

# పూజ్య గురుదేవులు



జ్ఞానప్రపూర్ణ

## శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట


Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com


Visit www.srichalapathirao.com to listen Pravachanas

# భగవద్గీత

## 1, 2 అధ్యాయములు




వ్యాఖ్యాత :
మహాభారత పరిశోధకులు,
ప్రముఖ వేదాంతోపన్యాసకులు,
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం వ్యవస్థాపకులు,
'జ్ఞానప్రపూర్ణ' **శ్రీ దేవిశెట్టి చలపతిరావు** B.Sc (Ag)

Dhyanamandali, E drive, Books Fol Bhagavathgeetha_20-01-2010 Fi.

ప్రథమ ముద్రణ : 2010

ప్రచురణ కర్త :
**ఆధ్యాత్మిక జ్ఞానపీఠం**
**చిలకలూరిపేట.**

వెల : రూ. **80/-**

ముద్రణ :

ప్రతులకు

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు**
వ్యవస్థాపకులు
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం
23-141, సాలిపేట,
చిలకలూరిపేట - 522616,
ఫోన్ : 08647 - 254716
సెల్ : 9290935732

**శ్రీ సత్యసాయి ధ్యానమండలి**
(అంతర్జాతీయ ఆధ్యాత్మిక మరియు పరిశోధనా సంస్థ)
ప్లాట్ నెం.143, ఇం.నెం. 54-13/5-4,
శ్రీనివాసనగర్ బ్యాంక్ కాలనీ,
విజయవాడ-520 008,
ఫోన్ : 0866 - 2545275,
సెల్ : 9849725540



# గురుదేవుల పరిచయం

**శ్రీమతి పొట్టి లక్ష్మీకామేశ్వరి**

అధ్యక్షులు, ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట.

### ఓం శ్రీ గురుభ్యోన్నమః

మానవ జీవిత పరమ లక్ష్యమైన మోక్షమార్గాన నన్ను నడిపిస్తూ, నా జన్మ చరితార్థతకు దీక్ష వహించిన నా ఆరాధ్యదైవం, పరమ జ్ఞాన స్వరూపులు, జ్ఞానప్రపూర్ణ బిరుదాంకితులు, మా గురుదేవులకు హృదయపూర్వక నమస్సుమాంజలులు.

లోకంలో తమకోసంగాక, భవరోగ పీడితులై, మనశ్శాంతి కరవై, దుఃఖాలతో అలమటించే సామాన్యుల నుద్ధరించటం కోసమై జన్మించే కారణ జన్ములలో మా గురుదేవులు ఒకరు. వారు 1946 సెప్టెంబరు 12న గుంటూరుజిల్లా తుర్లపాడులో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. వీరు 12 సంవత్సరముల వయస్సు నుండే రామాయణం, మహాభారతం, భాగవతం, పురాణాలు, ప్రబంధాలు చదవటమేగాక ఆంధ్ర మహాభారతంతో బాటు సంస్కృత మహాభారతాన్ని అధ్యయనం చేసి, 20 సం॥లకు పైగా పరిశోధనలు సాగించి నాలుగు సం॥లు ధారావాహిక ప్రవచనాలు చేశారు.

1989 నుండి ఆధ్యాత్మిక రంగంలో ప్రవేశించి ప్రతిరోజు సత్సంగాన్ని నిర్వహిస్తూ భగవద్గీతపైనను, శంకరాచార్యులవారి ప్రకరణ గ్రంథాలపైనను ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేశారు.

1994లో ఆధ్యాత్మిక జ్ఞానపీఠాన్ని స్థాపించి, వివిధ పట్టణాలలోను, చిలకలూరిపేటలోను ఇప్పటి వరకు 124 ఆధ్యాత్మిక జ్ఞాన యజ్ఞాలను నిర్వహించి భగవద్గీత, భజగోవిందం, తత్త్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, దక్షిణామూర్తి స్తోత్రం, అపరోక్షానుభూతి, అద్వైతసారం, ఆత్మవిద్యావిలాసం, ఉపదేశసారం, శంభునటనం, అష్టావక్రగీత, గురుగీత, రామాయణం,





మహాభారతం, భాగవతం, నారదభక్తి సూత్రాలు, బ్రహ్మసూత్రాలు మొదలైన గ్రంథాలపైనను, ఈశ, కేన, కఠ, ముండక, సూర్య, కైవల్య మొదలైన ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞాన సుగంధాలను ప్రసరింపచేస్తున్నారు.

2006లో నూరు ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరమూ కలిసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదు ప్రదానం గావించి ఘనంగా సత్కరించటం జరిగింది.

మా గురుదేవులు 1994లో 'కర్మసిద్ధాంతం' అనే గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. దీనిని తిరిగి 2002 లోను, 2009 లోను పునర్ముద్రించటం జరిగింది.

1998లో 'ఈశావాస్యోపనిషత్తు'పై అందరికీ అర్థమయ్యేరీతిలో వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2000 సం॥లో ద్వితీయ ముద్రణ జరిగింది. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం'పై విపులమైన వ్యాఖ్యను సామాన్యులకు కూడా చక్కగా అర్థమయ్యే రీతిలో సులభమైన, సరళమైన, సుబోధకమైన భాషలో వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

ప్రస్తుతం భగవద్గీతపై ఎంతో విపులమైన వ్యాఖ్యతో, సరళమైన భాషలో ప్రచురింపబడిన గ్రంథం మీ చేతుల్లో ఉన్నది.

త్వరలోనే 'మహాభారతం - ధర్మాధర్మ విశ్లేషణ' అనే పేరుతో మహాభారతంలోని సమస్త సందేహాలకు, విమర్శలకు, అపార్థాలకు సమాధానంగా అనేక రహస్యాలతో కూడిన గ్రంథం రాబోతున్నది.

గత 20 సం॥ల నుండి నేను గురుదేవుల పాదాల నాశ్రయించి, వారు బోధించే అద్వైత జ్ఞానామృతాన్ని పానం చేస్తున్నాను. నా జీవితం చివరి వరకూ వారి బోధలు వింటూ, వారు చూపిన మార్గంలో సాధనలు చేస్తూ నా ఈ మానవ జన్మను సార్థకం గావించుకొనేందుకు ప్రయత్నిస్తాను. ఇంతటి మహనీయులైన జ్ఞాన స్వరూపులు నాకు గురువుగా లభించటం నా పూర్వజన్మ సుకృతమని భావిస్తూ, వారి అనుగ్రహం నిరంతరం నాపై ప్రసరించాలని కోరుకుంటూ నమస్కారాలు తెలుపుకుంటున్నారు.

**-పి. లక్ష్మీకామేశ్వరి,**
అధ్యక్షులు.





# హృదయ స్పందన

**శ్రీమతి వి. జయలక్ష్మి** M.Tec.,
అసోసియేట్ ప్రొఫెసర్,
డి.ఆర్.కె. కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్ & టెక్నాలజీ,
హైదరాబాద్.

*ఓం నమోభగవతే వాసుదేవాయ*

ఈ ప్రపంచంలో ఎన్నో లౌకిక విద్యలున్నాయి. వాటిని నేర్పే అధ్యాపకులు ఎందరో ఉన్నారు. ఈ లౌకిక విద్యలన్నీ ఇహలోక జీవనానికి ఉపయోగపడేవేగాని ప్రతి మానవుడి జీవిత పరమ లక్ష్యమైన మోక్షధామాన్ని చేర్చటానికి ఉపయోగపడవు. మోక్షధామాన్ని చేర్చేది ఒక్క 'బ్రహ్మ విద్య' మాత్రమే. అట్టి బ్రహ్మవిద్యను బోధించే గురువులు లోకంలో అతికొద్ది మంది మాత్రమే ఉంటారు. అట్టివారిలో మా గురుదేవులు శ్రీ చలపతిరావుగారు ప్రముఖంగా పేర్కొనదగినవారు. వారు బ్రహ్మజ్ఞానులు, నిరాడంబరులు, నిగర్వి, శిష్యులందరితో స్నేహభావంతో మెలగుతూ అవసర సమయాలలో తగిన సలహాలను, సూచనలను ఇస్తూ శిష్యుల ఆధ్యాత్మికోన్నతికి తోడ్పడుతూ ఉంటారు.

భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాంత ప్రకరణ గ్రంథాలు, ప్రత్యేకించి మహాభారతంపై ఎంతో పరిశోధన గావించి, విషయాలను అవగాహన చేసుకొనుటయేగాక సామాన్యులు కూడా ఎంతో సులువుగా అర్థం చేసుకోగలిగే విధంగా బోధించటం మా గురుదేవుల ప్రత్యేకత. నిత్య జీవితంలో ఆచరణకు ఉపయోగపడే విధంగా అనేక అద్భుతమైన ఉపమానాలతో, ఉదాహరణలతో, ఎంతో క్లిష్టమైన ఆధ్యాత్మిక విషయాలను సరళమైన పదాలతో అరటిపండు





వలిచి చేతిలో పెట్టినట్లుగా మా గురుదేవులు చేసిన బోధలు మా మనస్సులలో ఇప్పటికీ మెదులుతూనే ఉన్నాయి.

నా పూర్వజన్మ సుకృతం వల్ల, భగవంతుని అనుగ్రహం వల్ల నా 20 ఏళ్ళ వయస్సులోనే విద్యార్థినిగా ఉన్నప్పుడే గురుదేవుల దర్శనభాగ్యం నాకు లభించింది. భగవద్గీత, భజగోవిందం, తత్త్వబోధ, ఈశావాస్యోపనిషత్ మొదలైన గ్రంథాలపై గురుదేవుల అనర్గళ ప్రవచనాలను శ్రవణం చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను.

**"మనం కష్టాలు వచ్చినప్పుడు క్రుంగిపోరాదు; మన పాపపు మూట తరిగిపోతున్నది గదా! అని సంతోషించాలి. అలాగే సుఖాలు వచ్చినప్పుడు పొంగిపోరాదు; మన పుణ్యరాశి తరిగిపోతున్నదే అని జాగ్రత్తపడాలి. ఇలా మనం స్థితప్రజ్ఞత సాధించాలి"** అని ఆనాడు చేసిన బోధ నా హృదయంలో ముద్రించబడి, ఈనాటికీ నా జీవితంలో ఎంతో ప్రయోజనకారిగా ఉంటున్నది.

ఈ భగవద్గీత గ్రంథ ముద్రణతో మా గురుదేవులు చేసిన విశేషకృషి, ఆయన బోధలు ఎందరికో మార్గదర్శకం కాగలవని ఆశిస్తూ వారి ఆశీస్సులు నాకు ఎల్లప్పుడూ లభించాలని కోరుకుంటూ వారి పాదపద్మాలకు నమస్కరిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

**– వి. జయలక్ష్మి**





# గురువు ఆవశ్యకత

**జి. సైదయ్య** B.S.W
Divisional Manager, Share Micro Fin. Ltd.
సభ్యులు, ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట.

## శ్రీ గురుభ్యోన్నమః

నేను హైస్కూల్లో చదివే రోజుల్లో నాస్తికత్వంతో ఉండేవాడిని. ఆ తర్వాత కుటుంబంలో పేదరికం, అనారోగ్యాలు, ఎదురు దెబ్బలతో కర్మఫలం కరిగిపోయిందేమో! అనుకోకుండా ఆధ్యాత్మికతలోనికి అడుగుపెట్టాను. ఇదే సమయంలో ఉద్యోగ బదిలీరీత్యా చిలకలూరిపేట వచ్చాను. గత జన్మల పుణ్యఫలం వల్లనేమో అనుకోకుండా గురుదేవుల జ్ఞానయజ్ఞంలో పాల్గొని వారి ప్రవచనాలు విని ఆకర్షించబడ్డాను.

శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా అర్జునునకు బోధించిన భగవద్గీతను, మరియు అత్యంత నిగూఢ భావాలతో కఠినతరమైన అర్థాలు గల ఉపనిషత్తులను పామరులకు కూడా అర్థమయ్యే రీతిలో అత్యంత సులభశైలిలో, ఆయా సందర్భాలకు తగిన అద్భుత ఉపమానాలతో, ఎంతో విపులంగా, వివరణాత్మకంగా విశ్లేషించి అరటిపండు వలచి చేతిలో పెట్టినట్లు వివరిస్తూ గురుదేవులు చేస్తున్న ప్రవచనాలు వింటుంటే ఆధ్యాత్మిక రంగంలో గురువుయొక్క ఆవశ్యకత ఏమిటో తెలిసింది.

ఇదే సమయంలో మహాభారతంలోని అనేక సందేహాలకు మొదటిసారిగా గురుదేవుల సమాధానాలను వింటుంటే మహాభారతం మొత్తం గురుదేవుల మస్తిష్కంలో నిక్షిప్తమై ఉన్నట్లు అర్థమైంది. ఎటువంటి సందేహానికైనా సమగ్రంగా, సంస్కృత మహాభారతంలోని శ్లోకాలను ఉటంకిస్తూ, విశ్లేషణాత్మకంగా వివరించటం 'నభూతో నభవిష్యతి' అని అనిపిస్తున్నది.





గతంలో గురుదేవులు అందించిన 'కర్మసిద్ధాంతం' గ్రంథం ఆధ్యాత్మిక రంగంలో నూతనంగా ప్రవేశించేవారికి ఎంతో ఉపయుక్తంగా ఉన్నది. అలాగే 'ఈశావాస్యోపనిషత్', 'భజగోవిందం' గ్రంథాలపై విపులమైన వ్యాఖ్యతో వెలువడిన గ్రంథాలు ఎంతో జ్ఞానాన్ని అందించాయి. ఇప్పుడు భగవద్గీతపై విపులమైన వ్యాఖ్యానంతో వెలువడిన ఈ గ్రంథం ఆధ్యాత్మిక రంగంలో ఉన్న అందరికీ ఎంతో ఉపకరిస్తుందనుటలో ఎట్టి సందేహంలేదు. ఇంత విపులమైన, వివరణాత్మకమైన వ్యాఖ్యానం ఇంతవరకు, ఇంత తేలిక భాషలో పుస్తక రూపంలో వెలువడలేదని చెప్పగలను. ఈ గ్రంథం పండిత పామరులందరికీ చక్కగా ఉపయోగ పడగలదని నా విశ్వాసం.

ఇక మహాభారతంపై గురుదేవుల పట్టు ఏమిటో తెలుసుకొన్న తర్వాత, గురుదేవుల ద్వారా మహాభారతంలోని ధర్మా ధర్మాలు లోకానికి తెలిస్తే బాగుంటుందని నా కోరిక. ఎందుకంటే పవిత్రమైన ఇతిహాసాలపై అనేక వక్రభాష్యాలు వెలువడుతున్న ఈ రోజుల్లో గ్రంథాన్ని చూడలేని సామాన్యులకు ఏది నిజమో? ఏది కల్పితమో తెలియటంలేదు. ఇలాంటి పరిస్థితుల్లో నిజమేమిటి? అబద్ధమేమిటి? గ్రంథంలో ఉన్నదేమిటి? కల్పించినదేమిటి? ఏ గాధ వెనుక ఏ ఆంతర్యం ఉన్నది? అసలు మహాభారతం మానవుడికెలా ఉపయోగపడుతుంది? ఏ ఉద్దేశ్యంతో వ్యాసభగవానుడు మహాభారత ఇతిహాసాన్ని లోకానికి అందించాడు? మహాభారతంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను చెప్పబడిన జీవన సత్యాలేమిటి? అనే ప్రశ్నలకు సరియైన సమాధానాలు కావాలి. దానిని గురుదేవులు త్వరలోనే అందించగలరని, తద్వారా భారతీయ సంస్కృతీ సాంప్రదాయాల పరిరక్షణ జరగగలదని నా దృఢ విశ్వాసం. అలాగే క్రమంగా భగవద్గీత 18 అధ్యాయాలు గ్రంథ రూపంలో వెలువడాలని నా తీవ్ర ఆకాంక్ష.

– జి. సైదయ్య.





# మధురానుభూతి

– రావికింది పుష్పావతి
డైరెక్టర్, ఇన్నర్‌వీల్ క్లబ్, చిలకలూరిపేట.
కార్యవర్గ సభ్యులు, ఆధ్యాత్మిక జ్ఞానపీఠం.

*ఓం శ్రీగురుభ్యోన్నమః*

*నేను 15 సం॥ల నుండి పూజ్య గురుదేవుల నాశ్రయించి నిత్యము వారి బోధలను వింటూ, వారు చూపిన మార్గంలో ప్రయాణిస్తున్నాను. నేను పెద్దగా చదువుకోనప్పటికీ భగవద్గీత శ్లోకాలనుగాని, ఉపనిషత్తులలోని మంత్రాలనుగాని అవలీలగా చదువగలుగుతున్నానంటే అదంతా మా గురుదేవుల చలువయే. గురుదేవులు బోధించే ఆధ్యాత్మిక జ్ఞానం, ఉపనిషత్తుల జ్ఞానం అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు – కాదు కాదు – నోటిలో పెట్టినట్లు ఎంతో సులభంగా, నాలాంటి వారికి కూడా చక్కగా అర్థమయ్యేటట్లు ఉండటం వల్లనే ఈ సత్సంగమనే స్వర్గంలోకి ఒక్కరోజు అడుగు పెట్టలేకపోయినా ఏదో పోగొట్టుకున్నట్లుగా రోజంతా బాధపడవలసి వస్తున్నది. ఈ సత్సంగం, గురుదేవుల ద్వారా పొందిన మహామంత్ర జపం నాకు జీవనాధారం.*

*భగవద్గీతలోని 700 శ్లోకాలను 3 సం॥ల 3 నెలల పాటు ఏకధాటిగా ప్రవచనములుచేసి మా గురుదేవులు గీతాజ్ఞానాన్ని మాకు అందించారు. అలా శ్రవణంచేసి మేము పొందిన మధురానుభూతిని అందరూ పొందితే ఎంత బాగుంటుందో గదా! అని ఎప్పుడూ మనస్సులో భావన మెదులుతూ ఉంటుంది. ఇప్పుడీ భగవద్గీత గ్రంథ ప్రచురణ ద్వారా మా కోరిక నెరవేరబోతున్నందుకు చాలా ఆనందంగా ఉన్నది. ఈ రెండు అధ్యాయాల గ్రంథం చదివినవారు మిగతా అధ్యాయాల కొరకు ఎదురు చూస్తారనటంలో అతిశయోక్తిలేదు. భగవద్గీతపై ఇది విపులమైన, సులభశైలిలో అందించబడిన వ్యాఖ్యానం. ఇది తెలుగు మాట్లాడే వారందరికి ఎంతో ఉపయోగపడగలదని నా నమ్మకం. ఈ గ్రంథాన్ని, ఇందులోని ప్రతి శ్లోకం యొక్క భావాన్ని చక్కగా గ్రహించి, జ్ఞాన మార్గంలో ప్రయాణించగలరని ఆశిస్తూ, ఇంకా మిగిలిన అధ్యాయాలపై వ్యాఖ్యను త్వరలో ప్రచురింప జేయగలందులకు మా గురుదేవులను భగవంతుడు ఆశీర్వదించాలని కోరుకుంటూ...*

**– ఆర్. పుష్పావతి**





# ఆకాంక్ష

**శ్రీమతి అరవపల్లి బేబీకుమారి**
కార్యనిర్వాహక సభ్యులు
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట.

## శ్రీ గురుభ్యోన్నమః

నేను గత 5 సంవత్సరముల నుండి మాత్రమే ఆధ్యాత్మిక జ్ఞాన పీఠంలో చేరి, సత్సంగానికి హాజరవుతూ, గురుదేవుల ప్రవచనాలను శ్రవణంచేస్తూ, గురుదేవులు నిర్వహించే సదస్సులకు, జ్ఞానయజ్ఞాలకు, గీతా పారాయణలకు, మహాత్ముల జయంతులకు, గీతాజయంతి ఉత్సవాలకు, హోమ కార్యక్రమాలకు అన్నింటికీ హాజరవుతూ అన్ని కార్యక్రమాలలోనూ పాల్గొంటూ పూర్తిగ మనశ్శాంతిని పొందగలుగుతున్నాను. అందుకు గురుదేవులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొంటున్నాను.

గురుదేవుల ద్వారా మహామంత్ర ఉపదేశాన్ని స్వీకరించి, నిత్యము జపసాధనలో ఉండటం నా ఆధ్యాత్మిక జీవితంలో గొప్ప మలుపుగా భావిస్తున్నాను. అంతేగాక గురుదేవుల ప్రోత్సాహంతో, వారి మార్గదర్శకత్వంలో ప్రతిరోజూ శ్రవణము, స్వాధ్యాయము, ధ్యానము, సాక్షీభావన, ఆత్మ విచారణ, సమాధి అభ్యాసము మొదలైన సాధనలు చేస్తూ నా జీవితాన్ని భగవంతుని పాదాలచెంత పూజాపుష్పంగా సమర్పించుకోగలగటం నా జన్మ జన్మల సుకృతఫలం, గురుదేవుల అనుగ్రహం. ఈ సాధనలలో అనేక మెళుకువలను నేర్పుతూ, నిరంతరము మమ్ములను బ్రహ్మనిష్ఠలో నిలుపుటకు గురుదేవులు చేస్తున్న కృషి అమోఘం, బహుధా ప్రశంసనీయం.

ఇప్పటికి 124 ఆధ్యాత్మిక జ్ఞాన యజ్ఞాలను నిర్వహించిన గురుదేవులు ఇంకా అనేక జ్ఞాన యజ్ఞాల ద్వారా జ్ఞాన సుగంధాలను దశదిశలా





ప్రసరింపచేయాలని, నిరంతరము శిష్యులమైన మాకు మార్గ నిర్దేశనం చేస్తూ మమ్ము మోక్షమార్గంవైపు నడిపించగలరని నా ఆకాంక్ష. అందుకు భగవంతుడు మా గురుదేవులకు ఆయురారోగ్యాలు ప్రసాదించాలని మనసారా కోరుకుంటున్నాను.

ఇంతవరకు కర్మసిద్ధాంతం, భజగోవిందం, ఈశావాస్యోపనిషత్ గ్రంథాలను మాత్రమే ప్రచురింపజేసిన మా గురుదేవులు ఇప్పుడీ **'భగవద్గీత'** ద్వారా వివరణాత్మక వ్యాఖ్యతో, సరళమైన వ్యావహారిక భాషలో పామరులకు కూడా గీతాజ్ఞానాన్ని అందించబోతున్నందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది.

మహాభారతంపై విశేష కృషిచేసి, మొత్తం భారతాన్ని తమలో నిక్షిప్తం చేసుకొన్న గురుదేవులు, మహాభారతంలోని ధర్మ సూక్ష్మాలు, జీవన సత్యాలను, విమర్శలకు సమాధానాలను, లోకంలో జన సామాన్యానికి గల సందేహాలను తీరుస్తూ పరిశోధనాత్మక గ్రంథాన్ని వెలువరించి, తెలుగు జాతికి మహోపకారం చేయాలని నా ప్రగాఢ ఆకాంక్ష. గురుదేవుల కృపా కటాక్ష వీక్షణాలు నాపై ఇలాగే ప్రసరించాలని కోరుకుంటూ వారి పాద పద్మాలకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను.

**- ఏ. బేబీకుమారి**





# సందేశం

**పూజ్యశ్రీ భిక్షమయ్య గురూజీ**

శ్రీ సత్యసాయి ధ్యానమండలి

**"జంతూనాం నరజన్మ దుర్లభం"** అనేది జగమెరిగిన సత్యం. మానవుని దేహము, మెదడు అందలి పదార్ధం సూక్ష్మాతిసూక్ష్మంగా ఉండి వివేచన, విచక్షణ, విశ్లేషణ, విచారణ, విజ్ఞతలతో తనను గురించి విశ్వాన్ని గురించి లోతుగా అధ్యయనం చేయగలిగిగాడు. ప్రపంచ దేశాలన్నీ నాగరికంగా వెనుకబడి ఆటవిక జీవితంను కొనసాగిస్తున్నప్పుడే భారతదేశమందలి ఆర్యులు మానవుని మేథస్సులో ఉత్పన్నమయ్యే అనేక చిక్కు ప్రశ్నలకు స్పష్టమైన సమాధానంలను కనుగొని ప్రపంచానికి వెల్లడించడం జరిగింది. నేను ఎవరు? నేను ఎక్కడి నుండి వచ్చాను? తిరిగి ఎందులో లయమైపోతాను? ఈ చరాచర జగత్తు ఆవిర్భవించడానికి ఆధారమేమిటి? మానవ జీవిత పరామర్ధమేమిటి? ఇటువంటి అతి కీలకమైన అంశములకు స్పష్టమైన సమాధానంలను అందించగలిగేవే వేదములు, వాని చివరి అంశములే ఉపనిషత్తులు. అటువంటి వేదములను క్రోడీకరించి ప్రపంచానికి కానుకగా సమర్పించిన ఘనత శ్రీవేదవ్యాసునిదే. అందుకే ఆ పరిపూర్ణుని పేరు మీద వ్యాసపౌర్ణమిని భక్తి శ్రద్ధలతో జరుపుకుంటాం. అయితే వేదములన్నీ ముడిరూపంలో సామాన్యులు అర్ధం చేసుకునే రీతిలో లేనందు వలన మానవులలో ధర్మపరిరక్షణకై పురాణములు, ఇతిహాసములు వెలుగులోనికి వచ్చాయి. వానిలో అతి కీలకమైంది మహాభారతం. అందుకే దీనిని పంచమవేదమన్నారు. అటువంటి మహాభారతం మధ్యలో వేదవ్యాసునిచే ప్రవేశపెట్టబడిన శ్రీకృష్ణార్జునుల సంవాదమే భగవద్గీత.

భగవద్గీత సర్వమత, సర్వవేద, సర్వయోగ సమన్వయం. ఒక దేశానికి రాజ్యాంగమెంత అవసరమో మానవజీవిత పరిపూర్ణత్వానికి భగవద్గీత అత్యంత ఆవశ్యకం. భగవద్గీతలో లేనిది ప్రపంచంలో ఎక్కడా ఉండదు. సాక్షాత్తూ భగవంతుని నుండి వెలువడింది కాబట్టి వేల సంవత్సరముల వరకు అది ఏమాత్రం మార్పులు చెందకుండా అలాగే కొనసాగుతూ వచ్చింది. దానియందలి 707 శ్లోకాలు ఆణిముత్యాలే. భగవద్గీతకు భాష్యం చెప్పడమంటే మామూలు విషయం కాదు. గత కొన్ని శతాబ్ధాలుగా గీతాసారాంశమును సామాన్యునికి కూడా తెలియజేయాలనే





సదాశయంతో సంస్కృత శ్లోకాలకు తెలుగులో వ్యాఖ్యానంను వ్రాయడం, కొందరు దానిని గీతాజ్ఞాన యజ్ఞముల ద్వారా ప్రచారం చేయడం జరుగుతుంది.

జ్ఞానప్రపూర్ణ శ్రీచలపతిరావుగారు గత రెండు దశాబ్ధాలుగా చిలకలూరిపేటలో గీతాజ్ఞానయజ్ఞములను నిర్వహిస్తూ వందలాది మందికి దాని సారాంశమును పంచడం జరిగింది. నేను ఆధ్యాత్మిక రంగంలోనికి ప్రవేశించి తపిస్తున్న తరుణంలో అదృష్టవశాత్తు వారి గీతా సందేశములను నెలల తరబడి వినడం జరిగింది. అవి నా మనసులో ఇప్పటికీ చెరగని ముత్యాలవలె నిలిచిపోయాయి. అటువంటి విలువైన సారాంశమును మా ధ్యానమాలిక పాఠకులకు అందిస్తే ప్రయోజనముంటుంది అనే భావనతో గీతాశ్లోకాలను, ద్రౌపదిదేవి కథా వృత్తాంతమును ధారావాహికంగా అందిస్తున్నాము. అయితే వానిలోని ఔనత్యాన్ని గమనించిన మా పాఠకులు వానిని పుస్తకరూపంలో ప్రచురిస్తే బాగుంటుంది అని అభ్యర్ధించిన మేరకు మేము మొదటి రెండు అధ్యాయములు గీతను పుస్తక రూపంలో ప్రచురించాలని సంకల్పించడం జరిగింది.

శ్రీచలపతిరావు గారి గీతాశ్లోకములు వ్యాఖ్యానాలను నేను ఇటీవల పరిశీలించినపుడు వారిలో నేను ఒకప్పుడు విన్న వ్యాఖ్యలకు ప్రస్తుతం వారు వివరించిన విధానంనకు ఎంతో వ్యత్యాసము కనుపించింది. భగవద్గీత యందలి ధర్మసూక్ష్మములను అతి సామాన్యునికి గూడ అర్ధమయ్యే రీతిలో ఉన్నాయి. మహాభారత యుద్ధమంతా అర్జునుని అంతరంగంలోనే జరిగింది. ప్రస్తుతం నవీన మానవులంతా అర్జునులే. ప్రతి అంతరంగం అగ్నిగుండం వలె రగిలిపోతుంది. అటువంటి అగ్నికి ఆజ్యం వలె సామాజిక పరిస్థితులు రోజురోజుకు దిగజారుతున్నాయి. అందువలన అగ్నిని ఆర్పే శీతల జలమే గీతా సారాంశం. గురువుగారు వెల్లడించిన ఉపమానాలు, సందర్భోచిత వ్యాఖ్యలు, ఉదాహరణలు అతి సరళంగా, సులభంగా అర్ధమయ్యే విధంగా ఉన్నాయి. నిష్కపటంగా చెప్పాలంటే నాకే అవి అప్పుడప్పుడు మార్గదర్శకమవుతున్నాయి. అందువలన మేము చేసిన ఈ ప్రయోగంను ఆధ్యాత్మిక పిపాసులు, ధ్యానులు సహృదయంతో స్వీకరించాలని మనవి చేస్తూ ఇటువంటి కృషికి మూలకారకులైన ఆధ్యాత్మిక పుష్పగుచ్ఛమైన శ్రీయుతులు చలపతిరావుగారికి శిరస్సు వంచి పాదాభివందనము చేస్తూ.. వారికి ఆ భగవంతుడు దివ్య ఆశీస్సులిచ్చి సంపూర్ణ ఆయురారోగ్యములతో సదా విశిష్టమైన ఆధ్యాత్మికసేవలందించే భాగ్యం కలుగుజేయాలని మనసా.. వాచా.. కర్మణా కోరుకుంటూ...

**పూజ్యశ్రీ భిక్షమయ్య గురూజీ**

# సంస్మరణ

జననం
1938



మరణం
2010

సహృదయులు, సంఘ సేవకులు,
పరోపకార పరాయణులు,
అజాత శత్రువు,
వాక్చతురులు,
'సంఘోద్ధారక, **కీ॥ శే॥ శ్రీ మాజేటి రామారావు**గారు
గౌరవాధ్యక్షులు (2009-2010)
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం :: చిలకలూరిపేట.





# సంస్మరణ

జననం
1928



మరణం
1997

నిష్కల్మష హృదయులు, నిరాడంబరులు,
దయా స్వభావులు, కర్మనిష్ఠులు,
మానవతావాది, స్నేహశీలి...
కీ॥ శే॥ **చేబ్రోలు సుబ్బారావు**గారు
గౌరవాధ్యక్షులు (1994 - 1997)
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం :: చిలకలూరిపేట.

# సంస్మరణ



జననం 1950

మరణం 2009

మానవత్వం మూర్తీభవించిన కరుణా స్వభావులు,

నిరంతర ఆధ్యాత్మిక జ్ఞానపిపాసకులు,

నిరాడంబరులు, సహృదయులు,

దైవభక్తి సంపన్నులు,

:: ఆధ్యాత్మిక జ్ఞానపీఠ సభ్యులు ::

కీ॥ శే॥ **పొత్తూరి సాంబశివరావు**గారు







# తొలిపలుకు

**శ్రీ డి. చలపతిరావు**

గ్రంధ వ్యాఖ్యాత

**ఈ** లోకంలో ప్రతి మానవుడు సుఖాన్నే కోరుకుంటాడు. ఎంత తెలివి తక్కువ వాడుకూడా దుఃఖాన్ని కోరుకోడు. కోరక పోయినా పూర్వజన్మ కర్మల ఫలితంగా రావలసిన సమయంలో దుఃఖాలు వస్తూనే ఉంటాయి. అలా వచ్చినపుడు ఈ దుఃఖం ఎప్పుడు పోతుందా? తిరిగి ఎప్పుడు సుఖం వస్తుందా? అని ఎదురు చూస్తాడు. ఎదురు చూడటమే కాదు. ఆ సుఖంకోసం ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. డబ్బు సంపాదిస్తాడు, వస్తువులు తెచ్చు కుంటాడు. ఇతరుల సాయం అర్థిస్తాడు. అనేక వస్తువులు కనిపెడుతుంటాడు, తన వృత్తిని మారుస్తాడు, వ్యాపారాన్ని మారుస్తాడు, ఉద్యోగాన్ని మారుస్తాడు, ఉన్న ఊరిని మారుస్తాడు, తన దేశాన్ని కూడా వదిలి విదేశాల కెళతాడు, పెద్దవాళ్ళతో స్నేహం చేస్తాడు, శారీరకంగా, మానసికంగా ఎంతో శ్రమిస్తాడు– ఇలా ఎన్నో, ఎన్నెన్నో చేస్తాడు. వీటి ఫలితంగా దుఃఖాలు పోవచ్చు, సుఖాలు రావచ్చు. కాని ఆ సుఖాలు శాశ్వతంగా ఉండటం లేదు. ఎప్పుడో ఒకప్పుడు ఆ సుఖాలు దూరమై, మళ్ళీ దుఃఖాలు దరిచేరతాయి. అంటే ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంత కష్టపడ్డా మానవుడు తాను కోరుకున్న సుఖాన్ని, ఆనందాన్ని పొందలేకపోతున్నాడు. తాను కోరుకొనేది శాశ్వత ఆనందమే గాని, తాత్కాలిక ఆనందంకాదు. ఎప్పుడూ ఉండే సుఖం– ఎప్పుడూ ఉండే ఆనందమే కావాలి. అప్పుడే తపన తీరేది, అన్వేషణ ఆగేది.

అట్టి శాశ్వత ఆనందం, నిత్యసుఖం ఎన్ని వస్తువులు సంపాదించినా, ఎందరు వ్యక్తులను దరిచేర్చుకున్నా, ఎన్ని పరిస్థితులను, స్థితులను మారుస్తున్నా రావటం లేదు. అనిత్య మైన సుఖమే వస్తున్నది ఎందువల్ల?

మనం కోరుకొనేది నిత్యసుఖాన్ని, కాని పట్టుకొనేది అనిత్య వస్తువులను. అనిత్య వస్తువులు అనిత్యమైన సుఖాన్నే ఇస్తాయి గాని నిత్యసుఖాన్ని ఇవ్వలేవు. నిత్యవస్తువు మాత్రమే నిత్యసుఖాన్నిస్తుంది. మరేమిటి ఆ నిత్యవస్తువు? "నిత్యవస్త్వేకం బ్రహ్మ తద్వ్యతిరిక్తం సర్వమనిత్యం"– నిత్యవస్తువు ఏకమైన

పరమాత్మ మాత్రమే. పరమాత్మకన్న వేరైన సమస్తమూ అనిత్యమే – అని శంకరాచార్యులవారు 'తత్త్వబోధ' అనే ప్రకరణ గ్రంథంలో తెలియజేశారు.

కనుక ప్రతిమానవుడు నిత్యమైన పరమాత్మను మాత్రమే పట్టుకోవాలి. అలా పట్టుకోవాలంటే అనిత్య వస్తువులు, విషయాలు, భోగాలు మొదలైన వాటి పట్టునుండి విడిపించు కోవాలి. ఈ అనిత్య వస్తువుల పట్టునుండి విడిపించు కొని శాశ్వతమైన పరమాత్మను ఆశ్రయించి, పరమాత్మతో ఐక్యమై పోవుటకే మనకు ఈ మానవజన్మ వచ్చింది. ఈ మానవ జన్మలోనే దీనిని సాధించాలి. అలా సాధిస్తేనే ఈ జన్మ సార్థకం. సాధించలేనిచో ఈ జన్మ వ్యర్థం.

మరి ఎలా సాధించటం? ఎలా ప్రాపంచిక విషయ వ్యామోహాన్ని వదలటం? ఎలా పరమాత్మను తెలుసుకొని, ఆశ్రయించి, అందుకోవటం? ఎలా సమస్త దుఃఖాలనుండి శాశ్వతంగా నివృత్తిచెంది అనంతమైన, అఖండమైన, దుఃఖ రహితమైన శాశ్వత ఆనందాన్ని పొందటం? ఈ అన్ని సందేహాలకు ఖచ్చితమైన సమాధానమే **భగవద్గీత.**

భగవద్గీత సర్వ ఉపనిషత్తుల సారం, యోగ శాస్త్రం, బ్రహ్మవిద్యా ప్రతిపాదిత గ్రంథం. ఇది మోక్ష శాస్త్రం. అన్ని వేదాల, ఉపనిషత్తుల, సమన్వయ శాస్త్రం. అన్ని శాస్త్రాలను, సిద్ధాంతాలను మథించి వెలికి తీసిన సార సంగ్రహం. ఒక్క హిందూమతానికేగాక, అన్ని మత సాంప్రదాయాలకు సంబంధించిన ప్రధాన సూత్రాలను, ధర్మాలను క్రోడీకరించిన సర్వ ధర్మ సమన్వయ క్షేత్రం ఇది. అందుకే దీనిని విశ్వమత గ్రంథం అన్నారు. ప్రపంచంలోని 42 భాషలలోనికి అనువదించబడి, 125 దేశాలలో పరిచయమున్న అద్భుత గ్రంథం భగవద్గీత. అన్ని కాలాలలోని, అన్ని దేశాలలోని మానవులందరి జీవిత సాఫల్యానికి కావలసిన సమస్త విషయాలను తెలియజేసిన సమగ్ర గ్రంథరాజం భగవద్గీత. ఎందరో మహాత్ములు, మహానుభావులు, ఆచార్యులు, పీఠాధిపతులు, స్వామీజీలు ఈ గీతాసాగరంలో మునిగి, అనర్ఘమైన రత్నాలను చేజిక్కించుకొని వాటిని సామాన్య మానవులకు పంచుతూనే ఉన్నారు.

మానవుని మాధవునిగా, నరుని నారాయణునిగా, జీవుని దేవునిగా తీర్చిదిద్దటానికి కావలసిన కర్మయోగము, ధ్యాన యోగము, భక్తియోగము, జ్ఞానయోగము అనే అన్ని యోగాలను, అన్ని ఉపాయాలను, మార్గాలను తెలియజెప్పిన అద్భుత గ్రంథం భగవద్గీత. వేదాలలోని కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞానకాండలను – కర్మషట్కం, భక్తిషట్కం, జ్ఞానషట్కం– అనే 3 షట్కాలుగా – 18 అధ్యాయాలుగా భగవద్గీతలో వివరించటం జరిగింది. ఇది ఒక సమగ్ర





ఆధ్యాత్మిక గ్రంథం అనుటలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు.

గీతకు ఇంతటి ప్రశస్తి రావటానికి కారణం ఏమిటి? మానవుని యొక్క దుఃఖాన్ని – శోకాన్ని సంపూర్ణంగా నివృత్తి చేయటము గీత యొక్క పరమోద్దేశ్యం కావటమే.

"అశోచ్యానన్వశోచస్త్వం...." (2–11) అంటూ గీతా జ్ఞాన బోధను ప్రారంభించిన భగవానుడు "మోక్ష ఇష్యామి మాశుచః..." (18 – 66) అంటూ తన బోధను ముగించాడు. **'అశోచ్యా'** అనే పదంతో ప్రారంభించి **'మాశుచః '** అనే పదంతో ముగించాడు. అంటే శోకంతో ప్రారంభమై శోకంతో ముగిసింది బోధ. ఇలా చేయటంలో ఒక స్వారస్యం ఉంది. ఒక సూచన ఉంది. అదేమిటంటే – ఈ రెండు శోకాల మధ్య నున్న శ్లోకాలు మానవుడిలోని శోకాన్ని పూర్తిగా నివృత్తిచేసి, నిరతిశయ ఆనందాన్ని ప్రాప్తింపజేస్తాయి – అని. అంతేగాదు అసలు భగవద్గీతలోని మొదటి అధ్యాయం అర్జున విషాదయోగం. అంటే దుః ఖంలో ఉన్న మానవుని దుఃఖనివృత్తే గీతలోని ప్రధాన వస్తువు. మరి దుః ఖంలేని, విషాదంలేని మానవుడెవరుంటారు? అందుకే గీతకు ఇంతటి ప్రశస్తి. అందుకే మహాత్మాగాంధీ "నాకెప్పుడు ఏ సంశయం కలిగినా, ఏ సమస్య ఎదురైనా భగవద్గీతలోని ఏదో ఒక పేజీ తెరచి చూస్తాను. అందులోని శ్లోకాలను అవగాహన చేసుకోవటంతో నా సమస్యకు పరిష్కారం లభిస్తుంది"అని తెలియజేశారు.

భగవన్నిర్మితమై, బ్రహ్మవిద్యా ప్రతిపాదితమై, సర్వ ఉపనిషత్తులసారమై, సర్వయోగ సమన్వయమై, సర్వశాస్త్ర సారభూతమై, సర్వమత సమన్వయమై, సర్వకాలాలకు తగినదై, సర్వమానవాళి జీవిత సార్థక్యానికి మార్గం చూపగలిగినదైన భగవద్గీతను ఎన్నిసార్లు చదివినా, ఎన్నిసార్లు విన్నా, అమృత పానంవలె తనివి తీరేది కాదు.

అట్టి భగవద్గీతను సవివరంగా, సరళమైన భాషలో, సులభంగా అర్థమయ్యే రీతిలో, ఆచరణకు అనువుగా తెలుసుకొని, ఇందులోని 18 అధ్యాయాలను 18 మెట్లుగా చేసికొని విషాదయోగం నుండి ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ మోక్ష సన్యాసయోగం వరకు ప్రయాణించి, మానవ జీవిత పరమ లక్ష్యమైన మోక్ష సామ్రాజ్యాన్ని చేరుకొని శాశ్వత ఆనందాన్ని, బ్రహ్మానందాన్ని పొంది మానవ జీవితాన్ని సార్థకము చేసికొందుముగాక!

– **వ్యాఖ్యాత**

# భగవద్గీత

మొదటి అధ్యాయం

## అర్జున విషాదయోగం

ఈ అధ్యాయమే భగవద్గీత అనే 17 అంతస్తుల భవనానికి పునాది. పునాది గట్టిగా ఉంటేనే దానిపై నిర్మించిన భవనం 10 కాలాలపాటు నిలిచి ఉంటుంది. మరి ఈ భగవద్గీతా భవనం ఇప్పటికి 5 వేల సంవత్సరాల నుండి చెక్కు చెదరకుండా నిలిచి ఉన్నది. ఇంకా లక్షల, కోట్ల సంవత్స రాలైనా అలాగే నిలిచి ఉంటుంది. దానికి కారణం పునాది గట్టితనమే.

భగవద్గీతలో అనేక యోగాలున్నాయి. సాంఖ్య, కర్మ, జ్ఞాన, కర్మ సన్యాస, విజ్ఞాన, అక్షర పరబ్రహ్మ, భక్తి, పురుషోత్తమప్రాప్తి... అంటూ ఎన్నో యోగాలున్నాయి. అన్నిటికి ముందు ప్రథమ స్థానంలో విషాదయోగం ఉన్నది. విషాదం అంటే ఏడుపు. యోగం అంటే జీవుడికి దేవుడితో కలయిక. ఇదేమిటండీ! విషాదం కూడా ఒక యోగమేనా? అని చాలామందికి సందేహం ఉండవచ్చు.

జీవుడు దేవుడు కావాలంటే విషాదం ఎంతో అవసరం. ఎన్నో సుత్తి దెబ్బలు తిన్న తర్వాతనే ఒక బండరాయి విగ్రహంగా మారి పూజలందుకొంటున్నది. ఎన్నో రంపపుకోతలను అనుభవించిన తర్వాతనే కొయ్య-మంచంగా మారి, మనకు సుఖ నిద్రనిస్తున్నది. ఎంతోసేపు అగ్ని మీద కాలి, ఉడికిన తర్వాతనే బియ్యం అన్నమై మనకు ఆహారంగా ఆకలి తీరుస్తున్నది. అలాగే ఎంతో విషాదం అనుభవించిన తర్వాతనే, ఎన్నో కఠిన పరీక్షలకు తట్టుకొని నిలిచిన తర్వాతనే ముడిసరుకు వంటి మానవుడు మాధవుడయ్యేది. కనుక విషాదం లేకుండా యోగం సిద్ధించదు. ఏకష్టం లేకుండా ఫలితం సిద్ధించదు.





ఇది అర్జున విషాద యోగం. సామాన్యంగా లోకంలో అందరి ఏడుపూ రోగం అవుతుంది. కాని అర్జునుని ఏడుపు మాత్రం యోగం అయి కూర్చుంది. ఏమిటీ ఏడుపుల్లో ఉన్న తేడా?

లోకంలో ఎవరైనా సరే ఎందుకేడుస్తారు? భార్యకోసమో, భర్తకోసమో, బిడ్డలకోసమో, డబ్బుకోసమో, అధికారంకోసమో, పదవులకోసమో, ఉద్యోగం కోసమో, సుఖ సంతోషాలకోసమో, భోగాలకోసమో, ఇళ్ళు వాకిళ్ళకోసమో, పెళ్ళికోసమో, ఆరోగ్యంకోసమో, మనశ్శాంతికోసమో లేక ఇతరులు పచ్చగా ఉన్నారే అనో - ఇలా ఏదో ఒక కారణంతో ఏడుస్తారు. లోకంలో ప్రతివాడూ ఏదో ఒక రోజు, ఎప్పుడో ఒకప్పుడు గట్టిగానో, గుట్టుగానో ఏడుస్తూనే ఉంటాడు. ఐతే ఈ ఏడుపులన్నీ చివరికి రోగాలై కూర్చుంటాయి. కాని అర్జునుని ఏడుపు ఇలాంటిది కాదు. అతడు సిరిసంపదలకోసమో, భోగభాగ్యాలకోసమో, రాజ్యంకోసమో, శత్రువులు పచ్చగా ఉన్నారనో ఏడవలేదు. మరి దేనికి ఏడ్చాడు? కర్తవ్యం తెలియక ఏడ్చాడు. జ్ఞానంకోసం ఏడ్చాడు. జన్మ సార్థక్యంకోసం ఏడ్చాడు. పైగా భగవంతుని ముందు పెట్టుకొని ఏడ్చాడు. అందుకే అర్జునుని ఏడుపు యోగమై కూర్చుంది.

శ్రీరామకృష్ణ పరమహంస కాళీమాత విగ్రహం ముందు రోజూ ఏడ్చేవాడు. తల్లీ! రోజులకు రోజులు గడిచిపో తున్నాయి. నాగతేమిటి? ఎప్పుడు నీ దర్శన భాగ్యం?-అని. అందుకే ఆయన పరమహంస అయ్యాడు. అర్జునుడు జగద్గురువైన శ్రీకృష్ణుని ముందు వలవలా ఏడ్చాడు. సిగ్గు పడకుండా ఏడ్చాడు. అంతటి మహావీరుడూ ఒక అబలలా ఏడ్చాడు. అందుకే పరమాత్మ కరిగిపోయాడు. వెన్ను తట్టాడు. సమస్త వేద వేదాంగ రహస్యాలను, యోగ మార్గాలను, బ్రహ్మ విద్యనూ బోధించాడు. దానితో "నష్టోమోహః స్మృతిర్లబ్ధా"-'నా అజ్ఞానం-ఏడుపు పోయింది. దారి తెలిసింది' అన్నాడు అర్జునుడు. ఎక్కడ ఏడవాలో ఎవరి దగ్గర ఏడవాలో తెలుసు కొని ఏడవాలి. అప్పుడే కావలసినదాన్ని పొందగలుగుతారు. అమ్మ దగ్గర బిడ్డ ఏడిస్తే దగ్గరకు తీసుకుని ఆదరిస్తుంది, తిండి పెడుతుంది. నాన్న దగ్గర ఏడిస్తే కావలసిన పుస్తకాలు, దుస్తులు కొనిపెడతాడు. కాని ఎవరి దగ్గర పడితే వారి దగ్గర అడ్డదిడ్డంగా ఏడిస్తే మొట్టికాయలే. కనుక ఏడవటంలో కూడా తెలివి ఉండాలి, ఉపాయం ఉండాలి. అర్జునుని లాగా తెలివిగా, ఎవరి దగ్గర, ఎలా, ఏడవాలో తెలుసుకొని ఏడవాలి.

ఎందుకు ఏడవాలో అందుకే ఏడవాలి. "అయ్యో! నాకసలు అలా ఏడవటం చేతకాదండీ!" అంటూ నవ్వుతూ, హొయలు పోతూ చెప్పకూడదు. నిజంగా అలా ఏడవటం ఒక వేళ చేతగాకపోతే "అర్జునుని లాగా ఏడవటం చేతగాకపోయెనే" అనైనా ఏడవాలి. శ్రీకృష్ణుని గురువుగా జేసికొని జ్ఞాన బోధ వినేముందు అర్జునుని గురువుగా జేసికొని ఏడవటం నేర్చుకోవాలి. ఏడుపు గొప్పయోగం. విషాదం గొప్పయోగం గనుకనే అర్జున విషాదయోగంతో భగవద్గీత ప్రారంభమైంది.

సామాన్యంగా లోకంలో ఎవరైనా సుఖాన్నే కోరుకుంటారు. దుఃఖాన్ని, విషాదాన్ని ఎవరూ కోరుకోరు. పైగా దుఃఖాన్ని శత్రువుగా భావిస్తారు. కాని జాగ్రత్తగా ఆలోచిస్తే మనిషికి మేలు చేసేది, ఉన్నతంగా నిలబెట్టేది దుఃఖమే. సుఖం వల్ల మనిషి మత్తులో పడిపోతాడు. భోగాలవైపు పరుగుతీసి భగవంతునికి దూరమవుతాడు. కాని దుఃఖమో కష్టాలను సహించటం నేర్పుతుంది, కర్తవ్యాన్ని తెలియజేస్తుంది, భగవంతుని గుర్తు చేస్తుంది, భగవంతుని దగ్గరకు చేరుస్తుంది. గజేంద్రుడికి సుఖంలో భగవంతుడు గుర్తుకు రాలేదు. దుఃఖంలోనే గుర్తు వచ్చాడు. అందువల్ల దుఃఖమే మంచిదని, మానవునికి శ్రేయస్సును కలిగిస్తుందని మహాత్ములు తెలియజేస్తుంటారు. శ్రీరాముడు తనకు కలిగిన దుఃఖాన్ని చిరునవ్వుతో స్వీకరిం చాడు. ఎవ్వరినీ నిందించలేదు. స్థిర చిత్తంతో ఆ దుఃఖాన్ని అనుభవించాడు. అందుకే ఆయన భగవంతుడయ్యాడు. కాదని ఎదురు తిరిగితే ఒక రాజుగా మిగిలిపోయేవాడు.

ధర్మరాజు మాయాజూదంలో సర్వం కోల్పోయాడు. తమ్ములతో సహా కౌరవులకు దాసుడయ్యాడు. కళ్ళెదుటే కట్టుకున్న భార్యకు ఘోర అవమానం జరుగుతున్నా చలించ లేదు. ధర్మం తప్పలేదు. అనేక క్లేశాలనుభవించాడు. అందుకే విజయాన్ని సాధించాడు. మహాత్ములు విషాదానికి భయపడరు. ఎన్ని కష్టాలు కలిగినా హరిశ్చంద్రుడు మాట తప్పలేదు. చిరయశస్సు నార్జించాడు.

కైక దశరథుణ్ణి రెండు వరాలు కోరి శ్రీరాముని అడవులపాలు చేసింది. ఆమెను అందరూ తిట్టి పోస్తారు. చివరకు కన్న కొడుకు కూడా కత్తి నెత్తాడు. కాని ఆమె ఆపని చేసి ఉండకపోతే శబరికోరిక నెరవేరేది కాదు. ఆయన పాదస్పర్శ దక్షిణ భారతానికి తగిలేది కాదు. అధర్మపరులైన రాక్షసులు





అంతమయ్యేవారు కాదు. ధర్మం రక్షించబడేది కాదు. రామాయణమనే మహాకావ్యం రచించబడేది కాదు. అందుకే అందరూ కైకను తిట్టినా శ్రీరాముడు మాత్రం పల్లెత్తుమాట అనలేదు. పైగా అయోధ్యకు తిరిగిరాగానే, ముందుగా కైక వద్దకే వెళ్ళి నమస్కరించి ఆశీస్సులు పొందాడు.

కుంతీదేవి శ్రీకృష్ణుని ఒక వరమడిగింది. అదేమిటంటే 'ఓ కృష్ణా! నాకెప్పుడూ దుఃఖాలే ఉండేట్టు వరమివ్వు' అని. తెల్లబోయాడు కృష్ణుడు. 'అదేమిటత్తా! అలాఅడిగావు?' అన్నాడు. దానికామె 'నాయనా! మేము కష్టాల్లో – దుఃఖాల్లో ఉండబట్టేగదా! నీ అంతట నీవు వచ్చి మా దగ్గర ఉంటున్నావు. అదే మేము సుఖాల్లో ఉంటే వచ్చేవాడివా? కనుక నిన్ను దగ్గరచేసే దుఃఖాలే కావాలి' అన్నదట. దుఃఖాలు భగవంతునికి మనను దగ్గర చేస్తాయి.

క్షీరసాగరమధనం చేస్తుంటే అమృతమూ పుట్టింది; విషమూ పుట్టింది. అమృతం కోసం అందరూ ఎగబడ్డారు. కాని విషాన్ని చూచి అందరూ భయపడి తలో దిక్కుగా పారిపోయారు. మరి అమృతాన్ని త్రాగిన వాళ్ళు చిల్లర దేవుళ్ళయ్యారు; విషాన్ని మ్రింగినవాడు మహాదేవుడయ్యాడు.

ముళ్ళ కిరీటాన్ని తగిలించుకున్నవాడు లోకానికంతటికీ ప్రభువయ్యాడు. వజ్ర కిరీటాలు పెట్టుకున్న వాళ్ళను తలచుకొనేది కొన్నిదేశాలవారే.

కనుక దుఃఖాలకు, విషాదాలకు భయపడరాదు. లక్ష్యాన్ని సాధించుకొనేందుకు అనువుగా దుఃఖాలను మలచుకోవాలి. భగవంతుని తలచుకోవాలి. భగవంతుని సమీపించాలి. పుటం పెట్టిన బంగారంలాగా ప్రకాశించాలి. ఇదే విషాద యోగం సర్వ మానవులకు ఇచ్చే సందేశం.

మహా భారతం – భీష్మ పర్వంలోని 25 వ అధ్యాయం నుండి 42వ అధ్యాయం వరకు గల 18 అధ్యాయాలే భగవద్గీత. భగవద్గీతలోని మొదటి అధ్యాయమే భీష్మ పర్వంలోని 25వ అధ్యాయం అర్జున విషాదయోగం. ఇది భారత కథతో అల్లుకుపోయి ఉంటుంది.

కురుక్షేత్రంలో మహాభారత సంగ్రామం ప్రారంభమయింది. అందు కౌరవ సర్వసేనాధిపతి, కురువృద్ధుడు భీష్మాచార్యుడు 10 రోజులపాటు వీరవిహారంచేసి, 10వ రోజు యుద్ధంలో శిఖండి కారణంగా, అర్జునుని బాణధాటికి అంపశయ్యపై కూలిపోవటం జరిగింది.

ఈ పదిరోజులుగా కౌరవ పక్షంలో నిలిచి యుద్ధంచేస్తున్న సంజయుడు, వ్యాసమహర్షి ప్రసాదించిన దివ్యదృష్టి కారణంగా, యుద్ధరంగంలో ఎక్కడెక్కడ, ఏమేమి జరుగుతున్నదీ, ఎవరెవరు ఏమేమి మాట్లాడుకుంటున్నదీ, ఎవరి ఆలోచనలు ఏమిటీ అనే విషయాలను గ్రహించినవాడై; కురువృద్ధుడు భీష్ముడు కూలిపోవటాన్ని, యుద్ధ విశేషాలను ధృతరాష్ట్రునికి వినిపించటానికి ఆ రాత్రి హస్తినాపురం చేరాడు.

అంతఃపురంలోని ధృతరాష్ట్ర మందిరంలో ప్రవేశించి, ధృతరాష్ట్ర మహారాజుతో 'శిఖండి చేతిలో భీష్ముడు కూలిపోవటం జరిగింద'ని తెలియజేస్తాడు. ఈ దుర్వార్త వినటంతోనే ధృతరాష్ట్రుడు హతాశుడై మూర్ఛబోయాడు. శీతలోపచారాలు చేయగా కొంతసేపటికి తేరుకున్న ధృతరాష్ట్రుడు ఎంతో దుఃఖించి, యుద్ధరంగంలో ఏదో అన్యాయం జరిగి ఉంటుందని, లేనిచో సింహంలాంటి భీష్ముడు నక్కలాంటి శిఖండి చేతిలో పరాజితుడు కావటమేమిటని మనస్సులో భావించి, తీవ్ర ఆవేదనతో పరిపరివిధాల శోకించి, అసలు యుద్ధం ఎలా ప్రారంభమైనదో; ఏమి జరిగిందో; అనేక యుద్ధాలలో ఆరితేరినవాడు, ద్వంద్వ యుద్ధంలో పరశురామునే ఎదిరించి నిలచినవాడు, సర్వశస్త్రాస్త్రసంపన్నుడు, మహావీరుడు ఐన భీష్ముడు శిఖండి చేతికి ఎలా చిక్కాడో; యుద్ధం ఏ విధంగా కొనసాగిందో, సవిస్తరంగా తెలుసుకోవాలని సంజయుని ప్రశ్నిస్తున్నాడు. ఇలా ధృతరాష్ట్రుని ప్రశ్నతో భగవద్గీత ప్రారంభమవుతున్నది.

**ధృతరాష్ట్ర ఉవాచ:**

**శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ!!! 1**

**తా॥: ధృతరాష్ట్రుడన్నాడు:** సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధం చేయుటకు సమావేశమైన నావాళ్ళు, పాండవులు ఏమిచేశారు?

**వ్యాఖ్య: 'ధృతరాష్ట్ర ఉవాచ':** శుభమా అని గీతాధ్యయనం ప్రారంభిస్తూ, దుష్టుడైన గ్రుడ్డిరాజు ధృతరాష్ట్రుని తలచు కోవటమా? ఇదేమిటి? ఎందుకిలా జరిగింది? మహా మేధావి ఐన వ్యాసుడు ఎందుకిలా ధృతరాష్ట్ర ప్రసక్తి తెచ్చాడు ప్రారంభం లోనే? ఏమిటి ఇందులోని ఆంతర్యం?





వ్యాసమహర్షి ఎంతో నేర్పుతో, కావాలనే ధృతరాష్ట్ర ప్రసక్తి తెచ్చి ఉండాలి. దీనిలో ఎంతో లోతైన భావం ఉంది.

అసలు ధృతరాష్ట్రునికి ఆ పేరు పెట్టినవాడు వ్యాసమహర్షే. ఒక్క ధృతరాష్ట్రునికేగాదు, మహాభారతంలో చాలామందికి నామకరణం చేసింది ఆయనే. నామకరణం చేయటంలో ఆయన సిద్ధహస్తుడు. పేరు వినగానే వాడి గుణగణాలు, బుద్ధులు అన్నీ తెలిసిపోతాయి. మనమూ పెడుతుంటాం పేర్లు బాలసారె రోజున. 'సత్యనారాయణ' అని పెడతాం. వాడు చచ్చినా నిజం చెప్పడు. 'ఆనందరావు' అంటాం. ఎప్పుడూ ఆముదం త్రాగిన ముఖంపెట్టుకొని ఏడుస్తూ ఉంటాడు. 'సుందరమ్మ' అని పెడతాం పేరు. పగలు చూస్తే రాత్రి కల్లోకి వస్తుంది. 'అన్నపూర్ణ' అంటాం. ఎంగిలిచేత్తో కాకిని తోలదు, పిల్లికి బిచ్చంపెట్టదు. 'శాంతాదేవి' అని పెడతాం. ఎప్పుడూ అశాంతే. సన్యాసం పుచ్చుకున్న తర్వాత 'స్వామి ఆత్మానంద' అని పేరు పెట్టుకుంటారు. ఆత్మానందం మాట దేవుడెరుగు, ఎప్పుడూ చిటపటలే, నిప్పుమీది మిరపకాయలే.

కాని వ్యాసుడుచేసే నామకరణం అలా ఉండదు. చక్కగా అతికినట్టు సరిపోతుంది. 'ధృతరాష్ట్రుడు' అంటే తనదికాని రాజ్యాన్ని గట్టిగా పట్టుక కూర్చున్నవాడు అని. నిజంగా ధృతరాష్ట్రుడు చేసింది అదే. చేతికి చిక్కిందిగదా అని పాండవుల రాజ్యాన్ని గట్టిగా పట్టుక కూర్చున్నాడు. ఆఖరుకు శ్రీకృష్ణుడే వచ్చి చెప్పినా ఏవో సాకులు చెప్పి తప్పించుకున్నాడు. ఈ ధృతరాష్ట్రునికి గీతను బోధించినవాడు సంజయుడు. 'సంజయుడు' అంటే సమ్యక్ జయం పొందినవాడు. అంటే ఇంద్రియాలను చక్కగా జయించినవాడు అని. అట్టివాడు గనుకనే వ్యాసులవారి అనుగ్రహంతో దివ్యనేత్రాన్ని పొంది శ్రీకృష్ణుని గీతాబోధను సాక్షాత్తుగా విన్నాడు. ఆయన విశ్వరూపాన్ని దివ్యనేత్రంతో తిలకించి పులకించిపోయాడు.

అట్టి సంజయుని ద్వారా గీతా బోధనువిన్నా, ధృతరాష్ట్రునికి ఏమీ ప్రయోజనం కలగలేదు. కాని అర్జునునికి మాత్రం గీతా బోధతో మోహం తొలిగింది, స్మృతి కలిగింది. ఇద్దరూ విన్నది ఒకే విషయం. అయినా ఎందుకీ తేడా? అర్హతలోనే తేడా. కనుక ధృతరాష్ట్రుని లాగా వినవద్దు– విన్నా ప్రయోజనం ఉండదు అని చెప్పటమే ధృతరాష్ట్ర ప్రసక్తిలోని అంతర్యం.

అంతేకాదు, మనందరం ధృతరాష్ట్రులమే. కనుకనే ఈ హెచ్చరిక. ఎలా? తనదికాని రాజ్యాన్ని గట్టిగా పట్టుక కూర్చున్నవాడు గదా ధృతరాష్ట్రుడు అంటే – మరి మనం చేస్తున్నదేమిటి? ఎన్నో హీన జన్మలెత్తిన తర్వాత, ఆ జన్మలన్నీ వ్యర్థం గనుక, మోక్షాన్ని పొందటానికి తగిన మానవ జన్మ నివ్వమని భగవంతుని ప్రార్థించి, ఈ జన్మను తెచ్చుకున్నాం. ఈ శరీరమనే రాజ్యానికి ప్రభువయ్యాం. అంతే. ఇక భగవంతుని మరచిపోయి, మనం ఎందుకు ఈ దేహాన్ని తెచ్చుకున్నామో మరచిపోయి, ఇది ఒక అద్దెకొంప లాంటిదని, జాగ్రత్తగా వాడుకుంటూ, సమయం రాగానే ఆయన ఇచ్చినదాన్ని ఆయనకు అప్పగించి వెళ్ళాలనే జ్ఞానం లేకుండా, ఇది నాదేనని, అసలు నేనే నని గట్టిగా పట్టుకు కూర్చున్నాం. శాస్త్రాలు, పెద్దలు "ఈ 'దేహాత్మ బుద్ధి'ని వదలరా బాబూ, నీవు దేహానివి కాదు, నీవు ఆత్మవు; ఈ దేహాన్ని నీవు వాడుకోవటానికి భగవంతుడిచ్చిన పరికరం మాత్రమే" అని ఎంత చెప్పినా వినిపించుకోం. సంపాదించుకోవటం, తినటం, తిరగటం, దాచుకోవటం, దోచుకోవటం – ఇదే మన పవిత్ర కర్తవ్యం అనుకుంటూ, వ్యర్థమైన పనులకు మాత్రమే దీనిని వినియోగించుకుంటున్నాం. ఒకవేళ భగవంతుడు 'నేనిచ్చిన దేహాన్ని నాకివ్వమ'ని బలవంతంగా లాగివేస్తే తిరిగి మళ్ళీ మళ్ళీ ఈ దేహాలను తెచ్చు కొనేందుకు వీలుగా కర్మలు చేస్తూ, జన్మకర్మ వలయంలో పడిపోయి, తిరిగి తిరిగి ఈ దేహాలను తెచ్చుకుంటున్నాం. మరి ఇలా గట్టిగా ఈ దేహమనే రాజ్యాన్ని పట్టుక కూర్చున్న మనం ధృతరాష్ట్రులం కాదా?

అందుకే ఓ ధృతరాష్ట్రులారా! మీరు కూడా ఆ ధృతరాష్ట్రుని లాగానే ఈ అద్భుత జ్ఞానాన్ని వింటే, ఆయన కెలాగైతే విన్న జ్ఞానం వంటబట్టక వృధా అయిందో, మీకూ అంతే. కనుక అర్జునునిలాగా మారి వినండి. భగవంతుని చేరుకోవాలనే తపనతో; నావాళ్ళు, నా రాజ్యం అంటూ మమకారం పెట్టు కోకుండా; మనస్సును నిర్మలం చేసుకొని, బుద్ధిని సూక్ష్మం చేసుకొని వినండి అని చెప్పటానికే 'ధృతరాష్ట్ర ఉవాచ' అని గ్రుడ్డిరాజును గుర్తు చేయటం.

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే:** కురుక్షేత్రం ఢిల్లీకి ఉత్తరంగా, హర్యానా రాష్ట్రంలోని అంబాలాకు దక్షిణంగా ఉన్నది. కురురాజు బంగారు నాగలితో ఈ ప్రదేశాన్ని





దున్ని యజ్ఞాలు చేశాడు. అందుకే ఇది కురుక్షేత్రం అయింది. అనేకమంది మహర్షులు, రాజర్షులు, మహాత్ములేగాక బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని మొదలైన దేవతలు కూడా ఇక్కడ తపస్సులు చేసినట్లు ప్రతీతి. కనుక ఇది ధర్మక్షేత్రం కూడా. అందువల్లనే దీనిని ధర్మక్షేత్రమైన కురుక్షేత్రం అన్నారు.

ఐతే ధృతరాష్ట్రుడు అలా అనటానికి వేరే అభిప్రాయం ఉంది. ఏమిటది? తమోగుణంతో అంధుడైనవాడు ధృత రాష్ట్రుడు. అతడికి రాజ్యంమీద చెప్పలేనంత వ్యామోహం. అలాగే కొడుకులమీద మమకారం. తన చేత జిక్కిన రాజ్యాన్ని అంత తేలికగా వదులుకోడు. అలాగని పాండవులతో యుద్ధమూ ఇష్టంలేదు. అందుకే సంజయునిచేత ధర్మరాజుకు వర్తమానం పంపాడు. ఏమని? "నా కొడుకు దుర్మార్గుడు, నా మాట వినటంలేదు. రాజ్య లోభంతో వాడు చెడిపోతే చెడిపోనీ. నీవు ధర్మాత్ముడవు, ఉత్తముడవు, సన్మార్గవర్తనుడవు, హింసకు వ్యతిరేకివి, పెద్దలను గౌరవించేవాడివి. అట్టి నీవు రాజ్యంకోసం మారణహోమం చేస్తావా? ఈ రక్తపుకూడు తినేకన్నా భిక్షాటన మేలు గదా!" అని. ఇదే సంజయ రాయబార సారాంశం.

ఐతే తన పథకం పారలేదు. శ్రీకృష్ణుడే స్వయంగా వచ్చాడు రాయబారిగా. మంచిగా చెప్పాడు. ఐనా ధృతరాష్ట్రుడు మెత్తగా మాట్లాడి వగలుపోయాడేగాని, రాజ్యం ఇవ్వటానికిగాని, చివరకు ఐదుగురికి ఐదూళ్ళు ఇవ్వటానికిగానీ అంగీకరించలేదు. తన కొడుకు తన మాట వినటంలేదని నెపాన్ని దుర్యోధనునిపైకి నెట్టి తప్పుకున్నాడు. ఇదంతా ఎందుకంటే "యుద్ధంలో తామే జయిస్తామ"ని కుమారుడు గట్టిగా చెబుతున్నాడు. పైగా తమ పక్షంలోని సర్వసేనాని భీష్ముడు అజేయ పరాక్రమశాలియేగాక స్వచ్ఛంద మరణం వరంగా గలవాడు. కనుక ఎవ్వరూ ఆయనను వధించలేరు. ఇక ద్రోణ, కృపులు రెండు పక్షాలలో నున్న వీరులందరికి గురువులు, గౌరవనీయులు, పైగా బ్రాహ్మ ణులు, పాండవులకు ఎంతో ప్రియులు. అలాగే అశ్వత్థామ గురుపుత్రుడు. వీరంతా పాండవ శ్రేయస్సును కోరే ధర్మపక్ష పాతులు. కనుక వధార్హులు కారు. పైగా వీరిని చంపితే బ్రహ్మ హత్యాపాతకం. ఇక 11 అక్షౌహిణుల సేన తమది. పాండవులకు 7 అక్షౌహిణులే. కనుక ఎలా చూచినా విజయం తమదేననే ధీమా లోలోపల ఉన్నది.

ఐతే 10 రోజుల యుద్ధం తర్వాత యుద్ధ భూమినుండి తిరిగి వచ్చిన సంజయుడు, శిఖండి చేతిలో భీష్ముడు పడిపోయిన విషయం చెప్పటంతోనే ధృతరాష్ట్రుని ఆశాసౌధం నేలకూలింది. ఆశ్చర్యంతో నిరుత్తరుడైనాడు. తనక్రింది భూమి కంపించినట్లయింది. నమ్మలేని నిజం వినటంతో హతాశుడయ్యాడు. అవధ్యుడైన భీష్ముడు పడిపోవటం – అదీ శిఖండి చేతిలోనని వినటంతో, ఏదో అధర్మం జరిగిపోయిందను కున్నాడు. ఐతే పాండుపుత్రులు ఏమి అధర్మంచేసి భీష్ముని పడగొట్టారు? అని అడిగితే సంజయుని ముందు పలచనై పోతాడు. పాండవులకెన్నో అన్యాయాలుచేసి, ఎంతో అధర్మంగా నడుచుకున్న తాను, 'ధర్మరాజు ఏం అధర్మం చేశాడు' అని సంజయుని ఏముఖం పెట్టుకొని అడుగుతాడు? కాని ఎలాగో అడగాలి తప్పదు. అందుకే తన భావాన్ని ప్రత్యక్షంగా వ్యక్తంచేయకుండా పరోక్షంగా 'ధర్మక్షేత్రమైన కురుక్షేత్రం'లో అని ప్రత్యేకంగా పేర్కొన్నాడు. అది 'ధర్మక్షేత్రం' గదా! ఏ అధర్మం జరగకుండానే భీష్ములవారు పడిపోయారా? అనే ఉద్దేశంతో అడిగాడు. తాను పాండవుల పట్ల ఎంత అధర్మంగా ప్రవర్తించినా వారు మాత్రం తన కుమారుల పట్ల ధర్మంగానే నడుచుకోవాలనే కోరిక ధృతరాష్ట్రునిది. అందుకే కురుక్షేత్రాన్ని ధర్మక్షేత్రమని ధృతరాష్ట్రుడు పేర్కొన్నది.

ఐతే అనుకోకుండానే భగవద్గీత "ధర్మ" అనే మంగళ వాచకంతో ప్రారంభం కావటం ఇక్కడ విశేషం. ఏ గ్రంథాన్నైనా ప్రారంభించేటప్పుడు మంగళాచరణం చేయటం శాస్త్ర సాంప్రదాయం. 'ధర్మ' శబ్దం పరమాత్మ వాచకం. కనుక మంగళాచరణం చేసినట్లే అయింది.

**మామకాః:** కౌరవులను మామకాః– నావారు అంటున్నాడు ధృతరాష్ట్రుడు. అంటే పాండవులు తనవారు కాదు, తన శత్రువులన్నమాట! తన మాటలను తు.చ. తప్పక పాటించేవారు ధర్మజాదులు. ధర్మజ యౌవరాజ్యాభిషేకానంతరం 'వారణావతానికి తల్లితో సహా వెళ్ళి కొన్నాళ్ళుండండి' అని చెప్పగానే సరేనని వెళ్ళినవాడు; ద్రౌపదీ వివాహానంతరం తిరిగి రమ్మని కబురంపితే వచ్చినవాడు; 5 సం॥ల తర్వాత 'ఖాండవ ప్రస్థం' మీకు అర్ధరాజ్యంగా ఇస్తున్నాను, అక్కడికి వెళ్ళండి– అంటే మారుమాట్లాడక వెళ్ళినవాడు; రాజసూయయాగంతో చక్రవర్తి





కాగా వారి రాజ్యాన్ని అపహరించాలనే దురాలోచనతో, 'జూదానికి రావలసినది' అని కబురుపెడితే వచ్చినవాడు; ప్రథమ జూదంలో ధర్మరాజు సర్వం కోల్పోయి, ద్రౌపదికి నిండు సభలో ఘోర అవమానం జరిగినప్పుడు ఉత్పాతాలకు భయపడిన ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాల రూపంలో పాండవులను దాస్య విముక్తులనుజేసి, వారి రాజ్యం వారికిచ్చి, 'కోపం పెట్టుకోకుండా తిరిగి మీ రాజ్యానికి మీరు వెళ్ళండి' అంటే వెళ్ళినవాడు; మార్గ మధ్యంలో ఉండగానే తిరిగి 'అనుద్యూతానికి రమ్మ'ని ప్రాతిగామిచేత కబురంపితే మారుమాట్లాడకుండా తిరిగి వచ్చినవాడు ధర్మరాజు. తనమాటను ఎన్నడూ మీరనివాడు, ఎదురు ప్రశ్నించనివాడు ధర్మరాజు. కాని తన కుమారుడో – ఎప్పుడూ తన మాట విన్న పాపాన పోలేదు. తనను ఎన్నడూ గౌరవించలేదు. అట్టి తన కుమారులను "మామకాః–' నావారు – అని, ధర్మజాదులను పాండవాః పాండవులు అని పిలవటంలో ధృతరాష్ట్రుని సంకుచిత మనస్తత్వం, మమకార బుద్ధి అర్థమవుతుంది. మూర్తీభవించిన మమకారం, స్వార్థబుద్ధియే ధృతరాష్ట్రుడు.

**కిం అకుర్వత:** అంటే ఏమి చేశారు? అని. యుద్ధభూమిలో యుద్ధం చేయటానికి సమావేశమైనవారు ఏం చేస్తారు? విందు భోజనాలు చేస్తారా? జూదం ఆడతారా? ఎంతోకాలం నుండి ఎదురు చూచిన యుద్ధం సంభవమైనపుడు, యుద్ధ రంగంలో నిలిచినపుడు యుద్ధమే చేస్తారు. ఈ విషయం ధృతరాష్ట్రునికి తెలియదా? తెలిసీ ఎందుకు 'ఏమి చేశారు?' అని ప్రశ్నిస్తున్నాడు.

ఏమి చేశారు? అని అడగడంలో ఉద్దేశం ఎలా యుద్ధం చేశారు? ధర్మంగానే యుద్ధం చేశారా? అధర్మమేమీ జరగలేదా? అనే. తనది అధర్మమైనా తనకే జయం కలగాలి. భీష్ముని పతనవార్త వినటంతోనే మతి చలించింది. మనస్సు అల్లకల్లోల మైంది. అందుకే తనకు తెలియకుండానే 'ధర్మ' శబ్దం తన నోటినుండి వచ్చింది. తన వాళ్ళకు జయం కలుగుతుందా? లేదా? అనే ఆదుర్దాతో సంజయుని ప్రశ్నించాడు. విజయం ఎవరికి కలుగుతుందో తెలుసుకోవాలని ఉన్నప్పటికీ డైరక్టుగా ప్రశ్న వేయకుండా తెలివిగా ప్రశ్నించాననుకున్నాడు ధృతరాష్ట్రుడు. దానికి తగ్గట్టుగానే సంజయుడు డైరక్టుగా సమాధానం చెప్పకుండా,

అంతకన్న తెలివిగా తన సమాధానాన్ని కొనసాగించి, చివరకు చెప్పకనే చెప్పాడు. "యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః తత్రశ్రీ విజయః" అని.

అయితే సంజయుడు చివరిదాకా చెప్పలేదుగాని, ధృతరాష్ట్రుడు తన నోటితోనే అడిగిన, తన ప్రశ్నలోనే సమాధానం ఉన్న సంగతిని బహుశా గమనించి ఉండడు. ఆయన అడిగిన శ్లోకంలో మొదటి రెండక్షరాలు 'ధర్మ'. ఆ శ్లోకంలోని చిట్టచివరి రెండక్షరాలు 'జయ'. అంటే ధర్మమే జయిస్తుంది – అని నిగూఢంగా సమాధానం దాగివుంది.

మన దేహమే కురుక్షేత్రం. ఇందులో ధర్మానికి – అధర్మానికి, మంచి గుణాలకు– చెడ్డ గుణాలకు పోరాటం జరుగుతూనే ఉంటుంది. మనం ధర్మాన్నే అనుసరించాలి. మంచికి స్థానం ఇవ్వాలి. హోల్కార్ మహారాణి అహల్యాబాయి ఒక పండితుని పిలిచి గీతాబోధ చేయమన్నదట. ఆయన మొదటి శ్లోకం మొదటి పాదం చదవగానే ఇకచాలు శాస్త్రులుగారూ అన్నదట. ఆయన ఆశ్చర్యపోగా, ఆమె మహాత్మా! 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' అని చదివారుగదా! ఆ పదాలను కొద్దిగా మారిస్తే 'క్షేత్రే క్షేత్రే ధర్మంకురు' ఏ క్షేత్రంలో ఉన్నా ధర్మాన్నే ఆచరించు అని కదా! అర్థం. ఇంతకన్న ఇంకా నేర్చుకోవలసినదేమున్నది? అన్నదట. కనుక ధర్మాచరణమే మానవుడికి ప్రధానం.

**ధృతరాష్ట్ర ప్రశ్నకు సంజయుడేమని సమాధానమిస్తున్నాడు?**

**సంజయ ఉవాచ:**

**శ్లో ॥ దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।**
**ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ 2**

సంజయుడన్నాడు:

**తా :** అప్పుడు దుర్యోధనుడు పాండవసేనా వ్యూహాన్ని చూచి, ఆచార్యుని సమీపించి ఇలా అంటున్నాడు

**వ్యాఖ్య :** ధృతరాష్ట్రుని ప్రశ్నకు సంజయుడు సమాధానం ఇవ్వటం ప్రారంభించాడు. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో మావారు, పాండవులు ఏంచేశారు? అని అడిగిన ప్రశ్నకు యుద్ధరంగ విశేషాలను వినిపిస్తున్నాడు సంజయుడు.





**పాండవానీకం వ్యూఢం దృష్ట్వాతు :** యుద్ధభూమిలో పాండవ సేనా వ్యూహాన్ని చూచాడు దుర్యోధనుడు. అది దుర్భేద్యమైన వజ్ర వ్యూహంగా పన్నబడి ఉంది. 11 అక్షౌహిణుల తనసేనకన్నా 7 అక్షౌహిణుల పాండవసేన చిన్నదే. అయినా ఆ వ్యూహాన్నీ, వ్యూహ ముఖంలో గదాదండం ధరించి నిలిచి యున్న భీమసేనుని చూడగానే దుర్యోధనుని ఆత్మ విశ్వాసం సడలిపోయింది. అందుకే ఆచార్యుడైన ద్రోణుని వద్దకు చేరాడు. నేరం చేసినవాడు, పాపం చేసినవాడు, అధర్మానికి ఒడిగట్టిన వాడు ఎప్పుడూ భయం భయంగానే ఉంటాడు. ధర్మాత్ములైన పాండవులను చూడగానే ఇప్పుడు దుర్యోధనునిలో అలాంటి భయమే కలిగింది. వారి సేనను చూడగానే తత్తరపాటు కలిగింది. తనకు విజయం లభిస్తుందా? లేదా? అనే ఆదుర్దా ఎక్కువైంది. తనలోని భయాన్ని, తత్తరపాటుని, ఆదుర్దాని దాచుకోవడానికి ద్రోణుని వద్దకు చేరాడు.

**ఆచార్యం ఉపసంగమ్య:** తాను రాజుగదా! ద్రోణుడు ఒక అక్షౌహిణీ సేనాధిపతి మాత్రమే. అయినప్పుడు ఆయన్నే తన వద్దకు పిలిపించుకోవాలి. అలా చేయలేదు. దానికి కారణం ఆయన తన గురువు. అంతేకాదు. భీష్ముడు పాండవ పక్షపాతి. ఆయనకు వారిపై ఎనలేని ప్రేమ. అందుకే పాండవులను నేను సంహరించను అని ముందే చెప్పేశాడు. కాని ద్రోణుని విషయం వేరు. ఆయనకు తనపై అభిమానం ఉంది. ఆయన కుమారుడు అశ్వత్థామ తనకు మిత్రుడు. పైగా పాండవుల మామగారైన ద్రుపదునితో ద్రోణునికి విరోధం. ఆ ద్రుపద పుత్రుడైన దృష్టద్యుమ్నుడే పాండవ సర్వసేనాని. కనుక ఎలాగైనా ద్రోణుని గౌరవించి, మంచి చేసుకొని పాండవులపై రెచ్చగొట్టాలి. అలా తాను ప్రయోజనం పొందాలి. అందుకే తానే స్వయంగా ఆయన వద్దకు వెళ్ళటం.

అయితే శిష్టాచార సాంప్రదాయం ప్రకారం గురువు వద్దకు వెళ్ళిన శిష్యుడు ముందుగా గురువుకు నమస్కరించాలి. కాని దుర్యోధనుడలా నమస్కరించలేదు. ఎందువల్ల? రాజుననే అహంకారమా? కాదు. అలాంటి అహంకారమే అయితే ఆయననే తనవద్దకు పిలిపించుకొనేవాడు గదా! మరి ఏమై ఉంటుంది? పాండవసేనను చూసినప్పుడు కలిగిన భయం వల్ల ఆలోచనలన్నీ అస్తవ్యస్తమై, తొందరపాటుతో వివేకాన్ని కోల్పోయాడు. అవివేకి పనులెప్పుడూ అస్తవ్యస్తంగానే ఉంటాయి.

ఈ విషయాన్ని తెలియజేయడానికి మహర్షి వేద వ్యాసుడు ప్రయోగించిన పదాలు ఎంతో సమయస్ఫూర్తి తోనూ, సందర్భోచితంగాను, విజ్ఞతతోను, మనోభావాలను చక్కగా ప్రతిబింబించే రీతిలోను ఉన్నాయి.

**"ఆచార్యం ఉపసంగమ్య రాజా వచనం అబ్రవీత్"**– ఆచార్యుని సమీపించి, రాజు ఇలా పలికెను: – అని.

అంటే సమీపించటం శిష్యునిగా సమీపించాడు. కాని పలకటం రాజుగా పలికాడు. అంటే దుర్యోధనునిలో వినయ విధేయతలతో కూడిన శిష్యభావం లేదు. అహంకారంతో కూడిన శిష్యభావనే–అని అతి మనోహరంగా చిత్రించాడు వ్యాస భగవానుడు. ఇదే పరమ పూజ్య వ్యాస భగవానుని విశిష్టత.

మరి ఆచార్య ద్రోణుని సమీపించి ఏమంటున్నాడు దుర్యోధనుడు?

**శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణం ఆచార్య! మహతీంచమూం।**
**వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవశిష్యేణ ధీమతా॥** 3

**తా :** ఆచార్యా! ద్రుపద పుత్రుడు, తమ శిష్యుడు, బుద్ధిమంతుడు అయిన దృష్టద్యుమ్నునిచేత నిర్మించబడిన ఈ పాండు పుత్రుల గొప్ప సేనను చూడండి.

**వ్యాఖ్య :** భగవద్గీతలో ధృతరాష్ట్రుడు మాట్లాడితే ధృతరాష్ట్ర ఉవాచ అని, అర్జునుడు మాట్లాడితే అర్జున ఉవాచ అని, సంజయుడు మాట్లాడితే సంజయ ఉవాచ అని, శ్రీకృష్ణుడు మాట్లాడితే శ్రీ భగవానువాచ అని ఉండగా దుర్యోధనుడు మాట్లాడిన మాటలను దుర్యోధన ఉవాచ అని వ్యాసుడెందుకు అనలేదు? దీనికి ఒక్కటే కారణం. దుష్టుడైన దుర్యోధన స్మరణ ఇష్టంలేకనే. మరి దుష్టుడైన ధృతరాష్ట్రుని స్మరణ ఉన్నది గదా– అంటే – ఉన్నదే ఎక్కువ ఇంకా ఇది కూడా ఉంచి దుష్టుల స్మరణ ఎందుకు ఎక్కువ చేయాలి? అనే తొలగించి ఉండాలి.

ఆచార్యుని సమీపించి దుర్యోధనుడేమన్నాడు? ఆచార్యా! గొప్పదైన ఆ పాండవ సేనను చూడండి అనీ; ఆ సేనను వ్యూహంగా నిలిపింది మరెవరో గాదు మీ శిష్యుడు, బుద్ధిమంతుడు, ద్రుపద పుత్రుడు అయిన దృష్టద్యుమ్నుడే అనీ.

ఇంతకూ ఈ రెండు విషయాలను దుర్యోధనుడు ద్రోణాచార్యునకు





తెలియజేయడం ఎందుకు? ద్రోణాచార్యునకు సేనా వ్యూహ నిర్మాణం గురించి అంతగా తెలియదా? లేక ఎదురుగానున్న సేనను వ్యూహంగా ఏర్పాటు చేసిన దృష్టద్యుమ్నుని గురించి సరిగ్గా తెలియదా?

నిజంగా రెండు పక్షాలలోనూ ద్రోణాచార్యునంతటి వ్యూహరచనా నైపుణ్యంగల మేధావి 'మరొకరు లేరు' అంటే అతిశయోక్తి కాదు. అపూర్వ వ్యూహరచనా దురంధరుడు ద్రోణాచార్యుడు. వ్యూహరచనలో ఆయనకెవ్వరూ సలహానివ్వనక్కరలేదు. ఎవరైనా ఆయన సలహాయే తీసుకోవాలి. భీష్ముడు కౌరవ సర్వసేనాధిపతిగా ఉన్న 10 రోజులూ ద్రోణుని సలహా తోనే ప్రతిరోజూ వ్యూహ నిర్మాణం చేశాడు.

ఇక ఎదటి సేనలోని దృష్టద్యుమ్నుని గురించో, లేక ఇతర వీరుల గురించో పరిచయం చేయటానికి అనుకుందామా! అదెంతో హాస్యాస్పదం. ఎందుకంటే రెండు సేనలలోను ఉన్న ఎందరో రాజపుత్రులకు అస్త్రశస్త్ర విద్యలు నేర్పిన ఆచార్యుడు ద్రోణుడు. పైపెచ్చు ద్రుపద పుత్రులైన శిఖండీ దృష్టద్యుమ్ను లిరువురూ తన శిష్యులే. అటు పాండవులైదుగురు, ఇటు ధార్తరాష్ట్రులు నూరుగురు, ఇంకా యుద్ధం చేయటానికి సిద్ధం గాని కర్ణుడు – అందరూ తన శిష్యులే. ద్రుపదుడు తన సహా ధ్యాయి. కనుక ఆయనకు తెలియని వారెవరూ అక్కడలేరు. మరెందుకు దుర్యోధనుడు ఇలా చెప్పటం?

ఎందుకంటే దుర్యోధనునిలో భయం ప్రవేశించింది. అధర్మపరుడికి కార్యరంగంలోకి దిగేముందే నిరాశా, భయం కలగటం సహజం. తనది అన్యాయమని తనకు తెలుసు. ఎన్నో అకృత్యాలు చేశాడు తాను. పాండవుల నెంతగానో క్లేశాలపాలు చేశాడు. అందుకే తాను విజయాన్ని సాధించలేనేమోనని భయం. ఆ భయంతో మనస్సు అశాంతిగా, ఆందోళనగా, గజిబిజిగా మారింది. స్థిరంగా ఒకచోట నిలవలేకపోయాడు. ఇలాంటి స్థితిలో ఉన్నవాడెవరైనా ఇతరులతో మాట్లాడడానికి ప్రయత్నిస్తూ, ఇతరులకు ధైర్యం చెబుతూ, నాకేం భయం లేదు అని తన లోలోపలి భయాన్ని పోగొట్టుకొని ధైర్యం తెచ్చుకొనేందుకు ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో భాగంగానే దుర్యోధనుడు ఇప్పుడు ద్రోణాచార్యుని వద్దకు వచ్చాడు. అసందర్భ ప్రసంగం, అధిక ప్రసంగం చేసి తన బుద్ధిహీనతను

ప్రదర్శించాడు. తనకు తెలియకుండానే తాను భయపడుతున్న సంగతిని ద్రోణాచార్యుడు గ్రహించేటట్లు ప్రవర్తించాడు. ఇదే అస్తవ్యస్త మనఃస్థితి.

అలా వచ్చి ఏమంటున్నాడు దుర్యోధనుడు? "ఆచార్యా! ద్రుపదపుత్రుడు, మీ శిష్యుడు, బుద్ధిమంతుడు అయిన దృష్టద్యుమ్నుని చేత వ్యూహంగా ఏర్పాటు చేసిన పాండవ సేనను చూడండి" అని.

ఇక్కడ దృష్టద్యుమ్నునికి 3 విశేషణాలను చేర్చి చెప్పటం జరిగింది.

**(1) ద్రుపదపుత్రేణ :** దృష్టద్యుమ్నుడు అని సూటిగా అతడి పేరు ఎత్తకుండా ద్రుపద పుత్రుడు అంటున్నాడు. అంటే ఇక్కడ ద్రోణాచార్యునికి ద్రుపదునితో గల వైరాన్ని గుర్తు చేయటానికే 'అతడు నీ శత్రువైన ద్రుపదుని కుమారుడు' అని చెప్పటం.

ద్రోణద్రుపదులిద్దరు అగ్నివేశుడనే మునివద్ద విద్యా భ్యాసం చేశారు. కనుక వారిరువురూ సహాధ్యాయులు, మంచి మిత్రులు. ఆ తర్వాత ద్రుపదుడు రాజయ్యాడు. కుటుంబ పోషణ కూడా కష్టంగా ఉన్న ద్రోణుడు ఒకసారి ద్రుపదుని వద్దకు సాయానికి వెళ్ళగా, అతడు అహంకారంతో అవమానించాడు ద్రోణాచార్యుని. దానితో ఆగ్రహించిన ద్రోణుడు కురు కుమారులకు ఆచార్యుడై 'గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెమ్మ'ని కోరగా భీమార్జునులు ద్రుపదునిపైకి దండెత్తి, జయించి, బంధించి, తెచ్చి ఆచార్యుని పాదాలపై పడవేశారు. దానితో ద్రోణుని క్రోధం చల్లారింది. ఇప్పుడు ద్రుపదునిపై ద్రోణునికి ఎటువంటి పగలేదు. అయితే ద్రుపదుడు మాత్రం ద్రోణునిపై కక్ష కట్టాడు. ద్రోణాచార్యుని చంపగల పుత్రుని కొరకై అరణ్యాలలో ఎందరో మునులను వేడుకొన్నాడు. ఎంతో ప్రయత్నం మీద యాజుడు, ఉపయాజుడు అనే ముని సోదరుల ఆధ్వర్యంలో యజ్ఞం చేయగా, హోమకుండంలోని అగ్నిమధ్యం నుండి దివ్యమైన రథంతో, ధనుర్బాణాలు ధరించి, అగ్నివంటి తేజస్సుతో దృష్టద్యుమ్నుడు ఉద్భవించాడు. ఇదీ దృష్టద్యుమ్నుని జనన విశేషం. ద్రోణవధకై జన్మించినవాడు దృష్టద్యుమ్నుడు.

అందుకే "ఆచార్యా! ద్రుపదుడు నీ అంతు చూడాలను కుంటున్న నీ శత్రువు. ఆ శత్రువు యొక్క పుత్రుడే నిన్ను వధించుటకై జన్మించిన ఈ





దృష్టద్యుమ్నుడు" అని ఆ కథ మొత్తాన్ని గుర్తుచేసి, ద్రోణాచార్యునికి రోషం ఎక్కించటానికే ఇలా 'ద్రుపదపుత్రేణ' అనే పదాన్ని దుర్యోధనుడు ప్రయోగించాడు.

**(2) తవశిష్యేణ :** ఆ దృష్టద్యుమ్నుడు మరెవరో కాదు, 'నీ శిష్యుడే' అని జ్ఞాపకం చేయటంలో దుర్యోధనుని మదిలో ఎన్నో భావాలు మెదిలి ఉంటాయి.

"నిన్ను చంపటానికే పుట్టిన వాడని తెలిసీ, నీ శత్రువైన ద్రుపదుని పుత్రుడని తెలిసీ, నీవు చక్కగా అతడికి అస్త్ర శస్త్ర విద్యలన్నింటినీ నేర్పావు. నీ తెలివి తెల్లారినట్లే ఉంది" అనే ఎత్తిపొడుపు, హేళన–ఒకటి.

"నీ శిష్యుడే గదా! అని శిష్యవాత్సల్యం చూపుతావేమో! అలా వాత్సల్యం చూపితే నా కొంప కొల్లేరవుతుంది. నీకు నూకలు చెల్లిపోతాయి. నిన్ను చంపటానికే పుట్టినవాడు నీ శిష్యుడైనంతమాత్రాన నీవు మెతకగా ఊరుకునే అవివేకివా?" అనే ఎత్తిపొడుపు– రెండు.

"నీ శిష్యుడే గదా! అతడికి ఎంత అస్త్ర శస్త్ర విద్యా నైపుణ్యం ఉన్నా అస్త్ర విద్యాచార్యుడవైన నిన్నేమీ మించిపోడులే. అతణ్ణి నీవే జయించి, నీ గౌరవాన్ని నిలబెట్టుకోవాలి. అతడి చేతిలో ఓడితే ఇక అంతకన్నా అప్రతిష్ఠ మనకింకేం ఉంటుంది?" అనే రెచ్చగొట్టే ధోరణి– మూడు. ఇవి నీ శిష్యుడే అని గుర్తు చేయటంలోని భావాలు.

**(3) ధీమతా:** ఇక అతడు 'గొప్ప బుద్ధిశాలి' అనటంలో దుర్యోధనుని భావాలేమిటి?

భలే బుద్ధిమంతుడయ్యా! నీ దగ్గరే విద్యలు నేర్చుకొని, ఆ విద్యల సాయంతో నిన్నే సంహరించ టానికి సిద్ధమయ్యాడు. ఆహా! గురువుకు పంగనామాలు పెట్టే బుద్ధిమంతుడు – అనే వ్యంగ్య ధోరణి – ఒకటి.

"అతడు ఎంత గొప్పగా పాండవసేనా వాహినిని వజ్ర వ్యూహంగా తీర్చిదిద్దాడో చూచారుగదా!" అని దృష్టద్యు మ్నుని వ్యూహరచనా నైపుణ్యాన్ని గుర్తుచేసి, అంతకన్నా గొప్పగా నీ వ్యూహరచన ఉండాలి– అనే హెచ్చరిక – రెండు.

ఈ ఉద్దేశాలతోనే 'ధీమతా' అని దుర్యోధనుడు అనటం జరిగింది.

తనకు 11 అక్షౌహిణుల సేన ఉన్నా – పాండవులకు 7 అక్షౌహిణులే

ఉన్నా 'మహతీం చమూం'–అంటూ పాండవ సేనను గొప్పదైన సేనగా చెప్పటంలోనూ దుర్యోధనుని భయం, అస్తవ్యస్థ మానసిక స్థితి వ్యక్తమవుతున్నది.

భగవంతుణ్ణి కాదని సైన్యాన్ని కోరితెచ్చుకొన్న ఆసురీస్వభావి దుర్యోధనుడు. అందుకే ఈ అస్తవ్యస్థ స్థితి. మనం కూడా 'భగవంతునికన్నా ధనసంపదలే గొప్ప' అని నమ్ముకుంటే దుర్యోధనుని గతే. ఇంకా ఏమంటున్నాడు దుర్యోధనుడు?

**శ్లో ॥ అత్రశూరా మహేష్వాసాః భీమార్జున సమాయుధి।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥** 4

**శ్లో॥ దృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।**
**పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥** 5

**శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాంతః ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః॥** 6

**తా॥** ఇక్కడ శూరులు, బలమైన ధనుస్సులు గలవారు, యుద్ధంలో భీమార్జునులతో సమానమైనవారు ఐన సాత్యకి, విరాటుడు, మహారథుడు ద్రుపదుడు, దృష్టకేతువు, చేకితానుడు, వీరుడైన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరులలో శ్రేష్టుడైన శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు ద్రౌపదేయులు ఉన్నారు. వీరంతా మహారథులే.

**వ్యాఖ్య :** దుర్యోధనుడు పాండవసేనలోని వీరులను ద్రోణాచార్యునికి వర్ణించి చెబుతూ, వారంతా శౌర్యధనులు, గొప్ప ధనుస్సులు గలిగినవారు, యుద్ధంలో భీమార్జునులతో దీటురాగలిగిన వాళ్ళూ అని ప్రశంసిస్తున్నాడు. శూరులు, గొప్ప ధనుస్సులు గలవారు అనటంలో విశేషం ఏమీ లేదు. కాని వారంతా భీమార్జునులతో దీటురాగలిగిన వాళ్ళు అని చెప్పటం దుర్యోధనుని భయాన్ని, అస్తవ్యస్త మానసిక స్థితిని తెలియ జేస్తున్నది. ఎందుకంటే భీమార్జునులతో సమమైన వారు మరెవ్వరూ లేరు. కొన్ని కొన్ని సమయాలలో పరాక్రమాన్ని ప్రదర్శించాల్సి వచ్చినప్పుడు అభిమన్యుని, సాత్యకిని కొంతవరకు పోల్చవచ్చునేమోగాని, మిగిలిన వారెవ్వరు ఆ స్థాయిగలవారు కాదు. మరి అందరినీ కలగలిపి, భీమార్జునులతో సమానమైన వారని ఎందుకు చెప్పినట్లు?

ఇక్కడ భీమార్జునుల ఆధిక్యతను పరోక్షంగా అంగీకరించటం – ఒకటి,





భీమార్జునులంటే తనకున్న గొప్ప భయాన్ని దాచుకోలేకపోవటం – రెండు.

భీమార్జునులంటే ఎందుకంత భయం?

చిన్నప్పుడు ఆటలాడుకొనే నాటినుండి భీముని దెబ్బ ఎలాంటిదో రుచి చూసినవాడు దుర్యోధనుడు. అందుకే భీముడంటే భయం. భీముణ్ణి అడ్డు తొలగిస్తే తప్ప పాండవుల రాజ్యంపై ఆధిపత్యాన్ని పొందలేనని భావించిన దుర్యోధనుడు, భీముణ్ణి చంపటానికి అనేక కుట్రలు, కుయుక్తులు పన్నాడు. పాములచేత కరిపించాడు, విషం కలిపిన అన్నాన్ని తినిపించాడు, గంగలో త్రోయించాడు. అయితే ఏవీ ఫలించలేదు. క్రమక్రమంగా భీముడు అజేయుడయ్యాడు. అట్టి భీమునికి ఇప్పుడు సర్వశస్త్రాస్త్ర విద్యలలో ఆరితేరిన అర్జునుడు తోడయ్యాడు. ఖాండవ వన దహన సమయంలో అర్జునుడు అగ్నిదేవుని ద్వారా దివ్యరథాన్ని, దివ్యాస్త్రాలను, గాండీవాన్ని పొంది దేవేంద్రునే జయించాడు. దేవలోకం వెళ్ళి, దేవతలకు అసాధ్యులైన కాలకేయ, నివాతకవచులనే రాక్షసులను సంహరించి, దేవతలద్వారా అనేక దివ్యాస్త్రాలు సంపాదించాడు. పరమశివుని మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. నిన్నగాక మొన్న జరిగిన ఉత్తర గోగ్రహణ సమయంలో, ఎట్టి సేనా లేకుండా, సహాయులెవ్వరూ లేకుండా, శ్రీకృష్ణుని తోడు లేకుండా, ఒక సామాన్య రథికుడైన ఉత్తరుని సారథ్యంలో, ఏక రథంపై వచ్చి సమస్త కౌరవ సేనను జయించి; భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునిలతో కూడిన చతురంగ బలాలను తన దివ్యాస్త్రాలతో చెల్లాచెదరు చేసి, గోవులను మళ్ళించుకు వెళ్ళాడు. ప్రత్యక్షంగా తన కన్నులారా దర్శించిన ఈ దృశ్యం ఇంకా కళ్ళముందు మెదులుతూనే ఉంది. అందుకే భీమార్జునులంటే హడల్. పైకి ఎంత మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శించినా, లోలోపల వారంటే ఉన్న భయం దయ్యంలా పీడిస్తున్నది. అసలే పాపాచార పరాయణుడు. చేసిన పాపాలన్నీ శాపాలై పీడిస్తుంటే, ఎదురుగా అజేయులైన బలపరాక్రమశాలురు భీమార్జునులను చూస్తుంటే, మతిపోతున్నది. అందుకే బుద్ధిహీనంగా మాట్లాడుతున్నాడు. ఏమిటి బుద్ధిహీనత?

ముందుగా తన పక్షంలో ఉన్న వీరులను గూర్చి ప్రశంసిస్తూ మాట్లాడకుండా శత్రుపక్ష వీరులనుగూర్చి ప్రశంసలుకురిపిస్తున్నాడు. శత్రుసైన్యంపై

ద్రోణాచార్యునికి రోషం కలిగిస్తున్నానని అనుకున్నాడేగాని, తన భయాన్ని, బలహీనతను, తన అస్తవ్యస్త మానసిక స్థితిని బయట పెట్టుకుంటున్నానని అనుకోలేదు.

ఇంతకూ దుర్యోధనుడు పేర్కొన్న వీరులెవరు?

**1. యుయుధానుడు :** ఇతడే సాత్యకి. వసుదేవుని సోదరుడైన శిని కుమారుడు. శ్రీకృష్ణునికి సోదరుడు, అర్జునునికి శిష్యుడు. అర్జునునితో దాదాపు సమానమైన అస్త్రవిద్యా విశారదుడు, సత్యబల పరాక్రమశాలి. యుద్ధంలో పరాక్రమశాలి గనుక యుయుధానుడు అనే పేరు వచ్చింది. ఇతడు అక్షౌహిణీ సేనాధిపతి.

**2. విరాటుడు :** మత్స్యదేశానికి రాజు. అజ్ఞాతవాసంలో పాండవులకు ఆశ్రయమిచ్చిన పాండవాభిమాని. కుమార్తె ఉత్తరను అభిమన్యునకిచ్చి వివాహంచేసి పాండవ బంధువర్గం లోనివాడయ్యాడు. ఇప్పటి జైపూర్ ప్రాంతమే మత్స్యదేశం. అక్షౌహిణీ సేనాధిపతి.

**3. ద్రుపదుడు :** పాంచాలదేశ రాజు. ద్రౌపది తండ్రి. అక్షౌహిణీ సేనాధిపతి. ద్రోణాచార్యుని సహాధ్యాయి. రాజ్యమదంతో ద్రోణుని అవమానించి విరోధం పెట్టుకున్నవాడు. ఈయన కుమారుడు దృష్టద్యుమ్నుడే పాండవ సర్వసేనాని. మరొక కుమారుడు శిఖండి అక్షౌహిణీ సేనాధిపతి. ద్రుపదుని గురించి చెబుతూ ప్రత్యేకంగా మహారథుడు అని విశేషణంతో చెబుతున్నాడు దుర్యోధనుడు. ఇది ద్రుపదునితో ద్రోణునికిగల వైరాన్ని గుర్తు చేయటానికే.

**4. దృష్టకేతువు :** ఇతడు చేదిదేశపు రాజు. శిశుపాలుని కుమారుడు. శిశుపాలుడు పాండవుల పినతల్లి (కుంతీదేవి చెల్లెలు) సాత్వతి కుమారుడే. రాజసూయయాగ సమయంలో శ్రీకృష్ణుని నిందించి, ఆయన చేతిలో హతుడయ్యాడు శిశు పాలుడు. అప్పుడు చేది రాజ్యానికి దృష్టకేతువు పట్టాభిషిక్తు డయ్యాడు. ఇతడు అక్షౌహిణీ సేనాధిపతి.

**5. చేకితానుడు :** యాదవులలో యదు, వృష్ణి, భోజ, అంధక అని 4 వంశాలున్నాయి. వారిలో అంధక వంశానికి చెందిన రాజు చేకితానుడు. ఈయన కూడా అక్షౌహిణీ సేనాధిపతియే.

**6. కాశీరాజు :** కాశీదేశపు రాజు. సామాన్య వీరుడు, భీమసేనుని మామ.





**7. పురుజిత్తు :** ఇతడు కుంతిని పెంచుకున్న కుంతిభోజుని పుత్రుడు. ధర్మజ, భీమార్జునులకు మేనమామ. అతిరథుడు. మహా పరాక్రమశాలి.

**8. కుంతిభోజుడు :** ఇతడు కూడా కుంతీదేవి సోదరుడే. కుంతి భోజుని పుత్రుడే. తండ్రి పేరే ఇతడికి పెట్టడం జరిగింది. పురుజిత్తు, ఇతడు సోదరులే.

**9. శైబ్యుడు :** ఇతడు శిబిదేశానికి రాజు. ఇతని కుమార్తె దేవికను ధర్మరాజు వివాహం చేసుకున్నాడు. కనుక ఈయన ధర్మజుని మామ. 'నరపుంగవః' పురుషులలో శ్రేష్ఠుడు అని దుర్యోధను డీయనను ప్రశంసించాడు.

**10. యుధామన్యుడు :** పాంచాల రాజు ద్రుపదుని సోదరుని యొక్క కుమారుడు. యుద్ధమునందు ఆవేశముగలవాడు గనుక యుధామన్యుడు అనుపేరు సార్థకమయింది. ఇతడు 18 రోజులు కురుక్షేత్ర యుద్ధభూమిలో అర్జున రథానికి ఎడమవైపు చక్రరక్షకుడుగా ఉండిన ప్రతాపశాలి. మహావీరుడు.

**11. ఉత్తమౌజుడు :** ఇతడు యుధామన్యుని సోదరుడే. పాంచాల రాజపుత్రుడే. ఇతడు అర్జున రథానికి కుడివైపు చక్రరక్షకునిగా ఉండి, 18 రోజులూ అర్జునుని కాపాడిన వాడే. యుధామన్య ఉత్తమౌజులిద్దరూ 18 రోజుల యుద్ధంలో ఎవరిచేతను వధించబడకుండా తీవ్రమైన యుద్ధం చేసిన పరాక్రమశాలురే.

**12. సౌభద్రుడు :** అర్జునునకు సుభద్రయందు జన్మించిన అమేయబలపరాక్రమ సంపన్నుడు. ఇతడే అభిమన్యుడు. అర్జునుని వద్ద, సాత్యకి వద్ద యుద్ధ విద్యలు నేర్చుకున్నవాడు. శ్రీకృష్ణుని మేనల్లుడు. విరాటరాజుకు అల్లుడు. భీష్మద్రోణు లిద్దరినీ ఒకరోజు యుద్ధంలో జయించి ప్రశంసలందు కున్న వాడు. 13వ రోజు యుద్ధంలో ద్రోణుడు పన్నిన పద్మవ్యూహంలో ప్రవేశించి, తన అసమాన శౌర్య, ధైర్య, పరాక్రమాలను ప్రదర్శించినవాడు. ఆనాడు ద్రోణాచార్యునితో సహా ఇతడి చేతిదెబ్బ తినని యోధుడు కౌరవపక్షంలో లేడు. ఆనాడు కర్ణుడు అభిమన్యుని చేతిలో విగతకవచుడై, రణభూమినుండి తొలగిపోయి, ముఖద్వారాన ఉన్న ద్రోణుని చేరి "ఆచార్యా! ఈ బాలుని పరాక్రమం గమనించారా? అర్జునుని బాణప్రయోగ కౌశల్యం చూచానుగాని, అతడి హస్తం ఇంత కర్కశం కాదు. బాలుని బాణ ప్రయోగ కౌశల్యం అనన్య సామాన్యం, అనితరసాధ్యం. ఆ బాణాలు ఘోర సర్పాలవలె నా శరీర అవయవాలను

పీడిస్తున్నాయి. యుద్ధరంగమున దుర్యోధనుని కొరకు నిలబడి యుండక తప్పదని నిలుచున్నానేగాని, నిజంగా శిబిరానికి వెళ్ళి విశ్రాంతి తీసుకోవాలనిపిస్తున్నది" అన్నాడు. అట్టి శౌర్యధనుడు, పరాక్రమశాలి అభిమన్యుడు. కనుకనే ఆరుగురు మహావీరులు కలిసి కుట్రపన్ని సంహరించారు అభిమన్యుని.

**13. ద్రౌపదేయులు :** పాండవులకు ద్రౌపదీదేవి వల్ల జన్మించిన ఐదుగురు పుత్రులే ద్రౌపదేయులు. వీరినే ఉప పాండవులు అంటారు. వీరు:

**(1) ప్రతివింధ్యుడు :** ధర్మజద్రౌపదీ పుత్రుడు. వింధ్యపర్వతం వలె స్థిరంగా నిలిచి యుద్ధం చేయగలవాడు. కనుకనే ప్రతి వింధ్యుడనే పేరు సార్థకం.

**(2) శ్రుతసోముడు :** భీమద్రౌపదీపుత్రుడు. ఇతడు జన్మించినప్పుడు పాండవులు సోమయాగం చేశారు. అందుకే శ్రుతసోముడనే పేరు పెట్టారు.

**(3) శ్రుతకీర్తి :** అర్జునద్రౌపదీ పుత్రుడు. ప్రసిద్ధ కర్మలాచరించి కీర్తిని బడసిన అర్జునుని పుత్రుడు గనుక ఆ పేరు పెట్టారు.

**(4) శతానీకుడు :** నకులద్రౌపదీ పుత్రుడు. శతానీక మహర్షి యందలి గౌరవం చేత ఆ పేరు పెట్టారు.

**(5) శ్రుతకర్ముడు :** సహదేవద్రౌపదీ పుత్రుడు. కృత్తికానక్షత్రంలో పుట్టినవాడు. కనుక అలా నామకరణం చేయటం జరిగింది.

ఇలా మొత్తం 17 మందిని పేర్కొని వీరంతా మహా రథులే అన్నాడు దుర్యోధనుడు. నిజంగా అందరూ మహారథులు కారు. మహారథులున్నారు. అంతకన్న గొప్పవారైన అతిరథులు, రథయూధపయూధకులున్నారు. తక్కువ వారైన సమరథులూ ఉన్నారు. మరెందుకిలా చెప్పినట్లు? ఇదే దుర్యోధనుని అస్తవ్యస్త మనస్థితి.

ఇంకా ఏం చెప్పబోతున్నాడు?

**శ్లో ॥ అస్మాకంతు విశిష్టాయే తాన్నిబోధ ద్విజోత్తమ!।**
**నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే॥ 7**

**తా:** ద్విజోత్తమా! మన పక్షంలో విశిష్టులైన వారెవరో ఇక తెలుసుకోండి. నా సైన్యంలోని నాయకులను మీ గుర్తుకోసం చెబుతాను.

**వ్యాఖ్య :** ద్విజోత్తమా! అంటే బ్రాహ్మణ శ్రేష్ఠుడా! అని. ఆచార్యుని ఇక్కడ





బ్రాహ్మణ శ్రేష్ఠుడా! అనటంలో దుర్యోధనుని ఆంతర్యంలో ఉన్న భావం ఏమై ఉండవచ్చు? సామాన్యంగా బ్రాహ్మణుని హృదయం దయతో ఉంటుంది. ఎదటి పక్షంలోని చాలామంది ఆయన శిష్యులే. కనుక శిష్యవాత్సల్యం, బ్రాహ్మణ సహజమైన దయ - రెండూ కలసి ఆచార్యుడు తన కొంప ముంచుతాడేమో ననే అనుమానంతో అయ్యా! ఇక్కడ మాత్రం దయచూపకు అనే ఉద్దేశ్యంతో ఈ పద ప్రయోగం చేసి ఉండవచ్చు. అక్రమ మైన పనులు చేస్తూ, నీచ భావాలు గల వాడికి అంతరాంతరాల్లో ఇలాంటి అనుమానాలు, భయాలు సహజం. హృదయం పవిత్రంగా లేనివాడు తన లోపాలను ఇతరులపై రుద్దే ప్రయత్నం చేస్తాడు. ఇక్కడ దుర్యోధనుని పరిస్థితి ఇదే.

తన భయాన్ని పోగొట్టుకొనుట కొరకే దుర్యోధనుడు నాసైన్యంలోని నాయకులను మీగుర్తుకోసం చెబుతాను అంటున్నాడు. కౌరవ సైన్యంలోఉన్న నాయకులెవరో ద్రోణునకు తెలియదా? లేక మరచిపోయాడా? మరెందుకు గుర్తు చేస్తున్నట్లు?

చీకటిలో నడిచేవాడు భయంతో ఉంటాడు. ఆ భయం నుండి తప్పించుకొనటానికి తనలో తనే ఈలవేసుకుంటాడు. బలవంతునితో శతృత్వం పెట్టుకున్న బలహీనుడు, తన భయాన్ని పోగొట్టుకొనుటకు తనవారి దగ్గరకెళ్ళి "వాడేదో అనుకుంటున్నాడు, నా సంగతి వాడికి బాగా తెలియదు, వాణ్ణి రానియ్. నా తడాఖా చూపిస్తాను" అంటాడు. ఇప్పుడు దుర్యోధనుని పరిస్థితి ఇదే. దిగజారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకొనటానికి, తనను తానే ప్రోత్సహించుకొనటానికి తన సేనలోని వీరుల పేర్లను తానే గుర్తు చేసుకుంటూ-నీ గుర్తుకోసం చెబుతున్నాను - అని ద్రోణునితో అంటున్నాడు. ద్రోణునికి గుర్తు చెయ్యాల్సిన అవసరమేమీ లేదు. ఆయనకు అందరూ తెలుసు. ఇప్పుడు దుర్యోధనుడు తన సేనలోని ఎవరెవరిని గుర్తు చేస్తున్నాడు?

**శ్లో ॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిం జయః।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ ॥ 8**

**తా॥** మీరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమందు జయశీలుడైన కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, అలాగే సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడు ఉన్నారు.

**వ్యాఖ్య :** దుర్యోధనుడు తన సేనలోని వీరులను ద్రోణాచార్యునికి గుర్తుచేస్తూ

మొదట 'భవాన్' 'మీరు' అంటూ ద్రోణాచార్యునే పేర్కొన్నాడు. సర్వసైన్యాలకు అధిపతి భీష్ముడు గదా! మరి ద్రోణునే మొదటివానిగా ఎందుకు పేర్కొన్నట్లు? దీనికి అనేక కారణాలు ఉండవచ్చు.

1. ఎదురుగా ఉన్న ఆచార్యునికి ఉత్సాహం కలిగించటానికి; "నాకు మీ మీదనే గౌరవం, విశ్వాసం ఎక్కువ" అని ఆచార్యునికి నమ్మకం కలిగించ టానికి కావచ్చు. 2. ఎదురుగా ఉన్న తనను విడిచి, వేరొకరిని ప్రథమస్థానంలో పేర్కొంటే ఆచార్యుని మనస్సుకు కష్టం కలగవచ్చు, లేదా తనమీద కోపం రావచ్చు- అని, 3. "ఇదంశస్త్రం - ఇదం శాస్త్రం" అంటూ శస్త్రవిద్యలోనూ, శాస్త్ర విద్యలోనూ - రెండింటి లోనూ ప్రవీణుడు గనుక మొదటగా ఆచార్యునే పేర్కొని ఉండవచ్చు. 4. ఇప్పటి వరకు 'తవశిష్యేణ' అని, 'ద్విజోత్తమా!' యని తాను పలికిన పలుకులలోని ఆంతర్యాన్ని గ్రహించి, తనను అవమానించినట్లుగ భావించినందు వల్లనే ద్రోణుడు తనతో ఒక్కమాట కూడా మాట్లాడకుండ, తనకు ధైర్యం చెప్పకుండా ఉన్నాడేమోనని గ్రహించిన దుర్యోధనుడు తన తప్పును దిద్దుకొనుటకై ఇలా మొదటగా ద్రోణుని పేర్కొని ఉండవచ్చు.

దుర్యోధనుడు పేర్కొన్న వీరులు మొత్తం 7 గురు. వారు-

**1. ద్రోణుడు :** ఈయన భరద్వాజ మహర్షి పుత్రుడు. మొదట తండ్రివద్ద, తర్వాత అగ్నివేశుడను మునివద్ద శాస్త్రాలను, ధనుర్వేదాన్ని అభ్యసించాడు. కృపాచార్యుని చెల్లెలు కృపిని వివాహమాడగా వారికొక కుమారుడు అశ్వత్థామ. కటిక పేదరికం. పరశురాముడు బ్రాహ్మణులకు విరివిగా దానాలు చేస్తున్నాడని తెలిసి ఆయన వద్దకు వెళ్ళాడు. అయితే అప్పటికే సర్వస్వమూ దానం చేసి, తపస్సు చేసుకుంటున్నాడు పరశు రాముడు. ద్రోణునికేమీ సాయం చేయలేక తన వద్దనున్న అస్త్రవిద్యను ప్రదానం చేశాడు. అక్కడినుండి తిరిగి వచ్చి, చిన్ననాటి సహాధ్యాయి ద్రుపదుని వద్దకేగి, అతడిచేత అవమానించబడి, హస్తినాపురం చేరాడు. అక్కడ కొన్నాళ్ళు రహస్యంగా కృపుని ఇంట ఉండి, భీష్ముని కోరికపై కురుపాండవులకు ధనురాచార్యుడయ్యాడు. గొప్ప పరాక్రమశాలి. కౌరవపక్షంలో అక్షౌహిణీ సేనాధిపతి. భీష్ముని తర్వాత సర్వసేనాని.

**2. భీష్ముడు :** గంగాశంతనుల పుత్రుడు. అసలుపేరు దేవ వ్రతుడు, గంగకు





పుత్రుడు గనుక గాంగేయుడు. ఆజన్మ బ్రహ్మ చర్య వ్రతాన్ని పాటిస్తానని భీష్మమైన ప్రతిజ్ఞచేసినందుకు 'భీష్ముడ'నే పేరు స్థిరపడిపోయింది. తల్లివద్ద, తరువాత పరశురామునివద్ద అస్త్రవిద్యలు నేర్చాడు. ఈయనకు 'స్వచ్ఛంద మరణం' వరం తండ్రిచేత ప్రసాదించబడింది. కౌరవ సర్వ సేనానిగా 10 రోజులు సేనలను నడిపించిన మహావీరుడు. ద్వంద్వ యుద్ధంలో పరశురామునే నిలువరించిన వీరాగ్రేసరుడు. కురుపితామహుడు.

**3. కర్ణుడు :** కుంతీదేవికి సూర్యప్రసాదాన జన్మించి, సూతులచే పెంచబడినవాడు. మహావీరుడు. ద్రోణుని వద్ద విద్యాభ్యాసం చేసే సమయంలోనే అర్జునునితో స్పర్థను పెంచుకున్నవాడు. అర్జునునిపై ద్వేషం పాండవ ద్వేషంగా మారింది. దానితో దుర్యోధనునితో సఖ్యం చేసి దుష్టచతుష్టయంలో చేరిపోయాడు. దుర్యోధనుడు పూర్తిగా కర్ణుని పరాక్రమంపైనే నమ్మకం పెట్టు కున్నాడు. మహావీరుడే అయినా స్వయంకృతాపరాధంతో శాపాలు కొని తెచ్చుకున్నవాడు. భీష్మునిపై కోపంతో 10 రోజులూ యుద్ధంలో పాల్గొనకుండా 11వ రోజున ప్రవేశించినవాడు.

**4. కృపాచార్యుడు :** గౌతమ వంశీయుడైన శరద్వంతుని పుత్రుడు. కౌరవులకు కుల గురువు. కురుపాండవులకు మొదటి ఆచార్యుడు. పరాక్రమశాలి. అక్షౌహిణీ సేనాధిపతి.

**5. అశ్వత్థామ :** ద్రోణపుత్రుడు, ప్రాణంమీద తీపి ఎక్కువ. తెగించి యుద్ధంచేస్తే అర్జునునితో సమానమైన పరాక్రమశాలి అని అంటారు. దుర్యోధనునికి మిత్రుడు.

**6. వికర్ణుడు :** దుర్యోధనుని తమ్ముడు. సమరథుడు. జూదంలో నేర్పరి. దుర్యోధన సోదరులలో ఒకే ఒక్క ధర్మపక్షపాతి. ఇతడి ధర్మతత్పరత - ద్రౌపదీదేవిని సభకీడ్చుకొని వచ్చి పరాభవించిన సందర్భంలో స్పష్టంగా తెలుస్తుంది. ధార్తరాష్ట్రులు వందమందినీ సంహరిస్తానని ప్రతిజ్ఞచేసిన భీముడు, ఇతడిని చంపేటప్పుడు మాత్రం కంటతడి పెట్టాడు. క్షత్రియ ధర్మాన్ని నిందించి వికర్ణుని చంపవలసివచ్చినందుకు బాధపడ్డాడు.

**7. సౌమదత్తి :** భీష్ముని పినతండ్రి బాహ్లికుడు. ఆయన పుత్రుడు సోమదత్తుడు. ఆ సోమదత్తుని పుత్రుడు భూరిశ్రవుడు. ఇతడే సౌమదత్తి. అతిరథుడు,

కురుపాండవులందరికీ గౌరవనీయుడు. తండ్రిలాంటివాడు. వీరు 7 గురిని పేర్కొన్నాడు దుర్యోధనుడు.

పాండవసేనలో 19 మందిని పేర్కొన్న దుర్యోధనుడు, తన సేనలో 7 గురిని మాత్రమే తెలిపాడు. దీనినిబట్టి పాండవ సేన 7 అక్షౌహిణులే అయినా వీరులెక్కువగా ఉన్నారని, తమ సేన 11 అక్షౌహిణులైనా వీరులు తక్కువని దుర్యోధనుడు భయపడుతున్నాడు.

పాల విలువ వెన్ననుబట్టి, సేన విలువ వీరులనుబట్టి ఉంటుంది. దుర్యోధనునికి అధిక సేన సమకూరింది గదా! అని కొందరి భావన. కాని వారందరూ దుర్యోధనునిపై ప్రేమతోనో, అతడిది ధర్మమనో చేరినవారు కాదు. పాండవ దిగ్విజయ సమయంలో పాండవుల చేత ఓడినవారు కొందరు ద్వేషంతో దుర్యోధనుని వైపు చేరారు. శ్రీకృష్ణునిపై ద్వేషంతో నరకుని కుమారుడు భగదత్తుడు, విందానువిందులు వచ్చారు. దుర్యోధనుని మోసానికి గురై శల్యుడు రావాల్సి వచ్చింది. దుర్యోధనుడు అధికారంలో ఉన్నందున భయంతో చేరినవారు కొందరు. ఇలా వేర్వేరు కారణాలతో వచ్చిన వారు. కాని పాండవ పక్షంవైపు వచ్చినవారు ధర్మంపై ప్రీతితో, ధర్మరాజుపై ప్రీతితో వచ్చారు.

ఇక్కడొక ముఖ్య విశేషం దాగి ఉంది. ఉభయసేనల వీరులను గూర్చి చెప్పేటప్పుడు దుర్యోధనుడు, 3 శ్లోకాల్లో పాండవ వీరులను చెప్పి, 1 శ్లోకంలో కౌరవ వీరులను చెప్పాడు. భగవద్గీత 16వ అధ్యాయంలో దైవీ సంపదను గూర్చి 3 శ్లోకాల్లో వర్ణించి, ఆసురీ సంపదను 1 శ్లోకంలో వర్ణించటం జరిగింది. ఈ రెంటిని పోల్చిచూస్తే ఒక స్వారస్యం కనిపిస్తుంది. అదేమిటంటే "పాండవసేనదైవీ సంపద" అని, "కురుసేన ఆసురీ సంపద" అని. తనసేన లోని వీరులను పేర్కొని ఇక తన సేన ఎట్టిదో వివరిస్తున్నాడు దుర్యోధనుడు.

**శ్లో॥ అన్యేచ బహవశ్శూరాః మదర్థేత్యక్త జీవితాః।**
**నానా శస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధ విశారదాః॥ 9**

**తా॥** ఇంకా ఎందరో శూరులు, యుద్ధ విశారదులు, అనేక శస్త్రాలు ధరించి నా కోసం జీవితాలను విడిచిపెట్టారు.

**వ్యాఖ్య:** ఇక్కడ దుర్యోధనుని మనస్సు భయంతో, అస్తవ్యస్తంగా ఉండటం





వల్లనేమో "నా కోసం ప్రాణాలర్పించ టానికి ఎందరో వీరులున్నారు" అని అనటానికి బదులు "నా కోసం ఎందరో ప్రాణాలర్పించారు (త్యక్త జీవితాః)" అన్నాడు. తనకు తెలియకుండానే అపశృతి, అపశబ్దం, అపశకునం సూచించే పదం వచ్చింది దుర్యోధనుని నోటినుండి. బ్రతికి ఉన్నవాళ్ళను పట్టుకొని ప్రాణాలు విడిచారు అనటం, ముందు రాబోయే దానికి ఒక సూచన. ఎలాగూ వీళ్ళంతా పోయేవాళ్ళేననే పలుకు అనుకోకుండా వచ్చింది.

లోకంలో మదర్థ జీవులు, తదర్థ జీవులు అని రెండు రకాల వారుంటారు. "నా పొట్ట నింపుకోవటం, నేను బాగుండటం ముఖ్యం. ఎవరెలా పోతే నాకేం, మీ ఇంటికొస్తే ఏమిస్తావు? మా ఇంటికొస్తూ ఏమితెస్తావు; నా సేవ చెయ్యటానికే ఇతరులు పుట్టారు, వాళ్ళలా నా సేవచేస్తూ ఉండాల్సిందే, అది వాళ్ళ ఖర్మ. నా జన్మహక్కు" అని భావించే స్వార్థ జీవులు, అహంకారులు మదర్థ జీవులు.

"నేను పుట్టినందుకు ఇతరులకేమైనా మేలు చేయగలుగు తున్నానా? నాకు కొంచెం నష్టమయినా ఇతరులకు మేలు జరిగితే చాలు, చెట్టులాగా అందరికీ నీడనివ్వాలి" అని భావించే ఉత్తములు తదర్థ జీవులు.

తినటం, సంపాదించటం, నిద్రపోవటం, సంతానాన్ని కనటం, అన్ని సుఖాలు అనుభవించటం – ఇదే ప్రధానం అనుకొనేవారు భోగజీవులు. చివరకు రోగ జీవులు.

తినటం కోసం జీవించటంకాదు, జీవించటం కోసం తినాలి. ఎంతకాలం బ్రతికామనిగాక ఎంత బాగా బ్రతికాం? అని ఆలోచించేవారు త్యాగజీవులు. చివరకు యోగజీవులు.

'మదర్థే' – నా కొరకు అనటంలో దుర్యోధనునిలో అహంకారం ఎంత ఉన్నదో తెలుస్తున్నది. వారి జీవితాలు వారివి కావు. నా కోసం ముడుపుగట్టబడ్డాయి అంటున్నాడు. నిజంగా దుర్యోధనుని సేనలో అతడిమీద ప్రేమతో వచ్చినవారు కనిపించరు. ఇంతకాలం వారి ఉప్పు తిన్నందున ఋణం తీర్చుకోవటానికి వచ్చినవారు, పాండవ ద్వేషంతోనో, శ్రీకృష్ణునిపై ద్వేషంతోనో వచ్చినవారు; మోసానికి గురై వచ్చినవారు, భయంతో వచ్చిన వారు. అట్టి వీరిని చూచి ఇలా అనటం దుర్యోధనుని అహంకారమే.

ఇక్కడ మరొక విశేషం చూద్దాం. 'అందరి బ్రతుకులూ నా కొరకే'

అంటున్నాడు దుర్యోధనుడీ శ్లోకంలో. ఇదే అధ్యాయం 33వ శ్లోకంలో తన బ్రతుకు అందరి కొరకూ అంటున్నాడు అర్జునుడు. "యేషా మర్థే కాంక్షితంనః రాజ్యం భోగాస్సుఖానిచ-" ఎవరి కోసం రాజ్యం, భోగాలు, సుఖాలు కావాలనుకుంటు న్నామో- అని అంటున్నాడు. అందుకే 'ఓ అర్జునా! నీవు దైవీ సంపదగలవాడివి' అని భగవానుడు ప్రశంసించాడు 16వ అధ్యాయంలో. మరి దుర్యోధనుడో! ఆసురీ సంపదగలవాడు. అందుకే దుర్యోధనుడు మదర్థ జీవి – అర్జునుడు తదర్థ జీవి.

ఇలా తన సేనను గూర్చి చెప్పిన దుర్యోధనుడు రెండు సేనలను పోల్చుతున్నాడు. ఎలా?

**శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం।**
**పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితం॥ 10**

**తా॥** భీష్ముల వారిచేత రక్షింపబడుతున్న మన ఆసేన అపరిమితమైనది. భీముని చేత రక్షింపబడుతున్న వారి ఈసేన పరిమితమైనది.

**వ్యాఖ్య:** పాపభీతి ఆవహించిన దుర్యోధనుడు మతి స్థిమితం కోల్పోయిన వానివలె ద్రోణాచార్యునికి ఏదేదో బోధిస్తున్నాడు. దుర్యోధనుని ఎత్తి పొడుపులను, సూటిపోటి మాటలను, నీచబుద్ధిని గ్రహించాడు ద్రోణాచార్యుడు. అయినా కర్తవ్యానికి బద్ధుడై మౌనంగా వింటున్నాడు. "నీ బ్రతుకు నాకు తెలుసులే, నేనిప్పుడు ఏమీ మాట్లాడకూడదు గనుక మౌనం వహించాల్సి వచ్చింది" అని లోలోపల అనుకుంటూ ఉపేక్షా భావంతో ఉన్నాడు. అనుకోకుండానే దుర్యోధనుని నోట వెలువడుతున్న అపశబ్దాలను వింటున్నాడు. ఇప్పుడు రెండు సేనలను దుర్యోధనుడు ఎలా పోలుస్తున్నాడో జాగ్రత్తగా గమనిస్తున్నాడు ద్రోణాచార్యుడు.

భీష్మాభిరక్షితం అస్మాకం **తత్‌బలం** "అపర్యాప్తం". భీమాభిరక్షితం ఏతేషాం **ఇదంబలం** "పర్యాప్తం"–భీష్మునిచే రక్షించబడుతున్న మన ఆసేన అపరిమితం. భీమునిచే రక్షింపబడుతున్న వారి ఈసేన పరిమితం.

కురుసేనకు సర్వసేనాని భీష్ముడు గనుక తనబలం భీష్మాభిరక్షితం. మరి పాండవసేనకు సర్వసేనాని దృష్టద్యుమ్నుడు గదా! భీమాభిరక్షితం అని ఎందుకన్నట్టు? పాండవ సర్వసేనాని దృష్టద్యుమ్నుడే అయినా మొదటిరోజున





వారి వ్యూహం వజ్ర వ్యూహం. వ్యూహ ముఖంలో గదాదండం ధరించిన భీమసేనుని నిలబెట్టి, వ్యూహ రక్షకుడిగా ఉంచటం వల్ల పాండవసేనను భీమాభిరక్షితం అన్నాడు దుర్యోధనుడు.

ఇందులో ఒక శ్లేషార్థం ఉంది. భీష్మ అంటే మొండి పట్టుదల అని, భీమ అంటే వివేకంతో కూడిన బలం అనీ అర్థం ఉంది. అందువల్ల మనసేన మొండితనం వల్ల కలిగిన బలంతోను, వారిసేన వివేకంతో కూడిన బలంతోను రక్షింప బడుతున్నది – అనే అర్థం వస్తున్నది. ఇలా అనుకోకుండా దుర్యోధనుని నోట శ్లేషార్థాలు గల పదాలు వెలువడ్డాయి.

అలాగే తన సేన అపర్యాప్తం అన్నాడు దుర్యోధనుడు. అపర్యాప్తం అంటే అపరిమితమైన అని ఒక అర్థంకాగా, అసమర్థమైనది, అసంపూర్ణమైనది అని మరొక అర్థం. అలాగే ఎదటి సేనను పర్యాప్తం అన్నాడు. పర్యాప్తం అంటే పరిమిత మైనది అని ఒక అర్థం కాగా సమర్థమైనది, సంపూర్ణమైనది అని మరొక అర్థం. తనసేన 11 అక్షౌహిణులు గనుక అపరిమితం అనే భావంలోను, పాండవసేన 7 అక్షౌహిణులే గనుక పరిమితమైనది అనే భావంలోను ఆ పదాలను ఉపయోగించాడు దుర్యోధనుడు. అయితే వాటికి వ్యతిరేకార్థా లుండటం కాకతాళీయం. అపర్యాప్తం అంటే నిండుకున్నది అని, పర్యాప్తం అంటే నిండైనది అనే అర్థాలు కూడా ఉండటం విశేషం.

'అస్మాకం తత్ బలం' – మన ఆ బలం; 'ఏతేషాం ఇదం బలం' – వారి ఈ బలం అన్నాడు దుర్యోధనుడు. దగ్గరగా ఉన్నదానిని ఇది అని, దూరంగా ఉన్నదానిని అది అంటాం. కాని దుర్యోధనుడు దగ్గరగా ఉన్న తన సేనను 'ఆసేన' అని, దూరంగా ఉన్న పాండవసేనను 'ఈసేన' అని పేర్కొంటున్నాడు. ఇది కూడా భయంవల్ల, పాపభీతివల్ల కలిగిన దుర్యోధనుని అస్తవ్యస్త మనోస్థితిని తెలియజేస్తుంది.

ఇలా పాండవసేనకన్న తనసేన చాలా పెద్దది, భయపడాల్సిందేమీ లేదు – అని తనకు తానే చెప్పుకుంటూ ద్రోణునితో అని, ఇప్పుడు సైన్యానికి ఒక ఆదేశం ఇస్తున్నాడు. ఏమని?

**శ్లో॥ అయనేషుచ సర్వేషు యథా భాగమవస్థితాః।**
**భీష్మమేవాభి రక్షంతు భవంతస్సర్వ ఏవహి॥ 11**

**తా॥** అన్ని వ్యూహ మార్గాలలోను మీరంతా ఎవరి స్థానాలలో వారుంటూ అందరూ భీష్ములవారినే రక్షిస్తూ ఉండాలి.

**వ్యాఖ్య:** దుర్యోధనుడు శిష్యుని లాగా ఆచార్యుని సమీపించి, రాజులాగా చెప్పదలచుకొన్న విషయాలను చెప్పి, ఇప్పుడు సేనలకు ఆదేశం ఇస్తున్నాడు. సేనలకు ఆదేశం ఇవ్వటం సేనాధిపతుల బాధ్యత. ఏ అక్షౌహిణీ సేనాధిపతి ఆ అక్షౌహిణీ సేనలకు తగిన సమయంలో తగిన ఆదేశాలిస్తూ సేనలను నడిపిస్తుంటాడు. ఇప్పుడు ద్రోణాచార్యుడు తన సేనలకు ఆదేశం ఇవ్వాలి. కాని దుర్యోధనుడే స్వయంగా ఆదేశం ఇస్తున్నాడు, "మీరందరూ మీ మీ నియమిత స్థానాలలో ఉండి భీష్ముల వారిని రక్షించండి" అని. ఎందుకిలా? – దుర్యోధనునిలో ప్రవేశించిన భయం, పిరికితనం ఇలా అస్తవ్యస్తంగా ప్రవర్తించేట్లు చేస్తున్నది.

ఇంతకూ 'భీష్ముల వారిని రక్షిస్తూ ఉండండి' అని సేనలకు ఎందుకు ఆదేశిస్తున్నాడు దుర్యోధనుడు? భీష్ముడు గొప్ప పరాక్రమశాలి. సర్వ శస్త్రాస్త్ర సంపన్నుడు. ద్వంద్వ యుద్ధంలో పరశురామునే ఎదిరించగలిగిన ధైర్యశాలి. తనను తాను రక్షించుకుంటూ ఎందరినో రక్షించగల అస్త్రవేత్త. అయినప్పటికీ శిఖండి తనకు ఎదురుపడితే అతడితో యుద్ధం చేయనని, ఒకవేళ శిఖండి తనపై బాణవర్షం కురిపించినా తానుమాత్రం అతనిని ఎదిరించి పోరాడనని ఇంతకుముందే తెలియజేశాడు భీష్ముడు. అజాగ్రత్తగా ఉంటే సింహం నక్కచేతిలో చిక్కినట్లు అవుతుంది. కనుక శిఖండి భీష్ముని కెదురుగా రాకుండా మిగిలినవారంతా జాగ్రత్తపడాలి. ఒక్క శిఖండి గురించి జాగ్రత్తలు తీసుకుంటే ఇంకెవ్వరూ ఆయన నేమీ చేయలేరు. అందుకే దుర్యోధనుడు ప్రత్యేకంగా జాగ్రత్తలు చెబుతున్నది. భీష్ముడొక్కడు క్షేమంగా ఉంటే తన సేన అంతా క్షేమంగా ఉంటుందని దుర్యోధనుని నమ్మకం. ఇదీ కథాపరంగా దుర్యోధనుడు జాగ్రత్తలు చెప్పటం వెనుక ఉన్న కారణం.

ఇక ఆధ్యాత్మికంగా తీసుకొంటే ఇందులో ఒక విశేషం దాగి ఉంది. భీష్ముడు ఆజన్మ బ్రహ్మచర్య వ్రత దీక్షా సంపన్నుడు. బ్రహ్మచర్యం మిగిలిన అన్ని ఆశ్రమాలకు పునాది. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసి అని నాలుగు ఆశ్రమాలు. బ్రహ్మచర్యం మిగిలిన మూడింటికి పునాది. అంటే అన్ని





యోగ సాధనలకు బ్రహ్మచర్యం అవసరం. బ్రహ్మచర్యం పడిపోతే అన్ని సాధనలు పడిపోయినట్లే. బ్రహ్మచర్యం పడిపోతే మిగిలిన 3 ఆశ్రమాలు దెబ్బతినిపోతాయి. అదే భీష్ముడు పడిపోతే అంతా పడిపోయినట్లేనని, అందుకని భీష్ముని అన్నివైపుల నుండి రక్షించుకోవాలని దుర్యోధనుడు భావించటంలోని ఆధ్యాత్మిక విశేషం. మరొక విశేషం కూడా ఉంది.

భీష్ముడు అహంకారానికి ప్రతీక. ద్రోణుడు మమకారానికి ప్రతీక. అహంకారం గురువును (పరశురాముని) ఎదిరిస్తుందీ, దైవాన్నీ (శ్రీకృష్ణుని) ఎదిరిస్తుంది. భీష్ముడలా ఎదిరించాడు. ద్రోణునికి పుత్రుడంటే మమకారం. కుమారుని మరణ వార్త విని ప్రాణాలు వదిలినవాడు. కనుక మమకార ప్రతినిధి.

దేవుడికి జీవుడికి మధ్యనున్న తెర అహంకారమే. అహంకారాన్ని తగిలించుకొని దేవుడు జీవుడవుతున్నాడు; అహం కారాన్ని వదిలించుకుంటే జీవుడు దేవుడే అవుతాడు. కనుక దైవీ సంపదగలవారు అహంకారాన్ని నాశనంచేసి జీవభావం నుండి దైవభావంలోకి వస్తారు. కాని ఆసురీ సంపదగలవారు అహంకారాన్ని పడకుండా చూసి జీవ భావంలోనే ఉంటారు. నీచ నికృష్ట యోనులందు జన్మిస్తూ జనన మరణ రూప సంసార చక్రంలోనే తిరుగాడుతూ ఉంటారు. ఇప్పుడు ఆసురీ సంపదగల దుర్యోధనుడు అహంకారాన్ని (భీష్ముని) పడిపోనీయకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు అని ఆధ్యాత్మిక అంతరార్థం.

అహంకారం పోతేనే మోక్షం – భీష్ముడు పడిపోతేనే ధర్మ విజయం – ధర్మరాజు విజయం. దీనితో దుర్యోధనుని పాత్ర తెరవెనుకకు పోయింది. ఇక దుర్యోధనుడు సేనలను ఆదేశించిన తర్వాత ఏమి జరిగింది?

**శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।**
**సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌప్రతాపవాన్॥ 12**

**శ్లో॥ తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః।**
**సహసైవాభ్య హన్యంత సశబ్ద స్తుములో భవత్॥ 13**

**తా॥** అతడికి (దుర్యోధనునికి) సంతోషం కలిగిస్తూ ప్రతాపవంతుడైన కురువృద్ధుడు; పితామహుడు భీష్మాచార్యులు గట్టిగా సింహనాదంచేసి శంఖాన్ని

ఊదాడు (12). ఆ వెనువెంటనే శంఖాలు, భేరీలు, పణవానకాలు, గోముఖాలు ఒకేసారిగా మ్రోగాయి. ఆ ధ్వని గజిబిజిగా ఉంది.

**వ్యాఖ్య:** పాండవ సేనను చూచి కలవరపాటు చెందిన దుర్యోధనుడు ద్రోణుని చేరి అడ్డదిడ్డంగా మాట్లాడటాన్ని నిశితంగా గమనిస్తున్నాడు భీష్ముడు. ద్రోణుడు మౌనంగా ఉండటాన్ని కూడా గమనించాడు. తన రక్షణకొరకు అన్నివైపుల నుండి కాచుకొని ఉండండి – అని సేనలకు ఆదేశం ఇవ్వటాన్నీ విన్నాడు. దుర్యోధనుని ఈ తెలివితక్కువ పనివల్ల సేనలలోనూ, సేనాధిపతులలోనూ అభద్రతా భావం కలుగుతుందని గ్రహించాడు భీష్ముడు. ఒకసారి సైన్యం నిరుత్సాహం పాలైతే వారిచేత సరిగ్గా యుద్ధం చేయించటం చాలా కష్టమవుతుంది.

ఇలాంటి పరిస్థితిని తప్పించాలంటే వారందరిని ఒక్క కుదుపు కుదిపి నిరుత్సాహాన్ని తొలగించాలి. దుర్యోధనుని తెలివి తక్కువ పనులకు, మాటలకు ముగింపు పలకాలి. అందుకే గట్టిగా సింహనాదం చేసి తన శంఖాన్ని పూరించాడు భీష్ముడు. భీష్ముని 'ప్రతాపవాన్' అన్నారు. యుద్ధంలో అజేయుడైన పరశురామునే ఎదిరించి విజయం సాధించిన పరాక్రమశాలి. కనుకనే ప్రతాపశాలి అన్నారు. ఇంకా కురువృద్ధుడు అన్నారు. పినతండ్రి బాహ్లికుడు తప్పిస్తే ఆయనకన్న వృద్ధులెవ్వరూ కురువంశంలో లేరు. అందుకే కురువృద్ధుడు. ఇక ఆయన కురుపాండవులకు పితామహుడు – తాతగారు. భీష్ముడు కురు వృద్ధుడేకాదు గుణవృద్ధుడు కూడా. తాతగారు గనుక మనుమల మనస్తత్వం ఎలాంటిదో బాగా తెలిసినవాడు. అందరినీ తానే పెంచి పెద్దచేసినవాడు. తండ్రిలేని వారు పాండవులైతే, లోకాన్ని చూడలేని తల్లీ తండ్రీ గలవారు ధార్తరాష్ట్రులు (దుర్యోధనాదులు). అందుకే అందరిమీదా సమానమైన ప్రేమ ఉన్నది.

అందుకే ఇప్పుడు దుర్యోధనునికి సంతోషం కలిగించటం కోసం సింహనాదంచేసి శంఖాన్ని పూరించాడు. దుర్యోధనుడెంత పాపాత్ముడైనా యుద్ధానికి ముందే భయపడి పోవటం గమనించాడు భీష్ముడు. భయపడ్డవాడు అలా ఉండిపోకుండా దానిని దాచుకొనే ప్రయత్నంలో బయటపడిపోయాడు. ద్రోణాచార్యుని నుండి ప్రోత్సాహవచనం లభిస్తుందేమోననుకుంటే అదీలేదు.





తన తెలివితక్కువతో, బుద్ధిహీనతతో ద్రోణుని మనస్సును గాయం చేశాడు. సైనికుల మనోస్థయిర్యం దెబ్బ తినేటట్లు ప్రవర్తించాడు. అందుకే జాలివేసింది భీష్మునికి. ఎలాగైనా అతడికి ధైర్యం కలిగించాలి, సంతోషం కలిగించాలి అని గట్టిగా సింహగర్జన చేశాడు. శంఖాన్ని పూరించాడు. ఇదంతా దుర్యోధనుడు ఇంకా వివేకహీనంగా ప్రవర్తించకుండా ఆపుజేయటానికే. ఐతే దుర్యోధనునిపై జాలితోచేసినా, అతడికి సంతోషం కలిగించటానికే చేసినా, సర్వసేనాధిపతి శంఖాన్ని పూరించటం యుద్ధ ప్రారంభాన్ని సూచిస్తుంది. దీనినిబట్టి యుద్ధాన్ని ప్రారంభించిన వారు కౌరవులే అని అవగతం అవుతుంది.

భీష్మునియొక్క సింహనాదాన్ని, శంఖధ్వనిని వినటం తోనే, తాము కూడా యుద్ధానికి సిద్ధంగా ఉన్నామని తమ తమ సంసిద్ధతను తెలియజేయటానికి, కౌరవ పక్షంలోని సేనాధిపతులు, వీరులు, మిగిలిన యోధ ప్రముఖులంతా తమతమ శంఖాలను ఊదటం ప్రారంభించారు. ఆ వెంటనే యుద్ధంలో సైనికులకు ఉత్సాహం కల్పించటానికి భేరీలు, పణవానకాలు – అంటే తప్పెటలు, గోముఖాలు – అంటే కొమ్ముబూరలు మొదలైన యుద్ధ వాయిద్యాలను ఆయా పనులకై నియమించబడినవారు వాయించటం మొదలుపెట్టారు.

ఈ శంఖ భేరీ పటహాదుల ధ్వని ఒక్కసారిగా అన్ని వైపుల నుంచి మార్మోగిపోయింది. కాని ఆ ధ్వని 'తుముల' – గజిబిజిగా ఉన్నదని సంజయుడు ధృతరాష్ట్రునితో చెబుతున్నాడు. అధర్మానికి స్పష్టమైన ఆలోచన ఉండదు. అంతా గజిబిజియే. కాని ధర్మం మాత్రం దీనికి విరుద్ధం. స్పష్టమైన ఆలోచనలు ఉంటాయి. అందుకేనేమో – కౌరవ శంఖనాదాలకు ప్రతిగా పాండవ శంఖనాదాల ధ్వనిని వర్ణిస్తూ – తర్వాతి శ్లోకాల్లో – ఆ ధ్వని భూమ్యాకాశాలను ప్రతిధ్వనింపజేసేది, కౌరవుల గుండెలను భేదించేది అని వర్ణించాడు. దీనిని బట్టి దుర్యోధనుని యుద్ధం చేయాలనే కోరిక ధర్మసమ్మతమైనది కాదని సంజయుడు ఆక్షేపిస్తున్నట్లు అర్థమవుతున్నది.

కురుక్షేత్రంలో ఏమిచేశారు? అని ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు కౌరవులేమి చేశారో చెప్పిన సంజయుడు, ఇక పాండవులేమి చేశారో చెప్పబోతున్నాడు.

శ్లో॥ తతః శ్వేతైర్హ యైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥ 14

తా॥ అప్పుడు తెల్లని గుర్రాలు పూన్చిన గొప్ప రథంలో కూర్చొని మాధవుడు, పాండవమధ్యముడైన అర్జునుడు తమ దివ్యమైన శంఖాలను పూరించారు.

**వ్యాఖ్య:** భగవద్గీతలో మొట్టమొదటిసారిగా శ్రీకృష్ణ భగవానుడు రంగప్రవేశం చేస్తున్నాడు. ఎలా ప్రవేశిస్తున్నాడు? తెల్లని గుర్రాలు పూన్చిన గొప్పదైన రథంపై కూర్చొని అర్జునునితో కలిసి ప్రత్యక్షమయ్యాడు.

**తెల్లని గుర్రాలు–** ఇవి గంధర్వరాజు చిత్రరథుడు కానుకగా ఇచ్చిన గంధర్వహయాలు. ఇది దివ్యమైనవి, శక్తివంతమైనవి. 18 రోజుల మహాభారత యుద్ధంలో అలుపూ సొలుపూ లేకుండా తమ అద్భుత దివ్యశక్తిని ప్రదర్శించినవి. తెలుపు సత్వగుణానికి ప్రతీక, ధర్మానికి ప్రతీక. నాలుగు గుర్రాలను నాలుగు అంతఃకరణాలైన మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారంగా వర్ణిస్తారు వేదాంతులు.

**గొప్పదైన దివ్యరథం–** అర్జునుని గుర్రాలే కాదు, రథం కూడా దివ్యమైనదే. ఖాండవ వన దహన సమయంలో అగ్ని దేవుడు ప్రసాదించినది ఈ రథం. యుద్ధంలో 18 రోజులూ ఒకే రథంపై నిలిచి యుద్ధం చేశాడు అర్జునుడు. రథాన్ని మానవ శరీరంగా వర్ణిస్తారు వేదాంతులు.

**మాధవః –** మా అంటే లక్ష్మీదేవి, ధవుడు అంటే భర్త. మాధవుడు అంటే లక్ష్మీదేవి భర్త అని అర్థం. లక్ష్మీదేవి భర్త శ్రీమహావిష్ణువు గదా! ఐతే "కృష్ణస్తు భగవాన్ స్వయం" అన్నారు గనుక, శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మయే గనుక ఇక్కడ శ్రీకృష్ణుని మాధవుడు అనటం జరిగింది. శ్రీకృష్ణభగవానుడు పార్థుని రథానికి సారథిగా ఉన్నాడు. సారథిని బుద్ధిగా వర్ణిస్తారు వేదాంతులు.

**పాండవః –** పాండుపుత్రుడైన అర్జునుడే 'పాండవః' అని అంటే. అర్జునుడు ఇక్కడ రథికుడు. అర్జునుని జీవాత్మగా శ్రీకృష్ణుని పరమాత్మగా వర్ణిస్తారు వేదాంతులు.

అంతఃకరణాలనబడే గుర్రాలతో శరీరమనే రథంలో కూర్చొని, జీవాత్మయైన అర్జునుడు రథికుడుగా, పరమాత్మయైన శ్రీకృష్ణుని సారథిగా జేసికొని, జీవనరంగమనే యుద్ధరంగంలో ప్రవేశిస్తున్నాడు. ఈ ప్రపంచమనే జీవన





నాటక రంగంలో ప్రవేశించిన జీవుళ్ళంతా (మనమంతా) ఈ జీవనరథాన్ని నడపటానికి పగ్గాలను పరమాత్మ చేతిలో ఉంచాలి. అప్పుడే జీవితం సార్థకమౌతుంది అని గ్రహించాలి.

శ్రీకృష్ణార్జునులు ఇరువురూ తమతమ శంఖాలను పూరించి యుద్ధానికి తమ సంసిద్ధతను తెలియజేస్తున్నారు.

ఈ శరీరమే ఒక శంఖం. దీనిని పరమాత్మ పూరిస్తేనే– పరమాత్మ చైతన్యం ఉన్నంతవరకే–ఇది పని చేస్తుంది. పరమాత్మ చైతన్యం అందని నాడు ఇది శ్మశానంపాలై రెండు కిలోల బూడిద అవుతుంది. ఇక్కడ పరమాత్మ శంఖాన్ని పూరించాడు అంటే శరీరాలకు చైతన్యం కలిగిస్తున్నాడు అని అంతరార్థం.

ఈ శంఖము యొక్క చరిత్ర ఏమిటి? చేపలాగా నీటిలో ఉండే ప్రాణియే శంఖం. అయితే శంఖం ప్రాణంతో ఉన్న జీవియా? అంటే కాదు. శంఖం లోపల ఆ ప్రాణి కదులుతూ ఉంటుంది. ఈ శంఖం ఆ ప్రాణికి అస్థి (ఎముక). మనకు లోపల ఎముకలు, బయట దేహం ఉంటుంది. దానికి బయట ఎముక లోపల దేహం ఉంటుంది. ఇదే పెద్ద తేడా. లోపల ఉన్న ఎముకలు మనకు అసహ్యకరమైనవి, అపవిత్రమైనవి; బయట ఉన్న దేహం మాత్రం అందమైనది. కాని దానికి మాత్రం బయట ఉన్న ఎముక (శంఖం) అందమైనది, పవిత్రమైనది. లోపల ఉన్న దేహం అసహ్యకరమైనది. పురుగుల కన్నా మానవులు ఎంతో గొప్పవారు. వారిలో చదువుకున్నవారు ఇంకా గొప్ప; యజ్ఞయాగాదులు చేసేవారు ఇంకా గొప్ప; జ్ఞానులు ఇంకా ఇంకా గొప్ప. అయితే ఇంత గొప్పవారు కదా అని వారి ఎముకలను ముట్టుకుంటామా? లేదు, ఎముకలను తాకితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. కాని ఒక పురుగు యొక్క ఎముక (శంఖం) ఎంతో పవిత్రమైనది.

"శంఖాస్థి పావనం అపావన మస్థి మాణాం"– శంఖం అనే అస్థి పవిత్రమైనది. మిగిలిన అస్థులన్నీ అపవిత్రమైనవి– అని. శంఖం పురుగు యొక్క ఎముకే అయినప్పటికీ ఈశ్వరాభిషేకంలో ఉపయోగపడుతున్నది, పవిత్రమైన పూజాపరికరంగా ఉపయోగపడుతున్నది. శుభకార్యాలు శంఖధ్వానంతో ప్రారంభమవుతున్నవి. యుద్ధంలో వీరులు శంఖాన్ని ఊది

యుద్ధాన్ని ప్రారంభిస్తారు. అట్టి పరమ పవిత్రమైన శంఖాన్ని పూరించి, మహాభారత యుద్ధాన్ని ప్రారంభిస్తున్నారు భీష్మాదులు. అట్టి పవిత్ర శంఖధ్వానంతోనే యుద్ధానికి తమ సంసిద్ధతను తెలియజేస్తున్నారు శ్రీకృష్ణార్జునులు.

ఇంకా మిగిలిన పాండవులు, ఇతర రాజులు ఈ శంఖధ్వానాలు ఎలా చేస్తున్నారో, ఆ విశేషాలేమిటో చూద్దాం.

**శ్లో॥ పాంచజన్యం హృషీకేశః దేవదత్తం ధనంజయః ।**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥ 15**

**శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।**
**నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥ 16**

**తా॥** హృషీకేశుడు శ్రీకృష్ణుడు 'పాంచజన్యాన్ని', ధనంజయుడైన అర్జునుడు 'దేవదత్తాన్ని', భీమకర్ముడైన వృకోదరుడు 'పౌండ్ర'మనే మహాశంఖాన్ని ఊదారు.

**తా॥** కుంతీపుత్రుడు ధర్మరాజు 'అనంతవిజయ'మనే శంఖాన్ని, నకులసహదేవులు 'సుఘోష, మణిపుష్పకాల'నే శంఖాలను పూరించారు.

**వ్యాఖ్య:** ఈ రెండు శ్లోకాలలో 5గురు పాండవులు, శ్రీకృష్ణుడు ఏఏ శంఖాలను పూరించారో తెలియజేస్తున్నారు.

హృషీకేశుడు పాంచజన్యాన్ని పూరించాడు.

**హృషీకేశుడు :** అంటే హృషీకములకు ఈశుడు. హృషీకాలంటే ఇంద్రియాలు. ఇంద్రియాలకు అధిపతియే హృషీకేశుడు. మన ఇంద్రియాలన్నీ స్వతహాగా జడం. వాటికి చైతన్యాన్ని కలిగించేవాడు– అంతటా ఉండి, ఈ దేహంలో కూడా ఉన్న పరమాత్మయే. శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మే గనుక ఆయనే ఇంద్రియాలకు కీ ఇచ్చి నడిపించే హృషీకేశుడు.

**పాంచజన్యం :** పంచజనుడనే రాక్షసుని ఎముకతో తయారైనది గనుక ఆ శంఖానికి పాంచజన్యం అనే పేరు వచ్చింది. ఇది శ్రీకృష్ణుని యొక్క శంఖం.

ఇక అప్పుడు ధనంజయుడు దేవదత్తమనే తన శంఖాన్ని పూరించాడు.

**ధనంజయుడు :** అంటే ధనాన్ని జయించినవాడు. ధర్మజ రాజసూయ యాగ సందర్భంగా, అర్జునుడు ఉత్తర దిక్కుగా దిగ్విజయ యాత్రకు వెళ్ళి, అనేకమంది రాజులను జయించి, అపారధనరాశులను కప్పంగా తెచ్చాడు.





కనుక అర్జునుని ధనంజయుడు అన్నారు. అర్జునుని శంఖం పేరు దేవదత్తం.

**దేవదత్తం :** దేవతల చేత దత్తం చేయబడినది గనుక దేవదత్తం అన్నారు. అర్జునుడు దేవలోకం వెళ్ళి, దేవతలకు అసాధ్యులైన నివాత కవచులు, కాలకేయులు అనే రాక్షసులతో యుద్ధం చేసి, వారిని జయించి దేవతలకు ప్రీతి కలిగించాడు. ఆ యుద్ధ సమయంలో దేవతలు ఈ శంఖాన్ని అర్జునునికి ఇచ్చారు. కనుక దేవదత్తం.

ఆ వెంటనే భీమకర్ముడైన వృకోదరుడు పౌండ్రమనే మహాశంఖాన్ని పూరించాడు.

**భీమకర్ముడు :** భయంకరమైన, సాహసోపేతమైన కర్మలు చేసినవాడు భీముడు. చిన్నతనంలో ఆటలాడుకొనే సమయంలోనే వందమంది ధార్తరాష్ట్రులను తానొక్కడే ఎదుర్కొని గెలిచేవాడు. విషాన్నం తినిపించి గంగలో త్రోయించినా అజేయుడై తిరిగి వచ్చాడు. హిడింబుణ్ణి, బకాసురుణ్ణి, కిమ్మీరుణ్ణి సంహరించటం; కీచకుణ్ణి, దుశ్శాసనుణ్ణి లోకభీకరంగా వధించటం – అన్నీ భయంకర, సాహసోపేత కర్మలే. అందుకే భీమసేనుని భీమకర్ముడు అన్నారిక్కడ. అతడు వృకోదరుడు.

**వృకోదరుడు :** వృకం అంటే తోడేలు. తోడేలు పొట్ట వంటి పొట్ట గలవాడు అని ఒక అర్థం కాగా, మరొక అర్థం వృకమనే అగ్ని ఉదరంలో గలవాడు అని. అందుకే భీముడు అతిగా తినేవాడు. ఎంత తిన్నా జీర్ణింపజేసుకోగలవాడు. అతడి శంఖం పౌండ్రం.

**పౌండ్రం :** భీమసేనుని ఈ శంఖం కూడా భీముని లాగానే చాలా పెద్దది. కనుకనే మహాశంఖం అని వర్ణిస్తున్నారు. విష్ణుచిహ్నాలు గలిగినది ఈ మహాశంఖం.

యుధిష్ఠిరుడు అనంతవిజయమనే తన శంఖాన్ని పూరించాడు.

**యుధిష్ఠిరుడు :** యుద్ధమునందు స్థిరముగా నిలిచి యుండు వాడు గనుక ధర్మరాజును యుధిష్ఠిరుడు అన్నారు. కుంతీపుత్రుడైన ధర్మరాజు రాజసూయయాగం చేసినవాడు గనుక 'రాజా' అని సంజయుడు చెబుతున్నాడు. శంఖం పేరు అనంతవిజయం.

**అనంతవిజయం :** ధర్మరాజుకు లభించబోయేది అనంత విజయమేనని

చెప్పటం కూడా ఇందులోని ఆంతర్యం. ఇక నకుల, సహదేవుల శంఖాలు సుఘోష, మణిపుష్పకాలు.

శ్రీకృష్ణుడు, పాండవులు పూరించిన శంఖాలపేర్లను కూడా ప్రత్యేకంగా సంజయుడు ధృతరాష్ట్రునితో పేర్కొనటంలో ఒక ఆధ్యాత్మిక రహస్యం దాగి ఉంది.

పంచభూతాలతో తయారైన జడదేహమే పాంచజన్యం. ఈ జడమైన పాంచజన్య దేహం పరమాత్మ చైతన్యం ఉంటేనే కదులుతుంది. కనుకనే ఇంద్రియాలకు అధిపతి అయిన హృషీకేశుడు ఈ పాంచజన్యాన్ని పూరించాడు. దానితో నరునిలో అద్భుతశక్తి ప్రవేశించింది. ఆ శక్తి అంతా దైవదత్తమే. ఆ దేవదత్త శక్తితో నరుడు ధర్మ సంస్థాపన చేయాలి, ప్రకృతి సంపదలను జయించి ధనంజయుడు కావాలి. అలా కావాలంటే భీమకర్మలు-భయంకరమైన, సాహసోపేతమైన కర్మలు చేయాలి. అలా చేయగలవాడే వృకోదరుడు. వృక+ఉదరుడు-ఎంతైనా తిని జీర్ణించుకోగలవాడు, ఎంతటి భయంకరమైన కర్మలైనా చేయగల సాహసి. అతడి శంఖం విష్ణు చిహ్నం గల పౌండ్రం. అంటే భగవంతుని ఆశ్రయించినందువల్ల అతడి కర్మలన్నీ ధర్మ కర్మలౌతాయి. ఆ ధర్మకర్మలే ధర్మరాజు. అతడికి లభించే విజయం అనంతవిజయం.

అయితే అవి ధర్మకర్మలే ఐనా చేయవలసింది మాత్రం ద్వంద్వాలతో కూడిన ఈ లోకంలోనే. ద్వంద్వాలకు ప్రతినిధులే నకులసహదేవులు.

ద్వంద్వాలతో కూడిన ఈ లోకం పరమాత్మ స్పర్శతో పులకించిపోయింది. పరమాత్మను ఆశ్రయించి, ఆయన స్పర్శతో ధర్మకర్మలు ఆచరించేవారికి అనంతవిజయం లభించగలదనే ఆధ్యాత్మిక అంతరార్థం ఈ రెండు శ్లోకాల వెనుక దాగి వున్నది.

శ్రీకృష్ణుని యొక్క, పాండవుల యొక్క శంఖధ్వనులు విని పాండవసేనలోని సేనాధిపతులు, వీరులు ఎవరెవరు తమతమ శంఖాలను పూరించారో, ఆ శంఖ ధ్వనులు ఎలా వినిపిస్తు న్నాయో ధృతరాష్ట్రునికి వినిపిస్తున్నాడు సంజయుడు.

**శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః।**





**దృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చా పరాజితః॥ 17**

**శ్లో॥ ద్రుపదోద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।**

**సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥ 18**

**శ్లో॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।**

**నభశ్చ పృథివీంచైవ తుములోవ్యను నాదయన్॥ 19**

**తా॥** గొప్పధనువు కలిగిన కాశీరాజు, మహారథుడైన శిఖండి, దృష్టద్యుమ్నుడు, విరాటుడు, పరాజయం లేనివాడైన సాత్యకి.

**తా॥** ఓరాజా! ద్రుపదుడు, ద్రౌపదీపుత్రులైన ఉప పాండవులు, మహాబాహుడైన సుభద్రా కుమారుడు అభిమన్యుడు- అందరూ వేరువేరుగా శంఖాలను పూరించారు.

**తా॥** ఆ ధ్వని భూమ్యాకాశాలయందంతటా ప్రతిధ్వనించి, దుర్యోధనాదుల గుండెలను బ్రద్దలు చేసింది.

**వ్యాఖ్య :** కాశీరాజు గొప్ప ధనుస్సు గలిగినవాడు, అతిరథుడు, ఇక శిఖండిని పేర్కొంటూ మహారథుడు అని ప్రత్యేకంగా పేర్కొంటున్నాడు సంజయుడు. మహాభారత యుద్ధంలో పాల్గొన్న అనేకమంది వీరులను వారి వారి పరాక్రమ స్థాయిని బట్టి మహారథులని, అతిరథులని, సమరథులని, అర్ధరథులని భీష్ములవారు నిర్ణయించి, తన అభిప్రాయాన్ని కోరిన దుర్యోధనునితో చెప్పటం జరిగింది. మహారథుడంటే తనను, సారథిని, గుర్రాలను, రథాన్ని రక్షించుకుంటూ పదివేలమంది యోధ వీరులతో యుద్ధం చేయగల సమర్థుడు. శిఖండి అంతటి మహావీరుడని భీష్ముడు తెలియజేశాడు. ఇపుడు సంజయుడు కూడా 'శిఖండి' మహారథుడు అనియే ధృతరాష్ట్రునితో చెబుతున్నాడు. సాధారణంగా లోకంలో అందరూ శిఖండి అంటే ఆడ, మగ కాని ఒక నపుంసకుడని, యుద్ధవిద్యలు తెలియని వాడని, కేవలం భీష్ముని పడగొట్టడం కొరకే 10వ రోజున అర్జునుని రథం పైకి ఎక్కి వచ్చాడని అనుకుంటారు. ఇలా అనుకోవటానికి కారణం సినిమాలలో చూపించిన దృశ్యాలే నిజమనుకొని, మహాభారత గ్రంథాన్ని సరిగ్గా చూడకపోవటమే. శిఖండీ దృష్టద్యుమ్నులిద్దరూ ద్రుపదుని పుత్రులే. ఇద్దరూ ద్రోణాచార్యుని వద్ద అస్త్ర శస్త్ర విద్యలు నేర్చిన వారే. మరొక ముఖ్య విశేషం

కూడా గమనించాలి. పాండవ సేనలోని 7అక్షౌహిణులకు 7గురు మహావీరులను సేనాధిపతులుగా నియమించాడు ధర్మరాజు. వారు 1. విరాటుడు, 2.ద్రుపదుడు, 3. దృష్టద్యుమ్నుడు, 4.శిఖండి, 5.సాత్యకి, 6.దృష్టకేతువు, 7. చేకితానుడు. ఇలా ఏడుగురు సేనానాయకులను నిర్ణయించి, వీరిలో సర్వసమర్థుడైన ఒక వీరుని సర్వసైన్యాలకు అధిపతిగా అభిషేకించాలి గనుక ఓ సహదేవా! నీ అభిప్రాయం ఏమిటో చెప్పు అని ధర్మరాజు అడుగగా సహదేవుడు 'మనను అజ్ఞాతవాస కాలంలో ఆశ్రయమిచ్చి ఆదుకున్న విరాటుని సర్వసేనానిగా అభిషేకించటం బాగుంటుంద'ని తెలిపాడు. ఆ తర్వాత నకులుని అడుగగా 'మహావీరుడు, ద్రోణాచార్యుని సహాధ్యాయి, మనకు బంధువు, మహావీరులైన పుత్రులు, మిత్రులు, సోదరులు గల ద్రుపదుడే సర్వసేనానిగా ఉండుట మంచిదని నా అభిప్రాయం' అని తెలిపాడు. అర్జునుని అభిప్రాయం అడుగగా 'వారిద్దరూ ఆ పదవికి సర్వసమర్థులే అయినా యువకుడు, అయోనిజుడు, అగ్ని నుండి జనించినవాడు ఐన దృష్టద్యుమ్నుడు తగినవాడ'ని తన మనసులోని మాటను తెలిపాడు. ఇపుడు భీముని అడుగగా 'అటు కౌరవసేనకు భీష్ముడు సర్వసేనాని గనుక, భీష్ముని సంహరించుటకే పుట్టిన శిఖండి మన సేనకు అధినాయకుడుగా ఉండుట శ్రేయస్కరమ'ని తన ఉద్దేశ్యాన్ని తెలిపాడు. చివరకు ధర్మజుడు, "కృష్ణా! నా సోదరుల అభిప్రాయం తెలిసింది గదా! ఇక నీవే ఒకరిని మన సేనలకు అధిపతిగా నిశ్చయించమ"ని కోరగా, శ్రీకృష్ణుడు అర్జునుని అభిప్రాయాన్నే సమర్థిస్తూ, దృష్టద్యుమ్నుని పాండవ సర్వసేనానిగా నియమించటం జరిగింది. ఈ వ్యవహారంలో ధర్మరాజు తన అభిప్రాయాన్ని చెప్పకుండా, ముందు సహదేవుని వద్ద నుండి అభిప్రాయ సేకరణ ప్రారంభించాడు. ఎందుకని? ఏదైనా సమస్య వచ్చి నప్పుడో, క్రొత్తగా ఏ పనినైనా ప్రారంభించాలనుకున్నప్పుడో కుటుంబ పెద్ద తానే నిశ్చయించి, మిగిలిన వారిని అంటే తమ్ముళ్ళను గాని, కుమారులను గాని అభిప్రాయాలు అడిగితే, పెద్దవాని భావానికి విరుద్ధంగా చెప్పాలంటే వారు జంకుతారు. అందువల్ల వారు తమ మనసులోని మాటను బయటపెట్టలేరు. అలా గాక చిన్నవారిని అడిగితే వారి మనస్సులో మాట నిర్భయంగా చెబుతారు. ఆ తర్వాత పెద్దవారు చిన్నవారిమాటను అంగీకరించనూ గలరు, లేదా ఇష్టం





లేకపోతే తిరస్కరించి తమ భావాన్ని చెప్పనూ గలరు. అందుకే ధర్మరాజు ఇలా అడిగింది. ఈ విధంగా నేటి సమాజంలో కూడా కుటుంబ పెద్ద లేదా సంఘ పెద్ద లేదా ప్రభుత్వాధిపతి ఎలా ప్రవర్తించాలో కూడా మహాభారతం మనకు తెలియజేస్తున్నది.

ఇక శిఖండి-పాండవసేనకు ఒక అక్షౌహిణీ సేనాధిపతియని, భీముని అభిప్రాయంలో సర్వసేనానిగా ఉండటానికి తగినవాడని, 18 రోజులూ మహాభారత యుద్ధంలో పాల్గొన్న మహావీరుడని, మహారథుడని మనం గ్రహించాలి. ఇక దృష్ట ద్యుమ్నుడు పాండవ సర్వసేనానియే.

ఇంకా శంఖాలు పూరించిన వారిలో విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, అభిమన్యుడు, ద్రౌపదీపుత్రులైన ఐదుగురు ఉప పాండవులు ఉన్నారు. వీరి శంఖాల పేర్లు మాత్రం ప్రత్యేకంగా చెప్పలేదు. శంఖాలను వేరువేరుగా పూరించారని మాత్రం చెప్పాడు.

సంజయుడు ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని 'పృధివీపతే' అని సంబోధిస్తున్నాడు. ఎందుకు? మహాభారత యుద్ధానికి మూలకారకుడైన ధృతరాష్ట్రునితో తాను కటువుగా మాట్లాడబోతున్నందుకు ఈ ప్రశంశతో సమంచేయాలని గావచ్చు, లేక 'ఇప్పటి వరకూ నీవు పృధివీపతివే; ఈ యుద్ధం కాస్తా పూర్త యిందా! ఈ పృధివి నీ చేతిలో నుండి జారిపోక తప్పదు' అనే భావాన్ని చెప్పకుండానే చెప్పాలనీ గావచ్చు.

ఇక పాండవుల శంఖధ్వని ఎలా ఉన్నదో వర్ణిస్తున్నాడు సంజయుడు. అది భూనభోంతరాళాలు వ్యాపించినదని, ధార్త రాష్ట్రుల గుండెలు బ్రద్దలు చేసిందనీ చెబుతున్నాడు. కౌరవుల శంఖధ్వనుల గురించి ఏ వర్ణణా లేదు. పైగా వారి శంఖధ్వనులు గజిబిజిగా ఉండి, పాండవులకేమీ భయం కలిగించలేదు. కాని పాండవ శంఖధ్వని కౌరవుల గుండెలు బ్రద్దలు చేసిందని చెబుతూ, పరోక్షంగా ధృతరాష్ట్రుని గుండెను బేజారెత్తిస్తున్నాడు సంజయుడు. ఇలా పక్షపాత ధోరణితో ఎందుకు చెబుతున్నట్టు?

పాండవులది ధర్మపక్షమని, పైగా దైవబలం వారికి తోడుగా ఉన్నదని, వారికితోడుగా ఉన్న శ్రీకృష్ణుడు మాధవుడని- అంటే లక్ష్మీదేవి భర్త అని, కనుక సంపదలను అనుగ్రహించే శక్తి ఆయనకు గలదని, కనుక పాండవ

విజయం తథ్యమనే విషయం ధృతరాష్ట్రుని హృదయానికి హత్తుకుపోవాలనే కోరిక సంజయునిది. ఈ యుద్ధం తమ నాశనానికే దారి తీస్తుందని గ్రహించి గ్రుడ్డిరాజు, ఎలాగైనా అన్నదమ్ముల మధ్య జరిగే ఈ యుద్ధాన్ని ఇకనైనా ఆపుజేయమని తన కొడుకులకు నచ్చ జెపుతాడేమోనని సంజయుని ఆశ. జరిగిన నష్టం జరిగి పోయింది. ఇకనైనా కళ్ళు తెరిచి ఘోర విపత్తు రాకుండా తన విజ్ఞతను ఉపయోగిస్తాడేమోనని సంజయుడు తన శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. ఇదంతా ఎందుకంటే ఇప్పటికైనా యుద్ధాన్ని ఆపగలిగే శక్తి గలవాడు ధృతరాష్ట్రుడే గనుక. కాని ధృత రాష్ట్రునిలో అలాంటి మార్పు వచ్చే సూచనలేమీ లేవు. ఆ తర్వాత ఏమి జరిగిందో తెలుసుకోవాలనే ఆరాటమే కనిపిస్తున్నది ధృతరాష్ట్రునిలో. అందుకే సంజయుడు ఆ తర్వాత ఏమి జరిగిందో చెప్పబోతున్నాడు.

**శ్లో॥ అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।**
**ప్రవృత్తే శస్త్ర సంపాతే ధనురుద్యమ్య పాండవః॥ 20**

**శ్లో॥ హృషీకేశం తదావాక్యం ఇదమాహ మహీపతే!।**

**అర్జున ఉవాచ:**

**సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ 21**

**శ్లో॥ యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్।**
**కైర్మయా సహయోద్ధవ్యం అస్మిన్ రణసముద్యమే॥ 22**

**శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్రసమాగతాః।**
**ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధేప్రియ చికీర్షవః॥ 23**

**తా॥** ఓ మహారాజా! బాణాలు వదలటానికి సిద్ధంగా ఉన్న ఆ తరుణంలో కపిధ్వజుడైన అర్జునుడు, యుద్ధ సన్నద్ధులై వచ్చి నిలిచియున్న ధార్తరాష్ట్రులను చూచి, ధనుస్సు నెక్కుపెట్టి, అప్పుడు హృషీకేశుడైన శ్రీకృష్ణునితో ఇలా అంటున్నాడు. "అచ్యుతా! రెండు సేనల మధ్య నా రథాన్ని నిలబెట్టు" (20-21)

**తా॥** ఓ కృష్ణా! యుద్ధం చేయగోరి సిద్ధపడి వచ్చిన ఎవరెవరితో నేను యుద్ధంచేయాలో వారందరినీ ఈ యుద్ధప్రారంభ సమయంలోచూడాలి. (22)

**తా॥** దుర్బుద్ధియైన ధృతరాష్ట్ర పుత్రునికి యుద్ధంలో ప్రియం





కలిగించటానికై ఏఏ వీరులు ఇక్కడ యుద్ధ సంసిద్ధులై యున్నారో వారిని నేను చూడాలి. (23)

**వ్యాఖ్య :** 'అథ' అనేది మంగళవాచకం. శాస్త్రగ్రంథాలను సాధారణంగా ఈ 'అథ' అనే మంగళవాచకంతోనే ప్రారంభిస్తారు. కనుక భగవద్గీత కూడా ఈ శ్లోకం నుండే నిజంగా ప్రారంభమైనదని పెద్దలు చెబుతుంటారు. నిజంగా గీతాబోధకు పునాది ఐన అర్జునుని విషాదం ఇక్కడనుండే మొదలవుతుంది. ఇంతవరకు రెండు సేనలలోని వీరుల గురించి, వారి శంఖ నాదాల గురించి మాత్రమే వివరించబడింది.

మహాభారత యుద్ధంలో ఉభయపక్షాలలోను ఏకైక వీరుడని ప్రశంసించబడిన, సర్వశస్త్రాస్త్ర సంపన్నుడైన అర్జునుడు ఏవిధంగా యుద్ధభూమిలోకి ప్రవేశిస్తున్నాడో సంజయుడు ఈ శ్లోకాల ద్వారా ధృతరాష్ట్రునికి వర్ణించి చెబుతున్నాడు.

ఇంకా అస్త్రశస్త్రాలు ప్రయోగించటం ప్రారంభం కాలేదు. యుద్ధ ప్రారంభానికి రంగం సిద్ధమైంది. మంచి పట్టులో ఉంది ఆ క్షణం. అంతటా ఉత్కంఠ. ప్రతివారి మనస్సులోను ఉత్సాహం ఉరకలు వేస్తున్నది. ఎప్పుడెప్పుడు యుద్ధం మొదలవుతుందా! అని అంతా ఆతృతగా ఎదురు చూస్తున్నారు. అదిగో ఆ క్షణం రానే వచ్చింది. కపిధ్వజంతో అర్జునుడు వస్తున్నాడు.

**కపిధ్వజః :-** అర్జునుని రథం ప్రత్యేకమైనది, దివ్యమైనది. గుర్రాలు గంధర్వహయాలు. ఇక సారథిని గూర్చి చెప్పేదేముంది? జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణుడు. సూత్రధారి గానే గాక పాత్రధారిగా కూడా అర్జున రథానికి సారథిగా ప్రత్యక్షమయ్యాడు. ఇక అర్జునుని ధనుస్సు గాండీవం. వరుణుని నుండి గ్రహించి అగ్నిదేవుడిచ్చినది. మహాప్రస్థానానికి వెళ్తూ, వస్త్రాభరణాలన్నీ విడిచి నార చీరలు ధరించి వెళ్తూ కూడా, గాండీవాన్ని మాత్రం వదలలేక తనతోనే తీసుకువెళ్ళాడు అర్జునుడు. మణులతో పొదగబడిన అద్భుత ధనుస్సు గాండీవం. ఇక బాణాలు అక్షయ తూణీరాలు. అక్షయంగా వచ్చి చేరుతూ ఉంటాయి. ఇక అర్జున దివ్య రథానికి గల ధ్వజం కూడా దివ్యమైనదే. అదే కపిధ్వజం. కపి అంటే కోతి. మామూలు కోతి గాదు.

సాక్షాత్తు ఆంజనేయుడే. అంటే ఆంజనేయుడే ధ్వజపతాకంపై కూర్చొని ఉన్నాడు. పాండవుల అరణ్యవాస కాలంలో గంధమాదన పర్వతంపై భీమునికి తారసపడిన ఆంజనేయుడు, భీమునికి గర్వభంగం కావిస్తాడు. భీముడు- వాయుపుత్రుడే అయిన ఆంజనేయుని శరణుగోరి, యుద్ధంలో అర్జునుని రథధ్వజ పతాకంపై ఉండి మాకు ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించాలని ప్రార్థించగా, 'తథాస్తు' అన్నాడు ఆంజనేయుడు. అందుకే అర్జునుడు కపిధ్వజుడయ్యాడు. అర్జునుని శంఖనాదంతో ఆంజనేయుని సింహనాదం కలిసి భీకర ధ్వని వెలువడి శత్రువుల గుండెలను బ్రద్దలు చేస్తుంది.

అలా కపిధ్వజంతో యుద్ధానికి సన్నద్ధుడైన అర్జునుడు, ధనుస్సు నెక్కుబెట్టాడు. త్వరలో యుద్ధాన్ని ప్రారంభించాలనే ఆతురత ఉంది. ఇక గాండీవం నుండి బాణాలు విడవటమే తరువాయి. యుద్ధ సన్నద్ధులై నిలిచి ఉన్న ధార్తరాష్ట్రులను చూచాడు. ఇంతలో అర్జునునిలో తళుక్కున ఏదో ఆలోచన మెరిసింది. ఏమిటా ఆలోచన? ఆలోచన రావటమే తడవుగా అర్జునుడు హృషీకేశుడైన శ్రీకృష్ణునితో ఇలా అంటున్నాడు. "ఓ అచ్యుతా! నేనిప్పుడు ఎవరెవరితో యుద్ధం చేయాలో-యుద్ధం చేయటానికి సిద్ధపడివచ్చిన అట్టివారిని ఎంత దూరంలో ఉండి నేను చక్కగా చూడగలనో-అంత దూరంలో రెండు సేనల మధ్య నా రథాన్ని నిలుపు" అన్నాడు.

అసలు ఇలాంటి సంకల్పం అర్జునునిలో ఎలాకలిగింది? ఒక అద్భుతం జరగటానికి ఇదే పునాది. ఆ సంకల్పాన్ని కలిగించిన వాడు హృషీకేశుడే. ఆయన హృషీకాలకు (ఇంద్రియాలకు) ఈశుడు (ప్రభువు) గదా! అందుకే అర్జునుని లోని సంకల్పానికి ప్రేరణ కలిగించాడు. పలికించే ప్రభువు ప్రేరణ కలిగిస్తే తప్ప స్వయంగా పలికే శక్తి ఎవరికీ ఉండదు.

ఇక్కడ అర్జునుడు శ్రీకృష్ణుని అచ్యుతా! అని సంబోధిస్తున్నాడు. అచ్యుతుడు-అంటే చ్యుతి లేని వాడు, పడిపోనివాడు, చలించనివాడు అని అర్థం. శ్రీకృష్ణుడు తన స్వస్థితినుండి పడిపోనివాడు. తన స్వస్వరూపం నుండి చలించనివాడు. ఎల్లప్పుడూ 'తాను పరమాత్మను' అనే స్పృహలో నిలిచి ఉండే వాడు. ఆయనకెప్పుడూ చ్యుతి లేదు. అందుకే ఆయన అచ్యుతుడు. కాని మనమో? మన స్వస్వరూపం పరమాత్మయే అని ఎంత బాగా తెలుసుకున్నా,





ఎన్ని శాస్త్రాల ద్వారా, ఎందరు మహాత్ముల ద్వారా నీవు జీవుడివిగాదు- దేవుడివే; నీవు దేహానివిగాదు - ఆత్మవే; నీవు సుఖదుఃఖాలనే ద్వంద్వాలమధ్య బందీవిగావు - ఆనంద స్వరూప ఆత్మవే- బ్రహ్మానివే అని తెలుసుకున్నా, మన నిజ స్వరూపంలో- ఆత్మ స్వరూపంలో నిలువలేము. మన స్వస్థితి నుండి పడిపోయి, ఈ దేహమే నేననే భ్రమతో- ఈ ప్రపంచ వ్యవహారాలలో మునిగిపోతాం. సుఖాలకు పొంగిపోతాం. దుఃఖాలకు క్రుంగిపోతాం. కనుక మనం చ్యుతులమేగాని అచ్యుతులంగాము. కాని భగవానుడు అచ్యుతుడే. మనం కూడా- దేహం ఏ వ్యవహారాలలో మునిగి ఉన్నా మన స్వస్థితిలో నిలిచి ఉంటే- నాటకంలో ఏ పాత్రలో నటిస్తున్నా మన యధార్థ స్థితిని మరువకుండా ఉన్నట్లుగా ఉంటే - మనం కూడా అచ్యుతులమే. ఈ స్థితిని సాధించేందుకు ఉపాయం చెప్పేదే భగవద్గీత.

తాను ఎవరెవరితో యుద్ధం చేయాలో వారందరినీ ఒక్కసారి చూడాలని అర్జునుని కోరిక. అందువల్ల ఎంత దూరంలో రథం నిలిపితే చక్కగా చూడగలనో అంత దూరంలో, రెండు సేనల మధ్య రథం నిలుపు అంటున్నాడు అర్జునుడు. అంటే రెండు సేనలలోని వీరులనూ చూడాలనేది అర్జునుని ఆంతర్యం. ఏదైనా ఒక పనిని ప్రారంభించేటప్పుడు దాని మంచి చెడుల గురించి బాగుగా ఆలోచించి ప్రారంభించాలనేది బుద్ధిమంతుల లక్షణం. అంతేగాదు యుద్ధరంగంలోకి లేదా కార్యరంగంలోకి దిగే ముందు తన బలాన్ని, ఎదుటి బలాన్ని అంచనా వేసుకొనటం వివేకవంతుల లక్షణం. అంచనా సరిగ్గా ఉండాలంటే ఏదో ఒక పక్షాన - ఏదో ఒక వైపున నిలిచి చూడకూడదు. రెండింటికి మధ్యన నిలబడి-అంటే నిష్పక్షపాత బుద్ధితో పరిశీలన చేయాలి. అందుకే దైవీ ప్రకృతిగల అర్జునుడు రెండు సేనల మధ్య నిలిచి ఉభయ పక్షాలను పరిశీలన చెయ్యాలని అనుకున్నాడు. కాని ఆసురీ ప్రకృతిగల దుర్యోధనుడు మాత్రం ఎదుటి సేనను-వీరులను మాత్రమే చూచి, తన పక్షం లోనే నిలిచియున్న ద్రోణాచార్యునితో మాట్లాడాడు.

ఇలా రెండు సేనల మధ్య నిలిచి పరిశీలన చెయ్యాలంటే గొప్ప ధైర్యం

కూడా కావాలి. అచ్యుతుడిని ఆశ్రయించినవానికి భయమెందుకుంటుంది? అందుకే అర్జునుడలా ఆజ్ఞాపించాడు. ఇది ఉత్తమ యోధవీరుని లక్షణం. ఇక్కడ అర్జునుని యుద్ధ సంసిద్ధత, ధైర్యసాహసాలు, శక్తిసామర్థ్యాలు,కార్యకుశలత, వివేకం మనకు అవగతమౌతాయి.

అర్జునుడు కార్యవాది. అందుకే తాను ఎవరెవరితో యుద్ధం చేయాలో ముందుగా చూడాలనుకున్నాడు. వారి బలాలు, బలహీనతలు ఏమిటో అంచనా వేసుకోకుండా గ్రుడ్డిగా వారితో యుద్ధం చేయాలనుకోవటం లేదు. పైగా ఆ వచ్చినవారు ఎలాంటివారో కూడా తెలుసుకోవాలనుకుంటున్నాడు. ఆ వచ్చినవారు దుర్యోధనునికి సహాయం చేయటానికి, అతడికి ప్రీతి కలిగించటానికి వచ్చినవారు. మరి ఆ దుర్యోధనుడో! అతడు దుర్బుద్ధి అని స్పష్టంగా తెలుసు. ఇంతకుముందు తమనెన్నో కష్టాలకు గురిచేసినవాడు, అంతం చేయటానికి చూచినవాడు. చిన్నతనంలోనే భీముని చంపటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు; తమందరినీ వారణావతంలో లక్కయింట తగలబెట్టజూచినవాడు; మాయాజూదంలో తమ రాజ్యాన్ని హరించినవాడు; నిండు సభలో ద్రౌపదిని ఘోరాతిఘోరంగా అవమానించినవాడు; అరణ్య అజ్ఞాత వాసాలకు పంపినవాడు; అరణ్యంలో ఉండగా అక్కడ కూడా అవమానించాలని ఘోషయాత్ర పేరుతో చతురంగ బలాలతో వచ్చినవాడు; న్యాయంగా, ద్యూతనియమం ప్రకారం తమ రాజ్య భాగాన్ని తమకు ఇవ్వకుండా యుద్ధానికి సిద్ధపడినవాడు. కనుక అతడు దుర్బుద్ధే. ఆ బుద్ధి కూడా అతడికి తండ్రినుండి సంక్రమించినదే. అందుకే 'దుర్యోధనస్య దుర్బుద్ధే' అనక 'ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే' అని అంటూ ఇక్కడ ధృతరాష్ట్రుని ప్రసక్తి కూడా తేవటం జరిగింది. అంటే ఇది పుట్టుకతో వచ్చిన బుద్ధి. పుడకలతోగాని పోదు.

అట్టి దుర్బుద్ధికి సాయంజేయవచ్చినవారు అతడి పాపాన్ని ప్రోత్సహించే వారే. అలా అతడి పంచన చేరినవారిలో వారి అర్థానికి (డబ్బుకు) దాసులై వచ్చినవారెవరో, పదవీ వ్యామోహంతో వచ్చినవారెవరో, లోభ బుద్ధితో వచ్చినవారెవరో, నీచ బుద్ధితో వచ్చినవారెవరో, తప్పనిసరై మొహమాటంతో వచ్చినవారెవరో, పాండవులపై, లేదా శ్రీకృష్ణునిపై ద్వేషంతో వచ్చినవారెవరో,





మోసగించబడి వచ్చినవారెవరో – అందరినీ తెలుసుకోవాలనుకున్నాడు.

ఈ మాటలతో అర్జునుడప్పుడు 'శత్రువుపట్ల క్రోధంతో పళ్ళు పటపట కొరుకుతున్నాడ'ని మనకు అర్థమౌతుంది. శత్రుసేన అంటే తనకొక లెక్కకాదనే ఆత్మవిశ్వాసం కనిపిస్తుంది. 'చూస్తా! ఎవరెవరున్నారో' అనటంలో ధైర్యశౌర్యాలు వ్యక్తమవుతున్నవి. ఇంతవరకు అర్జునునిలో ఏ విషాద ఛాయలూ లేవు.

అర్జునుని ఆదేశంతో భగవానుడేం విచిత్రం చేశాడు?–

**సంజయ ఉవాచ:**

**శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశః గుడాకేశేన భారత!।**
**సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమం॥ 24**

**శ్లో॥ భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాంచ మహీక్షితాం।**
**ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25**

**తా॥** సంజయుడన్నాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇలా అర్జునునిచేత ఆదేశించబడిన శ్రీకృష్ణుడు ఉభయ సేనల మధ్య ఉత్తమమైన రథాన్ని, ప్రముఖులైన భీష్మద్రోణులు, ఇతర రాజుల ఎదురుగా నిలిపి "పార్థా! ఈ సమావేశమైన కురుశ్రేష్ఠులను చూడు" అన్నాడు. (24–25)

**వ్యాఖ్య :–** సంజయుడు అప్పుడు జరిగిన విశేషాలను వినిపిస్తూ ధృతరాష్ట్రుని భారత! అని సంబోధిస్తున్నాడు. అంటే భరత కులంలో జన్మించినవాడా! అని. ఇలా అనటంలో అయ్యా! ఎందరో గొప్పవీరులు, మేధావులు, బుద్ధిమంతులు, ఉన్నత వ్యక్తిత్వం గలవారు ఈ కులంలో పుట్టి, రాజ్యం చేసి కుల మర్యాదను నిలబెట్టారు; వంశ ప్రతిష్ఠను ఇనుమడింపజేశారు. ఇప్పుడు నీ కుల మర్యాదను నీవు కాపాడుకో– అనే హెచ్చరిక ధ్వనిస్తుంది.

'నా రథాన్ని రెండు సేనల మధ్య నిలుపు' అని అర్జునుడు క్షత్రియ సహజమైన అహంకారంతో, యుద్ధోత్సాహంతో భగవానుని ఆదేశించాడు. 'సాక్షాత్తు భగవంతుణ్ణే ఆజ్ఞాపిస్తున్నానే' అనే సంశయం లేదు అతడిలో. రజోగుణంవల్ల వచ్చిన అహంకారపు పొర అతణ్ణి కప్పివేసింది. అయితే 'ఇతడు నన్ను ఆజ్ఞాపిస్తున్నాడే' అని భగవంతునికి కోపం లేదు. ఆజ్ఞాపించినవాడు గుడాకేశుడు. గుడాకేశుడంటే నిద్రను జయించినవాడు – అని. యుద్ధ వ్యూహాల

గురించి ఆలోచిస్తూ చాలారోజులు నిద్ర అనేది లేకుండా గడిపినవాడు అర్జునుడు. భగవంతుని కొరకు తపిస్తూ భక్తులు-మహాత్ములు నిద్రకు దూర మౌతారు. అయితే వేదాంతపరంగా నిద్రను జయించిన వాడు అంటే తమోగుణాన్ని జయించినవాడు అని. తమోగుణాన్ని జయిస్తే భగవంతుని ఆశ్రయం లభిస్తుంది. కనుకనే అర్జునునికి భగవానుడు సారథి అయ్యాడు. రథానికేగాదు. తన జీవితానికే సారథి. ఆయన హృషీకేశుడు. ఇంద్రియాలకు అధిపతి. హర్షం కలిగించేవి గనుక ఇంద్రియాలను హృషీకాలన్నారు. శ్రీకృష్ణుడెప్పుడూ ఆనందంలోనే ఉంటాడు. ఆయన ఆనందానికి తరుగు లేదు- విరుగు లేదు - తిరుగు లేదు.

బృందావనంలో గోపికలను తరింపజేసేందుకు మురళీగానం వినిపించేటప్పుడుగాని; యుద్ధరంగం మధ్యలో గీతాగానం చేసి అర్జునుని, సర్వమానవాళిని తరింపజేసే మార్గాన్ని చూపినప్పుడుగాని; జరాసంధుడు తనపై దండెత్తి వచ్చి యుద్ధాలు చేసినప్పుడుగాని; ధర్మరాజు అగ్రపూజ జరిపేటప్పుడుగాని; శిశుపాలుడు నిందావర్షం కురిపించేటప్పుడు గాని; రాయబార సమయంలో దుర్యోధనాది దుష్టచతుష్టయం తనను కట్టివేయవచ్చినప్పుడుగాని ఆయన వదనంలో చిరునవ్వు చెదరలేదు. ఆయన ఆనందం కుళాయిలో నీళ్ళలాగా బయట నుండి వచ్చేది కాదు; బావిలో నీళ్ళులాగా లోపలనుండి ఊరేది. అందుకే ఆయన హృషీకేశుడు.

అట్టి వానికి, ఇప్పుడు అర్జునుని మాటకు కోపం వస్తుందా? చేయవలసినదేదో చేసేయటమేగాని క్రోధం చెందేవాడు కాదు. అందుకే తన సారథి పాత్రను చక్కగా పోషిస్తూ, 'చిత్తం మహారాజా!' అన్నట్టుగా, రథాన్ని భీష్మద్రోణుల కెదురుగా ఉండేటట్లు రెండు సేనలమధ్య నిలిపాడు 'అరుగో కురు ప్రముఖులను చూడు' అన్నాడు. మొదటి అధ్యాయంలో శ్రీకృష్ణుని నోటినుండి వెలువడిన మాట ఇదొక్కటే. ఈ మాటే అర్జునునిలోని అహంకారాన్ని ఒక్కపెట్టున నాశనం చేసింది. గీతాబోధకు పునాదిని చటుక్కున వేశాడు భగవానుడిక్కడ. గీతాబోధను వినటానికి అర్హత ఉండాలా? ఉండాలి.

అర్హత లేని వానికి, అహంకారం అణగని వారికి ఈ అద్భుత జ్ఞానాన్ని అందించినా ప్రయోజనంలేదు. కనుక గీతాబోధ చెయ్యాలంటే అర్జునునిలో





అహంకారం అణగాలి. అతడిలో విషాదం కలగాలి. రథాన్ని దుర్యోధనాదుల కెదురుగా నిలిపితే అర్జునునిలో ప్రతీకారవాంఛ చెలరేగేది. వెంటనే గాండీవం నుండి బాణం రివ్వున దూసుకుపోయేది. కనుకనే భీష్మద్రోణులకెదురుగా నిలిపాడు. వారు పాండవుల శ్రేయోభి లాషులు. అంతేకాదు. భీష్ముడు తనను పెంచి పెద్దచేసినవాడు. ఒడిలో కూర్చోబెట్టుకొని విద్యాబుద్ధులు నేర్పినవాడు. ద్రోణుడు గురువు. తాను ఆయనకు ప్రియశిష్యుడు. తన కుమారుడు అశ్వత్థామకు కూడా ప్రసాదించని ఎన్నో అస్త్రాలు తనకు ప్రసాదించినవాడు. అందుకే వారిని చూడటంతోనే విషాదం కలిగింది. అయితే వీరిని చూచింది ఇప్పుడేనా? కాదు. విరాటనగరంలో ఉత్తర గోగ్రహణ సందర్భంగా వీరందరితో యుద్ధం చేశాడు. తానొక్కడే వచ్చి, దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులతోబాటు భీష్మద్రోణ, కృప, అశ్వత్థామాదులందరితోను యుద్ధంచేసి, తన అసమాన పరాక్రమంతో అందరినీ జయించి, గోవులను మరలించుకపోయాడు. అప్పుడే విషాదమూ కలగ లేదు. మరి ఇప్పుడెందుకు కలిగింది? అదే భగవంతుని లీలా విలాసం. గీతాబోధకు అనుకూలంగా అర్జునుని తీర్చిదిద్దటానికే శ్రీకృష్ణుడిలా చేశాడు.

ఇక్కడొక ముఖ్య విషయాన్ని గ్రహించాలి. మనం చేసే పనులన్నీ బయట ఫలితాలనిస్తే చాలదు. లోపల వ్యక్తిత్వం బాగుపడాలి. కనుక మన అంతరంగాన్ని శుద్ధం చేసుకోటానికి, అహంకారాన్ని నాశనం చేసుకోటానికి, మనోబుద్ధులను సరిచేసుకోటానికి, మన వ్యక్తిత్వాన్ని బాగుచేసుకోటానికి తగినట్లుగా కర్మలు చేయాలి. ఈ యుద్ధమనే క్రూరకర్మ కూడా అందుకే జరగాలి. ఆ దృష్టి కలగనంత వరకు మనది కురుక్షేత్రం అవుతుందేగాని ధర్మక్షేత్రం కాదు. కర్మలు చేసే దేహం కురుక్షేత్రం. ధర్మకర్మలను - వ్యక్తిత్వాన్ని శుద్ధం చేసే కర్మలను చేసే దేహం ధర్మక్షేత్రం.

ఇప్పుడు జరగబోయే యుద్ధ కర్మద్వారా అంతరంగాన్ని శుద్ధం చేసుకొనేందుకు వీలుగా, జ్ఞానబోధ చేయుటకే శ్రీకృష్ణుడు రథాన్ని రెండు సేనల మధ్య, భీష్మద్రోణుల కెదురుగా నిలిపాడు.

భగవద్గీత ఆవిర్భావానికి మూలశ్లోకం ఇది. ఇక్కడ శ్రీకృష్ణుని చర్యతో అర్జునునిలో అహంకారం తొలగింది, విషాదం కలిగింది, జ్ఞానాన్ని అందుకొనే

యోగ్యత కలిగింది.

ఆ యోగ్యత–అర్హత లేనివారైతే మీరు చెబుతూ ఉండండి, నేను తిరిగ్గా పనులు చేసుకొని వస్తాను అని వినటానికే ఎన్నో పోజులు. నిజంగా ఇది కృష్ణార్జునల కథ కాదు. మన కథ. మనం దైనందిన జీవితంలో పనులు ఎలా చేసి అంతరంగాన్ని శుద్ధం చేసుకోవాలో– ఆ ఉపాయాలను తెలిపే కథ. తప్పక తెలుసుకోవలసిన కథ. 'అరుగో కురువీరులను చూడు' అని శ్రీకృష్ణుడు అనటంతో అర్జునుడెవరెవరిని చూచాడు? అప్పుడేం జరిగింది?

**శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥ 26**
**శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి।**
**తాన్ సమీక్ష్య సకౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్॥ 27**
**శ్లో॥ కృపయాపరయాఽవిష్టః విషీదన్నిద మబ్రవీత్। (28లో 1/2)**

**తా॥** అపుడు అర్జునుడు రెండు సేనలలోను నిలిచియున్న తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, మనుమలను, స్నేహితులను, మామలను, హితులను చూచాడు.

అక్కడ నిలిచిన యావన్మంది బంధువులను పరిశీలించి చూచిన అర్జునుడు అధికమైన కరుణతో కూడినవాడై విషాదంతో ఇలా అంటున్నాడు.

**వ్యాఖ్య:** రథాన్ని రెండు సేనల మధ్య నిలిపి సారథియైన శ్రీకృష్ణుడు "అరుగో! కురువీరులను చూడు" అనటంతో, అర్జునుడు కేవలం శత్రుసైన్యంలోని వీరులనే గాక, ఉభయ సైన్యాలలోని ప్రముఖులను ఒక్కసారిగా పరికించి చూచాడు. ఎటు చూచినా ఆప్తులు, హితులు, బంధువులు, మిత్రులే. ఎవరెవరిని చూస్తున్నాడు?

**పితౄన్: తండ్రులు:** కురువంశ ప్రముఖుడు భూరిశ్రవుడు మొ॥న వారున్నారు.
**పితామహాన్:తాతలు:**భీష్ముడు, సోమదత్తుడు, బాహ్లికుడు (ముత్తాత) మొ॥న వారు.
**ఆచార్యాన్: గురువులు:** ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు మొ॥న వారు.
**మాతులాన్:మేనమామలు:** శల్యుడు, శకుని, పురుజిత్తు, కుంతిభోజుడు మొ॥న





వారు.
**భ్రాతౄన్:సోదరులు:** దుర్యోధనాదులు, ధర్మజ భీమ నకుల సహదేవులు, కేకయులు, విందానువిందులు మొ॥న వారు.
**పుత్రాన్:పుత్రులు:** అభిమన్యుడు, ఉపపాండవులు, లక్ష్మణుడు, దుశ్శాసనపుత్రుడు, ఘటోత్కచుడు, ఇరావంతుడు, దృష్టకేతువు మొ॥న వారు.
**సఖీం:స్నేహితులు:** అశ్వత్థామ, సంజయుడు మొ॥న వారు
**శ్వశురాన్:మామలు:**ద్రుపదుడు, శైబ్యుడు మొ॥న వారు.
**సుహృత్:హితులు:** విరాటుడు, సాత్యకి, కృతవర్మ, భగదత్తుడు, మొ॥న వారు.

వీరంతా అంతకుముందు తనకు తెలియని వారేంకాదు. అయితే ఇక్కడకు వచ్చి వీరిని చూచేంతవరకు అర్జునుని ఆలోచనలు వేరు. ఇపుడు అందరిని చూచిన తర్వాత కలిగిన ఆలోచనలు వేరు.

ఇంతవరకు అరణ్య అజ్ఞాతవాస కాలాలలో అన్నదమ్ములతో కలిసి అనేక క్లేశాలు అనుభవించాడు అర్జునుడు. వీటికి కారణం ప్రధానంగా దుర్యోధనుడే. అందువల్ల దుర్యోధనునిపై ప్రతీకారం తీర్చుకోవాలనే కసి ఉన్నది. అదే అతడిలో పట్టుదలను కలిగించింది. దానితో అతడిలో గొప్ప శక్తి ఉత్పన్నమైంది. అది ఉత్తర గోగ్రహణ సమయంలో వ్యక్తమైంది కూడా. కనుక ఎలాగైనా దుర్యోధనునిపై ప్రతీకారం తీర్చుకోవాలని, న్యాయంగా తమకు రావలసిన రాజ్యభాగాన్ని ఇవ్వకపోతే యుద్ధంలో జయించి తీసుకోవాలని, క్షత్రియుడుగానే ఆలోచించాడు ఇంతవరకు. అందుకే బలాబలాలు అంచనావేసుకుంటూ, ఎలాంటి వ్యూహాలు పన్నాలా అని ఆలోచిస్తున్నాడే గాని; ఇది అన్నదమ్ముల మధ్య పోరాటమని, ఇరుపక్షాలలోనూ ఉన్న వారంతా బంధువులు, మిత్రులు, ఆత్మీయులు అని, యుద్ధంలో విజయం సాధించాలంటే వీరిలో చాలామందిని పోగొట్టుకోవాల్సి ఉంటుందని ఆలోచించలేదు. ఇప్పుడు మొదటిసారిగా అందరిని ఒక్కచోట– అదీ– యుద్ధరంగంలో చూడటంతో ఇన్నాళ్ళ నుండి ఉన్న తన మనోస్థితి ఒక్కసారిగా మారిపోయింది. గొప్ప కరుణ ఆవహించింది. విషాదం కలిగింది.

ఇందరు ఆత్మీయులను,బంధువులను, మిత్రులను ఈ రణ భూమికి బలి ఇచ్చి తమ రాజ్యభాగాన్ని పొందటం అవసరమా? అందరినీ చంపుకున్న

తర్వాత ఇక మిగిలేది శాపనార్థాలే గదా! దుర్యోధనాదులను చంపి గాంధారీ ధృతరాష్ట్రుల ముఖం చూచేదెట్లా? భీష్మద్రోణాది మహాత్ములను చంపి తాను సుఖంగా ఉండగలడా? ఇలాంటి ఆలోచనలతో అర్జునునిలో కరుణ, జాలి, దయ కలిగినవి. 'పరయా కృపయా ఆవిష్టః'–ఈ గొప్ప కరుణతో కూడినవాడై 'విషీదన్ ఇదం అబ్రవీత్'–విషాదంతో ఇలా అంటు న్నాడు. ఎందుకు విషాదం?

ఇంతటి విషాదం కలగటానికి మూలకారణం మమకారమే. నా డబ్బు, నా ఇల్లు, నా భార్య, నా బిడ్డలు, నా వాళ్ళు, నా పదవి... ఇలా నా....నా... అనే వన్నీ పాశాలే. అన్నీ జీవుణ్ణి బంధించేవే. పాశబద్ధుడు జీవుడు; పాశముక్తుడు దేవుడు. పాశబద్ధుడైన వానికి దుఃఖం తప్పదు. అందుకే మమకారంతో, నా బంధువులు, నా ఆత్మీయులు, నా వారు అంటూ అర్జునుడు విషాద గ్రస్థుడయ్యాడు.

పిల్లలను తల్లిదండ్రులు ఎంతో ప్రేమతో పెంచుతారు. తాము తినకుండా వారికి పెడతారు. వారికేదన్నా జరిగితే విలవిలలాడిపోతారు. వారికోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడతారు. అయితే వారు పెరిగి పెద్దయిన తర్వాత తమ మాట వినటంలేదనో, తమను సరిగ్గా చూడటం లేదనో దాదాపుగా అందరూ బాధపడుతూనే ఉంటారు. బాధల్లో ఎక్కువ తక్కువలుండవచ్చు. కొందరూ గట్టిగా బయటికే బాధపడవచ్చు. కొందరు గుట్టుగా లోలోపలే బాధపడవచ్చు. కాని బాధమాత్రం తప్పదు. మమకారం ఉన్నచోటనే బాధ, మమకారం లేనిచోట ఏ బాధా ఉండదు.

ఇంతకు ముందు అర్జునుడు అనేక యుద్ధాలు చేశాడు. వేలమందిని సంహరించాడు. మరి ఎప్పుడూ విషాదానికి లోను కాలేదు. మరి ఇపుడు యుద్ధరంగంలో సంహరించటానికి ఎందుకు విషాదం?– ఇప్పుడు చంపవలసి వచ్చింది తన వారిని. అందుకే విషాదం. అంటే మమకారం వల్లనే విషాదం.

భాగవతంలో గజేంద్రమోక్షం అనే కథ ఉన్నది. అక్కడ సరస్సులోకి దిగగానే గజేంద్రుణ్ణి మొసలి పట్టుకుంది. గజేంద్రుడే జీవుడు. మొసలియే మోహం. సరస్సే సంసారం. ఈ సంసారంలో దిగిన జీవుడు మోహమనే మొసలి చేత చిక్కినపుడు ఎంత ప్రయత్నించినా వదలదు ఈ మమకార బంధం. చివరకు





భగవంతుని శరణు వేడాల్సిందే. మమకారమనే పిశాచం ఆవేశిస్తే ఎంతటి ధీరుడైనా దీనుడైపోవాల్సిందే. అందుకే పళ్ళు పటపటలాడిస్తూ శత్రువులను ఊచకోతకోయాలని యుద్ధ రంగంలో ప్రవేశించిన అర్జునుడు– ధీరుడైన, వీరుడైన అర్జునుడు దీనుడై పోయాడు. ఈ మమకార పిశాచం వల్లనే ద్రోణాచార్యుడి వంటి అస్త్రాచార్యుడు కూడా దృష్టద్యుమ్నుని చేతిలో చావవలసి వచ్చింది. ఈ మమకారమనే పిశాచం వల్లనే ధృతరాష్ట్రుడు వందమంది పుత్రులను పోగొట్టుకొని, తాను ఎవరికైతే అపకారాలు, అన్యాయాలు చేశాడో ఆ పాండవుల పంచన 13 సంవత్సరాలు జీవనం సాగించవలసి వచ్చింది.

ఒకనాటి సాయంకాలం ఒక తుమ్మెద షికారుకు బయలు దేరింది. దారిలో ఒక కొలనుంది. అక్కడ కొన్ని తామరపూలు కనిపించి ఆకర్షించబడింది. పుష్పంపై వాలి అందులోని మకరందాన్ని పీల్చుకుంటూ మత్తెక్కింది. అది తనకిచ్చిన సుఖంతో దానిపై మమకారం ఏర్పడి ఆ పుష్పాన్ని వదలాలనిపించ లేదు. రాత్రి కావటంతో పుష్పం ముడుచుకుంది. బంధంలో చిక్కుకుంది. ప్రయత్నిస్తే బయటకు రావచ్చు. కాని "ఇక్కడే బాగుంది, తెల్లవారకపోతుందా, తిరిగి పుష్పం వికసించక పోతుందా? అపుడు హాయిగా వెళ్ళవచ్చు. ఇంత మాత్రానికే అందమైన ఈ పుష్పాన్ని ఎందుకు చీల్చాలి?" అనుకొంది. తెల్లవారకముందే ఒక ఏనుగు ఆ కొలనులో దిగి ఆ పుష్పాన్ని తొండంతో పెకిలించి నోట్లో పెట్టుకుంది. – 'సహేంద్ర తక్షకాయ స్వాహా' అన్నట్టు ఆ తుమ్మెదతో సహా పుష్పం ఏనుగు కడుపులోకి పోయింది. మమకార బద్ధుడైతే ఇంతే సంగతులు.

ఎప్పుడూ ఏడవని అర్జునుడు మమకార వ్యామోహంతో ఏడ్చాడు. అర్జునుని వంటి వీరుణ్ణి, ధీరుణ్ణి ఏడ్పించిన మమకారానికి మనమొక లెక్కా? మదపుటేనుగులే పలాయన మంత్రం పఠిస్తే పుల్లాకులగతేమిటి?

అయితే అర్జునుడు ఏడిస్తే ఏడ్చాడు గాని ఎవరిముందు ఏడవాలో వాళ్ళముందే ఏడ్చాడు. భగవంతుని ముందు పెట్టుకొని ఏడ్చాడు. ధర్మదృష్టితో ఏడ్చాడు. ఎలాంటి విషాదమైనా సరే ధర్మదృష్టి ఉంటే చాలు– ఆ విషాదం వ్యక్తిని భగవంతుని వైపుకు త్రిప్పుతుంది. అర్జున విషాదం అధర్మమైనది కాదు,

స్వార్థపూరితం కాదు, ధార్మికమైనది. అందుకే అర్జునుని ఏడుపు భగవద్గీత అనే బ్రహ్మవిద్యాప్రతిపాదితము, యోగశాస్త్రము ఐన అద్భుత ఆధ్యాత్మిక జ్ఞానశాస్త్రం రావటానికి కారణమైంది.

ఇక విషాదంలో మునిగిన అర్జునుడేమంటున్నాడో చూద్దాం.

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితం ॥ 28లో$^1/_2$**

**శ్లో॥ సీదంతి మమగాత్రాణి ముఖంచ పరిశుష్యతి ।**
**వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చ జాయతే ॥ 29**

**శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।**
**నచ శక్నో మ్యవస్థాతుం భ్రమ తీవచమేమనః ॥ 30**

**శ్లో॥ నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ।**
**నచశ్రేయో2నుపశ్యామి హత్వా స్వజనమాహవే॥ 31**

**తా॥** కృష్ణా! యుద్ధం చేయగోరి సమావేశమైయున్న ఈ స్వజనాన్ని చూచి నా అవయవాలు శిథిలమౌతున్నాయి. నోరు ఎండిపోతున్నది. శరీరం వణుకుతున్నది. రోమాలు నిక్కబొడుచు కుంటున్నాయి. గాండీవం చేతిలోనుండి జారిపోతున్నది. చర్మం మండిపోతున్నది. నిలబడటానికి శక్తిలేదు. మనస్సు గిర్రున తిరిగిపోతున్నది.

కేశవా! అనర్థకరమైన దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. యుద్ధంలో స్వజనులను చంపటం వల్ల కలిగే మేలు ఏమిటో నాకు కనిపించటం లేదు.

**వ్యాఖ్య:** ఇక్కడనుండి అన్నీ అర్జునుని శోకాన్ని వర్ణించే శ్లోకాలే. అర్జునుడు ముందుగా శరీరంలో కలిగిన మార్పులను వర్ణిస్తున్నాడు. అవయవాలు పట్టుదప్పుతున్నాయని, శరీరం వణుకుతున్నదని, నోరెండిపోతున్నదని, గగుర్పాటు కలుగు తున్నదని, ఇవన్నీ జ్వర లక్షణాలు. ఐతే అర్జునునికి టెంపరేచర్ ఎక్కువై కాదు. మనసులో కలిగిన కలవరం వల్ల శరీరానికి వచ్చిన వికారాలు ఇవి. మనస్సులో కలవరం ఎందుకు? 'దృష్ట్వేమం స్వజనం'- స్వజనులను చూడటంవల్ల. ఊరికే చూడటంవల్ల ఎందుకు కలవరం కలుగుతుంది? కలగదు. మరెందుకీ కలవరం? తన వారిని చంపుకోవాల్సి





వస్తున్నదే అనే మమకారం వల్ల. స్వజనులంతా సుజనులేం కాదు. వారిలో చాలామంది దుర్జనులే, దుర్మార్గులే. ధర్మాన్ని నిలబెట్టాలని, అధర్మాన్ని అణచివేయాలని కోరేవాడు పలకాల్సిన పలుకులు కావు ఇవి. స్వధర్మపాలన చేసేవాడికి మమకారం అడ్డురాకూడదు. క్షత్రియుడికి యుద్ధం చేయటమే స్వధర్మం. అర్జునుని ఈ మమకారం అతడి స్వధర్మనిష్ఠకు అడ్డువచ్చికూర్చుంది.

అర్జునుడు స్వధర్మనిష్ఠ లేనివాడేంకాదు. ఒక బ్రాహ్మణుని గోవు అపహరించబడితే ఆ బ్రాహ్మణుని కోరికపై ఆ గోవును తెచ్చి ఇచ్చేందుకు దొంగలను హతమార్చాల్సి వచ్చింది. ధర్మరాజు శయ్యాగారం వెనుకనున్న ఆయుధాగారంలో తన ధనుర్బాణాలున్నాయి. ద్రౌపదితో కలసి ధర్మరాజు శయ్యాగారంలో ఉన్నప్పుడు అక్కడికి తాను పోరాదు. అయినా సరే స్వధర్మనిష్ఠ కొరకు ఆయుధాగారంలో ప్రవేశించి, ధనుర్బాణాలు తెచ్చి, దొంగలను హతమార్చి, గోవును రక్షించి బ్రాహ్మణుని కిచ్చాడు. ధర్మజుని ఏకాంత మందిరంలో ప్రవేశించిన కారణంగా ప్రాయశ్చిత్తం కొరకు నియమానుసారం 12 సంవత్సరములు వనవాసం చేసి వచ్చినవాడు అర్జునుడు. కాని ఇప్పటి పరిస్థితి వేరు. తన స్వధర్మనిష్ఠకు మమకారం అడ్డు వచ్చింది.

ఐతే, శ్రీకృష్ణుడలా కాదు. స్వధర్మనిష్ఠ ఆయన స్వంతం. ధర్మరక్షణ కోసం, అధర్మాన్ని అణచటం కోసం అవతరించిన వాడు. ఆయనకు స్వజన వ్యామోహం లేదు. దుర్యోధనుడు స్వయానా వియ్యంకుడు. (దుర్యోధనుని కుమార్తె లక్ష్మణను శ్రీకృష్ణునికి జాంబవతి ద్వారా పుట్టిన సాంబుడు వివాహ మాడాడు) ; కర్ణుడు మేనత్త కుమారుడు, ఘటోత్కచుడు భీమసేన పుత్రుడు; అభిమన్యుడు తన మేనల్లుడు, స్వయానా చెల్లెలి కొడుకు; ద్రౌపదేయులు తన ఆత్మీయులైన ద్రౌపదీ పాండవుల పుత్రులు; శల్యుడు నకుల సహదేవుల మేనమామ; శకుని దుర్యోధనాదుల మేనమామ; శిశుపాలుడు తన మేనత్త కొడుకు; కంసుడు తన మేనమామ; జరాసంధుడు తన మేనమామకు మామ; భీష్ముడు తనకు పరమ భక్తుడు. చెప్పుకోవాలంటే వీరంతా శ్రీకృష్ణునికి స్వజనులే, బంధువులే. అయినా సరే స్వధర్మనిష్ఠ ముందు మమకారానికి తావులేదని నిరూపించాడు. స్వపక్ష పరపక్ష భేదం లేకుండా అధర్మాన్ని అణచి ధర్మాన్ని నిలబెట్టాడు. చివరకు తన

యదువంశ  నాశనాన్ని ఆపటానికి కూడా ఏ ప్రయత్నమూ చేయలేదు.

కాని అర్జునునిలో అంతటి స్వధర్మనిష్ఠ లేదు. మమకారానికి లొంగి పోయాడు. ఈ మమకారం అనే జబ్బు ప్రవేశిస్తే శరీరంలో అనేక మార్పులు వస్తాయి. ఈ మానసిక జబ్బుకు మనస్తత్వ శాస్త్ర గ్రంథాలలో ఒక పేరుంది. "Anxiety State Neurosis"- అంటే 'ఉన్మత్త ఆతురత అవస్థ' అని తెలుగులో చెప్పుకోవచ్చు. శరీరంలో వణుకు, గగుర్పాటు, నోరు ఎండిపోవటం, అవయవాలలో పటుత్వం తగ్గి నరముల బలహీనతతో వణకటం- ఈ జబ్బు యొక్క లక్షణాలు. ఈ లక్షణాలన్నింటిని (29వ శ్లోకంలో) అర్జునుడు చెప్పుకున్నాడు.

శరీరంలో కలిగిన మార్పుల వల్ల ఇంకా ఏఏ పరిణామాలు జరుగు తున్నాయో అర్జునుడు (30వ శ్లోకంలో) చెబుతున్నాడు. గాండీవం జారిపోతున్నది, చర్మం మండిపోతున్నది, నిలబడేందుకు ఓపిక లేదు, మనస్సు గిర్రున తిరుగుతున్నది- అని.

గాండీవాన్ని ఎక్కుపెట్టి, పళ్ళుకొరుకుతూ రథాన్ని ముందుకు పోనిమ్మని కోరిన అర్జునుడు, మమకార వ్యాధిపీడితుడై అవయవాలు పట్టుదప్పిపోవటంతో చేతిలో సత్తువ పోయి గాండీవం జారిపోతున్నది. చేతుల్లో శక్తే కాదు, కాళ్ళలో సత్తువ లేక నిలబడలేకపోతున్నాడు. జ్వరం వచ్చినప్పుడు నడవాలన్నా కష్టమే. ఏదన్నా వ్రాయాలంటే కలం పట్టుకున్నా చేయి వణుకు తుంది. ఇక చర్మం కూడా మండిపోతున్నది. అంటే Temperature  కూడా వచ్చింది, High Fever. దీనికంతటికీ కారణం మనోవ్యాధియే. ఆలోచించి ఆలోచించి మనస్సు గిర్రున తిరిగిపోతున్నది. మనోవ్యాధికి మందులేదంటారు పెద్దలు. ఆయుర్వేదంలోనో, అల్లోపతిలోనో, హోమియోపతిలోనో మందు లేకపోతే లేకపోవచ్చునేమో గాని మనోవ్యాధికి మందు గీతా శాస్త్రంలో ఉంది. ఆత్మజ్ఞానబోధ ఒక్కటే ఈ మనోవ్యాధికి తిరుగులేని మందు. ప్రపంచదేశాలన్నీ ఈ విషయాన్ని అంగీకరిస్తున్నాయి. అందుకే క్రమక్రమంగా ఆధ్యాత్మికత వైపుకు మళ్ళుతున్నాయి.

అర్జునుని వ్యాధి లక్షణాలను జాగ్రత్తగా వింటూ, వ్యాధి నిర్ధారణకు





వస్తున్నాడు డాక్టర్ శ్రీకృష్ణ M.D.M.D. (Master in Destroying Mental Disorders). ఇక్కడ రోగి కూడా అన్నీ దాచుకోకుండా చెప్పేస్తున్నాడు. ఇంతవరకు చెప్పిన బయటకు కనిపించే లక్షణాలే గాక మనస్సు గిర్రున తిరుగుతున్నదని లోపలి లక్షణాలను కూడా తెలియజేస్తున్నాడు. వ్యాధి నిర్ధారణ సరిగ్గా జరిగి, వ్యాధి నివారణ కావాలంటే రోగి తన బాధలనన్నింటినీ దాచకుండా చెప్పాలి. అందుకే శారీరక మానసిక మార్పులనే గాక, బుద్ధిలో జరిగే కలవరపాటును కూడా దాచకుండా చెబుతున్నాడు అర్జునుడు.

కేశవా! అనేక దుర్నిమిత్తాలు, అపశకునాలు కూడా కనిపిస్తున్నాయి అంటున్నాడు అర్జునుడు. స్వజనులు-స్వజనులు అని పలవరించటంతో మనస్సులో కలవరం అధికమౌతున్నది, క్షోభప్రారంభమైంది. దానితో ఆత్మవిశ్వాసం కూడా తొలగి పోతున్నది. దానితో పిరికితనం ప్రవేశించింది. ఎప్పుడైతే పిరికితనం ప్రవేశించిందో ఏదో ఘోరం జరిగిపోతుందని, ఏదో నష్టం కలుగుతుందని, అపజయం కలుగుతుందని భయం ప్రవేశిస్తుంది. దానితో అన్నీ దుశ్శకునాలు తోస్తాయి.

మనిషిలో పిరికితనం, భయం ప్రవేశిస్తే మూఢుడై పోతాడు. విచక్షణాజ్ఞానం నశిస్తుంది. విజయంపై ఆశపోయి దుశ్శకునాలు కనిపిస్తాయి. అందుకే అర్జునుడు "కేశవ! విపరీతాని నిమిత్తాని చ పశ్యామి"- కేశవా! అనర్థకరమైన దుశ్శకునాలను కూడా చూస్తున్నాను - అంటున్నాడు.

బుద్ధియొక్క సహాయం లేకుండా మనస్సు మాత్రమే పనిచేస్తుంటే మానసిక స్థితి ఇలాగే ఉంటుంది. మనస్సు చపలం, ఉద్రేకాలతో కూడి ఉంటుంది, కోతి లాంటిది. బుద్ధి విచక్షణతో కూడినది, మంచీచెడూ తెలిసినది. బుద్ధితో కూడిన మనస్సు చక్కగా పనిచేస్తుంది. కాని బుద్ధిని విడిచిన మనస్సు ఆధారం వదిలిన గాలిపటంలాంటిది. గాలికి ఎగిరిన పులివిస్తరాకు లాంటిది. ఎక్కడకు కొట్టుకొని పోతుందో- దేనికి చిక్కు కుంటుందోతెలియదు. ఇప్పుడు అర్జునుని మనోస్థితి అలాంటిదే.

అందుకే యుద్ధంలో స్వజనులను చంపితే శ్రేయస్సు ఏమి ఉన్నది? అంటున్నాడు. అంటే లాభనష్టాల బేరీజు వేస్తున్నాడు. అంటే శ్రేయస్సు లేని,

లాభం లేని పని ఎందుకు చేయాలి? అంటున్నాడు.

స్వధర్మనిష్ఠుడైన వాడికి తన ధర్మాన్ని తాను పాలించటమే శ్రేయస్సు. అందులో నాకేం లాభం అని చూడకూడదు. లాభం కనిపిస్తేనే శ్రేయస్సు కాదు. ఎందుకంటే శ్రేయస్సు అనేది దృష్టం-అదృష్టం అని రెండు రకాలు.

1) **దృష్టం:కనిపించేది:** ధనసంపాదన, రాజ్యసంపాదన, సుఖభోగాలు, పదవీ, కీర్తి ఇలా కనిపించేవి కొన్ని.

2) **అదృష్టం:కనిపించనిది:** స్వర్గలోక భోగాలు, మరుజన్మలలో లభించే సుఖాలు- ఇలా కనిపించనివి కొన్ని.

కనుక శ్రేయస్సు-లాభం-ప్రయోజనం ఉన్నదా?లేదా? అని చూడకుండా స్వధర్మాన్ని పాలించటమే నిజమైన శ్రేయస్సని గ్రహించాలి.

ఈ శ్లోకంలో శ్రీకృష్ణుని కేశవా! అని సంబోధిస్తున్నాడు. కేశవా! అంటే కేశి అనే రాక్షసుని చంపినవాడా! అని. కేశిని చంపినట్లే నా శోకాన్ని కూడా అంతం చేసి నాకు సదానందాన్ని కలిగించవయ్యా! అని సమన్వయం.

తన శోకంవల్ల తనలో ఎంతటి వైరాగ్యం కలుగుతున్నదో చెప్పబోతున్నాడు అర్జునుడు.

**శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖానిచ।**
**కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా॥ 32**

**శ్లో॥ యేషా మర్థే కాంక్షితం నః రాజ్యం భోగాస్సుఖానిచ।**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వాధనానిచ॥ 33**

**శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చ పితామహాః।**
**మాతులాశ్శ్వశురాః పౌత్రాః శ్యాలాస్సంబంధినస్తథా॥ 34**

**శ్లో॥ ఏతాన్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।**
**అపిత్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥ 35**

**తా॥** కృష్ణా! నేను విజయాన్ని కోరను, రాజ్యాన్ని గాని, సుఖాలు గాని కోరను. గోవిందా! రాజ్యంవల్ల గాని, భోగాల వల్ల గాని, బ్రతకటం వల్ల గాని మనకు ఏం ప్రయోజనం? (32)

**తా॥** ఎవరికోసమైతే మనం రాజ్యాన్ని, సుఖాలను, భోగాలను





కోరుకుంటున్నామో అట్టి గురువులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావమరుదులు, వియ్యంకులు అంతా ప్రాణాలను, ధనాన్ని విడిచి ఇక్కడ యుద్ధానికి నిలబడి ఉన్నారు. (33) (34)

**తా॥** మధుసూదనా! వారు నన్ను చంపినా, త్రిలోక రాజ్యాధి పత్యానికైనా సరే నేను వారిని చంపటానికి ఇష్టపడను. ఇక భూలోక రాజ్యం సంగతి దేనికి? (35)

**వ్యాఖ్య:** "న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖానిచ" కృష్ణా! నాకు రాజ్యం వద్దు, సుఖాలు వద్దు, విజయాన్నీ కోరను- అంటున్నాడిప్పుడు అర్జునుడు. ఇదొకరకమైన తాత్కాలిక వైరాగ్యం. అసలు ఇంతకాలం నుండి ఆలోచనలు చేసింది ఈ యుద్ధం గురించి కాదా? అరణ్యవాస కాలంలో 5 సం॥ల పాటు అస్త్రసంపాదన కొరకు సోదరులను వదిలి వెళ్ళింది ఈ యుద్ధం గురించి కాదా? యుద్ధంలో విజయాన్ని సాధించటానికి కాదా? అసలు ఇప్పుడు కురుక్షేత్ర యుద్ధ భూమిలో ప్రవేశించింది యుద్ధం చేయటానికి కాదా? యుద్ధంలో విజయం సాధిస్తే రాజ్యం వస్తుందని కాదా? రాజ్యం చేతికొస్తే సుఖాలు, భోగాలు వస్తాయని కాదా? అయితే ఇప్పుడేమిటి ఈ వైరాగ్యం? ఈ వైరాగ్యం ఆత్మజ్ఞానం వల్ల వచ్చిన నిజమైన వైరాగ్యం కాదు. ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశాన వైరాగ్యంలాగా మమకారమనే జబ్బు వల్ల వచ్చిన తాత్కాలిక వైరాగ్యం మాత్రమే. అందుకే రాజ్యం వద్దు, సుఖాలు వద్దు, భోగాలు వద్దు అంటున్నాడు.

ఒక సైకియాట్రిస్ట్ నడిగితే ఈ లక్షణాన్ని బాగా విశ్లేషించి చెప్పగలుగుతాడు. మతిచలించినవాడు తనకేది కావాలో అది తనకు అక్కరలేదంటాడు. ఏది లేక మతి చలించిందో అది తన దగ్గర పుష్కలంగా ఉన్నట్లు మాట్లాడతాడు. ఉన్న డబ్బంతా ఒక్కసారిగా పోయినవాడు కటికపేదరికంలో ఉండాల్సి వచ్చినపుడు మతి చలిస్తే చిత్తుకాగితాలను పోగేసి డబ్బుగా లెక్కబెడుతుంటాడు. వేలు, లక్షలు కనిపించినవాడినల్లా తీసుకోమంటాడు. భర్త నిరాదరణకు గురైన భార్య మతి చలిస్తే 'మా వారికి నేనంటే ఎంతో ప్రేమ, మా మధ్య ఎప్పుడూ గొడవలే రావు' అని అందరికీ చెబుతుంది. ఇప్పుడు అర్జునుని పరిస్థితి కూడా దాదాపుగా

ఇంతే. వచ్చింది తమ రాజ్యాన్ని యుద్ధంలో జయించి తీసుకోవాలనే. కాని మమకారం మోహాన్ని కలిగించింది. ఆ మోహంలో ఇవేవీ నాకు వద్దు, వీటితో ఏం ప్రయోజనం? అంటున్నాడు.

ఐతే ఈ యుద్ధం నిజంగా రాజ్యంకోసం, భోగాల కోసమే అయితే భగవానుని దృష్టిలో ఇది తప్పవుతుంది. ఎందుకంటే ఇలా రాజ్యం కోసమే యుద్ధమైతే అది కర్మ అవుతుందే గాని కర్మయోగం కాదు. ఫలితంపై ఆసక్తి లేకుండా, ఏమి జరుగు తుందో అనే బెంగ లేకుండా, తన కర్తవ్యాన్ని నిర్వర్తించటమే కర్మయోగం. ఆ దృష్టి ఇప్పుడు అర్జునునికి లేదు. అందుకే ఇంకా తన విషాదానికి కారణాలు వినిపిస్తున్నాడు.

రాజ్యాన్ని, సుఖాలను ఎందుకు వద్దనుకుంటున్నాడో మరో కోణంలో కారణాన్ని చెబుతున్నాడు. అసలు ఈ రాజ్యం గాని, సుఖాలు గాని, భోగాలు గాని ఎవరికోసం? తన అన్నదమ్ములు, తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, తాతలు, మనుమలు, గురువులు, బంధుమిత్రులు మొ॥న వారి కోసం గదా! ఐతే యుద్ధంలో విజయం సాధించి రాజ్యాన్ని పొందిన తర్వాత, ఈ రాజ్య భోగాలు సుఖాలు అనుభవించాల్సిన తండ్రులు, తాతలు, పుత్రులు, మనుమళ్ళు, ఆచార్యులు, ఇతర బంధుమిత్రులు అందరూ ప్రాణాలకు తెగించి ఈ యుద్ధరంగంలో నిలబడ్డారే! వారంతా యుద్ధంలో ప్రాణాలు వదిలితే ఇక ఎవరు అనుభవించ టానికి ఈ రాజ్యం గాని, భోగాలు గాని? చాలా తెలివిగా వాదిస్తున్నానని భావించాడు అర్జునుడు. తాను ఇంత గట్టిగా వాదిస్తున్నా శ్రీకృష్ణుడు మాత్రం మౌనంగానే ఉన్నాడు. ఎందుకంటే శ్రీకృష్ణుని దృష్టిలో స్వధర్మ నిర్వహణ మాత్రమే ఉన్నది. లాభమైనా, నష్టమైనా, విజయమైనా, అపజయమైనా, ప్రాణాలు వదిలేది తమ వారైనా, శతృపక్షం వారైనా అవేవీ పట్టించుకోనక్కరలేదు. ఎవరో చస్తారని తన స్వధర్మాన్ని విడిచిపెట్టరాదు. యుద్ధం క్షత్రియునికి స్వధర్మం. పైగా ఈ యుద్ధాన్ని పాండవులు కోరి తెచ్చుకున్నది కాదు. యుద్ధాన్ని నివారించటానికి చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. చివరకు శ్రీకృష్ణునే రాయబారిగా పంపారు. ఐనా అనివార్యంగా వచ్చిపడింది ఈ యుద్ధం. అందుకే యుద్ధమనే ఈ స్వధర్మ కర్మను తప్పక చేయాలి అర్జునుడు. ఇదే భగవానుని ఆంతర్యం. అందుకే అర్జునుడు తన స్వధర్మాన్ని విడిచిపెట్టడానికి చెప్పే సాకులనన్నింటిని చిరునవ్వుతో మౌనంగా వింటున్నాడు. అర్జునునికేమో శ్రీకృష్ణుని





మౌనం, చిరునవ్వు ఉక్రోషం కలిగిస్తున్నది. అందుకే ఇక ఇలా కాదు చాలా గట్టిగా తన నిశ్చయాన్ని చెప్పాలనుకున్నాడు. ఇక శ్రీకృష్ణుడు తన మాటలను తేలికగా కొట్టి పారేయటానికి వీలు లేకుండా బల్లగుద్ది చెప్పాలనుకున్నాడు.

"మధుసూదనా! విను నా ప్రతిజ్ఞ. నన్ను వాళ్ళు చంపినా సరే, త్రిలోకాధిపత్యం లభిస్తుందన్నా సరే, నేను మాత్రం వాళ్ళను చంపను గాక చంపను; అలాంటిది ఈ భూలోక రాజ్యం నాకొక లెక్కా?" అని తేల్చి చెప్పాడు అర్జునుడు. ఇంత గట్టిగా అర్జునుడు చెబుతున్నా శ్రీకృష్ణుడు మాత్రం చిరునవ్వులు చిందిస్తూ మౌనంగానే ఉన్నాడు.

ఏడు అక్షౌహిణుల సేనను సమకూర్చుకొని ఇంతదూరం వచ్చింది దేనికోసం? త్రిలోకాధిపత్యం కోసం కాదు. భూలోక రాజ్యంలోని దుర్యోధనుని అధీనంలో ఉన్న తమ రాజ్యభాగం కోసమే. అయితే ఇప్పుడు మాత్రం త్రిలోకాధిపత్యం కూడా అక్కరలేదంటున్నాడు అర్జునుడు. దీనితో అర్జునుని భావం ఏమిటో అర్థమైంది శ్రీకృష్ణునికి. రాజ్యం కన్నా, సుఖభోగాల కన్నా ఆత్మీయులైన తమ వారి ప్రాణాలే మిన్న; కనుకనే ఇంత గట్టిగా, వైరాగ్యంగా మాట్లాడుతున్నాడు అర్జునుడు. వాళ్ళు నన్ను చంపినా, నేను వారిని చంపనంటున్నాడు. అర్జునుడు నిశ్చయంగా, దృఢంగా చెబుతున్నాడీ మాటలను. అంటే వైరాగ్యం వచ్చినట్లే. 'ఒక చెంపపై కొడితే రెండో చెంప చూపించమన్న గాంధీజీ–ఏసుక్రీస్తు మాటలే ఐనా' శ్రీకృష్ణుడు ఇంకా మౌనంగానే ఉన్నాడు. ఎందుకంటే అర్జునుని అహింసావాదం అజ్ఞానం మీద ఆధారపడి ఉన్నది. అంతే కాదు వైరాగ్యం వచ్చినా శిష్యభావం రాలేదు. పెద్ద మొనగాడిలా మాట్లాడుతున్నాడు. కనుక వైరాగ్యంతో బాటు శిష్యభావం కూడా వచ్చేదాకా ఆగాలనుకున్నాడు శ్రీకృష్ణుడు. శిష్యభావం లేని వానికి జ్ఞానబోధ తలకెక్కదు. అందుకే అర్జునుని వాక్ప్రవాహానికి అడ్డుకట్ట వేయకుండా మౌనంగానే ఉన్నాడు. ఈ మౌనం అర్జునునికి చిర్రెత్తుకొస్తున్నది. 'ఇంకా ఎలా చెబితే ఈయన నా భావాలను అర్థం చేసుకుంటాడు?' అని ఆలోచించి, ఇక నచ్చ జెప్పే పద్ధతిలో మాట్లాడాలని అనుకుంటున్నాడు. మరి ఇప్పుడు ఏమని చెప్పబోతున్నాడు?

**శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతిః స్యాజ్జనార్దన।**
**పాపమే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయనః ॥ 36**

**శ్లో॥ తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।**

స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ॥ 37

**తా॥** జనార్దనా! ఈ ధృతరాష్ట్ర పుత్రులను చంపటం వల్ల మనకు ఏమి సంతోషం కలుగుతుంది? ఆతతాయినులైన వీరిని చంపటం వల్ల మనకు పాపమే గదా!

**తా॥** అందువల్ల మన బంధువులైన ఈ ధార్తరాష్ట్రులను చంపదగదు. మాధవా! మన బంధువులైన వారిని చంపుకోవటం వల్ల మనం ఎలా సుఖపడగలం?

**వ్యాఖ్య:** ఎంత గట్టిగా చెప్పినా శ్రీకృష్ణునికి పరిహాసంగా ఉన్నట్లుంది. కనుక ఇలా కాదు. తెలియని పసిపిల్లలకు నచ్చ చెప్పినట్లుగా చెప్పి చూద్దాం అనుకొని తన యుద్ధ విముఖతకు కారణాన్ని మరోకోణంలో నుండి వివరించ బోతున్నాడు.

ధార్తరాష్ట్రులు ఎన్నో దుర్మార్గాలు చేసినవారు, తమకు ఎన్నో అపకారాలు చేసినవారు, తమ ప్రాణాలు తీయాలని ప్రయత్నించిన వారు, తమను ఎంతగానో అవమానించినవారు, తమ రాజ్యాన్ని నియమం ప్రకారం తిరిగి ఇవ్వాల్సి ఉండగా ఇవ్వకుండా యుద్ధానికి సిద్ధమై వచ్చినవారు. అట్టి దుర్మార్గులను చంపవలసిందేనని శాస్త్రాలు చెబుతున్నాయి. అయినప్పటికీ 'నేను వారిని చంపను' అని అంటున్నందుకే బహుశా శ్రీకృష్ణుడు నవ్వుతూ ఉండవచ్చు. నా మాటలను తేలికగా కొట్టి పారవేస్తూ ఉండవచ్చు. కనుక నేను నా వాదాన్ని సరిగ్గా వినిపించాలి– అని భావించిన అర్జునుడు దుర్మార్గులైనా సరే ఎందుకు చంపరాదో తెలియజేయబోతున్నాడు.

జనార్దనా! ధార్తరాష్ట్రులు దుర్మార్గులే. అలాంటి వారిని ఆతతాయినులు అంటారు. ఆతతాయినులంటే 1) కొంపలకు నిప్పు పెట్టేవారు, 2) విషప్రయోగం చేసేవారు, 3) ధనాన్ని అపహరించేవారు 4) భూమిని కాజేసేవారు, 5) పరస్త్రీలను అవమానించేవారు, అపహరించేవారు, 6) ఆయుధాలు ధరించి చంపటానికి పైకి వచ్చేవారు. మరి ధార్తరాష్ట్రులు ఈ పనులన్నీ చేసిన పరమ దుర్మార్గులు. 1) లక్క ఇంటికి నిప్పుబెట్టి పాండవులందరినీ అంతం చేయాలనుకున్నారు. 2) భీముడికి విషం కలిపిన అన్నం తినిపించారు. 3) పాండవుల యొక్క ధన సంపదలన్నీ మాయాజూదంతో హరించారు. 4) పాండవుల రాజ్యాన్ని అరణ్య అజ్ఞాతవాసాలు పూర్తి చేసి వచ్చేంతవరకు తమ





ఆధీనంలో ఉంచుకొని, వారు తిరిగి రాగానే ఇవ్వాలి– అనే ద్యూత నియమాన్ని ఉల్లంఘించి, వారి రాజ్యాన్ని వారి కిచ్చేందుకు తిరస్కరించారు. 5) పాండవుల భార్య ద్రౌపదిని నిండు సభలోనికి ఈడ్చుకొని వచ్చి ఘోరాతి ఘోరంగా అవమానించారు. 6) ఉత్తర గోగ్రహణ సమయంలోను, ఇప్పుడీ యుద్ధంలోను ఆయుధాలతో వచ్చారు. కనుక ధార్తరాష్ట్రులు ఆతతాయినులే. బహుశా ఈ పదంనుండే అల్లరి చిల్లరి పనులు చేసే కుర్రవాళ్ళను ఆకతాయిలు అనటం జరిగిందేమో! కనుక ధార్తరాష్ట్రులు దుర్మార్గులు అనటంలో సందేహం లేదు. అయినా సరే, ఇట్టి వారిని చంపటం పాపమే గదా! అంటున్నాడు అర్జునుడు.

బురద మీద రాయివేస్తే మన ముఖంపైనే చిందులు పడతాయి. దుష్టుడికి దూరంగా ఉండాలని పెద్దలు చెబుతారు గదా! అవతలివాడు పాపం చేశాడని మనం కూడా పాపం చేస్తామా? అందువల్ల వాడిపాపాన వాడే పోతాడు, క్షమించి వదిలేద్దాం అనే క్షమాగుణంతో ఇలా మాట్లాడుతున్నాను. అదీ గాక పాపపు పనులు చేస్తే పాపవాసనలు చేరుకుంటాయి. అవి తిరిగి మనను పాపపు పనులకు ప్రోత్సహిస్తాయి. కనుక మనం ఎందుకు అనవసరంగా ఈ పాపమనే బురదను అంటించు కోవాలి? అందుకే ఇలా మాట్లాడాను. నేనేం పిచ్చి వాణ్ణి కాదు. ఎంత లోతుగా ఆలోచించానో తెలుసా? అన్నట్లుగా చూచాడు శ్రీకృష్ణునివైపు. ఇక కృష్ణుడు నోరెత్తలేదు, నా మార్గానికి రావాల్సిందే– అని ఒక్క చూపు చూశాడు. అయినా శ్రీకృష్ణుడు మాత్రం అదే చిరునవ్వు. అదే మౌనం. రాక్షసుని కథ చెబుతున్న తాతయ్యతో, “నేనారాక్షసుణ్ణి నా పెన్సిల్‌తో పొడిచి చంపేస్తాన”ని అంటున్న 5 ఏళ్ళ మనవడిని, ఆ తాతయ్య చిరునవ్వుతో చూచినట్లు శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి చూస్తున్నాడు. ఇంతకీ ఏమిటి శ్రీకృష్ణుని ఉద్దేశం? ఎందుకు అర్జునుని చూచి నవ్వుతున్నట్లు?

1. ధర్మాన్ని నిలబెట్టుటకై అధర్మాన్ని అణచాలనే బాధ్యత నుండి తప్పుకుంటున్నందుకు. 2. అధర్మపరులను శిక్షించే విషయంలో మమకారానికి లొంగుతున్నందుకు. 3. క్షత్రియునికి స్వధర్మమైన యుద్ధం చేసి శతృవులను చంపితే పాపం వస్తుందన్నందుకు. 4. స్వధర్మనిష్ఠ నుండి జారిపోతున్నందుకు. అందుకే చిరునవ్వు, మౌనం.

శ్రీకృష్ణుడలా మౌనంగా ఉండేటప్పటికి అర్జునుడు తన వాదాన్ని ఇంకా బాగా సమర్థించుకొని, తనదే సరియైన నిర్ణయమని శ్రీకృష్ణునిచే రాజముద్ర

వేయించుకోవాలను కుంటున్నాడు. దానికై ఇప్పుడు 'ఒప్పుకోవయ్యా నా మాట' అని బ్రతిమాలుకొనే ధోరణిలో మాట్లాడి చూద్దామనుకున్నాడు.

"మాధవా! మన బంధువులను మనం చంపుకుంటే మనకు ఏం సుఖం? అందుకని స్వబాంధవులైన వారిని, స్వజనులైన వారిని చంపదగదు గదా!" అన్నాడు.

సుఖం అనేది రెండు రకాలు. 1. ఇహలోక సుఖం. 2. పరలోక సుఖం. మనం బంధువులను, ఆత్మీయులను, మిత్రులను చంపుకుంటే, వారి తల్లిదండ్రులు గాని, భార్యాబిడ్డలు గాని ఆక్రోశిస్తూ మనకు శాపనార్థాలు పెడతారు. కనిపించినప్పుడల్లా తిడతారు. ఎదురుగా వచ్చి పెద్దగా తిట్టక పోయినా "ఈ పాపాత్ముడి వల్లనే నేను భర్తను కోల్పోయాను, బిడ్డను కోల్పోయాను" అని లోలోపల తిట్టుకుంటూ అసహ్యించు కుంటారు. ఆ తిట్లు, శాపనార్థాలు తింటూ ఏం సుఖపడతాం. కనుక ఇహలోక సుఖం లేదు.

పోనీ ఇహలోక సుఖం లేకపోతే పోయింది, పరలోక సుఖమైనా లభిస్తుందా? ఇంతమందిని నిర్దాక్షిణ్యంగా చంపిన తర్వాత అందులో దుర్మార్గులతో బాటు ఎందరో మంచి వారు కూడా ఉండొచ్చు. ఈ పాపం స్వర్గసుఖాలను కూడా దూరం చేస్తుంది. భూలోకంలో పుణ్యకర్మలు ఆచరించిన వారికి స్వర్గ ప్రవేశం ఉంటుంది. అక్కడి స్వర్గభోగాలు అనుభవంలోనికి వస్తాయి. కాని ఇందరిని చంపి పాపం చేసిన వాడికి అంతా నరకమే గాని స్వర్గభోగాలెక్కడ? కనుక మాకు ఉభయభ్రష్టత్వమే గదా! మాధవా! మమ్ము ఎందుకయ్యా ఇలాంటి క్రూర కర్మకు ప్రోత్సహిస్తావు. ఇక్కడ మాధవా! అనే సంబోధనలో ఒక ఎత్తి పొడుపు కూడా ఉంది. 'మా' అంటే లక్ష్మీదేవి, 'ధవుడు' అంటే భర్త. మాధవ అంటే లక్ష్మీపతి అని. లక్ష్మి అంటే శుభప్రదమైనది, మంగళప్రదమైనది. నీవేమో మంగళస్వరూపుడవు. నన్నేమో అమంగళమైన పనికి ప్రోత్సహిస్తున్నావు. నీకిది న్యాయమా? అనే ఎత్తిపొడుపూ ఉంది, దీనాలాపనా ఉంది.

శ్రీకృష్ణుని వద్ద ఇలా మాట్లాడటానికి కావలసిన చనువు అర్జునుడి కున్నది. ఇద్దరూ సమవయస్కులు, బంధువులు, ఆత్మీయులు, బావా బావమరుదులు, వీరులు. ఒకే కంచంలో తిని ఒకే మంచంపై పరుండే స్వతంత్రం ఉంది. ఒకరినొకరు హాస్యమాడుకొనే చనువుంది, స్నేహముంది. అందుకే అర్జునుడిలా మాట్లాడగలుగుతున్నాడు. తన వాదన నెలాగైనా ముగించాలి గనుక ఎన్నోరకాలుగా





సమర్థించజూచి చివరకు కాళ్ళబేరాని కొచ్చాడు.

ఈ శ్లోకంలో కూడా స్వజనం అనే పదం వచ్చింది. ఇప్పటి వరకు 28, 31శ్లోకాల్లో కూడా స్వజనం-స్వజనం అని ఇప్పుడు 37వ శ్లోకంలో కూడా స్వజనం అంటున్నాడు. ఇలా వెంట వెంటనే స్వజనం అనే పదం 3 సార్లు రావటం వల్ల అర్జునునిలో మమకారమనే జబ్బు ఎంతగా ముదిరిపోయిందో మనకర్థ మౌతుంది.

అయితే అర్జునుడిలా కాళ్ళబేరానికొచ్చినా సరే శ్రీకృష్ణుడు మాత్రం మౌనం వీడలేదు. పండు పక్వానికి వస్తే గాని తినటానికి పనికిరాదు. అర్జునునిలో ఉన్న అజ్ఞానమంతా (కల్మషమంతా) బయటపడాలి. లోపలి మనోబుద్ధులు శుద్ధిపడాలి. నేనే వీరందరిని చంపేవాడిననే అహంకారం (దేహమే నేను అనే దేహాత్మభావం) పోవాలి. అహంకారం పోవాలంటే అజ్ఞానం పోవాలి. అజ్ఞానం పోవాలంటే జ్ఞానం-ఆత్మజ్ఞానం (నేను ఆత్మను అనే నిశ్చయజ్ఞానం) కలగాలి. అట్టి ఆత్మజ్ఞానాన్ని అందు కోవాలంటే విషాదం కలగటంతో బాటు శిష్యభావం కలగాలి. అందుకే ఎదురు చూస్తున్నాడు శ్రీకృష్ణుడు. ఇంకెంత సేపు? ఇంక కొద్దిసేపట్లోనే తన అజ్ఞానాన్ని ప్రదర్శించటానికి అర్జునునికి ఇక సాకులు దొరకవు. చేసేదేమిలేక శరణాగతి కోరుకుంటాడు. అదిగో! ఆ సమయం వచ్చే వరకు తాను నోరు విప్పకూడదు అనుకున్నాడు శ్రీకృష్ణుడు. అందుకే మౌనంగా ఉన్నాడు. అదే చిరునవ్వుతో "కానియ్, కానియ్! ఇంకా ఏం కక్కుతావో కక్కు అంటున్నట్లు"గ చూచాడు అర్జునుని. దానితో అర్జునుడిప్పుడొక నిశ్చయానికి వచ్చాడు. ఇక యుద్ధం వల్ల జరిగే అనర్థాలన్నింటిని ఏకరువు పెట్టి తన చివరి అస్త్రాన్ని ప్రయోగించాలనుకున్నాడు. ఏమిటా అనర్థాలు?

**శ్లో॥ యద్యప్యేతేన పశ్యంతి లోభోపహత చేతసః**
**కులక్షయ కృతం దోషం మిత్రద్రోహేచ పాతకం॥ 38**

**శ్లో॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్నివర్తితుం।**
**కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥ 39**

**తా॥** రాజ్యంపై గల లోభంచేత తెలివితప్పి ప్రవర్తించే ఈ దుర్యోధనాదులు కులక్షయం వల్ల కలిగే దోషాలను, మిత్రద్రోహం వల్ల కలిగే పాపాన్ని తెలుసుకోలేకపోయినప్పటికీ ఓ జనార్దనా! కులక్షయం వల్ల కలిగే దోషాలు

తెలిసిన మనం ఈ పాపం నుండి ఎందుకు తొలగకూడదు?

**వ్యాఖ్య:** ఈ యుద్ధం జరిగితే కలిగే అనర్థాలేమిటో తెలియజెప్పి, ఎలాగైనా తన వాదనను సమర్థించుకోవాలను కుంటున్నాడు అర్జునుడు. సమాజంలో అధర్మం పెరిగి పోతున్నప్పుడు మంచివారికి విషాదం కలుగుతుంది. ఎందుకంటే సమాజంలో మంచివాళ్ళూ ఉంటారు, చెడ్డవాళ్ళూ ఉంటారు. ధర్మాత్ములూ ఉంటారు, దురాత్ములూ ఉంటారు. ఈ చెడ్డవాళ్ళు, అధర్మపరులు, స్వార్థపరులవల్ల; వారు చేసే దుర్మార్గాలు, స్వార్థపూరిత కర్మల వల్ల మంచివారికీ, సమాజానికీ ఎంతో కీడు జరుగుతుంది. హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వల్ల, రావణుని వల్ల, ఇంకా ఎందరో రాక్షసులవల్ల సాధువులు, సత్పురుషులు ఎందరో పీడించబడ్డారు, హింసించబడ్డారు. ఇది ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఇది తెలిసిన ధర్మాత్ములు, సాధుపురుషులు వారితో పోటీపడకూడదు, సహనం వహించాలి. అలా సహనం వహించకపోతే ఇంకా ఇంకా చెడు జరుగుతుంది.

ఇక్కడ దుర్యోధనాదులు దుర్మార్గులు, అకృత్యాలు ఎన్నో చేసినవారు. తమది కాని రాజ్యాన్ని తాము పొందాలనే దురాశతో, లోభబుద్ధితో భీమసేనుని చంపేందుకు ప్రయత్నించారు. వారణావతంలో మా అందరినీ లక్క ఇంట తగులబెట్టాలని చూచారు, మాయాజూదాన్ని కల్పించి మా రాజ్యాన్ని హరించారు; నిండు సభలో ద్రౌపదిని ఘోరంగా అవమానించారు; ఘోషయాత్రా నెపంతో అరణ్యాలలో ఉన్న మమ్ములను అవమానించ వచ్చారు; ఇప్పుడు యుద్ధం వల్ల ఎంత నష్టం జరుగుతుందో అనే ఆలోచన కూడా లేకుండా యుద్ధానికి సిద్ధపడివచ్చారు.

యుద్ధం వల్ల జరిగే కులక్షయం కారణంగా ఎంత అనర్థం జరుగుతుందో, మిత్రద్రోహం కారణంగా ఎంత పాపం మూటగట్టుకోవాలో అనే పాపభీతి లేకుండా యుద్ధానికి సిద్ధమయ్యారు. వారలా సిద్ధపడితే సిద్ధపడవచ్చు. కాని యుద్ధం వల్ల ఎన్ని అనర్థాలు జరుగుతాయో, ఎంతటి కులక్షయం జరుగుతుందో, దాని కారణంగా సమాజం ఎంతగా చెడిపోతుందో తెలిసినవాణ్ణి నేను. మరి తెలియనివాళ్ళూ తప్పుచేసి, తెలిసినవాళ్ళూ తప్పుచేస్తే ఎలా?

మురికిబట్టలు వేసుకున్నవాడు మట్టిలో ఎంతగా పొర్లాడినా పరవాలేదు. కాని స్వచ్ఛమైన తెల్లటి బట్టలు వేసుకున్నవాడు ఎంత జాగ్రత్తగా ఉండాలి? ఇపుడు రాజ్యంపై లోభంతో, ఎన్నో దుర్మార్గాలు చేసిన దురాత్ముడైన దుర్యోధనుడు





భోగాలన్నీ తానే అనుభవించాలనే దురాశతో ఘోరమైన యుద్ధానికి సిద్ధపడుతున్నాడు. మరి మేముకూడా మా రాజ్యాన్ని మేము తిరిగి పొందాలనే కోరికతోనే ఇక్కడిదాకా వచ్చాం. నిజమే, అయితే ఈ యుద్ధం వల్ల జరిగే నష్టంతో పోల్చి చూచినప్పుడు మా రాజ్యం మాకు రాకపోయినా సరే – అని వదిలేసి వెళ్ళిపోవటం మంచిదికాదా? రాజ్యసంపాదన వల్ల మాకు సుఖాలు, భోగాలు కలగవచ్చు. కాని సమాజానికి ఎంత నష్టం? సమాజం కోసం – సమాజశ్రేయస్సు కోసం తమ శ్రేయస్సును బలిపెట్టటం సత్పురుషుల లక్షణం కాదా? అది గొప్ప త్యాగం కాదా? మన సుఖం కోసం సమాజశ్రేయస్సును బలిపెట్టడం న్యాయమా? ధర్మమా?

కనుక వాసుదేవా! కులక్షయం జరిగితే ఎంతటి అనర్థం జరుగుతుందో, మిత్రద్రోహం వల్ల ఎంతటి పాపమో తెలియని దుర్యోధనాదులు యుద్ధానికి సిద్ధపడితే పడనీ; కాని అన్నీ తెలిసిన నేను మాత్రం ఈ యుద్ధాన్ని చేయలేను అని అహింసా వాదాన్ని ముందుకు తెచ్చాడు అర్జునుడు.

అంతేకాదు కులక్షయం వల్ల దోషం దోషం అంటున్నావు, ఏమిటా దోషం అంటావా? విను ఎంత దోషమో, ఎంత పాపమో నీకే తెలుస్తుంది అని కులక్షయం వల్ల దోషాలను ఏకరువు పెట్టబోతున్నాడు అర్జునుడు.

**శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః ।**
**ధర్మే నష్టే కులం కృత్స్నం అధర్మోభి భవత్యుత॥ 40**

**శ్లో॥ అధర్మాభి భవాత్ కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః॥ 41**

**శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।**
**పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః ॥ 42**

**తా॥** ఓ కృష్ణా! కులక్షయం వల్ల సనాతనమైన కులధర్మాలు నశిస్తాయి. ధర్మం నశించినప్పుడు కులం మొత్తం అధర్మం వైపు తిరుగుతుంది. అధర్మం వ్యాపించినపుడు కులస్త్రీలు చెడిపోతారు. వార్ష్ణేయా! కులస్త్రీలు చెడిపోతే వర్ణసంకరం ఏర్పడుతుంది. ఈ వర్ణసాంకర్యం వల్ల కులానికి నరకమే. కులాన్ని నాశనం చేసినవారికీ నరకమే. అంతేకాదు వీరి పితరులు కూడా పిండోదక క్రియలు లేక నరకంలో పడిపోతారు.

**వ్యాఖ్య:** "కృష్ణా! కులక్షయం వల్ల కులధర్మాలు నశిస్తాయి. ధర్మం నశిస్తే

కులమంతా అధర్మం పాలైపోతుంది.” అంటున్నాడు అర్జునుడు.

అసలు కులక్షయం అంటే ఏమిటి? మహాభారతయుద్ధంలో రెండు పక్షాలలోను కలిసి 18 అక్షౌహిణుల సేన ఉన్నది. ఇందులో 20సం॥ల మొదలు 70సం॥ల వయస్సు గలవారంతా యువకులే. (ఆనాటి మానవుల ఆయుః ప్రమాణం 200 సం॥లు కనుక 70 సంవత్సరముల వయస్సు వారు యువకులే) వారంతా సుమారు 40 లక్షలమంది ఉంటారు. ఇక వృద్ధులైన వారు 18 లక్షలమంది. వీరుగాక అనేకమంది గజసేవకులు, రథసేవకులు, అశ్వసేవకులు, ఆయుధాలందించేవారు, యుద్ధ వాయిద్యాలు మ్రోగించేవారు సుమారు 40 లక్షల మందివరకు ఉంటారు. ఇందరు ఈ యుద్ధం కారణంగా మరణిస్తారు. ఇలా కులంలోని పురుషులంతా మరణిస్తే కులం నశించినట్లే. అదే కులక్షయం. ఈ కులక్షయం వల్ల కులధర్మాలు నశిస్తాయి- అంటున్నాడు అర్జునుడు.

ఈ కులధర్మాలు 2 రకాలు.

(1) మనం ఎలా ప్రవర్తించాలో, ఎలా నడుచుకోవాలో, ఎలాంటి పనులు చేయాలో, ఎలాంటి పనులు చేయకూడదో ధర్మశాస్త్రాలు – స్మృతులు బోధిస్తాయి. ఇలా శాస్త్రాలలో బోధించబడ్డ ధర్మాలు ఒకరకం.

(2) చాలామంది లోకంలో శాస్త్రాలను చదవరు. తెలుసుకోరు. అలా తెలుసుకునే ఓపిక, తీరిక ఉండదు. తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండదు. కనుక సామాజికంగా కొన్ని కట్టుబాట్లను ఏర్పాటుచేసుకుంటారు. ఈ కట్టుబాట్లను కుల పెద్దలు కట్టుదిట్టంగా అమలుపరుస్తూ ఉంటారు. కులంలో ఎవరైనా కట్టుబాట్లను మీరి ప్రవర్తిస్తే, ఏదైనా తప్పు చేస్తే ఆ కులపెద్దలే తగిన శిక్షలు విధించి, వారే అమలుచేస్తారు. ఈ విధంగా కులపెద్దలు అమలుపరిచే కట్టుబాట్లు రెండవరకం ధర్మాలు. ఇవే అర్జునుడు చెప్పే కులధర్మాలు. ఈ కులధర్మాలే కులక్షయం వల్ల నశించిపోతాయని అంటున్నది.

ఈ కుల కట్టుబాట్లను (కులధర్మాలను) అమలుపరిచే పెద్దలు మరణిస్తే ఆ స్థానాన్ని పూరించే యువకులు కూడా ఈ యుద్ధం వల్ల మరణిస్తే, ఇక ఎవరికి వారు కట్టు తెంచుకున్న గొడ్డులాగా స్వేచ్ఛగా విహరిస్తారు. అందువల్ల కులధర్మాలు నశిస్తాయి అంటున్నాడు అర్జునుడు. ఇలా కులధర్మాలు నశిస్తే కులంలోని అందరూ అధర్మం వైపుకే తిరుగుతారు. మరి కులం అంతా అధర్మం వైపుకు తిరిగితే ఏమవుతుంది? కులం అధర్మం వైపుకు తిరిగితే కులస్త్రీలు





చెడిపోతారు. కులస్త్రీలు చెడితే వర్ణసంకరం ఏర్పడుతుంది.

కుల కట్టుబాట్లను అమలుపరిచే పెద్దలు లేనప్పుడు, పురుషులంతా యుద్ధం కారణంగా మరణించినప్పుడు కులస్త్రీలు స్వేచ్ఛగా విహరిస్తారు. అలా స్వేచ్ఛావిహారం చేస్తే వర్ణ సంకరమౌతుంది అని అర్జునుని ఆవేదన.

విచిత్ర వీర్యుని మరణం తర్వాత కులక్షయం అయ్యే పరిస్థితి వచ్చింది. విచిత్రవీర్యునికి అంబిక, అంబాలికలనే ఇద్దరు భార్యలున్నారు. సంతానం కలగకుండానే అతడు రాజయక్ష్మ (వ్యాధి) పీడితుడై మరణించాడు. అట్టి స్థితిలో సింహాసనాన్ని అధిష్ఠించే వారసుడు లేడు. చేసిన ప్రతిజ్ఞకు కట్టుబడి రాజ్యాన్ని వదిలివేసిన భీష్ముడు తిరిగి స్వీకరించుటకు ఇష్టపడలేదు. ఆజన్మ బ్రహ్మచర్యవ్రత దీక్షాసంపన్నుడైనందున వివాహం చేసుకొనుటకు ఇష్టపడలేదు. ఉన్న ఒక్కడూ విచిత్రవీర్యుడు సంతానం లేకుండానే మరణించాడు. ఇపుడు కులక్షయం కాకుండా చూడవలసిన బాధ్యత సత్యవతి, భీష్ములపై పడింది. పెద్దలైన వారిరువురు ఉండటం వల్ల ఆపద్ధర్మంగా, ధర్మవిరుద్ధం కాని రీతిలో వారిరువురూ బాగుగా ఆలోచించి 'దేవరన్యాయం' అనే పద్ధతి ప్రకారం విచిత్రవీర్యుని క్షేత్రములైన (భార్యలైన) అంబికా, అంబాలికల యందు వ్యాసుని ద్వారా పుత్రోత్పత్తికై నిర్ణయించి ఆయనను నియోగించటం జరిగింది.

(దేవర న్యాయం, నియోగ పద్ధతి ద్వారా ఆపద్ధర్మంగా సంతానాన్ని కనుటయనే ఈ చర్యలోని ధర్మాధర్మాలేమిటో, సనాతనంగా వస్తున్న ఆచారాలేమిటో, సంతానాన్ని ఇచ్చే విధానమేమిటో, సంతానం కలిగిన తర్వాత ఆ స్త్రీ పురుషులు ఏ విధమైన భావనతో ఉంటారో, ఆ విధానాలను ఈనాడెందుకు ఆచరణలో పెట్టుటలేదో, ఇంకా ఇందులోని విమర్శలు, సందేహాలేమిటో, వాటికి సమాధానాలేమిటో మా మరొక ప్రచురణ మహాభారతం ధర్మాధర్మ విశ్లేషణ అనే గ్రంథం చూడండి.) ఇవి సామాన్యులు పాటించగల నియమాలు కావు. ఎంతో మనో నిగ్రహం గల తపశ్శక్తి సంపన్నులకే సాధ్యం.

కాని సామాన్య మానవుల పరిస్థితి ఏమిటి? వారికంతటి మనోనిగ్రహం ఉండదు గనుక, నియోగించే పెద్దలు లేనందున స్వేచ్ఛా విహారిణులై వర్ణసంకరానికి కారకులౌతారని అర్జునుని ఆవేదన.

వర్ణసంకరమైతే నష్టం ఏమిటంటావా? అని అర్జునుడు వర్ణసంకరం వల్ల

అనర్థాలను వర్ణిస్తున్నాడు.

వర్ణసంకరానికి కారణమైన స్త్రీపురుషులు నరకానికి వెళతారు. అంతేకాదు పురుషులను యుద్ధంలో వధించి ఈ వర్ణసంకరానికి కారకులైనవారు కూడా నరకం పాలౌతారు. అంతేకాదు, ఈ సంకర సంతానం ఇచ్చే పిండక్రియలు, ఉదక క్రియలు పితృదేవతలకు చెందవు. కనుక పితృలోకం కూడా పతితమైపోతుంది. పితృదేవతలు తమ పుత్రులు, తమ ధర్మసంతానం ఇచ్చిన పిండోదకాలను స్వీకరిస్తారే గాని, సంకర సంతానం ఇచ్చేవాటిని స్వీకరించరు. పిండప్రదానం ద్వారా మనం ప్రతి సంవత్సరం సంవత్సరానికి ఒకసారి ఇచ్చే ఆహారాన్ని 'మన సంవత్సరం పితృదేవతలకు ఒక్కరోజు' గనుక, వారు ప్రతిరోజూ ఆహారాన్ని స్వీకరించినట్లవుతుంది. సంకర సంతానం ఇచ్చే పిండాలను వారు స్వీకరించకపోతే వారు ఆహారం లేకుండా ఎప్పటికీ అలాగే ఉండాలి. ఇదే వారికి నరకం. ఇలా యుద్ధం వల్ల జరిగే నష్టాలను ఏకరువుపెడుతూ అర్జునుడు తన వాదాన్ని కొనసాగిస్తూ, వర్ణసంకరం చేసే కులనాశనకారుల వల్ల జరిగే ఘోరమైన నష్టాలను తెలియజేస్తున్నాడు.

**శ్లో॥ దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకై ః**
**ఉత్సాద్యంతే జాతి ధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43**

**తా॥** వర్ణ సంకరానికి కారకులైన కులనాశకుల ఈ దోషాల వల్ల శాశ్వతమైన జాతి ధర్మాలు, కులధర్మాలు నశించిపోతాయి.

**వ్యాఖ్య:** ఈ భయంకరమైన యుద్ధం వల్ల పురుషులు చాలామంది చనిపోతారు. అందువల్ల భర్తలను కోల్పోయిన వితంతువులు అధికమౌతారు. దీనివల్ల ఆ స్త్రీలు వక్రమార్గం పట్టే అవకాశం ఉంది. దాని కారణంగా వర్ణసంకరం జరుగుతుంది. వర్ణసంకరం జరిగింది అంటే ఎవరి ధర్మాన్ని వారు నిర్వర్తించే పద్ధతికి స్వస్తి పలికినట్లే. సమాజంలో ఎవరిపని వారు చేసుకుంటూపోతే వ్యవస్థ చక్కగా సాగిపోతుంది.

అలాగాక కొందరు గత్యంతరం లేని పరిస్థితులలో ఇతరులకు సంబంధించిన పనులు చేయవలసివస్తే, ఆ పనిలో వారికి నైపుణ్యం ఉండదు. వారు సమర్థవంతంగా ఆ పనిని చేయలేరు. పైగా తాము ఇంతవరకు చేస్తున్న తమ పనిని వదులుకోవటం వల్ల సమాజంలో అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుంది.





అంతటా లోపాలే కనిపిస్తూ ఉంటాయి.

ఉదాహరణకు క్షత్రియులు ఎక్కువగా మరణించారనుకోండి. ప్రజలను పాలించడానికిగాని, ఇతర దేశాలనుండి వచ్చే దాడులనెదుర్కోవటానికి గాని, స్వదేశంలోని సంఘ విద్రోహ శక్తులనణచివేయుటకు గాని, తగినంతమంది సమర్థులైన వారుండరు. దీనితో ఇతర వర్ణముల వారిని అనగా బ్రాహ్మణులనో, వైశ్యులనో, శూద్రులనో ఇందుకు వినియోగించాలి. వారికి సైనిక శిక్షణను ఇవ్వాలి. ఐనప్పటికీ వారికి ఈ పనిలో నైపుణ్యం ఉండకపోవచ్చు. అందువల్ల ఫలితం బాగుండదు. పైగా వారికి నైపుణ్యం ఉన్న వారి స్వధర్మ కర్మలను వదలుకోవాల్సి వస్తుంది. అందువల్ల అక్కడ పనిచేసేవారి కొరత, ఇక్కడచేసే పనిలో లోపం. దానివల్ల సమాజం అంతా అస్తవ్యస్తమైపోతుంది. ఇదే శాశ్వత జాతిధర్మాలు నశించటం అంటే.

ఇక 'శాశ్వత కులధర్మాలు' అంటే క్షత్రియునకు ఉండవలసిన పరిపాలనా నైపుణ్యం, శౌర్యధైర్య సాహసాలు, త్యాగబుద్ధిలాంటి సద్గుణాలు వర్ణసంకరం కారణంగా జన్మించే వారిలో ఉండకపోవచ్చు. అలాగే మిగతా అందరిలోను వారికి ఉండవలసిన గుణాలు ఉండవు. ఇలా కులధర్మాలు నశించి పోతాయని అర్జునుని ఆవేదన.

కులధర్మాలు నశించిపోతే ఏమిటి ప్రమాదం?-

**శ్లో॥ ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన! ।**
**నరకే నియతం వాసః భవతీత్యనుశుశ్రుమ ॥ 44**

**తా॥** జనార్దన! కులధర్మాలు నశించిపోయినచో మనుష్యులు చాలాకాలం నరకవాసం చేయాల్సి ఉంటుందని విన్నాను.

**వ్యాఖ్య :** వర్ణసంకరం వల్ల జన్మించినవారిలో కులధర్మాలు, కులాచారాలు పాటించటం జరగదు. తమ తమ ధర్మకర్మలను ఎవరైతే అతిక్రమిస్తారో వారికి నరకం తప్పదు. వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండ్రుల పోషణభారాన్ని వహించకపోయినా, మరణించిన తల్లిదండ్రులకు పిండప్రదానాలు చేయకపోయినా, తల్లిదండ్రులు చూపిన ధర్మమార్గంలో నడుచుకోకపోయినా, సనాతనంగా వస్తున్న ధర్మబద్ధమైన ఆచారవ్యవహారాలను పాటించకపోయినా అట్టివారికి నరకవాసం తప్పదు.

ఈ విషయాలను అర్జునుడు కేవలం తన అభిప్రాయంగా కాక 'ఇతి

అనుశుశ్రుమ' – ఈ ప్రకారంగా పెద్దలవల్ల విన్నాను అంటున్నాడు. అంటే ఇంతవరకు నేనేదో ఈ యుద్ధం నుండి తప్పుకోవటానికి ఏవేవో నా బుద్ధిలో పుట్టిన భావాలను వ్యక్తం చేస్తున్నాననుకుంటావేమో; ఇవి అన్నీ పెద్దలనుండి విన్న విషయాలే; శాస్త్రాలలోని విషయాలే. కనుక ఎవ్వరూ కాదనే వీలులేదు– అంటూ తాను వ్యక్తం చేసిన అభిప్రాయాలను శాస్త్రంతో–పెద్దలతో ముడిపెట్టి సమర్థించుకుంటున్నాడు.

ఇక అర్జుననికి చెప్పటానికింకేమీ లేదు. ఇంతవరకు యుద్ధం వల్ల జరిగే ఘోరాలన్నింటినీ చక్కగా విశ్లేషించాడు. బహుశా తన వాదనను శ్రీకృష్ణుడు కూడా అంగీకరించక తప్పదు. త్వరలోనే తన ఆమోదముద్రను వేయవచ్చు. ఆయన మౌనంగా ఉండి ఆలోచిస్తున్నాడు– అని భావించిన అర్జునుడు, ఇక తన వాదనను ముగించేందుకు గాను విషయం మొత్తాన్ని ఒక్కమాటతో తేల్చివేసెయ్యాలనుకున్నాడు. ఒక్కసారిగా ఆశ్చర్యం, విచారం, విషాదం– అన్నింటినీ కలగలిపి తన నిర్ణయాన్ని ప్రకటించబోతున్నాడు.

ఏమని?

**శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితావయం।**
**యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః॥ 45**

**శ్లో॥ యది మామప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః**
**ధార్త రాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమ తరం భవేత్॥ 46**

**తా॥** అక్కటా! రాజ్యసుఖాలపై ఆశచేత స్వజనులను చంపటానికి సిద్ధమైన మనం ఎంతటి మహాపాపానికి ఒడిగట్టుతున్నాము? ఆయుధాలు ధరించకుండా, ప్రతి క్రియ చెయ్యకుండా ఉన్న నన్ను; ఆయుధాలు ధరించిన దుర్యోధనాదులు ఒకవేళ యుద్ధంలో చంపినా, దానివల్ల నాకు మేలే కలుగుతుంది.

**వ్యాఖ్య:** తనలో తాను అనుకుంటున్నట్టుగా అర్జునుడు తన నిశ్చయాన్ని పైకే అనేస్తున్నాడు. కటకటా! ఎంతటి ఆశ్చర్యం? ఎలాంటి ఘోరకృత్యానికి సిద్ధమయ్యాం? రాజ్య సుఖాలు, భోగాలపై ఆశతో మనవారినే మనం చంపుకోవటానికి సిద్ధమై ఎంత ఘోరపాపానికి ఒడిగట్టుతున్నాం?

ఇంతకుముందు ఎన్నో యుద్ధాలు చేసి శత్రుసంహారం చేసిన అర్జునుడు, ఇపుడు యుద్ధం చేయటం మహాపాపం అంటున్నాడు. కారణం? స్వజనులను చంపవలసిరావటమే. పైగా ఇదంతా చేస్తున్నది రాజ్యలోభం చేతనట! నిజమా?





అర్జునుడిక్కడ పరులరాజ్యం కొరకు యుద్ధానికి రాలేదు. న్యాయంగా తమకు రావలసిన రాజ్యాన్ని తాము పొందటానికే. తమరాజ్యంలో కూడా ఐదుగురు సోదరులకు ఐదూళ్ళు ఇచ్చినా చాలని సంధి ప్రయత్నం చేసి, సూదిమొన మోపినంత భూమి కూడా ఇవ్వనని దుర్యోధనుడు భీష్మించుకున్నందునే, తప్పనిసరి పరిస్థితిలో యుద్ధానికి సిద్ధమయ్యారు. పోనీ రాజ్యసుఖాలు, భోగాలమీద ఆశ, ఆసక్తితో వచ్చినవాడా అర్జునుడు? "యేషా మర్థే కాంక్షితం నః రాజ్యం భోగాస్సుఖానిచ" ఎవరికోసమైతే ఈ రాజ్యాన్ని, సుఖాలను, భోగాలను కోరుకుంటున్నామో– అంటూ 'ఇవన్నీ తనవారికోసం' అని 33వ శ్లోకంలో స్వయంగా అర్జునుడే చెప్పాడు. కనుక రాజ్యలోభం లేదు.

ఇక తాను గొప్ప వీరుణ్ణని, పరాక్రమశాలినని నిరూపించు కొనుటకు వచ్చాడందామా? ఉత్తరగోగ్రహణ సమయంలోనే ఆ కోరికా తీరింది. భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణులతో సహా చతురంగబలాలతో కూడిన అపార సైన్యాన్ని శ్రీకృష్ణుని సాయంలేకుండా, తానొక్కడే వచ్చి, అరివీర భయంకరంగా పోరాడి, సమస్త యోధవీరులను తన అస్త్ర శస్త్ర విద్యాపాటవంతో ఓడించి, విరాటుని గోవులను తరలించుకు పోయాడు. ఎవ్వరినీ చంపాలనే కోరిక లేదు గనుక సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించి శత్రుసేనలను నిరుత్తరులను చేశాడు.

కనుక అర్జుననికి పరుల రాజ్యాన్ని అపహరించాలనే కాంక్షా లేదు, సుఖభోగాలమీద ఆశ, ఆసక్తి లేదు. తన శౌర్య, ధైర్య, పరాక్రమాలను ప్రదర్శించాలనే కోరికాలేదు. కేవలం తమ రాజ్యం కొరకే వచ్చాడు. ఇలా రావటం ఘోరపాపం అనుకుంటున్నాడు. ఇదంతా తనవారిపై గల మమకారం వల్లనే. ఈ మమకారం కారణంగానే క్షత్రియధర్మాన్ని కూడా మరచి పోతున్నాడు.

ద్యూతనియమం ప్రకారం పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం చేసివచ్చిన తమకు తమ రాజ్యాన్ని దుర్యోధనుడు ఇవ్వాలి. అలా ఇవ్వకుండా అధర్మపరులయ్యారు కౌరవులు. అధర్మపరులను హతమార్చి ధర్మాన్ని నిలబెట్టటం క్షత్రియధర్మం. ఐతే బంధుప్రీతి, మమకారం అడ్డువచ్చింది అర్జుననికి. దీనితో తాను యుద్ధం చేయటం ధర్మమా? చేయకుండా ఉండటమే ధర్మమా? అనే సందిగ్ధం ఏర్పడ్డది. ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు. సరియైన నిర్ణయం తీసుకోలేక పోతున్నాడు.

సాక్షాత్తూ ధర్మసంరక్షణకొరకే అవతరించిన పరమాత్మ తనకు సమీపంలోనే ఉన్నాడు గదా! తన సందేహాన్ని ఆయనకే చెప్పి, నిర్ణయాధికారం ఆయనకే వదిలి, తాను నిమిత్త మాత్రుడుగా తన కర్తవ్యాన్ని తాను నెరవేర్చవచ్చు గదా! అహఁ అలా చెయ్యలేదు. రజోగుణం ప్రబలంగా ఉన్న క్షత్రియుడైన అర్జునుడు తాను కర్తననే అహంకారంతో ఉన్నాడు గనుక, భగవంతుని శరణు గోరలేకపోయాడు. మనమూ అంతే.

అహంకారంతో ఉన్నంతవరకూ మనమే అన్ని ప్రయత్నాలు చేస్తాం. రజోగుణం తగ్గి సత్వగుణం ప్రబలంగా ఉంటేనే భగవంతునివైపుకు తిరుగుతాం. శరణాగతులమౌతాం. అందుకే అర్జునుడిక్కడ ఏవేవో సాకులు చెబుతున్నాడు. మార్చిమార్చి చెబుతున్నాడు. అంతేతప్ప పరమాత్మను శరణువేడలేదు. తనను శరణువేడితే గాని నోరువిప్పదు పరమాత్మ. అదిగో ఆ సమయం దగ్గరపడుతున్నది. తాను చెప్పటానికి ఇంకా ధర్మపన్నాలు మిగలలేదు. అందుకే అకటా! ఎంత ఆశ్చర్యం? అంటూ తాము చేయాలనుకున్న పనిని సింహావలోకనం చేసుకుంటున్నాడు.

రాజ్యలోభంతో ఎంతటి ఆకృత్యానికి సిద్ధపడ్డాం? రాజ్యలోభం ఎవరిచేతనైనా ఎంతటిపనైనా చేయిస్తుంది. లేకపోతే ధర్మాత్ములనీ, సత్యవాక్పాలకులనీ, సుగుణ సంపన్నులనీ, నీతి–నిజాయితీ కలవారనీ, సహనశీలురని, ప్రజారంజకులనీ, సహృదయులనీ, కరుణాసముద్రులనీ, అంతటివారనీ, ఇంతటి వారనీ ప్రజలందరిచేతా ప్రశంసలందుకుంటున్న మనమేనా ఇట్టి బంధుజనవధకు సిద్ధమయ్యింది? ఎవరినైనా ఒక్కరిని చంపటమే మహాపాపమైతే, అనేక లక్షలమందిని ఒక్కసారిగా చంపటం ఎంత ఘోరం? పైగా బంధువులు, మిత్రులు ఐనవారిని చంపటం ఎంతటి ఘోరపాపం? ఇవేనా మన సద్గుణాలు? ఇదేనా మన ధర్మతత్పరత?

ఇన్ని పాపాలు చేసి, ఇన్ని ఘోరాలు చేసి సంపాదించిన ఈ రాజ్యంగాని, సుఖాలు, భోగాలుగాని శాశ్వతమా? ఉట్టిగట్టుకొని ఊరేగుతామా?

ఈ బుద్ధి మొదటే ఉంటే బాగుండేది గదా! అంటావేమో? బుద్ధిమంతులు కూడా పొరపాట్లు చేస్తుంటారు. ఐతే వారు చేసిన పొరపాట్లను తెలుసుకొని సరిదిద్దుకుంటారు. పడటం తప్పుకాదు. పడి లేవకపోవటం తప్పు. ఒద్దు బావా! ఒద్దు. ఈ యుద్ధం వద్దు – అంటూ శ్రీకృష్ణునికి అవకాశం ఇవ్వకుండా





తనే ముగింపు పలుకుతున్నాడు.

కృష్ణా! ఇపుడు ఆలోచిస్తుంటే నాకు ఆశ్చర్యం వేస్తున్నది. ఎంతటి ఘోరానికి ఒడిగట్టామో! ఇప్పటికైనా కళ్ళు తెరుచుకున్నాయి. బుద్ధి వచ్చింది. ఈ బంధుహత్య ఎన్నో అనర్థాలకు కారణమౌతుందని, ఇది చేసిన నాకు నరకమేనని తెలిసింది. తెలిసీ ఈ దుర్మార్గాన్ని ఎలా చేయగలను? అందుకే చేతినుండి జారిపోతున్న గాండీవాన్ని వదిలేస్తున్నాను. ఆయుధాలు వదిలేస్తాను, యుద్ధం చేయనుగాక చేయను.

నిజమే, దుర్యోధనాదులు దుర్మార్గులే. దుర్బుద్ధి గలవారే. మాకు ఎంతో అపకారం చేసినవారే. నాకు తెలుసు. ఇదే సమయమని నిరాయుధుడనైన నాపై ఆయుధాలతో ఎత్తివచ్చి అన్యాయంగా నన్ను చంపినా సరే అదికూడా నాకు మేలే– నాకు క్షేమమే అని భావిస్తాను.

యుద్ధం చేసి విజయాన్ని సాధించటం, రాజ్యాన్ని పొందటం, సుఖభోగాలు అనుభవించటం, తనవారికి ఆనందాన్ని కలిగించటం క్షేమమని ఇంతవరకు భావించాడు అర్జునుడు. కాని ఇప్పుడేమో విజయం కలగకపోయినా, తమరాజ్యం తమకు రాకపోయినా, చివరకు శత్రువులు తనను చంపివేసినా తనకు క్షేమమేనంటున్నాడు. ఎందుకు? ఏమిటి తనకు క్షేమం?

1) ఇంతమంది స్వజనులను చంపితే వచ్చే పాపం తనకంటదు.

2) ఇంతమందిని చంపిన తర్వాత, వారి బంధుమిత్రుల శాపనార్థాలు తనకు ఉండవు.

3) తన కారణంగా వర్ణసంకరంగాని, దానివల్ల వచ్చే దోషాలుగాని ఉండవు.

4) ఒకవేళ వాళ్ళే తనను అన్యాయంగా చంపితే లోకం వారిని దూషిస్తుంది. నన్ను ఎంతగానో ప్రశంసిస్తుంది.

5) తన పూర్వపుణ్యాల కారణంగా తనకు ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి.

6) ఇహలోకంలో మంచిపేరు, కీర్తి, పరలోకంలో సుఖాలు భోగాలు ప్రాప్తిస్తాయి.

ఇవీ తనకు క్షేమం అనటానికి కారణాలు. అయితే ఇదంతా ప్రతీకారం తీర్చుకునే శక్తి నాకు లేక కాదు. బంధువులపట్ల మమకారం, జాలి, ప్రీతి. కేవలం స్వసుఖం కోసం ఇందరిని వధించటం ఎందుకు? ఇందరు ప్రాణాలతో జీవించటానికి నేను సంతోషంతో ప్రాణాలు వదులుతాను. అహింసా పరమోధర్మః

అన్నారు గదా! నేను అహింసావ్రతాన్ని పాటిస్తాను. పాపం చేయటం కన్నా ప్రాణాలు వదలటమే మిన్న. కనుక నీకూ-నీ యుద్ధానికి ఒక నమస్కారం, గుడ్‌బై అంటున్నాడు అర్జునుడు తన తుది తీర్పుగా.

ఇలా పలికిన అర్జునుడు ఆ తర్వాత ఏమి చేశాడో సంజయుని మాటలద్వారా విందాం.

**సంజయ ఉవాచ:**

**శ్లో॥ ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।**
**విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః ॥ 47**

**తా:** సంజయుడంటున్నాడు. ఇలా పలికిన అర్జునుడు విషాదంతో నిండిన మనస్సుతో యుద్ధభూమిలో తన ధనుర్బాణాలను విడిచి రథం వెనుకభాగంలో కూర్చున్నాడు.

**వ్యాఖ్య:** ఇంతవరకు అర్జునుని భావాలను అర్జునుని నోటి మీదుగా విని తెలుసుకున్నాం. ఇపుడు అర్జునుని చర్యలను సంజయుని నోటిమీదుగా తెలుసుకుందాం. హస్తినాపురంలో ధృతరాష్ట్రుని ఆంతరిక మందిరంలో ధృతరాష్ట్రునికి యుద్ధ విశేషాలను వినిపిస్తున్న సంజయుడు యుద్ధరంగంలో ప్రస్తుతం అర్జునుని పరిస్థితిని వర్ణిస్తున్నాడు.

యుద్ధరంగంలో అడుగుపెట్టేవరకు అర్జునునిలో ఏ సందేహాలూ లేవు, ఏ విషాదమూ లేదు. కానీ భీష్మద్రోణులను చూడగానే మమకారంతో బాధించబడ్డాడు. దానితో శోక సంవిగ్నమానసుడయ్యాడు. శోకంతో, దుఃఖంతో, బాధతో ఉన్నవాడు ఏ పనినీ సరిగ్గా చెయ్యలేడు. ఏ మాటా సరిగ్గా మాట్లాడలేడు. ఏ ఆలోచనా సరిగ్గా చెయ్యలేడు. అందుకే ధనుర్బాణాలు క్రిందపడవేశాడు. ఇక ఎట్టి పరిస్థితిలోనూ యుద్ధం చేయను గాక చేయను, ఇక నావల్ల గాదు- అని నిష్కర్షగా తెలియజేస్తూ రథోపస్తుడయ్యాడు.

'రథోపస్తుడు' అంటే? భారతకాలం నాటి రథాలు ఒక పద్ధతిలో ఉంటాయి. ముందుభాగంలో సారథి కూర్చునే చోటు పల్లంగా ఉంటుంది. సారథికి వెనుక రథికుడు నిలబడే చోటు కొద్దిగా ఎత్తుగా ఉంటుంది. ఇక ఆ వెనుక కొంతచోటు పల్లంగా ఉంటుంది. ఆ ప్రదేశంలో యుద్ధానికి అవసరమైన ధనుస్సులు, అమ్ములపొదలు, కత్తులు, గదలు మొదలైన ఆయుధాలు ఉంటాయి. వీటిని అందించటానికి ఒక సేవకుడు అక్కడ కూర్చుంటాడు. ఆ సేవకుడు కూర్చొనే





చోటునే రథోపస్థం అంటారు. అక్కడ కూర్చున్నవానిని రథోపస్తుడంటారు. అతనిపై ఎవరూ బాణప్రయోగం చెయ్యరు. అతడు యుద్ధం చెయ్యడు. ఇది యుద్ధనియమం. ఇపుడు అర్జునుడు తన స్థానాన్ని వదలి సేవకుడు కూర్చొనే స్థలంలో కూర్చున్నాడు. అంటే యుద్ధం చెయ్యనని స్పష్టం చేస్తున్నాడు.

ఇపుడు అర్జునుడు శోకంతో ఉన్నాడు, నిరుత్సాహంతో ఉన్నాడు, అలజడి ఆందోళనలతో ఉన్నాడు, ఆవేదన చెందుతున్నాడు, ధనుర్బాణాలు విడిచిపెట్టేశాడు. రాజ్యభోగాలు వద్దంటున్నాడు. స్వజనులను చంపుకోవలసి వస్తుందన్నాడు. కనుక యుద్ధం చేయనంటున్నాడు. హింసను-స్వజన హింసను సహించలేనంటున్నాడు. అహింసయే శ్రేష్ఠమంటున్నాడు.

ఐతే అర్జునుని యొక్క ఈ అహింసావ్రతం ఏసుక్రీస్తు యొక్క అహింసావ్రతం వంటిది కాదు. గౌతమబుద్ధుని అహింసావ్రతం వంటిది కాదు. ఇది అజ్ఞానం వల్ల కలిగిన అహింసాభావం. అహింస కూడా జ్ఞానికే చెల్లుతుంది. అజ్ఞానియొక్క అహింస అహింస కాదు, అది హింసయే అవుతుంది.

ఒక గ్రామంలో పరమ అహింసావాదియైన ఒక వ్యక్తి ఉండేవాడు. చీమకు కూడా అపకారం చెయ్యడు. ఒకనాడు పొరుగున ఉన్న గ్రామానికి ప్రయాణమయ్యాడు. చెరువుగట్టు మీదుగా వెళుతున్నాడు. ఒక చేప ఎలాగో ఒడ్డునపడి గిలగిల కొట్టుకుంటున్నది. ఈయన హృదయం విలవిలలాడింది. కరుణాస్వభావుడు, అహింసావాది అయిన ఆ వ్యక్తి ఆ చేప బాధను చూడలేకపోయాడు. వెంటనే అతడు దానిని పట్టుకొని ఇంటికి తీసుకొచ్చాడు. ప్రయాణం మానుకున్నాడు. దానిని ఒక పరుపుపై పరుండబెట్టి, విసనకర్రతో విసరుతూ పరిచర్యలు చేస్తున్నాడు. పాపం అది ఎంత ఆకలిగా ఉందో అని దానికి వేడి వేడి పాలు త్రాగించాడు. దానితో ఆ చేప ఉక్కిరిబిక్కిరై పరలోకానికి టపా కట్టింది. ఆయన అహింసావ్రతం అలా ఏడ్చింది. దానిని ఆ చెరువు నీటిలోనే వేస్తే అది హాయిగా ఉండేది, తాను చక్కగా ప్రయాణం కొనసాగించేవాడు. అలా చేస్తే అతడు జ్ఞానియే. అహింసావాదియే. కాని ఆ మాత్రం తెలివి లేక ఎంత పరిచర్యలు చేసినా ఏం ప్రయోజనం. కనుక అజ్ఞాని అహింస కూడా హింసయే.

ఇక్కడ అర్జునుడు కూడా అలాంటి అజ్ఞానంతో అహింసా వాదాన్ని ముందుకు తెచ్చాడు. దుర్మార్గులు, పాపాత్ములు, పరధనాపహరణయందు ఆసక్తి గలవారు,

ఎన్నో అకృత్యాలు చేసిన వారు – వీరంతా తనవారని, బంధువులని, స్వజనులనీ విడిచిపెడితే వారు ఇంకా ఎన్నో అకృత్యాలు చేస్తారు. ఎందరికో అపచారాలు చేస్తారు. అపుడు నీ అహింసావ్రతం కాస్తా హింసావ్రతం అవుతుంది.

శరీరంలో చెడిపోయిన, కుళ్ళిపోయిన భాగం మిగిలిన ఇతర భాగాలను, అవయవాలను చెడగొట్టకుండా ఉండాలంటే ఆ చెడినభాగాన్ని ఆపరేషన్ చేసి తీసెయ్యాలి. ఇదే భగవంతుడు చెయ్యమన్నది. పరమాత్మ విశ్వరూపుడు. ఈ విశ్వమంతా ఆయన దేహమే. పరమాత్మ శరీరంలో దురాత్ములైన దుర్యోధనాదులు ఒక అవయవం. ధర్మాత్ములైన పాండవులు మరొక అవయవం. దేవతలు, రాక్షసులు, యక్ష, కిన్నర, కింపురుషులు మరికొన్ని అవయవాలు. జంతు, పక్షి, క్రిమి, కీటకాలు, వృక్షాలు మొ॥నవి మరికొన్ని అవయవాలు. ఈబ్రహ్మాండం అంతా ఆయన శరీరమే. అందులో దుర్యోధనాదులనే ఒక అవయవం చెడిపోయింది. సంధి ప్రయత్నమనే మందు వేసి బాగు చెయ్యటానికి చూశాడు శ్రీకృష్ణుడు, కాని ఫలితం లేకపోయింది. కనుకనే ఆ అవయవాన్ని యుద్ధమనే ఆపరేషన్ చేసి తీసివేసి మిగిలిన అన్ని అవయవాలను, శరీరాన్ని కాపాడాలనుకున్నాడు.

కాని అర్జునునిలాంటి అజ్ఞాని అమ్మో! ఇది నా చెయ్యి కదా! నా కాలుకదా! నా వ్రేలుకదా! అనే మమకారంతో ఆపరేషన్‌కు ఒప్పుకోడు. దానికెన్నో కారణాలు చెబుతాడు. ఆపరేషన్ చేసేటప్పుడు ఎంతో నొప్పికదా! రక్తం చాలా పోతుందికదా! తర్వాత ఏదన్నా పనిచేయాలంటే చెయ్యి లేకపోతే ఎలా? వ్రేలు లేకపోతే ఎలా? అని ఎన్నో సాకులు చెబుతాడు.

జీవహింస పాపం అంటాడు, భగవంతుడిచ్చినదానిని తొలగించటానికి మనమెవరం? అంటాడు. అలా అని ఆపరేషన్‌కు ఒప్పుకోకపోతే ఏం జరుగుతుంది? ఆ కుళ్ళిపోయిన అవయవం అలాగే ఉంటే జబ్బు దేహమంతా ప్రాకి చివరకు ప్రాణమే పోతుంది. కనుక చెడిపోయిన అవయవంపై మమకారం కూడదు. మిగిలిన శరీరం మొత్తాన్ని రక్షించుకొనుటకు వ్యాధితో చెడిపోయిన అవయవాన్ని ఖండించి తీసి పారవెయ్యాలి.

అలాగే మిగిలిన సమాజం మొత్తం సుఖశాంతులతో జీవించటానికి అధర్మంతో, అన్యాయంతో, అకృత్యాలతో చెడిపోయిన దుర్యోధనాదులవంటి దుర్మార్గులను హతమార్చాలి. ఇదే భగవానుని నిశ్చయం.





వర్ణసంకరం అవుతుందని అర్జునుని బాధ. ధర్మసంకరం అవుతుందని భగవానుని బాధ. జనం చనిపోతారని అర్జునుని బాధ. ధర్మం నశిస్తుందని భగవానుని బాధ.

అర్జునునిలో ఇప్పుడు విరక్తి కలిగింది. రాజ్యం, సుఖాలు, భోగాలు వీటిపై ఏమాత్రం ఆసక్తి లేదు. ఇక భగవంతునివైపుకు తిరగటమే తరువాయి. ప్రాపంచిక విషయాల పట్ల విరక్తి ఉంటే పరమాత్మపట్ల, ధర్మం పట్ల అనురక్తి కలుగుతుంది.

ఐతే అర్జునునిలో వైరాగ్యం కలిగింది గాని భగవంతుని శరణాగతి కోరాలనే భావన రాలేదు. శరణాగతభావన కలిగితే గాని జ్ఞానబోధను ప్రారంభించే వీలులేదు.

అందుకే శ్రీకృష్ణుడు ఇక మౌనం వీడాలనుకుంటున్నాడు. అర్జునునిలో శిష్యభావన కలిగించి, శరణాగతుణ్ణి చేసుకొనుటకు చివాట్లుపెట్టి, అతడి మనోబుద్ధులు సరిచేయాలనుకున్నాడు. దానితో అర్జునుడు శరణాగతుడు కావటం, భగవానుని జ్ఞానబోధ రెండవ అధ్యాయంలో చూస్తాం.

**గద్యం: ఓం తత్సత్, ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే, అర్జున విషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః ॥**

ఈ ప్రకారంగా ఉపనిషత్తుల సారము, బ్రహ్మవిద్యాప్రతిపాదితము, యోగశాస్త్రము. శ్రీకృష్ణార్జునుల సంవాదరూపము ఐన భగవద్గీతయందు అర్జున విషాదయోగమనుపేరుగల ప్రథమ అధ్యాయము సమాప్తం.



# భగవద్గీత

## రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగం

అర్జునుని విషాదం పరమాత్మను శరణు పొందటానికి దారి తీసింది. అందుకే ఆ విషాదం యోగమైంది. ఇప్పుడిది రెండవ అధ్యాయం. సాంఖ్యయోగం. సాంఖ్యం అంటే పరిశుద్ధమైన ఆత్మజ్ఞానం. యోగం అంటే ఉపాయం. పరిశుద్ధమైన ఆత్మజ్ఞానాన్ని పొందే ఉపాయం-మోక్షాన్ని పొందే ఉపాయం ఇక్కడ చెప్పబడింది.

దేహం పంచభూతాలతో తయారైనదని, నామరూపాలతో గుర్తించబడు తున్నదని, ఇది ఎప్పటికైనా నశించిపోయేదేనని, ఈ దేహానికి ఆధారమైన ఆత్మ నాశనం లేనిదని, నిత్యమైనదని, సచ్చిదానందస్వరూపమని, అది నీవేనని ఈ అధ్యాయంలో తెలియజేయటం జరిగింది.

ద్వితీయం అద్వితీయం అంటారు. ఈ అధ్యాయం నిజంగా అద్వితీయమే. గీతాసారం అంతా ఇందులోనే ఉన్నది. ఇది 72 శ్లోకాలతో కూడిన పెద్ద అధ్యాయం. ఇందులో 1 నుండి 10 శ్లోకాలు విషాదంలో మునిగిన అర్జునుడు కృష్ణప్రభావానికి లొంగిపోయి, సంపూర్ణ శరణాగతిని పొంది, ఆత్మజ్ఞానాన్ని అందుకొనుటకు అర్హతను సంపాదించిన విషయములను వివరిస్తున్నవి. 11 నుండి 30 వరకు గల శ్లోకాలు సంపూర్ణమైన ఆత్మజ్ఞానాన్ని తెలియజేస్తున్నవి. 31 నుండి 38 వరకు గల 8 శ్లోకాలు క్షత్రియ ధర్మాన్ని అనుసరించి చూచినా అర్జునుడు తప్పక యుద్ధం చేయవలసిన విధిని గూర్చి తెలియజేస్తున్నవి. 39 నుండి 53 వరకు గల శ్లోకాలు బుద్ధియోగాన్ని అంటే నిష్కామకర్మయోగం యొక్క ఆవశ్యకతను తెలియజేస్తున్నవి. ఇక 54 నుండి 72 వరకు గల శ్లోకాలు ఎవడు ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆత్మానుభూతిలో ఉంటాడో, అట్టి ఆత్మజ్ఞాని-స్థితప్రజ్ఞుడు ఎట్టి లక్షణాలు కలిగి ఉంటాడో, ఈ లోకంలో ఎలా ప్రవర్తిస్తూ





ఉంటాడో కన్నులకు కట్టినట్టుగ వర్ణించటం జరిగింది. ఈ విధంగా అర్జునుని విషాదాన్ని పోగొట్టటానికి ఈ అధ్యాయంలోనే పూర్తి ప్రయత్నం జరిగింది. అందుకే ఇది సమగ్రమైన అధ్యాయం. గీతాసారమంతా నిక్షిప్తం చేయబడిన అధ్యాయం.

వేదాలలో చెప్పబడ్డ కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ లకు సంబంధించిన జ్ఞానమంతా ఈ అధ్యాయంలో సంక్షిప్తంగా చెప్పబడింది. కర్మకాండవల్ల మనశ్శుద్ధి, ఉపాసనాకాండ వల్ల సత్త్వగుణం పెరిగి ఆత్మజ్ఞానానికి అర్హత కలుగుతుంది. జ్ఞానకాండ వల్ల ఆత్మజ్ఞానాన్ని పొంది, మోక్షప్రాప్తికి అర్హతను సాధించగలరు.

'సంజయ ఉవాచ'తో ఈ అధ్యాయం ప్రారంభమవుతున్నది. మొదటి అధ్యాయం చివరి శ్లోకం (47) కూడా సంజయుడు చెప్పినదే. సంజయుడు చెప్పిన రెండు శ్లోకాలను తుంచి అధ్యాయ విభాగం ఎందుకు చేసినట్టు?-

మొదటి అధ్యాయం చివరలో అర్జునుడు ధనుర్బాణాలు పారవేసి రథం వెనుక చతికిలపడ్డాడు. ఇది తమోగుణస్థితికి పరాకాష్ఠ. ఇక ఇంతకన్న దిగజారటానికి వీలులేదు. అందుకే ఈ స్థితిని వర్ణిస్తూ చెప్పిన సంజయుని శ్లోకంతో మొదటి అధ్యాయం సమాప్తమైంది. ఇక ఆ అట్టడుగు స్థితినుండి పైకి లేవటం 2వ అధ్యాయంలో ప్రారంభం కాబోతున్నది.

తమోగుణం నుండి రజోగుణానికి, రజోగుణం నుండి సత్త్వగుణానికి ఎదగాలి. సత్త్వ గుణంలో నిలవకపోతే తత్త్వం అర్థం కాదు. సాత్వికుడు కాకపోతే శరణాగతి కోరలేడు. తమోగుణంలో ఉన్నవాడికి శరణాగతి కోరాలని కూడా తెలియదు. రజోగుణంలో ఉన్నవాడికి తెలిసినా అహంకారం అడ్డువచ్చి కోరలేడు. సత్త్వంలో ఉన్నవాడే శరణాగతి కోరగలడు, తత్త్వజ్ఞానాన్ని అవగాహన చేసుకోగలడు.

అదిగో సరిగ్గా ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్న శ్రీకృష్ణుడు అర్జునుని మేల్కొల్పటానికి మంచి ఇంజెక్షన్ ఇచ్చాడు. వెంటనే రజోగుణం మేల్కొంది. ఆ వెంటనే ధర్మసంశయం కలిగి సత్త్వం ముందుకొచ్చింది. అహంకారం అణిగింది. శిష్య భావం కలిగింది. పూర్తిగా దాసోహమన్నాడు. అర్జునుడనే భూమి, జ్ఞానమనే విత్తనాన్ని నాటటానికి చక్కగా తయారైంది. ఇక విత్తనం నాటటమే తరువాయి.

మొదటి అధ్యాయం చివరలో సంజయుని మాటలు గ్రుడ్డి రాజులో

ఆశలు రేకెత్తించాయి. రొట్టె విరిగి నేతిలో పడిందను కున్నాడు. ముఖంలో సంతోషం కనిపించింది. కాని సంజయుడు దూరదృష్టి, దివ్యదృష్టి కలవాడు. "సాక్షాత్తు భగవంతుడు పాండవ పక్షంలో ఉండగా ఈ అంధరాజు ఆశలు ఫలిస్తాయా? పాపం!" అని జాలితో చూస్తూ తన ప్రసంగాన్ని ప్రారంభిస్తున్నాడు. ఏమని? –

**సంజయ ఉవాచ**

**శ్లో॥ తంతథా కృపయాఽఽవిష్టం అశ్రుపూర్ణాకులేక్షణం।**
**విషీదంత మిదం వాక్యం ఉవాచమధుసూదనః ॥ 1**

**తా॥**సంజయుడంటున్నాడు–ఆ విధంగా కరుణతో ఆవహించబడి, కన్నీటితో నిండిన నేత్రములతో, విషాదంలో ఉన్న అర్జునుణ్ణి చూచి మధుసూదనుడిలా అంటున్నాడు.

**వ్యాఖ్య:** రాజభవనంలో ధృతరాష్ట్రుని ముందు కూర్చుని, యుద్ధరంగ విశేషాలను వినిపిస్తున్న సంజయుడు, అర్జునుని పరిస్థితిని చక్కగా చిత్రీకరించాడు. అర్జునుడు మమకారానికి లొంగిపోయాడు. అతడిలో విషాదం, పిరికితనం ప్రవేశించాయి. యుద్ధంవల్ల భయంకర పరిణామాలను ఊహించుకొన్నాడు. సమాజం అంతా చెడుతుందని దిగులు పడుతున్నాడు. చివరకు యుద్ధం చేయనని ధనుర్బాణాలు పడేసి, రథం వెనుక కూర్చున్నాడు. అర్జునుని ఈ పరిస్థితికి కారణాలేమిటో సంజయుడు చెబుతున్నాడు.

**1)కృపయావిష్టం** : కరుణ చేత ఆవహించబడ్డాడు. కరుణ–దయ మంచిలక్షణాలే గదా! మంచివే. కాని చూపదగని వారి మీద చూపినా, చూపదగని సమయంలో చూపినా అది చెడే అవుతుంది. తేలు కుట్టబోతున్నది – అని తెలిసినప్పుడు, పాము కాటు వేయబోతున్నది – అని తెలిసినప్పుడు వాటిపై దయ చూపటం మంచిదికాదు. కాని ఇక్కడ అర్జునుడు ఎన్నో అక్రమాలను, అన్యాయాలను చేసినవారిపై, కులస్త్రీని నిండు సభలో ఘోరాతిఘోరంగా అవమానించిన వారిపై, పరరాజ్యాన్ని హరించిన వారిపై దయ చూపుతున్నాడు. అదీ యుద్ధరంగంలో, యుద్ధం ప్రారంభం కాబోతున్న సమయంలో దయను చూపు తున్నాడు. అదే తప్పు. పైగా క్షత్రియ ధర్మానికి విరుద్ధం కూడా.





**2) అశ్రుపూర్ణాకులేక్షణం:**దయతో కూడినవాడే గాక కంటి నిండా నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. దయ ఆవహించినప్పుడు, దుఃఖం కలిగినప్పుడు కళ్ళలో నీళ్ళు తిరుగుతాయి. ఇది వైరాగ్య చిహ్నం. సుఖాలపైన, భోగాలపైన రోత కలిగింది. వైరాగ్యం వచ్చింది కాని శిష్యభావం రాలేదు. అది వచ్చేంతవరకు జ్ఞానబోధ జరుగదు.

**3) విషీదంతం**: జరగబోయే భయంకర దృశ్యాన్ని తలచుకొని వ్యాకులత చెందుతున్నాడు. మనస్సు మనస్సులో లేదు. ఈ 3 లక్షణాలతో అర్జునుని అప్పటి స్థితిని వర్ణించిన సంజయుడు భగవానుని మధుసూదనుడు అని అంటున్నాడు.

**"మధుసూదనుడు"** అంటే మధువనే రాక్షసుని సంహరించిన వాడు అని. మధువనే రాక్షసుని చంపి, దుష్టశిక్షణ చేసిన శ్రీకృష్ణుడు, ఇప్పుడు అర్జునుని ఆవహించిన కృప అనే భూతాన్ని, విషాదమనే దుష్టశక్తిని అంతం చేయలేడా? అంతం చేయగలడు అని సంజయుని ఆంతర్యం. అందుకే ఈ భూతసూదనుడు అర్జునునితో ఇలా అంటున్నాడు–

**శ్రీభగవానువాచ:**

**శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం।**
**అనార్యజుష్ట మస్వర్గ్యం అకీర్తకర మర్జున! ॥ 2**

**శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ 3**

**తా**: భగవానుడంటున్నాడు, అర్జునా! యుద్ధానికి సిద్ధమై యున్న ఈ విషమ సమయంలో ఈ కశ్మలం (మాలిన్యం) నీకు ఎక్కడినుండి వచ్చింది? ఇది ఆర్యులకు తగినది కాదు. స్వర్గాన్ని, కీర్తిని చెడగొట్టేది, పరంతపా! నపుంసకుడివి కావద్దు. ఇది నీకు శోభనివ్వదు. నీచమైన ఈ హృదయదౌర్బల్యాన్ని విడిచి లేచి నిలబడు.

**వ్యాఖ్య:**ధనుర్బాణాలు పారవేసి, రథం వెనుక చతికిలబడి కూర్చున్న అర్జునుని, పోటుమాటలతో, అతడిలోని దుర్బలత్వాన్ని పారద్రోలాలనుకున్న భగవానుడు, తారాజువ్వల వంటి, పిడుగుల వంటి మాటలతో అర్జునునికి చురుకు ముట్టిస్తున్నాడు.

అర్జునా! ఈ విషమపరిస్థితిలో నీకీ కశ్మలం ఎక్కడి నుండి వచ్చింది? ఎట్టి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కొని, నీకనుకూలంగా మార్చుకోగల సాహసవంతుడవు గదా నీవు. నీకీ దరిద్రపు కశ్మలం ఎక్కడి నుండి వచ్చింది? అందులోను ఇప్పుడా? విషమే? – ఒకవైపు శత్రువులు యుద్ధానికి కత్తులు నూరుతున్నారు. వీరులు మీసాలు మెలిత్రిప్పుతున్నారు. మరోవైపు శంఖభేరి నినాదాలు మిన్ను ముట్టుతున్నాయి. పోనీ వారేమైనా ధర్మాత్ములా? కాదే. పరమదుర్మార్గులు. వారు చేయని అకార్యం లేదు. ఎన్ని అవమానాలు చేశారు? చివరకు మీ రాజ్యభాగాన్ని స్వాహా చేశారు గదా! పోనీ, ఈ యుద్ధం హఠాత్తుగా వచ్చి పడిందా? ఎన్నో రాయబారాలు జరిగినవి. సంధిమాటలు జరిగినవి. ఎంతోకాలం నుండి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇంతకాలం లేని ఏడుపు ఇప్పుడెందుకయ్యా? ఈ విషమ పరిస్థితిలోనా నీకీ వ్యధ? విచారం? కశ్మలం? ఏడుపు? అసలీ కశ్మలం ఎలాంటిది? అనార్యజుష్టం, అస్వర్గ్యం, అకీర్తికరం.

**1) అనార్యజుష్టం:** ఆర్యులు, అనార్యులు అని 2 జాతులు. ఆర్యులంటే సన్మార్గంలో నడిచేవారు, పవిత్రులు, తేజస్సు గలవారు, స్వధర్మాన్ని పాటించేవారు, ధర్మాన్ని నిలబెట్టేవారు. ఈ లక్షణాలు లేనివారు అనార్యులు. నీవు క్షత్రియ కులంలో జన్మించినవాడవు. ఆర్యపురుషుడవు. నీ పిడికిలిలో బలముంది, గుండెలో ధైర్యముంది, బాణాల్లోపదునుంది, చేతిలో అద్భుత విద్య ఉంది. అయినా పామరుడిలాగా ఏడుస్తున్నావు. చేతగాని చవటదద్దమ్మలా చేతులు ముడుచుకొని కూర్చున్నావు. నీకిదేం బుద్ధి? ఇది ఆర్యులకు తగినదేనా?

**2) అస్వర్గ్యం:** యుద్ధంలో జయిస్తే రాజ్యం వస్తుంది. ఒకవేళ మరణిస్తే వీరస్వర్గం లభిస్తుంది. యుద్ధంచేస్తే విజయమో–వీరస్వర్గమో ఏదో ఒకటి ఖాయం. కాని ఇలా చేతులుముడుచుకు కూర్చుంటే విజయమూలేదు, వీరస్వర్గమూ రాదు.

**3) అకీర్తికరం:** పోనీ రాజ్యసుఖం వద్దు, స్వర్గసుఖం వద్దు. యుద్ధం మానేస్తే నీకేమైనా కీర్తి ప్రతిష్ఠలొస్తాయా? కీర్తి రాకపోగా కావలసినంత అపకీర్తిని నెత్తికెత్తుకుంటావు. ఇప్పటి వరకు అర్జునుడంటే హడల్. ఈ దెబ్బతో అర్జునుడు ఒట్టి 'కాగితంపులి' అనుకుంటారు. 'పిరికిపంద' అంటారు. ఎగతాళి చేస్తారు.

కనుక అర్జునా! జాగ్రత్తగా ఆలోచించు. యుద్ధం మానేస్తే (1) రాజ్యం రాదు (2) స్వర్గం రాదు (3) కీర్తి రాదు (4)స్వధర్మం నుండి వెనుదిరిగిన వాడివవుతావు. (5) ధర్మరక్షణ జరుగదు (6) అందరూ నిన్ను చూచి పరిహాసం





చేస్తారు. ఇదంతా నీకు అవసరమా?

**క్లైబ్యం మాస్మగమః** : అర్జునా! పేడివి కావద్దు. ఖాండవ వన దహన సమయంలో అపూర్వ ధైర్యసాహసాలు ప్రదర్శించి దేవేంద్రుని జయించావు. దేవతలకే అసాధ్యులైన నివాతకవచ, కాలకేయులనే రాక్షసులను హతమార్చిన వాడివి. భీష్మద్రోణాది మహావీరులతో కూడిన కౌరవసేనను, ఉత్తరగోగ్రహణ సమయంలో నీవొక్కడివే అసహాయుడవై ఎదిరించి జయించావు. పరమేశ్వరునే ఎదిరించి పోరాడి, పాశుపతాస్త్రాన్ని సంపాదించావు. పరాక్రమం విషయంలోనే కాదు; నీవు స్వర్గ లోకం వెళ్ళినప్పుడు, అప్సరస ఊర్వశి తనంతతాను వలచివచ్చి, నీ చెంత చేరి, తన కోరికను వెలిబుచ్చింది. అయినా ఆ సుందరిని తిరస్కరించి, ఇంద్రియ నిగ్రహంలో మహామునులను, ఋషి పుంగవులను తలపింపజేశావు. అందుకు ఆగ్రహించిన ఊర్వశి నపుంసకుడవు కమ్మని శాపమిచ్చింది. ఆ శాపాన్ని విరాట నగరంలో వరంగా ఉపయోగించుకొని అందమైన అమ్మాయిలకు ఆటపాటలు నేర్పుతూ నిన్ను నీవే మరచిపోయావు. ఇప్పుడా శాపప్రభావం పోయినా ఇంకా నీకు ఆ లక్షణాలు పోలేదా? ఇప్పటికీ పేడిలాగానే భావించుకుంటున్నావా? నీకన్నా మీ అన్న భీమన్న చాలానయం గదా! విరాట రాజువద్ద వంటలవాడిగా ఉండి, పప్పుదప్పళాలు వండి వార్చినా, ఇప్పుడు శత్రువులపై పళ్ళు పటపట కొరుకుతున్నాడు. మరి నీవేమిటో! ఇంకా ఆ నపుంసక లక్షణాలను విడవలేక పోతున్నావు. లే, లేచి నిలబడు, హృదయ దౌర్బల్యాన్ని విడిచిపెట్టు– అని పిడుగులు కురిపిస్తున్నాడు భగవానుడు.

పరంతపా! అంటే శత్రువులను తపింపజేసేవాడా! అని. ఇలా ఒకవైపు ప్రోత్సాహాన్నిస్తూనే, బాహ్య శత్రువులనే గాదు అంతః శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యా లనే అరిషడ్వర్గాలను కూడా తపింపజేయాలి అనే హెచ్చరికను అంతర్లీనంగా అందిస్తున్నాడు భగవానుడు సర్వ మానవాళికీ.

శ్రీకృష్ణుని ఈ పిడుగుల వంటి మాటలతో తమో గుణాన్ని వదిలిన అర్జునుడేమంటున్నాడు?

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ కథం భీష్మమహంసంఖ్యే ద్రోణంచ మధుసూదన! ।**
**ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన॥ 4**

శ్లో॥ గురూన హత్వా హి మహాను భావాన్
శ్రేయోభోక్తుం భైక్ష్య మపీహలోకే! ।
హత్వాzర్థ కామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥ 5

**తా॥** అర్జునుడంటున్నాడు– శతృసంహారకుడవగు ఓ మధుసూదనా! పూజార్హులైన భీష్మద్రోణులను యుద్ధమునందు నేను ఎలా బాణాలతో ఎదుర్కోగలను? మహానుభావులైన గురువులను వధించకుండా ఈ లోకంలో బిచ్చమెత్తుకుని జీవించటం మేలు. ఇక్కడ గురువులను వధించి, రక్తంతో తడిసిన సంపదలను, భోగాలను మాత్రమే అనుభవించగలము.

**వ్యాఖ్య:** శ్రీకృష్ణుని పోటుమాటలతో తేరుకున్న అర్జునుడు, తన బాధకు కారణాన్ని వినయంతో విన్నవిస్తున్నాడు. కృష్ణా! ఎదురుగా యుద్ధభూమిలో ఉన్న భీష్మద్రోణులు పూజించదగిన మహానుభావులు. తండ్రిలేని మమ్ములను ఎత్తుకొని, పెంచి, పెద్ద చేసిన మహాత్ముడు తాతగారు. మాపై ఎంతో ప్రేమను, వాత్సల్యాన్ని, ఆప్యాయతను చూపించాడు. ఇక ద్రోణాచార్యులు మా గురుదేవులు. అశ్వద్ధామ కామపుత్రుడు, అర్జునుడు ప్రేమ పుత్రుడు అని భావించి, స్వంత కుమారుని కన్న ఎక్కువగా అభిమానించి, సర్వశస్త్రాస్త్ర రహస్యాలను తెలియజేశారు. బ్రహ్మాస్త్రం, బ్రహ్మశిరోనామకాస్త్రం మొదలైన అస్త్రాలను ప్రసాదించి, అస్త్రవిద్యలో గొప్ప ప్రవీణుని కావించాడు. నాకన్న అధికుడైన వాడెవరూ తన శిష్యులలో ఉండరని హామీ ఇచ్చాడు. దానికి ప్రతిఫలంగా ఆయన నేర్పిన విద్యను ఆయన మీదనే ప్రయోగించి గురుద్రోహానికి పాల్పడమంటావా? నేనేమన్నా భస్మాసురుడనా? వరమిచ్చిన వానిమీదనే ఆ వరాన్ని ప్రయోగించటానికి? పూలతో పూజించవలసిన వారిని బాణాలతో బాధించమంటావా? ఇది ఆర్యలక్షణమా? అనార్య లక్షణమా? స్వర్గ్యమా–అస్వర్గ్యమా? కీర్తికరమా–అపకీర్తికరమా? ఇప్పుడు చెప్పు. గురువులను చంపితే ఏమిటో? నా బాధను అర్థం చేసుకోవయ్యా అంటే వినవేం?

నీకేం చెబుతావు. నీవు అరిసూదనుడవు (శతృసంహారకుడవు), మధుసూదనుడవు (మధువనే రాక్షసుని సంహరించిన వాడవు) కాని గురుసూదనుడవు కాదు గదా! ఎప్పుడో చని పోయిన గురుపుత్రుని కొరకు యమధర్మరాజుతో పోరాడి, అతడిని బ్రతికించితెచ్చి గురుదక్షిణగా సమర్పించి,





గురుదేవులను గురుపత్నిని ఆనందపరచావు. నన్నేమో గురువుతో యుద్ధం చేసి చంపమంటున్నావు. నీవు గురువుకు అపురూపమైన, అసాధ్యమైన గురుదక్షిణను సమర్పించి, 'శిష్యుడంటే ఇలా ఉండాలి' అని లోకమంతా ప్రశంసించే పనిచేశావు, నన్నేమో గురువుతోనే యుద్ధం చేసి, సంహరించి, గురుద్రోహం చేసి, 'శిష్యుడంటే ఇలా ఉండకూడదు' – అని లోకం ఛీకొట్టేటట్లు పురికొల్పుతున్నావు. నీకిదేమన్నా న్యాయంగా ఉందా? ఈ యుద్ధం గురువులతో, బంధువులతో, ఆత్మీయులతో చేసే యుద్ధం. అందుకే నాకింతటి బాధ. నా బాధ నీకెలా అర్థమవుతుంది? ఎవరికైనా అనుభవానికి వస్తే గాని తెలియదు అని లోలోపల మదనపడుతున్నాడు అర్జునుడు.

తమోగుణం నుండి లేవటానికి శ్రీకృష్ణుని పోటుమాటలు అర్జునునిపై బాగా పనిచేశాయి. రజోగుణంలోకి వచ్చాడు. అందుకే మళ్ళీ అహంకార మమకారాలు లేచినవి.

### అహంకారమేమిటి?

ఇప్పుడు జరుగుతున్న యుద్ధం ఇద్దరు వ్యక్తుల మధ్య కాదు. రెండు సేనలమధ్య. **భీష్మద్రోణులు కౌరవసేనలో భాగం.** అలాగే **అర్జునుడు పాండవసేనలో భాగం.** కాని అర్జునుడు తన సేనకన్న తాను ప్రత్యేక వ్యక్తిననుకుంటున్నాడు. అలాగే భీష్మద్రోణులను శతృసేనకన్న ప్రత్యేక వ్యక్తులుగ భావిస్తున్నాడు. **ఇదే అహంకారం.** ధర్మంకొరకు నిలిచినది పాండవసేన. అధర్మం కొరకు యుద్ధానికి సిద్ధమైంది కౌరవసేన. అధర్మాన్ని అణచటం పాండవసేన బాధ్యత. అది మరచి తనను తాను ప్రత్యేక వ్యక్తిననుకోవటమే అర్జునునిలోని అహంకారం.

### మమకారమేమిటి?

భీష్మద్రోణులకు అర్జునునిపై వాత్సల్యం లేదా? ఉన్నది. మరెందుకు యుద్ధానికి సిద్ధమయ్యారు? కౌరవసేన భాద్యతలోనే వారి వ్యక్తిత్వం విలీనమైయున్నది. తమసేనకన్న తాము ప్రత్యేక వ్యక్తులమని భావించటం లేదు. కాని అర్జునుడు మాత్రం వారిని శతృపక్షంగా, అధర్మపక్షంగా భావించకుండా తాత అని, గురువని చూస్తున్నాడు. అట్టివారిని యుద్ధంలో చంపి, వారి రక్తంతో తడిసిన కూడు తినటం మంచిదా? లేక వారిని చంపక పోతే రాజ్యం రాదు, సంపదలుండవు, భిక్షాపాత్ర చేత బట్టి బిచ్చమెత్తుకొని

జీవించాలి, ఇది మంచిదా? ఆలోచించాడు. ఆ రక్తపు కూడు తినేకన్నా ఈ బిచ్చపుకూడు తినటమే మంచిది. వారిని చంపి సుఖంగా ఎలా ఉండగలం? ఆనందంగా ఎలా జీవించగలం? ఇదీ అర్జునుని మమకారపు వాదన. అయితే గట్టిగా వాదించటం లేదిప్పుడు. నిర్ణయించే శక్తిని కోల్పో తున్నాడు. భగవంతునిపై భారం వేసే స్థితికి చేరుకుంటున్నాడు. అందుకే అంటున్నాడు. ఏమని?

**శ్లో॥ నచైతద్విద్మః కతరన్నో గరీయః**
**యద్వాజయేమ యదివానో జయేయుః ।**
**యానేవ హత్వా న జిజీవిషామః**
**తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6**

**తా**: ఎవరిని చంపిన తర్వాత ఇక మనం జీవించాలని అనుకోమో అట్టి ధార్తరాష్ట్రులు, బంధువులైన భీష్మాదులు యుద్ధ భూమిలో మన ఎదుట నిలిచియున్నారు. అదీగాక ఈ యుద్ధంలో మనమే జయిస్తామో, లేదా వారే జయిస్తారో నాకు తెలియదు. అందువల్ల ఇపుడు ఏది మనకు మంచిదో తేల్చుకోలేక పోతున్నాను.

**వ్యాఖ్య:** ఇంతవరకు యుద్ధం వల్ల కలిగే కష్టనష్టాలను ఏకరువు పెట్టి, యుద్ధం ఎందుకు చేయకూడదో అనేక విధాలుగా వాదించిన అర్జునుడు, శ్రీకృష్ణుని పోటు మాటలతో వాదనకు స్వస్తి చెప్పి తనలో తానే తర్కించుకుంటున్నాడు. తన ఆలోచనలన్నీ సమంజసమైనవే గదా! మరి ఎందుకు శ్రీకృష్ణుడు తన వాదనను అంగీకరించటం లేదు? అని తనలో తాను మధన పడుతున్నాడు. భీష్మద్రోణ, కృపాచార్యులు తనకు పూజ్యులు, గురువులు. కనుక వారు చంపదగినవారు కాదు. అట్టి పూజ్యులను, మహాత్ములను, గురువులను, బంధువులను చంపిన తర్వాత ఇంక తాను బ్రతికి ఉండటం వ్యర్థం కదా! అట్టి మహానుభావులంతా ఇప్పుడు యుద్ధరంగంలో తనకెదురుగా నిలిచి ఉన్నారు. పైగా వారేం సామాన్యులు కాదు. భీష్ముడు మహాపరాక్రమశాలి, సర్వశస్త్రాస్త్ర సంపన్నుడే కాదు, స్వచ్ఛంద మరణం వరంగా గలవాడు. ఇక కృపద్రోణులు అస్త్ర విద్యాచార్యులే గాక బ్రాహ్మణులు. బ్రాహ్మణులను వధిస్తే బ్రహ్మ హత్యాపాతకం. కనుక వారెవరూ వధార్హులు కారు. అట్టి వారందరూ నాయకత్వం వహిస్తున్న ఆ కౌరవసేనను తాము జయించ గలుగుతామో లేకవారే తమను జయిస్తారో చెప్పటం కష్టం.





గెలుపు నిశ్చయం కానప్పుడు, తప్పక గెలుస్తామనే నమ్మకం లేనప్పుడు ఇందరిని చంపుకోవటం తెలివిగలపనేనా? రెంటికీ చెడ్డరేవడి చందంగా అవుతుందా మనపని? కనుక ఇలాంటి సమయంలో యుద్ధం చేయటం మేలా? లేక మాను కోవటం మంచిదా? ఇదీ అర్జునుని మనస్సును వేధిస్తున్న సందేహం.

ఇంతవరకు అర్జునుని మనస్సులో కలిగిన కలవరం ఇప్పుడు బుద్ధికి కూడా వ్యాపించింది. బుద్ధి కూడా ఏమీ నిర్ణయం తీసుకోలేక సతమతమౌతున్నది. అంతరంగం ఆందోళనతో నిండి ఉన్నప్పుడు బుద్ధి కూడా సరియైన, స్థిరమైన నిర్ణయాలు తీసుకోలేదు. మనో బుద్ధులమధ్య ఈ ఆందోళన అడ్డుగోడగా నిలవటం వల్ల మనోబుద్ధులు ఒకదానికొకటి సహకరించు కోవటం మానివేశాయి. మనకెవరికైనా అంతే. ఆందోళనలతో, అలజడులతో, ఆతురతతో ఉన్నప్పుడు బుద్ధి సరియైన నిర్ణయం తీసుకోలేదు. అలాంటి సమయాలలో తీసుకొనే నిర్ణయాలన్నీ మనకు ఏదో ఒక విధంగా చేటునే కలిగిస్తాయి. ఇపుడు అర్జునుడు అహంకారంతో, ఆందోళనతో, ఫలితమునందలి ఆసక్తితో ఉండటం వల్ల ఇవి మనోబుద్ధుల మధ్య అడ్డుగోడలై నిలిచి వాటిమధ్య అగాధం సృష్టించినవి. అందుకే ఏమీ తేల్చుకోలేకపోతున్నాడు.

మనస్సు ఒక ఏజంటులాంటిది. అది ఇంద్రియాల ద్వారా ప్రపంచంలోని విషయాలను గ్రహిస్తుంది. వాటిని బుద్ధికి అందిస్తుంది. ఇక బుద్ధి అనేక అనుభవాలతో, స్మృతులతో పండిపోయిన మేధావిలాంటిది. మనసు తనకందించిన విషయాలను బాగా విశ్లేషణ చేసి, ఒక నిర్ణయం తీసుకొని దానిని మనసుకందిస్తుంది. అప్పుడు మనసు ఆ నిర్ణయాన్ని ఇంద్రియాలద్వారా అమలు చేస్తుంది. మనం మేలుకొని ఉన్నంత వరకు ఈ నాటకం జరుగుతూనే ఉంటుంది.

అయితే ఎవరిలోనైతే ఈ ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఒకదానితో ఒకటి సహకరించుకుంటూ పనిచేస్తాయో అతడు విజయవంతమైన జీవితాన్ని గడుపుతాడు. ఎవరిలోనైతే ఈ మూడూ సహకరించుకోకుండా ఉంటాయో అతడు ధైర్య, స్థైర్యాలను కోల్పోయి అసమర్థుడౌతాడు. ఇదే ఇప్పుడు అర్జునుని పరిస్థితి. అతడి అంతఃకరణాన్ని సరిదిద్ది, అతడి మనోబుద్ధులకు శ్రుతి కుదిరేటట్లు చేయాలి. అదే చేయబోతున్నాడు భగవానుడు. అదే చేస్తుంది భగవద్గీత సర్వమానవాళికి. అయితే తన స్థితిని గ్రహించి భగవంతునో, భగవద్గీతనో

శరణువేడాలి. అప్పుడే తాపం చల్లారేది, సరైన నిర్ణయం తీసుకోగలిగేది. అదిగో అర్జుననిది ఇప్పుడు సరిగ్గా అదే స్థితి. ఏది మంచిదో తేల్చుకోలేక సందిగ్ధావస్థలో పడ్డ అర్జునుడు ధర్మనిర్ణయం చేయగలశక్తిని కోల్పోయాడు. అందుకే తన ఎదుటనే ఉన్న సర్వజ్ఞుడు శ్రీకృష్ణ భగవానుని శరణుకోరుతున్నాడు. దీనికోసమే ఎదురు చూస్తున్నాడు భగవానుడు. ఎలా శరణాగతుడౌతున్నాడు అర్జునుడు?–

**శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః**
**పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢచేతాః ।**
**యచ్ఛ్రేయః స్యా న్నిశ్చితం బ్రూహితన్మే**
**శిష్యస్తే ఽహం శాధి మాం త్వాం ప్రపన్నం ॥ 7**

**తా:** కార్పణ్యదోషం చేత నా స్వభావం దెబ్బతిన్నది. ధర్మమేదో తెలుసుకోలేని వాడనై నిన్ను అడుగుతున్నాను. నాకు ఏది శ్రేయస్సో నిశ్చయించి దానినే తెలియజెయ్యి. నేను నీ శిష్యుణ్ణి. నిన్ను శరణుజొచ్చిన నాకు బోధించు.

**వ్యాఖ్య: కార్పణ్యదోషోపహతస్వభావః** ఈ లోకంలో ప్రతి వారికీ ఒక స్వభావం ఉంటుంది. అది నిర్మలంగానే ఉంటుంది. కాని ప్రకృతి యొక్క (వాసనలయొక్క) దోషాలతో అది మలిన మవుతుంది. కొందరికి కామదోషం. అంటే అంతులేని కోరికలు. కొందరికి క్రోధదోషం, కొందరికి లోభదోషం, కొందరికి అసూయాదోషం. ఈ దోషాలవల్ల వారికి కోపం, పిసినిగొట్టుతనం, ఇతరులు పచ్చగా ఉంటే కళ్ళల్లో నిప్పులు పోసుకొనే స్వభావం ఏర్పడతాయి. అయితే ఇక్కడ అర్జునుని స్వభావం **కార్పణ్యదోషం** చేత దెబ్బతిన్నది. ఈ విషయాన్ని స్వయంగా అర్జునుడే చెబుతున్నాడు. అందువల్లనే మనస్సు ధర్మాధర్మ విచక్షణ చేయలేకపోతున్నది.

కార్పణ్యం అంటే కరుణ–దయ అని ఒక అర్థం; కృపణత్వం అని ఒక అర్థం. మొదటి అర్థంలో ఇంతకు ముందే చెప్పుకున్నాం. 'తం తథా కృపయా విష్టం' కరుణతో ఆవహించ బడ్డ అర్జునుడు అని సంజయుడు మొదటి శ్లోకంలోనే చెప్పటం జరిగింది. ఇక రెండవ అర్థం కృపణత్వం. కృపణుడు అంటే లోభి అని, కృపణత్వం అంటే లోభం అని. మరి అర్జునుడు లోభియా? అతడి స్వభావం లోభంతో చెడిపోయిందా? పిసిని గొట్టును లోభి అంటారు. ఎంత సంపద ఉన్నా తాను అనుభవించడు, తన వారిని అనుభవించనీయడు, ఇతరులకు పెట్టడు. మరి అర్జునుడు అట్టి స్వభావం గలవాడా? "ఎవరి కోసం ఈ రాజ్యం,





భోగాలు, సుఖాలు కావాలనుకున్నామో అట్టి బంధువులు, ఆత్మీయులు చావుకు సిద్ధమై యుద్ధ రంగంలో నిలిచారే" అని ఆవేదన చెందినవాడు అర్జునుడు. 'నా సంపదలన్నీ నా వాళ్ళ కోసమే' అన్న త్యాగి అర్జునుడు. అట్టి వాడు లోభి అని ఎలా పరిగణించబడతాడు? కనుక కృపణత్వం అంటే మనం అనుకునే లోభికాదు. ఇంకేదో అంతరార్థం ఉంది ఉండాలి.

ఆ అంతరార్థం బృహదారణ్యకోపనిషత్తులో ఉన్నది. **"ఎవరైతే మానవజన్మనెత్తి కూడా అక్షరుడగు పరబ్రహ్మాన్ని తెలుసు కోకుండా మరణిస్తాడో అతడే కృపణుడు"** అని. అంటే అజ్ఞానియే – తాను ఆత్మనని తెలియని అజ్ఞానియే కృపణుడు. ఎందుకని అలా అన్నారు? అనంతమైన ఆనందమనే నిధి నీలోపలే ఉన్నా, దానిని తెలుసుకోకుండా, అనుభవించకుండా బయట వెతుక్కునే వాడు పిసినిగొట్టు గాక మరేమవుతాడు? కోట్ల ఆస్తులు కూడబెట్టిన వాడు తన ఆస్తులను తాను అనుభవించకుండా, ఎవరన్నా టీ ఇప్పిస్తారేమోనని వారి చుట్టూ వీరి చుట్టూ తిరిగే వాడు పిసినిగొట్టుల్లో నంబర్‌వన్. మనస్సు కన్నా, బుద్ధి కన్నా తాను వేరుగా ఉన్నానని; తన యదార్థ స్వరూపం ఆత్మయేనని, ఆత్మ అఖండ ఆనంద స్వరూపమని గ్రహించినవాడు అనంతమైన అఖండమైన ఆనంద స్వరూపంగా బ్రహ్మానందంలో ఓలలాడుతూ ఉండాలి. కాని ప్రతి మానవుడు ఆనందం కోసం, సుఖం కోసం, సంతోషం కోసం ఈ అనిత్యమైన ప్రపంచలోకి పరుగులు తీస్తూ అనిత్య వస్తువులు, విషయాలు, భోగాలకై అర్రులు చాస్తున్నాడు. తనలోని నిత్యమైన ఆనందాన్ని తెలుసుకోలేక అల్పమైన బయటి సుఖాల కోసం ప్రాకులాడుతున్నాడు. అందుకే ఇట్టి మానవుని – అజ్ఞాన మానవుని కృపణుడు అన్నది ఉపనిషత్తు.

ఇదే అర్జునునికున్నదోషం. ఆత్మజ్ఞానం లేకపోవుటే – నేను ఆత్మననే జ్ఞానం లేకపోవుటే అర్జునుని దోషం. ఇదే అన్ని దోషాలకు, దుఃఖాలకు మూలం.

అజ్ఞానమనే ఈ దోషం ఒక్కటుంటే చాలు అన్ని దోషాలు ఉన్నట్లే. ఎవడో అన్నాడట 'నాకే రోగమూ లేదండీ, ఒక్క కుష్ఠు రోగం తప్ప' అని. అదొక్కటుంటే చాలదా? అన్ని రోగాలు ఉన్నట్లే. కనుక ఆత్మజ్ఞానం లేనివాడు – ఆత్మనని తెలియనివాడు సమస్త దుఃఖాలను పొందాల్సిందే. ఇపుడు అర్జునుడు ఈ అజ్ఞాన దోషం వల్ల స్వభావం చెడిపోయి ధర్మమేదో, అధర్మమేదో నిశ్చయించ లేకపోతున్నాడు. అందుకే ధర్మ సంమూఢ చేతస్కుడయ్యాడు.

**ధర్మసంమూఢచేతాః** : యుద్ధం చేసి తన బంధువులు, ఆత్మీయులైన వారిని చంపటమా? లేక యుద్ధం మానేసి భిక్షా పాత్ర చేతబట్టి జీవనాన్ని కొనసాగించటమా? ఇదీ ధర్మ సంశయం. ఇలాంటి సమయంలో అవివేకులైన వారు సరియైన నిర్ణయం తీసుకోలేరు. కాని అర్జునుడు వివేకి. తన తప్పును తాను తెలుసుకున్నాడు. తన తప్పును తాను తెలుసుకొనుటే భక్తుడైన వాడికి, శిష్యుడైన వాడికి మొట్టమొదటి సుగుణం. అందుకే అర్జునుడు తన తప్పును తాను సరిదిద్దుకోవాలను కున్నాడు. ఇంతవరకు గొప్పజ్ఞానిలా ఏదేదో మాట్లాడాడు. ఇక అలాంటి తప్పు చేయకూడదని పరమాత్మను ఆశ్రయించాడు. 'త్వాంపృచ్ఛామి' నిన్ను అడుగుతున్నాను-అని నివేదించు కున్నాడు. ధర్మ స్వరూపాన్ని ఎరుగని వాడు, ఆత్మజ్ఞానం లేనివాడు తనకు తోచినట్లుగా ప్రవర్తించరాదు. ధర్మ నిర్ణయం చేయగల పెద్దల సహాయ సహకారాలను తీసుకోవాలి. దీనిని బట్టి సాధకుడికి గురువు అవసరమేమిటో తెలుస్తుంది. అందుకే అర్జునుడిక్కడ శరణాగతుడౌతున్నాడు.

**'యచ్ఛ్రేయఃస్యాన్నిశ్చితం బ్రూహితన్మే'** యఃశ్రేయస్యాత్ తత్ నిశ్చితం మే బ్రూహి- ఏది శ్రేయస్సును కలిగిస్తుందో దానినే నిశ్చయించి నాకు చెప్పు అంటున్నాడు. ఎవరు ఇలా అడగ గలుగుతారు?

తెలియని మూఢునికి 'తనకు తెలియదనే సంగతి కూడా' తెలియదు. మూఢత్వం పెరిగే కొద్దీ 'నాకన్నీ తెలుసు'ననే అహంకారం పెరుగుతుంది. 'నాకేమీ తెలియదు' అనే తెలివి రావాలంటే ఎంతో తెలివి కావాలి, వివేకం ఉండాలి. తనలోని గుణాలను కాక దోషాలను, లోపాలను గ్రహించగలిగేవాడే గొప్పవాడు. అట్టి వానికే క్షమాపణ లభిస్తుంది.

**'తప్పును ఒప్పుకుంటే ఆ తప్పు పొరపాటవుతుంది'**

**తప్పును సమర్థిస్తే ఆ తప్పు పాపమవుతుంది'**

ఇంతటి దుఃఖంలో, విషాదంలో ఉన్నా అర్జునునిలోని ఉదాత్తభావం పోలేదు. అందుకే ప్రేయస్సును గాక శ్రేయస్సునే చెప్పమంటున్నాడు. తన తప్పును తాను తెలుసుకొని అర్థిస్తున్నాడు. సాక్షాత్తు భగవానునే ముందు పెట్టుకొని తన అజ్ఞానాన్నంతా వెళ్ళబోసుకున్నాడు ఇంతవరకు. అందుకే నాకు ఏది శ్రేయస్సో దానినే నిశ్చయించి చెప్పు అని ప్రాధేయపడు తున్నాడు. శ్రేయస్సు





అంటే నిత్యసుఖం. ప్రేయస్సు అంటే అనిత్యమైన లౌకిక సుఖం అని కఠోపనిషత్‌లో స్పష్టం చేశారు. ఈ లోకంలోని సుఖసంతోషాలు గాని, స్వర్గాదిలోకాలలో లభించే సుఖాలు, భోగాలు గాని - అన్నీ ప్రేయస్సే. అవి మనం ఇక్కడ చేసే పుణ్యకర్మల ద్వారా లభించేవి. శ్రేయస్సు అంటే ఆత్మను తెలుసుకొని, ఆత్మానుభూతిని చెందటం ద్వారా- తాను ఆత్మగా ఉండిపోవటం ద్వారా లభించే నిత్యమైన, సత్యమైన, అఖండమైన, అమృతమయమైన, అక్షయమైన, అనంతమైన ఆత్మానందం. అర్జునుడడుగుతున్నది ఈ శ్రేయస్సునే.

తన తాపాన్ని తీర్చేవి ఈ రాజ్యము, భోగాలు, సుఖాలు కాదు. అలాగే స్వర్గలోక భోగాలు కాదు. ఎందుకంటే జ్వరం వల్ల వచ్చిన చలి కంబళ్ళు కప్పితే పోదు. జ్వరం పోతేనే చలి పోయేది. అలాగే అజ్ఞానం వల్ల వచ్చిన తాపం ఇహలోక సుఖాలతోనో, స్వర్గలోక భోగాలతోనో పోయేదికాదు. అజ్ఞానం పోతేనే ఈ తాపం చల్లారేది. అందుకే అడుగుతున్నాడు అర్జునుడు. ఈ ఇహలోక సుఖాలను, స్వర్గలోక భోగాలను నేను నా స్వశక్తితో సంపాదించుకోగలను. ఈ శరీరంతోనే స్వర్గలోకం వెళ్ళిన వాణ్ణి. అక్కడి సుఖాలకు చలించని వాణ్ణి. కనుక వాటితో నాకు పనిలేదు. నీలాంటి మహాత్ముని వద్దకు వచ్చి కూడా ఈ అల్పమైన సుఖాలను కోరుకోవటం అంటే 'కల్పవృక్షం దగ్గర కెళ్ళి కాకరకాయలు కోరుకున్నట్లే'. నేనలాంటి మూర్ఖుణ్ణి కాదు. నాకు శ్రేయస్సే కావాలి. అది నా ప్రయత్నంతో మాత్రమే సాధ్యపడేది కాదు. నీ అనుగ్రహం కూడా కావాలి. ఎందుకంటే ఆత్మజ్ఞానం ఎవరికి వారు పొందగలిగేది కాదు. ఒక సద్గురువును ఆశ్రయించి, ఆయనను సేవించి, ఆయన అనుగ్రహాన్ని పొంది మాత్రమే సాధించగలం. కనుక నిన్ను కోరుతున్నాను. అలా కోరేందుకు నాకు అర్హత ఉన్నది. ఏమిటా అర్హత అంటావా?

**శిష్యస్తేఽహం శాధిమాంత్వాం ప్రపన్నం** : అహంతేశిష్య= నేను నీ శిష్యుడను. ప్రపన్నం=శరణుజొచ్చాను. త్వాంమాంశాధి = నీవు నన్ను శాసించు. ఓ మహానుభావా! నేను నిన్ను ఊరికే అడగటం లేదు. ఆషామాషీగా అడగటం లేదు. శిష్యుడిగా అడుగుతున్నాను. నీవు నాకు గురువువు. నేను నీకు శిష్యుడను. ఇంతవరకు మనది దేహ సంబంధం. బావాబావమరుదులం. ఇప్పుడా సంబంధాన్ని వదిలేశాను. ఇది కొత్త సంబంధం. లోకంలో కొందరు శిష్యులు

గురువు తమతో సన్నిహితంగా ఉంటే మా బాబాయ్, మా అన్నాయ్, మా అంకుల్ అంటూ సంబంధాలు కలుపుతుంటారు. అన్నింటికన్న గొప్ప సంబంధం గురుశిష్య సంబంధం. అందుకే అర్జునుడు రక్త సంబంధాన్ని వదలి గురుశిష్య సంబంధాన్ని ముందుకు తెస్తున్నాడు. అంతే కాదు లోకంలో కొందరు శిష్యులు గురువుగారు, గురువుగారు అని ఎదురుగా పొగుడుతుంటారు. గురువు చెప్పినట్లే వింటాం అంటారు. ఆ గురువు వల్లనే ఇంతటివాళ్ళం అయ్యాం అంటారు. తల్లీ, తండ్రీ, భార్య, భర్త అందరికన్నా గురువే అధికుడని చెబుతారు. కాని సమయమొచ్చినప్పుడు ఆ గురువుకే పంగనామాలు పెడతారు. ఇంతటివాళ్ళం కావటానికి మా ప్రతిభే కారణం అంటారు. అవసరమైతే గురువుకు ద్రోహం చెయ్యటానికి కూడా వెనుకాడరు. అయితే ఇది గురువుకు ద్రోహం చెయ్యటం కాదు, తమకు తామే ద్రోహం చేసుకోవటం. తమ పతనానికి తామే మార్గం వేసుకోవటం.

అయితే నేను అలాంటి శిష్యుణ్ణి కాదు. నేను నిన్ను పూర్తిగా శరణుపొందాను. నీవు నన్ను శాసించు. నీవెలా చెబితే అలా నడుచుకుంటాను. పాలముంచినా, నీటముంచినా నీదే భారం. **'నీవే తప్పనితః పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్'.** నేను ప్రపన్నుడను. నీవు ప్రపన్న పారిజాతానివి. ప్రభూ! కాపాడు– అని శరణాగతుడౌతున్నాడు అర్జునుడు.

రామాయణంలో విభీషణ శరణాగతి ఉన్నది. భాగవతంలో గజేంద్రుని శరణాగతి శ్రేష్టమైనది. అలాగే భారతంలో అర్జున శరణాగతి. ఈ మూడూ సుప్రసిద్ధమైనవే.

శరణాగతిలో 3 రకాల శరణాగతులున్నాయి. (1) నేను నీవాడను అనేది. (2) నీవు నా వాడవు అనేది (3) నీవే నేను, నేనే నీవు అనేది. ఈ మూడూ ఒకదానికన్న ఒకటి గొప్పవి.

(1) **నేను నీ వాడను**: నీవు ప్రభువువు.–నేను సేవకుణ్ణి. నీవు స్వతంత్రుడవు– నేను పరతంత్రుడను. నీవు ఇచ్చేవాడివి– నేను పుచ్చుకునేవాణ్ణి అనే భావన. ఇది ప్రతివారికీ అనుకూలమైన, సాధ్యమైన కర్మమార్గంలోని శరణాగతి.

(2) **నీవు నా వాడివి** : ఇక్కడ భక్తుడు స్వతంత్రుడు. భగవంతుడే పరతంత్రుడు. ఇది భక్తిమార్గంలోని శరణాగతి. మీరాబాయి, రామదాసు,





సూరదాసు, సక్కుబాయిలాంటి వారు ఇలాంటి శరణాగత భక్తులు. వారి కష్టాలను భగవంతుడే భరించాడు. సూరదాసు అంధుడు, బృందావనానికి బయలు దేరాడు. అరణ్యంలో దారితప్పి ప్రయాణిస్తున్నాడు. తోడుగా ఎవరూ లేరు. ప్రమాదకరమైన మార్గం వెంట పోతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడే బాలుని రూపంలో వచ్చి, సరైన మార్గంలో పెట్టి అదృశ్యుడై పోయాడు. ఆ తర్వాత గ్రహించాడు సూరదాసు, అతడు మామూలు బాలుడు కాదు, మాయాబాలుడు అని. ఇప్పుడు భక్తిలో ఉన్మత్తుడై అంటున్నాడు సూరదాసు, "కృష్ణా! తెలిసిందయ్యా తెలిసింది పెద్ద మొనగాడివి. నా చేతి నుండి తప్పించుకు పోయావు గాని, ఏదీ నా హృదయం నుండి తప్పించుకో చూస్తా నీ తడాఖా ఏమిటో" అని. ఇక భక్త రామదాసు అంటున్నాడు – "ఎవడబ్బ సొమ్మని కులుకుతూ ఉన్నావు" అని. భక్తుడు భగవంతుని నిలదీయగల శక్తికి ఉదాహరణలు ఇవి. అందుకే 'నేను భక్త పరతంత్రుడను' అని భగవంతుడే అంటాడు.

(3) **నీవే నేను – నేనే నీవు** : ఇది అద్వైత శరణాగతి. జ్ఞానమార్గంలోనిది సర్వశ్రేష్టం. అన్నీ అర్పించి తనను మిగిలించుకుంటే లాభం ఏముంది. అన్నీ భగవంతుడే. వాసుదేవస్సర్వం. భక్తుడు భగవంతుడయ్యే పరాకాష్టదశ. జీవ బ్రహ్మైక్యస్థితి. నీవు నేను అని రెండు లేవు. ఉన్నదంతా ఒక్కటే. అదే నేను. అదే నీవు (తత్త్వమసి)

అర్జునుడు యుద్ధభూమిలో ప్రవేశించినపుడు ద్వేషవృత్తి ఉన్నది. దాని ప్రభావంతోనే 'రెండుసేనల మధ్య నా రథాన్ని నిలుపు' అని హుకుం జారీ చేశాడు. భీష్మద్రోణులను చూడగానే ద్వేషవృత్తి తొలగి మమకారవృత్తి పెరిగింది. దాని ప్రభావంతో ధీరుడు కాస్తా దీనుడయ్యాడు. యుద్ధం ధర్మమని శ్రీకృష్ణుడంటే అధర్మమని అర్జునుడంటున్నాడు. ఒకరిది ప్రమాదృష్టి. మరొకరిది భ్రమాదృష్టి. అందుకే కార్పణ్య దోషంతో నాస్వభావం చెడిపోయింది అన్నాడు. ఈ ద్వేషవృత్తి, మమకారవృత్తి జ్ఞాన బోధకు అనుకూలం కాదు.

అర్జునుని పుణ్యమో, భగవంతుని అనుగ్రహమో, మన అదృష్టమో గాని అర్జునునిలో ఆ రెండు వృత్తులూ తొలగి శరణాగతవృత్తి కలిగింది. దాని ప్రభావం వల్ల అర్జున హృదయమనే భూమి, జ్ఞానమనే విత్తనం నాటటానికి అనుకూలమైంది. తన మనోవేదననంతా గురువుకు నివేదించి తన భారాన్ని దించుకోబోతున్నాడు అర్జునుడు.

శ్లో ॥ నహిప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం।
అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపిచాధిపత్యం॥ 8

తా॥ : ఇంద్రియాలను దహింపచేస్తున్నట్టి నా యీ శోకాన్ని తొలగించే ఉపాయమేదో తెలియటం లేదు. శత్రువులు లేనట్టి, సర్వసమృద్ధమైన ఈ భూలోక రాజ్యంగాని, దేవలోక రాజ్యాధిపత్యం గాని ఈ శోకాన్ని తొలగించలేవు.

వ్యాఖ్య : అర్జునుడు భరించలేని మనోవేదనలో ఉన్నాడు. ఈ మనోవేదన తొలగే మార్గం ఏదో తెలియటం లేదు. తనకున్న తెలివితేటలేవీ తన దు:ఖాన్ని తొలగించలేకపోతున్నాయని గ్రహించాడు. అందుకే తన సారథి, సచివుడు అయిన శ్రీకృష్ణునే తన గురువుగా జేసుకొని తన దు:ఖం తొలగే ఉపాయాన్ని అర్థిస్తున్నాడు. ఎంతటి వీరుడైనా, ధనవంతుడైనా, మేధావియైనా, అధికారియైనా, రాజైనా, పేదైనా, స్త్రీయైనా, పురుషుడైనా తన సమస్యనుతాను పరిష్కరించుకొనుటకు అసమర్థుడైనప్పుడు, తీవ్రమైన మనోవేదనలో ఉన్నప్పుడు భగవత్స్వరూపులైన గురువులను, మహాత్ములను, జ్ఞానులను ఆశ్రయించాలి. అదే తెలివి. ఇప్పుడు అర్జునుడు అదే చేశాడు. శ్రీకృష్ణుని గురువుగా జేసుకొని, తాను శిష్యుడై, ఆయనను సంపూర్ణంగా శరణుపొందాడు. ఎందుకంటే మనస్సులోని బాధ ఏదో నోటితో వివరించి చెప్పలేకపోతున్నాడు. తనతోపాటుగా యుద్ధం చేయటానికి ఇరుపక్షాలలోనూ ఎందరో వీరయోధులున్నారు. వారెవ్వరికీ ఈ దు:ఖంగాని, మనోవేదనగానీ లేదు. చివరకు తన అన్న ధర్మరాజుకు కూడా ఈ దు:ఖం, బాధ ఉన్నట్లు లేదు. మరి తనకే ఎందుకీ బాధ? ఈ బాధ తన ఇంద్రియాలను దహించివేస్తున్నది. ఇక ఈ బాధను తాను ఎంతోసేపు భరించలేడు. తనకేదైనా మార్గం చూపకపోతే తానిక బ్రతకలేడు.

తన ఈ బాధను పోగొట్టేదేమిటి? బాహ్య ప్రపంచంలోని వస్తువులు పోగొడతాయా? అహ! శత్రువులు లేనటువంటి, సకల సంపదలతో కూడినట్టి ఈ భూలోక రాజ్యం తనకు వస్తే తన మనోవ్యధ తీరుతుందా? లేదు. పోనీ ఈ భూలోకరాజ్యం అలవాటైందే గనుక దేవలోక రాజ్యం అంతా తన చేతికొచ్చి,





దేవతలపై అధికారం వస్తేనన్నా ఈ బాధ తీరుతుందా? అహ తీరదు. మరి దేనితో తీరుతుంది? అదే తెలియటం లేదు. ఇదే అర్జునుని ప్రస్తుత పరిస్థితి.

దీనినిబట్టి మనకొక విషయం స్పష్టమవుతున్నది. **ఈ ప్రపంచంలో ఎన్ని రకాల సంపదలున్నా, ధనమున్నా, ఇళ్ళు, వాకిళ్ళున్నా, అనుచరులు-సహచరులు ఉన్నా, గొప్ప గొప్ప పదవులున్నా మనిషిలోని అశాంతిని, వ్యధను తొలగించలేవు. ఈ అశాంతి అనే జబ్బు పోవాలంటే ఆత్మజ్ఞానం అనే పరమౌషధం కావాలి.**

ముంగిస పాములతో పోరాడి చంపుతుంది. కాని నాగుపాముతో పోరాటం కొంచెం కష్టం. నాగుపాముకు విషం ఎక్కువ. అందువల్ల నాగుపాముతో పోరాడాల్సి వచ్చినప్పుడు దానినొక తీగ దగ్గరకు తీసుకెళ్ళి అక్కడ పోరాడుతుంది. నాగుపాము కాటువేసినప్పుడల్లా ముంగిస ఆ తీగను కొరికి రసం పీలుస్తుంది. ఆ రసం విషాన్ని హరిస్తుంది. ఇలా పోరాడి చివరకు నాగుపామును చంపుతుంది.

ఈ సంసారం కూడా నాగుపామువంటి విషసర్పమే. దానికాటుకు జీవులకు అశాంతి, దు:ఖం. అది తొలగాలంటే ఆత్మజ్ఞాన మనే తీగ దగ్గరకు చేరాలి. మహాత్ముల సాన్నిధ్యానికి చేరాలి.

అందుకే అర్జునుడు భగవానుని ఆశ్రయించాడు. భగవానుడు ఆత్మజ్ఞానమనే మందును ఇవ్వబోతున్నాడు.

లోకంలో ఎవ్వరికైనా సరే మానసిక వ్యధలు, బాధలు, దు:ఖాలు తొలగాలన్నా, శాశ్వతమైన ఆనందం కలగాలన్నా, ప్రాపంచిక వస్తువులు, విషయాలు, సుఖాలు లభిస్తే ప్రయోజనం లేదు. వాటివల్ల శాశ్వతమైన ఆనందం రాదు. కారణం-అవి అశాశ్వతమైనవి గనుక. అశాశ్వత వస్తువుల వల్ల అశాశ్వతమైన ఆనందమే. శాశ్వతమైన ఆత్మజ్ఞానం - నేను ఆత్మననే జ్ఞానం-నేను పరమాత్మననే జ్ఞానం - 'అహం బ్రహ్మాస్మి' అనే అనుభవజ్ఞానం మాత్రమే అఖండమైన, అనంతమైన, శాశ్వతమైన బ్రహ్మానందాన్ని ఇవ్వగలుగుతుంది.

కనుక ప్రపంచంలో ఎవ్వరైనా సరే సంపాదించాల్సింది. లౌకిక వస్తువులను, సుఖాలను, భోగాలను పదవులను కాదు. శాశ్వత ఆనంద ప్రదాయిని అయిన ఆత్మజ్ఞానాన్నే.

అందుకే శ్రీకృష్ణుడు లోకంలోని సర్వమానవుల సమస్త దు:ఖాలను పోగొట్టటానికి,

కలియుగానికి ముందు –ద్వాపరయుగం చివరలో అర్జునుని నిమిత్తంగా చేసుకొని, సర్వ మానవాళికీ ఈ ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించాడు. అందుకోవటమో–జారవిడుచుకోవటమో మన ఇష్టం. అందుకున్నవారిదే అదృష్టం.

యుద్ధరంగంలో అర్జునుడిలా భగవానుని శరణుజొచ్చిన తరువాత ఏమి జరిగిందో హస్తినాపురంలోని ధృతరాష్ట్ర మందిరంలో సంజయుడు ధృతరాష్ట్రునికి తెలియజేస్తున్నాడు.

**సంజయ ఉవాచ:**

**శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశ: పరంతప: ॥**
**నయోత్స్య ఇతిగోవిందం ఉక్త్వా తూష్ణీం బభూవహ॥ (9)**

**తా॥:** సంజయుడంటున్నాడు: పరులను తపింపజేసే ఓ రాజా! గుడాకేశుడైన అర్జునుడు హృషీకేశునితో (శ్రీకృష్ణునితో) ఇలా చెప్పి, యుద్ధం చెయ్యనని ముభావంగా (మౌనంగా) ఉండిపోయాడు.

**వ్యాఖ్య:** అర్జునుని విషాదాన్ని పూసగుచ్చినట్లు చెబుతున్నాడు సంజయుడు. లోలోపల పొంగిపోతూ వింటున్నాడు ధృతరాష్ట్రుడు. యుద్ధం చెయ్యనని శ్రీకృష్ణునితో చెప్పి అర్జునుడు ముభావంగా ఉండిపోయాడని తెలియటంతో ధృతరాష్ట్రునికి ఎంత సంతోషం కలుగుతుందో సంజయునికి తెలుసు. అయినా జరిగిన విషయాన్ని జరిగినట్లు చెబుతూనే, ధృతరాష్ట్రునికి హితాన్ని ఉపదేశించాలనేదే సంజయుని ఉద్దేశం.

అప్పట్లో యుద్ధాన్ని ఆపే అధికారం, పదవి ఆ గ్రుడ్డిరాజు చేతుల్లోనే ఉంది. తమవారికి విజయం కలుగుతుందని తెలిస్తే ఎట్టి పరిస్థితులలోనూ యుద్ధాన్ని ఆపడు ధృతరాష్ట్రుడు. శతృవులే జయిస్తారని ఖచ్చితంగా తెలిస్తే గాని యుద్ధాన్ని అపమని ఆజ్ఞాపించడు. అందుకే సంజయుడు ఎంతో జాగ్రత్తగా పదాలను ప్రయోగిస్తున్నాడు.

ఇక్కడ ధృతరాష్ట్రుని 'పరంతపా'! అంటే పరులను తపింపజేసేవాడా అని సంబోధిస్తున్నాడు. యుద్ధంలో శతృవులను చీకాకుపరచి, వారిపై విజయం సాధించే వీరులను – అర్జునునిలాంటి వారిని–పరంతపుడని పిలవటం ఎంతో సమంజసం. మరి ఎన్నడూ యుద్ధరంగంలో ప్రవేశించే వీలు లేని గ్రుడ్డిరాజును పరంతపా అని





ఎందుకంటున్నాడు? నీ దుర్మార్గాలచేత పాండవులను తపింపజేసినవాడా! అనే ఉద్దేశంతోనే అలా అని ఉండాలి సంజయుడు.

అంతేకాదు ఈ శ్లోకంలో శ్రీకృష్ణుని 'హృషీకేశుడు' అని, అర్జునుని 'గుడాకేశుడు' అని సంబోధిస్తున్నాడు సంజయుడు. ఈ పదాలను ప్రయోగించటంలో సంజయుని ఆంతర్యం ఏమై ఉంటుంది?

'హృషీకేశుడు' అంటే హృషీకాలను (ఇంద్రియాలను) ప్రేరేపించేవాడు– అని. 'గుడాకేశుడు' అంటే నిద్రను జయించినవాడు– అని. నిద్ర తమోగుణ లక్షణం. అర్జునుడిప్పుడు తమోగుణాన్ని జయించాడు. శ్రీకృష్ణుని పోటుమాటలతో ఇప్పుడు రజోగుణంలోనికి ప్రవేశించాడు. రజోగుణంలోకి వచ్చిన అర్జునుడు ఊరకే ఉండలేడు. ఇంద్రియాలను ప్రేరేపణ చేసే శ్రీకృష్ణుడు అతడిని ఊరకే ఉండనివ్వడు. "కనుక నీ ఆశలు నెరవేరవు. గాలిలో మేడలు కట్టి ఆనందించకు ఓ అంధరాజా! అర్జునుని చేత తప్పక యుద్ధం చేయించి విజయం చూరగొనేట్టు చేస్తాడు శ్రీకృష్ణుడు" అని సంజయుని ఆంతర్యం.

"నాకు ఏది శ్రేయస్సో దానినే నిశ్చయించి చెప్పు. నేను నీ శిష్యుణ్ణి" అని ఇంతకుముందు చెప్పిన అర్జునుడు 'నయోత్స్య' ఇతి గోవిందం' యుద్ధం చెయ్యను అని ఈ శ్లోకంలో అంటున్నాడేమిటి? అర్జునుడు మాట తప్పుతున్నాడా?

అర్జునుడు యుద్ధం చెయ్యటానికే యుద్ధరంగానికి వచ్చింది. ఇక్కడకు రాగానే భీష్మద్రోణాదులను చూడడంతో మమకారమనే జబ్బు పట్టుకుంది. అందుకే యుద్ధం వల్ల కలిగే నష్టాలను, ఇబ్బందులను ఏకరువు పెట్టి చివరకు తన అభిప్రాయంగా యుద్ధం చెయ్యను అని మౌనంగా ఉండిపోయాడు. అంటే శిష్యుడు తాను చెప్పదలచుకున్నదంతా గురువుకు విన్నవించి, గురువు యొక్క ఉపదేశం కోసం ఎదురు చూస్తున్నాడు. స్వతంత్రించి నేనే నిర్ణయం తీసుకోను, నీవు ఎలా ఆదేశిస్తే అలా చేస్తాను అనే ఇక్కడ అర్జునుని భావన. గురువు యొక్క ఉపదేశాన్ని పొందటానికి శిష్యుడు సర్వ సన్నద్ధం కావటం ఈ శ్లోకంలోని ప్రధాన విషయం. శిష్యుడు తన బాధనంతా వెళ్ళగ్రక్కి గురువు వద్ద తన మనస్సును ఖాళీ చేసుకోవాలి. అలా ఖాళీయైన మనస్సులోనే జ్ఞానబీజం నాటుకుంటుంది. అందుకే బ్రహ్మసూత్రాలలో 'సన్యస్యశ్రవణం కుర్యాత్' శ్రవణం చేసేవాడు అన్ని ఆలోచనలను విడిచిపెట్టి శ్రవణం

చెయ్యాలి- అని చెప్పటం జరిగింది. సంచిని చెత్తా చెదారంతో నింపితే ఉపయోగపడే వస్తువులను వెయ్యటానికి చోటుండదు. అలాగే మనస్సును ప్రాపంచిక విషయాలతో నింపితే పరమాత్మ సంబంధమైన జ్ఞానానికి చోటుండదు. ఇక్కడ అర్జునుడు తన లోపల ఉన్న వాటన్నింటినీ కక్కి వేశాడు. తన సమస్యను చెప్పి మౌనంగా ఉండిపోయాడు. శిష్యుడలా ఉండిపోవాలి. అప్పుడే గురుబోధకు ఆస్కారం. అలాగాక గురువును మాట్లాడనీయకుండా శిష్యుడు పదే పదే అడ్డు తగులుతూ, తానే అన్నీ చెబుతూ ఉంటే అట్టి వానికి ఉపదేశం ఎక్కదు. అందుకే అర్జునుడు మౌనంగా ఉన్నాడు.

సంజయుడు భగవానుని గీతాజ్ఞానబోధకు అవకాశం కల్పిస్తూ పూర్వపీఠికలోని చివరిమాటలు చెబుతున్నాడు.

**శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివభారత।**
**సేనయోరుభయోర్మధ్యేవిషీదంత మిదం వచః॥ (10)**

**తా॥:** భారతా! రెండుసేనల మధ్య దుఃఖిస్తున్న అర్జునునితో శ్రీకృష్ణుడు నవ్వుతూ ఇలా అంటున్నాడు.

**వ్యాఖ్య :** ఈ శ్లోకంలో సంజయుడు ధృతరాష్ట్రుని భారత! అని సంబోధిస్తున్నాడు. భారత-అంటే భరతవంశంలో జన్మించినవాడా' అని. అయ్యా! మీ వంశంలో ఎందరో మహామహులు జన్మించి విశేషమైన ప్రతిభాపాటవాలు చూపారు. వంశకీర్తిని, ప్రతిష్టను నిలబెట్టారు. అట్టి వంశంలో జన్మించిన నీవు వంశనాశనానికి పూనుకోవద్దు అనే భావమూ ఇమిడి ఉంది ఈ సంబోధనలో. అదే సమయంలో గొప్పదైన భరతవంశంలో జన్మించావు-అని ప్రశంస కూడా కావచ్చు. ఎందుకంటే ఇంతకుముందే పాండవులను ఎన్నో క్లేశాలకు లోనుగావించి వారిని తపింపజేశావు-అనే భావాన్ని 'పరంతప' అంటూ వ్యక్తం చేసినందున గ్రుడ్డిరాజు తనపై మరింత ద్వేషంతో, కోపంతో ఉండి ఉంటాడు. ఆ కోపాన్ని, ద్వేషాన్ని తొలగించటానికి అలా భరతవంశోద్భవుడవని ప్రశంసించి ఉండవచ్చు. ధృతరాష్ట్రుని మనోభావాలను పసిగట్టగల సంజయుడు ఎప్పుడు ఎలా మాట్లాడితే బాగుంటుందో అలాగే మాట్లాడుతున్నాడు.

**సేనయోరుభయోర్మధ్యే: ఉభయో: సేనయో: మధ్యే** - రెండు సేనల మధ్య.





ఇప్పుడు కృష్ణార్జునులిద్దరూ రెండు సేనల మధ్య నిలిపిన రథంలో ఉన్నారు. ఒకటి పాండవపక్షం మరొకటి కౌరవపక్షం. ఒకటి ధర్మపక్షం, మరొకటి అధర్మపక్షం. ఈ రెండు పక్షాల మధ్య నిలిచి విషాదంలో ఉన్న అర్జునునికి నవ్వుతూ భగవానుడు జ్ఞానబోధ చేయబోతున్నాడు.

ఈ ప్రపంచం ధర్మం-అధర్మం, న్యాయం-అన్యాయం, పుణ్యం-పాపం, మంచి-చెడు అనే ద్వంద్వాలతో కూడుకొని ఉన్నది. న్యాయస్థానంలో న్యాయమూర్తిగాని, సమాజంలో ఒక పెద్ద మనిషిగాని ఏదైనా తీర్పును లేదా మంచిని చెప్పాల్సి వచ్చినప్పుడు ఏదో ఒక పక్షం వైపు సపోర్ట్ చేస్తూ-లేదా సమర్థిస్తూ చెప్పకూడదు. ఇరువురి వాదనలు విని నిష్పక్షపాతంగా న్యాయమని తోచినదానిని చెప్పాలి. అలాగే ఇక్కడ కూడా భగవానుడు రెండు పక్షాల మధ్యన నిలిచి తాను చెప్పదలచుకున్న జ్ఞానాన్ని చెప్పబోతున్నాడు. అలాగే అర్జునుడు కూడా తన మనస్సులోని ధర్మం-అధర్మం అనే రెండు భావాల మధ్య నిలిచి భగవంతుని కృపను, గురువు యొక్క ఉపదేశాన్ని స్వీకరిస్తున్నాడు అని ఆంతర్యం.

మానవ జీవితం ద్వంద్వాలతో కూడుకొని ఉన్నది. నిర్ణయాలు తీసుకోవాలంటే మనోబుద్ధులు రెండూ తటస్థస్థితిలో ఉండాలి.

మరొక విధంగా కూడా భావించవచ్చు. రెండు పక్షాల మధ్య నిలిచి చెబుతున్నాడంటే మంచి-చెడు అనే ద్వంద్వాలతో కూడుకున్న ఈ లోకంలో సమస్త మానవుల కొరకు అద్భుతజ్ఞానాన్ని అందివ్వబోతున్నాడు-అని.

అయితే ఇపుడీ జ్ఞానబోధ ఎవరికి? విషీదంతం- విషాదంలో ఉన్న అర్జునునికి. దుఃఖంలో ఉన్న అర్జునునికి. దుఃఖంలో ఉన్నదీ, ఉండేదీ అర్జునుడు మాత్రమే కాదు. ఈ విశ్వంలో అందరూ దుఃఖించేవాళ్ళే. కాకపోతే కొందరు గట్టిగా దుఃఖిస్తే, మరికొందరు గుట్టుగా దుఃఖిస్తారు. అందువల్ల ఈ సమస్య అర్జునుని సమస్యే కాదు, విశ్వమానవ సమస్య. అందుకే భగవద్గీత దుఃఖించే వాళ్ళందరికోసం-వారి దుఃఖ నివారణకోసం చెప్పబడింది. ఇట్టి భగవద్గీతను 'ఇది మనలాంటి వాళ్ళకోసం కాదులే' అని కొందరు అజ్ఞానంతోనూ, అమాయకత్వంతోనూ అంటూ ఉంటారు. భగవద్గీతకు దూరంగా ఉంటారు. కాని సర్వమానవుల యొక్క దుఃఖాన్ని సంపూర్ణంగా తొలగించి, శాశ్వత ఆనందానికి మార్గం చూపేదే భగవద్గీత-అని

గ్రహించాలి.

సరే విషాదంలో–దు:ఖంలో ఉన్న అర్జునునికి బోధిస్తున్న దెవరు? హృషీకేశ: – శ్రీకృష్ణ భగవానుడు. ఎలా బోధిస్తున్నాడు. 'ప్రహసన్నివ' నవ్వుతూ. ఇక్కడ భగవానుడేమో నవ్వుతున్నాడు, అర్జునుడేమో ఏడుస్తున్నాడు. ఇదే విచిత్రం. ఏడుస్తున్న అర్జునుణ్ణి చూసి భగవానుడెందుకు నవ్వుతున్నట్లు?

(1) అర్జునా! ఎందుకయ్యా ఇక్కడ ఏడుస్తావు? ఆ ఏడ్చే ఏడుపేదో ఇంటిదగ్గరే ఏడవకపొయ్యావా? వచ్చి వచ్చి ఇక్కడ – ఈ యుద్ధరంగంలో ఏడుస్తావేంటీ?" అందరూ నిన్ను చూసి నవ్వరా? అని నవ్వా?–

(2) 'శిష్యస్తే2 హం శాధిమాం త్వాం ప్రపన్నం' నేను నీ శిష్యుణ్ణి, నేను నిన్ను శరణుజొచ్చాను. నన్ను శాసించు. నీవు చెప్పినట్లు చేస్తాను? అని అంటూనే 'నయోత్స్య ఇతి గోవిందం' – యుద్ధం చెయ్యను అంటున్నావు. ఇంతకూ నేను చెప్పినట్లు చేస్తావా? లేక నీ ఇష్టం ప్రకారం చేస్తావా? అని నవ్వా?–

(3) తాను గీతాబోధ చెయ్యటానికి, సర్వమానవాళికి ఆత్మజ్ఞానాన్ని అందించటానికి నిమిత్తంగా ఎంచుకున్న అర్జునుడు తన వలలో పడి, తన శిష్యుడై–జ్ఞానబోధకు సిద్ధపడినందుకు నవ్వా?–

(4) శిష్యుడికి తన బాధలు, సమస్యలు, సందేహాలు, భయంకరంగా అనిపిస్తాయి. అందువల్ల అమిత దు:ఖం కలుగుతుంది. కాని గురువు దృష్టిలో ఇవేవీ అంత గొప్ప సమస్యలు కావు. అందువల్ల పసిపిల్లల చర్యలకు పెద్దలు నవ్వినట్లు, అయ్యో ఈ మాత్రం దానికే ఇంతగా ఏడవాలా? నీకేం పరవాలేదు. నేనున్నాను గదా! అని అభయమిస్తున్నట్లు నవ్వా?–

ఇందులో ఏదైనా కావచ్చు. కొన్నిగావచ్చు. అన్నీ గావచ్చు. అయితే ఎన్నడూ ఏడవని అర్జునుడు ఏడ్చాడు. ఏదో జబ్బు. ఆ జబ్బుకు వైద్యుడు శ్రీకృష్ణుడు. "వైద్యో నారాయణోహరి" అన్న మాట నిజమైంది. జబ్బుకు అసలు కారణం ఏదో తెలుసుకొని నయం చేసే వైద్యుడు దొరికాడు.

దు:ఖానికి కారణం దేహం. దేహానికి కారణం మనం పూర్వంలో చేసుకున్న కర్మలే. కర్మలకు కారణం రాగద్వేషాలు. రాగద్వేషాలకు కారణం ద్వైతబుద్ధి, ద్వైతబుద్ధికి కారణం అజ్ఞానం. అంటే దు:ఖానికి మూలకారణం అజ్ఞానం.





కనుక అజ్ఞానం తొలగితే గాని దు:ఖం పోదు. పైపై చికిత్సలు ఎన్ని చేసినా ప్రయోజనం లేదు. అసలు కారణం కనుక్కొని చికిత్స చేయాలి. రోగం ఒకచోట–మందొకచోట వేస్తే ప్రయోజనం ఏముంటుంది?

కొడుక్కి తేలుకుట్టిందని తండ్రి డాక్టరు దగ్గరకు పరుగెత్తాడు. డాక్టరు మందు ఇచ్చి కుట్టినచోట వెయ్యమన్నాడు. తండ్రి ఇంటికి వచ్చి, నాయనా ఎక్కడరా తేలు కుట్టింది? అని అడిగాడు. అదిగో! ఆ మూలన కుట్టిందని చూపించాడు కుమారుడు. మందు తీసుకెళ్ళి ఆ మూలన వేశాడు ఆ తండ్రి. రోగమెక్కడ? మందెక్కడ?

అర్జునుని దు:ఖానికి మూలకారణం కనుక్కొని, ఆ మూలకారణం అజ్ఞానం అని తెలుసుకొని, ఆ అజ్ఞానం తొలగటానికి ఆత్మజ్ఞానమే సరైన మందు అని గ్రహించి, ఆ అఖండ ఆత్మజ్ఞానాన్ని బోధించటానికి ఉద్యుక్తుడవుతున్నాడు భగవానుడు.

## వ్యాఖ్యాత విన్నపము

**ఈ లోకంలోని మానవులందరి యొక్క దు:ఖాలను పూర్తిగా తొలగించటానికి, శాశ్వతమైన ఆనందాన్ని ప్రాప్తింప జేయడానికి భగవానుడు శ్రీకృష్ణుడు అన్ని ఉపనిషత్తుల యొక్క సారాన్ని పిండి, గీతా జ్ఞానమనే అమృతాన్ని అందించటం జరిగింది. భగవద్గీతను మహాత్ముల ద్వారా విన్నవారు, చదివినవారు, తెలుసుకోవాలనే అభిరుచిగలవారు ఎవరైనా చదువుతారు, ప్రయోజనం పొందుతారు. కాని భగవద్గీత అంటే మనలాంటి సామాన్యులకు ఒక పట్టాన అర్థమయ్యేది కాదు; అదెవరో పండితులకు, మహాత్ములకు, సన్యాసుల కొరకు చెప్పబడింది–అనే అపోహతో ఉన్నవారు ఇంతవరకు ప్రచురించిన శ్లోకాలలో ఏ ఒక్క శ్లోకంపై వ్యాఖ్యనైనా ప్రశాంత చిత్తంతో చదివి, భగవద్గీత అర్థమవుతుందో కాదో ఒక నిశ్చయానికి రండి. అర్థమవుతుంది, ఒకటి రెండుసార్లు చదివితే తప్పక అర్థమవుతుంది అని అనుకున్నా ఈ అవకాశాన్ని జారవిడుచుకోకండి. ఇందులో మానవుడు నిత్యజీవితంలో కర్మలనెలా చేయాలో తెలియజెప్పే 'కర్మకాండ' ఉన్నది. భగవంతునిపై మనస్సు నిలిపి ఎలా భగవంతునికి దగ్గర కావాలో తెలియజెప్పే 'ఉపాసనాకాండ' (భక్తికాండ) ఉన్నది. అసలు భగవంతుడంటే నాకంటే వేరుగా ఎక్కడోలేదు, ఈ దేహ, ఇంద్రియ,**

మనోబుద్ధులకు చైతన్యాన్నిస్తూ సూక్ష్మాతి సూక్ష్మమై, స్వయం ప్రకాశమై, సర్వవ్యాపకమై, ఆత్మగా ఉన్న నేనే ఈ పరమాత్మను (అహం బ్రహ్మాస్మి) అని తెలియజెప్పే **'జ్ఞానకాండ'** ఉన్నది. ఆ జ్ఞానాన్ని-ఆత్మజ్ఞానాన్ని-'ఆత్మను నేను' అనే జ్ఞానాన్ని అనుభవంలోనికి తెచ్చుకొనేందుకు చేయవలసిన సాధనలను తెలియచెప్పే 'ధ్యానకాండ' ఉన్నది. పైకి కనిపించని అనేక అంతరార్థాలున్నాయి. అనేక ఆధ్యాత్మిక రహస్యాలున్నాయి. ఆచరణాత్మక సందేశాలు ఉన్నాయి. మానవుడు మాధవుడయ్యేందుకు కావలసిన సమస్తమూ ఉన్నాయి.

కనుక భగవానుడు దయతో బోధించిన ఈ అద్భుత జ్ఞానాన్ని, వ్యాసమహర్షి గ్రంథస్థం చేసిన ఈ దివ్యజ్ఞానామృతాన్ని గ్రోలి అమరులై, అమృతులై తరించాలని నా ఆకాంక్ష.

ఈ అమృతాన్ని పానం చెయ్యండి. జీవితాన్ని నందనవనం చేసుకోండి. ఇది న్యూస్‌పేపర్‌లాగానో, నవలలాగానో, కథలపుస్తకం లాగానో చదివి అవతల పడవేసే గ్రంథం కాదు. వీలైనన్నిసార్లు చదివి సారాన్ని మదిలో నిలుపు కోవలసిన గ్రంథం. కనుక అవకాశం ఉన్నంతవరకు ఎక్కువసార్లు చదివి, ప్రయోజనం పొందగలరని ఆశిస్తున్నాను.

*ఇక్కడినుండే భగవానుని గీతాజ్ఞాన బోధ ప్రారంభం*

**శ్రీభగవానువాచ:**

**శ్లో ॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।**
**గతాసూనగతా సూంశ్చ నానుశోచంతి పండితాః ॥ (11)**

**తా॥** భగవానుడంటున్నాడు: అర్జునా! దు:ఖించతగనివారిని గూర్చి నీవు దుఃఖిస్తున్నావు. గొప్ప పండితునిలాగా మాట్లాడుతున్నావు. కాని మరణించినవారిని గూర్చిగాని, జీవించియున్నవారిని గూర్చి గాని పండితులైనవారు ఎన్నటికీ దుఃఖించరు.

**వ్యాఖ్య:** రెండవ అధ్యాయంలోని ఈ 11వ శ్లోకం నుండే భగవానుని గీతాజ్ఞానబోధ ప్రారంభమై 18వ అధ్యాయం 66వ శ్లోకం వరకు అఖండంగా సాగిపోతుంది.

మొదటి అధ్యాయం మొదటి శ్లోకం నుండి రెండవ అధ్యాయం 10వ శ్లోకం వరకు గల 57 శ్లోకాలను భగవానుని గీతాజ్ఞాన బోధకు **'పూర్వపీఠిక'** అంటారు.





అలాగే చివరి 18వ అధ్యాయం 67వ శ్లోకం నుండి 78వ శ్లోకం వరకు గల 12 శ్లోకాలను భగవానుని గీతాజ్ఞానబోధకు **'ఉత్తరపీఠిక'** అంటారు. ఈ పూర్వపీఠిక-ఉత్తరపీఠికల మధ్యగల 632 శ్లోకాలు భగవానుని గీతాజ్ఞాన బోధ.

**'భగవద్గీత'** అనబడే జ్ఞానస్వరూప కల్పవృక్షానికి ఈ 11వ శ్లోకం **'బీజశ్లోకం'**. అందుకే ఋష్యాదిన్యాసంలో **'అశోచ్యానన్వశోచస్త్వమితిబీజం'** అని సంకల్పం చెప్పటం జరిగింది. చెట్టుమొత్తం అవ్యక్తరూపంలో (కంటికి కనిపించ కుండా) బీజం (విత్తనం)లోనే ఉన్నట్లు **'గీతాతత్త్వం'** అంతా ఈ శ్లోకంలోనే నిక్షిప్తం చేయబడియున్నదని పెద్దలు చెబుతుంటారు. అట్టి ప్రసిద్ధమైన ఈ శ్లోకంలోని విశేషం ఏమిటో విశ్లేషణ చేసి చూద్దాం.

**అశోచ్యాన్ అన్వశోచఃత్వం:-** 'శోకించదగనివారికోసం నీవు శోకిస్తున్నావు' అంటూ భగవానుడు తన జ్ఞానబోధను 'అశోచ్యాన్'శోకం అనే పదంతో ప్రారంభిస్తున్నాడు. ప్రారంభమే కాదు, ముగింపు కూడా శోకం అనే పదంతోనే. 18వ అధ్యాయం 66వ శ్లోకం చివర 'మోక్షయిష్యామి మాశుచ:' అంటూ 'మాశుచః' శోకించవద్దు అనే పదంతోనే తన జ్ఞాన బోధను ముగించటం జరిగింది. ఇలా ప్రారంభించటం-ముగించటంలో ఒక విశేషం ఉంది. అది ఏమంటే ఈ శోకం (అశోచ్యాన్) నుండి ఆ శోకం (మాశుచః) వరకు మధ్య గల శ్లోకాలన్నీ మానవుడిలోని శోకాన్ని (దుఃఖాన్ని) పూర్తిగా పోగొట్టటానికే ఈ జ్ఞానబోధ అని తెలియజేయుటయే. కనుక భగవద్గీత లక్ష్యం మానవుడి దుఃఖాన్ని పూర్తిగా తొలగించటమే. **"దుఃఖనివృత్తియే - శోకరాహిత్యమే భగవద్గీతను తెలుసుకొనుటవలన కలిగే ప్రయోజనం"** అని తెలుస్తుంది.

అర్జునా! శోకించదగనివారికోసం నీవు శోకిస్తున్నావు. భీష్మద్రోణాదులు మరణిస్తారని గదా! నీ ఈ శోకం అంతా. భీష్ముని వయస్సు ఎంత? అసీతిపంచకః అంటే 400 సంవత్సరాలు. అలాగే కృపాచార్య, ద్రోణాచార్యులు కూడా సుమారుగా 350 సంవత్సరాలు పైబడినవారే. (ద్వాపరయుగం నాటి మానవుని ఆయుః ప్రమాణం 200సం॥లు) కనుక భీష్మద్రోణాదులు చాలా వృద్ధులు. మరి పుట్టిన ప్రతిజీవీ ఏదో ఒకనాటికి మరణించాల్సిందే. ఇంతటి వృద్ధులైన భీష్మాదులు నేడు కాకపోతే రేపైనా పోవాల్సినవారే గదా! మరెందుకు వారికోసం ఇంతగా ఏడవటం?

పోనీ వారేమైనా రోగాలతో, రొష్ఠులతో మంచంపట్టి మరణం చెందుతున్నారా? లేదే. యుద్ధరంగంలో నిలిచి, తమ అస్త్రశస్త్ర నైపుణ్యంతో వీరయోధులై పోరాడబోతు న్నారు. యుద్ధరంగంలో పోరాడి మరణించినవారికి వీరస్వర్గం లభిస్తుందిగదా! కనుక ఏ విధంగా చూచినా వారికోసం శోకించడంలో అర్థం లేదు.

మరొక విషయం. లోకంలో ఎవరైనా పాపాలు చేసినవారు, దుర్మార్గంగా నడుచుకున్నవారు మరణిస్తే- అట్టి వారు మనకు బంధువులో, మిత్రులో, ఆత్మీయులో ఐతే "అయ్యో! బ్రతికినన్నాళ్ళు పాపాలు, దుర్మార్గాలు చేశారు; ఎంత చెప్పినా వినిపించుకోలేదు; మరణానంతరం వీరికి ఎటువంటి దుర్గతిపడుతుందో-ఎటువంటి నరకయాతనలు అనుభవిస్తారో గదా!" అని బాధపడాలి, దుఃఖించాలి.

కానీ భీష్మ ద్రోణులు పుణ్యాత్ములు, మహాత్ములు, ధర్మవర్తనులు, భగవద్భక్తులు, అనేక దానధర్మాలు చేసినవారు, ఎందరికో ఎన్నో విధాల సహాయపడినవారు, పరులశ్రేయస్సును కోరిన వారు, స్వధర్మనిష్ఠా పరులు, పరాక్రమశాలురు, అన్ని భోగాలు అనుభవించినవారు. అట్టివారికోసం శోకించాల్సిన పని ఏమిటి? కనుక అర్జునా! నీవు శోకించదగనివారికోసం శోకిస్తున్నావు. ఇది అవివేకం.

ఇక జ్ఞానుల దృష్టితో చూచినపుడు మరొక అంతరార్థం గోచరిస్తుంది. ప్రపంచంలోని ప్రతి ప్రాణీ మనకు ఒక్కటిగానే పైకి కనిపించినా, అక్కడ నశించిపోయేదేహం-నశించని ఆత్మ అని రెండు అంశాలున్నాయి. ఇప్పుడు నీవు నశించి పోయే దేహం కోసం ఏడుస్తున్నావా? నశించని ఆత్మకోసం ఏడుస్తున్నావా? నీవు ఎంత ఏడ్చినా దేహమేమో నిలిచేది కాదు. అది ఎప్పుడో ఒకపుడు నశించిపోవాల్సిందే. ఇక ఆత్మకోసం ఏడుస్తున్నావా- అంటే ఆత్మకోసం ఏడవాల్సిన పనేలేదు. ఆత్మ ఎన్నటికీ నశించేది కాదు. అది నిత్యవస్తువు. కనుక ఆత్మకోసం ఏడవటం వృథా ప్రయాస. కనుక రెండూ శోకించదగనివే. శోకించదగనివాటికోసం శోకించటం అవివేకం, తెలివి తక్కువతనం- ఇది వేదాంతార్థం. అందుకే-

**గతాసూన్ అగతాసూన్ చ పండితాః న అనుశోచంతి**: - గతించినవారికోసంగాని, జీవించియున్నవారికోసం గాని పండితులైనవారు ఎన్నటికీ శోకించరు. 'పండా' అంటే తత్త్వ నిర్ణయబుద్ధి. అట్టి బుద్ధిగలవారినే పండితులు అంటారు. అంటే తత్త్వజ్ఞానం-ఆత్మజ్ఞానం గలవారే పండితులు. కేవల శాస్త్ర జ్ఞానం ఉన్నవారు-అంటే





శాస్త్రవిషయాలను అనుభవం ద్వారా గ్రహించనివారు పండితులు కాలేరు. వారు సామాన్యుల వలెనే అన్నింటికీ చలించిపోతుంటారు. కాని పండితులైనవారు మరణించినవారి కొరకూ శోకించరు; జీవించియున్నవారి కొరకూ శోకించరు. ఎందుకంటే మరణించినవారు కొంత కాలం తరువాత తమ ప్రారబ్ధకర్మల ననుభవించటానికి తగిన నూతన దేహాలతో తిరిగి జన్మిస్తారు. పనికిరాని దేహాన్ని వదలి నూతన దేహంతో, నూతన ఉత్సాహంతో తిరిగివస్తారు. అంతేకాదు, మానవుడికి బాల్యం, యౌవనం, వార్ధక్యం అనేవి ఎట్లా వస్తూ పోతూ ఉ ంటాయో-అలాగే మరణం కూడా ఒక మార్పు మాత్రమే-అని తెలిసినవారు గనుక పండితులైన వారు మరణించిన వారికొరకు శోకించరు.

అదేవిధంగా జీవించి ఉన్న ప్రతివాడూ తాను ఏ ప్రారబ్ధ కర్మఫలాలను అనుభవించటానికి ఈ లోకంలోకి వచ్చిపడ్డాడో, ఆ ప్రారబ్ధ కర్మఫలాలను అనుభవించటం పూర్తికాగానే ఒక్కక్షణం కూడా జీవించి ఉండడు. పుట్టిన ప్రతివాడూ తన సమయం ఆసన్నం కాగానే తప్పక మరణించాల్సిందే. కనుక ఎలాగూ పోయేవాడే గనుక జీవించిఉన్నవారిని గురించి కూడా పండితులు శోకించరు.

మరొక అంతరార్థం కూడా ఉన్నది. పండితులంటే ఆత్మజ్ఞానం తెలిసినవారు. వారికి దేహం అంటే ఏమిటో ఆత్మ అంటే ఏమిటో తెలుసు. దేహాలన్నీ నశించేవే గనుక వాటికోసం ఏడ్చి ప్రయోజనం లేదు. ఆత్మ చావు-పుట్టుకలు లేనిది, శాశ్వతమైనదీ గనుక దానికోసం ఏడవటంలో అర్థం లేదు. అందుకే పండితులు నశించేవాటికోసం గాని, ఎప్పుడూ జీవించి ఉండేదానికోసం గాని శోకించరు-అని అంతరార్థం. మరి నీవేమో-

**ప్రజ్ఞావాదాంశ్చ భాషసే**: గొప్ప పండితుడిలాగా మాట్లాడు తున్నావు, పామరుడిలాగా ఏడుస్తున్నావు. ఎవరికోసం ఏడవాల్సిన పనిలేదో వారికోసం ఏడుస్తున్నావు. పైగా ప్రజ్ఞా వాదాలు చేస్తున్నావు. మాటలు మాత్రం కోటలు దాటుతున్నాయి. కాలుమాత్రం గడపదాటటం లేదు. అన్నీ తెలుసునంటావు. బావురుమని ఏడుస్తావు. నిన్ను జ్ఞాని అనుకోవాలా? అజ్ఞాని అనుకోవాలా?

**"కథం భీష్మమహం సంఖ్యే"** అంటున్నావు. అంటే యుద్ధంలో భీష్మాదులనెలా చంపేదీ? అని. '**సంఖ్యే**' అన్నావు గాని '**గృహే**' అనలేదు గదా! ఇంట్లో కాదుగదా

చంపాల్సింది! యుద్ధరంగంలో. యుద్ధరంగంలో చంపటం ధర్మమే గదా! యుద్ధం క్షత్రియధర్మం.

కనుక నీ ధర్మాన్ని నీవు నిర్వర్తించు. ఆ భీష్మాదులు కూడా తమ ధర్మాన్ని నిర్వర్తించటానికే నీ ఎదుట నిలబడ్డారు. ఊరక అహంకారాన్ని నెత్తిన వేసుకొని ఇదంతా నేనే చేస్తున్నానని అల్లాడిపోకు. ఆర్చేవాడివి తీర్చేవాడివి నీవేననుకున్నావా? నీ కోడీ, కుంపటీ లేకపోతే తెల్లవారదనుకున్నావా? ఆర్చేతీర్చే ప్రచండ శక్తి ఒకటి ఉన్నది. ఆ శక్తిని తెలుసుకున్న జ్ఞానులు నిమిత్తమాత్రులుగా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ ఉంటారు. అహంకరించరు. ఇపుడు నీ కర్తవ్యాన్ని (డ్యూటీ) నిర్వర్తించి ఈ పరీక్షలో పాస్ అవుతావో లేక కాలగతిని ఎదిరించి ఫెయిల్ అవుతావో నీ ఇష్టం.

ఇక్కడ అర్జునునివి రెండు మోహాలుగా గుర్తించాడు భగవానుడు. **1.సామాన్యమోహం, 2.అసాధారణ మోహం.**

**1.సామాన్యమోహం**: మన అసలు స్వరూపం ఆత్మయే ఐనప్పటికీ, ఆత్మనని తెలియని అజ్ఞానంలో నేను దేహాన్ని అని భ్రమపడటం సామాన్యమోహం. దీనిని సామాన్యమోహం అని ఎందుకంటున్నాం? లోకంలో అందరూ ఈ మోహంలోనే ఉంటారు కనుక. అందుకే తమవారనుకున్నవారికి ఏ కష్టం వచ్చినా, ఏ ప్రమాదం జరిగినా, లేక అట్టివారు మరణించినా దుఃఖిస్తూ ఉంటారు. ఇంతకాలం మన కంటికి కనిపించి, మనతో మాట్లాడిన దేహం ఇక కనిపించదుగదా! అని దుఃఖం. ఇపుడు అర్జునుడు భీష్మాదులకొరకు దుఃఖిస్తున్నది ఈ మోహం వల్లనే.

**2. అసాధారణ మోహం**: క్షత్రియునికి యుద్ధం స్వధర్మం. స్వధర్మాన్ని అధర్మం అనుకొని క్షత్రియుడైన అర్జునుడు యుద్ధానికి విముఖత చూపటం అసాధారణ మోహం. ఇది అసాధారణమోహం అని ఎందుకంటున్నాం? ఈ మోహం అర్జునునికేగాని; అటు భీష్మాదులకుగాని; ఇటు తన సోదరులైన ధర్మజ, భీమ, నకులసహదేవులకు గాని, మరెవ్వరికి గాని లేదు.

ఈ రెండు మోహాల కారణంగానే అర్జునునికి దుఃఖం. ఈ రెండు మోహాలు తొలగితే గాని అర్జునుని దుఃఖం తొలగి పోదు. అందుకే భగవానుడు మొదట ఆత్మజ్ఞానాన్ని బోధించటం ద్వారా (12 నుండి 30వ శ్లోకం వరకు) సామాన్య





మోహాన్ని, స్వధర్మపాలన యొక్క విశిష్టతను బోధించటం ద్వారా (31 నుండి 38 శ్లోకం వరకు) అసాధారణ మోహాన్ని తొలగించబోతున్నాడు.

శరీరాలు నశించినా ఆత్మ నశించదని, ఆత్మ శాశ్వతమని ముందుగా తెలియజేయబోతున్నాడు భగవానుడు–

**శ్లో॥ నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః ।**
**న చైవ న భవిష్యామః సర్వేవయ మతఃపరం ॥ (12)**

**తా॥** నేను లేని సమయం అంటూ ఎప్పుడూ లేదు. అలాగే నీవు గాని, ఈ రాజులు గాని లేని సమయం కూడా ఎప్పుడూ లేదు. ఈ శరీరాలు నశించినప్పటికీ ఇకమీదట కూడా మనందరం లేకపోవుట అనేది లేదు.

**వ్యాఖ్య:** 'నేను లేని సమయం అంటూ ఎప్పుడూ లేదు' అని భగవానుడు అనగానే "స్వామీ! భగవంతుడివైన నీ సంగతి కాదు నేను చెప్పేది, మాలాంటి సామాన్యుల సంగతేమిటి?" అన్నట్లుగా చూచాడు అర్జునుడు. వెంటనే భగవానుడు, "నీవు గాని, ఈ రాజులు గాని వీరందరూ కూడా ఎప్పుడూ లేనివారు కాదు. అంతేకాదు భవిష్యత్తులో కూడా ఈ దేహాలు నశించినా మనందరం ఎప్పుడూ ఉండేవారమే" అని స్పష్టం చేశాడు భగవానుడు. వేరువేరు దేహాలలోని ఆత్మ ఎప్పుడూ ఉండేదే. దేహాలు నశించినా, నశించకుండా ఎప్పుడూ ఉండే తత్త్వం ఒకటి ఉన్నది. అదే ఆత్మ. అది త్రికాలలోనూ ఉంటుంది. త్రికాలాతీతంగాను ఉంటుంది. అదే జీవుని యదార్థ తత్త్వం. దానికి చావు పుట్టుకలు లేవు. ఏమార్పులూ లేవు.

కనుక ఓ అర్జునా! ఆత్మ నిత్యమైనది. నీవు ఆత్మవే కాని దేహానివి కాదు. నీవే కాదు, ఈ సమస్త ప్రాణికోటి ఆత్మస్వరూపమే. అందరమూ ఆత్మస్వరూపమే. అన్ని కుండల లోనూ ఒకే మట్టి ఉన్నట్లు, అన్ని ఆభరణములలోనూ ఒకే బంగారం ఉన్నట్లు, అన్ని దేహాలలోను ఒకే ఆత్మ ఉన్నది. ఇక్కడే చాలామందికి సందేహం. **అన్ని దేహాలలోను ఒకే ఆత్మ ఉంటే అందరూ ఒక్క విధంగానే ప్రవర్తించరెందుకు?** కొందరు ధర్మాత్ములుగా, కొందరు అధర్మపరులుగా; కొందరు పుణ్యాత్ములుగా, కొందరు పాపాత్ములుగా; కొందరు మంచివారుగా; కొందరు చెడ్డవారుగా; కొందరు అందంగా; కొందరు అనాకారంగా ఎందుకుంటున్నారు? అని ప్రశ్నిస్తారు. ఇలా తప్పుగా చెబితే వేదాంతాన్ని ఎవరు నమ్ముతారు? అని ప్రశ్నిస్తారు. మరి

ట్యూబ్‌లైటులోను, ఫ్యాన్‌లోను, ఫ్రిజ్‌లోను, హీటరులోను ఒకే కరెంటు ఉన్నదా? వేరువేరు రకాల కరెంటు ఉన్నదా? అన్నింటిలోనూ ఒకే కరెంటు. ఒకే తీగద్వారా ఇంటిలోనికి వచ్చింది. మరి లైటు వెలుగుతున్నది, ఫ్యాను తిరుగుతున్నది, ఫ్రిజ్ చల్లబరుస్తున్నది, హీటరు వేడిచేస్తున్నదేం? ఇది కరెంటులోని తేడా కాదు, ఆయా పరికరాలలో తేడా. అదేవిధంగా అందరిలో ఒకే ఆత్మ ఉన్నప్పటికీ, వారి వారి దేహమనోబుద్ధులనే పరికరాలలో తేడాలవల్ల వేరువేరుగా కనిపిస్తున్నారు, వ్యవహరిస్తున్నారు. కనుక అన్నిదేహాలలోను ఒకే ఆత్మ ఉన్నది. ఆ ఆత్మయే నేను, నీవు, ఈ రాజులు, అందరూ కూడా. ఆత్మజ్ఞాని ఎంతగా చెప్పినా 'దేహమే నేను'- అనే అజ్ఞానంలో ఉన్న సామాన్యుడు తికమకపడుతూనే ఉంటాడు. అర్జునుడు కూడా తికమకలో ఉన్నట్లు గుర్తించాడు శ్రీకృష్ణుడు. అందుకే -

**శ్రీకృష్ణుడు:** అర్జునా! నీవిప్పుడున్నావా?

**అర్జునుడు:**ఆ! లేకేం ఉన్నాను. నీ ఎదురుగానే ఉన్నాను.

**శ్రీకృష్ణుడు:** శరీరంతో ఉన్నావా? శరీరం లేకుండా ఉన్నావా?

**అర్జునుడు:** శరీరంతోనే ఉన్నాను. ఇందులో సందేహం ఏముంది?

**శ్రీకృష్ణుడు:** సరే, ఈ శరీరం ఏం చేస్తే నీకు వచ్చింది?

**అర్జునుడు:** వెనుకటి జన్మలలో నేను చేసిన పుణ్యపాప కర్మల ఫలితంగా వచ్చింది.

**శ్రీకృష్ణుడు:** అంటే వెనుకటి జన్మలలో నీవు పుణ్య పాపకర్మలను చేశావా?

**అర్జునుడు:** అవును, చేశాను, చేయబట్టేగా ఈ జన్మ వచ్చింది.

**శ్రీకృష్ణుడు:** అయితే అప్పుడు నీవు ఉండే చేశావా? లేకుండానే చేశావా?

**అర్జునుడు:** నేను లేకుండా కర్మలెలా చేస్తాను? ఉండే చేశాను.

**శ్రీకృష్ణుడు**: ఉంటే-అప్పుడు ఈ దేహంతోనే ఉన్నావా? లేక మరొక దేహంతోనా?

**అర్జునుడు:** ఏ దేహమో తెలియదు గాని, మొత్తం మీద ఏదో ఒక దేహంతో ఉన్నాను.

**శ్రీకృష్ణుడు:** అంటే అప్పుడు నీవున్నావు, ఏదో ఒక దేహం ఉంది, ఆ దేహం ఎలా వచ్చింది?

**అర్జునుడు:** అంతకుముందు జన్మలలో చేసిన కర్మలను బట్టి.

**శ్రీకృష్ణుడు:** కనుక ఓ అర్జునా! అనేక జన్మలనుండి నీవున్నావు. దేహం మాత్రం





మారిపోతున్నది. అంటే దేహాలు అనిత్యం. నీవుమాత్రం నిత్యం. నీవే కాదు-ఇక్కడ, ఈ లోకంలో అందరూ నిత్యులే. అట్టి నిత్యులైనవారికోసం ఏడుపెందుకు?

జీవుడి యొక్క అసలు తత్త్వం ఆత్మయని, ఆత్మ నిత్యమని- శాశ్వతమని, దేహాలు మాత్రం నశించిపోతాయని తెలియజెప్పిన భగవానుడు ఆత్మ నిత్యమే గాదు ఏ మార్పులూ లేనిదని, శరీరానికే మార్పులని, మరణం కూడా ఒక మార్పేనని తెలియజేయబోతున్నాడు.

**శ్లో॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా।**

**తథా దేహాంతర ప్రాప్తిః ధీరస్తత్ర నముహ్యతి ॥ (13)**

**తా॥** దేహధారియైన జీవునికి ఈ శరీరంలో బాల్యం, యౌవనం, ముసలితనం ఎలాగో అలాగే మరోదేహం కూడా వస్తున్నది. వివేకం గలవాడు ఈ విషయంలో ఎటువంటి మోహాన్నీ చెందడు.

**వ్యాఖ్య:** దేహం వేరు. దేహాన్ని ధరించిన దేహి వేరు. దేహం ఎప్పుడూ మార్పులు చెందుతూ ఉంటుంది. కొంత కాలం బాల్యం, ఆ తరువాత యౌవనం, చివరికి ముసలి తనం. అయితే బాల్యం పోయి యౌవనం వచ్చినా, యౌవనం కరిగిపోయి ముసలితనం వచ్చినా ఎవ్వడూ అదేపనిగా ఏడవటం లేదు. కాని మరణం అంటేనే భయం, దుఃఖం, శోకం. సామాన్యుడు మరణానికి ఏడుస్తాడు. ఎందుకంటే తనవి అనుకున్నవన్నీ వదలిపోవాల్సివస్తున్నదే అని, తనవారనుకున్న వారికి దూరమైపోతున్నానే అని. మరణం అంటే ఈ ముసలిదేహం పోయి తిరిగి కొత్త దేహంతో రావటమేనని సామాన్యునికి తెలియదు. అందుకే దుఃఖం.

అయితే జ్ఞానికి ఈ విషయం తెలుసు. అందుకే అతడు బాల్యము, యౌవనము, ముసలితనములాగానే మరణము, ఆ తర్వాత మరొక దేహం ప్రాప్తించటము కూడా దేహానికి కలిగే సహజమార్పులేనని గ్రహించి, ధీరుడై గంభీరంగా ఉండగలుగుతాడు. తాను దేహాన్ని కాదు దేహిని (ఆత్మను) అని, దేహం ఎన్ని మార్పులు చెందినా తానుమాత్రం ఏమార్పులు లేకుండా నిత్యంగా, శాశ్వతంగా, వికార రహితంగా ఉండేవాడినని గ్రహించి స్థిరంగా ఉంటాడు. ఇదే విషయాన్ని మరింత స్పష్టంగా తెలియజేస్తూ శ్రీకృష్ణుడు-

**శ్రీకృష్ణుడు:** అర్జునా! ఇపుడు నీ వయస్సెంత?

**అర్జునుడు:** అదేమిటి బావా! నీ వయస్సు, నా వయస్సు ఒకటేగదా! 88 సంవత్సరాలు.

**శ్రీకృష్ణుడు:**బాల్యంలో నీవు చేసిన గొప్ప కార్యమేమిటి?

**అర్జునుడు:** గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెచ్చి గురువు పాదాలపై పడవెయ్యటం.

**శ్రీకృష్ణుడు:** ఆ బాల్యం ఇపుడుందా?

**అర్జునుడు:** లేదు.

**శ్రీకృష్ణుడు:** మరి నీవున్నావా?

**అర్జునుడు:** లేకేం, ఉన్నాను. ఉండబట్టేగదా! నీకు సమాధానం చెబుతున్నది.

**శ్రీకృష్ణుడు:** సరే! యౌవనంలో నీవు చేసిన ఘనకార్యం ఏమిటి?

**అర్జునుడు:** సన్యాసివేషంలో మీ చెల్లి సుభద్రను అపహరించుకువెళ్ళాను గదా!

**శ్రీకృష్ణుడు:** మరి ఆ యౌవనం ఇప్పుడుందా?

**అర్జునుడు:** లేదు.

**శ్రీకృష్ణుడు:** మరి నీవున్నావా?

**అర్జునుడు:** ఆ! లేకేం. ఉన్నాను.

**శ్రీకృష్ణుడు:** అంటే ఆ బాల్యం, యౌవనం ఇపుడు లేవు. కాని నీవు మాత్రం ఉన్నావు.

అంటే అవస్థలు ఉండటం ఉండకపోవటంతో నీకే సంబంధం లేదు. నీవుమాత్రం ఉన్నావు. అలాగే శరీరం ఉండటం, ఉండకపోవటంతో నీకే సంబంధం లేదు. శరీరం ఉన్నా నీవు ఉన్నావు. శరీరం లేకపోయినా నీవు ఉంటావు. బాల్యంలో ఉన్న నీవే యౌవనంలో ఉన్నావు. యౌవనంలో ఉన్న నీవే ముసలితనంలో ఉన్నావు. ముసలితనంలో ఉన్న నీవే మరణానంతరం అవ్యక్తంలో ఉంటావు. అవ్యక్తంలో ఉన్న నీవే మరొక దేహాన్ని ధరించి వ్యక్తంలోకి – ఈ లోకంలోకి వస్తావు. కనుక నీవు నిత్యుడివి. ఎప్పుడూ ఉండేవాడివి. ఏ మార్పులు లేకుండా ఉండేవాడివి. మరెందుకు దుఃఖం? కనుక దు:ఖించేపనిలేదు. నీవు ధీరుడివి. మోహం చెందకు, శోకించకు.

అర్జునా! నీవిప్పుడు ఇలా దుఃఖిస్తున్నావు గాని అసలు సుఖదుఃఖాలు ఎందుకు





వస్తాయో తెలుసా? అవి ఎలాంటివో తెలుసా? సుఖదుఃఖాలు కలిగినప్పుడు వాటితో ఎలా వ్యవహరించాలో తెలుసా? ఇదిగో తెలుసుకో–అంటూ తరువాతి శ్లోకంలో దుఃఖాలతో అల్లాడే మానవులందరినీ దృష్టిలో పెట్టుకొని దుఃఖాన్ని ఎదుర్కొనే ఉపాయాన్ని తెలియజేయబోతున్నాడు.

**శ్లో ॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః।**

**ఆగమాపాయినోఽనిత్యాః తాం స్తితిక్షస్వ భారత॥ 14**

**తా॥** కౌంతేయా! ఇంద్రియాలకు శబ్దస్పర్శాది విషయాలతో కలిగే సంయోగం వల్ల శీతోష్ణాలు, సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి. అవి రాకడపోకడ కలిగినవి; అశాశ్వతమైనవి. కనుక ఓ భారతా! వాటిని సహించుము.

**వ్యాఖ్య:** ప్రతిజీవుడూ యదార్థంగా ఆత్మయేనని, ఆత్మకు ఏ మార్పులూ లేవని, నశించిపోయేది దేహాలేగాని ఆత్మకాదని, కనుక దుఃఖించాల్సిన పనిలేదని ఇంతవరకు భగవానుడు తెలియజేశాడు. మరి ఈ శీతోష్ణాలు, సుఖదుఃఖాలు ఎందుకు కలుగుతున్నాయి? వాటినెలా ఎదుర్కోవాలి? అనే విషయాలను ఈ శ్లోకంలో తెలియ జేస్తున్నారు.

'నేను ఆత్మను' అని తెలుసుకొని, ఆత్మానుభూతిని చెంది, సర్వకాల సర్వావస్థలలోను ఆత్మగా ఉండే ముక్తునికి ఏ దుఃఖాలు లేవు. కాని జీవభావంలో ఉండే ప్రతి మానవునికి శీతోష్ణాలు, సుఖదుఃఖాలు తప్పవు. ఐతే ఈ సుఖదుఃఖాలు ఎలా కలుగుతున్నాయి? ఎందుకు కలుగుతున్నాయి? అదే–

**మాత్రాస్పర్శాఃతు**:– మాత్రలు అంటే ఇంద్రియాలు–అవే కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక. ఇక స్పర్శాః అంటే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే విషయాలు. ఆ ఇంద్రియాలు ఈ విషయాలతో సంయోగం చెందినప్పుడే– సంబంధం పెట్టుకున్నప్పుడే సుఖమో, దుఃఖమో కలుగుతున్నాయి, చలి, వేడి పుడుతున్నాయి.

ఈ శీతోష్ణాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాల ధాటికి తట్టుకొని నిలబడగలవాని జ్ఞానమే జ్ఞానం; అలా నిలబడగలవాని భక్తియే భక్తి; అలా నిలబడగలవాని వివేకమే వివేకం; అలా నిలబడగల మనిషే మనిషి–మనీషి–మహాత్ముడు. జ్ఞానియొక్క జ్ఞానానికి, భక్తుని యొక్క భక్తికి, వివేకి యొక్క వివేకానికి ఇవే గీటురాళ్ళు. అంటే జ్ఞానిని పరీక్షించాలంటే అతడు సుఖాలకు పొంగుతూ, దుఃఖాలకు క్రుంగుతూ ఉన్నాడా? లేదా? అని పరీక్షిస్తే సరిపోతుంది.

ఈ సుఖదుఃఖాలు ఎలా కలుగుతున్నాయి? మన దేహంలో ఉన్న ఇంద్రియాలు బయట ఉన్న విషయాలతో సంబంధం పెట్టుకుంటే– అలా పెట్టుకున్నప్పుడే కలుగుతున్నాయి. మనం బజారులో వెళుతున్నాం. మనను చూచి ఒకడు ప్రక్కవాడితో ఏదో చెప్పి తిడుతున్నాడు. ఆ తిట్లు నీవు వింటే దుఃఖం, బాధ, కోపం కలుగుతాయి. వినకపోతే–నీకు దుఃఖమూ లేదు, బాధాలేదు, కోపం లేదు. ఎందుకు? ఆ తిట్లు 'శబ్దం' అనే విషయం. నీ చెవి 'ఇంద్రియం'. ఆ శబ్దం నీ ఇంద్రియానికి అందితే దుఃఖం, బాధ, కోపం. అందకపోతే అంటే ఇంద్రియానికి విషయానికి సంపర్కం లేకపోతే ఏమీలేదు. అలాగే తిట్లే కాదు పొగడ్తలు కూడా. 'పొగడ్త' అనే 'శబ్దం' 'చెవి' అనే ఇంద్రియాన్ని తాకితే సుఖం. తాకకపోతే ఏమీలేదు. దారివెంట వెళు తుంటే నీ శత్రువు నీ కంటబడ్డాడు. శత్రువు రూపమనే 'విషయం'; కన్ను 'ఇంద్రియం' రెండూ కలిస్తే దుఃఖం, కోపం. లేకపోతే లేదు. నీకిష్టమైన స్వీటు నీ నాలుకపై వేసుకున్నావు. ఆనందం. అది నీ నాలుకను తాకలేదు. నీకే ఆనందం లేదు. స్వీటు 'విషయం'. నాలుక 'ఇంద్రియం'. రెండూ కలిస్తే ఆనందం. లేకపోతే లేదు. కనుక సుఖంగాని, దుఃఖంగాని కేవలం ఇంద్రియాలవల్ల రావటం లేదు, కేవలం విషయాలవల్ల రావటం లేదు. ఆ విషయాలతో మన ఇంద్రియాలు సంబంధం పెట్టుకుంటేనే వస్తున్నాయి. సరే ఈ సుఖదుఃఖాలు ఎట్టి స్వభావం కలిగినవి?

**ఆగమాపాయినః, అనిత్యాః** :– ఇవి రాకడ పోకడ గలిగి నవి. అశాశ్వతమైనవి. ఇది తెలుసుకొని ఎవరైనా సరే సుఖాలు లభించినప్పుడు పొంగిపోరాదు; దుఃఖాలు వచ్చినప్పుడు క్రుంగి పోరాదు. ఎందుకంటే వచ్చినవాటికి పోయేగుణం కూడా ఉన్నది కనుక. సుఖంగాని, దుఃఖంగాని వచ్చినవి వచ్చినట్లుగా తిష్టవేసుకుని ఉండిపోవు.

ధర్మరాజు తమ్ములతోను, భార్యతోను అరణ్యవాసం చేస్తున్నప్పుడు వారి యోగక్షేమాలను విచారించుటకు శ్రీకృష్ణుడు వచ్చాడు. నాలుగు రోజులుండి, వారికి ధైర్యం చెప్పి ద్వారకకు ప్రయాణమయ్యాడు. ధర్మరాజు వీడ్కోలు పలకటానికి చాలా దూరం వచ్చి శ్రీకృష్ణునితో, "మహాత్మా! ఎన్ని సుఖదుఃఖాలు కలిగినా సరే చలించకుండా, నేను నా ధర్మాన్ని తప్పకుండా స్థిరచిత్తంతో నిలిచి ఉండేందుకు ఏదైనా తారకమంత్రాన్ని ఉపదేశించండి" అని ప్రార్థించాడు.





దానికి శ్రీకృష్ణుడు ఒక కాగితంపై మంత్రాన్ని వ్రాసి కవరులో పెట్టి, "ధర్మనందనా! ఇది అష్టాక్షరీ మంత్రం వంటిది. దీనిని జాగ్రత్తగా దాచుకో. నీకు భరించలేనంత కష్టం వచ్చి మనస్సు చలిస్తుందనుకున్నప్పుడు దీనిని విప్పి చదువుకో. 108సార్లు అర్థయుక్తంగా జపించు. దానితో నీకు మనస్సు స్థిరమై నీ ధర్మంలో నీవు చలించకుండా నిలబడతావు" అన్నాడు. శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు.

కొంతకాలం తర్వాత కౌరవులపట్ల ఉదాసీనంగా ఉంటున్నందుకు ధర్మరాజును ద్రౌపదీ భీమసేనులు అనేక పోటుమాటలతో బాధపెడుతున్నారు. ధర్మరాజు భరించలేక పోతున్నాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడిచ్చిన కాగితం గుర్తుకు వచ్చి, దానిని తెరచి చూచాడు. అందులో 8 అక్షరాలే ఉన్నాయి. "ఇది ఈలాగే ఉండదు" అని. అంటే ఈ వచ్చిన కష్టం శాశ్వతంగా ఉండిపోదు అని. వెంటనే అర్థయుక్తంగా 108 సార్లు జపించాడు. అంతే– తన మానసిక వ్యధ అంతమైంది. తన ధర్మానికే తాను కట్టుబడ్డాడు. చేసిన ప్రతిజ్ఞ ప్రకారం 12 ఏళ్ళు వనవాసం, 1 ఏడు అజ్ఞాతవాసం చేసేందుకే నిశ్చయించుకున్నాడు. కనుక సుఖం గాని, దుఃఖం గాని, కష్టాలు గాని, ఆనందం గాని ఏవీ శాశ్వతంగా ఉండవు. అవి రాకడపోకడలు కలిగినట్టివే అని ప్రతి మానవుడు గుర్తుంచుకోవాలి.

సుఖదుఃఖాలు రెండూ ఒకదానివెంట ఒకటి వస్తూ పోతూ ఉంటాయి. అవి మంచి స్నేహితులు. వాటి బంధం విడదీయరానిది. గ్రుడ్డివాణ్ణి భోజనానికి పిలిస్తే 2 పీటలు వెయ్యాలి. ఎందుకు? వాడు ఇంకొకణ్ణి దారి చూపించటానికి తోడు తెచ్చుకుంటాడు గదా! అలాగే మనం సుఖాన్ని ఆహ్వానిస్తే అది దుఃఖాన్ని కూడా తోడు తెచ్చుకుంటుంది. ఈ శీతోష్ణాలు కూడా అంతే. రాకడపోకడ కలిగినవి. చలికాలం వస్తుంది. పోతుంది. ఆ తర్వాత ఎండాకాలం వస్తుంది. అదీ పోతుంది. ఏదీ శాశ్వతం కాదు. అందుకే–

**అనిత్యాః** అనిత్యమైనవి. శాశ్వతమైనవి కాదు. కాలాన్ని బట్టి మారేవి శీతోష్ణాలు. కాలాన్నిబట్టి, మనిషిని బట్టి మారేవి సుఖదుఃఖాలు. ఒకప్పుడు సుఖాన్నిచ్చినది మరొకప్పుడు దుఃఖాన్నిస్తుంది. చలి ఎండాకాలంలో సుఖాన్నిస్తుంది. చలి కాలంలో దుఃఖాన్ని కలిగిస్తుంది. అలాగే ఎండ చలికాలంలో సుఖాన్నిస్తుంది. వేసవికాలంలో తీవ్రమైన బాధను కలిగిస్తుంది. అలాగే ఒకప్పుడు సుఖాన్ని కలిగించిన వస్తువు

మరొకప్పుడు దుఃఖాన్ని కలిగిస్తుంది. ఆకలి బాగా అయినప్పుడు భోజనం ఎంతో ఆనందాన్నిస్తుంది. కడుపు నిండిన తర్వాత అదే భోజనం దుఃఖాన్ని కలిగిస్తుంది. ఒకే వస్తువు ఒకడికి సుఖాన్నిస్తే అదే వస్తువు మరొకడికి దుఃఖాన్నిస్తుంది. స్వీటు ఆరోగ్య వంతునికి ఆనందాన్ని కలిగిస్తే అదే స్వీటు షుగర్‌పేషెంటుకు దుఃఖాన్నిస్తుంది. కనుక సుఖదుఃఖాలు అనిత్యమైనవి. మరి వీటితో ఎలా వ్యవహరించాలి?

**తాం స్తితిక్షస్వ** : దేహమున్నంతవరకు **ఇంద్రియాలు** వదిలిపోవు. ప్రపంచమున్నంతవరకు **విషయాలు** ఎక్కడికీ పోవు. ఇంద్రియాలు విషయాలతో సంబంధం పెట్టుకున్నంత కాలం సుఖదుఃఖాలు తప్పవు. మరెలా? వివేకి ఐనవాడు వాటిని తట్టుకొనే ఉపాయం నేర్చుకోవాలి. తితిక్ష అలవరుచు కోవాలి.

సముద్ర స్నానానికి వెళ్ళినవాడు అలలు తగ్గిన తర్వాత స్నానం చేద్దామని కూర్చున్నాడట. అలలు తగ్గేదీలేదు, వీడు స్నానం చేసేదీ లేదు. అలలదెబ్బ తప్పించుకుంటూ స్నానం చేసే నేర్పు కావాలి. ప్రపంచంలో ఎండ లేకుండా, వాన లేకుండా చేయాలనుకోరాదు. గొడుగు అనే ఉపాయంతో నీ పని నెరవేర్చుకోవాలి. దారినిండా ఉన్న ముళ్ళను తొలగించాలనుకోరాదు. వాటి బాధనుండి తప్పించుకొనుటకు చెప్పులు వేసుకోవటమే ఉపాయం. అలాగే ఈ సుఖదుఃఖాలను తప్పించుకుంటూ–ఓర్చుకుంటూ మన జీవనప్రయాణం సాగించాలి. ఎలా? దుఃఖాలు కలిగినప్పుడు ఏమని భావించాలి? ఎలా నిశ్చలంగా ఉండగలం? ఇలా భావించగలమేమో చూడండి.

**(1)** మనకు దుఃఖం కలిగిందీ అంటే మనం పూర్వంలో చేసుకున్నపాపం ఖర్చైపోతున్నదని, మనకు సుఖం వచ్చిందీ అంటే మనం పూర్వంలో సంపాదించుకున్న పుణ్యం ఖర్చై పోతున్నది–అనీ గుర్తుచేసుకుంటే పాపం ఖర్చైపోతున్నందుకు సంతోషించాలి, పుణ్యం ఖర్చైపోతున్నందుకు బాధపడాలి. కనుక కష్టాలు, దుఃఖాలు వచ్చినప్పుడు నవ్వుతూ ఉండవచ్చు. అలాగే సుఖంతో ఉన్నప్పుడు పుణ్యం ఖర్చైపోతున్నది గనుక మళ్ళీ పుణ్యం సంపాదించుకుందామని నిర్ణయించుకొని అందుకు ప్రయత్నించవచ్చు.

**(2)** దుఃఖాలు వచ్చినప్పుడు ఇవి ఇలాగే ఉండిపోవు. ఈ దుఃఖం తర్వాత





వచ్చేది సుఖమే అని గుర్తుచేసుకొని దుఃఖబాధను తగ్గించుకోవచ్చు. అసలు ఈ సుఖదుఃఖాలు అనిత్యమైనవి గనుక, రాకడపోకడ గలిగినవి కనుక, వీటికోసం నేనెందుకు నా బుద్ధిని చెడగొట్టుకోవాలి? నా మార్గం నుండి నేనెందుకు ప్రక్కకు మళ్ళాలి? నా స్వభావాన్ని నేనెందుకు మార్చుకోవాలి? అనే స్థిరబుద్ధితో ఉండవచ్చు.

**(3)** సుఖం మనిషిని మత్తులో ముంచేస్తుంది. భగవంతునికి దూరం చేస్తుంది. అహంకారాన్ని పెంచుతుంది. అదే దుఃఖం ఐతేనో భగవంతునికి దగ్గర చేస్తుంది. మనను హెచ్చరిస్తుంది. కనుక భగవంతునికి దగ్గరచేసే దుఃఖమే నాకు మంచిది–అని అనుకున్నామా! దుఃఖం కూడా మనను బాధించలేదు.

**(4)** సుఖదుఃఖాలు రెండూ భగవంతుని ప్రసాదంగా స్వీకరించటం నేర్చుకోవాలి. భగవంతుని ప్రసాదం రుచిగా ఉన్నా లేక కారంగానో, ఉప్పగానో, చేదుగానో ఉన్నా మనం కళ్ళకద్దుకొని నోటిలో వేసుకుంటాం. అలాగే సుఖమైనా, దుఃఖమైనా ప్రసాదబుద్ధితో స్వీకరించాలి.

సుఖదుఃఖాలను తట్టుకొనే విషయంలో ఆత్మజ్ఞానులకు మరొక రకమైన వివేకం ఉంటుంది. సుఖదుఃఖాలనేవి మనసు యొక్క ధర్మం, మనసు ఉండే జాగ్రత్, స్వప్నావస్థలలోనే సుఖదుఃఖాలున్నాయి; మనసులేని సుషుప్తి అవస్థలో ఏ సుఖదుఃఖాలు లేవు. కనుక ఇవి మనసు యొక్క వికారాలే. నేను మనస్సును కాదు ఆత్మను. ఆత్మనైన నన్ను ఇవి తాకలేవు– అనే దృఢనిశ్చయంతో ఉంటాడు, సుఖదుఃఖాలకు అతీతంగా ఉంటాడు. ఇది ఆత్మ విచారపరుని స్థితి.

ఇక ఈ శ్లోకంలో అర్జునుని కౌంతేయా! అని; భారత! అని రెండు విధాల సంబోధనలున్నాయి. కౌంతేయా! అంటే కుంతీకుమారా! అని. ఇది మాతృపక్షంగా సంబోధన. భారత! అంటే భరతవంశంలో జన్మించినవాడా! అని. ఇది పితృపక్ష సంబోధన. ఈ రెండు సంబోధనల ద్వారా ఉభయ పక్షాలలోను నీవు యోగ్యుడవే. ఓ అర్జునా! నీవు తితిక్షను అలవరచుకోగలవు– అనే అభయం, ప్రశంస ఇందులో ఉన్నాయి.

ఇలా సుఖదుఃఖాలపట్ల తితిక్ష (ఓర్పు–సహనం) కలిగి ఉంటే ప్రయోజనమేమిటి?

**శ్లో॥ యంహి నవ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ!**
**సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥** 15

**తా॥** పురుషశ్రేష్ఠుడా! సుఖదుఃఖములందు సమభావము గల ధీరుడైన ఏ పురుషుని ఈ మాత్రాస్పర్శములు (ఇంద్రియ విషయ సంయోగములు) బాధించవో అతడు అమృతత్వాన్ని (మోక్షాన్ని) అందుకోవటానికి అర్హుడవుతున్నాడు.

**వ్యాఖ్య:** "కృష్ణా! సుఖదుఃఖాలను వివేకంతో సహించు అంటున్నావు. అలా సహిస్తే ఏమిటి ప్రయోజనం?"

"అర్జునా! సుఖదుఃఖాలు రెండింటినీ సమంగా చూడగల వారే ధీరపురుషులు. అట్టివారే అమృతత్వానికి – మోక్షానికి అర్హులౌతున్నారు". ఈ లోకంలో పుట్టిన ప్రతి జీవి అందుకో వలసింది ఆ అమృతత్వ స్థితినే. అమృతం అంటే దేవతలు త్రాగే అమృతం కాదు. దానికి ఎందరో కాపలా ఉండాలి. దాచుకోలేక తిప్పలు పడాలి. ఈ అమృతం అలాంటిది కాదు. దాచుకొనేపనీ లేదు, దోచుకొనేవారూ ఉండరు.

అమృతం అంటే మృతంలేనిది, మార్పులేనిది, నిత్యమైనది, శాశ్వతమైనది. అదే స్వస్థితి; మోక్షస్థితి. ఆ స్థితిని చేరటానికే మనకు మానవజన్మ వచ్చింది. కనుక ప్రతివాడూ తన జీవితకాలంలో అట్టి అమృతత్వస్థితిని చేరుకొనుటకు లభించిన ప్రతి అవకాశాన్ని వినియోగించు కోవాలి. అప్పుడే జన్మకు సార్థకత. అలా ప్రయత్నించేవారే ధీరులు. ధీ అంటే బుద్ధి. కనుక ధీరులు అంటే బుద్ధిమంతులు. ఎందుకోసమైతే భగవంతుడు బుద్ధిని ప్రసాదించాడో అందుకోసమే బుద్ధిని వినియోగించుకొనేవారే ధీరులు. సుఖదుఃఖాలనే ఆటుపోట్లకు తట్టుకొని నిలిచేవారే ఈ ధీరులు.

మహాబలిపురం వద్ద సముద్రజలాలలో కొన్ని గండ శిలలున్నాయి. సముద్రపు అలలు నిరంతరం వాటిని ఢీకొంటూనే ఉంటాయి. కాని ఆ బండరాళ్ళు మాత్రం ఒక్క సెంటీమీటరు కూడా కదలవు. అలలు వదిలేదీ లేదు, శిలలు కదిలేదీ లేదు. అలాగే జీవితమనే ఈ సంసార సాగరంలో సుఖదుఃఖాలనే అలలు నిరంతరం వచ్చి పడుతూనే ఉంటాయి. అయితే వాటి తాకిడికి ఏమాత్రం చలించకుండా గండశిలలాగ స్థిరచిత్తంతో నిలబడగలవాడే ధీరుడు. అట్టివాడే మోక్షస్థితికి అర్హుడౌతాడు.

మనం చేరుకోవలసింది అమృతత్వస్థితిని. అంటే మార్పులు లేని స్థితిని. కాని మనం ఉన్నది మార్పులతో కూడిన ఈ ప్రపంచంలో. సుఖదుఃఖాలనే మార్పులు





ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటాయి. ఈ మార్పులకు లోబడి చలించిపోయే వాడు ఆ మార్పులు లేని స్థితిని ఎలా అందుకోగలుగుతాడు? కనుక సుఖదుఃఖాలపట్ల సమభావాన్ని కలిగి ఉండాలి.

**పురుషర్షభ !** : నీవు పురుషశ్రేష్ఠుడవు. కనుక సుఖదుఃఖాలను సమంగా చూడగల బుద్ధిశాలివిగా. శోకించకు. ధీరపురుషుడివై అమృతత్వాన్ని అందుకో.

సుఖదుఃఖాలపట్ల చలించకుండా సహనం వహించటమంటే ఒక బండరాయిలాగా దిక్కుమాలిన సహనం వహించటం కాదు. వికారంచెందే కారణం ఉన్నప్పటికీ వికారం చెందకుండా స్థిరచిత్తంతో నిల్చి ఉండటం. ద్రాక్షపండ్లు అందకపోతే ఆ! పుల్లగా ఉంటాయిలే, నాకిష్టం లేదు అని ఊరుకోవటం కాదు. అవి అందుబాటులో ఉన్నాసరే, తియ్యనివైనా సరే, నాకు అవసరం లేదు అనే ధైర్యం, స్థిరనిశ్చయం ఉండాలి. అట్టివారికే మోక్షార్హత అని తెలియజేస్తున్నారు.

'శోకించదగనివారికోసం శోకిస్తున్నావు' అంటూ ప్రారంభించి భగవానుడు, ఇంతవరకు ఆత్మానాత్మవివేకం గూర్చి చెప్పుకొస్తున్నారు. ఆత్మ నిత్యవస్తువు. దానికొరకు శోకించే పనిలేదు. ఇక శరీరాలు, వాటికి కలిగే సుఖదుఃఖాలు, వాటికి కారణమైన ఇంద్రియాలు, విషయాలు– ఇవన్నీ అనాత్మ. అనిత్యమైనవి. ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండాపోయేవి. మార్పులు చెందేవి. వాటి గురించి శోకించటం వృధా– అంటూ ఇప్పుడు నిత్య అనిత్య వస్తువులను సత్ అసత్ అనే పేరుతో వాటిని తెలుసుకొనే వివేకాన్ని, నేర్పును అందించబోతున్నారు.

**శ్లో॥ నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః ।**
**ఉభయోరపి దృష్టోఽంతః త్వనయోస్తత్త్వదర్శిభిః ॥** **16**

**తా॥** లేనిదానికి (అసత్‌కు) ఉనికి లేదు. ఉన్నదానికి (సత్) లేకపోవటం అనేది లేదు. ఈ రెండింటియొక్క నిశ్చయం, చివరి నిష్కర్ష తత్త్వజ్ఞానులచేత దర్శింపబడింది.

**వ్యాఖ్య:** సత్ అంటే ఉన్నది. అది మూడు కాలాలలోను ఉంటుంది. అది ఎప్పుడూ లేకుండా పోదు. అలాగే అసత్ అంటే లేనిది. అది మూడు కాలాలలోనూ లేనిదే. అది ఎప్పుడూ లేనిదే. అంటే ఒక కాలంలో కనిపించినా అది లేనిదే అని అర్థం. నిజంగా ఉన్నవస్తువు మనకు కనిపించక పోయినా ఉన్నట్టే. సూర్యుడు ఎప్పుడూ ఉంటాడు. రాత్రిపూట మనకు కనిపించడు. అంతమాత్రాన సూర్యుడు లేనట్లు కాదుగదా! ఇక లేని వస్తువు మనకు ఒక కాలంలో కనిపించినా అది లేనిదే.

ఎడారిలో ఎండమావులు కనిపిస్తాయి. అక్కడ నీరున్నట్లు భ్రమ కలుగుతుంది. కాని ఎంతదూరం వెళ్ళినా ఆ నీటిజాడే ఉండదు. అంటే కనిపించినా అది సత్యం కాదు. లేనిదే.

అసత్తు అంటే కుందేటికొమ్ములాగా, గొడ్రాలిబిడ్డలాగా ప్రతీతి లేనిది కాదు (ఊహకు అందనిది కాదు). స్వప్నంలోని వస్తువులాగా ఊహించవీలైనదే. చూడగలిగినదే. అయితే అలా చూడగల సమయంలో కూడా అది లేనిదే.

లేవు అంటే కానరావు అని అర్థం కాదు. లేకపోవటం వేరు, కానరాకపోవటం వేరు. వస్తువు కనిపించినా లేకపోవటం, లేకపోయినా కనిపించటం మిథ్య అంటారు. అదే భ్రాంతి. అదే అసత్.

స్వప్నంలో ఉన్నంతవరకు స్వప్నవస్తువులు నిజంగా ఉన్నట్లే ఉంటాయి. అవి సంతోషాన్నో, దుఃఖాన్నో కలిగిస్తూనే ఉంటాయి. కాని మేలుకున్న తర్వాత వస్తువులూ లేవు, సుఖదుఃఖాలూ లేవు. కనుక అవి కనిపించినప్పుడు కూడా లేనివే. "మొదట లేక–చివర లేక మధ్యలో ఉన్నా అది ఉన్నట్టు కనిపించటమే గాని నిజంగా లేనిదే"నని గౌడపాదాచార్యులు మాండూక్యకారికలలో తెలియజేశారు. అదే అసత్తు అంటే.

బావిదగ్గర త్రాడు పడి ఉంది. అక్కడ త్రాడు ఉన్నట్టు తెలియదు. చీకటిలో అటువైపుగా వచ్చినవాడు ఆ త్రాడును చూచి పాము అనుకున్నాడు. భయపడ్డాడు. అంతలో ఎవరో వచ్చి అగ్గిపుల్ల వెలిగించారు. ఆ వెలుగులో చూస్తే అక్కడ పాములేదు. త్రాడే ఉన్నది. మొదట త్రాడే ఉన్నది. చివరలో అగ్గిపుల్ల వెలిగించినప్పుడూ త్రాడే ఉన్నది. మధ్యలో చీకటిలో మాత్రమే పాము కనిపించింది.

మొదట–చివర త్రాడు మాత్రమే ఉండి మధ్యలో మాత్రమే పాము కనిపించిందీ అంటే అది పాములాగా భ్రమ గొల్పిందే గాని పాము కాదు. అది త్రాడే. అంటే పాముగా నీవు భ్రమపడి, భయపడినప్పుడు కూడా అది పాముకాదు, త్రాడే. అలాగే ముందూ పాము లేదు, చివరా పాము లేదు. మధ్యలో పాము ఉన్నా అది పాము కాదు. కనుక మూడు కాలాల్లోను త్రాడు ఉన్నది. అది సత్. మూడుకాలాలలోను పాము లేదు. అది అసత్.

అలాగే ఈ జగత్తు కూడా ఇప్పుడు కనిపిస్తున్నది. సృష్టికి ముందూ జగత్తు లేదు, ప్రళయం తర్వాతా జగత్తు లేదు. మధ్యలో ఉన్నట్టు కనిపించినా అది లేనిదే,





మిథ్యయే, అసత్తే. అలాగే ముందూ పరమాత్మే, చివరా పరమాత్మే. మధ్యలో కనిపించిన జగత్తు కూడా యదార్థంగా పరమాత్మే. సత్తే. అందుకే **"బ్రహ్మ సత్యం జగన్మిథ్య"** అన్నారు.

తత్త్వజ్ఞానులైనవారు ఉన్నది ఉన్నట్టుగా తెలుసుకోగలుగుతారు. సత్ ఏదో అసత్ ఏదో స్పష్టంగా తెలుసుకోగలరు. సామాన్యులుమాత్రం ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు భ్రమపడుతూ ఉంటారు. **తత్త్వం అంటే చివరి నిష్కర్ష, ఇక దానికి తిరుగుండదు.** జ్ఞానుల దృష్టి వేరు. సామాన్యుల దృష్టి వేరు. కనిపించినదే నిజమనుకొనేవారు సామాన్యులు.

ఒక భక్తుడు బంగారంతో గణపతిని తయారుచేయించి పూజించాలనుకున్నాడు. 200 గ్రాముల బంగారాన్ని కంసాలి వద్దకు తీసుకెళ్ళి 50 గ్రాములతో వినాయకుణ్ణి, 50 గ్రాములతో పీఠాన్ని, 50 గ్రాములతో గొడుగును, 50 గ్రాములతో ఎలుకను తయారుచేయించుకున్నాడు. అయితే బంగారు వినాయకుణ్ణి పూజించినా ఏమీ కలిసిరాకపోగా, ఉన్న ఆస్తి కూడా ఊడ్చుకు పోయింది. దానితో అతడు వాటిని కంసాలిదగ్గరకు తీసుకెళ్ళి అమ్ముతానన్నాడు. ఆ కంసాలి గీటురాయిమీద మచ్చు చూసుకొని, తూకంవేసి అన్నింటికీ సమానంగా ధర ఇచ్చాడు.

అప్పుడు భక్తుడు కంసాలితో, "ఏమయ్యా! ఇంత అన్యాయమా? వినాయకుడికీ అదే ధర, ఎలుకకూ అదే ధర, గొడుగుకూ అదే ధరా?" అన్నాడు.

వీడి దృష్టిలో అది వినాయకుడు, ఇది ఎలుక అని ఉన్నది గాని కంసాలి దృష్టిలో అంతా బంగారమే. బంగారాన్ని తీసేస్తే అక్కడ వినాయకుడూ లేదు, ఎలుకాలేదు. దేవుడు, ఎలుక ఉన్నదనుకున్నప్పుడూ అది బంగారమే. ఆ దృష్టి లేనప్పుడూ అది బంగారమే. ఎప్పుడూ అది బంగారమే. బంగారం సత్. దేవుడూ, ఎలుక అసత్. ఇదే దృష్టిభేదం అంటే.

కనుక అర్జునా! ఆత్మ సత్. ఈ దేహేంద్రియాలు అసత్. ఇదే తిరుగులేని సిద్ధాంతం. ఇదే తత్వజ్ఞానుల నిష్కర్ష. ఎందుకు అనవసరంగా ఏడుస్తావు? తత్త్వం తెలుసుకొని శోకాన్ని విడిచి పెట్టు. ఉన్నట్టు కనిపిస్తున్న ఈ శరీరాలను నిజంగా ఉన్నవని భావించి, భ్రమపడి ఏడుస్తున్నావు. కనిపించకపోయినా నిజంగా ఉన్న సత్ పదార్థాన్ని–ఆత్మను తెలుసుకో. ఆత్మను గురించి తెలుసుకున్నావా! ఇక నీకు

శోకించాల్సిన అవసరమే లేదు. అందుకే ఆత్మ (సత్) ఎట్టిదో తెలియజేయ బోతున్నాను. విను.

**శ్లో ॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదిం తతం।**
**వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి ॥** 17

**తా॥** దేనిచేత ఈ సమస్త జగత్తు వ్యాపించబడియున్నదో అట్టి ఆత్మనాశనం లేనిదని తెలుసుకో. నాశనంలేని ఆత్మను నశింపజేయుటకు ఎవ్వడూ సమర్థుడు కాడు.

**వ్యాఖ్య॥** ఈ సర్వజగత్తు-అంటే పదునాలుగు భువనాలతో కూడిన సృష్టి మొత్తం ఆత్మ అనే సూక్ష్మాతిసూక్ష్మమైన సద్వస్తువు చేత వ్యాపించబడియున్నది. సర్వవ్యాపకమైనది గనుక అది నశించేది కాదు. దానిని నాశనం చేయటం ఎవ్వరితరమూ కాదు. "యేన సర్వమిదం తతం" అనే వాక్యం "ఈశావాస్య మిదగ్ం సర్వం" అనే ఈశావాస్యోపనిషత్ మంత్రాన్ని పోలి ఉంది. ఈ జగత్తు యావత్తు ఈశ్వరునిచే వ్యాపించబడి యున్నది- అనే ఈ మంత్రభావన.

**పాలలో వెన్నలాగా, తిలలలో తైలంలాగా, కుండలలో మట్టిలాగా ఆత్మ ఈ జగత్తులో అణువణువునా వ్యాపించి యున్నది.** మానవుని దృష్టి సంకుచితం గనుక పై పై రూపాలనే చూడటం జరుగుతున్నది, వాటి అధిష్ఠానమైన ఆత్మను దర్శించలేకపోతున్నాడు.

ఒక గ్రామంలో నాస్తిక సంఘం ఉన్నది. ఆ ఊరికి ఏ సన్యాసులు వచ్చినా వీరంతా వెళ్ళి "భగవంతుడున్నాడా? ఉంటే చూపిస్తారా?" అని ఆయనను ప్రశ్నించి ఉక్కిరిబిక్కిరి చేస్తుంటారు. భగవంతుడున్నాడని చెప్పినా, ఆయనను చూపించటం కుదరదు గనుక వారేదేదో చెబుతారు. వీరు మాత్రం నమ్మరు. ప్రశ్నలతో వేధిస్తారు.

ఒకసారి ఒక మహాత్ముడు ఆ ఊరిలోని దేవాలయం దగ్గర పడుకున్నాడు. అది తెలిసి మనవాళ్ళంతా ఆయన చుట్టూ చేరి దేవుడున్నాడా? అని అడిగారు. "ఓ! ఉన్నాడు" అని ఆయన అనగానే "అయితే చూపించండి" అన్నారు వీరు. "ఓ! అలాగే చూపిస్తాను, దానికేం భాగ్యం" అని తకీమని సమాధానం చెప్పేటప్పటికి వారంతా బేజారయ్యారు. ఇంత ధీమాగా చెప్పిన వారెవరూ ఇంతవరకూ వారికి తారసపడ లేదు. తడబడకుండా తకీమని సమాధానం చెప్పటం కూడా ఒక కళయే.





అక్బరు పాదుషా తన మంత్రుల తెలివితేటలు పరీక్షించాలని, అందరినీ పిలిచి, మన పట్టణంలో మొత్తం కాకులెన్ని ఉన్నాయో ఖచ్చితంగా లెక్కగట్టి 24 గంటలలో చెప్పాలి. అలా చెప్పలేని వారి ఉద్యోగాలు ఊస్ట్ అన్నాడు. అందరూ తలలు పట్టుకు కూర్చున్నారు. ఆ రోజు గడిచిపోయింది. మరునాడు సభ ఏర్పాటయింది. పాదుషా ఒక్కొక్కరిని అడుగుతున్నాడు. మంత్రులంతా తలలు వాల్చేస్తున్నారు. చివరకు బీర్బల్ వంతు వచ్చింది. "బీర్బల్! లెక్కపెట్టావా?" అన్నాడు పాదుషా.

"చిత్తం మహారాజా! మన పట్టణంలోని కాకులన్నీ కలిపి 36వేల నాలుగు వందల అరవై రెండు" అన్నాడు. "ఇంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నావ్?" అని ప్రశ్నించాడు అక్బర్. "నిన్నటినుండి నిద్రాహారాలుమాని అదేపని మీద ఉన్నాను మహారాజా!" అన్నాడు బీర్బల్. అక్బర్ పాదుషా నిర్ఘాంతపోయాడు. వెంటనే ఒక ఆలోచన తట్టింది, "సరే నీవు చెప్పినదానికంటే ఎక్కువో, తక్కువో ఉంటేనో!" అన్నాడు. "ఎక్కువైతే పొరుగూళ్ళనుంచి వచ్చాయనుకోండి, తక్కువైతే పొరుగూళ్ళకు వెళ్ళాయనుకోండి; నిన్నటినుండి ఇప్పటివరకు మన పట్టణంలో ఉన్నవాటినే నేను లెక్కపెట్టాను" అన్నాడు బీర్బల్. అంతే సభాసదులతోపాటు అక్బర్‌పాదుషా అవాక్కయ్యాడు. ఇదొక అద్భుతమైనకళ. సాధువుగారు కూడా ఇలాంటి కళలలో ఆరితేరినవాడు కనుకనే భగవంతుని చూపిస్తానని తకీమని సమాధానం చెప్పాడు. "చూపండి, చూపండి" అని చుట్టూ మూగారు నాస్తికులు.

"నాయనా! ప్రయాణ బడలికలో ఉన్నాను కాస్త పాలు తెప్పించండి" అనటంతో ఒక గ్లాసుపాలు తెచ్చి ఇచ్చారు. తెచ్చిన పాలను త్రాగకుండా సాధువుగారు ఒక పుల్లతో కలియబెడుతూ ఏదో వెతుకుతున్నాడు. "అయ్యా! త్వరగా పాలు త్రాగి దేవుణ్ణి చూపండి" అన్నారు వారు. "అబ్బాయిలూ! పాలలో వెన్న ఉంటుందంటారు గదా! దాన్ని చూచి త్రాగుతాను" అన్నాడు సాధువు. "ఓరిపిచ్చివాడా! వెన్న అలా కనబడుతుందా? అది పాలలో అంతటా వ్యాపించే ఉంటుంది. పాలలో నుండి వెన్నను తీయాలంటే ముందుగా పాలను కాచి, చల్లార్చి, తోడు వేస్తే కొద్దిసేపటికి పెరుగవుతుంది. దానిని చిలికితే వెన్న వస్తుంది. ఏమీ చెయ్యకుండా తేరగా కనిపిస్తుందా వెన్న?" అన్నాడు వారిలో ఒకడు.

దానికాసాధువు "నాయనలారా! దేవుడుమాత్రం అంత తేరగా కనబడతాడా ఏమీ చేయకుండా? ఈ జగత్తు నందంతటా వ్యాపించియున్న ఆయనను దర్శించాలంటే

కర్మయోగం ద్వారా ఆగామికర్మలను చేసి మనశ్శుద్ధి చేసుకోవాలి. భక్తియోగం ద్వారా ప్రారబ్ధకర్మలను అనుభవించాలి. జ్ఞానయోగం ద్వారా సంచితకర్మలన్నీ దగ్ధం చేసుకోవాలి. ఆ పరమాత్మ ఎవరో తెలుసుకొని ధ్యానం చేసి సమాధిస్థితికి చేరుకోవాలి. అప్పుడే పరమాత్మ సాక్షాత్కారం. **పాలల్లో నుండి వెన్నను తీయటానికే అంత శ్రమపడాల్సి ఉంటే, ఈ ప్రపంచంలో అణవణువునా వ్యాపించియున్న పరమాత్మను దర్శించటానికి ఎంత శ్రమపడాలి?"** అన్నాడు సాధువు. ముఖాలు వాల్చేశారు నాస్తికులు.

కనుక ఆత్మ ఈ జగత్తునందంతటా వ్యాపించియున్నది. అట్టి వ్యాపకవస్తువునకు నాశనం లేదు. కుండను నాశనం చేయొచ్చుగాని కుండయందంతటా వ్యాపించియున్న ఆకాశాన్ని ఎలా నాశనం చేయగలరు? సూక్ష్మమైన ఆకాశాన్నే నాశనం చేయలేకపోతే ఆకాశంకన్నా సూక్ష్మాతిసూక్ష్మమైన ఆత్మను ఎవరు నాశనం చేయగలరు? కనుక ఓ అర్జునా! ఆత్మ అవినాశి. దానిని నశింపజేయటం నీతరం కూడా కాదు. నీవు శరీరాలను నీ అస్త్రశస్త్రవిద్యలతో నాశనం చేయగలవేగాని, ఆత్మనేమీ చేయలేవు. ఈ విషయాన్ని చక్కగా గ్రహించి శోకాన్ని విడిచి పెట్టు అన్నాడు భగవానుడు.

ఆత్మ అవినాశి అని స్పష్టం చేసిన భగవానుడు దేహాల పరిస్థితి ఏమిటో తరువాత శ్లోకంలో తెలియజేయబోతున్నాడు.

**శ్లో॥ అంతవంత ఇమేదేహాః నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినోऽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ! ॥** **18**

**తా॥**నిత్యమైనటువంటి, నాశనం లేనటువంటి, సాటి లేనటువంటి శరీరికి (ఆత్మకు) ఈ శరీరాలన్నీ నశించి పోయేవే. కనుక ఓ అర్జునా! యుద్ధం చెయ్యి.

**వ్యాఖ్య:** శరీరి (ఆత్మ) నిత్యుడు, అవినాశి, అప్రమేయుడు. ఆ శరీరి ధరించిన శరీరాలుమాత్రం అంతం గలిగినవి, అంటే నశించిపోయేవి. నీవు శరీరివేగాని, శరీరానివిగాదు. వీరంతా కూడా దేహాలు కాదు.

వీరంతా దేహాలు అని నీవు భావిస్తున్నావు. భ్రమ పడుతున్నావు. దేహాలు నశిస్తాయి గనుక వీరంతా నశిస్తారని దుఃఖిస్తున్నావు. వీరంతా దేహాలు కాదు; ఆత్మ. నీవు కూడా ఆత్మయే. ఆత్మ నశించేది కాదు. అది నిత్యం. ఎల్లప్పుడూ ఉండేది. కనుక





నశింపులేనిదానికొరకు దుఃఖించాల్సిన పని లేదు. ఇక నశించేవే ఐనా శరీరాలకొరకు దుఃఖించకుండా ఎలా ఉండగలను అంటావా? ఇవి 'అంతవంతాలు'. అంటే దేహం నశించినా మరొక దేహం వస్తుంది. మరి అట్టి దేహాల కొరకు ఎందుకు దుఃఖించటం? ఈ దేహాలు అసత్తు. అంటే లేనివే. ఎప్పుడో మరణించిన తర్వాత లేకపోటం కాదు, ఇపుడు కంటికి కనిపించేటప్పుడు కూడా లేనివే. ఇదే అసత్తు అంటే. రాత్రి కలలో కనిపించిన అప్సరసలైన నీ అష్టభార్యలు నీవు మేలుకోగానే కనిపించకుండా పోయారుగదా! వారికోసం ఏడుస్తావా? 'రాత్రి కలలో కనిపించగా తెచ్చుకొని బీరువాలో దాచుకున్న బంగారం కోసం మేలుకున్న తర్వాత ఏడుస్తావా?' అవి అన్నీ అసత్తు. ఇప్పుడే కాదు రాత్రి కలలో కనిపించి నప్పుడు కూడా అసత్తే. అలాగే ఈ దేహాలు కూడా అసత్తే. కనిపించేటప్పుడు కూడా యదార్థం కాదు.

కనుక ఓ అర్జునా! ఆత్మసత్ వస్తువని, దేహాలు అసత్ వస్తువులని తెలుసుకొని, వీరంతా ఆత్మయేగాని దేహాలు కాదు అని తెలుసుకొని, ఆత్మ ఎప్పుడూ ఉండేది నశించనిదని; దేహాలు ఎప్పుడూ లేనివేనని గ్రహించి, శోకాన్ని విడిచిపెట్టు. నీ కర్తవ్యమైన యుద్ధాన్ని చెయ్యి.

ఆత్మ నశించేది కాదని; దేహాలు నశించేవని; నీవు ఆత్మవే కాని దేహం కాదని; కనుక శోకించాల్సిన పనిలేదని ఇంతవరకు చెప్పిన భగవానుడు, ఆత్మయొక్క స్వరూప స్వభావాలేమిటో, లక్షణాలేమిటో, ప్రత్యేకత ఏమిటో తెలియజెప్పి అర్జునునికి తద్వారా సమస్తమానవాళికి ఆత్మజ్ఞానాన్ని కలిగించుటకై రాబోయే శ్లోకాల్లో అనేక వివరణలతో ఆత్మజ్ఞానాన్ని అందిస్తున్నాడు.

**శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం।**
**ఉభౌ తౌన విజానీతః నాయం హంతి న హన్యతే॥** **19**

**తా॥** ఎవరు ఆత్మ చంపేది అని అనుకుంటారో, లేక చనిపోయేది అని అనుకుంటారో వారు ఉభయులు తత్త్వము తెలియనివారే. ఆత్మ ఇతరులను చంపేదీ కాదు, చనిపోయేదీ కాదు.

**వ్యాఖ్య:** తాను చంపేవాడినని, భీష్మాదులు చనిపోయే వారని భావిస్తున్న అర్జునుడు, తనపై ఎంతో ఆదరాభిమానాలు గల ఆత్మీయులైనవారికోసం దుఃఖిస్తున్నాడు.

అర్జునుని దుఃఖాన్ని తొలగించటం కోసం ఆత్మజ్ఞానాన్ని బోధిస్తున్న భగవానుడు,

"అర్జునా! నీవుగాని, ఆ భీష్మాదులు గాని అందరూ ఆత్మయేగాని, దేహాలు కాదు. ఆత్మనాశనం లేనిది, నిత్యమైనది. అట్టి ఆత్మకొరకు దుఃఖించాల్సిన పనిలేదు" అని ఇంతవరకు చెప్పి; ఇపుడు ఆత్మ చంపేదీ కాదు, చనిపోయేదీ కాదు అని వివరించబోతున్నాడు.

చంపేదీ స్థూలశరీరమే, చనిపోయేదీ స్థూలశరీరమే, మరి నీవుగాని, భీష్మాదులుగాని స్థూలశరీరాలు కాదు, అందరూ ఆత్మయే. పైకి కనిపించేది స్థూలశరీరం. కనిపించకుండా లోపల ఉండేది ఆత్మ. పైనున్న స్థూలశరీరం నశించినా లోపలి ఆత్మ నశించేది కాదు.

ఒక కుండను రాతితో కొడితే కుండ పగిలిపోతుంది. కాని కుండలోని సూక్ష్మమైన ఆకాశానికేమీ కాదు. అలాగే కుండ ఎవరితలపైనన్నా పడితే తలకు దెబ్బ తగులుతుంది. అయితే ఆ దెబ్బ కుండవల్ల తగిలిందేగాని, కుండలోని ఆకాశం వల్ల కాదు. అలాగే నీవు బాణం వేస్తే పోయేది శరీరమే గాని ఆత్మకాదు. అలాగే ఆ దేహం పోయేది నీ దేహం వదలిన బాణం వల్లనే గాని ఆత్మవైన నీ వల్ల కాదు.

మరి చంపేదీ, చనిపోయేదీ దేహమే అయినప్పుడు, ఆత్మ కానపుడు నేను చంపేవాణ్ణని, వారు చనిపోయేవారని ఎందుకు అనుకుంటున్నాము? నేను ఆత్మను అనే జ్ఞానం లేక; నేను దేహాన్ని అని భ్రమచెందటం వల్ల. కనుక ముందు నేనెవరిని?" అనే విషయాన్ని రూఢి చేసుకోవాలి. నేను ఆత్మను అని గ్రహించి ఆత్మగా ఉండాలి. ఎరుకలో ఉండాలి. అలా ఉంటే, ఉండగలిగితే నేను చంపేవాణ్ణీ కాదు, చనిపోయేవాణ్ణీ కాదు అని నిశ్చయంగా తెలుస్తుంది. దానితో శోకం పోతుంది.

నేను దేహమనే వేషం వేసుకుని ఈ జీవన నాటక రంగంపై నటిస్తున్నాను. నాటకంలో జరిగేవన్నీ ఆ పాత్రకు సంబంధించినవేగాని, పాత్రధారికి సంబంధించినవి కావు. చంపేదీ, చచ్చేది పాత్రలేగాని, పాత్రధారులు కాదు. ఈ జ్ఞానం నాటకం వేసేవాడికీ ఉంటుంది, నాటకాన్ని చూసే వాడికీ ఉంటుంది. కాని జీవితంలో మాత్రం ఎవ్వరికీ ఉండటం లేదు. ఆత్మనని తెలియనివారు ఎందరో! తెలిసినా ఆత్మగా ఉండనివారు మరెందరో! దేహతాదాత్మ్యంతో అందరూ దేహంగానే ఉంటున్నారు. కనుక ఆత్మనని తెలుసుకొని ఆత్మగా ఉంటే నేను చంపేవాణ్ణీ కాదు, చనిపోయేవాణ్ణీ కాదు అని తెలిసిపోతుంది. అలాగాక నేను చంపేవాణ్ణిఅనిగాని,





చనిపోయేవాణ్ణిఅనిగాని ఎవరైతే అనుకుంటారో వారు తెలియనివారే. అజ్ఞానులే.

అయితే ఈ జ్ఞానాన్ని అన్నివేళలా కలిగి ఉండాలి. ఈ తెలివిని అతితెలివిగా ప్రదర్శించరాదు. ఒకడు హత్యచేసి కోర్టులో ప్రవేశపెట్టబడ్డాడు. జడ్జి విచారణచేసి మరణశిక్ష విధించాడు. అప్పుడా ముద్దాయి జేబులోనుండి భగవద్గీతను తీసి ఈ శ్లోకం చదివి, జడ్జిగారు! మీరు నాకు శిక్ష విధించటం అన్యాయం. చూడండి ఆత్మ చంపేదీకాదు, చనిపోయేదీ కాదు. నేను ఆత్మను గనుక చంపింది నేను కాదు, మరి వాడూ ఆత్మ గనుక చనిపోయిందీ వాడు కాదు. నేను చంపేవాడినని, చనిపోయేవాడినని అనుకొనేవారిద్దరూ అజ్ఞానులే. మరి నాకెందుకీ శిక్ష? అన్నాడు. దానికి జడ్జి, "నాయనా! నీవు చంపినవాడివీ కాదు, ఇప్పుడు చావబోయేవాడివీ కాదు. అసలు శిక్ష నీకు వేయలేదు; నీ దేహానికే. నీవు నిత్యుడివి, శాశ్వతుడివి. కనుక దుఃఖించాల్సినదేమీ లేదు. నీ దేహం పోయినా నీకు ఏ ఢోకా లేదు" అన్నాడు.

ఆత్మచంపేదీ కాదు, చనిపోయేదీ కాదు అని ఇంత గట్టిగా ఎందుకు చెబుతున్నాను అంటే–

**శ్లో॥ నజాయతే మ్రియతే వా కదాచిత్**
**నా యం భూత్వా భవితా వా న భూయః ।**
**అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** **20**

**తా॥** ఈ ఆత్మ ఎన్నటికీ పుట్టేదీ కాదు, చనిపోయేదీ కాదు. ఇదివరకు లేకుండి కొంతకాలం తర్వాత ఉండేదీకాదు. ఇది పుట్టుకలేనిది, నిత్యమైనది, ఎల్లప్పుడూ ఉండేది, అనాది యైనది. శరీరము చంపబడినప్పటికీ ఇది చంపబడదు.

**వ్యాఖ్య:** ఈ శ్లోకము, క్రిందటి శ్లోకము రెండూ కూడా యధాతథంగా కఠోపనిషత్తు నుండి గ్రహించబడినవే. ఆత్మ దేహం లాగా పుట్టేదీ కాదు, మార్పులు చెందేదీ కాదు, నశించేదీ కాదు. దేహం నశించినా దేహమునందంతటా నఖశిఖ పర్యంతం వ్యాపించియున్న ఆత్మ ఎన్నటికీ నశించదు అని స్పష్టంగా వివరిస్తున్నారీ శ్లోకంలో.

యదార్థంగా ఈ లోకంలో ప్రతి జీవీ ఆత్మయే. కాకపోతే 'నేను ఆత్మను' అని తెలుసుకోగల ప్రాణి కేవలం మానవుడు మాత్రమే. 84 లక్షల రకాల జీవరాసులలో కేవలం మానవుడికి మాత్రమే బుద్ధి ఉన్నది గనుక ఆత్మనని గ్రహించగల అవకాశం

మానవుడికే. ఐతే కేవలం తినటం, నిద్రపోవటం, సంతానాన్ని కనటం, పిల్లలను పోషించటం, ఆహారసంపాదన మొదలైన వ్యవహారాలే ప్రధానమనుకొని జీవించేవారు ఈ అవకాశాన్ని వినియోగించుకోరు. కొద్దిమంది పూర్వజన్మ సుకృతం ఉన్నవారు మాత్రమే ఈ ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణించి 'నేను ఆత్మను' అని తెలుసుకోగలుగుతారు. సాధనలు చేసి, ఆత్మగా ఉండి శాశ్వతానందాన్ని పొందుతారు.

ఇలా ఆత్మనని తెలుసుకోవటమేగాక, సర్వకాల సర్వా వస్థలయందు, దేహం ఏ పనులయందు నిమగ్నమై ఉన్నా నిరంతరం ఆత్మగా ఉండటానికి వీలుగా, ఈ శ్లోకంలో ఆత్మ లక్షణాలను స్థూలశరీరంతో పోల్చి చెప్పబోతున్నారు.

**నజాయతే-న మ్రియతేవాకదాచిత్:** స్థూలశరీరానికి షడ్వికారాలున్నాయి. అవే అస్తి (ఉండుట), జాయతే (పుట్టుట), వర్ధతే (పెరుగుట), విపరిణమతే (మార్పుచెందుట), విపక్షీయతే (కృశించుట), వినశ్యతి (నశించుట).

ఈ వికారాల కారణంగానే దుఃఖం. జన్మించేముందు గర్భంలో నరకయాతన, జన్మించేటప్పుడు దుఃఖం, ఇక పెరుగుతూ ఉన్నప్పుడు కోరికలు తీరలేదని దుఃఖం, శరీరంలో జరిగే మార్పులకు, గాయాలకు, రోగాలకు దుఃఖం; ఆ తర్వాత వృద్ధాప్యం వల్ల దుఃఖం; చివరకు మరణ దుఃఖం. అంటే అన్ని అవస్థలలోను, అన్ని వికారాల లోను దుఃఖమే. అయితే ఈ దుఃఖాలన్నీ వికారాలు గల దేహాలకే గాని, ఏ వికారాలు లేని ఆత్మకు కాదు. ఆత్మకు పుట్టుకా లేదు, మరణమూ లేదు. పుట్టుకలేని దానికి పెరగటం, మార్పు చెందటం, కృశించటం అనేవి ఏవీ ఉండే వీలు లేదు. కనుక ఏ వికారాలు లేని ఆత్మకు అసలు దుఃఖం ఉండే ప్రసక్తే లేదు.

కుమ్మరి కుండను తయారుచేస్తాడు. అంటే కుండకు పుట్టుక ఉంది. ఎప్పుడో ఒకప్పుడు నాశనమూ ఉంది. కాని దానిలోని ఆకాశానికి (ఖాళీస్థలానికి) పుట్టుకాలేదు, నాశనమూ లేదు. అలాగే వికారాలు శరీరానికే గాని ఆత్మకు ఏ వికారాలు లేవు.

**అజఃనిత్యః శాశ్వతఃపురాణః** :- పుట్టుకలేనిది; చావు లేనిది; కనుక ఎల్లప్పుడూ స్థిరంగా ఉండేది. అంటే ఒకప్పుడు ఉండటం మరొకప్పుడు లేకపోవటం అనేది లేనిది; ఇది 'పురాణః' అంటే పురాతనమైనది. అంటే ఎప్పటినుండో ఉన్నది. అసలు





ఆత్మకు మొదలు లేదు. కనుక అనాది. పురాతనం అంటే చాలా పాతది గదా అనుకుంటారేమో అది ఎల్లప్పుడూ క్రొత్తదే. సదానూతనం-సనాతనం. దేహం మాత్రం పాతబడి పోయి రోతపుడుతుంది.

**నహన్యతే హన్యమానే శరీరే** :- దేహం నశించినా ఆత్మ నశించదు. పాత్ర వేడెక్కితే పాత్రలోని నీరు వేడెక్కుతాయి. అలాగే దేహం నశిస్తే దేహమునందలి ఆత్మ నశిస్తుందా? అనే సందేహం అక్కరలేదు. పాత్రను అన్నివైపులా అంటుకొని నీరుంటుంది. కాని దేహంతో ఏమాత్రం అంటక అసంగంగా ఆత్మ ఉంటుంది. సూక్ష్మమైన ఆకాశం కుండను అంటకుండా ఉన్నట్లు సూక్ష్మాతిసూక్ష్మ ఆత్మ శరీరాన్ని ఏమాత్రం అంటక అసంగంగా ఉంటుంది. ఈ విధంగా ఆత్మను తెలుసుకున్నవాడు, నేను ఆత్మను అని గ్రహించినవాడు ఎలా ప్రవర్తిస్తాడు?

**శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం ।**
**కథంసపురుషః పార్థ! కం ఘాతయతి హంతికం॥ 21**

**తా॥** ఓ పార్థా! ఎవడు ఈ ఆత్మను పుట్టుక లేనిదని, నాశనం లేనిదని, నిత్యమైనదని, అక్షయమైనదని తెలుసు కుంటాడో, అట్టి పురుషుడు ఎవరిని చంపిస్తాడు? ఎవరిని చంపుతాడు?

**వ్యాఖ్య:** "నేను నిత్యమైన, శాశ్వతమైన, చావుపుట్టుకలు లేని ఆత్మను" అని గ్రహించిన మానవుడు, తనతో సహా అందరూ ఆత్మస్వరూపులే అని తెలుసుకుంటాడు. ఇక అట్టివాడు ఎవరిని చంపుతాడు? ఎవరిని చంపిస్తాడు?

ఆత్మను గురించి ఏమీ తెలియనివాడు, దేహమే నేను అని భ్రమలో ఉన్నవాడు, 'నేను ఆత్మనే గాని దేహాన్ని కాదు' అని తెలుసుకోలేనివాడు, నశించే దేహంలో నశించని ఆత్మగా ఉన్నానని గ్రహించలేనివాడు శరీరాన్ని చంపి నేను అతణ్ణి చంపాను అని అనుకుంటాడు. అందుకై దుఃఖిస్తాడు, శోకిస్తాడు. కాని ఆత్మజ్ఞానం కలిగిన మహాత్ముడు, 'నేను ఆత్మను-నశించని ఆత్మను' అని నిశ్చయజ్ఞానం గలవాడు ఆత్మనైన నాకు జననమరణాలు లేవు అని గ్రహించి, నేను చంపేవాణ్ణి అనిగాని, అతడు చనిపోయేవాడు అనిగాని అనుకోడు. అంతేకాదు ఆత్మనైన నేను అకర్తను-ఏమీ చేసేవాణ్ణి కాదు; అలాగే ఏమీ చేయించేవాణ్ణీ కాదు అని గ్రహించినప్పుడు నేను చంపేవాణ్ణీ కాదు, చంపించేవాణ్ణీ కాదు- అని గ్రహిస్తాడు.

ఇక్కడ శ్రీకృష్ణుడు తాను చెప్పేమాటలలో అర్జునునితో పాటు తనను కూడా

కలుపుకుంటున్నాడు. యుద్ధం చెయ్యమని స్వయంగా అర్జునుని ప్రోత్సహిస్తున్నాడు– అంటే సామాన్య భావంలో అర్జునుడు చంపేవాడు, శ్రీకృష్ణుడు చంపించేవాడు. కాని ఆత్మజ్ఞానం కలిగితే–నేను ఆత్మను అనే దృఢనిశ్చయంలో ఉంటే ఇక చంపేదెవరు? చంపించేదెవరు?

తాను చెప్పే ఆత్మజ్ఞానాన్ని అర్జునుడు గ్రహించి 'నేను ఆత్మను' అని, 'ఆత్మ చావులేనిది' అని గ్రహిస్తే, అనుభవ పూర్వకంగా గ్రహిస్తే నేను చంపేవాణ్ణి అనే భావం పోతుంది. ఆ భావం పోతే ఇక దుఃఖానికి తావులేదు. నశించేదానికి దుఃఖించాలి, కాని నశించనిదానికై దుఃఖమెందుకు?

ఇంతకూ ఆత్మకు, ఈ శరీరాలకు గల సంబంధం ఏమిటి?

**శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాని అన్యాని సంయాతి నవానిదేహీ॥ 22**

**తా॥** మానవుడు ఏ ప్రకారంగా చినిగిపోయిన వస్త్రాలను విడిచి నూతన వస్త్రాలను ధరిస్తున్నాడో, అలాగే ఆత్మ జీర్ణదేహాలను వదలి క్రొత్త దేహాలను పొందుతున్నది.

**వ్యాఖ్య:** "ఆత్మనిత్యమైనదని, నాశనం లేనిదని; శరీరాలు నశించి పోయేవని" సామాన్యులకు కూడా చక్కగా అర్థం కావటానికి వీలుగా అద్భుతమైన, అందరి అనుభవంలో ఉన్న ఉదాహరణను భగవానుడు తెలియజేయటం భగవద్గీతా పాఠకుల అదృష్టం.

అసలు మనిషి చనిపోవటం అంటే ఏమిటి? చినిగిపోయిన పాత బట్టను విడిచి క్రొత్త బట్టను ధరించినట్లుగ, పనికిరాని పాతశరీరాన్ని వదలి క్రొత్త శరీరం కొరకు వెళ్ళటమే. శరీరాన్ని విడిచి వెళ్ళటమే మరణం.

ఒక వ్యక్తి ఆయా సమయాలకు తగిన దుస్తులు ధరిస్తాడు. ఉద్యోగానికి వెళ్ళేటప్పుడు సూటు, పడుకొనేటప్పుడు నైట్‌డ్రస్, ఇంట్లో ఉన్నప్పుడు లుంగీ, బనియను–ఇలా. నైట్ డ్రస్‌తో ఉద్యోగానికి వెళ్ళడు. సూటు వేసుకొని ఆటలాడటానికి వెళ్ళడు. ఆయా సమయాలకు–పనులకు తగిన వస్త్రాలను ధరిస్తాడు. ఆ పనులకు సరిపడని వస్త్రాన్ని వదిలేస్తాడు. అలాగే జీవుడు తాను కోరిన అనుభవాలను పొందటానికి తగిన దేహాన్ని ధరించి ఈ లోకంలోకి వస్తాడు. ఎప్పుడైతే ఇక తన అనుభవాలకు ఆ దేహం పనికిరాదను కుంటాడో అప్పుడు దాన్ని విడిచివెళ్తాడు.





చినిగిన దుస్తులు వదిలేటప్పుడు ఎవరూ దుఃఖించరు. కాని జీర్ణమైన దేహాన్ని విడిచేటప్పుడు మాత్రం దుఃఖిస్తాడు. మృత్యువుయొక్క స్వరూప స్వభావాలు తెలియని వారికే ఈ దుఃఖం. నీవు పొందవలసిన అనుభవాలకు ఈ శరీరం పనికిరానప్పుడు, దీనిని వదలి, పనికివచ్చే నూతన శరీరాన్ని ధరించటమే ఈ మృత్యువు యొక్క స్వభావం–అని తెలుసుకున్న వాడికి ఇక దుఃఖమెందుకు ఉంటుంది?

పసిబిడ్డకు పాలు ఇస్తున్న తల్లి ఒకవైపున పాలు అయిపోతే పాలున్న రెండోవైపుకు బిడ్డను మారుస్తుంది. అజ్ఞానంలో ఉన్న ఆ పసివాడు ఈ విషయం తెలియక వదిలించేటప్పుడు ఏడుస్తాడు, కరిపించేటప్పుడు ఏడుస్తాడు. కాని తల్లిమాత్రం ఆ బిడ్డ క్షేమం కోసమే, అతడి ఆకలి తీరటం కోసమే బలవంతంగా అలా చేస్తుంది. అలాగే ప్రకృతిమాత కూడా జీవుడి యొక్క అనుభవాలకు తగిన నూతన దేహాన్ని ఇవ్వటం కోసమే, అనుభవాల నివ్వటానికి ఉపయోగపడని జీర్ణదేహాన్ని బలవంతంగా వదిలించేస్తుంది. ఇది తెలియని అజ్ఞాని దేహం వదిలిపోతుందే అని ఏడుస్తాడు. పిల్లవాని బట్టలు చినిగినప్పుడు, క్రొత్తబట్టలు వేయటానికే తల్లివాటిని తొలగిస్తుంది. ఇది తెలియని పిల్లవాడు ఏడుస్తాడు. అలాగే నూతన దేహాన్ని ఇవ్వటానికే జీర్ణదేహాన్ని ప్రకృతి తొలగిస్తుంటే, ఆ ప్రకృతిమాత చేసే మేలును తెలుసుకోలేని ఈ పిల్లలు– గడ్డాలు, మీసాలు వచ్చిన పిల్లలు ఊరక గోలపెట్టి ఏడుస్తారు. కాని ప్రకృతి వదలదు. దేహాన్ని వదిలించే తీరుతుంది. కనుక మరణ సమయంలో ఏడ్చేవాడు అజ్ఞాని. జ్ఞాని ఏడవడు, సంతోషిస్తాడు.

ఈ సందర్భంలోనే లోకంలో చాలామంది ఒక విమర్శ చేస్తుంటారు. అది ఏమిటంటే విడిచిపెట్టే దేహాలన్నీ జీర్ణమైనవేనా? 5 సంవత్సరముల బాలుడు, 10–12 ఏండ్లవారు, 20–25 సంవత్సరముల నవయవ్వనంలో ఉన్న స్త్రీ పురుషులు కూడా మరణిస్తుంటారు కదా! వారి దేహాలు ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉంటాయి. మరి ఇవి జీర్ణదేహాలెలా అవుతాయి?

ఇక్కడ జీర్ణమైన దేహాలు అంటే కర్మతో జీర్ణమైన దేహాలు అని. ఏ ప్రారబ్ధకర్మఫలాలు అనుభవించటానికి తగిన దేహాన్ని తీసుకొని జీవుడు ఈ లోకంలోకి వస్తున్నాడో, ఆ ప్రారబ్ధ కర్మఫలాలు అనుభవించటం పూర్తయి పోయినపుడు ఆ దేహం జీర్ణదేహమే.

అసలు వస్త్రాలు గాని, దేహాలు గాని జీర్ణమైనవా? కాదా? అని నిర్ణయించేదెవరు? వాటి (ఓనర్) స్వంతదారు మాత్రమే. ఒక సంపన్నురాలు సంవత్సరానికి 30-40 చీరలు కొంటుంది. 4-5 సార్లు ఒక చీరను కట్టిన తర్వాత దానిని తీసేస్తుంది. అది ఆమెకు జీర్ణవస్త్రం. అదే చీరను తక్కువ ధరకు కొన్న పేదరాలికి అది నూతన వస్త్రం. కనుక అది జీర్ణవస్త్రమో కాదో నిర్ణయించాల్సింది ఆ వస్త్రం యొక్క స్వంతదారు మాత్రమే. అలాగే ఒక దేహం జీర్ణదేహమా? కాదా? అని నిర్ణయించాల్సింది ఆ దేహం యొక్క స్వంతదారైన జీవుడే. దేహం ద్వారా తనకు రావలసిన అనుభవాలకు ఈ దేహం పనికిరాదు గనుక అతడి దృష్టిలో అది జీర్ణదేహమే. జీవుడు తాను అనుభవించవలసిన ప్రారబ్ధ కర్మఫలాలు అనుభవించటం పూర్తి అయితే అది అతడికి జీర్ణదేహమే.

కనుక అర్జునా! నీ ఎదుట నిలబడ్డ భీష్మద్రోణాదులు వారి జీర్ణ దేహాలను వదిలించుకోవటానికి సిద్ధంగా ఉన్నారు. వారు ఆత్మజ్ఞాన సంపన్నులైతే దేహాల పీడను శాశ్వతంగా వదిలించుకొని విదేహముక్తులవుతారు. జ్ఞానులు కాకపోతే ఈ జీర్ణదేహాలను వదిలి తగిన నూతన దేహాలతో తిరిగివస్తారు. ఎటు చూచినా ఇది వారికి లాభమేకాని ఏమాత్రం నష్టం లేదు.అందుకే ఏ దుఃఖమూ లేకుండా హాయిగా ఉన్నారు. నీవు నీ ధర్మాన్ని నెరవేర్చుకొని సార్థకత పొందు, వారు మరణాన్ని సద్వినియోగం చేసుకొని సార్థకత పొందుతారు.

**నర:దేహీ:** వస్త్రాలను మార్చేవానిని నరుడుఅని, దేహాలను మార్చేవానిని దేహి అని ఈ శ్లోకంలో అన్నారు. వస్త్రాలను మార్చేది నరులే. మానవులే. కాని దేహాలను మార్చేది అన్ని ప్రాణులూ కూడా. అందుకే దేహాలను మార్చేవానిని దేహి (జీవుడు) అన్నారు.

కనుక అర్జునా! దేహాలు నశిస్తాయని శోకించకు. పాతబట్టలు విడిచిన తరువాత ఎవడూ నగ్నంగా ఉండడు, తర్వాత ధరించాల్సిన వాటిని రడీగా ఉంచుకుంటాడు. అలాగే ఈ దేహాలు పోతే ఎలాగా? అని చింతించకు. క్రొత్త దేహాలు నీ కర్మలను బట్టి రడీగా ఉంటాయి. ఎన్ని దేహాలను ధరించినా, వదిలినా నీవు మాత్రం ఎక్కడికీ పోవు. నీవు నిత్యుడివి.

వస్త్రాలు ఎన్ని మార్చినా దేహం అలాగే ఉంటుంది. దేహాలు ఎన్ని మార్చినా ఆత్మ అలాగే ఉంటుంది. ఆత్మ నిత్యమైనది. చావు పుట్టుకలు లేనిది. శాశ్వతమైనది.





అని ఋజువు చేసేందుకే భగవానుడీ శ్లోకంలో ఈ ఉదాహరణను ఇవ్వటం జరిగింది.

ఆత్మ దానంతట అది నిత్యమైనదే. చావుపుట్టుకలు లేనిదే.సరే. దేహాలను బాధించినట్లు వేటితోనూ ఆత్మను బాధించటం కుదరదా? లేక ఆత్మను బాధించే వస్తువులు ఏమైనా ఉన్నాయా? తరువాత 2 శ్లోకాల్లో వివరించబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతిపావకః ।**
**నచైనం క్లేదయంత్యాపః నశోషయతి మారుతః ॥ 23**

**శ్లో॥ అచ్ఛే ద్యోఽయమ దాహ్యోఽయం అక్లేద్యోశోష్య ఏవచ।**
**నిత్యస్సర్వ గతః స్థాణుః అచలోఽయం సనాతనః॥ 24**

**తా॥** ఈ ఆత్మను శస్త్రాలు ఛేదించలేవు. అగ్ని కాల్చలేదు. నీరు దీనిని తడుపలేదు. వాయువు ఎండించలేదు (23). ఇది ఛేదించవీలులేనిది, దహించ వీలులేనిది, తడుపుటకు వీలులేనిది, ఎండించ వీలులేనిది. ఇది నిత్యమైనది, సర్వవ్యాపకమైనది, స్థిరమైనది, అచలమైనది, సనాతనమైనది (24).

**వ్యాఖ్య:** ప్రపంచంలోని వస్తువులు గాని, ప్రాణుల దేహాలు గాని, అన్నీ ఎప్పుడో ఒకప్పుడు నశించిపోయేవే. ఆయుధాలచేత ఛేధించబడతాయి, అగ్నిచేత దహింపబడతాయి, నీటిచేత తడుపబడతాయి. వాయువుచేత ఎండింపబడతాయి. కాని ఆత్మ ప్రపంచంలోని వస్తువుల లాంటిదీ కాదు, అది దేహములవంటి స్థూల వస్తువూ కాదు. ఆత్మసూక్ష్మాతి సూక్ష్మమైనది. దానికి పుట్టుకాలేదు, మరణమూలేదు, నాశనము లేదు. అంతేకాదు ఈ శస్త్రాలు గాని, అగ్ని గాని, నీరుగాని, వాయువుగాని ఆత్మను ఏమీ చేయలేవు. పంచభూతాల కతీతమైన ఆత్మను ఈ పంచ భూతాలు ఏమీ చేయలేవు అనిఇక్కడ భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.

స్థూలవస్తువులు సూక్ష్మమైన వాటినేమీ చేయలేవు. ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మమైనది. గనుక ఆత్మను ఇవి ఏమీ చేయలేవు. సూక్ష్మమైన గాలి (వాయువు) చెట్ల ఆకులను కదిలించగలుగు తుంది గాని, స్థూలమైన ఆకులు గాలిని ఏమీ చేయలేవు.

పంచభూతాలలో ఆకాశం సూక్ష్మమైనది. దానికి శబ్ద గుణం ఒక్కటే. వాయువు ఆకాశమంతసూక్ష్మం కాదు. దానికి శబ్దస్పర్శ అనే 2 గుణాలు. అగ్నికి శబ్ద స్పర్శతో

పాటు రూపం అనే గుణం కూడా ఉంది. కనుక కొంచెం స్థూలం, కొంచెం సూక్ష్మం. ఇక నీరు స్థూలం. దానికి 4 గుణాలు. శబ్దస్పర్శ రూపరస అనేవి. భూమి అన్నింటికన్న- నీటికన్నా స్థూలం. దీనికి పై నాలుగుతో బాటు గంధమనే గుణం కూడా ఉంది. 5 గుణాలున్న భూమి పూర్తిగా స్థూలం, గుణాలు తగ్గేకొద్దీ స్థూలత్వం తగ్గి సూక్ష్మత్వం పెరుగుతుంది. 1 గుణం ఉన్న ఆకాశం అన్నింటికన్నా సూక్ష్మం. ఇక ఆ ఒక్క గుణం కూడా లేని నిర్గుణమైన ఆత్మ ఆకాశం కన్నా సూక్ష్మాతి సూక్ష్మమైనది. అట్టి ఆత్మను ఈ పంచభూతాలు కూడా ఏమీ చేయలేవు.

ఈ శ్లోకంలో ఇచ్చిన అగ్ని, నీరు, వాయువు ఈ 3 పంచభూతాలకు చెందినవి. శస్త్రాలు భూతత్వం కనుక అవీ పంచభూతాలలోనివే. భూతత్వమైన శస్త్రాలు పంచభూతాలలోని ఆకాశాన్నే ఛేదించలేవు. అలాంటిది ఆకాశం కన్నా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మను ఎలా ఛేదించగలుగుతాయి? అలాగే అగ్ని ఆకాశాన్నే కాల్చలేదు. ఆత్మనెలా కాల్చగలుగుతుంది? నీరు ఆకాశాన్ని తడుపలేదు. ఆత్మనెలా తడుపగలగుతుంది? వాయువు ఆకాశాన్నే ఎండించలేదు. అలాంటిది ఆకాశం కన్నా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మనెలా ఎండించగలదు? కనుక ఇవేవీ ఆత్మనేమీ చేయలేవు. ఆత్మదేనిచేతను బాధించబడేది కాదు. ఇలా చెప్పటంలో భగవానుని అభిప్రాయం ఏమై ఉంటుంది?

అర్జునుని వద్ద భూతత్వానికి చెందిన ధనుస్సు, బాణాలు, కరవాలము, గద, కుంతము మొదలైన ఆయుధాలెన్నో ఉన్నాయి. అలాగే అగ్ని తత్వానికి చెందిన ఆగ్నేయాస్త్రము, నీటితత్వానికి చెందిన వారుణాస్త్రము, పర్జన్యాస్త్రము ఉన్నాయి. వాయు తత్వానికి చెందిన వాయువ్యాస్త్రం ఉంది. ఇంకా పంచభూతాలకు చెందిన అనేక అస్త్రశస్త్రాలున్నాయి. ఎలాంటి అస్త్ర శస్త్రాలున్నా, ఓ అర్జునా! ఇవి స్థూలమైన దేహాలను నశింపజేస్తాయే గాని, సూక్ష్మాతి సూక్ష్మమైన, నిత్యమైన, అవ్యయమైన ఆత్మను ఏమీ చేయలేవు- అని స్పష్టం చేయటానికే.

ఇదే భావాన్ని తిరిగి 24వ శ్లోకంలో కూడా స్పష్టం చేస్తున్నారు. పంచభూతాలతో తయారైన వాటినే పంచభూతాలు బాధిస్తాయి గాని పంచ భూతాలకతీతమైన ఆత్మను ఈ పంచభూతాలుగాని, పంచభూతాలతో తయారైన వస్తువులు గాని ఏమీ చేయలేవు అని. అందుకే ఆత్మ ఛేదించబడేది కాదు, దహించబడేదికాదు, తడుపబడేది కాదు,





ఎండించబడేది కాదు అని చెప్పటం. ఇలా చెప్పటంలో పునరుక్తి దోషం (మళ్ళీ మళ్ళీ చెప్పి విసిగించటం) ఉన్నదా? వేదాంతంలో అలాంటిదోషం ఏమీ ఉండదు. ఎన్నోసార్లు చెబితేగాని వేదాంత విషయాలు అర్థం కావు. అందుకే వెంటవెంటనే చెప్పటం జరిగింది. ఇది శాస్త్రమర్యాద.

ముసలితనం వల్లనో, వ్యాధులవల్లనో శరీరాలు రాలిపోతాయి. ఇది సహజమరణం. ఇక ప్రమాదాలవల్లనో, ఆయుధాలవల్లనో బలాత్కార మరణాలు కూడా ఉంటాయి. అయితే ఆత్మకు సహజ మరణం ఎలాగూ లేదు. ఇక ఆయుధాలవల్లగాని, నీరు, గాలి, నిప్పువల్లగాని బలాత్కార మరణం కూడా ఆత్మకు ఉండదు అని ఈ శ్లోకాల్లో స్పష్టం చేస్తున్నాడు భగవానుడు.

కొన్ని విశేషణాలతో ఆత్మ ఎట్టిదో వివరిస్తున్నారీ శ్లోకంలో-

**1) నిత్య:** ఆత్మకు పుట్టుకా లేదు, చావూ లేదు కనుక నిత్యమైనది. దేనిచేత మార్పు చెందేదీ కాదు, నశించేదీ కాదు. కనుక ఏ మార్పులు- వికారాలు లేకుండా ఎప్పుడూ ఒక్కటిగానే ఉంటుంది.

**2) సర్వగత:** ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మం గనుక సర్వగతం. అది లేని ప్రదేశం ఉండదు. పంచభూతాలలో సూక్ష్మమైన ఆకాశం కూడా సర్వవ్యాపకమే. కాకపోతే స్థూలవస్తువులలో ఆకాశం ఉండే వీలు లేదు. కాని ఆత్మమాత్రం స్థూల వస్తువులలో కూడా ఉంటుంది. కనుక సర్వవ్యాపి

**3) స్థాణు:** స్థాణువు అంటే స్థిరంగా ఉండేది. ఒకచోట కదలక ఉంటుంది అని.

**4) అచల:** చలనము లేనిది. దేనికైనా చలనం ఉండాలంటే చలించటానికి కావలసిన ఖాళీ ప్రదేశం ఉండాలి. మనం కదులుతున్నాం అంటే మనం లేని ఖాళీ ప్రదేశం ఉంది. కాని ఆత్మసర్వవ్యాపి గదా! అది లేని చోటు లేదు గదా! స్థూలవస్తువులతో సహా అన్నింటా- అంతటా వ్యాపించి యున్నది గదా! మరి అది ఎలా కదులుతుంది? కదలటానికి చోటెక్కడ? అంతటా అదే గదా! అందుకే అచలం అన్నారు.

స్థాణువు అన్నా అచలం అన్నా రెండూ సమానార్థక పదాలే. మరి రెండు పదాలనెందుకు వాడినట్లు? స్థాణువు అంటే చెట్టు. అది కదలకుండా భూమిలో

స్థిరంగా ఉంటుంది. అయితే పెరిగేకొద్దీ కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు వస్తూ కదులుతూ ఉంటుంది. అచలం అంటే పర్వతం. ఇక దీనిలో ఏ కదలికా ఉండదు. కనుక అచలం అన్నారు. ఆత్మ ఇలా కదలకుండా ఎప్పుడూ స్థిరంగా ఉంటుంది. ఆత్మలేని చోటు అంటూ లేదు గనుక అది కదిలే వీలు లేదు.

**5) సనాతన:** ఆత్మపుట్టుకలేనిది గనుక అది అనాది. అది లేని సమయం అంటూ లేదు. ఎప్పటినుండో ఉన్నది గనుక పురాతనం, సనాతనం అన్నారు. అంటే చాలా పాతది. పాతది కదా అని రోతది కాదు. ఎందుకంటే అది సనాతనమే కాదు సదా నూతనం. ఎల్లప్పుడూ కొత్తదే. అట్టి ఆత్మను తెలుసు కొనుటకు, అందుకొనుటకు, ఆ స్థితిలో నిలుచుటకు యోగులు, తపశ్శక్తి సంపన్నులు, సాధకులు, మహాత్ములు, జ్ఞానులు తమ సర్వశక్తులు ధారపోసి సాధన చేస్తుంటారు. కనుక అది ఎప్పుడూ నూతనమైనదే. ఆత్మతత్వ విచారణయే మనందరి సనాతన ధర్మం.

"కనుక ఓ అర్జునా! ఈ ఆత్మతత్వ విచారణ చేసి, శోకాన్ని విడిచిపెట్టు" అంటూ ఇంకా ఆత్మతత్వాన్ని తరువాత శ్లోకంలో వివరించబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ అవ్యక్తోఽయమ చింత్యోఽయం అవికార్యోఽయ ముచ్యతే।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ 25**

**తా॥** ఈ ఆత్మ అవ్యక్తం (ఇంద్రియములకు గోచరించనిది), అచింత్యం (మనస్సు చేత చింతించవీలులేనిది), అవికార్యం (ఏ వికారాలు లేనిది). ఈ ప్రకారంగా ఆత్మను తెలుసుకొని శోకాన్ని విడిచిపెట్టు.

**వ్యాఖ్య:** ఇంతవరకు అర్జునుని శోకానికి కారణం "ఆత్మనని తెలియని అజ్ఞానమే"నని గ్రహించిన భగవానుడు, అతడి అజ్ఞానాన్ని తొలగించటానికి 11వ శ్లోకం నుండి ఆత్మజ్ఞానాన్ని అఖండంగా బోధిస్తున్నాడు. ఓ అర్జునా! నీవు దేహానివి కాదు. ఆత్మవు. దేహాన్నని భావించి దేహంతో తాదాత్మ్యం చెందితే దేహ బాధలు నీవే అవుతాయి, కనుక శోకించాలి. అలాగాక 'నేను ఆత్మను' అని తెలుసుకొని ఆత్మగా ఉన్నావా? ఆత్మకు ఏ బాధలు, దుఃఖాలు ఉండవు; ఏ మార్పులు, వికారాలు ఉండవు. కనుక నీవు దుఃఖించేపని ఉండదు–అని స్పష్టం చేయటం కొరకు ఆత్మ లక్షణాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**ఆత్మ అవ్యక్తం** అంటే అన్ని స్థూలవస్తువులలాగా వ్యక్త మయ్యేది కాదు. మన ఇంద్రియాల ద్వారా గోచరించేది కాదు. అంతేకాదు. మనస్సుతో భావిద్దాం అన్నా





కుదరదు. ఎందుకంటే **ఆత్మ అచింత్యం** అంటే మనస్సు ద్వారా చింతించే అవకాశం కూడా లేదు. ఎందుకు? మనస్సేమో జడం. ఆత్మ ఏమో చైతన్యం, చైతన్యం జడవస్తువును తెలుసుకోగలుగుతుంది గాని జడవస్తువు చైతన్యాన్ని తెలుసుకోలేదు. ఇట్టి అవ్యక్తం, అచింత్యం అయిన ఆత్మ **అవికార్యం** – ఏ మార్పులు లేనిది; పుట్టటం, పెరగటం, కృశించటం; నశించటం; మార్పులు చెందటం– ఈ మార్పులన్నీ శరీరాలకే గాని ఆత్మకు ఇవేవీ లేవు. ఎప్పుడూ ఒక్కటిగానే ఉంటుంది. అట్టి అమృతమయమైన, ఆనంద స్వరూపమైన ఆత్మవే నీవు. ఇది తెలుసుకొని ఆత్మగా ఉన్నావా! ఇక శోకించేపనిలేదు.

దీనినిబట్టి ఈ తాపత్రయాలతో, సంసార దుఃఖాల్లోపడి కొట్టుకునే వారందరికీ శాశ్వత దుఃఖ నివారణకు పరమౌషధం ఆత్మజ్ఞానమే– నేను ఆత్మనని తెలుసుకొనే జ్ఞానమే అని తెలుస్తున్నది.

కనుక ఓ అర్జునా! సుఖదుఃఖాలన్నీ దేహమనో బుద్ధులకే. వీటితో ఆత్మకు అంటుసొంటు లేదు. అన్ని దేహాలలోను ఉన్న ఆ విరాట్ వీరపురుషుణ్ణి ఖండించే ఖడ్గా లెక్కడున్నాయి? మండించే మంటలెక్కడున్నాయి? నీ అస్త్ర శస్త్రాలన్నీ జడమైన శరీరాలనే గాని– నిత్యము, నిర్వికారము, అక్షరము అయిన ఆత్మను తాకను కూడా తాకలేవు. కనుక శోకించకు. దేహాలకోసం ఏడ్చినా ప్రయోజనం లేదు. ఆత్మకోసం ఏడవాల్సిన పనేలేదు.

అలెగ్జాండరు మనదేశంపై దండెత్తిన రోజుల్లో, ఒకనాడు సింధునదీప్రాంతంలో ఒక దిగంబర సాధువును చూశాడు. ప్రశాంతంగా, గంభీరంగా, యోగంలో ఆశీనుడైన ఆ సాధువు వద్దకెళ్ళి, "అయ్యా! మీరు నాతో మా దేశానికి రండి. మీకు ఉపకారం చేస్తాను" అన్నాడు అలెగ్జాండరు. దానికా సాధువు, "మహారాజా! మీ ఉపకారం అలా ఉంచి, చలివేళన ఎండకు అడ్డంగా నిలబడ్డ మీరు ప్రక్కకు తొలగండి. ఈ ఉపకారం చాలు నాకు" అన్నాడు. **ఆశలేని వాడికి ప్రపంచం గడ్డిపోచతో సమానం.**

అలెగ్జాండరుకు మండిపోయింది. కత్తిదూసి ఖండిస్తానంటూ పైపైకొచ్చాడు. సాధువు పకపక నవ్వుతూ, "మహారాజా! నన్ను ఖండిస్తావా? నీ ఖడ్గానికి

తెగిపడేందుకు నేను 3 మూరల మాంసపిండాన్ని అనుకుంటున్నావా? నైనం ఛిందంతి శస్త్రాణి...” అని గర్జించాడు. **ఆత్మస్వరూపునికి దుఃఖం లేదు, భయం లేదు, శోకం లేదు, కోపం లేదు.**

ఇంతవరకూ తత్త్వవేత్తల దృష్టితో ఆత్మ నశించేది కాదు గనుక శోకించే పనిలేదు–అని స్పష్టం చేసిన భగవానుడు, లోకంలో ఏ కొద్దిమందో తప్ప అందరూ సామాన్య మానవులే గనుక; ఆత్మజ్ఞానం లేనివారే గనుక; వారికోసం – అంటే వారు కూడా శోకించాల్సిన పని లేదని రాబోయే 5 శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు.

**శ్లో॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసేమృతం।**
**తథాపిత్వం మహాబాహో నైవం శోచితుమర్హసి॥ 26**

**శ్లో॥ జాతస్యహిధృవో మృత్యుః ధ్రువం జన్మమృతస్యచ।**
**తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితుమర్హసి ॥ 27**

**తా॥** ఒకవేళ ఆత్మపుట్టేది, చనిపోయేది అని అనుకున్నా ఓ మహాబాహుడా! అప్పుడు కూడా నీవు శోకించాల్సిన పని లేదు (26) పుట్టినదానికి మరణం, మరణించిన దానికి పుట్టుక నిశ్చయం గదా! మరి నివారించలేని ఈ విషయంలో నీకు శోకమెందుకు? (27)

**వ్యాఖ్య:** ఇక్కడినుండి మరో తర్కం వినిపిస్తున్నాడు భగవానుడు, లోకంలో చాలామందికి ఆత్మజ్ఞానం ఉండదు. ఆత్మశాశ్వతంగా ఉండేదని తెలియదు. మరి వారు శోకించాల్సిందేనా? అంటే – లేదు అని తెలియజేస్తున్నారు. ఆత్మ పుట్టేదీ, పోయేదీ అని అనుకున్నా, దేహంపోతే ఆత్మ పోయినట్లేనని అనుకున్నా అప్పుడు కూడా నీవు శోకించాల్సిన పనిలేదు. ఎందుకంటే పుట్టిన ప్రతిజీవికీ ఎప్పుడో ఒకప్పుడు మరణం తప్పదు. అలాగే మరణించిన ప్రతిజీవి తిరిగి జన్మించక తప్పదు. దీనిని నివారించటం ఎవరివల్లాకాదు. మరి ఎందుకు దుఃఖం? నీ ఎదురుగా ఉన్న భీష్మాదులు ఎప్పటికైనా మరణించ వలసిన వారే కదా? మరెందుకు వారికై శోకిస్తావు? ఎలాగూ జరిగేదానికై దుఃఖించటం తెలివితక్కువ తనం మాత్రమే.

జీవులు శూన్యంలో నుండి వచ్చి, కొంతకాలం ఉండి, తిరిగి శూన్యంలోకి వెళతారని భౌతికవాదుల విశ్వాసం. ఐతే ఆస్తికుల, వేదాంతుల విశ్వాసం వేరు. జీవుళ్ళు అవ్యక్తం నుండి వచ్చి, తమ ప్రారబ్ధ కర్మఫలాలను అనుభవించి, వాసనలను ఖర్చుచేసుకొని,





ఆ ప్రారబ్ధకర్మ ఫలాలు, వాసనలు క్షయం కాగానే ఈ దేహాన్ని విడిచి అవ్యక్తంలోకి వెళ్ళి, తమ సంచితకర్మలనుండి పక్వానికి వచ్చిన ప్రారబ్ధ కర్మఫలాలను అనుభవించటానికి తగిన దేహంతో తిరిగి జన్మిస్తారని ఆస్తికుల నమ్మకం. మరి ఎలాగూ తప్పని ఈ రాకపోకల గురించి శోకించటమెందుకు? అనేది భగవానుని వాదన. ఇది సామాన్యుల దుఃఖనివారణ కొరకు చెప్పినదే.

క్రొత్తగా వివాహం చేసుకున్న యువతి ఆఫీసుకు వెళ్ళిన భర్తరాకకోసం రోజంతా ఎదురుచూస్తూ ఉంటుంది. మధ్య మధ్యలో వాకిలివద్దకెళ్ళి చూస్తుంది. కాని ఎప్పుడూ టూర్లు తిరుగుతూ 10 రోజులకో, 15 రోజులకో తిరిగివచ్చే భర్తకోసం భార్య ప్రతిరోజు ఎదురుచూస్తుందా? లేదు. ఎందుకంటే ఆయన ఉద్యోగం అలాంటిది. ఎంత ఎదురుచూచినా ఏం ప్రయోజనం? అని ఉదాసీనంగా ఉంటుంది.

కనుక అర్జునా! ఎలాగూ తప్పక జరిగే జననమరణాలకై శోకించకు–అని చెప్పి మరొక విధంగా కూడా శోకించే పని లేదని చెప్పబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ అవ్యక్తాదీనిభూతాని వ్యక్తమధ్యానిభారత।**
**అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥ 28**

**తా॥** భరతవంశంలో జన్మించిన అర్జునా! భూతాలయొక్క మొదలు కనబడదు, మధ్య మాత్రం కనబడుతుంది, నశించిన తర్వాతా కనిపించవు. అట్టి భూతాలకొరకు ఎందుకు దుఃఖించటం?

**వ్యాఖ్య:** భూతము అంటే పుట్టినది అని. మనుష్యులు, జంతువులు, పక్షులు, క్రిమికీటకాలు, చెట్లు చేమలు, ప్రాణుల శరీరాలు–అన్నీ పుట్టినవే. అన్నీ భూతాలే. ఇవన్నీ పుట్టక ముందు అవ్యక్తంలో ఉంటాయి కనుక మనకు కనిపించవు. అలాగే మరణించిన తర్వాత కూడా అవ్యక్తంలోకి వెళ్ళి కనిపించవు. అయితే మధ్యలో కొద్దికాలం పాటు మాత్రం కనిపిస్తాయి. ఇలా కనిపించినంత మాత్రాన అవి సత్యమా? అంటే కాదు, ఎందుకంటే ఆదిలోనూ, అంతంలోనూ కనిపించక మధ్యలో కనిపించినప్పటికీ అవి లేనట్లేనని, మిథ్యయని ‘మాండూక్యకారికల’లో గౌడ పాదాచార్యులు తెలియజేశారు.

చీకటిలో భ్రమవల్ల కనిపించిన సర్పం భ్రమకు ముందు లేదు, భ్రమ తొలగిన తరువాతా లేదు. మధ్యలో భ్రమలో ఉన్నప్పుడు కనిపించినా నిజంగా సర్పం లేనేలేదని

మనకు తెలుసు. ఒక బ్రహ్మచారి నిద్రపోయాడు. కల వచ్చింది. ఆ కలలో వివాహం జరిగింది. నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు జన్మించారు. వారి చదువుల కోసం, ఉద్యోగాల కోసం, వివాహాల కోసం తన ఆస్తంతా కరిగిపోతుంటే, భార్యా భర్తల మధ్య ఎప్పుడూ తగాదాలే. ఇంతలో మెలకువ వచ్చింది. ఇప్పుడు భార్యాబిడ్డలు లేరు, కీచులాటలు లేవు, అతడు బ్రహ్మచారియే. నిద్రకు ముందు భార్యాబిడ్డలు లేరు; మేలుకున్న తర్వాతా లేరు. కాని నిద్రా సమయంలో కలలో మాత్రం కనిపించారు. ఆదిలోనూ, అంతంలోనూ లేకుండా మధ్యలో కనిపించినా సరే వారు లేనట్లేనని మనకు అనుభవమే. అలాగే ఈ ప్రాణులు, జగత్తు కూడా మనకు కనిపిస్తున్నప్పటికీ యదార్థం కాదు, లేనట్లే. మిథ్యయే.

కనుక ఓ అర్జునా! ఈ భీష్మాదులు కూడా పుట్టకముందు లేరు, మరణించిన తర్వాతా కనిపించరు. మధ్యలో ఇప్పుడు కనిపించినా యదార్థంగా లేనట్లేనని తెలుసుకో. ఈ మాత్రానికే ఎందుకిలా శోకిస్తావు? మధ్యలో కనిపించేదంతా స్వప్నం లాంటిదే, గారడీ ప్రదర్శన లాంటిదే. రాత్రి కలలో కనిపించిన బంగారం కోసం మేలుకున్న తర్వాత ఏడ్చే అజ్ఞాని లాగా మెరుపులా మెరిసి మాయమయ్యే ఈ దేహాల కోసం ఎందుకయ్యా ఏడుస్తావు? అసలు ఈ జనన మరణాలు ఎలాంటివో తెలుసా?

**శ్లో॥ ఆశ్చర్యవత్ పశ్యతికశ్చిదేనం ఆశ్చర్యవత్ వదతి తథైవ చాన్యః ।**
**ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేదనచైవ కశ్చిత్ ॥ 29**

**తా॥** ఒకానొకడు దీనిని ఆశ్చర్యంగా చూస్తాడు. మరొకడు దీనిని ఆశ్చర్యంగా చెబుతాడు. ఇంకొకడు దీనిని ఆశ్చర్యంగా వింటాడు. అలా విన్నప్పటికీ దీనిని ఎవడూ తెలుసుకోలేడు.

**వ్యాఖ్య:** ఏనం= దీనిని అంటే జనన మరణాలను అని. లోతుగా ఆలోచిస్తే ఈ జనన మరణాలు రెండూ ఆశ్చర్యంగానే ఉంటాయి. ఇప్పటివరకు ఈ భూమిపై కనిపించని ప్రాణి ఎంతో ఆశ్యర్యకరంగా తల్లిగర్భం నుండి బయటపడుతుంది. చిన్ని చిన్ని చేతులతో, కాళ్ళతో, కళ్ళతో, ముక్కుతో కదిలాడుతూ ముద్దుగొలుపుతుంది. కొంతకాలం పెరిగి, పెద్దదై, అనేక మార్పులు చెందుతూ, సుఖదుఃఖాది అనుభవాలు పొందుతూ, ఎన్నో తెలివితేటలు ప్రదర్శించి, చివరకు





ఒనాడు అచేతనమవుతుంది. ఒక్కక్షణం ముందువరకు ఉన్న కదలికలు, ఆశలు, ఆశయాలు, అలజడులు, ఆందోళనలు, ఆస్తులు, పదవులు, తెలివితేటలు, సంబంధబాంధవ్యాలు–అన్నీ మరుక్షణంలో మాయమై పోతాయి. ఇవి ఎక్కడినుండి వచ్చాయో–ఎక్కడికి పోతాయో, ఎలా వచ్చాయో–ఎలా పోయాయో ఎవ్వరికీ తెలియదు. అందుకే ఈ జనన మరణాలను ఆశ్చర్యంతో చూస్తారు, ఇతరులకు ఆశ్చర్యంగా చెబుతారు, ఎవరన్నా చెబుతుంటే ఆశ్చర్యంగా వింటారు. కాని ఇందలి రహస్యాలు మాత్రం ఎవరికీ తెలియవు. ఎంతో ఆశ్చర్యంగా ఈ దేహాలు భూమిపైకి వస్తున్నాయి. అలాగే ఎంతో ఆశ్చర్యంగా ఈ భూమిపై నుండి నిష్క్రమిస్తున్నాయి. ఇదంతా ఒక నాటకం, ఒక కల, ఒక గారడీ, ఇంద్రజాలం– అంతే. దీని కొరకు శోకించకు అని భగవానుడు తెలియ జేస్తున్నాడు.

అజ్ఞానం వల్లనే అర్జునునికి శోకం అని గ్రహించిన భగవానుడు, అర్జునుని యొక్క ఈ అజ్ఞానాన్ని తొలగించటానికి ఇంతవరకు ఆత్మజ్ఞానమనే మందును ఇచ్చి, ఓ అర్జునా! నీవు దేహానివి కాదు, నీవు ఆత్మవు–ఆత్మ నిత్యం గనుక నీవు నిత్యుడివి, నీవే కాదు ఈ సమస్త ప్రాణులు కూడా నిత్యమైన ఆత్మ స్వరూపమే కనుక ఎవ్వరికోసమూ శోకించే పనిలేదు– అని ముగింపువాక్యం పలుకబోతున్నాడు.

**శ్లో॥ దేహీనిత్యమవధ్యోఽయం దేహేసర్వస్య భారత।**
**తస్మాత్ సర్వాణి భూతాని నత్వంశోచితుమర్హసి॥ 30**

**తా॥** భారతా! అన్ని దేహాలలోనూ ఉండే ఈ దేహి (ఆత్మ) నిత్యమైనది, అవధ్యమైనది (వధించబడేది కాదు) అందువల్ల ఏ ప్రాణి గురించి నీవు శోకించపనిలేదు..

**వ్యాఖ్య:** ఇక్కడ అర్జునుని భారత! అని సంబోధిస్తున్నాడు భగవానుడు. 'భా' అంటే బ్రహ్మవిద్య. 'రతః' అంటే రమించేవాడా అని 'భారత' అంటే బ్రహ్మవిద్యయందు రమించేవాడా! అని. ఇంతవరకు శోకంలో ఉన్న అర్జునునికి బ్రహ్మవిద్యను–ఆత్మ విద్యను బోధించిన భగవానుడు, ఓ అర్జునా! నీ శోకం పూర్తిగా తొలగిపోవాలంటే ఈ బ్రహ్మవిద్యలో రమించేవాడివి కావాలి అనే ఆశీర్వచనం ఈ పదప్రయోగంలో దాగి ఉన్నది. ఎందుకంటే సమస్త దుఃఖనివృత్తి–శాశ్వత ఆనందప్రాప్తి ఈ బ్రహ్మవిద్య

వల్లనే గనుక; నేను ఆత్మను-బ్రహ్మాన్ని అని అనుభవపూర్వకంగా గ్రహించటం వల్లనే సాధ్యం గనుక.

**సర్వస్యదేహే అయందేహీ నిత్యం, అవధ్యం:** అన్ని ప్రాణులలోను, అన్ని దేహాలలోను ఉన్న ఈ దేహి ఆత్మయే. జాతి, మత, వర్ణ, వర్గ, లింగ, కులభేదాలతో నిమిత్తం లేకుండా అందరిలోను, అన్ని ప్రాణులలోను ఆత్మయే ఉన్నది. ఈ జగత్తులోని సమస్తము ఏ పేరుతో ఉన్నా, ఏ రూపంలో ఉన్నా, ఏ గుణాలతో ఉన్నా అన్నింటి యొక్క అసలు తత్త్వం ఆత్మయే. అట్టి ఆత్మ నిత్యమైనది. వధించటానికి వీలులేనిది. కనుక అర్జునా! ఈ దేహాలు కూలినా- రాలినా, ఉండినా-మండినా, ఆత్మకు నాశనం లేదు.

కుండ బ్రద్దలైతే కుండలోని ఆకాశం బ్రద్దలు కాదు. బల్బు పగిలిపోతే అందులోని కరెంటు పగిలిపోదు. దేహం శిధిలమైతే అందులోని ఆత్మ శిధిలం కాదు. నీవుగాని, ఈ సమస్త సేనలు గాని, భీష్మద్రోణాది వీరులు గాని, ఏనుగులు గాని, గుర్రాలు గాని ఇవి అన్నీ ఏకమైన ఆత్మయే గనుక అవి నిత్యము, అవధ్యము, కనుక శోకం ఎందుకు?

- కృశించిపోయే దేహాలలోని ఆత్మ కృశించదు.
- కదిలే దేహాలలోని ఆత్మ కదలదు.
- మార్పులు చెందే దేహాలలోని ఆత్మ మార్పు చెందదు.
- మరణించే దేహాలలోని ఆత్మ మరణించదు.

నేను దేహాన్నని, దేహం యొక్క హాని వృద్ధులు నావేనని భావించేవారు అజ్ఞానులు- ఆత్మజ్ఞానం లేనివారు. కాని పండితులైనవారు - ఆత్మజ్ఞానులైనవారు జీవించి ఉన్నవారికోసం గాని, మరణించినవారికోసం గాని, ఎన్నటికీ శోకించరు. కనుక నీవు కూడా 'దేహమేనేను' అనే అజ్ఞానాన్ని విడిచిపెట్టి, 'నశించని ఆత్మనే నేను' అని గ్రహించి, శోకాన్ని విడిచిపెట్టి నీ కర్తవ్యమైన యుద్ధానికి సిద్ధంగా ఉండు-అని భగవానుడు  అఖండమైన ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించాడు.

అర్జునుని స్వధర్మం ఏమిటో, ఎందుకు తప్పక యుద్ధం చేయాలో 'ధర్మాష్టకం'లో తెలుస్తుంది.





# ధర్మాష్టకం

క్షత్రియునికి స్వధర్మమైన యుద్ధాన్ని అధర్మమని వాదించే అర్జునునకు, **"నీ స్వధర్మం దృష్ట్వా యుద్ధం చేయుటయే శ్రేయస్కరమ"ని తెలియజెప్పే *8* శ్లోకాలను 'ధర్మాష్టకం' అంటారు.** ఇపుడా స్వధర్మబోధను ప్రారంభిస్తున్నాడు భగవానుడు.

**శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య నవికంపితుమర్హసి।**
**ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవిద్యతే॥ (31)**

**తా॥** స్వధర్మం దృష్ట్వా చూచినప్పటికీ నీవు చలించరాదు. క్షత్రియునికి స్వధర్మం కన్నా శ్రేయస్కరమైనది మరొకటి లేదు.

**వ్యాఖ్య:** ఇక్కడి నుండి మరో తర్కం. అర్జునా! ఇప్పటివరకు తెలిపిన ఆత్మజ్ఞానాన్ని ప్రక్కనబెట్టు. నీవు క్షత్రియుడవు కదా! క్షత్రియుని స్వధర్మం ఏమిటి? అసలు స్వధర్మం అంటే ఏమిటి? వారివారి సంస్కారాలను బట్టి జీవుళ్ళు వేరువేరుగా జన్మిస్తారు. ఆయా సంస్కారాలను బట్టే ఆయా జీవుళ్ళ స్వభావం-నడవడిక ఉంటాయి. ఈ స్వభావాన్నే స్వధర్మం అంటారు. ఒక్కొక్క వర్ణం వారికి ఒక్కోరకమైన స్వధర్మం ఉంటుంది. బ్రాహ్మణులు దైవకార్యాలు, వేదాధ్యయనం, అధ్యాపనం, దానం, పరిగ్రహం- అనేవి చేస్తుండాలి. అప్పుడే వారి వాసనలు ఖర్చయ్యేది. అందుకు తగినట్లుగానే వారి శరీరాలు, మనోబుద్ధులు అమరి ఉంటాయి. అలాగే క్షత్రియులు యుద్ధం చెయ్యాలి. అందుకు  తగినట్లుగానే వారి శరీరాలు దృఢంగా, బలంగా ఉండి; వారి మనోబుద్ధులు ధైర్యసాహసాలతో కూడి ఉంటాయి. దేశాన్ని, ప్రజలను రక్షించటానికి శత్రువులతో యుద్ధం చెయ్యటం, తన సంస్కృతిని రక్షించుకోవటం క్షత్రియధర్మం. అలా చేసినప్పుడే వారి వాసనలు ఖర్చవుతాయి. కనుక యుద్ధం నీ స్వధర్మం. అంతేకాదు స్వార్ధ పూరిత కారణాలతో గాక ధర్మంకోసం యుద్ధం చేయవలసి రావటం నీ అదృష్టం.

**కనుక ఓ అర్జునా! ధర్మదేవతకు హాని జరిగి కన్నీరు కారుస్తుంటే సుక్షత్రియవంశంలో జన్మించిన నీవు చేతకాని వాడిలా చేతులు ముడుచుకొని కూర్చుంటావా? స్వధర్మమైన యుద్ధాన్ని అధర్మం అంటావా?** నీ చుట్టూ ఉన్నది క్షత్రియ వీరలోకం. నీలో క్షత్రియ రక్తం పారుతున్నది. తీరా యుద్ధరంగంలోకొచ్చి

కళ్ళు తిరుగుతున్నాయి, కాళ్ళు వణుకుతున్నాయి, గుండె అదురు తున్నది, నాలుక పిడుచగట్టుకపోతున్నది, చేతుల్లో సత్తువలేదు అని నామర్దామాటలు మాట్లాడుతావా?

ఒకడు భార్యమీద అలిగి బావిలో దూకుతానని పరుగెత్తాడట. బావి దగ్గరకెళ్ళి కాళ్ళులోపలికి వేసి గట్టు మీద కూర్చున్నాడు. అంతలో ప్రక్కింటివాడు వచ్చి "ఏమిటలా కూర్చున్నావు? బావిలో దూకుతానని పరుగెత్తుకుంటూ వచ్చావు గదా?" అన్నాడు. దానికా ధీరోదాత్తుడన్నాడట, బావిలోకి దూకితే కప్పలు కరుస్తాయేమోనని భయంగా ఉన్నది అని– అలా ఉంది నీ వరస.

ధర్మపక్షంలో నిలిచి అధర్మాన్ని ఎదిరించటం క్షత్రియ వీరధర్మం. భీష్మద్రోణులంతటి వారు నీకు ప్రతియోధులుగా ఎందుకు నిలిచారు? స్వధర్మపాలన కొరకే. నీ ఎదురుగా ఉన్న భీష్ముడు తన గురువు పరశురామునితో ఎందుకు యుద్ధం చేశాడు? క్షత్రియధర్మం కాబట్టే, **అసలు క్షత్రియుడంటే ఏమిటో తెలుసా? క్షతం అంటే దుఃఖం. క్షతం (దుఃఖం) నుండి ప్రజలను రక్షించేవాడే క్షత్రియుడంటే.** ధర్మాన్ని రక్షించటం కోసం నీవు కోరకుండానే వచ్చిపడిన ఈ ధర్మయుద్ధాన్ని వద్దంటావు. ఇదెక్కడి చాదస్తం నీకు? ధర్మభ్రష్టుడివి కావద్దు. **స్వధర్మం తల్లిలాంటిది. భార్యను ఏరికోరి తెచ్చుకోవచ్చు. అవసరమైతే వదులుకోవచ్చు. కాని తల్లి విషయం అలాకాదు. అక్కడ నీ నిర్ణయం ఏమీ ఉండదు. అలాగే స్వధర్మం నీ జన్మతోనే నిర్ణయమై ఉంది. క్షత్రియుడిగా జన్మించావు కనుక యుద్ధం చేసి తీరాల్సిందే.**

దుర్మార్గులను శిక్షించటానికి, ధర్మాత్ములను కాపాడటానికి, భూభారాన్ని తొలగించటానికి, శాంతిసౌఖ్యాలు నెలకొల్పటానికి చేసేయుద్ధం ధర్మయుద్ధమే. అట్టి యుద్ధాన్ని చేయటంకన్నా శ్రేయోదాయకమైనది క్షత్రియుడికి మరేముంటుంది? అని ప్రోత్సహిస్తూ అర్జునా! ఈ విషయంలో నీవెంతో అదృష్టవంతుడివి. ఎందుకంటావా?

**శ్లో॥ యదృచ్ఛయాచోపపన్నం స్వర్గద్వారమపావృతం।**
**సుఖినః క్షత్రియాః పార్థ! లభంతేయుద్ధమీదృశం॥ 32**

**తా॥** పార్థా! యాదృచ్ఛికంగా (అప్రయత్నంగా) లభించి నట్టిది, తెరిచియున్న స్వర్గద్వారం వంటిది ఐన ఈ యుద్ధం అదృష్టవంతులైన క్షత్రియులకే లభిస్తుంది.

**వ్యాఖ్య:** ఈ యుద్ధం యాదృచ్ఛికంగా వచ్చిపడింది. పాండవులు కోరకుండానే వచ్చిపడింది.





**యదృచ్ఛయాచోపపన్నం:** పాండవులు తమ భుజబల, పరాక్రమాలతో దిగ్విజయ యాత్రలు చేసి సంపాదించిన మహా సామ్రాజ్యాన్ని మాయాజూదంతో చేజిక్కించుకున్నారు కౌరవులు. పాండవులను అరణ్య, అజ్ఞాతవాసాలకు పంపి సింహాసనంపై బైఠాయించారు. అధికారంతో కళ్ళు మూసుకపోయి పెద్దలను తిరస్కరించారు. ధర్మాన్ని నిరాకరించారు. పుణ్యాత్ములను దూషించారు. పతివ్రతను పరాభవించారు. అన్నమాటలను తప్పారు. అధర్మానికి ఒడిగట్టారు. తండ్రికి తగ్గకొడుకులు, అన్నకు తగ్గ తమ్ముళ్ళు. పాండవుల రాజ్యం మొత్తం ఇవ్వకపోయినా సరే, కనీసం వారు జీవించటానికైనా ఐదుగురికి ఐదూళ్ళిమ్మని శ్రీకృష్ణుడే అర్థించినా, సూదిమొన మోపినంత భూమిని కూడా ఇచ్చేది లేదని కుండబ్రద్దలు కొట్టాడు దుర్యోధనుడు. కుమారునిపై నెపం వేసి తప్పించుకున్నాడు ధృతరాష్ట్రుడు. వారి చేష్టల కారణంగానే, వారి స్వార్థచింతన కారణంగానే పరుల సొమ్ముపై వారికి గల మోహం, దురాశ కారణంగానే ఈ యుద్ధం వచ్చి పడింది. అందుకే ఇది యాదృచ్ఛికం.

**అపావృతం స్వర్గద్వారం:** ఇది కోరకుండా వచ్చిన యుద్ధం మాత్రమే కాదు, **తెరచుకున్న స్వర్గద్వారం.** అంటే యుద్ధంలో పోరాడుతూ మరణించినవారు ఎంతటి పాపాత్ములైనా సరే వారికి వీరస్వర్గం లభిస్తుంది. దుర్యోధనాదులు స్వర్గాన్ని పొందినట్లు స్వర్గారోహణ పర్వంలో చూశాం. దానికి కారణం యుద్ధమరణమే. అందుకే యుద్ధ ప్రారంభంలో కౌరవ సైన్యాధ్యక్షుడు భీష్ముడు తన సేనలనుద్దేశించి ప్రసంగిస్తూ "ఓ వీర సైనికులారా! అదిగో మీ కోసం స్వర్గద్వారాలు తెరుచుకున్నాయి" అని సైన్యాన్ని ప్రోత్సహించాడు. కనుక యుద్ధంలో మరణం సంభవిస్తే స్వర్గభోగాలను అందుకోవచ్చు.

**సుఖినః క్షత్రియాలభంతే ఈదృశం యుద్ధం:** ధన్యాత్ములైన క్షత్రియులకే ఇలాంటి యుద్ధం లభిస్తుంది. ఓ అర్జునా! నీవు ధన్యాత్ముడవు, అదృష్టవంతుడవు. కనుకనే నీవు కోరకుండానే వచ్చిందీ యుద్ధం. ధర్మద్రోహులైన కౌరవులను చీల్చి చెండాడు. నీ పరాక్రమాన్ని ప్రదర్శించి ధర్మాన్ని రక్షించు– అన్నాడు భగవానుడు.

ఇంతవరకు యుద్ధం అనేది క్షత్రియునికి స్వధర్మం అని, అందునా ఈ ధర్మయుద్ధం యాదృచ్ఛికంగా లభించటం నీ అదృష్టం అని చెప్పిన భగవానుడు,

ఈ యుద్ధాన్ని చెయ్యక వెనుదిరిగితే వచ్చే నష్టమేమిటో తరువాతి 4 శ్లోకాల్లో వివరించబోతున్నాడు.

**శ్లో॥ అథచేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి।**

**తతః స్వధర్మం కీర్తించ హిత్వాపాపమవాప్స్యసి॥ 33**

**శ్లో॥ అకీర్తించాపి భూతాని కథయిష్యంతితేఽవ్యయాం॥**

**సంభావితస్య చాకీర్తిః మరణాదతి రిచ్యతే॥ 34**

**తా॥** ఒకవేళ ఈ ధర్మయుద్ధాన్ని చెయ్యకపోయావో; దానివల్ల నీ స్వధర్మాన్నీ, కీర్తిని పోగొట్టుకొన్నవాడివవుతావు. పైగా పాపాన్ని పొందుతావు (33) అంతేకాదు నీవు యుద్ధం నుండి తొలగిపోతే ప్రజలు నీ అపకీర్తిని చిరకాలం చెప్పుకుంటారు. గౌరవనీయునికి అపకీర్తి అనేది మరణం కన్నా ఎక్కువ బాధాకరం (34)

**వ్యాఖ్య:** ప్రతివ్యక్తీ తన పూర్వవాసనలను ఖర్చు చేసుకొనుటకు ఆ వాసనల మూటను నెత్తిన పెట్టుకొని తగిన దేహాన్ని ధరించి ఈ లోకంలోకి వస్తాడు. ఆ వాసనల మూటయే స్వధర్మం. అర్జునుడు క్షత్రియుడు గనుక అతడి వాసనల మూటలో కీర్తి కాంక్ష, ధైర్యసాహసాలు ఉంటాయి. ఇప్పుడు తాను తెచ్చుకున్న వాసనల మూటను ఖర్చు చేసుకొనుటకు తగిన అవకాశంగా ఈ ధర్మయుద్ధం వచ్చి పడింది. ఈ అవకాశాన్ని వినియోగించు కోకపోతే ఆ వాసనలు ఖర్చుగాక అలా పేరుకొంటాయి. దానితో అతడి హృదయం భారమవుతుంది. మలవిసర్జన కెళ్ళినవాడు తీరా వెళ్ళి, ఏదో ఒక కారణంతో బలవంతంగా ఆపుకొని వస్తే శరీరానికి ఎంత బాధగా ఉంటుందో; కర్మలు చేసి వాసనలను ఖర్చు చేసుకోకపోతే మనస్సుకు అంతే బాధగా ఉంటుంది, ఏమిటా బాధ? ఇప్పుడు అర్జునుడు యుద్ధం మానేసి అడవులకెళ్ళి తపస్సు చేసుకుంటున్నా– అప్పుడు కూడా అయ్యో! యుద్ధం చేయకుండా వచ్చేశానే, శక్తి ఉండీ అధర్మాన్ని అణచలేకపోయానే–అని పశ్చాత్తాపంతో కుమిలిపోవాలి. అంతేకాదు యుద్ధం చేసి ఖర్చు చేసుకోవలసిన వాసనలు అతడిలో అలాగే ఉండటం వల్ల; తనకు కొద్దిపాటి ఆటంకం కలిగించిన మనుష్యుల పైననో, జంతువులపైననో కసి పెరిగి హింసించాలను కుంటాడు. కనుక ప్రతివ్యక్తీ తనలోని వాసనలను ఖర్చు చేసుకోవాలి. అలా చేయకపోతే స్వధర్మాన్ని విడిచినవాడవుతాడు. ఈ విషయాన్నే భగవానుడు తెలియజేస్తున్నాడు.





దివ్యశస్త్రాస్త్ర సంపన్నుడైన అర్జునుడు యుద్ధం చేసి శత్రుసంహారం కావిస్తే గొప్పకీర్తి వస్తుంది. మరలిపోతే గొప్ప అపకీర్తిని మూటగట్టుకున్నవాడవుతాడు. అంతేకాదు అర్జునుడు తన స్వధర్మమైన యుద్ధాన్ని చేయకపారిపోయి, ఎంత గొప్ప తపస్సులు చేసినా అతడికి అందులో నైపుణ్యం ఉండదు. సిద్ధి కలగదు.

ఒక తండ్రి తన కుమారునిపై ప్రేమతో, అతడి బాగును కోరి మంచి వ్యాపారంలో ప్రవేశపెట్టాడు. కాని అతడికి కళలపై అమితప్రీతి. అతడి స్వభావం, ఆలోచనలు–అన్నీ కళలకు సంబంధించినవే. అందులో కృషి చేస్తే అతడు తప్పక ఉన్నత శిఖరాలందుకుంటాడు, గొప్పకీర్తి వస్తుంది, ఎంతో సంతృప్తి కలుగుతుంది. అతడి వాసనలు ఖర్చై హాయిగా ఉంటాడు. కాని బలవంతంగా–అతడి స్వభావ విరుద్ధమైన వ్యాపారంలో ప్రవేశపెట్టటాన ఏ నైపుణ్యమూ సంపాదించలేడు. అతడి మనస్సు కళలచుట్టూ తిరుగుతుంటే శరీరం మాత్రం వ్యాపారంలో ఉంటుంది. దానితో **"బంగారమంటి కోమటి సంగీతము చేత చిక్కి బేరసారములుడిగెన్"** అన్నట్లు వ్యాపారంలో నష్టపోతాడు. లోపలి వాసనలు గడబిడ చేస్తుంటే, అశాంతితో జీవితాన్ని గడుపు తాడు. ఇలా ఎందరో జీవితాలను చేతులారా నాశనం చేసుకుంటూ ఉంటారు. ఇదే స్వధర్మాన్నీ కీర్తిని నష్టపోవటం.

అంతేకాదు **తన సహజ స్వభావానికి విరుద్ధంగా నడుచు కోవటమే పాపం.** పాపం అంటే సామాన్య అర్థం మరొకటుంది. శక్తి ఉండీ అధర్మపరులను చంపక వదిలేస్తే వారి అధర్మకార్యాల వల్ల ఇంకా ఎందరో హింసింపబడతారు. అలా పరోక్షంగా ఎందరి హింసకో కారణమవుతాడు అర్జునుడు. అదే పాపం. ప్రత్యక్షంగా తాను హింసించి పాపం మూటగట్టుకోకపోయినా, పరోక్షంగా ఇతరుల– అమాయకుల– ధర్మపరుల బాధలకు, కష్టాలకు కారణం కావటం కూడా పాపమే.

అంతేకాదు, అర్జునా! బంధునాశనానికి అంగీకరించలేక నీవు యుద్ధం నుండి తొలగిపోయినా, జనులు మాత్రం పిరికి తనంతో, భయంతో పారిపోయావను కుంటారు. ఎంత అపకీర్తి నీకు? పైగా ఈ విషయాన్ని కథలుకథలుగా, హేళనగా చెప్పుకుంటారు. అర్జునుడు ఒట్టి 'కాగితంపులే' అంటారు. ఇలాంటి విషయాలు మాట్లాడటం, ప్రచారం చెయ్యటం మానవులకు ఎంతో సరదాగా ఉంటుంది. **గౌరవనీయులైన వారికి అపకీర్తి కన్న మరణం మేలు కదా!** అంటున్నాడు

భగవానుడు. బాగా కాలిన ఇనుముపై సుత్తి దెబ్బలు వేసినట్లు తన జ్ఞానబోధ అర్జునునిపై పనిచేస్తున్నట్లు తెలుసుకున్న భగవానుడు **'అపకీర్తి కన్న మరణం మేలు'** అనే అస్త్రాన్ని ప్రయోగించాడు. ఇలా మాట్లాడుతున్న శ్రీకృష్ణునికి అర్జునునిపై ఎంతో సానుభూతి ఉన్నది; అర్జునుని పరాక్రమం, అస్త్రసంపద ఎట్టిదో కూడా తెలుసు. అందుకే యుద్ధం నుండి వెనుదిరిగితే జరిగే పరిణామాలను ఏకరువు పెడుతున్నాడు.

**శ్లో॥ భయాద్రణాదుపరతం మన్యంతే త్వాం మహారథాః।**
**యేషాం చత్వంబహుమతః భూత్వాయాస్యసి లాఘవం॥ 35**

**శ్లో॥ అవాచ్య వాదాంశ్చబహూన్ వదిష్యంతి తవాహితాః।**
**నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం నుకిం?॥ 36**

**తా॥** అర్జునా! నీవు భయం వల్లనే యుద్ధరంగం నుండి పారిపోయావని మహారథులు అనుకుంటారు. ఇంతవరకు నిన్ను గౌరవంగా చూచినవారే చులకనగా మాట్లాడతారు (35).

నీ శత్రువులు నిన్ను అనేక విధాలుగా అనరాని మాట లంటారు. నీ సమర్థతను శంకిస్తారు. అంతకన్నా మించిన దుఃఖం నీకు ఇంకేం ఉంటుంది? 36

**వ్యాఖ్య:** అర్జునుడు మహావీరుడు. దివ్యశస్త్రాస్త్ర విద్యా సంపన్నుడు. ఓటమినెరుగని పరాక్రమశాలి. దేవేంద్రుని నిలువరించినవాడు, దేవతల కసాధ్యులైన నివాతకవచ కాలకేయులనే రాక్షసులను సంహరించినవాడు; ఘోషయాత్రలో గంధర్వులను లొంగదీసినవాడు; ఉత్తరగోగ్రహణ సమయంలో భీష్మద్రోణ కృపాశ్వద్ధామలతోను, దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులతో సహా చతురంగ బలాలతో కూడిన మహాసేనను ఒక్కడే అసహాయుడై వచ్చి అందరిని జయించి, గోవులను తరలించుక వెళ్ళినవాడు; పరమశివునితో పోరాడి మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించినవాడు. అందుకే ఇంతవరకు ఎప్పుడూ అపకీర్తిని గురించి ఆలోచించవలసిన పరిస్థితి రాలేదు. దీన్ని దృష్టిలో పెట్టుకొనే ఇప్పుడు శ్రీకృష్ణుడు అపకీర్తి అంటే ఏమిటో– దాని పరిణామాలేమిటో–అపకీర్తిని భరించటం ఎంత కష్టమో తెలిపి, అర్జునునిలో వీరావేశం రగిలించి యుద్ధోన్ముఖుని చేయాలని నిర్ణయించుకున్నాడు.

అర్జునా! మహారథులలో అగ్రశ్రేణిలో నిలిచినవాడవు నీవు. నీవంటే శత్రువులకు





హడల్. నీ మీద గౌరవం, భయం, భక్తి–అన్నీ ఉన్నాయి. ఇప్పుడు నీవు యుద్ధరంగం నుండి తొలగి పోయావా! భయంతో పారిపోయావనుకుంటారు మహారథు లంతా. నీ మీద ఉన్న గౌరవం తొలగిపోతుంది. నీవంటే భయం ఉండదు. ఇప్పటివరకు నిన్ను ఎదిరించి యుద్ధం చేయటం చాలా కష్టం అని తెలిసినా, విజయంపై నమ్మకం లేకపోయినా, విధిలేని పరిస్థితిలో వచ్చి నిలిచిన వీరులు– ఇక యుద్ధం జరగదు అని తెలిస్తే నిన్ను చాలా హీనంగా మాట్లాడుతారు. ఎగతాళి చేస్తారు. వారి దృష్టిలో నీవు చులకనైపోతావు. అన్నదమ్ములమధ్య యుద్ధం మంచిదికాదని, బంధునాశనానికి ఇష్టపడక, నీవు యుద్ధం నుండి వెనుదిరిగినా ఇదంతా చేతకాని వాళ్ళు అనే మాటలే; పిరికిపందలు ఇంతకన్న ఇంకేం అంటారులే? అని గేలిచేస్తారు. ఇంతటి అవమానాన్ని సహిస్తావా? భరించగలవా?

కేవలం మహావీరులు, మహారథులే కాదు శత్రుపక్షంలోని సామాన్య సైనికులు కూడా నిన్ను అనరాని మాటలంటారు. ఎక్కడైనా నీవు కనిపిస్తే చాలు "ఈ మహావీరుడేనండి కురుక్షేత్ర యుద్ధరంగం నుండి మొదటిరోజునే పారిపోయిన పరాక్రమశాలి" అని తమలో తాము చెవులు కొరుక్కుని మురిసిపోతారు. శత్రుపక్షం వారే గాదు, నీ పక్షంలోని వారికి కూడా నీ సమర్థతపై సందేహం కలుగుతుంది. చరిత్రకారులు నీ చరిత్రను కళంకిత మైనదిగా చిత్రీకరిస్తారు. శాశ్వతంగా నీవు చరిత్రలో పిరికివాడుగా, అసమర్థుడుగా మిగిలిపోతావు. ఇంతకన్నా దుఃఖం మరేం ఉంటుంది? బాగా ఆలోచించుకో–అన్నాడు భగవానుడు.

యుద్ధంవల్ల జరిగే అనర్థాలను ఏకరువు పెట్టి, ఇక యుద్ధం చేయనని రథంలో కూలబడిపోయినప్పుడు అర్జునుడు ఇదంతా ఆలోచించలేదు. అప్పుడతడి మనోస్థితి అలాంటిది. ఐతే యుద్ధం నుండి వెనుదిరిగితే జరిగే పరిణామాలను భగవానుడు ఒక్కొక్కటే వివరిస్తుంటే– 'నిజమే గదా!' అనిపిస్తున్నది అర్జునునికి. అర్జునుని ముఖంలో మార్పులను గమనిస్తున్న భగవానుడు, అర్జునునిలోని సందేహాలన్నింటిని తొలగించి; ఏమైనా సరే యుద్ధం చేయక తప్పదని అర్జునునిలో దృఢనిశ్చయాన్ని కలిగించటానికి చివరి అస్త్రాన్ని ప్రయోగిస్తున్నాడు. ఏమిటది?

*అర్జునా! ఈ యుద్ధంలో విజయం సాధించినా లేక మరణించినా– ఏమి జరిగినా నీకు మంచిదే అని చెప్పి కర్తవ్యో న్ముఖుని చేస్తున్నాడు భగవానుడు.*

**శ్లో॥ హతో వా ప్రాప్యసే స్వర్గం జిత్వావా భోక్ష్య సే మహీం।**
**తస్మా దుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37**

**తా॥** కుంతీనందనా! చనిపోయావా! స్వర్గాన్ని పొందుతావు; విజయం సాధించావా! రాజ్యాన్ని పొందుతావు. అందువల్ల లే! లేచి యుద్ధానికి కృతనిశ్చయుడవుకా!

**వ్యాఖ్య:** కార్యరంగంలో ప్రవేశించిన తరువాత, సందేహాలతో కర్తవ్యవిమూఢుడైన వానిని కర్తవ్యోన్ముఖుని చేసేందుకు, అద్భుతమైన ప్రోత్సాహాన్ని కలిగించే మంత్రం ఇది. ఇంతవరకు భగవానుడు, యుద్ధం చేయకపోతే స్వధర్మాన్ని, కీర్తిని పోగొట్టు కొని పాపాన్ని పొందుతావని, ఎంతో అపకీర్తియని, అందరూ గేలిచేస్తారని కనుక తప్పక యుద్ధంచెయ్యాలని బోధించాడు. అయితే యుద్ధంచేస్తే అంతా లాభమేనా? నష్టంలేదా? గెలిస్తే మంచిదే. కాని ఓడిపోతేనో? మరణిస్తేనో? అప్పుడేంటి? అనే సందేహం అర్జునునికి కలగవచ్చు. దానికే ఇక్కడ సమాధానం.

**హతోవాప్రాప్యసే స్వర్గం :** అర్జునా! కీడెంచి మేలెంచుదాం. ఒకవేళ ఈ యుద్ధంలో శతృవులచేతిలో మరణించావే అనుకుందాం. అదీ నీకు ప్రయోజనమే. యుద్ధంలో మరణించిన వీరయోధుడు వీరస్వర్గాన్ని అలంకరిస్తాడని శాస్త్రవచనం. కనుక మరణిస్తే స్వర్గభోగాలను అనుభవించవచ్చు.

**జిత్వావా భోక్ష్యసే మహీం :** ఒకవేళ నీవే విజయం సాధించా వనుకో. ఈ భూమండల రాజ్యం అంతా నీ స్వాధీనం అవుతుంది. హాయిగా నీ సోదరులతోను, భార్యాబిడ్డలతోను, ఆత్మీయులతోను, బంధువులతోను కలసి సమస్త రాజ్యభోగాలు అనుభవించవచ్చు. అంతేకాదు, ధర్మం కోసం వీరోచితంగా పోరాడిన వీరయోధుడుగా అందరూ నిన్ను ప్రశంసిస్తారు. కనుక ఎలా చూచినా నీకు శ్రేయస్సే.

**యుద్ధాయకృతనిశ్చయః :** యుద్ధం చేయటమా? మానటమా? అనే నీ సందేహాలన్నింటినీ విడిచిపెట్టి, గెలిస్తే రాజ్య భోగాలు, మరణిస్తే స్వర్గభోగాలు లభిస్తాయి గనుక; యుద్ధం మానేస్తే అపకీర్తి, పాపం, అధర్మాన్ని అణచలేని అసమర్థుడుగా మిగిలి పోతావు గనుక యుద్ధానికి కృత నిశ్చయుడవుకా! నీ క్షత్రియ ధర్మాన్ని నెరవేర్చు – అని ప్రోత్సహిస్తున్నాడు.

అర్జునుడేకాదు మనందరం కూడా ఈ దేహమనే కురు క్షేత్రంలో జరుగుతుండే యుద్ధానికి సిద్ధంకావాలి. ఏమిటా యుద్ధం? అజ్ఞానంపై యుద్ధం, జన్మరాహిత్యం





కొరకు యుద్ధం. ఈ ఆంతరంగికయుద్ధంలో మనం కూడా అప్పుడప్పుడు వెనకడుగు వేస్తుంటాం. సాధనలతో ముందుకు పోవటమా? సాధారణ మానవులలాగా ప్రపంచ సుఖాలు, భోగాలు శాశ్వతమని వాటికొరకై పరుగులు తీయటమా? అని సంశయం. అలాంటి సమయాల్లో ఈ శ్లోకాన్ని గుర్తుచేసుకోవాలి. ఈ ఆంతరంగిక యుద్ధంలో (సాధనలలో) విజయం సాధించామా? మోక్ష సామ్రాజ్యంలో ప్రవేశించి శాశ్వత ఆనంద స్వరూపులుగా ఉండిపోతాం. లేక మధ్యలోనే మరణం సంభవించిందా ఉ త్తమ లోకాలకు వెళ్ళి అక్కడ స్వర్గభోగాలనుభవించి తిరిగి శుచివంతులు, శ్రీమంతులు అయినవారిండ్లలోనో, లేక సరాసరి యోగుల ఇండ్లలోనో జన్మించి మళ్ళీ సాధనలు సాగించి మోక్షాన్ని పొందగలం. కనుక రెండువిధాలా శ్రేయస్సే. అందువల్ల లక్ష్యాన్ని సాధించేవరకు మన సాధనలను విడిచిపెట్ట రాదు. డు ఆర్ డై. కరో యా మరో.

**తస్మాత్ ఉత్తిష్ఠ :** కనుక లెమ్ము. లేచి యుద్ధానికి సిద్ధంకా! అని ప్రోత్సహిస్తున్నాడు భగవానుడు. ఉత్తిష్ఠత! జాగృత!! ప్రాప్యవరాన్ని బోధత!!! అనే కఠోపనిషత్ వాక్యాన్ని పోలి ఉన్నదీ శ్లోక వాక్యం. లెండి! మేలుకొండి!! మహాత్ముల నాశ్రయించి జ్ఞానాన్ని పొందండి!!! అనే ఈ భావాన్ని స్వామి వివేకానంద తన ఉపన్యాసాలలో తరచుగా వ్యక్తం చేసేవారు. ఉత్తిష్ఠ! అనే పదంతో ఒక్క కుదుపు కుదుపుతున్నాడు భగవానుడీ శ్లోకంలో.

–యుద్ధం చేయాలని నిశ్చయానికి వచ్చినా – ఎలా చేయాలి యుద్ధాన్ని ? లోకంలోని మానవులంతా దైనందిన జీవితంలో ఎలా కర్మలు చేయాలో తెలియజేయటానికే ఈ రాబోయే శ్లోకం.

**శ్లో॥ సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ 38**

**తా॥** సుఖదుఃఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను సమముగా భావించి యుద్ధానికి సన్నద్ధుడివికా! అలా చేస్తే ఇక నీవు పాపాన్ని పొందవు.

**వ్యాఖ్య:** ఇంతవరకు భగవానుడు యుద్ధం చేయవలసిన అవసరాన్ని నొక్కిచెప్పి, ఇప్పుడు యుద్ధాన్ని ఎలా చేయాలో– ఏ భావనతో చేయాలో చెప్పబోతున్నాడు. యుద్ధం ఎలా చేయాలో అర్జునునికి చెప్పడం ద్వారా కర్మలనెలా చేయాలో సమస్త మానవాళికి తెలియజేయబోతున్నాడు.

భగవద్గీత కేవలం మోక్షం అంటే ఏమిటో చెప్పి ఊరుకునే శాస్త్రం కాదు. మోక్షాన్ని ఎలా అందుకోవాలో కూడా తెలియజెప్పిన శాస్త్రం. అర్జునుడు యుద్ధం చెయ్యాలి. మనం కర్మలు చెయ్యాలి. కర్మలు బంధాలకు కారణమై మళ్ళీ మళ్ళీ జన్మలకు దారితీస్తాయి. ఎందుకంటే కర్మ చేస్తే కర్మఫలం వస్తుంది. కర్మఫలాల ననుభవించటానికి జన్మ వస్తుంది. ఆ జన్మలో తిరిగి కర్మలు. వాటివల్ల కర్మ ఫలం. మళ్ళీ జన్మ. ఇలా జన్మ కర్మ వలయంలో - సంసార జనన మరణచక్రంలో ఇరుక్కుపోతాం. మన స్వధర్మకర్మలైనా జాగ్రత్తలు తీసుకోక తప్పదు. ఎదురింటిలో నిప్పు మాత్రమేకాదు, మన ఇంటిలో నిప్పు కూడా అజాగ్రత్తగా ఉంటే కాల్చేస్తుంది గదా! కనుక ఎలాంటి కర్మలు చేసేటప్పుడైనా జాగ్రత్తలు తీసుకోకతప్పదు. నిజంగా కర్మలలో ఏ దోషమూ లేదు. చేసే విధానంలోనూ, కర్మల వెనుకనున్న ఉద్దేశంలోనే దోషం అంతా. కనుక దోషాన్ని తొలగించుకొని కర్మలు చేయాలి.

మనం చేసే కర్మలవల్ల సుఖమూ కలగవచ్చు, దుఃఖమూ కలగవచ్చు. అలాగే లాభనష్టాలు, జయాపజయాలు, శుభాశుభాలు ఏవైనా కలగవచ్చు. ఈ ఫలితాలన్నీ మన మనస్సుని చెడగొడతాయి. కర్మ చేసేటప్పుడు మన దృష్టి ఈ ఫలితాల మీద ఉంటే మనకు పనిలో ఏకాగ్రత ఉండదు. ఆ కర్మ సంతృప్తి నివ్వదు. పైగా ఆ కర్మఫలం మనకు బంధమై కూర్చుంటుంది.ఇదే పాపం. ఇలా కర్మలు బంధం కాకుండా ఉండాలంటే ఫలితాలపై దృష్టిపెట్టకుండా-అంటే సుఖమా? దుఃఖమా? లాభమా? నష్టమా? జయమా? అపజయమా? అనే శంక లేకుండా అన్నింటిని సమంగా భావిస్తూ, 'నా స్వధర్మమైన కర్మను చేయటమే నా విధి. ఫలితంతో నాకు సంబంధంలేదు' - అనే నిశ్చయంతో చేయాలి. అప్పుడే పనిలో నైపుణ్యం కూడా ఉంటుంది. ఉత్తమ మైన కర్మ మన నుండి వెలువడుతుంది.

ఈ శ్లోకం ఇంతవరకు చెప్పిన జ్ఞానయోగానికి, ఇక ముందు చెప్పబోయే కర్మయోగానికి సంధిశ్లోకం. కర్మచేయక ఎవరికైనా తప్పదు. ఎలా చేయాలో తెలుసుకొని చేస్తేనే ప్రయోజనం.

ఒకడు సముద్ర స్నానానికి వెళ్ళాడు. అసలు సముద్రాన్ని చూడటం అతనికి ఇదే మొదటిసారి. అందువల్ల ఎలా దిగి స్నానం చేయాలో తెలియక సరాసరి దిగి, కొంచెం దూరం వెళ్ళి స్నానం చేస్తున్నాడు. బలమైన అలవచ్చి అతణ్ణి ముంచి





తనలోకి లాక్కుంది. ప్రాణాలు వదిలాడు. ఇంతకీ అతడిలోపం ఏమిటి? సముద్రంలో అలలు ఉంటాయని, అజాగ్రత్తగా ఉంటే మనను లోపలకు లాగివేస్తాయని తెలియకపోవటమే. అలాగని అలలు తగ్గిందాకా స్నానం చేయకుండా ఉందాం అంటే అలాంటివాణ్ణి మూర్ఖుడు అంటారు. ఎందుకంటే మన స్నానంకోసం సముద్రం తన స్వధర్మాన్ని విడిచిపెట్టదు గదా! కనుక అలలు వస్తున్నప్పటికీ పైకెగరటమో క్రిందికి వంగటమో ఏదో ఒకటి చేసి అలల దెబ్బను తట్టుకొని స్నానం పూర్తి చేసి ఆనందించాల్సిందే.

సముద్రంలో స్నానం చేసినట్లుగానే మనం ఈ సంసారమనే సముద్రంలో కర్మలు చేస్తూనే ఉండాలి. అయితే ఎలా చేయాలి? ఈ ద్వంద్వాలనే అలల తాకిడిని తట్టుకుంటూ, వాటికి చలించకుండా; సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాప జయాలు అనే ద్వంద్వాలను సమభావంతో చూస్తూ తెలివిగా కర్మలు చేయాలి. అంతేగాని ద్వంద్వాలు లేకుండా పోవాలని కోరుకుంటే అది మూర్ఖత్వమే అవుతుంది.

అందుకే యుద్ధం ఎలా చేయాలో భగవంతుడిక్కడ అర్జునునికి తెలియజేస్తున్నాడు. ముందు మనస్సును సమత్వంలో ఉంచుకో. ఆ తర్వాత యుద్ధం చెయ్యి. అలా చేస్తే ఏ కర్మబంధమూ (పాపమూ) అంటదు. యుద్ధపరిణామం ఏమైనా సరే నీవు నిర్లిప్తంగా ఉండాలి. జయానికి పొంగరాదు. అపజయానికి క్రుంగరాదు. ఫలితంపై ఆసక్తిని విడిచిపెట్టు-అని. కనుక ఏ కర్మను చేసినా గ్రుడ్డిగా చేయరాదు. మనోబుద్ధులు ఎలా ఉండాలో అన్నీ తెలుసుకొనే కార్యరంగంలోకి దూకాలి. జ్ఞానంతో చేయాలి. అందుకే ముందుగా జ్ఞానాన్ని బోధించి ఆ తర్వాతే కర్మలను గూర్చి చెబుతున్నాడు.

**శ్లో॥ ఏషాతేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాంశ్రుణు।**
**బుద్ధ్యాయుక్తోయయాపార్థ! కర్మబంధం ప్రహాస్యసి॥ (39)**

**తా॥** ఇంతవరకు నీకు జ్ఞానాన్ని బోధించటం జరిగింది. ఇక ఈ బుద్ధి యోగాన్ని గురించి విను. పార్థా! ఈ జ్ఞానంతో కూడుకుంటే నీవు కర్మబంధాన్ని ఛేదించగలవు.

**వ్యాఖ్య:** ఇంతవరకు స్వజనులు చనిపోతారనే దుఃఖాన్ని పోగొట్టటానికి ఆత్మజ్ఞానాన్ని (సాంఖ్యయోగాన్ని) గురించి చెప్పాడు. ఆ తర్వాత స్వధర్మం దృష్ట్యా చూచినా నీవు యుద్ధం చేసి తీరవలసిందే అని తెలియజేశాడు. ఇప్పుడా యుద్ధాన్ని ఎలా చేయాలో వివరించబోతున్నాడు భగవానుడు.

బుద్ధిపూర్వకంగా ఫలాసక్తిని వదలిపెట్టి చేసే కర్మయే నిష్కామకర్మ. అదే బుద్ధియోగం. సాధారణంగా కర్మలు చేస్తే కర్మఫలాలు వస్తాయి. ఆ కర్మఫలాలు జన్మలకు కారణమవు తాయి. అదే బంధం. ఈ బంధం వల్లనే మళ్ళీ మళ్ళీ కర్మలు, మళ్ళీ మళ్ళీ జన్మలు. మరి ముక్తి ఎలా? కర్మలను బంధం కాకుండా చేస్తేనే ముక్తి. కనుక తెలివితో చేయాలి. అదే బుద్ధియోగం.

భగవద్గీత కేవలం జ్ఞానాన్ని చెప్పి ఊరుకునే గ్రంథం కాదు, ఆ జ్ఞానాన్ని జీవితంలో అడుగడుగునా ఆచరణలో పెట్టుకొనే ఉపాయాలను కూడా తెలియజేస్తుంది. ఊరికే తెలిస్తే ప్రయోజనం లేదు. ఆ తెలివిని ఉపయోగించుకొని ప్రయోజనం పొందాలి.

అర్ధరాత్రివేళ దొంగ ఒకడు కన్నం వేస్తున్నాడు. భార్య భర్తతో ఏమండీ ఏదో శబ్దం వస్తున్నది చూడండి– అన్నది. భర్త కుంభకర్ణుని అంశ. నాకు తెలుసులే అన్నాడు. దొంగ లోపలి కొచ్చాడు. అడుగుల చప్పుడు విని భార్య మళ్ళీ హెచ్చరించింది. నాకు తెలుసులే పడుకో అన్నాడు భర్త. దొంగ పెట్టె తెరిచి, విలువైన వస్తువులు మూట గట్టుకుంటున్నాడు. మళ్ళీ భార్య హెచ్చరించింది. నాకు తెలుసులే అన్నాడు కళ్ళు తెరవకుండానే. దొంగ వెళ్ళిపోయాడు. భార్యకు ఒళ్ళు మండింది. నాకుతెలుసు, నాకుతెలుసు అంటావు, ఏం తెలుసు నీకు. ఆ తెలివికి నిప్పుపెట్టు. సొమ్మంతా పోయింది అని లబోదిబోమన్నది.

కనుక తెలిస్తే చాలదు. తెలిసిన దానితో ప్రయోజనం పొందాలి. ఒట్టి జ్ఞానం ఉంటే చాలదు. ఆ జ్ఞానంతో తెలివిగా కర్మలు చేయాలి. కర్మబంధం అంటకుండా చేయాలి. అదే బుద్ధి యోగం. తెలివితో కర్మలు చేసే ఉపాయం. దానినే వివరించ బోతున్నాడు భగవానుడు.

బుద్ధియోగాన్ని తెలుసుకోకుండా కర్మలు చేస్తే తేనెలో చిక్కిన ఈగ అందులోనే కొట్టుకొని ప్రాణం విడిచినట్లు మనం ఈ సంసార చక్రబంధంలో గిలగిల కొట్టుకోవాల్సిందే. అందుకే కర్మయోగాన్ని (బుద్ధియోగాన్ని) చెప్పబోతున్నాడు.

–ముందుగా బుద్ధియోగం యొక్క విశిష్ఠత ఏమిటో తరువాతి శ్లోకాల్లో చెప్పబోతున్నాడు.

**శ్లో॥ నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయోనవిద్యతే।**
**స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్॥ 40**





**శ్లో॥ వ్యవసాయాత్మికాబుద్ధిః ఏకేహ కురునందన।**
**బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం॥ 41**

**తా॥** ఈ నిష్కామ కర్మయోగంలో క్రమభంగం జరగటం గాని, వ్యతిరేక ఫలితాలు రావటం గాని జరుగదు. అంతేకాదు. ఏ కొంచెం ఆచరించినా గొప్ప భయం నుండి నిన్ను రక్షిస్తుంది. (40) కురునందనా! కోరికలు లేని నిశ్చయబుద్ధి ఏకాగ్రంగా ఉంటుంది. అదే నిశ్చయం లేని వారిబుద్ధి అనేక శాఖోపశాఖలుగా చీలిపోయి ఉంటుంది (41).

**వ్యాఖ్య:** ఈ లోకంలో మానవులు సాధారణంగా తాము చేసే పనికి ఏదో ప్రతిఫలాన్ని కోరుకుంటారు. ఏ ఫలితమూ రాదనుకుంటే ఆ పని ఎందుకు చెయ్యాలి? అనే ప్రశ్న వస్తుంది. కనుక కోరిక లేకుండా, ఫలితాన్ని కోరకుండా కర్మచేయటం వృధా అనుకుంటారు. మరి భగవానుడేమో నిష్కామ కర్మయోగాన్ని బోధిస్తున్నాడు. అంటే సకామకర్మలకన్న ఈ నిష్కామకర్మయోగం ఏదో గొప్పదై ఉండాలి. ఇందులో ఏదో విశిష్ఠత ఉండాలి. ఏమిటా విశిష్ఠత? ఏమిటా గొప్పతనం?

సాధారణంగా అందరూ చేసే సకామకర్మలలో రెండు దోషాలున్నాయి. అవి

**1. అభిక్రమనాశం**: పూజలు, వ్రతాలు మొదలైన కర్మలను చేసేటప్పుడు మధ్యలో ఆటంకాలు వచ్చి ఆగిపోవచ్చు. లేదా పాటించవలసిన విధులను పాటించకపోవచ్చు. దీనివల్ల రావలసిన ఫలం రాదు. చేసిన పని వృధా అవుతుంది. ఇలా కోరుకున్న ఫలం రాకపోవటమే అభిక్రమనాశం.

**2. ప్రత్యవాయదోషం:** ఏవో కోరికలతో పూజలు, హోమాలు చేస్తున్నప్పుడు శాస్త్ర విధులను అతిక్రమించి తప్పుగా చేసినా, ఆహుతులను మంత్రవిధిని బట్టి సమర్పించకపోయినా, నియమ నిష్టలను పాటించక పోయినా కోరుకున్న ఫలితం రాకపోగా విపరీత ఫలితం వస్తుంది. నహుషుడు కొండచిలువ అయ్యాడు; నృగుమహారాజు ఊసరవెల్లి అయ్యాడు; శివునికి వ్యతిరేకంగా యజ్ఞం చేసిన దక్షునికి మేకతల వచ్చింది. ఇలా కోరిన ఫలితం రాకపోగా వ్యతిరేక ఫలితం–చెడు ఫలితం రావటాన్నే ప్రత్యవాయదోషం అంటారు.

సకామకర్మలలో ఈ రెండు దోషాలు ఉన్నాయి. అయితే భగవానుడు ప్రతిపాదించిన ఈ బుద్ధియోగం (నిష్కామకర్మయోగం)లో ఈ రెండు దోషాలు లేవు, రావు.

నిష్కామకర్మను ప్రారంభించి మధ్యలో విరమించినా, చేసినంతవరకూ ఫలితం ఉంటుంది. ఆకలిగా ఉన్నవాడు ఎన్ని ముద్దలు తింటే అంతవరకు ఆకలి తీరినట్లు; మెట్లు ఎక్కేవాడు ఎంతవరకు ఎక్కితే ఎక్కవలసిన దూరంలో అంతవరకు తగ్గినట్లే. అలాగే ఈ నిష్కామకర్మలో నియమాలు ఉల్లంఘించినా, విధులు పాటించకపోయినా చేసినంతవరకూ ప్రయోజనమే; పైగా ఏ చెడ్డ ఫలితమూ రాదు. కూలికి పంఖాలాగేవాడికి మధ్యలో ఆపితే చివాట్లు పడతాయిగాని ఉచితంగా లాగేవాడికి ఆ బాధలేదు. పైగా **స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్:** ఈ నిష్కామకర్మ యోగాన్ని ఏ కొంచెం ఆచరించినా గొప్ప భయం నుండి నిన్ను రక్షిస్తుంది. నిప్పురవ్వ చిన్నదే అయినా కొండంత ఎత్తున ఉన్న దూది కుప్పను భస్మీపటలం చేసినట్లు నిష్కమకర్మయోగాన్ని ఏ కొంచెం ఆచరించినా మరణరూప సంసార భయం నుండి నిన్ను రక్షిస్తుంది. సకామ కర్మల ద్వారా సంపాదించే ధనం గాని, పుత్రాదులు గాని, సంపదలు గాని–అన్నింటినీ ఇక్కడే విడిచి ఒంటరిగా పోవాలి. అదే నిష్కామ కర్మలైతే వాటిఫలం మనతోబాటుగా ప్రయాణించి, ఒక్కొక్క జన్మలో మనను ముందుకు నడిపిస్తూ చివరకు మనను మోక్షద్వారం వద్దకు తీసుకుపోతుంది. ఈ విషయం తెలిస్తే నిస్సందేహంగా, సంతోషంగా ఈ మార్గంలో ప్రయాణిస్తారు. మరొక విశిష్ఠత ఉన్నది ఈ యోగంలో.

నిష్కామ కర్మయోగాన్ని ఆచరించేవారికి లౌకికభోగాలపట్ల, సంపదలపట్ల, విషయాలపట్ల ఆసక్తి ఉండదు. అతడు చేసే పనిమీదనే అతడి దృష్టి ఉంటుంది. కనుక ఒక లక్ష్యం కోసం, పట్టుదలతో వ్యవహరించే అతడి బుద్ధి ఏకాగ్రంగా , స్థిరంగా ఉంటుంది.

సకామకర్మలను ఆచరించేవారికి లౌకిక భోగాలు, సంపదలు, ధనం, విషయాలు ఇవే ప్రధానం. లోకంలో అనేక రకాల భోగాలు, సంపదలు, వస్తువులు, విషయాలు ఉన్నాయి గనుక వాటిని అనుభవించాలనే కోరికలు కూడా అనేకం ఉంటాయి. ఇలా నిరంతరం కోరికలతో వేగిపోయే మనస్సు కళ్ళెం లేని గుర్రంలాగా, గట్టుతెగిన చెరువులాగా, కట్టువిప్పుకున్న గొడ్డు లాగా ఎటువైపు పడితే అటువైపు పరుగెడుతుంది. చేసే పనికన్నా వచ్చే ఫలితం మీదనే ఆసక్తి. అందువల్ల అతడి బుద్ధి శాఖోపశాఖలుగా చీలిపోతుంది. ఇలా ఏకాగ్రత లేకుండా చీలిపోతే నష్టం ఏమిటి?

సూర్యకిరణాలు అనేకం. అవి అలా ఉన్నప్పుడు వాటిశక్తి సామాన్యం. కాని ఆ





కిరణాలన్నింటిని భూతద్దంలో కేంద్రీకరించి నప్పుడు క్రింద ఉంచిన కాగితాన్ని భస్మం చేస్తాయి. గడ్డిపరకలు వేరువేరుగా ఉంటే వాటికేశక్తి ఉండదు. కాని ఆ గడ్డి పరకలనే త్రాడుగా ఒక్కొక్కటిగా పేనినప్పుడు మదించిన ఏనుగును బంధించ గలదు. అలాగే బుద్ధి అనేక శాఖలుగా చీలి ఉంటే దాని శక్తి సాధారణం. కాని బుద్ధి ఏకాగ్రమైతే – ఒకే లక్ష్యంపై నిలిపితే ఆ బుద్ధి అత్యంత శక్తివంతమౌతుంది. అట్టి బుద్ధి పరమాత్మపై నిశ్చలంగా నిలిచి పరమాత్మతో ఐక్యమయ్యే సమర్థత వస్తుంది. కనుకనే నిష్కామకర్మయోగం అత్యంత శ్రేష్ఠమైనదని భగవానుడు తెలియజేస్తున్నాడు.

భగవానుడు చెప్పినవిధంగా ఈ బుద్ధియోగం శ్రేష్ఠమైనదనే దృఢనిశ్చయానికి వచ్చినప్పుడు శాస్త్రాన్ని తెలుసుకోవాలి. శాస్త్రాన్ని తెలియజెప్పే గురువులు 2 రకాలుంటారు. శాస్త్రాన్ని పూర్తిగా అవగాహన చేసికొని చెప్పేవారు ఒక రకమైతే, మిడిమిడి జ్ఞానంతో ఏదో కొద్దిగా తెలియగానే అంతా తెలుసుననుకొని బోధించేవారు రెండవ రకం వారు. మిడిమిడి జ్ఞానం గల ఈ అవివేకులు ఎవరు? ఏమని చెబుతారు వీరు?

కర్మయోగానికి సంబంధించి సంపూర్ణమైన జ్ఞానం లేకుండా మిడిమిడి జ్ఞానంతో బోధించే అవివేకులైన గురువులు ఎవరో, ఎట్టివారో, ఏమని బోధిస్తారో 3 శ్లోకాల్లో–

**శ్లో॥ యామిమాం పుష్పితాంవాచం ప్రవదం త్యవిపశ్చితః।**
**వేదవాద రతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః॥ 42**

**శ్లో॥ కామాత్మానఃస్వర్గపరాః జన్మకర్మ ఫలప్రదాం।**
**క్రియావిశేష బహుళాం భోగైశ్వర్య గతింప్రతి॥ 43**

**శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం।**
**వ్యవసాయాత్మికాబుద్ధిః సమాధౌన విధీయతే॥ 44**

**తా॥** పార్థా! వేదములందలి అర్థవాదము (కర్మకాండ)లో ఆసక్తి గలవారు కోరికలతో నిండి, స్వర్గసుఖముల పట్ల ఆకర్షితులై; స్వర్గసుఖములకంటే కోరవలసింది ఇంకేమీ లేదని వాదిస్తారు. అట్టి అజ్ఞానులు (అవివేకులు) అనేక క్రియా విశేషాలతో కూడి, జన్మకర్మ వలయంలో త్రిప్పి, భోగైశ్వర్యాలవైపుకు తీసుకు పోయే (మోదుగ)

పువ్వులవంటి మధురమైన మాటలను చెబుతూ ఉంటారు. అలాంటి వారి మాటలకు ముగ్ధులై, భోగైశ్వర్యాల వైపుకు ఎవరు ఆకర్షించబడతారో వారి వివేకం హరించుకు పోతుంది. దానివల్ల వారిబుద్ధి స్థిరముగా బ్రహ్మనిష్ఠయందు నిలువదు.

**వ్యాఖ్య:** మానవజీవిత పరమలక్ష్యం మోక్షప్రాప్తియే-శాశ్వత ఆనందప్రాప్తియే-జన్మరాహిత్యమే. ఆ లక్ష్యాన్ని సాధించాలంటే 'నేను పరమాత్మను' అనే అనుభూతిలో నిలవాలి. అలా నిలవాలంటే ఎల్లప్పుడూ నేను పరమాత్మననే నిష్ఠలో ఉండిపోవాలి. అలా ఉండాలంటే 'నేను' అంటే ఎవరో, పరమాత్మ అంటే ఎవరో తెలియాలి. అది తెలియాలంటే ఆత్మజ్ఞానం కావాలి. ఆత్మజ్ఞానాన్ని తెలియజేసేది **జ్ఞానకాండ**. బ్రహ్మనిష్ఠలో మనస్సు నిలిపే ఉపాయాన్ని తెలిపేది **ఉపాసనాకాండ**. అలా నిలిచేందుకు మనస్సును శుద్ధం చేసే ఉపాయాలను తెలిపేది **కర్మకాండ**. ఈ కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ అనే 3 మెట్లు మోక్ష సౌధాగ్రాన్ని చేరటానికి వేదాలలో ఇవ్వబడ్డాయి. అందుకే **'కాండత్రయాత్మకం వేదం'-** 3 కాండలతో కూడినది వేదం అన్నారు. ఇలా వేదాలలో చెప్పబడిన 3 కాండలను మెట్లుగా చేసుకొని మోక్షాన్ని పొందాలి. బ్రహ్మముగా, శాశ్వత బ్రహ్మానంద స్థితిలో ఉండిపోవాలి. ఈ మూడు కాండల జ్ఞానం తెలిసినవాడే జ్ఞాని.

**వేదవాదరతాః** అయితే వేదాలలోని కర్మకాండను మాత్రమే తెలుసుకొని, అదే సర్వస్వమనుకొని, అందులో చెప్పిన పూజలు, వ్రతాలు, నోములు, యజ్ఞయాగాదులు, సత్కర్మలు చేసి, వాటి ఫలితంగా వచ్చే ఇహలోక భోగాలు, సంపదలు, సుఖాలు మరియు పరలోక-స్వర్గలోక భోగాలను అనుభవించటమే మానవ జీవిత పరమార్థమనుకొనే వారినే ఇక్కడ 'వేదవాద రతులు' అన్నారు.

ఇలా కేవలం కర్మకాండను మాత్రమే తెలుసుకొని సకామకర్మలు చేసి సుఖభోగాలనుభవిస్తే చాలని అంతటితో ఆగిపోయే వారే భోగవాదులు. భోగవాదులు, త్యాగవాదులు అని 2 రకాల వారున్నారు. పాశ్చాత్యులు భోగవాదులు. భారతీయులు త్యాగవాదులు. మనస్సు కోరుకున్నట్లుగా బయటినుండి వస్తువులను, సుఖాలను సంపాదించటం భోగవాదం. లభించిన వస్తువులతో మనస్సును సంతృప్తిపరచటం త్యాగవాదం. మనస్సులో కోరికలు అనంతంగా ఉంటాయి. ఆ కోరికలకనుగుణంగా వస్తువులను సంపాదించటం చాలా కష్టం. అందువల్ల భోగవాదులకు మనస్సు





సమత్వంలో శాంతంగా ఉండదు. "మంచం ఉన్నంత వరకే కాళ్ళు చాచుకో" అన్నట్లుగా లభించిన వస్తువులతో సంతృప్తిగా ఉండటం నేర్చుకుంటే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అందుకే త్యాగవాదులు శాంత మనస్సుతో భగవంతునికి దగ్గర కాగలుగుతారు. భోగవాదం నుండి త్యాగవాదానికి నడిపించటమే భగవద్గీత అభిప్రాయమూ, భగవానుని అభిప్రాయము కూడా.

కోరికలతో తపించిపోతూ, సుఖభోగాలకై పరుగులు తీస్తూ, దానికి మార్గం చూపే కర్మకాండను గూర్చి మాత్రమే తెలుసుకొని, అందులోనే మునిగిపోయేవారు, దానినే ఇతరులకు బోధించేవారే వేదవాదరతులు. వారు సంపూర్ణ జ్ఞానంలేని అవివేకులు. వారు-

**కామాత్మానః, స్వర్గపరాః** వారు కోరికలపుట్టలు. ఇహలోక భోగాలు, సిరిసంపదలు, పరలోకంలో స్వర్గభోగాలను కోరుకునే వారు. అమృతపానం, నందనవనవిహారం, అప్సరసలతో సమాగమం-వీటికోసమే ఎప్పుడూ ఉవ్విళ్ళూరుతూ ఉంటారు వీరు. ఇలాంటివారు-

**నాన్యదస్తీతి వాదినః** : తాము తెలుసుకున్నదే సర్వస్వం అని, ఇంతకన్నా వేరేమీలేదని వాదిస్తూ ఉంటారు. వేదాలన్నీ తమకు తెలుసునని, తాము వేదవేత్తలమని, వేదాలే ఇలా కర్మలను చేసి సుఖభోగాలు అనుభవించమని చెబుతున్నాయని, ఇందుకోసమే మనకు మానజన్మ వచ్చిందని చెబుతూ గ్రుడ్డి వారిని నడిపించే గ్రుడ్డివారిలాగా వ్యవహరిస్తూ ఉంటారు. ఇట్టి వారినే-

**అవిపశ్చితః** : అవివేకులు అంటున్నాడు భగవానుడు. ఎందుకంటే వీరికి సూక్ష్మదృష్టి లేదు. కామ్యకర్మలను చెప్పింది లౌకిక వ్యవహారాలలో మునిగిపోయి భగవంతుని కనీసం స్మరించనివారి కోసం. అలాగైనా కనీసం వారి కోరికలు, భోగాలు, సంపదలకోసమైనా భగవంతునివైపుకు తిరుగుతారు అనే సకామకర్మలు చెప్పబడ్డాయి. కాని మోక్షప్రాప్తికి ఇవి ఆటంకాలని వారికి తెలియదు. ఆత్మోన్నతికై పాటుబడేవారికి- జన్మసార్థక్యం కొరకు తపించేవారికి వైరాగ్యం ఉండాలని కూడా వీరికి తెలియదు. అందుకే వీరు అవివేకులు. వారు చెప్పే మాటలు ఏమిటి?

**క్రియావిశేష బహులాం** : వేదాలలో అనేక రకాల కర్మలు చెప్పబడ్డాయి. ఇహలోక భోగాలకు కొన్ని; స్వర్గసుఖాలకు కొన్ని; సంపదలకు కొన్ని; సంతానం కొరకు

కొన్ని; ఆరోగ్యం కొరకు కొన్ని; ఇతరులకు మేలు చేయుటకు కొన్ని- ఇలా అనేకరకాల కర్మలు, వీటిని ఎలా చేయాలో విధివిధానాలు-అన్నీ వేదాలలోని కర్మకాండలో ఉన్నాయి. వాటన్నింటిని తెలుసుకొని చెబుతుంటారు. జనులను ఆకర్షిస్తూంటారు. అయితే వీటి యొక్క ఫలితం ఏమిటి?

**జన్మకర్మఫలప్రదాం**: సకామంగా, కోరికలతో, భోగాసక్తితో ప్రతిఫలాపేక్షతో చేసే ఈ కర్మలవల్ల కర్మఫలాలు వస్తాయి. ఆ కర్మఫలాలు జన్మలకు దారితీస్తాయి. ఆ జన్మలలో మళ్ళీ కర్మలు. ఆ కర్మలవల్ల కర్మఫలాలు, వాటివల్ల తిరిగి జన్మలు. ఇలా జన్మకర్మ వలయంలో చిక్కుకొని, సుడిగుండంలో చిక్కుకున్నవాడిలా గిరా గిరా తిరుగుతూ గిలగిలా కొట్టుకోవాల్సిందే. అయితే కర్మలవల్ల ప్రయోజనం లేదా? అంటే ఉంది. తాత్కాలిక ప్రయోజనం ఉంది.

**భోగైశ్వర్యగతింప్రతి:** ఈ కర్మలు భోగాలు, సంపదలు, ఐశ్వర్యం, స్వర్గసుఖాలవైపుకు తీసుకు వెళ్తాయి. ఎంతకాలం భోగాలనుభవించినా ఎప్పుడో ఒకప్పుడు అవైనా దూరమౌతాయి, లేదా మనమైనా వాటికి దూరమవుతాం. చేసిన కర్మలయొక్క ఫలం ఖర్చు కాగానే తిరిగి ఈ లోకానికి రావాల్సిందే. కనుక ఇవన్నీ తాత్కాలికమైనవే. పైగా ఇవి శాశ్వతానందానికి ఆటంకం. దీనినే భగవాన్ శ్రీరమణమహర్షులవారు-

**శ్లో॥ కృతి మహోదధౌ పతనకారణం**
**ఫలమశాశ్వతం గతి నిరోధకం** *(ఉపదేశసారం. 2శ్లో)*

**తా॥** కర్మలను అలా చేసుకుంటూ పోతే కర్మసముద్రంలో మునిగిపోతాం. పోనీ కర్మలవల్ల వచ్చే ఫలాలు శాశ్వతమా? అంటే కాదు. పైగా మోక్షమార్గానికి ఆటంకం కలిగిస్తాయి- అన్నారు. ఇక వీరి మాటలు-

**పుష్పితాంవాచం**: కామ్యకర్మలను గూర్చి చెప్పే అవివేకులు పుష్పాలవంటి మాటలు చెబుతారు. అంటే మృదువుగా మాట్లాడుతారు. మోదుగపువ్వు చూడటానికి ఎంతో బాగుంటుంది. దేనికీ ఉపయోగపడదు. అలాగే వీరు చెప్పే మాటలు వీనులవిందుగా ఉంటాయి. కాని అవి పరమార్థ సాధనకు ఉపయోగపడకపోగా జన్మను వ్యర్థం చేసుకోవటానికి ఉపయోగపడతాయి.

ఇలా భోగైశ్వర్యాలనిచ్చే కర్మలలో మునిగిపోతే నష్టం ఏమిటి?

**తయాఅపహృత చేతసాం:** సకామకర్మల గురించి తియ్యని మాటలు





మాట్లాడేవారితో సాంగత్యం కలిగిందా! వారి శిష్యరికం చేశావా! వారి మాటలను విశ్వసించావా! నీ వివేకం హరించుకు పోయినట్లే. కోరికలు అనేకం. వస్తువులు, భోగాలు అనేకం. కనుక వాటిని సంపాదించుకొని అనుభవించాలంటే బుద్ధి చంచలమైపోతుంది. ఒకదాని తర్వాత ఒకటిగా నిరంతరం కోరికలలోనే మునిగిపోతుంది. అందువల్ల భగవంతునిపై నిలపటానికి ఏకాగ్రం కాదు. బ్రహ్మనిష్ఠలో నిలువదు. అదే 'సమాధౌనవిధీయతే' సమాధిలో-బ్రహ్మనిష్ఠలో నిలువదు అని.

కనుక వేదవాదరతుల తియ్యని మాటలు విని మోసపోవద్దు- అని భగవంతుడు సర్వమానవాళిని హెచ్చరిస్తున్నాడు. గాలి వీచేటప్పుడు దీపం స్థిరంగా నిలవదు. కోరికలనే గాలి వీస్తుంటే మనస్సనే దీపం స్థిరంగా-ఏకాగ్రంగా నిలువదు. తస్మాత్ జాగ్రత్త- అని హెచ్చరిక.

-వేదాలలో చెప్పబడినవే ఐనప్పటికీ; భోగాసక్తితో సకామంగా కర్మలు చేస్తే బంధంలో పడవేస్తాయి గనుక ఏం చేయాలి?

**శ్లో॥ త్రైగుణ్య విషయావేదాః నిస్త్రైగుణ్యో భవార్జున।**
**నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థః నిర్యోగక్షేమ ఆత్మవాన్॥** **45**

**తా॥** అర్జునా! వేదాలు త్రిగుణాలతో కూడిన విషయాలకు చెంది ఉన్నవి. నీవు త్రిగుణాలకు అతీతుడవై, ద్వంద్వాలను వదిలిపెట్టి, నిత్యమూ సత్త్వగుణంలో నిలిచి, యోగక్షేమాలను పట్టించుకోకుండా ఆత్మజ్ఞానము కలవాడివి కా!

**వ్యాఖ్య: త్రైగుణ్యవిషయావేదాః** : ఇక్కడ వేదాలంటే వేదాల లోని కర్మకాండయే. ఈ కర్మకాండ అంతా సత్త్వరజస్తమో గుణాలకు చెందినదే. సుఖాలు, భోగాలు, సంపదలు, వాటిని సంపాదించుకొనే మార్గాలు-అన్నీ త్రిగుణాలకు చెందినవే. ఇందులోనే మునిగిపోతే మనం ఈ త్రిగుణాల వలలో చిక్కు కుంటాం. అందుకే **నిస్త్రైగుణ్యోభవ!** త్రిగుణాలకు అతీతుడవు కా! అంటున్నాడు భగవానుడు. లౌకికవస్తువులు, విషయాలు, భోగాలను చూచినా, విన్నా వాటిపై ఆసక్తి-కోరిక కలుగుతుంది. దానితో వాటిని సంపాదించుకోవటానికి కర్మలు చేయాలి. కర్మలు చేస్తే కర్మఫలాలు, వాటివల్ల జన్మలు. ఇలా జన్మకర్మ వలయంలో చిక్కుకుంటాం. వాటినుండి విముక్తి పొందాలంటే త్రిగుణాతీతులం కావాలి. త్రిగుణాతీతులమై ఈ

ప్రాపంచిక విషయాల కోసం, సుఖభోగాల కోసం కర్మలు చేయాలనే ఆసక్తిని విడిచి పెట్టాలి. ఈ ఆసక్తిని విడిచిపెట్టాలంటే ద్వంద్వాలను విడిచి పెట్టాలి. **'నిర్ద్వంద్వో'**: శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు, మానావమానాలు–ఇవన్నీ ద్వంద్వాలు. వీటిపట్ల సమభావం ఉంటే–లేక ఏమాత్రం ఆసక్తి లేకపోతే సకామ కర్మలకొరకు ప్రాకులాడం. అప్పుడే గుణాతీతులం అవుతాం.

**నిత్యసత్త్వస్థః** ఇలా మూడు గుణాలను వదిలితే సత్త్వంలో నిలబడగలుగుతాం. సత్వ, రజో, తమో–అనే 3 గుణాలను వదలమని చెబుతూ సత్త్వంలో నిలబడమనటమేమిటి? రజో గుణతమోగుణాలను వదిలించుకోటానికి ముందుగా సత్త్వంలో నిలవాలి. ఆ తరువాత సత్త్వాన్ని కూడా వదిలి శుద్ధసత్త్వంలో నిలిచిపోవాలి. ఇక రజోగుణ తమోగుణాలు అసలే ఉండవు. ఆ శుద్ధ సత్త్వంలో నిలవమనే భగవంతుని ఉద్దేశ్యం. పైగా నిత్యమూ అలా నిలవాలి. అంతేకాదు శుద్ధసత్త్వంలో నిలిచి– **'నిర్యోగక్షేమ'** నీ యోగక్షేమాలను కూడా పట్టించుకోవద్దు అని అంటున్నాడు భగవానుడు. యోగం అంటే లేనిదానిని సంపాదించు కోవటం; క్షేమంఅంటే ఉన్నదానిని చేజారిపోకుండా భద్రపరచు కోవటం. మరి యోగక్షేమాలను పట్టించుకోకుండా ఎలాగ? అన్న సందేహం మనకు రాకపోదు. మరైతే ఎందుకిలా చెప్పినట్లు? ఈ యోగక్షేమాల గురించిన ఆలోచనల్లో ఉంటే మనం ఉన్నత లక్ష్యానికి–మోక్షానికి దూరమౌతాం. కనుక పట్టించుకోకుండా ఉండాల్సిందే. అయితే చెప్పటం తేలికే కాని ఆచరించటం ఎంత కష్టం?

అందుకే వెంటనే ఎలా ఆచరించాలో భగవంతుడే చెబుతున్నాడు **'ఆత్మవాన్'** అని. ఆత్మవంతుడవై అంటే నిత్యమూ ఆత్మలో నిలిచి, ఆత్మసుఖాన్ని అనుభవిస్తూ అని. ఆత్మలో నిలిచిన వాడికి 'నేను సచ్చిదానంద స్వరూప ఆత్మను' అనే నిశ్చయజ్ఞానం ఉన్నవాడికి అన్నీ ఉన్నట్లే. ఇక్కడ ఉన్న వాటన్నింటికన్న విలువైన నిత్యసుఖం ఉన్నదక్కడ. అట్టి విలువైన వస్తువు ఉన్నప్పుడు ఇక విలువలేని వాటికై ప్రాకులాడాల్సిన పనేమిటి? అందుకే ఆత్మవంతుడవై యోగక్షేమాలను గురించి పట్టించుకోవద్దు అని చెప్పటం.

– మోక్షసాధనకు అడ్డువచ్చే ఈ కర్మకాండ వేదాలలో ఎందుకున్నట్లు? ఎవరికోసం?





**శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46**

**తా॥** అంతటా నీరు పొంగిపొర్లుతున్నప్పుడు స్నానాదుల కొరకు బావులు, చెరువులు జలపాత్రల అవసరం ఎంతవరకో బ్రహ్మజ్ఞానము గల బ్రాహ్మణునికి ఈ వేదాలలోని కర్మకాండ అంతవరకే అవసరం.

**వ్యాఖ్య:** నీటికి కరువు వచ్చినప్పుడు 3 రోజులకొకసారి, 4 రోజులకొకసారి నీటిని వదిలినప్పుడు బక్కెట్లు, బిందెలు, గంగాళాలు నింపుకున్న తర్వాత ఇంట్లో ఉన్న చిన్న చిన్న గిన్నెలు, చెంబులు, గ్లాసులకు కూడా నీరుపట్టి అట్టి పెట్టుకుంటారు. మళ్ళీ మళ్ళీ దొరకవు గనుక జాగ్రత్త పడతారు. అదే ఎక్కడ చూచినా పుష్కలంగా నీరు దొరికేటప్పుడు, రోజంతాఎప్పుడు కావాలంటే అప్పుడు నీటిని వదులుతున్నప్పుడు చెంబులకు, గ్లాసులకు నీరుపట్టి ఉంచాల్సిన అవసరమేముంటుంది?

అలాగే మోక్షమంటే శాశ్వత ఆనందమని; అది తనలోనే ఆత్మస్వరూపంగా ఉన్నదని; అసలు తాను ఆనందస్వరూప ఆత్మనేనని తెలియని అజ్ఞాని–సామాన్యుడు తనకు కావలసిన ఆనందాన్ని ఇల్లు వాకిలి, భార్యాబిడ్డలు, ధనసంపదలు వస్తువులు మొదలైన వాటిద్వారా పొందాలని బాహ్యంలోకి పరుగెడతాడు. సకామ కర్మలద్వారా ఆనందాన్ని, సుఖసంతోషాలను పొందాలని ప్రయత్నిస్తూ ఉంటాడు.

అదే బ్రహ్మజ్ఞానం గల బ్రహ్మనిష్ఠుడు–ఆత్మనిష్ఠుడు ఐన మహాత్మునికి; సర్వత్రా, సర్వదా ఆనందంలో–నిత్యానందంలో– బ్రహ్మానందంలో తేలియాడే ఆత్మజ్ఞానికి ఎక్కడచూచినా, ఎప్పుడు చూచినా ఆనందమే ఆనందం. అసలు తాను ఆనందస్వరూపుడే. అట్టివాడు అనిత్యమైన, అల్పమైన వస్తువుల ద్వారా; ప్రాపంచిక భోగాలద్వారా వచ్చే అనిత్యమైన, తాత్కాలికమైన సుఖభోగాల కోసం అర్రులు చాస్తాడా? వాటికోసం సకామకర్మలను చేస్తాడా? ఈ ప్రాపంచికమైన సుఖభోగాలను అనుభవించేవారిని చూచి అసూయపడతాడా?

కనుక అజ్ఞానంతో అల్పజ్ఞానంతో ఉన్న సామాన్యులను సంతృప్తి పరచటం కోసమే సకామకర్మలతో కూడిన కర్మకాండవేదాలలో చెప్పబడింది. ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆత్మలో రమించేవాడికి వేదాలలోని ఈ కర్మకాండతో పనిలేదు. ఎందుకంటే సకామ కర్మలద్వారా పొందే ఆనందం ఆత్మానందంలో ఒక భాగమే. వందలో

1,2,5,10,20,50 అన్నీ ఉన్నట్లే ఆత్మానందంలో ఈ లౌకిక సుఖభోగాలన్నీ ఉన్నాయి. గంగ, యమున, కృష్ణ, గోదావరి మొదలైన పుణ్యనదులలో స్నానం చేస్తే పుణ్యమని ఎంతో దూరంలో ఉన్న నదులవద్దకు అనేక వ్యయప్రయాసలకు ఓర్చి, వెళ్ళి స్నానం చేసి వస్తుంటారు సామాన్యంగా. కాని సముద్రం దగ్గరగా నున్నవానికి ఏ పుణ్యనది వద్దకు వెళ్ళాల్సిన పని లేదు. ఎందుకంటే అన్ని పుణ్య నదుల నీరు చేరేది సముద్రాన్నే గనుక, సముద్రస్నానం చేస్తే అన్ని పుణ్య నదులలోను స్నానం చేసినట్లే.

–ఐతే కర్మ ఎలా చేయాలి? ఏ భావంతో చేయాలి? అసలు చేయకుండా ఉండాలా? తరువాత శ్లోకంలో

**శ్లో॥ కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన।**
**మాకర్మఫలహేతుర్భూః మాతేసంగోఽస్త్వకర్మణి॥ 47**

**తా॥** కర్మలు చేయుటయందే నీకు అధికారం ఉన్నది. కర్మఫలాన్నెప్పుడూ కోరవద్దు. కర్మఫలానికి నీవెప్పుడూ కారకుడివి కావద్దు. అకర్మతో సంగభావము నీకు కలుగకుండుగాక!

**వ్యాఖ్య:** భగవద్గీతలో కర్మయోగానికి సంబంధించిన గొప్ప శ్లోకం ఇది. కర్మలనెలా చేయాలో ఇక్కడ చక్కగా తెలియజేశారు.

**కర్మణ్యేవాధికారస్తే:** 'కర్మణియేవ తే అధికారః' కర్మలు చేయుటయందే నీకు అధికారం ఉన్నది. అంటే కర్మలు చేసే అధికారం మానవులకు మాత్రమే. ఇతర పశుపక్ష్యాదులు, అల్ప జీవులు కర్మలు చేయకుండా స్తబ్దుగా ఉంటున్నాయా? లేదు. అవి కూడా తింటున్నాయి, తిరుగుతున్నాయి, ఆహారం సంపాదించుకుంటున్నాయి, పిల్లల్ని కంటున్నాయి, పెంచి పోషిస్తున్నాయి. అయితే అవి బుద్ధితో ఆలోచించి కర్మలు చేయలేవు. ఎందుకంటే వాటికి విచక్షణాశక్తిగల బుద్ధి లేదు గనుక. అవి తమ అంతరంగం నుంచి వచ్చే ప్రేరణలను బట్టి అవశులై కర్మలు చేస్తుంటాయి. కనుక వాటికి పాపపుణ్యాలు లేవు. కాని మానవుడు మంచి ఏదో, చెడు ఏదో బుద్ధితో విచక్షణ చేసి కర్మలను చేయగలుగుతాడు. కనుక మానవజన్మ కర్మక్షేత్రం. నా ప్రారబ్ధం, నా గ్రహచారం అంటూ ఏడుస్తూ కాల గడపకుండా తన పురుషార్థాన్ని నెరవేర్చుకోవాలి మానవుడు. ఏ కర్మ చెయ్యాలో, ఎలా చెయ్యాలో స్వతంత్రంగా నిర్ణయించుకొని చేసే స్వేచ్ఛ మానవుడికి మాత్రమే ఉన్నది. అయితే–





**మాఫలేషు కదాచన:** ఎప్పుడూ కర్మఫలాన్ని మాత్రం కోరవద్దు. లోకంలో అందరూ కర్మలు చేసి ఫలితాన్ని కోరుకుంటారు. కనీసం భగవంతుడికి నమస్కారం పెట్టినా ఏదో ఒక కోరిక లోపల ఉంటుంది. ఏ ఫలితం లేకపోతే ఎందుకు కర్మలు చెయ్యటం? అంటారు. కాని భగవానుడు 'అది సరికాదు' అంటున్నాడు. "కర్మలు చెయ్యి, కాని కర్మఫలాన్ని మాత్రం కోరవద్దు" అనేదే గీతాసందేశం. ఎందుకు?

కర్మచేస్తే కర్మనియమం ప్రకారం ఒక కర్మచేసినప్పుడు అందులోని స్థూలభాగం కర్మఫలంగాను, సూక్ష్మభాగం వాసనగాను మనలో ముద్రింపబడతాయి. కర్మఫలం ఇప్పుడో, ఎప్పుడో ఏ జన్మలోనో తప్పక అనుభవించి ఖర్చు చేసుకోవాలి; వాసన అటువంటివే అయిన కర్మలకు ప్రేరణ ఇస్తుంది. ఈ కర్మఫలాలు, వాసనలు ఉన్నంతవరకు జన్మలు తప్పవు. జనన మరణ రూప సంసారబంధం తప్పదు. కనుక కర్మలు బంధ కారణం అవుతున్నాయి. ఈ బంధం నుండి తప్పించుకోవాలంటే మానవుడికి మాత్రమే అవకాశం ఉంది. అదే కర్మఫలాన్ని కోరకుండా కర్మచెయ్యటం. అదే **నిష్కామకర్మయోగం**. కర్మఫలాన్ని కోరకుండా కర్మచేసినప్పుడు కర్మనియమం పనిచేయదు. కర్మ చేస్తున్నాడు గనుక లోపల వాసనలు (ప్రేరణలు) ఖర్చు అవుతాయి, క్రొత్తగా వాసనలు చేరవు; ఫలాన్ని కోరటం లేదు గనుక కర్మఫలం రాదు. దానితో చిత్తం శుభ్రపడుతుంది. చిత్తశుద్ధి వల్ల ఆత్మజ్ఞానాన్ని పొందే అర్హత వస్తుంది. భగవంతునిపై అనన్యభక్తి కుదురుతుంది. దానితో మోక్షప్రాప్తికి అర్హత లభిస్తుంది. అందుకే–

**మాకర్మఫలహేతుర్భూః:** 'కర్మఫలానికి నీవు కారకుడివి కావద్దు' అని హెచ్చరిక. కర్మఫలాన్ని కోరుకున్నావా? ఆ ఫలాన్ని నీవు అనుభవించటానికి తిరిగి జన్మలెత్తాలి. ఆ జన్మలలో తిరిగి తిరిగి కర్మలు చేయాలి. ఇలా జన్మకర్మ వలయంలో చిక్కు కుంటావు. సుడిగుండంలో పడిపోతావు. దీని నుండి తప్పించు కొనుటకే నీకు మానవజన్మ వచ్చింది. సరే ఫలితాన్ని కోరకుండా కర్మలు చెయ్యమంటున్నారు గదా! అసలు కర్మలే చెయ్యకుండా ఊరికే ఉండిపోతే నష్టం ఏమిటి అంటావా?

**మాతేసంగోఽస్త్వకర్మణి:** 'అకర్మణి' అంటే అసలు కర్మలే చేయకుండా ఉండే 'అకర్మ'. అలా ఉండవద్దు. అసలు కర్మ చెయ్యకుండా ఉండిపోవటం అసాధ్యం. దేహమున్నంత వరకు కర్మలు చేస్తూ ఉండాల్సిందే. కర్మలు చేయకపోతే దేహయాత్ర

సాగదు. అది సోమరితనమవుతుంది. సోమరికి ఆధ్యాత్మిక రంగంలో తావులేదు. కనుక కర్మ చేయాల్సిందే. ఆకర్మ బంధం కాకుండా ఉండే ఉపాయాన్ని అనుసరించాల్సిందే.

ఫలాసక్తితో పనిచేయటం రజోగుణం. అసలు కర్మ చేయకుండా ఉండటం తమోగుణం. రజోగుణ తమోగుణాలను వదిలించుకొని సత్త్వగుణంలో నిలవాలంటే ఫలాసక్తిని వదిలి కర్మచెయ్యాలి. ఇదే మానవునికి గల గొప్ప అవకాశం. దీన్నెలా చేయాలో తరువాతి శ్లోకంలో–

కర్మఫలాలకు కారకుడు కాకుండా కర్మలు చేయటం ఎలా?

**శ్లో॥ యోగస్థఃకురు కర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ॥**

**సిద్ధ్యసిద్ధ్యో సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥** **48**

**తా॥** ధనంజయా! సంగభావాన్ని విడిచిపెట్టి, సిద్ధించినా సిద్ధించకపోయినా రెంటినీ సమం గావించి, యోగంలో నిలిచి కర్మలు చెయ్యి. సమత్వమే యోగం అని చెప్పబడుతున్నది.

**వ్యాఖ్య:**

I) **సంగంత్యక్త్వా:** కర్మలు చేయాలి. కాని కర్మఫలాలు రాకూడదు. ఎలా? అదే నిష్కామకర్మయోగం. నిష్కామకర్మ యోగికి సంగబుద్ధి ఉండరాదు. సంగబుద్ధి అంటే కర్మలతో– కర్మఫలాలతో అతుక్కుపోవటమే. ఈ కర్మనాది; దీనిని చేసేది నేనే. దీని ఫలితం నాకు కావాలి. అది మంచి ఫలితమై ఉండాలి. ఇదే సంగబుద్ధి. కర్మ చేసేటప్పుడే కాదు, చేసిన తర్వాత కూడా ఆ కర్మను గూర్చి పదేపదే తలచుకోవటం, దానిని గూర్చి గొప్పలు చెప్పుకోవటం కూడా సంగబుద్ధియే. నిజంగా కర్మలు మనను బంధించటం లేదు. ఈ సంగబుద్ధే మనలను బంధిస్తున్నది. అందుకే 'సంగంత్యక్త్వా' అన్నారు.

II) **సిద్ధ్య సిద్ధ్యో సమోభూత్వా:** సంగబుద్ధిని వదలటమే కాదు, మనం చేసే పని ఫలించినా, ఫలించకపోయినా సమ బుద్ధి కలిగి ఉండాలి. అలాగాక నేను చేసేపని ఫలిస్తుందా? లేదా? అని అదే పనిగా ఆందోళన చెందుతుంటే మన దృష్టి చేసే పని మీదగాక వచ్చే ఫలితంపైనే ఉంటుంది. అప్పుడు నైపుణ్యంగా పనిచేయలేం. 'ఇది నా కర్తవ్యం'. ఇది భగవంతుని ఆజ్ఞ. జరగనీ జరగక పోనీ, ఫలించనీ





ఫలించకపోనీ నా కర్తవ్యాన్ని నెరవేరుస్తాను' అనే స్థిరబుద్ధితో కర్మ చేసినప్పుడు ఆ కర్మను చక్కగా నెరవేర్చగలవు. ఫలితాన్ని కోరకుండా నిష్కామ కర్మ ఆచరించినపుడు సిద్ధిస్తుందా? లేదా? అని సందేహించే ప్రశ్నే తలెత్తదు. ఇదే సమబుద్ధి. ఇదే సమత్వం.

III) **సమత్వం యోగ ఉచ్యతే:** ఈ సమత్వాన్నే యోగం అంటారు. ఎప్పుడైతే ఫలితాన్ని గురించిన ఆందోళన లేదో అప్పుడు మనస్సు నిశ్చలంగా ఉంటుంది. మనస్సు నిశ్చలమైతే ఆ మనస్సు వెనుకనున్న పరమాత్మకు దగ్గరవుతుంది. పరమాత్మతో కలుస్తుంది. ఇదే యోగం. యోగం అంటే కలుపుట అని. మనస్సు పరమాత్మతో కలవటమే యోగం. సంగబుద్ధిని వదలి, సమబుద్ధిని కలిగి కర్మ చేస్తే అది యోగానికి దారి తీస్తుంది.

IV) **యోగస్థఃకర్మాణికురు:** కనుక ఓ అర్జునా! యోగంలో నిలిచి కర్మలు చెయ్యి. అంటే సమత్వంలో నిలిచి కర్మలు చెయ్యి. అర్జునుడే కాదు, మనందరం కూడా సంగభావాన్ని వదిలి, ఫలితంపై ఆందోళన విడిచిపెట్టి, సమబుద్ధిని కలిగి ఉండి కర్మలు చేయాలి. అప్పుడే ఈ కర్మలు బంధం కాకుండా పోతాయి. మోక్షానికి దారిచూపుతాయి. ఇదే నిష్కామకర్మలు చేసేపద్ధతి. కర్మఫలానికి కారకులం కాకుండా కర్మలు చేసేపద్ధతి.

ఇప్పుడీ బుద్ధియోగంతో చేసే కర్మలు, సమత్వంతో చేసే కర్మలు సాధారణకర్మల కన్నా ఎలా శ్రేష్ఠమైనవో, సకామకర్మలు ఎందుకు అల్పమైనవో తెలియజేయబోతున్నారు.

**శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాద్ధనంజయ॥**

**బుద్ధౌశరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥** **(49)**

**తా॥** ధనంజయా! బుద్ధియోగం కన్నా సకామకర్మ చాలా నికృష్టమైనది. కనుక నీవు బుద్ధి యోగాన్నే శరణు పొందు. ఫలితాన్ని కోరి కర్మచేసేవాడు పిసినిగొట్టుయే.

**వ్యాఖ్య:** క్రిందటి శ్లోకంలోనూ, ఈ శ్లోకంలోనూ అర్జునుని ధనంజయా! అని సంబోధిస్తున్నాడు భగవానుడు. లౌకిక ధనాన్ని జయించి ధనంజయుడని బిరుదును పొందావు. అదేమంత గొప్పగాదు. జ్ఞానమనే ధనాన్ని సంపాదించు. ఆధ్యాత్మిక సంపదలను జయించు అని సూచన.

బుద్ధియోగం అంటే నిష్కామకర్మాచరణ. ఫలితంపై ఆసక్తి లేకుండా, సమబుద్ధితో కర్మలు చేయుటయే నిష్కామకర్మాచరణ. అదే బుద్ధియోగం. ఈ బుద్ధియోగం ద్వారా

కర్మలు చేసినపుడు కర్మలకు ప్రేరణలనిచ్చే వాసనలు క్షయమైపోతాయి. దానితో చిత్తశుద్ధి కలుగుతుంది. అది జ్ఞానసంపాదనకు, చివరకు మోక్ష ప్రాప్తికి దారితీస్తుంది. అంతేగాక ఫలితాన్ని కోరటం లేదు గనుక కర్మనియమాన్ని అనుసరించి కర్మఫలాలు రావు. కనుక బంధానికి దారి తీయవు. ఇక ఫలితాన్ని కోరి కర్మలు గనుక చేస్తే మంచిగాని, చెడుగాని, ఆకర్మఫలాలు నీకు అందుతాయి. అవి మంచివైతే రాగం, చెడువైతే ద్వేషం. అంటే కర్మఫలాలు నీలో రాగద్వేషాలు కలిగిస్తాయి. ఈ కర్మఫలాలే జన్మలకు దారితీసి నిన్ను జనన మరణరూప సంసారంలో బంధిస్తాయి. సంసార దుఃఖంలో ముంచెత్తివేస్తాయి.

ఇలా సకామకర్మలు బంధాన్ని కలిగిస్తాయి. తద్వారా జననమరణ సంసారచక్రం.

నిష్కామకర్మలు మోక్షాన్ని కలిగిస్తాయి. తద్వారా జన్మరాహిత్యం. అందువల్ల సకామకర్మలు అల్పమైనవి, నికృష్టమైనవి. నిష్కామకర్మలు ఉత్తమోత్తమమైనవి. కనుక నీవు నిష్కామ కర్మయోగాన్నే ఆచరించు. బుద్ధి యోగాన్నే ఆశ్రయించు.

సకామకర్మలు చేసేవాడు భగవంతుని దృష్టిలో కూలివాడు. నిష్కామ కర్మచేసేవాడు తనవాడు. మన బట్టలు చాకలి ఉతికితే జీతం తీసుకుంటుంది. భార్య ఉతికితే ఏమీ తీసుకోదు.

**కృపణాఫలహేతవః** :- ఫలాసక్తితో పనిచేసేవారు కృపణులు, పిసినిగొట్టులు. ఫలాసక్తితో పనిచేసేవాడికి అల్పమైన, అశాశ్వతమైన, లౌకికఫలం వస్తుంది. కాని బుద్ధియోగం ద్వారా నిష్కామకర్మ నాచరించినవారికి చిత్తశుద్ధి కలిగి, జ్ఞానాన్ని పొంది, మోక్షప్రాప్తికి అర్హత లభిస్తుంది. అంటే శాశ్వతమైన పారమార్థిక ఫలం లభిస్తుంది. అల్పమైనదానికోసం అధికమైన దానిని వదలుకునే వాడు పిసినిగొట్టు కాక మరేమవుతాడు? సుఖపడే అవకాశం ఉండీ హీనంగా బ్రతికేవాణ్ణి పిసినిగొట్టు అంటాం. అలాగే మోక్షాన్ని పొందే అవకాశం ఉండీ అల్పమైన ఫలితంతో ఈ సంసార జననమరణ చక్రంలో ఇరుక్కొనేవాడిని పిసినిగొట్టు అనే అనాలి. కనుక-

**బుద్ధౌశరణమన్విచ్ఛ:** బుద్ధియోగాన్నే ఆశ్రయించు. ఎలాగూ కర్మలు చేస్తూనే ఉన్నావు. వాటినే తెలివిగా, ఫలాసక్తిని విడిచి, కర్త్యవంగా భావించి, బుద్ధియోగంతో (సమత్వబుద్ధితో) చేస్తే వాటివల్ల చిత్తశుద్ధి కలిగి జ్ఞానంతో మోక్షం ప్రాప్తిస్తుంది. అలాగాక సకామంగా చేస్తే అవే నీకు బంధమౌతాయి. కనుక బుద్ధిని ఆశ్రయించు.





భగవంతుడు బుద్ధి ఇచ్చినా ఉపయోగించు కోకుండా వదిలేశావా? ఇక బుద్ధిలేని హీనజన్మలే గతి.

సమత్వబుద్ధితో కర్మలాచరిస్తే ఫలమేమిటి?

**శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభేసుకృత దుష్కృతే।**
**తస్మాద్యోగాయయుజ్యస్వ యోగఃకర్మసుకౌశలం॥ (50)**

**తా॥** సమత్వబుద్ధితో కూడిన వ్యక్తి ఈ జన్మలోనే పుణ్య పాపాలు రెంటినీ వదలిపెడతాడు. కనుక నీవు బుద్ధి యోగానికే సిద్ధంకా! యోగమంటే కర్మలలో నైపుణ్యతయే.

**వ్యాఖ్య:**

I) **బుద్ధియుక్తః** :- బుద్ధియుక్తుడు అంటే తాను తలపెట్టిన కార్యం ఫలించినా ఫలించకపోయినా చలించకుండా సమత్వ బుద్ధి కలిగి; నిర్లిప్తంగా, నిష్కామంగా, ఫలాపేక్ష లేకుండా, ఇది తన కర్తవ్యమని భావించి కర్మలను చేసేవాడు. అతడే కర్మయోగి. అట్టివాడు-

II) **ఇహఉభేసుకృత దుష్కృతే జహాతి:** ఇక్కడే ఈ జన్మలోనే పుణ్యపాపాలను రెంటినీ విడిచిపెడతాడు. కర్మసిద్ధాంతం ప్రకారం పుణ్యకర్మలు చేస్తే పుణ్యఫలం, పాపకర్మలు చేస్తే పాపఫలం వస్తాయి. అయితే అవి ఆశించి చేసేవారికే గాని, ఫలాపేక్షను విడిచి నిష్కామంగా చేసేవారికి పాపమూ లేదు, పుణ్యము లేదు. ఎందుకంటే ఆ ఫలాలకు అతడు కర్తకాదు గనుక. అది కూడా ఎప్పుడో మరణానంతరం కాదు. ఇప్పుడే ఇక్కడే జీవించి ఉండగానే పుణ్యపాపాలకు అతీతంగా ఉండగలుగుతాడు. అందుకే 'ఇహ' అన్నారు.

ఇక్కడ పుణ్యపాపకర్మలు రెండూ చెప్పబడ్డాయి. కర్మయోగి పాపాలు కూడా చేస్తాడా? అంటే చెయ్యడు. చెయ్యాల్సిన పనిలేదు. కాని అతడు చేసే పనులలో అనుకోకుండా ఏవైనా ఇతరులకు బాధకలిగించే పనులున్నా అతడికేమీ అంటవు అని మాత్రమే.

III) **తస్మాత్ యోగాయయుజ్యస్వ:** అందువల్ల-ఎందువల్ల? బుద్ధియోగం ద్వారా కర్మలు ఆచరిస్తే పుణ్యపాపాలనుండి సర్వకర్మ బంధనాల నుండి విముక్తుడవుతావు గనుక యోగానికి సిద్ధపడు. బుద్ధియోగివి-నిష్కామకర్మయోగివి కా!

IV) **యోగఃకర్మసు కౌశలం:** యోగమంటే కర్మలలో కుశలత్వమే. నేర్పుతో-నైపుణ్యంతో కర్మలు చేయుటే యోగం. ఏమిటీ కుశలత్వం- నైపుణ్యం?

కర్మలు చేస్తూనే కర్మబంధానికి చిక్కకుండా ఉండే నేర్పు. బంధాలకు కారణమైన కర్మను బంధవిముక్త సాధనంగా మార్చుకునే నేర్పు. కామ్యకర్మలనుండి మనస్సును తొలగించి నిష్కామ కర్మలలో నిలిపే సామర్థ్యమే కార్యకుశలత-నైపుణ్యం. అదే యోగం.

ఇక్కడే మనకొక సందేహం కలగక మానదు. 48వ శ్లోకంలో **"సమత్వం యోగ ఉచ్యతే"** సమత్వమే యోగం అని చెప్పిన భగవానుడు, వెంటనే 50వ శ్లోకంలో **"యోగఃకర్మసు కౌశలం"** కర్మలలో కుశలతయే యోగం అన్నారు. ఇంతకూ ఏది కరెక్టు? ఒకటి కరెక్టు అయితే రెండవది తప్పు అవుతుంది గదా! భగవంతుడు తప్పు చెబుతాడా? ఇందులో ఏదో విశేషం ఉండి ఉండాలి. ఏమిటది?

సమబుద్ధితో కర్మలు చేస్తే యోగం అని చెప్పినప్పుడు; అన్నింటిని సమంగా చూడటం అనగానే ఏమీపట్టని ఉదాసీనుడని, సోమరియని, హృదయంలేని బండరాయిలాంటి వాడని అపార్థం చేసుకోవచ్చు. ఆ అపార్థాన్ని తొలగించటానికే వెంటనే ఇక్కడ యోగఃకర్మసు కౌశలం అన్నారు. ఉదాసీనంగా, జడునిలాగా కర్మలు చేయకుండా ఉండటం కాదు; ఎంతో నేర్పుతో, నైపుణ్యంతో, కుశలతతో కర్మలను చేయటం అని తెలియజెప్పటమే ఇక్కడ విశేషం. ఈ రెండు శ్లోకాల్లోని రెండు పదాలను ఒక్కచోటకు చేర్చి సమన్వయపరిస్తే దాని భావం ఇది-

"సుఖంలో గాని, దుఃఖంలోగాని, సఫలతలోగాని, వైఫల్యంలో గాని, జయంలోగాని, అపజయంలోగాని, లాభంలో గాని, నష్టంలోగాని ఎట్టి పరిస్థితులలోను మనస్సు చెదరకుండా రెండింటిని సమభావంతో స్వీకరించి; కర్మబంధాలలో చిక్కకుండా, నేర్పుతో నైపుణ్యంతో కౌశల్యంతో కర్మలు చేయుటయే యోగం" అని.

ఇంత నైపుణ్యంతో నిష్కామకర్మ యోగాన్ని ఆచరిస్తే కలిగే అంతిమఫలం ఏమిటి?

**శ్లో॥ కర్మజం బుద్ధి యుక్తాహిః ఫలంత్యక్త్వా మనీషిణః ।**
**జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛాంత్యనామయం॥** **51**

**తా॥** సమత్వబుద్ధితో నిష్కామకర్మయోగాన్ని ఆచరించి, కర్మల వల్ల లభించే ఫలాన్ని విడిచిపెట్టగల వివేకి జన్మబంధం నుండి పూర్తిగా విడుదల పొంది, దుఃఖరహితమైన పదాన్ని చేరుకుంటాడు.





**వ్యాఖ్య:**

I) **బుద్ధియుక్తా మనీషిణః** :- మనీష అంటే ప్రజ్ఞ. మనీషిణః అంటే ప్రజ్ఞగలవాడు లేదా వివేకి. బుద్ధియుక్తా మనీషిణః అంటే బుద్ధియుక్తుడైన వివేకి. సమత్వబుద్ధితో నిష్కా మకర్మలాచరించే వివేకి అని. అట్టి వివేకి-

II) **కర్మజంఫలం త్యక్త్వా** :- కర్మలు చేయటం వల్ల వచ్చే ఫలితాన్ని విడిచి పెడతాడు. కర్మలు చేస్తే కర్మ నియమం ప్రకారం ఫలితాలు వస్తాయి. ఆ ఫలితాలు బంధమై కూర్చుంటాయి. అయితే బుద్ధియుక్తుడైన వివేకి కర్మఫలాలపై ఆసక్తిని విడిచిపెట్టి, నిష్కామంగా కర్మలాచరిస్తాడు గనుక అతడికి ఏ కర్మఫలాలు రావు. కర్మఫలాలు ఉంటే, అవి మనతోపాటు వస్తే వాటివల్ల సుఖాలు భోగాలు గాని లేదా దుఃఖాలు కష్టాలు గాని అనుభవించక తప్పదు. ఆ అనుభవం కోసం జన్మలెత్తక తప్పదు. అదే జన్మబంధం. కాని బుద్ధిని సమం చేసుకొని నిష్కామకర్మ లాచరించిన వివేకులు-

III) **జన్మబంధ వినిర్ముక్తా** :-జన్మబంధం నుండి విడుదల పొందుతారు. ఎందువల్ల? వీరు ఫలాపేక్ష లేకుండా, నిష్కామంగా కర్మలు చేస్తారు గనుక, పాపమైనా పుణ్యమైనా ఏ కర్మఫలాలు వారిని అంటవు. కనుక పొందవలసిన సుఖాలు, భోగాలు గాని, దుఃఖాలు కష్టాలు గాని లేవు. అందువల్ల వారు జన్మించాల్సిన పనిలేదు. అంటే దేహాన్ని ధరించి అనుభవించాల్సిన వేమీ లేవు. గనుక జన్మలే లేవు. ఈ లోకంలో మనుష్యులుగానో, పశు పక్ష్యాదులుగానో జన్మించాల్సిన పనిలేదు, దేవలోకాల్లో దేహం లేకుండా భోగాలనుభవించే పనీలేదు. అంటే అట్టివాడు జన్మ బంధం నుండి విడుదల పొందినట్లే. జన్మించటానికి కారణం లేదు గనుక జన్మించడు. సరే ఏమవుతాడు?

IV) **పదం గచ్ఛంతి అనామయం** : దుఃఖరహితమైన పదవిని చేరుకుంటారు. ఇది చక్రవర్తి పదవి కన్నా, దేవేంద్ర పదవి కన్నా, ఇంకా లోకంలో ఏఏ పదవులున్నాయో వాటన్నింటి కన్నా గొప్ప పదవి. ఇక్కడ పదవులన్నీ తాత్కాలికమైనవే. దేవేంద్ర పదవి కూడా అంతే. నూరు యజ్ఞాలు చేస్తే దేవేంద్రపదవి వస్తుంది. లేదా గొప్ప తపస్సు చేస్తే వస్తుంది. అయినా సరే అదీ శాశ్వతం కాదు. అంతేకాదు మళ్ళీ ఎవడన్నా 100 యజ్ఞాలు చేస్తాడేమో-గొప్ప తపస్సు చేసి తన పదవికి

ఎసరు పెడతాడే మోనని దేవేంద్రుడెప్పుడూ తపస్సులు చెడగొడుతూ ఉంటాడు. అప్పుడప్పుడు ఎదురుదెబ్బలు తింటాడు. కనుక అన్నీ ఆద్యంతాలు గల తాత్కాలిక పదవులే. కాని ఈ పదవి మాత్రం శాశ్వతం. మరొకరు ఆక్రమించుకొనే వీలు లేదు. ఊస్టింగ్ ఆర్డర్ ఎప్పటికీ రాదు. అక్కడ రెండవ వారెవరూ ఉండరు. అంతా ఒక్కటే. ఏకం అద్వితీయం. ఎలా సాధ్యం?

సముద్రం నుంచి వచ్చిన ఉప్పుగల్లు ఎక్కడెక్కడో తిరుగుతుంది. ఎందరిచేతుల్లోకో మారుతుంది. కొందరు రోటిలో వేసి నలగబొడుస్తారు. కొందరు గ్రైండరులో వేసి పిండి పిండి చేస్తారు. అయితే ఎప్పుడైతే అది తిరిగి సముద్రాన్ని చేరిందో అది సముద్రాకారంగా మారిపోతుంది. అలాగే మనం అందరం పరమాత్మ స్థానం నుండి వచ్చాం. ఎక్కడెక్కడో తిరుగుతాం. ఏవేవో చేస్తాం. ఎన్నో జన్మలెత్తుతాం. చివరికి ఏ జన్మలోనో సద్గురువు తటస్థపడినపుడు నీవు జీవుడివి కాదు, నీవు పరమాత్మవే, 'తత్వమసి' అని ఉపదేశించినప్పుడు, ఆయన చూపిన మార్గంలో ప్రయాణించి నిష్కామకర్మయోగంతో చిత్తశుద్ధి గావించుకొని, ఆత్మజ్ఞానాన్ని పొంది పరమాత్మను చేరితే పరమాత్మాకారంగా మారిపోతాం. అదే దుఃఖరహిత పదవి. శాశ్వత ఆనంద సాగరం. అదే మానవజీవిత గమ్యస్థానం. ఇదీ నిష్కామకర్మవల్ల అంతిమఫలం.

అట్టి దుఃఖరహిత పదవిని పొందేది ఎప్పుడు? 2 శ్లోకాల్లో

**శ్లో॥ యదాతే మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి।**
**తదాగంతాసి నిర్వేదం శ్రోతవ్యస్యశ్రుతస్యచ॥** **(52)**

**శ్లో॥ శ్రుతి విప్రతి పన్నాతే యదాస్థాస్యతి నిశ్చలా।**
**సమాధావచలాబుద్ధిః తదాయోగమవాప్స్యసి॥** **(53)**

**తా॥** ఎప్పుడైతే నీ బుద్ధి మోహమనే (అజ్ఞానమనే) బురదను వదిలించుకుంటుందో అప్పుడు వినదగిన విషయాలనుండి, విన్న విషయాలనుండి విరక్తిని పొందుతావు. (52)

**తా॥** విన్నవాటితో విసిగి వేసారిపోయిన నీ బుద్ధి సమాధిలో నిశ్చలంగా నిలిచినప్పుడు నీవు పరమాత్మతో యోగాన్ని పొందుతావు. (53)

**వ్యాఖ్య:** నిష్కామకర్మయోగంతో చిత్తశుద్ధి కలిగి, ఆత్మ జ్ఞానాన్ని పొంది, పరమాత్మ పదవిని– దుఃఖరహిత పదవిని పొంద గలవు అని భగవానుడు చెప్పగానే ఆ





అదృష్టం తనకెప్పుడో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలగింది అర్జునునికి. భగవానుడు 'అడగకుండానే పెట్టే అమ్మ' గనుక అర్జునుని భావాన్ని కనిపెట్టి రెండు శ్లోకాల్లో ఆ పదవిని ఎప్పుడు పొందగలడో తెలియ జేస్తున్నాడు.

సంసార బంధానికి కారణం అజ్ఞానం–మోహం–భ్రాంతి. ఏమిటది? ఈ దేహమే నేను అని అనుకోవటం; ఈ ప్రపంచం సత్యమనుకోవటం; ఇక్కడ పొందే సుఖాలే సత్యమని, శాశ్వతమని అనుకోవటం–ఇదే మానవులందరిలో గూడు కట్టుకొని ఉన్న అజ్ఞానం–మోహం.

ఇదే మోహకలిలం. మోహమనే బురద. ఈ మోహమనే బురద నీ బుద్ధిలో ఉన్నంతవరకు ప్రాపంచిక విషయాల కొరకు, భోగాల కొరకు, అనుభవాల కొరకు మనస్సు తహతహలాడుతూనే ఉంటుంది. వాటికై పరుగులు తీస్తూనే ఉంటుంది. అన్ని విషయాలకు నీ మనస్సు ప్రతిస్పందిస్తూనే ఉంటుంది. చిత్తం స్థిమితంగా ఉండదు. ఇహపరభోగాలకు, సుఖాలకు దాసుడై వాటి వలలో చిక్కి గిలగిల కొట్టుకుంటాడు.

ఎప్పుడైతే బుద్ధిలోని ఈ మోహమనే బురద వదిలిపోతుందో అప్పుడు దేని కోసమూ వెంపర్లాడడు. ఈ ప్రపంచం మిథ్యయని, ఇక్కడి సుఖాలు, భోగాలు శాశ్వతం కాదని గ్రహిస్తాడు. దానితో సమత్వ స్థితి కలుగుతుంది.

గాజు పలకకు వెనుక పాదరసం పూత ఉన్నట్లు బుద్ధికి వెనుక మోహమనే పూత ఉంటుంది. గాజుపలకకు వెనుక పూత ఉన్నంతకాలం ఎదురుగా ఉన్న వస్తువులను వ్యక్తులను అందరిని తనలోకి తీసుకొని చూపిస్తుంది. పూత తొలగించివేస్తే ఎదురుగా ఏమి ఉన్నా చూపదు–దానికి దేనితోను సంబంధం ఉండదు. అలాగే బుద్ధికి మోహమనే పూత ఉన్నంతవరకు ప్రపంచంలో ఉన్న వస్తువులు, వ్యక్తులు–వాటిపై రాగద్వేషాలు, భోగానుభవాలు అన్నీ కలుగుతాయి. ఈ మోహమనే పూత తొలగిపోతే ఏ ప్రాపంచిక వ్యామోహాలతోను, వస్తువులతోను నీ బుద్ధికి సంబంధం ఉండదు. దేనినీ కోరదు. నిర్లిప్తంగా ఉండిపోతుంది.

అలా బుద్ధి నిర్లిప్తంగా ఉన్నప్పుడు విన్న విషయాలనుండి, వినబోయే విషయాలనుండి విరక్తి కలుగుతుంది. అంటే ఇంతకు ముందు భోగాసక్తి ఉన్నప్పుడు ఏవేవో కర్మలగురించి విన్నావు. అలాగే భోగాసక్తి ఉన్నప్పుడు ఇంకా ఆయా

భోగాలనందుకొనే ఉపాయాల గురించి వినాలనుకుంటావు. ఇప్పుడు నీ బుద్ధి ఏ భోగానుభవాలను కోరుకోవటం లేదు గనుక అన్నింటియందు విరక్తియే. అంతేకాదు ఇట్టి విరక్తి స్థితిలో గురువు బోధించిన జ్ఞానం సరిగ్గా అవగతమౌతుంది. ఇలాంటి స్థితిలో ఈ జ్ఞానం కన్నా- ఈ ఆత్మజ్ఞానం కన్నా వేరుగా వినవలసింది, తెలుసుకోవలసింది ఏదీ లేదు అనే నిశ్చయజ్ఞానం కలుగుతుంది.

**శ్రుతివిప్రతిపన్నా:** ఇలా గతించిన విషయాల గురించి, భవిష్యత్తు విషయాలగురించీ, భోగాల గురించీ, రకరకాల కర్మల గురించీ, విన్న విషయాల గురించి విరక్తి చెందినపుడు ఇక బుద్ధి స్థిరంగా నిలిచిపోతుంది. **యదాతేబుద్ధి నిశ్చలా:** ఎప్పుడైతే నీ బుద్ధి అలా నిశ్చలమైపోయిందో, కోరికలన్నీంటినీ త్యజించివేస్తుందో **సమాధౌ అచలా స్థాస్యతి:** సమాధిస్థితిలో- సమాధి నిష్ఠలో స్థిరంగా, అచలంగా అంటే కదలకుండా నిలిచి పోతుంది. అలా నిలిచిపోయినప్పుడే **తదాయోగం అవాప్స్యసి:** అప్పుడు నీవు యోగాన్ని పొందుతావు. యోగమంటే కలయిక. **జీవ బ్రహ్మైక్యస్థితి.**

కనుక ఆత్మసాక్షాత్కారం లేదా మోక్షం ఎప్పుడు? అనే ప్రశ్నకు నానావిధ సిద్ధాంతాలు వినీవినీ; బాగా మననం చేసుకొని; ఇహలోక, పరలోక భోగాలయందు ఆసక్తిని విడిచి పెట్టి సంపూర్ణంగా విరక్తిని చెంది, వైరాగ్యాన్ని పొంది; బుద్ధి నిశ్చలమై అచలమై పరమాత్మలో స్థిరంగా ఎప్పుడు నిలుస్తుందో అప్పుడే ముక్తి- మోక్షం- ఆత్మసాక్షాత్కారం. అదే యోగం.

ఇక్కడ నిశ్చల-అచల అనే రెండు పదాల అర్థం తెలుసు కోవాలి.

కదిలే మనస్సు కదలకుండా నిలిచిపోవుట నిశ్చల. (ఇది **ధ్యానస్థితి**). అసలు కదలికే లేకుండా నిలిచిపోవుట అచల (ఇది **సమాధి స్థితి**)

ఇంతవరకు ఈ అధ్యాయంలో 1 నుండి 10వ శ్లోకం వరకు అర్జున శరణాగతి; 11 నుండి 30వరకు సాంఖ్యయోగం; 31నుండి 38 వరకు ధర్మాష్టకం; 39 నుండి 53 వరకు నిష్కామకర్మయోగం (బుద్ధియోగం) చెప్పటం జరిగింది. ఇక 54 నుండి 72 వరకు గల శ్లోకాలు స్థితప్రజ్ఞ లక్షణాల గురించి చెప్పబోతున్నాడు. దుఃఖరహిత పదవిని అందుకున్న జీవన్ముక్తుడు ఎలా వ్యవహరిస్తాడో తెలియజేసేవే ఈ స్థితప్రజ్ఞ లక్షణాలు.





# స్థితప్రజ్ఞ లక్షణాలు

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ!।**
**స్థితధీఃకింప్రభాషేత కిమాసీత వ్రజేత కిం?॥ (54)**

**తా॥** అర్జునుడు అడుగుతున్నాడు, "కేశవా! సమాధి నిష్ఠ యందుండే స్థితప్రజ్ఞుని లక్షణం ఏమిటి? స్థిరబుద్ధి గల అతడు ఎలా మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా ప్రవర్తిస్తాడు?"

**వ్యాఖ్య:** బుద్ధియోగం ద్వారా పరమపదాన్ని చేరుకొనే పథకాన్ని భగవానుడు వివరించగానే కార్యవాది ఐన అర్జునుడు ఎలాగైనా ప్రయత్నించి తానుకూడా ఆ స్థానాన్ని చేరుకోవాలను కున్నాడు. ఐతే అట్టి స్థితిని చేరుకున్న వ్యక్తి ఆ తర్వాత ఈ ప్రపచంలో ఉత్సాహంగా జీవించగలడా? లేక ఈ ప్రపంచానికి దూరంగా వెళ్ళి ఎక్కడో ఏకాంతంగా, ఎట్టి స్పందనా లేని బండరాయిలాగా ఉండిపోతాడా? స్వార్థం, ద్వేషం మొదలైన వాటితో కూడుకున్న ఈ లోకంలో అతడెలా ఇమడగలడు? ఒక వేళ ఇమిడినా అతడి ప్రవర్తన ఎలా ఉంటుంది? ఎలా మాట్లాడుతాడు? ఎలా కూర్చుంటాడు? ఎలా వ్యవహరిస్తాడు? అనే విషయాలను తెలుసుకోవాలనుకున్నాడు. అర్జునునికి తీవ్రమైన జిజ్ఞాస ఉంది గనుకనే ఇలాంటి సందేహం కలిగింది.

ఈ స్థిత ప్రజ్ఞ ప్రకరణం భగవద్గీతలో అతి ముఖ్యమైనది. భగవద్గీతకు ఆదర్శమూర్తి ఈ స్థితప్రజ్ఞుడు. గీతను చక్కగా విని, అర్థం చేసుకొని, మళ్ళీ మళ్ళీ మననం చేసుకుని, ఆచరణలో ఈ గీతా సూత్రాలను వినియోగించుకొన్నవాడు అందుకొనే స్థానం ఇదే- స్థితప్రజ్ఞుడు కావటమే. ప్రతి మానవుడు స్థిత ప్రజ్ఞుడు కావాలని భగవద్గీత ఆశయం.

అందుకే ఎందరో మహాత్ములు, సాధకులు, సన్యాసులు ప్రతినిత్యం దీనిని పఠిస్తూ, మననం చేసుకుంటూ, జీర్ణింప చేసుకుంటారు. మహాత్మాగాంధీ ప్రతినిత్యమూ తమ సాయంకాల ప్రార్థనలలో ఈ స్థితప్రజ్ఞ లక్షణాలు గల 18 శ్లోకాలను పారాయణ చేస్తూ ఉండేవారు. మహాత్మాగాంధీ గారి ఆధ్యాత్మిక వారసుడు ఆచార్య వినోబాభావే గారు ఈ ప్రకరణంపై 'స్థిత ప్రజ్ఞదర్శనం' అనే గ్రంథాన్ని వ్రాశారు.

ఇక్కడ అర్జునుడు 4 ప్రశ్నలు వేశాడు. 1) సమాధి నిష్ఠలో ఉన్న స్థితప్రజ్ఞుని

లక్షణాలేవి? 2)అతడు ఏమి మాట్లాడుతాడు? 3)ఎక్కడ కూర్చుంటాడు? 4) ఎలా ప్రవర్తిస్తాడు?–అని. అర్జునుని ప్రశ్నలకు సమాధానంగా భగవానుడేమి చెప్పాడో తెలుసు కుందాం.

**శ్రీ భగవానువాచ**

**శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55**

**తా॥** శ్రీ భగవానుడంటున్నాడు. పార్థా! మనస్సునందలి సమస్తమైన కోరికలను ఎప్పుడు సంపూర్ణంగా విడిచిపెడతాడో, ఎప్పుడు తనలో తాను ఆనందాన్ని పొందుతూ ఉంటాడో అప్పుడు స్థితప్రజ్ఞుడు అని పిలువబడతాడు.

**వ్యాఖ్య: (I) మనోగతాన్ సర్వాన్ కామాన్ ప్రజహాతి:** మనస్సులోని అన్ని కోరికలను పూర్తిగా విడిచిపెట్టినవాడే స్థిత ప్రజ్ఞుడు. కొన్ని కోరికలను పూర్తిగా వదిలినా ప్రయోజనం లేదు. అన్ని కోరికలను కొద్దికొద్దిగా వదిలినా ప్రయోజనం లేదు. అన్ని కోరికలను పూర్తిగా వదలాలి. మనస్సు కోరికలపుట్ట. కోరికలన్నీ వాసనల రూపంలో మనస్సు యొక్క మారు మూలల్లో దాగి ఉంటాయి. అందుకే వాటిని 'మనోగతాన్' అన్నారు. కనుక బంధం అంతా మనస్సులోనే కోరికల రూపంలో ఉంది. వాటిని వివేకం అనే దీపంతో వెతికి ఏరిపారవేయాలి. బియ్యంలో రాళ్ళు ఏరినట్లు, పొలంలో కలుపు మొక్కలను పీకివేసినట్లు, అనేక జన్మలనుండి వాసనల రూపంలో జీవుని వెంట ప్రయాణిస్తూ వస్తున్న ఈ కోరికలను పూర్తిగా పెకలించి వేయాలి.

కొందరు అంటుంటారు "నేను చాలా వరకూ కోరికలను వదిలేశానండీ! ఇక ఒక్కటే కోరిక. పిల్లలందరికీ మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేసేసి, వారంతా జీవితంలో స్థిరపడి, ఎవరికీ ఏ లోటూ లేకుండా పిల్లాపాపలతో, సిరి సంపదలతో తులతూగుతుంటే చాలు! నాకింకేమీ అవసరం లేదు. ఏదో పాతిక లక్షలు నా పేరవేసుకొని హాయిగా కృష్ణా! రామా! అంటూ కాలం గడిపేస్తా". ఇది కాదు కోరికలను వదలట మంటే. అన్ని కోరికలను వదలాలి. ఆఖరుకు తిండిని గురించి కూడా ఆలోచించరాదు. ఇక్కడే ఒక సందేహం రావచ్చు. 7వ అధ్యాయంలో **'ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ'** ధర్మానికి విరుద్ధం కాని కోర్కెలు నా





స్వరూపమే–అన్నాడు గదా! భగవానుడు. అంటే మంచికోర్కెలను, ధర్మవిరుద్ధం కాని కోరికలను కోరుకోమన్నాడు గదా! మరి ఇక్కడేమో అన్ని కోర్కెలను పూర్తిగా వదలమంటున్నాడేమిటి? అని. అది సాధకదశ. ఇది సిద్ధావస్థ. సాధకుడు మొదట మంచి కోర్కెలను కోరుకుంటూ చెడ్డవాటిని విడిచిపెట్టాలి. ఆ తరువాత మంచి కోర్కెలు కూడా వాసనలే గనుక, బంధాలే గనుక వాటినీ విడిచి పెట్టాలి. అప్పుడే అతడు స్థితప్రజ్ఞుడయ్యేది. ముల్లును ముల్లుతోనే తీయాలి. తీసింతర్వాత రెండవ ముల్లును ముద్దు పెట్టుకుంటామా? దాన్నీ పారవేస్తాం. అలాగే చెడ్డకోర్కెలను విడిచి వాటి స్థానంలో మంచి కోర్కెలనుంచాలి. ఇది సాధక దశ. ఆ దశ దాటిన తర్వాత ఆ మంచి కోర్కెలను కూడా విసిరిపారేయాలి. ఇది ముక్తస్థితి– సిద్ధావస్థ. అదే స్థితప్రజ్ఞుని లక్షణం.

**(II) ఆత్మన్యేవాత్మనాతుష్టః** ఆత్మలోనే(తనలోనే) తాను సంతృప్తి చెందాలి. ఆనందం ఎక్కడ దొరుకుతుంది? అది బయట ఎక్కడో లేదు. అది నీలోనే ఉంది. ఈ విషయం తెలియని వారు ఆనందం కొరకు బయట వెదుకుతారు. వస్తువులలో, విషయాలలో, భోగాలలో ఆనందం ఉందని వాటివెంట పడతారు. ఆనందం దొరుకుతుంది. కాని అంతలోనే దూరమై పోతుంది. అంటే అది శాశ్వత ఆనందం కాదు. శాశ్వతానందం నీలోనే ఉంది. నీ స్వరూపంగా ఉంది. అందుకే **'ఆత్మన్యేవ'** అన్నారు. "నీలో అంటే నీ శుద్ధమైన అంతఃకరణంలో" అని అర్థం. అన్ని కోరికలను విడిచిన అంతఃకరణమే శుద్ధ అంతఃకరణం అవుతుంది. అట్టి అంతఃకరణములోనే ఆనందం ఉండేది. అదే ఆత్మానందం– శాశ్వతానందం. ఆత్మానందం కొత్తగా తయారు చేసి తెచ్చుకొనేది కాదు. అది ఎప్పుడూ ఉన్నదే. నిత్యమైనదే.

అలా అన్ని కోరికలను వదలి అంతఃకరణాన్ని శుద్ధి చేసుకున్న స్థితప్రజ్ఞుని ముఖంలో ప్రశాంతత, ఆనందం, సంతృప్తి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కోరికలతో ఉన్నవాడు ఎప్పుడూ ఆముదం త్రాగిన ముఖంతో ఉంటాడు. ఏ కోరికా లేకపోతే బుద్ధి స్థిరంగాను, మనస్సు ప్రశాంతంగాను, ముఖం తేజస్సు గాను ఉంటుంది. అదే స్థితప్రజ్ఞ లక్షణం.

ఇంకా స్థితప్రజ్ఞుడు ఎలా ఉంటాడు?

**శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః।**

**వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56**

**తా॥** దుఃఖంలో ఉద్వేగం చెందనివాడు, సుఖాలకోసం ఆరాటం చెందనివాడు, రాగము, భయము, క్రోధము విడిచిన వాడు స్థితప్రజ్ఞుడైన మునిగా చెప్పబడతాడు.

**వ్యాఖ్య:** స్థితప్రజ్ఞుడు మనస్సులోని అన్ని కోరికలను విడిచి పెట్టినవాడు అని ఇంతకుముందే చెప్పుకున్నాం. ఐతే మనస్సులోని కోరికలన్నింటినీ వదిలినా బాహ్యంగా జరిగే సంఘటనలను కొన్నింటిని సుఖాలుగా, కొన్నింటిని దుఃఖాలుగా భావించి పొంగుతూ క్రుంగుతూ ఉంటాం గదా! మరి మనం కోరకపోయినా వచ్చిపడే ఈ సుఖదుఃఖాలతో స్థితప్రజ్ఞుడెలా వ్యవహరిస్తాడు?

సుఖాలు గాని, దుఃఖాలు గాని కోరితే వచ్చేవి కావు. అలా అయితే అందరూ సుఖాలనే కోరుకుంటారు. మరెందుకు వస్తున్నాయి ఈ సుఖదుఃఖాలు? మనం పూర్వంలో చేసుకున్న పుణ్యపాపకర్మల వల్ల. పుణ్యం వల్ల సుఖం, పాపం వల్ల దుఃఖం. దుఃఖాలు వస్తున్నాయంటే అందరికీ హడల్, భయం, అదిరి పోతారు. కాని "పాపం చెయ్యవద్దు" అని చెప్పటానికే మనకు దుఃఖాలు వస్తున్నాయి-అని తెలుసుకుంటే ఎంతో ఉపయోగం.

స్థితప్రజ్ఞుడైన వాడు ఈ సుఖాలకు పొంగడు, దుఃఖాలకు క్రుంగడు. అలా ఎలా ఉండగలగుతాడు? మేఘాలకు క్రింద ఉన్నవారికి వర్షం, ఉరుములు, మెరుపులు అనేవి ఉంటాయి. మేఘాలకు పైన ఉంటేనో-ఉండగలిగితేనో ఇవేవీ ఉండవు. అలాగే నీవు మనసుయొక్క పరిధిలో ఉన్నావా-అంటే 'మనస్సే నేను' అనుకున్నావా?! మనస్సుకు చెందిన సుఖదుఃఖాలు నీవే అవుతాయి. వాటికి స్పందిస్తావు. అలాగాక నీవు ఆత్మయొక్క పరిధిలో ఉన్నావా! అంటే 'ఆత్మనే నేను' అనే అనుభూతిలో ఉన్నావా! ఆత్మకే సుఖదుఃఖాలు ఉండవు గనుక వాటితో ఏమాత్రం సంబంధం లేకుండా, వాటికేమాత్రం స్పందించకుండా నీ స్థితిలో ప్రశాంతంగా ఉంటావు. స్థితప్రజ్ఞుడు తాను ఆత్మనని గ్రహించినవాడు గనుక సుఖాలకు పొంగడు, దుఃఖాలకు క్రుంగడు. అతడెపుడూ ఆనందస్వరూపుడిగానే ఉండిపోతాడు.

మరి సాధకుడైనవాడు అట్టి ప్రశాంత-ఆనంద స్థితిలో ఉండాలంటే ఎలా? అందుకే సూచన.





**వీతరాగభయక్రోధః** రాగము, భయము, క్రోధము విడిచి పెట్టాలి-అని. వీటిని విడిచినవాడు సుఖాలకు పొంగక, దుఃఖాలకు క్రుంగక ప్రశాంతంగా ఉండగలుగుతాడు. ఎందుకంటే వీటివల్లనే సుఖదుఃఖాలనేవి కలిగినప్పుడు ప్రతిస్పందిస్తున్నాము, చలిస్తున్నాము.

**రాగం** అంటే మనకు కావలసిన వస్తువుల మీద ప్రేమ, అభిమానం, మమకారం, కోరిక. ఇక మనం కోరుకున్న ప్రాణ సమానమైన వస్తువును పొందలేమనుకున్నప్పుడు, పొందిన వస్తువు జారి పోతుందనుకున్నప్పుడు కలిగే ప్రేరణే **భయం.** కావలసిన వస్తువును సంపాదించుకొనేటప్పుడు ఎవరైనా అడ్డు తగిలితే, ఎవరైనా దానిని తన్నుకుపోతే, సంపాదించిన వస్తువును నిలబెట్టు కొనేటప్పుడు ఎవరైనా ఆటంకం కలగిస్తే అప్పుడు కలిగేది **క్రోధం.** ఈ 3 ప్రేరణలు సాధకునిలో ఉండి సుఖాలకు, దుఃఖాలకు చలించేటట్లు చేస్తాయి. కనుక వాటిని వదలగలిగితే ఇక అంతా ప్రశాంతమే. స్థితప్రజ్ఞుడు తనలో తాను ఆనందించేవాడు గనుక అతడికి రాగ, భయ, క్రోధాలుండవు. అందుకే పొంగడు, క్రుంగడు. అంతేకాదు అతడు ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక సత్యాలను మననం చేసుకుంటూ ఉంటాడు కనుక **'ముని'** అన్నారు. స్థితప్రజ్ఞుడు మననశీలుడుగా ఉండి ఆనందంగా ఉండి పోతాడు. కనుక మనం కూడా రాగము, భయము, క్రోధము విడిచిపెట్టి ప్రాపంచికమైన సుఖదుఃఖాలకు చలించకుండా ఆధ్యాత్మిక సత్యాలను లేదా మనస్స్వరూపాన్ని మననం చేసుకుంటూ ఉండాలి. ఇదే విషయాన్ని మరొక రూపంలో తరువాతి శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్యశుభాశుభం।**

**నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా॥ 57**

**తా॥** ఎవడు సమస్త విషయములందును ఆసక్తి లేనివాడై, ఆయా శుభ అశుభాలను పొందినప్పుడు ఆనందించక, ద్వేషించక ఉంటాడో అట్టివాని ప్రజ్ఞయే స్థిరమైనది.

**వ్యాఖ్య: శుభం-అశుభం:** శుభం అశుభం అనే రెండూ బయటి వస్తువులతో మనకు గల సంబంధాన్ని బట్టి ఉంటుంది. బాహ్యంలో జరిగే సంఘటనలను బట్టి ఉంటుంది. మా అబ్బాయి, ప్రక్కింటి వారి అబ్బాయి-ఇద్దరూ ఆడుకుంటూ కొట్టు

కున్నారు. తప్పెవరిదైనా కానీ "మావాడు అసలు ఎవరినీ ఏమీ అనడండీ, మీ వాడికే బుద్ధి లేదు. ఇప్పుడే పెద్ద రౌడీ అయి పోతున్నాడు, కాస్త అదుపులో పెట్టుకోండి" అని సలహా ఇచ్చేస్తాను. ఎందుకంటే వీడు మా అబ్బాయి. వాడు నా వాడు కాదు. ఈ రకమైన పక్షపాతబుద్ధి లేకుండా ఉండాలంటే–

**సర్వత్రా అనభిస్నేహః** అందరిపట్ల, అన్ని విషయాలపట్ల గట్టి స్నేహం లేకుండా–ఆసక్తి లేకుండా సమభావంతో ఉండాలి. ఎలా సాధ్యం? ఈ ప్రపంచంగాని, ఇందులోని వస్తువులు గాని సత్యం కాదు, మిథ్య. అంటే లేకున్నా కనిపిస్తూ ఉండేవి. కలలో ఏ వస్తువులూ లేకున్నా అనేకమైన వాటిని చూస్తుంటాం. ఇంద్రజాలికుడు అక్కడేమీ లేకపోయినా ఉన్నట్లుగా ఎన్నింటినో చూపిస్తుంటాడు. అలాగే ఈ జగత్తు మిథ్య– నిజంగా లేకపోయినా ఉన్నట్లుగా భ్రాంతి కలుగుతున్నది– అని తెలుసుకున్న ప్పుడు దేనిమీదా ఆసక్తి ఉండదు. కలలో కనిపించిన బంగారం ఎక్కడుందో మేలుకున్న తర్వాత వెతుకుతావా? అలాగే ఈ జగత్తులోని సర్వమూ కల్పితమని తెలుసుకుంటే వాటిపట్ల స్నేహాన్ని–ఆసక్తిని కలిగి ఉండవు.

**నఅభినందతి–నద్వేష్టి:** అలా తెలుసుకున్నప్పుడు ఇక్కడ శుభం జరిగితే ఆనందించవు. అశుభం జరిగితే ద్వేషించవు. రాత్రి కలలో 100 కిలోల బంగారం నీ ఇంట్లోని బీరువాలో సర్దుకున్నావు. మేలుకున్న తర్వాత ఆనందిస్తావా? అలాగే రాత్రి కలలో నీ ఇంట్లో దొంగలు పడి సర్వాన్ని దోచుకు పోయారు. మేలుకోగానే లబోదిబోమని ఏడుస్తావా? కేసు పెడతావా?. అలాగే దేనిపట్ల ఆసక్తి లేకుండా, శుభ–అశుభాలు ఏమి జరిగినా స్థిత ప్రజ్ఞుడు స్థిరబుద్ధితో ఆనందించక–ద్వేషించక, దేనికీ చలించకుండా ప్రశాంతంగా ఉంటాడు. జాగ్రదావస్థలోకి మేలు కోగానే స్వప్న విషయాలన్నీ మనకు ఎలా అసత్యం అవుతున్నాయో అలాగే జ్ఞానావస్థలోనికి రావటంతోనే స్థితప్రజ్ఞునికి ఈ జాగ్రత్తలోని విషయాలన్నీ అసత్యం అవుతున్నాయి. అందుకే అతని ప్రజ్ఞ స్థిరంగా ఉంటున్నది.

–మరి ప్రపంచంలో తిరుగుతున్నప్పుడు ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలోకి పరుగులు తీస్తుంటాయి గదా! అలాంటప్పుడు స్థితప్రజ్ఞుడు ఎలా వ్యవహరిస్తుంటాడు?

**శ్లో॥ యదాసంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58**





**తా॥** తాబేలు తన అంగాలను లోపలకు ముడుచుకున్నట్లుగా ఇతడు ఎప్పుడైతే తన ఇంద్రియాలను విషయ వస్తువులనుండి ఉపసంహరించుకుంటాడో అపుడు అతడి ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

**వ్యాఖ్య:** ప్రపంచంలో అనేక విషయాలున్నాయి. అవే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనేవి. ఆ విషయాలను గురించి తెలుసుకోవటానికి మన వద్ద 5 జ్ఞానేంద్రియాలున్నాయి. శబ్ద విషయాలను గ్రహించేది చెవి, స్పర్శ విషయాలను గ్రహించేది  చర్మం, రూపాన్ని గ్రహించేది కన్ను, రసాన్ని తెలుసుకొనేది నాలుక, గంధాన్ని గ్రహించేది ముక్కు. ఈ 5 ఇంద్రియాలు 5 రకాల విషయాలను గ్రహించి మనస్సుకు తెలియజేస్తాయి. దానితో మనస్సు ఆయా విషయాలవెంట పరుగులెత్తుతూ అశాంతి పాలవుతుంది.

సీతాదేవి తన భర్త శ్రీరాముని విడిచి ఉండలేకనే అయోధ్య నుండి అరణ్యానికి వచ్చి ఉంటున్నది. కాని బంగారు లేడిని చూచింది. కావాలనుకుంది. భర్తకు తెలిపింది తన కోరికను. దానివల్ల భర్తకు (భగవంతునికి) దూరమైపోయింది. అలాగే మనస్సు విషయాలకొరకు పరుగులు తీస్తే మనం కూడా భగవంతునికి దూరమౌతాం. అశాంతి పాలవుతాం. మరేం చేయాలి?

ఇంద్రియాలను విషయ వస్తువుల వెంట పరుగెత్తించకుండా ఎప్పుడైతే వాటిని ఉపసంహరించ గలుగుతామో అప్పుడు మనం స్థిరంగా, శాంతంగా, ప్రశాంతంగా ఉండగలుగుతాం. అందుకే ఇక్కడ తాబేలు ఉదాహరణ.

**కూర్మోంగానీవ:** తాబేలు తన అంగాలను లోపలకు ముడుచుకున్నట్లుగా అని. తాబేలుకు 4 కాళ్ళు, తల, తోక మొత్తం 6 అంగాలున్నాయి. ఈ ఆరింటిని ఎంతో సులువుగా బయటకు పంపి మెల్లగా నడుస్తుంది. అయితే ఏ క్షణంలోనైనా ప్రమాదం వస్తుందని పసిగట్టిందా! ఆ ప్రమాదం ఎంత దూరంలో ఉన్నా సరే, వెంటనే ఆ ఆరు అవయవాలను సులువుగా తన డిప్పలోనికి లాక్కుంటుంది. ఆ తర్వాత దాన్ని ఎవరూ ఏమీ చేయలేరు. అది ఎంతో సులువుగా తన ఆరు అంగాలను తన డిప్ప లోపలకు లాక్కోగలుగుతుంది. అయితే మానవుడు మాత్రం ఇంద్రియాలను బయటకు పంపడానికి ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు. అసలవి ఎప్పుడూ బయటికే చూస్తుంటాయి. కాని లోపలకి తీసుకోవాలంటే మాత్రం బ్రహ్మప్రళయం అవుతుంది.

ఆ జంతువుకున్న యోగ్యత మానవుడికి లేకుండా పోయింది. అయితే స్థితప్రజ్ఞునికి మాత్రం ఇంద్రియాలు 'స్వవశాలు'. అతడి ఆధీనంలోనే ఉంటాయి. అవసరమైనప్పుడు అన్ని ఇంద్రియాలను బయటకు పంపి సంచరిస్తూ ఉంటాడు. అయితే ఆకర్షణలలో చిక్కుకుంటున్నానని, ప్రమాదం ముంచుకొస్తుందని భావించగానే తాబేలులాగా తన 5 జ్ఞానేంద్రియాలు, మనస్సు-మొత్తం ఆరింటిని లోపలకు ముడుచుకోగలుగుతాడు. అట్టి వాని బుద్ధియే స్థిరబుద్ధి. అతడే స్థితప్రజ్ఞుడు. ఇదే ఇంద్రియ నిగ్రహం. ఇంద్రియాలను అలా నిగ్రహించగలవాని ప్రజ్ఞయే స్థిరమైన ప్రజ్ఞ.

-ఐతే ఇంద్రియనిగ్రహం అంత తేలికైన విషయం కాదు, నిరంతరం జాగరూకతతో ఉండాలి. ఎందుకు?

**శ్లో॥ విషయావినివర్తంతే నిరాహారస్యదేహినః।**
**రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వానివర్తతే ॥** **59**

**తా॥** ఆహారాన్ని విడిచిపెట్టిన పురుషుని నుండి విషయ వస్తువులు దూరంగా తొలగిపోతాయి. ఐతే విషయ వాసన (విషయాలపై అభిరుచి) మాత్రం అలాగే ఉండిపోతుంది. పరమాత్మ దర్శనంతోనే ఆ అభిరుచి (వాసన) కూడా తొలగిపోతుంది.

**వ్యాఖ్య: (I)నిరాహారస్యదేహినః** నిరాహారిగా ఉండే పురుషుడు. అసలు ఎవరైనా నిరాహారిగా ఉంటారా? ఏదో ఒకరోజైతే ఉపవాసం చేస్తారు. నిరాహారదీక్ష అయితే 10 రోజులో 15 రోజులో చేస్తారు. ఇక్కడ ఆ నిరాహారుడు కాదు. ప్రాపంచిక విషయాలకు దూరమై, తపస్సు చేస్తూ కాలం గడపాలని భావించిన వారు ఎక్కడో ఏకాంతంలో గడపటానికి వెళ్తారు. అలాంటివారు తిండి గురించి పట్టించుకోరు. ఏదో ఆ సమయానికి దొరికిన పండో, పాలో తీసుకుని తపస్సును కొనసాగిస్తారు. వారే నిరాహారులు. అట్టి వారికి-

(II) **విషయా వినివర్తంతే:** విషయాలు, వస్తువులు, భోగాలు దూరంగా తొలగిపోతాయి. అట్టివారు విషయ భోగాలకై ఏమాత్రం ప్రయత్నించరు. నిరంతరం తపస్సు నందేకాలం గడుపుతూ ఉంటారు. ఐతే వారిలో ఇక ఎప్పుడూ విషయాలపట్ల అభిరుచి కలగదా? విషయభోగాలు అనుభవించాలని ఎప్పుడూ అనుకోరా? చెప్పలేం. ఎందుకంటే విషయాలకు దూరంగా పోయినా వారి మనస్సులో విషయాలపట్ల అభిరుచి- వాసన అంత తేలికగా పోదు.





భర్తమీద కోపం వచ్చిన భార్య భర్తను వదలి పుట్టింటికి పోవచ్చు. కాని భర్తను గురించి ఆలోచించకుండా ఉంటుందా? కుమారుడు తప్పుగా ప్రవర్తిస్తుంటే అనేకసార్లు హెచ్చరించిన తండ్రి ఎప్పుడో ఒకప్పుడు 'నీవు నా కుమారుడివే కాదు పో!' అని తిట్టవచ్చు. కాని ఆ బంధాన్ని మనస్సులో నుంచి పూర్తిగా తొలగించుకోగలడా? అలాగే విషయాలకు దూరంగా ఉండవచ్చు గాని విషయవాసనలకు దూరంగా ఉండలేరు. దీనికి కారణం ఏమిటి?

అనేక జన్మలనుండి మన ఇంద్రియాలు విషయాలలో చిక్కుకుని వాసనల రూపంలో చిత్తంలో ముద్రపడి ఉన్నాయి. ఆ వాసనలే మళ్ళీ మళ్ళీ విషయాలు కనిపించగానే ఇంద్రియాలను పరుగులెత్తిస్తూ ఉంటాయి. అందువల్ల విషయాలు దూరంగా ఉన్నా లోపల విషయవాసన లేదు-అని అనుకోరాదు. అది మనస్సులో ఏ మూలనో నక్కి ఉంటుంది. మరి ఆ వాసన తొలగేదెలా?

(III) **పరందృష్ట్వా నివర్తతే:** పరమాత్మ దర్శనమైతేనే. ఆత్మ సత్యమని, జగత్తు మిధ్యయని అనుభవపూర్వకంగా గ్రహించాలి. అలా గ్రహించాలంటే ఆత్మతత్వాన్ని తెలియజెప్పిన ఉపనిషత్తులను సద్గురువుల బోధ ద్వారా శ్రవణం చేసి, ఆ తరువాత మనన నిధిధ్యాసనల ద్వారా అనుభూతిని పొందాలి. అంటే ఆ ఆత్మను నేనేనని, **'అహంబ్రహ్మాస్మి'**యని అనుభూతి చెందాలి. అలా అనుభూతి చెంది సర్వకాల సర్వావస్థలలోను ఆత్మగా-బ్రహ్మముగా ఉండిపోతే విషయ వాసనలు సమూలంగా క్షయమై ఇక చుట్టూ విషయాలున్నా అటువైపుకు మనస్సు పోదు. అసలు అలా పోవటానికి మనస్సే ఉండదు. అలా మనోనాశనం గావించుకొని, సంపూర్ణంగా వాసనా క్షయాన్ని గావించుకొన్న ఆత్మనిష్ఠుడే పరమాత్మ దర్శనమైన స్థితప్రజ్ఞుడు. అతడిలో ఇక ఏ విషయ వాసనా ఉండదు.

-అయితే ఇంద్రియాలను నిగ్రహించటం అంత తేలికా? ఇంద్రియాలు ఎంత బలవత్తరమైనవి?-

**శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః॥** **60**

తా ॥ కౌంతేయా! వివేకి అయిన పురుషుడు ప్రయత్నించినప్పటికీ బలవత్తరమైన ఇంద్రియాలు మనస్సును బలాత్కారంగా విషయాలపైకి లాగివేస్తూనే ఉంటాయి.

**వ్యాఖ్య : (i) విపశ్చితః పురుషః :-** వివేకి అయిన పురుషుడు అంటే ఆత్మానాత్మ వివేకం గలవాడు. అనాత్మను త్రోసివేసి ఆత్మ సాక్షాత్కారం కొరకు కృషిచేసేవాడు. అట్టి వివేకి అయిన పురుషుడు కూడా ఎంతగా ప్రయత్నించినా ఇంద్రియాలు ఒక పట్టాన స్వాధీనంలోనికిరావు.ఇక సామాన్యుడి సంగతిచెప్పాల్సిన పనేలేదు.కట్టు త్రెంచుకున్న గొడ్డులాగా, కళ్ళెంలేని గుర్రంలాగా, గట్టు తెగిన చెరువు లాగా ఇంద్రియాలు విషయాలవైపుకు పరుగులు తీస్తూ మనస్సును తమతోపాటు లాక్కొనిపోతాయి. ఎందుకంటే -

(ii) **ఇంద్రియాణి ప్రమాథీని :** ఇంద్రియాలు బలవత్తరమైనవి, క్షోభగలిగించేవి. అందుకే ఇంద్రియాలను గుర్రాలతో పోల్చారు. అసలు ఆధ్యాత్మిక రంగంలో సాధకులు పతనమయ్యేది ఇంద్రియాలకు దాసులు కావటం వల్లనే - ఇంద్రియ లలోత్వం వల్లనే. మనకున్న 5 జ్ఞానేద్రియాలుప్రపంచంలోని శబ్ద స్పర్శాది 5 విషయాలను గ్రహించి మనస్సుకు చేరవేస్తాయి. అప్పుడు మనస్సు ఆ విషయాలగురించిన ఆలోచనలలో పడి వాటికోసం తహతహలాడుతూ ఆందోళన చెందుతుంది. అలా మనస్సు నిశ్చలత్వాన్ని కోల్పోవటంతో ఈ బలవత్తరమైన ఇంద్రియాలు -

(iii) **ప్రసభం మనః హరంతి** :- బలాత్కారంగా మనస్సును విషయాలపైకి లాగివేస్తాయి. నిజంగా ఇంద్రియ నిగ్రహాన్ని అభ్యసించిన సాధకుడి అంతరంగంలో ఎంతో ఆనందం ఉంటుంది. వెంటనే అతడు తన సాధనమీద అతి విశ్వాసం ప్రదర్శిస్తాడు. ఇంద్రియ నిగ్రహాన్ని సాధించాననే భరోసాలో ఉంటాడు. అయితే సాధనలో ఏ మాత్రం లోపం కలిగినా విషయాలవైపుకు చూడగానే, సమయం కోసం కాచుకొని కూర్చున్న ఇంద్రియాలు అతడి మనస్సును బలాత్కారంగా విషయాలవైపుకు లాగుకొనిపోతాయి. కనుక ఇంద్రియ నిగ్రహ విషయంలో అశ్రద్ధ పనికిరాదు; భరోసా కూడదు.

విశ్వామిత్రుడు ఘోర తపస్సునే చేశాడు. అయినా మేనక రావటంతో అతడి ఇంద్రియాలు పట్టుతప్పాయి. తప్పు తెలుసుకొని మళ్ళీ తపస్సు మొదలుపెట్టాడు. రంభ వచ్చింది. అయినా నిగ్రహంతో ఉన్నాడు. కాని ఏంలాభం? ఈసారి కామానికి లొంగలేదుగాని, క్రోధానికి లొంగిపోయాడు. రంభను శపించాడు. కనుక ఎంతటివారైనా ఇంద్రియ విషయాలలో జాగరూకతతో ఉండాల్సిందే.





-అందుకోసం ఏమి చేయాలి?-

**శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశేహి యస్యేంద్రి యాణి తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా ॥** **61**

తా॥ అట్టి బలవత్తరమైన ఇంద్రియాలన్నింటిని స్వాధీనంలో పెట్టుకొని, యోగయుక్తుడై, నన్నే (భగవంతునే) లక్ష్యంగా పెట్టుకొని ఉండాలి. ఎవరి ఇంద్రియాలు స్వాధీనంలో ఉంటాయో వారి ప్రజ్ఞయేస్థిరంగా ఉంటుంది (అతడే స్థిత ప్రజ్ఞుడు).

**వ్యాఖ్య :-** ఇంద్రియాలు విషయాలపైకి పోకుండా ఇంద్రియ నిగ్రహాన్ని పాటించాలి అన్నారు. అయితే 'నిగ్రహం' అంటే బలవంతంగా ఇంద్రియాలను అణచటమా? - నవీన మనస్తత్వ శాస్త్రవేత్త ఫ్రాయిడ్ మొదలగువారు అలాగే భావిస్తున్నారు. అయితే గీతాచార్యుని భావన అదికాదు. బలవంతంగా ఇంద్రియాలను అణచివేస్తే, అంతకంటే ఎక్కువ బలంగా అవి విషయాలవైపు పరుగెత్తటానికి తహతహలాడుతాయి.

ఒక స్వీటు తినాలనే కోరికను బలవంతంగా అణచుకొంటే ఎలాగోలా చాటుగానైనా తినాలనిపిస్తుంది. అయితే అందులోని దోషాలను తెలుసుకుంటే - లేదా ఆరోగ్యానికి అది కలిగించేనష్టాన్ని చక్కగా తెలుసుకుంటే క్రమంగా దానిపై ఇష్టం తగ్గిపోతుంది.

ఈ శ్లోకంలో ఆత్మ వికాసానికి విధి నిషేధాలు రెండింటిని ఒక్క గుక్కలో చెప్పాడు భగవానుడు. అన్ని ఇంద్రియాలను విషయాలపైకి పోకుండా; విషయాలలోని దోషాలను చూడటం ద్వారా నిగ్రహించు - ఇది నిషేధం. 'మత్పరః ఆసీతః' - నిరంతరం నాయందే నీ మనస్సును లగ్నం చేసి ఉంచు - ఇది విధి.

ఇక్కడ విధినిషేధాలురెండింటినీఎందుకు చెప్పారు? కేవలం ఇంద్రియాలను నిగ్రహిస్తేసరిపోదా? - సరిపోదు. ఇంద్రియాలు బలవత్తరమైనవి గనుక ఎప్పుడో ఒకప్పుడు అవిమనస్సును లాగివేస్తాయి. అందుకే ఆ మనస్సును ఖాళీగా ఉంచవద్దు. దానికొక ఆలంబన చూపాలి. అదే

'మత్పరః'- నాయందే ఉంచు అని చెప్పటం. మనస్సు పరమాత్మ భావనలో ఉంటే ఆ మనస్సును లాగివేసే శక్తి ఇంద్రియాలకు ఉండదు. మరి ఇంద్రియాల

సంగతి వదిలేసి మనస్సును పరమాత్మలో ఉంచితే చాలదా? అది సాధ్యంగాదు. **ఇందియాలు విచ్చలవిడిగా విషయాలపై తిరుగుతుంటే మనస్సును ఆత్మలో నిలపటం సాధ్యంకాదు.** అందుకే రెండూ జరగాలి. ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకోవాలి, మనస్సును ఆత్మలో రమింపజేయాలి. విషయ విరక్తి– ఆత్మచింతన రెండూ ముఖ్యమే.

ఇలా ఎవరియొక్క ఇంద్రియాలు స్వాధీనంలో ఉంటాయో వారి ప్రజ్ఞయే స్థిరమైనది. అట్టి వానినే స్థితప్రజ్ఞుడు అంటారు. అతడు నిరంతరము ఆత్మయందేరమిస్తూ ప్రశాంతంగా ఉంటాడు. దానికి కారణం అతడి ఇంద్రియాలు అతడి స్వాధీనంలో ఉంటాయి. విషయాల కొరకు, భోగాల కొరకు పరుగెత్తటం విఫలం చెందటం, ఆందోళన చెందటం, అశాంతిగా ఉండటం జరగదు. అతడు శాంతితో జీవిస్తాడు.

–ఇంద్రియ నిగ్రహంతో పాటు మనో నిగ్రహం కూడా ఉండాలా? ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సుతో విషయాలను అదే పనిగా ధ్యానిస్తే వచ్చే నష్టమేమిటి? రాబోయే 2 శ్లోకాల్లో –

**శ్లో ॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షఉప జాయతే ।**
**సంగాత్సం జాయతే కామః కామాత్ క్రోధో2భి జాయతే ॥** 62

**శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।**
**స్మృతి భ్రంశాత్ బుద్ధినాశః బుద్ధి నాశాత్ ప్రణశ్యతి ॥** 63

తా॥ ఇంద్రియ విషయాలను గురించి సదా చింతించే పురుషునికి ఆ విషయాలతో సంగభావం కలుగుతుంది. సంగభావం వల్ల కోరిక కలుగుతుంది. కోరికవల్ల కోపము జనిస్తుంది. 62

తా॥ కోపం వల్ల అవివేకం (మోహం) కలుగుతుంది. అవివేకం వల్ల మతిభ్రమిస్తుంది. మతిభ్రమవల్ల బుద్ధి నశిస్తుంది. బుద్ధి నశించి పోవటంతో సర్వనాశనం కలుగుతుంది. 63

**వ్యాఖ్య :** భగవద్గీతలో ఈ రెండు శ్లోకాలను క్యాలెండర్ శ్లోకాలు అంటారు. పైన క్యాలెండర్ బొమ్మ ఉంటుంది. క్రింద తేదీలువేసిన స్లిప్‌లు ఉంటాయి. ప్రతి రోజూ తేదీ స్లిప్పును తీసేస్తే ఆ రోజు తేదీ కనిపిస్తుంటుంది. తేదీ మార్చినపుడల్లా ఈ రెండు శ్లోకాలను పఠిస్తే మంచి ప్రేరణ కలుగుతుందని వీటిని క్యాలెండర్





శ్లోకాలన్నారు. తేదీ స్లిప్పులు మార్చినా మారకుండా ఎప్పుడూ ఉండే బొమ్మలాంటివీ శ్లోకాలు అని మరొక భావం

మనస్సు విషయ వస్తువులను ధ్యానిస్తే ఎంత ప్రమోదమో ఈ రెండు శ్లోకాల్లో అద్భుతంగా చిత్రించారు. విషయాలు విషంకన్న ప్రమాదమన్నారు. ఎందుకంటే విషాన్ని త్రాగితేనే ప్రమాదం. కాని విషయాలను చూచినా, విన్నా, మనసులో తలచుకున్నా చాలు ఘోర ప్రమాదం కలుగుతుంది. ఎంత ప్రమాదమో – ఎలా ప్రమాదమో ఈ రెండు శ్లోకాలలో వివరిస్తున్నారు.

(i) **ధ్యాయతో విషయాన్ పుంసః** :– విషయాలను గురించి ధ్యానిస్తే – ధ్యానం అంటే ఒక వస్తువు గురించి పదేపదే ఆలోచించటం. అది భగవంతుని గురించి కావచ్చు, ఇహలోక పరలోక భోగాల గురించీ కావచ్చు, తక్షణ అవసరాల గురించీ కావచ్చు. అయితే ఇక్కడ విషయ ధ్యానం గురించే చెబుతున్నారు. ఇలా ఒక వస్తువును గురించి పదేపదే ఆలోచిస్తూ ఉంటే ఏం జరుగుతుంది?

(ii) **సంగస్తే షఉపజాయతే :–** ఆ వస్తువుతో అతడికి మానసికంగా సన్నిహిత సంబంధం ఏర్పడుతుంది. ఆ వస్తువుకు, తనకు మధ్య సన్నిహితత్వం – సంగభావం ఏర్పడుతుంది. అదే సంగం – ఎటాచ్‌మెంట్. అలా ఆ వస్తువుతో ఎప్పుడైతే సన్నిహిత సంబంధం – సంగభావం ఏర్పడిందో దానివల్ల–

(iii) **సంగాత్ సంజాయతేకామః :–** ఆ సంగభావం ముదిరి కోరిక అవుతుంది. సంగభావంలో ఆ వస్తువు నాకుంటే బాగుండు ననుకుంటాడు. ఇప్పుడు ఆ వస్తువు నాకు కావాలి అనుకుంటాడు. అది లేకపోతే ఎట్లా? అది లేకపోతే ఏం సుఖం ఉంటుంది? అసలు అది లేకపోతే ఈ బ్రతుకు బ్రతుకేగాదు అనుకుంటాడు. ఇదేకామం – కోరిక. ధ్యానం వల్ల సంగభావం – సంగభావం వల్ల కోరిక, నిజంగా ఈ మూడింటికి పెద్ద తేడా లేకపోయినా ధ్యానం, సంగభావం లేతగా ఉన్న స్థితి, కోరిక ముదిరిపోయిన స్థితి. **ఇంటిలోకి దొంగ జొరబడితే ఎంత అపకారం చేస్తాడో, ఒంటిలోకి కామం జొరబడితే అంతటి అపకారం జరుగుతుంది.** కామం మొలకగా ఉన్నపుడే జాగ్రత్తపడాలి. లేకపోతే అది తన మిత్రులను కూడా పిలుచుకొని వస్తుంది. అవే క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనేవి. ఇక కామం దేనికి దారితీస్తుంది?

(iv) **కామాత్ క్రోధోభిజాయతే :-** కోరిక కలిగినపుడు ఆ కోరికను తీర్చుకోవాలని – అంటే ఆ వస్తువును తెచ్చుకోవాలని లేదా భోగాన్ని అనుభవించాలని అనిపిస్తుంది. దానికెవరైతే అడ్డుతగులుతారో వారిపై కోపం వస్తుంది. తాను తలచిన కోరిక నెరవేరకపోతే కలిగేదే క్రోధం. క్రోధంతో మనసుయొక్క సమతూకం దెబ్బతింటుంది. పెదవులు అదురుతాయి. కళ్ళు ఎర్రబడతాయి. చిత్తం వికలమవు తుంది. ఆవేశం కట్టలు త్రెంచుకుంటుంది. యుక్తాయుక్తాలు మరచిపోతాడు. దానితో–

(v) **క్రోధాద్భవతి సమ్మోహః :–** సమ్మోహం కలుగుతుంది. అంటే ఇదిమంచి ఇదిచెడు అనిగాని, ఇది చేయదగినది ఇదిచేయదగనిది అనిగాని, ఇది అనవచ్చు ఇది అనకూడదు అనిగాని మరచిపోతాడు. వివేకాన్ని కోల్పోతాడు. ఇతడు తండ్రి, ఇతడు మిత్రుడు, ఇతడు సోదరుడు, ఈమె సోదరి అనే సంబంధాన్ని కూడా మరచిపోతాడు. దానివల్ల –

(vi) **స్మృతి విభ్రమః :–** స్మృతి – అంటే జ్ఞాపకశక్తి కూడా పోతుంది. దేన్ని జ్ఞాపకం పెట్టుకోవాలో దాన్ని మరచిపోతాడు. దేన్ని మరచిపోవాలో అది గుర్తుకొస్తుంది. ఇదీ స్మృతిభ్రంశం. **ఉత్తములైనవారు తాము ఇతరులకు చేసినసాయం మరచిపోతారు. ఇతరులు తమకు చేసిన అపకారాన్ని మరచిపోతారు. అలాగే తాము ఇతరులకు చేసిన అపకారాన్ని గుర్తుపెట్టుకుంటారు. అలాగే తమకు ఇతరులు చేసిన ఉపకారాన్ని గుర్తు పెట్టుకుంటారు.** అపుడే వారు ప్రశాంతంగా జీవిస్తూ ఉన్నతమైన జీవితాన్ని గడపగలుగుతారు. ఐతే క్రోధంతో ఊగిపోయేటప్పుడు అదంతా మారిపోతుంది. "విశ్వాస ఘాతకుడా! నీకు నేను ఎంత మేలుచేశాను?" అని అన్నీ ఏకరువు పెడతాడు. నీవు ఇదా నాకుచేసేది అని అతడు చేసిన ద్రోహాలను ఏకరవు పెడతాడు. దానితో –

(vii) **స్మృతి భ్రంశాత్ బుద్ధినాశః :–** అతడి బుద్ధి నాశనమవుతుంది. అంటే యోగ్యమైన బుద్ధి లేకుండా పోతుంది. బుద్ధికి ఫలం ప్రజ్ఞ. అది పడిపోతుంది. అంటే బుద్ధి నశించినవాడు గత ప్రజ్ఞుడౌతాడు. స్థిత ప్రజ్ఞుడికి వ్యతిరేకి గత ప్రజ్ఞుడు. ఇలా బుద్ధి నశించినవాని గతి ఏమిటి?

(viii) **బుద్ధి నాశాత్ ప్రణశ్యతి :** పూర్తిగా నాశనమైపోతాడు. చేయరాని పనులు చేసినవాడు ఎంతవరకు పతనం కావాలో అంతవరకు పతనమౌతాడు.





మెట్లమీద పడిన బంతి ఒక్కొక్క మెట్టుదిగి, ఎగురుకుంటూ ఎగురుకుంటూ వచ్చి చివరిమెట్టును కూడా దిగి, ఇంకా క్రిందికి పోవటానికి వీలుందేమోనని అటూఇటూ తిరిగి నిలచిపోయినట్లు పూర్తిగ పతనమైపోతాడు. ఇదంతా కేవలం విషయ వస్తువుల గురించి ధ్యానించటం వల్లనే అని గుర్తుచుకోవాలి.

గీతలో భగవానుడు విషయవస్తు చింతనవల్ల మెట్టు మెట్టుగ పతనంచెంది మానవుడెలా సర్వనాశనమైపోతున్నాడో తెలియజేయగా; భజగోవిందంలో శంకరాచార్యులవారు సత్సంగం వల్ల మెట్టుమెట్టుగ పైకిఎక్కి ఎలా జీవన్ముక్తిని – మోక్షాన్ని పొందగలరో చెప్పారు. సత్సంగం వల్ల నిస్సంగభావం, నిస్సంగత్వం వల్ల నిర్మోహత్వం, నిర్మోహత్వం వల్ల నిశ్చలమైన స్థితి, నిశ్చలతత్త్వం వల్ల జీవన్ముక్తి అని మోక్షమార్గాన్ని తెలియజేశారు.

ఇంతవరకు విషయవస్తు చింతనం వల్ల బుద్ధినాశనమై సర్వనాశనం ఎలా సంభవిస్తుందో 2 శ్లోకాల్లో తెలియజేసిన భగవానుడు ఈ ప్రమాదాన్ని ఎదుర్కొని బుద్ధికి నిశ్చలత్వాన్ని ఎలా సాధించాలో రెండు శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు.

**శ్లో॥ రాగ ద్వేష వియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాదమధి గచ్ఛతి ॥ 64**

**శ్లో॥ ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ 65**

తా॥ రాగద్వేషాల నుండి విడివడి,ఇంద్రియాలను తన వశంలో ఉంచుకొని, మనస్సును తన అధీనంలో ఉంచుకొని విషయాలలో సంచరిస్తున్నప్పటికీ అతడు ప్రశాంతంగానే ఉంటాడు. 64

తా॥ ప్రశాంతంగా ఉన్నప్పుడు అతడి సమస్త దుఃఖాలు నశిస్తాయి. ప్రసన్న చిత్తము గలవాని బుద్ధి త్వరలోనే నిలకడ గలిగినదై యుంటుంది. (అతడే స్థిరమైన ప్రజ్ఞ గలవాడు) **65**

**వ్యాఖ్య :** సర్కస్ ఎరీనాలో సింహాలు, పులులు, ఏనుగులు, గుర్రాలు మొదలైన జంతువులుంటాయి. వాటిమధ్య రింగ్ మాస్టర్ చేతిలో ఒక కర్రముక్కను పట్టుకొని, వాటిని అదిలించి, బెదిరించి వాటిచేత ఫీట్స్ చేయిస్తాడు. అలా చేయించటానికి అతడికి ఆధారం చేతిలోని కర్రముక్కే. అలాగే ఈ ప్రపంచం అనే ఎరీనాలో

ఇంద్రియ విషయాలనే పులులు, సింహాలు, ఏనుగులు ఎన్నో ఉన్నాయి. వీటన్నింటి మధ్య మానవుడు నివసిస్తున్నాడు. ప్రతి విషయ వస్తువు అతణ్ణి దెబ్బ తీయటానికే ప్రయత్నిస్తుంది. అయితే రింగ్ మాస్టర్ లాగా మానవుడు వాటిని అదుపులో ఉంచాలంటే అతడిచేతిలో కర్రముక్క ఉండాలి. ఏమిటీ కర్రముక్క?–

(1) విషయ వస్తువుల పట్ల రాగద్వేషాలు లేకుండుట. (2) ఇంద్రియాలను, మనస్సును స్వాధీనంలో ఉంచుకొనుట.

గుర్రాలను అదుపులో ఉంచగలిగి, గట్టిపగ్గం చేతిలో ఉంటే ఏ బండివాడైనా ఆ బండిని సక్రమంగా నడపగలడు. అందులోని ప్రయాణీకుడు ప్రమాదం లేకుండా చేరవలసిన గమ్యాన్ని చేరగలడు. అలాగే ఇంద్రియాలనే గుర్రాలను అదుపులో పెట్టుకొని, మనస్సనే గట్టి పగ్గాన్ని చేతిలో ఉంచుకుంటే ఈ శరీరమనే బండిని జీవుడు సక్రమంగా నడపగలడు. విషయ వస్తువులతో కూడిన ఈ ప్రపంచంలోనే హాయిగా సాగిపోయి లక్ష్యాన్ని చేరగలడు. అలా చేరేందుకే ఇక్కడ సూచనలు ఇస్తున్నారు.

(i) **రాగద్వేష వియుక్తైస్తు :–** విషయాలపై, వస్తువులపై, భోగాలపై, వ్యక్తులపై రాగద్వేషాలు విడిచిపెట్టాలి. వస్తువులను, విషయాలను, భోగాలను అనిత్యమైనవిగా భావించినపుడు వాటిపై రాగద్వేషాలుండవు. తటస్థంగానే ఉంటాం. నేను ఎంతదూరం వెళ్ళినా నా నీడ నన్ను అనుసరిస్తూనే ఉంటుంది. ఆ నీడ నాదే అయినప్పటికీ, దానిపై పంది బురదచల్లినా, ఎవరన్నా పూలుజల్లినా నాకు రాగంలేదు, ద్వేషంలేదు.కారణం అది కేవలం నీడ గనుక, మిధ్య గనుక.

(ii) **విధేయాత్మా :–** స్వాధీనంలో ఉన్న మనస్సు గలవాడు. సామాన్యుల కెవరికైనా మనస్సు విషయాల మీదకు వెళ్ళినప్పుడు అందితే ఆనందిస్తారు, అందకపోతే దుఃఖిస్తారు. అయితే మనస్సును స్వాధీనంలో పెట్టుకున్నవాడు అందినా అందకపోయినా నిర్లిప్తంగానే ఉంటాడు. ఇదే మనస్సు స్వాధీనంలో ఉండటం. అట్టివాడు దేనిని అనుభవించినా నిర్లిప్తంగానే అనుభవిస్తాడు.

(iii) **ఆత్మవశ్యైఃఇంద్రియైః :–** ఇంద్రియాలు విషయాలమీదకు వెళ్తున్నా, తన స్వాధీనంలో – అదుపాజ్ఞలలో ఉంచుకోగలిగినవాడే ఇంద్రియాల జంఝూటానికి తలవంచనివాడు. అట్టివాడు –





(iv) **విషయాన్ ఇంద్రియైఃచరన్ః :–** ఇంద్రియాలు విషయాలలో తిరుగుతున్నప్పటికీ నిర్లిప్తంగా ఉండగలుగుతాడు. విషయాలను ప్రపంచంలో లేకుండా చేయటం ఎవరికీ సాధ్యంకాదు. అలాగే ఇంద్రియాలను మూసివేయటం కుదిరేపనిగాదు. ఇట్టి స్థితిలో ఇంద్రియాలు విషయాలలో తిరుగుతున్నప్పటికీ దేనిపట్ల ఆసక్తిలేక నిర్లిప్తంగా ఉండగలగాలి. విషయాలు లభించనప్పుడు అవి నా అనుభవంలోకి రావలసిన విధిలేదు అనీ, ఒకవేళ లభించితే అవి భగవంతుని ప్రసాదమని స్వీకరించాలి. అట్టివాడే స్థిర ప్రజ్ఞ గలవాడు. అతడే –

(v) **ప్రసాదం అధిగచ్ఛతి :–** అట్టివాడు మనో నిర్మలత్వాన్ని, ప్రశాంతతను పొందుతాడు. ప్రసాదం అంటే మానసిక ప్రశాంతత – నిర్మలత్వం. అట్టి ప్రశాంతత – నిర్మలత్వం కలిగితే ప్రయోజనం?

(vi) **సర్వదుఃఖానాం హానిః ఉపజాయతేః :–** సమస్త దుఃఖాలు తొలగిపోతాయి. అసలు దుఃఖాలన్నీ మన ఆలోచనలే. మనస్సు ప్రశాంతంగా ఉంటే ఆలోచనలు ఉండవు. కనుక దుఃఖాలుండే వీలులేదు.

**అమృత సాగరాన్ని ఆపోసన పట్టినవాడికి ఆకలి దప్పులుంటాయా?** అలాగే ఆత్మ ప్రసాదం పొందినవాడికి – నిర్మలత్వాన్ని, ప్రశాంతతను పొందినవాడికి సాంసారిక దుఃఖాలుండవు. రాత్రిపూట ఆకాశం వేపుకు చూస్తూ పడుకుంటే అనేక నక్షత్రాలు మిణుకు మిణుకు మంటూ కనిపిస్తాయి. అయితే సూర్యుడు తూర్పున బయలుదేరితే చాలు అన్నీ మటుమాయం. అలాగే జీవితం ఉన్నంతకాలం అనేక దుఃఖాలు – జన్మ దుఃఖం, జరాదుఃఖం వ్యాధి దుఃఖం, మరణ దుఃఖం, ఇవిగాక మరెన్నో దుఃఖాలుంటాయి. అయితే ఆత్మజ్ఞానమనే సూర్యుడు ప్రవేశిస్తే చాలు అన్ని దుఃఖాలు మటుమాయం. అలా దుఃఖాలన్నీ తొలగి ప్రసన్నచిత్తుడైన వానికి ప్రయోజనం ఏమి?

**ఆశుబుద్ధిః పర్యవతిష్ఠతి :–** శీఘ్రమే అతడి బుద్ధి స్థిరత్వాన్ని చెందుతుంది. మనస్సు నిర్మలమైనపుడు ఇక ప్రాపంచిక వ్యామోహాలుండవు. అప్పుడు బుద్ధి స్థిరంగా – నిశ్చలంగా ఉంటుంది. అట్టి బుద్ధి ఆత్మజ్ఞానాన్ని చక్కగా గ్రహించి నిలబెట్టుకుంటుంది. బుద్ధిలోని జ్ఞానమంతా ఆత్మజ్ఞానమే. అంతా ఆనందమే. అంతా ప్రశాంతతయే. అట్టివాడే స్థిత ప్రజ్ఞుడు. స్థిరమైన ప్రజ్ఞగలవాడు. ఈ విధంగా బుద్ధియొక్క నిశ్చలత్వాన్ని సాధించాలి.

మనిషి విషయ ప్రపంచంలో తిరుగుతుంటాడు. అలా తిరగక తప్పదు. ప్రపంచంలోని విషయాలన్నీ మనిషికి షాక్ ఇస్తుంటాయి. ఆ షాక్ నుండి తప్పించుకోవాలి. ఎలా? కరెంటు పని చేసేవ్యక్తి ఎప్పుడూ జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే అతడిది షాక్ తగిలి ప్రాణానికి అపాయం కలిగే పని. అందుకే అతడు రబ్బరు తొడుగులు వేసుకొని పనిచేస్తూ ఉంటాడు. అలాగే ప్రతి మనిషీ ఈ విషయ ప్రపంచంలో తిరుగుతున్నప్పుడు షాక్‌లు తగలకుండా ఉండాలంటే రబ్బరు తొడుగులు వేసుకోవాలి. అవే విషయాల పట్ల రాగద్వేషాలు లేకుండుట; ఇంద్రియ మనో నిగ్రహం అనే తొడుగులు. ఈ తొడుగులతో స్వేచ్ఛగా సంచరించవచ్చు.

–ఐతే ఇట్టి ఇంద్రియ మనో నిగ్రహాలు లేనివాడి పరిస్థితి ఏమిటి? అతడికి కలిగే దుస్థితి ఏమిటి? తరువాతి 2 శ్లోకాల్లో తెలియ జేయబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్త స్య భావనా।**
**నచా భావయతః శాంతిః అశాంతస్య కుతస్సుఖం ॥ 66**

**శ్లో॥ ఇంద్రియాణాంహి చరతాం యన్మనో2ను విధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥ 67**

తా॥ నిగ్రహం లేనివానికి బుద్ధి స్థిరంగా నిలవదు. అట్టివానికి ఆత్మచింతన – ఆత్మధ్యానం కుదరదు. ఆత్మచింతన లేనివానికి శాంతిలేదు. శాంతిలేని వానికి సుఖంలేదు. **66**

తా॥ ఎందుకంటే విషయాలలో సంచరించే ఇంద్రియాలకు లోబడి మనస్సు కూడా వాటిని అనుసరిస్తే, నీటిలోని పడవను తుపాను గాలి ముంచి వేసినట్లు అతడి మనస్సు అతని ప్రజ్ఞను ముంచివేస్తుంది. **67**

**వ్యాఖ్య :** సుఖం కావాలి, సుఖం కావాలి అని తపించేవారికి ఇక్కడ చక్కని ఉపాయం తెలియజేయబడింది. సుఖం అంటే మనస్సు ప్రశాంతంగా ఉండటమే. ఆందోళనతో ఉన్న మనస్సే దుఃఖం. కనుక సుఖం కావాలంటే మనస్సు ఆందోళనలు లేకుండా ప్రశాంతంగా ఉండాలి. మనసు ప్రశాంతంగా ఉండాలంటే ఆత్మచింతన – ఆత్మధ్యానం చేయాలి. ఆత్మచింతన చేయాలంటే ముందుగా ఆత్మను గురించి శాస్త్రాల ద్వారా తెలుసుకోవాలి. అలా తెలుసుకోవాలంటే సద్గురు సన్నిధానంలో శ్రవణంచేసి మననంచేసి స్థిరపరచుకోవాలి. ప్రాపంచిక వస్తుచింతన





అశాంతి కలిగిస్తుంది. పరమాత్మచింతన వల్ల శాశ్వత చిత్తశాంతి కలుగుతుంది. అయితే ఈ ఆత్మచింతన అందరికీ సాధ్యమా? లేదు. ఎవరైతే సూక్ష్మమైన, శుద్ధమైన బుద్ధిని కలిగి ఉంటారో వారికే సాధ్యం. ఏవో సినిమా కథలో, పురాణ కథలో వినటానికి బుద్ధి సూక్ష్మత అవసరంలేదు. కాని పరమాత్మ తత్త్వం తెలియాలంటే – ఆత్మ విచారణ చేయాలంటే – ఆత్మజ్ఞానం కలగాలంటే బుద్ధి సూక్ష్మంగా ఉండాలి. మరి బుద్ధిసూక్ష్మంగా ఎప్పుడుంటుంది? ఇంద్రియాలు, మనస్సు కలిసి ఇష్టం వచ్చినట్లు విషయ వస్తువుల వెంట పరుగులు తీయకుండా ఉన్నప్పుడే. అంటే ఇంద్రియ, మనో నిగ్రహం ఉంటేనే బుద్ధి సూక్ష్మత. ఇంద్రియ మనో నిగ్రహం లేనివాడే అయుక్తుడు. అట్టి అయుక్తునికే బుద్ధి స్థిరంగా ఉండదు. అన్నింటిమీదకు పరుగులు తీస్తుంది. కనుకనే అతడు ఆత్మచింతన చేయలేడు, ఆత్మ ధ్యానంలో నిలవలేడు. అప్పుడు మనసు శాంతంగా ఉండదు. “శాంతమూ లేక సౌఖ్యమూ లేదు” అన్నట్లు శాంతిలేని వానికి సుఖం ఉండదు.

ఆత్మ సాక్షాత్కారాన్ని బోధించే హిందూ వాఙ్మయంలో– అవి ఉపనిషత్తులు కానివ్వండి, బ్రహ్మ సూత్రాలు కానివ్వండి, భగవద్గీత కానివ్వండి – అన్నింటిలోను ఈ మనో నిర్మలత్వం, బుద్ధి సూక్ష్మత గురించి నొక్కి చెప్పటం జరిగింది. అది ఎందుకో ఈ శ్లోకంలో వివరించారు.

ఎప్పుడూ విషయాలలో సంచరించే ఇంద్రియాలకు మనస్సు వశమైపోయిందా – ఇక అతడి బుద్ధి – ప్రజ్ఞ నశించిపోతుంది. అతడు స్థితప్రజ్ఞుడుగాక గత ప్రజ్ఞుడైపోతాడు.

మానవునికి గల ముఖ్య ఉపకరణాలు 3. అవి: 1. ఇంద్రియాలు, 2. మనస్సు, 3. బుద్ధి – ఈ మూడు ఒకే కుటుంబం. **ఇంద్రియాలు అంటే పిల్లలు, మనస్సు అంటే తల్లి, బుద్ధి అంటే తండ్రి.** వీరి మధ్య జరిగే విచిత్రమైన కథయే మనకు జ్ఞానోదయం కలిగిస్తుంది. జ్ఞానేంద్రియాలనే పిల్లలు అన్ని బజార్లలో తిరుగుతూ ఒకడు దేనినో చూస్తాడు (కన్ను), మరొకడు దేనిగురించో వింటాడు (చెవి), మరొకడు దేనినో రుచిచూసి అబ్బా! అనుకుంటాడు (నాలుక), మరొకడు ఏదో సువాసనను పసిగట్టి ఆకర్షింపబడతాడు (ముక్కు), మరొకడు స్పర్శ సుఖాన్ని అనుభవించి ఆనందపరవశుడౌతాడు (చర్మం).

ఇంద్రియాలనే ఈ ఐదుగురు పిల్లలు మనస్సు అనే తల్లి వద్దకు వచ్చి వారు చూసిన, విన్న, తిన్న, వాసన చూసిన, స్పర్శించిన విషయాల గురించి, వస్తువుల గురించి, భోగాల గురించి ఏకరువు పెడతారు. అమ్మా! ఇది నాకు కొనిపెట్టు, అమ్మా! మనం దాన్ని తెచ్చుకుందాం, అమ్మా! ఇది లేకుండా ఇప్పుడెవరుంటున్నారు? అని చెవిక్రింద జోరీగలాగ చేరి మారాం చేయటంతో ఆ తల్లి వారి కోర్కెలను తీర్చాలని నిశ్చయించుకుంటుంది. అందుకోసం బుద్ధి అనే భర్త వద్దకెళ్ళి ఏమండీ! మనం ఫ్రిజ్ తెచ్చుకుందాం, ఎ.సి. కూడా ఉంటే ఎండాకాలం హాయిగా గడిచిపోతుంది అని రెండుమూడు కోర్కెలను బయటపెడుతుంది. వివేకం గల ఆ భర్త భార్యతో మన దగ్గర ఉన్న డబ్బు ఎంత? మన ఆదాయమెంత? ఇవి కొనటం మనకెలా సాధ్యం? ఒకవేళ అప్పుచేసి కొన్నా వడ్డీ ఎంతవుతుంది? కరెంటు ఖర్చు ఎంతవుతుంది? అని లెక్కలు చెబుతాడు. ఆయన మాటలలోని నిజాయితీని గుర్తించి, సరేనని ఆగిందా ఫరవాలేదు. అలాగాక 'నీవెప్పుడూ ఇంతే! పెళ్ళాం పిల్లల్ని సుఖపెట్టాలని లేదు. నీకు డబ్బు వచ్చేదెప్పుడు? వాటిని కొనేదెప్పుడు? మేం సుఖపడేదెప్పుడు? అని ఏడ్చి, గోలచేసి, అలిగి, అన్నం తినకుండా నిరాహారదీక్ష చేబడితే పాపం ఆ భర్త అప్పో సప్పోచేసి, ఉద్యోగస్తుడైతే లంచాలు పట్టి ఎలాగో తెస్తాడు. ఆ తర్వాత కష్టాల్లో కూరుకుపోతాడు.

ఈ మొత్తం వ్యవహారంలో ఇంద్రియాలు (పిల్లలు) ఎప్పుడూ బాహ్యంగా పరుగులెత్తి విషయాలలో సంచరిస్తుంటాయి. బుద్ధి (భర్త) స్థిరంగా, నిశ్చలంగా వివేకంతోఉ ఒడేది. మనస్సు మాత్రం (తల్లి) అటు బుద్ధికి – ఇటు ఇంద్రియాలకు మధ్య ఉ ఒటుంది. ఇది బయటకూ పరుగెత్తవచ్చు. లోపలనే ఉండవచ్చు. బుద్ధి చెప్పినట్లు విని బుద్ధిగా ఉండవచ్చు. ఇంద్రియాలు చెప్పినట్లు విని వాటితో పాటుగ ఊరేగనూవచ్చు.

ఈ విషయాన్నే ఈ శ్లోకంలో చెబుతున్నారు. ఎప్పుడూ విషయాల వెంటబడి పరుగులెత్తే ఇంద్రియాలకు లోబడిపోయి మనస్సు వాటివెంట పరుగులెత్తితే ఇక అతడి ప్రజ్ఞ (బుద్ధి) అస్థిరమై, అశాంతితో అలమటించిపోవాల్సిందే అని. దానికే ఒక ఉపమానం కూడా చెబుతున్నారు. సముద్రంలో ప్రయాణించే ఓడను తుపానుగాలులు ఎట్లా ముంచివేస్తాయో అలాగే అట్టివాని ప్రజ్ఞను ఈ ఇంద్రియాలకు





లొంగిన మనస్సు అనే తుపానుగాలి ముంచివేస్తుంది అని.

–కనుక ఓ అర్జునా! ఇది తెలుసుకొని ఎలా నడుచుకుంటావు?–

**శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68**

తా॥ అందువల్ల ఓ మహాబాహుడా! ఎవరియొక్క ఇంద్రియాలు విషయ వస్తువుల నుండి అన్ని విధాలుగా నిగ్రహింపబడతాయో అట్టివాని ప్రజ్ఞ (జ్ఞానం) యే స్థిరంగా ఉంటుంది.

**వ్యాఖ్య :** "ఓ అర్జునా! నీవు గొప్ప బాహువులు గలవాడవు. యుద్ధంలో నీ బాహుబలం ఎంతటిదో చూపగలవు. కాని అర్జునా! నీ శక్తి చూపించాల్సింది యుద్ధంలోనేగాదు. నీలో ఉన్న ఇంద్రియాలపై కూడా యుద్ధంచేసి వాటిని కూడా లొంగ దీసుకుని నీ అధీనంలో ఉంచుకోవాలి.ఎందుకంటే ఎవరైతే విషయ వ్యామోహాలలో పడిపోనీయకుండా ఇంద్రియాలను సంపూర్ణంగా నిగ్రహించి తమ స్వాధీనంలో పెట్టుకుంటారో అట్టి వారి బుద్ధియే స్థిరబుద్ధి. అతడి ప్రజ్ఞయే స్థిరమైనది. అతడే స్థితప్రజ్ఞుడు.కనుక నీవు కూడా 'సర్వశః'– అన్నివిధాలా ప్రయత్నించి ఇంద్రియాలను నీ స్వాధీనంలో ఉంచుకో" దీనిని బట్టి స్థిత ప్రజ్ఞుడెవరయ్యా అంటే అన్ని ఇంద్రియాలను సంపూర్ణంగా నిగ్రహించగలవాడేనని తేలిపోయింది.

58వ శ్లోకంలో తాబేలు తన అవయవాలను లోపలకు ముడుచుకొనే ఉపమానాన్ని చెబుతూ 'ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా' అంటూ ప్రారంభించి, ఇప్పుడీ 68వ శ్లోకంలో కూడా అదే వాక్యంతో ముగిస్తున్నారు. అంటే 58 నుండి 68 వరకు ఉన్న శ్లోకాలన్నీ ఇంద్రియ నిగ్రహానికి సంబంధించినవేనన్నమాట. అంటే ఇది ఇంద్రియ నిగ్రహ ప్రకరణం. ఉపక్రమ ఉపసంహారాలు రెండూ ఒకే వాక్యంతో చెప్పటం వ్యాసుని నైపుణ్యం.

–ఇంత వరకు ఇంద్రియ నిగ్రహానికి ఆధ్యాత్మిక రంగంలో గల ప్రాధాన్యతను నొక్కి చెప్పిన భగవానుడు ఇప్పుడు సామాన్యుల దృష్టికి స్థితప్రజ్ఞుని దృష్టికిగల భేదాన్ని గూఢంగా తెలియజేయబోతున్నాడీ శ్లోకంలో –

**శ్లో॥ యానిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సానిశాపశ్యతో మునేః ॥ 69**

తా॥ సమస్త ప్రాణులకు ఏది రాత్రియో ఇంద్రియ నిగ్రహముగల యోగి (సంయమి) అందులో మేలుకొని ఉంటాడు. దేనియందు ప్రాణులు మేలుకొని ఉంటాయో అది ఆత్మావలోకనంలో ఉన్న మునులకు రాత్రి యగుచున్నది.

**వ్యాఖ్య :–** ఇది అలంకార భాషలో చెప్పబడ్డ గ్రంధి శ్లోకం. దీనినివిరోధ భాసాలంకార మంటారు.

'అందరూ నిద్రించేటప్పుడు స్థిత ప్రజ్ఞుడు మేలుకొని ఉంటాడు'

'అందరూ మేలుకొని ఉన్నప్పుడు స్థితప్రజ్ఞుడు నిద్రపోతాడు'.

–ఇది అక్షరార్థం. అక్షరార్థాన్ని మాత్రమే గ్రహిస్తే అంతా అవకతవకయే. కనుక లక్ష్యార్థాన్ని, సూక్ష్మార్థాన్ని, గూఢార్థాన్ని గ్రహించాలి.

రాత్రిళ్ళు మేలుకొని పగలు నిద్రించే వారంతా స్థిత ప్రజ్ఞులైతే దొంగలు, పేకాటరాయుళ్ళు, గస్తీ తిరిగే గూర్ఖాలు, రాత్రి డ్యూటీచేసే స్టేషన్ మాస్టర్లు – వీరంతా స్థితప్రజ్ఞులు కావాల్సిందే. కనుక అక్షరార్థం తీసుకోరాదు.

సామాన్యులకు స్థితప్రజ్ఞులకు తేడా బయట కనిపించే విషయంలో కాదు. భావంలో తేడా, దృష్టిలో తేడా. ఒకరిది భోగజీవితం, మరొకరిది యోగజీవితం. ఈ శ్లోకంయొక్క అసలైన అర్థాన్ని – లక్ష్యార్థాన్ని ఇలా తీసుకోవాలి. **అందరూ ఏ విషయంలో నిద్రిస్తారో స్థితప్రజ్ఞుడు ఆ విషయంలో మేలుకుంటాడు. అందరూ ఏ విషయంలో మేలుకుంటారో జ్ఞాని ఆ విషయంలో నిద్రిస్తాడు.**

(i) **యానిశాసర్వభూతానాం :–** అందరూ ఏ విషయంలో నిద్రిస్తారో – సామాన్యులందరూ ఇంద్రియ నిగ్రహం, ఆత్మజ్ఞానం, జపధ్యానాది సాధనలు, ఆత్మ సాక్షాత్కారం మొదలైన విషయాలను తెలుసుకోరు, తెలుసుకోవాలనే కుతూహలాన్ని కూడా చూపరు.కనుక వారి దృష్టిలో ఇవి లేనట్లే. అందువల్ల ఈ పరమార్థ విషయాలలో వారు నిద్రిస్తున్నట్టే. అదే 'యానిశా సర్వ భూతానాం' అని చెప్పినది.

(ii) **తస్యాం జాగర్తి సంయమీ :–** స్థిత ప్రజ్ఞుడు ఆ విషయాలలో మేలుకుంటాడు. నిరంతరము దైవచింతన, ఆత్మజ్ఞానం, విచారణ, జప ధ్యానాలతో ఆత్మానుభూతికై తపిస్తూ ఉంటాడు ఇంద్రియ నిగ్రహపరుడైన(సంయమి) స్థితప్రజ్ఞుడు. అందువల్ల ఈ పరమార్థ విషయాల్లో అతడు మేలుకొని ఉన్నట్లే. అదే 'తస్యాం జాగర్తి సంయమీ' అని చెప్పినది.





ఇలా సామాన్యులకు దైవ విషయాలు పట్టవు గనుక అవి వారికి రాత్రి. ఇంద్రియ నిగ్రహపరులైన స్థితప్రజ్ఞులు నిరంతరమూ దైవ విషయాలను విస్మరించరు గనుక అది వారికి పగలు. అలాగే–

(iii) **యస్యాం జాగ్రతి భూతాని :–** అందరూ ఏ విషయాలలో మేలుకుంటారో – సామాన్యంగా లోకంలో అందరూ సంపాదించుకోవటం, అనుభవించటం, తనవారిని పోషించటం, పదవులు, కీర్తి ప్రతిష్ఠలు, ప్రపంచంలోని ఆకర్షణలు మొదలైన అనేక విషయాల గురించే నిరంతరం ఆలోచిస్తూ – ఇదే తమ ప్రధాన కర్తవ్యంగా భావిస్తారు. అంటే సామాన్యులంతా ఈ ప్రాపంచిక విషయాలలో మేలుకుంటారు.

(iv) **సానిశా పశ్యతో మునే :–** అదే విషయం మహాత్ములకు రాత్రి. అంటే ఆ విషయాల్లో వారు నిద్రిస్తారు. అంటే స్థిత ప్రజ్ఞులకు ఈ ప్రాపంచిక విషయాలు పట్టవు. అందుకే వారికిది రాత్రి.

అంటే సామాన్యులైనవారు నిరంతరం ప్రాపంచిక విషయాలలో ఉండటం వల్ల వారికి ఆ విషయాలు పగలు. అదే స్థితప్రజ్ఞునికి అవి పట్టవుగనుక అతడికి ఆ విషయాలు రాత్రి. ఇదీ సామాన్యులకు, స్థిత ప్రజ్ఞునికి గల దృష్టిభేదం.

–స్థిత ప్రజ్ఞునికి శాంతి అనేది స్వభావ సిద్ధమేనని అద్భుత ఉపమానం ద్వారా...

**శ్లోకం॥ ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।**
**తద్వత్ కామాయం ప్రవిశంతి సర్వే సశాంతి మాప్నోతి నకామకామీ ॥**
**70**

తా॥ పరిపూర్ణంగా నీటితో నిండి, స్థిరమైన ఉనికి గల సముద్రాన్ని ఏ ప్రకారంగా నీరు చేరుకుంటున్నదో అలాగే ఎవరిలో సర్వకామనలు ప్రవేశించి విలీనమైపోతున్నాయో అతడే శాంతిని పొందుతాడు. కామదాసునికి ఆ అవకాశం లేదు.

**వ్యాఖ్య :** శాంతిని స్వభావ సిద్ధంగానే – ఏ ప్రయత్నం లేకుండానే ఎవరు పొందగలరో ఈ శ్లోకం ఉపమానంతో సహా తెలియజేస్తున్నది.

సముద్రం అపార జలరాశి. ఎంతో లోతు. గంభీరంగా ఉంటుంది. ఎండ వేడికి సముద్రపు నీరు ఆవిరై మేఘాలుగా ఏర్పడతాయి. అయినా సముద్రం ఒక్క అంగుళం తగ్గదు. అనేక నదుల నీరు నిరంతరం సముద్రంలోకి ప్రవహిస్తూ ఉంటుంది.

అయినా ఒక్క అంగుళం పెరగదు. ఒకే హద్దులో నిశ్చలంగా ఉంటుంది. అనేక రుచులు, రూపాలలో ఉన్న నీరు పరుగులు తీసుకుంటూ తనలోకి ప్రవహిస్తుంటే అంతటినీ తనలో కలుపుకొని ఒకే రుచినిచ్చి, ఒకే రూపాన్నిచ్చి, ప్రశాంతంగా ఉంటుంది.

అలాగే స్థితప్రజ్ఞుడు కూడా అచల ప్రతిష్ఠుడు – స్థిరంగా ఉండేవాడు. ప్రారబ్ధవశాత్తు అతడిలోకి అనేక శబ్దాది విషయాలు వచ్చి చేరుతుంటాయి. అయినా వాటికి పొంగడు, క్రుంగడు. అతడికి ఏ వికారమూ ఉండదు. అన్ని కోరికలు అతడిలో లీనమైపోతాయి. కోరిక ఉంటేనే తీరటం, తీరకపోవటం – దానివల్ల సంతోషం, దుఃఖం. అసలు కోరికే లేకపోతే ఏ అలజడీ ఉండదు. నదులు సముద్రాన్ని చేరి శాంతించినట్లు కోరికలు అతణ్ణి చేరి శాంతిస్తాయి. కనుక అతడెప్పుడూ ప్రశాంతంగానే ఉంటాడు.

కాని కామదాసుడు – కోరికలకు దాసుడైనవాడు ఎన్నటికీ శాంతిని పొందలేడు. చిన్న చిన్న చెరువులు, కుంటలు వర్షాకాలం వచ్చినప్పుడు నీరుబాగా చేరి గట్లు తెంచుకొని ప్రవహిస్తాయి. ఎండాకాలంలో నీరు చుక్కలేకుండా ఎండిపోతాయి. అలాగే సామాన్యులు భోగ్య వస్తువులు, విషయాలు చేరుతున్నకొద్దీ ఆనందంలో పొంగిపోతూ, అవి లభించనప్పుడు, కోరిన కోరికలు తీరనప్పుడు క్రుంగిపోతు ఉంటారు. వారికి ప్రశాంతత అనేది ఉండదు. ఎప్పుడూ వికారాలతో ఉంటారు. కనుకకోరికలు లేనివాడే ప్రశాంతతను పొందగలడు అనే విషయం స్పష్టం.

'ప్రజహాతి యదా కామాన్' అంటూ కోర్కెలు పూర్తిగా విడిచినవాడే స్థిత ప్రజ్ఞుడని వర్ణన ప్రారంభించిన భగవానుడు 'సశాంతి మాప్నోతి నకామకామీ' అంటూ కోర్కెలు విడిచినవాడే శాంతిని పొందగలడని ముగిస్తున్నాడు.

–ఇదే భావాన్ని స్పష్టంగా, ఒక సిద్ధాంతంగా తెలియజేయబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।**

**నిర్మమో నిరహం కారః సశాంతి మధి గచ్ఛతి ॥ 71**

తా॥ ఎవరైతే సమస్త కోరికలను విడిచి, అహంకార మమకారాలు వదలి, ఆశలేనివాడై సంచరిస్తున్నాడో అట్టి పురుషుడు పరమశాంతిని పొందుతున్నాడు.

**వ్యాఖ్య :** శాంతిని పొందాలంటే మనస్సులో అలజడి, ఆందోళన, ఆరాటం





లేకుండా ఉండాలి. ఆరాటం కలిగించేవే కోరికలు. వాటిపై సంగభావమే అహంకార మమకారాలు. అవి విడిచిపెడితే శాంతియే. అయితే–

(i) **సర్వాన్ కామాన్ విహాయ :** ఏవో కొన్ని కోరికలను విడిచిపెట్టడంకాక అన్ని కోరికలను విడిచిపెట్టాలి. ఏమాత్రం కోరికలు మిగిలినా అవి మనస్సును ఆరాటపెడతాయి. ఆందోళన కలిగిస్తాయి.

(ii) **నిర్మమో నిరహంకారః :–** అహంకారమంటే 'నేను', మమకారమంటే 'నాది'. నేను ఈ దేహాన్ని అనుకున్నప్పుడు దేహానికి చెందినవి నావి అవుతాయి. ఎప్పుడైతే కొన్నింటిని నావి అనుకున్నామో వాటికేదైనా కష్టం, నష్టం వాటిల్లితే బాధ, దుఃఖం. వాటికి మంచి జరిగితే సుఖం, ఆనందం. సామాన్యులంతా దేహమే నేను అనే అహంకారంలో ఉంటారు. స్థిత ప్రజ్ఞుడు తాను ఆత్మ స్వరూపుణ్ణి అనే నిశ్చయజ్ఞానంలో ఉంటాడు. అంటే నిరహంకారిగా ఉంటాడు. నిరంహకారికి నాది అనే మమకారం ఉండదు. ఈ అహంకార మమకారాల వల్లనే యుద్ధ ప్రారంభంలో అర్జునుడు విషాదంలో మునిగిపోయాడు. స్థితప్రజ్ఞుడు అహంకార మమకారాలు వదిలినవాడు.

(iii) **నిస్పృహః :–** కోరికలను విడిచినా వాటిపై ఆసక్తి, ఆశ మనస్సులో ఉంటే మళ్ళీ మళ్ళీ స్ఫురణకు వస్తాయి. అలా వాటిని స్మరించామా? క్రమంగా అన్నీ చేరి సర్వనాశనం చేస్తాయి. కనుక కోరికలకు సంబంధించిన ఆసక్తి – స్పృహ ఏ మాత్రం ఉండరాదు. అదే నిస్పృహ. నిస్పృహ ఉంటే నిర్లిప్తంగా ఉండగలుగుతాడు. ఈ లక్షణాలు గలవాడే పరమశాంతిని పొందుతాడు.

ఈ శ్లోకంపై **శంకరాచార్యులవారు** తమ **గీతా భాష్యంలో** ఇలా అన్నారు: **"ఎవరైతే తాను జీవించటానికి కావలసిన ముఖ్య అవసరాలతో తృప్తి చెందుచున్నాడో, ఎవరు అటువంటి జీవాధార విషయాలను కూడా తనవికాదు అని భావిస్తాడో, ఎవడు తాను ఒక జ్ఞానిని – అనే అభిమానాన్ని కూడా విడిచిపెడతాడో – అట్టి సన్యాసి – స్థిత ప్రజ్ఞుడు – బ్రహ్మజ్ఞాని సంసార సాగరాన్ని దాటి నిర్వాణాన్ని పొందుతాడు. క్లుప్తంగా చెప్పాలంటే అతడు బ్రహ్మమే. బ్రహ్మైవభవతి.**

–అట్టి బ్రహ్మస్థితిని, బ్రాహ్మీస్థితిని చివరి శ్లోకంలో వివరించబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ ఏషా(బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి ।**
**స్థిత్వా2స్యా మంత కాలే2పి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥** 72

తా॥ పార్థా! ఇదే బ్రాహ్మీ స్థితి. ఈ స్థితిని పొందిన తర్వాత ఇక మోహంచెందదు. అంత్య కాలంలో కూడా ఈ స్థితిలో నిలిస్తే అతడు బ్రహ్మ నిర్వాణాన్ని – బ్రహ్మైక్యాన్ని – మోక్షాన్ని పొందుతాడు.

**వ్యాఖ్య : (i) ఏషాబ్రాహ్మీస్థితిః** :– అన్ని కోరికలను పూర్తిగా విడిచి, భోగ్య వస్తువులపై ఆశను వీడి; నిష్కామ కర్మయోగం ద్వారా సమత్వబుద్ధిని, అసంగ బుద్ధిని అలవరచుకొని; విషయ వాసనలన్నింటిని హృదయం నుండి పారద్రోలి; దేహమే నేను – అనే అహంకారాన్ని విడిచి; దేహానికి సంబంధించినవి నావి – అనే మమకారాన్ని విడిచి ఎవరు తన నిజస్వరూపాన్ని – ఆత్మస్థితిని ఒక్క క్షణం కూడా మరువకుండా ఉంటారో; అట్టి స్వరూప జ్ఞాన స్థితినే **'బ్రాహ్మీ స్థితి'** అన్నారు. ఇదే జీవుడు బ్రహ్మముతో ఏకమైన జీవ బ్రహ్మైక్య స్థితి. ఇప్పుడు జీవుడు – దేవుడు – అని ఇద్దరు లేరు. ఏకం – అద్వయం, ఇట్టి బ్రాహ్మీస్థితిని పొందటం కొరకే మానవజన్మ వచ్చింది. ఒక్కసారి ఈ స్థితిని పొందితే –

**(ii) నైనాం ప్రాప్య విముహ్యతి** :– మళ్ళీ ఎప్పటికీ మోహపరవశుడు కాడు. అతడికి ఎట్టి కోరికలుండవు. అసలు తానొక వ్యక్తినని భావించడు. తన స్వరూపంలోనే తానుంటాడు. కోరికలు, వాసనలు అతణ్ణి చేరి అణగారిపోతాయి. శరీరాన్ని వదిలే సమయంలో కూడా అతడు చలించడు.

**(iii) స్థిత్వా అస్యాం అంతకాలే2పి :– అంత్య కాలంలో కూడా ఈ స్థితిలో నిలిస్తే బ్రహ్మ నిర్వాణమే.** అంత్య కాలంలో నిలిస్తే సరిపోతుంది గదా! అనుకుంటారు కొందరు. అలా నిలవాలన్నా ఒక్కసారిగా నిలువగలిగే స్థితికాదు ఈ బ్రాహ్మీస్థితి. ఎన్నో జన్మల సాధన ఉండాలి. సాధనలన్నీ దేహమనో బుద్ధులు చక్కగా పనిచేసేటప్పుడే సాధ్యం. అంత్యకాలంలో చూద్దాం అనుకుంటే అసలా అంత్యకాలం ఎప్పుడో ఎవరికి తెలుసు? శరీరావయవాలు బాగా పనిచేస్తాయనే నమ్మకం ఏముంది? కనుక సాధన బాల్యంలోనే సాగించాలి. లేదా యౌవనంలో నన్నా ప్రారంభించాలి. అప్పుడే అతడు లక్ష్యాన్ని చేరుకోగలడు.

**(iv) బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి :–** ఇలా సాధనలు సాగించి, ఆత్మస్థితిలో – స్వస్థితిలో నిలిచి, మరణ సమయంలో కూడా ఆ స్థితిలో నిలిస్తే అతడు బ్రహ్మమే అవుతాడు. అదేమోక్షం. అదే జన్మరాహిత్యం. అదే బ్రహ్మానంద స్థితి. అదే బ్రహ్మ నిర్వాణం. అదే మానవ జీవిత పరమలక్ష్యం – కనుక

**నిష్కామ కర్మ యోగం ద్వారా చిత్తశుద్ధి గలిగి, తద్వారా ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆత్మలో నిలిచిపోవటం ద్వారా స్థితప్రజ్ఞుడై, చివరకు బ్రహ్మ నిర్వాణాన్ని – మోక్షాన్ని పొందాలి.**

**గద్యం :– ఓం తత్ సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే, సాంఖ్యయోగో నామ, ద్వితీయోధ్యాయః**

ఈ ప్రకారంగా ఉపనిషత్తులసారము, బ్రహ్మ విద్యా ప్రతిపాదితము, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జునుల సంవాద రూపమైన భగవద్గీతయందు సాంఖ్యయోగమను పేరుగల రెండవ అధ్యాయం సమాప్తం.

పవిత్రమైన, జ్ఞాన స్వరూపమైన,అద్వితీయమైన ద్వితీయ అధ్యాయాన్ని – మొత్తం భగవద్గీత యొక్క సారమైన అద్భుత అధ్యాయాన్ని ముగిస్తున్నాం.

## కృతజ్ఞతలు

నాతో ఏ మాత్రం పరిచయం లేనప్పటికీ నేను రచించిన 'కర్మ సిద్ధాంతం' మరియు శంకరాచార్యుల వారి 'భజగోవిందం' గ్రంధాలను చదివి, స్పందించి ఒక సత్కార్యములో పాలు పంచుకోవాలని భావించి, రూ.30,000/- విరాళంగా పంపించి ఈ భగవద్గీత గ్రంధ ముద్రణకు సహకరించిన హైదరాబాద్ వాస్తవ్యులు

**శ్రీ బందా బాలగోపాలకృష్ణశర్మ గారికి**

వారి కుమారులు

**శ్రీ విజయ్ కుమార్**

**శ్రీ రవి శంకర్** గార్లకు

నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. వారికి సదా భగవానుని దివ్య ఆశిస్సులు లభించగలవని ఆశిస్తూ ....

శ్రీ దేవిశెట్టి చలపతిరావు
గ్రంధ వ్యాఖ్యాత



గీతా
జయంతి
సందర్భంగా
18 రోజుల
కార్యక్రమ
ప్రారంభం



గురు
పూర్ణిమ
సందర్భంగా
పూర్ణకుంభ
స్వాగతం



గురుదేవుల
జన్మదినోత్సవ
సందర్భంగా
కనకాభిషేకం

# భగవద్గీత

***(3, 4, 5 అధ్యాయములు)***

**కర్మయోగం, జ్ఞానయోగం, కర్మ సన్యాసయోగం**




వ్యాఖ్యాత :

మహాభారత పరిశోధకులు,

ప్రముఖ వేదాంతోపన్యాసకులు,

ఆధ్యాత్మిక జ్ఞానపీఠం వ్యవస్థాపకులు,

'జ్ఞానప్రపూర్ణ' **శ్రీ దేవిశెట్టి చలపతిరావు** B.Sc., (Ag)

ముద్రణ : 2014

ప్రచురణ కర్త:

**ఆధ్యాత్మిక జ్ఞానపీఠం**

చిలకలూరిపేట.

వెల : అమూల్యం

ప్రింటింగ్ :

**శ్రీ భగవాన్ ప్రింటర్స్**

సూర్యారావుపేట, విజయవాడ-2

ఫోన్ : 94407 82996

ప్రతులకు

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

23-141, సాలిపేట,

చిలకలూరిపేట - 522616,

ఫోన్ : 08647-254716

సెల్ : 8008539770

**శ్రీ సత్యసాయి ధ్యానమండలి**

**Srii Sathya Sai Dhyaanamandali**

(అంతర్జాతీయ ఆధ్యాత్మిక మరియు పరిశోధనా సంస్థ)

డోర్ నెం 29-28-23, విక్రాంత్ బిల్డింగ్స్, దాసరి వారి వీధి,

సూర్యారావుపేట, విజయవాడ-02,

ఫోన్ : 9849725540

website : www.srisatyasaidhyanamandali.org



# సందేశం

**పూజ్యశ్రీ భిక్షమయ్య గురూజీ**

శ్రీ సత్యసాయి ధ్యానమండలి

**"జంతూనాం నరజన్మ దుర్లభం"** అనేది జగమెరిగిన సత్యం. మానవుని దేహం, మెదడు, అందలి పదార్ధం సూక్ష్మాతిసూక్ష్మంగా వుండి వివేచన, విచక్షణ, విశ్లేషణ, విచారణ, విజ్ఞతలతో తనను గురించి, విశ్వాన్ని గురించి లోతుగా అధ్యయనం చేయగలిగేటట్లుగా నిర్మితమై వుంది. ప్రపంచ దేశాలన్నీ నాగరికంగా వెనుకబడి ఆటవిక జీవితాన్ని కొనసాగిస్తున్నప్పుడే భారతదేశమందలి ఆర్యులు మానవుని మేధస్సులో వుత్పన్నమయ్యే అనేక చిక్కు ప్రశ్నలకు స్పష్టమైన సమాధానాలను కనుగొని ప్రపంచానికి వెల్లడించడం జరిగింది. నేను ఎవరు? నేను ఎక్కడి నుండి వచ్చాను? తిరిగి ఎందులో లయమైపోతాను? ఈ చరాచర జగత్తు ఆవిర్భవించడానికి ఆధారమేమిటి? మానవ జీవిత పరమార్ధమేమిటి? ఇటువంటి అతి కీలకమైన అంశాలకు స్పష్టమైన సమాధానాలను అందించగలిగేవే **వేదాలు,** వాని చివరి అంశాలే **ఉపనిషత్తులు.** అటువంటి వేదములను క్రోడీకరించి ప్రపంచానికి కానుకగా సమర్పించిన ఘనత **శ్రీవేదవ్యాసునిదే.** అందుకే ఆ పరిపూర్ణుని పేరు మీద **వ్యాసపౌర్ణమి**ని భక్తి శ్రద్ధలతో జరుపుకుంటాం. అయితే వేదాలన్నీ ముడిరూపంలో సామాన్యులు అర్థం చేసుకునే రీతిలో లేనందు వలన మానవులలో ధర్మపరిరక్షణకై పురాణాలు, ఇతిహాసాలు వెలుగులోనికి వచ్చాయి. వానిలో అతి కీలకమైంది మహాభారతం. అందుకే దీనిని పంచమవేదమన్నారు. అటువంటి మహాభారతం మధ్యలో వేదవ్యాసునిచే ప్రవేశపెట్టబడిన శ్రీకృష్ణార్జునుల సంవాదమే భగవద్గీత.

భగవద్గీత సర్వమత, సర్వవేద, సర్వయోగ సమన్వయం. ఒక దేశానికి రాజ్యాంగమెంత అవసరమో మానవజీవిత పరిపూర్ణత్వానికి భగవద్గీత అత్యంత ఆవశ్యకం. భగవద్గీతలో లేనిది ప్రపంచంలో ఎక్కడా ఉండదు. సాక్షాత్తూ భగవంతుని నుండి వెలువడింది కాబట్టి వేల సంవత్సరాల వరకు అది ఏమాత్రం మార్పులు చెందకుండా అలాగే కొనసాగుతూ వచ్చింది. దానియందలి 701 శ్లోకాలు ఆణిముత్యాలే. భగవద్గీతకు భాష్యం చెప్పడమంటే మామూలు విషయం కాదు. గత కొన్ని శతాబ్దాలుగా గీతాసారాంశాన్ని సామాన్యునికి కూడా తెలియజేయాలనే సదాశయంతో సంస్కృత శ్లోకాలకు తెలుగులో వ్యాఖ్యానాన్ని వ్రాయడం, కొందరు







దానిని గీతాజ్ఞాన యజ్ఞాల ద్వారా ప్రచారం చేయడం జరుగుతున్నది.

జ్ఞానప్రపూర్ణ శ్రీచలపతిరావుగారు గత రెండు దశాబ్ధాలుగా చిలకలూరిపేటలోను, ఇతర పట్టణాలలోను గీతాజ్ఞానయజ్ఞాలను నిర్వహిస్తూ వందలాది మందికి దాని సారాంశాన్ని పంచడం జరిగింది. నేను ఆధ్యాత్మిక రంగంలోనికి ప్రవేశించి తపిస్తున్న తరుణంలో అదృష్టవశాత్తు వారి గీతా సందేశాలను నెలల తరబడి వినడం జరిగింది. అవి నా మనసులో ఇప్పటికీ చెరగని ముత్యాలవలె నిలిచిపోయాయి. అటువంటి విలువైన సారాంశమును మా ధ్యానమాలిక పాఠకులకు అందిస్తే ప్రయోజనముంటుంది అనే భావనతో గీతాశ్లోకాలను, ద్రౌపదిదేవి కథా వృత్తాంతాన్ని ధారావాహికంగా ధ్యానమాలికలో అందిస్తున్నాం. అయితే వానిలోని ఔన్నత్యాన్ని గమనించిన మా పాఠకులు వానిని పుస్తకరూపంలో ప్రచురిస్తే బాగుంటుంది అని అభ్యర్థించిన మేరకు మేం మొదటి రెండు అధ్యాయాలు గీతను పుస్తక రూపంలో ప్రచురించాము. ఇప్పుడు 3, 4, 5 అధ్యాయములను పుస్తక రూపంలో అందిస్తున్నాం.

శ్రీచలపతిరావుగారి గీతాశ్లోకాల వ్యాఖ్యానాలను నేను ఇటీవల పరిశీలించినపుడు వారిలో నేను ఒకప్పుడు విన్న వ్యాఖ్యలకు ప్రస్తుతం వారు వివరించిన విధానానికి ఎంతో వ్యత్యాసం కనుపించింది. భగవద్గీత యందలి ధర్మసూక్ష్మాలను అతి సామాన్యునికి గూడ అర్థమయ్యే రీతిలో చెప్పటం జరిగింది. మహాభారత యుద్ధమంతా అర్జునుని అంతరంగంలోనే జరిగింది. ప్రస్తుతం నవీన మానవులంతా అర్జునులే. ప్రతి అంతరంగం అగ్నిగుండం వలె రగిలిపోతుంది. అటువంటి అగ్నికి ఆజ్యం వలె సామాజిక పరిస్థితులు రోజురోజుకు దిగజారుతున్నాయి. అందువలన అగ్నిని ఆర్పే శీతల జలమే గీతా సారాంశం. గురువుగారు వెల్లడించిన ఉపమానాలు, సందర్భోచిత వ్యాఖ్యలు, ఉదాహరణలు అతి సరళంగా, సులభంగా అర్థమయ్యే విధంగా వున్నాయి. నిష్కపటంగా చెప్పాలంటే నాకే అవి అప్పుడప్పుడు మార్గదర్శకమౌతున్నాయి. అందువలన మేము చేసిన ఈ ప్రయోగాన్ని ఆధ్యాత్మిక పిపాసులు, ధ్యానులు సహృదయంతో స్వీకరించాలని మనవి చేస్తూ ఇటువంటి కృషికి మూలకారకులై ఆధ్యాత్మిక పుష్పగుచ్ఛమైన శ్రీయుతులు చలపతిరావుగారికి శిరస్సు వంచి పాదాభివందనం చేస్తూ.. వారికి ఆ భగవంతుడు దివ్య ఆశీస్సులిచ్చి సంపూర్ణ ఆయురారోగ్యాలతో సదా విశిష్టమైన ఆధ్యాత్మికసేవలనందించే భాగ్యం కలుగజేయాలని మనసా.. వాచా.. కర్మణా కోరుకుంటూ...

**సదా ఆధ్యాత్మిక సేవలో...**

**- పూజ్యశ్రీ భిక్షమయ్య గురూజీ**



# తొలిపలుకు

**శ్రీ డి. చలపతిరావు**
గ్రంధ వ్యాఖ్యాత

**ఈ** లోకంలో ప్రతి మానవుడు సుఖాన్నే కోరుకుంటాడు. ఎంత తెలివి తక్కువ వాడుకూడా దుఃఖాన్ని కోరుకోడు. కోరక పోయినా పూర్వజన్మ కర్మల ఫలితంగా రావలసిన సమయంలో దుఃఖాలు వస్తూనే వుంటాయి. అలా వచ్చినప్పుడు ఈ దుఃఖం ఎప్పుడు పోతుందా? తిరిగి ఎప్పుడు సుఖం వస్తుందా? అని ఎదురు చూస్తాడు. ఎదురు చూడటమే కాదు. ఆ సుఖంకోసం ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు, డబ్బు సంపాదిస్తాడు, వస్తువులు తెచ్చుకుంటాడు, ఇతరుల సాయం అర్ధిస్తాడు, అనేక వస్తువులు కనిపెడుతుంటాడు, తన వృత్తిని మారుస్తాడు, వ్యాపారాన్ని మారుస్తాడు, ఉద్యోగాన్ని మారుస్తాడు, వున్న ఊరిని మారుస్తాడు, తన దేశాన్ని కూడా వదిలి విదేశాల కెళతాడు, పెద్దవాళ్ళతో స్నేహం చేస్తాడు, శారీరకంగా, మానసికంగా ఎంతో శ్రమిస్తాడు– ఇలా ఎన్నో, ఎన్నెన్నో చేస్తాడు. వీటి ఫలితంగా దుఃఖాలు పోవచ్చు, సుఖాలు రావచ్చు. కాని ఆ సుఖాలు శాశ్వతంగా వుండటం లేదు. ఎప్పుడో ఒకప్పుడు ఆ సుఖాలు దూరమై, మళ్ళీ దుఃఖాలు దరిచేరతాయి. అంటే ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంత కష్టపడ్డా మానవుడు తాను కోరుకున్న సుఖాన్ని, ఆనందాన్ని పొందలేకపోతున్నాడు. తాను కోరుకొనేది శాశ్వతానందమే గాని, తాత్కాలికానందంకాదు. ఎప్పుడూ వుండే సుఖం– ఎప్పుడూ వుండే ఆనందమే కావాలి. అప్పుడే తపన తీరేది, అన్వేషణ ఆగేది.

అట్టి శాశ్వతానందం, నిత్యసుఖం ఎన్ని వస్తువులు సంపాదించినా, ఎందరు వ్యక్తులను దరిచేర్చుకున్నా, ఎన్ని పరిస్థితులను, స్థితులను మారుస్తున్నా రావటం లేదు. అనిత్యమైన సుఖమే వస్తున్నది ఎందువల్ల?

మనం కోరుకొనేది నిత్యసుఖాన్ని, కాని పట్టుకొనేది అనిత్య వస్తువులను. అనిత్య వస్తువులు అనిత్యమైన సుఖాన్నే ఇస్తాయి గాని నిత్యసుఖాన్నివ్వలేవు. నిత్యవస్తువు మాత్రమే నిత్యసుఖాన్నిస్తుంది. మరేమిటి ఆ నిత్యవస్తువు? **"నిత్యవస్త్వేకం బ్రహ్మ**







**తద్వ్యతిరిక్తం సర్వమనిత్యం"**– నిత్యవస్తువు ఏకమైన పరమాత్మ మాత్రమే. పరమాత్మకన్నా వేరైన సమస్తమూ అనిత్యమే – అని **శంకరాచార్యులవారు** 'తత్త్వబోధ' అనే ప్రకరణ గ్రంథంలో తెలియజేశారు.

కనుక ప్రతిమానవుడు నిత్యమైన పరమాత్మను మాత్రమే పట్టుకోవాలి. అలా పట్టుకోవాలంటే అనిత్య వస్తువులు, విషయాలు, భోగాలు మొదలైన వాటి పట్టునుండి విడిపించుకోవాలి. ఈ అనిత్య వస్తువుల పట్టునుండి విడిపించు కొని శాశ్వతమైన పరమాత్మను ఆశ్రయించి, పరమాత్మతో ఐక్యమై పోవుటకే మనకు ఈ మానవజన్మ వచ్చింది. ఈ మానవ జన్మలోనే దీనిని సాధించాలి. అలా సాధిస్తేనే ఈ జన్మ సార్థకం, సాధించలేనిచో ఈ జన్మ వ్యర్థం.

మరి ఎలా సాధించటం? ఎలా ప్రాపంచిక విషయ వ్యామోహాన్ని వదలటం? ఎలా పరమాత్మను తెలుసుకొని, ఆశ్రయించి, అందుకోవటం? ఎలా సమస్త దుఃఖాలనుండి శాశ్వతంగా నివృత్తిచెంది అనంతమైన, అఖండమైన, దుఃఖ రహితమైన శాశ్వతానందాన్ని పొందటం? ఈ అన్ని సందేహాలకు ఖచ్చితమైన సమాధానమే **భగవద్గీత.**

**భగవద్గీత సర్వ ఉపనిషత్తులసారం, యోగ శాస్త్రం, బ్రహ్మవిద్యా ప్రతిపాదిత గ్రంథం. ఇది మోక్ష శాస్త్రం. అన్ని వేదాల, ఉపనిషత్తుల, సమన్వయ శాస్త్రం. అన్ని శాస్త్రాలను, సిద్ధాంతాలను మథించి వెలికి తీసిన సార సంగ్రహం. ఒక్క హిందూమతానికేగాక, అన్ని మత సాంప్రదాయాలకు సంబంధించిన ప్రధాన సూత్రాలను, ధర్మాలను క్రోడీకరించిన సర్వ ధర్మ సమన్వయ క్షేత్రమిది.** అందుకే దీనిని "విశ్వమత గ్రంథం" అన్నారు. ప్రపంచంలోని 42 భాషలలోనికి అనువదించబడి, 125 దేశాలలో పరిచయమున్న అద్భుత గ్రంథం భగవద్గీత. అన్ని కాలాలలోని, అన్ని దేశాలలోని మానవులందరి జీవిత సాఫల్యానికి కావలసిన సమస్త విషయాలను తెలియజేసిన సమగ్ర గ్రంథరాజం భగవద్గీత. ఎందరో మహాత్ములు, మహానుభావులు, ఆచార్యులు, పీఠాధిపతులు, స్వామీజీలు ఈ గీతాసాగరంలో మునిగి, అనర్ఘమైన రత్నాలను చేజిక్కించుకొని వాటిని సామాన్య మానవులకు పంచుతూనే వున్నారు.

**మానవుని మాధవునిగా, నరుని నారాయణునిగా, జీవుని దేవునిగా తీర్చిదిద్దటానికి కావలసిన కర్మయోగం, ధ్యాన యోగం, భక్తియోగం, జ్ఞానయోగం అనే అన్ని యోగాలను, అన్ని ఉపాయాలను, మార్గాలను తెలియజెప్పిన అద్భుత గ్రంథం భగవద్గీత. వేదాలలోని కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞానకాండలను –**

**కర్మషట్కం, భక్తిషట్కం, జ్ఞానషట్కం- అనే 3 షట్కాలుగా - 18 అధ్యాయాలుగా భగవద్గీతలో వివరించటం జరిగింది. ఇది ఒక "సమగ్ర ఆధ్యాత్మిక గ్రంథం"** అనుటలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు.

గీతకు ఇంతటి ప్రశస్తి రావటానికి కారణమేమిటి? మానవుని యొక్క దుఃఖాన్ని - శోకాన్ని సంపూర్ణంగా నివృత్తి చేయటం గీత యొక్క పరమోద్దేశ్యం కావటమే.

**"అశోచ్యానన్వశోచస్త్వం...."** (2-11) అంటూ గీతా జ్ఞాన బోధను ప్రారంభించిన భగవానుడు **"మోక్ష ఇష్యామి మాశుచః..."** (18 - 66) అంటూ తన బోధను ముగించాడు. **'అశోచ్యా'** అనే పదంతో ప్రారంభించి**'మాశుచః'** అనే పదంతో ముగించాడు. అంటే శోకంతో ప్రారంభమై శోకంతో ముగిసింది బోధ. ఇలాచేయటంలో ఒక స్వారస్యం వుంది. ఒక సూచన వుంది. అదేమిటంటే - ఈ రెండు శోకాల మధ్య నున్న శ్లోకాలు మానవుడిలోని శోకాన్ని పూర్తిగా నివృత్తిచేసి, నిరతిశయానందాన్ని ప్రాప్తింపజేస్తాయి - అని. అంతేగాదు అసలు భగవద్గీతలోని మొదటి అధ్యాయం **అర్జున విషాదయోగం.** అంటే దుఃఖంలో వున్న మానవుని దుఃఖనివృత్తే గీతలోని ప్రధాన వస్తువు. మరి దుఃఖంలేని, విషాదంలేని మానవుడెవరుంటారు? అందుకే గీతకు ఇంతటి ప్రశస్తి. అందుకే **మహాత్మాగాంధీ** "నాకెప్పుడు ఏ సంశయం కలిగినా, ఏ సమస్య ఎదురైనా భగవద్గీతలోని ఏదో ఒక పేజీ తెరచి చూస్తాను. అందులోని శ్లోకాలను అవగాహన చేసుకోవటంతో నా సమస్యకు పరిష్కారం లభిస్తుంది"అని తెలియజేశారు.

**భగవన్నిర్మితమై, బ్రహ్మవిద్యా ప్రతిపాదితమై, సర్వ ఉపనిషత్తులసారమై, సర్వయోగ సమన్వయమై, సర్వశాస్త్ర సారభూతమై, సర్వమత సమన్వయమై, సర్వకాలాలకు తగినదై, సర్వమానవాళి జీవిత సార్థక్యానికి మార్గం చూప గలిగినదైన భగవద్గీతను ఎన్నిసార్లు చదివినా, ఎన్నిసార్లు విన్నా, అమృత పానంవలె తనివి తీరేది కాదు.**

అట్టి భగవద్గీతను సవివరంగా, సరళమైన భాషలో, సులభంగా అర్థమయ్యే రీతిలో, ఆచరణకనువుగా తెలుసుకొని, ఇందులోని 18 అధ్యాయాలను 18 మెట్లుగా చేసికొని, విషాదయోగం నుండి ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ **మోక్ష సన్యాసయోగం** వరకు ప్రయాణించి, మానవ జీవిత పరమ లక్ష్యమైన మోక్ష సామ్రాజ్యాన్ని చేరుకొని శాశ్వతానందాన్ని, బ్రహ్మానందాన్ని పొంది మానవ జీవితాన్ని సార్థకం చేసికొందుముగాక!

**- వ్యాఖ్యాత**



4



## ఉపోద్ఘాతం :

**ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో ఒక దివ్యమైన రథం నిలిచివుంది. అందులో దివ్యపురుషుల జంట వున్నది. ఒకరు నరుడు, మరొకరు నారాయణుడు.**

**అంతా చేసినా ఏమీ చేయనివాడు నరుడు.**

**ఏమీ చేయకనే అంతా చేసేవాడు నారాయణుడు.**

**నరుడు చేశాననుకుంటాడు, కాని ఏమీ చేయడు. అతడిది కర్మలో అకర్మ.**

**నారాయణుడు చేయనట్టే ఉంటాడు, కాని అంతా చేస్తాడు. అతడిది అకర్మలో కర్మ.**

**నరుడు చేసేవాడు కనుక పాత్రధారి.**

**నారాయణుడు చేయించేవాడు కనుక సూత్రధారి.**

**నరునిది కర్మయోగం-నారాయణునిది కర్మసన్యాస యోగం.**

**సామాన్యులు-సాధకులు ఆచరించగలిగినది కర్మయోగం (నిష్కామ కర్మ యోగం) మహాత్ములు-జ్ఞానులు మాత్రమే ఆచరించగలిగినది కర్మసన్యాసయోగం.**

అజ్ఞానియైనవాడు కర్మలు చేసినా-మానినా రెండూ నష్టమే- దోషపూరితమే. ఎందుకు?-

కర్మలు చేస్తే కర్మఫలం వస్తుంది. ఫలం వస్తే అనుభవించాలి. ఆ అనుభవంతో చిత్తంలో వాసనలు పేరుకుంటాయి. ఆ వాసనలవల్ల తిరిగి జన్మనెత్తాలి. ఆ జన్మలో ఈ వాసనల ప్రేరణతో కర్మలు చేయాలి. కర్మచేస్తే మళ్ళీ కర్మఫలం- అనుభవం- వాసనలు-జన్మలు. ఇలా జన్మకర్మ వలయంలో- జననమరణ చక్రంలో తిరుగుతూ బంధింపబడుతున్నాడు మానవుడు. అందుకే **'కర్మణా బధ్యతే జంతుః'** మానవుడు కర్మలచేత బంధింపబడుతున్నాడు- అన్నారు.

పోనీ బంధించబడుతున్నాం గదా అని అసలు కర్మలే చెయ్యకుండా ఉంటేనో! అది ఎవ్వరికీ సాధ్యం కాదు. సాధ్యమైనా సోమరితనంతో భాధ్యతలనుండి తప్పించుకొని ఎవడైనా ఉంటే-దానివల్ల లోపల పేరుకొని ఉన్న వాసనలు అలాగే వుంటాయి. వాసనల భారంతో జీవితం నరకప్రాయమౌతుంది. తిరిగి తిరిగి నీచజన్మలకు దారి తీస్తుంది.

కనుక కర్మలు చేసినా బంధమే. చేయక సోమరిలా ఉండినా బంధమే. మరి ఏమిటి దారి?



5



పాములు పట్టి ఆడించేవాడు బ్రతుకుదెరువు కోసం ఆడించాలి. కాటువేస్తే ప్రాణం పోతుంది. అలాగని ఆడించకపోతే బ్రతుకుదెరువుపోతుంది. మరి ఎలా? ఆ పాములకున్న కోరలు పీకివేసి ఆడిస్తేసరి. కాటువెయ్యదు. పోషణకు ఢోకాలేదు.

అదేవిధంగా కర్మలు చేస్తే బంధం. మానుకోవటానికి వీల్లేదు మానుకున్నా బంధమే. కనుక బంధం కాని విధంగా కర్మలు చేయాలి. ఎలా? కోరికలనే కోరలను పీకి కర్మలు చేసినట్లైతే ఇక బంధమయ్యే అవకాశముండదు. దీనినే **'నిష్కామకర్మయోగం'** అన్నారు.

**కర్మవేరు-కర్మయోగం వేరు**

**కర్మలు కర్మఫలాన్నిచ్చి బంధాన్ని కలిగిస్తాయి**

**కర్మయోగం చిత్తశుద్ధిని కలిగించి మానవుని ఉద్ధరిస్తుంది**

భగవద్గీత సకామ కర్మలను ఎంతగా నిరశించిందో, కర్మలు చేయకుండా వుండే సోమరితనాన్ని అంతకన్న ఎక్కువగా నిరశించింది. అందుకే కర్మయోగాన్ని ముందుకు తెచ్చింది. కర్మయోగ రహస్యం భగవద్గీతలో లాగా స్పష్టంగా సులభంగా మరే ఇతర గ్రంథంలోను చెప్పబడలేదు. విశ్వమత గ్రంథాలలో 'కర్మయోగాన్ని' ఇలా సామాన్య మానవుడి వద్దకు తీసుకెళ్ళిన గ్రంథం విశ్వంలో భగవద్గీత ఒక్కటేనని సగర్వంగా చెప్పవచ్చు.

మనం నిత్యమూ చేసే కర్మలను ఎలా-ఏ భావనతో చేయాలో, ఎలా చేస్తే ఉన్నతికి దారి తీస్తుందో, ఎలా చేస్తే అధోగతికి పోవలసి వస్తుందో వివరంగా తెలియజేసిన అధ్యాయమే ఈ **'కర్మయోగం'.**

లోకంలో సామాన్యంగా నాలుగురకాల మనుషులుంటారు.

**1)** బద్ధకంతో, సోమరితనంతో, ప్రాలుమాలి, ఇతరుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతకటం అలవాటై పనులు చేయనివారు ఒకరకం. వీరు భగవంతుని దృష్టిలో దొంగలు, మిధ్యాచారులు, పాపులు, నిరర్థక జీవులు.

**2)** తనను తన కుటుంబాన్ని పోషించుకోవాలని; సుఖంగా జీవించాలని; భోగాలు అనుభవించాలని; ఏదో సాధించాలని ఆశలతో, కోరికలతో, స్వలాభాపేక్షతో అనేక రకాల కర్మలు చేసేవారు రెండవరకం. లోకంలో నూటికి తొంభైమంది వీరే. వీరు తమ కర్మల కారణంగా తిరిగి తిరిగి జన్మిస్తూ జనన మరణ చక్రంలో చిక్కుకుంటారు.

**3)** కొద్దిమంది మాత్రం ఈ జన్మ ఎందుకొచ్చిందో; తాను ఏమి చెయ్యాలో శాస్త్రాలద్వారా, గురువులద్వారా తెలుసు కుంటూ నిర్వర్తించవలసిన విద్యుక్తకర్మలను, బాధ్యతలను నిర్వర్తిస్తూ, దైవకార్యాలను నిష్కామంగా-ఫలితంపై ఆసక్తి లేకుండా చేసేవారు. వీరే సాధకులు. వీరంటే భగవంతునికి ఇష్టం. భగవదనుగ్రహం వీరిపై ఎల్లప్పుడూ వుంటుంది.

**4)** ఇక అరుదుగా బహుకొద్దిమంది మహాత్ములు జ్ఞానంలో సిద్ధిపొందిన వారు ఉంటారు. వీరికి ఏ కర్మలతోను పనిలేదు. వారెప్పుడూ తమ స్థితిలో (ఆత్మస్థితిలో) తాముండి దేహం ద్వారా జరిగే కర్మలను నిర్లిప్తంగా, కేవలసాక్షిగా చూచేవారు. వీరు సాక్షాత్తు భగవంతుని స్థానంలో ఉన్నవారు. వారే జ్ఞానులు.

పైన చెప్పిన నాలుగు రకాల మనుష్యులలో మూడవ రకం వారైన సాధకుల కొరకు 'కర్మలు బంధం కాకుండా ఎలా చెయ్యాలో' తెలియజేసేదే ఈ 'కర్మయోగం'. వేదాలలో కర్మకాండ గురించి విపులంగా చెప్పబడింది. కర్మకాండ అంటే యజ్ఞయాగాది క్రతువులు ఆచరించుటయే. వేదకాలంలో జీవితావసరాలు పరిమితంగా ఉండేవి. అందువల్ల వారి కోరికలు కూడా పరిమితమే. కనుక వారు దీర్ఘకాలం యజ్ఞయాగాదులు నిర్వహించి మనస్సును శుద్ధం చేసుకొనేవారు. కాని ఈ కాలంలో ఆ విధంగా దీర్ఘకాలం యజ్ఞయాగాదులు నిర్వహించటం సామాన్య మానవులకు ఆచరణ సాధ్యం కాదు. అందుకే మానవులందరికీ ఆచరణ సాధ్యమైన కర్మయోగ ఉపాయాన్ని గీత చెబుతున్నది.

"నీవు నిత్యము చేసే ఎటువంటి కర్మ అయినా సరే పవిత్ర భావంతో, ప్రేమార్ద్ర హృదయంతో, ఆత్మార్పణ బుద్ధితో, పరమాత్మ స్మరణతో, ఏ ఫలితాన్ని ఆశించకుండా చేసినట్లైతే అది గొప్ప యజ్ఞమే అవుతుంది" ఇదే కర్మయోగ సందేశం.

ఇపుడు అర్జునుడు తన స్వధర్మమైన యుద్ధం చెయ్యాలి. ఈ యుద్ధాన్ని యుద్ధంగా కాకుండా యజ్ఞంగా చేసే ఉపాయాన్ని తెలియజేస్తున్నాడు శ్రీకృష్ణుడు.
ఇదే **'అర్జునవ్యాధి'కి శ్రీకృష్ణ చికిత్స.**

ఇక్కడ అర్జునుడు యుద్ధం చెయ్యటానికే యుద్ధరంగానికి వచ్చాడు. అయితే భీష్మద్రోణాదులను చూడగానే మమకారంతో విషాదంలో మునిగాడు. యుద్ధం చేస్తే వచ్చే కష్టనష్టాల గురించి పూసగ్రుచ్చినట్లు ఏకరువు పెట్టాడు. శ్రీకృష్ణుడేమీ మాట్లాడలేదు. దానితో ధనుర్బాణాలు ఆవల పడవేసి కూలబడ్డాడు. శ్రీకృష్ణుని



6



పోటు మాటలతోశరణాగతుడై, నీవు చెప్పినట్లే చేస్తానని శిష్యభావంతో ఆశ్రయించాడు. దానితో శ్రీకృష్ణుడు అర్జునుని విషాదానికి కారణం అజ్ఞానమేనని గ్రహించి, ఆ అజ్ఞానాన్ని పోగొట్టడానికి ఆత్మజ్ఞానాన్ని బోధించాడు.

"ఓ అర్జునా! చావులేని ఆత్మ, చచ్చే శరీరం-రెండూ కలిసి జీవుడు ఏర్పడ్డాడు. నేను, నీవు, ఈ రాజులు-అందరూ ఆత్మయే గాని దేహాలు కాదు. ఆత్మ చచ్చేది కాదు గనుక ఎవరూ చంపలేరు. కనుక దుఃఖించాల్సిన పని లేదు. ఒకవేళ అజ్ఞానంతో 'దేహమే నేను' అనుకున్నావా? దేహం ఎలాగూ పోయేదే గనుక దుఃఖించటం వృథా"-అని ఆత్మజ్ఞానాన్ని బోధించాడు. ఆ తర్వాత స్వధర్మమైన యుద్ధాన్ని ఎందుకు తప్పక చేయాలో తెలియజేశాడు. ఇక ఏ కర్మనైనా లేదా యుద్ధాన్నైనా చేసేటప్పుడు ఫలితాన్ని కోరక, విద్యుక్తంగా చేయాలని బుద్ధియోగాన్ని తెలిపాడు. ఇలా బుద్ధియోగంతో కర్మలు చేస్తే చిత్తశుద్ధి కలిగి, పరమాత్మను తెలుసుకొని, స్థిరమైన బుద్ధితో స్థితప్రజ్ఞుడు కావచ్చని చెప్పాడు. అర్జునుడు కోరటంతో స్థితప్రజ్ఞుని లక్షణాలు తెలిపి, అతడు లోకంలో ఎలా వ్యవహరిస్తాడో చెప్పి, బ్రాహ్మీస్థితిని వర్ణించి, బ్రహ్మ నిర్వాణాన్ని-మోక్షాన్ని పొందే ఉపాయం చెప్పాడు. ఇదే మానవ జీవిత పరమలక్ష్యమని కూడా తెలియజేశాడు.

శ్రీకృష్ణుని ఈ అద్భుత జ్ఞానాన్ని విని అర్జునుడు "ఇదే నాకు కావలసింది. ఎలాగైనా ఈ స్థితిని నేను సాధించాలి" అని చెప్పాలనుకున్నాడు. కాని ఇంతలోనే "అర్జునా! కనుక నీవు ఆయుధం పట్టి ఈ యుద్ధం చెయ్యి" అని శ్రీకృష్ణుడు అజ్ఞాపించాడు. ఇంతకూ తాను మానవజీవిత పరమలక్ష్యమైన మోక్షాన్ని సాధించాలా? లేక క్షుద్రమైన-దోషాలతో కూడిన యుద్ధాన్ని చేయాలా? ఎందుకిలా శ్రీకృష్ణుడు గజిబిజిగా మాట్లాడుతున్నాడు? ఇదే అర్జునుని సందేహం. అర్జునుని ప్రశ్నతోనే ఈ అధ్యాయం ప్రారంభమవుతున్నది.

గురుశిష్యుల మధ్య సన్నిహిత సంబంధముండి, గురువును చనువుతో శిష్యుడు ప్రశ్నించటం ద్వారానే భారత దేశంలో వేదాంతం ప్రచారమైంది. శిష్యుడు ప్రశ్నలు వేయటానికి, గురువు చెప్పిన దాన్ని ఖండించి వాదించటానికి, హిందూ మతంలో కనిపించే స్వాతంత్ర్యం మరే మతంలోను కనిపించదు. శిష్యులు అలా సందేహాలతో తమతో చర్చలకు దిగాలని నిజమైన సద్గురువులు భావిస్తుంటారు. అలా జ్ఞాన వాదన చేయగల శిష్యులే తమ ఆధ్యాత్మిక శక్తిని, తేజస్సును పెంపొందించుకో గలుగుతారు.

– ఇక గ్రంథంలోనికి ప్రవేశిద్దాం!

అర్జునుడు తన సందేహాన్ని వ్యక్తం చేస్తున్నాడు– ఏమని?

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన!।**
**తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ!॥ (1)**

**శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవమే।**
**తదేకం వద నిశ్చిత్య యేనశ్రేయోహ మాప్నుయాం॥ (2)**

**తా॥ అర్జునుడంటున్నాడు: జనార్దనా! నీ అభిప్రాయం ప్రకారం కర్మకన్న జ్ఞానమే ఎక్కువైతే, ఓ కేశవా! నన్నీ ఘోర కర్మలో ఎందుకు నియోగిస్తున్నావు? (1)**

**తా॥ గజిబిజి మాటలతో నా బుద్ధికి మోహాన్ని కలిగిస్తున్నావు. ఇదంతా కాదు. దేనివల్ల నాకు శ్రేయస్సు కలుగుతుందో ఆ ఒక్కదానిని నిశ్చయించి చెప్పు. (2)**

**వ్యాఖ్య:** అర్జునుడిలా అడగటానికి కారణం భగవానుని మాటలలో ఏదో గజిబిజి ఉంది; స్పష్టత లేదు– అని అను కోవటమే. రెండవ అధ్యాయం 47వ శ్లోకంలో **"కర్మణ్యేవాధి కారస్తే"** కర్మలు చేయుటయందే నీకధికారం ఉన్నది అని చెప్పాడు. 48వ శ్లోకంలో **"యోగస్థఃకురుకర్మాణి"** కనుక యోగంలో నిలిచి కర్మలు చెయ్యి–అని చెప్పాడు. ఆ వెంటనే 49వ శ్లోకంలో **"దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాత్ ధనం జయ"** బుద్ధియోగం కన్న కర్మ చాలా అల్పమైనది అర్జునా! అన్నాడు. ఇలా అనటంతో బుద్ధియోగం అంటే జ్ఞానం గదా! జ్ఞానం కన్న కర్మ అల్పమైనదని చెబుతూనే, నన్నెందుకు ఈ యుద్ధమనే ఘోర కర్మను చెయ్యమంటున్నాడు? అని సందేహ పడ్డాడు అర్జునుడు. ఇక్కడే అర్జునుడు పప్పులో కాలువేశాడు. అతడు విషాదంలో వున్నాడు. భ్రాంతిలో ఉన్నాడు. మనస్సు ఆందోళనతో ఉండటం వల్ల ఈ భ్రాంతి–మోహం.

భగవానుడు స్పష్టంగా–ఏ గజిబిజి లేకుండానే చెప్పాడు. బుద్ధియోగం అంటే బుద్ధితో ఆలోచించి కర్మలు చేసే నిష్కామ కర్మయోగమే. ఈ నిష్కామకర్మయోగం కన్న సకామంతో చేసే కర్మలు అల్పమైనవనియే భగవంతుడు చెప్పినది. సకామ కర్మలు బంధానికి దారి తీస్తాయి కనుక అల్పమైనవి. నిష్కామ కర్మలు (బుద్ధి యోగం) చిత్తశుద్ధిని కలిగించి ఆత్మజ్ఞానం వైపు నడిపిస్తాయి గనుక శ్రేష్ఠమైనవి. యుద్ధరంగంలో ఆందోళనతో కూడిన మనస్సుతో ఉన్న అర్జునుడు జ్ఞానం కన్న కర్మ అల్పమైనదని చెప్పినట్లు భ్రమపడి మరి ఈ అల్పమైన కర్మలను ఎందుకు







చేయమంటున్నాడు? అని సందేహపడ్డాడు. అదేమిటో అడిగి తెలుసుకుందా మనుకున్నాడు. కాని శ్రీకృష్ణుడు అందుకు అవకాశం ఇవ్వకుండా బుద్ధియోగాన్ని ప్రశంసిస్తూ, "బుద్ధియోగం కారణంగా విరక్తుడవై సమాధిలో నిలిచి యోగాన్ని పొందుతావు" అని చెప్పటంతో? ఆ ప్రశ్న వెనుకకు పోయి సమాధి స్థితిలోనున్న స్థిరబుద్ధి గల పురుషుని (స్థితప్రజ్ఞుని) లక్షణాలేమిటి? అని అడిగాడు. అప్పటికి అర్జునునికి ఇది తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. దానితో భగవానుడు స్థితప్రజ్ఞుని లక్షణాలను, అతడి వ్యవహార సరళిని తెలియజేశాడు. అందువల్ల ఆ వెనుకటి ప్రశ్నను ఇప్పుడు అడుగుతున్నాడు అర్జునుడు.

"జనార్దనా! కేశవా! ఒకసారి జ్ఞానాన్ని ప్రశంసిస్తావు. మరొకప్పుడు కర్మలు చెయ్యాలంటావు. **'యుద్ధాయ యుజ్యస్వ**–యుద్ధానికి సిద్ధంకా! అంటావు. ఇంతకూ జ్ఞానయోగం గొప్పదా? కర్మయోగం గొప్పదా? జ్ఞానం గొప్పదైతే నన్నెందుకు కర్మ చెయ్యమంటావు? ఇదంతా నాకు కలగా పులగంగా– గజిబిజిగా ఉన్నది. కనుక ఏదో ఒకటి నిశ్చయించి స్పష్టంగా చెప్పు. యుద్ధం చెయ్యమంటావా? ఇది వదలి జ్ఞానమార్గాన్ని అనుసరించమంటావా? నాకు ఏది శ్రేయస్సు కలిగిస్తుందో ఆ ఒక్కదానినే తేల్చి చెప్పు" అంటున్నాడు అర్జునుడు. ఈ మొదటి శ్లోకంలో శ్రీకృష్ణుని జనార్దనా! కేశవా! అని రెండు సంబోధనలు చేశాడు అర్జునుడు.

'జనార్దన' అంటే సర్వజనులు తమ మనోరథసిద్ధికై ఎవరిని యాచిస్తారో అతడే జనార్దనుడు అని అర్థం కాగా, జనన మరణాలను, వాటికి కారణమైన అజ్ఞానాన్ని ఎవరు తన సాక్షాత్కారంతో నశింపజేస్తారో అతడే జనార్దనుడు అని మరొక అర్థం.

'కేశవ' అంటే 'క' అంటే బ్రహ్మ, 'అ' అంటే విష్ణువు 'ఈశ' అంటే మహేశ్వరుడు, 'వ' అంటే స్వరూపంగా గలవాడు. 'కేశవ' అంటే త్రిమూర్తుల స్వరూపం గలవాడు.

–ఇలా అర్జునుని ప్రశ్నతో ఈ అధ్యాయం ప్రారంభమౌతున్నది. అయితే 30వ శ్లోకంలో గాని సూటిగా సమాధానం రాదు. ఇక భగవానుని సమాధానం–

**శ్రీ భగవానువాచ:**

**శ్లో॥ లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయా నఘ!।**
**జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం॥ (3)**

**తా॥ భగవానుడంటున్నాడు: ఓ పాపరహితుడా! ఈ లోకంలో రెండు రకాలైన సాధనా మార్గాలు ముందే నాచేత చెప్పబడ్డాయి. సాంఖ్యులకు జ్ఞానయోగము, యోగులకు కర్మయోగం అనేవే ఆ రెండు మార్గాలు.**

**వ్యాఖ్య:** ఎవరైనా సరే ఇల్లు కట్టుకునేటప్పుడే బయటకు రావటానికి ద్వారాలు పెట్టుకుంటారు. అంతేగాని నాలుగు వైపులా గోడలు కట్టి, కప్పు వేసిన తర్వాత బయటకు ఎలా వెళ్ళటమా? అని ఆలోచించి ద్వారాలు పెట్టుకోరు గదా!

అదే విధంగా పరిమితులతో కూడిన ఈ ప్రపంచాన్ని సృష్టించి, ఇందులోకి మానవులను పంపటానికి ముందే ఈ ప్రాపంచిక బంధాలనుండి బయట పడేందుకు రెండు మార్గాలను కూడా భగవంతుడు ఏర్పాటు చేశాడు. అవే జ్ఞానయోగం-కర్మయోగం.

**ద్వివిధానిష్ఠా:** అయితే రెండు మార్గాలెందుకు? ఒక్కటి చాలదా? అంటే లోకంలో అందరూ ఒకే రకమైన మనుష్యులుండరు గదా! అందుకే రెండు మార్గాలు.

1) కొందరు మానవులు ఆలోచనాపరులుగా వుంటారు. వీరికి బుద్ధి చక్కని విచక్షణా జ్ఞానంతో వుంటుంది. భగవంతుని గురించి, తత్వాన్ని గురించి తెలుసుకోవాలనే ఆసక్తి బాగా వుంటుంది. ప్రాపంచిక విషయాలకన్నా పరమాత్మ విషయాలకు ఎక్కువగా ప్రాధాన్యతనిస్తుంటారు. పూర్వజన్మలలోనే కొన్ని సాధనలు చేసిన సుకృతం కలిగి వుంటారు. ఇట్టివారినే సాంఖ్యులంటారు. వీరికొరకే జ్ఞానమార్గం చెప్పబడింది. శాస్త్రాలు చదవటం, వినటం, మననం చేసుకోవటం, ఇతరులతో చర్చించటం, మహాత్ముల సాంగత్యం చేయటం, ఆచరించటం ద్వారా వీరు జ్ఞానమార్గంలో పయనిస్తారు.

2) కొందరు క్రియాశీలంగా వుంటారు. ఎప్పుడూ ఏదొ ఒక పనిచేయకుండా ఊరికే కూర్చోలేరు. వారి దృష్టి బాహ్య దృష్టి. స్వార్ధపూరితంగా ప్రవర్తించేవారు తమను, తమ కుటుంబాన్ని పోషించుకొనుటకు; భోగాలనుభవించుటకు; ఆస్తులు కూడబెట్టుకొనుటకు ప్రయత్నిస్తే; నిస్వార్ధజీవులు లోక కళ్యాణకాంక్షతో సత్రాలు, కళ్యాణమంటపాలు, దేవాలయాలు, విద్యాలయాలు, ఆశ్రమాలు కట్టించాలని; దేశసేవ చెయ్యాలని తపనపడుతుంటారు. వీరినే యోగులు అన్నారు. ఇట్టి వారి కోసం కర్మ యోగం చెప్పబడింది. పూజా పునస్కారాలు, యజ్ఞయాగాదులు, ఆసనాలు, ప్రాణా యామం, రాజయోగం మొదలైన కర్మలతో కర్మమార్గంలో ప్రయాణిస్తారు వీరు.

ఇలా రెండు మార్గాలను రెండు రకాల మనస్థత్వం గలవారికి చెప్పినా ఇందులో ఒక మార్గం గొప్ప, ఒకటి తక్కువ అనే దురభిప్రాయముండకూడదు. నిజం చెప్పాలంటే







రెండూ ఒకదానినొకటి బలపరిచే మార్గాలే. రెండూ ప్రయోజనకరమైనవే.

కర్మయోగాన్ని అనుసరిస్తే మనలోని వాసనలు క్షయమై, మనసు పవిత్రమై తేలిక పడుతుంది, శాంత స్థితిలో వుంటుంది. ఆ కారణంగా బుద్ధి సూక్ష్మమౌతుంది. అలా సూక్ష్మమైన బుద్ధి ఆత్మజ్ఞానాన్ని గ్రహించటానికి, జ్ఞానయోగంలో నిలవటానికి సహాయ పడుతుంది.

అంటే కర్మయోగం జ్ఞానయోగాన్ని చేరే మార్గమైతే..

జ్ఞానయోగం చేరుకోవలసిన లక్ష్యాన్ని అందుకొనే మార్గం.

ఈ రెండింటిలో దేనినైనా స్వీకరించే స్వాతంత్ర్యముంది. కాకపోతే ఏ ప్రవృత్తి గలవారు ఆ ప్రవృత్తికి తగిన మార్గాన్ని ఎంచుకోవాలి.

రజోగుణ ప్రధానుడైన అర్జునుడు కర్మమార్గాన్ని ఎంచుకొని కర్మయోగం ద్వారా వాసనా క్షయం గావించుకొని, రజోగుణాన్ని విడిచి, సత్వంలో ప్రవేశించాలి. అప్పుడే జ్ఞాన యోగంలోనికి ప్రవేశించి మోక్షమార్గంలో పయనించటం జరుగుతుంది. బలవంతంగా ఇప్పుడే జ్ఞానమార్గంలో ప్రవేశిస్తే అతనికేవిధంగాను ఉన్నతి కలగదు.

**పురాప్రోక్తామయా:** సాంఖ్యులకు జ్ఞానయోగాన్ని, యోగులకు కర్మయోగాన్ని ఎప్పుడు చెప్పాడు భగవానుడు? పూర్వం ఎప్పుడో-అంటే సృష్టి ప్రారంభంలోనే. అప్పుడు ఈ శ్రీకృష్ణుడు ఉన్నాడా? లేడు గదా! అంటే ఈ రెండు యోగాలను సృష్టి ప్రారంభమైనప్పుడే చెప్పినది ఈ దేవకీ పుత్రుడు శ్రీకృష్ణుడు కాదు. శ్రీకృష్ణుని రూపంలో వున్న భగవానుడు ఉపాధులే లేని పరమాత్మ.

**అనఘ:** పాపరహితుడా! అని అర్ధం. పాపాత్ముల బుద్ధి స్థూలంగా వుండి ఈ జ్ఞానాన్ని అర్ధం చేసుకోలేదు. అర్జునునిలాంటి పుణ్యాత్ముని బుద్ధియే సూక్ష్మంగా వుండి ఈ రెండు మార్గాల గురించి తెలుసుకోగలుగుతుంది. పాపరహితునికే జ్ఞానార్హత.

-కర్మయోగం యొక్క ఆవశ్యకత ఏమిటి? కర్మలు చెయ్యకపోతే ఏమౌతుంది?

**శ్లో॥ నకర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోశ్నుతే।**
**నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ (4)**

**తా॥ మానవుడు తాను చేయవలసిన కర్మలను చేయకపోవటం వల్ల నిష్కామకర్మల ద్వారా పొందవలసిన శాంత స్థితిని పొందలేడు. అసలు కర్మలే చేయకుండా విడిచి పెడితే నైష్కర్మ్య సిద్ధిని ఎన్నటికీ పొందలేడు.**

**వ్యాఖ్య:** స్థితప్రజ్ఞుని లక్షణాలను, అతడు లోకంలో వ్యవహరించే తీరును గూర్చి విన్న అర్జునుడు తాను ఎలాగైనా అట్టి ఉన్నతోన్నతస్థితిని పొందాలని ఉవ్విళ్ళూరు

తున్నాడు. అందుకోసం ఘోరమైన రక్తపాతానికి కారణమయ్యే ఈ భయంకర యుద్ధాన్ని వదలి వెళ్ళాలనుకుంటున్నాడు. అందుకే గొప్పదైన జ్ఞానయోగంకోసం ఈ అల్పమైన కర్మను (యుద్ధాన్ని) ఎందుకు వదలకూడదు? అనే సందేహాన్ని ముఖంలో వ్యక్తం చేస్తున్నాడు.

కర్మయోగాన్ని ఎందుకు వదలకూడదో భగవానుడు ఈ శ్లోకం ద్వారా స్పష్టం చేస్తున్నాడు. ఓ అర్జునా! కర్మయోగం, జ్ఞానయోగం అనే ఈ రెండు మార్గాలను ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు అనుసరించకూడదు. వారివారి పరిపక్వతను బట్టి ఏదో ఒక మార్గాన్ని ఎంచుకోవాలి. మనస్సు ప్రశాంతంగాను, బుద్ధి సూక్ష్మంగాను వున్న ఆలోచనాపరుడు, అంతర్ముఖుడు ఐన సాత్త్వికసాధకుడు జ్ఞానమార్గాన్ని ఎంచుకోవాలి. సాత్వికుడు కాని బహిర్ముఖుడైన వ్యక్తి, రజోగుణం ప్రబలంగా ఉండి, లోపల నుండి వాసనలు కర్మలకు ప్రేరేపిస్తున్నపుడు 'నేను కర్మలను విడిచి జ్ఞానమార్గంలో ప్రవేశిస్తానంటే' కుదరదు. లోపలినుండి కర్మలకు ప్రేరణలు వస్తున్నంతవరకు కర్మలు చేయనని భీష్మించుకొని కూర్చొనరాదు. **అతడు కర్మలు చేయక వదిలితే నైష్కర్మ్యసిద్ధి కలగదు. 'నైష్కర్మ్యసిద్ధి' అంటే ఏమిటి? కర్మలు చేయాలనే ప్రేరణలు మనస్సు నుండి రాకుండా ఉండటమే. అలా ప్రేరణలు రాకుండా ఎప్పుడుంటాయి? లోపలి వాసనలు క్షయమైపోతేనే. మరి వాసనలెప్పుడు క్షయమైపోతాయి? కర్మలు చేసినప్పుడే వాసనలు ఖర్చయ్యేది. కర్మలు చేసినప్పుడు పాత వాసనలు ఖర్చయ్యే మాట నిజమే గాని తిరిగి కొత్త వాసనలు చేరతాయి గదా! మరెలా? పాత వాసనలు ఖర్చై క్రొత్తవాసనలు చేరకుండా ఉండాలంటే ఫలాపేక్ష లేకుండా, ఏ కోరిక లేకుండా నేను చేస్తున్నాననే అహంకారం లేకుండా కర్మలు చెయ్యాలి. అదే 'కర్మయోగం'** అర్జునా!నీవు క్షత్రియుడవు. రజోగుణం ప్రబలంగా ఉన్న మహావీరుడవు. దుష్టులను శిక్షించాలని, శిష్టులను రక్షించాలని, ధర్మాన్ని నిలబెట్టాలని నీలో నుండి ప్రేరణలు వస్తూనే ఉంటాయి. ఈ ప్రేరణలున్నంతవరకు నీవు ప్రశాంతంగా జ్ఞానయోగమార్గంలో ప్రయాణించలేవు. అందువల్ల నీవు కర్మయోగాన్ని ఆశ్రయించకతప్పదు.

ఈ యుద్ధమనే కర్మను కర్మగా కాకుండా కర్మయోగంగా చెయ్యి. దానితో నీలో కొత్త వాసనలు చేరకుండా పాతవాసనలు ఖర్చై పోతాయి. దానితో ప్రేరణలు రావు. ప్రేరణలు లేని స్థితియే 'నైష్కర్మ్యసిద్ధి'. దానితో మనస్సు ప్రశాంతమై, బుద్ధి సూక్ష్మమై సత్త్వగుణంలో నిలిచి జ్ఞానయోగంతో సిద్ధిని పొందగలుగుతావు. కనుక "యుద్ధఫలితంపై



9



ఆసక్తిని వదలి, ఇది నా కర్తవ్యం అని భావించి నీ స్వధర్మమైన యుద్ధాన్ని నీవు చెయ్యవలసిందే!" అని స్పష్టం చేశాడు భగవానుడు.

– అయితే లోపలి వాసనలు ప్రేరణ ఇస్తూంటే కర్మలు వదలటం సాధ్యమా? తరువాతి శ్లోకంలో

**శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతేహ్యవశః కర్మ సర్వప్రకృతి జైర్గుణైః (5)**

**తా॥ ఎవ్వరూ ఒక్కక్షణం కూడా కర్మలనాచరించకుండా ఉండలేరు. ప్రతివాడూ తన స్వభావం వల్ల కలిగిన సత్వరజ స్తమో గుణాలచేత అవశుడై (అస్వతంత్రుడై) కర్మలు చేస్తూనే వుంటాడు.**

**వ్యాఖ్య:** ఎవ్వడూ ఒక్కక్షణం కూడా కర్మలను వదలి ఉండలేడు. ఇక్కడ కశ్చిత్=ఎవ్వడూ అంటే జ్ఞాని (ఆత్మజ్ఞాని) తప్ప ఎవ్వడైనా అని గ్రహించాలి. ఎందు కంటే ముక్తుడైన ఆత్మజ్ఞాని ఇతరుల దృష్టిలో కర్మలు చేస్తున్నట్లు అనిపించినా తనదృష్టిలో అతడు కర్మాతీతుడే. అంటే అతడి శరీరం ఏకర్మలు చేస్తున్నా ఆత్మయైన అతడు ఏమీ చేయడు– చేస్తున్నాననే స్పృహ వుండదు; చేయవలసిన అవసరమూ లేదు.

ఇది వినగానే అర్జునునికొక సందేహం. అదేమిటయ్యా కృష్ణా! జ్ఞాని శరీరం కర్మచేస్తున్నా అతడు చేసినట్లు కాదా? అతడు కర్మ చెయ్యనివాడా? ఎలాగ?– అవునయ్యా అర్జునా! నీవు విరాట నగరంలో బృహన్నల పేరుతో అమ్మాయిలకు నాట్యం నేర్పావు గదా! అప్పుడందరూ నిన్ను 'బృహన్నలా' అనిపిలుస్తూ 'పేడి' అనే వాళ్ళు. వాళ్ళ దృష్టిలో నీవు పేడివి. మరి నీ దృష్టిలో కూడా పేడివేనా? కాదు గదా! నేనొక సుక్షత్రియవంశంలో జన్మించిన వీరపురుషుణ్ణి అనే భావంలోనే వున్నావు గదా! అలాగే జ్ఞాని కూడా ఇతరుల దృష్టిలో కర్మలు చేసేవాడు. కాని స్వదృష్టిలో కర్మాతీతుడు.

అసలు తినటం, తిరగటం, వినటం, చెప్పటం, లేవటం, కూర్చోవటం, వ్రాయటం, చదవటం, నిద్రపోవటం, మేల్కొనటం, మాట్లాడటం, పోట్లాడటం–అన్నీ కర్మలే అయినప్పుడు కర్మలు వదలటం ఎలా సాధ్యం? కనుక ఒక్కక్షణం కూడా కర్మలు వదిలే వీలు లేదు. అసలు కర్మలు వదలి ఊరికే ఉండటం అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు.

ఒక దేవస్థానంలో మహాత్ముడైన సాధువు ఉండేవాడు. ఆయనది పూర్తిగా నివృత్తి మార్గం. ఎప్పుడూ ఏకాంతంలో కన్నులు మూసుకొని, అంతర్ముఖుడై, పరమాత్మ

తత్వంలో లీనమైవుండేవాడు. ఆ దేవస్థానం ఆఫీసరు చాలా ఉత్తముడు. సాధువు యొక్క యోగ్యతను గమనించి ప్రతిరోజూ ఆయనకు ఉచితభోజనం ఏర్పాటుచేశాడు. కొంత కాలం తర్వాత ఆ ఆఫీసరు గారి స్థానంలో కొత్త ఆఫీసరు వచ్చాడు. ఏదో మార్పు చేస్తే గాని ఆయన ప్రత్యేకత నిలవదని, లెక్కల పుస్తకాలు తనిఖీ చేసి, ఊరకే కూర్చునే సాధువుకు భోజనం ఎందుకు? దండగ అని నిర్ణయించుకున్నాడు.

మరునాడు సాధువు దగ్గరకెళ్ళి, "అయ్యా! దేవస్థానం డబ్బు దుర్వినియోగం అవుతున్నది. ఏ పనీ చేయని వారికి ఇక భోజనాలుండవు" అన్నాడు. దానికాసాధువు "అయ్యా! ఇష్టమైతే పెట్టండి లేకుంటే లేదు. ఊరికే ఈ ఆర్భాటాలెందుకు? ప్రపంచాని కంతటికీ భోజనం పెట్టే వెయ్యి చేతుల భగవంతుడు పెట్టేందుకు సిద్ధంగా ఉంటే రెండు చేతుల అల్పమానవుణ్ణి అర్థించాల్సిన పనేముంది?" అన్నాడు. దానికా ఆఫీసరు, "నీవేమో ఏ పనీ చేయవు. ఊరికే కూర్చొనే వాడికెవడు పెడతాడు?" అన్నాడు.

"ఊరక కూర్చొవటం అంత తేలికనుకున్నావా? మాటి మాటికి ఊరకే వుండే వాడివి అంటున్నావు. పనులు చేయటం గొప్పకాదు. నిశ్చలస్థితిలో కూర్చొవటమే గొప్ప. ఏదీ కాసేపు ఏ పనీ చేయకుండా ఊరకే కూర్చోండి చూద్దాం" అన్నాడు సాధువు.

ఆఫీసరు గారు పౌరుషంతో కూర్చున్నాడు. కన్నులు మూసుకున్నాడు. 5 నిముషాలు కాలేదు. కళ్ళు తెరుస్తాడు. అటు చూస్తాడు. ఇటు చూస్తాడు. తలపైకెత్తుతాడు. అటూ ఇటూ మసలుతాడు. 10 నిముషాల్లో 12 అవతారాలెత్తాడు. మనస్సు చిందులు త్రొక్కుతున్నది. పాపం మానవుడు కష్టపడి పోతున్నాడు. చివరకు అసహనంగా లేచాడు.

ఇపుడు సాధువు అంటున్నాడు. "అయ్యా తెలిసిందా? ఊరక కూర్చోవటం ఎంత కష్టమో. నేను పనిలేకుండా లేను. ఊరక కూర్చోవటం అనే పెద్దపని చేస్తున్నాను" అన్నాడు.

**ఏ వ్యక్తి ఊరక కూర్చోలేడు. ప్రకృతికి వశుడై అవశంగా కర్మలు చేస్తూనే ఉంటాడు. ప్రకృతి అంటే ప్రతివారిలోను అంతర్గతంగా ఉన్న వాసనలే.** వాటి ప్రేరణలవల్లనే తలపులు, ఉద్రేకాలు వస్తాయి. అవే సత్వరజస్తమోగుణాలుగా విభాగించ బడతాయి. ఆ గుణాలే బలవంతంగా మనచేత కర్మలు చేయిస్తాయి. కనుక కర్మలు చేయకుండా ఎవ్వడూ ఒక్కక్షణం కూడా ఉండలేడు. ఒక్కొక్కప్పుడు మనం పొందాల్సిన కర్మఫలమే మనలను కర్మలకు ప్రేరేపిస్తుంటుంది. ప్రశాంతంగా కూర్చొని స్వామీజీ







ఉపన్యాసం వింటున్న ఒక మహిళ ఇంటికి తాళం వేశానా? లేదా? అనే సందేహం వచ్చి వెంటనే లేచి ఇంటికి బయలుదేరింది. దారిలో యాక్సిడెంట్ అయింది, కాలు విరిగింది, హాస్పటల్‌లో చేర్చారు. ఆమె అనుభవించాల్సిన కర్మఫలమే ఆమెనలా ప్రేరేపించటంతో ఆమె కదిలి ఇంటికి బయలుదేరింది. కనుక లోపలి ప్రేరణలున్నంత వరకు ఎవరూ ఊరకే కూర్చోలేరు.

-కర్మలను వదలాలని బలవంతంగా ఇంద్రియాలను అణచుకొంటే అనర్థం ఏమిటి? అట్టి వానిని ఏమంటారు? తరువాతి శ్లోకంలో-

**శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్।**
**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యా చారస్స ఉచ్యతే॥ (6)**

**తా॥ ఎవరైతే కర్మేంద్రియాలను నిగ్రహించి మనస్సులో ఇంద్రియ విషయాలను స్మరిస్తుంటాడో అతడు పరమ మూర్ఖుడు, కపటాచారి అని పిలవబడతాడు.**

**వ్యాఖ్య:** ఎవ్వడూ ఒక్కక్షణం కూడా కర్మలు చేయకుండా వుండే వీలు లేదని, అతడిలోని ప్రకృతియే (వాసనలే) అతడిచేత బలవంతంగా పనులు చేయిస్తాయని క్రిందటి శ్లోకంలో భగవానుడు తెలియజేశాడు. **అయితే లోపలినుండి ప్రేరణలు వచ్చినా సరే బలవంతంగా కర్మేంద్రియాలను అణచిపెట్టి కర్మత్యాగి కాకూడదా?** అనే సందేహం రావచ్చు. అయితే అలా బలవంతంగా ఇంద్రియాలను అణచు కోవటం పూర్తిగ అజ్ఞానంలో చేసే హఠయోగమౌతుంది. ఎవరైనా ఇంద్రియాలను అణచుకోగలరే గాని, మనస్సును మాత్రం అణచుకోలేరు. కర్మలు చేయాలనే ప్రేరణ మనస్సు లోపలి పొరల్లో వున్న వాసనల వలన వస్తున్నప్పటికీ, నేను కర్మలు చేయను అని భీష్మించుకొని ఎవరైతే తన కర్మేంద్రియాలను బలవంతంగా అణచిపెట్టి వుంటాడో, అట్టివాడు బాహ్యంగా కర్మలు చేయనట్లే వుంటాడు గాని, అతని మనస్సు మాత్రం అన్ని ఇంద్రియ విషయాలను స్మరిస్తూ స్వేచ్ఛా విహారం చేస్తూనే వుంటుంది. ఇలా మనస్సు విషయాలలో విహరిస్తూ వుంటే, కోరికలతో రగిలిపోతుంటే ఇంద్రియాలను మాత్రం బలవంతంగా అణచుకొని వుండే వాడినే పరమమూర్ఖుడు, మిథ్యాచారి-అంటే కపటాచారి అని భగవానుడు అతడికి బిరుదునిస్తున్నాడు.

క్రూరమైన కర్మలను శరీరంతో చేసేకంటే మనస్సుతో భావించుటయే ఎక్కువ ప్రమాదకరం. ఎందుకంటే మనస్సులోని భావాలు కార్యరూపం దాల్చనపుడు అవి తీరని కోరికలై మళ్ళీ మళ్ళీ మనస్సులో అలజడి రేపుతాయి. అవే వాసనలుగా మారి మళ్ళీ మళ్ళీ ప్రేరణనిస్తుంటాయి. వాటిని బట్టే కర్మలు జరుగుతుంటాయి. ఇలా

బలవంతంగా కర్మేంద్రియాలను అణచటం వల్ల మనసులోని కోరికలు వెయ్యింతలై బలంగా బుసలుకొడుతూ పైకి వస్తాయి. వాటియొక్క ఒత్తిడికి తట్టుకోలేక అతడు మరింతగా చెడిపోతాడు.

'నాకసలు కాఫీ అలవాటే లేదండీ' అని గొప్పకోసం; సత్ప్రవర్తన గలవాడినని నమ్మించటం కోసం బడాయికి పోతాడు ఒక యువకుడు. కాని అందరూ తలా ఒక కప్పు వేడి వేడి కాఫీ త్రాగుతుంటే లోపల లొట్టలు వేసుకుంటూ, బయటకు మాత్రం బలవంతంగా నిగ్రహించుకుంటాడు. ఇట్టి వాని మనస్సు ఎప్పుడూ ఆ కాఫీ చుట్టూ తిరుగుతూనే వుంటుంది. ఇట్టి వాడినే **కపటాచారి** అంటున్నది.

అయితే నిజమైన సాధకుడు కూడా ఇంద్రియనిగ్రహానికి ప్రయత్నిస్తుంటాడు. మనస్సు పరుగులు తీస్తూనే వుంటుంది. మరి ఇతడు కూడా కపటాచారియేనా? కాదు. ఎందుకంటే అతడు తన మనస్సు విషయాల మీదకు పరుగెడుతుంటే దానిని మరలించి దైవంపై నిలపటానికి ప్రయత్నిస్తుంటాడు. కాని కపటాచారి అలా చేయడు. అతడి నిగ్రహం 'చేపలకోసం కొంగ చూపించే నిగ్రహం లాంటిదే'.

వ్యర్థమైన భావనలతో, వృధాకల్పనలతో, నిరర్థకమైన మనోరాజ్యంలో విహరిస్తూ, మనస్సుతో భోగాలను భావిస్తూ ఇంద్రియాలను బిగబట్టుకొనేవాడిది లోకవంచనయే కాదు, ఆత్మవంచన కూడా. అట్టి వానికి ఉద్ధారకం లేదు. కనుక ఇంద్రియాలను బలవంతంగా అణచి మనస్సును స్వేచ్ఛగా వదిలితే గొప్ప అనర్థం వాటిల్లుతుంది. మరేం చేయాలి?

**శ్లో॥ యస్త్వింద్రాణి మనసా నియమ్యారభతేఽర్జున।**
**కర్మేంద్రియైః కర్మయోగం అసక్తస్య విశిష్యతే॥ (7)**

**తా॥ అర్జునా! ఎవరైతే మనస్సు ద్వారా జ్ఞానేంద్రియాలను నిగ్రహించి, కర్మేంద్రియాల ద్వారా సంగభావం లేకుండా కర్మ యోగాన్ని ఆరంభిస్తాడో అతడే శ్రేష్ఠుడు.**

**వ్యాఖ్య:** ఇంద్రియాలను బలవంతంగా అణచి మనస్సును స్వేచ్ఛగా వదిలితే అనర్థం గనుక ఇక్కడ ఉపాయం చెబుతున్నారు. మనస్సు చేత జ్ఞానేంద్రియాలను నిగ్రహించటం; కర్మేంద్రియాలద్వారా అసక్తంగా కర్మయోగాన్ని ఆచరించటం అనేవి ఆ ఉపాయాలు.

**(1) జ్ఞానేంద్రియాలను మనస్సు చేత నిగ్రహించటం:** కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక అనేవి జ్ఞానేంద్రియాలు. ఇవి బాహ్య ప్రపంచంలో సంచరిస్తూ విషయ సమాచారాన్ని సేకరించి మనస్సుకు అందిస్తాయి. మనస్సు ఆ ఇంద్రియాలతో







కలిసినపుడే విషయాసక్తి కలుగుతుంది. అలాగాక ఇంద్రియాలు సమాచారాన్ని తెచ్చినా మనస్సు గనుక ఆ ఇంద్రియాలకు సహకరించకపోతే ఎదురుగా ఎన్ని విషయాలున్నా ఆసక్తి కలుగదు.

ఎంతో ఆసక్తితో క్రికెట్ మ్యాచ్ చూస్తున్నాడు ఒకడు. చివరి ఓవర్. ఈ ఓవర్‌లో 16 రన్స్ చేస్తే గెలుపు. చేయగలడా? అని ఆత్రుత. మొదటి బాల్‌కు ఫోర్, రెండో బాల్‌కు 2 రన్స్ చేశాడు. 3వ బాల్‌కు రన్స్ లేవు. నాలుగో బాల్ సిక్స్. ఇక రెండు బాల్సే ఉన్నాయి. ఉత్కంఠ పెరిగింది. కన్నార్పకుండా చూస్తున్నాడు. ఇంతలో భార్య టిఫిన్ చేస్తారా? అని అడిగింది. ఆ మాట వినిపించనే లేదు. కారణం? అతడి మనస్సు కళ్ళు, చెవులు అనే జ్ఞానేంద్రియాలను తన ఆధీనంలో ఉంచుకొని మ్యాచ్ పరిశీలనలో నిమగ్నమై వుంది. అందుకే టిఫిన్ చేస్తారా? అనే భార్యమాట వినిపించలేదు. అంటే చెవి వున్నది గాని దానికి మనస్సు సహకరించటం లేదు. దీనినిబట్టి మనస్సు ఇంద్రియాలతో కలిస్తేనే విషయగ్రహణం. మనస్సు ఇంద్రియాలకు సహకరించకపోతే ఎదురుగా ఎన్ని విషయాలున్నా గ్రహించలేం అని తెలుస్తున్నది. అందుకే మనస్సు చేత జ్ఞానేంద్రియాలను నిగ్రహించమంటున్నాడు భగవానుడు. అలా చేయాలంటే మనస్సు ఇంద్రియాలకు అందుబాటులో లేకుండా వుండేటట్లు చూడాలి. ఎలా? ఇంద్రియాలు విషయ ప్రపంచంలో సంచరిస్తున్నా వాటి వెనుక ఉండే మనస్సును ఉన్నతమైన పరమాత్మయందు నిలపాలి. పరమాత్మ చింతనలో నిమగ్నం కావాలి. అప్పుడు విషయ సమాచారం మనస్సును చేరదు. ఇదే మనస్సు చేత జ్ఞానేంద్రియాలను నిగ్రహించే పద్ధతి. ఇలా జ్ఞానేంద్రియాలను నిగ్రహించి–

(2) కర్మేంద్రియాలతో అసక్త భావంతో ఆచరించాలి. కర్మలు చేస్తే లోపల వాసనలు క్షయమైపోతాయి. క్రొత్త వాసనలు చేరుతాయి. అలాగాక కర్మయోగాన్ని ఆచరిస్తే పాత వాసనలు ఖర్చవుతాయి. క్రొత్తవి చేరవు. దానితో మనస్సు వాసనా రహితమై శుద్ధమై ప్రశాంతమవుతుంది. అందువల్ల చేసే కర్మలను ఎటువంటి సంగభావం లేకుండా; ఈ కర్మల వల్ల నాకు ఫలానా ప్రయోజనం కలగాలనే కోరిక, ఆసక్తి లేకుండా నిర్లిప్తంగా, నిష్కామంగా, చేసే పనిమీదనే శ్రద్ధ ఉంచి కర్తవ్య భావంతో కర్మచేయాలి.

ఈ సిద్ధాంతంలో హేతువాదం, శాస్త్రీయసమన్వయం ఉంది. కనుక ఎట్టి సందేహాలకు ఆస్కారం లేదు. ఆచరించ టానికి వెనుకంజ వేయాల్సిన పనిలేదు. ఇంద్రియ నిగ్రహం వల్ల శక్తి కూడబెట్టబడుతుంది. ఆ శక్తి కర్మేంద్రియాలతో

కర్మలు చేయటంలో వినియోగించబడుతున్నది. పైగా కర్మలు చేసేటప్పుడు మనస్సు భగవంతునిపై వుండటం వల్ల చేసే కర్మలు భగవత్ కర్మలైపోతాయి. ఇట్టి కర్మలు చేసేవారే శ్రేష్ఠులు. కనుక బలవంతంగా కర్మలను నిరోధించటం గాక మనస్సును పరమాత్మపై నిలిపి అసంగంగా కర్మలు చేయాలని భగవంతుని ఆదేశం.

'కర్మయోగమా? జ్ఞానయోగమా? ఏదో ఒకటి నిశ్చయించి తేల్చి చెప్పు' అని అడిగిన అర్జునునికి ఈ శ్లోకం ద్వారా సమాధానం చెప్పబోతున్నాడు భగవానుడు. ఏమని?

**శ్లో॥ నియతం కురుకర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః ।**
**శరీర యాత్రాపిచతే నప్రసిద్ధ్యే దకర్మణః ॥ (8)**

**తా॥ నీ కర్తవ్య కర్మను నీవు చెయ్యి. కర్మ చేయకుండటం కన్న చేయటమే మంచిది. పని చేయకపోతే శరీరయాత్ర కూడా జరగదు.**

**వ్యాఖ్య:** అర్జునా! నీ నియత కర్మలను-విద్యుక్త కర్మలను తప్పకుండా చెయ్యాల్సిందే. నీకై నిశ్చయించబడిన కర్మలను నీవు తప్పక చేయాలి. నిశ్చయించేదెవరు అంటావా!

శాస్త్రము-స్వభావము. ఇప్పుడీ యుద్ధం సంగతి చూడు. యుద్ధం శాస్త్రనియతం. ఎందుకంటే నాలుగు వర్ణాల వారిలో క్షత్రియుడు తన భుజబలంతో ప్రజలను కాపాడాలి. కనుక శాస్త్రనియతం. అలాగే యుద్ధం నీ స్వభావనియతం ఎందుకంటే నీవు క్షత్రియ వీర పురుషుడవు. క్షత్రియుడికి రజోగుణం ప్రబలంగా ఉంటుంది. రజోగుణం ఉన్నవాడు ప్రశాంతంగా కూర్చోలేడు. దుష్టశిక్షణ-శిష్టరక్షణ చేయాలని, ధర్మాన్ని నిల బెట్టాలని, అధర్మాన్ని అణచివేయాలని తపనపడుతుంటాడు. అది అతడి స్వభావం. నీ స్వభావం అటువంటిదే గనుక అధర్మపరులైన కౌరవులను జయించాలని ఈ యుద్ధరంగంలో అడుగు పెట్టావు. కనుక ఈ యుద్ధం నీ స్వభావజనితం. కనుకనే తప్పకుండా ఈ యుద్ధాన్ని నీవు చేయాలి. యుద్ధం ఎంతటి క్రూరమైన, ఘోరమైన కర్మ అయినా నీ స్వధర్మాన్ని నీవు విడిచిపెట్టరాదు. నిష్కామభావంతో, ఫలాపేక్ష లేకుండా నీ కర్తవ్యం అని భావించి ఈ యుద్ధకర్మను చెయ్యి. నిష్కామంతో చేసిన కర్మ మనశ్శుద్ధిని కలిగిస్తుంది. తద్వారా మోక్షమార్గం వైపు నడిచేందుకు అర్హత లభిస్తుంది.

సూర్యుడు, చంద్రుడు, భూమి, వాయువు, నదులు, సముద్రాలు, గ్రహాలు, చెట్లు, చేమలు, పశువులు, పక్షులు- అన్నీ తమతమ స్వధర్మాలను నిర్వర్తిస్తూనే







వున్నాయి. ఒకవేళ తమ స్వధర్మాన్ని తప్పి సూర్యుడు వెలుగునివ్వకపోయినా, గ్రహాలు సంచరించకపోయినా, వాయువు వీచకపోయినా ప్రపంచమంతా అస్తవ్యస్తమై పోతుంది. చెట్లు జంతువులు తగ్గిపోతే ప్రకృతి సమతుల్యం దెబ్బతింటుంది. వర్షాలులేక, పంటలు పండక బీభత్సమవుతుంది. కనుక ఎవరి స్వధర్మాన్ని వారు నిర్వర్తించక తప్పదు.

ఇంతకుముందు 5వ శ్లోకంలో కర్మలు చేయక ఎవ్వడూ ఒక్కక్షణం కూడా ఉండలేడు అని చెప్పారు. అవి సహజ కర్మలు. గాలి పీల్చటం, వదలటం, కూర్చోవటం, నడవటం, నిద్రించటం, కాలకృత్యాలు తీర్చుకోవటం, చూడటం, వినటం, స్పర్శించటం, తినటం, త్రాగటం- ఇలాంటివన్నీ సహజ కర్మలు 'వీటిని తప్పక చేయాలి' అని ఎవరూ చెప్పనక్కరలేదు. కాని ఈ శ్లోకంలో చెప్పిన శాస్త్రనియత, స్వభావనియత కర్మలను తప్పక చేయాలి. వాటిని మానటం కన్న చేయటమే మంచిది- అని చెబుతున్నారు. ఎందుకంటే కర్మలు మానితే దేహయాత్ర, జీవనయాత్ర సాగదు. దేహపోషణ, కుటుంబ పోషణ జరగదు. దేశానికి నష్టం, సంఘంలో అవమానం, గృహంలో అశాంతి, తిన్నది అరగక అనారోగ్యం. ఇవన్నీ గాక లోపలి వాసనలు ఖర్చు గాక మనస్సు బరువెక్కుతుంది.

సోమరిజీవితం భారమైనది. 'సోమరి తలలో దయ్యాలుంటాయ'ని సామెత. మనకు ఎడమచెయ్యి సోమరి. ఏ పని చెయ్యాల్సివచ్చినా అది కుడిచేతిని ముందుకు నెట్టి తాను వెనక్కుపోతుంది. అందుకే భగవంతుడు దానికొక అసహ్యకరమైన పనిని అప్పగించాడు. సోమరిపోతులగతి అంతే అని హెచ్చరిక.

కనుక ప్రతివ్యక్తీ తన కర్తవ్య కర్మలను-అంటే శాస్త్రనియత- స్వభావనియత కర్మలను తప్పక చేయాలి. అప్పుడే వాసనాక్షయం, ఆ చెయ్యటం కూడా నిష్కామంగా చెయ్యాలి. భగవానుని సమాధానాన్ని విన్న అర్జునునికి ఏ మూలనో సందేహం. కర్తవ్యకర్మలు చెయ్యాల్సిందే. ఆ చెయ్యటం నిష్కామంగా చెయ్యాలి. సరే ఆ చేసేటప్పుడు అజాగ్రత్త వల్ల ఏవైనా పొరపాట్లు జరిగితే మళ్ళీ బంధమే గదా! ఎలా దీనికి పరిష్కారం?

**శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణో న్యత్ర లోకోయం కర్మబంధనః**
**తదర్థం కర్మ కౌంతేయ!ముక్తసంగస్స మాచర॥ (9)**

**తా॥ యజ్ఞం కోసం చేసే కర్మలకన్న వేరైన కర్మలవల్లనే ఈ లోకం బంధింపబడుతున్నది. కుంతీ కుమారా! అందువల్ల సంగభావాన్ని వదిలిపెట్టి యజ్ఞకర్మల నాచరించు.**

**వ్యాఖ్య:** స్వామీ! నీవేమో కర్మలను చెయ్యమంటావు. కర్మలేమో బంధాన్ని కలిగించేవైపోయె. అలాగని చెయ్యకుండా ఉండే వీలు లేదాయె. అందుకే నిష్కామంగా చెయ్యాలంటున్నావు. మరి అలా చేసేటప్పుడు ఏవైనా పొరపాట్లు జరిగితే, అజాగ్రత్తగా వుంటే? అనుకోకుండా కోరిక కలిగితే? బంధమే కదా! ఎలా చేయాలి ఈ నిష్కామ కర్మలను? –ఇదీ అర్జునుని మనసులోని సందేహం. ఇంతవరకు సిద్ధాంతం విన్నాడు. బాగానే ఉంది. కాని ప్రాక్టికల్‌గా దోష రహితంగా ఎలా చేయాలి? అని తపన.

అర్జునుని మనస్సులోని సందేహాన్ని గ్రహించిన భగవానుడు "అర్జునా! ఎంత పెద్ద సమస్యకైనా పరిష్కారముంటుంది. దానిని తెలుసుకొనే నేర్పుకావాలి. పనసపండు ఒలిచే వాడికి పాలజిడ్డు అంటుకుంటుంది. అది అంటుకుంటే పండు ఒలవటానికే వీలుపడదు. ఆ జిడ్డు అంటుకోకుండా ఉండాలంటే చేతులకు నూనె రాసుకోవాలి. అలాగే బంధంలో పడకుండా కర్మ చేయాలంటే ఒక కౌశలం ఉంది. నేర్పు ఉంది. అదేమంటావా? యజ్ఞార్థంగా కర్మలు చేయటమే" అని తెలియజేశాడు.

**'యజ్ఞము'** అనే దానికి భగవానుడిక్కడ క్రొత్త అర్థాన్ని ఇస్తున్నాడు. సాధారణంగా యజ్ఞం అంటే హోమగుండం, అగ్ని , ఆహుతులు, ఋత్విజులు, మంత్రాలు ఉండాలి. కాని ఇక్కడ భగవానుడు ఆ అర్థంతో చెప్పటం లేదు. "నీవు చేసే కర్మలన్నింటినీ–అవి ఏవైనా సరే వాటిని స్వార్థం లేకుండా, లాభాన్ని కోరకుండా, భగవత్ప్రీతికరంగా, లోకహితార్థంగా చెయ్యి. అలాచేసే కర్మలన్నీ యజ్ఞకర్మలే. ఇట్టి కర్మల వల్ల ఎన్నటికీ బంధం కలగదు–అని హామీ ఇస్తున్నాడు. అంతేకాదు.

**ముక్తసంగస్సమాచర:** యజ్ఞార్థంగా కర్మలు చేయటమే కాదు. అలా చేసే కర్మలను సంగభావం విడిచి చక్కగా చేయాలి అని కూడా తెలియజేస్తున్నాడు. ఏమిటీ సంగభావం? కర్మలు చేసేది నేను, ఫలితం రావాల్సింది నాకు–అనేదే సంగభావం. ఈ నేను–నాకు అనే సంగాన్ని వదిలిపెట్టి ఏ కర్మచేసినా అది బంధం కాదు. పాదరసాన్ని శుద్ధి చేయకుండా వాడితే విషం అవుతుంది. శుద్ధి చేసి వాడితే అమృతమౌతుంది. అలాగే కర్మలను సంగభావంతో చేస్తే బంధమవుతుంది. నేను–నాకు అనే సంగభావాన్ని వదిలిచేస్తే మోక్షానికి మార్గమవుతుంది.

అన్నింటికి కర్త భగవంతుడు. ఆయన చేతిలో పనిముట్టును నేను. ఆయన సూత్రధారి. నేను పాత్రధారిని. ఆయన పలికిస్తే పలికే పిల్లనగ్రోవిని. ఆయన 'కీ' ఇస్తే ఆడే గడియారాన్ని. ఇదీ నిజంగా పరిస్థితి. ఐతే అజ్ఞానంతో నేను చేస్తున్నాను;







ఇదంతా నా వల్లనే సాధ్యపడింది అంటాం. నేను కాబట్టి నా తెలివితేటలతో ఇంతటి వాణ్ణి అయ్యాను అని విర్రవీగుతాం. అంతా మన నెత్తిమీద వేసుకుంటాం. ఇదే సంగభావం.

ఒకడు రైలు బయలుదేరే సమయంలో హడావుడిగా పరిగెత్తుకుంటూ వచ్చి రైలెక్కాడు. తన సూట్‌కేస్‌ను తలపై పెట్టుకున్నాడు. ప్రక్కనున్న ప్రయాణీకుడు అదేమని అడిగాడు. దానికా బుద్ధిమంతుడన్నాడు– "ఈ రైలు మనను మోస్తే చాలు. ఇంకా మన బరువులను కూడా మోయమనటం ఏం న్యాయం?" అన్నాడు. తనని, తన సామానులను అన్నింటిని మోసేది రైలేననే జ్ఞానంలేదు అతడికి. మన తెలివి కూడా అలాగే ఉంది. మనకూ, మనం సాధించే విషయాలకు, 'అన్నింటికీ కర్త భగవంతుడే'. అయితే నేనే కర్తను అనటం మన తెలివి తక్కువతనం. నేను చేస్తున్నాను అనేది వృధా కర్తృత్వం. కనుక కర్మరహస్యాన్ని తెలుసుకొని కర్మలనా చరించాలి. భగవత్ప్రీతికరమైన కర్మలను, లోకహితార్థంగా చేయాలి. సంగభావాన్ని విడిచిచేయాలి. ఇవే యజ్ఞకర్మలు. ఇదే బంధం నుండి తప్పించుకొనే నేర్పు. ఈ నేర్పుతో కర్మలు చేస్తే ఏ దోషాలు లేవు. బంధం కావు. అందుకే సంగభావాన్ని విడిచి యజ్ఞకర్మల నాచరించమని భగవానుడు ఉపదేశిస్తున్నాడు. అసలీ యజ్ఞభావన ఎక్కడినుండి వచ్చింది? ఎందుకు వచ్చింది?

**శ్లో॥ సహయజ్ఞాః ప్రజాసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏషవోస్త్విష్టకామధుక్॥ (10)**

**శ్లో॥ దేవాన్ భావయతానేన తేదేవా భావయంతువః॥**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥ (11)**

**తా॥ బ్రహ్మదేవుడు సృష్టి చేసేటప్పుడు యజ్ఞంతో సహా ప్రజలను సృష్టించి ముందే ఇలా చెప్పాడు. "ఈ యజ్ఞకర్మల చేత మీరు వృద్ధి పొందండి, ఇది మీ కోరిన కోర్కెలు తీర్చే కామధేనువు వంటిది" అని ఆశీర్వదించాడు (10)**

**తా॥ "ఈ యజ్ఞకర్మల చేత దేవతలను తృప్తిపరచండి. ఆ దేవతలు మిమ్ము అనుగ్రహించి తృప్తి పరుస్తారు. ఇలా పరస్పరం తృప్తినొందించుకొనుట ద్వారా గొప్ప శ్రేయస్సును పొందుతారు" (11)**

**వ్యాఖ్య:** పూర్వం ప్రజాపతిగా సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు పంచభూతాలతో కూడిన ఈ విశ్వాన్ని సృష్టించి, ఆ తరువాత పంచ భూతాత్మకమైన ప్రాణికోటిని

సృష్టించాడు. అందులో మనుష్యులు కూడా ఉన్నారు. అలా సృష్టి చేసి ఈ మానవులు తమను తాము ఉద్ధరించుకొని తరించటానికి వీలుగా ఈ యజ్ఞకర్మలను యజ్ఞభావనను కూడా సృష్టించాడు. ఏమిటీ యజ్ఞభావన? ఎటువంటి స్వార్థబుద్ధి లేకుండా, లోక సంగ్రహార్థం, పరోపకారం కొరకు, భగవత్ ప్రీతికై కర్మలు చేయుటయే. ఈ భావనతో చేసే కర్మలన్నీ యజ్ఞకర్మలే.

ఈ యజ్ఞభావన భగవంతుని సృష్టియే గనుక విశ్వ మంతటా ఇది మనకు కనిపిస్తుంది. ఈ విశ్వంలో పుట్టినవన్నీ (మానవుడు తప్ప) ఈ యజ్ఞకర్మల నాచరిస్తూనే ఉన్నాయి. **సూర్యుడు** తాను అపారమైన తాపాన్ని భరిస్తూ లోకానికంతటికీ వెలుగునిస్తున్నాడు. **సముద్రం** నుండి నీటిని స్వీకరించి మేఘాలకిచ్చి వర్షరూపంలో మనకు అందిస్తున్నాడు– అదీ ఉప్పునీటిని తియ్యగా మార్చి. **ఆకాశం** మనందరం తిరగటానికి అవకాశం కల్పిస్తున్నది. **వాయువు** ఒక్కక్షణం కూడా విశ్రాంతి తీసుకోకుండా మన ప్రాణాలను నిలబెడుతున్నది. **భూమి** పంటల ద్వారా మనకు కావలసిన ఆహారాన్నివ్వటమే గాక మనకు ఆధారంగా ఉన్నది. **వృక్షాలు** మనకు కావలసిన పూలు, పండ్లు వంటచెరుకును ఇవ్వటమే గాక మనకు నీడను ప్రసాదిస్తున్నవి. మనం విడిచే కార్బన్‌డయాక్సైడ్‌ను తీసుకొని మనకు కావలసిన ప్రాణవాయువు ఆక్సిజన్‌నిస్తున్నవి.

ఇలా చూస్తే సృష్టిలో అన్నీ తమతమ పరిధులలో నేను చేస్తున్నాననే కర్తృత్వబుద్ధి, స్వార్థబుద్ధి ఏమాత్రం లేకుండా పరోపకారం, లోకకళ్యాణమే తమ ధర్మంగా యజ్ఞకర్మలు చేస్తూనే ఉన్నాయి. అలాగే సత్పురుషులు కూడా నిస్వార్థబుద్ధితో పరోపకారం కొరకే జీవిస్తారు. ఇదే యజ్ఞజీవితం, త్యాగజీవితం. దీనిని బట్టి మనం కూడా యజ్ఞజీవితాన్ని గడపాలి. పరోపకారం కొరకు నిస్వార్థంగా చేయగలిగినంత చేయాలి అని ఋజువౌతున్నది. అందుకే..

సృష్టిచేసిన బ్రహ్మదేవుడు "మీరు ఈ యజ్ఞకర్మలద్వారా వృద్ధి పొందండి. ఇది మీ కోర్కెలు తీర్చే కామధేనువు" అని చెప్పటం జరిగింది. యజ్ఞభావనతో కర్మలు చేసినపుడు ఆ యజ్ఞభావనయే మీరు కోరిన కోరికలు తీరుస్తుంది అని అంతరార్థం. కోరిన కోరికలంటే అల్పమైన కోరికలే కాదు. తరించిపోయే కోరికలు కూడా. ఎలా తీరుతాయి ఆ కోరికలు? అదీ ఆయనే చెప్పాడు. "మీరు యజ్ఞకర్మలచేత దేవతలను తృప్తిపరచండి. ఆ దేవతలు మిమ్ము అనుగ్రహించి తృప్తిపరుస్తారు. ఇలా పరస్పర తృప్తి ద్వారా గొప్ప శ్రేయస్సును పొందుతారు" అని–







యజ్ఞకర్మల ద్వారా అంటే త్యాగబుద్ధితో దేవతలను, గురువులను, పితరులను, అతిథులను ఆరాధించాలి. వారిని తృప్తి పరచాలి. దేవతలు అంటే "దానాత్‌దేవః" = ఇచ్చే వారు దేవతలు అని. వివిధ రూపాలలో మనచే ఆరాధించబడే, పూజింపబడే దేవతలంతా పరమాత్మ యొక్క ప్రతినిధులుగా మనకు ఆహారాన్ని, గాలిని, నీటిని, వెలుతురును, చల్లదనాన్ని, భోగాలనిస్తున్నారు. కనుక వారిని ఆరాధించి తృప్తి పరచాలి. గురువులు మనకు జ్ఞానాన్నిచ్చే వారు గనుక గురుదేవులయ్యారు. తల్లిదండ్రులు మనకు దేహాన్నిచ్చినవారు గనుక పితృదేవతలయ్యారు. అతిథులు మనకు ఆశీస్సులందించే వారు గనుక అతిథి దేవుళ్ళయ్యారు. అందుకే మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథి దేవోభవ అంటూ అందరిని దేవతలుగా కీర్తిస్తున్నాం. వీరందరిని ఆరాధించి, పూజించి, సేవించి తృప్తిపరచటం మన విధి. భగవంతుడు మెచ్చే యజ్ఞకర్మ. ఇలా వారిని తృప్తి పరిస్తే ఆ దేవతలు మనను అనుగ్రహిస్తారు. మనకు కావలసిన వాటినిచ్చి తృప్తిపరుస్తారు. ఇదే పరస్పర సహకారంతో తృప్తిని, శ్రేయస్సును పొందటం.

అసలు ఈ ప్రపంచమే ఒక 'ఆదానప్రదానశాల' 'పరస్పర సహకారసంస్థ' ఎలా? ఒక చెట్టుకు నీవు నీరు పోస్తే అది నీకు పుష్పాలను, ఫలాలను ఇస్తున్నది. ఆవుకు గడ్డి వేస్తే అది నీకు పాలనిస్తున్నది. ఇదే పరస్పర సహకారం.

సముద్రాన్ని చూడండి. అది తన నీటిని ఆవిరిరూపంలో మేఘాలకిస్తున్నది. మేఘాలు ఆ నీటిని కొండలలో, కోనలలో వర్షరూపంలో కుమ్మరిస్తున్నాయి. ఆ కొండలు, కోనలు ఆ నీటిని నదులకు సప్లై చేస్తున్నాయి. నదులు చాలా దూరం ప్రయాణించి చివరకు ఆ నీటిని సముద్రానికే చేరుస్తాయి. ఇదే యజ్ఞచక్రం. ఇదే ఈశ్వరీయ విధానం. దేవతలను మనుష్యులను కలిపే లింక్ ఇదే. మనుష్యులు దేవతలను తృప్తి పరచాలి. దేవతలు మనుష్యులను తృప్తిపరుస్తారు. ఒకరికొకరు సహరించుకోవటం–**పరస్పరం భావయంతః** అంటే ఇదే. మానవులలో కూడా ఈ పరస్పరసహకారముండాలి.

ఒక ధర్మాత్ముడు సాధుసంతులకు అన్నసంతర్పణ చేస్తున్నాడు. మంచిమంచి పిండివంటలతో అందరికీ భోజనం వడ్డించారు. మంత్రం చెప్పే దాకా ఎవ్వరూ భోజనం చేయ కూడదన్నాడు. అన్నీ వడ్డించటం అయింది. అందరూ మంత్రం కొరకు ఎదురుచూస్తూ కూర్చున్నారు. అప్పుడా ధర్మాత్ముడొక గొప్ప మంత్రం చెప్పాడు.

ఏమిటా మంత్రం? "ఎవ్వరైనా సరే ఒక్కముద్దనోట్లో పెట్టుకున్నారా– ఇదిగో దీనితో మీ తల పగిలి పోతుంది. ఇక తినండి" అని పచ్చడి బండచేతిలో పట్టుకొని నిలబడ్డాడు. అందరూ విభ్రాంతులయ్యారు. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయినవి. ఎవ్వరూ విస్తరిలో చెయ్యి పెట్టే సాహసం చేయటం లేదు. అంతలో ఒక బుద్ధిమంతు డన్నాడు, "మేం నోట్లో పెట్టుకోం, తినం, ఎదటివారి నోట్లో పెడతాం, తినిపిస్తాం" అన్నాడు. దానితో అందరూ ఒకరికొకరు తినిపించుకున్నారు. అందరూ తృప్తి చెందారు. పరస్పరం భావయంతః. ఇలాగే దేవతలు మానవులు పరస్పరం ఒకరి నొకరు తృప్తి పరచుకోవాలి–అనేదే బ్రహ్మదేవుని అభీష్టం. అలా చేసినపుడే పరమశ్రేయస్సును పొందుతారు. ప్రపంచంలో అనేక శ్రేయస్సులున్నాయి. కాని పరమ శ్రేయస్సు ఒక్కటే. అదే మోక్షం. అట్టి మోక్షాన్ని పొందాలంటే దేవతలను యజ్ఞభావనతో తృప్తి పరచాలి. ఎలా?

లోకహితార్థంగా, నిస్వార్థ భావంతో, త్యాగభావంతో, భగవత్ప్రీతికరమైన కర్మలను చేయటం ద్వారా. అట్టి వారికే పరమ శ్రేయస్సు.

–ఇలా యజ్ఞకర్మల ద్వారా దేవతలను ఆరాధించకుండా, భగవంతుడిచ్చిన దానిని అనుభవిస్తుంటే?–

**శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హివోదేవా దాస్యంతే యజ్ఞభావితాః।**
**తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవసః॥ (12)**

**తా॥ యజ్ఞము చేత సంతోషపెట్టబడిన దేవతలు మీకు ఇష్టమైన భోగాలను ఇస్తారు. ఆ దేవతల చేత ఇవ్వబడినవాటిని వారికి సమర్పించకుండా ఎవడు అనుభవిస్తాడో అట్టి వాడు దొంగయే.**

**వాఖ్య:** యజ్ఞకర్మలద్వారా దేవతలను ఆరాధించినపుడు ఆ దేవతలు భోగ్యవస్తువులను ఇస్తారు. అయితే దేవతలచే మనకు ప్రసాదించబడిన వాటిని భగవంతునికి లేదా ఆయా దేవతలకు సమర్పించకుండా అనుభవిస్తే అట్టివాణ్ణి చోరుడు– దొంగ అని భగవానుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

దొంగ అంటే ఎవరు? ఇతరుల వస్తువులను వారికి చెప్పకుండా, వారి అనుమతి లేకుండా, లేదా తగిన ధర చెల్లించకుండా తెచ్చుకొంటే దొంగ అంటారు. మరి మనం తినే ఆహారం, త్రాగేనీరు, పీల్చేగాలి, ధరించే వస్త్రం, పళ్ళు, పూలు అన్నీ భగవంతుడిచ్చినవే. అన్నీ భగవంతుని సొత్తే. మరి ఆయన సొత్తును తీసుకొనుటకు ఆయన అనుమతిని తీసుకోవద్దా? భగవంతునికి సమర్పించవద్దా? నిజమే అనుమతి



15



ఎలా తీసుకోవాలి? ఎలా సమర్పించాలి? ఆయన మన ఎదురుగా ఉంటే అనుమతి తీసుకొనేవాళ్ళం. ఆయనకు ముందుగా సమర్పించే వాళ్ళమే. కాని ఆయన ఎదురుగా లేదు గదా? ఎలా భగవంతునికి సమర్పించటం? అంటే భగవత్స్వరూపులైన ప్రాణులకు సమర్పించటమే. తోటి మానవులకు, అతిథులకు, అభ్యాగతులకు, జంతువులకు, చీమలకు, పక్షులకు – ఇలా నీకు తటస్థపడిన ప్రాణులెవ్వరికైనా కొంత అర్పించి మిగిలిన దానిని భగవదర్పణ చేసి భుజించాలి. అలా సమర్పణ లేకుండా నీవు ఆరగిస్తే సమాజం దృష్టిలో నీవు కలెక్టరువైనా, గవర్నరు వైనా, ప్రధానివైనా, న్యాయాధిపతివైనా భగవంతుని దృష్టిలో మాత్రం దొంగవే. దొంగకు శిక్ష తప్పదు గదా! భగవంతుడు చిత్రవిచిత్రంగా శిక్షిస్తాడు. ఎలా?

ప్రకృతి వనరులన్నీ భగవంతుడిచ్చినవే. అరణ్యాలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, జంతుజాలం, గాలి, నీరు, భూమి, ఆకాశం, ఖనిజాలు, బంగారం, వృక్షజాలం–అన్నీ మానవుని ఉపయోగం కొరకు భగవంతుడిచ్చినవే. వీటిని మనం వాడుకుంటున్నాం. అయితే భగవంతునిపట్ల కృతజ్ఞతాభావం. సమర్పణభావం ఉండటం లేదు. ఈ కృతజ్ఞత, సమర్పణ లేకుండా, వాటిని వాడుకుంటే దొంగలమే. చెట్లు నరికి, అరణ్యాలను అంతం చేసి భారీ ప్రాజెక్టులు నిర్మిస్తాం. కాని మళ్ళీ చెట్లు, అరణ్యాలు పెంచం. అంటే భగవంతుడిచ్చిన ప్రకృతిని నాశనం చేస్తాం, కాని సమతుల్యత దెబ్బతినకుండా ప్రకృతిని కాపాడం. అందుకే శిక్షగా ప్రకృతి వైపరీత్యాలు, భూకంపాలు, తుఫాన్లు మొదలయినవి.

కనుక చెట్లు నరికితే కొత్తవి పెంచాలి. పంటలు పండిస్తే భూసారం తగ్గుతుంది. గనుక తిరిగి ఎరువులు వాడి భూసారాన్ని పెంచాలి. వన్యమృగాలు నశిస్తుంటే వాటిని సంరక్షించాలి. గాలిని నీటిని స్వచ్ఛంగా ఉంచుకోవాలి. ఇదే మనం దేవతలకు సమర్పించాల్సింది.

దీనినిబట్టి మనకొక విషయం స్పష్టమవుతున్నది. మనకున్న దాన్ని–అది డబ్బు కావచ్చు, వస్తువులు కావచ్చు, తెలివి తేటలు కావచ్చు, జ్ఞానం కావచ్చు–ఇతరులతో కలిసి అనుభవించాలి. సమాజానికి ఉపయోగపడాలి. నీవు ఒక్కడివే అనుభవించాలనుకున్నా, ఒక్కడివే బాగుపడాలనుకున్నా, ఇతరులతో కలవకుండా స్వార్థమే పరమార్థంగా జీవించాలను కున్నా నీవు దొంగవే అవుతావు. కనుక ఎవ్వరూ స్వార్థపరాయణులు కాకుండా, తోటివాడికి సాయపడటం తన విధ్యుక్తధర్మం అనే భావంతో ఉండాలి. అలాంటి అవకాశం ఎప్పుడొస్తుందా? అని ఎదురుచూడాలి.

అందుకే విదేశాల్లో పుచ్చుకొన్నవాడు థ్యాంక్స్ చెబితే మన దేశంలో ఇచ్చినవాడు నమస్కరిస్తాడు. ఎందుకు? తోటివాడికి సహాయపడే అవకాశం నీ వల్ల నాకు వచ్చింది - అనే భావంతో. కనుక భగవంతుడిచ్చిన దానిని భగవత్స్వరూపులైన ప్రాణులకు సమర్పించి అనుభవించాలి. అలా సమర్పించని వాడు చోరుడు. ఇలా భగవదర్పితం చేసి భుజిస్తే-అనుభవిస్తే ప్రయోజనమేమిటి?

**శ్లో॥ యజ్ఞశిష్టా శినస్సంతః ముచ్యంతే సర్వకిల్బిషైః**
**భుంజతే తేత్వఘంపాపాః యేపచంత్యాత్మకారణాత్॥ (13)**

**తా॥ యజ్ఞము చేయగా మిగిలిన అమృతాన్ని (దేవతలకు సమర్పించగా మిగిలిన దాన్ని) భుజించిన సత్పురుషులు సమస్త పాపాలనుండి విడుదల పొందుతారు. అలాగాక ఎవరైతే తమకొరకే వండుకుంటారో అట్టివారు పాపులు. వారు పాపాన్నే తింటారు.**

**వ్యాఖ్య:** ఈ లోకంలో మనం జీవిస్తున్నామంటే ఎందరి సహకారమో ఉంటున్నది. ప్రతి మనిషి తనకు కావలసిన ఆహారాన్ని, వస్త్రాలను, ఉపయోగించే వస్తువులను తానే తయారు చేసుకోలేడు. పరస్పర సహకారంతోనే అన్నీ సమకూర్చుకొని అనుభవిస్తున్నాడు. కనుక సమిష్టి శ్రేయస్సుకు పాటుపడాలి. సమిష్టి శ్రేయస్సులోనే తన శ్రేయస్సు ఉన్నదని గ్రహించి వ్యవహరించేవారే సత్పురుషులు. స్వార్ధంతో జీవించే వాడు పాపాన్ని మూటగట్టుకుంటున్నట్లే.

ఈ లోకంలో జన్మించిన ప్రతి వ్యక్తి తన జీవనం కొరకు, అభ్యుదయం కొరకు, జన్మసార్ధ్యతకొరకు అనేకమందిపై ఆధారపడుతున్నాడు. ఎవరెవరు సహాయం చేస్తున్నారోవారికి ఋణపడి ఉంటున్నాడు. ఆ ఋణం తీర్చుకోవాలి. అందుకు శాస్త్రం పంచయజ్ఞాలను విధిస్తున్నది ఏమిటవి?

**(1) దేవతలు** మనకు ఆహారం, నీరు, గాలి, వెలుతురు, ఆధారం, సంపదలు ఇస్తున్నారు. వారి ఋణం తీర్చుకొనుటకు **'దైవయజ్ఞం'** చేయాలి, అంటే యజ్ఞ యాగాదులు, పూజాపున స్కారాలు, నోములు, వ్రతాలు, దైవప్రార్ధనలు, భజనలు మొదలగునవి చేయాలి.

**(2) ఋషులు** మనం ధర్మబద్ధమైన జీవితాన్ని గడిపేందుకు, తరించేందుకు కావలసిన జ్ఞానాన్ని శాస్త్రాల ద్వారా, ఇతిహాసాల ద్వారా, పురాణాల ద్వారా అందించారు. వారి ఋణం తీర్చుకొనుటకు 'ఋషియజ్ఞం' అంటే వేదపఠనం, పారాయణం, రామాయణ, భారత, భాగవత, పురాణములను చదవటం, వినటం ముఖ్యంగా భగవద్గీతను అధ్యయనం చేయటం ద్వారా ఋషి ఋణాన్ని తీర్చుకోవాలి.







**(3) పితృదేవతలు** మనకు ఈ దేహాన్ని ప్రసాదించారు. ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి, మనం హాయిగా జీవించాలని ఆరాటపడుతూ ఉంటారు. వారి ఋణం తీర్చుకొనుటకు **'పితృయజ్ఞం'** చేయాలి. అంటే తల్లిదండ్రులు జీవించి ఉన్నంతవరకు వారికి ఏలోటూ రాకుండా చూసుకుంటూ వారిని సంతృప్తి పరచటం, మరణించిన తర్వాత తర్పణాలతో, శ్రాద్ధకర్మలతో పితృదేవలకు ఊర్ధ్వగతులు కలుగునట్లు చేయాలి.

**(4) మనుష్యులు** వారివారి వృత్తుల ద్వారా, కర్మలద్వారా ఎన్నో విధాలుగా మన జీవనానికి సాయపడుతున్నారు. వారి ఋణాన్ని తీర్చుకొనుటకు **'మనుష్యయజ్ఞం'** లేదా **'నృయజ్ఞం'** చేయాలి. అంటే అతిథులకు, అభ్యాగతులకు, యతులకు, బ్రహ్మచారులకు భోజనం పెట్టటం, తోటి వారికి కష్టాలలో చేతనైనంత సాయం చేయటం ద్వారా మనుష్యఋణం తీర్చుకోవాలి.

**(5) భూతములు** అంటే పశువులు, పక్షులు, క్రిమికీటకాలు- ఇంకా అనేక జంతువులు, వృక్షములు మనకెంతో సాయపడుతూ ఉన్నవి. వ్యవసాయానికి ఎద్దులు; పాలు పెరుగు వెన్న, నెయ్యి మొదలైన వాటికొరకు ఆవులు, గేదెలు, కాపలాకు కుక్కలు; పళ్ళు పూలకై వృక్షాలు; మన సుఖానికి, జీవనానికి సాయపడుతున్నాయి. వాటి ఋణం తీర్చుకొనుటకు **'భూతయజ్ఞం'** విధించబడింది. పశుపక్ష్యాదులను పోషించటం. మొక్కలకు నీరుపోయటం, చీమలకు ఆహారాన్నివ్వటం, పక్షులకు గింజలు వేయటం ద్వారా భూత ఋణం తీర్చుకోవాలి.

అంటే ఈ పంచయజ్ఞాల ద్వారా వారివారి భాగాలు వారికిచ్చి, సంతోషపరిచి మిగిలిన యజ్ఞశేషాన్ని తినాలి. వారే సత్పురుషులు. వారు తినేది అన్నాన్ని కాదు; అమృతాన్ని. వారు సమస్త పాపాలనుండి విడుదల పొందుతారు. అన్ని ఋణాలు తీర్చుకున్నవారౌతారు. అలాకాకుండా అందరి సహకారాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో స్వీకరించి; ఇతరులకు పెట్టకుండా, పరుల శ్రేయస్సును పట్టించుకోకుండా, తన బొజ్జనిండితే చాలని, తనకోసం మాత్రమే సంపాదించుకొని తానే తినేవాడు పాపాన్ని తిన్నట్టే. అట్టివారు పాపులే అని భగవానుడీ శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు. ఇక్కడ తన కోసమే అంటే తనవారి కోసం తన కుటుంబం కోసం చేసినది కూడా తనకోసం చేసినదేనని గ్రహించాలి.

కనుక ఇతరులకు పెట్టకుండా పంచభక్ష్య పరమాన్నాలు తిన్నా అవి విషమే; పాపమే. ఇతరులకు పెట్టి తాను తిన్నదే అమృతమౌతుంది.

అబ్బే మనం అభ్యాగతులకు పెడుతున్నాం గదా! అంటే ఎలా పెడుతున్నామో ఆలోచించాలి. (1) వీడు వచ్చాడంటే వదలడండీ పీడాకారం. శనిపడితే ఏడేళ్లు. వీడు పడితే పధ్నాలుగేళ్ళంటూ ఒక ముద్దపెడితే అది సమర్పణ కాదు. (2) ఇవ్వాళ మిగలలేదమ్మా, రేపు రా అంటారు. అంటే మనం తిన్నతర్వాత మిగిలితేనే పెట్టాలి అనే భావన లేదా నిన్న మనం తినగా ఏదైనా మిగిలితే ఎలాగూ పారవెయ్యాలి గదా అని వారికి వేద్దాం అనుకుంటారు. ఇదీ సమర్పణ కాదు.

త్యాగభావంతో, బాధ్యతగా భావించి, ఇష్టపూర్వకంగా, ప్రేమతో అందించేదే సమర్పణ. అలా ఇతరులకు సమర్పించగా మిగిలినదానినే తినాలి. అదే యజ్ఞశిష్టాశినః. యజ్ఞం పూర్తయిన తర్వాత మిగిలినదే యజ్ఞావశేషం– యజ్ఞ శేషం–ప్రసాదం. దాన్ని తినాలి. –యజ్ఞానికింత ప్రాధాన్యతేమిటి? యజ్ఞాలలో ప్రతిష్టితుడై ఉన్నది సాక్షాత్ పరమాత్మే. ఎలా?

– యజ్ఞమునకు ఇంతటి ప్రాధాన్యత ఎందుకు?

**శ్లో॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః।**
**యజ్ఞాత్ భవతి పర్జన్యః యజ్ఞః కర్మసముద్భవః॥ (14)**

**శ్లో॥ కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞేప్రతిష్టితం॥ (15)**

**తా॥ ప్రాణులన్నీ అన్నం వల్ల పుడుతున్నాయి. అన్నం మేఘం వల్ల పుడుతున్నది. మేఘం యజ్ఞం వల్ల, యజ్ఞం కర్మ వల్ల పుడుతున్నది. (14)**

**కర్మసృష్టి కర్త బ్రహ్మదేవుని నుండి పుట్టినది. ఆ బ్రహ్మదేవుడు సర్వవ్యాపకమైన అక్షరుడైన పరమాత్మ నుండి జన్మించాడు. అందువల్ల సర్వవ్యాపకుడైన పరమాత్మయే నిత్యమూ యజ్ఞంలో ప్రతిష్టితుడై యున్నాడు. (15)**

**వ్యాఖ్య:** సమస్త ప్రాణులు అన్నం వల్లనే పుడుతున్నాయి. అన్నమే పురుషునిలో వీర్యరూపంగా మారి పిండోత్పత్తికి కారణమవుతున్నది. మరి అన్నం ఎలా వస్తున్నది? వర్షంవల్ల పంటలు పండి ఆహారం లభిస్తున్నది. ఆ వర్షం యజ్ఞం వల్ల; యజ్ఞం వల్ల మేఘాలు ఏర్పడి వర్షం కురవటం జరుగుతున్నది. ఇక యజ్ఞమనేది కర్మవల్లనే సంభవం. కర్మ అనేది సృష్టికర్త బ్రహ్మ దేవుని నుండి సంభవించగా బ్రహ్మదేవుడు అక్షరుడైన, సర్వ వ్యాపకమైన పరమాత్మనుండే ఉద్భవిస్తున్నాడు. కనుకనే సర్వ వ్యాపక పరమాత్మయే యజ్ఞంలో ప్రతిష్ఠితుడై యున్నాడు. అని ఋజువు అవుతున్నది. అంటే యజ్ఞ కర్మలాచరిస్తే అందువల్ల పరమాత్మతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది.







ఇదే సృష్టి చక్రం, జగచ్చక్రం, ధర్మచక్రం.

అయితే ఈ పైన చెప్పిన పదాలన్నింటిని బుద్ధి కుశలతతో అర్థం చేసుకోకపోతే ఈ శ్లోకం యొక్క సంపూర్ణ సౌందర్యాన్ని దర్శించలేం. ఈ పదాలన్నింటికి భగవానుడు చెప్పే అర్థాలు వేరుగా ఉన్నాయి. శ్రీకృష్ణుడు యజ్ఞయాగాదులు చేయమని ప్రోత్సహించలేదు గనుక ఇక్కడ చెప్పిన 'యజ్ఞకర్మ' సమిష్టికోసం, పరుల శ్రేయస్సు కోసం, త్యాగభావంతో చేసే నిస్వార్థకర్మయేనని గ్రహించాలి. అలాగే 'వర్షం' అంటే అనుకూల పరిస్థితులే. 'అన్నం' అంటే ఆ కర్మల వల్ల లభించే ఫలమే.

అంటే ఎలాంటి స్వార్థబుద్ధి లేకుండా సమిష్టి శ్రేయస్సును కోరి, త్యాగబుద్ధితో లోకకళ్యాణ కాంక్షతో కర్మ (యజ్ఞం) చేసినపుడు ఫలితం లభించటానికి అనుకూల పరిస్థితులు (వర్షం) ఏర్పడతాయి. ఆ పరిస్థితుల కారణంగా పదిమందీ అనుభవించి ఆనందించటానికి వీలైన ఫలితం (అన్నం) లభిస్తుంది– అని అసలైన అర్థం.

ఉదాహరణకు ఒక నదిలోని జలాలు వృధాగా సముద్రం లోకి ప్రవహిస్తున్నాయి, ఆ జలాలను బంజరు భూములను సారవంతం చేయటానికి ఉపయోగించవచ్చు. అలా ఉపయోగ పెట్టుకోవాలంటే ఆ నదిపై ఆనకట్టను కట్టి కాలువలు త్రవ్వించాలి. ఆ కాలువల ద్వారా నీరు బంజరు భూములకు చేరితే అవి పంటపొలాలుగా మారిపోతాయి. ఇలా పదిమంది మేలు కోసం త్యాగభావంతో, నిస్వార్థబుద్ధితో ఆనకట్ట కట్టించి కాలువలు త్రవ్వించటం 'యజ్ఞకర్మ'. అట్టి కర్మవల్ల పొలాలను సాగు చేయటానికి అనుకూల పరిస్థితులేర్పడతాయి. ఆ అనుకూల పరిస్థితులే 'వర్షం' కనుక యజ్ఞం వల్ల వర్షం. అప్పుడు రైతులు ఆ పొలాలను దున్ని, నారుపోసి, వ్యవసాయం చేసి పంటలు పండిస్తారు. ఆ పంటయే 'ఫలం'. అదే 'అన్నం'. కనుక వర్షం వల్ల అన్నం. ఇలా యజ్ఞం వల్ల వర్షం, వర్షం వల్ల అన్నం, అన్నంవల్ల ప్రాణులు, ప్రాణులవల్ల మళ్ళీ యజ్ఞం– వర్షం–అన్నం–ప్రాణులు–ఇదే జగచ్చక్రం–సృష్టిచక్రం.

ఈ విధంగా మానవులు పవిత్రభావంతో, పరోపకారం కొరకు సమిష్టిగా, సహకారపూర్వకంగా, ఐక్యంగా పనులు చేస్తే అది యజ్ఞం; ఆ యజ్ఞంలో భగవత్తత్వం ప్రతిష్టితమై ఉంటుంది. యజ్ఞకర్మలో ఉన్నది ఆ సర్వవ్యాపక పరమాత్మయే. అంటే అందరికోసం, అందరు కలసి చేసే సమిష్టి కర్మల ద్వారా పరమాత్మకు సన్నిహితులమౌతాం. ఇది పరమాత్మ మెప్పు పొందే యజ్ఞం. పరమాత్మ యొక్క అనుగ్రహాన్ని పొందే యజ్ఞం. అందుకే ఈ యజ్ఞకర్మకు ఇంతటి ప్రాధాన్యత. ఈ

యజ్ఞకర్మ ద్వారా జగచ్చక్రాన్ని అనుసరించి పరమాత్మను దర్శించాలి. ఈ జగచ్చక్రాన్ని అనుసరించకపోతే? అట్టి వారికి భగవంతుని దృష్టిలో స్థానమేమిటి?

**శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।**
**అఘాయురింద్రియారామః మోఘం పార్థ! సజీవతి॥ (16)**

**తా॥ అర్జునా! ఎవడైతే ఇలా పరిభ్రమించే జగచ్చక్రాన్ని అనుసరించడో వాడు పాపాత్ముడే. అట్టివాడు ఇంద్రియాలకు దాసుడు. వాడి జీవితం వ్యర్థం.**

**వ్యాఖ్య:** ఈ జగచ్చక్రాన్ని అనుసరించనివాడంటే ఎవరు? పరులహితం కొరకు, సమిష్టి శ్రేయస్సు కొరకు నిస్వార్థంగా ఏ కర్మను చేయనివాడు. అట్టి వానిని గురించే ఈ శ్లోకంలో చెబుతున్నారు. అసలు ఈ జగచ్చక్రాన్ని అనుసరించనివారెవరు? క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, వృక్షలతాదులు, పంచభూతాలు, సూర్యచంద్రులు, నదులు, సముద్రాలు– అన్నీ ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా ఈ జగచ్చక్రాన్ని అనుసరిస్తూనే ఉన్నాయి. నిస్వార్థంగా ప్రాణికోటికి సాయపడు తూనే ఉన్నాయి. కాని మానవుడు మాత్రమే ఈ జగచ్చక్రాన్ని ప్రశాంతంగా తిరగనివ్వక తికమక పెట్టాలనుకుంటున్నాడు. మానవుడికి మాత్రమే ఇలా జగచ్చక్రాన్ని అనుసరించక ఎదురు తిరిగే వీలుంది. ఇట్టి మానవుని 'అఘాయు' పాపాత్ముడు అని భగవానుడు పేర్కొంటున్నాడు. ఎందుకిలా మానవుడు పాపాత్ముడౌతున్నాడు? దీనికి కారణం కేవలం స్వార్థం. నేను బాగు పడితే చాలు, నావాళ్లు సుఖంగా ఉంటే చాలు, లోకం సంగతి నాకెందుకు? అని భావించటం వల్లనే. యజ్ఞకర్మ అంటే నిస్వార్థంగా చేయాల్సినది. మరి స్వార్థ చింతన గల మానవుడు నిస్వార్థమైన, త్యాగబుద్ధితో కూడిన కర్మను ఎలా చేయగలుగు తాడు? ఇక రెండవ కారణం 'ఇంద్రియలోలత్వం'. దేహాన్ని పోషించుకోవటం, దేహవాంఛలు తీర్చుకోవటం, ఎప్పుడూ లౌకిక సుఖభోగాల గురించే ఆలోచించటం, అందుకోసం ప్రయత్నించటమే 'ఇంద్రియలోలత్వం'.

అసలు ఒకడు ఇంద్రియ లోలుడైనంత మాత్రాన ఈ జగచ్చక్రానికి, సమాజానికి వచ్చిన ఇబ్బంది ఏమిటి? సమాజ మంటే వ్యక్తుల సమూహమే. సమాజంలోని వ్యక్తులంతా ఉన్నతాదర్శాలు కలిగి, సమిష్టికోసం నిస్వార్థంగా జీవించే వారైతే సమాజం ఉన్నతంగా ఉంటుంది. అలా గాక సమాజంలోని వ్యక్తులు స్వార్థపరులై, చేయరాని పనులు చేసేవారైతే ఆ సమాజం కూడా భ్రష్టు పట్టిపోతుంది. కనుక వ్యక్తులను బట్టే సమాజం. వ్యక్తులు స్వార్థపరులు, ఇంద్రియ లోలురయితే జగచ్చక్రాన్ని భంగపరిచినట్లే. ఎందుకంటే వారు యజ్ఞకర్మలు చేయరుగనుక. యజ్ఞకర్మలు లేకపోతే అనుభవిం







చటానికి వర్షరూప అనుకూల పరిస్థితులు ఏర్పడవు. ఆ పరిస్థితులు ఏర్పడకపోతే అన్న రూపమైన భోగ్యవస్తువులు లభించవు.

ఇలా జగచ్చక్రాన్ని అనుసరించని; స్వార్థం, ఇంద్రియ లోలత్వం వల్ల యజ్ఞకర్మలు ఆచరించనివారిని పాపాత్ములని నిరశించి, వారి జీవితం వ్యర్థం అని భగవానుడు తెలియ జేస్తున్నాడు. వారి బ్రతుకు దండగ మారి బ్రతుకు. ఎందుకు?

మానవజన్మ మోక్షానికి ద్వారం వంటిది. అట్టి అపురూపమైన, దుర్లభమైన మానవజన్మ లభించినప్పటికీ సద్వినియోగపరుచుకోకుండా, ఆ విషయాన్ని మరిచి పశువులాగా– అంతకన్న హీనంగా కేవలం దేహవాంఛలు తీర్చుకొనుటకు, ఇంద్రియభోగ విషయాల ననుభవించటానికి ఈ జన్మను వెచ్చించి, దుర్లభమైన మానవజన్మను వ్యర్థం చేసుకుంటున్నాడు గనుక అతడిది వ్యర్థ జన్మమే.

ఈ శ్లోకంలో స్వార్థపరుడైన, పరోపకారబుద్ధి ఏమాత్రం లేని మానవుని పరమాత్మ నిందిస్తున్నాడు. మానవుడై పుట్టిన తర్వాత పరోపకారం కొరకు చేతనైనంతగా చేయాలని కూడా తెలియజేస్తున్నాడు.

– అయితే ఈ కర్మచక్రానికి అందరూ కట్టుబడి ఉండాల్సిందేనా?

**శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః।**
**ఆత్మన్యేవచ సంతుష్టః తస్యకార్యం న విద్యతే॥ (17)**

**శ్లో॥ నైవతస్యకృతే నార్థః నాకృతే నేహకశ్చన।**
**నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ (18)**

**తా॥ ఏ మానవుడు తన (ఆత్మ)లోనే రమిస్తూ, తనలోనే తృప్తిచెందుతూ, తనలోనే సంతుష్టి చెందుతూ ఉంటాడో అట్టి వానికి ఇక చేయదగిన కార్యం అంటూ ఏమీ లేదు. (17)**

**ఆత్మలోనే ఆనందించే అట్టి ఆత్మవిదునకు ఈ లోకంలో కర్మచేయటం వల్ల గాని, కర్మ చేయకుండా ఉండటం వల్ల గాని ఎట్టి ప్రయోజనము లేదు. తన ప్రయోజనం కొరకు సమస్త ప్రాణులలో దేనినీ ఆశ్రయించదు. (18)**

**వ్యాఖ్య:** జగచ్చక్రాన్ని అందరు మానవులు అనుసరించాల్సిందే. అయితే బహుకొద్ది మందికి మాత్రం ఇందులో మినహాయింపు వుంది. ఎవరు అట్టివారు? వారే ఆత్మరతులు, ఆత్మతృప్తులు, ఆత్మసంతుష్టులు.

–ఇష్టమైన వాటిని తలచుకొని ఆనందించటం **'రతి'**

–ఇష్టమైన వాటిని సంపాదించుకొని, అనుభవించి ఆనందించటం **'తృప్తి'**

–అలా అనుభవించి, ఆనందించి; ఇకచాలు నాకింకేమీ అవసరం లేదనుకోవటం **'సంతుష్టి'**

నిరంతరం తన స్వరూపమైన ఆత్మను తలచుకొని అందులోనే ఆనందించే వారు 'ఆత్మరతులు'. ఆత్మానుభవాన్ని పొంది ఆ అనుభవంలో ఆనందిస్తూ, నిర్లిప్తంగా కర్మలు చేసే వారు 'ఆత్మతృప్తులు'. ఆత్మానుభవాన్ని పొంది ఆ శాశ్వతా నందంలో మునిగిపోయిన తమకింకేమీ అవసరం లేదనుకొనే వారు 'ఆత్మసంతుష్టులు'.

ఇట్టివారు ఈ లోకంలో ఏ కర్మలూ చేయవలసిన అవసరం లేదు. ఎందుకంటే–ఎవరైనా కర్మలు ఎందుకు చేస్తారు? తమ కోర్కెలు తీర్చుకొనుటకు, ఆనందించుటకు. కాని ఆ ఆనందాన్ని ఆత్మలోనే పొందుతున్న ఆత్మవిదుడు ఇంకదేనికోసం కర్మలు చెయ్యాలి? ఎటువంటి కర్మలు చేసినా ఈ లోకంలో కలిగే ఆనందం తాత్కాలికమైనదే. కాని ఆత్మానందం శాశ్వతమైనది. అన్నింటికన్నా శ్రేష్టమైనది. అట్టి శాశ్వత ఆనందాన్ని తనలోనే నిత్యమూ నిరంతరమూ పొందే వ్యక్తి అల్పమైన, అశాశ్వతమైన సుఖాలకొరకు, భోగాలకొరకు అఱ్రులు చాస్తాడా?

అసలు ఆత్మానుభూతిని–మోక్షాన్ని పొందటానికే కర్మ యోగాన్ని– యజ్ఞకర్మలను చేయాలి. ఇప్పటికే మోక్షాన్ని పొందిన వ్యక్తికి చేయవలసిన కర్మలేముంటాయి? మెట్లు ఉన్నది డాబాపైకి ఎక్కటానికి. డాబాపైన ఉన్నవాడికి ఈ మెట్లతో పనేముంది? కనుక ఆత్మలో ఆనందించేవానికి కర్మలతో పనిలేదు.

ఆత్మవిదుడై, ఆత్మలో సంతుష్టి చెందేవానికి కర్మలు చేసినందు వల్ల ప్రయోజనమూ లేదు. చేయకపోతే దోషమూ లేదు. కర్మ చేయుటకు గాని, మానుటకు గాని అతడికి స్వతంత్రం ఉంది. అయినప్పటికీ లోకక్షేమం కొరకు, పది మందికీ మార్గదర్శకంగా ఉండటానికి కొందరు మహాత్ములు కర్మలు చేస్తూనే ఉంటారు. అట్టివారు ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించాల్సిన పనిలేదు. ఏ ప్రయోజనం కొరకూ ఎవరినీ ఆశ్రయించవలసిన అవసరం లేదు. సామాన్యులకు డబ్బు, సంపదలు, భోగవస్తువులు కావాలి గనుక వారు కొందరిని ఆశ్రయిస్తారు. సాధకులైన వారికి మోక్షం కావాలి గనుక సద్గురువులను ఆశ్రయిస్తారు. అయితే ఆత్మనిష్ఠులైన వారు ఆత్మానుభూతిని –మోక్షాన్ని పొందారు గనుక ఎవరినీ ఆశ్రయించాల్సిన పనిలేదు.

ఇలా కర్మలు చేయవలసిన అవసరం లేనివారు ఆత్మనిష్ఠులే గాని సామాన్యులు, సాధకులు కాదు. మేమూ ఆత్మనిష్ఠులమేనని ఫోజువేసి కర్మలు మానితే అధఃపాతాళమే.





కర్మ నియమాన్ని ఉల్లంఘించిన పాపులే అవుతారు. తమను తాము మోసగించుకున్న వారౌతారు.

ఒక వ్యక్తి ఆఫీసరుగా ఉద్యోగం చేసి 58 సంవత్సరాలు నిండగానే రిటైరయ్యాడు. రిటైరయినవారికి పెన్షన్ వస్తుంది. దానితో అతడు ఏ పనీ చేయకుండానే హాయిగా కుటుంబాన్ని పోషించుకోగలుగుతాడు. ఇది చూచి పది సంవత్సరాలు ఉద్యోగం చేసినవాడు నేను కూడా రిటైరయి పనిచేయకుండా హాయిగా జీవిస్తాను అని అనుకొని ఉద్యోగం మానేస్తే మొదటికే మోసం వస్తుంది. అతడికి జీతం–జీవితం రెండూ ఆగిపోతాయి. కనుక రిటైర్మెంట్ వయస్సు వచ్చేవరకు అతడు పనిచేస్తూనే వుండాలి.

అలాగే ఆత్మానుభూతిని పొంది, ఆత్మలో సంతుష్టిని పొందే వరకు సాధకులు కర్మయోగాన్ని–యజ్ఞకర్మలను చేస్తూనే ఉండాలి.

–అందువల్ల అర్జునా! నీవు ఏం చేయాలో తెలుసా? అంటూ సూటిగా సమాధానం ఇస్తున్నాడు భగవానుడు.

19

**శ్లో॥ తస్మాత్ అసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ (19)**

**తా॥ అందుచేత సంగభావం లేకుండా ఎల్లప్పుడూ చేయ వలసిన కర్మను చేస్తూ ఉండు. సంగభావాన్ని విడిచి (ఫలాసక్తిని విడిచి) కర్మను ఆచరించటం వల్లనే మానవుడు మోక్షాన్ని పొందుతున్నాడు.**

**వ్యాఖ్య:** అందువల్ల–ఎందువల్ల? ఆత్మానుభూతి పరుడు తప్ప మిగిలిన అందరూ కర్మలు చేయవలసిందే గనుక, ఓ అర్జునా! నీవింకా ఆత్మనిష్ఠుడవు కాదు గనుక కర్మలు చేయక తప్పదు. అయితే ఎలా చేయాలి కర్మలను?

**(1) సంగభావం లేకుండా :** అంటే ఫలితంపై ఆసక్తి లేకుండా –పనికి అతుక్కుపోకుండా;
**(2) కర్తవ్యకర్మలను–** అంటే చేయదగిన కర్మలను, లోక కళ్యాణ కారకమైన కర్మలను సమిష్టి ప్రయోజనం కొరకు, యజ్ఞ కర్మలను చేయాలి.

ఈ రెండు నియమాలను పాటిస్తే ఇక కర్మలలో దోషం ఉండదు. పైగా మోక్షానికి హేతువు అవుతుంది.

ఇప్పుడు నీవు యుద్ధం చేయటం నీకర్తవ్య కర్మ–విహిత కర్మ. అది నీ స్వధర్మం. కనుక తప్పక చేయాలి. అయితే ఫలితం మీద ఆసక్తి లేకుండా, ఇది నాకర్తవ్యం అనే దృష్టితో చెయ్యి. నీకే దోషమూ లేదు. ఇట్టి కర్తవ్య కర్మలను సతతం– ఎల్లప్పుడూ చేస్తూ ఉండాల్సిందే.

కర్మలు బంధకారణాలనే అందరి ఊహ నిజమే. అయితే కర్మలలోని దోషాలను తొలగించి ఆ కర్మలనే మోక్షానికి సోపానాలుగా మారుస్తున్నాడు భగవానుడు.

మోక్షానికి జ్ఞాన, ధ్యానయోగాలు దగ్గరిదారులే అయినా అందరూ ఆ మార్గాన ప్రయాణించలేరు. ఎందుకంటే మనస్సు ప్రాపంచిక విషయాలతో కలుషితమై ఉంటుంది గనుక. ముందుగా మనస్సును శుద్ధి చేసుకొనుటకే భగవంతుడు ఈ కర్మయోగ మార్గాన్ని చూపిస్తున్నాడు. కర్మలలోని దోషాలను తొలగించి, కర్మయోగంగా ఆచరించినప్పుడు చిత్తశుద్ధి కలిగి, జ్ఞానబీజం నాటుకుంటుంది. అప్పుడు జ్ఞాన, ధ్యాన యోగములద్వారా ఆ పరమపదాన్ని–మోక్షాన్ని చేరుకోవచ్చు.

కనుక ఓ అర్జునా! నీవు మోక్షాన్ని అందుకోవలసినవాడవే. అందుకుగాను నీకు జ్ఞానం కావాలి. ఆ జ్ఞానం చిత్త శుద్ధి కలిగినపుడే లభిస్తుంది. ఆ చిత్తశుద్ధి నిష్కామకర్మల ద్వారానే కలుగుతుంది. కనుక నీవు నిష్కామ కర్మలాచరించాలి. సంగభావాన్ని వదలి, కర్తవ్య కర్మలు చేసితీరాలి. అప్పుడే పరమగతి–మోక్షప్రాప్తి. –మోక్షాన్ని పొందాలంటే సంగభావం వదలి కర్తవ్య కర్మ లాచరించాలని సిద్ధాంతీకరించాడు భగవానుడు. అయితే ఇది కేవలం సిద్ధాంతమేనా? లేక ఆచరణలో నిజమా? ఏవైనా దృష్టాంతాలున్నాయా? అలా కర్మల ద్వారా సిద్ధి పొందిన వారెవరైనా ఉన్నారా?–

**శ్లో॥ కర్మణైవహి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః।**
**లోక సంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥ (20)**

**తా॥ జనకుడు మొదలైనవారు నిష్కామకర్మల ద్వారానే మోక్షమును పొందారు. లోక కళ్యాణాన్ని దృష్టిలో ఉంచుకొని అయినా కర్మ చేయటమే నీకు తగును.**

**వ్యాఖ్య:** కర్మలు చేయటం ద్వారానే ఇలాంటి పరిపక్వదశను చేరుకున్న వారెవరైనా ఉన్నారా? అనే ప్రశ్నకు భగవానుడు ఇక్కడ సమాధానమిస్తున్నాడు. వారే జనకాదులు.

**జనకాదులు :** జనకుడు, ఇక్ష్వాకు, అశ్వపతి, ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు వీరందరూ కర్మలనాచరిస్తూ – నిష్కామ కర్మయోగం ద్వారానే మోక్షసిద్ధికి అవసరమైన పరి పక్వస్థితిని పొందారు. మోక్షం పొందాలంటే అన్నింటిని సన్యసించి, అరణ్యాలకు పోయి తపస్సు నాచరించాలి గాని, రాజ్యపరిపాలనలో తలమునకలై యుండే రాజులకు ఎలా సాధ్యమౌతుంది? అనేది అర్జునుని సందేహం. అలాగే సామాన్య మానవులకు కూడా ఒక సందేహం ఉంటుంది. పెళ్ళి చేసుకొని, పిల్లలను కని, ఈ సంసార







జంఝాటంలో పడి కొట్టుకుపోతుండే సామాన్య మానవులు మోక్షాన్ని పొందగలరా? అని. ఈ రెండు సందేహాలు అర్థం లేనివే. ఎందుకంటే సాక్షాత్తు భగవానుడు మోక్షం అందుకునే ఈ ఆత్మజ్ఞానాన్ని–గీతాజ్ఞానాన్ని బోధించింది క్షత్రియుడైన అర్జునునికి. బోధించిన శ్రీకృష్ణునికి 8 పెళ్ళిళ్ళు, 80 మంది సంతానం. విన్న అర్జునునికి నాలుగు పెళ్ళిళ్ళు, నలుగురు సంతానం. పెద్ద సంసార జంఝాటం ఉన్నవాళ్ళే. పైగా ఇద్దరూ రాజకార్యవ్యవహారాలలో, యుద్ధాలలో నిమగ్నమైనవారే. కనుక రాజులుగాని, సామాన్యమానవులు గాని మోక్షాన్ని పొందటానికి అర్హత లేనివారైతే ఇంక ఈ భగవద్గీత ఎందుకు? వేదాంతం ఎందుకు? నిష్కామ కర్మలెందుకు? సన్యాసులే సన్యాసులకు చెప్పుకొనేవారు గదా! ఇలాంటి అనుమానాలను, సందేహాలను నివృత్తి చేయటానికే భగవానుడు ఇక్కడ కర్మలద్వారా మోక్షాన్ని పొందిన చక్రవర్తుల దృష్టాంతాన్ని ఇస్తున్నాడు–'జనకాదులు కర్మల ద్వారానే సిద్ధి పొందారు' అని.

"నిజంగా జనక మహారాజు మోక్షాన్ని పొందాడా?" అనేది మరొక సందేహం. యోగ వాశిష్ఠంలో ఈ సందేహం తీరి పోతుంది. "జనక మహారాజు ఫలాపేక్ష లేకుండా, నేను చేస్తున్నాను–అనే కర్తృత్వం లేకుండా అనేక సత్కర్మలు – విహిత కర్మలు– కర్తవ్య కర్మలు చేశాడు. దానివల్ల చిత్తశుద్ధి కలిగింది. దానితో ఆత్మవిచారణా శక్తి కలిగింది. అష్టావక్రమహర్షి ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొంది, స్వస్వరూప జ్ఞానంలో నిలిచి, మోక్షాన్ని పొందాడు" అని యోగవాశిష్టంలో తెలియజేయటం జరిగింది. దీనిని బట్టి రాజ్యపాలకుడైన జనక మహారాజు ఫలాపేక్ష రహిత కర్మల ద్వారా మోక్షాన్ని పొందాడు గనుక ఎవరైనా సరే కర్మ యోగం ద్వారా, యజ్ఞకర్మల ద్వారా మోక్షాన్ని పొందవచ్చుననే సిద్ధాంతం నిజమని ఋజువైంది.

సరే కర్మయోగం ద్వారా మోక్షాన్ని పొందవచ్చు. అలా పొందారు. మరి ఆ తరువాత కర్మలను ఆపివేయాలా? అనే సందేహాన్ని కూడా ఈ శ్లోకం తీరుస్తున్నది.

మోక్షసిద్ధిని పొందిన వారికి కర్మచేయవలసిన బాధ్యత ఏమీ లేదు. కాని లోక సంగ్రహార్థం కర్మలు చేస్తూనే వున్నారు. మహాత్ములు కొందరు లోక కళ్యాణ కాంక్షతో నిర్లిప్తంగా పనులు చేయటాన్ని మనం చూస్తూనేవుంటాం. భగవాన్ శ్రీరమణ మహర్షుల వారు మోక్షసిద్ధిని పొందిన తర్వాత సామాన్యునిలా కర్మలు చేయటం లోక విదితమే. అందరితో మాట్లాడుతూ, తగిన సలహాలనిస్తూ, వంటచేస్తూ, బోధిస్తూ, గిరిప్రదక్షిణ చేస్తూ ఉండేవారు. అలాగే శ్రీరామకృష్ణ పరమహంస కూడా కర్మలు చేస్తూనే

వుండేవారు. లోకసంగ్రహార్ధం-అంటే అపమార్గంలో పడిపోతున్న వారిని సన్మార్గంలో నడిపించటం కోసం కర్మలు చేస్తూనే వుంటారు మహాత్ములు.

ఏ ఒక్కరికైనా మేలు చేయటం మహాపుణ్యప్రదం. అలాంటిది అజ్ఞానాంధకారంలో కొట్టుకొని పోయేవారిని-అసలు ఎందుకు పుట్టామో? ఎందుకు జీవిస్తున్నామో తెలియక, దిక్కుతోచక, గాలి ఎటువీస్తే అటుపోయే ఎండుటాకులా జీవితాన్ని గడిపే దారి తప్పిన బాటసారులకు భవబంధ విముక్తిని మోక్షాన్ని కలిగించే ఉపాయాన్ని తెలియజెప్పటం కన్న మేలు ఇంకేముంటుంది? అందుకే మహాత్ములు సంసిద్ధిని పొంది కూడా తాము కర్మలను ఆచరించి, ఇతరులకు మార్గ దర్శకులై లోక కళ్యాణానికి పాటు పడుతున్నారు.

కనుక ఓ అర్జునా! నీవు నిష్కామంగా, ఫలాపేక్ష లేకుండా, ఇది నా కర్తవ్యం అనే భావంతో ఈ యుద్ధమనే స్వధర్మ కర్మను నీ విహితకర్మను ఆచరించు. నీ ఆచరణ ద్వారా లోకులకు సహాయపడు-అని హితబోధ చేస్తున్నాడు భగవానుడు.

కనుక కర్మయోగమనేది అల్పమైనది కాదు. మోక్షసిద్ధికి పరోక్షంగా సాయపడేది. పైగా ఇది అజ్ఞానులకే గాదు. జ్ఞానులు కూడా లోకసంగ్రహార్ధం ఆచరించదగినదే- అని స్పష్టమౌతున్నది.

- మహాత్ములు, సంసిద్ధులు ఐనవారు కూడా కర్మయోగాన్ని ఎందుకు ఆచరిస్తున్నారు? ఏమిటి దీనివల్ల ప్రయోజనం?

మహాత్ములైనవారు కూడా ఎందుకు కర్మయోగాన్ని ఆచరిస్తున్నారు?

**శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః॥**
**సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే॥ (21)**

**తా॥ శ్రేష్ఠుడు దేనినైతే ఆచరిస్తూ ఉంటాడో ఇతర జనులు దానినే ఆచరిస్తూ ఉంటారు. అతడు దేనిని ప్రమాణంగా తీసు కుంటాడో లోకం దానినే అనుసరిస్తుంటుంది.**

**వ్యాఖ్య:** శ్రేష్ఠులు అంటే కేవలం మహాత్ములు, సర్వసంగ పరిత్యాగులు మాత్రమే కాదు. ఇంటిలో తల్లిదండ్రులు పిల్లలకు శ్రేష్ఠులు; బడిలో ఉపాధ్యాయులు విద్యార్థులకు శ్రేష్ఠులు; గురువులు శిష్యులకు శ్రేష్ఠులు; రాజకీయాల్లో నాయకులు కార్యకర్తలకు శ్రేష్ఠులు. శ్రేష్ఠులైన వారు వారికి ప్రయోజనమున్నా లేకున్నా ఇతరులకు మార్గదర్శకంగా, ఆదర్శంగా ఉండటం కొరకు చక్కని ఆచరణ కలిగి వుండాలి. అలా సరియైన ఆచరణ కనుక లేకపోతే ఇతరులు చెడిపోయే ప్రమాదం ఉంది.







తండ్రి రోజూ సిగరెట్లు త్రాగుతూ కుమారుడికి మాత్రం సిగరెట్ త్రాగకూడదని చెబుతాడు. పిల్లవాడు మాటవినడు. ఎందుకంటే తండ్రి చెప్పిన మాటలు ముఖ్యం కాదు. అతడికి తండ్రి ఆచరణే ముఖ్యం. తల్లి అబద్ధాలు చెప్పకూడదని పిల్లలకు చెబుతూ వారి ఎదుటే పచ్చి అబద్ధాలు ఆడుతుంది. అది చూచి పిల్లలు నేర్చుకొనేది అబద్ధాలనే.

రాజకీయనాయకులు అవినీతిని చీల్చిచెండాడతామని ప్రతిజ్ఞలు చేస్తూ, తాము మాత్రం అవినీతి సామ్రాట్టులుగా వ్యవహరిస్తారు. వారిని చూచి ఉద్యోగులు, అధికారులు నిర్భయంగా లంచాలు స్వీకరించి అవినీతిని అందలమెక్కిస్తారు.

అలాగే కొందరు గురువులు విషయవస్తువులు విషం లాంటివని శిష్యులకు బోధిస్తారు. కాని అవి లేనిదే బ్రతకలేనట్లు ఎప్పుడూ అదే ఆరాటం. వారి ఆచరణను చూచిన శిష్యులు ఆయనే అలా నడుచుకుంటుంటే మనం వస్తువ్యామోహంలో పడితే తప్పేముంది? అనుకుంటారు. కనుక శ్రేష్ఠులైన వారి ఆచరణ ఎంతో ముఖ్యం. పెద్దలు ఎలా ప్రవర్తిస్తారో చూచి, పిన్నలు వారినే అనుసరిస్తుంటారు. ఇది లోక సహజం. కనుక ఆచరణయే ముఖ్యం.

రామకృష్ణ పరమహంస వద్దకు ఒక స్త్రీ తన బిడ్డను తీసుకొని వచ్చి "అయ్యా! వీడికి బెల్లం అంటే మహాపిచ్చి. ఈ అలవాటు మాన్పించండి" అని అడిగింది. దానికి పరమహంస గారు 10 రోజులాగి రమ్మన్నారు. 10 రోజుల తర్వాత బిడ్డను తీసుకొని వచ్చింది ఆ స్త్రీ. ఇంకొక 5 రోజులు ఆగి రమ్మన్నారు మళ్ళీ పరమహంసగారు. అలాగే వచ్చింది ఆమె. మళ్ళీ నాలుగు రోజులు వాయిదా. ఇలా నాలుగైదు సార్లు వాయిదాలు వేసిన తరువాత ఒక రోజున ఆ పిల్లవాణ్ణి పిలిచి "నాయనా! బెల్లం తినకు. ఆరోగ్యం దెబ్బతింటుంది" అన్నారు పరమహంస. అది విని ఆ స్త్రీ పరమహంసతో "మహాత్మా! ఈ ముక్క మొదటి రోజున నేను వచ్చినపుడే చెప్పవచ్చు గదా! ఇన్నాళ్లు ఆగటమెందుకు?" అన్నదట. దానికాయన "అమ్మా బెల్లం తినే అలవాటు నాకు కూడా ఉన్నది. నేను తింటూ బాలుణ్ణి తినవద్దని ఎలా చెప్పేది?" అన్నాడట. ఇదీ శ్రేష్ఠుల ఆచరణ. శ్రేష్ఠులు దేనిని ప్రమాణంగా తీసుకుంటారో ఇతరులు కూడా దానినే అనుసరిస్తారు. ఎవరైనా తిట్టినా, అపకారం చేసినా మహాత్ములు నవ్వుతుంటారు. ఏమయ్యా? అంటే మనం సహనంతో వుంటే వాడే వాడి తప్పు తెలుసుకుంటాడు అంటారు. అదే ప్రమాణాన్ని ఇతరులు కూడా అనుసరిస్తే లోకం శాంతియుతంగా వుంటుంది.

తుకారాం పరమభక్తాగ్రేసరుడు. ఆయనంటే గిట్టని వ్యక్తి ఆ ఊరిలోనే ఉన్నాడు. ఎప్పుడూ తుకారాంను ఎలా అవమానించాలా? అని చూస్తుంటాడు ఆ వ్యక్తి. ఒకరోజున పేద బ్రాహ్మణుడొకరు తన కుమార్తె వివాహానికి సాయంకోసం ఆ వ్యక్తి వద్దకు రాగా, 'నీవు తుకారాంను అవమానిస్తే వెయ్యి రూపాయలిస్తా'నన్నాడు. ఆ బ్రాహ్మణునికి ఇష్టం లేకపోయినా తన అవసరం తీర్చుకొనుటకు అంగీకరించాడు.

ఒక రోజున తుకారాం గోదావరి నదిలో స్నానం చేసి ఒడ్డుకు వస్తున్నాడు. ఈ బ్రాహ్మణుడు తుకారాంపై తుపుక్కున ఉమ్మివేశాడు. తుకారాం నిర్లిప్తంగా తిరిగి గోదావరిలో స్నానం చేసి వచ్చాడు. ఆ బ్రాహ్మణుడు మళ్ళీ ఉమ్మి వేశాడు. తుకారాం తిరిగి స్నానం చేసి రాగా బ్రాహ్మణుడు మళ్ళీ అలాగే ఉమ్మాడు. ఇలా 108 సార్లు నిర్విరామంగా జరిగింది. ఆ బ్రాహ్మణునిలో పాపభీతి కలిగింది. పశ్చాత్తాపంతో దహించుకపోతూ తుకారాం కాళ్ళపై బడి తనను క్షమించమని ప్రార్థించాడు. అపుడు తుకారాం అన్నాడు "బ్రాహ్మణోత్తమా! నేను ఎప్పటినుండో గోదావరిలో 108సార్లు స్నానం చేసి, దేవాలయంలో పూజ చేయాలని అనుకుంటున్నాను. కాని ఇంతవరకు ఆ అవకాశం రాలేదు. ఈ రోజు మీ పుణ్యాన నాకు ఆ అవకాశం లభించింది. ఇందులో నేను క్షమించాల్సిందేముంది?" అన్నాడు. అప్పుడా బ్రాహ్మణుడు జరిగినదంతా చెప్పాడు. అది విని తుకారాం "అయ్యో నాయనా! అలాగా! నీ కుమార్తె వివాహానికి ఉపయోగపడుతుందనకుంటే ప్రతిరోజూ నేను వస్తాను, ఇలాగే చెయ్యి" అన్నాడట. ఇదీ మహాత్ముల ఆచరణ. ఇతరులకు మార్గదర్శకంగా ఉండటానికి, తమ ఆచరణ ద్వారా బోధించటానికి మహాత్ములు ఎంతో సహనాన్ని చూపుతుంటారు.

కనుక ఓ అర్జునా! నీవు కూడా నీ కోసం కాకపోయినా ఇతరుల కోసమైనా సరే ఈ నిష్కామ కర్మయోగాన్ని ఆచరించు. యజ్ఞభావనతో కర్మలు చెయ్యి అని తెలియజేశాడు భగవానుడు.

– ఇంతవరకు జనకాదులను దృష్టాంతంగా చూపిన భగవానుడు, 'వారంతా ఎప్పటివారో గదా!' అనే సందేహం కలుగుతుందేమో అర్జునునికి అని భావించి, ఇపుడు తననే దృష్టాంతంగా చూపుతున్నాడు రాబోయే 3 శ్లోకాల్లో–

**శ్లో॥ నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషుకించన।**
**నాన వాప్తమవాప్తవ్యం వర్తఏవచకర్మణి॥ (22)**







**శ్లో॥ యదిహ్యహంనవర్తేయం జాతుకర్మణ్య తంద్రితః।**
**మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః॥ (23)**
**శ్లో॥ ఉత్సీదేయు రిమేలోకాః నకుర్యాం కర్మచేదహం।**
**సంకరస్యచ కర్తాస్యాం ఉపహన్యా మిమాః ప్రజాః॥ (24)**

**తా॥ పార్థా! ముల్లోకాల్లోనూ నాకు చేయవలసిన కర్తవ్యం అంటూ ఏమీ లేదు. ఇంతవరకు నేను పొందకుండా ఉన్నది గాని, ఇక ముందు పొందవలసినది గాని ఏమీ లేదు. అయినా సరే నేను కర్మలు చేస్తూనే ఉన్నాను (22). (ఎందుకంటావా?) ఒకవేళ నేను గనుక జాగరూకతతో కర్మలను చేయకుండా సోమరిగా ఉంటే మనుష్యులందరూ అన్ని విధాలా నన్నే అనుసరిస్తారు (23). నేను కర్మను చేయకపోతే జనులంతా చెడిపోతారు. కర్మసంకరానికి కారకుణ్ణవుతాను. ఈ జనులను నాశనం చేసిన వాడనవుతాను(24).**

**వ్యాఖ్య:** "పార్థా! ఎప్పటివారో అయిన జనకాదుల విషయం అలా ఉంచు. నీ ఎదురుగా ఉన్న నన్ను చూడు. ఈ మూడు లోకాల్లోనూ నాకు చేయవలసిన కర్తవ్యం అంటూ ఏమీ లేదు" అసలు ఎవరైనా ఏ పనినైనా ఎందుకు చేస్తారు? ఏ వస్తువైనా, ఏ భోగమైనా, ధనమైనా కొరతగా ఉంటేనో; అసలు లేకపోతేనో, ఉన్నది చాలకపోతేనో వాటిని సంపాదించటం కోసం చేస్తారు. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుడు. "కృష్ణస్తు భగవాన్ స్వయం" అన్నారు. శ్రీకృష్ణునిగా శరీరధారణ చేసి ఈ భూమిపై అవతరించిన పరమాత్మ ఆయన. లోకాలన్నీ ఆయన పొట్టలోనే ఉన్నాయని పసివానిగా ఉన్నప్పుడే తల్లి యశోదకు చూపించినవాడు. మరి ఆయనకేం కావాలి? ఆయనకు లేనిదేమిటి? కనుక ఆయన చేయవలసిన కర్తవ్యాలు కూడా ఏమీ లేవు. ఆయన దేనినీ ఆశించవలసిన పనే లేదు.

**'తత్త్వతః'** యదార్థంగా ఆయన నిరాకారుడు. కాని సాకార రూపంతో అందరితో కలిసిమెలిసి తిరుగుతూ సామాన్యుడి లాగానే కర్మలు చేస్తున్నాడు. ఎందుకు? కర్మలు ఆయనకు అవసరం లేదు. లోకానికి అవసరం. లోక సంగ్రహార్థమే పనులు చేస్తున్నాడు. ధర్మాన్ని నిలబెట్టటం అనే కర్తవ్య నిర్వహణ కొరకు పాండవులకు సహాయంగా నిలబడ్డాడు. అంతేగాని రాజ్యం కోసమో, భోగాలకోసమో కాదు.

నిజంగా శ్రీకృష్ణుని జీవితాన్ని విశ్లేషించి చూస్తే ఆయన దేనినీ పట్టుకోలేదు. అన్నీ విడిచిపెట్టటమే (1) పుట్టగానే కన్న తల్లిదండ్రులను విడిచిపెట్టి గోకులంలోని

యశోద పురిటి మంచం చేరాడు. (2) పోనీ ఆ గోకులంలోనైనా స్థిరంగా ఉన్నాడా? నందునితో సహా ఆ గోకులాన్ని వదలి బృందావనం చేరాడు. (3) అక్కడ గోపబాలురతో, గోపికలతో ఆడి, పాడి, మురళీగానంతో పరవశింపజేసి ధర్మపు పిలుపు వినిపించగానే తనకెంతో ఇష్టమైన గోపికలను, గోప బాలురను, గోవత్సాలను, నందయశోదలను, బృందావనాన్ని విడిచి మధురకు ప్రయాణ మయ్యాడు. (4) మధురానగరంలో కంసుడు స్వయానా తన మేనమామయే యైనా దుర్మార్గుడు, ధర్మద్రోహి గనుక బంధుత్వాన్ని పరిగణించక అతణ్ణి సంహరించాడు. (5) కంసుని చంపితే ఆ రాజ్యం తనదే కదా! స్వీకరించి రాజ్యపాలన చేశాడా? లేదు. ఆ రాజ్యాన్ని తనకవసరం లేదని విడిచిపెట్టి తన తాత ఐన ఉగ్రసేనునికిచ్చివేశాడు. (6) ఆ తరువాత మధురను విడిచి ద్వారకా నగరాన్ని నిర్మించుకొని అక్కడకు వెళ్ళాడు. (7) అక్కడ రాజ్యాన్ని స్థాపించి, సుస్థిరం చేసేసరికి వృష్ణులు రాగా దానిని వారికి అప్పగించాడు. (8) ధర్మరాజు వద్దనుండి పిలుపురాగా ఇంద్రప్రస్థం వెళ్ళి భీమార్జునుల సాయంతో జరాసంధుని సంహరింపజేసి, ఆ రాజ్యాన్ని జరాసంధుని కుమారుడు సహదేవుని కిచ్చివేశాడు. (9) రాజ సూయ మహాయాగంలో అగ్రపూజ సందర్భంగా ఎదిరించిన మేనత్త కుమారుడు శిశుపాలుని వధించి, ఆ రాజ్యాన్ని శిశు పాలుని కుమారుడు దృష్టకేతువుకిచ్చివేశాడు. (10) కౌరవులతో యుద్ధాన్ని నివారించటానికి స్వయంగా పాండవ రాయబారియై అనేక విధాలుగా ప్రయత్నించాడు. (11) చివరకు ధృతరాష్ట్రుని కుటిలనీతి, దుర్యోధనుని అహంకారం కారణంగా యుద్ధం నిశ్చయం కాగా, తాను సర్వశక్తి సంపన్నుడు, యుద్ధ విశారదుడు ఐనా యుద్ధం చేయకుండా అల్పమైన రథసారథ్యం చేయటానికి అంగీకరించాడు. (12)రాజసూయయాగం సమయంలో అక్కడకు విచ్చేసిన మహర్షుల, మహాత్ముల పాదాలను కడిగి ఆ జలాన్ని శిరస్సున చల్లుకొన్నాడు. (13) 'ఏ పని చేస్తున్నాను?' అని గాక 'ఎలా చేస్తున్నాను?' అనేదే ప్రధానం అని లోకానికి చాటాలనుకున్నాడు. (14) కురుక్షేత్ర సంగ్రామంలో పాండవుల విజయానికి తానే కారణమైనా వారి నుండి ఏమీ ఆశించలేదు. (15) చివరకు తనకు అత్యంత ఆత్మీయులైన పాండవులను, తల్లిదండ్రులను, అష్టభార్యలను, స్వయంగా నిర్మించుకున్న ద్వారకా నగరాన్ని– అన్నింటిని, అందరిని ఒక్కక్షణంలో విడిచిపెట్టి తన స్వస్థానాన్ని చేరాడు.

–ఇలా శ్రీకృష్ణుని జీవితమంతా విడిచిపెట్టడమే. దేనితోను బంధం లేదు. సంగభావం లేదు. అయినా కర్మలు చేశాడు. ఎందుకు?







శ్రీకృష్ణుడు స్వయంగా పరిపూర్ణుడు. సాక్షాత్తూ భగవానుడు. ఆయన కర్మలనాచరించకపోతే ఆయనకేమీ నష్టం లేదు గదా! మరి ఆనాటితరం వారికేమైనా నష్టమా?– అవును. సామాన్యులైన వారు తమ పెద్దలయొక్క, నాయకుల యొక్క కట్టుబాట్లను, వేషభాషలను, నీతి నియమాలను, ఆచార వ్యవహారాలను అనుసరిస్తూ ఉంటారు. పూర్వకాలంలో పెద్దల నడవడికను చూచి తమను తాము దిద్దుకొనేవారు. ఇపుడు కాలం మారింది. నీతి నియమాలు, ఆచారవ్యవహారాలు, నడవడిన సంగతి ఎలా ఉన్నా వేషభాషలను మాత్రం అనుసరిస్తున్నారు. అందుకే ఈనాడు హత్యలు చేసేవారు, చేయించే వారు, రౌడీలు, గూండాలు, భూకబ్జాదారులు, అవినీతి సామ్రాట్టులు గాంధీ అనుచరులుగా ఖద్దరు పంచలు, పేటు కండవాలు, ఖద్దరు టోపీలు ధరిస్తూ వేషభాషలను మాత్రం అనుసరిస్తున్నారు. మొత్తం మీద పెద్దలను చూచి అనుసరించటం, అనుకరించటం మాత్రం సాధారణమైపోయింది.

అలాగే ఆనాటి తరం వారు కూడా శ్రీకృష్ణుడంతటి వాడే కర్మలనాచరించకపోతే మనం మాత్రం ఎందుకు ఆచరించాలి? అని అకర్మణ్యులౌతారు, సోమరులౌతారు, వ్యర్థజీవితం గడుపు తారు. అందుకే శ్రీకృష్ణుడు ఆనాటి వారికి ఆదర్శంగా కర్మలు చేయుటయందు నిమగ్నమై వున్నాడు. అంతేకాదు ఆ చేయటం కూడా ఎలా?

**అతంద్రితం:: 'తంద్రితః'** అంటే సోమరితనం. 'అతంద్రితః' అంటే సోమరితనం లేకుండా జాగరూకులై అని అర్థం. కనుక ప్రతివారు కర్మలు చేయాలి. అదీ జాగరూకులై చేయాలి. సోమరితనం లేకుండా చేయాలి. భగవానుడే అంత జాగరూకతతో కర్మలు చేస్తుంటే సామన్యులమైన మనం ఎంత జాగరూకతతో చేయాలి? అనే భావంతో చేయాలి.

ఎంతో అనుభవం వున్న డ్రైవరు అంత జాగ్రత్తగా కారు నడుపుతుంటే అనుభవంలేని, క్రొత్తగా నేర్చుకున్న యజమాని ఎంత జాగ్రత్తగా ఉండాలి? 'అతంద్రితః' అనేది సాధకులకు ఒక హెచ్చరిక. ఇంత జాగరూకతతో కర్మలు చేసినప్పటికీ భగవానునికేమీ ప్రయోజనం లేదు. కేవలం ఆయనను చూచి ప్రజలు అనుసరిస్తారు గనుకనే ఈ భూమిపై నిలిచి ఉన్న 125 సంవత్సరాలలో ఒక్కక్షణం కూడా విశ్రాంతి తీసు కోకుండా ఆయన పనిచేయటం జరిగింది. అలా చేయకపోతే నష్టం ఏమిటి?–

సామాన్యంగా లోకంలో జనులందరికీ అనుకరణ స్వభావం ఎక్కువగా ఉంటుంది. స్వబుద్ధి కన్నా పరబుద్ధి ఎక్కువ. కనుక శ్రీకృష్ణుని వంటి మహానుభావుడు కర్మలు

చేయకపోతే మనం మాత్రం ఎందుకు చేయాలి? అని భావించి అకర్మణ్యులౌతారు, సోమరులౌతారు. వారివారి విధ్యుక్త ధర్మాన్ని అనుసరించి కర్మలు చేయకపోతే వారు చెడిపోవటమే గాదు కర్మసంకరం ఏర్పడి సమాజం కూడా అస్తవ్యస్తమౌతుంది.

వారివారి గుణాలను బట్టి, చేయవలసిన కర్మలను బట్టి లోకంలో వర్ణవ్యవస్థ ఏర్పడింది. బ్రాహ్మణులు దేవతార్చనలు, వేదపఠనం, అధ్యాపనం, దానం, ప్రతిగ్రహం మొదలైన కర్మలు చేయాలి. క్షత్రియులు పరిపాలన, ప్రజారక్షణ చేయాలి. వైశ్యులు వ్యవసాయం, పశుపోషణ, వాణిజ్యం చేయాలి. శూద్రులుపై వర్ణాలకు కావలసిన సేవలు అందించాలి. జనులు సోమరులైనప్పుడు ఈ కర్మలు జరుగవు. దీనివల్ల అస్తవ్యస్త స్థితి ఏర్పడుతుంది. ప్రజలు అన్యాయంగా ప్రవర్తిస్తారు. అధర్మంగా నడుచు కుంటారు. తమ తమ నియతకర్మలు వదలి ఇతరుల విధ్యుక్త కర్మలను కొందరు నిర్వర్తించాల్సి వస్తుంది. శాసించేవారు, శిక్షించేవారు ఉండరు. దీనివల్ల అశాంతి, ఉత్పాతాలు, విప్లవాలు బయలుదేరతాయి. అందుకే కర్మసంకరానికి కారకుణ్ణవుతాను, ఈ జనులను నాశనం చేసిన వాడినవుతాను అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు. లోకక్షేమం కోసం, ప్రజలను వినాశనం నుండి తప్పించేందుకు, ఈ లోకవ్యవస్థ చక్కగా సాగిపోవటానికే నేను జాగరూకతతో కర్మలు చేస్తుంటాను అని భగవానుడు కర్మయోగం ఆవశ్యకతను తెలియజేస్తున్నాడు. మహాత్ములు, జ్ఞానులు తమకు అవసరం లేకపోయినా ఇతరులకు మార్గదర్శకంగా ఉండేందుకు కర్మలు చేయాలి అని భగవానుడు తెలియజేస్తున్నాడు. అయితే ఏ ఫలితాన్ని కోరనివాడు కర్మల యందాసక్తి లేకుండా ఎలా చేయగలడు?

**శ్లో॥ సక్తాః కర్మణ్య విద్వాంసః యధాకుర్వంతి భారత।**
**కుర్యాద్విద్వాంస్తథాసక్తః చికీర్షుర్ లోకసంగ్రహం॥ (25)**
**శ్లో॥ నబుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం।**
**జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్‌యుక్తః సమాచరన్॥ (26)**

**తా॥ అర్జునా! కర్మఫలము నందు ఆసక్తిగల అజ్ఞానులు ఏ విధంగా కర్మలను శ్రద్ధతో చేస్తారో అలాగే కర్మఫలము నందు ఆసక్తిలేని జ్ఞానులు లోక క్షేమాన్ని కోరి శ్రద్ధతో పనులు చేయాలి (25). కర్మఫలాసక్తితో కర్మలలో ఇరుక్కుపోయిన అజ్ఞానుల బుద్ధిని వివేకి (జ్ఞాని) చెదరగొట్టకూడదు. తాను యోగంలో నిలిచి కర్మలు చేస్తూనే వారిని సమస్త కర్మలను ఆచరించుటకు ప్రోత్సహించాలి.**







**వ్యాఖ్య:** అజ్ఞానులు ఈ ప్రపంచం తమకు భోగవస్తువు అనుకుంటారు. తాము పుట్టింది భోగాలు అనుభవించటానికే అనుకుంటారు. ఆ భోగాలను అందుకొనుటకు, అనుభవించుటకే తమకు కాళ్ళు, చేతులు, కళ్ళు, ఇతర అవయవాలు, తెలివితేటలు ఉన్నాయనుకుంటారు. అందుకే ఆ తెలివి తేటలనుపయోగించి, దేహేంద్రియాలను పని చేయించి శ్రమిస్తారు. ఈ శ్రమంతా తమ సుఖసంతోషాల కోసం, తమవారి ఆనందం కోసం గనుక ఎంతో పట్టుదలతో, దీక్షతో, శ్రద్ధతో కర్మలు చేస్తుంటారు. ఈ కర్మలు స్వలాభం కోసం గనుక పనిలో నిర్లక్ష్యం ఉండదు. కాకపోతే ఈ విధమైన కర్మల వల్ల త్వరలోనే అలసిపోతారు. ఎందుకంటే ఫలాపేక్ష వల్ల– అంటే ఫలితంపై ఆసక్తి ఉండటం వల్ల ఫలితం వస్తుందో రాదో, ఏమవుతుందో అనే ఆందోళన ఉంటుంది. ఆందోళన వల్ల అలసట సహజం.

కర్మఫలమునందు ఆసక్తిలేని జ్ఞానులు కర్మలను నిర్లిప్తంగా చేయటం వల్ల; ఫలితం ఏమవుతుందోననే ఆందోళన లేనందువల్ల; అలసట ఉండదు, ప్రశాంత మనస్సుతో కర్మలు చేస్తారు. కాని స్వలాభం లేదు గనుక కర్మాచరణలో నిర్లక్ష్యం ఉండవచ్చు. పట్టుదలగా పనిచేయకపోవచ్చు. కర్మలో నిర్లక్ష్యం ఉంటే వాసనలు పూర్తిగా క్షాళనం కావు. కనుక ఫలాసక్తి లేకుండా, స్వార్థం లేకుండా కర్మలను చేస్తున్నప్పటికీ వాటిని దీక్షగా, పట్టుదలతో చేయాలి. నిర్లక్ష్యం లేకుండా శ్రద్ధగా చేయాలి. అలా చెయ్యాలంటే కర్మకొక ఆలంబనం కావాలి. అదే లోక శ్రేయస్సు. లోకకళ్యాణ కాంక్షతో కర్మలను చేస్తే అదే కర్మయోగం.

స్వార్థంకోసం, డబ్బుకోసం కర్మలను జాగరూకతతో చేసే వాడు అజ్ఞాని. ఏ స్వార్థం లేకుండా లోకకళ్యాణ కాంక్షతో కర్మలను జాగరూకతతో చేసేవాడు జ్ఞాని.

కర్మ అనేది కత్తిలాంటిది. కత్తితో తలలు నరకవచ్చు, కూరగాయలు తరగవచ్చు. అలాగే కర్మద్వారా బంధాన్నీ కరిగించుకోవచ్చు, ముక్తినీ అందుకోవచ్చు. కర్మ అనేది గొప్ప ఆయుధం. దానిని అసలు మూలన పడవెయ్యరాదు. వాడుకోవాలి, తెలిసి వాడుకోవాలి, తెలివితో వాడుకోవాలి. అందుకే ఈ శ్లోకంలో అజ్ఞానులు సంగభావంతో ఫలాపేక్షతో ఎలా జాగరూకతతో కర్మలు చేస్తారో అలాగే జ్ఞానులు లోక శ్రేయస్సును కోరి జాగరూకతతో కర్మలు చేయాలి అని సలహా ఇస్తున్నారు. ఫలాపేక్షతో చేసేవాడు నిర్లక్ష్యం లేకుండా చేస్తాడు. కాని జ్ఞానికి ఫలాపేక్ష లేదు గనుక అజాగ్రత్తగా, నిర్లక్ష్యంగా ఉండకుండా పనిచేసేందుకు ఆలంబనగా లోకశ్రేయస్సును దృష్టిలో

పెట్టుకోమని, లోకశ్రేయస్సే తన శ్రేయస్సుగా భావించాలని భగవానుని సలహా.

లోకశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని జాగరూకతతో పనులు చేయటమేగాక అజ్ఞానులకు మార్గదర్శకులుగా ఉండటానికి జ్ఞానికి మరొక ఉపాయాన్ని సలహాను కూడా ఇస్తున్నాడు భగవానుడు.

లోకంలో సామాన్యంగా అందరూ సకామకర్మలే చేస్తుంటారు. వారికి మానవజీవిత పరమలక్ష్యం మోక్షమేనని తెలియదు. అందువల్ల ఆ లక్ష్యాన్ని అందుకొనే మార్గం కూడా తెలియదు. కనుక దారితప్పిన బాటసారిలా ఈలోకంలోని సుఖాలను, పరలోకంలోని స్వర్గభోగాలను ఆశించి, అవే ప్రధానమని భావిస్తూ, 'ఈ పని చేస్తున్నది నేను' అనే కర్తృత్వబుద్ధితో, 'ఈ ఫలితం నాకు రావాలి' అనే కామ్య బుద్ధితో కర్మలు చేస్తుంటారు. వారికి నిష్కామ కర్మయోగం అంటే ఏమిటో తెలియదు. దాని విశిష్టతను అర్థం చేసుకొనే పరిపక్వత వుండదు.

అట్టివారిని చూచి జ్ఞానియైనవాడు వారిని సరైన మార్గంలోనికి మళ్ళించాలని భావించి "మీరు నడిచే మార్గం తప్పు. మీరిలా సకామకర్మలు ఆచరిస్తుంటే ఈ కర్మలే మీకు బంధాలవుతాయి. దానివల్ల మళ్ళీ మళ్ళీ పుడుతూ మళ్ళీ మళ్ళీ చస్తూ ఈ లోకంలో బంధించబడతారు. సంసార జనన మరణ చక్రంలో ఇరుక్కుపోతారు. కనుక మీరు ఈ సకామ కర్మల నాచరించవద్దు. మోక్షమనేది జ్ఞానం ద్వారానే లభిస్తుంది. ఆ జ్ఞానం నిష్కామ కర్మలాచరించి మనస్సును శుద్ధి చేసుకున్నప్పుడే పొందగలుగుతారు. కనుక ఏ ఫలితాన్ని ఆశించకుండా, ఏ కోరికలు కోరకుండా నిష్కామ కర్మలాచరించండి" అని చెబితే వారు సరిగ్గా అర్థం చేసుకోలేక; కోరికలు లేకపోతే కర్మలెందుకు చేయాలి? మన సమయాన్ని, డబ్బును ఎందుకు వృథా చేసుకోవాలి? అని నిష్కామ కర్మలూ చేయరు. మోక్షానికి పనికిరాని ఈ కర్మలెందుకు? అని సకామకర్మలూచేయరు. అంటే రెంటికీచెడిన రేవడులౌతారు. ఉభయభ్రష్టులౌతారు.

అందుకే ఇక్కడ మహాత్ములకు, జ్ఞానులకు, సాధు సన్యాసులకు, గురువులకు హెచ్చరిక చేయబడింది. 'సకామ కర్మలలో ఇరుక్కుపోయిన అజ్ఞానుల బుద్ధిని చెదరగొట్టకుండా మీరు యోగంలో నిలిచి కర్మలెలా చేయాలో, ఎందుకు చేయాలో ఆచరించి చూపండి" అని హెచ్చరిక. అర్హత లేనివారికి జ్ఞానబోధ చెవికెక్కదు. చేసే కర్మానుష్టానాన్ని కూడా వదిలేస్తాడు. అందుకే **"క్షుద్రజనులకు చెప్పే కన్న రుద్రభూమిలో చెప్పటం మంచిది"** అని ఒక మహాత్ముడన్నాడు. మరెలా చెప్పకుండా? అంటే



25



వారిని అలా కర్మలు చేయనిస్తూనే తాను మాత్రం నిష్కామ కర్మలనాచరిస్తూ తన స్థాయిలో తానుండి క్రమంగా వారంతా తనను అనుసరిస్తూ సకామకర్మలను నిష్కామంగా చేసేట్లుగా తన ఆచరణ ద్వారా బోధించాలి.

క్రొత్త గుర్రాన్ని ఎక్కేటప్పుడు అది అంత తేలికగా ఎక్కనివ్వదు. అందువల్ల కొంతదూరం దానితోపాటు పరుగెత్తి సమయం చూసి ఎక్కి కూర్చోవాలి. అలాగే అజ్ఞానుల బుద్ధిని చెదరగొట్టకుండా వారి మార్గంలో వారిని నడవనిస్తూనే జ్ఞానులు తమ ఆచరణ ద్వారా ఫలాపేక్షలేకుండా, నిష్కామంగా కర్మలాచరించేటట్లుగా వారిని తయారు చేయాలి.

కర్మలు చేయటంలో జ్ఞాని అజ్ఞాని– ఇరువురూ బాహ్యదృష్టిలో సమానమే. కానీ వారి వారి భావాల్లో మాత్రం తేడా ఉంటుంది. ఆ భావాన్నిబట్టి అజ్ఞాని బంధింపబడుతున్నాడు. జ్ఞాని బంధం నుండి తప్పించుకొని మోక్షమార్గంలో పయనిస్తాడు,

–అజ్ఞాని ఏ భావంతో కర్మాసక్తుడవుతున్నాడు? జ్ఞాని ఏ భావంతో కర్మలనాచరిస్తున్నాడు? రాబోయే 2 శ్లోకాల్లో వివరించబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ ప్రకృతేఃక్రియమాణాని గుణైఃకర్మాణి సర్వశః**
**అహంకార విమూఢాత్మాకర్తా2హమితి మన్యతే॥ (27)**

**శ్లో॥ తత్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః।**
**గుణాగుణేషువర్తంత ఇతిమత్వానసజ్జతే॥ (28)**

**తా॥ ప్రకృతి గుణాలవల్లనే అన్ని విధాలుగా కర్మలు చేయ బడుతున్నాయి. అయితే అహంకారం చేత వివేకం కోల్పోయిన మూర్ఖుడు జరిగే కర్మలకు నేనే కర్తను అని భావిస్తుంటాడు. (27)**

**ఓ మహాబాహుడా! గుణకర్మ విభాగాల తత్వం తెలిసిన వాడు గుణాలు గుణాలలో ప్రవర్తిస్తున్నాయని గ్రహించి ఆ కర్మలలో తగుల్కొనడు. (28)**

**వ్యాఖ్య:** ఒకే విధమైన కర్మ చేస్తున్నప్పటికీ అజ్ఞాని ఆ కర్మలలో బంధించబడు తున్నాడు, జ్ఞాని బంధం నుండి తప్పించుకొని మోక్షమార్గంలో ప్రయాణిస్తున్నాడు. ఎలా?అనే ప్రశ్నకు ఈ రెండు శ్లోకాలలో స్పష్టమైనసమాధానమిస్తున్నాడు భగవానుడు.

ప్రకృతి గుణాలంటే ప్రతి వ్యక్తిలోను ఉండే వాసనలే. ఆ వాసనలే బుద్ధిలో కోరికలుగా వ్యక్తమవుతాయి. ఆ కోరికలు మనస్సులో ఆలోచనలుగా కదులుతాయి. ఆలోచనలు శరీరం నుండి కర్మలుగా వెలువడతాయి. కనుక సమస్త కర్మలు జరిగి

పోవటానికి కారణం ప్రకృతి వల్ల పుట్టిన గుణాలే (వాసనలే). అయితే వాసనల కారణంగా సహజంగా జరిగిపోయే ఈ కర్మలను నేనే చేస్తున్నానని మూర్ఖుడు భ్రమిస్తాడు. మూర్ఖుడు అంటే దేహాభిమానం కలవాడు 'దేహమే నేను' అని అనుకొనే అహంకార విమూఢాత్ముడు. "దేహం వేరు ఆత్మవేరు అని; నేను ఆత్మనే గాని దేహాన్ని కాదు" అని తెలియనివాడే అజ్ఞాని, అవివేకి, అహంకార విమూఢాత్ముడు. ప్రతిజీవి యొక్క యదార్ధ స్వరూపం ఆత్మ. అట్టి ఆత్మస్వరూపుడు నశించిపోయే దేహంతో తాదాత్మ్యం పెట్టుకొని, 'దేహమేనేను' అని భావిస్తాడు. ఇదే భ్రమ. దీనివల్లనే బంధానికీ బాధలకు గురౌతున్నాడు.

ఒక బాటసారి అరణ్యంలో ప్రయాణిస్తున్నాడు. పులి గాండ్రింపు వినవచ్చింది. ప్రాణభయంతో పరుగు తీస్తూ కనిపించిన ఒక చెట్టు పైకెక్కి కూర్చున్నాడు, పులి ఆ చెట్టు దగ్గరకు వచ్చింది. కాని చెట్టు ఎక్కలేదు గనుక, అక్కడే నిలిచి ఉన్నది. పక్కనే ఉన్న మరొకచెట్టుపై ఒక కోతి ఉన్నది. పులి ఆ చెట్టుకొమ్మ వద్దకెళ్ళి గాండ్రించి, కోతినీడను ఫెడీమని కొట్టింది. దానితో తెలివి తక్కువ కోతి దెబ్బతన మీదనే పడ్డదని భావించి క్రిందపడిపోయింది. పులి దానిని మ్రింగేసింది. తెలివి గల ఆ పులి అదే యుక్తిని ఈ బాటసారిపై ప్రయోగించింది. కాని ఆ బాటసారి, "నేనేం బుద్ధిలేని కోతిననుకున్నావా? నీడ మీద పడ్డ నీ దెబ్బ నా మీద పడ్డదని భ్రమపడటానికి? నీడ వేరు, నేనువేరు. నేను నీడను కాదు" అనుకున్నాడు. అందువల్ల కోతిలాగా ప్రమాదాన్ని కొని తెచ్చుకోలేదు.

అలాగే నశించే దేహం వేరు, నశించని ఆత్మవేరు. నేను ఆత్మనే కాని దేహాన్ని కాదు అని గ్రహించినవాడు జ్ఞాని. 'నీడలాంటి దేహమే నేను' అని భావించేవాడు అహంకార విమూఢుడు-అజ్ఞాని. 'దేహంద్వారా జరిగే కర్మలను నేనే చేస్తున్నాను' అని భావించి, ఆ కర్మఫలాలను అనుభవిస్తూ పుడుతూ-చస్తూ-ఈ సంసార జననమరణ చక్రంలో బంధింపబడతాడు ఈ అజ్ఞాని... మరి జ్ఞానియో?

**తత్త్వవిత్** అంటే తత్త్వం తెలిసిన జ్ఞాని-యదార్ధ స్వరూపం తెలిసిన జ్ఞాని. దేని యదార్ధ స్వరూపం? **గుణకర్మ విభాగయోః** గుణములయొక్క, కర్మలయొక్క నిజమైన విభజన తెలిసిన వాడు. మనలోని వాసనలే మన ప్రకృతి. ఈ వాసనలు సత్త్వ, రజో, తమో గుణాలతో ఉంటాయి. ఈ గుణాలవల్లనే మనలో ఆలోచనలు, సంకల్పాలు కలుగుతున్నాయి. ఈ ఆలోచనలు సంకల్పాల వల్లనే కర్మలు జరుగుతున్నాయి. ఇలా గుణాల వల్లనే కర్మలు జరిగిపోతున్నాయని తెలుసుకోగలిగినవాడే తత్త్వవిత్-జ్ఞాని.







అట్టి జ్ఞాని దేహం ద్వారా జరిగే కర్మలను సాక్షిగా చూస్తాడే గాని, ఆ జరిగే కర్మలను నేనే చేస్తున్నాను- అనే భ్రమలో చిక్కుకోడు. కర్మలు జరిగేటప్పుడు అతడి భావాలెలా ఉంటాయి?

**గుణాగుణేషువర్తంత ఇతి మత్వా:**- గుణాలు గుణాలలో ప్రవర్తిస్తున్నాయని భావిస్తాడు. మనలోని వాసనలను బట్టి వచ్చే ఆలోచనలను సూక్ష్మగుణాలంటారు. వాటిని బట్టి, దేహేంద్రియాల ద్వారా జరిగే కర్మలను స్థూల గుణాలంటారు. గుణాలు గుణాలలో ప్రవర్తిస్తున్నాయి-అంటే 'అన్నీ వాటిపనులు అవి చేసుకుంటున్నాయి' అనే నిర్లిప్త భావంతో వుంటాడు ఈ సూక్ష్మ స్థూల గుణాలయొక్క నిజమైన విభజన తెలిసిన వివేకి. అందుకే అతడు వీటికి దూరంగా నిలిచి సాక్షిగా ఉండిపోతాడు.

మనం అలా బజారులో వెళుతూ ఉంటే అనేక దుకాణాలు కనిపిస్తుంటాయి. అనేకమంది వ్యాపారులు-కొనుగోలు దారులు మాట్లాడుకుంటుంటారు, పోట్లాడు కుంటుంటారు. కొందరు న్యాయంగా ప్రవర్తిస్తుంటే మరికొందరు మోసం చేస్తుంటారు. అయినప్పటికీ దారిన వెళ్ళే మనం అన్నీ చూస్తున్నప్పటికీ మోసగాళ్ళను నిలదీయం, న్యాయంగా ఉన్నవారిని ప్రశంసించం. ఆ! ఇదంతా సహజమేలే. వారివారి స్వభావాలను బట్టి వారు ప్రవర్తిస్తూ ఉంటారు అని తెలుసు కుంటాం. అలాగే దేహేంద్రియ మనోబుద్ధులు వాటి వాటి పనులు అవి చేస్తూ ఉంటాయి. వాటికి కారణం వాటి వెనుక ప్రేరణ ఇచ్చే వాసనలు. అయితే వీటన్నింటికి వేరుగా ఉన్న ఆత్మనైన నేను మాత్రం అన్నింటిని కేవలసాక్షిగా చూస్తుంటాను, అందులో దిగి మునిగిపోను అని భావిస్తుంటాడు జ్ఞాని. ఇలా భావిస్తే ప్రయోజనమేమిటి?

**నసజ్జతే:** సంగభావముండదు. బజార్లో ఎందరు మోసగిస్తున్నా, ఎందరు అన్యాయంగా ప్రవర్తిస్తున్నా ఎలా పట్టనట్లుగా ఉంటున్నామో అలాగే ఈ దేహం ద్రియాలు ఎలాంటి కర్మలు చేస్తున్నా - అవి మంచివైనా, చెడువైనా ఆత్మనైన నేను వాటిని పట్టించుకోకుండా-జరిగేవాటికి కేవలసాక్షిగా ఉంటే వాటితో ఏమాత్రం సంగభావం ఉండదు. ప్రేరణలు ఇచ్చేది వాసనలు, ఆలోచనలు చేసేది మనస్సు, కర్మలు చేసేది దేహేంద్రియాలు. నేను ఈ వాసనల (ప్రకృతి)కన్నా, మనస్సుకన్నా, దేహేంద్రియాల కన్నా వేరుగా నున్న ఆత్మను-అని తామరాకు మీద నీటి బొట్టులా కేవలంగావుంటే ఆ కర్మలతో సంగభావముండదు. ఆ కర్మఫలాలంటవు. దాని కారణంగా జన్మలురావు. అందువల్ల జనన మరణ రూపసంసార చక్రంలో బంధింపబడడు. ఇది తత్వవిదుని-జ్ఞాని ఆలోచనా సరళి. అర్జునుని ఇక్కడ మహాబాహో! అని

సంబోధిస్తున్నాడు భగవానుడు. యుద్ధంలో శత్రువులను చీల్చిచెండాడి నిన్ను నీవు రక్షించుకునే యోధుడివి మాత్రమే కాదు. నీ అంతరంగ శత్రువులతో కూడా పోరాడాలి. అహంకారమనే (దేహమే నేను అని భావించే) శత్రువును జయించి మహాబాహుడనే పేరు సార్ధకం చేసుకోవాలి–అనే సూచన ఈ సంబోధనలో దాగి వున్నది.

– మరి జ్ఞాని ఏం చేయాలో తరువాతి శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో॥ ప్రకృతేర్గుణ సంమూఢాః సజ్జంతే గుణకర్మసు।**
**తానకృత్స్న విదోమందాన్ కృత్స్న విన్నవిచాలయేత్॥ (29)**

**తా॥ ప్రకృతియొక్క గుణాలచేత మిక్కిలి మూఢులైన వారు గుణకర్మలయందు ఆసక్తులౌతున్నారు. సరిగ్గా తెలియని అట్టి మందబుద్ధులైనవారిని సర్వము తెలిసిన జ్ఞాని చలింపజేయ రాదు.**

**వ్యాఖ్య:** లోకంలో దాదాపు అందరూ లౌకిక విషయాలలో, దృశ్య పదార్ధాలలో ఆసక్తులై, ఫలితాన్ని కోరి కర్మలు చేస్తూ ఉంటారు. వారు కర్మలు చేయటానికి కారణం వారి మనస్సులలో కలిగే ఆలోచనలే. ఆ ఆలోచనలకు కారణం వారియొక్క గుణాలే. ఆ గుణాలెలా వచ్చినవి? వారి వారి వాసనల (ప్రకృతి) వల్ల. అంటే వాసనలవల్లనే గుణకర్మలు వ్యక్తమౌతున్నాయి. అలా జరిగిపోయే కర్మలతో తాదాత్మ్యం చెంది వాటిని నేనే చేస్తున్నాను అని భావిస్తూ, ఆ కర్మలతో సంగభావం పెట్టుకున్న వాడినే **'అకృత్స్నవిత్'** ఏమీ తెలియని అజ్ఞాని అంటారు. అతడే భగవంతుని దృష్టిలో 'మందాన్' మందబుద్ధి గలవాడు, అల్పజ్ఞుడు.

ఇలా గుణకర్మలయందు ఆసక్తి గల మూఢుని, అజ్ఞానిని– కోరికలతో, సంగభావంతో పనిచేసే మూఢుని వివేకి ఐనవాడు చెదర్చకూడదు. ఎవరా వివేకి? అతడే **కృత్స్నవిత్** సర్వమూ తెలిసినజ్ఞాని. జరిగే కర్మలన్నీ ప్రకృతి గుణాల ప్రేరణతో దేహేంద్రియాల వల్ల జరిగిపోతున్నాయని, తాను ఈ దేహేంద్రియ మనోబుద్ధుల కన్న వేరుగా ఉన్న ఆత్మనని తెలుసుకొన్న జ్ఞాని. ఈ ఆలోచనలను, కర్మలను చేస్తున్నది తాను కాదని, జరిగే కర్మలకు తాను కేవల సాక్షినని భావిస్తూ కర్మబంధంలో ఇరుక్కోకుండా తెలివిగా తప్పించుకునే జ్ఞానియే వివేకి.

ఇట్టి వివేకి అజ్ఞానంతో కర్మలుచేసే మూఢుని చెదర్చ కూడదు. అంటే అతణ్ణి ఆ కర్మలు చేయటంలోనే కొనసాగించి తన ప్రవర్తన ద్వారా ఆచరణ ద్వారా మెల్లగా అతణ్ణి మార్చుటకు ప్రయత్నం చేయాలి. ఎందుకలా?







ప్రతి వ్యక్తి ఆత్మస్వరూపుడే. ఆత్మలో ఏ తేడా లేదు. ప్రకృతి లోనే తేడా అంతా. ట్యూబ్‌లైట్ తెల్లని కాంతినిస్తుంది. 60 క్యాండిల్ బల్బు, తెల్లని కాంతినివ్వదు. దీనికి కారణం వాటిలోనికి వచ్చే కరెంటులో తేడా కాదు. ఆ బల్బులోనే తేడా. తేడా లేకుండా పోవాలంటే మనం బల్బుని సరిచేయాలే కాని, కరెంటును సరిచేయటం కుదరదు. అలాగే మనం ప్రకృతిని మార్చాలే గాని, పరమాత్మను కాదు–ఆత్మను కాదు మార్చాల్సింది. అంటే అజ్ఞాని యొక్క ప్రకృతిని (వాసనలను) మార్చాలి. ఎలా దుర్వాసనలు నశించటానికి సద్వాసనలను నింపాలి. ప్రకృతి మారితే గాని బుద్ధిలోని మాంద్యం పోదు. బుద్ధిమాంద్యం ఉన్నంతకాలం ఏం చెప్పినా తలకెక్కదు. ఆత్మతత్వం తెలియాలన్నా, తన యదార్ధస్వరూపం ఆత్మయేనని తెలియాలన్నా బుద్ధిమాంద్యం తొలగాల్సిందే. అందుకే మంద బుద్ధులు, కర్మలు కొనసాగిస్తుంటే చూస్తూనే మెల్లమెల్లగా తన ఆచరణ ద్వారా, తన ప్రవర్తన ద్వారా వారిలో మార్పు తీసుకొని రావాలి.

–మందబుద్ధులైన వారిని కదిలించకుండా; జ్ఞాని తాను దిగజారకుండా ఏ విధంగా కర్మలనాచరించి అజ్ఞానులకు మార్గ దర్శకుడు కావాలో–ఎలా కర్మయోగాన్ని ఆచరించాలో 30వ శ్లోకంలో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

అర్జునుని ప్రశ్నకు సూటిగా కర్మయోగాన్నెలా ఆచరించాలో భగవానుడు తెలియజేస్తున్నాడు. స్వామి వివేకానందకు ఎంతో ఇష్టమైన శ్లోకం ఇది.

**శ్లో॥ మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।**
**నిరాశీర్నిర్మమోభూత్వా యుధ్యస్వవిగత జ్వరః॥ (30)**

**తా॥ సర్వకర్మలను నాయందే సమర్పించి, మనస్సును ఆత్మలో నిలిపి, ఆశలను, మమకారాలను విడిచిపెట్టి, ఆరాటాన్ని విసర్జించి నీ కర్తవ్య కర్మయైన యుద్ధాన్ని చెయ్యి.**

**వ్యాఖ్య:** అర్జునుడు యుద్ధం చేయటానికే యుద్ధభూమిలో ప్రవేశించాడు. కాని భగవానుని జ్ఞానబోధతో మోక్షం పొందేందుకు ధ్యానజీవితం గడపాలని ఆలోచిస్తున్నాడు. అయితే క్షత్రియుడైన అర్జునుడు రజోగుణ ప్రధానుడు గనుక ధ్యానజీవితానికి పనికిరాడు. కనుక అతణ్ణి యుద్ధకర్మ నుండి చెదర్చకూడదు. ధ్యానజీవితానికి అనుకూల పరిస్థితిని సృష్టించాలంటే ముందుగా కర్మయోగాన్ని ఆచరించేట్లు చేయాలి. దానివల్ల కొత్తవాసనలు చేరకుండా పాత వాసనలు

ఖర్చైపోతాయి. దానితో వాసనలు తగ్గి మనస్సు ప్రశాంతమై ధ్యానానుకూలమౌతుంది. ఆ కర్మయోగాన్ని, ఎలా చేయాలో వివరంగా తెలియజేస్తున్నాడీ శ్లోకంలో భగవానుడు.

**సర్వాణికర్మాణి మయి సన్న్యస్య:** సర్వకర్మలను నా యందు సమర్పించి, నా యందు అంటే శ్రీకృష్ణుని యందు అని కాదు, పరమాత్మయందు- భగవంతునియందు అని. కర్మలను భగవంతునికి అర్పిస్తే ఆ కర్మయోగి భగవంతుని ప్రతినిధి ఔతాడు. అప్పుడు అతడు చేసిన కర్మల ఫలాలు అతడికి రావు. కర్మఫలాలు కర్తకు వస్తాయేగాని అతడి ప్రతినిధికి రావు. అంతేగాక అతడి వ్యక్తిత్వం ఎంతో ఉత్తమంగా వుంటుంది. సర్వకర్మలను విడిచిపెట్టటం అంటే సోమరిజీవితం గడపటం కాదు. కర్మలు చేస్తూనే కర్మఫలాలను విడిచిపెట్టటం, ఫలాసక్తి లేకుండా వుండటం.

అర్జునా! సర్వజ్ఞుడను, సర్వజగన్నియామకుడను, సర్వాత్మ స్వరూపుడను, వాసుదేవ పరబ్రహ్మాన్ని ఐన నా యందు సమస్త కర్మల ఫలాన్ని విడిచి పెట్టు. ఇంతటివాణ్ణి నేనడుగుతుంటే ఎందుకయ్యా నీకు లోభబుద్ధి? నా చేయి క్రిందై నీ చేయి మీదగుట మేలు గదా! కర్మలను నేను వదిలేస్తే ఎవరు మోస్తారు-అని సందేహిస్తున్నావా? నెత్తిమీది బరువును క్రిందికి దించితే ఎవరు మోస్తున్నారు? తనను కూడా మోసే ఈ భూమే కదా! అలాగే ఈ ప్రపంచాన్నంతా మోసేవాడే అన్ని కర్మఫలాలను మోస్తాడు. కనుక కర్మలను, కర్మఫలాలను నాకు సమర్పించేసెయ్. కర్మలను నీయందు విన్యసించుటకాదు, నా యందు సన్యసించుట నేర్చుకో. సేవకుడు యజమాని చెప్పిన పనులను చేసినట్లు సర్వకర్మలను చెయ్యి. కర్మఫలాలను భగవంతునికి సమర్పించు. ఎలాగంటావా? **ఆధ్యాత్మచేతసా**: నిరంతరము ఆత్మయందు నిలిపిన మనస్సుతో. లోకంలో సాధారణంగా అందరి మనస్సు ప్రాపంచిక విషయాలలో నిలిచి ఉంటుంది. లేదా కొందరి మనస్సు అప్పుడప్పుడూ భగవంతుని యందు నిలుస్తుంది. అలా గాకుండా నిరంతరమూ భగవంతునిపై భక్తిభావంతో మనస్సు నుంచి, బాహ్య విషయాలు ఎలా ఉన్నా-ఏం జరుగుతున్నా వాటిని పట్టించుకోకుండా, ఎవరి మనస్సు భగవద్భావంతో నిండి ఉంటుందో అట్టివారి చిత్తమే 'ఆధ్యాత్మచేతసా'. అట్టి చిత్తంతోనే కర్మఫలాలు సమర్పిస్తే అది నిజమైన సమర్పణ అవుతుంది. దీనివల్ల మనస్సులోని సంకల్పాలన్నీ పరిశుద్ధమై మనసు దివ్య ఉత్సాహంతో ఉప్పొంగుతుంది. అపుడు చేసే కర్మలన్నీ బంధాలు కాక మోక్షానికి సోపానాలవుతాయి. అయితే ఈ కర్మలు చేసేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఏమిటవి? 1) నిరాశీ. 2) నిర్మమ. 3) విగతజ్వరః.







**1. నిరాశీ**: ఆశలు లేకుండా. ఆశ అంటే భవిష్యత్తులో రాబోయే దానికోసం ఎదురు చూడటం. అలా రాబోయే ఫలితాల కోసం ఎదురుచూస్తుంటే పనిలో పటుత్వం తగ్గిపోతుంది. ఫలితం వస్తుంది అనుకుంటే ఎలాగూ వస్తుంది గదా అని పనిలో అశ్రద్ధ. రాదు అనుకుంటే ఎందుకీ వెట్టి చాకిరీ అనే నిస్పృహ. వస్తుందో రాదో తెలియనపుడు ఫలితాన్ని గురించే ఆలోచిస్తూ ఆందోళన చెందుతూ పనిపై అశ్రద్ధ. కనుక ఫలితం గురించి ఆలోచించరాదు.

**2. నిర్మమ:** గతంలో జరిగిపోయినవాటిపై ఆసక్తితో, సంగ భావంతో 'నావి' అనుకుంటూ జ్ఞాపకం చేసుకోవటం. మాటి మాటికి గతించిన విషయాలు గుర్తొస్తుంటే వర్తమానంలో జరిగే కర్మపై శ్రద్ధ కుదరదు. కనుక గత విషయాలను నెమరువేసు కుంటూ కర్మలు చేయరాదు.

**3. విగత జ్వరః:** వర్తమానంలో కర్మలు చేస్తూ పడే ఆందోళన, ఆరాటమే జ్వరం. ఏదైనా పనిచేసేముందే పక్కా ప్రణాళిక వేసుకొని కర్మ ప్రారంభించాలి. ఒకసారి కర్మ ప్రారంభించిన తర్వాత ఆరాట పడితే, ఆందోళన చెందితే కర్మలలో శ్రద్ధ తగ్గిపోతుంది. నైపుణ్యం ఉండదు. మన శక్తిని క్రుంగదీసేదే ఈ జ్వరం. కనుక దీనిని విడిచిపెట్టాలి.

కనుక కర్మలు చేసేటప్పుడు 3 జాగ్రత్తలు అవసరం. 1.భవిష్యత్తుకు సంబంధించిన భయాలు. 2. భూతకాలపు జ్ఞాపకాలు. 3.వర్తమానంలోని ఆందోళనలు-వీటిని పూర్తిగా వదిలిపెట్టాలి. ఈ మూడూ మానవుని శక్తిని నశింపజేసేవే. కనుకనే ఈ హెచ్చరిక. ఈ జాగ్రత్తలతో ఏం చెయ్యాలి?

**యుధ్యస్వ:** యుద్ధం చెయ్యి. అర్జునుని కార్యరంగం యుద్ధం. అలాగే మనం మన అంతరంగ శత్రువులపై యుద్ధం చేయాలి. మన కార్యరంగంలో మనం పని చేయాలి. ఎవరి కర్తవ్య కర్మలను వారు ఈ పై జాగ్రత్తలను తీసుకుంటూ చేస్తే ఆ కర్మలన్నీ మోక్షానికి దారి తీస్తాయి. ఇదే అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణ జవాబు. సమస్త మానవజాతి వ్యాధికి శ్రీకృష్ణ చికిత్స.

- శ్రీకృష్ణుడు బోధించిన ఈ కర్మయోగ మార్గాన్ని అనుసరించి ఆచరిస్తే ప్రయోజనమేమిటి? ఆచరించని వారి గతి ఏమిటి? రాబోయే 2 శ్లోకాల్లో వివరిస్తున్నారు.

**శ్లో॥ యేమే మతమిదం నిత్యం అనుతిష్ఠంతిమానవాః**
**శ్రద్ధావంతోఽన సూయంతః ముచ్యంతే తేఽపి కర్మభిః (31)**

**శ్లో॥ యేత్వే తదభ్యసూయంతః నాను తిష్ఠంతి మే మతం:**
**సర్వజ్ఞానవిమూఢాన్‌స్తాన్ విద్ధినష్టానచేతసః (32)**

**తా॥ ఏ మానవులు నాచే చెప్పబడ్డ ఈ మతాన్ని శ్రద్ధ గలవారై, అసూయ లేనివారై నిత్యము అనుసరిస్తుంటారో అట్టివారు కూడా కర్మలనుండి విడువబడు తున్నారు (31). ఎవరైతే నాచే చెప్పబడిన ఈ మతాన్ని అసూయాగ్రస్థులై అనుసరించరో వారు బుద్ధిహీనులై, ఏమాత్రం జ్ఞానం లేని వారై చెడిపోతారని తెలుసుకో (32)**

**వ్యాఖ్య:** కర్మయోగాన్ని ఆచరించవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పటానికే ఆచరించినందువల్ల ప్రయోజనాన్ని, ఆచరించకపోతే కలిగే నష్టాన్ని వివరిస్తున్నారీ శ్లోకాల్లో.

**మే ఇదం మతం:** 'నా యీ మతం' అంటున్నాడు కర్మ యోగాన్ని. మతం అంటే అభిప్రాయం అని అర్థం. మతం అంటే మార్గం అని అర్థం. భగవంతుని చేరుకోటానికి మహాత్ములచే చూపబడ్డ మార్గాలే మతాలు. లోకంలో చాలామంది ప్రవక్తలు ఆ తరంలోని మానవుల యొక్క మానసిక స్థితి గతులను బట్టి, వారిని ఉద్ధరించేందుకు అనేక మార్గాలను బోధించారు. అవే మతాలు. ఇక్కడ శ్రీకృష్ణుని మతం విశ్వజనీనం. అంతేగాదు అది కాలాతీతం. సర్వ కాలాలలోని సర్వమానవుల కోసం చెప్పబడ్డదీ కర్మయోగం. అట్టి ఈ మతాన్ని (కర్మయోగాన్ని) ఏ మానవులు శ్రద్ధతో అనుసరిస్తారో వారు అన్ని కర్మలనుండి విడుదల పొందుతారని భగవానుని హామీ. ఐతే ఎలా ఆచరించాలి?

**(1) శ్రద్ధావంతః:** శ్రద్ధావంతులై. శ్రద్ధ అంటే విశ్వాసం అని అర్థం. ఏ వ్యక్తి మీదనైనా విశ్వాసం (నమ్మకం) వుంటేనే అతడు చెప్పే విషయం సావధానచిత్తంతో వింటాం. ఆచరిస్తాం. డాక్టరు మీద విశ్వాసం ఉంటేనే అతడిచ్చిన మందును వాడి జబ్బునయం చేసుకోగలుగుతాం. అలాగే భగవంతునిపై, గురువుపై విశ్వాసం ఉంటేనే వారి బోధలను జాగ్రత్తగా విని, బుద్ధితో గ్రహించి ఆచరణలో పెట్టుకోగలుతాం. కనుక భగవంతునిపై ఆయన చూపిన ఈ కర్మయోగంపై అత్యంత శ్రద్ధ కలిగియుండి ఆచరణ చేయాలి.

**(2) అనసూయంతః** : అసూయ (ద్వేషం) లేకుండా. ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందాలంటే ఈ అసూయ, ద్వేషం, విమర్శలుండరాదు. కనుక ఎటువంటి ద్వేషము లేకుండా భగవంతుడు చెప్పిన ఈ కర్మయోగాన్ని ఆచరించాలి. అలా ఆచరిస్తే ప్రయోజనమేమిటి?







**తే అపి కర్మభిః ముచ్యంతి:** అట్టి వారు కూడా కర్మలనుండి విడుదల పొందుతారు. కర్మలు చేయమంటున్నారు గదా! మరి కర్మలనుండి విడుదల పొందటమేమిటి? చేయవలసింది కర్మయోగాన్ని, విడుదల పొందలసినది కర్మబంధనాలనుండి. కర్మలు చేస్తే కర్మఫలాలు వస్తాయి. ఆ కర్మఫలాలు జన్మలకు కారణమవుతాయి. ఆ జన్మలలో మళ్ళీ కర్మలు చేస్తారు. వాటి వల్ల కర్మఫలాలు, తిరిగి వాటివల్ల జన్మలు. ఇలా జనన మరణ చక్రబంధంలో ఇరుక్కుపోవాలి. ఇదే బంధం, కర్మబంధం. ఈ కర్మబంధం నుండి విడుదల పొందాలంటే కర్మలను కర్మలుగా గాక కర్మయోగంగా ఆచరించాలి. అంటే ఆశలు, మమకారాలు లేకుండా; ఆందోళనలు లేకుండా, మనస్సును ఆత్మలో నిలిపి, సర్వకర్మలను భగవంతునియందు సమర్పించి, నిర్లిప్తంగా చేయాలి. ఇదే కర్మయోగం. ఇలా చేస్తే అర్జునుడే కాదు, సామాన్యులు కూడా కర్మబంధాల నుండి విడిపోతారు. అంతేకాదు ఈ కర్మయోగాన్ని ఎప్పుడో ఒకసారి, ఏదో ఒకరోజు ఆచరించటం కాదు, 'నిత్యం' అంటే ఎల్లప్పుడూ ఆచరించవలసినదే అని కూడా స్పష్టం చేస్తున్నారు.

- ఈ కర్మయోగాన్ని ఆచరించటం వల్ల ప్రయోజన మేమిటో తెలియజేసి ఆచరించని వారికి కలిగే నష్టం ఏమిటో కూడా తెలియజేస్తున్నారు.

ఎవరైతే ఈ కర్మయోగాన్ని అసూయ-ద్వేషబుద్ధి ఉండి ఆచరించరో వారు బుద్ధిహీనులై, జ్ఞానహీనులై చెడిపోతారు అని భగవానుడు తెలియజేస్తున్నాడు.

**అసలు ఎవరైనా ఎందుకు ఆచరించరు? అభ్యసూయంతః** ద్వేషించువారై-అసూయాగ్రస్థులై. కొందరు ఏమీ తెలియక పోయినా, అన్నీ తెలిసినట్లే భావించుకొని మాట్లాడుతారు. తాము బాగా తెలిసిన వారమని అందరూ అనుకోవటానికి అందరినీ విమర్శిస్తూ నోటికి వచ్చినట్లు మాట్లాడతారు. భగవంతుని విమర్శిస్తారు; మహాత్ములను విమర్శిస్తారు; సాధు పురుషులను ఎగతాళి చేస్తారు; వేదాలను, శాస్త్రాలను దూషిస్తారు; దైవకార్యాలు చేసేవారిని, భక్తులను తూలనాడుతారు; మంచివాళ్ళను విమర్శిస్తారు; చెడ్డవాళ్ళను విమర్శిస్తారు; తన వాళ్ళను విమర్శిస్తారు; పరవాళ్ళను విమర్శిస్తారు. చివరకు వీరు తమను తామే విమర్శించుకొనే పరిస్థితి వస్తుంది. ఇట్టి వారికి దేనిమీదా స్పష్టమైన అభిప్రాయం ఉండదు. అట్టి వారు భగవానుడు చెప్పిన మార్గాన్ని ఆచరిస్తారా? ఆచరించరు. అట్టి వారి పరిస్థితి ఏమిటి? ఏమౌతారువారు?

**(1) అచేతస:** బుద్ధిహీనులైపోతారు. బుద్ధితో విచారణ చేసి గ్రహించవలసిన జ్ఞానాన్ని ద్వేషించి దానిని అందుకోలేక పోతే బుద్ధిని ఉపయోగించే పనిలేదు.

దానికి పదును పెట్టే పనిలేదు. పదును పెడితేనే కత్తి, చాకు, బాకు బాగా పని చేస్తాయి. పదును లేకపోతే మొద్దుబారిపోతాయి. ఎందుకూ పనికి రాకుండా పోతాయి. బుద్ధి కూడా అంతే. పదును పెట్టక పోతే బుద్ధి కూడా పనికిరాకుండా పోయి బుద్ధి హీనులౌతారు. అందువల్ల–

**(2) సర్వజ్ఞాన విమూఢాన్:** బుద్ధి పనిచేయని వీరు ఏ విధమైన జ్ఞానం లేని వారౌతారు. అసలు భగవంతునికి సంబంధించిన జ్ఞానం ఉంటేనే అతణ్ణి జ్ఞాని అంటారు. లౌకిక జ్ఞానం ఎంత ఉన్నా అట్టి వారు భగవంతుని దృష్టిలో అజ్ఞానులే. అట్టివారు–

**(3) నష్టాన్:** చెడినవారౌతారు. బాగుపడటం కోసం, తరించటం కోసం, జన్మను సార్ధకం చేసుకొనటం కోసం మానవజన్మనెత్తి ఈ లోకంలోకి వచ్చిపడ్డాం. ఆ సంగతిని మరిచిపోయి వదిలిపెట్టిపోయే సంపదలకోసం, భోగాల కోసం అర్రులు చాస్తూ పరుగులు పెడుతున్నామే గాని ఈ జన్మను సార్ధకం చేసుకొని తరించటానికి తగిన మార్గాలను అన్వేషించటం లేదు, ఆచరించటం లేదు. కనుక చెడిపోయినట్లే. అంటే ఈ లోకంలోకి మళ్ళీ మళ్ళీ వస్తూపోతూ కుక్కగా, నక్కగా, పందిగా, పక్షిగా, పిల్లిగా, నల్లిగా, బల్లిగా పుడుతూ కర్మఫలాలు అనుభవిస్తూ ఉండాల్సిందే. ఇదే నష్టాన్– చెడటం అంటే. కనుక ప్రతి మానవుడు భగవంతుడు ప్రబోధించిన కర్మయోగ మార్గాన్ని అనుసరించి–ఆచరించి జీవితాన్ని సార్ధకం చేసుకోవాలి. లేదా అన్నీ అనర్ధాలే.

– మరి ఇంత తెలిసినా ఎందుకు ఆచరించరు?

–భగవానుడు సూచించిన కర్మయోగాన్ని తెలుసు కొని కూడా జనులు ఎందుకు ఆచరించుట లేదు? ఎందుకు జనన మరణ చక్రంలో చిక్కుకొని నశించి పోతున్నారు?–

**శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి।**
**ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహఃకింకరిష్యతి॥ (33)**

**తా॥ జ్ఞానవంతుడైనప్పటికీ తనయొక్క ప్రకృతిని అనుసరించియే ప్రవర్తిస్తూ ఉంటాడు. ప్రాణులన్నీ తమతమ ప్రకృతిని అనుసరిస్తూ ఉంటాయి. నిగ్రహం ఏం చేస్తుంది?**

**వ్యాఖ్య:** 'ప్రకృతి' అంటే స్వభావం అని. ఈ స్వభావం ఒక్కొక్క ప్రాణిలో ఒక్కొక్క విధంగా ఉంటుంది. ఎందువల్ల? ఆయాజీవుళ్ళు పూర్వజన్మలలో చేసిన







సంకల్పాలు, కర్మల వల్లనే వారి స్వభావం ఉంటుంది. మరి అందరూ ఒకే రకమైన సంకల్పాలు, కర్మలు చేయరు గనుక వారి స్వభావాలు కూడా ఒకే రకంగా ఉండవు. ఎవరి స్వభావాన్ని (ప్రకృతిని) అనుసరించి వారు ప్రవర్తిస్తుంటారు. **కొందరు ఇతరుల సుఖం కోసం తమ సుఖాన్ని త్యాగం చేస్తారు. కొందరు తమ సుఖం తాము చూసుకుంటూ ఇతరుల సుఖాన్ని కోరుకుంటారు. కొందరు తమ సుఖం కోసం ఇతరులకు ఎంతటి హానినైనా తలపెడతారు. కొందరు తమకు ఏ ప్రయోజనం లేకున్నా ఇతరులకు ఎంతటి హానినైనా తలపెడతారు. కొందరు తమకు ఏ ప్రయోజనం లేకున్నా ఇతరులను హింసిస్తూ ఆనందిస్తారు. ఇలా వారివారి స్వభావాల ననుసరించి ప్రవర్తిస్తారు.** సామాన్యులే కాదు జ్ఞానులు కూడా అంతేనంటున్నాడు భగవానుడు.

**జ్ఞానవాన్ అపి స్వస్యాః ప్రకృతేః సదృశం చేష్టతే:**– జ్ఞానులైనప్పటికి తమ స్వభావానికి అనుగుణంగానే ప్రవర్తిస్తుంటారు. **ఐతే ఇక్కడ జ్ఞానులంటే ఎవరు? శాస్త్రజ్ఞానం మాత్రమే ఉన్నవారు.** అంతే తప్ప ఆత్మానుభూతిని పొందిన జ్ఞానులని కాదు. కర్మయోగాన్ని గురించి చక్కగా తెలుసుకొని, ఎలా ఆచరించాలో కూడా తెలుసుకొని, ఆచరిస్తే కలిగే ప్రయోజనమేమిటో, ఆచరించకపోతే జరిగే నష్టమేమిటో కూడా తెలుసుకొన్న జ్ఞానులు కూడా తమతమ స్వభావాన్ని అనుసరించే ప్రవర్తిస్తుంటారు అని చెప్పటంలో ఆంతర్యం ఏమిటంటే– వారే అలా ప్రవర్తిస్తుంటే ఇక సామాన్యుడి గతి ఏమిటి? ప్రత్యేకించి చెప్పాలా? అనియే. ఇక్కడ ప్రకృతి (స్వభావం) ఎంతో బలవత్తరమైనది అని హెచ్చరించటమే భగవానుని ఉద్దేశం.

కర్మయోగం గురించి తెలిసిన జ్ఞానియైనా, తెలియని అజ్ఞానియైనా లౌకిక విషయాల పట్ల, భోగాలపట్ల ఉన్న ఆసక్తి చేత, స్వార్ధం కారణంగా కర్మయోగాన్ని ఆచరించలేక పోతున్నారు. వారి వారి స్వభావాల కనుగుణంగానే ఇక్కడ కర్మలు చేస్తున్నారు.

మరి ఇలా ప్రతివారూ ప్రకృతి ప్రేరణల వల్లనే కర్మలు చేస్తుంటే ఇక ఈ కర్మయోగాన్ని గురించీ; ఇంద్రియ నిగ్రహం; మనోనిగ్రహం గురించీ తెలుసుకోవటం వల్ల ప్రయోజనం ఏమిటి? మనిషి తన ప్రకృతిని బట్టే నడుస్తుంటే నిగ్రహం ఎలా కుదురుతుంది? ఈ సందేహాన్నే **"నిగ్రహంః కిం కరిష్యతి?"** అని భగవానుడు వ్యక్త పరుస్తున్నాడు. ఇక్కడ భగవానుని ఉద్దేశ్యం మనను నిరాశ పరచటం కాదు. అదే భగవానుని ఉద్దేశమైతే తరువాతి శ్లోకంలో **"తయోర్నవశమాగచ్ఛేత్" "రాగద్వేషాలకు వశుడవు కావద్దు"** అని ఎందుకు చెబుతాడు?

తమతమ స్వభావాల ననుసరించి ప్రవర్తించే మానవులు భోగజీవితాన్ని వదలి యోగ జీవితాన్ని గడపాలన్నా, నిష్కామ కర్మయోగమార్గాన్ని అనుసరించాలన్నా ఎంతో కష్టమైనదనీ, అందరికీ అంత సులువుగా సాధ్యమయ్యేది కాదనీ విశాల దృష్టితో చెప్పటమే ఇందులోని ఆంతర్యం. అంతేగాని అసాధ్యమని చెప్పి నిరుత్సాహపరచటం కాదు.

*** బుద్ధిద్వారా కర్మయోగాన్ని చక్కగా తెలుసుకున్నా, బుద్ధి కన్నా, సూక్ష్మమైన ప్రకృతి బుద్ధిని పెడత్రోవ పట్టిస్తుంది. కనుక తీవ్ర ప్రయత్నంతో, పట్టుదలతో కర్మయోగాన్ని ఆచరించాలి. అలా ఆచరిస్తున్న కొద్దీ అతడిలోని సూక్ష్మవాసనలు (ప్రకృతి) కరిగిపోయి, అతడి స్వభావం శుద్ధమౌతుంది. స్వభావం శుద్ధమైన కొద్దీ ప్రాపంచిక వ్యామోహాలు తగ్గిపోయి సులువుగా కర్మయోగాన్ని ఆచరించ గలుగుతాడు.***

ఎంతో నిజాయితీతో; ఉన్న విషయాన్ని ఉన్నట్టు చెప్పటం ఇక్కడ శ్రీకృష్ణుని విశాల భావాన్ని వ్యక్తం చేస్తున్నది. ప్రతి బంధకాలు తెలిస్తేనే వాటిని వదిలించుకొని ముందుకు వెళ్ళటం ఎలాగో తెలుస్తుంది. అలా తెలియజేస్తున్నది గనుకనే భగవద్గీత 'అనుష్టాన వేదాంతం' అని నిరూపితమైంది.

– ప్రతిబంధకాలేమిటో తరువాతి శ్లోకంలో తెలియ జేస్తున్నారు.

**శ్లో॥ ఇంద్రియస్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।**
**తయోర్న వశమాగచ్ఛేత్ తౌహ్యస్య పరిపంథినౌ॥ (34)**

**తా॥ ప్రతి ఇంద్రియము యొక్క విషయమునందు రాగ ద్వేషాలు (ఇష్టానిష్టములు) ఉన్నవి. ఆ రాగద్వేషాలకు వశుడవు కావద్దు. ఎందుకంటే అవే మనిషికి శత్రువులు.**

**వ్యాఖ్య:** బుద్ధి ద్వారా కర్మయోగాన్ని చక్కగా తెలుసుకొని ఆచరించటానికి, ఆచరించి పరిపూర్ణ ఆనందాన్ని పొందటానికి ఆటంకం కలిగిస్తూ, మన హృదయంలోనే తిష్ట వేసుకుని కూర్చున్న శత్రువులను గూర్చి ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

మనం కర్మయోగం ద్వారా ఉన్నత జీవితాన్ని గడపాలి. కాని మన ప్రకృతే (స్వభావమే) దానికి ఆటంకం. ప్రకృతి ఎంతో బలవత్తరమైనది. అది మనలను వశం చేసుకుంటున్నది. ప్రకృతిని నిగ్రహించటం సాధ్యం కాదు. సాధ్యం కాదు గదా అని ప్రకృతికి వశులై అది ఆడించినట్లల్లా ఆడితే పశువుకూ మనిషికీ తేడా ఉండదు. మరేం చేయాలి? ప్రకృతిని నిగ్రహించటానికి వీలులేదు గనుక దానిని







మనకు అనుకూలంగా మార్చుకోవాలి. అదే జ్ఞానం–తెలివి. నీవు ఏమి చేయాలో నిర్ణయించేది నీ ప్రకృతి (స్వభావం). కాని ఎలా చేయాలో నిర్ణయించేది నీ వివేకం–బుద్ధి–తెలివి.

**– పోరాడటం నీ ప్రకృతి. అయితే అజ్ఞానం మీద పోరాడు. అధర్మం మీద పోరాడు**
**– దొంగతనం నీ ప్రకృతి. అయితే అందరి మనసులను దొంగిలించు**
**– పనిచేయటం నీ ప్రకృతి. ఐతే భగవత్ కార్యాలు చెయ్యి; జ్ఞానప్రచారంచెయ్యి**

నది దానంతటది దాని మార్గంలో ప్రవహిస్తూపోతుంది. మనం రమ్మన్న వైపుకురాదు. కాని దాని ప్రవాహమార్గంలో ఒక ఆనకట్టను నిర్మించి, మనకనుకూలంగా దారి మళ్ళిస్తున్నాం. అలాగే ప్రకృతి దాని ధాటికొద్దీ అది పోతుంటుంది. మనం దానిని మనకనుకూలంగా మార్చుకోవాలి.

ప్రకృతి సిద్ధమైన కర్మలు బంధాన్ని కలిగించలేవు. కాని రాగద్వేషాలతో కూడినప్పుడే అవి బంధమౌతాయి. ఈ రాగద్వేషాలే మానవుణ్ణి పెడదారుల్లో పడేసి నాశనం చేస్తాయి. అందుకే అన్ని ఇంద్రియ విషయాలలోను రాగద్వేషాలున్నాయి, అవే నీకు శత్రువులు, కనుక వాటి వలలో పడవద్దు–అని భగవానుడు హెచ్చరిస్తున్నాడు. నిజంగా రాగద్వేషాలు విషయాలలో లేవు. వాటిని చూస్తున్న నీ మనస్సులోనే ఉన్నాయి. 'లడ్డు' అనే విషయవస్తువు బయట ఉన్నది. కన్ను అనే నీ ఇంద్రియం దాన్ని చూచి నీ మనస్సుకు చెప్పింది. ఇపుడు మనస్సులో ఆ లడ్డుపై రాగం ఉండొచ్చు; ద్వేషం ఉండొచ్చు. రాగం ఉంటే కావాలనుకుంటావు. ద్వేషం ఉంటే వద్దనుకుంటావు. దాని రుచిపై రాగం ఉంటే, అది నీకు హాని చేస్తుందనుకున్నా తినాలనుకుంటావు. దాని రుచిపై ద్వేషం ఉంటే ఊరికే ఇచ్చినా తినవు. మనం చేయకూడని పనులు చేయటానికి గాని, చేయవలసిన పనులు చేయకుండుటకు గాని కారణం ఈ రాగద్వేషాలే. ఈ రాగద్వేషాలనే అంతఃశత్రువులను జయించాలి. ఎలా? శ్రద్ధతో శాస్త్రాలను అధ్యయనం చేయటం ద్వారా, లేదా సద్గురువుల బోధను శ్రవణం చేసి మననం చేయటం ద్వారా. అంతే కాకుండా అవసరమైన చోట–అవసరమైన వారికి–అవసరమైన సేవలను అందించటం ద్వారా కూడా ఈ రాగద్వేషాలను జయించవచ్చు. ఆకలిగొన్న వారికి ఆహారాన్ని; అనారోగ్యంతో ఉన్న వారికి ఆరోగ్యాన్ని; దుఃఖితులకు ఆనందాన్ని; అజ్ఞానులకు జ్ఞానాన్ని అందించటం ద్వారా ఈ రాగద్వేషాలను జయించవచ్చు. దొంగలు యాత్రికుడి వద్దనున్న ధనాన్ని దోచుకున్నట్లు

ఈ రాగద్వేషాలనే దొంగలు మానవునిలోని వివేకాన్ని దొంగిలిస్తాయి. కనుక వీటిని జయించాలి. మరి ఏమిటి ఉపాయం?–

**శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ (35)**

**తా॥ చక్కగా ఆచరించిన పరధర్మం కన్న గుణములేనిదైనా స్వధర్మమే మిన్న. స్వధర్మాచరణలో మరణించినా శ్రేయస్కరమే. పరధర్మం భయానకమైనది.**

**వ్యాఖ్య:** నీ ప్రకృతికి–స్వభావానికి అనుకూలమైన కర్మలే స్వధర్మం. అంటే నీలోపల వాసనల యొక్క ప్రేరణవల్ల చేయవలసిన కర్మలే నీ స్వధర్మం. ఎవరి ప్రకృతిని బట్టి వారికి ప్రేరణ ఉంటుంది. ఆ ప్రేరణను అనుసరించి తగిన విధంగా కర్మలు ఆచరించినపుడు అతడిలోని ప్రకృతి (వాసనలు) ఖర్చై పోయి అతడి మనస్సు శుద్ధమవుతుంది.

**ఇపుడు అర్జునుని యొక్క ప్రకృతి (స్వభావం) యుద్ధం చేయటమే.** అతడు క్షత్రియుడు. క్షత్రియోచితమైన విద్యలు నేర్చుకున్నాడు. అస్త్రసంపాదన కోసం స్వర్గలోకం కూడా వెళ్ళాడు. పరమేశ్వరుని గురించి తపస్సు చేసి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. అనేక యుద్ధాలు చేశాడు. ఎందరినో జయించాడు. అతడిది రజోగుణం.కనుకఅతడి ప్రకృతి యుద్ధానికి ప్రేరణ ఇచ్చేది. **అందువల్ల అతడి స్వధర్మం యుద్ధం చేయటమే.**

అయితే యుద్ధం ఎంతో భయంకరమైనదని; లక్షల మంది చనిపోతారని; ఆత్మీయులు, బంధువులు, మిత్రులు ఎందరో దూరమైపోతారని; యుద్ధంవల్ల ఎన్నో అనర్థాలు జరిగిపోతాయని ఇపుడు – అంటే యుద్ధం చేయటానికి యుద్ధరంగం లోనికి వచ్చి–బాధపడుతున్నాడు అర్జునుడు. అందువల్ల యుద్ధం మానేసి తపస్సు చేసుకుంటానని, భిక్షాటన చేస్తానని, యుద్ధం నుండి వెనుదిరిగిపోతానని అంటున్నాడు. తపస్సులు చేయటం, భిక్షాటన చేయటం సాత్వికుల స్వధర్మం. అది అర్జునునకు పరధర్మం. అందుకే భగవానుడు అంటున్నాడు, "అర్జునా! నీ స్వధర్మం ఏదో దానినే ఆచరించు, అది ఎంత గుణములేనిదైనా సరే. పరధర్మాన్ని ఆచరించకు, అది ఎంత గొప్పదైనా సరే–అని. ఎందుకని అలా చెప్పటం?

**స్వధర్మేనిధనంశ్రేయః** :– స్వధర్మంలో మరణం సంభవించినా సరే అదే నీకు శ్రేయస్సును కలిగిస్తుంది. ఏమిటా శ్రేయస్సు? నీలోపలి ప్రకృతిని బట్టి (వాసనలను బట్టి) నీకు ప్రేరణ వస్తున్నది. ఆ ప్రేరణను అనుసరించి నీవు కర్మ చేస్తున్నట్లైతే ఆ







వాసనలు ఖర్చైపోతాయి. వాసనలు ఖర్చై పోయినప్పుడు మనస్సు శుద్ధమౌతుంది. శుద్ధమైన మనస్సు జ్ఞానసంపాదనకు, ధ్యానసాధనకు అనుకూలమౌతుంది. దానితో మోక్షమార్గాన పయనించి నీ జీవితాన్ని సార్థకం చేసుకోవచ్చు. జన్మ రాహిత్యాన్ని పొందవచ్చు. ఇదే శ్రేయస్సు.

**పరధర్మో భయావహః** :– నీ స్వధర్మాన్ని విడిచి పరధర్మాన్ని ఆచరించావా? అది ఎంత గొప్పదైనా సరే భయంకరమైనదే. ఎందువల్ల? నీ లోపలి ప్రేరణ ప్రకారం యుద్ధమనే కర్మను చేయలేదనుకో. అప్పుడా వాసనలు ఖర్చు కాకుండా అలా పేరుకొని ఉంటాయి. పైగా పరధర్మాన్ని ఆచరించటం వల్ల క్రొత్త వాసనలు వచ్చి చేరతాయి. ఆ పాత వాసనలు, ఈ క్రొత్త వాసనలతో నీ మనస్సు మహాభారమవుతుంది. మరింత గందరగోళమౌతుంది. ఆందోళన, అలజడి, అశాంతి కలుగుతుంది. చేయవలసినది చేయలేక పోయానని; క్రొత్త పనిలో నైపుణ్యంలేక ప్రశాంతత కరవైపోతుంది. ఇదే పరధర్మం భయానకం అంటే.

అందుకే గుణం లేనిదైనా స్వధర్మాన్ని ఆచరించు. ఎంత గొప్పదైనా, అనుకూలమైనదైనా పరధర్మం భయావహం అని చెప్పటం.

**పాలు నీటికన్నా విలువైనవి. పోషక పదార్థాలెన్నో ఉన్నాయి పాలలో. అలాగని 'చేప' నేను నీళ్ళల్లో ఉండను, పాలల్లో ఉంటాను అంటుందా? ఉండగలుగుతుందా?**

స్వధర్మమైన యుద్ధంలో మరణం సంభవించినా, మంచిదే. ఎందుకంటే ఇహలోకంలో కీర్తి, పరలోకంలో స్వర్గసుఖం లభిస్తుంది. కనుక 'స్వధర్మమే సర్వశ్రేష్ఠం' అని భగవానుడు నిర్ద్వంద్వంగా తెలియజేశాడు.

– శ్రీకృష్ణుని ఈ బోధను ఎంతో శ్రద్ధతో వింటున్న అర్జునునిలో ఇప్పుడొక సందేహం తళుక్కున మెరిసింది. అందుకే వెంటనే తన సందేహాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ అథకేన ప్రయుక్తోఽయం పాపంచరతి పూరుషః।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయా! బలాదివ నియోజితః॥ (36)**

**తా॥ ఓ వార్ష్ణేయా! (వృష్ణి వంశంలో జన్మించినవాడా!) అయితే ఈ పురుషుడు దేనిచేత ప్రేరేపింపబడి, ఇష్టం లేకుండానే, బలవంతంగా ఇతరులచే నియోగించబడిన వానివలె పాపకార్యాలను చేస్తున్నాడు.?**

**వ్యాఖ్య:** శిష్యుడు గురువును ప్రశ్నించి తెలుసుకోవటం శాస్త్ర సాంప్రదాయం. ఇపుడు జ్ఞానసంబంధమైన విషయాలను వింటూ, విన్నవాటిని ఆచరణలో పెట్టాలనే తహతహలో ఉన్నాడు అర్జునుడు. అందుకే ప్రతి విషయాన్ని ఆచరణయోగ్యమా? కాదా? అని పరిశీలన చేస్తున్నాడు. ఆచరించటంలో వచ్చే ఇబ్బందులేమిటో గ్రహిస్తూ, వాటిని అధిగమించే ఉపాయాలను అడిగి తెలుసుకుంటున్నాడు. అందుకే ప్రశ్నిస్తున్నాడు.

**దేనిచేత ప్రేరేపించబడి మానవుడు పాపం చేస్తున్నాడు? పాపం చేయాలనే ఉద్దేశం సహజంగా ఏ మానవుడికీ ఉండదు. అలాంటి ఉద్దేశం లేకపోయినా ఎవరో బలవంతంగా పట్టి లాగుతున్నట్లుగా పాపం చేయటానికి సిద్ధపడుతున్నాడు, చేస్తున్నాడు. ఎవరలా బలవంతంగా పట్టి లాగుతున్నది? ఏమిటా బలవత్తరమైన శక్తి?**

కర్మయోగం అనేది మానవ జీవితాన్ని సార్ధకం చేసుకొనుటకు తొలిమెట్టు. ఎందుకంటే కర్మయోగం వల్లనే లోపలి వాసనలు క్షయమై, క్రొత్త వాసనలు చేరకుండా మనశ్శుద్ధి జరిగేది. మనశ్శుద్ధి జరిగినపుడే మనసు ప్రశాంతమై బుద్ధి సూక్ష్మమయ్యేది. ఆ సూక్ష్మబుద్ధి వల్లనే బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది. ఆ బ్రహ్మజ్ఞానం వల్ల నే 'నేనుబ్రహ్మన్ని' అనే బ్రహ్మానుభూతి కలిగి జీవన్ముక్తి లభించేది. అప్పుడే మానవజన్మకు సార్ధకత. ఈ విషయం పూర్తిగా, స్పష్టంగా తెలిసినప్పటికీ ఎందుకని మానవుడు ఈ కర్మయోగాన్ని ఆచరించలేక పోతున్నాడు? మానవుడు తాను చేయదలచుకున్న దానిని చేయలేకపోతే స్వతంత్రుడు అని ఎలా అనగలం? మరి ఎవరు ఇలా వెనక ఉండి నెడుతున్నది? పరమాత్మా? ప్రారబ్ధమా? స్వార్ధమా? విషయాలపట్ల ఆసక్తియా? ఎవరు? ఎవరు దీనికి కారణం? ఇదీ ప్రశ్న.

అబద్ధం ఆడటం పాపమని, అందరికీ తెలుసు. ఎన్నడూ అబద్ధమాడి ఎరుగని ధర్మరాజు, ఆపత్కాలంలో శ్రీకృష్ణుని ప్రోత్సాహంతో ఒక్క అబద్ధమాడాడు. దాని ఫలితంగా నరకదర్శనం చేయాల్సివచ్చింది. ఇది తెలిసి కూడా ఎందుకని దాదాపుగా అందరూ అబద్ధమాడుతూనే ఉన్నారు.

"తన కోపమే తన శత్రువు" అనే విషయం అందరికీ తెలుసు. అయినా క్రోధతాామ్రాక్షులౌతుంటారు మానవులు. ఎందుకని? విషయ వస్తువులు విషం కన్నా ప్రమాదమని సాధకులకు తెలుసు. అయినా వ్యామోహాన్ని వదలుకోలేరు. ఎందుకని? ఇంద్రియనిగ్రహం ప్రధానమని తెలుసు. అయినా నిగ్రహాన్ని కోల్పోతారెందుకు?







మనం తూర్పువైపుకు ప్రయాణం చేయాలనుకుంటూంటే కాళ్ళు పడమరవైపుకు లాగుతున్నాయి. ఎందుకు? ఏ అదృశ్య శక్తి ప్రేరేపిస్తున్నది? అది ఎంతో బలమైనది కూడా. **'బలాదివ నియోజితః'** బలాత్కారంగా లాగేస్తున్నది. ఏమిటా శక్తి?

**"అథకేనప్రయుక్తో2యం"** కేన? (దేనిచేత) అని ప్రశ్నిస్తున్నాడు అర్జునుడు. కేనోపనిషత్తులో సాధన చేసిన శిష్యుడు గురువును చేరి **"కేనేషితం పతతి ప్రేషితం మనః"** అని ప్రశ్నిస్తాడు. ఇక్కడ అర్జునుడు కూడా కేన? అని ప్రశ్నించటం ఆ ఉపనిషత్తుతో సామ్యాన్ని (పోలికను) తెలియజేస్తున్నది. అర్జునుడిలా ప్రశ్నించటం వల్ల ఆ బలవత్తరమైన శక్తి ఏదో? దానిని అధిగమించి మనం అనుకున్నట్లుగా ముందుకు వెళ్ళే శక్తి ఎలా వస్తుందో భగవంతుని సమాధానం ద్వారా తెలుస్తుంది. కనుక సాధకులు ఎంతో జాగ్రత్తగా భగవానుని సమాధానాన్ని అధ్యయనం చేయాలి.

–పాపాలు చేయాలని అనుకోకపోయినా మనచేత బల వంతంగా పాపాలు చేయిస్తున్న ఆ శక్తి ఏదో, దానిపుట్టు పూర్వోత్తరాలేమిటో భగవానుడు తెలియజేస్తున్నాడు.

**శ్రీభగవానువాచ:**

**శ్లో॥ కామ ఏషక్రోధ ఏష రజోగుణ సముద్భవః॥**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణం॥ (37)**

**తా॥ భగవానుడంటున్నాడు. 'ఆ బలవత్తరమైన శక్తి కామము, క్రోధము. ఇవి రజోగుణం నుండి పుడుతున్నాయి. ఈ కామానికి ఆకలి ఎక్కువ, పైగా మహాపాపానికి కారణమవు తుంది. ఈ కామక్రోధాలే ఇక్కడ నీ శత్రువులు అని తెలుసుకో.**

**వ్యాఖ్య:** అర్జునా! నిన్ను నీ ఇష్టంతో నిమిత్తం లేకుండా పాపాల వైపు నడిపించేది పరమాత్మ కాదు, ప్రారబ్ధమూ కాదు. పరమాత్మ కరుణామూర్తి. ఆయనకేం పని? నిన్ను పాపాలవైపు నడిపించటానికి. ఇక ప్రారబ్ధం అంటావా? ప్రారబ్ధం అనుభవిస్తే తీరిపోయేదే గాని నిన్ను కర్మలకు ప్రేరేపించేది కాదు. కనుక ఈ పాపానికంతా కారణం కామము, క్రోధమే. నిజంగా ఇవి రెండు కాదు ఒక్కటే. రెండింటి స్వరూపం ఒక్కటే. కామమే పరిస్థితులను బట్టి క్రోధంగా మారుతుంది.

ఏదైనా ఒక వస్తువును చూచావనుకో. అది నీకు సుఖాన్ని స్తుందని భావించినప్పుడు దానిని నీవు కావాలనుకుంటావు. ఎలాగైనా దానిని తెచ్చుకొని ఆనందించాలని తహతహలాడుతావు. అలా దానికై ఆరాటపడటం, కోరు కోవటమే కామం (కోరిక). అలా కోరుకున్న వస్తువును నీవు పొందటానికి కొన్ని పరిస్థితులు

అడ్డురావచ్చు. లేదా ఎవరైనా వ్యక్తులు అడ్డు రావచ్చు. అలా కోరిక తీర్చుకోవటానికి ఆటంకం కలిగితే వచ్చేదే క్రోధం. అంటే కామమే పరిస్థితులను బట్టి క్రోధంగా మారుతుంది.

చిన్నపిల్లవాడు ఆడుకునే బొమ్మకావాలి, కొనివ్వమన్నాడు. కొనివ్వమనటం కోరిక. ఆ కోరిక నెరవేరకపోతే-అంటే నీవు దానిని కొనివ్వకపోతే అతడికి వచ్చేదే కోపం (క్రోధం). దాని ఫలితం నిరాహారదీక్షో, ఇల్లుపీకి పందిరి వెయ్యటమో లేక ఇల్లు వదలి వెళ్ళిపోవటమో జరుగుతుంది.

భార్యభర్తను నెక్లెస్ కొనమంది. అది కోరిక. భర్తేమో "అంత ఆర్థిక స్థోమత లేదు; ఇపుడు కాదులే, తర్వాత కొనిస్తా"నన్నాడు. అప్పుడా భార్యకు వచ్చేదే క్రోధం. ఫలితం వంట సరిగ్గా ఉండకపోవచ్చు; అసలు వంటే లేకపోవచ్చు; నాలుగురోజులు మాటలు లేకపోవచ్చు; చిటపటలు, సూటిపోటి మాటలు రావచ్చు.

కనుక కామానికి (కోరికకు) ఆటంకం కలిగితే అది క్రోధం (కోపం)గా మారుతుందేగాని నిజంగా కామక్రోధాలు వేరు వేరు కాదు. కనుక క్రోధాన్ని నశింపజేయాలనుకుంటే ముందు కామాన్ని నశింపజేస్తే సరి. "అబ్బ! ఏమిటోనండి నాకు కోపం పోవటం లేదు" అంటాం. కోరికపోతేనే కోపం పోయేది. కోరిక ఉన్నంతకాలం కోపం ఎక్కడకూ పోదు.

బావిలో కుక్కపడి చనిపోయింది. వాసన పోవాలని మోటారు పెట్టి నీరు తోడి పోస్తున్నారు. ఎంతకాలం తోడి పోసినా ఆ కుక్కదేహం అందులో ఉన్నంతకాలం వాసనపోదు. కుక్కను తీసేసి నీరు తోడిపోస్తేనే వాసనపోతుంది. అలాగే లోపల కోరికను తీసేస్తేనే కోపం పోతుంది. ఈ కామం యొక్క పుట్టుక స్థానం ఏది?

**రజోగుణ సముద్భవ:** ఈ కామం రజోగుణం నుండి పుట్టినది. గుణాలన్నీ ప్రకృతిలోనివే. సత్వగుణం జ్ఞానాన్ని కలిగిస్తుంది; రజోగుణం కామాన్ని కలిగిస్తుంది; తమోగుణం సోమరితనాన్ని కలిగిస్తుంది. సత్వగుణాన్ని పట్టుకొని రజోగుణాన్ని వదిలించుకుంటే ఈ కామం క్రోధం వదిలి పోతాయి.

ఇక ఈ కామానికి 2 లక్షణాలున్నాయి. 1) మహాశన; 2) మహాపాప్మా.

**మహాశనః** :- దీనికి ఆకలి ఎక్కువ. పెద్ద తిండిపోతు. ఎంత తిన్నా తృప్తి లేదు. ఎన్ని సుఖాలు, భోగాలు అనుభవించినా, ఎంత సంపాదించినా కోరికలకు అంతు వుండదు.







ఎంత నెయ్యి పోసినా అగ్ని చల్లారదు. ఇంకా విజృంభిస్తుంది. అలాగే ఎన్ని వస్తువులు లభించినా, ఎంత ధనాన్ని సంపాదించినా, ఎన్ని భోగాలనుభవించినా తృప్తి అనేది ఉండదు. దూడ పెరుగుతున్న కొద్దీ కొమ్ములు పెరుగుతున్నట్లు కోరికలు తీరేకొద్దీ అవసరాలు పెరుగుతూనే వుంటాయి.

**మహాపాప్మా:** గొప్ప గొప్ప పాపాలకు ఈ కామమే మూల కారణం. ఈ కామమే దొంగతనం చేయిస్తుంది, ఇతరులను మోసం చేయమని పురిగొల్పుతుంది, దోపిడీలు చేయిస్తుంది. హత్యలు చేయిస్తుంది, ఏమైనా చేయిస్తుంది, ఎంతటి పాపాన్నైనా చేయిస్తుంది. కనుక-

**వైరిణం విద్ధి:** దీనిని శత్రువుగా తెలుసుకో. బలవంతంగా పాపాలు చేయించే వాడు; త్రాగుడు, పేకాట నేర్పేవాడు; దొంగతనాలు నేర్పేవాడు శత్రువు గాక మరేమవుతాడు? పైగా ఇది బయటి శత్రువు కాదు. లోపలి శత్రువు. లోపలే ఉండి జీవుణ్ణి బానిసగా చేసుకొనే శత్రువు.

-ఏం చేస్తుంది ఈ కామమనే శత్రువు? ఎలా పాపాలు చేయిస్తుంది?

రజోగుణం నుండి పుట్టిన ఈ కామమనే శత్రువు ఎలా మనచేత పాపాలు చేయిస్తుంది?

**శ్లో॥ ధూమేనా వ్రియతే వహ్నిః యథాదర్శో మలేనచ।**
**యథోల్బేనావృతో గర్భః తథా తేనేద మావృతం॥ (38)**

**తా॥ ఏ విధంగా పొగచేత అగ్ని కప్పబడుచున్నదో, దుమ్ము చేత అద్దం కప్పబడు చున్నదో, మావిచేత గర్భంలో ఉన్న శిశువు కప్పబడుచున్నదో, అలాగే కామంచేత జ్ఞానం కప్పబడు చున్నది.**

**వ్యాఖ్య:** మనిషి తనకు ఇష్టం లేకపోయినా ఎవరో బలవంతంగా నెట్టినట్లు పాపాలు చేస్తున్నాడు. ఎందుకు? కామం వల్లనే **ఆ కామం ఎలా చేయిస్తున్నది పాపాలను? మనిషిలోని జ్ఞానాన్ని కప్పివేసి చేయిస్తున్నది.** కనుక జ్ఞానాన్ని కప్పిన ఆ కామాన్ని తొలగించుకోవాలి. అలా తొలగించు కొనుటకు ముందు కామం మనలోని జ్ఞానాన్ని ఎలా కప్పి ఉంచినదో ఇక్కడ మూడు ఉదాహరణలు చెపుతున్నాడు భగవానుడు.

అవే **(1) పొగచేత అగ్ని కప్పబడినట్లు**
**(2) దుమ్ముచేత అద్దం కప్పబడినట్లు**
**(3) మావిచేత గర్భంలోని శిశువు కప్పబడినట్లు**

మూడు ఉదాహరణలెందుకు? ఒక్కటి చెబితే సరిపోదా? అంటే లోకంలో గుణాలను బట్టి మూడు రకాల మనుష్యులున్నారు. సాత్త్వికులు, రాజసికులు, తామసికులు వారి ముగ్గురి కొరకే 3 రకాల ఉపమానాలు చెప్పబడ్డాయి. ఈ ఉపమానాలను లోతుగా అర్థం చేసుకుంటే వారివారి జ్ఞానాన్ని కప్పిన కామం ఎలా తొలగించుకోవచ్చో తెలుస్తుంది.

**1) పొగచేత నిప్పు** : సత్త్వగుణ ప్రధానియైన వానిలోని జ్ఞానం పొగచేత నిప్పు కప్పబడినట్లు కప్పబడి యుంటుంది. పొగనిప్పును మొదట్లో కప్పివేసినా, నిప్పురాజుకుంటున్న కొద్దీ పొగ దానంతట అదే తగ్గిపోయి నిప్పు బాగా ప్రకాశిస్తుంది. అంటే పొగను తీసివేయటానికి ఏ ప్రయత్నమూ అవసరం లేదు. నిప్పురాజుకుంటున్న కొద్దీ తనంతట తానే పొగ తొలగి పోతుంది. అలాగే సత్త్వగుణ ప్రధానియైనవాడు కామాన్ని తొల గించుకోవటానికి ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు. సత్త్వ గుణంలో ఉన్నవాడు ఆత్మజ్ఞానం కొరకు తపిస్తూ జ్ఞానప్రాప్తికై శ్రవణ, మనన, నిధి ధ్యాసనలు చేస్తూనే ఉంటాడు గనుక; జ్ఞానం అవగాహన అవుతున్నకొద్దీ కామం తనంతట తానుగానే అదృశ్యమైపోతుంది. ఈ విషయం తెలియజేయుటకే ఈ మొదటి ఉదాహరణ చెప్పబడింది.

**2) దుమ్ముచేత అద్దం**: రజోగుణ ప్రధానియై, నిరంతరం సకామ కర్మలయందు ఆసక్తి గల వాని జ్ఞానం దుమ్ముచేత అద్దం కప్పబడినట్లు, కామంచేత కప్పబడి యుంటుంది. అద్దం మీద దుమ్ము పడినపుడు ప్రతిబింబం సరిగ్గా కనపడదు. అందు వల్ల దుమ్ము పోవాలి. అయితే అది తనంతట తాను పోదు. మనం కొంత ప్రయత్నం చేయాలి. ఒక బట్టతో తుడిచి శుభ్రం చేయాలి. అప్పుడే దుమ్ము తొలగిపోతుంది. అలాగే రజోగుణ ప్రవృత్తిలో కర్మలు చేసేవారి యొక్క జ్ఞానాన్ని కప్పిన కామం ప్రయత్నంతో మాత్రమే తొలగించుకోవాలి తప్ప దానంతటదే తొలగిపోదు. ఈ విషయాన్ని తెలియజేయుటకే ఈ రెండవ ఉదాహరణ.

**3) మావిచేత శిశువు**: తమోగుణ ప్రధానియై, తుచ్ఛమైన శారీరక సుఖాలకు లోనై పశువులా ప్రవర్తించేవాని జ్ఞానం మావిచేత శిశువు కప్పబడినట్లు కామంచేత కప్పబడి ఉంటుంది. గర్భంలోని శిశువు మావిచేత కప్పబడి ఉంటుంది. మరి శిశువుకు విముక్తి ఎట్లా? గర్భంలోని శిశువును కప్పిన మావిని తొలగించే వీలులేదు. అయితే 9 నెలలు నిండి శిశువు గర్భం నుండి బయటపడినప్పుడే ఆ మావి తొలగిపోయేది. అంత వరకు ఆగవలసిందే. ఏ ప్రయత్నమూ చేయటం కుదరదు. అంటే **ప్రయత్నం**







**ద్వారా తొలిగేది కాదు మావి. పరిపక్వదశ రావాల్సిందే. అలాగే తమోగుణంలో ఉన్నవాడు తనలోని కామాన్ని తొలగించుకోవటానికి అవకాశమే లేదు. ప్రయ త్నించటం కుదరదు. అసలు ప్రయత్నించడు. సమయం వచ్చే దాకా ఆగాల్సిందే. అతడిలోని తమోగుణం పోయేదాకా అతడికి ఉద్ధారకం లేదు.** ఈ విషయాన్ని తెలియజేయుటకే ఈ మూడవ ఉదాహరణ.

దీనిని బట్టి మానవులందరిలోను జ్ఞానం ఉంటుందని, ఆ జ్ఞానం కామం చేత కప్పబడి ఉంటుందని, ఆ కామాన్ని తొలగించుకున్నప్పుడే జ్ఞానం ప్రకాశిస్తుందని తెలుస్తున్నది. అయితే సత్వగుణసంపన్నుడు ఏ ప్రయత్నం చేయకుండానే ఆత్మ విచారణ ద్వారా అతడిలోని కామం తొలగిపోతుందని, రజోగుణ సంపన్నుడు ప్రయత్నంతో తనలోని కామాన్ని తొల గించుకోవాలని; తమోగుణ సంపన్నుడు ఏ ప్రయత్నమూ చెయ్యడని, చేసినా ప్రయోజనం లేదని ఎంత కాలమైనా– ఎన్ని జన్మలైనా అతడు తమోగుణం వదిలేదాకా ఆగాల్సిందేనని ఈ శ్లోకం ద్వారా స్పష్టమవుతున్నది.

ఈ మూడు ఉదాహరణలలోను భావభేదం కనిపించినా ఒక భావసారూప్యత కూడా ఉన్నది. ఏమిటది?

అగ్నిని పొగకప్పినా, అద్దాన్ని దుమ్ము కప్పినా, శిశువును మావి కప్పినా అగ్ని యొక్క, అద్దం యొక్క, శిశువు యొక్క రూపాలుమారవు. అలాగే జ్ఞానం కామంచే కప్పబడినప్పటికీ జ్ఞానంలో ఏ మార్పూ ఉండదు. కనుక రజోగుణ ప్రధానులు ప్రయత్నించి కామాన్ని వదిలించుకోవాలి.

– ఈ కామం యొక్క స్వరూప స్వభావలెలాంటివి?

**శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।**
**కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేనచ॥ (39)**

**తా॥ ఎంత నిండించాలనుకున్నా నిండనిది; తృప్తిపరచ టానికి వీలు లేని అగ్ని వంటిది; కోరికయే స్వరూపముగా గలది; జ్ఞానికి నిత్యశత్రువు అయిన ఈ కామంచేత జ్ఞానం కప్పబడియున్నది.**

**వ్యాఖ్య:** ఈ కామం ఎంతటి శక్తిగలిగినదో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు 4 లక్షణాలతో–

**1) దుష్పూరేణ:** ఎన్నో నదులనుండి నీరు ప్రతిక్షణమూ సముద్రాన్ని చేరుతూనే ఉంటుంది. అయినా సముద్రుడికి తృప్తి లేదు. చాలు అనడు. అలాగే ఎన్ని కోరికలు

తీర్చుకున్నా ఈ కామం తృప్తి చెందదు. ఇకచాలు అనదు. అందుకే పూరించ టానికి వీలులేని ఈ కామం 'దుష్పూరేణ' అన్నారు.

**2) అనలేన:** ఎన్ని కట్టెలు వేసినా అగ్ని చల్లారదు. ఇంకా ఇంకా ప్రజ్వలిస్తూనే ఉంటుంది. అలాగే ఎన్ని విషయసుఖాలను అనుభవించినా కామం ఇంకా వృద్ధి చెందుతుందే గాని అణిగి పోదు.

**3) కామరూపేణ:** కోరికయే స్వరూపంగా గలది కామం. అందుకే కామం అంటే కోరిక అనటం. 'కామానికి కడలేదు, ఆశకు అంతు లేదు' అంటారు పెద్దలు. ఆశను భర్తీచేసిన వాడు ఇంతవరకు ప్రపంచంలో పుట్టలేదు. ఆశ అంటే కోరికలే. విషయసుఖానికి చెందిన కోరికలే. కోరికలు లేకపోతే కామం లేనట్లే.

**4) జ్ఞానినో నిత్యవైరిణః** : జ్ఞానికి ఇది నిత్యశత్రువు. అంటే ఎల్లప్పుడూ శత్రువే. సాధారణంగా లోకంలో ఒకప్పుడు శత్రువుగా ఉన్నవాడు కొన్ని కారణాల వల్ల మిత్రుడవుతాడు. అలాగే మిత్రుడు శత్రువౌతాడు. రాజకీయాలలో దీనిని తరచుగా చూస్తూనే ఉంటాం. అయితే ఈ కామం మాత్రం ఎప్పుడూ శత్రువే. నిత్యశత్రువే. అంతేకాదు ఎంతటివారినైనా ఒక్కక్షణంలో పడగొట్టే శక్తి ఈ కామానికి ఉంది. ఘోరమైన తపస్సు చేసిన విశ్వామిత్రుని పడగొట్టింది. పరమభక్తాగ్రేసరుడు, సర్వశక్తి సంపన్నుడు అయిన రావణుని పడగొట్టింది. కనుక ఇది గొప్ప శక్తి కలిగినది. అట్టి ఈ కామాన్ని ఎంతో పట్టుదలతో, ప్రయత్నంతో జయించాలి.

– దాన్ని తొలగించాలంటే ముందు దాని స్థావరం ఏదో తెలుసుకోవాలి. ఎక్కడుంటుందీ కామం? –

**శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధిః అస్యాధిష్ఠాన ముచ్యతే।**
**ఏతైర్విమోహ యత్యేషః జ్ఞాన మావృత్యదేహినం॥ (40)**

**తా॥ ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఈ కామానికి ఆశ్రయ స్థానములని చెప్పబడుచున్నవి. ఈ కామం జ్ఞానాన్ని కప్పివేసి ఇంద్రియాలచేత మనుష్యుని వ్యామోహ పరుస్తున్నది.**

**వ్యాఖ్య:** కామం అనే దొంగ మన అంతరంగ సంపదను దోచుకోవటానికి సిద్ధంగా ఉన్నది. అలాంటి దొంగను ఎలాగైనా హతమార్చాలి. మనలో నుండి పారద్రోలాలి. అలా చెయ్యాలంటే ముందుగా దాని స్థావరం ఏదో తెలుసుకోవాలి. అందుకే అర్జునుని ఆరాటం. అది గమనించి భగవానుడు దాని స్థావరాలను చెబుతున్నాడు. అవే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి. కామం అనే దొంగ ఈ 3







స్థావరాలలో స్థానం ఏర్పాటు చేసుకొని జ్ఞానాన్ని కప్పివేసి మనుష్యుని వ్యామోహంలో పడేస్తుంది. అయితే జ్ఞానాన్ని కప్పివేయటం ఎందుకు? –

ఎవడైనా దొంగ ఇంటిలో ప్రవేశించి సొమ్ము దోచుకుపోవాలంటే ముందుగా ఇంటిలోని లైట్లన్నీ ఆర్పేయాలి. అలాగే కామమనే దొంగ మానవుడిలోని వివేకాన్ని దొంగిలించాలంటే ముందుగా జ్ఞానం అనే లైటును ఆర్పేయాలి. అందుకే జ్ఞానాన్ని కప్పివేయటం.

కామం ఎలా ప్రవేశించి మానవుణ్ణి పతనం చేస్తుందో ఈ ఉపమానం చూడండి.

చేతనసింహుడనే రాజు (జీవుడు)న్నాడు. అతని మంత్రి జ్ఞానసాగరుడు (బుద్ధి). సేనాని చంచలసేనుడు (మనస్సు). ఆ రాజ్యంలోని 10 మండలాలకు 10 మంది మండలాధికారులున్నారు. (5 జ్ఞానేంద్రియాలు+5 కర్మేంద్రియాలు). పాలన చక్కగా సాగిపోతున్నది. ఇంతలో జగన్మోహనుడనే శత్రురాజు (కామం) ఈ రాజ్యంపై కన్నువేశాడు. ఈ రాజ్యాన్ని జయించి రాజును పతనం చేయాలనుకున్నాడు. దానికొక ప్రణాళిక వేశాడు. ముందుగా మండలాధికారుల (ఇంద్రియాల)కు విషయభోగాలు, విషయ వస్తువులనే లంచం ఎరవేసి వారిని వశపరచుకున్నాడు. ఆ తర్వాత వారినే (ఇంద్రియాలనే) ప్రయోగించి చంచలసేనుని (మనస్సును) వలలో వేసుకున్నాడు. ఆ తరువాత జ్ఞానసాగరుని (బుద్ధిని) దుర్బలుణ్ణి చేసి రాజును (జీవుణ్ణి) కూడా మోహంలో ముంచి రాజ్యం అంతటా తన ప్రభావాన్ని వ్యాపింపజేశాడు. చివరకు రాజును (జీవుణ్ణి) చెరసాలలో బంధించి రాజ్యం స్వాధీనం చేసుకున్నాడు.

ఈ విధంగా కామం అనేది ఇంద్రియాలలో ప్రవేశించి, క్రమంగా మనోబుద్ధులను తన అధీనంలోనికి తెచ్చుకొని, జ్ఞానాన్ని కప్పివేసి జీవుని పతనం చేస్తుంది. కనుక దాని ఆశ్రయ స్థానాలపై దెబ్బకొట్టాలి. పతనం కాకుండా తనను తాను రక్షించుకోవాలి. ఎలా?

**శ్లో॥ తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।**
**పాప్మానంప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనం॥ (41)**

**తా॥ భరతశ్రేష్ఠుడా! అందువల్ల ముందుగా నీవు ఇంద్రియాలను నిగ్రహించి, జ్ఞానవిజ్ఞానాలను నాశనం చేసే పాపస్వరూప మైన ఈ కామాన్ని ప్రయత్న పూర్వకంగా విడిచి పెట్టు.**

**వ్యాఖ్య:** ఇంటిలో ప్రవేశించే దొంగను వీధి తలుపులు మూసివేసి, అక్కడే ఎదుర్కొంటే ఇంటికీ, ఇంట్లోని వస్తువులకు నష్టం ఉండదు. అలాగే ఈ కామాన్ని

కూడా ఇంద్రియ ద్వారాల వద్దనే ఎదుర్కొంటే ఇక అది మనోబుద్ధుల జోలికి రాలేదు. మనిషిని వ్యామోహపరచి పతనం గావించలేదు. అందుకే భగవానుడు 'ఆదౌ'- ముందుగా-ఇంద్రియాలను నిగ్రహించు అని తెలియజేస్తున్నాడు. ఆధ్యాత్మికరంగంలో ప్రవేశించిన వారికి 'ఇంద్రియనిగ్రహం' అనే సాధన అత్యుత్తమ సాధన. దీని వల్లనే ప్రగతి సిద్ధిస్తుంది.

ఈ కామం ఎంతటి పరమశత్రువో మరల తెలియజేస్తున్నాడు భగవానుడు. ఏమని?

**1) పాప్మానం:** ఇది మహాపాపి. ఎందుకంటే పాపం చేయాలనే ఆలోచన లేకపోయినా మనుష్యులు ఈ కామం వల్లనే పాపాలు చేస్తున్నారు. ఈ కామం అనేక విధాలుగా మోహపెట్టి-భ్రాంతి కల్గించి-ఆశపుట్టించి మానవుడిచేత అనేక పాపాలు చేయిస్తుంది. సామాన్యులచేతనే గాదు-మహామహా వారి చేత కూడా పాపాలు చేయిస్తుంది. దుర్యోధనుడో, దుశ్శాసనుడో, సైంధవుడో, కీచకుడో కామంచేత కళ్ళు మూసుకు పోయి ఎన్ని ఘోరాలు చేసినా వారు సామాన్యులే. కాని మహాజ్ఞాని, మహాపండితుడు, పరమభక్తాగ్రేసరుడు, బ్రహ్మవంశ సంజాతుడు, గొప్పపరిపాలనాదక్షుడు, అరివీర భయంకరుడు అయిన లంకేశ్వరుడు రావణుడు కూడా ఈ కామానికి లొంగి పోయి స్వర్ణసదృశమైన లంకా నగరంతో బాటుగా పుత్ర, మిత్ర, సోదర, బాంధవ సహితంగా అపారసేనలతో సర్వనాశన మయ్యాడు.

క్షత్రియుడుగా జన్మించి, రాజ్యాన్ని తృణప్రాయంగా విడిచి పెట్టి, భోగాలను సన్యసించి, ఘోరతపస్సును గావించిన విశ్వామిత్రుడు ఈ కామానికి లొంగి, తన తపఃశ్శక్తిని వృథా చేసుకున్నాడు. కనుక ఈ కామం మహాపాపి. ఎంతటివారినైనా హతం చేస్తుంది.

**2) జ్ఞానవిజ్ఞాన నాశనం**: ఇంకా ఈ కామం జ్ఞాన విజ్ఞా నాలను నాశనం చేస్తుంది. 'జ్ఞానం' అంటే గురువుల ద్వారా, వేదాంతశాస్త్రాల ద్వారా పొందే పరోక్షజ్ఞానం. ఇక 'విజ్ఞానం' అంటే పొందిన జ్ఞానాన్ని అనుభవానికి తెచ్చుకొని ఆత్మసాక్షా త్కారాన్ని పొందటానికి ఉపయోగించుకొనే అపరోక్షజ్ఞానం. ఈ కామం ఈ జ్ఞానవిజ్ఞానాలను అంటే పరోక్ష, అపరోక్ష జ్ఞానాలు రెండింటిని నాశనం చేస్తుంది. సాధనదశలో ఈ రెండింటిని కామం నశింపజేస్తుంది. ఇంద్రియనిగ్రహం గలవారిని మాత్రం ఈ కామం ఏమీ చేయలేదు.







ఇతరుల కన్నా ఏమాత్రం ఆధిక్యత ఉన్నా వెంటనే మనలో అహంకారం ప్రవేశిస్తుంది. అహకారంతో కన్ను మూసుకుపోతే కామం దర్జాగా లోపలకు ప్రవేశిస్తుంది. అది ప్రవేశించిందా చేయవలసిన హానినంతా చేసి వేస్తుంది. కనుక సామాన్యులమైన మనం ఈ కామం విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి.

శత్రువును జయించాలంటే సామదానభేద దండోపాయా లనే చతుర్విధోపా యాలున్నాయి. మరి ఈ కామమనే శత్రువును ఏ ఉపాయంతో జయించాలి? సామమా? అబ్బే ఈ కామం మాటలతో దారికి వచ్చేది కాదు. పోనీ దానమా? దీనికి ఏ లంచం ఇచ్చినా వ్యర్థమే. ఎందుకంటే ఇస్తున్నకొద్దీ ఆకలి పెరుగుతుందే కాని (మహాశనః) తగ్గదు. కనుక ప్రయోజనం లేదు. సరే దండోపాయమైతేనో! అహ! అసలు వీలు లేదు. ఈ కామాన్ని దండించటం ఎట్లా? ఇది స్థూలవస్తువు కాదు కదా! కనుక ఇక మిగిలింది భేదోపాయమే.

ఆధ్యాత్మరామాయణంలో ఒక సంఘటన వుంది. విశ్వా మిత్రుని యజ్ఞానికి మారీచ సుబాహులు విఘ్నం కలిగిస్తున్నారు. అందువల్ల తన యాగరక్షణకు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుక వస్తున్నాడు. వారికి అనేక అస్త్రవిద్యలను ప్రసాదించాడు. ఇంతలో 'తాటకి' ఎదురైంది. "బాలకులారా! మీరెవ్వరు? ఎక్కడకు వెళ్తున్నారు? ఈ ముని ఎవరు?" అని అడిగింది. "మేము దశరథుని పుత్రులం. ఈయన విశ్వా మిత్రుడు, మా గురుదేవులు. ఈయన యజ్ఞాన్ని సంరక్షించ టానికే మేం వెళుతున్నాం" అన్నాడు రాముడు. తాటకి పకాపక నవ్వి 'తన యజ్ఞాన్ని తాను కాపాడుకోలేనివాడు మీ గురు దేవుడా?" అని పరిహాసం చేసింది. దానికి రాముడు "ఆయనది బ్రహ్మశక్తి-ఆధ్యాత్మిక శక్తి. రాక్షస సంహారానికి దానిని వినియోగిస్తే ఆ శక్తిని దుర్వినియోగం చేసినట్లే. రాక్షస సంహారానికి మా క్షాత్ర శక్తి చాలు" అన్నాడు. దీనిలో ఒక తత్త్వరహస్యం ఇమిడి ఉంది.

మారీచుడంటే కామం. వాని తల్లి 'తాటకి' అంటే భ్రమ (భ్రాంతి) భ్రమ తొలగనిదే కామం నశించదు. కామం నశించాలంటే ముందుగా భ్రమను-భ్రాంతిని నిర్మూలించాలి. అందుకే మారీచ సంహారానికి ముందు తాటకివధ. ఇదే భేదోపాయం.

ఈ భేదోపాయాన్ని ఎలా ప్రయోగించి కామమనే శత్రువును జయించాలో తరువాతి రెండు శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యఃపరంమనః।**
**మనసస్తు పరాబుద్ధిఃయోబుద్ధేః పరతస్తుసః॥ (42)**

**తా॥ ఇంద్రియాలు దేహం కన్న గొప్పవని చెబుతారు. ఆ ఇంద్రియాలకన్న మనస్సు అధికమైనది. మనస్సు కన్న బుద్ధి ఎంతో శ్రేష్ఠమైనది. అట్టి బుద్ధికన్న సర్వశ్రేష్ఠమైనది ఆత్మ.**

**శ్లో॥ ఏవంబుద్ధే పరంబుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।**
**జహిశత్రుం మహాబాహో! కామరూపం దురాసదం॥ (43)**

**తా॥ ఓ మహాబాహుడా! ఇలా బుద్ధి కన్న ఎక్కువైన దానిని తెలుసుకొని, బుద్ధిచేత మనస్సును నిగ్రహించి, జయించుటకు కష్టమైన ఈ కామరూప శత్రువును జయించు-విడిచిపెట్టు- సంహరించు.**

**వ్యాఖ్య:** కామమనే శత్రువుకు ఆశ్రయస్థానాలు ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అని ఇంతకుముందే తెలియ జేయటం జరిగింది. ఈ కామాన్ని జయించాలంటే భేదోపా యాన్ని ప్రయోగించాలని కూడా 41వ శ్లోకంలో చెప్పటం జరిగింది. ఆ భేదోపాయాన్ని ప్రయోగించే విధానం ఈ చివరి 2 శ్లోకాల్లోను తెలియజేస్తున్నారు.

**1) ఇంద్రియాణి పరాణి ఆహుః** : జడమైన శరీరం కన్న ఇంద్రియాలు చాలా గొప్పవి. ఎందుకని? ప్రపంచం చాలా పెద్దది. ఇందులో ఎన్నో విషయాలున్నవి. వాటిన్నింటిని గ్రహించే 5 జ్ఞానేంద్రియాలు మనలో వున్నాయి. ప్రపంచంలోని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే 5 విషయాలను మనలో వున్న సూక్ష ఇంద్రియాలు గ్రహిస్తున్నాయి. కనుక ఇంద్రియాలు చాలా గొప్పవి. శరీరం జడం. ఈ జడమైన శరీరంలో విషయాలను గ్రహించే ఈ ఇంద్రియాలు చైతన్యవంతంగా ఉంటాయి గనుక గొప్పవని మహాత్ములు అంటారు. శరీరం రథం అయితే ఇంద్రియాలు గుర్రాలు. రథం జడం. కాని గుర్రాలు చైతన్యవంతం. కనుక ఇంద్రియాలు శ్రేష్ఠం.

**2) ఇంద్రియేభ్యఃపరంమనః** : ఇంద్రియాలకన్న మనస్సు శ్రేష్ఠం. ఎందువల్ల? ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క విషయంలోనే పనిచేస్తుంది. ఉదాహరణకు కన్ను దృశ్యాలను చూడగలదే గాని శబ్దాలను వినలేదు. చెవి శబ్దాలను వినగలదే గాని రుచులు చూడలేదు. నాలుక రుచి చూడగలదే గాని దానికి వాసన తెలియదు. ఇలా ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క విషయంలోనే పనిచేస్తుంది. కాని మనస్సో? అయిదు విషయాలను గ్రహించగలుగుతుంది. అందుకే శ్రేష్టం. పైగా ఇంద్రియాలతో పనిలేకుండా మనస్సు స్వతంత్రంగా కూడా పనిచేస్తుంది. స్వప్నంలో అన్ని ఇంద్రియాలు తానే అయి మనస్సు శబ్దస్పర్శరూప రసగంధ అనే 5 విషయాలలో ప్రవర్తిస్తుంది.







ఇంద్రియాలు గుర్రాలైతే మనస్సు పగ్గం. రథాన్ని తమ ఇష్టం వచ్చినట్లు లాగే శక్తి గుర్రాలైతే ఆ గుర్రాలను కంట్రోల్ పెట్టే శక్తి పగ్గానిది. కనుక ఇంద్రియాలకన్న మనస్సే శ్రేష్ఠం.

**3) మనసస్తు పరాబుద్ధిః** : మనస్సును సరైన పద్ధతిలో నడిపించేది బుద్ధి. మనస్సు ఇంద్రియాలు చెప్పినట్లుగానైనా చేస్తుంది. లేదా బుద్ధి చెప్పినట్లుగానైనా చేస్తుంది. దానికి స్వతంత్రం లేదు. కాని బుద్ధి స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొనేది; మనస్సును అదుపులో పెట్టేది; విషయాలకు ఎలా ప్రతిస్పందించాలో నిర్ణయించేది బుద్ధి. కనుక మనస్సు కన్న బుద్ధి శ్రేష్ఠమైనది. మనస్సు పగ్గమైతే బుద్ధి సారథి. పగ్గాన్ని ఎలా ఉపయోగించాలో నిర్ణయించేది సారథియే.

**4) బుద్ధేఃతు పరతఃసః** : బుద్ధి కన్న శ్రేష్ఠమైనవాడు అతడే-ఆత్మయే. బుద్ధికి కూడా గోచరించనిది. ఆ బుద్ధికి చైతన్యాన్నిచ్చేది ఆత్మయేగనుక ఆత్మసర్వశ్రేష్టమైనది.

ఇలా ఆత్మ అన్నింటికన్న శ్రేష్టమైనదని, తాను ఆత్మయే గాని ఈ దేహేంద్రియ మనోబుద్ధులు కాదని ధ్యానంలో-ఆత్మ విచారణలో నిశ్చయానికి రావాలి. అసలు మానవుడి యొక్క సమస్త దుఃఖాలు, బాధలు, భయాలు, అనర్థాలు అన్నింటికి కారణం తానెవరో తనకు తెలియకపోవటమే. 'నేను ఆత్మను' అని తెలియకపోవటమే. ఇదే అగ్రహణం. ఈ అగ్రహణం వల్లనే అన్యథా గ్రహణం. అంటే నేను ఆత్మను అని తెలియ నందున నేను దేహాన్ని-మనస్సును అనే భ్రమలో భ్రాంతిలో ఉంటున్నాం. ఈ భ్రమవల్లనే సర్వ అనర్థాలు. నీవు గొప్ప భాగ్యవంతుడవు. కాని రాత్రి కలలో పేదవాడివి. తిండి, బట్ట, ఇల్లు కూడా లేవు. కూలిపని చేసుకుంటున్నావు. ఆర్థిక ఇబ్బందులు, చివరకు బిచ్చమెత్తుకోవాల్సిన స్థితి. ఈ బాధంతా ఎందుకు వచ్చింది? నేను భాగ్యవంతుణ్ణి అని మరచి, పేదవాణ్ణి అని అనుకోవటం వల్లనే గదా! మెలకువ రాగానే తిరిగి నీవు భాగ్యవంతుణ్ణి అనుకుంటావు. కలలో దుఃఖాలు ఏవీ లేవు.

అలాగే నీవు ఆనందస్వరూప ఆత్మవు. కాని అజ్ఞానంలో నీ స్వరూపాన్ని మరిచి, ఈ దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది జీవుణ్ణి అనుకుంటున్నావు. దానితో ఈ ప్రాపంచిక వ్యవహారాలలో మునిగి శరీరబాధలు నావి అని, మనస్సుకు కలిగే దుఃఖం నాది అని భావిస్తూ అనేక అలజడులు, ఆందోళనలు, భయాలు, దుఃఖాలతో కాలం గడుపుతున్నావు. ఇదంతా ఎందుకు వచ్చింది? నేను ఆత్మనని మరిచి జీవుడిగా భావించటం వల్లనే.

కలలో ఉన్నంతవరకు నీ నిజస్వరూపం తెలియదు. అలాగే ఈ ప్రాపంచిక వ్యవహారాలలో మునిగి ఉన్నంతవరకు నీవు ఆత్మనని తెలుసుకోలేవు. కనుక నీ అజ్ఞానాన్ని పోగొట్టుకోవాలి. అందుకోసం జ్ఞానం కావాలి. ఆత్మజ్ఞానం కావాలి. నేను ఆత్మననే జ్ఞానం కావాలి. అలా ఆత్మనని తెలుసుకొని ఆత్మలో నిలిస్తే ఆత్మగా ఉంటే ఈ కామం అనేది ఉండదు.

ఈ కామం 'దురాసదం' జయించుట కష్టసాధ్యమైనది. చిన్నమొక్క అయితే చేతితో పీకివేయవచ్చు. కాని వందల సంవత్సరాల నుండి ఊడలు దిగి ఉన్న మర్రిచెట్టును అంత తేలికగా పీకివేయటం సాధ్యమా? అలాగే కోటానుకోట్ల జన్మల నుండి మనను తన దాసునిగా చేసికొని ఆడిస్తున్న కామాన్ని అంత తేలికగా వదలించుకోలేం. జయించ కష్టసాధ్యమైన ఈ కామాన్ని జయించాలంటే అసంగశస్త్రం కావాలి. దేహేంద్రియ మనోబుద్ధులతో అసంగం కావాలి. దీనికి మహనీయుల బోధ– ఆత్మవిచారణ ముఖ్యం. దయ్యాలు చీకటిలోనే ఉంటాయి. కామం అజ్ఞానంలోనే ఉంటుంది. వెలుగు వస్తే దయ్యాలుండవు. జ్ఞానం కలిగితే కామం ఉండదు. కనుక ఆత్మజ్ఞానంతో కామాన్ని జయించాలి.

**సంస్థభ్యఆత్మానం ఆత్మనా**: బుద్ధిచేత మనస్సును నిగ్రహించాలి. ఎలా? విషయాల గురించి ఇంద్రియాలు సమాచారం ఇవ్వగానే మనస్సు ఆ విషయాలవైపు పరుగులు తీస్తుంది. దానితో అనర్థాలు. బుద్ధి ఆత్మజ్ఞానాన్ని కలిగి వుంటే, మనస్సు బుద్ధికి అధీనమైతే ఇక మనస్సు ఇంద్రియాల మాట వినదు. ఎన్ని భోగాల గురించి తెలిసినా మనస్సు బుద్ధికి అధీనమై చలించదు. దానితో కామం జయించబడుతుంది. మహాబాహో: ఇలా బలవంతమైన శత్రువును సంహరించాలంటే గొప్ప బాహువులు కావాలి. అందుకే సంబోధన– ఓంతత్సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు, ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రేశ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగోనామ తృతీయోధ్యాయః

**(మూడవ అధ్యాయం సమాప్తం)**











# పూజ్య గురుదేవులు



జ్ఞానప్రపూర్ణ

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)**

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట


Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com


Visit www.srichalapathirao.com to listen Pravachanas

# ఉపోద్ఘాతము :

మూడవ అధ్యాయం కర్మయోగం. నాలుగవ అధ్యాయం జ్ఞానయోగం. ఇలా వరుసలో ప్రక్కప్రక్కనే వుండటాన్ని బట్టి కర్మయోగాన్ని చక్కగా ఆచరించిన వారికి వెంటనే జ్ఞానసిద్ధి కలుగుతుందనే సూచన ఇందులో ఇమిడి వున్నది. అంతేకాదు కర్మయోగాన్ని జ్ఞానంతో ఆచరించాలని కూడా తెలుస్తున్నది. ఈ అధ్యాయంలో ప్రధానంగా చెప్పినది జ్ఞానవిషయం. నిజంగా పరమాత్మనందుకొనే మార్గం జ్ఞానమార్గమే. జ్ఞానంతో కర్మలాచరించే ఉపాయం ఏదో ఈ అధ్యాయంలో చక్కగా తెలియజేయటం జరిగింది.

పరమాత్మనందుకోవాలని కాంక్షించే వారెవరైనా సరే ఈ జ్ఞానమార్గమనే సింహద్వారం గుండా ప్రయాణం చేయాల్సిందే. ఏ ఇంటిలోకి వెళ్ళాలన్నా సింహద్వారం గుండా లోపలికి వెళ్ళాల్సిందే (దొంగలు తప్ప). సింహద్వారం వరకూ ఏ మార్గంలో వచ్చినా లోపలికి వెళ్ళాలంటే సింహద్వారమే గతి. అలాగే కర్మ, భక్తి, యోగ, ధ్యాన అని ఎన్ని మార్గాలున్నా అవన్నీ జ్ఞానయోగమనే సింహద్వారం వరకే. అక్కడినుండి ఒక్కటే దారి. అట్టి జ్ఞానాన్ని బోధించే యోగం గనుక దీనిని జ్ఞానయోగం అన్నారు.

జ్ఞానమే మనిషికి శోభనిస్తుంది. ఎవరికైనా శోభనిచ్చేది అందచందాలు, వస్తుభూషణలు, ఆస్తిపాస్తులు, అధికారం, పదవులు కాదు. అవన్నీ అనిత్యమైనవి. వస్తూపోతూ వుండేవి. నిత్యమైనది. నీతోనే వుండేది, నిన్ను ఉద్ధరించేదీ, నీ జన్మ చరితార్థం చేసేది జ్ఞానం ఒక్కటే. జ్ఞానమే మనిషికి భూషణం. జ్ఞానహీనుని ద్విపాదపశు వు అంటారు.

వెదురుకర్రకు పొడవునుబట్టి, లావునుబట్టి విలువ!

చెరకు గడకు రసాన్ని బట్టి విలువ!

పాలకు వెన్నను బట్టి విలువ!

అలాగే మనిషికి జ్ఞానాన్ని బట్టే విలువ. జ్ఞానం వంటి పవిత్ర వస్తువు, అజ్ఞానం వంటి అపవిత్ర వస్తువు ఈ సృష్టిలో లేదు. **"నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే"** అని ఈ అధ్యాయంలోనే చెప్పబడింది. అయితే ఇంతకూ జ్ఞానం అంటే ఏమిటి?







అంతటా ఆత్మను దర్శించగలగటమే జ్ఞానం. అంతటా ఏకమైన ఆత్మను దర్శించటమే జ్ఞానం. అందరిలో అన్నింటిలో వున్న సత్యవస్తువును దర్శించుటే జ్ఞానం.

ఆత్మ తానేనని తెలియుట జ్ఞానం. ఆ ఆత్మ పరమాత్మేనని గ్రహించుట విజ్ఞానం. ఈ జ్ఞానవిజ్ఞానసిద్ధికే భగవద్గీత మార్గం చూపుతుంది.

ఈ అధ్యాయంలోని విషయాలన్నింటినీ నాలుగు ప్రకరణలుగా విభజించవచ్చు.

అవి: **1) దివ్యజన్మప్రకరణం (1 నుండి 11 శ్లో॥)**

**2) దివ్యకర్మ ప్రకరణం (12 నుండి 22 శ్లో॥)**

**3) యజ్ఞ ప్రకరణం (23 నుండి 33 శ్లో॥)**

**4. జ్ఞాన ప్రకరణం (34 నుండి 42 శ్లో॥)**

**1. దివ్యజన్మ ప్రకరణం:** ఇది భగవదవతార సిద్ధాంతం. ఇది ప్రసంగవశాత్తు వచ్చినట్లుంటుంది. కాని భగవానుడు చెప్పాలనే ఈ దివ్యజన్మ రహస్యాన్ని చెప్పాడు. తానెవరో, తన యదార్థ స్వరూపం ఏమిటో వివరించటం జరిగింది. ఎందుకిలా భగవానుడు తన గొప్పతనాన్ని తానే చెప్పుకోవటం?

శిష్యునికి గురువుపట్ల భక్తి, శ్రద్ధ, విశ్వాసం, గౌరవం, సేవాభావం వుండాలి. ఇవి లౌకిక విద్యలకు సంబంధించినంత వరకు ముఖ్యం కాకపోవచ్చు. కాని ఆధ్యాత్మిక విద్యను-బ్రహ్మవిద్యను నేర్చుకోవాలంటే ఇవి ఎంతో అవసరం. గురువు చెప్పే విషయం శిష్యుని హృదయంలో నాటుకోవాలంటే గురువుపట్ల శిష్యునికి గొప్ప విశ్వాసం-గౌరవం తప్పక వుండాలి. ఇక్కడ శ్రీకృష్ణుడు అర్జునునికి సారధి, మిత్రుడు, బంధువు, సమ వయస్కుడు. కనుక అర్జునునికి శ్రీకృష్ణునిపట్ల చనువు వుంటుంది గాని, భక్తి, శ్రద్ధ, గౌరవం అంతగా లేకపోవచ్చు. అవి వుంటేనే శ్రీకృష్ణుడు బోధించే జ్ఞానాన్ని అందుకోగలుగుతాడు. అందుకే జ్ఞానాన్ని బోధించేముందే శ్రీకృష్ణుడు తనపట్ల అర్జునునికి భయభక్తులు, శ్రద్ధావిశ్వాసాలు కలిగించాలనుకున్నాడు. అందుకే ప్రసంగం ఇలా సాగింది. తాను కేవలం మానవమాత్రుణ్ణి కాదని, భగవంతుడనని తెలియజెప్పుటకే తన జన్మ ప్రకరణాన్ని భగవానుడు తెలియజేయటం జరిగింది.

నవీన విషయాలు ఎంత యుక్తియుక్తంగా వున్నప్పటికీ వాటి పట్ల శిష్యుని మనస్సులో గాఢముద్ర పడదు. వాటికి ప్రాచీనతను జోడించాలి. ఇవన్నీ శ్రుతులలో చెప్పబడిన విషయాలేననే భావన కలగాలి. అందుకే తాను చెప్పే కర్మయోగం-కర్మ సిద్ధాంతం ఎప్పుడో ఆదికాలంలోనే సూర్యునికి బోధించాను- అనే విషయంతో భగవానుడు ప్రసంగాన్ని ప్రారంభించి ఈ కర్మయోగం ఇప్పటిది కాదు, పురాతనమైనది

అని వివరించి, అలా సూర్యునికి బోధించిన తానెవరో తెలియజేశాడు భగవానుడు. ఇదే దివ్యజన్మ ప్రకరణం.

**2) దివ్యకర్మ ప్రకరణం:-** రెండవ అధ్యాయం నుండి చెప్పుకొస్తున్న క్రమాగత విషయం నిష్కామకర్మయోగం. కర్మను కర్మగా కాక కర్మయోగంగా ఆచరించాలి. యజ్ఞభావంతో చేయాలి. అప్పుడే అవి దివ్యకర్మలౌతాయి. ఆ స్థాయిలో అవి జ్ఞానానికి సాధనాలౌతాయి. నిస్వార్థబుద్ధితో, త్యాగభావంతో చేసే కర్మలే యజ్ఞ కర్మలు. మన పొట్ట నింపుకోవటం కోసం, మన కుటుంబాన్ని పోషించుకోవటం కోసం, మనకీర్తి ప్రతిష్టలకోసం, మన కోరికలు తీర్చుకోవటం కోసం చేసే కర్మలు దివ్యకర్మలు కాజాలవు. పైగా అవి మనను బంధిస్తాయి. ఇతరుల మేలుకోసం, లోకకళ్యాణం కోసం చేసే నిస్వార్థకర్మలే దివ్యకర్మలు. ఇట్టి కర్మలను ఎలా చేయాలో తెలియజేసే ప్రకరణమే దివ్యకర్మ ప్రకరణం.

**3) యజ్ఞ ప్రకరణం:-** యజ్ఞాలంటే హోమకుండాలు, సమిధలు, నెయ్యి, ఋత్విజులు, మంత్రాలు, సమారాధనలు కాదు. భావనా విశేషంతో చేసే ప్రతి పనీ యజ్ఞమే. ఈ ప్రకరణంలో రకరకాల యజ్ఞాలు చెప్పబడ్డాయి. అన్నింటిలోను శ్రేష్టమైనది జ్ఞానయజ్ఞమని భగవానుడు తెలియజేశాడు. ఈ యజ్ఞాలన్నీ కర్మలవల్ల జనించినవని, వేదాలలో విస్తారంగా చెప్పబడినవేనని కూడా భగవానుడు తెలియజేశాడు.

**4) జ్ఞాన ప్రకరణం:-** యజ్ఞాచరణ చేసిన వానికి భగవంతునితో సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం ఏర్పడటానికి కావలసిన జ్ఞానం లభించేది ఈ యజ్ఞ కర్మాచరణ వల్లనే. కర్మ రహస్యాన్ని గుర్తెరిగివాడు పరమాత్మ, జ్ఞానాన్ని పొంద గలుగుతాడు. ఈ స్థితిలో కర్మ వేరు - బ్రహ్మము వేరు అనే తేడా లేదు. కర్మయే బ్రహ్మము. బ్రహ్మమే కర్మ. అదే బ్రహ్మకర్మ సమాధి. ఇలా నాలుగు ప్రకరణాలతో నాలుగవ అధ్యాయం ప్రకాశిస్తూ వున్నది.

నిష్కామ కర్మయోగం ద్వారా లోపలి వాసనలు క్షయం చేసుకొనే పద్ధతి మూడవ అధ్యాయంలో చెప్పబడింది. కానీ ఆ నిష్కామకర్మయోగ ఆచరణకు ఏదో అడ్డు పడుతున్నది. అదేమిటి? అది కామం. మరి ఆ కామాన్ని జయించటం ఎట్లా? లోపలే వున్న భగవంతుని తెలుసుకొని కామాన్ని జయించాలి-అని కూడా 3వ అధ్యాయం చివరలో చెప్పాడు.

అయితే భగవంతుణ్ణి తెలుసుకోవటం ఎలాగ? తెలుసుకొని కామాన్ని జయించటం ఎలాగ? ఈ విషయాలను ఈ జ్ఞానయోగంలో చెప్పబోతున్నారు. ఈ అధ్యాయానికి







ఇంకా చాలా పేర్లున్నాయి. 1. అవతార యోగం. 2. అవతార జ్ఞానయోగం. 3. జ్ఞాన విభాగయోగం 4. కర్మబ్రహ్మార్పణయోగం 5. జన్మ, కర్మ, యజ్ఞ, జ్ఞానయోగం 6. జ్ఞాన కర్మ సన్యాస యోగం-అని. ఈ పేర్లు ఎలా వచ్చినవి?

భగవంతుని అవతార విశేషాల గురించి చెప్పినందున అవతారయోగం, అవతార జ్ఞానయోగం అనీ, జ్ఞానమే ప్రధానంగా చెప్పినందున జ్ఞాన విభాగయోగం అనీ, కర్మలను భగవదార్పణం చేసే విధానాన్ని చెప్పినందున కర్మబ్రహ్మార్పణ యోగం అనీ, 4. ప్రకరణాలను చెప్పినందున జన్మకర్మ యజ్ఞ జ్ఞాన యోగం అనీ; సకామంగా కర్మలు చేస్తే కర్మఫలం బంధమై కూర్చుంటుంది. అదే నిష్కామంగా చేస్తే కర్మఫలం తాకదు గనుక జ్ఞానంతో కర్మలను చేసి కర్మఫలాన్ని సన్యసించే ఉపాయం చెప్పబడింది కనుక జ్ఞానకర్మ సన్యాసయోగం అనీ వేరు వేరు పేర్లు చెప్పబడ్డాయి.

**"తరతిశోకం ఆత్మవిత్"** ఆత్మ విదుదు శోకాన్ని తరిస్తాడు-అని ఛాందోగ్యోపనిషత్ చెబుతున్నది. అంటే శోకం తొలగాలంటే జ్ఞానం వల్లనే. జ్ఞానం పొందాలంటే సాధన కావాలి. ఆ సాధనయే కర్మయోగం. కర్మయోగం వల్లనే చిత్తశుద్ధి కలుగుతుంది, చిత్తశుద్ధి కలిగితేనే బుద్ధి సూక్ష్మంగా పనిచేస్తుంది. సూక్ష్మబుద్ధి కలవాడే ఆత్మజ్ఞానాన్ని అందుకోగలుగుతాడు. అవగాహన చేసుకోగలుగుతాడు. ఆ విధంగా నిష్కామ కర్మయోగం జ్ఞానానికి- ఆత్మజ్ఞానానికి- నేను ఆత్మను అని గ్రహించే జ్ఞానానికి దారి తీస్తుంది. అలా గ్రహించిన వాడే ఆత్మవిత్-ఆత్మవిదుడు, అట్టి ఆత్మవిదుడే శోకాన్ని తరిస్తాడు. ఇదీ నిష్కామ కర్మయోగం విశిష్టత, ఆవశ్యకత.

అయితే ఇంతవరకు చెప్పిన ఈ కర్మయోగం శ్రీకృష్ణుని చేత ఇప్పుడే స్వయంగా చెప్పబడిందా? కల్పించి ఊహించి చెప్పబడిందా? లేక పరంపరగా ఉన్న దానినే చెప్పాడా? ఇదీ అర్జునుని సందేహం. దీనిని గ్రహించి కర్మయోగ రహస్యాన్ని, దాని ప్రాచీనతను, తన జన్మరహస్యాన్ని వివరించబోతున్నాడు భగవానుడీ అధ్యాయంలో

**శ్రీ భగవానువాచ:**

**శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం।**
**వివస్వాన్ మనవేప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥ (1)**

**తా॥ భగవానుడు తెలియజేస్తున్నాడు-అవ్యయమైన ఈ యోగాన్ని నేను సూర్యునికి బోధించాను. సూర్యుడు మనువుకు, మనువు ఇక్ష్వాకు మహారాజుకు చెప్పాడు.**

**వ్యాఖ్య: ఇమం అవ్యయం యోగం:** ఈ అవ్యయమైన యోగాన్ని, ఈ నిష్కామకర్మ యోగం అవ్యయమైనది. అంటే నాశనం లేనిది. ఒక్కొక్కప్పుడు ప్రచారం చేసే

వాళ్ళు లేకనో, ఆచరించేవాళ్ళు లేకనో మరుగునపడితే పడవచ్చును గాని అసలు నాశనం కాదు. ఈ నిష్కామకర్మయోగం ద్వాపరయుగం చివరలో యుద్ధరంగం మధ్యలో అర్జునునికి మొదటిసారిగా బోధిస్తున్నాడా శ్రీకృష్ణుడు? లేదు, ఇది ఎంతో ప్రాచీనమైనది. ఎలా తెలుస్తుంది?

**అహం వివస్వతే ప్రోక్తవాన్:** "నేను దీనిని సూర్యునికి ఎప్పుడో బోధించాను" అంటున్నాడు భగవానుడు. సూర్యుడెప్పటివాడు? మహాభారత కాలం నాటివాడో ఆ తరువాతివాడో కాదు. అతడు ఎప్పటినుండో ఉన్నవాడే. ఆనాది అంటే ఈ కర్మయోగాన్ని ఎప్పుడో సూర్యునికి బోధించాడు గనుక ఇది. దీనిరచన, శ్రీకృష్ణునిచేత అర్జునునికి చెప్పబడటం మహాభారత కాలంలో జరిగినా ఈ గీతాతత్వం-కర్మయోగ తత్వం ఎప్పటినుండో ఉన్నదే. ఇదే గీతాజ్ఞానం యొక్క నిష్కామ కర్మయోగం యొక్క ప్రాచీనత.

భారతీయ సంస్కృతిలో సూర్యునికి ప్రత్యేక స్థానం వున్నది. ఆయన సహజ కర్మయోగి. ప్రకృతి శక్తులలో ప్రథముడు. ప్రత్యక్ష దైవం. క్షత్రియ వంశానికి మూలపురుషుడు. శ్రీరాముని ఇక్ష్వాకు వంశానికి మూలపురుషుడు సూర్యుడే. ఈ సూర్యుని వల్ల లోకానికి ఎంతో మేలు జరుగుతున్నది. అసలు నిష్కామ కర్మయోగాన్ని ఆచరించేవారిలో ప్రథముడు ఆయనే. అందుకే మొదట ఆయనకే చెప్పబడ్డదీ కర్మయోగం. ఆయన చక్కగా ఈ కర్మయోగాన్ని తెలుసుకొని ఆచరిస్తున్నవాడు. ఎలా?

ఈ ప్రపంచమంతా భగవంతుని తోట, అయితే దీనికి తోటమాలి సూర్యుడే. తోటమాలి ఏం చేస్తాడు? తోటలో వున్న బావి నుండి నీరు చేది, మొక్కలకు పోసి, చక్కగా పెంచుతాడు. మరి ఈ సూర్యుడేం చేస్తున్నాడు? తన కిరణాలతో సముద్ర జలాలను వేడెక్కించి పైకి లాగి మేఘాలను సృష్టించి ఆయా ప్రదేశాలకు వర్షరూపంలో నీటిని సరఫరా చేస్తుంటాడు. ఈ ప్రపంచంలోని మనుష్యులు, జంతువులు, పక్షులు, చెట్లు-అన్ని జీవరాశులు ఈ నీటిద్వారా వృద్ధి చెందుతుంటాయి. ఇంత చేస్తున్నా నేను చేస్తున్నాననే కించిత్ గర్వం కూడా లేదు. అభిమానం లేదు. విశ్రాంతిని కోరదు. ఆయన విశ్రాంతిని తీసుకుంటే లోకానికి, శాశ్వత విశ్రాంతే. అందుకే ఆయన ఉన్నత స్థానంలో వున్నాడు. అదే దైవ లక్షణం. ఆయనది సహజ కర్మ. కనుకే ఈ కర్మ బరువనిపించదు, బాధనిపించదు.







ఒక పోలీసు ఉద్యోగి డ్యూటీకి వెళ్ళేటప్పుడు యూనిఫాం వేసుకుంటాడు. ఇంటికి రాగానే ఆ డ్రెస్, టోపీ తీసేసి హాయిగా ఫీలవుతాడు. యూనిఫాంలో వున్నప్పుడు బరువుగా, బాధగా అనిపిస్తుంది. ఎందుకంటే అది సహజమైన డ్రెస్ కాదు. కృత్రిమం, మామూలు దుస్తులు ఎపుడూ వేసుకొనేవి, సహజమైనవి. కనుక బరువుండదు, బాధ వుండదు. అలాగే సూర్యుడు చేసే కర్మ సహజం. కృత్రిమం కాదు. అందుకే బరువు, బాధ లేదు. ఆయన ప్రత్యేకంగా చేయాలని చేసేది కాదు. దానితో ఆ కర్మ అలా చడీచప్పుడూ లేకుండా జరిగిపోతుంది. అందుకే కర్మయోగులకు ప్రథమ గురువు సూర్యభగవానుడే. భగవంతుని ఉపదేశాన్ని సార్థకం చేసుకొని యోగ్యమైన స్థానాన్ని సంపాదించుకున్నాడు. అంతటి యోగ్యుడైన శిష్యుడు దొరకటం భగవంతుని అదృష్టం, సూర్యునికి భగవానుడు బోధించాడు. ఆ పైన ఏమి జరిగింది?

**వివస్వాన్ మనవే ప్రాహ:** సూర్యుడు ఈ యోగాన్ని మనువుకు చెప్పాడు. గురువు వద్ద నుండి బ్రహ్మవిద్యను, యోగవిద్యను నేర్చుకొన్న శిష్యుడు, అందులో నిష్ణాతుడైన తరువాత దానిని ఇతరులకు బోధించాలి. అతడే ఉత్తమ శిష్యుడౌతాడు. సూర్యుడు ఆషామాషీ శిష్యులలాగా కాకుండా, లోభబుద్ధి లేకుండా తాను నేర్చిన ఈ యోగాన్ని మనువుకు బోధించాడు. మరి మనువు ఏం చేశాడు?

**మనుః ఇక్ష్వాకవేఽబ్రవీత్:** మనువు సూర్యునిద్వారా నేర్చుకున్న విద్యను ఇక్ష్వాకు మహారాజుకు బోధించాడు. శ్రీరాముని వంశానికి మూలపురుషుడే ఇక్ష్వాకు. అందుకే ఆ వంశాన్ని ఇక్ష్వాకు వంశం అంటారు. అంటే ఈ యోగం రాజలోకానికి ప్రచారమైంది. రాజులకే ఎందుకిలా చెప్పాల్సి వచ్చింది? రాజులద్వారా ఐతేనే లోకంలో బాగా ప్రచారంలోకి వస్తుంది. పూర్వం రాజులు కేవలం రాజ్యపాలనకే పరిమితం కాలేదు. ధర్మసంస్థాపన కూడా వారి బాధ్యతయే. రాజులు ఆచరిస్తే ప్రజలు కూడా ఎట్టి సందేహాలు, సంశయాలు లేకుండా ఆచరిస్తారు. ఎందుకంటే పూర్వకాలంలో ప్రజలు రాజులను అనుసరిస్తూ వుండేవారు. రాజులు ప్రజలను కన్నబిడ్డల్లాగా పాలించేవారు. ఈ విధంగా ఈ కర్మయోగం భగవంతుని నుండి సూర్యునిద్వారా రాజలోకానికి చేరింది. తరువాత ఏమైనదో 2వ శ్లోకంలో చెప్పబోతున్నారు.

**శ్లో॥ ఏవం పరంపరాప్రాప్తం ఇమం రాజర్షయోవిదుః ।**
**సకాలేనేహ మహతా యోగోనష్టః పరంతప ॥ (2)**

**తా॥ ఇలా పరంపరగా లభించిన ఈ కర్మయోగాన్ని రాజర్షులు తెలుసుకున్నారు.**

**ఓ పరంతపా! ఈ గొప్పయోగం కాలగతిలో ఈ లోకంలో నశించిపోయింది.**

**వ్యాఖ్య:** భగవంతుని నుండి సూర్యునికి, సూర్యుని నుండి మనువుకు, మనువు నుండి ఇక్ష్వాకుకు పరంపరగా– గురు శిష్యపరంపరగా లభించిన ఈ యోగాన్ని రాజర్షులంతా తెలుసుకున్నారు. అంటే ఈ విద్య గురుశిష్య పరంపరగా లభించవలసిన విద్య అని గ్రహించాలి. రాజర్షులంటే ఎవరు? ఋషులుగా మారిన రాజులే రాజర్షులు. కొంతకాలం రాజ్యపాలన చేసిన తర్వాత రాజులు తమ పుత్రులకు రాజ్యాలను అప్పగించి వానప్రస్థాన్ని స్వీకరించేవారు. వనాలలో నివసిస్తూ అనేక విద్యలను గురుముఖత నేర్చుకొని ఋషులౌతారు. ఆ విధంగా రాజర్షులు ఈ విద్యనెరుగుదురు. వీరు తిరిగి ఈ విద్యను కొందరు శిష్యులకు బోధిస్తారు. కొందరు బోధించరు. ఋషి అంటే ఇతరులకోసం జీవించేవాడు. క్రమక్రమంగా వారు తాము తరించటానికే ప్రయత్నిస్తూ మునులై తపమాచరించటం వల్ల ఈ విద్యను బోధించేవారు లేక ప్రచారం జరగక ఈ కర్మయోగం అదృశ్యమైంది. ద్వాపరయుగం నాటికి ఈ విద్య అదృశ్యమైపోవటం వల్ల దీనిని పునరుద్ధరించ వలసి వచ్చింది. అందుకే భగవంతుని అవతారం.

**యోగోనష్టః :** కాలక్రమంలో  యోగం నశించింది అంటున్నాడు పరమాత్మ. ఇంతకు ముందు శ్లోకంలో 'అవ్యయంయోగం' నశించని యోగం అని; ఈ శ్లోకంలో 'నష్టః నశించింది అంటున్నారు. అదెలా సరిపోతుంది? ఇక్కడ నశించటం అటే ప్రచారం లేక అదృశ్యం కావటమే. సృష్టి నశించిపోతుంది అంటాం. అంతమాత్రాన తిరిగి సృష్టి జరగదనా? కొంతకాలం సృష్టి అవ్యక్తంలో వుండిపోతుంది–అనే. సూర్యుడు అస్తమించాడు అంటే లేకుండా పోయినట్లేనా? తాత్కాలికంగా కొంతకాలం కనిపించడు, తిరిగి తెల్లవారుతూనే కనిపిస్తాడు. అలాగే ఈ కర్మయోగం తాత్కాలికంగా మరుగున పడిపోయింది. తిరిగి దానిని పునరుద్ధరించాలి. ప్రచారం చేయాలి. ఆచరణలోనికి వచ్చేట్లు చేయాలి. ఎవరికి బోధించాలి? ఎలాంటివారిని సెలెక్ట్ చేసుకోవాలి. వారికెటువంటి అర్హతలుం డాలి? ఈ విషయాన్ని తరువాతి శ్లోకంలో చెప్పబోతున్నాడు భగవానుడు.

ఈ రెండు శ్లోకాలలోని పదాల వెనుక ఒక అద్భుమైన ఆధ్యాత్మిక రహస్యం ఇమిడి వుంది.

**1. వివస్వాన్:** వాసనల వసనం (వస్త్రం) ధరించినవాడు. ఎవరు? కారణ శరీరంలో ప్రతిఫలించిన పరమాత్మయే.







**2. మనువు:** ఆలోచనలు చేసేవాడు ఎవరు? సూక్ష్మ శరీరంలో (మనోబద్ధులతో) ప్రతిఫలించిన పరమాత్మయే.

**3. ఇక్ష్వాకు (ఇక్షు+వాక్) :** 'ఇక్షు' అంటే కళ్ళు (జ్ఞానేంద్రియం) 'వాక్కు' అంటే నోరు (కర్మేంద్రియం) వాటిని ఉపయోగించుకునేవాడు. ఎవరు? స్థూలశరీరంలో ప్రతిఫలించిన పరమాత్మయే.

పరమాత్మజ్ఞానం అనంతమైన – సంపూర్ణమైన జ్ఞానం. అయితే పరమాత్మ మొదట కారణ శరీరంలో ప్రతిబింబించి ఆ తరువాత సూక్ష్మ శరీరంలోకి, ఆ తరువాత స్థూల శరీరంలోకి వచ్చి బాహ్య ప్రపంచంలోకి తొంగిచూసేసరికి ఆ అనంత జ్ఞానం కించిత్ జ్ఞానంగా – అసంపూర్ణ జ్ఞానంగా – పరిమితజ్ఞానంగా అయిపోతున్నది. అంటే తగ్గిపోతున్నది. సూర్యబింబం వైపు మధ్యాహ్న సమయంలో చూడలేం. అదే బింబం క్రింద వున్న నీటిలో ప్రతిఫలిస్తే అంతతీకాంతి వుంటుందా? చూడలేక కళ్ళు మూసుకుంటామా? లేదు గదా! అలాగే పరమాత్మజ్ఞానం ఈ దేహాలలో ప్రతిబింబించి ప్రపంచంలోకి చూచేటప్పటికి తగ్గిపోతుంది. ఇలా తగ్గిన జ్ఞానాన్ని అనంతజ్ఞానంగా పెంపొందించుకోవటం ఎలా? బాహ్య ప్రపంచాన్ని వదలి– అంటే ప్రాపంచిక విషయ వ్యామోహాన్ని విడిచిపెట్టి స్థూల శరీరాభిమానాన్ని, సూక్ష్మ శరీరాభి మానాన్ని విడిచి, వాసనలను క్షయం చేసుకొంటే తన యదార్థ స్థితిలో– ఆత్మస్థితిలో– పరమాత్మ స్థితిలో వుండిపోతాడు. అదే అనంతజ్ఞానాన్ని పొందే ఉపాయం. అంటే పరమాత్మ ఈ దేహాలలో కూర్చొని జీవాత్మగా వున్నాడు. జీవాత్మగా వున్న తాను ఈ ఉపాధులను వదలి తాను పరమాత్మనని గ్రహిస్తే చాలు– అనంతజ్ఞానం. ఈ జ్ఞానం నష్టమైపోవడానికి కారణం 'పరంతప'. పరులను తపింపజేసేవాడు ధర్మాన్ని మరిచిపోతాడు. స్వస్థితిని మరిచిపోతాడు. కనుక తిరిగి స్వస్థితికి చేరాలి. ఈ నష్టమైన యోగం ఎలా వెలుగులోకి వచ్చింది?

నష్టమైన ఈ అవ్యయయోగం తిరిగి ఎలా వెలుగులోకి వచ్చింది?

**శ్లో॥ సఏవాయం మయాతేద్యయోగః ప్రోక్తస్సనాతనః॥**

**భక్తోసిమేసఖా చేతి రహస్యం హ్యేతదుత్తమం ॥** **(3)**

**తా॥ ఆసనాతనమైన యోగమే ఇప్పుడు నా చేత నీకు చెప్పబడింది. నీవు నాకు భక్తుడవు, స్నేహితుడవు గనుక ఈ శ్రేష్ఠమైన రహస్యాన్ని నీకు చెప్పటం జరిగింది.**

**వ్యాఖ్య:** ఇంతవరకు అర్జునునకు బోధించిన నిష్కామ కర్మయోగం ఇప్పటికిప్పుడు క్రొత్తగా ఆవిష్కరించబడ్డ నూతన సిద్ధాంతం కాదు. అది ఎంతో ప్రాచీనమైనది,

సనాతనమైనది. కాలగతిలో ఈ యోగం అదృశ్యమైంది గనుక, ఇప్పుడు భగవంతుడే ఆ సనాతన ధర్మాన్ని పునరుద్ధరించి, లోకానికి శ్రేయస్సు కలిగించవలసి వచ్చింది. అయితే భగవంతుడే స్వయంగా ఈ పనిచేయాలా? అవును...

ఎందుకంటే చెన్నైనుండి కలకత్తా వరకు గల హైవే మధ్యలో ఎన్నో చిన్నచిన్న బ్రిడ్జిలున్నాయి. పెద్దపెద్ద వంతెనలు ఉన్నాయి. అన్నింటిని ప్రభుత్వమే నిర్మించింది. కొంతకాలానికి ఒక వంతెన కూలిపోయింది. రాకపోకలకు అంతరాయం కలిగింది. బస్సులు, కార్లు, లారీలు అన్నీ చుట్టూ తిరిగి వెళ్ళాల్సి వచ్చింది. అయినా అలా ఎంతో శ్రమకోర్చి ప్రయాణిస్తున్నారే గాని ఎవరూ దానిని నిర్మించరు. ఎందుకంటే ఆ వంతెనను నిర్మించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే గనుక.

అలాగే భగవంతుడీ లోకాన్ని సృష్టించాడు. కట్టుబాటుతో, క్రమపద్ధతితో నడవటానికి 'ధర్మం' అనే శక్తిని కూడా సృష్టించాడు. కాలక్రమంలో ఈ 'ధర్మసేతువు' భగ్నమై పోయింది. మరి ఎవరు దానిని బాగు చేయాలి? సృష్టి చేసిన భగవంతుడే. అందుకే నిరాకారుడైన భగవంతుడు నరాకారుడై అవతరించి, ఈ ధర్మసేతువును పునరుద్ధరించాడు. **'కృష్ణస్తు భగవాన్ స్వయం' స్వయంగా పరమాత్మే** అయిన శ్రీకృష్ణుడు అర్జునుని ద్వారా- అర్జునునికి బోధించటం ద్వారా పునరుద్ధరిస్తున్నాడు. అయితే అర్జునునికే ఎందుకు? ఎందరో పెద్దలు, మహాత్ములు ఉన్నారు గదా! ఏమిటి అర్జునుని గొప్పతనం.

**భక్తోసిమేసఖాచేతి:** నీవు నాకు భక్తుడవు, సఖుడవు గనుక. అర్జునుడు భక్తుడని స్వయంగా భగవానుడే చెబుతున్నాడు. నేను గొప్ప భక్తుణ్ణి అని తనను తాను ప్రకటించుకోవటం లేదు అర్జునుడు. భగవంతుడే సర్టిఫికెట్ ఇస్తున్నాడు.నీవు నా భక్తుడివి అని. ఇదీ అర్జునుని గొప్ప అదృష్టం. భగవంతుని చేత సర్టిఫికెట్ పొందినవాడే నిజమైన భక్తుడు. అర్జునుని లాగే శ్రీకృష్ణునిపై భక్తి కలిగినవారు లేరా? ఉన్నారు. ఎందరో ఉన్నారు. విదురుడు, భీష్ముడు, ధర్మరాజు ఇలా ఎందరో ఉన్నారు. మరి వారికెందుకు బోధించలేదు? యుద్ధరంగంలో లేని వారికి, శతృపక్షంలోని వారికి బోధించటం కుదరదు. మరి స్వపక్షంలో ఉన్న ధర్మరాజు కెందుకు బోధించలేదు? ధర్మరాజు భక్తుడేగాని, సఖుడు కాదు. రెండు అర్హతలూ ఉండాలి. అలా ఉన్నవాడే గురుబోధకు తగినవాడు.

గురుశిష్య సంబంధంలో శిష్యునికి గురువుపట్ల శ్రద్ధ మాత్రమే గాక, ఆ గురువుతో సన్నిహితత్వం ఉండాలి. అంటే భక్తి, చనువు రెండూ ఉండాలి. ఎందుకు? భక్తి







లేకపోతే గురువు పట్ల గౌరవం ఉండదు. చెప్పే విషయం మీద విశ్వాసం ఉండదు. కనుక భక్తి ఉండాలి. అయితే కేవలం భక్తి మాత్రమే ఉంటే ఆ భక్తి వల్ల భయం ఉంటుంది. ఆ భయం వల్ల గురువును ప్రశ్నించి, సందేహాలు తొలగించుకొనుటకు అవకాశం ఉండదు. సందేహాలు తొలగించుకోవాలంటే భయం పోవాలి. చనువు ఉండాలి, సన్నిహితత్వం ఉండాలి. మరి కేవలం చనువు మాత్రమే ఉంటే; గురువు పట్ల గౌరవం, వినయం, విధేయత ఉండవు. అందుకే భక్తీ- చనువు రెండూ ఉండాలి. భక్తి వల్ల అవిధేయత తొలగిపోతుంది. చనువు (మైత్రి) భయం లేకుండా చేస్తుంది. కనుక ఉత్తమమైన ఆధ్యాత్మిక విద్యను సరిగ్గా గ్రహించాలంటే శిష్యునిలో ఈ రెండు అర్హతలూ ఉండాలి. ఆ రెండూ ఉన్నవాడు అర్జునుడు. కనుకనే భగవానుని నుండి ఈ బ్రహ్మ విద్యను పొందటానికి అర్హుడయ్యాడు. అమృతం త్రాగటానికి అర్హత దేవతలకే ఉంటుంది. అలాగే ఈ ఆధ్యాత్మికామృతాన్ని త్రాగటానికి అర్హత భక్తుడు, సఖుడు అయినవానికే.

**రహస్యం ఉత్తమం**: ఈ విద్య ఎలాంటిది? అంటే రహస్యం, ఉత్తమం అన్నారు. రహస్యం అంటే ఎవ్వరూ వినకుండా ఏ ఒక్కడికో చెవిలో చెప్పే విషయం గదా! మరి ఈ ఆధ్యాత్మిక విద్యను అలా చెప్పాలనా? కాదు, ఎందరో చెబుతున్నారు. లక్షలమంది వింటున్నారు, చదువుతున్నారు. మరి రహస్యం ఏమిటి?

ఒకడు ఎంత వివేకి అయినా, ఎంత తెలివితేటలు గల వాడైనా ఈ పారమార్థిక తత్వాన్ని స్వయంగా అందుకోలేడు. తన యదార్థస్వరూపం ఆత్మయే అయినప్పటికీ తాను ఆత్మనని భావించలేడు, ఆత్మగా ఉండలేడు. ఎందుకంటే అది గురువు ద్వారానే అందుకోవాలి. గురూపదేశం ద్వారానే ఆత్మానుభూ తికి అవకాశం ఉంటుంది. కనుక ఆధ్యాత్మిక విద్య మన ఎదురుగా ఉన్నా అది రహస్యమే.

ఒక ప్యాకెట్ నీ ఎదురుగా ఉంచాను, అందులో ఏముందో నీవు చెప్పలేవు. ఎందుకంటే ఆ ప్యాకెట్‌ను నీవు తయారు చేయలేదు. దానిని తయారుచేసి నీ ముందుంచిన నేను చెప్పాలి అందులో ఏముందో. అంటే ప్యాకెట్ నీ ఎదురుగా ఉన్నా అదేమిటో నీకు రహస్యమే. అలాగే ఈ గీతాజ్ఞానం- బ్రహ్మవిద్య గురుబోధ ద్వారా గ్రహించాల్సిందే.

ఈ విద్య రహస్యమే కాదు, ఉత్తమం, శ్రేష్ఠమైనది. అన్ని విద్యలు నశించిపోయే ఈ దేహపోషణ కొరకే. అలాగే నశించి పోయే ఈ జగత్తు గురించీ, వస్తువుల గురించే. కాని ఈ బ్రహ్మ విద్య మాత్రం నశించని, నిత్యమైన ఆత్మను గురించి

తెలిపి ఆత్మానుభూతి కొరకే తెలియజేయబడింది. అందుకే ఇది ఉత్తమం. ఇట్టి రహస్యమైన ఉత్తమమైన విద్యను అర్జునుని ద్వారా వెలుగులోకి తెస్తున్నాడు భగవానుడు.

భగవానుని మాటలతో అర్జునునికి ఒక సందేహం కలిగింది. ఏమిటా సందేహం?

**అర్జున ఉవాచ:**

**శ్లో॥ అపరం భవతోజన్మ పరంజన్మ వివస్వతః**
**కథమేత ద్విజానీయాం త్వమాదౌప్రోక్తవానితి॥ (4)**

**తా॥** అర్జునుడు అడుగుతున్నాడు. నీవు ఇటీవల జన్మించిన వాడవు. కాని సూర్యుడు ఎప్పుడో జన్మించినవాడు. ఈ సనాతన యోగాన్ని నీవు మొదట్లోనే నేర్పించానంటున్నావు. దీన్ని నేనెలా అర్థం చేసుకోవాలి?

**వ్యాఖ్య:** 'అవ్యయమైన ఈ యోగాన్ని నేను మొదట సూర్యునికి బోధించాను' అన్న శ్రీకృష్ణుని వాక్యం అర్జునునికి అతిశయోక్తిగా అనిపించింది. అర్జునునికే గాదు సామాన్యుని కెవరికైనా అలాగే అనిపిస్తుంది. ఎందుకంటే శ్రీకృష్ణుడేమో ద్వాపరయుగం చివరిలో పుట్టినవాడు. సూర్యుడేమో ద్వాపర యుగంలోనే కాదు అంతకు ముందున్న త్రేతా, కృతయుగాలలోనూ ఉన్నాడు. అసలు ఎప్పుడు పుట్టాడో తెలియదు, పోనీ ఇప్పుడు ఉన్నాడు గదా! ఇప్పుడే ఎప్పుడో కొద్దికాలం క్రిందట చెప్పాడేమో అనుకోవటానికీ వీల్లేదు. ఎందుకంటే ఈ సూర్యుడు శ్రీకృష్ణుని వద్ద విని మనువుకు బోధించాడట. అంటే మనువుకన్నా పూర్వకాలంలోనే శ్రీకృష్ణుడు సూర్యునికి బోధించి ఉండాలి గదా! ఇదెలా కుదురుతుంది?

పోనీ శ్రీకృష్ణుడు అబద్ధం చెప్పేవాడా? కాదు. అందుకే తన సంశయాన్ని భగవానుని ఎదుట పెడుతున్నాడు అర్జునుడు. "దేవా! కృష్ణా! నీవు ఈ యోగాన్ని సూర్యునికి బోధించానని అంటున్నావు గదా! ఈ దేహంతోనే బోధించావా? లేక వేరొక దేహంతో ఏదో జన్మలో బోధించావా? ఈ దేహంతోనే బోధించావంటే నమ్మలేను. ఎందుకంటే నీ వయస్సు 88 సంవత్సరాలు. సూర్యునికి కొన్ని లక్షల సంవత్సరాల ముందు బోధించటం కుదరదు, పోనీ ఇంతకు ముందు ఏదో జన్మలో ఎప్పుడో బోధించానంటావా? అదీ నమ్మదగిందిగా లేదు. ఎందుకంటే వెనుకటి జన్మలలో చేసిన పనులు ఈ జన్మలో గుర్తుండవు. అబ్బేకాదు. గుర్తుంటాయంటావా? మరి నాకు ఆ గుర్తులు, జ్ఞాపకాలు ఏవీలేవు గదా! ఏమిటీ తిరకాసు? అన్నాడు.

అర్జునుడు అడిగిన ఈ ప్రశ్న అవతార సిద్ధాంతానికి సంబంధించినది. శ్రీకృష్ణుడు మహిమగలవాడని, దైవాంశ సంభూతుడని, యోగీశ్వరుడని, మహాత్ముడని అర్జునునికి







తెలుసు. అయితే ఆయనే సాక్షాత్తూ పరమాత్మ అనే విషయంలో కొంత సందేహం ఉంది. అది ఆయన నోటి ద్వారానే విని తెలుసుకోవాలి. అలా తెలుసుకొనుటకు లభించిన అదృష్ట ఘడియ ఇది. అందుకే వదిలి పెట్టకుండా అడిగేశాడు.

అసలు అర్జునునికి ఇలాంటి సందేహం కలగటానికే భగవానుడు తాను సూర్యునికి ఎప్పుడో ఈ యోగాన్ని బోధించాను అన్నాడు. పరమాత్మతత్వాన్ని, అవతార సిద్ధాంతాన్ని లోకానికి చాటాలనుకున్నాడు. అందుకే సందేహం కలిగించాడు.

అర్జునునికి దేహదృష్టి, మనోదృష్టి ఉన్నాయేగాని, ఆత్మ దృష్టి లేదు. అందుకే ఈ సందేహం కలిగింది.

ఇక్కడ మరొక రహస్యం కూడా అంతర్లీనంగా దాగి ఉంది. 'దేవకీపుత్రుడు, బృందావన గోపాలుడు ఐన శ్రీకృష్ణుడే ఈ గీతా జ్ఞానాన్ని తెలియజేస్తున్నాడు' అనే అభిప్రాయం పాఠకులకు కలగకుండా ఉండటానికే వ్యాసుడు భగవానుని నోట అవతార సిద్ధాంతాన్ని పలికిస్తున్నాడు అని మనం గ్రహించాలి.

అర్జునుని సందేహనివృత్తికి శ్రీకృష్ణుడు తన నిజతత్వం ఏమిటో తెలియజేస్తున్నాడు.

**శ్రీభగవానువాచ:**

**శ్లో॥ బహూని మేవ్యతీతాని జన్మాని తవచార్జున।**
**తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థ పరంతప॥ (5)**

**తా॥ భగవానుడు చెబుతున్నాడు. అర్జునా! నాకు, నీకు అనేక జన్మలు గడిచిపోయాయి. వాటన్నింటిని నేనెరుగుదును. ఓ పరంతపా! నీవు వాటిని ఎరుగవు.**

**వ్యాఖ్య:** ప్రతి మానవుడికి కోట్లకొద్దీ జన్మలు గడిచి పోతుంటాయి. ఏమానవుడూ హఠాత్తుగా ఇపుడే జన్మించినవాడు కాదు. ఇదే మొదటి జన్మకాదు. పరిణామక్రమాన్ని అనుసరించే ప్రతి మానవుడూ ఈ ప్రపంచంలోకి వస్తున్నాడు. డార్విన్ సిద్ధాంతం కూడా అదే చెబుతున్నది. అతి సూక్ష్మమైన అమీబా వంటి ఏకకణ జీవి నుండి పరిణామం చెంది మానవుడి దాకా ఎదుగుతున్నాడు. అనేక జన్మలెత్తి, వివిధ రూపాలు ధరించి ప్రస్తుత స్థితికి వచ్చాడు మానవుడు. ఈ భూమిపై పడగానే గత జన్మల విషయాలను మరిచిపోతున్నాడు. కాని పూర్వపు వాసనల, కర్మఫలాల మూటను మాత్రం వెంట తెచ్చుకుంటాడు. ఆ వాసనల కనుగుణంగా కర్మలు చేస్తూ, కర్మఫలాలను అనుభవిస్తూ ఈ జీవితాన్ని ముగించుకొని, తిరిగి అప్పటికి ప్రోగు చేసుకున్న వాసనల కర్మఫలాల మూటను వెంట తీసుకొని వెళ్ళి తిరిగి వస్తాడు. ఇలా అనేక జన్మలను ఎత్తుతూ, పుడుతూ చస్తుండాలి. సామాన్యుల అందరి స్థితీ ఇంతే.

అయితే నిరాకారుడైన పరమాత్మ మాత్రం అలా వాసనలకు, కర్మఫలాలకు లోబడి జన్మించేవాడు కాదు. ఎందుకంటే ఆయనకు వాసనలు, కర్మఫలాలు ఉండవు. మరి ఆయనెందుకు జన్మిస్తాడు? అధర్మం పెచ్చుమీరినపుడు అధర్మాన్ని అణచి ధర్మాన్నినిలబెట్టడానికి దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించటానికి తనను తానే సృజించుకుని ఈ లోకంలోకి వస్తుంటాడు. అలా ఆయన కూడా అనేక జన్మలెత్తు తుంటాడు. ఆయన జ్ఞాని గనుక సర్వజ్ఞుడు గనుక తానెవరో తనకు తెలుసు గనుక ఆయా జన్మలలో ఏమేమి చేసిందీ ఆయనకు తెలుస్తుంది. కాని అజ్ఞానంలో ఉన్న మానవులకు మాత్రం గత జన్మలు గుర్తుండవు. అర్జునుడు కూడా ఆత్మజ్ఞానం లేని అజ్ఞానియే గనుక అతడికి పూర్వజన్మలలోని కర్మలేవీ గుర్తుండే అవకాశం లేదు.

భగవంతుడు, జీవుడు ఇద్దరూ ఆత్మస్వరూపులే-పరమాత్మ స్వరూపులే. కాని భగవంతుడు మాయాధీశుడు. అంటే మాయకు యజమాని. అంటే మాయ ఆయన అధీనంలో ఉంటుంది. కాని జీవుడు మాయాధీనుడు. అంటే మాయకు అధీనుడై ఉండేవాడు. అంటే ఆయన మాయయొక్క అధీనంలో ఉంటాడు. అందుకే భగవంతునికి పూర్వజన్మలు తెలుసు. అర్జునునికి పూర్వజన్మలు తెలియవు.

అందుకే భగవానుడు ఓ అర్జునా! స్వయంగా నేను జన్మలేని వాణ్ణి. అయినా పరులదృష్టిలో అనేకజన్మలెత్తినట్లు గోచరిస్తూ ఉంటాను. ఆ జన్మల సంగతి నాకు తెలుసు. నా జ్ఞానశక్తిని మాయకప్పలేదు. నీవు కూడా అనేక జన్మలెత్తావు. కాని నీకు వాటి సంగతి తెలియదు. ఎందుకంటే నీ జ్ఞానశక్తిని మాయ (వాసనలు) కప్పివేసింది.

భగవంతుడు ఈ లోకాన్ని సృష్టించి, సక్రమంగా సాగటానికి కొన్ని నియమాలు ఏర్పాటు చేశాడు. దుర్మార్గులు, బలవంతులు జన్మించి ఆ నియమాలను ఉల్లంఘిస్తే భగవంతుడే నరాకారంలో జన్మించి, వారిని అణచి, నియమ బద్ధజీవితాన్ని గడిపి అందరికీ ఆదర్శమై, తిరిగి ధర్మాన్ని నిలబెడతాడు. ఇదే అవతార సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని శాస్త్రాలు, ఋషులు అంగీకరించారు. ఇది శ్రుతి, స్మృతి ప్రమాణ సిద్ధమైన సిద్ధాంతం. -తన జన్మయొక్క ప్రత్యేకత ఏమిటో తెలియజేస్తున్నాడు భగవానుడు

**శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్।**
**ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా॥ (6)**







**తా॥ పుట్టుకలేని వాణ్ణి, నాశనం లేనివాణ్ణి, జీవుళ్ళందరికీ అధిపతిని అయినప్పటికీ, ప్రకృతిని స్వాధీనంలో పెట్టుకుని నా మాయవల్ల జన్మిస్తూ ఉంటాను.**

**వ్యాఖ్య:** దివ్యపురుషుని యొక్క పరిపూర్ణ స్థితిని ఈ శ్లోకంలో స్వల్ప పదజాలంతో వర్ణించటం జరిగింది. ఇదొక అద్భుత ప్రయోగం.

ఓ అర్జునా! నాకూనీకూ అనేక జన్మలు గడిచిపోయినవి. కాని అవి అన్నీ నాకు తెలుసు, నీకు తెలియవు అని ఇంతకు ముందు శ్లోకంలో భగవానుడు తెలియజేశాడు.

అయితే భగవంతుడు కూడా అందరి జీవుళ్ళమాదిరిగా కర్మల కారణంగా జన్మిస్తున్నాడా? కర్మఫలాలను అనుభవించ టానికే వస్తున్నాడా? అంటే కాదు అని ఈ శ్లోకంలో వివరిస్తు న్నాడు భగవానుడు.

భగవంతుని జన్మ వేరు, జీవుల జన్మవేరు. జీవులు ప్రకృతికి-మాయకు- అంటే వారివారి వాసనలు కర్మఫలాలకు అధీనులై జన్మిస్తున్నారు. అంటే పూర్వ వాసనలను ఖర్చు చేసు కొనుటకు, కర్మఫలాలను అనుభవించుటకు అవశులై జన్మిస్తున్నారు. అనేక సుఖదుఃఖాలను అనుభవిస్తున్నారు. కాని భగవంతుడు మాత్రం ప్రకృతిని-మాయను తన అధీనంలో ఉంచుకొని లోకహితం కొరకు, ధర్మరక్షణ కొరకు అవతరిస్తున్నాడు.

ఈ శ్లోకంలో భగవంతుని ప్రత్యేకతలు 3 చెప్పబడ్డాయి. అవి **అజః, అవ్యయః భూతానాం ఈశ్వరః** అని. అంటే పుట్టుక లేనివాడు, మరణం (నాశనం) లేని వాడు, సర్వభూతాలకు నియామకుడు-అని. మరి భగవంతుణ్ణి పుట్టాడు అంటారేమిటి?

భగవంతుడు స్వేచ్ఛాజీవి. ఆయనకు ఇక్కడ అవసరాలు లేవు. అయినప్పటికీ పుణ్యాత్ముల పుణ్యం, పాపాత్ముల పాపం ఆయనను రప్పిస్తుంది. అయితే ఎలా వస్తున్నాడు? మాయ అనే ఉపాధిని (వేషాన్ని) తగిలించుకొని వస్తున్నాడు. తాను వచ్చిన పని పూర్తి చేసుకొని ఆ వేషాన్ని వదలి వేస్తున్నాడు అంతే. కనుక ఆయనకు జననం లేదు. మరణం లేదు. మరి మనమో వాసనలు కర్మఫలాలు అనే ప్రకృతిని తగిలించుకొని దేహమనే ఉపాధితో వస్తున్నాం. ఇక్కడకు వచ్చిన తర్వాత ఆ దేహంతో తాదాత్మ్యం చెంది దేహమే నేనుగా వ్యవహరిస్తు న్నాం. దేహం నశిస్తే నేను మరణించాను అనుకుంటున్నాం. అందువల్ల మనకు జననం మరణం రెండూ ఉన్నాయి. భగవంతుడు మాయను వశంలో ఉంచుకొన్న స్వేచ్ఛాజీవి. ఆ మాయకు జీవుడు వశమై పోతున్నాడు, బంధింపబడు తున్నాడు. సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాడు.

ఈ మాయ మహావిచిత్రమైనది. ఎంత అర్థం చేసుకుందామన్నా అర్థం కాదు. నీకొక కారుంది. దాన్ని నడపటానికి డ్రైవరున్నాడు. మీ ఇద్దరికీ ఆ కారుతో సంబంధం ఉంది. నీవు సరదాగా షికారు వెళ్ళాలని నీ కారును నీవే డ్రైవ్ చేసుకుంటూ (ప్రక్కనే డ్రైవరున్నా) ఒక తోటకు వెళ్ళావు. ఆకారును బయట వదిలి, నీ భార్యతో సహా లోనికి వెళ్ళి కాసేపు విశ్రాంతి తీసుకొని తిరిగి కారులో కూర్చొని ఇంటికి వచ్చావు. కానీ నీ డ్రైవరు మాత్రం ఆ కారుతోపాటుగా వచ్చినా, నీవు తిరిగి వచ్చేంతవరకు ఆ కారును తుడుస్తూ దానికి రక్షణగా అక్కడే నిలబడిపోయాడు. అంటే దానికి సేవ చేస్తూ ఉండిపోయాడు.

కారు నీదే అయినా నీవు స్వేచ్ఛా జీవి. నీ డ్రైవరు మాత్రం దానికి సేవకుడై ఎంతసేపైనా దాన్ని కాపలా కాస్తూ నిరీక్షించాలి. కారును నీవు స్వేచ్ఛగా ఉపయోగించు కుంటున్నావు. అంటే కారు నీ సేవలో ఉంటుంది. నీ డ్రైవరు మాత్రం దాని సేవలో ఉంటున్నాడు. అంటే అతడికి స్వేచ్ఛ లేదు. ఎంత బాధగా ఉన్నా దాని సేవలో ఉండిపోవాల్సిందే.

ఇక్కడ నీవే భగవంతుడు, కారు మాయ, డ్రైవరు జీవుడు. నీ అధీనంలో కారు ఉన్నట్లు భగవంతుని అధీనంలో మాయ ఉంటుంది. డ్రైవరు ఆ కారు అధీనంలో ఉన్నట్లు జీవుడు మాయ అధీనంలో ఉండి అనేక బాధలు అనుభవించాలి. మాయను అధీనం చేసుకొనే జ్ఞానం భగవంతునికుంది. అ జ్ఞానం లేని జీవుడు మాయకు దాసుడై శ్రమిస్తున్నాడు, దుఃఖిస్తున్నాడు.

గుర్రపు స్వారీ ఎలా చేయాలో బాగా తెలిసిన నీవు గుర్రం పై స్వారీ చేస్తూ వెళ్ళవలసిన చోటుకు వెళ్ళి ఆనందిస్తున్నావు. ఇలా వెళ్ళేటప్పుడు నీ దృష్టి వెళ్ళవలసిన చోటు మీద ఉన్నదే గాని గుర్రం మీద లేదు. కాని గుర్రపు స్వారీ ఇప్పుడిప్పుడే నేర్చు కుంటున్నావు. అయినా ధైర్యం చేసి గుర్రంపై స్వారీ చేస్తూ ప్రయాణం సాగిస్తున్నావు. ఇపుడు నీ దృష్టి వెళ్ళవలసిన చోటు మీద లేదు. గుర్రాన్ని ఎలా దారిలోకి తెచ్చుకోవాలా? క్రిందపడిపోకుండా ఎలా జాగ్రత్తగా స్వారీ చెయ్యాలా? దారి ఎగుడు దిగుడుగా ఉంటే దిగి నడిపించుకుంటూ వెళదామా? అనే ఆలోచనలతో ఎప్పుడూ గుర్రం మీదనే నీ దృష్టి.

మాయ అనే గుర్రాన్ని ఎలా అదుపులో పెట్టాలో, దానిమీద ఎలా స్వారీ చేయాలో తెలిసినవాడు భగవంతుడు తెలియని వాడు జీవుడు. ఈ మాయను అధీనం చేసుకొని భగవంతుడు జీవుళ్ళకు ఈశ్వరుడయ్యాడు. **భూతానాం ఈశ్వరః** ఈ మాయోపాధితోనే భగవంతుడు సూర్యునికి బోధించింది.







ప్రకృతిని వశం చేసుకున్నవాడు భగవంతుడు. ప్రకృతికి వశులు మానవులు. అరణ్యవాసానికి వెళుతున్న శ్రీరాముడు ముని వేషంతో ముందు నడుస్తున్నాడు. ఆయన వెనుక సీతాదేవి ఆ వెనుక లక్ష్మణుడు ఉన్నారు. రాముడు భగవంతుడు, సీత ప్రకృతి, లక్ష్మణుడు జీవుడు. రాముడు స్వతంత్రుడు. సీత రామునికి వశవర్తి. మరి లక్ష్మణుడో? సీతను అనుసరిస్తూ సేవిస్తుంటాడు. ఇపుడు జీవుడైన లక్ష్మణునికి భగవంతుడైన రాముని దర్శనం కావాలంటే మధ్యలో నున్న ప్రకృతియైన సీత ప్రక్కకు తొలగాలి. అంటే భగవత్ సాక్షాత్కారం కావాలంటే ప్రకృతియొక్క ఆవరణ (వాసనలు) తొలగాలి. మాయ (ప్రకృతి) భగవంతుని ఆశ్రయించుకొని ఉంటుంది. కాని భగవంతుడు స్వేచ్ఛాజీవి. అసలు నిజంగా మాయకు (ప్రకృతికి) భగవంతుని కప్పి ఉంచే శక్తి ఉన్నదా? లేదు. నీ కంటికి చేతిని అడ్డం పెట్టుకొని సూర్యుని వైపు చూస్తున్నావు. సూర్యుడు కనిపించటం లేదు. ఇప్పుడు నీ చేయి సూర్యుని కప్పి ఉంచినదా? లేదు. అది నీ కంటిని మాత్రమే కప్పి ఉంచింది. అలాగే మాయ భగవంతుని కప్పలేదు. జీవుణ్ణే కప్పి ఉన్నది. జీవుడు ప్రయత్నించి ఈ మాయను అధిగమిస్తే జీవుడు స్వేచ్ఛాజీవి అవుతాడు. బంధనాలు, దుఃఖాలు తొలగిపోతాయి. ఇలా భగవంతుడు మాయ అనే ఉపాధిని (శరీరాన్ని) ధరించి ప్రకృతిని వశపరచుకొని ఈ లోకంలో అవతరిస్తున్నాడు. ఎందుకు? ఏమిటీ ఈ అవతారం యొక్క ఆవశ్యకత? హాయిగా అక్కడెక్కడో కూర్చొని ఆనందంలో ఓలలాడక ఇలా రావటం ఎందుకు? ఏ పరిస్థితుల వల్ల వస్తున్నాడు?

– భగవంతుని అవతారం యొక్క ఆవశ్యకత ఏమిటి?

**శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।**

**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥ (7)**

**తా॥ అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో, అధర్మం పెచ్చుమీరిపోతుందో అప్పుడప్పుడు నన్ను నేను సృజించుకుంటాను.**

**వ్యాఖ్య : ధర్మానికి హాని : అసలు ధర్మం అంటే ఏమిటి?** –మన జన్మలన్నీ కర్మజన్మలు. అంటే మనం చేసిన కర్మలే మనలను మళ్ళీ జన్మలెత్తించి ఈ లోకంలోకి లాక్కొని వస్తాయి. సత్కర్మలు చేస్తే మంచి జన్మలు. దుష్కర్మలు చేస్తే నీచ జన్మలు, దుఃఖపూరిత జన్మలు. అయితే ఏ రకమైన జన్మలు వచ్చినా ఇక్కడ అన్నీ పరిమితులే. కొంతకాలం సుఖం, ఆ తర్వాత దుఃఖం. పరిపూర్ణమైన ఆనందం మాత్రం ఉండదు. ఇక్కడి ఈ పరిమితులన్నింటిని దాటి పరిపూర్ణమైన ఆనందాన్ని అందుకోవాలంటే

ఏంచేయాలో, ఎలా చేయాలో భగవంతుడే కొన్నినియమాలు ఏర్పరిచాడు. ఆ నియమాలే ధర్మం. మన దైనందిన జీవితాన్ని నిజాయితీగా గడుపుతూ, తోటివారికి చేతనయినంతగా సాయపడుతూ, అన్యాయాలు, అక్రమాలు చేయకుండా, ఇతరులను పీడించకుండా, నిషిద్ధకర్మ లాచరించకుండా, దైవభక్తిని కలిగియుంటూ, దైవ ఋణాన్ని, ఋషి ఋణాన్ని, పితృ ఋణాన్ని, మనుష్య ఋణాన్ని, భూత ఋణాన్ని తీర్చుకుంటూ, జీవితాన్ని తరింపజేసుకోవాలి. మనం తరించటానికి భగవంతుడు ఏర్పాటు చేసిన ఈ నియమాలను అనుస రిస్తే మంచి ఫలితాలు, అనుసరించకపోతే, వ్యతిరేకిస్తే చెడ్డ ఫలితాలు కలిగి మళ్ళీ మళ్ళీ ఈ లోకంలోకి వస్తూ ఇందులోనే కూరుకుపోతారు. ఇదే భగవంతుడేర్పరచిన ధర్మం.

**ఈ ధర్మానికి హాని కలిగినప్పుడు, అధర్మం విజృంభించినప్పుడు భగవంతుడు తనను తాను సృజించుకొని (మాయ అనే దేహాన్ని ధరించి) అవతరిస్తాడు.** అంటే భగవంతుని దృష్టిలో ధర్మానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. అందుకే "ధర్మోరక్షతి రక్షితః" అన్నారు. ధర్మాన్ని రక్షిస్తే ఆ ధర్మమే (ధర్మరక్షణపై మక్కువ గల ఆ భగవంతుడే) నిన్ను రక్షించటం జరుగుతుంది-అని. అంతే కాదు. అధర్మం పెచ్చుపెరిగిపోతున్నా భగవంతుడు సహించడు. అవకాశం దొరికిందికదా అనో, బలం ఉన్నది కదా అనో అధర్మా లకు పాల్పడే వారిని భగవంతుడు చూస్తూ సహించడు. అందుకే తనను తాను సృజించుకొని వచ్చి ధర్మాన్ని నిలబెడతాడు, ధర్మాన్ని అనుసరించేటట్లు మానవులను తీర్చిదిద్దుతాడు.

**ఐతే భగవంతుడెప్పుడు వస్తాడు?-డాక్టరు మన ఇంటికి ఎప్పుడు వస్తాడు? రోగం ముదిరి హాస్పిటల్‌కు వెళ్ళటానికి కూడా వీలు లేనప్పుడు కదా! అలాగే అధర్మం బాగా ముదిరిపోయి నప్పుడే భగవంతుడు ఈ లోకానికి వస్తాడు.**

హిరణ్యకశిపుని పాపం బాగా ముదిరిపోయి భక్తుడు, పుత్రుడు ఐన ప్రహ్లాదుని తీవ్రంగా హింసించినప్పుడే నరసింహస్వామి రూపంలో అవతరించాడు.

ఒక జమీందారు ప్రతిరోజూ తన పొలాలు చూడటానికి, పనివాళ్ళ చేత పనులు చేయించటానికి వెళతాడా? వెళ్ళడు. ఐతే పరిస్థితులు తారుమారైతే, పనివాళ్ళు సరిగ్గా పనిచేయక, పొలాలు పండక, పూర్తిగా నష్టాలు వస్తుంటే అప్పుడు తన పనివాళ్ళను, పొలాలను పరిశీలించటానికి వస్తాడు. **అలాగే భగవంతుడు కూడా అధర్మం ప్రబలిపోయినప్పుడే వస్తుంటాడు. జమీందారు పనివాళ్ళ మధ్య తిరుగుతున్నా-ఒకవేళ తానే వాళ్ళతో కలిసి పనిచేస్తున్నా తన అధికారాన్ని,**







**యాజమాన్యాన్ని, జమీందారునన్న విషయాన్నీ మరచిపోడు. అలాగే భగవంతుడు దేహధారియై ఈలోకంలో మనుష్యుల మధ్య తిరుగుతున్నా తాను భగవంతుణ్ణనే విషయం మరచిపోడు. తానెవరో, ఎందుకొచ్చాడో మరచిపోడు. మనుష్యులలోని కల్మషాలను తొలగించి, వారి హృదయాలు పవిత్రమయ్యేటట్లు, తిరిగి ధర్మమార్గంలో నడిచే టట్లు తన ఆచరణ ద్వారానో (రామునిలా) తన బోధనల ద్వారానో (కృష్ణునిలా) చేస్తాడు.** కనుక ధర్మరక్షణ భగవానుని ప్రధమ కర్తవ్యం.

– ధర్మరక్షణ కోసం అలా అవతరించిన భగవంతుడు ఇక్కడ ఏంచేస్తాడు?

**శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం।**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ (8)**

**తా ॥ సాధుపురుషులను రక్షించటానికి, దుష్టులను నాశనం చెయ్యటానికి, ధర్మాన్ని స్థాపించటానికి యుగయుగములందు జన్మిస్తుంటాను.**

**వ్యాఖ్య :** భగవంతునికి ఈ లోకంలో 3 పనులు. వాటికోసమే ఆయన దిగివచ్చేది. అవి. 1.సాధు-సత్పురుషుల సంరక్షణ. 2.దుష్టులను నాశనం చేయుట. 3. ధర్మసంస్థాపన.

**1. పరిత్రాణాయ సాధూనాం :** 'సాధువులను రక్షిస్తాడు అంటే సంసారులను రక్షించడు అని అర్థం కాదు. సాధువులు అంటే సత్పురుషులు అని. వారు గృహస్థులైనా, వానప్రస్థులైనా, సన్యా సులైనా, సామాన్యులైనా, గొప్పవారైనా-ఎవరైనా సరే-**ఎవరైతే ప్రాణం మీదకు వచ్చినా ధర్మాన్ని విడిచిపెట్టరో వారే సాధువులు. ఇతరులకు ఎట్టి పరిస్థితులలోనూ అపకారం చేయనివారే సాధువులు. చేతనైనంతగా ఇతరులకు సాయపడేవారే సాధువులు. అట్టివారిని భగవంతుడు తప్పక రక్షిస్తుంటాడు.** తనను తండ్రి ఎంత హింసించినా తన ధర్మం నుండి తొలగిపోలేదు ప్రహ్లాదుడు. తన జీవితకాల మంతా విసుగులేకుండా శ్రీరామునికై ఎదురు చూచింది శబరి. ఇలా సత్పురుషులైన వారిని భగవంతుడు తప్పక రక్షిస్తాడు.

**2. వినాశాయచ దుష్కృతాం :** సత్పురుషులను, భక్తులను, సన్మార్గంలో నడిచే వారిని అనేక బాధలకు గురిచేస్తూ, హింసిస్తూ, శాస్త్ర విరుద్ధమైన, ధర్మవిరుద్ధమైన మార్గాలలో నడిచే వారిని భగవంతుడు నాశనం చేస్తాడు. కొందరు రాక్షసులు భగవంతుడు దిగివచ్చి తమ ఎదుట పడాలంటే ఆ భగవంతుని భక్తులను హింసించాలని నిర్ణయించుకొని, యజ్ఞయాగాది క్రతువులను ధ్వంసం చేస్తూ, మునులను, స్త్రీ బాల వృద్ధులను, చివరకు తమ వారిని కూడా హింసించేవారు. విశ్వామిత్రుని యాగాన్ని

మారీచ సుబాహులు ధ్వంసం చేసేవారు. రావణుడు శ్రీరాముని భార్యను హరించి చెరబట్టాడు. కంసుడు శ్రీకృష్ణుని తల్లిదండ్రులను చెరసాలలో బంధించాడు. హిరణ్యకశిపుడు తన కుమా రుడు ప్రహ్లాదుని ఘోరాతిఘోరంగా హింసించాడు. భస్మాసురుడు తనకు వరమిచ్చిన పరమశివుని నెత్తిన చెయ్యి పెట్టాలనుకున్నాడు. దుర్యోధనుడు శ్రీకృష్ణుడినే బంధించాలనుకున్నాడు. ఇలా అనేకమంది దుర్మార్గులు భగవంతుని, భగవద్భక్తులను, భగవంతునికి సంబంధించిన వారిని హింసించారు. అట్టివారే దుష్కృతులు, దుష్టులు, దుర్మార్గులు. నిప్పుకన్నా నిప్పుతో కాగిన ఇనుము భయంకరమైనది. అలాగే పాపం కన్నా పాపి భయంకరుడు. అట్టి పాపులను నశింపజేసేందుకే భగవానుడు అవతరిస్తుంటాడు.

పాప భావాలను వారి నుండి తొలగించవచ్చుకదా! వారిని చంపినందువల్ల పాపం పోతుందా? అనే వారున్నారు. అయితే జ్వరం వచ్చినప్పుడు ఒక మాత్ర(Tablet) ఇచ్చి నయం చేస్తాడు డాక్టరు. జలుబు చేస్తే Capsules ఇచ్చి, ఇంకా తగ్గకపోతే ఇంజెక్షన్ ఇచ్చి జలుబు తగ్గిస్తాడు. ఇక అవయవం కుళ్ళిపోతే Tablet ఇచ్చి ఊరుకుంటాడా? అలా ఊరుకుంటే శరీరమంతా కుళ్ళిపోతుంది. కనుక ఆపరేషన్ చేసి కుళ్ళిన భాగాన్ని తీసేయాలి. ఇప్పుడు శ్రీకృష్ణుడుగా అవతరించి అర్జునుని యుద్ధానికి ప్రోత్సహిస్తున్నాడు శ్రీకృష్ణుడు. కౌరవ సంహారం హింస గదా! **శ్రీకృష్ణుడు భగవంతుడై యుండీ హింసను ప్రోత్సహిస్తున్నాడు. శాంతిని స్థాపించకుండా హింసను ప్రోత్సహించే ఆయనేం భగవంతుడండీ? అంటూ చంకలో సంచి తగిలించుకొని వచ్చి ప్రశ్నిస్తుంటారు కొందరు మేధావులు.**

భగవంతుడంటే విశ్వవిరాట్ పురుషుడు. **ఆ విరాట్ పురుషుని దేహంలోని అంగాలే కౌరవులు, పాండవులు, యాదవులు, దేవతలు, రాక్షసులు అందరూను. ఆ విరాట్ పురుషుని దేహంలోని కౌరవులు అనే అంగం చెడిపోయింది. ఎలాగైనా బాగు చేయాలని రాయబారాలు, సామదాన భేదోపాయాలు అనే Tabletలు, ఇంజెక్షన్‌లు ఇచ్చాడు జగద్వైద్యుడు శ్రీకృష్ణుడు. ఈ తేలికపాటి చికిత్సలకు లొంగలేదు జబ్బు. ఇంకా ఇంకా ముదిరిపోయింది. దాన్ని అలాగే వదిలేస్తే శరీరమంతా పాకి మొత్తాన్ని దెబ్బ తీస్తుంది. అందుకే కౌరవులనే ఆ దుష్టాంగాన్ని ఖండించి మిగిలిన సమాజం అనే శరీరాన్ని రక్షించాల్సి వచ్చింది. "దుష్టాంగంబు ఖండించి శేషాంగ శ్రేణికి రక్షసేయు విధంబుగా" మహావైద్యుడైన శ్రీకృష్ణుడు అర్జునుని కౌంపొండరుగా పెట్టుకొని ఈ కురుక్షేత్ర సంగ్రామమనే ఆపరేషన్ చేశాడు. చెడిపోయిన భాగాన్ని తీసివేసి**







**మనిషి ప్రాణాన్ని కాపాడలేక పోతే బంధువులు డాక్టరును తిడతారు, దాడి చేస్తారు. అలాగే దుర్యోధనాది కౌరవాధములను సంహరించి, ధర్మాత్ములైన పాండవులను కాపాడలేకపోతే అందరూ శ్రీకృష్ణుణ్ణే నిందించేవారు. కనుక దుష్టుల నాశనం భగవంతుని కర్తవ్యం.**

**3. ధర్మసంస్థాపనార్థాయ :** దుష్టశిక్షణ, శిష్ట రక్షణలే గాక ధర్మ సంస్థాపన కూడా భగవంతుని కర్తవ్యమే. ధర్మం యొక్క అవసరాన్ని, గొప్పతనాన్ని అందరికీ తన వాక్కుద్వారా బోధిస్తూ ప్రజల్లో ధర్మాచరణ కలిగించటానికి ప్రయత్నిస్తూ శాస్త్రాల మీద, గురువుల మీద, పెద్దల మీద, దైవం మీద శ్రద్ధ కలిగిస్తూ, ప్రజలను సదాచారులుగా చేయుటే ధర్మసంస్థాపన. భగవద్గీతా బోధ ద్వారా భగవానుడు చేసిన దదే.

ఈ శ్లోకంలోని 3 పదాలలోని విశేషాన్ని తప్పక గమనిం చాలి.

1. సాధురక్షణను **'త్రాణాయ'** అనక **'పరిత్రాణాయ'** సాధూనాం అని–
2. నశింపజేయుటను **'నాశాయచ'** అనక **'వినాశాయచ'** దుష్కృతాం' అని–
3. నిలబెట్టటాన్ని **'స్థాపనార్థాయ'** అనిగాక ధర్మ **'సంస్థాప నార్థాయ'** అని – చెప్పటం విశేషం. అంటే ఈ మూడు విధులను భగవంతుడెంతో ముఖ్యంగా భావిస్తున్నాడని తెలుస్తుంది.

ఇంతవరకు భగవంతుడు తన దివ్యజన్మ కర్మల గూర్చి తెలియజేసి ఇప్పుడు తన దివ్యజన్మను గురించి, తన దివ్య కర్మల గురించి తెలుసుకొంటే ప్రయోజనమేమిటో తెలియజేయ బోతున్నాడు.

**శ్లో ॥ జన్మకర్మచ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వాదేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జునః ॥ (9)**

**తా॥ అర్జునా! ఎవరైతే నా దివ్యజన్మ, కర్మల గురించి ఈ విధంగా యదార్థంగా తెలుసుకుంటారో, అతడు ఈ శరీరాన్ని విడిచిపెట్టిన తర్వాత తిరిగి పుట్టడు, నన్నే చేరుకుంటాడు.**

**వ్యాఖ్య : 1. జన్మకర్మచ మే దివ్యం :** భగవంతుని జన్మమూ దివ్యమే. భగవంతుని కర్మలూ దివ్యమే. సామాన్యులందరూ వారి వారి ప్రకృతి(వాసనలు)ని అనుసరించి వాటికి లోబడి జన్మిస్తుం టారు. అంటే వారు ప్రకృతి చేతిలో కీలుబొమ్మలు. కాని భగవంతుడు ప్రకృతి (మాయ)ని తన అధీనంలో పెట్టుకొని తనను తాను సృజించుకొని వస్తాడు. అంటే ప్రకృతి ఆయన చేతిలో కీలుబొమ్మ. అందుకే ఆయన జన్మ దివ్యమైనది.

అలాగే భగవంతుని కర్మలు కూడా దివ్యమే. మనం మన వాసనలకు అనుగుణంగా కర్మలు చేస్తుంటాం. అప్పుడే వాసనలు ఖర్చయ్యేది. కాని భగవంతుడో? ఆయన స్వేచ్ఛాజీవి. ఆయన తన సుఖసంతోషాల కోసమో, స్వార్థం కోసమో, కీర్తిప్రతిష్టల కోసమో కర్మలు చేయడు. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ, ధర్మ సంస్థాపన కోసమే కర్మలు చేస్తాడు. ఆయన ఎట్టి కర్మలు చేసినా ఆయనను బంధించవు. కనుకనే ఆయన చేసే కర్మలన్నీ లీలలౌతున్నాయి. శ్రీకృష్ణుని చిన్ననాటి అల్లరి పనులన్నీ కృష్ణలీలలై పోయినవి. కనుక భగవంతుని కర్మలు కూడా దివ్యమైనవే.

**2. ఏవం యో తత్త్వతః వేత్తి** : ఇలా ఆయన జన్మను, కర్మలను దివ్యమైనవిగా తత్త్వతః-అంటే యదార్థంగా తెలుసుకొంటే అట్టి వానికి ఫలితం పునర్జన్మ ఉండదు. అయితే ఊరికే తెలుసుకుంటే ప్రయోజనం లేదు. **తత్త్వతః తెలుసుకోవాలి. అంటే అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. ఆత్మీయంగా ఆ దివ్యత్వాన్ని అనుభవించాలి. అంటే అపరోక్ష బ్రహ్మజ్ఞానం ద్వారా తెలుసుకోవాలి.** అదే తత్త్వతః తెలుసుకోవటమంటే. భగవంతుడు తన కన్న వేరుగా ఉన్నాడని తెలియటం పరోక్ష జ్ఞానం. **ఆ భగవంతుడు నేనే నని అనుభవ పూర్వకంగా తెలియటం అపరోక్ష జ్ఞానం.** అట్టి అపరోక్ష జ్ఞానం ద్వారా నేను ఈ దేహేంద్రియ మనోబుద్ధుల కన్న వేరుగా, ఈ దేహమునందంతటా నఖశిఖ పర్యంతం వ్యాపించియున్న సూక్ష్మాతిసూక్ష్మ, సర్వవ్యాపక, స్వయంప్రకాశ చైతన్యాన్ని; నాకు ఏ అవసరాలు లేవు, కోరికలు లేవు, ఆశలు లేవు, ఆశయాలు లేవు, అకర్తను, అభోక్తను అని గ్రహించి, నిర్లిప్తంగా, కేవల సాక్షిగా ఉన్నట్లైతే అదే అపరోక్షంగా-అనుభవ పూర్వకంగా తెలియటం. అలా తెలిస్తే-

**3. దేహం త్యక్త్వా పునర్జన్మ న ఇతి** :-ఈ దేహాన్ని విడిచిన తర్వాత తిరిగి మరొక దేహాన్ని ధరించడు. అంటే తిరిగి జన్మించడు. **అసలు జన్మ ఎందుకు వస్తున్నది? మన మనస్సును అంటుకున్న వాసనల వల్ల. వాసనలన్నీ క్షయమై అసలు మనస్సే లేకపోతే-ఇక జన్మ ఎత్తేది ఎవరు?** ఇప్పటిదాకా నేను దేహాన్ని, నేను మనస్సును అని భావించిన జీవుడు భగవంతుని యదార్థ స్వరూపాన్ని గ్రహించిన తర్వాత-అపరోక్ష జ్ఞానం ద్వారా-తత్త్వతః గ్రహించిన తరువాత -నేను **ఈ దేహాన్ని, మనస్సును; చైత న్యాన్ని-ఆత్మను-భగవంతుడిని అని తెలుసుకొని అలా కేవల ఆత్మగా ఉండిపోయి నప్పుడు-తిరిగి జన్మ ఎత్తవలసిన ఆ మనస్సే అంతమైనప్పుడు** పునర్జన్మ ఎలా **ఉంటుంది?** అందుకే బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమే అవుతాడు-అనేది ఉపనిషత్ వాక్యం.







**మామ్ఏతి :** జన్మలేకుండా పోతే శూన్యమేనా? అని కొందరి సందేహం. ఆ సందేహ నివృత్తి కోసమే ఇక్కడ భగవానుడు 'మామ్ఏతి'-నన్నే చేరుకుంటాడు అని తెలియజేయటం జరిగింది. జన్మ లేదంటే భగవంతునిలో ఏకమైనట్లే. అదే మామ్ఏతి. మట్టితో కుక్క బొమ్మను చేశాం. ఆ తర్వాత దాన్ని చెడగొట్టి ఎద్దు బొమ్మను చేశాం. ఆ తర్వాత దాన్నే చెట్టు బొమ్మను చేశాం. అలా అనేక రకాల బొమ్మలుగా చేసి చివరకు దాన్ని నీటిలో వేశాం. ఏమవుతుంది? నీటిలో కరిగిపోయి నీటి రూపంగా మారిపోతుంది. అలాగే ఎన్నో జన్మలెత్తిన తర్వాత ఎప్పుడైతే తన యదార్థ స్వరూపాన్ని తెలుసుకొంటాడో అప్పుడు ఆ స్వరూపమే-ఆత్మయే అవుతాడు.

**ఇక్కడే మరొక సందేహం. దేహాన్ని విడిచిన తర్వాత పునర్జన్మ లేదు. నన్నే చేరుకుంటాడు-అన్నారు కదా! అంటే భగవంతుణ్ణి చేరుకొనేది దేహం విడిచిన తర్వాత నేనా? మోక్షమనేది దేహం విడిచిన తర్వాత వచ్చేదా? అనే సందేహం రావచ్చు.**

**అసలు మోక్షం అనేది దేహం విడిచిన తర్వాత వచ్చేది కాదు. దేహం ఉండగానే పొందేది మోక్షం. ఎప్పుడు అనుభవ పూర్వకంగా నేను పరమాత్మను అని తెలుసుకుంటాడో అప్పుడే మోక్షం. అలా తెలుసుకొనటం దేహం ఉన్నప్పుడే గదా సాధ్యమయ్యేది. అయితే ఈ మోక్షం పొందిన తర్వాత కూడా ఆయుష్షు ఉన్నంత వరకు ఆ దేహం నిలిచే ఉంటుంది. అయుష్షు పూర్తయి ఆ దేహం పోయిన తర్వాత తిరిగి దేహం రాదు. జన్మ లేదు అని మాత్రమే.** సామాన్యులంతా దేహాన్ని విడిచిన తర్వాత మరొక దేహాన్ని తగిలించుకొని వస్తారు. కానీ ఈ పరమాత్మానుభవాన్ని పొందిన జ్ఞాని మాత్రం దేహాన్ని విడిచిన తర్వాత తిరిగి జన్మించటానికి వాసనలు గాని, సంచిత కర్మలు గాని లేవు గనుక, అతడు తన స్వరూపంలో నిలిచిపోతాడు.

అయితే అందరూ ఇలా పరమాత్మానుభవాన్ని పొందగలుగుతారా? తమ స్వరూపంలో నిలిచిపోగలుగుతారా? అంటే- మోక్షాన్ని పొందే అర్హత ఎవరికి?

**శ్లో॥ వీతరాగ భయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః ॥ (10)**

**తాత్పర్యము : రాగము, భయము, క్రోధము విడిచిపెట్టి, నాయందే చిత్తము నిల్పి, నన్నే ఆశ్రయించి, జ్ఞాన తపస్సు వల్ల, పవిత్రులైన ఎందరో నా స్వరూపాన్ని పొందారు.**

**వ్యాఖ్య :** స్వస్వరూప జ్ఞానాన్ని, మోక్షాన్ని పొందాలంటే గొప్ప సాధన కావాలి. ఆ సాధనా క్రమాన్ని ఇక్కడ సంక్షిప్తంగా తెలియ జేస్తున్నారు. అవి–

**1. వీతరాగ భయ క్రోధాః** – రాగ, భయ, క్రోధాలను విడిచిపెట్టాలి. ఎందుకు?–

మనం భగవంతుని వైపుకు తిరగాలి. అందుకు ప్రధానంగా మనకు అడ్డువస్తున్న దేమిటి? ప్రపంచంతో మనం పెట్టుకొనే ప్రమేయాలే. విషయాలపై, వస్తువులపై, భోగాలపై మనకుగల ఆసక్తియే. ఈ ఆసక్తిని తొలగించుకో గలిగితేనే భగవంతుని వైపుకు తిరగటం సాధ్యం. అలా తొలగించుకొనుటకే ఈ రాగ భయ క్రోధాలను విడిచిపెట్టవలసిన అవసరం ఉంది.

ఈ లోకంలో అనేక వస్తువులు, విషయాలు, భోగాలున్నాయి. వాటి పట్ల మనకు గల అభిలాష, వాటిని తెచ్చుకొని, అనుభవించి, ఆనందించాలనే కోరికయే **రాగం.** ఈ రాగం కలిగి నప్పుడు వాటినెలాగైనా సంపాదించాలని ప్రయత్నిస్తాం. ఈ ప్రయ త్నంలో వాటిని సంపాదించలేమేమోననే భావం, లేదా సంపాదిస్తే అవి మన చేతుల్లో నుండి జారిపోతాయేమో ననుకుంటే కలిగేది **భయం.** వాటిని నీవు పొందలేక పోవటానికి గాని, లేదా నీవు చేజార్చుకోవటానికి గాని ఎవరు కారణమౌతారో వారిపై కలిగేది **క్రోధం.** ఈ మూడూ వదలాలి. అలా వదిలితే మనం ప్రపంచం నుండి విడుదల పొందినట్లే. ఈ మూడింటిలోనూ ప్రధానంగా రాగాన్ని వీడాలి. అలా వీడాలంటే ఈ వస్తువులు, భోగాలు అన్నీ అనిత్యమైనవని, అవి సుఖాలను తాత్కాలికంగా ఇచ్చినా చివరకు దుఃఖాలపాలు చేస్తాయని నిరంతరం గుర్తుంచుకోవాలి. వాటిలోని దోషాలను చూడాలి. అయితే వీటిపై ఆసక్తిని వదలాలంటే మనకు ఇంకేదో గొప్ప ఆధారం కావాలి. అదే–

**2. మన్మయా–మాం ఉపాశ్రితాః** – భగవంతుని గురించి ఆలోచన చేయటం, ఆయన మహిమను గురించి తెలుసుకోవటం, ఆయన మనకు చేస్తున్న ప్రయోజనం గురించి ఆలోచించటం, ఆయనను ఆరాధించటం, ఆయననే సర్వ సంపూర్ణ శరణాగతి చెంది ఆశ్రయించటం, పూర్తిగా ఆయనపై భారం వేయటం. **నిజంగా భగవం తుడు మనకు ఏం మేలు చేస్తున్నాడు? మనకు ఆధారంగా భూమి నిచ్చాడు. దప్పిక తీర్చుకొనుటకు నీరు, ఆహారం కొరకు భూమి, పీల్చుకొనుటకు గాలి, తిరగటానికి అవకాశమిచ్చే ఆకాశం...ఇలా ఎన్నో ఇచ్చాడు. మనం తిని హాయిగా పడుకొని నిద్రపోతే తిన్న ఆహారాన్ని అరిగించి, సారాన్ని దేహభాగాలకు అందిస్తున్నాడు. అట్టి భగవంతునికి మనం ఎంతటి కృతజ్ఞులమై ఉండాలి.** ఇలా భగవంతుని ఆలోచనలతో







మనస్సు నిండాలి. అప్పుడే వస్తువులపై రాగం తొలగేది, విరాగం కలిగేది. దీనికై మనం ఏంచేయాలి.

**3. జ్ఞాన తపసా:–** భగవంతుని గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలన్నా, భగవంతుని చేరుకోవాలన్నా ఆధ్యాత్మిక జ్ఞానం కావాలి. **ఆ జ్ఞానాన్ని శాస్త్రాల ద్వారా, గురువుల ద్వారా శ్రవణం చేసి తెలుసుకోవాలి. ఆ తెలుసుకున్న జ్ఞానాన్ని మనన, నిధి ధ్యాసనల ద్వారా గట్టి పరచుకొని అనుభూతికి తెచ్చుకోవాలి. ఇదే తపస్సు. జ్ఞానం కొరకు చేసే తపస్సే జ్ఞాన తపస్సు. ఈ తపస్సు వల్లనే తనకూ భగవంతునికి తేడా లేదని– జీవుడికి దేవుడికి యదార్థంగా తేడా లేదని జీవుడే దేవుడని అభేద దృష్టి కలుగుతుంది. ఇదే జీవ బ్రహ్మైక భావం.** ఇట్టి భావం అనుభవ పూర్వకంగా కలిగితే అదే భగవత్ప్రాప్తి–భగవత్ స్వరూపాన్ని పొందటం.

ఇది కేవలం వాచా వేదాంతం కాదు. ఇలా ఎందరో సాధన చేసి ప్రపంచ వ్యామోహాల నుండి బయటపడి భగవంతుని యందే మనస్సు నిల్పి భగవత్స్వరూపాన్ని పొందారు. అందుకే 'బహవః' అన్నారు. అంతేకాదు, ఇట్టి జ్ఞాన తపస్సు వల్లనే మానవులు పునీతులౌతారు. అందుకే 'పూతాః' అన్నారు. పవిత్ర నదులలో మునిగినందునో, మన స్వార్థం కోసం చేసే పూజలు, యజ్ఞాల వల్లనో, పవిత్రత రాదు. ఈ జ్ఞానతపస్సు వల్లనే పవిత్రులౌతారు– అని భగవానుడు స్పష్టంగా తెలియజేస్తున్నాడు. ఇట్టి పవిత్రత వల్లనే పరమాత్మ స్వరూప ప్రాప్తి. ఈ శ్లోకంలో మరొక విశేషం ఉంది. పరమాత్మ ప్రాప్తికి కర్మకాండ, ఉపాసన కాండ, జ్ఞానకాండ అని వేదాలలోను, కర్మ మార్గం, భక్తి మార్గం, జ్ఞాన మార్గం –అని భగవద్గీతలోనూ తెలియజేసిన విషయాలను ఈ శ్లోకంలో సంక్షిప్తంగా తెలియజేయటం జరిగింది.

1) ప్రథమ పాదంలో **'వీతరాగ భయ క్రోధాః'** అని చెప్పటం ద్వారా **'కర్మ మార్గం'** సూచించబడింది. వస్తువులపై రాగాన్ని విడిచి కర్మ క్షేత్రంలో పనిచేయాలి–అని.

2) ద్వితీయ పాదంలో **'మన్మయా మాము పాశ్రితాః'** అని చెప్పటం ద్వారా **'భక్తి మార్గం'** సూచించబడింది. భగవంతుని యందు చిత్తాన్ని నిలిపి, ఆ భగవంతునే సర్వకాల సర్వావస్థల యందు ఆశ్రయించాలి–అని.

3) తృతీయ పాదం **'జ్ఞాన తపసా'** అని చెప్పటం ద్వారా **'జ్ఞాన మార్గం'** సూచించబడింది. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తెలుసుకొని, అనుభవానికి తెచ్చుకొనుటకు తపించాలి–అని.

ఇలా మూడు మార్గాల ద్వారా 'మద్భావం ఆగతాః' పరమాత్మ భావాన్నే పొందుతారు. ఐతే భగవంతుడు ఎవరినెలా అనుగ్రహిస్తాడు?

ఎట్టివారు భగవంతుని తత్త్వతః తెలుసుకొని ఆయనను చేరుకోగలుగుతారో ఇంతకుముందు శ్లోకంలో తెలియజేయటం జరిగింది. మరి లోకంలో ఎందరో మానవులున్నారు గదా! అందరూ భగవంతునివైపుకు తిరుగుతున్నారా? లేదు. అంటే భగవంతుని అనుగ్రహం అందరిమీదా ఉండదా? కొందరిపైనే రాగం ఉంటుందా? అసలు భగవంతునికి రాగ ద్వేషాలుంటాయా?–

**శ్లో॥ యేయథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం।**

**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః॥ (11)**

**తా : పార్థా! ఎవరు నన్ను ఎలా కొలిస్తే వారిని నేను అలాగే అనుగ్రహిస్తాను. మనుష్యులందరూ అన్నివేళలా నన్నే అనుసరిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య : చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవా! అన్నట్లు ఎవరు ఎంత భక్తితో ఏ విధంగా భగవంతుణ్ణి సేవి స్తారో, అర్చిస్తారో, ప్రార్థిస్తారో వారిని ఆ విధంగానే భగవంతుడు అనుగ్రహిస్తాడు.** భగవంతుడిలో ఏ రాగద్వేషాలు, ఇష్టా ఇష్టాలు ఉండవు. ఐతే మనం మన యొక్క కర్మల ద్వారా, భగవంతుని అనుగ్రహాన్ని పొందటమో– ఆగ్రహాన్ని పొందటమో జరుగుతుంది.

భగవంతుడు ప్రతి ప్రాణిలోను కూర్చొని ఆ ప్రాణికి శక్తినిస్తున్నాడు. ఆ శక్తిని మనం సద్వినియోగం చేసుకోవటమో, దుర్వినియోగం చేసుకోవటమో మనదే గాని భగవంతునిదేమీ లేదు.

కరెంటుతో రేడియోలో పాటలు వినవచ్చు. టి.వి.లో బొమ్మలు చూడవచ్చు, ఫ్యాన్ ద్వారా గాలిని, లైట్ ద్వారా కాంతిని పొందవచ్చు, ఫ్రిజ్ ద్వారా వస్తువులను, నీటిని చల్లబరచు కోవచ్చు, హీటరు ద్వారా నీటిని వేడిచేసుకోవచ్చు. తాకకూడని చోట తాకి ప్రాణం పోగొట్టుకోవచ్చు. కరెంటు స్వయంగా పాటలు పాడదు. బొమ్మలు చూపదు, గాలిని, వెలుతురును ఇవ్వదు, చల్లబరచదు, వేడి చేయదు. అది అన్నింటికి పక్షపాత రహితంగా శక్తినిస్తుంది. ఆ శక్తిద్వారా మనం కోరుకున్నట్లు ఫలితాలను పొందుతాం. అలాగే భగవంతుడనే చైతన్యం ద్వారా మనం మంచి పనులు చేయవచ్చు, చెడ్డ పనులు చేయవచ్చు, ఈ ప్రాపంచిక వ్యామోహాలలో మునిగిపోతూ తిరిగి తిరిగి జన్మలు తెచ్చుకుంటూ బంధంలో పడిపోవచ్చు. భగవంతుని గురించి తెలుసుకుంటూ, సాధనలు చేస్తూ మోక్షాన్ని పొంద వచ్చు. ఇలా వారి వారి భావాలకు, కర్మలకు అనుగుణంగా ఫలితాలనివ్వటమేగాని







భగవంతునికెవరి పట్లా రాగద్వేషాలుండవు. బుద్ధునిలోనూ, హంతకునిలోనూ– అందరిలోను ఉన్నది ఒకే ఒక దివ్య చైతన్య శక్తి. ఆ శక్తిలో ఏ తేడా లేదు. దానిని ఉపయోగించుకోవటంలోనే తేడా.

**మమవర్త్మానువర్తంతే మనుష్యా సర్వశః :–** మనుష్యులంతా నన్నే అనుసరిస్తూ ఉంటారు. నిజంగా మనుష్యులంతా భగవంతునే అనుసరిస్తున్నారా? లేదే, చాలా కొద్ది మంది మాత్రమే భగవంతుని గురించి ఆలోచిస్తున్నారు. భగవత్ కార్యాలు చేస్తున్నారు, మోక్ష మార్గాన ప్రయాణిస్తున్నారు. మిగిలిన అందరూ లౌకిక విషయాలలో, భోగాలలో మునిగిపోతూ వున్నారు. అయినప్పటికి ఎవరు ఎక్కడ తిరిగినా, ఏమి చేసినా, ఎలా ప్రవర్తించినా అంతా ఈ భగవంతుని సృష్టి పరిధిలోనే గదా! ఎవరు ఎన్ని కోట్లానుకోట్ల జన్మలెత్తినా, ఎలా వ్యవహరించినా చివరకు చేరుకోవలసిన చోటు ఒక్కటే. అదే పరమాత్మ. పరమాత్మ నుండి బయట పడిన మనం ఎక్కడెక్కడ తిరిగినా, ఎన్ని జన్మలెత్తినా, ఎన్ని సుఖదుఃఖాలు అనుభవించినా చివరకు బుద్ధిమంతుల్లా ఆ పరమాత్మవైపు తిరగాల్సిందే. ఆ పరమాత్మను చేరుకోవాల్సిందే. అప్పుడే శాంతి. సముద్రం నుండి వేడెక్కి ఆవిరై అంతరిక్షం లోకి ప్రవేశించిన నీరు తిరిగి వర్ష రూపంలో భూమిని చేరి, నదుల ద్వారా ఎక్కడెక్కడ తిరిగినా చివరకు సముద్రాన్ని చేరవలసిందేగదా! అలాగే సమస్త మానవులు చివరకు పరమాత్మ వైపుకు తిరిగి ప్రయాణించాల్సిందే.

కోరుకున్నవారికి కోరుకున్నట్లుగా ఇచ్చే కల్పవృక్షంగదా భగవానుడు. మరి అందరూ మోక్షాన్నే కోరుకుని భగవంతుని వైపుకు తిరగవచ్చుగదా! ఎందుకీ అల్పమైన ప్రాపంచిక విషయాలకోసం ఆయా దేవతలను ఆరాధిస్తుంటారు?–

**శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।**

**క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥ (12)**

**తా : కర్మల యొక్క ఫలితాన్ని కోరుకునే వారు ఇక్కడి దేవతలను ఆరాధిస్తూ ఉంటారు. ఎందుకంటే ఈ మానవ లోకంలో కర్మల వల్ల వచ్చే ఫలితం త్వరగా లభిస్తుంది గనుక.**

**వ్యాఖ్య :** పరమాత్మ కల్పవృక్షంలాంటివాడు. మనం తగిన విధంగా, మనస్ఫూర్తిగా, భక్తితో కోరాలేగాని ఏ కోరికనైనా తీర్చగలవాడు. మనం ఆయననే చేరుకోవాలనీ కోరుకోవచ్చు, లేదా ఈ లోకంలోని అల్పమైన, అనిత్యమైన సుఖాలు,

భోగాలు, ధన సంపదలు కావాలనీ కోరుకోవచ్చు, అవన్నీ అనిత్యమైనవి. ఆయనను చేరుకొంటే లభించేది శాశ్వత ఆనందం; అఖండమైన అనంతమైన ఆనందం. మరి అట్టి నిత్యమైన ఆనందం కొరకు ఆయననే చేరుకోవాలని కోరుకోవచ్చుగదా! కోరుకోవచ్చు, కాని ఆయనను చేరుకోవాలంటే... 1. రాగభయక్రోధాలు విడిచి పెట్టాలి. 2. ఆయననే ఆశ్రయించాలి, ఆయనయందే చిత్తాన్ని ఏకాగ్రంగా నిలపాలి. 3. పరిపూర్ణమైన జ్ఞానాన్ని, ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆ జ్ఞానం అనుభవానికి తెచ్చుకొనేందుకు అనేక సాధనల ద్వారా జ్ఞాన తపస్సు చేయాలి-అని ఇంతకు ముందు శ్లోకంలో తెలుసుకున్నాం. మరి ఈ మూడు మార్గాలను అను సరించడానికి ఎంతకాలం పడుతుంది? ఒక సంవత్సరమో, 5-10 సంవత్సరాలో, 50 సంవత్సరాలో, 4-5 జన్మలో, 100 జన్మలో ఎంత కాలం పడుతుందో ఎవరికీ తెలియదు. తీవ్రమైన మోక్షాపేక్షతో, ఏకాగ్రమైన మనస్సుతో, సూక్ష్మమైన బుద్ధితో, మహాత్ములైన గురువుల ఆశ్రయంతో, వారికి చేసే సేవలతో, ప్రాపంచిక విషయాల పట్ల, భోగాలపట్ల వైరాగ్యంతో కత్తిమీద సాములాగా ఈ సాధనలు సాగించాలి. అలా సాగించినా ఫలితం మనకు అంత త్వరగా - స్పష్టంగా కనిపించదు.

అదే ఈ లోకంలోని సుఖాలు, భోగాలు, ధనం, సంపదలు మొదలైన వాటికోసం భగవంతుని ఆశ్రయిస్తే, అర్థిస్తే, ప్రార్థిస్తే, పూజిస్తే, ఆరాధిస్తే- ఆ ఫలితాలు వెంట వెంటనే లభిస్తుంటాయి. వాటివల్ల తాత్కాలికంగానే ఐనా సంతోషం, ఆనందం కలుగుతుంది. ఇలా ఫలితం త్వరగా లభించే, ప్రత్యక్షంగా కనిపించే మార్గం ఉన్నప్పుడు; ఫలితం ఎప్పటికి వస్తుందో, అసలు వస్తుందో రాదో తెలియని ఆ మోక్షం కొరకు, పరమాత్మ ప్రాప్తి కొరకు ఏ మానవుడు ప్రయత్నిస్తాడు?

కలెక్టరు కావాలంటే డిగ్రీ చదవాలి. పోస్ట్ గ్రాడ్యుయేషన్ చెయ్యాలి. ఎన్నో పోటీ పరీక్షలకు హాజరు కావాలి. ఎంతో శ్రమపడాలి. ఇంత శ్రమపడ్డా చివరకు ఫలితం ఏమౌతుందో తెలియదు. కాని ఏదో చిన్న ఉద్యోగం కోసమైతే కొద్ది ప్రయత్నంతో, కొద్ది శ్రమతో పొందవచ్చు. అలాగే ఆకు కూరలు నెలరోజులకే వస్తాయి. కాయగూరలైతే 4 నుండి 6 నెలల వరకు ఆగాలి. సపోటా, నిమ్మ, మామిడి అయితే 5 నుండి 8 సంవత్సరాలు ఆగాలి. అందువల్ల త్వరగా ఫలితం వచ్చేవాటి కోసమే ఎక్కువమంది ప్రయత్నిస్తుంటారు.







అందుకే ఈ లోకంలో మానవులు త్వరత్వరగా ఫలితాలనిచ్చే సుఖాలు, భోగాలు, ధనసంపదలు, ఆరోగ్యం కలగాలని ఇక్కడి దేవతలను ఆరాధిస్తూ ఉంటారు. అరుదుగా ఏ కొద్దిమందో శాశ్వత ఆనందదాయకమైన మోక్షప్రాప్తికై పరమాత్మను ఆశ్రయిస్తారు.

**ఇంతకూ పరమాత్మ ఎవరు? అన్యదేవతలు ఎవరు? ఇక్కడే చాలామంది పొరబడుతుంటారు. సరైన అర్థం తెలుసుకోకపోతే మత మౌఢ్యం ఏర్పడే ప్రమాదం ఉంది.**

**మన మనోభావాలనుబట్టే మనం పరమాత్మను ఆశ్రయిస్తున్నామా? అన్య దేవతలను ఆరాధిస్తున్నామా? అనే విషయం తేలిపోతుంది. మన లౌకికమైన కోరికలను తీర్చుకోవాలనే భావంతో ఆరాధిస్తే అది అన్యదేవతారాధన అవుతుంది. అలా గాక పరమాత్మలో నిలచిపోవాలని ఆరాధిస్తే అది భగవదారాధన అవుతుంది.**

**నీవు శ్రీకృష్ణుని విగ్రహం ముందు కూర్చుని నీ కష్టం తీరిపోవాలని, లేదా ఆరోగ్యం కలగాలని, లేదా ధనం రావాలని ఆరాధిస్తే అది దేవతారాధన అవుతుంది. అదే శ్రీకృష్ణుని విగ్రహం ముందు కూర్చొని ఆయననే చేరుకొని, ఆయనలో ఐక్యమైపోవాలని కోరుకుంటే అది భగవదారాధన అవుతుంది.**

అన్యదేవతలంటే అన్యమతాలవారు ఆరాధించే జీసస్, అల్లా, బుద్ధుడు, మహావీరుడు అని; భగవంతుడంటే హిందూ మతానికి చెందిన విష్ణువు, శ్రీకృష్ణుడు అని భావిస్తే అది మత మౌఢ్యం అవుతుంది. అలాగే విష్ణువు గొప్ప, శివుడు తక్కువ అనిగాని, ఇంకా ఇలా దేవతా స్వరూపాలలో భేదాలను గాని చూచేవారు కూడా తెలియనివారు, మూర్ఖులే అవుతారు.

ఎవరినా పూజించినా, ఏ మతాన్ని అనుసరించినా, 'భగ వంతుని చేరుకోవటమే నా లక్ష్యం' అని భావించి అందుకు ప్రయత్నించే వారంతా భగవదారాధకులే. వారు ఆరాధించేది నిరాకార నిర్గుణ పరమాత్మనే. అలాగాక లౌకిక కోరికల కోసం ఏ విగ్రహాన్ని, ఏ మతాన్ని ఆశ్రయించినా వారు అన్యదేవతా రాధకులే. వారు ఆరాధించేది అన్యదేవతలనే అని గ్రహించాలి.

- అందరినీ భగవంతుడే కదా సృష్టించింది. మరి అందరినీ పరమాత్మను చేరుకొనే శక్తిగల వారిగానే సృష్టిస్తే బాగుండేది గదా! మరెందుకు అల్పమైన కోర్కెలను తీర్చుకొనే వారినిగా సృష్టించటం?

**శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।**
**తస్య కర్తార మపి మాం విద్ధ్య కర్తార మవ్యయం ॥ (13)**

**తా : వారి వారి గుణకర్మల విభాగాన్ని అనుసరించి నాలుగు వర్ణాలూ నా చేతనే సృష్టించబడ్డాయి. వాటిని సృష్టించి నది నేనే అయినా కర్తను కానని, నాశనం లేని వాడిననీ తెలుసుకో.**

**వ్యాఖ్య :** భగవంతుడు ఎలా సృష్టిస్తున్నాడు ఈ లోకంలోని మానవులను? వారి వారి గుణాలను బట్టి-వారి వారి కర్మలను బట్టి. వారి గుణాలను ఆయన మార్చటంలేదు. వారి వారి గుణాలకు తగిన రూపాలనిచ్చి దేహాలను సృష్టిస్తున్నాడు.

కంసాలికి బంగారం ఇస్తే గాజులు, నెక్లెస్, ఉంగరాలు, జూకాలు చేసి ఇస్తాడు. కుమ్మరి మట్టితో కుండలు, కూజాలు, పిడతలు, మూకుళ్లు చేస్తాడు. కంసాలిగాని, కుమ్మరిగాని వస్తువుల గుణాన్ని మార్చటం లేదు. వాటికి వేరువేరు రూపాలను మాత్రం ఇస్తున్నారు. బంగారం బంగారంగానే ఉంటుంది. మట్టి మట్టిగానే ఉంటుంది. అలాగే భగవంతుడు ఎవరి గుణాలను గాని, కర్మఫలాలను గాని, వాసనలనుగాని మార్చడు. వాటికి తగిన దేహాలనిచ్చి పంపిస్తున్నాడు. అంటే ఎవరి గుణాలను బట్టి-కర్మలను బట్టి వారికి జన్మలు వస్తున్నాయి.

ఒకడు చాలా పేదవాడు, కురూపి కూడా. అందువల్ల అందరూ వాణ్ణి చూచి, గేలి చేస్తుంటారు. వాడు వాళ్లనేమీ అనలేడు. లోలోపల కోపం, ఉక్రోషంతో ఉడికిపోతూ, నేను కూడా బాగా సంపాదించి, కోటీశ్వరుడిని అయి వీరిని నా పాదాల దగ్గర పడి ఉండేటట్లు చేయాలి అని మనస్సులో అనుకుంటూ ఉండేవాడు. అవే వాడి వాసనలు. ఎప్పుడూ రజోగుణంతోనే ఉండేవాడు. ఆ జన్మలో అనుకున్నదేదీ సాధించలేదు. మరు జన్మలో అందం, చదువు, తెలివిగల వాడిగా, ఒక సంపన్నుడికి ఒక్కడే కుమారుడిగా జన్మించాడు. వాణ్ణి ఎగతాళి చేసిన వారంతా పేదవారుగా పుట్టి వాడివద్ద పనివాళ్లుగా చేరారు. ఇప్పుడు వాళ్ళని ఏదైనా చిన్న తప్పు చేసినా, అసలు తప్పు చేయక పోయినా తిడుతూ, ఎగతాళి చేస్తూ వుంటున్నాడు. ఇదే 'ఎవరు చేసిన కర్మ వారనుభవించక తప్పదన్నా' అనే తత్వం.

భగవంతుడు గుణ కర్మలను బట్టి 4 వర్ణాలుగా సృష్టి స్తున్నాడు గదా! ఎలా?-

**1. సత్వగుణం అధికం,** రజోగుణ తమోగుణాలు అల్పంగా ఉంటే బ్రాహ్మణులుగా పరిగణించబడతారు. బ్రహ్మతత్వాన్ని అన్వేషించటం, అధ్యయనం, అధ్యాపనం చేస్తూ లోకంలో ఆధ్యాత్మిక నైతిక జీవితాన్ని ప్రేరేపించటం అతడి కర్మలు.







**2. రజోగుణం అధికం** సత్వ, తమో గుణాలు అల్పంగా ఉంటే క్షత్రియులు. వారు శాసన వ్యవస్థను చేపట్టి ధర్మరక్షణ చేస్తారు.

**3. రజోగుణం అధికం,** తమో, సత్వ గుణాలు అల్పంగా ఉంటే వైశ్యులు, వారు వృత్తి, వ్యాపారాలతో పాడి పంటలను విస్తారం చేస్తారు.

**4. తమోగుణం అధికం,** రజో, సత్వ గుణాలు అల్పంగా ఉంటే శూద్రులు. వారు వివిధ వృత్తులతో సేవల నందిస్తూ లోక శ్రేయస్సుకు పాటుపడతారు.

**ధర్మ సంస్థాపన కొరకు తనను తాను సృజించుకొని వచ్చే భగవంతుడు ఒక క్రమబద్ధమైన విధానాన్ని అనుసరించి సృష్టి జరిపాడు. అదే చాతుర్వర్ణ వ్యవస్థ. ఎవరియందు ఏ గుణం అధికంగా ఉంటుందో, ఎవరెట్టి కర్మ ప్రవృత్తి కలిగి ఉంటారో దానికి అనుగుణంగానే ఈ వ్యవస్థ సృష్టించబడింది.**

**ఈ వర్ణ వ్యవస్థ కేవలం భారతదేశంలోనే గాదు. పేరు మార్పుతో ప్రపంచ మంతటా ఉన్నది. శిక్షక వర్గం (బోధక వర్గం), రక్షక వర్గం (అధికార వర్గం),వణిక్ వర్గం (వ్యాపార, పారిశ్రామిక వర్గం), శ్రామిక వర్గం (కార్మికులు). అయితే ఈ వర్ణ వ్యవస్థ జన్మతో వచ్చేది కాదు. గుణకర్మలతో ఏర్పడ్డది.**

ఈనాడు వర్ణ వ్యవస్థ మింగటానికీ వీల్లేదు, కక్కటానికీ వీల్లేదు అన్నట్లు తయారైంది. ఎందుకంటే జన్మను బట్టే వర్ణం అనుకోవటం వల్ల. పుట్టుక వల్ల బ్రాహ్మణుడైనవాడు వ్యాపారం చేస్తాడు. పుట్టుకతో వైశ్యుడు వేదవేదాంగాలను అభ్యసించి, అధ్యయనం చేసి, అధ్యాపనం చేస్తాడు. పుట్టుకతో శూద్రుడైనవాడు దేశ రక్షణలో ఉంటాడు. లేదా శాసన వ్యవస్థలో ఉంటాడు. కనుక ఈ వర్ణ వ్యవస్థ పుట్టుక వల్ల నిర్ణయించబడేది కాదు.

ఈ నాలుగు వర్ణాలనూ సృష్టించింది భగవంతుడే అయినా ఆయన కర్త కాదు. ఎందువల్ల? ఎవరెవరి గుణకర్మలను బట్టి వారివారి వర్ణాలను సృష్టిస్తున్నాడే గాని వారి గుణాలను, కర్మలను, వాసనలను ఆయన ఏ మాత్రం మార్చడు; పట్టించుకోడు. ఆయన నిర్లిప్తంగా, ఏ వికారాలు చెందకుండా, ఏ మార్పులు చేర్పులు లేకుండా చేస్తున్నాడు గనుక చేసినా చేయనివాడే. **అకర్తయే.** సాధారణంగా కర్మలు చేస్తే శక్తి ఖర్చవుతుంది. కాని భగవంతుడు ఏ కర్మ చేస్తున్నా శక్తి ఖర్చుకాదు. కనుక అవ్యయుడు, అవ్యయ అకర్త.

భగవంతుడు కర్త అయితే మనకేం? కర్త కాకపోతే మనకేం? ఆయన కర్త కాకపోతే ఎంతో ప్రయోజనం ఉంది. కర్త అయితే ఎంతో నష్టం ఉంది. ఏమిటా ప్రయోజనం? నష్టం?–

**శ్లో॥ నమాం కర్మాణి లింపంతి నమే కర్మ ఫలే స్పృహా।**
**ఇతి మాం యోభిజానాతి కర్మ భిర్నస బధ్యతే॥ (14)**

**తా : నన్ను కర్మలంటవు. కర్మ ఫలంపై నాకు ఆసక్తిలేదు. ఈ ప్రకారంగా నన్ను ఎవరు తెలుసుకుంటారో అతడు కర్మలచేత బంధింపబడడు. (అతణ్ణి కర్మలు బంధించవు)**

**వ్యాఖ్య :** భగవంతుడు నాలుగు వర్ణాలను ఎందుకు సృష్టించినట్లు? అందరూ వారి వారికి కేటాయించిన కర్మల ద్వారా తరించేందుకే. దీనివల్ల భగవంతునికేమి ప్రయోజనం? ఏమీ లేదు. అంటే ఆయనకు ఈ కర్మల వల్ల ఏదో ఫలితం కావాలనే ఆసక్తి లేదు. కర్మ ఫలాసక్తి లేకుండా కర్మలు చేసినందున ఆ కర్మలు అతడిని అంటవు. కర్మఫలంపై కోరికతో కర్మ చేసినప్పుడు ఫలం అనుభవించాలి గనక ఆ కర్మ బంధం అవుతున్నది.

అసలు భగవంతునికి కోరికలు ఉంటాయా? ఉండవు. ఎందుకంటే ఆయన పరిపూర్ణుడు. ఆయనకే కొరతలులేవు. అందువల్ల కోరికలు ఉండవు. **మరి మనం భగవత్స్వరూపులమే గదా! మనకెందుకు కోరికలుంటున్నాయి?– ఎందుకంటే మనం మన యదార్థ స్వరూపం భగవంతుడే అని తెలుసుకోలేక జీవుణ్ణి అనుకుంటున్నాం. అంటే పరమాత్మ ఐన మనం ఈ దేహం, మనోబుద్ధులలో కూర్చొని, మనను మనం మరిచిపోయి జీవా త్మగా ఉంటున్నాం. అలా ఉంటున్నాం గనుక మన బుద్ధిలోని వాసనల కనుగుణంగా కోరికలను కోరి కర్మలు చేస్తుంటాం. అందువల్ల బంధంలో చిక్కుకుంటున్నాం.**

పైన సూర్యబింబం క్రిందనున్న బక్కెట్టులోని నీటిలో ప్రతి బింబించింది. నీరు గాలికి చెదిరినప్పుడు ఆ ప్రతిబింబం కూడా కదులుతుంది. కాని, అసలు సూర్యబింబం కదులుతుందా? లేదు. స్థిరంగా ఉంటుంది. మరి ఈ ప్రతిబింబం యొక్క కదలికకు కారణం ఏమిటి? నీటియొక్క కదలిక వల్లనే. సూర్యు డనే పరమాత్మ బక్కెట్టు అనే దేహంలోని మనస్సనే నీటిలో ప్రతి బింబించినపుడు అది జీవాత్మగా ఐపోయింది. మనస్సనే నీరు కదులుతుంటే ఈ ప్రతిబింబమనే జీవాత్మ







కదులుతున్నది. కనుక పరమాత్మ పరమాత్మగానే ఉంటే ఏ కోరికలు లేవు. కాని ఈ దేహ మనో బుద్ధులలో ప్రతిబింబించి జీవాత్మయై మనస్సులోని వాసనల కనుగుణంగా కోరికలతో వేగిపోతూ కర్మలు చేయటం, ఆ కర్మల వల్ల కర్మ ఫలాలు రావటం, దానితో బంధంలో చిక్కుకోవటం జరుగుతున్నది.

**ఈ ప్రకారంగా ఎవరైతే తెలుసుకుంటారో అతడు కర్మల చేత బంధించ బడడు. ఎలా? మనం ఏ కర్మలు చేస్తున్నా– ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా, కర్మ ఫలంపై ఆసక్తి లేకుండా, 'అసలు నేను చేస్తున్నాను' అనే కర్తృత్వ భావన లేకుండా నిర్లి ప్తంగా కర్మలు చేస్తే ఆ కర్మఫలాలు బంధాలు కావు. ఇదే ఫలాసక్తి లేకుండా కర్మలు చేస్తే ప్రయోజనం. అలాకాక చేసే కర్మలతో సంగభావం పెట్టుకొని, కర్మఫలంపై ఆసక్తితో, 'నేను చేస్తున్నాన'నే కర్తృత్వంతో కర్మలు చేస్తే బంధంలో చిక్కుకుంటాం. ఇదే నష్టం– కర్తగా కాకుండా కర్మలు చేసి తరించే ఈ ఉపాయం క్రొత్తదా? లేక పూర్వం నుండి ఉన్నదేనా?–**

**శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।**
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం॥ (15)**

**తా : ఇది తెలిసే పూర్వం ముముక్షువుల చేత కర్మ చేయ బడింది. అందువల్ల పూర్వీకులచేత పూర్వం కర్మ చేయబడినట్లే నీవు కూడా నిష్కామ కర్మను చెయ్యి.**

**వ్యాఖ్య :** తాను చేసే కర్మల యొక్క ఫలితంపై ఏమాత్రం ఆసక్తి లేకుండా – ఈ కర్మను నేనే చేస్తున్నాను– అనే భావన (కర్తృత్వ భావన) లేకుండా భగవంతుడు కర్మలు చేస్తూ కూడా అకర్తగా ఉంటున్నాడు. ఈ రహస్యాన్ని తెలుసుకొని కర్మలు చేసేవారు కర్మలచేత బంధించబడరు. వారికి మోక్షానికి అర్హత లభించినట్లే.

మోక్షార్థులైన ముముక్షువులు అనేకులు ఈ రహస్యాన్ని తెలుసుకొని పూర్వం ఈ నిష్కామ కర్మలాచరించారు. కర్మబంధం నుండి తప్పించుకున్నారు, తరించారు.

అలాగే ఓ అర్జునా! నీవు కూడా కర్మఫలంపై ఆసక్తిని విడిచిపెట్టి; నేను ఈ కర్మ (యుద్ధం)ను చేసే కర్తను; దీని ఫలితాన్ని (విజయాన్ని) అనుభవించే భోక్తను అనే భావాన్ని విడిచిపెట్టి, కర్మను (యుద్ధాన్ని) చెయ్యి. అందుకే **'కురుకర్మ ఏవ'** అంటున్నాడు భగవానుడు. అంటే నిష్కామకర్మనే ఆచరించు – అని.

'పూర్వతరం' అన్నందువల్ల ఇది పూర్వీకులు ఆచరించి నదేనని, క్రొత్త విషయం, క్రొత్త మార్గం కాదని, కనుక నిస్సం దేహంగా, నిర్భయంగా ఆచరించవచ్చునని

తెలుస్తున్నది. మార్కెట్లోకి ఏదైనా క్రొత్త వస్తువు వస్తే ఇది ఎంత బాగా పని చేస్తుంది? ఎంత మన్నికగా ఉంటుంది? అనే విషయంలో మనకు సందేహం ఉంటుంది. అదే చాలాకాలం నుండి ఉన్న వస్తువే అయితే, దాని గురించి మనకు అన్ని విషయాలు తెలిసే ఉంటాయి. అందువల్ల ఎంతో నమ్మకంతో, భరోసాతో దానిని కొంటాం. అలాగే ఓ అర్జునా! ఈ నిష్కామ కర్మయోగ విధానం పూర్వకాలం నుండి ఆచరణలో ఉన్నదే గనుక, ధైర్యంగా అసంగ భావంతో నీ కర్తవ్య కర్మను (యుద్ధాన్ని) చెయ్యి. అంటున్నాడు భగవానుడు.

ఈ నిష్కామ కర్మలను, లేదా కర్తృత్వ భావన లేకుండా చేసే కర్మలను ఎప్పటి వరకు చేయాలి? అంటే ఎప్పుడూ చేయాల్సిందే. అంటే జ్ఞాననిష్టలో కుదురుకొనేంతవరకు తప్పక చేయాల్సిందే. మరి తర్వాతనో–అవసరం లేకపోయినా, చెయ్యాలని అనుకోకపోయినా జరిగిపోతుంటాయి.

నీవు మోక్షాన్ని పొందాలనే కోరికగల ముముక్షువు ఐతే– 'సర్వకర్త భగవంతుడే; నేను కేవలం భగవంతుని చేతిలో పనిముట్టును'–అని చేయాలి. ఇక ముక్తుడవే ఐతే– 'ఇదంతా వ్యవహార మాత్రం; దేహేంద్రియాలు వాటి పని అవి చేసుకుంటూ ఉన్నాయి' అనే దృష్టితో చెయ్యి.

ఈ శ్లోకానికి శంకరాచార్యులవారు భాష్యం వ్రాస్తూ–

'ఆత్మజ్ఞాని కాకపోతే అంతఃశుద్ధి కొరకు నిష్కామ కర్మలు చేయాలి. ఆత్మజ్ఞాని ఐతే పూర్వీకులైన జనకాదులవలె లోక సంగ్రహార్థం కర్మలు చేయాలి.' అన్నారు.
– ఇక కర్మలు ఎన్ని రకాలో, అవేమిటో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

**కర్మ అంటే ఏమిటి? అకర్మ అంటే ఏమిటి?**

***శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయో ప్యత్ర మోహితాః ।***
***తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్ ॥*** **(16)**

**తా॥ కర్మ అంటే ఏమిటి? అకర్మ అంటే ఏమిటి? అనే విషయంలో ఋషులు కూడా మోహం చెందుతున్నారు. దేనిని తెలుసుకుంటే నీవు ఈ సంసార బంధం నుండి విడుదల పొందు తావో ఆ కర్మ గురించి నీకు చక్కగా తెలియజేస్తాను.**

**వ్యాఖ్య :–** మన శరీరం పనిచేస్తూ ఉంటే కర్మ అని, పనిచేయకుండా ఊరకే ఉంటే అకర్మ అని అనుకుంటాం. అయితే ఇది పైపై అర్థం– వాచ్యార్థం మాత్రమే. కాని నిజమైన అర్థం ఏమంటే కర్మను బాహ్య చేష్టల ద్వారా కాకుండా, ఆ చేష్టల







వెనుకనున్న సూక్ష్మమైన ఉద్దేశాలను బట్టి నిర్ణయించాలి. ఎందు కంటే **బాహ్యమైన పని ఏదైనా అది మంచియని గాని, చెడ్డ అని గాని నిర్ణయించలేం. దాని వెనుకనున్న ఉద్దేశాన్ని బట్టే మంచి– చెడులను నిర్ణయంచగలం.**

**ఒకడు ఒక బాలిక చేతి ఉంగరాన్ని కాజేయటానికి లాగి చూచాడు. రాలేదు. దానితో ఆ బాలిక వ్రేలును కోసి ఆ ఉంగ రాన్ని తీసుకున్నాడు. ఆ వ్రేలును కోస్తుంటే ఎంతో బాధ, రక్తం కారిపోతున్నది.**

**ఒక డాక్టరు ఒక పేషంటు కాలి వ్రేళ్లను కోసి తీసేశాడు. ఎందుకంటే అతడు డయాబెటిక్ పేషంటు. తుప్పుపట్టిన సీలను త్రొక్కి 10 రోజులు ఎవరికీ చెప్పకుండా ఉన్నాడు. దానితో సెప్టిక్ అయింది. ఆ వ్రేళ్ళ వరకు తీసేస్తే తప్ప అతడు బ్రతకడు. అలా తీసేసేటప్పుడు ఎంతో రక్తం కారుతుంది. బాధగా ఉంటుంది. ఇప్పుడు దొంగ, డాక్టరు–ఇద్దరూ చేసిన పని ఒక్కటే. వ్రేళ్లను కోసి వెయ్యడం. అయితే చిక్కితే దొంగను శిక్షిస్తాం. డాక్టరుకు ఫీజు ఇచ్చి వస్తాం. ఎందుకు? ఆ చేసిన పని వెనుక ఉన్న ఉద్దేశాన్ని బట్టి. దొంగ చేసిన పని చెడ్డది, డాక్టరు చేసిన పని మంచిది– అని మనకు తెలుసు.**

కనుక కర్మ స్వరూపం ఎలాంటిదైనా స్వభావాన్ని పరిగణన లోకి తీసుకోవాలి. అందువల్ల ఈ విషయంలో **'కవయః'**– పండితులు కూడా భ్రాంతి చెందుతున్నారు. పండితులు అంటే ఆత్మతత్త్వమునెరిగి, ఉపనిషత్తులను–అమృత మయమైన సత్య తత్త్వాన్ని ఇతరులకు బోధించగలవారు. అట్టివారు కూడా ఈ కర్మ–అకర్మల విషయంలో పొరబడుతున్నారు. కనుక ఆ విషయాలను నీకు బోధిస్తున్నాను అంటున్నాడు భగవానుడు.

**ఈ కర్మల విషయం తెలుసుకుంటే ఏమిటి ప్రయోజనం?**

**అశుభాత్ మోక్ష్యసే :–** అశుభాల నుండి, దుఃఖాల నుండి, ఈ జనన మరణ రూప సంసార దుఃఖం నుండి, సర్వ కర్మ బంధనాలనుండి విముక్తి లభిస్తుంది. కనుక మనం సర్వ దుఃఖాలనుండి విముక్తిని పొందటానికే, పండితులు కూడా తికమక పడుతున్న ఈ కర్మ అకర్మల విషయాన్ని భగవంతుడు దయతో తెలియజేస్తున్నాడు. ఏమని?–

***శ్లో॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః ।***
***అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥*** **(17)**

**తా॥ కర్మల గురించీ తెలుసుకోవాలి. వికర్మల గురించీ తెలుసుకోవాలి. అకర్మల గురించి కూడా తెలుసుకోవాలి. కర్మల యొక్క మార్గం మహా నిగూఢమైనది.**

**వ్యాఖ్య :-** శాస్త్రం విధించిన కర్మ లేదా ముక్తికి దారితీసే కర్మ ఏదో తెలుసు కోవాలి. అది కర్మ. శాస్త్రం నిషేధించిన కర్మ లేదా బంధాన్ని కలిగించే కర్మ ఏదో తెలుసుకోవాలి. అది వికర్మ. శాస్త్రం చెప్పినట్లుగా చేయకుండా ఊరికే ఉండటం అకర్మ. దీనినీ తెలుసుకోవాలి. ఎందుకు వీటిని తెలుసుకోవటం?-

**శాస్త్రం విధించిన కర్మ ఏదో తెలియకపోతే ఎలా ఆచరించగలుగుతావు? శాస్త్రం నిషేధించిన కర్మ ఏదో తెలియకపోతే ఎలా జాగ్రత్త పడతావు? పనులు మానేసి ఊరికినే ఉంటే అకర్మ అంటే ఏమిటో తెలియకపోతే ఉన్నత స్థితికి ఎలా చేరుకుంటావు? అందుకే వీటిని గురించి చక్కగా - విపులంగా తెలుసుకోవాలి.**

మనం జీవించి ఉన్నంతకాలం ఎలాగూ కర్మలు చేస్తూనే ఉంటాం. అయితే వాటి తత్త్వం- స్వభావం ఏమిటో తెలుసు కోవటమే జ్ఞానం. **అలా జ్ఞానంతో కర్మలు చేస్తేనే బంధాలు తొలగిపోయేది. అజ్ఞానంతో కర్మలు చేస్తే అవి దుఃఖాన్ని, బాధను, అలసటను కలిగిస్తాయే గాని సుఖాన్ని, ఆనందాన్ని ఇవ్వవు.**

ఒక గ్రామంలో ఒక భక్తుడు ఒక గురువును ఆశ్రయించి మంత్రోపదేశం పొందాడు. ఏకాంతంలో కూర్చొని, అక్షర లక్ష జపించమన్నాడు గురువు. ఇంటికి వెళ్ళి జపం ప్రారంభించాడు. ఇంట్లో పిల్లలగోల వల్ల కుదరలేదు. సమీపంలోని ఒక తోటలో చెట్టు క్రింద కూర్చొని మొదలుపెట్టాడు. పక్షులు రెట్టలు వేస్తూ గోల చేస్తున్నాయి. ఏకాగ్రత కలగటం లేదు. దానితో సమీపం లోని నదికి వెళ్ళి నడుములోతు నీళ్ళల్లో నిలిచి జపం ప్రారంభించాడు. అక్కడ పెద్ద చేపలు చిన్న చేపలను మ్రింగుతున్నాయి. హింసాయుత వాతావరణం. జపం కుదరలేదు.

"ఛీ! ఛీ! ఇంట్లో పిల్లలగోల, వనంలో పిట్టలగోల, నదిలో చేపలగోల. ఇక ఈ జన్మలో నాకు జపసిద్ధి కలగదు. ఈ పాడు జీవితాన్ని వదలి, మరో "ఉత్తమ జన్మను పొంది గురువుగారికిచ్చిన మాటను నిలబెట్టుకోవాలి.." అని నిర్ణయించుకుని, దూరంగా ఉన్న అడవికి వెళ్లి, కట్టెపుల్లలన్నీ ఒకచోట చేర్చి అగ్ని ముట్టించాడు. చితిలో దూకబోతుండగా ఒక ముదుసలి వచ్చి అడిగాడు. తన బాధనంతా చెప్పాడు. అంతా విని ముసలివాడు "నాయనా! నీ ఇష్టాన్ని నేను కాదనను. అలాగే చెయ్యి. కాని ఇక్కడకు ఫర్లాంగు దూరంలో మా ఊరుంది. నీవు కాలిపోతే







ఆ దుర్గంధం మా పల్లెకు చేరుతుంది. అందరికీ రోగాలొస్తాయి. కనుక ఎలాగూ చచ్చే వాడివి ఇక్కడే ఎందుకు? కాస్త దూరంగా వెళ్ళి చావు" అన్నాడు.

"ఛీ! పాడులోకం. ఉండనియ్యదు, మండనియ్యదు" అను కుంటూ బుద్ధి మార్చుకొని ఇంటిదారి పట్టాడు. సుఖం కోసం, శాంతి కోసం, చెయ్యాలనుకున్న జపం ఇలా అయింది. కనుక అజ్ఞాని ఏ కర్మలో ప్రవేశించినా దుఃఖకరమే. అందుకే జ్ఞానంతో కర్మలు చెయ్యాలి.

**అన్ని పరిస్థితులు అనుకూలిస్తే సాధనలు చేస్తానని కూర్చోరాదు. కోపంతో వదిలెయ్య కూడదు. ప్రాణం తీసుకోకూడదు. ఇదే అజ్ఞానం.**

**"శాంతాకారం భుజగశయనం" పడుకున్నది పాముపైన, కాని శాంతాకారుడై యున్నాడు నారాయణుడు. ఈ సంసారమనే పాము పడగ నీడలో ఉన్నా మనం జ్ఞానంతో కర్మలాచరిస్తే శాంతంగా, ప్రశాంతంగా ఉండవచ్చు. అదొక కళ. ఆ కళను సాధించాలి.** అందుకే భగవానుడిక్కడ స్వయంగా కర్మ- అకర్మ- వికర్మల గురించి తెలుసుకోవాలి అంటున్నాడు. తెలియజేయ బోతున్నాను అంటున్నాడు.

**1. నిర్మాణాత్మక కర్మ- చేయదగిన కర్మ- ముక్తికి దారితీసే కర్మ - కర్మ.**

**2. వినాశాత్మక కర్మ - చేయకూడని కర్మ - బంధానికి దారితీసే కర్మ - వికర్మ.**

**3. అసలు చేయవలసినవి చేయకుండుట - అకర్మ.**

ఇలా తెలుసుకోవాలి. అయితే కర్మలతత్త్వం గహనం, అత్యంత నిగూఢం అని చెప్పటంలో ఉద్దేశ్యం ఏమిటి? అంటే మానవులు చేసే కర్మలను వీటిక్రింద విభాగించటం చాలా కష్ట మని చెప్పటమే. వినాశాత్మక కర్మను కూడా స్వార్థంతో ఆలో చించేవాడు చేయదగిన కర్మగానే భావిస్తాడు. **నీ స్కూటరుకు ఎదురుగా వచ్చి డాష్ ఇచ్చినవాడి తల పగులగొట్టావు. ఇప్పుడది ఏ కర్మ? చూచే వారందరికీ అది వినాశాత్మక కర్మ. కాని నీవు మాత్రం చేయదగిన కర్మయేనంటావు. కనుక యదార్థతత్త్వం తెలుసుకోవాలి.**

ఇంతకూ చేయదగిన కర్మను చేసిన బుద్ధిమంతుడెట్టివాడు?

***శ్లో॥ కర్మణ్య కర్మయః పశ్యేత్ అకర్మణిచ కర్మయః ।***
***సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్ ॥*** **(18)**

**తా॥ కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను ఎవడు చూస్తాడో అతడే మనుష్యులలో బుద్ధిమంతుడు. అతడే యోగి. చేయదగిన కర్మను చేసినవాడు అతడే.**

**వ్యాఖ్య :-** క్రిందటి శ్లోకంలో కర్మ, వికర్మ, అకర్మ అని మూడింటిని చెప్పి ఇక్కడ కర్మ, అకర్మ రెండింటినే చెబుతున్నారు. ఎందుకని? కర్మ అంటే చేయదగినది, వికర్మ అంటే చేయగూడ నిది. రెండూ కర్మలే కనుక రెంటినీ ఒక్కటిగా చెప్పారు. ఇదొక కూట శ్లోకం. అంటే గూఢార్థంతో కూడిన శ్లోకం. ఏ స్థాయిలో వారు ఆ స్థాయిలో ఆలోచించడానికి, ఆచరించడానికి వీలున్న శ్లోకం.

***కర్మలో అకర్మను చూచుట:-*** సినిమా తెరపై పెళ్ళిళ్ళు, చావులు, ప్రేమలు, హత్యలు, యుద్ధాలు, పరోపకారాలు ఎన్ని జరిగి పోతున్నా ఆధారంగా ఉన్న తెరమాత్రం నిశ్చలంగా, కేవలంగా, ఊరికే ఉంటుంది. అలాగే ఈ దేహేంద్రియాలద్వారా ఎన్ని కర్మలు జరిగిపోతున్నా తాను మాత్రం ఆత్మ స్థితిలో ఉండి, ఆ కర్మలకు కేవల సాక్షిగా ఉంటూ, తాను ఏమీ చేయటం లేదని తెలుసుకొని అలా ఉండిపోవుటయే "కర్మలో అకర్మను చూచుట" అంటే. అట్టివాడే జ్ఞాని.

***అకర్మలో కర్మను చూచుట:-*** శరీరం నిశ్చలంగా ఉన్నప్పుడు ఒక కవి ఒక గేయాన్నో, కావ్యాన్నో మనసులో తయారు చేసుకుంటూ ఉంటాడు. అది సృజనాత్మక కర్మ. అలాగే శరీరం, మనస్సు నిశ్చలంగా ఉన్నప్పుడు ఒక సైంటిస్టు బుద్ధి నూతన విషయాన్ని గురించి పరిశోధిస్తుంది. అది ప్రశస్థమైన కర్మ. ఇక శరీరం, మనస్సు, బుద్ధి – ఈ మూడింటిని నిశ్చలం చేసి సమాధి స్థితిలో తాను కేవల ఆత్మగా, నిలిచిపోవటం అసాధారణ మైన, అద్భుతకర్మ. ఇదే అకర్మలో కర్మను చూచుట అంటే. ఇతడే జీవిత లక్ష్యాన్ని సాధించిన వాడు. ఆత్మ జ్ఞాని.

**బుద్ధిమాన్ :-** ఇలా ఎవరైతే కర్మలో అకర్మను; అకర్మలో కర్మను చూస్తాడో అట్టివాడే మనుష్యులలో బుద్ధిమంతుడు. బుద్ధిని లౌకిక విషయాల్లో వినియోగించిన వాడు సామాన్యుడే. అలా కాక జన్మ సార్థక్యహేతువైన ఆత్మలో నిలపగలవాడే నిజమైన బుద్ధిమంతుడు. అతడు బుద్ధిమంతుడే కాదు. యోగి. అంటే పరమాత్మతో కలయికను సాధించినవాడు. అంతేకాదు. అతడు ఏ లక్ష్యాన్ని సాధించటానికి ఈ మానవజన్మ ఎత్తి వచ్చాడో ఆ లక్ష్యాన్ని సాధించినవాడు. అందుకే అతడు **'కృత్స్న కర్మకృత్'** చేయదగిన కర్మను చేసినవాడు.







ఈ కర్మ –అకర్మల జ్ఞానమే ఈ జ్ఞానయోగం ప్రతిపాదించిన సిద్ధాంతం. ఈ జ్ఞానాన్ని తెలుసుకొని విజ్ఞానంగా మలచుకొనగలవాడే యదార్థం తెలిసినవాడు, పరమార్థాన్ని అందుకున్న బుద్ధిమంతుడు.

–ఇలా కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూడటం ఎవరికి సాధ్యపడుతుంది? ఏ రకమైన ఆచరణ, ఏ రకమైన భావాలుకలవాడు ఆ ఉన్నత స్థితిని చేరుకుంటాడు?– రాబోయే 5 శ్లోకాల్లో సాధనా మార్గాన్ని తెలియజేయబోతున్నాడు భగవానుడు.

***శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః ।***

***జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం తమాహుః పండితం బుధాః ॥*** **(19)**

**తా॥ కామ సంకల్పాలు లేకుండా సమస్త కర్మలను ఎవరు ప్రారంభిస్తారో, కర్మ ఫలాలను జ్ఞానాగ్నిలో ఎవరు దగ్ధం చేసు కుంటారో అట్టివానిని వివేకి అని విజ్ఞులంటారు.**

**వ్యాఖ్య :-** కామ సంకల్ప వర్జితాః... 1.కామవర్జితాః– కోరిక లేకుండా, 2. సంకల్ప వర్జితాః... సంకల్పం విడిచిపెట్టి ....

1. సాధారణంగా అందరూ ఏవేవో కోరికలతోనే కర్మలు చేస్తుంటారు. ఈ లోకంలో సుఖాలు, భోగాలు అనుభవించాలని, మరణానంతరం పైలోకాల్లో కూడా భోగాలు అనుభవించాలని చేస్తుంటారు. **ఇలా కోరికలతో చేసే కర్మలు మనకు బంధమై కూర్చుంటాయి. అవి దాన ధర్మాలు కావచ్చు, పుణ్యకార్యాలు కావచ్చు, గుళ్ళు గోపురాలు కట్టించడం కావచ్చు. అవి మంచి కర్మలే అయినా ఆ కర్మల ఫలం మనకు బంధమై ఈ లోకానికి కట్టిపడేస్తుంది. అంటే మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ ఉండాల్సిందే. 2. సంకల్పం లేకుండా కూడా చేయాలి. అంటే కర్మలన్నీ 'నేను' సంకల్పిస్తేనే జరుగుతాయి. ఈ నేను అనే కర్తయే అహంకారం. ఎప్పుడైతే కర్త ముందుకొచ్చాడో–అంటే ఈ కర్మ 'నేను' చేస్తున్నాను అనే భావంతో చేస్తాడో ఆ కర్మఫలం కర్తకు వచ్చి, అది బంధమై కూర్చుంటుంది. కనుక నేను కర్తను అనే భావాన్ని అంటే కర్తృత్వాభిమానాన్ని విడిచి నిర్లిప్తంగా కర్మలు చేయాలి. అదే 'సంకల్ప వర్జితాః'.**

**సర్వే సమారంభాః–** ఇలా అన్ని కర్మలను కోరిక విడిచిపెట్టి – అంటే నిష్కామంగాను; అలాగే సంకల్పాన్ని విడిచిపెట్టి – అంటే కర్తృత్వాభిమానాన్ని

విడిచిపెట్టి 'సర్వే' అన్ని పనులను చేయాలి. అప్పుడే సర్వకర్మలు బంధం కాకుండా పోయేది.

**జ్ఞానాగ్ని *దగ్ధ కర్మాణాం* :– మరి తెలిసో, తెలియకో ఇంతకు ముందు అనేక కర్మలను కోరిక తోను, కర్తృత్వ భావన తోను చేశాం గదా! అవన్నీ బంధనాలై కూర్చున్నాయి గదా! మరి ఆ బంధనాలనెట్లా వదిలించుకోవాలి? జ్ఞానాగ్నిలో దగ్ధం చేయాలి. మనం కర్మలు అజ్ఞానంలో చేశాం. కనుక అవి బంధమై కూర్చు న్నాయి. అజ్ఞానంలో నుండి జ్ఞానంలోనికి మేలుకుంటే ఆ కర్మలన్నీ దగ్ధమైపోతాయి.**

ఉదాహరణకు స్వప్నంలో నీవొక వ్యక్తిని హత్య చేశావు. దానివల్ల నీకు 10 సంవత్సరాలు జైలు శిక్ష పడ్డది. ఆ శిక్షను అలా స్వప్నంలో అనుభవిస్తున్న నీవు స్వప్నంనుండి జాగ్రత్ లోకి మేలుకున్నావనుకో. ఇప్పుడా శిక్ష అనుభవించాలా? అక్కరలేదు గదా! అలాగే అజ్ఞానంలో (జాగ్రత్‌లో) చేసిన కర్మలన్నీ జ్ఞానంలో – జ్ఞానాగ్నిలో దగ్ధమైపోతాయి. **అసలు జ్ఞానమంటే ఏమిటి? "నేను ఆత్మను" అని గ్రహించి, ఆత్మగా ఉండి పోవటమే జ్ఞానం. స్వస్వరూప జ్ఞానమే జ్ఞానం. 'నేను అన్నీ చేస్తూ, అనుభవిస్తూ ఉండే జీవుణ్ణి – అని అనుకోవటమే అజ్ఞానం. 'నేను అకర్తను, అభోక్తను ఐన ఆత్మనే' అని తెలుసుకొని అలా ఉండిపోవటమే జ్ఞానం. ఆ స్థితిలో అన్ని కర్మలు–కర్మఫలాలు దగ్ధమై పోతాయి.** అట్టివానినే పండితుడు–వివేకి అంటాడు. అట్టి జ్ఞాన స్థితిలో అతడు ఏ కర్మలు చేసినా చేయనట్లే. ఎందుకంటే నేను చేస్తున్నాననే భావన లేదు గనుక.

– అలా కర్మలు చేసినా, చేయనివాడే కావాలంటే ఎలా?

***శ్లో॥ త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।***
***కర్మణ్యభి ప్రవృత్తో పి నైవకించిత్ కరోతి సః ॥*** **(20)**

**తా॥ కర్మ ఫలంతో సంగభావాన్ని విడిచిపెట్టి, నిత్యతృప్తుడై యుండి, దేనిమీదా ఆధారపడకుండా కర్మలలో నిమగ్నుడైయున్న ప్పటికీ, ఏ కర్మా చేయనివాడే.**

**వ్యాఖ్య : కర్మఫలాసంగం త్యక్త్వా :–** ఒక్కొక్కసారి ఏ కోరికా లేకుండా కర్మలు చేయటం ప్రారంభించినా, ఆ కర్మలు జరుగు తున్నప్పుడు ఫలితం ఏమి వస్తుందా? అనే ఆసక్తి కలగవచ్చు. ఆ కర్మఫలాన్ని గురించి ఆలోచిస్తుంటే దానికి బానిసలమైపోయే ప్రమాదం ఉంది. అందువల్ల మనస్సు అలసిపోయి కర్మలను నైపుణ్యంతో చేయలేక పోవచ్చు. కనుక ఫలితంతో సంగభావం పెట్టుకోవద్దు అని







హెచ్చరిస్తున్నాడు భగవానుడు. **ఇక్కడ కర్మ ఫలాన్ని విడిచిపెట్టమనటంలేదు. కర్మ ఫలంపై ఉన్న ఆసక్తిని – సంగభావాన్ని మాత్రం విడిచిపెట్టమంటున్నాడు.**

**నిత్యతృప్తః:–** నీ మనస్సు తృప్తితో నిండి ఉంటే ఏమీ కోరవు. అంతేకాదు. అలా తృప్తితో ఉన్నప్పుడు సంతోషంతో, నైపుణ్యంతో కర్మలు చేస్తావు. కర్మఫలంపై ఆసక్తి ఉండదు. అదే తృప్తిలేనివాడు ఏది కొరతగా ఉందనుకుంటాడో దానిని సాధించటానికి ప్రయత్నం చేస్తాడు. ఎందరినో ఆశ్రయిస్తాడు. తనకు చేతగాక పోయినా ఎవరైనా సహాయం చేస్తారేమోనని ఎదురుచూస్తాడు.

**నిరాశ్రయః :–** తృప్తిగా –నిత్యం తృప్తిగా ఉండే వ్యక్తి; ఉన్నదానితో సంతృప్తి చెందే వ్యక్తి ఎవరినీ ఆశ్రయించడు. ఎవరిమీదా, దేనిమీదా ఆధారపడడు. అతడే నిరాశ్రయుడు.

సాధారణంగా అందరూ జీవభావంలోనే ఉంటారు. నేను జీవుణ్ణి అనుకున్నవాడు పరిమితుడైపోతాడు. అందువల్ల కొన్ని ఉన్నాయి. కొన్నిలేవు. లేని వాటికోసం పరితపిస్తాడు. వాటిని సంపాదించటంకోసం కర్మలు చేస్తాడు. అతడికి తన కోర్కెలను తీర్చుకొనే శక్తి లేకపోతే ఇతరులను ఆశ్రయిస్తాడు. అలాగాక నేను ఆత్మను అనే ఆత్మజ్ఞానంలో ఉంటే–పరిమితత్వం పోయి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది. పరిపూర్ణత్వంలో ఉండేవానికి కోరిక లుండవు. కర్మలు చేస్తున్నా కర్మఫలాలపై ఆపేక్ష– ఆసక్తి ఉండదు. ఎవరినీ, దేనికీ ఆశ్రయించడు. నిత్య తృప్తుడుగా ఉంటాడు. అతడికి ఏ కర్మలతోను పని లేదు. అయితే అతడు కర్మలు చేయడా? చేస్తాడు. కాని చేసినా చేయనట్లే. చేసేది దేహం. తాను దేహం కాదు ఆత్మ. ఆత్మ అకర్త. కనుక తాను ఏమీ చేయటం లేదు అనే జ్ఞానంలో– స్పృహలో ఉంటాడు.

జీవం లేకుండా దేహం పనిచేయదు. కాని దేహం పనిచేస్తే జీవం పని చేసినట్లు కాదు. కరెంటు లేకుండా లైటు వెలగదు. కాని లైటు వెలుగుతున్నదీ అంటే కరెంటు వెలుగుతున్నట్లు కాదు. ఇలా నిత్య తృప్తుడై, నిరాశ్రయుడై, కర్మ ఫలాసక్తి లేకుండా ఏ కర్మలు చేసినా అతడు చేయనట్లే. అతడికి ఏ బంధమూ ఉండదు. అట్టివాడే వివేకి, ఆత్మజ్ఞాని.

ఇంకా కర్మలు ఎలా చేస్తే బంధంలేని వాడౌతాడు? –

***శ్లో॥ నిరాశీర్యత చిత్తాత్మా త్యక్తః సర్వ పరిగ్రహః ।***
***శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం ॥*** **(21)**

**తా॥ ఆశలేకుండా, మనోబుద్ధులను స్వాధీనంలో ఉంచు కొని, పరిగ్రహ భావాన్ని విడిచి, కేవలం శరీరంతో కర్మ చేసినా పాపాన్ని పొందదు.**

**వ్యాఖ్య :–** పెద్ద చేపలు చిన్న చేపలను తింటాయి; పిల్లి ఎలుకలను వేటాడి తింటుంది. క్రూర మృగాలు మనుషులపై, జంతువులపై బడి తింటాయి. గోడమీది బల్లి పురుగులను తింటుంది. ఐతే వీటికి వేటికీ పాపం అంటదు. అయితే మానవుడు తోటి మానవులను చంపినా, ఆహారం కోసం పశువులను, పక్షులను చంపినా పాపం అంటుతుంది. ఎందువల్ల?

మనిషి ఏదో ఒక ఆశతో, కోరికతో, స్వార్థంతో ఈ పనులు చేస్తాడు. నేను చేస్తున్నాననే 'అహంకారం'తో చేస్తాడు. మనస్సుతో ఆలోచించి ప్రణాళిక వేసుకొని చేస్తాడు. అందుకే అతడికి పాపం. కాని పైన పేర్కొన్న జంతువులు ఏవీ కూడా ఆలోచించవు, ప్రణాళికలు వేయవు, ఇది మంచి– ఇది చెడు అని ఆలోచించవు. కేవలం అంతర్గతమైన ప్రేరణవల్ల, ప్రకృతి ప్రసాదించిన ఆహా రాన్ని తీసుకుంటూ ఉంటాయి. కనుక వాటికే పాపం లేదు.

ఈ కర్మ చేస్తే నాకీ వస్తువు, లేదా సుఖం లభిస్తుందనే ఫలాసక్తి; నేను చేస్తున్నాననే అహంభావం; వస్తువులపై ఆశ, మమకారం ఉన్నప్పుడు ఆ కర్మలు మన మనస్సుపై ముద్రలు వేస్తాయి. అవే వాసనలు. వాటినే 'కిల్బిషం' పాపం అంటున్నది.

కనుక కర్మలు చేసేటప్పుడు అవి బంధం కాకుండా, పాపం కలగకుండా ఉండాలంటే కర్మలనెలా చేయాలో భగవంతుడిక్కడ ఉపాయాలు తెలియ జేస్తున్నాడు. అవే 1. నిరాశ – ఆశ లేకుండుట; 2. యత చిత్తాత్మ– మనోబుద్ధులను వశంలో ఉంచుకొని; 2. సర్వ పరిగ్రహ; త్యక్త– విషయాలను, వస్తువులను సమకూర్చు కొనుటను విడిచి లేదా వస్తువులపై విషయాలపై మమకారాన్ని విడిచిపెట్టి. ఈ మూడు ఉపాయాలతో ఏ కర్మలు చేసినా అతడికే పాపాలు అంటవు. (వాసనలు చేరవు) బంధకరములు కావు. **రాబోయే వాటికోసం ఎదురుచూడటం ఆశ, వచ్చిన వాటిని 'నావి' అనుకోవటం మమకారం. ఈ రెండూ వదిలితే మనస్సు అదుపులో ఉంటుంది. అట్టివాడు ఏ కర్మలు చేసినా కర్త కాదు. పైగా భగవంతుని ఇచ్ఛను నెరవేర్చే సాధనమౌతాడు. అందుకే అతడికే పాపం లేదు.**

**సాధనానికి ఏ ఫలం ఉండదు. ఆ సాధనాన్ని వాడిన వానికే ఫలం, కవిత్వం వ్రాయాలంటే కలం అనే సాధనం కావాలి. అయితే కవిత్వం బాగా ఉన్నా,**







**చెత్తగా ఉన్నా కలాన్ని ఎవ్వరూ ప్రశంసించరు, దూషించరు. ఈ దూషణ భూషణ తిరస్కారా లన్నీ ఆ కలంతో కవిత్వం వ్రాసిన కవికే. అలాగే అహంకార మమకారాలు విడిచి, మనస్సును అదుపులో పెట్టుకొని, ఆశలు లేకుండా కేవలం శరీరంతో కర్మలు చేసే వానికి ఏ పాపాలంటవు– అని భగవానుడు తెలియజేస్తున్నాడు.**
ఇంకా బంధం కాకుండా కర్మలు చేసే ఉపాయాలేమిటి?–

**శ్లో॥ యదృచ్ఛా లాభ సంతుష్టః ద్వంద్వాతీతో విమత్సరః**
**సమ స్సిద్ధావ సిద్ధౌచ కృత్వా ఽ పి న ని బధ్యతే॥ (22)**

**తా : యాదృచ్ఛికంగా లభించిన దానితో సంతృప్తి చెందుతూ, ద్వంద్వాలకు అతీతుడై, అసూయలేనివాడై, కార్యం సిద్ధించినా సిద్ధించకపోయినా సమభావం కలిగినవాడు కర్మలు చేసినా బంధింపబడడు.**

**వ్యాఖ్య : 1. యదృచ్ఛాలాభ సంతుష్టః :–** ఈ లోకంలో జన్మించిన ప్రతి జీవికి ఒక ప్రారబ్ధం ఉంటుంది. ఆ శరీరం ఎలా పోషించబడాలో ముందే నిర్ణయించబడి ఉంటుంది. నిజం చెప్పాలంటే **ప్రారబ్ధమే ఈ శరీరాన్ని పోషిస్తుంది.** అయితే అంతటి స్థిర భావన అందరికీ ఉండదు కనుక ఏదో చేయాలని, ఏదో పొందాలని మనిషి ఆరాటపడిపోతుంటాడు. అలాంటి ఆరాటం లేకుండా **భగవంతుని మీద, ప్రారబ్ధం మీద విశ్వాసం గలిగిన వ్యక్తి నిర్లిప్తంగా తాను చేసే కర్మలు చేస్తూ, వచ్చే ఫలితాన్ని భగవంతుని ప్రసాదంగా స్వీకరిస్తాడు.** అట్టివాడే యాదృచ్ఛికంగా లభించిన దానితో తృప్తి చెందేవాడు. తనకు లభించినది ఏదైనా – అది అనుకూలమైనా, ప్రతికూలమైనా ఏమాత్రం రాగద్వేషాలు లేకుండా, లభించిన దానితో సంతృప్తి చెందుతాడు. అనిత్యమైన ఈ ప్రాపంచిక విషయాలకోసం, భోగాలకోసం అర్రులు చాచడు. ఎంతటి ఆకర్షణీయమైన వస్తువులకైనా గుటకలు మ్రింగడు. ఏది లభిస్తే అదే పరమాన్నం. **నొసటి వ్రాత తుడిస్తే చెరిగేది కాదు గనుక ఎందుకు అనవసర వ్యథ? అని పరిపూర్ణ తృప్తితో జీవిస్తాడు.**

అయితే అతడు పురుషార్థానికి దూరుడై, సోమరిలా జీవిస్తూ ఎవరో ఏదో ఇవ్వాలని ఎదురు చూచేవాడు కాదు. సోమరికి తృప్తి ఉండదు. సోమరి హృదయంలో అశాంతి అనే పిశాచి తాండవ నృత్యం చేస్తుంది. ఎందుకంటే స్వార్థ పరుడికి కోరికలు ఉడిగిపోవు. అట్టివారికి తృప్తి ఉండదు. కనుక **సోమరితనం లేకుండా, దేనికీ ఆరాటపడకుండా తన కర్తవ్య కర్మలను నిర్లిప్తంగా చేస్తూ లభించిన దానితో సంతృప్తి చెందేవాడే యదృచ్ఛా లాభసంతుష్టుడు.**

**2. ద్వంద్వాతీతః** :- లభించిన దానితో సంతృప్తి చెందేవాడే ద్వంద్వాలకు అతీతంగా ఉండగలుగుతాడు. శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు, మానావమానాలు - ఇవన్నీ ద్వంద్వాలు. ఇవి మనస్సు మీద పెత్తనం చెలాయించటం వల్ల మనిషి ఆ ద్వంద్వాలకు లోనై సుఖాలకు పొంగుతూ, దుఃఖాలకు కృంగుతూ వుంటాడు. అయితే మనస్సును స్వాధీనంలో ఉంచుకొన్న వాడిపై ఈ ద్వంద్వాలు పెత్తనం చలాయించలేవు. అప్పుడే అతడు ద్వంద్వాలకు అతీతుడౌతాడు.

**3. విమత్సరః** :- ఇతరుల గొప్పతనాన్ని చూచిగాని, సంపదలను చూచిగాని ఓర్వలేనివాణ్ణి అసూయ (మాత్సర్యం) గలవాడు అంటారు. ఎప్పుడూ సంతృప్తితో ఉండేవానికి ఈ మాత్సర్యం ఉండదు.కొందరు తమకు లేకపోయినా అవతలివాడికి లేకుండా పోతే చాలునని తలపోస్తుంటారు. **అవతలి వాడికి 2 కళ్ళుపోతే చాలు నాకు ఒక కన్ను పోయినా ఫరవాలేదనుకొనేవారు అసూయా చక్రవర్తులు. ఈ అసూయ పెద్ద జబ్బు.** ఈ అసూయ గలవారు ప్రశాంతంగా ఉండలేరు. సంతోషంగా, సంతృప్తిగా ఉండలేరు. సంతృప్తితో, లభించిన దానితో సంతృప్తి చెంది జీవించేవాడే విమత్సరుడు.

**4. సిద్ధౌ అసిద్ధౌ చ సమః** :- తాను అనుకున్న పని అయితే సిద్ధి, తప్పితే అసిద్ధి. సామాన్యుడు సిద్ధిలో పొంగుతాడు. అసిద్ధిలో క్రుంగిపోతాడు. కాని ఇతడు నిత్యం, నిరంతరం ఆ రెండింటిని సమభావంతో చూడగలుగుతాడు.

**5. కృత్వా ఉపి న నిబద్ధ్యతే** :- యాదృచ్ఛికంగా లభించిన దానితో సంతృప్తి చెందే వ్యక్తి ద్వంద్వాలకు అతీతుడై, అసూయ లేనివాడై, సిద్ధి అసిద్ధియందు సమభావం కలిగి ఉంటాడు. గనుక అతడు ఏ కర్మలు చేసినా చేయనట్లే. అతడికి ఏ కర్మ బంధమూ అంటదు. అతడు స్వార్థం కోసం కర్మలు చేసేవాడు కాదు కనుక, కర్తవ్యతా భావంతో, నిర్లిప్తంగా కర్మలు చేసేవాడు గనుక ఆ కర్మలు బంధకరం కావు.

దీనిని బట్టి సరైన జ్ఞానంతో కర్మలు చేస్తేనే అవి బంధం కాకుండా ఉంటాయని గ్రహించవచ్చు. ఎటువంటి జ్ఞానంతో కర్మలు చేయాలో తెలియజెప్పే అధ్యాయమే ఈ జ్ఞానయోగం. కర్మను, జ్ఞానాన్ని విడదీయ వీలులేదనియే 3,4 అధ్యాయాలు వరుసగా చెప్పటం జరిగింది.







- ఇంతవరకు కర్మలో అకర్మను చూచే విధానాన్ని 4 శ్లోకాలలో చెప్పి, ఇప్పుడు అకర్మలో కర్మను చూడటం ఎలాగో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

**శ్లో॥ గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః ।**
**యజ్ఞాయా చరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ (23)**

**తా : దేనియందు సంగభావం లేనివాడు, ఫలాసక్తి లేని వాడు, ఆత్మ జ్ఞానమునందు నిలిచినవాడు, భగవత్ప్రీతి కరంగా (త్యాగబుద్ధితో) చేసే కర్మ పూర్తిగా నశించిపోతున్నది.**

**వ్యాఖ్య :- గత సంగస్య, ముక్తస్య, జ్ఞానావస్థిత చేతసః** అనే మూడు పదాలు జ్ఞానికి సంబంధించినవి. ఇవి స్థిత ప్రజ్ఞ లక్షణాలు. పదాలను సంక్షిప్తం చేసి ఒక క్రమ పద్ధతిలో సాగిన రచనా శైలి ఇది.

**1. గత సంగస్య** :- సంగభావం పోయినవాడు, దేనితో సంగభావం? అనిత్యమైన ఈ ప్రాపంచిక విషయాలతో. ఎవరు పెట్టుకున్నారు ఈ సంగభావాన్ని? మనస్సు, బుద్ధి, అహంకారం. బుద్ధి ఆనందంకోసం విషయ ప్రపంచంలో సంచరించి సంగ భావం పెట్టుకుంటున్నది. ఆ సంగభావంపోవాలి. ఎలా పోతుంది? విషయ ప్రపంచం లేకుండా పోతే సరిపోతుంది గదా? కాని విషయ ప్రపంచం లేకుండా పోదు. మరి ఏం చేయాలి? **నీ మనోబుద్ధులు అహంకారం లేకుండాపోతే ఇక ప్రపంచంతో సంగభావం పెట్టుకొనే ప్రశ్నే తలెత్తదు గదా! బాగానే ఉంది. మరి ఈ మనోబుద్ధులు, అహంకారం ఎక్కడకు పోవాలి? ఆత్మలో కలిసిపోయి, ఆత్మతో తాదాత్మ్యం చెందితే సరి. అంటే ఎలా? ఇప్పటివరకు నేను దేహాన్ని, మనస్సును, బుద్ధిని, అహంకారాన్ని అని భ్రమపడుతున్న నీవు నేను దేహాన్ని కాదు, మనస్సును కాదు, బుద్ధినికాదు, అహంకారాన్ని కాదు-నేను వీటన్నిటికి ఆధారంగా, అధిష్టానంగా ఉన్న ఆత్మను అని గ్రహించి, అట్టి ఆత్మగా ఉండిపోవాలి**. అలా ఆత్మగా ఉంటే ఇక ఈ ప్రపంచమే లేదు. ఎందుకంటే ప్రపంచంగా భావిస్తున్న దంతా ఆత్మయే గనుక, నీవే గనుక; నిరాకార, నిర్గుణ, సూక్ష్మాతి సూక్ష్మ, సర్వవ్యాపక చైతన్యమే గనుక.

**'నేను ఆత్మను' అనే యదార్థ స్థితిలో నిలిచినప్పుడు నేను దేహాన్ని కాదు గనుక నాకు చావు పుట్టుకలెక్కడివి? నేను మనస్సును కాదు; కనుక నాకు శోక మోహాలెక్కడివి? నేను బుద్ధిని కాదు; కనుక నాకు కర్తృత్వ భోక్తృత్వాలెక్కడివి?**

**కనుక ఆత్మనైన నాకు దేనితోను సంగభావం లేదు – అని తెలిసి పోతుంది.** 'శరీర మనోబుద్ధులే 'నేను' అనుకున్నప్పుడు ఈ ప్రాపంచిక విషయాలతో సంగభావం ఉండేది. ఇప్పుడు నేను ఆత్మనని గ్రహించాను గనుక గతసంగుడను అని తెలుస్తుంది.'

అయితే ఇట్టి స్థితి ఎలా వస్తుంది? సత్సంగం వల్ల. **"సత్సం గత్వే నిస్సంగత్వం" సత్సంగం వల్లనే నిస్సంగత్వం. అప్పుడే గతసంగుడయ్యేది.**

సత్సంగం దేనితో? సత్ స్వరూప పరమాత్మతో, సత్యాన్ని తెలియజెప్పే సత్పురుషులతో, సత్ శాస్త్రాలతో సాంగత్యం పెట్టు కోవాలి.

**భగవంతుని స్తుతించేటప్పుడు ఆయనను కమలంతో పోలుస్తారు. పాదకమలం, కరకమలం, ముఖ కమలం, కమల నేత్రాలు, అని. ఎందుకిలా? కమలం బురదలో ఉన్నా, నీటిలో ఉన్నా ఆ బురదను, నీటిని అంటించుకోకుండా స్వచ్ఛంగా ఉంటుంది. అందుకే ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు తామ రాకులా ఉండు, బ్లాటింగ్ పేపర్‌లా ఉండవద్దు; అద్దంలా ఉండు, కెమెరాలోని ఫిల్మ్‌లా ఉండొద్దు అంటారు.** ఇలా గత సంగులం కావాలి.

**2. ముక్తస్య :–** ముక్తుడు. దేనినుండి? సాంసారిక బంధాల నుండి, రాగద్వేషాలనుండి, కామ క్రోధాలనుండి, సమస్త కర్మల నుండి – అన్నింటినుండి విడుదల పొందినవాడే ముక్తుడు. ఎవరైతే సత్సంగం వల్ల నిస్సంగులై గత సంగులౌతారో వారంతా ముక్తులే. వారికీ ప్రాపంచిక విషయభోగాలపై ఆసక్తిలేదు గనుక, వాటి కొరకు కర్మలు చేయవలసిన విధి లేదు గనుక వారు అన్ని బంధనాలనుండీ ముక్తులే.

**3. జ్ఞానావస్థిత చేతః :–** ప్రాపంచిక విషయాలతో సంగ భావం పోయిన ముక్తుని మనస్సెప్పుడూ ఆత్మలోనే నిలిచిపోయి, ఆత్మగానే ఉంటాడు. ఆత్మ జ్ఞానిగానే ఉంటాడు. అతడి ఇంద్రియాలు, శరీరం ఏ విషయాలలో ప్రవర్తిస్తున్నా అతడి చిత్తం మాత్రం ఆత్మాకారమై ఉంటుంది. అతడే జ్ఞానావస్థిత చేతసుడు. అట్టి వ్యక్తి చేసే కర్మలు ఎట్టివి?

**4. యజ్ఞాయాచరతః కర్మ :–** యజ్ఞకర్మలు – యజ్ఞార్థమైన కర్మలనే చేస్తాడు. అసలు యజ్ఞకర్మలంటే హోమాలు చేయు టయా? కాదు. త్యాగంతో కూడిన ఏ కర్మ అయినా, భగవత్ప్రీతి కరమైన ఏ కర్మయైనా యజ్ఞకర్మయే. ఆత్మలో మనస్సు







నిల్పిన గతసంగుడైన ముక్తుడు ఈ లోకంలో ఏమీ కోరుకోడు గనుక, అతడికి స్వార్థం ఉండదు గనుక, భోగాసక్తి ఉండదు గనుక, అతడు చేసే కర్మలన్నీ లోకోపకారార్థమో, భగవత్ ప్రీత్యర్థమో చేస్తాడు. ఆ కర్మలే యజ్ఞకర్మలు. ఎందుకంటే అవన్నీ త్యాగ భావంతో చేసేవే గనుక.

**5. సమగ్రంప్రవిలీయతే :–** అట్టి యజ్ఞ కర్మలు అతడి మనస్సులో వాసనలను ముద్రించవు గనుక ఆ కర్మలన్నీ పూర్తిగా నశించిపోతాయి. అవి బంధాలు కావు. ప్రవిలీయతే.

**ఇక్కడనుండి యజ్ఞ ప్రకరణం ప్రారంభం**

– కర్మ లన్నింటిని బ్రహ్మముగా భావించే జ్ఞానికి అన్నీ బ్రహ్మమే అని చెప్పుటకీ శ్లోకం.

**శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహూతం ।**
**బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధి నా ॥ (24)**

**తా: బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన వానిచేత బ్రహ్మమను అగ్ని యందు వ్రేల్చబడిన హవిస్సు బ్రహ్మమే. స్రుక్ సువాలు బ్రహ్మమే. సర్వము బ్రహ్మమే అను భావము నిశ్చయముగా గల అట్టిజ్ఞాని చేత పొందదగినది కూడా బ్రహ్మమే.**

**వ్యాఖ్య :–** భారతదేశంలో చాలామంది ఈ శ్లోకం యొక్క అర్థం తెలుసుకోక పోయినా, తెలుసుకోవాలనే శ్రద్ధ లేకపోయినా భోజనానికి ముందు ఈ శ్లోకాన్ని పఠించటం ఆచారంగా వస్తున్నది. సంపూర్ణ వేదాంత తత్త్వాన్ని సంక్షిప్తం చేసి చెబుతున్నదీ శ్లోకం.

**1. బ్రహ్మకర్మ సమాధినా:–** సమస్త కర్మలు బ్రహ్మమే యను భావంతో, ఏకాగ్రమైన చిత్తంతో చేసే జ్ఞానికి కలిగే ఫలితాన్ని ఇక్కడ చెప్పటం జరిగింది. **అంతటా, అన్నివేళలా, అన్నింటిని బ్రహ్మముగా దర్శించేవాడు జ్ఞాని. అంతటా ప్రపంచాన్ని, వస్తువులను, జీవుళ్లను దర్శించేవాడు సామాన్యుడు. నిజంగా ఇక్కడ ప్రపంచము, బ్రహ్మము (పరమాత్మ) అని రెండున్నాయా? లేవు. ఉన్నదొక్కటే పరమాత్మ. నిరాకార, నిర్గుణ, సూక్ష్మాతి సూక్ష్మ, సర్వవ్యాపక, స్వయంప్రకాశ పరమాత్మ. ఆ పరమాత్మయే ఇక్కడ నానా విధాలైన నామ రూప భేదాలతో ప్రపంచంలాగా వ్యక్తమౌతున్నది. ఉన్నదొక్కటే త్రాడు. అదే చీకటిలో పాములాగా భ్రమ గొలుపుతున్నది. అలాగే ఉన్నదొక్కటే పరమాత్మ. అదే అజ్ఞానంలో ప్రపంచంలాగా భ్రమగొల్పుతున్నది.**

పంచదార పాకంతో చిలకలను వేసి అమ్ముతుంటారు. పిల్లలు దాన్ని చిలుకగా చూస్తారు. పెద్దలు దాన్ని పంచదారతో తయారుచేసిన స్వీటుగా చూస్తారు. కొయ్యతో చేసిన ఏనుగు బొమ్మను చూచి పిల్లలు ఏనుగు– ఏనుగు అని ఎగిరి గంతులు వేస్తారు. కాని వడ్రంగి దానిని కొయ్యగానే చూస్తాడు. బంగారంతో చేసిన నగలను స్త్రీలు గాజులుగా, నక్లెస్‌గా చూస్తారు. కాని కంసాలి మాత్రం దానిని బంగారంగా చూస్తాడు. అలాగే అజ్ఞాని దీన్ని ప్రపంచంగా చూస్తాడు. జ్ఞాని మాత్రం పరమాత్మగా దర్శిస్తాడు.

**నామరూపాలతో కనిపించే ఈ జగత్తును నామరూపాలు తొలగించి చూస్తే కనిపించేది పరమాత్మయే. ప్రపంచ భావన విడిచిపెడితే ఇక మిగిలేది పరమాత్మయే.** అలా అంతటా పర మాత్మను దర్శించేజ్ఞానికి ఇక రెండవదేదీ లేదు గనుక అన్నింటినీ పరమాత్మగానే దర్శిస్తాడు. సర్వ కర్మలను బ్రహ్మముగానే భావి స్తాడు. అట్టి భావన నిరంతరం ఎవరికి ఉంటుందో అతడే 'సమాధినా'–ఏకాగ్రచిత్తం గలవాడు. అట్టి జ్ఞాని పొందేది కూడా చివరకు బ్రహ్మాన్నే అనే విషయాన్ని యజ్ఞ ఉదాహరణతో భగవా నుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

అట్టి జ్ఞాని కర్మ (యజ్ఞం) చేసేటప్పుడు అతడికి కలిగే ఫలితం ఏమిటి? అసలు ఆ కర్మలనెట్లు చేస్తాడు? అతడికి అర్పణం బ్రహ్మం, హవిస్సు బ్రహ్మం, అగ్ని బ్రహ్మం, తాను బ్రహ్మం, చివరకు తాను అందుకొనే లక్ష్యం బ్రహ్మం. అంటే అతడు బ్రహ్మమే అవుతాడు. పూర్వకాలం యజ్ఞాలు బాగా ఎక్కువగా చేసేవారు గనుక ఈ పదాలన్నీ వారికి పరిచయమే. ఈ కాలంలో ఆ పదాలకు వివరణ అవసరమవుతున్నది. ఏమిటీ పదాల అర్థం?

**1. అర్పణం** :– హోమం చేసేటప్పుడు నెయ్యిని ఉంచటానికి ఒక కొయ్య గిన్నెను ఉపయోగిస్తారు. దానిని 'సువం' అంటారు. అందులోని నెయ్యిని హోమకుండంలోని అగ్నియందు వేయు టకు ఒక కొయ్య గరిటె ఉంటుంది. దానిని 'స్రుక్కు' అంటారు. ఈ రెంటిని కలిపి స్రుక్ సువాలంటారు. ఇవి హోమసాధనాలు.

**2. హవిః** :– హవిస్సు. అంటే దేవతలకు సమర్పించే అన్నం, మధుర పదార్థాలు, నెయ్యి, సమిధలు మొ॥వి.





**3. అగ్నౌ** :– హోమకుండం మధ్యలో వెలిగించే అగ్ని. మనం సమర్పించే పదార్థాలను అగ్నిదేవుడే ఆయా దేవతలకు అందిస్తాడు. మనం ప్రత్యక్షంగా దేవతలకివ్వలేం. వారికి సమర్పించదలచుకొన్న సమిధలను, హోమద్రవ్యాలను, నెయ్యిని అగ్నిలో వేస్తుంటే ఆ అగ్నిదేవుడు వాటిని స్వీకరించి ఆయా దేవతలకు అందిస్తాడు. అంటే అగ్ని ఏజంట్.

**4. బ్రహ్మణాః** :– హోమాన్ని నిర్వహించే యజమాని. ఈ యజమాని సామాన్యుడైన యజమాని కాదు. బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన యజమాని. హోమద్రవ్యాలను అగ్నిలో సమర్పిస్తాడు.

ఈ జ్ఞాని దృష్టిలో అర్పణం బ్రహ్మమే, హవిస్సు బ్రహ్మమే, అగ్ని బ్రహ్మమే. హోమంచేసే యజమాని బ్రహ్మమే. ఇలా అన్నింటిని బ్రహ్మముగా చూడగల జ్ఞాని చివరకు పొందేది ఆ బ్రహ్మాన్నే. అతడు సమస్త నామరూపములందు, అన్ని క్రియా ప్రవృత్తులందు బ్రహ్మాన్నే తిలకిస్తున్నాడు. బ్రహ్మమునే స్మరిస్తున్నాడు. కనుక భ్రమర కీటక న్యాయాన్ననుసరించి అతడు బ్రహ్మమే అవుతున్నాడు.

**5. సమాధినా** :– మరపులేకుండా, ఎప్పుడూ ఎరుక గలిగి బ్రహ్మ భావనతో కర్మ చేస్తుంటే ఆ కర్మ ధ్యానంగా, సమాధిగా మారుతుంది. ఆ కర్మయే జ్ఞాన రూపంగా పరిణామం చెందుతుంది.

**భోజనానికి ముందు ఈ శ్లోకాన్ని పఠించటంలోని భావం ఏమిటి?**

**మన నోరు హోమకుండం అని, మనలోని జఠరాగ్ని హోమాగ్ని అని, మనం భోజనం చేసే ప్లేటు 'సువం' అని, మన చెయ్యి 'స్రుక్' అని, మనం నోటిలో వేసే అన్నం, కూరలు, నెయ్యి పెరుగు మొ॥వి హోమద్రవ్యాలైన హవిస్సు అని, మనం ప్రతిరోజు చేసే భోజన క్రియ యజ్ఞమేనని భావిస్తూ భోజనం చేస్తే ఇది యజ్ఞమే అవుతుంది. ఈ యజ్ఞంలో మనం స్రుక్ సువాలు బ్రహ్మమేనని, అన్నాదులు బ్రహ్మమేనని, మనలోని జఠరాగ్ని బ్రహ్మమేనని, మనం అందించే ఈ హవిస్సును (అన్నా దులను) స్వీకరించేవాడు ఈ దేహాన్ని ఆశ్రయించుకొనియున్న బ్రహ్మమే (పరమాత్మ) అని,** (అహం వైశ్వానరో భూత్వా ప్రాణి నాం దేహమాశ్రితః – నేను వైశ్వానర అగ్ని రూపంలో ప్రాణుల యొక్క దేహాలనాశ్రయించుకొని ఉన్నాను. 15వ అధ్యాయం లో పరమాత్మ స్వయంగా చెప్పటం జరిగింది), **వీటిని అర్పించే నేను బ్రహ్మమునే నని భావించాలి. ఇలా చేస్తే మనకు కలిగే అంతిమ ఫలితం ఆ**

**బ్రహ్మాన్ని పొందటమే. అంటే బ్రహ్మరూపులగుటయే. ఇలా ప్రతిరోజూ 2,3 యజ్ఞాలు ఎంతో సులభంగా చేయవచ్చు. ఇలా సర్వకర్మలూ బ్రహ్మమేనని చేస్తే ఏ కర్మ అయినా మనను పరబ్రహ్మాన్ని – పరమాత్మను చేరుస్తుంది.**

–ఆ బ్రహ్మాన్ని చేరుకోవటానికి రకరకాల కర్మలను యజ్ఞ భావంతో చేయవలసిన కర్మలను పన్నెండింటిని 6 శ్లోకాల్లో వివరించబోతున్నారు. ముందుగా రెండు యజ్ఞాలు–

**శ్లో॥ దైవమేవాఽపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।**
**బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నైవోప జుహ్వతి॥ (25)**

**తా: కొందరు యోగులు దైవయజ్ఞాన్ని చక్కగా చేస్తారు. మరికొందరు బ్రహ్మ మనే అగ్నిలో యజ్ఞం ద్వారా యజ్ఞాన్ని అర్పిస్తారు.**

**వ్యాఖ్య :** సమస్త కర్మలను బ్రహ్మ భావనతో చేస్తే చివరకు ఆ బ్రహ్మాన్నే పొందుతారు. అలాంటి 12 కర్మలను యజ్ఞాలుగా చెప్పబోతూ రెండు యజ్ఞాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు. అవే 1. దైవయజ్ఞం, 2. బ్రహ్మయజ్ఞం.

**1. దైవయజ్ఞం** :– కర్మయోగులు –అంటే సాధారణ గృహస్థులైనవారు దేవతలను తృప్తి పరచేందుకు కొన్ని కర్మలు చేస్తుంటారు. అవే దేవతారాధన, పూజ, యజ్ఞం, సంధ్యావందనం మొ॥న దైవకర్మలు. ఇదే దైవయజ్ఞం. దేవతలంతా పరమాత్మ యొక్క పరివారం. ఏజంట్స్. పరమాత్మ తరఫున అన్ని కార్యాలను నిర్వహించేది వీరే! వీరు గ్రహిస్తారు, అనుగ్రహిస్తారు, నిగ్రహి స్తారు. అన్నింటికీ సమర్థులే. దేవతలకు మనుష్యులకు సంబంధం కలిగించే సూత్రమే యజ్ఞం. యజ్ఞం యొక్క ఆ చివర దేవత లుంటే ఈ చివర మనుష్యులుంటారు. యజ్ఞం ద్వారా ఈ ఇద్దరి మధ్య సంబంధం కుదిరింది. దేవతలు మనుష్యులకు గాలి, నీరు, వెలుతురు, ఆహారం, నివసించడానికి భూమి, తిరిగేందుకు అవకాశం ఇచ్చే ఆకాశం, పూలు, పండ్లు... ఇలా ఎన్నింటినో ప్రసాదిస్తారు. అందుకు ప్రతిగా మనుష్యులు దేవ తలకు పూజా పునస్కారాలు, యజ్ఞయాగాదుల ద్వారా ఆహుతులను, నైవేద్యాలను సమర్పిస్తారు. ఇలా సమర్పించి, యజ్ఞ శేషాన్ని భుజిస్తే పాపం లేదు. దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే పాపాన్నే తింటారు. **అలా దేవతలకు కృతజ్ఞతా భావంతో సమర్పించ కుండా తినేవాడి భోగం భోగం కాదు – రోగం. అది భవరోగం.**







ఈ దైవయజ్ఞాన్ని బ్రహ్మార్పణ బుద్ధితో – బ్రహ్మ భావనతో చేసినప్పుడు మనస్సు శుద్ధమై అంతిమంగా ఆ బ్రహ్మాన్నే అందు కోవటం జరుగుతుంది. **యజ్ఞం వల్ల పాపం తొలగుతుంది, పవిత్రత కలుగుతుంది, పుణ్యం కలుగుతుంది. నిష్కామంగా చేసినప్పుడు చిత్తశుద్ధి కలిగి జ్ఞానానికి అర్హత కలుగుతుంది. దేవతల ఋణం తీర్చుకొనుటకు చేయవలసిన యజ్ఞమే ఈ దైవయజ్ఞం.**

**2. బ్రహ్మయజ్ఞం** :– ఋషులైనవారు మానవులను తరింప జేయటానికి అనేక శాస్త్రాలను అందించారు. జన్మ సార్థకం చేసుకొనుటకు ఎన్నో సాధనా మార్గాలను, ఉపాయాలను తెలియజెప్పారు. **అట్టి ఋషుల యొక్క ఋణం తీర్చుకొనుటకు చేయ వలసిన యజ్ఞమే ఋషియజ్ఞం. కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది జ్ఞానార్హత సాధించిన జ్ఞానయోగులు చేసేదే ఈ బ్రహ్మ యజ్ఞం** (ఋషియజ్ఞం).

**బ్రహ్మమనే అగ్నిలో యజ్ఞం ద్వారా యజ్ఞాన్ని అర్పిస్తారు. అంటే జీవ బ్రహ్మైక్య భావంతో జీవభావాన్ని బ్రహ్మ (జ్ఞాన)మనే అగ్నియందు ఆహుతి చేయుట. నిష్కామకర్మ యోగం ద్వారా చిత్తశుద్ధి పొందిన సాధకులు బుద్ధి సూక్ష్మతతో సద్గు రువుల ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొంది, నిరంతరం తాను జీవుణ్ణి కాదని; నిరాకార, నిర్గుణ పరమాత్మనని తెలుసుకొని, సాధన చేసి జీవభావాన్ని వదలి ఆత్మగా, పరమాత్మగా నిలిచిపోవుటయే బ్రహ్మయజ్ఞం. అగ్ని కట్టెలన్నింటిని దహించి తనయందే విలీనం చేసుకొని తన స్వరూపాన్నే ఇస్తుంది. అలాగే బ్రహ్మమనే అగ్ని (జ్ఞానాగ్ని) జీవ భావమనే కట్టెలను దహించివేసి తనలో లీనం చేసుకొని తన స్వరూపాన్నే ఇస్తుంది. ఇదే జీవ బ్రహ్మైక్య స్థితి.** ఆత్మ విచారణ ద్వారా నేనీ జడమైన క్షేత్రాన్ని కాదు, జీవుణ్ణి కాదు. ఈ క్షేత్రానికి చైతన్యాన్నిచ్చే ఆత్మను– పరమాత్మను అనే అనుభూతిని చెందుటయే ఈ **బ్రహ్మయజ్ఞం.** దీనిని జ్ఞాన యోగులు మాత్రమే ఆచరించగలరు. – మరొక రెండు యజ్ఞాలను వివరిస్తున్నాడు...

**శ్లో॥ శ్రోత్రాదీ నీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషుజుహ్వతి।**
**శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషుజుహ్వతి॥ (26)**

**తా॥ శ్రోత్రాది ఇంద్రియాలను కొందరు నిగ్రహమనే అగ్నిలో వ్రేలుస్తారు. మరి కొందరు శబ్దాది విషయాలను ఇంద్రియాలనే అగ్నియందు వ్రేల్చుచున్నారు.**

**వ్యాఖ్య :** ఇంతకుముందు శ్లోకంలో 1. దైవయజ్ఞం, 2. బ్రహ్మ యజ్ఞం అనే రెండింటిని చెప్పగా ఈ శ్లోకంలో మరో రెండు యజ్ఞాలను చెప్పారు. అవి 3. ఇంద్రియ నిగ్రహం, 4. విషయ యజ్ఞం అనేవి.

**3. ఇంద్రియ నిగ్రహం :–** ఇంద్రియాలను నిగ్రహమనే అగ్నిలో వ్రేల్చుట అంటే ఇంద్రియ నిగ్రహమే. మనకు ఐదు జ్ఞానేంద్రి యాలు– శ్రోత్ర (చెవి) చక్షు(కన్ను) రసన (నాలుక) ఘ్రాణ (ముక్కు) త్వక్ (చర్మం)అనేవి ఉన్నాయి. ఇవి ఎల్లప్పుడూ బయటకు తెరచు కొనే ఉంటాయి. ఇవి ప్రపంచంలోని విషయాల వెంటపడి వాటికి సంబంధించిన సమాచారాన్ని మనసుకు చేరవేస్తూ ఉంటాయి. దానితో మనస్సు అలజడి, ఆందోళనలతో అల్లకల్లోలమౌతుంది. ఆధ్యాత్మిక రంగంలో శాస్త్రాన్ని శ్రవణం చేయాలన్నా, మననం చేయాలన్నా, జపధ్యానాదులు సాగించాలన్నా మనస్సు ప్రశాంతంగా ఉండాలి. అందువల్లనే యోగులు, మహాత్ములు, సాధు పురుషులు తమ ఇంద్రియాలు విషయాలలో పడిపోకుండా అరికడతారు. సామాన్యులకు ఆ శక్తి సామర్థ్యాలుండవు. ఇంద్రియాలను తృప్తిపరచాలని ఎంత ప్రయత్నించినా అవి తృప్తి చెందవు సరికదా! అవి మనపై దాడి చేసి, మన మానసిక శాంతిని దోపిడీ చేస్తాయి. కనుకనే వీటిని నిగ్రహించాలి. **అలా నిగ్రహించలేకపోతే బ్రేకులేని బండి –కళ్ళానికి లొంగని గుర్రం– కాడిక్రిందకు రాని ఎద్దులాగా నిగ్రహంలేని వాడు ఎందుకూ కొరగాడు, ఏమీ సాధించలేడు.** ఇంద్రియాలనే గుర్రాలు స్వాధీనంలో లేకపోతే ఈ జీవితమనే రథం సరైన బాటలో నడవదు. గుర్రం తనదే ఐనా, కళ్ళెం బిగించే స్వారీ చేయాలి. అలాగే ఇంద్రియాలు తనవే అయినా వాటిని స్వాధీనంలో ఉంచుకొనే ఆత్మవైపు పయనించాలి. ఇదే ఇంద్రియ నిగ్రహం.

**4. విషయయజ్ఞం :–** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ అనే విషయాలను ఇంద్రియాలనే అగ్నులలో హోమం చేయుట. అంటే శబ్దాది విషయత్యాగం. అదే విషయయజ్ఞం. రాగద్వేషాలను విడిచిపెట్టి ఇంద్రియాలతో విషయాలను హితంగా, మితంగా, అనుభవించటమే విషయయజ్ఞం. అయితే అలా విషయాలను అనుభవిస్తున్నప్పటికీ మనస్సును ఆ విషయాలలో – సుఖాలలో ఇరికించకూడదు. విషయసుఖాల కొరకు తపించకూడదు. వాటికై ప్రయత్నించకూడదు. అప్రయత్నంగా లభించిన దానితో సంతృప్తి చెందుతూ నిర్లిప్తంగా అనుభవించాలి. విషయాలు ఎంతగా ఆకర్షిస్తున్నా వాటి వలలో పడకూడదు. వాటిలోని దోషాలను చూస్తూ వాటిపై నిర్లిప్తభావం కలిగి ఉండాలి. చేత నయితే విషయాలను బ్రహ్మముగా చూడాలి. ఇలా విషయాలు మనస్సును చేరినా ఆ విషయాలలో ఆసక్తిని వదలి మితంగా, హితంగా, నిర్లిప్తంగా అనుభవించటమే విషయయజ్ఞం.







– మరొక యజ్ఞం గురించి చెప్పబోతున్నారు.

**శ్లో॥ సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణి చాపరే।**
**ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపితే॥ (27)**

**తా॥ మరి కొందరు సమస్తమైన ఇంద్రియ కర్మలను, ప్రాణకర్మలను జ్ఞానంచే ప్రకాశింపజేయబడిన ఆత్మ సంయమమనే అగ్ని యందు వ్రేల్చుచున్నారు.**

**వ్యాఖ్య :–** ఆత్మ సంయమయోగం అంటే మనస్సును ఆత్మలో లయించే యోగం. ఇదే 'సమాధి' అంటారు. ఐతే ఈ సమాధి రెండు విధాలు. 1.లయపూర్వక సమాధి (సద్బీజ సమాధి), 2. బాధ పూర్వక సమాధి (నిర్బీజ సమాధి). ఈ నిర్బీజ సమాధియే మనోనాశం. ఇదే 5వ యజ్ఞం.

**5. మనోనాశం :** కార్యాన్ని కారణంలో లయంచేసి కారణంగా మిగిలిపోవటమే సమాధి. కుండకార్యం. మట్టి కారణం. కుండను మట్టిలో లయంచేసి కేవలం మట్టిగా ఉండాలి. బంగారు గాజును కరిగించి బంగారంగా మార్చి బంగారంగా ఉండిపోవాలి. అలాగే కార్యమైన ఈ ప్రపంచాన్ని కారణమైన పరమాత్మలో లయంచేసి కేవల పరమాత్మ తప్ప రెండవదేదీ లేని స్థితిలో ఉండాలి. అదే కార్యం కారణంలో కలిసి ఏకమై కారణంగా ఉండుట.

అయితే ఈ స్థితిని పొందటానికి అవిద్య (అజ్ఞానం) పూర్తిగా నశించిపోవాలి. 'తత్త్వమసి' మహావాక్యాల తాత్పర్యం తెలియాలి. అలా తెలియకుండా అజ్ఞానంలోనే ఉంటే కార్యరూపంలో కనిపించే ప్రపంచ భావన అలాగే ఉంటుంది.

మనస్సనేది ఆత్మ నుండి లేచిన అల. అల సముద్రంలోనే లేచి, కొంతసేపటికి ఆ సముద్రంలోనే పడిపోతుంది. తిరిగి లేచి, మళ్ళీ పడుతుంది. అలాగే మన మనస్సుకూడా ప్రతిరోజూ సుషుప్తిలో ఆత్మలో పడిపోయి మళ్ళీ మెలకువ రావటంతో తిరిగి లేస్తుంది. అలాగే ప్రగాఢ ధ్యానంలో కూడా మనస్సు ఆత్మలో పడిపోయి, తిరిగి ధ్యానం నుండి లేవగానే లేచి వస్తుంది. అలా లేచి వచ్చి ఈ ప్రపంచ భావనలో తిరుగుతుంది. ఇదే సద్బీజ సమాధి. అంటే బీజం ఇంకా ఉంది. ఇలా కాకుండా మహావాక్యాల జ్ఞానంతో, అవిద్య సంపూర్ణంగా నశించిపోగా మనస్సు పూర్తిగా ఆత్మలో కలసిపోతుంది. ఇప్పుడిక మనస్సు లేవదు. ఇదే మనోనాశనం. ఎందుకని తిరిగి మనస్సులేవదు? "నేను బ్రహ్మమును, పరమాత్మను" అని బుద్ధితో మహావాక్యార్థాన్ని తెలుసుకొని, ధ్యాన విచారణల ద్వారా సాధన చేసినప్పుడు, ఆ

సాధన చేస్తున్న మనస్సు తనకు కారణమైన ఆత్మలో కలసి ఆత్మాకారంగా మారిపోతుంది. దానితో ఇక తిరిగిలేచే ప్రసక్తే లేదు. ఇదే నిర్బీజసమాధి– మనోనాశం. ఎప్పుడైతే ఇలా మనోనాశనం జరిగిందో 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 4 అంతఃకరణాలు, 5 ప్రాణాలు మొత్తం– 19 తత్త్వాలూ (సూక్ష్మ శరీరం మొత్తం) ఆత్మలో కలసి కేవలం ఆత్మ మాత్రమే మిగులు తుంది.

– మరొక 5 యజ్ఞాలను చెప్పబోతున్నారు–

**శ్లో॥ ద్రవ్య యజ్ఞాస్తపోయజ్ఞాః యోగయజ్ఞా స్తథాఽ పరే।**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశిత వ్రతాః॥ 28**

**తా॥ కఠిన నియమాలుగలయతులు కొందరు ద్రవ్య యజ్ఞములు, తపో యజ్ఞములు, యోగ యజ్ఞములు, స్వాధ్యాయ యజ్ఞములు, జ్ఞానయజ్ఞములు చేస్తారు.**

**వ్యాఖ్య :– 6. ద్రవ్యయజ్ఞం:–** ధనాన్ని, వస్తువులను ఉపయోగించి చేసే హోమం ఈ ద్రవ్య యజ్ఞం క్రిందికే వస్తుంది. స్మృతులలో, వేదాలలో చెప్పిన విధంగా హోమకుండంలో హోమాగ్నిని రగిల్చి అందులో సమిధలు, ఆవు నెయ్యి మొ॥న వానిని ఆహుతులుగా దేవతలకు సమర్పించుట ద్రవ్యయజ్ఞం. అంతేగాక ధనాన్ని, వస్తువులను,సేవలను మనఃపూర్వకంగా, భక్తితో, సేవాభావంతో ఇతరులకు సమర్పించుట కూడా ద్రవ్య యజ్ఞమే. భూదానం, గోదానం, సువర్ణదానం, అన్నదానం, శ్రమదానం, వస్త్రదానం, విద్యాదానం, జ్ఞానదానం, వైద్యదానం – ఇలా శక్తి మేరకు అర్పించుట ద్రవ్యయజ్ఞమే.

**7. తపోయజ్ఞం:** శరీరం, వాక్కు, మనస్సు అనే త్రికరణములతో చేసే తపస్సులు శారీరక తపస్సు, వాచిక తపస్సు, మానసిక తపస్సు అని మూడు విధాలు. కొన్ని నియమాలతో, కట్టుబాట్లతో దైవానుగ్రహాన్ని పొందటానికి, భగవత్ప్రాప్తికి సహాయకారులు కావటానికి ఈ తపస్సులు చేస్తారు. ఇదే తపోయజ్ఞం. ధర్మాన్ని, దైవాన్ని ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని దేహేంద్రియ మనోబుద్ధు లను తపింపచేయుటయే తపస్సు. పెద్దలను, గురువులను, మహాత్ములను, దైవాన్ని పూజించుట శారీరక తపస్సు, సత్యంగా, హితంగా, ప్రియంగా మాట్లాడుట, భగవంతుని మహిమలను తెలియజేయటం, స్తోత్రాలను, మంత్రాలను, శ్లోకాలను పారాయణ చేయుట వాచిక తపస్సు. మనస్సును పూర్తిగా భగవంతుని యందు







నిలుపుట, జపధ్యానాది సాధనలు చేయుట మొదలైనవి మానసిక తపస్సు. ఇలా పరలోకానికి, భగవంతుని అనుగ్రహానికి, భగవత్ప్రాప్తి కొరకు మనోవాక్కాయములను తపింపజేయుటయే తపోయజ్ఞం.

**8. యోగయజ్ఞం:** మనలోని నీచత్వం నుండి ఉన్నత స్థానానికి చేరటానికి చేసే ప్రయత్నమే యోగం. జీవభావం నుండి దైవ భావానికి చేరటానికి చేసే ప్రయత్నమే యోగం. ప్రపంచ వ్యామో హాలనుండి విడివడిన మనస్సును దాని స్వస్థానమైన ఆత్మయందు చేర్చుటకు చేసే ప్రయత్నమేయోగం. కర్మలు చేస్తూనే భగవద్గీతలో చెప్పిన యుక్తిని ప్రయోగించి కర్మబంధాలకు చిక్కకుండా కర్మయోగాన్ని ఆచరించుటే యోగం. ఈ యోగాన్ని ఆచరించుటే యోగయజ్ఞం. మనుష్య జన్మ భోగం కోసం వచ్చిన జన్మకాదు, యోగం కోసం వచ్చిన జన్మ. యోగజీవితాన్ని గడపటమే మానవ జీవిత పరమార్థం. పతంజలి మహర్షి చెప్పిన అష్టాంగ యోగాన్ని ఆచరించటం యోగ యజ్ఞమే. అష్టాంగ యోగమే కాక షడంగ యోగం, పంచ, దశాంగ యోగాలను ఆచరించి లక్ష్యాన్ని సాధించటం యోగయజ్ఞమే.

**9. స్వాధ్యాయ యజ్ఞం:** మోక్షప్రాప్తికి మార్గం చూపే శాస్త్రాలను – అంటే ఉపనిషత్తులను, భగవద్గీతను, ప్రకరణ గ్రంథాలను నిత్యం శ్రద్ధాభక్తులతో అధ్యయనం చేయుటే స్వాధ్యాయం. దీని వల్ల ఋషి ఋణం తీర్చుకున్నట్లవుతుంది. వారి జ్ఞానతేజస్సు లభిస్తుంది. నిజమైన శాస్త్రవిజ్ఞాన పఠనం లేకనే ఈనాటి యువ కులలో ధర్మ సంస్కారం లోపించి, ధర్మభ్రష్టులవుతున్నారు. హింసాత్మక చర్యలకు ఒడిగడుతున్నారు. రామాయణ, భారత, భాగవతాలను, భగవద్గీతను పిల్లలచేత చదివింప జేయటం, అందులోని విశేషాలను వారికి అర్థమయ్యే విధంగా తెలియ జేయటం వల్ల వారిలో ఎంతో మార్పు వస్తుంది. బిడ్డలకు సంపాదన ఇవ్వడం కాదు, సంస్కారాన్ని ఇవ్వాలి. సంపాదన గాని, సంసారం గాని వెంట వచ్చేవి కాదు, కేవలం సంస్కారం మాత్రమే వెంట వస్తుంది. శాస్త్రములను కేవలం పఠించటం కాక వాటిలోనైన భావాలను అర్థం చేసుకొంటే ఉత్తమ ఫలితాలు కలుగుతాయి. ఇదే స్వాధ్యాయ యజ్ఞం.

**10. జ్ఞానయజ్ఞం :** శాస్త్రాలను – మోక్షప్రాప్తిని కలిగించే శాస్త్రా లను సద్గురువుల ద్వారా శ్రవణం చేసి, వాటిని నిరంతరం మననం చేసుకొంటూ భావాలను స్థిరపరచుకొని, ఆ భావాలను అనుభవానికి తెచ్చుకొనుటకు చేసే ప్రయత్నాలన్నీ

కలిసి జ్ఞాన యజ్ఞమని అంటారు. అలాగే ఆత్మజ్ఞానాన్ని ప్రవచనములద్వారా అందించటం, అవగాహన అయ్యేటట్లు చేయటం, తద్వారా జ్ఞాన వ్యాప్తి గావించటం కూడా జ్ఞానయజ్ఞమే. ఆత్మను గూర్చిన యదార్థ జ్ఞానం సాధారణంగా అందరికీ వుండదు. విపరీత భావనలే ఎప్పటినుండియో స్థిరపడి ఉంటాయి. దీనికి కారణం అవిద్య– అజ్ఞానం. కనుక సద్గురువులను ఆశ్రయించి, శాస్త్రాలలో, ఉపనిష త్తులలో తెలియజేయబడిన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలనే జిజ్ఞాసతో తెలుసుకొనే ప్రయత్నం చేయుటే జ్ఞానయజ్ఞం. అన్ని యజ్ఞాలలలోను ఈ జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనది, ఉత్తమోత్తమ మైనది.

– మరొక యజ్ఞాన్ని చెప్పబోతున్నారు తరువాత శ్లోకంలో–

**శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణాఽపానం తథాఽపరే।**
**ప్రాణా పాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ (29)**

**తా॥ ప్రాణాయామ పరాయణులైన కొందరు ప్రాణ అపాన మార్గాలను నిరోధించి, అపానము నందు ప్రాణాన్ని, ప్రాణమునందు అపానాన్ని ఆహుతులుగా వ్రేలుస్తారు.**

**వ్యాఖ్య :** ప్రాణాయామాన్ని కూడా ఇచ్చట యజ్ఞంగా చెప్పటం జరిగింది. అష్టాంగయోగాలలో నాలుగవది ఈ ప్రాణాయామం. శరీర ఆరోగ్యానికి, మనస్సును పరుగులు తీయకుండా అరికట్టి ఏకాగ్రం చేయుటకు – పరమాత్మపై నిలుపుటకు ఈ ప్రక్రియ తోడ్పడుతుంది.

**11. ప్రాణాయామ యజ్ఞం:**–ప్రాణాయామంలో పూరక, కుంభక, రేచకములను 3 విభాగాలున్నాయి. 1. బయటనున్న గాలిని ఒక ముక్కు రంధ్రం ద్వారా లోనికి పీల్చుట పూరకం, 2.పీల్చిన గాలిని బయటకు వదలకుండా బిగబట్టి ఉంచటం కుంభకం, 3. ఆ గాలిని రెండవ ముక్కు రంధ్రం ద్వారా బయటకు మెల్లగా వదలటాన్ని రేచకం అంటారు.

**'అపానే ప్రాణం జుహ్వతి'** అంటే అపానంలో ప్రాణాన్ని హోమంచేయుట. అంటే బయటి గాలిని లోపలకు పీల్చటమే. ఇదే పూరకం. 'ప్రాణ అపాన గతీరుద్ధ్వా' అంటే ప్రాణ, అపాన ముల గతిని నిరోధించుట. అంటే గాలిని లోపలే కుంభించి ఉంచుట. ఇదే కుంభకం. 'ప్రాణే అపానం జుహ్వతి' అంటే ప్రాణంలో అపానాన్ని వ్రేల్చుట. అంటే లోపలి గాలిని బయటకు వదలుట. ఇదే







రేచకం. ఈ పూరక, కుంభక, రేచకములను కలిపి 'ప్రాణాయామం' అంటారు. ఈ ప్రాణాయామంలో అనేక విధానాలు ఉన్నాయి.

ఏ సాధనను అవలంబించి ప్రాణశక్తిని స్వాధీనం చేసుకొనే వీలుంటుందో దానినే ప్రాణాయామం అంటారు. ఇది కూడ యజ్ఞమే. దీనివల్ల మనస్సు స్థిరమై ఏకాగ్రమౌతుంది. బుద్ధి వికాసం పొందుతుంది. అయితే అనుభవజ్ఞులైన వారి శిక్షణలోనే అభ్యాసం ప్రారంభించాలి. ప్రతి మానవునిలోనూ వెన్నెముక ఉంటుంది. దానినాశ్రయించి 'సుషుమ్న' అనే ప్రధాన నాడి ఉంది. దీనినే బ్రహ్మనాడి లేక మోక్షనాడి అని కూడ అంటారు. ఇందులో షట్చక్రాలు (ఆరు పద్మాలు) ఉన్నాయి. గుదస్థానంలో మూలాధారం, లింగస్థానంలో స్వాధిష్ఠానం, బొడ్డు స్థానంలో మణిపూరకం, హృదయస్థానంలో అనాహతం, కంఠం వద్ద విశుద్ధం, కనుబొమల మధ్య ఆజ్ఞాచక్రం అని ఆరు చక్రాలు ఉన్నాయి. ఈ ఆరు చక్రాలకు పైన శిరస్సుపై బ్రహ్మరంధ్రం (మాడు) వద్ద 'సహస్రారం' అనే వేయి దళాల పద్మం ఉంటుంది. ఈ సుషుమ్ననాడికి ఇరువైపులా ఇడ, పింగళ అనే 2 నాడులు న్నాయి. అవి రెండూ ముక్కు రంధ్రాలనుండి బయలుదేరి గుద స్థానంలో సుషుమ్న నాడిలో కలుస్తాయి. మనం గాలి పీల్చినప్పుడు, వదలినప్పుడు ఇడ, పింగళ నాడులలో సంచరిస్తూ లోనికి, బయటకు సంచరిస్తుంది ప్రాణశక్తి. ఈ ప్రాణశక్తిని ఇడా, పింగళ నాడులలోనుండి ప్రాణాయామం ద్వారా సుషుమ్న నాడిలో ప్రవేశపెట్టాలి (కుంభకం ద్వారా). అప్పుడు ప్రాణశక్తి మూలాధార చక్రంలో ఉన్న కుండలినీ శక్తిని కదిలించగా ఆ కుండలినీ శక్తి క్రమంగా ఒకొక్క చక్రాన్ని దాటుకుంటూ చక్ర భేదనం చేస్తూ చివరకు ఆజ్ఞా చక్రాన్ని చేరుకుంటుంది. అప్పుడు కుండలిని (జీవుడు) ఆత్మ స్వరూపాన్ని పొందుతాడు. అక్కడినుండి సహస్రారం వరకు తీసుకువెళ్ళి ఆత్మను పరమాత్మలో ఐక్యం చేయాలి. ఇలా జీవుడు పరమాత్మ అయ్యే ప్రక్రియయే ఈ ప్రాణా యామం. ఇది కూడా యజ్ఞమే. అయితే ఇందులో అరుదుగా విజయం సాధించటం జరుగుతుంది. దీనిని ఎంతో జాగ్రత్తగా ఆచరించవలసి వుంది. లేనిచో ప్రమాదం వాటిల్లుతుంది.

– ఇక చివరి 12వ యజ్ఞం ఈ శ్లోకంలో–

**శ్లో॥ అపరే నియతా హారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।**
**సర్వే ఽప్యేతే యజ్ఞవిధః యజ్ఞక్షపిత కల్మషాః॥ (30)**

**తా॥ కొందరు నియమితమైన ఆహారాన్ని తీసుకుంటూ ప్రాణాలను ప్రాణాలకు ఆహుతి ఇస్తారు. వీరందరూ యజ్ఞవిదులే. యజ్ఞం వల్ల కల్మషాలను తొలగించుకుంటారు.**

**వ్యాఖ్య : ఆహార సంయమము లేదా నియతాహారము :** ఆహారం తీసుకోవటం కూడా యజ్ఞమేనా? అని సందేహం వుంటుంది కొందరికి. కాని భగవానుడు దీనికి భగవద్గీతలో ప్రముఖ స్థానాన్ని కల్పించాడు. ఎందుకంటే మోక్షాన్ని పొందాలంటే సాధ నలు చేయాలి.ఆ సాధనలకు నిర్మలమైన మనస్సుండాలి. మనస్సు ఆహారం వల్లనే ఏర్పడుతుంది. మనం తీసుకునే ఆహారంలో స్థూలభాగం మన శరీర వృద్ధికి తోడ్పడుతుంది. సూక్ష్మభాగం మనస్సుగా ఏర్పడుతుంది. అందువల్ల మనం తీసుకునే ఆహారం ఎట్టిదో మన మనస్సు కూడా అట్టిదే అవుతుంది. ఆహారం సాత్వికమైనదైతే మనస్సు సాత్వికం అవుతుంది. ఆహారం రాజసిక మైనదైతే మనస్సు రాజసికమౌతుంది. ఆహారం తామసికమైతే మనస్సు తామసికమౌతుంది. అందుకే బ్రాహ్మణులకు సాత్వి కాహారం చెప్పబడ్డది. దానితో వారు బ్రహ్మజ్ఞానాన్ని పొందుటకు వీలవుతుంది. మాంసాహారం వల్ల రజోగుణం వృద్ధి అవుతుంది. మాంసాహారులైన మృగాలు క్రూరంగా ఉండటానికి కారణం ఇదే. మనుష్యులైనా అంతే.

**మనం ఆహారం విషయంలో ఏ నియమాలు పాటిస్తే మనస్సు సాత్వికమౌతుంది?**

**1. సాత్విక ఆహారం:** ఎక్కువ తీపి, ఎక్కువ పులుపు, ఎక్కువ కారం, ఎక్కువ ఉప్పు, ఎక్కువ వేడి, అతి చల్లదనం లేకుండా ఉండేది. రసవంతమైనవి; మనస్సుకు ఇంపితమయ్యేవి; త్వరగా జీర్ణమయ్యేవి; జిడ్డుగా ఉండేవి (పాలు, పెరుగు, నెయ్యి) సాత్విక భావాలు కలిగించే ఆహారం.

**2. న్యాయార్జితం:** మనం యజ్ఞభావంతో విద్యుక్త కర్మలను చేస్తూ, ఆ కర్మల వల్ల లభించినదే యజ్ఞశేషం, అదే న్యాయా ర్జితమైనది. ఇతరులను మోసగించకుండా, బాధించకుండా ఆర్జించినదే న్యాయార్జితం.

**3. మితాహారం:** తీసుకునే ఆహారం మితంగా ఉండాలి. బ్రతకటానికి తినాలేగాని, తినటానికి కాదు. యోగశాస్త్రం ఏమి చెబుతున్నదంటే ఉదరకోశాన్ని సగభాగం ఆహారంతో నింపి, పావు భాగం నీటితో నింపి, మిగిలిన పావుభాగం గాలికోసం







ఖాళీగా ఉంచాలి. అలాగాక పూర్తిగా ఆహారంతో నింపితే ఊపిరి ఆడదు. సాధన కుదరదు.

**4. నియమిత కాలసేవితం:** ప్రతిరోజు ఒక నియమిత కాలంలోనే ఆహారాన్ని తీసుకోవాలి. ఒకరోజు 12 గంటలకు, ఒకరోజు సాయంత్రం 4 గంటలకు, ఒకరోజు అసలు మానటం ఇలా చేయకూడదు. రుచిగా ఉన్నదని ఎప్పుడు పడితే అప్పుడు తినరాదు.

**5. భగవదర్పితం :** మనం తినే ఆహారం భగవంతుడు మనకోసం ఇచ్చినది. పంటలు పండటానికి భూమిని, వర్ష రూపంలో నీటిని, వెలుతురును, చంద్రుని కాంతిని, భూమిలోని సారాన్ని- అన్నింటినీ ఆయనే ఇచ్చాడు. ఆయన ఇచ్చిన దానిని ఆయనకు సమర్పణ చేసి తినాలి. ఆయనకు సమర్పించటం అంటే ఆయన అనుమతిని తీసుకోవటమే. అలా ఇతరుల అనుమతి లేకుండా వారి సొత్తును తీసుకుంటే దొంగలమవుతాం.

ఇలా నియమంగా ఆహారం తీసుకుంటే ఆకలి తీరుతుంది. శరీరారోగ్యం చెడకుండా ఉంటుంది. విషయ వాంఛలు వశమౌతాయి. మనోనిగ్రహం కుదురుతుంది. మనస్సు సాత్విక మౌతుంది.

**యజ్ఞవిదః :** ఇక్కడ చెప్పిన 12 రకాల యజ్ఞాలను తెలుసుకొని చేసేవారంతా యజ్ఞ విదులే. దానివల్ల వారు అన్ని కల్మషాల నుండి విడివడి పోతారు. కల్మషాలంటే మనలోని వాసనలే.ఈ వాసనలే జీవుడికి దేవుడికి మధ్యనున్న తెర. ఆ వాసనలు తొలగితే చిత్తం శుద్ధమై, నిష్కల్మషమై ఆత్మజ్ఞానం కలిగి జీవుడు దేవుడే అవుతాడు. దానితో ఆనందం- బ్రహ్మానందం కలుగుతుంది.

– ఈ యజ్ఞం చేసిన వారికి ఫలమేమి? చేయని వారి గతి యేమి?

**శ్లో॥ యజ్ఞశిష్టామృత భుజః యాంతి బ్రహ్మ సనాతనం।**
**నాయం లోకో స్త్య యజ్ఞస్య కుతో ఽ న్యః కురుసత్తమ॥ (31)**

**తా॥ కురుశ్రేష్ఠా! యజ్ఞంచేయగా మిగిలిన అమృతాన్ని భుజిం చినవారు సనాతన బ్రహ్మాన్ని చేరుకుంటారు. యజ్ఞం చెయ్యని వాడికి ఈ లోకమే లేదు. ఇంక పరలోకమెక్కడ?**

**వ్యాఖ్య :** ప్రాచీన కాలంనుండి యజ్ఞ యాగాదులు చేసినప్పుడు హోమాగ్నిలో హోమం చేయగా మిగిలిన పదార్థాలను దేవతా ప్రసాదంగా భక్తిభావంతో

కళ్ళకద్దుకొని భుజిస్తారు. అదే అమృతం – యజ్ఞ శిష్టామృతం. అలాగే పూజాదికాలు చేసినప్పుడు నైవే ద్యాలు భగవంతునికి సమర్పించిన తర్వాత, మిగిలిన దానిని ప్రసాదంగా స్వీకరిస్తాం. ఐతే ఇక్కడ చెప్పిన యజ్ఞాలేవీ హోమాలు కావు. ఇక్కడ యజ్ఞమనే పదం అలంకారిక భాషలో వాడబడింది. ఇక్కడ తినే పదార్థాల ప్రసక్తే లేదు. మరి యజ్ఞం చేయగా మిగిలిన అమృతాన్ని భుజించటం ఏమిటి?

బ్రహ్మభావనతో, యజ్ఞభావనతో పైన చెప్పిన కర్మలు గనుక చేస్తే మిగిలే అన్నం ఏమిటంటే సాత్వికమైన, నిర్మలమైన, నిష్కల్మషమైన మనస్సే. అంటే ఈపైన చెప్పిన 12 రకాల యజ్ఞాలు లోపలి ప్రకృతిని శుద్ధపరచి మనస్సును సాత్వికం చేస్తాయి. అట్టి సాత్విక మనస్సును ఉపయోగించుకొని సాధనలు సాగిస్తే, జ్ఞాన మథనం చేస్తే, అట్టివారు చేరుకొనేది సనాతనమైన బ్రహ్మాన్నే – అంటే పరమాత్మనే.

**అయజ్ఞ:** ఇక పైన చెప్పిన 12 రకాల యజ్ఞాలలో ఏ ఒక్కదానిని కూడా ఆచరించని వారే అయజ్ఞులు. అట్టివారికి ఇహమూ లేదు, పరమూలేదు. యజ్ఞ భావంతో కర్మలాచరించని వారికి ఇహలోక సుఖమే ఉండదు. ఇక పరలోక సుఖం ఎక్కడ? అంటూ ఆశ్చ ర్యాన్ని వ్యక్తం చేస్తున్నాడు పరమాత్మ. మనవల్ల ఇతరులకు మేలు జరిగినప్పుడు మన మనస్సు ఎంతో హాయిగా, ఆనందంగా ఉంటుంది. అంటే ఇహలోక సుఖం కలుగుతుంది. దానితో పాటు మనస్సు సత్త్వగుణంతో నిండిపోవటం వల్ల పరమాత్మకు సన్నిహితమై చివరకు పరమాత్మాకారంగా మారిపోతుంది. యజ్ఞ కర్మ చేయని వానికి ఇహమూ– పరమూ రెండూ లేవు. వారి బ్రతుకు నిరర్థకం.

అంతేకాదు, ఋగ్వేదంలో ఋక్కు ఇలా చెబుతున్నది. **"కేవలా ఘోభవతి కేవలాదీ"** అంటే తనకు గానే తినేవాడు (స్వార్థంతో తినేవాడు) పాపాన్నే తింటున్నాడు అని. ఇదే విషయం భగవద్గీత 3వ అధ్యాయంలోని 13వ శ్లోకం కూడా చెబుతున్నది. తమ కోసం వండుకుని తినేవాడు పాపాన్నే తింటున్నాడు– అని.

కనుక మనుష్యుడు తన కర్తవ్య కర్మలను నిస్వార్థంగా, త్యాగ భావంతో చెయ్యాలి. అదే యజ్ఞకర్మ అవుతుంది.

యజ్ఞకర్మ బంధం కాదు, అది మోక్షదాయకం.

యజ్ఞహీనుడు ఉభయలోక భ్రష్టుడు.







కనుక మనిషి తన స్వేచ్ఛను, లాభాన్ని, సంపాదనను తానొక్కడే తినరాదు. సమాజానికి కొంత త్యాగం చేయాలి. అలా చెయ్యకపోతే సమయం వచ్చినప్పుడు ఈ ప్రకృతే బలవంతంగా అతడి వద్దనుండి లాగివేస్తుంది. అగ్నిప్రమాదాలు, భూకంపాలు, తుపానులు, దొంగలు, బందిపోట్లు, మృత్యువు–ఏదైనా కావచ్చు, అతడి నుండి బలాత్కారంగా లాగివేయటం తథ్యం.

ఈ యజ్ఞాలను ఇప్పుడు తన స్వంత అభిప్రాయంగా శ్రీ కృష్ణుడు చెబుతున్నాడా? లేక ఇవి వేదాలలో చెప్పబడినవేనా?

ఇంతవరకు చెప్పిన యజ్ఞాల యొక్క ప్రాచీనత, వాటివల్ల ఫలితాలు ఏమిటో తరువాత శ్లోకంలో –

***శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞాః వితతా బ్రహ్మణో ముఖే ।***
***కర్మజాన్ విద్ధితాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ (32)***

**తా: ఈ ప్రకారంగా అనేక యజ్ఞాలు బ్రహ్మముఖం నుండి వచ్చిన వేదములందు విస్తారంగా చెప్పబడినవి. ఇవి అన్నీ కర్మల వల్లపుట్టినవని తెలుసుకో. ఇలా తెలుసుకుంటే విముక్తడవు అవుతావు.**

**వ్యాఖ్య :** ఇంతవరకు భగవానుడు తెలిపిన యజ్ఞాలన్నీ ఎక్కడైనా చెప్పబడ్డాయా? లేక ఆయన స్వంత అభిప్రాయాలా? అనే సందేహం ఎవరికైనా కలుగుతుంది.

ఇక్కడ చెప్పిన యజ్ఞాలే కాదు, ఇంకా అనేక విధాలైన యజ్ఞాలు బ్రహ్మముఖం నుండి వెలువడినవే. బ్రహ్మకు 4 ముఖాలు. నాలుగు ముఖాలూ నాలుగు వేదాలు. **అంటే బ్రహ్మ యొక్క ముఖం నుండి వెలువడిన వాక్యాలే వేదాలు**. అంటే వేదాలు మానవ నిర్మితాలు కావు. అందుకే వాటిని 'అపౌరు షేయాలు' అన్నారు. **వేదాలన్నీ మానవుణ్ణి మాధవుడిగా నిలబెట్టటానికి మార్గాలు చూపేవే.** మనం ప్రస్తుతం ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి చేర్చటానికి జన్మ చరితార్థం చేసుకోటానికి కావ లసిన మార్గాలన్నీ వేదాలలో చెప్పబడ్డాయి. ఆ మార్గాలే అనేక యజ్ఞాలు. ఇవి ద్వాపరయుగం చివరలో కురుక్షేత్ర యుద్ధ భూమిలో అర్జునుని యుద్ధోన్ముఖుని చేయటానికి కల్పించి చెప్పబడినవి కాదు. ఇవి ప్రాచీనమైనవి, సనాతనమైనవి, పరమాత్మ నుండి వచ్చినవి. సాక్షాత్తూ భగవంతుని వాక్యాలు.

**కర్మజాన్విద్ధి :** ఇవన్నీ కర్మవల్ల జనించినవని తెలుసుకో. అంటే శరీరం ద్వారా చేయవలసిన కర్మలు కొన్ని; ఇంద్రియాల ద్వారా చేయవలసినవి కొన్ని,

వాక్కు ద్వారా చేయవలసినవి కొన్ని, మనోబుద్ధుల ద్వారా చేయవలసినవి కొన్ని. ఈ విధంగా అన్ని యజ్ఞాలూ కర్మాచరణములే. అంటే కర్మ చేయటం వల్లనే ఫలి స్తాయి గాని కేవలం విన్నంత మాత్రాన ఫలించవు. అంటే సోమరులకు ఈ యజ్ఞాలు ఏమాత్రం ప్రయోజనాన్ని కలిగించవు.

**ఏవంజ్ఞాత్వావిమోక్ష్యసే :** ఈ రహస్యాన్ని తెలుసుకున్నవారికే ముక్తి. **అంటే ఇక్కడ పేర్కొన్న యజ్ఞాలన్నింటినీ చక్కగా తెలుసుకొని, అవగాహన చేసుకొని, ఆ మార్గాన కర్మలు చేస్తూ, మనోబుద్ధులను సవరించుకొంటేనే ముక్తికి మార్గం చూపుతాయి.** ఇవన్నీ మార్గాలే గాని లక్ష్యం కాదు. సాధనలే గాని సాధ్యం కాదు.

పైన చెప్పిన యజ్ఞాలన్నింటిలోనూ శ్రేష్టమైన యజ్ఞమేదో తెలియజేసి భగవానుడు ఈ యజ్ఞప్రకరణాన్ని ముగిస్తున్నాడు.

*శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।*
*సర్వంకర్మాఖిలం పార్థ । జ్ఞానే పరిసమాప్యతే ॥ (33)*

**తా॥ పరంతపా! ద్రవ్యంతో చేసే యజ్ఞాలన్నింటికన్నా జ్ఞాన యజ్ఞం శ్రేష్టమైనది. పార్థా! అన్నిరకాలైన కర్మ మొత్తం జ్ఞానంలో పరిసమాప్తమై పోతున్నది.**

**వ్యాఖ్య : ద్రవ్యమయాత్ యజ్ఞాత్ :** ద్రవ్యంతో చేసే యజ్ఞా లన్నింటికన్నా శ్రేష్టమైనది జ్ఞానయజ్ఞం మాత్రమే. హోమాది క్రతువులు, దానధర్మాలు, ప్రాణా యామాలు, స్వాధ్యాయాలు, పూజాదికాలు, ఆహార నియమాలు మొదలైనవన్నీ ద్రవ్యయజ్ఞాలే. ద్రవ్యమంటే కేవలం డబ్బు మాత్రమే కాదు. అంతరంగికంగా మనలో వున్న క్షమ, కరుణ, ధృతి మొదలైన భావాలన్నీ ద్రవ్యాలే. ఇలా ఆలోచించినప్పుడుపైన పేర్కొన్న యజ్ఞాలలో అధికభాగం ద్రవ్యయజ్ఞాలే. జ్ఞానయజ్ఞం వీటికి విలక్షణమైనది. **జ్ఞానయజ్ఞం** ఎందుకు శ్రేష్టమైనది?

**సాధారణంగా ద్రవ్యయజ్ఞాలలో ఆహుతి చేసేది భౌతిక పదార్థాలను. కానీ జ్ఞానయజ్ఞంలో ఆహుతి చేసేది అజ్ఞానాన్ని. భౌతిక పదార్థాలను ఆహుతి చేస్తే అనిత్యమైన స్వర్గసౌఖ్యాలు లభిస్తాయి. మళ్ళీ మళ్ళీ జన్మలు తప్పవు. కాని అజ్ఞానాన్ని ఆహుతి చేస్తే నిత్యమైన పరమాత్మ ప్రాప్తియే- మోక్షప్రాప్తియే. ఇక జన్మ ఉండదు. అందుకే భౌతిక పదార్థాలను ఆహుతి చేసే ద్రవ్యయజ్ఞాల కన్నా మనలోని అజ్ఞానాన్ని ఆహుతి చేసే జ్ఞాన యజ్ఞమే శ్రేష్ఠమైనదని భగవానుడు నిర్ద్వంద్వంగా తెలియజేస్తున్నాడు.** దీనిని బట్టి ధన రూపేణా, వస్తు రూపేణా, మాట రూపేణా







మనం ఇతరులకు చేసే సహాయాన్ని గాని, దానధర్మాలను గాని, దైవ పూజలను గాని, అంతగొప్పగా చెప్పుకోవాల్సిన పనిలేదు. **అజ్ఞానాన్ని త్రుంచి, జ్ఞానాన్ని పంచే జ్ఞానదానమే సర్వశ్రేష్ఠమైనదని భగవానుని అభిప్రాయం.**

ఈ మాత్రానికి మరి ఇన్ని రకాల యజ్ఞాలను భగవంతుడు ఎందుకు చెప్పటం? శ్రేష్టమైన జ్ఞానయజ్ఞం ఒక్కదాన్ని చెబితే సరిపోయేది గదా! అంటే **జ్ఞానం ఒక్కసారిగా ఆకస్మాత్తుగా లభించేది కాదు. దానికి గొప్ప అర్హత ఉండాలి. ఏ కొద్దిమందో అనేక జన్మల సుకృతం వల్ల అర్హత సంపాదించుకుంటారు. అట్టివారికే జ్ఞానబోధ.** మరి మిగిలిన వారి సంగతేమిటి? వారు అర్హతను సంపాదించుకోవాలి. అందుకొరకే అన్నిరకాల కర్మలను యజ్ఞాలుగా ఇక్కడ చెప్పటం జరిగింది. ఈ కర్మలతో కూడిన ద్రవ్యయజ్ఞాలన్నీ జీవుడికి చిత్తశుద్ధిని కలిగిస్తాయి. జ్ఞానప్రాప్తికి అర్హతను కలిగిస్తాయి.

డాక్టరు కావాలంటే ఎం.బి.బి.ఎస్. చదవాలిగాని ఈ టెన్త్ క్లాస్, ఇంటర్మీడి యట్లు ఎందుకు అనవసరంగా అంటామా? ఇవన్నీ చక్కగా చదివి, మంచి మార్కులు తెచ్చుకుంటేనే గదా! ఎం.బి.బి.ఎస్. సీటుకు అర్హత వచ్చేది. అలాగే ఇక్కడ చెప్పిన యజ్ఞ కర్మలు జ్ఞానప్రాప్తికి అర్హత కలిగిస్తాయి. జ్ఞానప్రాప్తి వల్లనే సర్వకర్మబంధ విముక్తి, మోక్షప్రాప్తి.

**అఖిలం కర్మజ్ఞానే పరిసమాప్యతే : సమస్తమైన కర్మలు జీవుణ్ణి జ్ఞానం వద్దకు చేర్చి అందులో లయమైపోతాయి. నదు లన్నీ నీటిని సముద్రానికి చేర్చి సముద్రంలో లయమైపోతాయి. అలాగే కర్మలనే నదులు చివరకు జ్ఞానమనే సముద్రాన్ని చేరి జ్ఞానంలో లయమైపోతాయి. దీనిని బట్టి మనకొక విషయం స్పష్టమౌతున్నది. ప్రతివారూ జ్ఞానాన్ని పొందటం ద్వారా మనలో గూడుకట్టుకొనియున్న అజ్ఞానాన్ని తొలగించుకోవాలి. జ్ఞానాన్ని -ఆత్మజ్ఞానాన్ని పొందితేనే మోక్షం. అందుకే 'జ్ఞానే నైవతు కైవల్యం' అన్నారు. జ్ఞానం వల్లనే కైవల్యం-మోక్షం అని భావం.** అయితే అట్టి జ్ఞానం కలగాలంటే దానికి అర్హత కర్మల వల్లనే- యజ్ఞకర్మల వల్లనే -నిష్కామ కర్మయోగం వల్లనే అని గ్రహించాలి. కనుక యజ్ఞకర్మలను సాధనగా, మార్గంగా చేసుకొని జ్ఞానమనే లక్ష్యాన్ని చేరుకోవాలి. 'కర్మ' జీవుణ్ణి 'జ్ఞానం' అనే భవనం యొక్క ప్రధానద్వారం వద్దకు తీసుకొని వెళుతుంది. అక్కడి నుండి జ్ఞానమే పరమాత్మలో చేరుస్తుంది. **ఈ విధంగా కర్మయొక్క అవసరాన్ని, జ్ఞానం యొక్క శ్రేష్టత్వాన్ని -రెండింటినీ ఇక్కడ చెప్పటం జరిగింది.**

దీనితో యజ్ఞ ప్రకరణం పూర్తి అయింది. దివ్యజన్మ ప్రక రణం, దివ్య కర్మ ప్రకరణం, యజ్ఞ ప్రకరణం అనే 3 ప్రకరణాలు పూర్తయినవి కనుక నాలుగవదైన జ్ఞాన ప్రకరణం ఇక ప్రారంభం కాబోతున్నది.

**జ్ఞానప్రకరణం ప్రారంభం**

– జ్ఞానం అన్నింటికన్నా శ్రేష్టమైనది. మరి ఆ జ్ఞానాన్ని ఎలా అందుకోవాలి?

***శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।***
***ఉపదేక్ష్యంతితేజ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥ (34)***

**తా॥ ఆత్మజ్ఞానాన్ని సాష్టాంగ నమస్కారం చేసి, సేవించి, సమయం చూసి ప్రశ్నించి తెలుసుకో. ఆత్మానుభవం, శాస్త్రజ్ఞానం గల గురువులు నీకు ఆ జ్ఞానాన్ని ఉపదేశిస్తారు.**

**వ్యాఖ్య :** భగవంతుని నోట జ్ఞానప్రశంస రాగానే ఆ జ్ఞానం ఎక్కడ దొరుకుతుంది? అనే జిజ్ఞాస కలిగింది అర్జునునిలో. అర్జునుని పుణ్యం గొప్పది. అడక్కుండానే అన్నీ ఇచ్చే పరమాత్మ జగద్గురువు తనకు గురువుగా లభించాడు. గోవిందుడు అందరి వాడే కదా! కనుక ఆయన బోధ అర్జునునికి మాత్రమే కాదు, మనకు కూడా అని గ్రహించాలి.

**జీవన్ముక్తిని కలిగించే జ్ఞానాన్ని, బ్రహ్మవిద్యను గురూపదేశం ద్వారానే పొందాలి.** అయితే ఎట్టివాడు గురువు? తనను తాను ఉద్ధరించుకుంటూ ఇతరులను కూడా ఉద్ధరించగలవాడే సద్గు రువు. శ్రీరామకృష్ణ పరమహంస గురువులు 3 రకాలన్నారు. ఒకడు రాయిలాంటివాడు, ఒకడు ఆకులాంటివాడు, మరొకడు పడవలాంటివాడు. రాయి నీటిలో వేస్తే దుబుక్కున మునిగి పోతుంది. కానీ ఆకు తేలుతుంది కానీ దానిమీద ఏమాత్రం బరువు పడినా మునిగిపోతుంది. అయితే పడవ మాత్రం తానూ తేలుతుంది. ఇతరులనూ క్షేమంగా తీరం చేరుస్తుంది. అందుకే పడవలాంటి వాణ్ణి గురువుగా ఎంచుకోవాలి. అందుకే **'బాన్‌కర్ పీజియే-జాన్‌కర్ కీజియే' అన్నారు. వడకట్టి నీళ్ళను త్రాగు, గుర్తించి గురువును చేసుకో-అని.**

మనం ఆశ్రయించవలసిన గురువుకు ముఖ్యంగా రెండు లక్షణాలుండాలని ఈ శ్లోకంలో భగవానుడు తెలియజేస్తున్నాడు. అవి. 1) జ్ఞానినః 2) తత్త్వదర్శినః అని. అంటే శాస్త్రజ్ఞానం, అనుభవజ్ఞానం గలవారే సద్గురువులు-అని. ఈ విషయాన్నే 'ముండకోపనిషత్' స్పష్టం చేస్తున్నది. 'తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్







శ్రోత్రియం, బ్రహ్మనిష్టం' అంటే-అట్టి జ్ఞానంకోసం శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన గురువును ఆశ్రయించాలి-అని. శ్రోత్రియుడు అంటే శ్రుతులయొక్కవేదాల యొక్క జ్ఞానం గలవాడు; బ్రహ్మనిష్ఠుడు అంటే అనుభవజ్ఞానం గలవాడు అని.

**కొందరు గురువులకు శాస్త్రజ్ఞానం వుంటుంది. ధాటిగా శిష్యులకు చెప్పగలరు. కాని అనుభవం మాత్రం శూన్యం. అట్టివారి జ్ఞానం భుక్తికి పనికి వస్తుందే గాని ముక్తికి పనికిరాదు. అనుభవం లేని శాస్త్రజ్ఞానం ఖాళీ కుండలాంటిది. మోత బాగా వస్తుంది కానీ దప్పిక తీరదు. మరికొందరికి శాస్త్రజ్ఞానం ఏమీ వుండదు. కానీ పూర్వజన్మ సుకృతం వల్ల సద్గురువు లభించి, వారు చూపిన మార్గంలో పయనించి ఆత్మానుభూతిని పొందుతారు. వారే తత్త్వదర్శినులు. వారు తాము తరించగలరేగాని, శిష్యులకు వారి స్థాయిలోనికి దిగి శాస్త్రాన్ని బోధించలేరు, శిష్యుల సందేహాలు తీర్చి వారిని సంతృప్తిపరచలేరు, వారిని ఉన్నతస్థాయికి తీసుకొని వెళ్ళలేరు. కనుక శాస్త్రజ్ఞానం, అనుభవ జ్ఞానం రెండూ ఉన్నవారే సద్గురువులు.**

ఒకడు పొరుగూరికి ప్రయాణమైపోతున్నాడు. మధ్యలో ఒక వాగు ప్రవహిస్తూ వున్నది. కొత్తనీరు కూడా చేరి ఉధృతంగా ప్రవహిస్తున్నది. తటాలున దిగటం మంచిది కాదని చుట్టూ చూశాడు. ఆ తీరంలో ఒక బిచ్చగాడు కూర్చున్నాడు. అతడు కుంటివాడు. ఈ బాటసారిని చూచి ఆ బిచ్చగాడు ధైర్యం చెప్పాడు- 'నడుముల్లోతుకన్నా నీరు లేదు. ఈ త్రోవన వెళ్ళొచ్చు' అని. కానీ బాటసారికి ధైర్యం చాలలేదు. ఎందుకంటే అతడు కుంటివాడు గనుక ఎప్పుడూ నీటిలో దిగి ఉండడు. వాడిది అనుభవం లేనిమాట. అంతలో గ్రుడ్డివాడొకడు ఆ దారిన వచ్చాడు. వాడు ఇతరుల సాయంతో రోజూ ఆ వాగును దాటు తూనే వుంటాడు. వాణ్ణి అడిగితే 'ఏం ఫరవాలేదు వెళ్ళు' అన్నాడు. వాడికి అనుభవం వుంది గాని, కళ్ళు లేవు గనుక, ఖచ్చితంగా తాను దాటే మార్గం తెలియదు. అందుకే వాడి మాటను కూడా విశ్వసించలేకపోయాడు బాటసారి.

అంతలో మరొక వ్యక్తి వచ్చాడు. అతడికి కళ్ళున్నాయి. కాళ్ళున్నాయి. రోజూ ఆ వాగును దాటివెళ్లి వస్తూ వుంటాడు. అతడు 'రావయ్యా! నాకు తెలుసు ఈ మార్గం' అన్నాడు. బాట సారి ఏమాత్రం సందేహించకుండా అతడి వెంట వెళ్లి తీరం దాటాడు. అనుభవజ్ఞానం లేనివాడు కుంటివాడు, శాస్త్రజ్ఞానం లేనివాడు

గ్రుడ్డివాడు. రెండూ ఉన్నవాడే సరైన మార్గం చూపగల గురువు. అట్టి గురువులనే జ్ఞానం కొరకు ఆశ్రయించాలి. వారే శిష్యులకు ఉపదేశిస్తారు. అయితే అందరికీ ఉపదేశిస్తారా? లేదు. అర్హత గలవారికే. ఏమిటా అర్హతలు? ఎట్టి అర్హతలు శిష్యులకు ఉండాలి?

**1. ప్రణిపాతేన :** అంటే సాష్టాంగ నమస్కారం చేయుట. సాష్టాంగ నమస్కారం ఎవరైనా చేయవచ్చు. అదేమంత కష్టమైన పనికాదు. **కాని దీని అసలైన అర్థం ఆత్మార్పణ గావించుట. గురువుపట్ల సంపూర్ణమైన శరణాగత భావం వుండాలి.** వినయం, విధేయత, గౌరవం, సర్వ సమర్పణ భావం-అంటే ఇక నీదే భారం, పాలముంచినా, నీటముంచినా నీవే దిక్కు అనే శరణాగతి వుండాలి. పూజ్యభావం ఉండాలి. గురువు చెప్పిన దానిని తు.చ. తప్పక పాటించాలి.

'సమిత్పాణియై గురు సన్నిధికి వెళ్ళాలి' అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. సమిధలంటే ఎండిన కట్టె పుల్లలు. ఇంతవరకు అనుభవించిన విషయాలన్నీ ఎండిన కట్టెపుల్లలలాగా నిస్సార మైనవని, వాటిని గురు సన్నిధిలో విడిచిపెడుతున్నానని ఇందు లోని భావం. అలా సర్వాన్నీ వదలి గురువు యొక్క పాదాలను పట్టాలి.

**2. సేవయా :** ఆత్మజ్ఞానాన్ని పొందాలనుకున్న శిష్యుడు మనఃపూర్వకంగా గురుసేవ చేయాలి. గురువుకు ప్రీతి కలిగించే పనులు చేయాలి. **'గురుశుశ్రూషయా విద్య' అన్నారు. అంటే గురుసేవ చేసిన వారికే బ్రహ్మ విద్య లభిస్తుంది, అనుభవానికి వస్తుంది అని.** గురువు ద్వారా కాకుండా స్వయంగా శాస్త్రాల ద్వారా ఈ జ్ఞానాన్ని అందుకోలేమా? అని కొందరికి సందేహం వస్తుంటుంది.

**సముద్రంలోని నీరు అలాగే త్రాగితే దప్పిక తీరుతుందా? ఆ నీరే కదా మేఘాల ద్వారా వర్షించేది- అని అనుకుంటు న్నామా? లేదు. వర్షపునీరు దప్పిక తీరుస్తుంది. సముద్రపు నీరు త్రాగలేం, త్రాగినా దప్పిక తీరదు. అలాగే శాస్త్రాల ద్వారా జ్ఞానాన్ని పొందలేం. పొందినా అనుభవానికి రాదు. శాస్త్రంలోని విషయాలే అయినా గురువుద్వారా వస్తేనే జ్ఞానపిపాసుల దప్పిక తీరేది.** కనుక గురుసేవ చేసి, ఆయన అనుగ్రహాన్ని పొంది ఈ జ్ఞానాన్ని సంపాదించాలి. సాక్షాత్తూ భగవానుడే 18వ అధ్యాయం 67వ శ్లోకంలో 'నచాశుశ్రూషవే వాచ్యం' అంటూ గురుసేవ చేయనివానికి ఈ జ్ఞానాన్ని చెప్పకూడదు-అన్నారు.







**3. పరిప్రశ్నేన :** ఆత్మార్పణ భావంతోగురువును చేరి, గురుసేవ చేసి, తగిన సమయంలో గురువును ప్రశ్నించి జ్ఞానాన్ని తెలుసుకోవాలి. 'ప్రశ్నేన' అనక 'పరిప్రశ్నేన' అని ఎందుకన్నారు? ప్రశ్నించే వారు అనేక రకాల వారుంటారు. కొందరు గురువును పరీక్షించటానికి ప్రశ్నిస్తారు. కొందరు కొండవీటి చాంతాడులా ఎంతకీ తెగకుండా ప్రశ్నిస్తారు. కొందరు తమకు తెలిసిన విషయాన్ని చెప్పాలనే ఉద్దేశ్యంతో ప్రశ్నగా ప్రారంభించి తెలిసినదంతా చెప్పేస్తుంటారు. కొందరు అధికారిలా ప్రశ్నిస్తారు. కొందరు వ్యంగ్యంగా ప్రశ్నిస్తారు. వీరెవ్వరికీ జ్ఞానాన్ని తెలుసుకోవాలనే కోరిక ఉండదు. ఇవి ప్రశ్నలేగాని పరిప్రశ్నలు కాదు. పరిప్రశ్న అంటే ఏమిటి? తనకున్న సందేహం ఏమిటో స్పష్టం చేసుకొని, ఆ సందేహాన్ని తీర్చుకొనుటకు చక్కని పదాలతో, అర్థవంతంగా, క్లుప్తంగా, సూటిగా, వినయంతో, తెలుసుకోవాలి అనే తపనతో గురువుకు అనుకూలమైన సమయం చూచి ప్రశ్నించటమే పరిప్రశ్న. అట్టివారికే జ్ఞానామృతాన్ని పానం చేసే అర్హత వుంటుంది. ఇలా ప్రశ్నించటం అంటే గురువులో తాళం వేయబడివున్న జ్ఞానద్వారాన్ని తెరుస్తున్నామని అర్థం.

ఈ జ్ఞానం యొక్క మహిమ ఎట్టిది?

***శ్లో॥ యజ్ఞాత్వా న పునర్మోహం ఏవంయాస్యసి పాండవ ।***
***యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ (35)***

**తా॥ అర్జునా! దేనిని తెలుసుకొంటే తిరిగి ఈ ప్రకారంగా మోహాన్ని చెందవో, దేనిచేత అశేషమైన జీవుళ్ళను నీలోను, నాలోనుచూడగలుగుతావో అదే ఈ జ్ఞానం.**

**వ్యాఖ్య :** జ్ఞానాన్ని తెలుసుకుంటే మోహంలో పడిపోయే ప్రమాదం తొలగిపోతుంది. అయితే **అసలు మోహం అంటే ఏమిటి? ఈ జగత్తు సత్యం అనుకోవటం, నేను దేహాన్ని అనుకోవటం, భగవంతుడు నాకన్నా వేరుగా వున్నాడు అని అనుకోవటం, ఈ ప్రపంచంలోని వస్తువుల ద్వారా, విషయాల ద్వారా నిజమైన సుఖాన్ని పొందగలను అనుకోవటం. ఇదే మోహం. ఇదే అజ్ఞానం. ఇదే భ్రమ. ఇది కేవలం జ్ఞానం వల్లనే తొలగిపోతుంది. తొలగిపోవటమే కాదు, తిరిగి ఈ మోహం తలెత్తే ప్రమాదం కూడా లేదు.**

శరీరం నేను అనుకోవటం అహంకారం. శరీరానికి సంబం ధించినవారు నావారు అనుకోవటం మమకారం. ఈ అహంకార మమకారాల వల్లనే శోకం. ఇప్పుడు అర్జునుని శోకానికి కారణం ఈ అహంకార మమకారాలే. ఈ భయంకర యుద్ధాన్ని 'నేను' చేయాలి, భీష్మద్రోణులు 'నా వారు', నా వారిని నేను చంపవలసి

వస్తున్నది అని విషాదంలో మునిగిపోయాడు అర్జునుడు. ఇదంతా అజ్ఞానం వల్లనే. ఆత్మజ్ఞానం లేకపోవటం వల్లనే. అందుకే భగవానుడు ఆత్మజ్ఞానాన్ని బోధించి అర్జునుని శోకమోహాలు తొలగించాడు. ఒక్కసారి జ్ఞానసూర్యుడు ఉదయిస్తే చాలు మోహాంధకారం పటాపంచలు.

ఇట్టి జ్ఞానాన్ని పొందినవాడు దృశ్య వస్తువులను చూచి మోహం చెందడు. కారణం? అతడు సమస్త ప్రాణులను తన యందు, పరమాత్మ యందు దర్శిస్తాడు గనుక. సర్వభూతాలను ఆత్మయందు దర్శించే జ్ఞాని అంతటా ఆత్మనే దర్శిస్తాడు గనుక శోకం లేదు, మోహం లేదు. మమకారం ఉంటే శోకం, అహం కారం ఉంటే మోహం.

త్రాడు నందు పాము కల్పించబడినట్లు ఈ చరాచర జగత్తు అంతా పరమాత్మ యందు కల్పించబడింది. అంటే ఉన్నది పర మాత్మే గాని జగత్తు కాదు. **కలలో నుండి మేలుకొన్నవానికి కల లోని వస్తువులు కల్పించబడినవని, అవి తనలోనే కనిపించినట్లు కనిపించి అదృశ్యమైపోయినవని గ్రహించి వాటికోసం శోకించడు. అదే విధంగా అజ్ఞానం నుండి మేల్కొన్న జ్ఞానికి ఈ మిథ్యాజగత్తులోని వస్తువులు, విషయాలు, వ్యక్తులు- సర్వమూ కల్పించబడినవని, అవి తన (ఆత్మ)లోనే కనిపించి అజ్ఞానం తొలగగానే అదృశ్యమైపోతున్నాయని గ్రహించి వేటికోసమూ శోకించడు. ఇలా సమస్తాన్ని ఆత్మయందు అంటే తనయందు దర్శించేవాడే జ్ఞాని. ఈ విధంగా శోకమోహాలను తొలగించేదే జ్ఞానం.**

– ఈ జ్ఞానం యొక్క ప్రయోజనం ఏమిటి?

**శ్లో॥ *అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః॥***
***సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ (36)***

**తా॥ పాపాత్ములందరిలోకి గొప్ప పాపం చేసిన వాడివైనా నీ సమస్త పాపాన్ని జ్ఞానమనే పడవ సాయంతో దాటివేస్తావు.**

**వ్యాఖ్య :** ఎంతటి పాపాత్ముడైనా సరే తన తప్పు తెలుసుకొని, పశ్చాత్తాపం చెంది, స్వయంకృషితో, ప్రయత్నంతో సాధన చేసి తప్పకుండా తన జన్మహక్కు అయిన ఆ బ్రహ్మతత్వాన్ని- అమృతత్వాన్ని అందుకోవచ్చు-అని దృఢంగా నిశ్చయించి చెప్పేదే భారతీయ వేదాంతం-సనాతన ఆధ్యాత్మిక తత్వం. ఆ విషయాన్ని తెలిపేదే ఈ శ్లోకం.







అందుకే ఇక్కడ భగవానుడు సమస్త మానవాళికి ఢంకా భజాయించి ‘ఓ మానవుడా! పాపాత్ములందరిలోకీ గొప్ప పాపాలు చేసిన వాడివైనా, ఘోరమైన నేరాలు చేసినవాడివైనా సరే, ఆ పాపం అనే సముద్రాన్ని జ్ఞానమనే పడవ సహాయంతో దాటగలవు’ అని అభయప్రదానం చేస్తున్నాడు.

ఈ భావాన్ని అపార్థం చేసుకొనే అవకాశం కూడా ఉంది. ఎన్ని పాపాలు చేసినా పరవాలేదు. తప్పించుకోవటానికి మనకొక తేలిక మార్గం ఉంది. జ్ఞానమనే పడవనెక్కితే సరి-అని అనుకోవడం జ్ఞానమనే పడవనెక్కటం తేలికైన పనికాదు. దానికి కొన్ని జన్మల సుకృతం ఉండాలి. సదాచార సంపన్నుడవు కావాలి. గొప్ప సద్గురువు లభించాలి. ఆత్మజ్ఞానాన్ని శ్రవణం చేయాలి. మననం చేసి అవగతం చేసుకోవాలి. దానిని ఆచరణలోనికి తెచ్చుకొనుటకు విశేషమైన సాధన చేయాలి. భగవంతుని అనుగ్రహం కావాలి. ప్రాపంచిక విషయాల పట్ల తీవ్ర వైరాగ్యం కలగాలి. ఇదంతా చాలా కష్టసాధ్యం. కావాలని పాపాలు చేసి నాకు జ్ఞానం ప్రసా దించండి, ఈ పాపాలు కడిగివేసుకొని మళ్లీ పాపాలు చెయ్య టానికి పోతాను-అనే వాడికి ఈ జ్ఞానాన్ని పొందటం అసాధ్యం. భారతీయ వేదాంతంలో ఇలాంటి అవకాశం ఏమీ లేదు. పాపాత్ముడు పాపాత్ముడుగా అలాగే పడి ఉండాల్సిన పని లేదు, అట్టివారు కూడా తీవ్ర ప్రయత్నంతో తరించవచ్చు అని చెప్పటమే ఇందులోని విశేషం.

పాపపు పనులలో మునిగిపోయి ఉన్న పాపాత్ముడు జ్ఞానాన్ని పొందలేడు-అనే విషయం భగవంతునికి తెలియదా? తెలుసు. పాపి పాపిగానే ఉండి జ్ఞానాన్ని పొందలేడు. అయితే అతడు కూడా ఏ జన్మలోనో చేసుకున్న సుకృతం వల్లనో, మహాపురుషుల సాంగత్యం వల్లనో, భగవంతుని అనుగ్రహం కలిగి, చేసిన పాపాలకు పశ్చాత్తాపం చెంది, జ్ఞానామృతాన్ని పానం చెయ్యటానికి అర్హత సంపాదించాడా! నిన్నటివరకు అతడెలాంటి పాపాలు చేసిన వాడైనా తరించగలడు-దీనికి వాల్మీకి మహర్షి గాథయే మనకు దృష్టాంతం.

ఇంతకూ అంతటి పాపాత్ముడు పాప సముద్రాన్ని ఎలా దాటగలుగుతాడు? జ్ఞానమనే పడవసాయంతో. నిజంగా జ్ఞానంతో పాపాన్ని దాటగలడా?-

మన నిజస్వరూపం ఏమిటో తెలియని అజ్ఞాన దశలో ‘జీవుణ్ణి’ అని భావించి ఈ జాగ్రదవస్థలో ఎన్నో తప్పులుచేస్తాం, పాపాలు చేస్తాం, స్వార్థంతో కొట్టుకుపోతాం.

అయితే ఆత్మజ్ఞానం కలిగితే–నేను ఆత్మను అని గ్రహించి ఆత్మగా వుంటే జీవభావం రద్దు ఔతుంది.దానితోపాటు జీవభావంలో చేసిన పాపాలు కూడా రద్దయిపోతాయి.

స్వప్నంలో ఒక వ్యక్తితో తగాదా పడ్డాం. చివరకు చేతులు కలిసినవి. ఆ పోరాటంలో ఒక బండరాయితో అతడి తలపై కొట్టాం. వాడు నేలకొరిగాడు. దానితో హత్యా నేరం. కోర్టులో కేసు నడుస్తున్నది. వాయిదాలకు హాజరవుతున్నాం. చివరకు తీర్పు వచ్చింది..7 సంవత్సరాలు కఠిన కారాగారం అని. ఇంతలో మెలకువ వచ్చింది. అంటే హత్యానేరం క్రింద శిక్ష రద్దయి పోయింది. స్వప్నావస్థలో స్వప్నపురుషుడు చేసిన హత్యకు శిక్ష అనుభవించాల్సింది ఆ స్వప్న పురుషుడే గాని మేలుకున్న ఈ జాగ్రత్ పురుషుడు కాదు. అలాగే జాగ్రదవస్థలోని జీవుడు అనుభవిస్తాడేగాని జాగ్రదవస్థలోని జీవుడు చేసిన హత్యకు శిక్షను జ్ఞానావస్థలోనికి మేలుకొన్న జ్ఞాన పురుషుడు అనుభవించాల్సిన పనిలేదు. కలలో చేసిన నేరాలు ఇలలో మేలుకున్నవాణ్ణి ఏమీ చేయవు. అలాగే ఇలలో చేసిన పాపాలు జ్ఞానంలో మేలుకున్నవాణ్ణి (జ్ఞానిని) ఏమీ చేయలేవు. ఇదే జ్ఞానమనే పడవలో పాప సముద్రాన్ని దాటటమంటే.

ఎంతటి సముద్రాన్నైనా పడవతో దాటవచ్చు. ఎంత పాపా న్నైనా జ్ఞానంతో దాటవచ్చు.

ఈ జ్ఞానం యొక్క గొప్పతనాన్ని అద్భుతమైన ఉపమానం ద్వారా తెలియజేస్తున్నాడు.

*శ్లో॥ యథై దాంసి సమిద్ధో ఽ గ్నిః భస్మసాత్కురుతే ఽ ర్జున।*
*జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥* **(37)**

**తా॥ అర్జునా! ప్రజ్వలిస్తున్న అగ్ని ఏ విధంగా కట్టెలను భస్మీ పటలం చేస్తుందో అలాగే జ్ఞానాగ్ని అన్ని కర్మలను భస్మీపటలం చేస్తుంది.**

**వ్యాఖ్య :–** కట్టెలు ఏ ఆకారంలో ఉన్నా, ఏ రంగులో ఉన్నా, ఏ సైజులో ఉన్నా, ఎండినవైనా, పచ్చివైనా, పుచ్చినవైనా, చచ్చిన వైనా, చేదువైనా, వగరువైనా– ఎలాంటివైనా సరే భగభగమండే అగ్నిలో పడితే కాలి బూడిదైపోతాయి. ఆ బూడిదలో మనం వేసిన కట్టెల తేడాలను తెలుసుకోలేం. అన్నీ ఒకే రూపుగా– బూడిదగా మారిపోతాయి. అలాగే కర్మలు– అవి పుణ్యకర్మలైనా, పాపకర్మలైనా, శాస్త్రవిహిత కర్మలైనా, శాస్త్రవిరుద్ధ కర్మలైనా, ఆగామికర్మలైనా, సంచితకర్మలైనా,







ప్రారబ్ధకర్మలైనా– ఏవైనా సరే– అన్నీ అజ్ఞా నాగ్నిలో– జ్ఞానమనే అగ్నిలో – ఆత్మ జ్ఞానమనే అగ్నిలో– నేను ఆత్మను అని గ్రహించి ఆత్మగా వుంటే పుట్టే అగ్నిలో దగ్ధమైపోతాయి.

**కర్మలు చేస్తే ఫలాలు రాకమానవు. వాటిని ఎప్పుడో ఒక ప్పుడు అనుభవించక తప్పదు. వాటిని అనుభవించటానికి జన్మిం చక తప్పదు. జన్మిస్తే దుఃఖాలు తప్పవు. వీటిని తప్పించుకోవాలంటే కర్మలను వదిలించుకోవాలి. కర్మలను దగ్ధం చేయాలి. ఎలా? జ్ఞానమనే అగ్నిని రాజేసి అందులో భస్మం చేయాలి. మరి జ్ఞానాగ్ని ఎలా పుడుతుంది? శాస్త్ర సాయంతో, గురుముఖతః ఆత్మ జ్ఞానాన్ని గ్రహించి, నేను ఈ దేహేంద్రియమనో బుద్ధులు కాను, వీటికి ఆధారంగా ఉన్న చైతన్యస్వరూప ఆత్మను; ఆత్మ అంటే అంతటా వున్న పరమాత్మే. కనుక నేను పరమాత్మనే– 'అహం బ్రహ్మాస్మి' అనే వేదాంత మహావాక్య అనుభవంతో జ్ఞానాగ్ని పుడుతుంది. దానిలో సమస్తకర్మలు భస్మమైపోతాయి. సమస్త కర్మలు అంటే...**

**అనుభవించుటకు దాగియున్న సంచితకర్మలు–**

**అనుభవించటం ప్రారంభమైన ప్రారబ్ధకర్మలు–**

**భవిష్యత్తులో అనుభవించుటకు తయారవుతున్న ఆగామి కర్మలు.**

కర్మలన్నీ జాగ్రదావస్థలో చేసేవి. ఆ కర్మఫలాలను ఏ జన్మలో అనుభవించినా జాగ్రదవస్థలోనే అనుభవించాలి. ఎప్పుడైతే జాగ్రదావస్థ నుండి జ్ఞానావస్థకు చేరావో ఇక ఏ కర్మఫలాలు అనుభవించే పని లేదు. ఎందుకంటే జన్మలే ఉండవు కనుక.

**కలలో చేసిన కర్మల యొక్క ఫలం కలలోనే అనుభవించాలి. జాగ్రదవస్థలో అనుభవించే పనిలేదు. అలాగే జాగ్రదవస్థలో చేసిన కర్మల ఫలాలు జాగ్రదవస్థలో అనుభవించాలేగాని, జ్ఞానావస్థలో అనుభవించే పని లేదు. ఇదీ జ్ఞానయోగం యొక్క గొప్పతనం.**

– ఇంతటి గొప్ప జ్ఞానాన్ని పొందటం ఎలా? ఏమిటి దానికి అర్హత?–

***శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।***
***తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మ ని విందతి॥ (38)***

**తా॥ జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు మరొకటి ఇక్కడ లేదు. అట్టి జ్ఞానాన్ని కర్మయోగంలో సిద్ధిపొందినవాడు కాలక్రమంలో తనయందే స్వయంగా పొందుతాడు.**

**వ్యాఖ్య :-** సమస్తకర్మలను దగ్ధం చేసేది, దుఃఖరాహిత్యాన్ని కలిగించేది అయిన జ్ఞానాన్ని గురించి మాటలతో చెప్పవీలులేనిదని తెలియజేయుటకు భగవానుడు "జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు ఈ లోకంలో మరొకటిలేదు.." అని ప్రశంసిస్తున్నాడు. సర్వపాపాలను, **సర్వ కర్మలను నశింపజేసే ఈ జ్ఞానం అనుభవజ్ఞానమే గాని శాస్త్రాలను చదివిగాని, గురువుల ద్వారా వినిగాని పొందేది కాదు. మరి ఎలా పొందటం?**

**యోగసంసిద్ధః :- యోగంనందు - కర్మయోగంనందు సిద్ధిపొందినవాడే పొందగలడు. నిష్కామ కర్మయోగాన్ని ఆచరిస్తే చిత్తశుద్ధి కలిగి మనసు ప్రశాంతమౌతుంది. బట్టమీది మురికి తొలగితేనే రంగు అతుకుతుంది. అలాగే మనసుకు పట్టిన మాలిన్యం తొలగితేనే జ్ఞానం అతుకుతుంది. కనుక నేను ఆత్మ జ్ఞానాన్ని పొందటం ఎలాగ? అని మథన పడేవారు ముందు నిష్కామ కర్మలు ఆచరించాలి- అని గ్రహించాలి. అంతే తప్ప ఒక్కసారిగా ఆత్మానుభూతిని ఎవరు ఇస్తారా? అని వెతికితే ప్రయోజనం లేదు.**

**ఏ గురువూ నెత్తిన చెయ్యి పెట్టి జ్ఞానాన్ని ప్రసాదించలేదు. అనుభూతిని కలిగించలేదు. నిష్కామకర్మాచరణలో సిద్ధిపొందిన వారికి ఈ జ్ఞానం స్వయంగానే లభిస్తుంది. అందుకే ఇక్కడ 'స్వయం' అన్నారు. అంటే సద్గురువుల ద్వారా ఆత్మజ్ఞానాన్ని శ్రవణం చేసి, మనన నిధి ధ్యాసనల ద్వారా సిద్ధపరచుకొన్న వారికి కర్మయోగంలో పరిపక్వత సాధించటంతో స్వయంగా ఈ జ్ఞానం అనుభవంగా మారుతుంది.** అయితే ఎక్కడ ఈ జ్ఞానం అనుభవంగా మారుతుంది?

**ఆత్మని :- తనలోనే.** అంటే గ్రహించిన జ్ఞానం మనలోనే అను భూతిని కలిగిస్తుంది. ఇప్పటివరకు నేను జీవుణ్ణి అనే అనుభూతి ఉన్నది. ఏమండీ! డాక్టరు గారూ! అని పిలిస్తే డాక్టరుగారు పలుకుతారు. ఎందుకంటే ఆయనకు డాక్టరుననే అనుభూతి ఉన్నది. రామారావుగారూ! అని పిలిస్తే ముందుకు వెళ్తున్న ఆ రామారావు అనే శాల్తీ వెనుదిరగడం జరుగుతుంది. ఎందుకంటే అతడికి రామారావుననే అనుభవం ఉన్నది. పురుషులంతా కుడివైపు కూర్చోండి, స్త్రీలంతా ఎడమవైపు కూర్చోండి అనగానే అలా కూర్చుంటారు. ఎందుకంటే మేము పురుషులమనే అనుభూతి వీరికి, మేము స్త్రీలమనే అనుభూతి వారికి ఉన్నది గనుక. **ఇప్పుడు ఎలాగైతే నేను పురుషుణ్ణి-నేను స్త్రీని అనే అనుభూతి ఉన్నదో అలాగే నేను**







**ఆత్మను అనే అనుభూతి ఉండాలి. సర్వకాల సర్వా వస్థలలోను, ఏ పనిచేస్తున్నా ఏమి మాట్లాడుతున్నా నేను ఆత్మను అనే స్పృహ ఉంటే అదే ఆత్మానుభూతి. అట్టి అనుభూతి ఎప్పుడు కలుగుతుంది? ఎంతకాలానికి కలుగుతుంది?**

**కాలేన :-** కాలక్రమంలో జ్ఞానం ఎప్పుడు అనుభవానికి వస్తుందో ఎవరూ చెప్పలేరు. అది వారి వారి చిత్తశుద్ధి మీద, సాధనయొక్క తీవ్రత మీద, ప్రాపంచిక విషయ వైరాగ్యం మీద ఆధారపడి ఉంటుంది. ప్రయత్నం చేసే అందరికీ, **సాధన చేసే అందరికీ, శాస్త్రజ్ఞానాన్ని సద్గురువుల ద్వారా శ్రవణం చేసిన అందరికీ, నిష్కామకర్మయోగ ఆచరణ చేసిన వారందరికీ ఎప్పుడో ఒకప్పుడు తప్పక జ్ఞానసిద్ధి కలుగుతుంది. అయితే సాధన మానుకోరాదు, ప్రయత్నాన్ని వదులుకోరాదు.**

కనుక నిష్కామకర్మయోగాన్ని ఆచరిస్తూ, ఆత్మజ్ఞానాన్ని సద్గురువుల ద్వారా పొంది, సాధనలు చేసి జ్ఞానసిద్ధిని, ఆత్మసిద్ధిని, జీవన్ముక్తిని పొందాలి. ఇటువంటి జ్ఞానాన్ని పొందే నిశ్చితమైన మార్గం, లేదా అర్హతలు ఏమిటి? ఆ జ్ఞానాన్ని పొందితే ఫలం ఏమిటి?

***శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః॥***
***జ్ఞానం లబ్ధ్వాపరాం శాంతిం అచిరేణాధిగచ్ఛతి॥ (39)***

**తా॥ శ్రద్ధ గలవారు, జ్ఞానమునందే తదేకనిష్ఠ గలవారు, ఇంద్రియనిగ్రహం గలవారు జ్ఞానాన్ని పొందగలుగుతారు. జ్ఞానానుభవాన్ని పొంది శీఘ్రముగా శ్రేష్టమైన శాంతిని పొందగలుగుతారు.**

**వ్యాఖ్య:-** జ్ఞానాన్ని పొందటానికి బహిరంగ సాధనలూ కావాలి. అంతరంగ సాధనలూ కావాలి. బహిరంగ సాధనలు-ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా- అనేవి 34వ శ్లోకంలో చెప్పారు.

అంతరంగ సాధనలు-శ్రద్ధ, తత్పరః, సంయతేంద్రియః - అనేవి ఇక్కడ తెలియజేస్తున్నారు.

**1. శ్రద్ధావాన్ : శ్రద్ధగలవానికే జ్ఞానసిద్ధియని ఉపనిషత్తులు ఘోషి స్తున్నాయి. శ్రద్ధ అంటే 'గురు వేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధా' అన్నారు. అంటే గురువుపట్ల, వేదాంత వాక్యాలపట్ల అచంచలమైన విశ్వాసమే శ్రద్ధ. ఈ జ్ఞానం వల్లనే నాకు విముక్తి లభిస్తుంది; ఈ గురువు యొక్క ఉపదేశాల వల్లనే నాలోని అజ్ఞానాంధకారం తొలగిపోతుంది. అనే ధృఢమైన విశ్వాసం ఉండాలి.** భగవద్గీతలో అనేక చోట్ల ఈ శ్రద్ధ అనే పదం ప్రయోగించబడింది. కనుక జ్ఞానసిద్ధికి శ్రద్ధ ఎంతో అవసరం.

**2. తత్పరః** :– తదేకనిష్ఠ శ్రద్ధతోపాటు గురువు ఉపదేశించే విషయాన్ని తెలుసుకొనుటయందు పట్టుదల ఉండాలి. ఎన్ని ఆటంకాలు వస్తున్నా వాటన్నింటిని ఎదుర్కొని, అధిగమించి ఆత్మ జ్ఞానాన్ని పొందటమే పరమలక్ష్యంగా పెట్టుకోవాలి. జ్ఞానసంపాదన కోసం ప్రాపంచిక విషయాలను, వస్తువులను, సుఖాలను, భోగాలను – దేనినైనా సరే వదులుకోవటానికి సిద్ధంగా ఉండాలి. ఇదే పట్టుదల, త్యాగభావం, తదేక నిష్ఠ ఇవి నిరంతరం ఉండాలి. ఈ భావన సోమరితనాన్ని దరిచేరనీయకుండా ఉంటుంది. ధన సంపాదన కోసం ఎంత పట్టుదలగా ఉంటామో అంతకన్న వందరెట్లు అధికమైన పట్టుదల ఉంటేనే జ్ఞాన సంపాదనయందు తత్పరులమైనట్లు.

**3. సంయతేంద్రియః** :– ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొనుట. మనకున్న 5 జ్ఞానేంద్రియాలు– కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక–ఎప్పుడూ ప్రపంచంలోకి పరుగులు తీస్తూ దృశ్య విషయాల గురించి, వాసనల గురించీ, శబ్దవిషయాల గురించీ, స్పర్శవిషయాల గురించీ, రుచుల గురించీ సమాచారాన్ని సేకరించి తెచ్చి మనస్సుకు చేరవేస్తాయి. దానితో మనస్సు ఆ విషయాల గురించి ఆలోచిస్తూ, వాటిని తెచ్చుకొనుటకు, అనుభవించుటకు, ఆనందించుటకు ఆలోచనలు చేస్తూ అలజడులతో, ఆందోళనలతో, అశాంతితో అలమటించి పోతుంది. **ఇలా విషయ మోహజాలంలో చిక్కి, అశాంతితో నిండిపోయిన మనస్సులో భగవంతునికి చోటుండదు. జ్ఞానాన్ని పొందటానికి అవకాశం ఉండదు. మనస్సునుండి ఈ విషయ వ్యామోహాలను తొలగిస్తే తప్ప జ్ఞానానికి చోటు దొర కదు.** అందుకే ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవాలి. నిగ్రహిం చాలి. స్వాధీనంలో ఉంచుకోవాలి. విషయాలనే దొంగలను ఇంద్రియద్వారాల వద్దనే అడ్డుకుంటే మనస్సుకు ఏ నష్టమూ జరగదు; ప్రశాంతతకు భంగం కలగదు. అప్పుడే జ్ఞాన సంపాదనలో ఏకాగ్రత కుదురుతుంది.

ఇలా జ్ఞానాన్ని సంపాదిస్తే ప్రయోజనం ఏమిటి?

**పరాంశాంతిం గచ్ఛతి** :– పరమశాంతిని పొందుతారు. అదే మోక్షస్థితి. అయితే ఎప్పుడు లభిస్తుంది ఈ స్థితి? **అచిరేణ:** అచిర కాలంలోనే, శీఘ్రంగా, ఎప్పుడైతే ఆత్మ జ్ఞానాన్ని అనుభవపూర్వ కంగా పొందుతావో అప్పుడే పరమశాంతి లభిస్తుంది. భోజనం చేస్తే ఆకలి తీరుతుంది. అంటే తర్వాత ఎప్పుడో కాదు. భోజనం చేస్తూ చేస్తూ ఉండగానే క్రమక్రమంగా తీరిపోతుంది ఆకలి. సూర్యోదయంతో చీకటి





తొలగుతుంది. అంటే సూర్యోదయమైన కొన్ని గంటలకు చీకటి తొలగుతుంది అని కాదు. సూర్యుడు కని పించటంతోనే చీకటి తొలగిపోతుంది. అలాగే జ్ఞానం పొందటం తోనే పరమశాంతి కలుగుతుంది.

– శ్రద్ధతో జ్ఞానాన్ని పొందకపోతే ఏమవుతుంది?–

***శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధ ధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।***
***నాయం లోకో౽స్తి నపరః న సుఖం సంశయాత్మనః ॥ (40)***

**తా॥ జ్ఞానం లేనివాడు, శ్రద్ధలేనివాడు, సంశయాత్ముడు నశించిపోతాడు. అన్నింటినీ సందేహించేవాడికి ఇహమూ లేదు, పరమూలేదు, సుఖమూ లేదు.**

**వ్యాఖ్య** :– 1. శ్రద్ధతో సద్గురువును సేవించి, ఆయనద్వారా జ్ఞానాన్ని పొందినవాడు జ్ఞాని, అలా వేదాంత జ్ఞానాన్ని– ఆత్మ జ్ఞానాన్ని అభ్యసించనివాడు **'అజ్ఞుడు'** – అజ్ఞాని. జ్ఞానికి ఆత్మను గురించిన సంశయాలేవీ ఉండవు. జ్ఞానం లేకపోయినా, వేదాంతాన్ని అభ్యసించకపోయినా కనీసం గురువుపై విశ్వాసం ఉండి గురుబోధలను ఆలకించి సాధన చేస్తే అతడికీ సందేహాలు తొలగి పోతాయి.

2. వేదాంత వాక్యాల పట్లగాని, గురువు పట్లగాని ఏమాత్రం శ్రద్ధ లేనివాడు **'అశ్రద్ధధానుడు'**. ఒక విధమైన సోమరిపోతు. అతడు గురువును ప్రశ్నించి తెలుసుకోడు, తెలుసుకోవాలని అనుకోడు. 3. ఇక శాస్త్రమూ తెలియక, గురువుపై విశ్వాసమూ లేక ప్రతిదానినీ సందేహించేవాడు, ప్రతిదానినీ వ్యతిరేకించేవాడు, అన్నీ తనకే తెలుసుననుకొనేవాడు **'సంశయాత్ముడు'**. సంశయాత్మునికి ఫలం వినశ్యతి.

**ఈ ముగ్గురిలో 'అజ్ఞుడు' వేదాంత విషయాలను తెలుసుకోడు, తెలుసుకొనే ప్రయత్నం చేయడు. అందువల్ల ఈ సంసార జనన మరణ చక్రంలో పడి దుఃఖిస్తూనే ఉంటాడు. రెండవవాడు 'అశ్రద్ధ ధానుడు' ఇతడికి శాస్త్రాలపట్ల విశ్వాసం లేదు. గురువు పట్ల విశ్వాసముండదు. అందువల్ల ఆచరించవలసిన విధులను ఆచరించక ధర్మచ్యుతుడై నశిస్తాడు.** ఇతడు ఇతరులకన్నా గొప్ప వాడిగా ఉండాలని శాస్త్రాలను తెలుసుకుంటాడు. కాని వాటిపై ఏ మాత్రం విశ్వాసం ఉండదు. అందుకే ఆచరించడు. కనుక పతనం తప్పదు. **ఇక మూడవవాడు 'సంశయాత్ముడు.' ప్రతి దానినీ సందేహిస్తూ 'ఇలా చేస్తే ఫలితం వస్తుందన్నారు. వస్తుందో రాదో; అలా వెళితే మంచిదన్నారు. నిజమో కాదో; అని సందేహిస్తూ ఏ పనీ చేయక కర్తవ్యతావిమూఢుడవుతాడు. అన్నింటినీ సందేహిస్తూ నశించిపోతాడు.**

ఈ ముగ్గురూ నశించిపోయేవారైనా వీరిలో కొంచెం హెచ్చు తగ్గులున్నాయి. ముగ్గురిలోను సంశయాత్ముని నష్టం గొప్పది. **సంశయం అనేది మనస్సుకు క్షయరోగం లాంటిది. మనస్సుకు అధిష్ఠానదేవత చంద్రుడు. ఆయనకూ క్షయరోగమే. ఆ చంద్రుని ప్రభావానికి లోనయ్యే మనస్సుకూ క్షయరోగమే.** సంశయాత్ముడు ఇంట్లో భార్యను నమ్మడు, బిడ్డలను నమ్మడు, బంధుమిత్రులను నమ్మడు, ఇరుగు పొరుగువారినీ నమ్మడు, చివరకు తనను తానే నమ్మడు, తన శ్వాసలో కూడా విశ్వాసం ఉండదు.

**ఒకడికి ఒళ్ళంతా తెలివే. అతితెలివి అనర్థం కదా! ఒకరోజున కూర్చొని ఏమీ తోచక, దేనిని సందేహించడానికి ఏమీ దొరకక, శ్వాస మీదకి దృష్టిపోయింది. ఈ శ్వాస బయటకుపోయి లోపలకు వస్తున్నది. దీన్ని ఎలా నమ్మటం? బయటకు పోయిన శ్వాస తిరిగి లోనికి రాకపోతే ఎట్లా? సంశయం కలిగింది. వెంటనే దీని పని పట్టాలనుకున్నాడు. గాలిని పీల్చి, బయటకు పోకుండా గట్టిగా బిగబట్టాడు. అంతే, పదికాలాలు బతకాల్సిన వాడు 'ఠా' అన్నాడు. అందుకే 'విశ్వాసం లేకపోతే నిశ్వాస నడవదు' అన్నారు.**

**అందువల్ల సంశయాత్మునికి ఇహంలేదు, పరంలేదు. ఇక్కడా సుఖంలేదు. అక్కడా ఉండదు.** అజ్ఞుడు, అశ్రద్ధ ధానుడు పరలోక సుఖాలకు దూరమైనా ఇహలోక సుఖమైనా దక్కుతుంది వారికి. కాని సంశయాత్ముడు భోజన, భాజన, లౌకిక, విహార విషయాల్లో కూడా స్వేచ్ఛగా ఉండలేడు. ఇష్టమైన స్వీటు నోట్లో పెట్టుకోబోతూ దీనిలో విషం కలిసిందేమోనని దూరంగా విసిరేస్తాడు. ఇంట్లో నుండి పనిమీద బయటకు వెళుతూ, తాను లేని సమయంలో భార్య ఇల్లంతా దోచుకుని పుట్టింటికి పోతుందేమోనని సందేహించి పని మానుకుని ఇంటికి కాపలా ఉంటాడు. అందుకే సంశయాత్మ నికి సుఖం ఉండదు.

**అజ్ఞుడు సుసాధ్యుడు. తేలికగా మార్గానికి వస్తాడు. అశ్రద్ధ ధానుడు దుస్సాధ్యుడు. కష్టంమీద మార్గంలోకి వస్తాడు. సంశయా త్ముడు అసాధ్యుడు. ఎంత కష్టపడ్డా మార్గంలోకి రానేరాడు. దేనికైనా మందు ఉంటుంది గాని సంశయాత్మునికి మందులేదు. వాడి గతి అధోగతే.** అతడికి సుఖంలేదు. శాంతి లేదు. ఇహమూ లేదు, పరమూ లేదు. తాను చెప్పిన విషయాలను సంక్షిప్తం చేసి చెబుతూ, అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేస్తున్నాడు భగవానుడు.







***శ్లో॥ యోగ సన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయం।***
***ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥ (41)***

**తా॥ ధనంజయా! నిష్కామకర్మయోగంచేత కర్మఫలాలను సన్న్యసించి, జ్ఞానంచేత సంశయాలను తొలగించుకున్న ఆత్మవం తుణ్ణి కర్మలు బంధించవు.**

**వ్యాఖ్య :–** యోగసన్న్యస్త కర్మాణం : ఫలాసక్తిని విడిచిపెట్టి, నిష్కామంగా, యజ్ఞభావంతో త్యాగభావంతో కర్మలు చేసినప్పుడు ఆ కర్మఫలాలు అతడిని అంటవు. ఆ కర్మలపట్లగాని, కర్మ ఫలాల పట్లగాని సంగభావంలేదు గనుకను, భగవదార్పణ బుద్ధితో యజ్ఞ కర్మలను ఆచరిస్తున్నందువల్లను అతడిలో వాసనలు పేరుకోవు. క్రొత్తగా వాసనలు రాకపోవటమే గాక పాతవాసనలు కూడా క్షయమైపోతాయి. అలా వాసనలు క్షయం కావటం వల్ల ఇక క్రొత్తగా కర్మలకు ప్రేరణ కూడా ఉండదు. ఇదే 'యోగ సన్న్యస్తకర్మాణం' అంటే. ఎప్పుడైతే వాసనాక్షయం జరిగిందో అప్పుడు మనస్సు నిర్మలమవుతుంది. అట్టి మనస్సులో జ్ఞానబీజం అంకురిస్తుంది. అందువల్ల–

**జ్ఞానసంఛిన్న సంశయం :–** జ్ఞానాన్ని –ఆత్మజ్ఞానాన్ని పొందినప్పుడు మనస్సులోని సంశయాలన్నీ పటాపంచలైపోతాయి. ఇప్పటివరకు జీవుడుగా, పరిమితుడుగా వ్యవహరిస్తున్న తాను పరమాత్మనేనని తెలుసుకుంటాడు. తాను ఏ కొరతలు లేని పరిపూర్ణుడనని గ్రహిస్తాడు. అతడే–

**ఆత్మవంతం :–** ఆత్మవిదుడు – ఆత్మనిష్ఠుడు. తాను పరమాత్మను అనే నిశ్చయజ్ఞానం కలిగితే నిరంతరం ఆత్మయందే నిష్ఠగలవాడై, ఆత్మ స్వరూపునిగానే జీవిస్తాడు.

అట్టి ఆత్మవంతుడు –ఆత్మనిష్ఠుడు ఏ విధమైన కర్మలు చేస్తు న్నప్పటికి ఆ కర్మలు అతడిని బంధించవు. ఎందుకంటే బంధం అనేది కర్మలు చేయటంవల్లనో, మానటం వల్లనో కాదు; ఆ కర్మలు చేస్తున్నప్పుడు మనస్సు ఫలితాన్ని కోరుకుంటున్నదా? లేదా? ఫలితంతో సంగభావం పెట్టుకుందా? లేదా? కర్తృత్వం ఉందా? లేదా? అనేదాని మీదనే ఆధారపడి ఉంటుంది.

కోరికతో, ఫలితంపై ఆసక్తితో, నేను చేస్తున్నాను అనే కర్తృత్వ భావన (అహంకారం)తో కర్మలు చేసినప్పుడే కర్మఫలాలు, వాసనలు మన అంతఃకరణంలో పేరుకొని; వాటిని అనుభవించటానికి తిరిగి జన్మలు ఎత్తాలి. ఆ జన్మలలో వాసనల ప్రేరణతో మళ్ళీ కర్మలు చేస్తూ ఈ జన్మకర్మ వలయంలో చిక్కి ఈ లోకానికి బంధింపబడతాము.

**స్వప్నంలో నీవు ఒకరిని హత్య చేశావు. అయితే మేలుకున్న తర్వాత శిక్షను అనుభవిస్తావా? ఒకవేళ శిక్ష అనుభవించాల్సివస్తే ఆ స్వప్నంలో హత్యచేసిన స్వప్నపురుషుడు అనుభవించాలే గాని, జాగ్రత్తలోకి మేలుకున్న నీకేమీ సంబంధం లేదు. అలాగే జాగ్రత్తలు జాగ్రత్ పురుషుడు చేసిన కర్మల యొక్క ఫలాన్ని జాగ్రత్ పురుషుడు అనుభవిస్తాడేగాని జాగ్రత్ నుంచి మేలుకున్న ఆత్మ పురుషుని - ఆత్మవంతుణ్ణి ఆ ఫలాలు - శిక్షలు తాకవు.**

అయితే భగవదార్పణ బుద్ధితో, నిష్కామంగా చేసిన కర్మలు మనకు బంధం కావుగాని సంశయాలు ఇంకా ఉండవచ్చు. జ్ఞానం కలిగేంత వరకు సంశయాలు తొలగిపోవు. జ్ఞానం కలగడంతోనే సమస్త సంశయాలు తొలగిపోతాయి. 'జ్ఞానసంఛిన్న సంశయం' అంటే ఇదే.

కనుక నిష్కామకర్మయోగంతో చిత్తశుద్ధిని పొందితే ఆత్మజ్ఞానం కలుగుతుంది. అప్పుడు ఆత్మలోనే రమిస్తూ, ఆత్మలోనే స్థితులమై ఆత్మ వంతులమౌతాము. ఆత్మవంతునికి ఏ బంధాలు ఉండవు. కనుక ఆత్మవంతులై శాశ్వత ఆనందాన్ని పొందటానికి ప్రయత్నించాలి. యుద్ధం చేయాలా? వద్దా? దీనివల్ల పాపాన్ని మూటగట్టుకోవటమౌతుందా? అనే అర్జునుని హృదయంలోని సంశయాన్ని ఛేదించే ఉపాయాన్ని తెలిపి కర్తవ్యాన్ని బోధిస్తున్నాడు భగవానుడు.

***శ్లో॥ తస్మాదజ్ఞాన సంభూతం హృత్ స్థం జ్ఞానాసినాత్మనః।***
***ఛిత్త్వైనం సంశయం యోగం ఆతిష్ఠోత్తిష్ఠ భారత॥ (42)***

**తా॥ అందువల్ల ఓ అర్జునా! అజ్ఞానంవల్ల పుట్టి, నీ హృదయంలోనే ఉన్న సంశయాన్ని ఆత్మజ్ఞానమనే ఖడ్గంతో ఛేదించి నిష్కామ కర్మయోగాన్ని ఆచరించు, లెమ్ము!**

**వ్యాఖ్య :-** అర్జునుని హృదయంలో సందేహం ఉంది. ఈ యుద్ధం పాపమేమో! తనవాళ్ళు అందరిని చంపుకోవాల్సివస్తుంది గదా! ఇంతటి ఘోరమైన పాపాన్ని తానెందుకు చేయాలి? అని. ఈ సందేహం కలగటానికి కారణం అహంకార మమకారాలే. ఈ యుద్ధాన్ని చేయాల్సింది తానేనని - అంటే అర్జునుడనే పేరుగల శరీరమని; ఇది అహంకారం. ఇక తాను చంపవలసింది తన తండ్రులను, తాతలను, గురువులను, ఆత్మీయబంధువులను అని; ఇది మమకారం. ఈ అహంకార మమకారాలే అజ్ఞానం. కనుక ఈ సంశయం అజ్ఞానం వల్ల పుట్టినది. ఎక్కడున్నదీ







అజ్ఞానం? హృత్‌స్థం. హృదయంలోనే. అహంకార మమకారాలతో కూడిన ఈ అజ్ఞానం ప్రతి జీవుని హృదయంలోనే వాసనల రూపంలో ఉంటుంది. మరి ఈ అజ్ఞానాన్ని ఎలా పోగొట్టుకోవాలి?

**జ్ఞానాసినా ఛిత్వా :-** జ్ఞానమనే ఖడ్గంతో ఛేదించాలి. ఆత్మ జ్ఞానమనే ఖడ్గంతో ఛేదించాలి. అంధకారం పోవాలంటే వెలుగు రావాలి. అజ్ఞానమనే అంధకారం పోవాలంటే జ్ఞానమనే వెలుగు రావాలి. జ్ఞానం లేకుండా ఏ కర్మలు చేసినా అవి ఫలితాన్నివ్వవు. అందుకే జ్ఞానంతో కర్మలనాచరించాలి. కర్మయోగం గొప్పదే అయినా జ్ఞానం తో కూడినప్పుడే పూర్తి ప్రయోజనం. **శ్రీ మహావిష్ణువు గొప్పవాడే అయినా లక్ష్మీదేవితో కూడినప్పుడే ఆధిక్యత. లక్ష్మీదేవిని విడిచి పెడితే అన్నీ కష్టాలే. అలాగే జ్ఞానంతో కూడినప్పుడే కర్మయోగం మంచి ఖడ్గంగా మారుతుంది. దానితో సంశయాలను ఛేదించవచ్చు.** మరి సంశయాలు తీరిన తర్వాత ఏం చేయాలి?

**యోగం ఆతిష్ఠ:-** నిష్కామ కర్మయోగాన్ని ఆచరించాలి. స్వార్థం కోసం గాక ధర్మరక్షణ కొరకు, లోక కళ్యాణం కొరకు, కర్తవ్య పాలన కొరకు చెయ్యాలి.

ఈ ఉపాయాన్ని తెలియజేసి భగవానుడు ఇప్పుడు అర్జునుని ఉద్బోధిస్తున్నాడు. **"అర్జునా! నీలో ఉన్న సంశయాలు అజ్ఞానంతో కలిగినవి గనుక వాటిని జ్ఞానఖడ్గంతో ఖండించివెయ్యి. ఇక నీవు చెయ్యవలసిన కర్తవ్య కర్మను - ఈ ధర్మయుద్ధాన్ని ధర్మరక్షణకోసం చెయ్యి. జ్ఞానం యొక్క ఔన్నత్యాన్ని తెలుసుకున్నావు గదా! ఇక లే..." అంటున్నాడు.**

**ఉత్తిష్ఠ! :- లే! లేచి కర్తవ్యోన్ముఖుడవు కా! అని ధైర్యాన్ని కలిగిస్తు న్నాడు. కర్తవ్య విముఖుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయటం ద్వారా మనందరిని కూడా కర్తవ్య నిర్వహణకై ప్రోత్సహిస్తున్నాడు భగవానుడు.**

అజ్ఞానమనే వ్యామోహానికి చిక్కి స్వధర్మాన్ని ఆచరించటానికి సంశయించే నరుని చూచి కరుణబూనాడు నారాయణుడు. తన పాంచజన్య శంఖారావంతో శ్రుతి కలిపి "యోగం ఆతిష్ఠ - ఉత్తిష్ఠ" కర్మయోగివికా! లే! లెమ్ము! అని ఉద్బోధిస్తున్నాడు. **మనం కూడా మన కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. స్వస్థితిలో నిలవటమే మన కర్తవ్యం. మన యదార్థ స్వరూపాన్ని మనం తెలుసుకొని మనం మనంగా ఉండిపోవాలి. అందుకు ఎదురయ్యే ఆటంకాలను, సంశయాలను అధిగమించి**

**కర్తవ్యోన్ముఖులం కావాలి. ప్రయత్నిస్తే సాయపడతాడు భగవానుడు. నీవు చేయి చాపు. ఆయన పట్టుకుంటాడు. నీ చేతులు పొట్టివైనా ఆయన చేతులు చాలా పొడవు. కనుక లేచి ఆయన కరుణామృత వర్షంలో తడవాలి. ఇదే ఈ అధ్యాయం మనకిచ్చే సందేశం.**

**గద్యం :–** ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోஉధ్యాయః

తా॥ ఓం తత్ సత్ ఈ ప్రకారంగా భగవద్గీత అనబడే ఈ ఉపనిషత్తులో, బ్రహ్మ విద్యా ప్రతిపాదితమై, యోగశాస్త్రమైన ఈ గీతా శాస్త్రంలో జ్ఞానయోగమనే నాలుగవ అధ్యాయం సమాప్తం.

**వ్యాఖ్య :–** 'చతుర్థ' అనే పదం 'ఛత్' అనే ధాతువునుండి వచ్చింది. ఛత్ అంటే కప్పివేయటం. ఆత్మ మనలో వాసనల తెర చేత కప్పివేయబడింది. ఆ కప్పివేయబడిన ఆత్మను గురించి తెలియజేసే అధ్యాయం ఇది.

***(4వ అధ్యాయం సమాప్తం)***







## ఐదవ అధ్యాయం

# కర్మ సన్యాసయోగం



# పూజ్య గురుదేవులు



జ్ఞానప్రపూర్ణ

## శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట


Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com


Visit www.srichalapathirao.com to listen Pravachanas

# ఉపోద్ఘాతం

'సన్యాసం' అంటే అన్నింటినీ విడిచిపెట్టడం. అన్నీ విడిచిన సర్వసంగ పరిత్యాగినే 'సన్యాసి' అంటారు. కర్మ సన్యాసం అంటే కర్మలన్నింటినీ విడిచిపెట్టటం కదా! మరి అన్ని కర్మలను విడిచి సోమరిగా ఉండేవాణ్ణి కర్మసన్యాసి అంటారా? అసలు కర్మలన్నిం టినీ విడిచిపెట్టడం ఎవరికైనా సాధ్యమవుతుందా? కాదు. **అసలు కర్మలనన్నింటినీ విడిచి పెట్టాల్సిన అవసరమేమిటి? కర్మలు చేస్తే కర్మ ఫలాలు వస్తాయి. ఆ కర్మ ఫలాలననుభవించటానికి జన్మలొస్తాయి. ఆ జన్మలలో మళ్ళీ కర్మలు చేస్తాం. వాటివల్ల మళ్ళీ కర్మఫలాలు. వాటి అనుభవం కొరకు మళ్ళీ జన్మలు. ఇలా జన్మ కర్మ వలయంలో చిక్కుకుపోయి ఈ లోకానికి బంధించబడు తున్నాం. అందువల్ల బంధం కాకుండా ఉండేం దుకే కర్మలను విడిచిపెట్టాలి అనటం. మరి కర్మలను విడిచి ఒక్క క్షణం కూడా ఉండలేం కదా! ఎలా? కర్మలు చేస్తూనే కర్మ ఫలాలు అంటకుండా చూసుకోవాలి. బంధం కాకుండా చూసు కోవాలి. దానికే నిష్కామ కర్మయోగాన్ని 3వ అధ్యాయంలో చెప్పటం జరిగింది.** నిష్కామ కర్మయోగం అంటే కోరికలు లేకుండా కర్మలు చేయటం. "అసలు కోరికలు లేకుండా ఎలా ఉంటాయండీ?" అంటే– సరే! కోరిక ఉంటే ఉంది. వచ్చే ఫలితం మీద ఆసక్తి లేకుండా ఏ ఫలితం వచ్చినా సరే, దానిని భగవంతుని ప్రసాదంగా భావించి స్వీకరిస్తాను– అనే దృఢ నిశ్చయంతో కర్మలుచెయ్యి. అది కూడా నిష్కామ కర్మయోగమే అని తెలియ జేశారు. ఇదంతా మూడవ అధ్యాయంలో చెప్పటం జరిగింది. సోమరిలాగా జీవితాన్ని వ్యర్థం చేసుకునేవాడు తమోగుణంలో ఉన్నవాడే. అట్టివాడు తమోగుణాన్ని వదిలించుకొనుటకే కర్మలు చేయాలి. ఆ కర్మలు బంధం కాకుండా ఉండటానికే కోరిక లేకుండా, కర్మఫలంపై ఆసక్తి లేకుండా కర్మలు చేయవలసిన అవసరాన్ని, విధానాన్ని 3వ అధ్యాయంలో చెప్పటం జరిగింది.







**అయితే కోరికలు ఒక పట్టాన వదలవు. కోరికతో కర్మ చేస్తున్నప్పుడు వచ్చే ఫలితంపై ఆసక్తి కూడా తొలగిపోదు. మరి ఏమిటి దీనికి పరిష్కారం? కోరికలు వదలిపోవాలంటే మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మపై నిలవాలి. చేసే కర్మలను బ్రహ్మ భావనతో చేయాలి. నిరంతరం భగవంతుని యందు నిష్టకలిగి ఉంటే కోరికలకు మనస్సులో చోటుండదు. అప్పుడు చేసే కర్మ యావత్తు కర్మయోగమే అవుతుంది. భగవంతునిలో మనస్సు నిల్పి, కర్మలను భగవత్ కర్మలుగా, యజ్ఞ కర్మలుగా, త్యాగపూరిత కర్మలుగా ఎలా చేయాలో 4వ అధ్యాయంలో తెలియజేశారు.** అంటే పరమాత్మజ్ఞానంతో, అన్నింటిని – అంతటా– అన్ని వేళలా భగవత్ స్వరూపాలుగా భావించి చేయవలసిన 12 రకాలైన వివిధ యజ్ఞాలను– వేదాలలో విస్తారంగా చెప్పబడిన యజ్ఞాలను వివరించటం జరిగింది. అంతేకాదు ఆ జ్ఞానాన్ని ఎవరివద్ద, ఎలా పొందాలో కూడా తెలియజేయటం జరిగింది. ఈ జ్ఞానం యొక్క గొప్పతనాన్నీ అక్కడ తెలియజేశారు.

ఇలా జ్ఞానంతో – బ్రహ్మ భావనతో– యజ్ఞ భావనతో కర్మలు చేస్తున్నప్పటికీ కర్మఫలం రాదుగానీ, ఇంకా కర్తృత్వం ఉంటుంది. అంటే 'ఈ కర్మలను చేస్తున్నది నేనే' అనే భావన ఉంటుంది. **ఈ కర్తృత్వ భావనవల్ల మనలో వాసనలు పేరుకుంటాయి. అవి తిరిగి తిరిగి కర్మలకు ప్రేరణ కలిగిస్తాయి. ఆ ప్రేరణలతో కర్మలు చేయాలి. ఇలా ఈ వాసనలు మనకు బంధం అవు తున్నాయి. మరి ఈ వాసనలు తొలగిపోయేది ఎలా? కర్మలను చేస్తున్నప్పుడు "ఈ కర్మలను చేస్తున్న కర్తను నేనే" అనే కర్తృత్వ భావన వదిలిపెట్టాలి. కర్తవు నీవే అయితే కర్మఫలాలు నీకే చేరతాయి. కర్మఫలాలు నీకు చేరకుండా ఉండాలంటే నేను కర్తను అనే భావన విడిచిపెట్టి, 'నేను నిమిత్త మాత్రుణ్ణి' అని గాని, ఇది నా కర్తవ్యం' అని గాని చేయాలి. కర్త ఎవరో అజ్ఞాత వ్యక్తి. అతడే పరమాత్మ. నీవు కేవలం గుమాస్తావి. అంతే. ఇలా కర్తృత్వాన్ని వదిలి కర్మ చేయుటయే కర్మ సన్యాసం. కర్మ చేసీ చేయని వాడవు కావటమే కర్మసన్యాసం. దీనిని తెలియజెప్పే అధ్యాయమే కర్మసన్యాస యోగమనే ఈ ఐదవ అధ్యాయం.** ఇలా కర్తృత్వ భావం లేకుండా కర్మలు చేయటంలో నైపుణ్యం పొందితే ఇక దేనికీ ప్రాకులాడనవసరం లేదు. మనస్సు శుద్ధమై, ఏకాగ్రమై, ధ్యానవస్తువుపై నిలిచిపోతుంది. ధ్యానం చక్కగా సాగుతుంది.

అందుకే వెంటనే ధ్యాన విషయాలతో కూడిన ఆత్మ సంయమయోగాన్ని (ధ్యానయోగాన్ని) 6వ అధ్యాయంగా చెప్పటం జరిగింది.

కర్మ సన్యాసయోగమనే ఈ 5వ అధ్యాయం నిజంగా స్వతంత్రమైన అధ్యాయం కాదు. 3వ అధ్యాయం పూర్వార్థమైతే 5వ అధ్యాయం ఉత్తరార్థం. కర్మలను ప్రారంభించటాన్ని తెలిపేది 3వ అధ్యాయం. ఆ కర్మలను జ్ఞానంతో తెలివితో ఎలా చేయాలో తెలిపేది 4వ అధ్యాయం. ఆ కర్మల పరమావధి ఏమిటో తెలియ జెప్పేది 5వ అధ్యాయం. కర్మలను ఆచరిస్తూ, ఆచరిస్తూనే ఆ కర్మల పరమావధి అయిన సన్యాసాన్ని చేరగలిగే ప్రక్రియ ఈ అధ్యాయంలో చెప్పబడ్డది.

ఈ అధ్యాయంలో చెప్పినవిధంగా కర్మలను సన్యసించగల స్థితిని సాధించినవాడు ధ్యాననిష్ఠకు అర్హుడు. ధ్యాననిష్ఠలో సిద్ధిని పొందినవాడు ఇక పొందవలసినది ముక్త స్థితినే – మోక్షమునే– జీవన్ముక్తినే. **"ముక్తి అంటే సదాచార జీవనం కాదు, సర్వాత్మ భావం" అన్నారు భారతీయ తత్త్వశాస్త్రంలో డా॥సర్వేపల్లి రాధా కృష్ణన్ పండితులు. అయితే సర్వాత్మ భావం ఉంటే సదాచార జీవనం అక్కరలేదా? సదాచారం వ్యర్థమా? అంటే కాదు. సదాచారం యొక్క మూలతత్త్వం సర్వాత్మ భావం. హిందూ ధర్మం, వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత –ఇవన్నీ ఈ సర్వాత్మ భావాన్నే విశదీకరిస్తున్నాయి. ఇతర మతాలు సదాచార జీవనంతో తృప్తి పడుతున్నాయి.**

మహాత్మాగాంధీగారి జీవితకాలంలో ఒక సంఘటన జరిగింది. విదేశాల నుండి ఒక క్రైస్తవ మతబోధకుడు భారతదేశానికి వచ్చాడు. విదేశాలనుండి మనదేశానికి వచ్చినవారెవరైనా ఆ కాలంలో తాజ్‌మహల్‌ను, మహాత్మాగాంధీని దర్శించకుండా వెళ్ళరు. ఈయన కూడా గాంధీగారిని కలుసుకొనేందుకు వచ్చాడు. ఆ సమయంలో ఆయన ప్రక్కన భగవద్గీత, బైబిలు గ్రంథాలున్నాయి. భగవద్గీత క్రింద ఉన్నది. దానిపైన బైబిల్ ఉన్నది. **అతడు గాంధీజీతో "అయ్యా! చూశారా మా బైబిల్ మీ భగవ ద్గీతపైన ఉన్నది" అన్నాడు. వెంటనే గాంధీగారు, "మిత్రమా! అవును, మా భగవద్గీత ఆధారంగా మీ బైబిల్ ఉన్నది. గమ నించారా?" అన్నాడు. ఇది ఛలోక్తి మాత్రమే కాదు. సత్యసారం కూడా. ఎందుకంటే ఇతరమతాలు బోధించే సదాచార జీవనానికి భగవద్గీత బోధించే సర్వాత్మ భావనే ఆధారం. సర్వాత్మ భావన ఉంటే చాలు సదాచార జీవనం దానంతటదే అలవడుతుంది.**







**కాని సదాచారం ఉన్నంత మాత్రాన సర్వాత్మ భావన కలుగుతుందని చెప్పే అవకాశం ఏమాత్రం లేదు.**

**అందుకే వివేకానందస్వామి అమెరికాలో ప్రసంగిస్తూ "మీ పాశ్చాత్య వేదాంతం ముగిసిన చోటినుండి మా భారతీయ వేదాంతం ప్రారంభమైనది" అని చెప్పటం జరిగింది.**

**అల్పము – అధికము, నీచము – ఉత్తమము, గుణము – దోషము, నామము – రూపముతో కూడిన ఈ ప్రపంచంలో చీమలోను, బ్రహ్మములోను, శివకేశవుల లోను, బ్రహ్మవస్తువు (పరమాత్మ చైతన్యం) సమానంగా వ్యాపించియున్నది. ఆ అధి ష్ఠాన సత్యవస్తువు యొక్క ఆధారంతోనే ఈ నామరూపాలతో కూడిన మిథ్యా ప్రపంచం మాయచేత కల్పించబడి యున్నది.**

భగవంతుని దయతో – పూర్వజన్మ పుణ్య ప్రభావంతో – శాస్త్రం యొక్క గురువుయొక్క కృపా విశేషంతో మాయా మోహం తొలగిందా! అజ్ఞాన ఆవరణ తొలగిందా! అట్టి వానిలో సర్వాత్మ జ్ఞానం ప్రకాశించినట్లే. అదే సమదర్శనం. ఆ సమదర్శనమే సమ్యక్ దర్శనం. అది కలిగినవాడే పండితుడు, బుద్ధిమంతుడు. **"పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి" అని పోతనగారి భాగవతంలోని ప్రహ్లాదుని పలుకుల వెనుకనున్న మర్మం ఇదే. విభిన్న నామరూపాలతో కూడిన ఈ ప్రపంచాన్ని భేద బుద్ధితో చూచే బుద్ధి బుద్ధికాదు. ఏకమై–అఖండమై – అభిన్నమై యుండే ఆ పురుషోత్తముని (పరమాత్మను) తెలుసుకొనే బుద్ధియే నిజమైన బుద్ధి. అట్టివాడే పండితుడు అని ఆ పలుకులలోని ఆంతర్యం. నిజంగా భగవద్గీతను ఆశ్రయించి మనం పండించుకోవలసిన పాండిత్యం ఇదే. అట్టి సర్వాత్మ బుద్ధిని పొందటానికి అర్హత ఈ 'కర్మ సన్యాసయోగమే'.**

ఈ అధ్యాయం అర్జునుని సందేహంతో ప్రారంభమైంది. అయితే అసలు అర్జునునికి ఈ సందేహం ఎందుకు కలిగింది? భగవానుడే కావాలని అర్జునుని మదిలో సందేహం కలిగేటట్లు పదాలను ప్రయోగించాడా? చూద్దాం. 4వ అధ్యాయం 41వ శ్లోకంలో **'యోగ సన్యస్త కర్మాణం'** అని కర్మ సన్యాసాన్ని తెలిపిన భగవానుడు, 42వ శ్లోకంలో **'యోగం ఆతిష్ఠోత్తిష్ఠ భారత!'** అని అర్జునా! కర్మయోగాన్ని ఆచరించు, లెమ్ము! అంటున్నాడు. ఇంతకూ తాను కర్మయోగాన్ని ఆచరించాలా? లేక కర్మ సన్యాసాన్నా? అని అర్జునునకు సందేహం కలిగింది. ఇలా సందేహం కలగటానికి

కారణం భగవానుడు ప్రయోగించిన పదాలే. **"యోగ సన్యస్త కర్మాణం'** అంటే అర్థం కర్మసన్యాసాన్ని ఆచరించమని కాదు. నిష్కామ కర్మయోగం ద్వారా కర్మలను సన్యసించు అనియే. అంటే నిష్కామ కర్మయోగాన్ని ఆచరించమనియే. అందుకే 42వ శ్లోకంలో **'యోగం ఆతిష్ఠ! ఉత్తిష్ఠ'** కర్మయోగాన్ని ఆచరించుటకు సిద్ధంకా! లెమ్ము! అని ఉద్బోధించటం జరిగింది. అయితే కర్మ లను సన్యసించు అనగానే కర్మసన్యాసం అని పొరబడ్డాడు అర్జునుడు. కర్మలను సన్యసించటం నిష్కామ కర్మయోగం ద్వారానే సాధ్యం. కనుక కర్మయోగాన్ని నిష్కామ కర్మయోగాన్ని ప్రతి ముముక్షువు, ప్రతి జ్ఞానార్థి ఆచరించవలసిందే. అందులోను అర్జునుని వంటి క్షత్రియుడు, రజోగుణ సంపన్నుడు కర్మ యోగాన్ని చక్కగా ఆచరించి-దాని ద్వారానే కర్మలను సన్యసించాలి. **కర్మ యోగాచరణ లేని వారికి కర్మసన్యాసానికి అర్హత లేదు. ఈ భావాన్నే భగవానుడు ఈ అధ్యాయంలో ప్రధానంగా చెప్పాలనుకున్నాడు. దానికి అర్జునుని ప్రశ్న ఆధారం కావాలనుకున్నాడు. అందుకే అర్జునుడు ప్రశ్న వేసేటట్లుగా అతడికి తికమక కల్గించాడు. దానితో అర్జునుడు ప్రశ్నద్వారా సందేహాన్ని వ్యక్తం చేయగా భగవానుడు సమాధానం ఇవ్వటం జరిగింది.**

అర్జునుని ప్రశ్న ఏమిటో చూద్దాం.

**అర్జున ఉవాచ :**

*శ్లో॥ సన్యాసం కర్మణాం కృష్ణ । పునర్యోగంచ శంససి।*
*యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మేబ్రూహి సునిశ్చితం॥* **(1)**

**తా॥ అర్జునుడు అంటున్నాడు: కృష్ణా! కర్మలయొక్క సన్యా సాన్ని, మళ్ళీ కర్మయోగాన్ని ప్రశంసిస్తున్నావు. ఈ రెండింటిలో ఏది శ్రేయస్సును కలిగిస్తుందో ఆ ఒక్కదానినే నిశ్చయించి నాకు బోధించు.**

**వ్యాఖ్య :** అర్జునుని ఈ సందేహానికి కారణం 4వ అధ్యాయం 41వ శ్లోకంలో **"యోగసన్యస్త కర్మాణం"** అని భగవానుడు అనటమే. భగవానుని ఉద్దేశం యోగంద్వారా కర్మలను అంటే కర్మ ఫలాలను సన్యసించు- అని. కాని అర్జునుడు కర్మసన్యాసం చెయ్యి అంటున్నాడని అర్థం చేసుకున్నాడు. అంటే కర్మలను వదలమంటు న్నాడు అని. ఇలా కర్మలను వదలమంటూనే తిరిగి **'యోగం ఆతిష్ఠ'-** కర్మయోగాన్ని ఆచరించు అంటున్నాడేమిటి? ఇంతకూ నేను కర్మలను సన్యసించాలా? లేక కర్మలను ఆచరించాలా? ఏది నాకు శ్రేయస్సును కలిగిస్తుంది? అని సందేహం కలిగింది.







**నాకు కావలసింది శ్రేయస్సే కాని ప్రేయస్సు కాదు. ప్రేయస్సు అంటే నశించిపోయే ఇహలోక, పరలోక భోగాలు. శ్రేయస్సు అంటే శాశ్వతమైన ఆత్మానందం.** ఇంతకు ముందు 2వ అధ్యా యంలో కూడా **"యచ్ఛ్రేయస్యాన్నిశ్చితం బ్రూహితన్మే"** అని; అలాగే 3వ అధ్యాయంలో **"తదేకం వదనిశ్చిత్య యేన శ్రేయోహ మాప్నుయామ్"** అనీ శ్రేయస్సునే కోరుకున్నాడు గాని అంతటి విషాదంలో ఉండి కూడా ప్రేయస్సును కోరలేదు అర్జునుడు. ఇప్పుడు కూడా అలాగే నాకు శ్రేయస్సే చెప్పు కృష్ణా! అంటు న్నాడు. **నీ యంతటివాణ్ణి చేరి శ్రేయస్సును కోరక ప్రేయస్సును కోరుతానా? అలా కోరితే కల్పవృక్షం దగ్గరకెళ్ళి కాకరకాయలు కావాలని కోరినట్లుండదా? అని అర్జునుని ఆంతర్యం.**

అయితే భగవానుడు అర్జునునికి శ్రేయస్సును కలిగించేది నిష్కామ కర్మ యోగమేనని చెబుతూనే ఉన్నాడు. మందు ఒక్కటే అయినా మోతాదులు మార్చి మార్చి ఇస్తున్నాడు. **అర్జుననంతటి వానికి మళ్ళీ మళ్ళీ చెప్పాలా? అంటే ఇది నిజంగా అర్జునుని కొరకు కాదు; అర్జునుని నిమిత్తంగా చేసుకొని సర్వ మానవాళికీ ఇస్తున్న సందేశం.**

"సన్యాసం అంటే విడిచిపెట్టడం. యోగం అంటే చెయ్యటం. కర్మసన్యాసం అంటే కర్మలను విడిచిపెట్టటం. కర్మయోగం అంటే కర్మలను చెయ్యటం. ఈ రెండూ పరస్పర విరుద్ధాలు గదా! రెండూ ఒక్కటెలా అవుతాయి? కనుక స్వామీ! ఈ గొడవంతా నాకెందుకు? కర్మలు వదలటం సుఖమే కదా! ఈ క్రూర కర్మయైన యుద్ధాన్ని వదిలిపెడతాను. నాకు విజయమూ వద్దు, భోగాలూ వద్దు, నాకు మోక్షం కావాలి. అదే నాకు శ్రేయస్సు. ఆ శ్రేయస్సు ఇప్పుడు కర్మను చేస్తే వస్తుందా? వదిలితే వస్తుందా? నాకు ఏదో ఒకటి చక్కగా నిశ్చయించి చెప్పు. నన్ను ఇలా గందరగోళం లోకి నెట్టవద్దు" అంటున్నాడు అర్జునుడు.

అర్జునుని సందేహానికి (ప్రశ్నకు) భగవానుడేమని సమాధానం ఇస్తున్నాడు?-

**శ్రీ భగవానువాచ:**

*శ్లో॥ సన్యాసః కర్మ యోగశ్చ నిశ్రేయ సకరావు భౌ।*
***తయోస్తు కర్మ సన్యాసాత్ కర్మ యోగో విశిష్యతే॥*** **(2)**

**తా॥ సన్యాసమూ, కర్మయోగమూ రెండూ శ్రేయోదాయక ములే. వాటిలో కర్మ సన్యాసంకన్నా కర్మయోగమే శ్రేష్ఠమైనది -అని భగవానుడు అన్నాడు.**

**వ్యాఖ్య :-** ఆధ్యాత్మిక ప్రగతికి 3 మెట్లున్నాయి. అవి 1. కర్మయోగం. 2 కర్మ సన్యాసం. 3. ధ్యానయోగం. కర్మయోగాన్ని, 3-4 అధ్యాయాలలోను, ధ్యానయోగాన్ని 6వ అధ్యాయంలోను చెప్పారు. సకామ కర్మలను వదలి, నిష్కామ కర్మలను ఆచరిస్తూనే కర్మసన్యాసాన్ని ఎలా అభ్యసించాలో ఈ 5వ అధ్యాయంలో చెబుతున్నారు.

కర్మయోగం-కర్మ సన్యాసం రెండూ శ్రేయస్సును కలిగించేవే అయినా కర్మసన్యాసం కన్న కర్మయోగమే శ్రేష్ఠమైనదని భగవా నుడు ఇక్కడ తెలియచేస్తున్నాడు. అలాగని కర్మసన్యాసం తక్కువ దని భావిస్తే అది మన తెలివి తక్కువతనమే అవుతుంది. ఎందు కంటే **ఎలిమెంటరీ స్కూల్‌లో చేరితే బాగుంటుందా? హైస్కూల్ లో చేరితే బాగుంటుందా? అని ఒక 5 సంవత్సరాల పిల్లవాడు పెద్దలనడిగితే ఏం చెబుతారు? హైస్కూల్‌కన్నా నీవు ఎలిమెంటరీ స్కూల్‌లో చేరితేనే నీకు మేలు జరుగుతుంది- అని చెబుతారు. ఎందుకు? హైస్కూల్ తక్కువదనా? కాదు. ఆ పిల్లవాడు తప్పక ఎలిమెంటరీస్కూల్‌లో చేరితేనే చదవగలుగుతాడు.** అలాగే ఇక్కడ కర్మయోగాన్ని ఆచరించకుండా అర్జునునిలాంటి రజోగుణ సంపన్నుడు కర్మసన్యాసాన్ని ఆచరించటం సాధ్యంకాదు. ఎవరి స్థాయిలో వారు ముందుకు పోవాలి.

**జీవితంలో గడ్డు సమస్యలు ఎదురైనప్పుడు బుద్ధి సరిగ్గా పనిచేయని అర్జునుని లాంటి విద్యార్థికి - పరమాచార్యునికి మధ్య జరుగుతున్న సంభాషణే భగవద్గీత. ఇక్కడ అర్జునుడు రజోగుణ ప్రధానుడైన క్షత్రియుడు. వాసనా భారంతో క్రుంగి పోతున్నవాడు. ఆ భారం తగ్గితేగాని మనస్సు ప్రశాంతమై ధ్యానానుకూలం కాదు. ఆ భారం తగ్గాలంటే కర్మక్షేత్రంలో (యుద్ధభూమిలో) కర్మ (యుద్ధం) చేయాలి. అదీ కర్తవ్య భావనతో, ధర్మాన్ని నిల బెట్టాలనే దీక్షతో చేయాలి. అప్పుడే వాసనాభారం తగ్గి మనస్సు ప్రశాంతమయ్యేది. అందుకే అర్జునుని లాంటి వానికి కర్మ యోగమే శ్రేష్ఠమైనదని చెప్పటం.** పరిపూర్ణజ్ఞానికి కర్మ యోగం తోనూ పనిలేదు. కర్మ సన్యాసంతోనూ పనిలేదు. ఆత్మజ్ఞానాన్ని పొందాలనే తపనగల సాధకులకే ఈ కర్మయోగం యొక్క అవసరం. అందుకే భగవానుడు అర్జునునితో అంటున్నాడు.

**"అర్జునా! నేను చెప్పేది కర్మల సన్యాసం కాదు, కర్మలలో సన్యాసం. అసలు కర్మలే చేయకపోతే ఇంక నీవు సన్యసించేది (వదిలేది) ఏముంటుంది? కర్మలు చేస్తూనే కర్మఫలాలను వదలాలి, కర్తృత్వాన్ని వదలాలి. అదీ గొప్ప విషయం.**







కొందరు శరీరంద్వారా, వాక్కు ద్వారా ఏ కర్మలూ చేయరు. మౌనంగా ఒక చోట కూర్చొని ధ్యానమగ్నులౌతారు. లేదా ఆత్మ విచారణ చేస్తుంటారు. స్వస్థితిలో నిలిచే ప్రయత్నం చేస్తారు. వీరే కర్మ సన్యాసులు. అలా కాకుండా కొందరు నిష్కామభావంతో, ఫలితంపై ఆసక్తి లేకుండా, కర్తవ్యతా భావంతో, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేస్తారు. వీరే కర్మయోగులు. ఈ రెండు మార్గాలలో ప్రయాణం చేసేవారు మోక్షార్థులే. అయినప్పటికీ నీకు కర్మయోగమే శ్రేష్ఠమైనది."

"ఎందుకంటావా? సన్యాసంలో శ్రవణ మననాదులకు అవకాశం ఉండదు. అవి లేకుండా కర్మలను సన్యసిస్తే ఉట్టికి స్వర్గానికి కాకుండా పోతారు. కర్మయోగం అపాయంలేని ఉపాయం. కొంచెం చేసినా మహాభయం నుండి కాపాడుతుంది. కర్మయోగి కర్మలను ఆచరిస్తూ క్రమంగా చిత్తశుద్ధిని పొంది, ఆత్మజ్ఞానాన్ని అవగాహనచేసుకొని, ఆత్మనిష్ఠను సంపాదించి కృతకృత్యుడౌతాడు. కనుక ఓ అర్జునా! నీవు కర్మయోగాన్నే ఆచరించి శ్రేయస్సును పొందు!" అంటున్నాడు భగవానుడు.
- ఇంతకీ సన్యాసి అంటే ఎవరనుకుంటున్నావు?

**శ్లో॥ జ్ఞేయస్స నిత్య సన్యాసీ యోనద్వేష్టి న కాంక్షతి।**
**నిర్ద్వంద్వోహి మహాబాహో। సుఖంబంధాత్ ప్రముచ్యతే॥ (3)**

**తా॥ ఎవరైతే ద్వేషించకుండా, కాంక్షించకుండా (దేనినీ కోర కుండా) ఉంటారో అతడే నిత్యసన్యాసి అని తెలుసుకో. ఓ మహా బాహుడా! ద్వంద్వాలు లేనివాడే బంధాలనుండి సుఖంగా బయట పడతాడు.**

**వ్యాఖ్య :** కర్మయోగమా? కర్మసన్యాసమా? నేను దేనిని ఆచరించాలి? అని సందేహం వ్యక్తం చేసిన అర్జునునికి కర్మ సన్యాసంకన్న కర్మయోగమే శ్రేష్ఠమైనదని భగవానుడు తెలియజేశాడు. కర్మయోగం ఎంతో సులువుగా ఆచరించదగినదని కూడా చెప్పాలనుకున్నాడు. అది చెప్పాలంటే కర్మసన్యాసం ఎంత కష్టమైనదో చెప్పాలి. అసలు సన్యాసం అంటే ఏమిటో, సన్యాసి అంటే ఎవరో కూడా స్పష్టం చేయాలని భావించి సన్యాసి లక్షణాలను చెబుతున్నాడు.

**యః నద్వేష్టి న కాంక్షతి:** "కేవలం వేషం మార్చుకున్నంత మాత్రాన సన్యాసి కాదు. ఎవడు తన అంతరంగంలోని కోరిక లను, రాగద్వేషాలను బయటకు తరిమివేస్తాడో అతడే నిజమైన సన్యాసి" అని తన విప్లవాత్మక సిద్ధాంతం ద్వారా సన్యాసి లక్ష ణాలను తెలియజేస్తున్నాడు భగవానుడు. **సన్యాసి అంటే పనులు**

**మానుకొని; నాకే కర్తవ్యాలు లేవు; నేనేమీ చేయవలసిన అవసరం లేదు– అంటూ ఒళ్ళు వంచటానికి బద్ధకమై, సోమరితనంతో కర్మలు విడిచినవాడు కాదు. కేవలం కాషాయ వస్త్రాలు మాత్రం ధరించినవాడు కాదు. మరి ఎవరు? కర్మేంద్రియాలతో కర్మలు చేస్తుండనీ లేదా మాననీ, దానితో సంబంధం లేకుండా –ఎవరైతే దుఃఖాన్ని గానీ దుఃఖకారణాలను గానీ ద్వేషించకుండా; సుఖాన్నిగాని, సుఖ కారణాలనుగానీ కోరకుండా ప్రారబ్ధవశాత్తు కలిగే మంచి చెడ్డలయందు తటస్థభావం వహించి, సమచిత్తం కలిగి ఉంటాడో అతడే నిత్య సన్యాసి. చూడటానికి అతడు గృహస్థాశ్రమంలో ఉన్నా, కర్మలు చేస్తున్నా దేనిపట్ల రాగంగాని, ద్వేషంగాని లేకపోతే అతడు కర్మసన్యాసియే. అంటే రాగద్వేషాలు లేని సంసారి సన్యాసియే. రాగద్వేషాలున్న సన్యాసి వేషధారి సంసారియే.**

ఒక వస్తువుపై లేదా విషయంపై కోరిక ఉండి ఎలాగైనా దానిని పొందాలి అనుకున్నా; లేక ఒక వస్తువుపై లేదా విష యంపై ద్వేషం ఉండి ఎలాగైనా అక్కరలేనిదాన్ని వదిలించుకోవా లన్నా మనం తప్పక కర్మ చేయవలసిందే. ఆ కోరిక గాని, ద్వేషంగాని లేకపోతే ఇక ఏ కర్మా చేయవలసిన అవసరంలేదు. అతడే కర్మసన్యాసి– నిత్యసన్యాసి.

**నిర్ద్వంద్వః :** ద్వంద్వాలు లేనివాడు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు, మానావమానాలు, రాగద్వే షాలు, ఇవన్నీ ద్వంద్వాలు. ఇవి శరీరాన్ని, మనస్సును, బుద్ధిని, కలవరపెడుతుంటాయి. సామాన్యులెవరినైనా మానసిక సంఘర్షణకు గురిచేస్తాయి. బంధంలో పడవేస్తాయి. ఎవరైతే నిత్యసన్యాసులో వారిని మాత్రం ఇవేవీ బాధించవు. సంసార బంధం చాలా గట్టిది. మనం మళ్ళీ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చి పడటానికి కారణమైన వాసనలు, కర్మఫలాలే బంధాలు. ఇవి మనతోనే ఉంటాయి. అవే పాశాలు – యమపాశాలు.

**యమధర్మరాజు దున్నపోతునెక్కి పాశం ధరించివచ్చి; దాన్ని మన మెడకు తగిలిస్తాడని, సినిమాలలోను, కథలలోను చూస్తాం. నిజంగా ఆ యమపాశం ఆయన దగ్గర లేదు. ఆయన దగ్గర ఏ తాళ్ళ ఫ్యాక్టరీయో లేదు. ప్రతి వ్యక్తి తన మెడకు ఒక పాశాన్ని ఎప్పుడూ తగిలించుకొనే ఉంటాడు. ఆ పాశం మరేదో కాదు. మన కోరికలు, ద్వేషాలే. వాటి వల్లనే కర్మలు చేస్తాం. కర్మ ఫలాలు, వాసనలు సంపాదించుకుంటాం. అవే బంధాలౌతాయి. పాశాలవుతాయి. మళ్ళీ**







**మళ్ళీ జన్మలను తెచ్చిపెడతాయి. ఈ బంధాలమధ్య చిక్కి, ఉక్కిరిబిక్కిరి అయ్యే మనం, వాటిని వదిలించుకొని స్వేచ్ఛగా గాలిపీల్చుకోవటం ఎలాగో భగవానుడు ఇక్కడ తెలియజేస్తున్నాడు. అదే 'నిర్ద్వంద్వోహిమహాబాహో! సుఖం బంధాత్ ప్రముచ్యతే' అని. అంటే ద్వంద్వాలకు చలించనివాడే బంధాలనుండి సులభంగా విడుదల పొందుతాడు– అని.**

సన్యాసి వేషం వేసుకొని అన్నింటిపై ఆసక్తితో ఉంటే అతడు సంసారే. సంసారికి భార్యాబిడ్డలపై ఆసక్తి, భోగాలపై ఆసక్తి, ధన సంపదలపై ఆసక్తి ఉండి; సన్యాసికి దండకమండలాలపై ఆసక్తి, ఆశ్రమాలపై ఆసక్తి, పెద్ద పెద్ద భవనాలు కట్టించటంపై ఆసక్తి, ధనం కోసం ఇతరులను ఆశ్రయించటంపై ఆసక్తి గనుక ఉంటే ఇద్దరూ ఒక్కటే. ఇద్దరూ బందీలే. ఆసక్తియే బంధం. అనాసక్తియే మోక్షం. మమ అంటే బంధం. నమమ అంటే మోక్షం.

కనుక నిష్కామ కర్మయోగి ఫలితంపై ఆసక్తి లేకుండా, చేసే పనులలో సంగభావం లేకుండా, దేనియందు కోరిక లేకుండా, ద్వేషం లేకుండా అనాసక్తితో కర్మలు చేస్తూ కూడా కర్మ బంధనాల నుండి సులభంగా విడుదల పొందవచ్చు. ద్వంద్వాలను వది లించుకోవాలంటే ఈ అనిత్య జగత్తులోని పరిమిత హద్దుల నుంచి దాటి బయటపడాలి. కనుక కర్మసన్యాసం ఎంతో కష్ట మైనది. కాని గొప్ప ప్రయోజనకారి. మరి కర్మయోగమే శ్రేష్ఠమని భగవానుడు ఎందుకు చెప్పినట్లు? అర్జునుడు తన స్థితి నుండి తాను వికాసం పొందాలి. అర్జునుని మనస్సులో క్షత్రియోచితమైన ఉత్సాహం, వీర రసస్ఫూర్తి దట్టంగా అలముకొని ఉన్నాయి. అతడు అనాలోచితంగా త్వరపడి సన్యాసం వైపు దూసుకుపోతే 'రెంటికి చెడిన రేవడ'వుతాడు. అందుకే అతడికి కర్మయోగమే శ్రేష్ఠమని చెప్పటం. – మరి సన్యాసం యోగం కన్న తక్కువా? కర్మయోగం అంత గొప్పదా? తర్వాతి శ్లోకంలో...

***శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః ।***
***ఏకమప్యా స్థిత స్సమ్యక్ ఉభయోర్విందతే ఫలం ॥ (4)***

**తా॥ సాంఖ్యం (కర్మసన్యాసం), యోగం(కర్మయోగం) రెండూ వేరువేరని ఏమీ తెలియనివారు అంటారు కాని పండితులు అలా అనరు. ఏ ఒక్కదానినైనా చక్కగా ఆచరిస్తే రెండింటి ఫలితాన్ని పొందుతారు.**

**వ్యాఖ్య:-** అర్జునుడు సన్యాసం, యోగం గురించి అడిగితే భగవా నుడేమో సాంఖ్యం, యోగం గురించి చెబుతున్నాడు. సన్యాసానికి బదులుగా సాంఖ్యం ఎందుకు చెబుతున్నట్లు? రెండింటి మధ్య తేడాలేదా? భగవానుని దృష్టిలో తేడాలేదు. **అర్జునుని మాటలకు మెరుగుపెట్టి, సన్యాసంతో కూడిన జ్ఞానాన్ని 'సాంఖ్యం' అనే పేరుతో తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**ఏదైనా ఒక కర్మను దివ్యకర్మగా చేయాలంటే రెండు మార్గాలున్నాయి. నేను అకర్తనైన ఆత్మను అనే భావంతో కర్తృత్వాన్ని వదలి కర్మ చేయటం ఒకటి. అదే 'సాంఖ్యం'. మనస్సును సంక్షోభపరచి, బుద్ధిని వికలం చేసే కర్మఫలం పట్ల ఆసక్తి లేకుండా – కోరిక లేకుండా కర్మ చేయటం రెండవది. అదే కర్మయోగం.** ఈ రెండింటిలో మొదటిది చాలా కష్టం. రెండవది సులభం. ఎందుకంటే ఒక సాధకుడు ఆత్మజ్ఞానాన్ని కలిగి, సంపూర్ణతను చూడగలిగే సమర్థత ఉంటేగాని కర్తృత్వం లేకుండా కర్మ చేయగలడు. నిజంగా అతడు కర్మను చేయడు, అతడి దేహం ద్వారా ఆ కర్మ జరిగిపోతుంది. అదే కర్మయోగమైతే సామాన్యజ్ఞానం ఉంటే సరి. చక్కగా ఫలాసక్తి లేకుండా కర్మలు చేయగలడు.

సాంఖ్యులు అంటే ఏకాంత ప్రదేశంలో ఆత్మచింతనా తత్పరులై కర్మలపట్ల ఆసక్తి లేనివారు... యోగులు అంటే కోరిక లేకుండా, సమత్వ బుద్ధితో కర్మలనాచరించేవారు. చూడటానికి ఇద్దరి మధ్య తేడా ఉన్నట్లు అనిపిస్తుంది. అలా అనిపించేవారు బాలురు– అవివేకులు. కాని పండితులు– వివేకులు– ఆత్మజ్ఞాన సంపన్నులు అలా భావించరు. ఎందుకంటే సాంఖ్యం ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొంది స్వస్థితిలో నిలవటం జరుగుతుంది. **అదే మోక్షం. కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది, ఆత్మజ్ఞానాన్ని గ్రహించి స్వస్థితిలో నిలవటం జరుగుతుంది. అదే మోక్షం. కనుక అంతిమఫలం రెండింటికీ మోక్షమే.**

**స్వస్థితిని –మోక్షాన్ని పొందే మార్గంలో కర్మయోగం ఒక భాగం, జ్ఞానయోగం ఒకభాగం.** ఒకే రోడ్డుకు కొంతదూరం ఒక పేరు, కొంతదూరం మరొకపేరు. ఒక పట్టణాన్ని చేరటానికి చేసే ప్రయాణంలో కొంతదూరం రిక్షా, కొంతదూరం బస్సు ఉపయోగించుకున్నట్లు, రెండూ ఆ పట్టణం చేరటానికే. ఇక్కడ సమ్యక్ అనే పదాన్ని ఎంతో అర్థవంతంగా ప్రయోగించటం జరిగింది. ఏ యోగాన్నయినా చక్కగా, వివేకంతో, అవగాహనతో ఆచరించాలి. **జ్ఞానయోగం గొప్పది కనుక,**







**ఎలా ఆచరించినా ఫరవాలేదనే అహంకారం కూడదు. అలాగే కర్మయోగం అల్ప మైనది అనే న్యూనతా భావంతో అశ్రద్ధవహించరాదు. దేనినైనా చక్కగా ఆచరిస్తేనే లక్ష్యాన్ని చేరుకోగలం అనే భావన ఉండాలి. రిక్షా ప్రయాణం అల్పమైనదని, బస్సు ప్రయాణం ఎంతో అవసర మైనదని భావించరాదు. రెండూ ముఖ్యమైనవే. రెండింటిపట్లా నిర్లక్ష్యం చేయకూడదు. జాగ్రత్తగా ఉంటేనే చేరుకోవలసిన గమ్యస్థానం చేరుకునేది. లేదా సరాసరి స్వర్గానికే, లేదా హాస్పిటల్‌కు పోవాల్సివస్తుంది.**

**ఇక్కడ పేర్కొన్న జ్ఞానులు (సాంఖ్యులు) ఆత్మ జ్ఞానసంపన్నులై, కర్తృత్వం లేకుండా కర్మలు చేస్తుంటారు. యోగులు సామాన్య జ్ఞానంతో, స్వార్థం లేకుండా కర్మలు చేస్తుంటారు. కనుక ఇద్దరి మధ్యా సామ్యమేగాని భేదం లేదు. చిత్తశుద్ధి కలిగేంతవరకే భేదం. ఆ తర్వాత అంతా ఒక్కటే. కనుక మనస్థాయిని బట్టి సరైన యోగాన్ని ఆచరించాలి. దేన్ని ఆచరించినా రెండింటి ఫలం వస్తుంది.**

– అంటే రెండూ వేర్వేరు ఫలాలనిచ్చేవా? రెండింటి ఫలం ఒక్కటి కాదా?

*శ్లో॥ యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।*
*ఏకం సాంఖ్యంచ యోగం చ యః పశ్యతి సపశ్యతి॥* **(5)**

**తా॥ ఏ స్థానాన్ని సాంఖ్యులు (జ్ఞానులు) పొందుతారో దానినే యోగులు కూడా పొందుతారు. సాంఖ్యం, యోగం ఒక్కటే అని ఎవరు చూడగలుగుతారో వారే సరైన దృష్టి గలవారు.**

**వ్యాఖ్య :** సాంఖ్యులు పొందే స్థానం పరమాత్మ స్థానం. తాము పరమాత్మ కన్న వేరుకాదు అనే నిశ్చితమైన అనుభవాన్ని పొందుతారు. ఇక కర్మలు చేస్తూ ఫలితంపై ఆసక్తిని వదిలినవారు, భగవదార్పణ బుద్ధితో కర్మలాచరించేవారు చిత్తశుద్ధిని పొంది, జ్ఞానాన్ని అభ్యసించి, ఆ జ్ఞానం ద్వారా తాము పరమాత్మకన్న వేరుకాదు అనే అనుభవాన్నే పొందుతారు. అంటే సాంఖ్యులకు, యోగులకు అంతిమఫలితం ఒక్కటే. కాకపోతే సాంఖ్యం సాక్షాత్ సాధనం; యోగం పరంపరా సాధనం.

అమెరికా వెళ్ళాలంటే బొంబాయి నుండి విమానంలో వెళ్ళాలి. ఆ బొంబాయి కో? బస్సు లేదా రైలుద్వారా వెళ్ళాలి. ఇక్కడ మోక్షాన్ని అందుకోవాలంటే సాంఖ్యం అనేది సాధనం. అయితే ఆ సాంఖ్యాన్ని ఎప్పుడు ఆచరించగలం? కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొందినప్పుడే. అంటే కర్మయోగమనే రైలు ద్వారా మనం

ఉన్నచోటినుండి సాంఖ్యమనే స్టేషనుకు చేరుకోవాలి. అక్కడినుండి సాంఖ్యమనే విమానంద్వారా పరమాత్మ అనే గమ్యస్థానం చేరుకుంటాం. ఇలా ఈ రెండుయోగాలు ఒక్క చోటికే చేర్చేవి అని గ్రహించాలి. అలా ఎవరు చూడగలుగుతారో వారే నిజమైన చూపుగలవారు.

**యఃపశ్యతి సపశ్యతి:–** ఇక్కడ పశ్యతి అనే పదాన్ని శాస్త్రీయమైన పారిభాషిక పదంగా ఉపయోగించారు. **అందువల్ల 'పశ్యతి' అంటే కళ్ళతో చూడటం కాదు. అనుభవపూర్వకంగా గ్రహించటమే. మరి చూచుట అనే పదాన్ని ఎందుకు ఉపయోగించారు? 'ఆత్మా నుభూతిని మనం ఎంత స్పష్టంగా తెలుసుకుంటా మంటే కళ్ళతో ఒక వస్తువును స్పష్టంగా చూచినట్లు'– అనే ఉద్దేశంతో ఇక్కడ పశ్యతి– చూచుట అనే పదాన్ని ఉపయోగించారు.**

ఇక్కడ సాంఖ్యయోగాన్ని, కర్మయోగాన్ని ఒక్కటే అంటున్నా రంటే అసలు భేదమే లేదని కాదు. ఇవి ఒకదాని తర్వాత ఒకటి అభ్యసించవలసినవి. రెండూ ఒక్కసారిగా ఆచరించే వీలులేదు. **కర్మయోగం మనస్సులోని మాలిన్యాలను తొలగించి పరిశుద్ధం చేస్తుంది. ధ్యానానికి, ఆత్మజ్ఞానాన్ని పొందటానికి అర్హత కలిగి స్తుంది.** ఇక జ్ఞానం (సాంఖ్యం) ఆత్మ విచారణ ద్వారా ఆత్మాను భూతిని కలిగిస్తుంది. అంటే ఫలం రీత్యా రెండూ ఒక్కటే ఐనా ఒకదాని తర్వాత ఒకటి ఆచరించవలసిందే. **ఇప్పుడు ఎవరిలో జ్ఞాననిష్ఠ ఉన్నదో అట్టివారు ఇంతకు ముందు జన్మలోనే కర్మ యోగాన్ని ఆచరించినవారు. ఇప్పుడు ఎవరైతే కర్మయోగాన్ని ఆచరిస్తున్నారో వారు భవిష్యత్తులో జ్ఞాన నిష్ఠలో నిలచిపోతారు.**

– రెండూ ఒక్కటే ఫలితాన్ని ఇచ్చేవే అయితే సరాసరి సన్యాసాన్ని ఆచరించవచ్చుగదా!

*శ్లో॥ సన్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః ।*
*యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి ॥* **(6)**

**తా॥** ఓ మహాబాహుడా! కర్మయోగాన్ని ఆచరించకుండా కర్మసన్యాసాన్ని **పొందటం చాలా కష్టం. కర్మయోగాన్ని ఆచరించిన సాధకుడు మాత్రమే మననశీలుడై (ఆత్మజ్ఞానాన్ని గ్రహించి, మననం చేసి, సాధన చేసి) బ్రహ్మ పదవిని శీఘ్రంగా పొంద గలుగుతాడు.**

**వ్యాఖ్య :** కర్మయోగం, కర్మ సన్యాసం రెండూ శ్రేయస్సును కలి గించేవే అయినా కర్మసన్యాసం కన్న కర్మయోగమే శ్రేష్ఠమని ముందుగా చెప్పటం జరిగింది. అయితే







కర్మసన్యాసం అంత శ్రేష్ఠం కాదనుకుంటాడేమో అర్జునుడు అని రెండు యోగాలు కూడా ఒకే ఫలితాన్నిస్తాయి – రెండూ మోక్షసాధకాలే గనుక అవి వేరువేరని భావించరాదు! అలా భావించేవారు అవివేకులు. పండితులు అలా భావించరు– అన్నాడు భగవానుడు. **ఇంతవరకు విన్న తర్వాత, "ఈ రెండూ ఒకే ఫలితాన్నిస్తాయి గదా! అలాం టప్పుడు సాక్షాత్ మోక్షసాధనమైన కర్మసన్యాసాన్ని (జ్ఞానాన్ని) సరాసరిగా ఆచరించి మోక్షాన్ని పొందవచ్చు గదా! మధ్యలో ఈ కర్మయోగమెందుకు? కర్మయోగమే శ్రేష్ఠమైనదని చెప్పటమెందుకు? – అనే ఆలోచన అర్జునుడికైనా లేదా ఏ సాధకుడికైనా కలగవచ్చు. ఈ సందేహాన్ని తీర్చటానికే భగవానుడిక్కడ కర్మయోగ ఆవశ్యకత ఏమిటో తెలియజేస్తున్నాడు ఈ శ్లోకంద్వారా.**

మానవుని పరమలక్ష్యం మోక్షాన్ని పొందటమే. ఆ మోక్షం ఆత్మజ్ఞానాన్ని పొంది సాధనలద్వారా మాత్రమే సాధించగలం. అంటే కర్మ సన్యాస పూర్వక జ్ఞాననిష్ఠ వల్లనే మోక్షం. అయితే అట్టి జ్ఞాననిష్ఠను పొందాలంటే తప్పక చిత్తశుద్ధి కలగాలి. మనస్సు నిర్మలమూ, ప్రశాంతమూ కావాలి. అందుకు కర్మ యోగాన్ని చక్కగా ఆచరించాలి. నిష్కామ కర్మయోగాన్ని ఆచరించకుండా కర్మలను సన్యసించుట–వదలుట అసాధ్యం. కనుక చిత్తశుద్ధిని కలిగించే కర్మలను– అంటే నిష్కామకర్మయోగాన్ని తప్పక ఆచరించాలి. **అజ్ఞానంతో కర్మలను వదిలితే కష్టాలపాలు కావటమేగాని జ్ఞాననిష్ఠ కుదరదు. కర్మయోగాన్ని ఆచరించకుండా జ్ఞానాన్ని పొందాలనుకోవటం పునాది లేకుండా ఇల్లు కట్టాలను కోవటం లాంటిదే. ఇల్లు కట్టటానికి, అది దీర్ఘకాలం నిలబడడానికి పునాది ఎంత అవసరమో– ఆత్మజ్ఞానాన్ని పొందటానికి, ఆ జ్ఞానంలో నిష్ఠ కలిగి నిలిచి పోవటానికి కర్మయోగ ఆచరణ అంతే ముఖ్యం.**

**గిన్నెను శుభ్రం చేయకుండా అన్నం వండటానికి వీల్లేదు.**

**భూమిని బాగా దున్నకుండా విత్తనం నాటటానికి వీల్లేదు.**

**బట్టను ఉతికి మురికి వదిలించకుండా రంగు వేయటానికి వీల్లేదు.**

**అలాగే కర్మయోగం ద్వారా మనస్సుకు పట్టిన వాసనల మురికిని వదిలించకుండా ఆత్మజ్ఞానాన్ని పొందవీలులేదు. పొందినా అది నిలవదు. ఫలితాన్ని ఇవ్వదు. మనస్సు వాసనల మురికితో ఉంటే జ్ఞానమనే రంగు ఆ మనస్సుకు అంటదు.** పూర్వకాలంలో నాటువైద్యులు రోగికి ఔషధాన్ని ఇచ్చేముందు విరేచనానికి

మాత్ర ఇచ్చేవారు. దానివల్ల శరీరం పూర్తిగా కడిగి వేయబడుతుంది. అప్పుడు రోగానికి ఇచ్చిన ఔషధం బాగా వంటపట్టి పనిచేస్తుంది. అలాగే జ్ఞానమనే ఔషధం బాగా మనస్సుకు పట్టి పనిచేయాలంటే నిష్కామకర్మయోగమనే 'శుద్ధి కర్మ'ద్వారా మనస్సును ముందుగా శుద్ధం చేసి, సిద్ధం చేయాలి.

ఈ ప్రపంచం అంతా దృశ్యం, దీనికి ఆధారం దృక్కు. దృశ్యాన్ని తేలికగా ఈ కళ్ళతో, ఇంద్రియాలతో చూడవచ్చు, తెలుసుకోవచ్చు. కాని దృక్కును మాత్రం అలా సులభంగా తెలుసుకోలేం. దానికి ఎంతో సాధన కావాలి. జ్ఞానార్జన చేయాలి. మనన నిధి ధ్యాసనలు చేయాలి. అలా చేయాలంటే మనస్సు శుద్ధం కావాలి, నిర్మలం కావాలి; చిత్తశుద్ధి కలగాలి. ఆ చిత్తశుద్ధి కొరకు కర్మయోగాన్ని ఆచరించాలి. ఇలా కర్మయోగాన్ని ఆచ రించి, చిత్తశుద్ధిని పొంది, కర్మ సన్యాసం చేస్తేనే ఆత్మజ్ఞానానికి అర్హత వస్తుంది. మోక్షాన్ని అందుకోవచ్చు. ఎప్పుడు?

**అచిరేణ అధిగచ్ఛతి :** అచిరకాలంలోనే అంటే త్వరలోనే, శీఘ్రంగానే అందుకోవచ్చు. అలా అందుకోవటానికే అర్హతను కూడా చెప్పారు... అదే-

**యోగయుక్తః, మునిః :-** 'యోగయుక్తః' అంటే కర్మయోగంలో సిద్ధి పొందినవాడై ఉండాలి. అంటే కర్మలు చేసేటప్పుడు 1. మనస్సు కోరికల వేటలో- కోరికల విషవలయంలో తిరగరాదు. 2. రాబోయే ఫలితంపై ఆసక్తి ఉండరాదు. 3. చేసే కర్మతో సంగభావం ఉండరాదు. ఇలా చేసినప్పుడే చివరకు 'నేను చేస్తు న్నాను' అనే కర్తృత్వం కూడా తొలగిపోయి కర్మసన్యాసం సిద్ధి స్తుంది. **'ముని' అంటే మననశీలుడు అని.** కర్మయోగం ద్వారా మనస్సు శుద్ధమైనప్పుడు ఆత్మజ్ఞానాన్ని సద్గురువు ద్వారా శ్రవణం చేయాలి. ఆ తర్వాత శ్రవణం చేసిన దానిని మననం చేయాలి. అలా మననశీలుడైతేనే అతడు ముని. ఇలా యోగయుక్తుడు, మననశీలుడు అయితే ప్రయోజనం ఏమిటి?

**బ్రహ్మ అచిరేణ అధిగచ్ఛతి : అచిరకాలంలోనే పరమాత్మను అందుకోగలడు - అని. కనుక కర్మయోగ ఆచరణ పునాది వంటిది గనుకనే శ్రేష్ఠమైనదని భగవానుడు స్పష్టం చేశాడు.** చిత్తశుద్ధి కలగాలంటే కర్మయోగాన్ని ఆచరించాలి. కాని కర్మలను ఆచరించేటప్పుడు మనస్సు కల్మషం కాదా? కళంకం అంటదా? ఏమిటి ఉపాయం?-







***శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః***
***సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ (7)***

**తా॥ బుద్ధిలో కోరికలు లేకుండా మనస్సు శాంతంగా ఉండి, ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొని, సర్వ ప్రాణులను తన వలెనే భావిస్తూ, కర్మయోగాన్ని ఆచరించే వాడు ఎట్టి కర్మలు చేస్తున్నప్పటికీ అతడికి ఏ కళంకము అంటదు.**

**వ్యాఖ్య :-** కర్మలు బంధదాయకాలు. అందుకే "కర్మణా బధ్యతే జంతుః" అన్నారు. అయితే కర్మలనాచరిస్తూనే కర్మయోగి ఈ బంధాలనుండి తప్పించుకొని క్రమక్రమంగా పారమార్థిక సన్యాసం అనే జ్ఞాననిష్ఠా శిఖరాన్ని ఎలా చేరుకోవాలో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

పనస తొనలు అమ్మేవాడు చేతికి నూనె రాసుకొని ఆ పనస పండును కోసి తొనలు తీస్తాడు. లేకపోతే పాలజిడ్డు చేతికి అంటుకుంటుంది. పాత్రకు కళాయిపోసి అందులో ఏది వండినా చిలుము పట్టదు. లేకపోతే పాత్రదోషం పదార్థానికి అంటుకుంటుంది. కరెంటు పని చేసేవాడు చేతులకు రబ్బరు తొడుగులు వేసుకొని పని చేస్తాడు. లేకపోతే ప్రమాదవశాత్తు షాక్ కొడితే ప్రాణమే పోవచ్చు. అలాగే కర్మయోగి సర్వాత్మ జ్ఞానసిద్ధిని పొంది, ఆ జ్ఞాన ప్రభావంతో కర్మలు చేస్తే కర్మ బంధాలు అంటవు.

**కర్మయోగం ద్వారా మనలో ఏ ఏ మార్పులు కలుగుతాయో, ఆంతరంగికంగా ఎట్టి వికాసం, పరివర్తన కలుగుతుందో వాటిని శాస్త్రప్రమాణంతో స్థిరపరుస్తున్నాడు భగవానుడు. కర్మబంధాలు అంటకుండా ఉండాలంటే నిర్మల హృదయం, మనోనిగ్రహం, ఇంద్రియనిగ్రహం, సర్వత్రా ఆత్మదర్శనం అనే లక్షణాలు కలిగి ఉండి, నిష్కామకర్మాచరణ చేయాలి అని ఈ శ్లోకంలో భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.**

**1.విశుద్ధాత్మా :** బుద్ధిలో కోర్కెలు లేనివాడే విశుద్ధాత్ముడు. బుద్ధి శాస్త్రజ్ఞానంతో నిండియున్నప్పుడు ఈ జగత్తు కేవలం మిథ్యయని, ఇందులోని వస్తువులుగాని, విషయాలుగాని, భోగాలు గాని మనిషికి శాశ్వత ఆనందాన్ని ఇవ్వలేవని స్థిరనిశ్చయం కలుగుతుంది. పైగా ఈ కోరికలవల్ల పరమాత్మవైపుకు చేసే ప్రయాణానికి ఆటంకం కలుగుతుందని కూడా గ్రహిస్తాడు. దానితో కోరికల పట్ల అనాసక్తి కలిగి బుద్ధి నిర్మలంగా ఉంటుంది. దానివల్ల-

**2.విజితాత్మా :** కోరికలు తుడిచివేయబడటం వల్ల అంతరంగంలో ఎట్టి సంక్షోభాలు పుట్టవు. ఏ అలజడులు, ఆందోళనలు, నిరాశా నిస్పృహలు ఉండవు గనుక మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అదే విజితాత్మా అంటే. దానితో–

**3. జితేంద్రియః :** ఎవరైతే విశుద్ధాత్ముడు,విజితాత్ముడు అయ్యాడో అతడు తన ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకొని, వాటిని సరైన మార్గంలో నడపగలుగుతాడు.ఇంద్రియాలకు దాసుడై వాటి వెంటబడి పోకుండా; వాటిని నిగ్రహించి, వాటి పోకడలను అరికట్టగలుగుతాడు, అతడే జితేంద్రియుడు.

ఇలా విశుద్ధాత్ముడై బుద్ధి దండాన్ని, విజితాత్ముడై మనో దండాన్ని, జితేంద్రియుడై వాగ్దండాన్ని ధరించటంతో అతడు త్రిదండి అవుతాడు. సన్యాసి దండాన్ని ధరించటంలోని ఆంతర్యం ఇదే. ఈ మూడింటిని సాధించినవాడే త్రిదండి. 3 కర్రముక్కలు పట్టుకుంటే త్రిదండి కాదు.

4. విశుద్ధాత్ముడు, విజితాత్ముడు, జితేంద్రియుడు అయిన మహాత్ముడు తానొక్కడే ఆత్మ స్వరూపుడనని భావించడు. అన్ని భూతాలను–మనుష్యులు, జంతువులు, పక్షులు, క్రిమి కీట కాలు, చెట్లు – అన్నీ ఆత్మ స్వరూపంగానే భావిస్తాడు. అంటే సర్వత్రా ఆత్మనే దర్శిస్తుంటాడు.

**సముద్రంలోని ఒక అలకు జ్ఞానోదయమైంది, తన యదార్థ స్వరూపం సముద్రమే అని. వెంటనే తన వెనుకనే వస్తున్న అలలను చూచింది. అవి కూడా సముద్రమే కదా! అంటే తానే కదా! అనుకుంది. అలాగే నా నిజస్వరూపం ఆత్మయేనని తెలుసుకుంటే ఇక నాకు అంతటా ఆత్మయే. నాకు ఇతరులకు ఏ తేడా ఉండదు. అన్ని ప్రాణుల యదార్థ స్వరూపం నా స్వరూపమే.**

**5. ఈ జ్ఞాన ప్రభావంతో– సర్వ భూతాత్మ భూతాత్మ– సర్వమూ ఆత్మయే అనే జ్ఞానంతో ఇక ఏ కర్మలు చేసినా అతడు యోగయుక్తుడే. అతడికి ఏ కర్మ కళంకాలు అంటవు. అతడికి ఏ కర్మఫలాలు రావు, బంధకరం కావు. ఇదే కర్మలు చేస్తూనే బంధాలనుండి తప్పించుకొని పారమార్థిక సన్యాసం అనే జ్ఞాన నిష్ఠా శిఖరాన్ని చేరుకొనే ఉపాయం.**

ఇట్టి కర్మయోగి కర్మలు చేసేటప్పుడు అతడి అంతరంగంలోని భావనలు ఎలా ఉంటాయో ఎలా ఉండాలో రెండు శ్లోకాల ద్వారా అత్యద్భుతంగా తెలియజేస్తున్నాడు భగవానుడు.







***శ్లో॥ నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।***
***పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥ (8)***
***శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్ అపి।***
***ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥ (9)***

**తా॥ చూస్తున్నప్పుడు, వింటున్నప్పుడు, తాకుతున్నప్పుడు, వాసన చూస్తున్నప్పుడు, తింటున్నప్పుడు, నడుస్తున్నప్పుడు, నిద్ర పోతున్నప్పుడు, శ్వాసిస్తున్నప్పుడు, మాట్లాడుతున్నప్పుడు, మల విసర్జన చేస్తున్నప్పుడు, పట్టుకుంటున్నప్పుడు, కనురెప్పలు వేసి తీస్తున్నప్పుడు, తత్త్వవిదుడు ఇంద్రియాలు ఆయా విషయాలలో ప్రవర్తిస్తున్నాయి అని గ్రహించుకొని, నేను మాత్రం ఏమీ చేయటం లేదు– అని భావిస్తుంటాడు. (తాను అకర్తగా ఉంటాడు)**

**వ్యాఖ్య:– తత్త్వవిత్ :** 'తత్త్వవిదుడు' అంటే అంతఃకరణ శుద్ధిని పొంది; ఇంద్రియాలను, మనస్సును తన ఆధీనంలో ఉంచుకొని, అందరినీ తనలోను, తనను అందరిలోను చూడగలుగుతూ; ఉన్నదొక్కటే ఆత్మయని, అది తానేనని గ్రహించి ఆత్మయందు నిలకడగలవాడు, తత్త్వం తెలిసినవాడు. అట్టి తత్త్వవిదుడు యోగ యుక్తుడై – అంటే నిష్కామకర్మయోగాన్ని ఆచరిస్తున్నప్పుడు ఎలా వ్యవహరిస్తాడు?

అతడి కన్ను చూస్తున్నా, చెవి వింటున్నా, చర్మం స్పర్శిస్తున్నా, ముక్కువాసన చూస్తున్నా, నాలుక రుచులు చూస్తున్నా, పాదాలు నడుస్తున్నా, చేతులు పట్టుకుంటున్నా, వాక్కు మాట్లాడుతున్నా, ప్రాణం ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుపుతున్నా, గుహ్య గుదేంద్రి యాలు జలాన్ని మలాన్ని విసర్జిస్తున్నా, ఉపప్రాణవాయువులు కంటి రెప్పలు వేస్తున్నా తీస్తున్నా ఆయా ఇంద్రియాలు ఆయావిషయాలలో ప్రవర్తిస్తూ వాటిపనులు అవి చేసుకుంటున్నాయి. నేను మాత్రం కేవల సాక్షిగా ఉన్నాను. నేను అకర్తను, అభోక్తను, అసంగుణ్ణి అనే నిశ్చయజ్ఞానంలో ఉంటాడు తత్త్వవిదుడు. జీవితంలో తప్పక చేయవలసిన ఈ కర్మలను చేస్తున్నా నేను చేస్తున్నా ననే కర్తృత్వాభిమానం ఉండదు.

**అతడు కర్మలను సన్యసించడు. కర్మలతో సంగభావాన్ని సన్యసిస్తాడు. అతడి ఆలోచనలలో భావనలలో కర్మల తాలూకు వాసనలు – జ్ఞాపకాలు ఉండవు. అదెలాగో చూద్దాం.**

ఒక సన్యాసి, అతడి శిష్యుడైన బ్రహ్మచారి ఇద్దరూ ప్రక్కన ఉన్న గ్రామానికి నడిచిపోతున్నారు. మధ్యలో ఒక చిన్న ఏరు పారుతున్నది. వారలా ఏటి దగ్గరకు రాగానే 'రక్షించండి, రక్షిం చండి...' అంటూ ఒక స్త్రీ యొక్క ఆర్తనాదం వినిపించింది. ఆ శబ్దం వచ్చినవైపుకు చూడగా ఏటిలో కొట్టుకుపోతున్న ఒక యువతి కనిపించింది. ఆమె ఒడ్డుకు రాలేక సతమతమవు తున్నది. వెంటనే ఈత వచ్చిన ఆ బ్రహ్మచారి ఆ ఏటిలో దూకి ఆమెను పట్టుకొని, భుజాలమీదికి ఎక్కించుకొని ఒడ్డుకు చేర్చి, త్రాగిన నీరు క్రక్కించి, ఆమె సేదతీరగానే ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. సన్యాసి, బ్రహ్మచారి ఏరుదాటి నడక సాగిస్తు న్నారు. అయితే ఆ సన్యాసి తన శిష్యుడైన బ్రహ్మచారిని ఒకటే గోకటం ప్రారంభించాడు.

'నీవు బ్రహ్మచారివి, స్త్రీని తాకకూడదు. అందులోను వయసులో వున్న యువతిని తాకావు. ఊరికే తాకటం కాదు. భుజాల మీదికి ఎక్కించుకున్నావు. ఒడ్డుకు తీసుకొచ్చేటప్పుడు ఆమె శరీరాన్ని, అవయవాలను తాకావు. ఇది నీకు తగునా? నీ పవి త్రత ఏమైపోతుంది?' అని మొదలు పెట్టాడు. రెండు రోజులు గడిచినా అదే గొడవ, అదే నస, అదే చర్చ. ఆ యువతి వయ స్సును, ఆమె అందాన్ని, అవయవ సౌష్ఠవాన్ని వివరంగా వర్ణిస్తూ అతడి తప్పును పదే పదే ఎత్తి చూపుతున్నాడు. అయినప్పటికీ గురువుకదా! పెద్దవాడు కదా! అని పట్టించుకోకుండా గౌరవ భావంతో ఊరుకున్నాడు ఈ కుర్ర బ్రహ్మచారి. కాని ఆ గురువు మాత్రం జిడ్డులాగా పట్టుకొని ఆ విషయాన్ని వదలకుండా పదే పదే గుర్తుచేస్తున్నాడు.

చివరకు విసిగి వేసారిన బ్రహ్మచారి, 'కాని గురువుగారూ! నేను ఆమెను రెండు నిమిషాలు మోశాను. కాని మీరు మాత్రం రెండు రోజులనుండీ ఇంకా మోస్తూనే ఉన్నారుకదా!' అన్నాడు. **కనుక కర్మను సన్యసించటం కాదు, కర్మతో సంగభావాన్ని సన్య సించాలి. భావసన్యాసం ముఖ్యం.** ఈ పని నేను చేస్తున్నాను. ఇది నేనే చేయాలి. నేను తప్ప దీనిని నిర్వహించగలవారెవరు? అనే భావ వుండి కర్మను సన్యసించినా (చేయకపోయినా) అతడు సన్యాసి కాడు. మిధ్యాచారి అవుతాడు. కర్మ చేయకపోయినా దానినే మనసుకు పట్టించుకొని, ఎప్పుడూ దానిని తలచుకుంటూ ఉంటే అతడు కపట సన్యాసియే. రక్షించటానికి దిగకపోయినా అన్నీ పరిశీలించే పనిలో నిమగ్నమైన ఈ సన్యాసి కూడా కపట సన్యాసియే. కర్మసన్యాసం కాక భావసన్యాసం ఉండాలి. అదే నిజమైన సన్యాసం. అతడే నిజమైన తత్త్వవిదుడైన యోగి.







**దేహేంద్రియ మనోబుద్ధులకు అతీతమైనది ఆత్మ. ఈ దేహేంద్రియాలను, వాటియొక్క వృత్తులను కేవలంగా – కేవల సాక్షిగా చూస్తుంది ఆత్మ. ఈ ఆత్మయే జీవుని అసలు స్వరూపం. అయితే అజ్ఞానం వల్ల జీవుడు తన అసలు స్వరూపం అయిన ఆత్మను – నేను ఆత్మను అని మరచి ఈ దేహాదులతో తాదాత్మ్యం చెంది ఈ దేహమే నేను, ఈ మనస్సే నేను; ఈ బుద్ధి నేనే అని భ్రమపడుతూ అవి చేసే పనులను, ఆలోచనలను నేనే చేస్తున్నాను అనే కర్తృత్వ బుద్ధితో ఉంటాడు. అయితే ఎవరైతే శాస్త్ర విషయా లను సద్గురువు ద్వారా శ్రవణం చేసి, మనన నిధి ధ్యాసనలద్వారా గట్టి పరచుకుంటాడో అట్టి తత్త్వవిదుడు అజ్ఞానాన్ని తొలగించు కొని, "తాను ఆత్మనని, ఈ దేహేంద్రియమనో బుద్ధులు తనకన్న వేరుగా ఉన్నాయని, అవి చేసే పనులతో, సంకల్పాలతో నాకే సంబంధమూ లేదని, ఇంద్రియాలు వాటి వాటి పనులలో ప్రవర్తి స్తున్నాయే కాని ఆత్మనైన నేను ఏమీ చేయటంలేదని, నేను ఆ ఇంద్రియాల వృత్తులను చూసే కేవల సాక్షినని నిశ్చయించుకొని ఎట్టి వికారాలు (సుఖదుఃఖాలు) లేకుండా ఉండిపోతాడు. అత డెప్పుడూ తన అఖండ ఆనందంలో ఉండిపోతాడు. ఇదే యోగ యుక్తుడైన తత్తవేత్త ఈ ప్రపంచంలో వ్యవహరించే తీరు.**

సామాన్య సాధకుడు ఇట్టి భావనకు రావటానికి ఎట్టి శిక్షణ పొందాలి? యోగయుక్తుడైన తత్త్వవేత్త–ఆత్మజ్ఞాని దేహేంద్రియాల ద్వారా ఏ కర్మలు జరిగిపోతున్నా తాను మాత్రం ఆత్మగా–కేవలం సాక్షిగా ఉంటాడు. మరి సామాన్యుడు అట్టి స్థితికి రావటం ఎలా? –

***శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః॥***
***లిప్యతే న సపాసేన పద్మ పత్ర మివాంభసా॥ (10)***

**తా॥ సకల కర్మలను పరమాత్మ యందు సమర్పించి, సంగ భావాన్ని విడిచి ఎవడు కర్మలు చేస్తాడో అతడు నీరు అంటని తామరాకులాగా పాపంచేత అంటబడడు.**

**వ్యాఖ్య : 'నేను ఆత్మను'** అని గ్రహించిన యోగయుక్తుడైన తత్త్వవేత్త తన దేహం ద్వారా ఎట్టి కర్మలు జరిగిపోతున్నా 'నేను చేస్తున్నాను' అనే భావన ఏమాత్రం లేకుండా; ఇంద్రియాలు వాటి వాటి పనులు అవి చేసుకుంటున్నాయి, 'నేను మాత్రం అకర్తయైన కేవల ఆత్మను' అని భావిస్తూ నిరంతరం ఆత్మయందే స్థితి

కలిగి ఉంటూ నిర్లిప్తంగా ఉండిపోతాడు. అంతటి మహాత్ముడు అలా వ్యవహరించ వచ్చు. కాని సామాన్యులైన సాధకులు ఆత్మజ్ఞానాన్ని తెలుసుకున్నప్పటికీ ఆత్మభావనలో ఉండలేరు, చేసే కర్మలలో కర్తృత్వభావాన్ని విడిచిపెట్టలేరు. విరక్తి జీవితాన్ని గడపటం అంత సులువైన విషయం కాదుగదా! ఎందుకంటే సామాన్యులు సాధకులే గాని సిద్ధులు కాదు. మరి అట్టివారు కూడా ఈ ఆత్మ భావనలో నిలిచి కేవల సాక్షిగా ఉండాలంటే ఎటువంటి శిక్షణ పొందాలి? విరక్తి జీవితానికి కావలసిన సాధనావిధానం ఏమిటి? అనే విషయాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు భగవానుడు.

సాధారణంగా మానవులు నిరంతరం లోక వ్యవహారాలలో నిమగ్నమై ఉంటారు. తనను, తన కుటుంబాన్నీ పోషించుకోవడానికి, సుఖభోగాలు అనుభవించటానికి ఏవో పనులు చేస్తూ, సంపాదిస్తూ, ఖర్చుపెడుతూ, దాచుకుంటూ ఈ లోకంలో జీవిస్తూ ఉంటారు. నేను-నాది అనే అహంకార మమకారాలకు, ప్రాపం చిక వ్యామోహాలకు, అనేక లౌకిక విషయాలకు మనస్సు అంటుకొని ఉంటుంది. ఇదే సంగభావం. అనాలోచితంగా జరిగే కొన్ని శారీరక క్రియలలో అంటే కాలకృత్యాలు తీర్చుకోవటంలోనో, స్నాన పానాదులలోనో కర్తృత్వభావన లేకుండా- నేను చేస్తున్నా ననే సంగభావం లేకుండా ఆయా కర్మలు చేయటం సాధ్యమే కాని, మనకు ప్రయోజనం కలిగించే అనేక కర్మలయందు ఈ సంగభావాన్ని తొలగించి, నిస్సంగంగా-నిర్లిప్తంగా ఉండటం చాలా కష్టం. మనం చేసే కర్మలలో ఏ మాత్రం సంగభావం లేకుండా, **నేను చేస్తున్నాను అనే కర్తృత్వం లేకుండా; ఆలోచనతో కూడిన కర్మలను చేయాలంటే ఒక్కటే ఉపాయం. అదే కర్మలను భగవంతునికి సమర్పించటం. ఎందుకంటే మనస్సు ఎప్పుడూ ఏదో ఒకదాన్ని పట్టుకొని ఉంటుంది. ఒకవేళ ఆ పట్టు నుంచి విడిపించి దానిని అలా వదిలేసినా అది ఊరుకోకుండా మరొక దాన్ని పట్టుకొంటుంది. దొంగ గడ్డి తినే గొడ్డును అలా తినకుండా లాక్కొచ్చినా తిరిగి మరో వైపుకు పరుగెడుతుంది. అందువల్ల దానికి మంచి గడ్డిని మనమే అందించాలి. అలాగే ప్రాపంచిక విషయాలలో తిరుగుతూ, వాటితో తాదాత్మ్యం పెట్టుకున్న మనస్సును వాటినుండి లాగి వదిలేస్తే ప్రయోజనం లేదు. దానికి మనమే ఉత్తమమైన విషయాన్ని అందించాలి. ఈ మనస్తత్త్వ శాస్త్ర విషయాన్నే భగవానుడు ఈ శ్లోకంలో "బ్రహ్మణ్యా ధాయ కర్మాణి సంగం త్యక్త్వా**







**కరోతి" అంటూ తన కర్మలను బ్రహ్మంనందు- పరమాత్మయందు సమర్పించి, ఆ కర్మలతో ఏ మాత్రం సంగభావం లేకుండా చేయాలి అని తెలియ జేస్తున్నాడు.**

కర్మలను భగవంతునికి సమర్పించటం ఎట్లా? నైవేద్యాన్ని సమర్పించటం ఎలాగో మనకు తెలుసు. ఆ పదార్థాన్ని కొంచెం తీసుకొని భగవంతుని విగ్రహం నోటికి తాకిస్తాం. కాని మనం నిత్యజీవితంలో చేసే కర్మలను భగవంతునికెలా సమర్పించాలి? ఎలాగంటే మనం ఏ పని చేస్తున్నా ఆ పనిని ప్రారంభించేటప్పుడు భగవంతుని స్మరించి ప్రారంభించాలి. ముగించినప్పుడు భగవ త్కృపవల్ల నిర్విఘ్నంగా పూర్తయిందని భావించాలి. మధ్య మధ్యలో కూడా భగవంతుని స్మరించాలి. **ఆ కర్మల వల్ల లభించిన ఫలితం ఏదైతే ఉందో అది భగవంతుడు ప్రసాదించిన ప్రసాదం లాగా భావించాలి.** ఎవరైనా కలిసినప్పుడు "బాగున్నారా?" అంటే ఆ భగవంతుని దయవల్ల అని హృదయపూర్వకంగా చెప్పాలి. ఇల్లు కట్టించావటగదా? అమ్మాయి పెళ్ళి చేశావట గదా? అబ్బాయిని బాగా చదివిస్తున్నావటగదా? అని అడుగుతున్నప్పుడు అంతా భగవంతుని ఇచ్ఛ, ఆయన దయ, నాదేముంది? అని మనస్సు లోతులనుండి అనగలగాలి. ఇలా అన్ని విషయాల్లోనూ భగవంతుని కర్తగా చేస్తూ, నీవు నిమిత్తమాత్రుడివి కావాలి. **భగవంతునియందు కర్మలను సమర్పించటం అంటే భగవంతునికే కర్తృత్వాన్ని కట్టబెట్టటం. ఇలా సాధన దశలో కర్తృత్వాన్ని భగవంతునికి అర్పించి, కర్తవ్యాన్ని నిర్లిప్తంగా నిర్వర్తిస్తుంటే క్రమంగా కర్మలలో నిస్సంగత్వం, భగవంతునితో సంగభావం ఏర్పడుతుంది. అప్పుడే "అన్నీ చేసేవాడు భగవంతుడు, నాదేం లేదు" అనే నిశ్చయజ్ఞానం కలుగుతుంది.** ఈ విధంగా కర్మలను భగవంతునికి సమర్పించాలి. కర్మలను సమర్పించటం అంటే కర్మల యొక్క కర్తృత్వాన్ని సమర్పించటమే. దీనివల్లనే కర్మలతో సంగభావం పోయి నిస్సంగత్వం ఏర్పడుతుంది. **అయితే ఇట్టి నిస్సంగత్వం నిరంతరం పరమాత్మయందు మనస్సు నిలవటం వల్లనే కలుగుతుంది. మరి, నిరంతరం పరమాత్మయందు ఎలా మనస్సు నిలుస్తుంది? దానికి సత్సంగమే ఉత్తమమైన ఉపాయం. అందుకే శంకరాచార్యులవారు "సత్సంగత్వే నిస్సంగత్వం" అని భజగోవింద శ్లోకాలలో తెలియజేయటం జరిగింది.**

ఇలా సత్సంగంద్వారా భగవంతునితో సంగభావం పెట్టుకో వటం ద్వారా ప్రపంచంతో నిస్సంగత్వం ఏర్పరచుకొని, చేసే కర్మలన్నింటిని భగవంతునికి సమర్పిస్తే ప్రయోజనం ఏమిటి?-

**స పాపేన న లిప్యతే :–** అతడు పాపాలచేత అంటబడడు. ఇక్కడ 'పాపాలు' **అంటే వాసనలే. మనం పూర్వంలో చేసిన పాప, పుణ్య ఆలోచనలేవైతే ఉన్నాయో అవే వాసనలుగా మన మనస్సుపై ముద్రలుగా పడి ఉంటాయి. అవి మళ్ళీ మళ్ళీ మనలను కర్మలకు ప్రేరేపిస్తూ ఉంటాయి. ఆ ప్రేరణల వల్ల మనం మళ్ళీ మళ్ళీ కర్మలు చేసి కర్మబంధంలో ఇరుక్కుంటాం.** ఆ వాసనలన్నీ క్షయమైపోతేనే మనస్సు శుద్ధమై ధ్యానానుకూల మౌతుంది. అదీ మనకు ప్రయోజనం. అంతేగాని పూర్వంలో చేసిన పాపాలు నశించిపోతాయని భ్రమపడరాదు. చేసిన పాపాలుగాని, పుణ్యాలు గాని అనుభవిస్తేనే ఖర్చైపోతాయి. పాపాల చేత అంటబడడు అనే విషయాన్ని భగవానుడు ఒక అద్భుతమైన ఉపమానం ద్వారా తెలియజేస్తున్నాడు. అదే–

**పద్మపత్ర మివాంభసా :–** నీరు అంటని తామరాకువలె. తామరాకు నీటిలోనే ఉంటుంది. అయినప్పటికీ దానికి నీరు అంటదు. తామరాకును నీటిలో ముంచి పైకి తీసి విదిలిస్తే అది నీటిలో ముంచిన ఆకు అని భావించే వీలు లేదు. అంత పొడిగా ఉంటుంది. అందుకే పద్మం వైదిక సంస్కృతికి పూజ నీయమైన ప్రతీక అయింది. **బురదలో ఉన్నా బురదనంటించు కోదు తామరాకు. అలాగే ప్రపంచంలో ఉన్నా ప్రపంచ విషయాలకు, వ్యామోహాలకు అంటకుండా ఉండాలని సూచన.**

బ్రహ్మార్పణ బుద్ధితో కర్మలాచరిస్తే ఆ కర్మలలో గొప్ప సామర్థ్యం వ్యక్తమవుతుంది. సంగభావంతో కర్మలు చేస్తే సమర్థత ఉండదు. ఒక డాక్టరు ఆపరేషన్లు చేయటంలో సిద్ధహస్తుడు. ప్రతిరోజూ ఎన్నో ఆపరేషన్లు అవలీలగా చేస్తుంటాడు. ఒకసారి తన భార్యకు జబ్బు చేసింది. ఆపరేషను చేయాల్సి వచ్చింది. అతడు ఆమెను మరొక డాక్టరు వద్దకు తీసుకెళ్ళి ఆపరేషన్ చేయించాడు. ఎందుకు? తన భార్యపైగల మోహం, మమ కారమే అతణ్ణి అసమర్థుణ్ణి చేసింది. భార్య అనే సంగభావం వల్ల బెదురు. కనుక సంగభావాన్ని విడిస్తే సమర్థత కూడా ఉంటుంది. – ఏ కోరికలు లేకుండా, కర్మఫలాన్ని ఆశించకుండా, కర్మలపై ఆసక్తి లేకుండా కర్మలు చెయ్యాలని అన్పించదు కదా? మరెలా సంగభావాన్ని వదలి, కర్మ భగవంతుని కర్పిస్తూ కర్మ చెయ్యటం?

**శ్లో॥ కాయేన మనసాబుద్ధ్యా కేవలై రింద్రియై రపి।**
**యోగినః కర్మ కుర్వంతి సంగంత్యక్త్వాత్మ శుద్ధయే॥ (11)**







**తా॥ నిష్కామ కర్మయోగులైనవారు సంగభావాన్ని విడిచిపెట్టి శరీర మనోబుద్ధుల ద్వారాను, కేవల ఇంద్రియాల ద్వారాను చిత్తశుద్ధిని పొందటం కోసం కర్మలు చేస్తుంటారు.**

**వ్యాఖ్య:–** సాధారణంగా లోకంలో ఎవరైనా ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించి మాత్రమే కర్మలు చేస్తారు. అది ధనం కావచ్చు, సంపదలు కావచ్చు, స్వార్థం కావచ్చు, కక్షతీర్చుకోవడానికి కావచ్చు. ఏ ప్రయోజనం లేకపోతే ఎందుకు అనవసరంగా కష్టపడటం అనుకుంటారు. మరి ఇక్కడ ఏ కర్మఫలాన్నీ కోర కుండా, సంగభావం లేకుండా, కర్తృత్వం లేకుండా కర్మయోగులు ఎందుకు కర్మలు చేస్తారు? అంటే చిత్త శుద్ధికోసం అని భగవానుడు సమాధానం చెబుతున్నాడు. **సాధకులకు కావలసింది లౌకికమైన ప్రయోజనాలు కాదు. పారమార్థిక ప్రయోజనం. ఆ పారమార్థిక ప్రయోజనం ముక్తియే. మోక్షమే. అట్టి మోక్షప్రాప్తికి ఆత్మజ్ఞానం కావాలి. ఆత్మజ్ఞానాన్ని అనుభవానికి తెచ్చుకొనుటకు ధ్యాన నిష్ఠలో నిలవాలి. అందుకు మనస్సు ఏకాగ్రం కావాలి. ఏకాగ్రం కావాలంటే చిత్తం అన్ని మాలిన్యాలనుండి శుద్ధిపడాలి. అట్టి చిత్తశుద్ధికోసమే ఈ నిష్కామ కర్మయోగం, కర్తృత్వం లేకుండా కర్మల నాచరించటం అవసరం. అందుకే యోగులు, తత్త్వంలో నిలవాలనుకున్న సాధకులు చిత్త శుద్ధికోసమే సంగ రహిత కర్మలనాచరిస్తారు.** అంతేకాదు ఈ కర్మలను వారు ఎలా ఆచరిస్తారు?

**కాయేన, మనసా, బుద్ధ్యా కేవలైరింద్రియైరపి :–** శరీరంతో, మనస్సుతో, బుద్ధితో కేవల ఇంద్రియాలతో చేస్తారు. శరీరంతో కర్మలు చేయటం వల్ల శరీర శుద్ధి, మనస్సులో భగవంతుని నిల్పుకొని చేసే మానసిక కర్మలవల్ల మనోశుద్ధి, అలాగే బుద్ధిలో ఆత్మభావాన్ని నింపుకొని చేసే బౌద్ధిక కర్మలవల్ల బుద్ధి శుద్ధి జరుగుతుంది. అంతేగాక కేవల ఇంద్రియాలతో అనటం వల్ల రాగద్వేషాలు లేని ఇంద్రియాలతో చేసే కర్మలవల్ల తప్పక చిత్త శుద్ధి కలుగుతుందని గ్రహించాలి. ఈ కర్మలన్నీ భగవత్ప్రీతి కోసం, భగవదార్పణ బుద్ధితో, భగవంతుని స్మరిస్తూ చేయాలి. ఇక్కడ కేవలం అనే పదాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి.

**ఒక బ్రాహ్మణుడొక గొర్రెను చూశాడు. ఒక కసాయివాడూ చూశాడు. బ్రాహ్మణుడు చూసి ఇది గొర్రె అనుకున్నాడు. కసాయి వాడు దీనినుండి ఎంత**

**మాంసం వస్తుంది? అని చూశాడు. బ్రాహ్మణునిది కేవల దృష్టి. కసాయి వానిది సంగదృష్టి.**

ఇట్టి కేవల దృష్టితో నిష్కామ కర్మయోగి కర్మలు చేస్తుంటే అతడికి ఫలితం ఏమిటి? అతడి ప్రగతి ఏమిటి? అతడు నిష్కామంగాను, కర్తృత్వం లేకుండాను, నిర్లిప్తంగా కర్మలు చేస్తూ చేస్తూ ఉంటే చివరకు ఆ కర్మలను చేస్తున్నది తనదేహం, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలేగాని తాను మాత్రం ఏమీ చేసేవాణ్ణి కాదని, కేవల సాక్షినని తెలుసుకుంటాడు. **ఐతే ఆ తెలుసుకొనేవాడెవరు? బుద్ధి స్థానంలో కూర్చున్న ఆత్మ. ఇలా కేవల సాక్షిగా ఉండి, చూచే ఆ ద్రష్టను తనలోనే గమనిస్తూ ఉంటాడు. క్రమంగా ఆ ద్రష్టతో ఐక్యమైపోయి ఆత్మగా ఉంటాడు.**

పరమాత్మ తత్త్వాన్ని తెలియజెప్పే ఉపనిషత్తుల జ్ఞానం బుద్ధిలో నాటుకొని వృద్ధి చెందాలంటే బుద్ధి సూక్ష్మంగా ఉండాలి. బుద్ధి సూక్ష్మంగా ఉండాలంటే మనసు ప్రశాంతంగా ఉండాలి, చిత్తం నిర్మలం కావాలి. చిత్తం నిర్మలమూ శుద్ధమూ కావాలంటే అసంగ భావంతో, భగవదార్పణ బుద్ధితో, కర్తృత్వం లేకుండా కర్మలు చేసినప్పుడే సాధ్యమౌతుంది. అందుకే కర్మయోగులు చిత్తశుద్ధిని కోరి సాక్షిగా ఉండి కర్మలాచరిస్తారు.

– ఫలాసక్తిని వదలి కర్మలు చేసే యోగికి అంతిమఫలం ఏమిటి? కర్మఫలా సక్తితో, కోరికలతో కర్మలు చేసే వానికి కలిగే ఫలితం ఏమిటి?

***శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం।***
***అయుక్తః కామ కారేణ ఫలేసక్తో ని బధ్యతే॥ (12)***

**తా॥ నిష్కామకర్మయోగి కర్మఫలంపై గల అపేక్షను విడిచి పరమశాంతిని పొందుతాడు. కామ్యకర్మల నాచరించేవాడు కోరి కలవల్ల ఫలంపై ఆపేక్షతో సంసారంనందు బంధించపడు తున్నాడు.**

**వ్యాఖ్య :** నిష్కామకర్మయోగి తాను చేసే కర్మల వల్ల ఏ ఫలితం వస్తుందా? అని ఎదురుచూడకుండా; ఫలితాన్ని ఊహిం చుకొంటూ మనస్సును సంక్షోభంలోకి నెట్టకుండా కర్మలు చేస్తాడు. కనుక చివరకు అతడు పొందే ఫలితం పరమశాంతి– పారమార్థిక శాంతి. ఈ శాంతి ఎలాంటిదంటే 'నైష్ఠికీం'– అంటే ఆత్మ నిష్ఠలో నిలవటం ద్వారా పొందే శాంతి. పరమాత్మయందు పొందే శాశ్వత శాంతి. శాంతి అనేది పరిశ్రమలలో యంత్రాల నాడించి ఉత్పత్తి చేసేది కాదు. ప్రభుత్వాలు







శాసనం చేస్తే వచ్చేదీ కాదు. లేదా ఇంట్లో కూర్చొని పొయ్యి వెలిగించి బాణలిపెట్టి పాకంగా తయారుచేసేదీ కాదు.

**ఒక ప్రత్యేక వ్యక్తి యొక్క మనస్సును కోరికలనే తుపాను గాలులు కల్లోల పరచకుండా ఉంటే కలిగే స్థితియే శాంతి. ఇది అఖండమైన ఆనందాన్ని కలిగిస్తుంది. ఇట్టి శాంతి నిజంగా ఎలా కలుగుతుంది? కర్మఫలాన్ని, కర్తృత్వాన్ని విడిచిపెట్టినప్పుడు మనస్సులో ఒక సమత్వం కలిగి, ఆ స్థితిలో జ్ఞాన నిష్ఠతో కూడిన పరమశాంతి కలుగుతుంది. కనుక ఇట్టి శాంతిని పొందాలంటే కోరిక– ఆశ అనే చిన్న ఫలాన్ని విడిచిపెట్టాలి.** కేవలం ఈ లోకంలో జీవించి ఉన్న కాలంలో కొద్దికాలంలో మాత్రం పొందే ఆనందాన్ని త్యాగం చేసినందువల్ల, కోరిక– ఆశ అనే వాటిని విడిచినందువల్లనే చిత్తశుద్ధి కలిగి, దానివల్ల పరోక్ష జ్ఞానం కలిగి, ఆ తరువాత కర్మ సన్యాస రూప జ్ఞాననిష్ఠ వల్ల మోక్షరూపమైన పరమశాంతిని పొందుతాడు.

ఇలా శాంతిని పొందే ఉపాయాన్ని చెప్పి కూడా భగవానుడు తృప్తి చెందక ఈ విషయాన్నే వ్యతిరేక పద్ధతిలో చెప్పి మనను ఈ శాంతి మార్గాన్ని అనుసరించటానికి ప్రోత్సహిస్తున్నాడు.

ఎవ్వరైతే కోరికలతో, ఆశలతో వేగిపోతూ కర్మఫలంపై అపేక్షను విడిచిపెట్టలేడో అతడు ఆ కర్మఫలాలతోనే బద్ధుడై – ఈ సంసార జనన మరణ చక్రంలో ఇరుక్కుపోతాడు. **ఈ లోకంలోని సుఖ సంపదల కోసం, లేదా పరలోకంలోని సుఖ భోగాలకోసం, లేదా కీర్తి ప్రతిష్ఠలకోసం కోరికలచేత, ఆశలచేత ప్రేరేపించబడి కర్మలు చేసేవాడే అయుక్తుడు. అతడు కోరికలతోనే కర్మలు చేస్తాడు. ఆ ఫలితాలను ఇక్కడో లేక పరలోకంలోనో అనుభవిస్తాడు. తిరిగి ఉత్తమ జన్మలో, మధ్యమ జన్మలో, అధమ జన్మలో పొందుతాడు. ఇలా మళ్ళీ మళ్ళీ జన్మబంధంలో చిక్కు కుంటాడు.**

కనుక కర్మలు చేసేటప్పుడు ఆశలు, కోరికలు వదిలితే శాశ్వత శాంతి, విడవకపోతే జన్మరూప దుఃఖం, బంధం, కనుక చేసే కర్మలు తెలివితో చేయాలి.

మనం ఔషధాన్ని తీసుకొనేటప్పుడు కూడా తెలివితోనే తీసుకోవాలి. ఏదైనా బాగా దెబ్బ తగిలినప్పుడు భరించలేని బాధ కలుగుతుంది. డాక్టరు దగ్గరకు వెళితే ముందు నొప్పి తగ్గటానికి రోజుకో నిద్రమాత్ర వాడమని 2 మాత్రలు

వ్రాస్తాడు. మనం నొప్పి ఎక్కువగా ఉంది గనుక ఒక్కసారే గుప్పెడు మాత్రలు మ్రింగితే! మాత్రలు అవే గదా! ఏమవుతుంది? శాశ్వత నిద్రే. అలాగే మనం బాహ్య జగత్తులో కర్మలను ఆచరించేటప్పుడు తెలివిగా ప్రవర్తించకపోతే– శాస్త్రం చెప్పినట్లు, భగవానుడు చెప్పి నట్లు, గురువు చెప్పినట్లు వినకపోతే అంతరంగ సంతోషం, శాంతి – సంతృప్తి పొందటానికి బదులు ఆ కర్మలే మనను బంధించివేస్తాయి. అవే మన అశాంతికి కారణమౌతాయి. ఏ నిద్రమాత్ర మన నొప్పిని తగ్గించి, సుఖంగా నిద్ర పోవటానికి ఉపయోగపడుతుందను కున్నామో అదే సుఖ నిద్ర బదులు శాశ్వత నిద్రను ప్రసాదిస్తుంది. అలాగే ఏ కర్మ శాంతిని ప్రసాదిస్తుందను కున్నామో అదే అశాంతిని కలిగించి బంధంలో పడవేస్తుంది. కనుక కోరికలను విడిచి కర్మ చేయాలి. అప్పుడే శాశ్వత శాంతి – కర్మ ఫలాన్ని వదలి పరమశాంతిని పొందే మహనీయుని అంతరంగ పరిస్థితి ఎలా ఉంటుంది?

**శ్లో॥ సర్వ కర్మాణి మనసా సన్యస్యా ఉ_స్తే సుఖం వశీ।**
**నవద్వారే పురే దేహీ నైవకుర్వన్ నకారయన్॥ (13)**

**తా॥ ఇంద్రియాలను వశంలో ఉంచుకొన్న దేహధారి మనస్సు ద్వారా అన్ని కర్మలను విడిచిపెట్టి, తొమ్మిది ద్వారాలు గల ఈ దేహమనే పురంలో ఏమీ చెయ్యకుండా, ఏమీ చేయించ కుండా సుఖంగా ఉంటాడు.**

**వ్యాఖ్య:–** ఇంద్రియాలను తన అధీనంలో ఉంచుకోగలిగిన మహాత్ముని ఇక్కడ 'వశీ' అంటున్నాడు. 'వశీ' అనే బిరుదు మహాత్ముడైన సిద్ధునికే చెల్లుతుంది. సాధకుడైతే ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొనుటకు ప్రయత్నిస్తాడు. అందుకే అతణ్ణి 'యతి' యత్నశీలుడు అంటారు. సిద్ధుడు ఇంద్రియాలను వశంలో ఉంచుకొనుటకు ప్రయత్నించాల్సిన పనిలేదు. అతడు ఆ స్థితిని దాటిన మహాత్ముడు. అట్టి మహాత్మునే 'దేహి' అంటున్నారు. 'దేహి' అంటే దేహానికి వేరుగా ఆత్మగా ఉన్న 'జ్ఞాని' అని. దేహాన్ని ధరించిన వాడెవడైనా దేహియే గదా! అంటే అజ్ఞాని కూడా దేహియే కదా! అనుకోవచ్చు.

**అజ్ఞాని తాను దేహం కన్నా వేరుగా ఈ దేహంలో ఉన్న ఆత్మను అని గ్రహించనివాడు. తాను దేహాన్ని అని భావించేవాడు.** దేహం ఇంటిలో ఉంటే నేను ఇంటిలో ఉన్నాను అని, బస్సులో ఉంటే బస్సులో ఉన్నాను, అని, దేహం కుర్చీలో ఉంటే నేను కుర్చీలో ఉన్నాను అని అనేవాడు. కాని జ్ఞాని మాత్రం తాను







దేహంలో వున్న ఆత్మను అని గ్రహించినవాడు. ఈ దేహం ఇంటిలో వున్నా, బస్సులో వున్నా, కుర్చీలో ఉన్నా నేను దేహంలోనే వున్నాను అని అంతటా వున్నాను అని భావించేవాడు.

ఒక బాటసారి ప్రయాణం చేస్తూ సత్రంలో బస చేసినప్పుడు దీనిని ఎలా బాగు చేద్దాం? ఎలా దీనిని వృద్ధి చేద్దాం? క్రొత్త పథకాలు ఏమి పెడదాం? అని ఆలోచించడు. తెల్లవారగానే వెళ్ళిపోతాడు. అలాగే అద్దె ఇంటిలో కాపురం ఉండేవారు ఆ ఇంటిలో ఏమేమి కట్టుబడి చేద్దాం? ఏ రంగులు వేద్దాం? అని ఆలోచించరు. ఉన్నంతకాలం అద్దె చెల్లించి, అవసరం తీరిం తర్వాత వెళ్ళిపోతాడు. **అలాగే జ్ఞానియైనవాడు అద్దెకొంపవంటి దేహంలో ఉంటూ, ప్రారబ్ధం పూర్తి కాగానే విడిచివెళ్ళిపోతాడు.**

**రమణ మహర్షి వద్దకు ఒక భక్తుడు ఆటో రిక్షా తెచ్చి "మహర్షీ తమరు ఒక్కసారి ఈ బండిలో కూర్చోండి. మా ఇంటికి దయచేద్దురు" అన్నాడు. దానికి మహర్షి, "నేనిప్పుడు బండిలోనే కూర్చున్నాను గదా! ఈ బండికి మరొక బండి ఎందుకు?" అన్నారట. 'ఆత్మవేత్తలైన జ్ఞానులకు ఈ దేహం బండివంటిదే.' కాని మనం దేహమే నేనుగా భావిస్తుంటాం. ఇదే జ్ఞానికి అజ్ఞానికి గల భేదం.**

ఇట్టి ఆత్మజ్ఞాని– నేను దేహాన్ని కాదు, దేహిని అనే భావంతో ఉన్న మహాత్ముడు మనస్సుద్వారా సర్వ కర్మలను సన్యసిస్తాడు. **కర్మలను శరీరంద్వారా సన్యసించటం కుదరదు. వాటిని మనస్సు ద్వారానే వదలాలి. దేహంతో కర్మలు జరిగిపోతున్నా ఆ కర్మ ఫలాలను వదల వలసింది మాత్రం మనస్సు ద్వారానే. అలాగే కర్తృత్వాన్ని వదలాల్సింది కూడా మనస్సు ద్వారానే.** ఇలా మనస్సు ద్వారా కర్తృత్వాన్ని వదలి కర్మలు చేస్తున్నా అతడు చేయనివాడే. అట్టి నిగ్రహపరుడు తాను కేవల ఆత్మగా ఉంటూ, మనస్సు చేత కర్తృత్వాన్ని వదలి, నిర్లిప్తంగా కర్మలు చేస్తుంటే అతడు తనలోపలి నుండి పొంగి వచ్చే అనిర్వచనీయమైన శాంతిని పొందుతాడు. అతడి ఈ నిజస్థితి ఎలా ఉంటుందో ఇక్కడ ఒక అద్భుతమైన ఉపమానం ద్వారా భగవానుడు చెబుతున్నాడు.

**"నవద్వారే పురే దేహినైవ కుర్వన్ నకారయన్" :** తొమ్మిది ద్వారాలుగల ఈ దేహమనే పురంలో ఏమీ చేయకుండా, ఏమీ చేయించకుండా సుఖంగా ఉంటాడు–అని. **'నవద్వారపురం'** అనేది ఈ దేహాన్ని సూచించటానికి ఉపనిషత్తులో

పేర్కొన్న రూప కాలంకారం. ఏమిటి ఈ నవద్వారపురం? రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రాలు, ఒక నోరు ఈ ఏడూ ఊర్ధ్వ ద్వారాలు. మూత్ర, పురీష విసర్జన ద్వారాలు రెండూ అధో ద్వారాలు. మొత్తం తొమ్మిది. అన్నీ రెండు రెండు పెట్టి నోరు మాత్రం ఒక్కటే ఎందుకని? ఎక్కువగా విను, ఎక్కువగా చూడు కాని ఎక్కువగా మాట్లాడకు. అని కావచ్చు. ఏమైనా ఈ నవరంధ్రా లను నవద్వారాలుగా పోల్చి, దేహాన్ని పట్టణంతో పోల్చి, ఆత్మను అందులో హాయిగా కాలుమీద కాలువేసుకొని కూర్చొనే మహారాజుగా పోల్చారు. ఎందుకంటే రాజు ఏ పనులూ చేయడు. ఆయన సింహాసనం మీద కూర్చుంటే చాలు ఎవరి పని వారు చేసుకుపోతారు. అలాగే ఆత్మ ఏమీ చేయదు. కాని ఆత్మ సాన్ని ధ్యంలో కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, మనోబుద్ధులు అన్నీ తమ పనులు తాము చేసుకుపోతుంటాయి. పనులు చేసేది అవయవాలు, దేహం చేయించేది వాసనలు. మరి ఆత్మో! 'నకు ర్వన్, నకారయన్' అంటే చేసేదీ కాదు చేయించేదీ కాదు. అది కరెంటులాగా శక్తినిచ్చి ఊరుకుంటుంది. అంతే. ఆత్మగా ఉండేవాడు అలా హాయిగా, ఏ క్లేశమూ లేకుండా సుఖంగా ఉంటాడు.

–ఐతే మనచేత మంచిపనులో, చెడ్డపనులో చేయించేది భగవంతుడు కాదా? మనకు కష్టాలు, సుఖాలు కలిగించేది భగవంతుడు కాదా? మనం అన్నీ భగవంతుని మీదకు నెట్టేస్తాం కదా! నిజమేమిటి?

*శ్లో॥ న కర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః॥*
*న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥* ***(14)***

**తా॥ భగవంతుడు ఈ లోకంలోని ప్రాణులకు కర్తృత్వాన్ని గాని, కర్మలనుగాని, కర్మఫలంతో సంబంధాన్ని గాని సృష్టిం చటం లేదు. జన్మాంతర సంస్కారాలే ఈ కర్తృత్వాదులకు కారణం. స్వభావమే కారణం.**

**వ్యాఖ్య:–** సామాన్యంగా లోకంలో చాలామంది 'భగవంతుడు నాకీ బాధలు, దుఃఖాలు ఎందుకు కల్పిస్తున్నాడు? నా చేత ఎందుకిలా చెడ్డపనులు చేయిస్తున్నాడు? అసలు నాకీ నికృ ష్టపు జన్మనెందుకు ఇచ్చాడు? నన్నెందుకిలా కుంటివాడుగా, గ్రుడ్డివాడుగా పుట్టించాడు? నేను ఇన్ని పూజలు చేస్తున్నా నా మొర ఎందుకు ఆలకించటం లేదు?' అని ప్రశ్నిస్తుంటారు. మరికొందరు నాకిన్ని కష్టాలు కలిగించే







దేవుణ్ణి, నా మొర వినని దేవుణ్ణి నేనెందుకు పూజించాలి? అని అమాయకంగా– మూర్ఖత్వంతో దూషిస్తుంటారు. అయితే నిజమేమిటి?

భగవంతుడు– ఆత్మ – పరమాత్మ – ప్రభువు– ఈశ్వరుడు ఏమీ చేసేవాడు కాదు, ఏమీ చేయించేవాడు కాదు. అని ఇంతకు ముందు శ్లోకంలో చెప్పటం జరిగింది. **మరి ఇక్కడి పనులకు కారణమెవరు? వారి వారి స్వభావాలే. ఆ స్వభావాలకు అను గుణంగానే అన్నీ జరిగిపోతున్నాయి.**

మనం పనులు చేస్తున్నామంటే నిజంగా చేస్తున్నది దేహం– ఇంద్రియాలు. ఆ దేహేంద్రియాలను చెయ్యమని ఆదేశిస్తున్నది కోరికలతో, ఆశలతో, స్వార్థంతో, రాగద్వేషాలతో వున్న మనస్సు. మనస్సు అలా ఆదేశించటానికి కారణం ఆ మనసు వెనుకనున్న వాసనలు. ఆ వాసనలే అతడి స్వభావం. ఆ వాసన లెలా వచ్చాయి? పూర్వంలో (పూర్వ జన్మలలో) చేసిన సంకల్పాలు, ఆలోచనల వల్ల ఆ సంకల్పాలు, ఆలోచనలు, అపుడు నెరవేరనందున అవి వాసనలుగా ముద్రపడి, ఈ జన్మలో ప్రేరణలివ్వటానికి సిద్ధంగా వున్నాయి. ఆ వాసనలతో ఏర్పడ్డ స్వభావమే మనను ఆయా కర్మలకు ప్రోత్సహిస్తున్నది. అంటే మన స్వభావమే మనచేత పనులు చేయిస్తున్నదేగాని ఇందులో భగవంతునిది (ఆత్మది) ఏమీలేదు. **అంటే భగవంతుడు ఈ మంచి పని చేయమనిగాని, చెడ్డపని చేసి చెడిపోమని గాని ఎవరినీ ప్రోత్సహించడు. అంతేగాదు ఆయా కర్మల ఫలితాన్ని అనుభవించమని చెప్పేదీ ఆత్మకాదు. మరైతే ఆత్మ పని ఏమిటి? అది కేవలంగా, అకర్తగా, అభోక్తగా వుండేది. అయితే ఆ ఆత్మ యొక్క చైతన్యంతోనే వాసనలు కదులుతున్నాయి, ప్రేరణనిస్తున్నాయి. వాటి ప్రేరణలతో మనస్సు ఆదేశించటానికీ ఆత్మచైత న్యమే ఆధారం. అలాగే ఇక్కడ పనులు చేయటానికి కూడా జడమైన దేహానికి చైతన్యాన్నిచ్చేది ఆత్మయే.**

లైటు వెలుగుతూ కాంతినిస్తున్నది. ఫ్యాన్ తిరుగుతూ గాలి నిస్తున్నది. అంటే దానికి కారణం ఆ లైటులోను, ఫ్యాన్‌లోను అలాంటి ఏర్పాటు చేయటం వల్లనే. కాకపోతే ఆ పరికరాలకు శక్తి మాత్రం కరెంటు శక్తే. కరెంటు స్వయంగా వెలగదు, తిరగదు. అది నిశ్చలం గానే ఉంటుంది. అలాగే ఆత్మ ఒక చైతన్యం. దాని సాన్నిధ్యం వల్లనే ఈ దేహేంద్రియ మనోబుద్ధులనే పరికరాలు పనిచేస్తూ వాటి వాటి పనులు చేస్తూ ఉంటున్నాయి. అందుకే ఇక్కడ జరిగేవాటికి భగవంతుని

దేమీలేదు. వారి వారి స్వభావాల వల్లనే ఎలా జరగాలో, ఏమి జరగాలో అలా అవి జరిగిపోతున్నాయి. ఇందులో ఆత్మకు ఏ పాప పుణ్యాల, మంచి చెడుల ప్రసక్తి లేనేలేదు.

మనిషి తనకు సుఖం కావాలనుకుంటాడు. ఎవరైనా తనసుఖానికి అడ్డుపడితే త్రిప్పి కొడతాడు. అది అతడి స్వభావం. పురుగును చూడగానే బల్లి ఎంతో వేగంగా పరుగిడి, దాన్ని నోట కరచుకుంటుంది. అది దాని స్వభావం. నిప్పుకు కాల్చే స్వభావం ఉంటుంది. నీ చెయ్యి నిప్పు దగ్గరకు వస్తే కాలుతుంది. భగవంతుడు మాత్రం నీ చేతిని నిప్పులో పెట్టమనడు. కరెంటుకు షాక్ ఇచ్చే స్వభావం. నిన్ను ముట్టుకోమని భగవంతుడు చెప్పడు. కానీ ముట్టుకుంటే షాకు తగిలి తీరుతుంది. ఇలా అన్నీ వాటి వాటి, వారి వారి స్వభావాల వల్లనే జరిగిపోతున్నాయి. నీ స్వభావాన్ని నీవు మార్చుకోకుండా భగవంతుని కారణం చేసి దూషిస్తే ఏ ప్రయోజనమూ ఉండదు. ఈ స్వభావం జన్మాంతర సంస్కారాల వల్లనే ఏర్పడుతుంది.

**దీనినిబట్టి మనం తెలుసుకోవాల్సిన నీతి ఏమిటంటే– 'భగవంతుడు నాకీ గతి కల్పించాడు' అని ఏడవకూడదు. దిగులు చెందకూడదు. మనం చేసిన కర్మలు, ఆలోచనలే మనకు ఈ గతి పట్టించాయి. అని తెలుసుకోవాలి. కర్మలు చేయటానికి మనకు స్వాతంత్ర్యం ఉంది. మనకు మంచి గతి కావాలన్నా; సుఖాలు, శుభాలు కలగాలన్నా దానికి తగిన మంచి కర్మలను చేయటానికి సిద్ధం కావాలి. మంచివి చేస్తే సుఖాలు, చెడ్డవి చేస్తే దుఃఖాలు వస్తాయి. తప్పదు... మన వెనుక పాపపు వాసనలు (స్వభావం) ఉంటే పురుష ప్రయత్నంతో మార్చుకొని సన్మార్గంలో నడవాలి. అంతే తప్ప భగవంతునిపై నెపం వేసి దూషించటం మూర్ఖత్వమే అవుతుంది.**

– భగవంతుడు (ఆత్మ) అకర్త, అభోక్త, అయితే వేదాలలో, శాస్త్రాలలో భగవంతుడు చేయించేవాడు, జీవుడు చేసేవాడు అంటారుగదా! మరి మనం చేసే పాపపుణ్యాలతో భగవంతునికి ఏ సంబంధమూ లేదా? – తరువాతి శ్లోకంలో...

–జీవుడి పాపపుణ్యాలతో భగవంతుడికి ఏ సంబంధమూ లేదా?

***శ్లో॥ నా దత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః***
***అజ్ఞానేనావృతం జ్ఞానం తే న ముహ్యంతి జంతవః॥ (15)***







**తా॥ భగవంతుడు ఎవరి యొక్క పాపాన్ని గాని, పుణ్యాన్ని గాని గ్రహించటం లేదు. అజ్ఞానంచేత జ్ఞానం కప్పబడి వుంటున్నది. అందువల్ల జీవులు మోహం చెందుతున్నారు.**

**వ్యాఖ్య :–** జీవులు చేసే పాపపుణ్యాలను భగవంతుడు చేయించటం లేదు. అలాగే ఆ పాపపుణ్యాలను భగవంతుడు గ్రహించడు. చేసేది దేహేంద్రియాలు, చేయమని ప్రోత్సహించేది మనస్సు. ఆ మనస్సును ప్రేరేపించేది మన వాసనలు లేదా స్వభావం. కాకపోతే ఈ దేహేంద్రియాలు, మనస్సు, వాసనలు– అన్నీ పనిచేసేది ఆత్మ చైతన్య శక్తి వల్ల. అంతే. అలాగే ఈ పాపపుణ్యాల ఫలితంగా వచ్చే కష్టాలను, సుఖాలను అనుభవిం చేది కూడా మనస్సే. **మరి పురాణాలలో భగవంతుడు ఆకాశంలో ఎత్తుగా 7 ద్వారాలకు అవతల శేషపాన్పు మీద పవ్వళించి అందరిచేత తాను అనుకున్నట్టుగా పాప పుణ్యాలను చేయిస్తాడని, అందరినీ పాలిస్తుంటాడని, చెప్పే గాథలన్నీ సత్యం కాదా? పాపాత్ములను శిక్షించటం, పుణ్యాత్ములను రక్షించటం నిజం కాదా? అంటే కాదు. మరి అలా మహర్షులైన వారు ఎందుకు అబద్ధాలు వ్రాసినట్లు? ఎందుకంటే అలా వ్రాస్తే ఎవ్వరూ పాపాలు చెయ్యకుండా, పుణ్యాలు చేస్తూ సదాచారంతో జీవిస్తా రనే భావంతోనే వ్రాశారు. భగవంతునికొక రూపాన్ని కల్పించి; ఆయన పట్ల భక్తిని, శ్రద్ధను కలిగించి, తద్వారా చిత్త శుద్ధి కలిగి భగవంతునికి దగ్గర కావటానికే ఆ కథలు వ్రాయటం జరిగింది.**

మనం అనుభవించే సుఖ ప్రారబ్ధంగాని, దుఃఖ ప్రారబ్ధం గాని భగవంతుడే పెట్టాడనుకోవటం భ్రమ మాత్రమే. ఈ ప్రారబ్ధం మనమే మన కర్మలతో తయారుచేసుకొని తెచ్చుకున్నాం. **పుణ్య కర్మలు చేసి సుఖ ప్రారబ్ధాన్ని, పాపకర్మలు చేసి దుఃఖ ప్రారబ్ధాన్ని తెచ్చుకున్నాం.**

**అజ్ఞానేన జ్ఞానం ఆవృతం :–** అజ్ఞానం చేత జ్ఞానం కప్పబడింది. ఏమిటీ అజ్ఞానం? మనం పూర్వంలో చేసిన పుణ్య కర్మల వల్ల సుఖమనే పొర, పాపకర్మల వల్ల దుఃఖమనే పొర ఏర్పడి మన బుద్ధిలోని జ్ఞానాన్ని – అంటే నేను ఆత్మను– సోఽహం– అహం బ్రహ్మాస్మి– అనే జ్ఞానాన్ని కప్పివేసింది. ఇదే అజ్ఞానపు పొర. ఈ పొర యొక్క స్వభావాన్ని బట్టే నేను సుఖపడుతున్నాను– అని, దుఃఖపడుతున్నాను అని, జీవుళ్ళు భ్రమపడుతుంటారు.

పరిశుభ్రమైన అద్దంలో సూర్యబింబం చక్కగా ప్రకాశిస్తుంది. అదే గాజు పట్టకం ద్వారానైతే 7 రంగులు కనిపిస్తాయి. అలాగే పరిశుద్ధ జ్ఞానం – ఆత్మజ్ఞానం ద్వారా ఆత్మ దివ్య ప్రకాశంతో వెలుగొందుతుంది. అదే ఆత్మ ఈ దేహేంద్రియ మనోబుద్ధిరూప మైన అజ్ఞానం ద్వారా ప్రసరించినపుడు నానారూప నామాలతో కూడిన జగత్తుగా కనిపిస్తుంది. అప్పుడే పాప పుణ్యాలు చేసేదిగా, అనుభవించేదిగా భ్రమ కలుగుతున్నది. **పాప పుణ్యాలననుభవించేది దేహమైతే ఆ దేహమే నేను అని భావించే అజ్ఞాని నేనే అనుభవిస్తున్నాను– అని భ్రమపడుతున్నాడు.**

మేలుకొని ఉన్నప్పుడు డాక్టరుగా ఉన్నవాడు నిద్రపోతూ కలలో బిచ్చగాడినను కుంటాడు. అలాగే పాప పుణ్యాలతో సంబంధంలేని ఆత్మ అజ్ఞానమనే నిద్రలో తన యదార్థ స్థితిని మరచి నేను జీవుణ్ణి అనుకుంటూ సుఖ దుఃఖ అనుభవాలతో మునిగిపోతున్నాడు. జాగ్రత్తులో డాక్టరు స్వప్నంలో బిచ్చగాడైనట్లు, ఉపాధులు లేనప్పుడు ఆత్మ ఉపాధులతో చేరి జీవుడిగా మోహం చెందుతున్నాడు.

మరి ఈ అజ్ఞాన ఆవరణ తొలగుతుందా? మనం తిరిగి మన యదార్థ స్థితిని చేరుకోగలమా? ఎలా?

***శ్లో॥ జ్ఞానే నతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।***
***తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరః ॥ (16)***

**తా॥ ఆత్మజ్ఞానం చేత ఎవరి యొక్క అజ్ఞానం నశించి పోతుందో వారియొక్క జ్ఞానం సూర్యుని వలె ఆ పరబ్రహ్మస్వరూ పాన్ని ప్రకాశింపజేస్తుంది.**

**వ్యాఖ్య :–** మన యదార్థ స్వరూపం ఆనందప్రదమైన ఆత్మయే. అయితే అలా ఆనందంగా ఉన్నామా? లేదు. సుఖదుఃఖాలతో కూడుకొని ఉన్నాం. ఎందువల్ల? అజ్ఞానం వల్ల. మన జ్ఞానాన్ని అజ్ఞానం కప్పటం వల్ల. **ఇంతకూ అజ్ఞానం అంటే ఏమిటి? 'నేను ఆనందస్వరూప ఆత్మను' అని తెలియక పోవటమే. నేను ఈ దేహాన్ని,మనస్సును, బుద్ధిని అనుకుంటూ వీటితో తాదాత్మ్యం చెంది, వీటికి కలిగే సుఖ దుఃఖాలను నావిగా భావిస్తూ ఉండటమే అజ్ఞానం. మరి జ్ఞానం అంటే ఏమిటి? 'నేను ఆత్మను' అనే స్ఫృహలో ఉండటమే జ్ఞానం.** ఈ అజ్ఞానం, జ్ఞానం రెండూ బుద్ధిలోనివే. కనుక బుద్ధిలోని అజ్ఞానాన్ని బుద్ధిలో కలిగే జ్ఞానం ద్వారానే తొలగించాలి.







**'ఆత్మను అజ్ఞానం కప్పివేసింది' అని కొందరు భ్రమపడుతుంటారు. నిజంగా ఆత్మను అజ్ఞానం కప్పలేదు. సూర్యుణ్ణి మన అరచెయ్యి కప్పివేసింది అంటాం. నిజమా? కోట్ల మైళ్ళ దూరంలో ఉన్న సూర్యుణ్ణి, భూమండలం కన్నా ఎంతో పెద్దదైన సూర్యుణ్ణి అరచేయి కప్పగలదా? లేదు. మన అరచేయి సూర్యుణ్ణి చూసే మన కంటిని కప్పివేసింది. అంతే. దానితో సూర్యుడు కనిపించడు. అలాగే అనంతమైన ఆత్మను, సత్యమైన ఆత్మను, మిథ్యయైన అజ్ఞానం కప్పలేదు. అది కప్పి ఉంచింది మన బుద్ధిలోని జ్ఞానాన్ని మాత్రమే. ఇప్పుడు ఆత్మకు సంబంధించిన జ్ఞానం – ఆత్మజ్ఞానం – నేను ఆత్మను అనే జ్ఞానం బుద్ధిలో వెలిగితే చాలు బుద్ధిలోని అజ్ఞానం కాస్తా తొలగిపోతుంది.** అలా తొలగితే ఏమవుతుంది? బుద్ధిలో వెలిగిన ఈ జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపాన్ని ప్రకాశింపజేస్తుంది. ఎలా?

మనం ఒక వస్తువును పేపరులో చుట్టి అక్కడుంచాం. అదేమిటో చెప్పమని ఎందరిని అడిగినా చెప్పలేకపోయారు. ఎందువల్ల? ఆ వస్తువును కప్పి పేపరు ఉంది గనుక. ఇప్పుడా పేపరును తొలగిస్తే అక్కడ ఉన్నదేదో అందరికీ తెలిసిపోతుంది. అలాగే ఆత్మను కప్పిన అజ్ఞానాన్ని గనుక తొలగించినట్లైతే లోపలి ఆత్మ స్వయంగా ప్రకాశిస్తుంది.

అజ్ఞానం తొలగిన తర్వాత ఆత్మ స్వయంగా – తనంతట తానుగా తెలియబడుతుందా? ఆఁ! తెలియబడుతుంది. ఎందు కంటే అది స్వయం ప్రకాశం గనుక. **దివ్య ప్రకాశంతో వెలుగొందే ఒక మణిని కుండక్రింద కప్పి ఉంచాం. అర్ధరాత్రి వేళ ఆ రత్నాన్ని చూడాలనుకున్నాం. మరి చీకటి గదా! ఎలా? ఒక టార్చిలైటు సాయంతో కుండ ఎక్కడ బోర్లించబడి ఉన్నదో చూచి ఆ కుండను తొలగించాం. ఇప్పుడక్కడ మణి ఉంది. మరి దానిని చూడటానికి టార్చిలైటు వెయ్యాలా? అవసరంలేదు. ఎందుకంటే స్వయంగా ప్రకాశిస్తున్న మణిని చూడటానికి వేరొక లైటు అవ సరం లేదు. అలాగే స్వయం ప్రకాశమైన ఆత్మను తెలుసు కొనుటకు వేరొక ప్రకాశం అక్కర లేదు. అందుకే "ఆదిత్యవత్ జ్ఞానం తత్పరం ప్రకాశయతి"– సూర్యుని వలె జ్ఞానం ఆ పర మాత్మను ప్రకాశింపజేస్తుంది అంటున్నారు.**

అయితే జ్ఞానం వల్ల అజ్ఞానం తొలగిపోతుంది–అని తెలుసు కున్నంత మాత్రాన చాలదు. బుద్ధిలో జ్ఞానాన్ని – ఆత్మజ్ఞానాన్ని ప్రకాశింపజేయటం ఎలాగో తెలుసుకోవాలి. దానికే శ్రవణ, మనన, నిధి ధ్యాసనలు, సాధనలు చెయ్యాలి.

ఒక సద్గురువును ఆశ్రయించి, భక్తి శ్రద్ధలతో సేవించి శాస్త్రాన్ని చక్కగా **శ్రవణం** చేయాలి. శ్రవణం చేసిన జ్ఞానాన్ని నిరంతరం **మననం** చేస్తూ దానిని బుద్ధిలో స్థిరపరచుకోవాలి. దానిని ఆచరణలో పెట్టాలంటే నిష్కామ కర్మాచరణ ద్వారా చిత్త శుద్ధిని సాధించాలి. ఆ శుద్ధమైన చిత్తంతో(బుద్ధితో) విచారణ చేస్తూ **నిధిధ్యాసన** సాగించాలి. ఇదే సమయంలో భోగాలపట్ల ఆసక్తిని విడిచి **వైరాగ్యమును** వృద్ధిచేసుకోవాలి. ఇలా సాధన సాగిస్తూ **"అహం బ్రహ్మాస్మి"** అనే మహా వాక్యార్థాన్ని విశ్లేషిస్తూ 'నేనే పరబ్రహ్మాన్ని' అనే స్థితిలో నిలిచిపోవాలి. ఇదే ఆత్మజ్ఞానం. ఈ ఆత్మజ్ఞానంతోనే బుద్ధిలో పేరుకున్న అజ్ఞానపు పొర కరిగిపోతుంది. దానితో బుద్ధి చిత్ స్వరూపం అవుతుంది. మనో బుద్ధులు అదృశ్యమైన ఆ స్థితిలో ఆత్మ తనంతట తానుగా ప్రకా శిస్తుంది. అదే ఆత్మానుభూతి– బ్రహ్మ సాక్షాత్కారం– ముక్తి.

– ఇట్టి ఆత్మ జ్ఞానాన్ని పొందే అద్భుతమైన అపాయంలేని ఉపాయం ఏమిటి?

***శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మానః తన్నిష్ఠాస్త త్పరాయణాః।***
***గచ్ఛంత్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః॥ (17)***

**తా॥ పరమాత్మయందే బుద్ధిని నిల్పి, పరమాత్మయందే మనస్సును నిల్పి, పరమాత్మయందే నిష్ఠ గలిగి, పరమాత్మనే ఆశ్రయించినవారు జ్ఞానం చేత కల్మషాలు నశించినవారై తిరిగి రాని (పునర్జన్మ లేని) మోక్ష పదవిని పొందుతారు.**

**వ్యాఖ్య :–** శాశ్వత ఆనందం లేదా మోక్షం అనేది స్వస్వరూప దర్శనమైతేనే – స్వస్థితిలో నిలిస్తేనే, స్వస్వరూపంలో నిలవాలంటే బుద్ధిలోని జ్ఞానాన్ని కప్పిన అజ్ఞానం తొలగాలి. అజ్ఞానం తొలగాలంటే ఆత్మజ్ఞానాన్ని పొందాలి. దానికి గొప్ప అర్హత కావాలి; గొప్ప సాధన కావాలి. ఏమిటా సాధన?

**1. తత్ బుద్ధయః–** ఆ పరమాత్మయందే బుద్ధిని నిల్పుట. నిరంతరం పరమాత్మ జ్ఞానంతో ఉండుట.

**2. తత్ ఆత్మనః–** ఆ పరమాత్మయందే మనస్సు నిల్పుట. అంటే నిరంతరం పరమాత్మను చింతించుట.

**3. తత్ నిష్ఠాః –** ఆ పరమాత్మయందే నిరంతరం నిష్ఠ గలిగి ఉండుట.

**4. తత్ పరాయణాః –** ఆ పరమాత్మనే సర్వ విధాల శరణు గోరుట– ఆశ్రయించుట.

అంటే నిరంతరం పరమాత్మకు తప్ప అన్యమైన లౌకిక విషయాలకు, ప్రాపంచిక సుఖ భోగాలకు ఏమాత్రం చోటు ఇవ్వకుండా సర్వమూ పరమాత్మే అని భావిస్తూ







ఆ పరమాత్మనే లక్ష్యంగా పెట్టుకోవాలి. అట్టివారే ఆత్మానుభూతికి అర్హులయ్యేది. **మనకున్న పరికరాలు శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి. వీటిని మనం ఈ ప్రపంచం కోసం వినియోగించినప్పుడు మళ్ళీ మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చి పడతాం. అలాగాక ఈ పరికరా లను భగవంతునికోసం వినియోగిస్తే ఆ భగవంతునిలోకే వెళ్ళి పడతాం. అంతే.**

అంటే ఎవరైతే తమ దేహేంద్రియాలను దైవకార్యాలలో వినియోగిస్తారో, తమ మనస్సును నిరంతరం భగవత్ చింతన లోనే వినియోగిస్తారో, తమ బుద్ధిని పరమాత్మ తత్త్వాన్ని తెలుసు కొనుటకు విచారణ చేయుటకు వినియోగిస్తారో అట్టివారే తమ బుద్ధిలోని అజ్ఞానాన్ని తొలగించుకొని ఆత్మజ్ఞానాన్ని పొందగలుగు తారు. మిగిలినవారు ఈ ప్రాపంచిక వ్యామోహాలలో మునిగి పోయి తిరిగి తిరిగి ఈ లోకానికి వస్తూ పోతూ జననమరణ రూప సంసార బంధంలో చిక్కుకుంటారు.

ఇక్కడ చెప్పిన నాలుగు పదాలు ఒక క్రమ పద్ధతిలో ఉన్నాయి. ప్రతిదానికి తరువాతి పదం ఆధారమవుతున్నది.

**1. తత్ బుద్ధయః –** బుద్ధిని ప్రాపంచికమైన కోరికలు వ్యామో హాలనుండి మరలించి పరమాత్మయందే నిల్పి, తాను ఆ పర మాత్మ కన్న వేరుకాదు– తన నిజ స్వరూపం పరమాత్మే అని తెలుసుకోవటమే తత్ బుద్ధయః అంటే.

**2. తదాత్మానః –** అలా తాను పరమాత్మేనని తెలుసుకోవాలంటే మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మ చింతనలోనే ఉండాలి. ఇలా మనస్సు ఆత్మయందు నిలిచిపోవటమే తదాత్మనః అంటే.

**3. తత్ నిష్ఠాః –** అలా మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మయందు నిలవాలంటే శ్రవణ మననముల ద్వారా సంశయాలన్నీ తొలగిపోవాలి. అలా సందేహాలు తొలగి ఆత్మయందే నిశ్చలస్థితి కలుగుటే తత్ నిష్ఠాః అంటే.

**4. తత్ పరాయణాః –** ఇలా ఆత్మయందు నిశ్చలస్థితి కలిగి, నిష్ఠ కుదరాలంటే ఆత్మనే ఆశ్రయించాలి. ఆ భగవంతునే పరమ గతిగ భావించాలి. జన్మ సార్థక్యానికి ఆత్మజ్ఞానం తప్ప మరొక గతి లేదని గ్రహించాలి. అలా గ్రహించి భగవంతుని పాదాలను వదలకుండా పట్టుకోవాలి. సంపూర్ణ శరణాగతి చెందాలి. "తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత॥" అని గీతలో చెప్పినట్లు సర్వవిధాలా భగవంతునే ఆశ్రయించాలి. ఇలా ఒక్కొక్క మెట్టు ఎక్కి, 'నేను ఆత్మను' అనే ఏకత్వ భావనలో నిలచిపోవాలి. నిశ్చయజ్ఞానంలో నిలవాలి. అలా నిలిస్తే?–

**జ్ఞాన నిర్ధూత కల్మషాః** – అటువంటి జ్ఞాన నిష్ఠవల్ల కల్మషాలన్నీ (వాసనలన్నీ) తొలగిపోతాయి. పాపపుణ్య వాసనలన్నీ మళ్ళీ జన్మలకు కారణమౌతాయి. ఆ వాసనలన్నీ జ్ఞాన నిష్ఠతో నిర్మూ లించబడతాయి. దానితో–

**గచ్ఛంతి అపునరావృత్తిం** – ఎప్పుడైతే కల్మషాలన్నీ (వాసనలన్నీ) నిర్మూలించబడ్డాయో అప్పుడు పొందేస్థానం అపునరావృత్తిం పదం–తిరిగిరాని పదవే. అంటే అట్టి వానికి ఇక జన్మలే ఉండవు. మన జన్మలకు కారణం వాసనలే. ఆ వాసనలన్నీ నిర్మూలించ బడితే ఇక జన్మ ఎలా వస్తుంది? మరి ఎక్కడకు చేరుకుంటారు? పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మ పదవిని చేరుకుంటారు.

– నిరంతరం ఆత్మలోనే నిష్ఠ గలిగిన జ్ఞానుల యొక్క దృష్టి ఎలా ఉంటుంది?–

*శ్లో॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।*
*శుని చైవ శ్వపాకే చ పండితా స్సమ దర్శినః ॥* **(18)**

**తా॥ విద్యా, వినయ సంపదలతో కూడిన బ్రాహ్మణుని యందును, గోవు యందును, ఏనుగు యందును, కుక్క యందును, కుక్క మాంసమతినే ఛండాలునియందును జ్ఞానులైన వారు సమత్వ మును (ఒకే ఆత్మ చైతన్యమును) దర్శించుచుందురు.**

**వ్యాఖ్య :–** దృష్టి మూడు రకాలు. 1. దేహదృష్టి, 2. మనోదృష్టి, 3. ఆత్మ దృష్టి – అని విభాగించవచ్చు.

**1. దేహదృష్టి :–** పైపై ఆకారాన్ని – అంటే శరీరం రంగు, ఎత్తు, లావు, సన్నం, అందం, వికారం, అవయవలోపం మొ॥న వాటిని చూడటం దేహదృష్టి.

**2. మనోదృష్టి :–** పైపై రూపం ఎలా ఉన్నా వారి మనస్సు ఎలాంటిదో, వారి బుద్ధి ఎలాంటిదో, తెలివి తేటలు ఎలాంటివో అని చూచేదృష్టి మనోదృష్టి. మంచివారా? కాదా? త్యాగధనులా? పిసినిగొట్టులా? కఠినులా? కరుణా మయులా? స్వార్థపరులా? పరోపకారులా? అహంకారులా? అణకువ గలవారా? తెలివి గలవారా? అమాయకులా? దుష్టులా? సజ్జనులా? అని చూచే దృష్టి మనోదృష్టి.

లోకంలో సాధారణంగా ఈ రెండు రకాల దృష్టియే ఉంటుంది. అబ్బాయికి సంబంధం చూడాలని వెళ్ళాం. అమ్మా యిని చూచి, చాలా బాగుందంటే బాగుందని అందరం అనుకున్నాం. అయితే ఏమిటా బాగు? కన్ను ముక్కు తీరు బాగుంది.







తెల్లగా ఉంది. అనేగాని ఇంటికి తెచ్చుకున్న తర్వాత తెలుస్తుంది. నోరెత్తితే అత్తమామలకు బడితె పూజ చేసే సంగతి. ఇదే దేహ దృష్టి. అదే మనకు తెలిసిన అమ్మాయి గనుక ఐతే, ఎవరన్నా చూచి 'అమ్మాయి రంగుతక్కువ కదండీ!' అంటే! 'ఐతే ఏమయిం దండీ బుద్ధి బంగారం, ఎంతో అణకువ గలది, ఓర్పుతో అన్ని పనులు చక్కబెట్టుకుపోయేది' అంటాం. ఇదే మనోదృష్టి.

**దేహదృష్టి అధమం. మనోదృష్టి మధ్యమం. ఇవి రెండూ సామాన్యుల దృష్టి. ఇక జ్ఞానుల దృష్టి ఆత్మదృష్టి. ఇది ఉత్తమో త్తమమైన దృష్టి. ఆత్మ దృష్టి అంటే ఏమిటి?**

**3. ఆత్మదృష్టి :–** ఈ దృష్టి గలవారు ఎవరిని చూచినా వారి దేహాన్నిగాని, వారి మనస్సును గాని, వారి బుద్ధిని గాని, మంచి చెడ్డలనుగాని పట్టించుకోరు. ఈ దేహ మనోబుద్ధులు ఎప్పుడూ మారుతూ ఉండేవి. పైగా అనిత్యమైనవి. వీటి వెనుక నిత్యము, శాశ్వతం అయిన ఆత్మ చైతన్యం ఉన్నది. అది అందరిలోనూ, అన్నింటిలోను ఉన్నది. అసలు ఉన్నది అదే– దానికెట్టి గుణ దోషాలు లేవు. అందరిలోను ఉన్నది ఒక్కటే అయిన ఆత్మ గనుక అందరినీ అట్టి ఆత్మగానే చూస్తారు. అదే సమదృష్టి. ఆత్మ దృష్టి. ఇట్టి ఆత్మ దృష్టి గల జ్ఞానుల గురించే ఈ శ్లోకం చెబుతున్నది.

భగవద్గీతలోని సుప్రసిద్ధమైన శ్లోకాలలో ఇది ఒకటి. భగవద్గీత దృష్టిలో, భగవానుని దృష్టిలో పండితుడు అంటే సర్వత్రా ఆత్మనే దర్శించగల బ్రహ్మజ్ఞానియేగాని శాస్త్రాల లోను, తర్క వ్యాకరణాలలోను పాండిత్యం గలవారో, కవిత్వం వ్రాయ గలవారో కాదు.

నిజమైన పండితులు చీమలో, బ్రహ్మలో, శివకేశవులలో ఒకే విధంగా సత్తు, చిత్తు, ఆనంద స్వరూపమైన ఆత్మను– పర మాత్మను దర్శిస్తాడు. అతడు సమదృష్టిని సాధించినవాడు. **సమ దర్శనమే ఆత్మ దర్శనం. బ్రహ్మ దర్శనం అవుతుంది. "దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" అన్నది ఉపనిషద్వాక్యం.** దృష్టి జ్ఞానాకారమైతే సృష్టి బ్రహ్మాకారమవు తుంది. మనం అజ్ఞాన దృష్టితో చూస్తే సృష్టిలో కనిపించేది దృశ్య ప్రపంచమే. అదే మనం జ్ఞాన దృష్టితో చూస్తే సృష్టిలో కనిపించేది బ్రహ్మమే తప్ప వేరొకటి లేదు. కెమేరా దృష్టి బాహ్య దృష్టి, ఎక్స్‌రే దృష్టి అంతర్దృష్టి.

వ్యాసుని పుత్రుడు శుకమహర్షి తాను బ్రహ్మమై అంతటా బ్రహ్మాన్నే దర్శించ గలిగాడు. అందుకే వివస్త్రలుగా ఉండి స్నానం చేసే అప్సరసలను చూచి చలించ లేదు. ఆ అప్సరసలు కూడా నిర్వికారులై అలాగే స్నానం చేస్తూ ఉన్నారు.

**ప్రహ్లాదుడు తండ్రియైన హిరణ్య కశిపునితో "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!" అన్నాడు ఏమిటా మర్మం? అంతటా, అన్నింటా ఉన్నది నారాయణుడే అని. తనను త్రొక్కటానికి వచ్చిన ఏనుగులోను, తనను కాటువేయవచ్చిన పాములోను, తాను త్రాగబోయిన విషంలోను, తాను విసరివేయబడ్డ సముద్రంలోను – అంతటా నారాయణునే దర్శించాడు.**

నారదుడు ద్వారకలోని శ్రీకృష్ణుని దర్శించుటకు వచ్చి అష్ట భార్యల ఇళ్ళయందు శ్రీ కృష్ణునే దర్శించాడు. అందరి ఇళ్ళలోను శ్రీ కృష్ణుడే.

గోపికలు చెట్లలోను, పుట్టలలోను, ఇండ్లలోను, వీధులలోను ఆ కన్నయ్యనే దర్శించగలిగారు. పాలు కావాలా? పెరుగుకావాలా? అని గాక కన్నయ్య కావాలా? కృష్ణయ్య కావాలా? అంటూ వీధులవెంట తిరిగారు. వారికి అంతటా ఆ గోపాల కృష్ణుడే. ఇదే సమదృష్టి.

ఇట్టి దృష్టినే భగవానుడు ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు. "ఓ అర్జునా! విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునిలోను, గోవులోను, ఏనుగులోను, కుక్కలోను, కుక్క మాంసం తినే ఛండా లుని లోను ఒకే దృష్టి – సమదృష్టి గలవాడే పండితుడు (జ్ఞాని). పైపై రూపాలు వేరుగా ఉండవచ్చు. వాటి ప్రవర్తనలు వేరు వేరుగా ఉండవచ్చు. లక్షణాలు వేరుగా ఉండవచ్చు. చైతన్యస్థాయి వేరుగా ఉండవచ్చు. కాని అన్నింటిలోను వారు చూచేది మాత్రం మార్పు చెందని, ఒక్కటే అయిన ఆత్మనే. పై పై నామ రూపాలను ఛేదించివారు అన్నింటియందు సచ్చిదానంద స్వరూప బ్రహ్మాన్నే దర్శిస్తారు. కనుక వారికి భేద దృష్టి లేదు. సమదృష్టే ఉంటుంది" అన్నాడు. ఈ రకమైన దృష్టిని ఎలా సాధించగలి గారు? వారు ఉన్నతమైన జ్ఞాన స్థితిలో ఉన్నారు గనుక. నేలమీద నడిచేవాడికి భూమి పై అనేక ఎత్తు పల్లాలు కనిపిస్తాయి. కాని ఆకాశంలో విమానంలో ప్రయాణించేవారికి ఈ ఎత్తుపల్లాలు కనిపించవు. అంతా సమంగా ఉంటుంది. ఎత్తుకు ఎగిరే కొద్దీ భేదాలు మాయమై సమంగా కనిపించినట్లు ఉన్నత స్థితిలో ఉన్నవారికి భేదాలు మాయమై అంతా ఒక్కటిగానే కనిపిస్తుంది. వీరే సమదర్శనులు.







- **గలీబులు వేరైనా అన్ని దిండ్లలో ఉన్న దూది ఒక్కటే.**
- **నగల రూపాలు వేరైనా అన్నింటిలో ఉన్న బంగారం ఒక్కటే.**
- **కుండలు, కూజాలు, పిడతలు, మూకుళ్ళు వేరైనా అన్నింటిలో ఉన్న మట్టి ఒక్కటే.**
- **లడ్లు, మైసూరుపాక్‌లు, బొబ్బట్లు రకరకాలుగా కనిపిస్తున్నా అన్నింటిలోని పంచదార ఒక్కటే.**
- **అలాగే సకల ప్రాణులు వేరు వేరుగా కనిపిస్తున్నా అన్నింటి లోను అధిష్ఠానంగా ఉన్న ఆత్మ ఒక్కటే.**

బ్రాహ్మణునిలోని ఆత్మే గోవులోను, ఏనుగులోను, కుక్కలోను, ఛండాలునిలోను ఉన్నది.

ఇక ఈ ఉపమానాన్ని విశ్లేషిస్తే–

**బ్రాహ్మణుడు, గోవు సాత్విక గుణానికి ప్రతీకలు.**

**ఏనుగు రజోగుణ ఉపాధికి ఉదాహరణ.**

**కుక్క, ఛండాలుడు తమోగుణానికి ప్రతీకలు.**

**– అంటే త్రిగుణాలలో దేనితో కూడిన ఉపాధియైనా ఒక్కటే అని. మొదట బ్రాహ్మణుని చెప్పి చివర ఛండాలుని చెప్పారు. ఒకరు పవిత్రం. ఒకరు నీచం. ఏనుగు పెద్దది. కుక్క చిన్నది. ఆకారంలో ఏ తేడా ఉన్నా ఒక్కటే అని. గోవు పవిత్రమైనది, పూజనీయమైనది. కుక్క ఛండాలమైనది (కక్కిన పదార్థాన్ని తినేది)**

**బ్రాహ్మణుడు, ఛండాలుడు మానవులు ; మిగిలినవి జంతువులు. గోవు ఉత్తమజాతి ; ఏనుగు మధ్యమజాతి ; కుక్క అధమజాతి.**

**ఇలా జాతి భేదాలున్నా, గుణభేదాలున్నా, ఆకారంలో భేదా లున్నా, పవిత్రతలో భేదాలున్నా జ్ఞాని (పండితుడు) అన్నింటిని, అందరిని సమభావంతోనే చూస్తాడు అని భావం.**

సూర్యుడు గంగాజలంలో ప్రతిబింబించినా, కల్లుకుండలో ప్రతిబింబించినా ఆయా ఉపాధుల గుణదోషాలు సూర్యుని అంటవు. అలాగే జ్ఞానులు, మహాత్ములు ఆత్మ నిష్ఠయందున్న **అవధూతలు** మనుష్యులను చూచినా, జంతువులను చూచినా, పాములను చూచినా, పక్షులను చూచినా, క్రిమికీటకాదులను చూచినా అన్నింటిపట్ల సమభావమే. మానవులలో కూడా మహా త్ములైనా, దురాత్ములైనా, స్త్రీలైనా,

పురుషులైనా, ధనికులైనా, దరిద్రులైనా, సుందరులైనా, కురూపులైనా ఆ తేడాలను గమనించక ఆత్మ దృష్ట్యా అందరినీ సమంగా చూస్తారు. అదే ఆత్మ దృష్టి – సమదృష్టి.

ఐతే ఈ సమదృష్టి భావంలో ఉండాలిగాని క్రియలో కాదు. క్రియలో అద్వైతం చూపితే అనర్ధమే అవుతుంది. అలాగే సమ దృష్టి కూడా క్రియలో చూపరాదు.

ఒక గురువు గారు శిష్యునికి "ఈ జగత్తంతా బ్రహ్మమయం; చీమగాని, దోమగాని, పాముగాని, మనిషిగాని అంతా ఒక్కటే" అని బోధించాడు. శిష్యుడు ఆ మాటను గట్టిగా వంట పట్టించు కున్నాడు. ఒకనాడు వీధివెంట పోతుంటే ఆ వీధిలో ఏనుగు వస్తున్నది. ఏనుగు మీద కూర్చున్న మావటి "దూరంగా వెళ్ళండి, దూరంగా వెళ్ళండి" అని కేకలు పెడుతున్నాడు. మనవాడు సామాన్యుడు కాదుగదా! గురువుగారు చెప్పిన దాన్ని అక్షరాలా పాటించాలనుకున్నాడు. "నేను బ్రహ్మం, ఏనుగు బ్రహ్మం. అంతా బ్రహ్మమయమేగదా! నేనెందుకు తొలగిపోవాలి?" అనుకున్నాడు. సరాసరి ఏనుగుకు ఎదురుగా వెళ్ళాడు. అంతే! ఆ ఏనుగు తొండంతో ఎత్తి విసిరివేసింది. ప్రక్కలు, డొక్కలు విరిగిపోయాయి. ఎలాగో లేచి గురువు గారి దగ్గరకు వెళ్ళి "స్వామీ! మీ ఉపదేశం నాకీ గతి పట్టించింది" అన్నాడు.

బుద్ధిలేనివాడికి ఏది చెప్పినా ప్రమాదమే. గురువు అన్నాడు, "ఒరే మూర్ఖుడా! నీవు బ్రహ్మం, ఏనుగు బ్రహ్మం. నిజమే. మరి మావటివాడు బ్రహ్మం కాదా? పైన కూర్చున్న బ్రహ్మం దూరంగా పో– దూరంగా పో అని చెబుతుంటే ఆ బ్రహ్మ వాక్కును ఎందుకు తిరస్కరించావు? అదిగో దాని ఫలితమే ఇది" అన్నాడు. ఆత్మ దృష్ట్యా అన్నీ సమానమే అయినా మన భావన అలా ఉండాలే గాని సమానం అన్నాం గదా అని ఉపాధుల లక్షణాలను గమనించకపోతే ఎలా? పాము బ్రహ్మమేగదా! అని మెడకు చుట్టుకుంటామా? పులి బ్రహ్మమే గదా! అని షేక్ హాండ్ ఇస్తామా?

కన్ను, ముక్కు, చెవి, నాలుక అన్నీ నావే. అన్నింటిపైన నాకు సమాన అభిమానమే. దేన్ని ఒదులుకోలేను. అంత మాత్రాన దేన్నైనా చూడాలంటే ముక్కుతో చూస్తామా? వినాలంటే కంటితో వింటామా? దేని పని దానిదే.

ఎడమ చెయ్యి, కుడిచెయ్యి – రెండింటిలో ఏది నీకు ఇష్టం? అంటే ఏం చెబుతాం? రెండూ ఇష్టమే. రెండూ కావాలి. రెండూ సమానమే. అయితే దేని పని







దానిదే. ఒకటి భోజనంచెయ్యటానికి పనికి వస్తుంది. మరొకటి పాకీ పని చేయటానికి పనికి వస్తుంది.

ఆభరణాలలో ఉన్న బంగారం ఒక్కటే అయినా గాజులు మెడలో వేసుకోరు, నెక్లెస్ వ్రేలికి తగిలించుకోరు. దేని పని దానిదే. దేని ప్రాధాన్యం దానిదే. దేని విలువ దానిదే.

**మనకు కావలసింది సమదర్శనమేకాని సమవర్తనం కాదు. అన్నింటిని సమదృష్టిలో చూడాలేగాని అన్నింటి ద్వారా ఒకే పని చేసే వీలులేదు. అన్నింటిలో ఉన్న ఆత్మ ఒక్కటే అయినా ఉపాధులు వేరు వేరు గదా? ఉపాధులు కూడా ఒక్కటే అనలేదు గదా!**

కుక్కలు, ఏనుగులు ఒక్కటే అన్నారు గదా! అని 4 కుక్కలను రాజభవనానికి తీసుకెళ్ళి వీటికి బదులుగా 4 ఏనుగులివ్వండి అంటే దేహశుద్ధి చేసి పంపిస్తారు. ఇక్కడ నీకు నిజంగా సమ దర్శనం ఉన్నదా? ఏనుగులైతే పెద్ద రేటుకు అమ్ముకోవచ్చుననే స్వార్ధబుద్ధియే గదా!

**ఉపాధులను దృష్టిలో పెట్టుకొని వేరుగా చూచే వారు విషమ దర్శనులు. ఉపాధులను ఉపేక్షించి ఆధార వస్తువైన ఆత్మను చూచే వారు సమదర్శనులు. కర్మయోగంలో సిద్ధిపొందిన బ్రహ్మ జ్ఞాని ఇట్టి సమదర్శనం కలిగి ఉంటాడు.** పవిత్రమైన వాటిని, నీచమైన వాటిని, మనుష్యులను, జంతువులను అన్నింటి ఒక్కటిగా చూడగల సమదృష్టిని సాధించి నందువల్ల ప్రయోజనమేమిటి?

***శ్లో॥ ఇహైవ తైర్జితః సర్గః యేషాం సామ్యే స్థితం మనః***
***నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తేస్థితాః॥ (19)***

**తా॥ ఎవరి మనస్సు సకల ప్రాణులయందు సమస్థితిలో ఉంటుందో వారు ఈ దేహంతోనే ఈ లోకాన్ని జయిస్తారు. నిర్దోషమైన బ్రహ్మం అంతటా సమంగా ఉన్నందున వారు బ్రహ్మం నందే ఉండిపోతారు.**

**వ్యాఖ్య :** బ్రాహ్మణునీ, ఛండాలునీ ఒక్కలాగా – సమదృష్టితో చూడాలని, అలా చూడగలవాడే జ్ఞాని, పండితుడు అని క్రిందటి శ్లోకంలో చెప్పటం జరిగింది. అయితే గొప్పవారిని తక్కువగా, నీచుణ్ణి గొప్పగా చూడటం తప్పుకాదా? ఎవరైతే గొప్పవారిని నీచంగాను, నీచుణ్ణి గొప్పగానూ చూస్తారో అట్టి వారి అన్నాన్ని భుజించరాదు– అని 'గౌతమస్మృతి' చెబుతున్నది. అలా అయితే పైన చెప్పిన

బ్రహ్మ జ్ఞానుల అన్నాన్ని భుజించరాదు గదా! ఈ సందేహానికి ఈ శ్లోకం పరోక్షంగా సమాధానం ఇస్తున్నది.

ఈ కర్మ శాస్త్రాలు, ధర్మ శాస్త్రాలు (స్మృతులు) దేహాత్మ దృష్టి గల సామాన్యులకే గాని, బ్రహ్మ జ్ఞాన సంపన్నులైన బ్రహ్మజ్ఞానులకు కాదు. ఆధ్యాత్మశాస్త్రం అన్నింటికన్న పై మెట్టు. కనుక వాటి అంతస్థులు వేరు.

ఎవరి యొక్క మనస్సు సామ్య స్థితిలో ఉంటుందో – అంటే అన్ని ప్రాణులను సమదృష్టితో చూడగలుగుతుందో వారే ఈ లోకాన్ని జయిస్తారు. అంటే జనన మరణ రూప సంసార బంధాల నుండి విడుదల పొందుతారు. తిరిగి జన్మించవలసిన అవసరం లేదు. ఎందుకంటే వారి మనస్సు దోషరహితమైనది కనుక. **నిజంగా బ్రహ్మం నిర్దోషం. అంటే దోషాలు లేనిది.** అది నిర్గుణం కనుక– ఏ ఒక్క గుణమూ లేదు గనుక అది దోషరహితమైనది. అది అంతటా సమానంగా వ్యాపించి, సూక్ష్మాతి సూక్ష్మంగా ఉన్నది. అదే నిర్దోషమైన, నిర్గుణమైన, నిరాకారమైన, సర్వ వ్యాపకమైన, స్వయం ప్రకాశమైన బ్రహ్మం. **ఈ ప్రకృతితో కూడినపుడు లేదా ఈ దేహంలో కూర్చొని, దేహేంద్రియాలతో తాదాత్మ్యం చెందినపుడు ఆ నిర్దోష బ్రహ్మం సదోష బ్రహ్మమవు తుంది. దానినే మనస్సు అంటాం. అహంకార మమకారాలు, రాగ ద్వేషాలు, కామ క్రోధాలు– మొదలైనవన్నీ ఇందులోని దోషాలు. ఈ దోషాల కారణంగానే భేదదృష్టి. మనకు మేలు చేస్తారనుకున్న వారిపై రాగం, కీడు చేస్తారనుకుంటే ద్వేషం. కొన్ని వస్తువులను కావాలనుకుంటాం. ఇది కామం, వాటి కెవరైనా అడ్డు తగిలితే క్రోధం. నేను అనుకుంటే అహంకారం. నాది అని అతుక్కుపోతే మమకారం. అయితే సరైన జ్ఞానంతో, భగవంతుని అనుగ్రహంతో, తీవ్రసాధనలతో, ప్రపంచ విషయాలపై వైరాగ్యంతో, పరమాత్మతో ఐక్యతకు తపనతో ఎవరైతే తమ మనస్సులోని దోషాలను తొలగించుకొని, సమదృష్టిని అలవరచుకొని, ఆ మనస్సును నిర్దోషం కావిస్తారో అప్పుడు ఆ మనస్సే బ్రహ్మమవుతుంది. దోషంతో కూడి ఉంటే మనస్సు, దోషాలను తొలగించి వేస్తే బ్రహ్మం లేదా పరమాత్మ. ఈ విధంగా ఎవరు తమ మనస్సును దోషరహితం కావిస్తారో వారు ఆ పరమాత్మలోనే నిలుస్తారు. ఇప్పుడు వారికి అంతటా సమదృష్టే.** అయితే దీనిని సాధించాల్సింది ఎక్కడ?







**ఇహఏవ :** ఇక్కడే, అంటే ఈ దేహం ఉండగానే. ఈ దేహంలో ఉండగానే ఈ సంసారాన్ని త్యజించి మోక్షాన్ని పొందాలేగాని దేహాన్ని విడిచిన తర్వాత ఇక సాధించేదేమీ లేదు. ఎందుకంటే దేహాన్ని విడిచిన తర్వాత జీవుడు తాను చేసిన పాప పుణ్యాల యొక్క ఫలితాన్ని అవ్యక్తంలో (స్వర్గ నరకాలలో) అనుభవించ గలడేగాని, అక్కడ ఏ కర్మ చేసే వీలులేదు. జ్ఞానాన్ని పొందే వీలు లేదు. సాధనలు చేసే వీలూ లేదు. ఎందుకంటే శరీరం ఉండదు కనుక. ఇది కర్మభూమి. అది ఫలభూమి. కనుక ప్రాణం ఉన్నప్పుడే జాగ్రత్త పడాలి. లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అలాకాక జీవించినంతకాలం ఐహిక విషయాలలో మునిగిపోతే, ఆ తరువాత తీరికగా కూర్చొని ఏడవాల్సిందే. కనుక జీవించివున్నప్పుడే మనస్సులోని దోషాలను తొలగించు కొని సమత్వ స్థితిని సాధించి ఆ బ్రహ్మంలో నిలిచిపోవాలి.

–అలా సమత్వ దృష్టిని సాధించి, బ్రహ్మంలో నిలిచిపోయిన జ్ఞానులు ఎలా ఉంటారో రాబోయే నాలుగు శ్లోకాల్లో తెలియ జేయబోతున్నాడు.

***శ్లో॥ నప్ర హృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చా ప్రియం।***
***స్థిర బుద్ధి రసం మూఢః బ్రహ్మ విద్ బ్రహ్మణి స్థితః ॥ (20)***

**తా॥ బ్రహ్మంనందు నిలిచిన బ్రహ్మవేత్త స్థిరమైన ప్రజ్ఞతో, మోహరహితుడై, ఇష్టమైన దానిని పొందినప్పుడు సంతోషించక, ఇష్టం లేనిదానిని పొందినప్పుడు ఉద్వేగాన్ని చెందక ఉంటాడు.**

**వ్యాఖ్య :** ఎల్లపుడూ తాను బ్రహ్మం నేననే నిశ్చయ జ్ఞానంలో ఉండేవాడే బ్రహ్మ విదుడు. అతడే **'బ్రహ్మణి స్థితః బ్రహ్మవిత్'** అని ఇచ్చట చెప్పబడినవాడు. ఇతడు సాధకుడు కాదు, సిద్ధుడు. ఇతడికి అంతటా సమదృష్టే. అట్టివాని వ్యవహార సరళి గురించి ఇక్కడ తెలియజేస్తున్నారు. **ఒకడు గుడ్డివాడా? కాదా? అనే విషయం అతడి నడకను బట్టి తెలుస్తుంది. అలాగే ఒకడు మంచివాడా? కాదా? అనే విషయం అతడి నడతను బట్టి తెలుస్తుంది. మరి ఈ బ్రహ్మంలో నిలిచిన బ్రహ్మవిదుని గురించి ఎలా తెలుస్తుంది? ఈ శ్లోకం వివరిస్తున్నది.**

**స్థిరబుద్ధి :** వారి బుద్ధి స్థిరంగా ఉంటుంది. సాధక దశలో చలిస్తుంది గాని సిద్ధులైన వారి ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది. ఎలా స్థిరంగా ఉంటాడు? ఈ దృశ్య ప్రపంచమంతా మిథ్య గనుక, ఉన్నది ఈ మిథ్యా ప్రపంచానికి అధిష్టానంగా

ఉన్న పరమాత్మే గనుక అతడు పైకి ప్రపంచాన్ని చూస్తున్నా అతడు నిజంగా దర్శించేది పరమాత్మనే. అందుకే అతడిది స్థిరబుద్ధి. కాని సాధ కులు ఈ విషయాన్ని శాస్త్రాలనుండి తెలుసుకున్నా ఆ స్పృహ (తెలివి) సర్వకాల సర్వావస్థలలో ఉండదు. అందుకే బుద్ధి ఎన్నో మార్పులతో కూడుకున్న ప్రపంచాన్ని చూస్తూ మారిపోతూ ఉంటుంది.

**అసంమూఢః :–** స్థిరబుద్ధిగల ఆత్మవిదుడు నేను దేహాన్ని, మనస్సును అని మోహం చెందడు. నేను ఆత్మను అనే నిశ్చయజ్ఞానమే ఉంటుంది. ఎడారుల్లో దూరంగా చూచినప్పుడు నీరున్నట్లుగా అనిపిస్తుంది. అవే ఎండమావులు. తెలియనివారు నీరేమోనని భ్రమపడతారు. కానీ ఎడారుల్లో తిరిగే వారికి తెలుసు. అవి ఎండమావులు– నీరు కాదు అని. అలాగే సాధకులైనవారు ఆత్మ నని తెలుసుకున్నా ఆత్మగా ఉండలేక నేను దేహాన్ని అని భ్రమపడ తారు. కాని సిద్ధులకు ఆ భ్రమ ఉండదు.

**నప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియం :–** ఇష్టమైన వస్తువులు లభిస్తే పొంగిపోడు, అనిష్టమైన వస్తువులు లభిస్తే దుఃఖించడు. కారణమేమంటే అతడి దృష్టిలో అన్నీ ఒకటే. ఐతే అతడికీ ఇష్టా ఇష్టాలుంటాయా? అనే సందేహం కలగవచ్చు. నిజంగా అతడికవేమీ ఉండవు. కాకపోతే ప్రారబ్ధం అనేది ఉంది గదా! దేహం ఉన్నంతవరకు అది వదలదు. అందువల్ల ఒక్క క్షణం ఇష్టమో, అయిష్టమో అనిపించవచ్చు. వెంటనే తన స్థితిలో తానుండి అన్నింటిని ఒక్కటిగా చూస్తాడు. సాధకులు మాత్రం సమత్వాన్ని ఆదర్శంగా పెట్టుకొని ప్రయత్న పూర్వకంగా సాధించాలి.

ఈ శ్లోకంలోని పదాల కూర్పు కూడా ఒక క్రమమైన పద్ధతిలో ఉండి ఒక విచిత్ర మైన సత్యాన్ని తెలియజేస్తుంది.

ఎవరైతే ఇష్టా ఇష్టాలు కలిగినప్పుడు చలించరో అతడే స్థిర బుద్ధి గలవాడు. అట్టి స్థిరబుద్ధిగలవాడు ఎన్నటికీ మోహం చెందడు. భ్రమపడడు. అతడే అసంమూఢః అలా తాను దేహాన్ని అనే భ్రమకు లోను కానివాడే బ్రహ్మమును తెలుసుకొనే బ్రహ్మ విదుడు. బ్రహ్మముననిి తెలుసుకొన్న బ్రహ్మవిదుడే నిరంతరం బ్రహ్మమునందు నిలిచే బ్రహ్మణి స్థితః.







ఇలా బ్రహ్మంనందు స్థిరపడిన మహాత్ముడే దివ్య మానవుడుగా ఆనందించటానికి ఈ భూమి ఒక క్రీడారంగం అవుతున్నది – మరొక లక్షణాన్ని తరువాతి శ్లోకంలో చెప్పబోతున్నాడు భగవానుడు.

***శ్లో॥ బాహ్యస్పర్శేష్వ సక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం।***
***సబ్రహ్మ యోగ యుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥ (21)***

**తా॥ బాహ్య విషయములందు ఆసక్తిలేని బ్రహ్మనిష్ఠుడు ఆత్మ యందు గల సుఖాన్ని పొందుతాడు. నిరంతరం ఆ బ్రహ్మంనందే నిలిచిన ఆ బ్రహ్మనిష్ఠుడు అక్షయమైన ఆత్మసుఖాన్ని పొందుతాడు.**

**వ్యాఖ్య :–** ఈ లోకంలో ప్రతి మానవుడు ఆనందాన్నే కోరుకుం టాడు. ఆ ఆనందంకోసం బాహ్యప్రపంచంలోకి తొంగి చూస్తాడు. అక్కడ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ అనే 5 విషయాలున్నాయి. వాటిని గ్రహించడానికి చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు అనే 5 ఇంద్రియాలు మన దేహానికి అమర్చబడి ఉన్నాయి. ఈ ఇంద్రియాల ద్వారా ఆ విషయాలతో సంపర్కం పెట్టుకొని సుఖాన్ని, సంతోషాన్ని, ఆనందాన్ని పొందటానికి ప్రయత్ని స్తుంటాం. ఇదే విషయానందం. ఐతే ఈ విధంగా మనం పొందే ఆనందం శాశ్వతంగా ఉంటున్నదా? లేదు. ఇది తాత్కాలికంగా ఉండేదే. ఏ వస్తువు ఇంతవరకు ఆనందాన్నిచ్చిందో అదే ఇప్పుడు దుఃఖాన్నిస్తుంది. మళ్ళీ ప్రయత్నించి ఇంకా గొప్ప వస్తువును సంపాదించాలను కుంటాం. అప్పుడూ ఇంతే. **ఇలా ఎన్ని వస్తువులను సంపాదించినా, ఎంత డబ్బు సంపాదించినా, ఎన్ని ఇళ్ళు కట్టించినా, ఎన్ని పదవులు అలంకరించినా ఇంకా ఇంకా ఏదో కావాలనే తపన, తహతహ, ఎప్పుడూ ఏదో కొరత, ఏదో అసంతృప్తి. అంటే నిజమైన ఆనందం బాహ్య విషయాలలో లేదు. అది మనలోనే వుంది. మనస్వరూపంగా ఉంది. ఈ విషయం తెలియని వారు సామాన్యులు. తెలిసినవారు బ్రహ్మ జ్ఞానులు.**

అందుకే బ్రహ్మజ్ఞానులైనవారు బాహ్య విషయాలవెంట పరుగులెత్తక తనయందే (ఆత్మ యందే) గల ఆత్మ సుఖాన్ని – శాశ్వత సుఖాన్ని పొందుతారు. బాహ్యంగా వెళ్ళినంతకాలం ఆత్మకు దూరమై, ఆత్మ సుఖానికి దూరం కావాల్సి వస్తుంది. బాహ్య విషయాలయందు ఆసక్తిని విడిచి ఎప్పుడైతే అంతర్ముఖులై తమలోనే ఉన్న ఆత్మను దర్శిస్తారో అప్పుడే ఆత్మానందం కలుగుతుంది. కనుక మనం ఆనందం

కోసం వెతకవలసిన క్షేత్రం బయటలేదు. లోపలే ఉన్నది, మనలోపలే ఉన్నది.ఆత్మ రూపంలో ఉన్నది అని గ్రహించి బాహ్య విషయాలపై ఆసక్తిని విడిచి ఆత్మా నందాన్ని అనుభవిస్తాడు బ్రహ్మంనందు స్థిరపడిన బ్రహ్మవిదుడు. అతడు ఎట్టివాడు? ఎట్టి ఆనందాన్ని పొందుతున్నాడు.

**బ్రహ్మయోగయుక్తాత్మా:–** 'సర్వానికి ఆత్మయైన పరబ్రహ్మమే తాను' అనెడి జ్ఞానమే బ్రహ్మయోగం. అట్టి జ్ఞానంతో కూడిన వాడే బ్రహ్మయోగ యుక్తాత్ముడు.అతడు పొందే సుఖం ఎలాం టిది?

**అక్షయం సుఖం అశ్నుతే :–** అక్షయమైన, నాశనం లేని, అంతం లేని అనంతమైన సుఖం. విషయ సుఖంగాని, నిద్రా సుఖం గాని, క్షయ సుఖాలే. అంతమైపోయే సుఖాలే. విషయం పోతే సుఖం పోతుంది. మెలకువ వస్తే నిద్రా సుఖం పోతుంది. కాని ఆత్మ పోయేదికాదు గనుక ఆత్మ సుఖం కూడా ఎప్పుడూ పోదు. అది శాశ్వత సుఖం. జ్ఞాని అట్టి అక్షయ సుఖాన్నే అనుభవిస్తాడు.

మనం ఆత్మ స్వరూపులమే కదా! మరి ఎందుకు అక్షయ సుఖాన్ని పొందటంలేదు?

చేప నీటిలోనే ఉంటుంది. పాటుదప్పి వెల్లకిలా పడ్డది. గొంతులోకి నీళ్ళు చేరక విలవిలలాడుతున్నది. పరితపించి పోతుంది. అది నీళ్ళలోనే ఉన్నా నీళ్ళు త్రాగలేదు. అలాగే జీవుడు ఆత్మలోనే ఉన్నా, ఆత్మగానే ఉన్నా, ఆత్మానంద సాగరంలోనే ఉన్నా ఇంద్రియాలు వెల్లకిలా పడ్డవి. బయటికి చూస్తున్నాయి. బాహ్య విషయాలతో సంపర్కం పెట్టుకున్నాయి. అందుకే పరితాపం , అసంతృప్తి, చేపను పాటుకు త్రిప్పితే అది నీళ్ళు త్రాగి శాంతి స్తుంది. అలాగే జీవుడు బాహ్య విషయాలతో సంపర్కం విడిచి అంతర్ముఖమైతే పరితాపం తొలగి ఆత్మానందాన్ని అనుభవి స్తాడు, అక్షయమైన సుఖాన్ని పొందుతాడు.

కనుక ముముక్షువులు బాహ్య విషయాలనుండి ఇంద్రియా లను మళ్ళించి, చిత్తాన్ని అంతర్ముఖం చేసి ఆత్మతో అనుసం ధానం చేసి అక్షయమైన ఆత్మ సుఖాన్ని పొందాలి.

– మరి బాహ్య విషయాలపై ఆసక్తిని తగ్గించుకొనటం ఎలా?

***శ్లో॥ యేహి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవతే।***
***ఆద్యంత వంతః కౌంతేయ। నతేషు రమతే బుధః ॥ (22)***







**తా॥ అర్జునా! విషయాలతో ఇంద్రియాల కలయికవల్ల కలిగే భోగాలన్నీ దుః ఖాన్ని కలగజేసేవే. అంతేకాదు, అవి ఆది అంతా లతో కూడుకున్నవి. అందువల్ల వివేకులెవరూ ఆ భోగాలలో రమించరు.**

**వ్యాఖ్య :** విషయసుఖాలపై ఆసక్తితో వాటి వెంట పడిపోవటం అందరికీ అలవాటే. ఇందులో మినహాయింపులేమీ లేవు. అంతే కాదు, ఇవి తాత్కాలిక సుఖాలే అని తెలిసినా వాటి వెంటపడక మానరు. మరి విషయ వస్తువులపై, భోగాలపై, సుఖాలపై ఆసక్తి ఎలా తగ్గుతుంది. వాటి పట్ల విరక్తి ఎలా కలుగుతుంది?

మనకు పాలకోవా అంటే ఎంతో ఇష్టం. నాలుగు ముక్కలు నీ ఎదురుగా ఉన్నవి. వాటిని చూస్తుంటే నోటిలో లాలాజలం ఊరుతున్నది. ఒక ముక్క తీసుకొని నోట్లో వేసుకోబోయావు. అంతలో నీ స్నేహితుడు చెప్పాడు "అందులో విషం కలిసింది" అని. మరి ఇప్పుడు దానిని నోట్లోనే వేసుకుంటావా? విషం కలిస్తే కలిసిందిలే; నాకెంతో ఇష్టమైన స్వీటు కదా! అని తినే స్తావా? లేదు కదా? అలాగే మనకెంతో ఇష్టమైన వస్తువులైనా, విషయాలైనా, భోగాలైనా అవి మనకు హాని కలిగిస్తాయి; ప్రాణం తీస్తాయి అని తెలిస్తే ఇక వాటి జోలికి వెళతామా? వెళ్ళం గదా! **కనుక విషయ వస్తువులలో, భోగాలలో మనకు హాని కలిగించే దోషాలున్నట్లు తెలిస్తే వాటిపట్ల మనకు తప్పక విరక్తి కలుగుతుంది. విరక్తి కలగాలంటే అందులోని దోషాలు తెలి యాలి.**

**అందుకే ఈ శ్లోకంలో విషయ భోగాలలో గల రెండు ముఖ్యమైన దోషాలను భగవానుడు తెలియజేస్తూ ఈ దోషాలను తెలుసుకున్న వివేకులు వాటి పట్ల విరక్తి కలిగి ఉంటున్నారని తెలియజేస్తున్నాడు. ఏమిటా రెండు దోషాలు?**

**1.దుఃఖయోనయః 2. ఆద్యంవంతః అని,**

**1. దుఃఖయోనయః :** విషయాలతో ఇంద్రియాల స్పర్శ (సంపర్కం) వల్ల కలిగే సుఖాలు పైకి సుఖాలుగా కనిపిస్తాయే గాని అవి దుఃఖాలతో కూడుకొని ఉంటాయి. అందుకే వాటిని 'దుఃఖయోని' అన్నారు. అంటే సుఖం ఒడిలో దుఃఖం దాగి ఉంటుందన్న మాట. ఏ వస్తువు సుఖాన్నిస్తుందని అనుకుం టామో అదే దుః ఖాన్నిస్తుంది. ఒకడికి లడ్డూలు బాగా ఇష్టం. ఒక బుట్ట లడ్లు తెచ్చి ముందుపెట్టి తినమన్నాం. మొదటి రెండు ఎంతో ఇష్టంగా తిన్నాడు. 3, 4 లడ్లు ఒక మోస్తరుగా ఉన్నాయి. ఇంకా రెండు లడ్లు తినమని చేతిలో పెట్టాం. అస్సలు బాగాలేవు.

మరి 4 తినమని బలవంతం చేశాం. ఛీ! ఛీ! అన్నాడు. **అంటే మొదటి లడ్డు ఇచ్చిన ఆనందాన్ని 6వ లడ్డు ఎందుకివ్వలేదు? అంటే ఆనందం ఆ లడ్డులో లేదన్నమాట. ఆనందం లడ్డులో ఉంటే ఎన్ని లడ్లు తింటే అంత ఆనందం కలగాలి. కానీ కలగటం లేదు. అంటే లడ్డు ఆనందాన్నిచ్చేది కాదన్నమాట. నిప్పు వేడిని కలిగిస్తుంది. అది ఎప్పుడూ వేడినే ఇస్తుంది. అలాగే విషయ వస్తువు సుఖాన్నిస్తున్నది అంటే అది ఎప్పుడూ సుఖాన్నే ఇవ్వాలి. అలా ఇవ్వకపోతే అది సుఖాన్నిచ్చేమాట నిజం కాదు.**

**విషయసుఖం నిజమైన సుఖం కాదు, సుఖం వేషం వేసు కున్న దుఃఖం. మేకతోలు కప్పుకున్న పులి. అందుకే శంకరా చార్యులవారు 'వివేక చూడామణి' గ్రంథంలో విషయాలు విషం కన్నా ప్రమాదం అన్నారు. విషాన్ని తింటేనే ప్రమాదం, చూస్తే ఏ ప్రమాదమూ లేదు. కానీ విషయ వస్తువులను చూస్తే చాలు ప్రమాదమే అన్నారు.** వాటిని గురించి విన్నా చాలు, ప్రమాదమే అన్నారు. వాటిని గురించి విన్నా చాలు కలగవలసిన అనర్థం కలుగుతుంది. ముందు సుఖంగా అనిపించినా చివరకు దుఃఖాన్నే మిగుల్చుతాయి.

**విషయ వస్తువులు కలిగించే దుఃఖాలు 3 రకాలు :**

**1. పరిణామ దుఃఖాలు:–** దూడ పెరుగుతుంటే కొమ్ములు కూడా పెరుగుతున్నట్లు భోగాలు అనుభవించేకొద్దీ వాటిపై ఆసక్తి ఇంకా పెరుగుతుంది. ఇంకా ఇంకా అనుభవించాలనే కోరిక కలుగు తుంది. కోరిన కోరికలు తీరనప్పుడు దుఃఖాలు పెరిగిపోతాయి. దానితో పాపాలు చేస్తారు. ఇదీ విషయభోగాలతో కలిగే పరి ణామదుఃఖం.

**2. తాపదుఃఖాలు:–** సుఖాలు కొద్దిసేపు ఉంటాయి. కాని దాని తాపం చాలాకాలం ఉంటుంది. ఈ సుఖాలు నాకు దూరమైపోతా యేమోనని అనుకుంటే చాలు ఒకటే తాపం.

బాగా డబ్బు సంపాదించినవాడికి దొంగలభయం, ఇన్‌కం టాక్స్ వాళ్ళ భయం ఉంటుంది. ఒంటినిండా నగలు ధరించి ఆనందించేవారికి ఎవరైనా గొంతు పిసికి చంపుతారేమోనని భయం. వస్తువులుగాని, సుఖాలుగాని దూరమైపోతాయేమో, ఎవరైనా అడ్డు పడతారేమో అనుకుంటే చాలు ఒకటే భయం, బాధ. ఇక మనకన్నా అవతలవారికి ఎక్కువగా ఉంటే ఒకటే తాపం. కళ్ళు మంట, కడుపు మంట, అసూయ. వీటితో మాన వత్వం కూడా మంటకలుస్తుంది. ఇదే తాపదుఃఖం.







**3. సంస్కార దుఃఖాలు :–** ఒకప్పుడు అనుభవించిన సుఖాల గురించి, భోగాల గురించి ఇప్పుడు తలచుకొని "అప్పటి సుఖం ఇప్పుడు లేకపోయెనే" అని తలచుకొని దుఃఖించటం సంస్కార దుఃఖం. అయితే ఈ దుఃఖాలన్నీ పైకి కనిపించేవి కావు. అందుకే అజ్ఞానులు తెలుసుకోలేరు. వివేకులు మాత్రమే చూడగలరు. ఇక రెండవ దోషం–

**2. ఆద్యంతవంతః :– విషయాలద్వారా లభించే సుఖాలకు ఆది అంతం ఉన్నవి. ఒకప్పుడు మొదలై, కొంత కాలం ఉండి, చివరకు నశించిపోతాయి. కనుక విషయ సుఖాలు క్షణికాలు. ఆత్మ సుఖం శాశ్వతమైనది. విషయ సుఖం దీపం లాంటిది. ఆత్మ సుఖం సూర్యుని వంటిది. విషయసుఖం చిన్న కాలువ వంటిది. ఆత్మ సుఖం అనంత సాగరంలాంటిది. ఇలా విషయ సుఖాల నిజ స్వరూపం ఏమిటో చూడగల వివేకులే వాటిపట్ల విరక్తి చెంది ఉంటారు.**

**తేషు బుధః నరమతే :–** ఇలాంటి విషయభోగాలపై వివేకులు ఆసక్తిని ప్రదర్శించరు. పసివాడు ఏమీ తెలియని అజ్ఞాని గనుక మల మూత్రాలలో దొర్లుతాడు. అతడే పెద్దవాడైన తరువాత వాటిని అసహ్యించుకుంటాడు. వాటి జోలికివెళ్ళడు. అలాగే విషయ భోగాలలోపడి దొర్లేవాడు మూఢుడు, అవివేకి, అబుధుడు. అదే జ్ఞాని, వివేకి, బుధుడు ఐతేనో. విషయ భోగాలన్నీ దుఃఖంతో కూడుకున్నవి. ఆద్యంతాలతో కూడినవి అని గ్రహించి వాటియందు రమించడు.

'దుఃఖదోషానుదర్శనం' అన్నట్లు విషయ భోగాలలోని దోషాలను దర్శించి విరక్తి చెందాలి.

– ఇంతకూ కర్మ సన్యాసయోగం ఎప్పుడు పూర్తి అయినట్లు?

*శ్లో॥ శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ శరీర విమోక్షణాత్।*
*కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీనః ॥* **(23)**

**తా॥ ఎవరైతే శరీరం రాలి పోవడానికి ముందే ఇక్కడే కామక్రోధాల వేగాన్ని తట్టుకొని నిలబడగలడో అట్టివాడే యోగ సిద్ధిని పొందినవాడు. అతడే శాశ్వత ఆనందాన్ని పొందినవాడు.**

**వ్యాఖ్య :** ఒక సంపూర్ణ పురుషుడు ప్రియ అప్రియాల పట్ల సమబుద్ధితో ఉంటాడని, బాహ్య విషయాలపట్ల ఆసక్తిని విడిచి ఆత్మయందే నిష్ఠ కలిగి ఉంటాడని ఇంతవరకు చెప్పడం జరి గింది. ఇది విన్న సాధకుడు అట్టి పరిపూర్ణతను పొందటం

సాధ్యమా? అని సందేహిస్తాడు. అటువంటి సందేహాన్ని పోగొట్టి, నిరాశా నిస్పృహలను తొలగించుటకే ఈ శ్లోకంలో ఉపాయం చెప్పబడింది.

నీ తాతగారు గొప్ప సంగీత విద్వాంసుడు. ఆయన వీణను చక్కగా వాయించగలడు. ఆయన పోయిన తర్వాత ఆ వీణను ఇంట్లో ఒక చోట భద్రపరిచారు. ఇప్పుడు నీకు సంగీతంలో ప్రవేశం ఉంది. నీ తాతలాగా గొప్ప విద్వాంసుడు కావాలని అభిలాష. వెంటనే ఆ వీణను తీసి, తీగెలను గట్టిగా బిగించి, మీటగానే అవి తెగిపోయినవి. ఇక ఏ సంగీతం దానినుండి వినిపించలేదు. అలాకాక ఆ వీణను శుభ్రంచేసి క్రొత్త తీగెలను అమర్చి, శ్రుతిచేసి తీగెలను మీటితే చక్కని స్వరాలు పలికి సంగీతం వినిపించింది.

**అలాగే మనోబుద్ధులనే వీణ తీగెలు చాలాకాలం నుంచి అశ్రద్ధ చేయబడ్డాయి. వాటిచేత ఆనందగీతం పాడించాలంటే ఆ మనోబుద్ధులను సరిచేసి, వాటిని సరైన మార్గంలో పెట్టాలి. దానికే ఇక్కడ ఉపాయం చెప్పారు. కామక్రోధాల వేగాన్ని, ఈ జన్మలోనే అరికట్టి యోగసిద్ధుడవై ఆనందాన్ని అందుకో అని.** ఏమిటీ కామక్రోధాలు? వాటి పరిణామం ఏమిటి?

ఒకప్పుడు అనుభవించి, రుచి మరిగిన ప్రియవస్తువును తలచుకొన్నా, చూచినా, విన్నా దానిని సంపాదించి అనుభవించాలనే ఆలోచన నీలో కలుగుతుంది. అదే కోరిక. అదే కామం. అలాగే తనకు లేనిదాన్ని గాని, ఇతరులకు ఉన్నదాన్నిగాని కోరు కోవటం కామం. ఈ కామం వల్ల ఒళ్ళు గగుర్పాటు చెందటం, ముఖంలో ప్రసన్నత చెడటం కామం యొక్క వేగానికి గుర్తు.

ఇక నీవు కోరుకున్న వస్తువును పొందలేక పోయినా, మరొ కడు అడ్డువచ్చి తన్నుకు పోయినా కలిగేది క్రోధం. ఈ క్రోధం వల్ల శరీరంలో కంపం, కళ్ళు ఎర్రబడటం, పెదవులు అదరటం, చెమటలు పట్టటం, నోటినుండి ఎటువంటి మాటలైనా రావటం క్రోధం యొక్క వేగానికి గుర్తు. ఈ కామక్రోధాలు రెండింటినీ విడిచిపెట్టాలి. ఎప్పుడు?

**ప్రాక్ శరీర విమోక్షణాత్ :** శరీరం విడిచేలోపలే– అంటే ప్రాణం పోయే లోపలే ఈ కామక్రోధాల వేగాన్ని అరికట్టాలి. ప్రాణం పోయేదాక వీటి విషయంలో హెచ్చరిక కలిగి ఉండాలి. ఏ మాత్రం భరోసా గాని, ఏమరుపాటు గాని కూడదు.







ఈ అంతః శత్రువులను గెలువకపోతే ముక్తి లేదు. మరణానికి ముందే అనటంలో మరొక విశేషం కూడా ఉంది. మరణానికి ముందు నీవు ఏ స్థితిని సాధించావో మరణించిన తర్వాత నీకు లభించే స్థితి అదే. కనుక చచ్చిన తర్వాత సాధించేదేమీ లేదు. బ్రతికి ఉన్నప్పుడే సాధించాలి. కనుక ఎప్పుడో చివరికి చూసుకుందాం అనుకుంటే అప్పుడు చూసుకోవడానికి ఏమీ ఉండదు. **కామ క్రోధాల వేగం చిన్నది కాదు. పెద్ద నదీ ప్రవాహం వంటిది. నదీ ప్రవాహం తనలో పడ్డ వస్తువును సముద్రంలోకి నెట్టివేస్తుంది. అలాగే ఈ కామక్రోధాల వేగం తనలో పడ్డ వాణ్ణి సంసారమనే సముద్రంలోకి నిర్దాక్షిణ్యంగా నెట్టివేస్తుంది.**

**అయితే ఎంత గొప్ప నదీ ప్రవాహంలోనైనా మొసలి వంటి జల జంతువులు ఆ జలవేగాన్ని తట్టుకొని నిలిచినట్లు ఈ కామ క్రోధాల వేగాన్ని ఎవరు అరికట్టి నిలబడగలరో అతడే బ్రహ్మ యుక్తుడు– యోగసిద్ధుడు. అనంతమైన ఆత్మానందాన్ని అనుభవించే అర్హత గలవాడితడే.** అట్టి వానినే ఇక్కడ 'నరః' నరుడు అన్నారు. మిగిలినవారు నరరూపంలో ఉన్న వానరాలు, సూకరాలు మాత్రమే.

అయితే ఎవరు ఈ కామక్రోధాల వేగాన్ని అరికట్టగలరు? ఎవరైతే సుఖదుః ఖాలకు అతీతంగా ఉంటారో, ప్రియ, అప్రియ వస్తువులు లభించినప్పుడు పొంగక– క్రుంగక ఉంటారో; ఎవరు బాహ్యామైన విషయభోగాలు దుఃఖపూరితమైనవని, ఆది అంతా లతో కూడియున్నవని గ్రహిస్తారో; ఎవరు అంతర్ముఖులై ఆత్మ యందే రమిస్తూ ఉంటారో అట్టివారి మనస్సు శుభాశుభాలకు చలించదు. సుఖభోగాలకోసం అర్రులు చాచదు. అంటే కోరిక లుండవు. కనుక క్రోధానికి అవకాశంలేదు. ఇలా ఎవరు జీవించి ఉండగానే కామక్రోధాలనరికడతారో వారే యోగయుక్తులు, వారే అనంతమైన సుఖంలో స్థితులై ఉంటారు.

కనుక అమూల్యమైన, దుర్లభమైన ఈ మానవజన్మను క్షణికమైన సుఖభోగాలకు వెచ్చించక, సాధనలో అప్రమత్తులై భగవానుని హెచ్చరికను పాటించి, జీవించి యుండగానే మోక్ష సాధనకు ప్రయత్నించాలి. కామక్రోధాలనరికట్టినప్పుడే కర్మస న్యాసం పూర్తి అయినట్లు అనిగ్రహించాలి.

–కామక్రోధాల వేగాన్ని అరికట్టినవాడు చేయవలసిన అంతరంగ సాధన ఏమిటి?

***శ్లో॥ యోంతస్సుఖో ంతరా రామః తథా ంతర్జ్యోతి రేవయః॥***
***స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మ భూతో ధి గచ్ఛతి॥ (24)***

**తా॥ ఎవరు ఆత్మయందే సుఖిస్తూ, ఆత్మయందే రమిస్తూ, అలాగే ఎవరు ఆత్మయందే ప్రకాశం (జ్ఞానం) గలవాడై యున్నాడో అట్టి ధ్యానయోగి బ్రహ్మ స్వరూపుడై బ్రహ్మానందాన్ని (బ్రహ్మ సాక్షాత్కారాన్ని) పొందుతున్నాడు.**

**వ్యాఖ్య :–** కేవలం కామ క్రోధాలనరికట్టినంత మాత్రాన ముక్తి లభించదు. అరికట్టాల్సిందే. అది బహిరంగ సాధన. దీనితో పాటు అంతరంగ సాధన కూడా కావాలి. అదే ఆత్మ నిష్ఠ. దానినే ఈ శ్లోకంలో తెలియజేయబోతున్నారు. దీనికి 3 సాధన లను ఈ శ్లోకంలో చెప్పారు. అవే–

**1.అంతస్సుఖః :–** సామాన్యులు బాహ్య వస్తువుల ద్వారా సుఖించాలనుకుంటారు. వాటికోసం ప్రయత్నించి తాత్కాలిక సుఖాలు పొందుతారు. వాటితో తృప్తి పడక ఇంకా ఇంకా కావాలని బాహ్య ప్రపంచం వైపుకే పరుగులు తీస్తారు. **కానీ మహాత్ములు మాత్రం నిజమైన సుఖం బాహ్యంలో లేదని, అంతరంలోనే ఉన్నదని, ఆత్మయే సుఖ స్వరూపమని గ్రహించి, నిరంతరం తమలోనే ఆనందాన్ని పొందుతారు.అదే అక్షయ సుఖం, శాశ్వత సుఖం, దుఃఖం లేని సుఖం. సుఖం బయటి నుండి కూరేది కాదు. లోపల నుండి ఊరేది. బావిలోనుండి నీరు ఊరుతున్నట్లు అంతరంగ సుఖం ఎప్పుడూ ఊరుతూనే ఉంటుంది. కనుక దానినే అనుభవిస్తు ఉంటారు.**

**2.అంతరారామః :–** ఆత్మలో క్రీడిస్తూంటారు. సామాన్యులు బాహ్య వస్తువులలో, విషయాలలో క్రీడిస్తుంటారు. భార్యా బిడ్డలు, బంధుమిత్రులు, ఆత్మీయులు మొదలైన వారితో క్రీడిస్తూ ఆనందిస్తారు. **కాని మహాత్ములు మాత్రం బాహ్య వస్తువులు, విషయాలు, వ్యక్తులు అనిత్యమైనవని, చంచలమైనవని గ్రహించి, వీరంతా రైలు ప్రయాణీకులవంటి వారేనని గుర్తించి, వారిపై ఆసక్తిని, బంధాన్ని పెంచుకోకుండా, నిరంతరం తనలోనే–ఆత్మలోనే అను సంధానమై ఆత్మ ధ్యానంలోనే కాలం గడుపుతారు. వారి క్రీడా స్థలం ఆత్మయే. ఆత్మలోనే వారు క్రీడిస్తూ ఉంటారు.**

**3.అంతర్జ్యోతిః :–** సామాన్యులకు బాహ్యంలోని వస్తువులను చూడటానికి వెలుగు కావాలి.అది పగలు సూర్యుడు, రాత్రి దీపం. అయితే ఆ సూర్యుణ్ణి కూడా ప్రకాశింపజేసే జ్యోతి స్వరూపం మరోటి ఉంది. అదే ఆత్మ. పరమాత్మ. ఎలా?







సూర్యుణ్ణి చూచేది నేత్రం. నేత్రాన్ని ప్రకాశింపజేసేది బుద్ధి. ఆ బుద్ధిని ప్రకాశింపజేసేది ఆత్మ. అదే జ్యోతులకు జ్యోతి– పరంజ్యోతి. మహాత్ములు అట్టి దివ్యాత్మ జ్యోతినే ఆశ్రయించి శాశ్వతంగా ప్రకాశిస్తుంటారు.

ఈ ప్రకారంగా దృశ్యంపై వ్యామోహాన్ని వదలి, బాహ్య విషయాలపై ఆసక్తిని విడచి, ఆత్మయే సుఖ స్థానమని గ్రహించి, ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలోనే ప్రకాశిస్తూ, ఆత్మలోనే ఆనందిస్తూ నిరంతరం ఆత్మధ్యాన పరుడై యుంటాడు మహాత్ముడు. అతడే యోగి. అతడే సమాధాన చిత్తం గలవాడు. అట్టి వానినే బ్రహ్మ భూతుడు – బ్రహ్మ స్వరూపుడు అంటారు. అతడే బ్రహ్మ నిర్వా ణాన్ని పొందుతాడు. అంటే బ్రహ్మ సాయుజ్యం చెందుతాడు. నిజం చెప్పాలంటే అతడు బ్రహ్మమే.

**బాహ్య సుఖాలకోసం బాహ్య విషయాలలో రమిస్తూ తమ జ్ఞానజ్యోతిని బాహ్యంలోనే వినియోగించేవారు తిరిగి తిరిగి ఈ లోకంలోకి వచ్చి పడాల్సిందే. అలాగాక ఆత్మలోనే రమిస్తూ తమ జ్ఞానజ్యోతిని (జ్ఞానాన్ని) ఆత్మలోనే వినియోగించేవారు, ఆత్మస్వరూపులై బ్రహ్మ స్వరూపులై, బ్రహ్మంలోనే విలీనమై, బ్రహ్మా నందాన్ని అనుభవిస్తూ ఉంటారు. అదే మోక్షం. అట్టి బ్రహ్మ నిర్వాణ రూపమోక్షాన్ని పొందటానికి ఎట్టి అర్హతలుండాలి? ఏ లక్షణాలు ఉండాలి?**

***శ్లో॥ లభంతే బ్రహ్మ నిర్వాణం ఋషయః క్షీణ కల్మషాః॥***
***ఛిన్నద్వైధా యతాత్మానః సర్వ భూత హితే రతాః॥ (25)***

**తా॥ పాపాలు తొలగించుకున్నవారు, ద్వైతభావనను ఛేదించిన వారు, మనస్సును స్వాధీనంలో పెట్టుకున్నవారు, సమస్త ప్రాణుల హితాన్ని కోరేవారు అయిన ఋషులు బ్రహ్మ నిర్వాణ రూప ఆనందాన్ని పొందగలుగుతారు.**

**వ్యాఖ్య :–** బ్రహ్మ నిర్వాణాన్ని ఎవరు పొందగలరు? అంటే ఋషులు– అన్నారు. అయితే మనకు అవకాశం లేనట్లే కదా! అని సందేహం కలుగుతుంది ఎవరికైనా. అందుకే ఋషులు అంటే ఎవరో తెలుసుకోవాలి.

**ఋషయః :–** ఋషులు అంటే జడలు, గడ్డాలు, గోళ్ళు పెంచుకొని, అడవులలో కూర్చొని కళ్ళు మూసుకొని తపస్సులు చేసేవారు అని అందరి భావన. దండ కమండలాలు ధరించి, నెత్తి మీద కొప్పు పెట్టుకొని, చాలీ చాలని బట్ట కట్టుకొని, బక్క చిక్కిన దేహంతో తిరిగేవారే ఋషులని, కనుక మనం ఋషులం కాదని అనుకుంటూ ఉంటారు.

**నిజంగా ఋషులు అంటే హృషీకాలను(ఇంద్రియాలను) జయించిన వారు అని అర్థం. ఇంద్రియాలను స్వాధీనంలో పెట్టుకొని, మనస్సును పరమాత్మయందే నిలిపి, ప్రశాంత జీవనం గడిపేవారే ఋషులు. ఈ ఋషిత్వం అనేది ఒక డిగ్రీ. మనం 15, 16 సంవత్సరాలు చదివి డిగ్రీ సంపాదిస్తే వీరు కొన్ని జన్మలు కృషి చేసి ఈ ఋషి అనే డిగ్రీ సంపాదిస్తారు. అలా ఎవరు కృషి చేస్తే వారే ఋషి. అంతే తప్ప వేషానికి ఏ మాత్రం ప్రాధాన్యత లేదు.**

ఇట్టి ఋషులు బ్రహ్మ నిర్వాణం పొందాలంటే ఏ సాధనలు చేయాలో నాలుగింటిని ఈ శ్లోకంలో చెప్పారు. అవి...

**1. క్షీణ కల్మషాః :–** కల్మషాలను (పాపాలను) తొలగించుకున్న వారు. పాపాలంటే మళ్ళీ మళ్ళీ జన్మలను తెచ్చిపెట్టే పుణ్య పాప వాసనలే. అనేక జన్మలలో ఆర్జించుకున్న ఈ వాసనల మూటను ఒక శరీరం నుండి మరొక శరీరంలోకి ప్రవేశించే టప్పుడు మనం వెంట తెచ్చుకుంటూ ఉంటాం. అవి ఉన్నంత కాలం మళ్ళీ మళ్ళీ జన్మలెత్తాల్సిందే. కనుక వాటిని క్షయం చేసుకోవాలి. ఎలా? నిష్కామకర్మయోగం ద్వారా, భగవంతునిపై అచంచలమైన భక్తి ద్వారా. జపధ్యానాది సాధనలద్వారా, ఆత్మ జ్ఞానాన్ని పొంది, ఆత్మ విచారణ ద్వారా, ఆత్మతో తాదాత్మ్యం చెందటం ద్వారా క్షయం చేసుకోవాలి. అలా క్షయం చేసుకొన్న వారే క్షీణకల్మషాః అంటే.

**2. ఛిన్నద్వైధా :–** ద్వైత భావన తొలగటం. నేను వేరు, పరమాత్మ వేరు అనే ద్వైత భావనలో ఉంటారు అందరూ. ఈ భావం పోయి అద్వైత భావనలో నిలవాలి. అలా నిలవాలంటే అద్వైత జ్ఞానాన్ని సద్గురువుల ద్వారా శ్రవణం చేయాలి. శ్రవణం చేసిన ప్పుడు అనేక సందేహాలు కలుగుతాయి. ఈ సందేహాలన్నింటిని తత్త్వ విచారణ ద్వారాను, సద్గురువులను ప్రశ్నించి తెలుసు కోవడం ద్వారాను తొలగించుకోవాలి. సందేహాలు పూర్తిగా తొల గేంతవరకు గురువును విసిగించకుండా ప్రశ్నిస్తూ తెలుసుకోవాలి. అప్పుడే సంశయనివృత్తి జరిగి అద్వైత సిద్ధి కలుగుతుంది.

**3. యతాత్మానః :–** ఇంద్రియాలను, మనస్సును అదుపులో ఉంచుకొనుట, మోక్షానికి గొప్ప అవరోధం మనస్సు అదుపులో లేకపోవటమే. మనస్సు అదుపులోకి రావాలంటే ఇంద్రియాలు స్వాధీనం కావాలి. మనస్సును అదుపులో ఉంచుకోగలిగితే ఇంద్రి యాలేమీ చేయలేవు. కనుక ప్రయత్నించి ఇంద్రియాలను, మన స్సును అదుపులో







ఉంచుకోవాలి. ప్రపంచం మిథ్య యని, ఇక్కడి వస్తువులు, విషయాలు, భోగాలు అన్నీ దుఃఖ పూరితాలని బాగా గ్రహించి మనస్సును నిగ్రహించాలి.

**4. సర్వ భూత హితే రతాః :–** సమస్త ప్రాణుల హితాన్ని కోరటం. "సర్వే జనా స్సుఖినో భవంతు" అనేది ఆధ్యాత్మిక రంగంలో ఉన్నతికి సంకేతం. అంతటా ఉన్నది బ్రహ్మమే కనుక – అన్ని ప్రాణులు ఆత్మ స్వరూపమే గనుక, తానూ ఆత్మయే గనుక అందరి మేలు తన మేలే అవుతుంది కనుక ఏ ప్రాణిని ద్వేషించకుండా ఉండాలి. ఎవరిని ద్వేషించినా పరమాత్మను ద్వేషించినట్లే– తనను ద్వేషించినట్లే. కనుకనే **'అద్వేష్టా సర్వ భూతానాం'** అని భక్తుల లక్షణాలలో మొదటిదిగా దీన్ని చెప్పారు.

ఇలా ఎవరైతే సాధనలు చేస్తారో వారే ఋషులు. వారే బ్రహ్మ నిర్వాణరూప ఆనందాన్ని పొందగలుగుతారు.

– బ్రహ్మ నిర్వాణానికి ఇంకా ఏ సాధనలు చేయాలి?

***శ్లో॥ కామక్రోధ వియుక్తానాం యతీనాం యత చేతసాం।***
***అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మ నాం॥ (26)***

**తా॥ కామక్రోధాల నుండి విడుదల పొందినవారు, స్వాధీనమైన మనస్సు గలవారు, ఆత్మజ్ఞానాన్ని తెలుసుకున్నవారు, ప్రయత్న శీలురు అయిన వారికి బ్రహ్మ నిర్వాణ రూప మోక్షం అంతటా ఉంటుంది.**

**వ్యాఖ్య :–** ఎవరైతే బ్రహ్మ నిర్వాణ రూపమైన మోక్షాన్ని కోరి జన్మను సార్థకం చేసుకోవాలనుకుంటారో అట్టివారు ముందుగా ఏ సాధనలు చేయాలి? అనే విషయాన్ని ఈ శ్లోకంలో చెబు తున్నారు.

**1. కామక్రోధ వియుక్తానాం :–** కామక్రోధాలనుండి విడుదల పొందాలి. ఎందుకు? బుద్ధిలో కోర్కెలు పుడితే వాటిని తీర్చుకొను టకు విషయ ప్రపంచం వైపుకు పరుగులు తీయాలి. అప్పుడు నిరంతరం వాటి గురించే ఆలోచనలు చేస్తాం. ఆ విషయాలపై ఆసక్తి కలుగుతుంది. అది మనను బహిర్ముఖం చేస్తుంది. ఆత్మకు దూరం చేస్తుంది. సంసారంలో ఇరికిస్తుంది. దానితో బంధం. కనుక కామక్రోధాలనుండి విడుదల పొందాలి.

**2. యతచేతసాం :–** కామక్రోధాలను అరికడితే దృష్టి అంతర్ముఖం అవుతుంది. శ్రవణం, మననం చక్కగా సాగుతాయి. ఎందుకంటే చిత్తం బయటకు పోదు

గనుక. ఇలా చిత్తాన్ని బాహ్యంగా పోని వ్వక అంతరంగా ఆత్మ వైపుకు త్రిప్పి ఏకాగ్రం చేయటమే యతచేతసాం.

**3. విదితాత్మనాం:–** ఇలా ఏకాగ్రమైన మనస్సుతో శ్రవణం చేసినప్పుడు తెలియని ఆత్మ తత్త్వం తెలుస్తుంది. ఆ తరువాత తెలిసిన తత్త్వం మననం ద్వారా స్థిరపడుతుంది. ఇలా స్థిరపడిన జ్ఞానం వల్లనే ఆత్మను తెలుసుకొని, స్వస్వరూప జ్ఞానంతో మోక్షం కరతలామలకమవుతుంది. అదే విదితాత్మనాం.

**4. యతీనాం:–** ఇంతకు ముందు కామక్రోధాల వేగాన్ని అరికట్టా లన్నారు. ఇప్పుడు కామక్రోధాలు అంతఃకరణంలో పుట్టకుండా చూడాలంటున్నారు. ఇలా ఎవరైతే కామక్రోధాలకు తమ చిత్తంలో అవకాశం లేకుండా– స్థానం లేకుండా చేస్తారో వారే యతీనాం– యతులు. వారే జ్ఞాన నిష్ఠను పొందగల సన్యాసులు. నిరంతర యత్నశీలురు.

**ఇలా కామక్రోధాలకు చిత్తంలో స్థానం లేకుండా చేసిన యతులు, అంతః కరణాన్ని తమ స్వాధీనంలో ఉంచుకొన్నవారు, ఆత్మజ్ఞానాన్ని పొంది ఆత్మ నెరిగిన విదితాత్ములు జీవించి ఉండగానే ముక్తులు. మరి మరణించిన తరువాతనో! అప్పుడూ ముక్తులే. వారికిక మరణం లేదు. జీవించి ఉండగానే శరీరంతో తాదాత్మ్యాన్ని విడిచి, ఆత్మలో తాదాత్మ్యం చెందారు గనుక పోయేది వారు ఎప్పుడో విడిచిన శరీరమే. కనుక తాము నిత్యులు, శాశ్వతులు. అట్టి వారికి బ్రహ్మనిర్వాణం అభితః వర్తతే– అంతటా ఉంటుంది.**

కనుక ప్రతివారూ యతులు కావాలి. ప్రయత్న శీలురు కావాలి. ప్రయత్నిస్తేనే ఫలితం. భగవంతునిపై, సద్గురువులపై, సత్ శాస్త్రములపై అచంచల విశ్వాసం ఉంచి, సాధన సాగించాలి. అప్పుడే బ్రహ్మ సాక్షాత్కారం – బ్రహ్మ సాయుజ్యం పొందేందుకు అర్హత వస్తుంది. ఇది అంతరంగ సాధన.

నిరంతరం ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలోనే సుఖిస్తూ, కల్మషాలను సందేహాలను తొలగించుకొని, సర్వభూతాలకు హితాన్ని కలిగిస్తూ, కామక్రోధాల నరికట్టి, నిరంతర శ్రవణ మనన నిధి ధ్యాసనలతో ఆత్మను తెలుసుకొని, సాధనలు చేస్తే, ప్రయత్న శీలురైతే బ్రహ్మ నిర్వాణమే. బ్రహ్మానందమే.

– ఇక చివరిగా తప్పక చేయవలసిన సాధనలు– ధ్యాన పద్ధతిని వివరించ బోతున్నాడు భగవానుడు.







***శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।***
***ప్రాణాపానౌ సమౌకృత్వా నా సాభ్యంతర చారిణౌ॥ (27)***

***శ్లో॥ యతేంద్రియ మనోబుద్ధిః మునిర్మోక్ష పరాయణః ।***
***విగతేచ్ఛా భయక్రోధః యస్సదా ముక్త ఏవసః ॥ (28)***

**తా॥ ఎవరు బాహ్యమైన స్పర్శాది విషయాలను బయటనే నిలిపి వేసి, దృష్టిని భ్రూ మధ్యమునందు నిలిపి, ముక్కులో సంచరించే ప్రాణ అపాన వాయువులను సమం చేసి, మనోబుద్ధులను ఇంద్రి యాలను నిగ్రహించి, ఆశ– భయ క్రోధాలను విడిచిపెట్టి, మోక్షాన్ని కోరుకునే మనన శీలుడో అతడు ఎల్లప్పుడూ ముక్తుడే.**

**వ్యాఖ్య :–** ఇంతవరకు మోక్షాన్ని పొందుటకు అర్హతలను చెప్పి, ఇప్పుడు అందుకు చేయవలసిన ధ్యానసాధన గురించి సంక్షిప్తంగా తెలియజేస్తున్నారు. రాబోయే అధ్యాయంలో విపులంగా చెప్ప బోయే ధ్యానయోగానికి పీఠికగా పునాది వేస్తున్నాడు భగవానుడు.

**1. బాహ్యాన్ స్పర్శాన్ బహిః కృత్వా :–** బాహ్యమైన శబ్ద స్పర్శాది విషయాలన్నింటిని వివేక వైరాగ్యాలతో బయటనే నిలిపివేయాలి. వాటిని మనస్సులోనికి చొరబడనీయరాదు. ఈ విషయాలు మన స్సులో చొరబడితే మనస్సును ప్రశాంతంగా ఉండనీయవు. అప్పుడు మనస్సు ధ్యానానికి అనుకూలంగా ఉండదు. మరి వాటిని ఎలా ఆపాలి? దీనికొక్కటే ఉపాయం. నీ మనస్సును భగవదాకార వృత్తితో నింపాలి. అంటే ఎల్లప్పుడూ మనస్సు భగవద్భావనతో– ఆత్మజ్ఞానంతో–విచారణతో నిండిపోవాలి. మనస్సులో ఒక ఆలో చన ఉంటే మరొక ఆలోచనకు ఆస్కారం ఉండదు. ఒక కుర్చీలో ఇద్దరు కూర్చోలేరు. ఒకరు లేస్తేనే మరొకరికి చోటు. కనుక పరమాత్మకు సంబంధించిన ఆలోచనలు, పరమాత్మ మహి మలు, పరమాత్మ తత్త్వం గురించి నిరంతరం ఆలోచిస్తూ విషయాలకు చోటు లేకుండా చేయాలి.

**2. చక్షుః భ్రువో అంతరే ఏవ :–** దృష్టిని భ్రూమధ్యంలో నిలపాలి. యోగ శాస్త్రంలో దీనిని **'ఖేచరీ ముద్ర'** అంటారు. ఇది హఠయోగ ప్రక్రియ. **జ్ఞాన మార్గంలో దీని అర్థం వేరు. దృష్టిని రాగద్వేషాలు లేకుండా నిలుపుట–అని.** భ్రూమధ్యంలో ఆజ్ఞా చక్రం ఉన్నది. అయితే బలవంతాన చూపును భ్రూమధ్యంలో నిలిపితే కళ్ళు నొప్పి పెడతాయి. దీనికి శంకరులవారు తమ భాష్యంలో ఇలా అన్నారు. **"భ్రూమధ్యంలో దృష్టి నిలపటం అంటే రెండు కనుల మధ్య దృష్టిని**

**నిలిపి చూచుచున్నారో అనునట్లు"** అని. దీనివల్ల దృష్టి ఊర్ధ్వముఖంగా పోతుంది. మనస్సు కూడా ఊర్ధ్వంగా పైకి లేస్తుంది. అట్టి మనస్సు ఉత్తమ ధ్యానానికి సరయిన సాధన. ఇక ధ్యానానికి రెండవ సాధన–

**3. నాసాభ్యంతర చారిణౌ ప్రాణా పానౌ సమంకృత్వా :** ముక్కులో సంచరించే ప్రాణ అపాన వాయువులను సమం చేయాలి. సాధా రణంగా మానవులలో ప్రాణ–అపాన వాయువులు సమంగా ప్రవహించవు. వాటిని ప్రాణాయామం ద్వారా క్రమపద్ధతిలో నడిచేటట్టు చేయాలి. ఈ ప్రాణాయామ అభ్యాసం ఆరోగ్యానికి, మనస్సు నిలవటానికి కొంతవరకు ఉపయోగపడుతుంది. ప్రాణా లకు, మనస్సుకు సంబంధం వుంది. ఒకే చెట్టు యొక్క రెండు కొమ్మలవంటివి. ప్రాణం–మనస్సు. అందుకే ప్రాణాన్ని నిరోధిస్తే మనస్సు నిలబడుతుంది కనుక ప్రాణాయామం ద్వారా మనస్సును నిలబెట్టుటకు, ఏకాగ్రం చేయుటకు వీలు కలుగుతున్నది.

**4. యంతేంద్రియ మనోబుద్ధిః :–** ఇంద్రియాలు, మనస్సు వాటికి కావలసిన వాటిని కోరుకుంటూ ప్రపంచంలోనికి పరుగులు తీస్తుంటాయి. అజ్ఞాని వాటికి లోబడి, బానిసైపోతాడు. జ్ఞాని మాత్రం వాటిని స్వాధీనంలో ఉంచుకొని తన ఇష్ట ప్రకారం నడుపుకుంటాడు. వాటిని స్వాధీనంలో పెట్టుకొనాలంటే గొప్ప జ్ఞానం కావాలి. అంటే ప్రపంచం యొక్క యదార్థ స్థితి తెలి యాలి. అంతేగాక దీర్ఘకాల సాధన కూడా చేయాలి. అప్పుడే వైరాగ్య భావన కలిగి నిగ్రహించగలుగుతాం.

**5. విగతేచ్ఛా భయక్రోధః :–** కోరిక, భయం, క్రోధం– వీటిని విడిచిపెట్టాలి. గీత అనేక పర్యాయాలు ఈ విషయాన్ని నొక్కి చెబుతుంది. దీని యొక్క ప్రాధాన్యత అట్టిది. ఏమిటి ఈ కోరిక, భయం క్రోధం?

ఏదైనా ఒక వస్తువు లేదా విషయం తనకు సుఖాన్ని, ఆనం దాన్ని ఇస్తుందని అనుకున్నప్పుడు దానిని కావాలని అనుకుంటాం. అదే కోరిక (ఇచ్ఛ). కోరుకున్న వస్తువును సంపాదించుకొని అనుభ విస్తున్నప్పుడు ఇది నా చేతినుండి చేజారి పోతుందేమోనని అను కున్నప్పుడు, ఎవరైనా దీనిని అపహరిస్తారేమో అనుకున్నప్పుడు కలిగే వికారమే భయం. మన చేత చిక్కిన వస్తువును ఎవరైనా ఎత్తుకు పోతున్నా, మనం దాన్ని చేజిక్కించుకొనే సమయంలో ఎవరైనా అడ్డు తగిలినా, లేక మనం సుఖాన్ని, ఆనందాన్ని పొందుతున్నప్పుడు మనకు అంతరాయం కలిగించినా మనకు కలిగేది క్రోధం (కోపం). ఇవన్నీ మనబుద్ధిని నాశనం చేసేవి.







మన మనస్సును అలజడులకు, ఆందోళనకు, అశాంతికి గురి చేసేవి. కనుక వీటిని విడిచి పెట్టాలి. వీటిని గనుక మన మనస్సు నుండి పారద్రోలితే మన హృదయం పాచిలేని సరోవరంలా నిర్మలమౌతుంది. నిర్మల హృదయంలోనే పరమాత్మ ప్రకాశిస్తాడు.

**6. మోక్ష పరాయణః :–** వేదాంత జ్ఞానాన్ని అర్థం చేసుకోవాలన్నా, సాధన చక్కగా సాగాలన్నా, అనుభూతి కలగాలన్నా తీవ్ర మోక్షా పేక్ష ఉండాలి. లౌకిక వ్యవహారాలలో కూడా ఏదో ఒక అపేక్ష– కోరిక ఉంటేనే గదా శ్రద్ధతో మనం పనులు చేసేది. అలాగే ఈ జీవితాన్ని సార్ధకం చేసుకోవాలంటే మోక్షాన్ని తప్పక పొందాలి గనుక ఏమైనా సరే– ఎంత త్యాగం చేసైనా సరే మోక్షాన్ని ఈ జన్మలోనే పొందాలి అనే తీవ్రకాంక్ష–తీవ్రముముక్షుత్వం ఉండాలి. ఇదే అన్నింటికన్నా ముఖ్యం.

**7. మునిః :–** ముని అంటే మననశీలుడు. పైన చెప్పిన లక్షణా లను సాధన చేసి అలవరచుకున్న సాధకుడు నిరంతరం భగవంతుని గూర్చి మననం చేస్తూ, ఆ భగవంతునే లక్ష్యంగా పెట్టుకొని ఆత్మ విచారణలో నిమగ్నుడైతే అట్టివానినే ముని అంటారు. అట్టి మునియే–

**8. సదాముక్తః :–** ఎల్లప్పుడూ ముక్తుడే. మరి సాధన చేసే వారంతా ముక్తులేనా? అంటే కాదు. సాధన పూర్తయి అందులో సిద్ధి పొందితేనే ముక్తి. కాకపోతే సాధకులు ఎలాగూ ఎప్పుడో ఒకప్పుడు ముక్తి పొందేవారే గనుక ఇక్కడ **సదాముక్తః** అని భగవానుడు భరోసా ఇస్తున్నాడు.

'ఏం చేస్తున్నావొదినా?' అని పక్కింటామెను అడిగితే "అన్నం వండుతున్నాను" అంటుంది. నిజంగా ఆమె వండేది అన్నాన్నా? బియ్యాన్నా? బియ్యాన్నే గదా వండేది. మరెందుకలా చెప్పటం? ఎందుకంటే ఎలాగూ కొద్దిసేపట్లో తయారయ్యేది అన్నమే కదా? అని అన్నం వండుతున్నానంటారు. అలాగే కొద్దికాలంలో అందుకో బోయేది ముక్తినే గనుక సాధన చేసే ఈ మననశీలురను కూడా ముక్తులు అని భగవానుడు గౌరవిస్తున్నాడు. సాధకులకు గొప్ప భరోసాను, ప్రోత్సాహాన్ని, ఉత్సాహాన్ని ఇస్తున్నాడు. మోక్షం కోసం ఎక్కడకో, ఏ లోకానికో పోనక్కరలేదు. ఇక్కడే, ఇప్పుడే సాధనలు చేసి, జ్ఞానాన్ని పొంది, మననశీలుడై పొందవచ్చు–అని భగవా నుని ఉపదేశం.

– మనం అందుకోవలసిన పరమాత్మ ఎట్టివాడో? ఏ లక్ష ణాలు గలవాడో?

– ఆ 'తత్' పదార్థాన్ని గురించి అంతిమంగా తెలియజేయబోతున్నాడు.

***శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం।***

***సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥ (29)***

**తా॥ యజ్ఞాలకు, తపస్సులకు భోక్తగాను, సర్వలోకాలకు ప్రభువు గాను, సర్వప్రాణికోటికి మేలు చేసేవానినిగాను నన్ను తెలుసుకొని శాంతిని పొందుతాడు.**

**వ్యాఖ్య :–** శాంతిని సాధించాలంటే ఆ పరమాత్మను తెలుసుకొని ఆయనను చేరుకోవాలి. మరి ఆ పరమాత్మ ఎవరు? ఎట్టివాడు? – ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**1. యజ్ఞాలకు తపస్సులకు భోక్త :–** సాధారణంగా మనం యజ్ఞాలు చేస్తున్నప్పుడు ఆయా దేవతలకు అగ్ని ద్వారా ఆహుతు లను సమర్పిస్తాం. ఈ ఆహూతులను అందుకునే భోక్తలు ఆయా దేవతలే. ఆ దేవతలెవరు? పరమాత్మచే నియమితులైన వారు. పరమాత్మ యొక్క ఏజంట్లు. వెలుగునివ్వడానికి సూర్యుడు, వర్షా నికి వరుణుడు, గాలి కొరకు వాయువు. ఈ దేవతలకు ప్రభువు ఇంద్రుడు, జీవుల పాపపుణ్యాలకు ఫలితాలిచ్చేందుకు యమధర్మ రాజు– ఇలా ఆయా కార్యాల నిర్వహణకు నియమించబడిన వారు. వారికి మనం అర్పించే ఆహుతులు చివరకు చేరేది ఈ దేవతల నియామకుడైన ఆ పరమాత్మకే. కనుక ఆయనే భోక్త.

మరొక అర్థంలో యజ్ఞాలు అంటే మనం చేసే కర్మలన్నీ యజ్ఞాలే. నిగ్రహించేవన్నీ తపస్సులే. నిప్పులో చెయ్యి పెడితే కాలుతుంది. గనుక అలా పెట్టకుండా నిలపటం తపస్సు. ఇలా జరిగే కర్మలన్నింటికీ, చేసే తపస్సులన్నింటికీ భోక్త ఆ పరమాత్మే.

**2. సర్వలోక మహేశ్వరం :–** ఈశ్వరుడు అంటే ప్రభువు. ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క ప్రభువు. వారి అధికారం ఆ లోకం వరకే. ఇంద్రుడు స్వర్గలోకానికి ప్రభువు. బ్రహ్మదేవుడు సత్యలోకానికి, శివుడు కైలాసానికి, విష్ణువు వైకుంఠానికి, యముడు నరకలోకానికి ప్రభువులు. ఇక వీరందరిని నియమించిన పరమాత్మ అన్ని లోకా లకు ప్రభువు. ఆయన ప్రభువులకు ప్రభువు. ఆయన శాసనాలు అన్ని లోకాల్లోనూ అమలు జరుగుతాయి. కాని పైన చెప్పిన ప్రభువుల శాసనాలు వారి వారి లోకాలకే పరిమితం. అందువల్ల పరమాత్మనిక్కడ మహేశ్వరుడన్నారు.







సర్వ లోకమహేశ్వరుడన్నారు. ఆయనను నియమించేదెవరు? ఆయన నెవరూ నియ మించరు. ఎందుకంటే ఆయన ఎప్పుడూ ఉండే శాశ్వతుడు.

**3. సర్వ భూతానాం సుహృదం :–** సర్వలోకాలకు ప్రభువు, శాసకుడు అయిన పరమాత్మ కరుణా సముద్రుడు, గర్వంగాని, పక్షపాతం గాని, భేద దృష్టిగాని లేకుండా ప్రాణులందరికీ ఆయన సుహృత్ అంటే ఎటువంటి ప్రతిఫలాన్ని కోరకుండా అందరికీ మేలు చేసేవాడు. మనం ఎవరికైనా సాయం చేయాలంటే ప్రతి ఫలం పుచ్చుకొంటాం. లేదా ఇంతకుముందు సాయం చేసిన వారిపట్ల కృతజ్ఞతగా వారికి సాయం చేస్తాం. లేదా భవిష్యత్తులో వారివల్ల ప్రయోజనం ఉంటుందనుకుంటే సాయం చేస్తాం. అందుకే మనం సామాన్య మానవులం. **ప్రతిఫలాన్ని ఆశించ కుండా చేసేవాడు గనుక పరమాత్మ సుహృత్. సర్వభూతాలకు అంటే కేవలం మానవులకే గాక పశుపక్ష్యాదులకు, క్రిమి కీటకాలకు, చెట్లకు చేమలకు అన్నింటికీ మేలు చేసేవాడు పరమాత్మ. ఏం చేస్తున్నాడు పరమాత్మ మనకు? మనకు కావలసిన నీటిని, ఆహారాన్ని, వెలుతురును, గాలినీ, ఆధారంగా భూమిని, తిరగటానికి అవకాశంగా ఆకాశాన్ని ఇవ్వటమే గాక మనం తిన్న ఆహారాన్ని అరిగించేది కూడ పరమాత్మే. ఇంతేకాదు అన్నింటికన్నా గొప్ప మేలు మరొకటుంది. అదే వేద విజ్ఞానాన్ని మహర్షుల ద్వారా అందించటం. మానవుడు ఈ సంసార సము ద్రాన్ని తరించి జీవుడు దేవుడయ్యేందుకు కావలసిన జ్ఞానాన్ని వేదమంత్రాల ద్వారా మానవులకు అందించి మహోపకారం చేశాడు పరమాత్మ. అందుకే పరమాత్మ సర్వ భూతాలకు సుహృదుడు. నిజంగా మనం పరమాత్మలో ఐక్యం కావాలంటే ఈ పరమాత్మ లక్షణాన్ని పుణికి పుచ్చుకోవాలి. అంటే ప్రతిఫలాన్ని కోరకుండా సర్వ భూతాలకు హితం కలిగించేందుకు ప్రయత్నించాలి.**

**4. మాం జ్ఞాత్వా :–** నన్ను తెలుసుకొని, నన్ను అంటే శ్రీకృష్ణునా? కాదు పరమాత్మను. నిరాకార, నిర్గుణ సర్వవ్యాపక, స్వయం ప్రకాశ చైతన్య స్వరూపుడైన పరమాత్మను తెలుసుకోవాలి. తెలుసు కోవటం 2 విధాలు. 1. పరోక్ష జ్ఞానం. 2. అపరోక్ష జ్ఞానం. ఇత రుల వల్ల–అంటే శాస్త్రాల ద్వారా, గురువుల ద్వారా తెలుసు కోవటం పరోక్ష జ్ఞానం. అలా తెలుసుకొన్న విషయాన్ని మనన, నిధిధ్యాసనల ద్వారా సాధనలద్వారా స్థిరపరచుకొని, అనుభవానికి తెచ్చుకోవటం అపరోక్ష జ్ఞానం.

**మనకున్న అశాంతి, సంసార భ్రాంతి అపరోక్షమే. ఎవరూ మనకు బోధించాల్సిన పనిలేదు. ఈ అపరోక్షమైన భ్రాంతిని, అశాంతిని తొలగించుకొనుటకు అపరోక్ష జ్ఞానమే కావాలి.** ఇలా అపరోక్షంగా తెలుసుకుంటే ఏమిటి ఫలితం?

**5. శాంతిం ఋచ్ఛతి :-** శాంతిని పొందుతాడు, భగవంతుని యదార్థ తత్త్వాన్ని తెలుసుకొని, నిరంతరం ఆయననే స్మరిస్తూ ధ్యానిస్తూ, భక్తితో సేవిస్తూ, విచారణ చేస్తే లభించేది పరమ శాంతియే– మోక్షరూప శాంతియే– అని శ్రుతులు ఘోషిస్తు న్నాయి. పరమాత్మను తెలుసుకొని, తలచుకొని తలచుకొని భ్రమర కీటక న్యాయాన్ని అనుసరించి పరమాత్మే అవుతాడు. పరమాత్మ శాంతి సాగరం–

**గద్యం :-** ఓం తత్ సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మ సన్యాస యోగో నామ పంచమోఽధ్యాయః

**ఈ ప్రకారంగా ఉపనిషత్తుల సారమై, బ్రహ్మ విద్యా ప్రతిపాదితమై, యోగ శాస్త్రమై, శ్రీకృష్ణ– అర్జునుల మధ్య జరిగిన సంవాద రూపమైన భగవద్గీత యందు కర్మ సన్యాసయోగమనే ఐదవ అధ్యాయం సమాప్తం.**



# గురుదేవుల పరిచయం

-శ్రీమతి రావూరి అన్నపూర్ణ

**ఓం శ్రీ గురుభ్యోన్నమః**

మానవజన్మ మహోన్నతమైనది, దుర్లభమైనది. అట్టి ఉత్కృష్టమైన మానవజన్మ లభించినప్పటికీ సార్థకం చేసుకొనుట ఎట్లో తెలియక, ఈ సంసార జనన మరణ చక్రంలో దిక్కు తోచక తిరుగాడుతూ గడ్డిపువ్వులా జీవితాన్ని గడిపే నన్ను, తన అశేష ప్రజ్ఞా దురంధరత్వంతో, అపూర్వ వచో విభవంతో, ఆధ్యాత్మిక జ్ఞానామృత వర్షంలో తడిపి, భగవంతుని పాదాలపై సమర్పించబడే పూజాపుష్పంగా తీర్చిదిద్ది, ఈ జన్మకొక సార్థకతను కలిగించిన జ్ఞాన స్వరూపులు, ప్రముఖ వేదాంతోపన్యాసకులు, మహాభారత పరిశోధకులు 'అభినవ వ్యాస', 'జ్ఞాన ప్రపూర్ణ' బిరుదాంకితులు, మా ఆరాధ్య గురుదేవులు శ్రీ చలపతిరావు గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. గురుదేవుల అనుగ్రహం నాపై పుష్కలంగా వర్షించటం వల్లనే సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులకు మాత్రమే సాధ్యమయ్యే వేద వేదాంత సారాన్ని సాధారణ గృహిణినైన నేను తెలుసుకోగలిగాను.

1946 సెప్టెంబరు 12వ తేదీన గుంటూరుజిల్లా తుర్లపాడు గ్రామంలో మా గురుదేవులు జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాథమిక విద్య తుర్లపాడు గ్రామంలోనూ, ఉన్నత విద్య చిలకలూరిపేటలోనూ అభ్యసించి, బాపట్ల వ్యవసాయ కళాశాలనుండి B.Sc.,(Ag) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయసు నుండి 8 సంవత్సరాల వయసు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే







జరిగేది. పూర్వ జన్మసంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంథాలను, పురాణాలు, ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకు పైగా తీవ్రమైన పరిశోధన గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయ మిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994లో ఆధ్యాత్మిక జ్ఞానపీఠాన్ని స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటినుండి ప్రతిరోజూ సత్సంగం, ప్రతినెల గీతాపారాయణలతో పాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్య జయంతి, రమణమహర్షి జయంతి, ఆషాఢ కార్తీక మాఘ, వైశాఖ పౌర్ణమిలయందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వన సమారాధనలు, ధ్యాన తరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోనూ, నిరంతర జపధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌన సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోనూ, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి, మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞానప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించిన బాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైవున్న ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పదిమందికి పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంథాలైన భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేక చూడామణి, దక్షిణామూర్తి స్తోత్రం, అపరోక్షానుభూతి, ఆత్మవిద్యావిలాసం, అద్వైతసారం, శంభునటనం, ఉపదేశసారం, నారద భక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు ఇంకా రామాయణ, భారత, భాగవతములు అలాగే ఈశ, కేన, కఠ, ముండక, కైవల్య, సూర్య, తైత్తిరీయ మొదలగు ఉపనిషత్తులపైనను, ప్రవచనములు చేస్తూ జ్ఞాన సుంగంధాలను నలువైపులా ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ థర్మల్ పవర్‌స్టేషన్,

రాయలసీమ థర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగు చోట్ల 142 ఆధ్యాత్మిక జ్ఞాన యజ్ఞములను చేశారు. 1998లో వి.టి.పి.ఎస్.కాలనీ నందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ముగింపు సందర్భంగా, 2001లో వివేకాచూడామణి ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోనూ; 1999లో భగవద్గీత ముగింపు సందర్భంగా, 2002లో వివేకచూడామణి ముగింపు సందర్భంగా వి.టి.పి.ఎస్ లోనూ శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో వంద జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరమూ కలిసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోనూ, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోనూ గురుదేవులను సత్కరించడం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యే రీతిలో గురుదేవులు **'కర్మసిద్ధాంతం'** అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోనూ, 2008లోనూ, 2009లోనూ, 2013లోనూ పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్ల యజుర్వేదము నందలి **'ఈశావాస్యోపనిషత్తు'** పై అందరికీ అర్థమయ్యేవిధంగా సరళమైన వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యులవారి **'భజగోవిందం'**పై అందరికీ అతిసులభంగా అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యనురాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో, 2013లో పునర్ముద్రణ జరిగినది.

**'భగవద్గీత'** అనగానే అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు అనుకునేవారు. 'భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?' అనుకునేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపజేశారు. ఇప్పుడు 3, 4, 5 అధ్యాయములను ముద్రింపజేస్తున్నారు. భగవాన్‌రమణ మహర్షులు **'ఉపదేశసారము'**నకు విపులమైన వ్యాఖ్యను రాసి ప్రచురింపజేస్తున్నారు.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే ధ్యానమాలిక మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా







ప్రచురిస్తున్నారు. ఇక దేశ విదేశాలలో నన్ను తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్‌సైట్‌ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్‌లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంథాలపై గురుదేవుల ప్రవచనాలను సి.డి.ల రూపంలోనూ, వీడియో డి.వి.డి.ల రూపంలోనూ అందిస్తున్నారు.

ముందు ముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గనిర్దేశనం చేయగల ఎన్నో గ్రంథాలు ముముక్షు జనావళిని తరింపజేయుటకు అందుబాటు లోనికి రావాలని అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్థులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాను.

జ్ఞానసూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్థంగా తన సేవలనందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదిక ధర్మాన్ని ప్రచారం చేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ, మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్ర వందనములు సమర్పించుకుంటున్నాను.

ఇట్లు

**రావూరి అన్నపూర్ణ**

**కార్యనిర్వాహక అధ్యక్షులు**

**ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట**



# హృదయ స్పందన

**శ్రీమతి వి. జయలక్ష్మి** M.Tec., Ph.D.
ప్రొఫెసర్,
MIC కాలేజ్ ఆఫ్ టెక్నాలజీ, కంచికచర్ల.

## ఓం నమోభగవతే వాసుదేవాయ

ఈ ప్రపంచంలో ఎన్నో లౌకిక విద్యలున్నాయి. వాటిని నేర్పే అధ్యాపకులు ఎందరో ఉన్నారు. ఈ లౌకిక విద్యలన్నీ ఇహలోక జీవనానికి ఉపయోగపడేవేగాని ప్రతి మానవుడి జీవిత పరమ లక్ష్యమైన మోక్షధామాన్ని చేర్చటానికి ఉపయోగపడవు. మోక్షధామాన్ని చేర్చేది ఒక్క 'బ్రహ్మ విద్య' మాత్రమే. అట్టి బ్రహ్మవిద్యను బోధించే గురువులు లోకంలో అతికొద్ది మంది మాత్రమే ఉంటారు. అట్టివారిలో మా గురుదేవులు శ్రీ చలపతిరావుగారు ప్రముఖంగా పేర్కొనదగినవారు. వారు బ్రహ్మజ్ఞానులు, నిరాడంబరులు, నిగర్వి, శిష్యులందరితో స్నేహభావంతో మెలగుతూ అవసర సమయాలలో తగిన సలహాలను, సూచనలను ఇస్తూ శిష్యుల ఆధ్యాత్మికోన్నతికి తోడ్పడుతూ ఉంటారు.

భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాంత ప్రకరణ గ్రంథాలు, ప్రత్యేకించి మహాభారతంపై ఎంతో పరిశోధన గావించి, విషయాలను అవగాహన చేసుకొనుటయేగాక సామాన్యులు కూడా ఎంతో సులువుగా అర్థం చేసుకోగలిగే విధంగా బోధించటం మా గురుదేవుల ప్రత్యేకత. నిత్య జీవితంలో ఆచరణకు ఉపయోగపడే విధంగా అనేక అద్భుతమైన ఉపమానాలతో, ఉదాహరణలతో,







ఎంతో క్లిష్టమైన ఆధ్యాత్మిక విషయాలను సరళమైన పదాలతో అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగా మా గురుదేవులు చేసిన బోధలు మా మనస్సులలో ఇప్పటికీ మెదులుతూనే ఉన్నాయి.

నా పూర్వజన్మ సుకృతం వల్ల, భగవంతుని అనుగ్రహం వల్ల నా 20 ఏళ్ళ వయస్సులోనే విద్యార్థినిగా ఉన్నప్పుడే గురుదేవుల దర్శనభాగ్యం నాకు లభించింది. భగవద్గీత, భజగోవిందం, తత్త్వబోధ, ఈశావాస్యోపనిషత్ మొదలైన గ్రంథాలపై గురుదేవుల అనర్గళ ప్రవచనాలను శ్రవణం చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను.

**"మనం కష్టాలు వచ్చినప్పుడు క్రుంగిపోరాదు; మన పాపపు మూట తరిగిపోతున్నది గదా! అని సంతోషించాలి. అలాగే సుఖాలు వచ్చినప్పుడు పొంగిపోరాదు; మన పుణ్యరాశి తరిగిపోతున్నదే అని జాగ్రత్తపడాలి. ఇలా మనం స్థితప్రజ్ఞత సాధించాలి"** అని ఆనాడు చేసిన బోధ నా హృదయంలో ముద్రించబడి, ఈనాటికీ నా జీవితంలో ఎంతో ప్రయోజనకారిగా ఉంటున్నది.

ఈ భగవద్గీత గ్రంథ ముద్రణతో మా గురుదేవులు చేసిన విశేషకృషి, ఆయన బోధలు ఎందరికో మార్గదర్శకం కాగలవని ఆశిస్తూ వారి ఆశీస్సులు నాకు ఎల్లప్పుడూ లభించాలని కోరుకుంటూ వారి పాదపద్మాలకు నమస్కరిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

**– వి. జయలక్ష్మి**





# మధురానుభూతి

**రావికింది పుష్పావతి**
డైరెక్టర్, ఇన్నర్‌వీల్ క్లబ్, చిలకలూరిపేట.
కార్యవర్గ సభ్యులు,
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం.

**ఓం శ్రీగురుభ్యోన్నమః**

*నేను 15 సం॥ల నుండి పూజ్య గురుదేవుల నాశ్రయించి నిత్యము వారి బోధలను వింటూ, వారు చూపిన మార్గంలో ప్రయాణిస్తున్నాను. నేను పెద్దగా చదువుకోనప్పటికీ భగవద్గీత శ్లోకాలనుగాని, ఉపనిషత్తులలోని మంత్రాలనుగాని అవలీలగా చదువగలుగుతున్నానంటే అదంతా మా గురుదేవుల చలువయే. గురుదేవులు బోధించే ఆధ్యాత్మిక జ్ఞానం, ఉపనిషత్తుల జ్ఞానం అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు - కాదు కాదు - నోటిలో పెట్టినట్లు ఎంతో సులభంగా, నాలాంటి వారికి కూడా చక్కగా అర్థమయ్యేటట్లు ఉండటం వల్లనే ఈ సత్సంగమనే స్వర్గంలోకి ఒక్కరోజు అడుగు పెట్టలేకపోయినా ఏదో పోగొట్టుకున్నట్లుగా రోజంతా బాధపడవలసి వస్తున్నది. ఈ సత్సంగం, గురుదేవుల ద్వారా పొందిన మహామంత్ర జపం నాకు జీవనాధారం.*

*భగవద్గీతలోని 700 శ్లోకాలను 3 సం॥ల 3 నెలల పాటు ఏకధాటిగా ప్రవచనములుచేసి మా గురుదేవులు గీతాజ్ఞానాన్ని మాకు అందించారు. అలా శ్రవణంచేసి మేము పొందిన మధురానుభూతిని అందరూ పొందితే ఎంత బాగుంటుందో గదా! అని ఎప్పుడూ మనస్సులో భావన మెదులుతూ ఉంటుంది. ఇప్పుడీ భగవద్గీత గ్రంథ ప్రచురణ ద్వారా మా కోరిక నెరవేరబోతున్నందుకు చాలా ఆనందంగా ఉన్నది. ఈ రెండు అధ్యాయాల గ్రంథం చదివినవారు మిగతా అధ్యాయాల కొరకు ఎదురు చూస్తారనటంలో అతిశయోక్తిలేదు. భగవద్గీతపై ఇది విపులమైన, సులభశైలిలో అందించబడిన వ్యాఖ్యానం. ఇది తెలుగు మాట్లాడే వారందరికి ఎంతో ఉపయోగపడగలదని నా నమ్మకం. ఈ గ్రంథాన్ని, ఇందులోని ప్రతి శ్లోకం యొక్క భావాన్ని చక్కగా గ్రహించి, జ్ఞాన మార్గంలో ప్రయాణించగలరని ఆశిస్తూ, ఇంకా మిగిలిన అధ్యాయాలపై వ్యాఖ్యను త్వరలో ప్రచురింప జేయగలందులకు మా గురుదేవులను భగవంతుడు ఆశీర్వదించాలని కోరుకుంటూ...*

**- ఆర్. పుష్పావతి**









# ఆనందానుభూతి

**శ్రీమతి అరవపల్లి బేబీ కుమారి**
ఉపాధ్యక్షులు,
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

**శ్రీ గురుభ్యోన్నమః**

నేను సుమారు 10 సం॥ ల నుండి గురుదేవుల సత్సంగానికి హాజరై ప్రవచనాలను వింటూ కార్యక్రమాలలో పాల్గొంటూ ఎంతగానో ఆనందిస్తున్నాను. గురుదేవులనుండి మహామంత్రాన్ని స్వీకరించి జప, ధ్యానాలతోబాటు సాధనలు చేస్తూ ఆధ్యాత్మిక జీవితాన్ని గడుపుతున్నాను. ఇది నా జీవితంలో ఏనాడూ ఊహించని అద్భుతమైన, ఆశ్చర్యకరమైన, ఆనందప్రదమైన మార్పును తీసుకొని వచ్చింది. ఇది నా జన్మ జన్మల సుకృతం కారణంగా లభించిన అదృష్టమని భావిస్తున్నాను. గురుదేవుల ప్రవచనాలు వింటుంటే అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగ వుంటున్నది. అతి సులభమైన భాషలో, చక్కని ఉపమానాలతో, మా బుద్ధి స్థాయిలోనికి దిగి, వచ్చి చేస్తున్న ఈ భగవద్గీత ప్రవచనాలు. ఇతర ప్రదేశాలలోని సాధకులకు అందుబాటులోనికి రావటం నాకు ఎంతో ఆనందంగా వుంది. మిగిలిన అధ్యాయాలు కూడా త్వరలో ప్రచురించబడాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

మోక్షమార్గంలో ప్రయాణిస్తున్న మా అందరిపై గురుదేవుల కృపా కటాక్ష వీక్షణాలు నిరంతరం ప్రసరించాలని, మా ఆధ్యాత్మిక ప్రగతికి ఇకముందు కూడా తోడ్పడి, మా జీవితాలకు సార్థకత కలిగించాలని ఆశిస్తూ... గురుదేవులకు కృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

**- ఎ. బేబీకుమారి**



# ఆకాంక్ష

**శ్రీమతి నల్లమల్లి పద్మజ**
ప్రధాన కార్యదర్శి,
ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

**శ్రీ గురుభ్యోన్నమః**

నేను గత 20 సం॥ల నుండి గురుదేవుల ప్రవచనాలను శ్రవణం చేస్తూ.. ఆధ్యాత్మిక జ్ఞానపీఠం నిర్వహించే అన్ని కార్యక్రమాలలోనూ పాల్గొంటు గురుదేవుల అనుగ్రహాన్ని పొందగలిగాను.

గత 8 సం॥లుగా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం ప్రధాన కార్యదర్శిగా నియమింపబడి అందరి మన్ననలను చూరగొంటున్నాను. గురుదేవుల ద్వారా మహామంత్రాన్ని స్వీకరించి జప, ధ్యాన, సాక్షీభావన, ఆత్మవిచారణ, సమాధి అభ్యాసం మొ॥న సాధనలు చేస్తూ నా జీవితాన్ని భగవంతుని పాదాల చెంత పూజా పుష్పంగా సమర్పించుకోగలగటం నా జన్మ జన్మల సుకృత ఫలంగా భావిస్తున్నాను.

ఇప్పటికి 160 ఆధ్యాత్మిక జ్ఞాన యజ్ఞాలను నిర్వహించిన గురుదేవులు ఇంకా అనేక జ్ఞాన యజ్ఞాల ద్వారా జ్ఞాన సుగంధాలను దశదిశలా ప్రసరింప చేయాలని, శిష్యులమైన మాకు మార్గనిర్దేశనం చేస్తూ మమ్ము మోక్షమార్గం వైపు నడిపించగలరని నా ఆకాంక్ష.

ఇంతవరకూ కర్మసిద్ధాంతం, భజగోవిందం, ఈశావాస్యోపనిషత్తు, భగవాన్ రమణమహర్షుల ఉపదేశసారం, భగవద్గీత, 1, 2, అధ్యాయములను ప్రచురింపజేసిన మా గురుదేవులు ఇప్పుడు 3, 4, 5 అధ్యాయముల భగవద్గీతను ప్రచురింపజేయడం నాకెంతో ఆనందంగా వున్నది. మొత్తం 18 అధ్యాయాల భగవద్గీత ప్రచురింపబడాలని, దానికి తెలుగువారంతా చదివి తమ జీవితాలను సార్థకం చేసుకోవాలని నా ప్రగాఢ ఆకాంక్ష.

గురుదేవుల కృపా కటాక్ష వీక్షణాలు నాపై ఇలాగే ప్రసరింపజేయాలని కోరుకుంటూ వారి పాదపద్మాలకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను.

– ఎన్. పద్మజ







**భగవద్గీత, ఉపనిషత్తులు, భాగవతం, ఉపదేశసారం, ఆత్మవిద్యా విలాసం, దక్షిణామూర్తి స్తోత్రం మొ॥న అనేక గ్రంథాలపై పాటలను రచించటంతోపాటు ఆధ్యాత్మిక జ్ఞానపీఠం కార్యక్రమాల రూపకల్పనలో, నిర్వహణలో, శిష్యులకు మార్గదర్శకులై ముందుండి నడిపిస్తున్నవారు.**



**గురుపత్ని**
**శ్రీమతి దేవిశెట్టి మాధవి గారు**

# శ్రీమద్భగవద్గీత :6 వ అధ్యాయం

# ఆత్మసంయమయోగం



: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**


**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడుగ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాథమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మసంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంథాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంధాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002, 2008, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యులవారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము"నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యులవారి 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం', 'ఆత్మబోధ' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3, 4, 5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015లో భగవద్గీత 6 నుండి 17 అధ్యాయములు ప్రచురింపచేశారు. ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు , భగవద్గీత 18 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే ***ధ్యానమాలిక*** మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా *ఆధ్యాత్మిక జ్ఞానపీఠం* కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను,

భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

ఈ సంసారం ఒక నల్లుల మంచం లాంటిది. నల్లుల మంచం మీద పడుకున్న వాడెవడైనా సుఖంగా నిద్రపోగలుగుతాడా? అలాగే ఈ సంసారంలో పడినవాడెవ్వడూ సుఖంగా, ఆనందంగా ఉండలేడు. అప్పుడప్పుడూ తాత్కాలికంగా కొన్ని సుఖాలు అనుభవించినా, నిరంతరం దుఃఖాలు, బాధలు, అలజడులు, ఆందోళనలు తప్పవు. ఈ దుఃఖాల నుండి పూర్తిగా తొలగిపోవాలంటే ప్రాపంచిక విషయాలకు, వ్యామోహాలకు దూరం కావాలి. పరమాత్మ వైపుకు తిరగాలి. అంటే ప్రపంచం వైపుకు తిరిగావా? దుఃఖం. పరమాత్మ వైపుకు తిరిగావా? ఆనందం.

చేపలు పట్టడానికి జాలరి వల విసురుతాడు. చేపలు వల వైపుకు పరుగులు తీశాయా? అవి వలలోపడిపోయి ప్రాణాల మీదకు తెచ్చుకుంటాయి. అలాకాక వల విసిరిన వాడి పాదాల వైపుకు వచ్చాయా? వలలో పడవు, ప్రాణాలు పోవు. తిరగలిలో గింజలు వేసి విసురుతుంటే బొడ్డు దగ్గరకు చేరిన గింజలు అలాగే ఉంటాయి. కాని దూరంగా జరిగిపోయిన గింజలన్నీ పిండి పిండి అయిపోతాయి. అందుకే ఈ సంసారంలోకి వచ్చి పడిన మనం ప్రపంచం వైపుకు తిరిగితే అనంతమైన దుఃఖం. అదే పరమాత్మవైపుకు తిరిగితే అఖండమైన ఆనందం.

మృత్యువు నుండి తప్పించుకోవటానికి మార్కండేయుడు శివలింగాన్ని కౌగిలించుకున్నాడు. కాని మనం ఈ శరీరమనే శవాన్ని కౌగిలించుకుం టున్నాం. శవాన్ని కౌగలించుకుంటే దుఃఖం, శివాన్నికౌగిలించుకుంటే సుఖం.

అంటే - దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యం దుఃఖం, పరమాత్మతో తాదాత్మ్యం సుఖం - అని.

సముద్రం నుండి వేరుపడిన ఉప్పుగల్లు ఎన్నో ప్రదేశాలు తిరుగుతుంది. ఎందరి చేతుల్లోనో పడుతుంది. ఎన్నో రూపాలు మారుతుంది. ఎందరో రోటిలో వేసి నలగ పొడుస్తారు. రోకలితో దంచుతుంటే ఎగిరెగిరి పడుతుంది. మళ్ళీ చేతితో రోటిలోకి త్రోసి రోకలి దెబ్బ వేస్తారు. నలిగి పొడిపొడి అయిపోతుంది. దానికి ఆ బాధ తొలగాలంటే అది తిరిగి తన స్వస్థానమైన సముద్రాన్ని (నీటిని) చేరాలి. అంతే. అన్ని బాధల నుండి విముక్తి. అలాగే పరమాత్మ నుండి వేరుపడి ఈ లోకంలోకి జారిపడ్డ మనం ఎన్నెన్నో జన్మలెత్తుతూ, ఎన్నెన్నో ప్రదేశాలలో తిరుగుతూ, ఎన్నెన్నో కష్టాలను, బాధలను, దుఃఖాలను అనుభవిస్తూ ఎగిరెగిరి పడుతుంటాం, ఏడుస్తుంటాం తప్పించుకో వాలని ఎంత గిలగిలలాడినా ప్రకృతి (వాసనలు) మనను మళ్ళీ మళ్ళీ ఈ సంసార జననమరణచక్రంలో తిప్పుతుంది. ఈ బాధల నుండి శాశ్వతంగా తప్పించుకోవాలంటే తిరిగి మన స్వస్థానమైన పరమాత్మను చేరుకోవాల్సిందే. అప్పుడిక ఆనందమే ఆనందం.

అయితే మనం మనస్వస్థానమైన పరమాత్మను చేరుకోవాలంటే ముందు పరమాత్మ వైపుకు తిరగాలి. అలా తిరగటమే భక్తియోగం. మరి మనం పరమాత్మ వైపుకు తిరిగి ఉంటామా? లేదు. ప్రపంచం వైపుకే తిరిగి ఉంటాం. ధనం, సంపదలు, పదవులు, కీర్తిప్రతిష్ఠలు, భోగాలు అనుభవించాలనే కోరికతో ఎప్పుడూ దృష్టి ప్రపంచం వైపుకే ఉంటుంది. లౌకిక విషయాలకే మనస్సు

ప్రాధాన్యత నిస్తుంది. అలాంటి మనస్సును లౌకిక విషయాల నుండి మరల్చి పరమాత్మవైపుకు త్రిప్పాలి. మనస్సును లౌకిక విషయాల నుండి మరల్చి శుద్ధి చేయాలంటే దానికి నిష్కామకర్మయోగమే చక్కని ఉపాయం. అందుకే 3వ అధ్యాయంలో నిష్కామకర్మయోగాన్ని చెప్పి, దానిని ఎలా తెలివితో ఆచరించాలో 4వ అధ్యాయంలో చెప్పి, ఆ కర్మల యొక్క కర్తృత్వాన్ని విడిచి కర్మసన్యాసాన్ని సాధించటం ఎలాగో 5వ అధ్యాయంలో చెప్పటం జరిగింది. ఇప్పుడు మనస్సు కర్మరంగం నుండి దూరంగా తొలగి నిర్మలము, నిశ్చలము అవుతుంది. అయితే అంత మాత్రంతో సరిపోదు. ఈ నిర్మలమైన మనస్సు తిరిగి కర్మరంగం వైపుకు పరుగులు తీయకుండా భగవంతుని వైపుకు త్రిప్పే ప్రయత్నం చేయాలి. అది ఎలాగో తెలియజెప్పే అధ్యాయమే ఈ ఆత్మసంయమయోగం. అంటే ఈ యోగం ఇంతకుముందు చెప్పిన కర్మయోగాన్ని - ఇకముందు చెప్పబోయే భక్తియోగానికి లంకె పెడుతుందన్నమాట.

ఈ అధ్యాయం పేరు ఆత్మ సంయమ యోగమే అయినా దీనికి ఇంకా చాలా పేర్లు వాడుకలో ఉన్నాయి. ధ్యానయోగం, అభ్యాసయోగం, ఆధ్యాత్మ యోగం, ఆత్మయోగం, సంయమయోగం, స్వరూపయోగం - అని. భగవద్గీతలో ఇది చాలా ముఖ్యమైన అధ్యాయం. గంగానది పుట్టినచోటి నుండి సముద్రంలో కలిసేంతవరకు అంతా పవిత్రమైనదే. అయినా కాశీ, అలహాబాద్ వంటి కొన్ని కొన్ని ప్రదేశాలలో ప్రత్యేకమైన తీర్థక్షేత్రంగా, పవిత్రమైనదిగా భావిస్తుంటాం. అలాగే భగవద్గీత మొత్తం గొప్ప విశిష్ఠత కలిగినదే అయినా కొన్ని కొన్ని అధ్యాయాలలో మరింత విశిష్ఠతను సంతరించుకున్నది. అట్టి

విశిష్టమైన అధ్యాయాలలో ఈ ఆరవ అధ్యాయం ఆత్మసంయమయోగం ఒకటి.

వర్షంలో ప్రయాణించేవాడికి గొడుగు ఎంతఅవసరమో మోక్షమార్గంలో ప్రయాణించేవాడికి ఈ గీతాశాస్త్రం అంత అవసరం. అయితే ఎక్కడకు ప్రయాణంచేయాలో గమ్యస్థానం తెలియాలి. గమ్యం తెలియకుండా ప్రయాణించేవాణ్ణి పిచ్చివాడంటారు.

ఒకడు పెట్టే బేడా సర్దుకొని రైల్వేస్టేషన్ కు వచ్చి రైలులో కూర్చున్నాడు. ఇతడి హడావిడి చూసి ప్రక్కనున్న ప్రయాణీకుడు టికెట్టు తీసుకున్నావా? అని అడిగాడు. 'మరచిపోయానండీ' అన్నాడు. 'పోనీ ఇప్పుడైనా తెచ్చుకో, టైముందిలే' అన్నాడు ప్రక్క ప్రయాణీకుడు. 'ఎక్కడకు వెళ్ళాలో తెలియదండీ' అన్నాడు మనవాడు. ఇక అతడి ప్రయాణం ఎలా సాగుతుంది? ఇదే గమ్యం తెలియని ప్రయాణం, పిచ్చివాడి ప్రయాణం. కనుక మన జీవితానికి గమ్యం ఏమిటో ముందుగా తెలుసుకోవాలి. ప్రయాణం ప్రారంభించిన తర్వాత కాదు, ప్రయాణానికి ముందే నిర్ణయించుకోవాలి.

ఒకవేళ నీ ప్రయాణం ఎక్కడికో నీకు తెలియకపోతే తెలుసుకో. జ్ఞానులనడుగు, శాస్త్రాలనడుగు, ఉపనిషత్తులనడుగు లేదా భగవద్గీతనడుగు. వారు చెబుతారు నీ గమ్యస్థానం ఏమిటో, ఆ గమ్యాన్ని చేరే మార్గం ఏమిటో! మరి మన గమ్యస్థానం ఏమిటి? ఉపనిషత్తుల నడుగుదాం.

నదులకు గమ్యస్థానం ఏది? గంగానది ఎక్కడకు చేరాలని పరుగులు తీస్తున్నది? యమునానది, కృష్ణానది, గోదావరి, కావేరి, పెన్నా - ఇవన్నీ

ఎక్కడకు వెళ్ళాలని అనేక వంపులు తిరుగుతూ, వయ్యారంగా పరుగులు పెడుతున్నాయి? అడుగుదామావాటిని? ఓ నదీమతల్లీ! ఎక్కడికి నీ ప్రయాణం? అంటే "నా గమ్యస్థానం సముద్రం. అక్కడికే నేను త్వరగా చేరాలి" అంటున్నది మౌనభాషలో. గంగ, కృష్ణా, గోదావరి, కావేరి, పెన్న, యమున - దేనినడిగినా అంతే. మౌనంగా చెప్పేది ఇదే సమాధానాన్ని. ఎందుకని?

ఎందుకంటే ప్రపంచంలోని ఏ నదైనా సరే అక్కడకు చేరితేనే శాంతి - విశ్రాంతి.

అక్కడకు చేరితేనే దాని ప్రయాణం పూర్తవుతుంది. అలా సముద్రుని వద్దకు చేరకపోతే మురిగి కంపు కొడుతుంది. సముద్రాన్ని చేరేదాకా వాటికి ప్రత్యేకమైన పేరు - రూపం ఉంటుంది. సముద్రుణ్ణి చేరి అందులో కలిసి పోయిందా ఇక నామ (పేరు) రూపాలుండవు. సముద్రాన్ని చేరిన తర్వాత గంగ గంగ కాదు, కృష్ణ కృష్ణ కాదు, గోదావరి గోదావరి కాదు. అన్నీ ఒక్కటే. సముద్రం. నదులన్నీ తమ అస్థిత్వాన్ని కోల్పోయి సముద్రాకారంగా మారి పోతాయి. తిరిగి సముద్రం నుండి ఆ నదులేవీ బయటకు వచ్చే వీలులేదు. అప్పుడే నదులు పరుగులు ఆగి ప్రశాంతమయ్యేది.

మరి జీవుల గమ్యస్థానం ఏది? ఓ మానవుడా? నీ పేరేమి? ఊరేది? నీవు ఎక్కడినుండి వచ్చావు? కుత ఆయాతః? "నేను గుంటూరు నుండి వచ్చాను. తెనాలి నుండి వచ్చాను. విజయవాడ నుండి వచ్చాను. చెన్నై నుండి వచ్చాను." అబ్బే ఇవన్నీ దేహానికి సంబంధించినవి. నేనడిగేది దేహాన్ని గురించి కాదు. దేహాన్ని ధరించిన జీవుడి గురించి, జీవుడి యొక్క స్వస్థానం ఏది? ఈ దేహం

మధ్యలో వచ్చింది. మధ్యలోనే పోతుంది. కాని జీవుడో! అది నా స్వరూపమే. నా అంశయే - "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" - సనాతనమైన నా అంశయే జీవలోకంలో జీవుడిగా మారింది - అని భగవద్గీతలో భగవానుడు చెబుతున్నాడు. కనుక జీవుని యొక్క స్వస్థానం పరమాత్మయే. పరమాత్మ నుండే జీవుడు ప్రయాణం సాగించి అనేక జన్మలెత్తుతూ ఈ భూమిపైకి వస్తూ పోతూ ఉన్నాడు. అయితే చివరకు చేరుకోవలసిన స్థానం ఆ పరమాత్మ స్థానమే. అక్కడకు చేరుతేనే శాంతి. ప్రశాంతి. అప్పటిదాకా ఈ ఉరుకులు, పరుగులు తప్పవు. మరి ఆ పరమాత్మను చేరుకోవటం ఎట్లా?

"నేనెవరిని" అని ప్రశ్నించుకొని, "ఈ నామరూపాలతో కూడిన దేహాన్ని నేను కాదు; సత్యమై, జ్ఞానస్వరూపమై, ఆనందస్వరూపమైన ఆత్మను నేను" అని ఎవరైతే తెలుసుకొని అట్టి ఆత్మగాఉండిపోతారో అతడే పరమాత్మను చేరుకొనే విద్వాంసుడు.

జీవుడియొక్క గమ్యస్థానం తెలిసింది. ఇక ఆ గమ్యాన్ని చేరుకొనే మార్గం తెలియాలి. సరైన సాధనం కావాలి. ఆ మార్గాన్ని - ప్రయాణ సాధనాన్ని తెలియజేసేదే ఈ 6వ అధ్యాయం. మార్గం చక్కగాఉంటే గమ్యాన్ని సులభంగా చేరవచ్చు. రోడ్డు చక్కగా గతుకులు లేకుండా ఉంటే బస్సును ఎంత స్పీడ్ గానైనా నడపవచ్చు. తుపాను తాకిడికి దెబ్బతిన్న గతుకుల రోడ్డుమీదనైతే ప్రయాణం చాలాకష్టం. ఒళ్ళు హూనమైపోతుంది. మరి మన గమ్యస్థానాన్ని మనం ఎప్పుడు చేరుకోవాలి? ఎప్పుడో ఒకప్పుడు చేరుకుందాంలే! అనే నిర్లక్ష్యం పనికిరాదు. 'ఈ జన్మలో మనకు కుదరదులే! వచ్చేజన్మలో

చూసుకుందాం అనే అలసత్వం పనికిరాదు. 'ఆలస్యం అమృతం విషం' అన్నారు. 'శుభస్య శీఘ్రం' అనుకుంటూ త్వరపడాలి. తర్వాత తర్వాత అంటే ఎన్ని ఆటంకాలు వస్తాయో! అసలు మానవజన్మ వస్తుందో రాదో! వర్తమానం మన చేతుల్లో ఉంది గాని, భవిష్యత్తు మన చేతుల్లో ఉండదు కదా! కనుక దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. శరీరంలో ఓపిక, ఆయుష్కాలం ఉన్నప్పుడే మోక్షమార్గంలో ప్రయాణించాలి. మనుష్య జన్మ మోక్షానికి ద్వారం వంటిది. మాటిమాటికి రమ్మంటే రాదు ఈ మానవజన్మ. వచ్చినప్పుడే సద్వినియోగం చేసుకోవాలి. సోమరిపోతుకు ఇహమూ లేదు, పరమూ ఉండదు.

ఎడమచేయి సోమరి. ఏ పనిచేయాలన్నా అదిగో కుడిచేయి ఉందిగదా! అని అన్నింటికీ దాన్నే ముందుకునెట్టి అది తప్పుకుంటుంది. వెనక్కుపోతుంది. అందుకే భగవంతుడు దానికొక ప్రత్యేకమైన పనిని అప్పగించాడు. ఆ పని పాకీ పని. ఆ పాకీ పనిని అదే చెయ్యాలి. ఈ గుణపాఠాన్ని ప్రతివాడూ గుర్తుంచు కోవాలి. సోమరితనానికి బద్ధకానికీ స్వస్థి చెప్పి, పరమార్థాన్ని సాధించటానికి ముందుకు ఉరకాలి.

అయితే ఎప్పటికి మన గమ్యం చేరతాం? అనే నిరాశకూడదు. ఢిల్లీ వెళ్ళాలి. ఎద్దుల బండిలో అయితే 4 నెలలు పడుతుంది. గుర్రపుబండిలో 2 నెలలకు చేరతావు. కారులో బయలుదేరితే వారంలో చేరవచ్చు. రైల్లో అయితే రెండు రోజుల్లో వెళ్ళవచ్చు. అదే విమానమైతే 2 గంటలు చాలు. కనుక మన గమ్యస్థానం ఎంతదూరంలో ఉన్నది అనేది ముఖ్యం కాదు. ఆ దూరాన్ని అధిగమించటానికి మనం ఏ ప్రయాణసాధనాన్ని ఎన్నుకోవాలి? అనేదే ముఖ్యం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'ఎంత దూరమైనా సరే క్షణంలో చేరుకోవచ్చు గురుకృప ఉంటే' అన్నాడు కబీర్ దాస్. అక్కడ ఢిల్లీ ప్రయాణానికి ఎద్దుబండి, కారు, రైలు, విమానం లాగా ఇక్కడ మన స్వస్థానాన్ని చేరుకోవటానికి కర్మ, ధ్యాన, భక్తి, జ్ఞాన అనే మార్గాలున్నాయి. జ్ఞానమార్గం విమానప్రయాణం వంటిది. ఇది శ్రేష్ఠమైన సాధనం. అందుకే "నహిజ్ఞానేన సదృశం పవిత్రం" - జ్ఞానంతో సమానమైన పవిత్రమైనది మరొకటి లేదు - అని, 'జ్ఞానప్లవేన' - జ్ఞానమనే పడవతో ఈ సంసార సాగరాన్ని దాటాలి - అని; 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం' - జ్ఞానమనే అగ్నిలో సర్వకర్మ బంధనాలు దగ్ధమౌతాయని భగవద్గీత అనేక సందర్భాలలో జ్ఞానాన్ని ప్రశంసించటం జరిగింది.

సరే జ్ఞానమార్గం శ్రేష్ఠమైనదని తెలుసుకున్నాం. ఈ జ్ఞానాన్ని పొందటం ఎలా? జ్ఞానాన్ని పొందాలంటే రెండు రకాల సాధనలున్నాయి. అవి 1.బహిరంగ సాధన, 2.అంతరంగ సాధన.

1.బహిరంగసాధన అంటే నిష్కామకర్మయోగం. భగవద్గీతలో 3, 4, 5 అధ్యాయాల విషయం అంతా ఇదే కర్మయోగం చేస్తూ చేస్తూ, కర్తృత్వాన్ని వదలి కర్మసన్యాసం అనే సాధనలో ఆరితేరాలి. అప్పుడే మనస్సు నిర్మలమై శుద్ధమై ఏకాగ్రమవుతుంది. దానితో ఈ కర్మల గోల, కోరికల గోల వదిలి పోతుంది.

2.అంతరంగసాధన అంటే నిర్మలము, శుద్ధము, ఏకాగ్రము అయిన మనస్సును పరమాత్మ ధ్యానంలో నిలపటమే. దీనిని ధ్యాన యోగము, లేదా ఆత్మసంయమ యోగము అని చెప్పటం జరిగింది. ఈ ధ్యానయోగాన్నే 'నిధిధ్యాసన' అన్నారు.

వేదాంత శాస్త్రాలను గురువు ద్వారా వినటం శ్రవణం. విన్న విషయాలను మళ్ళీ మళ్ళీ గుర్తుతెచ్చుకోవటం మననం. ఆ విషయాలను నిరంతరం ధ్యానించి అనుభవంలోకి తెచ్చుకోవటం నిధిధ్యాసన. ఈ నిధిధ్యాసన వల్ల -

1) ఈ శరీరం నేను అనే విపరీత భావన తొలగిపోతుంది.

2) ఈ ప్రపంచం సత్యం అనే పొరపాటు భావన తొలగిపోతుంది.

3) నేను ఆత్మను అనే దృఢ నిశ్చయం కలుగుతుంది.

ఈ ప్రకారంగా ధ్యానయోగం ద్వారా బ్రహ్మజ్ఞానం సిద్ధించే విధానం - ఉపాయం ఈ ఆరవ అధ్యాయంలో వివరించబడుతుంది. సంయమం అంటే నిగ్రహించటం. ఆత్మసంయమం అంటే ఆత్మను నిగ్రహించటమా. ఆత్మ సంయమం అంటే ఆత్మను నిగ్రహించటం కాదు. అంతఃకరణాన్ని - మనస్సును నిగ్రహించటం. ఒకచోట నిలవకుండా పరుగులు తీసే మనస్సును ఒకే ఒక్క సత్యవస్తువుపై ఏకాగ్రం చేసి నిలపటమే ఆత్మసంయమయోగం. అలా మనస్సుకు తర్ఫీదు నిచ్చేదే ఈ అధ్యాయం. ఇక అధ్యాయంలో ప్రవేశిద్దాం.

మనస్సును భగవంతునిపై నిల్పాలంటే, ఏకాగ్రం చెయ్యాలంటే మనస్సు నిర్మలం కావాలి. అలా కావాలంటే ముందు ప్రాపంచిక విషయాలపై నుండి మనస్సు వెనుకకు మరలాలి. చివరకు కర్మసన్యాసం చేయాలి. ఇంతకీ సన్యాసి అంటే ఎవరు? కాషాయవస్త్రాలు ధరించిన వాడా? సర్వసంగ పరిత్యాగియా? కర్మలను వదిలినవాడా? సన్యాసి - యోగి - ఇద్దరూ వేరా? ఒక్కరా? అనే సందేహాలను తొలగిస్తూ, భగవానుడు బోధ ప్రారంభిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో|| అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః|**
**స సన్న్యాసీచ యోగీచ న నిరగ్నిర్న చాక్రియః|| (1)**

**తా||** భగవానుడంటున్నాడు: ఎవరైతే కర్మఫలంపై ఆసక్తి లేకుండా చేయదగిన కర్మను చేస్తాడో అతడే సన్యాసి. అతడే యోగి. అగ్నిహోత్రాన్ని, కర్మలను విడచినవాడు కాదు.

**వ్యాఖ్య:-** హిందూ ధర్మశాస్త్రం నాలుగు ఆశ్రమ ధర్మాలను విధించింది. అవి -

1.బ్రహ్మచర్యం:- ఒక గురువును ఆశ్రయించి విద్యాభ్యాసం చెయ్యటం ఈ బ్రహ్మచర్యాశ్రమ ధర్మం.

2.గృహస్థం:- ధనాన్ని సంపాదిస్తూ కుటుంబాన్ని, ఆశ్రితులను పోషిస్తూ; సమాజానికీ, దేశానికీ, మూగజీవాలకు ఉపయోగపడటం; గురువులను, సాధు సన్యాసులను సేవించటం, నిత్యం అగ్నిహోత్రంతో దేవతలను, పితృదేవతలను సంతోషపెట్టటం. గృహస్థాశ్రమధర్మం.

3.వానప్రస్థం:- తన ఇంటికి, తన వారికి దూరంగా ఉంటూ, సాధనలు చేసుకుంటూ, అవసరమనిపించినప్పుడు తనవారిని కలుస్తూ సాయపడుతూ ఉండటం వానప్రస్థాశ్రమ ధర్మం.

4.సన్యాసం:- తనవారు పరవారు అనే భేదం లేకుండా, ఎవరితోను సంబంధ బాంధవ్యాలు లేకుండా, సమస్త కర్మలను విడిచిపెట్టి; అగ్నిహోత్రాన్ని విడిచిపెట్టి భిక్షాన్నంతో జీవించాలి. అగ్నిహోత్రాన్ని వదలమంటే గృహాన్ని, భార్యా బిడ్డలను, సంపదలను, సమస్తాన్ని విడిచిపెట్టటమే. ఇదే సన్యాసాశ్రమ ధర్మం.

ఈ నాలుగు ఆశ్రమధర్మాలను గురించి అర్జునునికి తెలుసు. కనుక "సన్యాసి అంటే అగ్నులు వదిలినవాడు అని అనుకుంటావేమో! నేను చెప్పే సన్యాసి ఇట్టివాడు కాదు" అని భగవానుడు తెలియజేస్తున్నాడు. ఎందుకంటే భగవద్గీత సామాన్యమైన ధర్మశాస్త్రం కాదు. ధర్మాన్ని ఆచరిస్తూనే లౌకికమైన పరిమితులను అధిగమించి మోక్షాన్ని పొందే మార్గాన్ని, ఉపాయాన్ని తెలియ జెప్పే వేదాంత శాస్త్రం. కర్మలు చేస్తూనే మానసికంగా సన్యసించి, నిజమైన సన్యాసి ఎలా అవుతాడో నేర్పుతుంది భగవద్గీత.

భార్యాబిడ్డలను, ఇళ్ళువాకిళ్ళను, సిరిసంపదలను వదులుకున్నంత మాత్రాన లేదా కాషాయవస్త్రాలు ధరించినంతమాత్రాన అతడు సన్యాసి కాదు, ఇవన్నీ బాహ్యవేషాలే. లోపలనున్న వాసనలు పూర్తిగా క్షయమైతేనే అతడు నిజమైన సన్యాసి. ప్రాపంచిక విషయాలతో సంగభావం పోవాలి. ఫలాసక్తి తొలగాలి. అంతరంగంలో మార్పు రావాలి. అప్పుడే అతడు గృహస్థుడైనా, బ్రహ్మచారియైనా, ఇంటిలో ఉన్నా, అడవిలో ఉన్నా సన్యాసి అవుతాడు. కనుకనే భగవంతుని దృష్టిలో సన్యాసి అంటే కర్మలు చేస్తూనే చేయనివాడు కావాలి. అంటే కర్మఫలంపై ఆసక్తిని విడిచిపెట్టి, నిర్లిప్తంగా చేయదగిన కర్మ చేసినవాడే సన్యాసి. కర్మఫలాన్ని ఎందుకు వదలాలి? కర్మఫలంపై ఆసక్తి ఉంటే ఈ లోకంలో గాని, ఆ లోకంలో గాని సుఖదుఃఖాలు అనుభవించాలి. తిరిగి తిరిగి జన్మలెత్తాలి. అది బంధమవుతుంది. కనుక కర్మఫలాసక్తిని విడిచిపెట్టి చేయదగిన కర్మలు చేయాలి. మరి చేయదగిన కర్మలు అంటే ఏవి?

కార్యం కర్మ:- విధిగా చేయవలసిన నిత్యనైమిత్తిక కర్మలు; లోకసంగ్రహార్థం, పరోపకారం కొరకు చేయవలసిన కర్మలు; శాస్త్ర విహితమైన కర్మలు - ఇవి చేయదగినవి. శాస్త్రవిరుద్ధ కర్మలు, ఇతరులకు హానికలిగించే కర్మలు చేయరాదు. అయితే మంచి కర్మలే ఐనా ఫలాసక్తిని వదలాల్సిందే. ఫలాసక్తిని వదలి కర్మలు చేస్తుంటే క్రమంగా 'నేను చేస్తున్నాను' అనే కర్తృత్వభావన కూడా పోతుంది. అప్పుడే అతడు 'సన్యాసి' అని గుర్తించబడతాడు.

ఇట్టి మహాత్మునే భగవానుడు అతడే సన్యాసి, అతడే యోగి అంటున్నాడు. నిజంగా ఈ రెండూ పరస్పరవిరుద్ధమైన పదాలు. సన్యాసి అంటే వదిలినవాడు. యోగి అంటే చేస్తున్నవాడు. మరి ఒక్కడే సన్యాసి, యోగి ఎలా అవుతున్నాడు?

కర్మఫలాన్ని వదిలినవాడు గనుక సన్యాసి; కర్మలను చేస్తున్నవాడు గనుక యోగి. అంటే కర్మఫలాలు వదిలి కర్మలు చేస్తున్నాడు గనుక అతడే సన్యాసి - అతడే యోగి. ఇలా కర్మఫలాన్ని వదలి కర్మలు చేస్తుంటే చివరకు అతడు కర్మలపై ఆసక్తి లేని కర్మసన్యాసి అవుతాడు. కర్మలు చేయాలనే ప్రేరణ లోపల నుండి రాదు.

గుమ్మడి, సొర, దొండ మొదలైన చెట్లకు ముందు పువ్వు వస్తుంది. తర్వాత కాయ వస్తుంది. అప్పుడు పువ్వు రాలిపోతుంది. పువ్వు ఎలాగూ రాలిపోయేదే గదా! అని ముందే తుంచేస్తే ఇక ఎప్పటికీ కాయరాదు. అలాగే "ఎట్లాగూ వదలాల్సినవే గదా కర్మలు" అని ముందుగానే కర్మలు చేయటం మానేస్తే ఎప్పటికీ కర్మ సన్యాసి కాలేడు. సోమరి అవుతాడు. కనుక కర్మలు

**చేస్తూ చేస్తూనే మానసికంగా సన్యసించే స్థితి వస్తే ఆ తర్వాత కర్మలు వాటంతట అవే రాలిపోతాయి. కనుక కర్మలు చేయాల్సిందే. ఫలాసక్తిని వదలాల్సిందే. అట్టివాడే సన్యాసి - యోగి.**

**- యోగి అంటే ఎవరో స్పష్టం చేయబోతున్నాడు భగవానుడు తరువాత శ్లోకంలో**

**శ్లో|| యం సన్యాస మితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ|**
**నహ్య సన్యస్త సంకల్పః యోగీ భవతి కశ్చన|| (2)**

**తా|| అర్జునా! దేనిని సన్యాసమంటారో అదే యోగం అని తెలుసుకో. సంకల్పాలను సన్యసించని వాడెవ్వడూ యోగి కాలేడు.**

**వ్యాఖ్య:- సన్యాసమంటే వదలటం. యోగమంటే చెయ్యటం గదా! ఈ రెండూ పరస్పర విరుద్ధమైనప్పుడు రెండూ ఒక్కటే ఎలా అవుతాయి అని అర్జునుని సందేహం. కర్మఫలంపై ఆసక్తిని విడిచి, కర్మ చేసేవాడే నిజమైన సన్యాసి అని, అతడే యోగి అని భగవానుడు క్రిందటి శ్లోకంలో చెప్పాడు. సంకల్పాలు వదులుతున్నాడు గనుక సన్యాసి అంటే బాగానే ఉంది గాని అతడు యోగి ఎలా అవుతాడు? అని అర్జునునిలో సందేహం తొలుస్తున్నది. ఎందుకంటే యోగి అంటే చేసేవాడు గదా! అని, అందుకే యోగి అంటే నిజమైన అర్థం ఏమిటో భగవానుడు స్పష్టంగా ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.**

**"అర్జునా! సంకల్పాలు వదలనివాడెవ్వడూ యోగి కాలేడు" అని భగవానుడు యోగి యొక్క ముఖ్య లక్షణాన్ని తెలియజేస్తున్నాడు. ఏ రకమైన యోగి అయినా త్యాగభావం ఉండాల్సిందే.**

జ్ఞానయోగి అహంకారాన్ని త్యాగం చేస్తాడు. అంటే 'దేహాదులు నేను' అనే భావనను వదిలేస్తాడు.

ధ్యానయోగి బహిర్ముఖవృత్తులను - అంటే ప్రాపంచికమైన ఆలోచనలను త్యజిస్తాడు.

భక్తియోగి బాహ్యవస్తువులపై, దృశ్యవిషయాలపై ఆసక్తిని, ప్రేమను త్యజిస్తాడు.

కర్మయోగి కర్మలయందలి ఫలాసక్తిని, కోరికలను త్యాగం చేస్తాడు.

ఇలా ఏ యోగి అయినా అనాత్మ వస్తువులను, లౌకిక వస్తువులను, సుఖభోగాలపై ఆసక్తిని విడిచిపెట్టి మనస్సును పూర్తిగా పరమాత్మయందే నిలుపుతాడు. అంతే తప్ప నాకు వస్తువుల మీద, ధనసంపదల మీదా ప్రేమ ఉన్నది. భగవంతుని పైనా భక్తి ఉన్నది - అంటే కుదరదు. త్రాసులో ఒకవైపు సిబ్బి పైకి లేచింది అంటే మరొకవైపు సిబ్బి క్రింద ఉన్నట్లే.

ఒక ఫకీరు ఉండేవాడు. ఫకీరు అంటే ఫికరులు లేనివాడు అని అర్థం. అంటే చింతలు లేనివాడు అని. వాడికుండే చింత అంతా ఒక్కటే. ఎప్పుడు భగవంతుని దర్శనమౌతుందా? ఎప్పుడు పరమాత్మతో కలయిక జరుగు తుందా? అనే. ఆ ఫకీరుకు ఒక మనుమడున్నాడు. ఒకరోజున వాడు "తాతా! నీకు నా మీద ప్రేమ ఉందా?" అన్నాడు. దానికా ఫకీరు "ఓ! నీ మీదే నా పంచ ప్రాణాలు పెట్టుకున్నాను" అన్నాడు. "మరి భగవంతునిపై నీకు ప్రేమ ఉన్నదా?" అన్నాడు. "ఆ! భగవంతుణ్ణి పూర్ణ హృదయంతో ప్రేమిస్తున్నాను" అన్నాడు. అప్పుడు వాడన్నాడు, "తాతా! అంతా అబద్ధం. పచ్చిమోసం. నీ ప్రేమంతా

నామీదే ఉంటే ఇక భగవంతునిపై ఉంచటానికి ఏం మిగిలింది? అలాకాక అంతా భగవంతునిపైనే ఉంచితే నాకేం మిగులుతుంది? ఇలా వ్యభిచరించే ప్రేమ ప్రేమ కాదు. నిజమైన ప్రేమ - పూర్తి ప్రేమ కావాలి. మనస్సంతా ఒక్క దానిపైనే నిలవాలి. అదే నిజమైన ప్రేమ" అని బుద్ధి చెప్పాడు బుడతడు. అయితే ఇది భక్తియోగి విషయం. కాకపోతే ఏ యోగి అయినా వదలాల్సిందే. త్యాగం చెయ్యాల్సిందే.

అందుకే సంకల్పాలు వదలనివాడెవ్వడూ యోగి కాలేడని భగవానుడు చెప్పటం. ఇంతకీ సంకల్పాలంటే ఏమిటి? మానవుని మనస్సులో కలిగే ఆలోచనలే అలలు అలలుగా కదలివస్తూ ఉంటాయి. అవే సంకల్పాలు. ఇలా నిరంతరం సంకల్పాలు వస్తూ వుంటే మనస్సు ప్రశాంతంగా ఉండదు. ఆందోళనలతో ఉంటుంది. కనుక అట్టి మనస్సు ఏకాగ్రమై పరమాత్మపై ఉండజాలదు. అందువల్ల ప్రయత్నంతో ఈ సంకల్పాలను అరికట్టాలి. కోరికలు, ప్రాపంచిక వ్యామోహాలు తగ్గితేనే సంకల్పాలు తగ్గిపోతాయి. మనస్సు ప్రశాంతమౌతుంది. ఇలా సంకల్పాలు తగ్గిపోయేదాకా మనం సాధించేదేమీ ఉండదు. ఈ విషయాన్నే దృఢంగా చెప్పేందుకు భగవానుడు కశ్చన = ఎవడు కూడా అనే పదాన్ని ప్రయోగించటం జరిగింది.

దీనితో యోగి అంటే సంకల్పాలు వదిలినవాడు అని తెలిసిపోయింది. సన్యాసి అంటే అన్నీ వదిలినవాడే గదా! కనుకనే "అర్జునా! దేనిని సన్యాసమంటారో అదే యోగం" అన్నాడు భగవానుడు. అన్నీ వదలటం

సన్యాసం గనుక, సంకల్పాలు వదిలినవాడే యోగి గనుక సన్యాసి - యోగి ఒక్కడే. అలాగే సన్యాసం - యోగం కూడా ఒక్కటే అని ఋజువౌతున్నది.

ధ్యానం చక్కగా కుదరాలంటే మనస్సు స్వాధీనంలో ఉండాలి. అందుకు కర్మయోగం అవసరం. ఐతే ఈ కర్మయోగాన్ని ఎంతకాలం చేయాలి? -

**శ్లో||** ఆరు రుక్షోర్మునేః యోగం కర్మకారణ ముచ్యతే|

యోగా రూఢస్యతస్త్యైవ శమః కారణముచ్చతే|| **(3)**

**తా||** యోగాన్ని (ధ్యానాన్ని) అధిరోహించాలనుకొనే మునికి కర్మసాధన మౌతుంది. యోగాన్ని అధిరోహించిన తర్వాత అతడికి శాంతమే సాధనం.

**వ్యాఖ్య:-** ధ్యానయోగాన్ని సాధించాలనుకొనే వాడికి నిష్కామకర్మయోగం సాధనమౌతుంది. అంటే నిష్కామ కర్మయోగాన్ని ఆచరించాలి. ఎందుకంటే మనలో పూర్వవాసనలు మనస్సును ప్రశాంతంగా ఉండనివ్వవు. మనస్సు ప్రశాంతం కాకపోతే ధ్యానానుకూలం కాదు. కనుక మనస్సు ఆలోచనా రహితమై ప్రశాంతమయ్యేవరకు కర్మక్షేత్రంలో పరుగులు తప్పవు. ఇక మనస్సు శాంతించి ధ్యానయోగంలో నిష్ఠ కుదిరిన తర్వాత ఇక కర్మలతో పనిలేదు. శమం - అంటే మనోనిగ్రహమే సాధనం.

దీనినే అలంకారిక భాషలో యోగాన్ని ఎక్కేదాకా కర్మయోగం, ఎక్కిన తర్వాత శమం సాధనమౌతుందని ఈ శ్లోకంలో చెప్పారు.

మన మనస్సు క్రొత్త గుర్రం లాంటిది. క్రొత్త గుర్రం ఒక పట్టాన మనను ఎక్కనివ్వదు. అటూ ఇటూ పరుగులు పెడుతుంది. దానిపైకి ఎక్కాలంటే మనం

కూడా దానితో పాటు పరుగులు పెట్టాలి. అదును కనిపెట్టి దాని జీనును పట్టుకొని వ్రేలాడుతూ ఒకకాలు నేలమీద మోపి, రెండవకాలును దాని రికాబులో ఉంచి, దానితో పాటు పరుగెడుతూ సమయం కనిపెట్టి ఎక్కి కూర్చోవాలి. మన రెండు కాళ్ళూ రెండువైపులా వేసి స్థిమితంగా కూర్చున్న తర్వాత ఇక దాన్ని అదుపు చేయటం తేలికవుతుంది. కళ్ళాన్ని బిగిస్తే చాలు ఇక మనం దానితో పాటు పరుగులు తీయనక్కర లేదు. అదే మనం చెప్పినట్లు పరుగు తీస్తుంది.

అలాగే మన మనస్సు స్వాధీనం కానంతకాలం అది శరీరాన్ని పరుగులు పెట్టిస్తుంది. నిష్కామకర్మయోగాన్ని ఆచరిస్తూ మన శరీరం మనస్సుతో పాటు పరుగులు పెడుతూ అదును చూసి మనస్సును లొంగదీసుకోవాలి. ఒక్కసారి మనస్సు లొంగిందా - ఇక శరీరానికి పరుగులు పెట్టాల్సిన పనిలేదు. ఇప్పుడు స్వాధీనమైన మనస్సును ఆత్మయందే నిలపాలి. ఇదే ఆత్మసంయమనం.

కనుక ధ్యానయోగంలో ప్రవేశించ గలిగేంత వరకే కర్మయోగం యొక్క అవసరం. ధ్యానయోగంలో స్థిరపడిన తర్వాత ఇక అతడికి కర్మలతో పనిలేదు. పైగా కర్మ అడ్డం కూడా. కర్మయోగాన్ని జీవితాంతం ఆచరించవలసిందేనా? ఎంతవరకు అవసరం? అనే సందేహానికిజవాబుగా భగవానుడు "అంతఃకరణం శుద్ధమై, వైరాగ్యం కలిగి, ధ్యానయోగాన్ని ఆచరించుటకు శక్తి కలిగేంతవరకే కర్మయోగం. ఇక ఆ తర్వాత కర్మలతో పనిలేదు" అని తెలియజేస్తున్నాడు.

వంట అయ్యేంత వరకే మంట ఉండాలి. వంట పూర్తయిన తర్వాత మంటతో పనిలేదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**ఒక అరణ్యంలో వెళుతూ బాటసారి దప్పికైతే, ఒక బావిలో నీరు త్రాగుదామని వెళ్ళి జారిపడ్డాడు. అదృష్టవశాత్తు ఒడ్డున వున్న చెట్టు ఊడ బావిలోకి వ్రేలాడుతూ ఉంటే దాన్ని పట్టుకున్నాడు. ఆ దారిన వెళ్తున్న మరొక బాటసారి అతడి పరిస్థితిని చూచి ఒక త్రాడును తెచ్చి "దీన్ని పట్టుకో .... నిన్ను పైకి లాగుతాను" అన్నాడు. దానికా బాటసారి, "అయ్యా! ఈ ఊడ ఇంతవరకు నన్ను రక్షించింది. కనుక దీనిని వదలలేను" అన్నాడట. త్రాడు వచ్చేదాకా ఊడను వదలకూడదుగాని త్రాడు వచ్చిన తర్వాత కూడా ఊడను పట్టుకుంటే ఎలా? అలాగే ధ్యానంలో ప్రవేశించటానికే కర్మ సాధనమవుతుంది గాని ప్రవేశించిన తర్వాత ఇక కర్మతో పనిలేదు.**

**- కర్మయోగాన్ని ఎప్పటిదాకా ఆచరించాలి? అనే ప్రశ్నకు ధ్యాన యోగంలో ప్రవేశించగలిగేంతవరకు అని క్రిందటి శ్లోకంలో చెప్పారు? అయితే ధ్యానయోగంలో ఎప్పుడు ఆరూఢుడైనట్లు?**

**శ్లో||** యదాహి నేంద్రియార్థేషు సకర్మస్వనుషజ్జతే|

సర్వసంకల్ప సన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే|| **(4)**

**తా||** ఇంద్రియ విషయాలలోను, కర్మలలోను ఎప్పుడు మనస్సుకు ఆసక్తి లేకుండాపోతుందో అన్ని సంకల్పాలను ఎప్పుడువిడిచిపెట్టటం జరుగుతుందో అప్పుడు అతణ్ణి యోగారూఢుడు అంటారు.

**వ్యాఖ్య:-** ఒక సాధకుడు నిష్కామకర్మయోగాన్ని ఆచరించి, ధ్యానయోగంలో నిలవటానికి తగినట్లుగా మనస్సును శాంతింపజేసినట్లు మనకు ఎలా గుర్తు?

ఎప్పుడు అతడు యోగారూఢుడైనట్లు? కర్మయోగాన్ని ఆచరించవలసిన అవసరం ఎప్పుడులేనట్లు? ఈ ప్రశ్నలకు సమాధానమే ఈశ్లోకం. ఎప్పుడంటే-

1.బాహ్యప్రపంచంలో ఉన్న ఇంద్రియవిషయాల్లో ఆశ గాని, ఆసక్తి గాని లేకపోయినప్పుడు.

2.కర్మలు చేయుట యందు ఆసక్తి లేనప్పుడు.

3.అన్ని సంకల్పాలను విడిచిపెట్టినప్పుడు.

1) <u>ఇంద్రియవిషయాల పట్ల అనాసక్తి</u>:- ఇంద్రియ విషయాలంటే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ - ఏ బజారులో ఏం జరిగిందో, ఏ రాష్ట్రంలో, ఏ దేశంలో, ఏం జరిగిందో, ఎవరి కుటుంబంలో ఏం జరిగిందో తెలుసుకోవాలనేవి శబ్ద విషయాలు; ఏ వస్తువులను పొందితే శారీరకంగా హాయి, ఆనందం కలుగుతుందో అనేవి స్పర్శ విషయాలు; ఏవేవో దృశ్యాలనుచూచి ఆనందించాలనుకోవటం రూప విషయం; రుచిగల పదార్థాలు తినాలనుకోవటం రస విషయం; సెంట్లు, పౌడర్ లు మొ||న సువాసన పదార్థాలపై కోరిక గంధ విషయం. ఈ ఐదు రకాల ఇంద్రియ విషయాల పట్ల ఏమాత్రం ఆసక్తి లేకుండా నిర్లిప్తంగా ఉండగలిగితే అతడి మనస్సు శాంతించినట్లే. అతడు యోగారూఢుడైనట్లే.

2) <u>కర్మలయందు అనాసక్తి</u>:- ధ్యానయోగంలో నిలిచినవాడి మనస్సు నిశ్చలంగా గాలిలేని చోట దీపంలా ఉంటుంది. ఉండాలి. అలా నిశ్చలంగా మనస్సు ఉన్నప్పుడు కర్మాచరణ ఉంటే అంతా చికాకే. కనుక కర్మలను విడిచిపెడతాడు. కర్మలను విడిచిపెట్టటమంటే అసలు కర్మలే చేయకపోవటం - అని కాదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చెయ్యాలనే ఆలోచన లేకపోవటం, చేయవలసిన అవసరం లేకపోవటం, చేస్తున్నాననే స్పృహ లేకపోవటం, చెయ్యకపోతే ఎలాగ? అనే భయం లేకపోవటం. ఇదే కర్మల పట్ల అనాసక్తి అంటే. ఇలాంటి అనాసక్తి కలిగిందంటే అతడికి యోగారూఢత్వం సిద్ధించినట్లే.

3) సర్వసంకల్పాలను వదిలిపెట్టుట:- సాధారణంగా మనస్సులో అనేక సంకల్పాలు కలుగుతూ ఉంటాయి. కొన్ని చెడ్డ సంకల్పాలు, మరికొన్ని మంచి సంకల్పాలు. చెడ్డ సంకల్పాలు రాకుండా ఉండటానికి దైవసంబంధమైన మంచి సంకల్పాలను ప్రారంభంలో చెయ్యాలి. అయితే ఆ తర్వాత మంచి సంకల్పాలను కూడా వదిలెయ్యాలి. ఎందుకంటే ఈ సంకల్పాలే కోరికలుగా మారతాయి. ఆ కోరికలను తీర్చుకొనుటకు తిరిగి కర్మరంగంలోకి దిగిపోవాలి. దానితో మనస్సు అలజడులు, అశాంతితో ఉండి ధ్యానానికి అనుకూలం కాదు. అందుకే సర్వసంకల్ప సన్యాసీ - అన్ని సంకల్పాలను వదిలినవాడు కావాలి - అని ఇక్కడ చెప్పటం జరిగింది. ఈ 3 లక్షణాలు ఎవరిలో ఉంటాయో అతడు యోగారూఢుడే. ధ్యానమందు స్థితి కలిగినవాడే అని చెప్పవచ్చు. ఇక అతడికి కర్మయోగం యొక్క అవసరం లేదు.

పైన చెప్పిన ఈ 3 లక్షణాలతో యోగారూఢస్థితిని పొందే హక్కు ప్రతివాడికీ ఉంది. ఈ హక్కు బయటి నుండి వచ్చేది కాదు, అదృష్టం మీద ఆధారపడి లేదు. అది కేవలం మన పురుషార్థం పైనే ఆధారపడి ఉంది. కష్టపడి సాధన చేస్తేనే ఈ హక్కు వచ్చేది. దానికి గురువులు మార్గం చూపగలరే గాని ప్రయత్నం చేయవలసింది మాత్రం నీవే. అందుకు కావలసిన దివ్యశక్తి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ప్రతివారిలోను అంతర్లీనంగా ఉన్నది. దానిని గుర్తించి సద్వినియోగంచేసుకొని బాగుపడటమో, గుర్తించలేక దుర్వినియోగం చేసుకొని చెడిపోవటమో మన చేతిలోనే ఉంది. ఈ విషయాన్నే తరువాత శ్లోకంలో తెలియజేయబోతున్నారు.

- యోగారూఢ స్థితిని పొందటానికి ఏంచేయాలి? ఏమిటి ఉపాయం?

**శ్లో||** ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్|

ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః|| **(5)**

**తా||** తనను తానే ఉద్ధరించుకోవాలి. మనస్సును అధోగతికి జారనివ్వరాదు. ఎందుకంటే తన మనస్సే తనకు బంధువు. తన మనస్సే తనకు శత్రువు.

**వ్యాఖ్య:-** 1) ఉద్ధరేదాత్మ నాత్మానం:- నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి. ఇదొక ప్రోత్సాహకశ్లోకం. నిద్రబోయేవాణ్ణి నిద్రలేపి కార్యరంగంలోకి దూకించేందుకు ఉద్దేశించబడింది. ఇదొక అష్టాక్షరీమంత్రం లాంటిది. ఎవరో వస్తారని ఎదురు చూస్తూ కూర్చోవటం గాని, నిన్ను ఉద్ధరించేవాడు ఎక్కడో దొరుకుతాడని దేశమంతా గాలించటంగాని, అదృష్టం ఉంటే వాళ్ళే వచ్చి ఉద్ధరిస్తారనే సోమరితనం గాని కూడదు. అనవసరంగా ఈ నీ జీవితాన్ని వ్యర్థం చేసుకోవద్దు అని హెచ్చరిక.

నిజంగా నిన్ను నీవు ఉద్ధరించుకోవటానికే ఈ మానవజన్మ వచ్చింది. లేకపోతే ఏ జంతువుగానో, కీటకంగానో పుట్టి కర్మఫలాలను మూగగా అనుభవించి పోతుండేవాడివి. కనుక నిన్ను నీవు ఉద్ధరించుకోవటానికి ఈ

మానవజన్మ ఒక ఛాన్స్. ఆ ఛాన్స్ ను ఉపయోగించుకున్నావా? తెలివి గలవాడివౌతావు. ఉపయోగించుకోవా? తెలివి తక్కువ దద్దమ్మవు, మూర్ఖుడివి అవుతావు. భగవంతుడెందుకింతగా ప్రోత్సహిస్తున్నాడు? ఎవరికైనా నిరుత్సాహం కలిగించే మాటలు చెప్పకూడదు. అలా చెబితే హత్య చేసినంత పాపం. నీవు నీచుడివి, అసమర్థుడివి, పనికిరానివాడివి అని నిరుత్సాహ పరచటం ప్రాణాపాయం కన్న ప్రమాదం.

మహాభారతంలో అర్జునునికి శ్రీకృష్ణ సారథ్యం లభించింది. కర్ణుడికి శల్య సారథ్యం లభించింది.

ప్రోత్సాహకరమైన మాటలతో అర్జునుణ్ణి విజయుణ్ణి చేశాడు శ్రీకృష్ణుడు. నిరుత్సాహపరిచే మాటలతో కర్ణుణ్ణి దుంపనాశనం చేశాడు శల్యుడు. అందుకనే నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి అని ప్రోత్సహిస్తున్నాడు భగవానుడు. అయితే ఆధ్యాత్మికరంగంలో గురువు యొక్క సహాయం అక్కరలేదా? అంటే కావాలి. సద్గురువును ఎంచుకొని, ఆయనను సేవించి, పూజించి, ఆయన అనుగ్రహాన్ని పొందాల్సిందే. ఐతే ఆ గురువే నిన్ను ఈ సంసారబంధం నుండి ఉద్ధరించడు. నీవు చేసే స్వయంకృషికి మార్గాన్ని చూపుతూ సహాయపడ తాడు. అంతే.

'నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి' - ఈ మాటచెప్పింది ఎవరో సామాన్యుడు కాదు. సాక్షాత్తు శ్రీకృష్ణుడు. అతడు కూడా యమునానదీ తీరంలో గోపికలతో చెట్టాపట్టాలేసుకొని అల్లీబిల్లీ తిరుగుతూ, ఆడుతూపాడుతూ చెప్పిన మాట

కాదు. యుద్ధభూమిలో ప్రమాదకరమైన క్షణంలో తన అవతారాన్ని సార్థకం చేసుకొనుటకు; ఉత్తమశిష్యుడైన అర్జునునకు చేసిన గంభీర భాషణం.

మానవుడు తనలోనే అణగి, అదృశ్యరూపంలో ఉన్న నిత్య, సత్య ఆత్మను అందుకోవటానికి తనలోనే ఆటంకంగా ఉన్న నీచ మనస్సును - కలుషిత మనస్సును శుద్ధి చేసుకొని ఉద్ధరించుకోవాలి అని ఢంకా బజాయించి చెబుతున్నాడు. ఎలా ఉద్ధరించుకోవాలి? -

- బుద్ధిస్థాయిలో మనం గొప్ప ఆదర్శవంతులం, నీతి నిజాయితీ గలవారం.
- మనోస్థాయిలో మోహవశులమై రాగద్వేషాలకు, కామవాంఛలకు లొంగిపోతాం.
- శరీర స్థాయిలో దారి ప్రక్కన ఉన్న ఎముక ముక్కకోసం ఒకదానిపై ఒకటి కలియబడే వీధి కుక్కల్లా ప్రవర్తిస్తుంటాం.

మరి మనం ఏం చేస్తే ఉద్ధరింపబడతాం? -

మనస్సును దేహేంద్రియాలవైపుకు త్రిప్పితే పతనం. బుద్ధివైపు త్రిప్పితే ఉద్ధరించబడతాం. కనుక మనస్సుకు తగిన శిక్షణనిచ్చి, నచ్చజెప్పి, కోరికతో బాహ్యవిషయాల వైపుకు తీసే పరుగులను ఆపి, మనస్సును నిర్మలం చేసి ఉద్ధరించుకోవాలి.

2) ఆత్మానం న అవసాదయేత్:- ఒకసారి శుద్ధం చేసిన మనస్సును తిరిగి అధోగతికి జారనివ్వకూడదు. అంటే అది తిరిగి అల్పమైన, అనిత్యమైన ప్రాపంచికవిషయభోగాల వైపుకు తిరగకుండా జాగ్రత్తపడాలి. అలా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చెయ్యాలంటే ఆత్మవైపుకు దానిని మరలించి ఆత్మలోనే నిరంతరం నిలపాలి. ఎందుకింత జాగ్రత్త?

**3) నీ మనస్సే నీకు బంధువు. నీ మనస్సే నీ శత్రువు:-** మనకు నిజమైన శత్రువులు మిత్రులు బయటలేరు. మనలోనే ఉన్నారు. ఎవరు? నీ మనస్సే. మనస్సు బుద్ధిని ఆశ్రయిస్తే మిత్రుడౌతుంది. అలాగాక దేహేంద్రియాలతో కలిసి విషయాల వెంటపడితే అదే నీ శత్రువు. ఎందుకంటే విషయాల వెంటబడిపోతే మనస్సు జీవుణ్ణి పరమాత్మకు దూరంగా తీసుకెళ్ళి సంసారబంధంలో ముంచి వేస్తుంది. ఆ సంసార సాగరంలో మునుగుతూ తేలుతూ గ్రుడ్లు తేలవేస్తూ చావలేక బ్రతకాల్సిందే. అలా కాకుండా దృశ్యవిషయాల నుండి వెనకకు మరలించి ఆత్మధ్యానంలో నిలిపితే జీవాత్మను పరమాత్మలో ఐక్యం చేస్తుంది. ఇక జన్మలుండవు, దుఃఖాలుండవు. కనుక మనస్సే మిత్రుడు.

- మనస్సు ఎప్పుడు బంధువు? ఎప్పుడు శత్రువు?

శ్లో|| బంధురాత్మా త్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః|
అనాత్మ నస్తు శత్రుత్వే వర్తేతా త్మైవ శత్రువత్|| **(6)**

**తా||** ఎవరిలోనైతే మనస్సు జయింపబడుతుందో, అట్టి మనస్సు అతడికి బంధువు. ఎవరిలో జయింపబడదో అదేఅతడికి శత్రువై అపకారం చేయటంలో నిమగ్నమై ఉంటుంది.

**వ్యాఖ్య:-** ఉపాకారం చేసేవారిని బంధువుగా పరిగణిస్తాం. అపకారం చేసే వారిని శత్రువుగా చూస్తాం.

1) మనస్సు గనుక జయింపబడితే - స్వాధీనంలోకి వస్తే - చెప్పినట్లు వింటే - కూర్చోమన్న చోట కూర్చుంటే - దానిమీదకూ దీనిమీదకూ చెప్పాపెట్టకుండా పరుగులు తీయకుండా ఉంటే - బుద్ధిమంతురాలిగా ఉంటే ఆ మనస్సే బంధువు - మిత్రుడు. ఎందుకంటే అది ఉపకారం చేస్తుంది.

ఏమిటా ఉపకారం?

ఆత్మసంయమనానికి - ధ్యానానికి - పరమాత్మపై దృష్టి నిలపటానికి అనుకూలిస్తుంది. దానితో పరమశాంతిని కలిగిస్తుంది. ఆత్మవిచారణలో సాయపడుతుంది. ఆత్మతో జీవుణ్ణి కలుపుతుంది. ఆ విధంగా జీవుడికి గొప్ప ఉపకారం చేస్తుంది.

2) అలాగాక మనస్సు స్వాధీనం కాకపోతే - చెప్పినట్లు వినకపోతే - కూర్చోమన్నచోట కూర్చోకపోతే - దృశ్య ప్రపంచ విషయాల పైకి పరుగులు తీస్తుంటే - ఇంద్రియాలతో స్నేహం చేస్తూ వాటి వెంటబడి భోగాల కోసం ఆరాటపడితే ఆ మనస్సే శత్రువు. అట్టి మనస్సు ఎప్పుడూ అపకారమే చేస్తుంది. కీడు కలిగిస్తుంది. ఏమిటా అపకారం?

జీవుణ్ణి దేవుడికి - ఆత్మకు దూరం చేసి, విషయభోగాలవైపు నెట్టి, "నీవు పుట్టింది భోగాలనుభవించటానికి, సుఖంగా బ్రతకటానికి; అందుకు బాగా డబ్బు సంపాదించాలి" అని చెప్పి ధన సంపాదనలో, భోగాలలో ముంచి వేసి, తానెందుకు జన్మించిందీ తెలుసుకో నీయకుండ, తెలుసుకొనే తీరిక లేకుండా, తెలుసుకోవాలనే ఆసక్తి లేకుండా చేసి జన్మకర్మ వలయంలో, జననమరణ రూప సంసార చక్రంలో త్రిప్పి ముక్తికి దూరం చేస్తుంది. ఇదే అపకారం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అందుకే మనస్సే మిత్రుడు; మనస్సే శత్రువు అన్నది. "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" - మనస్సే మనుష్యుల బంధానికి, మోక్షానికి కారణం అని శృతులు చెబుతున్నది. ఇట్టి మనస్సును ప్రయత్నంతో బంధువుగా - మిత్రుడుగా మార్చుకోవాలి. ఎలా?

- వివేకం - ఆత్మానాత్మ వివేకంతో -

- వైరాగ్యం - ఈ లోకంలో గాని, పై లోకంలో గాని భోగాలు పొందాలనే ఆసక్తి లేకుండా -

ఈ వివేక వైరాగ్యాలతో మనస్సును జయించాలి. ఇందుకు శాస్త్రాలు, గురువు తోడ్పడతారు. మొదట్లో కొంతకాలం పరుగెత్తే మనస్సుతో పరుగెత్తాల్సిందే. తప్పదు, అలా పరుగెత్తుతూ తనను తాను మరచిపోకూడదు. ఎందుకు పరుగెత్తుతున్నాను? అనేది గుర్తుంచుకొని సమయం కనిపెట్టి కళ్ళెం బిగించి స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. ఆ తరువాత ఆత్మపై నిలపాలి.

- ఇలా మనస్సును స్వాధీనంలో ఉంచుకుంటే ప్రయోజనం ఏమిటి?

**శ్లో||** జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః|
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః|| (7)

**తా||** శీతోష్ణాలలో, సుఖదుఃఖాలలో, మానావమానాలలో మనస్సు స్వాధీనమై ప్రశాంతంగా ఉన్నవారికి పరమాత్మ సన్నిహితంగా ఉంటాడు.

**వ్యాఖ్య:-** మనస్సు దేహేంద్రియాల వెంటబడి ప్రాపంచిక విషయభోగాల వైపు పరుగులు తీయకుండా స్వాధీనంలో ఉంచుకోగలిగితే అతడే 'జితాత్మనః' -

అట్టివాడు ప్రశాంతంగా ఉంటాడు. ఎందుకంటే మనస్సు విషయభోగాలను చింతించినప్పుడు అనేక కోరికలు కలుగుతాయి. కొన్ని తీరుతాయి. కొన్ని తీరవు. అప్పుడు మనస్సు ఆందోళనలతో, అలజడితో ఉంటుంది. అలాగాక మనస్సు స్వాధీనంలో ఉంటే కోరికలకు, భోగాలకు, విషయ వ్యామోహాలకు దూరంగా ఉండి ప్రశాంతమవుతుంది. కనుక జీవాత్ముడే ప్రశాంతుడుగా ఉంటాడు. అట్టివానికి ప్రయోజనం ఏమిటి?

శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు - ఈ ద్వంద్వాలకు చలించకుండా ఉంటాడు.

శీతోష్ణాలు శరీరానికి సంబంధించినవి; సుఖదుఃఖాలు మనస్సుకు సంబంధించినవి; మానావమానాలు బుద్ధికి సంబంధించినవి. చలి, వేడి, జబ్బులు, ముసలితనం - ఇలాంటి శారీరకమైన ప్రతికూలతలు ఎన్ని ఎదురైనా ప్రశాంతమైన మనస్సు గలవాడు చలించడు. సమత్వంలో ఉంటాడు. అలాగే మనస్సుకు కలిగే సుఖదుఃఖాల యందు కూడా సమత్వం కలిగి ఉంటాడు. సుఖంవస్తే పొంగటం గాని, దుఃఖం కలిగితే క్రుంగటం గాని ఉండదు. ఎందుకంటే ఈ సుఖదుఃఖాలన్నీ అనిత్యమైనవి, శాశ్వతంగా ఉండేవి కాదని గ్రహించి ప్రశాంతంగా నిర్లిప్తంగా ఉండిపోతాడు. అలాగే సన్మాన అవమానాలను కూడా సమంగానే భావిస్తాడు. ఏమాత్రం చలించడు.

- ఇలా శీతోష్ణాల వల్ల శరీరానికి ఇబ్బంది కలిగినా
- సుఖదుఃఖాలవల్ల మనస్సు ఉద్రేకాలకు లోనైనా

- మానావమానాల వల్ల బుద్ధిలో తుఫానులు రేగినా జితాత్ముడైనవాడు మనస్సు స్వాధీనంలో ఉండటం వల్ల ప్రశాంత చిత్తంతో ఆత్మయందే మనస్సు నిల్పిఉంచుతాడు. దేనికీ చలించకుండా ఉంటాడు. అందుకే అతడికి -

పరమాత్మా సమాహితః- పరమాత్మ సన్నిహితంగా ఉంటాడు. మనస్సనేది ఆత్మ నుండి లేచిన అల. అది ఆత్మకు వేరు కాదు. స్వచ్ఛంగా - నిర్మలంగా - ఆలోచనా రహితంగా ఉంటే ఆత్మ. అదే ఆలోచనలతో, రాగద్వేషాలతో, అసూయా మోహాలతో ఉంటే మనస్సు, మనస్సు ఎప్పుడైతే ఆలోచనా రహితమై, పరుగులు తీయకుండా ప్రశాంతంగా ఉన్నదో అప్పుడు అది ఆత్మగా ప్రకాశిస్తుంది. అదే పరమాత్మా సమాహితః అంటే. ప్రపంచం మీదకు పరుగులు తీస్తే అది మనస్సు ఔతుంది. ఆత్మపై నిలిస్తే అది ఆత్మాకారమై ఉంటుంది. 'పరమ్+ఆత్మ+సమాహితః' అంటే ఎక్కువగా ఆత్మ ప్రకాశిస్తుంది అనే అర్థం కూడా ఈ పదానికి చెప్పుకోవచ్చు. కనుక మనస్సు స్వాధీనంలో ఉంటే పరమాత్మ బాగా ప్రకాశిస్తాడు అని చెప్పుకోవచ్చు. అంటే పరమాత్మ దివ్యశక్తి అతడిలో బాగా వ్యక్తమవుతుంది. కనుక మనస్సును స్వాధీనంలో ఉంచుకోవటంలోనే ఉంది మన గొప్పతనం అంతా. యోగారూఢుడైనందువల్ల, ప్రయోజనం తెలిసింది. ఇక —

- యోగారూఢుడైన యోగి లక్షణాలేమిటి. అతడి దృష్టి ఎలా ఉంటుంది? లేదా ఎలాంటి దృష్టి ఉంటే అతడు యోగంలో నిలిచినవాడు అని తెలుసుకోవచ్చు?

**శ్లో||  జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః|**

**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః||  (8)**

**తా|| జ్ఞాన విజ్ఞానాలతో తృప్తి చెందేవాడు, ఆత్మలో నిలిచిన వాడు, ఇంద్రియాలను చక్కగా జయించినవాడు, మట్టి - రాయి - బంగారం - వీటిని సమంగా చూచేవాడు యోగయుక్తుడు.**

**వ్యాఖ్య:- ఎవరైతే మనస్సును ప్రాపంచిక విషయభోగాల వైపుకు పోనీయ కుండా నిలిపివేసి, ఆ నిర్మలమైన, శుద్ధమైన మనస్సును ఆత్మయందే నిలిపి ఆత్మలోనే నిలిచినవాడు యోగయుక్తుడు. అట్టి యోగయుక్తుడు ఎలా వ్యవహరిస్తాడు. ఎలా ఉంటాడు? -**

**1) <u>జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా:-</u> జ్ఞాన విజ్ఞానాలతో తృప్తిగా ఉంటాడు. జ్ఞానం అంటే పరోక్షజ్ఞానం. శాస్త్రం ద్వారా, గురువుల ద్వారా తెలుసుకొనేది. విజ్ఞానం అంటే ప్రత్యక్షజ్ఞానం - అపరోక్షజ్ఞానం, శాస్త్రాల ద్వారా, గురువుల ద్వారా గ్రహించిన దానిని అనుభవానికి తెచ్చుకోవటం. అంటే ఆత్మతత్త్వాన్ని తెలుసు కోవటం జ్ఞానం, ఆత్మతత్త్వాన్ని దర్శించటం - అనుభూతి చెందటం విజ్ఞానం. వంట ఎలాచెయ్యాలో తెలుసుకోవటం జ్ఞానం, వంట చేసి తిని ఆనందించటం విజ్ఞానం, తింటేనే ఆకలి తీరుతుంది. కేవలం తెలుసుకుంటే చాలదు. అలాగే ఆత్మతత్త్వాన్ని తెలుసుకుంటే చాలదు. అనుభూతి పొందితేనే తృప్తి. ఇలా ఆత్మతత్త్వాన్ని తెలుసుకొని అనుభూతి పొందినవాడే యోగయుక్తుడు. అతడు ఎల్లప్పుడూ ఈ జ్ఞానవిజ్ఞానాల వల్ల తృప్తిగా ఉంటాడు. అతడి ముఖం ప్రసన్నంగా ఉంటుంది. అతడి తృప్తి ధనం ఉన్నదని గాదు, భోగాలు**

లభిస్తున్నాయనీ కాదు. ధనం, భోగాలు - ఇవి ఎల్లప్పుడూ తృప్తినివ్వవు. అప్పుడప్పుడూ అసంతృప్తిని కలిగిస్తాయి. ఐతే జ్ఞానవిజ్ఞానాలు సదా తృప్తిని కలిగిస్తూ ఉంటాయి.

2) కూటస్థః- కూటస్థుడు అంటే స్థిరంగా - నిశ్చలంగా ఉండేవాడు అని, కంసాలి వద్ద దాగలి అనే పరికరం ఉంటుంది. ఇనుపదిమ్మె అది. దానిపై తీగలు బద్ధలుగా చేయటం, వంచటం, వివిధ ఆకృతులలోకి మార్పు చేయటం జరుగుతుంది. అయితే దానిపై ఎన్ని వస్తువులు ఎన్ని మార్పులు చెందుతున్నా అది మాత్రం మారకుండా అలాగే ఉంటుంది. అలాగే యోగయుక్తుడు ఎల్లప్పుడూ మనస్సును ఆత్మలో నిలిపి ఆత్మగానే తనను తాను గ్రహించి నిశ్చలంగా ఉంటాడు. అతడి దేహేంద్రియ మనోబుద్ధులలో ఎన్ని మార్పులు జరుగుతున్నా తాను మాత్రం ఏమార్పులు లేకుండా నిర్లిప్తంగా, నిర్వికారంగా, నిశ్చలంగా ఉంటాడు. అందుకే అతణ్ణి 'కూటస్థుడు' అంటారు.

3) విజితేంద్రియః:- ఇంద్రియాలను జయించినవాణ్ణి జితేంద్రియుడు అంటారు. ఇతడు విజితేంద్రియుడు. అంటే బాగా జయించినవాడు అని. ఏ క్షణంలోనైనా ఇంద్రియాలు వశం తప్పవచ్చు. కాని ఈ విజితేంద్రియునిలో ఎప్పటికీ అలా స్వాధీనంలో నుండి తప్పిపోవు. విచ్చలవిడిగా వదిలినా అవి దారి తప్పవు. కారణం? అతడు మనస్సు అనే త్రాడు యొక్క ఒక కొనను ఆత్మ అనే స్థంభానికి బిగించి, రెండవ కొనను ఇంద్రియాలనే గుర్రాల మెడకు తగిలించాడు. అందువల్ల అవి ఆత్మ అనే స్థంభం చుట్టూ తిరగాల్సిందే తప్ప ఎటూ పోలేవు. అందుకే విజితేంద్రియుడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇలా జ్ఞానవిజ్ఞానాలతో తృప్తిచెందుతూ, స్థిరంగాఉండే విజితేంద్రియుని దృష్టి ఎలా ఉంటుందో నాలుగవ లక్షణంతో తెలియజేస్తున్నాడు భగవానుడు. అదే -

4) సమలోష్టాశ్మకాంచనః:- మట్టి - రాయి - బంగారం - వీటిని సమంగా చూస్తాడు యోగయుక్తుడు. ఇది ఎలా సాధ్యం? అని ఎవరికైనా సందేహం కలుగుతుంది.

రాత్రి కలలో మనకు కనిపించిన రత్నరాసులను, బంగారాన్ని మూటకట్టి తెచ్చుకొని బీరువాలో దాచాం. మేలుకున్న తర్వాత ఆ మూటకోసం బీరువాలో వెతుకుతామా? లేదు. కారణం? అది కలలో కనిపించినవే గాని సత్యం కాదు. అంటే కలలో కనిపించిన వస్తువులకు జాగ్రత్ లో ఏమాత్రం విలువలేదు - అని తెలుస్తున్నది. నిరంతరం ఆత్మలోనే మనస్సును నిలిపి ఆత్మగానే ఉండిపోయిన యోగయుక్తునకు ఈ జాగ్రత్ ప్రపంచం ఒక కల లాంటిదే. మిథ్య. లేనిదే. కనుకనే ఇక్కడ కనిపించే మట్టి - రాయి - బంగారం - దేనికీ అతడి దృష్టిలో విలువలేదు. అన్నింటిని ఒకటిగానే చూస్తాడు.

స్వప్నంలో ఉన్నంతకాలం బంగారం విలువైనది, మట్టి, రాయి విలువ లేనివి, కనుక తేడా ఉంది. మేలుకోవటంతోనే నీకు స్వప్నంలో కనిపించిన ఆ బంగారం - మట్టి - రాయి - అన్నీ విలువ లేనివే అయిపోయినవి. అలాగే మెలకువలో - అంటే జాగ్రదావస్థలో ఉన్నంతవరకు ఈ జాగ్రత్ లో కనిపించిన బంగారం విలువైనది; మట్టి, రాయి విలువ లేనివి. కనుక తేడా ఉంది. ఈ జాగ్రత్ నుండి మేలుకొని జ్ఞానావస్థలో - ఆత్మలో నిలిస్తే ఈ జాగ్రత్ లో

కనిపించిన మట్టి రాయి బంగారం - అన్నీ విలువలేనివే అయిపోతాయి. అందుకే ఆత్మలో నిలిచిన యోగయుక్తుడు అన్నింటిని సమంగా చూడగలుగు తాడు. స్వప్న వస్తువుగా చూస్తాడు.

ఇదీ యోగయుక్తుని దృష్టి. ఇట్టి దృష్టి గలవాడే యోగయుక్తుడు, యోగారూఢుడు.

యోగారూఢుని దృష్టి ఎలాంటిదో చెప్పటానికి ఇక్కడ అన్నీ జడ వస్తువులనే ఉదాహరణగా చెప్పారు. అర్జునుని దృష్టిలో సందేహం కలగవచ్చు. మహానుభావా! జడవస్తువులను సమదృష్టితో చూస్తే చూడవచ్చు. కాని చైతన్యం గలిగిన వస్తువులనైతేనో - అంటే తోటి మానవులతో ప్రవర్తించేట ప్పుడు ఆయన దృష్టి ఇలాగే ఉంటుందా? అని. ఎందుకంటే మానవులలో మంచి వారుంటారు, చెడ్డవారుంటారు. మరి వీరితో ఎలా ప్రవర్తిస్తాడు? అనే సందేహాన్ని తీర్చటానికి భగవానుడు తరువాత శ్లోకంలో వివరణ ఇవ్వబోతు న్నాడు.

-యోగయుక్తుడు తోటి మానవులతో ఎలా వ్యవహరిస్తాడో భగవానుడు తెలియజేస్తున్నాడు.

**శ్లో||** సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు|
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే|| **(9)**

**తా||** మంచివారు, స్నేహితులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేషింపదగిన వారు, బంధువులు, సాధుపురుషులు, పాపాత్ములు, వీరందరిపట్ల సమబుద్ధి కలిగి శ్రేష్టుడుగా ఉంటాడు.

**వ్యాఖ్య:-** ఈ ప్రపంచంలో ఉన్న మానవులను ఇక్కడ తొమ్మిది రకాలవారిగా విభజించటం జరిగింది. వారు....

**1.సుహృదులు:-** వీరు తమతో ఏమాత్రం పరిచయం లేనివారైనా, ఎవరికైనా చేతనైన మేలు చేసేవారు. వీరు ప్రత్యుపకారాన్ని కోరేవారు కాదు. పూర్వంలో తమకు చేసినదానికి కృతజ్ఞతగా చేసేవారు కాదు. అవసరాన్ని బట్టి ఎవరికైనా సహాయపడేవారు. వీరు మానవులలో ఉత్తములు.

**2.మిత్రులు:-** వీరు పరిచయం ఉన్నవారు. స్నేహంగా ఉండేవారు. స్నేహం కోసం అవసరమైనప్పుడు సాయం చేసేవారు. మళ్ళీ మనకు అవసరమైనప్పుడు సాయం చేయకపోతాడా? అనే భావం ఉంటే ఉండవచ్చు. అయితే మిత్రులెప్పుడూ ఒకరికొకరు అపకారం చేసుకోరు.

**3.అరి:-** శత్రువు. నిష్కారణంగా కీడు చేసినవారు. లేదా స్వార్థం కోసమైనా కీడు తలపెట్టేవారు. లేదా ఎప్పుడైనా మనం అతడికి అపకారం చేస్తే అది గుర్తించు కొని సమయం కోసం ఎదురు చూసేవాడు. వీరు తేలులాంటి స్వభావం గలవారు.

**4.ఉదాసీనులు:-** వీరు తటస్థులు. అపకారం చేయరు. ఉపకారం చేయరు. అసలు పరిచయం లేనివారు కూడా తటస్థులే. అందువల్ల మంచి, చెడు అనేవి ఏవీ మనస్సులో ఉండవు.

**5.మధ్యస్థులు:-** ఇరుపక్షాల వారికీ మేలు చేయాలనుకునేవారు. అందరికీ సమానదూరంగా ఉండేవారు. ఎవరికీ కీడు చేయాలని ఉండదు. చేతనైతే మంచి చేయుటమే.

**6.ద్వేషింపతగినవారు:- ఇంతకుముందు కీడు చేసినవారు, లేదా ఎప్పుడైనా కీడు తలపెడతాడేమో అని సందేహింపదగిన వాడు. దెబ్బకు దెబ్బ తీయాలనే ఉద్దేశంతో ఉండేవారు.**

**7.బంధువులు:- వీరు రక్త సంబంధీకులు, బంధుత్వం ఉన్నవారు, సాధారణంగా మేలు చేస్తారు. అప్పుడప్పుడూ స్వార్థంతోనో, ఇతర కారణాలతోనో కీడు కూడా తలపెట్టేవారు.**

**8.సాధువులు:- మెత్తని హృదయం కలవారు. చెడు తలంపులు లేనివారు. సత్కార్యాలు చేసేవారు ధర్మాన్ని నిలబెట్టటానికి ప్రాణత్యాగానికి కూడా సిద్ధపడేవారు.**

**9.పాపాత్ములు:- శాస్త్ర విరుద్ధ కార్యాలు, అకృత్యాలు, అరాచకాలు చేసేవారు..... ఎంతటి దారుణానికైనా తెగించేవారు. దొంగలు, ఖూనీ కోరులు, రౌడీలు, భూ ఆక్రమణదారులు, నమ్మించి మోసంచేసేవారు. ఇతరులను హింసించేవారు.**

**వీరందరిపట్ల యోగయుక్తుడు సమదృష్టి కలిగియుంటాడు. ఎందుకంటే అతడిది ఉపాధి దృష్టి కాదు. ఆత్మదృష్టి, దేహదృష్టి, మనోదృష్టితో చూస్తే అన్నీ భేదాలే. కాని ఆత్మదృష్టితో చూస్తే - అందరూ ఆత్మస్వరూపులే అనుకున్నప్పుడు తనకూ వారికీ భేదం ఉండదు. కనుక అందరిని - వారు పుణ్యాత్ములైనా పాపాత్ములైనా, మేలుచేసేవారైనా కీడు చేసేవారైనా, ఎవ్వరైనా సరే అందరినీ ఒక్కటిగా, ఆత్మగా చూస్తాడు గనుక యోగయుక్తుని దృష్టిలో అందరూ సమానమే. పంచదార పాకంతో చిలకబొమ్మ చేసినా, కుక్కబొమ్మ చేసినా**

పెద్దవారి దృష్టిలో తేడా ఉండదు. అదే పిల్లలైతే పైపై ఆకారాలను చూస్తారు గనుక వారికి భేదదృష్టి ఉంటుంది.

యోగయుక్తుని గొప్పతనాన్ని భగవానుడు వర్ణిస్తుంటే చెవులు రిక్కించుకొని వింటున్న అర్జునుడు అట్టి గొప్పస్థితిని అందుకోవటమే ఈ జన్మకు సార్ధకత; ఈ రాజ్యాలు, భోగాలు, యుద్ధాలు, చంపుకోవటాలు ఎందుకు? అని మనస్సులో మధనపడుతున్నాడు. అయితే అట్టి సమదృష్టిని, యోగారూఢస్థితిని అందుకోవడం ఎలాగ? అని జిజ్ఞాస కలిగింది. ఎందుకంటే ముందు తెలుసుకుంటే గాని ఆచరణ సాధ్యం కాదుగదా! - ఈ భావాలను అర్జునుని ముఖంలో చూచిన భగవానుడు అట్టి యోగారూఢ స్థితిని పొందటానికి ముందుగా పరుగులు తీసే మనస్సును కట్టడి చేయటం ముఖ్యం గనుక, మనస్సును ఏకాగ్రం చేసే ధ్యానయోగ పద్ధతిని వివరంగా రాబోయే 6 శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు.

- ధ్యానయోగ పద్ధతి

**శ్లో||** యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః|
ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీర పరిగ్రహః|| **(10)**

**తా||** ధ్యానయోగి ఏకాంత ప్రదేశంలో, ఒంటరిగా, ఇంద్రియాలను మనస్సును నిగ్రహించి, ఆశను వీడి, దేనినీ పరిగ్రహించక, ఎల్లప్పుడూ మనస్సును ఆత్మ యందు నిలుపుటకు అభ్యాసం చేయాలి.

**వ్యాఖ్య:-** యోగారూఢస్థితిని అందుకోవాలంటే పరుగులు తీసే మనస్సును కట్టడిచేయాలి. అందుకే ధ్యానం. చక్కగా ధ్యానం కుదరాలంటే కొన్ని అనుకూల పరిస్థితులను సృష్టించుకోవాలి. వాటినే ఇకనుండి వరసగా చెప్పబోతున్నారు. అసలు ధ్యానమంటే ఏమిటి? నిరంతరం ధ్యేయవస్తువును తలచుకుంటూ ఉండటమే ధ్యానం. ఆ ధ్యానం తైలధారలాగా ఉండాలి. అంటే మన ఆలోచన లేదా దృష్టి ధ్యేయ వస్తువైన పరమాత్మపై ధారాపాతంగా ప్రవహించాలి. దానినే సరళ చింతనం అని కూడా అంటారు.

ధ్యానం చేయటం అబ్బో చాలా కష్టమండీ! అంటుంటారు. కాని ధ్యానం చెయ్యకుండా ఉంటున్నదెవరు? భార్య ధ్యానం, భర్త ధ్యానం, అత్త ధ్యానం, కోడలు ధ్యానం, ధన ధ్యానం, సంపదల ధ్యానం, సంపాదనల ధ్యానం, పదవుల ధ్యానం, కీర్తి ప్రతిష్టల ధ్యానం, లంచాలధ్యానం - ఇలా ఎన్నో రకాల ధ్యానాలు చేస్తూనే ఉంటారు. కాకపోతే ఈ ధ్యానాలన్నీ అనాత్మ ధ్యానాలు. ఇవన్నీ నిన్ను ఈ బంధాల్లో ముంచేవే గాని నిన్ను ఉద్ధరించేవి కావు. ఆత్మధ్యానం ఒక్కటే నిన్ను ఉద్ధరించేది. అట్టి ఆత్మధ్యానాన్ని అభ్యసించటానికే కొన్ని జాగ్రత్తలను చెబుతున్నాడు భగవానుడు.

1.<u>రహసిస్థితః:-</u> ఏకాంత ప్రదేశంలో ధ్యానాభ్యాసం చెయ్యాలి. అంటే మనస్సును చెదరగొట్టే వాటికి దూరంగా ఉండాలి. రహస్య ప్రదేశం అంటే కొండగుహలు, అరణ్యప్రదేశాలు గదా! అని భ్రమపడకూడదు. మన ఇంటిలోనో, పరిసర ప్రదేశాలలోనో ఇతరులు వచ్చి ఆటంకం కలిగించని చోట ధ్యానానికి కూర్చోవాలి. ఇలా రహస్య ప్రదేశంలో ఏకాంత ప్రదేశంలోనే ఎందుకు

చేయాలి? భూమిలో గుప్తంగా ఉన్న విత్తనమే మొలకెత్తుతుంది. పదిమందికీ కనపడాలని బయటపడితే పక్షుల పాలవుతుంది. సెంటు బాటిల్ కు బిరడా బిగించి ఉంటేనే సువాసన నిలుస్తుంది. బిరడా తీస్తే సువాసన ఆవిరైపోతుంది. పాపమైనా, పుణ్యమైనా దాచేస్తే పెరుగుతుంది. వెల్లడిచేస్తే క్షీణిస్తుంది. అందుకే చేసిన పుణ్యాన్ని దాచుకోవాలి. పాపాన్ని బహిర్గతం చెయ్యాలి. అందుకే చేసిన పాపం చెబితే పోతుందంటారు పెద్దలు. కనుక రహస్యస్థలంలోనే ధ్యానం చెయ్యాలి.

2.ఏకాకీ:- ధ్యానం ఒక్కడే చేయాలి. అయితే ప్రారంభంలో ఒకే విధమైన భావాలు గలవారు ధ్యానం కోసమే ఒకచోట కలసి కూర్చొని ధ్యానాన్ని అలవరచుకోవచ్చు. ఆ తరువాత మాత్రం ఒక్కడే కూర్చోవాలి. దీనికి కారణం నలుగురి మధ్యలో ఉంటే ఏవేవో విషయాలు చర్చకు వస్తాయి. అందుకే తపస్సుకు ఒక్కడు అధ్యయనానికి ఇద్దరు అన్నారు.

ఒక యువతి వడ్లు దంచుతున్నది. చేతికి 8 గాజులున్నవి. అవి గలగల శబ్దం చేస్తుంటే చిరాకుగా ఉంది. ఒక్కొక్క గాజు తీసేస్తుంటే శబ్దం తగ్గిపోతున్నది. ఇంక రెండున్నవి. అప్పుడూ కొంచెం శబ్దమే. మరొకటి తీసేసింది. ఇప్పుడు శబ్దమే లేదు. అందుకే ధ్యానయోగి ఏకాకిగా ఉండాలి -అని చెప్పటం.

3.యతచిత్తాత్మా:- మనస్సును స్వాధీనంలో ఉంచుకోవాలి. అంటే అన్యమైన ఆలోచనలు రాకుండా ఉండాలి. అసలు ఆలోచనలు ఎందుకు వస్తాయి? మనలోని వాసనల కారణంగా. వాసనలెందుకున్నాయి? మనం పూర్వంలో చేసిన సంకల్పాల వల్ల. అందువల్ల ఆ వాసనలు పోవాలి. వాసనలు

పోవాలంటే కర్మలు చేయాలి. కర్మలు చేస్తే క్రొత్త వాసనలు చేరతాయి కదా? మరెలా? అందుకే నిష్కామ కర్మయోగాన్ని ఆచరించాలి. ఫలాసక్తి లేకుండా కర్మలు చేయాలి. అందుకే ధ్యాన యోగానికి ముందే కర్మయోగాన్ని చెప్పటం జరిగింది. ఇలా కర్మయోగాన్ని ఆచరించిన వారికే వాసనా క్షయమై మనస్సు స్వాధీనంలో ఉంటుంది. మనస్సు పరుగులు తీస్తే ధ్యానం కుదరదు.

ఏనుగు చపల ప్రాణి. దాని ఇంద్రియాలు దాని స్వాధీనంలో ఉండవు. అందుకే సింహం స్వప్నంలోకి వస్తే చాలు ప్రాణం వదిలేస్తుంది. మరి సింహం? ఎంతో నిగ్రహం గల ప్రాణి. జీవితకాలంలో ఒకే సంతానాన్ని కంటుంది. అందుకే అది అరణ్యానికి రాజు. దానినెవరూ అభిషేకించరు. తన పట్టాభిషేకం తానే చేసుకుంటుంది. స్వార్జితం మీద జీవిస్తుంది. పిత్రార్జితం దానికి పనికిరాదు. కోతి కూడా చపల జంతువే. ఆంజనేయుడు కూడా అంతే. కోతి గదా! లంకాదహనం చేసేటప్పుడు సీతమ్మ తల్లి గుర్తుకు రాలేదు. అంతా అయిపోయి సముద్రం దగ్గర నిప్పునార్పుకొనేటప్పుడు గుర్తువచ్చి తిరిగి వెళ్లి చూసి వస్తాడు. కనుక మనోనిగ్రహం ధ్యానయోగికి తప్పనిసరి.

**4.నిరాశీః-** యోగికి ఆశ ఉండకూడదు. ఆశ అనేది ఒక పాశం(త్రాడు). అదే యమపాశం. యముడు ప్రతివాణ్ణీ పాశంతో బంధిస్తాడు అంటారు. నిజంగా ఇంత మందికి పాశాలు ఎక్కణ్ణుంచి వస్తాయి? ఆయనకేమన్నా తాళ్ళ ఫ్యాక్టరీలున్నాయా? లేదు. ఎవడి పాశం వాడి మెడకే తగిలించి ఉంటుంది. అదే ఆశాపాశం. ఆశకు దాసుడైతే లోకానికంతా దాసుడే. ఆశ గల వాడి ధ్యానమంతా ఆశించినదానిమీదే ఉంటుంది గాని భగవంతుని మీద



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉండదు. కనుక ఆశలు పెంచుకొని మోసపోవద్దు. యోగులమని, సర్వసంగ పరిత్యాగులమని చెప్పుకునే ఎందరో భోగాలపై ఆశతో జీవితాన్ని గడుపుతుంటారు. ఆశ్రమాల సంఖ్య పెంచాలని, విదేశాల్లో ఆశ్రమాలు కట్టాలని, పెద్ద పెద్ద భవనాలు దేవాలయాలు, పాఠశాలలు నిర్మించాలని, విమానాలు, హెలికాప్టర్లు, విమానాశ్రయాలు, ఎ.సి. రూములు, మందీమార్బలం.... ఇలా ఆశకు అంతులేదు. చివరకు ఎక్కడ ఆగుతారో వారికే తెలియదు. వీటివల్ల ప్రజల మెప్పు పొందవచ్చునేమో గాని పరమాత్మ మెప్పు మాత్రం లభించదు. కనుక నిరాడంబరంగా, నిర్లిప్తంగా ఉన్నప్పుడే నిజమైన ఉన్నతి.

5.అపరిగ్రహః:- యోగి పొదుపరిగా ఉండాలి. ఇతరుల నుండి దేనినీ ఆశించకుండా, అడిగి తీసుకోకుండా, అప్రయంత్నగా లభించిన దానితో సంతృప్తి చెందాలి. ధనం, బంగారం, స్థలాలు, భవనాలు మొ||న వాటిని సేకరించిన కొద్దీ వాటిపై ఆసక్తి పెరుగుతుంది. యోగసాధనకు అంతరాయం కలుగుతుంది. ఇప్పడీ దేహాన్ని సేకరించి తెచ్చుకొని గదా! ఇన్ని కష్టాలు పడుతున్నాను. ఇంకా ఇంకా వస్తువులను, ఆస్తులను సేకరించినట్లయితే ఇంకా ఎన్నికష్టాలు పడవలసి వస్తుందో అనే సత్యాన్ని గ్రహించాలి. అసలు ఇతరులనేమైనా అర్థించామంటే వామనులమైపోతాం. శ్రీమహావిష్ణు వంతటి వాడు బలిచక్రవర్తి ముందు పొట్టివాడయ్యాడు.

అంతేకాదు, ఈ పరిగ్రహం(పుచ్చుకోవడం) వల్ల ఎన్నో ఇబ్బందులొస్తాయి. ఒక భక్తుడు దేవాలయంలో ప్రతిరోజూ 108 ప్రదక్షిణలు చేసేవాడు. సాష్టాంగ ప్రదక్షిణలు చేసేవాడు. అతడి భక్తికి ముచ్చటపడి ఒక దాత అతడికి పట్టువస్త్రాన్ని

బహూకరించాడు. భక్తుడు దానిని ధరించి ప్రదక్షిణ చేయబోయి, సాష్టాంగ పడితే పట్టువస్త్రం మాసిపోతుంది, చినిగిపోతుంది అని సాష్టాంగపడటం మానుకున్నాడు. ఆ తరువాత ప్రదక్షిణలే మానుకున్నాడు. ఇదీ ఇబ్బంది.

ఈ జాగ్రత్తలు తీసుకుంటూ ధ్యానసాధన సాగించాలి. ఎప్పుడు?

సతతం:- ఎల్లప్పుడూ. ఎంతకాలం సాగించాలి? అనే దానికి కాలనియమం లేదు. పాము   బుస్సు మన్నది. దాన్ని పట్టుకొని తలను గట్టిగా బంధించాడు. ఎంతసేపు ఉండాలి? అది చచ్చిన దాకా. అలాగే మనస్సు పూర్తిగా ధ్యేయవస్తువుపై నిలిచి అందులో లయమయ్యే(చచ్చే) వరకు ధ్యానం సాగించాల్సిందే. కనుక దీర్ఘకాలం, ఎడబాటు లేకుండా, శ్రద్ధతో చేయాలి. ఇదే సతతం అంటే.

ఒకసారి రమణ మహర్షిని ఒకాయన అడిగాడు.  "స్వామీ! ధ్యానం ఎంతసేపు చేయాలి?" అని. దానికాయన "నేను ధ్యానం చేస్తున్నాననే భావం పోయేంతవరకు చేయాలి" అన్నారట. దేహభావం తొలగిపోయేంత వరకు ధ్యానం సాగాల్సిందే.

- ధ్యానానికి 5 జాగ్రత్తలు తెలుసుకున్నాం. ఇక ఆసనం ఎలా ఉండాలి?

శ్లో|| శుచౌదేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః|
నాత్యు చ్ఛ్రితం నాతి నీచం చైలాజిన కుశోత్తరం|| (11)

తా|| శుచియైన ప్రదేశంలో మరీ ఎత్తు కాకుండా, మరీ లోతు కాకుండా, దర్భచాప, లేడి చర్మం, మెత్తటి బట్టతో స్థిరమైన ఆసనాన్ని తన కొరకు ఏర్పాటు చేసుకోవాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** ధ్యానానికి కూర్చునే ప్రదేశం ఎలా ఉండాలో, ఆసనం ఎలా ఉండాలో తెలియజేస్తున్నారు.

**1.**శుచౌదేశే:-శుచి, శుభ్రత ఉన్న ప్రదేశంలో ధ్యానం చెయ్యాలి. అపరిశుభ్రంగా, దుర్వాసన వచ్చే ప్రదేశాలలో ధ్యానానికి కూర్చుంటే మనస్సు స్థిరంగా నిలవదు. సాత్విక భావాలు కలిగించే పటాలు, వెలుతురు తక్కువగా ఉండే దీపం, ఈగలు, దోమలు, చీమలు మొ॥వి లేకుండా ఉండాలి. ఎందుకంటే స్థాన మహిమ గొప్పది.

ఒకసారి గరుత్మంతుడు శివుని వద్దకు వెళ్ళాడు. శివుడు ధ్యానమగ్నుడై ఉన్నాడు. గరుత్మంతుడు అక్కడే వేచి ఉన్నాడు. అప్పుడు శివుని మెడలోని సర్పం గరుడుణ్ణి చూచి బుస్సు బుస్సుమని బుసగొడుతున్నది. అది చూచి గరుడుడు, "నాగరాజా! నీ ప్రభావం నాకు తెలియక పోలేదు. నీవు శివుని కంఠంలో ఉండి గర్జిస్తున్నావు. ఎంతైనా స్థానబలం కదా! ఏదీ ఆ స్థానం నుంచి దిగిరా! చూపిస్తాను నా తడాఖా ఏమిటో" అన్నాడట. కనుక స్థాన మహిమ అట్టిది.

గజేంద్రుడు మహాబలశాలి. అయితేనేం! నీటిలో దిగాడు. మొసలి కాలు పట్టేసింది. ఎంత వదిలించుకుందామన్నా వీలు కాలేదు. "లావొక్కింతయు లేదు, ప్రాణంబుల్ ఠావుల్ తప్పెను" అన్నాడు గజేంద్రుడు. దీనికి కారణం మొసలి గజేంద్రుని కన్న బలమైనదని కాదు. అది తన స్థానమైన నీటిలో ఉన్నది. అదే బయటకు వస్తే గజేంద్రుడు ఒక్క విసురు విసిరేవాడు. "స్థానబలము

కాని తన బలము కాదయా" అన్నది ఇందుకే. కనుక శుచియైన ప్రదేశంలో కూర్చోవాలి.

2.న అత్యుచ్ఛ్రితం న అతి నీచం:- తాను కూర్చొనే చోటు మరీ ఎత్తుగానో, మరీ లోతుగానో ఉండరాదు. ఎత్తుగా కూర్చుంటే పడిపోతానేమోననే భయంతో మనస్సు ఏకాగ్రంగా నిలవదు. పరవశంలో గాని, నిద్రలో గాని పడిపోవచ్చు. ఇక పల్లంలో కూర్చుంటే పైనుండి నీరు వచ్చిపడే వీలుంటుంది. క్రిమికీటకాల బాధ ఉంటుంది. పల్లపు ప్రదేశాలు శీతలంగా ఉంటాయి. హృదయ స్పందన వేగం తగ్గిపోతుంది. కనుక భూగృహాలలో ధ్యానం చేయరాదు. ఇక ఆసనం....

3.చైలాజిన కుశోత్తరం:- ఆసనం స్థిరంగా కూర్చొనుటకు వీలుగా ఉండాలి. అలా ఉండాలంటే దర్భాసనం, దానిపైన అజినం - అంటే జింక చర్మం; దానిపై తెల్లని, మెత్తని వస్త్రం పరచుకొని ఆసనాన్ని ఏర్పాటు చేసుకోవాలి. ఆసనం వల్ల భూమి యొక్క స్పర్శ తప్పుతుంది. భూమిపై కూర్చొని ధ్యానం చేస్తే నీ ధ్యాన శక్తిని భూమ్యాకర్షణ శక్తి లాగివేస్తుంది. కనుక ఇలా మూడింటితో ఏర్పాటు చేసుకోవాలి. దర్భలు చల్లదనాన్ని పోగొడతాయి. కనుక శీతాకాలంలో వెచ్చగా ఉంటుంది. వేసవిలో జింకచర్మం వేడెక్కుతుంది. దానివల్ల సాధకుడికి చెమట పట్టి, ఆ వేడి వల్ల చర్మవ్యాధులు రావచ్చు. దీని నివారణకే ఆ చర్మంపై తెల్లని వస్త్రం. ఇలా ఏర్పాటు చేసుకొన్న ఆసనం అన్ని కాలాలకు తగియుంటుంది. ఒకవేళ చర్మం లేకపోతే వస్త్రంపై కూర్చోవచ్చు.

4.స్థిరమాసనం:- ఇక ఆ ఆసనంపై దేహాన్ని అటూ ఇటూ కదపకుండా, ముందుకు గాని, వెనక్కుగాని వంగకుండా స్థిరంగా, తిన్నగా కూర్చోవాలి. శరీరం కదిలితే మనస్సు కదులుతుంది. వెన్నెముకను నిట్టనిలువుగా ఉంచి, చేతులు ముందుకు పెట్టుకొని, వ్రేళ్ళలో వ్రేళ్ళను దూర్చి, అన్ని వేళ్లను కలిపి ఉంచి, పద్మాసనంలో గాని, సుఖాసనంలో గాని కూర్చోవాలి. ఈ ఆసనం 'ఆత్మనః' తన కొరకు అని చెబుతున్నారు . అంటే ఈ ఆసనం ఎవరిది వారికే ఉండాలి. ఒకరిది మరొకరు మార్చుకోకూడదు. అలా మార్చుకుంటే వారి ఆలోచనలు, కోర్కెల ప్రభావం నీపై పడే ప్రమాదం ఉంటుంది. అది సాధనకు భంగకరం. ఆసనం - జపమాల - పారాయణ గ్రంథం ఎవరివి వారికే ఉండాలి.

- ఇక ఈ ఆసనంపై కూర్చొని ఏంచేయాలో తరువాత శ్లోకంలో చెబుతున్నారు.....

**శ్లో||** తత్రై కాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రియః|
ఉపవిశ్యా సనేఽఽయుంజ్యాత్ యోగమాత్మ విశుద్ధయే|| **(12)**

**తా||** ఆసనంపై కూర్చొని, మనస్సును ఏకాగ్రం చేసి, ఇంద్రియ మనో వ్యాపారాలని నిగ్రహించి, ఆత్మ శుద్ధి కోసం యోగాన్ని అభ్యసించాలి.

**వ్యాఖ్య:-** ఇంతకుముందు శ్లోకంలో చెప్పినట్లుగా స్థిరమైన ఆసనాన్ని ఏర్పాటు చేసుకొని, దానిపై కూర్చొని యోగాన్ని అభ్యసించాలి. ఎలా?

1.మనః ఏకాగ్రం కృత్వా:- మనస్సును అన్ని ఆలోచనల నుండి విముక్తం చేసి ఏకాగ్రం చెయ్యాలి. ఎలా? గురుధ్యానం, భగవధ్యానం చేసి మనస్సును ప్రశాంతంగావించాలి. అనేకాగ్రం నుండి శూన్యానికి, శూన్యాగ్రం నుండి

ఏకాగ్రానికి తెచ్చుకోవాలి. అంటే అనేక విషయాల మీదకు వెళ్ళే మనస్సును అనేకాగ్రం అంటారు. అట్టి మనస్సును అన్నింటి నుండి వెనక్కు తీసుకురావాలి. అప్పుడు మనస్సును శూన్యాగ్రం అంటారు. ఇప్పుడు శూన్యంలో ఉన్న మనస్సును ధ్యాన వస్తువుపైకి తెచ్చి నిలపాలి. అదే ఏకాగ్రమైన మనస్సు అంటారు. ఇది చాలా కష్టం. ఐనా దీనికి కూడా గీత ఉపాయం చెబుతున్నది. అదే -

2.యత చిత్తేంద్రియ క్రియః- చిత్రక్రియలైన ఆలోచనలను, ఇంద్రియ క్రియలైన కర్మలను స్వాధీనంలో ఉంచుకోవాలి. ఆలోచనలు చేస్తున్నప్పుడు వాటి కనుగుణంగా కర్మలు చేయవలసి వస్తుంది. విషయవస్తు చింతనను ఆలోచనలను ఆపగలిగితే కర్మలూ ఆగిపోతాయి. ఐతే విషయచింతన ఎలా ఆగుతుంది? మనస్సుకు నచ్చచెప్పాలి. ఈ విషయవస్తువులన్నీ విషంలాంటి వని, అవి నిజమైన, శాశ్వతమైన సుఖాన్ని, సంతోషాన్ని ఇవ్వలేవని, కనుక వృధాగా వీటిని గురించి ఆలోచించి శక్తిని వృధా చేసుకోరాదని నచ్చచెప్పు కోవాలి. అలా ప్రయత్నంతో చిత్తాన్ని స్వాధీనంలోనికి తెచ్చుకొని క్రమంగా ఇంద్రియాలను నిగ్రహించి యోగాన్ని ఆచరించాలి.

లోతుగా ఆలోచిస్తే చిత్తానికి విషయాలకు నిత్య సంబంధం లేదు. తాత్కాలిక సంబంధమే. కాని చిత్తానికి ఆత్మకు నిత్య సంబంధం ఉంది. కుండలో నీళ్ళు పోశారనుకోండి. అది తాత్కాలిక సంబంధమే. కాని కుండకు ఆకాశానికి ఉన్నది నిత్య సంబంధం. నిత్య సంబంధం తెగిపోయేది కాదు. తాత్కాలిక సంబంధాన్ని తెంచుకోవచ్చు. కనుక చిత్తానికి విషయాలతో ఉన్న

సంబంధాన్ని తెంచుకోవచ్చు. కనుక చిత్తానికి విషయాలతో ఉన్నసంబంధాన్ని ప్రయత్నంతో తొలగించుకోవాలి.

ఈ యోగాభ్యాసం వల్ల ప్రయోజనం ఏమిటి? నేరుగా ఆత్మసాక్షాత్కారం కలుగుతుందా? కలగదు. మరి ఈ యోగాభ్యాసం ఎందుకు చేయటం?

3.ఆత్మశుద్ధయే:- మనశ్శుద్ధి జరుగుతుంది. మనస్సులోని సంకల్పాలు, విక్షేపాలే మాలిన్యం. అవి తొలగటమే శుద్ధి. మనస్సు ప్రాపంచిక విషయాలలో ఉంటే మలినమవుతుంది. అదే పరమాత్మ సంబంధమైన ఆలోచనలలో ఉంటే శుద్ధమవుతుంది. ఇనుప ముక్క మట్టిలో వేస్తే తుప్పు పడుతుంది. అదే నిప్పులో వేస్తే పట్టిన తుప్పు వదిలి శుద్ధమవుతుంది. ఇలా మనస్సు శుద్ధి కావటానికే ఈ ధ్యానయోగం. మనస్సు శుద్ధమై ప్రశాంతమైతే బుద్ధి సూక్ష్మమవుతుంది. బుద్ధి సూక్ష్మమైతే ఆత్మజ్ఞానం చక్కగా అవగతమవుతుంది. అప్పుడే మోక్షమార్గంలో ప్రయాణించ వీలుకలుగుతుంది. అంటే ధ్యానం సాక్షాత్తుగా మోక్షాన్ని కలిగించదు. కాని మోక్షాన్ని పొందటానికి సహాయకారి అవుతుంది. శుద్ధమైన మనస్సులోనే ఆత్మ ప్రతిబింబిస్తుంది. అందుకే ధ్యానం.

- మనస్సును నిశ్చలంగా ఉంచేందుకు శరీరాన్ని ఆసనంపై ఎలా ఉంచాలో చెబుతున్నారు ఈ శ్లోకంలో -

**శ్లో||** సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః |
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్|| **(13)**

**తా||** శరీరం, మెడ, తల - ఈ మూడింటిని సమంగా - నిటారుగా ఉంచి, కదలకుండా స్థిరంగా కూర్చొని, దిక్కులు చూడకుండా, తన నాసికాగ్రంపై దృష్టిని నిలపాలి.

**వ్యాఖ్య:-** స్థిర ఆసనాన్ని ఏర్పాటు చేసుకొని ఎలా కూర్చుంటే మనస్సు నిశ్చలంగా నిలబడుతుందో ముఖ్యమైన పద్ధతులను ఇక్కడ చెబుతున్నారు.

1.సమం కాయ శిరోగ్రీవం:- కాయం అంటే శరీరం. ఇక్కడ శరీరం అంటే గుదస్థానం నుండి కంఠం వరకు గల భాగం. కంఠాన్ని గ్రీవం అన్నారు. కంఠం పైన ఉండే తలయే శిరస్సు. ఈ కాయం, గ్రీవం, శిరస్సు - ఈ మూడింటిని సమంగా - అంటే నిటారుగా ఉంచాలి. వంగిపోకూడదు. ఎందుకు?

గుదస్థానంనుండి వెన్నెముక బయలుదేరుతుంది. అది తలలో మెదడుతో అనుసంధానమై ఉంటుంది. ఈ వెన్నెముకను ఆశ్రయించుకొని సన్నని సుషుమ్నానాడి ఉంటుంది. అదే బ్రహ్మనాడి- మోక్షనాడి. అందులో గుదస్థానంలో మూలాధార చక్రం, ఆ పైన వరుసగా స్వాధిష్టానం, మణిపూరం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞాచక్రం అని షట్చక్రాలు ఉంటాయి. మూలాధారచక్రంలో పాములాగా ముడుచుకొని ఉండే కుండలినీ శక్తి ఉంటుంది. అదే జీవుడు. సుషుమ్నానాడికి ఇరువైపులా ఇడ, పింగళ అనే రెండు నాడులుంటాయి. వానినే విష్ణునాడి, శివనాడి అంటారు. ధ్యానం చక్కగా సాగుతున్నప్పుడు ధ్యానశక్తి - ప్రాణశక్తి ఇడాపింగళ నాడులగుండా సుషుమ్న నాడిలో ప్రవేశించి, అక్కడ మూలాధారంలో ఉన్న కుండలినీ శక్తిని కదిలిస్తుంది. ధ్యానం దీర్ఘకాలం సాగుతున్న కొద్దీ ఆ కుండలినీ శక్తి చక్రభేదనం చేసుకుంటూ ఒక్కొక్క చక్రాన్ని

దాటి రెండు కనుబొమల మధ్యనున్న అజ్ఞాచక్రాన్ని చేరుకుంటుంది. అయితే కుండలినీ శక్తి యొక్క ఈ ప్రయాణంలో వెన్నెముక వంగితే సుషుమ్నానాడి ఒంగిపోతుంది. దానితో కుండలినీ ప్రయాణం అక్కడే ఆగిపోతుంది. కనుకనే సమంకాయ శిరోగ్రీవం అన్నారు. నిటారుగా ఆసనంపై కూర్చోవాలి. అంతేకాదు......

2. అచలం:- అంటే కదలకుండా కూర్చోవాలి. అలాగని కట్టెలాగా బిగుసుకు పోరాదు. మొదట్లో కూర్చోగానే కదలకూడదు గదా! అని బిగుసుకుపోయినా, వెంటనే శరీరాన్ని సడలింపు చేయాలి. అలా సడలింపు చేసి శరీరాన్ని అటూ ఇటూ కదలకుండాఉంచాలి. ఎందుకిలా కదలకుండా నిలబెట్టటం? మనస్సుకు ఈ శరీరానికి దగ్గర సంబంధం ఉంది. మనస్సు కదిలితే శరీరం కదులుతుంది. శరీరం కదిలితే మనస్సు కదులుతుంది. మనస్సును నిల్పటం కష్టం గనుక, శరీరాన్ని కదలకుండా ఉంచటం తేలిక గనుక శరీరాన్ని కదలకుండా నిల్పి మనస్సును కట్టడి చేయాలి. శరీరం, మనస్సు రెండూ ఒకే చెట్టుకొమ్మలు. ఒక కొమ్మని లాగితే రెండవది కదులుతుంది. అందుకే శరీరాన్ని కదలకుండా చేసి మనస్సును నిలపాలి. ఏకాగ్రం చేయాలి.

3.స్థిరః:- ధ్యానం చేసినంత సేపు ఆటంకం ఉండరాదు. మధ్య మధ్యలో లేచి కూర్చోరాదు. ఆపి ఆపి చెయ్యరాదు. నిరాటంకంగా సాగిపోవాలి.

4. దిశశ్చాన అవలోకయన్:- ధ్యానంలో కూర్చున్నంత సేపు కన్నులు మూసుకొని ఉండటం శ్రేష్టం. నిద్ర వస్తుందనుకుంటే అర్ధ నిమీలిత నేత్రాలతో ఉండవచ్చు. కన్నులు తెరచి కూర్చుంటే అటూ ఇటూ దిక్కులు చూడాలని

పిస్తుంది. కావాలని చూడకపోయినా ఏవో విషయవస్తువులు కనిపిస్తాయి. లేదా మనుష్యులు కనిపిస్తారు. దానితో అనేకమైన ఆలోచనలు వస్తుంటాయి. అవి ధ్యానానికి ఆటంకం కలిగిస్తాయి. దానితో మనస్సు చలిస్తుంది.

5. నాసికాగ్రం స్వం:- అర్థ నిమీలిత నేత్రుడై తన ముక్కు కొనను చూస్తుండాలి. నిజంగా దృష్టిని ఒక్కచోట నిలపటానికే ఈ జాగ్రత్త. ఐతే ముక్కు కొనను చూడమంటే కనుగుడ్లను బలవంతంగా ముక్కుకొన మీదకు మళ్లించటం కాదు. అలా చేస్తే కళ్ళు మండుతాయి. నొప్పి పెడతాయి. తలనొప్పి రావచ్చు. అందువల్ల నాసికాగ్రం నందు దృష్టి నిలిపాడా అన్నట్లుగా ఉండాలి. కొందరు భ్రూమధ్యంలో దృష్టిని నిలపమంటారు. గీతలో కూడా 5, 8 అధ్యాయాలలో అలాగే చెప్పారు. ఇంతకూ దృష్టిని ఎక్కడ నిలపాలి? అనే సందేహం రావచ్చు. నాసికాగ్రం అంటే పైనుండి చూస్తే ముక్కుకొన, కాని క్రింద నుండి చూస్తే భ్రూమధ్యమే. కనుక భ్రూమధ్యం అనుకూలమైనదే. మొత్తం మీద దృష్టిని అనుకూలమైన ఒక్కచోట నిలిపి ఉంచటమే ప్రధానం. కొందరు హృదయ స్థానంలోను, కొందరు సహస్రారం పైన దృష్టిని నిలుపుతారు. ఇలా ఏదో ఒక స్థానంలో దృష్టిని నిలిపితే మనస్సు నిశ్చలమవుతుంది.

- ఇంతవరకు బాహ్యంగా చేయవలసిన సాధనను, జాగ్రత్తలను చెప్పి, ఇప్పుడు అంతరంగ సాధన - అంటే మనస్సు దేనిని తలచుకోవాలో, దేనిపై ఆలోచనలు నిలవాలో చెప్పబోతున్నారు –

శ్లో|| ప్రశాంతాత్మా విగత భీః బ్రహ్మచారి వ్రతే స్థితః|
మనస్సంయమ్య మచ్చిత్తః యుక్త ఆసీత మత్పరః|| (14)

**తా||** ప్రశాంత మనస్సుతో, భయాన్ని విడిచి, బ్రహ్మచర్య వ్రతంలో నిలిచి, మనస్సును నిగ్రహించి, చిత్తాన్ని నాయందే నిలిపి, నన్నే చేరాలనే లక్ష్యంతో ధ్యానంలో కూర్చోవాలి.

**వ్యాఖ్య:-** ధ్యానయోగి యొక్క లక్ష్యం ఏమిటో - ఆ లక్ష్యాన్ని చేరుకోటానికి ఏ జాగ్రత్తలు తీసుకోవాలో ఈ శ్లోకంలో చక్కగా తెలియజేస్తున్నారు.

1. మత్పరః:- నన్నే పరమగతిగ ఎంచి, నన్నే లక్ష్యంగా పెట్టుకొని, నన్ను చేరితేనే శాశ్వత ఆనందం అని తెలుసుకొని, అందుకోసమే ధ్యానయోగాన్ని సాగించాలి. ఇలా భగవంతుణ్ణే లక్ష్యంగా ఎందుకు పెట్టుకోవాలి? భగవంతుని చేరుకొని ఆయనలో ఐక్యమైపోతేనే సమస్త కర్మబంధనాలు విచ్ఛిన్నమై శాశ్వత శాంతి - శాశ్వత ఆనందం కలుగుతుంది గనుక అందుకు ఏంచెయ్యాలి?

2.మచ్చిత్తః:- చిత్తాన్ని నాయందే నిలపాలి. అంటే మన ఆలోచనలన్నీ ఆ పరమాత్మ చుట్టూ తిరుగుతుండాలి. అయితే ఊరికే చిత్తం ఉంచానంటే సరిపోదు. స్వార్థపూరిత ప్రయోజనాలనాశించి చిత్తాన్ని పరమాత్మయందుంచితే ప్రయోజనం లేదు. కేవలం పరమాత్మ కొరకే పరమాత్మయందు చిత్తం నిలిచిపోవాలి. చిత్తం అలా నిలిచిపోవాలంటే పరమాత్మనే లక్ష్యంగా పెట్టుకోవాలి. అయితే ఇలా చిత్తం పరమాత్మలో నిరంతరం నిలిచిపోవాలంటే కొంత శిక్షణ కావాలి. ఏమిటది?

3.ప్రశాంతాత్మా:- సాధకుని మనస్సు ప్రశాంతంగా ఉండాలి. రాగద్వేషాలే మనస్సు యొక్క ప్రశాంతతను చెడగొడతాయి గనుక రాగద్వేషాలను విడిచి పెట్టాలి. నీకెవరైనా అపకారం చేసినా, నిన్ను అవమానించినా అది వారికే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నష్టం అని, నీకు ఏమాత్రం నష్టం కలగదనీ గ్రహిస్తే... మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అలాగే ఎవరైనా నిన్ను ప్రశంసించినా, నీకు మేలు చేసినా వారిని మరిచిపోకుండా ప్రత్యుపకారం చెయ్యటానికి అవకాశం దొరికినప్పుడు వారికి ఉపకారంచేయాలి. దానివల్ల మనస్సులో ఎటువంటి ఉద్రేకాలు కలగవు. దానితో మనస్సుకు శాంతి, ధ్యానానికి అనుకూలం. ఇక మరొక ఉపాయం -

4.విగతభీః:- సాధకుడికి భయం ఉండకూడదు. ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతాం? ధన సంపదలు లేవనో, అధికారం లేదనో, ఇల్లూవాకిలి లేదనో - ఇలా దేనికోసమో ఆలోచిస్తూ భయపడరాదు. నిజంగా ఈ జగత్తు మిథ్య, ఇట్టి మిథ్యాజగత్తును గాక సత్యమైన ఆత్మను ఆశ్రయిస్తే భయం ఉండదు. నాలుగు రోజులు వాడుకొని వదిలిపెట్టిపోయే ఈ ప్రాపంచికమైన వస్తువుల కోసం తపనపడితే భయం కలుగుతుంది. నాదేదో పోతున్నదని భయపడరాదు. నిజంగా నీది ఇక్కడ ఏం వున్నదో ఆలోచించుకో. వస్తూ ఏం తెచ్చావు? పోతూ ఏం తీసుకెళుతున్నావు? ఇలా ఆలోచించాలి. ఈ భయం వల్లనే మనస్సు ప్రశాంతంగా ఉండదు.

5.బ్రహ్మచారి వ్రతేస్థితః:- బ్రహ్మచర్య వ్రతంలో స్థిరంగా ఉండాలి. బ్రహ్మచర్యం అంటే రెండు అర్థాలున్నాయి. 1.వీర్యరక్షణం. 2.బ్రహ్మమునందు చరించుట.

I. వీర్యరక్షణ వల్ల ఎంతో ప్రయోజనం ఉన్నది. ప్రమిదలో నూనెపోసి వత్తి వేసి దీపం వెలిగిస్తాం. నూనె వత్తి గుండా పైకి వెళితే వెలుగు. అలాకాక నూనె క్రింద పడిపోతే గలీజు. అలాగే వీర్యం ఊర్ధ్వరేతస్కం అయితే దివ్యజ్యోతి - దివ్య ప్రకాశం. అలాకాక అధః పతనమైతే నిష్ప్రయోజనం. గృహస్థులైన వారి సంగతి

ఏమిటి? వారు గృహస్థ బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి. గృహస్థాశ్రమం స్వేచ్ఛాచారం కారాదు. కామశోధన కోసం గృహస్థాశ్రమం గాని కామతృప్తి కోసం కాదు. బ్రహ్మచారి వ్రతం అన్నారు గనుక ఇదొక వ్రతంగా, దీక్షగా, పట్టుదలగా ఉండాలి.

II. ఇక బ్రహ్మమునందు చరించుట అంటే ఒక గురువును ఆశ్రయించి, ఆయన ఇచ్చే జ్ఞానామృతాన్ని సేవించాలి. ఆ జ్ఞానాన్ని తన అనుభవంలోనికి తెచ్చుకోవాలి. నిత్యమూ బ్రహ్మమునందే నీ ఆలోచనలు సంచరించాలి. దీనివల్ల ధ్యానంలో మనస్సు ఏకాగ్రమవుతుంది. ఇక -

6.మనః సంయమం:- నిర్భయంగా వుంటే మనస్సులోని సంక్షోభం నిర్మూలన మవుతుంది. బ్రహ్మచర్యం మనిషిని శారీరకంగా, మానసికంగాను స్థిరంగా ఉంచుతుంది. గురువుయొక్క సాన్నిధ్యం, సహాయం ధైర్యాన్ని కలిగిస్తుంది. దీనివల్ల కలిగే ప్రశాంతత బుద్ధిని స్థిరంగా ఉంచుతుంది. ఇలా మనస్సు నిగ్రహంతో ఉంటే ధ్యానం చక్కగా సరళచింతనగా సాగుతుంది. కనుక మనస్సును బాగా మచ్చిక చేసుకొని స్వాధీనంలో ఉంచుకోవాలి. అదే సంయమం, అప్పుడే నిలువమన్న చోట నిలుస్తుంది మనస్సు. ఈ జాగ్రత్తలతో ధ్యానం సాగించాలి. ఆత్మపై మనస్సు నిలపాలి. ఇట్టి ధ్యానాభ్యాసం వల్ల అంతిమఫలం ఏమిటో చెబుతున్నారు.

శ్లో|| యంజన్నేవం సదాత్మానం యోగీనియత మానసః|
శాంతిం నిర్వాణ పరమాం మత్సం స్థామధి గచ్ఛతి|| (15)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** మనోనిగ్రహంగల యోగి ఎల్లప్పుడూ మనస్సును ఆత్మధ్యానంలో నిలిపి, నాయందేయున్నట్టి మోక్షరూపమైన శాంతిని పొందుతాడు.

**వ్యాఖ్య:-** 1.యోగీ నియత మానసః:- మనస్సును నిగ్రహించినవాడే యోగి. అట్టివాడే మనస్సును ఎల్లప్పుడూ ఆత్మధ్యానంలో నిలుపగలుగుతాడు. మనస్సు కోతిలాంటిది. అన్నివైపులకు పరుగులు తీయటం దాని స్వభావం. చక్రవర్తులు, కోటీశ్వరులు, రాజులు, మహారాజులు, నాయకులు, వినాయకులు, సాధువులు, సన్యాసులు, సంసారులు - వీరు వారు అనే భేదం లేకుండా అందరూ మనస్సుకు బానిసలే. బయటనున్న శత్రువులను బాంబులు పెట్టి చంపవచ్చును కాని ఈ లోపల శత్రువును చంపడం ఎలా? కేవలం ఆత్మజ్ఞానం కలిగితేనే మనస్సును జయించడం సాధ్యం. ఆత్మజ్ఞానం అంటే 'నేను ఆత్మను' అనే జ్ఞానమే. ఇప్పటివరకు 'ఈ దేహమే నేను' అనే అజ్ఞానం మనలో ఉన్నది. ఇది పోయి 'నేను ఆత్మను' అనే జ్ఞానం కలగాలి. అలా కలిగిందా! ఇక మనస్సు నీకు దాస్యం చేస్తుంది. నీ ముందు చేతులు కట్టుకొని నిలబడుతుంది.

నీవు సామాన్య పౌరుడుగా ఉన్నప్పుడు ఒక పెద్ద పోలీస్ ఆఫీసర్ ను ఆజ్ఞాపించగలవా? అసలు ధైర్యంగా మాట్లాడగలవా? అతడినేమైనా చేయ గలవా? ఏమీ చేయలేవు. అతడే నిన్నేమైనా చేయగలడు. అదే నీవు ఎన్నికలలో ఎం. ఎల్. ఏ గా గెలిచి హోం మంత్రి వయ్యావనుకో.... ఆ పోలీస్ ఆఫీసరే నీముందు చేతులు కట్టుకొని నిలబడతాడు. నీ ఆజ్ఞల కోసం ఎదురుచూస్తాడు. ఇప్పుడతడు నీవు చెప్పినట్లు చెయ్యాలి.

అలాగే నీవు దేహాత్మ బుద్ధి(దేహమే నేను అనే బుద్ధి) తో ఉన్నావా! ఈ మనస్సుకు దాసుడివి. అలాగాక నేను ఆత్మననే జ్ఞానంలో నిలిచావా! - ఈ మనస్సే నీకు దాస్యం చేస్తుంది. నీ ఆజ్ఞలకోసం నీముందు చేతులు కట్టుకొని నిలబడుతుంది.

ఇలా ఆత్మజ్ఞానంతో మనస్సును స్వాధీనంలోకి తెచ్చుకో గలిగితే నీవు యోగివి. ఇప్పుడు నీ స్వాధీనంలో ఉన్న మనస్సును ఆత్మయందే నిలుపగలుగుతావు. దాని ఫలితం ఏమిటి?

మత్సంస్థాం - నిర్వాణపరమాం శాంతిం అధిగచ్ఛతి:- నాయందే ఉన్నట్టి, నా స్వరూపమే అయినట్టి శాంతిని పొందుతావు. శాంతి ఎక్కడ ఉన్నది? పరమాత్మలోనే ఉన్నది. ఎందుకు అక్కడే ఉన్నది? ఎందుకంటే భగవంతుని స్వరూపమే శాంతి. ఇక్కడి వస్తువులలో ఉండే శాంతి తాత్కాలిక శాంతి మాత్రమే. కొంత కాలం తర్వాత అశాంతి తప్పదు. అందుకే మహాత్ములు శాశ్వత శాంతికై ప్రయత్నిస్తారు. సామాన్యులు మాత్రం ఈ విషయం తెలియక ఇక్కడి వస్తువులలో దొరకే శాంతి కొరకు నానాతంటాలు పడుతుంటారు. అయితే శాంతి చిక్కినట్లే చిక్కి తప్పించుకుపోతుంది.

నీవు కోరుకున్న కారును నీ ఇంటి ముందుకు తెచ్చుకున్నావు, నీకు భలే ఆనందం, శాంతి. ఈ ఆనందంలో డ్రైవ్ చేసుకుంటూ వెళ్లావు, యాక్సిడెంట్ అయింది. చెయ్యి విరిగింది, శారీరక బాధ. కారు రిపేరుకు 12వేలు అయింది, మానసిక బాధ. డ్రైవరును పెట్టుకున్నావు, పనిలేకపోయినా జీతం ఇవ్వాల్సి వచ్చింది, ఇంకా బాధ. దానికి గ్యారేజీ, పెట్రోలు....ఊహించుకుంటే ఎంతో బాధ.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కనుక ఇక్కడి విషయవస్తువుల ద్వారా ఎంత ఆనందాన్ని పొందినా అది తాత్కాలికమే. శాశ్వత ఆనందం, దుఃఖం లేని ఆనందం ఆత్మపై మనస్సును నిల్పి ధ్యానం చేసి ఆత్మతో మనస్సును ఐక్యం చేసినప్పుడే లభిస్తుంది.

- ధ్యానం వల్ల కలిగే ప్రయోజనాన్ని తెలియజేసి, ఆ ధ్యానం సక్రమంగా సాగాలంటే ఏ జాగ్రత్తలు తీసుకోవాలో తెలియజేసి, ఎవరికి ధ్యానం సరిగ్గా కుదరదు అనే విషయాన్ని ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు -

**శ్లో||** నాత్య శ్నతస్తుయోగోఽస్తి నచైకాంత మనశ్నతః|
నచాతి స్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున|| **(16)**

**తా||** అర్జునా! ఎక్కువగా తినేవాడికి, అసలు తిననివాడికి, ఎక్కువగా నిద్రపోయేవాడికి, అసలు నిద్రపోకుండా తెల్లవార్లూ మేలుకొని ఉండేవాడికి యోగం కుదరదు.

**వ్యాఖ్య:-** అతిగా తినేవాడికి, అసలు తినకుండా పస్తులుండే వాడికీ యోగం కుదరదు. బ్రతకటం కోసం తినాలిగాని తినటం కోసం బ్రతకరాదు. దేహం కోసం అన్నమేగాని అన్నం కోసం దేహం కాదు.

మహాభారతంలో పాండవులు ద్రౌపదీదేవితో సహా మహాప్రస్థానం పూర్తిగావించి, మేరు పర్వతాన్ని ఎక్కుతుండగా ముందు ద్రౌపదీదేవి పడిపోయింది. ముందు వెళుతున్న ధర్మరాజును ఆ వెనుక వెళుతున్న భీముడు మహాసాధ్వియైన ద్రౌపదీదేవి పడిపోవడానికి కారణమేమిటని అడుగగా, ధర్మరాజు వెనుదిరిగి చూడకుండా, అలా ముందుకు వెళుతూనే "ద్రౌపదికి అర్జునునిపై కొంచెం ప్రేమ అధికం. ఆ పక్షపాత బుద్ధివల్ల పడిపోయింది"

అన్నాడు. ఆ తరువాత సహదేవుడు పడిపోగా "నేను గొప్ప పండితుడిననే అహంకారం వల్ల పడిపోయాడని; నకులుడు - గొప్ప అందగాడిననే గర్వం ఉన్నదని, అర్జునుడు మహావీరుల సమక్షంలో తనను తాను గొప్పవాడినని ప్రశంసించుకుంటాడ"ని చెప్పాడు. చివరకు భీముడు పడిపోతూ, "అన్నా! నేనెందుకు పడిపోతున్నాన"ని అడుగగా, ధర్మరాజు, "నాయనా! నీవు అతిగా తింటావు. అందుకే పడిపోతున్నావు" అన్నాడు. ఈ గాథలోని ఆంతర్యం ఏమిటంటే.... పడిపోవటం అంటే యోగంలో నిలువలేక పడిపోవటం. అతిగా తినేవాడికి యోగం కుదరదని, అలాగే పక్షపాతబుద్ధి, అహంకారం, గర్వం, ఆత్మ ప్రశంస - ఇవి కూడా యోగానికి ఆటంకాలేనని తెలియజేయటమే.

మితి మీరి తింటే శరీరం బరువెక్కుతుంది. మత్తెక్కి పోతుంది. సరిగ్గా కూర్చోలేడు. ఒకవేళ బలవంతంగా కూర్చున్నా నిద్రవస్తుంది. నిద్ర రాకపోతే శరీరం బరువెక్కి శరీరాన్ని గురించిన ఆలోచనలే వస్తాయి. ధ్యానం అంటే ఏకాగ్రంగా ఆత్మను ధ్యానించాలి. కనుక అతిగా తింటే ధ్యానం కుదరదు.

సాత్వికాహారం మంచిదే గదా! కాస్త ఎక్కువ తింటే ఏమవుతుంది? అని కొందరు భావిస్తుంటారు. ఏ ఆహారమైనా అతి పనికిరాదు. పాలు సాత్త్వికాహారం గదా! అని ఒక గంగాళం త్రాగితే హాస్పిటల్ కు వెళ్ళాలి. ఆకలి అనేది ఒక జబ్బు, దానికి ఆహారం అనేది మందు అని శంకర భగవత్పాదులు అన్నారు.. మందు తియ్యాగా ఉందిగదా అని ఎక్కువగా తీసుకుంటామా? కనుక ఆహారాన్ని కూడా మందులాగే తగు మోతాదులోనే తీసుకోవాలి. ఆకలి తీరటానికి ఆహారం తీసుకోవాలేగాని రుచికోసం కాదు.

ఇక ఆహారాన్ని అసలు తీసుకోకుండా పస్తులుండడం యోగానికి మంచిది కాదు. మనం తినే అన్నంలో సూక్ష్మభాగం మనస్సుగా, స్థూలభాగం మాంసంగా మారుతుంది. త్రాగేనీటిలో సూక్ష్మభాగం ప్రాణంగా, స్థూలభాగం రక్తంగా మారుతుంది. కనుక పస్తులుంటే శరీరంలో శక్తి ఉండదు; మనస్సు క్షీణించి పోతుంది. ప్రాణం కొడిగట్టిన దీపం అవుతుంది. అందువల్ల ధ్యానం చేయటం సాధ్యం కాదు. ఒకసారి బుద్ధభగవానుడు అలాగే ఆహారం తీసుకోకుండా చాలా రోజులుండేటప్పటికి ధ్యానించే శక్తి లేక నిస్త్రాణగా పడిపోయాడట. అప్పుడు పల్లె వనిత తెచ్చిన పాయసాన్ని స్వీకరించి తిరిగి ధ్యానమగ్నుడయ్యాడట.

ఛాందోగ్యోపనిషత్తులో శ్వేతకేతువు 15 రోజులు ఆహారం లేకుండా కేవలం నీటిని త్రాగుతూ ఉన్నాడు. దానితో అతడు చదివిన వేదం గుర్తుకు రాలేదు. మళ్ళీ ఆహారాన్ని తీసుకోవడంతో జ్ఞాపకశక్తి వచ్చింది. కనుక పూర్తిగా పస్తుంటే ప్రజ్ఞను కోల్పోవాల్సి వస్తుంది.

ఇక నిద్ర విషయంలో కూడా అంతే. అతినిద్ర గానీ, తెల్లవార్లూ మేలుకోవటం గానీ కూడదు. నిద్ర ద్వారానే మానవుడికి విశ్రాంతి. కోల్పోయిన శక్తి తిరిగివచ్చేది నిద్రద్వారానే. దేహంలోని విషవాయువులు బయటకు వెళ్లి స్వచ్ఛమైన ప్రాణవాయువు లోపలికొచ్చేది నిద్రలోనే. అలాగని ఎప్పుడూ నిద్రపోతే తమోగుణం పెరిగి సోమరితనం వస్తుంది, బుద్ధి మందగిస్తుంది, జ్ఞానం కలగదు, యోగం కుదరదు. అలాగని నిద్రపోకుండా ఎప్పుడూ మేలుకొని ఉంటే రజోగుణం పెరుగుతుంది. ఉద్రేకం అధికమౌతుంది, శక్తి

హరించుకుపోతుంది, యోగం కుదరదు. కనుక నిద్ర ఆహారాలు తగు మోతాదులో ఉండాలి. ఎప్పుడూ తింటూ, నిద్రపోతూ ఉంటే వారికి యోగం తెలియదు. తెలిసేది భోగం, వచ్చేది రోగం మాత్రమే.

- యోగం ఎవరికి కుదరదో ఇంతవరకు చెప్పి ఇక ఎవరికి యోగం సిద్ధిస్తుందో చెబుతున్నారు.

**శ్లో||** యుక్తా హార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు|

యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా|| **(17)**

**తా||** ఆహార విహారాలలో మితంగా ఉండేవారికి, కర్మలు చేయుటలో మితంగా ఉండేవారికి, నిద్ర మెలకువలను సమంగా పాటించేవారికి యోగం దుఃఖాన్ని పోగొట్టేది అవుతుంది.

**వ్యాఖ్య:-** యోగోభవతి దుఃఖహా:- యోగం దుఃఖాన్ని పోగొట్టేదే గాని దుఃఖాన్ని కలిగించేది కాదు.

"ఏమిటోనండీ! నేను చాలాకాలం నుండి యోగం చేస్తున్నాను కానీ నాకు ఏమాత్రం దుఃఖం తగ్గలేదు" అని కొందరు నిరాశతో మధ్యలోనే విడిచి పెడతారు. అంతేగాక ఒక పరమసత్యాన్ని కనుగొన్నట్లు ప్రక్కవారికి చెబుతారు. "ఆ! ఏమి యోగం అండీ! ఏదో కాలక్షేపానికి గానీ మనకేం ఉపయోగపడదు" అని. ఇది చాలా ప్రమాదకరమైన నిర్ణయం. నిజంగా యోగం దుఃఖాన్ని పోగొట్టేదే. ఐతే జాగ్రత్తగా చేయవద్దా?

మనం జబ్బుచేసినప్పుడు డాక్టరు దగ్గరకెళతాం. మందులు రాసిచ్చాడు. 4 రోజులైన తర్వాత మళ్ళీ డాక్టరు దగ్గరకెళ్ళి జబ్బు తగ్గలేదు అంటాం. "నేను

రాసిచ్చిన మందులు వాడావా?" అంటాడు డాక్టరు. "లేదండీ! చీటీ జాగ్రత్తగా దాచాను" అంటావు. "అదేమిటయ్యా! మందులు వాడకపోతే జబ్బు ఎలా తగ్గుతుంది?" అంటాడు. సరేనని ఇంటికి వచ్చి మందులు తెచ్చి వేసుకొని, మరునాడు మళ్ళీ డాక్టరు దగ్గరకెళ్ళి "డాక్టరుగారూ! మందులు వాడితే జబ్బు తగ్గకపోగా ఎక్కువైనట్లుంది" అంటాం. "అదేమిటి అప్పుడే మందులు వాడేశావా?" అంటాడు డాక్టరు. "5 రోజుల నుండి వాడలేదు గదా! అని మొత్తం వేసేసుకున్నాను" అంటావు. ఇది కాదు పద్ధతి. మందులను తగు మోతాదులో వాడాలి. అప్పుడే జబ్బు తగ్గేది. అలాగే యోగం సిద్ధించాలంటే తగు మోతాదు ఉండాలి.

ఆహార విహారాల్లోనూ, కర్మలు చేయటంలోనూ, నిద్రా మెలకువలలోనూ - అన్నింటిలోను తగు మోతాదు ఉంటేనే యోగం దుఃఖాన్ని పోగొడుతుంది.

1.ఆహారం:- సాత్వికాహారం కావాలి. అతిగా తినరాదు. పొట్టలో సగం ఆహారం, పావుభాగం నీరు, పావుభాగం ఖాళీగా ఉంచాలి.ఇక నిరాహారిగా ఉండరాదు. అప్పుడే యోగాభ్యాసానికి వీలవుతుంది.

2.విహారం:-యోగి ఎట్టి పరిస్థితిలోను 10 మైళ్ళకన్నా ఎక్కువ నడవకూడదు. దేహానికి ఎక్కువ శ్రమ కలిగించే పనులు చేయరాదు. అలాగని సోమరిగా ఉండరాదు. ధ్యానం కూడా నిరంతరం చేయరాదు.

3.కర్మలు:- మితంగా నిష్కామకర్మలాచరించాలి. శాస్త్ర విహిత కర్మలే చేయాలి. నిషిద్ధకర్మలాచరించరాదు. పూజాదికాలు, యజ్ఞయాగాదులు అన్నింటిని తగు మాత్రంగా ఆచరించాలి. ఈ కర్మలన్నీ మనశ్శుద్ధికే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**4.నిద్ర:- వయస్సును బట్టి నిద్రపోవాలి. 50 సం||ల లోపువారు 6 గంటలు నిద్రపోవాలి. 50 సం||లు పైబడినవారు 4 గంటలు నిద్రపోతే సరిపోతుంది. ఏమైనా 4 లేక 5 గంటల రాత్రి నిద్ర మంచిది.**

**ఇలా జాగ్రత్తలు తీసుకొని ధ్యానసాధన సాగిస్తే చక్కగా కుదరటమే గాక, దుఃఖాలు కూడా తొలగిపోతాయి. యోగం ద్వారా చిత్తవృత్తులు నిరోధింపబడితే దుఃఖం కూడా నిరోధింపబడుతుంది. ఇలా యోగం సాగిస్తే సిద్ధి పొందటం తథ్యం.**

**- ధ్యానాభ్యాసం చేసే యోగి ఎప్పుడు యోగంలో సిద్ధుడైనట్లు? -**

**శ్లో|| యదా వినియతం చిత్తం ఆత్మన్యేవావ తిష్ఠతే||**

**నిస్పృహః సర్వకామే భ్యః యుక్త ఇత్యుచ్యతే తదా|| (18)**

**తా|| ఎప్పుడు చిత్తం బాగా అణచబడి ఆత్మయందే నిలిచిపోతుందో, అన్ని కోరికలపట్ల నిస్పృహ కలుగుతుందో అప్పుడు అతడు యోగసిద్ధుడైనట్లు.**

**వ్యాఖ్య:- 1.వినియతం చిత్తం:- చిత్తం పూర్తిగ అణచబడాలి. ప్రారంభంలో చిత్తం వికారాలతో కూడి ఉంటుంది. అందువల్ల కదలిక ఎక్కువ. అట్టి చిత్తాన్ని విషయవస్తువుల పైకి పరుగులెత్తకుండా నిరోధించాలి. సాధారణంగా మనలో ఏవేవో కోరికలుంటాయి. అలాగే అనేక జన్మల నుండి ప్రోగుచేసుకున్న వాసనలుంటాయి. ఆ కోరికలు, ఈ వాసనలు మనస్సులో అనేక ఆలోచనలను ప్రేరేపించి కర్మరంగంలోకి పరుగెత్తిస్తాయి. అలా మనస్సును పరుగులు తీయకుండా నిరోధించాలి. ఎలా? -**

మనం కోరే వస్తువులన్నీ అనిత్యమైనవని, అనిత్య వస్తువులు అనిత్య సుఖాన్నిస్తాయే గాని, నిత్యమైన సుఖాన్ని అందించలేవని గ్రహించి; నిత్యవస్తువైన ఆత్మపైకే మనస్సును మరలించాలి. అప్పుడే మనస్సు పరుగులు ఆగిపోతాయి. ఇక రెండవది మనస్సులోని పూర్వవాసనలు. ఆ వాసనలను క్షయం చేసుకుంటే గాని మనస్సు యొక్క పరుగులు ఆగవు. మరి వాసనాక్షయం ఎలా? కర్మలు చేస్తేనే వాసనలు క్షయం. కాకపోతే కర్మలవల్ల తిరిగి క్రొత్తవాసనలు చేరతాయి. అలా క్రొత్త వాసనలు చేరకుండా పాతవాసనలు ఖర్చుకావాలంటే నిష్కామకర్మయోగాన్ని ఆచరించాలి. ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరించాలి. దానితో చిత్తం పూర్తిగా అణచబడుతుంది. అలా అణచబడ్డ చిత్తాన్ని ఎక్కడ నిలపాలి? -

<u>ఆత్మన్యేవ అవతిష్ఠతే</u>:- ఆత్మయందే నిలపాలి. ఆత్మను గురించి తెలుసుకొని ఆత్మ గురించిన ఆలోచనలు చేయటమే ఆత్మయందు మనస్సును నిలుపుట అంటారు. చిత్తంలో వికారాలన్నీ అంతమై శుద్ధమైన తర్వాత చిత్తాన్ని ఆత్మలోనే త్రిప్పాలి. అలా నిలిస్తే ఆత్మలోని ఆనందం అనుభవానికి వస్తుంది. ఇంతవరకు బయటి వస్తువులలో ఆనందం వెతుక్కున్నావు. ఇప్పుడు ఆనందం నీలో నుండే అనుభవానికి వస్తుంది. ఇలాంటి స్థితిలో మనలో వచ్చే పెద్దమార్పు ఏమిటి?

<u>సర్వకామేభ్యః నిస్పృహః</u>:- అన్ని కోరికల పట్ల నిస్పృహ. అంటే కోరికలు లేకపోవటం కాదు. కోరికలను తీర్చుకోవాలనే స్పృహ - ఆలోచన లేకపోవటం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఏదో ఒక కోరిక కాదు. అన్ని కోరికల పట్ల నిస్పృహ - ఆసక్తి లేకుండుట. లోపలి నుండే ఆనందం పెల్లుబికి వస్తుంటే బయట వెతుక్కోవాల్సిన పనేముంది?

ఇలా ఎప్పుడైతే చిత్తం విషయాలవైపు పరుగులు తీయకుండా అణగిపోయి, ఆత్మలో నిలిచి లౌకికమైన కోరికలయందు పూర్తిగా ఆసక్తి లేకుండాపోతుందో అప్పుడు అతడు యోగంలో సిద్ధిపొందినట్లే.

- అలా మనస్సు అణచబడి ఆత్మలో నిలిచిపోయినప్పుడు ఎలా ఉంటుందో చక్కగా అర్థం చేసుకొనుటకు ఒక మంచి ఉపమానాన్ని స్వయంగా భగవానుడే తెలియజేస్తున్నాడు.

**శ్లో||** యధా దీపో నివాతస్థః నేంగతే సోపమా స్మృతా|
యోగినో యత చిత్తస్య యంజతో యోగమాత్మనః|| **(19)**

**తా||** ధ్యానయోగాన్నిఅభ్యాసం చేస్తూ, నిగ్రహించబడిన చిత్తం గల యోగిని గాలిలేని చోట చలించకుండా ఉండే దీపంతో పోల్చి ఉపమానంగా చెబుతున్నాడు.

**వ్యాఖ్య:-** ఆత్మలో నిలిచిన యోగి యొక్క చిత్తం ఎలా ఉంటుందో ఇక్కడ ఉదాహరణగా ఉపమానాన్ని చెబుతున్నారు.

ఇంటిలో ఒక దీపాన్ని వెలిగించి పెడతాం. చుట్టూ కిటికీలు, ద్వారాలు తెరిచిఉన్నాయి. వాటి గుండా గాలి లోనికి వస్తుంది. అప్పుడా దీపపు కాంతి అటూ ఇటూ కొట్టుకుంటుంది. ఒక్కొక్కప్పుడు గాలివేగం ఎక్కువగా ఉంటే దీపం ఆరిపోతుంది కూడా. అయితే కిటికీలను, ద్వారాలను మూసివేస్తే ఇక బయటినుండి గాలులు లోపలికి రావు. దీపాన్నేమీ చేయలేవు. దానితో దీపం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నిశ్చలంగా - ఊర్ధ్వముఖంగా వెలుగుతూనే ఉంటుంది. ఇప్పుడు యోగారూఢుని చిత్తం కూడా అలాగే గాలిలేని చోట దీపంలాగా, నిశ్చలంగా, ఆత్మయందే నిలిచిఉంటుందని ఈ ఉపమానం తెలియజేస్తున్నది.

యోగారూఢుని చిత్తమే దీపం, ఇంద్రియాలే చుట్టూ ఉన్న కిటికీలు, ద్వారాలు, విషయ వస్తువులకు సంబంధించిన జ్ఞానమే బయటి నుండి వచ్చే గాలి. ఇంద్రియాలను తెరచి ఉంచితే బయటి నుండి విషయవస్తువుల జ్ఞానమనే గాలి ఇంద్రియద్వారాల ద్వారా లోనికి ప్రవేశించి మనస్సు అనే దీపాన్ని చెదరగొడుతుంది, చలింపజేస్తుంది. ఇది సామాన్యులలో జరిగే విషయం. అయితే యోగారూఢుని విషయం అలాకాదు. అతడు ఇంద్రియాలను నిగ్రహించి తన చెప్పుచేతల్లో పెట్టుకున్నాడు. అంటే ఇంద్రియ ద్వారాలన్నీ మూసివేయబడ్డాయి. ఇప్పుడు బయటి విషయవస్తువులకు సంబంధించిన సమాచారమనే గాలి లోపలికి ప్రవేశించలేదు. దానితో లోపల వెలుగుతున్న మనస్సనే దీపం నిశ్చలంగా ఉంటుంది. దీపం ఊర్ధ్వముఖంగా వెలుగుతున్నట్లు చిత్తం ఊర్ధ్వంగా - ఉన్నతంగా లేచి పరమాత్మలో నిలిచి పోతుంది. చిత్తం పరమాత్మలో నిలిచిపోయింది అంటే చిత్తం ఉన్నట్లా, లేనట్లా? ఇదొక విచిత్ర పరిస్థితి.

ఎండలో ఒక ప్రమిదెను వెలిగించి పెట్టాం. ఇప్పుడు దీపం ఉన్నట్లా? లేనట్లా? ఉన్నది. కాని వెలుగు ఏ ప్రభావాన్నీ చూపదు. అంటే లేనట్లే. ఆ దీపం వెలుగు సూర్యకాంతిలో కలిసిపోయింది. అలాగే చిత్తం ఆత్మలో నిలిస్తే చిత్తం ఉన్నా లేనట్లే. దాని ప్రకాశం ఆత్మలో కలిసిపోయింది.

- యోగసిద్ధి కలిగినప్పటి స్థితిని, యోగమహిమను, అప్పటి ఆనందాన్ని రాబోయే 4 శ్లోకాల్లో అద్భుతంగా వర్ణించబోతున్నారు.

**శ్లో||** యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా!|

యత్ర చైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి|| **(20)**

**తా||** యోగాభ్యాసముచేత ఎప్పుడు మనస్సు నిగ్రహించబడి పరమశాంతిని పొందుతుందో; ఎప్పుడు పరిశుద్ధ మనస్సుచేత పరమాత్మను తనయందే దర్శిస్తూ ఆనందిస్తుంటాడో(అప్పుడు యోగసిద్ధి కలిగినట్లు)

**వ్యాఖ్య:-** సామాన్యుడి మనస్సు రెండు రకాలుగా ఉంటుంది. క్షిప్తం, మూఢం. 'క్షిప్తం' అంటే చలించటం. 'మూఢం' అంటే ఏమీ తెలియక పడి ఉండటం. సాధన చేస్తూ చేస్తూ ఉంటే మనస్సు యొక్క చలనం తగ్గిపోతుంది. ఇదే 'విక్షిప్తం'. ఇంకా ఇంకా ధ్యాన సాధన సాగిస్తున్న కొద్దీ పరుగులు తగ్గిన మనస్సు ఒక విషయం మీద కేంద్రీకరింపబడుతుంది. అదే 'ఏకాగ్రం'. అలా ఏకాగ్రమయిన మనస్సులో ఆ ఒక్క విషయం కూడా లేకుండా పోతే దానిని 'నిరుద్ధం' అంటారు. ఇదే ఆలోచనా రహితస్థితి. ఇదే నిర్విషయ స్థితి. దీని ఫలితం ఏమిటి?

తుష్యతి:- ధ్యానయోగం వల్ల మనస్సు ఆత్మయందులయమై అక్కడి ఆనందాన్ని పొందుతుంది. ఇక్కడి విషయవస్తువుల ద్వారా కూడా ఆనందం వస్తుంది. ఇది విషయానందం. ఇది శాశ్వతం కాదు. అయితే ఆత్మనుండి వచ్చే ఆనందం నిత్యమైన ఆనందం. శాశ్వతానందం. నిజంగా విషయాల నుండి వచ్చే ఆనందం

కూడా విషయాలలో లేదు. వాటి వెనుకనున్న ఆత్మనుండి వచ్చేదే కాకపోతే మనం విషయాల వల్ల వచ్చిందని అనుకుంటాం.

పప్పుల పిండి తియ్యగా ఉన్నది అంటాం. నిజంగా ఆ తియ్యదనం ఆ పిండిది కాదు. ఆ పిండిలో కలిపిన బెల్లానిది. బెల్లానికి తియ్యదనం సహజం. అలాగే ఆత్మ సహజంగానే ఆనందస్వరూపం. ఎక్కడ విషయవస్తువులు ఉన్నా వాటిని ఆత్మ తన ప్రతిబింబం చేత ప్రకాశింపజేస్తుంది. అలా ఆత్మ కలయిక వల్ల విషయవస్తువులు కూడా ఆనందంగా ఉన్నట్లుంటాయి. కాని విషయ వస్తువుల సహజ స్వభావం మాత్రం ఆనందం కాదు, దుఃఖమే. కనుక నిజమైన తీపి బెల్లానిదైనట్లు నిజమైన ఆనందం ఆత్మదే.

అట్టి నిజమైన ఆనందం - నిత్యమైన ఆనందం, ఏ వస్తువులు, విషయాలు, భోగాలు లేకుండానే కలిగే ఆనందం - రాత్రి గాఢ నిద్ర(సుషుప్తి) లో లాగా కలిగే ఆనందం, ఎప్పుడు మనకు యోగసాధన వల్ల కలుగుతుందో అప్పుడు యోగసిద్ధి కలిగినట్లే.

అయితే మనస్సలా ఆత్మలో నిలిచిపోవాలంటే మనస్సులో కల్మషాలుండకూడదు. ఆత్మ శుద్ధమైనది గనుక ఆత్మలో కలవాలంటే మనస్సు కూడా శుద్ధం కావాలి. శుద్ధం కావటమంటే ఆలోచనలు లేకపోవటమే. నిర్విషయం కావటమే, నిరుద్ధం కావటమే.

అట్టి నిరుద్ధం ఎలా కలుగుతుంది? 'యోగసేవయా' - అన్నారు. అంటే యోగాభ్యాసం చేయటం వల్లనే. కనుక నిత్యమూ ధ్యానయోగాన్ని అభ్యాసం చేయాలి. నిరాశ చెందకుండా, తగిన జాగ్రత్తలు తీసుకుంటూ, నీకు కలిగే

సందేహాలను గురువు ద్వారా తీర్చుకుంటూ, ఆటంకాలను అధిగమిస్తూ, నేను 'ధ్యానయోగిని' అనే ప్రచారం చేసుకోకుండా సాధనచేస్తే మనస్సు నిర్విషయమై కల్మషరహితమై పరమమైన శాంతిని పొంది, ఆత్మయొక్క ఆనందాన్ని అనుభవించటం జరుగుతుంది. అప్పుడే యోగసిద్ధిని పొందినట్లు.

కనుక యోగసేవ చెయ్యాలి. తల్లిదండ్రుల సేవ, భార్య సేవ, భర్త సేవ, బంధుసేవ, మిత్రసేవ, ప్రజాసేవ, దైవసేవ....ఇలా ఎన్ని సేవలు చేస్తున్నా యోగసేవను వదలకూడదు. యోగసేవ చక్కగా సాగటానికి గురుసేవను వదలకూడదు.

- ఇంకా యోగసిద్ధి ఎప్పుడు కలిగినట్లో తరువాతి శ్లోకాల్లో తెలియజేయబోతున్నారు.

**శ్లో||** సుఖమా త్యంతికం యత్తద్ బుద్ధి గ్రాహ్య మతీంద్రియం|
వేత్తియత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః|| **(21)**

**తా||** అంతంలేని, ఇంద్రియగోచరం కాని, బుద్ధికి మాత్రమే తెలిసేది అయిన సుఖం ఏదైతే ఉందో దానిని తెలుసుకొని, ఎప్పుడు తత్త్వం నుండి చలించకుండా స్థిరంగా ఉంటాడో(అప్పుడు యోగసిద్ధి కలిగినట్లు)

**వ్యాఖ్య:-** ధ్యానయోగంలో సిద్ధిపొందినవాడు ఆత్మసుఖాన్ని - ఆనందాన్ని పొందుతాడు. ఎలాంటిది ఆ సుఖం?

- అది అంతులేని ఆనందం. ఇక్కడి విషయానందం అంతంతో కూడుకున్నది. పెళ్ళి చేసుకున్నావు. ఆనందం. 10సం||ల తర్వాత అంత ఆనందం ఉంటుందా? అబ్బాయి పుట్టాడు. చెప్పలేని ఆనందం. వాడు పెరిగి

పెద్దయ్యేటప్పుడు, చెప్పిన మాట విననప్పుడు అంత ఆనందం ఉంటుందా? ఇవన్నీ అంతంతో కూడిన ఆనందాలు. కాని ఆత్మవల్ల లభించే ఆనందం అంతంలేని ఆనందం.

2. అతీంద్రియం:- ఇష్టమైన పదార్థాలు తినేటప్పుడు, కోరిన కోరికలు తీరినప్పుడు, ఇష్టమైన వ్యక్తులు, వస్తువులు లభించినప్పుడు ఆనందం కలుగుతుంది. ఆ ఆనందపు ఛాయలు ముఖంలో, కళ్ళల్లో, మాటల్లో వ్యక్తమౌతాయి. అంటే ఇవి ఇంద్రియ గోచరాలు. కాని ఆత్మానందం ఇంద్రియాతీతం. ఇంద్రియాలకు అందేది కాదు. అగోచరం, అలాగని అసలు తెలుసుకొనే వీలులేదా? -

3.బుద్ధిగ్రాహ్యం:- ఇంద్రియాలకు అందని ఆత్మానందాన్ని తెలుసుకొనేది ఎవరు? బుద్ధి గ్రాహ్యం - బుద్ధిచేత తెలుసుకోబడుతుంది. బుద్ధిమాత్రం ఒక ఇంద్రియం కాదా? అంతరింద్రియాల్లో ఒకటి గదా! అవును. బుద్ధి మామూలుగా ఉన్నప్పుడు అది ఇంద్రియమే. ఆ బుద్ధి ప్రాపంచిక వాసనలు వదిలి పరమాత్మ సంబంధమైన జ్ఞానంతో నిండినప్పుడు శుద్ధమౌతుంది. అప్పుడది శుద్ధబుద్ధి. అది ఆత్మాకారమవుతుంది. ఉప్పు బొమ్మ విడిగా ఉన్నంతకాలం అది బొమ్మే. ఐతే సముద్రంలో పడిపోయిందా! అది తన అస్థిత్వాన్ని కోల్పోయి సముద్రాకారంగా మారిపోతుంది. అలాగే బుద్ధి ఆత్మలో నిలిచి ఆత్మాకారంగా మారితే అది ఇంద్రియం కాదు. అట్టి శుద్ధ బుద్ధి తెలుసుకోగలుగుతుంది. అంటే నిర్మలమైన శుద్ధబుద్ధికే ఆనందం గ్రాహ్యమౌతుంది.

స్థితః తత్త్వతః న ఏవ చలతి:- ఇట్టి ఆనందాన్ని పొందిన యోగి అందులోనే స్థిరంగా ఉంటాడు. ఆ తత్త్వం నుండి జారడు; చలించడు. అంటే విషయానందం లాగా తరిగిపోవటం, తొలగిపోవటం అనేది ఉండదు.

మనం ఈ లోకంలో ఏదైనా సుఖాన్ని, ఆనందాన్ని పొందాలంటే ఎంతో కష్టపడతాం, కొన్నింటిని త్యాగం చేస్తాం, కొందరిని ఆశ్రయిస్తాం; కొందరికి లంచాలు ఇస్తాం. ఇంతా చేస్తే ఆ సుఖం గాని, ఆనందం గాని, వస్తువు గాని, శాశ్వతంగా ఉంటుందా? బాగా ఉంటే 10 లేదా 20 సంవత్సరాలు. కాని ఈ ఆత్మానందం అనేది అనంతకాలం శాశ్వతంగా ఉండేది. అనేక జన్మల దుఃఖం తప్పిపోతుంది. ఈ ఒక్క జన్మలో గురువునాశ్రయించి ఆత్మజ్ఞానాన్ని పొంది, విషయత్యాగం చేసి, సాధన చేస్తే అట్టి శాశ్వతానందం నీ స్వంతం.

ఇలాంటి శాశ్వతమైన ఆనందాన్ని, అంతులేని ఆనందాన్ని, ఆత్మానందాన్ని పొంది అందులోనే స్థిరంగా ఉండి, ఆ ఆనందం నుండి, ఆ ఆత్మతత్త్వం నుండి చలించకుండా స్థిరంగా నిలిచిపోతే అప్పుడు అతడు యోగంలో సిద్ధిపొందినట్లే.

- ఆత్మ సుఖం ఎట్టిదో, అట్టి ఆత్మసుఖం పొందినవాడి భావం ఎలా ఉంటుందో, ఎలా ప్రవర్తిస్తాడో వివరించబోతున్నాడు.

శ్లో|| యం లబ్ధ్వాచా పరం లాభం మన్యతే నాధికం తతః|
యస్మిన్ స్థితోన దుఃఖేన గురుణాపి విచాల్యతే|| (22)

**తా||** దేనిని పొందిన తర్వాత ఇతరమైన దేనినీ గొప్ప లాభంగా భావించడో, ఎందులో నిలిచి గొప్ప దుఃఖం చేత కూడా చలించకుండా ఉంటాడో (అతడు యోగంలో సిద్ధి పొందినట్లే)

**వ్యాఖ్య:-** 1.ఆత్మ సుఖం కన్న మించినది మరొకటి కలదని భావింపనివాడు, 2.ఎంతటి దుఃఖానికైనా చలించనివాడు యోగంలో సిద్ధి పొందినవాడే.

1.ప్రపంచంలోని అన్ని సుఖాలకన్నా, అన్ని లాభాలకన్నా అధికమైనది ఆత్మ సుఖం. అందుకే "ఆత్మ సుఖము కన్న మిన్న అన్యమేమి లేదురా" అని వేదాంతులు పాడుకుంటూ ఉంటారు. ఎందుకంటే ప్రపంచంలోని విషయాల ద్వారా, వస్తువుల ద్వారా, భోగాల ద్వారా వచ్చే సుఖాలు, భోగాలు అన్నీ నశ్వరమైనవి, నశించిపోయేవి. సుఖంగా కనిపిస్తాయే గాని ఆ సుఖం చాటున దుఃఖం దాగి ఉంటుంది. ఐతే ఆత్మసుఖం అలాంటిది కాదు. అది నిత్యమైనది. ఒకవేళ దానిని పొందిన నీ శరీరం రాలిపోయినా ఈ సుఖం మాత్రం రాలిపోదు. కారణం? నీవు శరీరానివి కాదు కనుక. ఇది అంతంలేని సుఖం, అంతులేని ప్రశాంతి, అఖండ ఆనందం.

కనుక వివేకం కలవాడు నశించిపోయే ఈ ప్రాపంచిక సుఖాలకోసం ప్రాకులాడకుండా, కాలాన్ని వ్యర్థం చేయకుండా ఆత్మప్రాప్తికి - ఆత్మసుఖాన్ని పొందటానికి ప్రయత్నించాలి. అందుకొరకై ధ్యానయోగాన్ని ఆశ్రయించాలి. అందులో ఆరూఢుడు కావాలి. ఒకసారి ఆత్మసుఖాన్ని పొందితే ఇక అతడు లౌకిక సుఖాల కోసం ప్రాకులాడడు.

మందారంలోని మకరందాన్ని రుచి చూచిన తేనెటీగ ఆ పుష్పాన్ని వదిలి పిచ్చి మొక్కల పూలకోసం పరుగిడుతుందా? బంగారం దొరుకుతుంటే దానిని సంచులకు నింపుకునేవాడు మట్టి, రాళ్ళ కోసం పరుగులు తీస్తాడా? నిజమైన సంపదలను పొందుతూ ఆనందించే వ్యక్తి కలలో దొరకే సంపదల కోసం అర్రులు చాస్తాడా? అలాగే ఆత్మసుఖం పొందినవాడు అన్యమైన, క్షణికమైన, లౌకిక సుఖాల కోసం ఆరాటపడడు - పరుగులు తీయడు.

2.ఆత్మసుఖాన్ని పొంది ఆనందించేవాడు ఎంతటి దుఃఖం కలిగినా ఏమాత్రం చలించడు. ఈ దుఃఖాలేవీ అతణ్ణేమీ చేయలేవు. ఈ రహస్యాన్ని తల్లి గర్భంలో ఉండగానే ప్రహ్లాదుడు గ్రహించాడు నారదుని ద్వారా, అందుకే ఏనుగుల చేత త్రొక్కించినా, విషాన్ని త్రాగించినా, పాములచేత కరిపించినా, సముద్రంలో విసిరివేయించినా - ఎన్ని కష్టాలు ఎదురైనా ఆత్మలో స్థితుడై, ఆత్మానందాన్నిపొందుతూ దేనికీ చలించలేదు. శారీరక బాధలేవీ అతణ్ణేమీ చేయలేకపోయాయి. అలాగే జీవితంలో దుఃఖాలు, కష్టాలు వచ్చినా, జబ్బులు చేసినా, ఆత్మసుఖాన్ని పొందుతున్న యోగసిద్ధుడు చలించడు. "గురుణా దుఃఖేన అపి న విచాల్యతే" గొప్పదైన దుఃఖాన్ని పొందినప్పుడు కూడా ఏమాత్రం చలించడు అని భగవానుడు బోధిస్తున్నాడు. కష్టాలు ప్రారబ్ధం వల్ల, దుఃఖాలు అజ్ఞానం వల్ల వస్తున్నాయని గ్రహించి, అజ్ఞానాన్ని తొలగించుకొని, ఆత్మలో స్థితుడై ఆత్మసుఖాన్ని పొందుతూ దేనికీ చలించకుండా ఉంటాడు.

✓ అజ్ఞాని నేలమీది బరువును మోసినట్లు కష్టాలను మోస్తాడు.

✓ జ్ఞాని నీటిలోని బరువును మోసినట్లు కష్టాలను మోస్తాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

స్వప్నంలో వచ్చిన కష్టాలు మేలుకున్న వాణ్ణి బాధపెట్టలేనట్లు ఈ మిధ్యా జగత్తులోని కష్టాలు జీవభావం నుండి మేల్కొని ఆత్మానుభవంలో ఉన్నవాణ్ణి ఏమాత్రం బాధపెట్టలేవు.

- ఈ యోగస్థితి ఎట్టిదో తెల్పుతూ ఆ స్థితిని ఎలా పొందాలో తెలియ జేస్తున్నాడు.

**శ్లో||** తం విద్యా దుఃఖ సంయోగ వియోగం యోగ సంజ్ఞితం |

స నిశ్చయేన యోక్తవ్యః యోగోఽనిర్విణ్ణ చేతసా|| **(23)**

**తా||** దుఃఖ సంయోగం నుండి వియోగం కల్పించే ఆ స్థితి యోగం అనబడుతున్నది -అని తెలుసుకో. అట్టి ధ్యానయోగం కలతచెందని మనస్సుతో పట్టుదలతో పొందవలసినది.

**వ్యాఖ్య:-** యోగం అంటే చిత్తవృత్తి నిరోధం - అంటే అన్ని ఆలోచనలు ఆగిపోవటమే - అని పతంజలి మహర్షి చెప్పారు. మరి కొందరు మహాత్ములు జీవాత్మ పరమాత్మల ఐక్యతే యోగం అన్నారు. యోగం అంటే దుఃఖ సంయోగ వియోగం - అంటే దుఃఖం యొక్క స్పర్శ ఏమాత్రం లేకుండా ఉండేదే అని ఇక్కడ భగవానుడు తెలియజేస్తున్నాడు.

సాధారణంగా వియోగం దుఃఖాన్ని కలిగిస్తుంది. ఇద్దరు ఇరుగుపొరుగు వారు కొంతకాలం కలిసి మెలిసి స్నేహంగా ఉండి విడిపోవటంతో దుఃఖం. భార్యాభర్తలు చాలాకాలం కలిసి ఉండి ఎవరో ఒకరి మరణం వల్ల వియోగం కలిగితే అంతులేనిదుఃఖం. అదే ఎప్పుడూ తగాదాలాడుకుంటూ, కొట్టుకుంటూ

ఉండే ఇరుగు పొరుగులు నిత్య శత్రువుల్లా వ్యవహరిస్తూ ఉన్నప్పుడు విడిపోతుంటే ఎంతో ఆనందిస్తారు.

ఈ ప్రపంచం అంతా దృశ్యం. దీనిని చూచే ఆత్మ దృక్కు . ఆత్మసత్యం, ప్రపంచం మిథ్య. స్వప్నం లాంటిది. ఈ రెంటికీ నిజంగా పొత్తులేదు. కాని మన అజ్ఞానం వల్ల తాదాత్మ్యం చెందటాన పొత్తు కుదిరింది. అందువల్ల దృశ్యం వల్ల దుఃఖం. అజ్ఞానం తొలగిందా? ఇక ఏ దుఃఖమూ ఉండదు.

ఒక వ్యక్తి రాత్రిపూట మంచినీళ్ళు త్రాగుతున్నాడు. అకస్మాత్తుగా గోడమీద ప్రాకే బల్లి నీడ ఆ నీటిలో పడ్డది. దానితో అతడు నీటితోపాటు బల్లి కూడా లోపలికి పోయిందని భ్రమపడ్డాడు. ఇంకేముంది? మనోవ్యాధితో మంచ మెక్కాడు. ఎన్ని వైద్యాలు చేసినా రోగం తగ్గలేదు. ఇది గ్రహించిన ఒక చమత్కారి ఈ జబ్బు నేను తగ్గిస్తానని వాంతులయ్యేందుకు మాత్ర ఇచ్చాడు. దానితో అతడు బాగా వాంతి చేసుకున్నాడు. అప్పుడా చమత్కారి అతడు వాంతి చేసుకుంటూ అవశుడైయుండగా తనతో పాటు తెచ్చిన చచ్చిన బల్లిని ఆ వాంతిలో పడేశాడు. అదిగో బల్లి బయటపడిపోయింది అన్నాడు. అంతే మనో వ్యాధి మాయం.

"భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు" అన్నారు. భ్రాంతి తొలగితే చాలు రోగం మాయం. భ్రాంతి వల్లనే రోగం - దుఃఖం. దేహ మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది, 'ఈ దేహమే నేను, ఈ మనోబుద్ధులే నేను' అనుకోవటం భ్రమ. ఈ భ్రమ ఉన్నంతకాలం దేహబాధలు, మనోవికారాలు అన్నీ నీవే

అవుతాయి. దుఃఖం తప్పదు. 'నేను ఆత్మను' అనే జ్ఞానంతో ఈ దేహ మనోబుద్ధులతో తాదాత్మ్యాన్ని విడిచిపెడితే ఇక ఆ దుఃఖంతో వియోగమే.

నీవు లక్షాధికారివని మరచి కలలో బిచ్చగాడి ననుకుంటున్నావు. దానితో కలలో జరిగేవన్నీ నిన్ను బాధపెడతాయి, దుఃఖం కలిగిస్తాయి. నీవు మేలుకొని లక్షాధికారినని తెలుసుకోగానే ఆ కలలోని దుఃఖంతో నీకు వియోగమే. దుఃఖంతో వియోగం కలిగించే ఈ స్థితినే 'యోగం' అంటున్నాడు భగవానుడు.

అట్టి యోగస్థితిని - దుఃఖంతో ఏమాత్రం సంబంధంలేని ఆత్మసుఖాన్ని - శాశ్వత ఆనందాన్ని పొందాలనుకున్నావా? - ఇదిగో మార్గం. అదే యోగ సాధన ద్వారా యోగసిద్ధిని పొందటం. యోగమనగానే అదేదో సాధువులు సన్యాసుల కొరకు ఉపయోగపడేది, చాలా కష్టమైనది, నాలాంటి వారికి అసాధ్యమైనది అని భయపడనక్కరలేదు. ఈ సంసారదుఃఖాన్ని తొలగిస్తుందో లేదో అని సంశయించవలసిన పనిలేదు. మరి ఏమి చేయాలి? ఎలా చేయాలి?

<u>అనిర్విణ్ణ చేతసా</u>:- నీ మనస్సును నిర్విషయం చేసుకోవాలి. పరుగులు తీసే మనస్సును కట్టడిచేసి ఒకే విషయంపై - ఆత్మపై నిలిపి, క్రమంగా అన్ని ఆలోచనలు వదిలేయాలి. అలా నిర్విషయమైన మనస్సు ఆత్మగా తన స్వస్థితిలో నిలిచిపోతుంది. సమస్త దుఃఖాలనుండి విడుదలౌతుంది.

<u>నిశ్చయేన</u>:- అయితే ఎలాగైనా సాధించాలి - అనే పట్టుదలతో ఈ యోగసాధన సాగించాలి. ఎన్ని ఆటంకాలు వచ్చినా అధిగమించాలి. ధైర్యంతో ముందడుగు

వేయాలి. 4 రోజులు చేసి ఆగిపోరాదు. అప్పుడే ఫలసిద్ధి. ఆత్మ రూపమైన ఆనంద సామ్రాజ్యాన్ని చేరుకోగలుగుతావు. అదే నీ గమ్యం.

ఇలాంటి భావాన్ని కలిగించిన విప్లవకారుడు శ్రీకృష్ణుడు . విప్లవగ్రంథం భగవద్గీత. ఎందుకంటే ఎంతో కష్టమని, అసాధ్యమని భావించబడే ఈ యోగసాధన సుసాధ్యమేనని, అందరికీ ఆచరణ యోగ్యమేనని, అందరూ చేయవలసినది, చేయగలిగినది అని తెలియజెప్పటం జరిగింది. కాకపోతే పట్టుదలతో ముందుకు సాగటమే నీ పని.

- ఇట్టి ఆత్మస్థితిని పొందటానికి చేయవలసిన అంతరంగ సాధనను 2 శ్లోకాల్లో చెబుతున్నాడు.

**శ్లో||** సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వాన శేషతః|
మనసై వేంద్రియ గ్రామం వినియమ్య సమంతతః|| (24)

**శ్లో||** శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్వా ధృతి గృహీతయా|
ఆత్మ సంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్|| **(25)**

**తా||** సంకల్పం వల్ల జనించిన కోరికలన్నింటిని పూర్తిగా విడిచిపెట్టి, మనస్సు ద్వారానే ఇంద్రియ సమూహాన్ని అన్నివైపుల నుండి నిగ్రహించి, పట్టుదలతో కూడిన బుద్ధి చేత మనస్సును మెల్లమెల్లగా శాంతింపజేస్తూ, మనస్సును ఆత్మలో నిలిపి ఇక దేనిని గురించీ చింతించరాదు.

**వ్యాఖ్య:-** ఆత్మసుఖాన్ని పొందాలంటే ఆత్మస్థితిని పొందాలి. ఆత్మస్థితిని పొందాలంటే మనస్సును నిర్విషయం చేయాలి. అలా మనస్సును నిర్విషయం చేయటానికి సాధన చేస్తున్నా, ఒక్క క్షణం ఏమారితే మళ్ళీ ఈ

మనస్సు జారిపోతూ ఉంటుంది. దానికి కారణం, సంకల్పం వల్ల జనించే కోరికలే. కనుక -

1.సంకల్ప ప్రభావాన్ కామాన్ సర్వాన్ అశేషతః త్యక్త్వా:- సంకల్పం వల్ల జనించే అన్ని కోరికలను పూర్తిగా విడిచిపెట్టాలి. అసలు కోరికలనేవి 2 రకాలుగా ఉంటాయి. ప్రస్తుత జన్మకు కారణమైన కోరికలు; పుట్టిన తర్వాత క్రొత్తగా సంపాదించుకునే కోరికలు - అని 2 రకాలు.

ఇంతకుముందు జన్మ ముగియబోయేటప్పుడు అనేక తీరని కోరికలు ఉంటాయి. అవే ప్రబలమైన వాసనల రూపంలో ఉంటాయి. అవే రాబోయే జన్మలో - అంటే ఈ జన్మలో తీర్చుకోవలసిన కోరికలు. ఆ కోరికలు ఎలాంటివో నిర్ణయించుకొని, వాటిని తీర్చుకొనుటకు - అనుభవించుటకు తగిన శరీరాన్ని తయారుచేసుకొని జీవుడు ఈ భూమిపైకి వస్తాడు. ఆయా కోరికలను తీర్చుకొని అనుభవించడానికే ఈ దేహం వచ్చింది. కనుక ఏ సంకల్పం లేకుండానే - ఏ ప్రయత్నం చేయకుండానే - ఏ ఆరాటం లేకుండానే ఆ కోరికలు తీరిపోతాయి. అవి ఏ విధంగానూ మనస్సును కలత పెట్టవు. వీటి గురించి కాదు ఇక్కడ విడిచిపెట్టమని చెబుతున్నది. ఇక్కడ చెబుతున్నది రెండవ రకం కోరికలను గురించి. అవేమిటి? - ఏదో ఒక శరీరంతో మానవులుగా జన్మించిన తర్వాత; మనకున్న ఇంద్రియాల ద్వారా ఈ ప్రపంచంలోని విషయవస్తువులను, భోగాలను చూస్తూ, వింటూ, తింటూ, తాకుతూ, వాసనచూస్తూ కొన్ని కోరికలను సృష్టించుకుంటూ ఉంటాం. వాటిని గురించి సంకల్పాలు చేస్తూ ఉంటాం. ఇవే సంకల్పాల వల్ల పుట్టే

కోరికలు. ఇవే మనస్సును చెడగొట్టేవి, అశాంతి పాలు చేసేవి. ఇవే ధ్యానానికి శత్రువులు. కనుక వీటినే విడిచిపెట్టాలి అని చెప్పటం. వీటిని విడిచిపెడితే తప్ప మనస్సుకు శాంతి లభించదు. అలజడులు - ఆందోళనలు తగ్గవు.

విషయాలన్నీ గొప్ప ఆనందాన్నిస్తాయని భ్రమపడటం వల్లనే కోరికలు. ఆ కోరికల వల్లనే వెంటబడి, వాటికోసం ప్రాకులాడటం జరుగుతుంది. అజ్ఞానియైన మానవుడు అనిత్యమైన వస్తువులను నిత్యమైనవని; దుఃఖ మిశ్రితమైన భోగాలను సుఖాలని భావించి వాటి వెంటపడతాడు. మానవుడే కాదు. దేవుడైనా, రాముడైనా ఎవరైనా అంతే. బంగారు లేడి ఉండదని రాముడికి తెలియదా? అదే మాయ. భార్య కోరికను తీర్చాలని దానివెంట పడ్డాడు. దానితో సీతను కోల్పోయాడు. మనమూ అంతే. ఈ మాయా వస్తువుల వెంటబడుతుంటాం. శాంతిని కోల్పోతాం. అంతే.

ఇక ఈ సంకల్పాల వల్ల జనించే కోరికలను అన్నింటిని - 'సర్వాన్' - విడిచిపెట్టాలి. ఏవో కొన్నింటిని, మనకు వీలైన వాటిని విడిచిపెడతానంటే కుదరదు. ఋణశేషం, శత్రుశేషం, అగ్నిశేషం, రోగశేషం, కోరికల శేషం - ఏవీ ఉండకూడదు. ఏ కొంచెం మిగిలినా అవి నిన్ను నిలువునా ముంచేస్తాయి. పోనీ అన్ని కోరికలను కొద్ది కొద్దిగా వదులుతానంటే అదీ కుదరదు. పూర్తిగా నిశ్శేషంగా వదలాల్సిందే. అందుకే 'అశేషతః' అని చెప్పింది. కనుక అన్ని కోరికలను, పూర్తిగా విడిచిపెట్టవలసిందే. ఆ తర్వాత ఇంకేం చేయాలి?

2. మనసా ఏవ ఇంద్రియగ్రామం సమంతతః వినియమ్య:- ఇంద్రియాలనే గుర్రాలను మనస్సు అనే కళ్ళెంతో అన్నివైపుల నుండి - అన్ని విషయాల నుండి

నిగ్రహించాలి. అంటే ఇంద్రియాలను మనస్సు యొక్క చెప్పుచేతల్లోకి తీసుకొనిరావాలి. ఇంద్రియాలెప్పుడూ విషయాలలో తిరుగుతూ వాటి సమాచారాన్ని తెచ్చి మనస్సుకు అందిస్తాయి. అంతవరకే వాటిపని. అయితే చివరకు అవి మనస్సు చెప్పినట్లే చేస్తాయి. మనస్సు గనుక విక్షేపాలతో బలహీనంగా ఉంటే ఇంద్రియాలపై పెత్తనం చెయ్యలేదు. అయితే సంకల్పాల వల్ల పుట్టే కోరికలనుండి విముక్తమైతే మనస్సుకు అధికమైన శక్తి కలుగుతుంది. దానితో దానికి ఇంద్రియాలపై పెత్తనం చేసే శక్తి వస్తుంది. ఇక్కడ ఇంద్రియాలు అంటే ఏవో కొన్ని కాదు, అన్ని ఇంద్రియాలు. అందుకే 'ఇంద్రియగ్రామం' అన్నది. అలాగే ఒక విషయం పైనుండి గాక అన్ని విషయాల నుండి, అన్ని వైపుల నుండి ఇంద్రియాలను నిగ్రహించాలి. అందుకే 'సమంతతః' అన్నది. ఇక నియమ్య అనక 'వినియమ్య' అనటం వల్ల బాగా నిగ్రహించాలి - అని. ఇలా ఇంద్రియాలన్నింటిని మనస్సు యొక్క ఆధీనంలోనికి తెచ్చినప్పుడు మనస్సు ప్రశాంతమవుతుంది. అయితే అలా వదిలేస్తే మనస్సు మళ్ళీ జారిపోవచ్చు. అలా జారకుండా ఉండాలంటే ఏం చేయాలి?

<u>3.బుద్ధ్యాధృతి గృహీతయా:-</u> పట్టుదలతో కూడిన బుద్ధిచేత మనస్సును వశపరచుకోవాలి. ఇంద్రియాలనే గుర్రాలను మనస్సనే పగ్గం పట్టి ఉంచినా, ఈ పగ్గం బుద్ధి అనే సారధి చేతిలో ఉండాలి. అయితే ఆ బుద్ధి ఎలాంటిదై ఉండాలి? మనస్సు ముందుకు వెళ్ళి మే - మే - అనరాదు. సింహంలాగా జూలు విసరాలి. ఆంజనేయుడు రాముని ఎదుట దీనుడు - దాసుడు, కాని రావణుని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎదుట ధీరుడు. అలాగే బుద్ధికి గొప్పధృతి ఉండాలి. పట్టుదల ఉండాలి. ఎలా ఉండాలి ధృతి? -

సముద్రతీరంలో రెండు టిట్టిభ పక్షులున్నాయి. అవి గ్రుడ్లు పెట్టాయి. సముద్రానికి పోటు వచ్చి ఆ గ్రుడ్లు సముద్రంలోకి పోవటంతో పోతుపక్షి సహించలేకపోయింది. సముద్రుడిపై కోపం వచ్చింది. సముద్రాన్ని ఖాళీ చేస్తానని ప్రతిజ్ఞ చేసింది. ఒక గడ్డి పరకను ముక్కుతో పట్టి సముద్ర జలంలో ముంచి బయటికొచ్చి విదిలించింది. ఇలా సముద్రంలో నీటిని మొత్తాన్ని ఖాళీ చేయాలనే ఉద్యమం చేపట్టింది. ఈ గడ్డి పరకతో సముద్రాన్ని ఖాళీ చెయ్యటం సాధ్యమా? కాదు. తోటి పక్షులన్నీ వచ్చి ఎందుకు ఈ మతిలేని పనిచేస్తున్నావు? అని మందలించాయి. కాని ఈ పక్షి వినలేదు. విజయమో - వీరస్వర్గమో! ఏదో ఒకటి తేలాలి అనే దృఢ నిశ్చయంతో అది దాని ఉద్యమాన్ని ఆపలేదు. ఒకసారి నారదుడు అటుగా వెళుతూ ఈ తతంగాన్ని చూచి, ఎలాగైనా దీనికి సహాయం చెయ్యాలని భావించి, గరుత్మంతుని దగ్గరకెళ్ళి, "ఏమయ్యా! నీ జాతి పక్షికి సహాయం చెయ్యవా?" అన్నాడు. దానితో గరుత్మంతుడు సముద్రునిపై దాడికి వచ్చి సముద్రుడి చేత దాని గుడ్లు దానికిప్పించాడు. పట్టుదల కలవాడికి భగవంతుడు సాయం చేస్తాడనేది ఈ కథ యొక్క సారాంశం. కనుక బుద్ధి, పట్టుదలతో మనస్సును ఆధీనం చేసుకోవాలి. అయితే ఎలా? -

**4.శనైః శనైః ఉపరమేత్:-** మెల్లమెల్లగా స్వాధీనంలోనికి తెచ్చుకోవాలి. బలాత్కారం చేయరాదు. "లాలయేత్ చిత్తబాలకం" - బాలుణ్ణి లాలించి,

బుజ్జగించి దారిలోకి తెచ్చుకున్నట్లుగా మనస్సును కూడా లాలించి, బుజ్జగించి, బ్రతిమాలుకుంటూ దారిలోకి తెచ్చుకోవాలి. నిప్పురవ్వను పెద్ద మంటగా చెయ్యాలంటే చిన్న చిన్న పుల్లలను, చితుకులను వేసి రగిల్చి క్రమక్రమంగా మంట పెద్దదైన తర్వాత ఎంత పెద్ద కట్టెలు వేసినా దహించుకుపోతాయి. అలాగాక ముందే పెద్ద కట్టెలువేస్తే ఆ నిప్పురవ్వ ఆరిపోతుంది. అందుకే ఇక్కడ జాగ్రత్త చెబుతున్నారు.

ఇలా బుద్ధి చేత మనస్సును స్వాధీనం చేసుకున్న తర్వాత మనస్సును అలా వదిలెయ్యరాదు. మరేం చెయ్యాలి?

<u>5.ఆత్మ సంస్థం మనఃకృత్వా:-</u> ఆ మనస్సును ఆత్మలో - అంటే ఆత్మచింతనలో నిలపాలి. ఆత్మ అంటే ఏమిటో శాస్త్రాల ద్వారా, గురువుల ద్వారా తెలుసుకొని ఆత్మను గురించి చింతించాలి. మనస్సంతా పరమాత్మ యొక్క ఆలోచనలతో నిండాలి. పరమాత్మ చింతనలో పరవశించాలి. అలా నిలుపుతూ -

<u>6.కించిత్ అపి న చింతయేత్:-</u> పరమాత్మచింతన తప్ప ఇతర ఏ చింతన కొంచెం కూడా ఉండకూడదు. ఇతర అనాత్మచింతన, ప్రాపంచిక విషయ చింతన ఏమాత్రం ఉండరాదు. అప్పుడే మనస్సు ఏకాగ్రమైనట్లు.

మనస్సు ప్రపంచ విషయాల నుండి పూర్తిగా మళ్ళి పరమాత్మపై నిలిచి, ఆ పరమాత్మనే నిరంతరం ధ్యానిస్తూ క్రమంగా నిర్విషయం కావాలి. అంటే ఒక్క ఆలోచన కూడా లేకుండా పోవాలి. అలా మనస్సు నిర్విషయం ఐతే నిరుద్ధం ఐతే ఆత్మాకారమైనట్లే. అంటే ఇప్పుడు మనస్సు మనస్సు కాదు. ఆత్మయే. నిజంగా ఆత్మ- మనస్సు అని రెండు లేవు. ఆలోచనలు పూర్తిగా

విడిచిన మనస్సు ఆత్మయే. ఆత్మయే ఆలోచనలు చేస్తే దానిని మనస్సు అంటారు. అంటే మనస్సుగా మారిన ఆత్మ చివరకు ఆత్మగా ఉండిపోతున్న దన్నమాట.

- అంతా విన్న అర్జునునికి ఒక సందేహం. మనస్సు మనకు తెలియ కుండానే విషయాలపైకి పోతుంటుంది గదా! మరి ఏంచేయాలి? అనే సందేహానికి భగవానుడు సమాధానం ఇస్తున్నాడు.

**శ్లో||** యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం|

తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్|| **(26)**

**తా||** స్థిరం లేని, చంచలమైన మనసు ఎక్కడెక్కడికి వెళ్ళి సంచరిస్తుందో అక్కడక్కడ నుండి దానిని తీసుకొని వచ్చి ఆత్మకు వశం చెయ్యాలి. అంటే ఆత్మలోనే నిలబెట్టాలి.

**వ్యాఖ్య:-** బుద్ధితో మనస్సును శాంతింపజెయ్యాలి అని ఇంతకుముందు శ్లోకంలో చెప్పారు. ఎంత చేసినా మళ్ళీ మళ్ళీ మనస్సు పరుగులు తీస్తుంది గదా అంటే ఇక్కడ దానికి సమాధానం చెబుతున్నారు.

**1.**మనః చంచలం అస్థిరం:- మనస్సు చంచలమైనది, ఒకచోట స్థిరంగా ఉండదు. ఈ విషయం ఎప్పుడు తెలుస్తుంది? మనం ధ్యానం కొరకు కళ్ళు మూసుకొని కూర్చోగానే తెలుస్తుంది. మనస్సు ఏ విషయం మీదా స్థిరంగా ఉండదు. ఇప్పుడొక విషయాన్ని గురించి ఆలోచిస్తుంది. అంతలోనే మరొక విషయం పైకి పోతుంది. పోనీ ఈ రెండు విషయాల మధ్యనే తిరుగుతుందా?

అంటే అదీ లేదు. మళ్ళీ వెంటనే మరొక విషయం పైకి పోతుంది. అంటే దేనిమీదా స్థిరంగా ఉండదు. దీనినే అస్థిరం - చంచలం అన్నారు.

ఎందుకు ఇలా జరుగుతున్నది? ఇంతకుముందు కలిగిన అనుభవాలను నెమరువేసుకుంటుంది. జీవితంలోని వివిధ సంఘటనలను విశ్లేషిస్తుంది. ఆశ కలిగించే వస్తువులు విషయాల గురించి ఆలోచనలు చేస్తుంది. దానితో రాగద్వేషాలు - ఇలా అన్నింటిలోకి తొంగిచూస్తుంది మనస్సు. మనస్సుకే ఎందుకు ఈ లక్షణం? బెల్లానికే ఎందుకు చీమలు పడతాయి? ఈ మనస్సు వాయుతత్త్వంలో పుట్టింది. వాయువు యొక్క సహజగుణం చలనం. అందుకని చలించటం మనసు యొక్క గుణం అయింది. కనుక ఈ మనస్సు యొక్క స్వభావానికి ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. ఇట్టి చలించిపోయే, నిలకడలేని మనస్సును సాధన ద్వారా ఆత్మలో నిలపాలి. ఆత్మ ధ్యానంలో నిలపాలి. ఎలా? -

2.యతోయతో నిశ్చరతి ఏతత్ తతః తతః నియమ్య:- ధ్యానంలో కూర్చున్నప్పుడు ఈ మనస్సు ఏ విషయం మీదకు పోతున్నదో గమనిస్తూ అక్కడి నుండి దానిని వెనక్కు తెచ్చుకోవాలి. అంటే ఏఏ విషయాల మీదకు పోతున్నదో ముందు గమనించాలి. అలా గమనించి దానికి సర్ది చెప్పి వెనక్కు తీసుకొనిరావాలి. ఎలా సర్ది చెప్పాలి? -

"ఓ మనసా! నీవు కోరే విషయాలన్నీ అనిత్యమైనవి. అవి నీకు నిజమైన సుఖాన్ని, శాశ్వతమైన సుఖాన్ని ఇవ్వవు. అవి తాత్కాలికంగా సుఖాన్నిచ్చినా చివరకు నీకు దుఃఖాన్ని మిగిల్చిపోయేవే. నీవు కోరుకున్న ఆనందాన్ని,

శాంతిని ప్రసాదించే కామధేనువు - కల్పతరువు ఇదిగో నీలోనే ఉన్నది. అదే ఆత్మ. కనుక దాని మీదకు రా. అది నిజంగా నీవే. నిన్ను విడిచి ఉండలేని నీ నిజమైన మిత్రుడు, నీ శ్రేయోభిలాషి ఆత్మ. కనుక దానిని విడిచిపెట్టకుండా పట్టుకో" అని నచ్చచెప్పాలి. అంతేకాదు - ఇంతవరకు ఏ విషయాలు, భోగాలు, వస్తువులు ఆనందాన్నిస్తాయని భావిస్తున్నామో వాటిలోని దోషాలను తెలియ జెప్పాలి. విషయాలు విషం లాంటివని, దుఃఖదాయకాలని వివరించి వాటిపట్ల వైముఖ్యాన్ని - వైరాగ్యాన్ని కలిగించాలి. అప్పుడే మనస్సు ఆత్మవైపుకు తిరుగుతుంది. అలా తిరిగినా మళ్ళీ వెళ్ళవచ్చు. కనుక పట్టు వదలని విక్రమార్కునిలా మళ్ళీ మళ్ళీ ప్రయత్నించి ఆత్మలో నిలపాలి.

ఈ సందర్భంలో విజయానికి ఒక కిటుకును అర్థం చేసుకోవాలి. నీవు మనస్సుతో కలిసిపోయి ఉన్నంతకాలం, నీకు తెలియకుండానే దాని వెంటబడి పోతుంటావు. ఎన్నటికీ మనస్సును నీ దారికి తెచ్చుకోలేవు. నీ మనస్సు ఎక్కడెక్కడ సంచరిస్తుందో గమనించలేవు. నీవు నీ మనస్సుకన్న వేరుగా ఉండి, నీ మనస్సును గమనించే సాక్షిగా ఉన్నావా! - నీకు విజయం తథ్యం. అంటే నీ మనస్సును దృశ్యంగా చేసి, దానిని చూచే దృక్కువు నీవు కావాలి. సాక్షివి కావాలి. మనస్సు యొక్క వికారాలు నీవిగా భావించి, దానితో తాదాత్మ్యం చెందరాదు. వికారాలు మనస్సువి, నీవు వాటిని గమనించే సాక్షివి. నిర్వికారుడివి - అనే నిశ్చయంలో ఉంటే తప్పకుండా మనస్సును ఆత్మపైకి మళ్ళించగలుగుతావు. ఈ విధంగా మెల్లమెల్లగా పట్టుదలతో మనస్సును బుద్ధివశంలోకి తెచ్చి, నీవు బుద్ధితో తాదాత్మ్యం చెంది, మనస్సును సాక్షిగా

**గమనిస్తూ ఆత్మపైకి మళ్ళించాలి. ఇలా మనస్సును ఆత్మపైకి మళ్ళించిన వారికి కలిగే ప్రయోజనం ఏమిటి?**

**- ధ్యానయోగాన్ని శ్రద్ధగా అభ్యాసం చేసి, మనస్సును ఆత్మలో నిలిపిన వారికి ఫలితం ఏమి? -**

**శ్లో|| ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమం|**
**ఉపైతి శాంతి రజసం బ్రహ్మభూత మకల్మషం|| (27)**

**తా||** రజోగుణం శాంతించి, కల్మషాలు తొలగి, శాంతించిన మనస్సుతో బ్రహ్మభావాన్ని పొందిన ధ్యానయోగికి ఆత్మసంబంధమైన ఉత్తమసుఖం లభిస్తుంది.

**వ్యాఖ్య:-** ధ్యానయోగం అంటే నిర్మలమైన మనస్సును ఆత్మయందే నిల్పి ఏకాగ్రము చేయుట. అలా మనస్సును ఆత్మయందు నిలపాలంటే మనస్సును శుద్ధంగా, శాంతంగా, నిర్మలంగా చేయాలి.

(i) శాంత రజసం:- శాంతించిన రజోగుణం గలది. ప్రతివారికి సత్త్వ, రజః, తమః అనే మూడు గుణాలుంటాయి. తమోగుణాన్ని వదిలించుకోవాలంటే కర్మలు చేయాలి. అప్పుడు రజోగుణం ప్రబలంగా వుంటుంది. ఈ రజోగుణాన్ని వదిలించుకోవాలంటే నిష్కామకర్మయోగాన్ని ఆచరించాలి. భగవంతుని యందు అత్యంత భక్తిప్రపత్తులు కలిగినప్పుడు భగవత్ సంబంధమైన కార్యాలు నిష్కామంగా ఆచరిస్తాం. దానితో రజోగుణం తగ్గిపోతుంది. రజోగుణం తగ్గినప్పుడే మనస్సులో అలజడులు, ఆందోళనలు తగ్గి శాంతిస్తుంది. అదే శాంతరజసం అంటే -

(ii) అకల్మషం:- కల్మషాలు తొలగిన మనస్సు. కల్మషాలంటే కోరికలు, సంకల్పాలు, ఆలోచనలే. కోరికలున్నప్పుడు వాటిని తీర్చుకునేందుకు ఆలోచనలు చేయాలి. కొన్ని ఆలోచనలు కార్యరూపం ధరించాలంటే సంకల్పాలు చెయ్యాలి. ఇవన్నీ మనస్సులో మెదులుతూ ఉంటే మనస్సు కల్మషమైనట్లు. ఇవన్నీ మనస్సు నుండి తొలగితే అకల్మషం. సాధారణంగా నిష్కామ కర్మలు ఆచరిస్తున్న కొద్దీ కోరికలు తగ్గి మనస్సు కల్మషాలు తొలగి నిర్మలమవుతుంది. కనుక నిష్కామ కర్మయోగం వల్ల వాసనల క్షయం జరుగుతుంది. నిత్యానిత్యవస్తువివేకం వల్ల కోరికలు తగ్గి వైరాగ్యం కలుగుతుంది. ఇలా కల్మషాలు తొలగించుకొని మనస్సు నిష్కల్మషం కావాలి.

(iii) ప్రశాంత మనసం:- మనస్సులో రజోగుణం తగ్గి; వాసనలు, కోరికలు పూర్తిగా తొలగిపోయినప్పుడు ఆ మనస్సు ప్రశాంతమవుతుంది. అప్పుడు ఏ ఉద్రేకాలు, ఆందోళనలు వుండవు. అట్టి శాంతించిన మనస్సే పరమాత్మ ధ్యానంలో నిలిచిపోతుంది. ఏకాగ్రమవుతుంది. అలా పరమాత్మభావనలో నిలిచినప్పుడే మనస్సు బ్రహ్మభూతమవుతుంది. బ్రహ్మభూతమంటే?

(iv) బ్రహ్మభూతం:- మనస్సులో ప్రాపంచిక విషయవాసన పూర్తిగా తొలగి పోయి, అకల్మషమై, ప్రశాంతమై, పరమాత్మధ్యానంలో నిలిచినప్పుడు మనస్సు క్రమంగా అంతమై ఆత్మాకారంగా నిలిచిపోతుంది. అదే బ్రహ్మభూతం. అంటే అదే ధ్యానంలో నిలిచిపోవటం. అలా మనస్సు ఆత్మలో నిలిస్తే ఫలితం ఏమిటి?

(v) ఉత్తమం సుఖం ఉపైతి:- ఆత్మ ధ్యానంలో మనస్సు అంతమైతే పొందేది బ్రహ్మన్నే. అదే బ్రహ్మభూతం. దానివల్ల ప్రయోజనం అత్యంత సుఖం.

మామూలు సుఖం కాదు. ఉత్తమ సుఖం, శాశ్వత సుఖం, దుఃఖం అంటే ఏమిటో తెలియని సుఖం. ఇది దుఃఖ స్పర్శలేని ఆనందం. ఈ లోకంలో విషయాల ద్వారా వచ్చే సుఖం విషయసుఖం. ఇది దుఃఖంతో కూడుకున్నదే. కాని ఈ ఆత్మసుఖం అలాంటిది కాదు. దుఃఖం లేని సుఖం.

'ఉత్తమం సుఖం ఉపైతి' అనటం వల్ల ఈ ఉత్తమ సుఖం ధ్యానయోగిని పొందుతుంది. అంటే ఈ సుఖం ధ్యానయోగిని తనంతటతానే ఆశ్రయిస్తుంది. అదీ ఫలం.

- ఇదే విషయాన్ని మరింత స్పష్టంగా తెలియజేస్తున్నారు.

**శ్లో||** యుంజన్నేవం సదాత్మానం యోగీ విగత కల్మషః|

సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యంతం సుఖ మశ్నుతే|| **(28)**

**తా||**ఈ విధంగా ఎల్లప్పుడూ మనస్సును ఆత్మయందే నిలిపే యోగి కల్మష రహితుడై బ్రహ్మస్పర్శతో కూడిన అత్యంతసుఖాన్ని సులభంగా పొందుతాడు.

**వ్యాఖ్య:-** (i) విగత కల్మషః:- ఎల్లప్పుడూ మనస్సును ఆత్మలో నిలిపే యోగి అన్ని కల్మషాలు నశించినవాడౌతాడు. మనస్సు అనేది జాగ్రత్తగా వాడుకోవలసిన ఇనుపముక్క లాంటిది. ఇనుప ముక్కను మట్టిలో వేస్తే తుప్పుపడుతుంది. అదే ముక్కను నిప్పులో వేస్తే పట్టిన తుప్పు కూడా వదిలిపోతుంది. ఇప్పుడీ మనస్సు కూడా అంతే. ఈ మనస్సును ప్రాపంచిక విషయాలలో, భోగాలలో త్రిప్పితే వాసనలు, కల్మషాలు అనే తుప్పు పడుతుంది. అలాగాక పరమాత్మ సంబంధమైన ఆలోచనలలో త్రిప్పితే అన్ని వాసనలు, కల్మషాలు తొలగిపోయి,

శుద్ధమౌతుంది. కల్మషాలతో కూడిన మనస్సు పరమాత్మను అందుకోలేదు. ఆందోళనలతో, ఉద్రేకాలతో ఊగిపోతుంది, చెడిపోతుంది. ఆత్మలో నిలిపితే ఆత్మాకారంగా మారిపోతుంది. అయితే ఇలా మనస్సును ఎల్లప్పుడూ ఆత్మలో నిలిపితేనే కల్మష రహితమయ్యేది, శుద్ధమయ్యేది. ఏదో కొద్దిసేపు నిలిపితే, ఎప్పుడో ఒకరోజు నిలిపితే చాలదు. నిత్యమూ, నిరంతరం ఆత్మధ్యానంలో నిలపాలి. అలా నిలిపినవాడే యోగి. అతడికే సుఖం. ఆ సుఖం ఎలాంటిది?

(ii) బ్రహ్మ సంస్పర్శం సుఖం:- బ్రహ్మతో - ఆత్మతో - పరమాత్మతో ఐక్యమైపోయినది. అంటే ఈ మనస్సు ఆత్మధ్యానంలో నిలిచి, ఆత్మను తలచి తలచి ఆత్మాకారమౌతుంది. ఆత్మబ్రహ్మమే గనుక బ్రహ్మానందమే అనుభవమౌతుంది. అదే బ్రహ్మ సంస్పర్శం సుఖం, శాశ్వత సుఖం దుఃఖం లేని సుఖం. ఆ సుఖాన్నే 'అత్యంతం సుఖం' అన్నారు. అంతంలేని సుఖం అది. శాశ్వత సుఖం, ఈ లోకంలో ఏ సుఖమైనా ఆది అంతాలతో కూడుకున్నదే. కాని ఈ ఆత్మ సుఖం ఆద్యంతాలు లేనిది. అందుకే అత్యంతం సుఖం అన్నారు. పైగా ఈ సుఖాన్ని ఎలా పొందుతారు? అంటే 'సుఖేన' - సులభంగా అన్నారు.

నిజంగా అంత సులభంగా పొందగలమా ఈ బ్రహ్మసుఖాన్ని? ఇక్కడ నిజంగా సుఖాన్ని పొందటమంటూ లేదు. ఆత్మ ఆనంద స్వరూపం. మనస్సుగా భ్రమపడుతున్న మనం మన భ్రమను ఆత్మజ్ఞానం ద్వారా పోగొట్టుకొని 'నేను ఆత్మను - బ్రహ్మన్ని' అనే అనుభూతిని పొందటంతో ఆనందస్వరూపమే అవుతాం. అంతే. ఇక్కడి సుఖాలలాగా పొందటం ఐతే పోవటం కూడా ఉంటుంది. కనుక ఇది పొందేది కాదు. మనమే సుఖ స్వరూపం అవుతాం.

- ఇంతవరకు మనస్సును ఆత్మలో నిలిపి ఆత్మాకారంగా మారిన యోగి ఆనందాన్ని వర్ణించారు. ఇక అలా మారినవాడు పరమాత్మే గనుక 'తత్త్వమసి' మహావాక్య వివరణను రాబోయే మూడు శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

ముందుగా 'త్వం' పద వివరణ. ఆత్మయే ఐన యోగి దృష్టి ఎలా ఉంటుంది?

**శ్లో||** సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని|
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః|| **(29)**

**తా||** యోగయుక్తుడై అంతటా సమత్వాన్ని దర్శించే యోగి అన్ని ప్రాణులను తనలోను, అన్ని ప్రాణులలో తనను దర్శిస్తూ ఉంటాడు.

**వ్యాఖ్య:-** (i) యోగయుక్తాత్మా:- యోగయుక్తుడు - అంటే ధ్యానయోగంలో పరిపూర్ణుడైనవాడు, యోగం అంటే కలయిక. జీవబ్రహ్మైక్యమే. ఇప్పటివరకు తనను తాను జీవుడుగా భావించి భ్రమపడుతున్న అతడు, తన భ్రమను పోగొట్టుకొని, 'తాను ఆత్మను' అనే అనుభూతిలో ఉండిపోయినవాడే యోగయుక్తుడు. అట్టివాని దృష్టి ఎలా ఉంటుంది? -

(ii) సర్వత్ర సమదర్శినః:- అన్ని వేళలా, అన్ని చోట్ల, అందరిని - అన్నింటిని సమంగా - ఒక్కటిగా చూస్తాడు. మనిషిని, జంతువును, పక్షిని, పామును, అన్నింటిని ఒక్కటిగా చూస్తాడు. వీటన్నింటికీ తేడాలున్నాయి గదా! శరీర ఆకృతిలో, వేషంలో, భాషలో, చేసేపనులలో, ఆలోచనలలో, ప్రవర్తనలో, భావాలలో, బుద్ధిలో - అన్నింటిలో తేడాలుంటాయి. అయితే దేహదృష్టితో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చూసినప్పుడు, మనోదృష్టితో చూసినప్పుడు ఈ తేడాలు. ఆత్మదృష్టితో చూస్తే ఏ తేడాలు వుండవు. ఇతడిది ఆత్మదృష్టి కనుకనే సర్వత్ర సమదర్శనం సాధ్యమౌతున్నది.

కుండని కొనడానికి వెళ్ళినవాడు దాని సైజు,ఆకారం, కాల్చు చూస్తాడు. తేడాలు కనిపిస్తాయి. నాలుగింటిని తిరగేసి ఒకదానిని కొంటాడు. కాని కుమ్మరి దృష్టిలో అన్నీ మట్టే. వాడికి ఏ తేడాలేదు.

స్వీటు షాపు వాడు పంచదార పాకంతో చిలకబొమ్మలు, కుక్కబొమ్మలు, పోలీసు బొమ్మలు తయారుచేసి అమ్ముతాడు. ఆకారం చూస్తారు కనుక కొనేవారికి తేడాలు కనిపిస్తాయి. కాని అమ్మేవాడికి అన్నీ ఒకటే స్వీటు. పంచదార పాకం.

అలాగే సామాన్యులదృష్టిలో అనేక తేడాలుంటాయి. కాని యోగయుక్తుడైనవాడు ఆత్మజ్ఞాని గనుక; అతడు పైపై నామరూపాలను, వేషభాషలను, మనో బుద్ధులను గాక అతడి యదార్థ స్వరూపం ఏమిటి? అని ప్రశ్నించుకొని అందరూ ఆత్మ స్వరూపులే అని గ్రహించి ఒక్కటిగా, సమంగా చూస్తాడు. ఎవరిని చూసినా అతడి భావన ఎలా వుంటుందో ఇక్కడ చక్కని పదాలతో తెలియజేస్తున్నారు.

(iii) <u>సర్వభూతస్థం ఆత్మానం:-</u> అన్ని ప్రాణులలో తనను (ఆత్మను) చూస్తాడు. ఎలా సాధ్యం? ఈ సృష్టి మొత్తానికి మొదట ఏదో వుండాలి గదా! ఏమిటది? అతడే సృష్టికర్త. అదే చైతన్యం. అదే పరమాత్మ. ఇంకా ఏమి ఉన్నది? ఇంకేమీ లేదు. మరి ఏమీలేకపోతే ఈ సృష్టి మొత్తాన్ని దేనితో తయారు చేశాడు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మ? ఈ ప్రాణులన్నీ దేనితో తయారైనవి? పంచభూతాలతోనే తయారైనవి. వాటినెవరు తయారుచేశారు? పరమాత్మే. సృష్టికర్తయే. వాటిని దేనితో తయారుచేశాడు? దేనితోనో తయారుచేయాటానికి పరమాత్మ కన్న వేరొక వస్తువు లేదు. మరి ఎలా తయారైనవి? ఆ పరమాత్మతోనే తయారైనవి. అంటే ప్రాణులు పంచభూతాలతో తయారైనవి; పంచభూతాలన్నీ ఆ పరమాత్మ చైతన్యమే. అంటే పంచభూతాలు పరమాత్మే అయితే వాటితో తయారైన ప్రాణులన్నీ పరమాత్మ చైతన్యమేనని తెలుస్తుంది. అంటే అన్ని ప్రాణుల యొక్క యదార్థ స్వరూపం - ముడి సరుకు పరమాత్మే. కనుక సమస్త ప్రాణికోట్లలో ఉన్నది ఆ పరమాత్మే. ఆ పరమాత్మకు నామం లేదు, రూపం లేదు, గుణం లేదు, వికారాలు లేవు, పుట్టుక లేదు, చావు లేదు. కనుక ఏ మార్పులు, భేదాలు లేవు. అందువల్ల ప్రాణికోట్ల అసలు స్వరూపంలో ఏ భేదము లేదు. అందుకే అన్ని ప్రాణులను ఒక్కటిగా చూడగలుగుతున్నాడు. కనుకనే అతడు ఎవరిని చూచినా కోపం లేదు, జుగుప్స లేదు, ద్వేషం లేదు. బ్రాహ్మణుని, ఛండాలుని, కుక్కను, గోవును, పామును, పులిని - అన్నింటిని ఒక్కటిగానే చూస్తున్నాడు. పంచదార పాకంతో తయారుచేసిన దేవుడిని, పందిని ఒక్కటిగానే చూడగలం మనం. అతడేమో ఆత్మతో - తయారైన ప్రాణికోట్లన్నింటిని ఒక్కటిగా - సమంగా చూడగలుగుతున్నాడు.

(iv) <u>సర్వభూతానిచ ఆత్మని:-</u> సమస్త ప్రాణులను తనలో (ఆత్మలో). ఆత్మసర్వ వ్యాపకం. సూక్ష్మాతి సూక్ష్మం. ఆ ఆత్మలోనే ఈ సమస్త దృశ్య ప్రపంచం కల్పించబడింది. త్రాడులో పాము కల్పించబడినట్లు ఆత్మలోనే (తనలోనే) ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మొత్తం ప్రపంచం - ప్రాణులు కల్పించబడ్డాయి. సముద్రంలోని అలలన్నీ సముద్రమే అయినట్లు; నీటిలోని బుడగలన్నీ నీరే అయినట్లు; పరమాత్మలోని ప్రాణులన్నీ పరమాత్మయే. కనుకనే అన్నింటిని ఒక్కటిగా - పరమాత్మగా చూడగలుగుతున్నాడు.

ఇలాంటి సమదృష్టి గలవాడు ఎవరిని పాపి అంటాడు? ఎవరిని దుర్మార్గుడు అంటాడు? అతడి దృష్టిలో పుణ్యాత్ములు, పాపాత్ములు అనే వారెవరూ లేరు. అతడిది సమదృష్టి. ఆత్మదృష్టి. ఇది 'త్వం' పదార్థ వివరణ.

- ఇక తర్వాతి శ్లోకంలో 'తత్' పదార్ధ వివరణ. భగవంతుని దృష్టిలో పడేవాడెవడు?

**శ్లో||** యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి|

తస్యాహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి|| **(30)**

**తా||**ఎవరైతే అంతటా నన్ను చూస్తారో, అన్నింటిని నాలో చూస్తారో, అలాంటి వారికి నేను కనిపించకుండా పోను. అతడు నాకు కనిపించకుండా పోడు.

**వ్యాఖ్య:-** క్రిందటి శ్లోకంలో యోగయుక్తుడు సర్వప్రాణికోట్లను ఆత్మ (తన) యందు; సర్వప్రాణికోట్లలోను ఆత్మ(తన)ను దర్శిస్తూ అంతటా సమభావం - అత్మభావం కలిగి ఉంటాడని చెప్పుకున్నాం. అట్టి వానికి నేను కనబడకుండా పోను, అతడు నాకు కనబడకుండా పోడు - అని ఈ శ్లోకంలో భగవానుడు తెలియజేస్తున్నాడు. అంటే అతడు తనకన్న వేరుకాదు, అతడే తాను, తానే అతడు అని.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుడు (పరమాత్మ) సూక్ష్మాతిసూక్ష్మం, సర్వవ్యాపకం. పరమాత్మ కన్న వేరుగా రెండవదేదీ నిజంగా లేదు. "ఏకమేవాఽద్వయం బ్రహ్మ నేహనానాఽస్తి కించన" - ఉన్నదంతా ఒక్కటేయైన బ్రహ్మమే (పరమాత్మే). దానికన్న వేరుగా రెండవదేదీ కొంచెం కూడా లేదు - అనేది ఉపనిషద్వాక్యం. మరి అంతటా వ్యాపించియున్న బ్రహ్మం ఎందుకు కనిపించటం లేదు? అంతటా ఉన్న ఆకాశాన్ని ఎందుకు చూడలేకపోతున్నాం? అంటే బుద్ధిలోని దోషమే. సూక్ష్మాతిసూక్ష్మమైన దేదీ స్థూల దృష్టికి (కంటికి) కనిపించదు. ఆకాశాన్ని శబ్దాన్ని బట్టి తెలుసుకుంటున్నాం గదా! తెలుసుకుంటున్నాం. నిజమే, దానికి కారణం ఆకాశానికి శబ్దమనే గుణం ఒకటి ఉండటం వల్ల తెలుసుకోగలుగుతున్నాం. కాని పరమాత్మ గుణరహితుడు. అంటే ఏ ఒక్క గుణం లేనివాడు, కనుకనే కంటితో గాని, మనస్సుతో గాని, బుద్ధితో గాని తెలుసుకోలేక పోతున్నాం. మరి దేనితో తెలుసుకోవాలి? బుద్ధితోనే తెలుసుకోవాలి. కాకపోతే బుద్ధిలోని దోషాన్ని తొలగించి, శుద్ధం చేసుకొని - ఆ శుద్ధబుద్ధితో తెలుసుకోవాలి. బుద్ధిలోని దోషమేమిటి? ప్రాపంచిక విషయవాసనలే. వాటివల్లనే బుద్ధి స్థూలమై కూర్చుంది. ఈ విషయవాసనలను దూరం చేసి బుద్ధిని సూక్ష్మం చేసినప్పుడు పైపైన కనిపించే ఈ మనసు శరీరాలను కాక వీటికి ఆధారమైన ఆత్మను దర్శించే నేర్పు కలుగుతుంది. అప్పుడు ఎవరిని చూచినా ఆత్మగా - తానుగా తెలుస్తుంది. అంటే అన్ని ప్రాణులలోను ఆత్మనే దర్శిస్తాడు. అంతేగాదు అన్ని ప్రాణులను ఆత్మలోనే దర్శిస్తాడు.

ఇలా అంతటా పరమాత్మనే దర్శించేవానికి, తాను పరమాత్మ స్వరూపమేననే అనుభూతి కలుగుతుంది. అలాంటప్పుడు ఇక పరమాత్మకన్న తాను ఎలా వేరుగా ఉంటాడు? పరమాత్మ తన నుండి ఎలా వేరవుతాడు? ఉన్నదొక్కటే గదా! అదే పరమాత్మతో ఐక్యత. అదే సాక్షాత్కారం.

నీవొక డాక్టరువు. ఒక నాటకం వేయాలని తోటి స్నేహితులతో కలసి ప్రాక్టీస్ చేశావు. అందులో నీది స్త్రీ పాత్ర. ఆ పాత్రలో ఎంతో చక్కగా నటించి రాణించావు. స్త్రీలాగా నడుస్తూ, స్త్రీ హావభావాలను ప్రదర్శిస్తూ, డాక్టరునని మరిచిపోయి బాగా నటించావు. నాటకం ముగిసిన తర్వాత వేషం తీసేశావు. ఇప్పటి దాకా ఆ స్టేజి మీద ఉన్న స్త్రీ నీ కన్నా వేరా? కాదు. ఎవరన్నా అడిగినా ఆ స్త్రీని నేనేనయ్యా! అంటావు. అంటే నీకు ఆ స్త్రీకి ఏమీ తేడా లేదన్న మాట. కాకపోతే వేషంలోనే తేడా ఉంది.

అదే విధంగా భగవంతుడు అహంకారమనే మాయతో (వేషంతో) జీవుడిగా ఈ సంసారచక్రమనే నాటకంలో జీవిస్తున్నాడు. తాను భగవంతుడనని మరిచిపోయి అనేక బాధలు, భయాలతో - దుఃఖాలతో పైకీ క్రిందికీ ఎగిరెగిరి పడుతున్నాడు. మహాత్ముల సాన్నిధ్యం వల్ల, శాస్త్రాన్ని తెలుసుకోవటం వల్ల తానెవరో తెలుసుకొని, తాను తానుగా ఉండేందుకు తీవ్రప్రయత్నం సాగించాడు. అదే ధ్యానయోగం. ఆ యోగంతో అహంకారమనే మాయను తొలగించుకొని జీవభావమనే వేషాన్ని కడిగివేసుకొని తన యదార్థ స్వరూపమైన భగవంతునిగా ఉన్నాడు. మరి ఈ భగవంతుడికి, ఇప్పటిదాకా జీవుడిగా ఉన్న వాడికి భేదమున్నదా? లేదు. ఆ జీవుడే ఈ భగవంతుడు. ఈ

భగవంతుడే అప్పటి జీవుడు. ఇప్పుడిద్దరు లేరు. ఉన్నది ఒక్కడే. ఆ ఒక్కడు భగవంతుడే - పరమాత్మే - తానే. అదే తత్(పరమాత్మ). ఈ శ్లోకంలోని 'తత్', క్రిందటి శ్లోకంలోని 'త్వం' ఒక్కరే. 'అసి' అయి ఉన్నాడు. ఇప్పుడు 'అసి' గురించి.

- ఇప్పుడు 'అసి' అనే పదం యొక్క వివరణ ఇస్తున్నారు.

**శ్లో||** సర్వభూతస్థితం యోమాం భజత్యే కత్వ మాస్థితః|
సర్వధా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే|| **(31)**

**తా||** అన్ని ప్రాణులలోను ఉన్న నన్ను(ఆత్మను) ఏకత్వంలో నిలిచి ఎవరు చూస్తారో అతడు ఎలా సంచరించినా నాలోనే వర్తిస్తూ ఉంటాడు.

**వ్యాఖ్య :-** సర్వభూతస్థితం:- అన్ని ప్రాణులలోను పరమాత్మ ఉన్నాడు. "అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః" - అర్జునా! అన్ని ప్రాణులలోను ఆత్మగా నేనే ఉన్నాను; "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి" - అర్జునా! సమస్త ప్రాణికోట్ల హృదయాలలో ఈశ్వరుడవైన నేనే ఉన్నాను. "సర్వస్య చాఽహం హృది సన్నివిష్ఠః" అందరి హృదయాలలో నేనే ఉన్నాను.

- ఇలా భగవంతుడు అంతటా - అందరిలో - అన్నింటిలో నేనే ఉన్నాను అని అనేక సందర్భాలలో తెలియజేయటం జరిగింది. భగవద్గీతలో - ఉపనిషత్తులలోనే కాదు, పురాణాలలో, భాగవతంలో కథారూపంలో కూడా తెలియజేశారు. "ఎక్కడరా నీ విష్ణువు?" అని గద్దించాడు హిరణ్యకశిపుడు. ఎక్కడ లేడు విష్ణువు? "ఇందుగలడందు లేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు ఎందెందు వెదకి చూచిన అందందే గలడు దానవాగ్రణి వింటే" అని ధైర్యంగా చెప్పాడు వినయంతో ప్రహ్లాదుడు. ఈ స్థంభంలో చూపు

అని స్థంభాన్ని గదతో మోదాడు. అందులో నుండి నరసింహస్వామి దర్శనమిచ్చాడు. కథలో స్థంభంగా చెప్పినది దేహమే. ప్రతి దేహంలోనూ ఆత్మరూపంలో ఉన్నది పరమాత్మేనని గ్రహించాలి. స్థంభాన్ని పగలగొట్టినట్లు జీవభావాన్ని చీల్చివేయాలి. దానితో నేను పరమాత్మనే అని తెలుస్తుంది. కనుక పరమాత్మ అన్ని భూతాలలోను ఉన్నాడు. ఆయన సర్వవ్యాపి.

పాలలో వెన్నలాగా, నువ్వులలో నూనెలాగా, చెరకులో రసంలాగా, బెల్లంలో తీపిలాగా, పూలదండలో దారంలాగా, కుండలలో మట్టిలాగా, ఆభరణాలలో బంగారంలాగా, వస్త్రంలో దారంలాగా సమస్త చరాచర ప్రాణికోట్లలోను ఆత్మచైతన్యం లాగా ఆయన ఉన్నాడు. కనుక సమస్త ప్రాణులు ఆత్మస్వరూపులే - పరమాత్మస్వరూపులే.

అలా అందరిలోను ఉన్న పరమాత్మ ఒక్కడేగాని వేరువేరు కాదు. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" - అన్ని క్షేత్రాలలో ఉన్న క్షేత్రజ్ఞుణ్ణి నేనేనని తెలుసుకో అర్జునా! అని భగవానుడు క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగంలో తెలియజేయటం జరిగింది. నీటితో నింపిన 10 బక్కెట్లను సూర్యుని కెదురుగా నేలపై పెడితే అన్నింటిలోను సూర్యుడు ప్రకాశిస్తాడు. అయితే అన్నింటిలోను కనిపించే ఆకారాలు ఒక్క సూర్యునివే. ఉన్నది ఒక్క సూర్యుడే. కుండలు అనేక రూపాలలో ఉన్నా వాటిలోని మట్టి ఒక్కటే. ఆభరణాలు ఎన్ని రూపాల్లో ఉన్నా బంగారం ఒక్కటే. అలాగే ఉపాధులు ఎన్ని ఉన్నా చైతన్యం మాత్రం ఒక్కటే.

అట్టి ఏకం, అద్వయం, నిరాకారం, నిర్గుణం, సర్వవ్యాపకం అయిన పరమాత్మను అన్ని ప్రాణులయందు ఒక్కటిగా ఎవరైతే దర్శిస్తారో, ఎవరైతే భజిస్తారో వారినే యోగులు అంటారు.

సర్వధావర్త మానోఽపి:- యోగసిద్ధిని పొందిన అట్టి యోగులు ఎలా ప్రవర్తిస్తున్నప్పటికీ వారు ఆ పరమాత్మయందే స్థితి కలిగి ఉంటారు. ఎలా ప్రవర్తిస్తున్నా.... అంటే దుర్మార్గంగా, సన్మార్గంగా, స్వార్థంగా, త్యాగపూర్వకంగా అనియా? కాదు. వారికి ఈ లోకంలో కావాల్సింది ఏమీలేదు. అందువల్ల స్వార్థంతో - దుర్మార్గంగా ప్రవర్తించాల్సిన పనిలేదు. మరి ఎందుకన్నారు అలాగ? -

అతడికింకా శరీరం ఉన్నది గనుక పరోపకారార్థం పనులు చేస్తూ ఉండవచ్చు; లేదా సర్వసంగపరిత్యాగంతో ఆత్మచింతనలో ఉండవచ్చు; దేశ సంచారం చేస్తూ ఉండవచ్చు; ఒక్కచోటనే ఉండిపోవచ్చు; ఎలా ఉన్నా అతడు పరమాత్మలో ఉన్నవాడే. సమస్త సుఖ దుఃఖాలలోను అతడు దివ్యత్వాన్ని నిలబెట్టుకుంటాడు. అతడు ఎలాంటి గొప్పపనులు చేస్తున్నా - అల్పమైన పనులుచేస్తున్నా, ఏ రంగంలో ఉన్నా, ఏ స్థాయిలో పనిచేస్తున్నా అతడెప్పుడూ ఆనందంగానే ఉంటాడు. అతడి పెదవులపై చిరునవ్వు. ఎప్పటికీ చెదరదు.

శ్రీకృష్ణుని విషయమే తీసుకుందాం. అనేకమంది రాక్షసులను సహరించినవాడు. శిశుపాల, దంతవక్త్రాదులను అవలీలగా అంతమొందించిన మహాపరాక్రమశాలి. అంతటి మహావీరుడు కురుక్షేత్ర యుద్ధభూమిలో వీరునిగా కాకుండా రథాన్ని తోలే సారథిగా రథం నొగలిపై కళ్లెం పట్టుకొని

కూర్చున్నాడు. అదేమంత గొప్ప పదవీ కాదు. గొప్ప పనీ కాదు. ఏ విధంగా చూసినా అది శ్రీకృష్ణునికి తగిన స్థానం కాదు, స్థాయి కాదు. ఎందుకంటే అంతటి మహావీరుడు, పరాక్రమశాలి రథికుని ఆజ్ఞలను పాటించాలి. రథాన్ని, గుర్రాలను, రథికుని సంరక్షించుకుంటూ తనను  తాను కూడా శత్రువుల నుండి కాపాడుకోవాలి. ఒక్కొక్కసారి బాణం దెబ్బలు రథికుని కన్న సారథికే ఎక్కువగా తగులుతుంటాయి. వీరులెవరైనా సరే ముందు గుర్రాలను, సారథిని చంపి, రథాన్ని ధ్వంసం చేసి రథికుణ్ణి నిర్వీర్యుణ్ణి చేసి సంహరిస్తారు. కనుక మొదటి దెబ్బ సారథికే తగులుతుంది. ఇంతా చేస్తే సారథి చెయ్యవలసిన పని ఏమిటంటే ప్రతిరోజూ గుర్రాలను నీటితో కడిగి, గ్రుచ్చుకున్న బాణాలను తొలగించి, గాయాలకు మందు రాసి, వాటికి గడ్డి తినిపించి, నీరు త్రావించి రథానికి కట్టాలి.

అయినప్పటికీ శ్రీకృష్ణునంతటి యోగేశ్వరేశ్వరుడు ఈ పని చేయటానికి ఏమాత్రం సిగ్గుపడలేదు. నాకీ గ్రహచారం ఎందుకు పట్టింది? అని నుదురు బాదుకోలేదు. "నేనింతటి వీరుణ్ణయి కూడా ఆయుధం పట్టుకోకుండా అనామకుడిలా ఉండిపోయానే" అని చింతించలేదు. తనకన్నా అల్పులయిన వారు గొప్ప వీరులుగా ఫోజు కొడుతుంటే వారిని చూచి అసూయపడలేదు. ఎలాచెప్పగలం ఈ విషయాన్ని? - యుద్ధభూమిలో ఎట్టి పరిస్థితులలోనూ - అంటే జయం కలిగినా, అపజయం కలిగినా చెరగని చిరునవ్వే తన ఆయుధంగా; మకుటంలేని మహారాజులా వ్యవహరించాడు. సిగ్గుపడేవాడికి, చింతించేవాడికి, నుదురు బాదుకొనేవాడికి, అసూయాగ్రస్థుడికి నిరంతరం

అలా చిరునవ్వు ఉంటుందా? - వుండదు. కనుకనే చెప్పగలిగాం. ఆ యుద్ధం జరిగిన 18 రోజులూ యుద్ధరంగమంతా ఆ సారథి చుట్టూ పరిభ్రమించింది అంటే అందులో ఏమాత్రం అతిశయోక్తి లేదు. భీష్ముని నిరోధించటంలో, అర్జునుని తేజస్సును వృద్ధిచేయటంలో, తన మేనల్లుడు అభిమన్యుని మరణంలో, సైంధవవధకై మాయాతిమిరాన్ని సృష్టించడంలో, ఘటోత్కచ వధలో, ద్రోణవధకై ధర్మరాజుచేత అబద్ధం పలికించటంలో, కర్ణవధ సమయంలో, శల్యుని ఉపయోగించుకోవటంలో, దుర్యోధనవధ సమయంలో - అన్ని సందర్భాలలోను చెక్కుచెదరని చిరునవ్వు, దేనికీ చలించని స్థిరత్వం.

దీనిని బట్టి మనకొక విషయం అర్థమౌతుంది. ఒక యోగసిద్ధుడు, ఆత్మజ్ఞాని అన్ని పరిస్థితులలోను ఏ పనినైనా, ఎంతటి అల్పమైన పనినైనా చేయగలడని, ఏ పని చేస్తున్నా అతడు తన సహజ దివ్యత్వాన్ని విడిచిపెట్టక ఆత్మానందంలో రమిస్తూ ఉండగలడని, తన స్వస్థితిని తాను మరువకుండా తానుతానుగా ఉండగలడని తెలుస్తున్నది. అదే "సర్వథా వర్తమానోఽపి సయోగీ మయివర్తతే" అనే వాక్యానికి నిజమైన అర్థం.

ఉపాధులు వదిలిన జీవుడు, ఉపాధులే లేని పరమాత్మ ఒక్కటేననే ఏకత్వాన్ని దర్శించిన యోగి "సోఽహం" భావనతో 'ఆ పరమాత్మ నేనే' అనే అనుభూతిలో ఉంటాడు. ఇదే 'అసి'.

29వ శ్లోకంలో జీవుడు సాధనచేసి ఉపాధులు తొలగించుకొని 'త్వం' అవుతున్నాడు. 30వ శ్లోకంలో అసలు ఉపాధులే లేనివాడు ఎప్పుడూ తాను తానుగానే వుంటాడు. అదే 'తత్'. ఈ 31వ శ్లోకంలో ఆ 'త్వం' ఈ 'తత్'

రెండూ ఒక్కటే - 'అసి' - అయివున్నావు - అని "తత్త్వమసి" మహావాక్యార్థానికి వివరణ అయినది. ఇలా.....

తత్+త్వం+అసి=అది నీవే అయి ఉన్నావు; ఆ పరమాత్మ నీవే(ఉపాధులు తొలగిన ఆత్మ స్వరూపమైన నీవే) అని తత్త్వమసి మహావాక్యార్థ వివరణను 3 శ్లోకాల్లో అందించాడు భగవానుడు.

-ఇలా సర్వత్రా ఏకత్వాన్ని దర్శించగల యోగిని ఏమని ప్రశంసిస్తున్నాడు భగవానుడు? —

**శ్లో||** ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!|
సుఖం వాయది వా దుఃఖం సయోగీ పరమో మతః|| **(32)**

**తా||** అర్జునా! ఎవరైతే సుఖంగాని, దుఃఖంగాని, అంతటా - అన్నివేళలా తనదిగా భావిస్తూ, సమంగా చూస్తాడో, అట్టి యోగి శ్రేష్ఠుడని నా అభిప్రాయం.

**వ్యాఖ్య:-** సయోగీ పరమో మతః:- అట్టి యోగి శ్రేష్ఠుడు, నాకెంతో ఇష్టుడు అని భగవానుడు తన అభిప్రాయాన్ని తెలియజేస్తున్నాడు. 'నేను గొప్పవాణ్ణి' అని మనమే చాటుకుంటే వినేవాళ్ళు నవ్విపోతారు. 'అతడెంతో గొప్పవాడు' అని ఇతరులు మన గురించి చెప్పుకోవాలి. అదే గొప్పవిషయం. అలాగే నేను భగవంతుడి దృష్టిలో శ్రేష్టుణ్ణి అని మనకు మనమే బాకా ఊదుకోరాదు. నీవంటే నాకెంతో ఇష్టం. నీవు చాలా శ్రేష్టుడివి. అని భగవంతుడే అనాలి. నిజమే. భగవంతుడలా డైరక్టరుగా మనతో మాట్లాడడు గదా! మరి ఎలా తెలుస్తుంది ఆయన అభిప్రాయం? ఇదిగో ఇలా తెలుస్తుంది. ఎవరైతే ఇక్కడ

తాను చెప్పినట్లు నడుచుకుంటాడో అతడే శ్రేష్టుడు అని. ఎలా నడుచుకోవాలి?

సమస్త ప్రాణులకు వచ్చే సుఖదుఃఖాలను తనవిగానే భావించి, అందరిని తనలాగే తనతో సమానంగా భావించాలి. అలా ఎవడు భావిస్తాడో అతడే శ్రేష్టుడైన యోగి - అని.

ఇతరుల సుఖదుఃఖాలను తనవిగా భావించే యోగి ఇతరులకు సుఖం కలిగినప్పుడు ఆనందిస్తూ, ఆ సుఖాన్ని ఎక్కువ చేయటానికి ప్రయత్నిస్తాడు. అలాగే ఇతరులకు దుఃఖం కలిగినప్పుడు బాధపడుతూ ఆ దుఃఖాన్ని తొలగించడానికి ప్రయత్నిస్తాడు.

అదే దుర్యోధనుని లాంటివాడు ఇతరులు సుఖంగా ఉంటే అసూయతో రగిలిపోతాడు. వారు కష్టాలలో ఉంటే ఆనందిస్తాడు. ఇంకా వారిని కష్టపెట్టాలని చూస్తాడు. అందుకే ఘోషయాత్ర. నీ కాలికి దెబ్బ తగిలితే నీకే తగిలినట్లు బాధపడతావు. ఎందుకంటే ఆ కాలు నీదే గనుక. అదే నీ పొరుగువాడి కాలికి తగిలిన దెబ్బ నీకేమన్నా బాధ కలిగిస్తుందా? లేదు. ఎందుకని? అతడు నీకన్న వేరు కనుక. అతడు నీవేననే భావం లేదు గనుక. ఐతే మహాత్ముడు 'ఆత్మే పమ్యేన' అతడు నేనేననే భావంతో ఉంటాడు కనుక అతడి బాధ నాదే అనుకుంటాడు. అలాగే అతడి సుఖం నాదే అనుకుంటాడు. ఆత్మజ్ఞాని అందరూ ఆత్మస్వరూపులేనని, నేనూ ఆత్మస్వరూపుణ్ణేనని భావిస్తాడు. కనుకనే అంతా తానే అని భావిస్తాడు. అదే 'ఆత్మౌపమ్యేన స్థితి'.

సనాతన ధర్మం - హిందూ ధర్మం చెప్పేది ఈ ఆత్మౌపమ్యేన స్థితినే. ఇతరులను నీలాగా భావించుకో - అని. నీతోటి వారిని సోదరులుగా భావించుకో అంటుంది బైబిల్ లోని క్రీస్తువాక్యం. విశ్వమానవ సౌభ్రాతృత్వం - అంటే విశ్వమానవులందరినీ సోదరులుగా చూసుకోవటం చాలా గొప్పగా భావిస్తారు ఆ మతానుయాయులు. కాని భగవద్గీత మాత్రం 'సోదర భావం ఉంటే చాలదు, తోటి వారిని నీలాగా చూసుకో' అంటున్నది. ఎందుకంటే సోదరులు కొంతకాలం ప్రేమగా ఉండవచ్చు. కాని ఏదైనా తేడా వస్తే - ఆస్తి పంపకాలలో భేదాభిప్రాయం కలిగితే ఒకరినొకరు చంపుకోవటానికి కూడా వెనుదీయరు. ఎక్కడో కొద్దిమంది అన్యోన్యంగా ఉంటే ఉండవచ్చు గాని ఎక్కువమంది ద్వేషభావాలతోనే ఉంటారు. అందుకే "అన్నదమ్ములు చావు కోరు" బావమరుదులు బ్రతుకుకోరు అనే సామెత వచ్చింది. కాని నీలాగా చూసుకో అంటే ఎప్పుడైనా నిన్ను నీవు ద్వేషిస్తావా? నిన్ను చూస్తే నీకు అసూయ కలుగుతుందా? లేదు. అందుకే 'ఆత్మౌపమ్యేన' చాలా గొప్పవిషయం.

మహాభారతంలో "ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్" ఇతరులు నీకేది చేస్తే సరిపోదో అది నీవు ఇతరులకు చేయవద్దు అని చెప్పటం జరిగింది. అలాగే భాగవతంలో

ఒరులేయవి యొనరించిన

నరవర యప్రియము తన మనంబున కగు

దానొరులకు నవి సేయకునికి

పరాయణము పరమధర్మ పథములకెల్లన్

అని ఇదే విషయాన్ని చెప్పటం జరిగింది. ఎందుకు? నీలోను, అందరిలోను ఉన్న ఆత్మ ఒక్కటే. కనుక నీవు ఇతరులకు అపకారం చేస్తే అది నీకు నీవు చేసుకున్నట్లే. ఈ భావం నీలో ఉంటే ఇక నీలో అసూయ అనే పెద్ద జబ్బు మటుమాయం. పరోపకార బుద్ధి కలుగుతుంది. కరుణ నీ ఆభరణమౌతుంది.

మహాత్మాగాంధీ బ్రతికి ఉన్న రోజుల్లో ఒక క్రైస్తవ మతబోధకుడు గాంధీ గారి దర్శనంకోసం సేవాగ్రాం వచ్చాడు. గాంధీగారితో మాట్లాడుతున్నాడు. గాంధీగారి దగ్గర ఎప్పుడూ తీయకుండా ఒక గ్రంథం ఉంటుంది. అదే భగవద్గీత. అయితే భగవద్గీతతో పాటు బైబిల్ కూడా చూస్తూ దాన్ని మడిచి గీతాగ్రంథం పై పెట్టాడు. గీత క్రింద ఉండి బైబిలు పైన ఉండటాన్ని చూచిన ఆ క్రైస్తవ మత బోధకుడికి స్వమత దురభిమానం పెచ్చుమీరి, "గాంధీగారూ! మీ భగవద్గీతకు పైన మా బైబిలు ఉందే" అన్నాడట. గాంధీగారు చటుక్కున "అవును మా భగవద్గీత ఆధారంగానే మీ బైబిలు ఉంది" అన్నాడు. అంతే అతడికి తల తిరిగింది. ఇది కేవలం ఛలోక్తి మాత్రమే కాదు. అక్షరసత్యం.

భగవద్గీత సర్వ ధర్మసారం. దీనిని మించి ఏ మతంలో కూడా ఏమీ ఉండదు. ఏ మతంలోని భావాలైనా ఇంత ఉన్నతస్థితికి ఎదగలేవు.

"యోగీ యుంజీత సతతం" అంటూ 10వ శ్లోకంతో మొదలుపెట్టి ధ్యానానికి సంబంధించిన సమస్త విషయాలు సాంగోపాంగంగా వివరించి, ఆ ధ్యానం వల్ల కలిగే ఫలితాన్ని తెలియజేసి, ఇట్టి ధ్యానయోగియే శ్రేష్ఠుడు అని ఒక సర్టిఫికేట్ ను జారీచేసి భగవానుడు ఈ 32వ శ్లోకంతో ధ్యానయోగాన్ని

ముగించాడు. అయితే అర్జునునికి 2 సందేహాలు మిగిలిపోయాయి. ఆ సందేహాలకు చెప్పిన సమాధానాలే మిగిలిన శ్లోకాలలో వివరణ.

-అర్జునుని మొదటి సందేహం ఏమిటో 2 శ్లోకాల్లో వ్యక్తం చేస్తున్నాడు.

**అర్జున ఉవాచ:-**

**శ్లో||** యో యం యోగస్త్వయాప్రోక్తః సామ్యేన మధుసూదన|
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితం స్థిరాం|| (33)

**శ్లో||** చంచలం హిమనః కృష్ణ! ప్రమాథి బలవత్ దృఢం|
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం|| (34)

**తా||** అర్జునుడంటున్నాడు: మధుసూదనా! ఇప్పుడు నీచేత చెప్పబడ్డ సమత్వ స్థితితో కూడిన యోగం చంచలత్వం వల్ల నిలకడగా స్థిరంగా ఉంటుందని నేను అనుకోవటం లేదు.

**తా||** కృష్ణా! మనసు చంచలమైనది. దేహేంద్రియాలకు బాధాకరమైనది, బలమైనది, దృఢమైనది. వాయువును నిగ్రహించటం ఎంత కష్టమో అలాగే ఈ మనస్సును నిగ్రహించటం చాలా కష్టమని నా అభిప్రాయం.

**వ్యాఖ్య:-** ధ్యానయోగానికి సంబంధించిన అన్ని విషయాలు విన్నాడు అర్జునుడు. అయితే అతడి హృదయంలో ఒక సందేహం పీడిస్తున్నది. హృదయంలో కలిగిన ఈ సందేహం చెప్పులోని రాయిలాగా, కంటిలోని నలుసులాగా బాధపెడుతున్నది. సంశయాత్మా వినశ్యతి అన్నారు గదా! కనుక తన సంశయాన్ని తొలగించుకోవాలి. దానికి తగిన గురువు తన ఎదుటనే

ఉన్నాడు. ఇంతకన్నా అదృష్టం మరొకటి ఏముంటుంది? అందుకే తన సందేహాన్ని వ్యక్తం చేస్తున్నాడు. ఏమని?

‘‘మధుసూదనా! నీచే చెప్పబడ్డ ఈ ధ్యానయోగం మనసు యొక్క చంచలత్వం వల్ల స్థిరంగా ఉంటుందని అనుకోను" - అని.

శ్రీకృష్ణుడు యుద్ధరంగ మధ్యంలో అద్భుతం, ఆశ్చర్యకరం, అఖండం, సర్వవేదసారం ఐన వేదాంతాన్ని బోధిస్తున్నాడు. ఎందుకు? దుఃఖంతో నిండిన సమస్త మానవజాతి యొక్క దుఃఖనివృత్తి కొరకు. అలాగే అర్జునుడు కూడా విపరీతమైన దుఃఖంతో ఉండి తన దుఃఖనివృత్తికి ఏదైనా పరిష్కారం దొరుకుతుందేమోననే తీవ్రమైన తపనలో ఉన్నాడు. అందుకే ప్రతి విషయాన్ని ఎంతో సావధానంగా వింటూ, 'ఇది ఆచరణ సాధ్యమేనా?' అనే ప్రశ్న వేసుకుంటూ సందేహం కలగగానే ప్రశ్నిస్తున్నాడు.

"మధుసూదనా! నీవు చెప్పిన ధ్యానయోగం మనస్సు యొక్క సమత్వం వల్లనే సిద్ధిస్తుంది. కాని మనస్సుకు రెండు లక్షణాలున్నాయి. ఒకటి చంచలత్వం - అంటే మనస్సు ఎక్కడా నిలకడగా ఉండదు. విషయాలలో సంచరిస్తూ ఉంటుంది. రెండవది అస్థిరం - అంటే దానికి ఏదో ఒకదాని మీద అభిరుచి కాకుండా అభిరుచులు మార్చుకుంటూ ఉంటుంది. ఒక విషయం మీద నుండి మరొక విషయం మీదికి కోతిలా గెంతుతుంది. అలాంటి మనస్సును విషయాల నుండి వెనుకకు మరలించాలన్నా, దాని తిరుగుడును అరికట్టాలన్నా, మన అధీనంలో పెట్టుకోవాలన్నా, దానిని ఆత్మధ్యానంలో

నిలపాలన్నా చాలా కష్టం. ఆచరణలో ఇది సాధ్యమవుతుందని నేను అనుకోను" అన్నాడు అర్జునుడు.

ఈ సందర్భంలో మధుసూదనా! అని సంబోధిస్తున్నాడు అర్జునుడు. "అయ్యా! నీవు మధువనే రాక్షసుణ్ణి సంహరించావు. కాబట్టి ఈ మనస్సనే రాక్షసుణ్ణి కూడా నీవు సంహరించగలవు. కాని నాలాంటి వారికి ఇది ఎలా సాధ్యమవుతుంది?" అని ప్రపంచం లోని మానవులందరి తరుపున వకాల్తా పుచ్చుకొని మాట్లాడుతున్నాడు అర్జునుడు. ఎందుకంటే ధ్యానసాధన చేద్దామనుకున్న వారినందరినీ పీడించే సందేహమే ఇది. సందేహాన్ని అలాగే ఉంచితే అదే బ్రహ్మరాక్షసి అవుతుంది. అందుకే గురువు దగ్గర దాచకుండా తన హృదయాన్ని పరిచాడు.

ఇలాంటి సందర్భాలలో శిష్యుడు బాధ్యతా రహితంగా, ఆషామాషీగా ప్రశ్నించకూడదు. తన సందేహానికి సరైన కారణం కూడా చూపాలి. అందుకే మనసు యొక్క చంచలస్థితిని వివరంగా, సందర్భోచితంగా వివరించి తన సందేహం ఎంతో సమంజసమైనదని నిరూపిస్తున్నాడు.

"ఓ కృష్ణా! నీవు చెప్పే ఈ ధ్యానయోగం సిద్ధించాలంటే మనస్సు నిశ్చలంగా ఉండాలి. కానీ ఈ మనసు గాలిలేనిచోట దీపంలా నిశ్చలంగా ఉండేది కాదు. అది చంచలం. ఒకదానిపై నుండి మరొకదాని పైకి వేగంగా పరుగులు తీస్తుంది. ఇలా వేగంగా పరుగులు తీసే మనస్సును నీవు కృష్ణుడవు గనుక (కర్షయతి ఇతి కృష్ణ, ఆకర్షించేవాడు కృష్ణుడు అని వ్యుత్పత్తి అర్థం) ఈ

మనస్సును ఆకర్షించి పట్టి వేయగలవు. కాని సామాన్యులకు అంతటి శక్తి ఉండదు గదా! ఎలా? ఇది కేవలం చంచలం మాత్రమే కాదు. -

1) ప్రమాధి:- చలిస్తూ చలిస్తూ ఈ మనస్సు ఇంద్రియాలను క్షోభ పెడుతుంది. ఈ మనస్సు చేసే ఆలోచనలవల్ల అసూయ, ఈర్ష్య, ద్వేషం, అలజడి, ఆందోళన, కోపం, భయం, ఆనందం, దుఃఖం మొదలైన వికారాలు కలుగుతాయి. వీటివల్ల ఇంద్రియాలు ప్రశాంతంగా ఉండలేవు. కోపం వస్తే కళ్ళు ఎరుపెక్కుతాయి. పెదవులు అదురుతాయి. ఇక దుఃఖం వస్తే కళ్ళవెంట నీరు కారుతుంది. ఆనందం కలిగితే ముఖం చాటంత అవుతుంది. భయం వల్ల దేహం అదురుతుంది. లోపల సంక్షోభం. ఇదే ప్రమాధి.

2) బలవత్:- ఇది బలమైంది కూడా. కళ్ళు మూసుకొని కూర్చోగానే మనస్సుకు ఎక్కడలేని బలం. అంకుశం దెబ్బతిన్న ఏనుగులా విశృంఖలంగా పరుగులు తీస్తుంది. వేగంగా ప్రవహించే దానికి బలమెక్కువ. వరదలు వచ్చినప్పుడు నదులు, కాలువలు కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తాయి. మనుషులు గాని, ఇళ్ళువాకిళ్ళు గాని కొట్టుకొని పోతాయి. తుఫాను వచ్చినప్పుడు గాలికి విపరీత బలం వస్తుంది. చెట్లు విరిగి పడిపోతాయి. కరెంటు స్తంభాలు వంపులు తిరిగిపోతాయి. అలాగే ఈ మనస్సు ధ్యానంలో కూర్చోగానే వేగంగా కదులుతూ స్థిరత్వాన్ని చెడగొడుతుంది.

3) దృఢం:- ఒక్కో సందర్భంలో ఏదో ఒక వస్తువుపై లేదా భోగం పై గట్టిగా నాటుకుపోతుంది. ఈరోజు ఒక వస్తువును చూచి గట్టిగా కావాలనుకుంటే

ఏం చేస్తున్నా మనస్సు దానిమీదకే పోతుంది. ఇలా వస్తువులలో గట్టిగా నాటుకుంటే దానిని ఊడబెరకటం కష్టమే.

ఇలా మనస్సు యొక్క లక్షణాలను చెప్పి, ఒక ఉపమానం ద్వారా ఈ పదాలను తెలియజేస్తున్నాడు.

వాయోరివ:- వాయువులాగా. వాయువు ఎప్పుడూ చలిస్తూ ఉంటుంది. కనుక చంచలం. అది విపరీతంగా వస్తుంటే దేహేంద్రియాలకు బాధ కలుగుతుంది. కనుక ప్రమాథి. వేగంతో కదులుతూ అన్నింటిని పడవేస్తుంది. ఇనుప స్థంభాలను మెలికలు తిప్పుతుంది. కనుక బలవత్. ఒక్కొక్కసారి స్థంభించి పోతుంది. దృఢం. కనుక మనస్సును నిలపటం, నిశ్చలం చేయటం, సామ్యస్థితిలో ఉంచటం సుదుష్కరం అని తన భావాన్ని వివరిస్తున్నాడు అర్జునుడు. దుష్కరం అంటే కష్టం. సుదుష్కరం అంటే చాలా కష్టం అని. అంటే దాదాపు అసాధ్యమౌతుందేమోనని భావన.

అయితే అదృష్టవశాత్తు జగద్గురువే తన ఎదుట ఉన్నాడు. అసాధ్యాన్ని సుసాధ్యం చేయగల మహాత్ముడు ఏదైనా ఉపాయం చెప్పకపోతాడా? అనే ఆశ, భరోసా ఉన్నది అర్జునునకు. ఒకవేళ తన సందేహం అర్థం లేనిదయితే ఆ విషయం తెలుస్తుంది గదా!

- అర్జునుని సందేహానికి 2 శ్లోకాల్లో సమాధానం తెలియజేస్తున్నాడు భగవానుడు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో|| అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలం|**

**అభ్యాసే నతు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే|| (35)**

**తా||** భగవానుడంటున్నాడు: ఓ మహాబాహుడా! సందేహం లేదు. మనస్సు చలించే స్వభావం గలదే. దానిని నిగ్రహించటం కష్టమే. అయితే కుంతీ కుమారా! అభ్యాసంతోను, వైరాగ్యంతోను అది నిగ్రహించబడుతుంది.

**వ్యాఖ్య:-** అర్జునుని ప్రశ్న, శ్రీకృష్ణుని సమాధానం - ఈ రెంటిని విశ్లేషిస్తే ఆ గురుశిష్యుల మేధాశక్తి మనకు అర్థమవుతుంది. అర్జునుడు గొప్పవీరుడే కాదు, సాహసి కూడా. మొగమాటంలేని వాస్తవిక వాది. విషయాన్ని వినటమే కాక ఆచరణ సాధ్యమా? కాదా? అనే పరిశీలనా శక్తిగల జిజ్ఞాసువు. సందేహాన్ని దాచుకోకుండా గురువుకు విన్నవించి పరిష్కారం వెతుక్కొనే కార్యశీలి. తన సందేహాన్ని సకారణంగా వివరించగల దీక్షాదక్షతలు గలవాడు. గురువుపట్ల అత్యంత భక్తివిశ్వాసాలు, వినయవిధేయతలు గలవాడు. నేర్పుతో వాదించగల శక్తిసామర్థ్యాలు గలవాడు. గురువు యొక్క ఆధిక్యతను గుర్తించిన వివేకి.అందుకే మధుసూదనా! కృష్ణా! అనే రెండు పదాలతో గురువు యొక్క శక్తి సామర్థ్యాలను, ఆధిక్యతను చెప్పకనే చెప్పాడు. అట్టి శిష్యునికి బోధించే గురువు ఎలాంటివాడై ఉండాలి? శ్రీకృష్ణుని వంటివాడై వుండాలి. అని చెప్పక తప్పదు. ఇక్కడ శ్రీకృష్ణుని సమాధానంతో ఆయన జగద్గురువు ఎందుకయ్యాడో తెలుస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనస్సు చలించే స్వభావం గలది కదా! ధ్యానంలో దానిని ఎలా సమస్థితిలో నిలపగలం? అనేది అర్జునుని ప్రశ్న. దానికి భగవానుడు సమాధానం చెప్పే ముందు ఒక చిట్కా ప్రయోగించి శిష్యునిపై ఆధిపత్యాన్ని సంపాదించాడు. "అవును. సందేహం లేదు. నీవు చెప్పింది నిజం. మనస్సు చలించేదే. దాన్ని నిగ్రహించటం కష్టమే" అన్నాడు. ఇలా శిష్యుని భావాన్ని అంగీకరించటం ద్వారా తాను చెప్పబోయే సమాధానం పట్ల శిష్యుడు ఆకర్షితుడయ్యేట్లుగా చేయటమే ఈ చిట్కా. సాధారణంగా మనమొక విషయాన్ని చెప్పినప్పుడు అవతలివాడు "నీకసలు ఏం తెలుసు? నీవు చెప్పేది శుద్ధ తప్పు" అన్నారనుకోండి.

అప్పుడు మనం నిరుత్సాహపడతాం. "అదీ నిజమే! సరిగ్గానే చెప్పావు. నీవన్నది ముమ్మాటికీ నిజం" అన్నాడా! అంతే అతడి మీద మనకు గౌరవం పెరుగుతుంది. అందుకే వేదాంతంలో ఒక సూక్తి ఉంది. "నీవు జయించాలనుకుంటే ముందు నీవు వంగు" అని, ఆ సూక్తినే ఇక్కడ భగవానుడు పాటించాడు.

అందుకే తన సమాధానాన్ని వెనక్కునెట్టి మొదటి పదంగా 'అసంశయం' అందులో ఎటువంటి సందేహం లేదు - అంటూ అర్జునుని అభిప్రాయాన్ని బలపరిచాడు. అయితే అర్జునునిపై ఆధిపత్యం కొరకు అబద్ధం మాట్లాడుతున్నాడా? లేదు. అది సత్యవచనమే. ఎందుకంటే మనస్సు చంచలమైనదే. దానిని నిగ్రహించటం చాలా కష్టమే. ఈ విషయంలో ఎటువంటి సందేహం లేదు. అయితే అంతమాత్రాన నీవు భయపడవలసిందేమీలేదు. ఎంతటి

కష్టమైన పనినైనా నేర్పుతో,ప్రయత్నంతో సాధించవచ్చు. అని అభయమిస్తూ, 'మహాబాహో! అని అర్జునుని సంబోధిస్తున్నాడు. నీవు మహాబాహుడవు. పిరికివాడిలా భయపడి పారిపోయేవాడివి కాదు. బాహ్యశత్రువులనే గాదు. అంతఃశత్రువైన ఈ మనస్సును కూడా జయించ సమర్థుడవు అనే ప్రోత్సాహక వచనం ఇందులో దాగి ఉంది. అర్జునుడేమో 'మధుసూదనా' అని సంబోధిస్తే శ్రీకృష్ణుడేమో, 'నీవు మాత్రం తక్కువ తిన్నావా? నీవు మహాబాహుడవు' అంటున్నాడు. ఇలా గురుశిష్యులిద్దరూ గొప్ప మేధాశక్తి గలవారని, సమయస్ఫూర్తి గలవారని, చమత్కారంగా మాట్లాడే నేర్పుగలవారని ఈ పదప్రయోగాల ద్వారా తెలుస్తుంది. మరి మనస్సును నిగ్రహించటానికి ఉపాయమేమిటి? -

మనస్సును నిగ్రహించటానికి అభ్యాసం, వైరాగ్యం ఉపాయాలని భగవానుడు తెలియజేస్తున్నాడు. పతంజలి మహర్షి కూడా ఇదే విషయాన్ని "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్ని రోధః" - అభ్యాస వైరాగ్యాలే మనస్సును నిరోధిస్తాయి అని చెప్పారు.

1) అభ్యాసం:- ఏదైనా ఒక పనిని నిత్యమూ చేయుటయే అభ్యాసం. "ఒకే విషయానికి సంబంధించిన భావాన్ని వదలిపెట్టకుండా నిరంతరం, మళ్ళీ మళ్ళీ మననం చేసుకోవటమే అభ్యాసం" అని శంకరాచార్యులవారు తమ గీతా భాష్యంలో వివరించారు. నిరంతరం అభ్యాసం చెయ్యటం వల్ల ఎటువంటి పనినైనా అవలీలగా చేయగలుగుతారు. డాక్టరు గాని, లాయరు గాని డిగ్రీ తీసుకున్న తరువాత కొంతకాలం అభ్యాసం చేస్తారు. అప్పుడే వారు తేలికగా

వృత్తిలో నైపుణ్యం చూపగలుగుతారు. కొన్ని ఉద్యోగాలకు పూర్వానుభవం అడుగుతారు. ఇదంతా ఎందుకంటే ఎంత నేర్చుకున్నా ఆచరణ వల్ల - అభ్యాసం వల్లనే నైపుణ్యం వస్తుంది. కనుక నిరంతరం ధ్యానాన్ని అభ్యాసం చేయటం వల్లనే మనస్సు నిలకడ సాధించగలుగుతుంది. మనస్సు బయటకు వెళ్ళినప్పుడల్లా అరికడుతూ ఉంటే అదే అభ్యాసం అవుతుంది. కొంతకాలానికి నిలిచిపోతుంది. అందుకే "యతో యతో నిశ్చరతి తతస్తతో నియమ్యైతత్" అని చెప్పింది కూడా. ఇక 2వ ఉపాయం -

2) <u>వైరాగ్యం:-</u> మనస్సు ఎప్పుడూ విషయవస్తువులపైకి పరుగులు తీస్తుంది. అన్నింటిని చూస్తూ వాటిని గురించి తెలుసుకుంటూ, ఎలాగైనా వాటిని సాధించి, అనుభవించి, ఆనదించాలని మనస్సు ఉవ్విళ్ళూరుతూ ఉంటుంది. ఇదే రాగం అలాగాక మనస్సు వాటిపై విముఖత చెందితే అదే వైరాగ్యం. ఈ వైరాగ్యం ఎలా కలుగుతుంది?

ప్రపంచంలోని పదార్థాలన్నీ అనిత్యమైనవని, ఎప్పుడో ఒకప్పుడు నశించిపోయేవని -

అన్ని వస్తువులు సుఖాన్నిచ్చినట్లే ఇచ్చి దుఃఖాన్ని కలిగిస్తాయని- మనస్సు విషయాల వైపుకు పరుగులు తీస్తుంటే పరమాత్మకు దూరమై పోతామని -

ఎంత సంపాదించినా పోతూ పోతూ తీసుకెళ్ళేది ఏమీలేదని - ఎంతకాలం భోగాలనుభవించినా సంతృప్తి కలగదని - గ్రహిస్తే వైరాగ్యం కలుగుతుంది.

అభ్యాసం - వైరాగ్యం ఈ రెండూ వేరువేరు కాదు. ఒకదాని నొకటి సమర్థించేవే. అభ్యాసం వైరాగ్యాన్ని బలపరుస్తుంది. వైరాగ్యం అభ్యాసాన్ని దృఢం చేస్తుంది. కనుక ధ్యానాన్ని అభ్యసించటం వల్ల విషయవస్తువుల పట్ల వైరాగ్యం కలుగుతుంది. వైరాగ్యం వల్ల మనస్సు ఆత్మపై స్థిరంగా నిలబడుతుంది. అయితే వైరాగ్యం కలిగేదాకా అభ్యాసం మానుకోరాదు. రెండూ చెయ్యాల్సిందే.

అభ్యాసం లేని వైరాగ్యం స్థిరంగా ఉండదు. కలగవలసిన ప్రయోజనం కలగదు. వైరాగ్యంలేని అభ్యాసం ఎంతకాలం చేసినా ఫలించదు. కనుక రెండూ కలిపి సాధన చేయాలి. అందుకే "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే" అని చకార ప్రయోగం చేసింది.

- మనస్సు నెందుకు నిగ్రహించాలో భగవానుడు తెలియజేస్తున్నాడు.

**శ్లో||** అసంయతాత్మ నాయోగః దుష్ప్రాప ఇతిమే మతిః|

వశ్యాత్మ నాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః|| **(36)**

**తా||** మనస్సు స్వాధీనంలో లేని వానికి యోగం కష్టమని నా అభిప్రాయం. ప్రయత్నంతో, ఉపాయంతో మనస్సును స్వాధీనంలోనికి తెచ్చుకున్నట్లైతే యోగసిద్ధిని పొందవచ్చును.

**వ్యాఖ్య:-** మనసెప్పుడూ ప్రాపంచిక విషయాలపైకి పరుగులు పెడుతుంది. కనుక మనస్సును కట్టడి చేయటం చాలా కష్టం అన్నాడు అర్జునుడు. నీలాంటి మహాత్ముడికి సాధ్యమవుతుందేమోగాని, మాలాంటి సామాన్య మానవులకు

అసాధ్యం అన్నాడు. దానికి భగవానుడు "నిజమే అర్జునా! మనస్సును నిగ్రహించటం చాలా కష్టం. ఐతే అభ్యాసం, వైరాగ్యం అనే 2 ఉపాయాలతో నిగ్రహించవచ్చు" - అని చెప్పటం జరిగింది. ఐతే మనస్సును నిగ్రహించవలసిన అవసరమేమిటి? అనే సందేహానికి భగవానుడు "అర్జునా! మనో నిగ్రహం లేని వానికి యోగసాధన కుదిరే పనికాదు" అని స్పష్టం చేస్తున్నాడు అంటే విషయవ్యామోహాలలో చిక్కుకొని, వాటివెంట పరుగులెత్తే వానికి ఆత్మధ్యానం కుదరదుగాక కుదరదు. ఎందుకంటే ఆత్మనుగురించి తదేకంగా స్మరించాలంటే మనస్సు యొక్క పరుగులు ఆగాలి. మనస్సు మన చెప్పుచేతల్లో ఉండాలి. తప్పదు. మనస్సు స్వాధీనంలోనికి రాకుండా నీవు ఎంత ప్రయత్నించినా ధ్యానం సాగదు. కనుక మనోనిగ్రహం తప్పనిసరి. మరి ఎలా మనస్సును స్వాధీనంలోనికి తెచ్చుకోవాలి? యతతా (ప్రయత్నం) ఉపాయతః(ఉపాయం) - అనే రెండు సాధనలతో మనస్సును స్వాధీనంలోనికి తెచ్చుకోవాలి.

**1.యతతా:-** ధ్యానసిద్ధికి పురుష ప్రయత్నం (పురుషార్ధం) ముఖ్యం. నా ప్రారబ్ధం, నా గ్రహచారం అంటూ చేతులు ముడుచుకొని కూర్చుంటే కుదిరేది కాదు. ధ్యానసిద్ధి ప్రారబ్ధం వల్ల లభించేది కాదు. అది నీ పురుషార్థం (పురుష ప్రయత్నం) వల్లనే లభిస్తుంది. జీవిత పరమార్ధం ఏదో తెలుసుకోవటం, ఆ పరమార్ధాన్ని సాధించటానికి మార్గాన్ని తెలుసుకోవటం ప్రారబ్ధం. అంటే పూర్వజన్మల సుకృతం ఉంటే తెలుసుకోగలుగుతావు. కాని ఆ మార్గంలో ప్రయాణించటం - అందుకు ప్రయత్నం చేయటం అంతా నీ ప్రయత్నం పై - పురుషార్థంపై ఆధారపడి ఉంటుంది. అందుకే స్వామివివేకానంద "ఉత్తిష్ట!

జాగృత!! ప్రాప్యవరాన్ని బోధత!!!" - లే! మేలుకో!! సద్గురువుల బోధనలను అనుసరించు! అంటూ ఉత్తేజం కలిగించాడు. మీనమేషాలు లెక్కించటానికి, నిద్రపోవటానికి ఇది సమయం కాదు. మృత్యువు ముంచుకొస్తున్నది. టైం లేదు. త్వరపడు. జీవచ్ఛవంలాగా పడి ఉండకు అనేది ఆయన భావన. కఠోపనిషత్ లోని ఈ పదం ఆయనకెంతో ప్రీతిపాత్రమైనది. కనుక నీ ప్రయత్నం నీవు చేయాలి.

2. ఉపాయతః- ఇలా నీవు చేసే ప్రయత్నంలో ఉపాయం కూడా కావాలి. ఉపాయం లేకుండా చేసే ప్రయత్నం గుడ్డి ఎద్దు చేలో పడ్డట్లే ఉంటుంది. శక్తి పనిచేయని చోట యుక్తి పనిచేస్తుంది. మనస్సును ఇంద్రియ విషయాల నుండి మరలించటానికి హఠప్రయత్నం హఠయోగం కాదు. ఉపాయం కావాలి. హఠయోగం రాక్షసక్రియ. ఉపాయం దైవక్రియ.

ఒక తండ్రి తాను సంపాదించిన సొమ్మును ఒకచోట గొయ్యి త్రవ్వి దాచాడు. తన ఇంట్లో ఒక పుస్తకంలో "కార్తీక శుద్ధ పంచమి రోజున ఉ||10 గంటలకు మన గ్రామ శివాలయం యొక్క గోపుర మధ్య కలశంలో నిధిని దాచాను" అని వ్రాసి తరువాత కొంత కాలానికి చనిపోయాడు. అతడి కుమారుడు పాతపుస్తకాలు తిరగేస్తుంటే ఇది కనిపించింది. వెంటనే ఆ రాత్రి శివాలయ గోపురం ఎక్కి మధ్య కలశాన్ని పగలగొట్టాడు. అందులో ఏమీలేదు. దానితో చేసేదిలేక తిరిగి వచ్చాడు. అతడి తండ్రి యొక్క స్నేహితునితో విషయం చెప్పగా, ఆ స్నేహితుడు, "ముందు నీవు పడగొట్టిన కలశాన్ని ఉన్నది ఉన్నట్లు కట్టించు అన్నాడు. ఆ తరువాత కార్తీక శుద్ధపంచమి రోజున

శివాలయానికి వెళ్ళి ఆ మధ్య కలశం యొక్క నీడ ఉ||10లకు ఎక్కడ పడుతున్నదో గుర్తించి, ఆ రాత్రికి వెళ్ళి అక్కడ త్రవ్వించగా నిధి బయటపడింది. అంటే ఉన్నది ఉన్నట్లుగా చదివి ప్రయత్నించటం కాదు. ఉపాయం కావాలి అని తెలుస్తుంది.

కనుక మనస్సును విషయవ్యామోహాల నుండి తప్పించి, దానిని నీ స్వాధీనంలో ఉంచుకోవటానికి ఉపాయాలేమిటో శాస్త్రాలు తెలియజేస్తాయి. గురువులు వాటిని బోధిస్తారు. వారి సూచనలను పాటిస్తూ సాధన చేయాలి. అలా చేస్తేనే మనోనిగ్రహం, యోగసిద్ధి కలుగుతుంది.

ఇతి మేమతః:- ఇది నా అభిప్రాయం అని భగవానుడు తెలియజేస్తున్నాడు. కనుక సందేహించవలసిన పనిలేదు. కనుక నాకు మోక్షం ఎట్లా? అనిగాని, ధ్యానం చక్కగా సాగించటానికి మనస్సును నిగ్రహించటం ఎట్లా? అనిగాని సందేహించవలసిన పనిలేదు, ఇక్కడ చెప్పినట్లు భగవానుడు దయతో తెలియజేసినట్లు - అభ్యాస వైరాగ్యాలతో విజయం సాధించాలి. కనుక -

ధ్యానాభ్యాసం చేస్తూ వుండు. (ప్రయత్నం కొనసాగించు)

మనోనిగ్రహానికి గురువుల నాశ్రయించు (ఉపాయాలను తెలుసుకో)

ఇదే నీ కర్తవ్యం. - ఇలా చెప్పినా అర్జునునికి ఇంకొక సందేహం ఉంది.

ఇంతచేసినా యోగసిద్ధిని పొందటం సాధ్యమా? అలా పొందలేకపోతే పరిస్థితి ఏమిటి? అని. అదే అడుగుతున్నాడు. ఏమని?

- ఎంతో కష్టపడి, ఎన్నో శ్రమల కోర్చి, ఎన్నో త్యాగాలు చేసి ధ్యాన యోగాన్ని దీర్ఘకాలం సాగించినా యోగసిద్ధిని పొందలేకపోతే ఏమౌతుంది? అనే సందేహాన్ని వ్యక్తం చేస్తున్నాడు అర్జునుడు.

**అర్జున ఉవాచ:**

**శ్లో||** అయతిః శ్రద్ధయోపేతః యోగాచ్చలిత మానసః|
అప్రాప్య యోగ సంసిద్ధిం కాంగతిం కృష్ణ! గచ్ఛతి|| **(37)**

**శ్లో||** కచ్చిన్నో భయ విభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి|
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి|| **(38)**

**శ్లో||** ఏ తన్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ్యస్య శేషతః|
త్వ దన్య స్సంశయస్యాస్య ఛేత్తా నహ్యుప పద్యతే|| **(39)**

**తా||** కృష్ణా! శ్రద్ధ ఉన్నప్పటికీ ప్రయత్నలోపం వల్ల యోగం నుండి మనస్సు చలించినవాడు యోగసిద్ధిని పొందలేకపోతే అతడి గతి ఏమిటి?

ఓ మహాబాహుడా! యోగమార్గంలో నిలువలేక, మోహంలో పడి పోయిన సాధకుడు రెంటికీ చెడినవాడై చెదిరిన మేఘంలాగా వ్యర్థుడై నశించిపోడా?

కృష్ణా! నా యీ సందేహాన్ని పూర్తిగా తొలగించగలిగిన వాడవు నీవే. ఈ సంశయాన్ని తొలగించగలవారు నీకన్నా వేరే ఎవరూ నాకు లభించరు.

**వ్యాఖ్య:-** అర్జునుడు ఈ ప్రశ్న వేయకపోయినట్లైతే లోకంలోని సమస్త మానవులకు గొప్పనష్టం సంభవించేది. జన్మజన్మాంతర విషయాలకు

సంబంధించిన ఒక గొప్ప విశేషాన్ని భగవంతుని నోటిమీదుగా చెప్పించటానికి వ్యాసమహర్షి అర్జునుని చేత ఈ ప్రశ్న వేయించాడు. ఈ ప్రశ్నకు సామాన్యులెవరూ సమాధానం చెప్పలేరు. అంతేకాదు ఈ ప్రశ్నకు భగవంతుని సమాధానాన్ని తెలుసుకోకపోతే గీతా పాఠకులకు ఎంతో నష్టం. అదేమిటంటే "ఎన్ని త్యాగాలు చేసైనా, యోగసాధనను సాగించి అనంతమైన ఆనందాన్ని పొందవలసిందే..." అనే నిర్ణయానికి రావటం జరగదు. అదే గొప్ప నష్టం. ఇప్పుడు అర్జునుని ప్రశ్న ఏమిటో విశ్లేషిద్దాం.

శాస్త్రవాక్యాలపైన, గురువాక్యాలపైన శ్రద్ధ, విశ్వాసం గల ఒకడు ధ్యానయోగాన్ని అభ్యసిస్తున్నాడు. అయితే అతడి ప్రయత్నంలో లోపం ఉన్నది. ఆ కారణంగా అతడు యోగంలో నిలువలేక, ఆ జన్మలోనే సిద్ధి పొందలేకపోతే అతడి గతి ఏమిటి? అని అర్జునుని ప్రశ్న.

ఈ ప్రశ్నలో 2 భాగాలున్నాయి. ప్రయత్నలోపం రెండు కారణాల వల్ల కావచ్చు. 1.యోగసాధన ఎంత చక్కగా తెలుసుకొని చేస్తున్నప్పటికీ ప్రాపంచిక విషయవ్యామోహాలకు లొంగిపోవచ్చు. తిండి, బట్ట, ఇల్లు లాంటి ప్రాథమిక అవసరాలు కావచ్చు. లేదా చుట్టూ వున్న సమాజాన్ని చూస్తూ కొన్ని భోగాల పట్ల ఆసక్తి కావచ్చు. వీటి కారణంగా మనస్సు చలిస్తుంది. దానితో యోగం నుండి జారిపోతాడు. యోగభ్రష్టుడవుతాడు. కోరికలపై వ్యామోహంతో ధ్యానాన్ని వదిలేస్తాడు. ఎప్పుడో ఒకప్పుడు మరణం సంభవిస్తుంది. మరి అతడి గతి ఏమిటి?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

2.మరికొందరు అరుదుగా ఉంటారు. వారికి ప్రాపంచిక వ్యామోహాలేమీ లేవు. భోగాసక్తి లేదు. యోగాభ్యాసాన్ని సాగిస్తూనే ఉన్నాడు. కాకపోతే శారీరక పరిస్థితులవల్లనో, అనారోగ్యం వల్లనో, ఇతర కారణాల వల్లనో తీవ్ర ప్రయత్నం చేయలేకపోతున్నాడు. అట్టివానికి కూడా ఎప్పుడో ఒకప్పుడు మరణం తథ్యం. మరి యోగస్థితిని పొందకుండానే మరణించిన అట్టివాని గతి ఏమిటి? - ఇవి అర్జునుని ప్రశ్నలలోని రెండు భాగాలు.

ఇలా ధ్యానసాధన సాగించి కూడా సిద్ధి పొందకుండానే మరణించిన యోగభ్రష్టుల యొక్క గతి ఏమిటి? రెంటికి చెడిన వాడవుతాడా? ఉభయభ్రష్టత్వమేనా? - అంటే ఇహలోక సౌభాగ్యానికి, పరలోక సౌఖ్యానికి - రెంటికీ దూరమవుతాడా? అని.

ధ్యానయోగాన్ని అభ్యాసం చేసి సిద్ధి పొందితే, ఆత్మసుఖం - దుఃఖం లేని నిత్యానందం లభిస్తుంది గదా! అని ఇక్కడి లౌకిక సుఖాలను త్యాగం చేసి, ఎంతో కష్టపడి యోగాభ్యాసం చేస్తాడు. మరి సిద్ధి పొందకపోతే ఆత్మ సుఖమూ అందదు; ఇక్కడి లౌకిక సుఖాలకూ దూరమయ్యాడు. అంటే ఇంటికూటికి, బంతికూటికి రెంటికీ చెడినవాడౌతాడు కదా! అని అర్జునుని సందేహం. దీనినే అర్జునుడు చెదిరిన మేఘంలాగా అని ఒక ఉపమానాన్ని చెప్పాడు.

వేసవికాలంలో మేఘాలు కొండల ఆకారంలోను, మేడల ఆకారంలోను, ఇంకా చిత్రవిచిత్ర రూపాలలో గాలిలో తేలియాడుతూ కనిపిస్తాయి. అయితే పెద్ద గాలి కనుక వీచిందా - ఆ మేఘాలన్నీ చెదిరి, తునాతునకలైపోతాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మేఘాల ఈ తునకలన్నీ పిల్లగాలి వీచినప్పుడు అటూ ఇటూ కొట్టబడుతుంటాయి.

ఈ మబ్బు తునుకలు అటు పెద్ద మేఘంలోనూ చేరవు. పోనీ చల్లబడి వర్షిస్తాయా? అంటే అదీ లేదు. అవి గాలికి అల్లల్లాడుతుంటాయి. ఆ విధంగా ఉట్టికీ గాక, స్వర్గానికీ గాక ఈ యోగభ్రష్టుడి గతి కూడా ఇంతేనా? అని అర్జునుని ప్రశ్న.

అర్జునుని ఈ సందేహాన్ని ఎవరు తీర్చగలరు? సర్వజ్ఞుడైన భగవానునికి తప్ప మరెవరికీ ఈ అర్హత ఉండదు. భగవానుడే తన గురువై ఎదురుగా ఉంటే అర్జునునికి కావలసిందేముంది? అందుకే వినయంతో ప్రశ్నించాడు. అర్జునుని ప్రశ్నలో ఒక చిక్కు సమస్య ఉన్నది. ధ్యానయోగాన్ని చేస్తూ చేస్తూ, సిద్ధి పొందకుండానే మరణించిన వారి గతి ఏమౌతుంది? అని అడగడం వల్ల జీవుల మరణానంతర స్థితి గతులను చెప్పగలగాలి. అలా చెప్పాలంటే 3 కాలాల్లోని పరిస్థితులను, ప్రాణికోట్లను తెలుసుకోగల ఆగత - అనాగత జ్ఞానం వుండాలి. అది సర్వజ్ఞుడైన భగవంతునికే ఉంటుంది. అట్టి సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడే తన సందేహం తీర్చగలడని అర్జునుని నమ్మకం. అందుకే 'నీవు తప్ప దీనికి సమాధానం చెప్పగల మరొకరెవ్వరూ లేరు' అనటం.

ఆధ్యాత్మిక రంగంలో నిజమైన శిష్యుడు గురువు ద్వారా సంశయ నివృత్తి ఎలా పొందాలో ఇక్కడ చక్కగా చూపబడింది. గురువు జ్ఞాన భాండాగారం, శిష్యుని ప్రశ్న దానిని తెరిచే తాళం చెవి. ఇక యోగభ్రష్ఠుని గతి ఏమిటో రాబోయే 6 శ్లోకాల్లో విపులంగా వివరిస్తున్నారు.

- యోగభ్రష్టుని గతి ఏమౌతుందోనని భయపడే వారికి ముందుగా అభయప్రదానం చేస్తున్నారు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో||** పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే|

నహికల్యాణ కృత్ కశ్చిత్ దుర్గతింతాత! గచ్ఛతి|| **(40)**

**తా||** భగవానుడంటున్నాడు. పార్థా! అట్టివానికి ఇక్కడగాని, అక్కడ (ఆ లోకంలో)గాని ఎక్కడా నాశనం లేదు. నాయనా! మంచి పనిచేసినవాడెవడూ దుర్గతిని పొందడు.

**వ్యాఖ్య:-** అర్జునుని ప్రశ్నలోని ఆవేదనను గమనించిన భగవానుడు వెంటనే హామీ ఇస్తూ అతడికి ధైర్యాన్ని ఉత్సాహాన్నీ కలిగిస్తున్నాడు. ఏమిటా హామీ? "శుభకర్మలు ఆచరించిన వాడికి ఎప్పుడూ దుర్గతి ఉండదు" ఇదొక సత్య సిద్ధాంతం. ఇది తర్కబద్ధమైన హామీ. ఏమిటా తర్కం?

భూతకాలం యొక్క ఫలమే వర్తమానం. వర్తమానం యొక్క ఫలమే భవిష్యత్తు. ఇపుడు నీకు బ్యాంకు నుండి లక్షరూపాయలు వచ్చినవి అంటే ఇంతకుముందు నీవు తగినంత మొత్తం బ్యాంకులో దాచుకుని ఉండటమే. అలాగే ఇపుడు నీవు బ్యాంకులో దాచుకున్నావంటే భవిష్యత్తులో నీకు వడ్డీతో సహా మొత్తం అందుతుంది.

ఒకడు డాక్టరు దగ్గరకు వచ్చి "కడుపు నొప్పండీ!" అన్నాడు. "రాత్రి ఏం తిన్నావు?" అని అడిగాడు డాక్టరు. "ఏమీ లేదండీ మజ్జిగ త్రాగాను" అన్నాడు.

"మజ్జిగ త్రాగితే కడుపునొప్పి రాదు. నిన్న మధ్యాహ్నం ఏం తిన్నావు" అని అడిగాడు డాక్టరు. "డజను గారెలు, 4 బూరెలు, పావుకిలో జీడిపప్పు పాకం, 10 బజ్జీలు తిని రెండు డ్రింకులు త్రాగాను" అన్నాడు. అదీ కడుపునొప్పికి కారణం. నిన్న తింటే ఈ రోజు కడుపునొప్పి. ఈ రోజు తింటే రేపు లేదా ఎల్లుండి వస్తుంది. అలాగే పూర్వజన్మలలో సత్కర్మలు చేస్తే ఇప్పుడు సుఖభోగాలు అనుభవిస్తాం. ఈ జన్మలో సత్కర్మలు చేస్తే రాబోయే జన్మలో సుఖపడతాం. అలాగే ఇప్పుడు పాపాలు చేస్తే రాబోయే జన్మలో దుఃఖాలు అనుభవిస్తాం.

ఈ శ్లోకం పునర్జన్మ సిద్ధాంతాన్ని, కర్మ సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. మంచి చేసిన వాడికి చెడు జరగదు. చెడు చేసిన వాడికి మంచి జరగదు. యోగసాధన అనేది చాలా ఉత్తమకార్యం. అందుకే అట్టి యోగసాధకుడు ఫలితం సిద్ధించకుండా మరణించినా అతడికి చెడు జరగదు అని భగవానుడు ధైర్యం చెబుతున్నాడు. యోగసాధన చేసేవాడికి మనోనిగ్రహం కలగక పోయినా, విషయవస్తువుల వ్యామోహం తగ్గకపోయినా, అతడికి ఇహలోకంలో ఏమాత్రం చెడు జరగదు. అనుమానం లేదు. ఇక ఈ జన్మ అంతమైన తర్వాత పరలోకంలో కూడా నరకయాతనలు గాని, చెరుపుగాని ఉండదు. పైగా అతడికి శుభం జరుగుతుంది. కనుక ఇహపరాలు రెండింటిలోనూ చేటు కలగదు. ఎందుకంటే యోగసాధన అనేది శుభకర్మ. శుభకర్మ ఆచరించిన వాడికి అశుభం ఎలా కలుగుతుంది? కలగదు - అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు. మరొక ముఖ్య విషయం -


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దానధర్మాలు, పుణ్యకార్యాలు, పరోపకారార్థం చేసే పనులు, ఏవైనా ఉత్తమ ఫలితాలనే ఇస్తాయి. అయితే ఈ కర్మల వల్ల లభించే భోగాలను, సుఖాలను అనుభవించటంతో అవి క్షయమైపోతాయి. కాని యోగసాధన అలా కాదు. మళ్ళీ లభించే జన్మలన్నీ ఈ యోగసాధన సాగించటానికి అనువైన జన్మలు వస్తాయి. కనుక మోక్షార్థి అయినవాడు యోగసాధన తప్పక చేయాలి.

"రెండింటికీ చెడిన వాడవుతాడా యోగభ్రష్టుడు?" అని అర్జునుని సందేహం. :రెండింటికీ చెడడు. ఒక్కదానికీ చెడడు. అసలు చెడటమే లేదు. పైగా రెండింటా శుభమే జరుగుతుంది. చేసిన శ్రమ ఊరికే పోదు" అని భగవానుని సమాధానం.

తాత! అంటే సంస్కృతంలో తండ్రీ, - నాయనా - అని అర్థం. ఇక్కడ శ్రీకృష్ణుడు అర్జునుని నాయనా! అని సంభోదిస్తూ ఉపనిషత్తుల సాంప్రదాయాన్ని పాటిస్తున్నాడు. ఈ సంబోధనలో గంభీర భావన ఇమిడి వుంది. ప్రపంచంలో తండ్రి ఎంతటి క్రూరుడైన, మోసగాడైనా, దుర్మార్గుడైనా తన కుమారుడికి చెప్పవలసి వచ్చినప్పుడు అతడికి చెడు చెప్పడు, మోసగించడు. ఇక్కడ శ్రీకృష్ణుడు అలాంటి పుత్రప్రేమతోనే చెబుతున్నాడని గమనించాలి.

ఇక యోగభ్రష్టుని గతినిగూర్చి భగవానుడు తెలియజేయబోతున్నాడు. యోగభ్రష్టులు రెండు రకాలు.

1.యోగాభ్యాసాన్ని సాగిస్తూ విషయభోగాలపై వ్యామోహంతో పతనమైన వాడు.

2.యోగాభ్యాసాన్ని సాగిస్తూ ప్రయత్నలోపంవల్ల సిద్ధి పొందకముందే మరణించినవాడు.

-ఇపుడు మొదటివాని గతి ఏమిటో 41వ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

**శ్లో||** ప్రాప్య పుణ్య కృతాంలోకాన్ ఉషిత్వా శాశ్వతీ స్సమాః|

శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే|| (41)

**తా||** యోగభ్రష్టుడు పుణ్యకర్మల వల్ల వచ్చే లోకాలను పొంది, అనేక సంవత్సరాలు అక్కడ నివసించి, శుచివంతులు - శ్రీమంతులు అయిన వారింట జన్మిస్తాడు.

**వ్యాఖ్య:-** యోగభ్రష్టుడైన వాడికి ఇహంలో గాని, పరంలో గాని, దుర్గతి కలగదు - అని ఇంతవరకుతెలియజేసిన భగవానుడు, ఎటువంటి సద్గతి కలుగుతున్నదో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

యోగభ్రష్టుడు చనిపోయిన తర్వాత పుణ్యలోకాలకు వెళ్ళి అక్కడ చాలాకాలం భోగాలనుభవిస్తాడు. ఆ తర్వాత భూలోకంలో సదాచార సంపన్నులు, శ్రీమంతులు అయిన వారి ఇంట జన్మిస్తాడు. అంటే అతడికి ఇహంలోనూ లోటు లేదు. పరంలోనూ లోటు లేదు. రెండు చోట్లా సుఖమే - అని.

ఈ యోగభ్రష్టుడు విషయభోగాలపై ఆసక్తి గలవాడు. పూర్వజన్మ సుకృతం వల్లనో, మహాత్ముల వాక్యాలపై విశ్వాసం వల్లనో, మోక్షాన్ని

పొందాలని, అందుకు యోగాభ్యాసం చెయ్యాలని తెలుసుకొని యోగసాధన చేస్తున్నాడు. కాని అతడి మనస్సు స్థిరంగా ధ్యానంలో నిలవటం లేదు. సుఖాలు, భోగాలు, విషయ వస్తువులు అతడి మనస్సును లాగివేస్తున్నాయి. అంటే మాయకు లోబడి పోతున్నాడు. ఈ ప్రాపంచిక ఆకర్షణల నుండి, విషయ వ్యామోహాల నుండి బయటపడలేకపోతున్నాడు. కనుక మనస్సు యోగంలో నిలవక భోగంలోనే నిలుస్తుంది. ఐనా యోగసాధన సాగించాలనే కోరికా ఉన్నది, సక్రమంగా సాగించలేక పోతున్నాననే బాధా ఉన్నది, అలాంటి వాడికి మరణ సమయంలో కూడా యోగం పట్ల, భోగం పట్ల ఆసక్తి ఉంటుంది. అది తలచుకుంటూనే ప్రాణాలు విడిచి పెడతాడు. "యం యంవాఽపిస్మరన్ భావం త్యజత్యంతే కళేబరం। తంతమేవైతి కౌంతేయ|| 'శరీరాన్ని విడిచిపెట్టే సమయంలో ఏది తలచుకుంటే తరువాత అదే అవుతావు' అనే గీతావాక్యం ప్రకారం అతడు భోగాన్ని తలచుకున్నాడు గనుక భోగజీవితమూ రావాలి, యోగాన్ని తలచుకున్నాడు గనుక యోగజీవితమూ రావాలి. కనుకనే పుణ్యకర్మలు ఆచరించేవారు చేరుకొనే పుణ్యలోకాలకు - స్వర్గాది లోకాలకు వెళ్ళి అక్కడ అనేక సంవత్సరాలు స్వర్గభోగాలు అనుభవిస్తాడు. ఎంతకాలం అనుభవిస్తాడు? యోగాభ్యాసమనే పుణ్యం ఎంత చేసుకున్నాడో దానిని బట్టి ఆ కాలం నిర్ణయమవుతుంది. అలా చాలాకాలం సుఖ భోగాలు అనుభవించిన తరువాత అతడు తిరిగి ఈ లోకంలో జన్మించాలి. ఎందుకంటే ఎంతకాలం స్వర్గలోకంలో ఉన్నా అదేం శాశ్వత స్థానం కాదుగదా! పుణ్యం క్షయమైపోగానే మళ్ళీ ఈ భూలోకంలోకి

రావాల్సిందే. అయితే యోగభ్రష్టుడు అలా తిరిగివచ్చి భూలోకంలో సదాచార సంపన్నులు, శ్రీమంతులైన వారి ఇంట జన్మిస్తాడు. ఎందుకు ఇటువంటి ఇంట జన్మిస్తాడు?

అతడు మరణ సమయంలో కూడా యోగాన్ని తలచుకుంటూ దేహాన్ని వదిలాడు గనుక అక్కడ కొనసాగించలేక విడిచిపెట్టిన యోగాభ్యాసాన్ని చక్కగా కొనసాగించటానికే సదాచారసంపన్నులైనవారి ఇంట జన్మిస్తున్నాడు. అలాగే మరణ సమయంలో భోగాన్ని కూడా తలచుకుంటూ దేహాన్ని వదిలాడు గనుక, ఆ భోగవాసనలు ఖర్చు చేసుకోవటానికి శ్రీమంతుల ఇంట జన్మించి, ధన సంపదలకు కొరత లేకుండా వుండి భోగాలను అనుభవిస్తాడు. ఇలా భోగాలను అనుభవిస్తూ, యోగాభ్యాసాన్ని కొనసాగించటానికే శుచివంతులు, శ్రీమంతులు అయిన వారింట జననం.

శ్రీమంతులై,సంపదలు కలిగిఉండి సదాచార సంపన్నులు కాకపోతే వారు అహంకారంలో ఉంటారు. వారి చర్యలన్నీ పాపమార్గంలో నడుస్తాయి. ధనమదం కన్నుగప్పి వేస్తుంది. కనుక వారు అకృత్యాలకు, అన్యాయాలకు వెనుకాడరు. అకృత్యాలు చేయకపోయినా నిరంతరం భోగవిలాసాలలో మునిగిపోయి వ్యర్థమైన జీవితాన్ని గడుపుతారేగాని, జీవితాన్ని సార్థకం చేసుకోవాలనే ఆలోచన కూడా రాదు, అవకాశం కూడా లభించదు. ఇట్టి జన్మలనే అసుర జన్మలని కూడా అంటారు. ఇక ఆ తరువాత వీరికి వచ్చే జన్మలన్నీ నీచ నికృష్ట జన్మలే. కనుకనే వారు  శ్రీమంతులేగాక శుచివంతులు కూడా అయి ఉంటారని చెప్పటం.

ఇక శుచిమంతులు, సదాచార సంపన్నులు, పవిత్రులై ఉండి కూడా శ్రీమంతులు కానిచో వారిలో భోగాసక్తి - భోగవాసనలు ఉంటాయి - గనుక ఎంతగా యోగాభ్యాసాన్ని చేస్తున్నా ఈ భోగవాసనల వల్ల ధ్యానంలో మనస్సు నిలవదు. జీవించటానికి ధనాన్ని సంపాదించాలి గనుక వృత్తులో, ఉద్యోగాలో, వ్యాపారాలో చేసుకుంటూ అందులోనే పూర్తికాలం గడిపేస్తారు. యోగసాధనకు మళ్ళీ ఈ జన్మలోనూ అంతరాయం కలుగుతుంది. అంతరాయమే కాదు అసలు సాధనకు అవకాశమే లేకపోవచ్చు. ఇక ఆ తరువాత వచ్చే జన్మలు సామాన్య జన్మలే.

కనుకనే యోగసాధన సాగిస్తూ, భోగాలపట్ల ఆసక్తి వల్ల సిద్ధి పొందకుండానే మరణించినవారికే 'శుచీనాం శ్రీమతాంగేహె' - శుచివంతులు, శ్రీమంతులు ఐనవారింట జన్మ కలుగుతుందని చెప్పటం జరిగింది. శుచివంతులు, సదాచార సంపన్నులు గనుక పారమార్థిక చింతనకు, యోగాభ్యాసానికి ఆటంకం ఉండదు. శ్రీమంతులు గనుక భుక్తికోసం, భోగాల కోసం, పాటుపడనక్కర లేదు. యోగం - భోగం రెండూ ఆటంకాలు లేకుండా సాగిపోతాయి.

ఇలా ధనమూ వివేకమూ కలిగిన జన్మలు అపురూపమైనవి. యోగభ్రష్టునికి ఇహంలోనూ, పరంలోనూ ఎక్కడా లోటులేదు. అతడు చేసే మోక్షమార్గ ప్రయాణంలో ఆంటకాలు, ఆగిపోవటాలు ఉండవు. ఇదీ మరణ సమయంలో భోగాసక్తి ఉండి మరణించిన యోగి యొక్క స్థితి. కనుక ఒక్కజన్మలో మనం చేసిన కొద్ది త్యాగం (యోగాభ్యాసం) ఎంత గొప్ప

ఫలితాన్ని ఇస్తుందో ఇక్కడ మనకు తెలుస్తున్నది. కనుక నిలిచినా, నిలవలేకపోయినా యోగాభ్యాసాన్ని - ధ్యానయోగాన్ని ఆచరించటం గొప్ప సాధన - మన జీవితాన్ని మలుపు తిప్పే సాధన అని గ్రహించాలి.

యోగభ్రష్టుడు పుణ్యలోకాలకు వెళ్ళి చాలాకాలం అక్కడ భోగాలను భవిస్తాడు అని చెప్పటం వల్ల యోగసాధన అనేది గొప్ప పుణ్యకర్మ అని అర్థమౌతుంది. మిగిలిన పుణ్యకార్యాలు - అంటే దానధర్మాలు చేయాలన్నా, గుళ్ళు గోపురాలు కట్టించాలన్నా, సత్రాలు కళ్యాణమండపాలు కట్టించాలన్నా, యజ్ఞయాగాదులు ఆచరించాలన్నా డబ్బు కావాలి, శ్రమ చేయాలి. కాని ఈ ధ్యానయోగ సాధనకు మాత్రం శ్రద్ధ ఉంటే చాలు. కొంచెం శ్రమిస్తే చాలు. అంతేకాదు, కేవల పుణ్యకార్యాలు ఎన్ని చేసినా శ్రీమంతుల ఇంట పుట్టి భోగభాగ్యాలు అనుభవించవచ్చునేగాని సదాచార సంపన్నులై జీవిత సార్థక్యానికి పాటు పడలేరు. కనుక యోగసాధన అనేది గొప్ప పుణ్యకర్మ. ఉత్తమ ఫలితాన్నిచ్చే పుణ్యకర్మ.

ఇలా యోగంలో నిలవలేక పడిపోయినవాడు చక్కని జన్మను పొంది అక్కడ సాధన సాగించటం జరుగుతుంది కనుక చేసిన కృషి వృథాపోదు.

ఈ శ్లోకం కూడా పునర్జన్మ సిద్ధాంతాన్ని, కర్మ సిద్ధాంతాన్ని బలపరుస్తున్నది.

- ఇక రెండవరకం యోగభ్రష్టుని గతి ఏమిటో తెలియజేస్తున్నారు.

శ్లో|| అథవా యోగినా మేవ కులేభవతి ధీమతాం|

ఏతద్ధి దుర్లభతరం లోకేజన్మ యదీదృశం|| (42)

**తా||** లేదా వివేకులైన (బుద్ధిమంతులైన) యోగుల ఇంటిలోనే జన్మిస్తాడు. లోకంలో ఈ విధమైన జన్మ చాలా అరుదుగా లభిస్తుంది.

**వ్యాఖ్య:-** ఈ యోగభ్రష్టుడు ఉత్తముడు. ఇతడికి విషయాలపట్ల, భోగాలపట్ల ఆసక్తి లేదు. మనస్సు ఎల్లప్పుడూ యోగంలోనే నిలిచింది. యోగాభ్యాసాన్ని చిత్తశుద్ధితోనే సాగిస్తున్నాడు. కాకపోతే మరీ తీవ్రంగా ప్రయత్నం చేయకపోవటం వల్లనో, లేదా ఆయుష్కాలం తక్కువై మృత్యువు ముంచుకొచ్చినందువల్లనో యోగసిద్ధి పొందకుండానే దేహాన్ని చాలించాడు. మరి ఇట్టివాని గతి ఏమిటి? - ఎలాంటి జన్మ వస్తుంది?

ఇట్టి యోగభ్రష్టుడు తన యోగసాధనను కొనసాగించటానికి వీలుగా వెంటనే బుద్ధిమంతులు, వివేకులు ఐన యోగుల ఇంట సరాసరి జన్మిస్తాడు. ఇతడికి విషయభోగాలపై ఆసక్తి లేదు గనుక, పుణ్యకర్మల ఫలాలను అనుభవించాలనే కోరిక ఉండదు గనుక ఇతడు ఏ పుణ్యలోకాలకో వెళ్ళి అక్కడ భోగాలనుభవిస్తూ చాలాకాలం ఉండాల్సిన పనిలేదు. అతడి కోరిక యోగసిద్ధియే గనుక, అందుకు ప్రయత్నించాల్సింది భూలోకంలో మానవజన్మ ఎత్తినప్పుడే సాధ్యం గనుక, అతడు సరాసరి యోగుల ఇంట జన్మిస్తాడు. యోగసిద్ధికి స్వర్గాది లోకాలు పనికిరావు. అవన్నీ అనుభవలోకాలే గాని, అక్కడ కర్మాధికారం లేదు. యోగసాధన సాగించే వీలులేదు.

ఇలా సరాసరి యోగుల ఇంట జన్మించిన వారికి ధన సంపదలు ఉండవు. వారికి ధనసంపదలపై ఆసక్తి ఉండదు. అవి లేవే అనే బాధా ఉండదు. వారికివి తృణప్రాయం. ఉన్నదానితో - లభించిన దానితో సంతృప్తికరమైన

జీవితాన్ని గడుపుతారు. ఎల్లప్పుడూ దైవం మీద, దైవకార్యాల మీద ఆసక్తి, శ్రద్ధ కలిగిఉంటారు. మోక్షప్రాప్తిని గురించే ఆలోచిస్తూ అందుకు తగిన జ్ఞానాన్ని పొందుతూ, సాధనలు సాగిస్తూ ఉంటారు. సత్కాలక్షేపం చేస్తూ సద్గ్రంధాలు పఠిస్తూ, సజ్జనులతో సాంగత్యం చేస్తూ, మహాత్ములను, గురువులను అత్యంత భక్తిశ్రద్ధలతో సేవిస్తూ, పారమార్థిక విషయాలపై చర్చిస్తూ ఉంటారు. ఇలాంటి ఇంట జన్మించిన వారికి యోగసాధన కొనసాగించటానికి పరిస్థితులన్నీ అనుకూలంగా ఉంటాయి. తపస్సు, ధ్యానం నిత్యకృత్యాలవుతాయి.

ఒకవేళ యోగుల ఇంట జన్మించిన ఈ యోగభ్రష్టుడు పరిస్థితులు పైన చెప్పినట్లు అనుకూలంగా లేకపోతే? ఇంటి నుండి పారిపోయి గురుకులాలలోనో, ఆశ్రమాలలోనో ఉండి అక్కడ మహాత్ముల సేవ చేసుకుంటూ, సత్పురుషుల సాంగత్యంతో యోగసాధనను నిరాటంకంగా సాగిస్తాడు. కనుక ఎట్టి పరిస్థితులలోనైనా, ఎలాగైనా అతడు తన యోగసాధనను కొనసాగించటానికి, తీవ్ర యోగాభ్యాసానికి అనువైన జన్మే వస్తుంది; అనువైన పరిస్థితులే కల్పించబడతాయి.

ఇక్కడ జాగ్రత్తగా విశ్లేషణ చేసి గమనించాల్సిన విషయం ఒకటి ఉంది. పరిసరాల ప్రభావం వల్ల మంచి వ్యక్తి కూడా చెడు స్నేహాలతో చెడిపోతాడని సాధారణంగా అందరం అనుకుంటూ ఉంటాం. అయితే వేదాంతం దీనిని పూర్తిగా సమర్థించదు. నిజమేమిటంటే అలా చెడిపోవటానికి పుట్టినవాడే (అంటే పూర్వపు చెడువాసనలు వున్నవాడే) ఆయా చెడు పరిసరాలలో నిలుస్తాడు, చెడ్డవారితో స్నేహం చేసి చెడిపోతాడు. అదే ఉత్తముడైనవాడు

చెడు పరిసరాలలో జన్మించినప్పటికీ అతడా పరిసరాలను వదిలి పారిపోతాడు. లేదా ఆ పరిసరాలనే మార్చగలిగిన వాడౌతాడు. ఇంకా చెప్పాలంటే ఆయా ప్రత్యేక జీవులు తమంతట తామే స్వతంత్రంగా వర్తమాన పరిసరాలను, భూతకాలంలోనే కోరుకున్నారు. అందుకే ఈ పరిస్థితులు సృష్టించబడ్డాయి. విభీషణుడు రాక్షసకులంలో పుట్టినా శ్రీరాముని ఆశ్రయించాడు. ప్రహ్లాదుడు హరిద్వేషికి జన్మించినా ఆ పరిసరాలను మార్చుకున్నాడు. గొప్ప హరిభక్తుడుగా నిలిచాడు. అంటే ఇప్పటి జన్మ మనముందు జన్మలోని కర్మలకు, కోరికలకు అనుగుణంగానే ఉంటుంది అనే విషయం స్పష్టం.

కనుక పూర్వజన్మలో ఏమాత్రం సుకృతం గాని, సాధనగాని లేనివాడు అకస్మాత్తుగా ఈ జన్మలో సాధకుడిగా, జ్ఞానిగా కాలేడు. కొందరంటూ ఉంటారు, అబ్బే ఇక్కడ ఈ ప్రపంచ వ్యవహారాలలో మునిగి ఉన్నవాడికి ఈ వేదాంతం ఎలా ఎక్కుతుందండీ? యోగసాధన ఎలా కుదురుతుందండీ? ఎక్కడికో అరణ్యాలకో, ఆశ్రమాలకో వెళ్తే తప్ప ఎలా కుదురుతుంది? అని ప్రశ్నించే వారెందరో. కాని అరణ్యాలలోనో, ఆశ్రమాలలోనో ఉండేవారు ఈ ఆశ్రమం బాగా లేదని ఆ ఆశ్రమానికి, ఇక్కడి గురువు సరైనవాడు కాదని మరొక గురువు వద్దకు తిరుగుతూ జీవితాన్ని వృథా చేసుకుంటూ ఉంటారు. అదే సమయంలో ఎలాంటి ప్రాపంచిక వ్యవహారాలలో ఉన్నా, గృహస్థులుగా ఉన్నా శాస్త్రాలను తెలుసుకోవటంలోను, సాధనలు చేయటంలోను ఎంతో

దీక్షగా, పట్టుదలగా ఉన్నవారు లేరా? ఎలా ఉన్నారు? పూర్వజన్మ సుకృతం వల్లనే. కనుక పరిసరాల కన్నా పూర్వపు సంకల్పాలే బలమైనవి.

ఇక ఈ యోగుల ఇంట జన్మదుర్లభమైనది, చాలా అరుదైనది అంటున్నారు. గొప్ప యోగసాధన చేసినవారికి మాత్రమే లభించే జన్మ ఇది. ఆచార్య శంకరులు, రామకృష్ణ పరమహంస, భగవాన్ రమణమహర్షి, స్వామివివేకానంద, అరవింద యోగి, మొదలైన వారి జన్మలు ఇలాంటివే. డబ్బు, అధికారం, పదవులు, అందం ఉన్న జన్మలు గొప్ప కాదు, దేవజన్మలు గొప్పకాదు. యోగజన్మలే చాలా చాలా గొప్పవి, దుర్లభమైనవి. ఇట్టి దుర్లభమైన యోగజన్మ లభించటానికి కారణం పూర్వజన్మలో చేసిన తీవ్రయోగసాధనే. అట్టి సాధన ఈ జన్మలో చేస్తే రాబోయే జన్మయోగ జన్మయేనని గ్రహించాలి.

- ఇలా జన్మించిన యోగభ్రష్టులు ఈ జన్మలో ఏం చేస్తారు? ఎలా ఈ మార్గం వైపుకు పయనిస్తారు?

యోగసాధన చేస్తూ సిద్ధి పొందకుండానే మరణించిన వారిగతి ఏమిటని అడిగిన అర్జునునికి భగవానుడు "చాలాకాలం పుణ్యలోకాలలో భోగాలను అనుభవించి, శుచివంతులు శ్రీమంతులు అయిన వారింట జన్మిస్తారు. లేదా సరాసరి యోగుల ఇంట జన్మిస్తారు" అని తెలియజేశాడు. అలా జన్మించిన వారు ఈ జన్మలో ఏమి చేస్తారో, ఎలా ఈ మార్గంలోకి వస్తారో తెలియజేస్తున్నాడు.

శ్లో|| తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వ దేహికం|

యతతేచతతో భూ యః సంసిద్ధౌ కురునందన|| (43)

**తా||** కురునందనా! అక్కడ (ఆ యోగుల ఇంట) పూర్వదేహ సంబంధమైన బుద్ధితో సంపర్కం కలిగి అక్కడినుండే మరల యోగసిద్ధికై ప్రయత్నం చేస్తాడు.

**వ్యాఖ్య:-** పూర్వజన్మలలో యోగసాధన చేసి సిద్ధి పొందకుండానే మరణించినవారు ఈ జన్మలలో ఆగిపోయిన సాధనను పునః ప్రారంభిస్తారు. పూర్వజన్మలో ఎంతవరకు సాధన చేసి, ఏ స్థాయిని చేరుకున్నారో ఈ జన్మలో అక్కడి నుండి ప్రారంభిస్తారు. ఎలా జరుగుతున్నది ఈ విచిత్రం?

పూర్వ దేహానికి సంబంధించిన బుద్ధిని పొందటం వల్లనే. అప్పుడు బుద్ధిలో ఏ జ్ఞానం ఉన్నదో - ఏ వాసనలు ఉన్నాయో దానినే ఇప్పుడు పొందటం వల్ల అక్కడి నుండే అతడి సాధన ప్రారంభమవుతున్నది. ఇల్లు కట్టాలని ప్రారంభించినవారు గోడలు కట్టేటప్పటికి డబ్బు అయిపోయింది. 4 సంవత్సరాల తర్వాత డబ్బు వచ్చింది. ఇప్పుడు ఎక్కడనుండి ప్రారంభిస్తారు? గోడలపై కప్పు వేయటంతో ప్రారంభిస్తారు. అంతేగాని పునాదులు తవ్వించరు కదా! అలాగే ఇక్కడ కూడా మొదటినుండి యోగసాధన ప్రారంభించాడు. పూర్వజన్మలో ఏ స్థాయిలో ఆగిపోయాడో అక్కడనుండే ప్రారంభిస్తాడు. ఇక్కడ మారింది దేహం, పేరు మాత్రమే. బుద్ధి మాత్రం అదే. బుద్ధి అనేది ఒక్కొక్క దేహాన్ని తగిలించుకుంటూ, వదిలించుకుంటూ కొనసాగుతుంది. అంటే బుద్ధి మారిపోయి క్రొత్తది రావటం లేదు. కనుక సాధన కొనసాగుతుంది. వెనుక జన్మలో చేసిన సాధన వృధా అయిపోతుందనే బాధ ఎవరికీ అక్కరలేదు. ఆ జన్మలో చేసిన పాపం గాని పుణ్యంగాని, సాధన గాని, పొందినజ్ఞానం గాని ఏదీ ఊరికే పోదు. అన్నీ వచ్చేస్తాయి. సంపాదించిన డబ్బు, ఇళ్ళు, ఆస్తిపాస్తులు,

వస్తువులు అవి మాత్రం దేహంతోనే సరి. పూచిక పుల్ల కూడా వెంటరాదు. చిన్నసూది కూడా జీవుడితో పాటు రాదు. అందుకే వదిలిపెట్టి వెళ్ళిపోయే వాటికోసం గాక వెంట తీసుకు వెళ్ళే వాటికోసం - అంటే పుణ్యం, జ్ఞానం, సాధన - వీటి కోసమే జీవించి ఉన్నంతవరకు ఆరాటపడాలి. ఒక గర్భిణీ స్త్రీ హాస్పిటల్ లో ప్రసవించింది. తల్లి తన పాలు ఇవ్వలేని పరిస్థితిలో ఉంటే, అక్కడే ఆ హాస్పిటల్ లోని నర్సు అప్పుడే ప్రసవించి ఉండటాన ఈ బిడ్డకు పాలు ఇస్తుంది. పాలు త్రాగిన తర్వాత ఆ బిడ్డ చేయి ముడుచుకున్నాడు. ఎంత విడదీసినా వాడు ఆ గుప్పిట విప్పటం లేదు. బలవంతాన తెరవగా ఆ గుప్పెటలో నర్సు ఉంగరం ఉంది. అంటే పాలు త్రాగేటప్పుడు ఆ నర్సు ఉంగరాన్ని లాగి గుప్పెట పట్టాడు. వాడు పూర్వజన్మలో దొంగ, ఆ బుద్ధి ఇప్పుడుకూడా పాత వాసన ప్రకారం పనిచేసింది. కనుక వెనుక జన్మలో చేసిన సాధన ఈ జన్మలో కూడా కొనసాగుతుంది.

ఇలా జరిగినప్పుడు ఈ జన్మలో సాగే సాధన చాలా తేలికగా ఉంటుంది. ఎందుకంటే పుర్వానుభవం చక్కగా ఉపయోగపడుతుంది కనుక. ఈ కారణంగానే కొందరు ఎక్కడకూ పరుగులు తీయకుండానే ఏ గురువుతోనూ పనిలేకుండానే ఎంతో జ్ఞానాన్ని పొందుతారు. సాధనను సాగిస్తారు.

ఎన్నో భోగాలనుభవించిన గౌతమబుద్ధుడు, వర్ధమానుడు అకస్మాత్తుగా యోగంలోకి దిగి సిద్ధి పొందారు. అసలు భోగాలు అనుభవించకుండానే రామకృష్ణ పరమహంస, భగవాన్ రమణమహర్షిలాంటివారు సూటిగా

యోగంలోకి దిగిపోయారు. వీరంతా గతజన్మలో యోగసాధన చేసి సిద్ధి పొందకుండా మరణించినవారే. యోగభ్రష్టులే.

అయితే వీరు ఎంతకాలం ఈ సాధన సాగించాలి? "సంసిద్ధౌ" - సిద్ధి పొందేంతవరకు సాగించాలి. అలా సాగిస్తారు కూడా. ఎందుకంటే యోగసాధనకు అన్నీ అనుకూల పరిస్థితులు ఉంటాయి. బుద్ధిలో అలాంటి పట్టుదల ఉంటుంది. ఒకవేళ ఈ జన్మలో కూడా ప్రయత్నం మందకొడిగా సాగినా కనీసం మరుజన్మ తప్పకుండా సిద్ధిపొందే జన్మయే వస్తుంది. కనుక సిద్ధి పొందేంత వరకు ఈ సాధన సాగుతుంది. ఇందులో ఎట్టి సందేహమూ లేదు. అది కూడా కర్మ సిద్ధాంతం. పునర్జన్మ సిద్ధాంతమే.

దీనిని బట్టి ప్రతివ్యక్తీ తెలుసుకోవలసినది ఏమంటే మనస్సును భోగాల యందుంచక యోగమునందుంచాలి. బుద్ధికి సరియైన జ్ఞానాన్ని అందించాలి. అంటే ఉపనిషత్తుల జ్ఞానాన్ని అందించాలి. యోగసాధన మోక్షప్రాప్తికి దారి తీస్తుంది గనుక పట్టుదలతో సాధన సాగించాలి.

- పూర్వజన్మలోని యోగసాధన ఏవిధంగా ఫలితమిస్తుందో, ఎలా అందులోకి లాగబడతాడో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

**శ్లో||** పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్య వశోఽపిసః|
జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బ్రహ్మాతి వర్తతే|| **(44)**

**తా||** పూర్వజన్మలో చేసిన అభ్యాసం చేతనే అవుశుడై అతడు అందులోనికి (యోగంలోకి) లాగబడతాడు. యోగాన్ని ఆచరించాలనే జిజ్ఞాస కలిగినా చాలు శబ్ద బ్రహ్మాన్ని దాటిపోతాడు.

**వ్యాఖ్య:-** ప్రతివ్యక్తికీ తన గతజన్మతో సంబంధం ఉంటుంది. ఆ జన్మ యొక్క కొనసాగింపే ఈ జన్మ. అందరి సొమ్ము తినటమే తప్ప ఇతరులకెప్పుడూ పెట్టని పిసినారి అందరికీ ఋణపడి బరువులు మోసే గాడిదగానో, బళ్ళులాగే దున్నపోతుగానో పుట్టి ఋణం తీర్చుకోవాలి. తాను తింటూ ఇతరులకు పెట్టనివాడు దరిద్రుడుగా పుట్టాలి. ఇలా ఎందుకు జరిగింది? అని ఇప్పుడు బాధపడి ప్రయోజనం లేదు. వచ్చే జన్మలో అలా జరగకుండా ఇప్పుడు జాగ్రత్త పడాలి. ఇది మన నిత్య జీవితంలో అనుభవానికి వస్తున్న కర్మసిద్ధాంతమే. ఈ సిద్ధాంతాన్ని అర్థం చేసుకొని ఈ శ్లోకాన్ని చదివితేనే దాని భావం మనకు స్పష్టంగా తెలుస్తుంది, మనకు ఉపయోగపడుతుంది.

పూర్వజన్మలో యోగసాధన చేసినవాడు ఆ పూర్వాభ్యాసం వల్ల తనకు తెలియకుండానే - తన ప్రయత్నం లేకుండానే బలవంతంగా ఈ యోగసాధనలోనికి ఈడ్వబడతాడు. యోగసాధన చేయాలనే కోరిక అతడిలో లేకపోవచ్చు. దాని గురించి అసలు తెలియకపోవచ్చు. పైగా దానికి విరుద్ధమైన పనులు చేస్తూ ఉండవచ్చు. అయినా సరే ఏదో అదృశ్యశక్తి (పూర్వసాధన) ఎవరి ద్వారానో బలవంతంగా ఇందులోకి నెట్టివేస్తుంది.

రత్నాకరుడు దారిదోపిడీలు చేసి జీవించే ఒక బోయవాడు. అతడిలో దైవభక్తి లేదు. తపస్సు, యోగం అనే మాటలు తెలియవు. చిక్కిన వాళ్ళను దోచుకోవటం, తీసుకెళ్ళి తినటం మాత్రమే తెలుసు. కాని అకస్మాత్తుగా నారదమహర్షి దర్శనంతో రాత్రికి రాత్రే అతడి జీవితం మారిపోయింది. అతడే ఆదికవి వాల్మీకి అయ్యాడు. రామాయణ ఇతిహాసాన్ని రచించాడు.

అలాగే కనిపించిన వారి చేతివ్రేళ్ళను నరికి మెడలో దండగా వేసుకొనే అంగుళీమాలుడు బుద్ధుని దర్శనంతో బౌద్ధ సన్యాసి అయ్యాడు. దీనికంతా వారి వారి పూర్వజన్మలలో చేసిన కర్మలే కారణం. వారు అనుకోకుండానే, ఎట్టి ప్రయత్నం లేకుండానే ఇట్టి పవిత్ర జీవితం వైపుకు లాగబడ్డారు. ఇదే పూర్వజన్మలో చేసిన అభ్యాసంవల్ల అవశంగా లాగబడటం అంటే. పూర్వజన్మలో సాధన చేసినవాడు, మంచి సంస్కారం గలవాడు, ఉత్తమ జ్ఞానాన్ని సంపాదించిన వాడు ఈ జన్మలో ఎంతోకాలం, మూఢునిలాగా వ్యవహరించలేడు. కొంతకాలం మూఢ జీవితాన్ని గడిపి గొప్ప సంస్కారం, సదాచారం గల జీవిగా మారిపోయిన వారు ఎందరో ఉన్నారు. వేమన ఎన్నో వ్యసనాలకు బానిస. అతడిలో మంచి గుణాలేవీ లేవు. అందరిచేత ఛీత్కారాలు పొందాడు. అతడి మిత్రుడు అభిరాముడనే కంసాలి ఒక గురువును సేవిస్తూ ఉండేవాడు. అంత్యకాలం సమిపించినప్పుడు ఆ గురువు ఉపదేశం ఇస్తాను రమ్మన్నాడు అభిరాముని. అయితే తెల్లవారేసరికి నగ తయారుచేసి ఇవ్వాలని రాణి ఆజ్ఞ జారీచేసింది. అభిరామునికి బదులుగా కుతూహలం కొద్దీ వేమన ఆ గురువు వద్దకు వెళ్ళి ఉపదేశం పొందాడు. దానితో వేమన మహాజ్ఞాని అయ్యాడు.

యుద్ధం చేయటానికి యుద్ధరంగంలో ప్రవేశించిన క్షత్రియుడైన అర్జునునికి తత్త్వజిజ్ఞాస కలగటానికైనా, రాక్షసజాతిలో పుట్టిన ప్రహ్లాదుడు మహాభక్తుడు కావటానికైనా ఈ పూర్వజన్మ సంస్కారాలు, సాధనలే కారణం.

యోగసాధన చేయటం మాట అటుంచి యోగం చెయ్యాలని, యోగసిద్ధి పొందాలనీ, యోగాన్ని గూర్చి తెలుసుకోవాలనీ జిజ్ఞాస - తపన కలిగితే చాలు అతడు శబ్ద బ్రహ్మాన్ని దాటిపోతాడు అని ఇక్కడ భగవానుడు తెలియజేస్తున్నాడు.

శబ్ద బ్రహ్మం అంటే ఏమిటి? వేదాలలోని శబ్దాలే - కర్మకాండయే శబ్దబ్రహ్మం. అంటే వేదాలలోని కర్మకాండలో చెప్పబడిన పూజాపునస్కారాలు, యజ్ఞయాగాదులు, నోములు, వ్రతాలు, పారాయణలు, శాస్త్ర విహిత కర్మలు చేసిన వాడికి పుణ్యలోకాలు, స్వర్గాది లోకాలు ప్రాప్తిస్తాయి. అక్కడ అనేక సుఖభోగాలు అనుభవిస్తాడు. అయితే యోగాన్ని గురించిన జిజ్ఞాస కలిగితే చాలు అతడు శబ్ద బ్రహ్మాన్ని దాటిపోతాడు. అంటే వేదంలో చెప్పిన యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించిన వారిని కూడా మించిపోతాడు. అంటే పుణ్యలోకాలను, స్వర్గాదిలోకాలను దాటిపోతాడు అని ఇక్కడ భగవానుడు తెలియజేస్తున్నాడు.

మరి కేవలం యోగాన్ని గురించిన జిజ్ఞాస కలిగితేనే అంతటి ఫలితం లభిస్తుంటే ఇక కొంతవరకైనా యోగసాధన చేసిన వాడి విషయం ఎలా ఉంటుందో ఊహించండి. పుణ్యకర్మలు చేసినవాడికి స్వర్గభోగాలు ప్రాప్తించటం వరకే ఫలితం. కాని యోగసాధన చేసేవాడు మోక్షం పొందనంత వరకు పుణ్యకర్మలు చేసినవారు పొందే లోకాలను పొందుతూ సుఖభోగాలు అనుభవిస్తూ ఉంటాడు. మోక్షమార్గంలో ప్రయాణిస్తూ యోగసాధన సాగించి, ఆత్మజ్ఞానాన్ని పొంది చివరకు జీవిత సార్థక్యమైన

మోక్షాన్నిపొందుతాడు. కనుక ఇతడు వేదాలలో చెప్పిన పుణ్యకర్మలు చేసేవానికన్న ఎంతో అధికుడు. ఇదే శబ్ద బ్రహ్మాన్ని దాటటం అంటే.

- ఇలా అవశంగా - బలవంతంగా - పూర్వజన్మ అభ్యాసం వల్ల యోగమార్గంలోనికి లాగబడిన యోగి మోక్షసిద్ధిని ఎలా పొందుతాడు?

**శ్లో||** ప్రయత్నాద్యత మానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః|
అనేక జన్మ సంసిద్ధః తతోయాతి పరాంగతిం|| **(45)**

**తా||** పట్టుదలతో ప్రయత్నించే యోగి ప్రయత్నం వల్ల దోషాలన్నింటి నుండి విడివడి, శుద్ధుడై, అనేక జన్మలలో చేసిన సాధనల వల్ల కలిగే సిద్ధిని పొంది, అంతట పరమగతిని చేరుకుంటాడు.

**వ్యాఖ్య:-** యోగమార్గంలోకి లాగబడిన యోగి ఈ జన్మలో 1.పట్టుదలతో కూడిన ప్రయత్నం చెయ్యాలి. 2.దానివల్ల పాపాలన్నింటి నుండి విముక్తి చెందుతాడు. 3.దానితో అనేక జన్మలలో చేసిన సాధన వల్ల కలిగే సిద్ధిని పొంది చివరకు పరమగతిని చేరుకుంటాడు.

1.ప్రయత్నాద్య తమానస్తు:- పూర్వంలో చేసిన సాధన వల్ల తీవ్రప్రయత్నం చేస్తాడు. ఏ ప్రయత్నం చేయకుండానే సిద్ధి పొందటం జరగదు. పూర్వజన్మలలో చేశాను గదా! అంటే ఆ చేసినదానికే ఇప్పుడీ మార్గంలోకి ప్రవేశించావు. అంటే ప్రారబ్ధం నిన్నీ యోగమార్గంలో కూర్చోబెడుతుంది, అంతవరకే. ఇక ముందుకు వెళ్ళటం మాత్రం నీ ప్రయత్నం మీదనే ఆధారపడి ఉంటుంది. కనుక ఈ జన్మలో యోగసిద్ధి కొరకై తీవ్రప్రయత్నం సాగించాల్సిందే. దానివల్ల ఏం జరుగుతుంది?

2.సంశుద్ధ కిల్బిషః- కిల్బిషః అంటే పాపం. యోగసాధన చేస్తే పాపాల నుండి విడుదల పొంది శుద్ధమౌతావు. పాపాలు అంటే పాపపు పనులు కాదు, పాపవాసనలు. పాపపు పనులు చేసేవాడికి మోక్షసిద్ధి అసాధ్యం. పూర్వంలో మనం చేసిన సంకల్పాలు మనలో ముద్రలుగా మిగిలిపోతాయి. అవే వాసనలు. అవి ఉన్నంతవరకు మనస్సుకు ప్రశాంతత ఉండదు. అది పుణ్యవాసనలైనా, పాపవాసనలైనా - అవి మనలో ప్రేరణలు కలిగించటం వల్ల కర్మలు చేయాలనే తపన కలుగుతుంది. దానితో మోక్షమార్గంలో పయనించ లేము.

అలా ఈ వాసనలు (పాప, పుణ్య) మోక్షమార్గానికి ఆటంకం కలిగిస్తాయి గనుక వీటిని పాపాలు (కిల్బిషం) అన్నారు. ఈ వాసనలు లేదా పాపాలు ఉన్నంతవరకు మనస్సు స్థిమితంగా ఉండదు. ఆందోళనలు, ఉద్రేకాలు, అలజడులు, అశాంతితో ఉంటుంది మనస్సు. ఇట్టి మనస్సు ధ్యానానికి పనికిరాదు. కనుక యోగసిద్ధికి పాపాలు తొలగాల్సిందే. యోగసాధన పట్టుదలతో సాగిస్తే ఈ వాసనలు క్షయమైపోతాయి. ఇలా పాపాల నుండి విడుదల పొంది మనస్సు శుద్ధమైతే ఏమిటి ఫలితం?

3.అనేక జన్మ సంసిద్ధః- యోగంలో దృఢమైన బుద్ధి ఏదో ఒక జన్మలో అకస్మాత్తుగా కలిగేది కాదు. అది అనేక జన్మల నుండి ఆర్జించుకున్న సంపద. అసలు మానవజన్మ లభించాలన్నా, మోక్షంపొందాలనే కోరిక కలగాలన్నా, మహాత్ముల యొక్క సాంగత్యం లభించాలన్నా అనేక జన్మలలో మనం చేసుకున్న సాధనల ఫలమే. అందుకే -

**శ్లో|| దుర్లభం త్రయమే వైతత్ దైవానుగ్రహ హేతుకం|**

**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః||**

**(వివేక చూడామణి 3శ్లో)**

**- అని శ్రీ శంకర భగవత్పాదులవారు వివేక చూడామణి గ్రంథంలో తెలియజేశారు. కనుక ఎన్నో జన్మల కృషి ఉంటేనే సిద్ధి. ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ లక్ష్యాన్ని అందుకోవాలి. కొన్ని జన్మల ప్రయత్నం ఉంటేనే ఈ మార్గంలో ప్రవేశించటం జరుగుతుంది. తీవ్ర ప్రయత్నంతో సాధన చేస్తేనే అన్ని జన్మలలో చేసిన సాధన ఫలించి సిద్ధి చేకూరుతుంది. దీనివల్ల అందుకొనే స్థానం ఏమిటి?**

**4.పరాంగతిం యాతిః-** పరమమైన - శ్రేష్ఠమై స్థానాన్ని - ఉన్నతోన్నతమైన పదవిని పొందటం జరుగుతుంది. ఈ లోకంలోని పదవులుగాని, స్వర్గలోకంలోని పదవులుగాని, చివరకు దేవతలకు అధిపతి అయిన దేవేంద్ర పదవిగాని అన్నీ అశాశ్వతమైనవే, తిరిగి వెనకకు రావల్సినవే. మోక్షం ఒక్కటే పునరావృత్తి రహిత పదవి. శాశ్వత స్థానం. శ్రేష్ఠమైన స్థానం. ఈ పదవి కొరకే సర్వసంగపరిత్యాగులు, ఋషులు, మహాత్ములు, జ్ఞానులు తపించి పోతుంటారు. అట్టి స్థానాన్ని అందుకోవాలంటే పైన చెప్పిన విధంగా ప్రయత్నించవలసిందే.

-ఇప్పుడిక యోగసాధన యొక్క మహిమను, గొప్పతనాన్ని తెలియ జేస్తున్నారు.

**శ్లో|| తపస్వి భ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోధికః|**

**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున!|| (46)**

**తా||** తపస్సు చేసే వారికన్న యోగి అధికుడు. జ్ఞానుల కన్న కూడా ఎక్కువని నా అభిప్రాయం. కర్మచేసే వారికన్న యోగి అధికుడు. అందువల్ల ఓ అర్జునా! నీవు ఆత్మ సంయమయోగివికా!

**వ్యాఖ్య:-** ఆధ్యాత్మిక వికాసానికి చెప్పబడిన యోగాలన్నింటిలోను ధ్యాన యోగానికి గల విశిష్ఠత ఏమిటో చెప్పటానికి ఆయా యోగాల పట్టికను ఇక్కడ శ్రీకృష్ణుడు పేర్కొంటున్నాడు. వాటితో పోల్చి ఈ ధ్యానయోగ గొప్పతనాన్ని వివరిస్తున్నాడు.

1.<u>తపస్విభ్యోఽధికోయోగీ:-</u> ఇళ్ళు వాకిళ్ళు విడిచిపెట్టి ఈ లౌకిక ప్రపంచానికి దూరంగా - ఏ అరణ్యాలకో వెళ్లి, శరీరాన్ని శుష్కింపజేస్తూ చేసే తపస్సుల కన్నా ఈ ధ్యానయోగం ఎంతో అధికమైనది. ఏవేవో కోరికలతో అనేకమంది రాక్షసులు ఘోరతపస్సులు చేసి వరాలు పొందారు. అయినప్పటికీ ఆ తపస్సుల వల్ల వారికేమీ నిజమైన ప్రయోజనం కలగలేదు. పరగర్వంతో దుర్మార్గాలు మాత్రం చేసి, దుష్టులుగా మిగిలిపోయారు. అలా కాకుండా మనస్సును నిగ్రహించటానికే ఘోరతపస్సులు చేసే వారు కూడా హృదయం కరుడుగట్టుకుపోయి బండరాయిలాగా మారిపోతారు. కానీ ఈ ధ్యానయోగం వల్ల మనస్సు మెత్తబడుతుంది. ఇళ్ళూవాకిళ్ళూ వదలి ఎక్కడకూ పోనక్కరలేదు. వ్యతిరేక ఫలితాలు రావు. కనుకనే తపస్సు చేసే వారికన్న యోగి అధికుడు అని చెప్పటం జరిగింది.

2.జ్ఞానిభ్యోఽపి మతోధికః :- జ్ఞానికన్న ధ్యానయోగి శ్రేష్ఠుడు. ఇక్కడ జ్ఞానం అంటే శాస్త్రజ్ఞానం మాత్రమే. శాస్త్రాలను బాగా అధ్యయనం చేసి పరమాత్మ నందుకొనే విధానం ఏమిటో తెలుసుకోవటమే జ్ఞానం. అలా తెలుసుకున్న వాడే జ్ఞాని. వీరు పరమాత్మనెలా అందుకోవాలో, ధ్యానం ఎలా చేయాలో తెలుసుకున్నారేగాని ధ్యానాభ్యాసం చేయరు. మనస్సును అదుపులో పెట్టుకోలేరు.

ఇట్టివారు శాస్త్రాలను వల్లెవేయగలరు, గౌరవాలు, సన్మానాలు పొందగలరేగాని ధ్యానసిద్ధిని, మోక్షసిద్ధిని పొందలేరు. కనుకనే ఇలాంటి జ్ఞానుల కన్నయోగులే శ్రేష్ఠులు అని చెప్పటం.

3.కర్మిభ్య శ్చాధికో యోగీ:- వేదాలలో చెప్పబడ్డ యజ్ఞయాగాది కర్మల వల్ల, పుజాపునస్కారాల వల్ల దేవతలు తృప్తి చెందుతారు. దేవతలు కరుణించి కోరికలు తీరుస్తారు. ఇంతవరకే ఫలితం. ఇక పుణ్యకార్యాలు, లోకకళ్యాణ కారకమైన కర్మలు, దానధర్మాలు ఏమి చేసినా ఇక్కడ సుఖభోగాలు అనుభవించటమో, మరణాంతరం స్వర్గాది భోగాలు అనుభవించటమో, మరుజన్మల్లో అనేక సంపదలను, సుఖాలను, భోగాలను పొందటమో జరుగుతుంది. అయితే అవన్నీ తాత్కాలికం. పుణ్యకర్మఫలాలున్నంతవరకే. కాని ముక్తి లేదు, శాశ్వత ఆనందం రాదు. అయితే ధ్యానయోగాన్ని అభ్యసిస్తే, యోగానికి అనువైన జన్మ లభించి, ఆ జన్మలో యోగాభ్యాసాన్ని కొనసాగించి, సిద్ధి పొందవచ్చు. ఆ తరువాత శాశ్వత ఆనంద ప్రదమైన ముక్తికి దారితీస్తుంది. కనుక ధ్యానయోగం కర్మలన్నింటి కన్న శ్రేష్ఠమైనది.

ఇలా తపస్సుల కన్న, శాస్త్రజ్ఞానం కన్న, శాస్త్రవిహిత కర్మలకన్న యోగమే శ్రేష్ఠమైనది కనుక ప్రతివ్యక్తి చేతనైనంతగా యోగసాధన చేయాలి. యోగసాధన పట్టుదలగా సాగిస్తే మోక్షప్రాప్తికి దారితీస్తుంది. ఒకవేళ సరిగ్గా సాధన సాగించలేకపోయినా, మధ్యలో వదిలేసినా చేసిన యోగం వృధా పోదు. మరుజన్మలో తిరిగి కొనసాగించటం జరుగుతుంటుంది. ఆ జన్మలోనో, ఆ తరువాత జన్మలోనో యోగసిద్ధి జరిగి, ఆత్మజ్ఞానాన్ని పొందటం ద్వారా మోక్షసిద్ధి ప్రాప్తిస్తుంది. మానవజన్మ సార్థకమవుతుంది. కనుక యోగసాధన అన్నింటికన్న శ్రేష్ఠమైనది, చేయవలసినది అని గ్రహించాలి.

తస్మాత్ యోగీభవ:- కారణాలన్నీతెలిపి అందువల్ల నీవు ధ్యానయోగివికా! అర్జునా! అని భగవానుడు ముగిస్తున్నాడు.

యోగం జబ్బు నయం చేసే దివ్యౌషధం. భోగం నమిలి పారవేసిన పిప్పి వంటిది. భవరోగాన్ని నివారించే మందు యోగం. ఇది అర్జునునికే కాదు, అందరికీ. కనుక ధ్యానయోగులై ఈ జన్మకు సార్థకత కలిగించుకోవాలి.

- అందరిలోకి ధ్యానయోగి శ్రేష్ఠుడు. ఆ శ్రేష్ఠులైన ధ్యానయోగులలో భగవానుని దృష్టిలో ఉత్తముడెవరు? -

**శ్లో||** యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా|
శ్రద్ధావాన్ భజతే యో మాం సమేయుక్త తమోమతః|| **(47)**

**తా||** యోగులందరిలో కూడా ఎవరైతే తన మనస్సును నాయందే నిలిపి శ్రద్ధతో నన్ను భజిస్తాడో అతడే యోగులలో ఉత్తముడని నా అభిప్రాయం.

**వ్యాఖ్య:-** సాధకుడు తన భావప్రవాహాన్ని(ఆలోచనా ప్రవాహాన్ని) నిర్ణీతమైన, నిశ్చయించబడిన ఒకే మార్గంలో ప్రవహింపజేయటానికి బుద్ధిపూర్వకంగా చేసే ప్రయత్నమే ధ్యానం. ఈ ధ్యాన ప్రక్రియలో మనస్సు విపరీత భావాల వైపు, ఆకర్షణల వైపు పరుగులు తీయకుండా చూడటాన్నే మనోనిగ్రహం అంటారు. ఇలా మనస్సును నిగ్రహిస్తే తప్ప అది ఏకాగ్రమై లక్ష్యం మీద తదేకంగా నిలవదు. అలా మనస్సు నిలవాలంటే ఏదో ఒక విషయాన్ని ఎన్నుకొని, దానిని మనస్సుకు ఆలంబనగా చేసుకోవాలి. అలా ఏదో ఒక ధ్యేయాన్ని పెట్టుకొని అభ్యాసం సాగిస్తేనే మనస్సు యొక్క పరుగులు ఆగిపోతాయి. అయితే ఇలా మనం ఎంచుకొనే ధ్యేయవస్తువును బట్టి ధ్యాయోగులను వివిధరకాలుగా విభజించవచ్చు.

సాధన ప్రారంభదశలో మనస్సును నిలపటానికి ఆలంబనగా ఉంచే ధ్యేయవస్తువులు సాధారణంగా ఒక చిహ్నం, ఓంకారం, స్వస్తిక్, ఒక దేవతా రూపం, జ్యోతి, గురువురూపం, హృదయస్థానం లేదా సహస్రారం. ఐతే ఈ ధ్యానయోగులు అంత గొప్పవారు కాదు. మరెవరు గొప్పవారు?

"ఎవడు తన అంతఃకరణమును నాయందే నిలిపి, శ్రద్ధతో నన్నే భజిస్తున్నాడో అట్టి యోగియే సర్వశ్రేష్ఠుడని నాఅభిప్రాయం" అని భగవానుడు తెలియజేశాడు. నాయందే మనస్సు నిల్పి అంటే నెమలిపింఛం ధరించి, యుద్ధరంగంలో రథంపై సారథి స్థానంలో ఉండి, అర్జునునికి గీతాజ్ఞానాన్ని బోధిస్తున్న శ్రీకృష్ణునియందా? కాదు. ప్రారంభ దశలో మనస్సు యొక్క ఏకాగ్రత కొరకు దేని మీదనైనా నిలపవచ్చు. కాని అభ్యాసం కుదిరిన తర్వాత -

ఏకాగ్రంగా మనస్సు నిలిచిన తర్వాత మాత్రం నిరాకారం, నిర్గుణం, నిరంజనం, నిర్వికారం, నిరీహం, నిశ్చలం, నిత్యం, శాశ్వతం, అజం, అవ్యయం, అచింత్యం, అనిర్దేశ్యం, సూక్ష్మాతి సూక్ష్మం, సర్వవ్యాపకం, స్వయం ప్రకాశం, విజ్ఞానఘనం, అద్వితీయం, ఆద్యంత రహితం, పరమసుఖం అయిన ఆత్మపై మనస్సును నిలుపుటయే శ్రేష్ఠం. అట్టి ఆత్మయందు అంతఃకరణాన్ని లయింపజేసి, ఎవరైతే శ్రద్ధాభక్తులతో ఆత్మను భజిస్తున్నారో, ధ్యానిస్తున్నారో అతడే శ్రేష్ఠుడైన యోగి.

అయితే  ఇలా ఆత్మను భజించాలంటే ఆత్మ అంటే ఏమిటో తెలియాలి గదా! ఎలా తెలుస్తుంది? బుద్ధి ద్వారా పరమాత్మతత్త్వాన్ని శ్రవణం చేసి, మననం చేసి గ్రహించాలి. అప్పుడే ఆత్మపై శ్రద్ధ, భక్తి కుదిరేది. అలా భక్తి కుదిరితేనే ధ్యానం కుదిరేది. అంటే భక్తి అనే అమృతంలో తడిస్తేనే ధ్యానం అనే ఫలం లభిస్తుంది. నీటితో తడిపితేనే విత్తనం మొలకెత్తుతుంది.

శ్రద్ధతో ఆత్మను భజించుటకు ఆత్మను గురించి తెలుసుకోవాలి. అలా ఆత్మను గురించి వివరంగా తెలియజెప్పేదే భగవద్గీతలోని భక్తిషట్కం. (7 నుండి 12వ అధ్యాయం వరకు) ఈ విధంగా ముందు రాబోయే భక్తిషట్కానికి, ఈ కర్మషట్కం చివరలో బీజం వేస్తున్నాడు భగవానుడు ఈ శ్లోకం ద్వారా. ఈ శ్లోకంతో కర్మషట్కం ముగుస్తున్నది. భక్తిషట్కం ప్రారంభం కాబోతున్నది.

<u>శ్రద్ధావాన్ మాం భజతే:-</u> శ్రద్ధ గురించి గీతలో తరచుగా చెప్పటం జరిగింది. భగవంతుని పై శ్రద్ధ (విశ్వాసం) ఉంటేనే భగవంతుని మాటలు నమ్ముతాం. అందుకే డాక్టరు మీద, ఔషధం మీద కూడా విశ్వాసం ఉంటేనే మందు పనిచేస్తుంది అనటం. శ్రద్ధ కలిగి, భక్తితో భగవంతుని భజిస్తే భగవంతునికి

ఇష్టులమౌతాం. భజించుట అంటే భజన చేయటం కాదు. మనస్సును పూర్తిగా ఆత్మలో నిలిపి, ఆత్మకు వశం చేసి, ఆత్మతో ఐక్యత కలిగించుటయే భజన. ఇలా ఎవరు నాలో మనస్సు నిల్పి నన్నే లక్ష్యంగా పెట్టుకొని ధ్యానిస్తారో వారే ఉత్తములు - శ్రేష్ఠులు అయిన యోగులు అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.

ఇతిమే మతః:- ఇది నా అభిప్రాయం అని భగవానుడు ఎంతో నిగర్వంతో, వినయంతో "మీరు కూడా ఆలోచించండి" అనే భావాన్ని ఇమిడ్చి చెబుతున్నాడు. కనుక మనం ఆలోచించాలి.

భగవంతుని గురించి తెలుసుకొని, ఆయననే శ్రద్ధాభక్తులతో భజిస్తే ఉత్తములమౌతాం. కనుక భగవంతుని గురించి తెలుసుకోవాలి.

తెలుసుకుందామా? - 7వ అధ్యాయం నుండి 12వ అధ్యాయం వరకు పూర్తిగా భగవంతుని గురించిన విషయాలే - భక్తి సంబంధ విషయాలే - అవేమిటో తెలుసుకుందాం.

**గద్యం:-** ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మ సంయమ యోగోనామ షష్ఠోఽధ్యాయః||

- ఇలా ఉపనిషత్తుల సారం, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం ఐన భగవద్గీతయందు శ్రీకృష్ణఅర్జున సంవాద రూపమైన ఆత్మసంయమయోగమనే పేరుగల ఆరవ అధ్యాయం సమాప్తం.

# శ్రీమద్భగవద్గీత :7 వ అధ్యాయం

# విజ్ఞానయోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# పూజ్య గురుదేవులు

జ్ఞానప్రపూర్ణ

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)**

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com

Visit www.srichalapathirao.com to listen Pravachanas

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడుగ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మసంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంధాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002, 2008, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యులవారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము"నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యులవారి 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం', 'ఆత్మబోధ' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3, 4, 5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015లో భగవద్గీత 6 నుండి 17 అధ్యాయములు ప్రచురింపచేశారు. ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు , భగవద్గీత 18 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే ***ధ్యానమాలిక*** మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా *ఆధ్యాత్మిక జ్ఞానపీఠం* కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను,

భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంథాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంథాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్థులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్థంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

భగవంతుని "అణోరణీయాన్ మహతో మహీయాన్" - అణువుకన్న చిన్నవాడు, మహత్తు కన్న పెద్దవాడు - అని కైవల్యోపనిషత్ వర్ణించింది. తులసీదళంతో తూగేంత చిన్నవాడు భగవంతుడు; అలాగే పదునాలుగు లోకాలతో కూడిన సమస్త బ్రహ్మాండాన్ని తన బొజ్జలో చూపించగలిగినంత పెద్దవాడు భగవంతుడు. భగవంతుడే కాదు, భగవంతుని గీత (భగవద్గీత) కూడా ఈ వర్ణనకు సరిపోయేదే. 700 శ్లోకాలు గల చిన్నగ్రంథం భగవద్గీత. సమస్త ఉపనిషత్తుల సారాన్ని తన బొజ్జలో నింపుకున్న పెద్దగ్రంథం భగవద్గీత. అంటే సైజులో చిన్నది, విషయంలో మహాపెద్దది. అలాగే ఈ 7వ అధ్యాయం కూడా ఆకారంలో 30 శ్లోకాలతో చిన్నది. అయితే విషయ సంపదలో మాత్రం చాలా పెద్దది - మహతో మహీయాన్.

ధనం పోతే మళ్ళీ వస్తుంది. ఆరోగ్యం పోతే తిరిగి వస్తుంది. పదవిపోతే ఎలాగో తిరిగి వస్తుంది. ఉద్యోగంపోతే మళ్ళీ వస్తుంది. కీర్తి ప్రతిష్టలు పోతే తిరిగి కష్టపడి సంపాదించుకోవచ్చు. కానీ, పోతే తిరిగి రానిది ఒక్కటే. అదే కాలం. పోయిన క్షణం ఎంత కష్టపడ్డా, ఏం చేసినా తిరిగి రాదు గాక రాదు. కనుక అన్నింటి కన్న విలువైన ధనం కాలమే. విలువ కట్టలేని అమూల్యధనం కాలం. అయితే మనకు ఇష్టమున్నా లేకున్నా కాలం ఖర్చయిపోతూనే ఉంటుంది. అయితే ఆ కాలం భగవంతుని కొరకు ఖర్చు కావటం మన పూర్వజన్మ పుణ్యవిశేషం. మన అందరి కాలం ఇలా భగవంతుని నిమిత్తం ఖర్చుకావాలని ఆశిస్తూ విషయంలోకి వెళదాం.

భగవద్గీతలో ఈ అధ్యాయం నుండి భక్తిమార్గం మొదలవుతుంది. భగవద్గీతలోని 18 అధ్యాయాలను 3 భాగాలుగా విభజిస్తే 6 అధ్యాయాల చొ||న 3 భాగాలు అవుతాయి. ఆరు అధ్యాయాలను షట్కం అంటారు. అంటే భగవద్గీత మొత్తం 3 షట్కాలన్నమాట. మొదటి ఆరు అధ్యాయాలను కర్మ షట్కమని, రెండవ దానిని భక్తిషట్కమని, మూడవ దానిని జ్ఞానషట్కమని అంటారు.

వేదాలలో నాలుగు మహావాక్యాలున్నాయి. అందులో 'తత్త్వమసి' అనేది ఉపదేశ వాక్యం. 'తత్త్వమసి' లో తత్ - త్వం - అసి అని మూడు పదాలున్నాయి. ఈ 3 పదాల యొక్క వివరణయే భగవద్గీతలోని 3 షట్కాలు అంటారు.

❖ మొదటి కర్మషట్కం 'త్వం' పదార్థాన్ని,

❖ రెండవ భక్తిషట్కం 'తత్' పదార్థాన్ని,

❖ మూడవ జ్ఞానషట్కం 'అసి' పదార్థాన్ని నిర్దేశన చేస్తున్నాయి అంటారు.

'త్వం' అంటే నీవు అని అర్థం. ఇది వాచ్యార్థం. అంటే పైపై అర్థం. మరి లక్ష్యార్థం? - అంటే ఉద్దేశించిన అసలైన అర్థం ఏమిటి?

నీవు అనే పదంలో ఏరివేయాల్సిన భావాలు - కల్మషాలు ఎన్నో ఉన్నాయి. వాటన్నింటిని ఏరివేసిన తర్వాత మిగిలిన శుద్ధమైన నీవు ఏది మిగిలి ఉన్నదో - అదే అసలైన నీవు - 'త్వం'.

అంగట్లో వాము, జీలకర్రలాంటివి తెచ్చుకొని వాటిని అలాగే వాడుకో రాదు. అందులో మట్టిగడ్డలు, పొట్టు, పొలకట్టు, పుల్లలు ఉంటాయి. వాటిని ఏరివేసి, లేదా చేటలో పోసి చెరిగి పారవేసి శుద్ధమైన దానినే వాడుకోవాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అలాగే 'త్వం' - 'నీవు' లో కూడా అనేక వ్యర్థపదార్థాలున్నాయి. వాటన్నింటిని ఏరి పారవేయాలి. ఏమిటవి? ఈ దేహం నీవు కాదు, ఇంద్రియాలు నీవు కాదు, మనస్సు నీవు కాదు, బుద్ధి నీవు కాదు, ప్రాణాలు నీవు కాదు, చిత్తం నీవు కాదు, అహంకారం నీవు కాదు, దృశ్యం ఏదీ నీవు కాదు. ఇవన్నీ నీవు అతికించుకున్న మలినాలు లేదా నీకు అతికించబడ్డ మలినాలు. వీటన్నింటికి వేరుగా నీవున్నావు. ఇలా విచారణ చేసి, నీవు కాని వాటిని త్రోసివేయటమే 'త్వం' పదార్థ శోధన అంటారు.

ఈ విచారణ - పరిశోధన ప్రథమషట్కంలో జరిగింది. 3వ అధ్యాయం చివరిలో భగవానుడు -

శ్లో|| ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః|
మనసస్తు పరాబుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః||

ఇంద్రియాలు శ్రేష్టమైనవి. ఇంద్రియాల కన్న మనస్సు శ్రేష్టం. మనసు కన్న బుద్ధి శ్రేష్టం. బుద్ధి కన్న వేరైన ఆత్మయే అన్నిటికన్న శ్రేష్టం. అదే నీవు - అని చెప్పటం జరిగింది.

'నేను దేహాన్ని; నాకొక ఆత్మ ఉన్నది' ఇది పాశ్చాత్యుల అభిప్రాయం.

'నేను ఆత్మను; నాకొక దేహం ఉన్నది' ఇది భారతీయుల అభిప్రాయం. వారికి దేహం ముఖ్యం. దేహం అనేది మనం ధరించే వస్త్రం లాంటిది. వస్త్రాలను ఎన్ని మార్చినా మనం మారనట్లుగా దేహాలను ఎన్ని మార్చినా ఆత్మ మారదు. ఆ ఆత్మయే నీవు. దాని యొక్క తత్త్వం రెండవ అధ్యాయంలో వివరించారు.

"నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః - - -" అంటే శస్త్రాలచే ఛేదించబడదు, అగ్నిచే దహించబడదు అని. అంటే - - -

త్యజించవలసింది దేహాన్ని, స్వీకరించవలసింది ఆత్మను. ఇలా దేహాభిమనాన్ని త్యజించి 'త్వం' - 'నీవు'ను కనుగొనటమే నిజమైన జ్ఞానం.

అట్టి జ్ఞానాన్ని పొందాలంటే రెండు సాధనలు చేయాలి. అవి 1.బహిరంగ సాధన 2.అంతరంగ సాధన.

బహిరంగసాధనను 3,4,5 అధ్యాయాలలో వివరించారు. అంతరంగ సాధనను 6వ అధ్యాయంలో వివరించారు. అంటే నిష్కామకర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది, ఆత్మసంయమ (ధ్యాన) యోగం ద్వారా అనాత్మ పదార్థాలను - అంటే దేహేంద్రియ మనోబుద్ధుల తాదాత్మ్యాన్ని విడిచిపెట్టటమే 'త్వం'లోని కల్మషాలను, పనికిరాని వాటిని తొలగించటం. అలా నిన్ను నీవు శుద్ధి చేసుకొనే మార్గం కర్మషట్కంలో చెప్పబడింది.

ఇక ఇప్పుడు 'తత్' అంటే 'అది' - అంటే 'ఆ పరమాత్మ' గూర్చి శోధన సాగాలి. ఏమిటి దీని అవసరం?

ఆరవఅధ్యాయంలో ధ్యానం గురించి ప్రత్యేకంగా చెప్పబడింది. నిజంగా మనమందరం - మనమే కాదు, మానవుడై పుట్టిన ప్రతివాడూ నిరంతరం ఏదో ఒక ధ్యానం చేస్తూనే ఉన్నాడు. ఒకడు ధనాన్ని గురించి ధ్యానం చేస్తుంటే, మరొకడు సంపదల గురించి ధ్యానిస్తున్నాడు. ఒకడు పదవుల గురించి ధ్యానం చేస్తుంటే, మరొకడు కీర్తిప్రతిష్ఠల గురించి ధ్యానిస్తున్నాడు. ఒకడు భార్యాబిడ్డలు, బంధుమిత్రుల గురించి ధ్యానం చేస్తుంటే మరొకడు ఇంట్లో

పెంచుకొనే బొచ్చుకుక్కపిల్ల గురించి ధ్యానిస్తున్నాడు. ఒకడు ఇల్లు వాకిలి గురించి ధ్యానం చేస్తుంటే, మరొకడు కట్టుకొనే బట్ట గురించి, సొమ్ముల గురించి ధ్యానిస్తున్నాడు. ఇలా అందరూ ఏదో ఒక ధ్యానం చేస్తూనే ఉన్నారు. అయితే ఇవన్నీ అనాత్మ వస్తువుల, అనిత్య వస్తువుల గురించి చేస్తున్నవే. ఇది కాదు నిజమైన ధ్యానం అంటే. మరి నిజమైన ధ్యానం ఏమిటి? -

ఈ అనిత్య విషయాల గురించి ధ్యానించటం కట్టిపెట్టి, ఆత్మను గురించి - పరమాత్మను గురించి ధ్యానం చేయాలంటున్నది భగవద్గీత. ధ్యానం వల్ల మనస్సులోని కల్మషాలన్నీ తొలగిపోవాలి. మనస్సు నిర్మలమై - ఆ నిర్మల మనస్సు నిలిచిపోవాలి. అదే ధ్యానం అంటే.

ఈ ధ్యానయోగాన్ని చక్కగా సాధించాలంటే ముఖ్యంగా 3 సాధనలున్నాయి. అవి – 1.ఏకాగ్రత, 2.నియమబద్ధ జీవితం, 3.సమదృష్టి.

1.ఏకాగ్రత:- మనస్సు ఏకాగ్రమైతే బ్రహ్మాండాన్ని బ్రద్దలు చేయవచ్చు. సామాన్యంగా శూన్యాగ్రత, అనేకాగ్రతయే కాని ఏకాగ్రత చాలా కష్టం.

శూన్యాగ్రత అంటే ఎప్పుడూ నిద్రపోతూ ఉండడం. (గాఢనిద్ర).

అనేకాగ్రత అంటే తలా - తోకా లేకుండా అనేక ఆలోచనలు చేయటం. ఇందువల్లనే ఏ పనీ సక్రమంగా చేయలేక ఎప్పుడూ ఆముదం త్రాగిన ముఖం పెట్టుకొని, ప్రతివాడూ నిరుత్సాహంతో, నీరసంతో క్రుంగిపోతున్నాడు. ఏకాగ్రత ఉంటే దేవతలను కూడా జయించవచ్చు.

రావణ, కుంభకర్ణాది రాక్షసులు కూడా ఏకాగ్రతతో తపస్సు చేసి దేవతలను గెలుచుకోగలిగారు. మేఘనాథుడు ఇంద్రుని గెలిచి, ఇంద్రజిత్తయ్యాడు.

2.నియమబద్ధ జీవితం:- ఆహారం, విహారం, నిద్ర, మెలకువ మొ॥న అన్ని విషయాలలోను సమతూకం పాటించాలి. అన్నింటిని మితంగా వాడుకోవాలి. వస్తువు మంచిదైనా మితి తప్పకూడదు. ఔషధం మంచిదే అయినా మోతాదు మించకూడదు. అలా మించితే మంచి జరగకపోగా చెడు జరగటం తథ్యం.

3.సమదృష్టి:- ఇదే ఆత్మదృష్టి లేదా బ్రహ్మదృష్టి, దేహదృష్టి, మనోదృష్టి వల్ల రాగద్వేషాలు, కోపతాపాలు కలుగుతాయి. వాటివల్ల మనస్సులో అలజడులు, అశాంతి కలిగి ధ్యానం కుదరదు. అందరిని ఆత్మస్వరూపులుగా - నీ స్వరూపులుగా - పరమాత్మ వ్యక్తస్వరూపులుగా చూడగలిగితే ధ్యానం చక్కగా కుదురుతుంది. ఇదంతా అభ్యాసం వల్ల - అంటే మళ్ళీ మళ్ళీ ఆచరణ చేయటం వల్ల, అలాగే వైరాగ్యం వల్ల - అంటే ప్రాపంచిక విషయాల పట్ల వైముఖ్యం వల్ల సులువవుతుంది. అప్పుడే మనస్సు నిగ్రహించబడుతుంది.

ఇలా ఎవరైతే సాధన ద్వారా మనస్సును అరికట్టి, ఆ మనస్సును అంతర్ముఖం చేసి, ఆత్మసాక్షాత్కారం కోసం పాటు పడతారో అతడే 'యోగి' అని భగవంతుడు స్పష్టం చేస్తున్నాడు. అంతేకాదు -

శాస్త్ర పరిశోధన చేసే జ్ఞాని కంటె -

స్వార్థం లేకుండా సంఘసేవ చేసే కర్మనిష్ఠుని కంటె -

ఇంద్రియాలను, శరీరాన్ని తపింపజేసే తపస్వి కంటె -

ఆత్మసాక్షాత్కారం కోసం ధ్యానాభ్యాసం చేసే యోగి అధికుడు. కనుక 'అర్జునా! నీవు యోగివి కమ్ము' అని ఆశీర్వదించాడు భగవానుడు.

అట్టి ధ్యానయోగులలో కూడా తన దృష్టిలో ఉత్తముడెవరో చెబుతున్నాడు భగవానుడు 6వ అధ్యాయం చివరలో - ఏమని?

"ఎవరు భగవంతుని యందే మనస్సు నుంచి, భగవంతునే భజిస్తూ ఉంటాడో అట్టి యోగియే పరమశ్రేష్ఠుడు" అని.

మరి అలా భగవంతుని యందే మనస్సు నుంచి భజించాలి అంటే ఆ భగవంతుడెవరో తెలియాలి గదా! ధ్యానయోగి భజించాల్సింది అర్జుని రథాన్ని తోలే నల్లని శరీరధారి శ్రీకృష్ణుణ్ణా? లేక వేరే ఎవరైనా ఉన్నారా? భగవంతుని యదార్థ స్వరూపాన్ని నిర్దేశించి చెప్పటానికి, వర్ణించటానికి వీలుందా? లేదు. అందుకే భగవంతుని అనిర్దేశ్యుడు, అచింత్యుడు (చింతించ వీలులేని వాడు) అన్నారు.

అలా నిర్దేశించి చెప్పటానికి, వర్ణించిచెప్పటానికి, భాషకు అందని భగవంతుని ఎలాగో భాషలోనే చెప్పాలి. వాక్కు ద్వారానే చెప్పాలి. దానికే వేదాంతంలో 'చంద్రశాఖాన్యాయం' అని ఒక పద్ధతి ఉంది.

విదియ నాటి చంద్రుడు సన్నని గీతలా కంటికి కనిపించకుండా ఉంటాడు. ఆ చంద్రవంకను చూపించాలంటే దగ్గరలో ఉన్న ఒక చెట్టు వద్దకు తీసుకొని వెళ్ళి, చెట్టు కొమ్మను చూడమని, అక్కడి నుండి దృష్టిని ఆకాశంలోనికి మళ్ళించినప్పుడు కొన్ని. లక్షల మైళ్ళ దూరంలో ఉన్న చంద్రవంకను ఆ చెట్టుకొమ్మ ఆధారంగా చూడవచ్చు.

అలాగే లౌకికమైన విషయాల ద్వారా అలౌకికమైన - వర్ణించవీలులేని - కంటితో చూడసాధ్యంకాని - మనస్సుతో చింతించవీలులేని, పరమాత్మవైపుకు దృష్టి మరల్చటం జరుగుతుంది. అలా దృష్టి ఆ పరమాత్మ వైపుకు మళ్ళినప్పుడు నిర్మలమైన మనస్సు ధ్యాన సమాధిలోనించి అందులో లీనమై పోతుంది.

ఇలా నిత్యమైన, అపరిమితమైన పరమాత్మను అనిత్యమైన, పరిమితమైన మనోబుద్ధుల ద్వారా ఎలా ఆకళింపు చేసుకోవాలో అర్జునునికి చెప్పటానికే ఈ ప్రత్యేక అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు భగవానుడు.

అంతేకాదు అర్జునునికి కలిగే సందేహాలన్నింటిని కూడా నిశ్శేషంగా తీరుస్తాననే హామీతో ఈ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు. భగవంతుని సమగ్రంగా తెలుసుకోవాలంటే నీలో ఉండవలసిన అర్హత లేమిటో కూడా తెలియజేస్తూ ఈ అధ్యాయం ప్రారంభమౌతున్నది. సృష్టికర్తగా భగవంతుని స్వరూపం ఏమిటో కూడా ఈ అధ్యాయంలో వివరించబోతున్నాడు.

ప్రక్రియలో ఇంత విపులత, ప్రవచనంలో ఇంత సమగ్రత కలిగిన గ్రంథం ప్రపంచంలో భగవద్గీత తప్ప మరొక గ్రంథం లేదు. అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

- ఇక అధ్యాయం లోతుల్లోకి వెళదాం.

- భగవంతుని సమగ్రంగా తెలుసుకొనుటకు అర్హత లేమిటో తెలియజేస్తున్నారు.

**శ్లో|| మయ్యాసక్త మనాః పార్థ! యోగం యుంజన్మదాశ్రయః|**

**అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు|| (1)**

**తా||** అర్జునా! నాయందు మనస్సును లగ్నం చేసి, యోగాన్ని అభ్యసిస్తూ, నన్ను ఆశ్రయించి, సంశయాలు లేకుండా, సంపూర్ణంగా నన్ను ఏ ప్రకారంగా తెలుసుకోగలవో అది విను.

**వ్యాఖ్య:-** క్రిందటి అధ్యాయం చివరలో ధ్యానయోగులలో శ్రేష్ఠుడెవరో భగవానుడు తెలియజేశాడు. ఎవరైతే నాయందే మనస్సునుంచి, నన్నే భజిస్తారో, అట్టివాడే ఉత్తమ ధ్యానయోగి - అని.

మరి భగవంతుని యందే మనసునుంచి, ఆయనపై ప్రేమతో - భక్తితో ఆయనను భజించాలంటే ఆయన ఎవరో తెలియాలి.

పరిమితమైన మనోబుద్ధులతో అపరిమిత తత్త్వమైన ఆ భగవంతుణ్ణి తెలుసుకోవటం సాధ్యమా - - -? అని అర్జునుని సందేహం. సాధకులైన వారందరి సందేహం కూడా ఇదే. అందుకే భగవానుడు ఈ సందేహనివృత్తి కోసం తనను - తన తత్త్వాన్ని ఈ అధ్యాయంలో వివరించబోతున్నాడు.

భగవంతుడంటే యదార్థంగా ఎవరో నిజంగా తెలిసినవారు మనుష్యులలో చాలా అరుదుగా ఉంటారు. పరిపూర్ణంగా తెలిసిన వారు ఇంకా అరుదు. ధ్యానానికి కూర్చోబోయే ముందు ప్రతి సాధకుడు 'నేను భగవంతుని తెలుసుకోగలనా?' అని సందేహిస్తూనే ఉంటాడు. శాస్త్రజ్ఞానం అంతో ఇంతో కలిగినవారే ధ్యాన సాధనకు పూనుకుంటారు. అట్టివారికి ఈ సందేహం సహజం. ఎందుకని?

మనస్సేమో పరిమితం. పరమాత్మ అపరిమితం. ఈ మనసు తన పరిమితులను అధిగమిస్తేతప్ప మనసు ఆత్మధ్యానంలో అనంతత్వాన్ని పొందలేదు. మనసు పరిమితులను అధిగమించాలంటే అది సంస్కరించబడాలి. బుద్ధికి అధీనం కావాలి. అలా సంస్కరించబడిన మనసే తనయందు ఒక దైవాంశ ఉన్నదని గ్రహించగలుగుతుంది. అటువంటి దైవాంశపై ఏకాగ్రత పొంది, అభ్యాసం కొనసాగితేనే ఆ మనసుకు వికాసం కలుగుతుంది. ఆ వికాసం వల్లనే అది ఆంతరంగికంగా అభివృద్ధి చెంది పరిమితులను అధిగమిస్తుంది. అప్పుడే ఆ అపరిమిత తత్త్వాన్ని తెలుసుకుంటుంది.

ఇలా భగవంతుని అపరిమిత తత్త్వాన్ని పూర్తిగా తెలుసుకోవాలంటే ఏ సాధకునికైనా కొన్ని అర్హతలుండాలి. అర్హతలేనివాడు ఎంత విన్నా తత్త్వాన్ని తెలుసుకోలేడు.

వేదాంత శ్రవణం అందరూ చేస్తారు. చేయవచ్చు. కాని కొందరు మాత్రమే దానివల్ల పొందవలసిన ప్రయోజనాన్ని పొందగలుగుతారు.మరి మిగిలినవారు? అర్హత లేనివారే. ఎందువల్ల? వారు కాలక్షేపానికో, ప్రొద్దుపుచ్చటానికో, గొప్పవారుగా పరిగణించబడటానికో వింటారు. కనుక ఆచరణ జోలికిపోరు. వేదాంత శ్రవణం కాలక్షేపానికి కాదు, ఆచరించి అందుకోవటానికి. ఆచరించి అందుకోగలవారు మాత్రమే అర్హత గలవారు. అర్హత గలవారే భగవంతుని సమగ్రంగా తెలుసుకోగలరు.

ఇంతకూ భగవంతుని గురించి సంపూర్ణంగా, సమగ్రంగా తెలుసుకోవాలంటే అర్హతలేమిటి? ఆ అర్హతలు మనలో ఉన్నాయా? లేవా? విశ్లేషణ చేసి తెలుసుకుందాం.

1.భగవంతుని యందే ఆసక్తి ఉండాలి.

2.భగవంతునే ఆశ్రయించాలి.

3.యోగాన్ని - ధ్యానయోగాన్ని అభ్యాసం చేస్తూ ఉండాలి.

1.మయ్యాసక్త మనః:- మనస్సనేది ఒక టార్చి లైటులాంటిది. టార్చి లైటును చెట్టు మీదికి త్రిప్పితే చెట్టు కనిపిస్తుంది. నేలమీదికి తిప్పితే దారి కనిపిస్తుంది. వస్తువు మీదికి త్రిప్పితే వస్తువు కనిపిస్తుంది. అలాగే మనస్సును కూడా భోగాల మీదకు త్రిప్పినప్పుడు ఆ మనసు భోగవస్తువుల పట్ల ఆసక్తి కలిగిఉంటుంది. కీర్తిప్రతిష్టల మీదకు త్రిప్పినప్పుడు పదవుల మీద ఆసక్తి కలుగుతుంది. మోక్షమార్గం వైపుకు త్రిప్పినప్పుడు భగవంతుని మీద ఆసక్తి కలిగి ఉంటుంది. దేనిమీద ఆసక్తి ఉన్నదో దానిని గురించే నిరంతరం చింతిస్తూ ఉంటావు. దాని గురించే కలవరిస్తూ ఉంటావు. కనుక ఎల్లప్పుడు మనస్సును భగవంతుని యందు, భగవంతుని వైభవంనందు, భగవతత్త్వంనందు, భగవంతుని అవతార విశేషాలయందు, భగవంతుడు మనకు చేస్తున్న మేలునందు లగ్నం చేసి ఉంచాలి. వాటికోసమే తపించాలి.

లోకంలోని అజ్ఞాన మానవులు అనిత్యమైన వస్తువుల మీద, విషయాల మీద, భోగాల మీద, ఆసక్తి కలిగి ఉంటారు. వాటిని గురించే నిరంతరం చింతిస్తూ ఉంటారు. కనుక వారు భగవంతుని గురించి తెలుసుకోలేరు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుని గురించి తెలుసుకోవాలంటే భగవంతునిపైనే ఆసక్తి కలిగి ఉండాలి. మోక్షం పొందాలంటే ఆసక్తి ఉండాలి, తపన ఉండాలి. అందుకే మయ్యాసక్త మనః పార్థః - 'అర్జునా! మనస్సును నాయందే లగ్నంచేసి ఉంచు' అనటం.

2.మదాశ్రయః- నన్నే ఆశ్రయించు. విషయాలపట్ల, భోగాలపట్ల ఆసక్తులైన వారు తమ కోరికలను ఎవరు తీరుస్తారో వారినే ఆశ్రయిస్తారు. మోక్షం పట్ల ఆసక్తులైనవారు మోక్షాన్ని ప్రసాదించే భగవంతునే ఆశ్రయిస్తారు. భగవత్స్వరూపులైన, ఆత్మద్రష్టలైన, శ్రోత్రియులు - బ్రహ్మనిష్ఠులు ఐన గురువులను - మహాత్ములనే ఆశ్రయిస్తారు. అయితే ఎలా ఆశ్రయించాలి? "నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ కావవే ఈశ్వర సంరక్షించు భద్రాత్మకా!" యని గజేంద్రుడు ఎలా భగవంతుని శరణు కోరాడో అలాగ సంపూర్ణ శరణాగతభావంతో ఆశ్రయించాలి. తమనుతాము సంపూర్ణంగా సర్వసమర్పణ చేసుకుని ఆశ్రయించాలి. అలా భగవంతుని ఆశ్రయించినవారే భగవంతునితో ఐక్యత సాధించగలరు.

ఇలా ఆసక్తి - ఆశ్రయం రెండూ భగవంతుడే కావాలి. ఆసక్తి ఒకచోట, ఆశ్రయ స్థానం మరోచోట అయితే ప్రయోజనం లేదు.

మన ఇంట్లో పనిమనిషి ఉన్నది. ఆమె రోజూ ఉదయం నుండి రాత్రి వరకు పనిచేసి వెళుతుంది. ఆమెకు తిండి, బట్ట ఇచ్చి కొంత జీతం కూడా ఇస్తున్నాం. కనుక ఆమెకు ఆశ్రయస్థానం మనమే. కాని ఆమెకు ఆసక్తి స్థానం మాత్రం ఆమె భర్త, బిడ్డలు. వారి క్షేమమే తన క్షేమంగా భావిస్తుంది.


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వారికేదన్నా జరిగితే విలవిలలాడిపోతుంది. కనుక ఆమెకు ఆశ్రయస్థానం ఒకటి - ఆసక్తి స్థానం మరొకటి. రెండూ వేరువేరు అయినాయి.

అలాగే మనం కూడా పరమాత్మనే ఆశ్రయించామని నోటితో అంటాం. కాని ఆసక్తి మాత్రం భార్యాబిడ్డలు, ఇల్లు, సంపద, భోగాలు, ప్రాపంచిక విషయాలు, వస్తువులు, ధన సంపాదన మొదలైనవి - - - ఇలా ఉంటే కుదరదు.

నిజంగా భగవంతుడే నా పరమగతి - ఆయనే సర్వస్వం - నాదేం లేదు అని అంటూ ఉంటామే గాని అలా ఉంటున్నామా? ఊరికే అంటున్నామా? ఆలోచించుకోవాలి. గజేంద్రుడు పోరాడి, పోరాడి, చివరకు గతిలేక అన్నాడు. అయితే సంపూర్ణ శరణాగతితో అన్నాడు. కాని మనం అలాకాదే! నిరంతరం పోరాడుతూనే ఉంటాం. నేను భగవంతుణ్ణే ఆశ్రయించాను. అంతా ఆయనే చూసుకుంటాడు. నాకేం పట్టదు. పాలముంచినా, నీట ముంచినా ఆయనదే భారం. ఎలా నడిపిస్తాడో, ఏం చేస్తాడో ఆయన ఇష్టం. ఆయనకు తెలియదా? నన్నెలా రక్షించాలో అంటాం. అనటమైతే అలా అంటాం, కాని మన జాగ్రత్తలో మనం ఉండకపోతే ఎలా? గాలిలో దీపం పెట్టి, 'దేవుడా! అంటే ప్రయోజనమేముంది? మన ప్రయత్నం మనం చేయాలి గదా? అంతా భగవంతుడిదే భారం అంటే ఎలా? మనం మన అశ్రద్ధతో, చేతగాని తనంతో అన్నీ పోగొట్టుకుంటే ఏ దేవుడు వచ్చి రక్షిస్తాడు మనల్ని?' అంటూ సన్నాయి నొక్కులు నొక్కుతాం. ఈ ప్రాపంచిక విషయాలలో ఆసక్తిని కనబరచి; మన తెలివి తేటల్ని ప్రదర్శిస్తాం.

ఇంతకీ నీవు భగవంతుని ఆశ్రయించి, ఆయనపై నీ సమస్త భారాన్ని వేసి, ఆయన సర్వజ్ఞుడని, దక్షుడని నమ్మినట్లా? నమ్మనట్లా? ఆలోచించాలి.

అర్జునుడికి ఇలాంటి పరీక్షే ఎదురైంది. కురుక్షేత్ర యుద్ధానికి ముందు దుర్యోధనుడు, అర్జునుడు ఇద్దరూ ఒక్కసారే శ్రీకృష్ణుని సహాయం కోసం ద్వారకకు వెళ్ళారు. శ్రీకృష్ణుడు ఇద్దరికీ సాయం చేస్తానన్నాడు. "నాతో సమానమైన బలం, శౌర్యం, ధైర్యం, ప్రతాపం, పరాక్రమం కలిగిన పదివేలమంది నారాయణగోపాలురు ఒకవైపు, యుద్ధం చేయకుండా సమయానికి తగిన సలహాలు మాత్రం ఇస్తూ ఉండే నేను ఒక వైపు ఉంటాం. ఇందులో మీకేది కావాలో కోరుకోండి" అన్నాడు. గుటకలు వేస్తున్నాడు దుర్యోధనుడు. ముందుగా చిన్నవాడైన అర్జునుణ్ణి కోరుకో మనటంతో యావత్ సైన్యాన్ని తాను తీసుకొని, బొమ్మలాగా రథంలో కూర్చొనే ఈ శ్రీకృష్ణుణ్ణి నాకు వదులుతాడేమోనని దుర్యోధనుని శంక. కాని అర్జునుడు మాత్రం భగవంతుణ్ణే కోరుకున్నాడు. భగవంతుణ్ణి కోరుకున్న అర్జునుడు విజయం సాధించాడు. భౌతిక సంపదలను - అంటే సైన్యాన్ని కోరుకున్న దుర్యోధనుడు దుంప నాశనమయ్యాడు. అర్జునుడు ఏమాత్రం సంశయించక భగవంతుణ్ణే కావాలనుకున్నాడు. భగవంతుణ్ణే ఆశ్రయించాడు. అదే మదాశ్రయః అంటే.

శ్రీకృష్ణుడు యుద్ధం చేయను, ఊరికే సలహాలిస్తుంటాను అన్నాడు. ఎందుకు? భగవంతుడు నిష్క్రియుడు. అకర్త. ఆయనేమీ చేయడు. అంతా జరిగిపోతుంది. కనుక భగవంతుని యందే ఆసక్తి ఉండాలి. భగవంతునే ఆశ్రయించాలి.

3.యోగంయుంజన్:- యోగసాధన చెయ్యాలి. లక్ష్యం సిద్ధించాలంటే భగవంతునిపై ఆసక్తి భగవంతుని ఆశ్రయించటం మాత్రమే చాలదు. యోగాన్ని అభ్యసించాలి. అంటే 6వ అధ్యాయంలో వివరించినట్లు ధ్యానయోగాన్ని అభ్యసించాలి. మనం తెలుసుకున్న విషయాలను ఆచరణలో పెట్టటమంటే ఇదే. ముందుగా శాస్త్రంపై, గురువుపై విశ్వాసంతో శాస్త్రాన్ని శ్రవణం చేయాలి. ఆ తరువాత శ్రవణం చేసిన విషయాలను పదేపదే మననం చేసి సందేహాలను తీర్చుకోవాలి. సందేహ రహితంగా బోధపడిన విషయాన్ని అనుభవంలోనికి తెచ్చుకోవడానికి నిధిధ్యాసన చేయాలి. అదే ఆచరణ, అదే ధ్యానాభ్యాసం. ఇలా ఆసక్తి - ఆశ్రయం - సాధన అనేవి భగవంతుని గూర్చి తెలుసుకోవటానికి అర్హతలు. ఈ 3 అర్హతలు ఉంటే భగవత్తత్త్వాన్ని కేవలం తెలుసుకోవటం గాక సమగ్రంగా, సందేహ రహితంగా తెలుసుకోవచ్చు. అందుకే భగవంతుడన్నాడు అసంశయం - సమగ్రం - మాం జ్ఞాస్యసి - అని. అంటే సమగ్రంగా సందేహ రహితంగా నన్ను తెలుసుకోగలవు - అని.

భగవంతుడు బోధించే ఈ అఖండజ్ఞానం కేవలం అర్జునునికి మాత్రమే కాదు. సమస్త మానవాళికీ కూడా. ఇది అందరికీ అవసరమైన జ్ఞానమే. కనుక మనం కూడా ఈ భౌతికసంపదల కోసం ప్రాకులాడకుండా" నీవే నాకు కావాలి" అని భగవంతుని ఆశ్రయించాలి. సంపదలనాశ్రయించినప్పుడు ఒకవేళ దక్కితే అవి మాత్రమే దక్కుతాయి. కాని భగవంతుని ఆశ్రయిస్తే అన్నీ దక్కుతాయి. నీకు కావలసినవన్నీ దక్కుతాయి. శాశ్వతానందం కూడా దక్కుతుంది. అర్జునుడు భగవంతుని ఆశ్రయించటం వల్ల యుద్ధంలో

విజయమూ లభించింది, అఖండ జ్ఞానమూ లభించింది. అంటే భౌతిక సంపద, ఆధ్యాత్మిక సంపద - రెండూ లభించాయి. కనుక ఆశ్రయించ వలసింది భగవంతుణ్ణే.

ఈ శ్లోకంలో భగవంతుని తెలుసుకోవాలంటే - అఖండ జ్ఞానం కలగాలంటే 'మయి ఆసక్తః, మత్ ఆశ్రయః' - నాయందే ఆసక్తి, నన్నే ఆశ్రయించుట ముఖ్యమని భగవానుడు తెలియజేశాడు. అంటే జ్ఞాన యోగానికి భక్తియోగం యొక్క ఆవశ్యకతను చక్కగా తెలియజేస్తున్నదీ శ్లోకం. అలాగే 'యోగం యుంజన్' అనటం వల్ల జ్ఞానయోగానికి ధ్యానయోగం కూడా తప్పనిసరి అని అవగతమౌతున్నది. అంటే భక్తియోగ - ధ్యానయోగాల వల్లనే అఖండ జ్ఞానప్రాప్తి అని అర్థం.

- అర్హతగల శిష్యునికి తాను బోధించబోయే విద్య ఎట్టిదో సూచనప్రాయంగా తెలియజేస్తున్నాడు జగద్గురువు శ్రీకృష్ణుడు.

**శ్లో||** జ్ఞానంతేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్య శేషతః|
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవ శిష్యతే|| **(2)**

**తా||** దేనిని తెలుసుకుంటే తిరిగి తెలుసుకోవలసినది మరొకటి ఉండదో అట్టి ఈ విజ్ఞానంతో కూడిన జ్ఞానాన్ని నేను నీకు అశేషంగా చెబుతాను.

**వ్యాఖ్య:-** జ్ఞానం సవిజ్ఞానం:- జ్ఞానం అంటే శాస్త్రజ్ఞానం. శాస్త్రంలో ఉన్న విషయాలను విని తెలుసుకోవటం జ్ఞానం. అయితే ఇలా ఎంతకాలం తెలుసుకున్నా ఇంకా తెలుసుకుంటూ ఉండాల్సిందే. ఎందుకంటే శాస్త్రాలు

అనంతం. జ్ఞానం అనంతం. మానవుని ఆయుర్దాయం మాత్రం అల్పం. ఈ అల్పమైన ఆయుష్కాలంలో అనంతమైన శాస్త్రాలను తెలుసుకోవటం అసాధ్యం. కనుకనే భగవానుడు విజ్ఞానంతో కూడిన జ్ఞానాన్ని బోధించబోతున్నాడు. దీనినే బ్రహ్మజ్ఞానం అన్నారు. ఇదే అనుభవజ్ఞానం. ఈ జ్ఞానాన్ని ఒక్కసారి తెలుసుకుంటే తిరిగి మళ్ళీ మళ్ళీ తెలుసుకోవలసింది ఏమీ ఉండదు. ఇది తెలుసుకుంటే అన్నీ తెలుసుకున్నట్లే.

చెట్టు యొక్క కాండాన్ని, ప్రతి కొమ్మను, ఆకును, పూలను, కాయలను, మొగ్గలను తడపాలంటే చాలా కష్టం. వ్రేళ్ళను తడపటం అసాధ్యం. కాని చెట్టు మొదట్లో నీరుపోస్తే ఆ నీరు లోపలి వ్రేళ్ళను తడుపుతుంది. అలాగే ఆ నీరు కాండానికి, కొమ్మలకు, ఆకులకు, మొగ్గలకు, పూలకు, కాయలకు - అన్నింటికీ చేరుతుంది. అలాగే బ్రహ్మజ్ఞానాన్ని - అనుభవజ్ఞానాన్ని - బ్రహ్మానుభూతిని ఒక్కసారి పొందితే అన్ని శాస్త్రాలు అధ్యయనం చేసినట్లే. ఎందుకంటే అన్ని శాస్త్రాల లక్ష్యం మోక్షాన్ని పొందటమే. బ్రహ్మానుభూతిని పొందటమే గనుక.

పరమశివుని కుటుంబాన్ని చూడండి. భార్య పార్వతి, కుమారులు విఘ్నేశ్వరుడు, కుమారస్వామి. వారిద్దరిలో ఎవరికి విఘ్నాధిపత్యం ఇవ్వాలా? అని ఒక పరీక్ష పెట్టాడు పరమశివుడు. అదే భూప్రదక్షిణ చేసి తిరిగి రావటం. కుమారస్వామి ఎంతో కష్టపడి భూప్రదక్షిణ చేసి వచ్చాడు. కాని విఘ్నేశ్వరుడు తండ్రికి ప్రదక్షిణం చేశాడు. దానితో సమస్త బ్రహ్మాండాన్ని ప్రదక్షిణ చేసిన ఫలితాన్ని పొందాడు. అలాగే ఒక్క బ్రహ్మజ్ఞానాన్ని పొందితే సమస్త జ్ఞానాలు పొందినట్లే. కనుకనే సకల విద్యలను నేర్చుకొనటంలోనే జీవితాన్ని వ్యర్థం

చేయకుండా ఒక్క బ్రహ్మవిద్యను తెలుసుకుంటే చాలు. అన్ని విద్యలలోను ఆరితేరినట్లే. అందుకే భగవానుడు ఇక్కడ విజ్ఞానసహిత జ్ఞానాన్ని అందించబోతున్నాను అని చెబుతున్నాడు.

ఇలా చెప్పటం వల్ల వినే శ్రోతకు - లేదా శిష్యునికి తాను చెప్పబోయే విజ్ఞానం యొక్క ప్రభావం ముందుగానే తెలిసి, దానిపై అభిరుచి కలుగుతుంది. ఒట్టి శాస్త్రజ్ఞానం భుక్తికే గాని ముక్తికి పనికిరాదు. బ్రహ్మానుభూతిలేని కేవల శాస్త్రజ్ఞానం 'దర్వీపాకరసం యధాః' అని శంకరాచార్యుల వారు వివేక చూడామణిలో తెలియజేశారు. అంటే ఏమాత్రం అనుభూతి లేకుండా ఒట్టి శాస్త్రజ్ఞానంలో మునిగితేలేవాడు పాయసంలో తిరిగే గరిటలాంటి వాడు - అని. గరిట ఎంతకాలం పాయసంలో తిరిగినా ఆ పాయసం రుచి కొంచెం కూడా దానికి పట్టదు. అంతే. కనుక జ్ఞానం విజ్ఞానంతో కూడుకొని ఉంటేనే ప్రయోజనం.

ఛాందోగ్యోపనిషత్తులో ఒక కథ ఉంది. ఉద్దాలకుడనే ఋషి చాలా గొప్ప జ్ఞాని, గురువు. అయన జిజ్ఞాసువులైన శిష్యులకు బ్రహ్మ విద్యాబోధ చేస్తున్నాడు. ఆయనకు శ్వేతకేతుడనే కుమారుడున్నాడు. ఒట్టి బడుద్ధాయిలాగా పెరుగుతున్నాడు. చదువు అబ్బలేదు. అతడిని గౌతముడనే గురువు వద్దకు విద్యార్జనకై పంపించాడు. అతడు 12 సం||లు గౌతముని వద్ద విద్యాభ్యాసం చేసి తిరిగి వచ్చాడు.

తండ్రి దగ్గరకు వచ్చినప్పటి నుండి గర్వంతో ఉంటున్నాడు. తండ్రికి నమస్కారం కూడా చేయలేదు. ఆయనకు సమర్థత లేకనే తనను మరొకరి వద్దకు పంపించాడు గనుక తండ్రికన్న తానే గొప్ప జ్ఞానిననుకున్నాడు.

వినయం - విధేయత లేని విద్య విద్యయే కాదు. అందుకే కుమారుని అహంకారాన్ని అణచాలనుకున్నాడు. ఒకనాడు కుమారుని పిలిచి "నాయనా! నీవు గొప్ప విద్వాంసుడివైనట్లు కనిపిస్తున్నావు. దేనిని తెలుసుకుంటే సమస్తము తెలిసినట్లు అవుతుందో ఆ విద్యను తెలుసుకున్నావా?"అన్నాడు. తెల్లబోయాడు కుమారుడు. 'తండ్రీ! ఆ విద్య మా గురువుగారికే తెలియదు. తెలిస్తే నాకెందుకు చెప్పడు? నేను అది తెలుసుకోలేదు. ఐనా లోకంలో మనం దేనిని గురించి తెలుసుకుంటే అదే తెలుస్తుంది గాని మిగిలినవన్నీ ఎలా తెలుస్తాయి? అదేదో మీరే బోధించండి." అన్నాడు. అహంకారంతోనే అయినా తండ్రిని అర్థించాడు.

అప్పుడు ఉద్దాలకుడు, "నాయనా! మట్టిని తెలుసుకుంటే కుండలు, కూజాలు, చట్లు, మూకుళ్ళు, పిడతలు, బానలు అన్నింటిని తెలుసుకున్నట్లే - అంటే - కారణాన్ని తెలుసుకుంటే కార్యరూప వస్తువులన్నింటిని తెలుసుకున్నట్లే గదా! ఈ ప్రపంచం కార్యం. దీనికి కారణం పరమాత్మ. కనుక పరమాత్మను తెలుసుకుంటే ఇక ఈ ప్రపంచంలోని ఒక్కొక్క వస్తువును తెలుసుకునే పనిలేదు. అందుకే ఆత్మజ్ఞానిని సర్వజ్ఞుడు అంటారు అని చెప్పి బ్రహ్మజ్ఞానాన్ని బోధించాడు.

ఈ సారాన్నే "యత్ జ్ఞాత్వా నేహ భూయోన్యత్ జ్ఞాతవ్యమవ శిష్యతే" - అని భగవానుడిక్కడ తెలియజేశాడు. ఆ విద్యయే అసలైన విద్య.

ఒకసారి ఒక సిద్ధుడు ఒక జ్ఞాని వద్దకు వచ్చి తన మహిమను చూపిస్తున్నాడు. తొడ దగ్గర నుండి రూపాయి నోట్లు తీసి చూపిస్తున్నాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. అప్పుడా జ్ఞాని అడిగాడట. ఈ నోట్లు నీవు క్రొత్తగా సృష్టించి ఇస్తున్నావా? లేక ఎవరి దగ్గరైనా ఉన్నవాటిని ఆకర్షించి ఇస్తున్నావా? క్రొత్తగా సృష్టిస్తున్నట్లయితే నీవు నేరస్తుడివి. గవర్నమెంటును మోసం చేస్తున్న మోసకారివి. కనుక శిక్షార్హుడివి. లేక ఎవరిదగ్గరన్నా ఉన్నవాటిని ఆకర్షణశక్తితో తెస్తున్నట్లయితే వాడెవడో సంపాదించుకున్న వాటిని దొంగిలించిన దొంగవవుతావు. అప్పుడూ నేరస్థుడివే. ఇలా దొంగిలించటం, సృష్టించటం నేరం గనుక ఇలాంటి పనులు యోగులైన వారికి తగినవేనా? నీవు సాధుపురుషుడివేనా? అన్నాడట. వాడు గమ్మున వెళ్ళిపోయాడు. క్షుద్రమైన సిద్ధులు జ్ఞానం కాదు. వాడు జ్ఞానీకాదు. జనులను ఆకర్షించటానికి చేసే జిమ్మిక్కులు. ఇప్పుడు కొందరు తమ వస్తువులనే కొందరు పెద్దలు, మోతుబరులకు సృష్టించి ఇచ్చి వారి ద్వారా ప్రయోజనం పొందుతూ ఉంటారు. లేదా వాటిని చూసిన అమాయకుల ద్వారా డబ్బు, బంగారం దండుకొని, వందల, వేలకోట్లు కూడబెట్టి చివరకు దిక్కులేని చావు చస్తారు. లేదా ప్రభుత్వం చేతిలోనో, ప్రజల చేతిలోనో శిక్షింపబడుతూ ఉంటారు. ఈ జిమ్మిక్కులేవీ జ్ఞానానికి పనికి వచ్చేవి కాదు. కాకపోతే కొంతకాలం ఒక వెలుగు వెలగటానికి పనికివస్తాయి.

విజ్ఞానంతో కూడిన జ్ఞానమే సర్వశ్రేష్టం. జ్ఞానం - విజ్ఞానం రెండూ ఉన్నది భగవద్గీత. ఇందులో శాస్త్రజ్ఞానమూ ఉన్నది, అనుభవజ్ఞానమూ ఉన్నది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇట్టి వేదాంతాన్ని తెలుసుకుంటున్న విద్యార్థి శాస్త్రాభ్యాసం చేసే సమయంలోనే అర్హత గలిగినవాడైతే ఒక్క క్షణంలో ఆత్మసాక్షాత్కారాన్ని పొందగలుగుతాడు. అయితే ఎప్పుడు?

ఎవరికైతే అంతరంగశుద్ధి ఉన్నదో, శ్రద్ధ ఉన్నదో, ఆత్మానుభూతిని పొందాలనే తపన ఉన్నదో, ప్రాపంచిక విషయాలపట్ల, భోగాలపట్ల, వస్తువుల పట్ల తీవ్ర వైరాగ్యం ఉన్నదో అట్టి శిష్యుడు గురువు బోధించే వేదాంత విజ్ఞానంలోని హేతువాదాన్ని, అందులోని సరియైన భావాన్ని - అంటే లక్ష్యార్థాన్ని గ్రహించి జీర్ణించుకుంటాడు. అందులోనే తాదాత్మ్యం చెందుతాడు. వేదాంతం నిర్దేశించిన లక్ష్యాన్ని అందుకుంటాడు.

కనుక మన అంతరంగాన్ని శుద్ధి చేసుకోవాలి. గురువుపట్ల, శాస్త్రంపట్ల అత్యంత శ్రద్ధ (విశ్వాసం) కలిగిఉండాలి. విషయవైరాగ్యం కలిగిఉండాలి. శ్రవణ - మనన- నిధిధ్యాసలను కొనసాగిస్తూ ఉండాలి. అప్పుడే ఆత్మానుభూతి. అయితే ఆత్మానుభూతి ఇంత తేలికా? అలా అయితే ఆత్మజ్ఞానులు లోకంలో ఇంత అరుదుగా ఉన్నారెందుకు? తరువాతి శ్లోకంలో -

- మనస్సును పరమాత్మపై లగ్నం చేసి, పరమాత్మయే పరమగతియని విశ్వసించి, ధ్యాన సాధన సాగిస్తున్న వారికి విజ్ఞానంతో కూడిన జ్ఞానం తెలుసుకోవటం తేలికే. అంతేకాదు. ఈ జ్ఞానాన్ని తెలుసుకుంటే ఇక తెలుసుకోవాల్సింది ఏమీ ఉండదు. మరి ఎందుకు జ్ఞానులు అరుదుగా ఉంటున్నారు? -

**శ్లో||** మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్య తతి సిద్ధయే|

యతతా మపిసిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః || (3)

**తా||** వేలాదిమంది మనుజులలో సిద్ధికోసం ప్రయత్నించేవారు ఎక్కడో ఒక్కరుంటారు. అలా ప్రయత్నించి సిద్ధులైన వారిలో ఏ ఒక్కరో నన్ను యదార్థంగా తెలుసుకుంటారు.

**వ్యాఖ్య:-** ఈ ఆత్మజ్ఞానం విలువైనదేగాని అంత సులువైనది కాదు. ఇట్టి జ్ఞానాన్ని పొందటానికి ఒక్క మానవజన్మ మాత్రమే అర్హమైనది. జంతువులుగాని, చెట్లుగాని, దేవతలు గాని ఆత్మజ్ఞానాన్ని పొందే హక్కు లేదు. కర్మ చేయటానికి అధికారం మానవులకు మాత్రమే ఉన్నది. అలాగని మానవులందరూ తమ జన్మలను ఆత్మానుభూతికి ఉపయోగించుకుంటారా? - అంటే లేదు. ఎందుకంటే - - -1.ఆత్మానుభూతిని పొందాలని, అదే మానవజీవిత పరమలక్ష్యమని ముందు తెలియాలి. 2.ఆత్మానుభూతిని పొందాలనే పట్టుదల కలగాలి. 3.పొందే విధానం తెలుసుకోవాలి. 4.పొందటానికి ఆటంకంగా ఉన్న దోషాలను తొలగించుకోవాలి. 5.మార్గం చూపే సద్గురువు లభించాలి. 6.ఆయన చూపిన మార్గంలో పట్టుదలగా ప్రయాణించాలి. అందుకే లోకంలో ఈ జ్ఞానాన్ని పొందేవారు అరుదుగా ఉంటారని భగవానుడు తెలియజేస్తున్నాడు.

వేలాదిమందిలో ఈ ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించే వారే అరుదు. వేదాంతం వినేవారిలో అర్థం చేసుకొనేవారు, లక్ష్యం కోసం పట్టుదలతో సాధన చేసేవాళ్ళు ఇంకా అరుదు. వారిలో సిద్ధి పొందేవారు ఇంకా అరుదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వారిలో కూడా పరమాత్మ యొక్క యదార్థ తత్త్వాన్ని గ్రహించేవారు ఇంకా ఇంకా అరుదుగా ఉంటారు.

చెట్టుకు అనేక పూలు పూస్తాయి. వాటిల్లో చాలా పూలు రాలిపోతాయి. అందులో కొన్ని మాత్రమే పిందెలుగా మారుతాయి. ఏ కొద్దిగానో ఫలాలుగా మారుతాయి. అలాగే మనుష్యులలో కూడా భగవంతునిపై భక్తి కుదిరేవారు ఏ కొద్దిమందో ఉంటారు. వారిలో పరమాత్మ జ్ఞానాన్ని పొందేవారు కొద్దిమంది. వారిలో కూడా పరమాత్మ తత్త్వాన్ని యదార్థంగా తెలుసుకొని జన్మసార్థక్య హేతువైన మోక్షాన్ని పొందేవారు బహు అరుదుగా ఉంటారు.

దుర్లభమైన మానవజన్మనుపొంది మోక్షాన్ని పొందటానికి వినియోగించుకోకుండా విషయభోగాలకు వినియోగించటం, ఎలాంటిదంటే "ముత్యాలు పోసి రేగుబండ్లు కొనుక్కోవటం" లాంటిదే.

పిల్లి తన కూనలను కళ్ళు తెరిచేలోపల తట్టలలో, బుట్టలలో, గాదెలలో, గంపలలో మారుస్తుందట. అలా ఏడుచోట్ల మారుస్తుందంటారు. అలాగే 'మాయ' అనే పెద్ద పిల్లి ఈ జీవుళ్ళను కళ్ళు తెరిచేలోపల ఎన్ని చోట్ల మార్చింది? 83 లక్షల 99వేల 999గాదెలలో, గంపలలో - వివిధ గర్భకోశాలలో చేర్చింది. మార్చింది. అలా మార్చిన తర్వాత వచ్చిన అపురూపమైన జన్మే ఈ మానవజన్మ. కళ్ళు తెరుచుకోవలసిన జన్మ. పశువులాగా, పక్షిలాగా, పురుగులాగా ఇప్పుడూ కళ్ళు మూసుకుంటే 'పునరపి జననం పునరపిమరణం పునరపి జననీ జఠరేశయనం' తప్పదు. చావు పుట్టుకలతో కూడిన ఈ సంసార చక్ర బంధంలో ఇరుక్కొని బయటపడలేక బాధలు పడాలి. ఆహారం సంపాదించు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కోవటం, భోగాలనుభవించటం, పిల్లల్ని కనటం, పెంచటం, నిద్రపోవటం, పశువులకు పక్షులకు జీవితలక్ష్యాలు. కాని మానవుడి అసలు లక్ష్యం అది కాదు. మోక్షాన్ని అందుకోవటమే మానవ జీవిత పరమలక్ష్యం.

అపరోక్ష బ్రహ్మజ్ఞానాన్ని పొందాలంటే మహాపురుష సమాశ్రయం కావాలి. జ్ఞానం కోరుకొనేవాడు జ్ఞానులను ఆశ్రయించాలి. వారి సహాయాన్ని అర్థించాలి. వారి చరణాలు పట్టుకోవాలి. శరణాగతి పొందాలి. ఒక్కొక్కసారి అభిమానం అడ్డువచ్చి అవకాశాలను విడిచిపెడతారు కొందరు. అభిమానాన్ని విడిచిపెట్టాలి గాని అవకాశాలను విడిచిపెట్టరాదు. లౌకిక భోగాలను విడిచి ముందడుగు వేయాలి.

"ఓ అర్జునా! ఈ కురుక్షేత్రంలో అటువారు, ఇటువారు - అందరూ నన్ను చూస్తున్నారు. కాని నన్ను తెలుసుకోలేరు. చూడటం వేరు, తెలుసుకోవటం వేరు. చూడబడేది ఈ దేహమే కాని, నేను కాదు. ఈ నేను (ఆత్మ) చూడబడేది కాదు తెలుసుకోవలసింది. ఆ తెలుసుకోవటం కూడా తత్త్వతః తెలుసుకోవాలి. కనుక అర్జునా! సద్గురువును ఆశ్రయించి; శ్రవణ - మనన - నిధిధ్యాసల నాచరించి; నిత్య - నిరంతర - నిర్వికల్ప సమాధి నిష్ఠ యందు వాసుదేవ పరబ్రహ్మనైన నన్ను అపరోక్షంగా తెలుసుకో! నీవు లోకంలో ఉన్న వేలాదిమందిలో అరుదుగా ఉన్నవాడివి. భగవంతుడి వైపుకు తిరిగిన వాడివి. భగవత్ సంబంధమైన వేదాంతజ్ఞానాన్ని వింటున్నవాడివి. విన్న విషయాలను అవగాహన చేసుకొని ఆచరించాలనే తపన గలవాడివి. కనుక నీవు అరుదుగా ఉండే మహాత్ముడివి. కనుక నేను చెప్పబోయే విషయాలను శ్రద్ధా భక్తులతో,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సావధాన చిత్తుడవై విను" అంటున్నాడు భగవానుడు. అర్జునుని నిమిత్తంగా చేసుకొని మనందరికి బోధ చేస్తున్నాడు భగవానుడు. కనుక భగవతత్త్వాన్ని శ్రద్ధగా మనం కూడా వినాలి.

- భగవంతుని అఖండ స్వరూప జ్ఞానబోధను చేస్తున్నాడు భగవానుడు.

**శ్లో||** భూమిరాపో నలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ|
అహంకార ఇతీయం మే భిన్నాప్రకృతి రష్టధా|| **(4)**

**తా||** భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం మరియు మనస్సు, బుద్ధి, అహంకారం అని ఇలా నా ప్రకృతి ఎనిమిది విభాగాలుగా విభజింపబడి ఉంది.

**వ్యాఖ్య:-** భగవద్గీత దుఃఖనివృత్తికి మందు. ఈ లోకంలో ప్రతివ్యక్తీ ఏదో ఒక దుఃఖంలోనే ఉంటాడు. ఆ దుఃఖాలను శాశ్వతంగా తొలగించుకోవాలి. అలా తొలగించుకోవాలంటే ఆ దుఃఖం యొక్క మూలకారణం తెలుసుకోవాలి. ప్రతి దుఃఖానికి మూలకారణం అజ్ఞానమే. మరి ఆ అజ్ఞానం తొలగేది ఎట్లా? జ్ఞానంతో మాత్రమే. మరొక మార్గం లేదు. అర్జునుడు కూడా తన దుఃఖాన్ని తొలగించుకోవటానికి భగవానుని ఆశ్రయించాడు. భగవానుడు అర్జునుని నిమిత్తంగా చేసుకొని సమస్త మానవజాతి యొక్క దుఃఖాన్ని శాశ్వతంగా తొలగించటానికి తన అఖండ స్వరూపాన్ని తెలియజేయబోతున్నాడు. అజ్ఞానాన్ని తొలగించే జ్ఞానాన్ని బోధిస్తున్నాడు.

మొత్తం ప్రపంచంలో జడము, చైతన్యము అని రెండే వస్తువులున్నాయి. ఇక్కడ ఎన్ని రూపాలలో ఏమి ఉన్నా అన్నీ ఈ రెండింటి సమ్మేళనమే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇది పుస్తకం. జడం. నేను మాట్లాడుతున్నాను. కనుక చైతన్యం. పుస్తకాన్ని నేను తెలుసుకోగలను. కాని నన్ను పుస్తకం తెలుసుకోలేదు. అంటే జడం దేనినీ తెలుసుకోలేదు. చైతన్యం అన్నింటినీ తెలుసుకోగలుగుతుంది. జడాన్ని అపరా ప్రకృతి అని, చైతన్యాన్ని పరాప్రకృతి అనీ అంటారు.

ముందుగా భగవానుడు తన అపరా ప్రకృతిని గూర్చి వర్ణిస్తున్నాడు. ఈ అపరాప్రకృతి 8గా విభాగించబడింది. అవే భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం. ఎందుకు ఈ ప్రకృతుల గూర్చి చెప్పటం?

దేనిని తెలుసుకుంటే ఇక తెలుసుకోవలసింది లేదో దానిని గురించి చెబుతానన్నాడు భగవానుడు మొదటి శ్లోకంలోనే. అంటే పరమాత్మను గురించి తెలుసుకుంటే సర్వమూ తెలిసినట్లే. పరమాత్మ వ్యక్తావ్యక్త స్వరూపుడు. ఆయన వ్యక్త స్వరూపం ఈ ప్రపంచం. కనుక ప్రపంచపు యదార్ధ స్వరూపాన్ని ముందుగా తెలియజేస్తున్నాడు. ఈ ప్రపంచం అంతా అపరాప్రకృతి, పరాప్రకృతి అనే 2 ప్రకృతుల సమ్మేళనమే. ఈ రెండూ పరమాత్మకన్న వేరుకాదు అని నిరూపిస్తే ఆ భగవంతుని మాట సార్థకమౌతుంది. అందుకే ఈ రెండు ప్రకృతులను వివరించబోతూ ముందుగా అపరాప్రకృతిని గూర్చి వర్ణిస్తున్నాడు భగవానుడు.

ఒక ఆర్టిస్టు తెల్ల కాగితంపై పెన్సిలుతో అనేక బొమ్మలు గీశాడు. పశువు, పక్షి, ఏనుగు, పర్వతం, సముద్రం, చెట్టు, మానవుడు, అప్సరస, రాక్షసుడు, శ్రీకృష్ణుడు, లక్ష్మీదేవి - - - ఇలా అనేక బొమ్మలు. వీటిలో కొన్నింటిని చూస్తే నవ్వు, కొన్నింటిని చూస్తే పూజ్యభావం, కొన్నింటిని చూస్తే కోపం, కొన్నింటిని చూస్తే


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నిర్లిప్తత, కొన్నింటిని చూస్తే ఆహ్లాదం. ఒకే మనిషి ఒకే కాగితంపై ఒకే పెన్సిలుతో గీసిన గీతలు అవి. అయినా వాటిని చూసినప్పుడు వేర్వేరు భావాలు.

ఒకే సృష్టికర్త (పరమాత్మ) జడప్రకృతిలో అనేక వస్తువులను జగత్తులో సృష్టించాడు. వాటి వెనుక తాను ఆధారంగా ఉన్నాడు. ఇప్పుడీ వస్తువులను, మనుష్యులను, జంతువులను చూస్తున్నప్పుడు రకరకాల భావాలు, ఆవేశాలు, ఉద్రేకాలు కలుగుతాయి. ప్రేమ, ద్వేషం, సంతోషం, దుఃఖం, పూజ్యభావం, శతృత్వం, నిర్లిప్తత - - - ఇలా. దీనికి కారణం? మన దృష్టియే. మాయకు లోబడ్డ పదార్థాల మీదనే మన దృష్టిగాని, మాయాధిపతి అయిన పరమేశ్వరునిపై లేదు.

రంగులమీద, బొమ్మల మీద, ఆకారాల మీదనే మన దృష్టిగాని వీటికి ఆధారమైన కాగితంపై దృష్టి లేదు. కాగితంపై దృష్టి ఉంటే నిర్వికారం. రంగులు, బొమ్మలపై దృష్టి ఉంటే అనేక వికారాలు.

అలాగే మన దృష్టి ఈ ప్రపంచంలోని జడపదార్థాలపైనే ఉంటున్నది. వాటిపై దృష్టి ఉన్నంతకాలం అన్నీ బాధలు, దుఃఖాలు, సంతోషాలు, కోపాలు, తాపాలు - - - రకరకాల వికారాలు. అలాగాక ఇవన్నీ పరమాత్మ సృష్టిలోని కల్పిత విచిత్రాలే అని గమనించి, వాటన్నింటికి ఆధారంగా ఉన్న పరమాత్మపై దృష్టి నిలిపితే ఏ వికారాలు ఉండవు. కనుక మన దృష్టిని ప్రపంచం మీద నుండి పరమాత్మమీదకు మళ్ళించాలి. అప్పుడే సమస్త వికారాలకు ఫుల్ స్టాప్ .

ఉదయం గం.10ల సమయంలో పడమర దిక్కుగా నడుస్తున్నావు. అప్పుడు నీ నీడ నీముందే ఉంటుంది. దాన్ని పట్టుకోవాలన్నా, వెనక్కు నెట్టేయాలన్నా నీవెంతగా పరుగులు తీసినా ప్రయోజనం లేదు. కాని నీవు సూర్యునివైపు తిరిగావనుకో. అప్పుడు నీ నీడ నీ వెనుక పెంపుడు కుక్కలా వెంట వస్తుంది. దీనికి కారణం నీవు సూర్యునివైపు తిరగటమే. అలాగే నీవు ఈ ప్రపంచం వైపు తిరిగావా? ఈ ప్రపంచం నిన్ను ఏడిపిస్తుంది. నీమీద స్వారీ చేస్తుంది. అలాగాక భగవంతుని వైపు తిరిగావా? ఈ ప్రపంచం నీకు దాసోహం అంటుంది. నీ చెప్పుచేతుల్లో ఉంటుంది.

అర్జునుడు కూడా ముందు భగవంతుణ్ణి చూడటం మాని సైన్యంవైపు చూశాడు. విషాదం కలిగింది. సైన్యాలను చూడకుండా భగవంతుని వైపుకు దృష్టి సారించాడు. దుఃఖం తీరిపోయింది. ఇదే కీలకం.

పరమాత్మవి 2 ప్రకృతులు. 1.అపరాప్రకృతి (జడప్రకృతి) 2.పరాప్రకృతి (చైతన్యం). అపరాప్రకృతి 8 విధాలుగా విభాగించబడి ఉన్నది. అవే పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం. ఈ ప్రకృతి యావత్తు భగవంతుని నుండే వచ్చింది. వీటికి ఆధారం ఆ పరమాత్మ చైతన్యమే. పరాప్రకృతే. వీటిని చూస్తున్నప్పటికీ మన దృష్టి వీటిపై గాక వీటికి ఆధారంగా ఉన్న చైతన్యం - పరాప్రకృతి పైకి మళ్ళించాలి.

ఈ మొత్తం అపరాప్రకృతి పరమాత్మ నుండే వచ్చింది. భూమి, భూమికి కారణం జలం. జలానికి కారణం అగ్ని, అగ్నికి కారణం వాయువు, దానికి

కారణం ఆకాశం. ఆకాశానికి కారణం మనస్సు అంటే ఆకాశాన్ని గుర్తించేది మనస్సు. మనస్సుకు అధిష్టానం బుద్ధి. వీటన్నింటితో పనిచేసేది అహంకారం.

ఈ నామరూపాలతో కూడుకున్న ప్రపంచం అంతా కార్యవస్తువు. ప్రతి కార్యానికీ ఒక కారణం ఉంటుంది. అదే కర్త. పుస్తకం ఉన్నదీ అంటే దీనికి కర్త ఉండాలి. అలాగే ఈ ప్రపంచానికి ఒక కర్త ఉండాలి. ఆ కర్తయే సర్వజ్ఞుడు - అన్నీ తెలిసినవాడు. గొప్ప తెలివైనవాడు. నియమిత పద్ధతిలో ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు. పోషించేవాడు, లయకర్త, అతడే పరమాత్మ. అతడికొక శక్తి ఉంది. అదే మాయాశక్తి. అది అలాంటిది, ఇలాంటిది అని వర్ణించటానికి వీలులేనిది. చూడటానికి కనిపించనిది. చెప్పటానికి కుదరనిది. ఎందుకంటే అది సత్తు కాదు, అసత్తు కాదు, సదసత్తూ కాదు. అనిర్వచనీయం.

ఈ మాయాశక్తి అవ్యక్తం. కనిపించేది కాదు. అంటే సాక్షాత్తుగా కనిపించదు. మీరు నాకు కనిపించినట్లు, నేను మీకు కనిపించినట్లు ఈ మాయ కనిపించదు. కాని కార్యరూపంలో కనిపిస్తుంది. ఎలా? నా చేతిలో బలం ఉంది. కాని కనిపించదు. అయితే కార్యరూపంలో కనిపిస్తుంది. ఎలా? ఈ బల్లను ఎత్తి అవతల పెట్టినప్పుడు నా చేతిలోని బలాన్ని చూడగలరు. అలాగే ఈ మాయ యొక్క శక్తి కూడా కార్యరూపంలో చూడగలుగుతామే గాని సాక్షాత్తుగా చూడలేము. గాలిని చూడలేం కాని ఆకులు, కొమ్మలు కదిలితే గాలి ఉన్నదని తెలుసుకుంటాం. అలా.

ఈ మొత్తం పరమాత్మ నుండి ఎలా వచ్చింది?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మ సంకల్పం చేశాడు - ఒక్కటే అయిన నేను అనేకం కావాలి - అని. అంతే. ఆ సంకల్పబలంతో మాయాశక్తిలో చలనం కలిగింది. అలా కలిగి ఆ మాయాప్రకృతి (అవ్యక్త ప్రకృతి) మహత్తుగా మారింది. ఇదే మొదటి మార్పు. విత్తనాన్ని భూమిలో వేసి నీరుపోస్తే రెండు రోజులకు మెత్తగా ఉబ్బి ఉంటుంది. మొదటి విత్తనరూపం మారింది. ఇంకా మొలక బయటకు రాలేదు. ఇదే మాయాశక్తి మహత్తుగా మారటం అంటే. ఆ తరువాత మొలక పుడుతుంది. అదే 'నేను'. 'నేను' అని పైకిలేచే మొలక. అదే అహంకారం. అక్కడి నుండి చెట్టుగా మారుతుంది. అవే మనస్సు, బుద్ధి. అక్కడి నుండి శాఖలు - కొమ్మలు - అవే ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి అనే సూక్ష్మ పంచభూతాలు.

ఈ ఎనిమిదింటితో జడప్రకృతి - అపరా ప్రకృతి అనే జగత్తు ఏర్పడింది. ఈ మొత్తం పరమాత్మనాశ్రయించుకొని వున్న మాయ నుండి పుట్టింది. మాయకు లోబడినంత కాలం ఇది ఉంటుంది. మాయకు అధిష్ఠానమైన పరమాత్మను పట్టుకొని మాయను అధిగమిస్తే స్వప్నం లాగా అంతా అదృశ్యం.

పరమాత్మ తన సంకల్పబలంతో మాయాశక్తిని చలింపజేసినంత కాలం ఈ దృశ్య ప్రపంచం పుడుతుంది, చాలాకాలం ఉంటుంది. చివరికి లయమైపోతుంది. ఆయన సంకల్పం చేయకపోతే అంతా అవ్యక్తంగానే ఉంటుంది. ఆపరేటర్ ప్రొజెక్టర్ స్విచ్ ఆన్ చేసినంతకాలం తెల్లని తెరపై అనేక చిత్ర విచిత్రమైన బొమ్మలు కదులుతూ, పనులు చేస్తూ, మాట్లాడుతూ ఉంటాయి. ఎన్నో కథలు జరిగిపోతాయి. ఎప్పుడైతే స్విచాఫ్ చేస్తాడో దానితో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**అన్ని బొమ్మలు కథలు బంద్. ఏమీ కనిపించవు. ఎప్పటిలాగ తెల్లని తెర మాత్రమే దర్శనమిస్తుంది.**

**అదే విధంగా ఈ జడప్రకృతి - అపరాప్రకృతి - పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం అనే ఈ అష్టప్రకృతులు పరమాత్మ చైతన్యం ఆధారంగానే సృష్టించబడి, కనిపిస్తూ ఉంటాయి. ఆ పరమాత్మ చైతన్యమే వీటికి ఆధారంగా ఉంటుంది.**

**మన దృష్టి ఈ జడ ప్రకృతిపై కాకుండా ఆధారంగా ఉన్న ఆ పరమాత్మ చైతన్యం పైకి మరలించాలి. అలా మరలించి దానిపై దృష్టిని నిలపాలంటే ఆ పరాప్రకృతి గురించి తెలుసుకోవాలి. దాని గురించే తరువాతి శ్లోకాల్లో వివరిస్తున్నారు.**

**- అపరాప్రకృతిని కదిలించే చైతన్యం పరాప్రకృతి గురించి -**

**శ్లో|| అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం|**

**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్|| (5)**

**తా|| ఈ అపరాప్రకృతి అల్పమైనది. దీనికన్నా వేరై జీవుడిగా మారింది. నా పరమమైన ప్రకృతి అని తెలుసుకో. దానివల్లనే ఈ జగత్తు ధరింపబడుతున్నది.**

**వ్యాఖ్య:- ఇంతవరకు చెప్పిన అపరాప్రకృతి జడమైనది గనుక అల్పమైనది. దానికి స్వతంత్రం లేదు. దీనికన్నా వేరైనది, శ్రేష్ఠమైనది మరొకటి ఉంది. అదే పరాప్రకృతి. అది జీవరూపం, చైతన్యం, దానివల్లనే ఈ జగత్తంతా ధరింపబడి ఉన్నది. దానినే పురుషుడు అన్నారు.**

జడమైన ప్రపంచాన్ని సృష్టించిన తరువాత భగవంతుడు తానే జీవరూపంతో దానిలో ప్రవేశించి, ఈ ప్రపంచాన్ని చైతన్యవంతం చేశాడని వేదం చెబుతున్నది. కనుక ఇది సాక్షాత్తు పరమాత్మయే. అపరా ప్రకృతి భగవంతుని స్వభావ ప్రకృతి. పరాప్రకృతి భగవంతుని స్వరూప ప్రకృతి. రెండూ ఆయన స్వరూపాలే. భిన్నం కాదు. ఈ రెండు ప్రకృతులను ఉదాహరణతో తెలుసుకుందాం.

ఒక కుండ, అందులో నీరు, దానిలో సూర్యుని ప్రతిబింబం పడుతున్నది. కుండ స్థూలశరీరం. నీరు సూక్ష్మశరీరం. ప్రతిబింబం జీవుడు. సూర్యుడు పరమాత్మ. కుండ; జలం అపరాప్రకృతి. ప్రతిబింబం పరాప్రకృతి. ఆ రెంటి కన్న విలక్షణుడైన సూర్యుడు రెండు ప్రకృతులకు అతీతుడైన పరమాత్మ.

వికారాలన్నీ కుండ, నీరు, ప్రతిబింబాలకే గాని సూర్యునికే వికారాలు లేవు. అలాగే వికారాలన్నీ పర, అపర ప్రకృతులకే గాని, ఆ పరమాత్మకు ఏ వికారాలు లేవు.

అపరాప్రకృతియైన పంచభూతాలు, మనోబుద్ధి, అహంకారాలు జడం. పరాప్రకృతియైన చిదాభాసుడు (ఆత్మప్రతిబింబం) చైతన్యం. కనుక జడరూపమైన అపరాప్రకృతి (జగత్తు) చైతన్యరూపమైన పరాప్రకృతి చేత ధరింపబడుతున్నది.

ఈ పరా ప్రకృతియే - జీవరూప చైతన్యమే స్థూల - సూక్ష్మ శరీరాలను సజీవంగా, సచేతనంగా, జ్ఞానంతో కూడినదిగా చేస్తున్నది. అంటే దేని యొక్క సాన్నిధ్యం చేత ఈ శరీర మనోబుద్ధులు పని చేస్తున్నాయో, అదే పురుషుడు -



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చైతన్యం - జీవుడు - పరాప్రకృతి. ఆ చైతన్యం లేకపోతే బాహ్య ప్రపంచంలో మనకు ఏ అనుభూతులు ఉండవు. అలాగే అంతర ప్రపంచంలో - అంటే మన మనోబుద్ధులలో కూడా ఏ విషయానుభూతి కలుగదు. మనలో జరిగే క్రియా కలాపాలన్నింటిని ఈ పరాప్రకృతియే సంరక్షించి, పోషించి, జీవింప జేస్తున్నది. కనుక ఇది శ్రేష్ఠమైనది.

జీవరూప చైతన్యం తన శక్తితో ప్రాణాన్ని ఆకర్షించి, పట్టి ఉంచుతుంది. నీతిశాస్త్రంలో ఒక శ్లోకం ఉంది. తొమ్మిది వాకిళ్ళు గల పంజరం ఉంది. దానిలో ఒక పక్షి ఉంది. వాకిళ్ళన్నీ ఎప్పుడూ తెరిచే ఉంటాయి. కాని పక్షి మాత్రం పారిపోదు. ఎంత ఆశ్చర్యం! పక్షి అంటే ప్రాణం. 9 వాకిళ్ళు గల పంజరం అంటే నవద్వారాలు గల శరీరం. ఈ శరీరం యొక్క ద్వారాలు - కళ్ళు, ముక్కు రంధ్రాలు, చెవులు, నోరు, గుదం, జననేంద్రియం - అన్నీ తెరిచే ఉంటాయి. అయినా ప్రాణపక్షి పారిపోదు. ప్రాణపక్షి పారిపోతే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. పారిపోకపోతేనే ఆశ్చర్యం. కాని అదేమి విచిత్రమో గాని పారిపోతేనే మనం ఆశ్చర్యపోతుంటాం. పారిపోకపోతే అసలు తలచుకోం, పట్టించుకోము. ఎందుకిలా జరుగుతున్నది? ఇదిగో ఈ పరాప్రకృతి - జీవచైతన్యం ప్రాణాన్ని ఆకర్షించి పట్టి ఉంచుతుంది గనుక.

ఇలా జగత్తును ధరించేది పరాప్రకృతి. అయినా రెండూ మిథ్యయే. ఈ రెంటికీ విలక్షణంగా ఉన్న పరమాత్మే సత్యం. కనుక ఆ సత్యాన్ని చేరుకోవాలి.

- ఈ జగత్తు అనే బిడ్డకు తల్లిదండ్రులెవరో భగవానుడు తెలుపుతున్నాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో|| ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ|**

**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా|| (6)**

**తా||** ఇది అన్ని ప్రాణులకు గర్భం అని తెలుసుకో. ఈ యావత్తు జగత్తుకు నేనే పుట్టుకను, అలాగే ప్రళయాన్ని కూడా.

**వ్యాఖ్య:-** ఒక శిశువు జననానికి తల్లి అనబడే స్త్రీ, తండ్రి అనబడే పురుషుడు, వారిద్దరి కలయిక ఎలా కారణమో అలాగే ఈ సమస్త ప్రాణికోట్లతో కూడిన జగత్తు యొక్క సృష్టికి 8 ప్రకృతులతో కూడిన అపరాప్రకృతి మరియు పురుషుడు అనబడే చైతన్యం యొక్క కలయికే కారణం.

జడప్రకృతి లేకపోతే పురుషుడు ప్రవర్తించటానికి అతడికొక వ్యవహారక్షేత్రం ఉండదు. అలాగే చైతన్యరూప పురుషుడు లేకపోతే జడప్రకృతి స్వతంత్రంగా ప్రవర్తించలేదు. బల్బు ఉంటేనే కరెంటు వ్యక్తమౌతుంది. కరెంటు ఉంటేనే జడమైన బల్బు వెలిగి కాంతినీయగల్గుతుంది. ఇలా కరెంటు, బల్బు అనే రెండూ కలిస్తేనే కాంతి సృష్టించబడేది.

ఈ భావాన్ని దృష్టిలో పెట్టుకొనియే భగవానుడు పర, అపరప్రకృతులే సమస్త భూతాలకు 'యోని' అని చెబుతున్నాడు. ఈ రెండు ప్రకృతులు నావే అంటున్నాడు కనుక ఈ జగత్తు యొక్క సృష్టికి కారణం పరమాత్మే అని చెప్పక తప్పదు. అంటే ఈ రెండు ప్రకృతుల ద్వారా జగన్నాటకాన్ని సృష్టిస్తున్నాడన్నమాట.

సృష్టికే కాదు ప్రళయానికి కూడా నేనే కారణం అంటున్నాడు భగవానుడు. మట్టి నుంచి వచ్చిన కుండలన్నీ శిథిలమై తిరిగి మట్టిలోకే

చేరిపోయినట్లుగా, బంగారం నుండి వచ్చిన నగలన్నీ కరిగిస్తే తిరిగి బంగారంలోకి చేరిపోయినట్లుగా పరమాత్మ నుండి వచ్చిన ఈ నామరూపాలతో కూడిన జగత్తు తిరిగి ఆయనలోనే లయమైపోతుంది.

పురుషుడు తన స్వంతమాయలోపడి, అపరాప్రకృతితో కలిసి, సుఖదుఃఖాది అనుభవాలను పొందుతున్నాడు (ప్రభవ), తన దివ్యశక్తిని తెలుసుకొని మాయ నుండి విడివడిపోతే సుఖదుఃఖాల నుండి విముక్తుడవుతున్నాడు (ప్రలయః)

అంటే ప్రకృతితో పురుషుడు కలిస్తే జగత్తు యొక్క సృష్టి, ప్రకృతి నుండి విముక్తుడైతే జగత్తు యొక్క లయం. ఈ ప్రభవః ప్రళయాలకు - సృష్టి లయాలకు కారణమైన ఆ పరమాత్మ ఎట్టివాడు? ఎక్కడ ఉన్నాడు? ఎలా ఉన్నాడు? ఎలా గుర్తించాలి? 7వ శ్లోకంలో -

**శ్లో||** మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!|
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి గణాఇవ|| (7)

**తా||** ధనంజయా! నాకన్నా ఎక్కువైనదీ, వేరైనదీ కొంచెం కూడా ఏదీలేదు. ఇది యావత్తు మణులలో దారంలాగా నాలో గ్రుచ్చబడింది.

**వ్యాఖ్య:-** నాకన్నా శ్రేష్ఠ వస్తువు వేరే ఏదీ లేదు. అంటే నేనే అన్నింటికన్నా శ్రేష్ఠం. ఇది పరమాత్మ యొక్క పారమార్థిక స్వరూపం - యదార్థ స్వరూపం.

ఇక్కడ అర్జునుని ధనంజయా! అని సంబోధిస్తున్నాడు భగవానుడు. ధనంజయ! అంటే ధనాన్ని జయించినవాడా! అని. ధర్మజ రాజసూయ

మహాయాగ సందర్భంగా అర్జునుడు ఉత్తర దిక్కుకు వెళ్ళి దేశదేశాల రాజులను జయించి, వారి నుండి అపార ధనరాసులను కప్పంగా తెచ్చి కుప్పలు పోశాడు. అందుకే ధనంజయ! అన్నారు. ఇది సాధారణ అర్థం. వేదాంత పరిభాషలో ధనం అంటే జ్ఞానధనం అని. భౌతిక ధనం ఒక్క జన్మకు పనికి వస్తుంది. కాని జ్ఞానధనం జన్మజన్మలకు ఉపయోగపడుతుంది. అంతేకాదు జన్మరాహిత్యాన్ని, మోక్షాన్ని కలిగిస్తుంది. జ్ఞానం ఉంటే చక్రవర్తులు కూడా పూజిస్తారు. ఒక ఉద్యోగి లేదా కోటేశ్వరుడు, లేదా హోదాలో ఉన్నవాడు వారివారి పరిధులలో గౌరవింపబడుతారు. కాని 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్నట్లు. ఒక విద్వాంసుడు లేదా జ్ఞాని అంతటా పూజింపబడతాడు. అట్టి జ్ఞానాన్ని సంపాదించినవాడు గనుక అర్జునుణ్ణి ధనంజయా! అనటం ఎంతో సమంజసం, అలాగే వ్యంగంగా భౌతిక ధనాన్ని సంపాదించటం కాదయ్యా అర్జునా! ఆధ్యాత్మిక ధనాన్ని సంపాదించు, అదీ గొప్ప విషయం అనే భావంతో ధనంజయా! అని ఉండవచ్చు.

<u>మత్తః పరతరం నాన్యత్ కించిత్ అస్తి:-</u> పరమాత్మ కన్న వేరైనది ఏదీ కొంచెం కూడా లేదు; అంటే ఈ ప్రపంచంగాని, ఇందులోని జీవుళ్ళుగాని, ఇతర స్థావర జంగమాలు గాని - అన్నీ పరమాత్మ కన్నా వేరుకావు. అన్నీ యదార్థంగా పరమాత్మ స్వరూపాలే. అందరూ పరమాత్మ స్వరూపాలే అయినప్పటికీ మనకు అలా కనిపించకపోవటానికి కారణం మన దృష్టి దోషమే. మన దృష్టిని సరిచేసుకుంటే అంతా పరమాత్మగానే దర్శనమౌతుంది. అందుకే "దృష్టిం జ్ఞాన

మయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మమయం జగత్" - దృష్టి జ్ఞానాకారమైతే సృష్టి బ్రహ్మాకారమౌతుంది - అని వేదం చెబుతున్నది.

సర్వం పరమేశ్వర స్వరూపమే అనటానికి ఒక చక్కని కృష్ణలీల భాగవతంలో ఉన్నది.

శ్రీకృష్ణుడు బృందావనంలో గోపబాలురతో కలసి గోవులను మేపటానికి వెళ్ళి, కొంతసేపు ఆటలాడుకొని చల్దులు ఆరగిస్తున్నారు. అందరూ వలయాకారంలో కూర్చొని ఒకరి చేతిలో ముద్దను మరొకరు లాక్కుంటూ, ఒకరి చేతిలోని నంజుడును మరొకరు నోటితో అందుకుంటూ, ఎంగిలి మంగలం అనే తేడా లేకుండా తింటున్నారు. గోపబాలుర చేతిలోని చల్దులను ఒడిసి లాక్కొని తింటున్నాడు కన్నయ్య. కన్నయ్య చేతిలోనిది లాక్కొని తింటున్నారు స్నేహితులు. భగవంతుని ఎంగిలి భక్తునికి ప్రసాదమైతే భక్తుని ఎంగిలి భగవంతునికి ప్రసాదం. అదొక లీల. ఇదంతా చూస్తున్న బ్రహ్మదేవునికి ఈ ఎంగిలి తినే శ్రీకృష్ణుడు భగవంతుడేనా? అని సందేహం వచ్చింది. ఎంతవారైనా మాయకు లొంగేవారే. అందుకే ఎంగిలి ముద్దల కోసం దేబిరించుకుంటూ వాటిని అందుకొనుటకు ఎగబడుతూ, స్నేహితులతో వాటికోసం పోట్లాడుతూ ముద్ద దొరికితే పరమానందం చెందే ఈ అర్భకుడు భగవంతుడా? అనే సందేహం వచ్చింది. సందేహం రాగానే పరీక్షించాలనుకున్నాడు.

వెంటనే ఆవులను, లేగదూడలను మాయం చేశాడు. అవి కనిపించక పోయే సరికి గోపబాలురు భయంతో తినే తినే ముద్దలను వదిలి

లేవబోతున్నారు. "నేను వెళ్ళి గోవులను వెతికి వస్తాను" అని కన్నయ్య వారికి నచ్చజెప్పి బయలుదేరాడు. గోవులు ఎక్కడా కనిపించలేదు. గోవులు కనిపించలేదని గోవిందుడు తిరిగి వచ్చేసరికి ఇక్కడ ఉన్న గోపబాలురందరిని మాయం చేశాడు బ్రహ్మదేవుడు. బ్రహ్మదేవుని పితలాటకం తెలుసుకున్నాడు కన్నయ్య. సంకల్పమాత్రంతో గోవులూ తానే అయ్యాడు, లేగదూడలూ తానే అయ్యాడు, గోవులను తోలే గోపబాలకులూ తానే అయ్యాడు. సర్వం కృష్ణమయం - భగవన్మయం. అదొక కమనీయదృశ్యం. ఎవరు తెలుసుకోగలరు ఈ వైష్ణవ మాయను? ఒక సంవత్సరం గడిచిపోయింది. బ్రహ్మదేవునికి శృంగభంగమైంది. బాలకృష్ణుని పాదాలపై బడి క్షమించమన్నాడు. ఇలా సంవత్సరం పాటు అన్ని రూపాలలో కన్నయ్యే ఉన్నాడు. అయినా ఎవ్వరూ తెలుసుకోలేకపోయారు. అలాగే ఇక్కడ ఉన్న సమస్త ప్రాణులూ పరమాత్మ స్వరూపులే, అయినా బాహ్యదృష్టి గలవారు తెలుసుకోలేరు.

ఇలా ఈ జగత్తు అంతా పరమాత్మే అయినా ఆయనను తెలుసుకోలేక పోతున్నాం. ఈ జగత్తులో పరమాత్మ ఎలా వ్యాపించియున్నాడు? ఎక్కడ ఎలా దాగి ఉన్నాడు? ఆయనను మనం దర్శించాలంటే ఎలా? అనే విషయాన్ని రెండవ పాదంలో తెలియజేస్తున్నాడు భగవానుడు.

<u>సూత్రేమణిగణా ఇవ ఇదం సర్వం మయి ప్రోతం:-</u> దారమునందు మణులు గ్రుచ్చబడినట్లు ఈ సమస్త ప్రపంచం నాయందు కూర్చబడినది.

మణులు వేరువేరు సైజులుండవచ్చు, వేరు వేరు రంగుల్లో ఉండవచ్చు, వేరువేరు ప్రకాశం కలిగిఉండవచ్చు. కాని వాటిని కట్టిన సూత్రం - బంగారు తీగ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మాత్రం ఒక్కటే. పూలదండలో బంతి, చామంతి, మల్లె, గులాబీ, మరువం - ఇలా రకరకాల పూలు ఉండవచ్చు. అయితే అన్నింటిని కలిపి కట్టిన దారం మాత్రం ఒక్కటే. అన్నింటికీ ఆధారం ఒక్కటే. అలాగే అన్ని వస్తువులకు, అన్ని ప్రాణులకు ఆధారం పరమాత్మే. అతడి ఆధారం లేకపోతే ఈ ప్రపంచం నిలిచేది కాదు.

మరి ఇలా ప్రపంచమంతటా వ్యాపించియున్న పరమాత్మను ఎలా దర్శించగలం? ఒక్కొక్క పూసను తొలగించి చూస్తే సూత్రం కనిపిస్తుంది. ఒక్కొక్క పుష్పాన్ని తొలగించి చూస్తే దారం కనిపిస్తుంది. అలాగే నామ, రూప, గుణాలను తొలగించి చూస్తే అంతటా పరమాత్మే కనిపిస్తాడు. కనుక అంతటా ఉన్న పరమాత్మను చూడాలంటే బాహ్యదృష్టిని విడనాడాలి. సూక్ష్మ దృష్టి - అంతర్ దృష్టి - జ్ఞానదృష్టి కావాలి.

మామూలు కెమేరా పైపై రూపాన్ని చూడగలుగుతుంది. అదే X - ray కెమేరా అయితే లోపలున్న ఎముకలను చూడగలుగుతుంది. కనుక దృశ్యం మీద వ్యామోహాన్ని విడిచిపెట్టి దృక్కుమీద ఆసక్తి కలగాలి.

పరమార్థంలో అంతా పరమాత్మే. అన్నీ పరమాత్మే. వ్యవహారంలో మాత్రం అన్నింటిలో పరమాత్మ ఉన్నాడని అభ్యాసం పెట్టుకోవాలి. తల్లిపిల్లలకు పాలిస్తూ వారిలో భగవంతుని చూడాలి. గురువు శిష్యులలో భగవంతుని చూడాలి. డాక్టరు రోగులలో భగవంతుని చూడాలి. వ్యాపారస్తుడు కస్టమర్లలో భగవంతుని చూడాలి. పాలకుడు ప్రజలలో భగవంతుని చూడాలి. లాయరు

క్లయింట్లలో భగవంతుని చూడాలి. అలా చూడగలిగితే అన్యాయాలు, మోసాలు, ఉండవు. అందరూ సుఖంగా సంతోషంగా ఉంటారు.

- ఇలా అందరూ అందరిలో - అన్నింటిలో భగవంతుని చూడటానికి ఎలా అభ్యాసం చేయాలి? రాబోయే 5 శ్లోకాలలో వివరించబోతున్నాడు భగవానుడు.

**శ్లో||** రసోఽహమప్సు కౌంతేయ! ప్రభాస్మి శశి సూర్యయోః|

ప్రణవస్సర్వ వేదేషు శబ్దఃఖే పౌరుషం నృషు|| **(8)**

**తా||** కౌంతేయా! నీటిలో రుచిని నేను. సూర్యచంద్రులలోని కాంతిని నేను. అన్ని వేదాలలోని ప్రణవాన్ని, ఆకాశంలో శబ్దాన్ని, నరులలో పౌరుషాన్ని నేను.

**వ్యాఖ్య:-** మణులలో దారంలాగా పరమాత్మ ప్రపంచము నందంతటా వ్యాపించియున్నాడు. అట్టి పరమాత్మను దర్శించాలంటే బాహ్యదృష్టిని వదలి అంతర్ దృష్టిని కలిగిఉండాలి. ఈ నామరూప గుణాత్మక ప్రపంచంలోనే నామరూప గుణాలను తొలగించి పరమాత్మను దర్శించాలి.

మన వీధిలోనే ఉన్న విశ్వేశ్వరరావు దసరా పండుగకు సరదాగా పులి వేషం వేశాడు. ఒంటినిండా రంగు, పులిటోపి, తోక తగిలించుకొని ఉన్నాడు. అతనినెవరూ గుర్తుపట్టలేరు. అచ్చం పులిలాగానే ఉన్నాడు. అతని నిజస్వరూపాన్ని తెలుసుకోవాలంటే బాహ్యదృష్టి వదలి అంతర్ దృష్టిని కలిగిఉండాలి. రంగు కడిగివేసి, తలను కప్పిన టోపీను తొలగించి, తోకను పీకేస్తే సరి అతడి అసలు స్వరూపం బయటపడుతుంది. అలాగే నామరూప,

గుణాలతో ఉన్న పరమాత్మ జీవుడుగా వ్యక్తమవుతున్నాడు. ఆ నామరూప గుణాలను తొలగించి చూస్తే అతడి నిజస్వరూపం పరమాత్మే.

ఇలా ప్రపంచంలో అన్నింటిని అంతర్ దృష్టితో చూడటం ఎలా అభ్యాసం చెయ్యాలో అర్జునునికి బోధపడేలా కొన్ని విభూతులను తెలియజేస్తున్నాడు భగవానుడు. ఈ అభ్యాసం కుదిరితే సర్వత్రా పరమాత్మనే దర్శించవచ్చు. ఆ నిష్ట కుదిరేంత వరకు అన్నింటిలో పరమాత్మే ఉన్నాడనే ఉపాసన అలవాటు చేసుకోవాలి. అది ఎలాగో ఈ శ్లోకం నుండి ప్రారంభిస్తున్నారు.

1.రసోఽహం అప్సు:- నీటిలో రుచిని నేను. మంచినీటిలోని రుచి మన దాహాన్ని తీరుస్తుంది. అంతేకాదు నాలుకపై తడిలేకపోతే ఏ రుచినీ తెలుసుకోలేము. అందుకే నాలుకపై లాలాజలం ఊరుతుంటుంది. భగవంతుడు రసస్వరూపుడు. అందుకే 'రసోవైసః' అని వేదమంత్రం చెబుతున్నది. కనుక ఎక్కడెక్కడ రసమున్నా అది ఆయన భిక్షే. ఆయన రసస్వరూపుడు, రసేశ్వరుడు.

నీరు త్రాగి దప్పిక తీర్చుకొని తృప్తి చెందుతున్నావు. దాహాన్ని తీర్చే శక్తి - రుచి నీటికెక్కడిది? రసస్వరూపుడైన భగవంతునిదే. కనుక నీటిలోని రుచి భగవంతుడే. ఎవరి మాటలన్నా మధురంగా ఉండి మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తుంటే ఆ మాధుర్యం భగవంతుడే. ఈ భావన చేస్తుంటే చిత్తం ఎప్పటికప్పుడు అంతర్ముఖమై భగవంతుని చేరుకుంటుంది. ఇది ఒట్టి మాట కాదు. నిజం. మనం రోజూ ఎన్నోసార్లు నీటిని వాడుతుంటాం. త్రాగేటప్పుడు,

స్నానం చేసేటప్పుడు, కాళ్ళు చేతులు కడుక్కొనేటప్పుడు, వంట చేసేటప్పుడు, అంట్లు తోమేటప్పుడు, కళ్ళాపి చల్లేటప్పుడు - అన్ని సందర్భాలలోను ఈ భావన చేశావా? - ఇంతకు మించిన జపం - తపం - ధ్యానం - ఉపాసన ఇంకేముంటుంది? భగవంతుని పూజలు ప్రత్యేకంగా చేయ్యాల్సిన పనిలేదు ఈ భావన చేస్తే.

"గంగా సమం నాస్తి తీర్థం" - గంగ వంటి తీర్థం లేదు. గంగలో మునిగితే పాపాలు పోతాయని మన విశ్వాసం. ఐతే కొందరు నాగరికులమను కొనేవారు గంగలోని కప్పలు, చేపల సంగతేమిటి? అని అడుగుతారు. ఆ భావనతో అవి అందులో ఉంటే వాటికీ గొప్పపుణ్యమే. భావన ప్రధానం గదా!

ఆచార్య వినోబాభావే రైలులో కలకత్తా నుండి కాశీ వెళుతున్నాడు. రైలు మొగల్ సరాయి స్టేషన్ దాటి బ్రిడ్జి మీదుగా వెళుతున్నది. ప్రక్కనే కూర్చున్న ఒక పల్లెటూరి రైతు మూటలో నుండి ఒక కాణీ (coin) తీసి నదిలో విసరివేసి, "గంగా! తవదర్శనాన్ముక్తి" అని నమస్కారం చేశాడు. ప్రక్కనే ఉన్న ఒక ఆఫీసరు దర్జాగా సిగరెట్ కాలుస్తూ ఆ రైతును చురచుర చూస్తూ "ఇలాంటి మూర్ఖులు డబ్బును వృధా చేస్తారు, బుద్ధిహీనులు" అన్నాడు. వినోబా విన్నాడు. ఆఫీసరుతో అంటున్నాడు "అయ్యా! ఆ అమాయకరైతు గంగలో ఒక కాణీ వేస్తే మూర్ఖుడు, డబ్బు వృధా చేస్తున్నాడు అన్నావు. నీకు క్రియలో దృష్టేగాని భావనలో లేదు. పరమేశ్వర భావనతో 'కాణీ' సమర్పించాడు. భావనతో కూడినప్పుడు కర్మకు గొప్ప విలువ వస్తుంది. భావనలేని కర్మ దండగ మారి కర్మ. ఒక్క కాణీ నీటి పాలు చేస్తే అంగలారుస్తున్నావు. నీవు రూపాయలకు రూపాయలు

నిప్పుపాలు చేస్తున్నావు గదా! మీలో ఎవరు బుద్ధిమంతులు? ఎవరు బుద్ధిహీనులు?" అన్నాడు. కనుక భగవద్భావనతో నీటిని చూడాలి.

2.ప్రభాస్మి శశి సూర్యయోః:- సూర్యచంద్రులలోని ప్రకాశాన్ని నేను. సూర్యునిలో కోట్లాది సంవత్సరాల నుండి తరగని కాంతి ఉన్నది. తీక్షణమైన ఆ కాంతియే చంద్రునిపై బడి చల్లగా, ఆహ్లాదమైన వెన్నెలగా మనకు చేరుతుంది. సూర్యచంద్రుల ముఖ్య ధర్మం వెలుగునివ్వటమే. ఆ వెలుగు ఎక్కడిది? అది భగవంతునిదే. వెలుగు లేకపోతే మానవుడు జీవించలేడు. చీకటి దయ్యం లాంటిది. ప్రకాశం ఎక్కడి నుండి వచ్చినా అది నా సొత్తే అని భగవానుడు తెలియజేస్తున్నాడు. ఇంటిలోని ఏ బల్బు వెలిగినా, ఆ వెలుగు కరెంటుదే. అలాగే వెలుగు సూర్యుని నుండి వచ్చినా, చంద్రుని నుండి వచ్చినా, అగ్ని నుండి వచ్చినా అది నాదే. కనుక వెలుగు రూపంలో ఉన్నది భగవంతుడే అని ఉపాసించాలి.

3.ప్రణవస్సర్వ వేదేషు:- వేదాలలోని ప్రణవాన్ని నేను. నాలుగు వేదాలలోని విషయమంతా ప్రణవ స్వరూపమైన పరమాత్మయే. వేదాల అద్యంతాలలో ఉన్నది ప్రణవమే. ప్రణవమంటే శబ్దబ్రహ్మమే. పరమాత్మను శబ్దంతో సూచించేది 'ఓం' అనే ప్రణవం. ఈ 'ఓం' 'అ' కార 'ఉ' కార 'మ' కారముల కలయికయే. నోటితో చేసే శబ్దాలన్నింటిలో 'అ' కారం మొదటిది; 'ఉ' కారం మధ్యది; 'మ' కారం చివరిది.

ఋగ్వేదం మొదటి పదంలోని మొదటి అక్షరం 'అ'

యజుర్వేదం మధ్యపదంలోని మధ్య అక్షరం 'ఉ'

సామవేదం చివరిపదంలోని చివరి అక్షరం 'మ్'

ఈ 3 అక్షరాలు 'ఓం' కారంలో ఇమిడి ఉన్నాయి. కనుక వేదాలన్నీ ఓం కారంలోనే ఇమిడి ఉన్నాయి. అంటే వేదాలలో ఉన్నది 'ఓం' కారమే, భగవంతుడే. ప్రణవ స్వరూప పరమాత్మే.

ప్రపంచంలో ఏ గ్రంథాలైనా 52 అక్షరాలతోనే ఉంటాయి. ఈ అక్షరాలకు మూలం ఏమిటి? ఎలా వచ్చినవీ అక్షరాలు? మన శరీరంలో 6 నాడీ కేంద్రాలున్నాయి. ఇవే షట్చక్రాలు. ప్రతి చక్రంలో దళాలు (ఆకులు) ఉంటాయి. 6 చక్రాలకు కలసి 52 దళాలున్నాయి. ఒక్కొక్క దళం ఒక్కొక్క అక్షరానికి సంకేతం. మనం 'అ' అనే అక్షరం పలకాలి. కంఠస్థానంలో ఉన్న విశుద్ధ చక్రంలోని మొదటి దళం కదిలి 'అ' శబ్దం వెలువడుతుంది. అది కదలకపోతే ఈ శబ్దం వెలువడదు. ఒక్కొక్క దళం కదిలినప్పుడు ఆ దళానికి చెందిన శబ్దం బయటకు వస్తుంది.

ఈ దళాలను కదిలించే శక్తి ఏది? వాటంతట అవి కదలవు. ఋషులు ఈ విషయాన్ని కనిపెట్టారు. ఈ 52 దళాలను కదిలించే శక్తిని 'అనాహతధ్వని' అంటారు. అదే కుండలిని, అదే గాయత్రి, అదే ప్రణవం. ప్రయత్నంతో కదిలే ధ్వనిని 'ఆహత ధ్వని' అంటారు. అప్రయత్నంగా కదిలే ధ్వనిని 'అనాహత ధ్వని' అంటారు. ఈ ధ్వని మనలో ఎప్పుడూ ఉంటుంది. దానిని రెండు చెవులు మూసుకొని మనం వినవచ్చు. మరణసమయం ఆసన్నమైతే ఈ ధ్వని క్షీణిస్తూ వస్తుంది. ఈ ధ్వని సాధనలో నిష్ణాతులైన వారు ఈ ధ్వని యొక్క ప్రమాణాన్ని బట్టి తాను ఫలానా రోజున మరణించబోతున్నానని తెలియజేస్తాడు.

ఇలా ఈ ప్రణవంలోనే వేదాలన్నీ ఉన్నాయి. కనుక వేదాలన్నీ పరమాత్మ స్వరూపాలుగా ఉపాసన చేయాలి. ప్రణవశబ్దం పరమాత్మేనని గ్రహించాలి.

4.శబ్దఃఖే:- ఆకాశంలోని శబ్దాన్ని నేను అంటున్నాడు భగవానుడు. ఆకాశం అంటే ఖాళీప్రదేశం. వస్తువులు, వ్యక్తులు తిరగటానికి అవకాశం కల్పించేది ఆకాశం. రెండు వస్తువులు ఒకదానికొకటి దగ్గరై డీ కొంటే శబ్దం వస్తుంది. కనుక ఆకాశంలో శబ్దం వస్తుంది. ఆ శబ్దం నేనే అంటున్నాడు భగవానుడు. శబ్దం వల్లనే సుఖదుఃఖాలు, రాగద్వేషాలు కలుగుతాయి. చివరకు మోక్షం కూడా శబ్దం వల్లనే పొందాలి. శబ్దంలో శక్తి ఉంది. అదే శబ్దశక్తి. అదే పరమాత్మ. నీవు దూరంలో కనబడకుండా ఉండి అరుస్తున్నావు. అంటే శబ్దం చేస్తున్నావు. ఆ శబ్దాన్ని అనుసరించి వెళ్తే నీవు చిక్కుతావు. అలాగే శబ్దం వల్ల శబ్దానికి కర్త అయిన భగవంతుణ్ణి మనం గుర్తించవచ్చు. శబ్దంలో మనస్సు లయిస్తుంది. మనస్సు పాములాంటిది. పాముకు 2 లక్షణాలు. 1.వంకర టింకరగా పోవటం. 2.కనిపించినదానినల్లా కరవటం. అలాగే మనస్సు కూడా వంకర టింకరగా పోతుంది. చూచినదానినల్లా కావాలంటుంది. ఈ మనస్సును శబ్ద ఉపాసనలో లయం చేయవచ్చు. దీర్ఘమైన ప్రణవోచ్ఛారణయే అట్టి శబ్దం. మనస్సును లయింపజేసే శబ్దం అదే - - - ఓంకారం.

భగవంతుని ఉపాసనకు ఎక్కడికీ పోనక్కరలేదు. శబ్దం ద్వారా ఉపాసన చేయవచ్చు. శబ్దం అంతా పరమాత్మేనని ఉపాసన చేయాలి. ప్రతి శబ్దంలో ఉన్నది పరమాత్మేనని చేసే భావనయే ఉత్తమోత్తమ ఉపాసన. ఆకాశంలోనే గదా శబ్దం. ఆకాశం అంతటా ఉన్నది ఆ పరమాత్మేనని ఉపాసన చెయ్యాలి.

**5.పౌరుషం నృషు:- నరులలో పౌరుషాన్ని. పట్టుదలతో ఒక ఫలితాన్ని సాధించాలని పనిచేసే శక్తినే పౌరుషం అన్నారు. ఇట్టి పౌరుషం - అంటే పట్టుదల మానవులలో ఉంటుంది. ఈ శక్తి జంతువులలో గాని, ఇతర ప్రాణులలో గాని సాధారణంగా ఉండదు. ఒకవేళ కొన్నింటిలో ఉన్నట్లు కనిపించినా అది దాని సహజలక్షణమే గాని ప్రయత్నపూర్వకంగా చేసే పురుషార్థం కాదు. ఇట్టి పురుషార్థం మానవుల ముఖ్యధర్మం. ఆ ధర్మాన్ని - (పౌరుషాన్ని - పట్టుదలను) నేనే అంటున్నాడు భగవానుడు.**

**ప్రారబ్ధం - పురుషార్థం అని రెండు కర్మ నియమాలున్నాయి. ఎలా జరగాలో అలా జరుగుతుందని కర్మఫలం మీద ఆధారపడి ఉండటం ప్రారబ్ధం. అలాగాక ప్రయత్నం చేయటం పురుషార్థం. నీవు ఇప్పుడు పొందే ఫలితాలన్నీ ప్రారబ్ధం మీదనే ఆధారపడి ఉంటాయి. నీవు చేసే పురుషార్థం అంతా తర్వాత ఎప్పుడో ప్రారబ్ధంగా మారుతుంది. మానవుడు తాను వచ్చిన పని ఏమిటో తెలుసుకొని పురుషార్థం చెయ్యాలి. నేను - నాది అనే అహంకారం లేకుండా ఇది భగవంతుని సొత్తు - ఆయన ఇచ్ఛ అనుకుంటూ పురుషార్థం చెయ్యాలి. ఆ శక్తి భగవంతుడే అని భావన చేయాలి. అదే ఉపాసన. పురుషార్థం చేయుటే భగవంతుని పూజ.**

**- అందరిలో అన్నింటిలో భగవంతుని చూసే అభ్యాసం ఎలా చేయాలో ఇంకా చెబుతున్నారు.**

**శ్లో|| పుణ్యోగంధః పృధివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ|**

**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు|| (9)**

**తా||** భూమిలోని సువాసనను నేను. అగ్నిలోని ప్రకాశాన్ని, సమస్త భూతాల లోని ప్రాణాన్ని. తపస్సు చేసే వారిలో తపస్సును.

**వ్యాఖ్య:-** భగవంతుని ఉపాసించడానికి అరణ్యాలకు గాని, కొండ గుహలకు గాని, పుణ్యక్షేత్రాలకు గాని, దేవాలయాలకు గాని వెళ్ళనక్కరలేదు. నీవు ఉన్న చోటనే వుండి భగవదుపాసన చేయవచ్చు — ఎలా?

1.పుణ్యోగంధః పృధివ్యాంచ:- భూమికి సహజ సిద్ధంగా ఒక సువాసన ఉంది. ఆ సువాసన పట్టణాలలో తెలియక పోవచ్చు గాని పల్లెలలో బాగా తెలుస్తుంది. వేసవికాలంలో భూమి బాగా వేడెక్కిపోతుంది. వేడెక్కిన ఆ భూమిమీద వర్షాకాలంలో చినుకులు పడటంతో కమ్మని వాసన వస్తుంది. ఇది పొలాలలో బాగా తెలుస్తుంది. అదే భూమి యొక్క సహజ సువాసన. అది భగవంతుని విభూతియే - అని ఉపాసన చేయాలి. ఆ సువాసన ముక్కుపుటాలకు తగలగానే ఇది పరమాత్మే అని భావన చేయాలి. అదే ఉపాసన.

పుణ్యగంధమనే మాటకు యోగశాస్త్రంలో మరొక అర్థం వుంది. అసలు పృథ్వీతత్త్వం బయట లేదు. మన లోపలే ఉంది. బయట ఉన్నది పంచీకరణం చెందిన భూమి. అపంచీకృతమైన భూమి - స్వచ్ఛమైన భూతత్వం లోపల ఉన్నది. అది మన శరీరంలో మూలాధార చక్రం వద్ద ఉన్నది. యోగి అయినవాడు మూలాధారంలో చిత్తాన్ని ఏకాగ్రం చేసి ధ్యానించినప్పుడు అక్కడ ఘర్షణ ఏర్పడి అక్కడి పృథ్విలోని పుణ్యగంధం బైటపడుతుంది. అందుకే

యోగుల శరీరం నుండి సుగంధం వెలువడుతుంది. వారు ఏ సుగంధ ద్రవ్యాలనూ వాడరు. అయినా వారి శరీరం నుండి సహజ సువాసన వెలువడుతుంది. అదే భగవంతుని స్వరూపం అని ఉపాసన చేయాలి.

2.తేజశ్చాస్మి విభావసౌ:- అగ్నియందలి తేజస్సును (వేడిని) నేను, తేజస్సు (వేడి) లేని అగ్ని వుండదు. అగ్నిలోని ఆ తేజస్సును భగవంతునిగా ఉపాసన చేయాలి. అగ్ని జోలికి వెళ్తే చురుక్కు మనిపించక మానదు. అది భగవంతుని విభూతియే. ధ్యానంలో జ్యోతిని లక్ష్యంగా పెట్టుకుంటారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలను జ్యోతి ప్రజ్వలనంతో ప్రారంభిస్తారు. ఇదంతా భగవంతుని అనుగ్రహ ఆశీర్వాదాల కోసమే.

క్రిందటి శ్లోకంలో పంచభూతాలలోని నీరు, ఆకాశం గురించి చెబితే ఈ శ్లోకంలో భూమి, అగ్ని గురించి చెప్పారు. మనం ప్రతిరోజూ వీటితో సంబంధం కలిగే వుంటాం. భూమిని చూసినప్పుడు అందులోని సువాసనను, నీటిని ఉపయోగించినప్పుడు అందులోని రుచిని, అగ్నిని చూసినప్పుడు దానిలోని వేడిని, ఆకాశాన్ని చూసినప్పుడు దాని శబ్దగుణాన్ని భగవంతునిగా ఉపాసన చేయటం అలవరచుకోవాలి.

3.జీవనం సర్వభూతేషు:- అన్ని భూతాలలోని ప్రాణాన్ని నేనే. ఈ లోకంలో సమస్త భూతాలు - అంటే మనుషులు, జంతువులు, పక్షులు, క్రిములు, కీటకాలు, పాములు, కప్పలు, చేపలు - అన్నీ ఎలా జీవిస్తున్నాయి? ప్రాణం వుండటం వల్లనే. ఆ ప్రాణం భగవంతుడే అని ఉపాసించాలి. అంటే మనం భగవంతుని వల్లనే జీవిస్తున్నాం. సాధారణంగా బయటవున్న వాయువు మన

ముక్కు రంధ్రాల ద్వారా లోనికి పోయినప్పుడు అది ప్రాణంగా మారి మనం జీవించడానికి ఆధారంగా వున్నది. అసలు వాయువు ప్రాణంగా ఎలా మారింది? లోపల వున్న ఆత్మచైతన్య స్పర్శ వల్లనే. చనిపోయిన వ్యక్తికి ముక్కురంధ్రాలున్నాయి కదా! వాటి ద్వారా బయటి గాలిని లోపలికి పంపితే అది ప్రాణంగా మారుతున్నదా? లేదు. కారణం? ఆత్మచైతన్య స్పర్శ లేకపోవటం వల్ల. కనుక మనలోని ప్రాణం పరమాత్మ. అంటే పరమాత్మే మన ప్రాణేశ్వరుడు. ఎవరి ప్రాణానికి హాని కలిగించినా అది భగవంతునిపై వేసిన దెబ్బే ఔతుంది. అలా అందరిలోనూ భగవంతుడే ప్రాణస్వరూపంలో వున్నాడని ఉపాసన చేయాలి.

4.తపశ్చాస్మి తపస్విషు:- తపస్సు చేసే వారిలోని తపస్సును నేను. తపస్సు అంటే తపించటం. జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలను ధర్మబుద్ధితో సహించి వుండటం తపస్సే. నీవు నిర్ణయించుకున్న లక్ష్యం కోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయకుండా పట్టుదలతో వుండటం కూడా తపస్సే. నిరంతరం భగవంతుని కొరకై పరితపించటం తపస్సే. ఈ సహనం, త్యాగం, తపన ఇవే నిన్ను భగవంతుని వద్దకు చేర్చేవి. ప్రహ్లాదుడు, ధ్రువుడు మొదలైన వారు పసితనంలోనే ఎన్నో కష్టాలను ఎదుర్కొని సహనంతో, పట్టుదలతో అనుకున్నది సాధించారు. అదే తపస్సు. ఆ తపస్సు భగవంతుడే అని ఉపాసన చేయాలి.

- ఇలా భూమి, నీరు, అగ్ని, ఆకాశం, సూర్యచంద్రులు, సమస్తభూతాలు - దేనిని చూసినా, ఎవరిని చూసినా వారిలోని అసలైన ధర్మాన్ని, లక్షణాన్ని

భగవంతునిగా ఉపాసన చేస్తూ సర్వత్రా పరమాత్మ దర్శనానికి అర్హతను సాధించాలి. ఇంకా ఎందులో ఈ ఉపాసన సాగాలి?

**శ్లో||** బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం|
బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజస్తే జస్వినామహం|| **(10)**

**తా||** పార్థా! సమస్త జీవుల యొక్క సనాతమైన బీజాన్ని నేను. బుద్ధిమంతుల లోని తెలివిని నేను. తేజస్సు కలిగిన వారిలోని తేజస్సును నేను.

**వ్యాఖ్య:-** భగవంతుని సర్వత్రాదర్శించి ఉపాసించుటకు మరికొన్ని విభూతులు.

**1.సర్వభూతానాం సనాతన బీజం:-** ప్రాణులన్నింటికీ నేను సనాతన బీజాన్ని అంటున్నాడు భగవానుడు. ప్రతి జీవి పుట్టుకకు వెనుక ఒక కారణం వుంటుంది. చెట్టుకు కారణం విత్తనం. విత్తనానికి కారణం చెట్టు. మరి మొదట చెట్టో, విత్తనమో ఏదో ఒకటి వుండి వుండాలి కదా! అదే సనాతన బీజం, పరమాత్మ.

పక్షికి కారణం గ్రుడ్డు. గ్రుడ్డుకు కారణం పక్షి. ఇలా వెనక్కు వెళితే పక్షో, గ్రుడ్డో ఏదో ఒకటి ముందు వుండి వుండాలి కదా! అదే సనాతన బీజం.

మనిషికి కారణం అతని తండ్రి. అతడికి కారణం అతడి తండ్రి. ఆ తండ్రికి కారణం అతడి తండ్రి. ఇలా వెనక్కు వెళితే మొట్టమొదట ఎవరో వుండి వుండాలి. అదేదో ఎవరికీ అంతుచిక్కదు. దీనినే అనవస్థాదోషం అంటారు. ఎక్కడో ఒకచోట ఆగి, కారణం లేని కారణం - మూలకారణం - అన్నింటికీ ప్రారంభం అది అని ఒప్పుకోక తప్పదు. ఆ మూలకారణం దేని నుండో రాలేదు.

అది ఎప్పుడూ శాశ్వతంగా వున్నది. చావు పుట్టుకలు లేకుండా వున్నది. అదే పరమాత్మ. అతడే సనాతన బీజం.

కనుక మానవులు గానీ, పశుపక్ష్యాదులు గానీ, ఈ వృక్షజాతులు గానీ ఒక కారణం లేని కారణం నుండి వచ్చినవే. అదే సనాతన బీజం - పరమాత్మ. ఇలా అందరికీ అన్నింటికీ మూలకారణం పరమాత్మే అయితే అందరం పరమాత్మ బిడ్డలమే. కనుక ఒకరు తక్కువ, మరొకరు ఎక్కువ అనే భేదదృష్టి కూడదు. అంతా పరమాత్మ స్వరూపులే అనే ఏకత్వదృష్టితో చూడాలి. ఈ ఉపాసనయే సమాధిస్థితికి దారి తీస్తుంది.

2.బుద్ధిమతాం అహం బుద్ధిః- బుద్ధిమంతులలోని బుద్ధిని నేనే. నిజంగా మన బుద్ధిని ప్రచోదనం చేసేది పరమాత్మే. ధియోయోనః ప్రచోదయాత్ అనే గాయత్రీమంత్రార్థం ఇదే. అసలు బుద్ధి అంటే ఏమిటి? ఇంద్రియాలను, మనసును స్వాధీనంలో పెట్టుకొని వస్తువుయొక్క స్వరూపాన్ని వున్నదివున్నట్లు తెలుసుకోగల అంతఃకరణశక్తే బుద్ధి. బుద్ధి భగవంతుని అపరాప్రకృతే. కనుక బుద్ధి పరమాత్మ స్వరూపమే.

ఒక గ్రుడ్డివాడు, కుంటివాడు కలసి పొరుగూరికి బిచ్చమెత్తుకోవటానికి బయలుదేరారు. కుంటివాడు, గ్రుడ్డివాడి భుజాలమీదికెక్కి దారి చూపుతున్నాడు. అలా వెళ్తుంటే దారిలో ఒక పొలంలో దోసకాయలు విరగకాసి వున్నాయి. కుంటివాడు "అన్నా! చేని నిండా దోసకాయలే. కొంచెం ఆగు. నాలుగు తిని పోదాం" అన్నాడు. దానికి గ్రుడ్డివాడు "చేనికి కంచె లేదా?" అన్నాడు. "లేదు" అన్నాడు కుంటివాడు. "అయితే అవి చేదు దోసకాయలై

వుంటాయి. కంచె లేక, కాపలా లేకుండా వదిలేశారంటే అవి చేదువే. మనకెందుకు?" అన్నాడు గ్రుడ్డివాడు. బుద్ధిలో వివేకం అన్నది గొప్ప సంపద. గ్రుడ్డివాడైనా బుద్ధిమంతుడు. కళ్ళున్నా తెలుసుకోలేని సంగతిని తెలుసుకున్నాడు. ఈ బుద్ధి భగవంతుని ప్రసాదమే. కనుక బుద్ధిలోని వివేకం, ప్రతిభను గమనించినప్పుడల్లా దానిని భగవత్ స్వరూపంగా ఉపాసన చేయాలి. తెలివిగలవాణ్ణి చూసి అసూయ పడకూడదు. ఆహా! ఇతడి బుద్ధిలో ఎంత దివ్యమైన భగవత్ శక్తి వున్నది! అని ఉపాసన చెయ్యాలి.

3.తేజస్తే జస్వినా మహం:- తేజస్సు కలిగిన వారిలోని తేజస్సును నేను. తేజస్సు కలిగిన వారి ఎదుటకు వెళితే మనకు తెలియకుండానే లొంగిపోతాం. కొందరు మహాత్ముల వద్దకు వెళితే నమస్కరించాలనే భావం మనలో కలగటానికి కారణం వారి తేజస్సే.

వివేకానందుడు రామకృష్ణపరమహంస దగ్గరకు వెళ్ళగానే లొంగిపోయాడు. బాల్యం నుండి దైవ సాక్షాత్కారం కోసం తపించినవాడు నరేంద్రుడు. కనిపించిన మహాత్ములను, సాధువులను 'నీవు దేవుణ్ణి చూశావా?' అని అడిగేవాడు. ఎవరూ తృప్తికరమైన సమాధానం ఇవ్వలేదు. చివరకు దక్షిణేశ్వరంలోని రామకృష్ణుని అడగటంతో "నిన్ను చూస్తున్నట్లే భగవంతుణ్ణి చూస్తున్నాను." అన్నాడు రామకృష్ణుడు.

పరమహంస తన ఆధ్యాత్మిక శక్తిని శక్తిపాతం ద్వారా నరేంద్రుని శరీరంలో ప్రవేశపెట్టాడు. గురువు తన పాదాన్ని నరేంద్రునికి తాకించాడు. దానితో నిర్వికల్పసమాధిని పొందాడు నరేంద్రుడు. గురువు యొక్క తేజస్సుకు

లొంగి ఆయన శిష్యుడయ్యాడు. ఇలా తేజస్వంతులలోని తేజస్సు భగవత్ శక్తే. అందుకే దానిని భగవంతునిగా ఉపాసన చెయ్యాలి.

ఇలా ప్రతి వస్తువులోని ముఖ్య ధర్మాన్ని లేదా ముఖ్యలక్షణాన్ని భగవంతునిగా ఉపాసన చెయ్యాలి. అప్పుడే అంతటా అన్నింటా భగవత్ దర్శనం.

- ఇంతవరకు ప్రతివస్తువులోని ముఖ్యలక్షణాన్ని, ఉత్తమగుణాన్ని భగవంతునిగా ఉపాసన చేయాలని చెప్పారు. అయితే మంచివస్తువులలో, గొప్ప వ్యక్తులలో మాత్రమేనా ఇలా చూడాల్సింది? చెడ్డ వస్తువులలో భగవంతుడు లేడా? ఉంటే వాటిలో భగవంతునెలా చూడాలి?

**శ్లో||** బలం బలవతాం చాహం కామరాగ వివర్జితం|

ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ|| **(11)**

**తా||** భరతశ్రేష్టా! బలవంతులలో కామరాగాలు తీసేసిన బలాన్ని నేను. జీవుళ్ళలోని 'ధర్మానికి విరుద్ధం గాని కామాన్ని' నేను.

**వ్యాఖ్య:-** 1.<u>బలం బలవతాం చాహం కామరాగ వివర్జితం:-</u> బలవంతులలోని కామరాగాలు లేని బలాన్ని నేను. అందరిలో రకరకాల బలాలుంటాయి. పశుబలం, ధనబలం, విద్యాబలం, బుద్ధిబలం, జనబలం, మాయాబలం, మనోబలం - - - ఇలా. వీటన్నింటిని భగవద్భావనతో ఉపాసన చేయాలి. ఐతే ఒక షరతు. ఆ బలం ఎలాంటిదైనా కామరాగాలు లేనిదై వుండాలి. అట్టిదే భగవంతుడు.

I. కామం అంటే తన దగ్గరలేని దానిని కావాలనుకోవటం, ఆశపడటం.

II. రాగం అంటే ఉన్నదానిపై ఆసక్తి, అపేక్ష, మమకారం.

i. తనది కాని రాజ్యాన్ని కాజేయాలనుకొని శకుని బుద్ధిబలాన్ని ఉపయోగించి జూదంలో ధర్మరాజు రాజ్యాన్ని కాజేశాడు దుర్యోధనుడు. ఈ బలం పరమాత్మశక్తి కాదు. తన రాజ్యాన్ని తాను పొందటం కోసం జనబలాన్ని సమీకరించుకుని, సోదరుల పరాక్రమంతో యుద్ధం చేసి రాజ్యాన్ని పొందాడు ధర్మరాజు. ఈ బలం పరమాత్మే. ఎందుకు? తనది కాని దానిని పొందాలనుకోవటం కామం. తన దానిని తాను పొందాలనుకోవటం ధర్మం.

ii. పరభార్యను అపహరించటం కోసం మారీచుని మాయాబలాన్ని ఉపయోగించుకొని దొంగ సాధువు వేషంలో వచ్చిన రావణుని బలం కామం. కనుక అది పరమాత్మ కాదు. తన భార్యను తాను తిరిగి తెచ్చుకోవడానికి జనబలాన్ని సమీకరించుకుని పరాక్రమంతో యుద్ధం చేసిన రామునిది ధర్మబలం. అది పరమాత్మ.

తన ప్రారబ్ధంలో లేని వస్తువుల కోసం, భోగాల కోసం ఉపయోగించే బలం అది బుద్ధిబలమైనా, పశుబలమైనా అది పరమాత్మ కాదు. లభించిన వస్తువులతో ఆనందించటం, తృప్తి చెందటం - అది పరమాత్మయే.

భుక్తి కోసం ఉపయోగించే విద్యాబలం పరమాత్మ కాదు. ముక్తి కోసం ఉపయోగించే విద్యాబలం పరమాత్మే.

II. ఉన్నవాటిపై ఆసక్తి, అనురాగం, మమకారం, ఈ మమకారంతో ఉపయోగించే బలం పరమాత్మ కాదు.

i. ధృతరాష్ట్రునికి తన రాజ్యంపై మమకారం. కొడుకు మీద మమకారం. ఈ రాజ్యం శాశ్వతంగా తన కొడుకుకే వుండాలని ఆయన ఆరాటం. అందుకై ఎన్నో పథకాలు వేశాడు. బుద్ధిబలం చూపాడు. ఆ బలం పరమాత్మ కాదు.

ధర్మకార్యాలకు, దైవకార్యాలకు, పరోపకారానికి, పరమార్థాన్ని సాధించటానికి ఉపయోగించే ధనబలం, శారీరకబలం, మనోబలం, బుద్ధిబలం, జనబలం - ఏదైనా సరే అది పరమాత్మే. ఇట్టి బలన్నే భగవంతునిగా ఉపాసించాలి. ధనాన్ని సత్కార్యాలకు ఉపయోగిస్తే సార్ధకం. త్రాగి తందనాలడటానికి ఉపయోగిస్తే వ్యర్థం.

- బలం దుర్మార్గుని వద్దవుంటే పరపీడనం. మంచివాడి వద్దవుంటే పరుల రక్షణ.
- విద్య ఖలుని వద్దవుంటే వివాద కారణం. సజ్జనుని వద్దవుంటే జ్ఞానకారణం.
- ధనం దుష్టుని వద్దవుంటే అహంకారం. శిష్టుని వద్దవుంటే సుఖశాంతులు కలుగుతాయి.

ఇలా కొన్ని జాగ్రత్తలతో బలాన్ని భగవంతునిగా ఉపాసించాలి.

2. ధర్మః అవిరుద్ధోకామః అస్మి:- ధర్మవిరుద్ధం కాని కామాన్ని నేను. కామం కూడా భగవంతుడే. అయితే ఆ కామం ధర్మానికి విరుద్ధం కాకుండా వుండాలి. ధర్మవిరుద్ధమైన కోరిక ఆసురీగుణం. ధర్మబద్ధమైన కోరిక దైవీగుణం.

మోక్షాన్ని పొందాలనే కోరిక నిన్ను భగవంతుని వద్దకు చేరుస్తుంది. భగవత్ కార్యాలు చేయాలని, గురువులను సేవించాలని, పూజించాలని, సాధన చెయ్యాలని కోరిక వుంటే ఆ కోరిక భగవంతుడే. ఎందుకంటే అది



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుని దరి జేర్చే కోరిక. పరుల సొమ్ము రావాలని, పరస్త్రీలను పొందాలనే కోరికలు ధర్మవిరుద్ధమైన కోరికలు. పరస్త్రీని కోరి రావణుడు, పరధనాన్ని ఆశించి దుర్యోధనుడు సర్వనాశనమైపోవటం రామాయణ, మహాభారత ఇతిహాసాల సారాంశం. కనుక ఇలాంటి కోరికలు భగవంతుడు కాదు. ధర్మబద్ధమైన కోరికలనే భగవంతుడుగా ఉపాసన చేయాలి. కోరికలు విడిస్తేనే కదా భగవంతుని పొందు. మరి కోరికలు నేనే అంటున్నాడు భగవానుడు. ఎందుకిలా అంటున్నాడు?

సాధకుని స్థాయిలో చెడ్డ కోరికలు వదలి మంచి కోరికలను - ధర్మబద్ధ కోరికలను కలిగి వుండాలి. అయితే సిద్ధుని స్థాయిలో అన్ని కోరికలను విడనాడాలి.

కాలిలో విరిగిన ముల్లును తీయడానికి మరొక ముల్లును ఉపయోగించాలి. తరువాత రెండు ముళ్ళనూ పారేయాలి. ఇలా ప్రపంచంలో తటస్థపడే అన్నింటిని భగవంతునిగా దర్శిస్తూ ఉపాసన చేయాలి.

- ఇక ఈ విషయాన్ని ముగించబోతూ తన స్థితిని వర్ణిస్తున్నాడు భగవానుడు.

శ్లో|| యేచైవ సాత్త్వికా భావాః రాజసాస్తామసాశ్చయే|

మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తే మయి|| (12)

**తా||** ఇంకా ఏవేవి సాత్త్విక, రాజసిక, తామసిక భావాలున్నాయో అవన్నీ నా వల్లనే వస్తాయని తెలుసుకో. అయితే నేను వాటిలో లేను. అవి నాలో వున్నాయి.

**వ్యాఖ్య:-** అర్జునా! ఇది, అది అననేల అన్నీ నా వల్లనే వచ్చాయని తెలుసుకో. అయినా ఉపాసకునికి మంచిభావన ఏర్పడటానికి మొదట కొన్ని మంచి వస్తువులు చెప్పాను. ఆ తరువాత చెడ్డవాటిలోని చెడును తొలగించి వాటినీ నేనుగానే చెప్పాను. కాబట్టి మంచీ - చెడూ అన్నీ నావల్ల వచ్చినవే. సాత్త్విక, రాజసిక, తామసిక వస్తువులన్నీ నా నుండే వచ్చాయి. అన్నీ నా స్వరూపాలే - భగవత్ స్వరూపాలే అనే ఉత్తమ జ్ఞానాన్ని బుద్ధిలో స్థిరపరచుకోవాలి. భావాలు అంటే ఆలోచనలు అని మాత్రమే కాదు. అన్ని ప్రాణులు కూడా భావాలే. ఇవన్నీ సాత్త్విక, రాజసిక, తామసిక అని మూడు విధాలుగా విభాగించబడి వున్నాయి.

1. దేవర్షులు, దేవతలు, బ్రాహ్మణులు, గోవులు, చక్కెర, శమదమాదులు - ఇవన్నీ సాత్త్వికభావాలు.

2. గంధర్వులు, క్షత్రియులు, ఏనుగులు, మిరియాలు, కామ - లోభ - హర్షాదులు - ఇవన్నీ రాజసిక భావాలు.

3. రాక్షసులు, పిశాచాలు, కుక్కలు, క్షుద్రజీవులు, ఉల్లి, శోకమోహాలు - ఇవి తామసిక భావాలు.

ఇవన్నీ నాలో వున్నాయి. అయితే నేను వాటిలో లేను అంటున్నాడు భగవానుడు. దీనిలో ఒక అద్భుతభావన ఉన్నది. ఏమిటది? అయ్యో! వాటిని

వదిలినా ఫరవాలేదు. కానీ నన్ను మాత్రం వదలకు - అని నన్ను పట్టుకుంటే అన్నీ నాలో వున్నాయి గనుక నాతోపాటు అన్నీ దక్కుతాయి. వాటిని పట్టుకున్నావా? వాటిలో నేను లేను కనుక అవి దక్కినా నేను మాత్రం దక్కను - అని.

కనుక మనం సాత్విక, రాజసిక, తామసిక వస్తువులనే చింతిస్తూ, వాటి కోసమే ప్రాకులాడితే అక్కడే నిలిచిపోతాం. అలాగాక వాటికి ఆధారమైన ఆత్మను కనుక చింతిస్తూ, ఆత్మతో తాదాత్మ్యం చెందామా - - -? ఆత్మనూ పొందుతాం; వాటినీ పొందుతాం.

ఒక నదీ తీరంలో ఒక సాధువు వుండేవాడు. ఆ నది దగ్గరకు స్త్రీలు, పురుషులు, ఛండాలురు, పశువులు, పక్షులు - ఎవరు వచ్చినా, ఏవి వచ్చినా "ఓ పరమాత్మా! ఈ రూపంలో వచ్చావా? ఈ రూపంలో వున్న నీకు నమస్కారం" ఇదే అతడి ఉపాసన. అంతటా భగవద్దర్శనం. గొప్ప అనుష్టానం.

అవి నాలో వున్నాయి. నేను వాటిలో లేను అంటే గుణాలు నాలో వున్నాయి. నేను గుణాల పరిమితిలో లేను - అని.

మరి ఇంతకుముందు ప్రపంచమంతటా పూసలలో దారంలా నేనే వున్నాను అన్నాడు కదా! మరిప్పుడు వాటిలో నేను లేను అంటున్నాడేమిటి?

నన్ను (పరమాత్మను) ఆధారం చేసుకుని ప్రపంచం వున్నది. కానీ ప్రపంచాన్ని ఆధారం చేసుకుని పరమాత్మలేదు - పరమాత్మకు ఏ ఆధారం అక్కరలేదు. ప్రపంచానికే ఆధారం కావాలి - అని.

- ప్రపంచానికి ఆధారంగా వున్న అటువంటి నిత్యమైన పరమాత్మను ఎందుకు గుర్తించలేకపోతున్నాం?

**శ్లో||** త్రిభిర్గుణ మయైర్భావైః ఏభిస్సర్వ మిదం జగత్|
మోహితం నాభి జానాతి మామేభ్యః పరమవ్యయం|| (13)

**తా||** ఈ చెప్పబడిన మూడు రకాల గుణాలతో నిండిన భావాల చేత ఈ సమస్త ప్రపంచం భ్రాంతిలో పడిపోతున్నది. అందుకే వీటన్నింటికన్నా శ్రేష్టం, నాశరహితం అయిన నన్ను తెలుసుకో లేకపోతున్నది.

**వ్యాఖ్య:-** మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి - నాకన్నా శ్రేష్టమైనది, వేరైనది ఇక్కడ కొంచెం కూడా ఏమీలేదు - అంటూ భగవానుడు తన పారమార్థిక స్వరూపాన్ని, యదార్థ స్వరూపాన్ని ఇంతకుముందే తెలియజేశాడు. అంటే ఉన్నది పరమాత్మ ఒక్కటే. పరమాత్మ కన్నా వేరుగా ఏదన్నా కనిపిస్తే అది నిజంగా లేనిదే అని భావం.

ఇక భగవంతుని వ్యావహారిక స్వరూపం ఈ ప్రపంచం. ఇది నిజంగా పారమార్థికంగా లేనిదే అయినా వున్నట్లుగా కనిపిస్తున్నది. అలా కనిపించటానికి కారణం దానికి ఆధారంగా పరమాత్మ వుండటం వల్లనే. చీకటిలో లేని పాము కనిపిస్తున్నదీ అంటే దానికి కారణం అక్కడ త్రాడు పడి వుండటమే. అంటే మనం చూసే ప్రతి వస్తువుకు ఆధారంగా - అధిష్టానంగా పరమాత్మ పూసలలో దారంలాగా కనిపించకుండా - అవ్యక్తంగా వున్నాడు. కనుక నిజమైన పరమాత్మ దర్శనం కోసం గుళ్ళకు, గోపురాలకు, తీర్థాలకు,

క్షేత్రాలకు పరుగెత్తాల్సిన పనిలేదు. నీవు అర్హతను సంపాదిస్తే వున్న చోటనే పరమాత్మను దర్శించవచ్చు. కానీ మనం ఏం చేస్తున్నాం? ఆధారమైన పరమాత్మను వదిలి ఆధేయమైన ప్రపంచాన్ని చూస్తున్నాం. ఈ ప్రపంచం నుండి ఏదేదో తెచ్చుకుని, ఆనందించాలని పరుగులు తీస్తున్నాం. ఆధారం వదిలి పరుగులు తీస్తున్నాం కనుక పడిపోతున్నాం. కనుక మన దృష్టి ఆధారం వైపుకు తిరగాలి.

ఒక బాటసారి ఎడారిలో ప్రయాణం చేస్తున్నాడు. బాగా దప్పిక అవుతున్నది. దూరంగా నీరు కనిపిస్తున్నది. త్రాగుదామని దగ్గరకు వెళ్ళాడు. అలా వెళ్ళి చూడగా అక్కడ నీరు లేనేలేదు. కాని అక్కడకు కొంతదూరంలో నీరు కనిపిస్తున్నది. మళ్ళీ ప్రయాణం సాగించి అక్కడకు వెళితే అక్కడా నీరు లేదు. కానీ కొంతదూరంలో నీరు వున్నట్లు కనిపిస్తున్నది. నడవలేక నడవలేక అక్కడికి ఎంతో కష్టం మీద వెళ్ళి చూస్తే అక్కడా నీరు లేదు. మళ్ళీ కొంతదూరంలో కనిపిస్తున్నది. ఏమిటీమాయ? అవే ఎడారిలో ఎండమావులు. మరు మరీచికలు. నీళ్ళలాగా కనిపించినా అక్కడ నీటి చుక్క వుండదు. ఈ విషయం తెలిసిందా? ఇక ఎండమావులు నిన్ను ఆకర్షించలేవు. భ్రమపడి పరుగెత్తవు. ఈ ప్రపంచం కూడా అంతే. నిజంగా లేనిదే అయినా వున్నట్లు కనిపిస్తున్నది. అందుకే దాని వెంటబడుతున్నాం. లేనిదే అని తెలిస్తే ఇక దాని వెంట పడవు.

తెలియకపోవటానికి కారణం ఏమిటి? అదే త్రిగుణాత్మక మాయ. ఈ మాయాప్రభావం వల్లనే మనం ప్రపంచవ్యామోహాలలో పడి పరమాత్మకు దూరమౌతున్నాం. ఆయన్ని తెలుసుకోలేకపోతున్నాం.

భగవంతుడు తన 'మాయ' అనే ప్రకృతితో కలవటం వల్ల ఈ సృష్టి జరిగింది. అంటే మనందరకు తండ్రి పరమాత్మ. తల్లి మాయ - లేదా ప్రకృతి. ఆ మాయకు పుట్టిన బిడ్డలం కనుక మాయ ఒడిలోనే పెరుగుతున్నాం. ఆ మాయకు గల గుణాలే సత్వరజస్తమో గుణాలు. అవే మనకూ వచ్చినవి. అంటే మనలో ప్రతి ఒక్కరిలోనూ ఎక్కువ తక్కువలుగా ఆ మూడు గుణాలే వున్నాయి. ఐతే ఇవి అందరిలో ఒక్క రకంగా వుండవు, స్థిరంగానూ వుండవు. మారిపోతూ వుంటాయి. బద్ధకస్తుడు చురుకైన వాడవుతాడు, కోపిష్టి వాడు శాంతస్వభావుడౌతాడు, సత్ప్రవర్తన కలవాడు దుర్మార్గుడౌతాడు, దుర్మార్గుడు బుద్ధిమంతుడౌతాడు. ఇలా గుణాలు మారిపోతూ వుంటే వాటి ప్రభావం తోటే ఈ ప్రపంచాన్ని చూస్తూ వుంటాం. గుణాల ప్రభావంలో వున్నంత వరకు గుణాలకు అతీతుడైన పరమాత్మను చూడలేం. కారణం? ఈ గుణాలే మనను భ్రాంతిలోనికి నెడుతున్నాయి.

ఆకాశం మేఘాలతో కప్పబడి వుంది. మేఘాలకు ఇవతల మనం వున్నాం. మేఘాలకు ఆవల వున్న సూర్యుని చూడగలమా? లేదు. అలాగే త్రిగుణాలకు ఈవలవున్న మనం త్రిగుణాలకు, మాయకు ఆవలవున్న పరమాత్మను చూడలేం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మాయ అనే ప్రవాహంలో పడిపోయిన మనం ఆ ప్రవాహంలోనే కొట్టుకుపోతున్నాం. అయితే తత్త్వవిచారణ అనే పడవ నెక్కితేగాని ఈ మాయ అనే ప్రవాహాన్ని ఎదురీది మాయాతీతుడైన పరమాత్మ అనే ఒడ్డుకు చేరుకోలేం.

ఈ శ్లోకంలో మానవులు త్రిగుణాత్మకమైన మాయలో ఎలా బందీలవుతున్నారో తెలియజెబుతున్నాడు భగవానుడు. ఇది తెలిస్తే గాని ఈ బందికానా నుండి తప్పించుకుని బయటపడలేం.

సర్వమిదం జగత్ - ఇదం జగత్ సర్వం - అంటే ఈ జగత్తంతా కూడా ఇలా భ్రమకు లోనై వుంది. ఎక్కడో అరుదుగా వున్న జీవన్ముక్తులు తప్ప మిగిలిన వారందరూ భ్రమకు లోనై, ప్రపంచ వ్యామోహాలలో ఇరుక్కొని పరమాత్మను చూడలేక పోతున్నారు.

కొందరు ప్రశ్నిస్తుంటారు. అందరినీ పుట్టించినవాడు భగవంతుడే కదా! మరి అందరినీ తనవైపు తిప్పుకోవచ్చు కదా! ఎందుకిలా వ్యామోహాలలో ఇరికిస్తున్నాడు? - అని.

దీనికి కారణం మాయే. భగవంతుడు తండ్రి. మాయ తల్లి. మాయను పట్టుకున్న వారందరూ మాయా మోహంలో చిక్కుకుని భగవంతునికి దూరమౌతూ వుంటారు. అలాగాక భగవంతుని పట్టుకున్నవారు చివరకు భగవంతునిలో చేరిపోతారు. వారే మాయను దాటగలిగినవారు.

కనుక ఎంతటివారైనా, ధనవంతులైనా, బలవంతులైనా, విద్యావంతు లైనా, పండితులైనా, పామరులైనా, సన్యాసులైనా, సంసారులైనా - ఎవ్వరైనా

సరే ఈ త్రిగుణాత్మకమైన మాయకు లోబడవలసిన వారే. అలా లోబడి పరమాత్మను గుర్తించనివారే. మరి తరుణోపాయం ఏమిటి?

- మాయ యొక్క స్వరూప స్వభావాలేమిటి? దానిని దాటే ఉపాయం ఏమిటి?

**శ్లో||** దైవీ హ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా|
మామేవ యే ప్రపద్యంతే మాయామే తాం తరం తితే|| (14)

**తా||** దివ్యమైన, గుణమయమైన నాయీ మాయ దాటశక్యం కానిది, ఐతే ఎవరు నన్నే సేవిస్తారో వారు మాత్రం ఈ మాయను దాటగలరు.

**వ్యాఖ్య:-** భగవద్దర్శనం చేసుకోవాలంటే భగవంతునికి మనకు మధ్యన ఒక అడ్డుగోడ ఉన్నది. అదే మాయ. ఆ అడ్డుగోడను ఎలా ఛేదించాలో ఈ శ్లోకంలో మార్గం చెబుతున్నారు. ముందు మాయ ఎలాంటిదో చెప్పి, దానిని అధిగమించటం ఎలాగో తర్వాత చెబుతున్నారు.

మాయ 1) దైవ సంబంధమైనది. 2) త్రిగుణాలతో కూడినది. 3) భగవంతుని అధీనంలో ఉన్నది. 4) దాటుటకు కష్టమైనది.

1) దైవ సంబంధమైనది:- మాయ పరమాత్మను ఆశ్రయించుకొని ఉన్నది. కనుకనే అది దైవ సంబంధమైనది.

చీకటి ఇంటిని ఆశ్రయించి ఇంటినే ఆవరిస్తుంది.

పాచి నీళ్ళలో పుట్టి ఆ నీటినే ఆవరిస్తుంది.

కంటి పొర కంటిలో పుట్టి ఆ కంటినే ఆవరిస్తుంది.

అలాగే మాయ పరమాత్మ నుండే పుట్టి పరమాత్మనే ఆవరిస్తుంది. కనుకనే దైవీ - దైవ సంబంధమైనది - అన్నారు. అందుకే దాని శక్తి అమోఘం. కాబట్టే మహామహులు కూడా దీని బారిన పడాల్సిందే. రాజాధిరాజులైనా, ఇంద్రులైనా, చంద్రులైనా, సన్యాసులైనా, మేధావులైనా, పరమభక్తుడు నారదుడైనా, పరమేశ్వరుడే అయినా, సాక్షాత్తు సృష్టికర్త బ్రహ్మదేవుడే అయినా దాని ధాటికి ఎప్పుడో ఒకప్పుడు తలవంచినవారే. అసలు ఎవరైనా 'నేను మాయను గెలిచాను' అన్నాడా? మాయలో పడిపోయినట్లే.

2) <u>గుణమయీ:-</u> సత్త్వ, రజ, స్తమో గుణాలనే మూడు గుణాలతో కూడినది. ఈ 3 గుణాలనే దారాలతో పేనబడిన త్రాడే ఈ మాయ. త్రాడులోని ఒక్కొక్క దారాన్ని లాగేస్తే త్రాడు లేకుండా పోతుంది. అలాగే మాయలోని ఒక్కో గుణాన్ని తొలగించుకుంటూ పోతే మాయ లేకుండా పోతుంది.

3) <u>మమ :-</u> 'మమ మాయ' ఇది నా మాయ అంటున్నాడు భగవానుడు. నా పుస్తకం, నా కలం, నా యిల్లు, నా కుక్క అన్నట్లు నా మాయ అంటున్నాడు. అంటే పుస్తకం, కలం, ఇల్లు, కుక్కకు ఎలా అతడు యజమానియో, అలాగే మాయకు యజమాని భగవంతుడే. మన కుక్క ఇతరులను ఎంత ఇబ్బంది పెట్టినా మన దగ్గర లొంగి పడి ఉంటుంది. అలాగే మాయ మనల్ని ఎంతగా ఇబ్బంది పెట్టినా పెట్టవచ్చు, కాని భగవంతుని ముందు కుక్కలా పడి ఉంటుంది.

4.<u>దురత్యయా :-</u> దాటుటకు కష్టసాధ్యమైనది. కష్టమే గాని అసాధ్యం మాత్రం కాదు. ఎంతో కష్టపడి జ్ఞానులు సాధనద్వారా దాటవచ్చు. కాని సులభోపాయం ఏమి?

మాం ఏవయే ప్రపధ్యంతే మాయాం ఏతాం తరంతి తే :- నన్ను ఎవరు శరణు పొందుతారో - ఎవరు నన్ను ఆశ్రయిస్తారో అట్టివారు మాయను దాటగలరు.

ఎంత భయంకర సముద్రాన్నయినా ఓడ సాయంతో దాటవచ్చు. అలాగే ఎంతటి భయంకరమైన మాయకైనా భగవంతుని ఆశ్రయించి - భగవంతుని శరణుగోరి దాటవచ్చు. కనుక మాయను దాటాలంటే మాయాధీశుని ఆశ్రయించాలి. ఆ పరమాత్మ యందు అనన్యభక్తి ఉండాలి.

మాయాధీశుని ఆశ్రయిస్తే మాయను దాటగలమా? - నీవు ఒక పనిమీద ఆఫీసరుగారింటికి వెళ్లావు. గేటు దగ్గర కుక్క ఉన్నది. అది మనను అడుగు ముందుకు వేయనీయటం లేదు. దానిని తప్పించుకుంటే గాని ఆఫీసరు గారితో మాట్లాడే వీలులేదు. ఏం చేయాలి?

దానికి రెండు మార్గాలున్నాయి. 1.ఆ ఆఫీసరు గారినే కేకవేసి పిలిస్తే ఆయన వస్తాడు. ఆయన సమక్షంలో కుక్క మననేమీ చేయలేదు. ఆయనతో పాటుగా లోపలకు వెళ్ళవచ్చు. 2. మనం ఆఫీసరు గారి వేషం వేసుకొని అచ్చం ఆయనలాగే తయారైతే చాలు నిరభ్యంతరంగా లోనికి వెళ్ళవచ్చు. కుక్క ఏమీ చేయదు.

ఇందులో మొదటిది భక్తిమార్గం. రెండవది జ్ఞానమార్గం. మొదటిది సులభమార్గం. రెండవది చాలా కష్టమైన మార్గం.

అంటే మాయ అనే కుక్క భయం నుండి తప్పించుకోవాలంటే ఆ మాయ అనే కుక్కయొక్క యజమాని పరమాత్మను శరణుకోరాలి. ఆశ్రయించాలి. ఇదే భక్తిమార్గం. శరణాగతతత్త్వం అన్ని శాస్త్రాలలోను

చెప్పబడింది. రామాయణ, భారత, భాగవతాలన్నింటిలోను ఈ శరణాగతి చక్కగా చెప్పబడి ఉంది.

మహాభారతంలో అర్జునుడు భగవంతుణ్ణి ముందు పెట్టుకొని ఘోరమైన యుద్ధం చేశాడు. అదొక మహాయజ్ఞమైంది. దక్షుడు భగవంతుని తిరస్కరించి బ్రహ్మాండమైన యజ్ఞం చేశాడు. కాని అది కాస్తా యుద్ధమై కూర్చుంది. ఎక్కడుంది కీలకం? అర్జునుడు శరణాగత భక్తుడు. "శిష్యస్తేఽహం శాధిమాంత్వాం ప్రపన్నం" అంటూ తన శక్తి యుక్తులు, తన సర్వస్వం భగవంతుని పాదాల వద్ద సమర్పించి జ్ఞానం పొందాడు. దక్షుడు భగవంతుని వ్యతిరేకించి అవమానించాలనుకున్న అహంకారి. కనుకనే అభాసు పాలయ్యాడు. శిరస్సు తెగిపడిపోయింది. మేకతల వచ్చింది. భగవంతుని అవమానించినా, గురువును అవమానించినా పరాభవం తప్పదు.

రామాయణంలో విభీషణ శరణాగతి సుప్రసిద్ధమైనది, "నేను నీ వాడను" అని ఒక్కసారి చెబితే చాలు శత్రువు తమ్ముణ్ణే కాదు శత్రువునైనా దగ్గరకు చేర్చుకుంటాను, ఇది నా వ్రతం - అన్నాడు శ్రీరాముడు. విభీషణునికి అప్పటికప్పుడు సముద్రజలాలతో పట్టాభిషేకం జరిపించాడు యుద్ధానికి ముందే. అప్పుడు సుగ్రీవుడు అంటున్నాడు - "రామా! లంకా రాజ్యాన్ని ఇప్పుడే విభీషణునికి పట్టం కడుతున్నారు గదా! ఒకవేళ రావణుడే శరణని వస్తే ఏంచేస్తారు?" అన్నాడు. అప్పుడు రాముడు వెంటనే, "సుగ్రీవా! రావణుడలా రావాలేగాని అతడిని కూడా అక్కున చేర్చుకుంటాను. నా హక్కు ఐన అయోధ్యా రాజ్యాన్ని అతడికిస్తాను" అన్నాడు. సుగ్రీవుడికి నోరు పెగలలేదు.

పుణ్యాత్ముడైన విభీషణుడు శరణాగతితో ధన్యుడయ్యాడు. పది తలలతో ఆలోచించే వాడైనా ఇరవై చేతులతో పనిచేసే వాడైనా రావణునిలో అట్టి శరణాగతి లేదు, అందుకే అన్ని విధాలా విఫలమయ్యాడు.

భాగవతంలో గజేంద్రుడు శరణాగతులలో శ్రేష్ఠుడు. మొసలి పట్టు నుండి విడిపించుకోలేక "నీవే తప్ప నితః పరంబెరుగ" నని శరణాగతుడై రక్షించమని ప్రార్థించాడు. సుదర్శన చక్రం మొసలిని వధించి, గజాన్ని విడిపించింది. గజరాజంటే జీవుడు. విషయ సుఖాలపై ఆశతో సంసారమనే కొలనులో దిగాడు. అహంకారమనే మొసలి పట్టుకుంది. దీని నుండి విడిపించుకొనుటకే శ్రీహరిని శరణు వేడాడు గజేంద్రుడు. సుదర్శనం వచ్చింది. సుదర్శనమంటే మంచి దర్శనం - భగవద్దర్శనం. భగవద్దర్శనంతో అహంకారం వదిలి పోయింది.

మాయ అనేది అఘటన ఘటనా పటీయసి. దాన్ని దాటాలంటే శరణాగతి అనే గొప్ప నావ కావాలి. అప్పుడే దానిని దాటగలం. కాని ఆ మార్గంలో పోము. ఎందుకని? - పాము నోట్లో కప్ప ఉంది. తల బయటకు ఉంది. బెకబెకలాడుతున్నది. ఎదురుగా పురుగు కనిపిస్తే నాలుక చాపుతున్నది. మనం కూడా కాలమనే సర్పం నోట చిక్కి ఉన్నాం. కాలం ఎప్పుడో ఒకప్పుడు కాటేయక మానదు. అయినా సరే ప్రాపంచిక భోగాల కోసం అర్రులు చాస్తుంటాం.

అయితే అందరూ ఇంతేనా ? ఎవ్వరూ భగవంతుని ఆశ్రయించరా? అంటే కాదు. భగవంతుని ఆశ్రయించేవారూ ఉన్నారు, ఆశ్రయించని వారూ

ఉన్నారు అంతే - భగవంతుని ఆశ్రయించని వారెవరో 5 రకాల వారిని తెలియజేస్తున్నాడు.

**శ్లో||** నమాందుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః|

మాయయాఽపహృత జ్ఞానాః ఆసురం భావమాశ్రితాః|| (15)

**తా||** దుష్టకార్యాలు చేసేవారు, మూఢులు, నరాధములు, మాయ చేత జ్ఞానం నశించినవారు, అసురభావాన్ని ఆశ్రయించినవారు నన్ను సేవించరు.

**వ్యాఖ్య:-** మాయను అధిగమించటం చాలా కష్టం. అయినప్పటికీ ఎవరైతే మయాధీశుడైన భగవంతుని ఆశ్రయించి, శరణు కోరుతారో; భగవంతుని సేవిస్తారో వారు మాయను అధిగమించగలరు. అయితే ఇంకేం? అందరూ భగవంతుని ఆశ్రయించవచ్చు గదా! సేవించవచ్చు గదా! సేవించవచ్చు. కాని అలా సేవించరు, ఆశ్రయించరు. ఎవరు వారు? ఎందువల్ల భగవంతుని ఆశ్రయించరు?

వారే 1.దుష్కృతులు, 2. మూఢులు, 3.నరాధములు, 4.మాయచేత జ్ఞానం నశించినవారు, 5.అసురభావాన్ని ఆశ్రయించినవారు.

1.దుష్కృతులు :- దుష్టకార్యాలు చేసేవారు. కొందరికి ఎప్పుడూ దుష్టకార్యాల మీదనే ఆసక్తి. కారణం? వారి స్వభావం. పంది ఎప్పుడూ బురదలోకే పోతుంది. ఎందుకు? అది దాని స్వభావం. వీళ్ళూ అంతే. అయితే ఆ స్వభావం వీరికి ఎలా వచ్చింది? ఎన్నో జన్మల నుండి తెచ్చుకుంటున్న పాప సంస్కారాల వల్ల - దుష్టవాసనల వల్ల ఆ స్వభావం ఏర్పడుతుంది. ఆ వాసనలెలా వచ్చినవి?

అలాంటి దుష్టమైన ఆలోచనలు చేయటం వల్ల. అంటే దీనికి అంతులేదు. దుష్టకార్యాలు చేస్తే దుష్టవాసనలు పేరుకుంటాయి . ఆ దుష్టవాసనలే దుష్టకార్యాలకు ప్రేరణ ఇస్తాయి. దానితో దుష్ట స్వభావం ఏర్పడి దుష్టకార్యాలు చేస్తారు. ఇదొక చక్రం.

ఒకడు దొంగతనం చేసి పోలీసులకు చిక్కాడు. వాణ్ణి కోర్టులో హాజరుపరిస్తే 6 నెలల కారాగారం విధించారు. 6 నెలలు శిక్ష అనుభవించి బయటకు వస్తుంటే అధికారి పిలిచి, "నాయనా! నీ శిక్షాకాలం రెండు రోజుల క్రిందటే పూర్తయిపోయింది. పొరపాటున 2 రోజులు ఎక్కువగా ఉంచాం. ఏమీ అనుకోవద్దు" అన్నాడట. దానికా దొంగ "మరేం ఫర్వాలేదు సార్, ఈ సారి శిక్షలో ఆ రెండు రోజులు తగ్గించుకుందురులే" అన్నాడట. ఇదే వాసన. అంటే అతడు మళ్ళీ దొంగతనం చేసి జైలుకు రావాలనే కోరిక అన్నమాట.

ఇలా ఎప్పుడూ తప్పుడు పనులు చేసేవారు భగవంతుని వైపు తిరగరు, తిరగలేరు. ఒకవేళ తిరిగినా అది భక్తితో కాదు. ఇంకా బాగా తప్పుడు పనులు చేసి చిక్కకుండా తప్పించుకోవాలనే కోరిక తోనే. స్వార్థమే వీరికి పరమార్థం.

ఈ ఒక్కసారికే గదా దొంగతనం చేస్తున్నది, అబద్ధమాడుతున్నది, వాడినెత్తిన చెయ్యి పెడుతున్నది అని అనుకోరాదు. ఈ ఒక్కసారికే గదా! పేకాట ఆడుతున్నది, త్రాగి తందనాలాడుతున్నది అని అనుకోరాదు. ఒక్కసారి చేసిన పనివల్ల అతడిలో దుష్టవాసనలు పేరుకొని, అతణ్ణి మళ్ళీ మళ్ళీ దుర్మార్గాలు చేయాటానికి ప్రేరణను, ప్రోత్సాహాన్ని ఇస్తాయి.

దుర్యోధనుడు దుష్టుడైన శకుని మాటలే విన్నాడు కాని ధర్మాత్ముడైన విదురుని మాటలు వినిపించుకోలేదు. అందుకే దుష్టకార్యాలెన్నో చేశాడు. పరమాత్మ దగ్గరగా ఉన్నా తెలుసుకోలేక పోయాడు. నేను కావాలా? నా సైన్యం కావాలా? అంటే సైన్యమే కావాలన్నాడు, పరమాత్మను తృణీకరించి పతనమయ్యాడు. మనం కూడా అంతే! నేను కావాలా? సంపదలు కావాలా? అంటే సంపదలే కావాలంటాం. మనలో స్వార్థబుద్ధి అలా పలికిస్తుంది. మంచివాళ్ళ మాటలు వినం.

రావణుడు మారీచుణ్ణి తన పనికి ఉపయోగించుకున్నాడు. కాని అతడి హితవచనాలను మాత్రం వినిపించుకోలేదు. పాపాత్ముల బుద్ధులు అంతే. మంచి వారి మాటలు వినాలనిపించదు, వినరు. అందుకే వీరు దుష్టకార్యాలలో నిమగ్నమై భగవంతునికి దూరమైపోతారు. భగవంతుని ఆశ్రయించాలనుకోరు. అర్జునుడు పరమాత్మనే కావాలన్నాడు. విజయం సాధించాడు.

2.<u>మూఢః</u>:- మూఢులు, వీరి కసలు శాస్త్రం తెలియదు. ఎవరి మాటా వినరు. ఇది తప్పు, ఇది రైటు అని తెలుసుకోలేరు. చెప్పినా అర్థం కాదు. సరైన ఆలోచన చేయలేదు. ఇట్టివారు భగవంతుని వైపుకు తిరగరు. అన్నీ తనకు తెలుసుననుకుంటాడు. తనకు తోచినట్లు నడుస్తాడు. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అంటాడు.

దుర్యోధనుడు దుర్మార్గుడే కాదు, మూఢుడు కూడా. కేవలం కర్ణుని నమ్ముకొని పాండవులతో శతృత్వం పెంచుకొని యుద్ధానికి సిద్ధమయ్యాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆ కర్ణుడు ఎప్పుడైనా అర్జునుని గెల్చాడా? గురుదక్షిణ సమయంలో ద్రుపదునితో యుద్ధం చేసి ఓడి పారిపోయినవాడు. ఆ దృపదుని అర్జునుడు బంధించి తెచ్చి ద్రోణాచార్యుని పాదాలపై పడవేశాడు. ద్రౌపదీ స్వయంవర సమయంలో అర్జునునితో పోరి యుద్ధరంగం నుండి తొలగిపోయినవాడు. ఘోషయాత్రా సమయంలో గంధర్వుల చేతిలో ఓడి పారిపోయినవాడు. ఆ గంధర్వులను ఓడించి తమను విడిపించినవాడు అర్జునుడు. ఉత్తర గోగ్రహణ సమయంలో ఒక్కడుగా వచ్చిన అర్జునునితో పోరి ఓడిపోయినవాడు. ఇన్ని సందర్భాలలో కర్ణుని బలపరాక్రమాలు తెలిసినా అతడే తనకు విజయం సాధించి పెట్టగలడని ఎలా నమ్ముతాడు? మూర్ఖుడు గనుకనే నమ్మాడు. ఇలాంటి మూర్ఖులు భగవంతుడు ఎదురుగా ఉన్నా తెలుసుకోలేరు.

మూర్ఖులు భగవంతుని గురించి తెలుసుకోవాలనుకోరు, తెలుసుకోరు, ఎవరైనా చెప్పబోతే వినరు; ఏదో పని ఉన్నట్లు వెళ్ళిపోతారు. ఇదంతా తెలివి తక్కువవాళ్ళు చేసేపని అనుకుంటారు. తామే తెలివిగల వారిమనుకుంటారు.

3.అపహృతజ్ఞానులు :- మూర్ఖులలాగా వీరు తెలియని వారు కాదు. జ్ఞానం ఉన్నవారే. శాస్త్రం తెలిసినవారే. ఇతరులకు బోధించే తెలివి కూడా కొందరికి ఉంటుంది. అయినా శాస్త్రం చూపిన మార్గంలో నడవరు. తెలుసుకున్న దానిని ఆచరించరు. జ్ఞానం ఉన్నా వారి జ్ఞానం మోహం చేత కప్పబడి ఉంటుంది.

'మాయ' అనే దోపిడీ దొంగ బుద్ధిలో ఉన్న జ్ఞానమనే రత్నాన్ని కొల్లగొట్టి అపహరించాడు. కనుక బుద్ధిలోని జ్ఞానం తొలగిపోయింది. బుద్ధి చెడుతుంది. బుద్ధి చెడినవాడు భగవంతుని వైపుకు తిరగలేడు. భగవంతుని వైపుకు

తిరగకపోయినా శాస్త్రజ్ఞానం ఉన్నది గనుక దానిని ముక్తి కొరకు గాక భుక్తి కొరకు, కీర్తిప్రతిష్టల కొరకు ఉపయోగించుకుంటాడు. లోకంలో ఇలాంటి వారు ఎంత తెలిసినవారైనా మాయలో పడి నాశనమవుతారు.

ధృతరాష్ట్రుడు పుట్టి గ్రుడ్డి. అయినా షడంగ సహితముగ వేద వేదాంగముల నభ్యసించినవాడు; సర్వశాస్త్రాలు తెలిసిన వాడు. ఎల్లప్పుడూ ప్రక్కనే సర్వ ధర్మవిదుడైన విదురుడు హితబోధ చేస్తుంటాడు. భీష్మ, ద్రోణ, సంజయాదులు మంచిని బోధిస్తూ ఉంటారు. సనత్సుజాతుని ద్వారా అనేక వేదాంత విషయాలు, మోక్షప్రాప్తికి ఉపాయాలు తెలుసుకున్నాడు.

భగవంతుని కృపతో విశ్వరూపాన్ని సందర్శించినవాడు. ఆయన మహిమను స్వయంగా వీక్షించినవాడు, గ్రహించినవాడు. అయినప్పటికీ ఆయన మాట వినలేదు. వ్యాసుని మాట వినలేదు. సంజయుని మాట వినలేదు. చివరకు వందమంది పుత్రులలో ఒక్కడు కూడా మిగలకుండా సర్వనాశనమయ్యాడు. ఇట్టి వారే అపహృతజ్ఞానులు. ఆశ వల్ల, మమకారం వల్ల జ్ఞానం కప్పి వేయబడింది.

4. నరాధములు :- వీళ్ళని 2 కాళ్ళ జంతువులు అనవచ్చు. రూపం మనుష్య రూపం. ప్రవర్తన పశుప్రవర్తన. వీరికి మాయ ఎప్పటికీ తొలగదు. భగవంతునివైపు తిరగరు. వీరు రకరకాల జంతు, పక్షి, క్రిమి, కీటకజన్మలు ఎత్తి, ఎత్తి మొదటిసారిగా మానవజన్మనెత్తి వచ్చినవారు. అందుకే ఆ జంతుజన్మల వాసనలు ప్రబలంగా ఉంటాయి. అందుకే ఆయా జంతువుల స్వభావాలు వారిలో ఉంటాయి. వీరు నరులలో అధములు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఒకడు భార్యను కొడుతూ ఉంటాడు. చుట్టుప్రక్కలవాళ్ళు చేరి అడ్డుకుంటారు, కొందరు తిడతారు. అయినా సరే కొట్టటమే నా పవిత్ర కర్తవ్యం అనుకుంటూ కొడుతుంటాడు. ఎవరేమన్నా పట్టించుకోడు. ఇది దున్నపోతు స్వభావం.

ఒకడు ఎప్పుడూ పనికిరానిపనులు, చేయకూడని పనులు చేస్తుంటాడు. ఎవరైనా తటస్థపడితే వారికీ తన బుద్ధులు అంటించాలని చూస్తాడు. ఇది పంది స్వభావం. పంది బురదలో ఉండి మనుషులు కనిపించగానే ఒళ్ళు విదిలిస్తుంది. దానితో బురద వారి మీద పడుతుంది.

ఒకడు అమాయకుడితో కలసి వ్యాపారం చేసి వాణ్ణి నిలువునా ముంచుతాడు. ఇది నక్క స్వభావం.

ఒకడు ఎప్పుడూ దుర్మార్గపు విషయాలనే నూరిపోస్తూ ఉంటాడు. ఇది విషాన్ని గ్రక్కే పాము స్వభావం. ఒకడు జలగలా రక్తం పీల్చినట్లు ఆస్తులు కాజేసి పీల్చి పిప్పి చేస్తాడు. ఒకడు మృగంలా మీది మీదికొస్తాడు. వీరేనరాధములు.

ఇలా జంతువులుగా ప్రవర్తించే మానవులకు భగవంతుని వైపుకు తిరిగే అవకాశం ఉండదు.

5. ఆసురం భావం ఆశ్రితాః :- ఆసుర భావాలనాశ్రయించిన వారు. కక్ష, హింస, క్రూరత్వం, అకారణంగా ద్వేషించి హాని కలిగించటం - ఇవి ఆసురీభావాలు. వీరు నరాధములకన్నా అధములు. రజోగుణ, తమోగుణ ప్రకోపంతో హత్యలు, గృహదహనాలు, బలాత్కారాలు, బాంబులు పేల్చి అమాయకుల ప్రాణాలు తీయటాలు, శాడిజం, యాసిడ్ లు చల్లటం మొదలైన క్రూర కర్మలతో

రక్తసిక్తమైన వారు. వీరిలో దయ, సత్యం, శౌచం, క్షమ అసలే ఉండవు. "దయ" అనే మాటకు అర్థం తెలియని ఈ క్రూరకర్ములు భగవంతుని గురించి అసలు తెలుసుకోలేరు. వీరు నీచమైన, నికృష్టమైన యోనులందు జన్మించి చేసిన క్రూర కర్మల ఫలితాన్ని అనుభవిస్తారు.

పదవుల కోసం మతకలహాలు సృష్టించి మారణ హోమం చేసేవారు, అమాయకులను మతద్వేషాలతో బాంబులు పేల్చి సంహరించి ఆనందించే వారు, బస్సులో పెట్రోలు పోసి తగలబెట్టి అందరూ హాహాకారాలు చేస్తుంటే పైశాచిక ఆనందాన్ని పొందేవారు ఈ జాతివారే.

అసురభావానికి, దైవీభావానికి జరిగే ఘర్షణయే పురాణ ఇతిహాసాలలో చెప్పబడ్డ యుద్ధాలు, పోరాటాలు.

రామాయణంలో రామరావణ యుద్ధం,

భారతంలో కురుపాండవ యుద్ధం,

భాగవతంలో ఇంద్ర వృత్రాసుర యుద్ధం,

పురాణాలలో దేవదానవ యుద్ధం,

క్రైస్థవ మతంలో ప్రభువుకు సైతానుకు జరిగిన పోరాటం,

ఇస్లాం మతంలో అల్లాకు ఇబ్లీసుకు జరిగిన పోరాటం,

బౌద్ధ గ్రంథాలలో బుద్ధునికి మారునికి జరిగిన పోరాటం - ఇలాంటివే.

భగవంతునివైపుకు తిరగలేని, తిరగని వారి మనస్సు, ఆలోచనలు ఎలా ఉంటాయో తెలుసుకొని మనం మన ఆలోచనలను చక్కగా విశ్లేషణ చేసుకొని, మన ఆలోచనలను, ఆచరణను మార్చుకోవాలి. ప్రాపంచిక

విషయాలకు గాక భగవంతునికి అధిక ప్రాధాన్యత నిచ్చి భగవంతుని వైపుకు తిరగాలి.

- ఇక భగవంతుని వైపుకు తిరిగి ఆయనను భజించే వారెవరో తెలుపుతున్నారు.

**శ్లో||** చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతి నోఽర్జున|
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!|| **(16)**

**తా||** భరత శ్రేష్ఠా! ఆర్తుడూ, జిజ్ఞాసువు, అర్థార్థీ, జ్ఞానీ అనే నాలుగు రకాల పుణ్యాత్ములు నన్ను భజిస్తారు.

**వ్యాఖ్య:-** సుకృతులు అంటే సత్కార్యాలు, పుణ్యకార్యాలు చేసినవారు - అని. పూర్వజన్మలో అలా సుకృతాలు చేసినవారు ఈ జన్మలో భగవంతుని వైపుకు తిరుగుతారు. అయితే అలా తిరగటానికి గల కారణాన్ని బట్టి వారిని 4 విధాలుగా విభాగించారు. వారే 1.ఆర్తులు 2.అర్థార్థులు 3.జిజ్ఞాసువులు 4.జ్ఞాని -అని.

1.<u>ఆర్తులు:-</u> ఆర్తులంటే కష్టాలలో, దుఃఖాలలో ఉన్నవారు. శారీరకంగా గాని మానసికంగా గాని ఏవైనా కష్టాలున్నప్పుడు వీరు భగవంతునివైపు తిరుగుతారు. కష్టాలు, దుఃఖాలు లేని మానవుడు ఈ భూమిపై ఒక్కడు కూడా ఉండడు. 'శరీరం రోగమయం' - 'ప్రపంచం దుఃఖమయం' అన్నారు. 'లోకం శోకహతంచ సమస్తం' అన్నారు శంకరులు భజగోవిందంలో. కనుక దుఃఖం లేనివారు లోకంలో ఉండరు. అయితే కష్టాలు, దుఃఖాలు కలిగినప్పుడైనా

భగవంతుని వైపుకు తిరగాలి అనే సద్బుద్ధి అందరికీ కలగదు. కొందరే అలా 'సంకటమొస్తే వెంకటరమణ' అంటారు. ఐనా వారూ భక్తులే అంటున్నాడు భగవానుడు. ఎందుకంటే ఏమి కోరుతున్నాడు? అనిగాక ఎవరిని కోరుతున్నాడు? అనే విషయాన్ని గమనించాలి. కోరిక ఉన్నప్పటికీ భక్తిని గనుక దానికి జోడిస్తే ఆ కోరిక కూడా పవిత్రమవుతుంది.

ధృవుడికి తండ్రి ఒడిలో కూర్చోవాలని కోరిక. సవతి తల్లి ఆ బాల్యుణ్ణి లాగివేసింది. ఆ అవమానభారంతో ఎలాగైనా ఉన్నతస్థానం సంపాదించాలనుకుని 6 సం||ల వయస్సులో 6 నెలలు ఘోరతపస్సు చేశాడు. భగవంతుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకో అన్నాడు. ఏమీ కోరుకోకుండా ఉండే స్వభావాన్ని ప్రసాదించమన్నాడు ధృవుడు. భగవత్సాక్షాత్కారంతో సకామబుద్ధి నిష్కామబుద్ధిగా మారింది.

ద్రౌపది కురుసభలో చెప్పరానంత కష్టం వచ్చినప్పుడు మహావీరులైన భర్తలను ఆశ్రయించక నేరుగా భగవంతుని ఆశ్రయించింది. దుఃఖం తొలగించుకుంది.

గజేంద్రుడు మాత్రం తన శాయశక్తులా మొసలితో పోరాడాడు. ఇక పోరాడలేనని తెలుసుకున్న తర్వాత భగవంతుని శరణుకోరాడు. సాక్షాత్కారం పొంది మొసలి బాధ నుండి విముక్తుడయ్యాడు.

శివాలయంలో ప్రవేశించి శివుడి కన్న ముందు నందికి నమస్కరిస్తాం. నంది అంటే ఎద్దు. పశువు. పశువుకెందుకు నమస్కారం? అది ఎప్పుడూ పరమేశ్వరుని వైపుకు తిరిగి ఉంటుంది గనుక దానికా అర్హత. కనుక ఆర్తుడు

తన ఆర్తిని తీర్చుకొనటానికైనా ప్రపంచం వైపుకు కాకుండా పరమాత్మవైపుకు తిరిగితే అతడూ భక్తుడే.

2.అర్థార్థి :- ధనమో, ఇల్లో, వాకిలో, వస్తువో, పదవో ఏదో ఒకదానిని తన సుఖం కోసం, భోగం కోసం, ఆనందం కోసం కోరుకునేవాణ్ణి అర్థార్థి అంటారు. అయితే ఈ కోరికలను కూడా భగవంతుని వైపుకు తిరిగి కోరుకోవటం వల్ల అతణ్ణి కూడా భక్తుడే అంటున్నారు. భగవంతుని వైపుకు తిరగటమే అతడిలో సుగుణం. కుచేలుడు, ధృవుడు, విభీషణుడు, సుగ్రీవుడు - వీరంతా అర్థార్థులైన భక్తులే. 'అడిగిన వారికి ఇవ్వబడును' అని భగవంతుడు బోర్డు పెట్టుకొని అడిగినది ఇవ్వటానికి సిద్ధపడి కూర్చుంటే - ఇక ఈ అజ్ఞాన మానవుడు అల్పులు, స్వల్పులు ఐన మానవులను యాచించటం ఎందుకు? భగవంతునే ఆశ్రయించి తమ కోరికలు నేరవేర్చుకోవాలి. ఆర్తులు, అర్థార్థులు - ఈ రెండు రకాల వారు సకాములే అయినప్పటికీ భగవంతుని వైపు తిరిగారు గనుక భక్తులయ్యారు. భగవంతుని ఆశ్రయం - సాన్నిధ్యం దొరికితే చాలు సకాములు కాస్తా నిష్కాములవుతారు.

3.జిజ్ఞాసువు :- తెలుసుకోవాలనే తపనయే జిజ్ఞాస. ఈ ప్రపంచం ఏమిటి? ఎవరు దీనిని సృష్టించారు? భగవంతుడెవరు? ఎలా ఉంటాడు? ఎక్కడుంటాడు? నేనెవరిని? భగవంతుని నేనెందుకు పూజించాలి? ఎందుకు ఆయనను గురించి తెలుసుకోవాలి? అతడికి నాకు సంబంధం ఏమిటి? నేనెందుకు సత్కార్యాలు చేయాలి? ఇలా సందేహాలు కలుగుతూ, వాటిని తీర్చుకోవాలనుకోవటమే జిజ్ఞాస. అట్టి జిజ్ఞాసగలవాడే జిజ్ఞాసువు.

మరొక రకం జిజ్ఞాస కూడా ఉంది. వదినగారూ! ఆ సుబ్బమ్మ కూతుర్ని మొగుడు వదిలేశాడంట గదా! ఎందుకట?; సూరమ్మత్తా! ఇదేం పోయేకాలం. వాళ్ళమ్మాయి ఎవడో కిరస్తానీ వాణ్ణి చేసుకున్నదట గదా!; అక్కయ్యా! మొన్న పండక్కి చేయించుకున్న రాళ్ళగాజులు ఒకసారి చూపించవూ! ఎంత తూకం? - ఇలాంటి సందేహాలు తీర్చుకోవాలనుకోవటం కూడా జిజ్ఞాసే. అయితే భగవంతుని విషయాలకు సంబంధించిన జిజ్ఞాసయే నిజమైన జిజ్ఞాస. వీరే జిజ్ఞాసువులు. ఇట్టి జిజ్ఞాసతోనే దేశవిదేశాల నుండి ఎందరో భారతదేశానికి వచ్చి భగవాన్ రమణ మహర్షిని, అరవింద యోగిని దర్శించి ఆశ్రయించేవారు. జిజ్ఞాసను ముందు పెట్టుకొనే ఉపనిషత్తులు బయలుదేరాయి. ఈ జిజ్ఞాసువు కూడా భక్తుడే.

4.జ్ఞాని :- ఇతడే అందరిలోను గొప్ప భక్తుడు. పరాభక్తుడు. ఇతడు నిష్కామభక్తుడు. నిర్గుణ భక్తుడు. స్వార్థం లేని భక్తుడు. ఏమీ కోరని భక్తుడు. భగవత్తత్వం సంపూర్ణంగా తెలిసిన భక్తుడు. నిరంతరం ఆత్మయందే మనస్సును నిల్పి ఆత్మలో రమిస్తూ పరవశించే భక్తుడు. అతడికి ఈ లోకంలో దేనితోనూ పనిలేదు. అన్నీ ఆత్మలోనే దర్శిస్తూ ఆత్మలోనే ఆనందిస్తుంటాడు. శుకుడు, నారదుడు, ప్రహ్లాదుడు, సనకసనందనాదులు ఈ తరగతికి చెందినవారు: జ్ఞానిని కూడా ఇలా నాలుగురకాల భక్తులలో చేర్చి చెబుతుంటే వింటున్న అర్జునునికి సందేహం కలిగింది. ఈ నలుగురు భక్తులు ఒకే శ్రేణికి చెందినవారా? లేక తేడాలు, తరతమభేదాలు ఉన్నాయా? అని. సందేహాన్ని

ప్రశ్నగా అడగలేదు గాని క్వశ్చన్ మార్కు ముఖం పెట్టాడు అర్జునుడు. దానికి భగవానుడు సమాధానం చెబుతున్నాడు. ఏమని?

- ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు - అనే నాలుగు రకాల భక్తులు ఒకే శ్రేణికి చెందినవారా? లేక వారిలో తరతమ భేదాలున్నాయా?

**శ్లో||** తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే|

ప్రియోహి జ్ఞానినోஉత్యర్థం అహంసచమమప్రియః|| **(17)**

**తా||** వారిలో నిత్యము నాతో కలిసి ఉండే, నా ఒక్కనియందే భక్తిగల జ్ఞాని శ్రేష్ఠుడు. అట్టి జ్ఞానికి నేను ఎక్కువ ప్రియుణ్ణి. అతడు నాకు ప్రియుడు.

**వ్యాఖ్య:-** నాలుగురకాల భక్తులలో జ్ఞాని శ్రేష్ఠుడు. ఎందువల్ల? రెండు కారణాలు. 1.నిత్యయుక్తః 2.ఏకభక్తిః, ఈ రెండు కారణాల వల్ల జ్ఞానియే శ్రేష్ఠుడు.

1.నిత్యయుక్తః:- నిత్యయుక్తుడంటే ఎల్లప్పుడూ పరమాత్మతో కలిసి ఉండేవాడు. ఆర్తులు దుఃఖాలు కలిగినప్పుడు, అర్థార్థులు కోరికలతోవున్నప్పుడు, జిజ్ఞాసులు సందేహాలు కలిగినప్పుడు భగవంతుని స్మరిస్తారు. కాని జ్ఞాని ఎల్లప్పుడూ భగవంతునితో కలిసి వుంటాడు, భగవంతునే ధ్యానిస్తూ వుంటాడు. అతడికి రెండవ దృష్టి వుండదు. మొదటి ముగ్గురూ పాక్షికభక్తులు. జ్ఞాని పరిపూర్ణభక్తుడు. సూర్యునికి ప్రకాశం ఎట్లా సహజమో, జ్ఞానికి భక్తి అలా సహజం. మిగిలిన భక్తులు అలాకాదు.

ఒక ఇంట్లో తల్లీ బిడ్డా వున్నారు. బిడ్డకు 10 ఏళ్ల వయస్సు. తల్లి తన బిడ్డకు ఎప్పుడూ చెబుతుంటుంది; "అమ్మా! నీకు ఎప్పుడైనా భయం వేస్తే భగవంతుని తలచుకో. ఆయన నిన్ను కాపాడుతాడు" అని. బిడ్డ మనసులో ఆ మాట బాగా నాటుకుంది. ఒకరోజున తల్లి ప్రక్క గ్రామం వెళుతూ "రేపు తిరిగి వస్తాను. ఇల్లు జాగ్రత్త" అని బిడ్డకు చెప్పి వెళ్ళింది. చీకటి పడగానే బిడ్డకు భయమేసింది. వెంటనే తల్లి మాట గుర్తుకు వచ్చి "భగవంతుడా! నాకు భయంగా ఉంది. మా అమ్మ ఇంట్లో లేదు. నీవు త్వరగా వచ్చి రక్షించు" అని ప్రార్థన చేసింది. మరునాడు తల్లి వచ్చింది. ఇప్పుడు "ఓ భగవంతుడా! మా అమ్మ వచ్చింది. ఇక నీతో పనిలేదు. నీవు వెళ్ళవచ్చు" అన్నది - ఇదీ వరస- - - అంటే - ఆర్తుడు దుఃఖం, భయం తీరిపోగానే భగవంతుని వదిలేస్తాడు. అర్థార్థి కోరిక తీరిపోగానే భగవంతుని వదిలేస్తాడు. జిజ్ఞాసువు శాస్త్ర సంబంధ జ్ఞానం కలగగానే భగవంతుని వదిలేస్తాడు. కాని - - - జ్ఞాని ఆత్మజ్ఞానం పొందగానే భగవంతుని వదిలేస్తాడా? లేదు. ఎందుకని? ఆత్మజ్ఞానాన్ని పొందటమంటే నేను భగవంతుణ్ణి 'అహం బ్రహ్మాస్మి' - అని గ్రహించటమే. తానే భగవంతుడని గ్రహిస్తే ఇక భగవంతుని ఎలా వదిలేస్తాడు? కనుక అతడు భగవంతునితో నిత్యయుక్తుడు.

మనకు శరీరం - మనసు - బుద్ధి అనే మూడు పరికరాలున్నాయి. వాటిలో శరీరం ఎప్పుడూ భోగాలను కోరుకుంటూ ప్రపంచం వైపుకు తిరుగుతుంది. బుద్ధి ఎప్పుడూ పరమాత్మవైపుకే పయనిస్తుంది. ఇక మధ్యలో వున్న మనసు శరీరం వైపు తిరిగిందా.....? భగవంతుడికి దూరమౌతాం.

అలాగాక బుద్ధివైపు తిరిగిందా.....? ఇంద్రియాలు వశమై భగవంతునిపై దృష్టి నిలిచిపోతుంది. జ్ఞాని మనసు ఎప్పుడూ బుద్ధివైపుకే తిరిగి వుంటుంది. కనుక నిత్యయుక్తుడు.

2.ఏకభక్తి :- జ్ఞాని ఏకభక్తుడు. మిగిలినవారు అనేక భక్తులు. ఒకే ఒక్క దానిపై భక్తి వుంటే ఏకభక్తుడు. అనేకం మీద భక్తి వుంటే అనేక భక్తులు. భగవంతునిపైనే గాక అనేక వస్తువులపై, విషయాలపై, వ్యక్తులపై భక్తి వుంటుంది ఇతర భక్తులకు. కాని ఒకే ఒక్కడైన భగవంతునిపై మనసు నిల్చిపోతుంది జ్ఞానికి. మనసు దేనిమీదకు పోకుండా, మనసులోకి ఏ విషయాలు రాకుండా నిరంతరం భగవంతుని యందే నిల్చిన మనసు గలవాడు జ్ఞాని.

జ్ఞానికి నేను అత్యంత ప్రియుణ్ణి. అతడు నాకు ప్రియుడు. జ్ఞానికి భగవంతుని యందు అమితమైన ప్రేమ..... కారణం? భగవంతుడంటే ఎవరో కాదు, తన ఆత్మే - తానే..... తనమీద తనకు ఎవరికైనా ప్రేమయే గదా! తన భార్యయందు, తన భర్తయందు, తన బిడ్డలయందు, తన తెలివియందు తన మంచితనము నందు అందరికీ ప్రేమయే - ప్రీతియే. తనవి కానివాటి యందు అంత ప్రేమ వుండదు. అందుకే అంటారు "పరకంపు చెడు కంపు, తన కంపు ఇంపు" అని ..... తనది అంటే ఎవరికైనా గొప్పయే.

జ్ఞానికి దృశ్యవస్తువులపైనా, భోగాలపైనా ప్రీతి వుండదు. కారణం? అవి అనిత్యాలు గనుక..... నశించిపోయేవి గనుక...... తనకన్నా వేరైనవి గనుక. కాని పరమాత్మ యందు అమితమైన ప్రేమ. కారణం? పరమాత్మ నిత్యుడు గనుక, అవినాశి గనుక, తన స్వరూపమే...... తానే గనుక.

ఇలా ఎల్లప్పుడూ భగవంతుని యందే ప్రీతిగలవాడు జ్ఞాని గనుక - భగవంతునికి కూడా జ్ఞాని అంటే అంతే ప్రీతి. నేనంటే ఎవరికి ఇష్టమో వారంటే నాకూ ఇష్టమే. ఇది సహజమే గదా! జ్ఞాని దృష్టి ఎప్పుడూ పరమాత్మ మీదే గనుక పరమాత్మ దృష్టి ఎప్పుడూ జ్ఞాని మీదే వుంటుంది. తక్కిన భక్తులపై, ఇతరులపై వుండదని కాదు. కాని జ్ఞాని అందరికన్నా అత్యంతప్రియుడు.

భగవంతుని ప్రేమ విశ్వంలోని అందరిపై వుంటుంది. ఆయనకు ద్వేషం వుంటే ఎవడు బ్రతికి బట్టగట్టగలుగుతాడు? పాపాత్ములు, పుణ్యాత్ములు, ఖూనీకోర్లు, దొంగలు అందరూ బ్రతుకుతున్నారు. అంటే ఆయన ప్రేమ అందరిపైనా వున్నదన్న మాట. అయితే ఈ సంగతి జ్ఞానికి తెలుసు, మిగతావారికి తెలియదు. వారి అజ్ఞానంతో వారు దూరమౌతున్నారు. వారు కూడా దగ్గరైతే వారిపైనా భగవంతుని దృష్టి ఎప్పుడూ వుంటుంది. చలి పోగొట్టే గుణం అగ్నిది. అయితే దగ్గర కూర్చున్న వారి చలినే పోగొడుతుంది. అలాగే భగవంతునికి ఎల్లప్పుడూ దగ్గరగా వుండే జ్ఞానియే భగవంతునికి అత్యంత ప్రియుడు.

ప్రపంచంలో ఎవరి ప్రేమను సంపాదించినా మంచిదే. కాని భగవంతుని ప్రేమను సంపాదించగలగటం ఎంతో మంచిది; ఎంతో గొప్పది. ఇతరులు మెచ్చితే మనను ప్రశంసిస్తారు, అంతే. కాని భగవంతుడు మెచ్చితే మోక్ష సామ్రాజ్యమే లభిస్తుంది...... జన్మ సార్థకమౌతుంది. కనుక జ్ఞానియే కృతకృత్యుడు.

సరే! జ్ఞాని శ్రేష్టుడు ..... బాగానే వుంది. మరి ఇతర భక్తులను వదిలేస్తాడా భగవంతుడు! లేదు....... లేదు.... వారిని కూడా వదలడు. కాకపోతే వారికి జ్ఞానికి మధ్యగల భేదాన్ని తెలియజేస్తున్నాడు. ఏమని?

**శ్లో||** ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మేవతం|

ఆస్థితస్సహ యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం|| **(18)**

**తా||** వీరంతా ఉదారులే. అయితే జ్ఞాని మాత్రం నా స్వరూపమేనని నా అభిప్రాయం. ఎందుకంటే అతడు సర్వోత్తమమైన ప్రాప్తి స్థానంగా నన్నే భావించి, నాయందే మనసు నిల్పి నన్ను ఆశ్రయించినవాడౌతున్నాడు.

**వ్యాఖ్య:-** ఉదారాస్సర్వఏవైతే :- ఏతే సర్వ ఉదారా ఏవ - వీరంతా ఉదారులే. ఏదో ఒక కారణంతో భగవంతునివైపుకు తిరిగిన వారు గనుక, వీరంతా ఉదారులే, పుణ్యాత్ములే - ఉత్తములే. అయితే జ్ఞానిమాత్రం నా స్వరూపమే. జ్ఞాని నా స్వరూపమే అన్నంత మాత్రాన మిగిలినవారు లెక్కలోని వారు కాదని అనుకోకూడదు. వారు కూడా ఉత్తములే. ఏమాత్రం భక్తిలేక, ఎట్టి విపత్కర పరిస్థితులలోను భగవంతుని వైపుకు చూడక, ఆయనను ఆశ్రయించక వున్నవారి కన్న వీరు ఎంతో గొప్పవారు. ఎందుకంటే వీరు కనీసం తమ కష్టాలు తీరటానికైనా, కోరికలు నెరవేర్చుకోవటానికైనా భగవంతుణ్ణి ఆశ్రయించారు గనుక.

అయితే అందరిలో జ్ఞాని అంతస్థు బాగా గొప్పది. దానికి ఒక్కటే కారణం. అతడు ఎప్పుడూ భగవచ్చింతనలోనే వుంటాడు. ఎప్పుడూ

దైవకార్యాలు, దైవధ్యానం, దైవస్మరణ చేస్తూ, దైవానికి దగ్గరై, దైవంతో ఐక్యమై వుంటాడు. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అన్నారు. అంటే బ్రహ్మవేత్త బ్రహ్మమే - అని.

పంచదారబొమ్మ నీటిలో మునిగి నీటి రూపాన్నే ధరించినట్లు ..... సముద్రంలో పడ్డ వడగళ్ళు సముద్ర రూపం ధరించినట్లు..... జ్ఞాని యొక్క చిత్తం బ్రహ్మంలో లయమై బ్రహ్మరూపం ధరిస్తుంది....

కనుకనే జ్ఞానికి, నాకు తేడా లేదు, జ్ఞాని సాక్షాత్తు నేనే అంటున్నాడు. ధ్యానంలో ఆరూఢస్థితిని పొందినవాడు, ఆలోచనలు అంతమై భావాతీత స్థితిలో నిలిచినవాడు, తాను ఆత్మనే అనే అనుభూతిలో వుంటాడు. ఇప్పుడు నేను మనిషిని అనే అనుభూతి మనకెలా వుందో అతడికి ఆత్మను అనే అనుభూతి వుంటుంది. తానూ భగవంతుడు ఒక్కటే అనే భావం స్థిరంగా వుంటుంది. అందుకే జ్ఞాని సాక్షాత్తు నేనే అంటున్నాడు భగవానుడు.

ఒక మంత్రితో స్నేహం కలిగి వుండటానికి, తానే స్వయంగా మంత్రి కావటానికి తేడా వుంటుంది. మంత్రితో స్నేహం వల్ల సమాజంలో కొంత ప్రయోజనం వుంటుంది. కాని స్వయంగా అతడే మంత్రైతే అతడికి సంపూర్ణ అధికారం, గౌరవం, వైభవం వుంటుంది. అలాగే సామాన్యులకన్నా సత్కర్మలు చేసేవారు అధికులు..... సత్కర్మలు చేసేవారి కన్నా ఆత్మతో ఐక్యమై, తానూ ఆత్మ వేరుకాదని, ఆ పరమాత్మను నేనేనని, అహం బ్రహ్మస్మి అని తెలుసుకొని, అనుభూతి చెందినవాడు పరమశ్రేష్ఠుడు.

భగవంతుడు అట్టి జ్ఞానిని ప్రశంసిస్తున్నాడు. అల్పమైన వస్తువులను కోరేవారు కృపణులు - పిసినిగొట్లు. భగవంతుని కోరేవారు ఉదారులు. వారిలో కూడా భగవంతునితో ఐక్యమైన జ్ఞాని సర్వశ్రేష్టుడు. ఎందుకంటే అతడు

1.యుక్తాత్ముడు :- అంటే నిరంతరం భగవంతుని యందే వుండే వాడు. అతడి మనసు భగవంతునిలోనే తిరుగుతుంటుంది. బాహ్య విషయాలు పట్టవు.

2.నన్నే సర్వోత్తమ గతిగ ఆశ్రయించినవాడు :- అంటే పొందవలసిన లక్ష్యం భగవంతుడే అని తెలుసుకొని భగవంతుని ఆశ్రయించినవాడు భగవంతుడే అయ్యాడు. జ్ఞానిని భగవంతుని వేరు చెయ్యటానికి వీలులేదు. అందుకే జ్ఞానిని శరీరం ధరించిన భగవంతుడు అనవచ్చు.

ద్వైతంలో భగవంతుడు దూరంగా వుంటాడు..... విశిష్టా ద్వైతంలో భగవంతుడు దగ్గరగా వుంటాడు..... అద్వైతంలో తానే భగవంతుడై యుంటాడు. ఇతడే జ్ఞాని...

కనుకనే జ్ఞానులను, జీవన్ముక్తులను సాక్షాత్తు దైవంగా భావించి జనులు ఆరాధిస్తారు, పూజిస్తారు. అట్టి అద్వయజ్ఞానం కలిగేవరకు ఆత్మసాధన సాగించాలి.

- అయితే జ్ఞాని ఇట్టి స్థితికి ఎలా వచ్చాడు?

**శ్లో|| బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే|**

**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సు దుర్లభః|| (19)**

**తా||** అనేక జన్మల అనంతరం జ్ఞాని సర్వమూ వాసుదేవుడే అని నన్ను కొలుస్తాడు. అలాంటి మహాత్ముడు చాలా అరుదుగా వుంటాడు.

**వ్యాఖ్య:-** అనేక జన్మలు గడిచిపోయిన తర్వాతనే మానవుడు జ్ఞానాన్ని పొంది, జ్ఞాని అవుతున్నాడు. ఈ జన్మలో ఒకడు గొప్ప జ్ఞాని అయ్యాడు - అంటే, లేదా భగవంతుని గురించిన జ్ఞానవిజ్ఞానాలను తెలుసుకొనుటకు తపించి పోతున్నాడంటే వాడికి అంతకుముందు అనేక జన్మలలో చేసుకున్న పుణ్యబలం, శ్రవణబలం, సాధనాబలం - అన్నీ వుండి వుండాలి. ఏరు పొంగి వచ్చిందీ అంటే పైన ఎక్కడో వర్షం పడి వుండాలి. ఒక వ్యక్తి గొప్ప ఉద్యోగం సంపాదించాడంటే అతడు ఎంతో కష్టపడి చదివి, గొప్ప ప్రయత్నం చేసి వుండాలి.

అలాగే ఈ జన్మలో ఒకడు జ్ఞాని అయ్యాడంటే అతడికి ఇంతకుముందరి జన్మలే కారణం. ఆ జన్మలలో అతడు జ్ఞానం కోసం సద్గురువులను ఆశ్రయించి వుండాలి. శాస్త్రాల నుండి జ్ఞానాన్ని పొంది, జ్ఞాన సాధనలు చేసి వుండాలి అని తెలుస్తుంది. దీనిని బట్టి ఎవ్వడూ ఒక్క జన్మలో అమాంతంగా జ్ఞాని ఐపోడు.

ఈ జన్మలో మోక్షార్థులమై సత్కార్యాలు చేస్తూ, సద్గ్రంథాలు పఠిస్తూ, సత్పురుషులను, సద్గురువులను సేవిస్తూ, జ్ఞానప్రాప్తికి సాధనలు చేస్తూ, ఆత్మజ్ఞానం పొందుతున్నామంటే - పరమాత్మ సాక్షాత్కారాన్ని, మోక్షాన్ని, సర్వకర్మబంధ విముక్తిని ఆపేక్షిస్తున్నాం..... అంటే - శ్రవణ, మనన, నిదిధ్యాసనలు కొనసాగిస్తున్నామంటే దీనికి అనేక పూర్వజన్మల పుణ్యఫలం వున్నదని

గుర్తించాలి. అంతేకాదు, రాబోయే జన్మ మరింత ఉత్తమోత్తమజన్మ తథ్యం అని కూడా గ్రహించాలి.

భగవంతుడంటున్నాడు, "జ్ఞాని అంటే నేనే. నాకూ జ్ఞానికి భేదం లేదు. అతడున్న చోటు కాశి ..... అతడు మునిగింది గంగ... అతడు పలికింది వేదం... అతడితో సాంగత్యం భగవంతుడితో సాంగత్యమే.... అతడికి నమస్కరిస్తే నాకు నమస్కరించినట్లే... అతడికి భోజనాది సత్కార్యాలు చేస్తే నాకు చేసినట్లే... అతణ్ణి సంతోషపెడితే నన్ను సంతోషపెట్టినట్లే.... అతడికి సేవచేస్తే నాకు చేసినట్లే - అని.

అట్టి జ్ఞాని పొందే జ్ఞాన స్వరూపం ఎటువంటిది? ఈ కనిపించే ప్రపంచమంతా వాసుదేవుడే. వసు అంటే సంపద. దేవుడంటే... ఇచ్చేవాడు. ఈ సమస్త సంపదను - ప్రకృతిని - ప్రపంచాన్ని ఇచ్చినవాడు పరమాత్మ. ఆయనే వాసుదేవుడు. ఈ ప్రపంచాన్ని చూస్తున్న నేను; నాలో వున్న సర్వస్వం - అంతా వాసుదేవుడే. వాసుదేవస్సర్వమితి అనేదే జ్ఞానం.

చూడబడేది, చూచేవాడు, చూడటం, అంతా వాసుదేవుడే. వాసుదేవుడంటే మరొక అర్థముంది. అన్నింటి యందు తానుండి, అన్నింటిని తనలో నిక్షిప్తం చేసుకున్నవాడు - అని' ఇలా అంతటా వున్న ఏకమైన పరమాత్మను దర్శించటమే జ్ఞానం. అలా దర్శించేవాడే జ్ఞాని.

ప్రారంభంలో... దేనిని తెలుసుకున్న తర్వాత ఇక తెలుసుకోవలసింది మరొకటి లేదో అని ప్రశంసించిన జ్ఞానం ఇదే. ఇలా సర్వత్రా పరమాత్మను

దర్శించే జ్ఞానమే ఆ ఉత్తమోత్తమ జ్ఞానం. అట్టి జ్ఞానాన్ని పొందినవాడే నిజమైన జ్ఞాని.

అట్టి మహాత్ములైన జ్ఞానులు లోకంలో అంతటా విస్తరించి వుండరు.... దుర్లభులు.... ఎక్కడో ఒకరుంటారు.

'వాసుదేవస్సర్వమితి' - అనేది గీతలో ఒక మహావాక్యం వంటిది. అవివేకి బాలుడు దేనిని ఏనుగు అంటున్నాడో వివేకి దానినే కొయ్య అంటున్నాడు.

నిత్యమూ గణపతిని ఉపాసించే ఉపాసకుడొకడున్నాడు. అతడికి ఈ ఉపాసన ప్రారంభించిన తర్వాత ఆదాయం బాగా పెరిగింది. సంపదలు బాగా సమకూరుతున్నాయి. రాతి గణపతికి బదులు బంగారంతో గణపతిని చేయిద్దాం అనుకున్నాడు. దీనితో తన సంపదలు ఇంకా బాగా వృద్ధి చెందుతాయనుకున్నాడు. ఒకరోజున వంద గ్రాముల బంగారం కంసాలివద్దకు తీసుకెళ్ళి ఒక గణపతిని, పీఠాన్ని, ఛత్రాన్ని, ఎలుకను - నాలుగింటిని ఒక్కొక్కదాన్ని ఇరవై ఐదు గ్రాములతో తయారుచేయమన్నాడు. ఇప్పుడు బంగారు విగ్రహాన్ని పూజించటం ప్రారంభించాడు. ఆ తర్వాత అతడికి అన్నీ కష్టాలే. ఉన్న ఆస్తంతా హారతి కర్పూరమైంది. ఆదాయం లేదు. ఖర్చులు ఎక్కువైనాయి; దరిద్రం తాండవించింది. చేసేది లేక చివరికి ఒకనాడు ఆ బంగారు విగ్రహాలను ఆ కంసాలి వద్దకు తీసుకెళ్ళి అమ్ముతానన్నాడు. ఆ కంసాలి అన్నింటిని తూకం వేశాడు. అన్నీ ఒకటే తూకం; ఒకటే మచ్చు. అన్నింటికీ సమానంగా రేటు కట్టి డబ్బు ఇచ్చాడు. దానికి ఈయన అంటున్నాడు,

ఇదేమి అన్యాయమయ్యా! గణపతికి అదే రేటు, ఎలుకకూ అదే రేటు, ఛత్రానికి అదే రేటు, పీఠానికి అదే రేటా? అన్నాడు.

దానికా కంసాలి "అయ్యా! మేం ధర ఇస్తున్నది బంగారానికే గాని, వినాయకునికి - ఎలుకకూ కాదు. నీ దృష్టిలో వాటిలో తేడా వున్నది గానీ, నా దృష్టిలో అన్నీ ఒకటే, బంగారం" అన్నాడు.

అలాగే అన్నింటిని పైపై దృష్టితో - నామ రూపాల దృష్టితో చూచేవాడు అజ్ఞాని. అన్నింటిలో ఒక్కటైన ఆత్మను చూచేవాడు జ్ఞాని. జ్ఞానికి అంతటా భగవానుడే. అట్టి దృష్టిగల జ్ఞానియే దుర్లభుడు.

- వెదురు కర్రను లావును - పొడువును బట్టి వెలకడతారు.
- చెరకుగడకు రసాన్ని బట్టి వెలకడతారు.
- బంగారానికి మచ్చును బట్టి వెలకడతారు.
- పశుపక్ష్యాదులకు శరీర ఆకారాన్ని బట్టి వెలకడతారు.
- మానవునికి మాత్రం జ్ఞానాన్ని బట్టి విలువకట్టాలి.

మానవజన్మకు జ్ఞానమే ప్రధానం. పశువుకు మనిషికి తేడా జ్ఞానంలోనే.

"జ్ఞానే నహీనః పశుభిస్సమానః" జ్ఞానహీనుడు పశువుతో సమానం. కనుక జ్ఞానం అనేక జన్మల పుణ్యఫలం.... సాధనాఫలం...

దీనిని జాగ్రత్తగా పదిలపరచుకోవాలి, వృద్ధి చేసుకోవాలి. కనుక అందరూ జ్ఞానభక్తులు కావాలి.

- జ్ఞాని అంతటా పరమాత్మను దర్శిస్తాడు... బాగానే వుంది. మరి ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు వీరూ ఉదారులే గదా! పుణ్యాత్ములే కదా! మరి ప్రపంచం

అంతటా వున్న పరమాత్మను వీరు ఎందుకు దర్శించలేకపోతున్నారు? తరువాతి శ్లోకంలో -

**శ్లో||** కామై స్తైర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః|
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా|| **(20)**

**తా||** వారి వారి కోరికల వల్ల జ్ఞానం హరించుకుపోగా, తమ ప్రకృతి ప్రేరణ వల్ల ఆయా నియమాలను పాటిస్తూ ఇతర దేవతలను ఆరాధిస్తుంటారు.

**వ్యాఖ్య:-** జ్ఞానులు దీపస్థంభం లాంటివారు. చీకటిలో ప్రయాణించే వాడికి దీపస్థంభం ఎంత అవసరమో, అలాగే అజ్ఞానంలో జీవించేవాడికి జ్ఞానులు అంత అవసరం. అయితే జ్ఞానులు కావటం అంత తేలికా? కాదు..... కానే కాదు... ఎందువల్ల?

తైః తైః కామైః హృత జ్ఞానాః :- వారి వారి కోరికల కారణంగా జ్ఞానం హరించబడుతున్నది. కనుక జ్ఞానులు కాలేకపోతున్నారు. కోరికలు ఎలా కలుగుతున్నాయి? వారివారి జన్మాంతర సంస్కారల వల్ల. అంటే పూర్వజన్మలలో చేసిన సంకల్పాలవల్ల, కర్మలవల్ల కొన్ని వాసనలు గాఢంగా ముద్రింపబడి స్వభావంగా మారుతుంది. ఆ స్వభావం వల్ల కోరికలు కలిగి వాటిని నెరవేర్చుకొనుటకు కర్మరంగంలో దిగిపోవటాన చిత్తం ప్రశాంతతను కోల్పోతుంది, జ్ఞానానికి దూరమౌతుంది.

అంటే భగవంతుని వైపు తిరిగినవారు కూడా ఆత్మజ్ఞానులు కాలేకపోవటానికి కారణం వారిలోని కోరికలే. ఆ కోరికలను తీర్చుకొనుటకు

వారు ఆయా దేవతారూపాలను నియమంతో అర్చిస్తారు, పూజిస్తారు. విఘ్నాలు కలగకుండా ఉండటానికి విఘ్నేశ్వరుని, చదువు బాగా రావాలని సరస్వతీ దేవిని, ధనం, సంపదలు వృద్ధి చెందాలని లక్ష్మీదేవిని, కష్టాలు తొలగిపోవాలని వెంకటేశ్వరస్వామిని, భూతప్రేత పిశాచాలు దరిచేరకుండా వుండాలని ఆంజనేయస్వామిని, వివాహ సమయాల్లో కన్యలు గౌరీదేవిని ఇంకా అనేకమంది అనేక రకాల కోరికలతో అనేక దేవతలను పూజిస్తారు.

ఒక్కొక్క దేవతను ఎలా పూజించాలో కొన్ని నియమాలు, నిబంధనలు, పద్ధతులు వుంటాయి. ఆ నియమాలను అనుసరించి పూజిస్తుంటారు. ఇదంతా కోరికల ప్రభావం వల్లనే. అట్టి వారికి దూరదృష్టి లేదు. ఎందుకంటే వారికి కోరికలు తీరటమే ప్రధానం గనుక.

ఒకసారి శ్రీశైలం వెళితే అక్కడికి ఒక భార్యాభర్తల జంట వచ్చింది. వారికి వివాహమై పదహారు సంవత్సరాలు ఐనదట. సంతానం లేదు. మొదట్లో తిరుపతి దేవునికి అప్లికేషన్ పెట్టారు. ఏం సమాధానం లేదు. ఒకటీ, రెండు కాదు; వరుసగా ఆరు సంవత్సరాలు క్రమం తప్పకుండా తిరుపతి వెళ్ళి వెంకటేశ్వర స్వామి దర్శనం చేసుకున్నా ప్రయోజనం లేకుండా పోయింది. ఆయన పెద్ద దేవుడు. జనం తండోపతండాలుగా వస్తుంటారు. అందరికీ ఏవేవో కోరికలుంటాయి. అంత రద్దీ గనుక మేం ఆయన దృష్టిలో పడలేదు కాబోలు. అందుకే మా మొర ఆలకించలేదేమో! ఇక్కడ జనం కాస్త పలుచగా వుంటారు గదా! మేం ఈ మల్లన్న దృష్టిలో పడకపోతామా? మా కోరిక నెరవేరకపోతుందా? అని ఈ సంవత్సరం అటుపోకుండా ఇటు వచ్చాం -

అన్నారు. ఇలా కోరికలు తీరటం కోసం దేవతలను మార్చుకుంటూ వస్తున్నారు. దీనివల్ల కలగవలసిన ప్రయోజనం కలగదు. వారి ప్రారబ్ధంలో సంతానయోగం వుంటే కలగవచ్చు. లేకపోతే సంతానం కలగకపోవచ్చు. కాని భగవంతునికి దగ్గర కావటం మాత్రం జరగదు. ఎందుకంటే దృష్టి కోరికల మీదనే గాని భగవంతునిపై కాదు గనుక. మరెలా?

కోరిక ఉన్నప్పటికీ భగవంతుడంటే ఎవరో - ఏమిటో యదార్థంగా తెలియాలి. భగవత్తత్వం కొంతైనా తెలియాలి. అలాగాకుండా ఎవరు మా కోరిక తీరిస్తే అతడే దేవుడు అనుకుంటూ తిరిగితే అతడు భక్తుడు కాదు - నిజమైన భక్తుడు కాదు. 'భగవంతుడనేవాడు మనం ఇచ్చే ముడుపులు, నైవేద్యాలు పుచ్చుకొని మన కోరికలు తీర్చేవాడు' అనే భావం మనలో నుండి తొలగిపోవాలి. అందుకు ఏం చేయాలి?

భగవంతుని యదార్థతత్త్వాన్ని పెద్దల ద్వారా, గురువుల ద్వారా, శాస్త్రాల ద్వారా తెలుసుకొని భగవంతుని సంపూర్ణ శరణాగతితో ఆశ్రయించాలి. రూపం ఏదైనా దృష్టి మాత్రం ఒక్కటే అయిన భగవంతునిపై నిలపాలి. కోరికలు అలలలాగా వస్తుంటాయి. భగవంతునిపై నిజమైన భక్తి కలిగి ఉన్నప్పుడు ఆత్మజ్ఞానం కోసం సాధన చేస్తున్నప్పుడు అనేక కోరికలు తీరిపోతుంటాయి, కొన్ని జారిపోతుంటాయి. కొన్ని కోరికలు బలంగా నాటుకొని వుంటాయి. వాటితో మనసు తాదాత్మ్యం చెందినప్పుడు పదేపదే మనసు అటువైపే లాగుతుంది. తనకు తెలియకుండానే ఆ కోరికలకు తన నాడించే శక్తి నిస్తున్నాడు మానవుడు. అప్పుడే పతనం. అలా కాకుండా విషయ సుఖాలన్నీ

నిస్సారమైనవనీ, నిరర్థకమైనవనీ తెలుసుకొని వాటిపట్ల వైరాగ్యాన్ని పెంపొందించుకుంటూ, లభించిన వాటిని భగవత్ ప్రసాదంగా భావించి అనుభవిస్తూ, లభించని వాటిని మనసులో నుండి తొలగించుకుంటూ మనసును నిర్మలం చేసుకొని భగవంతుని వైపుకు తిరిగితే జ్ఞానాన్ని కప్పిన కోరికల పొర తొలగిపోతుంది. సత్యమార్గాన్ని అన్వేషించే వీలు కలుగుతుంది.

కోరికలు ఎక్కువగా వుంటే ప్రమాదమే. సామాను ఎక్కువగా వున్న ఇంటిలో గాలి తక్కువగా వస్తుంది. ప్రశాంతత తక్కువ, ఆరోగ్యం తక్కువ. అతిగా కోరికలున్న హృదయంలో ఉత్సాహముండదు, జ్ఞానముండదు, శాంతి కరవౌతుంది.

'చితి' చనిపోయిన తర్వాత కాల్చేది. 'చింత' బ్రతికుండగానే కాల్చేది.... కాముడున్న హృదయంలో రాముడుండడు. రాముడున్న హృదయంలో కాముడుండడు.

నిజంగా అన్ని దేవతా రూపాలలో వుండేది పరమాత్మే - భగవంతుడే. ఈ భావనయే బుద్ధిలో వుండాలి. అదే శ్రేష్టమైన భావన.

గ్రామ మునసబు గారికి శిస్తు చెల్లిస్తే ప్రభుత్వానికి చెల్లించినట్లే.... ఈ-సేవా కేంద్రంలో డబ్బు చెల్లిస్తే ప్రభుత్వానికి చెల్లించినట్లే.... అలాగే మనం దేనిని ఉపాసించినా భగవంతుని ఉపాసించినట్లే.

కనుక మనం భగవంతుని ముందు పెట్టుకొని మనలోని కాముణ్ణి తొలగించుకోవాలి. భగవంతుణ్ణి ముందు పెట్టుకొని అర్జునుడు చేసిన యుద్ధం


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

యజ్ఞమైంది. భగవంతుణ్ణి నిరాకరించి దక్షుడు చేసిన యజ్ఞం యుద్ధమైంది... తల తెగిపడింది... మేకతల వచ్చింది. కనుక భగవంతుణ్ణి ముందు పెట్టుకొని శరీరంతో ఏపని చేసినా అది పవిత్ర యజ్ఞమే ఔతుంది - అని గ్రహించి మన పవిత్ర కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలి.

ఈ శ్లోకంలో "కోరికలతో ఇతర దేవతలనారాధిస్తుంటారు" అన్నారు. ఇతర దేవతలంటే ఎవరు? "ఇతర మతాలవారు ఆరాధించే దేవతలు" అని అర్థం కాదు; శ్రీకృష్ణుడు తప్ప ఇతర దేవతలని అర్థం కాదు. మరెవరు? ఇతర దేవతలంటే...? కోరికలతో ఏ దేవతను ఆరాధించినా అన్యదేవతయే. ఏ కోరికా లేకుండా కేవలం భగవంతుని కోసమే... భగవత్ప్రాప్తి కోసమే... ఏ దేవతను ఆరాధించినా అది భగవదారాధనయే. అంటే.... కోరికతో శ్రీకృష్ణుని ఆరాధిస్తే శ్రీకృష్ణుడు అన్యదేవత. ఏ కోరికా లేకుండా భగవత్ప్రాప్తి కోసం, మోక్షప్రాప్తి కోసం శ్రీకృష్ణుని ఆరాధిస్తే ఆ శ్రీకృష్ణుడు భగవంతుడు. అయితే అన్యదేవతల నారాధిస్తే భగవంతునికి కోపమా?

- అన్యదేవతల నారాధించే వారిపట్ల భగవంతుడెలా ప్రవర్తిస్తాడు?

**శ్లో||** యోయోయాంయాం తనుం భక్తః, శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి|
తస్య తస్యా చలాం శ్రద్ధాం, తామేవ విదధా మ్యహం|| **(21)**

**తా||** ఏఏ భక్తులు ఏఏ రూపాన్ని శ్రద్ధతో ఆరాధించాలనుకుంటారో ఆయా భక్తునికి అందులోనే చలించని శ్రద్ధను నేను కలిగిస్తాను.


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** మనం ఏవేవో కోరికలతో దేవతలను ఆశ్రయిస్తాం. అయితే ఆ దేవతలపట్ల మనకు భక్తి, శ్రద్ధ వుండాలి. శ్రద్ధ లేకపోతే సిద్ధిలేదు అన్నారు. అయితే శ్రద్ధతో ఆశ్రయించాలనే భావన మనలో వుంటే చాలు భగవంతుడే సాయపడతాడు.

తల్లి మేడమీద పనిచేసుకుంటూ వున్నది. పిల్లవాడు క్రింద అంతస్తులో నిద్రపోతున్నాడు. వాడికి మెలకువ వచ్చి, లేచి తల్లి దగ్గరకు చేరాలని ఏడుస్తున్నాడు. అప్పుడు తల్లి మేడ దిగి బిడ్డ దగ్గరకు రావాలా? లేక బిడ్డ తానే పైకెక్కి తల్లి దగ్గరకు చేరాలా? ఏది అపాయంలేని ఉపాయం? తల్లే దిగివచ్చి బిడ్డను పైకి తీసుకెళ్ళాలి. భగవంతుడు కూడా అలాంటి ఉపకారమే చేస్తున్నాడు. ఆ బిడ్డ తల్లి కోసం ఏడ్చినట్లు నీవు భగవంతుని కోసం తపించాలి, విలపించాలి, అలా చేస్తే చాలు భగవంతుని సహాయం నీకు లభిస్తుంది.

నీవు ఏ దేవతను కోరికతో ఆరాధించినా ఆ దేవతపై శ్రద్ధ (విశ్వాసం) వుండాలి. అలా వున్నప్పుడు నీ శ్రద్ధను, భక్తిని బాగా వృద్ధి చేసేవాడు, స్థిరపరిచేవాడు ఆ పరమాత్మే. ఆయనకేం పని? ఈ దేవతలంతా ఆయన ఏజెంట్లే. ఆయన మంత్రిమండలి సభ్యులే. ఆయన శక్తులే, వేరువేరు దేవతా రూపాల ద్వారా వ్యక్తమౌతుంటాయి. "ఏకం సత్ విప్రా బహుధావదంతి" అన్నారు. ఉన్నదొక్కటే పరమాత్మ. ఒక్కడే భగవంతుడు. ఋషులు ఆయననే వేరువేరుగా చెబుతుంటారు, వేరువేరుగా దర్శించారు. అంతే. అందుకే ఏ దేవతను ఆరాధించినా భగవంతునికి కోపం రావటం లేదు. పైగా సహాయం చేస్తున్నాడు. హిందూ ధర్మంలోని విశిష్టత ఇదే. ఏ మార్గంలో ప్రయాణించినా

చివరికి చేరాల్సింది ఆయననే. ఆ రూపాలన్నీ తనవే గదా! అందుకే కోపం లేదు. పరమాత్మ over head tank లాంటివాడు. దేవతలంతా చిన్న చిన్న కుళాయిలు. కుళాయిలలో నుండి వచ్చే నీరంతా ఆ ట్యాంకుదే. ఏ కుళాయి నుండి నీరు వచ్చినా ఆ ట్యాంకుదే. అలాగే ఏ దేవత ద్వారా మన కోరిక తీరినా అది ఒక్కడే అయిన పరమాత్మ తీర్చినట్లే. వీళ్ళు నా దగ్గరకు రాకుండా కుళాయిలు తిప్పుకుంటున్నారే అని ట్యాంకుకు కోపం రాదు. అలాగే ఈ దేవతల నారాధిస్తున్నారే అని పరమాత్మకు కోపం రాదు. అయితే తనను అసలు పట్టించుకోకపోతే ఆయన సాయం లభించదు. ట్యాంకులో నీరు నింపకపోతే కుళాయిలు ఎంత త్రిప్పినా ప్రయోజనం లేదు. కనుక ఆయా దేవతా రూపాలన్నీ పరమాత్మకు ప్రతీకలే అని భావించి, ఆ దేవతల ద్వారా కోరికలు తీర్చుకోవచ్చు. ఆ కోరికలను తీర్చేది పరమాత్మే. అసలు విగ్రహారాధన ఏర్పడింది ఈ దృష్టితోనే.

వివేకానందుడు ఆల్మోరా నగరంలో ఉపన్యాసాలిస్తుండే రోజుల్లో ఆ రాజు పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో ఉన్నవాడు. అతడికి విగ్రహారాధన అంటే ఒళ్ళుమంట. ఆయన మంత్రిగారు స్వామివారి దర్శనంతో రాజులో మార్పు వస్తుందేమోనని స్వామిని ఆస్థానానికి ఆహ్వానించాడు. స్వామితో రాజు ఇలా అన్నాడు "హిందూ మతంలో రాయికి, రప్పకు, చెట్టుకు, పుట్టకు పూజలు చేస్తుంటారు. విగ్రహారాధన అంటే నాకు గిట్టదు. ఇది మూఢ నమ్మకం కాదా?" అన్నాడు. స్వామి ఎదురుగా గోడకు తగిలించిన రాజుగారి ఫోటోను తెప్పించి, మంత్రిని పిలిచి దానిమీద ఉమ్మి వేయమన్నాడు. మంత్రి "అయ్యో!



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇది మా రాజుగారి ఫోటో. వారిని అవమానించలేను" అన్నాడు. ఒక్కొక్కరిని పిలిచి అడిగాడు. అందరూ అలాగే చెప్పారు. అప్పుడు స్వామి రాజుతో అన్నాడు, "రాజా! ఈ బొమ్మలో మీరున్నారా? మీరు సింహాసనం పైన వున్నారు గదా! నేను ఉమ్మి వేయమన్నది ఈ కాగితంపై వేసిన బొమ్మ మీద గదా! మరెందుకు మీ వారు ముందుకు రావడం లేదు? అంటే మీ బొమ్మను మిమ్ముగానే భావిస్తున్నారు మీవారు. అంటే అది మీరేనని గౌరవిస్తున్నారు. విగ్రహారాధకుల పద్ధతి కూడా ఇదే" అన్నాడు.

కనుక ఏ దేవతను ఆరాధించినా అది ఆ పరమాత్మ రూపంగానే భావించాలి. అప్పుడు ఆ పరమాత్మే మనకు భక్తిని, శ్రద్ధను కలిగిస్తాడు, వృద్ధి చేస్తాడు. ఇదంతా ఎందుకంటే ఎవరు ఏ దేవతను ఆశ్రయించినా దృఢమైన శ్రద్ధా భక్తులతో ఎప్పటికైనా నన్నే పొందగలరు అనే భావంతోనే.

- కోరికతో ఆరాధించే వారికి ఫలితం ఎక్కణ్ణించి వస్తుంది?

**శ్లో||** సతయా శ్రద్ధ యా యుక్తః, తస్యారాధన మీహతే|

లభతేచ తతః కామాన్, మయైవ విహితాన్ హితాన్|| **(22)**

**తా||** అతడు అట్టి శ్రద్ధతో కూడిన వాడై ఆయా దేవతారూపాన్ని ఆరాధించసాగితే దానివల్ల ఆయా కోరికలను నా నుండే తీర్చుకుంటాడు.

**వ్యాఖ్య:-** భగవంతుడే భక్తునికి శ్రద్ధను కలిగిస్తాడు, వృద్ధి చేస్తాడు అని ఇంతకుముందు శ్లోకాలలోనే చెప్పటం జరిగింది. అట్టి శ్రద్ధతో అతడు ఆయా

దేవతా రూపాన్ని పూజిస్తూ, ఆరాధిస్తుంటే భగవంతుడే ఆయా దేవతల ద్వారా వారి వారి కోరికలను తీరుస్తుంటాడు.

నిజంగా వున్నది ఒక్కడే అయిన పరమాత్మ. బృహదారాణ్యకోపనిషత్తులో దేవతల సంఖ్య మీద చర్చ జరిగింది. యాజ్ఞవల్క్యమహర్షిని విదర్భశాకల్యుడు అడుగుతున్నాడు, "దేవతలు ఎందరు?" అని. 'మూడువేల ముగ్గురు' అని యాజ్ఞవల్క్య మహర్షి తెలియజేశాడు. 'నిజంగా ఎందరు?' అని అడిగాడు. 'మూడువందల మూడు మంది' అన్నాడు. నిజంగా ఎందరు? అని మళ్ళీ అడిగితే 'ముప్పది మూడు మంది' అన్నాడు. మళ్ళీ అడిగాడు 'నిజంగా ఎందరో చెప్పండి' అని 'ఆరుగురు' అన్నాడు. 'నిజంగా చెప్పండి' అంటే 'ముగ్గురు' అన్నాడు. మళ్ళీ అడిగితే ఇద్దరు అని, మళ్ళీ అడిగితే ఒక్కడే అని చెప్పాడు. అసలు సత్యం అదే. "ఏకమేవాఽద్వయం బ్రహ్మ, నేహనానాస్తి కించన" బ్రహ్మమొక్కటే. రెండవది లేనేలేదు.

ప్రభుత్వానికి అధిపతి ప్రధాని. ఆయన మంత్రివర్గంలో అనేకమంది మంత్రులుంటారు. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్కరు అధిపతిగా వుంటారు. ఎవరు ఏం చేయాలన్నా ప్రధాని అనుమతి మీదనే చేయాలి. అలాగే పరమాత్మయే సూపర్ పవర్, సర్వాధిపతి. మిగిలిన దేవతలంతా ఆయన చేత వేరువేరు శాఖలకు అధిపతులుగా నియమింపబడ్డారు. కనుక ఆ దేవతలు భక్తులకు ఏమివ్వాలన్నా పరమాత్మ వద్ద నుండే తీసుకురావాలి. ఆయన అనుమతితోనే ఇవ్వాలి. ఉద్యోగి జీతాన్ని తీసుకొనేది బ్యాంకునుండైనా నిజంగా యిస్తున్నది

ప్రభుత్వమే. అలాగే ఏ వరాన్ని దేవతలనుండి పొందినా యదార్థంగా ఆ వరాన్నిస్తున్నది పరమాత్మే. పరమాత్మ గొప్ప నిధి.

ఏ రూపాన్ని భక్తుడు చలించని శ్రద్ధతో పూజిస్తాడో, ఆ రూపంలోనే ప్రత్యక్షమై వరాలిచ్చేవాడు పరమాత్మే. ఆ రూపంలో దైవసాక్షాత్కారం కలిగించేది భక్తుని చలించని విశ్వాసం - ఆరాధన. కనుక చలించని భక్తితో పూజించి సేవించాలి.

- అయితే అన్యదేవతారాధకులకు లభించే ఫలితమెలాంటిది?

**శ్లో||** అంతవత్తు ఫలం తేషాం, తద్భవత్యల్ప మేధసాం|

దేవాన్ దేవయజోయాంతి, మద్భక్తా యాంతి మామపి|| **(23)**

**తా||** అల్పబుద్ధి గలవారికి వచ్చే ఆ ఫలితం అంతంతో కూడుకున్నదే. దేవతలనారాధించేవారు దేవతలను చేరుకుంటారు. నన్ను ఆరాధించేవారు నన్ను కూడా చేరుకుంటారు.

**వ్యాఖ్య:-** అక్షయమైన ఫలాలనిచ్చే అనంతశక్తి ఆ భగవంతునిది. మరి అట్టి సర్వశక్తివంతుడైన భగవంతుని విడిచిపెట్టి అన్యదేవతలను ఎందుకు ఆశ్రయిస్తున్నారు? ఎందుకంటే.... వారు అల్పబుద్ధులైన వారు గనుక. భగవంతుని శక్తి సామర్థ్యాలు తెలియనివారు గనుక. తాత్కాలికమైన ఫలితాల కోసం - అనిత్యమైన ఫలితాల కోసం అలా ఆశ్రయిస్తున్నారు. వారు ఈ ప్రాపంచికమైన వస్తువులు, విషయాలు, గొప్పవనుకుంటారు. ఐహిక సుఖభోగాలే గొప్పవనుకుంటారు. మోక్షఫలం ఎలాంటిదో తెలియదు వారికి.

ప్రపంచమంతా ఆద్యంతాలతో కూడుకున్నది. అంటే నిత్యమైనది కాదు, అశాశ్వతమైనది. అలాగే దేవతలు కూడా నిత్యులు కారు, వారూ ఆద్యంతాలతో కూడినవారే. కనుక వారిచ్చే ఫలాలు కూడా ఆద్యంతాలతో కూడినవే, అనిత్యమైనవే. అయినా అట్టి ఫలితాల కోసమే అర్రులు చాస్తుంటారు చాలామంది. అట్టివారినే అల్ప మేధస్కులు.... అల్ప బుద్ధి గలవారని అంటున్నది. నిత్యమూ, శాశ్వతమూ, దుఃఖరహితమూ ఐన ఆనందాన్ని భగవంతుని నుండి పొందటానికి అర్హత కలిగివుండి కూడా అల్పమైన, అనిత్యమైన నశించిపోయే సుఖాల కోసం, భోగాల కోసం, విషయవస్తువుల కోసం అన్యదేవతలను ఆశ్రయిస్తున్నారు గనుక వారు అల్ప బుద్ధులు. పూర్ణబుద్ధి గలవారైతే శాశ్వత మోక్షాన్నే కోరుకునే వారు కదా! అల్పబుద్ధులు గనుకనే అశాశ్వతమైన ఇహలోక, పరలోక భోగాలను కోరుకుంటున్నారు. ఇహలోక భోగాలన్నీ అనిత్యమైనవే. ఒకప్పుడుండి మరొకప్పుడు అదృశ్యమైపోయేవే. ఒకవేళ శాశ్వతమనుకున్నా కేవలం శరీరమున్నంతవరకే. ఇక పరలోక భోగాలు కూడా అనిత్యమే. పుణ్య కర్మఫలమున్నంతవరకే ఆ స్వర్గభోగాల అనుభవం. ఇక్కడ దేవతారాధనను నిందించడం లేదు. ఆరాధన ఎలాగూ చేస్తున్నావు.... శ్రమ ఎలాగూ పడుతున్నావు.... ఎలాగూ ఎవరో ఒకరిని ఆశ్రయిస్తున్నావు..... అయినప్పుడు అనంతఫలాన్ని శాశ్వత మోక్షాన్ని ప్రసాదించే భగవంతుణ్ణే ఆరాధిస్తే ఎంతో మంచిది కదా! జన్మించినందుకు మానవజన్మ సార్థకమౌతుంది కదా! కనుక భగవంతుని ఆరాధన యొక్క విశిష్టతను తెలియజేయడమే ఇక్కడ ముఖ్య ఉద్దేశ్యం.

దేవతలను ఆరాధించేవారు దేవతలను చేరుకుంటారు. నన్నారాధించేవారు నన్నే చేరుకుంటారని భగవానుడు తెలియజేస్తున్నాడు. దేవతలనారాధించి, పూజించి, ఇహలోక సౌఖ్యాలను, భోగాలను, వస్తువులను పొందేవారు కొందరు. అవన్నీ అనిత్యమైనవి..... అంతమైపోయేవి.

పరలోక సుఖాలను, భోగాలను కోరి యజ్ఞయాగాదుల ద్వారా ఇంద్రాది దేవతలకు హవిస్సులను సమర్పించేవారు కొందరు. అట్టివారు ఆయా దేవతలకు చెందిన లోకాలకు... స్వర్గాది లోకాలకు వెళ్ళి అక్కడ చాలాకాలం సుఖాలు, భోగాలు, అనుభవించి వారి పుణ్యం కాస్తా క్షయమైపోవడంతో తిరిగి మనుష్యలోకానికి వస్తారు. దేవతలను ఆరాధించే వారు దేవతలను చేరుకుంటారంటే ఇదే.

ఐతే ఏ కోరికా లేకుండా భగవంతునే ఆరాధించేవారి పరిస్థితి వేరు. అట్టివారు ఆ భగవంతునే చేరుకుంటారు. అంతేగాక ఇక్కడ ఒక ముఖ్యమైన రహస్యం కూడా వుంది. "మాం అపి' అన్నారు. అంటే నన్ను ఆరాధించేవారు నన్ను కూడా చేరుకుంటారు అని. భగవంతుని ఆరాధించేవారు భగవంతుని కూడా పొందుతారు. అంటే - పైన చెప్పిన సుఖాలు, భోగాలు మాత్రమే కాక భగవంతుని కూడా పొందుతారు' అని.

అన్యదేవతలను ఆశ్రయిస్తే అనిత్యమైన సుఖభోగాలను పొందుతారని చెప్పుకున్నాం. అవి ఇహలోక భోగాలు కావచ్చు. పరలోక భోగాలు కావచ్చు... అయితే భగవదారాధన చేసినవారు భగవంతుని పొందితే సుఖభోగాలు దూరమౌతాయని కాదు... ఏ స్వర్గభోగాలు, సుఖాలు అన్య దేవతారాధకులు

పొందుతారో ఆ సుఖ భోగాలను వీరు కూడా పొందుతారు. చివరకు భగవంతుని చేరుకొని శాశ్వతానందంలో వుండిపోతారు. అంటే అన్ని సుఖాలు, భోగాలు భగవంతునిలోనే ఉన్నాయన్నమాట. మోక్షప్రాప్తి పరమసుఖం, బ్రహ్మానందం, అఖండాత్మానందం.

గంగానదిలో స్నానం చేస్తే గంగలో స్నానం చేసినంత పుణ్యం. కృష్ణానదిలో స్నానం చేస్తే కృష్ణలో స్నానం చేసినంత పుణ్యం. గోదావరి నదిలో స్నానం చేస్తే గోదావరిలో చేసిన పుణ్యం మాత్రమే వస్తాయి. అదే సముద్రంలో స్నానం చేస్తే.... అన్ని నదులలో స్నానం చేసిన పుణ్యంతో పాటు సముద్రస్నానం పుణ్యం కూడా వస్తుంది. కనుక శాశ్వతుడు, నిత్యుడు, ఆనంద స్వరూపుడైన పరమాత్మనే ఆశ్రయించి శాశ్వత మోక్షప్రాప్తి రూపమైన ఆనందసామ్రాజ్యంలో శాశ్వత స్థానం దక్కించుకోవాలి. బ్రహ్మానంద సాగరంలో ఓలలాడాలి.

- మోక్షప్రాప్తిని అనంత బ్రహ్మానందాన్ని ప్రసాదించే భగవంతుణ్ణే అందరూ ఎందుకు ఆశ్రయించడం లేదు?

**శ్లో||** అవ్యక్తం వ్యక్తి మాపన్నం, మన్యంతే మామ బుద్ధయః|
పరంభావ మజానంతః, మమావ్యయమనుత్తమం|| **(24)**

**తా||** అవ్యక్తమైన నన్ను శరీరాన్ని ధరించిన వానిగా తెలివి తక్కువ వాళ్ళు భావిస్తారు. ప్రకృతి కన్నా విలక్షణమైనట్టి అవ్యయమైన, సర్వశ్రేష్ఠమైన నా స్వభావం వారికి తెలియదు.

**వ్యాఖ్య:-** ఎందుకు అందరూ భగవంతునే ఆశ్రయించరు? భగవంతుని యొక్క అసలు స్వభావం వారికి తెలియనందువల్ల. ఏమిటాయన స్వభావం? భగవంతుడు అవ్యయుడు, సర్వోత్తముడు, ప్రకృతికి విలక్షణమైనవాడు.

1.అవ్యయం :- భగవంతుడు నాశనం లేనివాడు, ఆయనకు పుట్టుక లేదు గనుక నాశనం కూడా లేదు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు - వీరికి పుట్టుక వున్నది గనుక అంతం కూడా వున్నది. అంటే వారు భగవంతుని వ్యక్త రూపాలే గాని అవ్యక్త స్వరూపం కాదు, భగవంతునికి పుట్టుక నాశనం రెండూ లేవు గనుక ఆయన శాశ్వతుడు. సృష్టికి ముందూ ఆయన వున్నాడు, సృష్టి వున్నప్పుడూ వున్నాడు, ఈ సృష్టి అంతా లయమైపోయిన తర్వాతా వుంటాడు. కనుక శాశ్వతుడు, అవ్యయుడు.

2.అనుత్తమం :- భగవంతుడు అన్ని కాలలో, అన్ని ప్రదేశాలలో వుండేవాడు గనుక ఆయన సర్వవ్యాపి. ఎట్టి గుణదోషాలు లేని పరిశుద్ధుడు, నిర్మలుడు. కనుక ఆయనతో పోల్చదగినవాడు మరొకడు లేడు, ఆయనకన్నా అధికుడు కూడా మరొకడు లేడు. కనుక ఆయన సర్వోత్తముడు.

3.పరం :- ఆయన ప్రకృతి కన్నా విలక్షణమైన వాడు. ప్రకృతి అంటే అపరా ప్రకృతి. అది పంచభూతాత్మకం. ఆయన పంచభూతాలకన్న వేరైనవాడు. అందుకే పరం. ఇట్టి పరమాత్మ స్వభావాన్ని తెలుసుకోలేనివారు అల్పులు. అందుకే అబుద్ధయః అన్నారు.

అబుద్ధయః:- సరైన బుద్ధి లేనివారు. ఉన్నది వున్నట్లు చూడలేనివారు. లోకంలో జనులందరి సామాన్యదృష్టి దేహదృష్టి లేదా మనోదృష్టి, ఇది బాహ్య దృష్టి.

అందుకే భగవంతుణ్ణి తమలాగా ఒక మానవుడిగా భావించుకుంటారు. నిజంగా భగవంతుడు అవ్యక్తుడు. అవ్యక్తుడంటే వ్యక్తం కానివాడు. ఇంద్రియాలకు అగోచరుడు, మనసుకు అందనివాడు. నిరాకారుడు గనుక కంటితో చూచే వీలులేదు. సర్వవ్యాపి గనుక ఊహకు అందడు. అయినప్పటికీ దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం ఈ భూమిపై అప్పుడప్పుడు అవతరిస్తుంటాడు. మాయను తన అధీనంలో వుంచుకుంటాడు గనుక తన ఇష్టప్రకారం దేహాన్ని ధరించటానికి గానీ, విడిచి పెట్టడానికి గానీ స్వతంత్రం వున్నవాడు.

కృష్ణుడనే వేషం వేసుకొని వచ్చిన భగవంతుని కృష్ణునిగా, వసుదేవుని పుత్రునిగా, 125 సంవత్సరాలు ఈ భూమిపై వుండి దేహాన్ని విడిచి వెళ్ళినందున ఒకప్పుడుండి ఒకప్పుడు లేనివానిగా భావిస్తారే గాని భగవంతునిగా తెలుసుకోలేరు. భగవంతుని వ్యక్తిగా భావిస్తున్నారేగాని భగవంతునిగా భావించలేకపోతున్నారు. అందుకే అల్పబుద్ధులు. మందుసీసాను ముందుగా భావించటం ఎలాంటిదో రాతిని మాత్రమే భగవంతునిగా భావించటం అలాంటిదే. అలా భావించేవారు అల్పబుద్ధులే.

రూపం కలిగిన ప్రతిదీ కలిగి, మెలగి, తొలగిపోతుంది. అవ్యక్తమైనదే నిజవస్తువు. అవివేకుల దృష్టి కనిపించే వస్తువు వరకే వెళుతుంది కానీ దానికి ఆధారము, మూలమైన అవ్యక్తం వరకు వారి దృష్టి సాగదు. అందుకే వారికి భగవంతుని స్వభావం తెలియదు. మరికొందరు భగవంతుని ఎందుకు ఆశ్రయించరు? - భ్రాంతివల్ల, భగవంతుడు మోక్షాన్ని ప్రసాదించేవాడే గాని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కోరికలు తీర్చేవాడు కాదు గదా! అని వారి భ్రాంతి. అందుకే కోరికలు తీర్చే అన్యదేవతల నాశ్రయిస్తారు.

నేను దేహాన్ని అని భావించే వారందరూ భగవంతుని కూడా దేహంగానే భావిస్తారు. నామరూప గుణాలకే ప్రాధాన్యతనిస్తారు. తమను ఆత్మగా దర్శించగల ఆత్మజ్ఞానులే భగవంతుని అవ్యక్త స్వరూపాన్ని దర్శించగలుగుతారు. మిగిలిన వారందరూ భగవంతుని తెలుసుకోలేరు.

అంతటా ఉన్న పరమాత్మను తెలుసుకోలేక పోవటానికి కారణమేమిటి?

**శ్లో||** నాహం ప్రకాశ స్సర్వస్య, యోగమాయా సమావృతః|

మూఢోఽయం నాభి జానాతి, లోకోమామజ మవ్యయం|| (**25**)

**తా||** యోగ మాయచేత ఆవరించబడి యున్న నేను అంతటా ప్రకాశించను. అందుకే పుట్టుక నాశనం లేని నన్ను ఈ మూఢలోకం తెలుసుకోలేకపోతున్నది.

**వ్యాఖ్య:-** పరమాత్మ సర్వవ్యాపి, ఆయన లేనిచోటు లేదు. ఆయన స్వయం ప్రకాశం గలవాడు. మరి ఎందుకని ఆయనను చూడలేక పోతున్నారు?

యోగమాయా సమావృతః :- ఆయన యోగ మాయచేత కప్పబడి వున్నాడు.

---

సూర్యుడు ప్రచండంగా ప్రకాశిస్తున్నా మేఘాలు పూర్తిగా కప్పివేయటం వల్ల ఎలా సూర్యుని చూడలేకపోతున్నామో, అలాగే దివ్యప్రకాశంతో వెలుగొందుతున్నా యోగమాయచేత కప్పబడి వుండటం వల్ల పరమాత్మను తెలుసుకోలేకపోతున్నారు. పరమాత్మను తెలుసుకోవాలంటే ఆ మాయను



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఛేదించగలగాలి. అయితే ఎవరు ఛేదించగలరు? ఎవరైతే భగవంతుని యందు అనన్యమైన భక్తిని కలిగియుండి; ఆ భగవంతునే ఆశ్రయిస్తారో వారు మాత్రమే మాయను ఛేదించగలరు; పరమాత్మను దర్శించగలరు. ఎందుకంటే మాయ భగవంతుని అధీనంలో వుంటుంది. మాయకు అధిపతి భగవంతుడే గనుక.

అసలు మాయ అంటే ఏమిటి? దీని స్వరూపం ఏమిటి? మాయ అనేది మూడుపొరలతో ఉంటుంది. ఇది జీవుడికి దేవుడికి మధ్యనున్నతెర. ఈ మూడు పొరలే మూడు గుణాలు. సత్వరజస్తమోగుణాలు. ఇందులో తమోగుణమనేది మందమైన గట్టి పొర. ఇది నలుపు రంగు గలది. రజోగుణం మధ్యస్తంగా వుంటుంది. ఇది ఎరుపు రంగులో వుంటుంది. సత్వగుణం అనేది పలుచని పొర. ఇది తెలుపు రంగు గలది. ఈ మూడు పొరలతో కూడినదే మాయ అనే తెర. మరి దీనిని ఎలా తొలగించాలి?

జీవులు నిష్కామకర్మాచరణ చేస్తుంటే తమోగుణం తొలగిపోతుంది. భగవంతునిపై అనన్యభక్తి కలిగి భక్తియోగాన్ని ఆచరిస్తుంటే రజోగుణం కూడా తొలగిపోతుంది. మిగిలింది సత్వగుణం. ఈ సత్వగుణం మంచిదే. భగవంతుని దరిచేర్చేదే. అయినప్పటికీ భగవద్దర్శనానికి ఈ సత్వగుణం కూడా అడ్డువచ్చేదే. కనుక జ్ఞానయోగం ద్వారా, వివేక, వైరాగ్యాల ద్వారా, ఆత్మవిచారణ ద్వారా, నిరంతర ధ్యానయోగాభ్యాసం ద్వారా సర్వసంకల్పాలను వదిలేయటం ద్వారా ఈ సత్వగుణాన్ని కూడా తొలగించుకోవాలి. ఇలా సాధనతో ఒక్కొక్క పొరను తొలగించుకోవటం ద్వారా మాయను పూర్తిగా అడ్డు

తొలగించుకోవాలి. అప్పుడే భగవత్ సాక్షాత్కారం. అదే భగవంతుని తెలుసుకొనుట. అంటే మాయ తొలగితేనే భగవత్ సాక్షాత్కారం.

నిజంగా మాయంటే ఏమో కాదు, ఈ ప్రపంచంలో కనిపించే విషయ వస్తువులు, భోగాలు, సుఖదుఃఖాలు, కోరికలు - ఇవే. ఇవన్నీ మనసులో వున్నప్పుడు భగవంతుడు కనిపించడు. వీటిని దూరంగా త్రోసివేస్తేనే భగవంతుని దర్శనం. కనుక ఇవే మాయ.

తల్లి పసిపిల్లవాణ్ణి చంకనుండి దించింది. వాడు ఎత్తుకోమని ఏడుస్తుంటాడు. వాణ్ణి ఎత్తుకుంటే పనిచేసుకోవటానికి వీలులేదు. అందుకే వాడిని మరిపించటానికి ఆటబొమ్మలను వాడి ముందు ఉంచుతుంది. వాడు వాటితో ఆడుకుంటూ అమ్మను మరచిపోతాడు. అలాగే మనం కూడా ఆటబొమ్మల వంటి ఈ ప్రాపంచిక వస్తువులను, విషయభోగాలను అనుభవిస్తూ, వీటిలో మునిగిపోయి భగవంతుని మరచిపోతున్నాం. వీటన్నింటినీ ఆవలకు త్రోసివేసి భగవంతుని కోసం ఆక్రోశించినవాడే భగవంతుని తెలుసుకోగలుగుతాడు. ఈ ఆట వస్తువులలో మునిగిపోయి భగవంతుని మరచిపోయిన వారినే మూఢలోకం అంటున్నాడు భగవానుడు.

నిజంగా మాయ భగవంతుని కప్పి వేయగలదా? క్షుద్రమైన మాయకు ఆ శక్తి వుందా? లేదు. అది నిజంగా భగవంతుని కప్పటం లేదు, భగవంతుని చూడాలనే మన దృష్టిని కప్పి వుంచుతున్నది. మేఘాలు సూర్యుని కప్పినవి అంటాం. కాని నిజంగా మేఘాలు సూర్యుణ్ణి కప్పగలవా? మేఘాలు మనకు చాలా దగ్గరలో కొన్ని మైళ్ళ దూరంలో వున్నాయి. మరి సూర్యుడో - కొన్ని

కోట్ల మైళ్ళ దూరంలో వున్నాడు. మరి మేఘాలు ఎవరిని కప్పినట్లు? చూచేవారి దృష్టిని మాత్రమే. అలాగే మాయ భగవంతుని కప్పలేదు. అజ్ఞానుల దృష్టిని కప్పివేస్తున్నది.

- యోగమాయ కప్పివేయటం వల్ల భగవంతుని మనం చూడలేక పోతున్నాం. మరి భగవంతుడు కూడా మనలను చూడలేడా?

**శ్లో||** వేదాహం సమతీతాని, వర్తమానాని చార్జున!|
భవిష్యాణి చ భూతాని, మాంతువేదన కశ్చన|| **(26)**

**తా||** అర్జునా! గతించిపోయిన జీవుళ్ళను, ఇప్పుడున్న జీవుళ్ళను, భవిష్యత్తులో పుట్టబోయే జీవుళ్ళను నేను తెలుసుకోగలను. నన్ను మాత్రం ఎవ్వరూ తెలుసుకోలేరు.

**వ్యాఖ్య :-** భగవంతుడు జీవుళ్ళందరిని (తెలుసుకోగలడా?) యోగమాయ అడ్డం రాదా? అనే దానికి గతించిన కాలంలోని జీవుళ్ళను, ఇప్పుడున్న జీవుళ్ళను, భవిష్యత్తులో పుట్టబోయే జీవుళ్ళను - అందరినీ తెలుసుకోగలడు - అని ఈ శ్లోకంలో సమాధానం చెబుతున్నారు. ఎలా? జీవుళ్ళందరూ కాలంలో పుట్టి, కాలంలో వుండి, కాలంలో గతించేవారు. అంటే అంతా కాలగర్భంలోనే వుంటారు. మరి ఈ కాలమో? భగవంతుని పొట్టలో ఉన్నది. కనుక అందరి గురించీ ఆయనకు తెలుస్తూనే వుంటుంది. ఆయన ఎక్కడినుండి అందరినీ చూస్తుంటాడు? అందరిలో చైతన్యంగా వున్నది ఆయనే గదా! కనుక వారిలోనే వుండి వారినందరినీ చూస్తుంటాడు.

ఆయన మనందరిలోను చైతన్యంగా వున్నాడా? అవును. వున్నాడు. ఆయన వుండబట్టే మన అందరి శరీరాలు పనిచేస్తున్నాయి. ఇంద్రియాలు వాటి వాటి వ్యాపారాలను - అంటే కన్ను చూడటం, చెవి వినడం, ముక్కు వాసన చూడటం. లాంటివన్నీ జరుపుకోగలుగుతున్నాయి. కనుక భూత, భవిష్యత్, వర్తమానాలలోని సమస్త ప్రాణులను ఆయన సాక్షిగా - కేవల సాక్షిగా చూస్తూనే వున్నాడు.

మరి మనం ఎందుకు ఆయనను చూడలేక పోతున్నాం? ఆయన మనలోనే వున్నాడు కదా! మనం కంటితో లేదా మనస్సుతో చూడాలని ప్రయత్నిస్తాం. అందుకే మనకు మాయ అడ్డం వస్తున్నది. కాని పరమాత్మ మనలో నఖశిఖపర్యంతం వ్యాపించియుండి ఏ ఇంద్రియ సహాయం లేకుండా చూస్తున్నాడు గనుక ఆయనకు మాయ అడ్డం రాదు. అంతేకాదు. ఆయన చైతన్యం, మనం జడం.... అంటే కన్ను, మనస్సు, బుద్ధి - అన్నీ జడమే. జడాన్ని చైతన్యం తెలుసుకోగలుగుతుందే గాని చైతన్యాన్ని జడం తెలుసుకోలేదు. చైతన్యాన్నే కాదు జడాన్ని కూడా జడం తెలుసుకోలేదు. కనుకనే అజ్ఞాని భగవంతుని తెలుసుకో లేకపోతున్నాడు. భగవంతుడు అందరినీ తెలుసుకోగలుగుతున్నాడు.

ఇది పుస్తకం అని నేను తెలుసుకోగలనుగాని, పుస్తకం నన్ను తెలుసుకోలేదు గదా!

ఇదే యోగమాయ యొక్క చమత్కారం. భగవంతుని మాయకు వివశులైన వారు భగవంతుని తెలుసుకోలేరు. కాని మాయను తన అధీనంలో పెట్టుకొన్న భగవంతుడు అందరినీ తెలుసుకోగలడు.

పరదా వేసుకున్న స్త్రీ అందరినీ చూడగలదు. కాని ఆమె నెవరూ చూడలేరు. నల్ల కళ్ళద్దాలు ధరించినవాడు అందరినీ చూడగలడు. కాని వాడి దృష్టిని ఎవరూ గమనించలేరు. దొంగ ఇంట్లోకి ప్రవేశించి అందరినీ కనిపెట్టి చూస్తుంటాడు. కాని అతడు మాత్రం ఎవ్వరికీ కనిపించకుండా ఉంటాడు.

ఈ పరదా, నల్ల కళ్ళద్దాల వంటి మాయయే భగవంతుని యోగ మాయ.

ఇక ఈ శ్లోకంలో మనం గమనించవలసిన విషయం మరొకటి వున్నది. భగవంతుడు మనలోనే చైతన్య రూపంలో నఖశిఖపర్యంతం వ్యాపించి యున్నాడు - అని తెలుసుకున్నాం గదా! మరి మనం ఎలా ప్రవర్తించాలి? ఎవరూ చూడటం లేదు గదా! అని పాపపు పనులు, దొంగతనాలు చేయరాదు. ఎవరూ మనను గమనించటం లేదు గదా! అని వాగ్దానాలు చేసి తప్పించుకోవటమూ, మనసులో దుష్టభావాలు కలిగివుండటం చేయరాదు. చేయగలిగితే సత్కర్మలు చేయాలి. లేకపోతే మౌనంగా వుండాలి. అంతేగాని తప్పుడు పనులు, పాపపు పనులు, అబద్ధాలు ఆడటం, ఆడి తప్పటం, ఇతరులను నిందించటం, అభాండాలు వేయటం లాంటి పనులు చేయకూడదు అని గ్రహించి నడుచుకోవాలి.

- యోగమాయ కారణంగా జనులు భగవంతుని తెలుసుకోలేక పోతున్నారు. ఎందుకంటే మనం అజ్ఞానులం గనుక. మరి ఈ అజ్ఞానం ఎక్కడి నుండి వచ్చింది.

**శ్లో||** ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత!|
సర్వభూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప!|| **(27)**

**తా||** పరులను తపింపజేసే అర్జునా! ఇచ్ఛాద్వేషాల నుండి పుట్టిన ద్వంద్వమోహాల వల్ల సమస్త ప్రాణులు పుట్టుకతోనే భ్రాంతి (అజ్ఞానం) తో వస్తున్నాయి.

**వ్యాఖ్య:-** భగవంతుని తెలుసుకోలేకపోవటానికి కారణం అజ్ఞానం, భ్రాంతి. ఈ భ్రాంతి కలగటానికి కారణం ద్వంద్వాలు. అవే సుఖదుఃఖాలు, సుఖమైతే ఆ మత్తులో పడిపోయి పరమాత్మను చూడలేని అజ్ఞానం. దుఃఖమైతే దానిని తొలగించుకొనే ఆలోచనలు చేస్తూ విచక్షణా జ్ఞానం కోల్పోయి అజ్ఞానం. కనుక సుఖమైనా, దుఃఖమైనా రెండూ భ్రాంతిలో - అజ్ఞానంలో పడవేసేవే.

సరే! ఈ సుఖ దుఃఖాలనే ద్వంద్వాలు ఎందువల్ల వస్తున్నాయి? అవి ఇచ్ఛాద్వేషాలవల్ల. 'ఇచ్ఛ' అంటే 'కావాలి' అనే కోరిక. 'ద్వేషం' అంటే 'వద్దు' అనే భావం. మనిషి జీవిత మంతా వీటి గోలయే. ఈ దృశ్య ప్రపంచంలో దేనినో చూచి నాకు కావాలి అనుకుంటాం. ఎప్పుడూ దానిని గురించే ఆలోచిస్తాం. అదే తపన. దానివల్ల మనస్సు చంచలమౌతుంది. చంచలమైన మనస్సులో పరమాత్మ ప్రకాశించడు. నీవు వద్దనుకున్నది వచ్చినా, కావాలనుకున్న దానిని

పొందే సమయంలో ఎవరైనా అడ్డుపడ్డా ద్వేషం కలుగుతుంది. ఇది కోపంగా - మోహంగా మారుతుంది.

కనుక కోరిక తీరకపోయినా, తీరే సమయంలో ఆటంకం కలిగినా ద్వేషం అనే వృత్తి బయలుదేరి సతమతం చేస్తుంది. ఇది జ్ఞానానికి దూరం చేసే వృత్తి.

ఈ ఇచ్ఛాద్వేషాలను వదిలించుకుంటే తప్ప ద్వంద్వాలు తొలగవు. ద్వంద్వాలు తొలగితే గాని అజ్ఞానం తొలగదు. అజ్ఞానం తొలగితే గాని భగవంతుని తెలుసుకోలేం. అసలు ఈ ఇచ్ఛాద్వేషాలు మనలో ఎలా ఎప్పుడు ప్రవేశించాయి? ఎక్కడ నివాసమేర్పాటు చేసుకున్నాయి?

ఇవి మన కారణ శరీరంలో బీజరూపంలో నివాసమున్నాయి. అవి ఎలా వచ్చినవి? పూర్వజన్మలలో మనం చేసిన కర్మలవల్ల, సంకల్పాలవల్ల, పొందిన అనుభవాల వల్ల సూక్ష్మముద్రలుగా - వాసనలుగా - సంస్కారాలుగా ఇవి బీజరూపంలో కారణ శరీరంలో వున్నాయి. ఎప్పుడు వచ్చినవి? మన పుట్టుకతోనే వచ్చినవి. అందువల్లనే ఎవరూ నేర్పకుండానే అనేక విషయాలు నేర్చుకుంటున్నాం.

పసిపిల్లవాడు పుట్టగానే తల్లివద్ద పాలు త్రాగుతాడు. ఎవరు నేర్పారు? మరణమంటే అందరికీ భయం. మరి ఎప్పుడన్నా మరణించి అనుభవాన్ని పొందాడా? లేదే. మరి ఎలా భయపడుతున్నాడు? దీనికి కారణం ఒక్కటే. ఇంతకుముందు ఎన్నో జన్మలలో ఆ అనుభవముంది. ఎన్నో జన్మలెత్తి తల్లి దగ్గర పాలు త్రాగటం, ఎన్నో జన్మలలో మరణించి భయం చెంది వుండటం. ఆ

భయం తాలూకు వాసనలు బీజరూపంలో మనలో ముద్రలు పడి వున్నాయి. అవే ఇప్పుడు జ్ఞాపకమొచ్చి పాలు త్రాగుతున్నాడు.... మరణానికి భయపడుతున్నాడు.

అలాగే ఒకరిని చూడగానే అకస్మాత్తుగా ప్రేమ, అనురాగం కలుగుతుంది. ఒకరిని చూడగానే ద్వేషం కలుగుతుంది. ఈ ప్రేమకుగాని, ద్వేషానికి గాని ఈ జన్మలో ఏ కారణం లేకపోయినా ఎందుకు కలుగుతున్నాయి? ఇవన్నీ పూర్వజన్మల తాలూకు వాసనల వల్లనే. ఆ వాసనలు బీజరూపంలో వుండి ఇప్పుడు ఫలిస్తున్నాయి. కనుక ఇచ్ఛాద్వేషాలన్నీ పుట్టుకతో వచ్చినవే. అందుకే 'సర్గే' అన్నారు.

కనుక పూర్వజన్మలలోని అనుభవాల వాసనలే బీజంగా మనం జన్మిస్తున్నాం. అంటే పుట్టుకతోనే ఇచ్ఛాద్వేషాలు వస్తున్నాయి. ఆ ఇచ్ఛాద్వేషాల వల్ల సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. వాటి వల్లనే మోహం - అజ్ఞానం కలుగుతుంది. ఆ అజ్ఞానమే మాయగా మనలను కప్పి వుంచింది. కనుక భగవంతుని తెలుసుకోలేకపోతున్నాం. భగవంతుని తెలుసుకోవాలంటే పుట్టుకతోనే వచ్చిన ఈ ఇచ్ఛాద్వేషాలను ప్రయత్నంతో తొలగించుకోవాలి.

ఈ శ్లోకంలో అర్జునుని రెండు పేర్లతో పిలుస్తున్నాడు భగవంతుడు. "పరంతపా! భారతా!" అని. 'పరంతపా' అంటే 'పరులను తపింపజేసేవాడా!' అని. 'పరులు' అంటే ఇక్కడ 'శత్రువులు' అని. అయితే బాహ్య శత్రువులని కాదు, అంతః శత్రువులైన ఇచ్ఛాద్వేషాదులను తపింపజేసేవాడా! అని. 'భారతా!'

అంటే 'జ్ఞానమందు ఆసక్తి గలవాడా!' అని. ఈ రెంటిని సమన్వయం చేస్తే - ఇచ్ఛాద్వేషాలను తపింపచేయాలంటే జ్ఞానమందు ఆసక్తి కలగాలి - అని.

- పుట్టుకతోనే వచ్చే ఈ ద్వంద్వ మోహాలకు విరుగుడున్నదా? ఏమిటది?

**శ్లో||** యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం|

తే ద్వంద్వ మోహనిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః|| **(28)**

**తా||** పుణ్యకర్మలు చేయటం వల్ల ఏ జనుల యొక్క పాపం తొలగిపోతుందో వారు ద్వంద్వ మోహాల నుండి పూర్తిగా విముక్తులై నన్ను చెదరని దీక్షతో భజిస్తారు.

**వ్యాఖ్య:-** భగవంతుని చెదరని దీక్షతో, గట్టి పట్టుదలతో భజించినప్పుడే భగవంతుని అనుగ్రహం, భగవత్ సాక్షాత్కారం. అయితే అట్టి గట్టి పట్టుదల ఎప్పుడు కలుగుతుంది? ద్వంద్వ మోహాల నుండి పూర్తిగా విడుదల పొందితేనే. మరి ఈ ద్వంద్వ మోహాలు తొలగేదెలా? ఈ విషయాన్నే ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు భగవానుడు.... ఎలా? ఏం చేయాలి?

పుణ్యకర్మణాం :- పుణ్యకర్మలు చేయటం వల్ల - సత్కర్మలు చేయటంవల్ల - దైవకార్యాలు చేయటంవల్ల. పుణ్యకర్మలు చేయటంవల్ల పాపం తొలగిపోతుంది - అని కూడా భగవానుడు తెలియజేస్తున్నాడు. ఈ వాక్యాన్ని కొందరు అపార్థం చేసుకొనే అవకాశముంది. ఎన్ని పాపాలు చేసినా ఫర్వాలేదు. ఆ పాపం పోవటానికి పుణ్యకర్మలు చేస్తే సరి - అని ఘోరమైన పాపాలు చేస్తూ దేవాలయాలకు చందాలివ్వటం, దేవుడికి కిరీటాలు,

ఆభరణాలు చేయించటం, దానధర్మాలు చేయటం, పూజలు - అభిషేకాలు చేయటం - ఇవి చేస్తే ఆ చేసిన పాపాలు, ఘోరాలు తొలగిపోతాయి - కడిగి వేయబడతాయి - అని కొందరి భావన. ఇది పూర్తిగా తప్పు. చేసిన పాపం కాశీకి వెళ్ళినా - కాటికి వెళ్ళినా అది నీతో పాటే వస్తుంది. నిన్ను నీడలాగా వెంబడిస్తుంది. అది అనుభవించి ఖర్చు చేసుకోవాల్సిందే. మరి ఏ పాపాన్ని కడిగివేసుకోవచ్చు?

చెయ్యాలనుకున్న పాపం.... అంటే పాపపు ఆలోచనలు - సంకల్పాలు..... అవే వాసనలు. వానిని కడిగివేసుకోవచ్చు. పుట్టుకతోనే వచ్చే రాగద్వేషాలే ఆ పాపాలు. వాటికే విరుగుడున్నది. ఏమిటా విరుగుడు? పుణ్యకర్మలు చెయ్యటమే. దానధర్మాలు, యజ్ఞయాగాదులు, పూజాపునస్కారాలు, బాధలలో వున్నవారికి సేవ, ఓదార్పు, అతిథి అభ్యాగతుల సేవ, మహాత్ముల సేవ ఇలాంటి కర్మలవల్ల పాపవాసనలు పోయి పుణ్యవాసనలు చోటు చేసుకుంటాయి. ఇలా పాపవాసనలు తొలగితేగాని భగవంతుని వైపుకు దృఢచిత్తంతో - స్థిరంగా తిరగటం కుదరదు.

పాపి పాపిగానే వుండి భగవంతుని చేరలేడు. తన పాప కర్మలకు స్వస్తి చెబితేనే అతడికి భగవంతుని చేరే మార్గం తెలుస్తుంది.

ఒక బ్రాహ్మణుడు గంగలో స్నానం చేస్తున్నాడు. అతడు ఒక్క మునక వేయగానే చేతికి ఏదో వస్తువు తగిలింది. అదేదైనా విలువైన వస్తువై వుంటుందని దానిని చేతితో పట్టుకొని పైకి లేచి చూశాడు. అది ఎముక. అయ్యో! మైలపడిపోయానే అనుకొని మళ్ళీ మునిగాడు. చేతిలోని ఎముకను

అలాగే పట్టుకొని ఎన్నిసార్లు మునిగినా మైలపోతుందా? ఆ ఎముకను దూరంగా విసిరివేసి ఒక్కసారి మునిగితే చాలు, మైలపోతుంది, పవిత్రుడౌతాడు. అలాగే పాపవాసన అలాగే వుంచుకొని భగవంతుని ఎంతకాలం భజించినా ప్రయోజనముండదు. ముందు ఆ పాప వాసనను పుణ్యకర్మల ద్వారా పోగొట్టుకోవాలి.

పుణ్యకర్మలు చెయ్యాలంటే డబ్బు ఖర్చౌతుంది గదా! అని లెక్క చూడకూడదు. ఖర్చు పెట్టగలవాడు ఖర్చు పెట్టాలి. అలా పెట్టలేనివాళ్ళు ఏ చిన్న అవకాశాన్ని కూడా వదులుకోరాదు. చిన్న సత్కార్యం కూడా అనంత ఫలాన్నిస్తుంది.

మహాభారతంలో ద్రౌపదికి వచ్చిన కష్టం చెప్పనలవి కాదు. ధర్మం, బలం, పరాక్రమం, అందం, పాండిత్యం గల ఐదుగురు భర్తలు కౌరవదాసులై తనకు రక్షణ కల్పించలేని అసమర్థులయ్యారు. వారి కళ్ళ ఎదురుగా నిండు సభలో దుష్టదుశ్శాసనుడు వస్త్రాపహరణానికి ఒడిగట్టాడు. ఆ కష్టకాలంలో ఆమెశ్రీకృష్ణుని స్మరించింది. ఆయన వెంటనే అక్షయవస్త్రాలను ప్రదానం చేశాడు. అర్హత లేకపోయినా ఇచ్చాడా? లేదు. ఆమె పూర్వంలో చేసిన ఒక పుణ్యం వున్నది.

పూర్వజన్మలో ద్రౌపది సముద్రస్నానానికి వెళ్ళింది. ఆ పర్వదినాన అనేకమంది సముద్రస్నానానికి వచ్చారు. ఒక సాధువు అక్కడ స్నానం చేస్తున్నాడు. అతడి గోచీ అలల తాకిడికి కొట్టుకుపోయింది. అతడు బయటకు రావటానికి సిగ్గుపడుతూ నీటిలో నానిపోతున్నాడు. ఆయన అవస్థను చూసి

తన చీర చెంగును చించి సాధువుకు అందించింది. అతడు దానిని ధరించి బయటకు వచ్చాడు. ఆనాడు చేసిన వస్త్రదానం తెలిసిన శ్రీకృష్ణుడు "ఆ చిన్న వస్త్రం అక్షయమై ద్రౌపదిని రక్షించుగాక!" అన్నాడు. అంతే! ఆమె రక్షింపబడింది. కనుక ఎంత స్వల్పంగా చేసినా అది అధిక ఫలదాయాకమౌతుంది.

'పరీక్షిత్తు' చచ్చిన పామును 'శమీకుని' మెడలో వేశాడు. ఆ చచ్చిన చిన్న పామే భయంకర సర్పం 'తక్షకుడై' పరీక్షిత్తును కాటువేశాడు.

బ్యాంకులో చిన్న మొత్తం డిపాజిట్ చేసి మర్చిపోయాం. 10 సంవత్సరాల తర్వాత పెద్దమొత్తమై చేతికి వస్తుంది.

కనుక పుణ్యమైనా - పాపమైనా - ఏ కొంచెం చేసినా అది అనంత ఫలాన్నిస్తుంది. కనుక చేతనైనంత వరకు సత్కార్యాలు చేయాలి.... చేయాలనే తపహతపహ వుండాలి.

ఇలా సత్కర్మల ద్వారా పాపవాసనలు తొలగించుకొని ద్వంద్వ మోహాలను తొలగించుకోవడంవల్ల చిత్తం శుద్ధమౌతుంది. అప్పుడే భగవంతుని యందు చెదరని భక్తి కలుగుతుంది. అట్టి దృఢవ్రతుడే మోక్షానికి అర్హుడు.

- ఇలా శ్రద్ధతో భగవంతుని ఆశ్రయించి, దృఢదీక్షతో సాధనలు చేసే వారికి కలిగే ఫలితమేమిటి?

శ్లో|| జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతి యే|
తే బ్రహ్మ తద్విదుఃకృత్స్నం అధ్యాత్మం కర్మచాఖిలం|| (29)

**తా||** ఎవరైతే జరామరణముల నుండి విడుదల పొందాలని నన్ను ఆశ్రయించి సాధన చేస్తారో వారు ఆ బ్రహ్మను, యావత్తు ఆధ్యాత్మాన్ని సమస్త కర్మను తెలుసుకుంటారు.

**వ్యాఖ్య:-** పుణ్యకర్మలు చేసి, పాపవాసనలు తొలగించుకొని దృఢవ్రతులై భగవంతుని సేవించాలని ఇంతకుముందు శ్లోకంలో తెలియచేశారు. అట్టివారు పొందే ఫలితమేమిటో ఈ శ్లోకంలో తెలియచేస్తున్నారు.

పాప వాసనలు లేని నిర్మలమైన మనస్సుతో ధ్యానం చేసేది జరామరణాల నుండి విడుదల పొందటానికే. ఎందుకు వాటి నుండి విడుదల పొందాలి?

**1**.జరః:- 'జర' అంటే 'ముసలితనం'. ఈ ముసలితనం ఒక భయంకర అనుభవం. మనస్సుకు ముసలితనం లేదు గాని శరీరానికి ముసలితనం తప్పదు. ఏదన్నా తినాలనుకున్నా, పరుగెత్తాలన్నా, ఎగిరి గంతులేసి ఆటలాడాలన్నా, బాగా పనిచేసి సంపాదించాలన్నా అన్నింటికీ శరీరం సహరించక ఎంతో బాధ. అంతేకాదు ముసలితనంలో దయనీయమైన పరిస్థితి ఎదురౌతుంది. తన కనుసన్నలలో మెలగి, తనకు భయపడి పనిచేసిన పిల్లలు తనమీద పెత్తనం సాగిస్తారు, ఎదిరిస్తారు.... అవమానిస్తారు..... ఇంతకుముందు గౌరవించినవారే ఇప్పుడు అవమానిస్తారు. ఇంతేకాదు ఇప్పటిదాకా ఎక్కడెక్కడో దాగిన వ్యాధులు పలకరించటానికి వస్తాయి. కాపురం పెడతాయి, పీడిస్తాయి. ఈ వృద్ధాప్యంలో వాటిని తట్టుకొనే శక్తి వుండదు. ఇదంతా చాలా బాధాకరంగా వుంటుంది.

అవసానదశలో శ్రీకృష్ణుడు ఒక చెట్టు నీడన విశ్రమిస్తాడు. అప్పుడు 'జరుడ' నే బోయవాడు బాణమేస్తాడు. ఈ జరుడు మరెవరో కాదు. జర అనే ముసలితనమే. మనందరికీ జరుడు బాణం వేస్తూనే వుంటాడు. అందువల్ల ఈ జర - ముసలితనంలో అందరూ అనే మాట ఒకటుంది.... "ఏదో ఇలా తింటూ తిరుగుతూ ఒకళ్ళచేత చేయించుకోకుండా పోతే బాగుంటుంది" అని. అందుకే ఈ ముసలితనాన్ని తప్పించుకోవాలని అందరూ తపన పడుతూనే వుంటారు.

<u>2.మరణం :-</u> మరణమనేది కూడా ఎవరో మహాత్ములకు దప్ప అందరికీ బాధాకరమే. అందరికీ దూరమైపోతున్నామని; కష్టపడి కట్టించుకున్న ఇల్లు ఏమై పోతుందోనని, కష్టపడి, సంపాదించి, మూటగట్టిన ధనసంపదలను బిడ్డలు వృధాగా ఖర్చు పెడతారో, నష్టం కలిగిస్తారో అని, సంపాదించుకొని కూడా బాగా భోగాలు అనుభవించకపోతినే అని; నా తర్వాత నా భార్యగతి - నా భర్తగతి ఏమౌతుందోనని; చచ్చిన తర్వాత నరకంలో ఎన్నెన్ని బాధలు పడాలోనని - ఇలా ఏవేవో చింతలతో బాధపడతాడు. ఇక మరణ సమయంలో పంచభూతాలు విడిపోతూ గొప్పబాధ. అందుకే ప్రాణోత్క్రమణం లక్ష తేళ్ళు ఒక్కసారిగా కుట్టినంత బాధ వుంటుందని శాస్త్రాలు ఘోషిస్తున్న విషయాన్ని తెలుసుకుని మరింత భయపడిపోతాడు. అందుకే మరణమంటే గొప్ప భయం. ఈ మరణబాధ లేకుండాపోతే ఎంత బాగుంటుంది అనుకుంటాడు.

నిజంగా మరణమే కాదు జననం కూడా బాధాకరమే. గర్భంలో వున్నప్పుడు గర్భనరకమనుభవించాలి. ఇది అతి తీవ్రమైన బాధ. కాకపోతే, మనకు గుర్తుండదు గనుక పట్టించుకోం. ఇలా జన్మదుఃఖం, జరాదుఃఖం, వ్యాధిదుఃఖం, మరణదుఃఖం అన్నీ తప్పించుకోవాల్సినవే. చితిమంటల కన్నా చింతల మంటలే బాధాకరం. మరి వీటన్నింటి నుండి తప్పించుకోవాలంటే ఏంచేయాలి? అదే చెబుతున్నారు-

<u>మాం ఆశ్రిత్య యతంతి :-</u> నన్ను (భగవంతుని) ఆశ్రయించాలి. సాధన చేయాలి. ఆత్మను గురించి తెలుసుకొని ఆత్మధ్యానం చేయాలి. అలా చేసి, చేసి చివరకు ఆత్మగా వుండిపోవాలి. దేహంగా వుంటే ముసలితనం, వ్యాధులు పీడిస్తాయి. మనస్సుగా వుంటే చింతలు పీడిస్తాయి. కనుక ఈ మనస్సు, శరీరాలు నేను కాదు. వీటికి వేరుగా వుండి ఇవి పనిచేయటానికి కావలసిన శక్తిని ప్రసారం చేస్తున్న ఆత్మను నేను అని నిరంతర ధ్యానంలో ఆత్మగా వుండిపోవాలి. అలా ఆత్మగా వుంటే ఆత్మకు పుట్టుక - మరణాలు లేవు కనుక జరామరణాల నుండి విముక్తి. అందుకే జరామరణాల నుండి విముక్తి కలగాలంటే "యతంతి" తీవ్ర ప్రయత్నం చేయాలి - సాధన చేయాలి అని చెప్పటం. తనను తాను ఉద్ధరించుకోవాలి. ప్రయత్నం లేకపోతే ప్రగతి లేదు.

పూర్వం ఒక అమాయకుడు సాయంత్రం ఆరు గంటలకు పొరుగూరికి బయలుదేరాడు. చీకటి గనుక లాంతరు, అగ్గిపెట్టె వెంట తీసుకెళ్ళాడు. బాగా చీకటి పడడంతో దారి కనిపించడం లేదు. అందుకే లాంతరు వెలిగించాడు. వెంటనే ఏదో ఒక ఆలోచన వచ్చి చతికిలబడి కూర్చొని ఏడవడం

మొదలుపెట్టాడు. దారిలో వస్తున్న బాటసారి "ఎందుకయ్యా ఏడుస్తున్నావ్" అన్నాడు. "బాబూ ఏమని చెప్పేది..... నేను నాలుగు మైళ్ళు ఈ చీకట్లో పోవాలి... ఈ లాంతరు వెలిగిస్తే పది గజాల దూరం కన్నా ఎక్కువ కాంతి పడడం లేదు. ఎక్కడి నాలుగుమైళ్ళు? ఎక్కడి పది గజాలు? ఈ పది గజాలు దాటితే ఆ కటిక చీకట్లో ఎలా ప్రయాణిస్తాను?" అన్నాడు.

అతడి వెర్రికి నవ్వుకుంటూ.... "ఓరి వెర్రివాడా! లేచి లాంతరు పట్టుకొని నడక సాగించు.... నీవు ఎంతదూరం వెళ్ళినా ఈ పది గజాల దూరం కాంతి పడుతూనే వుంటుంది.... నాలుగు మైళ్ళు కాదు.... నలభై మైళ్ళు అయినా వెళ్ళవచ్చు" అన్నాడు. దానితో అతడు ప్రయాణం సాగించి గమ్యాన్ని చేరుకున్నాడు.

అలాగే మనం శాస్త్ర శ్రవణం ద్వారా ఆత్మను గురించి తెలుసుకొని ఆ ఆత్మను నేనేనని తెలుసుకొని ఆత్మధ్యాన సాధన కొనసాగించాలి. అలా నిత్యం సాధన చేయగా, చేయగా గమ్యంవైపు.... ఆత్మవైపు...... "స్వస్థితి" వైపు ప్రయాణం సాగుతుంది. ఒకనాటికి ఆత్మతో ఏకమై ఆత్మగా వుండిపోవడం జరుగుతుంది. అలాగాక నిరాశతో కూర్చుంటే ఏనాటికీ గమ్యం చేరుకోలేం. నడక సాగిస్తే చాలు.... చీమ కూడా వేలమైళ్ళు ప్రయాణిస్తుంది... కదలకుండా కూర్చుంటే గరుత్మంతుడైనా సరే ఒక్క అడుగు ముందుకు వేయలేడు. ఇలా భగవంతుని ఆశ్రయించి సాధన సాగిస్తుంటే ఫలితమేమిటి?

యావత్తు అధ్యాత్మాని...... సమస్త కర్మను, ఆ బ్రహ్మాన్ని తెలుసుకుంటాడు.

1.ఆధ్యాత్మం:- శరీరమనోబుద్ధుల తాదాత్మ్యాన్ని విడిచిపెట్టి, ఆత్మతో తాదాత్మ్యం పెట్టుకున్న సాధకుడు సమస్త ప్రాణికోటిలోనూ అంతర్యామిగా నున్న ఆ ఆత్మను పరమాత్మగా దర్శించగలుగుతాడు.

2.కర్మ :- తాను ఆచరించవలసిన, ఆచరిస్తున్న కర్మను కూడా పరమాత్మగానే భావిస్తాడు. అప్పటివరకు వున్న భేదదృష్టి తొలగిపోయి అన్నింటిని పరబ్రహ్మంగా - పరమాత్మగా చూస్తాడు.

3.బ్రహ్మ:- ఆత్మ పరమాత్మే గనుక పరమాత్మ అన్నా.... పరబ్రహ్మమన్నా.... ఒక్కటే గనుక బ్రహ్మ భావన కలిగినట్లే... సమస్త కర్మలూ బ్రహ్మమే కనుక కర్మలు నశించి బ్రహ్మస్వరూపుడే అవుతాడు. అంతటా బ్రహ్మమే.... సర్వం బ్రహ్మమయం.

ఒక గురువుగారు అలసిపడుకుంటే శిష్యులు పాదసేవ చేస్తున్నారు. ఇద్దరు శిష్యులు చెరొక కాలు ఒత్తుతున్నారు. పొరపాటున కుడికాలు ఎడమకాలుకు తగిలింది. దానితో ఈ శిష్యునికి కోపమొచ్చి ఈ ఎడమకాలు ఎత్తి ఆ కుడికాలుపై కొట్టాడు. దానితో వాడు "ఒరే! నా కాలును కొడతావా? ఉండు నీపని చెబుతా!" అని కమండలంతో ఎడమకాలును కొట్టాడు. దానికా శిష్యుడు యోగదండంతో కుడికాలును పచ్చడి పచ్చడి చేశాడు. గురువుగారు కోపంతో "ఏమిట్రా మీరు చేస్తున్న సేవ?" అని అరిచాడు. "గురువు గారూ మీరుండండి... నా కాలు గొప్పో... వాడి కాలు గొప్పో.... తేల్చేస్తాను" అన్నాడు శిష్యుడు. దానికా గురువు, "ఒరే మూర్ఖులారా! రెండూ నా కాళ్ళేరా! మీరు దేనిని కొట్టినా దెబ్బ నాకే" అని ఇద్దరినీ పంపించేశాడు.

అలాగే ఇక్కడ సమస్తమూ పరమాత్మే, సర్వం బ్రహ్మమయం అని సాధన చేయగా చేయగా తెలుస్తుంది.

- ఎవరు మరణసమయంలో కూడా పరమాత్మను గుర్తుంచుకో గలుగుతారు?

**శ్లో||** సాధిభూతాది దైవం మాం, సాధి యజ్ఞం చ యే విదుః|

ప్రయాణకాలేఽపిచమాం, తే విదుర్యుక్త చేతసః|| **(30)**

**తా||** అధి భూతం, అధి దైవం, అధి యజ్ఞంతో కూడిన నన్ను ఎవరు తెలుసుకుంటారో వారి మనస్సు స్వాధీనంలో వుండి ప్రయాణకాలంలో కూడా నన్ను గుర్తుంచుకోగలుగుతారు.

**వ్యాఖ్య:-** నా సమగ్ర స్వరూపాన్ని పూర్తిగా తెలియజేస్తానని భగవానుడు ఈ అధ్యాయం ప్రారంభంలోనే చెప్పటం జరిగింది. ఏమిటా సమగ్ర స్వరూపం? భగవంతుడు అధిభూత, అధిదైవ, అధియజ్ఞాలతో కూడినవాడు.

- అధిభూతం.... అంటే నశించిపోయే జడవర్గ రూపమైన తత్త్వం, అదే క్షేత్రం.
- అధిదైవం.... అంటే జీవుడే..... అజ్ఞానం తొలగటంతో అంతమయ్యేది జీవుడే.
- అధియజ్ఞుడు..... అంటే అందరిలో అంతర్యామిగా వున్న పురుషుడే..... ఆత్మయే.

ఈ మొత్తం భగవంతుని స్వరూపం.ఇలా భగవంతుని స్వరూపాన్ని ఎవరు సమగ్రంగా తెలుసుకుంటారో అట్టివారే ప్రాణ ప్రయాణ సమయంలో కూడా నిలకడ మనసు గలవారై భగవంతుని తెలుసుకుంటారు.... భగవంతునే పొందుతారు.

మరణసమయంలో భగవంతుని స్మరించగల వారికే భగవంతుని చేరుకొనే అవకాశముంటుంది. అయితే ఆ సమయంలో భగవంతుని స్మరించాలంటే మనస్సు ప్రశాంతంగా, నిర్మలంగా, నిగ్రహంగా ఉండదు. అందుకు భగవంతుని యదార్థ స్వరూపాన్ని ముందే తెలుసుకొని ప్రయత్నం చేయాలి. జీవితమంతా ఆత్మ చింతనతో గడపాలి. ఇప్పుడేం తొందరొచ్చింది? ఎప్పుడో మరణసమయంలో కదా అవసరమని అశ్రద్ధ చేయరాదు. మరణ సమయమెప్పుడో ఎవ్వరికీ తెలియదు కదా!

ఒక గ్రామంలో భార్యాభర్తలున్నారు. భార్య భక్తురాలు. ఎప్పుడూ పూజలు, పారాయణాలు చేస్తూ భగవంతుని స్మరిస్తూ వుంటుంది. భర్త మాత్రం దైవచింతన ఇప్పుడే ఎందుకు? నిదానంగా చూడొచ్చు అనుకుంటాడు. భార్య ఎంత చెప్పినా అతడు మారలేదు. ఒకసారి భర్తకు జబ్బుచేసి టానిక్ తెచ్చుకున్నాడు. రెండుపూటలా భోజనం తర్వాత ఒక మూత మందు తీసుకోమన్నాడు డాక్టర్. భార్య టానిక్ దాచేసింది. రెండు రోజులు చూశాడు భర్త. భార్య టానిక్ ఇవ్వడం లేదు.... మూడవ రోజు అడిగాడు భార్యను. భార్య అన్నది "ఆ.... ఇప్పుడేం తొందరొచ్చిందండీ.... నిదానంగా చూసుకుందాం..... భోజనం చేయగానే నిద్ర వస్తుంది, నిద్ర లేవగానే పని.... పనులు కాగానే వంట చేయాలి... అన్నీ సర్దుకొని తీరిక చిక్కగానే ఇస్తానులే" అన్నది. "అదేమిటి? జబ్బు వచ్చినప్పుడు కదా మందు తాగాలి" అన్నాడు భర్త.

అప్పుడు భార్య అన్నది, "నిజమేనండీ మనందరం భవరోగంతో బాధపడుతున్నాం దీనికి మందు దైవచింతన. మరి దీనిని ఎప్పటికో వాయిదా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వేస్తారేమిటి? ఈ శరీరం క్షణికం. ఎప్పుడు రాలిపోతుందో తెలియదు. ముసలితనం వచ్చే దాకా ఆగుతానంటారేం?" అనగానే భర్తకు జ్ఞానోదయమైంది.

కనుక అన్ని అవయవాలు బాగుండి, అన్ని అవకాశాలున్నప్పుడే దైవచింతన ప్రారంభించాలి. అంతేకాదు.... జీవితమంతా సాధన చేయాలి. నిత్యం, నిరంతరం భగవత్ చింతన చేస్తుంటేనే అంత్యకాలంలో భగవంతుని స్మరించగలిగేది. జీవితమంతా ప్రాపంచిక విషయాలలోనో, సంపాదనలోనో పడితే చివరి సమయంలో భగవంతుడు గుర్తుకు రావాలంటే సాధ్యమా? కాదు.....

పూర్వం కన్నడ దేశంలో ఒక ధనికుడున్నాడు. బాగా సంపాదించాడు. వృద్ధాప్యమొచ్చింది.... జబ్బు చేసింది. డాక్టరు చూసి ఇది అంటువ్యాధి. అతణ్ణి కాస్త వేరుగా వుంచండి" అని చెబితే పశువుల కొట్టంలో మంచం వేసి అక్కడే ఉంచారు. కొడుకులు, కోడళ్ళు మరణసమయం రాగానే అందరూ చుట్టూ చేరారు. 'రామ' అను, 'కృష్ణ' అను, 'నారాయణ' అను అని అందరూ ఉపాయం చెబుతున్నారు. ఏనాడూ ఆ తలంపేలేని ఆయనకు నోరు పెగలటం లేదు. ఏదో అంటున్నాడు. దగ్గరగా వెళ్ళి చెవులు రిక్కించుకొని విన్నారు. క...క...క... అని వినబడింది. అంతే. "ఏదో రహస్యం చెప్పాలనుకుంటున్నాడు ఇంకా ఆస్తులేవైనా ఎక్కడన్నా దాచాడేమో" నని అందరూ ఆందోళన చెంది, ఒక గొప్ప డాక్టర్ దగ్గరకెళ్ళి "ఎంత ఖర్చైనా ఫర్వాలేదు..... రెండు మాటలు మాట్లాడించండి" అని ప్రాధేయ పడ్డారు. ఆయన 5వేల రూపాయల ఇంజెక్షన్

ఇచ్చాడు. దానితో అతనికి శక్తి వచ్చింది. ఇందాక చెప్పిన క...క...క...ఏమిటని కొడుకులు అడిగారు. దానికాయన 'కరు కస బరికెయున్న కడి యుత్తదే' - అన్నాడు. అంటే "దూడ చీపురుకట్టను తింటున్నది" - అని. చీపురును జాగ్రత్త చేయమని ఆయన అంతిమ సందేశం. కొన్ని క్షణాల్లో భార్యబిడ్డలను, సంపదలను, ఇల్లూ, వాకిళ్ళను, భోగభాగ్యాలను వదలిపోతున్నాడు. అయినా సరే చీపురుకట్టమీద వ్యామోహం మాత్రం పోలేదు. నా నామం పలుకు... నా దగ్గరకే వస్తావు అని భగవంతుడు చెబుతుంటే చీపురుకట్టను తలచుకుంటున్నాడు గనుక మరుజన్మలో వీధులు ఊడ్చే ఉద్యోగంలో చేరాలి..... కేవలం చివరి సమయంలో మాత్రం తలచుకోవడం కాదు..... 'ప్రయాణ కాలే అపి' మరణ సమయంలో కూడా తలచుకోమన్నారు. అంటే జీవితమంతా భగవంతుని తలచుకుంటూ చివరి ప్రయాణంలో కూడా తలచుకోవాలి.

ఇలా అంత్యకాలంలో కూడా భగవంతుని తలచుకోగలవారే యుక్త చేతసులు. వారే పరమాత్మను తెలుసుకోగలరు.

**గద్యం :-** ఓం తత్సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగో నామ సప్తమోధ్యాయః

ఈ ప్రకారంగా ఏడవ అధ్యాయం సమాప్తం.

# శ్రీమద్భగవద్గీత :8 వ అధ్యాయం

# అక్షరపరబ్రహ్మ యోగం




: వ్యాఖ్యాత :

**“అభినవ వ్యాస“, “జ్ఞానప్రపూర్ణ“**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# పూజ్య గురుదేవులు

జ్ఞానప్రపూర్ణ

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)**

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com

Visit www.srichalapathirao.com to listen Pravachanas

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్ధమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

నిజమైన ఆత్మజ్ఞాని, నిజమైన దేవుడు, ఈ భూమిపై నడయాడే భగవంతుడు ఎవరు? -

పరమాత్మకు అపరాప్రకృతి, పరాప్రకృతి అని రెండు ప్రకృతులున్నాయని బాగా తెలుసుకొని, వాటిని విశ్లేషించి, విభాగించి పరాప్రకృతితో తాదాత్మ్యం చెంది, అపరాప్రకృతి సృష్టించిన ఈ దృశ్య ప్రపంచంలో ఎవరు స్వేచ్ఛగా ఆనందంగా విహరిస్తారో - క్రీడిస్తారో అతడే ఆత్మజ్ఞాని. ఈ భూమిపై నడయాడే భగవంతుడు. అతడే సమస్త సంసారబంధనాల నుండి విడుదలపొందిన ముక్తుడు - జీవన్ముక్తుడు. మిగిలినవారంతా ఈ జననమరణ రూప సంసారబంధాలలో చిక్కుకొని, దిక్కుతోచక తిరిగాడుతూ ఉండేవారు. అట్టి సామాన్య మానవులను ఆనందస్వరూప ఆత్మజ్ఞానిగా తీర్చిదిద్దటమే వేదాంతం యొక్క ముఖ్యఉద్దేశం.

అందుకే 7వ అధ్యాయంలో అపరాప్రకృతి, పరాప్రకృతుల గురించి, జ్ఞానవిజ్ఞానాల గురించి వివరించటం జరిగింది. జ్ఞానాన్ని - అంటే ఆత్మజ్ఞానాన్ని తెలుసుకొని, దానిని అనుభూతిగా (విజ్ఞానంగా) మార్చుకున్న ఆత్మజ్ఞాని ఎట్టివాడో ఈ అధ్యాయంలో ప్రశంసించబోతున్నాడు భగవానుడు. ప్రపంచవ్యవహారాలన్నింటిలోను, అన్ని అంతస్థులలోను, సమత్వదృష్టిని కలిగి అంతటా ఆత్మనే దర్శిస్తుంటాడు అట్టి ఆత్మజ్ఞాని.

7వ అధ్యాయానికి 8వ అధ్యాయానికి మధ్య గల సంబంధం ఏమిటి ?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

7వ అధ్యాయంలో వేదాంతం అంటే కేవలం శాస్త్రజ్ఞానమే కాదు - ఆచరించి అందుకోవాల్సినది అని తెలియజేసి; ఆచరణ ఎలా చేయాలో ఈ 8వ అధ్యాయంలో సూటిగా తెలియజేయబోతున్నారు.

సృష్టి అయిన ప్రతిదీ ఎప్పుడో ఒకప్పుడు లయం కావలసిందే. సృష్టిక్రమాన్ని 7వ అధ్యాయంలో వివరించి, లయక్రమాన్ని ఇప్పుడీ 8వ అధ్యాయంలో చెప్పబోతున్నారు.

ఈ జగత్తంతా అపరాప్రకృతి అనబడే పంచభూతాలు, అహంకారం, మహత్తు, అవ్యక్తం అనే అష్టప్రకృతులుగా జడపదార్థంతో సృష్టి జరిగింది. దానితో పరాప్రకృతి అనే చైతన్యం కలిసి జగత్తుగా ఏర్పడింది.

అలాగే ఈ జీవుడు కూడా అపరాప్రకృతి అనబడే పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారం అనే అష్టప్రకృతులుగా జడపదార్థంతో సృష్టింపబడి అందులో చైతన్యంతో కూడిన పరాప్రకృతి కలిసి జీవుడు తయారయ్యాడు. ఇలా జగత్తు - జీవుడు వేర్వేరు స్థాయిలలో - వివిధదశలలో సృష్టింపబడ్డారు.

ఇలా సృష్టింపబడ్డ జగత్తుగాని, జీవుడుగాని లయంకాక తప్పదు. ఐతే ఈ లయం కూడా వివిధ దశలలో జరుగుతుంది. జీవుళ్ళు ఒక్కో దశలో లయం అయ్యేటప్పుడు ఒక్కో అనుభవం కలుగుతుంది. వివిధ పరిస్థితులలో ఆయా లోకాలను దర్శిస్తారు. ఆలోకించేవి గనుక లోకాలు అన్నారు. ఈ భూలోకం ఒక్కటే స్థూలం. మిగిలిన లోకాలన్నీ సూక్ష్మలోకాలు. అంటే మనం స్వప్నంలో ఎలా ఒక స్వప్నలోకాన్ని దర్శించి, అందులో ఒక స్వప్న పురుషుడు ఎలా

అనుభవాలు పొందుతాడో అలాగ ఈ లోకాలలో శరీరంతో పనిలేదు. మనస్సు మాత్రమే అనుభవాలు పొందుతుంది.

అయితే ఏ లయ పరిస్థితులలో ఏయేలోకాలను దర్శించి అనుభవాలను పొందుతాం? ఏలోకాల పరిస్థితి ఏమిటి? అని మనం తెలుసుకుంటే ప్రయత్నించి ఆయా లయ పరిస్థితులను సాధించి, ఆయా లోకాలను పొందుతాం. అంటే - ఎట్టి కర్మలతో నరకలోక దర్శనమవుతుందో, ఎట్టి కర్మలతో స్వర్గలోక దర్శనమవుతుందో, ఏది సుఖమో? ఏది దుఃఖమో? తెలిస్తే ఆయాకర్మల ద్వారా కోరుకున్న అనుభవాలను పొందగలం.

లయమైపోవాల్సినవన్నీ లయమైపోయిన తర్వాత అన్నింటిని తనలో లయం చేసుకొని, తాను లయం కాకుండా మిగిలి ఉండేది ఏదో అదే 'అక్షరం' - అక్షర పరబ్రహ్మం. దానిని చేరుకోవటమే మానవజీవిత గమ్యం - లక్ష్యం. ఎలా ఆ అక్షర పరబ్రహ్మాన్ని చేరుకోవచ్చునో తెలియజేసే అధ్యాయమే ఈ 'అక్షర పరబ్రహ్మయోగం' ఇందులో చెప్పిన మార్గాన్ని అనుసరిస్తే అక్షర పరబ్రహ్మాన్ని అందుకోవటం తథ్యం. అందుకై ప్రయత్నిద్దాం.

అసలు మనిషి ఎందుకు పుడతాడు? అని ప్రశ్న వేస్తే సామాన్యుడి సమాధానం 'చావటానికి' - అని. ఎందుకు చస్తాడు? అంటే పుట్టటానికి - అని. ఐతే ఇది నిజమా? ఇదే నిజమైతే పుట్టటం - చావటం అంటూ తిరగటమే గదా! ఏపనీపాటా లేనివాడు చెట్టుపైకి ఎక్కుతూ దిగుతూ ఉన్నట్లు; లేదా మట్టితో బొమ్మను చేసి దాన్ని మళ్ళీ ముద్దచేసి, మళ్ళీ బొమ్మను చేసి ముద్దచేసినట్లు - వ్యర్థమైన జీవితం గడపటమే గదా! జన్మను సార్థకం చేసుకోవాలనుకొనేవాడి

సమాధానం ఇదికాదు - కారాదు. మరి? ఎందుకు పుడుతున్నావు? అంటే మళ్ళీ పుట్టకుండా ఉండటానికి - అని; ఎందుకు చస్తున్నావు? అంటే మళ్ళీ చావకుండా ఉండటానికి - అని కావాలి. ఇదే పరమార్థం. ఇదే నిజమైన తెలివి. పుట్టినవాడు మళ్ళీ పుట్టకుండా ఉండే మార్గం ఆలోచించుకోవాలి. అందుకే ఒక మహాత్ముడన్నాడు, "పుట్టైనా - మరి చావునెరుగని గుట్టు నేర్వాలి. ఆ పట్టు దొరక్కపోతే పుట్టుకలేని విద్యనన్నా పట్టుకోవాలి" - అని.

పుట్టి చావని విద్య బ్రహ్మవిద్య. (జీవన్ముక్తి).

చచ్చి పుట్టని విద్య ఉపాసనా విద్య. (క్రమముక్తి).

మనిషి అజ్ఞానంతో పుడుతున్నాడు. కాని అజ్ఞానంతో చావకూడదు. ఏడుస్తూ పుడతాడు. కాని ఏడుస్తూ చావకూడదు. పుట్టేటప్పుడు అజ్ఞానం కనుక ఏడుస్తాడు. మరి మరణించేటప్పుడు కూడా ఏడిస్తే బాగుండదు. అజ్ఞానం ఉంటే ఏడుపే. తప్పదు. అందువల్ల జీవించి ఉన్నప్పుడు జ్ఞానాన్ని పొంది - 'నేను ఆత్మను' అనే జ్ఞానాన్ని పొంది; చచ్చేటప్పుడు ఏడుపు లేకుండా నవ్వుతూ చావాలి. అంటే మరణాన్ని మంగళప్రదం చేసుకోవాలి.

అసలు ఇన్ని రకాల ప్రాణికోట్లలో పుట్టేటప్పుడు ఏడుస్తూ పుట్టేది మానవుడొక్కడే. ఇక ఏ ప్రాణీ ఏడవదు. వాటికి ఏడవాల్సిన పనిలేదు. ఎందుకు? ఎందుకంటే మానవుడు తప్ప మిగిలిన ప్రాణులన్నీ పుట్టేది కర్మఫలాలు అనుభవించటానికి, వాసనలు ఖర్చు చేసుకోవటానికి, ఆ రెండు పనులూ ఎలాగూ చేస్తాయి గనుక అవి ఏడ్చే పనిలేదు. మరి మానవుడో ఆ రెండింటితో పాటు ముఖ్యంగా జన్మరాహిత్యం చేసుకోవాలని; అందుకు

ఆత్మజ్ఞానాన్ని పొంది మోక్షాన్ని పొందాలని పుడుతున్నాడు. కాని మానవుడు ఈ పని మాత్రం చెయ్యడు. అందుకే "వచ్చింది ఎందుకో మర్చిపోయి, ఏదేదో చేస్తూ ఏడుస్తూ పోయే బ్రతుకేగదా! నాది" - అని పుట్టేటప్పుడు కూడా ఏడుస్తూ పుడుతున్నాడు.

పుట్టేటప్పుడు ఏమని ఏడుస్తాడు? కోఽహం, కోఽహం - అని. అంటే నేనెవరు? నేనెవరు - అని. జీవితంలో దీనికి సమాధానాన్ని వెతుక్కున్నవాడు 'సోఽహం, సోఽహం' అంటూ మరణిస్తాడు. అంటే ఆ పరమాత్మ నేనే - నేనే - అని. అలా అయితేనే జన్మసార్థకం. అలాంటి మరణాన్ని పొందటం ఎలాగో చెప్పేదే ఈ అధ్యాయం. అందుకే ఇది ఎంతో గొప్ప అధ్యాయం. ఆచరణకు, బుద్ధి వికాసానికి తెరతీసే అధ్యాయం.

ఈ అధ్యాయంలో రెండు మహావాక్యాల వంటి వాక్యాలున్నాయి.

1."తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ" - 7వ శ్లోకం.

2."తస్మాత్ సర్వేషు కాలేషు యోగ యుక్తో భవార్జున!" - 27వ శ్లోకం.

ఉపక్రమ - ఉపసంహారాలలో - అంటే ప్రారంభంలో - ముగింపులో చెప్పిన ఈ రెండు వాక్యాలు ఆచరణ చేయాలనుకున్న వారికి మహామంత్రాలే. ఇవి నిరంతరం మననం చేసుకోవలసినవి. అక్షరుడైన పరబ్రహ్మను చేరుకొనుటకు ప్రధానమైన ఈ రెండు ఉపాయాలు ఈ అధ్యాయంలోనే చెప్పబడినవి. ఆచరిస్తేనే వీటికి సార్థకత.

ప్రపంచంలో ఒక నియమం ఉంది. ఎవరి దగ్గరనుంచైనా ఏదైనా వస్తువును నీవు తీసుకుంటే ప్రత్యామ్నాయంగా వారికి నీవేదైనా ఇవ్వాలి.

ఇప్పుడు నానుండి మీరు పొందుతున్న వస్తువు ఈ ఉపాయాలే. దీనికి ప్రతిఫలంగా మీరు ఏమి ఇవ్వాలి? ప్రశాంత చిత్తంతో విని, తెలుసుకొని, జీవితంలో ఆచరించటానికి ప్రయత్నించాలి. ఇదే నేను కోరే ప్రతిఫలం.

బజారు నుండి వేరుశెనగ నూనె డబ్బా తెచ్చారు. రోజూ వాడుకోవటానికి కొంచెం టిఫిన్ లోకి వంచుకోవాలి. అలా వంచేటప్పుడు డబ్బా తొణకకూడదు. క్రింద టిఫిన్ కూడా తొణకకూడదు. రెండూ నిశ్చలంగా ఉంటేనే పై డబ్బాలో నుండి క్రింది టిఫినులోనికి నూనె చక్కగా చేరుతుంది. అలాగే వేదాంత విషయాలను చెప్పే గురువూ నిశ్చలచిత్తంతో చెప్పాలి. వినే శిష్యుడూ నిశ్చలమైన ఏకాగ్రచిత్తంతో వినాలి. అప్పుడే మనకు ప్రయోజనం కలుగుతుంది.

ఇది ఎనిమిదవ అధ్యాయం. అక్షర పరబ్రహ్మయోగం. దీనిని బ్రహ్మయోగం, అక్షర బ్రహ్మయోగం, అభ్యాసయోగం, ధారణాయోగం, తారక బ్రహ్మయోగం, మంగళ మార్గయోగం, మహాపురుష యోగం, బ్రహ్మాక్షర నిర్దేశ యోగం - అని వేరువేరు పేర్లతో పిలుస్తారు. యోగం అంటే ఉపాయం - యుక్తి అని అర్థం.

క్షరము కాని (నాశనం లేని) పరబ్రహ్మన్ని పొందే ఉపాయం ఇందులో చెప్పబడింది. కనుకనే దీనిని అక్షర పరబ్రహ్మయోగం అన్నారు.

పరమాత్మను తెలుసుకోవటం, ముక్తిని పొందటం మానవ జీవిత లక్ష్యం. మనం పుట్టింది నిజంగా ఇది సాధించటానికే. అంటే మనం వచ్చిన పని ఇదే. అయితే మనం వచ్చిన పని మరిచిపోయి, పుచ్చిన పనులలో, వ్యవహారాలలో మునిగిపోతున్నాం. ధనం సంపాదిస్తున్నాం, భూములు సంపాదిస్తున్నాం,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మేడలు కడుతున్నాం, వస్తువుల్ని కొంటున్నాం, బిడ్డల్ని కంటున్నాం, భోగాలు అనుభవిస్తున్నాం, ఇతరుల సొమ్ముకు ఆశపడుతున్నాం, మోసాలు చేస్తున్నాం, కబ్జాలు చేస్తున్నాం, దొంగతనాలు చేస్తున్నాం, హత్యలకు తెగబడుతున్నాం. ఇవేమీ మానవజన్మకు శోభనివ్వవు. ఇవి లేకపోయినా పెద్దనష్టమేమీ లేదు.

పిల్లి తన కూన కళ్ళు తెరిచేలోగా ఏడుసార్లు తట్టలలో, బుట్టలలో, గాదెలలో, గంపలలో మారుస్తుందట. అలాగే మాయ అనే పిల్లి జీవుడనే కూనను కళ్ళు తెరిచేలోగా - అంటే మానవజన్మ వచ్చేలోగా 83,99,999 గర్భగోళాలలో వేసి తీస్తుంది. కనుక కళ్ళు తెరవాల్సిన జన్మ ఈ మానవజన్మ. ఇప్పుడూ కళ్ళు మూసుకొనే ఉన్నావా? 'పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం' అన్నట్లుగా ఇక ఈ ప్రయాణం ఇంతే. అంతులేని కథయే. ఈ అంతులేని కథకు - ముగింపు లేని కథకు ముగింపు నీవు కళ్ళు తెరిస్తేనే. జ్ఞాననేత్రం తెరుచుకుంటేనే - ముక్తిని సాధించి నరుడు నారాయణుడైతేనే. మానవుడు మాధవుడైతేనే - జీవుడు దేవుడైతేనే. అప్పుడే జననమరణ చక్రం నుండి విముక్తి. అప్పుడే శాంతి - ప్రశాంతి. అప్పటిదాకా ఒకటే ప్రయాణం - ఎడతెరిపి లేని ప్రయాణం - విశ్రాంతిలేని ప్రయాణం - అంతులేని ప్రయాణం.

ఒక నది వద్దకు వెళ్ళి ఒడ్డున నిలబడి పరిశీలనగా చూడండి. ఆ నదికి ఒక్కక్షణం తీరిక లేదు. పరుగులే పరుగులు. అమ్మా! నదీమతల్లీ! ఎక్కడికమ్మా నీ పరుగులు? ఎక్కడికమ్మా ఈ విశ్రాంతి లేని ప్రయాణం? అని అడగండి. ఆ కర్మయోగి నీ మాటలు వినిపించుకోదు. ఒక్కక్షణం ఆగదు. ప్రయాణమే

ప్రయాణం. అయితే మౌనభాషలో ఆ నది ఇలా సమాధానం చెబుతుంది. "నేను సముద్రుణ్ణి చేరుకోవాలి. అతడే నాకు పతి - గతి. అక్కడకు చేరితేనే నాకు విశ్రాంతి. అక్కడికి చేరేంతవరకే నాకు హద్దులు - పద్దులు. అక్కడికి చేరగానే సముద్రాకారంగా మారిపోతా. దానితో నాకు హాయి - విశ్రాంతి - ఆనందం" - అంటుంది.

నది నదిగా ఉన్నంతవరకు ఉరుకులు - పరుగులు. సముద్రాన్ని చేరగానే విశ్రాంతి - ప్రశాంతి. సముద్రాన్ని చేరిన తర్వాత గంగ గంగకాదు, యమున యమునకాదు, గోదావరి గోదావరికాదు, కావేరి కావేరికాదు. ఒకే ఒక అఖండ సముద్రం. మరి సముద్రానికే ఎందుకు పోవాలి? ఎక్కడికైనా వెళ్ళొచ్చు గదా! అక్కడక్కడ హాయిగా ఆడుతూ పాడుతూ తిరుగుతూ ఉండొచ్చుగదా! అహా! సముద్రమే దాని స్వస్థానం. సముద్రం నుండే అది వచ్చింది. కనుక చేరాల్సింది సముద్రాన్నే. సముద్రమే నదులకు స్వస్థానమా? అవును. ఎలా?

సముద్రంలోని నీరు సూర్యతాపానికి వేడెక్కి; ఆవిరై, మేఘాలుగా ఏర్పడతాయి. ఆ మేఘాలు చల్లబడి వర్షంగాపడి, ఆ నీరు వాగులు వంకలు ద్వారా నదులను చేరతాయి. చివరకు నదీరూపంలో సముద్రానికి ప్రయాణమవుతుంది. కనుక సముద్రమే నదులకు స్వస్థానం. స్వస్థానాన్ని చేరేవరకు ఎక్కడా ఆగకుండా ఒకటే పరుగు - ఒకటే ఆరాటం. ఎప్పుడెప్పుడు సముద్రుణ్ణి చేరడమా? అని ఆరాటం, పోరాటం. అక్కడకు చేరితే చాలు హాయి, శాంతి, ప్రశాంతి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నది ఎట్లాగైతే తన స్వస్థానమైన సముద్రుడి నుండి వచ్చి, ఉరుకులు పరుగులతో ఆ సముద్రుణ్ణి చేరుకొని హాయిగా - శాంతంగా - ప్రశాంతంగా ఉండిపోతున్నదో అలాగే మనం కూడా మన స్వస్థానానికి చేరుకొని హాయిగా, ప్రశాంతంగా, ఆనందంగా ఉండిపోవాలి. మరి మన స్వస్థానం ఏమిటి? అదే పరమాత్మస్థానం. ఆ పరమాత్మ నుండి జారిపడ్డాం. ఆయనను విడిచి, ఆయనను మరచి, జననమరణాలకు గురౌతున్నాం. ఆనందానికి, ప్రశాంతతకు దూరమైపోతున్నాం. దేహాభిమానంతో, శరీరమనోబుద్ధుల తాదాత్మ్యంతో అనేక దుఃఖాలను పొందుతున్నాం. ఈ దుఃఖాలను తొలగించుకోవటానికి, ఆనందాన్ని పొందటానికి ఈ ప్రపంచంలోకి పిచ్చి పరుగులు తీస్తున్నాం. వంకరటింకరలుగా తిరుగుతున్నాం. అంతేగాని ఆ నదీమ తల్లిలాగా మనకు పతి - గతి అయిన పరమాత్మను చేరుకోవాలని, ఆనందాన్ని పొందాలని తెలియటం లేదు. ఆ నదికున్నపాటి తెలివి కూడా మనకు లేకుండా పోయింది. మన స్వస్థానాన్ని చేరుకోకుండా ఎన్ని చోట్ల తిరిగినా, ఎలా తిరిగినా, ఎక్కడ తిరిగినా, ఎన్ని జన్మలెత్తినా, ఏ జన్మలెత్తినా మనం కోరుకునే ఆనందం - శాశ్వత ఆనందం - ప్రశాంతత మనకు రాదు గాక రాదు. ఆ ఆనందం రావాలంటే ఈ శరీరమనోబుద్ధుల తాదాత్మ్యం వదిలించుకొని, ఆ అఖండ పరమాత్మ స్వరూపాన్ని చేరుకొని, అందులో ఐక్యమై ఆ పరమాత్మ స్వరూపంగా మారిపోవాలి. అంటే మన స్వస్థానాన్ని చేరుకోవాలి. అప్పుడే శాంతి - ప్రశాంతి - అఖండ ఆనందం - ఆత్మానందం. అలా స్వస్థానాన్ని చేరుకొనే దాకా ఒకటే తహతహ ఉండాలి. ఆరాటం ఉండాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తపన ఉండాలి. నది సముద్రాన్ని చేరి సముద్రాకారంగా మారేవరకు ఎలా తన ప్రయాణం కొనసాగిస్తున్నదో అలా మన ప్రయాణం సాగాలి. అన్యవిషయాలకు అనవసర ప్రాధాన్యత నివ్వరాదు.

నీటిలో నుండి గట్టున పడ్డ చేప విలవిలలాడిపోయి, తిరిగి నీటిలో పడగానే హాయిగా సంతోషంగా ఎలా కేరింతలు కొడుతుందో అలాగే మనం కూడా పరమాత్మ నుండి జారిపడి వ్యాపారం చేసినా, వ్యవసాయం చేసినా, ఉద్యోగం చేసినా, ఊళ్ళేలినా ఏం చేసినా ఎక్కడా శాంతి లేదు. పరమాత్మను చేరి పరమాత్మ స్వరూపంగా మారిపోవాలి. అప్పుడే హాయి, ఆనందం. దుఃఖ స్వరూపమైన ప్రపంచాన్ని ఆశ్రయిస్తే దుఃఖమే. ఆనందస్వరూప పరమాత్మను ఆశ్రయిస్తే ఆనందమే ఆనందం.

దుఃఖాలు లేకుండాపోవాలనే ప్రతి మానవుని పరమాశయం. మానవుడే కాదు; పశువు పక్షి క్రిమి కీటకం - అన్నింటికి దుఃఖం పోవాలని, సుఖం కలగాలనే కోరిక. జరా మరణాలే మానవుని దుఃఖాలు. ఈ దుఃఖం పోవాలనే మానవుని కోరిక. కోరిక ఉంటే చాలదు. తగిన విధంగా ఆచరణ చేయాలి. మనం దుఃఖాలు పోవాలనుకుంటాం కాని తగిన సాధనలు మాత్రం చేయం. అందుకే భగవానుడు సరియైన మార్గమేదో తెలియజేస్తున్నాడు. అదే - "మామాశ్రిత్య యతంతి" - నన్ను ఆశ్రయించి సాధన చెయ్యి - అని. దుఃఖరూపమైన ప్రాపంచిక పదార్థాలను ఆశ్రయిస్తే దుఃఖమెలా తొలగుతుంది. మనం మాయిక పదార్థాలను ఆశ్రయిస్తున్నామేగాని మాయాపతిని ఆశ్రయించటం లేదు. అందుకే దుఃఖం తప్పటం లేదు. దుఃఖానికి

మూలకారణం అజ్ఞానం. కనుక అజ్ఞానం తొలగాలి. అజ్ఞానం తొలగాలంటే జ్ఞానం కలగాలి. జ్ఞానం కలిగితే సమస్త దుఃఖాలు నివృత్తే.

కలలో అనేక దుఃఖాలు కలుగుతాయి. అవి తొలగాలంటే పూజా పునస్కారాలు, మంత్ర తంత్రాలు - ఏమీ ఉపయోగపడవు. మేలుకోవాలి. దానితో అన్ని దుఃఖాలు ఊడ్చుకొని పోతాయి. స్వప్నంలో వచ్చిన దుఃఖం స్వప్నం తొలగితే - అంటే మేలుకుంటే తొలగిపోతుంది. అలాగే అజ్ఞానం వల్ల వచ్చిన దుఃఖం అజ్ఞానం తొలగితే - అంటే జ్ఞానం కలిగితే (నేను ఆత్మను అనే జ్ఞానం కలిగితే) తొలగిపోతుంది.

అజ్ఞానం తొలగటానికి, జ్ఞానం కలగటానికి అర్జునుడు శ్రీకృష్ణుని ఆశ్రయించాడు, జ్ఞానం పొందాడు. అలాగే ప్రతి మానవుడు తన అజ్ఞానాన్ని తొలగించుకోవటానికి, జ్ఞానాన్ని పొందటానికి గురువును ఆశ్రయించాలి.

జ్ఞానమంటే ఏమిటో 7వ అధ్యాయం చివరి 2 శ్లోకాల్లో తెలియజేశారు. "బ్రహ్మమును, ఆధ్యాత్మమును, కర్మను, అధిభూత - అధిదైవ - అధియజ్ఞాలతో" కూడిన భగవంతుణ్ణి తెలుసుకుంటూ, శరీరాన్ని విడిచే సమయంలో కూడా ఎవరు భగవంతునియందే చిత్తం నిల్పుతారో, వారు చివరకు నన్నే చేరుకుంటారు - అని భగవానుడు తెలియజేశాడు. దీనితో అర్జునునికి బ్రహ్మము, అధ్యాత్మము, కర్మ, అధిభూత - అధిదైవ - అధియజ్ఞములంటే ఏమిటో తెలుసుకోవాలనే అపేక్ష కలిగింది. అలాగే మరణ సమయంలో పరమాత్మ స్మరణ చేయటానికి ఉపాయం ఏమిటో తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది. అందుకే అర్జునుని ప్రశ్నతో ఈ అధ్యాయం ప్రారంభమౌతున్నది. ఇప్పుడు

అర్జునుని ప్రశ్న ఏమిటో చూద్దాం. అలాగే మనం కూడా ఈ అధ్యాయాన్ని బాగా గ్రహించి మరణసమయంలో పరమాత్మ స్మరణ చేయగల స్థితిని చేరుకుందాం. -

అర్జునుని ప్రశ్నలు - (1 – 2 శ్లో)

**అర్జున ఉవాచ:-**

**శ్లో||** కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కింకర్మ పురుషోత్తమ!|
అధి భూతంచ కిం ప్రోక్తం అధిదైవం కి ముచ్యతే|| (1)

**శ్లో||** అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన!|
ప్రయాణ కాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః|| (2)

**తా||** అర్జునుడడుగుతున్నాడు; పురుషోత్తమా! ఆ బ్రహ్మ ఏది? అధ్యాత్మం ఏది? కర్మ అంటే ఏమిటి? అధిభూతమని ఏది చెప్పబడింది? అధిదైవమని దేనినంటారు? మధుసూదనా! ఈ దేహంలో అధియజ్ఞుడెలా ఉన్నాడు? ఎవరు అతడు? మనస్సు స్వాధీనంలో ఉన్నవారిచేత మరణసమయంలో ఎలా తెలియబడతావు?

**వ్యాఖ్య:-** ఈ పదాలన్నీ 7వ అధ్యాయం చివరి 2 శ్లోకాల్లో భగవానుడు ప్రయోగించినవే. అక్కడ వాటి వివరణ మాత్రం ఇవ్వలేదు. అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో కూడిన నన్ను ఎవరు తెలుసుకుంటారో వారే అంత్యకాలంలో కూడా మనస్సు స్వాధీనంలో ఉన్నవారై నన్ను స్మరిస్తారని భగవానుడు అక్కడ తెలియజేశాడు. దానితో అర్జునునిలో జిజ్ఞాస పెరిగింది.

ఉత్కంఠ హెచ్చింది. అందుకే ఆ పదాల వివరం ఆయననే అడిగి తెలుసుకోవాలనుకున్నాడు. అందుకే ఈ ప్రశ్నలు. అర్జునుడు ప్రశ్నిస్తే వాటి అర్థాలను చెప్పి అంత్యకాలంలో కూడా భగవంతుని స్మరణ ఎలా సాధ్యమో - ఆ ఉపాయాన్ని - సాధనా విధానాన్ని ప్రత్యేకంగా వివరించాలని భగవానుని అభిప్రాయం. అందుకే అర్జునునికి జిజ్ఞాస కలిగించే పదాలను వాడి తాను చెప్పదలచుకున్న విషయానికి నాందీ ప్రస్థావన గావించాడు.

అర్జునుడడిగిన ప్రశ్నలు మొత్తం 7. అందులో పదాల అర్థం తెలుసుకోవటానికి అడిగినవి 6. అంత్యకాలంలో భగవంతుని స్మరించే ఉపాయం తెలుసుకోవటానికి అడిగినది 7వ ప్రశ్న. భగవానుడు కూడా 2 శ్లోకాల్లో 6 పదాలకు వివరణ ఇచ్చి చివరి ప్రశ్నకు సమాధానంగా మొత్తం అధ్యాయాన్ని కేటాయించాడు.

ఇక్కడ అర్జునుడు శ్రీకృష్ణుని పురుషోత్తమ - అని, మధుసూదన అని 2 పదాలతో సంబోధించటం జరిగింది. మొదటి శ్లోకంలో సంబోధన పురుషోత్తమ.

<u>పురుషోత్తమ!:-</u> పురం అంటే ఈ దేహం. పురమునందంతటా నఖశిఖపర్యంతం నిండి ఉన్నవాడు పురుషుడు. కనుక జీవుడే పురుషుడు. జీవుడు శరీరమునందంతటా వ్యాపించియున్నాడు కనుకనే చెయ్యి పట్టుకున్నా, కాలు పట్టుకున్నా, తలమీద వెంట్రుకలు పట్టుకున్నా తెలుసుకుంటున్నాడు. అట్టి పురుషులలో శ్రేష్ఠుడు, ఉత్తముడు ఎవరో అతడే పురుషోత్తముడు. జీవుడు శరీరం అనే పురంలో అంతటా ఎలా నిండి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉన్నాడో - అలాగే పురుషోత్తముడు ఈ చరాచర విశ్వబ్రహ్మాండం అంతటా నిండి ఉన్నాడు. అట్టివాడే ఈ శ్రీకృష్ణుడు అని భావం. కనుక కృష్ణుడు అంటే అర్జునుని రథం నొగలపై కూర్చొని గుర్రాలను తోలే మూడున్నర మూరల శరీరం కాదు. ఆయన పురుషోత్తముడు. ఈ విశాల విశ్వం అంతటా - బ్రహ్మాండం అంతటా విస్తరించుకొని నిండియున్నవాడు. ఎక్కడ ఏమి జరిగినా అన్నీ తెలుసుకోగల సర్వజ్ఞుడు. ఆయనకు తెలియకుండా ఎక్కడా ఏమీ జరగదు. 'శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు'.

(i) స్థూల ప్రపంచానికి అధిదేవత విరాట్పురుషుడు. అతడికి స్థూల ప్రపంచం - స్థూలదేహం సంగతే తెలుస్తుంది. (ii) సూక్ష్మప్రపంచానికి అధిదేవత హిరణ్యగర్భుడు. అతడికి స్థూల సూక్ష్మ ప్రపంచం లేదా దేహం సంగతులన్నీ తెలుస్తాయి. (iii) స్థూలసూక్ష్మకారణ ప్రపంచాలకు అధిదేవత పురుషోత్తముడు (ఈశ్వరుడు). అతడికి యావత్తు విషయాలు తెలుసు. తెలియనిది లేదు. అతడు పూర్ణపురుషుడు - సర్వజ్ఞుడు. ఆయనది అపరిమిత జ్ఞానం.

అంతటి సర్వజ్ఞుడు గనుకనే ఎట్టి సందేహాలకైనా సమాధానం చెప్పగలడు. ఆ సమాధానం ఎంతటి వారికైనా సంతృప్తినిస్తుంది. అర్జునుడు పురుషోత్తమా! అని సంభోదించటంలోని ఆంతర్యం ఇదే. అందుకే ఆయనను అడుగుతున్నాడు.

**1. కిం తత్ బ్రహ్మ** :- తత్ అంటే అది. దూరంగా ఉన్నదానిని తత్ = అది అంటారు. తత్ బ్రహ్మ అంటే ఆ బ్రహ్మ అని. అంటే బ్రహ్మ దూరంగా ఉన్నాడనేనా? ఎంత దూరంలో ఉన్నాడు? ఇంద్రియాలకు, మనస్సుకు

అందనంత దూరం. అయితే ఎవరికి దూరంగా ఉన్నాడు? అజ్ఞానులకు - ప్రాపంచిక వ్యామోహాలలో చిక్కి అందులోనే మునిగిపోయే వారికి అందుకోలేనంత దూరం. కాని భగవంతుని అనుగ్రహం, గురువు అనుగ్రహం ఉన్న వారికో! చాలా దగ్గర. అందుకే కబీర్ దాస్ అంటాడు - "కోటి జన్మకా పంధ దా! క్షణ్ మే పహుం చా జాయ్" అని. గురుదేవా! నా అంతట నేను ప్రయాణం చేస్తే కోటిజన్మలకు గాని చేరుకోలేను. నీ అనుగ్రహంతో ఒక్కక్షణంలో చేరుకున్నాను - అని.

ఒకడు కలగంటున్నాడు. ఆ కలలో పెద్ద పులి వెంటబడ్డది. దిక్కుతోచక పరుగులు తీస్తున్నాడు. అలా పరుగెడుతూ ఒక గోతిలో పడిపోయాడు. అక్కడొక సర్పం బుసలు కొడుతున్నది. పెడబొబ్బలు పెడుతున్నాడు. భయంతో ముచ్చెమటలు పోస్తున్నాయి. వాడి బాధ ఎలా తొలగిపోతుంది? మేల్కొలిపితే సరి.

అలాగే ఈ మానవుడు అజ్ఞానమనే నిద్రలోబడి చిత్రవిచిత్రమైన స్వప్నవస్తువుల వంటి అనిత్యవస్తువులను చూస్తున్నాడు. దేహం తానే అనుకుంటున్నాడు. జగత్తు సత్యం అనుకుంటున్నాడు. అసత్యాన్ని సత్యమని, అనిత్యాన్ని నిత్యమని, అనాత్మను ఆత్మయని పొరపాటుపడుతున్నాడు, కలవరిస్తున్నాడు. అట్టివానికి బాధలు తొలగేదెలా? ముక్తి ఎలా? గురువు అతణ్ణి ఈ అజ్ఞానమనే నిద్ర నుండి మేల్కొలపాలి. అలా మేలుకుంటే అట్టివాడికి బ్రహ్మము ఎంతో దగ్గర. ఆ బ్రహ్మము తన స్వరూపమే. అలా కాకుండా అజ్ఞానమనే నిద్రలో ఉంటే ఎంతోదూరం. అందుకే తత్ బ్రహ్మ అనటం. అట్టి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

బ్రహ్మను తెలుసుకోవాలంటే ఎలా? ఇంద్రియ అగోచరం కదా! మనస్సుతో ఆలోచించలేం కదా! బుద్ధిలో ఉన్న తెలివితో - పాండిత్యంతో తెలుసుకోలేం కదా! కనుక బోధవల్లనే - గురుబోధ వల్లనే తెలుసుకోవాలి. అందుకే జగద్గురువునే అడుగుతున్నాడు ఎవరా బ్రహ్మ? అని.

పురాణాలలో బ్రహ్మ అంటే చతుర్ముఖబ్రహ్మ. ఆయనే సృష్టికర్త. మరి ప్రకృతిని కూడా బ్రహ్మ అంటారు. వేదాన్ని, యజ్ఞాన్ని బ్రహ్మ అంటారు. ప్రణవాన్ని కూడా బ్రహ్మము అంటారు. ఇవిగాక ఉపాధులేలేని నిరాకార పరమాత్మను కూడా బ్రహ్మము అంటారు. మరి ఇంతకీ ఎవరు తత్ బ్రహ్మ?

2.కిం అధ్యాత్మం :- అధ్యాత్మం అంటే ఏమిటి? అధి+ఆత్మ. ఆత్మకన్నా అధికమైనది అనిగదా! నిజంగా ఆత్మకన్న అధికమైనదేమైనా ఉంటుందా? ఆత్మ అంటే దేహం అనికూడా అర్థం చెబుతారు. అలాంటప్పుడు దేహం కన్నా అధికమైన ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి - ఇవన్నీ అధ్యాత్మం అనవచ్చు గదా! ఇంతకూ నీ అభిప్రాయం ఏమిటి? అధ్యాత్మం అనేది ఉపాధికి సంబంధించినదా? లేక చైతన్యానికి సంబంధించినదా? -

3. కిం కర్మ :- కర్మ అంటే ఏమిటి? కొందరు నిత్య, నైమిత్తిక, కామ్య, నిషిద్ధ, ప్రాయశ్చిత్త కర్మలను కర్మ అంటారు. కొందరు ఆగామి, ప్రారబ్ధ, సంచిత కర్మలను కర్మ అంటారు. మరి కొందరు యజ్ఞయాగాదులు, దానధర్మాలు, పూజాపునస్కారాలు - వీటిని కర్మ అంటారు. ఇంకా కొందరేమో అన్ని పనులను - అంటే తినటం, తిరగటం, కూర్చోవటం, నిలుచొనటం, మాట్లాడటం,

నవ్వటం, ఏడవటం - అన్నీ కర్మయేనంటారు. మరి కొందరేమో భగవంతుడు సృష్టి చేయుటమే కర్మ అంటారు. మరి నీవు చెప్పే అర్థం ఏమిటి?

4.అధిభూతం కిం ప్రోక్తం :- అధిభూతమని చెప్పబడింది ఏమిటి? ఈ కనిపించే దేహేంద్రియాలు అధిభూతాలా? లేక పంచభూతాలు అధిభూతాలా? లేక పుట్టినవన్నీ అధిభూతాలా? వీటికి వేరుగా మరొకటేదైనా అధిభూతం అనేది ఉన్నదా?

5.అధిదైవం కిం ఉచ్యతే :- అధిదైవం అని దేనినంటారు? ఈ జగత్తులో ఎందరో దేవతలున్నారు. 33 కోట్లమంది దేవతలున్నారంటారు. వీరా అధిదైవతం? లేక ఒక్కొక్క ఇంద్రియానికి ఒక్కొక్క అధిష్టానదేవత ఉన్నది? వారేనా అధిదైవతం? లేక నాలుగు వేదాలకు అధిదేవతలున్నారు. వారా అధిదైవతం? ఇందులో ఎవరైనా ఉన్నారా? లేక వీరందరూ కాక వేరే అధిదైవం అనే వారింకెవరైనా ఉన్నారా?

6. అధియజ్ఞః కథం కోఽత్ర :- అధియజ్ఞుడెవరు? అతడెక్కడ ఉన్నాడు? అధియజ్ఞుడంటే కర్మలు చేసేవాడా? ఫలితాలననుభవించేవాడా? లేక ఊరకే చూస్తూ ఉండేవాడా? అతడు మన లోపల ఉంటాడా? వెలుపల ఉంటాడా? దూరంగానా? దగ్గరగానా? నీవే చెప్పాలి - అని అర్జునుని భావం.

ఇలా 6 ప్రశ్నలను గబగబా అడిగేసిన అర్జునుడికి తన మనస్సులో పురుగులా తొలుస్తున్న ప్రధానమైన సందేహాన్ని 7వ ప్రశ్నగా అడగబోతూ మధుసూదనా! అని సంభోధిస్తున్నాడు. ఏమిటా సంభోదనలోని ఆంతర్యం? ఏమిటా ముఖ్య ప్రశ్న?

అర్జునునిలో పురుగులా తొలుస్తున్న సందేహం ఏదైతే ఉందో అది మనకు కూడా ఎంతో ముఖ్యమైనది. ప్రాణం విడిచిపెట్టే సమయం ఎంతో బాధాకరమైనది. అవయవాలు పట్టుదప్పిపోతాయి. శరీరం భయంతో బిగుసుకుపోతుంది. స్మృతి తప్పిపోతుంది. బుద్ధి వికలమైపోతుంది. చిత్తం స్వాధీనంలో ఉండదు. 'ప్రాణోత్క్రమణం' లక్ష తేళ్ళు ఒక్కసారిగా కుట్టినంత బాధగా ఉంటుంది. అలాంటప్పుడు పరమాత్మను స్మరించటం ఎవరికైనా సాధ్యమవుతుందా? కాదు. దానికేదైనా ఉపాయం ఉందా? తెలుసుకోవాలి. అందుకే "ఓ మధుసూదనా! ఇలాంటి కష్టకాలంలో నీవెలా గుర్తుకు వస్తావో తెలియజేసి పుణ్యం కట్టుకోవయ్యా! అంటున్నాడు అర్జునుడు. ఇక్కడ కృష్ణుని మధుసూదనా! అనటంలో అర్జునుని సమర్థత, సమయస్ఫూర్తి తెలుస్తున్నది. ఏమిటది? -

మధుసూదన! ఈ పేరు భగవానునికి జన్మలగ్నం చూచిపెట్టిన పేరు కాదు. ఇది లాక్షణిక అర్థం. ఒక వ్యక్తిని ఉపాధ్యాయుడు అంటాం. ఒకరిని డాక్టరు అంటాం. మరొకరిని లాయరు అంటాం. ఇవన్నీ వారికి తల్లిదండ్రులు పెట్టిన పేర్లు కాదు. వాళ్ళు చేసే వృత్తిని బట్టి వచ్చిన పేర్లు. అలాగే ఇక్కడ శ్రీకృష్ణుడు 'మధు'వనే రాక్షసుని సంహరించినవాడు గనుక మధుసూదనుడు అన్నారు. ఇది పురాణ కథలకు సరిపోయే అర్థం. అయితే ఆధ్యాత్మిక ప్రసంగంలో ఈ అర్థం చాలదు. మరి?

మధువు అంటే తేనె. తేనెటీగలు ఒక్కొక్క పుష్పంలోనికి దూరి అందులోని మకరందాన్ని గ్రోలి, కడుపు నింపుకొని, భవిష్యత్తు అవసరాలకు

బొట్టు బొట్టుగా తేనెను తేనెపట్టులోనికి చేర్చి కూడబెట్టుకుంటాయి. ముందెప్పుడో అనుభవించటానికి వీలుగా అలా తేనెపట్టులో తేనె కూడుకుంటుంది. ఎవడో ఒకడు తేనెకోసం ఆ పట్టును కొట్టి తేనెను తీసుకుంటాడు.

ఇప్పుడు జీవుడు తేనెటీగ. ఒక్కొక్క దేహం పుష్పం. జీవుడు ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క దేహమనే పుష్పంలో దూరి, ఆయాదేహాలలో కూర్చొని అనేక కర్మలు చేస్తూ సుఖదుఃఖాలు అనుభవిస్తూనే భవిష్యత్తులో సుఖాలు, భోగాలు అనుభవించాలనే కోరికతో కొన్ని మంచికర్మలను, పుణ్యకర్మలను చేస్తూ; పొరపాటునో గ్రహపాటునో కొన్ని పాపకర్మలు కూడా చేస్తూ, ఒక్కొక్కటిగా కర్మఫలాలను కూడబెట్టుకొని సంచితం చేసుకుంటాడు. ఇలా కూడబెట్టుకొనే సంచిత కర్మలన్నీ ఖర్చయ్యేంతవరకు ముక్తిలేదు. అవి ఖర్చుచేసుకోటానికి అనంతకోటి జన్మలెత్తుతూ ఉండాలి. ఆ జన్మలలో సుఖాలతో బాటు దుఃఖాలు కూడా అనుభవిస్తూ మళ్ళీ మళ్ళీ కర్మలను కూడబెట్టుకొని సంచితంలో కలుపుతుంటాడు. ఇవన్నీ ఒక్కసారిగా జ్ఞానాగ్నిలో దగ్ధమైపోతే తప్ప ముక్తి లేదు. ఈ సంచిత కర్మఫలాలన్నింటిని జ్ఞానాగ్నిలో దగ్ధం చేసేవాడు ఆ భగవంతుడే. అక్కడ మధువనే రాక్షసుని సంహరించిన భగవానుడే ఇక్కడ కర్మఫలాలనే మధువును సంహరించేవాడు గనుక ఆయనను మధుసూదనా! అని సంబోధిస్తున్నాడు అర్జునుడు.

మరొక విధంగా కూడా చెప్పుకోవచ్చు.

మధువంటే తేనె. తీపివస్తువు. అసలు అన్నింటికన్న తీపి వస్తువు 'నేను' 'నేను' అనే అహంకారమే. దేనికి అఘాతం కలిగినా మానవుడు సహిస్తాడు గాని అహంకారానికి దెబ్బ తగిలితే సహించడు. స్వీటుకన్న, ధనంకన్న, బంగారంకన్న, బిడ్డలకన్న, భార్యకన్న -అన్నింటికన్న తీపి వస్తువు అహంకారమే.

ఒక వ్యక్తి భార్యాబిడ్డతో కలసి పొరుగూరికి బయలుదేరాడు. చద్దన్నం, కొన్ని బట్టలు మూటగట్టుకొని బయలుదేరాడు. మధ్యలో ఒక వాగు ప్రవహిస్తున్నది. పడవలేదు. చీకటి పడబోతున్నది. చేసేదిలేక మూట తలపైపెట్టుకొని, బిడ్డను భుజాల మీద కూర్చుండ బెట్టుకొని, భార్యను చేతితో పట్టుకొని వాగులో దిగి ముందుకుపోతున్నాడు. మధ్యలోకి వెళ్ళేటప్పటికి ప్రవాహం ఎక్కువగా ఉంది. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా ముగ్గురూ కొట్టుకపోతారు. జాగ్రత్తగా, నెమ్మదిగా అడుగులు వేస్తున్నాడు. ఐనా ప్రవాహవేగం ప్రమాదకరంగా ఉన్నది. ఏదో ఒకటి వదలాల్సిన పరిస్థితి. సరే నెత్తిమీద ఉన్న గుడ్డల మూటను వదిలేశాడు. నాలుగడుగులు వేశాడో లేదో బ్యాలెన్స్ కుదరటం లేదు. అందరూ పోయే కన్నా ఎవరో ఒకరిని వదులుకుంటే మిగిలిన ఇద్దరూ బ్రతకవచ్చు అనుకొని ఎవరిని వదలాలా? అని ఆలోచించాడు. బిడ్డపోతే మళ్ళీ బిడ్డను కనవచ్చు. కాని భార్యపోతే ఎలా? అని బిడ్డను వదిలేశాడు. మరి కొంతదూరం భార్యభర్తలిద్దరూ కలిసి జాగ్రత్తగా నడిచారు. కాని ఇక అడుగుముందుకు పడటం లేదు. భార్యపోతే మరొక భార్యను తెచ్చుకోవచ్చు అనుకొని భార్యను వదిలేసి ఈదుకుంటూ ఒడ్డుకు

చేరుకున్నాడు. అంటే అందరికన్న తన రక్షణయే ముఖ్యం. తన కోసమే అందరూ కావాలి. ఇదే అహంకారం. అన్నింటికన్నా తీపి అహంకారమే.

ఈ అహంకారం దేనితోనూ చావదు. అంత తీపి. ఒక్క భగవానుడే అహంకారాన్ని అంతం చేయగలవాడు. అహంకారం చావకపోతే జ్ఞానం రాదు. అసలు జీవుడికీ దేవుడికి మధ్యనున్న తెర అహంకారమే. అహంకారం తొలగితే జీవుడు దేవుడే.

భాగవతంలో గోపికా వస్త్రాపహరణం ఉన్నది. శ్రీకృష్ణుడు గోపికల వస్త్రాలను అపహరించాడు అంటే నిజంగా వస్త్రాలను హరించటం కాదు. అహంకారాన్ని హరించటమే. గోపికలే జీవుడు. వస్త్రమే అహంకారం. వస్త్రాలను హరించటమంటే అహంకారాన్ని అంతం చేయటమే. అప్పటివరకు గోపికలు జీవుడుగా శ్రీకృష్ణుడు దేవుడుగా ఉన్నారు. వస్త్రాపహరణంతో అంతా ఒక్కటయ్యారు. అంటే అహంకారమనే అడ్డుగోడ తొలగిపోయింది. జీవుడు దేవుడయ్యాడు.

అందుకే అర్జునుడు ఇక్కడ మధుసూదనా! అని పిలిస్తున్నాడు. అయ్యా! నీవు మధువనే రాక్షసుని సంహరించావు. ఇప్పుడు అహంకారమనే రాక్షసుని సంహరించి నన్ను నీలో కలుపుకో - అంటున్నాడు. నీవు భక్తుల కోసం ఏద్దైనా చేస్తావు. ఇప్పుడు నా సంశయాన్ని హరించు. నా సందేహాన్ని తొలగించు. మరణసమయం మహాదారుణం, దుర్భరం. అట్టి సంకటసమయంలో నిన్ను స్మరించటం ఎలా వీలవుతుందో చెప్పు అని మానవులందరి ప్రతినిధిగా అడుగుతున్నాడు.

**అర్జునుని ప్రశ్నలకు భగవానుడేమని సమాధానం చెబుతున్నాడు? -**

**శ్రీ భగవానువాచ:**

**శ్లో||** అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే|

భూత భావోద్భవ కరః విసర్గః కర్మ సంజ్ఞితః|| (3)

**తా||** భగవంతుడంటున్నాడు : బ్రహ్మము నాశరహితమైనది; సర్వోత్తమమైనది. ఆయన యొక్క స్వభావమే అధ్యాత్మం అని చెప్పబడుతున్నది. సర్వప్రాణుల ఉత్పత్తిని కలుగజేసే ఆహుతులను కర్మ అంటారు.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో అర్జునుని మూడు ప్రశ్నలకు సమాధానాలు ఉన్నాయి.

(i) బ్రహ్మ:- ఈ శరీరం పంచీకరణం చెందిన పంచభూతాలతో తయారైంది. ఈ శరీరం నశించినప్పుడు దానిని తయారుచేసిన పంచభూతాలు మిగులుతాయి. అవే శరీరం యొక్క బ్రహ్మ. అయితే అవి అక్షరం కాదు. నశించేవే. అవి పంచతన్మాత్రాల పంచీకరణం వల్ల ఏర్పడినవి గనుక ఆ పంచభూతాలు నశించినప్పుడు పంచతన్మాత్రలు మిగులుతాయి. అందువల్ల పంచతన్మాత్రలే పంచభూతాలకు బ్రహ్మ. ఈ తన్మాత్రలు కూడా అక్షరం కాదు. అవీ నశించేవే. భూతన్మాత్ర జలతన్మాత్రలో, జలతన్మాత్ర అగ్ని తన్మాత్రలో, అది వాయుతన్మాత్రలో, అది ఆకాశతన్మాత్రలో లయమై, ఆ ఆకాశతన్మత్ర చివరకు పరమాత్మలో లయమై పరమాత్మ మాత్రమే మిగులుతుంది. ఈ పరమాత్మే పంచతన్మాత్రలకు బ్రహ్మ. ఈ బ్రహ్మ అక్షరమా? అవును. అక్షరమే, నశింపులేనిదే. అది ఎప్పుడో ఒకప్పుడు పుట్టినదీ, సృష్టింపబడినదీ కాదు. కనుక

నశింపులేనిది - అన్ని కాలాలలో ఉండేది. కనుక పరమాత్మే అక్షరబ్రహ్మ. ఇక దానికన్న వేరైనదీ, ఎక్కువైనదీ మరేదీ లేదు. అదే అన్నింటికన్న సర్వోత్తమమైనది. కనుక అది పరమం - శ్రేష్టమైనది.

ఈ దృశ్యమాన ప్రపంచానికి మూలమై, ఆధారమై, కారణమై ఉన్న స్థిరమైన ఆత్మతత్త్వమే బ్రహ్మం. అదే ఈ దేహమనోబుద్ధులను ప్రకాశింపజేస్తున్నది. కనుక బ్రహ్మము అంటే చైతన్యరూప ఆత్మయే. బ్రహ్మము యొక్క లక్షణం అక్షరం, పరమం (శ్రేష్ఠమైనది).

బ్రహ్మము కేవలం అక్షరం కాదు. అది పరమమైన అక్షరం. కేవలం పరమం అనో, కేవలం అక్షరం అనో చెబితే అతివ్యాప్తి దోషం వస్తుంది. అసలు అతివ్యాప్తి దోషం అంటే ఏమిటి?

ఇద్దరు వ్యక్తులు పొరుగూరికి వెళుతున్నారు. మధ్య మార్గంలో అడవి గుండా వెళ్ళాలి. నడిచివెళుతున్నారు, అలసటగా ఉన్నది. కొద్దిసేపు విశ్రాంతి తీసుకుందామని ఒక చెట్టు క్రింద కూర్చున్నారు. ఇద్దరూ మంచి వారే గనుక వారి మధ్య సంభాషణ కూడా ధార్మిక విషయాల మీదనే సాగుతున్నది. ఒకడు రెండవ వానితో అంటున్నాడు, "ఆవు పవిత్ర జంతువు. పూజనీయమైనది. భారతీయునికి గోమాత - భూమాత - వేదమాత - ఈ ముగ్గురూ తల్లి తర్వాత తల్లులు. ఆవును పూజిస్తే 33 కోట్లదేవతలను పూజించినట్లే. ఎందుకంటే ఆవు యొక్క ప్రతి అంగంలోను, ఉపాంగంలోనూ దేవతలు వెలసియున్నారు" - అని. ఒక అడవిమనిషి చెట్టు చాటున నిలబడి వారి మాటలు విన్నాడు. తాను కూడా ఆవును దర్శించి పూజించాలనుకున్నాడు. అయితే ఎప్పుడూ వాడు

ఆవును చూచిన పాపాన పోలేదు. మరెట్లా? అందుకేవాడు వారి ముందు కొచ్చి నిలబడి, "బాబూ! ఆవు అంటే ఎలా ఉంటుందో చెప్పండి. నేను కూడా దానిని దర్శించుకొని పూజించుకుంటాను" అన్నాడు. ఆవు ఎలా ఉంటుందో చూపించటానికి ఆ అడవిలో ఆవు ఒక్కటీ లేదు. కనుక వర్ణించి చెప్పాలి. అందుకే చెప్పాడు, "ఆవు తెల్లగా ఉంటుంది. రెండు కొమ్ములుంటాయి. వెనుక ఒక తోక ఉంటుంది". అని. దానితో వాడు అలాగేనని చెప్పి ముందుకు వెళ్ళాడు. అతడికొక దున్న కనిపించింది. రెండు కొమ్ములు, తోక ఉన్నాయిగాని అది తెల్లగా లేదు. అందుకే ముందుకు వెళ్ళాడు. అతడికొక ఎద్దు ఎదురుపడింది. తెల్లగా ఉంది. రెండు కొమ్ములున్నాయి. వెనుక తోక ఉన్నది. ఇంకేం. ఇదే ఆవు అని పూజచేశాడు. ఇదే అతివ్యాప్తి దోషమంటే.

ఆవుకు చెప్పిన లక్షణం ఆవుకే గాక ఎద్దుకు కూడా ఉంటుంది. ఏ వస్తువును గూర్చి ఏ లక్షణం చెబుతారో ఆ లక్షణం ఆ వస్తువునందు తప్ప ఇంకదేని యందూ ఉండరాదు. అలా మరొక దానియందు ఉంటే అతివ్యాప్తి దోషం ఉన్నట్లే. ఆ చెప్పేవాడు ఆవుకు గల అసాధారణ లక్షణం చెప్పక సాధారణ లక్షణం చెప్పాడు. గంగడోలు ఉన్నదే ఆవు అని చెప్పటం అసాధారణ లక్షణం. తెల్లగా, కొమ్ములు, తోక ఉండేది ఆవు మాత్రమే కాదు. ఎద్దు కూడా. కాని గంగడోలు ఆవుకే ఉంటుంది. ఎద్దుకు ఉండదు.

కనుక బ్రహ్మాన్ని గురించి చెప్పేటప్పుడు కేవలం అక్షరం అని ఊరుకో రాదు. పరమం అని కూడా చెప్పాలి. ఎందుకంటే అక్షరమనే మాట ప్రణవానికీ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సరిపోతుంది. కనుక అతివ్యాప్తి దోషం కలగకుండా ఉండేందుకు పరమమూ, అక్షరమూ అని చెప్పి తీరాలి. ఇక 2వది అధ్యాత్మం.

(ii) అధ్యాత్మం :- అధ్యాత్మం అంటే స్వభావమే అని భగవంతుని సమాధానం. అయితే దేని స్వభావం? భగవంతుని యొక్క స్వభావమే అధ్యాత్మం. భగవంతుని నుండి వచ్చినవాడే జీవుడు గనుక భగవంతుని స్వభావమే జీవుని అసలు ధర్మంగా ఉంటుంది.

భగవంతుని స్వభావం ఏమిటి? సచ్చిదానందం. సత్, చిత్, ఆనందం. మరి ఈ స్వభావం జీవుడి అసలు ధర్మంగా ఉన్నదా? చూద్దాం.

(a) సత్: ఈ లోకంలో ఎందరో మనుష్యులున్నారు. తెలివిగలవారు, తెలివి తక్కువవారు, పెద్దవారు, చిన్నవారు, మంచివారు, చెడ్డవారు, ఆడవారు, మగవారు - ఇలా ఎందరో. ఇప్పుడు సరదాగా అన్ని రకాల వారిని కూర్చోబెట్టి ఇంకొక్క గంటలో చనిపోవటానికి సిద్ధంగా ఉన్నవారెవరో చెప్పండి అన్నాం. ఏ ఒక్కరైనా, ఎన్ని కష్టాలలో ఉన్నవారైనా నేను రడీ - అంటారా? 90 ఏళ్ళ ముసలివాళ్ళు కూడా ఏదో - మా మనవడి పెళ్ళి చూసుకొని పోతానయ్యా! అంటాడు. అంటే అందరూ ఉండాలనే కోరుకుంటారు గాని, పోవాలని ఎవరూ కోరుకోరు. కోరుకోనంత మాత్రాన పోకుండా ఎప్పుడూ ఇక్కడే ఉంటామా? ఉండం. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, శంకరులు, రామకృష్ణుడు, రమణమహర్షి, అరవిందుడు, వివేకానందుడు, గాంధీ - అందరూ పోయారు గదా! ముందూ వెనకా అంతే. పుట్టినవారు గిట్టక తప్పదు. మరి అన్నీ తెలిసినా ఎవ్వరికీ చావాలని ఉండదు. ఉండాలనే కోరిక. ఎన్ని కష్టాలు పడుతున్నా సరే

ఎలాగో అలా ఉండాలనే కోరిక. ఇది ప్రతిజీవి యొక్క స్వభావం. ఎక్కడిదీ స్వభావం? ఎలా వచ్చింది ఈ స్వభావం? ఇది భగవంతుని స్వభావమైన 'సత్' అనే లక్షణం. ఎప్పుడూ ఉండాలి అనే కోరిక. భగవంతునికి చావు లేదు. చావును ఒప్పుకోదు ఆత్మ. అదే ఆత్మస్వభావం. భగవంతుని స్వభావం. జీవుడి అసలు ధర్మంగా ఉన్నది.

మనం ఆత్మ స్వరూపులం గనుక; ఆత్మ లక్షణం ఎప్పుడూ ఉండటం (సత్) గనుక ఆ లక్షణమే - ఆ స్వభావమే మన ధర్మం - మన స్వభావం అయింది. ఈ స్వభావమే అధ్యాత్మం అని చెప్పబడింది.

(b) చిత్:- చిత్ అంటే జ్ఞానస్వరూపం. నలుగురు కలసి మాట్లాడుకుంటూ ఉంటే అదేమిటో తెలుసుకోవాలనుకుంటాం. పిల్లవాడు మనతో బజారుకు వస్తే నాన్నా అదేమిటి? ఇది ఎందుకు పనికి వస్తుంది? దానితో ఏం చేస్తారు? ఇది ఇలా ఎందుకుంది? అని సవాలక్ష ప్రశ్నలు. ఎందుకు? ఏదో తెలుసుకోవాలని. ఒక కారును చూస్తే ఇది ఎంతవుతుంది? తెలుసుకోవాలనే ఆరాటం. సైకిలు కొనే శక్తి లేకపోయినా కారు రేటు ఎంతో తెలుసుకోవాలనే జిజ్ఞాస. ఆ వడ్డాణం ఎన్ని శవర్లో? ఎందుకు నీకు? నీవేమైనా కొంటావా? లేదు. ఆయనకు ఎంతమంది కొడుకులు? అందరికీ పెళ్ళిళ్ళు చేశాడా? నీకెందుకు? తెలుసుకోవాలనే ఆరాటం. మూడున్నర మూరల శరీరంలో అణగి మణిగి పడి ఉండటం ఆత్మకు ఇష్టం లేదు. త్రివిక్రమునిలాగా - వామనునిలాగా బ్రహ్మాండాన్ని ఆలింగనం చేసుకోవాలని ఆరాటం. ఎందుకు? ఆత్మ చిత్ స్వరూపం గనుక. మనం ఆత్మ స్వరూపులమే గనుక ఆ లక్షణం - తెలుసుకోవాలి

అనే లక్షణం మన ధర్మం అయింది, మన స్వభావం అయింది. ఈ స్వభావమే అధ్యాత్మం.

c) ఆనందం :- ఎప్పుడూ సుఖంగా, ఆనందంగా ఉండాలి. దుఃఖమనేది అసలు రాకూడదు - ఇది ప్రతి జీవుని యొక్క స్వభావం. ఎవరన్నా ఏడుస్తుంటే ఎందుకు ఏడుస్తున్నావు అంటాం. కాని ఎవరైనా సుఖంగా, సంతోషంగా ఉంటే ఎందుకు సుఖంగా ఉన్నావు? ఎందుకు ఏడవటం లేదు? అని అడుగుతామా? అడగం. ఎందుకని? సుఖం మన స్వరూపం గనుక అడగం. నీరు చల్లగా ఉంటే ఎందుకు చల్లగా ఉన్నది? అని అడగం. కాని బదరీలోని తప్తకుండంలో నీరు ఎందుకు వేడిగా ఉంటుంది? అని అడుగుతాం. కారణం నీటి స్వభావం చల్లదనమే గాని వేడికాదు గనుక.

అలాగే ఆత్మస్వభావం ఆనందం. జీవుడు ఆత్మస్వరూపుడే గనుక జీవుడి స్వధర్మం కూడా ఆనందమే. ఈ స్వభావమే అధ్యాత్మం.

ఇప్పుడు జీవుడి స్వభావం సత్, చిత్, ఆనందం అని తేలింది. ఉపనిషత్తులలో పరమాత్మ సత్, చిత్, ఆనందం అన్నారు. మరి పరమాత్మ సచ్చిదానందమై, నీవూ సచ్చిదానందమైతే నీకూ పరమాత్మకు తేడా ఏమిటి? 'అహం బ్రహ్మాస్మి' అనుకోవటంలో తప్పేమిటి?

మగవాడంటే ఎలా ఉంటాడండీ అని ఎవడో అడిగాడట. మీసాలుంటే మగవాడేనని జవాబు చెప్పాడు. అప్పుడు మూతి మీద చెయ్యి వేసుకొని చూచాడు. తనకూ మీసాలున్నాయి. ఇక తానూ మగవాడే గదా!



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అలాగే బ్రహ్మము యొక్క లక్షణం సచ్చిదానందం. ఆ లక్షణం - అంటే సత్ చిత్ ఆనంద లక్షణం తనలో కనిపిస్తున్నాయి గదా! కనుక తానే బ్రహ్మం అనటంలో సందేహం ఎందుకు? కనుక జీవుడు బ్రహ్మమే. బ్రహ్మము యొక్క స్వభావం జీవుడే కనుక ఆ స్వభావమే అధ్యాత్మం.

(iii) కర్మ:- "భూత భావోద్భవ కరః విసర్గః కర్మసంజ్ఞితః" - భూతములంటే ప్రాణులు; భావం అంటే ఉండటం - స్థితి; ఉద్భవం అంటే పుట్టటం; కర అంటే చేసే; విసర్గః అంటే త్యాగం. అంటే ప్రాణులు పుట్టటానికి, ఉండటానికి చేసే త్యాగాన్నే కర్మ అన్నారు. ప్రాణుల ఉత్పత్తికే యజ్ఞం చేస్తారు. ఎలా? యజ్ఞం వల్ల మేఘాలు; మేఘులవల్ల వర్షం; వర్షం వల్ల సస్యాలు; వాటిని స్వీకరించటం వల్ల పురుషునిలో వీర్యం; అది స్త్రీ గర్భంలోని అండంతో కలియటం వల్ల శిశుజననం. ఇలా యజ్ఞమనే కర్మ భూత కోటి పుట్టుకకు కారణమౌతున్నది. ఈ యజ్ఞాన్నే ఇక్కడ విసర్గః అన్నారు. అంటే త్యాగం చెయ్యటం. ఈ త్యాగపూర్వక క్రియనే 'కర్మ' అన్నారు.

ఈ ప్రపంచం ఎలా ఏర్పడింది? అందులో ఈ ప్రాణులందరూ ఎలా సృష్టించబడ్డారు? మొదట పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. ఆయన ఏకం - అద్వయం. రెండవదేదీ లేదు. ఆ అఖండ ఏకరూప పరమాత్మకు ఒక సంకల్పం కలిగింది. ఏమిటది?

"నేను ఒక్కటిగా ఉన్నాను. అనేక రూపాలు ధరిస్తాను" - అని. ఇదే సృష్టి సంకల్పం అంటే. అసలు ఇలా సృష్టి చేయాలనే సంకల్పం ఎందుకు కలిగింది? అంతకుముందు కల్పంలో ఉన్న ప్రాణులన్నీ కల్పాంతంలో అవ్యక్తంలోనికి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పోయినవి గదా! వాటి సమిష్ఠి వాసనలే పరమాత్మ సంకల్పం అవుతున్నది. ఆ జీవుల సమిష్ఠి వాసనల ప్రేరణయే పరమాత్మ యొక్క సంకల్పంగా మారింది. ఇలా భగవంతుడు సృష్టి సంకల్పం చేశాడు. ఒక్కడు అనేకం కావాలనుకున్నాడు. కనుక తన స్వరూపాన్ని త్యాగం చేశాడు.

విత్తనం తన స్వరూపాన్ని త్యాగం చేసి వృక్షమవుతుంది.

పరమాత్మ తన స్వరూపాన్ని త్యాగం చేసి బహురూపాలుగా ప్రాణికోటి సృష్టి జరిగింది.

ఇలా తన స్వరూపాన్ని త్యాగం చెయ్యటాన్నే విసర్గః అన్నారు.

భగవంతుని సృష్టి సంకల్పమే ఈ ప్రపంచానికి బీజం (విత్తనం). ఆ సంకల్పం ఉన్నంతవరకు ఈ ప్రాణికోట్ల సృష్టి అనే ప్రవాహం సాగిపోతూనే ఉంటుంది. ఇలా భగవంతుని సంకల్పానికి అనుగుణంగా తన స్వరూపాన్ని త్యాగం చెయ్యటాన్నే 'కర్మ' అన్నారు. ఈ కర్మచక్రం ఆపితే ఆగేది కాదు. మనం చేసినా - చేయకపోయినా ఈ కర్మ అనే జగన్నాథ రథం సాగిపోతూనే ఉంటుంది. మనం చేసే కర్మలన్నీ ఈ ప్రవాహంలో భాగమే. కనుక ఈశ్వరుని సృష్టి సంకల్ప రూపమైన కర్మయే కర్మ.

ఈ విధంగా ఈ శ్లోకంలో భగవానుడు అర్జునుడడిగిన ఏడు ప్రశ్నలలోను మూడింటికి సమాధానం చెప్పటం జరిగింది. ఇక మరో 3 ప్రశ్నలకు తరువాతి 4వ శ్లోకంలో సమాధానం చెప్పబోతున్నాడు.

**శ్లో||** అధి భూతం క్షరోభావః పురుషశ్చాధి దైవతం|

అధియజ్ఞోఒహమే వాత్ర దేహే దేహ భృతాంవర|| (4)

**తా||** నశించిపోయే తత్త్వం అధిభూతం. జీవుడేమో అధిదైవతం. దేహధారులలో శ్రేష్ఠుడా! ఈ దేహంలో ఉండే అధియజ్ఞుడను నేనే.

**వ్యాఖ్య:-** మరొక 3 ప్రశ్నలకు సమాధానాన్ని ఈ శ్లోకంలో భగవానుడు తెలియజేస్తున్నాడు. అవి 1.అధిభూతం. 2.అధిదైవం. 3.అధియజ్ఞుడు.

(i) అధిభూతం క్షరోభావః:- క్షరం అంటే నశించేది; భావం అంటే పుట్టేది. క్షరోభావమంటే పుట్టినశించేది - అని. కనుక ప్రపంచంలో పుట్టి నశించే స్వభావం గలవి అన్నీ అధిభూతములే. శరీరాలు, ఇంద్రియాలు, ఆలోచనలు, ఉద్రేకాలు, తలంపులు, వాసనలు, కర్మఫలాలు - అన్నీ నశించేవే గనుక ఇవన్నీ అధిభూతాలే. అపరాప్రకృతి అంతా అధిభూతమే. ఐతే ఇది సామాన్య అర్థమే లోతుగా విచారిస్తే ఈ అధిభూతం అంతటికీ మూలకారణం పరమాత్మే అని తెలుస్తుంది. ఎలాగో విచారణ చేద్దాం.

ఈ స్థూలశరీరం అధిభూతం. ఈ శరీరానికి కారణం? అంటే ఎలా ఈ శరీరం ఉత్పత్తి అయింది? తల్లిదండ్రులు తిన్న అన్నం నుండే. అన్నం ఎలా వచ్చింది? భూమి నుండి. అంటే భూమియే అన్నరూపంగా మారింది. అన్నమే శరీరరూపం ధరించింది. అందుకే దీనిని అన్నమయకోశం అన్నారు. సరే. భూమి ఎక్కడి నుండి వచ్చింది? జలం నుండి. జలం అగ్ని నుండి, అగ్ని వాయువు నుండి, వాయువు ఆకాశం నుండి. అంటే శరీరం మొదట ఆకాశరూపంలోను, తరువాత వాయురూపంలోను, తరువాత

అగ్నిరూపంలోను, తరువాత జల రూపంలోను, తరువాత భూమిరూపంలోను, తరువాత అన్నరూపంలోనికి వచ్చిందన్నమాట. మరి ఆకాశం ఎక్కడి నుండి వచ్చింది? అది బుద్ధికి అందని చోటు. అదే మాయ అయితే మాయకు ఆధారం ఏమిటి? పరమాత్మే. కనుక శరీరాలకు మొదట్లో పరమాత్మే కారణం అని తెలుస్తుంది. కార్యంలో కారణం తప్ప మరేమీ ఉండదు. కుర్చీ కార్యం. కొయ్య కారణం. కుర్చీలో కొయ్య తప్ప మరేమీ ఉండదు గదా! అలాగే శరీరం అనే కార్యంలో పరమాత్మ అనే కారణం తప్ప మరేమీ ఉండదు.

ఇప్పుడు బ్రహ్మమన్నా, అధ్యాత్మమన్నా, కర్మ అన్నా, అధిభూతమన్నా ఒకే ఒక్క అఖండ పరమాత్మయే అని ఋజువైంది. ఈ అఖండ భావం పొందినవాడే పరమాత్మ యొక్క యదార్థ స్వరూపం తెలుసుకొని; జన్మ- జరా - మరణముల నుండి విముక్తినొంది భగవంతుని చేరుకోగలవాడు అని తెలుస్తుంది. ఇక అధిదైవం అంటే? -

<u>(ii) పురుషశ్చ అధిదైవతం:</u>- పురుషుడే అధిదైవం అంటున్నాడు భగవానుడు. అన్ని పురాలలో ఉండే పురుషుడే అధిదైవం. మనకు ఒక్కొక్క ఇంద్రియానికి ఒక్కొక్క అధిదేవత ఉంటే ఈ అధిదేవతలంతా పురుషునికి - విశ్వరూపునికి ఇంద్రియాలు. కనుక విశ్వరూపుడు సర్వదేవతామయుడు. ఆయనలోనే సమస్త దేవతలు ఉండి ఈ సృష్టిని వెలిగించి చూపిస్తున్నారు. కనుక ఆయనే అధిదైవం. ముందు చెప్పినట్లు బ్రహ్మం - అధ్యాత్మం - కర్మ - అధిభూతంతో పాటు అధిదైవం కూడా సర్వవ్యాపక పరమాత్మే. ఇక అధియజ్ఞుడు -

**(iii) అత్రదేహే అహమేవ అధియజ్ఞః- ఈ దేహంలో నేనే అధియజ్ఞుడను.** అధియజ్ఞుడంటే ఫలభోక్త. మన సమస్త కర్మల ఫలభోక్త పరమాత్మయే. అతడే అన్ని దేహాలలో ఉన్న యజ్ఞభోక్త. మనం రకరకాల పిండివంటలతో తృప్తిగా భోజనం చేశాం. అప్పుడు తృప్తి పడేది శరీరమా? మనస్సా? బుద్ధియా? ప్రాణాలా? నిజంగా ఇవేవీ కాదు. మరి? మనం తినటానికి కూర్చున్నాం. పళ్ళెంలో భోజనం రడిగా ఉంది. ముద్దనోట్లో పెట్టుకోబోయే సమయంలో ప్రాణం పోయింది. శరీరం అక్కడే ఉంది. తిని తృప్తి చెందుతుందా? లేదు. మనస్సు తృప్తి చెందుతుందా? లేదు. మరి ఎవరు అక్కడ ఉంటే తృప్తి? ఎవరు లేకపోవటం వల్ల తృప్తి లేదు? అదే నిజమైన భోక్త. ఎవరతడు? "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః" అన్ని భూతాల శరీరాలలో ఉండి చతుర్విధ ఆహారాలను ఆరగించే యజ్ఞ భోక్తను నేనే - అని పరమాత్మ తెలియజేస్తున్నాడు. అందుకే భర్తా భోక్తా మహేశ్వరః అన్నారు.

యజ్ఞం చేసినప్పుడు యజ్ఞఫలభోక్త ఎవరో తెలుసుకోవాలి. అతడు పరమాత్మే. భగవంతునికే ఫలాన్ని అర్పిస్తున్నామనే ఆలోచన లేకుండా ఎంత ఆడంబరంగా యజ్ఞం చేసినా ప్రయోజనం లేదు. ఆ యజ్ఞభోక్త - అధియజ్ఞుడు ఎక్కడున్నాడు? 'అత్రదేహే' - ఈ దేహంలోనే. అందుకే గుర్తించలేకపోతున్నాం. బయట ఉన్నవాళ్ళను బాగానే గుర్తిస్తాం. కాని దేహంలోనే ఉన్న పరమాత్మను గుర్తించలేం. ఇదే మన దౌర్భాగ్యం.

ఒకసారి బాలగోపాలుడు బృందావన సమీపంలోని అడవిలో గోపబాలురతో కలసి గోవులను మేపుతున్నాడు. కృష్ణయ్యకు ఆకలి వేస్తున్నది.

తోటివారితో అంటున్నాడు, "మిత్రులారా! అదిగో సమీపంలో మునిపల్లె ఉన్నది. అక్కడ బ్రాహ్మణులెవరో యజ్ఞం చేస్తున్నారు. హోమాగ్ని ఆకాశాన్ని అంటుతున్నది. అక్కడ అన్ని రకాల ఆహారపదార్థాలు ఉంటాయి. మీరు వెళ్ళి శ్రీకృష్ణుడు ఆకలితో ఉన్నాడు, కొంచెం అన్నం అడిగి తెమ్మన్నాడు అని అడగండి" అని చెప్పటంతో గోపబాలురు వెళ్ళారు. బ్రాహ్మణులు ఎంతో ఆడంబరంగా యజ్ఞం చేస్తున్నారు. చెవులు చిల్లులుపడేటట్లు మంత్రాలు పఠిస్తున్నారు. ఆహూతులు సమర్పిస్తున్నారు. ఆ సమయంలో గోపబాలురు వెళ్ళి కృష్ణుని కోసం అన్నం అడిగారు. అంతే "పొండి పొండి. వీలుకాదు. ఇంతవరకు నైవేద్యం పెట్టలేదు. యజ్ఞం పూర్తికాలేదు. మా భోజనాలు పూర్తి చెయ్యలేదు. గొల్లవారికి ఎలా పెడతాం? అని కోపంతో అరిచారు. పాపం వాళ్ళు ఉసూరుమంటూ వెళ్ళి కృష్ణునితో చెప్పారు. అప్పుడు కృష్ణుడు నవ్వుతూ "అరె! ఆకలి సంగతి అమ్మగార్లకు తెలుస్తుంది గాని, అయ్యవార్లకు ఏం తెలుస్తుంది. ఈసారి వెనుకదారిన వెళ్ళి అమ్మగార్లనడగండి" అన్నాడు. పాపం వారికి ఇష్టం లేకపోయినా వెళ్ళారు. అమ్మగార్లను అడిగారు, 'శ్రీకృష్ణునికి ఆకలట. అన్నం కావాలట' అనే మాట వారి చెవులబడటంతోనే తమను తాము మరచిపోయారు, పరవశులయ్యారు. వారికి యజ్ఞం గుర్తులేదు, నైవేద్యం గుర్తులేదు. తాము, తమ భర్తలు తినటం సంగతి గుర్తురాలేదు. భర్తల విషయమే జ్ఞాపకం లేదు. నాగస్వరం విన్న నాగుబాముల్లాగా, పల్లానికి ప్రవహించే నీటిలాగా, అయస్కాంతంచే ఆకర్షింపబడే సూదుల్లాగా ఆహారపదార్థాలను తీసుకొని పరుగు ప్రారంభించారు. భర్తలు కోపించారు,

వలదన్నారు, అడ్డుపడ్డారు. కొందరు నిర్బంధించారు. అయినా అదేమీ పట్టలేదు. పరుగే పరుగు. వారు తెచ్చిన ఆహారాన్ని భక్తితో శ్రీకృష్ణునికి సమర్పించారు. ఆయన తిన్నాడు. 'చేతులు, కాళ్ళు తగిలించుకొని కూర్చున్న యజ్ఞఫలభోక్త - యజ్ఞేశ్వరుడు' తమ ఆహారాన్ని స్వీకరించాడు - అని ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతున్నారు. సిద్ధి ఎదురుగా ఉంటే - మోక్షం చేతికందుతుంటే సాధనలకోసం పరుగులు తీసే మూర్ఖత్వం లేదు వారికి. వారి యజ్ఞం వెయ్యిరెట్లు పండింది. 'పెద్దలకు పెడతల నుండు బుద్ధి' అన్నారు. దానిని సార్థకం చేసుకున్నారు మగవారు. తాము చేసిన పనికి తర్వాత పశ్చాత్తాపం చెందారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నారు. అయ్యో! మోసపోయామే - ఆడవాళ్ళకున్న బుద్ధి కూడా లేకపోయెనే అని లెంపలు వేసుకున్నారు. ఏం లాభం. యజ్ఞాలు చేశారు. ఫలభోక్త ఎవరో జ్ఞానం లేదు. కనుక ఫలభోక్త - యజ్ఞఫలభోక్త - అధియజ్ఞుడు పరమాత్మే. ఆయన అత్రదేహే - ఈదేహంలోనే ఉన్నాడు - ఇక అర్జునుడడిగిన ముఖ్యప్రశ్న - 7వ ప్రశ్నకు సమాధానం -

అంత్యకాలంలో - మరణసమయంలో భగవంతుని స్మరించటం ఎలా? అనే అర్జునుని 7వ ప్రశ్నకు భగవానుడు సమాధానం ప్రారంభిస్తున్నాడు 5వ శ్లోకం నుండి. ముందుగా అంత్యకాలస్మరణ వల్ల కలిగే ప్రయోజనమేమిటో తెలియజేస్తున్నాడు.

శ్లో|| అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం|
యః ప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్ర సంశయః|| (5)

**తా||** అంత్యకాలంలో కూడా ఎవరు నన్నే స్మరిస్తూ కళేబరాన్ని వదిలి ప్రయాణిస్తారో అతడు నా భావాన్నే పొందుతాడు. ఇందులో సంశయమేమీ లేదు.

**వ్యాఖ్య:-** మనిషికి అన్నీ తెలుసు. ఆకాశంలో ఎగరటం; చంద్రమండలానికి వెళ్ళటం; ఇతర గ్రహాలను పరిశోధించటం; అనేకరకాల వస్తువులను, యంత్రాలను కనిపెట్టటం; ఒక్క క్షణంలో లక్షలమందిని చంపగల ఆటంబాంబులను, హైడ్రోజన్ బాంబులను కనిపెట్టటం; ఇతరుల నెత్తిన చెయ్యి పెట్టటం; నమ్మించి మోసగించటం; తెల్లవారే సరికి కోట్లకు పడగలెత్తటం; సర్వసంగ పరిత్యాగం చేసి కాషాయాంబరాలు ధరించి వందల, వేల కోట్లు ధనాన్ని, కిలోల కొద్దీ బంగారాన్ని దోచుకోవటం; ప్రజాసేవకే నా జీవితం అంటూ స్విస్ బ్యాంకుల్లో డబ్బు దాచుకోవటం - ఒకటేమిటి? అన్నీ తెలుసు. కాని ఎలా చావాలో మాత్రం తెలియదు. పుట్టటం మనిషిలాగానే పుడుతున్నాడు. కాని చావటం మాత్రం కుక్కలాగా, నక్కలాగా, పందిలాగా, పశువులాగా, పిట్టలాగా దిక్కులేని వాడిలా చస్తున్నాడు. మనిషి లాగా మాత్రం చావటం లేదు.

నిజంగా మనం నేర్చుకోవాల్సింది ఎలా బ్రతకాలా? అనికాదు. ఎలా చావాలో అది నేర్చుకోవాలి. పుట్టినవాడు ఎలాగో ఒకలాగా బ్రతుకుతాడు. ఆయుష్షే అన్నం పెడుతుంది. ప్రారబ్ధమే పోషిస్తుంది. కనుక బ్రతకటానికి కాదు మనం తెలివితేటలు ప్రదర్శించాల్సింది, మనం శ్రమ చేయాల్సింది. బంగారం లాంటి చావును ఎట్లా పొందాలా? అని ఆలోచించాలి. మళ్ళీ మళ్ళీ చావు

రాకుండా - అంటే మళ్ళీ మళ్ళీ పుట్టకుండా ఉండే విధంగా చావాలి. జన్మరాహిత్యం అయ్యే విధంగా చావాలి. పశువులు, పక్షులు, క్రిములు, కీటకాలలాగా మాటిమాటికి - సిగ్గు బిడియం లేకుండా - పుడుతూ చస్తూ ఉండే దుర్గతి మానవుడికి శోభ నివ్వదు. చావు అంటే ఇదే చివరి చావు కావాలి. ద్రస్సులు మార్చుకున్నట్లుగా దేహాలను మార్చుకుంటూ ఎప్పుడూ ఈ లోకంలోకి వస్తూపోతూ ఉండే జీవుళ్ళను జ్ఞానులైనవారు అల్పులుగా చూస్తారు. బుద్ధిలేని వారిగా చూస్తారు.

ఒకడు దొంగతనం చేసి జైలు కెళ్ళాడు. 6నెలలు శిక్ష అనుభవించి వచ్చి మళ్ళీ దొంగతనాలు మొదలుపెట్టాడు. మళ్ళీ పట్టుబడి సంవత్సరం జైలు శిక్ష అనుభవించాడు. తిరిగి వచ్చిన తర్వాత మళ్ళీ యధాప్రకారంగా దొంగతనాలు, పట్టుబడి జైలు శిక్ష అనుభవించటం. మళ్ళీ మళ్ళీ ఇదే తంతు. వాణ్ణి అందరూ 'జైలుపక్షి' అని ఎగతాళి చేస్తారు. చిన్న చూపు చూస్తారు. అసలు ఏమాత్రం మర్యాద ఇవ్వరు వాడికి. అలాగే మాటిమాటికి ఈ లోకమనే జైలుకు వచ్చిపోతూ ఉండే వాణ్ణి చూసి జ్ఞానులు ఎగతాళి చేస్తారు. బుద్ధిలేని వాడిగా, అజ్ఞానిగా, మూర్ఖుడిగా చూస్తారు. అవకాశాలను దుర్వినియోగం చేసుకొనే అల్పుడిగా, అధముడిగా చూస్తారు.

మనిషి పుట్టేటప్పుడు ఏడుస్తూ పుడతాడు. కాని ఏడుస్తూ చావకూడదు. పుట్టేటప్పుడు అజ్ఞానం గనుక ఏడుస్తూ పుడతాడు. మరి మరణించేటప్పుడు కూడా అజ్ఞానంలోనే ఉండి ఏడుస్తూ పోవటం ఏం బాగుంటుంది? కనుక జ్ఞానాన్ని - ఆత్మజ్ఞానాన్ని - నేను ఆత్మను అనే జ్ఞానాన్ని పొంది సోஉహం,

సోఽహం అంటూ నవ్వుతూ చావాలి. అదే బంగారం వంటి చావు. దానిని సాధించినవాడే ఉత్తముడైన మానవుడు. వాడే మరణాన్ని మంగళప్రదం చేసుకున్న తెలివిగలవాడు,

- మరణవిద్యను బట్టే కఠోపనిషత్తు వచ్చింది.
- మరణాన్ని చూసే సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు.
- మరణ సమస్యే భగవద్గీతను సృష్టించింది. అందుకే మరణం అనేది గొప్పవరం అంటారు మహాత్ములు, జ్ఞానులు.

మరణం అనేది ఎలా ఉండాలో రామాయణంలో ఒక అద్భుతమైన సంఘటన ఉంది. ఆ సంఘటన మనకు గొప్ప ఉపదేశాన్ని అందిస్తున్నది.

శ్రీరాముని బాణంతో వాలి ప్రాణాలు పోతున్నాయి. మరణవేదనను అనుభవిస్తున్నాడు. అప్పుడు సుగ్రీవునితో కలసి శ్రీరాముడు వాలి వద్దకు వచ్చాడు. చూచాడు వాలి. చెట్టుచాటున నిలిచి బాణం వేసి అన్యాయంగా తనను వధించిన శ్రీరాముని అనేక విధాల తూలనాడాడు వాలి. "నేను నీకేం శత్రువుని? నీకు నేను ఏమి అపకారం చేశాను? నీ భార్యకోసమే సుగ్రీవుని వద్దకు వెళ్ళావా? వాడి బలమెంత? ఓ రామా! నీవు నా వద్దకు వచ్చియున్నట్లైతే ఆ రావణుని బంధించి నీ పాదాలపై పడవేసేవాణ్ణి. ఈ మాత్రానికే నీవు అన్యాయం చెయ్యాలా? అధర్మానికి ఒడిగట్టాలా?" అని ఆక్రోశించాడు. వాలి యొక్క అన్ని ప్రశ్నలకు ఉచిత రీతిన సమాధానం చెప్పిన శ్రీరాముడు చివరకు వాలితో ఇలా అన్నాడు. "మహాబలీ! వాలీ! ఎందుకిలా ఆక్రోశిస్తావు? నీవు

కావాలనుకుంటే కోరుకో. నిన్ను నేను బ్రతికిస్తాను. చాలాకాలం జీవించి రాజ్యపాలన చేద్దువు గాని" అన్నాడు.

శ్రీరాముని కళ్ళారా చూచి, ఆయన మాటలను వీనుల విందుగా విన్న వాలిలో అజ్ఞానపొర తొలగిపోయింది. జ్ఞాననేత్రం తెరుచుకుంది. ఇప్పుడంటున్నాడు వాలి, "ప్రభూ! నేను అజ్ఞానిని. నన్ను క్షమించు. నీ దర్శనంతో నాకు తెలివి వచ్చింది. నా మనోనేత్రం తెరుచుకుంది. నాకు ఈ జీవితంతో ఇక పనిలేదు ఈనాటి ఈచావు నాపాలిటికి బంగారం వంటి చావు. భగవంతుడివైన నిన్ను దర్శిస్తూ, నీమాటలు వింటూ, స్థిరమైన చిత్తంతో ప్రాణం వదిలే అదృష్టం ఈనాడు నాకు కలిగింది. ఇప్పుడు గనుక నీదయ వలన బ్రతికితే ఆ తర్వాత వచ్చే చావు నికృష్టమైన చావు కాదనే నమ్మకమేమిటి? ఎందుకంటే అప్పుడు నీ దర్శనం కాదు. నీమాటలు వినలేను. నిన్ను స్మరించ గలననే నమ్మకం లేదు. కనుక ఆ దౌర్భాగ్యపు చావు నాకొద్దు". అన్నాడు స్థిర చిత్తంతో వాలి. అదీ తెలివి అంటే. కనుక భగవంతుని స్మరిస్తూ, భగవంతుని దర్శిస్తూ మరణించాలి. మరణసమయంలో భగవంతుని స్మరిస్తూ మరణించటమే మరణాన్ని మంగళప్రదం చేసుకోవటం అంటే.

ఈ విషయాన్నే భగవానుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు. ఎవరైతే అంత్యకాలంలో (మరణసమయంలో) కూడా నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచిపెడతారో వారు నా తత్త్వాన్నే పొందుతారు - అంటే నన్నే చేరుకుంటారు - అని. కనుక మరణసమయంలో కూడా భగవంతుని స్మరిస్తూ

దేహాన్ని వదలాలి. అదే మంగళకరమైన మరణం. అసలు మరణం అంటే ఏమిటి?

మనం మన అవసరాల కోసం మనకు తగిన ఒక అద్దె ఇంట్లో దిగుతాం. కొంతకాలం అందులో ఉంటాం. కొన్నాళ్ళ తర్వాత అది మన అవసరాలకు సరిపోకపోయినా, లేక మనస్తోమతకన్నా ఎక్కువదిగానో, తక్కువదిగానో ఉన్నా ఆ అద్దె ఇంటిని వదలి, మన సామాను మొత్తం మూటలు కట్టుకొని అప్పటికి మనకు తగినది అనుకున్నమరొక అద్దె ఇంటిలోనికి చేరతాం. తిరిగి అది కూడా మన అవసరాలకు, అభిరుచులకు, స్తోమతకు తగినది కాదనుకున్నప్పుడు దానినీ వదిలి మరొక తగిన ఇంటికి చేరతాం. ఇలా ఒక ఇంటి నుంచి మరొక ఇంటికి మారుతూనే ఉంటాం. అలాగే మన ప్రారబ్ధంలోని కోరికలకు, కర్మఫలాలకు తగిన దేహంతో వస్తాం. ఆ కోరికలు తీరేవరకు, అనుభవాలు పూర్తయ్యే వరకు అదే నేను - నేనే అది అన్నట్లుగా ఉంటాం. ఐతే కోరికలు, అనుభవాలు పూర్తయితే ఇక ఆ దేహంతో మనకు పనిలేదు. అప్పటి మన కోరికలకు, కర్మఫలాలకు తగిన మరొక దేహం కొరకు ప్రయాణమైపోయే కాలమే అంత్యకాలం - మరణకాలం - ప్రయాణకాలం. ఇదే మరణం అంటే. దేహాన్ని వదలిపోవటమే మరణం. ఈ అంత్యకాలంలోనే - మరణకాలంలోనే పరమాత్మ స్మరణ చేయాలి.

అయితే మనకొక తెలివి ఉన్నది. మరణ సమయంలో గదా పరమాత్మను స్మరించాల్సింది. ఓ! అప్పుడు చూసుకుందాంలే - అనుకుంటాం. కాని మరణసమయం ఏదో ఎవరికైనా తెలుసునా? ఎవ్వరికీ తెలియదు. ఎప్పుడు

ఎలాంటి మరణం సంభవిస్తుందో ఎవరికెరుక? ఎక్కడ మరణం సంభవిస్తుందో తెలియదు. ఇంటిలోనో, రైలులోనో, బస్సులోనో, ఆటోలోనో, విమానంలోనో, అగ్నిలోనో, వరదలోనో, ప్రమాదాలలోనో ఎవ్వరికీ తెలియదు. అప్పుడు బుద్ధి ప్రసన్నంగా ఉండదు, అవయవాలు పట్టుదప్పిపోతాయి, శరీరం బిగుసుకు పోతుంది, స్మృతి తప్పిపోతుంది. చిత్తం స్వాధీనంలో ఉండదు. అదొక భయంకరమైన సమయం. శరీరం నుండి ప్రాణాలు బయటకు పోతున్నప్పుడు లక్షతేళ్ళు ఒకేసారి కుడితే ఎలా ఉంటుందో అలా ఉంటుందట. మరి అప్పుడు పరమాత్మ స్మరణ సాధ్యపడుతుందా? లేదు. అందుకే జీవించియున్నంతకాలం పరమాత్మను స్మరించటం అలవాటు చేసుకోవాలి. అందుకే 'అంతకాలేచ మామేవ' అంత్యకాలంలో కూడా అని భగవానుడు తెలియజేయటం జరిగింది. అంటే జీవితమంతా స్మరిస్తూ అంత్యకాలంలో కూడా స్మరించాలి - అని. అలాగాక కేవలం అంత్యకాలంలో మాత్రమే స్మరించాలని చెప్పటమే అయితే 'అంతకాలేన మామేవ' అని చెప్పి ఉండేవాడు. జీవితమంతా లౌకిక విషయాలలో, భోగాలలో మునిగిపోయిన వాడికి అంత్యకాలంలో భగవంతుని స్మరణ అసాధ్యమే. అసంభవమే.

ఒకాయన జీవితమంతా సంపాదించటం, దాచుకోవటంలోనే గడిపాడు. జీవితంలో ఏనాడూ భగవంతుని స్మరించిన పాపాన పోలేదు. ఎవరన్నా ఏదన్నా భగవంతుని గురించి చెబితే వినడు. కంపరం ఎత్తినట్లుగా ఉంటాడు. అసలు అలా స్మరించటానికి గాని, వినటానికి గాని అతడికి ఒక్కక్షణం తీరిక కూడాలేదు. సరే మరణసమయం వచ్చింది. బిడ్డలంతా చుట్టూ

చేరారు. నారాయణా నారాయణా అనమన్నారు. లేదా రామా రామా అనమన్నారు. అతడేనాడైనా ఈ మాటలు చెవికెక్కించుకుంటే గదా! అహా! నాకు రాదు అన్నాడు. సరేనని కుమారుడు లోపలికి వెళ్ళి నారను తెచ్చి చూపించి, ఇదేమిటి? అన్నాడు. ఎందుకంటే నార అంటే నారాయణలో సగం పలికినట్లుగదా! సగం పుణ్యమన్నా వస్తుంది గదా! అని. కాని ఆ పుణ్యాత్ముడు దానిని చూచి 'పీచు' అన్నాడు. అలా ఉంటుంది కేవలం మరణసమయంలోనే స్మరించాలంటే. కనుక జీవితమంతా సాధన చేయాల్సిందే. ఏవిధమైన మినహాయింపు లేదు.

నిజంగా అంత్యకాలమే భగవంతుని స్మరించుటకు చక్కని సంధికాలం. అట్టి సంధి కాలంలోనే వందనం చేయాలి. సంధికాలంలో చేసే వందనమే నిజమైన సంధ్యావందనం. అంత్యకాలంలో నన్నే స్మరిస్తే నన్నే చేరుకుంటావు - అనేది భగవానుని హామీ.

ఫోటో తీసేటప్పుడు ఫోటోగ్రాఫర్ వన్, టు, త్రి అంటాడు. 'త్రి' అన్నప్పుడు నీవు ఏ ఫోజులో ఉంటే అదే ఖాయం. వన్ - టు - అన్నప్పుడు అన్నీ చక్కగా సర్దుకోవాలి, సరిచేసుకోవాలి. అలాగే మరణానికి ముందే అన్నీ సర్దుకోవాలి, సరిచేసుకోవాలి. భగవత్ స్మరణను అలవాటు చేసుకొని మరణసమయానికి రడీ కావాలి.

భగవంతుడు విసుగులేకుండా మనకు జాగ్రత్తలు చెబుతున్నాడు. ఎందుకంటే మనం ఈ జాగ్రత్తలతో మరణసమయంలో కూడా బుద్ధిని

స్థిరంగా ఉంచుకుంటామని. అలా మరణసమయంలో బుద్ధిని స్థిరంగా, ప్రసన్నంగా, ప్రశాంతంగా ఉంచుకోగలవారే మహాత్ములు.

భీష్ముడు అంపశయ్య మీద పరుండి శాంతిపర్వాన్ని బోధించాడు. పడుకున్నది బాణాల ములుకుల మీద; బోధించింది శాంతిపర్వాన్ని, అది ఆయనకే చెల్లింది.

'శాంతాకారం భుజగశయనం' - పడుకున్నది పాముపడగ నీడలో. కాని ఆయన ఆకారం శాంతాకారం - ఎలా సాధ్యం? నిరంతర సాధనవల్లనే.

అసలు ప్రతిక్షణమూ మనకు అంత్యకాలమేనని గుర్తుంచుకోవాలి. మనం ఆయుష్షు అనే టికెట్టు తీసుకొని దేహమనే రైలులో కూర్చొని ఆడుతూ - పాడుతూ, పెళ్ళిచేసుకుంటూ, పిల్లల్ని కంటూ, డబ్బు సంపాదిస్తూ, సుఖాలు - భోగాలు అనుభవిస్తూ ప్రయాణం చేస్తున్నాం. మనం ఏమిచేస్తున్నా సరే ఈ రైలుబండి మాత్రం స్మశానమనే స్టేషన్ ను చేరుకుంటుంది. అయితే మనం ఈ విషయాన్ని మరచిపోతున్నాం. కనుక ప్రతిక్షణాన్ని అంత్యకాలంగా భావించి పరమాత్మ స్మరణ చేస్తుండాలి. రైలు వచ్చినప్పుడే టికెట్టు కొనుక్కుందాం అని రైలు కోసం ఎదురుచూచేవాడి ప్రయాణం సక్రమంగా సాగదు. టికెట్టు కొనుక్కొని ప్లాట్ ఫారంపై నిలబడ్డ వాడి ప్రయాణమే సుఖంగా సాగుతుంది.

అలాగే మనం కూడా మరణం వచ్చినప్పుడే పరమాత్మను గురించి ఆలోచిద్దాం అని అనుకోరాదు. భక్తి అనే టికెట్టును కొనుక్కొని మరణమనే రైలు కొరకు సిద్ధంగా ఉంటే - ఆ మరణం ఎప్పుడు వచ్చినా ఇబ్బంది ఉండదు.

కనుక ప్రతిక్షణం భగవత్ స్మరణ చేయాలి. ఇతర స్మరణలేవీ మనను ఉద్ధరించవు. "నహి నహి రక్షతి డు కృఞ్ కరణే".

ఒకాయన బాగా సంపాదించాడు. మేడలు, స్థలాలు, తోటలు, పరిశ్రమలు, నగలు, బ్యాంక్ బ్యాలెన్సు - - - ఎటు చూచినా సంపదలే. మరణసమయం ఆసన్నమైంది. భార్యా, కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు అందరూ చుట్టూ చేరి ఏడుస్తున్నారు. అయ్యో! ఇక మాసంగతేంటి? మాకెవరు దిక్కు? మేమేమైపోవాలి? అంటూ గుండెలు బాదుకుంటూ చీదేస్తున్నారు. అప్పుడాయన అన్నాడట, "మీరెందుకలా ఏడుస్తున్నారు? నేను సంపాదించిన ఇళ్ళు, భూములు, సొమ్ములు, డబ్బులు, వ్యాపారాలు, పరిశ్రమలు, బ్యాంక్ బ్యాలెన్స్ లు అన్నీ మీకే విడిచిపెట్టి పోతున్నాను. ఒక్కటి కూడా నాతో తీసుకపోవటం లేదు. పైగా మీరంతా ఒకరికొకరు తోడుగా ఉన్నారు. కష్టసుఖాలు పంచుకుంటారు. మరి నా పరిస్థితి ఏమిటో చూడండి. చేతిలో చిల్లి గవ్వలేదు. ఒంటరి ప్రయాణం. నాతో కలసి తోడు వచ్చే వాళ్ళు ఒక్కరు కూడా లేరు. పోనీ దారి బత్తెంగా భక్తి అనే సంపదను కూడా సంపాదించలేదు. భవిష్యత్తును తలచుకొని లబోదిబోమని ఏడవాల్సింది నేనా? మీరా?" అన్నాడట. దానితో ఎవ్వరూ కిక్కురుమనలేదు.

కనుక పోయే ప్రతిజీవుడూ దారిబత్తేన్ని ఇక్కడే సంపాదించుకోవాలి. అదే భగవత్ స్మరణ. భగవద్భక్తి. మనతో వచ్చేది, మనకు పనికి వచ్చేది అదే. కాని మనం జీవించి యున్నంతకాలం ఏం చేస్తున్నాం? వదిలిపెట్టి వెళ్ళే వాటిని గురించే ఆలోచిస్తాం, పోగు చేసుకుంటాం, దాచుకుంటాం. అందుకోసం

ఎంత శ్రమనైనా చేస్తాం. కాని మనతో వచ్చే వాటి కోసం మాత్రం ఆలోచించనే ఆలోచించం. ఆహా! ఏమి తెలివి మనది?

అందుకే 'మామ్ ఏవ స్మరన్' - నన్నే స్మరించు. అలా స్మరిస్తే నన్నే చేరుకుంటావు - అని భగవానుడు హామీ ఇస్తున్నాడు. ఇలా భగవంతుని స్మరిస్తూ మరణాన్ని మంగళప్రదం చేసుకున్నవారే నవ్వుతూ, ఆనందంగా దేహాన్ని వదిలేవారు. వారే పరమాత్మ సన్నిధానాన్ని చేరుకొనేవారు. వారే ఈ మానవజన్మ ఎందుకు వచ్చిందో తెలుసుకొని అందుకే ఉపయోగించుకున్న తెలివిగలవారు - జన్మను సార్థకం చేసుకున్నవారు. మానవులలో మహాత్ములు.

ఈ విషయంలో ఎవరికైనా సందేహం ఉన్నదా? మరణసమయంలో ఈశ్వర చింతన చేస్తే భగవత్ స్వరూపాన్ని పొందటం నిజమేనా?

'అత్ర సంశయ నాస్తి':- ఈ విషయంలో ఎవరికీ సందేహం అక్కర లేదు అని భగవానుడే చెబుతున్నాడు. శాస్త్ర వాక్యాలలో గాని, భగవంతుని వాక్కులలో గాని సంశయాలు, సందేహాలు పనికిరావు.

మనకు ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఈనాడు, వార్త, సాక్షి పత్రికలున్నాయి. వాటిని మాత్రం పరమప్రమాణంగా భావించుకొని వాదోపవాదాలు సాగిస్తాం. ఈ రోజు వచ్చిన వార్తావిషయం అబద్ధమని రేపే తేలిపోతుంది. ఖండనమండనలు సాగిపోతుంటాయి. అంతేకాదు ఈరోజు న్యూస్ పేపర్ రేపటికి వేస్ట్ పేపర్. ఇది అంతటా నిజం. అయినా సరే. ఎందుకో వాటినే నమ్ముతుంటాం. 5వేల సంవత్సరాల నుండి న్యూస్ న్యూస్ గానే ఉంటున్న భగవద్గీతను గాని, భగవానుని వాక్కులను గాని సందేహిస్తుంటాం. ఇదే మన

దౌర్భాగ్యం. ఈ శాస్త్ర వాక్యాలుగాని, భగవత్ వాక్యాలు గాని నిత్యసత్యాలు. కనుక నమ్మాలి. నమ్మి తీరాలి. ఏమిటి ఋజువు?

రాత్రి నిద్రపోయే ముందు చెన్నై వెళ్ళాలి అనుకొని నిద్రపోతే తెల్లవారగానే గుర్తువచ్చేది చెన్నై ప్రయాణమే గదా! అలాగే మరణానికి ముందు భగవంతుని స్మరిస్తే నీ ప్రయాణం భగవంతుని వద్దకే అనేది సత్యం.

'అంత్యకాలంలో పరమాత్మను స్మరిస్తే పరమాత్మనే చేరుకుంటారు' అనటానికి నిదర్శనం హేతువు ఏదో తెలియజేయబోతున్నారు. -

**శ్లో||** యంయం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం|

తం తమేవైతి కౌంతేయ సదాతద్భావ భావితః|| **(6)**

**తా||** కౌంతేయా! ఏ ఏ భావాన్ని స్మరిస్తూ కళేబరాన్ని వదులుతారో వారు నిత్యమూ ఆ భావాన్నే భావిస్తుంటారు గనుక దానినే పొందుతారు.

**వ్యాఖ్య:-** అంత్యకాలంలో కలిగే సంకల్పానికి అంతబలం ఎలా వస్తున్నదో భగవానుడిక్కడ తెలియజేస్తున్నాడు. అంతేకాక పరమాత్మనుస్మరిస్తూ ప్రాణాలు విడిస్తే పరమాత్మను చేరుకుంటారనే సిద్ధాంతాన్ని కూడా ప్రతిపాదిస్తున్నాడు.

సదా తద్భావ భావితః:- నిరంతరం నీవు దేనిని స్మరిస్తూ ఉంటావో ఆ భావమే నీలో సంస్కారంగా మిగిలిపోతుంది. అదే నీకు అంత్యకాలంలో గుర్తొస్తుంది. ఆ సంస్కారానికి అనుగుణమైన జన్మనే ఆ తరువాత నీవు పొందుతావు.

భ్రమరం కీటకాన్ని తెచ్చి మట్టిగూటిలో పెడుతుంది. ఆ గూటికి సన్నని రంధ్రం ఉంటుంది. దాని గుండా లోపలికి చూచి కీటకం ఉందో లేదో

చూస్తుంది. అందుకోసం భ్రమరం ఆ గూటి చుట్టూ ఝుంకారం చేస్తూ తిరుగుతుంది. లోపల ఉన్న కీటకం ఈ రంధ్రం వద్దకు వచ్చినప్పుడు భ్రమరం తన ముక్కుతో దానిని పొడుస్తుంది. మళ్ళీ మళ్ళీ తిరుగుతూ ఝుంకారం చేస్తూనే ఉంటుంది. దాని నుండి తప్పించుకోవాలని కీటకం కూడా గూటి లోపల చుట్టూ తిరుగుతూనే ఉంటుంది. అలా భయంతో కీటకం తిరిగి తిరిగి భ్రమరంగా మారిపోతుంది. దీనినే భ్రమర కీటక న్యాయం అంటారు. కీటకం అలా తిరిగి తిరిగి, జీవించి ఉండగానే భ్రమరంగా మారిపోతుంటే మనిషి దేహాన్ని విడిచిన తర్వాత ధ్యేయరూపాన్ని పొందుతాడు అంటే సందేహం ఎందుకు?

మహాదేవుని స్మరిస్తూ స్మరిస్తూ నందీశ్వరుడు ఆ జన్మలోనే శివుని స్వరూపాన్ని పొందినట్లు శివపురాణం మనకు తెలియజేస్తున్నది.

అలాగే భాగవతంలో జడభరతుని కథ ఉన్నది. రాజ్యపాలన వదిలి అరణ్యంలో తపస్సు, ధ్యానము, అనుష్టానము చేసుకుంటూ ఉండే రాజు ఒకనాడు తల్లిని కోల్పోయిన, అప్పుడే పుట్టిన జింకపిల్లను చూచి జాలితో, దయతో పెంచుకున్నాడు. దానిమీద మమకారంతో తన తపస్సును, ధ్యానాన్ని, అనుష్టానాలనన్నింటిని మరచిపోయాడు. ఎప్పుడూ జింకపిల్ల ధ్యాసే. చివరకు దానినే తలచుకుంటూ తలచుకుంటూ ప్రాణాలు వదిలేశాడు. ఆ తరువాత జన్మలో జింకగా జన్మించాడు.

అంటే మరణ సమయంలో ఏ భావాన్ని స్మరిస్తూ ఉంటావో ఆ భావానికి అనుగుణమైన జన్మనే పొందుతున్నావు. అంతేకాదు మరణసమయంలో ఏ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భావాన్ని స్మరిస్తున్నావో అది నీవు జీవించినంతకాలం స్మరించి స్మరించి దానిని నీలో సంస్కారంగా నిలుపుకున్నావు అని తెలుస్తుంది. చచ్చేటప్పుడు భగవంతునిపై మనస్సు ఉంటే గొప్పభక్తుడిగా జన్మిస్తావు. అలాగాక నీవు పెంచుకొనే అల్సేషియన్ డాగ్ పైనే మరణకాలంలో నీ దృష్టి ఉన్నదా? కుక్కజన్మ తప్పదు. కనుక మరణకాలంలో ఏ భావన ఉంటే అదే నీకు సిద్ధిస్తుంది. "మతి ఎంతో గతి అంత".

ఒక బ్రాహ్మణ సన్యాసి అంత్యకాలంలో చెప్పులను స్మరిస్తూ ప్రాణాలు వదలటం వల్ల రోహిదాసు అనే ఛండాలభక్తుడై జన్మించాడు.

మనిషి పుట్టేటప్పుడు ఒంటరిగా పుడతాడు. తన వెంట ఒక్క చీపురుపుల్లనుగాని, గోచీగుడ్డనుగాని తెచ్చుకోడు. అలాగే చచ్చేటప్పుడు ఎంత గొప్ప సంపదలకు అధిపతియైనా సరే ఏమీ తీసుకవెళ్ళే వీలులేదు. మొత్తం మొత్తం వదిలిపెట్టి వెళ్ళాల్సిందే. వస్తువును తానైనా విడిచిపోవాలి. లేదా అదైనా తనను నిర్దాక్షిణ్యంగా వదిలివెళ్ళిపోతుంది. ఈ నియమం మీద ఎర్రగీత గీచేవాడు ఇంతవరకు పుట్టలేదు; ఇక ముందు పుట్టబోడు. ప్రపంచాన్ని జయించి జగదేకవీరుడు కావాలని కలలుగన్న అలెగ్జాండరు చక్రవర్తే ఇందుకు నిదర్శనం.

జీవుడి వెంట వచ్చేది అతడు చేసుకున్న కర్మము - ధర్మము మాత్రమే తక్కినది ఏదీరాదు. ఈ విషయం తెలిసీ వదిలిపెట్టి వెళ్ళేవాటి కోసమే తపించి, వెంట వచ్చే దాని గురించి ఆలోచించనివాడు తరువాత ఎంత ఏడ్చి మొత్తుకున్నా ప్రయోజనం శూన్యం. కనుక అనిత్యమైన, తుచ్ఛమైన, వదిలిపెట్టి

వెళ్ళే లౌకిక వస్తువుల స్మరణను వదలి పరమాత్మ స్మరణతో జన్మను ధన్యం చేసుకోవాలి. మరణాన్ని మంగళప్రదం చేసుకోవాలి.

మహారాష్ట్రలో పీష్వా వంశీయుడైన మాధవరావుకు మరణకాలం సమీపించింది. కఫం అడ్డంపడి గొంతు పెగలటం లేదు. డాక్టర్లు చెప్పారు - "కఫాన్ని తొలగిస్తే అతిసారం వస్తుంది. అతిసారం తొలగిస్తే కఫం అడ్డం పడుతుంది. దేనితోనైనా మరణం తప్పదు" - అని. మరణం ఎలాగూ తప్పదు గనుక అతిసారంతో చచ్చినాసరే కఫాన్ని తొలగించండి. భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ ప్రాణం వదులుతాను అన్నాడట. అదీ నిజమైన తెలివి అంటే.

భగవంతుడీ శ్లోకంలో అర్జునుని కౌంతేయా! అన్నాడు. అంటే కుంతీకుమారా! అని. కుంతి శ్రీకృష్ణుని పరమభక్తురాలు. జీవితమంతా కృష్ణుని స్మరిస్తూనే ఉంది. చివరకు అరణ్యంలో అగ్నికి ఆహుతై మరణించే సమయంలో కూడా శ్రీకృష్ణునే మనసారా తలచుకుంటూ ప్రాణాలు విడిచింది. అట్టి పుణ్యాత్మురాలైన తల్లికి పుట్టిన అర్జునా! అంత్యకాలంలో నా స్మరణ నీకు కష్టం కాదులే అనే ఆశ్వాసన ఉందిక్కడ.

నిత్యమూ స్మరించినదే అంత్యకాలంలో గుర్తొస్తుంది కనుక ఏం చేయాలి మనం? -

శ్లో|| తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ|
మయ్యర్పిత మనోబుద్ధిః మామేవైష్యస్య సంశయః|| (7)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** అందువల్ల అన్ని సమయాలలోను నన్ను స్మరించుకుంటూ యుద్ధం చెయ్యి. మనోబుద్ధులను నాకు అర్పించు. నన్నే చేరుకుంటావు. సందేహం లేదు.

**వ్యాఖ్య:-** తస్మాత్:- అందువల్ల. ఎందువల్ల? అంత్యకాలంలో భగవత్ స్మరణ చెయ్యాలంటే నిరంతరం భగవంతుని స్మరిస్తూ ఉండాలి గనుక -

సర్వేషు కాలేషు మాం అనుస్మర యుద్ధ్యచ:- పరీక్షలో విద్యార్థి పాస్ కావాలన్నా, మంచి మార్కులు తెచ్చుకోవాలన్నా మొదటి నుండీ శ్రద్ధగా పాఠాలు చదువుకోవాలి గాని, పరీక్షలప్పుడు చదువుకుంటే చాలదు. యుద్ధంలో నైపుణ్యం సాధించాలంటే నిరంతర సాధన కావాలి. అలాగే అంత్యకాలంలో భగవంతుని స్మరించాలంటే జీవితమంతా ఎల్లప్పుడూ భగవంతుని స్మరణలో ఉండాలి.

ముందుగా రైల్వేస్టేషన్ కు వెళ్ళి టికెట్టు కొని ప్లాట్ ఫాం పై సిద్ధంగా ఉన్నవాడు రైలు ఎప్పుడు వచ్చినా సరే రైలు ఎక్కి ప్రయాణం చేయాటానికి సిద్ధంగా ఉంటాడు. అలాగే నిరంతర భగవచ్చింతన అనే టికెట్టు కొన్నవాడికి మరణమనే రైలు ఎప్పుడు వచ్చినా ఎక్కి ప్రయాణించటానికి సిద్ధంగా ఉంటాడు. కనుక ఎప్పుడో ఒకప్పుడు గాక నిత్యము, నిరంతరము; తింటూ, వింటూ, కంటూ, తిరుగుతూ సర్వకాల సర్వావస్థలలోను భగవంతుని స్మరణ ఎడబాయక ఉండాలి. ఎప్పుడూ నీలో భగవంతుని గురించిన చింతనలే సాగుతుండాలి. ఇందులో అనేకరకాల చింతనలున్నాయి. గోపికలు కామంతో, శిశుపాలాదులు శతృత్వంతో, కంసుడు భయంతో, యాదవులు

బాంధవ్యంతో, పాండవులు ప్రేమతో, నారద భీష్మవిదురాదులు భక్తితో, మునులు ఆత్మభావంతో, భగవంతుని స్మరించి జీవితాలను ధన్యం గావించుకున్నారు. ఏదో విధంగా నిరంతర స్మరణతో మానవుడు ధన్యత చెందాలి; చెందుతాడు. ఐతే 'యద్ధ్యచ' అని ఎందుకన్నారు?

నిరంతరం భగవంతుని స్మరిస్తూ ఉంటే కుటుంబపోషణ, దేహపోషణ ఎలా? అని సందేహం వస్తుంది. అందుకే 'మామనుస్మర యుద్ధ్యచ' అన్నారు. నన్ను స్మరిస్తూ యుద్ధం చెయ్యి - అని. కురుక్షేత్రంలో యుద్ధం జరిగింది 18 రోజులే గదా! ఆ 18 రోజులు స్మరించమనా? లేక యుద్ధం చేసేటప్పుడు మాత్రమే స్మరించమనా? కానేకాదు. యుద్ధం కురుక్షేత్రంలోనే కాదు. మన హృదయక్షేత్రంలో ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. అసలు ఈ మాట అర్జునునికే గాదు, సర్వమానవాళికీ కూడా. అంటే మీ మీ కర్తవ్యకర్మలను నిర్వహిస్తూనే నన్ను స్మరించండి - అని. వ్యాపారం, వ్యవసాయం, పశుపోషణ, ఉద్యోగం, వృత్తి,సేవ, పని - ఏదైనా సరే నీ కర్తవ్యకర్మలు చేస్తూ నిరంతర స్మరణ జరగాలి.

లోభి ఎలాగైతే ఏపని చేస్తున్నా ధనాన్ని కూడబెట్టే విషయాన్ని ఆలోచిస్తాడో, కాముకుడు ఏపని చేస్తున్నా ఎల్లప్పుడూ తన ప్రేయసిని గురించి స్మరిస్తూ ఉంటాడో అలాగే పనికి పని, స్మరణకు స్మరణ జరిగిపోవాలి. సాధ్యమా? అని సందేహం.

ఒక గృహిణి చెరువు వద్ద నీరు తెచ్చుకోటానికి బయలుదేరింది. ఇంటిలో ఊయలలో చంటిపిల్లవాడు నిద్రపోతున్నాడు. బిందె నింపుకొని నెత్తిపై

పెట్టుకొని తిరిగి వస్తున్నది. "పిల్లవాడు లేచాడేమో, ఏడుస్తున్నాడేమో అనుకుంటూ నడుస్తున్నది. నడక ఆగలేదు. ఆలోచన ఆగలేదు. దారి తప్పలేదు. పిల్లవాడి స్మరణ జరిగిపోతూనే ఉన్నది. అలాగే మనం కూడా మన అన్ని వ్యవహారాలలోను భగవత్స్మరణ చేయవచ్చు. కాకపోతే కొంతకాలం అలవాటు కావాలి.

మయ్యర్పిత మనోబుద్ధిః- మనోబుద్ధులు భగవంతునికి సమర్పించాలి. పూలు, పండ్లు, కొబ్బరికాయలు సమర్పించటం గొప్పకాదు. ఎందుకంటే అవి నీవి కాదు. చెట్టు నుండి గిల్లి తెచ్చినవి. నీకు పుణ్యం రావాలంటే, ప్రయోజనం కలగాలంటే నీ వస్తువులను సమర్పించాలి. మనోబుద్ధులు నీవి. కనుకనే వాటిని సమర్పించమన్నాడు. జీవుణ్ణి దేవుడికి దూరం చేసేవి ఈ మనోబుద్ధులే. కనుక వీటిని వదిలించుకోవాలి. అలా నీ మనోబుద్ధులను సమర్పిస్తే -

మాం ఏవ ఏష్యసి - అసంశయః- నన్నే పొందుతావు. సంశయము లేదు. నిజంగా భగవంతుణ్ణి పొందటమంటే ఎక్కడో ఉన్న ఆయనను వెతికి పట్టుకోవటం కాదు. అసలు నీవు భగవంతుడివే. మనోబుద్ధులను తగిలించుకొని జీవుడివయ్యావు. ఇప్పుడా మనోబుద్ధులను భగవంతునికే వదిలేశావా? ఇప్పుడు నీవు భగవంతునివే అని తెలుస్తుంది. అదే భగవంతుని పొందటం అంటే. నీవు పురుషుడివే. కాని నాటకంలో స్త్రీవేషం వేశావు. అందుకోసం చీరె, జాకెట్టు, బొట్టు, జడ అన్నీ తగిలించుకున్నావు. నాటకం అయిపోయిన తర్వాత తగిలించుకున్న వాటిని వదిలించుకుంటావు. దానితో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నీవు పురుషుడివే అవుతావు. అలాగే నీవు భగవంతుడివే. ఇందులో ఏ సంశయము అవసరం లేదు - ఇక దీనిని ఎలా సాధించాలో 8వ శ్లోకంలో..

**శ్లో||** అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా|
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్|| (8)

**తా||** పార్థా! అభ్యాసయోగంతో కూడుకొని, అన్యవిషయాలపైకి పోని మనస్సుతో నిరంతర చింతన చేస్తే దివ్యమైన పరమపురుషుణ్ణి చేరుకుంటారు.

**వ్యాఖ్య:-** అంత్యకాలంలో పరమాత్మను స్మరించాలంటే సాధన (ఉపాయం) ఏమిటి? అవి -

1.'అభ్యాస యోగ యుక్తుడు' - మనస్సు అభ్యాసమనే ఉపాయాన్ని ఆశ్రయించాలి.

2.'నఅన్యగామినా చేతసా' - చిత్తం ఇతర విషయాలపైకి పోకుండా ఉండాలి.

3.'అనుచింతయన్' - పరమాత్మను గూర్చి మరలమరల చింతిస్తూ ఉండాలి.

1.అభ్యాసయోగం:- అభ్యాసం వల్ల ఎటువంటి పనినైనా సాధించవచ్చు.

- అభ్యాసం వల్లనే చిన్నపాప (బాలిక) నృత్యం చేయగలుగుతుంది.
- అభ్యాసం వల్లనే సర్కసులో తీగ మీద నడవటం సాధ్యపడుతుంది.
- అభ్యాసం వల్లనే అనేక జంతువులు, క్రూరమృగాలు చెప్పిన పనులు చేస్తాయి.
- అభ్యాసం వల్లనే ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కగలిగారు.

- అభ్యాసం వల్లనే నీటమునిగి చాలాసేపు ఉండగలుగుతున్నారు.
- అభ్యాసం వల్లనే క్రీడలలో, యుద్ధాలలో నైపుణ్యం సంపాదించగలుగుతున్నారు.

మహాభారతంలో అర్జునుడు భోజనం చేస్తుండగా గాలికి దీపం ఆరిపోయింది. అయినా ముద్దనోట్లోకే పోయింది. అభ్యాసం వల్లనే కదా! అనుకున్నాడు. చీకట్లో భోజనం చేయటం కుదిరినప్పుడు బాణప్రయోగం ఎందుకు కుదరదు? అని సాధన ప్రారంభించాడు. చీకట్లో కూడా బాణాలు వదలగలిగాడు. అంటే సాధనతో దేనినైనా సాధించవచ్చును అని తెలుస్తున్నది.

అందుకే "తత్ చింతనం తత్ కధనం అన్యోన్నం తత్త్వబోధనం" అన్నారు విద్యారణ్యస్వామి. పరమాత్మ గురించే చింతించు, పరమాత్మను గురించే మాట్లాడు. కూర్చున్నా, నిలుచున్నా, తింటున్నా, తిరుగుతున్నా నిరంతరం భగవచ్చింతనే చేయాలి.

మొదట్లో ఈ అభ్యాసం కష్టంగా ఉన్నా, క్రమంగా సరైన మార్గంలో పడుతుంది. అనేక లౌకిక విషయాల గురించి చింతన చేయటం అలవాటైన మనస్సు దొంగగొడ్డులాగా అటే పరుగెడుతుంది. అయితే సాధన వదలకుండా చేస్తే క్రమంగా పరమాత్మ చింతనలో నిలిచిపోతుంది. సాధన వదలరాదు. ఇలా నిరంతరము మనస్సును పరమాత్మ చింతనలో ఉంచటమే అభ్యాసయోగం అంటారు.

**2.చేతసా న అన్యగామినా :-** ఎంతగా అభ్యాసం చేస్తున్నా మనస్సు అన్యవిషయాలపైకి పోకుండా ఉండదు. ప్రాపంచిక విషయవస్తువులలో,

భోగాలలో తిరిగిన మనస్సు మాటిమాటికి వాటిపైకే పోతుంది. అలా వెళ్ళే మనస్సును చలించే మనస్సు అంటారు. అది పరమాత్మపై నిలవదు. సాధన కుదరదు. అభ్యాసం కుదరదు. అందువల్ల విషయభోగాలన్నీ అనిత్యమైనవని, నశించిపోయేవని, శాశ్వత ఆనందాన్నివ్వజాలవని పదేపదే తలచుకుంటూ, మనస్సులో గట్టిగా నిశ్చయం చేసుకుంటూ వాటిపట్ల వైముఖ్యాన్ని వైరాగ్యాన్ని కలిగి ఉండాలి. అదే సమయంలో పరమాత్మయే సత్యమని, నిత్యమని, ఆనందస్వరూపమని గ్రహించి ఆ పరమాత్మపై ఏకాగ్రమైన మనస్సును నిలపాలి. అప్పుడే అభ్యాసం సులభమవుతుంది. అదే న అన్యగామినా చేతసా - అంటే.

3.అనుచింతయన్ :- ఇలా మనస్సును అన్యమైన అల్పవిషయాల పైకి పోనీయకుండా నిరంతరం పరమాత్మనే చింతిస్తూ అభ్యాసయోగంతో సాధనచేయాలి. ఆ సాధన అప్పుడప్పుడూ కాకుండా, మళ్ళీ మళ్ళీ వదలకుండా చింతన చేయాలి. అందుకే స్మరన్ అని అనకుండా అనుస్మరన్ - అనుచింతయన్ అన్నారు. ఇలా నిరంతరం - మళ్ళీ మళ్ళీ - భగవంతుని చింతిస్తూ అభ్యాసం చేస్తుంటేనే మరణకాలంలో కూడా భగవంతుని స్మరించటం జరుగుతుంది. అలా మరణకాలంలో కూడా స్మరిస్తేనే భగవంతుని అందుకోవటం జరిగేది. అందుకే 'యాతి' అన్నారు.

4.పార్థా :- ఇక్కడ అర్జునుని పార్థా! అని సంభోదిస్తున్నాడు భగవానుడు. అర్జునుడు పృథాపుత్రుడు కనుక పార్థుడు. అతడేకాదు మనందరం పార్థులమే. పృథివీ పుత్రులం. అంటే ఈ మరణసమయంలో స్మరణ అర్జునునికే గాదు,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అర్జునుని నిమిత్తంగా చేసుకొని సకలమానవాళికీ బోధిస్తున్నాడు భగవానుడు.

కనుక గురువు యొక్క, శాస్త్రం యొక్క ఉపదేశాలను గ్రహించి, అన్యవిషయాలపైకి పోకుండా ఉండే ఏకాగ్రమైన మనస్సుతో, భగవంతుని స్మరణ - లేదా చింతన నిరంతరం అభ్యాసం చేస్తూ, ఎట్టి పరిస్థితులలోనూ అభ్యాసాన్ని విడవకుండా ఉంటే మరణకాలంలో భగవత్ స్మరణ చేయగలుగుతాం అని గ్రహించాలి.

మనం ధ్యానించవలసిన పరమపురుషుని లక్షణాలేమిటో 9వ శ్లోకంలో -

**శ్లో||** కవిం పురాణమను శాసితారం

అణో రణీయాంస మనుస్మరేద్యః|

సర్వస్య ధాతార మచింత్య రూపం

ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్|| (9)

**తా||** సర్వజ్ఞుడు, పురాతనుడు, శాసకుడు, సూక్ష్మాతి సూక్ష్మమైనావాడు ప్రపంచానికి ఆధారమైన వాడు, చింతించ వీలులేని రూపం కలవాడు, సూర్యతేజస్సు గలవాడు, చీకటికి అతీతమైన వానిని ఎవరు నిత్యము స్మరిస్తారో - - -

**వ్యాఖ్య:-** అంత్యకాలంలో భగవంతుని స్మరణ చేయగలగాలంటే 1.అభ్యాసం, 2.అన్యచింతనలు లేని చిత్తం 3.నిరంతర స్మరణ ఉండాలని క్రిందటి శ్లోకంలో చెప్పారు. ఐతే ఆ భగవంతుడెవరో, ఎట్టివాడో తెలియకుండా ఎలా

స్మరించటం? అందుకే భగవంతుని గురించిన స్వరూప స్వభావ వివరణ ఈ శ్లోకంలో ఇచ్చారు.

భగవంతుని 3 విధాలుగా 3 రకాల భక్తులు ఉపాసిస్తారు. ప్రారంభదశలో ఉన్నావారు సాకార - సగుణ స్వరూపాన్ని ఉపాసించటం కుదురుతుంది. సాధనదశలో ఉన్నవారు నిరాకార - సగుణ స్వరూపాన్ని మాత్రమే ఉపాసించగలరు. అట్టివారి కొరకే ఈ శ్లోకంలో ఇచ్చిన వర్ణన. ఇక జ్ఞానులైన వారు నిరాకర - నిర్గుణ తత్త్వాన్ని ఉపాశించుటకు అర్హత కలిగి ఉంటారు.

ఇక్కడ రెండవరకమైన సాధకులకు నిరాకార - సగుణ స్వరూపం ఇవ్వబడింది.

1.కవి :- అంటే సర్వజ్ఞుడు అని. ఆయనకు తెలియని విషయం ఉండదు. ఎందుకంటే ఆయన అంతటా - అన్నింటా వ్యాపించియున్నవాడు గనుక ఆయనకు తెలియకుండా ఏమీ దాచటానికి వీలులేదు. నిజంగా భగవంతుడు సర్వజ్ఞుడేనా? అవునని తర్కశాస్త్రాన్ని అందించిన గౌతమఋషి అనుమాన ప్రమాణంతో నిరూపించాడు. వాచీ ఉంది. ఇది తయారైన వస్తువు. దీనిని ఎవరో ఒకరు తయారుచేశారు. ఆ తయారుచేసిన వానికి వాచీకి సంబంధించిన పరిజ్ఞానం పూర్తిగా ఉండాలి. అలా లేకపోతే వాచీ పట్టుమని 10 రోజులు కూడా పని చేయదు. అలాగే ఈ విశాలమైన విశ్వబ్రహ్మాండాన్ని సృష్టించిన సృష్టికర్త భగవంతునికి దీనికి సంబంధించిన పూర్తి జ్ఞానం ఉండి ఉండాలి. అలా లేకపోతే ఒక క్రమపద్ధతిలో ఈ గ్రహాలన్నీ

ఎలా సూర్యుని చుట్టూ తిరుగుతాయి. ఆ గ్రహాల చుట్టూ ఉపగ్రహాలెలా తిరుగుతాయి? ఇవన్నీ అంతరిక్షంలో ఏ ఆధారం లేకుండా ఎలా నిలబడతాయి? ఈ భూమిపై జీవసృష్టి, వారికి ఏలోటు లేకుండా కావలసినవన్నీ సమకూర్చటం - ఇదంతా ఒక అద్భుతం. దీనిని బట్టి సృష్టికర్త భగవంతుడు ఎంతటి సర్వజ్ఞుడో మనం గ్రహించవచ్చు.

కాని అజ్ఞాన మానవుడు అంగీకరించకపోవచ్చు. ఒక రైతు వేసవికాలంలో పొరుగూరికి వెళుతున్నాడు. బట్టతల. ఎండ చుర్రుమనిపిస్తున్నది. గొడుగు లేదు. అలసటతో ఒక మర్రిచెట్టు క్రింద విశ్రాంతి తీసుకున్నాడు. అలసట తీరగానే ప్రయాణానికి సిద్ధపడుతున్నాడు. అంతలో ఎదురుగా చూచాడు. ఒక పొలంలో గుమ్మడికాయలు విరగకాసినవి. ఈ మర్రిచెట్టును - ఆ గుమ్మడి చెట్టును మార్చి మార్చి చూశాడు. ఆ! దేవుడికి బుద్ధిలేదు. సృష్టి చేసి చేసి ముసలివాడై బుద్ధి చెడి ఉంటుంది. కొండంత చెట్టుకు పిసరంత కాయలా! పలుచని తీగకు మోయలేనంత బరువున్న కాయలా? ఏమిటీ పిచ్చితనం. నన్ను గనుక సృష్టి చేయమంటే ఆ గుమ్మడితీగకు మర్రికాయలు, ఈ మర్రిచెట్టుకు ఆ గుమ్మడికాయలు పెట్టేవాణ్ణి అనుకున్నాడు. అంతలో చెట్టుపై నుండే పిట్ట ఒకటి 10కాయలను కొరికింది. అవి టపటపారాలి ఈ రైతు బోడిగుండు మీద పడ్డవి. అమ్మో! దేవుడు మహాతెలివిగలవాడు నేననుకున్నట్టు ఆ పెద్ద పెద్ద గుమ్మడికాయలే గనుక ఈ చెట్టుకు ఉంటే నాతల కాస్తా పచ్చడి పచ్చడి అయ్యేది గదా! అని అదరిపడ్డాడు. దేవుడా! బ్రతికిపోయాను - అనుకున్నాడు. భగవంతుడు తెలివి తక్కువవాడు

అనుకోవటం మన తెలివితక్కువ తనమే. ఆయన సర్వజ్ఞుడు అని నిత్యము, నిరంతరము చింతన చేయాలి.

2.పురాణం:- భగవంతుడు పురాతనుడు. అంటే సృష్టికి ముందే ఉన్నవాడు. సృష్టిలో పుట్టి పోయేవాడు కాదు. ఈ సృష్టియే ఆయనలో పుట్టి, ఉండి, నశించిపోతుంది. తిరిగి సృష్టి స్థితి లయం. కనుక ఆయన ఎప్పుడూ ఉండేవాడు. పాతవాడు. అలాగని ముసలివాడు కాదు. సదా నూతనుడు.

3.అనుశాసితారం:- ఆయన అందరిని అన్నింటిని, శాసించే ప్రభువు. సూర్యుడు తన వెలుగును ప్రసరించినా, గాలి వీచినా, మృత్యు దేవత నిద్రపోకుండా పనిచేసినా, వానకురిసినా, దేహేంద్రియ మనోబుద్ధులు వాటివాటి విధులు నిర్వర్తించినా - అన్నీ ఆయన శాసనం ప్రకారమే. అందరిలో అంతర్యామియై ఉండి శాసించేవాడు. కనుక శాసకుడు - ప్రభువు - అని చింతన చేయాలి. ఆయన శాసనం వల్లనే సృష్టి క్రమపద్ధతిలో సాగిపోతున్నది.

4.అణోఃఅణీయాం :- అణువు కన్న సూక్ష్మమైన వాడు పరమాత్మ. సూక్ష్మము అంటే ఏ ఇంద్రియాలకు కనిపించనివాడు. ఏ పవర్ మైక్రోస్కోప్ కూ కనిపించనివాడు. ఆకాశం కన్న సూక్ష్మము. ఆయన నిర్గుణుడు. కనుక వ్యాపకం ఎక్కువ. ఆకాశానికి శబ్దగుణం ఒక్కటే ఉన్నది. అయినా కంటికి కనిపించదు. అసలు గుణాలే లేని పరమాత్మ ఏ ఇంద్రియానికి అందడు. అది సర్వవ్యాపకం. ఆయనలేని చోటే లేదు. అందరిలో అన్నింటిలో ఉన్నాడు. కనుక ఆయనకు తెలియకుండా ఏమీ చేయటానికి వీలులేదు. అట్టివాడు భగవంతుడు అని ధ్యానించాలి.

5.సర్వస్యధాతారం :- సమస్త ప్రపంచానికి ఆధారమైనవాడు పరమాత్మ. దేహానికి భూమి ఆధారం; భూమికి జలం; జలానికి అగ్నీ; అగ్నికి వాయువు; వాయువుకు ఆకాశం; ఆకాశానికి పరమాత్మ ఆధారం. అంటే అన్ని ప్రాణులకు, సమస్త జగత్తుకు, ఈ బ్రహ్మాండం అంతటికి ఆయనే ఆధారం. సినిమాహాలులో స్థిరమైన తెల్లని తెర లేకపోతే ఏ కథా జరగదు. అలాగే సర్వజీవులకు ఆధారం ఆ పరమాత్మే. పరమాత్మ ఆధారంగానే జీవులన్నీ వాటివాటి కార్యకలాపాలు కొనసాగిస్తున్నాయి - అని ఉపాసన చేయాలి.

6.అచింత్య రూపం :- ప్రతి వస్తువుకు ఒక రూపం, గుణం, పదార్థం ఏదో ఉంటుంది గనుక అన్నింటిని మనస్సు చేత భావించవచ్చు, చింతించవచ్చు, గుర్తించవచ్చు. కుర్చీ, బల్ల, ఇల్లు, మనిషి - వీటన్నింటిని కంటితో చూచి గుర్తించవచ్చు. కొన్ని కంటికి కనిపించవు. అలాంటి వాటిని వాటి గుణాలతో మనస్సు చేత భావించవచ్చు. మంచి, చెడు, పుణ్యం, పాపం, ధర్మం, అధర్మం, ప్రేమ, ద్వేషం - మొ||నవి. కాని ఆత్మ - లేదా పరమాత్మను మనస్సు చేత కూడ చింతించే వీలులేదు. ఎందుకంటే దానికి గుణం కూడా లేదు గనుక. ఐతే మలిన మనస్సు ఆత్మను తెలుసుకోలేక పోయినా శుద్ధమైన, కల్మషరహితమైన మనస్సుతో తదేకంగా చింతన చేస్తే మనస్సు ఆత్మాకారంగా మారిపోతుంది.

7.ఆదిత్యవర్ణం:- వర్ణం అంటే రంగు. పరమాత్మకు రంగు లేదు. కాని ఆదిత్యవర్ణం అంటున్నారే! అంటే సూర్యునిలా ప్రకాశమానమైన వాడు అని. కోటిసూర్యసమప్రభా కాంతులతో విరాజిల్లేవాడు పరమాత్మ. సూర్యునిలో ప్రకాశం ఆయనదే. అందుకే ఆదిత్యవర్ణం.

8.తమసః పరస్తాత్ :- చీకట్లకు అతీతమైన వాడు. పరమాత్మ చీకటిని కూడా చూపగలవాడు. అజ్ఞానానికి ఆవల ఉండేవాడు. సూర్యుడు చీకటిని చూపలేడు. కాని పరమాత్మ చీకటిని, అజ్ఞానాన్ని చూపగలడు.

ఒకడు నేను అజ్ఞానిని అన్నాడు. అజ్ఞాని అని ఎలా తెలిసింది? అజ్ఞానిని అని తెలుసుకున్న జ్ఞానివి నీవు. అజ్ఞానివే అయితే అజ్ఞానిని అని కూడా తెలుసుకోలేవు గదా! అలాగే ఇది తమస్సు - చీకటి - అజ్ఞానం అని ఎవరు తెలుసుకోగలుగుతారు? వాటికి వేరుగా -సాక్షిగా ఉండి చూడగలిగేవాడే కదా! అంటే చీకటికి - తమస్సుకు వేరుగానున్న వాడే గదా! అంటే అతడు చీకటి కాదు గదా! ఎందుకంటే నీవు చీకటి అయితే చీకటిని చూడలేవు. కనుక తమస్సుకు వేరుగా ఉండి చూసే సాక్షి తమస్సుకన్న వేరైనవాడే. అదే పరమాత్మ.

ఈ లక్షణాలను ఆధారంగా చేసుకొని నిరంతరం పరమాత్మను స్మరించాలి.

యః అను స్మరేత్:- ఎవరు ఇలా పరమాత్మను నిరంతరం స్మరణ చేస్తూ ఉంటారో అట్టివారు చేరుకొనే స్థానం ఏమిటి? లేక వారికి కలిగే ఫలితం ఏమిటి?

నిరంతర పరమాత్మ స్మరణ వల్ల కలిగే ఫలితం ఏమిటో..

శ్లో|| ప్రయాణకాలే మనసాఽచలేన

భక్త్యా యుక్తో యోగ బలేన చైవ|

భ్రువోర్మధ్యే ప్రాణమా వేశ్యసమ్యక్

సతం పరం పురుష ముపైతి దివ్యం||          (10)

**తా||** దేహాన్ని వదిలి ప్రాణం ప్రయాణించే సమయంలో మనస్సులో చలించని భక్తి కలిగినవాడై, యోగ బలంతో భ్రూమధ్యంలో చక్కగా ప్రాణాన్ని నిలిపి అతడు దివ్యమైన ఆ పరమపురుషుణ్ణి చేరుకుంటాడు.

**వ్యాఖ్య:-** ప్రయాణకాలే:- ఇక్కడ మరణకాలాన్ని ప్రయాణకాలం అంటున్నారు. ఎందుకంటే మరణం అనేది నిజంగా ముగింపుకాదు. జీవుడు ఈ దేహాన్ని విడిచి మరొక దేహం కొరకు ప్రయాణిస్తున్నాడు గనుక ఇది జీవుడి యొక్క ప్రయాణకాలమే.

ప్రయాణం ఉన్నదంటే మనం బట్టలు, వస్తువులు, డబ్బులు, అవసరమైన కాగితాలు అన్నీ సర్దుకోవాలి గదా! అలాగే ఈ జీవుడి ప్రయాణానికి ముందే అన్నీ సర్దుకోవాలి. అవసరమైన వాటిని సమకూర్చుకోవాలి. ఏమిటవి?

1.అచలేన మనసా. (చలించని మనస్సు)

2.భక్త్యా యుక్త:- అనన్యమైన భక్తిని.

3.యోగబలేన - ధ్యానయోగ బలంతో భ్రూమధ్యంలో ప్రాణవాయువును నిలబెట్టుట. లేదా ధారణ చేయుట.

1.అచలేన మనసా:- చలించని మనస్సుతో. పరమాత్మకు మన మనస్సును సమర్పించాలి. అయితే ఎలాంటి మనస్సును? చలించని మనస్సును, అన్యమైన, అల్పమైన విషయాలపైకి పరుగులెత్తని మనస్సును. మనం భగవంతునికి కుళ్ళిపోయిన కొబ్బరికాయలను, పండ్లను సమర్పిస్తామా? లేదు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గదా! అలాగే రాగద్వేషాలతో, పాపపు వాసనలతో, ప్రాపంచిక విషయ వ్యామోహాలలో చిక్కుకున్న మనస్సును కూడా పరమాత్మకు సమర్పించరాదు. నిర్మలమైన, నిశ్చలమైన మనస్సును మాత్రమే భగవంతునికి సమర్పించాలి.

అక్బరు చక్రవర్తి పరమత సహనం, దైవభక్తి గలవాడు. ప్రతిరోజు నమాజు చేస్తుండేవాడు. అన్ని మతాలలోని మహాత్ములను గౌరవించేవాడు. ఆకాలంలో శిక్కుల మతగురువు 'గురునానక్' చక్కని ధర్మబోధలు చేస్తుండేవాడు. ఆయన పేరుప్రఖ్యాతలు విన్న అక్బరుచక్రవర్తి ఆయనను తన ప్రార్థనా సమావేశానికి ఆహ్వానించాడు. నానక్ ను ఉన్నతాసనంపై ఆశీనుని చేసి అక్బరు ప్రార్థన ప్రారంభించాడు. అక్బరు భక్తిభావనతో కన్నులరమోడ్చి ప్రార్థనా గీతాన్ని ఆలపిస్తున్నాడు. అనుచరులంతా అలాగే చేస్తున్నారు. ఇదంతా చూస్తున్న నానక్ పకపక నవ్వాడు. తక్కిన వారికి ఆయనపై కోపం వచ్చి ఎందుకు నవ్వాడో తేల్చుకోవాలనుకున్నారు. అక్బరు మాత్రం వారిని వారించి ప్రార్థన కొనసాగించాడు.

ప్రార్థన పూర్తయి అందరూ వెళ్ళిపోయిన తర్వాత అక్బరు నానక్ తో "మహాత్మా! ప్రార్థన మధ్యలో మీరెందునవ్వారు?" అని వినయంతో ప్రశ్నించాడు. దానికి నానక్ "చక్రవర్తీ! ప్రార్థనకు రమ్మని ఆహ్వానం పంపితే వచ్చాను. నీవు ఏకాగ్రచిత్తంతో ధ్యానం చేస్తావనుకున్నాను. అలా జరుగలేదు. అందుకే నవ్వు వచ్చింది. ప్రార్థన చేసేటప్పుడు నీ మనస్సు భగవంతుని యందే ఉన్నదా? లేక మార్కెట్ లో అరేబియా గుర్రాలను బేరం చేస్తున్నదా?" అన్నాడు.

అక్బర్ ఆశ్చర్యపోయాడు. నిజంగా ఆ సమయంలో అతడి మనస్సు దైవం మీద లేదు - అరేబియా గుర్రాల మీదే ఉన్నది. చక్రవర్తి తన తప్పును తెలుసుకొని క్షమాపణ కోరుకున్నాడు.

అందువల్ల మనస్సు భగవచ్చింతనలో నిల్పాలంటే అన్యత్ర పోనీయకూడదు. పూర్వ సంస్కారాల వల్ల అలా పోయినప్పటికీ పగ్గంతో గుర్రాన్ని అదుపులోనికి తెచ్చినట్లు భక్తి అనే పగ్గంతో మనస్సు అనే గుర్రాన్ని అదుపులోనికి తెచ్చుకొని భగవంతుని పాదపద్మాల యందు నిలపాలి. ఇక -

2.భక్త్యా యుక్తః- భక్తితో భగవంతుని యందు మనస్సు నిలపాలి. ఏదో తప్పక చేయాల్సి వచ్చింది - అనిగాక ప్రీతితో - ప్రేమతో - ఆసక్తితో భగవచ్చింతన చేయాలి.

పరమాత్మపై గల ప్రేమనే భక్తి అంటారని నారదమహర్షి తెలియజేశాడు. ప్రతివాడికీ ఏదో ఒక వస్తువుపై, లేదా వ్యక్తిపై ప్రేమ ఉంటుంది. కాని అది పవిత్రమైన భక్తి క్రిందకురాదు.

భార్య యందుండే ప్రేమను మోహం అంటారు.

బిడ్డలపై ఉండే ప్రేమను వాత్సల్యం అంటారు.

భగవంతునిపై, గురువుపై ఉండే ప్రేమనే భక్తి అంటారు.

మన యొక్క ప్రేమ వృధాగా అనిత్య పదార్థాలపైకి పోయి వృధా కాకుండా భక్తి అనే ఆనకట్టను కట్టి భగవంతుని మీదకు మళ్ళించాలి. అప్పుడే ఆ ప్రేమకు - భక్తికి సార్థకత.

ఒక ఆశ్రమంలో గురువుగారు శిష్యులకు చక్కని బోధ చేస్తున్నారు. ఒక రోజున శిష్యులతో కలసి ప్రకృతి సౌందర్యాన్ని తిలకించటానికి - భగవంతుని చిద్విలాసాన్ని చూచి ఆనందించటానికి సమీపంలోని ఉద్యానవనానికి వెళ్ళారు. అక్కడ వికసించిన గులాబీ పుష్పం యొక్క సౌందర్యాన్ని తిలకిస్తూ సృష్టికర్త యొక్క శక్తిసామర్థ్యాలను, మేధాశక్తిని కొనియాడుతూ గురువుగారు ఆ పుష్పాన్ని మెల్లగా కోశారు. ఆ కోయటంలో పొరపాటున దాని ముల్లు గ్రుచ్చుకొని వ్రేలి నుండి రక్తం కారుతున్నది. అది చూచి కొందరు శిష్యులు గుడ్డపేలికతో కట్టు కట్టాలని పాతగుడ్డ కొరకై ఆశ్రమానికి వెళ్ళారు. కొందరు గురువుగారు ఆదిశిస్తే, అడిగితే చూద్దామని ఊరకే నిలబడి యున్నారు. కాని ఒక శిష్యుడు మాత్రం తాను పైన కప్పుకున్నా వస్త్రం నుంచి ఒక పేలికను చించి తక్షణమే ఆయనకు కట్టుకట్టాడు. రక్తం కారటం ఆగిపోయింది. అప్పుడు గురువు 'ఈతడు గదా! నిజమైన భక్తుడు' అని తలంచి అతడిపై ప్రత్యేక అభిమానాన్ని వాత్సల్యాన్ని కలిగియున్నాడు.

అలాగే కొందరు శిష్యులు గురువుగారికి ఏదన్నా కష్టం కలిగితే, అవసరం వస్తే - ఆయన అడిగితే సాయం చేద్దామని అనుకుంటారు. అడక్కపోతే గురువుగారికి అహంకారం ఉన్నట్లు అని గురువును పరీక్షిస్తుంటారు. కాని తమ అహంకారం సంగతి చూసుకోరు. గురువు తమ దగ్గర చేయి చాపి తన కన్న తక్కువవాడు కావాలని ప్రయత్నిస్తుంటారు. అక్కడే ఉన్న శిష్యులు అలాంటి వారే.

ఇక మరి కొందరు తమపైసా నష్టపోకుండా, ఇతరుల దగ్గర చందాలు వసూలు చేసి ఇవ్వాలనుకుంటారు. పాత గుడ్డల కోసం ఆశ్రమానికి పరుగెత్తిన వారు ఇలాంటి వారే. ఇక ఎక్కడో ఒకరు మాత్రం తమ సంపద గురువుకోసమేనని భావిస్తూ; గురువు కొరకు వినియోగించని సంపద వ్యర్థమని భావిస్తూ ఆయనను తృప్తి పరుస్తూ ఉంటారు. అప్పటికప్పుడు తనపై వస్త్రాన్ని చింపి కట్టుకట్టిన శిష్యుడు అట్టివాడే. ఇదే నిజమైన భక్తి. ఇట్టి భక్తి కలవానికే భగవంతుని అనుగ్రహం.

3.యోగబలేన భ్రువోర్మధ్యే ప్రాణం ఆవేశ్య సమ్యక్:- చలించని మనస్సు, అచంచల భక్తితో పాటు యోగబలం కూడా ఉంటే మరణసమయంలో పరమాత్మ స్మరణ కలుగుతుంది. ఏమిటా యోగబలం? భ్రూమధ్యంలో ప్రాణశక్తిని చక్కగా ధారణ చేసి నిలపటమే యోగబలం. ఇది రెండువిధాలు: 1.హటయోగంద్వారా 2.చక్రభేదనం ద్వారా సాధ్యమవుతుంది.

1.హటయోగం: ముక్కులో సంచరించే ప్రాణవాయువును నిరోధించి రెండుకనుబొమల మధ్య గల ప్రదేశంలో - అంటే భ్రూమధ్యంలో నిలబెట్టటం.

2.చక్రభేదనం:- సుషుమ్నా నాడికి ఇరువైపుల ఉన్న ఇడ, పింగళ నాడులలో ప్రాణశక్తి సంచరిస్తూ ఉంటుంది. ఆ ప్రాణశక్తిని ఒకదాని నుండి రెండవదానికి మార్చుకుంటూ, సుషుమ్నా నాడిలో ప్రవేశపెట్టి, అక్కడి మూలాధార చక్రంలో కుంభింపజేసినప్పుడు, మూలాధారంలోని కుండలినీ శక్తిలో చైతన్యం వస్తుంది. ఇలా ప్రాణాయామాన్ని సాగిస్తూ, అంతర కుంభకం, బాహ్యాకుంభకం ద్వారా కుండలినీ శక్తి కదులుతుంది. అది క్రమంగా స్వాధిష్ఠానం, మణిపూరం,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అనాహతం, విశుద్ధం అనే చక్రాలను దాటుకుంటూ ఆజ్ఞాచక్రంలో ప్రవేశిస్తుంది. ఆజ్ఞాచక్రం అనేది భ్రూమధ్యంలో ఉంటుంది. కనుక కుండలినీ శక్తి భ్రూమధ్యంలో నిలిచినట్లు. ఇదే భ్రూమధ్యంలో ప్రాణశక్తిని నిలబెట్టే 2వ విధానం.

యోగమార్గంలో ఈ 2విధాల ఉపాయాలతో భ్రూమధ్యంలో ప్రాణశక్తిని నిలపటం జరిగితే - ఆ స్థితిలో పరమపురుషుని స్మరిస్తూ ప్రాణాలు వదిలితే ఆ పరమపురుషునే చేరుకుంటారు.

ఆజ్ఞాచక్రం సమీపంలో సప్తకోశాలున్నాయి. అవి 1.బోధినీ; 2.నాద; 3.అర్ధ చంద్రికా; 4.మహానాద; 5.కలా; 6.చంద్రికా; 7.ఉన్మనీ - జీవుడు ప్రాణంతో సహా ఉన్మనీ కోశంలో ప్రవేశించినప్పుడు పరమపురుషుని చేరుకుంటాడు. భ్రూమధ్యం ఒక సంధి ప్రదేశం. దాని క్రింది ప్రదేశం ప్రకృతికి సంబంధించినది. పై ప్రదేశం పరమాత్మకు సంబంధించినది. భ్రూమధ్యం గడప లాంటిది. అక్కడకు చేరటమే కష్టం. ఇక ఆ తర్వాత పరమాత్మ సాక్షాత్కారానికి ఆయాసం, ఆలస్యం ఉండనే ఉండవు. భ్రూమధ్యం నుండే పరమాత్మ సాక్షాత్కారం జరుగుతుంది.

యోగులు కానివారు కర్మలకు వశులై, కర్మబంధాలకులోనై భ్రూమధ్యానికి క్రిందనున్న కన్ను, ముక్కు, నోరు, చెవి, మొ||న అధోమార్గాల ద్వారా ప్రాణాలను వదలి మళ్ళీ జన్మను పొందుతారు.

యోగులు కర్మాతీతులై భ్రూమధ్యం వద్ద దృష్టిని నిల్పి అక్కడి ప్రకాశంలో మోక్ష నాడి (సుషుమ్నా నాడి) ద్వారా పైకి ప్రయాణం చేస్తారు. ఇకవారు తిరిగి వచ్చే పనిలేదు. (జన్మలేదు).

ఇంతవరకు యోగమార్గం లోని సాధకుల విషయం చెప్పటం జరిగింది. ఇక జ్ఞాన మార్గంలోని సాధకుడికి కూడా ఇదే విషయం సరిపోతుంది. భ్రూ అంటే భ్రమించటం. మధ్యే అంటే మధ్యన. నిరంతరం పరమాత్మ గురించిన భావాల, చింతనల మధ్య భ్రమిస్తూ ఉంటే - అంటే ఎల్లప్పుడూ అన్యవిషయాలపై అనాసక్తితో, భగవంతునికి సంబంధించిన భావాలపై ఆసక్తితో విచారణ చేస్తూ ఉంటే మన చిత్తం ఈ ఆలోచనలకు కేంద్రమైన పరమాత్మ మీదనే నిలిచిపోతుంది. అప్పుడు బుద్ధి సూక్ష్మాతి సూక్ష్మమై నిర్వికల్ప సబీజ సమాధిని పొందుతుంది. ఆ విధంగా పరమాత్మను సాక్షాత్కరించుకోవటం జరుగుతుంది. కాబట్టి భ్రూమధ్యంలో ప్రాణాలు నిల్పటం అంటే పరమాత్మకు సంబంధించిన విషయాల విచారణలో చిత్తాన్ని నిలపటమే.

ఈవిధంగా చలించని మనస్సు - పరమాత్మపై భక్తి - నిరంతర విచారణ. ఈ మూడింటితో భగవత్ప్రాప్తి.

ఈ నిరంతర విచారణయే యోగబలం - అభ్యాసయోగబలం.

తుకారాం గొప్ప భక్తుడు. ఎప్పుడూ పండరినాథుడైన విఠల్ దేవుని కీర్తిస్తూ ఉండేవాడు. ఆయన రచించిన కీర్తనలే అభంగాలు. అతడికి నిద్రాహారాలు పట్టవు. అదే తపన, అదే అభ్యాసం. నోరు తెరిస్తే విఠల్ దేవుడే. జై


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

విఠల్ - జై విఠల్ అనే కీర్తనయే. అతడు అనేక గ్రామాలు తిరుగుతూ భక్తిని ప్రభోదిస్తూ కీర్తనలు పాడుతూ ఉండేవాడు.

ఒకనాడు ఒక గ్రామానికి రాగా గ్రామస్థులంతా అతడికి గొప్ప సన్మానం చేశారు. సంకీర్తన సభ ఏర్పాటు చేశారు. ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. భగవన్నామ స్మరణ యొక్క మాధుర్యాన్ని గురించి చక్కగా ఉపన్యశించి సంకీర్తన ప్రారంభించాడు తుకారాం. జనాలు ఆనంద పరవశులౌతున్నారు. తుకారాం బ్రహ్మానంద వారాశిలో మునిగిపోయాడు. ఆయనకు బాహ్య స్పృహ కూడా లేదు. పరవశత్వంతో పాడుతున్నాడు. ఆ దృశ్యం నిజంగా వర్ణనాతీతంగా ఉంది. సంకీర్తన సాగుతుండగా రాత్రి 10 గంటలైంది. క్రమంగా జనులు ఒక్కొక్కరు లేచి వెళుతున్నారు. అయినా తుకారాంకు ఇదేమీ తెలియదు. అర్ధరాత్రి అయ్యేసరికి 3 వంతులు జనం వెళ్ళిపోయారు. తన్మయంలో ఉన్న తుకారాం ఇదేమీ గమనించలేదు. ఆయన పారవశ్యంలో మునిగిపోయి ఎంతో మధురంగా గానం చేస్తున్నాడు. తెలతెలవారుతున్నది. ఒక్కడు తప్ప అందరూ వెళ్ళిపోయారు.

అప్పుడు తుకారాం సంకీర్తన ఆపి కళ్ళుతెరచి చూచాడు. ఒక్కడే ఉన్నాడు. అతణ్ణి పిలిచి, "నాయనా! నీవు చాలా అదృష్ట వంతుడివి. అందరూ వెళ్ళినా నీ వొక్కడివే ఉన్నావు. రాత్రి అర్ధరాత్రి సమయంలో సాక్షాత్తు పండరినాథుడు నాతో కలసి నృత్యం చేశాడు చూచావా?" అన్నాడు.

"నేను చూడలేదు అన్నాడ"తడు. అదేమిటి నీకేమైనా మసక, చత్వారం ఉన్నాయా? అన్నాడు తుకారాం. లేదన్నాడు అతడు.

అయితే నా ప్రక్కనే ఉన్న పండరినాథుడు నీకెందుకు కనిపించలేదు? నీవెందుకు మరి ఇక్కడే కూర్చున్నావు? అన్నాడు.

అప్పుడతడన్నాడు, "మీరు కూర్చున్న చాపనాదే. మీరు ఆపగానే దానిని తీసుకువెళ్ళాలని కూర్చున్నాను ఇంకా" అన్నాడు.

అప్పుడు తుకారాం "ఆహా! ప్రాపంచిక వస్తువులపై ప్రీతి చేత ప్రత్యక్షంగా ఉన్న భగవంతుణ్ణి చూడలేక పోతున్నారే జనులు. ఇతడు చాప మీద ప్రీతితో దైవం ఎదురుపడ్డా చూడలేక పోయాడే! ఎంత ఘోరం." అని విస్తుబోయాడు తుకారాం.

కనుక మన దృష్టిని పవిత్రం చేసుకోవాలి. విషయవస్తువులపై, భోగాలపై దృష్టిని పెట్టకుండా భగవంతునిపైనే దృష్టినుంచాలి. అదే అభ్యాసం కావాలి. అదే అభ్యాసయోగం. అ అభ్యాసం వల్లనే బలం. అదే యోగబలం. ఆ యోగబలంతోనే మన ప్రయాణం సాగాలి.

ప్రయాణకాలం అంటే దేహాన్ని వదిలి జీవుడు ప్రయాణించేకాలం. ఆ సమయంలో మనస్సు పరమాత్మను గురించి చింతించాలి. అంటే నిరంతరం చలించని మనస్సుతో, భగవంతునిపై అనన్యభక్తితో, అభ్యాసయోగ బలంతో భ్రూమధ్యంలో ప్రాణశక్తిని నిల్పి - బుద్ధిని పరమాత్మ చింతనలోనే - ఆ పరమాత్మ ఆలోచనలలోనే భ్రమింపజేస్తే మరణకాలంలో పరమాత్మచింతన చేసి పరమపురుషుని చేరుకుంటాం. ఆ స్థానం ఎట్టిది?

చలించని మనస్సుతో, భగవంతునిపై అనన్యభక్తితో, అభ్యాసయోగ బలంతో భ్రూమధ్యంలో ప్రాణశక్తిని నిల్పిన సాధకుడు మరణసమయంలో

పరమాత్మను స్మరించి దివ్యమైన పరమపురుషుని చేరుకుంటాడు అని క్రిందటి శ్లోకంలో చెప్పారు. ఇప్పుడా పరమపురుషుని స్థానం - పరమపదం ఎటువంటిదో చెప్పబోతున్నారు.

**శ్లో|| యదక్షరం వేద విదో వదంతి**
**విశంతి యద్యతయో వీతరాగాః|**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరం తి**
**తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే||** **(11)**

**తా||** ఏ అక్షరాన్ని గురించి వేదవిదులు చెబుతుంటారో, రాగరహితులైన వారు దేనిలో ప్రవేశిస్తారో, దేనిని కోరి బ్రహ్మచర్యంలో చరిస్తారో, ఆ పదాన్ని గురించి నీకు సంగ్రహంగా చెబుతాను.

**వ్యాఖ్య:-** ఇంతవరకు సగుణోపాసన ద్వారా క్రమముక్తిని పొందే మార్గాన్ని బోధించి ఇక నిర్గుణోపాసన ద్వారా జీవన్ముక్తిని పొందే ఉపాయం తెలియజేయబోతున్నారు.

(i) యదక్షరం వేదవిదో వదంతి:- వేదవిదులైనవారు పరబ్రహ్మాన్ని అక్షరం అని చెబుతున్నారు. అక్షరం అంటే నాశనం లేనిది - అని. ప్రపంచంలోని సమస్త పదార్థాలు, సకలప్రాణులు - అన్నీ క్షరమే - క్షణికమే. కాని పరబ్రహ్మం మాత్రం అక్షరం. నాశనం లేనిది. అది 3 కాలాల్లోను ఉండేది; కాలాతీతమైనది కూడా. అట్టి పరమాత్మను చేరుకోవటమే సమస్త మానవాళి యొక్క పరమలక్ష్యం. ఎందుకంటే అది శాశ్వతసుఖాన్ని అందించేది. మానవులంతా


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

శాశ్వతసుఖాన్ని, ఆనందాన్ని వెతుక్కుంటూ వెళ్ళేవారే గనుక ఎప్పటికైన ఆ పరబ్రహ్మాన్ని చేరుకోవాల్సిందే.

బాల్యంలో అక్షరాభ్యాసం చేస్తారు. అక్షరాన్ని అభ్యాసం చేయించటమే అక్షరాభ్యాసం. అక్షరమైన పరమాత్మను గురించి బోధించటమే నిజమైన అక్షరాభ్యాసం. కాని ఈనాడు బోధించేవన్నీ క్షరమైన విషయాల గురించే. అయితే ఆ సాంప్రదాయం పెట్టింది మాత్రం అక్షరమైన ఆత్మ విద్యను బోధించేందుకే. అందుకే మొదట పరబ్రహ్మ వాచకము, ప్రణవమునైన 'ఓం' అనే అక్షరాన్నే దిద్దిస్తారు. ఆ తరువాత నమఃశివాయ - అని. ఇదే అక్షరపరబ్రహ్మం.

ఈ పరబ్రహ్మ స్వరూపం అక్షరం - అవినాశి అని తెలిసినవారు, బోధించేవారు వేదవిదులు - వేదవేత్తలు. వేదవిదులు అంటే వేదమంత్రాలలోని పరమాత్మ తత్త్వాన్ని బోధించే భాగాలు బాగా తెలిసినవారు - అని. బ్రహ్మాన్ని గురించి చెప్పే యోగ్యత వేదవేత్తలకే గాని సామాన్యులకు ఉండదు. బ్రహ్మవిద్యను సామాన్యులు చెప్పినా ఏమాత్రం ప్రయోజనం ఉండదు. "వాచా వేదంబు పల్కవద్దుర వేమా" అన్నాడు మహానుభావుడు వేమన. కనుక అనుభవజ్ఞులే - నిజంగా తెలిసినవారే చెప్పాలి.

(ii) <u>విశంతి యద్యతయో వీతరాగాః</u>:- అట్టి అక్షరపరబ్రహ్మాన్ని గురించి చెప్పటమే కాదు, అందరూ ప్రవేశించవలసిన స్థానము కూడా అదే. అయితే అందరూ ప్రవేశించగలరా? - అర్హత ఉన్నవారే ప్రవేశించగలరు. ఏమిటా అర్హత? 1.వీతరాగః 2.యతయః - అనేవి 2 ప్రధాన అర్హతలు.

**1.వీతరాగః:-** రాగాన్ని విడిచిపెట్టటం. దేనిపట్ల రాగాన్ని విడిచిపెట్టాలి? ప్రాపంచిక విషయవస్తువుల పట్ల, భోగాల పట్ల గల రాగాన్ని, ఆసక్తిని విడిచిపెట్టాలి. దానినే వైరాగ్యం అంటారు. ఆ వైరాగ్యం కూడా పైపై వైరాగ్యం కాదు, నిజమైన వైరాగ్యం ఉండాలి. పైపై వైరాగ్యం వల్ల - ఆ పాత వైరాగ్యం వల్ల ప్రయోజనం లేకపోగా నష్టమే ఎక్కువ.

ఒక గ్రామంలో ఒక రైతున్నాడు. భార్య, ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలున్నారు అతడికి. ఒకరోజున భార్యాభర్తలిద్దరూ బాగా తగాదాపడ్డారు. కోపంతో భార్యను కొట్టాడు. ఆమె అలిగి మాట్లాడటం మానేసింది. సరిగ్గా వంట చెయ్యటం లేదు. ఏమీ పట్టించుకోవటం లేదు. దానితో కుటుంబ కార్యాలన్నీ కుంటుపడ్డాయి. ఇంట్లో అశాంతి ఎక్కువైంది. దానితో ఒక అర్థరాత్రి అతడు ఇల్లు విడిచిపెట్టి ఒక ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. ఆ ఆశ్రమాధిపతియైన స్వామిజీని కలిసి అతడికి నమస్కరించి తన అశాంతిని, ఆవేదనను వెళ్ళగ్రక్కి, తనకు సన్యాసం ప్రసాదించి మనశ్శాంతి కలిగించమని కాళ్ళమీద పడ్డాడు.

ఆ మహాత్ముడు ఈయన తీవ్రవైరాగ్యం కలవాడిగా భావించి లోలోపల ఎంతో సంతోషించి, అతడి అశాంతికి కారణం అడిగాడు. ఆత్మీయులెవరైనా దూరమయ్యారా? ఎవరైనా అవమానించారా? సంపదలను కోల్పోయావా? సుఖాలపై మొఖం మొత్తిందా? నిజం చెప్పు అన్నాడు.

దానికా రైతు, "గురుదేవా! నా భార్యతో కలసి కాపురం చేయలేను. అది పరమగయ్యాళిగా, రాక్షసిగా మారిపోయింది. అందుకే వచ్చేశా" అన్నాడు. "అయితే శాశ్వతంగా ఇక్కడే ఉండిపోతావా? కొన్నాళ్ళ తర్వాత

ఇదంతా మర్చిపోయి వెళ్ళిపోతావా?" అన్నాడు స్వామీజీ. సూర్యుడు పడమట ఉదయించినా సరే నేను తిరిగి వెళ్ళటం, దానితో కాపురం చేయటం జరగదు" అన్నాడు రైతు.

అప్పుడు గురువు "నాయనా! సన్యాసం మంచిదే. అయినా తొందర పడకూడదు. కొంతకాలం ఇంటివద్దనే ఉండి జపధ్యానాలు సాగించి, వైరాగ్యం దృఢ పడిన తరువాత సన్యాసం తీసుకొందువులే" - అన్నాడు. ఆ మాటలకు రైతు "నేను తిరిగి ఇంటికి వెళ్ళటమన్న ప్రసక్తే లేదు. ఇక్కడే జీవితాంతం ఉంటా" అన్నాడు.

అప్పుడు స్వామీజీ అన్నాడు, "నాయనా! ఒకవేళ కొన్నాళ్ళ తర్వాత నీ భార్య నీ దగ్గరకు వచ్చి, తాను తప్పు చేశానని అంగీకరించి, నిన్ను తిరిగి ఇంటికి రమ్మంటేనో!" అన్నాడు. "ఆ! అప్పటి సంగతి అప్పుడు ఆలోచిద్దాం" అన్నాడు. గురువుగారికి అర్థమైంది అతడిది ఎలాంటి వైరాగ్యమో. రెండు రోజులు ఆశ్రమంలో ఉంచుకొని ఇంటికి పంపించివేశాడు. స్మశానవైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం లాంటి వైరాగ్యాలు ఎందుకూ పనికిరావు.

నిజమైన వైరాగ్యం కలిగినవారే పరబ్రహ్మము నందు ప్రవేశించగలరు. విషయములందు దోషదృష్టిగలవారికే నిజమైన వైరాగ్యం. అట్టి వైరాగ్యవంతులకే అన్ని ప్రతిబంధకాలు తొలగి, అజ్ఞానం తొలగి, నేను పరబ్రహ్మాన్ని అనే అనుభూతి కలుగుతుంది. అదే పరమాత్మలో ప్రవేశం.

**2.యతయః :- వైరాగ్యంతో బాటు ప్రయత్నశీలుడు కావాలి. దృఢదీక్షతో సాధన సాగించాలి. పట్టుదలతో ప్రయత్నించిన వారికే ముక్తి - మోక్షం. సోమరిపోతుకు ఆధ్యాత్మిక రంగంలో స్థానం లేదు.**

**ఒక ఆశ్రమంలో గురువుగారు, కొందరు శిష్యులు ఉన్నారు. గురువుగారు ఒక కుటీరంలో, శిష్యులు 4 కుటీరాల్లో ఉంటున్నారు. ఒకనాడు సాయంకాలం మబ్బులు కమ్మి, పెనుగాలులతో గొప్పవర్షం కురిసింది. గురువుగారి కుటీరంపై కప్పిన 4 తాటిఆకులు గాలికి లేచిపోయినవి. దానితో వర్షపు చినుకులు పడి పుస్తకాలు, జపమాల, బట్టలు అన్నీ తడిసిపోయాయి. శిష్యుని పిలిచి "ఒరే నాయనా! ఆ తాటి ఆకులు వెతికి తెచ్చి కప్పరా!" అన్నాడు. దానికా శిష్యుడు "గురువుగారూ! ఇప్పుడు కటిక చీకటిగా ఉంది. కన్ను బొడుచుకున్నా కానరావటం లేదు. కనుక ఉదయమే వెతికి కప్పేస్తా" అన్నాడు. రాత్రి గడిచిపోయింది. తెల్లవారింది. గురువుగారు శిష్యుని కుటీరం వద్దకెళ్ళి నిద్రలేపి "ఒరే శంభూ! ఆ తాటియాకులు వెదికితెచ్చి కప్పరా నాయనా!" అన్నాడు. శిష్యుడు నిద్రలేచి "గురువుగారూ! ఇంకా చినుకులు పడుతూనే ఉన్నాయి గదా! వాటిని వెదికి తెచ్చినా కప్పటం కుదరదు గదా! వర్షం తగ్గగానే తెచ్చి కప్పుతాను" అన్నాడు. కాసేపటికి వర్షం పూర్తిగా తగ్గింది. కొంచెం ఎండ కూడా వచ్చింది. గురువుగారు మళ్ళీ గుర్తుచేశాడు. శిష్యుడు ఆలోచిస్తున్నాడు. సరే! ఇక శిష్యుడు పనిపూర్తి చేయాటానికి బయలుదేరుతున్నాడని అనుకున్నాడు గురువుగారు. కాని శిష్యుడు ఎంతసేపైనా కదలలేదు. "ఏమిరా! కదలటం లేదు" అన్నాడు గురువు. దానికా శిష్యుడు, "మహాత్మా! ఇప్పుడు**

వర్షం ఆగిపోయింది గదా! ఇంక ఆ తాటియాకులను వెదకటం, కప్పటం ఎందుకు? అంతగా వర్షం వస్తే ఈసారి చూసుకోవచ్చు గదా!" అన్నాడు. ఇదే సోమరితనం అంటే. ఆధ్యాత్మికరంగంలో తీవ్రప్రయత్నం కావాలి. దృఢమైన పట్టుదల ఉండాలి. ఆ తర్వాత చూద్దాం అనే సోమరితనం పనికిరాదు.

చిన్నవయస్సులో ఉన్నవారిని జపం చేయమన్నా, ధ్యానం చేయమన్నా ఇప్పుడే ఏం తొందరొచ్చింది? ఇంకా చాలా టయముంది గదా! అలాంటి వాటికి? అంటారు. కనుక ఎప్పుడు అవకాశం కుదిరితే అప్పుడే సాధన ప్రారంభించాలి. ప్రయత్నలోపం ఉండరాదు. అట్టి ప్రయత్నశీలురే విజయం సాధించగలరు.

(iii) యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి:- బ్రహ్మచర్యం అంటే సాధారణ అర్థం వీర్య రక్షణం. మనస్సు సుఖభోగాల వైపు పోకుండా ఉండటానికి ఇది మంచిదే. అయితే విశేషార్థం - అసలైన అర్థం - బ్రహ్మమునందు చరించుట. అంటే బ్రహ్మప్రాప్తి కొరకు సాధనలలో చరించుట అని. అంటే పరబ్రహ్మను చేరుకొనుటకు చేయవలసిన శ్రవణ, మనన, నిధిధ్యాసనలతో బాటుగ జపము, ధ్యానము, ఆత్మవిచారణ, సాక్షీభావన, నిర్వికల్ప సమాధి మొ||న అనేక సాధనలలో చరించుటయే బ్రహ్మచర్యం. పరమాత్మ స్థానమైన పరమపదాన్ని చేరుకోవాలనే కోరికతో నిరంతరము బ్రహ్మము నందు చరించాలి.

(iv) తత్ పదం తే సంగ్రహేణ ప్రవక్ష్యే:- ఆ పరమపదాన్ని గూర్చి నీకు సంగ్రహంగా చెప్పబోతున్నాను.

ఏపరమపదాన్ని గురించి వేదవిదులు చెబుతున్నారో, వైరాగ్యవంతులు ప్రయత్నంతో ఏపదాన్ని ప్రవేశించాలనుకుంటున్నారో, దేనిని కోరి బ్రహ్మమునందు నిరంతరము చరిస్తూ ఉంటారో, అట్టి పరమపదాన్ని గురించి సంగ్రహంగా చెప్పబోతున్నాను అని భగవానుడంటున్నాడు. ఇక్కడ పరమపదాన్ని గురించి చెప్పబోతున్నాను అంటే ఆ స్థానాన్ని గురించి చెప్పటం కాదు, ఆ స్థానాన్ని ఎలా చేరుకోవాలో తెలియజేయబోతున్నాడు. అందుకే ప్రణవోపాసన గురించి - నిర్గుణ పరబ్రహ్మాన్ని గురించి తరువాత శ్లోకాలు చెబుతున్నాయి.

ఓంకారోపాసన ఎలా చేయాలో, పరబ్రహ్మాన్ని అందుకొనే సాధన ఏమిటో తరువాతి 2 శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు.

**శ్లో||** సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ|
మూర్ధ్నాధా యాత్మ నః ప్రాణం ఆస్థితో యోగ ధారణాం|| (12)

**శ్లో||** ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్|
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిం|| (13)

**తా||** అన్ని ద్వారాలను స్వాధీనంలో ఉంచుకొని, మనస్సును హృదయంలో నిల్పి, శిరస్సులో ప్రాణాన్ని నిలబెట్టి, యోగనిష్ఠను అవలంబించి, ఓం అనే ఏకాక్షర బ్రహ్మమును ఉచ్ఛరిస్తూ, నన్ను స్మరిస్తూ, ఎవరు దేహాన్ని వదిలి ప్రయాణం చేస్తారో అతడు పరమగతిని చేరుకుంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** పరమపదాన్ని - పరమగతిని - పరబ్రహ్మాన్ని చేరుకొనే సాధన ఏమిటో ఇక్కడ ఒక క్రమపద్ధతిలో తెలియజేస్తున్నారు. అవి -

1.అన్ని ఇంద్రియ ద్వారాలను స్వాధీనంలో పెట్టుకొనుట.

2.మనస్సును హృదయంలో నిలబెట్టుట.

3.ప్రాణమును శిరస్సు నందు నిలబెట్టుట.

4.యోగనిష్ఠను అవలంబించుట.

5.'ఓం' అనే ప్రణవాన్ని - ఏకాక్షర బ్రహ్మాన్ని ఉచ్ఛరించుట.

6.నన్ను మరల మరల స్మరిస్తూ దేహాన్ని వదలి ప్రయాణించుట.

1.అన్ని ఇంద్రియద్వారాలను స్వాధీనంలో పెట్టుకొనుట:- ద్వారాలంటే ఇంద్రియద్వారాలే. మనవద్ద 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు ఉన్నాయి. వీటిని ద్వారాలని ఎందుకన్నారు? ఈ దేహమనే ఇంటిలోనికి బయటి విషయాలు లోపలికి రావాలంటే జ్ఞానేంద్రియాలనే 5 ద్వారాలున్నాయి. అలాగే లోపలి విషయాలను బయటకు వదలటానికి కర్మేంద్రియాలనే 5 ద్వారాలున్నాయి. రావలసినవి వచ్చేందుకు, పోవలసినవి పోయేందుకు ఇవి మార్గాలు కాబట్టే వీటిని ద్వారాలన్నారు.

ఇంటిలోనికి పందులను, కుక్కలను, గాడిదలను, దొంగలను రానివ్వకుండా ఆ ద్వారాలకు మనం తలుపులు అమర్చుకుంటాం. మరి ఈ ఇంద్రియద్వారాలకు అలాంటి తలుపులు లేవు. అదుపూ ఆజ్ఞాలేకుండా అడ్డదిడ్డంగా అన్నీ దూరి దేహమనే ఇంటిని సర్వనాశనం చేసే విషయాలు లోపలికి రాకుండా ఉండాలంటే మనమే ఈ ద్వారాలను సంయమం

చేయాలి. స్వాధీనంలో ఉంచుకోవాలి. అయితే కొన్నింటిని స్వాధీనంలో ఉంచుకొని, కొన్నింటిని వదిలేస్తే ప్రయోజనం లేదు. అందుకే అన్నింటిని స్వాధీనంలో ఉంచుకోవాలి. సర్వద్వారాణి సంయమ్య అన్నది అందుకోసమే.

ఇక్కడ సంయమం చేయమన్నారే గాని అరికట్ట మనలేదు. అరికట్టటమంటే ఇంద్రియాలనన్నింటిని బిగబట్టి - ఉగ్గబట్టి బొత్తిగా పని చేయించకుండా ఉండటం. అది అసాధ్యం. సంయమం అంటే మన స్వాధీనంలో ఉంచుకొని, మన ఇష్టప్రకారం నడపటం.

గుర్రాన్ని బండికి కట్టి ఊరికే బండిలో కూర్చుంటే ఆ గుర్రం బండిని ఎలాబడితే అలా నడిపి ఏ గోతిలోనో పడేస్తుంది. అలాగని ఆ గుర్రాన్ని ఒక గుంజకు కట్టేస్తే బండి కదలదు. కనుక గుర్రాన్ని ఫ్రీగా కదలనీయాల్సిందే. అయితే పగ్గం తన చేతిలో పెట్టుకొని తన ఇష్టం వచ్చిన దిక్కుగా నడపాలి. అదే సంయమం అంటే. స్వాధీనంలో ఉంచుకోవటం అంటే. అదేవిధంగా మనం మన మనస్సు అనే పగ్గంతో ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొని నడపాలి.

ఒకడు ఇష్టం వచ్చినట్లు వాగుతుంటాడు. ఆ వాగుడుతో ఇతరులను ద్వేషిస్తాడు, మాటలతో హింసిస్తాడు, విమర్శిస్తుంటాడు. అనేక అబద్ధాలు దొర్లుతుంటాయి. పాపం మూటకట్టుకుంటాడు. ఇవన్నీ ఆగిపోవాలంటే ముందు వాగుడు ఆగాలి. అంటే మౌనం పాటించాలి. అయితే ఎప్పుడూ మౌనమే అయితే భగవంతుడిచ్చిన వాక్కును వృధా చేసుకున్నట్లే. అందువల్ల జాగ్రత్తగా అవసరమైన మాటలు మాట్లాడాలి. భగవత్ సంబంధమైన

విషయాలు మాట్లాడాలి. కొందరు మౌనవ్రతం పాటిస్తున్నాం అనుకొని నోరుమాట్లాడకుండా మనస్సును బాగా మాట్లాడిస్తుంటారు. ఒక్కమాటతో సరిపోయే దానికి 20 రకాల సైగలు చేస్తూ, పలక మీద వ్రాస్తూ నానాతిప్పలు పడతారు. ఇక భగవత్ సంబంధమైన పూజలు, పారాయణలు, స్తోత్ర పాఠాలు మొ||న వాటి విషయంలో మూగనోము పాటించి వాటిలో మాత్రం పాల్గొనకుండా ఉంటారు. ఇదొక మూర్ఖత్వం. అవసరమైన, దైవసంబంధమైన వాటిని మాట్లాడుతూ అనవసరమైన వాటిని మాట్లాడకుండా ఉండటమే నిజమైన మౌనం. నిజమైన సంయమం.

2.మనోహృది నిరుధ్యచః- మనస్సును హృదయంలో నిలబెట్టుట మరొక ముఖ్యసాధన. బయటనున్న విషయాలు లోపలికి చేరకుండా ఇంద్రియద్వారాలను నిగ్రహిస్తాం. బాగానే ఉంది. అంతమాత్రాన మనస్సు విషయాలను చింతించకుండా ఉంటుందా? ఉండదు. ఎందుకంటే మనస్సు ఇంతకు పూర్వమే కొన్ని విషయవాసనలను సేకరించుకొని ఉన్నది. ఆ వాసనల ప్రేరణతో మనస్సు నిరంతరం విషయచింతనం సాగిస్తూనే ఉంటుంది. కనుక ఈ మనస్సును కూడా నిరోధించాలి. వదిలేయాలి. ఎక్కడ వదలాలి ఈ మనస్సును? హృది - హృదయంలో. హృదయం అంటే గుండెకాయ కాదు. ఆత్మ. ఆత్మలోనే వదలాలి. ఇంతకూ మనస్సంటే ఏమిటి? ఆత్మ అంటే ఏమిటి? ఆత్మ సముద్రం అయితే మనస్సు అల. అల సముద్రంలోనే లేచి పరుగులు తీసి సముద్రంలోనే అణగిపోతుంది. అలాగే మనస్సు ఆత్మలో నుండే లేచి అనేక ఆలోచనలనే పరుగులు తీస్తూ ఉంటుంది. అది గనుక ఆత్మ

అనే సముద్రంలో పడిపోయిందా ప్రశాంత గంభీరమవుతుంది. ఆత్మయే అవుతుంది. కనుక అల వంటి ఈ మనస్సును సముద్రం వంటి ఆత్మలో వదలాలి. దానికి ప్రయత్నం చెయ్యాలి. అభ్యాస వైరాగ్యాలతో సాధన చెయ్యాలి.

మనస్సు యొక్క స్వస్థానం ఆత్మయే గనుక ఆత్మను చేరితే చాలు మనస్సు యొక్క చలనం ఆగిపోతుంది. అందుకు చేయవలసింది నిరంతర ఆత్మచింతన. నిరంతర ఆత్మచింతనకు ఆటంకం ప్రాపంచిక విషయాలే గనుక వాటిపట్ల వైరాగ్యాన్ని అభ్యసించాలి. ఇలా వైరాగ్యభావనతో మనస్సు నిరంతరం ఆత్మచింతన చేయుటయే 'మనో హృది నిరుధ్యచ'.

దోషాలతో కూడిన మనస్సు యొక్క ఉనికియే బంధం.

దానిని వదలివేయుటయే మోక్షం.

3.మూర్ధ్న ఆదాయ ఆత్మనః ప్రాణం:- తన ప్రాణములను శిరస్సునందు నిలబెట్టుట. ప్రాణశక్తిని భ్రూమధ్యంలో నిలబెట్టి దేహాన్ని విడిచిపెట్టే హఠయోగులు పరమపురుషుణ్ణి పొందుతారని ఇంతకుముందు 10వ శ్లోకంలో చెప్పారు. అన్నింటికన్న పైన ఉండే చక్రం సహస్రారం. ప్రాణశక్తిని సుషుమ్నానాడి గుండా ఆజ్ఞాచక్రానికి చేర్చి, అక్కడి నుండి ఒక్కొక్క కోశాన్ని దాటిస్తూ సహస్రారానికి చేర్చి, అక్కడ నిలబెట్టి ఓంకార ధ్యానం చేస్తూ పరమాత్మను చింతిస్తూ ప్రాణాలు వదిలేస్తే కపాలభేదనం జరిగి బ్రహ్మరంధ్రం గుండా స్వేచ్ఛగా వెళ్ళిపోయి పరమపదంలో లీనమైపోతారు.

ఇక జ్ఞానమార్గంలో మూర్ధ్న అంటే 'మూర్తం అస్మిన్ ధీయతే' అని వ్యుత్పత్తి అర్థం. అంటే 'ఆకారాలన్ని ఇందులో నిలిచి ఉంటాయి' అని. నగల ఆకారాలన్నీ నిరాకార బంగారంలో, కుండల ఆకారాలన్నీ నిరాకార మట్టిలో, అలల ఆకారాలన్నీ నిరాకర సముద్రంలో నిలిచినట్లు ప్రపంచంలోని ఆకారాలన్నీ నిరాకార పరమపదంలో నిలిచిఉంటాయి. ఆ పరమపదం ఏదో తెలుసుకోటానికి తన శక్తిని కేంద్రీకరించటమే ప్రాణాన్ని నిలిపి ఉంచటం.

**4.యోగధారణాం ఆస్థితః:-** ఆ తర్వాత యోగధారణను అవలంబించాలి. ఏకాక్షరమైన ఓంకారంలో మనస్సును పూర్తిగా నిలిపివేయటమే యోగధారణం. ప్రపంచరూపంలో విస్తరించుకొని యున్న నాశరహిత పరమాత్మయే ఏకాక్షర బ్రహ్మ. అదేమిటో తెలుసుకోవాలంటే నేనెవరు? అనేది తెలుసుకోవాలి. అదే రమణ మహర్షి సూచన. ఇలా ధ్యానంలో కూర్చొని నేనెవరు? అనే ప్రశ్నకు సమాధానం వెతుకుతూ దేహధ్యాసను వదిలితే నిర్వికల్ప నిర్బీజ సమాధిలో ఆత్మను తెలుసుకొంటాడు. జీవన్ముక్తుడౌతాడు. ఇలా యోగధారణ నవలంబించి ఏంచేయాలి? -

**5.ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్:-** ఓం అనే ఏకాక్షర బ్రహ్మన్ని ఉచ్ఛరించాలి. ఓం అనేది ఏకాక్షరం. ఏకాక్షరం అంటే ఒక అక్షరం అనికాదు; ఏకము - అక్షరము అని అర్థం. అక్షరమైనది పరమాత్మే. అట్టి పరమాత్మను - ఏకాక్షరాన్ని ఉచ్ఛరించాలి. ఓంకారోచ్ఛారణ అంటే ఓంకార జపమే. ఏమిటి దీనివల్ల ప్రయోజనం? జపతో నాస్తి పాతకం - అన్నారు. జపం చేస్తే పాపం పోతుంది.

పాపం పోతుంది గాని పరమాత్మ ప్రాప్తి ఎలా? అందుకే మాం అనుస్మరన్ అని కూడా చెప్పారు.

అంటే ఓంకారాన్ని కేవలం ఉచ్చరిస్తే చాలదు. మరల మరల స్మరించాలి. దాని యొక్క స్వరూపాన్ని - ప్రతీకాన్ని మననం చేసుకోవాలి. అందుకే పతంజలి మహర్షి "తత్ జపః తదర్థ భావనం" అన్నాడు. జపించడం, అర్థాన్ని భావన చేయటం రెండూ ఒకేసారి ఎలా సాధ్యం? కొత్తలో కష్టంగా ఉంటుంది. తరువాత తరువాత అలవాటవుతుంది. అర్థభావన జపానికి ఎంతో సహాయకారి అవుతుంది.

మంత్రజపం వల్ల మాంసమయమైన శరీరం మంత్రమయమవుతుంది. అయితే ఏమిటి లాభం? పచ్చికుండ దేనికీ పనికిరాదు. కాల్చితేనే పనికి వస్తుంది. అలాగే పచ్చికుండలాంటి మాంసమయదేహం పరమార్థానికి పనికిరాదు. మంత్రమయమైతేనే పనికి వస్తుంది. మరొక విశేషం ఉంది.

పచ్చికుండ పగిలితే ఆ ముక్కలతో మళ్ళీ మళ్ళీ కుండను చేయవచ్చు. కాలిన కుండ పగిలితే ఆ ముక్కలతో ఇక కొత్తగా కుండను చేసే వీలులేదు. అలాగే మాంసమయ శరీరం పోతే మళ్ళీ మళ్ళీ శరీరాలు వస్తాయి. కాని మంత్రమయ శరీరం పోతే తిరిగి శరీరాలు రావు. జన్మరాహిత్యమే. మోక్షమే. కనుక సాధకులందరూ జపసాధనను వదలకుండా సాగించాలి.

ఇలా జపధ్యానాలను ఎవరు కొనసాగిస్తారో - అలా చేస్తూ చేస్తూ దేహాన్ని వదులుతారో వారే పరమగతిని పొందుతారు.

యః:- ఎవరైతే అనటం వల్ల అయ్యో! మేం స్త్రీలం గదా! శూద్రులం గదా! అని చింతించనక్కర లేదు. జాతి, మత, వర్ణ, వర్గ, కుల, లింగ భేదాలతో నిమిత్తం లేకుండా సాధనలను ఎవరైనా సాగించవచ్చు.

అంతా విన్న అర్జునునికి ఒక సందేహం. కృష్ణా! ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకోమంటున్నావు; మనస్సును ఆత్మలో కలిపేయమంటున్నావు; ప్రాణాన్నిబ్రహ్మరంధ్రంలో నిలబెట్టమంటున్నావు; యోగనిష్ఠలో నిలవమంటున్నావు. ఇవన్నీ నాకెక్కడ కుదురుతాయి. యుద్ధం చేస్తూ చేస్తూ ఉంటే ఎప్పుడు మృత్యుఘంటికలు మ్రోగుతాయో తెలియదు. నాకే గాదు ప్రపంచంలో ఎవ్వరికైనా ఇవి ఎలా సాధ్యం? లోకంలో ఎందరో దరిద్రులున్నారు. ఒక్కక్షణం విశ్రాంతి లేకుండా జీవనపోరాటం సాగించాలి. వారేం యోగం చేయగలుగుతారు? అనే భావాన్ని వ్యక్తం చేస్తుంటే - ఆ సందేహాన్ని తీర్చటానికి భగవానుడు సమాయత్తమవుతున్నాడు.

ఎలాంటి వారైనా సరే భగవంతుని చేరుకొనే సులభమార్గం ఏమిటి?

**శ్లో||** అనన్య చేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః|

తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః|| **(14)**

**తా||** అర్జునా! ఎవరైతే ఇతర విషయాలలోనికి పోని మనస్సుతో నిత్యము, నిరంతరము నన్ను స్మరిస్తారో నిత్యయుక్తుడైన అట్టి యోగికి నేను సులభుడను.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** మోక్షాన్ని పొందటం, భగవత్ సాక్షాత్కారం అసాధ్యమని భావించి నిరాశానిస్పృహలతో ఉన్నవారికి; గొప్ప గొప్ప సాధనలు గాని, శాస్త్ర విషయాలుగాని అంతగా తెలియని సామాన్యులకు భగవంతుని అందుకొనే సులభమార్గం ఏమిటో ఇక్కడ తెలియజేస్తున్నారు.

అనన్యచిత్తంతో నిత్యము, నిరంతరము భగవంతుని గురించి చింతన చేయుటయే ఆ సులభమైన ఉపాయం.

మరి ఇంతకు ముందు గొప్పగొప్ప సాధనలు చెప్పారు గదా! ఇప్పుడు తేలికగా అందరికీ అనుకూలమైన సాధన చెబుతున్నారు. ఇంతకూ ఏది నిజం? తేలికమార్గం ఉంటే కష్టమైన మార్గం చెప్పటం ఎందుకు?

రెండు స్థాయిల్లో రెండూ సత్యమే. అన్ని అర్హతలు పొంది, అత్యుత్తమ సాధనలు చేయగలవారు తక్షణమే ఆత్మసాక్షాత్కారాన్ని - జీవన్ముక్తిని పొందుతారు. అంతటి సాధనలు చేయలేనివారు, శాస్త్రం అంతగా తెలియనివారు జీవన్ముక్తిని సాక్షాత్తుగా - తక్షణమే పొందరు. అయితే జీవన్ముక్తిని పొందటానికి ఏసాధనలు చేయాలో ఆ సాధనలు చేసే అర్హతను సంపాదిస్తారు. దానితో గొప్ప గొప్ప సాధనలు చేసి ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతారు. మరి ఈ సులభమార్గం ఏమిటి?

(i) అనన్యచేతా:- భగవంతుని గురించి తప్ప ఇతర లౌకికవిషయాల గురించిన ఆలోచనలు మనస్సులోకి రాకూడదు, చూచినా, చదివినా, విన్నా, చెప్పినా, చేసినా - అన్నీ భగవంతునికి సంబంధించిన కర్మలను, ఆలోచనలనే చేయాలి.

పేడపురుగు ఎప్పుడూ పెంటకుప్పల్లోనే ఉన్నట్లు కొందరి ఆలోచనలు ఎప్పుడూ లౌకిక విషయాలలోనే ఉంటుంది. ఈగ కొద్దిసేపు బెల్లం మీద, కొంతసేపు పెంటకుప్పలమీద వాలినట్లు కొందరి మనస్సు కొద్దిసేపు భగవంతునిపైన, కొద్దిసేపు లౌకిక విషయాలపైన వాలుతుంది. తేనెటీగ పుష్పాలలోని మకరందాన్ని పీల్చుకొని మాత్రమే జీవించినట్లు అతికొద్ది మంది ఎల్లప్పుడూ భగవంతుని యందే తమ చిత్తాన్ని నిలుపుతారు. ఇలా ఉండాలి.

ఇట్టి యోగి మాత్రమే నన్ను చేరుకుంటాడు అని భగవానుడు తెలియజేస్తున్నాడు. 'నన్ను మరువని వాణ్ణి నేను మరువను' - ఇదే భగవంతుని నిష్ఠ. మనం మనచిత్తాన్ని భార్యకో, భర్తకో, బిడ్డలకో, ఇంటికో, ధనానికో, పదవులకో, భోగాలకో, మంచి తిండికో, పరోపకారానికో, రాజకీయలకో, గూండాగిరికో ఇస్తూనే ఉంటాం. కాని భగవంతుడికివ్వవయ్యా అంటే తంటా వచ్చి పడుతున్నది. తరిచటం అంటే తోటకూర కొనుక్కున్నంత తేలికకాదు. మోక్షం అంటే మార్కెట్ లో అమ్మే వస్తువు కాదు డబ్బుపారేసి కొనుక్కోటానికి. దాన్ని మనస్సు పారేసి కొనుక్కోవాల్సిందే.

సముద్రంలో పడవఎటు ప్రయాణిస్తున్నా దిక్సూచి మాత్రం ఉత్తరంవైపే చూపినట్లు మనం దేహంతో ఏ పనులు చేస్తున్నా చిత్తం పరమాత్మయందే ఉండాలి. మనస్సు భగవంతుని దిక్కునే చూపాలి.

పతివ్రతా స్త్రీ అన్నింటిని ప్రేమిస్తున్నా అసలైనప్రేమ భర్త మీదనే. పురోహితుడు ఏపూజలు, వ్రతాలు చేయిస్తున్నా ప్రేమ అంతా దక్షిణ మీదనే. వ్యాపారస్తుడు ఏమాటలు మాట్లాడుతున్నా దృష్టి అంతా వచ్చే లాభం మీదనే.

భక్తుడు ఏం తింటున్నా ఎక్కడ తిరుగుతున్నా ఏమి చేస్తున్నా, ఏమి మాట్లాడుతున్నా దృష్టి అంతా భగవంతుని మీదనే ఉండాలి.

భగవంతుని ప్రేమను పొందాలంటే మన ప్రేమనంతా భగవంతునికే సమర్పించాలి. కొంత భగవంతునికి, కొంత ప్రపంచానికి ఇస్తానంటే కుదరదు.

ఒక యజమాని తన వంటవాణ్ణి పిలిచి, "అరే! ఈరోజు కోడికూర తినాలని ఉంది. మన దగ్గర మంచి కోడి ఉందిగదా! దాన్ని సగంకోసి కూరచెయ్యి. మిగతా సగం గ్రుడ్లుపెట్టేందుకు ఉంచు" అన్నాడట.

పాపం వంటవాడు ఎంత వినయవిధేయతలు గలవాడైనా ఎలా కుదురుతుంది? అందుకే అన్నాడు. "బాబయ్యా! తిండి మీద ఆశ ఉంటే గ్రుడ్ల మీద ఆశ వదులుకోవాలి. గ్రుడ్ల మీద ఆశ ఉంటే తిండి మీద ఆశ వదులుకోవాలి. మీరు అవ్వాకావాలి. బువ్వా కావాలి అంటే ఎలాగండీ!" అన్నాడు.

కనుక ఏదో ఒకదాని మీదనే మనస్సు నుంచాలి. పరమాత్మా? ప్రపంచమా? ఏదో ఒకటి తేల్చుకోవాల్సిందే.

భగవంతుని యందే చిత్తాన్ని నిలపాలి. అయితే ఎలా నిలపాలి?

(ii) నిత్యశః సతతం:- నిత్యమూ - ఎల్లప్పుడూ (నిరంతరము)

---

ఏదో ఒక రోజున - లేదా అప్పుడొక రోజు అప్పుడొక రోజు భగవత్ చింతనచేస్తే చాలదు. లేదా ప్రతిరోజూ కొద్దిసేపు - Time ప్రకారం భగవత్ చింతన చేసినా చాలదు. ప్రతిరోజూ, రోజంతా భగవచ్చింతన సాగిపోవాల్సిందే. అంతేగాని 'సంకట మొస్తే వెంకట రమణ' అన్నట్లు కష్టాలు

వచ్చినప్పుడో, కోరికలు తీరనప్పుడో భగవంతుని స్మరిస్తే అది నిజమైన భగవత్ చింతన కాదు.

(iii) నిత్యయుక్తస్య యోగినః:- ఇలా నిత్యము, నిరంతరము భగవత్ చింతన చేసే వానినే నిత్యయుక్తుడైన యోగి అంటారు. అట్టివానికి కలిగే ఫలం ఎలాటింది?

(iv) తస్యాహం సులభః:- అలాంటి నిత్యయోగులకు నేను సులభుణ్ణి. అంటే నన్ను తేలికగా చేరుకోవచ్చు - అని. అయితే ఇలా ఎంతకాలం చేయాలి? అనే సందేహం వస్తుంది.

స్వామీ 12 సం||ల నుండి జపం చేస్తున్నాను. ఇంకా ఎన్నాళ్ళు చేయాలి? అని ఒక భక్తుడు రమణమహర్షిని అడిగాడట. దానికి ఆయన, "నేను జపం చేస్తున్నాను - అనే భావన నీ మనస్సులో నుండి తొలగిపోయేవరకు చేయాలి" అన్నాడట. కనుక సాధన ఎంతో సహజంగా సాగాలి. చింతన ఎంతో సహజంగా ఉండాలి. ఇలా చింతన చేసి భగవంతుని చేరుకోవటం వల్ల ప్రయోజనం?

నిత్యము, నిరంతరము అనన్య చిత్తంతో భగవంతుని స్మరిస్తే భగవంతుని చేరుకుంటాం. దానివల్ల ప్రయోజనం?

శ్లో|| మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం|
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః|| (15)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** నన్ను చేరుకున్న మహాత్ములు ఉన్నతోన్నతమైన మోక్షసిద్ధిని పొందినందువల్ల దుఃఖాలకు నిలయము, అశాశ్వతము అయిన పునర్జన్మను పొందరు.

**వ్యాఖ్య:-** మహాత్మనః:- ఎవరైతే అనన్య చిత్తంతో నిత్యము, నిరంతరము భగవంతుని చింతిస్తూ ఉంటారో వారే మహాత్ములు. అట్టి మహాత్ములే భగవంతుని చేరుకోగలరు. భగవంతుని చేరుకోవటం. అంటే భగవంతునితో ఐక్యమై అలా ఉండిపోవటమే. అలా ఉంటే ఇక జన్మ అనేది లేదు. రాదు.

మళ్ళీ జన్మ ఉంటే నష్టమేమిటి? ఇది దుఃఖాలయం - అశాశ్వతం. మనకు రామాలయం, కృష్ణాలయం తెలుసుకదా! అలాగే ఈ దేహం (జన్మ) దుఃఖాలయం. రాముడుండేది రామాలయం; కృష్ణుడుండేది కృష్ణాలయం; శివుడుండేది శివాలయం; దుఃఖాలుండేది దుఃఖాలయం. అంటే జన్మ వచ్చింది - అంటే దుఃఖాలు తప్పవు. జన్మించేటప్పుడు జన్మ దుఃఖం; ముసలితనం వస్తే జరాదుఃఖం; వ్యాధులొస్తే వ్యాధిదుఃఖం, మరణ సమయంలో మరణ దుఃఖం, ఇవిగాక దేహాన్ని వదిలిన తర్వాత నరకయాతనలు అనుభవించాల్సివస్తే నరక దుఃఖం; తిరిగి జన్మించటానికి ఎంతో దుఃఖం, తల్లి గర్భంలో గర్భనరకం - ఇలా ఎన్నో దుఃఖాలు. అందుకే జన్మలన్నీ దుఃఖమయాలు.

ఇక ఈ జన్మలలో సుఖాలు లేవా? అంటే ఉంటాయి. అయితే అవి అశాశ్వతం. ప్రాపంచిక సుఖాలన్నీ దుఃఖాలతో కూడుకొనే ఉంటాయి. అజ్ఞానులు వేటిని సుఖాలు అనుకుంటారో, జ్ఞానులు వాటినే దుఃఖాలు అని గ్రహిస్తారు.

కనుక ప్రపంచంలోని సుఖాలను చూసి మోసపోకండి. అందులో సుఖమున్నదని భావించి, వాని వెంట పరుగెత్తి జీవితాలను నాశనం చేసుకోవద్దు. అవి దుఃఖాలయాలే గాని సుఖాలయాలు కాదు. అయితే దుఃఖాలతో కూడిన ఈ జన్మలు ఎంతవరకు? భగవత్ప్రాప్తి కలిగేంత వరకు ఈ జన్మలు తప్పవు. ఈ జన్మను వదిలితే మళ్ళీ జన్మ సిద్ధం. చేసిన కర్మల యొక్క ఫలితాలను బట్టి అనేకరకాల జన్మలు వస్తుంటాయి. చక్రవర్తి అయినా సరే తలపై కిరీటమే గాని, తల నిండా సంకటాలే. కనుక ఎంత వారికైనా దుఃఖం తప్పదు.

ఇట్టి దుఃఖపూరిత జన్మలు మళ్ళీ మళ్ళీ కలగకుండా ఉండాలంటే పరమసిద్ధిని - మోక్షాన్ని పొందాలి. మోక్షాన్ని పొందాలంటే పరమాత్మ సులభుడు కావాలి. పరమాత్మ సులభుడు కావాలంటే అనన్యచిత్తంతో ఆయనను నిత్యము, నిరంతరము స్మరించాలి.

నిజంగా ఈ జీవితం ఒక సత్రం లాంటిది. సామాన్యంగా సత్రంలో 3 రోజులు ఉండనిస్తారు. తరువాత దయ చేయమంటారు. అలాగే ఈ జీవితంలో బాల్యం 1 రోజు, యవ్వనం 1 రోజు, వృద్ధాప్యం ఒకరోజు. ఈ 3 రోజులు దాటితే - మున్నాళ్ళముచ్చట ముగిసిపోతే యమధర్మరాజు వచ్చి ఈ జీవితమనే సత్రం నుండి బలవంతంగా సాగనంపుతాడు. ఆ తరువాత ఎక్కడికి వెళ్ళాలో ఇప్పుడే నిశ్చయించుకున్నవాడు తెలివిగలవాడు.

నీవు వెళ్ళటానికి 3 స్థానాలున్నాయి. 1.నరకం. 2.స్వర్గం. 3.మోక్షం. పాపం చేస్తే నరకం. పుణ్యం చేస్తే స్వర్గం. జ్ఞానం పొందితే మోక్షం.

తెలివిగలవారు తిరిగి జన్మించే పనిలేని మోక్షాన్నే కోరుకుంటారు. కనుక పాపాన్ని పారద్రోలి, పుణ్యాన్ని ఆర్జించి, జ్ఞానాన్ని సముపార్జన చేసి మోక్షాన్ని పొందాలి. ఇదంతా ఈ 3 రోజుల సత్ర కాపురంలోనే పూర్తిచేయాలి.

పునర్జన్మ పొందని వారెవరు? పొందేవారెవరు?

**శ్లో||** ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!|
మాముపేత్యతు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే|| **(16)**

**తా||** అర్జునా! బ్రహ్మలోక పర్యంతం ఉండే లోకాలన్నీ తిరిగి తిరిగి వచ్చేవే. కౌంతేయా! నన్ను చేరుకున్నట్లైతేనో ఇక పునర్జన్మ అనేదే లేదు.

**వ్యాఖ్య:-** తాను చెప్పే భావాలు వినే వారి మనస్సులలో గాఢంగా నాటుకోవాలి. దానికై రెండు పరస్పర వ్యతిరేక భావాలు చెబితే శిష్యుడు వాటిని పోల్చి చూచుకొని ఆ భావాలను మనస్సులో గాఢంగా నిలుపుకుంటాడు. అందుకే భగవానుడిక్కడ బ్రహ్మలోక పర్యంతం ఏలోకానికి వెళ్ళినా తిరిగి రావలసిందే. నన్ను చేరుకుంటే మాత్రం తిరిగి వచ్చే పనిలేదు - అంటున్నాడు.

ఇది జగద్గురువు శ్రీకృష్ణుని స్టైల్. చెప్పే పద్ధతి. ఆధ్యాత్మిక భావాలను మనస్సులోకి ఎక్కించే పద్ధతి.

ఆ బ్రహ్మ భువనాల్లోకాః:- బ్రహ్మలోక పర్యంతం ఉన్న లోకాలు మొత్తం 14. భూలోకం మధ్యలో 7వదిగా ఉన్నది. భూలోకానికి క్రింద 7 లోకలున్నాయి. వాటిని అధోలోకాలంటారు. అవే అతల, వితల, సుతల, రసాతల, తలాతల,

మహాతల, పాతాళ లోకాలు. ఇక భూలోకం - దానిపైన ఆరు ఊర్ధ్వలోకాలు మొత్తం 7 లోకాలున్నాయి. అవే భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్య లోకాలు. ఈ 14 లోకాలతో కూడినదే బ్రహ్మాండం అంతా. భూలోకంలో ఉన్న మనం సత్కార్యాలు చేసి ఊర్ధ్వలోకాలకు వెళ్ళి సుఖభోగాలు అనుభవించవచ్చు. అలాగాక దుష్కార్యాలు చేస్తే దేహం విడిచిన తర్వాత అధోలోకాలకు వెళ్ళి నరకయాతనలు అనుభవించవచ్చు. అయితే ఏ లోకానికి వెళ్ళినా అన్నీ తిరిగివచ్చే లోకాలే. పునరావర్తి ఉన్న లోకాలే.

ఈ సందర్భంలో బ్రహ్మలోకం తప్ప మిగిలినవి తిరిగి వచ్చే లోకాలని కొందరు; బ్రహ్మలోకంతో సహా అన్నీ తిరిగివచ్చేవే అని మరికొందరు వ్యాఖ్యానిస్తున్నారు. మొదటి భావాన్ని ఒకరిద్దరు ద్వైతపండితులు, ఆర్య సామాజికులు మాత్రం చెబుతున్నారు. రెండవ అర్థాన్ని శంకరాచార్యులు, ఆనందగిరి, మధుసూదన సరస్వతి, శ్రీధర స్వామి, జ్ఞానదేవుడు, తిలక్ మొ||న వారెందరో చెప్పటం జరిగింది.

జాగ్రత్తగా విశ్లేషణ చేసి చూస్తే బ్రహ్మలోకం వరకు ఉన్న లోకాలన్నీ తిరిగి వచ్చేవి, నన్ను చేరుకుంటే తిరిగి వచ్చే పనిలేదు అని రెండు పరస్పర విరుద్ధవిషయాలు చెప్పినందున బ్రహ్మలోకంతో సహా అన్నీ తిరిగి వచ్చేవేనని స్పష్టమౌతున్నది. అలాకానిచో బ్రహ్మలోకం మాత్రం తిరిగి వచ్చేది కాదు, మిగిలినవి తిరిగి వచ్చేవి అని చెప్పి ఉండాలి. పైగా నన్ను పొందితే మాత్రం తిరిగి వచ్చే పనిలేదు అని చెప్పటంవల్ల లోకాలన్నీ తిరిగి వచ్చేవే అనే విషయం సందేహరహితం.

సృష్టికర్త బ్రహ్మదేవుడు అన్నింటికన్న పైనున్న సత్యలోకంలో కూర్చొని సృష్టి చేస్తున్నాడు. ఆయన కాలం తీరినప్పుడు ఆయన చేసిన ఈ సృష్టితో పాటు - అంటే అన్ని లోకాలతో పాటు పరమాత్మలో లీనమౌతాడు. అంటే అన్నిలోకాలు బ్రహ్మతో పాటు మాయమై పోతాయి. తిరిగి క్రొత్త బ్రహ్మ వచ్చినప్పుడు ఈ అన్ని లోకాలు, జీవుళ్ళు అంతా వ్యక్తమౌతారు. అంటే బ్రహ్మలోకము, బ్రహ్మ మళ్ళీ మళ్ళీ వచ్చే వారైనప్పుడు ఆ బ్రహ్మలోకంలోని వారు రాకుండా ఎక్కడికి పోతారు? కనుక ఏ లోకానికి చేరినా తిరిగి రావలసిందే, జన్మనెత్తవలసిందే, సుఖదుఃఖాలు అనుభవించవలసిందే. దీనిని బట్టి ఎటువంటి పుణ్యకార్యాలు చేసినా జీవభావం ఉన్నంతవరకు ఏదో ఒక లోకానికి పోతూవస్తూ ఉండాల్సిందే. కాకపోతే పాపాలు చేస్తే అధోలోకాలలో కష్టాలు, దుఃఖాలు అనుభవించాలి. పుణ్యకార్యాలు చేస్తే ఊర్ధ్వలోకాలకు వెళ్ళి సుఖాలు భోగాలు అనుభవించాలి. అనుభవాలు పూర్తయిన తర్వాత తిరిగి భూలోకానికి దేహాన్ని ధరించి రావాలి.

<u>మాముపేత్యతు పునర్జన్మనవిద్యతే:</u>- అందుకే ఓ మానవులారా! ఆయా లోకాలను నమ్ముకొని చెడిపోవద్దు. బ్రహ్మలోకంతో సహా అన్ని లోకాలు పునరావర్తి గలిగినవే; పునర్జన్మ నిచ్చేవే; దుఃఖాలనిచ్చేవే. నన్ను చేరుకుంటేనే ముక్తి. జన్మరాహిత్యం. అని భగవానుడు ఉపదేశిస్తున్నాడు.

పరమాత్మను చేరుకొంటే ఎందువల్ల జన్మలేదు? అసలు జన్మ అనేది ఎందుకు వస్తున్నది? కర్మఫలాలు, వాసనలు ఉన్నందున. అవెందుకు ఉన్నాయి. పూర్వజన్మలలో చేసిన కర్మల వల్ల, ఆలోచనల వల్ల. అప్పుడు ఎలా చేశావు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వీటిని? దేహమనోబుద్ధులే నేను అనుకొని నేనే చేస్తున్నాను అని చేశావు. జీవభావంలో చేశావు. ఇప్పుడు నీవెవరో తెలుసుకొని, నీవు నీవుగా ఉంటే? అంటే -

నేను ఈ దేహమనోబుద్ధులు కాదు, నేను ఆత్మను - పరమాత్మను అని తెలుసుకొని, సాధనలు చేసి, నిరంతరం సాక్షిగా - ఆత్మగా ఉంటూ నేను చేసేవాణ్ణి కాదు, అనుభవించే వాణ్ణి కాదు అనే నిశ్చయజ్ఞానంలో ఉంటే - ఇప్పుడా కర్మఫలాలు, వాసనలు నీకు ఉండవు. అవి నీకు (ఆత్మవైన నీకు) లేవు గనుక వాటి కారణంగా జన్మ వచ్చే వీలులేదు. అదే జన్మరాహిత్యం అదే మోక్షం. అదే పరమాత్మను చేరుకోవటం.

బ్రహ్మలోకం కూడా పునరావృత్తి కలిగిందే; నిత్యమైనది కాదు - అని రూఢి చేయటానికే బ్రహ్మ యొక్క జీవితకాలాన్ని లెక్కిస్తున్నారు.

**శ్లో||** సహస్ర యుగ పర్యంతం అహర్యద్బ్రహ్మణో విదుః|
రాత్రిం యుగ సహస్రాంతాం తేఽహో రాత్ర విదో జనాః|| (17)

**తా||** బ్రహ్మ యొక్క పగలు వేయి యుగములు గల దానిగను, అలాగే రాత్రి వేయి యుగములు గల దానిగను ఏజనులు తెలుసుకుంటారో వారే అహోరాత్రముల నెరిగిన వారు.

**వ్యాఖ్య:-** కాలాన్ని లెక్కించటంలో మన మనస్సులలోని భావవ్యత్యాసాలు లెక్కలోకి వస్తాయి. ఒక వ్యక్తి మనస్సులో ఆనందం తాండవిస్తుంటే అతడికి కాలం పరుగెత్తినట్లనిపిస్తుంది. అతడికి "యుగమొక క్షణంగా" ఉంటుంది. అదే

వ్యక్తి మనస్సులో దుఃఖం, బాధ, విషాదం తాండవిస్తుంటే కాలం అతినిదానంగా గడుస్తున్నట్లు అనిపిస్తుంది. అంటే అతడికి "క్షణమొక యుగం" లా ఉంటుంది.

ఈ భావాన్ని ఆధారం చేసుకొని పురాణాలలో దేవతలకు కాలపరిమితి ఎక్కువ అని చెప్పటం జరిగింది. మనకు ఒక నెల పితృదేవతలకు 1రోజు. మన శుక్లపక్షం వారికి పగలు. మన కృష్ణపక్షం వారికి రాత్రి. అలాగే మన సంవత్సరం దేవతలకు 1రోజు. మన ఉత్తరాయణం వారికి పగలు. దక్షిణాయనం వారికి రాత్రి. అంటే మన 360 సం||లు దేవతలకు 1 సం|| రం. అదే 'దివ్యవర్షం' లేదా దివ్యసం||రం అంటారు.

ఇక సృష్టి కర్త బ్రహ్మదేవుని విషయానికి వస్తే ఆయన ఆయుర్దాయం 100 సం||లు. 1 సంవత్సరానికి 360 రోజులు. 1 రోజులో పగలు వెయ్యి మహాయుగాలు, రాత్రి వెయ్యి మహాయుగాలు. అంటే బ్రహ్మయొక్క 1 రోజుకు 2 వేలమహాయుగాలన్నమాట. బ్రహ్మదేవుని పగటికాలాన్ని కల్పం అని, రాత్రికాలాన్ని ప్రళయం అని కూడా అంటారు. అంటే బ్రహ్మ యొక్క 1రోజుకు 2 వేల మహాయుగాలన్న మాట. బ్రహ్మదేవుని పగటికాలాన్ని కల్పం అని, రాత్రికాలాన్ని ప్రళయం అని కూడా అంటారు. అంటే బ్రహ్మ యొక్క 1రోజులో వెయ్యి మహాయుగాల పగలు, వెయ్యి మహాయుగాల రాత్రి ఉంటాయి. అసలు మహాయుగమంటే ఏమిటి? ఎంతకాలం?

కృత, త్రేతా, ద్వాపర, కలి - అనే 4 యుగాలను కలిపి మహాయుగమంటారు. కృతయుగం 4800 దివ్యసం||లు. అంటే 17,28,000 సం||ల కాలం. త్రేతాయుగం 3,600 దివ్యసం||లు. అంటే 12,96,000 సం||ల కాలం. ద్వాపరయుగం 2,400 దివ్యసం||లు. అంటే 8,64,000 సం||ల కాలం. కలియుగం. 1,200 దివ్యసంవత్సరాలు. అంటే 4,32,000 సం||లు. మొత్తం 4 యుగాలు. అంటే మహాయుగం యొక్క ప్రమాణం 12,000 దివ్యసం ||లు. లేదా 43, 20,000 మానవ సం||లు.

ఒక మహాయోగం 43,20,000 సం||లు గనుక 1000 మహాయుగాల కాలం 432 కోట్ల సం||లు. ఇదే బ్రహ్మకు పగలు. తిరిగి 432 కోట్లసం||లు బ్రహ్మకు రాత్రి. అంటే సృష్టిలేని ప్రళయకాలం. బ్రహ్మ 1రోజు = 864 కోట్ల సం||లు.

బ్రహ్మ యొక్క పగటి కాలమైన కల్పంలోనే సృష్టి ఉంటుంది. ఆ కల్పం (బ్రహ్మ యొక్క పగలు)లో 14 మంది మనువులు వరుసగా పాలన సాగిస్తారు. ఒక్కొక్క మనువు కాలాన్ని మన్వంతరం అంటారు. ఒక్కొక్క మన్వంతరంలో 71 మహాయుగాలుంటాయి. అంతకాలం ఒక్కొక్క మనువు పాలనసాగిస్తాడు. ఈవిధంగా బ్రహ్మయొక్క పగటికాలం (కల్పం) లో వచ్చే 14 మంది మనువులు వరుసగా 1.స్వాయంభువ 2.స్వారోచిష 3.ఉత్తమ 4.తామస 5.రైవత 6.చాక్షుష 7.వైవస్వత 8.సూర్యసావర్ణి 9.అగ్నిసావర్ణి 10.బ్రహ్మసావర్ణి 11.రుద్ర సావర్ణి 12.దక్షసావర్ణి 13.రౌచ్య 14.భౌచ్య అనేవారు. ఈ వరుస ముగిసిపోతే ఆ కల్పం పూర్తయిపోతుంది. అప్పుడు కల్పాంతం. అంటే ప్రళయం.

ఇలా 2000 మహాయుగాలు - లేదా 864 కోట్ల సంవత్సరాలు బ్రహ్మకొకరోజైతే ఇలాంటి 30 రోజులు 1నెల. అలాంటి 12 నెలలు 1సం||రం. అలాంటి 100 సం||లు పూర్తయితే బ్రహ్మ ఆయుర్దాయం పూర్తయిపోతుంది.

అంటే బ్రహ్మదేవునికి కూడా పుట్టుక - చావు ఉంది. ఆది - అంతం ఉంది. అందుకే బ్రహ్మలోకం కూడా అనిత్యమైనదే. ఇదే విషయం మనుస్మృతిలోను, మహాభారతం శాంతిపర్వంలోను చెప్పటం జరిగింది. మన దృష్టిలో బ్రహ్మదేవుని జీవితం చాలా దీర్ఘమైనది కావచ్చు.కాని అది కూడా అనిత్యమైనదే - అంతమయ్యేదే అని గ్రహించాలి.

కనుకనే విజ్ఞుడైనవాడు అటువంటి అనిత్యమైన లోకాలనుగాని, ఆ లోకాల్లోని భోగాలను గాని కోరుకోకుండా; నిత్యమైన - కాలాతీతుడైన పరమాత్మనే ఆశ్రయించాలి. పరమాత్మనే చేరుకోవాలి. సమస్తలోకాలను, బ్రహ్మాండాన్ని కాలం మ్రింగేస్తుంది. ఆ కాలాన్ని మ్రింగేది కాలాతీతుడైన పరమాత్మ. అందుకే అతడు కాలాంతకుడు. కనుక నశించే లోకాలను చేరుకొనుటకు ఆరాటపడకుండా నిత్యుడు, శాశ్వతుడు, మోక్షప్రదాత అయిన పరమాత్మనే ఆశ్రయించాలి; మిగిలిన వాటియందు విరక్తి కలిగియుండుటయే కాలతత్త్వము నెరిగిన వాని లక్షణం. అతడే అహోరాత్రముల నెరిగిన వాడు, కాలజ్ఞానము తెలిసినవాడు. అంటే దృశ్య ప్రపంచము యొక్క నశ్వరత్వమును, ఆత్మయొక్క శాశ్వతత్త్వము నెరిగిన వాడే కాలజ్ఞానము గలవాడు, నిజమైన జ్ఞాని.

దీనినిబట్టి బ్రహ్మలోకం కూడా ఆద్యంతాలు కలదేనని, కాలానికి లోబడి యుండేదేనని, నశించి పోయేదేనని గ్రహించి, బ్రహ్మలోకాన్ని చేరుకుందామని - అదే మోక్షమని భావించటం అజ్ఞానం; ఈ బ్రహ్మలోకాన్నే వైష్ణవులు వైకుంఠమని, శైవులు కైలాసమని, శాక్తేయులు శ్రీపురమని - భావిస్తూ అక్కడికి వెళ్తే మోక్షమేనని భ్రమపడుతూ జీవభావంలోనే ఉండిపోతారు. ఈ అజ్ఞానాన్ని వదలి, పరమాత్మనే ఆశ్రయించి, జన్మరాహిత్యాన్ని - మోక్షాన్ని పొందటమే మానవజీవిత పవిత్ర కర్తవ్యమని గ్రహించి అందుకోసం ప్రయత్నించే వాడే జ్ఞాని - మహాజ్ఞాని.

బ్రహ్మయొక్క పనులను - సృష్టి కార్యాన్ని 18,19 శ్లోకాల్లో వివరిస్తున్నారు.

**శ్లో||** అవ్యక్తాద్వ్య క్తయ స్సర్వాః ప్రభవంత్యహరాగమే|
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞకే|| **(18)**

**తా||** పగలు కాగానే అవ్యక్తం నుండి అందరూ వ్యక్తమై జన్మిస్తారు. రాత్రి కావటంతోనే ఆ అవ్యక్తమనే దానిలోనే లీనమైపోతారు.

**వ్యాఖ్య:-** మనకు ప్రతిరోజు పగలు - రాత్రి అనేవి ఉన్నాయి. పగలు ప్రారంభం కావటంతోనే నిద్రలేస్తాం. ఏవేవో పనులు చేస్తుంటాం. రాత్రి కావటంతోనే పడుకొని నిద్రపోతాం. మళ్ళీ తెల్లవారగానే నిద్రలేస్తాం. ఇదీ మన దినచర్య.

అయితే బ్రహ్మకు కూడా రాత్రింబవళ్ళు ఉన్నాయి. అవి మన రాత్రి - పగలు లాగా చిన్నవి కావు. చాలా చాలా పెద్దవి. 1000

మహాయుగాలకాలం (432కోట్ల సం||లు) రాత్రి. అంతకాలం పగలు. ఇంత దీర్ఘమైన పగలు, రాత్రి ఆయన ఎలా గడుపుతున్నాడు? ఏం చేస్తున్నాడు?

బ్రహ్మదేవుని పగలు ప్రారంభంకాగానే అప్పటివరకు అవ్యక్తంలో ఉన్న జీవుళ్ళు (ప్రాణికోట్లు) వ్యక్తంలోకి వస్తారు. అంటే సూక్ష్మరూపంలో కంటికి కనిపించకుండా ఉన్న సృష్టి మొత్తం స్థూలరూపంలో వ్యక్తంలోనికి వస్తుంది. అంటే సూక్ష్మదేహాలతో ఉన్న జీవుళ్ళు స్థూలశరీరాలను తగిలించుకొని కంటికి కనిపిస్తాయి. ఇక పగటికాలమంతా ఈ ప్రాణికోట్లు పుడుతూ చస్తూ - వస్తూ పోతూ ఉంటాయి. మరల ఎప్పుడైతే బ్రహ్మదేవునికి రాత్రి (ప్రళయం) అవుతుందో వెంటనే అప్పటివరకు కనిపించిన జీవుళ్ళు - స్థూలరూపంతో ఉన్న జీవుళ్ళు ఆ రూపాలను వదలి అవ్యక్తంలోకి పోతారు. ఇలా జీవుళ్ళకు స్థూల దేహాలనిచ్చి ఈ లోకంలోనికి తేవటం; ఆ రూపాలను తొలగించి అవ్యక్తంలోకి పంపటం ఆయన దినచర్య.

ఇంతకూ అవ్యక్తం అంటే ఏమిటి? పరమాత్మను ఆశ్రయించుకొని మాయ ఉంటుంది. అదే అవ్యక్తం. బ్రహ్మకు రాత్రి కాగానే సూక్ష్మ దేహాలన్నీ అందులో లయం. బ్రహ్మకు పగలు ప్రారంభమైతే అందులో నుండి వ్యక్తం అవుతాయి.

మనం రాత్రి పడుకొని నిద్రపోయినప్పుడు స్వప్నం వస్తుంది. ఆ స్వప్నంలో ఎన్నో వస్తువులు, ఎందరో మనుష్యులు సృష్టింపబడుతున్నారు. కొంతసేపు ఉన్న తర్వాత అన్నీ - అందరూ ఆ స్వప్నంలోనే లయమైపోతున్నారు. మేలుకున్న వాడికి వీటితో సంబంధం లేదు. అలాగే

పరమాత్మను ఆశ్రయించుకొని మాయ ఉంటుంది. సమస్త ప్రపంచము, మనుష్యులు, వస్తువులు, జీవజాలము అంతా ఆ మాయనుండే పుడుతుంది. కొంతకాలం ఉన్న తర్వాత అన్నీ - అందరూ ఆ మాయలోనే లయమైపోతున్నారు. అయితే పరమాత్మకు ఈ సృష్టితో ఏ సంబంధము లేదు. ఇలా మాయనుండి అన్నీ పుట్టటమే బ్రహ్మకు పగలు. లయం కావటమే బ్రహ్మకు రాత్రి.

కనుక మన నిద్రలో మన చిన్న సంసారం లయమై పోయి మళ్ళీ జాగ్రత్ లో ఎలా బయటకు వస్తున్నదో, అలాగే బ్రహ్మయొక్క రాత్రి కాలంలో ఈ గొప్ప సృష్టి లయమై పగలు కాగానే మళ్ళీ వ్యక్తమవుతున్నది.

ఇంతకూ లయమైన సృష్టియే మళ్ళీ వ్యక్తమవుతున్నదా? లేక క్రొత్తగా సృష్టి జరుగుతున్నాదా?

**శ్లో||** భూతగ్రామస్స ఏ వాయం భూత్వా భూత్వా ప్రలీయతే|
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవత్యహరాగమే|| (19)

**తా||** అర్జునా! (పూర్వకల్పం లోని) ఆ భూత సముదాయమే అవశులై పుట్టి, పుట్టి, రాత్రి కావటంతో లయమైపోతున్నది. పగలురాగానే మళ్ళీ పుడుతున్నది.

**వ్యాఖ్య:-** బ్రహ్మ యొక్క పగటికాలం (కల్పం) లో సృష్టి జరుగుతున్నది. తిరిగి రాత్రి కాలం (ప్రళయం) లో మొత్తం సృష్టి లయమై పోతున్నది. తిరిగి పగలు కావటంతో సృష్టి తిరిగి వ్యక్తమవుతున్నది. అయితే ఈ సృష్టి క్రొత్తదా? లేక పాత సృష్టియేనా? అనే సందేహానికి సమాధానమే ఈ శ్లోకం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వ్యష్ఠిలో రాత్రింబవళ్ళు జరిగేదే సమిష్ఠిలో కూడా జరుగుతున్నది. రాత్రి డాక్టరుగా పడుకున్నవాడు ఇంజనీరుగా నిద్రలేస్తాడా. లేవడు. డాక్టరుగానే లేస్తాడు. రాత్రి నిద్రలో డాక్టరు లయమయ్యాడు. తెల్లవారి మేలుకోవటంతో ఆ డాక్టరే వ్యక్తమవుతున్నాడు.

అలాగే సమిష్ఠిలో కూడా ఏప్రాణులు ప్రళయకాలంలో అవ్యక్తంలోకి పోతున్నారో తిరిగి కల్పంలో ఆ ప్రాణులే వేరువేరు దేహాలతో వ్యక్తమవుతూ ఉంటారు.

అవ్యక్తం నుండి వ్యక్తం కావటమంటే క్రొత్తగా రావటం కాదు. క్రొత్తగా జీవుళ్ళు సృష్ఠించబడటం కాదు. వెనుకటి కల్పంలోని జీవుళ్ళే క్రొత్తక్రొత్త శరీరాలు ధరించి మళ్ళీ మళ్ళీ వస్తుంటారు. స్థూలశరీరాలు మారుతూ ఉంటాయి గాని సూక్ష్మశరీరాలు మారవు. మనోబుద్ధులు, ఆశలు, ఆశయాలు, సంకల్పాలు - అవి మాత్రం మారటం లేదు. రంగులు మారుతున్నాయే గాని వస్తువులు మారటం లేదు. సీసాలు మారుతున్నాయే గాని మందు మాత్రం మారటం లేదు.

ఒక రాత్రి ఎక్కడెక్కడి నుండో వచ్చిన ఒక డాక్టరు, ఒక ప్లీడరు, ఒక భక్తుడు, ఒక గజదొంగ ఒక సత్రంలో పడుకొన్నారు. అందరూ తమతమ పనులలో వస్తూ పోతూ ఆ రాత్రికి అక్కడ మజిలీ చేయాల్సి వచ్చింది. బాగా అలసిపోయి ఉన్నారేమో పడుకోగానే నిద్రపట్టింది. గాఢనిద్రలో మునిగిపోయారు. అలా గాఢనిద్రలో ఉన్నంతసేపు వారిలో ఏమార్పులేదు. అందరూ ఒకే తీరులో ఉన్నారు. ఎవరి గుణగుణాలు వ్యక్తం కావటం లేదు.

డాక్టరు ప్లీడరు కన్న, ప్లీడరు భక్తుని కన్న, భక్తుడు దొంగకన్న ఏ విధంగాను భిన్నంగా లేరు. వేరుగా అనిపించటం లేదు. వైద్యం చేసే తెలివిగాని, వాదించే తెలివిగాని, భగవంతుని పట్ల భక్తిభావం గాని, దొంగతనాలు చేసే తెలివిగాని ఆ గాఢనిద్రా సమయంలో వారిలో వ్యక్తం కావటం లేదు. అయితే ఆ తెలివితేటలు నశించిపోయాయా? లేదు. అవి వారి హృదయాలలోనే అంతర్లీనంగా దాగి ఉన్నాయి. అలా దాగిన గుణాలు ఎప్పుడైతే వారు నిద్ర లేచారో ఇక వారు బయలుదేరటానికి సిద్ధమై డాక్టరు హాస్పిటల్ కు, ప్లీడరు కోర్టుకు, భక్తుడు దేవాలయానికి, గజదొంగ దొంగతనానికి బయలుదేరారు. వారి వారి గుణాలను బట్టి వారి వారి రంగాలలో పనిచేస్తారు.

అంటే తెల్లవారగానే ఈ గుణాలు, బుద్ధులు వారికి క్రొత్తగా కలుగుతున్నాయా? లేదు. రాత్రి పడుకోబోయే ముందు వారి గుణాలు అవే. నిద్రలేవగానే అవే గుణాలు వ్యక్తమవుతున్నాయే గాని క్రొత్తగా ఏగుణాలు రావటం లేదు. డాక్టరు ప్లీడరు కాడు. ప్లీడరు భక్తుడు కాడు. భక్తుడు గజదొంగ కాడు.

అలాగే ఈ సృష్టి అనేది క్రొత్తగా వచ్చింది కాదు. అంతకుముందున్నవే రూపాలు మార్చుకొని - దేహాలు మార్చుకొని వస్తున్నవి.

కుమ్మరి మట్టితో కుండలు చేస్తాడే కాని లడ్డుచేయలేడు. ఎందుకంటే కుండలక్షణాలే మట్టిలో ఉన్నాయి కాని లడ్డు లక్షణాలు లేనేలేవు. కనుకనే మట్టిముద్ద నుండి కుండలను సృష్టించగలడే గాని లడ్డు సృష్టించ లేకపోతున్నాడు.

అలాగే ఒక వ్యక్తి - అతడు అనేక సం||లు నుండి, అనేక జన్మల నుండి బుద్ధితో ఏమి ఆలోచిస్తున్నాడో, మనస్సుతో ఏమి భావిస్తున్నాడో, దేహంతో ఏకర్మలు చేస్తున్నాడో. అవే అతడిలో వాసనా రూపంగా ఉండి, ఆ వాసనలతో శరీరాన్ని విడిచి వెళ్ళినప్పుడు తిరిగి ఆ వాసనలకు, కర్మఫలాలకు అనుగుణమైన దేహంతో జన్మించి, ఆ దేహంతో అలాంటి భావనలు, కర్మలనే చేస్తాడు. అదే అతడి స్వభావం, కనుక స్వభావం క్రొత్తగా వచ్చేది కాదు. కనుక -

బ్రహ్మదేవుడు శూన్యం నుండి బ్రహ్మాండాలను సృష్టించటం లేదు. అవ్యక్తం నుండి సృష్టిస్తున్నాడు. అవ్యక్తం అంటే కనిపించకుండా అంతకుముందున్న బ్రహ్మాండమే; అంతకుముందున్న ప్రాణికోట్లే. ప్రళయం కూడా అంతే; ఉన్నది కనిపించకుండా పోవటమే.నశించిపోవటం కాదు.

బక్కెట్టుకు త్రాడు తగిలించి భావిలో వదిలితే ఆ త్రాడు ఉన్నంతవరకే పైకీ క్రిందికీ తిరుగుతుంది. అంతే తప్ప బకెట్టుకు స్వతంత్రం లేదు. అలాగే కర్మబంధాలు ఉన్నంతవరకే ప్రాణులకు రావటం - పోవటం ఉంటుంది. పుట్టటం - చావటం ఉంటుంది. అందుకే వెనుకటి కల్పం (సృష్టి) లోని భూతగణం వ్యక్తం కావటాన్ని 'అవశః' అన్నారు. అంటే ప్రాణులకు రావటానికి పోవటానికి స్వతంత్రం లేదు. అవి పరతంత్రమై - కర్మ పరతంత్రమై - వాటి ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా, చేసిన కర్మల యొక్క, ఆలోచనల యొక్క ఫలితాలకు లోనై మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ ఉండాల్సిందే.

ఈ శ్లోకంలో కర్మ సిద్ధాంతాన్ని బలపరిచాడు భగవానుడు. ఎవరు చేసిన పుణ్య పాప కర్మలకు ఫలంగానే తగిన జన్మలను మళ్ళీ మళ్ళీ వారు

పొందుతుంటారు అనేది కర్మసిద్ధాంతం. కర్మసిద్ధాంతాన్ని అంగీకరించకపోతే చేసే పుణ్యపాపాలకు, అనుభవించే సుఖదుఃఖాలకు సంబంధమే ఉండదు. పుణ్యం గాని, పాపం గాని ఏమిచేసినా అన్నీ ఊరికినే పోయినట్లే. కాని మనం సుఖంగా ఉన్నామంటే పూర్వంలో పుణ్యం చేసుకున్నందుకే. దుఃఖం అనుభవిస్తున్నామంటే పూర్వంలో పాపం చేసినట్లే - అదే కర్మసిద్ధాంతం. ఇది అనివార్యం.

ఇంతవరకు అన్ని లోకాల అనిత్యత్వాన్ని చెప్పి, ఇప్పుడు భగవంతుని యొక్క నిత్యత్వాన్ని తెలియజేయబోతున్నాడు భగవానుడు. ఇక భగవంతుని నిత్యత్వాన్ని గురించి -

**శ్లో||** పరస్తస్మాత్తు భావోఽన్యః ఽవ్యక్తో ఽవ్యక్తా సనాతనః|
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సున వినశ్యతి|| (20)

**తా||** దానికన్న వేరైనది, శ్రేష్ఠమైనది, ఇంద్రియాలకు గోచరము కానిది, సనాతనమైనది ఏ సత్తా ఉన్నదో అది సమస్త ప్రాణులు నశించినప్పటికీ నశించనిది.

**వ్యాఖ్య:-** ఎన్ని పుణ్యకర్మలు చేసి ఏ లోకానికి వెళ్ళినా పునర్జన్మ తప్పదు. పునర్జన్మ ఉన్నదంటే దుఃఖాలు, కష్టాలు, కన్నీళ్ళు తప్పవు. మరి పునర్జన్మ లేకుండా చేసుకోవాలంటే - జన్మరాహిత్యాన్ని పొందాలంటే ఏమిటి ఉపాయం? అనే దానికి సమాధానంగా ఆ పరమాత్మను చేరుకోవట మొక్కటే

**మార్గం అని ఇంతకుముందే భగవానుడు చెప్పటం జరిగింది. మరి ఆ పరమాత్మ ఎవరో - ఎట్టివాడో ఈ శ్లోకం నుండి చెప్పబోతున్నారు.**

**బ్రహ్మయొక్క పగటి కాలంలో (కల్పంలో) సమస్త ప్రాణికోటి అవ్యక్తం నుండి వచ్చి కొంతకాలం (432 కోట్ల సం||లు) ఉంటుంది. మళ్ళీ బ్రహ్మకు రాత్రి కాగానే (ప్రళయంలో) ఈ ప్రాణికోటి అంతా అవ్యక్తంలోకి పోతుంది అని ఇంతకుముందే తెలుసుకున్నాం. బ్రహ్మ యొక్క ఆయుర్దాయం ఉన్నంతవరకు ఇలా ప్రాణికోట్లు పగలు వస్తూ, రాత్రికి పోతూ ,మళ్ళీ పగలు వస్తూ ఉంటాయి. బ్రహ్మ యొక్క ఆయుర్దాయం పూర్తయినప్పుడు ఈ సమస్త సృష్టి, 14 లోకాలు, సర్వ ప్రాణికోటి, పంచభూతాలతో సహా ఆ బ్రహ్మ కూడా అవ్యక్తంలోకి అంటే పరమాత్మ నాశ్రయించుకున్న మాయలోనికి వెళ్ళిపోవటం జరుగుతుంది. తిరిగి క్రొత్త బ్రహ్మ వచ్చినప్పుడు ఈ బ్రహ్మాండం అంతా సృష్టింపబడుతుంది. అంటే బ్రహ్మతో సహా అన్ని లోకాలకు ఆధారమైన అవ్యక్తం (మాయ) కన్న వేరైనది ఒక సత్తా ఉన్నది. అదే పరమాత్మ. ఆ పరమాత్మ ఎట్టిది? పరః, అవ్యక్తాత్ అవ్యక్తః, సనాతనః, సర్వేషు భూతేషు నశ్యత్సు స న వినశ్యతి - అని ఆ పరమాత్మ గురించి 4 ముఖ్య లక్షణాలను ఇక్కడ చెప్పటం జరిగింది.**

**1.పరః- శ్రేష్ఠమైనది. ఎందువల్ల? బ్రహ్మదేవునితో సహా సృష్టి అంతా ఉండే అవ్యక్తం మాయ. కాని ఇది (పరమాత్మ) మాయకు అతీతం. మాయకు అధిపతి. అందుకే సర్వోన్నతమైనది, సర్వశ్రేష్టమైనది. పైగా ఆ మాయ పారమార్థిక సత్యం కాదు. అజ్ఞానంలో మాత్రమే ఉన్నట్లు అనిపిస్తుంది. కాని పరమాత్మ**

పారమార్థిక సత్యం. ఎల్లప్పుడూ ఉండే ఒకే ఒక సత్యం. త్రికాలాలలో ఉంటుంది. కాలాతీతమై ఉంటుంది. అందుకే పరః అన్నారు.

2.అవ్యక్తాత్ అవ్యక్తః:- అవ్యక్తం (మాయ) కంటికి కనిపించనిదే, ఇంద్రియాలకు అగోచరమైనదే. సూక్ష్మమైనదే - అయినా అంతకన్నా సూక్ష్మాతి సూక్ష్మమైనది పరమాత్మ. ఆ అవ్యక్తానికి కూడా ఆధారమైనది. ఆ అవ్యక్తం పరమాత్మను ఆశ్రయించుకొని ఉంటుంది. పరమాత్మకు ఏ ఆశ్రయము అవసరం లేదు. సర్వ ఇంద్రియాలకు అగోచరం; శాశ్వత సత్యం.

3.సనాతనః:- మాయ అనేది అజ్ఞానం ఉన్నంతవరకే. అజ్ఞానం ఉన్నంతవరకే బ్రహ్మదేవుడు, సృష్టి, అవ్యక్తం అన్నీ. అజ్ఞానం నశిస్తే అన్నీ మాయం. అప్పుడు ఉన్నదొక్కటే పరమాత్మ. కనుక అది అనాది. ఆది లేనిది. అంతము లేనిది. సనాతనం.

4.సర్వేషు భూతేషు నశ్యత్సు - స నవినశ్యతి:- సర్వభుతాలు నశించినా ఈ పరమాత్మ - అక్షర పరబ్రహ్మం నశించేది కాదు. సర్వలోకాలు ఉన్నా ఇది ఉంటుంది. అవి పోయినా ఇది ఉంటుంది. అవి ఉన్నప్పుడు అన్నింటికి ఆధారం పరమాత్మే. అవి లేనప్పుడు పరమాత్మ ఏమార్పులు లేకుండా అలాగే ఉండిపోతుంది. అది శాశ్వతం. అవినాశి.

తరగతి గదిలో Black Board ఉంటుంది. ఒక రోజులో 7 పీరియడ్లు ఉంటాయి. మొదటి పీరియడ్ తెలుగు మాస్టారు వస్తాడు. ఆయన చాక్ పీస్ తో ఆ బల్లపై వ్యాకరణ సూత్రాలు వ్రాస్తాడు. తర్వాత పీరియడ్ లో లెక్కల మాస్టారు వస్తాడు. వ్యాకరణ సూత్రాలను తుడిపేసి లెక్కలు వేస్తాడు. ఆ

తరువాత వచ్చిన కెమిస్ట్రీ మాస్టారు వాటిని తుడిపేసి ఏ ఏ రసాయనాలు కలిపితే ఏ సమ్మేళనం వస్తుందో ఫార్ములాలు వ్రాస్తాడు. తరువాత వచ్చిన చరిత్ర మాస్టారు వాటిని తుడిపేసి పూర్వరాజుల వంశచరిత్రలను - వంశవృక్షాన్ని వ్రాస్తాడు. ఇలా ఒక్కొక్క సబ్జెక్ట్ కు చెందిన మాస్టారు వచ్చి అంతకుముందు వ్రాసినవి తుడిచేసి తన సబ్జెక్ట్ కు చెందినవి వ్రాస్తుంటాడు.

ఈ వ్రాతలలోని మార్పులన్నీ ఏమార్పులు లేని ఆ నల్లబల్ల మీదనే. అందరూ దానిపైన వ్రాస్తున్న వ్రాతలను చూస్తారే గాని, వాటికి ఆధారమైన నల్లబల్ల మీదకు దృష్టిపోదు. అది కదలదు. నశించదు. నిరాడంబరంగా ఉంటుంది. దానిమీద వ్రాసిన వ్రాతాలన్నీ మారిపోతుంటాయి, నశించిపోతుంటాయే గాని అది మాత్రం స్థిరంగా, మారకుండా ఎప్పుడూ ఉంటుంది. ఇవన్నీ వ్రాయక ముందూ అది ఉంది. వ్రాసినప్పుడూ ఉంటుంది. చెరిపి వేసిన తర్వాతా ఉంటుంది. అందరికీ వ్రాయటానికి అవకాశం ఇస్తుంది. అందరికి పాఠాలు బోధించటానికి ఆధారంగా ఉంటుంది. అందరూ వెళ్ళిపోయిన తర్వాతా అలాగే ఉంటుంది.

అలాగే మార్పులు చెందే ఈ అవ్యక్తానికి ఏ మార్పులు లేని ఆధారంగా ఉండేది, అన్ని భూతాలు నశించిపోయినా నశించకుండా ఉండేది ఏదో అదే అన్నింటికి ఆధారమైన అక్షర పరబ్రహ్మం - పరమాత్మ. ఈ సృష్టి ఉన్నా అది ఉంటుంది. ఇక్కడ ఏమార్పులు జరుగుతున్నా అన్నింటికి ఆధారంగా ఉంటుంది. ఈ సృష్టి లేకుండా పోయినా అది అలాగే స్థిరంగా ఉంటుంది. కనుక ఆ పరమాత్మ - అక్షర పరబ్రహ్మం నిత్యం. సత్యం. అవినాశి.

**పరమాత్మ ఎట్టివాడో తెలుసుకున్న తర్వాత మన జీవిత గమ్యం ఏమిటి? అందుకోవలసిన స్థానం ఏమిటి?**

**శ్లో||** అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిం|
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ|| **(21)**

**తా||** అవ్యక్తము అక్షరము అని చెప్పబడే దానిని జీవులకు పరమగతి అని చెబుతారు. దేనిని పొందిన తర్వాత ఇక తిరిగి రారో అదే నాయొక్క పరమధామం.

**వ్యాఖ్య:-** బ్రహ్మలోకం వరకుగల ఏ ఉత్తమలోకాలకు - స్వర్గ భోగాల నందించే ఎక్కడకు వెళ్ళినా, తమలో అవ్యక్తంగా ఉన్న వాసనలను తృప్తిపరచుకోటానికి, కర్మఫలాలను అనుభవించటానికి జీవుళ్ళు మళ్ళీ మళ్ళీ జన్మలెత్తాల్సిందే, ఈ భూలోకానికి రావాల్సిందే. జన్మలు ఎత్తితే నష్టం ఏమిటి? అంటే ఈ జన్మను దుఃఖాలయం అన్నారు. దుఃఖాలకు నిలయం జన్మ. పైగా అశాశ్వతం - అనిత్యం. కనుక పునర్జన్మ లేకపోతేనే తృప్తి, ఆనందం, అదే జన్మను సార్థకం చేసుకోవటం అంటే.

కొందరు అధునాతనులు పునర్జన్మ ఉంటే ఏం? అసలు జన్మలేకపోతే మజా ఏం ఉంటుంది? అంటారు. ఈ జన్మపోయి మరో జన్మ తెచ్చుకోవటం అంటే ఈ దుఃఖాన్ని పోగొట్టుకొని మరో దుఃఖాన్ని తెచ్చుకోవటమే గదా!

ఎవరికైనా జబ్బు చేసి హాస్పిటల్ లో ఉంటే పలకరించటానికి వెళ్ళిన మిత్రులు "ఏమిటి? అంత చలాకీగా, ఆరోగ్యంగా ఉండేవాడివి హాస్పిటల్ లో


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేరావు? ఏమిటి జబ్బు? అని అడుగుతారు. త్వరలో జబ్బు తగ్గిపోయి ఆనందంగా మాతో గడపాలి" అంటారు. అంతేగాని "ఏమిటి? నీకు హార్ట్ ఎటాక్ వచ్చిందంట గదా! త్వరలో ఇది తగ్గిపోయి బ్లడ్ క్యాన్సర్ వస్తే బాగుంటుంది. అది తగ్గి క్షయగాని, కుష్ఠుగాని వస్తే మజాగా ఉంటుంది అని అంటారా? అనరు గదా! అంటే రోగి బంధువులు వాణ్ణి అక్కడే పేషంటుగా పడుకోబెట్టరూ.

ఇక్కడా అంతే. పునర్జన్మ ఉంటే ఏం? ఎందుకుండకూడదు? అని అనటం అంటే ఏమిటి? ఇప్పుడీ జన్మలోని దుఃఖాలన్నీ పోయి మళ్ళీ దుఃఖాలు పొందటానికి మరొక జన్మవస్తే ఏం? అనేగదా! జన్మ తెచ్చుకోవటం అంటే దుఃఖాలను కౌగిలించుకోవటమే. కనుక సమస్తదుఃఖాలకు శాశ్వత నివృత్తి జన్మరాహిత్యమే. అదే ఆనందం, పరమానందం, బ్రహ్మానందం. అట్టి జన్మరాహిత్యం కలగాలంటే ఒక గొప్ప స్థానాన్ని, గొప్ప పదవిని అందుకోవాలి, పొందాలి. అట్టి ప్రాప్య స్థానం - పరమగతి అక్షరుడు, అవ్యక్తుడు అయిన పరమాత్మయే. ప్రపంచంలోని అన్ని పదవుల కన్న శ్రేష్ఠమైన పదవి అదే. అదే నీ పరమగతి అంటున్నాడు భగవానుడు.

ఎందుకు దానిని పరమగతి - శ్రేష్ఠమైనగతి - పదవి అంటున్నారు? ఎందుకంటే అక్కడికి వెళ్ళిన తర్వాత తిరిగి వచ్చే పనిలేదు గనుక. ఎక్కడికి వెళ్ళినా వెళ్ళే దారి - వచ్చే దారి అని రెండు దారులుంటాయి. 7+7 పద్నాలుగు లోకాలు కూడా అలాంటివే. వెళ్ళటం - రావటం. కాని ఈ పరమగతికి మాత్రం ఒక్కటే దారి - వెళ్ళేదారియే గాని వచ్చేదారి లేదు. అందుకే ఆత్యంతిక

దుఃఖనివృత్తి, శాశ్వత ఆనందప్రాప్తి కావాలనుకొనేవారు; పునర్జన్మ వద్దనుకున్న వారు; జన్మరాహిత్యం కావాలనుకొనేవారు అక్షరుడైన ఆ పరమాత్మనే - పరబ్రహ్మమునే ఆశ్రయించాలి గాని; క్షరమైన - నశించిపోయే - అనిత్యమైన సుఖాలనిచ్చే అన్యలోకాలను కాదు. ప్రపంచంలోని అన్ని దృశ్యపదార్థాలు, అన్ని లోకాలు, అన్ని సుఖభోగాలు అనిత్యమైనవే, నశించిపోయేవే. కనుక కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలి గాని అల్పమైన జీవుల పైకి వెళితే ఏం ప్రయోజనం? ఏమి గొప్ప? కనుక గురితప్పినా, కష్టమైనా, ఆలస్యమైనా పరమాత్మస్థానాన్ని పొందటానికే కృషి చేయాలి. - ఆ పరమాత్మ స్థానమే పరంధామం.

<u>తత్ మమ పరమం ధామ:-</u> అది నా పరమధామం అంటున్నాడు భగవానుడు. అది నా పరంధామం అంటే నేను వేరు, అది వేరు అనేనా? కాదు. అది నేనే అని మాత్రమే. నా స్వరూపమే అని గ్రహించాలి. నా ఇల్లు అంటే నేను వేరు ఇల్లు వేరు అని గదా! నిజమే ఇక్కడ అంతే. కాని పరమాత్మ విషయంలో మాత్రం పరమాత్మే పరంధామం.

"రాహువు తల" అన్నారనుకోండి. అప్పుడు రాహువు వేరు, రాహువు తల వేరు అనా? కాదు. రాహువే తల, ఆ తలే రాహువు. ఎందుకంటే రాహువుకు మొండెం లేదు. కేవలం తల మాత్రమే ఉంది. రాహుకేతువులు దేవతల వరుసలో నక్కి కూర్చొని అమృతం త్రాగారు. అది గొంతు దిగకుండా విష్ణువు తన చక్రంతో వారి శిరస్సులు ఖండించాడు. అందువల్ల వారికి మొండాలు లేవు. అమృతం త్రాగటం వల్ల తలలు మాత్రం సజీవంగా ఉన్నాయి.

అలాగే పరమాత్మకు దేహం లేదు. ఆకారం లేదు. నిరాకారం, సూక్ష్మాతిసూక్ష్మం, సర్వవ్యాపకం. అందువల్ల ధామం (నివాసం - ఇల్లు) అక్కరలేదు. పరమాత్మే పరంధామం. ఆ పరంధామం మన స్వస్థానం. అక్కడికి చేరితే జన్మలేదు. చేరటం అంటే పరబ్రహ్మం నా స్వరూపమే; నేను పరమాత్మనే అని తెలుసుకోవటమే. అలా ఉండిపోవటమే.

అందుకోవలసిన స్థానం ఏదో తెలిసిన తర్వాత అందుకొనే ఉపాయం ఏదో తెలియజేయబోతున్నారు.

**శ్లో||** పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వ నన్యయా|
యస్యాంత స్థాని భూతాని యేన సర్వమిదం తతం|| (22)

**తా||** పార్థా! ఎవనిలో అన్ని భూతాలు ఉన్నాయో, ఎవరిచేత ఈ బ్రహ్మాండం అంతా వ్యాపించబడి యున్నదో ఆ శ్రేష్ఠ పురుషుడు అనన్య భక్తి వల్లనే లభిస్తాడు.

**వ్యాఖ్య:-** లక్ష్యాన్ని చేరే మార్గాలన్నీ ఇంతకుముందే చెప్పబడ్డాయి. ఆ మార్గాల ద్వారా లక్ష్యాన్ని చేరుకొనే ఉపాయాన్ని ఇక్కడ చెబుతున్నారు. ఆ ఉపాయమే - అనన్యభక్తి. ఇంతకూ ఈ భక్తి ఎవరి మీద?

పరః పురుషః:- పరమపురుషుడు - శ్రేష్ఠపురుషుడు అయిన పరమాత్మ మీద. ఆయన ఎట్టివాడో, ఆయన స్వరూప స్వభావాలెట్టివో కూడా తెలుసుకోవాలి. అలా తెలుసుకుంటే గాని నిజమైన ప్రేమ - భక్తి కుదరదు. ఇంతకుముందు చెప్పినా మరల ఈ శ్లోకంలో మరొక విధంగా తెలియజేస్తున్నారు.

యస్య అంతస్థాని భూతాని:- ఈ సమస్త ప్రాణులు ఎవరిలో ఉన్నాయో - అతడే పరమాత్మ. ఈ జగత్తంతా అనేక ప్రాణికోట్లతో నిండిఉన్నది. అట్టి ఈ జగత్తు ఎక్కడ ఉన్నది? పరమాత్మలోనే ఉన్నది. చీకటిలో (భ్రమపడిన) కనిపించిన పాము ఎక్కడ ఉన్నది? త్రాడులోనే ఉన్నది. అలాగే సత్యమైన పరమాత్మలోనే భ్రమాత్మకమైన - మిథ్యయైన ప్రపంచం ఉన్నది. ఈ ప్రపంచంలోనే సమస్త జీవరాసులు ఉన్నాయి. కనుక అన్ని ప్రాణులు పరమాత్మలోనే ఉన్నాయి. ఈ 14 లోకాలు - బ్రహ్మాండం అంతా పరమాత్మలోనే ఉన్నది.

ఇదే విషయాన్ని కథా రూపంలో భాగవతంలో చెప్పబడింది. కృష్ణుడు మన్ను తిన్నాడని బలరాముడు రిపోర్టు చేస్తే యశోద కృష్ణుని పిలిచి గద్దించి అడిగింది. అబ్బే. నేను మన్ను తినలేదు. అంతా అబద్ధం చెబుతున్నాడు అన్నయ్య - అన్నాడు. 'ఏదీ నోరు తెరువు' అంటే బాలకృష్ణుడు నోరు తెరిచాడు. ఆనోటిలో 14 లోకాలతో కూడిన బ్రహ్మాండాన్ని చూచి యశోద నోరు తెరిచింది. ఇదంతా పరమాత్మలోనే ఈ సమస్తము ఉన్నదని చెప్పటానికే.

అలలన్నీ సముద్రంలోనే ఉన్నట్లు; కుండలన్నీ మట్టిలోనే ఉన్నట్లు; ఆభరణాలన్నీ బంగారంలోనే ఉన్నట్లు; స్వప్నలోకం అంతా మేలుకున్న వాని మనస్సులోనే ఉన్నట్లు ఈ సమస్త ప్రాణులతో కూడిన బ్రహ్మాండం అంతా పరమాత్మలోనే ఉన్నది. అంతేకాదు అన్ని ప్రాణులలో ఉన్నదీ ఆ పరమాత్మ చైతన్యమే. పాలలో వెన్నలాగా, నువ్వులలో నూనెలాగా ఆయన అంతటా వ్యాపించియున్నాడు. "ఈశావాస్య మిదగ్ం సర్వం యత్ కించ జగత్యాం జగత్" అన్న ఈశ్యావాస్యోపనిషత్ మంత్రభావం ఇదే -

యేన సర్వమిదం తతం:- ఈ సమస్తము దేనిచేత వ్యాపించబడియున్నదో - అంటే ఆ పరమాత్మ చేతనే ఈ బ్రహ్మాండం అంతా వ్యాపించబడియున్నది. ఈ వాక్యం భగవద్గీతలో 3 పర్యాయములు వచ్చింది. ఈ వాక్యం భగవంతుని అఖండ స్వరూపాన్ని తెలియజేస్తున్నది. అందుకే "ఎందెందు వెదకి చూచిన అందందే గలడు దానవాగ్రణి వింటే" - అని ప్రహ్లాదుడు చెప్పగలిగింది. కనుక సర్వేసర్వత్రా, అన్ని సమయాలలోను, అన్నింటా ఉన్నది ఆయనే. అట్టి పరమాత్మను అందుకుంటేనే ఆనందం. మరి అందుకొనుటకు ఉపాయం?

అనన్యయా భక్త్యా లభ్యస్తు:- అనన్య భక్తి చేతనే పరమాత్మ ప్రాప్తి. అది సాధారణ భక్తి కాదు. అనన్యభక్తి. అన్యవస్తువుల మీద, ప్రాపంచిక భోగాల మీద ప్రీతిని - ఆసక్తిని వదలి ఒక్క పరమాత్మపైనే ప్రీతిని కలిగిఉండాలి. కొంత పరమాత్మ మీద - కొంత ప్రపంచం మీద ఉంటే అది అనన్యభక్తి కాదు. "నేను పరమాత్మ కన్న వేరుకాదు. నేను పరమాత్మనే - 'అహం బ్రహ్మోస్మి' అనే అఖండభావనయే అనన్యభక్తి. ఇది జ్ఞానరూపమైన భక్తి. ఎలా లభిస్తుంది? నిరంతర పరమాత్మ చింతన వల్లనే. దానివల్ల జ్ఞాన విచారణా శక్తి లభించి మోక్షం కలుగుతుంది. మహాభక్తుడైన ప్రహ్లాదునికి ప్రత్యక్షమైన భగవానుడు ఏం కావాలో కోరుకో - అంటే. నాకు ఉత్తమమైన దాన్ని నీవే ప్రసాదించమన్నాడు. అప్పుడు భగవానుడు 'జ్ఞాన విచారణా శక్తి కలుగుగాక' అని దీవించాడు. నేరుగా మోక్షాన్నివ్వక మోక్షప్రాప్తికి కావలసిన బుద్ధిని - విచారణా శక్తిని ప్రసాదించాడు. కనుక భక్తివల్లనే జ్ఞానవిచారణా శక్తి కలిగి మోక్షం ప్రాప్తిస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇక ఈ అధ్యాయం యొక్క చివరి ఘట్టానికి వస్తున్నాం.

ఉపోద్ఘాతం:- ఇక చెప్పబోయే విషయం చాలా క్లిష్టమైనది, కష్టమైనదీ. జీవులు మరణానంతరం ఏ ఏ లోకాలకు వెళ్ళేదీ చెప్పటం ఇక్కడి విశేషం. ఇవి ఋజువులు చూపించటానికి వీలైన విషయాలు కాదు. కేవలం శాస్త్రం మీద విశ్వాసంతో నమ్మవలసిందే. కనుక శ్రద్ధ, విశ్వాసం ముఖ్యం.

వేద మంత్రాలను దర్శించిన, విన్న ఋషులు - మహర్షులు - మహాత్ములు చెప్పినవి, భగవంతుడే స్వయంగా చెప్పినవి. కనుక విశ్వాసంతో నమ్మాలే గాని అంతఃకరణానికి అందేవి కావు. ఎందుకంటే ఇవన్నీ అతీంద్రియ విషయాలు గనుక. ఇలాంటి క్లిష్టమైన విషయాలు గందరగోళంగా ఉంటాయి గనుక విషయం అర్థం కావటానికి కొంత ఉపోద్ఘాతం చెప్పుకోవాల్సి వచ్చింది.

ప్రపంచంలోని మొత్తం మానవులను 4 విధాలుగా విభాగించవచ్చు. (1) కర్మాతీతులు (2) నిష్కామ కర్మయోగులు (3) సకామ కర్మయోగులు (4) కర్మభ్రష్టులు.

(1) కర్మాతీతులు :- వీరే జ్ఞానులు -ఆత్మజ్ఞానులు - జీవన్ముక్తులు. వీరు జ్ఞానవిచారణ ద్వారా తాము పరమాత్మ కన్న వేరుకాదని; పరమాత్మ తామేనని అనుభూతి చెందినవారు. నరరూపంలో కనిపించే నారాయణులు వీరు. వారి యొక్క సమస్త కర్మలు జ్ఞానాగ్నిలో దగ్ధమై పోయాయి. కనుక కర్మ బంధనాలు లేవు. వారికి విధినిషేధాలు లేవు. వారు చెప్పిందే వేదం. నడిచిందే శాస్త్రం. వారు మునిగిందే గంగ. వారు ఉన్నదే కాశి. వారు దేహాన్ని వదిలిం తర్వాత



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎక్కడికీ - ఏ లోకానికీ పోనక్కరలేదు. ఉన్నవారు ఉన్నట్లే పరమాత్మగా ఉండిపోయినవారు. వీరి విషయం రాబోయే 9వ అధ్యాయంలో విపులంగా చెప్పటం జరిగింది.

2.నిష్కామ కర్మయోగులు :- వీరు ముక్తులు కాదు. ముముక్షువులు. మోక్షం కోసం - భగవత్ప్రాప్తి కోసం నిష్కామంగా సత్కర్మలు చేస్తారు. సగుణ బ్రహ్మోపాసన - ఓంకారోపాసన చేస్తారు. కర్తృత్వం లేకుండా కర్తవ్యతా భావంతో నిత్యనైమిత్తిక కర్మలు చేస్తారు. ఫలాపేక్ష, సంగభావం ఉండదు. వీరు జీవభావాన్ని వదలలేని వారు గనుక, ఉపాసకులు గనుక, వీరు శరీరాన్ని విడిచిన తర్వాత అర్చిరాది మార్గం ద్వారా (దేవయానం ద్వారా) బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు. అక్కడ బ్రహ్మద్వారా జ్ఞానోపదేశాన్ని పొందుతారు. బ్రహ్మప్రళయంలో బ్రహ్మతో పాటు పరమాత్మతో ఐక్యమై ముక్తిని పొందుతారు. ఇక వీరికి పునర్జన్మ లేదు.

(3) సకామ కర్మయోగులు :- వీరు పూజాపునస్కారాలు, యజ్ఞయాగాదులు, దానధర్మాలు ,భూతదయ, పరోపకారాలు మొ||న సత్కర్మలనే - శాస్త్ర విహిత కర్మలనే చేస్తారు. అయితే ఫలాపేక్షతో, కోరికతో మాత్రమే చేస్తారు. పాపకర్మలు గాని, నిషిద్ధ కర్మలుగాని చేయరు. వీరు దేహం వదిలిన తర్వాత ధూమాది (పితృయానం) మార్గం ద్వారా పితృలోకాన్ని చేరుకుంటారు. దీనినే చంద్రలోకమని, సూర్యలోకమని, స్వర్గలోకమని అంటారు. ఆ లోకానికి వెళ్ళిన వారు పుణ్యఫలం ఉన్నంతవరకు సుఖాలు భోగాలు అనుభవిస్తారు. ఆ పుణ్యం

ఖర్చైపోగానే తిరిగి జన్మ నెత్తేందుకు భూలోకానికి వస్తారు. ఇది తిరిగి వచ్చే మార్గం.

(4) కర్మభ్రష్టులు :- వీరే నేటి ప్రపంచంలో మెజారిటీ. వీరికి తమ కడుపు నింపుకోవటం, సుఖాలు పొందటం, తాము - తమవాళ్ళు ఆనందంగా గడపటం, ఇతరులేమైపోయినా పట్టించుకోకపోవటం స్వభావం. తమ సుఖం కోసం, స్వార్ధం కోసం ఇతరులకు హాని చెయ్యటానికి కూడా సిద్ధపడతారు. వీరికి కడుపే కైలాసం. పరోపకారం - దయ - కరుణ అంటే ఏమిటో వీరికి తెలియదు. వీరు మనుష్యరూపంలో తిరిగే మృగాలు. నరరూపంలో ఉండే వానరాలు. వీరికి కర్మం లేదు, ధర్మం లేదు, పుణ్యం లేదు, పాపం లేదు,శాస్త్రం లేదు, ఆచారం లేదు. ఇట్టివారు చచ్చి ఏలోకానికీ పోనవసరం లేదు. 'తృణజలూకం' లాగా ఈ దేహాన్ని వదలగానే ఇక్కడే మరొక దేహాన్ని పట్టుకుంటారు. లేదా చేసిన పాపాలకు ఫలితంగా నరకయాతనలను అనుభవించి తిరిగి నీచ జన్మలెత్తుతారు.

తృణజలూకం అంటే గడ్డిపురుగు. ఆ పురుగు గడ్డి మీద ప్రాకుతూ ముందున్న పోచను పట్టుకొని వెనుకటి పోచను వదులుతూ ప్రాకుతుంది. వీరు కూడా అంతే. ఈ శరీరాన్ని వదలగానే మరొక శరీరాన్ని పట్టుకుంటారు. పశువు గానో, పక్షి గానో, క్రిమిగానో, కీటకం గానో ఏదో ఒక క్షుద్ర శరీరాన్ని ధరించి పాతశరీరాన్ని వదిలేస్తారు. కనుక వీరికి లోకాంతర ప్రయాణం లేదు. లోకాంతర ప్రయాణం 2, 3 వర్గాల వారికే.

ఈ నిష్కామ కర్మయోగులకు, సకామ కర్మయోగులకు లభించే లోకాలను, ఆ లోకాలకు చేసే ప్రయాణ పద్ధతులను భగవద్గీత చెప్పబోతున్నది. 23వ శ్లోకం నుండి చివరి వరకు ఇదే విషయం. ఈ విషయాన్నీ ఛాందోగ్యోపనిషత్తులోను, బృహదారణ్యకోపనిషత్తులోను, ప్రశ్నోపనిషత్తులోను, కౌషీతకీ బ్రాహ్మణాలలోను, బ్రహ్మసూత్రాలలోను, ఆత్మపురాణంలోను చెప్పబడి ఉన్నాయి. వాటిని కూడా క్రోడీకరించి ఇక్కడ తెలుసుకుందాం.

**శ్లో||** యత్ర కాలేత్వనా వృత్తిం ఆవృత్తిం చైవ యోగినః|
ప్రయాతా యాంతి తంకాలం వక్ష్యామి భరతర్షభ|| **(23)**

**తా||** భరతశ్రేష్ఠా! యోగులైన వారు ఏకాలంలో (మార్గంలో) దేహాన్ని వదలిన తర్వాత పునర్జన్మ లేని స్థితిని చేరుకోవటానికి, పునర్జన్మతో కూడిన స్థితిని చేరుకోవటానికి ప్రయాణిస్తుంటారో ఆ కాలాన్ని (మార్గాన్ని) చెప్పబోతున్నాను.

**వ్యాఖ్య:-** అనన్యమైన భక్తి గలిగినవారు ఆత్మజ్ఞానాన్ని పొంది, లేదా తత్త్వవిచారణా శక్తి గలిగి, ఆత్మానుభూతిని పొందటంతో జీవభావాన్ని వదిలి జీవన్ముక్తిని పొందుతారు. అట్టివారే కర్మాతీతులు - జ్ఞానులు - ఆత్మజ్ఞానులు - ఆత్మ నెరిగినవారు - ఆత్మానుభూతి పరులు - ముక్తులు. వీరు తిరిగి జన్మించాల్సిన పనిలేదు; ఏలోకానికీ వచ్చిపోయే పనిలేదు. వీరే పైన చెప్పిన 4 రకాల వారిలో మొదటిరకం వారు. వారు సాక్షాత్తు పరమాత్మయే.

ఇక మిగిలిన వారిలో నాలుగవ రకంవారు కర్మభ్రష్టులు. వీరు స్వార్థమే పరమార్థంగా భావించేవారు. భగవంతుని కూడా స్వార్థానికే వినియోగించుకొనేవారు. వీరు కూడా ఏలోకానికి వెళ్ళనవసరం లేకుండా ఒక శరీరం నుండి మరొక శరీరానికి - తృణజలూకంలాగా పయనించేవారు. వీరు ఎక్కువగా క్షుద్రజన్మలను, నీచజన్మలను ఎత్తుతూ ఉంటారు.

ఇక రెండు, మూడు రకాల వారినే యోగులు అంటారు. వీరిలో ఆయా లోకాలకు వెళ్ళి తిరిగి వచ్చే వారు కొందరైతే, తిరిగిరాని వారు కొందరు. తిరిగి రానివారు నిష్కామ కర్మయోగులు - 2వ రకంవారు. తిరిగివచ్చే వారు సకామకర్మయోగులు - 3వ రకంవారు. వీరి గురించే రాబోయే శ్లోకాలలో చెప్పటం జరిగింది.

<u>నిష్కామ కర్మయోగులు</u> :- వీరినే ఉపాసకులు అని కూడా అంటారు. వీరు ప్రాపంచిక విషయాలకు అంతగా ప్రాధాన్యం ఇవ్వకుండా ఎల్లప్పుడూ భగవంతుని ఉపాసిస్తూ దివ్యజీవనం గడిపేవారు. పరమాత్మ అన్వేషణలో ఉండేవారు. సత్కార్యాలు, దైవకార్యాలు చేస్తుంటారు. అది కూడా నిష్కామంగా, ఏదో ఫలితం కావాలనే ఆసక్తి లేకుండా నిర్లిప్తంగా, కర్తవ్యతా భావంతో, లోకకళ్యాణ కాంక్షతో చేస్తుంటారు. వీరు పరమాత్మ యొక్క యదార్థ స్వరూపాన్ని శాస్త్రాలద్వారా, సద్గురువులద్వారా గ్రహించలేరు. తానెవరో, పరమాత్మ ఎవరో తెలుసుకున్నా తెలుసుకోకపోయినా జీవభావం పోదు. తాను పరమాత్మ కన్న వేరుగా ఉన్న భక్తుడను, వ్యక్తిని అనే భావమే ఉంటుంది. అందువల్ల ఇట్టి వ్యక్తి దేహాన్ని వదిలిన తర్వాత దేవయాన మార్గం

ద్వారా ఒక్కొక్క లోకాన్ని దాటుకుంటూ చివరకు బ్రహ్మలోకాన్ని చేరి అక్కడ బ్రహ్మ ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందుతాడు. చివరకు బ్రహ్మతో పాటు పరమాత్మలో కలిసిపోయి ముక్తి నందుకుంటాడు. దీనినే క్రమముక్తి అంటారు.

అయితే బ్రహ్మలోకాన్ని చేరినా తిరిగి రావలసిందే అని ఇంతకుముందు 16వ శ్లోకంలో 'ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తి' చెప్పటం జరిగింది గదా! మరి ఇక్కడ తిరిగి వచ్చే పనిలేదు; అక్కడే ఆత్మజ్ఞానాన్ని పొంది ముక్తి నందుకుంటాడు - అని చెబుతున్నారు గదా! ఏమిటి ఇందులో తిరకాసు?

నిజంగా బ్రహ్మదేవుడు దేహం, ఇంద్రియాలు కలిగి ఉన్నాడా ఆత్మజ్ఞానాన్ని బోధించటానికి? పోనీ ఆయన సంగతి మనకు తెలియదులే అనుకుందాం. దేహాన్ని వదలి వెళ్ళిన ఈ జీవుడు ఆ ఆత్మజ్ఞానాన్ని వినటానికి చెవులు, కూర్చోటానికి దేహము ఉన్నాయా? కనుక ఆక్కడ జ్ఞానాన్ని పొందటం కుదరదు. కొంచెం లోతుగా ఆలోచిస్తే ఈ ఉపాసకుడు - నిష్కామ కర్మయోగి తన ఉపాసన కారణంగా బ్రహ్మలోకానికి చేరటం అంటే బ్రహ్మజ్ఞానిని చేరటమే. అంటే ఆ జీవుడు మరణానంతరం ఆయా లోకాలలో సుఖభోగాలు అనుభవించిన తరువాత ఒక యోగి ఇంట జన్మించటమో, లేదా శ్రీమంతుడు, శుచివంతుడు అయిన వారింట జన్మించటమో జరిగి అతడు అవశుడై ఒక బ్రహ్మజ్ఞానిని - శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు, కరుణా సముద్రుడు అయిన మహాత్ముని ఆశ్రయించి ఆత్మజ్ఞానాన్ని పొంది, సాధనలు చేసి ఆ జన్మలోనే ముక్తిని పొందటం జరుగుతుంది. ఇదే తిరిగిరాని జన్మ. ఇక -

సకామ కర్మయోగులు :- వీరు భోగాసక్తితో సత్కార్యాలు, దానధర్మాలు, పుణ్యకార్యాలు,పూజా పునస్కారాలు, యజ్ఞయాగాదులు, పరోపకారం మొ||న కర్మలు చేస్తూ దుఃఖాలతో కూడిన సుఖాలు అనుభవిస్తూ గడిపేవారు. వీరు దేహాన్ని వదిలిన తర్వాత పితృయాన మార్గం ద్వారా పితృలోకం, చంద్రలోకం మొ||న లోకాలకు వెళ్ళి పుణ్యం క్షయమైపోగానే తిరిగి అప్పటికి ఉన్న ప్రారబ్ధ కర్మఫలాలు, వాసనలను బట్టి దేహాన్ని ధరించి భూలోకానికి తిరిగివస్తారు. వీరిని కూడా యోగులు అని గౌరవనామంతో పిలవటం జరిగింది. ఎందుకంటే వీరు చేసింది సకామకర్మలే అయినా త్యాగబుద్ధి ఉన్నట్లే గదా!

ఇలా ఏఏ దారులున్నాయో, అవి ఎక్కడకు దారితీస్తాయో చక్కగా తెలిస్తే మనకు కావలసిన దారి ఏదో నిర్ణయించుకొనే అవకాశం ఉంటుంది. అందుకే రెండు దారులను గురించి చెబుతున్నారు.

కాలం అనే పదంలో శ్లేష ఉన్నది. కాలం అంటే అంత్యకాలం అని ఒక అర్థం. మార్గమని మరొక అర్థం. కనుక ఇవి 2మార్గాలు. జీవుడు ప్రయాణించే మార్గాలు. వారివారి జ్ఞానాన్ని బట్టి, చేసిన కృషిని బట్టి, సంస్కారాలు, అభిరుచులు, కోరికలు ఉంటాయి. స్థూలదేహం రాలిపోయిన తరువాత వారి మానసిక ప్రయాణం ఆ సంస్కారాలను బట్టే ఉంటుంది. ఆ ప్రయాణాన్ని బట్టే వారు చేరుకొనే లోకాలుంటాయి.

ఉపాసకుడు బ్రహ్మలోకాన్ని చేరాలి. సకామ కర్మయోగి పితృలోకాన్ని చేరాలి. వారి ప్రయాణం ఎలా సాగుతుంది? ముందు బ్రహ్మలోక ప్రయాణం, తరువాత పితృలోక ప్రయాణం ఎలాగో -

**నిష్కామ కర్మయోగి - లేదా ఉపాసకుడు శరీరం విడిచిన తర్వాత చేసే ప్రయాణం -**

**శ్లో|| అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం|**
**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదోజనాః|| (24)**

**తా|| జ్యోతిర్మయమైన అగ్ని, పగలు, శుక్లపక్షం, ఆరునెలల ఉత్తరాయణం. బ్రహ్మవిదులు ఇలా ప్రయాణించి బ్రహ్మను చేరుకుంటారు.**

**వ్యాఖ్య:- ఈ శ్లోకం అగ్ని అనే పదంతో ప్రారంభమైంది. అంటే ఈ మార్గంలో మొదటి స్టేషన్ అగ్ని. వేదాల్లో అగ్నిని అర్చి అన్నారు. అందుకే ఈ మార్గాన్ని అర్చిరాది మార్గం అన్నారు. దీనినే దేవయానం అని కూడా అంటారు. అంతేకాదు ఈ మార్గం అగ్నితో - అంటే వెలుగుతో ప్రారంభమై, చివరి వరకు వెలుగులోనే ఉంటుంది గనుక దీనిని శుక్లగతి అని కూడా అంటారు. ఈ మార్గం వెలుగుతో కూడుకొని ఉన్నది గనుక దేహాన్ని వదలిన జీవుడు సుఖంగా ప్రయాణం చేస్తాడు.**

**ఈ మార్గాన్ని సూర్యమార్గం అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఎందుకంటే ఉపాసకుడు ముందుగా సూర్యలోకానికి వెళ్ళి అక్కడి నుండి బ్రహ్మలోకానికి ప్రయాణమవుతాడు. ఇక ఇక్కడి అగ్నిజ్యోతి అనేవి రెండు పదాలు కాదు. ఒకే పదం. జ్యోతిర్మయమైన అగ్ని అని. అంటే పొగలేని, ప్రకాశవంతమైన అగ్ని అని. ఇక ఈ ప్రయాణం ఎలా సాగుతుందో చూద్దాం.**

మన దేహంలో వెన్నెముకను ఆశ్రయించుకొని ఒక సూక్ష్మ నాడి గుదస్థానం నుండి సహస్రారం వరకు ఉన్నది. అదే సుషుమ్నా నాడి - లేదా బ్రహ్మనాడి. అది పైకే ప్రయాణించే ఊర్ధ్వనాడి. దానికీ బ్రహ్మలోకానికి సరాసరి సంబంధం ఉన్నది. ఈ సుషుమ్నా నాడి కంటితో చూద్దాం అని శరీరానికి ఆపరేషన్ చేసి చూద్దాం అంటే కనిపించేది కాదు. ఎందుకంటే అది స్థూల రూపంలో లేదు. శక్తి రూపంలో సూక్ష్మాతి సూక్ష్మమై ఉంటుంది. ఉపాసకుని యొక్క మహాప్రయాణకాలంలో - అంటే అవసాన కాలంలో అది తెరుచుకుంటుంది. తక్కిన వారికి ఆ నాడి ఎప్పుడూ మూసుకొనే ఉంటుంది.

సగుణోపాసకుడు దేహం వదలటంతోనే మొట్టమొదట ఆ సుషుమ్నా నాడితో సంబంధం ఏర్పడుతుంది. ఇక అతడి ప్రయాణం అంతా ఆ నాడి గుండానే. ఆ ప్రయాణంలో మొదటి స్టేషన్ అగ్ని - ప్రకాశవంతమైన అగ్ని. అగ్ని అంటే తనలోపలి అగ్నియే గాని బయటి అగ్ని కాదు. అగ్ని అంటే అగ్ని అభిమాన దేవత. పగలు అంటే పగటి అభిమాన దేవత. శుక్లపక్షం అంటే శుక్లపక్ష అభిమాన దేవత. ఉత్తరాయణం అంటే ఉత్తరాయణ అభిమాన దేవత. ఇలా అందరూ దేవతలే. ఈ దేవతలే జీవుణ్ణి మోసుకెళ్ళేది.

దేహం వదలటంతోనే ఉపాసకుడు ముందుగా అగ్ని అభిమాన దేవతను చేరుకుంటాడు. ఎలా చేరుకుంటాడు? ఎవరు చేరుస్తారు? మన ప్రాణశక్తి ఐదువిధాలు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన - అని. అందులో ఉదానశక్తియే జీవుణ్ణి అగ్నిదేవత వద్దకు చేరుస్తుంది. ఆ అగ్నిదేవత జీవుణ్ణి పగటిదేవతకు అప్పగిస్తుంది. ఆ దేవత శుక్లపక్ష అభిమాన దేవతకు, ఆ దేవత

ఉత్తరాయణ అభిమానదేవత వద్దకు చేరుస్తుంది. ఆ దేవతయే ఉపాసకుణ్ణి బ్రహ్మలోకానికి చేరుస్తుంది. అందుకే ఈ దేవతలను అతివాహక దేవతలు అంటారు. అంటే సూక్ష్మశరీరాన్ని ఒక చోటి నుండి మరో చోటికి తీసుకెళ్ళేవారు - మోసుకెళ్ళేవారు - అని.

రాష్ట్ర గవర్నరును సాగనంపేటప్పుడు ఒక జిల్లా అధికారి ఆయనను తన జిల్లా సరిహద్దుల వరకూ వెంటవెళ్ళి మరొక జిల్లా అధికారికి అప్పగిస్తాడు. ఇలా అంచెలవారిగా ప్రయాణం సాగిపోతుంది. అలాగే ఉపాసకుని ప్రయాణం కూడా అంచెలంచెలుగా, మజిలీలు చేస్తూ సాగుతుంది. ఉపనిషత్తులలో ఈ మజిలీలు ఇంకా ఎక్కువగా చెప్పబడ్డాయి. భగవద్గీత ఆ మజిలీలను సంక్షిప్తంచేసి క్లుప్తంగా చెప్పింది.

బ్రహ్మవిదోజనాః :- ఈ శ్లోకంలో ఇలా ప్రయాణించే వారిని బ్రహ్మవిదులు అన్నారు. ఇక్కడ బ్రహ్మవిదులు అంటే బ్రహ్మోపాసకులు - సగుణ బ్రహ్మోపాసకులు అని అర్థం. ఉపాసకులే ఈ మార్గంలో ప్రయాణించేవారు.

ఉత్తరాయణం అంటే ఉత్ + తర - తరించి పైకి వెళ్ళే ప్రయాణం అని అర్థం. అంతే తప్ప ఉత్తరాయణ పుణ్యకాలంలో - అంటే ఆ ఆరునెలల కాలంలో చనిపోయిన వారంతా బ్రహ్మలోకం చేరుకుంటారు అని మాత్రం కాదు. ఎందుకంటే ఎందరో దొంగలు, ఖూనీ కోర్లు, కూటసాక్షులు, మోసగాళ్ళు, నీతి మాలినవాళ్ళు, అబద్ధాల కోర్లు, త్రాగుబోతులు, తిరుగుబోతులు ఉత్తరాయణంలో చనిపోతారు. వారంతా బ్రహ్మలోకానికి వెళ్ళే పుణ్యాత్ములై పోతారా?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అయితే ఉపాసకుడైన వాడు ఒకవేళ రాత్రి కాలంలో చనిపోవచ్చు, లేదా కృష్ణ పక్షంలో చనిపోవచ్చు, లేదా దక్షిణాయనంలో చనిపోవచ్చు. మరి వీరెలా బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు?

(i) ఒక ఉపాసకుడు రాత్రి కాలంలో చనిపోయాడనుకుందాం. ఆ జీవుణ్ణి అగ్ని అభిమాన దేవత రాత్రి కాలం దాటిపోయి పగటికాలం వచ్చేవరకు తన అధీనంలో ఉంచుకొని పగటిదేవతకు అప్పగిస్తుంది. ఆ పగటి దేవత శుక్లపక్ష దేవతకు, ఆ దేవత ఉత్తరాయణ దేవతకు, ఆ దేవత బ్రహ్మలోకానికి చేరుస్తుంది.

(ii) ఒకవేళ ఉపాసకుడు కృష్ణ పక్షంలో చనిపోతే ఆ జీవుడు అగ్నిదేవత నుండి, పగటిదేవత వరకు ప్రయాణించి పగటిదేవత అధీనంలో ఉంటాడు. ఆ దేవత శుక్ల పక్షం వరకు ఆ జీవుణ్ణి తన వశంలో ఉంచుకొని శుక్లపక్ష దేవతకు అప్పగించగా ఆ దేవత ఉత్తరాయణ దేవతకు, అక్కడి నుండి బ్రహ్మలోకానికి చేరుకుంటాడు.

(iii) ఇక దక్షిణాయనంలో మరణించిన ఉపాసకుని ఉదాన వాయువు అగ్నిదేవతకు - అగ్ని దేవత పగటిదేవతకు అప్పగించగా, ఆ దేవత శుక్లపక్షదేవత కప్పగిస్తుంది. శుక్లపక్ష దేవత జీవుణ్ణి తన అధీనంలో ఉంచుకొని దక్షిణాయనం దాటి ఉత్తరాయణం వచ్చేవరకు ఆగి ఉత్తరాయణ దేవత కప్పగించగా, ఉత్తరాయణ దేవత బ్రహ్మలోకానికి చేరుస్తుంది. ఇలా ఉపాసకుడు ఎప్పుడు చనిపోయినా (ఆయుష్కాలం ప్రకారం) చేరేది మాత్రం బ్రహ్మలోకమే.

ఇక సకామకర్మ యోగులు చంద్రలోకాన్ని చేరుకొనే ప్రయాణం గురించి

**శ్లో||** ధూమో రాత్రి స్తధా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం|

తత్ర చాంద్ర మసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే|| (25)

**తా||** అలాగే పొగ, రాత్రి, కృష్ణపక్షం, 6నెలల దక్షిణాయనం - ఇలా యోగి చంద్రలోకాన్ని పొంది తిరిగి వస్తాడు.

**వ్యాఖ్య:-** తథా:- అలాగే - అంటే ఉపాసకులు బ్రహ్మలోకాన్ని చేరినట్లుగానే సకామ కర్మయోగులు చంద్రుని చేరుకుంటారు. ఎలా?

వీరు వెళ్ళే మార్గం ధూమం (పొగ), రాత్రి, కృష్ణపక్షం, 6 నెలల దక్షిణాయనంతో కూడుకున్న మార్గం. అంటే ధూమాభిమాన దేవత, రాత్రి అభిమానదేవత, కృష్ణపక్షాభిమాన దేవత, దక్షిణాయన అభిమాన దేవత - వీరితో కూడుకున్న మర్గాన శరీరం వదిలిన సకామకర్మయోగులు ప్రయాణిస్తారు. ఇలా ప్రయాణించి వారు చేరుకొనేది చంద్రలోకం - అంటే చంద్రప్రకాశం గల పితృలోకం - స్వర్గలోకం. అలా అక్కడికి చేరి అక్కడే ఉండిపోతారా? లేదు. మళ్ళీ తిరిగి వస్తారు. ఇదే ఈ మార్గంలోని చిక్కు.

ఇంతకుముందు చెప్పుకున్న మార్గం అగ్నితో ప్రారంభమైన అర్చిరాది మార్గం. అయితే ఇది ధూమంతో ప్రారంభమైన ధూమాది మార్గం. దీనినే 'పితృయానం' అని కూడా అంటారు. ఇది పొగతో కూడిన మార్గం గనుక దీనిని 'కృష్ణగతి' అని కూడా అంటారు. అయితే ఈ మార్గంలో ప్రయాణించే వారెవరు?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కోరికతో, ప్రతిఫలాపేక్షతో, ఇష్టాపూర్తదత్తాది కర్మలు చేసేవారు. అగ్నిహోత్రాదులు (యజ్ఞయాగాది క్రతువులు), పూజాదికాలు ఇష్ట కర్మలంటారు. భావులు, చెరువులు త్రవ్వించుట, చెట్లు నాటించుట, దేవాలయాలు కట్టించుట, ప్రజలకు ఉపయోగపడే సత్రములు, కళ్యాణ మండపములు కట్టించుట పూర్తకర్మలు. గోవులను, బంగారాన్ని, ధనాన్ని, వస్త్రాలను సత్పురుషులకిచ్చుట దత్తకర్మలు.

ఇట్టి కర్మల నాచరించే వారు ఆత్మజ్ఞానులు కాదు. ఆత్మజ్ఞానం కొరకు ప్రయత్నించేవారు, త్యాగశీలురైనవారు. అందుకే వీరిని కూడా యోగులు అంటున్నది శాస్త్రం. ఎందుకంటే వీరు తమ ధనాన్ని, సంపదలను కామ్యబుద్ధితోనైనా సత్కార్యాలకు వినియోగిస్తున్నారు గనుక. తమ ధనాన్ని సజ్జనులకు, సత్పురుషులకు వినియోగించటం ఎంతో గొప్పవిషయం. అయినప్పటికీ ఫలాసక్తి ఉన్నది గనుక ఆ ఫలాన్ని - సుఖభోగాలను అనుభవించుటకు తగిన లోకాలకు వెళ్ళి, తిరిగి ఈ లోకానికి శరీరాన్ని ధరించి రావలసిందే.

దేహాన్ని విడిచిన తర్వాత వీరు చేసే ప్రయాణంలో మొదట చేరుకొనే 'స్టేషన్' ధూమం (పొగ). వీరి కోరికలే వీరిని పొగలాగా ఆవరిస్తాయి. వీరి దారి చీకటి మార్గమే. చీకటిలో దారి సరిగ్గా కనబడదు. అందువల్ల ప్రయాణం కష్టంగా ఉంటుంది.

దేహం వదలగానే ఈ సకామకర్మయోగి ముందుగా ధూమాభిమాన దేవతను చేరుకుంటాడు. ఎవరు చేరుస్తారు? ప్రాణంలోని ఉదాన శక్తి

చేరుస్తుంది. ఈ ధూమదేవత ఆ జీవుణ్ణి రాత్రి అభిమానదేవతకు అందిస్తుంది. రాత్రిదేవత కృష్ణపక్ష దేవతకు, కృష్ణపక్ష దేవత దక్షిణాయన దేవతకు అప్పగిస్తుంది. అక్కడి నుండి ఆ దేవత జీవుణ్ణి చంద్రలోకనికి చేరుస్తుంది.

ఈ చంద్రలోకాన్నే జీవుడు పొందే సుఖభోగాలను బట్టి పితృలోకమని, స్వర్గలోకమని, సూర్యలోకమని అంటారు. ఆ జీవుడు చేసిన సత్కార్యాలకు, దానధర్మాలకు, భగవత్కార్యాలకు, పరోపకారాలకు తగిన సుఖభోగాలను ఈ లోకాలలో అనుభవించి, పుణ్యఫలం పూర్తిగా క్షయం కావటంతో ఇక అక్కడ ఉండే వీలులేదు గనుక తిరిగి ఈ లోకానికి వస్తాడు.

ఆ తిరిగి వచ్చే మార్గం ఏమిటి? (పంచాగ్ని విద్య - ఛాందోగ్య ఉపనిషత్తు) చంద్రలోకం నుండి ఆ జీవుడు జారి మేఘమండలంపై పడతాడు. ఆ జీవుడితో పాటు 'అనుభవించినవి పోను మిగిలిన సంచిత కర్మల మూట' అంటిపెట్టుకొని ఉంటుంది. ఆ మూటతో సహాజీవుడు మేఘమండలంలోని వర్షపు బిందువును ఆశ్రయించుకొని ఉంటాడు. వర్షం ద్వారా ఆ జీవుడు భూమండలాన్ని చేరి, భూమి నుండి వచ్చే సస్యాలలోనికి - ధాన్యపు గింజలోనికి వస్తాడు. ఆ ధాన్యాన్ని ఎవరు తింటారు?

ఆ జీవుడి యొక్క ప్రారబ్ధ కర్మలను బట్టి వాడు ఏ దంపతులకు పుట్టాలో ఆ పురుషుడే ఆ ధాన్యాన్ని అన్నంగా తింటాడు. దానితో ఆ జీవుడు పురుషునిలోని వీర్యంగా మారి స్త్రీ గర్భంలో - అంటే తాను ఏ గర్భంలో గర్భనరకం అనుభవించాలో ఆ గర్భంలోచేరి అక్కడి అండంతో సంయోగం చెంది పిండరూపాన్ని ధరిస్తాడు. అనేక వీర్యకణాలలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఒక్క వీర్యకణమే స్త్రీ గర్భంలోని అండాన్ని తొలుచుకొని దానితో కలిసి పిండంగా ఏర్పడుతుంది. ఆ తొలుచుకోగలిగిన వీర్యకణం ఈ జీవుడున్నదే. ఇక ఆ పిండం క్రమక్రమంగా వృద్ధి చెంది 9 మాసాలు కాగానే శిశువుగా జన్మించటం జరుగుతుంది. ఈ విధంగా సకామకర్మయోగి చంద్రలోకం నుండి జారి పునర్జన్మ నెత్తటం జరుగుతుంది.

అయితే ఈ సకామకర్మ యోగులు ఒకవేళ పగలే దేహాన్ని వదిలితే సరాసరి బ్రహ్మలోకానికి చేరుతారా? లేదు. శరీరం విడవగానే ధూమదేవతను చేరిన జీవుడు పగటికాలం గడిచి రాత్రి వచ్చేదాకా ఆ దేవత అధీనంలోనే ఉంటాడు. ఆ ధూమదేవత అతణ్ణి రాత్రి దేవతకు అందిస్తుంది. అక్కడి నుండి కృష్ణపక్ష దేవత, దక్షిణాయన దేవత - చంద్రలోకం. అలాగే శుక్లపక్షంలో దేహం వదిలినా, ఉత్తరాయణంలో దేహం వదిలినా సరాసరి బ్రహ్మలోకం చేరరు. శుక్లపక్షం గడిచి కృష్ణపక్షం వచ్చేదాకా, ఉత్తరాయణం గడిచి దక్షిణాయనం వచ్చేదాకా ముందు స్టేషన్ లోనే ఆగి క్రమంగా చంద్రలోకాన్నే చేరుకుంటారు.

ఇక్కడే దైవఘటన ఉంటుంది. ఏ అన్నం ఎవరికీ ప్రాప్తమో వారికే చేరుతుంది. ఏ స్త్రీపురుషులు భార్యాభర్తలు కావాలో వారే అవుతారు. అందుకే నోటి దగ్గర పెట్టుకున్న ముద్ద నోట్లోకి పోతుందన్న గ్యారంటీ లేదు. పీటల మీద కూర్చున్న పెళ్ళి కొడుకు, పెళ్ళికూతురు మొగుడూ పెళ్ళాలవుతారన్న గ్యారంటీ లేదు, మొగుడూ పెళ్ళాలయిన వారు కాపురం చేసి పిల్లలను కంటారన్న గ్యారంటీ లేదు. ఎక్కడో పండిన ధాన్యం ఎక్కడికో వస్తుంది. దాన్ని కొని అన్నం వండుకొని తింటాం. ఇక్కడ వండిన అన్నాన్ని ఏ రాష్ట్రం నుండో, ఏ దేశం

నుండో వచ్చిన అతిథి - బంధువు తింటాడు. అలాగే పెళ్ళిళ్ళు కూడా అంతే. ఎక్కడెక్కడి వారో భార్యాభర్తలవుతారు.

చంద్రలోకం అనటంలోని ఆంతర్యం: మనస్సుకు అధిదేవత చంద్రుడు. కనుక మనస్సులోని కోరికలు, ఫలాపేక్ష తీరటానికే చంద్రలోకగమనం, చంద్రుని అనుగ్రహంతో సుఖాలు అనుభవించటం జరుగుతుంది. చంద్రుడు ఆహ్లాదాన్ని కలిగించేవాడు.

ఈ రెండు మార్గాలను సమన్వయం చేసి చెబుతూ సాధకులకు సూచన చేయబోతున్నాడు భగవానుడు -

**శ్లో||** శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే|
ఏకయాయాత్యనా వృత్తిం అన్యయాఽఽవర్తతే పునః|| (26)

**తా||** ఈ ప్రకారంగా శుక్ల కృష్ణగతులు రెండూ ఈ జగత్తులో శాశ్వతంగా ఉన్నాయి. ఒకదానితో తిరిగిరాని మార్గాన ప్రయాణిస్తాడు. మరొక దానితో తిరిగివచ్చే మార్గంలో ప్రయాణించి తిరిగివస్తాడు.

**వ్యాఖ్య:-** లోకంలోని యోగులకు శుక్లగతి, కృష్ణగతి అని రెండు మార్గాలు చెప్పబడ్డాయి. ఒక సాధకుణ్ణి అవి చేర్చే లక్ష్యాన్ని బట్టి ఒకదానిని శుక్లగతియని, మరొక దానిని కృష్ణగతి యని అన్నారు. శుక్ల అంటే తెలుపు. కృష్ణ అంటే నలుపు. శుక్లమార్గం ప్రకాశంతో - వెలుగుతో కూడుకొన్నది. కృష్ణమార్గం చీకటితో కూడుకున్నది. మొదటిది సాధకుణ్ణి ఉన్నత స్థానానికి చేరుస్తుంది. రెండవది పైకీ క్రిందికీ తిప్పుతూ సంసార జనన మరణ చక్రంలో ఇరికిస్తుంది.

మొదటి మార్గాన్ని అనుసరించే యోగి పునర్జన్మను పొందడు, మోక్ష సామ్రాజ్యాన్ని చేరుకుంటాడు. రెండవ మార్గాన్ని అనుసరించే యోగి పునర్జన్మను పొందుతూ పుడుతూ - చస్తూ, పుడుతూ - చస్తూ నలిగిపోతాడు. మొదటిది ముక్తిని కలిగించే మార్గం. రెండవది బంధంలో ఇరికించే మార్గం.

జగతః శాశ్వతే మతే:- ఈ రెండు మార్గాలు జగత్తులో శాశ్వతంగా ఉండేవే. జగత్తులో ఎప్పుడూ మానవులుంటారు. వారిలో పైన చెప్పిన నిష్కామ కర్మయోగులూ ఉంటారు, అలాగే సకామకర్మయోగులూ ఉంటారు. వారికోసం ఏర్పరచబడిన ఈ రెండు మార్గాలూ జగత్తులో శాశ్వతంగా ఉంటాయి. ప్రపంచాన్ని సృష్టించేటప్పుడే బ్రహ్మదేవుడు మానవులతో పాటు వారు వెళ్ళవలసిన ఈ రెండు మార్గాలను కూడా సృష్టించాడు. కనుక ఎప్పుడూ ఉండేవే.

మనం ఇల్లు కట్టుకొనేటప్పుడే వీధిగుమ్మాలు, గదులలోనికి పోయే గుమ్మాలు అన్నీ ఏర్పరచుకుంటాం. అలాగే మానవులను సృష్టించేటప్పుడే ఈ రెండు మార్గాలు కూడా ఏర్పాటు చేయబడ్డాయి.

(i) అనాది కాలం నుండి మానవులలో ఐహిక మార్గంలో నడిచేవారు ఎందరో ఉంటున్నారు. తిండి, బట్ట, ఇల్లు, భోగాలు, పదవులు, కీర్తిప్రతిష్టలు - ఇవే జీవితపరమార్థం అనుకుంటూ; శారీరక వాంఛలను, మానసికమైన కోరికలను తీర్చుకోవటం, ఇహలోక, స్వర్గలోక భోగాలను అనుభవించటం మాత్రమే మానవజీవిత లక్ష్యం అని ఎవరు భావిస్తారో; ఎవరి యొక్క బుద్ధి ఉత్తమము, దివ్యము ఐన పరమార్థాన్ని సాధించాలనే ఉత్సాహం లేక ఐహిక

విషయాలలో, సుఖభోగాలలో సంతృప్తి చెందుతూ ఉంటుందో అట్టివారు అనుసరించే మార్గమే కృష్ణగతి. తిరిగి వచ్చే మార్గం.

(ii) ఇక కొద్దిమందే అయినా ఆముష్మిక మార్గంలో నడిచేవారు. ఈ దివ్యమార్గంలో నడిచేవారికి ఇంద్రియముల యందు గాని, ప్రాపంచిక విషయములందు గాని ఆనందం కనిపించదు. వారి బుద్ధి వికసించి ఉంటుంది. ఈ భోగాలన్నీ అనిత్యమైనవిగా, అల్పమైనవిగా కనిపిస్తాయి. వారు శాశ్వతమైన ఆనందాన్ని మాత్రమే కోరుకుంటారు. జీవితం యొక్క నిజమైన లక్ష్యాన్ని, పరమార్థాన్ని తెలుసుకోవాలని ప్రయత్నించి తెలుసుకుంటారు. ఒక సద్గురువును ఆశ్రయిస్తారు. ఇట్టివారు అనుసరించే మార్గమే శుక్లగతి. తిరిగి రాని మార్గం.

పరమార్థాన్ని కోరేవారు వృద్ధులైనా, గొప్పసాధనలు చేస్తున్నా, ఎంతటి జ్ఞాని ఐనా అతడిలో దాగి ఉన్న వాసనలు అప్పుడప్పుడు తలెత్తుతుంటాయి. అప్పుడతడి దృష్టి కొంత ప్రపంచం మీదికి మళ్ళవచ్చు. అయినా అతడు భయపడనవసరం లేదు. నిరాశ చెందనక్కర లేదు. అతడు కేవలం సాధకుడే గనుక సాధనను వదలకుండా ఉంటే సరి. అతడిలో లేచిన అల్పమైన కోరికలు వాటంతటవే చల్లారిపోతాయి. కనుక పరమార్థాన్ని కోరేవారు ప్రాపంచిక విషయాలపై, భోగాలపై అసలు కోరికే లేనివారు - అని భావించనక్కర లేదు. అలాంటివి ఏవి ఉన్నా వారికి పరమార్థమే ప్రధానం. మోక్షమే జీవితలక్ష్యం. అట్టి స్థిర నిశ్చయం ఉంటే చాలు అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి.

ఈ రెండు మార్గాలు తెలియటం వల్ల ప్రయోజనమేమిటో అటు అర్జునునికీ - ఇటు సమస్త మానవాళికీ తెలియజేస్తూ తరుణోపాయాన్ని సూచిస్తున్నాడు.

**శ్లో||** నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన|
తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున|| (27)

**తా||** పార్థా! ఈ రెండు మార్గాలను తెలుసుకున్న యోగి ఎప్పటికీ మోహము చెందడు. అందువల్ల అర్జునా! అన్ని కాలాలలోను నీవు యోగివికా!

**వ్యాఖ్య:-** అర్జునా! ఉన్నత స్థానానికి చేర్చే, వెలుగుతో కూడిన దేవయాన మార్గాన్నీ చెప్పాను. మళ్ళీ మళ్ళీ జన్మలను కలిగించే, చీకటితో కూడిన పితృయాన మార్గాన్నీ చెప్పాను. ఈ రెండు మార్గాలను చక్కగా తెలుసుకున్న యోగి ఇక మోహం చెందడు. యోగి అంటే భగవంతునితో ఐక్యతను కోరుకొనే వాడు; అందుకోసం వేదాంత విషయాలను తెలుసుకొనే ప్రయత్నం చేసేవాడు. అట్టివాడు ఈ రెండు మార్గాలను తెలుసుకుంటే భ్రమ చెందడు. తెలుసుకోకపోతే భ్రమ చెందవచ్చు. ఎందుకంటే వేదాలు కర్మకాండను గురించి చెప్పినవి. పూజాపునస్కారాలు, యజ్ఞయాగాదులు, దానధర్మాలు, ఇష్టాపూర్తాది కర్మలు మొ||న ఎన్నో సత్కార్యాలను, పుణ్యకార్యాలను ఎలా చేయాలో, ఎందుకు చేయాలో, చేస్తే ఎలాంటి ఫలితాలు కలుగుతాయో చక్కగా వేదాలు తెలియజేశాయి. మరి పరమ పవిత్రమైన వేదాలే అలా చెప్పినవి గనుక వాటిని ప్రమాణంగా తీసుకొని కర్మలాచరించటం శాస్త్ర విహితమే గదా! అని అలాగే చేస్తారు కూడా. అలా చేసి వాటి యొక్క

ఫలితాలను స్వర్గలోకంలోనో, లేక మరుజన్మలలోనో అనుభవించి ఖర్చుచేసుకుంటారు. మళ్ళీ మళ్ళీ అలా చేయటం, మళ్ళీ మళ్ళీ జన్మలెత్తి ఈ లోకానికి రావటం జరుగుతుంది. జన్మలెత్తి నందువల్ల జన్మదుఃఖం, జరాదుఃఖం, వ్యాధిదుఃఖం, మరణ దుఃఖం మొ||న దుఃఖాలను అనుభవించాల్సిందే. ఈ దుఃఖాలు తొలగాలని తపిస్తారు గాని తొలగినట్లే తొలగి, తిరిగి తిరిగి వస్తూనే ఉంటాయి. శాశ్వత పరిష్కారం దొరకదు. అట్టివారికి ఈ రెండు మార్గాలు తెలిస్తే? దుఃఖాలు పూర్తిగా, శాశ్వతంగా తొలగిపోవాలంటే తిరిగి జన్మలే లేకుండా పోవాలని, అలా జన్మ లేకుండా పోవాలంటే నిష్కామ కర్మలు ఆచరిస్తూ, భగవంతుని అనన్య భక్తితో నిత్యము, నిరంతరము ఉపాసించాలని, ఇలా చేస్తూ దేహాన్ని విడిస్తే శుక్ల గతిలో ప్రయాణించి, చివరకు బ్రహ్మలోకాన్ని చేరుకొని, ఆత్మజ్ఞానాన్ని పొంది ముక్తి నందుకొన వచ్చునని, తిరిగి వచ్చే పనిలేదని తెలుస్తుంది. దానితో భ్రమ తొలగిపోతుంది; నిష్కామంగా కర్మలాచరిస్తాడు.

- మంచి ఏదో చెడు ఏదో తెలిస్తే చెడును వదిలి మంచినే గ్రహిస్తాడు.
- వెలుగు మార్గం, చీకటి మార్గం తెలిస్తే చీకటిమార్గాన్ని వదిలి వెలుగు మార్గాన్నే వెళతాడు.
- ఒక చేతిలో విషం, మరో చేతిలో అమృతం ఉంటే విషాన్ని విడిచి అమృతాన్నే స్వీకరిస్తాడు. ఎంతటి అమాయకుడు కూడా విషాన్ని స్వీకరించడు.

కనుక ఓ అర్జునా! ఈ రెండు మార్గాలు తెలుసుకున్న నీవు సర్వకాల సర్వావస్థలలోను యోగయుక్తుడవై యుండు. నిష్కామ కర్మలనే ఆచరించు. ఒక్క క్షణం కూడా భగవంతుని మరచిపోవద్దు. భగవంతుని మరిస్తే చాలు మాయ ప్రవేశిస్తుంది. అది నిన్ను ఎంతటి పతనావస్థకైనా తీసుకెళ్ళగలుగుతుంది. కనుక జాగ్రత్తగా ఉండు అంటున్నాడు భగవానుడు.

మనకేం? మనం మహాభక్తులం, మహాజ్ఞానులం, మహాధ్యానులం అని గర్వించరాదు. అహంకరించరాదు. మనం కేవలం సాధకులం మాత్రమే అని గుర్తుంచుకోవాలి. లక్ష్యం ఏమిటో తెలుసుకొని కూడా సాధన చేయని వాడు మూఢుడే అని శంకరాచార్యుల వారు వివేక చూడామణిలో తెలియజేశారు. భవిష్యత్తుపై ఆశపెట్టుకున్నవాడు వర్తమానాన్ని జార విడుచుకోకూడదు. వర్తమానాన్ని సద్వినియోగం చేసుకున్న వాడికే భవిష్యత్తు బంగారంలా ఉంటుంది.

వర్తమానం మన చేతిలో ఉంది. భవిష్యత్తు మన చేతిలో లేదు. చివరకు అది రంగంలోకి వస్తుందో, భంగమై పోతుందో తెలియదు. కనుక వర్తమానాన్ని సద్వినియోగం చేసుకోవాలి. నిరంతరం యోగ యుక్తులం కావాలి. ఏమిటా యోగం? పరమాత్మతో కలయికయే. చిత్తం బ్రహ్మాన్ని చేరి, బ్రహ్మముతో ఐక్యమై అంతటా బ్రహ్మాన్నే దర్శించాలి. ఇదే సమస్త మానవాళికీ భగవంతుడిచ్చిన సందేశం.

అంతిమంగా యోగి పొందే ఫలం ఎట్టిది?

**శ్లో||** వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ

దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టం|

అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా

యోగీ పరం స్థానముపైతి చాద్యం|| (28)

**తా||** యోగి దీనిని తెలుసుకున్నవాడై; వేదాలు, యజ్ఞాలు, తపస్సులు, దానాలు చేస్తే ఏ పుణ్యఫలం వస్తుందో దానిని దాటిపోతున్నాడు. ఆద్యమైన పరంధామాన్ని చేరుకుంటాడు.

**వ్యాఖ్య:-** యోగీ ఇదం సర్వం విదిత్వా:- నిష్కామ కర్మయోగి ఈ అధ్యాయంలో చెప్పిన విషయాన్ని అంతటినీ, ముఖ్యంగా దేవయాన పితృయాన మార్గాల ద్వారా చేరుకొనే లోకాలను గురించి తెలుసుకున్నట్లైతే గొప్ప పుణ్యాన్ని పొందుతాడు. ఏమిటది? (i) బ్రహ్మచర్య నియమంతో షడంగసహితంగా వేదాలను అధ్యయనం చేస్తే ఎంతటి పుణ్యం కలుగుతుందో అంతకన్న అధికంగానూ; (ii) సాంగోపాంగంగా వివిధరకాల యజ్ఞాలను ఆచరిస్తే కలిగే పుణ్యం కన్న అధికంగానూ; (iii) మనస్సును ఏకాగ్రం చేసి కఠినమైన తపస్సులు చేసిన దానికన్న అధికమైన పుణ్యాన్ని; (iv) సరియైన సమయంలో, సరైన ప్రదేశంలో సత్పురుషులైన వారికి శ్రద్ధతో - భక్తితో గో - భూ - హిరణ్య - ధన - ధాన్యాదులను దానం చేస్తే కలిగే ఫలితాల కన్న ఎక్కువఫలితాన్ని పొందుతాడు. దీనిని బట్టి యజ్ఞ, దాన, తపస్సుల కన్న, వేదాధ్యయనం కన్న గొప్పఫలితం ఉపాసన ద్వారా బ్రహ్మాండాన్ని చేరుకోవటం వల్ల కలుగుతుందని తెలుస్తున్నది. అంతేకాదు పైన చెప్పిన 4 రకాల కర్మలు అంత తేలికైన వేమీ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కాదు. ఎందుకంటే (i) చదువురాని వారికి, స్పష్టంగా పలకలేని వారికి వేదాధ్యయనం చాలా కష్టం. (ii) అర్థబలం, అంగబలం లేనివారికి యజ్ఞయాగాదులు నిర్వహించటం కష్టం. (iii) శరీరం దృఢంగా, ఆరోగ్యంగా లేకపోయినా, వయస్సు మీద పడ్డా, సహనం తక్కువైనా తపస్సులు చాలా కష్టం. (iv) ఇక పేదవారికి గాని, భాగ్యవంతులైనా త్యాగబుద్ధి లేనివారికి గాని, స్వార్థపరులకు గాని దానధర్మాలు చేయాలంటే కుదరదు. అంటే పుణ్యప్రదమైన వైనప్పటికీ ఈ చెప్పిన కర్మలను ఆచరించటం అంత తేలిక కాదు. మరి అటువంటి వారికీ కూడా గొప్ప అవకాశం ఏమిటంటే - వాటన్నింటి వల్ల లభించే పుణ్యం కన్న అధికమైన పుణ్యాన్ని పొందాలంటే ఈ అధ్యాయంలో చెప్పబడిన విషయాన్ని చక్కగా గ్రహించి ఆచరణలో పెట్టుకొనుటయే. అదే ఓంకారోపాసన. సగుణోపాసన. నిరంతర పరమాత్మ స్మరణ. దీనికి చదువుగాని, అంగబలం - అర్థబలం గాని, గొప్ప తెలివితేటలు గాని ఏమీ అవసరం లేదు.

కావలసింది శాస్త్రం పట్ల గురువు పట్ల విశ్వాసం. అత్యున్నత స్థానాన్ని పొందాలనే పట్టుదల ఉంటే చాలు. ఇలా చెప్పినందువల్ల యజ్ఞయాగాదులు, వేదాధ్యయనం, దానధర్మాలు, తపస్సులు అవసరం లేదని గాని, వ్యర్థమని గాని అపార్థం చేసుకోరాదు. ఇవన్నీ తప్పక చేయవలసినవే. ఆయా సమయ సందర్భాలను బట్టి, అవకాశాన్ని బట్టి ఆచరించవలసినవే. అయితే వాటిని కూడా నిష్కామంగా ఆచరించాలి.

ఇట్టి యోగి అంతిమంగా అందుకొనే స్థానం ఎటువంటిది?

**ఆద్యం,పరం స్థానం:- ఆద్యం అంటే ఆదిలేనిది, మొదటిది, శాశ్వతమైనది. అది మూడు కాలాలలోను ఉన్నది. అదిలేని కాలం లేదు. నిజంగా కాలం కూడా దానిలో పుట్టి కొనసాగుతూ ఉంటుంది. అంతేకాదు అది పరం - శ్రేష్ఠమైన స్థానం. సర్వోత్తమం. అన్ని స్థానాల కన్న ఉన్నతమైనది. దానికన్న మించినది లేదు.**

**అట్టి స్థానాన్ని పొందినవాని జన్మ సార్థకం అయినట్లే. అతడి పంట పండినట్లే. మానవజీవిత పరమార్థాన్ని సాధించినట్లే. పుట్టినందుకు జన్మను సార్థకం చేసుకున్నట్లే.**

**గద్యం:** ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షర పరబ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః

**ఓం తత్ సత్. ఇలా ఉపనిషత్తుల సారమై, బ్రహ్మవిద్యా ప్రతిపాదితమై, యోగశాస్త్రమై, శ్రీకృష్ణ - అర్జునుల మధ్య జరిగిన సంవాద రూపమైన భగవద్గీతలో అక్షరపరబ్రహ్మ యోగమనే పేరుగల ఎనిమిదవ అధ్యాయం సమాప్తం.**

**ఓంకారాన్ని ఉచ్చరిస్తూ - అర్థభావాన్ని ధ్యానిస్తూ, జీవుడికి ఆధారమైన పరమాత్మను స్మరిస్తూ దేహాన్ని వదిలిన యోగి, అక్షరుడైన పరబ్రహ్మాన్ని చేరుకొనే ఉపాయాన్ని చెప్పిన అధ్యాయం గనుక, ఇది అక్షర పరబ్రహ్మయోగం.**

# శ్రీమద్భగవద్గీత :9 వ అధ్యాయం

# రాజవిద్యారాజగుహ్యయోగం



: వ్యాఖ్యాత :


**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాథమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంథాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్త్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం', 'ఆత్మబోధ' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3, 4, 5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం భగవద్గీత 6 - 18 అధ్యాయములు, ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

రాజవిద్యా రాజగుహ్య యోగం అనే ఈ అధ్యాయం భగవద్గీతలో 9వ అధ్యాయం. భగవద్గీత మొత్తం 18 అధ్యాయములు. కనుక ఇది మధ్యలోనున్న అధ్యాయం అన్నమాట. మహాభారత మధ్యంలో భగవద్గీత అనే మణిపూస ఉంటే, భగవద్గీత మధ్యలో ఈ రాజవిద్యా రాజగుహ్యయోగం అనే పతకం ఉన్నది.

అంకెలలో చివరి అంకె 9. అది విచిత్రమైన అంకె. దానికి అనేక ప్రత్యేకతలు ఉన్నాయి. భగవంతుని లాగే ఈ అంకె ఒక్కటే అయినా అనేక రూపాలు ధరిస్తుంది. అనేక రూపాలు ధరించినా ఒక్కటిగానే ఉంటుంది. ఈ 9 అంకెను ఎంతతోనైనా హెచ్చించండి. అనేక రూపాలు ధరిస్తుంది. మళ్ళీ ఆ వచ్చిన అన్ని అంకెలను కలపండి. ఆ 9 అనే అంకెయే వస్తుంది. ఉదాహరణకు 9x4=36. 3+6=9, 9x15=135, 1+3+5=9, ఇలాగే 9ని ఏ అంకెతోనైనా, ఏ సంఖ్యతో నైనా హెచ్చించినప్పుడు అనేక రకాల సంఖ్యలు వస్తాయి. తిరిగి ఆ సంఖ్యలలోని అంకెలన్నింటిని కలుపుతూ పోతే చివరకు ఆ తొమ్మిదే వస్తుంది. ఇదే ఏకత్వంలో పృథక్త్వం; పృథక్త్వం నుండి ఏకత్వం. ఒక్కటి అనేకం. అనేకం తిరిగి ఒక్కటి కావటం. ఈ విషయాన్నే "ఏకత్వేన పృథక్త్వేన - - -" అని అంటూ భగవానుడు ఈ అధ్యాయంలో తన యోగమాయను గురించి చెప్పటం జరిగింది. దీని భావం ఏమంటే భగవంతుడు ఒక్కడే. అయితే అనేక రూపాలుగా వ్యక్తమవుతూ ఉంటాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అయినప్పటికీ ఆ రూపాలు ఉన్నా, తొలగినా నిజంగా ఉన్నది మాత్రం ఒక్కడే అని. అన్ని రూపాలలో ఉన్నది ఒక్కడే.

ఆకాశం ఒక్కటే. అయితే ఇక్కడ 10 కుండలను ఉంచాం. అన్నింటిలోనూ ఆకాశం ఉంది. దీనిని ఘటాకాశం అంటారు. అంతటా ఉన్నది మహాకాశం. ఎన్ని ఘటాలుంటే అన్ని ఘటాకాశాలున్నట్లు అనిపిస్తుంది. కాని అన్నింటిలోనూ ఉన్నది ఆ మహాకాశం ఒక్కటే.

ఇంకా 9 అంకె ప్రత్యేకతలెన్నో ఉన్నాయి.

1 నుండి 9 వరకు గల అంకెలన్నింటిని కూడండి. 45 వస్తుంది. ఈ 45లోని 4, 5 కూడితే 9 వస్తుంది. అంటే 9 అంకె ఎన్ని రూపాలు ధరించినా చివరకు ఒక్కటిగానే ఉంటున్నది.

ఎన్ని అంకెల సంఖ్యనైనా వేయండి. తిరగవేసిన సంఖ్యను పై సంఖ్య నుండి తీసివేయండి. ఆ వచ్చిన సంఖ్యలోని అంకెలను కూడండి. చివరకు 9 వస్తుంది. ఉదాహరణకు - 7362-2637=4725, ఈ సంఖ్యలోని అంకెలను కూడండి. 4+7+2+5=18, తిరిగి 1+8=9.

భగవద్గీతలోని అధ్యాయాలు 18. 1+8=9.

అంకెలన్నింటిలోను పెద్ద అంకె 9 మాత్రమే.

ఇలా గణితంలో 9 అంకెకు ఎన్నో ప్రత్యేకతలున్నాయి. ఇది ఒక చమత్కారమైన అంకె. అలాగే ఈ 9వ అధ్యాయం కూడా అనేక ప్రత్యేకతలతో కూడిన అధ్యాయం.

మహారాష్ట్రలో ఒక జ్ఞానియైన భక్తాగ్రగణ్యుడున్నాడు. ఆయనే జ్ఞానదేవుడు. ఆయన తన అవసానదశలో ఈ అధ్యాయాన్ని పఠిస్తూ మహాసమాధిని పొందాడు. కర్మను భక్తితోను, భక్తిని జ్ఞానంతోను ముడిపెట్టి ఈ మూడింటికి ఒకే సూత్రాన్ని ఘటింపజేసిందీ అధ్యాయం.

ఇందులో చెప్పిన విద్యను రాజవిద్య అన్నారు. రాజవిద్య అంటే విద్యలలోకెల్లా రాజు వంటిది, అంటే శ్రేష్ఠమైన విద్య - అని. రాజబజారు అంటారు. అంటే ముఖ్యమైన బజారు అని.

ఈ అధ్యాయం యొక్క మరొక ప్రత్యేకత ఏమంటే ఇది భక్తులైన వారికి భక్తి స్వరూపంగాను, జ్ఞానులైన వారికి జ్ఞానస్వరూపంగాను దర్శనమిస్తుంది. అంటే ఈ అధ్యాయంలో భక్తులేమో భక్తి యొక్క గొప్పతనాన్ని దర్శిస్తారు. జ్ఞానులేమో జ్ఞాన మహాత్యాన్ని దర్శిస్తారు. వారి వారి అంతస్తును, అభిరుచిని బట్టి వారివారి భావాలు, అనుభవాలు ఇందులో ఫలిస్తుంటాయి.

తిరుపతి క్షేత్రాన్ని పూర్వకాలం నుండి చాలామంది విష్ణుక్షేత్రం గానే దర్శిస్తున్నారు. అయితే కొందరు శైవక్షేత్రంగాను, కొందరు శక్తిపీఠం గాను పరిగణిస్తున్నారు, దర్శిస్తున్నారు. ఇక్కడి దేవుడు నిలువుబొట్టు గలవాడు గనుక వైష్ణవులు విష్ణుక్షేత్రం అంటారు. చేతులపై నాగపడిగలుంటాయి గనుక శైవులు శైవక్షేత్రం అంటుంటారు. ముందు భాగంలో వధ్యశిల ఉన్నది గనుక శాక్తేయులు దీనిని శక్తిక్షేత్రం అంటారు. ఏడుకొండల వాడు అందరికీ అన్ని రూపాలై దర్శనమిస్తున్నాడు. అయినా తానుతానుగానే ఉన్నాడు.

కర్నాటక రాష్ట్రంలో 'శివగంగ' పర్వతం ఉన్నది. దాన్ని 'తుంకూరు' నుండి చూస్తే శివలింగాకారంగా కనిపిస్తుంది. 'బెంగళూరు' నుండి చూస్తే నంది ఆకారంగా ఉంటుంది. మరొక వైపు నుండి చూస్తే సర్పాకారం గాను, మరోవైపు నుండి గణపతి ఆకారంలోను దర్శనమిస్తుంది. అలాగే ఈ అధ్యాయం ఎవరు ఏ విధమైన భావనతో చూస్తే వారికి ఆవిధంగా కనిపిస్తుంది.

7వ అధ్యాయంలో సృష్టి యొక్క 'ఉత్పత్తి' చెప్పబడింది. ఈ 9వ అధ్యాయంలో సృష్టియొక్క 'స్థితి' చెప్పబడింది. 8వ అధ్యాయం ప్రారంభంలో అర్జునుడు మరణాన్ని గురించి అడగటంతో సృష్టి యొక్క లయాన్ని - ప్రళయాన్ని గురించి 8వ అధ్యాయంలో చెప్పబడింది. అర్జునుడు అలా ప్రశ్న వేయకపోయినట్లైతే ఈ 9వ అధ్యాయంలో చెప్పబడిన విషయం తరువాత 8వ అధ్యాయానికి సంబంధించిన విషయం వచ్చేది. అంటే 7,9,8 ఒక వరుసలో ఉండేవి.

నిజంగా 7వ అధ్యాయానికి, 9వ అధ్యాయానికి చక్కని సంబంధం ఉన్నది. 'జ్ఞానం తేహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్య శేషతః' - విజ్ఞాన సహిత జ్ఞానాన్ని నేను నీకు సంపూర్ణంగా చెప్పబోతున్నాను అంటూ ప్రారంభించాడు భగవానుడు 7వ అధ్యాయంలో. 'జ్ఞానం విజ్ఞాన సహితం ప్రవక్ష్యామి' - విజ్ఞాన సహిత జ్ఞానాన్ని చెప్పబోతున్నాను అంటూ ఈ 9వ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు. అంటే 7వ అధ్యాయంలో చెప్పిన విషయాల కొనసాగింపే ఈ 9వ అధ్యాయం అని అర్థమవుతున్నది. ఇది

శ్రేష్ఠమైన విద్య, రహస్యమైన విద్య. మోక్షవిద్య. కనుక ఎంతో ప్రాధాన్యత గల విద్య.

ఈ అధ్యాయంలో భగవంతుడు మానవులకు 3 గొప్ప హామీలను ఇవ్వటం జరిగింది. 1.ఎవరైతే తనను అనన్యభక్తితో సేవిస్తారో వారి అవసరాలన్నింటిని తానే తీరుస్తాననన్నాడు. 2.తనను శరణువేడిన వాడు ఎంతటి పాపాత్ముడైనా సరే అతడు సాధువుగానే పరిగణించబడతాడు. అట్టి వానిని రక్షిస్తాననన్నాడు. 3.పాపాత్ములు కూడా మోక్షాన్ని పొందవచ్చునని హామీ ఇచ్చాడు. ఐతే వారు పాపాచరణ మాని సత్కర్మాచరణ ప్రారంభించాలి.

ఇన్ని ప్రత్యేకతలున్న శ్రేష్ఠమైన విద్య గనుక, రహస్యమైన మోక్షవిద్య గనుక దీనికి ప్రసిద్ధమైన పేరు పెట్టబడింది, రాజవిద్యా రాజగుహ్యం అని. దీనికే 'రాజమార్గయోగం' అనే పేరు కూడా ఉన్నది.

మహాభారత మధ్యంలో భగవద్గీత శోభించినట్లు, భగవద్గీత మధ్యలో ఈ అధ్యాయం శోభిస్తుంది. ఈ అధ్యాయం మధ్యలో శోభించే అద్భుతశ్లోకం ఒకటి ఉన్నది. అదే "అనన్యాశ్చింత యంతో మాం ఏజనాః పర్యుపాసతే —" అని. ఈ శ్లోకం స్వర్ణాభరణం మధ్య తళతళ ప్రకాశించే పచ్చల పతకం లాంటిది.

ఈ అధ్యాయంలోని విషయాల గురించి చర్చించే ముందు గడిచిన అధ్యాయంలోని విషయాల గురించి ఒకసారి సింహావలోకనం చేద్దాం.

ప్రపంచంలోని మొత్తం మానవజాతిని 4 వర్గాలుగా విభజించవచ్చు.

1.మొదటివర్గం కర్మాతీతులు :- వీరు జీవన్ముక్తులు, జ్ఞానభక్తులు.

2.రెండవవర్గం వారు ఉపాసకులు :- వీరు ముముక్షువులు. నిష్కామ కర్మయోగులు. వీరికి ఫలాసక్తి లేదుగాని కర్తృత్వ బుద్ధి ఉంటుంది. అంటే "నేను చేస్తున్నాను" అనే స్పృహ ఉంటుంది. నిష్కామ కర్మాచరణతో చిత్తశుద్ధి పొంది ఆత్మజ్ఞానాన్ని పొందుతూ ఉంటారు. వీరిది క్రమముక్తి మార్గం. వీరి గురించి 8వ అధ్యాయంలో చెప్పుకున్నాం.

3.మూడవవర్గం వారు కర్ములు :- వీరు సకామ కర్మయోగులు. సత్కర్మలే చేస్తారు. కాని ఫలితాన్ని ఆశిస్తారు. పేరుకు కృష్ణార్పణం అంటారుగాని చేసేదంతా దేహార్పణం, పుత్రార్పణం, భార్యార్పణం, భర్తార్పణం. అనేది శివార్పణం చేసేది శవార్పణం. గుళ్ళో పూజారిని "ఏమయ్యా! ఎప్పుడూ భగవంతుని సాన్నిధ్యంలో ఉండి పూజలు చేస్తుంటావు గదా! ఏమి వస్తుంది నీకు?" అంటే ఆయనంటాడు "ఆ! ఏమొస్తుందండీ! గంపెడు పిల్లలు, నేను, మాఆవిడ - అస్తమానం కనిపెట్టుకుని ఉంటే ఏదో తినటానికి, ఉండటానికి - అంతే. పెళ్ళిళ్ళు, పేరంటాలు చేయాల్సి వస్తే అప్పుల బ్రతుకే" - అంటాడు. అంతా డబ్బు దృష్టే; ప్రాపంచిక దృష్టే గాని పరమాత్మ దృష్టి లేదు.

నిజమైన కృష్ణార్పణ దృష్టితో కర్మలు చేయటం అంత తేలికకాదు, దాని ఫలమూ అంత తేలికైనది గాదు. అది ఎలా ఉంటుందో చూడండి.

మహారాష్ట్రలో ఒక భక్తురాలు ఉండేది. ఏ పనిచేసినా కృష్ణార్పణం అని చేయటం ఆమెకు అలవాటు. పనిఏదైనా సరే కృష్ణార్పణం అనకుండా ఉండదు. ఆ అభ్యాసం ఆమె పాలిటికి ఒక యోగమై కూర్చుంది. అందులో గొప్పసిద్ధి

కూడా లభించింది. మనం నిరంతరం - దీర్ఘకాలం - సదుద్దేశంతో చేసే ఏ పనైనా ఏ సాధన ఐనా ఒక సిద్ధిని కలిగించే తీరుతుంది.

ఆమె ప్రతిరోజూ ఇంటి ముంగిలిని పేడతో అలికి శుద్ధి చేస్తుంది. అలికిన తరువాత మిగిలిన పేడను వీధిలో పారవేస్తూ 'కృష్ణార్పణం' అంటుంది. ఆ ఊళ్ళో ఒక కృష్ణాలయం ఉంది. ఆ ఆలయంలోని కృష్ణ విగ్రహం పై పడిపోతుందీ పేడ. పూజార్లు దోషపరిహారం కోసం రోజూ సంప్రోక్షణ చేస్తుండే వారు.

ఆమె కొకనాడు జ్వరం వచ్చింది. జ్వరం కూడా కృష్ణార్పణమే. కృష్ణవిగ్రహం వేడెక్కి పోయింది. అర్పించిన దాన్ని అనుభవించక ఆయనకు తప్పదు గదా! ఆమెకు మరణం ఆసన్నమయింది. అదీ కృష్ణార్పణమే. అంతే. కృష్ణవిగ్రహం ఫెళఫెళ మంటూ బ్రద్దలైంది. వైకుంఠం నుండి విమానం వచ్చింది. అదీ కృష్ణార్పణమే.

మంచీ కృష్ణార్పణమే. చెడూ కృష్ణార్పణమే. చెడును కృష్ణార్పణం చేసి, మంచిని మనకర్పణం చేసుకుంటే అది పచ్చి మోసం అవుతుందేకాని భక్తికాదు. మోక్షాన్ని ఇక్కడికిక్కడే పొందిన ఆ మహాభక్తురాలికి విమానంతో పనేమిటి? ఇక్కడ ఏమిలేక అక్కడ వైకుంఠానికి వెళ్ళాలి? కృష్ణార్పణబుద్ధితో ఇన్నాళ్ళు పనిచేసిన ఫలితంగా విమానం వస్తే ఆమె ఆఫలాన్నీ కృష్ణార్పణం చేసింది.

పనిచేసేటప్పుడు కృష్ణార్పణం అని; ఫలితం వచ్చినప్పుడు ప్రాకులాడితే అది నిష్కామ కర్మయోగలక్షణం కాదుగదా! అందుకే ఆమె పనితో సహా

ఫలితాన్నీ కృష్ణార్పణం చేసింది. ఆమె ఇక్కడికిక్కడే కృష్ణునిలో లీనమై పోయింది. ఇదే నిజమైన నిష్కామకర్మయోగ విధానం, దానివల్ల కలిగే ప్రభావం.

అయితే ఫలాసక్తితో పనిచేసే సకామకర్మయోగులు ఇంతదూరం పోలేరు. వారికి ఫలితం మీదే దేబిరింపు. భగవద్గీత దృష్టిలో వీరు కృపణులు. అంటే లోభులు - పిసినిగొట్టులు. చేసే కష్టం చేస్తూ శాశ్వతానందం పొందక తాత్కాలిక ఆనందంతో తృప్తి పడేవాళ్ళు. "అయినా ఫరవాలేదు. క్రమంగా బాగుపడతారులే" అని భగవద్గీత వారిని సానుభూతితో చూస్తుంది. ఫలాసక్తితో ఉండేవాడు అల్పఫలాన్నే కాదు, అప్పుడప్పుడు అనర్థాన్ని కూడా పొందే అవకాశం ఉంది. గొప్పకోసం, పదిమందికీ తెలియటం కోసం నాలుగు బజార్ల కూడలిలో ఒకడు కోనేరు త్రవ్వించాడు. ఒకడికి కాలుజారి ప్రాణం పోయింది. ఆ పాపం ఎవరికి? పుణ్యం కోసం ఆరాటపడిన వాడికే పాపం కూడా. సకామకర్మల పరిణామాలు ఇలాగే ఉంటాయి. ఈ సకామకర్మయోగులు పితృయానం ద్వారా ప్రయాణించి, తిరిగి ఈ లోకంలో జన్మలెత్తుతుంటారని 8వ అధ్యాయంలో చెప్పుకున్నాం.

4.నాలుగవ వర్గం వారు కర్మభ్రష్టులు :- వీరు భ్రష్టాచారులు. వీరికి కర్మం, ధర్మం, పుణ్యం, పాపం అంటూ ఏమీ లేవు. ఇంద్రియ సుఖాలకోసం, స్వార్థం కోసం ఏమైనా చేస్తారు. వీరికి దేవుడు, దైవం, భక్తి, భజన, పూజలు, పునస్కారాలు పడవు. పైగా అలా చేసే వారిని చూసి ఎగతాళి చేస్తారు. కోసి చూస్తే ఏ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కోశంలోనూ దంభం, దర్పం, అహంకారం, అజ్ఞానం తప్పవేరేమీ ఉండవు. వీరు దర్పానికి భయపడతారే గాని ధర్మానికి భయపడరు.

ఒక ఆశ్రమం ఉంది. ఆశ్రమవాసులు రోజూ వేకువనే లేచి స్నాన సంధ్యాదులు, ధ్యాన పారాయణలు చేస్తుంటారు. ఒక సాధువు ప్రయాణం చేస్తూ ఒకరోజు ఈ ఆశ్రమానికి అతిధిగా వచ్చాడు. ఆయనకొక గది ఇచ్చారు. ఆశ్రమనియమం ప్రకారం వేకువనే గంట మ్రోగింది. ఆశ్రమవాసులు స్నానానికి వెళ్ళారు. క్రొత్త సాధువు పడక దిగలేదు. ఆశ్రమాధిపతి అతడి గది వద్దకు వెళ్ళి సాధువును స్నానానికి పిలిచాడు. చన్నీళ్ళలో మునిగే ఓపిక లేదు సాధువుకు. అందుకే అతడు ఆశ్రమాధిపతితో "నేనెప్పుడూ జ్ఞానగంగలోనే స్నానం చేస్తాను. బాహ్యగంగ అజ్ఞానులకే గాని మాబోటి వారికి కాదు, వెళ్ళండి" అన్నాడు.

మరురోజు ద్వాదశి భిక్ష లక్షణంగా జరిగింది. స్వీట్లు, హాట్లు, వడలు, బొబ్బట్లు, పాయసం, గారెలు మొ||న వాటితో విస్తరి నిండింది. అందరితో పాటు సాధువు సుష్టుగా భోజనం చేశాడు. రాత్రికి గదిలో పడుకున్నాడు. సాధువుగారు గదిలో పడుకున్న తరువాత ఆశ్రమాధిపతి గది బయట గొళ్ళెం పెట్టాడు. తీపి అధికంగా తిన్నందువల్ల, భుక్తాయాసం వల్ల సాధువుకు బాగా దప్పిక వేసింది. లోపల కావాలనే మంచినీరు పెట్టలేదు. తలుపు తీయబోతే రాలేదు. "తలుపు తీయండని"సాధువు నానాగోల చేశాడు. ఆశ్రమాధిపతి వచ్చి తలుపు తీసి సంగతి అడిగాడు.

"ఏమయ్యా! ఏమిటీ మర్యాద? లోపల మంచినీరు లేదు. బయట గొళ్ళెం పెట్టారు. దప్పికతో చచ్చిపోతున్నాను. నీరు తెప్పించండి" అన్నాడు సాధువు. దానికి ఆశ్రమాధిపతి, "స్వామీ! వేకువన స్నానం చేసిన జ్ఞానగంగ త్రాగండి. బాహ్యగంగ మాబోటి అజ్ఞానులకే గాని మీకు కాదుగదా! స్నానానికి లోపలిగంగ, త్రాగటానికి బయటిగంగ ఎందుకండీ?" అన్నాడు. ఆ దెబ్బతో సాధువుగారి రోగం కుదిరింది. వీరే భ్రష్టాచారులు, కర్మభ్రష్టులు. ఇలా 4 వర్గాలవారున్నారు.

8వ అధ్యాయంలో ఉపాసకులు, కర్ములు అనే 2,3 వర్గం వారి ప్రయాణమార్గాలు చెప్పారు. ఇప్పుడీ అధ్యాయంలో కర్మాతీతులైన జ్ఞానుల విషయం చెప్పబోతున్నారు. 8వ అధ్యాయం ఉపాసనా ప్రధానమైన అధ్యాయం. 9వ అధ్యాయం జ్ఞాన ప్రధానమైన అధ్యాయం. మరొక విధంగా చెప్పాలంటే 8వ అధ్యాయం ఎట్లా చావాలో చెబుతుంది. 9వ అధ్యాయం ఎట్లా బ్రతకాలో చెబుతుంది.

ఇది రాజవిద్యా రాజగుహ్య యోగం. అవ్యక్తం నుండి ఈ ప్రపంచం ఎలా వ్యక్తమవుతుందో తెలిపే విద్య గనుక ఇది రాజవిద్య. ప్రకాశంతో, ఆకర్షణీయంగా కనిపించే ఈ ప్రపంచానికి అధిపతి ఐన ఆ పరమపురుషుడు ఎవరో తెలియదు గనుక ఇది రాజగుహ్యం (అత్యంత రహస్యం). ఇక అధ్యాయంలోనికి ప్రవేశిద్దాం -

- భగవానుడు తాను చెప్పబోయే విద్య ఎట్టిదో, దానిని అందుకున్నందు వల్ల ప్రయోజన మేమిటో మొదటి శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో|| ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే|**

**జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్|| (1)**

**తా||** భగవానుడంటున్నాడు: ఇదిగో అత్యంత రహస్యమైన విజ్ఞానంతో కూడిన జ్ఞానాన్ని అసూయలేనివాడవు గనుక నీకు చెప్పబోతున్నాను. దీనిని తెలుసుకుంటే అశుభం నుండి విడుదల పొందుతావు.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో శాస్త్రానికి కావలసిన అనుబంధ చతుష్టయం మొత్తం నిరూపించబడింది. అనుబంధ చతుష్టయం అంటే - 1.అధికారి: శాస్త్రాన్ని తెలుసుకోవటానికి అర్హత ఉండాలి. అట్టి అర్హత గలవాడే అధికారి. 2.సంబంధం: గురుశిష్య సంబంధం. 3.విషయం: శాస్త్రంలో చెప్పబడ్డ ముఖ్య విషయం ఏమిటి? 4.ప్రయోజనం: ఈ శాస్త్రాన్ని తెలుసుకోవటం వల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? ఈ నాలుగు విషయాలను ఈ శ్లోకంలో వివరించటం జరిగింది. ఇంటి యొక్క వైభవాన్ని ముఖద్వారమే చెబుతుంది. ఊరి యొక్క కళను గోడలే చెబుతాయి. అలాగే అధ్యాయం యొక్క ప్రభావాన్ని మొదటి శ్లోకమే చెబుతుంది. మరి ఏం చెబుతున్నది ఈ మొదటిశ్లోకం?

1.అధికారి:- అనసూయవే = అసూయలేని వాడవు గనుక. శాస్త్రాన్ని వినటానికి అర్హత అసూయ లేకుండటం. లోతుగ తెలుసుకోకుండ దేనినైనా త్రోసి పుచ్చటమే అసూయ. ఇదిలేని వాడు అర్జునుడు.

**2.సంబంధం:- ప్రవక్ష్యామి = చెప్పబోతున్నాను. చెప్పబోతున్నది గురువైన శ్రీకృష్ణుడు. వినవలసినది శిష్యుడైన అర్జునుడు. అంటే గురుశిష్య సంబంధం.**

**3.విషయం:- జ్ఞానం విజ్ఞాన సహితం = విజ్ఞానంతో కూడిన జ్ఞానం. ఇదీ ఈ అధ్యాయంలోని విషయం. అత్యంత రహస్యమైన మోక్షవిద్య ఇక్కడి విషయం.**

**4.ప్రయోజనం:- యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ = దీనిని తెలుసుకుంటే అశుభం నుండి విడుదల పొందుతావు. కనుక సకల అశుభాల నుండి విడుదలయే ప్రయోజనం.**

**ఇలా ఎందుకు ముందుగానే చెప్పటం? తాను తెలియజేయబోయే జ్ఞానాన్ని ఎలాగైనా సరే విని తెలుసుకోవాలనే అభిరుచిని శ్రోతకు (అర్జునునికి) కలిగించటానికే భగవానుడు ఇలా చెప్పటం.**

**ఈ శ్లోకంలో చెప్పబడిన ముఖ్యవిషయాలు 3.**

**I. తాను చెప్పబోయే జ్ఞానం:- 1.గుహ్యతమం. 2.విజ్ఞాన సహిత జ్ఞానం.**

**1.గుహ్యతమం అంటే అత్యంత రహస్యమైనది - అని.**

**గుహ్యం (positive degree) గుహ్యతరం (comparitive) గుహ్యతమం (superlative) గుహ్యం = రహస్యం. గుహ్యతరం = మరొక రహస్యం కన్నా ఎక్కువ రహస్యం. గుహ్యతమం = అన్ని రహస్యాల కన్న గొప్ప రహస్యం. దీనికి మించిన రహస్యం మరొకటి లేదు. పరమాత్మను పరోక్షంగా చెప్పే జ్ఞానం గుహ్యతరం. పరమాత్మను తన స్వరూపమేనంటూ చెప్పే జ్ఞానం**

గుహ్యాతమం. ఇంత అత్యంత రహస్యమైన జ్ఞానాన్ని ఎవరూ లేనిచోట చెవిలో చెప్పాలా? అలాగైతే యుద్ధరంగ మధ్యంలో 18 అక్షౌహిణుల సేనల రణగొణ ధ్వనులు, సింహనాదాల మధ్య భగవానుడు ఎలా చెప్పాడు? - అంటే

ఎంతమందిలో చెప్పినా బుద్ధి అంతర్ముఖమైన వాడు, ఏకాగ్రమైన చిత్తంతో ఉన్నవాడే గ్రహిస్తాడు గాని, ప్రాపంచిక విషయాలతో కలుషితమైన మనస్సు గలవాడు గ్రహించలేడు అని. అందుకే ఇది గుహ్యాతమం.

2.జ్ఞానం విజ్ఞాన సహితం:- జ్ఞానం అంటే శాస్త్రజ్ఞానం. విజ్ఞానం అంటే అనుభవజ్ఞానం. విజ్ఞానంతో కూడినప్పుడే జ్ఞానం ఫలప్రదమౌతుంది. అనుభవంలేని శాస్త్రజ్ఞానం భుక్తికే గాని ముక్తికి కాదు. అది వాపేగాని బలుపుకాదు.

7వ అధ్యాయంలో సృష్టి క్రమం, 8వ అధ్యాయంలో లయరహస్యం చెప్పారు. ఈ రెండూ అర్జునునికి తెలుసు. ఇక తెలుసుకోవలసింది 'సృష్టి', 'సంహారాల' కు ఆధారభూతమైన 'స్థితి' లో ఉండే పరమపురుషుణ్ణి గురించే. ఆయనను చేరుకోవటం గురించే.

పరమపురుషుని గురించి తెలుసుకోవటం జ్ఞానం. ఆయన సృష్టి సంహారాలకు ఎలా ఆధారభూతమౌతాడో తెలుసుకోవటం విజ్ఞానం. మరొకవిధంగా చెప్పాలంటే పరమపురుషుని గురించి తెలుసుకోవటం జ్ఞానం. ఆయనను చేరుకొనే విధానాన్ని తెలుసుకోవటం విజ్ఞానం.

(II) ఈ విజ్ఞాన సహిత జ్ఞానాన్ని తెలుసుకుంటే ప్రయోజనం ఏమిటి? ఏ ప్రయోజనమూ లేని పనిని ఎవరైనా ఎందుకు చేస్తారు? ఏదో ప్రయోజనం ఉండాలి. ఏమిటది? యజ్ఞాత్వా మోక్ష్యసేஉశుభాత్ = అన్ని అశుభాల నుండి విడుదల పొందటం. అసలు అశుభం ఏమిటి? జననమరణ రూప సంసారమే అసలైన అశుభం.

కార్యరూపంలో ఉండే అశుభాలు కర్మలతో, ఉపాసనలతో తొలగుతాయి. కాని కారణరూపమైన అశుభం జ్ఞానంతో తప్ప తొలగదు. కారణాన్ని అలాగే అట్టిపెట్టి కార్యాన్ని ఎన్నిసార్లు తొలగించినా ఏం లాభం లేదు. అంటే అన్ని ఆశుభాలకు కారణమైన అజ్ఞానాన్ని అలాగే ఉంచి పైపై ఆశుభాలను ఎన్నిసార్లు తొలగించినా లాభం లేదు. దుంపను అలాగే ఉంచి పైపైకొమ్మలను ఎన్నిసార్లు త్రుంచినా మళ్ళీ మొలకెత్తుతాయి. చచ్చిన కుక్కను భావిలోనే ఉంచి ఎన్నిసార్లు నీళ్ళు తోడినా వాసన పోదు.

అలాగే అజ్ఞానాన్ని అలాగే ఉంచి ఎన్ని అశుభాలు తొలగించుకున్నా మళ్ళీ మళ్ళీ వస్తాయి. కనుక విజ్ఞానసహిత జ్ఞానంతో ఈ అజ్ఞానాన్ని తొలగించుకుంటేనే అసలైన అశుభం తొలగిపోతుంది. అదే ఈ రహస్యజ్ఞానం యొక్క ప్రయోజనం.

(III) అట్టి ఈ అత్యంతరహస్య విజ్ఞానసహిత జ్ఞానాన్ని అందుకోవాలంటే అర్హత ఏమిటి? - అనసూయవే. అసూయలేకుండా ఉండటమే.

జ్ఞానం మన స్వరూపమే అయినా అర్హతలేని వానికి అగమ్యగోచరంగానే ఉంటుంది.

- గుడ్లగూబకు పట్టపగలే సూర్యుడు కనిపించడు.
- ఎంత సంపదలున్నా పిసినారి వాడు ఏమీలేనివాడే.

అలాగే భగవద్గీతలో ఎంత జ్ఞానం ఉన్నా, గురువు ఎంత వివరంగా చెప్పినా నొసటిగీత బాగాలేకపోతే - అర్హత లేకపోతే ఏం ప్రయోజనం లేదు.

- అమృతాన్ని త్రాగేందుకు దేవతలే అర్హులు. రాక్షసులకు ఆ అర్హత లేదు.
- పుష్పాలలోని మకరందం భ్రమరాలకే గాని కప్పలకు బురద నీరే గతి.
- సింహం పాలు పోయాలంటే బంగారు పాత్ర కావాలి. చిల్లర పాత్రలలో పోస్తే చిల్లులు పడిపోతాయి.
- నాగస్వరం ఆలకించి పడగలెత్తి ఆడటం నాగుబాములకే చెల్లుతుంది కాని మట్టి తినే తుట్టెపురుగులకేం తెలుస్తుంది?

అందుకే శాస్త్రాలలో అధికారి లక్షణాన్ని మొదట్లోనే చెబుతారు. అర్జునునిలో అధికారి లక్షణం అసూయ లేకపోవటమే. అసూయ అన్ని గుణాలలోను చెడ్డది. అదొక్కటుంటే చాలు అన్నీ ఉన్నట్టే. ఎవడో అన్నాడట నాకే రోగం లేదు, ఒక్క కుష్టు తప్ప - అని. అది ఒక్కటి ఉంటే చాలదా? - రాజరోగం.

ఇతరులు పచ్చగా ఉంటే చూచి కళ్ళల్లో నిప్పులు పోసుకొనే తుచ్ఛ స్వభావమే అసూయ. ఇది పండితులను, పామరులను, సాధువులను, సన్యాసులను ఎవ్వరినీ వదలదు. అసూయాపరుడి జీవితమంతా ఇతరులను విమర్శించటంతో, ఇతరుల తప్పులను లెక్కబెట్టటంతోనే పాడై పోతుంది.

అట్టివాడు ఎన్నటికీ ఆత్మ విమర్శ చేసుకోడు. అందుకు అవకాశమే ఉండదు. ఎందుకంటే వాడి టైమంతా ఇతరులను విమర్శించటానికే చాలదు. ఇక తనను తాను ఉద్ధరించుకొనేందుకు టైమెక్కడ? కనుక అసూయా రహితునకే జ్ఞానాధికరం.

అర్జునుడు అసూయ లేనివాడు. అసూయ లేకుండుటే అనసూయ. అనసూయ అనే మహాఇల్లాలు రామాయణంలో ఉన్నది. ఆమె భర్త అత్రిమహర్షి. వారి పుత్రుడు పరమజ్ఞాని దత్తాత్రేయుడు.

అనసూయ అంటే అసూయలేని చిత్తం. అత్రి అంటే త్రిగుణాతీతమైన బుద్ధి. దత్తాత్రేయుడు జ్ఞానం. అంటే అసూయలేని చిత్తంలోనే జ్ఞానం పుడుతుంది అని గ్రహించాలి.

మంచి ఎక్కడున్నా, ఎంతున్నా గోరంతను కొండంత చేసి, కొనియాడటం; దోషాలయందు బొత్తిగా దృష్టి పెట్టకుండటం అసూయా రహితుని లక్షణం.

అసూయాపరుడికి గొప్ప ఉదాహరణ దుర్యోధనుడు. దుర్యోధనునికి మంచి వాడెవ్వడూ కనిపించలేదట. ధర్మరాజుకు చెడ్డవాడెవ్వడూ కనిపించలేదట. దుర్యోధనుడు అసూయాపరుడు. ధర్మరాజు అసూయా రహితుడు. దుర్యోధనుడెప్పుడూ ఇతరులలో దోషాలనే చూస్తాడు. ధర్మరాజు ఇతరులలో మంచి గుణాలనే చూస్తాడు. ప్రతివ్యక్తిలోనూ మంచీ ఉంటుంది, చెడూ ఉంటుంది.

ప్రపంచంలో సూదిలాగా ఉండొద్దు. దారంలాగా ఉండాలి. ఇదొక ఉపదేశం. సూది రంధ్రాలు చేసుకుంటూ పోతుంది. దారం భర్తీ చేసుకుంటూ పోతుంది. అలాగే జల్లెడలాగా ఉండొద్దు. చేటలాగా ఉండాలి - అంటారు. జల్లెడ మంచిని వదిలేసి చెత్తాచెదారం తనలో ఉంచుకుంటుంది. చేట చెత్తనంతా చెరిగిపారేసి మంచిని తనలో ఉంచుకుంటుంది.

అర్జునుడు అసూయా రహితుడు కనుకనే భగవానుడు తనను తాను ఎన్నిసార్లు ప్రశంసించుకున్నా ప్రేమతో, భక్తితో, గౌరవంతో వింటున్నాడే గాని వక్రంగా భావించటం లేదు. అందుకే ఈ రహస్యజ్ఞానం అర్జునునికి చెప్పటం జరిగింది.

- తాను చెప్పబోయే శ్రేష్ఠమైన, సర్వోన్నతమైన బ్రహ్మవిద్య యొక్క విశిష్టతను, ప్రత్యేకతలను తెలియజేస్తున్నాడు భగవానుడు -

**శ్లో||** రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం|

ప్రత్యక్షా వగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయం|| (2)

**తా||** ఇది రాజవిద్య, రాజగుహ్యం, పవిత్రమైనది, ఉత్తమమైనది. ప్రత్యక్షంగా తెలుసుకోవచ్చును, ధర్మమైనది, అభ్యసించటం తేలిక. నిలకడగా ఉంటుంది.

**వ్యాఖ్య:-** ఈ విద్యను గురించి 8విశేషణాలు చెబుతున్నాడు భగవానుడు.

1.ఇది రాజవిద్య:- ప్రపంచంలో అనేక లౌకిక విద్యలున్నాయి. అవన్నీ బ్రతుకు దెరువు కోసమే. అవి జననమరణాల నుండి తప్పించలేవు. శాశ్వత ఆనందాన్ని

ఇవ్వలేవు. తాత్కాలిక ఆనందాన్ని ఇవ్వగలుగుతాయి. ఈ విద్యలకన్న వేరైనది బ్రహ్మవిద్య. ఇదే రాజవిద్య. జననమరణాల నుండి తప్పించి శాశ్వత ఆనందాన్నిచ్చే విద్య. అందుకే ఇది శ్రేష్ఠమైన విద్య. విద్యలలో కెల్ల రాజు వంటిది గనుక రాజవిద్య అన్నారు. ఎవరు ఈ విద్యను పొందుతారో వారు ఈ లోకంలో పూజించబడతారు.

దేనిని తెలుసుకుంటే ఇక తెలుసుకోవలసింది ఉండదో అదే ఈ రాజవిద్య - బ్రహ్మవిద్య. లౌకిక విద్యలు ఎన్ని తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవలసినవి ఉంటూనే ఉంటాయి.

నారదుడు 64 విద్యలలో ఆరితేరాడు. అయినా ఆత్మశాంతి దొరకక అల్లాడిపోయాడు. చివరకు సనత్కుమారుని ఆశ్రయించి బ్రహ్మవిద్యను తెలుసుకొని పరమశాంతిని పొందాడని ఉపనిషత్తు చెబుతున్నది. కనుక ఈ విద్యను తెలుసుకుంటేనే పరమశాంతి. అందుకే ఇది రాజవిద్య.

2.రాజగుహ్యం:- ఇది పరమ రహస్యమైన విద్య. అవ్యక్తంగా - రహస్యంగా ఉండే పరమాత్మను గురించి చెప్పే విద్య గనుక ఇది రాజగుహ్యం అన్నారు.

రహస్యం అంటే రహస్యంగా చెప్పవలసిన విద్య అని కాదు. అధికారి అయినవానికి (అర్హతగల వానికి), గురుసేవ చేసిన వానికి, అహంకారం లేని వానికి, అసూయలేనివానికి, శిష్యత్వం స్వీకరించినవానికి మాత్రమే చెప్పదగిన విద్య. అట్టివారికే ఈ విద్య అవగతం అవుతుంది. మిగిలినవారు ఎంత శ్రద్ధగా విన్నా వారికి అవగతం కాదు. అందుకే రాజగుహ్యం. లౌకిక విద్యలు తెలుసుకోవాలంటే గురువులు సులభంగానే లభిస్తారు. కాని ఈ

బ్రహ్మవిద్యను బోధించే గురువులు ఎంతో అరుదుగా ఉంటారు. అనేక జన్మల సుకృతం ఉన్నవారికి, శాస్త్రం పట్ల, గురువు పట్ల గొప్పశ్రద్ధ (విశ్వాసం) గలవారికి మాత్రమే బ్రహ్మజ్ఞానులైన గురువులు లభిస్తారు. సాక్షాత్తు జగద్గురువైన భగవానుడు బోధించటం వల్లనే ఈ అత్యంత రహస్యవిద్యను తెలుసుకొనే వీలు కలిగింది.

3.పవిత్రం:- లోకంలో మానవుణ్ణి పవిత్రం చేసే సాధనాలు అనేకం ఉన్నాయి. అవే సూర్యుడు, అగ్ని, వాయువు, జలం, గంగ మొ||న తీర్థాలు, పుణ్యక్షేత్రాలు, ప్రాయశ్చిత్తాది కర్మలు. ఐతే ఇవన్నీ మానవుణ్ణి తాత్కాలికంగా పవిత్రం చేస్తాయే గాని, సంపూర్ణంగా పవిత్రం చేయలేవు.

గంగలో స్నానం చేస్తే పాపాలు పోతాయంటారు. పాపాలు పోతాయేమో గాని పాపవాసన - పాపబుద్ధి మిగిలే ఉంటుంది. అసలు పాపాలు కూడా తొలగిపోవు. ఎందుకంటే - గంగలో స్నానం చేస్తున్నంత సేపు పాపాలన్నీ గట్టు మీద చెట్టుకు వ్రేలాడదీయబడి ఉంటాయి. తీరికగా స్నానం చేసి తీరం పైకి వచ్చేటప్పటికి ఆ పాపాలన్నీ యధాప్రకారం చేరుకుంటాయి - అని కొందరు చమత్కారంగా చెబుతుంటారు.

ఐతే జ్ఞానం మాత్రం అలాకాదు, అన్ని పాపాల నుండి శాశ్వతంగా విముక్తి కలిగించి, పవిత్రం చేసేది జ్ఞానం - ఆత్మజ్ఞానం. అందుకే 'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే' - ఇక్కడ జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు మరొకటి లేదని తెలుసుకో - అని భగవానుడే భగవద్గీతలో బోధించటం జరిగింది. కనుక ఈ బ్రహ్మవిద్య పవిత్రమైనది.

4.ఉత్తమం:- ఈ జ్ఞానం ఎంతో శ్రేష్టమైనది. విలువైనది. కోహినూరు వజ్రం కన్న ఇది విలువైనది. ఎందుకంటే ఆ వజ్రం ఎంత విలువైనదైనా జడవస్తువే కదా! శ్రీరామ పట్టాభిషేకంలో సీతాదేవి ఆంజనేయునికి రత్నాల హారం ఇచ్చింది. ఛెంగున ఎగిరి చెట్టెక్కి కూర్చొని ఒక్కొక్క రత్నాన్ని కొరికి ఊసి పారేస్తున్నాడు. ఒక్కదానిలో కూడా రామదర్శనం కాలేదు. రాముడు లేని రత్నాలు తనకు విలువ లేనివే అని ఆయన భావన. జడవస్తువులు చైతన్యానికి దీటురావు. అర్జునా! బంగారంతో, రత్నాలతో, వజ్రవైడూర్యాలతో, ధనరాసులతో నన్ను తులాబారం తూయాలనుకున్నది సత్యభామ. కాని అవి నన్ను తూయగలిగినవా? పరమాత్మ అందరి కన్న ఉత్తముడు. పరమాత్మ జ్ఞానం - బ్రహ్మజ్ఞానం అన్నింటి కన్నా ఉత్తమం.

5.ప్రత్యక్షావగమం:- ఈ జ్ఞానం ప్రత్యక్షంగా అనుభవానికి వచ్చేది. పూజలు, యజ్ఞాలు, దానధర్మాలు చేస్తే చనిపోయిన తర్వాత స్వర్గంలోనో, తిరిగి జన్మఎత్తినప్పుడు ఈ భూలోకంలోనో సుఖభోగాలు అనుభవిస్తారని శాస్త్రాలు చెబుతున్నాయి. వీటిని ఎవరూ ప్రత్యక్షంగా చూడలేదు. శాస్త్రాన్ని నమ్మాలి. మహాత్ముల మాటలను నమ్మాల్సిందే తప్ప గత్యంతరం లేదు. అదీ గాక ఇవన్నీ ఎప్పుడో స్వర్గంలోనో, తరువాతి జన్మలలోనో అనుభవానికి వస్తాయి. అయితే ఈ బ్రహ్మవిద్య అలాకాదు. ఇప్పటికిప్పుడే అనుభవానికి వస్తుంది. ఏ క్షణంలో ఆత్మానుభూతి కలుగుతుందో ఆ క్షణంలోనే అతడు పరమాత్మ అవుతాడు. ఈ జన్మలోనే, ఈ దేహంలో ఉండగానే అనుభూతి కలుగుతుంది. అందుకే ఇది ప్రత్యక్షావగమం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

6.ధర్మ్యం:- బ్రహ్మజ్ఞానాన్ని పొందటం ప్రతివ్యక్తి యొక్క స్వధర్మం. కొందరికి ధర్మం అని కొందరికి అధర్మం అని చెప్పే వీలులేదు. అన్ని వర్ణాల వారికి, అన్ని ఆశ్రమాల వారికీ, స్త్రీలకూ పురుషులకూ అందరికీ ఇది స్వధర్మమే. అందరి జన్మహక్కు. ప్రతివ్యక్తీ తప్పక తెలుసుకోవలసినది ఈ జ్ఞానం.

7.సుసుఖం కర్తుం:- "కావలసినంత బంగారం శుక్ర గ్రహంలో ఉందండీ, డబ్బు చెల్లించే పనిలేదు, ప్రభుత్వానికి సుంకం చెల్లించే పనిలేదు, అక్కడెవ్వరూ కాపలా ఉండరు, ఎంతైనా త్రవ్వి తెచ్చుకోవచ్చు అని నిజమైన విషయాన్నే శాస్త్రవేత్తలు చెప్పారనుకోండి. ఏం ప్రయోజనం? అక్కడకు వెళ్ళి రావటానికి కొన్నివేల సంవత్సరాలు పడుతుంది. కనుక తెచ్చుకోవటం సాధ్యం కాదుగదా! కనుక అసాధ్యమైన విషయాలను తెలుసుకున్నా ప్రయోజనం లేదు.

అయితే ఈబ్రహ్మవిద్య ఆచరించటానికి తేలిక అని పరమాత్మ చెబుతున్నాడు. కనుక అసాధ్యమేమో అని భయపడనవసరం లేదు. ప్రయత్నిస్తే చాలు తప్పకుండా సాధించవచ్చు. ఎందుకని అంతసులభం?

లేనిదాన్ని పొందాలంటే కష్టం. దూరంగా ఉన్నదాన్ని తెచ్చుకోవాలంటే శ్రమ. విలువైన దాన్ని తెచ్చుకోవాలంటే తగిన మూల్యం చెల్లించాలి. తనకన్న వేరైన వస్తువును సంపాదించాలంటే కాలయాపన. కాని నీలో ఉన్న పరమాత్మను - నీవే అయిన పరమాత్మను పొందటానికి ఏం కష్టపడాలి? తెలుసుకొని ప్రయత్నిస్తే చాలు తప్పనిసరిగ పొందవచ్చు. నీలోని వాసనలను ఖర్చు చేసుకొని, మనస్సులోని దుష్టసంస్కారాలను - అరిషడ్వార్గాలను

వదిలించుకొని, బుద్ధిలోని అజ్ఞానాన్ని తొలగించుకుంటే చాలు స్వస్వరూప జ్ఞానం లభ్యం. నిన్ను కప్పిన ముసుగును తొలగించుకుంటే నీవెవరో తెలుస్తుంది గదా! కనుక ఇది చాలా సులభం అంటున్నాడు భగవానుడు.

8.అవ్యయం:- కొన్ని పనులు చాలా సులభం ఐతేకావచ్చు . కాని దానివల్ల వచ్చే ఫలితం మాత్రం క్షణికం, అశాశ్వతం. ఇలా క్షణికమైన ఫలితాల కోసం, అశాశ్వతమైన ప్రయోజనం కోసం వివేకం గలిగినవాడు, నిజమైన తెలివిగల వాడెవడూ ప్రాకులాడడు, ప్రయత్నం చేయడు. బాగా ఉపయోగపడేది, కొంతకాలమైనా తృప్తిని, సంతోషాన్ని కలిగించే దానికోసమైతేనే కష్టపడతాడు, ఖర్చుపెడతాడు. ప్రయత్నిస్తాడు. మరి ఈ బ్రహ్మవిద్య ఎలాంటిది? సంసారజననమరణ చక్రం నుండి తప్పించేది. మనను ఉద్ధరించేది. శాశ్వతమైన ఆనందాన్నిచ్చేది, నశింపులేనిది. లౌకిక విద్యలనెన్నింటిని తెలుసుకున్నా మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకోకపోతే అడుగంటిపోతాయి. ఈ రాజవిద్యను ఒకసారి తెలుసుకుంటే ఇక మరుగునపడదు. నిలకడగా ఉంటుంది. అందుకే ఇది అవ్యయం అన్నారు.

- ఇంతటి గొప్పవిద్యను పొందటానికి ప్రయత్నం చేయని వారెవరు? అందువల్ల వారి కలిగే నష్టం ఏమిటి?

**శ్లో||** అశ్రద్ధ ధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప! |
అప్రాప్యమాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని || (3)

**తా||** పరులను తపింపజేసే ఓ అర్జునా! ఈ ధర్మం (బ్రహ్మజ్ఞానం) లో విశ్వాసం లేని మానవులు నన్ను పొందలేక ఈ జననమరణరూప మృత్యుసంసారంలోనికే తిరిగివస్తారు.

**వ్యాఖ్య:-** 1.అస్యధర్మస్య అశ్రద్ధధానా పురుషః:- 'ఈ ధర్మంలో విశ్వాసం లేని మానవులు' అంటూ ఈ జ్ఞానాన్ని, బ్రహ్మవిద్యను ధర్మం అంటున్నారీ శ్లోకంలో. ఈ జ్ఞానాన్ని అందుకోవాలంటే శ్రద్ధ ఉండాలి. విశ్వాసం ఉండాలి. శ్రద్ధ అనేది ఏ రంగంలోనైనా అవసరమే. మనకున్న శ్రద్ధను బట్టే మనం చేపట్టే కార్యం యొక్క సఫలత ఆధారపడి ఉంటుంది. ఇక పారమార్థిక రంగంలో శ్రద్ధ అనేది ఎంతో ముఖ్యమైనది. శాస్త్రాన్ని చక్కగా అవగాహన చేసుకోవాలంటే గొప్ప అర్హతగా "గురు వేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధా" - గురువుపట్ల, వేదాంత వాక్యాలపట్ల విశ్వాసమే శ్రద్ధ అంటూ చెప్పటం జరిగింది. కనుక శ్రద్ధ అనేది ఎంతో ముఖ్యం, తప్పనిసరి.

ప్రపంచంలో అన్నీ ఉన్నాయి. కాని శ్రద్ధలేని వాడికి ఏమీ లేదు. అశ్రద్ధ అనేది ఒక పెద్ద శని. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" - శ్రద్ధ గలవానికే జ్ఞానం లభిస్తుంది అని 4వ అధ్యాయంలో భగవానుడు తెలియజేశాడు. శ్రద్ధగలవానికి అన్నీ సిద్ధిస్తాయి. రామకృష్ణపరమహంస ఏ సాధనను పట్టుకున్నా 3 రోజులులో సిద్ధి పొందేవాడు. శ్రద్ధయొక్క ప్రభావం అలాంటిది. మహాభారతంలో ఏకలవ్యుడు ద్రోణాచార్యుని పట్ల గొప్ప శ్రద్ధగల వాడు. గురువుపై అంతటి శ్రద్ధ (విశ్వాసం) ఉండబట్టే అతడు ద్రోణ విగ్రహాన్ని

ముందు పెట్టుకొని అనన్య సామాన్యమైన విలువిద్యను నేర్చుకోగలిగాడు. కనుక శ్రద్ధ గలవాడే ఈ జ్ఞానానికి(విద్యకు) అర్హుడు.

రత్నాన్ని కొనాలంటే ధనం కావాలి గదా! అలాగే జ్ఞానరత్నాన్ని పొందాలంటే శ్రద్ధ అనే ధనం తప్పనిసరిగా అవసరం. అదేమి ఖర్మమో కాని మానవుడికి అల్పమైన, స్వల్పమైన, అనిత్యమైన విషయాల మీద, వస్తువుల మీద ఉండే శ్రద్ధ ఆత్మోద్ధారక విషయాలపై ఉండదు. ఒక్క రూపాయిబిళ్ళ జారిపోతే ఊరంతా గాలిస్తాం. అయ్యో! ఆత్మను జారవిడుచుకున్నామే! - పరమాత్మను జారవిడుచుకున్నామే! అని చీమకుట్టినంత చింతైనా ఉన్నదా? పరమాత్మకు దూరమైన మనం తిరిగి పరమాత్మను చేరుకోవటానికి ఎంతగా తపించాలి? ఎంతగా ఏడవాలి? ఎంతగా సాధన చేయాలి? చేస్తున్నామా? లేదే. అదే అశ్రద్ధ. శ్రద్ధలేని వారు అనంతమైన పరమాత్మ నీలోనే ఉన్నాడని చెప్పినా, అసలు నీవు పరమాత్మవే అని చెప్పినా నమ్మరు, నమ్మలేరు, అందుకొనేందుకు ప్రయత్నించరు. అట్టి అశ్రద్ధ ధానాః పురుషః = విశ్వాసం లేని మానవులకు ఫలితం ఏమిటి?

<u>2.మాం అప్రాప్య మృత్యు సంసారవర్త్మని నివర్తంతే:-</u> నన్ను పొందలేక ఈ మృత్యు సంసార సాగరంలోనికే తిరిగివస్తారు. భగవానుని పొందలేక పోతే జననమరణ రూప సంసారంలోనే చిక్కుకపోతారు. అంటే మళ్ళీ మళ్ళీ పుట్టటం, మళ్ళీ మళ్ళీ చావటం, మళ్ళీ మళ్ళీ దుఃఖాలు అనుభవించటం.

ఈ సంసారచక్రం మృత్యురూపం అంటున్నారు. చాలామంది భోగవిలాసాలకు లోనై దీన్ని స్వర్గతుల్యంగా భావిస్తారు. కాని పరమాత్మ దీనిని

మృత్యురూపం అంటున్నారు. పైకి డాబుగా - దర్పంగా కనిపించినా ఇది పైన పటారం లోన లొటారం లాంటిదే. సుఖం వెంట దుఃఖం తప్పదు.

పిచ్చిపట్టిన రాజు తన రాజ్యాన్ని విడిచిపెట్టి, అధికారాన్ని విడిచిపెట్టి ఇల్లు వాకిలి లేని దేశదిమ్మరిలా వీధులవెంట తిరుగుతాడు. అలాగే దివ్యత్వాన్ని తెలుసుకోలేక - ఆత్మతత్వమే తానని తెలుసుకోలేక శ్రద్ధలేనివారు విషయభోగాలనే నడివీధుల్లో తిరుగుతూ దారి ప్రక్కన మురుగుగుంటల్లోని పురుగుల్లాగా జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు.

బ్రహ్మవిద్య యందు విశ్వాసం లేనివాడు సంసారమనే రొంపిలో దిగబడిపోయి తాపత్రయాలనే రాబందులు, నక్కలు, కాకులు మొ||న వానిచేత బాధ పడవలసిందే.

భగవంతుని మీద ఏమాత్రం భక్తి, విశ్వాసం లేని ఒక పిసినారి భాగ్యవంతుడు భార్య పోరు తట్టుకోలేక సత్యనారాయణ స్వామి వ్రతం చేస్తున్నాడు. షోడశోపచార పూజ ప్రారంభమైంది. ధూపానికి అగరొత్తు లేవి? అన్నాడు పురోహితుడు. మర్చిపొయ్యాను అన్నాడు. సరేనని 'ధూపార్థం అక్షతాన్ సమర్పయామి' అన్నాడు పురోహితుడు. ఆ తరువాత వస్త్రం అడిగినా, నైవేద్యం అడిగినా అన్నింటికీ ఒక్కటే సమాధానం - 'తెలియదు - కానివ్వండి' అని. సరేనని వస్త్రార్థాన్ అక్షతాన్ సమర్పయామి; నైవేద్యార్థం అక్షతాన్ సమర్పయామి అంటూ అన్నింటిని అక్షతలతో పూర్తి చేశాడు పూజ. పూజానంతరం పురోహితుణ్ణి పంపించేశాడు.

ఇక భోజనానికి కూర్చున్నాడు. భార్య విస్తరి వేసింది. మంచినీళ్ళు పెట్టింది. ఆ తరువాత అక్షతలు తెచ్చి అన్నార్థం అక్షతాన్ సమర్పయామి, శాకార్థం అక్షతాన్ సమర్పయామి, అపూపార్థం అక్షతాన్ సమర్పయామి, దధియార్థం అక్షతాన్ సమర్పయామి అంటూ అక్షతలను వంచింది విస్తరిలో. ఇదేమిటి? వీటితో భోజనం చేయాలా? అని కసురుకున్నాడు భార్యను. ఆమె, "దేవుని పూజకు ఏ ఉపచారం అక్కరలేదు గాని, మీ భోజనానికి అన్నీ కావాలా?" అన్నది. దానితో ఆ ధనికుడు సిగ్గుపడి అప్పటి నుండి శ్రద్ధగా పూజలు చేశాడు.

అలాగే ఏ పనిచేసినా శ్రద్ధ ఉండాలి. శ్రద్ధలేకపోతే సిద్ధిలేదు. కనుక బ్రహ్మజ్ఞానము నందు, బ్రహ్మమునందు, గురువునందు విశ్వాసం (శ్రద్ధ) ఉండాలి. అనంతమయిన భగవంతుని అంశ నీలోనే ఉన్నది అని చెప్పినా నమ్మలేని వాళ్ళు, నమ్మని వాళ్ళు తమలోనే ఉన్న భగవంతుని అందుకొనుటకు, భగవంతునితో ఐక్యమై పోవుటకు ఏ ప్రయత్నమూ చేయరు. అలా భగవంతుని అందుకొని, భగవంతునితో ఐక్యమై, జీవన్ముక్తులు కాకపోతే మళ్ళీ మళ్ళీ మార్పులతోను, మరణాలతోను కూడుకున్న ఈ ప్రపంచానికే తిరిగిరావాలి. అంతకన్న వేరొకదారి లేదు అని స్పష్టం.

- బ్రహ్మజ్ఞానము యొక్క ప్రాముఖ్యతను వివరించి, దానిపై శ్రద్ధలేని వారికి కలిగే నష్టాన్ని తెలియజేసి ఇప్పుడు ఆ బ్రహ్మజ్ఞానాన్ని తెలియజేస్తున్నాడు.

**శ్లో|| మయాతత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా|**

**మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః|| (4)**

**తా||** ఈ సమస్త జగత్తు అవ్యక్తరూపంలో ఉండే నా చేత వ్యాపించబడియున్నది. సమస్తభూతాలు నాయందు నిలిచి ఉన్నవి. నేను వాటియందు లేను.

**వ్యాఖ్య:**భగవంతుడు తన యొక్క స్వరూపాన్ని తెలియజేయబోతున్నాడు.

1. భగవంతుడు అవ్యక్తుడు. అవ్యక్త రూపంలో ఈ జగత్తు నందంతటా వ్యాపించియున్నాడు. అవ్యక్తుడు అంటే కనిపించడు అని. కేవలం కంటికే గాదు, ఏ ఇంద్రియానికీ తెలియనివాడే. అందుకే ఇంద్రియ అగోచరుడు. స్థూలమైన వస్తువు వ్యక్తం. సూక్ష్మమయ్యే కొద్దీ అవ్యక్తమౌతుంది. పంచభూతాలన్నింటిలోను గుణాలు తక్కువగా ఉన్నది ఆకాశం. అయితే ఆకాశానికి శబ్దగుణం ఉన్నది. అసలు ఒక్కగుణం కూడా లేని గుణరహితుడు భగవంతుడు. అందుకే భగవంతుడు ఏ ఇంద్రియానికి తెలియడు.అవ్యక్తం.

అవ్యక్తమైన దానికి వ్యాపకత్వం ఎక్కువ. ఆకాశం వ్యాపకత్వం గలది. అయినా కొంత పరిమితి ఉంది. కాని పరమాత్మకు ఏ పరిమితీ లేదు. ఆయన సర్వవ్యాపకుడు. ఆకాశం స్థూల వస్తువులలో ఉండదు. కాని భగవంతుడు స్థూల వస్తువులతో సహా సర్వత్రా వ్యాపించియుంటాడు. కనుక జగత్తంతా పరమాత్మ చేత - అవ్యక్త రూపంలో వ్యాపించబడి యుంటుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ మాటలు చెబుతున్న శ్రీకృష్ణునికి ఒక స్థూల శరీరం ఉంది. అంటే ఒక రూపం ఉంది. అయితే అది మాయతో కూడిన రూపం. కనుక వ్యక్తం. కాని ఆయన పారమార్థిక స్వరూపం అవ్యక్తం. ఇంద్రియ అగోచరం.

పాలలో వెన్న వ్యాపించియున్నట్లు, నువ్వులలో నూనె వ్యాపించియున్నట్లు, కుండలలో మట్టి వ్యాపించియున్నట్లు, ఆభరణాలలో బంగారం వ్యాపించియున్నట్లు ఈ జగత్తు నందంతటా పరమాత్మ వ్యాపించియున్నాడు.

2. పరమాత్మ జగత్తునందంతటా వ్యాపించియున్నాడు. పరమాత్మ వ్యాపక వస్తువు. జగత్తు వ్యాప్యవస్తువు. – పరమాత్మ- జగత్తు - ఈ రెంటి మధ్యగల సంబంధం ఏమిటి? దీనికి భగవానుడు చిత్రంగా, చమత్కారంగా సమాధానం చెబుతున్నాడు. ఏమని?

(i) ఈ సమస్త భూతాలు నాయందున్నవి.

(ii) నేను మాత్రం వాటిలో లేను.

అంటే "ఈ సమస్త భూతాలకు ఆధారంగా నేనున్నాను. నాకు ఏ ఆధారం అవసరం లేదు" - అని అసలైన అర్థం.

❖ బొమ్మలకు ఆధారం తెర. కాని తెరకు ఆధారం బొమ్మలు కాదు. బొమ్మలు ఉన్నా, లేకున్నా తెర ఉంటుంది. కాని తెర లేకపోతే బొమ్మలుండవు.

❖ కుండకు ఆధారం మట్టి, కాని మట్టికి ఆధారం కుండకాదు. కుండను తీసేసినా మట్టి ఉంటుంది. కాని మట్టిని తీసేస్తే కుండలేదు.

❖అలలకు ఆధారం సముద్రం. కాని సముద్రానికి ఆధారం అలలు కాదు. అలలు లేకపోయినా సముద్రం ఉంటుంది. కాని సముద్రం లేకపోతే అలలు లేవు.

❖కల్పిత సర్పానికి ఆధారం త్రాడు. త్రాడు ఉంటేనే చీకటిలో పాము అని భ్రమపడుతున్నాం. అసలు త్రాడే లేకపోతే పాము అనే భ్రమ ఉండదు. పాము లేకపోయినా త్రాడు ఉంది, కాని త్రాడు లేకపోతే పామే లేదు. అంటే పాము త్రాడు నందు ఆరోపించబడింది. కల్పించబడింది.

అలాగే ఈ జగత్తు పరమాత్మయందు ఆరోపించబడింది. కల్పించబడింది. జగత్తు నిజం కాదు. పరమాత్మ మాత్రమేసత్యం. అందుకే పరమాత్మ చెబుతున్నాడు. ఈ సమస్త భూతాలతో కూడిన జగత్తు నాయందున్నది. నేను ఆ జగత్తులో లేను అని. అంటే నా ఆధారంగానే ఈ జగత్తు ఉన్నది. నాకు ఈ జగత్తు ఆధారం కాదు - అని.

త్రాడు - పాము ఉదాహరణలో త్రాడు అంటున్నది, "పాము నాలో ఉన్నది, నేను మాత్రం పాములో లేను. అంటే పాము నాకు ఆధారం కాదు. నేను పాముకు ఆధారంగా ఉన్నాను - అని.

జగత్తంతా నాలోనే ఉంది అంటే జగత్తు నందంతటా నేనున్నాను అనే అర్థం. కాని జగత్తులో - సర్వభూతాలలో నేను లేను అని భగవంతుడు ఎందుకు అంటున్నాడు? భూతాల యొక్క పరిమితులలో నేను లేను. వాటి పాపపుణ్యాలతో గాని, సుఖదుఃఖాలతో గాని, ఆశలు కోరికలతో గాని, ఆలోచనలు పనులతో గాని నాకే సంబంధం లేదు అని అర్థం చేసుకోవాలి.

సమస్తభూతాలు నాయందున్నవి అని చెప్పిన భగవానుడు మళ్ళీ ఏమంటున్నాడు?

**శ్లో||** నచ మత్ స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరం|
భూత భృన్నచ భూతస్థః మమాత్మా భూత భావనః|| **(5)**

**తా||** భూతము లేవీ నాయందు లేవు. నాయోగ మహిమను చూడు. నా చైతన్యమే భూతాలను సృష్టిస్తున్నది, భూతాలను రక్షిస్తున్నది. అయినప్పటికీ భూతాలలో నేనులేను.

**వ్యాఖ్య:-** క్రిందటి శ్లోకంలో సమస్త భూతములు నాయందున్నవి, నేను మాత్రం వాటిలో లేను అని చెప్పిన భగవానుడు ఈ శ్లోకంలో భూతాలు నాలో లేవు. నేను వాటిలో లేను అంటున్నాడు.

'సర్వభూతములు నాలో ఉన్నవి'. 'నాలో లేవు' అనే పరస్పర విరుద్ధ పదాలను గమనించినప్పుడు మనకు సందేహం వస్తుంది. ఇంతకీ భూతములు పరమాత్మలో ఉన్నట్టా? లేనట్టా? అని.

రెండు స్థాయిలలో రెండూ కరెక్టే. ఎలా?

కలకనే వాడికి కలలోని ప్రాణులంతా నిజమే. కలలోని ఒక వ్యక్తి 'అబ్బే ఇది కల' అని చెప్పినా ఆ కలకంటున్న వాడు నమ్ముతాడా? లేదు. అంటే కలకనే వాడి స్థాయిలో కలలో కనపడే వారందరూ ఉన్నట్టే. మరి అతడు మేలుకున్న తర్వాత పరిస్థితి ఏమిటి? ఇప్పటి వరకూ తను చూచిన వారందరూ నిజం


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కాదు. అసలు కల అనేది అబద్ధమే గనుక ఆ కలలోని వ్యక్తులు సంఘటనలు కూడా అబద్ధమే. అసలు వారెవరూ నిజంగా లేనేలేరు అంటాడు.

అంటే స్వప్న ప్రపంచం నాలో ఉన్నది. స్వప్న ప్రపంచం నాలో లేదు - అని పరస్పర విరుద్ధంగా మాట్లాడినప్పుడు ఇందులో ఏది నిజం? అంటే కలగనే వాడి స్థాయిలో స్వప్నప్రపంచం నాలో ఉన్నది అనేది నిజం. మేలుకున్న వాడి స్థాయిలో స్వప్నప్రపంచం నాలో లేదు అనటం నిజం. అంటే రెండు స్థాయిలలో రెండూ నిజమే.

చీకట్లో త్రాడును చూచి పాము అని భ్రమ పడ్డాం. ఆ సమయంలో త్రాడు అంటున్నది, "నాలో పాము ఉన్నది" - అని.

వెలుగు వచ్చి భ్రమ తొలగిన తర్వాత పాములేదు. త్రాడే ఉన్నది. ఇప్పుడు ఆ త్రాడు అంటున్నది, "నాలో పాము లేదు" - అని.

అంటే నాలో పాము ఉన్నది. నాలో పాము లేదు. అనే రెండు పరస్పర విరుద్ధ పదాలు నిజమే. అలాగే -

కేవలం శాస్త్రాన్ని తెలుసుకున్న వారిది, సామాన్యులది ద్వైత దృష్టి. ద్వైత దృష్టి గలవారికి తాము వేరు - భగవంతుడు వేరు. తమను, ఈ ప్రపంచాన్ని భగవంతుడు సృష్టించాడు. భగవంతుడూ సత్యమే, ప్రపంచమూ సత్యమే. ఇదీ వారి భావన, నమ్మకం.

వారి దృష్టిలో ప్రపంచము, పరమాత్మా రెండూ నిజమే గనుక ఈ ప్రపంచం పరమాత్మ యందున్నది - లేదా ఈ ప్రపంచానికి పరమాత్మే

ఆధారం అని అక్కడ చెప్పుకున్నాం (క్రిందటి శ్లోకంలో). మరి ఇక్కడో (ఈ శ్లోకంలోనో) -

అద్వైత దృష్టి గలవారి విషయం. వీరికి పరమాత్మ సత్యం. కాని ప్రపంచం గాని, ఇందులోని సమస్త భూతాలు కాని మిథ్య. లేనివే. లేకున్నా మన అజ్ఞానం వల్ల ఉన్నట్లు భ్రమకలుగుతున్నది. అంతే. కనుక అసలే లేని ప్రపంచం పరమాత్మలో ఉన్నదని, లేని ప్రపంచానికి పరమాత్మ ఆధారమని చెప్పటం హాస్యాస్పదం గదా! కనుకనే ఈ సమస్త భూతాలు - లేదా ప్రపంచం నాలో లేదు అని భగవానుడు ఈ శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు. కనుక రెండు స్థాయిలలో పరమాత్మ చెప్పిన 2 విరుద్ధ వాక్యాలు నిజమే.

దీనిని బట్టి జగత్తు సత్యం అనే భ్రమలో ఉన్నవారి కోసం "జగత్తు నాలో ఉన్నది" అని భగవానుడు చెప్పటం కరెక్టు.

అలాగే జగత్తు మిథ్య అనే దృష్టిలో ఉన్నవారి కోసం 'జగత్తు నాలో లేదు' అని భగవానుడు చెప్పటం కూడా కరెక్టే.

ద్వైతదృష్టిలో ఉన్నవారికి ఈ జగత్తు సత్యమే గనుక, సత్యమని భావించే ఈ జగత్తును సృష్టిస్తున్నది నేనే, అలాగే ఈ జగత్తును రక్షిస్తున్నది, పోషిస్తున్నదీ నేనే అని భగవానుడు తెలియజేస్తూనే; ఈ జగత్తులోను - భూతాలలోను నేను లేను అంటున్నాడు. అంటే ఈ జీవుళ్ళ పుణ్యపాపాలతో, సుఖదుఃఖాలతో, ఆలోచనలు కోరికలతో నాకేమీ సంబంధం లేదు. అసలు ఈ జగత్తుతో నాకేమీ సంబంధము లేదు అంటున్నాడు. ఎందుకు? ఆయన దృష్టిలో జగత్తే లేదు, జీవుళ్ళే లేరు. ఉన్నదంతా ఆయనే. ఆయన కన్నా

అన్యంగా కొంచెం కూడా ఏమీలేదు. "ఏకమేవాஉద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన". కనుక జగత్తే లేకపోతే, జీవుళ్ళే లేకపోతే ఇక వారితో సంబంధం ఏం ఉంటుంది? లేని జీవుళ్ళ పుణ్యపాపాలతో సంబంధం ఏం ఉంటుంది?

ఇదే భగవంతుని యోగమహిమ. ఇట్టి యోగ మహిమనే చూడమని అర్జునుని ఆదేశిస్తున్నాడు. అర్జునునికే కాదు, మనందరికీ ఈ ఆదేశం.

జగత్తు లేనే లేదు. జగత్తుగా కనిపించేది కూడా పరమాత్మే. కనుక జగత్తుకు పరమాత్మకు సంబంధం అనేది ఉండేవీలులేదు.

ఈ అధ్యాయం పేరు రాజవిద్యారాజగుహ్యం. పేరుకు తగ్గట్టుగానే ఇందులోని విషయాలు గుహ్యతమాలే. బుద్ధిమంతులు మాత్రమే అంతో ఇంతో గ్రహించగలుగుతారు గాని, మందబుద్ధులకు అయోమయంగా ఉంటుంది. అలాగని వదిలిపెట్టకూడదు. వింటూ వింటూ ఉంటే చొరవ ఏర్పడుతుంది. పరస్పర విరుద్ధ పదాలు యోగమాయతోనే సమన్వయమౌతాయి. సామాన్యుల బుద్ధికి అందని ఈ విషయాన్ని ఉదాహరణతో చెప్పబోతున్నాడు.

- జీవుళ్ళు నాలో ఉన్నారు - జీవుళ్ళు నాలో లేరు అనే పరస్పర విరుద్ధ విషయాలు సామాన్యుల బుద్ధికి సమస్యే. అందుకే ఉదాహరణ ద్వారా పరమాత్మ తన స్థితిని వర్ణిస్తున్నాడు తరువాత శ్లోకంలో.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో|| యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్ర గోమహాన్|**

**తథా సర్వాణి భూతాని మత్ స్థానీత్యుపధారయ|| (6)**

**తా||** ఏ ప్రకారంగా సర్వత్రా సంచరించే ప్రచండవాయువు నిత్యమూ ఆకాశంలోనే ఉంటుందో అలాగే అన్ని ప్రాణులు నాలోనే ఉన్నాయని తెలుసుకో.

**వ్యాఖ్య:-** క్రిందటి రెండు శ్లోకాల్లోనూ భగవానుడు తన స్థితిని వర్ణిస్తూ ఈ జగత్తునందంతట నేను వ్యాపించియున్నానని, ఈ జగత్తు, జీవుళ్ళు నాలోనే ఉన్నారని - అంటే వారికి ఆధారం నేనేనని, అయినప్పటికి వాటి పరిమితులలో నేను లేనని - అంటే వారి పుణ్యపాపాలకు, సుఖదుఃఖాలకు, ఆలోచనలు కర్మలకు నేను కారణం కాదని చెప్పటం జరిగింది.

అంతటా వ్యాపించియుండి, అన్నింటిని తనలో ఇముడ్చుకోగలిగి ఉన్నప్పటికీ, వాటి చేత పరిమితంగాని వస్తువు ఒకటి ఉన్నది అని చెబితే సామాన్యుడికి అర్థం కాదు. అందుకే ఉదాహరణ.

ఆకాశం, వాయువు (గాలి) ఈ రెండూ తెలియని వారులేరు. వాయువు కంటికి కనిపించదు గాని చర్మేంద్రియానికి తెలుస్తుంది. ఆకాశం ఇంద్రియాలకు అగోచరం. మనస్సు చేత, ఊహ చేత - శబ్దం వల్ల తెలియబడుతుంది. ఈ రెంటి మధ్య సంబంధం చూడండి.

వాయువు ఒక మహాభూతం. ప్రచండంగా వీస్తుంది. సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తుంది. అది తన శక్తినంతటినీ చూపితే ప్రాణులు భయపడతారు. అది అంతటా సంచరిస్తుంది. ఇంతటి ప్రళయభీకరమైన

వాయువు అంతటా సంచరించే వాయువు తిరగటానికి అవకాశం ఇచ్చింది ఎవరు? అదే ఆకాశం. వాయువుకు ఆధారం ఆకాశమే. ఆకాశం లేకపోతే వాయువు లేదు. వాయువు లేకపోయినా ఆకాశం ఉంటుంది. వాయువు యొక్క ఉత్పత్తి, స్థితి, లయాలు - అన్నీ ఆకాశంలోనే. ఆకాశం చాలా పెద్దది. ఈ ప్రచండ వాయువు ఆకాశంలో ఎక్కడో ఏదో ఒక మూల ఒదిగి ఉంటుంది. ఎలా చెప్పగలం? అనంతమైన ఆకాశంలో దాదాపు 150 మైళ్ళ వరకు వాయువు వ్యాపించి యుంటుంది. అంటే చాలా ఖాళీ స్థలంలో కొద్దిభాగంలో మాత్రమే వాయువు వ్యాపించియుండి ప్రళయభీకర స్థితిని సృష్టిస్తున్నది.

అలాగే అనేక ప్రాణికోట్లతో కూడిన ఈ జగత్తు కూడా అనంతమైన పరమాత్మలో ఏ మూలనో అణగిపడి ఉన్నది.

ఇక ఆకాశం వాయువుతో ఎంత సన్నిహితంగా ఉన్నట్లు అనిపించినా వాయువు యొక్క గుణదోషాలతో ఆకాశానికి సంబంధం లేదు, ఆ వాయువును అంటిపెట్టుకొని ఉండదు.

- వాయువు ఎంత ప్రచండంగా వీచినా ఆకాశం కదలదు.
- వాయువు ఎన్ని తుఫానులు సృష్టించినా ఆకాశం చలించదు.
- వాయువు చల్లబడ్డా, వేడెక్కినా ఆకాశానికేమీ కాదు, ఏ మార్పూ చెందదు.

అలాగే పరమాత్మ తనయందు కల్పించబడిన జగత్తుతో ఎంత సన్నిహితంగా ఉన్నట్లు అనిపించినా జగత్తు యొక్క, అందలి జీవుళ్ళ యొక్క పుణ్యపాపాలతో గాని, గుణదోషాలతో గాని, ఆలోచనలు కర్మలతో గాని,

సుఖదుఃఖాలతో గాని పరమాత్మకు ఏ సంబంధమూ ఉండదు. పరమాత్మ నిర్లిప్తం.

అలాగే శరీర మనోబుద్ధులలో జరిగే మార్పులకు ఆత్మతో సంబంధం లేదు. ఏమార్పులూ ఆత్మకు అంటావు.

ఇప్పుడు అసలు విషయానికి ఉపమానానికి గల పోలికలను చూద్దాం.

1.పరమాత్మ ఆకాశం వంటివాడు. జగత్తు, భూతాలు వాయువు వంటివి.

2.వాయువుకు ఆకాశం ఆధారం. జగత్తుకు పరమాత్మ ఆధారం.

3.వాయువు ఆకాశంలో ఉంటుంది. జగత్తు పరమాత్మలో ఉంటుంది.

4.వాయువు ఆకాశంలో ఉన్నా ఆకాశం యొక్క పూర్ణత్వానికి భంగం లేదు. జగత్తు పరమాత్మలో ఉన్నా పరమాత్మ యొక్క పూర్ణత్వానికి భంగం లేదు.

5.వాయువు ఎలా వీస్తున్నా దాని అంటుసొంటు ఆకాశానికి లేదు. అలాగే ఈ జీవుళ్ళు ఎలా ప్రవర్తిస్తున్నా వారి గుణదోష వికారాలతో పరమాత్మకు సంబంధం లేదు.

6.ఆకాశం స్థిరంగా నిశ్చలంగా ఉంటుంది. వాయువు మాత్రం చలిస్తూ ఉంటుంది. పరమాత్మ స్థిరంగా నిశ్చలంగా ఉంటుంది. జగత్తు మాత్రం చలిస్తూ ఉంటుంది.

7.వాయువు యొక్క కదలికకు కారణం ఆకాశం కాదు. జగత్తు యొక్క కదలికకు కారణం పరమాత్మ కాదు.

ఇక్కడ ఆకాశం, వాయువు యొక్క దృష్టాంతాన్ని ఎందుకు తీసుకున్నట్లు?

- ఆకాశం అవ్యక్తం. కంటికి కనిపించదు. పరమాత్మ కూడా అవ్యక్తం. అగోచరం.
- ఆకాశం సర్వవ్యాపకం. పరమాత్మా సర్వవ్యాపకం.
- వాయువు చర్మానికి గోచరం. జగత్తు కంటికి గోచరం.

ఇలా అనేక పోలికలున్నాయి గనుక ఈ దృష్టాంతాన్ని తీసుకున్నారు. అయితే పరమాత్మతో అన్నింటా పోల్చదగినదేదీ మరొకటి ఉండదు. ఉండరాదు. అలా ఉంటే పరమాత్మ పరిమితం అవుతుంది. పరిమితమైనది ఎప్పటికైనా నశిస్తుంది. నశించే దానిని పరమాత్మ అనటం శుద్ధ తప్పు. కనుక సూక్ష్మంగా ఆలోచిస్తే తేడాలు ఉంటాయి. ముఖ్యమైన తేడా ఏమిటంటే - ఆకాశం జడం. పరమాత్మ చైతన్యం. మరైతే ఎందుకు పోల్చినట్లు?-

స్థూలదృష్టితో ఉండేవారికి, మందబుద్ధులైన వారికి, అల్ప జ్ఞానులకు అసలు విషయం అర్థం కావటానికే ఇలా పరమాత్మకు బదులుగా ఆకాశాన్ని ఉదాహరణగా చెప్పటం జరిగింది.

ఇలా జగత్తుకు తానే ఆధారమని, జగత్తు యొక్క గుణదోషాలతో తనకేమీ సంబంధం లేదని చెప్పిన భగవానుడు ఇప్పుడు జగత్తు యొక్క ఉత్పత్తి లయాల గురించి చెప్పబోతున్నాడు.

- జీవుళ్ళందరి యొక్క పుట్టుక - లయాన్ని గురించి చెప్పబోతున్నాడు.

శ్లో|| సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికాం|
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం|| (7)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** కుంతీ కుమారా! అర్జునా! జీవుళ్ళందరూ కల్పక్షయం అయినప్పుడు నా స్వాధీనంలో ఉన్న ప్రకృతిని (మాయను) పొందుతారు. తిరిగి కల్పప్రారంభంలో వాళ్ళని నేను విసిరి వేస్తుంటాను (సృష్టిస్తుంటాను).

**వ్యాఖ్య:-** దేవమానం ప్రకారం బ్రహ్మ యొక్క ఆయుష్షు 100 సం||లు. అయితే అవి మన సం||లు కాదు. మన 864 కోట్ల సంవత్సరాలు బ్రహ్మకు ఒకరోజు. అలాంటి రోజులు 360 అయితే ఆయనకు 1సం||రం. అలా 100 సం||లు జీవిస్తే బ్రహ్మ ఆయుర్దాయం పూర్తవుతుంది. బ్రహ్మ యొక్క రోజులో పగలు, రాత్రి రెండూ ఉంటాయి. ప్రతిరోజూ రాత్రి నిద్రపోయినప్పుడు ఆయనతో బాటే ఈ ముల్లోకాలు నిద్రిస్తాయి. ఆయన మేలుకోవటంతోనే ముల్లోకాలు వ్యక్తమవుతాయి. ఈ విషయాలు 8వ అధ్యాయంలో చెప్పబడ్డాయి. మరి బ్రహ్మదేవుని ఆయువు తీరినప్పుడు ఏమవుతుంది?

బ్రహ్మదేవుని జీవితకాలం 100 సం|| లను కల్పం అన్నారు. ఇది పరమాత్మకు పగలు వంటిది. కల్ప ప్రారంభమంటే పరమాత్మ యొక్క పగలు ప్రారంభం; కల్పక్షయం అంటే పరమాత్మ యొక్క పగలు క్షయం కావటం - అంటే రాత్రి కావటం.

కల్పక్షయంలో ఏం జరుగుతుంది? కల్పక్షయం అంటే బ్రహ్మదేవునికి నూరేళ్ళూ నిండి పరమాత్మలో కలిసిపోవటం. ఆ సమయంలో ఇక సృష్టి అనేది ఉండదు. అంటే ఈ సృష్టిలోని జీవుళ్ళంతా వారివారి స్థూల శరీరాలను

విడిచిపెడతారు (అంటే చనిపోతారు). స్థూల శరీరాలు పోయినా ఇంకా సూక్ష్మ కారణ శరీరాలుంటాయి. అవెక్కడకు పోతాయి? అవన్నీ అవ్యక్తంలోకి వెళ్ళిపోతాయి. అంటే అవ్యక్తుడైన పరమాత్మలో ఉండిపోతాయి. అందరి సూక్ష్మ శరీరాలు కలిస్తే (సమిష్టి సూక్ష్మశరీరాభిమాని)బ్రహ్మ(సృష్టికర్త) అంటారు. అందరి కారణశరీరాలు కలిస్తే (సమిష్టి కారణ శరీరాభిమాని) మాయ (ప్రకృతి ) అంటారు. ఈ మొత్తం అవ్యక్త పరమాత్మలోనే ఉంటాయి. ఇలా ఎంతకాలం? మళ్ళీ కల్పం ప్రారంభం అయ్యే దాకా. అంటే ప్రాణులందరూ లోకానుభవాలకోసం తహతహ లాడే దాకా. ఇలా పరమాత్మ రాత్రికాలం గడిచిపోతుంది.

తిరిగి కల్ప ప్రారంభంలో ఏం జరుగుతుంది? - గతించిన కల్పంలోని ప్రాణులు లోకానుభవాల కోసం తహతహలాడు తుంటాయి. అప్పుడు పరమాత్మ తన అధీనంలో ఉన్న సమిష్ఠి కారణ శరీరం (మాయ)లో సంచలనం కలిగిస్తాడు. నిజంగా పరమాత్మ సంచలనం కలిగించడు. ఆయన సాన్నిధ్యం వల్ల ఆ మాయలో - ప్రకృతిలో - సమిష్టి కారణ శరీరంలో సంచలనం కలుగుతుంది. ఈ సంచలనం కారణంగా గతించిన కల్పంలోని ప్రాణుల యొక్క సూక్ష్మశరీరాలన్నీ కలిసి, సమిష్టి సూక్ష్మ శరీరాభిమాని అయిన సృష్టికర్త బ్రహ్మ పరమాత్మ నుండి ఉద్భవిస్తాడు. దీనినే కథారూపంలో శ్రీమహావిష్ణువు నారాయణుడుగా జలరాశి మధ్యలో వటపత్రశాయియై పవ్వళించి ఉంటే, ఆయన నాభి నుండి ఒక తామరపువ్వు - అందులో బ్రహ్మదేవుడు పుట్టినట్టు అందరికీ అర్థం కావటం కోసం చెబుతుంటారు.

నిజంగా ఈ బ్రహ్మదేవుడు గత కల్పంలోని ప్రాణులన్నింటి యొక్క సమిష్టి సూక్ష్మశరీరమే. ఇప్పుడు ఇక సృష్టి జరగాలి. ఎలా జరుగుతుంది? ఇప్పుడు బ్రహ్మలో ఉన్నదేమిటి? లోకానుభవాల కోసం తహతహ లాడుతున్న గత కల్పంలోని ప్రాణుల సూక్ష్మశరీరాలే గదా! వారు తగిన దేహాలతో జన్మిస్తే గాని కోరుకున్న అనుభవాలను - అంటే కర్మఫలాలకు తగిన సుఖదుఃఖాలను పొందే వీలులేదు. మరి ఏ సూక్ష్మ శరీరానికి ఎటువంటి దేహాన్ని ఇవ్వాలి? మానవదేహం ఎవరికి? పశువు దేహం ఎవరికి? పక్షి దేహం ఎవరికి? పురుగు దేహం ఎవరికి? అది తేలాలంటే ఏ సూక్ష్మ శరీరం ఏ కారణశరీరానికి చెందినదో తెలియాలి. అన్ని కారణ శరీరాల సమిష్టి కారణ శరీరం మాయలో పరమాత్మ చైతన్యం వల్ల సంచలనం కలిగింది గదా! ఇప్పుడు ఏసూక్ష్మ శరీరానికి ఏ కారణశరీరం సంబంధించినదో చూచి దానికి తగిన స్థూలశరీరాన్ని నిర్ణయించి బ్రహ్మదేవుడు ఈ లోకంలోకి పంపిస్తాడు - అంటే ఆయా తల్లి గర్భములందు ప్రవేశపెడతాడు. దానితో సృష్టి - జీవుళ్ళ సృష్టి జరిగిపోతుంది.

ఇలా కల్పక్షయంలో సర్వభూతాలు పరమాత్మలో లయమై తిరిగి కల్పారంభంలో భూమి మీదకు వచ్చిపడతాయి.

ఇంతకూ ఏ జీవుడైనా క్రొత్తగా సృష్టింపబడ్డాడా? లేదు. వెనుకటి కల్పంలోని - జన్మలోని జీవుడే అతడి కారణశరీరంలో ఏయే కర్మఫలాలు, వాసనలు ఉన్నాయో; వాటికి అనుగుణంగా తగిన నూతనదేహంతో వస్తున్నాడు. కనుక నూతన సృష్టి అంటూ లేదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ మొత్తం వ్యవహారంలో జీవుళ్ళు తమ తమ ప్రకృతులకు (కారణ శరీరాలకు) లోబడి ఉంటారు. ఈ మొత్తం ప్రకృతి పరమాత్మకు లోబడి ఉంటుంది. అందుకే 'మామికాం ప్రకృతిం యాంతి' - నా స్వాధీనంలో ఉన్న ప్రకృతిని పొందుతారు అని భగవానుడు చెప్పటం జరిగింది.

జీవుళ్ళు మాయకు (ప్రకృతికి) అధీనులు గనుక ఆ మాయ నుండి తప్పించుకోవాలంటే మాయాధీశుడైన పరమాత్మను ఆశ్రయించవలసిందే. అంటే మాయను జయించిన మహాత్ములను, జీవన్ముక్తులను ఆశ్రయించాలి. ఆఫీసరు గారి పెంపుడు కుక్కను తప్పించుకొని ఆఫీసరుగార్ని కలవాలంటే - ఆయనతో మాట్లాడాలంటే, ఆయనను ఆశ్రయించాల్సిందే. ఆయన గనుక తన కుక్కను అదిలిస్తే అది కుక్కిన పేనులాగా ఉండిపోతుంది.

ఈ మొత్తం విషయాన్ని చక్కగా గ్రహిస్తే, నాకెందుకిలాంటి గ్రుడ్డి బ్రతుకు? నాకెందుకీ పేదరికం? నాకెందుకీ కష్టాలు? నేనెందుకింత అందంగా పుట్టాను? భాగ్యవంతుడిగా పుట్టాను? అనే ప్రశ్నలకు చక్కగా సమాధానం దొరుకుతుంది. ఆ భగవంతుడు నాకెందుకిలా చేశాడు? అని భగవంతుని గాని, ఇతరులను గాని నిందించవలసిన అవసరం రాదు. ఎవరు చేసిన కర్మలను బట్టే వారి జన్మలు.

ఒక చక్కని కర్మసిద్ధాంతం - కర్మనియమం ఇక్కడ పనిచేస్తున్నది. అదే అన్నింటికి కారణం. ఎక్కడా పొరపాట్లు గాని; రికమెండేషన్లుగాని, లంచాలు గాని లేవు. ఇదే విషయాన్ని తరువాత శ్లోకంలో స్పష్టం చేస్తున్నారు.

ఏ ప్రాతిపదికన భగవానుడు జీవుళ్ళ సృష్టి చేస్తున్నాడు?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో|| ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః|**

**భూతగ్రామ మిమం కృత్స్నం అవశం ప్రకృతేర్వశాత్|| (8)**

**తా||** ప్రకృతికి వశులైయున్న ఈ సమస్త ప్రాణికోటిని, నా మాయను అవలంబించి మళ్ళీ మళ్ళీ నేను సృజిస్తూ ఉంటాను.

**వ్యాఖ్య:-** సృష్టికర్త బ్రహ్మ యొక్క నూరేళ్ళ ఆయుర్దాయం తీరిపోతే పంచభూతాలతో సహా సృష్టి అంతమైపోతుంది. అప్పుడుండేది పరమాత్మ మాత్రమే. ఆయన మళ్ళీ సృష్టి చేయాలని సంకల్పించినప్పుడు క్రొత్తగా బ్రహ్మను సృష్టించి, సృష్టికార్యం సాగించమని ఆదేశిస్తాడు. మరిప్పుడు క్రొత్త బ్రహ్మ క్రొత్త జీవుళ్ళను సృష్టిస్తాడా? లేదు.

అసలు క్రొత్త జీవుళ్ళు పుట్టటం అంటూ లేదు. అంతకుముందు కల్పంలోని జీవుళ్ళే వాళ్ళ వాళ్ళ కోరికలు ప్రకోపించినప్పుడు అవ్యక్తంలో నుండి వ్యక్తంలోకి వచ్చి, అవి ఖర్చై పోయిన తర్వాత తిరిగి అవ్యక్తంలోకి వెళతారు. ఇలా వ్యక్తం కావటంలో గాని, అవ్యక్తంలోకి పోవటంలోగాని జీవుళ్ళకు స్వేచ్ఛ ఉందా? అంటే లేదు అని స్పష్టం. వారు అస్వతంత్రులై, పరాధీనులై వారి ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా వస్తూ పోతూ ఉంటారు. ఐతే వారు దేనికి వశులౌతున్నారు?

<u>ప్రకృతేర్వశాత్:-</u> ప్రకృతికి వశులౌతున్నారు. ప్రకృతి అంటే కర్మఫలాలు, వాసనలతో కూడిన కారణశరీరాలే. అంటే వారి కర్మఫలాలు వాసనలకు జీవుడు లోబడి ఉంటాడు; అవి ఆడించినట్టల్లా ఆడాల్సిందే. పుణ్యకర్మఫలాలుంటే సుఖభోగాలనుభవించే జన్మలు. పాపకర్మఫలాలుంటే

దుఃఖాలు బాధలు అనుభవించే జన్మలు వస్తుంటాయి. అంతే తప్ప జీవుడి ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేదు. అలా జీవుళ్ళ ఇష్టమే అయితే దుఃఖాలు పొందే జన్మలను ఎవరు కోరుకుంటారు? ఇలా జన్మలెత్తటంలో స్వేచ్ఛ లేకపోవటమే కాదు - కారణ శరీరాలున్నంత వరకు - అవి పూర్తిగా నశించిపోయేంత వరకు మళ్ళీ మళ్ళీ జన్మలు తప్పవు. జన్మను తప్పించుకోవటంలో జీవుడికి స్వేచ్ఛ లేదు. అందుకే జీవుళ్ళను "అవశం ప్రకృతేర్వశాత్" అన్నారు. వారి వారి ప్రకృతికి వశులై యుంటారు. అస్వతంత్రులై యుంటారు - అని. కనుక జీవుళ్ళంతా వారి వారి ఇష్టాయిష్టాలతో రావటంలేదు. వారి వారి ప్రకృతికి (కారణశరీరాలకు) లొంగిపోయి, అవశులై వస్తున్నారు.

మరి జీవుళ్ళ సృష్టికి కారణం వారివారి కర్మఫలాలే ఐతే భగవంతుడు చేసేదేమిటి? ఆయనెందుకున్నట్టు? "విసృజామి పునః పునః" - మళ్ళీ మళ్ళీ సృష్టిస్తున్నాను అంటున్నాడు గదా! ఆయనే సృష్టి చేసి పంపుతున్నాడా? అవును. ఆయనే సృష్టిస్తున్నాడు. అయితే ఏపద్ధతి మీద సృష్టిస్తున్నాడు? -

స్వాం ప్రకృతిం అవష్టభ్య:- నా ప్రకృతిని - నామాయను అనుసరించి సృష్టిస్తున్నాను అంటున్నాడు. మాయ అంటే సమిష్టి కారణశరీరం. కనుక భగవంతుడు వారివారి కారణ శరీరాలలోని కర్మఫలాలు; వాసనలను బట్టే జీవుళ్ళను సృష్టిస్తున్నాడు. అంటే కర్మ సిద్ధాంతంపై ఆధారపడే సృష్టి చేస్తున్నాడు. దీనిని బట్టి జీవుళ్ళ సృష్టి జరగటానికి వారివారి కారణ శరీరాలు, భగవంతుడు ఇద్దరూ అవసరమే అని ఋజువౌతున్నది.

ఇద్దరెందుకు? ప్రకృతి జడం. కనుక తనంత తానుగా సృష్టి చేయలేదు. పరమాత్మ యొక్క చైతన్యం ఉంటేనే ప్రకృతి పరవశించి పని చేస్తుంది. లైటు దానంతటది వెలుగదు. కరెంటు ఉంటేనే. ఫ్యాన్ తనంతట తాను తిరగదు. కరెంటు ఉంటేనే. ఒట్టి కరెంటు వెలుగునివ్వదు, గాలి నివ్వదు. అయితే ఆ కరెంటు సాన్నిధ్యంలో లైటు, ఫ్యాన్ పనిచేస్తాయి. అలాగే పరమాత్మ సాన్నిధ్యంలోనే ప్రకృతి పరవశించి పని చేస్తుంది.

ఒకడు కూలిపని చేశాడు. అతడికి ఆపని డబ్బు ఇవ్వదు. ఆ పనిని బట్టి యజమాని డబ్బు ఇస్తాడు. ఇక్కడ కూలివానికి స్వతంత్రం లేదు, ఇష్టాఇష్టాలు లేవు. అలాగే ఇచ్చే యజమాని కూడా చేసిన పనిని బట్టి లెక్కగట్టి ఇస్తాడే గాని ఎక్కువ తక్కువలివ్వాలనే పక్షపాత బుద్ధి ఉండదు.

అలాగే భగవానుడు  జీవుళ్ళ కర్మఫలాలను బట్టి శరీరాలు సృష్టించి ఇస్తున్నాడే గాని కొందరిని కుంటివాళ్ళుగా, కొందరిని గ్రుడ్డివాళ్ళుగా, కొందరిని ఐశ్వర్యవంతులుగా, కొందరిని పేదవారుగా సృష్టించాలని అనుకోడు. కొందరికి ఉత్తమజన్మలు, కొందరికి నీచజన్మలు ఇవ్వాలనే పక్షపాత బుద్ధి ఉండదు. పక్షపాతం ఉంటే ఆయన భగవంతుడెలా అవుతాడు?

అవ్యక్తంలోకి వెళ్ళినవారు తిరిగి ఎలా అవశులై జన్మలెత్తుతున్నారో చూడండి - ఒక పుణ్యాత్ముడు, ఒక గజదొంగ, ఒక డాక్టరు, ఒక లాయరు ఒక రాత్రి సత్రంలో పడుకొని గాఢనిద్ర పోతున్నారు. అప్పుడు అందరి స్థూలశరీరాలు చచ్చిపోయినట్లు అలాపడి ఉంటాయి. వారి సూక్ష్మ శరీరాలు కారణశరీరాలలో లయమై ఉంటాయి. అప్పుడు అంతా ఒక్కటే. ఏతేడాలు

లేవు. మేలుకున్న తర్వాత వారి కారణశరీరాల నుండి సూక్ష్మశరీరాలు లేస్తాయి. అవి స్థూలశరీరాలను కదిలిస్తాయి. దానితో పుణ్యాత్ముడు పుణ్యకార్యాలు చేయాటానికి వెళతాడు; గజదొంగ దొంగతనానికి, డాక్టరు హాస్పిటల్ కు, లాయరు కోర్టుకు బయలుదేరతాడు. వారివారి అలవాట్లన్నీ అవశంగా వచ్చేస్తాయి. సృష్టి కూడా ఇంతే. అలా జరిగిపోతుంది.

మరి పరమాత్మ సృష్టి చేస్తున్నాడు గదా! ఆయనకు ఎలాంటి కర్మఫలం వస్తుంది? కర్మసిద్ధాంతం నిర్వివాదం. కర్మను బట్టే ఫలితం ఉంటుంది. ఈ సృష్టి అనే కర్మను పరమాత్మ చేస్తున్నాడు. కర్మ చేస్తున్నాడు గనుక ఏ కర్మఫలం వస్తుంది? అసలు వస్తుందా రాదా? భగవంతునికి కూడా కర్మ బంధమవుతుందా? -

**శ్లో||** నచమాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!|
ఉదాసీన వదాసీనం అసక్తం తేషు కర్మసు|| **(9)**

**తా||** ధనంజయా! ఆ కర్మల యందు ఏమాత్రం ఆసక్తి లేకుండా ఉదాసీనంగా (నిర్లిప్తంగా) ఉంటాను గనుక ఆ కర్మలు (జీవసృష్టి) నన్ను బంధించవు.

**వ్యాఖ్య:-** మనం కర్మలు చేస్తే కర్మఫలాలు వస్తాయి. ఆ కర్మఫలాలు అనుభవించటానికి జన్మలు వస్తాయి. అంటే మనం చేసే కర్మలే మనకు బంధమై కూర్చుంటున్నాయి. అయితే కోరికలతో, సంగభావంతో, మమకారంతో, ఫలాసక్తితో చేసే కర్మలన్నీ మనస్సుపై ముద్రలు పడి బంధాలవుతున్నాయి గాని కోరిక లేకుండా, ఫలాసక్తి లేకుండా, సంగభావం

లేకుండా, మమకారం లేకుండా ఎన్నిరకాల కర్మలు చేసినా అవి మనను బంధించలేవు.

తాను కోరినంత డబ్బు ఇవ్వలేదని కసితో, ద్వేషంతో తండ్రిని కాలితో తన్నాడు ఒక ప్రబుద్ధుడు. ఒక పసివాడు తనను ఎత్తుకున్న తండ్రి గుండెలపై కాలితో తన్నాడు. ఈ రెండింటి మధ్య భేదం తెలుసుకోవటానికి ఎవరూ పెద్ద వేదాంతి కానక్కరలేదు. పెద్దవాడికి స్వార్థం, రాగద్వేషాలు ఉన్నాయి. పసివాడికేమీ లేవు. కనుక పెద్దవాడు కర్మబంధీ. పసివాడిని ఏ కర్మా బంధించలేదు .

ఒక దొంగ చిన్నపిల్ల వ్రేలి ఉంగరం కోసం వ్రేలిని కత్తితో కోసి దొంగిలించాడు. ఒక డాక్టరు చిన్నపిల్ల వ్రేలు సెప్టిక్ అయినందున కోసి తొలగించాడు. దొంగది స్వార్థం, పాపం. డాక్టరుది కర్తవ్యం, విధి నిర్వహణ. దొంగను కర్మ బంధిస్తుంది. డాక్టరుకు ఏ బంధమూ లేదు. కనుక రాగద్వేషాలు లేకుండా, స్వార్థం లేకుండా చేసే పనులు బంధం కావు.

అలాగే "పరమాత్మ సృష్టి చేస్తున్నాడు" - అంటే ఎలాంటి రాగద్వేషాలు లేకుండా, చేయాలనే కోరిక లేకుండా, చేసి ఏదో ఫలితాన్ని పొందాలనే ఫలాసక్తి లేకుండా, ఎవరిపట్ల పక్షపాత బుద్ధి; మమకారం లేకుండా వారివారి ప్రకృతులకు అనుగుణంగా చేస్తున్నాడే గాని ఎక్కడా తన స్వంత అభిప్రాయాలంటూ ఏమీ లేవు. ఆ కర్మలయందు ఆయనకు ఆసక్తి లేదు; సంగభావం లేదు. కనుక ఆ కర్మలు పరమాత్మను బంధించవు. నిజంగా పరమాత్మ సృష్టి అనే కర్మను చేయటం లేదు. ఆయన సాన్నిధ్యంలో చైతన్యాన్ని

పొంది ఆయన అధీనంలో ఉన్న ప్రకృతియే (మాయయే) ఈ పని చేస్తున్నది.

సరే. ఆయన అధీనంలో ఉన్న ప్రకృతి చేస్తున్నది. అంటే అది ఆయన ప్రకృతి. ఆయన వస్తువు అది. మరి ఆయన ప్రకృతి వల్ల జరిగే గుణదోషాలతో ఆయనకే సంబంధమూ లేదా?

ఒక రాజుగారికి సైన్యం ఉంది. ఆ సైన్యం ఆయనదే. పొరుగు దేశపు రాజు దండెత్తి వస్తే ఆయన సైన్యంతో ఈ సైన్యం యుద్ధం చేసి విజయం సాధించింది. రాజు యుద్ధానికి వెళ్ళలేదు. యుద్ధం చెయ్యలేదు. మరి ఇప్పుడీ విజయం రాజుదేనా? కాదా? రాజుదే. ఎందుకని?

రాజు సాక్షాత్తు యుద్ధానికి వెళ్ళకపోయినా ఆయనకు ఇక్కడ ఫలాసక్తి ఉంది. 'ప్రయోజక కర్తృత్వం' ఉంది. తాను తన విజయం కోసం తన సైన్యాన్ని యుద్ధానికి పంపాడు. ఆ కోరిక, అభిలాష, ఫలాసక్తి వల్లనే ఆ కర్మ ఫలం తనదైంది. అది బంధమైంది. కాని భగవంతుడో -

ఆయనకు కర్తృత్వం లేదు. ఫలాసక్తి లేదు. కేవలం సాక్షి, ఆయన ఉదాసీనవత్ ఆసీనం:- ఉదాసీనుడిలాగా, తటస్థుడిలాగా, నిర్లిప్తంగా ఉంటాడు. అంతే తప్ప జరిగే ఏ విషయాలలోను తల దూర్చడు. అసలు సృష్టి చేయాలనే కోరిక కూడా పరమాత్మకు లేదు. ఆయన సాన్నిధ్యం కారణంగానే జీవుళ్ళు వస్తున్నారు, పోతున్నారు. అంతే.

పరమాత్మకు ఎవరిపైన రాగద్వేషాలు లేవు. ఒకరికి ఉత్తమ జన్మ నివ్వాలని, మరొకరికి నీచజన్మ నివ్వాలనే పక్షపాత బుద్ధి ఉండదు. వారివారి కర్మలను బట్టి, వారివారి వాసనలను బట్టి తగిన జన్మలు వస్తుంటాయి.

ఒక జడ్జీగారు తన దగ్గరకు వచ్చిన కేసులను విచారించి ఒక ముద్దాయికి రు100 లు. జరిమానా విధించాడు. ఒక ముద్దాయికి 2సం||లు కఠిన కారాగార శిక్ష విధించాడు. ఒకరికి ఉరిశిక్ష విధించాడు. మరొకరిని నిర్దోషిగా విడుదల చేశాడు. వీరిలో ఒకరిమీద రాగం, ఒకరి మీద ద్వేషం ఉండి ఇలా చేశాడా? లేదు. అసలు వారెవరో కూడా జడ్జీకి తెలియదు. కేవలం చట్టం ప్రకారమే శిక్షలు విధించటం జరిగింది. కనుక ఈ కర్మలు ఆయనను బంధించలేవు. అతడికి ఎవరిపట్ల ఆసక్తి లేదు, శిక్షలు వెయ్యటంలో ఆరాటం లేదు, అందుకే ఆయా విషయాలలో, వ్యక్తుల విషయంలో ఆయన ఉదాసీనుడు. కనుక బంధం లేదు.

అలాగే పరమాత్మకు ఎవరి పట్ల ఆసక్తి లేదు. రాగద్వేషాలు లేవు కేవలం చట్టప్రకారం - అంటే కర్మసిద్ధాంతం ప్రకారం జీవుళ్ళ సృష్టి ఆయన చైతన్య సాన్నిధ్యంలో జరిగిపోతుంది. కనుక ఆయనకు బంధం లేదు.

సుగంధం గాని, దుర్గంధం గాని మన ముక్కుకే గాని, గాలికి ఏమీ లేదు. దాన్ని తనతో బాటుగ మోసుకొని వెళ్ళటమే గాలి యొక్క పని, అలాగే రాగద్వేషాలు గాని, ఆసక్తిగాని మనకే గాని, భగవంతుని కేమీ లేవు.

ఈ లోకంలో కొందరు గొప్పవారైనా, కొందరు అల్పులైనా, కొందరు ఆనందంలో తేలియాడినా, కొందరు దుఃఖాలలో మునిగిపోయినా ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తేడాలన్నింటికి కారణం పరమాత్మకానే కాదు. వారివారి కర్మఫలాలే కారణం. పరమాత్మ అందరిని ఒకే న్యాయంతో సమానంగానే సృష్టిస్తున్నాడు.

మేఘం అంతటా సమానంగానే వర్షిస్తుంది. అయినా భూమిలో ఉన్న విత్తనాన్ని బట్టి ఒక చోట వేపచెట్టు మొలుస్తుంది. ఒకచోట మామిడిచెట్టు వస్తుంది. ఒకచోట గడ్డి మొలుస్తుంది. ఒకచోట పిచ్చిమొక్కలు వస్తాయి. ఈ తేడాలను మేఘం మీద ఆరోపించకూడదు. అలాగే వారువారు చేసుకున్న కర్మలను బట్టే జీవులు వేరువేరు ఫలితాలను పొందుతున్నారే గాని భగవంతునిదేమీ లేదు.

పాండవుల పుణ్యం పాండవులకు శ్రీకృష్ణుని సన్నిహితం చేసింది. కౌరవుల పాపం కౌరవులను శ్రీకృష్ణునికి దూరం చేసింది.

కనుక మనం కూడా మన కష్టాలకు, సుఖాలకు, దుఃఖాలకు, బాధలకు కారణం మనమేనని గ్రహించాలి. భగవంతునిదే తప్పు అని భగవంతుని నిందించరాదు. భగవంతుని పక్షపాతం ఏమీలేదు. ఆయన ఉదాసీనుడు. ఆయనను నిందించటం అంటే సూర్యునిపై ఉమ్మివేయటం లాంటిదే.

- మరి భగవంతునికి ఏ ఆసక్తీ లేకపోతే సృష్టి ఎలా జరుగుతున్నది?

**శ్లో||** మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం|
హేతు నాఽనేన కౌంతేయ! జగద్విపరి వర్తతే|| **(10)**

**తా||** నా అధ్యక్షతన ప్రకృతియే చరాచర ప్రపంచాన్ని సృష్టిస్తున్నది. ఓ కౌంతేయా! ఈ కారణం చేతనే జగత్తు తిరిగి తిరిగి వస్తున్నది.

**వ్యాఖ్య:-** ఆసక్తి లేకుండానే భగవంతుడు సృష్టి చేస్తున్నాడు. ఎందుకు చేస్తున్నాడు? నిజంగా భగవంతుడు సృష్టి చెయ్యటం లేదు. కాని భగవంతుని వల్ల సృష్టి జరుగుతున్నది.

ఆకాశంలో సూర్యుడు ఉండటం వల్ల సముద్రంలోని నీరు వేడెక్కి, ఆవిరై పైకి ఆకాశంలోకి వెళ్ళి మేఘాలుగా ఏర్పడి వర్షం కురుస్తున్నది. ఇదంతా సూర్యుడు ఆసక్తితో చేస్తున్నాడా? లేదు. అయితే సూర్యుడు తన ప్రచండ కిరణాలను ప్రసరింపజేయటం వల్లనే వర్షం కురుస్తున్నది. అంటే సూర్యుడు వర్షం కురిపించటం లేదు. కాని సూర్యుని వల్ల వర్షం వస్తున్నది.

అలాగే పరమాత్మ చైతన్యం కారణంగానే ప్రకృతి ఉత్తేజం పొంది, పరవశించి ఈ జగత్తును సృష్టిస్తున్నది. ఇది ప్రకృతి యొక్క స్వభావం.

సరే ప్రకృతే ఈ జగత్తును సృష్టిస్తున్నది అనుకుందాం. మరి భగవంతుడేం చేస్తున్నాడు? ప్రకృతికి భర్త భగవంతుడే కదా! ఆయనకు 'ప్రయోజక కర్తృత్వం' లేకపోయినా, 'సన్నిధాన కర్తృత్వం' ఉన్నది గదా! దోషం లేకుండా పోతుందా?

నిజంగా భగవంతుడు ప్రకృతికి కర్త కూడాకాదు. ఆయన అధ్యక్షుడు. అధ్యక్షుడన్నా సాక్షి అన్నా ఒక్కటే. అధ్యక్షుడు కార్యభారం వహించడు. ఊరికే పెద్దగా కూర్చుంటాడు. ఆయన ఉదాశీనుడు. ఉత్+ఆసీనుడు. ఉన్నతమైన స్థానంలో కూర్చొని ఉంటాడు. అధ్యక్షుడు తన స్థానంలో ఆసీనుడయ్యే దాకా కార్యక్రమం ప్రారంభం కాదు. సభలో ఎంతమంది వ్యక్తులున్నా అధ్యక్షుడు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉంటేనే సభ జరిగేది. ఆయన గొప్ప ఉపన్యాసం ఇవ్వకపోయినా జరగవలసిన కార్యక్రమం అంతా ఆయన సమక్షంలోనే జరుగుతుంది.

అలాగే భగవంతుని సమక్షంలో - సాన్నిధ్యంలో ప్రకృతియే కార్యభారాన్ని వహించి సృష్టి జరుపుతుంది. ప్రకృతికి ఆశక్తి పరమాత్మ సాన్నిధ్యం వల్ల కలుగుతున్నది. ప్రకృతికి సృష్టి చేయటం స్వధర్మం. అయితే పరమాత్మ సాన్నిధ్యంలోనే - ఆయన చైతన్యాన్ని స్వీకరించియే చేస్తుంది. ఎందుకంటే అది జడం కనుక.

'రాబోయే పౌర్ణమి రోజున నగరయాత్ర చేయాలనుకుంటున్నాను' అని రాజు మంత్రితో అన్నాడు. అంతే ఇక ఆవిషయం రాజుకు గుర్తు కూడా లేదు. ఒక రోజు ముందే మంత్రి రాజు వద్దకు వచ్చి నగరయాత్ర గురించి గుర్తుచేశాడు. పట్టపు టేనుగు అలంకరించి సిద్ధం చేయబడింది. రాజుగారు ఏనుగుపై ఆశీనుడయ్యాడు. ప్రజలంతా జయజయధ్వానాలు చేస్తూ పూలు జల్లుతున్నారు. స్వాగత ద్వారాలు ఏర్పాటయ్యాయి. రక్షకభటులు అడుగడుగునా రాజుగారిని కనిపెట్టి ఉంటున్నారు. రాజోద్యోగులు తమ తమ పనులలో నిమగ్నమైయున్నారు. ఈ పనులన్నీ చేయటానికి వారికి అధికారం, శక్తి, భాద్యత ఎక్కడి నుండి వచ్చాయి? రాజుగారి వద్ద నుండే. మరి రాజుగారు వారితో ఎప్పుడైనా చెప్పారా? లేదు. మంత్రిగారి ఆజ్ఞమీదనే. మంత్రిగారు మంత్రిగా కాక సామాన్యపౌరుడుగా ఆజ్ఞాపిస్తే రాజోద్యోగులు, భటులు ఈ పనులు చేస్తారా? చెయ్యరు.

మంత్రి ఎలా రాజుగారి సాన్నిధ్యంలో పని చేస్తున్నాడో అలాగే ప్రకృతి కూడా పరమాత్మ సాన్నిధ్యంలోనే ప్రణాళికలు తయారు చేస్తుంది, అమలు జరుపుతుంది. ఈ మొత్తం కార్యం విజయవంతం కావటానికి కావలసిన శక్తిని పరమాత్మ నుండే పొందుతుంది.

ఇలా పరమాత్మ ఏమీ చెయ్యకుండానే చేస్తున్నట్లు అనిపిస్తుంది.

ఈ మొత్తం వ్యవహారం నుండి మనం గ్రహించవలసిన దేమిటి? - కనిపించే ఈ జగత్తుకు కారణం ప్రకృతి యని, జడమైన ఈ ప్రకృతికి చైతన్యాన్ని, శక్తిని ఇచ్చేది పరమాత్మయని తెలియక, పరమాత్మను దర్శించలేక, శాశ్వత ఆనందానికి దూరమౌతున్నారు. సుఖదుఃఖాల స్పర్శలేని ఆత్మయే ఆనందస్వరూపమని, అట్టి ఆత్మయే తానని అనుభవపూర్వకంగా - విజ్ఞాన సహితంగా ఎవరు తెలుసుకుంటారో అట్టివాడే జీవన్ముక్తుడు. కనుక మానవుడు అట్టి ఆత్మశక్తిని పొందటానికి తపనపడుతూ తన జీవితాన్ని సద్వినియోగం చేసుకోవాలి. పరమాత్మ సాన్నిధ్యానికి, పరమాత్మతో సాయుజ్యానికి ప్రయత్నించాలి.

ఇలా పరమాత్మ మహిమను అందరూ తెలుసుకోలేరు. తెలుసుకోవాలని ప్రయత్నించరు. కాని కొద్దిమంది మాత్రం పరమాత్మ యొక్క యదార్థస్వరూప స్వభావాలను తెలుసుకోగలుగుతారు. మరి పరమాత్మ మహిమను తెలుసుకోలేని వారెవరు? తెలుసుకోగలవారెవరు? ఆసురీస్వభావం గల మూఢులు తెలుసుకోలేరు. దైవీస్వభావం గలవారు మాత్రమే తెలుసుకోగలుగుతారు.

ఆసురీ స్వభావం గలవారి లక్షణాలేవి? దైవీస్వభావం గలవారి లక్షణాలేవి? ఇది తెలుసుకుంటే మనను మనం సరిచేసుకోవచ్చు.

- భగవంతుని తెలుసుకోలేని ఆసురీ స్వభావం గల వారెవరో ముందుగా 11వ శ్లోకంలో చెబుతున్నారు.

**శ్లో||** అవజానంతి మాం మూఢాః మానుషీ తను మాశ్రితం|
పరంభావ మజానంతః మమభూత మహేశ్వరం|| **(11)**

**తా||** సర్వప్రాణికోట్లకు నియామకుడనైన నా యొక్క సర్వోన్నత తత్త్వాన్ని తెలుసుకోలేని మూఢులు నన్ను మానవదేహం ధరించిన వానిగా మాత్రం తలంచి అలక్ష్యం చేస్తున్నారు.

**వ్యాఖ్య:-** పరమాత్మ యొక్క యదార్ధ తత్త్వాన్ని తెలుసుకొనుటకు ఇది ఎంతో ముఖ్యమైన శ్లోకం. ఎవరు పరమాత్మ యొక్క యదార్ధతత్త్వాన్ని తెలుసుకోలేకపోతున్నారు? ఎందుకు తెలుసుకోలేకపోతున్నారు? అనే విషయాన్ని జాగ్రత్తగా పరిశీలన చేస్తే ఆ సర్వోన్నత తత్త్వాన్ని తెలుసుకోవటం ఎలాగో అర్ధమవుతుంది.

"పశ్యమే యోగమైశ్వరం" అంటూ భగవానుడు నా యోగమహిమను చూడమన్నాడు. అలా చూడలేని వారెవరో, వారి యొక్క గుణగణాలు, స్వభావం ఎట్టిదో; వారికి భగవంతుడు ఇచ్చిన బిరుదు ఏమిటో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు. భగవంతుడు ఎవరు?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**1.భూత మహేశ్వరం:-** సర్వప్రాణికోట్లకు నియామకుడు, ఈశ్వరుడు, ప్రభువు, పరమాత్మ. పరమాత్మ సాన్నిధ్యం వల్లనే ప్రకృతి పరవశించి, కదిలి ఈ జగత్తును, ప్రాణికోట్లను సృష్టిస్తున్నది. అంతేకాదు ప్రాణికోట్ల పోషణ కూడా పరమాత్మ వల్లనే. పరమాత్మ కారణంగానే సూర్యుడు ప్రకాశించి వెలుగునిస్తున్నాడు. ఆహారం కోసం భూమిని, నీటిని, సూర్యుని కాంతిని, చంద్రుని చల్లదనాన్ని ఇస్తున్నాడు. ఆధారంగా భూమిని, తిరగటానికి అవకాశంగా ఆకాశాన్ని, దప్పిక తీర్చుకొనుటకు నీటిని, బ్రతకటానికి - జీవక్రియలు సాగించటానికి గాలిని, ఆహారాన్ని అరిగించటానికి అగ్ని (జఠరాగ్ని) ని సర్వాన్నీ సమకూర్చి పోషిస్తున్నది పరమాత్మే. అందుకే ఆయన నియామకుడు - శాసకుడు - ప్రభువు - ఈశ్వరుడు.

**2.పరంభావం:-** ఆయన తత్వం పరం - శ్రేష్ఠమైనది. ఆయన సూక్ష్మాతి సూక్ష్మమై, సర్వవ్యాపకమై, స్వయం ప్రకాశమై, ఇంద్రియ అగోచరమై, తనలో అన్నింటిని ఇముడ్చుకొని, అన్నింటిలోను తానుండి, ఏమీ చేయకుండానే అన్నీ చేస్తూ ఉండే సర్వోన్నత, విశిష్టతత్వం ఆయనది. ఇది తెలియని వారే -

**3.మూఢాః:-** అట్టి పరమాత్మ యొక్క శ్రేష్ఠమైన తత్వాన్ని తెలుసుకోలేని వారు ఎందరో ఉన్నారు. వారినే భగవానుడిక్కడ 'మూఢాః' అనే బిరుదుతో సత్కరిస్తున్నాడు. మూఢులు - మూర్ఖులు అని. సాధారణంగా లోకంలో మూఢులు - మూర్ఖులు అని ఎవరిని అంటారు? "తనకు తెలియదు, చెబితే వినడు" - అట్టి వారినే మూఢులు అంటారు. ఇక్కడ కూడా భగవత్తత్వాన్ని తెలియక, ఎవరైనా చెప్పినా వినక, చెప్పినవారిని ఎగతాళి చేస్తూ, తమకే

అంతా తెలుసుననుకునే వారు, తామే గొప్ప అనుకునే వారినే మూఢులు అంటున్నాడు భగవానుడు. అయితే వీరు ఎందుకు భగవంతుని యదార్థ తత్త్వాన్ని తెలుసుకోలేరు?

4.మానుషీం తనుం ఆశ్రితం:- మానవ శరీరాన్ని ధరించి ఉన్నాను గనుక. ధర్మాన్ని రక్షించటానికి, అధర్మాన్ని అణచివేయటానికి యుగయుగములందు నన్ను నేను సృజించుకుంటూ ఈ లోకానికి మానవదేహాన్ని ధరించివస్తూ ఉంటాను. అందరి లాగే పనిచేస్తూ ఉంటాను. ఇది చూచి తెలివి తక్కువవారు, అవివేకులు, అహంకారులు ఈయన కూడా మనలాగే తల్లిగర్భం నుండి జన్మించిన వాడే గదా! మనలాగే అన్ని పనులు చేస్తున్నాడు గదా! అని భావించి, నాయదార్థతత్త్వాన్ని తెలుసుకోలేక నన్ను నిర్లక్ష్యం చేస్తుంటారు. నన్ను మానవమాత్రునిగ భావించి అవమానిస్తారు.

శిశుపాల దంతవక్త్రులు నా మేనత్తల కుమారులే, దుర్యోధనుడు నా వియ్యంకుడే. అయినా ఆసురీ స్వభావం గలిగిన అహంకారులు గనుక వారు నా శ్రేష్ఠత్వాన్ని చూడలేకపోయారు. నా పరతత్త్వాన్ని గ్రహించలేక పోయారు. అలా తెలుసుకొనే సమ్యక్ దృష్టివారికి లేదు. అందుకే వారు మహాత్ములను దూషిస్తారు, సాధుపురుషులను అవమానిస్తారు. తమకున్న ధనాన్ని, బలాన్ని, సంపదలను చూచుకొని గర్విస్తారు. ఇట్టివారినే భగవానుడు 'మూఢాః' అనటం జరిగింది. నశించే బాహ్యరూపాన్ని నిజమని భావించి, నశించని ఆత్మతత్త్వాన్ని చూడలేని వారు గనుక వీరు మూఢులు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వాస్తవంగా భగవంతుడు సర్వవ్యాపి, అసంగుడు, అనాసక్తుడు సర్వసాక్షి, సర్వ భూతాధిపతి. అయినప్పటికీ తన మాయతో దేవకీ వసుదేవులకు కృష్ణుడనే పేర జన్మించాడు. ఇది భగవంతుని వ్యక్తస్వరూపం. వ్యక్తంలో ఉన్నప్పటికీ ఆయన భగవంతుడు కాకపోడు. ఎందుకంటే భగవంతుడు వ్యక్తావ్యక్త స్వరూపుడు. ఆయన వ్యక్తంలోనూ ఉంటాడు. అవ్యక్తంగాను ఉంటాడు. అయితే మూఢ మానవులు శ్రీకృష్ణుడు తల్లిగర్భంలో జన్మించాడు గదా! ఆయన పరమాత్మ ఎలా అవుతాడు? పరమాత్మ అంటే జ్యోతిర్బిందు స్వరూపుడు గదా అని వాదించే వారిని చూస్తుంటాం. ఇలాంటి వారి కోసమే 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అని స్పష్టంగా చెప్పింది. అయినా మూర్ఖత్వం వారిని నమ్మనివ్వదు. భగవానుడు స్వయంగా చెప్పినా నమ్మలేరు. అందుకే అట్టివారిని మూఢులు అన్నది.

ఇక్కడ భగవానుడు తన అవతార సిద్ధాంతాన్ని విడమరిచి సులభతరం చేసి చెబుతున్నాడు.

శ్రీకృష్ణుడుగా కనిపించే ఆయన అసలు స్వరూపం - అసలు తత్త్వం పరంభావం - సర్వభూత మహేశ్వరం. మరి ఆయన శరీరానికి గొప్పతనం లేదా? ఉన్నది.

1.మన శరీరాలు భూత కార్యాలు. అంటే పంచభూతాలతో నిర్మితం. ఆయన శరీరం మాయాకార్యం. కనుకనే ఇతరులచే కట్టుబడదు. యశోద కట్టివేసినా, దుర్యోధనుడు కట్టివేయబోయినా కట్టుబడలేదు. భూతకార్యమైతే కట్టుబడేది.

2.మన శరీరం మృణ్మయం. ఆయన శరీరం చిన్మయం. (జ్ఞాన స్వరూపం)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

3.మన శరీరం మనం చేసుకున్న పాప, పుణ్యకర్మల ఫలితంగా వచ్చింది. కనుక స్వయంగా సుఖదుఃఖాలు అనుభవించాల్సిందే మనం. మరి ఆయన శరీరమో ఆయన స్వయంగా చేసిన పాప పుణ్యాల వల్ల వచ్చింది కాదు. ఎందుకంటే ఆయన అకర్త. ఏమీ చేసేవాడు కాదు. కనుక పాపపుణ్యాల ప్రసక్తే లేదు. మరైతే ఎలా వచ్చింది?

ఈ భూమండలంపై పుణ్యాత్ములు చేసిన పుణ్యంవల్ల, పాపాత్ములు చేసిన పాపం వల్ల వచ్చింది. కనుక ఆయన శరీరంతో ఆయనకు సుఖంలేదు, దుఃఖంలేదు. ఎప్పుడూ ఆనందమే. ఎప్పుడూ పెదవులపై చిరునవ్వే. శిశుపాలుడు తిడుతున్నా, దుర్యోధనాది దుష్టచతుష్టయం బంధించవచ్చినా, సత్యభామ తన్నినా - ఆయన పెదవులపై చెదరని చిరునవ్వే. ఎందుకంటే శ్రీకృష్ణుని శరీరం పాండవుల పుణ్యం, కౌరవుల పాపం కారణంగా వచ్చింది గనుక. ఆయన వల్ల పాండవులకు సుఖం, కౌరవులకు దుఃఖం తప్పలేదు. పాండవులకు విజయం, కౌరవులకు సర్వనాశనం జరిగింది. అలాగే ప్రహ్లాదుని పుణ్యం, హిరణ్యకశిపుని పాపం వల్లనే నరశింహ స్వామిగా రావటం జరిగింది. ఆ శరీరం ద్వారా ప్రహ్లాదునికి సుఖం, హిరణ్యకశిపునికి దుఃఖం కలిగింది. కనుక శ్రీకృష్ణుని శరీరానికి కూడా పూజ్యత ఉన్నది. ఆయనది కారణజన్మ. సృష్టికర్త బ్రహ్మదేవుడు కూడా ఆ శరీరాన్ని పూజించాడు.

దేహాన్ని చూచి భగవంతుని నిర్లక్ష్యం చేసే మూఢులేకాదు, దేహాన్నే - విగ్రహాన్నే భగవంతునిగ భావించే భక్తులూ ఉన్నారు. అదీ మూఢత్వమే. ఎందుకంటే తాము కొలిచే దేవుడే పరమాత్మ అని, గొప్పవాడని, మిగిలిన

రూపాలు భగవంతుడు కాదని, అట్టివారిని పూజించరాదని, దర్శించరాదని, ఆరాధించరాదని భావించేవారున్నారు. శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య మతాలు శివుడే మా దేవుడు మిగిలినవారు దేవుడే కాదని; విష్ణువే దేవుడు, మిగిలిన వారిని పూజించరాదు, తలచుకోరాదని వీరు చెబుతుంటారు. ఇప్పుడు క్రైస్తవులు కూడా హిందూ దేవాలయాలకు వెళ్ళరాదని, దేవతలను పూజించరాదని, ప్రసాదం కూడా తీసుకోరాదని చెబుతున్నారు. ఏమతం వారైనా, ఏవిశ్వాసం గలవారైనా ఇతర దేవతలను అపహాస్యం చేయటం, అవమానించటం మూర్ఖత్వమే అవుతుంది. ఇతర నటుల వాల్ పోస్టర్ల మీద పేడముద్దలు కొట్టే సినీనటుల ఫాన్స్ కు వీరికి తేడా ఏమీలేదు. వీరు పరమాత్మతత్త్వం తెలియని మూఢులే.

విగ్రహాన్ని దేవుడుగా భావించటం అంటే పాత్రను పరమాన్నంగా భావించటమే. పరమాన్నం తీసుకరావయ్యా! అంటే పరమాన్నం ఉన్న పాత్రను తీసుకవస్తాడు. పరమాన్నం రుచి చూపించవయ్యా అంటే పాత్ర యొక్క కాడను నోట్లో పెట్టి 'రుచిచూడు' అంటే సరిపోతుందా? అలాగే పరమాత్మను గుర్తుచేసుకోవాలంటే విగ్రహం అవసరమే. కాని పరమాత్మ తత్త్వం తెలుసుకోవాలంటే బుద్ధికి పదును పెట్టాల్సిందే.

పాత్ర పరమాన్నం కానట్టే విగ్రహం దేవుడు కాదు. విగ్రహం కేవలం భగవంతునికి ప్రతీక మాత్రమే. పరమాత్మను లక్ష్యంగా పెట్టుకొనుటకు విగ్రహాన్ని ప్రతీకగా పెట్టుకుంటాం. అంతేగాని విగ్రహమే దేవుడు కాదు. విగ్రహం పగిలిపోతే పరమాత్మ పగిలిపోయాడని, విగ్రహాన్ని ఎవరైనా దొంగిలిస్తే

పరమాత్మను ఎవరో దొంగిలించారని సత్యాగ్రహం చేసేవారు మూఢులే. ఇలా విగ్రహమే దేవుడని మూర్ఖంగా భావించే వారివల్లనే మతమౌఢ్యం, మత దురహంకారం, మత కలహాలు, ఉద్రేకాలు కలుగుతాయి. ఏ విగ్రహమైనా ఒకే ఒక్కటైన అనంత పరమాత్మ చైతన్యానికి ప్రతీక అని భావించగలిగినప్పుడు ఇట్టి విపరీతాలు తలెత్తవు.

సర్వవ్యాపక చైతన్య స్వరూప పరమాత్మ మనకు ఎంతో దూరంగా ఉన్నాడని భావించరాదు. సూర్యుడు ఆకాశంలో కోట్ల మైళ్ళ దూరంలో ఉన్నాడు. అయినా ఆ సూర్యుని ప్రకాశం అంతరిక్షంలో సంచరించే మేఘాల మీద, వర్షించే నీటి మీద, ప్రవహించే నదుల మీద, నేలపైన గడ్డి మీద, సముద్రంలోని అనంతజలరాశి మీద ప్రతిబింబించటం లేదా? అలాగే పరమాత్మ కంటికి కనిపించకపోయినా, అవ్యక్తంగా, ఉదాశీనుడుగా ఉండిపోయినా ఆ పరమాత్మ సాన్నిధ్యంలోనే ప్రకృతి పరవశించి, మార్పులు చెందుతూ, ప్రపంచంలో వివిధ రూపాలు ఏర్పడుతుంటే, ఆ పరమాత్మ చైతన్యం అన్నింటి మీద ప్రతిబింబిస్తూ, ప్రతి జీవుని శరీరంలోను జీవచైతన్యంగా - జీవుడుగా వ్యక్తమౌతున్నది. ఈ చైతన్యం యొక్క పరమభావాన్ని గుర్తించాలి. శరీరానికిచ్చే ప్రాధాన్యతను చైతన్యానికివ్వని వారే పరమాత్మను గుర్తించని మూఢులు. వారే పరమాత్మను అలక్ష్యం చేసేవారు.

- ఉత్తమమైన పరమాత్మ తత్త్వాన్ని నిర్లక్ష్యం చేసే ఇట్టి మూఢులు ఏ లక్షణాలు గలవారౌతారు. ఏ స్వభావం గలవారౌతారు?

**శ్లో||** మోఘాశా మోఘ కర్మాణః మోఘజ్ఞానా విచేతసః|

రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః || (12)

**తా||** వ్యర్థమైన ఆశలుగలవారు, దండగ మారి కర్మకాండ, ప్రవృత్తి గలవారు వ్యర్థమైన జ్ఞానం గలవారు, జ్ఞానహీనులైన మూఢులు మోహాన్ని కలిగించే రాక్షస సంబంధమైన, ఆసురిక సంబంధమైన స్వభావాన్ని ఆశ్రయించిన వారవుతారు.

**వ్యాఖ్య:-** భగవంతుని నిర్లక్ష్యం చేసేవారి ఆశలు, కోరికలు వ్యర్థమైనవే. వారు వ్యర్థమైన కర్మ ప్రవృత్తిని కలిగిఉంటారు. అట్టివారి జ్ఞానం కూడా వ్యర్థమైనదే అవుతుంది. దానితో వారి బుద్ధి చెడిపోతుంది. బుద్ధి హీనులౌతారు. వారినే విచేతసః అని చెబుతున్నది. ఇలా బుద్ధి హీనులైన వారి ప్రవృత్తి ఆసురీ ప్రవృత్తి.

ఆసురీ ప్రవృత్తి గలవారిని ఇక్కడ 3 విధాల ప్రకృతి గలవారిగా చెపుతున్నారు. అవి 1.రాక్షస ప్రకృతి 2.ఆసురిక ప్రకృతి 3.మోహినీ ప్రకృతి

1. రాక్షస ప్రకృతి:- హింసా ద్వేషాలే స్వభావంగా గలిగినవారు రాక్షసులు. తమకు ఏప్రయోజనమూ లేకపోయినా సరే నిష్కారణంగా ఇతరులను పీడించటం, హింసించటం వీరి స్వభావం. ఇది పుట్టుకతో వచ్చిన బుద్ధి.

ఒకసారి ఒక తేలు దారితప్పి జారి చెరువులో పడిపోయింది. నీటిలో మనిగిపోతున్నది. మునిగితే అది చనిపోతుంది. అదృష్టవశాత్తు కప్ప ఒకటి ప్రక్కనే కనిపించింది. "సోదరా! నన్ను నీవీపు మీద ఎక్కించుకొని పుణ్యం కట్టుకో. నాకు ప్రాణదానం చెయ్యి" - అని ప్రార్థించింది. కప్ప సరేనని తేలును

వీపుపై కెక్కించుకొని గట్టుకు చేర్చటానికి ప్రయాణమైంది. రెండడుగుల దూరం వేసిందోలేదో తేలు కప్పను కుట్టింది. కప్ప తేలుతో అంటున్నది, "నేను నీ ప్రాణాలు రక్షించటానికి నిన్ను నా వీపుపై కెక్కించుకొని ఒడ్డుకు చేరుస్తున్నాను. అలాంటి నన్నే కుడతావా? ఛీఛీ! ఏమి జన్మ నీది? అన్నది. దానికా తేలు, "సోదరా! నాకు ఎవరు తటస్థపడ్డా సరే - కుట్టటం నా అలవాటు. అది నా స్వభావం. పుట్టుకతో వచ్చిన బుద్ధి. నాకు మేలుచేసే వారైనా, కీడు చేసే వారైనా - ఎవరైనా సరే చిక్కితే వదలను. నా అలవాటు మారదు. పదపద. ఆ గట్టుకు చేరిస్తే నీ పుణ్యం ఎక్కడకు పోతుంది? అన్నది. కప్ప బయలుదేరగానే మళ్ళీ కుట్టింది. కప్పకు ఒళ్ళు మడింది. "సరే అది నీ అలవాటైతే ఇది నా అలవాటు" అంటూ బుడుంగున నీటిలో మునిగింది. దానితో తేలు నీటిలో మునిగి చనిపోయింది.

ఈ తేలులాంటి స్వభావం గలవారే రాక్షసులు. వారి స్వభావం క్రూరమైంది. నిష్కారణంగా అపకారం చేస్తారు. భగవంతుని నిందించటం, భక్తులను నిందించటం - దూషించటం, పరులను పీడించటం, హింసించటం వారికి పుట్టుకతో వచ్చిన బుద్ధి.

ఆకలితో అలమటించి పోతున్నానంటే పిలిచి అన్నం పెట్టిందో ఇల్లాలు. సుష్టుగా తిని, ఒంటరిగా ఉన్నది గదా! అని చెయ్యి పట్టుకున్నాడు. ఇట్టివారే రాక్షస ప్రవృత్తి గలవారు.

2.ఆసురీ ప్రకృతి:- తమకోసం, తమ సుఖం కోసం, తమ స్వార్థం కోసం

ఇతరులకు ఎంతటి అపకారాన్నైనా చేసేవారు, ఇతరులను హింసించేవారు

అసురులు. ఈ స్వభావం గలవారు - అంటే తమ స్వార్థం కోసం ఇతరులకు ఎంతటి ద్రోహాన్ని, అన్యాయాన్ని చెయ్యటానికి కూడా వెనుకాడని వారి స్వభావమే ఆసురీప్రకృతి. వీరికి భగవంతుడు, భక్తి, శాస్త్రం, గీస్త్రం, నీతి, న్యాయం, ధర్మం, కర్మం అంటూ ఏ నియమ నిబంధనలు ఉండవు.

రావణాసురుడు గొప్ప శివభక్తుడు, పరిపాలనా దక్షుడు, మహావీరుడు. అయినా అతడిలో పరస్త్రీ వ్యామోహమనే నీచబుద్ధి ఉన్నది. సీతాదేవి విషయాన్ని తన సోదరి శూర్పణఖ చెప్పటంతో, ఎలాగైనా ఆమెను అపహరించాలనే దుర్బుద్ధి కలిగింది. మారీచుడి వద్దకెళ్ళి తన ఆలోచనను చెప్పాడు. అతడి హితబోధను తృణీకరించాడు. అతణ్ణి బెదిరించి మాయలేడి కమ్మన్నాడు తాను తాపస వేషంతో వెళ్ళి ఒంటరిగా ఉన్న సీతాదేవిని అపహరించి తెచ్చాడు.

విపరీత కోరిక, విపరీత కర్మ. పరమభక్తుడైనా సరే ఆ కోరిక అతణ్ణి సర్వనాశనం చేసింది. ఇతరుల నెంత బాధకు గురిచేసి అయినా సరే తన కోరిక తీర్చుకోవాలనే తపనయే ఆసురీ స్వభావం.

తమ లాభం కోసం ఇతరుల శ్రమను దోచుకోనేవారు, తమ స్వార్థంకోసం పసిపిల్లలను అంధులుగా చేసేవారు, తమ స్వార్థం కోసం యువతులను వ్యభిచారకొంపల్లో అమ్మేవారు, తమ ప్రేమఫలించలేదని కత్తితో గొంతులు కోసేవారు, యాసిడ్ పోసేవారు, తమ కామదాహం తీర్చుకొనుటకు స్త్రీల జీవితాలను ఛిన్నాభిన్నం చేసేవారు - వీరంతా అసురులే. అసురిక ప్రవృత్తి గలవారే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

3.మోహినీ ప్రకృతి:- ఇతరులకు కష్టం కలిగించాలనే ఆలోచనలేకపోయినా, అజ్ఞానం వల్ల, మోహంవల్ల ఇతరులకు కష్టం కలిగించేవారు మోహినీ ప్రకృతి గలవారు. ఇక్కడి ధనం, సంపదలు, వస్తువులు, విషయాలవల్ల తమకు సుఖ సంతోషాలు కలుగుతాయని, అవి లేకపోతే జీవితమే వ్యర్ధమని భావించి, వాటిని సంపాదించటానికి ధర్మమైన, న్యాయమైన పద్ధతి పనిచేయదని; అందుకు అన్యాయం, మోసం చెయ్యవలసి వచ్చినా తప్పులేదని భావించేవారు ఈ స్వభావం గలవారు.

అధికారం కోసం, పదవుల కోసం తపించే రాజకీయనాయకులు గాని, రకరకాల ఆశలు చూపించి వ్యాపారాలు చేసేవారు గాని, చిట్ ఫండ్స్ పేరుతో ఇతరులను మోసగించే వారుగాని, వీరంతా మోహంతో ఉన్నవారే. మోహినీ ప్రకృతి గలవారే.

ఈ 3 రకాల ప్రవృత్తి గలవారు వ్యర్ధమైన ఆశలతో, వృధాకర్మలు చేస్తూ బుద్ధిహీనులై ప్రవర్తిస్తూ, పరమాత్మకు దూరమై పోతారు. ఏం చేస్తారు వారు?

1.మోఘాశా:- వారి ఆశలు వ్యర్ధమైనవి. ఆశకు ఆకలి ఎక్కువ. ఎప్పటికీ తీరదు. ఆశలు తీరకపోగా మొదటికే మోసం వస్తుంది. ఇక వారి ఆశలు తీర్చుకొనుటకు చేసే కర్మలు ఎలా ఉంటాయి?

2.మోఘకర్మాణా:- 200 ఎకరాల పొలం ఉన్న ధనికుడున్నాడు. అయినా తృప్తి లేదు. ఎవరో చెప్పారు "కొండ ప్రాంతాల్లో కోయదొరల వశంలో చాలా పొలం ఉంది, వారికి డబ్బు సంగతి తెలియదు. ఏవైనా తినుబండారాలు, వస్తువులు ఇచ్చి ఆ పొలం తీసుకోవచ్చును" - అని. వెంటనే ధనికుడు

ఆటవస్తువులు, బొమ్మలు, తినుబండారాలు మూటగట్టుకొని అక్కడకు వెళ్ళాడు. వారి పిల్లలకు వాటిని ఇచ్చి మచ్చిక చేసుకున్నాడు. దానితో కోయదొర నీకేం కావాలి? అని అడిగితే ఇక్కడ కొంత నేల కావాలి అన్నాడు. దానికా దొర, "రేపు ఉదయం 6 గంటలకు బయలుదేరి నీ యిష్టం వచ్చినంత దూరం వెళ్ళి తిరిగి సాయంత్రం 6 గంటలకు బయలుదేరిన చోటుకు రావాలి. ఆ మధ్యలో ఉన్న భూమి అంతా నీదే" అన్నాడు. మరునాడు ఉదయం 6 గంటలకు దొర స్థలం గుర్తుచూపాడు. ఈ ధనికుడు నడక ప్రారంభించాడు. స్థూలకాయం, పొట్టివాడు కావటంతో నడిస్తే ఎక్కువదూరం పోలేనని పరుగు ప్రారంభించాడు. దారిలో కాలువ. దూకాడు, కాలుజారి పడ్డాడు. ఎలాగో లేచి పరుగు ప్రారంభించాడు. ఆయాసం, దప్పిక, చెమట. ఎవరో మంచి నీరు తెచ్చిస్తే Time వృధా అవుతుందని త్రాగలేదు. అలా పరుగెత్తి పరుగెత్తి సాయంత్రం 6 గంటలకు బయలుదేరిన చోటుకు 100 గజాల దూరంలో పడిపోయి ప్రాణాలు వదిలాడు. ఆ ధనికుడు ఎంత పొడుగున్నాడో అంత గోతిని తీయించి అందులో పూడ్పించాడు కోయదొర. ఇది మోఘాశా - మోఘకర్మాణ - అంటే. ఇక వీరి జ్ఞానం.

మోఘజ్ఞానా విచేతసః:- వారి తెలివి వారికి ఏప్రయోజనం కలిగించదు. వారి జ్ఞానం (తెలివి) వల్ల వారికి సుఖం లేదు, శాంతి లేదు, లోకానికీ ప్రయోజనం లేదు. అట్టివారు ఎంతటి వారైనా అధములే. బుద్ధిలేని వారే.

నా చుట్టూ ఉన్న వాళ్ళు బాగా సంపాదిస్తున్నారని, భోగాలనుభవిస్తున్నారని, నేను కూడా వారిలాగా అనుభవించాలని, అందుకు

ఇంకా ఇంకా సంపాదించాలని, క్షుద్రమైన ఆశలతో, కోరికలతో, ఆలోచనలతో అక్రమమార్గాల్లో సంపాదించటానికి, దేవాలయాల్లోని విగ్రహాలను దొంగిలించాలని, దొంగతనాలు చేయాలని, బస్సు దోపిడీలు చేయాలని, నిధుల కొరకు వేట సాగించాలని, మత్తుమందులు - మత్తు పదార్థాలు సరఫరా చేయాలని; బ్రోతల్ హౌస్ లు నడపాలని, రౌడీయిజం చేయాలని ఆలోచిస్తూ ఉండే వారంతా ఈ ఆసురీ స్వభావం గలవారే. ఈ పనిలో ఎదురుతిరిగిన వారిని కాల్చేస్తారు, చంపేస్తారు. ఇదే రాక్షసప్రవృత్తి. ఇవే వృథా ఆశలు, వృథా కర్మలు.

వీటివల్ల బుద్ధి పూర్తిగ చెడిపోతుంది. దానితో భగవంతుని వైపుకు అడుగువేయాలనే ఆలోచన కూడా రాదు. పైగా భగవంతుణ్ణి కూడా తమ పనిలో భాగస్వామిని చేయాలని కోరుకుంటారు. తమ దుర్మార్గాలు నిర్విఘ్నంగా జరగాలని, సంపదలు లభించాలని, అలా లభిస్తే కొంత లంచం ఇవ్వాలని భావిస్తారు.

ఇట్టివారు భగవంతుని వైపుకు తిరగరు, భగవత్తత్వాన్ని ఎప్పటికీ తెలుసుకోలేరు; వీరి జీవితం వృథా జీవితం. కనుక ఈ ఆసురీ ప్రవృత్తిని విడిచి దైవీప్రవృత్తిని అలవరచుకోవాలి. ఆ దైవీ ప్రవృతి ఎలాంటిది?

ఆసురీ ప్రకృతి గలవారు ఎలాంటి ఆశలతో, కర్మలతో భగవంతునికి దూరమౌతారో ఇంతవరకు తెలిపిన భగవానుడు దైవీప్రకృతి గలవారు భగవంతునికి ఎలా దగ్గరౌతారో, ఏం చేస్తారో చెప్పబోతున్నాడు.

**శ్లో||** మహాత్మా నస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః|

భజంత్య నన్య మనసః జ్ఞాత్వా భూతాది మవ్యయం||   **(13)**

**తా||** అర్జునా! మహాత్ములైతే దైవీ ప్రకృతిని ఆశ్రయించిన వార్తై, జీవుళ్ళకు ఆదియై, నాశనం లేని నన్ను తెలుసుకొని అన్యచింతనలు లేని మనస్సుతో సేవిస్తారు.

**వ్యాఖ్య:-** ఇంతవరకు భగవానుడు ఆసురీ ప్రకృతి గలవారి గురించి చెప్పి, ఇప్పుడు దైవీప్రకృతి గలవారి గురించి చెప్పబోతున్నాడు.

క్షుద్రమైన బాహ్యవస్తువుల కోసం, భోగాల కోసం సత్యమైన పరమాత్మను విస్మరించేవారు ఆసురీ స్వభావం గల అవివేకులు. అలాగాక సత్యమైన పరమాత్మ కోసం క్షుద్రమైన బాహ్యవస్తువులను, భోగాలను త్యాగం చేసేవారు దైవీప్రకృతి గల వివేకులు.

ఆసురీ స్వభావం గలవారిపై రజోగుణ, తమోగుణాలు స్వారీచేస్తాయి. దైవీ స్వభావం గలవారు సత్వగుణసంపన్నులు; దైవపరాయణులు.

'మహాత్మానస్తు' అంటే మహాత్ములైతేనో - అని. అంటే 'ఇప్పటి వరకు అల్పాత్ముల గురించి చెప్పాను - ఇక మహాత్ముల గురించి చెప్పబోతున్నాను' అని భావం.

<u>మహాత్మనః</u>:- దైవీగుణాలు, దైవీ స్వభావం గలవారిని భగవానుడు ఇక్కడ స్వయంగా 'మహాత్ములు' అని బిరుదు నిచ్చి సత్కరిస్తున్నాడు. పరమాత్మభావన ఎవరి అంతఃకరణంలో ఉంటుందో వారే మహాత్ములు. అల్పమైన, అనిత్యమైన, క్షుద్రమైన భౌతిక వస్తువులు ఎవరి అంతఃకరణంలో

ఉంటాయో వారే అల్పాత్ములు. మహాత్ముల అంతఃకరణంలో రాముడు రాజ్యమేలుతాడు; అల్పాత్ముల అంతఃకరణంలో కాముడు రాజ్యమేలుతాడు.

భగవంతుని కోసం క్షుద్రమైన విషయాలను త్యజిస్తే మహాత్ముడు, అలాగాక క్షుద్రమైన విషయాల కొరకు భగవంతుని త్యజిస్తే అల్పాత్ముడు.

ఒక మహాత్ముడైన సన్యాసి వీధి వెంట పాదచారియై వెళుతున్నాడు. ఒకరాజు గారు ఏనుగు అంబారీ మీద ఊరేగింపుగా ఆ వీధిలోనే వస్తున్నాడు. సన్యాసి ఎదురుపడగానే రాజుగారు ఏనుగు దిగి వినయంతో సన్యాసికి నమస్కరించాడు. సన్యాసి కూడా రాజుగారికి అలాగే వంగి వినయంగా నమస్కారం చేశాడు. రాజుగారన్నారు, "మహాత్మా! మీరు సర్వసంగ పరిత్యాగులు గనుక నేను మీకు నమస్కరించటం ధర్మం. కాని ఈ భౌతిక విషయాలలో కూరుకుపోయిన నేను ఏమి గొప్పత్యాగం చేశానని నాకు నమస్కరిస్తున్నారు?" అన్నాడు. దానికా సన్యాసి, "మహారాజా! నేను భగవంతుని కోసం అల్పమైన, క్షుద్రమైన విషయాలను త్యాగం చేశాను. కాని మీరో ఈ అల్ప విషయాల కోసం అంతటి భగవంతునే త్యాగం చేశారు గదా! త్యాగంవిషయంలో నా కన్నా మీదే గొప్పత్యాగం. అందుకే నేను మీకు నమస్కరిస్తున్నాను" అన్నాడు. అంటే గొప్ప వస్తువును త్యాగం చేసిన వాడన్నమాట రాజు. అలాంటి త్యాగం మనం చేయరాదు. అలా చేస్తే అల్పాత్ములమైపోతాం. మహాత్ములు ఏం చేస్తారు?

(i)దైవీప్రకృతిని ఆశ్రయిస్తారు. దైవీగుణాలను అలవరచుకుంటారు.

**(ii) ప్రాణికోటికి ఆదియైన వాడు, నాశరహితుడు పరమాత్మ అని తెలుసుకుంటారు.**

**(iii) అనన్యమైన చిత్తంతో భగవంతుని భజిస్తారు.**

**1.అనన్య మనసః భజంతిః- అనన్య మనస్సు అంటే ఇక్కడ రెండు అర్థాలున్నాయి. (i) పరమాత్మ తన కంటే అన్యంగా లేడనే మనస్సుతో భజించుట.**

**(ii) పరమాత్మ కన్న ఇతరమైన దేనియందు మనస్సు నిలుపకుండుట.**

**(i) 'పరమాత్మ తనకన్న వేరుకాదు' అనే మనస్సు ఉండటం చాలా గొప్పవిషయం. 'నేనే పరమాత్మను' అనే అద్వైత భావన గలవారు అరుదుగా ఉంటారు.**

**సాధారణంగా హిందూ సాంప్రదాయంలో దేవాలయానికో, ఇంటిలోని పూజామందిరంలోనికో వెళ్ళి భగవంతుని విగ్రహాన్ని చూడగానే తలవంచి, కళ్ళు మూసుకొని నమస్కరిస్తాం. ఎందుకు? భగవంతుడు వేరుగా ఎక్కడో లేడు నా హృదయంలోనే ఉన్నాడు అనే ఉపదేశం ఉంది అక్కడ. అసలు భగవంతుడు తన కన్న వేరుగా ఉన్నాడని అనుకున్నంతవరకు బాధ తప్పదు, భారం తప్పదు.**

**ఒక పల్లెటూరి రైతు 10 మైళ్ళ దూరంలో ఉన్న పొరుగూరికి బయలుదేరాడు. ఆ రోజుల్లో అన్ని గ్రామాలలో హోటళ్ళుండవు. అందుకని చద్దన్నం మూటగట్టుకొని నెత్తిన పెట్టుకొని వెళుతున్నాడు. నడిచినడిచి అలసిపోయాడు. మూట బరువైపోతున్నది. కడుపులో ఆకలవుతున్నది; బాధ.**

ఆ మూట నెత్తిన పెట్టుకొని ఉన్నంత వరకు బరువు, బాధ తప్పలేదు. ఒకచోట నీటికుంట, ప్రక్కనే పెద్ద చెట్టు ఉన్నది. అక్కడ కూర్చొని ఈ చద్దిమూటను స్వాహాచేశాడు. అంతే. అతడికిప్పుడు బరువూ లేదు. బాధాలేదు. పైగా నూతనశక్తి వచ్చింది. అలాగే భగవంతుడు మనకన్న వేరుగా ఉన్నాడను కున్నంత వరకు భక్తి కూడా భారంగా, బాధగా ఉంటుంది. అంటే భగవంతుని భజించాలంటే పూలు, నైవేద్యాలు, మంత్రాలు, పురోహితులు ఎన్నో అవసరం. పైగా ఉపవాసం ఉండాలని, తలస్నానం చేయాలని ఎన్నో రూల్స్. అలాగాక భగవంతుడు నాలోనే ఉన్నాడనుకుంటే అసలు - నేనే భగవంతుడని గ్రహిస్తే ఇంక ఏ బరువూ, బాధా ఉండదు.

(ii) భగవంతుని యందు తప్ప ఇతరత్రా ఏ ప్రాపంచిక విషయాల యందు, వస్తువుల యందు, భోగాల యందు మనస్సు నుంచకుండుట అనన్యభక్తి అంటారు. మరి ప్రాపంచిక వ్యవహారములను వదిలి వెయ్యాలా? అవసరం లేదు. వదలరాదు కూడా.

పడవ ఎక్కడ ఎటు తిరుగుతున్నా దిక్సూచి ఉత్తరం వైపుకే చూపుతున్నట్లు ఎన్ని ప్రపంచవ్యవహారాలలో ఉన్నా మహాత్ముల మనస్సు పరమాత్మ పైనే ఉంటుంది. కొందరు తమ మనస్సును కొంత దైవం మీద, కొంత ప్రాపంచిక విషయాల మీద ఉంచుతారు. ఇది అనన్యభక్తి కాదు. మనం ఏం చెయ్యాలి? ప్రాపంచిక విషయాలలో, భోగాలలో ఉన్న దోషాలను మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకుంటూ, పరమాత్మ యొక్క నిత్యత్వాన్ని తెలుసుకుంటూ

పరమాత్మనే ఆశ్రయించాలి. అదే అనన్య చిత్తం. ఇలా అనన్యచిత్తంతో ఏంచేయాలి?

2.భూతాదిం అవ్యయం జ్ఞాత్వా:- ఇలా పరమాత్మ యందు చిత్తం దృఢంగా నిలిపి పరమాత్మ యొక్క యదార్థతత్వం తెలుసుకోవాలి. పరమాత్మ అన్ని ప్రాణులకు ఆది. నీకు నీ తండ్రి కారణం. ఆయనకు ఆయన తండ్రి కారణం. ఇలా వెనక్కుపోతే కారణం లేని కారణం ఒకటి ఉంటుంది. అదే పరమాత్మ. పరమాత్మకు ముందు ఎవ్వరూ లేరు. కనుక ఆయన ఆది కారణుడు. ఇక పరమాత్మ ఎల్లప్పుడూ ఉండేవాడు. ఆయనకు ఆది అంతం లేదు. జన్మ- మరణం లేదు. శాశ్వతం. ఈ విశిష్ట లక్షణాలు పరమాత్మకు తప్ప ఎవ్వరికీ ఉండవు. ఇదే ఆయన ప్రత్యేకత. ఇది తెలుసుకోవాలి. ఇలా తెలుసుకుంటేనే పరమాత్మపై ప్రేమ కలుగుతుంది. భక్తి కలుగుతుంది.

విగ్రహమే భగవంతుడని భావించి చేసే పూజ విగ్రహానికే చేరుతుంది. కాని భగవంతునికి చేరదు. కనుక భగవంతుని లక్షణాలను, విశిష్ఠతను తెలుసుకుంటూ చేసే పూజయే నిజమైన భగవంతుని పూజ అవుతుంది.

3. దైవీం ప్రకృతిం ఆశ్రితాః:- ఇలా భగవంతుని భజించాలంటే మనలో దైవీ గుణాలను పెంపొందించుకోవాలి. ఈ దైవీ గుణాలంటే ఏమిటో 16వ అధ్యాయంలో మొదటి 3 శ్లోకాల్లో ఎంతో వివరంగా తెలియజేయటం జరిగింది. ఇందులో 36 గుణాలను చెప్పటం జరిగింది. ఈ గుణాలను అలవరచుకుంటున్న కొద్దీ భగవంతుని పట్ల ఆసక్తి కలుగుతుంది. దైవానికి దగ్గర కావటం జరుగుతుంది. ఇట్టివారు భగవంతుని ఎలా ఉపాసిస్తారు?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- పరమాత్మను అనన్యభక్తితో సేవించే మహాత్ములు ఎలా సేవిస్తారు?

**శ్లో||** సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః|

నమస్యంతశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే|| **(14)**

**తా||** ఎల్లప్పుడూ నన్ను కీర్తిస్తూ, దృఢమైన నిష్ఠతో సాధనచేస్తూ, భక్తితో నాకు నమస్కరిస్తూ, నిత్యయుక్తులై ఉపాసిస్తూ ఉంటారు.

**వ్యాఖ్య:-** పరమాత్మను ఉన్నది ఉన్నట్లుగ - నిరాకార నిర్గుణ తత్వంగా తెలుసుకోవటం పరాభక్తి. అలా కాకుండా భగవంతుడు సగుణ, సాకార రూపంలో భక్తులననుగ్రహిస్తూ ఉంటాడని భావించి, నమ్మి, ఆయనను ఆరాధించటం, సేవించటం ఉపాసన. ఇది సాధారణ భక్తి. ఈ రెండూ వేదాలలో చెప్పబడ్డాయి. ఈ శ్లోకం సగుణరూపంగా భక్తుల పక్షంగా చెప్పబడింది. ఎలాగ?

1.సతతం మాం కీర్తయంతః:- భక్తులైన వారు నిరంతరం హే కృష్ణా! హే వాసుదేవా! హే రామా! హే నారాయణ! అంటూ ఆయా రూపాలతో ఉన్నట్టు భావించబడే భగవంతుని, వారి వారి గుణాలను స్మరిస్తూ కీర్తిస్తూ ఉంటారు. నోటితో నామాన్ని ఉచ్చరిస్తూ, మనస్సుతో వారి గుణగణాలను, వారి కథలను స్మరిస్తూ ఉంటారు. ఇది వాచిక తపస్సు. ఇది ఏదో ఒక సమయంలో కాక 'సతతం' ఎల్లప్పుడూ కీర్తిస్తుంటారు భక్తులైన వారు.

సాధారణంగా కీర్తన, భజన అనగానే పదిమందీ ఒకచోట కూడి, పెద్ద పెద్ద శబ్దాలతో, వాయిద్యాలతో గట్టిగా గానం చేయటం అనుకుంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తాళయుక్తంగా భజనలు చేయటం, నృత్యం చెయ్యటం మొ॥నవన్నీ భక్తిలో భాగమే. అయితే ప్రసాదాలు తీసుకొని ఎవరి దారిన వారు వెళ్ళిన తరువాత ఇక భగవంతుని ప్రసక్తే లేకపోతే ప్రయోజనం లేదు. తన్మయత్వంతో - పరవశంతో పాడి, ఆడి, కీర్తన చేస్తే మంచిదే. భగవంతుని గుణగణాలను సదా కీర్తిస్తూ, హృదయంలో నిలుపుకుంటే అదే సతత కీర్తన అవుతుంది.

2.ధృఢవ్రతా యతంతః చః- దృఢమైన నిష్టతో సాధనచేయాలి. భగవత్ప్రాప్తికి ఎంతో కష్టపడాలి. ఎంతో కాలం సాధన చేయాలి. ఏ వ్రతమైనా, ఏ దీక్షయైనా, కొన్ని రోజులలో, కొన్ని గంటలో చేసివదిలేస్తే ప్రయోజనం లేదు.

అది నీలో మార్పు తీసుకొచ్చేంత వరకు చేయాలి. ఇప్పుడు కొన్ని రకాల దీక్షలున్నాయి. 40 రోజులు అనేక నియమాలతో దీక్షచేబడతారు. ప్రతిరోజూ రెండు పూటలా భజనలు, సాత్విక ఆహారం, నేలపడక, దీక్షావస్త్రధారణ, మాలాధారణ, బ్రహ్మచర్యం, దురలవాట్లు మానటం, అందరినీ స్వామీ అని పిలవటం - ఇలా ఎన్నో నియమాలు. 40 రోజులు ఇలా చేసిన వారు 41వ రోజు నుండి ఎలా ఉంటున్నారు? అనేది ప్రధానం. అందరినీ స్వామి అని పిలిచినవారు తరువాత నుండి నోటికి వచ్చినట్లు తిడుతూ మాట్లాడితే ఏం ప్రయోజనం? ఈ 40 రోజులు మంచి అలవాట్లు చేసుకొనేది ఎందుకు? తరువాత కూడా అలా ప్రవర్తించి జీవితాన్ని ఉన్నతంగా తీర్చి దిద్దుకుంటారనే. కనుక మార్పు వచ్చే దాకా సాధన సాగాలి.

ప్రహ్లాదుడు, ధృవుడు, నచికేతుడు ఎన్ని కష్టాలు ఎదురైనా ధృఢవ్రతులై నిలిచారు, శ్రేయస్సును పొందారు. వారు నిర్ణయించుకున్న మార్గం నుండి చలించలేదు. అదే దృఢవ్రతం.

మనం కూడా దృఢవ్రతంతో ప్రయత్నం సాగించాలి. భగవంతుని గురించి పూర్తిగా తెలుసుకోవటానికి చేసే ప్రయత్నమే సాధన. భగవత్తత్త్వాన్ని తెలుసుకొని ఆ తత్త్వంతో ఐక్యతకు ప్రయత్నించటమే నిజమైన సాధన. అందుకు ఎన్ని అడ్డంకులు ఎదురైనా దృఢమైన నిష్ఠతో ప్రయత్నం సాగించాల్సిందే తప్ప ఎవరి మీదనో, దేని మీదనో నెపం వేసి, నా తప్పేం లేదు - అని సమర్థించుకోవటం సరికాదు. అట్టివారికి ప్రగతి ఉండదు. ఇక మహాత్ముల మరి యొక సాధన -

3.భక్త్యా మాం నమస్యంతః:- భక్తితో భగవంతునికి నమస్కరించటం గొప్ప శారీరక తపస్సు అవుతుంది. అయితే భక్తితో నమస్కరించాలి. మన అవసరాల కోసం అధికారుల వద్దకో, మంత్రుల వద్దకో వెళ్ళినప్పుడు నమస్కరిస్తుంటాం. అది మొక్కుబడి నమస్కారం. అక్కడ ప్రేమ, భక్తి, గౌరవం అనేవి ఉండవు. అలాగే మన కోరికలు తీరాలని భగవంతునికి నమస్కరిస్తాం. మనస్సులో నిజమైన భక్తి ఉండదు. భగవంతుని తత్త్వం తెలియకుండా చేసే ఈ నమస్కారాల వల్ల ప్రయోజనం లేదు. మరి ఎలా చేయాలి నమస్కారం?

ఈ దేహం గాని, ఈ ప్రకృతి గాని, ఇక్కడున్న సర్వస్వమూ భగవంతునిదే. నాదేం లేదు, అనే భావంతో 'న - మమ' నాదేమీ లేదు అని చేసే నమస్కారమే నిజమైన నమస్కారం. భగవంతుని సంపూర్ణ శరణాగతితో నీవు

**తప్ప నాకు గత్యంతరం లేదనే భావనతో గజేంద్రుని లాగా నమస్కరించాలి. అదే నిజమైన నమస్కారం.**

**4.నిత్యయుక్తా ఉపాసతే:- నిత్యయుక్తులై ఉపాసిస్తారు. అంటే తమ చిత్తం ఎల్లప్పుడూ భగవంతుని యందే నిలిపి ఆరాధిస్తారు. చిత్తం నిత్యము నిరంతరము పరమాత్మ యందే నిల్పి, పరమాత్మనే లక్ష్యంగా పెట్టుకొని నిజమైన భక్తులు ఉపాసన చేస్తారు. శరీర మనోబుద్ధులు ఒకే ఒక లక్ష్యం కోసం - భగవంతుని చేరుకోవటం కోసం నిలపటమే యుక్తత్వం. నిత్యయుక్తుడంటే ఎల్లప్పుడూ భగవంతుని విషయంలోనే ఉండటం. కూర్చున్నా, నిలుచున్నా, మాట్లాడుతున్నా, వింటున్నా, తింటున్నా, తిరుగుతున్నా ఆ భగవంతుని గురించే చింతించటం, భగవంతుని గురించే మాట్లాడటం, భగవంతునే స్మరించటం.**

**- భక్తి మార్గంలో భగవంతుని సగుణ రూపాన్ని ఉపాసించే మహాత్ముల యొక్క అనన్యభక్తిని గురించి చెప్పి, ఇప్పుడు జ్ఞానమార్గంలో నిర్గుణో పాసన చేసే మహాత్ముల యొక్క భక్తిని గురించి భగవానుడు చెప్పబోతున్నాడు.**

**శ్లో|| జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే|**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధావిశ్వతో ముఖం|| (15)**

**తా|| మరి కొందరు మహాత్ములు సర్వాంతర్యామినైన నన్ను అద్వైత భావముతోను, ద్వైత భావముతో వివిధ రూపాలతోను, జ్ఞానయజ్ఞము చేతను పూజిస్తూ ఉపాసిస్తున్నారు.**

**వ్యాఖ్య:-** పరమాత్మ విశ్వతోముఖం. అంతటా ఆయనే ఉన్నాడు. ఆయన సర్వాంతర్యామి. అందరి హృదయాలలో తిష్ఠ వేసుకొని కూర్చొని ఉన్నాడు. ఆయనకు తెలియకుండా ఎవ్వరూ ఏమీ చేయలేరు, ఏమీ ఆలోచించలేరు. విశ్వతోముఖం అంటే విశ్వమంతా ముఖంగా గలవాడు - అని. కనుక విశ్వంలో ఏం జరిగినా ఆయన చూస్తాడు, వింటాడు, వాసన చూస్తాడు, రుచి చూస్తాడు.

అట్టి భగవంతుని మహాత్ములు ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా భజిస్తారు.

1.ఏకత్వేన:- అంతా ఒక్కటే. జీవుడు - దేవుడు అని ఇద్దరు లేరు, ఉన్నదంతా భగవంతుడే అనే అద్వైత బుద్ధియే ఏకత్వబుద్ధి. తాను ఆత్మనని గ్రహించి; ఆత్మ పరమాత్మేనని తెలుసుకొని, ఎల్లప్పుడూ పరమాత్మగానే ఉండిపోయే జ్ఞాని - ఆత్మజ్ఞాని. అతడిలో ఎటువంటి భేదబుద్ధి ఉండదు. అందరిలో ఉన్నది తానే (ఆత్మయే)ననే దృఢభావన ఉంటుంది. ఈ భావన గలవాడు తన సాధనకు ఆటంకం కలిగించే వస్తువులను, విషయాలను, భోగాలను - అన్నింటిని తృణప్రాయంగా వదిలేస్తాడు.

ఒక జ్ఞాని సర్వత్రా భగవంతునే దర్శిస్తూ ఉంటాడు. భగవన్నామమే అతడి పెదవులపై ఆడుతూ ఉంటుంది. ఒకరోజు మంగలి గడ్డం గీస్తున్నాడు. కత్తి పెదవుల దగ్గరకు రాబోయే సమయంలో ఆయన పెదవులు అల్లాడిస్తుంటే చూచి మంగలి, "అయ్యా! పెదవులు అల్లాడిస్తుంటే గడ్డం చేయటం కుదరదు" అన్నాడు. "నా అనుష్టానానికి అడ్డు వచ్చే ఈ గడ్డం నాకెందుకు? పో "

అన్నాడు మంగలిని. సగం గడ్డంలోనే లేచి వెళ్ళిపోయాడు. అదే తీవ్రత. ఇదే అభేదబుద్ధితో పరమాత్మను ఉపాసించే విధానం. ఇక మరికొందరు -

2.పృథక్త్వేన:- భగవంతుడు వేరు, తాను వేరు అనే భావంతో - ద్వైతబుద్ధితో భేదబుద్ధితో కొందరు ఉపాసన చేస్తారు. వారు భగవంతుడు ప్రభువు, తాను దాసుడు అనే 'దాసోహం' భావనతో వేరువేరు రూపాలను ఉపాసన చేస్తారు. ఇలా భేదంతో ఉపాసన ప్రారంభమైనా చివరకు అభేదంతో ముగిసిపోతుంది . ద్వైతంతో ప్రారంభమైనా భక్తితో ఉపాసన సాగిస్తే చివరకు అద్వైతంతో ముగుస్తుంది. దాసోఽహంతో ప్రారంభమై సోఽహంతో ముగుస్తుంది. దాసోఽహం అల్పమైనదని భావించరాదు.

మధుసూదన సరస్వతీ స్వామి గొప్ప జ్ఞాని. ఐనా శ్రీకృష్ణుని ఎడల గొప్పభక్తి ఉన్నది. ఇదేమి స్వామీ అని కొందరు శిష్యులు అడిగితే దానికాయన ఇలా చెప్పాడు. "నాది మొదటి నుండి శ్రీకృష్ణుని ఎడల దాసోహంబుద్ధియే. అయితే శ్రీకృష్ణునిది దొంగబుద్ధి గదా! గోపికల చీరలను దొంగిలించినట్లు నా దాసోహంలోని 'దా' ను దొంగిలించాడు. ఇంకేం మిగిలింది? సోఽహం మిగిలింది అన్నాడు. జీవాత్మ పరమాత్మల ఏకత్వమే సోఽహం భావన. ఇదే అద్వైతభావన.

అద్వైత సాంప్రదాయానికి చెందిన ఒక సాధువు, జ్ఞానిననే అహంకారంతో ఉండేవాడు. ఒకరోజు ఒక ఆశ్రమానికి వచ్చాడు. వేకువన స్నానం చేశాడు. భావి ప్రక్కనే తెల్లని సున్నం వేసిన గోడ ఉంది. నా అద్వైత మంత్రంతో అందరూ తరించాలనే భావనతో ఆ గోడపై బొగ్గుతో సోఽహం

అని వ్రాశాడు. సోఽహం అంటే ఆ పరమాత్మ నేనే అని. ఆ తరువాత ఒక భక్తుడు స్నానార్థం వచ్చిగోడపై గల మంత్రాన్ని చూచి, దానిముందు 'దా' అనే పదాన్ని వ్రాశాడు. దానితో అది 'దాసోఽహం' అయింది. అంటే నేను దాసుడను అని. మరునాడు జ్ఞాని వచ్చి చూచి దానిముందు 'స' చేర్చాడు. దానితో అది 'సదా సోఽహం' అయింది. మరునాడు భక్తుడు 'దా' చేర్చాడు. దాసదాసోఽహం అయింది. నీ దాస దాసుణ్ణి నేను - అని. ఇలా భక్తుడు 'దా' ను చేరుస్తూ, జ్ఞాని 'స' ను జేరుస్తూ ఆ గోడంతా ఖరాబు చేశారు. ఆశ్రమాధిపతి వచ్చి రెండింటిలోను దోషం లేదు. దాసోఽహం సోఽహం గా అంతమవుతుంది. భక్తిమార్గం, జ్ఞానమార్గం రెండూ ఉన్నతమైనవే అని చెప్పి వారిని పంపివేశాడు.

కనుక కబుర్లతో కాలక్షేపం చేయక, ఏకత్వోపాసనో, పృధక్త్వోపాసనో; సోఽహం భావనో, దాసోఽహం భావనో ఏదో ఒకటి అవలంబించి ఉపాసన చేయాలి. ఆకులు లెక్కపెట్టుకుంటూ కూర్చోక పండ్లు తినాలి. మార్గాలు వేరైనా చేరే గమ్యం ఒక్కటే.

3.జ్ఞాన యజ్ఞేన:- సర్వవ్యాపి, సర్వాంతర్యామి అయిన పరమాత్మ ఈ జగత్తు నందంతటా వ్యాపించియున్నాడు. ఈ జగత్తులోనే ఉంటూ, ఈ జగత్తుకు కారణమైన పరమాత్మను వెతికి, కనుక్కొని, ఆ మాధుర్యాన్ని అనుభవించాలి. దానికొరకై విడిచి పెట్టకుండా ప్రయత్నం చేయాలి. అదే "జ్ఞాన యజ్ఞం".

చాక్లెట్లు తయారుచేసే కంపెనీ వాడు కొన్ని పొడవుగా, కొన్ని పొట్టిగా, కొన్ని గుండ్రంగా, కొన్ని గుండ్రాయిలాగా వేరువేరు రూపాలలో, వేరు

రంగులలో తయారుచేస్తాడు. వాటిపై రంగురంగుల రేపర్లు ఆకర్షణీయంగా ఉంటాయి. చాక్లెట్ ఏ రూపంలో ఉన్నా, ఏ రంగులో ఉన్నా, ఏ రేపర్ లో ఉన్నా చాక్లెట్లన్నీ ఒకే రకమైన మాధుర్యంతో ఉంటాయి. వాటి ఆకారాలను, రంగులను పట్టించుకోకుండా వాటి మాధుర్యాన్ని అనుభవిస్తాం.

అలాగే ఈ జగత్తులో వస్తువులు గాని, ప్రాణికోటి గాని, ఏ రూపంలో ఉన్నా ఏ పేరుతో ఉన్నా అన్నింటిలోను ఉన్నది ఆ పరమాత్మ చైతన్యమేనని గ్రహించినవాడు సర్వత్రా ఆ పరమాత్మనే దర్శిస్తాడు.

అట్టివాడు తనకంటి పాపలోను, స్నేహితుని చిరునవ్వులోనూ, శత్రువు యొక్క క్రోధంలోనూ, అసూయతో కూడిన పరుషవాక్యాలలోను, ఆదరణతో కూడిన ప్రేమమాటల్లోనూ, శీతోష్ణాది ద్వంద్వాలలోను, మానవుల్లోను, మృగాల్లోనూ, వృక్షాల్లోనూ, చరాచర జగత్తులోను పరమాత్మ యొక్క దివ్యదర్శనాన్ని అనంతమైన ఆనందంగానో, బ్రహ్మజ్ఞానంగానో, సచ్చిదానందరూపంలోనో పొందగలుగుతాడు. ఇదే అన్ని మతాలలోను ప్రశంసించబడే ఈశ్వరదర్శనం. ఇలా నామరూపాలతో కూడిన జగత్తునందు ఆ పరమాత్మ తత్త్వాన్ని - ఆ చిదానందాన్ని వెతికి కనుక్కోవటమే జ్ఞానయజ్ఞం.

- ఇక జ్ఞానయజ్ఞం ద్వారా ఉపాసన ఎలాగో రాబోయే 4 శ్లోకాల్లో వివరిస్తున్నారు.

**శ్లో||** అహంక్రతు రహం యజ్ఞః స్వధాఽహమహ మౌషధం|
మంత్రోఽహ మహమేవాజ్యం అహమగ్నిరహం హుతం|| (16)

**తా||** నేను క్రతువును, నేను యజ్ఞాన్ని, పితరుల కర్పించే అన్నం నేను, హోమం చేసే మూలికలు నేను, నేను మంత్రాన్ని, ఆజ్యాన్ని కూడా నేనే, నేను అగ్నిని, హోమకర్మలో అర్పించే ఆహుతులు నేనే.

**వ్యాఖ్య:-** విశ్వతోముఖుడైన భగవంతుని అనేక రూపాలలో అర్చించే, ఉపాసించే వైఖరిని ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

సాధారణంగా యజ్ఞం చేయాలంటే అగ్ని, ఆజ్యం, ఆహుతులు, ఓషధులు, మధురపదార్థాలు, మంత్రాలు - ఇలా ఎన్నో సమకూర్చుకొని చేయాలి. కాని జ్ఞానయజ్ఞంలో సర్వమూ భగవంతుడే. ఆ భగవంతునే 'అహం' (నేను) అంటూ ఇక్కడ చెప్పటం జరిగింది. అంతటా, అన్నింటా ఉండే భగవంతుని తెలుసుకోవటం, అన్నింటిని భగవంతునిగా దర్శించటమే జ్ఞానయజ్ఞం.

ఈ జగత్తులో కనిపించే రూపాలన్నీ భగవంతుడే. వినిపించే శబ్దాలన్నీ భగవంతుడే. ఎవరికి ఏ వస్తువును సమర్పించినా భగవంతుని కర్పించినట్లే. తాను ఏమి అనుభవిస్తున్నా అన్నీ భగవంతునివే. దైవీగుణాలు గలిగి దైవీప్రకృతి నాశ్రయించిన వారు ఈ ప్రకారంగా విశ్వరూపోపాసన చేస్తారు.

"ఓ కృష్ణా! నీవు పరమాత్మవే గదా! సర్వవ్యాపివే గదా! నీవు ఏఏ రూపాలలో ఉన్నావో చెబితే ఆయారూపాలను ఉపాసించటం ద్వారా నిన్ను చేరుకుంటాను" - అని అర్జునుడు అడిగినట్లుగ భావించి భగవానుడిక్కడ 3

రూపాలను చెబుతున్నాడు 4 శ్లోకాల్లో. జగత్తులోని చర - అచర, పుణ్య - పాప, గొప్ప - అల్ప, మంచి - చెడు, ఉత్తమ - నీచ అనే సమస్త రూపాలను పరమాత్మగానే భావించాలి. అయితే హీనమైన, నీచమైన, అల్పమైన వస్తువులను, వ్యక్తులను భగవంతునిగ భావించాలంటే మొదట్లో చాలా కష్టంగా ఉంటుంది. అందుకే భగవంతుడిక్కడ భగవద్దృష్టితో చూడటానికి వీలయ్యే కొన్నింటినే పేర్కొన్నాడు. ఇక రాబోయే అధ్యాయంలో అన్ని విభూతులను పేర్కొనటం జరిగింది, దానితో మిత్రులలోను, శత్రువులలోను, మంచివాటిలోను, అల్పమైన వాటిలోను పరమాత్మను దర్శించటం కుదురుతుంది. ముందుగా ఈ శ్లోకంలో 8 రూపాలను చెప్పటం జరిగింది.

భగవంతుణ్ణి దేవాలయంలో మాత్రమేగాక జగత్తునందంతటా దర్శించటానికి వీలుగా ఇక్కడ యజ్ఞప్రక్రియను ఎన్నుకున్నారు. యజ్ఞప్రక్రియనే ఎందుకు ఎన్నుకున్నారు?

మహాభారతకాలంలో దేవతారాధనలన్నీ వేదంలో చెప్పిన కర్మకాండ (యజ్ఞ) రూపంలోనే జరిగేవి. కర్మకాండలో ఉపయోగించే వస్తువులు ఆనాటి వారికి బాగా పరిచయం. అందుకే అర్జునునితో ముందుగా ఈ యజ్ఞప్రక్రియను ప్రస్థావించి, అందులో ఉపయోగించే వస్తువులు, పదార్థాలు, కర్మవిభాగాలు అన్నీ భగవంతుని స్వరూపాలే అని చెబుతున్నారు. అంతేగాక శ్రీకృష్ణుడు తాను పరమాత్మనే నని చెప్పకనే చెబుతున్నాడు - 'అహం' అంటూ.

**1.అహంక్రతుః- క్రతువులు అంటే వేదములలోని కర్మకాండయందు చెప్పబడిన అగ్నిష్టోమాది క్రతువులు. అవి అన్నీ భగవంతుని స్వరూపాలే. అందుకే క్రతువును నేనే అంటున్నాడు భగవానుడు.**

**2.అహం యజ్ఞః- యజ్ఞమంటే గృహస్థుడు తప్పక ఆచరించవలసిన పంచయజ్ఞాలతో బాటు, దేవతలను సంతృప్తి పరచటానికి చేసే హోమక్రియలు అన్నీ యజ్ఞములే. దేవయజ్ఞం, ఋషియజ్ఞం, పితృయజ్ఞం, నృయజ్ఞం, భూతయజ్ఞం - ఇవి పంచయజ్ఞాలు. ఈ 5 రకాల యజ్ఞాలు చేయకపోతే మనం దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, మనుష్యులకు, భూతకోటికి ఋణపడి ఉంటాం. ఆ ఋణాలు తీరేంతవరకు మళ్ళీ మళ్ళీ ఈ లోకంలోకి వస్తూ పోతూ ఉండాల్సిందే. అలాగే మనకు కావలసిన అవసరాలన్నింటినీ తీరుస్తూ మనను పోషిస్తున్న సమస్త దేవతలకు, దిక్పాలకులకు ఆహుతులనర్పించి కృతజ్ఞత చూపవలసిన అవసరం ఉన్నది. అందుకొరకు అగ్ని ద్వారా ఆహుతుల నర్పించే హోమక్రియను తప్పకచేయాలి. ఇవన్నీ నేనే అంటున్నాడు భగవానుడు. అంటే యజ్ఞం భగవంతుని స్వరూపమే.**

**3.అహం స్వధః- 'స్వధ' అంటే మంత్రపూర్వకంగా పితృదేవతల కర్పించే అన్నం. అదీ నేనే అంటున్నాడు భగవానుడు. అందుకే 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అనటం జరిగింది.**

**మనం ఇచ్చే వస్తువులు పితృదేవతలకు అందుతాయా? అని కొందరి సందేహం. ఈనాడు మంత్రశక్తి లోపించటం వల్ల అలాంటి సందేహాలు**

వస్తుంటాయి. ఒక గడ్డి పరకను తీసుకొని మంత్రం జపిస్తే ఆగ్నేయాస్త్రం అవుతున్నది; వారుణాస్త్రం అవుతున్నది, బ్రహ్మాస్త్రం అవుతున్నది.

ఎండుమిరపకాయను ముక్కు దగ్గర పెట్టుకుంటే ఆ ఘాటు నీకొక్కడికే. దానినే రోటిలో వేసి దంచితే చుట్టూ ఉన్న 10 మందికీ ఘాటు వ్యాపిస్తుంది. దాన్ని నిప్పులో వేస్తే పై అంతస్థులో ఉన్నవాడికి కూడా ఘాటు తగులుతుంది. అలాగే అగ్ని ద్వారా సూక్ష్మరూపం చెందిన వస్తువు వస్తురూపంలో గాక శక్తి రూపంలో పితృదేవతలకు చేరుతుంది. అంటే ఆహూతులన్నింటినీ అగ్ని పోస్ట్ మేన్ లాగా సకలదేవతలకు అందిస్తాడు. ఈ స్వధ నేనే అంటున్నాడు.

<u>4.అహం ఔషధం:-</u> హోమాగ్నిలో వేసే సమిధలు, నవధాన్యాలు, మధుర పదార్థాలు - అన్నీ ఔషధమే. మనం తినే అన్నం కూడా ఔషధమే, ఎందుకంటే ఆకలి అనే జబ్బుకు ఔషధం అన్నమే గనుక. ఈ ఔషధం నేనే అంటున్నాడు.

<u>5.అహం మంత్రః:-</u> ఆహుతులు సమర్పించేటప్పుడు ఉచ్ఛరించే మంత్రాలన్నీ భగవత్స్వరూపమే. స్వాహాకార్యాలలో గాని, స్వధాకార్యాలలో గాని, యజ్ఞాలలో గాని ఉచ్ఛరించే మంత్రాలన్నీ నేనే అంటున్నాడు భగవానుడు.

<u>6.అహం ఏవఆజ్యం:-</u> దేవతల ప్రీతి కోసం హోమాగ్నిలో వేసే ఆవు నెయ్యి కూడా నేనే అంటున్నాడు భగవానుడు. అంటే ఆజ్యాన్ని భగవంతునిగా చూడాలి.

7.అహం అగ్నిః :- అగ్నిని కూడా నేనే అంటున్నాడు భగవానుడు. హోమాగ్నిని పవిత్రాగ్ని అంటారు. అగ్ని లేకపోతే జగత్తూ లేదు, జీవుడూ లేడు. జబ్బుపడ్డ వ్యక్తి అంత్యకాలంలో బ్రతికి ఉన్నాడా? లేదా? అని తెలిసేది శరీరంలోని వేడిని బట్టే. శరీరం పూర్తిగా చల్లబడితే టపా కట్టినట్లే. తిన్న ఆహారాన్ని అరగించేది జఠరాగ్నియే. నేనే జఠరాగ్ని రూపంలో నీవు తిన్న ఆహారాన్ని అరిగిస్తున్నాను అని భగవానుడే అన్నాడు. కనుక అగ్ని భగవంతుని రూపమే.

8.అహం హుతం:- హోమకుండంలో హోమం చేసే హోమ ద్రవ్యాలే ఆహూతులు. అవి కూడా నేనే అంటున్నాడు భగవానుడు.

కర్త కర్మ క్రియ అన్నీ భగవంతుడే. ఆకారాలు అనేకమైనా అన్ని రూపాలలో ఉండేది భగవంతుడే.

బంగారంతో వివిధ వస్తువులు తయారయ్యాయి. ఇప్పుడు బంగారం అంటున్నది. "గాజులు నేనే, ఉంగరాలు నేనే, దుద్దులు నేనే, నెక్ లెస్ నేనే, గొలుసులు నేనే అని", అలాగే యజ్ఞం నేనే, క్రతువులు నేనే, ఆజ్యం నేనే, ఆహూతులు నేనే, అగ్ని నేనే అంటున్నాడు భగవానుడు.

శివాభిషేకంలో నమకచమకంలో ఇదే అభిప్రాయం ఉన్నది. "గిరిశ్చమే, పయశ్చమే, తిలశ్చమే" అని. అంటే పర్వతంలో నీవే, పాలలో నీవే, నువ్వులలో నీవే - అని. సర్వంలోను పరమాత్మ తప్ప మరేమీ లేదు. ఇలా సర్వం బ్రహ్మమయం, భగవన్మయం అని భావన చేస్తూ అంతటా భగవద్దృష్టి కలిగి ఉండాలి. ఇదే 'జ్ఞానయజ్ఞం'. ఇక్కడ మొత్తం 8 విభూతులు చెప్పారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- వ్యవహారరంగంలోని విషయాలను ఉదాహరణలుగా జూపి అంతటా ఉన్నది భగవంతుడే అని ఋజువు చేస్తున్నాడు భగవానుడీ శ్లోకంలో -

**శ్లో||** పితాఽ_హ మస్య జగతః మాతాధాతా పితామహః|
వేద్యం పవిత్ర మోంకారః ఋక్సామ యజురేవచ|| (17)

**తా||** ఈ జగత్తుకు నేను తండ్రిని, తల్లిని, కర్మఫలదాతను, తాతను. తెలియబడవలసిన పవిత్రమైన ఓంకారాన్ని, ఋక్, సామ, యజుర్వేదాలు నేనే.

**వ్యాఖ్య:-** 'అస్య జగతః' ఈ జగత్తుకు అంటూ భగవానుడు ఈ కనిపించే ప్రపంచాన్ని మన దృష్టికి తెస్తున్నాడు. ఏదైనా ఒక వస్తువు కనిపిస్తే దానిని కార్యం అంటారు. దానిని తయారుచేసిన కర్తను కారణం అంటారు. ఒక మనిషి కనిపిస్తే ఇతడి తల్లిదండ్రులెవరో ఉండాలి అని తెలుస్తుంది. అలాగే ఈ జగత్తు కనిపిస్తున్నది గనుక దీనికి తల్లి, తండ్రి ఎవరో ఉండాలి. ఆ తల్లి, తండ్రి నేనే అంటున్నాడు పరమాత్మ.

1.అస్యజగతః అహం పితా, మాతా, ధాతా, పితామహః:- ఈ జగత్తుకు నేను తండ్రిని, తల్లిని కర్మఫల ప్రదాతను, తాతను అని 4 రూపాలు తానేనని చెబుతున్నాడు భగవానుడు.

భగవంతుని తల్లిగా, తండ్రిగా ఆరాధించటం హిందూ సాంప్రదాయంలో ఉంది. 'త్వమేవ మాతా చ పితా త్వమేవ' - నీవే తల్లివి, నీవే తండ్రివి - అని. తల్లివి నీవే, తండ్రివి నీవే అని పాడుకోవటం జరుగుతుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ జగత్తుకు ఉపాదాన కారణం (ముడిసరుకు) ప్రకృతి లేదా మాయ. కనుక ప్రకృతే దీనికి తల్లి. ఈ ప్రకృతికి అధిష్ఠానం పరమాత్మ. కనుక ఆయన తండ్రి. ప్రకృతి యందు బీజాన్నుంచే వాడు గనుక తండ్రి. "బీజంమాం సర్వభూతానాం" ఈ సమస్త ప్రాణికోట్లకు నేను బీజాన్ని అని స్వయంగా భగవానుడే భగవద్గీతయందు తెలియజేయటం జరిగింది.

మనం ఎన్ని జన్మలెత్తినా అన్ని జన్మలలోనూ అందరికీ పరమాత్మే తల్లి, తండ్రి. తాత్కాలికంగా ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క తల్లి, ఒక్కొక్క తండ్రి ఉంటారు. అయితే ఆ శరీరాన్ని వదలటంతో వారితో సంబంధం రద్దు. కాని పరమాత్మ శాశ్వతుడు గనుక ఆయనతో సంబంధం శాశ్వతం. మరి నిజమైన తల్లిదండ్రులు పరమాత్మే గనుక మనం ఆశ్రయించవలసింది పరమాత్మనే. మనం పరమాత్మను ఆశ్రయిస్తే ఆయన మనను తల్లిలా ఆదరించి, తండ్రిలా పోషిస్తాడు.

మరి ఈ భౌతికమైన తల్లిదండ్రులను పట్టించుకోనక్కర లేదా? అంటే నీదేహం ఉన్నంతవరకు వారిలోనే పరమాత్మను దర్శించాలి. అదే భగవంతునికి ప్రీతికరమైనది.

ఇక తల్లి, తండ్రినే కాదు, 'ధాతను' అని కూడా అంటున్నాడు భగవానుడు. ధాత అంటే కర్మఫలప్రదాత. మనం పుణ్యం చేసుకుంటే సుఖాలను, పాపం చేసుకుంటే దుఃఖాలను ఇచ్చేది కూడా ఆయనే. మధ్యలో ఆయనెవరండీ ఇవ్వటానికి? అంటారు కొందరు. నీవు బ్యాంకులో డబ్బు వేశావు. 5 సం||ల తర్వాత నీ డబ్బు నీకు ఇవ్వటానికి అక్కడ ఒక క్యాషియరు ఉండాలి గదా!



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎక్కువ తక్కువలు లేకుండా ఖచ్చితంగా నీకు లెక్కగట్టి ఇవ్వాలిగదా! అలాగే మనం చేసిన కర్మలు ఎలాంటివో చూచి, ఏ కర్మలకు ఎలాంటి ఫలితం ఇవ్వాలో ఖచ్చితంగా లెక్కగట్టి ఇచ్చేవాడే భగవానుడు.

ఇక 4వ రూపం పితామహః - అంటే తాత. తల్లి ఇంటిపనుల్లో ఉండి, తండ్రి సంపాదన వ్యవహారాల్లో ఉండి బిడ్డను పట్టించుకోలేనప్పుడు తాత ఆ బిడ్డను ఆడిస్తాడు, నవ్విస్తాడు, కథలు చెబుతాడు, హితబోధలు చేస్తాడు. అలా ఎంతో సన్నిహితంగా ఉంటాడు. అసలు కన్న కొసరు ముద్దు అన్నట్లు కుమారుని మీద కన్న మనుమడి మీదనే ముద్దు ఎక్కువ. అలాగే జగత్తుకు హితం కలిగించేవాడు గనుక పరమాత్మ పితామహుడు.

ప్రపంచం కొన్ని నియమాలకు లోబడి, ఒక క్రమమైన పద్ధతిలో నడుస్తుంది. ఈ నియమాలను, పద్ధతులను అనుసరించే వారు కొందరైతే, వాటిని నిర్లక్ష్యం చేసేవారు, ఎదిరించే వారు, వ్యతిరేకించేవారు కూడా కొందరుంటారు. అయితే తల్లిలా లాలించి, తండ్రిలా కఠినత్వం చూపి, న్యాయమూర్తిలా నిర్లిప్తంగా నియమాలను అమలుపరుస్తూ, తాతలా చనువుతో వ్యవహరిస్తూ అందరినీ భరించేవాడు భగవానుడే. అందుకే ఆయన తల్లి, తండ్రి, ధాత, పితామహుడు. ఆయా రూపాలలో ఉన్నది భగవంతుడే అని దర్శించాలి.

**2.వేద్యం పవిత్రం ఓంకారం:-** తెలియబడవలసినది పవిత్రమైన ఓంకారమే. ఓంకారం అనేది పరమపవిత్రం. ఓంకారం అంటే పరమాత్మే. అదే ప్రణవం. పరమాత్మ యొక్క అసలు పేరు ఓంకారమే. రాముడు, కృష్ణుడు, శివుడు,

శంకరుడు, అల్లా, క్రీస్తు ఇలా ఎన్ని పేర్లున్నా అసలు పేరు మాత్రం 'ఓం'. ఎందుకంటే మిగిలిన అన్ని పేర్లు పరమాత్మలోని ఒక్కొక్క శక్తిని ప్రదర్శిస్తాయి. కాని 'ఓం' అనేది పరమాత్మలోని సమస్త శక్తులను ప్రతిబింబిస్తుంది. అందుకే అది పవిత్రం. విష్ణుసహస్ర నామాల్లో "పవిత్రాణాం పవిత్రం యో మంగళానాంచ మంగళం" అని ఉన్నది. పవిత్రమైన వాటిలో పవిత్రం, మంగళకరమైన వాటిలో మంగళం నేనే అని దాని అర్థం.

అట్టి పవిత్రమైన ఓంకారాన్ని తెలుసుకోవాలి. అందుకోసమే ఈ మానవజన్మ. దానిని తెలుసుకోకపోతే ఈ మానవజన్మ వృథా అయిపోయినట్లే. ఎందుకు తెలుసుకోవాలి? వేదమే దీనికి సమాధానం చెబుతున్నది "యత్ జ్ఞాత్వా సర్వమిదం జ్ఞాతం భవతి" - దేనిని తెలుసుకుంటే ఈ సర్వమూ తెలిసిపోతుందో అదే పరమాత్మ - అని. పరమాత్మను తెలుసుకుంటే ప్రయోజనం? "యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" - దానిని తెలుసుకుంటే అన్ని అశుభాల నుండి విడుదల పొందుతావు - అని ఈ అధ్యాయంలోనే చెప్పటం జరిగింది. అందుకే పరమాత్మను - 'ఓం' కారాన్ని తప్పక తెలుసుకోవాలి. అలా తెలుసుకొని సమస్త అశుభాల నుండి విముక్తి పొందాలి.

<u>3.ఋుక్, సామ, యజురేవచ</u> :- ఋుగ్వేదం, యజుర్వేదం, సామవేదం నేనే అంటున్నాడు భగవానుడు. ఋుగ్వేదం సృష్టికి సంబంధించిన విషయాలను, యజుర్వేదం స్థితికి - పోషణకు సంబంధించిన విషయాలను, సామవేదం లయానికి సంబంధించిన విషయాలను తెలియజేస్తుంది. అందుకే

ఋగ్వేదానికి బ్రహ్మ, యజుర్వేదానికి విష్ణువు, సామవేదానికి ఈశ్వరుడు అధిష్టానదేవతలుగా ఉన్నారు, నిజంగా సృష్టి, స్థితి, లయకర్త పరమాత్మే గనుక 3 వేదాలు నేనే అంటున్నాడు. వేదాలంటే శ్రుతులు. అంటే విన్నవి. విన్నదెవరు? మహర్షులు. వినిపించినదెవరు? వారిలోనే ఉన్న పరమాత్మ. కనుక వేదాలన్నీ పరమాత్మే. వేదాలను భగవత్ స్వరూపంగా దర్శించాలి.

ఈ శ్లోకం మొత్తం 8 విభూతులు చెప్పారు. మొత్తం 8+8=16.

- ఇంకా ఏఏ రూపాలలో భగవంతుడున్నాడో మరికొన్ని విభూతులను చెబుతున్నాడు.

శ్లో|| గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్|
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయం|| (18)

**తా||** పరమలక్ష్యం, భరించేవాడు, ప్రభువు, జరిగే వాటిని చూచే సాక్షి, సర్వానికీ నిలయం, శరణం, ఆప్తుడను, సృష్టి స్థితి లయాలు, ఆధారం, అవ్యయబీజం నేనే.

**వ్యాఖ్య:-** 1.గతిః- గతి అంటే గమ్యం, లక్ష్యం, చేరుకోవలసిన స్థానం. ఈ లోకంలో పుట్టిన ప్రతిప్రాణీ, ప్రతిజీవి అంతిమంగా చేరుకోవలసింది ఆ పరమాత్మనే. అదే అందరి పరమలక్ష్యం. ఆ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని మనం నడుచుకోవాలి. దానధర్మాలు చేసినా, పూజలు యజ్ఞాలు చేసినా, జప తపాదులు చేసినా, శ్రవణ మనన నిధిధ్యాసనలు చేసినా, ఆత్మవిచారణ చేసినా చివరకు ఆ పరమాత్మను చేరుకొనుటకే చేయాలి. గమ్యం తెలియకుండా

ప్రయాణం చేస్తే అతడు ఎక్కడకు చేరుకుంటాడో అతడికే తెలియదు. మనం ఎందుకు పరమాత్మ వద్దకే చేరుకోవాలి? మన స్వస్థానం అదే గనుక. మన స్వస్థానం నుండి జారిపడ్డాం. ఎన్నో కష్టాలు, దుఃఖాలు పడుతున్నాం. ఎక్కడెక్కడో తిరుగుతున్నాం, దారీ తెన్నూ తెలియటం లేదు. అందువల్ల సద్గురువు అనే బాటసారి మాటలు విని, మన స్వస్థానం ఏదో తెలుసుకొని, ఆయన చూపిన మార్గంలో ప్రయాణించి మన స్వస్థానాన్ని చేరుకుంటే సమస్త దుఃఖాలు పూర్తిగా నివృత్తి చెంది శాశ్వత ఆనందాన్ని పొందుతాం. స్వస్థానం ఎవరికైనా హాయిని ఆనందాన్ని ఇస్తుంది గదా! కనుక అందరి గతి పరమాత్మ స్థానమే.

2. భర్త:- భర్త అంటే భరించేవాడు, పోషించేవాడు అని. ఈ సమస్త జీవుళ్ళకు కావలసిన ఆహారం, నీరు, గాలి, వెలుతురు అన్నింటిని ఇచ్చి పోషించేవాడు పరమాత్మే. అన్నీ మనమే సంపాదించుకుంటున్నాం గదా! అని అహంకారంతో అల్లల్లాడి పోతారు కొందరు. ఈ భూమిని ఎవరు వస్తూ తెచ్చారు? ఈ గాలిని, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి, సముద్రాలను, వర్షాలను, వృక్షాలను, కొండలను ఎవరు తెచ్చారు? ఇవన్నీ ఎవరి ఆస్తి? కనుకనే పరమాత్మ నిజమైన పోషకుడు. అలా పోషిస్తూ భరించేవాడు గనుక భర్త. భర్తవియోగం భార్య కెంత దుఃఖమో భగవంతుని వియోగం జీవులకు అలాగే దుఃఖప్రదం. భగవంతునికి దూరం కావటం వల్లనే ఈ సంసార తాపత్రయాలలో చిక్కుకొని, జననమరణ చక్రంలో చిక్కుకొని బాధలు పడుతున్నాం. ఆయన అన్నింటిని ఇచ్చి పోషించటమే కాదు తిన్న ఆహారాన్ని అరిగించేవాడు, చూచేశక్తిని, వినే శక్తిని,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రుచి చూచేశక్తిని, మాట్లాడే శక్తిని అన్నింటిని ఇచ్చేదీ ఆయనే. అందుకే ఆయన భర్త అన్నారు.

3.ప్రభుః- శాసించేవాడు. ఆయన శాసనాన్ని ధిక్కరించేశక్తి ఎవరికీ లేదు. కనుకనే దశరథుడు పుత్రశోకంతో మరణించాడు, దేవకీ వసుదేవులు కారాగార వాస శిక్షను అనుభవించారు. ఎంతటి వారైనా ఆయన శాసనానికి తలవంచాల్సిందే.

4.సాక్షి:- ఈ ప్రపంచంలో ఎక్కడ ఏమి జరిగినా, ఎవరి మనస్సులలో ఏమి ఆలోచనలు, సంకల్పాలు చేసినా, ఎవరు ఏ పాపపుణ్యాలు ఆచరించినా అన్నింటిని కేవలంగా - ఏ రాగద్వేషాలు లేకుండా - నిర్లిప్తంగా చూసే సాక్షి భగవంతుడు. ఆయన అందరిలో, అన్నింటిలో అంతర్యామిగా ఉండి సర్వాన్నీ రికార్డు చేస్తుంటాడు. చిత్రంగా గుప్తంగా ఉండి చిత్రంగా చూస్తుంటాడు. కనుక ఎవరూ చూడటం లేదు గదా! అని ఎలా బడితే అలా ప్రవర్తించరాదు.

5.నివాసః- ఈ జగత్తుకు, అందరి చరాచర జీవరాసులకు, అన్నింటికి నివాసం నేనే అంటున్నాడు పరమాత్మ. నిజంగా ఈ జగత్తంతా పరమాత్మలో ఒక భాగం. అంటే పరమాత్మ బొజ్జలోనే ఈ ప్రపంచం అంతా ఉన్నది. అంటే అందరికీ నివాసం పరమాత్మే. ఇదే విశ్వరూప సందర్శనయోగంలో చూపింది. ఇదే యశోదకు నోరు తెరిచి చూపింది. కనుక అందరి నివాసం పరమాత్మే అని గ్రహించాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

6.శరణం:- మన నివాసం పరమాత్మే గనుక మనం శరణు కోరవలసింది కూడా. ఆ పరమాత్మనే శరణన్న వారిని రక్షించటం ఆయన లక్షణం. ఈ ప్రాపంచిక వ్యక్తులను శరణుకోరితే వారితో పాటుగా నశించటమే. కనుక శాశ్వత ఆనందస్వరూపుడైన పరమాత్మనే శరణు కోరాలి. అన్ని విధాలా శరణు కోరాలి. సంపూర్ణంగా శరణాగతులం కావాలి. గజేంద్రునిలాగా, ప్రహ్లాదునిలాగా, ద్రౌపదిలాగా నీవే తప్ప నితః పరం బెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ కావవే ఈశ్వర సంరక్షించు భద్రాత్మకా! అని సంపూర్ణంగా శరణు కోరాలి.

7.సుహృత్:- ప్రతిఫలాన్ని కోరకుండా ఉపకారాన్ని చేసేవాడు సుహృత్. పరమాత్మ అట్టివాడే. మిత్రులు, బంధువులు ఎవరైనా చేసిన మేలుకు ప్రతిగానో, భవిష్యత్తులో ఉపయోగపడతారనో, కీర్తికోసమో ఉపకారం చేయవచ్చు.

కొందరు అదీ చేయరు. కానీ పరమాత్మ అలాకాదు. నిజంగా మనవల్ల పరమాత్మకు ఏం మేలు జరగాలి? ఏమీలేదు. ఆయన సర్వజ్ఞుడు, దయామయుడు గనుకనే శరణన్న వారిని రక్షిస్తాడు. కనుక సుహృత్. మనం ఎలాంటి వారమైనా, కోరినా - కోరకున్నా, సూర్యుని వెలుగును, చంద్రుని చల్లదనాన్ని, త్రాగేనీటిని, పీల్చేగాలిని, ఆధారమైన భూమిని, ఓషధులను, ఫలాలను, పుష్పాలను, ధాన్యాలను అన్నింటిని ఇచ్చే సుహృత్ పరమాత్మ.

8.ప్రభవః ప్రలయః స్థానం:- అలలు సముద్రంలోనే పుట్టి, కొంతసేపు ఉండి, చివరకు ఆ సముద్రంలోనే లయమౌతున్నాయి. అలాగే ఈ జగత్తు పరమాత్మలోనే పుట్టి, పరమాత్మలోనే స్థితి గలిగి ఉండి, చివరకు పరమాత్మలోనే లయమవుతున్నది. అంటే జగత్తు అలలాంటిదే. అంతేకాదు మనం పడుకొని

నిద్రపోతే కల వస్తున్నది. ఆ కల కొంతకాలం ఉంటున్నది. తరువాత కల అంతమైపోతున్నది. మరి ఈ కల ఎక్కడ పుడుతున్నది? మన మనస్సులోనే. అది ఎక్కడ ఉంటున్నది? మన మనస్సులోనే. మనస్సే దానిని పోషించి నిలుపుతున్నది. చివరకు మనస్సులోనే అంతమైపోతున్నది. అంటే స్వప్న ప్రపంచాన్ని మనస్సు సృష్టిస్తున్నది, పోషిస్తున్నది లయం చేస్తున్నది. అంటే ఆ స్వప్న ప్రపంచ పుట్టుక, స్థితి, లయం అన్నీ మనస్సులోనే. ఆ మనస్సంటున్నది, "నేనే స్వప్నం పుట్టుకను, నేనే స్వప్నం యొక్క స్థితిని, నేనే స్వప్నం యొక్క లయాన్ని అని. అలాగే ఈ జగత్తు యొక్క సృష్టి - స్థితి - లయాలన్నీ ఆ పరమాత్మే. అలా చూడాలి.

9.నిధానం:- సర్వజీవులకు భగవంతుడు నిధి లాంటివాడు. ప్రళయకాలంలో జీవుళ్ళంతా స్థూల దేహాలను వదలి, వారివారి కారణ శరీరాలతో (ప్రకృతితో) పరమాత్మలోనే లయమై ఉండిపోతారు. అందరి సమిష్టి వాసనలు ఆయనలో నిక్షిప్తం అయి ఉంటాయి. కనుక ఆయన నిధిలాంటి వాడు, store house లాంటివాడు.

10.అవ్యయబీజం:- భగవంతునిలో ప్రళయకాలంలో నిక్షిప్తం చేయబడిన store చేయబడిన కర్మఫలాలు, వాసనలు బీజరూపంలో ఉంటాయి. సృష్టి కాలంలో ఆ బీజం నుండే సర్వప్రాణులు వ్యక్తమవుతారు. మరి బీజం నశించిపోతుందా? లేదు. ఇది అలా నశించే బీజం కాదు. అది అవ్యయం. ఎందుకంటే ఎందరు ఆ బీజంలో నుండి వ్యక్తమైనా ఇంకా వ్యక్తం కాని కర్మఫలాలు, వాసనలు అనంతంగా ఉండిపోతాయి. పోయేవి పోతుంటే

వచ్చేవి వస్తుంటాయి. ఆ బీజం మాత్రం ఎప్పటికీ అలాగే ఉండిపోతుంది. అందుకే అది నాశరహితమైన బీజం. ఇలా జీవుళ్ళ కర్మఫలాలు, వాసనలతో కూడిన అవ్యయబీజాన్ని భగవంతునిగా దర్శించాలి.

ఈ శ్లోకంలో మొత్తం 10 విభూతులు చెప్పారు. మొత్తం 8+8+10=26.

- ఇంకా కొన్ని విభూతులను తరువాత శ్లోకంలో చెప్పబోతున్నారు.

**శ్లో||** తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృ జామిచ|
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున!|| **(19)**

**తా||** అర్జునా! ఎండకాయించేదీ, వర్షాన్ని నిలుపు చేసేదీ, కురిపించేదీ నేనే. అమృతాన్ని మరియు మృత్యువును అలాగే సత్తు, అసత్తులు కూడా నేనే.

**వ్యాఖ్య:-** ఈ జగత్తుకు, జగత్తులో జరిగే క్రియలకు కూడా ఆధారభూతుడను నేనేనని భగవానుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు. ఇక్కడ జరిగే సర్వమూ ఆయన వల్లనే అని తెలుస్తున్నది.

కరెంటు ఉండటం వల్లనే లైటు వెలుగుతున్నది, ఫ్యాన్ తిరుగుతున్నది. ఫ్రిజ్ చల్లబరుస్తుంది, హీటరు వేడినిస్తుంది. ఈ చర్యలకు కారణం కరెంటే. అలాగే.

1.అహంతపామి:- సూర్యుడు తన కిరణాలతో జగత్తును తపింపజేసి, జీవుళ్ళకు కావలసిన వేడిని, వెలుగును ప్రసాదిస్తున్నాడంటే దానికి కారణం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సూర్యునిలోని పరమాత్మ శక్తియే. సూర్యుని వెలుగు సూర్యునిది కాదు. నాదే అంటున్నాడు భగవానుడు -

2.వర్షం నిగృహ్ణామి, ఉత్సృజామి:- వర్షాన్ని నిలుపు చేసేదీ, కురిపించేదీ నేనే అంటున్నాడు భగవానుడు. సూర్యకిరణాల వేడికి సముద్రంలోని నీరు వేడెక్కి, ఆవిరై, మేఘాలుగా ఏర్పడుతుంది. ఆ మేఘాలను ఆకాశంలో ఎవరు నిలుపుతున్నారు? తిరిగి వర్షాకాలంలో ఎవరు వర్షంగా కురిపిస్తున్నారు? అది నేనే అంటున్నాడు భగవానుడు. వేసవి కాలంలో నీరు వేడెక్కి మేఘలుగా మారి అప్పుడే వర్షం కురిస్తే వేసవి దాటిన తర్వాత వర్షాలెలా కురుస్తాయి? అంటే వేసవిలో ఏర్పడిన మేఘాలు కొంతకాలం దాగి ఉండాలి. అలా ఉంచేది నేనే. తిరిగి కురిపించేదీ నేనే అని భగవానుడు తన విభూతిని తెలియజేస్తున్నాడు.

ఇక్కడ మరో విశేషం కూడా ఉన్నది. ఉప్పు నీటిని తీసుకొని మంచినీటిని ప్రపంచానికి ఇస్తున్నాడు పరమాత్మ. ఇదే పరమాత్మ మహిమ.

3.అమృతం, మృత్యుశ్చ ఏవ:- అమృతాన్ని, మృత్యువును నేనే. అమృతం అంటే మృతం లేనిది. మార్పులేనిది. అట్టి మార్పులు లేనిది ఆత్మయే - పరమాత్మయే. ఈ లోకంలో అన్నీ మార్పులు చెందేవే. మృతమే. కాని పరమాత్మ అమృతం.

నేను అమృతాన్ని అని చెప్పిన పరమాత్మ మృతం కూడా నేనే అంటున్నాడు. అంటే మృత్యువు, మృత్యుం జయుడు రెండూ తానేనన్న మాట.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మృత్యువు నా విభూతి అని 10వ అధ్యాయంలో కూడా చెప్పటం జరిగింది. మృత్యువు అంటే పనికిరాని పాతను వదిలించి ప్రపంచాన్ని ఎప్పటికప్పుడు నూతనత్వంతో కళకళ లాడించటమే. అది కూడా పరమాత్మ మహిమే. అసలు మృత్యువే లేకపోతే ఈ భూమి ఎలా ఉంటుంది? తరతరాల మనుషులు రోగాలతో, వృద్ధాప్యంతో తరువాతి తరాల వారిపై ఆధారపడి వారికి భారంగా బ్రతకాలి. ఇక ఇళ్ళు ఎలా ఉండాలి? ఒక్కొక్క చిన్నగ్రామం అంత ఇళ్ళుండాలి. వందల కొద్దీ వేలకొద్దీ మంచాలుండాలి. రోజూ బస్తాల కొద్దీ ఆహారధాన్యాలు కావాలి. ఇక తేళ్ళూ పాములూ, పురుగులూ, ఈగలు, దోమలు - వాటికి కూడా మృత్యువు లేదు గనుక అంతటా ముసురుకొని ఉంటాయి. వాటితో సహజీవనం సాగించాలి. పుట్టేవారికి చోటుండదు. మనిషి కదలటానికి చోటుండదు. ఒకడు సంపాదిస్తే వందలమంది తినాలి. అందుకే ఈ బాధలు లేకుండా మృత్యువు అనే లయస్థితిని భగవంతుడు ఏర్పాటు చేశాడు. లేకపోతే తిండి దొరకదు. గాలి, నీరు, స్థలం దొరకదు. ఈ దుర్భర జీవనం లేకుండా భగవంతుడు మృత్యువు ద్వారా మేలు చేస్తున్నాడు. కనుక మృత్యువు అమంగళం కాదు. మంగళమే. అందుకే ఎవరైనా చనిపోయినప్పుడు శివైక్యం అంటారు. శివ అంటే మంగళ స్వరూపం. కనుక అమృతం - మృత్యువు రెండూ భగవానుడే.

**4.సత్తూ, అసత్తు నేనే:-** సత్తు అసత్తు అనే పదాలకు అనేక అర్థాలు, కార్యము - కారణము అని, వ్యక్తము - అవ్యక్తము అని, స్థూలము - సూక్ష్మము అని, నశించేది - నశించనిది అని.

(i) పరమాత్మే జగత్తు రూపంలో కార్యంగా చైతన్యరూపంలో కారణం గాను,

(ii) పరమాత్మే జీవుళ్ళ రూపంలో వ్యక్తంగా, చైతన్య రూపంలో అవ్యక్తంగాను,

(iii) పరమాత్మే జగత్తు రూపంలో స్థూలంగా, చైతన్య రూపంలో సూక్ష్మంగాను,

(iv) పరమాత్మే దేహాల రూపంలో నశించేదిగా, ఆత్మరూపంలో నశించనిది గాను, ఉన్నది.

ఇలా సర్వత్రా భగవంతుని మహిమను, ఆయన వివిధ రూపాలను దర్శిస్తూ ఆయనతో సన్నిహితంగా ఉండి ఆయనతో ఐక్యతకు సాధన చేయుటయే జ్ఞానయజ్ఞం. దీనితో 30 విభూతులు చెప్పినట్లైనది. 8+8+10+4=30.

ఏకత్వోపాసన, పృధక్త్వోపాసన చెప్పి, చివరకు ఈ బహుధా ఉపాసనను - అంటే విశ్వరూపోపాసనను చెప్పి ఈ ప్రకరణాన్ని ముగిస్తున్నాడు.

- "సర్వ దేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" - ఏ దేవునికి నమస్కరించినా అది కేశవునికే చేరుతుంది. అంటే పరమాత్మకే చేరుతుంది. ఇది శాస్త్రవాక్యం. దీనిని అర్థం చేసుకోలేని వారు పరమాత్మ వేరు, దేవతలు వేరు అనే భేదదృష్టితో, ఫలాపేక్షతో అనేక పూజలు, యజ్ఞాలు చేస్తుంటారు. ఇలా అజ్ఞానంతో, ఫలాపేక్షతో కర్మలు చేసేవారికి ఎట్టి ఫలితం కలుగుతుందో వారి పరిస్థితి ఏమిటో రాబోయే 2 శ్లోకాల్లో తెలియజేయబోతున్నాడు భగవానుడు. నిందించినట్లు కనిపిస్తున్నా ఇది నిందకాదు. దయతో - ఆవేదనతో పసివారికి చెప్పటమే - శాస్త్రాలలోని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

విషయాలు తెలుసుకున్నవారు కూడా సుఖాలను భోగాలను ఆశించి, వేదాలలోని కర్మకాండలో చెప్పిన యజ్ఞ విధులను, పూజాదికాలను నిర్వర్తిస్తూ ఉంటారు. అట్టివారికి ఎలాంటి ఫలితం కలుగుతుందో రాబోయే 2 శ్లోకాల్లో తెలియజేస్తున్నారు.

**శ్లో||** త్రైవిద్యామాం సోమపాః పూతపాపాః యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే|
తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం అశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్|| **(20)**

**తా||** త్రివేదులు సోమపానంతో పవిత్రులై, నన్ను యజ్ఞాల ద్వారా పూజించి, స్వర్గ భోగాలను కోరుకుంటారు. వారు పుణ్యాలకు ఫలితంగా స్వర్గలోకాన్ని చేరుకొని, అక్కడ దివ్యమైన దేవభోగాలను అనుభవిస్తారు.

**వ్యాఖ్య:-** త్రైవిద్యా:- అంటే త్రివేదులు - 3 వేదాలను అభ్యసించిన వారు. వేదాలలో కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞానకాండ అని 3 విభాగాలున్నాయి. అందులో కర్మకాండలో యజ్ఞయాగాది విధులు ఎలా నిర్వర్తించాలో, దేనివల్ల ఎలాంటి ఫలితమో వివరంగా ఉన్నది. అది తెలుసుకున్న వారే త్రివేదులు. వారు నియమనిష్ఠలతో ఆయా యజ్ఞవిధులు నిర్వర్తిస్తారు.

సోమపాః:- యజ్ఞం పూర్తయిన తర్వాత సోమవల్లి అనే తీగ యొక్క రసంతో సోమపానం చేస్తారు. దానితో యజ్ఞం పూర్తయినట్లు.

సోమవల్లి అనే తీగ శుక్లపక్షంలో ఆకులు వేస్తుంది. కృష్ణపక్షంలో ఆకులు రాలుస్తుంది. దాని రసాన్ని తీసి కొంత హోమకుండంలో వేసి, మిగిలిన దాన్ని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

యజ్ఞం పూర్తికాగానే కర్త పానం చేస్తాడు. అలా సోమపానం చేసినవాడే సోమపాః

అలా ఎవరైతే సోమరసాన్ని త్రాగుతారో వారు పాపవిముక్తులౌతారు. అందుకే అతణ్ణి పూతపాపాః అంటారు. దానితో స్వర్గానికి ఆటంకం కలిగించే పాపాలు తొలగిపోతాయి. వారు యజ్ఞాలనెందుకు చేస్తారు?

స్వర్గతిం ప్రార్థయంతే:- స్వర్గభోగాలను కోరినవారై యజ్ఞాలు చేస్తారు. త్రయీవిద్యలు పఠించారు, సోమపానం చేశారు, సోమయాజులయ్యారు. అయితేనేం కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్టు గొప్పపనులు చేసీ అల్పఫలితాల కొరకే అర్రులు చాస్తున్నారు. అందుకే భగవానుడు వారిపై జాలిపడుతున్నాడు.

నిజంగా ఈ యజ్ఞాల ద్వారా మనం పూజించే దేవతలంతా ఆ పరమాత్మ స్వరూపులే. కాని మనకా భావన ఉండదు. దేవతలలో పరమాత్మ దృష్టిని ఉంచాలి. కాని మనం పరమాత్మలో దేవతా దృష్టినుంచుతాం. చేసే పని గొప్పదే ఐనా భావన అల్పం. అందుకే వచ్చే ఫలం కూడా అల్పమైనదే.

మనం ధర చెల్లించి అంగడిలో వస్తువులను కొంటాం. అలాగే యజ్ఞాలు చేసి స్వర్గంలో భోగాలను కొనుక్కుంటున్నాం. ఇక్కడ చెప్పిన సురేంద్రలోకం ఇంద్రుడున్న లోకం అనేకాదు, స్వర్గం మొదలు అన్ని దివ్యలోకాలు కూడా.

ఈ లోకాలన్నీ దేవలోకాలు; అంటే పుణ్యం చేసుకున్న వారు దానికి ప్రతిఫలంగా దేవజన్మలెత్తి అక్కడకు చేరుకుంటారు. అక్కడి భోగాలన్నీ దేవభోగాలు, ఈ భూలోకంలో ఉండే భోగాల లాంటివి కాదు. అవి దివ్యమైనవి.

ఇక్కడ స్వేచ్ఛగా భోగాలనుభవించటానికి వీల్లేదు. భయపడుతూ ఉండాలి. అక్కడ మాత్రం స్వేచ్ఛగా భోగాలనుభవించవచ్చు. ఎవరికీ భయపడనవసరం లేదు. ఇక్కడ భోగాలు అనుభవించిన తర్వాత రోగాలు సిద్ధంగా ఉంటాయి. అక్కడ ఎన్ని భోగాలనుభవించినా రోగాలు రావు. ఎందుకంటే వారివి సూక్ష్మ శరీరాలే గనుక. అమృతపానం, నందనవన విహారం, అప్సరసలతో సమాగమం - ఇలా ఒకటేమిటి? ఎన్నో భోగాలు - అలా ఎంత కాలమైనా అనుభవిస్తూ ఉండటమేనా? లేక పరిమితులున్నాయా?

నిజంగా అలా శాశ్వతంగా ఎల్లకాలం భోగాలనుభవిస్తూ ఉండటమే. ఐతే అందరూ ఇలా కోరికలతో, ఫలాసక్తితో కర్మలు చేయటమే మంచిది. ఎందుకంటే అంతకంటే ఎవరికైనా కావలసిందేముంటుంది? ఇంక ఎక్కడకు వెళ్ళినా ప్రయోజనమేముంటుంది? కాని అలా శాశ్వతంగా సుఖాలు అనుభవించే వీలులేదు. ఇక్కడ చేసిన పుణ్యం ఎంత ఉంటుందో ఖచ్చితంగా తూకం వేసి, దానికి తగినంత వరకే సుఖభోగాలు. అంటే కర్మలు అంతంతో కూడినవి, కర్మఫలాలు అంతంతో కూడినవి. భోగాలూ అంతంతో కూడినవే - మరి అంతంతో కూడిన ఈ భోగాలు అనుభవించిన తర్వాత ఏమవుతుంది?

- స్వర్గభోగాలు కోరి యజ్ఞాలు చేసినవారు అక్కడి భోగాలు అనుభవించిన తరువాత ఏం జరుగుతుంది?

**శ్లో||** తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి|
ఏవం త్రయీా ధర్మ మనుప్రపన్నాః గతాగతం కామకామా లభంతే|| **(21)**

**తా||** వారు ఆ విశాలమైన స్వర్గలోకంలో దివ్యభోగాలు అనుభవించి, చేసుకున్న పుణ్య కర్మఫలం ఖర్చై పోవటంతో ఈ భూలోకంలోకి ప్రవేశిస్తారు. ఈ ప్రకారంగా కామ్యఫలాలనిచ్చే వేదోక్త కర్మలను అనుష్టించే కామదాసులు రాకపోకలతో కూడిన జననమరణాలను పొందుతూ ఉంటారు.

**వ్యాఖ్య:-** ఈ లోకంలో యజ్ఞయాగాది పుణ్యకర్మలు ఆచరించినవారు స్వర్గాది దేవలోకాలకు వెళ్ళి అక్కడ చాలాకాలం దివ్యమైన దేవభోగాలను సూక్ష్మ శరీరంతో అనుభవిస్తారు. ఐతే అలా అనుభవిస్తూ అక్కడే ఉండిపోతే బాగానే ఉంటుంది. ఎందుకంటే అది విశాలమైన లోకం. ఈ లోకం అంతా ఇరుకు ఇరుకు. స్థలం తక్కువ. జనం ఎక్కువ. అన్నింటికీ పోటీ. అక్కడ ఇదేం ఉండదు. హాయిగా అందరూ కోరిన భోగాలను అనుభవిస్తూ ఉండవచ్చు. అమృతం త్రాగి ఎప్పుడూ యవ్వనంగా ఉండొచ్చు; నందనవన విహారం చెయ్యొచ్చు; అప్సరసలతో నాట్యం చెయ్యవచ్చు, సేవలు చేయించుకోవచ్చు; విమానాల్లో తిరగొచ్చు; కల్పతరువు దగ్గర కెళ్లి కావలసిన వాటిని అడిగి పొందవచ్చు. ఏ మర్యాదలకు లోపం జరిగినా ఇంద్రుడికి ఫోన్ కొట్టి రిపోర్ట్ చెయ్యవచ్చు. ఎంతో స్వేచ్ఛ. అందుకే విశాలం అన్నారు.

అయితే ఇలా ఎన్ని భోగాలు అనుభవించినా శాశ్వతం కాదు. మరి ఎప్పటి వరకు అనుభవించవచ్చు? ఆ తర్వాత ఎక్కడికి వెళ్ళాలి?

క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి:- మనం ఈ లోకంలో చేసుకున్న పుణ్యఫలం ఎంతవరకు ఉంటుందో అంతవరకే స్వర్గనివాసం. పుణ్యఫలం కాస్తా క్షయమై

పోయిందా! ఒక్కసారిగా ఈ భోగాలు, సుఖానుభవాలు అన్నీ కట్. మర్యాదలన్నీ మటు మాయం.

నీవు 10వేలు జేబులో వేసుకొని బొంబాయి వెళ్ళావు. లాడ్జిలో A/C రూమ్ తీసుకుంటావు. భోజనం, టిఫెను రూమ్ కే తెప్పించుకుంటావు. సాయంత్రం షికారుకు బీచ్ కు, జూకు, ఇంకా చూడదగిన ప్రదేశాలకు వెళ్తావు. పేకాట ఆడతావు. ఇంకా నీకు ఏ సరదాలున్నా తీర్చుకుంటావు. అయితే ఇలా ఎంతకాలం? నీ జేబులో డబ్బు ఖాళీ అయ్యేదాకా. తిరుగు ప్రయాణానికి మిగుల్చుకోలేదా టికెట్టు లేకుండా రైలెక్కాల్సిందే. లాడ్జి బోయ్ బైటకు నెట్టేస్తాడు.

ఇక్కడ కూడా అంతే. పుణ్యధనం నీ దగ్గర ఎంత ఉన్నదో అంతవరకే నీకు క్రొత్త అల్లుడి మర్యాదలు. ఆ పుణ్యధనం అయిపోయిందా! ఒక్క క్షణం కూడా నిన్ను ఉండనివ్వరు. కుక్కను తరిమినట్లు తరిమేస్తారు. ఇక్కడే నయం అడుక్కొని కడుపు నింపుకోవచ్చు. స్వర్గంలో అలాంటి దయాదాక్షిణ్యాలుండవు. ఇంతవరకు ఇంద్రుడివి, చంద్రుడివి అని పొగడినవారు కూడా ఛీ! పో! అని నెట్టేస్తారు. 'దూరపు కొండలు నునుపు' అన్నట్లు స్వర్గం అంటే "ఆహా! ఎంత మజాగా ఉంటుందో అని లొట్టలేసుకుంటాం. మన భ్రమను తొలగించటానికే భగవానుడు మేడిపండు పొట్ట విప్పి చూపుతున్నాడు.

దీనిని బట్టి పుణ్యకర్మలు చేసి స్వర్గఫలాలు కోరుకున్న వాడికి ఈ మర్యాదలు తప్పవు అని అర్థమవుతుంది. అయితే తరువాత ప్రయాణం ఎక్కడికి?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'మర్త్యలోకం విశంతి' - ఈ భూలోకంలోనికి రావలసిందే. పోనీ వచ్చినా ఏవైనా గొప్పజన్మలు వస్తాయా? భోగాలనుభవించే జన్మలు వస్తాయా? అదేం లేదు. అప్పటికి మన సంచిత కర్మల ఖాతాలో ఏకర్మలు అనుభవాలు పొందటానికి పక్వానికి వచ్చి ఉన్నాయో ఆ ప్రారబ్ధకర్మల ఫలితాలు అనుభవించటానికి తగిన జన్మలే వస్తాయి.

కనుక దేవలోకం నుండి దిగినవాడు సరాసరి కుక్కగానో, పందిగానో, గాడిదగానో పుట్టవచ్చు. లేదా మనిషిగాను పుట్టవచ్చు. మనిషిగా కూడా ఉత్తమభోగాలనుభవించే జన్మా రావచ్చు. లేదా నికృష్టమైన జన్మారావచ్చు. అబ్బే! నేను దేవలోకం వెళ్ళి వచ్చిన వాణ్ణండీ, - అక్కడ నాకు ఎంత గౌరవం ఇచ్చారు. అలాంటి నాకు పంది జన్మా? అని, తగవు లాడకూడదు. "దేవేంద్రుడికే పంది జన్మ వచ్చింది. నీవొక లెక్కా? నోరుమూసుకొని అనుభవించు"అని సమాధానం వస్తుంది.

ఒక కోటీశ్వరుడు పేకాట ఆడి, త్రాగి తందనాలాడి, దుర్వ్యసనాలతో ఆస్తినంతా హారతి కర్పూరం చేశాడు. ఇప్పుడు చేతిలో చిల్లి గవ్వలేదు. బాగా ఆకలిగా ఉండి హోటల్ కెళ్ళి దర్జాగా కూర్చొని, దోసె, పూరి, తిని కాఫీ త్రాగాడు. సర్వర్ బిల్లు తెచ్చి చేతిలో పెట్టాడు. 35/- బిల్లు. తన దగ్గర 5/- ఉన్నాయి. బిల్లు కట్టకుండా వెళుతుంటే క్యాషియరు పట్టుకున్నాడు. డబ్బులు లేవు, తరువాత ఇస్తానన్నాడు, ఘర్షణ జరిగింది. "అంట్లు తోమించ" మన్నాడు అయ్యరు. ఓయ్ అయ్యరూ! నేనెవరనుకున్నావు? పోయిన సంవత్సరం అయితే నిన్నూ, నీ హోటల్నీ కొనేవాణ్ణి, జాగ్రత్త! అన్నాడు. దానికా

అయ్యరు "నోరు మూసుకొని అంట్లు తోమరా అంట్ల వెధవ! అన్నాడు. అంతే మనగతి కూడా. పూర్వవైభవాన్ని తలచుకొంటే ప్రయోజనం లేదు. కనుక ఎన్ని భోగాలు అనుభవించినా చివరకు మర్త్యలోకమే గతి. చేసిన కర్మల ఫలాలు ఎంతటి వారైనా అనుభవించాల్సిందే.

ఇలా వేదోక్తమైన కర్మలను భోగాలపై ఆశతో, కోరికతో, కామ్యబుద్ధితో, చేసేవారినే కామదాసులు అంటారు. ఈ కామదాసులు గతాగతం లభంతే - రాకడ పోకడ కలిగిన జననమరణాలలో ఇరుక్కుపోతారు. మళ్ళీ మళ్ళీ పుడుతూ, మళ్ళీ మళ్ళీ చస్తూ ఈ లోకానికి వస్తూపోతూ ఉండాలి.

కనుక కామ్యబుద్ధితో ఎన్ని గొప్పకర్మలు చేసినా ప్రయోజనం లేదు. కనుక నిష్కామబుద్ధితో, భగవదార్పణబుద్ధితో కర్మలు చేసి కడతేరమని భగవంతుని సలహా. ఇదంతా తెలిసిన మహాత్ముడే గనుక అర్జునుడు "ముల్లోకరాజ్యాలు వచ్చినా నాకొద్దు" అంటూ భగవంతుని ముఖ్యశిష్యుడైనాడు. భగవద్గీతకు ముద్దుబిడ్డ అయ్యాడు.

సకామంగా కర్మలు చేసేవాణ్ణి అల్పాత్ముడుగా నిందిస్తున్నాడు భగవానుడు. అతణ్ణి కామదాసుడు అంటున్నాడు. నిష్కామంగా, ఫలాపేక్ష లేకుండా కర్మల నాచరించమని భగవంతుని ఆదేశం. అలా చేస్తే చిత్తశుద్ధి కలిగి, జ్ఞానం ద్వారా మోక్షం కలుగుతుంది; నిజమే. మరి ప్రస్తుత అవసరాల సంగతేమిటి? ఎప్పుడూ భగవంతుని చింతనే ఐతే కడుపునిండేదెట్లా? అవసరాలు తీరేది ఎట్లాగ? దీనికి సమాధానంగా అద్భుతమైన



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

హామీనిస్తున్నాడు భగవానుడు రాబోయే శ్లోకంలో. ఈ శ్లోకం భగవద్గీతలోనే మణిహారం మధ్య పచ్చలపతకం లాంటిది.

**శ్లో||** అనన్యాశ్చింత యంతో మాం యేజనాః పర్యుపాసతే|

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం|| **(22)**

**తా||** అనన్యమైన చిత్తంతో నన్ను చింతిస్తూ ఎవరు పరిపూర్ణంగా ఉపాసిస్తారో, నిత్యయుక్తులైన అట్టివారి యోగక్షేమాలను నేనే భరిస్తాను (వహిస్తాను).

**వ్యాఖ్య:-** భగవద్గీతలో ఇది కీలక శ్లోకం. గీత అనే పుష్పమాలలో మధ్యలో అలంకరించిన గులాబీపుష్పం వంటిది ఈ శ్లోకం. ఇందులో భగవానుడు సమస్త మానవులకు ఒక అద్భుతమైన హామీ ఇస్తున్నాడు. "ఎవరైతే అన్యమైన చింతనలను - ఆలోచనలను విడిచిపెట్టి; నిరంతరము, ఎడతెగకుండా నన్నే ధ్యానిస్తూ, నన్నే తలచుకుంటూ, నన్నే స్మరిస్తూ, నా పనులలోనే ఉంటారో అట్టి నిత్యయుక్తుల యోగక్షేమాలు నేనే చూస్తాను" - అని. దీనితో 'ఎల్లప్పుడూ దైవం - దైవం అని కూర్చుంటే కుటుంబ పోషణ ఎట్లా? తిండితిప్పలు ఎట్లా?' అని సందేహించే వారికి చక్కని జవాబు ఇచ్చినట్లైంది.

యోగక్షేమం అహం వహామి:- నీ యోగక్షేమాలు నేనే వహిస్తాను.

---

'యోగం' అంటే తనకు లేనిదానిని సంపాదించుకోవటం.

'క్షేమం' అంటే తనవద్ద ఉన్నది పోకుండా రక్షించుకోవటం.

ఈ లోకంలో ప్రతివ్యక్తీ తన సుఖం కోసం, సంతోషం కోసం, పోషణకోసం, భోగం కోసం, తృప్తి కోసం, గొప్పకోసం ఎప్పుడూ ఏదో ఒక

ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. కష్టపడి పనిచేస్తూనే ఉంటాడు. సంపాదిస్తూనే ఉంటాడు.

అలాగే తాను సంపాదించుకున్న ధనాన్ని, సంపదలను, వస్తువులను, ఆస్తిపాస్తులను, దాచుకుంటాడు, జాగ్రత్త చేసుకుంటాడు. ఇతరుల నుండి రక్షించుకొంటాడు. ఇది సాధారణంగా అందరూ చేసేదే.

అలాగాక నిరంతరం భగవంతునియందే మనస్సు నిల్పి, భగవత్కార్యాలలో తలమునకలైయుండే భక్తులు గాని, నిరంతరం జపధ్యానాది సాధనలతో ఉండే పూర్ణ భక్తులు గానీ ఎవరైతే ఉంటారో అట్టివారి యోగక్షేమాలను నేనే చూస్తాను అని భగవంతుడు హామీ ఇస్తున్నాడు. మీభారం అంతా నాపై వేయండి, నేను మోస్తాను అని భగవానుడు ఎంతో నమ్మకంగా నచ్చజెపుతున్నాడు.

మనం రెండు సూట్ కేసులు తీసుకొని తిరుపతికి ప్రయాణమయ్యాం. టికెట్టు కొనుక్కొని రైలెక్కాం. తీరా రైలెక్కిన తరువాత రెండు సూట్ కేసులు నెత్తిమీద పెట్టుకొని సీటు మీద కూర్చున్నాం. ఇప్పుడా రైలు అంటున్నది "నిన్నూ నీ సూట్ కేసులను మొయ్యటానికి నేనుండగా ఎందుకయ్యా పిచ్చివాడా! నీ నెత్తిన పెట్టుకొని మోస్తున్నావు" అని ఎగతాళి చేస్తున్నది.

ఆ రైలు ఎలా అడుగుతున్నదో భగవంతుడు కూడా మనను అడుగుతున్నాడు "నీ యోగక్షేమాలను చూచే వాణ్ణి నేనుండగా నీకెందుకయ్యా అనవసరంగా శ్రమ" - అని. "కాకపోతే నీవు 'భక్తి' అనే

టికెట్టు కొనుక్కో చాలు" అంటున్నాడు. ఇలాంటి హామీ ఎందుకిస్తున్నాడు భగవానుడు?

ఆ! ఎప్పుడూ భగవంతుణ్ణే చింతిస్తూ కూర్చుంటే దైనందిన జీవితం గడిచేదెట్లా? భార్యాబిడ్డల పోషణ ఎట్లా? అని అనేక అనుమానాలు. మనం ఊరికే కూర్చుంటే ఎలా? గాలిలో దీపం పెట్టి దేవుడా! నీవే దిక్కు అంటే ఆరిపోకుండా ఉంటుందా? మన ప్రయత్నం మనం చేయవద్దా? అంటారు. అందుకే భగవంతుడు ఇక్కడ స్పష్టం చేస్తున్నాడు. "అవన్నీ నేనే చూస్తాను. నీకు కావలసినవి సంపాదించుకోవటానికి ప్రయత్నం కూడా నేనే చేయిస్తాను - అని.

అయితే భగవంతుని నుండి ఇట్టి ప్రయోజనాన్ని పొందాలంటే మనకు కొన్ని అర్హతలుండాలి. ఏమిటవి?

(1) <u>అనన్యచింతన:-</u> భగవంతుని తప్ప ఏ ఇతర విషయాల గురించి చింతన చేయరాదు. నీ చిత్తం పూర్తిగ భగవంతుని యందే నిలపాలి. ఈ లోకంలోని భోగాలపై ఆసక్తితో నిరంతరం శ్రమించి ధనాన్ని సంపాదిస్తారు కొందరు. స్వర్గలోకంలోని దివ్యభోగాలనాశించి వేదాలలో చెప్పినట్లు యజ్ఞయాగాదులు ఆచరిస్తారు మరికొందరు. మొత్తం మీద ప్రాపంచిక భోగాల చింతన గాని, స్వర్గభోగాల చింతన గాని - ఏదైనా అన్యచింతనయే, వాటిని గూర్చిన చింతనలేకుండా కేవలం భగవంతుని గురించే చింతన చేయాలి. అంటే ఏం చేయాలి? స్తోత్రాలు, భజనలు, పూజలు, యజ్ఞాలు, జపధ్యానాలు, భగవత్తత్త్వాన్ని గురించి శాస్త్రాలలో చెప్పబడిన విషయాలను సద్గురువుల

ద్వారా శ్రవణం చేయటం - మననం చేయటం, ఆత్మవిచారణ - ఇలా నీ స్థాయిని బట్టి నీవు చింతన సాగించాలి.

ఇలా నిరంతర చింతన సాగాలంటే ప్రాపంచిక విషయాల మీద, వస్తువుల మీద, భోగాల మీద ఆసక్తి తగ్గాలి. వాటిలోని దోషాలను చూస్తుండాలి. అవి అనిత్యమైనవని, తాత్కాలిక సుఖాలనిచ్చినా చివరకు దుఃఖసముద్రంలో ముంచివేస్తాయని గ్రహించి వాటిపై వైముఖ్యం, వైరాగ్యం కలిగిఉండాలి. లేకపోతే అనన్య చింతన - అనన్యభక్తి కుదరదు.

అలాగాక ప్రాపంచిక సుఖభోగాలను వదలలేక, పరమాత్మయందు అనన్యభక్తి కుదరాలి అంటే కుదరదు గాక కుదరదు.

ఒక దొరగారు వంటవాణ్ణి పిలిచి "మన కోడిపెట్టను సగం కోసి కూరచేసి పెట్టు. మిగతా సగం గ్రుడ్లు పెట్టటానికి ఉండనీ" అన్నాడట. దానికా వంటవాడు "దేవరా! కూరాకావాలి, గ్రుడ్లూ కావాలి అంటే ఎలా? తిండి మీద ఆశ ఉంటే గ్రుడ్ల మీద ఆశ వదులుకోండి. గ్రుడ్ల మీద ఆశ ఉంటే తిండి మీద ఆశ వదులుకోండి. రెంటి మీద ఆశ ఉంటే కుదరదు. అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే ఎలా దొరా?" అన్నాడట. కనుక ప్రాపంచిక భోగాలపై ఆశ ఉన్నదా? పరమాత్మను వదులుకోవాలి.పరమాత్మనందుకోవటమే ముఖ్యమనుకున్నావా? ప్రాపంచిక భోగాలపై విరక్తి కలగాలి. అలా విరక్తి కలిగినవాడే అనన్యచిత్తంతో పరమాత్మను ఉపాసించగలుగుతాడు.

మరైతే ఉన్న సంపదలను వదిలేయాలా? అవసరం లేదు. వాటిని వదలవద్దు. వాటిపై ఉన్న ఆసక్తిని, అనురాగాన్ని వదిలెయ్ అంతే.

ప్రారబ్ధవశాత్తూ నీకు సంపదలు ప్రోగుపడవచ్చు. వాటి నుండి నీవు తొలగిపోనక్కరలేదు. నీ మనసులో నుండి వాటిని తొలగించుకో అంతే.

పడవ నీటిలో ఉండవచ్చు. నీరు పడవలో ఉండరాదు. అలాగే నీవు భోగాలలో ఉండవచ్చు. కాని నీలో భోగాలు ఉండరాదు. పసివాడు తల్లిని నమ్ముకొని ఉన్నట్లు, పిల్లికూన తల్లిపై ఆధారపడినట్లు, విశ్వాన్ని రక్షించే విశ్వనాథునిపై విశ్వాసం ఉంచినవాడే భక్తుడు. పతివ్రతకు భర్తయందే అనురాగం ఉన్నట్లు అనన్యభక్తునికి పరమాత్మ యందే చిత్తం నిలవాలి.

ఇలా దైవాన్ని తప్ప ఇతరత్రా దేనినీ చింతన చేయనివారి యోగ క్షేమాలనే భగవంతుడు స్వయంగా చూస్తాడు. బిడ్డలకు ఏది అవసరమో తెలుసుకొని తల్లి ఎలా చూస్తుందో, అలాగే భక్తులకు ఎప్పుడెప్పుడు ఏది అవసరమో చూచుకొని కాపాడేవా డే భగవంతుడు.

కోడలు పూర్ణ గర్భవతి ఐతే చాలు అత్త ఆమెను కూర్చోబెట్టి పని చేస్తుంది. ఆమెను ఏ పనీ చేయనివ్వదు. ఆమెకు ఏమేమి ఇష్టమో తెలుసుకొని అన్నీ చేసి పెడుతుంది, తినిపిస్తుంది, ప్రేమగా ఆదరంగా చూస్తుంది. గర్భవతి కాకుండా ఉన్నప్పుడు ఇంటిపని అంతా కోడలే చేయాలి. అలాగే భక్తుడు కానివాడు తన పనులు తానే చూసుకోవాలి. తన యోగక్షేమాల గురించి తానే పట్టించుకోవాలి. అదే అతడు పూర్ణభక్తుడైతే ఇక ఆ భగవంతుడే అతడి యోగక్షేమాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ స్వయంగా నిర్వహిస్తాడు.

ఐతే ఈ విషయంలో సంపూర్ణ విశ్వాసం ఉండాలి. సంశయాత్ముడైన వాడు తన బాధ తానే పడతాడు. "నేను భక్తితో భగవంతుని భజిస్తే నా

యోగక్షేమాలు నిజంగా చూస్తాడా? ఆయనకు నాలాంటి వారెందరో ఉంటారు గదా! అందరినీ పట్టించుకుంటాడా? లేక నా భక్తి అంత గొప్పది గాదని వదిలేస్తాడా?"- ఇలా సందేహిస్తూ ఉంటే అది పూర్ణ భక్తి కాదు, అనన్యభక్తి కాదు. ఏమైనా కానీ పాలముంచినా నీట ముంచినా నీదే భారం అని పూర్తిగా భారాన్ని భగవంతునిపై వేయాలి. ఇది మొదటి అర్హత -

2.పర్యుపాసతే:- మనం ఈ అనన్యభక్తిని - ఇతర విషయాలపైకి పోకుండా పరమాత్మపైనే నిలిపే భక్తిని ఏదో కొద్దిసేపు చేసి వదిలెయ్యటం కాదు, నిరంతరం చెయ్యాలి. ఎప్పుడో కొద్దిసేపు చేసే భక్తి ఉపాసన అవుతుందే గాని పర్యుపాసన గాదు. ప్రతిరోజూ ఉదయం కొద్దిసేపు పూజ చేసినట్లో, జపం చేసినట్లో, నామస్మరణ చేసినట్లో చేయటం ఉపాసన. సర్వకాల సర్వావస్థలలోను, నిరంతరం - మనం ఏపని చేసున్నా, ఏం మాట్లాడుతున్నా చిత్తం మాత్రం పరమాత్మలోనే ఉంటే అది పర్యుపాసన.

అయస్కాంతానికి అంటుకున్న సూదిలాగా -

సముద్రం వైపుకు పరుగెత్తే నదులలాగా -

భక్తుని చిత్తం పరమాత్మనే అంటిపెట్టుకొని ఉండాలి. అలా అనన్యచిత్తంతో నిరంతరము పరమాత్మను ఉపాసించే అట్టి భక్తునికి మరొక బిరుదు ఉంది. అదే నిత్యయుక్తుడు - నిత్యాభియుక్తుడు. నిత్యము, నిరంతరము పరమాత్మ యందే నిష్టగల వాడు అని భావం.

పండరిపురంలో ఒక గొప్ప భక్తుడున్నాడు. అతడికి ఈ శ్లోకం అంటే ఎంతో అభిమానం, ఎంతో విశ్వాసం, నిరంతరం ఈ శ్లోకాన్ని జపిస్తూ

ఉండేవాడు. అతడు లౌకిక విషయాలలో కూడా భగవంతుని పైనే పూర్తిగా ఆధారపడి ఆయన ఇచ్ఛ ప్రకారమే జీవితాన్ని కొనసాగిస్తున్నాడు. అతడు పేదరికంతో ఉన్నా, అన్నీ భగవంతుడే చూసుకుంటాడు అనే నమ్మకంతో ఉన్నాడు. అలాగే అతడి భుక్తి పరమాత్మ అనుగ్రహంతో జరిగిపోతున్నది. ఇలా ఉండగా ఒక రోజున భగవంతుడు ఈ భక్తుని పరీక్షించాలనుకున్నాడు.

ఆ రోజు ఇంటిలో బియ్యం లేవు. ప్రతిరోజూ లాగే ఏదో విధంగా భగవంతుడే అందజేస్తాడని భార్యాభర్తలు నిశ్చింతగా ఉన్నారు. మధ్యాహ్నం దాటింది. ఇక భార్య భర్తతో అన్నది, "అలా వీధిలోకి వెళ్ళి కొద్దిగా ప్రయత్నం చెయ్యండి. మన ప్రయత్నం మనం చేయకపోతే భగవంతుడు ఎలా సహాయపడతాడండీ!" అన్నది. ఐనా ఆయన భగవంతునిపై విశ్వాసంతో అలాగే ఉండిపోయాడు. కానీ ఏమీ ప్రయోజనం కలగలేదు. దానితో భార్య మళ్ళీ భర్తను హెచ్చరించింది. ఏమి చేయటానికీ తోచలేదు. క్రమంగా ఈ శ్లోకంపై విశ్వాసం సన్నగిల్లి పోయింది. సందేహం కలిగింది. కష్టం కలిగేటప్పటికి సందేహం కలిగింది.

జ్ఞానాన్ని, భక్తిని ఒరిచి చూచే గీటురాళ్ళే కష్టాలు - దుఃఖాలు.

- గీటురాయి మీద గీత వేసి చూస్తే గాని బంగారం నాణ్యత తెలియదు.
- కష్టాలనే గీటురాయిపై ఒరిచి చూస్తేగాని భక్తుని భక్తి ఎట్టిదో తెలియదు.

కష్టాలు కలిగినప్పుడు పొట్టులాగా, తోలులాగా ఎగిరిపోకుండా నిలిచేదే నిజమైన భక్తి. కష్టాలు కలగ్గానే భక్తి ఎగిరిపోతే అతడు నిజమైన భక్తుడు కాదు. మన భక్తుడు అలాగే పప్పులో కాలేశాడు అంతే.

భగవద్గీత వంటి పవిత్రగ్రంధంలో ఈ అబద్ధపు వాక్యం ఎందుకుండాలి? అనుకొని ఒక ముల్లు తీసుకొని తాటియాకుపై నున్న ఈ శ్లోకంపై గీత వేశాడు. వెంటనే బజారుకు వెళ్ళి ఒక మిత్రుని అర్థించాడు. ఐతే అతడు బయటకు వెళ్ళగానే ఒక పిల్లవాడు మూట నెత్తిన పెట్టుకొని పరుగు పరుగున వచ్చి, అమ్మా! అయ్యగారు పంపారు అని మూటను అప్పగించాడు. వాడి వీపు మీద పెద్ద వాత ఉన్నది. "నాయనా! ఏమిటూ వాత?" అని అడిగిందా ఇల్లాలు. దానికా బాలుడు, "అమ్మా నేను రావటంలో ఆలస్యమైంది అందువల్ల అయ్యగారు వాత బెట్టారు" అన్నాడు.

అంతలో మూట నెత్తిన పెట్టుకొని భక్తుడు వచ్చాడు. విషయం తెలుసుకున్నాడు, అతడి ఆవేదనకు అంతులేదు. భగవంతుని దర్శనానికి నోచుకున్న భార్య అదృష్టానికి మెచ్చుకున్నాడు. తన మూర్ఖత్వానికి తనను తాను తిట్టుకున్నాడు. ఆ శ్లోకంపై గీత వెయ్యటమంటే భగవంతుని శరీరం పై వాత పెట్టటమే. దీనిని బట్టి భగవద్గీతను న్యూస్ పేపర్ లా గిరాటు వెయ్యటం, ఎడమ చేత్తో తీసుకోవటం, ఇవ్వటం లాంటి అనాచారం పనులు చేయరాదు. వాటివల్ల సాధకుడు భ్రష్టుడైపోతాడు.

ఈ శ్లోకంలో మరొక ముఖ్యవిశేషం ఉంది. ఈ శ్లోకంలో మొదటి అక్షరం - 'అ'. చివరి అక్షరం - 'హం' రెండూ కలిపితే అహం. అంటే నేను. అంటే ఈ శ్లోకరూపంలో ఉన్నది నేనే అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.

"విశ్వాసః ఫలదాయకః" = విశ్వాసం ఉంటే ఫలితం ఖాయం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కనుక ఈ సంసారమనే సముద్రంలో పడ్డ మనం ఈ దుఃఖాల నుండి, బాధల నుండి తప్పించుకోవాలంటే పరమాత్మను సంపూర్ణ శరణాగతి కోరాలి. అనన్యచిత్తంతో ఆశ్రయించాలి. నిరంతరం పరమాత్మ ఉపాసన చేయాలి. అర్జునుడు అలాగే పూర్తి శరణాగతుడయ్యాడు. శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నం అని భగవానుని పాదాల నాశ్రయించాడు. భగవానుడు కంటికి రెప్పలా కాపాడాడు. మహాభారత యుద్ధం 14వ రోజున సైంధవుని వధించటంలోను, అతడి తలను అతని తండ్రి ఒడిలో పడవేయించటం లోనూ సహాయం చేసి అర్జునుని ప్రతిజ్ఞను నెరవేర్చాడు.

కనుక మనం ప్రాపంచిక సంపదలు, భోగాలపైన ఆశవదలి, ఆసక్తిని వదలి వాటిని అనుభవిస్తూనే మత్తెక్కకుండా అనన్యభక్తితో భగవంతుని ఆరాధిస్తూ జీవించాలి.

టంకశాలలో కొందరు బంగారు నాణేలు, కొందరు వెండినాణేలు, మరి కొందరు రాగినాణేలు తయారుచేస్తారు. కాని ఎవరూ ఒక్క నాణేన్ని కూడా తమతో తీసుకెళ్ళే వీలులేదు. లోపలికి వచ్చేటప్పుడు, బయటకు వెళ్ళేటప్పుడు అందరినీ తనిఖీ చేస్తారు గార్డులు. కనుక సాయంత్రం అయ్యేటప్పటికి అన్నింటిని వదలి వట్టి చేతులతో బయటకు రావాలి.

అలాగే ఈ ప్రపంచం ఒక టంకశాల లాంటిదే. ఇందులో కోటేశ్వరులు బంగారు వస్తువులను, మధ్య తరగతి వారు వెండి వస్తువులను, పేదలు రాగి, ఇత్తడి, సత్తు, మట్టి వస్తువులను కలిగిఉంటారు. అయితే చనిపోయిన తర్వాత ఎవరైనా సరే తాము సంపాదించిన బంగారం, వెండి, రాగి, ఇత్తడి, మట్టి, -

వేటినైనా సరే ఇక్కడే వదిలి; ఎలా వచ్చారో అలా వెళ్ళి పోవాల్సిందే. ఒక్క వస్తువును కూడా తీసుకెళ్ళే వీలులేదు. చివరకు తమ దేహాన్ని కూడా వదిలి వెళ్ళాల్సిందే. కనుక ప్రాపంచిక వస్తువులపై మోహాన్ని విడిచిపెట్టి, లభించిన దానితో తృప్తి చెందుతూ, నిరంతరము పరమాత్మపై మాత్రమే మనస్సు నుంచి, పరమాత్మనే సంపూర్ణంగా శరణు వేడి, ఆయనపై విశ్వాసంతో అనన్యచిత్తంతో పర్యుపాసన చేయాలి. ఇదే మానవుల పరమపవిత్ర కర్తవ్యం.

- పరమాత్మను అనన్యభక్తితో నిరంతరము సేవిస్తే వారి యోగక్షేమాలు నేనే చూస్తానని భగవానుడు హామీ ఇచ్చాడు. అలా పరమాత్మను గాక అన్యదేవతలను ఆరాధిస్తే? -

**శ్లో||** యేప్యన్య దేవతా భక్తాః యజంతే శ్రద్ధయాఽన్వితాః|
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్య విధి పూర్వకం|| **(23)**

**తా||** కౌంతేయా! అన్యదేవతల భక్తులైనా సరే ఎవరైతే శ్రద్ధతో కూడిన వారై ఆరాధిస్తారో వారు కూడా అస్తవ్యస్తంగానైనా నన్నే ఆరాధించిన వారౌతున్నారు.

**వ్యాఖ్య:-** పరమాత్మ ఎవరు? అన్యదేవతలు ఎవరు? శ్రీకృష్ణుడు తప్ప మిగిలిన వారు అన్యదేవతలా? కాదు కాదు.

లోకంలో అనేకమంది అనేక రూపాలలో ఉన్న దేవతలను పూజిస్తారు. అయితే ఏ రూపంలో ఉన్న దేవతలైనా అందరూ పరమాత్మ ప్రతీకలే. ఏ రూపాన్ని పూజించినా ఈ రూపం పరమాత్మే అనే భావనతో చేసే పూజ

పరమాత్మ పూజ అవుతుంది. అలాగాక ఈ రూపాలన్నింటిని భేదదృష్టితో చేస్తూ, ఏవేవో కోరికలతో, అవసరాల కోసం, సుఖభోగాల కోసం ఆరాధిస్తే అది అన్యదేవతా పూజ అవుతుంది. అంటే నీవు పెట్టుకున్న విగ్రహం - రూపం ప్రధానం కాదు, దానిని పరమాత్మగా భావిస్తున్నావా? కోరికలు తీర్చే దేవతగా భావిస్తున్నావా? అన్నదే ప్రధానం.

ఏ దేవతను, ఏ రూపాన్ని నీవు ఆరాధించినా శ్రద్ధతో ఆరాధించాలి. అలా శ్రద్ధతో ఆరాధిస్తే అస్తవ్యస్తంగానైనా పరమాత్మను ఆరాధించినట్లే అవుతుంది. పరమాత్మ ఒక్కడేనని, ఆయనకు ఏ రూపమూ లేదని, ఆయన సర్వత్రా వ్యాపించి యున్నాడని, సర్వాంతర్యామియని, ఆయన తప్ప రెండవదేదీ లేదని తెలియనివారు; శాస్త్రజ్ఞానం లేనివారు భేదదృష్టితో, భిన్నదృష్టితో, సుఖాపేక్షతో, అజ్ఞానంతో తమ ఇష్టదైవాన్ని పూజిస్తారు. వీరు ఆయా రూపాలను శ్రద్ధగా పూజిస్తే అది అవిధిపూర్వకమైన నా పూజగానే గ్రహిస్తాను అంటున్నాడు పరమాత్మ. అన్ని రూపాలలో కూర్చొని పూజలను అందుకోనేది నేనే అయినా వారి భావన నా మీద లేదు గనుక వారు అన్యదేవతా భక్తులవుతున్నారు.

రామకృష్ణ పరమహంస దగ్గరకు ఒక వితంతు స్త్రీ వచ్చింది. తన జన్మ తరించటానికి ఏదైనా ఒక మార్గం చెప్పమంది. ఆయన ఒక మంత్రాన్ని ఉపదేశించి, "ఈ మంత్ర మూర్తియైన భగవంతుని ఈ రూపంతో - ఈ విధంగా భ్రూమధ్యంలో నిలుపుకొని జపించు" అని చెప్పి పంపించాడు. ఆమె ఇంటికి వచ్చి జపసాధన ప్రారంభించింది. ఆమెకు ఒక్కడే కుమారుడు. అల్లారు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ముద్దుగా పెంచుకున్నది. వాడిపైనే ఆమె పంచప్రాణాలు. ఆమె జపానికి కూర్చుంటే భ్రూమధ్యంలో కనిపించేది దేవతామూర్తి కాదు. ఆమె పుత్రుని రూపమే. మార్చుకోవాలని ఎంత ప్రయత్నించినా సాధ్యం కావటం లేదు. దుఃఖంతో ఆవేదనతో పరమహంస వద్దకు వచ్చి, "స్వామీ! కళ్ళు మూసుకొని కూర్చుంటే నా కొడుకు రూపమే కనిపిస్తున్నది. దేవుని రూపం కనిపించటం లేదు" అని విలపించింది. దానికాయన, "అమ్మా! భయపడవద్దు. ఆ దేవుడే నీ కుమారుని రూపంలో దర్శనమిస్తున్నాడని భావించుకో. దేవునికి ఒక్కటే రూపం కాదు గదా! అన్ని రూపాలు ఆయనవే. రూపాన్ని మార్చనక్కరలేదు. భావాన్ని మార్చుకో" అన్నాడు.

కనుక ఏ రూపంలో పూజించినా నీ భావం ప్రధానం. మనస్సు ప్రధానం. నేను పూజించేది పరమాత్మనే అనే భావం ఉంటే అది పరమాత్మోపాసన; నేను పూజించేది ఫలానా రూపాన్ని, ఫలానా దేవతను అనే భావన ఉంటే అది అన్యదేవతోపాసన అవుతుంది.

ఇట్టి అన్యదేవతోపాసననైనా శ్రద్ధతో చేస్తే పరమాత్మనుపాసించినట్లే. కాకపోతే క్రమపద్ధతి కాదు. అక్రమపద్ధతి. డొంక తిరుగుడు మార్గం. వీరు తాత్కాలిక ఫలితాలు పొందగలుగుతారే గాని శాశ్వత ఆనందప్రదమైన మోక్షాన్ని పొందలేరు.

కనుక ఏ రూపాన్ని పూజించినా అన్నింటిలో పరమాత్మనే దర్శించాలి. పరమాత్మ భావనయే చేయాలి. రూపం ప్రధానం కాదు, భావన ప్రధానం.

- ఇలా అవిధిపూర్వక ఉపాసనలవల్ల కలిగే ఫలితం ఏమిటి? -

**శ్లో|| అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ|**

**నతుమాం అభిజానంతి తత్త్వే నాతశ్చ్య వంతితే|| (24)**

**తా|| నేనే అన్ని యజ్ఞాలకు భోక్తను, అధిపతిని. అయితే వారు నన్ను తెలుసుకో నందున అసలు తత్త్వం నుండి దిగజారిపోతున్నారు.**

**వ్యాఖ్య:- వేదాలలోని కర్మకాండ యజ్ఞయాగాదుల ద్వారా భగవంతుని ఆరాధన గూర్చి చెబుతున్నది. పురాణాలలో పూజల ద్వారా భగవంతుని ఆరాధించటం ఎలాగో చెప్పబడి యున్నది. యజ్ఞాల ద్వారా ఆరాధించినా, పూజల ద్వారా ఆరాధించినా భగవంతుని యదార్థతత్త్వం తెలుసుకొని ఆరాధించాలి. ఏ రకమైన యజ్ఞం చేసినా, ఏ రకమైన పూజ చేసినా ఫలభోక్త మాత్రం భగవంతుడే. ఎక్కడ యజ్ఞం చేసినా, ఏ దేవతలకు ఆహూతుల నర్పించినా చివరకు అవి చేరేది ఒకే ఒక్కటైన పరమాత్మనే. దేవతలంతా భగవంతుని ముఖాలే. ఏ దేవతకు ఆహూతులందించినా, నైవేద్యాలు సమర్పించినా అవి అన్నీ చివరకు చేరేది పరమాత్మనే. ముఖాలు వేరైనా తినే వాడొక్కడే.**

**ఒకచోట గీతాపారాయణం పూర్తయి భోజనాలు జరుగుతున్నాయి. ఎంతమంది భోజనాలు చేస్తున్నారో చూడమని ఇంటియజమాని ఒకనిని పంపాడు. అతడు చాలా సేపైనా తిరిగిరాలేదు. లెక్కల్లో తేడా వస్తున్నట్లయింది. అటు నుంచి ఇటు, ఇటు నుంచి అటు లెక్కలు వేస్తున్నాడు. చూసి, చూసి యజమాని ఇంకొకరిని పంపాడు. అతడు వెంటనే తిరిగి వచ్చి భోజనం చేస్తున్నది ఒక్కడే అన్నాడు. ఇంతలో మొదటి వాడొచ్చి 278**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మంది అన్నాడు. 'ఏమయ్యా! ఒక్కడే అంటావేమిటి?" అని యజమాని మొదటి వానినడిగాడు.

"బాబయ్యా! వైశ్వానర పరమాత్మ ఒక్కడే కదా! ఏ రూపంలోని వారు భోజనం చేసినా అది చేరేది వైశ్వానర రూప పరమాత్మకే గదా! ఇప్పుడే గదా! "అహం వైశ్వానరో భూత్వాప్రాణినాం దేహమాశ్రితః ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం" అని శ్లోకం చదివింది. ఏ జీవి భుజించినా అది అంతా చేరేది ఒక్క పరమాత్మకే గదా!" అన్నాడు.

కనుక భగవంతుడే అన్ని యజ్ఞాలకు, పూజలకు భోక్త, ఫలదాత, ప్రభువు. ఈ జ్ఞానం లేకుండా చేసే పూజలు, యజ్ఞాలు అవిధిపూర్వకం. ఇలా అవిధిపూర్వక యజ్ఞాలు చేస్తే అట్టివారికి పునరావృత్తి తప్పదు. ఎక్కడకు వెళ్ళినా, ఎన్ని భోగాలనుభవించినా జారిపడవలసిందే. ఈ మర్త్యలోకానికి తిరిగి రావలసిందే. కనుక పరమాత్మ యొక్క యదార్థతత్త్వం తెలుసుకోవాలి. ఊరికే తెలుసుకోవటం కాదు, ఆచరణలో కూడా తెలిసి ఉండాలి.

భాగవతంలో ఒక కథ ఉంది. బాలగోపాలుడు గోపబాలురతో కలసి అడవిలో గోవులను మేపుతున్నాడు. స్నేహితులకు ఆకలి వేసింది. వారంతా శ్రీకృష్ణుని చేరి ఆకలిగా ఉన్నదని చెప్పారు. అప్పుడు కన్నయ్య "అదిగో మునిపల్లె. అక్కడ ఏదో యజ్ఞం జరుగుతున్నట్లుంది. వెళ్ళి ఆ బ్రాహ్మణులను అడగండి, "శ్రీకృష్ణునికి ఆకలిగా ఉందట, అన్నం పెట్టండి" - అని చెప్పి పంపాడు. వారు వెళ్ళి అడిగారు. మా కృష్ణునికి ఆకలిగా ఉందట. అన్నం పెట్టండి అని దీనంగా నిలబడ్డారు. ఆ మాటలు విని బ్రాహ్మణులు, "పొండి, పొండి.

యజ్ఞకార్యం ఇంకా పూర్తికాలేదు. నైవేద్యాలు పెట్టలేదు. వీలులేదు వెళ్ళండి!" అని కసిరారు. పాపం వాళ్ళు చేసేది లేక వెనుదిరిగారు.

రాతి పాముకు పాలు పోస్తారు. ప్రదక్షిణం చేస్తారు. దణ్ణం పెడతారు. నిజమైన పాము వస్తే కర్ర తీసుకుంటారు. చచ్చేదాకా వదిలిపెట్టరు.

తినని దేవుడికి నేతితో జీడిపప్పు వేసి పొంగలి చేసి పెడతారు. తినే జీవుడికి కాస్త అన్నం ముద్ద వెయ్యాలన్నా కష్టమే.

అంత గొప్పగా యజ్ఞం చేస్తున్నారు బ్రాహ్మణులు. తాము ఇచ్చే ఆహూతులను భగవంతునికి అర్పించి పుణ్యం సంపాదించాలని వారి భావన. స్వయంగా భగవంతుడే అనుగ్రహించినా గ్రహించే తెలివి లేకపోయింది వారికి. మాధవునిలో మానవదృష్టి వారిది. కృష్ణుడు సామాన్య మానవుడని వారి భావన. కనుక ఎన్ని యజ్ఞాలు చేసినా ఫలితం లేకుండా పోతున్నది.

మానవునిలో మాధవదృష్టి ఉండాలి. అప్పుడే ఉద్ధరించబడేది. మాధవునిలో మానవదృష్టి ఉంటే అంతా వ్యర్థమే.

కనుక భగవంతుని యొక్క యదార్థతత్త్వాన్ని తెలుసుకొని, ఆయన సూక్ష్మాతి సూక్ష్మమని, సర్వ వ్యాపియని, సర్వాంతర్యామియని, ఏకము - అద్వయము అని, రూపం లేనివాడని, అయినా అన్ని రూపాలలో ఉన్నది ఆయనేనని, సకల యజ్ఞాలకు ఫలభోక్త, సకల కర్మఫలప్రదాత ఆయనేనని తెలుసుకొని ఆరాధించేవాడు ముక్తినందుకుంటాడు. దీనిని తెలుసుకోకుండా రూపంలోనే బుద్ధినుంచిన వాడు భ్రష్టుడై పోతాడు, ఉన్నత స్థితిని అందుకోలేక చ్యుతుడౌతాడు.

- ఈ అన్యదేవతల భక్తులకు కలిగే ఫలమేమి? భగవంతుని భక్తులకు కలిగే ఫలమేమి?

**శ్లో||** యాంతి దేవవ్రతా దేవాన్ పితృన్ యాంతి పితృవ్రతాః|

భూతాని యాంతి భూతేజ్యాః యాంతి మద్యా జినోఽపిమాం|| **(25)**

**తా||** దేవతలను ఆరాధించే వాళ్ళు దేవతలను చేరుకుంటారు. పితరులను సేవించేవారు పితరులను చేరుకుంటారు. భూతాలను పూజించే వారు భూతాలను చేరుకుంటారు. నన్ను ఆరాధించేవారు మాత్రం నన్నే చేరుకుంటారు.

**వ్యాఖ్య:-** పరమాత్మకు ఉపాధి లేదు. ఆకారం లేదు. గుణాలు లేవు. జన్మలేదు, మరణం లేదు. అది సూక్ష్మాతి సూక్ష్మమై సర్వత్రా వ్యాపించియున్న చైతన్యం. అది నిత్యం, జ్ఞానం, ఆనందప్రదం. అట్టి పరమాత్మ 3 గుణాలను ఆశ్రయించి ఉండాలి. దేహమనోబుద్ధులనే ఉపాధులనాశ్రయించి జీవుడయ్యాడు. ఈ జీవుడు తిరిగి తన స్వస్వరూపమైన పరమాత్మగా ఉండిపోవాలంటే దేహమనోబుద్ధుల తాదాత్మ్యం పోవాలి. 3 గుణాలు తొలగి గుణాతీతుడు కావాలి. దానికి మార్గం ఆత్మవిచారణయే.

విచారణ చేస్తూ చేస్తూ బుద్ధి నిలిచిపోతే అది సాక్షాత్కారమే. ఆత్మానుభూతియే. మనోబుద్ధులు అంతమై పోయినవి గనుక ఇక తిరిగి జన్మించే పనిలేదు. సూక్ష్మ శరీరము; అందలి వాసనలు, కర్మఫలాలతో కూడిన



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కారణశరీరము అంతమై పోతే ఇక మిగిలేది కేవల ఆత్మచైతన్యమే. అదే పరమాత్మను చేరుకొని; పరమాత్మలో ఐక్యమగుట.

అలాగాక బుద్ధి పరుగెడుతున్నంతకాలం అన్ని లోకాలు తిరుగుతూ అన్ని అనుభవాలు పొందాల్సిందే. బుద్ధి ఆగిపోతే ఇక ఏ అనుభవమూ అక్కరలేదు.

మనోబుద్ధులు ఆగిపోకుండా ఆలోచనలు చేస్తున్నవి అంటే అతడు త్రిగుణాలతో ఉన్నట్టే. ఏదో ఒక గుణం ప్రబలంగా ఉన్నట్టే. ఏ గుణం ఉంటే ఎలా వ్యవహరిస్తాడు జీవుడు?

1.<u>సత్వగుణం</u> ప్రధానంగా ఉంటే రాముడు కృష్ణుడు మొ॥న ఐతిహాసిక పురుషులనుగాని; ఇంద్రుడు, అగ్నీ, సూర్యుడు, మొ॥న ప్రకృతి శక్తులను గాని లేదా లక్ష్మి, సరస్వతి, విఘ్నేశ్వరుడు, విష్ణువు, ఈశ్వరుడు మొ॥న దేవతలను గాని ఆరాధిస్తూ ఉంటాడు. ఇలా వివిధదేవతలను ఆరాధిస్తూ ఆయాదేవతా లోకాలను చేరుకుంటాడు. స్వర్గభోగాలనుభవిస్తాడు.

2.<u>రజోగుణం</u> ప్రధానంగా ఉన్నవారు పితృదేవతలను ఆరాధిస్తూ ఉంటారు. చివరకు వారు పితృలోకాలను చేరుకొని భోగాలనుభవిస్తారు.

3.<u>తమోగుణం</u> ప్రధానంగా గలవారు క్షుద్రమైన ఆలోచనలు చేస్తూ భూతప్రేతాలను ఆరాధిస్తూ ఆయా భూతగణాలలో చేరిపోతారు.

4.<u>ఈ మూడు గుణాలకు అతీతులైన వారు</u> శుద్ధ సత్త్వ సంపన్నులై, త్రిగుణాతీతులై పరమాత్మను ఉపాసించి గుణాతీత బ్రహ్మ పదవిని - అంటే పరమాత్మను చేరుకుంటారు. పరమాత్మలో ఐక్యమై పోతారు.

శ్రమ అందరిదీ సమానమే. కాని ఫలితాలు వేరువేరు. ఎందుకని? వారి భావనలు వేరు వేరు గనుక. పరమాత్మను చేరుకున్న వారు తప్ప మిగిలిన వారు ఏ లోకాలకు వెళ్ళినా తిరిగి రావలసిందే. మళ్ళీ మళ్ళీ జన్మలెత్తవలసిందే. ఎందుకంటే ఆ లోకాలన్నీ అనిత్యం, అక్కడి భోగాలు అనిత్యం. కనుక అక్కడికి చేరుకున్నవారు ఆ అనిత్య భోగాలనుభవించి తిరిగి రావలసిందే. శాశ్వతంగా ఉండిపోయే వీలులేదు. అంటే బుద్ధితో ఆలోచనలు ఆగిపోలేదు గనుక ఇంకా ఇంకా ముందుకు సాగాల్సిందే.

అన్య దేవతలను ఆరాధించేవారు ఆయా దేవతల ద్వారా కోరిన ఫలితాన్ని అనుభవించిన తర్వాత తిరిగి భూలోకానికి తగిన దేహాన్ని ధరించి రావాల్సిందే. అక్కడ అనుభవించిన ఆ భోగాలను నిజంగా ఇచ్చేదెవరు? ఆయా దేవతలే. ఆ దేవతలు ఎలా ఇస్తున్నారు? వాటిని పరమాత్మ నుండి పొంది ఇస్తున్నారు. అంటే మనం దేవతలను పూజిస్తే ఆ పూజ చేరేది భగవంతునికే.

మనం ఫలితాలు పొందుతున్నామంటే అవి అన్నీ భగవంతుని నుండే. ఈ దేవతలంతా భగవంతుని ఏజెంట్లే. నిజంగా అన్నీ ఆయనవే. అందరిలోని శక్తీ ఆయనదే. ఈ భావంతోనే ప్రతివాడూ పనిచేయాలి. అదే అహంకారరాహిత్యం. నాదేం లేదు. అంతా నీదే. 'నమమ' అనే భావన ఉండాలి. కాని మనం ఏపని చేస్తున్నా, ఏదానం ఇస్తున్నా, ఏయజ్ఞం చేస్తున్నా, ఇతరులకు ఏ సహాయం చేస్తున్నా అంతా మన గొప్పతనంగా భావిస్తాం. పైకి అనకపోయినా లోలోపల అహంకారం.

ధర్మరాజు అశ్వమేధ యాగం చేశాడు. అన్నదానాలు, వస్త్రదానాలు, గోదానాలు, భూదానాలు, హిరణ్యదానాలు, వస్తుదానాలు, భూరి దక్షిణలతో దివ్యంగా జరిగిపోతున్నాయి. అందరూ అనేక విధాల ప్రశంసిస్తున్నారు. ఇది చూచి ధర్మరాజులో కొద్దిగా అహంకారం బయలుదేరింది. అది తొలగించాల్సిన భాధ్యత భగవానునిదే.

అవబృధ స్నానం పూర్తయింది. అందరూ కూర్చొని ధర్మరాజుని ప్రశంసిస్తున్నారు. ఎక్కడి నుండో వచ్చింది ఒక ముంగిస - పకపకా నవ్వింది. అందరూ అటు చూచారు. ఎందుకు నవ్వుతున్నావు? అన్నారు. అది చెప్పటం మొదలుపెట్టింది.

మీరంతా ధర్మరాజుని పొగడ్తలతో ముంచెత్తుతుంటే నవ్వువచ్చింది. ఇది సక్తుప్రస్థుని యజ్ఞం కన్న గొప్పది కాదు - అన్నది.

సక్తుప్రస్థుడెవరు? ఆయన యజ్ఞం ఎలా చేశాడు? అడిగారు అందరూ. చెప్పటం మొదలు పెట్టింది ముంగిస.

కురుక్షేత్రంలో సక్తుప్రస్థుడనే పేదబ్రాహ్మణుడున్నాడు. ఆయనకు భార్యా, కుమారుడు, కోడలు ఉన్నారు. ఒక చిన్న కుటీరంలో ఉంటున్నాడు. ఆ ప్రక్కనే నా బిలం(కలుగు) ఉన్నది. ఆయన వెదురు బియ్యం ఏరుకొస్తే పిండి చేసుకొని దానితోనే అందరూ జీవిస్తున్నారు. అతిధి అభ్యాగతులను సేవిస్తున్నారు. అతడు 3 రోజులకొకసారి భోజనం చేసేవాడు. ఒకసారి ఆ ప్రాంతంలో క్షామం వచ్చింది. భిక్ష దొరకటం లేదు. అదే సమయంలో అతణ్ణి పరీక్షించటానికి ధర్మదేవత అతిథిగా వచ్చాడు. అప్పటికే 3 రోజుల నుండి పస్తున్న కుటుంబం.

తలా పిడికెడు పేలపిండిని తినటానికి కూర్చున్నారు. అతిథి రాగానే యజమాని అతణ్ణి సాదరంగా ఆహ్వానించాడు. అతడికి విస్తరి వేసి తనవాటా పేలపిండిని సమర్పించాడు. అతిథికి ఆకలి తీరలేదు. భార్య తన వాటా ఇచ్చింది. ఉహూ! ఆకలి తీరలేదు. కుమారుడు తనభాగం పేలపిండిని ఇచ్చాడు. తృప్తి కలగలేదు. కోడలు తన భాగం ఇచ్చి వేసింది. అప్పుడా అతిథి తృప్తి చెంది తన నిజరూపంలో ప్రత్యక్షమయ్యాడు ధర్మదేవతగా. వారి త్యాగానికి మెచ్చి బ్రహ్మలోకాన్నుండి విమానం వచ్చింది. ఆ నలుగురూ విమానంలో వెళ్ళిపోయారు.

ఇదంతా చూస్తున్న నేను కలుగులో నుండి బయటకు వచ్చి ఆ పేలపిండి పడ్డ ప్రదేశంలో పొర్లాడాను.నా తల, శరీరం ఒకవైపు బంగారు రంగులోకి మారింది. మిగతా సగం శరీరం బంగారు రంగుగా మారుతుందేమోనని ఎన్నో యజ్ఞశాలలకు వెళ్ళాను. ఎక్కడ పొర్లాడినా బురద అంటుకున్నదే గాని శరీరం రంగుమారలేదు. అందుకే ధర్మరాజు యజ్ఞం చేస్తున్నాడని తెలిసి ఇక్కడకు వచ్చాను. అన్ని నీటి గుంటలలో పొర్లాను. బురద కావటం తప్ప బంగారం కాలేదు. 'భక్తిలేని పూజ పత్రి చేటు' అన్నట్లు వట్టి ఆర్భాటమే గాని ప్రయోజనం లేదు - అన్నది ముంగిస.

తనలోని అహంకారానికి ఇది శ్రీకృష్ణుని చికిత్స అని తెలుసుకున్నాడు ధర్మరాజు. అహంకారంతో చేసింది ఎంత గొప్ప పనియైనా భగవంతునికి ఇష్టం కాదు. అన్ని వస్తువులు ఆయనవే. మన గొప్పతనం ఏమీలేదు. మనం ఏదో గొప్ప త్యాగం చేసినట్లు గర్వించనక్కరలేదు. అంతటా ఉన్నది

ఆయనేనని, అన్నీ ఆయన ప్రసాదించినవేనని గ్రహించి స్థిరబుద్ధితో ఆరాధించి ఆయనను చేరుకోవాలి. అంతేకాదు భగవంతుని ఆరాధనలో ఒక సుఖం ఉంది. అన్యదేవతారాధనలో వస్తులోపం జరగరాదు, కర్మలోపం జరగరాదు, విధిలోపం జరగరాదు. ఏది బెడిసినా ప్రమాదమే. 'పెడితే పెళ్ళి కూడు, పెట్టక పోతే పిండా కూడు' అన్నట్లుంటుంది. భగవంతుని ఆరాధనలో వస్తువులకు, కర్మకు, విధులకు ప్రాధాన్యత లేదు. భక్తియే ప్రధానం. మనస్సే ప్రధానం.

పని సులభం - ఫల మధికం. కనుక భక్తితో ఆరాధించాలి భగవంతుణ్ణి. అదేమిటో 26వ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

- ఫలాపేక్షతో కర్మలు చేయుటయే అన్యదేవతారాధన. అట్టి అన్యదేవతారాధనలో వస్తులోపం, కర్మలోపం, విధి విధానాల లోపం జరగకూడదు. ఏది బెడిసినా ప్రమాదమే. అయితే నిష్కామంగా, ఫలాసక్తి లేకుండా చేసే దేవతారాధనలో వస్తువులకు, కర్మకు, విధివిధానాలకు ప్రాధాన్యత లేదు. భక్తి మాత్రమే ప్రధానం. నీవు ఏమి ఇస్తున్నావో భగవంతుడు చూడడు. ఎలా ఇస్తున్నావో చూస్తాడు. ఆయనకు నీ వస్తువులతో పనిలేదు. నీ భావనతోనే పని, నీ మనస్సు ఏమిటో దానినే చూస్తాడు. అన్ని వస్తువులు నిజంగా ఆయనవే. ఆయన వస్తువులను ఆయనకు సమర్పిస్తున్నామే గాని మనం మన వస్తువుల నేమీ ఇవ్వటం లేదు. అసలు మన వస్తువులంటూ ఏమున్నాయి? వస్తూ ఏం తెచ్చాం? వెళుతూ ఏం తీసుకెళుతున్నాం? కనుక వస్తువులు కాదు, భక్తియే ప్రధానం. ఈ విషయాన్నే ఈ 26వ శ్లోకం అర్థవంతంగా తెలియజేస్తున్నది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి|
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః|| **(26)**

**తా||** ఆకునో, పువ్వునో, ఫలాన్నో, జలాన్నో ఎవరైతే నాకు భక్తితో సమర్పిస్తారో, అట్టి నిర్మల చిత్తుడు భక్తితో సమర్పించిన వాటిని నేను ఆరగిస్తాను. (స్వీకరిస్తాను).

**వ్యాఖ్య:-** భగవంతుని అనుగ్రహం పొందాలంటే దేవాలయాలు కట్టించాలా? బాగా డబ్బు ఖర్చుపెట్టి యజ్ఞయాగాదులు చేయాలా? లక్ష బిల్వార్చనలు, కోటి బిల్వార్చనలు చేయాలా? దానధర్మాలు చేయాలా? - ఒకవేళ ఇవన్నీ చేయాలంటే చాలా డబ్బు కావాలి గదా! భాగ్యవంతులకు ఫరవాలేదు. మరి పేదవారి గతి ఏమిటి? వారికి పరమాత్మను పూజించే అర్హత లేదా? పరమాత్మ అనుగ్రహం పొందే వీలులేదా? దీనికి సమాధానంగానే ఈ శ్లోకం చెప్పబడింది. పేద - ధనిక తారతమ్యం లేకుండా అందరూ భగవంతుని అనుగ్రహాన్ని పొందవచ్చు. ఎలా?

భగవంతుని అర్చించటానికి, పూజించటానికి పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదైనా చాలు. ఇవి అందరికీ అందుబాటులో ఉంటాయి. డబ్బు ఖర్చులేదు. అయితే వీటిని నిర్మలమైన మనస్సుతో, భక్తితో సమర్పించాలి. అంతే. ఈ నాలుగు వస్తువులనే ఇక్కడ చెప్పటంలో ఉద్దేశం ఇవే సమర్పించాలని కాదు. ఇవి ఎంతో సులభంగా లభించేవి గనుక వీటిని చెప్పటం జరిగింది. ఆకు, పువ్వు, నీరు ఉచితంగా లభించేవి. ఫలం కొన్ని సందర్భాల్లో ఉచితంగా లభించవచ్చు, లేదా కొంత ధర చెల్లించాలి. కనుక ఇవి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అందరికీ అందుబాటులో ఉండేవి. ఈ స్వల్ప వస్తువులతోనే భగవంతుడు తృప్తి చెందుతుంటే ఇక విలువైన వస్తువుల మాట చెప్పవలసిన పనేలేదు గదా!

అసలు భగవంతుని పూజలో ఇచ్చే వస్తువుకు ప్రాధాన్యత లేదు. ఇచ్చే వ్యక్తి యొక్క మనస్సుకే ప్రాధాన్యత. వస్తు ప్రాధాన్యం కాదు, భక్తి ప్రాధాన్యం. వాస్తవంగా భగవంతునికి ఇచ్చి మెప్పించ గలిగే వస్తువు మన దగ్గర ఏముంటుంది? ఆయనకు లేనిదీ మన దగ్గరున్నదీ ఏముంది? ఒక్క మనస్సు తప్ప మరేమీ లేదు. కనుక మనం సమర్పించవలసింది నిర్మల, నిష్కల్మష, పరిశుద్ధ మనస్సునే గాని వస్తువులను కాదు. అసలు ఈ లోకంలోని వస్తువులన్నీ ఆయన ఇచ్చినవే. ఆయనవే. అది నాది అనుకోవటం ఒట్టి భ్రమ మాత్రమే. మనం ఈ లోకంలోకి వస్తూ ఏదైనా ఒక్క వస్తువును తెచ్చామా? వెళ్తూ తీసుకెళ్తున్నామా? లేదే. కనుక ఇక్కడున్న వన్నీ ఆయనవే.

ఆయన సొమ్మునే తస్కరించి, ఆయనకే సమర్పించి ఏదో గొప్ప త్యాగం చేశానని భ్రమపడుతున్నాం. నిజంగా మనం వస్తువులను సమర్పించటం లేదు. మన శుద్ధమైన మనస్సును - భక్తిని మాత్రం సమర్పిస్తున్నాం. అలా భక్తిని మనం భగవంతునికి సమర్పించటానికి ఇవి గరిటెల వంటివి. అంతే.

గిన్నెలో కూర, పప్పు, పచ్చడి ఉన్నాయి. అవి మనం వడ్డించుకోవాలంటే గరిటెను ఉపయోగించి వాటిని తీయాలి. ఆ పని కాస్తా పూర్తయితే గరిటెను కడిగి మూలన పడేస్తాం. మనం తినేది కూరనే గాని గరిటెను కాదు గదా! అలాగే ఈ పత్రం గాని, పుష్పం గాని, ఫలం గాని, తోయం గాని - ఇవన్నీ భక్తి అనే కూరను భగవంతునికి వడ్డించటానికి గరిటెలాంటివే. కనుక వాటికేం

ప్రత్యేకత లేదు. భగవంతుడు స్వీకరించేది భక్తినే గాని పత్రాన్ని, పుష్పాన్ని కాదు.

నిర్మలమైన, శుద్ధమైన, పరవశించే మనస్సులేనివాడు బంగారాన్ని ఇచ్చినా, రత్నరాసులు ఇచ్చినా, ధనరాసులు ఇచ్చినా భగవంతుడు స్వీకరించడు. ఎందుకంటే ఇవన్నీ గరిటెల వంటివే గదా! వీటితో ఆయనకేం పని? వీటి ద్వారా స్వీకరించవలసిన భక్తి లేనప్పుడు వీటితో పనిలేదు. కూర రుచిగా ఉండాలిగాని, గరిటె బంగారానిదైతేనేమి, వెండిదైతేనేమి, స్టీలుదైతేనేమి? అలాగే మనస్సు భక్తితో నిండినదై ఉండాలిగాని వస్తువులు ఎలాంటివైతే నేమి?

- శ్రీరామచంద్రుడు మెచ్చుకున్నది ఉడుత చేసిన సహాయానికి కాదు. దాని భక్తికి మాత్రమే. దాని భావానికి మెచ్చి దగ్గరకు తీసుకున్నాడు.
- ద్రౌపది పెట్టిన అక్షయపాత్రలోని శాకాన్ని ఆరగించి శ్రీకృష్ణుడు దుర్వాసుని 10వేలమంది శిష్యుల కడుపునింపాడు. అది ద్రౌపది యొక్క భక్తికి కదిలిపోయే గాని, ఎంగిలి మెతుకుకు సంతోషించికాదు.
- కుబేరుని అటుకులు బజారులో అమ్మితే అర్ధరూపాయి కూడా రాదు. ఆప్యాయంగా వాటిని భుజించి ఆయనకు అష్టైశ్వర్యాలిచ్చింది ఆయన తెచ్చిన అటుకులను చూచి ఆనందించి కాదు. అందులో కుచేలుని అనన్యభక్తిని చూచి మాత్రమే.
- శబరి ఒక ఆటవిక స్త్రీ. నాగరికత తెలియనిది. అయినా ఆమె ఇచ్చిన ఎంగిలి పండ్లు తిని ఆమెను అనుగ్రహించింది ఆ పండ్ల యొక్క రుచికి కాదు. ఆ

పండ్లను ఇస్తున్న ఆమె యొక్క నిర్మల మనస్సు, అనన్యమైన భక్తికి మెచ్చియే.

- ఒక పేదరాలు ఇచ్చిన ఉసిరిక పండును స్వీకరించి శంకరాచార్యులు ఆమె ఇంట బంగారు ఉసిరిక పండ్ల వర్షం కురిపించింది ఆ పండు యొక్క రుచికి గాదు, ఆమె యొక్క భక్తికి మెచ్చి మాత్రమే.
- అరచేతి అంత తెల్ల కాగితం 10 పైసలు విలువ చేయదు. కాని గవర్నమెంటు వారి ముద్రపడితే చాలు వెయ్యిరూపాయల నోటు అవుతుంది. అది వస్తువు గొప్పతనం కాదు. ముద్ర యొక్క గొప్పతనం.

అలాగే భగవంతుని ఆరాధనలో వస్తువు యొక్క ప్రభావం ఏమీలేదు. అంతా భక్తి ప్రభావమే. కనుక ఏ వస్తువును భగవంతునికి సమర్పించినా భక్తి మాత్రం ఉండాలి. ఆర్తి ఉండాలి. భగవంతుని యందు ప్రేమ ఉండాలి. నేను నీ వాడను, నీవు నావాడవు - అనే ఆత్మీయత ఉండాలి. పరవశం ఉండాలి.

అందుకే ఈ శ్లోకంలో 'భక్త్యా' - 'భక్త్యు పహృతం' అనే రెండు పదాలనుపయోగించి భక్తి యొక్క విశిష్ఠతను నొక్కి చెబుతున్నారు.

మనకైతే చిన్న వస్తువును చూస్తే చిన్నచూపు. పెద్ద వస్తువైతే సంతోషం. కాని భగవంతుడు ఎంత చిన్న వస్తువునైనా స్వీకరిస్తాడు. కాకపోతే ఇచ్చేవాడిలో యోగ్యత ఉండాలి. అదే భక్తి, చిత్తశుద్ధి. అందుకే 'చిత్తశుద్ధి లేని శివపూజ లేలయా విశ్వదాభిరామ వినురవేమ' అంటూ వేమన చిత్తశుద్ధి లేని పూజలను నిరశించాడు. కనుక నిజమైన ప్రేమతో, నిజమైన భక్తితో ఇవ్వాలి.

అంతేగాని వంకాయ కొని టెంకాయ కొసిరే వ్యాపారంగా ఉండకూడదు. భక్తి వ్యాపారం కాదు. భక్తుడు వ్యాపారి కాకూడదు.

"నీకు జీడిపప్పు పాయసం నైవేద్యం పెడతాను. నాకు లాటరీలో లక్షరూపాయలు రప్పించు" "ప్రతి సంవత్సరం నీ కొండకు వచ్చి మ్రొక్కులు తీర్చుకుంటాను. నాకు మంత్రి పదవి ఇప్పించు" లాంటి భక్తి నిజమైన భక్తి కాదు.

ఒకాయన ఒక సాధువు గారిని ఇంటికి పిలిచి పాదపూజ చేస్తూ, ఆచమనం చేసి "ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధనకనక వస్తువాహన సమృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థం గురుపూజా మహం కరిష్యే" అంటూ సంకల్పం చెప్పాడట. అది వినటంతోనే సాధువు చివాలున లేచి వెళ్ళిపోతున్నాడు. "మహాత్మా! ఏమిటలా వెళ్ళిపోతున్నారు?" అంటే "బాబూ! నీ పూజా వద్దు, పురస్కారమూ వద్దు. చెంబెడు నీళ్ళు కాళ్ళ మీద పోసి ఆయురారోగ్యాలు, అష్టైశ్వర్యాలు, మనోవాంఛలు, ధర్మార్థ కామమోక్షాలు, ధనకనక వస్తువాహనాలు కావాలంటున్నావు. అవి నావద్ద లేవు. నేను ఇవ్వలేను" అన్నాడట.

కొద్దిగా ఇచ్చి ఎక్కువగా తీసుకోవాలనే బుద్ధి వ్యాపారమే గాని భక్తి కాదు. నిజమైన భక్తి ఇచ్చేదేగాని తీసుకొనేది కాదు. ఓడిపోయే వాడు యోధుడూ కాదు. వేడుకొనే వాడు భక్తుడూ కాదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

"స్వామీ నీ అనుగ్రహం తప్ప నాకేమీ వద్దు. నీ దర్శనం కూడా కోరను. ఎందుకంటే ఈ ప్రపంచరూపంలో ఉన్నది నీవే కదా! నీ ప్రాప్తిని కూడా కోరను. ఎందుకంటే నీవు దూరంగా ఉన్నావా? లేదే! ఆత్మ స్వరూపంగా నాలోనే ఉన్నావు - అంటూ భక్తిని తప్ప దేనినీ కోరడు భక్తుడు.

రాయబార సమయంలో దుర్యోధనుడు పిలిచినా విందుకు ఆయన ఇంటికి వెళ్ళలేదు శ్రీకృష్ణుడు. పిలవకపోయినా విదురుని ఇంటికే వెళ్ళాడు. ఆయనకు కావలసింది ఆడంబరం కాదు. ప్రేమ - భక్తి. విదురుడు మైమరపుతో ఇచ్చిన అరటి తొక్కలను తిన్నాడు. భక్తుడు మైమరిస్తే భగవంతుడూ మైమరచి పోతాడు. తోళ్ళిచ్చినా తొక్కలిచ్చినా భక్తితో ఇచ్చిన వాటిని తినాల్సిందే. అందుకే 'అశ్నామి' - తింటాను అంటున్నాడు భగవానుడు. ఫలాన్నైతే తినొచ్చు. ఆకును, పువ్వును, నీటిని తినటమేమిటి? అదే భక్తి పరవశం. ఆ పరవశంలో ఆకునైనా, తొక్కనైనా, నీటినైనా, తోళ్ళనైనా, పువ్వునైనా తినెయ్యటమే.

పత్రం పుష్పం ఫలం తోయం - దేనినైనా ఇవ్వటానికి భగవంతుడెదురుగా లేడు గదా! ఎలా? భగవంతునికి రెండు రూపాలు. ఒకటి సాలగ్రామం. రెండు సాధు సత్పురుషులు. ఎవరికి సమర్పిస్తున్నా భగవంతునికే ఇస్తున్నాననే భక్తి భావం ఉండాలి. లెక్క చూచుకొని ఇవ్వకూడదు. ఎక్కువిస్తున్నానేమోననే సందేహం కూడదు.

ఒకరోజున కుక్క ఒకటి తుకారాం ఇంటిలోనికి వచ్చి రొట్టె నోట కరచుకొని పరుగెత్తుతున్నది. తుకారాం నేతిగిన్నె పట్టుకొని "పాండురంగా!

ఉండు! ఉండు, కాస్త నెయ్యి వేస్తా అంటూ వెంటపడ్డాడు. కుక్కలో కూడా పాండురంగణ్ణి చూస్తున్నాడు తుకారాం. ఇదే సర్వత్రా పరమాత్మదృష్టి. భగవంతుడనే భావంతో ఛండాలునికి నీళ్ళను పోసి భగవంతుని అనుగ్రహం పొందాడు రంతిదేవుడు.

పత్రం పుష్పం ఫలం తోయం ఏదైనా సమర్పించవచ్చు నంటూ భగవంతుని ఉపాసనను సులభం చేశాడు భగవంతుడు. నిజమే. ఒక్కొక్కప్పుడు అవి కూడా దొరకక పోవచ్చు. అప్పుడెలా? యుద్ధరంగంలో ఉన్న అర్జునునికిప్పటికిప్పుడు పత్రం పుష్పం ఫలం తోయం ఎక్కడి నుంచి వస్తాయి? కనుక మరొక ఉపాయం ఉందా? అసలు జ్ఞానికి వీటితో అవసరం లేనేలేదు.

బాహ్యంగా వస్తువులు దొరకకపోయినా మనస్సులోనే పూజా వస్తువులు కల్పించుకోవచ్చు. భావసమర్పణకు లోటేముంటుంది? దేనికి దరిద్రుడైనా మానవుడు భావదరిద్రుడు కారాదు. నిజంగా ఈ పత్రం పుష్పం ఫలం తోయం ఈ నాలుగూ మనలోనే ఉన్నాయి.

పత్రం అంటే మనస్సు. ఎప్పుడూ ఆకులా చలిస్తుంది మనస్సు.

పుష్పం అంటే బుద్ధి. ఎప్పుడూ పుష్పంలా పరిమళిస్తుంది బుద్ధి.

ఫలం అంటే అహంకారం. ఎప్పుడూ పండులా పునరుత్పత్తికి కారణమవుతుంది.

తోయం అంటే చిత్తం. జలతత్త్వంలో పుట్టింది చిత్తం.

కనుక మన అంతఃకరణాన్ని సమర్పిస్తే చాలు. సర్వసమర్పణ గావించినట్లే.

దీనిని బట్టి భగవంతుని ఉపాసించుటకు భాగ్యవంతులే కానక్కరలేదు. ఎంతటి పేదలైనా పూజించవచ్చు. కోటీశ్వరులు, రాజాధిరాజులు కూడా ఒక్కొక్కప్పుడు భగవంతుని అనుగ్రహాన్ని పొందలేరు. గోచిగుడ్డ ధరించిన వారు కూడా ఆయన దయను పొందవచ్చు.

పత్రం పుష్పం ఫలం తోయం అన్నారు గదా అని అన్ని అవకాశాలు ఉన్న భాగ్యవంతుడు కూడా పిసినారిగా ఉండి వాటినే ఇస్తే అతడి మనస్సు ఎలాంటిదో భగవంతుడు తెలుసుకోడా? కనుక జాగ్రత్త. మనకున్న దానిలోనే మనస్ఫూర్తిగ భక్తితో సమర్పించుకోవటమే నిజమైన పూజ అవుతుంది.

- భగవంతునికి సమర్పించేది ఎంత అల్పమైన వస్తువైనా ఫరవాలేదు. కాని భావన ముఖ్యం. అని ఇంతవరకు తెలుసుకున్నాం. ఆ భావన ఎలా ఉండాలి? ఈ శ్లోకంలో.

**శ్లో||** యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్|

యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణం|| **(27)**

**తా||** అర్జునా! నీవు ఏమిచేస్తావో, ఏది తింటావో, ఏయజ్ఞం చేస్తావో, ఏదానం చేస్తావో, ఏతపస్సును చేస్తావో వాటిని నాకర్పించు.

**వ్యాఖ్య:-** అసలు వస్తువు లేవీ సమర్పించకుండా నీ జీవిత వ్యాపారాలన్నింటిని కూడా భగవంతునికి భక్తితో అర్పించవచ్చును - అని భగవానుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు. ఈ లోకంలో ప్రతివ్యక్తీ ఏదో ఒక పనిని - వ్యాపారమో, వ్యవసాయమో, ఉద్యోగమో, వృత్తియో, వంటయో, సేవయో చేస్తూనే

ఉంటాడు. అలా ఏపనులు చేస్తున్నా వాటిని భగవంతునికి అర్పించి చేయటం ఎంతో ప్రయోజనకరం. చేసే ప్రతి పనిని భగవంతుణ్ణి ముందుపెట్టుకొని చేయాలి. మనం ఏపని చేస్తున్నా నేను చేస్తున్నాననే అహంకారం వదిలి, భగవంతుడే నాచేత ఈ పనిని చేయిస్తున్నాడనే కర్తవ్యతా బుద్ధి, నిరహంకారం ఉండాలి. భగవంతుడు సూత్రధారి, నేను పాత్రధారిని అనుకోవాలి.

భాగవతాన్ని తెనిగించిన పోతన పరమభక్తుడు. అందుకే వ్రాసుకున్నాడు 'పలికెడిది భాగవతమట పలికించెడువాడు రామభద్రుండట' - అని. ఈ శరీరం భగవంతుని చేతిలో మురళి. ఆయన ఎలా ఊదితే అలాంటి స్వరాలను పలుకుతుంది.

గడియారం ముళ్ళు వాటంతటఅవి తిరగవు. 'కీ' ఇస్తేనే తిరుగుతాయి. ఈ శరీరమొక గడియారం. దీనికి 'కీ' ఇచ్చి నడిపేవాడు భగవానుడే.

నాది నాది అంటే అపచారం. నీది నీది అంటే ఉపచారం. నాది నాది అంటూ మమకారంతో మానవుడు అపచారం చేస్తున్నాడు. ఆ అపచారానికి క్షమాపణ కోరకపోతే చేసిన తప్పుకు ఫలితాన్ని అనుభవించాలి గదా! అందుకే నీది, నీది అని సమర్పణ భావాన్ని చూపి క్షమాపణ కోరాలి. సమర్పణమంటే రామార్పణం, కృష్ణార్పణం అని నోటితో పలకటం మాత్రమే కాదు. కర్తృత్వాన్ని, భోక్తృత్వాన్ని వదులుకోవటమే సమర్పణ భావం. నేను చేస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను అనే భావన లేకుండుటయే. అందుకే -

నీవు ఏపనులు చేస్తున్నా, ఏమి తింటున్నా, ఏయజ్ఞాలు, దానాలు, తపస్సులు ఆచరిస్తున్నా వాటిని నాకర్పించు అని భగవానుడు ఉపాయం

చెబుతున్నాడు. అలా చెబుతూ కౌంతేయ! అని సంబోధిస్తున్నాడు అర్జునుని.

కౌంతేయ!:- కుంతీకుమారా! అని. నీవు పరమభక్తురాలైన కుంతీదేవి కుమారుడివి. సర్వసమర్పణ భావం గల అట్టి భక్తురాలి కుమారుడివి గనుక నీకు ఈ సమర్పణ భావం సులభమే. అంత కష్టమేమి కాదు అని సూచన.

యత్ కరోషితత్ మదర్పణం కురుష్వ:- చేసే పనులన్నింటిని నాకు అర్పించు. కర్మలను సమర్పించటమంటే కర్మఫలాలను సమర్పించటమే. చేసే కర్మలో ఫలం కావాలని కోరటంవల్ల ఆ కర్మఫలం మనకు జన్మ బంధమవుతుంది. కనుక కర్మబంధం అనే రోగానికి సమర్పణం అనేది మందు. సమర్పణ భావంతో కర్మలు ఎలా చేయాలి? - "సర్వకర్త భగవంతుడే. నేను నిమిత్తమాత్రుణ్ణి. ఆయన చేతులలోని మురళిని నేను. నాదేం లేదు" - అనే భావనతో కర్మలు చేయాలి.

అయితే కొందరు దీన్ని తమ స్వార్థానికి ఉపయోగించుకుంటారు అప్పుడు. ఇది మెట్టవేదాంతం అవుతుంది. దొంగతనాలు, దోపిడీలు, మోసాలు చేస్తూ ఇదంతా భగవంతునిదే, నాదేం లేదుఅంటారు . తప్పుడు పనులు చేసి భగవంతుని నెత్తిన రుద్దుదామంటే అది మరింత పాపకారణమవుతుంది.

యదశ్నాసి తత్ మదర్పణం కురుష్వ:- నీవు ఏది తింటున్నావో, ఏమి అనుభవిస్తున్నావో అది భగవంతునికి సమర్పించాలి. మనం ఏం తిన్నా, ఏం అనుభవించినా, వాటిని ఇచ్చింది భగవంతుడే - అనే భావన

మనకుండాలి. నిజంగా మనం వస్తూ ఏం తీసుకొచ్చాం గనుక. మనం వచ్చే సరికి అన్నీ రడీ చేసి ఉంచిన వాడు భగవంతుడే. కనుక ఇవన్నీ ఆయనవే. మరి ఆయన ఇచ్చిన వాటిని ఆయనకు చెప్పకుండా తింటే - అనుభవిస్తే దొంగలమవుతాం. కనుక ఆయన అనుమతి తీసుకోవాలి. ఎక్కడున్నాడు చెప్పటానికి? అంతటా ఉన్నాడు. మనలోనే ఉన్నాడు. కనుక భావన చెయ్యి. ఏమని? "ఓ భగవంతుడా! ఇదిగో నీవిచ్చిన ఆహారం నీకు సమర్పిస్తున్నాను. నీవు ప్రసాదించిన భోగాలను నీకు సమర్పిస్తున్నాను" అని భగవంతునికి నివేదన చెయ్యాలి.

భగవంతునికి నివేదిస్తే అది ప్రసాదం. లేకపోతే సాదం (దద్దోజనం). నైవేద్యం పెట్టకముందు అది పులిహోర, దద్దోజనం, చక్కెర పొంగలి. నైవేద్యం పెట్టిన తర్వాత అంతా ప్రసాదం అవుతుంది. ఇలా ప్రసాద బుద్ధితో అనుభవించటమే అన్నింటిని అర్పణ చేయటం.

<u>యజ్జుహోషి తత్ మదర్పణం కురుష్వ:</u>- నీవు చేసే యజ్ఞాలను, హోమాలను నాకు సమర్పించు అంటున్నాడు భగవానుడు. ఏకర్మలు చేసినా పరమేశ్వర ప్రీతి కొరకు చేయాలి. అందుకే అభిషేకం పూర్తయిన తర్వాత "ఏతత్ ఫలం సర్వం పరమేశ్వరార్పణ మస్తు" - ఈ ఫలం అంతా పరమేశ్వరునికి అర్పించబడుగాక - అని మంత్రం చదువుతారు. ఏ యజ్ఞమైనా భగవంతునికి అర్పణ చేస్తేనే అది సార్థకం అవుతుంది. అహంకారంతో, కర్తృత్వ భావంతో చేసే యజ్ఞం యజ్ఞమే కాదు. భగవదార్పణ బుద్ధితో చేసిన యజ్ఞమే ఫలవంతమవుతుంది.

దక్షుడు అహంకారంతో పరమేశ్వరుని అవమానించాలని యజ్ఞం చేశాడు. అది యుద్ధంగా మారింది. దక్షుని తల తెగింది. మేకతల వచ్చింది. అర్జునుడు భగవదార్పణ బుద్ధితో, భగవంతుని ముందు పెట్టుకొని యుద్ధం చేశాడు. అది యజ్ఞం అయింది.

యత్ దదాసి తత్ మదర్పణం కురుష్వ:- నీవు ఏమి దానం చేస్తావో దానిని నాకు అర్పించు అంటున్నాడు భగవానుడు. ప్రతివ్యక్తీ తన తాహతును బట్టి కొద్దో గొప్పో దానం చెయ్యాలి. భగవంతుని రూపంలో ఉన్న వ్యక్తికి, సమాజానికి సమర్పించాలి.

ఒక శిష్యుడు గురువుగారిని అడిగాడు. "స్వామీ! ప్రపంచంలో ఎవడూ దరిద్రుడుగా, బిచ్చగాడిగా పుట్టాలనుకోడు గదా! మరెందుకు అలా పుడుతున్నాడు? అని. దానికి గురువు "అదాన దోషేణ భవేద్దరిద్ర" వెనుకటి జన్మలో దానం చెయ్యని దోషం చేత ఈ జన్మలో నరుడు దరిద్రుడౌతున్నాడు - అని సమాధానం ఇచ్చాడు.

మన ఇంటి ముందుకొచ్చే ప్రతి బిచ్చగాడు మనకొక పాఠం నేర్పటానికే వస్తున్నాడు. "అయ్యో! పూర్వజన్మలో ఏమీ దానం చేయకపోవటం వల్ల నాకీ గతి పట్టింది. మరు జన్మలో నీకీ గతి పట్టకూడదు అని గుర్తుచేయటానికే.

మనం ఎవరికి ఏదానం చేసినా కృష్ణార్పణం, రామార్పణం, శివార్పణం, భగవదార్పణం అంటూ చేయాలి. ఎందుకంటే పుచ్చుకొనే వాడు బిచ్చగాడు

కాదు. భగవంతుడే ఈ రూపంలో మనసుద్ధరించటానికి వచ్చాడని భావన చేయాలి.

యత్తపస్యసి తత్ మదర్పణం కురుష్వ:- నీవు చేసే తపస్సులు కూడా నాకు అర్పించు - అని. తపస్సు అంటే ఓర్పు. ఓర్పుతో కష్టాలను అనుభవించటం తపస్సు. ఇక శారీరక, వాచిక, మానసిక తపస్సులున్నాయి. పెద్దలను, గురువులను, మహాత్ములను పూజించటం శారీరక తపస్సు. సత్యము పలుకుట, భగవంతుని గురించి మాట్లాడుట వాచిక తపస్సు. ధ్యానం, జపం, స్వాధ్యాయం, శ్రవణ, మననాలు మానసిక తపస్సు. వీటన్నింటిని ఎన్ని కష్టాలు ఎదురైనా ఓర్పుతో చేయాలి. అదే తపస్సు. అన్ని అవకాశాలు ఉండి కూడా ఈ తపస్సులు చేయని వారు ఈ జన్మను వృధాచేసుకున్నవారే. ఈ తపస్సులను కూడా భగవంతునికి అర్పించాలి. భగవంతుడే నాకీ అవకాశం కల్పించాడు అనే భావనతో చెయ్యాలి.

కొందరు డబ్బుకోసం, పదవుల కోసం, కీర్తి కోసం, భోగాల కోసం, సంపదల కోసం, భార్యాబిడ్డల కోసం, భూములు, తోటలు, దొడ్ల కోసం తపిస్తూ గొప్ప తపస్సులు చేస్తారు. అయితే ఈ తపస్సులను భగవంతునికి సమర్పిస్తున్నానంటే భగవంతునికి మస్కాకొట్టటమే. కనుక ఇవి కాదు సమర్పించాల్సింది. నిజమైన తపస్సులను సమర్పించాలి.

ఈ విధంగా మనం చేసే పనులను, పొందే అనుభవాలను, యజ్ఞదాన తపస్సులను అన్నింటిని భగవంతునికి సమర్పిస్తూ, ఆయన అనుగ్రహంతోనే

చేస్తున్నాను. నిమిత్త మాత్రుణ్ణి అనే భావనతో ఉండాలి. ఇదే గొప్ప ఉపాయం.

- ఇలా అన్నింటిని భగవంతుని కర్పించి చేస్తుంటే - అనుభవిస్తుంటే కలిగే ఫలితం ఏమిటి? ఈ విషయాన్ని 28వ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో||** శుభాశుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః|
సన్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి|| **(28)**

**తా||** ఈ ప్రకారంగా సన్యాస యోగంతో కూడిన మనస్సు గలవాడవై, పుణ్యపాపములే ఫలములుగా గల కర్మబంధనాల నుండి విడుదల పొంది నన్ను పొందగలవు.

**వ్యాఖ్య:-** మాం ఉపైష్యసి:- నన్నే చేరుకుంటావు - అంటే భగవంతుని చేరుకుంటావు. ఎప్పుడు? అన్ని కర్మబంధనాల నుండి విడుదల పొందినప్పుడు. అన్ని కర్మబంధనాల నుండి విడుదల పొందటమే మోక్షం. చాలాకాలం నుండి దుఃఖాలు అనుభవిస్తున్నవాడు అవి తొలగిపోతే అమ్మయ్య! ఇప్పటికి నాకు ఈ దుఃఖాల నుండి మోక్షం కలిగింది అంటాడు. ఎప్పుడూ కష్టాలను పొందే వాడు నాకీ కష్టాల నుండి మోక్షం ఎప్పుడో? అంటాడు. అంటే మోక్షం అంటే విముక్తియే. విడుదలయే.

ఒకణ్ణి దొంగతనం చేశాడని త్రాళ్ళతో స్థంభానికి కట్టేశారు. అది బంధం. కొద్ది సేపటికి జాలితో వదిలేశారు. అంటే త్రాళ్ళు విప్పేశారు. అది మోక్షం - విముక్తి - విడుదల.

మరిప్పుడు మనని ఈ లోకానికి బంధించిన త్రాళ్ళు ఏమిటి? అవే కర్మఫలాలు. అంటే వెనుకటి జన్మలో మనం చేసిన కర్మల యొక్క ఫలాలే. ఈ కర్మలు శుభకర్మలు (పుణ్యకర్మలు) కావచ్చు, అశుభకర్మలు (పాపకర్మలు) కావచ్చు. ఏవి చేసినా వాటికి తగిన సుఖాలు, దుఃఖాలు వస్తాయి. ఇవే బంధనాలు. ఇవి ఎలా బంధమౌతున్నాయి?

పుణ్యకర్మలు చేస్తే వచ్చే పుణ్యఫలాలు; పాపకర్మలు చేస్తే వచ్చే పాపఫలాలు - ఈ రెండు రకాల ఫలాలు మనతో పాటే ఉంటాయి. మనం శరీరాన్ని విడిచిపెట్టినా ఇవి మాత్రం సూక్ష్మ శరీరంతో పాటు వదలకుండా వచ్చేస్తాయి. వాటిని అనుభవించి ఖర్చు చేసుకొనే దాకా మనను వదిలిపెట్టవు. అనుభవిద్దామంటే అవి సంచితమై ఉంటాయి. (పచ్చికాయల మూటగా ఉంటాయి). అవి ఎప్పుడు పక్వానికి వస్తాయో అప్పుడు వాటిని ప్రారబ్ధకర్మలు అంటారు. ఆ ప్రారబ్ధకర్మఫలాలను అనుభవించటానికి తగిన దేహాన్ని తీసుకొని వచ్చి, ఆ జన్మలో వీటిని అనుభవించి, మళ్ళీ కొన్ని క్రొత్త కర్మలు చేసి కర్మఫలాలు మూటగట్టుకుంటాం. మళ్ళీ వీటితో వెళ్ళి, పాత సంచిత కర్మఫలాలతో కలిపి వాటిలో నుండి పక్వమైన ప్రారబ్ధకర్మఫలాలను అనుభవించటానికి తగిన దేహంతో జన్మఎత్తి రావాలి. ఇలా అనేక జన్మ పరంపరలను కలిగిస్తాయి. ఈ కర్మఫలాలు, ఈ విధంగా ఇవి మనకు బంధనాలవుతున్నాయి. మనను ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

లోకానికి కట్టి వేస్తున్నాయి. వీటి నుండి విముక్తి చెందటమే మోక్షం. అప్పుడే భగవంతునితో ఐక్యత.

మరి ఈ కర్మలు బంధనాలు కాకుండా తప్పించుకొనే ఉపాయం ఏమిటి? అదే నిష్కామకర్మయోగం. ఫలాసక్తి లేకుండా కర్మలు చేయటం. దీనినే క్రిందటి శ్లోకంలో వివరించారు. నీవు ఏమి చేస్తున్నా, ఏమి తింటున్నా, ఏమేమి యజ్ఞ, దాన, తపస్సులు చేస్తున్నా అన్నింటినీ భగవంతుని కర్పించు - అని. అంటే లౌకిక కర్మలైనా, యజ్ఞదాన తప్పస్సులైనా - ఏవైనా సరే భగవంతుని కర్పించటమే. అంటే ఆ కర్మఫలాల యందు ఏమాత్రం ఆసక్తి ఉండరాదు. అలా చేస్తేనే క్రొత్తగా కర్మఫలాలు రావు. మనకు బంధాలు కావు. ఇలా చేసిన వాణ్ణే సన్యాసయోగ యుక్తుడు అంటారు.

<u>సన్యాస యోగ యుక్తాత్మా:-</u> ఇలా కర్మలు చేస్తూ మోక్షాన్ని అందుకోవాలనుకున్నవాడి మనస్సు ఎలా ఉండాలి? సన్యాస యోగ యుక్తాత్ముడై యుండాలి. సన్యాసం అంటే విడిచిపెట్టటం. ఏమి విడిచి పెట్టాలి ? కర్మఫలాలను విడిచిపెట్టాలి. యోగం అంటే కర్మయోగం - అంటే నిరంతరం కర్మలు చేయటం. సన్యాస యోగం అంటే కర్మఫలాలను సన్యసిస్తూ కర్మలను చేయటం. ఇలా ఎవరైతే నిరంతరం కర్మఫలాలపై కోరిక లేకుండా, నిర్లిప్తంగా కర్మలు చేయుట యందే నిష్ఠ కలిగి ఉంటారో వారే సన్యాసయోగయుక్తులు. వారే సర్వకర్మబంధనాల నుండి విడుదల పొంది పరమాత్మను చేరుకుంటారు.

కనుక చేసే పనులు నిర్లిప్తంగా చేస్తూ, కర్మఫలాలపై ఆసక్తిని విడిచిపెడితే, భగవంతునికి సమర్పిస్తే పరమాత్మను చేరుకోవటమే అంతిమఫలితం. ఇలా సన్యాసయోగయుక్తులనే తనదరికి చేర్చుకుంటున్నాడంటే పరమాత్మకు పక్షపాత బుద్ధి ఉందా?

- భగవంతుడు కొందరిని తన వద్దకు చేర్చుకుంటూ, కొందరిని దూరంగా పెడితే అది పక్షపాత బుద్ధి కాదా? భగవంతునికి అలాంటి దృష్టి ఉంటుందా?

**శ్లో||** సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోఽస్తి నప్రియః|

యే భజంతి తుమాం భక్త్యా మయితే తేషు చాప్యహం|| **(29)**

**తా||** సమస్త భూతములందు నేను సమంగా ఉన్నాను. నాకు ద్వేషింపదగిన వాడుగాని ప్రేమించవలసిన వాడుగాని లేడు. ఎవరైతే నన్ను భక్తితో భజిస్తారో వారు నాలో ఉంటారు. నేను వాళ్ళలో ఉంటాను.

**వ్యాఖ్య:-** తనపై భక్తి ఉన్నా లేకున్నా తల్లి తన బిడ్డలందరిని సమానంగా చూస్తుంది. అందరి మీద వాత్సల్యాన్ని చూపుతుంది గదా! మరి భగవంతుడు ఈ మాత్రం ఔదార్యాన్ని చూపలేడా? అని కొందరికి సందేహం. దానికి సమాధానమే ఈ శ్లోకం.

భగవంతుడీ శ్లోకంలో 3 విషయాలను స్పష్టం చేస్తున్నాడు.

1.నేను సమస్త భూతములయందు సమానంగా ఉన్నాను.

2.నాకు ఒకడిపై ద్వేషం గాని, ఒకడిపై రాగం గాని లేవు.

**3.ఎవరు నన్ను భక్తితో పూజిస్తారో వారు నాలో ఉంటారు. నేను వారిలో ఉంటాను.**

**ఈ శ్లోకంలో భగవంతుని శాస్త్రీయ స్వరూప స్వభావాలు చెప్పబడ్డాయి.**

**1.సమోఽహం సర్వభూతేషు :- సమస్త భూతాలలో ఉండే ఆత్మ ఒక్కటే. అన్నింటిలోను సమంగా ఉంటుంది ఆత్మచైతన్యం.**

**"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"**

**"సర్వస్య చాఽహం హృది సన్నివిష్ఠః"**

**"అహమాత్మా గుడాకేశ!" సర్వభూతాశయ స్థితః" - అని భగవద్గీతలోనే అనేక సందర్భాలలో చెప్పటం జరిగింది.**

**ఆకాశం అంతటా సమానంగా ఉన్నది. కుండలోను, బిందెలోను, చెంబులోను, పీపాలోను, ఇంటిలోను - అన్నింటిలోనూ సమానంగానే ఉన్నది అయితే చిన్న, పెద్ద, మంచి, చెడ్డ తేడాలన్నీ ఉపాధులవేగాని, ఆ ఉపాధులలోని ఆకాశంలో ఏ తేడాలు లేవు. కుండలోని ఆకాశం కుండ ఆకారం గాను, చెంబులోని ఆకాశం చెంబు ఆకారంగాను, పీపాలోని ఆకాశం పీపా ఆకారం గాను, ఉన్నట్లు అనిపిస్తుంది. అంతే.**

**సూర్యకిరణాలు అంతటా ఒకే రకంగా ప్రసరిస్తాయి. బండరాయి మీద, మట్టి మీద, అద్దం మీద, రత్నం మీద - దేనిమీదనైనా ఒకే విధంగా పడతాయి. అయితే ఆ వస్తువును బట్టి కిరణాలు వేరువేరుగా ప్రతిఫలిస్తాయి.**

కరెంటు అన్ని బల్బులలోకి, ట్యూబ్ లైట్లలోకి, ఫ్యాన్ లోకి, ఫ్రిజ్ లోకి, హీటరులోకి, A/C లోకి ఒకే విధంగా సమానంగానే వెళ్తుంది. ఒకే కరెంటు వెళుతుంది. అయినా ఫలితాలు వేరువేరుగా ఉంటాయి. కరెంటులో తేడా లేదు. ఉపాధులలో తేడాయే. లైటులోకి వస్తే కాంతినిస్తుంది, ఫ్యాన్ లోకి వస్తే గాలినిస్తుంది. ఫ్రిజ్ లోకి వస్తే చల్లబరుస్తుంది, హీటరులోకి వస్తే వేడి చేస్తుంది. అన్ని పరికరాలలోకి ఒకే కరెంటు సమానంగా వచ్చినా, ఆ పరికరాల వల్ల వేరువేరుగా ఫలితాన్నిస్తుంది, పనిచేస్తుంది.

అలాగే పరమాత్మ అందరిలో ఒకే విధంగా సమానంగా ఉన్నా ఉపాధుల తేడాల వల్ల వేరువేరుగా ప్రకాశిస్తున్నాడు. బుద్ధునిలో, శంకరాచార్యులలో, కృష్ణునిలో, హంతకునిలో, పిచ్చివానిలో, సామాన్యునిలో అందరిలో సమానంగానే ఉన్నా వారి మనోబుద్ధుల కారణంగా వేరువేరుగా ప్రకాశిస్తున్నాడు. అందుకే మహాత్ములు, గురువులు పూజలందుకుంటున్నారు; హంతకులు, దుర్మార్గులు జైలుకు వెళుతున్నారు; సామాన్యులు సాధారణ జీవితం గడుపుతారు.

<u>2.నమేద్వేష్యోఽస్తి నప్రియః</u>:- భగవంతుని దృష్టిలో అందరూ సమానులే. భక్తులైనా, జ్ఞానులైనా, పుణ్యాత్ములైనా, పాపాత్ములైనా, దుర్మార్గులైనా, ఛండాలురైనా, ఎవరైనా సరే సూర్యుని కాంతిని, చంద్రుని చల్లదనాన్ని, ప్రాణవాయువును, నీటిని - అందరూ సమానంగా పొందవచ్చు.

ఐతే కొందరు యోగులుగా, కొందరు భోగులుగా, కొందరు రోగులుగా, కొందరు దరిద్రులుగా, కొందరు భాగ్యవంతులుగా ఉంటున్నారే. వారినలా

పుట్టించిన భగవంతునికి రాగద్వేషాలు లేవా? అందరినీ సమానంగా చూస్తే ఈ భేదాలెందుకు వచ్చినట్లు? ఎందుకంటే పరమాత్మ అందరినీ సమానంగా చూసినా పరమాత్మను అందరూ ఒకే దృష్టితో చూస్తున్నారా? అందరి మనోబుద్ధులు ఒక్కటిగానే ఉన్నాయా? లేదే. ఎవరి దారి వారిది? ఎవరి మనస్తత్వం వారిది. ఎవరి మనోబుద్ధులు వారివి.

సినిమాకు వెళ్ళి రిజర్వుడులో ప్రక్కప్రక్కనే కూర్చున్నారు భార్యాభర్తలు. భార్య చక్కగా సినిమా చూస్తున్నది. భర్తకేమీ కనిపించటం లేదు. దీనికి కారణం ఆయన కళ్ళకు దృష్టి దోషం ఉన్నది. సినిమాలో ఏ తేడా లేదు.

వేకువ జామున చలికాలంలో చలిమంట వేసుకుంటారు చాలామంది. అది ఎవరికైనా వేడినిస్తుంది. దానికే పక్షపాతం లేదు. అయితే ఎవరు సమీపంగా కూర్చుంటారో వారికి చలిదూరం. ఎవరు చాలా దూరంగా కూర్చుంటారో వారిని చలి వదిలిపెట్టదు. ఆ చలిమంటకు ఒకరిపై రాగం, ఒకరిపై ద్వేషం ఉన్నదా?

వృక్షం ఎవరికైనా నీడనిస్తుంది. దానికి ఏ పక్షపాతం లేదు. ఎవరు దాని క్రిందకు వెళతారో వారికే నీడ. దూరంగా ఉన్నవారికి నీడ లేదు.

సూర్యుడు అందరికీ వెలుగునిస్తాడు. కాని గ్రుడ్డివాడు వెలుగును చూడలేడు. అంతమాత్రాన సూర్యునికి గ్రుడ్డివాడంటే ద్వేషమా?

అద్దం ఎవరి ప్రతిబింబాన్నైనా చూపిస్తుంది. అందంగా ఉన్న అమ్మాయి అద్దం ఎదురుగా నిలబడితే అందులో ఆమె అందమైన రూపం కనబడుతుంది. పళ్ళూడి పోయి, శరీరం ముడుతలు పడి, జుట్టు నెరిసి, అనాకారంగా ఉన్న

ముసలమ్మ అదే అద్దం ముందు నిలబడి నారూపాన్ని అలా అందంగా చూపలేదే; అద్దానికి ఎంత పక్షపాత బుద్ధి? నేనంటే ఎంత ద్వేషం? అంటే కుదురుతుందా?

అలాగే పరమాత్మకు ఏ భేదదృష్టి లేదు. ఆయనకు అందరూ సమానులే భేదమంతా మనలోనే. మన మనోబుద్ధులలోనే. దోషం మనలో ఉంచుకొని ఆయనలో మచ్చలున్నాయంటే ఎలా?

మరి కొందరు సుఖాలు, కొందరు దుఃఖాలు ఎందుకు అనుభవిస్తున్నారు?

- పూర్వంలో పుణ్యం చేసుకున్నవారు ఇప్పుడు సుఖాలు అనుభవిస్తున్నారు.
- పూర్వంలో పాపకృత్యాలు చేసుకున్నవారు ఇప్పుడు దుఃఖాలు అనుభవిస్తున్నారు. వారివారి కర్మలను బట్టే వారికి ఫలితాలు. అయ్యో! నా ఎదురింటి వాడికి ఎన్నో సంపదలున్నాయి. నాకెందుకీ దరిద్రం? అని బాధ పడితే ప్రయోజనం లేదు. పూర్వం చేసిన పుణ్యానికి, దానధర్మాలకు అతడిప్పుడు సంపదలననుభవిస్తున్నాడు. నీవు చేసిన పాపకర్మల ఫలితంగా దరిద్రం అనుభవిస్తున్నావు. ఇందులో భగవంతుని పక్షపాతం ఏమీ లేదు. కనీసం వచ్చే జన్మలోనన్నా సుఖభోగాలు అనుభవించాలనుకుంటే ఇప్పుడు సత్కార్యాలు, పుణ్యకార్యాలు, దానధర్మాలు చెయ్యి. నీ భవిష్యత్తు నీ చేతుల్లోనే ఉంది. భగవంతునికి ఏ రాగద్వేషాలు లేవు.

**3.యేమాం భక్త్యా భజంతి తేమయి, అహంతేషు:- ఎవరు నన్ను భక్తితో సేవిస్తారో వారు నాయందు, నేను వారి యందు ఉంటాను. భగవంతుని అనన్యభక్తితో భజించాలి. భక్తుని హృదయంలోనే భగవంతుడు ప్రకాశిస్తాడు. అందుకే నేను వారి యందుంటాను అంటున్నాడు. వారి మనస్సులో ఎప్పుడూ భగవంతుడే గనుక నేను వారియందు ఉంటాను అన్నాడు. అట్టి వారిలోనే ఆయన ఉండేది.**

**భగవంతుడు వారిలో ఉన్నాడు గనుక వారి శరీరమే దేవాలయం. అందులోని ఆత్మయే భగవంతుడు. కనుకనే వారు పూజనీయులు. అందుకే భగవంతుడు అంటున్నాడు నాకూ నా భక్తునికీ భేదం లేదు - అని. అంటే భక్తుడే భగవంతుడయ్యాడు.**

**మరి వారు నా యందున్నారు - అంటే -**

**ఎవరైతే అహంకార మమకారాలు విడిచి, మనస్సును బాహ్యావిషయాల నుండి మరలించి, అంతర్ముఖం చేసి, తనలోని పరమాత్మ తత్త్వాన్ని అన్వేషిస్తూ, తదేకంగా ఆత్మవిచారణ చేస్తాడో, అతడు పరమాత్మను స్మరించి, స్మరించి, నిరంతర ధ్యానంలో అతడి మనస్సు పరమాత్మలోనే ఆత్మగానే మిగిలిపోతాడు. అంటే అతడు పరమాత్మలోనే ఉండిపోయాడు. అదే తేమయి - వారు నాలోనే ఉంటారు అంటే.**

**అట్టి మహాత్ముల దర్శనం చేత, స్పర్శనం చేత అలౌకిక ఆనందం కలుగుతుంది. మనస్సు తనలో లయం అయింది గనుక వారు నాలోనే ఉంటారు అన్నాడు.**

**భగవంతుని ఎవరు భజిస్తారో వారు పరమాత్మకు దగ్గరవుతారు. నిజమే. మరి పాపాత్ములు, దురాచారులు అయినవారు ఎప్పటికీ భగవంతుని చేరుకొనే అవకాశం లేదా?**

**దుర్మార్గులు, దుష్టులు, పాపాత్ములు అయినవారు పరమాత్మవైపుకు తిరిగి, ఆయనకు చేరువయ్యే మార్గమేమైనా ఉన్నదా? లేదా? -30వ శ్లోకంలో -**

**శ్లో||** అపిచేత్సు దురాచారః భజతే మా మనన్య భాక్|

సాధురేవస మంతవ్యః సమ్యగ్వ్యవసితో హిసః|| **(30)**

**తా||** పరమ దుర్మార్గుడైనప్పటికి నన్ను అనన్యభక్తితో సేవిస్తే - భజిస్తే అతడు సాధువుగానే పరిగణించబడతాడు. ఎందుకంటే అతడు స్థిరమైన మనో నిశ్చయం కలిగి ఉన్నాడు గనుక.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకాన్ని అపార్థం చేసుకొనే వీలుంది. అలా అపార్థం చేసుకుంటే అనర్థమే. పరమపాపాత్ములు కూడా భగవంతుని సేవిస్తే సత్పురుషులుగా పరిగణింపబడతారు గనుక చేయరాని పాపాలన్నీ చేసి దేవుడికి ఘనంగా పూజలు జరిపిస్తే పాపాలు తొలగి పోతాయి అని భావించే వీలుంది. ఈ భావన సరికాదు. ఎందుకంటే ఇందులో మానసిక పరివర్తన గాని, పశ్చాత్తాపం గాని లేవు. కనుక పాపాలన్నీ అలాగే ఉంటాయి. పైగా భగవంతుణ్ణి మోసగించాలనే ఊహ ఉన్నది గనుక చెడ్డవాసనలు పేరుకొని మరింతగా పతనం కావటమే జరుగుతుంది. కనుక ఈ శ్లోకాన్ని ఘోరమైన పాపాలు

చేయటానికి లైసెన్స్ గానో, పర్మిషన్ గానో భావించరాదు. కావాలని పాపాలు చేసి సత్పురుషులుగా చలామణి అవుదామనుకొనే వారికి ఆధ్యాత్మిక రంగంలో స్థానం లేదు. మరెందుకు చెప్పినట్లు?

స్వార్థంకోసమో, సుఖభోగాలకోసమో, అజ్ఞానంతోనో, అలవాటుగానో, ఆలోచించకుండా పాపాలు, ఘోరాలు, నేరాలు చేసేవారు ఎప్పుడో ఒకప్పుడు, ఎవరో ఒకరి ద్వారా తాము చేసిన పాపాల గురించి, వాటి ఫలితాల గురించి తెలుసుకొని, పశ్చాత్తాపం చెంది, ఇకనైనా సన్మార్గంలో నడవాలని, ఉత్తమజీవితాన్ని గడుపుదామని నిర్ణయించుకొని, అందుకు ప్రయత్నించే వారి కోసం ఈ శ్లోకం చెప్పబడింది.

పాపాలు చేసిన వాడెప్పుడూ పాపిగానే ఉండవలసిన పనిలేదు. అతడూ మారవచ్చు, సత్పురుషుడు కావచ్చు, భక్తుడు కావచ్చు, భగవంతుని అనుగ్రహాన్ని పొంది భగవంతుని చేరవచ్చు అని చెప్పటానికే ఈ శ్లోకం.

వేదాలు పాపాన్ని నిరశిస్తున్నాయే గాని, పాపిని కాదు. ఎలాంటి వాడైనా తన తప్పు తెలుసుకొని, పాప జీవితాన్ని వదలి ఉన్నతమార్గంలో ప్రయాణిస్తుంటే ఇంకా అతణ్ణి పాపి అనటం సమర్థనీయమా? ఒక వ్యక్తి జబ్బు చేసి హాస్పిటల్ లో ఉన్నప్పుడు డాక్టర్లు గాని, ఇతరులు గాని అతణ్ణి 'పేషంటు' అంటారు. ఐతే అతడు జబ్బు తగ్గిపోయి ఇంటికి వెళ్ళిన తర్వాత కూడా అతణ్ణి చూచినవారు పేషెంటు అంటారా? లేదే.

అలాగే పాపపుపనులు, దుర్మార్గాలు చేసినవాణ్ణి పాపి, దుర్మార్గుడు అంటారు. అది సహజం. ఐతే అతడు పశ్చాత్తాపంలో పనులు మాని,

సత్కార్యాలు చేస్తుంటే, పుణ్యకార్యాలు చేస్తుంటే, భక్తుడుగా ఉంటే ఇప్పుడు కూడా 'పాపి' దుర్మార్గుడు అంటారా? అనరు. అనకూడదు కూడా.

పశ్చాత్తాపంతో పాపకార్యాలు వదిలినవాడు పుణ్యాత్ముడు కావచ్చు. దుర్మార్గుడు సన్మార్గుడు కావచ్చు. అందుకే ఈ శ్లోకంలో సుదురాచారః - ఒట్టి పాపాత్ముడు కాదు. మహాపాపాత్ముడైనా సరే పుణ్యాత్ముడుగా మారవచ్చు అని చెప్పటం జరిగింది.

ఎలా అవుతాడు పుణ్యాత్ముడు?

అనన్యభాక్:- అనన్య భక్తుడైతే. ఇతరత్రా దేని మీదకు మనస్సు పోకుండా, పూర్తిగా పరమాత్మ మీదనే మనస్సు నిల్పి సేవించినట్లైతే అతడు సత్పురుషుడే అవుతాడు. ఇంతవరకు అతడి మనస్సు అన్యాయాలు, అక్రమాలు, పాపకార్యాలు, మోసాలు, దుర్మార్గాల పైనే నిలిచింది. ఇప్పుడు ఎవరో ఒక మహాత్ముని సాంగత్యం వల్ల తప్పు తెలుసుకున్నాడు. కనుక తిరిగి ఆ తప్పు మీదకు మనస్సు పోకుండా పరమాత్మ పైకి మళ్ళించాలి. నిరంతరం భగవచ్చింతన చేయాలి. అప్పుడే అతడు సత్పురుషుడౌతాడు.

రత్నాకరుడు పరమ కిరాతకుడు. దారి దోపిడీలు చేసేవాడు. ఎదురు తిరిగిన బాటసారులను చంపి, వారి దగ్గరున్న సొమ్ముకాజేసేవాడు. ఒకనాడు నారదుడు ఆ మార్గంలో వస్తున్నాడు. ఆయనొక పరివ్రాజకుడు. నిరంతర నారాయణ నామస్మరణలో ఉండేవాడు. తిరుగుతూ తిరుగుతూ పాడుతుంటాడు, పాడుతూ పాడుతూ తిరుగుతుంటాడు. రత్నాకరుడు ఎదురయ్యాడు. కత్తిని పైకెత్తి నీ దగ్గరున్న మూటను అక్కడ పెట్టు అన్నాడు.

నారదుడికి జంకూ గొంకూ లేదు. అలాగే నారాయణ, నారాయణ అంటూ నిలిచాడు. రత్నాకరుడికి ఇది విచిత్రంగా ఉన్నది. ఇంతవరకు 2 రకాల మనుషులను చూచాడు. భయపడి పరుగెత్తేవారు ఒకరకం, ఎదురుతిరిగి పోరాడే వారు మరోరకం. అయితే ఈ విచిత్రవ్యక్తి భయపడలేదు, ఎదురు తిరగలేదు, పారిపోలేదు. నిశ్చలంగా నిలబడ్డాడు.

ఇంతవరకు భయమంటే ఏమిటో తెలియని రత్నాకరుడు నారదుడు అనే అద్దంలో తనను చూచుకున్నాడు. తన భీభత్సరూపానికి తానే భయపడ్డాడు. అదే సత్పురుషుల సాంగత్యమహిమ.

పరమపాపి రత్నాకరుడు నారదమహర్షి కృపతో ఆదికవి వాల్మీకి అయ్యాడు. రామాయణ మహాకావ్యాన్ని వ్రాశాడు. అగ్నిని ముట్టుకుంటే జొన్నగింజ తెల్లగ అవుతుంది. అలాగే మహాత్ముల సాంగత్యంతో పాపాత్ములు మహర్షులౌతారు. ఇప్పుడు వాల్మీకి మహర్షిని పాపాత్ముడు - క్రూరుడు - బందిపోటు అంటారా ఎవరైనా? అనరు. ఆయన సాధువు, మహర్షి. అందరూ పూజించి గౌరవిస్తారు.

ఎంతటి పాపాత్ముడైనా తన మనస్సు మార్చుకొని, సరైన విధానంలో ప్రవర్తిస్తుంటే; దుర్మార్గాలు చేయక, సన్మార్గంలో ఉంటే అతడు సాధువే. సత్పురుషుడే.

సమ్యక్ + వ్యవస్థితః స్థిరమైన మనోనిశ్చయం కలవాడైనందున అతడు సత్పురుషుడే. ఒకప్పుడు ఎలా వ్యవహరించినా అతడిప్పుడు ఆ మార్గాన్ని వదలి ఉన్నతమార్గంలో ఉన్నందున అతడు సత్పురుషుడే.

అయితే పాపాత్ముని పాపాలు తొలగి పుణ్యాత్ముడౌతాడా? లేదు. చేసిన పాపాలు మాత్రం తొలగిపోవు. ఇక పాపవాసనలు పశ్చాత్తాపంతో తొలగిపోతాయి. పుణ్యకర్మల వల్ల పుణ్యవాసనలు చేరుకుంటాయి. దానితో పాపాత్ముడు పుణ్యాత్ముడౌతాడు. కానీ ఇంతకుముందు చేసిన పాపకర్మల ఫలం ఉందికదా! అది మాత్రం అనుభవించి ఖర్చుచేసుకోవాల్సిందే. అందుకే ఎంతటి భక్తుడైనా, మహాత్ముడైనా అప్పుడప్పుడూ ఈ కర్మఫలాలు అనుభవిస్తూ ఉండటం చూస్తుంటాం. అయితే వారు భక్తితో ఉంటారు గనుక అనుభవించే శక్తి, భరించే శక్తి వారికి ఉంటుంది. అదే భగవత్ కృప.

కనుక ఎంతటి పాపాత్ములైనా భయపడవలసినది లేదు. అయ్యో! ఇంతటి అకృత్యాలు, అన్యాయాలు చేశాను గదా! నాకు నిష్కృతి ఏది? అని తమలో తాము కుమిలి పోవాల్సిన పనిలేదు. తాము కూడా భగవంతుని అనుగ్రహాన్ని పొందగలమనే ధైర్యంతో చేసిన తప్పులకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం చెంది, తిరిగి అలాంటి పనులు చేయకుండా, వాటి వైపుకు మనస్సు పోకుండా భగవంతుని ఆశ్రయించాలి. అట్టివారికి కలిగే ఫలితం ఏమిటి?

- ఎంతటి దుర్మార్గులైనా వారు చేసిన పనులకు పశ్చాత్తాపం చెంది, అనన్యభక్తితో భగవంతుని భజిస్తే వారు సాధుపురుషులు గానే పరిగణింపబడతారు. అట్టివారికి కలిగే ఫలితం ఏమిటో తరువాతి శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో||** క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి|
కౌంతేయ! ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి|| **(31)**

**తా||** కౌంతేయా! అతడు వెంటనే ధర్మాత్ముడై శాశ్వత శాంతిని పొందుతాడు. నా భక్తుడు ఎన్నటికీ నశించడని చాటించు.

**వ్యాఖ్య:-** క్షిప్రం ధర్మాత్మా భవతి:- అతడు వెంటనే ధర్మాత్ముడౌతున్నాడు. ఎందుకు? అతడు పూర్వం దుర్మార్గుడై దుష్టకార్యాలు చేసినవాడైనా ఇప్పుడు పశ్చాత్తాపం చెంది భగవంతుని వైపుకు తిరిగాడు. సత్పురుషుల సాంగత్యం వల్ల లేదా దైవకృప వల్ల తన చర్యలు దుష్టమైనవని తెలుసుకొని తిరిగి అలాంటి పనులు చేయకుండా సత్కార్యాలే చేస్తున్నాడు. అతడి మనస్సు పూర్తిగ భగవంతుని యందే నిలిచి ఉంటున్నది. కనుక అతడు ధర్మాత్ముడే అవుతున్నాడు. అలా ధర్మాత్ముడు కావటం వల్ల ఫలితం ఏమి?

శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి:- శాశ్వత శాంతిని పొందుతున్నాడు. భగవంతుని యందు అనన్యభక్తి కలగటంతోనే అతడు శాంతిని కూడా పొందుతాడు. సాధారణంగా లౌకికవిషయాలన్నీ - అవి ఎలాంటివైనా సరే అశాంతిని ఇవ్వకమానవు. కాని భగవత్ సంబంధమైన విషయాలు గాని, ఆలోచనలు గాని, కార్యక్రమాలు గాని ఎంతో ఆనందాన్ని, శాంతిని కలిగిస్తాయి. శాంతి ఎక్కడుంటుంది? నిజంగా శాంతి మనలోనే ఉంది. దానికి మనం లౌకిక వ్యవహారాలతో అడ్డంకులు కల్పిస్తున్నాం. అందుకే అశాంతి.

ఇప్పుడు ఏ సమస్యా లేకుండా హాయిగా ఉన్నావు. ఇంతలో ఒక ఆలోచన వచ్చింది. "ఇప్పుడు దొంగతనాలు ఎక్కువైనవి; దోపిడీలు కూడా

విపరీతంగా జరుగుతున్నాయి; నాకు ఈ దొంగల భయం లేకుండా ఉంటే బాగుంటుంది" అనుకున్నావు. అంతే అశాంతి. ఇలా అశాంతి నీ ఆలోచనల వల్ల వస్తుంది; శాంతి నీలోనే ఉన్నది.

'తళతళ లాడే తెలుపు' 'మిలమిల లాడే మెరుపు' కొత్త 'RIN' అని ప్రచారం చేస్తారు. ఆ సబ్బు రంగుబట్టలను తెల్లగా చేస్తుందా? లేదు. తెల్లబట్టనే తెలుపు చేస్తుంది. అంటే తెల్లటి బట్ట మురికి అయినప్పుడు ఆ సబ్బు మురికిని పోగొట్టి తెలుపు చేస్తుంది. అంతే. అంటే తెలుపు అనేది సబ్బులో లేదు. బట్టలోనే ఉంది.

అలాగే శాంతి అనేది మనలోనే ఉంది. భక్తిలో లేదు. భక్తి సబ్బు లాంటిది. మనలో ఉన్న శాంతిని మనం పొందకుండా చేస్తున్న ఆటంకాన్ని (మురికి ఆలోచనలను) తొలగిస్తుంది. అంతే. అందుకే భక్తుడు శీఘ్రమే శాంతిని పొందుతున్నాడు అని చెప్పటం.

- దృశ్యం వెంటబడితే శాంతి దూరమవుతుంది.
- దైవం వెంటబడితే శాంతి దగ్గరవుతుంది.

దీనిని బట్టి ఎంతటి పాపాత్ముడైనా సరే తన తప్పులకు పశ్చాత్తాపం చెంది, సన్మార్గంలో నడవాలని నిశ్చయించుకొని, అనన్యభక్తితో భగవంతుని సేవిస్తే 2 ప్రయోజనాలున్నాయి. అవి.

1.ధర్మాత్ముడౌతాడు.

2.శాశ్వత శాంతిని పొందుతాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అయితే ఈ పశ్చాత్తాపం హృదయ పూర్వక పశ్చాత్తాపం కావాలి. పైపై నటన అయితే పాపాలు కూడా పైపైన పోయినట్లే ఉంటాయి. నిజంగా పోవు. శాంతి కూడా ఒట్టొట్టి శాంతే అవుతుంది.

క్రొత్తగా పెళ్ళయిన దంపతులు ఒక ఊరిలో కాపురం పెట్టారు. భర్త బ్యాంకులో ఉద్యోగం చేస్తుంటాడు. భార్య మాత్రం ఇంటి పనులు చూసుకుంటూ ఉంటుంది. హాయిగా ఆనందంగా కాలం గడుపుతున్నారు. ఇంతలో వారి దూరపు బంధువు ఒకాయన ఏదో పని ఉన్నదని ఆ ఊరు వచ్చి, వీరి అడ్రసు తెలుసుకొని వీరింటికి వచ్చాడు. రెండు రోజులు, 3 రోజులు చూశారు. ఆయన వెళ్ళేటట్లు కనిపించలేదు. అసలు ఆయనకొక పేరుంది. ఎవరింటికి వెళ్ళినా బంకలా అతుక్కుపోతాడు; ఎన్నాళ్ళైనా వెళతాననడు - అని. ఈ సంగతి వారికి తెలిసి ఏం చేయాలి? అని రాత్రింబవళ్ళు 4 రోజులు ఆలోచించారు. పని అయిందా? అయిందా? అని అడిగితే ఇంకా కాలేదు. 2 రోజుల్లో అయిపోతుందిలే అంటున్నాడు. 10 రోజులు దాటింది. కాని ఆయన వెళ్ళే సూచనలేమీ లేవు. చివరకు భార్యా భర్తలిద్దరూ ఒక నిశ్చయానికి వచ్చి ఆ ఆలోచనలను అమలులో పెట్టాలనుకున్నారు.

ఆ బంధువు ఇంటికి వచ్చే సమయానికి భార్యాభర్తలిద్దరూ తగవు పెట్టుకున్నారు. పోట్లాట తారస్థాయికి చేరింది. భార్య భర్తను నోటికి వచ్చినట్లు తిడుతున్నది. భర్త భార్యను ఆ చెంపా, ఈ చెంపా వాయిస్తున్నాడు.

వాళ్ళ గొడవ చూచిన బంధువు సర్ది చెప్పబోయాడు. ఇద్దరూ ఆయన్ను కసురుకున్నారు. ఇక పోట్లాట ఆపేటట్లు లేకపోవటంతో ఆయన పెట్టే బేడా

సర్దుకొని చల్లగా జారుకున్నాడు. ఆయనలా వెళ్ళాడో లేదో వెంటనే భార్య భర్తతో అంటున్నది, "నేను మిమ్మల్ని తిడతానా! రామ రామ! ఊరికే అలా తిట్టినట్టు తిట్టాను గాని" అన్నది. దానికా భర్త, "నేను నిన్ను కొడతానా డియర్! ఊరికే అలా కొట్టినట్లు కొట్టాను గాని" - అన్నాడు. వెంటనే తలుపు చాటు నుంచి బంధువు లోపలకొచ్చి నేను మాత్రం అలా వెళతానా నాయనా! ఏదో అలా ఊరికే వెళ్ళినట్లు వెళ్ళాను గాని" - అన్నాడట. అలా అంటూ దర్జాగా లోపలకు వచ్చి పెట్టే బేడా అక్కడ పెట్టి సోఫాలో కూర్చున్నాడు.

కనుక ఏదో పైపైన నటనకు చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెందినట్లు చెందితే ప్రయోజనం లేదు. హృదయపు లోతుల్లో నుంచి ఆవేదన కలగాలి. నిజంగా పశ్చాత్తాపం చెందాలి. అప్పుడే నిజంగా పాపాలు తొలగిపోయేది.

<u>మేభక్తః న ప్రణశ్యతి:-</u> నా భక్తుడెన్నటికీ చెడడు. ఇది భగవంతుని ప్రతిజ్ఞా వాక్యం. ఎందుకీ ప్రతిజ్ఞ? కొందరు లౌకిక రంగం నుంచి నిష్క్రమించి ఆధ్యాత్మిక రంగంలో ప్రవేశించి; "మన లాభాలు, సంపదలు, సుఖాలు వదులుకొని వస్తే శాశ్వత శాంతి నిజంగా లభిస్తుందా? ఆనందం కలుగుతుందా?" అని సందేహిస్తారు. అలాగే దుష్టులు, పాపులు కూడా మహాత్ముల ప్రభావానికి లొంగి ఈ మార్గంలోకి వస్తారు. అలాంటివాడు నేను ఇంత పాపాత్ముణ్ణి కదా! నాకు మంచి జరుగుతుందా? భగవంతుడు నన్ను క్షమిస్తాడా? అని సందేహిస్తూ ఉంటాడు. అలాంటి సంశయస్తులకు ధైర్యం కలిగించి, వారి సందేహాలు నివారించి, వారికి ఆశ్వాసన కలిగించేందుకు, ప్రోత్సాహాన్నిచ్చేందుకు ఇక్కడ భగవానుడు నా భక్తుడెన్నటికీ చెడడు - అని

ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాడు. అంతే కాదు. ఈ ప్రతిజ్ఞను చాటింపు వెయ్యమంటున్నాడు అర్జునునితో -

కౌంతేయ! ప్రతిజానీహి:- "ఓ అర్జునా! నా భక్తుడెన్నటికీ చెడడు" - అని నాలుగు రస్తాలు కలిసిన చోట నిలబడి, "డాండ డడాండ డాండ నినదంబు లజాండము నిండ మత్త వేదండము నెక్కి చాటు" ఫరవాలేదు - అని ఢంకా బజాయించి చెబుతున్నాడు.

శ్రీకృష్ణుని ఉత్సాహం ఎలా ఉప్పొంగుతున్నదో ఈ పదం ద్వారా తెలుస్తున్నది. తాను చెబుతున్న విషయాలను ఆశ్చర్యంతో నోరు తెరుచుకొని వింటున్న అర్జునుని వీపు తట్టి - "ఫో! పోయి చెప్పు. నా భక్తుడెన్నటికీ చెడడు"- అని అందరికీ ప్రతిజ్ఞచేసి చెప్పు - అని ఆజ్ఞాపిస్తున్నాడు. ఇక ఈ విషయంలో ఎవరికీ ఎట్టి సందేహము అవసరం లేదని తెలుసుకోవాలనే భగవంతుని నిశ్చయం.

"ప్రతిజానీహి" అనే పదానికి 2 అర్థాలున్నాయి. నీవు తెలుసుకో - అని ఒక అర్థం. ఇతరులకు తెలియజెయ్యి అని 2వ అర్థం. ఇది లోకంలోని జనులందరికీ భగవంతుడు ఇస్తున్న గొప్పహామీ.

ఇంతవరకు పరమ దుర్మార్గులైనా భగవంతుని అనన్యభక్తితో సేవించి సాధుపురుషులై తరించవచ్చునని చెప్పిన భగవానుడు, పుట్టుకతోనే పాపులైనా - ఎలాంటి వారైనా సరే పరమగతిని చేరుకోవచ్చునని స్పష్టం చేస్తున్నారు.

**శ్లో||** మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః|

స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః తేఽపి యాంతి పరాంగతిం|| **(32)**

**తా||** అర్జునా! పాపయోనులందు జన్మించిన వారుగాని, స్త్రీలు వైశ్యులు శూద్రులు గాని ఎవరైనా సరే నన్ను ఆశ్రయించినచో వారు కూడా పరమగతిని పొందుతారు.

**వ్యాఖ్య:-** సమస్త ప్రాణులపట్ల భగవంతుని ఔదార్యం, సమభావం ఎలాంటిదో ఈ శ్లోకం ద్వారా ఋజువుచేస్తున్నారు.

తలనొప్పికి అమృతాంజన్ లేదా జండూబామ్ అనే మందులున్నాయి. తలనొప్పి వచ్చిన వారు పుణ్యాత్ములైనా, పాపాత్ములైనా, స్త్రీలైనా, పురుషులైనా, ఏ జాతివారైనా, ఏ కులంవారైనా, ఏ మతం వారైనా - ఎవ్వరైనా సరే ఆ మందు వాడితే తలనొప్పి తగ్గిపోతుంది.

అలాగే భవరోగంతో జీవించేవారు ఎవరైనా సరే భగవద్భక్తి అనే మందు వాడితే సరి. వారి భవరోగం తగ్గిపోతుంది.

ఈ శ్లోకాన్ని వివరించే వ్యాఖ్యాన కర్తలు కొందరు 'పాపయోనయః' అనే పదాన్ని 'స్త్రీ వైశ్యశూద్రాః' అనే పదాలకు విశేషణగా చెప్పారు. అంటే పాపయోనులందు జన్మించిన స్త్రీలు గాని, వైశ్యులు గాని, శూద్రులు గాని అని. అంటే స్త్రీలు, వైశ్యులు, శూద్రులు పాపాత్ములని - అంటే పాపయోనులందు జన్మించిన వారని దీనిభావం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ భావం ఎంత ఘోరమైన తప్పిదమో ఏ మాత్రం మానవత్వంతో ఆలోచించేవారికైనా తెలుస్తుంది. ఇది శ్రీకృష్ణుని భావానికి, వ్యాసమహర్షి భావానికి విరుద్ధమని వేరే చెప్పనక్కరలేదు.

'స్త్రీ' అంటే సాధారణంగా మనం భావించే స్త్రీలని; వైశ్యశూద్రులంటే ఆయా కులాలలో జన్మించిన వారని భావిస్తే అంతకంటే అజ్ఞానం, మూర్ఖత్వం మరొకటి ఉండదు. వారి జన్మలు పాపజన్మలు అనటం కన్న ఘోరమైన పాపం మూర్ఖత్వం, అజ్ఞానం, బుద్ధిహీనత మరొకటి ఉండదు.

ఇలా గనుక భావిస్తే స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మానవ జాతిలో హీనజాతి వారైనట్లు, బ్రాహ్మణ, క్షత్రియ జాతులు - అందులోనూ కేవలం పురుషులు మాత్రమే పుణ్యాత్ములైనట్లు అనుకోవాల్సి వస్తుంది.

1.స్త్రీ:- (i) అలా స్త్రీలను హీనజాతి వారుగా భావిస్తే వారికి జన్మించే మహాత్ములు, మహాపురుషులు ఎవరౌతారు? వారు కూడా హీనజాతి వారేనా?

(ii) బ్రాహ్మణజాతి పుణ్యజన్ములైతే మరి ఆ జాతిలోని స్త్రీలు హీనజాతి వారా? పాపజన్ములా? అంటే ఆ పుణ్యజన్ములకు జన్మనిచ్చిన వారు పాపజన్ములా?

(iii) స్త్రీలు హీనజాతి వారైతే యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించేటప్పుడు భర్తతో పాటు విధిగా భార్య కూడా పాల్గొనాలని శ్రుతులలో చెప్పబడి ఉన్నది గదా! హీనజాతి వారికి ఆ అవకాశం ఎలా కలిగింది?

(iv) సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి, లోపాముద్ర మొ||న మహా పతివ్రతలు గాని; గార్గి, చూడాల మొ||న మంత్రద్రష్టలు గాని పాపయోనులా?

(v) ఈ పాపిష్టి కలియుగంలో భగవంతుడు, భక్తి, ధర్మం, కర్మం కాస్తో కూస్తో మిగిలి ఉన్నాయంటే అట్టి పతివ్రతామతల్లులైన స్త్రీల యొక్క మహిమయే కారణం. పాశ్చాత్య ప్రభావంతో పురుషులు, ధర్మభ్రష్టులైనా స్త్రీలు మాత్రం సనాతన ధర్మాన్ని కాపాడుతూనే ఉన్నారు.

అట్టి స్త్రీ మూర్తులను పాపాత్ములని అనటానికి వారిది గుండెయా? లేక ఇనుపగుండా?

2. వైశ్య:- వేదాధ్యయనం చేసే అధికారం, యజ్ఞయాగాది క్రతువులు చేసే అధికారం వైశ్యులకున్నది. భారత దేశమంతటా వారి దానధర్మాలు ప్రసిద్ధం. అట్టి ధర్మగుణం కలిగిన, వేదాధ్యయన అధికారం గలిగిన వైశ్యులు పాపజన్ములు అనటం తగునా?

3.శూద్ర:- ఎందరో మహాత్ములు, మహానుభావులు, భక్తులు శూద్రులలో ఉన్నారు. దానధర్మాలలో, పరోపకారంలో, సేవలలో ప్రసిద్ధులైన శూద్రులు ఎందరో ఉన్నారు. విదురుడు, సంజయుడు, గుహుడు, సుదాముడు, శబరి, ధర్మవ్యాధుడు, తిన్నడు మొ||న వారు శూద్రులే. అట్టివారిని పాపజన్ములు అనటం - పాపాత్ములు అనటం తగునా?

కనుక ఎట్టి పరిస్థితులలోను వారిని పాపాత్ములు అన్నారంటే అలా అన్నవారి కన్నా పాపాత్ములు మరెవరూ ఉండరు. వారిని పాపాత్ములు అనటం కన్న ఘోరమైన పాపం మరొకటి ఉండదు.

ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి, విభీషణుడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, గుహుడు, నందుడు, గజరాజు, జటాయువు, ధర్మవ్యాధుడు, గోపికలు, కబీరు,

శబరి మొ||న వారు ఎందరో భక్తితో - సేవలతో భగవంతుని పొందినవారే. వీరిలో రాక్షసులున్నారు, కోతులున్నాయి, ఏనుగులు, పక్షులు, స్త్రీలు, వైశ్య, శూద్రులు ఉన్నారు. కనుక స్త్రీ, వైశ్య, శూద్రులు పాపాత్ములు అని నిర్ణయించటం ఘోరతప్పిదం. అలా వ్యాఖ్యానించేవారు భగవంతునికి ద్రోహం చేసినవారే. భగవంతుని భావాలకు విపరీత వ్యాఖ్యానాలు చేసినవారే. భగవంతుని ఉద్దేశాన్ని తెలుసుకోలేని అజ్ఞాన చక్రవర్తులే.

మరైతే పాపాత్ముల గురించి చెబుతూ స్త్రీ వైశ్యశూద్రుల గురించి ఎందుకు చెప్పినట్లు? ఆ పదాల యొక్క అసలైన అర్థం వేరే ఉంది.

మానవులలో జ్ఞానాన్ని మరుగుపరిచే లక్షణాలు కొన్ని ఉన్నాయి. వాటికి సంకేతాలే స్త్రీవైశ్యశూద్ర పదాలు. అంతేగాని అవి లింగభేదానికి కులభేదానికి సంబంధించినవి కావు.

(i) మనస్సు ఉద్రేక పూరితం అవటం వల్ల; మమకారం, అనురాగం, జాలి, దయ, రాగం, ద్వేషం, అసూయ - మొ||న మనోవికారాల వల్ల వివేకం మరుగుపడే వాళ్ళను స్త్రీలు అంటారు. వారిలో స్త్రీలు పురుషులు అందరూ ఉంటారు.

అంటే ఎవరికైతే బలం తక్కువగా ఉండి, అన్నింటికీ విపరీతంగా స్పందిస్తూ ఉండే స్త్రీ పురుషులను ఇక్కడ స్త్రీ అనే పదంతో చెబుతున్నారు.

ఆత్మీయులకు బాధ కలిగితే వలవల ఏడవటం, ఇష్టమైన వారిపై ఎంతో ప్రేమను చూపటం, ఇష్టం లేనివారిపై కోపం ప్రదర్శించటం, అసూయ, ద్వేషం - ఇవి సాధారణంగా స్త్రీలలో ఎక్కువగా ఉంటాయి. కొందరు

పురుషులలో వారి కన్నా ఎక్కువగానే ఉంటాయి. ఈ లక్షణాలు ఎవరిలో ఉంటే వారు స్త్రీలే.

(ii) సంపదలు ప్రోగుచేయటం, ప్రతి విషయాన్ని వ్యాపార బుద్ధితో చూడటం, లాభనష్టాల బేరీజు వేయటం మొ||న లక్షణాలు ఎవరిలో ఉంటే వారే వైశ్యులు. ఈ లక్షణాలవల్ల వారిలో వివేకం నశిస్తుంది. అంతేగాని వైశ్యకులంలో పుట్టటం కాదు.

బ్రాహ్మణకులంలో పుట్టినవాడు వ్యాపారం చేస్తే వైశ్యుడు. ఉద్యోగం చేస్తే శూద్రుడు. పెళ్ళి చేయిస్తే వెయ్యిరూపాయలొస్తాయి. దినానికి వెళితే 5 వేలు వస్తాయి. గనుక పెళ్లిని వదిలి దినానికి వెళ్ళి మంత్రాలు చదివినవాడు బ్రాహ్మణుడౌతాడా? అతడు వైశ్యుడే.

పేదవాడైన రోగి ప్రాణాపాయ స్థితిలో ఉండి కాళ్ళావేళ్ళా పడి ప్రాధేయపడుతున్నా లెక్కచేయక శ్రీమంతునికి కడుపు నెప్పిగా ఉందని ఫోన్ వస్తే అక్కడికి వెళ్ళే డాక్టరు వైశ్యుడే.

నాకు వెయ్యి రూపాయలిస్తే మీ ఇంటికి భిక్షకు వస్తాను. లక్షరూపాయలిస్తే మీ ఊరువచ్చి ప్రవచనాలు చేస్తాననే స్వామీజీ వైశ్యుడే. వారు ఏ కులంలో పుట్టినా వైశ్యులే.

(iii) మందమతులు, బద్ధకస్తులు, విపరీత భావనలు గల తామసులు, సరైన ఆలోచన చేయలేని వారు ఏ కులంలో జన్మించినా వారంతా శూద్రులే. కాబట్టి -

(i) మమకారం వల్ల వివేకం కోల్పోయిన వారిని స్త్రీలని,

(ii) లాభార్జన దృష్టి వల్ల వివేకం కోల్పోయిన వారిని వైశ్యులని,

(iii) బద్ధకం వల్ల వివేకం కోల్పోయిన వారిని శూద్రులని అర్థం చేసుకోవాలి. అప్పుడే ఈ శ్లోకభావాన్ని సరిగ్గా గ్రహించినట్లవుతుంది. లేకపోతే అపార్థం. దానివల్ల అనర్థం.

పాపాత్ములు, దురాచారులు ఐనవారు కూడా భగవంతుని అనన్యభక్తితో సేవించి పరంధామాన్ని - పరమపదాన్ని చేరుకోవచ్చు. అంతేకాదు. మనస్సులోను, బుద్ధిలోను, పైన చెప్పిన కారణాల వల్ల వివేకం కోల్పోయిన వారు కూడా భగవంతుని ఆశ్రయించి పరమపదాన్ని చేరుకోవచ్చు ననియే ఈ శ్లోక భావన.

స్వామివివేకానంద ఉత్తరదేశంలో ఒక మహారాజు గారి ఆశ్రయంలో ఉపన్యాసాలిస్తున్నారు. ఒక వేశ్యాస్త్రీ యైన భక్తురాలు ప్రతిరోజూ వచ్చి ఆయన ఉపన్యాసాలను శ్రద్ధగా వింటున్నది. ఒకరోజు ఆమె స్వామి వారిని కలిసి తన ఇంటికి భిక్షకు రమ్మన్నది. భక్తి భావంతో ఆమె కోరింది.

మహాత్ములను, జ్ఞానులను భిక్షకు పిలిచి, పాదపూజ చేసి, భోజనం పెట్టి, దక్షిణ ఇచ్చి పంపితే కనీసం తరువాత జన్మయైనా ఉత్తమజన్మ వస్తుందని, సార్థకం చేసుకొనే జన్మ వస్తుందని భక్తుల విశ్వాసం.

తాను వేశ్య ఇంటికి పోతే తన పరువు ఏమౌతుందోనని స్వామి కొంచెం తటపటాయిస్తున్నాడు. వెంటనే ఆమె అన్నది, "స్వామీ! మాగ్రామానికి ఒక పరుసవేది వచ్చింది. దేవాలయంలోని విగ్రహాన్ని తాకింది. అది బంగారమైంది. ఆ తరువాత కసాయి వాని కత్తిని తాకింది. మరి కత్తి కూడా

బంగారమౌతుందా? అది పూజింపబడే విగ్రహం దాన్ని బంగారం చెయ్యవచ్చు. ఇది కటికవాడి కత్తి. దీన్ని బంగారం చేసే వీల్లేదు అంటూ తేడా చూపించగలుగుతుందా? దాని శక్తి పై దానికి సందేహమా స్వామీ? తాము పరుసవేది లాంటి వారనుకున్నాను. తమ చిత్తం. ఇంక సెలవు అన్నది. స్వామి నిర్ఘాంత పోయాడు. ఇనుము ఎలాంటిదైనా దాన్ని బంగారం చెయ్యటం పరుసవేది లక్షణం. పాపాత్ముడో - పుణ్యాత్ముడో - స్త్రీయో - పురుషుడో తనను చేరిన వాణ్ణి పవిత్రుణ్ణి చెయ్యటమే జ్ఞానము యొక్క మహిమ, జ్ఞాని యొక్క మహిమ. భక్తి యొక్క ప్రభావం.

కనుక ఎట్టి వారైనా భగవంతుని చేరుకోవచ్చు. ఉత్తమగతిని పొందవచ్చు. ఇక అంతిమంగా అర్జునునికి తరుణోపాయాన్ని చూపుతున్నాడు భగవానుడు.

భగవంతుడు చెప్పదలచుకున్న విషయాలన్నీ చెప్పి తన ఉపదేశాన్ని ముగిస్తూ అర్జునునకు తరుణోపాయాన్ని సూచిస్తున్నాడు.

**శ్లో||** కింపునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా|
అనిత్య మసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వమాం|| **(33)**

**తా||** ఇక పుణ్యాత్ములైన బ్రాహ్మణులు, భక్తులైన రాజర్షుల గురించి మరల చెప్పవలసిన పని ఏమున్నది? అనిత్యము, దుఃఖమయము అయిన ఈ లోకంలో పుట్టావు. నన్ను సేవించు.

**వ్యాఖ్య:-** పాపాత్ములు, దురాచారులు అనన్యభక్తితో తమ పాపాలను కడిగి వేసుకొని భగవంతుని చేరుకొనుట తథ్యమని చెప్పారు. అలాగే జన్మతః



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పాపాత్ములైన వారు, మనోబుద్ధులలో దోషాలు గలవారు (స్త్రీ వైశ్య శూద్రులు) కూడా తమతమ మనోబుద్ధులను సవరించుకొని వైరాగ్యభావంతో భగవంతుని ఆశ్రయించి పరమగతిని పొందవచ్చునని కూడా చెప్పారు.

అలా గుణాలలో, మనోబుద్ధులలో దోషాలు గలవారు కూడా భగవంతుని సేవించి ముక్తిని పొందుచుండగా ఇక పుణ్యాత్ములైన బ్రాహ్మణులు, భక్తులైన రాజర్షుల గురించి వేరే చెప్పాలా? వారు భగవంతుని ఆశ్రయించి సులభంగానే పరమపదాన్ని పొందగలరు అని స్పష్టం చేస్తున్నారు.

ఇక్కడ కూడా బ్రాహ్మణులు అంటే బ్రాహ్మణ కులంలో పుట్టిన వారని కాదు. కులం చేత బ్రాహ్మణులు కాదు, గుణం చేత బ్రాహ్మణులు. ఎవరు సత్త్వగుణం ప్రధానంగా గలవారో, ఎవరు బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించి ఉన్నారో - లేదా బ్రహ్మజ్ఞానం కొరకు తపిస్తూ ప్రయత్నిస్తున్నారో వారే బ్రాహ్మణులు. అంతేకాదు పుణ్యాత్ములైన బ్రాహ్మణులు అంటే బ్రాహ్మణులంతా పుణ్యాత్ములని కాదు; పుణ్యకార్యాలు చేయటంలో నిమగ్నమైయున్న బ్రాహ్మణులు అని మాత్రమే. అట్టివారు సులభంగానే పరమపదాన్ని చేరుకోగలరు.

ఇక భక్తులైన రాజర్షులు. వీరెవరు? కొంతకాలం రాజ్యపాలన చేసి, పుత్రునికి వివాహం గావించి, తగిన సమయంలో రాజ్యాన్ని పుత్రునికి అప్పగించి, వైరాగ్యంతో అరణ్యాలకు వెళ్ళి, అక్కడ భక్తితో భగవంతుని సేవిస్తూ, భజిస్తూ, భగవద్భావనలో నిమగ్నమై ఉన్నవారే భక్తులైన రాజర్షులు. వారు కూడా సులభంగానే పరమపదాన్ని అందుకోగలరు.

ప్రాణం పోయేవరకు ప్రాపంచిక వ్యామోహాలను విడువలేక, అనిత్యమైన సంసారబంధాన్ని త్యజించలేక, రోగాలతో, ముసలితనంతో, తనవారిపై ఆధారపడి చీదరింపులు, ఛీత్కారాలతో మంచం మరణం శ్రేయస్కరం కాదు. అన్నీ త్యజించి వానప్రస్థాన్ని స్వీకరించి గాని, నిరంతర భగవచ్ఛింతనలో కాలం గడపటం గాని జన్మను చరితార్థం చేసుకొనే పద్ధతి. ఎందుకంటే ఈ మానవజన్మ అపురూపంగా లభించిన జన్మ. దానిని సార్థకం చేసుకోకపోతే మళ్ళీ అవకాశం ఎప్పటికో!

ఒక ఆసామి చుట్ట నోట్లో పెట్టుకున్నాడు. బొడ్లో దాచుకున్న అగ్గిపెట్టెను తీసి చుట్ట వెలిగించుకోబోయాడు. తీరాచూస్తే అందులో ఒకే ఒక అగ్గిపుల్ల ఉంది. దానిని వెలిగించి జాగ్రత్తగా చుట్ట కాల్చుకుంటున్నాడు. అంతలో ఒక పాత కాలపు స్నేహితుడు అటుగా వచ్చి ఏం బావగారూ! బాగున్నారా? మిమ్ములను చూచి చాలాకాలం అయింది. ఏం చేస్తున్నారు? ఇద్దరు అబ్బాయిలకు పెళ్ళిళ్ళు చేశావా? అంటూ కుశల ప్రశ్నలు వేస్తున్నాడు. అయితే ఈ ఆసామి మాత్రం ఒక్కమాట కూడా మాట్లాడకుండా, చుట్టను ముట్టించే పనిలో నిమగ్నమయ్యాడు. రెండు దమ్ములు లాగి అప్పుడు చూచాడు స్నేహితుని వైపు. ఈ నిర్లక్ష్యాన్ని చూచి ఆ స్నేహితుడు, "ఏమయ్యా! మనిద్దరం ప్రక్క ప్రక్క ఇళ్ళలో 10 సం||లు ఉన్నాం. ఎంతో స్నేహంగా, ఆప్యాయంగా ఉన్నాం. నేను ఇల్లు ఖాళీ చేసి వెళుతుంటే నా రెండు చేతులూ పట్టుకొని కంటనీరు పెట్టుకున్నావు. అలాంటి నీవేనా ఒక్కమాట కూడా మాట్లాడకుండా, నేనెవరో తెలియనట్లుగా ఉన్నావు?" అన్నాడు నిష్ఠురంగా.

దానికా ఆసామి, "అయ్యా! నీవు చెప్పినదంతా యదార్థమే. నీవు ఎంతో మంచి స్నేహితుడివి. నాకెంతో ఆత్మీయుడివి. నీవు ఇలా కనిపించినందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది. కాని నాదగ్గరున్న అగ్గిపెట్టెలో ఒకే ఒక అగ్గిపుల్ల ఉన్నది. ఇక్కడ జనసంచారం లేదు. నీవా బీడీలు చుట్టలు కాల్చేవాడివి కాదు. నేను ఆ ఒక్క అగ్గిపుల్లను జాగ్రత్తగా వెలిగించి చుట్ట కాల్చుకోవాలి. నీతో మాటలు పెట్టుకుంటే ఆ అగ్గిపుల్ల కాస్తా ఆరిపోయిందనుకో ఇక నాకు చుట్ట కాల్చే అవకాశమే ఉండదు. అందుకే నీతో మాట్లాడలేదు. అంతేగాని నాకు నిర్లక్ష్యం లేదు; మరొక ఉద్దేశం లేదు" - అన్నాడు.

ఈ మానవజన్మ కూడా ఒకే ఒక అగ్గిపుల్ల ఉన్న అగ్గిపెట్టె లాంటిది. దానిని వ్యర్థంగా అన్యవిషయాలలో - ప్రాపంచిక వ్యామోహాలలో వ్యర్థం చేశామనుకో ఇక పరమాత్మ నందుకొనే అవకాశం చేజారిపోతుంది. కనుక ప్రాపంచిక విషయాలను కట్టిపెట్టి, లేదా క్రమంగా తగ్గించుకొని భగవంతుని భజించేందుకు వినియోగించాలి. అమూల్యమైన ఈ మానవజన్మను దృశ్య విషయాలలో గడిపివేయటం వెర్రితనం. కనుక సమయాన్ని వ్యర్థం చేయకుండా భగవంతుని వైపుకు తిరిగి జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

ఇక్కడ కేవలం బ్రాహ్మణులు, రాజర్షులు అయినంత మాత్రాన భగవంతుని చేరుకుంటారని చెప్పలేదు. వారు పుణ్యాత్ములు భక్తులు అయితేనే. కనుక కర్మయోగం ద్వారా పుణ్యాత్ములు కావాలి. భక్తియోగం ద్వారా అనన్యభక్తులు కావాలి. అట్టివారికే ఆత్మజ్ఞాన ప్రాప్తి, తద్వారా మోక్షప్రాప్తి.

అనిత్యమసుఖం లోకం:- అర్జునా! ఈ లోకం అనిత్యమైనది. ఇక్కడ సుఖం ఏమాత్రం లేదు. ఒకవేళ ఉన్నా అది అనిత్యమైన సుఖమే. కనుక దీనిలోనే మునిగిపోకు. ఇందులో పుట్టావు. అయినా ఇందులోనే మునిగిపోవాల్సిన అవసరం లేదు. మరి ఏంచేయాలి?

మాం భజస్వ:- నన్ను భజించు. నన్ను ఆశ్రయించు. నన్ను సేవించు. అప్పుడే నీకు శాశ్వత సుఖం. శాశ్వత ఆనందం. నిత్యమైన పరంధామం.

అలాగాక అనిత్యమైన, సుఖంలేని ఈ ప్రపంచాన్నే నమ్ముకున్నావా? ఈ ప్రాపంచిక భోగాలలోనే మునిగిపోయావా? అశాశ్వతమైన లోకమే గతి. తాత్కాలిక సుఖాలే గతి. శాశ్వత ఆనందం లేదు. రాదు. క్షణికమైన వస్తువుల ద్వారా క్షణికమైన ఆనందం వస్తుందే గాని శాశ్వతమైన ఆనందం రాదు. నిత్యమైన వస్తువు ద్వారానే నిత్యమైన ఆనందం వస్తుంది. మరి నిత్యవస్తువేమిటి?

"నిత్యవస్త్వేకం బ్రహ్మ తద్ వ్యతిరిక్తం సర్వం అనిత్యం" - తత్త్వబోధ. నిత్యమైన వస్తువు ఏకమైన బ్రహ్మమే. పరమాత్మే. పరమాత్మ కన్న వేరైనవన్నీ అనిత్యమే.

కనుక నిత్యమైన పరమాత్మను భజించి నిత్యానందాన్ని పొందు. నిత్యమైన భగవంతుని భజించాలంటే ఈ అనిత్యమైన శరీరంతోనే భజించాలి. ఈ అనిత్యమైన శరీరంలో ఉండగానే భజించాలి. అసలు ఈ మానవజన్మ వచ్చిందే అందుకు. కేవలం విషయ సుఖాలను, భోగాలను అనుభవించటానికైతే ఏ జంతువుగానో, పక్షి గానో, దేవతలు గానో

జన్మించవచ్చు. ఐతే ఆ జన్మలలో భగవంతుని భజించే వీలులేదు. మోక్షాన్ని పొందే అవకాశం లేదు. మోక్షసాధనకే ఈ మానవజన్మ అని తెలుసుకో - అని భగవానుడు తన బోధను ఈ అధ్యాయంలో ముగించబోతున్నాడు.

ఇంతలో అర్జునుని ముఖంలో క్వశ్చన్ మార్కు కనిపించింది. "కృష్ణా! నేనిప్పుడు యుద్ధం చేయాలి కదా! నిన్ను భజించటం, సేవించటం ఎలాగ?" - అని అర్జునుని సందేహం.

"కృష్ణా! నేనిప్పుడు జీవన పోరాటం కొనసాగించాలి గదా! బ్రతుకు దెరువు చూసుకోవాలి గదా! నిన్ను భజించటం, సేవించటం ఎలాగ?" - అని సామాన్యుని సందేహం. దానికి సమాధానంగా ఈ అధ్యాయసారాన్ని తెలియజేస్తున్నాడు భగవానుడు చివరి శ్లోకంలో.

- 'మాంభజస్వ' - నన్నే భజించు అంటున్నావు. బాగానే ఉంది. ఈ యుద్ధరంగంలో నిన్ను ఎలా భజించాలి? పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో తేవాలి గదా? ఇక్కడ ఎలా కుదురుతుంది? యుద్ధం చేయటం నీ కర్తవ్యం అంటూ నన్నే భజించు అంటే నేను ఏది చేయాలి? యుద్ధమా? భజించటమా? - అనే అర్జునుని సందేహానికి సర్వమానవాళి యొక్క సందేహానికి సమాధానంగా భగవానుడు ఈ అధ్యాయసారాన్ని ఆచరణకు ఉపయోగపడే విధంగా బోధిస్తున్నాడు. ఏమని?

**శ్లో||** మన్మనా భవ మద్భక్తః మద్యాజీ మాం నమస్కురు|
మామే వైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః|| **(34)**

**తా||** నీ మనస్సు నాకు అర్పించు; నా భక్తుడివికా; నన్ను ఆరాధించు. నాకు నమస్కరించు. ఈ ప్రకారంగా మనస్సును నాయందే చేర్చి నన్నే పరమలక్ష్యంగా పెట్టుకో. నన్నే చేరుకుంటావు.

**వ్యాఖ్య:-** భగవంతుని కృపతో 9వ అధ్యాయం ముగింపుకు వచ్చాం. ఇది ఈ అధ్యాయంలోని 34వ శ్లోకం. ఇదే చివరిశ్లోకం. ఈ శ్లోకం ఈ అధ్యాయం మొత్తానికి సంగ్రహరూపం. అధ్యాయసారం.

నీ మనస్సును అర్పించు, నా భక్తుడివికా!, నన్నే పూజించు, నాకే నమస్కరించు అంటూ భగవానుడీ శ్లోకంలో పరమాత్మను చేరుకొని ఆయనతో ఐక్యం కావటానికి మనం ఏం చేయాలో వివరిస్తున్నాడు. నిజానికి 'నన్ను' 'నన్ను' అనటంలో శ్రీకృష్ణుడనైన నన్ను అనికాదు, భగవంతుడినైన నన్ను అని భావం.

ఇతర మతాల్లో ప్రవక్త వేరు, పరమాత్మ వేరు. కాని భగవద్గీతలో; హిందూధర్మంలో ప్రవక్త - పరమాత్మ ఒక్కరే. పరమాత్మే ఇక్కడ ప్రవక్త.

- మహమ్మదీయ మతంలో మహమ్మద్ ప్రవక్త. అల్లా పరమాత్మ.
- క్రైస్తవ మతంలో క్రీస్తు ప్రవక్త. యెహోవా పరమాత్మ.
- ఇక్కడ శ్రీకృష్ణుడే ప్రవక్త. శ్రీకృష్ణుడే పరమాత్మ. అందుకే ఇక్కడ శ్రీకృష్ణుడు నన్నే స్మరించు, నన్నే పూజించు, నాకే నమస్కరించు, నన్నే చేరుకుంటావు అని చెప్పటం జరిగింది.
- నేను దేవుని దూతను అన్నాడు మహమ్మద్ ప్రవక్త.
- నేను దేవుని బిడ్డను - దేవుని కుమారుడను అన్నాడు క్రీస్తు.

➤ నేను సర్వప్రాణికోట్ల ఆత్మను. నేనే పరమాత్మను అంటున్నాడు శ్రీకృష్ణుడు. కనుక భగవంతుడనే దృష్టితోనే శ్రీకృష్ణుని స్మరించాలి, పూజించాలి, భక్తి కలిగిఉండాలి, నమస్కరించాలి. అప్పుడే భగవంతుని చేరుకుంటాం. భగవంతుడనే దృష్టితో రాముణ్ణి,శివుణ్ణి పూజించకూడదా? పూజించవచ్చు. ఎవరినైనా పూజించవచ్చు. దృష్టి ప్రధానం. అంతే.

ఈ శ్లోకం 9వ అధ్యాయం యొక్క సారమే గాదు. మొత్తం భగవద్గీత యొక్క సారం కూడా. ఎందుకంటే 18వ అధ్యాయం చివరలో 65వ శ్లోకం కూడా ఇదే గనుక. అందుకేనేమో ఈ శ్లోకం మంగళశ్లోకం కావాలని మాటిమాటికి 'మ' కారాన్ని నొక్కి, నొక్కి - 'ఇంతకన్న గత్యంతరం లేదు, ఈ శ్లోకంలో చెప్పిన భావం తప్ప నీ జన్మ సార్థకం చేసుకోవటానికి మరొక దారి లేదు' - అని భగవంతుడన్నట్లుగా ఉన్నది.

ఇందులో 9 'మ' కారాలున్నాయి. ఇది 9వ అధ్యాయం. బహుశా అనుకోకుండా జరిగినదే అయి ఉండవచ్చు. అయినా ప్రశంసనీయంగా ఉంది.

ఈ శ్లోకంలో మరొక విశేషం కూడా ఉన్నది. ఇదే అధ్యాయం 14వ శ్లోకంలో 'సతతం కీర్తయంతో మాం' అంటూ నిరంతరం నన్నే కీర్తిస్తూ, సాధన చేస్తూ, భక్తితో నాకు నమస్కరిస్తూ, మనసు నాయందే నిలిపి ఉపాసించు - అని; 27వ శ్లోకంలో "యత్కరోషియ దశ్నాసి" - అంటూ నీవు చేసేది, తినేది, నీ యజ్ఞ, దాన, తపస్సులు నాకే అర్పించు అనీ చెప్పిన

భావాలను కూడా ఈ శ్లోకంలో వివరించి, ఆచరణ విధానాన్ని తెలియజేస్తున్నాడు.

సాధన చేస్తేనే సాధ్యవస్తువైన పరమాత్మ లభించేది. ఈ శ్లోకంలో పరమాత్మ నందుకొనుటకు చేయవలసిన సాధనను చక్కగా తెలియజేశాడు. నిజంగా సాధన అంటే ఏమిటి? -

ప్రాపంచిక వస్తువుల కోసం ప్రాకులాడే మనస్సును పరమాత్మ కోసం పరితపించేటట్లుగా చేయటమే సాధన.

ఈ సాధననే బ్రహ్మాభ్యాసం అని కూడా అంటారు. బ్రహ్మాభ్యాసం ఎలా చేయాలి?

తత్ చింతనం, తత్ కథనం, అన్యోన్యం తత్ ప్రబోధనం యే తత్ ఏక పరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్ బుధాః - ఆ పరమాత్మనే చింతించుట, దానిని గూర్చియే చెప్పుట, దానిని గూర్చియే పరస్పరం సంభాషించుకొనుట, దానినొక్క దానినే పరమగతియని తలంచి శరణుపొందుట - ఇదియే బ్రహ్మాభ్యాసం అని పండితులు చెబుతున్నారు.

ఈ బ్రహ్మాభ్యాసం ఎలా చేయాలో వివరణయే ఈ శ్లోకం.

1.మన్మనాభవః- నీ మనస్సును నాయందే ఉంచు. అంటే ఆలోచనలన్నీ భగవంతుని చుట్టూ తిరగాలి. నిరంతరము భగవంతుని స్మరిస్తూ ఉండాలి. సాధారణంగా అందరి ఆలోచనలు దృశ్యప్రపంచంలోనే ఉంటాయి. మనస్సు అలా ప్రాపంచిక విషయాలలో సంచరిస్తూ ఉంటే పరమాత్మను స్మరించే అవకాశం ఉండదు. అంటే పరమాత్మకు దూరమైపోతాడు. కనుక ప్రాపంచిక

విషయవ్యామోహాలను వదలి, మనస్సును వాటిపై నుండి వెనుకకు తేవాలి. అలా తెచ్చి ఆ మనస్సును పరమాత్మలో నిలపాలి. దానితో పరమాత్మ చింతన చేసి చేసి మనస్సు పరమాత్మాకారంగా మారిపోతుంది. అదే జీవబ్రహ్మైక్యం. జీవుడు దేవుడగుట.

నీళ్ళలాగానే మనస్సుకు ఒక రంగూ లేదు, రూపమూ లేదు. నీటిలో ఏ రంగును కలిపితే ఆ రంగే అవుతాయి. ఏ ఆకారం గల పాత్రలో పోస్తే ఆ ఆకారంగానే అవుతుంది. మనస్సు కూడా అంతే. మనస్సును ఏ విషయంలోకి చేరిస్తే ఆ విషయాకారంగానే మారిపోతుంది. పరమాత్మలో చేరిస్తే పరమాత్మాకారంగానే మారిపోతుంది.

నిజంగా మనస్సు అనేది మన అశాంతికి, దుఃఖానికి కారణం. ఎప్పుడూ ఏదో ఒక విషయం గురించి ఆలోచిస్తుంది మనస్సు. దానివల్ల దుఃఖం, భయం, అశాంతి కలుగుతాయి. ధ్యాన సమయంలో ఏకాగ్రత కుదరదు. మనస్సు ఏ సంకల్పాలు చేయకపోతే ఇక మనస్సే లేదు. అప్పుడు పరమాత్మకు మనకు అడ్డుగోడ తొలగిపోయినట్లే. దానితో పూర్ణశాంతి. పరమానందం. జాగ్రదావస్థలో మనస్సు ఏవేవో ఆలోచనలు చేస్తుంది. దాని కారణంగా సుఖమో, దుఃఖమో కలుగుతుంది. ప్రశాంతత చెడుతుంది. స్వప్నావస్థలో మనస్సు ఒక ప్రపంచాన్ని సృష్టించుకుంటుంది. అందులో సుఖమో - దుఃఖమో పొందుతుంది. కనుక అశాంతి. కాని గాఢనిద్రలో మనస్సే లేదు. ఒక్క ఆలోచన కూడా లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు. కనుక ప్రశాంతత,

హాయి, ఆనందం. అంటే మనస్సుంటే అశాంతి. మనస్సు లేకుంటే ప్రశాంతి అని అర్థమవుతున్నది.

ఒక పట్టణంలో అనేక గ్రంథాలు వ్రాసిన గొప్పకవి ఉన్నాడు. ప్రతిరోజూ ఆయన దగ్గరకు ఎందరో పెద్దలు, స్నేహితులు వస్తూ ఉంటారు. ఒకరోజు ఒక స్నేహితుడు వచ్చి, కుశలప్రశ్నలు వేస్తూ అక్కడున్న ఒక గ్రంథాన్ని చేతిలోకి తీసుకున్నాడు. పేజీలు త్రిప్పుతూ రెండు మూడు పేరాలు చదివాడు. ఆ కవిని ప్రశంసిస్తూ, "ఆహా! ఎంత బాగా వ్రాశావయ్యా ఈ గ్రంథాన్ని! ఎప్పుడు వ్రాశావు దీన్ని? నీ గొప్పతనాన్ని మాటలలో చెప్పలేను అన్నాడు.

దానికా కవి "అయ్యా! ఇందులో నా గొప్పతనం ఏమీలేదు. దీనిని వ్రాయటంలో నాభార్య సహకారం మరువలేనిది - అన్నాడు. ఓహో! మీ భార్య కూడా గొప్ప పండితురాలేనన్న మాట. ఆహా! చక్కని దాంపత్యం అన్నాడు స్నేహితుడు. ఆ తర్వాత స్నేహితుడు వెళ్ళిపోయాడు.

వారి సంభాషణ లోపల నుండి వింటున్న భార్య భర్తతో ఇలా అన్నది. ‘‘ఏవండీ! ఇంత పచ్చి అబద్ధం చెప్పారు. ఈ గ్రంథ రచనలో నేను సహాయం చేశానా? అసలు ఆ గ్రంథం వ్రాసేటప్పుడు నేను మా పుట్టింటికి వెళ్ళాను గదా! నేను చేసిన సహాయం ఏమున్నది?’’ అన్నది.

దానికా భర్త "నీవు పుట్టింటికి వెళ్ళటమే నాకు చేసిన గొప్ప సాయం. నీవు ఇక్కడే ఉంటే నేనాగ్రంథాన్ని అలా వ్రాయగలిగే వాణ్ణే కాదు. అదే నీవు చేసిన సాయం" - అన్నాడు.

గ్రంథాన్ని వ్రాసేటప్పుడు భార్య దగ్గర లేకుండటం పండితునికి ఎలా సహాయంగా ఉందో, అలాగే భగవంతుని భజించేటప్పుడు, ధ్యానించేటప్పుడు మనస్సు లేకుండా పోతే పరమశాంతి కలుగుతుంది. మనస్సు యొక్క ఉనికియే జీవుని దుఃఖానికి కారణం. మనస్సు లేకపోవటమే పరమానందం. కనుక అట్టి మనస్సును పరమాత్మయందే లయం చేసి పరమశాంతిని పొందాలి.

2.మద్భక్తః :- ఇలా మనస్సును ప్రాపంచిక విషయాలలో త్రిప్పకుండా భగవంతుని యందే నిలపాలంటే భగవంతునిపై గొప్పప్రేమ - భక్తి ఉండాలి. ఆయన మనకు చేస్తున్న సహాయం ఏదో ఎంతో తెలుసుకుంటే ఇక ఆ పరమాత్మను వదలాలనిపించదు. ఆయనతోడిదే లోకం అన్నట్లుగ ఉండాలనిపిస్తుంది. ఇంకాఇంకా పరమాత్మ గురించి తెలుసుకోవాలనిపిస్తుంది. తెలుసుకున్న కొద్దీ ఆయనపై ఆసక్తి - భక్తి పెరుగుతుంది.

ప్రపంచంలో ప్రతివాడూ ఏదో ఒక వస్తువుకు భక్తుడే. జడమైన వస్తువులపై భక్తి ఉంటే జడులమైపోతాం. చైతన్య వస్తువుపై భక్తి ఉంటే చైతన్య స్వరూపులమే అవుతాం. కనుక భగవంతునిపై అచంచల విశ్వాసం, భక్తి ఉండాలి.

భక్తియే వికసించి జ్ఞానంగా పరిణమిస్తుంది. అందుకే భక్తి షట్కం తరువాత జ్ఞానషట్కం వచ్చింది. పరమభక్తులైన వారికి భగవంతుడే జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు.

ప్రహ్లాదుడు పరమభక్తాగ్రేసరుడు. ఆయన భక్తికి భగవంతుడు ప్రత్యక్షమై 'ఏం కావాలో కోరుకో' అన్నాడు. ఆలోచించాడు ప్రహ్లాదుడు. ముల్లోకాల్లోను శ్రేష్టమైనదేదో అది నాకన్నా భగవంతునికే తెలుసు అని తలంచి, "స్వామీ! అన్ని వరాలలో శ్రేష్ఠమైనదేదో దానినే ప్రసాదించండి" అన్నాడు.

అప్పుడు భగవంతుడు, "ప్రహ్లాదా! ఆత్మసాక్షాత్కారం కలిగేదాకా నీకు జ్ఞానవిచారణ కలుగుగాక!" అన్నాడు.

అంటే నేరుగా మోక్షాన్ని ఇవ్వకుండా - మోక్షప్రాప్తికి కావలసిన బుద్ధి యోగాన్ని ప్రసాదించాడు.

కనుక భక్తితో పరమాత్మను సేవించే వారికి జ్ఞానవిచారణాశక్తిని ఆ భగవానుడే ప్రసాదిస్తాడు. దానివల్లనే మోక్షప్రాప్తి. కనుక భగవంతుని యందు భక్తి ఉండాలి.

3.మద్యాజీ :- భగవంతుని యందు భక్తి గలవాడు భగవంతుని పూజించాలి. మనోవాక్కాయముల ద్వారా ఆయనను సేవించాలి.

4.మాం నమస్కురు :- నాకే నమస్కరించు. ఈ లోకంలో ఎందరికో నమస్కారాలు చేస్తుంటాం. చిన్న చిన్న గుమాస్తాల దగ్గర నుండి ఉద్యోగుల వరకు, ఇంకా పెద్ద పెద్ద అధికారులు, మంత్రులు మొ||న వారెవరి దగ్గరకు వెళ్ళినా నమస్కరిస్తూ ఉంటాం. ఈ నమస్కారాలన్నీ నిజంగా వ్యర్థమైనవే. ఇవి హృదయపూర్వకంగా చేసేవి కావు. ఈ నమస్కారాలలో మస్కాయే

ఉంటుంది. అయితే భగవంతునికి చేసే నమస్కారం అలాంటిది కాదు. ఇది ఎంతో అర్థవంతమైనది. హృదయపూర్వకంగా చేసేది.

రెండు అరచేతులు జోడించి ఒక్కటిగా చేయటం నిజమైన నమస్కారం. దీని భావమేమిటి? రెండు ఒక్కటి కావటం. జీవుడు దేవుడు ఒక్కటి కావటం. అయ్యా! 'నేను' లేను. ఈ 'నేను' ను నీలోకి చేర్చుకో! అప్పుడు 'నేను' 'నీవు' అనే 2 లేకుండా ఒక్కటే మిగులుతుంది - అని భావం.

నమస్కారం చేసేటప్పుడు అహంకార మమకారాలు వదలి, ఏకత్వ భావంతో నమస్కరించాలి.

ఇలా మనస్సును పరమాత్మయందే నిలిపి 'నీవే తప్ప నితః పరం బెరుగ' నని భగవంతునికి శరణాగతుడు కావాలి. అట్టివారే "మాం ఏవప్యస్యసి" నన్నే పొందుతారు అని భగవానుని హామీ.

<u>మత్పరాయణః</u> :- నన్నే లక్ష్యంగా పెట్టుకో. ఈ లోకంలో జన్మించిన ప్రతి మానవుని యొక్క పరమగతి - పరమలక్ష్యం పరమాత్మే. ఎందుకంటే అది మన స్వస్థానం. మళ్ళీ చేరుకోవలసింది అక్కడికే. ఈ లక్ష్యంతోనే జీవించాలి. ఈ లక్ష్యం కోసమే సాధన చేయాలి. అప్పుడే మోక్షప్రాప్తి.

నిరంతర భగవచ్చింతనతో మనస్సును పూర్తిగ భగవంతుని యందే నిలిపి, పూర్తి భక్తి భావంతో భగవంతునికి శరణాగతుడై, భక్తితో పూజిస్తూ, భజిస్తూ, నమస్కరిస్తూ, నిరంతరం భగవంతుని ధ్యానంలో నిలిస్తే ఈ మనస్సు కాస్తా భగవదాకారంగా మారిపోతుంది. అదే ఆత్మస్థితి - ఆత్మసాక్షాత్కారం - మోక్షం. అదే మానవజీవిత పరమార్థం. ఇదే భగవద్గీతా సారం.

**గద్యం :** ఓం తత్సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః||

ఇలా ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును, శ్రీకృష్ణ - అర్జున సంవాద రూపమైనది యునగు శ్రీమత్ భగవద్గీత యందు రాజవిద్యారాజగుహ్య యోగము అనే తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

ఈ ప్రపంచం వ్యక్తమైనది. అనేక ఆకర్షణలతో కూడినది. భగవంతుడు అవ్యక్తం, నిగూఢమైన వాడు. ఆయనా ఆకర్షించే వాడే. ప్రపంచం యొక్క ఆకర్షణలన్నీ మనను బంధంలో పడవేసేవి. ఆ విషయాన్ని తెలుసుకొని, ఇందులో ఇరుక్కోకుండా బయటపడే ఉపాయాలను తెలియజెప్పి, మనను పరమాత్మ వైపుకు త్రిప్పే అధ్యాయం ఇది.

భగవద్గీత ఉపనిషత్తుల సారం. ఉపనిషత్తులలో ప్రతిపాదించిన బ్రహ్మతత్త్వాన్ని వివరించి చెప్పేదే భగవద్గీత. ఇది బ్రహ్మవిద్య. మోక్షవిద్య. బ్రహ్మాన్ని అందుకొనుటకు మార్గాన్ని తెలియజేసే విద్య. అంతేకాదు ఇది యోగశాస్త్రం. యోగం అనే పదం "యుజ్" అనే ధాతువు నుండి వచ్చింది. యుజ్ అంటే కలుపుట. కనుక యోగం అంటే జీవుణ్ణి దేవుడితో కలిపి ఏకం చేయుట. దానికి ఉపాయాలను చెప్పే శాస్త్రమే యోగశాస్త్రం.

ఇక భగవద్గీత అంతా శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య జరిగిన సంవాద రూపంలో ఉన్నది. శ్రీకృష్ణుడు గురువు. అర్జునుడు శిష్యుడు.

భారతీయ వేదాంతం అంతా గురుశిష్య పరంపరాగతం. గురుశిష్య సంవాద రూపంలోనే ఉంటుంది. ఉపనిషత్తులలో ఒక గురువు - ఒకరు లేక ఎక్కువమంది శిష్యులు ఉంటారు. భగవద్గీత కూడా అంతే. గురుశిష్య సంవాదరూపంలో ఉండటం శ్రోతలకు, పాఠకులకు చాలా మంచిది. ఎందుకంటే ఎక్కడైనా సందేహం కలిగినప్పుడు ఆ సందేహాన్ని శిష్యుడు అడగటం వల్ల గురువు చక్కగా తెలియజేస్తాడు. దానితో చదివే లేదా వినే మనకు బాగా అర్థమవుతుంది. కేవలం బోధించుకుంటూ వెళ్ళటమే అయితే మనకు ఎక్కడన్నా సందేహం కలిగితే దానిని తీర్చుకొనే మార్గం ఉండదు.

భగవద్గీతలోని గురుశిష్యులు ప్రత్యేకం. ఎందుకంటే శ్రీకృష్ణ, అర్జునులు అంతకుముందు పరిచయం లేనివారు కాదు, ఇద్దరూ బంధువులు. శ్రీకృష్ణుని మేనత్త కుంతీదేవి కుమారుడే అర్జునుడు. శ్రీకృష్ణుడు తన సోదరి సుభద్రను అర్జునునకిచ్చి వివాహం చేశాడు. పైగా ఇద్దరూ ఒకే వయస్సు వారు. అన్యోన్యంగా కలిసిమెలిసి తిరిగినవారు. ఒక కంచంలో తిని, ఒక మంచంపై పడుకున్నవారు. మంచి స్నేహితులు. కురుక్షేత్ర యుద్ధ భూమిలోనికి ప్రవేశించేంతవరకు శ్రీకృష్ణుడు తన స్నేహితుడు, హితుడు, బంధువు అనుకున్నాడే గాని అతడు సాక్షాత్తు పరమాత్మే అనే విషయం అర్జునునికి తెలియదు. అతడు గొప్పమేధావి, మాటకారి, ఎలాంటి సమస్యనైనా పరిష్కరించే తెలివితేటలు గలవాడు, తనకు అత్యంత ఆత్మీయుడు అనుకున్నాడే గాని శ్రీకృష్ణుని భగవంతునిగా భావించలేదు.

అయితే యుద్ధభూమిలో ప్రవేశించిన తర్వాత, రెండు సేనల మధ్య నా రథాన్ని నిలుపు అని సారథిగా ఉన్న శ్రీకృష్ణుని ఆజ్ఞాపించిన తర్వాత ఒక్కసారిగా పరిస్థితి తారుమారై పోయింది. తండ్రులు, తాతలు, గురువులు, సోదరులు, మిత్రులు, కుమారులు, హితులు, ఆత్మీయులు ఐన వారందరిని చూచేటప్పటికి ఇంతమందిని ఈ భూమికి బలిఇచ్చి రాజ్యాన్ని పొంది సుఖించాలా? అని బాధతో, విషాదంతో విలవిలలాడి పోయి, చెప్పుకోటానికి సారథి స్థానంలో ఉన్న శ్రీకృష్ణుడే ఇక దిక్కు అని భావించి, యుద్ధం వల్ల జరిగే అనర్థాలను గురించి వక్కాణించాడు. అంతా విని శ్రీకృష్ణుడు రెండు పోటుమాటలు అనటంతో శిష్యుడయ్యాడు అర్జునుడు. శిష్యస్తే ఽహం శాధిమాం త్వాం ప్రపన్నం" - అని ప్రసన్నుడయ్యాడు.

అలా అర్జునుడు శిష్యుడు కావటం మనందరి అదృష్టం. ఎందుకంటే అర్జునుడు కేవలం శిష్యుడు మాత్రమే కాదు. భగవానుని మాటలలో చెప్పాలంటే 'భక్తోఽసిమే సఖా చేతి" - "నీవు నా భక్తుడవు సఖుడవు గనుక నేను ఈ రహస్యమైన ఉత్తమమైన విద్యను బోధిస్తున్నాను" అన్నాడు.

కేవలం భక్తుడైతే భగవంతునితో మాట్లాడటానికే భయపడతాడు. కేవలం సఖుడైతే ఇది మాట్లాడవచ్చా? లేదా? అని చూడకుండా ఎంతో చనువుగా ఏమైనా మాట్లాడతాడు. కాని భక్తుడు, సఖుడు అయితే భయము, చనువు రెండూ ఉంటాయి. కనుక బోధచేస్తూ చేస్తూ ఉన్నప్పుడు కూడా సందేహం కలిగితే వ్యక్తంచేస్తాడు. ఎన్ని సందేహాలు కలిగినా, అడిగితే బాగుంటుందో లేదో అనే సంకట స్థితి లేకుండా అడిగేస్తాడు. ఎన్ని

సందేహాలనైనా వ్యక్తం చేసే చనువు ఉంటుంది. అదే సమయంలో భక్తి, గౌరవం ఉండటాన ఎంతో నమ్రత, విధేయత కలిగిఉంటాడు.

అర్జునుడలాంటి శిష్యుడు గనుకనే భగవద్గీతలో మనకు వచ్చే ఎన్నో సందేహాలను అతడే అడిగి సమాధానాలు రాబట్టాడు. కొన్ని సందేహాలను ప్రత్యక్షంగా అడిగి తెలుసుకుంటే కొన్నింటిని కేవలం ముఖ కవళికల ద్వారా వ్యక్తం చేశాడు. కనుకనే భగవద్గీతను పాఠకులు, శ్రోతలు చక్కగా అర్థం చేసుకొనే వీలు కలిగింది. మనందరికి ఎంతో మేలు కలిగింది. అందుకే ఈ అధ్యాయాంత గద్యంలో 'శ్రీకృష్ణార్జున సంవాదే' అనటం ద్వారా మనకు గలిగిన మేలు వ్యక్తమవుతున్నది.

ఇక ఈ అధ్యాయం రాజవిద్యా రాజగుహ్య యోగం. ఈ పేరు పెట్టటం వల్ల ఇది రాజవిద్య - లేక బ్రహ్మవిద్య అని; అంతేగాక ఇది అత్యంత రహస్యవిద్య అని తెలుస్తున్నది. నిజంగా ఇది అత్యంత రహస్యమైన బ్రహ్మవిద్య. మోక్షవిద్య.

ఈ అధ్యాయంలో భగవంతుని ఎలా ఆశ్రయించాలో, అనన్యభక్తిని ఎలా కలిగి ఉండాలో, నిజమైన భక్తుడు ఎట్టివాడో తెలియజేశారు. కర్మ, భక్తి, జ్ఞానము అనే 3 సాధనలలో భక్తి అనేది గడప మీది దీపం వంటిది. కర్మ అనే గదికి, జ్ఞానం అనే గదికి మధ్యనున్న గడప మీది దీపమే భక్తి. అంటే కర్మలు చేయుటకు భక్తి అనే దీపం అవసరం. అలాగే జ్ఞానాన్ని పొందటానికి కూడా భక్తి అనే దీపం అవసరం. కనుక భక్తి ఎంతో ప్రధానమైనది. అట్టి భక్తిని జోడించి కర్మయోగాన్ని ఎలా ఆచరించాలో, ఆత్మజ్ఞానాన్ని పొందటానికి భక్తి ఎంత

అవసరమో అనే విషయాలను ఈ అధ్యాయంలో ఎంతో చక్కగా తెలిపారు. అంతేకాదు -

ఎంతటి పాపాత్ములైనా, దుర్మార్గులైనా, దురాచారులైనా భగవంతుని ఆశ్రయించి, సత్పురుషులై ఎలా జన్మను చరితార్థం చేసుకోవాలో చెప్పాడు; తనను అనన్య భక్తితో ఉపాసించే వారి యోగక్షేమాలను నేనే చూస్తానని అద్భుతమైన హామీ ఇచ్చాడు భగవానుడు. తన భక్తుడెన్నటికీ చెడడు అని చాటింపు వేసి చెప్పమని అర్జునుని ఆదేశించాడు. అసలు ఏవిధంగా భగవంతునిపై అనన్యభక్తిని చూపాలో; ఎలా మన శరీరాన్ని, వాక్కును, మనస్సును భగవంతుని సేవలో వినియోగించాలో చెప్పాడు భగవానుడు.

ఈ విధంగా ఈ 9వ అధ్యాయం ఎన్నో ప్రత్యేకతలను కలిగి ఉంది. ఇది 9వ అధ్యాయం కావటం కూడా విశేషమే. ఈ విషయాలను అధ్యాయ ప్రారంభంలోనే ఉపోద్ఘాతంలో వివరించటం జరిగింది. నిజంగా ఒక్కమాటలో చెప్పాలంటే ఈ అధ్యాయంలో సాక్షాత్తు భగవానుడే ఉన్నాడు. భక్తి షట్కంలోని అద్భుత అధ్యాయం ఇది.

ఈ అధ్యాయాన్ని ఇంతటితో ముగించి 10వ అధ్యాయం విభూతి యోగాన్ని ప్రారంభిద్దాం.

- స్వస్తి -



Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# శ్రీమద్భగవద్గీత : 1 0 వ అధ్యాయం

# విభూతియోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్త్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములుచేస్తూ జ్ఞాన సుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 179 ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞములను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్ధమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.






Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

## : ఉపోద్ఘాతం :

ఈ లోకంలో ప్రతిప్రాణి - ప్రతిజీవి యొక్క యదార్థ స్వరూపం బ్రహ్మమే. ఐతే ఆ విషయాన్ని తెలుసుకొనే అర్హత, అవకాశం మానవుడికి మాత్రమే ఉన్నది. కనుక ప్రతిమానవుడు తాను యదార్థంగా - తత్త్వతః బ్రహ్మమే (పరమాత్మే) అని తెలుసుకోవాలి. అలా తెలుసుకొని, బ్రహ్మన్ని చేరుకొని బ్రహ్మముగా ఉండిపోవాలి. అలా ఉండాలంటే బ్రహ్మాభ్యాసం చేయాలి. ఆ బ్రహ్మాభ్యాసం ఎలా చేయాలో 9వ అధ్యాయం చివరి శ్లోకంలో తెలియజేయటం జరిగింది. అదే "మన్మనాభవ మద్భక్తః మద్యాజీ మాం నమస్కురు" - నా యందే మనస్సు నిలుపు, నాకు భక్తుడవుకా, నన్ను పూజించు, నాకే నమస్కరించు - అని.

అయితే ఈ నిరంతర బ్రహ్మాభ్యాసం కార్యరూపం దాల్చాలంటే అంతటా పరమాత్మ ఉన్నట్లు పరమాత్మను దర్శించగలగాలి. ఈ ప్రపంచంలోని అన్నింటా, అందరిలోను పరమాత్మే ఉన్నట్లు భావన చేయాలి. అలా భావన చెయ్యాలంటే పరమాత్మ యొక్క విభూతులు తెలియాలి.

మనం బంగారాన్ని దర్శించాలంటే బంగారం యొక్క విభూతులు - అంటే గాజులు, గొలుసులు, ఉంగరాలు, వడ్డాణాలు, వంకెలు, హారాలు, నెక్ లెస్ లు, ముక్కుపుడకలు, తలపిన్నులు, జూకాలు ------- ఇలా రకరకాల విభూతులు తెలిస్తే ఆ తరువాత నీవు గాజులు చూచినా,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గొలుసులు చూచినా, జూకాలు చూచినా, నెక్ లెస్ లు చూచినా, వడ్డాణాలు చూచినా -వేటిని చూస్తున్నా వాటన్నింటి యదార్ధస్వరూపం బంగారమే అని, బంగారాన్ని చూడగలుగుతావు.

అలాగే సర్వత్రా వ్యాపించియున్న పరమాత్మను దర్శించాలంటే పరమాత్మ యొక్క వివిధ విభూతులు తెలియాలి. ఈ విశ్వజగత్తు అంతా భగవద్ విభూతే అయినప్పటికీ ఈ అధ్యాయంలో కొన్ని కొన్ని వస్తువులను దివ్య విభూతులుగా చెప్పటం జరిగింది. ప్రపంచంలోని అన్ని వస్తువులు దివ్యవిభూతులు కాదు. అవి సామాన్యవిభూతులు. అయితే వేటిలో తేజస్సు, బలం, ఐశ్వర్యం, విద్య, శక్తి, కాంతి విశేషంగా ఉంటాయో అవి దివ్యవిభూతులు.

అగ్ని సామాన్యరూపంలో సర్వవ్యాపకంగా అన్ని వస్తువులలోను ఉంటుంది. అయితే చెకుముకి రాయిలో అది విశేషమైన శక్తితో ఉన్నది. అందుకే చెకుముకి రాయి అగ్ని యొక్క దివ్యవిభూతి. తక్కినవన్నీ సామాన్యవిభూతులు.

అంతేకాదు ఈ అధ్యాయంలో చెప్పిన విభూతులలో కొన్ని సాత్వికమైనవి, కొన్ని రాజసికమైనవి, కొన్ని తామసికమైనవి.

గంగ సాత్విక విభూతి. సింహం రాజసికవిభూతి. జూదం తామసిక విభూతి. అయినా వాటివాటి స్వభావంలో, వాటివాటి ప్రభావంలో వాటికి విశిష్టత ఉన్నది; ప్రత్యేకత ఉన్నది. అయితే ఇక్కడే మనకొక

సందేహం కలగవచ్చు. భగవంతుడు గుణాతీతుడు - గుణరహితుడు గదా! మరి ఈ రాజసిక, తామసిక విభూతులు కూడా ఉంటాయా? అని.

"యేచైవ సాత్త్వికా భావాః రాజసాస్తామసాశ్చయే"(7-12) - సాత్త్వక, రాజసిక, తామసిక భావాలు అన్నీ నానుండే కలిగినవి. అవన్నీ నా విభూతులే - అని 7వ అధ్యాయంలో భగవానుడే స్వయంగా తెలియజేశాడు. అయితే నిజం అదే అయినప్పటికీ ఉపాసకుడు ఉపాసనకు అన్నింటిని స్వీకరించలేడు.

- నీళ్ళన్నీ భగవత్ స్వరూపమే. అయితే ఉప్పునీరు త్రాగగలమా?
- పాములన్నీ భగవత్ స్వరూపమే. అలాగని వాటిని మెడకు తగిలించుకోగాలమా?

అలాగే అన్ని వస్తువులు భగవంతుని విభూతులే అయినా విశేషమైన సత్తా కలవానినే భగవంతునిగా ఆరాధించగలం. ఒక మహాత్ముని, సర్వసంగపరిత్యాగిని, భక్తుణ్ణి, జ్ఞానిని పూజించగలమే గాని ఒక దుర్మార్గుని, హంతకుణ్ణి భగవంతునిగా పూజించలేము గదా! కనుక ఉపాసకుని ఉపాసనా సౌలభ్యం కొరకు ఈ అధ్యాయంలో అనేక దివ్యవిభూతులు చెప్పబడ్డాయి. అందుకే ఈ అధ్యాయాన్ని విభూతియోగం అన్నారు. భగవంతుని విభూతులు విస్తారంగా పేర్కొనబడిన అధ్యాయం ఇది.

భగవంతుని విభూతులు తెలుసుకున్నందువల్ల ప్రయోజనమేమిటి?

**భగవంతుని విభూతులు తెలుసుకోవటం వల్ల మనకు సర్వత్రా ఈశ్వరదృష్టి - పరమాత్మ దృష్టి అలవడుతుంది. ఎవరిని చూచినా, దేనిని చూచినా పరమాత్మ స్వరూపులుగానే కనిపిస్తారు. దానివల్ల పరమాత్మ ధ్యానంలో ముందడుగు వేయటం జరుగుతుంది. భక్తి చక్కగా కుదురుతుంది. ఈ సర్వత్రా పరమాత్మదృష్టి మనను ఉన్నతంగా నిలుపుతుంది. అందుకే ఈ విభూతులు.**

**ఈ విశ్వమంతా పరమాత్మే గనుక; ఆయన లేని వస్తువుగాని, ప్రాణిగాని లేదు గనుక ఈ విభూతులు అంతులేనివి. అంతులేని విభూతులను అన్నింటిని ఎవ్వరూ పూర్తిగా వివరించలేరు. ఈ విశాల విశ్వంలోని సమస్త నామరూపాలలోను చైతన్యరూపంగా పరమాత్మే ఉన్నాడు. అంటే మంచి వాటితో పాటు చెడ్డవాటిలో కూడా భగవంతుని దర్శించాలంటే మొదట్లో కష్టంగా ఉంటుంది.**

**ఒక సర్వసంగ పరిత్యాగిని భగవంతునిగా చూడగలం. కాని స్వార్థం కోసం గొంతులు కోసే వాణ్ణి పరమాత్మగా చూడగలమా? శ్రీకృష్ణుని భగవంతునిగా పూజించగలం. కాని శిశుపాలుణ్ణి అలా పూజించగలమా? అలాగే ఉత్తముణ్ణి భగవంతునిగా చూడగలం. కాని అధముణ్ణి భగవంతునిగా చూడలేం. అందుకే మొదట మొదట ఉత్తమ వస్తువులలో భగవద్దృష్టిని అవలంబిస్తూ వస్తే క్రమక్రమంగా నికృష్ట వస్తువులలో కూడా భగవంతుని దర్శించే జ్ఞానం కలుగుతుంది. అక్షరాభ్యాసం చేసే పిల్లవాడు మొదట మొదట పెద్ద పెద్ద అక్షరాలు**

దిద్దుకుంటాడు.తర్వాత తర్వాత చిన్నచిన్న అక్షరాలు వ్రాస్తాడు. సాధకుడు కూడా అంతే.

ఈ సాధనలో ఎవడు కృతార్థుడవుతాడో -అంటే ఈ అధ్యాయంలో చెప్పబడ్డ విభూతులలో, విశేషవస్తువులలో భగవంతుని చూడటంలో ఎవడు నిష్ణాతుడవుతాడో అట్టివాడు క్రమంగా ఈ విశ్వంలోని సమస్త వస్తువులను పరమాత్మగా - విశ్వేశ్వరుడుగా దర్శించగలుగుతాడు. అదే విశ్వరూపసందర్శన యోగం. విశ్వంలోని సమస్తాన్ని పరమాత్మగా దర్శించే నేర్పు కలిగితే పరమాత్మను విశ్వరూపుడుగా - విశ్వేశ్వరుడుగా దర్శించటం జరుగుతుంది. అంటే 10వ అధ్యాయంలో పాసైతే 11వ అధ్యాయానికి ప్రమోషన్ వస్తుంది.

ఈ అధ్యాయంలో భగవంతుని విభూతిని, భగవంతునితో యోగాన్ని - రెండింటినీ చెప్పారు. "ఏతాం విభూతిం యోగంచ" అంటూ రెంటినీ విడదీసి చెప్పారు. విభూతి అంటే ఏమిటి? భూతి అంటే సంపద - ఐశ్వర్యం అని అర్థం. విభూతి అంటే విశేషమైన సంపద - విశేషమైన ఐశ్వర్యం అని. అంతేగాని విభూతి అంటే నొసటిపై పూసుకొనే తెల్లని పొడి అనికాదు. శైవమో - వైష్ణవమో బాగా తలకెక్కితే ఇలాంటి అర్థాలు దొర్లుతుంటాయి.

ఒక ఊళ్ళో గీతాజ్ఞాన యజ్ఞం జరుగుతున్నది. యజ్ఞం ముగింపు రోజున అధ్యాయాంత గద్యాన్ని చదువుతున్నాడు స్వామీజీ. 'విభూతి యోగోనామ దశమోధ్యాయః' అన్నాడు. ఈ వచనాన్ని చదవటంతోనే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వినే శ్రోతలలో శైవులు లేచి చూచారా! మా విభూతి భగవద్గీతలో కూడా ఉన్నది అన్నారట. అంతలో వైష్ణవులు లేచి మానామాలు భగవద్గీతలో ఉన్నాయి గమనించలేదా? అన్నారట. ఇలా సంకుచిత సాంప్రదాయక భావాలను, అసంబద్ధ ప్రలాపాలను భగవద్గీతకు అంటగట్టే అవివేకులు కూడా ఉంటారు. కనుక విభూతి అంటే శివాలయంలో దొరికే విభూతి కాదు. సంపద, ఐశ్వర్యం అని అర్థం. ఇక యోగం అంటే కలయిక అని అర్థం. దేనితో కలయిక? ఆ పరమాత్మతో కలయిక. పరమాత్మతో ఏకత్వానుభూతికి సాధనం. ఈ జీవుణ్ణి దేవుడితో ఐక్యం చెయ్యటానికి సాధన ఏదో అదే యోగం. ఇలా విభూతి - యోగం రెండూ చెప్పబడ్డాయి గనుక ఈ అధ్యాయాన్ని 'విభూతియోగం' అన్నారు.

అయితే ఈ అధ్యాయానికి భగవంతుడే స్వయంగా ఒక పేరు పెట్టాడు. అదే 'అవికంప యోగం' "సోஉవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః" అని భగవానుడే స్వయంగా చెప్పటం జరిగింది. కనుక ఇది అవికంపయోగం. అవికంపానికి వ్యతిరేకం వికంపం. వికంపం అంటే ఏమిటి? ధ్యానంలో కూర్చున్నప్పుడు భగవంతునితో సంబంధం. కళ్ళు తెరిస్తే - వ్యవహారంలోకి వస్తే భగవంతునితో సంబంధం కట్ (cut). ఇక అంతా లౌకికవిషయాలే.

- కళ్ళు మూస్తే రాముడు. కళ్ళు తెరిస్తే కాముడు.
- తీర్థానికి తీర్థం. ప్రసాదానికి ప్రసాదం.

- వేదాంతానికి వేదాంతం. వ్యవహారానికి వ్యవహారం.
- సత్సంగంలో కూర్చున్నంత సేపు వేదాంతం. గడపదాటితే వ్యవహారం.
- చెప్పుకోవటానికి వేదాంతం. చెయ్యటానికి వ్యవహారం.

ఇదే వికంపయోగం అంటే.

ఒక మహాత్ముడు గీతాప్రవచనాలు చేస్తున్నాడు. 'బిచ్చగాడు మనకు జ్ఞానబోధ చేయటానికి వచ్చిన దైవం. అతడిలోనూ భగవంతుడే ఉన్నాడు' అని చెబుతున్నాడు. మరునాడు ఆయన ఇంటిముందు బిచ్చగాడు వచ్చి నిలబడ్డాడు. వెళ్ళమంటే వెళ్ళటం లేదు. ఒకటే గోలచేస్తున్నాడు. ఈ మహాత్మునికి పెద్ద చిరాకు కలిగింది. కోపం వచ్చింది. ఛీ! పోరా వెధవా! వెళతావా? తన్నమంటావా? అని కేకలు వేస్తున్నాడు. అయినా వాడు కదలలేదు. కర్ర తీసుకోని ఫెళఫెళా రెండు వేశాడు. అంతలో భార్య అక్కడకు వచ్చి, 'అదేమిటండీ! బిచ్చగాడు భగవంతుడేనని రాత్రి అన్నారు గదా! ఇప్పుడు ఆ భగవంతుణ్ణే కొడుతున్నారా?' అన్నది.

ఆ! అది వేదాంతం. ఇది వ్యవహారం. అది అక్కడ. ఇది ఇక్కడ. అక్కడ వేదాంతం ఇక్కడకు తెస్తే ఇంకేంలేదు. వీడు నెత్తికెక్కుతాడు. ఈ వెధవ భగవంతుడా? మళ్ళీ తిట్లు. ఇదే వికంపయోగం. కాని ఈ అధ్యాయం అవికంపయోగం. అక్కడ - ఇక్కడ - అంతటా ఒక్కటిగానే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉండాలి. సర్వత్రా - అందరిని పరమాత్మగా భావించాలి. నీకు కోపం వచ్చినప్పుడు కూడా ఆ విషయాన్ని మరువకూడదు.

నిజంగా భగవంతుడు ఎక్కడో ప్రత్యేకంగా కూర్చొనిలేడు. ఆయన అంతటా వివిధరూపాలలో, వివిధ ప్రాణికోట్లుగా ఉన్నాడు. ఇక్కడ జీవుడుగా ఉన్నది పరమాత్మే. జంతువుగా - క్రిమిగా - కీటకంగా - చెట్టుగా - పుట్టగా - నీటిగా - నిప్పుగా ఉన్నది పరమాత్మే. అందుకే 'పాండవానాం ధనంజయః' అన్నాడు. నేను పాండవులలో ధనంజయుణ్ణి - అని. అర్జునా! నీవే నేను అని చెప్పిన భగవంతుడు అర్జునుణ్ణి విడిచి వేరుగా ఎలా ఉంటాడు? ఒక్క అర్జునునికే కాదు చెప్పింది. సమస్త విశ్వమానవ కోటిని ఉద్దేశించి చెప్పిన మాట ఇది. కనుక భగవంతుడు మనను విడిచి వేరుగా ఉండలేడు. ఉండడు.

అయితే జన్మ జన్మాల నుండి ముట్టె ముదిరి పట్టుకున్న భ్రమ ఉంది. ఆయన వేరు, నేను వేరు అని. అది నీ భ్రమగాని నిజం కాదు. నిన్ను విడిచి ఆయన ఉండలేడు. నిన్ను విడిచి ఆయన వేరుగా ఉంటే ఆయన పరిచ్ఛిన్నుడౌతాడు; ఖండుడై పోతాడు. సర్వవ్యాపి అనే బిరుదును కోల్పోతాడు. 'ఏకమేవాఽద్వయం బ్రహ్మ' అనే బిరుదు అబద్ధమైపోతుంది. కనుక ఆయన మనను వదిలి ఉండే వీలులేదు. ఆయనే మనం, మనమే ఆయన. ఇద్దరులేరు. ఉన్నది ఒక్కటే. స్వయంగా భగవంతుడే చెబుతున్నా తెలుసుకోలేని దౌర్భాగ్య దామోదరులమౌతున్నాం. కనుక మేలుకోవాలి.

- సమాధిలోనూ యోగమే. సంసారంలోను యోగమే.
- కళ్ళు మూసినా యోగమే, కళ్ళు తెరిచినా యోగమే.
- నడుస్తూ ఉన్నా యోగమే, కుడుస్తూ ఉన్నా యోగమే.
- జాగ్రత్ లోనూ యోగమే, స్వప్నంలోను యోగమే. సుషుప్తిలోనూ యోగమే. ఎప్పుడూ పరమాత్మతో ఐక్యమై - ఒక్కటై ఆయనగా ఉండాలి. ఈ యోగానికి కంపం లేదు. చలనం లేదు. ఒక కాలానికో, ఒక దేశానికో, ఒక వ్యక్తికో కట్టుబడి లేదు. పరిమితమై లేదు. అదే అవికంప యోగం.

నాకంటే వేరుగా ఎవరూ లేరు, ఏదీలేదు - అని భగవానుడే స్వయంగా "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ" అని చెబుతూనే ఉన్నాడు. అలాంటప్పుడు నీవు ఆయన కన్న వేరు ఎలా అవుతావు? నీకు ఆయనతో వియోగం ఎక్కడ? వికంపం ఎక్కడ? యోగమే. అవికంపమే.

అసలు ఈ అధ్యాయం అంతా 'మాం అనుస్మర యుద్ధ్యచ' - నన్ను స్మరిస్తూ యుద్ధం చెయ్యి - అని చెప్పిన భగవానుని మాటకు వ్యాఖ్యానమే.

- భగవంతుని స్మరిస్తూ ఉండటం - పరమార్థం.
- యుద్ధం చేయటం - వ్యవహారం.
- భగవంతుని స్మరిస్తూ ఉండటం - యోగం.
- యుద్ధం చేయటం - విభూతి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'పశ్యమే యోగ మైశ్వర్యం' - భగవంతుడు యోగం. ఆయన ఐశ్వర్యం విభూతి - ఇదే విభూతియోగం.

ఆరవ అధ్యాయం వరకు కర్మషట్కం. కర్మలు ఎలా - ఏ భావనతో చేయాలో అక్కడ వివరించారు. అదంతా చట్టంలాంటిది. 7వ అధ్యాయం నుండి భక్తిశాస్త్రం ప్రారంభం. భక్తి అంటే ప్రేమయే. భగవంతునిపై ప్రేమనే భక్తి అంటారు. ప్రేమ దగ్గర చట్టాలు, ధర్మాలు జాంతానై. ప్రేమలో భగవంతుడు భక్తుడవుతాడు, భక్తుడు భగవంతుడౌతాడు. ఇద్దరూ ఒక్కటై పోతారు.

ప్రేమకు వ్యతిరేకం అహంకారం, నేను - నేను అని వేరుపడేది అహంకారం. అంతా ఒక్కటే అనేది ప్రేమ. నీవే నేను - నేనే నీవు అంటుంది ప్రేమ. మనకు ఒక వ్యక్తి మీద ప్రేమ ఉంటే అతడి బాధలలో, దుఃఖాలలో మనం కూడా పాలు పంచుకోవాలనుకుంటాం. అతడి దుఃఖాన్ని మన దుఃఖంగా భావిస్తాం. అంటే రెండు ఒకటయ్యే లక్షణం ప్రేమది. దీనికి వ్యతిరేక లక్షణం - అంటే ఒకటి రెండయ్యే లక్షణం అహంకారానిది. ఇద్దరం ఒకటే నన్నట్లుగా ఉంటారు కొంతకాలం. తర్వాతెప్పుడో తేడా వస్తుంది. "నన్ను ఇలా అంటావా? నేనంటే నీకంత అలుసా?" అని అహంకారం పైకి లేస్తుంది. దానితో ఒక్కటిగా ఉన్నవారు విడిపోయి ఇద్దరవుతారు. కనుక -

- ప్రేమ రెంటిని ఒకటి చేస్తుంది.
- అహంకారం ఒకటిని రెండు చేస్తుంది.

నిజంగా ఉన్నది ఒక్కటే ఆత్మ. అయితే అహంకారం ఆ ఆత్మనుండే జీవుడుగా బయటికొస్తుంది. ఇప్పుడు జీవుడు - దేవుడు (ఆత్మ) అని రెండు. అదే భక్తిలో మైమరచిపోతే - పరవశించిపోతే - ఈ అహంకారం కాస్తా అణగిపోతే జీవభావం అంతమైపోతుంది. దానితో జీవుణ్ణి అని భావించిన వాడే ఆత్మగా ఉండిపోతాడు. జీవుణ్ణి అనే భ్రమ తొలగిపోతుంది. అంతా ఒక్కటిగా - వాసుదేవస్సర్వమితి - అన్నట్లుగా ఉండిపోతాడు. కనుక అహంకారం తొలగితే 'నేను' అనేది లేకుండా పోతుంది. నీకు - ఈశ్వరుడికి భేదం తొలగి ఒక్కటిగానే ఉండిపోతావు.

సూఫీ సాంప్రదాయంలో ఒక కథ ఉంది. ఒకడు భగవంతుని ఆఫీసు వద్దకెళ్ళి తలుపు తడుతున్నాడు. 'ఎవరండీ?' అని లోపలి నుండి ప్రశ్న. 'నేనే' - అని బయటి నుండి జవాబు. 'ఏం కావాలి?' అని మళ్ళీ లోపలి నుండి ప్రశ్న. 'నేను లోపలికి రావాలి' అని బయటి నుండి సమాధానం.

"భగవంతుని ఆఫీసులో నీకూ నాకూ ఇద్దరికి చోటుండదు. ద్వైతానికి ఇక్కడ స్థానం లేదు" అని లోపలి నుండి సమాధానం వచ్చింది. కొద్దిసేపటి తర్వాత మళ్ళీ తలుపు చప్పుడు. 'ఎవరండీ?' అని మళ్ళీ లోపలి నుండి ప్రశ్న. 'నీవే' అని ఈసారి బయటినుండి సమాధానం. నేను నీవు కావటంతోనే తలుపు తెరుచుకుంది.

కనుక అహంకారం పోతేనే - 'నేను' అనే తత్త్వం నశిస్తేనే - 'ఉన్నదంతా పరమాత్మ ఒక్కటే' అనే నిశ్చయ జ్ఞానం ఉంటేనే - 'కనిపించేదంతా పరమాత్మ తప్ప మరేమీ లేదు' అనే విజ్ఞానం ఉంటేనే భగవంతునితో ఏకత్వం - ఆత్మసాక్షాత్కారం - మోక్షం. ఇదే మానవజీవిత పరమార్థం.

ఈ పరమార్థాన్ని సాధించటానికే ఈ అధ్యాయం సహాయపడుతుంది. నీ చుట్టూ దైవీవిభూతిని విస్తారం చేయటంకోసం, అవికంప యోగం కోసం - అంటే దైవసన్నిధిలో కూర్చున్నప్పుడే కాకుండా ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు కూడా దైవాన్నే స్మరించగలిగేందు కోసం - దైవభావనలో ఉండేందు కోసం ఈ అధ్యాయం వెలింసింది.

ఈ అధ్యాయంలో ఒక ముఖ్యబోధను చూడండి -

'వృష్ణీనాం వాసుదేవోఽస్మి' = యాదవులలో నేను వాసుదేవుడను.

'పాండవానాం ధనంజయః' = పాండవులలో నేను అర్జునుడను.

'మునీనా మప్యహం వ్యాసః' = మునులలో నేను వ్యాసుడను.

తాను వాసుదేవుడు - ఉత్తమ పురుష - First Person.

నీవు అర్జునుడు. - మధ్యమ పురుష - second person.

ఆయన వ్యాసుడు - ప్రథమ పురుష - Third Person.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**ఈ 3 పురుషలు నేనే. ప్రపంచం అంతా ఈ మూడు పురుషలలోనే ఉంటుంది. కనుక ప్రపంచం అంతా నేనే. అంతా కృష్ణమయం - భగవన్మయం.**

**ఉత్తమ పురుషయైన తాను కృష్ణుడు.**

**మధ్యమ పురుషయైన అర్జునుడు కృష్ణుడే. (అర్జునుని 10పేర్లలో కృష్ణుడు అనే పేరు ఉన్నది.)**

**ప్రథమ పురుషయైన వ్యాసుడు కృష్ణుడే. (ఆయన కృష్ణద్వైపాయనుడు)**

**'కనుక సర్వం కృష్ణమయం' - అనే మాట సార్ధకమైంది.**

**ఇలా అంతటా అన్నివేళలా పరమాత్మను దర్శించటమే అవికంపయోగం. ఇదే విభూతియోగం యొక్క ప్రయోజనం.**

**ఈ శరీరమనోబుద్ధులలో అంతటా 'నేను' ఎలా వ్యాపించియున్నానో అలాగే విశ్వం అంతటా సమస్త చరాచర ప్రాణికోట్లలోను 'నేనే' వ్యాపించియున్నాను. "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" - ఈ జగత్తు నందంతటా పరమేశ్వరుడే నిండి నిబిడీకృతమైయున్నాడు - అనే ఈశావాస్యోపనిషత్తు వాక్యం ఈ అధ్యాయానికి ప్రాణం. ఇదే విభూతి యోగం సారం.**

**భగవంతుడు చెప్పబోయే వచనాలు ఎలాంటివో తెలియజేస్తున్నాడు ముందుగా -**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్రీ భగవానువాచ:**

**శ్లో||** భూయ ఏవ మహాబాహో! శ్రుణుమే పరమం వచః|

యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హిత కామ్యయా|| **(1)**

**తా||** భగవానుడంటున్నాడు - గొప్ప బాహువులు గల అర్జునా! ప్రీతితో వింటున్న నీకు హితం కలిగించాలనే కోరికతో, ఏమి చెబుతున్నానో అట్టి నా శ్రేష్ఠ వచనాలను మళ్ళీ విను.

**వ్యాఖ్య:-** ఇంతవరకు అర్జునునికి మేలు కలిగించాలనే కోరికతో అతడిలోని అజ్ఞానాన్ని తొలగించటం కోసం అనేకమైన విషయాలను తెలియజేశాడు భగవానుడు. ఆ మాటలు ఎలా ఉన్నాయి అర్జునునికి?

<u>ప్రీయ మాణాయ:-</u> శ్రీకృష్ణుడు బోధించే వేదాంత సత్యాలు, ఆయన ప్రవచించే సిద్ధాంతాలు అర్థం చేసుకుంటున్న కొద్దీ అర్జునునికి ఎంతో ప్రీతి కలుగుతున్నది. మనస్సులో అశాంతితొలగి శాంతి కలుగుతున్నది.

హిందూ ధర్మంలోని సిద్ధాంతాలు, ఆధ్యాత్మిక ధర్మాలు కేవలం విన్నంత మాత్రం చేతనే హృదయంలోని తాపం చల్లారి శాంతి కలుగుతుంది. అలా కలిగిన శాంతి శ్రవణం చేస్తున్న వాని ముఖం మీద ఒక వర్చస్సును కలిగిస్తుంది. ఇటువంటి వర్చస్సును, సంతోషాన్ని అర్జునుని ముఖంలో చూస్తున్నాడు శ్రీకృష్ణుడు.

మనస్సులోని సంతోషం ముఖంలో కనిపిస్తుంది. గురువు బోధించే విషయాలను శిష్యుడు ఉత్సాహంగా, ఆనందంగా, అపురూపంగా వింటున్నాడా? లేక 'ఈ పీడ తనకెక్కడ తగులు

కున్నదిరా నాయనా!, పొరపాటున ఇక్కడకు వచ్చి ఇరుక్కుపోయాను, లేచి వెళ్ళటానికి బాగుండదేమో' అనుకుంటూ ఆముదం త్రాగిన ముఖం పెట్టుకొని వింటున్నాడా? అనే విషయం వివేకం కలిగిన గురువుకు తెలిసిపోతుంది. అందుకే జగద్గురువైన శ్రీకృష్ణుడు తన శిష్యుడైన అర్జునుని ముఖంలోని శాంతిని, సంతోషాన్ని గుర్తించి 'ప్రీయమాణాయ' - ప్రీతితో వింటున్న నీకు 'వక్ష్యామి' - చెబుతున్నాను అంటున్నాడు.

గురువు చెప్పే వాక్యాలను ప్రీతితో, ఆసక్తితో, ఆనందంతో శిష్యుడు వింటున్నప్పుడు గురువుకు ఎంతో ఉత్సాహం కలుగుతుంది. శిష్యుని మీద అపారమైన కరుణ, వాత్సల్యం కలుగుతుంది. దానితో ఇంకా ఎంతో చెప్పాలనుకుంటాడు. ఇక్కడ శ్రీకృష్ణుని బోధ అర్జునుని బాధను పోగొడుతున్నది. అందుకే అమృతాన్ని పానం చేస్తునట్లు భగవానుని బోధను శ్రవణం చేస్తున్నాడు. అసలు భగవానుడు ఎందుకు చెబుతున్నాడు?

<u>హితకామ్యయా:-</u> ప్రీతితో వింటున్నవానికి హితాన్ని - మేలును - శ్రేయస్సును కలిగించాలని గురువు తపనపడుతూ ఉంటాడు. కనుక శాంతిని, సుఖాన్ని, మేలును, శ్రేయస్సును కోరుకొనే వారెవరైనా గురువు చెప్పే వాక్యాలను శ్రద్ధగా వినాలి; మనస్సు పెట్టి వినాలి. అలా వింటేనే గురువుకు ఉత్సాహం. నిజంగా శ్రద్ధగా వినే శిష్యులు దొరకటం గురువు యొక్క అదృష్టమే. హరికథలకు పురాణ కాలక్షేపాలకు వచ్చిన శ్రోతలు నిద్రపోతూ మధ్య మధ్య కొద్దిసేపు వింటూ ఉంటారు. అలా

వింటే ఆధ్యాత్మిక విద్య పట్టుబడదు. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని విని అర్థం చేసుకోవాలంటే బోధ యందు శ్రద్ధ ఉండాలి; బోధకుని యందు శ్రద్ధ ఉండాలి. అట్టి శ్రద్ధగలవాడే అర్జునుడు. అందుకే హితం కలిగించాలనే కాంక్షతో బోధిస్తున్నాడు. అందుకే 'గురుబుద్ధి ర్విశేషతః' - గురువాక్యాలు శిష్యునికి శ్రేయస్సును, హితాన్ని కలిగిస్తాయి అంటున్నారు.

ఆత్మబుద్ధి సుఖాన్ని కలిగిస్తుంది.

గురుబుద్ధి హితాన్ని కలిగిస్తుంది.

ఇంతకీ హితం - మేలు - శ్రేయస్సు అంటే ఏమిటి?

కావలసినంత డబ్బు, సంపదలు, భోగాలు సమకూరటమా? అబ్బాయిల చదువులు, అమ్మాయిల పెళ్ళిళ్ళు త్వరత్వరగా పూర్తికావటమా? మంచి ఉద్యోగాలు లభించటమా? లేక ఎక్కడో ఉన్న ముసలివాళ్ళు 'హరీ' అనటంతో వారి ఆస్తులు కలిసి రావటమా? - ఇవేవీ హితం కానేకాదు. మరి?

1. బంధ విముక్తి యేహితం. 2. జన్మ సంసార దుఃఖ నివృత్తియే హితం. 3. నిత్య నిరతిశయ ఆనంద ప్రాప్తియే హితం. 4. స్వస్వరూప జ్ఞాన ప్రాప్తియే హితం.

అర్జునుని హితము, మన హితము, ఈ భూప్రపంచంలో పుట్టిన ప్రతి మానవుని హితము అదే. మనందరకు హితం కలిగించాలనే

కోరికతోనే భగవంతుడు అర్జునుని నిమిత్తంగా చేసుకొని మనకు ఈ శ్రేష్ఠమైన జ్ఞానాన్ని బోధిస్తున్నాడు. ఎలా?

భూయఏవ:- మరల మరల బోధిస్తున్నాడు, ఎందుకు? ఒకసారి చెబితే చాలదా? లౌకిక విద్యలు ఒకసారి చెబితే చాలు. కాని ఆధ్యాత్మిక విద్యకు పునరుక్తి దోషంలేదు. మళ్ళీ మళ్ళీ చెప్పాలి. ఎన్నిసార్లు వింటే అంత బాగా జీర్ణమవుతుంది. తత్త్వం వంట బడుతుంది. ఆ చెప్పేవి ఎలాంటి మాటలు?

పరమం వచః:- ఆత్మ సంబంధమైన విషయాలే శ్రేష్టమైన వచనాలు. ఇలాంటి శ్రేష్టవచనాలను ఎన్ని మార్లైనా చెప్పాలి. ఆచరణ చేయాలనే నిశ్చయం కలిగేదాకా చెప్పాలి. ఎందుకంటే గీతది మాస్టరు హృదయం కాదు, మాతృహృదయం. తన బిడ్డ క్షేమం కోసం తల్లి మళ్ళీ మళ్ళీ జాగ్రత్తలు చెబుతుంది. అలాగే శ్రుతిమాత విసుగు, విరామం లేకుండా ఆధ్యాత్మిక రహస్యాలను తెలియజేస్తుంది.

మహాబాహో!:- అర్జునా! నీవు గొప్ప బాహువులు గలవాడవు. బయటి శత్రువులను అవలీలగా జయించగలవాడవు. అంతరంగ శత్రువులను కూడా జయిస్తేనే ఈ జన్మ సార్థకం. నీవు అంతటి వాడవే, అంటూ మహాబాహో! అని సంబోధన చేస్తున్నాడు భగవానుడు. ఈ శ్లోకంలో మహాబాహో! అని అధికారిని, పరమం వచః! అంటూ విషయాన్ని, హితకామ్యాయా అంటూ ప్రయోజనాన్ని, ప్రీయమాణాయ అంటూ సంబంధాన్ని చెప్పి అనుబంధ చతుష్టయాన్ని తెలిపారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'నా శ్రేష్ఠ వచనాలు విను' అంటూ భగవానుడు తన యదార్థ తత్త్వాన్ని తెలియజేయబోతున్నాడు.

**శ్లో||** న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః|

అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః|| (2)

**తా||** నా పుట్టుకను గురించి దేవతలుగాని, మహర్షులు గాని తెలుసుకోలేరు. ఎందుకంటే నేను ఆ దేవతలకన్నా, మహర్షుల కన్నా ముందువాణ్ణి.

**వ్యాఖ్య:-** ఏదైనా ఒక విషయం గురించి మనం ప్రత్యక్షంగా తెలుసుకొనే వీలులేకపోతే, ఆ విషయాన్ని గురించి బాగా తెలిసినవారు వివరించి చెబితే చక్కగా తెలుసుకోవచ్చు.

మరి భగవంతుని గురించి మనం ప్రత్యక్షంగా తెలుసుకోలేం. ఎందుకంటే ఆయన నిరాకారుడు, నిర్గుణుడు, సూక్ష్మాతి సూక్ష్మమైన వాడు, సర్వవ్యాపి, ఇంద్రియాలకు అగోచరుడు, అనిర్దేశ్యుడు, అచింత్యుడు. కనుక ప్రత్యక్షంగా తెలుసుకొనే వీలులేదు. అట్టి భగవంతుని తెలుసుకోవాంటే ఎవరి ద్వారానైనా తెలుసుకోవాల్సిందే. ఎవరి ద్వారా తెలుసుకుంటాం? మనకన్న గొప్పవారైన దేవతల వల్లగాని, మహర్షుల వల్లగాని తెలుసుకోవాలి. అయితే ఆ దేవతలకు గాని, మహర్షులకు గాని నా పుట్టుక గురించి తెలియనే తెలియదు - అంటున్నాడు భగవానుడు. వారికే తెలియకపోతే వారేం

చెప్పగలుగుతారు? అయితే ఎందుకు వారికి కూడా తెలియదు? వారు చాలా గొప్పవారు గదా! నిజమే. గొప్పవారే. కాని ఆ దేవతలకు, మహర్షులకు ఆదియైనవాడు, ఆధారమైనవాడు భగవంతుడు. అందుకే వారు కూడా భగవంతుని తెలుసుకోలేరు. నిజంగా ఈ విశ్వమంతా భగవంతుని ఆధారంగానే ఉన్నది. భగవంతుడు స్థిరంగా, నిశ్చలంగా, శాశ్వతంగా ఉండేవాడు. ఈ 14 లోకాలతో కూడిన బ్రహ్మాండం అంతా ఆయనలో కల్పించబడింది. ఆయనపై విశ్వం ఆధారపడ్డది గాని, ఆయనకు ఏ ఆధారం అక్కరలేదు. అందుకే దేవతలు గాని, మహర్షులు గాని ఆయనను తెలుసుకోలేరు. సంపదలు, భోగాలు గల దేవతలు గాని, మంత్రద్రష్ఠలు. గూఢమైన విషయాలను దర్శించగల సిద్ధులైన మహర్షులు గాని భగవంతుని శక్తి చేతనే - ఆయన సాన్నిధ్యం వల్లనే పని చేయగలుగుతున్నారు. భగవంతుడిచ్చిన తెలివితో పనిచేసే వారు ఈ ప్రపంచంలో దేన్నైనా తెలుసుకోగలరే గాని, భగవంతుని మాత్రం తెలుసుకోలేరు.

అశ్వద్ధామ రుద్రాంశతో జన్మించిన వాడు కనుక మహాశక్తి సంపన్నుడు. పుట్టేటప్పుడు గుర్రంలాగా సకిలించాడు. అందుకే అశ్వద్ధామ అనే పేరు పెట్టారు. అతడు ద్రోణపుత్రుడు. ద్రోణునికి అశ్వద్ధామపై వల్లమాలిన ప్రేమ. అతని కోసం ఏమైనా చేస్తాడు. చివరకు అతడి కోసమే ప్రాణాలు కూడా వదిలాడు. అయితే కుమారునిపై అంతటి ప్రేమ ఉన్నా అర్జునినిపై గొప్ప శిష్య వాత్సల్యం ఉంది. అర్జునునికి

బ్రహ్మశిరో నామకాస్త్రాన్ని ప్రయోగ ఉపసంహారాలతో ఇచ్చాడు. పుత్రుడు కోరినందువల్ల, అర్హత లేకపోయినా కాదనలేక ప్రయోగం మాత్రం చెప్పి అస్త్రాన్ని ప్రసాదించాడు.

ఆ తరువాత కొంతకాలానికి అశ్వద్ధామ శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి నా బ్రహ్మశిరమనే అస్త్రాన్ని నీకిస్తాను, బదులుగా నీ సుదర్శన చక్రాన్ని నాకివ్వు అన్నాడు. దానికి, "అదిగో నా చక్రం, శంఖం, గద, ధనుస్సు. వాటిలో నీకు ఏది కావాలన్నా తీసుకో. దాని బదులుగా నాకేమీ ఇవ్వనక్కర్లేదు." అన్నాడు శ్రీకృష్ణుడు. అశ్వద్ధామ ఎంతో సంతోషంతో సుదర్శన చక్రం వద్దకెళ్ళి ఎత్తటానికి ప్రయత్నం చేశాడు. కాని ఎంత ప్రయత్నించినా దానిని ఎత్తలేకపోయాడు. అంతటి శక్తి సంపన్నుడు, రుద్రాంశ సంభూతుడు ఒక్క ఆయుధాన్ని ఎత్తలేక చతికిల పడ్డాడంటే కారణం ఏమిటి? అదే భగవత్ సంకల్పం. అతడికి శక్తి నిచ్చింది భగవంతుడు. ఆ భగవంతుని మీదనే శక్తిని ప్రయోగించాలనుకున్నాడు. భస్మాసురిడిలా ఆలోచించాడు. శ్రీకృష్ణుని వద్ద చక్రాన్ని తీసుకొని ఆయన మీదనే ప్రయోగించాలనుకున్నాడు. అందుకే శక్తి హీనుడయ్యాడు.

అలాగే దేవతలకు, మహర్షులకు శక్తి నిచ్చింది భగవానుడే. ఆ శక్తితో - జ్ఞానంతో వారు భగవంతుని తెలుసుకోవటం ఎలా సాధ్యం? అందుకే భగవంతుని మహిమను, ఆయన ఉత్పత్తిని ఆయనే

చెబుతున్నాడు. అంతకన్న భగవతత్త్వాన్ని చెప్పగలిగే సమర్థులెవరుంటారు?

దేవతలకు, మహర్షులకు, మొత్తం లోకాలన్నింటికి ఆది కారణం నేనే. కార్యమెప్పుడూ కారణాన్ని తెలుసుకోలేదు. బిడ్డకార్యం, ఆ బిడ్డకు కారణం తండ్రి. బిడ్డ తండ్రి యొక్క పుట్టుకను చూడలేడు. తండ్రిమాత్రం బిడ్డ పుట్టుకను చూడగలడు. అలాగే పరమాత్మ సర్వాన్నీ తెలుసుకోగలడు. కాని జీవుడో! ఆ పరమాత్మ శక్తితో అన్నింటినీ తెలుసుకోగలడు గాని, ఆ పరమాత్మను మాత్రం తెలుసుకోలేడు.

జడమైన వస్తువును సృష్టించి, ఆ జడంలో చైతన్యాన్ని చేర్చి ఆడించే సూత్రధారిని నేను. దేవతలు, మహర్షులు అంతా నా చేతిలోని కీలుబొమ్మలు. వారు నన్నెలా తెలుసుకోగలరు? అందుకే నా గురించి నేనే చెప్పాలి అంటున్నాడు భగవానుడు.

ఇదే విషయాన్ని వేదాంత అర్థంతో చూస్తే - దేవతలు అంటే ఇంద్రియ అధిష్టాన దేవతలు. అంటే అనుభవాలను ప్రకాశింపజేసే ఇంద్రియాలే దేవతలు. ఇక మహర్షులు అంటే శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాలనే 5 తన్మాత్రలు, మహత్తు, అహంకారం. వీటికే రూపం కల్పించి పురాణాలలో ఈ ఏడింటిని సప్తర్షులు అన్నారు. ఈ సప్తర్షులే మానవుడి మానసిక, బౌద్ధిక జీవితానికి ప్రతినిధులు.

ఈ దేవతలనబడే ఇంద్రియాలకు, మహర్షులనబడే శబ్దస్పర్శాదులకు శుద్ధ చైతన్యరూప ఆత్మయే మూలకారణం. ఇలా

ఆత్మపై ఆధారపడి, ఆత్మవల్లనే శక్తిని, చైతన్యాన్ని పొందిన ఇంద్రియాలు గాని, శబ్దాది విషయాలు గాని, ఏవీ ఆత్మయొక్క ఉత్పత్తిని తెలుసుకోలేవు. ఇంద్రియాలు గ్రహించటానికి ఆత్మ ఇంద్రియ గోచర విషయం కాదు. మనోబుద్ధులకు అందే విషయం కాదు. కనుకనే వారు నా ఉత్పత్తిని తెలుసుకోలేరు. అందుకే భగవానుడే స్వయంగా తెలియజేస్తున్నాడు.

ఇలా భగవంతుని ఉత్పత్తిని, యదార్థతత్త్వాన్ని తెలుసుకుంటే ప్రయోజనం?

**శ్లో||** యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరం|
అసంమూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే|| (3)

**తా||** ఎవరైతే నన్ను పుట్టుకలేనివాని గాను, మొదలు లేనివాని గాను, లోకాలన్నింటికి ప్రభువుగాను తెలుసుకుంటారో అట్టివారు మనుష్యులలో జ్ఞాని. అతడు అన్ని పాపాల నుండి విడుదల చెందుతాడు.

**వ్యాఖ్య:-** పరమాత్మ యొక్క యదార్థతత్త్వాన్ని తెలుసుకున్నవాడు తన అజ్ఞానాన్ని పోగొట్టుకున్నట్లే. జ్ఞానియైనట్లే. అతడు తన పాపాలు తొలగించుకున్నట్లే. అయితే ఆ పరమాత్మ యొక్క యదార్థతత్త్వం ఏమిటి? ఆయన అజుడు - అనాది - సర్వలోక మహేశ్వరుడు. ఇదే తెలుసుకోవాల్సింది. అయితే తెలుసుకోవటం అంటే బుద్ధితో

తెలుసుకోవటమా? చదివి, విని, బాగా గుర్తుపెట్టుకోవటమా? కాదు. అనుభూతి చెందాలి. మనస్సులో ఆ తత్త్వం ఎప్పుడూ నిలిచిఉండాలి. నిద్రలో నుండి లేపి నీవు పురుషుడివా? స్త్రీవా? అని అడిగితే ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా ఎలా చెబుతామో - అలా. ఇంతకూ ఆ భగవత్తత్వం ఏమిటి?

1. <u>అజం:-</u> ఈ లోకంలో అన్నీ ఎప్పుడో ఒకప్పుడు పుట్టినవి. కాని పరమాత్మ అలా పుట్టినవాడు కాదు. ఆయన ఎప్పుడూ శాశ్వతంగా ఉంటాడు. పుట్టుకలేదు గనుక నాశనం కూడా ఉండదు. జీవుళ్ళంతా ఆయనలోనే పుట్టి - ఆయనలోనే ఉండి, - ఆయనలోనే అంతమై పోతుంటారు. ఆయన మాత్రం అందరికి ఆధారంగా ఎల్లప్పుడూ ఉండేవాడు. భూమిలో నుండి విత్తనం మొక్కగా వృక్షంగా పెరిగి ఒకనాటికి నశించిపోతుంది. భూమి మాత్రం అలాగే ఉంటుంది. అదే విధంగా పరమాత్మ పుట్టుక, నాశనం లేకుండా ఎప్పుడూ శాశ్వతంగా అలా ఉండిపోతాడు. సముద్రంలో అలలు పుడతాయి, కొంతసేపు పరుగులు తీస్తాయి. చివరకు ఆ సముద్రంలోనే అంతమైపోతాయి. సముద్రం మాత్రం ఎప్పుడూ అలాగే ఉండిపోతుంది. అలాగే ఆత్మ అజం పుట్టుకలేనిది.

2. <u>అనాదిం:-</u> పుట్టుకలేని వాడు సరే. ఎప్పటి నుండి ఉన్నాడు ఆయన? అనే సందేహం వస్తుంది కొందరికి. 'ఫలానా అప్పటి నుండి ఉన్నాడు' అంటే అది ఆయన పుట్టుకే గదా! కనుక ఆయనకు మొదలు అంటూ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

లేదు. అందుకే 'అనాది' అన్నారు. ఆదిలేని వాడు అని అర్థం. ఆయనకు ఆదియే గాదు అంతమూ లేదు, మధ్య లేదు. అందుకే ఆది మధ్యాంత రహితుడు అన్నారు.

3. సర్వలోక మహేశ్వరం:- అన్ని లోకాలను పాలించే ప్రభువు. శాసకుడు. ఆయన ఎక్కడ కూర్చొని పాలన సాగిస్తున్నాడు? అంతటా ఆయనే ఉండి, అన్నింటిలోను ఉండి, సంకల్ప మాత్రం చేత సర్వాన్ని జరిపిస్తూ ఉంటాడు. సూర్యుడు, సూర్యుని చుట్టూ గ్రహాలు, గ్రహాల చుట్టూ ఉపగ్రహాలు ఎలా తిరగాలో, ఎంత వేగంగా తిరగాలో, ఏమార్గంలో తిరగాలో అంతా శాసించేవాడు ఆయనే. అన్నిలోకాలను ఆయనే నడుపుతుంటాడు. లోకం అంటే ఈ దేహం, మనస్సు, బుద్ధి కూడా. కనుక వీటిని కూడా శాసించేది ఆ పరమాత్మే. "భ్రామయన్ సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా" - యంత్రారూఢులైన జీవుళ్ళను మాయచేత త్రిప్పేవాడు ఆయనే. ఆత్మ అంతటా ఒక్కటే గనుక, అన్ని లోకాలను పాలించేది ఆత్మయే. కనుక ఆత్మను - పరమాత్మను సర్వలోక మహేశ్వరుడు అన్నారు. ఇలా తెలుసుకుంటే? -

సఃమర్త్యేషు అసంమూఢః:- ఎవరైతే ఇలా భగవత్ తత్త్వాన్ని అజం - అనాదిం - సర్వలోక మహేశ్వరం అని తెలుసుకుంటారో వారే అసమ్మూఢులు. అంటే మోహం పూర్తిగ తొలగినవారు. మోహం అంటే -

ఆత్మను అని తెలియకపోవటం మోహం. అందువల్ల జీవుణ్ణి అనుకోవటం సమ్మోహం. ఇదే భ్రాంతి - భ్రమ. దీనివల్లనే దుఃఖం. అంటే

నేను జీవుణ్ణి అనే భ్రమ వల్లనే మనకు ఈ సమస్త దుఃఖాలు కలుగుతున్నాయి. ఈ భ్రమ - సమ్మోహం తొలిగినవారే అసంమూఢులు. వీరే జ్ఞానులు. వీరికి -

- దేహమే నేను అనే భ్రాంతి ఉండదు.
- ఈ జగత్తు సత్యము అనే భ్రాంతి ఉండదు.
- భగవంతుడు నాకన్నా వేరుగా ఎక్కడో ఉన్నాడనే భ్రాంతి ఉండదు.

ఒక గ్రామంలో ఒక గొప్ప ధనికుడున్నాడు. ఒక్కడే కుమారుడు. అతడు పెరిగి పెద్దవాడు కాగానే దురలవాట్లకు లోనయ్యాడు. త్రాగుడు, జూదం మొ||న వాటికి విచ్చలవిడిగ డబ్బు ఖర్చుచేస్తున్నాడు. తండ్రి ఎంతో ఆలోచించి, కుమారుని హయాంలో తమ కుటుంబం పేదకుటుంబం కారాదనే భావంతో తనకున్న పొలాలు, స్థలాలు అమ్మి, ఆ మొత్తాన్ని బంగారంగా మార్చి, ఆ మొత్తాన్ని ఒక బిందెలో ఉంచి, అందరూ నిద్రపోయే అర్ధరాత్రి సమయంలో ఇంటి గర్భంలో నేలను త్రవ్వి, ఆ బిందెను అందులో పెట్టి, పూడ్చివేసి బండలు పరిచాడు. కుమారునికి డబ్బుగాని, అమ్ముకునేందుకు పొలాలు, స్థలాలు గాని అందుబాటులో లేకుండా చేశాడు.

ఆ తండ్రి వృద్ధాప్యంలో ఒకనాటి అర్ధరాత్రి చనిపోయాడు. నిధి రహస్యం కుమారునికి చెప్పనేలేదు. కుమారుడు తండ్రి ఉత్తరక్రియలు జరిపించాడు. చేతిలో చిల్లిగవ్వలేదు గనుక అప్పులలో కాలం గడుపుతున్నాడు. చేసిన అప్పులు తీర్చకపోవటంతో వారు వత్తిడి

చేస్తున్నారు. కొత్తగా అప్పులు పుట్టే అవకాశం లేకుండా పోయింది. దానితో భుక్తి కోసం యాచన చేస్తూ 'భవతీ భిక్షాం దేహి' అనే స్థితిలోకి వచ్చాడు.

ఒకనాడు తన తండ్రి మిత్రుడు తటస్థపడి ఇతడితో, "మీ నాన్న ఆస్తినంతా బంగారంగా మార్చి ఇంటిలో పాతి పెడతాను అన్నాడు. ఆ విషయం నీకు చెప్పలేదా" అన్నాడు. చెప్పలేదన్నాడు కుమారుడు. మీ ఇంట్లో త్రవ్వి చూద్దాం. ఒకవేళ బిందె దొరికితే నీ దరిద్రం అంతా తీరిపోతుంది. హాయిగా బ్రతకవచ్చు - అని, ఇంటికివచ్చి ఇద్దరూ త్రవ్వి చూచారు. మధ్య ఇంటిలోనే బిందె దొరికింది. దానితో అందరి అప్పులు తీర్చి, తనకు సహాయపడిన వారికి అవసర సమయాల్లో సహాయపడుతూ సుఖంగా జీవనం సాగించాడు. దరిద్రుడు కాస్తా కోటీశ్వరుడయ్యాడు.

అతడు కోటీశ్వరుడుగా మారలేదు. నిజంగా అతడు కోటీశ్వరుడే. కాకపోతే ఆ నిధి విషయం తెలియనంత వరకు దరిద్రుడుగా జీవించాడు, కష్టాలు అనుభవించాడు. నిధి విషయం తెలియటంతో దానిని త్రవ్వి తీసుకొని కోటీశ్వరుడయ్యాడు. కష్టాలు తీరినవి. ఆనందం కలిగింది.

అలాగే మనం కూడా ఆత్మఅనే నిధిని కలిగే ఉన్నాం. అయితే ఆ నిధిని తెలుసుకోలేక జడమైన దేహమే నేను అనుకొని, జీవుడిగా దుఃఖాలు, కష్టాలు అనుభవిస్తున్నాం. ఇదే భ్రమ - సమ్మోహం. ఎప్పుడైతే


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆ తండ్రి మిత్రునిలాగ ఒక సద్గురువు మనకు లభించినప్పుడు, "నాయనా! నీవు జీవుడివి గాదు, ఆత్మస్వరూపుడివి; నీ హృదయంలోనే ఆత్మ అనే నిధి ఉన్నది." అని తెలియజెప్పి ఆ నిధిని అందుకొనే మార్గాన్ని తెలియజెప్పినప్పుడు, మన స్వరూపంలో మనం నిలిచిపోతాం. ఆత్మను అని తెలుసుకొని ఆత్మగా ఉండిపోతాం. దానితో సమస్తదుఃఖాల నుండి విముక్తికలిగి, పరమానందం లభిస్తుంది.

కోట్ల కొద్దీ నిధి ఉండి కూడా దరిద్రుడై, బిచ్చగాడై ఆకలితో అలమటించిన ఆ కోటీశ్వరుని పుత్రునిలాగా - మనం కూడా భగవంతుడనే నిధిని మన హృదయంలోనే పెట్టుకొని, తెలుసుకోలేక జీవుడిగా, హీనుడిగా, దరిద్రుడిగా, బిచ్చగాడిలా జీవిస్తున్నాం. కష్టాలతో, దుఃఖాలతో అలమటిస్తున్నాం. ఆ నిధిని తెలుసుకొని నేను జీవుణ్ణి అనే భ్రమను - సమ్మోహాన్ని తొలగించుకుంటే సమస్త దుఃఖాలు తొలగి బ్రహ్మానందంలో ఓలలాడుతాం. ఇలా అసంమూఢులైతే ప్రయోజనం ఏమిటో భగవానుడిక్కడ తెలియజేస్తున్నాడు.

<u>సర్వపాపైః ప్రముచ్యతే:-</u> అన్ని పాపాల నుండి శాశ్వతంగా విముక్తుడవుతాడు. తాను ఆత్మనని తెలిసి ఆత్మగా ఉంటే సర్వపాపాలు తొలగిపోతాయా? --- ఆ!

కలలో చేసిన హత్యకు మేలుకున్న తర్వాత శిక్ష అనుభవించాలా? లేదుగదా! అలాగే జీవభావంలో చేసిన పాపాలన్నీ ఆత్మస్థితిలో ఉన్నవాడికి తొలగిపోతాయి. కలలో చేసిన పాపాలు

జాగ్రత్ లోకి మేలుకుంటే ఎలా తొలగిపోతాయో అలాగే జాగ్రత్ లో చేసిన పాపాలన్నీ జ్ఞానస్థితిలో తొలగిపోతాయి.

కారులో కూర్చొని వెళుతున్నావు. రైల్వే గేటు వేసిఉంది. నీవు కారులో కూర్చున్నంత సేపు నీకు గేటు అడ్డమే. కారు దిగావా? గేటు నీకు అడ్డం కాదు. హాయిగా దాటి వెళ్ళిపోవచ్చు. అలాగే జీవభావంలో ఉన్నంతసేపు నీకు అన్నీ ఆటంకాలే. జీవభావం నుండి దిగావా? ఇక నీకు ఏ ఆటంకం ఉండదు.

పెంటకుప్ప మీద కూర్చున్నంత సేపు కంపు తప్పదు. దిగి దూరంగా వెళ్ళావా? ఇక కంపు నీకు ఉండదు. అలాగే జీవభావంలో ఉన్నంత వరకు పాపాలు తప్పవు. జీవభావం నుండి దిగి నీ స్థితిలో నిలిచావా? ఇక ఏ పాపాలు నిన్ను అంటవు.

అసలు "దేహమే నేను" అనే దేహాత్మ బుద్ధియే గొప్పపాపం.

"దేహాత్మ బుద్ధిజం పాపం నతద్ గోవధ కోటిభిః"- దేహాత్మ బుద్ధికి మించిన పాపం లేదు. కోటి గోవులను వధించిన దానికన్నా పాపం - అన్నారు. పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకొని అది నేనేనని గ్రహించిన అసంమూఢులే సర్వపాపాల నుండి విడుదల పొందుతారు.

భగవంతుడు సర్వలోక మహేశ్వరుడని, అన్నింటికీ అధీశుడని 4-5 శ్లోకాల్లో ఋజువుచేస్తున్నాడు.

**శ్లో||** బుద్ధిః జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమ శ్శమః|

సుఖం దుఃఖం భవోఽభావః భయం చాభయమేవ చ|| (4)

**శ్లో||** అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః|

భవంతి భావా భూతానాం మత్త ఏవ పృధగ్విధాః|| (5)

**తా||** బుద్ధి, జ్ఞానం, మోహరాహిత్యం, ఓర్పు, సత్యం,ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం, సుఖదుఃఖాలు, ఉత్పత్తి ప్రళయాలు, భయము - అభయము, అహింస, సమత్వం, తృప్తి, తపస్సు, దానం, కీర్తి, అపకీర్తి మొ||న వేరువేరు భావాలు అన్నీ నావల్లనే కలుగుతున్నాయి.

**వ్యాఖ్య:-** ఇక్కడ భగవంతుని 20 విభూతులను వెల్లడించటం జరిగింది. ఇవన్నీ జీవుళ్ళలో నావల్లనే కలుగుతున్నాయి అని కూడా భగవానుడు తెలియజేస్తున్నాడు. వీటిలో 16 మంచిభావాలు, 4 చెడ్డభావాలు ఉన్నాయి. అవి అన్నీ నావల్లనే ప్రాణులకు సంభవిస్తున్నాయని కూడా తెలియజేస్తున్నారు. మనస్సులోని భావాలకు కారణం మనలోని త్రిగుణాలే. ఈ త్రిగుణాలు ఆత్మ వల్లనే శక్తిని పొందుతున్నాయి.

అంటే మంచి, చెడ్డభావాలకు కారణం త్రిగుణాలే గాని, ఆత్మకాదు అని తెలుస్తుంది. ఆత్మకు ఏ పక్షపాత బుద్ధీ లేనేలేదు. అగ్ని దేనిని తగలబెట్టాలన్నా వాయువు ఉండాలి. ఐతే దేనినైనా అగ్ని కాల్చింది అంటాం గాని వాయువు కాల్చింది అనం. వస్తువులను చల్లబరిచేది ఫ్రిజ్. కాని ఆ ఫ్రిజ్ కు శక్తినిచ్చేది కరెంటు. వస్తువులను ఫ్రిజ్ చల్లబరిచింది అంటాం గాని కరెంటు చల్లబరిచింది అనం. అలాగే ఈ మంచిచెడు

అనేవి గుణాల వల్ల కలిగినవే గాని ఆత్మవల్ల - పరమాత్మ వల్లకాదు. కనుక పరమాత్మే నాకు సుఖాలనిస్తున్నాడు - దుఃఖాలను కలిగిస్తున్నాడు అని పరమాత్మపై నెపం వేయరాదు. ఆ సుఖదుఃఖాలన్నీ మనం చేసుకున్న కర్మల వల్లనే. మన కర్మఫలాలను మనచేత అనుభవింపజేసేవాడే పరమాత్మ.

హిరణ్యకశిపునిలో ఉన్నది దుష్టవాసనలు. ప్రహ్లాదునిలో ఉన్నది సద్ వాసనలు. ఏ వాసనలైనా జడమే. వాటికి చైతన్యాన్నిచ్చేది ఆత్మ. ఆత్మ చైతన్యం వల్లనే అవి కదిలి వాటి ప్రభావాన్ని చూపుతాయి. ఆత్మ ప్రకాశం వల్లనే హిరణ్యకశిపునిలోని దుష్టవాసనలు కదిలి దుష్టకార్యాలు చేయించినవి. ప్రహ్లాదునిలోని సద్ వాసనలు కదిలి అపారమైన భక్తిని కలిగించి, అందరిని సన్మార్గంలో నడిపించినవి. కనుక వారివారి వాసనలే వారి మంచికైనా చెడ్డకైనా కారణమయ్యాయే గాని పరమాత్మకు ఏ సంబంధము లేదు. అందుకే మంచి చెడు అన్నీ నా నుండే సంభవిస్తున్నాయి' అంటే నాశక్తి వల్లనే వాసనలు, కర్మఫలాలు కదిలి మంచి, చెడు భావాలు కలుగుతున్నాయి అని అర్థం. ఇప్పుడా మంచి చెడు విభూతులేమిటో తెలుసుకుందాం.

(1) బుద్ధి:- ఎటువంటి సూక్ష్మ విషయాన్నైనా గ్రహించే అంతఃకరణ వృత్తిని బుద్ధి అంటారు. బుద్ధి అలా సూక్ష్మ విషయాలను గ్రహించటానికి ఆధారం ఆత్మచైతన్యమే. ఓవర్ హెడ్ టాంకులో నీరుంటేనే కుళాయిలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నీరు వస్తుంది. అలాగే బుద్ధిలో తెలివి ఉన్నదీ అంటే అది అంతా భగవంతునిలోని శక్తియే. భగవంతుని నుండి వచ్చిన శక్తియే.

(2) జ్ఞానం:- జ్ఞానం అంటే బుద్ధిలోని వివేకమే. ఎవరి బుద్ధి సూక్ష్మంగా ఉంటే వారికే జ్ఞానం ప్రాప్తిస్తుంది. నేను జ్ఞానిని అనే అహంకారం ఎవ్వరికీ కూడదు. జ్ఞానం భగవంతుని స్వరూపమే. అది భగవంతుని సొత్తే.

(3) అసంమోహః :- భ్రమలేక పోవటం. ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకోవటం. ఉన్నది యదార్థంగా పరమాత్మ. కాని అజ్ఞాని మానవుడు దానిని ప్రపంచంగా భ్రమపడుతున్నాడు. ఉన్నది త్రాడు. కాని అంధకారంలో పాము అని భ్రమపడుతున్నాం. పాము కాదు అది త్రాడే అని తెలుసుకున్నట్లు ఇది ప్రపంచం కాదు పరమాత్మే అని తెలుసుకుంటే అసంమూఢుడవుతాడు. అలా తెలుసుకొనే ప్రయత్నం చేసేవాడిని అనుగ్రహించేది నేనే అని భగవానుడంటున్నాడు.

(4) క్షమ :- ఇతరులు నిందించినా, బాధించినా, అధిక్షేపించినా వికారం చెందకుండా ఓర్పుతో ఉండటమే క్షమ. ఈ క్షమ ఈశ్వర విభూతి. ప్రకృతిలోని పంచభూతాలు క్షమాగుణంతో ఉంటాయి. క్షమ గొప్ప ఆభరణం. అయితే అసమర్థుని క్షమ క్షమ కాదు. శక్తి ఉండీ ఓర్చుకుంటేనే అది క్షమ అవుతుంది.

ఒక స్త్రీని ఏసుక్రీస్తు ముందుకు తెచ్చి, "ఈమె దుష్టురాలు, అనాచారి. ఈమె వల్ల సమాజం భ్రష్టుపట్టి పోతున్నది. కనుక ఈమెను



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రాళ్ళతో కొట్టి చంపుతాం. అనుమతించండి" అన్నారు అందరూ. సరే! అంటే - తన బోధకు విరుద్ధం. వద్దు అంటే - అనాచారాన్ని ప్రోత్సహించినట్లు. ఎలా? అని ఆలోచించి వారితో "ఈమె తప్పు చేసింది అని గదా! శిక్ష. సరే మీలో తప్పుచేయని వారు రాళ్ళు వేయండి" అన్నాడు. అంతే. అందరి చేతుల్లోని రాళ్ళు జారి పడిపోయాయి. ఆ నేరం చేసిన స్త్రీ "స్వామీ! నాకు ప్రాణభిక్షే కాదు, జ్ఞాన భిక్ష కూడా పెట్టారు." అని ఆయన పాదాలపై వ్రాలింది. ఆమే మేరీ మాగ్డనాల్డ్. క్షమ భగవద్ విభూతి.

(5) సత్యం :- మనసా, వాచా, కర్మణా సత్యాన్నే వ్రతంగా కలిగిఉండాలి. "సత్యమేవ జయతే" అన్నారు. సత్యానికి మించిన ధర్మం లేదు. సత్య సంధుడైన ధర్మరాజు 'నరోవా - కుంజరోవా' అని కూటసత్యం పలికినందుకు ఆయన రథం భూమిని ఆనింది, నరకదర్శనం చేయాల్సివచ్చింది. సత్యం అంటే పరమాత్మ అని అర్థం. సత్యదర్శనం అంటే పరమాత్మ దర్శనం అని. కనుక సత్యం పరమాత్మ విభూతి.

(6) దమః :- దమం అంటే ఇంద్రియనిగ్రహం. ఎదురుగా వస్తువు ఉంది. దానిపై కోరిక ఉంది. అయినా ఇంద్రియాలను నిగ్రహించుకొని దానిని నిరాకరించటమే దమం.

(7) శమం :- శమం అంటే మనోనిగ్రహం. వస్తువుపై మనస్సులో వ్యామోహం లేకుండా పోవటమే శమం. శమం కలిగిందా దమం

దానంతటదే కలుగుతుంది. అయితే సాధకుడు ముందుగా దమం కలిగిఉండాలి. ఈ రెండూ భగవద్విభూతులే.

(8-9) సుఖం, దుఃఖం :- ఈ రెండూ భగవంతుని నుండి వచ్చేవే. భగవంతుడు కొందరికి సుఖాన్నిచ్చి బాగుచేస్తాడు, మరికొందరికి దుఃఖాన్ని కలిగించి బాగుచేస్తాడు. వైద్యుడు కొందరికి చేదుమందు ఇచ్చి, కొందరికి తీపి మందు నిచ్చి రోగాన్ని బాగుచేసినట్లుగా. సముద్రమధనంలో అమృతమూ పుట్టింది, విషమూ పుట్టింది. వివేకంతో ఉపయోగించుకుంటే విషం కూడా అమృతంలాగా పనిచేస్తుంది.

ఒక పిల్లవాడు రాయి విసిరి కుక్కను కొట్టాడు. కుక్క రాతిని చూచి మొరగదు, రాతిని విసిరిన వాణ్ణి చూచి మొరుగుతుంది. అలాగే మనం దుఃఖాన్ని చూచి గాక, దుఃఖాన్ని పంపిన పరమాత్మను చూచి మొరపెట్టుకోవాలి.

(10-11) భవోఽభావః :- సృష్టి - ప్రళయం, పుట్టుక - చావు - ఇవి కూడా భగవంతుని విభూతులే. పుట్టిన ప్రతిప్రాణీ ఎప్పుడో ఒకప్పుడు గిట్టక తప్పదు. అలాగాక పుట్టేవారు పుడుతూ చచ్చేవారు చావకపోతే ఇక్కడ ఒకరినొకరు పీక్కు తినాల్సిందే. చివరకు గాలి, నీరు కూడా దొరకదు. పెండ్లిలో దేవతా సమారాధన, చావులో వైకుంఠ సమారాధన చేస్తారు. పుట్టినప్పుడు, పోయినప్పుడు రెండు సందర్భాలలోను దృష్టి భగవంతుని వైపే ఉంచాలి. సృష్టి చేసేవాడూ, లయం చేసేవాడూ భగవంతుడే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**(12-13)** <u>**భయంచ - అభయం ఏవచ**</u> **:-** భయం, అభయం రెండూ భగవత్ విభూతులే. భయం కలిగించి కొందరిని అనుగ్రహిస్తాడు భగవంతుడు. అభయమిచ్చి కొందరిని అనుగ్రహిస్తాడు.

కంసుడు శ్రీకృష్ణుని మేనమామ. మేనల్లుడివల్ల మృత్యువు ఉన్నదని తెలుసుకొని భయపడ్డాడు. ఆ భయంతోనే ఆరుగురు పసికందులను సంహరించాడు. సోదరి దేవకిని, బావ వాసుదేవుని చెరసాలలో వేయించాడు. అడ్డు వచ్చిన తండ్రి, ఉగ్రసేనుని చెరసాలలో బంధించి తానే రాజయ్యాడు. కాని ఎన్ని చేసినా భయం తగ్గలేదు. ఇంకా ఎక్కువైంది. దేవకి అష్టమ గర్భ సంజాతుడైన శ్రీకృష్ణుడు ఎక్కడో పెరుగుతున్నాడని విని, భయపడి, ఆ వయస్సు గల పసివారందరిని నిర్దాక్షిణ్యంగా చంపించాడు. పూతనను పంపించాడు, శకటాసురుని, అఘాసురుని, ఇంకా ఎందరో మహామాయావులైన అసురులను పంపించాడు. పోయినవారు పోయినట్లే ప్రాణాలు వదిలిపోతున్నారు. దానితో భయం ఇంకా ఎక్కువైంది. చివరకు బలరామకృష్ణు లిరువురిని అక్రూరుని చేత పిలిపించాడు. మదపుటేనుగు చేత త్రొక్కించి చంపించాలనుకున్నాడు. మల్లయుద్ధంలో మల్లయోధుల చేత చంపించాలనుకున్నాడు. అన్ని ప్రయత్నాలు విఫలమై పోతున్నాయి. దానితో అంతులేని భయం కలిగింది. రాత్రింబవళ్ళు నిద్రాహారాలు మాని నిరంతరం కృష్ణునే స్మరిస్తున్నాడు. ఎక్కడ చూచినా కృష్ణుడే కనిపిస్తున్నాడు. కృష్ణుని మాటలే వినిపిస్తున్నాయి. మనసంతా

కృష్ణమయం ఐపోయింది. అలా భయం కారణంగా నిత్యము, నిరంతరము కృష్ణస్మరణ - భగవత్ స్మరణ ప్రాప్తించింది. చివరకు ఆ భగవంతుని చేతిలోనే హతుడై ఆయనలోనే లీనమై పోయాడు. ఇలా భయం ద్వారా - భయం కలిగించటం ద్వారా కంసుని హతమార్చి అనుగ్రహించాడు.

కొందరికి అభయప్రదానం చేసి రక్షించాడు భగవానుడు. విభీషణుడు రావణ సోదరుడు. రాక్షసుడు. అయినా సరే శరణన్న వారిని రక్షించటం నా వ్రతం అంటూ శ్రీరాముడు విభీషణునికి అభయప్రదానంతో రాజ్యప్రదానం కూడా చేశాడు శ్రీరాముడు.

ఇక మహాభారతంలో ద్రౌపదీ దేవి శ్రీకృష్ణ భక్తురాలు. నిండుసభలో వస్త్రాపహరణం గావించాలనే దుర్బుద్ధితో కౌరవులు ప్రయత్నిస్తున్నప్పుడు అనంత వస్త్రప్రదానంతో ద్రౌపదీదేవి మానసంరక్షణ గావించాడు. అలాగే అరణ్యాలలో దుర్వాస మహాముని వల్ల కలగబోయే అనర్థం నుండి ద్రౌపదీ పాండవులను రక్షించాడు.

ఇలా భయం - అభయం రెండూ భగవంతుని నుండి వచ్చేవే. వాటివైపు చూడక వాటినిచ్చే భగవంతుని వైపుకు చూడాలి.

(14) <u>అహింస</u> :- 'మా హింస్యాత్ సర్వభూతాని' - ఏ ప్రాణినీ హింసించరాదు - అని వేదం చెబుతున్నది. ఏప్రాణిని హింసించినా భగవంతుని హింసించినట్లే అని గ్రహించాలి. శరీరంతో గాని, వాక్కుతో గాని, మనస్సుతో గాని ఏ విధంగాను హింసచేయకూడదు.

ఐతే ఒక్కొక్కసారి అహింస కోసం హింస చేయాల్సి వస్తుంది. అది కూడా అహింసయే.

అర్జునుణ్ణి యుద్ధం చేయమన్నాడు శ్రీకృష్ణుడు. యుద్ధం అంటే హింసయే గదా! స్థూలదృష్టితో చూస్తే అంతే. కాని సూక్ష్మదృష్టితో చూస్తే అది అహింసయే. ఎలా?

కాలిలో ఇనుప సీల గుచ్చుకొంది. అశ్రద్ధ చేశావు. సెప్టిక్ అయింది. ఇప్పుడు డాక్టరు దగ్గరకెళ్ళావు. కాలు తీసేస్తే కాని బ్రతకవు అన్నాడు. మిగతా శరీరం మొత్తాన్ని కాపాడుకోవాలంటే పాదం వరకు తీసేయాల్సిందే. మరి ఆ పాదాన్ని తీసివేయటం హింసా? అహింసా? పైకి హింసగా కనిపించినా అది అహింసయే.

నీటిలో నుండి చేప ఒడ్డున పడి గిలగిల తన్నుకుంటుంది. దానిని ఇంటికి తెచ్చి ఎన్నో ఉపచారాలు చేశావు. మెత్తని పరుపుపై పరుండబెట్టి, విసురుతూ ఎంతో సేవచేస్తున్నావు. అంతేగాని దానిని నీటిలో మాత్రం వెయ్యటం లేదు. ఇప్పుడిలా సేవచేయటం హింసా? అహింసా? అహింసగా కనిపించినా అది హింసయే.

అలాగే మొత్తం సమాజం సుఖశాంతులతో జీవించాలంటే సమాజ విధ్వంసకులను - అధర్మపరులను - అన్యాయం చేసేవారిని సంహరించాల్సిందే. అది హింస కాదు - అహింసయే. వారిని వదిలేస్తే అంతా హింసయే జరుగుతుంది.

అహింస భగవంతుని విభూతి. భగవంతుని వల్లనే ఈ అహింసాభావం కలుగుతుంది. కనుక అహింసను పాటించేటప్పుడు కూడా మనదృష్టి భగవంతునిపై ఉండాలి.

(15) సమత :- సమత్వం. అందరిని సమదృష్టితో చూడటం. 'సమత్వం యోగ ముచ్యతే' అన్నారు 2వ అధ్యాయంలో. సమత్వానికి వ్యతిరేకం మమత్వం. నా అనుకున్న వారిపై అభిమానం, పక్షపాత బుద్ధి కలిగిఉండటం. సామాన్యుల దృష్టి ఈ మమత్వం. మహాత్ముల దృష్టి సమత్వం. శ్రీకృష్ణుని దృష్టి సమత్వ దృష్టే. నా పక్షం, శత్రుపక్షం అనే తేడాలేకుండా తన పక్షంలోని ఉపపాండవులు, శిఖండి, దృష్టద్యుమ్నులు, ఘటోత్కచుడు, తన మేనల్లుడే అయిన అభిమన్యుడు మొ||న వారిని యుద్ధరంగానికి బలి ఇవ్వటం జరిగింది. పరపక్షంలోని తన భక్తులు, అభిమానులు అయిన భీష్మద్రోణాదులను కూడా బలిపెట్టటానికి వెనుకాడలేదు. ఇదే సమదృష్టి. ఈ సమతా దృష్టి పరమాత్మ యొక్క విభూతియే.

(16) తుష్టి :- తృప్తి. కోరుకున్నది లభించినా, అక్కరలేనిది వదిలిపోయినా కలిగేది తృప్తి. ఏది లభించినా భగవత్ ప్రసాదం అని భావించి తృప్తి చెందాలి. నీ జేబులోని డబ్బును చూచుకొని గాక, నీ హృదయంలోని పరమాత్మను చూచుకొని తృప్తి చెందాలి. తృప్తి కలిగింది అంటే అది భగవంతుని నుండి వచ్చిన భావమే.

(17) తపస్సు :- తన సుఖాన్ని తగ్గించుకోవటమే తపస్సు. భగవంతుని కొరకు తపిస్తూ తన సుఖాన్ని పట్టించుకోకపోవటం నిజమైన తపస్సు. 'తపోహిదురతిక్రమః" - తపస్సు భేదింపరాని కవచం. తపస్సు వల్ల అసాధ్యం సాధ్యమవుతుంది. విశ్వామిత్రుడు ఘోరతపస్సు చేసి సృష్టికి ప్రతిసృష్టి చేశాడు. అర్జునుడు పాశుపతాస్త్రం సంపాదించాడు. హిరణ్యకశిపుడు, రావణ కుంభకర్ణులు, సైంధవుడు తపస్సు చేసి కొన్ని లౌకికమైన కోరికలు సాధించారు. విభీషణుడు ఘోరతపస్సు చేసి తన బుద్ధి ధర్మాన్ని వదలకుండా ఉండాలనే వరాన్ని కోరుకున్నాడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వం సాధించాడు. మహాత్మాగాంధీ ఉపవాసవ్రతం అనే తపస్సు - సత్యాగ్రహం అనే తపస్సు చేసి భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించాడు.

- తపించిన కుండ కుమ్మరి సారెపైకి మళ్ళీ వచ్చే పనిలేదు.
- తపించిన జీవుడు ఈ సంసారంలోకి మళ్ళీ వచ్చే పనిలేదు.

'తప' అనే రెండు అక్షరాలను తిరగేస్తే 'పత' అవుతుంది. తపస్సు లేనివాడికి పతనమే గతి. తపస్సు భగవంతుని విభూతి.

(18) దానం :- మనకున్న దానిలో కొంత ఇతరులకు త్యాగం చెయ్యటమే దానం. తన సుఖాన్ని తగ్గించుకోవటం తపస్సు. ఇతరులకు సుఖాన్ని కలిగించటం దానం. తపస్సు, దానం చెయ్యాలనే బుద్ధి భగవంతుని వల్లనే కలుగుతుంది. దానం ప్రతిఫలం పుచ్చుకోకుండా చెయ్యాలి. శిబి చక్రవర్తిలాగా, బలిచక్రవర్తిలాగా, దధీచి


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**లాగా దానం చెయ్యాలి. కర్ణుని దానం (కవచకుండల దానం) లాగా ఉండకూడదు. అది ఫలించదు.**

**(19-20) యశః అయశః :- కీర్తి - అపకీర్తి. ఈ రెండింటికి మూలం పరమాత్మే. ధర్మంగా నడుచుకుంటే కీర్తి. అధర్మంగా నడుచుకుంటే అపకీర్తి. ఎంత కీర్తి వచ్చినా అది భగవత్ప్రసాదమే అని భావించాలి, పొంగిపోరాదు. అపకీర్తికి క్రుంగిపోరాదు.**

**ఈ భావాల్లో ఏవికలిగినా వాటిల్లో మునిగిపోకుండా, మూలమైన పరమాత్మను చూడాలి. ఆయననే చేరుకోవాలనే నిశ్చయంతో ఉండాలి.**

**ఇంతవరకు ఆధ్యాత్మిక విభూతులను చెప్పి, ఇక ఆధి దైవిక విభూతులను గురించి చెప్పబోతున్నారు.**

**శ్లో||** మహర్షయః సప్తపూర్వే ఛత్వారో మనవ స్తథా।

**మద్భావా మానసా జాతాః యేషాం లోక ఇమాః ప్రజాః|| (6)**

**తా||** సప్తర్షులు, వారి కంటే ముందున్న సనకాది నలుగురు మునులు, మనువులు అంతా నా సంకల్పం వల్ల జన్మించిన వారే. వీరి నుండే ఈ ప్రాణులంతా వచ్చారు.

**వ్యాఖ్య:- ఇంతవరకు చెప్పిన 20 ఆధ్యాత్మిక విభూతులు నానుండే వచ్చినవని చెప్పిన భగవానుడు ఈ శ్లోకంలో ఆధిదైవిక విభూతులన్నీ నానుండే వచ్చినవని చెప్పబోతున్నాడు.**

ఈ లోకంలో పుట్టిన, పుడుతున్న, పుట్టబోయే మానవులందరికి ఆది పురుషుడెవరు? అదీ నేనే అంటున్నాడు భగవానుడు. ఈ మానవులంతా ఎలా వచ్చారు? 14 మంది మనువులు, 7గురు సప్తర్షులు, నలుగురు దేవర్షులు - వీరి నుండి వచ్చారు. వీరో? వీరంతా బ్రహ్మ నుండి. బ్రహ్మదేవుడో? పరమాత్మ నుండి.

పరమాత్మ సృష్టి చేయాలనుకున్నప్పుడు డైరెక్టుగా చేయడు. కారణం? ఆయన అకర్త. ఆయన సృష్టి చేయాలని సంకల్పం కలగటంతో ఆయన నుండి బ్రహ్మ వస్తాడు. ఆ బ్రహ్మ తపస్సు ద్వారా తానెందుకు పుట్టిందీ తెలుసుకుంటాడు. సృష్టి కోసమే ఆయన పుట్టినట్లు తెలుసుకుంటాడు.

బ్రహ్మ యొక్క పగటికాలం కల్పం. అది 432 కోట్ల సంవత్సరాలు. అలాగే రాత్రికాలం ప్రళయం అదీ 432 కోట్ల సం||లు. పగటికాలం సృష్టికాలం. ఈ సృష్టిని చేసి కొనసాగించుటకు ఆయన మనస్సు నుండి సనక సనందనాదులనే నలుగురు మహాజ్ఞానులు జన్మించారు. వారిని సృష్టి కార్యం నిర్వర్తించ మనగా వారు అంగీకరించలేదు. దానితో ఆయన సప్తర్షులను, 14 మంది మనువులను సృష్టించి వారిని సృష్టి కార్యం కొనసాగించమని ఆదేశించాడు. ఆ మనువుల నుండి వచ్చినవారే మానవులు. బ్రహ్మదేవుని పగటికాలం ప్రారంభంలో స్వాయంభువ మనువు సృష్టి ప్రారంభించాడు. తరువాత స్వారోచిష



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనువు. ప్రస్తుతం వైవస్వత మనువు. కనుక అందరికి మూలపురుషుడు మనువే.

సుబ్బయ్య అని ఒకాయన ఉండేవాడు. ఆయనకు 8 మంది కుమారులు. వారికి ఒక్కొక్కరికి 3,4,5 గురు చొ||న 30 మంది. వారికి తిరిగి 80 మంది. వారికి మళ్ళీ 270 మంది. వారికి 600 మంది. ఇలా కొన్ని తరాలు గడిచేటప్పటికి మొత్తం 4000 మంది అయ్యారు. అయితే అందరికీ మూలపురుషుడు సుబ్బయ్యే. అందరూ ఒకే కుటుంబంలోనివారే. అలాగే భగవంతుని కుటుంబంలోని వారమే మనమంతా.

ఇలా ఎవరైతే తెలుసుకున్నారో వారు మేము అల్పజాతి వారమని, తక్కువ కులం వాళ్ళమని దిగులు చెందాల్సిన పనిలేదు. అలాగే మేము ఉత్తమజాతి వారమని, అందరికన్నా అధికులమని అహంకారించాల్సిన పనిలేదు. అందరూ పరస్పరం సహకరించుకుంటూ ఒకే కుటుంబంలోని వారుగా జీవించాలి.

భగవంతుని సంకల్పం ప్రకారమే మనువులు ఈ మానవులను సృష్టించారు. 'ఏకో2హం బహుస్యాం' అనేది భగవంతుని సంకల్పం. 'ఒక్కడినైన నేను అనేక రూపాలు కావాలి' అని. కనుక ఇక్కడి రూపాలన్నీ ఆయనవే. ఆయన విభూతులే. భగవంతుడిలా సంకల్ప మాత్రంచేత అనేక రూపాలుగా సృజింపబడి - సృష్టిగావించి గొప్ప ఏర్పాట్లుచేశాడు. అలా సప్తర్షులు - నలుగురు దేవర్షుల సృష్టి జరిగింది.

(1) <u>సప్తర్షులు</u> :- భృగువు, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు. వీరంతా గృహస్థులు కూడా. బిడ్డలను కన్నవారే వీరంతా.

(2) <u>దేవర్షులు</u> :- వీరు. సనకుడు, సనందుడు, సనత్ కుమారుడు, సనత్ సుజాతుడు. వీరు బ్రహ్మచారులు, దిగంబరులు - అంటే ఎప్పుడూ బాలలుగా ఉండే మహాత్ములు, బ్రహ్మజ్ఞాన సంపన్నులు. సనత్ అంటే సర్వకాలాలలో కుమారులుగా అంటే బ్రహ్మచారులుగా ఉండిపోయే వారు అని అర్థం. కనుక వీరికి సంతానం లేదు. కాకపోతే శిష్యరూపంలో వీరి అనుయాయులు వ్యాపించియున్నారు.

<u>మద్భావా, మానసాజాతాః</u>:- ఆ సప్తర్షులు గాని, ఈ దేవర్షులు గాని వీరంతా 'మద్భావా' అంటే నాభావం గలవారు. అంటే నిరంతరం దైవభావనలో - ఆత్మజ్ఞానంలో ఉండేవారు. పైగా 'మానసా జాతా ' అంటే నా మనస్సు నుండి జన్మించిన వారు.

మరి వీరి పనిఏమిటి? -

ప్రజలను తరింపజేయుటే వీరి పని. మానవులంతా ముక్తిని పొందాలంటే - తరించాలంటే - స్వస్థితిలో నిలవాలంటే - శాశ్వత ఆనందస్థితిలో ఉండాలంటే సాధన చేయాలి. దానికి 2 మార్గాలు.

1.ప్రవృత్తిమార్గం. 2. నివృత్తిమార్గం.

<u>1.ప్రవృత్తిమార్గం</u>:- అంటే మన పూర్వజన్మ కర్మల ఫలంగా లభించిన ఈ శరీరంతో గృహస్థులుగా జీవిస్తూ - అంటే ధనసంపాదనతో - కోరికలు

తీర్చుకుంటూ, సంతానాన్ని కంటూ, మనస్సును మాత్రం వాటియందు ఇరికించకుండా నిరంతరం పరమాత్మ యందే నిలిపి మోక్షం కొరకు తపిస్తూ, శ్రవణ - మనన - నిధిధ్యాసనలతో పరమాత్మ వైపుకు అడుగువేయాలి. అలా చేయాలంటే మనశ్శుద్ధి జరగాలి. అందుకు మార్గ దర్శకులే సప్తర్షులు. వారు గృహస్థులుగానే ఉండి తరించారు గనుక వారి మార్గంలో పయనించి చిత్తశుద్ధిగావించుకొని, ఆత్మజ్ఞానాన్ని పొంది,ఆత్మానుభూతిని పొందాలి. మనది ప్రవృత్తి మార్గమే.

అందుకే అందరికీ ఋషి - గోత్రం ఉంటుంది. నేను ఫలనా ఋషి సాంప్రదాయానికి చెందినవాణ్ణి అంటాం. కేవలం అంటే చాలదు. ఆ ఋషి మార్గాన్ని అనుసరించి తరించాలి. ఇదే ప్రవృత్తి మార్గం. సామాన్యుల మార్గం.

2. <u>నివృత్తిమార్గం:-</u> ఇక అనేక జన్మలలో గృహస్థులుగా ఉండి చిత్తశుద్ధిగావించుకొన్నవారు ఆత్మతత్త్వాన్ని, బ్రహ్మజ్ఞానాన్ని మహాత్ముల ద్వారా - సద్గురువుల ద్వారా పొంది, సంసారాన్ని త్యజించి, లేదా సంసారాన్ని తగిలించుకోకుండా సర్వసంగ పరిత్యాగంతో, తీవ్రమోక్షా పేక్షులై, బ్రహ్మనిష్ఠులైన సద్గురువులను సేవించి, వైరాగ్యంతో మోక్ష సామ్రాజ్యాన్ని అందుకోవాలి. దీనిని లభింపజేయటానికే సనక సనందనాదులు. వీరు గురువులుగా, తీవ్ర ముముక్షువులైన శిష్యులకు వైరాగ్యాన్ని, జ్ఞానాన్ని బోధిస్తారు. మోక్షమార్గాన్ని చూపుతారు. ఇదే నివృత్తిమార్గం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- సంసారంలో ఉండే మోక్షమార్గంలో ప్రయాణించటం ప్రవృత్తిమార్గం.
- సంసారాన్ని త్యజించి మోక్షమార్గంలో ప్రయాణించటం నివృత్తిమార్గం.

ఇలా సప్తర్షుల ద్వారా, నలుగురు దేవర్షుల ద్వారా మానవులు తరించటానికి మార్గం ఏర్పరచాడు భగవంతుడు. దీనిని బట్టి -

(i) మానవుల పుట్టుకకు కారణం మనువులు.

(ii)ఆ మానవులు ప్రవృత్తిమార్గంలో - గృహస్థులుగా ఉండి తరించటానికి మార్గం చూపేవారు సప్తర్షులు.

(iii) ఆ మానవులు నివృత్తి మార్గంలో - సన్యసించి, జ్ఞాన వైరాగ్య బోధల చేత తరించుటకు మార్గంచూపేవారు సనకసనందనాదులు నలుగురు.

వీరంతా భగవద్భావం గలవారే. అంటే వీరంతా పరమాత్మ యొక్క మనస్సు నుండి జన్మించిన మానసపుత్రులు, పరమాత్మ భావనలో ఉండేవారు, పరమాత్మ విభూతులు, ఆధిదైవిక విభూతులు అని గ్రహించాలి.

ఇలా భగవంతుని విభూతులు తెలుసుకుంటే ప్రయోజనం ఏమిటి?

**శ్లో|| ఏతాం విభూతిం యోగంచ మమయో వేత్తి తత్త్వతః|**

**సోఽవికంపన యోగేన యుజ్యతే నాత్ర సంశయః|| (7)**

**తా||** నా యీ విభూతిని, యోగాన్ని ఎవరు అసలు తత్త్వంలో తెలుసుకుంటాడో అతడు చలించని యోగంలో నిలిచిపోతాడు. ఈ విషయంలో ఏ సందేహమూ లేదు.

**వ్యాఖ్య:-** ఈ సమస్త సృష్టి భగవంతుని విభూతియే అని సమ్యక్ దృష్టితో - యదార్థదృష్టితో చూడగలగాలి. అలా చూడగలవాడే అవికంప యోగంలో - చలించని యోగంలో నిలిచిపోతాడు. అంటే నిరంతరం పరమాత్మ స్థితిలోనే నిలిచిపోతాడు. ఐతే భగవంతుని విభూతిని యదార్థంగా తెలుసుకోలేని వాడు కొద్దిసేపు పరమాత్మలో - కొద్దిసేపు ప్రపంచంలో నిలుస్తాడు. నిరంతరం పరమాత్మ భావనలో ఉండలేక పోవటానికి కారణం ఇదే. సాధారణంగా ఎంత వేదాంతాన్ని తెలుసుకున్నా ఆత్మలో నిలువలేక పోవటానికి కారణం పరమాత్మ యదార్థ తత్త్వాన్ని తత్త్వతః - తెలుసుకోలేకపోవటమే. ఎంతటి పండితులైనా, భక్తులైనా, జ్ఞానులైనా, గొప్పవారైనా యోగంలో స్థిరంగా లేరు అంటే వారు విషయాసక్తితో ప్రాపంచిక విషయాలవైపు ఆకర్షించబడుతున్నారు - అనియే.

అందువల్ల భగవంతుని సర్వత్రా దర్శించాలన్నా, చలించని యోగంలో నిలవాలన్నా భగవంతుని విభూతులు చక్కగా తెలుసుకోవాలి. అలా తెలుసుకొని సర్వకాల సర్వావస్థలలోను సర్వత్రా పరమాత్మను చూడగలగాలి.

సప్తర్షులు, సనకాది దేవర్షులు, మనువులు అంతా తన మనస్సు నుండి పుట్టిన వారేనని - కనుక వారంతా తన విభూతులే అని చెప్పారు. అలాగే బుద్ధి, జ్ఞానం, సత్యం, క్షమ, తపస్సు, దానం మొ||న భావాలన్నీ తన విభూతులేనని చెప్పారు. కనుక ఏ భావాన్ని పొందినా, దేనిని చూచినా, ఎవరిని చూచినా, దేవతలను తలచుకొన్నా అందరూ పరమాత్మ విభూతులే అని తెలుసుకుంటే చలించని యోగంలో నిలుస్తాడు.

సృష్టి ఎలాగున్నా సరే దృష్టి మాత్రం సరిగ్గా ఉండాలి. అప్పుడే సర్వత్రా పరమాత్మ దర్శనం.

రామకృష్ణ పరమహంస వద్దకు ఒక వితంతు స్త్రీ వచ్చింది. "స్వామీ! జీవనోపాధికి లోటు లేదు. ఒక బిడ్డ ఉన్నాడు. భర్తృవియోగం. ఇక ఈ జీవితాన్ని భగవంతుని సేవకు అంకితం చెయ్యాలనుకుంటున్నాను. కనుక తరించే ఉపాయం బోధించండి. దయచేసి మంత్రోపదేశం చేయండి" అన్నది.

పరమహంస ఆమెకు మంత్రాన్ని ఉపదేశించి, మంత్రాధిష్టాన దేవతను ధ్యానిస్తూ మంత్రజపం చేయమని చెప్పాడు. ఆమె ఇంటికి వెళ్ళి జపం చేయబోతే మంత్రాధిష్టాన దేవతకు బదులు తన బిడ్డ రూపమే కనిపిస్తున్నది. ఎన్ని రోజులు చేస్తున్నా అంతే. చివరకు ఒకనాడు పరమహంస వద్దకెళ్ళి తన బాధను చెప్పుకున్నది. అప్పుడాయన అన్నాడు, "అమ్మా! నీ ఇష్టదైవము నీ పుత్రరూపంలో

దర్శన మిస్తున్నాడని భావించు. అతడు నీ పుత్రుడని ఆ శరీరాన్ని చూచి భావిస్తున్నావు. చైతన్యం తొలగితే ఆ శరీరాన్ని ముట్టవు గదా! కనుక నీ బిడ్డ శరీరంలోని చైతన్యమే నీ ఇష్టదైవం అని భావించు." - నీ యిష్టదైవమే నీ పుత్రరూపంలో కనిపిస్తున్నదనుకుంటే నీ జపం చక్కగా సాగిపోతుంది" అన్నాడట.

ఇలా అన్ని రూపాలను భగవంతునిగా చూడాలి. భగవంతుడే ఇన్ని వేరువేరు రూపాలుగా దర్శన మిస్తున్నాడని దర్శించాలి.

అంతటా పరమాత్మను దర్శించాలంటే ఇంటి నిండా ప్రతి గదిలోను దేవుని విగ్రహాలు పెడితే బాగుంటుంది గదా! మరి ఇంటి నుండి బయటకు వెళ్ళినప్పుడో! రోడ్డు మీద వరుసగా వందలవేల విగ్రహాలు పెట్టాలి. ఏదన్నా ఊరువెళితేనో! ఆ ఊరంతా విగ్రహాలు పెట్టాలి. ఇది సాధ్యమా? కాదు. కనుక సృష్టిని మార్చలేవు. నీ దృష్టిని మార్చుకోవాలి.

పూర్వం ఒకరాజు గారికి నేత్రవ్యాధి. ఎండను చూస్తే కంటి నుండి నీరు కారుతుంది. ఎందరు ఎన్ని రకాల వైద్యాలు చేసినా తగ్గలేదు వ్యాధి. ఒకరోజు ఒక భిషగ్వరుడు రాజును పరీక్షించి, "రాజా! నేను చెప్పినట్లు చేస్తే నీకు జబ్బు క్రమంగా తగ్గిపోతుంది" అన్నాడు. రాజు సరే అన్నాడు. దానికా వైద్యుడు, "రాజా! కంటికి ఇంపుగా ఉండే రంగు ఆకుపచ్చరంగు. ఉదయం నిద్రలేచింది మొదలు రాత్రి పడుకోబోయేంత వరకు ఆకుపచ్చరంగును మాత్రమే చూస్తుండు. ఇదే ఉపాయం"

అన్నాడు. రాజు మంత్రిని పిలిచి, "నేను ఎక్కడున్నా, ఎక్కడ తిరుగుతున్నా అంతా ఆకుపచ్చరంగే కనిపించాలి. అన్ని వస్తువులు ఆకుపచ్చగానే ఉండాలి" అన్నాడు.

మంత్రి ఆదేశంతో రాజభవనం అంతా ఆకుపచ్చరంగు వేయించాడు. మంచాలు, కంచాలు, వస్తువులు - అన్నింటికి ఆకుపచ్చరంగే. రాజుగారు తిరిగే వీధులలోని అన్నిఇళ్ళకు ఆకుపచ్చరంగే. ఫ్యాక్టరీలన్నీ ఆకుపచ్చరంగునే తయారుచేయాలని ఆదేశించాడు. కొన్ని వేలమంది కార్మికులు రంగుడబ్బాలు, బ్రష్షులు పట్టుకొని నగరమంతా పచ్చదనం చేస్తున్నారు.

ఒక సాధువు క్రొత్తగా నగరానికి వచ్చి జరుగుతున్న దృశ్యాన్ని చూచి; అక్కడి వారి నడిగితే విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పారు. అప్పుడా సాధువు రాజు దగ్గరకెళ్ళి, "రాజా! ఇది ఎంత అవివేకం? మీరు ఇంత చేసినా ఒకవేళ పైకి చూచారనుకోండి. ఆకాశం ఆకుపచ్చగా కనబడుతుందా? మనుష్యుల ముఖాలు ఆకుపచ్చగా కనిపిస్తాయా? ఇదంతా వ్యర్థప్రయత్నం. ఎంతో ఖర్చు. కనుక ఇది ఆపి మీరు ఆకుపచ్చ కళ్ళద్దాలు ధరించండి చాలు." అన్నాడు.

కనుక సృష్టిని మార్చటానికి ప్రయత్నిస్తే ప్రయోజనం లేదు. దృష్టిని మార్చుకోవాలి. దృష్టిని పవిత్రం చేసుకోవాలి. దృష్టిని భగవన్మయం చేయాలి.

నీలో ఏభావం కలిగినా అది పరమాత్మే అనే దృష్టితో చూడు. ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు దీని నిచ్చిన భగవంతుని చూడు. దేవతలను, మహర్షులను, మనువులను - ఎవరిని స్మరిస్తున్నా వారి మూలపురుషుడైన భగవంతుని స్మరించు. మానవులను, సకల భూతాలను చూచేటప్పుడు వారికి మూలమైన భగవంతుని భావించు. పంచభూతాలను చూచినా వాటి నిచ్చిన భగవంతుని గుర్తు చేసుకో. ఇలా అంతటా భగవంతునే దర్శించటం నేర్చుకోవాలి.

అత్రసంశయః నః :- ఇలా చేస్తే భగవంతునే నిరంతరం స్మరిస్తూ, ఆయననే చేరాలనుకుంటావు. భక్తి కలిగి ఉంటావు. ఆయనను వదిలి ఒక్కక్షణం కూడా ఉండవు. ఇదే అవికంప యోగం. ఈ విషయంలో ఏ సందేహము అక్కరలేదు. కనుక భగవానుని మాటను విశ్వసించి భగవతత్త్వాన్ని తత్త్వతః తెలుసుకోవాలి.

మూడేళ్ళ పిల్లవాడు ఆడుకొనేందుకు తండ్రి ఒక కొయ్యగుర్రాన్ని కొనిచ్చాడు. వాడు దానిమీద కూర్చొని వెనక్కుముందుకూ ఊగుతూ "నా గుర్రం వస్తున్నది, పరిగెత్తండి, ప్రక్కకు తప్పుకోండి" అని కేకలు వేస్తూ, దానిని అదిలిస్తుంటాడు. అసలు అది కొయ్య. కాని వాడికి మాత్రం గుర్రం. కొయ్య కొయ్యగానే ఉండి గుర్రం రూపాన్ని తనలో ఇముడ్చుకుంది. అలాగే పరమాత్మ పరమాత్మగానే ఉండి జగత్తు యొక్క రూపాన్ని తనలో ఇముడ్చుకున్నాడు. అందుకే కొయ్యను చూచి గుర్రం అని ఆ పసివాడన్నట్లు - పరమాత్మను చూచి జగత్తు అంటున్నాం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అజ్ఞానులమైన మనం. మన ఈ దృష్టిని సరిచేసి నిజమైన దృష్టిని ప్రసాదించటమే ఈ విభూతియోగం యొక్క ఆంతర్యం. గుర్రం రూపంలో కనబడుతున్నా అది కొయ్యేనని గ్రహించినట్లుగా, జగత్తు రూపంలో కనబడుతున్నా ఇది పరమాత్మే అని తెలుసుకోవాలి. అలాంటి దృష్టి కలగటానికే ఈ విభూతియోగం.

ఇట్టి యోగంలో నిలవటానికి సాధనాక్రమం ఏమిటి? -ఎలా సేవిస్తారు భగవంతుని?

**శ్లో||** అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే|
ఇతి మత్వా భజంతేమాం బుధా భావ సమన్వితాః|| **(8)**

**తా||** ఈ అన్నింటి పుట్టుకకూ నేనే మూలకారణం. నావల్లనే జగత్తంతా నడుస్తున్నది. ఇది తెలుసుకున్న వివేకులు భక్తితో నన్నే సేవిస్తారు.

**వ్యాఖ్య:-** సాధారణంగా లోకంలో భగవంతుని పూజించేవారు, సేవించేవారు, ధ్యానించేవారు చాలామంది ఉంటారు. అయితే వీరిలో అనేకమంది కష్టాలు వచ్చినప్పుడు తొలగించుకోవటానికో, కోరికలను తీర్చుకొనుటకో, సమాజంలో గొప్పతనం కోసమో, కాలక్షేపం కోసమో, తప్పుడు పనులను కప్పిపుచ్చుకొనుటకో, భవిష్యత్తులో కష్టం వస్తుందనే భయంతోనో ఉన్న సంపదలు పోతాయనే భయంతోనో - ఏవో కారణాలతో పూజించేవారే. భగవంతునిపై పరిపూర్ణమైన భక్తితో, ఏ కోరిక లేకుండా, నిస్వార్థంగా, కేవలం తరించాలనే కోరికతో

భక్తిభావంతో పూజించేవారు అరుదుగా ఉంటారు. అసలు ఇదే నిజమైన భక్తి.

అయితే అటువంటి భక్తి ఎలా కుదురుతుంది? భగవంతుని మహిమ ఎట్టిదో నిజంగా తెలిస్తే, ఆయన మనకు ఎంత ఆప్తుడో - ఆత్మీయుడో తెలిస్తే కలుగుతుంది. ఒక వస్తువు యొక్క విలువ; దాని ప్రయోజనం తెలిస్తేనే దానిపై ఆసక్తి కలుగుతుంది. అలాగే భగవంతుని మహిమ తెలిస్తేనే భగవంతునిపై నిజమైన భక్తి, ఆసక్తి కలుగుతుంది. 'భక్తిలేని పూజ పత్రి చేటు' అన్నారు. మరి ఏమిటి భగవంతుని మహిమ?

అహం సర్వస్య ప్రభవః:- ఈ సమస్త జగత్తు యొక్క పుట్టుకకు కారణం పరమాత్మే. అన్నింటికి - అందరికి మూలకారణం పరమాత్మే. దేని యొక్క పుట్టుకకైనా రెండు కారణాలుంటాయి. 1. ఉపాదాన కారణం. (ముడిసరుకు) 2. నిమిత్త కారణం (తెలివి). ఈ జగత్తుకు ఉపాదానము, నిమిత్తము - రెండూ భగవంతుడే. కనుక ఆయన ఉభయకారణం. మాయయే ఉపాదానం. చైతన్యమే తెలివి (నిమిత్తం). కనుక రెండూ ఆయనే.

సాధారణంగా సృష్టిని గురించి 3 వాదాలున్నాయి.

1. ఆరంభవాదం:- మనం మట్టిని తెచ్చి బొమ్మలు చేసినట్లు భగవంతుడు పరమాణువు మొ|| న సామాగ్రితో ఈ సృష్టి చేశాడని చెప్పటం ఆరంభవాదం. ఇది సామాన్యులకు అర్థమయ్యేందుకు చెప్పేదే గాని

సత్యం కాదు. కారణం? భగవంతుని కన్న వేరుగా ఏ పరమాణువు ఉండే వీలులేదు గనుక.

2. పరిణామవాదం:- పాలు తోడువేస్తే పెరుగైనట్లు భగవంతుడే ఈ జగత్తుగా మారిపోయాడు అని. ఇది మధ్యములకు చెప్పేది. కానీ ఇదీ సత్యం కాదు. కారణం? పాలు పెరుగైతే ఇక పాలు ఉండవు. అలాగే పరమాత్మ జగత్తుగా మారితే ఇక పరమాత్మ ఉండే అవకాశం లేదుగదా!

3. వివర్తవాదం:- తాడు తాడుగానే ఉండి చీకటి వల్ల పాముగా కనిపించినట్లు పరమాత్మ పరమాత్మగానే ఉండి అజ్ఞానం వల్ల ప్రపంచంగా - జగత్తుగా కనిపిస్తున్నాడు అనేది వివర్తవాదం. ఇదే సత్యం. ఇది ఉత్తమ సాధకులకు చెప్పే విధానం. జగత్తు కనిపిస్తున్నా ఉన్నది పరమాత్మే. జగత్తు అదృశ్యమైనా ఉన్నది పరమాత్మే.

'బ్రహ్మ సత్యం జగన్మిధ్య' అనేది ఇందుకే. కనిపించని పరమాత్మ సత్యం. కనిపించే జగత్తు మిథ్య. అంటే లేదని కాదు. అజ్ఞానం వల్ల 'లేకపోయినా కనిపిస్తుంది' - అని. జగత్తుగా కనిపించేది యదార్థంగా పరమాత్మే.

ఇలా ఒక్కొక్క స్థాయిలో ఒక్కొక్క విధంగా చెప్పటం జరుగుతుంది. ఏది ఏమైనా జగత్తు యొక్క సృష్టికి కారణం పరమాత్మే. అంతేకాదు -

మత్తః సర్వం ప్రవర్తతే:- ఈ జగత్తు నడవటానికి కారణం పరమాత్మే. ఈ విషయం తెలిస్తే భగవంతుడెప్పుడూ మనను ఒకకంట

కనిపెడుతున్నాడని గ్రహిస్తాం. దానితో చెడు చేయరాదని, మంచి చేయాలని; సాధకులకు సాయపడతాడని, మనకు శక్తినిస్తాడని తెలుసుకుంటాం. ఈ జగత్తు, జగత్తులోని చరాచర ప్రాణికోటి, గ్రహాలు, ఉపగ్రహాలు - అన్నీ పరమాత్మ చైతన్యం వల్లనే కదులుతున్నాయి. సూదంటురాయి (Magnet) సన్నిధానంలో సూదులు కదిలినట్లు ఈ జడజగత్తు - జీవుళ్ళు అందరూ పరమాత్మ చైతన్యం కారణంగా కదులుతూ ఉన్నారు. ఈ విషయాన్ని అధికారులైన (అర్హులైన) పండితులు తెలుసుకోగలుగుతారు. అలా తెలుసుకొని వారి మనస్సును పరిపూర్ణంగా ఆ పరమాత్మ యందే నిల్పి అనేక విధాలుగా పరమాత్మను భజిస్తారు, పూజిస్తారు, ఆరాధిస్తారు. అన్ని రూపాలను పరమాత్మగానే భావించి, ఏ మూర్తిని పూజించినా పరమాత్మనే పూజించినట్లు భావించి సేవిస్తారు.

అట్టి వివేకం గలిగినవారే తమ మనస్సును విషయప్రపంచం నుండి మరల్చుకోగలుగుతారు. పరమాత్మపై మనస్సును లగ్నం చేస్తారు.

ఈ జగత్తు నందు ఈశ్వరుడుగా వ్యవహరించే ఆత్మ, శరీరంలో జీవుడుగా వ్యవహరించే ఆత్మ - రెండూ ఒక్కటేనని (కుండలోని ఆకాశం, అంతటా ఉన్న ఆకాశం ఎలా ఒక్కటేనో అలాగ). ఆ ఆత్మ తానేనని, తనకంటే వేరు కాదని తెలుసుకొని పరిపూర్ణ భక్తిని నిలుపుకోవటమే 'భావసమన్వితాః' అనే పదం సూచిస్తున్నది.

**ఇలా పరిపూర్ణ భక్తితో భజించేవారు ఎలా ప్రవర్తిస్తారు?**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరం|

కథయం తశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతిచ|| (9)

**తా||** తమ మనస్సులను నాలో లగ్నం చేసి, జీవితాలను నాకే అర్పించి, నా గురించే పరస్పరం చెప్పుకుంటూ, బోధించుకుంటూ నిత్యము తృప్తి పడతారు, ఆనందిస్తారు.

**వ్యాఖ్య:-** 1. మచ్చిత్తా:- సామాన్యుల చిత్తం ఎప్పుడూ ప్రాపంచిక విషయాల పైనే ఉంటుంది. సంపాదించటం, ఖర్చుపెట్టటం, సుఖభోగాలు అనుభవిచటం, కీర్తిప్రతిష్టలు సంపాదించటం, పదవులు అధికారం సంపాదించటం, భార్యాబిడ్డల పోషణ - ఇవే ఎల్లప్పుడూ వారి మనస్సులలో ఉండే విషయాలు. అయితే భగవంతుని మహిమను గుర్తెరిగిన వారు ఎల్లప్పుడూ తమ చిత్తాన్ని భగవంతుని యందే నిలుపుతారు. పూజలు, పారాయణలు, జపధ్యానాలు చేస్తుంటారు. భక్తుల కథల గురించి చదువుతూనో, వింటూనో మనం కూడా అంతటి భక్తిని ఎప్పుడు కలిగి ఉంటామా? అని ఆలోచిస్తుంటారు.

2. మద్గత ప్రాణాః:- భగవద్విభూతిని, ఐశ్వర్యాన్ని తెలుసుకొన్న మహాత్ములు ఆ భగవంతుని చేరుకొనుటకు తమ ప్రాణాలను కూడా లెక్కచేయరు. తమ జీవితాలను భగవంతునికే అంకితం చేస్తారు.

తల్లికి బిడ్డపై అంతులేని ప్రేమ. బజారులో కారు దూసుకువస్తున్నది. బిడ్డ అజాగ్రత్తగా నడుస్తున్నది. ఒక్క క్షణంలో ఏం జరగబోతుందో తెలుసుకున్న తల్లి తటాలున బిడ్డను ఆవలకు నెట్టేసింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తన ప్రాణాలు పోయినా ఫరవాలేదు. బిడ్డ రక్షింపబడాలి. అంటే తాను ప్రేమించే బిడ్డ కోసం ప్రాణాలు లెక్కచెయ్యదు. అలాగే భక్తుడు తాను ప్రేమించే భగవంతుని కొరకు ప్రాణాలను లెక్కచెయ్యడు. కనుక భగవంతుని పొందాలంటే త్యాగం చెయ్యాలి. 'త్యాగే నైకే అమృతత్వ మానశుః' అని ఉపనిషత్తు చెబుతున్నది.

రాజ్యం కోసం, ప్రేమ కోసం, పదవి కోసం, డబ్బు కోసం ప్రాణాలు వదులుకొనేవారు లోకంలో ఎందరో ఉన్నారు. కాని భగవంతుని కోసం ప్రాణాలను త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డవాని జన్మయే జన్మ. సార్థక జన్మ.

దేవతల కోసం దధీచి వెన్నముక ఇచ్చి ప్రాణాన్ని వదిలాడు. బలిచక్రవర్తి దానం ద్వారా భగవంతుని తృప్తిపరచి పాతాళానికి అణగ ద్రొక్కబడ్డాడు. శ్రీరాముని కోసం ఆంజనేయుడు రాక్షస సమూహం మధ్యకు లంకకు వెళ్ళాడు. సముద్ర లంఘనం చేశాడు. నారాయణుని కోసం ప్రహ్లాదుడు అగ్నిలోకి, సముద్రంలోకి విసరివేయబడ్డాడు, విషాన్ని త్రాగాడు, ఎన్ని కష్టాలకైనా సిద్ధమయ్యాడు. ఇదే భగవంతుని కోసం జీవితాలను అర్పించటం అంటే.

3. పరస్పరం బోధయంతః:- ఎవరికి ఏ విషయం ఇష్టమో వారు దానిని గురించే మాట్లాడుకుంటారు. ఇద్దరు వ్యాపారులు ఒకచోట చేరితే పెట్టుబడులు, లాభాలు, కస్టమర్స్ తెలివితేటలు, ప్రభుత్వం వల్ల కలిగే ఇబ్బందులు, పన్నులు - గురించి మాట్లాడుకుంటారు. ఇద్దరు ప్లీడర్లు

ఒకచోట చేరితే కేసులు, వాదించటంలో తెలివితేటలు, తాను పట్టిన కేసును ఎంతకాలం సాగదీసిందీ, జడ్జీగారి అలవాట్లు గురించి మాట్లాడుకుంటారు. ఇద్దరు డాక్టర్లు ఒకచోట చేరితే జబ్బులు, మందులు, ఆపరేషన్లు, హాస్పిటల్ గదులు నింపటం, ఎలా తెలివిగా ఫీజులు వసూలు చెయ్యాలి? అని మాట్లాడుకుంటారు. ఇద్దరు ఆడవాళ్ళు ఒకచోటకు చేరితే చీరలు, సొమ్ములు, వంటకాలు, సినిమాలు, టి.వి. సీరియల్స్, భర్తల అలవాట్లు, పెళ్ళిళ్ళు, పేరంటాలు మొ||న విషయాల గురించి మాట్లాడుకుంటారు. ఇలా ఎవరకి సంబంధించినవి వారు మాట్లాడుతారు. అదే ఇద్దరు భక్తులు ఒకచోట చేరితే పుణ్యక్షేత్రాలు, తీర్థాలు, దేవాలయాలు, పారాయణలు, పూజలు, వ్రతాలు, వేదాంత విషయాలు, భక్తుల చరిత్రలు మాట్లాడుకుంటారు. తాము నేర్చుకున్న విషయాలను, క్రొత్తగా విన్న కథలను గురించి చర్చించుకుంటారు. దీనివల్ల అంతవరకు విన్న విషయాలు బాగా అర్థమవుతాయి, క్రొత్త విషయాలు తెలుస్తాయి, సందేహాలు తొలగిపోతాయి.

<u>4.కథయంతశ్చ:-</u> ఎవరైతే ఇలా పరస్పరం చర్చించి నిశ్చయజ్ఞానం పొందుతారో దానిని ఇతరులకు వినిపించాలనుకుంటారు. ఇతరులకు బోధించటం వల్ల తమకు తెలిసిన విషయాలు ఇంకా స్థిరపడతాయి. ఇలా చేస్తూ -

<u>5. నిత్యం తుష్యంతి - రమంతిచ:-</u> ఇలా ఆధ్యాత్మిక చింతనతో, భక్తి భావంతో ఉండేవారికి నిత్యము తృప్తి - ఆనందం పుష్కలంగా

**లభిస్తాయి. వారికి ఎప్పుడూ సంతోషమే. అట్టివారికి కలిగే గొప్ప మేలు ఏమిటో తెలియజేస్తున్నారు.**

**శ్లో|| తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం|**

**దదామి బుద్ధి యోగం తం యేన మాముపయాంతి తే|| (10)**

**తా|| అలా సతతమూ నా యందు మనసు నుంచి ప్రీతితో సేవించేవారికి నన్ను చేరుకొనుటకు అవసరమైన జ్ఞానాన్ని నేనే కలుగజేస్తాను.**

**వ్యాఖ్య:- అసలు మానవులుగా మనం పుట్టింది ఎందుకు? మళ్ళీమళ్ళీ పుట్టకుండా ఉండటానికే. అంటే మోక్షం పొందటానికే. దీనిని సాధించకపోయినా సాధించటానికి ఏమాత్రం ప్రయత్నం చేయకపోయినా మన జీవితాన్ని వ్యర్థం చేసుకున్నట్లే. మరి అట్టి మోక్షాన్ని పొందటానికి ముఖ్యమైన - ఏకైక మార్గం ఏమిటి? అదే జ్ఞానమార్గం లేదా జ్ఞానయోగం . దానినే ఇక్కడ బుద్ధియోగం అన్నారు. అట్టి బుద్ధియోగం మనకు ఎలా లభ్యమవుతుందో ఇక్కడ ఉపాయాన్ని చెబుతున్నారు. (1) నిత్యము, నిరంతరము భగవంతుని యందు చిత్తాన్ని నిలపటం. (2) భగవంతుని ప్రీతితో - ఇష్టంతో - ప్రేమతో - భక్తితో భజించటం. కనుక ఎప్పుడో ఒకప్పుడు కాక నిత్యము, నిరంతరము మనస్సు భగవంతుని యందే ఉండాలి. అదీ ప్రీతితో - భక్తితో - ప్రేమతో నింపాలి - భజించాలి - సేవించాలి.**

ఇలా ప్రీతితో సేవించిన వారికి ఫలంగా భగవంతుడు బుద్ధియోగాన్ని ప్రసాదిస్తాడు. ఈ బుద్ధి యోగం వల్లనే జీవుడు తన యదార్థస్వరూపం ఆత్మయని - పరమాత్మయని గ్రహించి, జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని సాధించి, ఈ జీవబ్రహ్మైక్యత ద్వారా సమస్త దుఃఖనివృత్తిని, శాశ్వత ఆనందప్రాప్తిని పొందుతాడు. అందుకే బుద్ధియోగం.

బుద్ధియోగం అంటే ఈ దేహేంద్రియ మనోబుద్ధులన్నీ అనిత్యమైన అనాత్మ వస్తువులని గ్రహించి, వీటిని నిత్యవస్తువైన ఆత్మ నుండి వేరుచేసి చూచే జ్ఞానమే బుద్ధియోగం. ఇలా వేరుచేసి చూచే శక్తి బుద్ధి వల్లనే కలుగుతుంది. అందుకే ఇది బుద్ధియోగం అన్నారు.

దీనిని బట్టి మనకొక విషయం తెలుస్తుంది. జ్ఞాన మనేది భక్తి వల్లనే లభిస్తుంది - అని. భక్తియనే పుష్పం జ్ఞానమనే ఫలంగా మారుతుంది. ప్రహ్లాదుడు గొప్ప భక్తుడు. ఆయనకు శ్రీహరి ప్రత్యక్షం కాగా మోక్షాన్ని ప్రసాదించమన్నాడు. కాని భగవంతుడు ఆయనకు భక్తిని ప్రసాదించి మోక్షప్రాప్తి కలుగుతుందని ఆశీర్వదించాడు. కనుక –

- భక్తిలేకుండా జ్ఞానం పొందటం సాధ్యం కాదు. అలాగే
- జ్ఞానం లేని కేవల భక్తి పరమాత్మ సాక్షాత్కారాన్ని - మోక్షాన్ని ప్రాప్తింప చేయదు. మరొక విధంగా ఈ భక్తి జ్ఞానాల మధ్యగల సంబంధాన్ని గ్రహించవచ్చు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- భక్తియోగం అంటే సాకార సగుణోపాసన. ఇది విగ్రహారాధన - పూజ.
- జ్ఞానయోగం అంటే నిరాకార నిర్గుణోపాసన. ఇది అంతరంగంలోని ఆత్మపూజ.

ఇలా బాహ్యంలో ఉండే సాకారదృష్టి అంతరంగంలోని నిరాకారదృష్టిగా ఎప్పుడు మారుతుంది? కొంతకాలం భక్తియోగంతో - సాకారపూజను ప్రీతితో - నిస్వార్థంగా చేస్తే, భగవంతుని ఏదో ఒక రూపంతో ఆరాధిస్తే పరమాత్మ సంతృప్తి చెంది, నిరాకార నిర్గుణోపాసనకు కావలసిన బుద్ధిని - తెలివిని ప్రసాదిస్తాడు. ఇలా సాకారం నిరాకారం అవుతుంది. కనుక తరించాలి అంటే భగవంతుని ప్రీతితో నిరంతరము సేవించాల్సిందే.

భగవంతుడు ఎక్కడ కూర్చొని, ఏ విధంగా బుద్ధియోగాన్ని ప్రసాదిస్తాడు?

శ్లో|| తేషామేవాను కంపార్థం అహమ జ్ఞానజం తమః|
నాశయా మ్యాత్మ భావస్థః జ్ఞాన దీపేన భాస్వతా|| (11)

తా|| వారిని అనుగ్రహించటం కోసమే నేను వారి మనస్సులలో నిలిచి, వారి అజ్ఞాన తమస్సును జ్ఞానమనే దీపం యొక్క ప్రకాశంతో నశింపజేస్తాను.

**వ్యాఖ్య:- 1. అజ్ఞానజంత మః:- అజ్ఞానం అంటే ఏమిటి? మన నిజస్వరూపం - యదార్థస్వరూపం ఏమిటో తెలియకపోవటమే అజ్ఞానం. మన యదార్థ స్వరూపం ఏమిటి? ఆత్మ - పరమాత్మ - ఇదే మన యదార్థస్వరూపం. ఇది తెలియనందు వల్ల ఈ దేహమేనేనని, మనస్సే నేనని, బుద్ధియే నేనని భ్రమపడుతున్నాం. ఈ భ్రమ కారణంగానే - ఈ దేహతాదాత్మ్యం కారణంగానే నేను చేస్తున్నాను అనే కర్తగా, నేను అనుభవిస్తున్నాను అనే భోక్తగా ఈ లోకంలో కర్మలు చేస్తూ, కర్మఫలాలు అనుభవిస్తున్నాం. ఈ కర్మల కారణంగా మళ్ళీమళ్ళీ జన్మలెత్తుతున్నాం. జననమరణ రూప సంసార చక్రంలో బంధించబడి బాధలు పడుతున్నాం, దుఃఖాలు అనుభవిస్తున్నాం. ఏమిటి దుఃఖాలు? జన్మించేటప్పుడు జన్మ దుఃఖం; జీవించేటప్పుడు ఆశలు, కోరికలు తీరక దుఃఖం, జబ్బులు చేస్తే వ్యాధి దుఃఖం; ముసలితనం వల్ల జరాదుఃఖం; మరణసమయంలో మరణదుఃఖం; తిరిగి గర్భంలో ప్రవేశించినప్పుడు గర్భదుఃఖం - ఇదే గర్భనరకం. ఈ దుఃఖాలన్నింటికి కారణం జన్మలే. జన్మలకు కారణం అజ్ఞానం. ఈ అజ్ఞానమనే అంధకారం తొలగిపోతే తప్ప జీవుడికి దుఃఖాలు తొలగవు.**

**మరి ఈ అజ్ఞానమనే అంధకారం ఎలా తొలగుతుంది?**

**2. జ్ఞాన దీపేన భాస్వతా:- జ్ఞానమనే దీపం యొక్క ప్రకాశం వల్ల తొలగుతుంది. అయితే ఈ జ్ఞానదీపం ఎక్కడ లభిస్తుంది? ఎవరి వల్ల లభిస్తుంది? ఇది భగవంతుని వల్లనే లభిస్తుంది. ఆయనే జ్ఞానదీపాన్ని**

వెలిగించి మనలోని అజ్ఞానమనే కటికచీకట్లను పారద్రోలగలడు. కనుక ఈ జ్ఞానదీపం పరమాత్మ యొక్క ప్రసాదం. ఆయనే మన బుద్ధిలో దీనిని వెలిగించాలి. అయితే లోకంలో ఉన్న అందరికీ ఈ జ్ఞానదీపాన్ని ప్రసాదిస్తాడా? లేదు. మరి ఎవరికి ప్రసాదిస్తాడు?

ఎవరిపై భగవంతునికి అనుగ్రహం కలుగుతుందో, దయ కలుగుతుందో వారికే ప్రసాదిస్తాడు. మరి ఎవరి మీద దయ కలుగుతుంది? ఆయనకు కూడా పక్షపాత బుద్ధి ఉన్నదా? రాగద్వేషాలున్నాయా? లేవు. మరి?

ఎవరైతే భగవంతుని ప్రీతితో, నిత్యము, నిరంతరము సేవిస్తారో - ఎవరి చిత్తం నిరంతరం భగవన్మయమై ఉంటుందో, ఎవరు తనపై అచంచల భక్తిని కలిగిఉంటారో అట్టివారిపైనే ఆయనకు దయ - అనుగ్రహం. ఐతే అట్టివారికి ఆయన ఎక్కడ కూర్చొని ఈ సహాయం చేస్తున్నాడు?

3. <u>ఆత్మభావస్థః</u>:-వారి యొక్క అంతఃకరణంలో కూర్చొని ఈ జ్ఞానదీపాన్ని వెలిగిస్తున్నాడు. నిజంగా పరమాత్మ ప్రత్యేకంగా అంతఃకరణంలోకి వచ్చి కూర్చోడు. ఆయన ఎప్పుడూ సర్వజీవుల అంతఃకరణంలో ఉండనే ఉన్నాడు. ప్రతి జీవి యొక్క దేహమునందు నఖశిఖ పర్యంతం వ్యాపించియే యున్నాడు.

ఇప్పుడొక పుస్తకం ఉన్నది. కాని కంటికి కనిపించటం లేదు. ఎందుకు కనిపించటం లేదు? చీకటి కారణంగా. అంతేగాని నిజంగా

పుస్తకం లేదా? అంటే ఉన్నది . అది ఉన్నది అని తెలిస్తే - అది మన కంటికి కనిపించకపోయినా చేతితో తడిమిచూస్తాం. అక్కడా ఇక్కడా చెయ్యి ఆనించి చూస్తాం. అంతలో ఎవరైనా ఒక దీపాన్ని వెలిగించి తెస్తే వెంటనే దానిని చూడగలుగుతాం, చేతితో తాకగలుగుతాం, తీసుకోగలుగుతాం.

అలాగే ఆత్మ అనేది లేని వస్తువు కాదు. అది అంతటా సర్వకాల సర్వావస్థలలోను ఉన్నదే.అయినా చూడలేకపోతున్నాం. తెలుసుకోలేక పోతున్నాం. ఎందుకు? అజ్ఞానమనే చీకటి వల్ల. కనుక ఈ అజ్ఞానమనే చీకటి తొలగాలి. ఎలా తొలగుతుంది? జ్ఞానమనే దీపాన్ని వెలిగిస్తే అజ్ఞానమనే చీకటి తొలగిపోతుంది. ఏమిటి ఈ జ్ఞానదీపం? అదే తత్త్వ విచారణ. నాయదార్థ స్వరూపం ఏమిటి? అని విచారణ. నేనెవరు? అనే విచారణ. నేను ఈ శరీరం కాదు, ఇంద్రియాలు కాదు, మనస్సు కాదు, బుద్ధికాదు, ప్రాణాలు కాదు. వీటన్నింటికి వేరుగా ఉండి, వీటికి చైతన్యాన్నిస్తూ ఉన్న సూక్ష్మాతి సూక్ష్మ, స్వయం ప్రకాశక, సర్వవ్యాపకమైన ఆత్మను అని విచారణ చేసి తెలుసుకోవటమే జ్ఞానం. ఈ జ్ఞానాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటే అదే జ్ఞానదీపం. ఈ జ్ఞాన దీపం వల్లనే - అజ్ఞానం వల్ల పుట్టిన తమస్సు - చీకటి తొలగిపోతుంది.

**4.నాశయామి:-** తనను ఎవరైతే భక్తితో - ప్రీతితో నిరంతరము భజిస్తూ ఉంటారో అట్టివారి అంతఃకరణంలోని అజ్ఞానమనే చీకటిని జ్ఞానదీపంతో నశింపజేస్తాను అని భగవానుడు హామీ ఇస్తున్నాడు.

ఎందుకంటే అజ్ఞానాంధకారాన్ని ఎవరికి వారు తొలగించుకోలేరు. భగవంతుని అనుగ్రహంతోనే తొలగించుకోవాలి. అందుకు భగవంతుని అనుగ్రహం కావాలి. ఆ అనుగ్రహాన్ని సంపాదించాలంటే ఆయనపై అచంచల భక్తి ఉండాలి. నేను గొప్పభక్తుణ్ణి అని మనం చెప్పుకోవటం కాదు, భగవంతుడే నమ్మాలి. అప్పుడే హామీ అమలవుతుంది. అజ్ఞానం నాశనం అవుతుంది. నాశనం చేస్తానని భగవంతుడే హామీ ఇస్తున్నాడు. కనుక మనం తప్పక నమ్మాలి. అందుకే -

నమ్మిన వారికి సొమ్ము. నమ్మనివారికి దుమ్ము - అన్నారు.

కనుక మనం ప్రాపంచిక విషయాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా భగవంతునిపై నమ్మకంతో, విశ్వాసంతో ఆ భగవంతునికే ప్రాధాన్యత ఇచ్చి, ఆయనపై నిత్య నిరంతర భక్తిని కలిగిఉండాలి.

- భగవంతునిపై భక్తి లేకపోతే ఆయన అనుగ్రహం కలగదు.
- ఆయన అనుగ్రహం కలగకపోతే జ్ఞానమనే దీపం ప్రకాశించదు.
- జ్ఞానదీపం ప్రకాశించకపోతే అజ్ఞానమనే చీకటి నశించదు.
- అజ్ఞానమనే చీకటి నశించకపోతే సంసార దుఃఖం తొలగదు. మోక్షం కలగదు.

కనుక జ్ఞానం ద్వారా మోక్షాన్ని పొందాలంటే భగవంతునిపై నిజమైన భక్తి కలగాలి. అట్టి భక్తి కలగాలంటే భగవంతుని మహాత్మ్యం, భగవంతుని యొక్క విభూతులు చక్కగా తెలియాలి. ఆ తెలియటం ఒక మహాత్ముడైన సద్గురువు నుండి తెలియాలి. అర్జునునికి సాక్షాత్తు

జగద్గురువైన భగవానుని నుండే తెలుసుకొనే అదృష్టం లభించింది. అందుకే భగవానుని 7శ్లోకాల్లో స్తుతించి ఆయన విభూతులను తెలియజేయమని అర్థిస్తున్నాడు. భగవానుడు తన భక్తుడు - శిష్యుడు అయిన అర్జునునిపై తన కరుణామృత వర్షం కురిపిస్తుంటే; ఆనంద డోలికలలో తేలియాడుతున్న అర్జునుడు పరవశించిపోతూ భగవానుని అనేక విధాలుగా స్తోత్రం చేస్తున్నాడు. గురువు పట్ల ఇట్టి అచంచలభక్తి ఉంటేనే గురువాక్యం శిష్యుని హృదయంలో చక్కగా నాటుకుంటుంది. ఏమని ప్రశంసిస్తున్నాడు అర్జునుడు?

**అర్జున ఉవాచ:**

**శ్లో||** పరంబ్రహ్మ! పరంధామ! పవిత్రం పరమం భవాన్!|
పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవ! మజం విభుం|| **(12)**

**శ్లో||** ఆహుస్త్వాం ఋషయస్స ర్వే దేవర్షిర్నారదస్తథా|
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవేషిమే|| **(13)**

**తా||** అర్జునుడన్నాడు: నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు, పరమ పవిత్రుడవు, శాశ్వతుడవు, దివ్యుడవు, పరమ పురుషుడవు, ఆదిదేవుడవు, పుట్టుక లేనివాడవు, సర్వవ్యాపకుడవు అని అందరు ఋషులూ, దేవర్షినారదుడు, అలాగే అసితుడు, దేవలుడు, వ్యాసుడు నిన్ను అంటారు. స్వయంగా నీవు కూడా ఆ విధంగానే చెబుతున్నావు.

**వ్యాఖ్య:-** భగవంతుని అనేకమంది ఋషులు, దేవర్షులు ఏమని స్తుతించారు?

**1.పరంబ్రహ్మ:-** బ్రహ్మ అంటే 'బృహత్ ఇతి బ్రహ్మ' చాలా పెద్దది అని అర్థం. లోకంలో చాలా పెద్దవి అని చెప్పబడే వాటన్నింటికన్న పెద్దది పరమాత్మయే గనుక పరంబ్రహ్మ అన్నారు. అన్నింటికి అతీతుడైనవాడే పరమాత్మ.

**2.పరంధామ!:-** పరమాత్మ స్థానం పరంధామం. అన్నింటికన్న ఉన్నతమైన, అన్నింటికి అతీతమైన, శ్రేష్ఠమైన స్థానం పరంధామం. ఏమిటి ఆ స్థానం యొక్క గొప్పతనం? ఆ స్థానాన్ని ఒక్కసారి పొందితే ఇక మళ్ళీ ఎక్కడకూ వెళ్ళవలసిన పనిలేదు. తిరిగి ఈ సంసారచక్రంలో పడే ప్రమాదం లేదు. అదే పరమపదం. ఆ పదం నిజంగా పరమాత్మే.

**3.పరమం పవిత్రం:-** గంగానది తనలో స్నానం చేసినవాడి పాపాలనే పోగొడుతుంది. కాని పరమాత్మో - స్మరించినంత మాత్రాననే సర్వుల పాపాలను పోగొట్టి పవిత్రులను చేస్తాడు. అంతేకాదు ఆయనను తెలుసుకుంటే - ఆయనతో ఐక్యమైతే మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తులనుగా చేయగలడు. కనుక పరమపవిత్ర మూర్తి పరమాత్మ.

**4.పురుషం:-** పురమునందంతటా వ్యాపించియున్న వాడే పురుషుడు. మనుష్యుల, దేవతల, యక్షగంధర్వ కిన్నెరకింపురుషాదుల, పశు, పక్షి, క్రిమి, కీటకాది తిర్యగ్ జంతువుల, సమస్త స్థావర జంగమాల యొక్క శరీరాలను సృష్టించి; ఆ శరీరాలనే పురములన్నింటియందు

అంతర్యామిరూపంలో శయనించి విశ్రాంతి పొందుతున్నవాడు పరమాత్మే గనుక ఆయన పురుషుడు - పరమపురుషుడు - శ్రేష్ఠపురుషుడు.

5.శాశ్వతం:- పరమాత్మ శాశ్వతుడు, నిత్యుడు, ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండా ఉండేవాడు కాదు. ఈ జగత్తు సృష్టికి ముందూ ఆయన ఉన్నాడు. ఈ జగత్తు ఉన్నప్పుడూ ఈ జగద్రూపంలో ఆయనే ఉన్నాడు. ఈ జగత్తు అంతమైపోయిన తర్వాతా ఆయన మాత్రమే ఉంటాడు. కనుక ఆయన శాశ్వతుడు. ఆయనకు జననమరణాలు లేవు. తల్లిదండ్రులు లేరు. ఆద్యంతాలు లేవు.

6.దివ్యం:- దివ్యమైన వాడు పరమాత్మ. అంటే పరమప్రకాశ రూపం గలవాడు అని. ఈ జగత్తు అంతటికి ప్రకాశం ఇచ్చేవాడు సూర్యుడు. ఆ సూర్యుని నుండి ప్రకాశాన్ని పొందేవి గ్రహాలు, ఉపగ్రహాలు. మనకు కనిపించే చంద్రుడు కూడా సూర్యుని నుండి ప్రకాశాన్ని గ్రహించేవాడే. అయితే ఆ సూర్యునికి ప్రకాశం ఇచ్చేది ఎవరు? సూర్యునిలో అంతర్యామిగా ఉన్న పరమాత్మే. అందుకే దివ్యమైన వాడు పరమాత్మ. ఆయన లక్షణాలన్నీ దివ్యమైనవే. దైవ సంబందమైనవే. అందుకే దివ్యం అన్నారు.

7.ఆదిదేవం:- ఆదిదేవుడు పరమాత్మ. విశ్వంలో అనేకమంది దేవతలున్నారు. ఎవరు వీరు? మానవులుగా జన్మించి యజ్ఞయాగాదుల ద్వారా, పుణ్యకర్మల ద్వారా పుణ్యం సంపాదించుకున్న వారంతా దేహం

వదిలిన తర్వాత దేవజన్మలెత్తుతారు. వారిలో గొప్ప పుణ్యాత్ములు దేవతలకు అధిపతులుగా, దిక్పాలకులుగా, దేవేంద్రునిగా స్వర్గభోగాలనుభవిస్తూ ఉంటారు. వీరందరు శాశ్వతంగా ఉండేవారు కాదు. పుణ్యఫలం క్షయమైపోతే తిరిగి ఈ లోకానికి వస్తూపోతూ ఉంటారు. ఈ దేవతలందరికీ మొదటివాడు సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు. అయితే ఆ బ్రహ్మదేవునికి ఆదికారణం పరమాత్మే. అంటే బ్రహ్మదేవుడు కూడా పరమాత్మ నుండే ఉద్భవించి, చివరకు ఆయనలో లయమైపోతాడు. కనుక పరమాత్మ ఆదిదేవుడు.

8.అజం:- పుట్టుకలేని వాడు పరమాత్మ. ఈ లోకంలో అందరికీ పుట్టుక ఉంటుంది. తల్లి గర్భం నుండి ఉద్భవిస్తారు. కాని పరమాత్మకు తల్లి, తండ్రి లేరు. పుట్టుకలేదు. బ్రహ్మదేవునికి కూడా కారణం పరమాత్మే. ఆయన కారణంలేని కారణం.

9.విభుం:- అంటే సర్వవ్యాపకం. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మమైనవాడు. కనుక సర్వవ్యాపి. ఆయన లేనిచోటు లేదు. ఇందుగలడందు లేడను సందేహము వలదు, చక్రి సర్వోపగతుండని ప్రహ్లాదుడు చెప్పటానికి కారణం ఇదే. ఆయనకు శరీరం లేదు. గుణాలు లేవు. నిరాకారుడు, నిర్గుణుడు. పంచభూతాలలన్నింటిలో ఒక్కటే గుణమున్న ఆకాశం సూక్ష్మం. అంతటా వ్యాపించియుంటుంది. పరమాత్మకు ఆ ఒక్కగుణం కూడా లేదు కనుక సూక్ష్మాతి సూక్ష్మం. సర్వవ్యాపకం. అందుకే విభుం అన్నారు.

భగవంతుని ఇలాగని ఎవరు స్తుతిస్తున్నారు?

1.సర్వేఋషయః:- ఋషులందరూ. ఋషులంటే సప్తర్షులు, ఇంకా అనేక మంది మహర్షులు. వశిష్ఠుడు, అత్రి, అంగిరసుడు, పులహుడు, విశ్వామిత్రుడు, పులస్త్యుడు, మరీచి, వామదేవుడు, అగస్త్యుడు, శాండిల్యుడు, కౌండిన్యుడు మొ||న వారెందరో భగవంతుని అనేక విధాలుగా ప్రశంసించారు. స్తుతించారు.

2. దేవర్షిః నారదః:- దేవర్షియైన నారదుడు లోకకళ్యాణం కోసం లోకాలన్నీ సంచరిస్తూ భగవంతుని అనేకవిధాలుగా కీర్తిస్తూ ఉంటాడు. ఇంకా బ్రహ్మమానస పుత్రులైన సనకసనందనాదులు కూడా పరమాత్మను స్థుతిస్తూ ఉంటారు.

3.అసితుడు, దేవలుడు,వ్యాసుడు:- వ్యాసమహర్షి భగవంతుని వైభవాన్ని కీర్తించటానికి భాగవతమనే పురాణగ్రంధాన్ని రచించాడు. అందులో భగవంతుని అనేక విధాలుగా స్థుతించాడు, కీర్తించాడు. ఇక అసితుడు, దేవలుడు అనే మహర్షులు ఆయన శిష్యులే. వీరు ఇద్దరు అని కొందరు, కాదు అసితదేవలుడనే పేరుగల ఒక్కరే అని కొందరు చెబుతుంటారు. వీరు భగవంతుని గుణగానం చేసినవారే. మహాభారతంలో వీరి ప్రస్తావన ఉన్నది.

వ్యాసమహర్షి మహాభారత గ్రంధకర్త అని అందరికీ తెలుసు. లక్ష శ్లోకాల మహాభారతగ్రంధాన్ని గణపతిచేత వ్రాయించాడని లోకంలో ప్రతీతి. కాని వ్యాసుని మహాభారతం నిజంగా 60 లక్షల శ్లోకాల గ్రంధం

**అని వ్యాసభారతం మనకు తెలియజేస్తున్నది. ఇందులో 30లక్షల గ్రంధాన్ని దేవలోకంలో నారదుడు ప్రచారం చేయగా, 15 లక్షల గ్రంధాన్ని పితృలోకంలో అసితదేవలుడు, 14 లక్షల గ్రంధాన్ని గంధర్వలోకంలో శుకమహర్షి, లక్షశ్లోకాల గ్రంధాన్ని ఈ మానవలోకంలో వైశంపాయనుడు జనమేజయునికి సర్పయాగ ముగింపు సందర్భంగా చెప్పి ప్రచారం గావించారని వ్యాసభారతం తెలియజేస్తున్నది. ఇలా అసితదేవలుడనే మహర్షి మహాభారతాన్ని పితృలోకంలో ప్రచారం చేసినవాడు. ఈ విషయం అంతా అర్జునునికెలా తెలుసు?**

**వ్యాసుడు, నారదుడు, మార్కండేయుడు - ఇంకా అనేకమంది మహర్షులు పాండవ జ్యేష్ఠుడైన ధర్మరాజు వద్దకు అనేక సందర్భాలలో వచ్చియున్నప్పుడు భగవత్తత్వాన్ని గురించి, భగవంతుని మహిమను గురించి అనేకవిధాలుగా వర్ణించి చెబుతుంటే అప్పుడు అర్జునుడు విన్నాడు. అయితే ఆ విషయాలు అప్పుడు అంతగా నాటుకోలేదు. ఇప్పుడు భగవానుడు స్వయంగా చెబుతుంటే ఆ విషయాలన్నీ గుర్తుకు వస్తున్నాయి అర్జునునికి. అప్పుడు అవన్నీ పరమాత్మ యొక్క విశేషణాలు అనుకున్నాడు. కాని ఇప్పుడు అవే విశేషణాలను శ్రీకృష్ణుడు తన ఎదురుగా ఉండి చెబుతూ 'అవన్నీ నేనే' అంటున్నాడు. దానితో శ్రీకృష్ణుడే పరమాత్మ అని ఆశ్చర్యపోతున్నాడు.**

శ్రీకృష్ణుడు తన చెలికాడని, తన తల్లికి మేనల్లుడని, సమ వయస్కుడని, స్నేహితుడని, బావయని, మేధావియైన రాజనీతిజ్ఞుడని, వసుదేవ పుత్రుడని, గోపికా వల్లభుడని, ఆర్త జనరక్షకుడని, మహావీరుడని మాత్రమే ఇంతవరకు భావించాడు. ఇప్పుడు ఆయన మాటలతో సాక్షాత్తు పరమాత్మయని తెలుస్తున్నది. అసలు ఇదెలా సాధ్యం? నిజంగా ఈయన పరమాత్మా? తన కంటికి కనిపిస్తున్న శ్రీకృష్ణుడు అజుడు, అవ్యయుడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి అని ఎలా నమ్మటం? ఆయన మాటపై నమ్మకముంది. కాని తనకింకా కొంత వివరణకావాలి.

తనకు కావలసిన వివరణ నివ్వగలవాడు తన గురువు, మిత్రుడు, బంధువు, శ్రేయోభిలాషి, తన సారథి, సచివుడు, అన్నింటికి మించి గొప్పగొప్ప వేదాంత రహస్యాలను తేలికగా బోధపడేటట్లు చేయగల విద్వాంసుడు అయిన శ్రీకృష్ణుడే. అందుకే ఆయనను స్తుతించి తనకు కావలసిన సమాచారాన్ని రాబట్టుకోవాలి; తన సందేహాలను తీర్చుకోవాలి. తద్వారా తన కృష్ణుడే పరమాత్మయని తెలుసుకొని తృప్తి చెందాలి - అని అనుకున్నాడు. అందుకే శ్రీకృష్ణుని మాటలపై అచంచల విశ్వాసాన్ని ప్రకటిస్తూ తనకు ఏమి కావాలో వినయంగా అర్థిస్తున్నాడు. ఎలా?

భగవానునిపై తన విశ్వాసాన్ని ప్రకటిస్తూ భగవంతుని మహిమను తెలియజేస్తున్నాడు అర్జునుడు.

**శ్లో||** సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ!|

నహితే భగవాన్! వ్యక్తిం విదుర్దేవాన దానవాః|| (14)

**తా||** కేశవా! నీవు నాతో చెప్పినదంతా యదార్థమేనని నమ్ముతున్నాను. నీ నిజస్వరూపాన్ని దేవతలుగాని దానవులు గాని ఎరుగరు.

**వ్యాఖ్య:-** గురువాక్యాలపై శిష్యునికి శ్రద్ధ (విశ్వాసం) ఉన్నప్పుడే గురువు శిష్యునిపై అపారమైన వాత్సల్యాన్ని చూపుతాడు. అలా గురువు యొక్క కృప శిష్యుని ఆత్మాభ్యున్నతికి చక్కని సోపానం అవుతుంది. అందుకే ఇక్కడ అర్జునుడు తన గురువువైన శ్రీకృష్ణునిపై అపారమైన విశ్వాసాన్ని చూపుతూ, 'కేశవా! నీవు చెప్పినదంతా సత్యమేనని నా విశ్వాసం' అంటున్నాడు. కేశవా! అంటే 'తనను శరణు పొందినవానిని దుఃఖాల నుండి విడుదల చేసేవాడు' అని అర్థం.

అర్జునుడు భగవానుని మాటలను సత్యమని నమ్ముతున్నాడు. అయితే ఆ మాటల వెనుక భావాలను అర్థం చేసుకోలేక పోతున్నాడు. దీనికి కారణం అర్జునుని అంతఃకరణం సత్యాన్ని విని గ్రహించేందుకు తగిన పరిపక్వతను ఇంకా సాధించలేదు. అదీగాక వింటున్నది యుద్ధరంగ మధ్యలో.

విత్తనం ఎంత మంచిదైనప్పటికీ అది భూమిలో నాటుకొని మొలకెత్తటానికి తగిన విధంగా భూమిని తయారుచెయ్యాలి. అలాగే చెప్పే విషయాలు ఎంత సత్యమైనవైనప్పటికీ వినే అంతఃకరణం శుద్ధంగానూ, సూక్ష్మంగాను లేకపోతే అవి అర్థం కావటం చాలా కష్టం.

అందుకే నారదాది మహర్షులు వెనుకటి రోజుల్లో ఎన్నిసార్లు చెప్పినా, ఎంతగా చెప్పినా ఆ ఉపదేశమహిమను అర్జునుడు గ్రహించ లేకపోయాడు.

ఇంకా అంటున్నాడు అర్జునుడు, "భగవాన్! నీ లీలా స్వరూపాన్ని - యదార్థతత్త్వాన్ని దేవతలుగాని, దానవులు గానీ ఎవ్వరూ తెలుసుకోలేరు" - అని. భోగాలలో మునిగి తేలేవారు దేవతలు, కర్మలలో మునిగితేలేవారు దానవులు. కనుక వారికి పరమాత్మ తత్త్వాన్ని గ్రహించేందుకు సమయం లేదు.

దీనిని బట్టి భగవంతుడిచ్చిన సంపదలతో భోగాలలో మునిగిపోయేవారికి భగవత్తత్వం తెలియదు. భోగం యోగానికి నష్టం. అలాగే భగవంతుని ఎదిరిస్తూ, ఆయనతో శతృత్వం పెట్టుకొనే దానవులు ఎల్లప్పుడూ స్వర్గం మీద దాడి చెయ్యటం, యజ్ఞయాగాదులు ధ్వంసం చెయ్యటం మునులను, ఋషులను బాధించటం లాంటి పనులలో మునిగిపోతారు. కనుక దుష్టకార్యాలలో, పాపకార్యాలలో పరపీడనంలో మునిగిపోయేవారూ పరమాత్మను తెలుసుకోలేరు. కర్మలలో మునిగితే తత్త్వం అర్థంకాదు.

ఇలా దేవతలు, దానవులు భగవత్తత్వాన్ని తెలుసుకోలేరు - అని ఇక్కడ చెప్పిన దానిని ఉన్నది ఉన్నట్లు గ్రహించటం కాదు. మరి? యక్ష, కిన్నెర, కింపురుష, గరుడ, గంధర్వ, సిద్ధ, సాధ్య, విద్యాధరాదులు కూడా తెలుసుకోలేరు అని భావం. అంటే భగవత్తత్వాన్ని ఉన్నది

ఉన్నట్టు గ్రహించటం ఎవరికైనా అసాధ్యం అని అర్థం. మరైతే ఎవరు భగవంతుని యదార్థతత్త్వాన్ని చక్కగా తెలిసినవారు?

**శ్లో||** స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థత్వం పురుషోత్తమ!|
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే|| **(15)**

**తా||** భూతభావనుడా! భూతేశుడా! దేవదేవా! జగత్పతీ! పురుషోత్తమ! నీ స్వరూపం ఏదో స్వయంగా నీవే ఎరుగుదువు.

**వ్యాఖ్య:-** ఇక్కడ అర్జునుడు భగవానుని 5 విశేషణాలతో సంబోధిస్తున్నాడు. ఇది కేవలం గౌరవం చూపడమే కాదు. అర్జునుని ఉద్దేశం కూడా.

1. భూతభావన:- సమస్త భూతాలను - అంటే ప్రాణులన్నింటిని, జడమైన వాటినన్నింటిని కూడా సృష్టించిన వాడివి నీవే. నీవే సృష్టికర్తవు - అని.

2.భూతేశ!:- ఉత్పన్నమైన ప్రాణికోట్లన్నింటిని ఒక నియమంలో నిలిపి పాలించేవాడివి, పోషించేవాడివి నీవే. అంటే స్థితికర్తవు నీవే - అని.

3.దేవదేవ:- దేవతలందరికీ దేవుడవు నీవు. దేవతలంటే ప్రార్థించిన వారికి అన్నీ ఇచ్చేవారు. కోరిన కోరికలు ఆయావ్యక్తుల అర్హతలను బట్టి తీర్చేవారు. అట్టి దేవతలకు దేవుడవు నీవు. అంటే వారికి అవన్నీ ఇచ్చేవాడవు నీవు. అందుకే నీవు దేవదేవుడవు.

4.జగత్పతే:- ఈ జగత్తుకంతటికీ నీవు పతివి, భర్తవు, భరించేవాడివి. ఈ జగత్తుకు ప్రభువు నీవే. నీ మాయచేత సృష్టింపబడి, నీ చేత

పాలింపబడి చివరకు నీ చేతనే నీలోనే లయమై పోయేది ఈ జగత్తు. కనుక దీని శాసకుడవు, ప్రభువువు, పతివి నీవు. కనుక జగత్పతివి.

5.పురుషోత్తమ:- సాధారణ పురుషులు (మానవులు) కర్మఫలాలతో, వాసనలతో, అజ్ఞానంతో జన్మించి కష్టాలతో, దుఃఖాలతో కూడుకొని ఉంటారు. కాని నీవు వాటన్నింటికి అతీతుడవు. అందువల్ల వారికన్న ఉత్తముడవు. పురుషులలో ఉత్తముడవు గనుక పురుషోత్తముడవు. క్షరమైన పురుషులకు అక్షరుడైన ఈశ్వరునకు అతీతుడవు. అందుకే పురుషోత్తమ! అంటున్నాను.

ఈ రకమైన విశేషణాలతో భగవంతుని ప్రశంసిస్తున్నాడంటే ఇప్పటికి అర్జునుడు శ్రీకృష్ణుని భగవంతునిగా - మానవాతీత దివ్యశక్తిగా గుర్తించాడని తెలుస్తున్నది. ఈ పదాలన్నీ అర్జునుని హృదయం నుండి వెలువడిన మాటలేనని తెలుస్తున్నది. అందుకే భగవాన్! భగవానుడా! అని క్రిందటి శ్లోకంలో శ్రీకృష్ణుని సంబోధించటం జరిగింది. శ్రీకృష్ణుని రూపంలో ఉన్నది సాక్షాత్తు భగవంతుడే - నిరాకార నిర్గుణ పరమాత్మే అని అర్జునుని విశ్వాసం. ఇలా సంబోధించి అర్జునుడు ఏమంటున్నాడు?

"స్వయంగా నిన్ను నీవే ఎరుగుదువు. మరెవ్వరూ తెలుసుకోలేరు". ఎందువల్ల భగవంతుని ఎవ్వరూ తెలుసుకోలేరు?

ఏదైనా ఒక వస్తువునో, విషయాన్నో తెలుసుకోవాలంటే జ్ఞానేంద్రియాల ద్వారా బుద్ధి తెలుసుకుంటుంది. ఒక పుస్తకాన్ని

'పుస్తకమని' కన్ను అనే జ్ఞానేంద్రియం ద్వారా బుద్ధి తెలుసుకుంటుంది. ఒక పాటను 'పాట' అని చెవి అనే జ్ఞానేంద్రియం ద్వారా బుద్ధి తెలుసుకుంటుంది. ఒక పదార్థాన్ని 'స్వీటు' అని నాలుక అనే జ్ఞానేంద్రియం ద్వారా బుద్ధి తెలుసుకుంటుంది. మరి ఆత్మను తెలుసుకోవటం ఎలా? ఆత్మ వస్తువుకాదు, విషయంకాదు బుద్ధి తెలుసుకోవటానికి. ఆత్మ స్వయంగా చైతన్యం, అన్నింటిని తెలుసుకొనే బుద్ధికి ఆధారంగా ఉన్నది. అది జ్ఞానస్వరూపం. జ్ఞానాన్ని తెలుసుకోవటానికి మరొక జ్ఞానం అక్కరలేదు. ఏవస్తువునైనా చూడాలంటే రాత్రిపూట దీపం కావాలి. మరి దీపాన్ని చూడాలంటే - వేరొక దీపం కావాలా? అక్కరలేదు గదా! అలాగే జ్ఞానాన్ని తెలుసుకోవటానికి వేరొక జ్ఞానం అక్కరలేదు. దానినదే స్వయంగా తెలుసుకుంటుంది. అంటే ఆత్మను తెలుసుకొనేది ఆత్మయే. అందుకే భగవంతుని మహిమను భగవంతుడే చెప్పాలి. అందుకే అర్జునుడు భగవాన్! నీ స్వరూపం ఏదో నీవే ఎరుగుదువు అంటున్నాడీ శ్లోకంలో.

భగవంతుని అనేకవిధాల ప్రశంసించి భగవానుని నేరుగా అడుగుతున్నాడు అర్జునుడు. ఏమని?-

**శ్లో||** వక్తుమర్హస్య శేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః|

యా భిర్విభూతి భిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్యతిష్ఠతి|| **(16)**

**శ్లో||** కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్|

కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవాన్ మయా|| **(17)**

**శ్లో||** విస్తరేణాత్మనో యోగం విభూతించ జనార్దన|

భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తిమేఽమృతం|| **(18)**

**తా||** ఏయే విభూతులతో ఈ లోకమంతటా వ్యాపించి ఉన్నావో, ఆ దివ్యమైన నీ విభూతులను అశేషంగా చెప్పవలసింది. యోగీశ్వరా! నేను సదా నిన్ను ధ్యానిస్తూ ఎలా తెలుసుకోగలను? భగవాన్! ఏఏ వస్తువుల యందు - ఏఏ రూపాలలో నిన్ను ధ్యానించగలను? జనార్ధనా! నీయోగాన్ని, విభూతిని విస్తారంగా మరల చెప్పు. అమృతము వంటి నీమాటలు వింటున్న నాకు తృప్తి కలగటం లేదు.

**వ్యాఖ్య:-** భగవంతుడు సర్వవ్యాపి అని తెలుసుకున్నాడు అర్జునుడు. కనుక ఆయన అన్ని వస్తువులలోను, అన్ని ప్రాణులలోను ఉండిఉండాలి. అయితే తనకేమో అలా కనిపించటం లేదు. కనుక ఆయననే ఏఏ వస్తువులలో ఎలా ఎలా ఉన్నాడో అడిగి తెలుసుకోవాలనుకున్నాడు.

పరమాత్మ అన్నింటిలోను సమంగానే ఉన్నా అర్జునునికి ఎందుకు కనిపించటం లేదు? అర్జునునికే గాదు, మనకెవ్వరికీ కూడా కనిపించటం లేదు.

ఉత్సవాలు జరిగేటప్పుడు ఆ పందిరిలో గాని, భవనంలోగాని, దేవాలయంలో గాని రంగురంగుల బల్బులు, సీరియల్ సెట్లు, ట్యూబ్ లైట్లు, ఫోకస్ లైట్లు, పూలు జల్లే యంత్రాలు, సువాసనలు వెదజల్లే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

యంత్రాలు - ఇలా అనేకం ఉంటాయి. అయితే అవన్నీ ఎలా వెలుగుతున్నాయి? ఎలా పనిచేస్తున్నాయి? వాటన్నింటిలోను ఒకే శక్తి - విద్యుచ్ఛక్తి ఉన్నది. అయితే ఒక పిల్లవాడికి ఈ మాట చెబితే అతడు నమ్మలేడు. ఏదీ చూపించు? నిజంగా అన్నింటి వెనుకా ఒకే శక్తి ఉన్నదా? అంటాడు. వాడికి కంటితో చూడటమే తెలుసుగాని, బుద్ధితో విచక్షణ చేసే శక్తి లేదు. అలాగే అర్జునుడు శరీరమనోబుద్ధులతో ఈ ప్రపంచంలో అన్నింటినీ చూస్తున్నాడు. కాని వీటికతీతంగా ఆత్మ ద్వారా చూచే శక్తిలేదు. కనుకనే అన్నింటినీ పరమాత్మ యొక్క రూపాలుగా చూడలేకపోతున్నాడు. కనుకనే పరమాత్మ చెబుతున్న మాటలను ఋజువు చేసుకోవాలనుకున్నాడు. అందుకే సూటిగా అడుగుతున్నాడు.

ప్రపంచంలో అనేక నామరూపాలున్నాయి. అందులో భగవంతుని విభూతులేవి? ఏ విభూతుల ద్వారా పరమాత్మ ఈ జగత్తులో వ్యాపించియున్నాడు? ఇవన్నీ నాకు అశేషంగా చెప్పు అంటున్నాడు.

అర్జునుడు కేవలం తెలుసుకోవటానికి అడగటం లేదు. కాలక్షేపం కోసం వినాలనుకోవటం లేదు. తనలోని అజ్ఞానాన్ని తొలగించుకోవాలంటే ఆత్మజ్ఞానం కావాలి. పరమాత్మ గురించిన జ్ఞానం కావాలి. అలా పొందిన జ్ఞానంతో ఆచరణ చేయాలి. అప్పుడే ఆత్మసాక్షాత్కారం. మరి భగవంతుని విభూతులు చెప్పాలంటే భగవంతుడైన శ్రీకృష్ణుడే అందుకు తగినవాడు గనుక ఆయనను అడుగుతున్నాడు. - ఎలా చెప్పాలట?

'అశేషతః':- ఏమీ మిగల్చకుండా పూర్తిగా తెలియజేయమంటున్నాడు.

"యోగేశ్వరా! నిన్ను నిరంతరం ఎలా ధ్యానిస్తూ తెలుసుకోగలను? ఏయే వస్తువులలో - ఏఏరూపాలలో నిన్ను ధ్యానించగలను అంటున్నాడు.

అర్జునుడు క్షత్రియుడు. కర్మక్షేత్రంలో నిరంతరం పనిచేసేవాడు. తెలిసినవిషయాలను ఆచరణలోనికి తెచ్చుకోవాలనే తపన కలిగినవాడు. కనుక భగవంతుని ఎల్లప్పుడూ ధ్యానించాలని నిర్ణయించుకున్నాడు.

ఆత్మ సర్వత్రా ఉన్నాదని, అన్నింటిలో, అందరిలో అంతర్యామిగా ఉన్నదని ఇప్పటికే తెలుసుకున్నాడు, కనుక ఏఏవస్తువుల యందు ఆత్మను దర్శించాలి? అని ఒక సందేహం అర్జునునికి. అందుకే నిన్ను నేను ఎలా ధ్యానించాలి? అని అడుగుతున్నాడు.

నీ యోగమహిమను, నీ విభూతులను విస్తారంగా, వివరంగా తెలియజేయి. నీ అమృత తుల్యమైన మాటలు వింటుంటే ఇంకాఇంకా వినాలనిపిస్తున్నది అని కూడా తెలియజేస్తున్నాడు అర్జునుడు.

ఏదైనా ఒక విషయాన్ని తెలుసుకోవాలని, అర్థం చేసుకోవాలని తీవ్రమైన తపన - జిజ్ఞాస కలిగితే గాని ఆ విషయాన్ని తెలుసుకోవటం జరగదు; ఆధ్యాత్మిక విషయాలు కూడా అంతే. తపన - పట్టుదల - జిజ్ఞాస ఉండాలి. ఎంతటి త్యాగాన్నైనా చేసి అందుకోవాలనే నిష్ఠ ఉండాలి. ఆధ్యాత్మిక విషయాలు వినటానికి శిష్యునిలో మంచిఉత్సాహం, పట్టుదల ఉండాలి. శిష్యుని ఉత్సాహం చూస్తే

గురువు సంపూర్ణంగా బోధించాలని, అర్థమయ్యేట్లు చెప్పాలని తహతహలాడుతాడు. గురువు చెప్పే విషయాలను నిద్ర మొహంతో వింటున్నా, నిర్లిప్తంగా వింటున్నా, ఏదో తప్పక వినాల్సి వచ్చిందని వింటున్నా, మనస్సు ఎక్కడో పెట్టుకొని వింటున్నా గురువులో ఉత్సాహం చచ్చిపోతుంది.

ఇక్కడ అర్జునుడు ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. వివరంగా - అశేషంగా నీ విభూతులు చెప్పమంటున్నాడు. అంతేకాదు గురువు చెప్పే వాక్యాలు అమృతతుల్యమైన వంటున్నారు. వాటిని వింటున్న కొద్దీ ఇంకా ఇంకా వినాలని ఉందని అంటున్నాడు. దీనితో అర్జునునిలో ఎంతటి జిజ్ఞాస, ఆసక్తి, పట్టుదల, గురువుపై అచంచల విశ్వాసం ఉన్నదో అర్థమైపోతున్నది.

<u>దివ్యవిభూతులు:-</u> భూతి అంటే ఉనికి అని అర్థం. విభూతి అంటే విశేషమైన భూతి. విశేషంగా ఉండే ఉనికి. భగవంతుడు విశేషంగా - ప్రత్యేకంగా ఉండే ఉనికి విభూతి అంటారు. భగవంతుడు అన్ని వస్తువులలోను, అందరిలోను సామాన్యమైన ఉనికిని కలిగిఉంటాడు. అయితే కొన్నింటిలో విశేషంగా - ప్రత్యేకంగా ఉనికిని కలిగిఉంటాడు. అవే దివ్యవిభూతులు. వేటియందు భగవంతుని తేజస్సు, బలము, విద్య, కాంతి, ఐశ్వర్యము విశేషంగా ఉంటాయో వాటిని దివ్యవిభూతులుగా గుర్తించాలి. మనుష్యులందరిలోనూ భగవంతుని సత్తా సామాన్యరూపంగా ఉంటుంది. కాని పరమభక్తులు, జ్ఞానులు,

మహాత్ములు - అయిన వారిలో భగవంతుని సత్తా విశేషరూపంలో ఉంటుంది. మహాత్మాగాంధీలో ఆ భగవత్ సత్తా విశేషరూపంలో ఉన్నది. కనుకనే అంత్యసమయంలో హేరాం - హేరాం అంటూ ప్రాణాలు వదిలాడు.

ఇలా విశేష సత్తా ఉండటమే దివ్యవిభూతి. విభూతి ద్వారా విభూతినాయకుడు గుర్తించబడతాడు. అట్టి విభూతుల స్మరణలో ఆత్మ లాభం చేకూరుతుంది.

'మాతృదేవోభవ' అంటారు. అంటే తల్లి భగవంతుని విభూతి. భగవంతుని మాతృరూపంలో ఉపాసన చేయవచ్చు.

'పితృదేవోభవ' అంటారు. అంటే తండ్రి భగవంతుని విభూతి. భగవంతుని పితృరూపంలో ఉపాసన చేయవచ్చు.

'ఆచార్యదేవోభవ' అంటారు. అంటే ఆచార్యుడు భగవంతుని విభూతి. భగవంతుని ఆచార్యుని (గురువు) రూపంలో ఉపాసన చేయవచ్చు.

ఈ అందరిలో భగవంతుని చూడమని సందేశం.

ఎవరెవరు మనకు గౌరవనీయులో, ఇష్టులో, ఆత్మీయులో వారి యందు సులభంగా భగవద్ భావన చేయవచ్చు. ఆ అభ్యాసం బలపడితే ఆ తరువాత అందరియందు భగవంతుని దర్శించవచ్చు. అంతా పరమాత్మే సర్వం వాసుదేవమయం - వాసుదేవః సర్వమితి - అని

అఖండ స్థితిని సాధించవచ్చు. అందుకే అర్జునుడు ఎంతో వినయంతో అర్థిస్తున్నాడు.

ఇంత తపనతో అడుగుతున్న అర్జునునికి పరమాత్మ ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో చెబుతున్నాడు. ఏమని?

**అర్జునుని ప్రశ్నకు భగవానుని జవాబు:**

**శ్రీభగవానువాచ:-**

**శ్లో||** హంతతే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః|

ప్రాధాన్యతః కురుశ్రేష్ట! నాస్త్యం తో విస్తరస్యమే|| **(19)**

**తా||** భగవానుడంటున్నాడు: కురుశ్రేష్ఠా! నా విభూతులకు అంతంలేదు. అవి విస్తారం - ఐనప్పటికీ నా దివ్యమైన విభూతులను ముఖ్యమైన వాటిని నీకు చెబుతాను.

**వ్యాఖ్య:-** నీ విభూతులను విస్తారంగా తెలియజెయ్యి అన్నాడు అర్జునుడు. అలా అర్థించిన అర్జునునికి తన విభూతులను చెప్పబోతూ అవి ఎంత విస్తారంగా ఉన్నాయో - వాటిని ఎలా చెప్పబోతున్నాడో సూచనప్రాయంగా తెలియజేస్తున్నాడు భగవానుడు. ఏమని?

ఓ అర్జునా! నాయొక్క విభూతులు అనంతం. 'ఇన్ని' అని లెక్కబెట్టి చెప్పటానికి వీలులేదు. అయినా ప్రధానమైనట్టివి, దివ్యమైనవి అయిన విభూతులను చెప్పబోతున్నాను అంటున్నాడు భగవానుడు.

భగవంతుడు అనంతుడు. కనుక ఆయన విభూతులు కూడా అనంతమే. అలాగే ఆయన సృష్టించిన ఈ జగత్తు కూడా అనంతమే. అలాగే ఈ సృష్టించటం అనేది కూడా అనంతమే. సృష్టి - స్థితి - లయం. తిరిగి సృష్టి - స్థితి - లయం. తిరిగి సృష్టి - స్థితి - లయం, ఇలా అనంతంగా సాగిపోతుంది. ఎప్పటి నుండి సృష్టి జరుగుతున్నది అంటే ఎవరూ చెప్పలేరు.

కనుక అనంతుడైన భగవంతుని అనంతమైన విభూతులను చెప్పటం ఎవరికైనా అసాధ్యమే. సరస్వతీదేవి గాని, ఆదిశేషుడు గాని - ఎవ్వరూ అన్ని విభూతులను చెప్పలేరు. అలాగని నిన్ను నిరాశపరచకూడదు గదా! కనుక ముఖ్యమైన దివ్యవిభూతులను తెలియజేస్తాను అంటున్నాడు భగవానుడు.

అసలు ముఖ్యమైన దివ్యవిభూతులు అంటే ఏమిటి?

మనం ప్రతిరోజూ చూచే ఈ ప్రపంచంలో సూర్యకాంతి ఒక బండరాయి మీద పడుతుంది, నీటిలో పడుతుంది, నిర్మలమైన అద్దం మీద పడుతుంది. అన్నింటిలోను సమానంగా ఆ కాంతి పడుతున్నప్పటికీ ఆ కాంతి అద్దంలోనైతే ఎంతో స్పష్టంగా, ప్రకాశవంతంగా పడుతుంది. నీటిలో అంత ప్రకాశం ఉండదు. కొంచెం తక్కువగా పడుతుంది. అదే బండరాయి మీద ఆ కాంతి ప్రకాశవంతంగా ఉండదు. అలాగే పరమాత్మ అందరిలో - అన్నింటిలో సమానంగా ప్రతిబింబిస్తున్నప్పటికీ కొందరు మహాత్ములలో, జ్ఞానులలో,

భక్తులలో చక్కగా ప్రకాశిస్తుంది. కొందరిలో చాలా తక్కువగా ప్రకాశిస్తుంది. అలాగే జంతువులలో, జడపదార్థాలలో ప్రకాశించదు. ఎక్కడ - ఎవరిలో పరమాత్మ ప్రకాశం ఎక్కువగా ఉంటుందో అవే ముఖ్యవిభూతులు - దివ్యవిభూతులు. వాటినే తెలియజేస్తానంటున్నాడు భగవానుడు.

ఇలా ముఖ్యమైన - దివ్యమైన విభూతులను చెబితే వాటిని గుర్తించి, ఆ విభూతులలో భగవంతుని దర్శించి, ధ్యానించటం తేలిక. అలా దివ్యవిభూతులతో ప్రారంభిస్తే - సాధనచేస్తూ అలవాటుపడితే మిగిలిన సామాన్య విభూతులను కూడా క్రమక్రమంగా తెలుసుకుంటావు. ఈ ప్రకారంగా అన్ని విభూతులను చెప్పినట్లే అవుతుంది. ఇలా విభూతులను తెలుసుకోవటం వల్ల ఆత్మను సాక్షాత్కరించుకొనే విధానం తెలుస్తుంది.

ముందుగా మూలసూత్రాలను చెబుతున్నాడు.

**శ్లో||** అహమాత్మా గుడాకేశ! సర్వ భూతాశయ స్థితః|
అహమాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ|| **(20)**

**తా||** గుడాకేశా! నేను అన్ని ప్రాణుల హృదయాలలో ఉన్న ఆత్మను. నేను సమస్త ప్రాణుల ఆది, మధ్య, అంతాలను.

**వ్యాఖ్య:-** అహం సర్వభూతాశయ స్థితః ఆత్మ:- నేను అన్ని ప్రాణుల హృదయాలలో ఉన్న ఆత్మను అని భగవానుడు తన ప్రప్రథమ విభూతిని

తెలియజేస్తున్నాడు. అందరి హృదయాలలో 'నేను' ' నేను' అంటూ స్వయం ప్రకాశంగా - అంటే ఎవరి యొక్క శక్తితోను పనిలేకుండా నిత్యము, నిరంతరము వెలుగుతూ ఉండే శుద్ధచైతన్య స్వరూప ఆత్మయే నేను. ఇదే అసలైన విభూతి. దీనిని తెలుసుకోలేని వారి కోసమే మిగతా విభూతులన్నీ. ఇది తెలుసుకొనే సమర్థత గలవానికి ఇంకేమీ అవసరం లేదు. ఓ అర్జునా! నీవు గుడాకేశుడవు. నీవు ప్రయత్నించి తెలుసుకోగలవు.

గుడాకేశః:- గుడాకమంటే నిద్ర. ఈశ అంటే స్వాధీనం చేసుకున్న వాడు అని. అంటే నిద్రను జయించినవాడు అర్జునుడు - అని. నిద్ర తమోగుణం. ప్రతివాడు ముందు తమోగుణాన్ని - ఆ తరువాత రజోగుణాన్ని తొలగించుకొని సత్వంలోకి ప్రవేశిస్తే గాని ఆత్మజ్ఞానం అవగతం కాదు, అందరిలో ఆత్మను గుర్తించలేడు.

సాధారణంగా లోకంలో అందరూ భగవంతుని విషయంలో నిద్రపోతుండే వారే. అరుదుగా ఎక్కడో ఒకరు మాత్రం తమంతట తామే నిద్ర మేలుకుంటారు. మిగిలిన వారి నందరిని భగవంతుడే మేలుకొలపాలి. అందుకే శ్రీమహావిష్ణువు నాలుగు చేతుల్లో 4 వస్తువులున్నాయి. కొందరిని పుష్పంతో తట్టి నిద్రలేపుతాడు. వీరు సత్త్వగుణంలో ఉండేవారు. మరి కొందరు అంత తేలికగా లేవరు గనుక చెవిదగ్గర శంఖం ఊది నిద్రలేపుతాడు. ఇంకా కుంభకర్ణ నిద్రపోయే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వారి నెత్తిన గదతో మోది మేలుకొలుపుతాడు. అప్పటికీ లేవనివాడికి చక్ర ప్రయోగమే.

శిష్యుడు గుడాకేశుడై గురువు హృషీకేశుడైతే ఆ కలయిక మణికాంచన సంయోగంలాగా అద్భుతమై ఉంటుంది.

అందరిలో ఆత్మగా ఉన్న భగవంతుడు అన్నింటికి కేవలసాక్షిగా ఉంటాడు. అంతేకాదు. ఈ దేహంగాని, ఇంద్రియాలు గాని, మనస్సు గాని, బుద్ధి గాని, ప్రాణాలు గాని వాటి వ్యాపారాలను అవి చేసుకోగలుగుతున్నాయి అంటే వాటికా శక్తి ఎక్కడ నుండి వస్తున్నది? ఆత్మ నుండే. ఆత్మశక్తి అనే విద్యుచ్ఛక్తిని మనస్సనే ఫిలమెంటు స్వీకరించి అన్ని దేహాలనే బల్బులను వెలిగిస్తున్నది - చైతన్యపరుస్తున్నది.

కనుక ఓ అర్జునా! ఎందుకయ్యా నన్ను ఎక్కడెక్కడో వెతకాలనుకుంటావు? నేను నీలోనే ఉన్నాను. నీలోను, అందరిలోను, అన్ని ప్రాణులలోను, అంతటా ఉన్నాను. కనుక నీలో చూసుకో. నీ ఎదుట ఉన్నవారిలో చూసుకో. నీ రథానికి కట్టిన గుర్రాల్లో చూసుకో. ఇది అర్జునునికే గాదు, అందరికీ సంబంధించిన విషయం. మట్టిని విడిచి కుండ ఉండదు. భగవంతుని విడిచి మనం లేము.

మనకు తెలియకుండానే మనలో భగవంతుడున్నాడని అంగీకరిస్తాం. తిరుపతి వెళ్ళి 12 గంటలు క్యూలో నిలబడి, చచ్చీచెడి భగవంతుని దగ్గర కెళ్ళగానే రెండు కళ్ళు మూసుకొని తలవంచుకొని,

రెండుచేతులు కలిపి హృదయం దగ్గర నిలుపుతాం. అంటే అర్థం ఏమిటి? భగవంతుడు నా హృదయంలోనే ఉన్నాడు - అని.

ఉత్తమాధికారి భగవంతుడు నాలోనే ఆత్మ స్వరూపంగా ఉన్నాడని అనుసంధానం చేయటానికే ఈ విభూతి. ఇక మధ్యమాధికారి విషయం.

అహం ఆదిశ్చ, మధ్యంచ, భూతానాం అంతఏవచ:- సమస్త ప్రాణులకు ఆది (సృష్టి) నేనే. మధ్య (స్థితి) నేనే. అంతం (లయం) నేనే. సృష్టిస్థితిలయాలకు కారణం నేనే. అంటే ఈ జగత్తుకు ముందూ నేనున్నాను, జగత్తులోనూ నేనే ఉన్నాను. ఈ జగత్తు అంతమైపోయిన తర్వాతా నేనున్నాను.

ఈ ప్రాణికోటి పుట్టక ముందు ఎక్కడ ఉండేది? ఎలా ఉండేది? ఎవ్వరికీ తెలియదు. నశించిన తర్వాత ఈ ప్రాణికోటి ఎక్కడకు పోతుంది? అదీ ఎవ్వరికీ తెలియదు. ఇంద్రియాలకు గోచరించదు. మధ్యలో మాత్రం ఈ ప్రాణుల ఉనికి ఇంద్రియాలకు కనిపిస్తుంది. ఈ కనిపించేదే సృష్టి. దీనినే ప్రాణులందరూ చూస్తున్నారు.

ఈ ప్రాణులందరూ కంటికి కనిపించే ఈ సృష్టిని చూడగలుగుతున్నారే గాని, ఈ సృష్టికి కారణమైన సృష్టికర్తను చూడలేరు. సృష్టి కర్త అయిన పరమాత్మ నామరూపాలకు అతీతుడు. కనుకనే ఇంద్రియాలతో గాని, మనస్సుతోగాని, బుద్ధితో గాని తెలుసుకొనేందుకు వీలులేదు. మరెలా? అనుభూతి ద్వారానే

తెలుసుకోవాలి. సాధుసత్పురుషుల సహవాసంతో, సద్గురువుల సత్ సంగంతో, వారి అనుభవ వాక్యాలతో, ఆధ్యాత్మిక విషయాలను శ్రవణం చేయటంతోనూ ఆ అనుభవం ఎవరికైనా కలుగుతుంది.

ఇలా ఉత్తమాధికారికి - మధ్యమాధికారికి కావలసిన విభూతులను చెప్పి ఇప్పుడు లోకంలో ఎక్కువగా ఉండే మందాధికారుల కొరకు విస్తారంగా విభూతులను పేర్కొంటున్నాడు భగవానుడు.

మందాధికారులు, సామాన్యులు ఈ దృశ్యమాన జగత్తులో నివశిస్తూనే ఆత్మను ధ్యానించేందుకు విభూతులను విస్తారంగా తెలియజేస్తున్నారు.

**శ్లో||** ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్|
మరీచిర్మ రుతా మస్మి నక్షత్రాణా మహం శశీ|| (21)

**తా||** ఆదిత్యులలో నేను విష్ణువును. వెలిగే వాటిలో కిరణాలు గల సూర్యుణ్ణి. మరుత్తులలో నేను మరీచిని. నక్షత్రాలలో నేను చంద్రుణ్ణి.

**వ్యాఖ్య:-** ఇక్కడి నుండి అద్భుతమైన వివరణలు, లౌకిక సత్యాలు, ఆధ్యాత్మిక రహస్యాలు లభిస్తాయి.

<u>1.ఆదిత్యానాం అహం విష్ణుః:-</u> ఆదిత్యులలో నేను విష్ణువును. వైదిక సాంప్రదాయంలో అదితికి పుట్టినవారు ఆదిత్యులు. వారు 12 మంది. వారే ద్వాదశాదిత్యులు. మొత్తం 12 సూర్యమండలాలున్నాయని; ప్రళయంలో అన్నీ ఒకేసారి కనిపిస్తాయని శాస్త్రం చెబుతున్నది. 12



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నెలలపై ఆదిపత్యం వహించేవారే పన్నెండు మంది ఆదిత్యులని, వారిలో 12వ వాడు విష్ణువని విష్ణుపురాణంలో పేర్కొన్నారు.

ఆదిత్యులలో విష్ణువనే ఆదిత్యుని యందు తక్కినవారందరి కన్న అధికంగా, విశేషంగా భగవంతుని దివ్యశక్తి వ్యక్తమవుతుంది. కనుక విష్ణువును భగవంతుని యొక్క దివ్యవిభూతిగా పేర్కొనటం జరిగింది. అలా భావించుకొని విష్ణువును భగవంతుని విభూతిగా ఉపాసన చేయాలి.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే ద్వాదశాదిత్యులు అంటే 10 ఇంద్రియాలు + మనస్సు + బుద్ధి. విష్ణువు అంటే వ్యాపకుడు అని అర్థం. ఆదిత్యులలో విష్ణువును నేనే అంటే 10 ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి - వీటన్నింటియందు వ్యాపించి యుండి వాటిని ప్రకాశింపజేసే ఆత్మయే నేను అని ఆధ్యాత్మిక ఆంతర్యం.

**2.జ్యోతిషాం అంశుమాన్ రవిః:-** ప్రకాశించే వానిలో కిరణాలు గల సూర్యుణ్ణి. ఈ లోకంలో ప్రకాశించి వెలుగునిచ్చేవి అనేకం ఉన్నాయి. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అగ్ని, విద్యుత్తు, దీపం మొ||వి. వాటిల్లో ఎక్కువ వెలుగునిచ్చేది రవి - సూర్యుడు. ఆధునిక భౌతికశాస్త్రం సూర్యుడే సమస్త జీవశక్తులకు మూలమని అంగీకరిస్తున్నది. సూర్యుడు కనిపించని రాత్రి సమయంలో జీవులంతా తమతమ పనులు మానేసి నిద్రపోతుంటారు. సూర్యుడు కనిపించటంతోనే చైతన్యం ప్రవేశించి నిద్రపోయే వారు లేచి, తమతమ వ్యవహారాలలో నిమగ్నమవుతారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ చైతన్యం సూర్యుని కెక్కడిది? అది సూర్యునిలోనే ఉన్న అంతర్యామి ఆత్మచైతన్యమే. కనుక సూర్యుని చూస్తూ చూస్తూ ఆ సూర్యునిలోనే ఉన్న భగవంతుని విభూతిని దర్శించి ధ్యానించాలి, ఉపాసించాలి.

3.మరుతాం మరీచిః అస్మి:- మరుత్తులలో మరీచిని అయి ఉన్నాను. మరత్తులు 7 గురు. వారిలో చివరివాడు 'పరివహుడు'. అతణ్ణే మరీచి అంటారు. అతడిలో భగవంతుడు విశేషంగా ప్రకాశిస్తాడు. మరుత్తులను రుద్రుని పుత్రులుగా వేదమంత్రాలు చెబుతున్నాయి. ఆ మరుత్తులలో మరీచి ముఖ్యుడని ఋగ్వేదం తెలియజేస్తున్నది. వేదమంత్రాలలో చెప్పబడిన ఈ రుద్రుని పుత్రులైన మరుత్తులు అంతా రౌద్రం చూపేవారే. పెనుగాలులు, తుఫానులు - వీటికి ప్రాతినిధ్యం వహించేవారే మరుత్తులు.

ఇక వాయుపురాణంలో, గరుడపురాణంలో మరుత్తులను 49 మందిగా చెప్పారు. అక్కడ ఇచ్చిన 49 పేర్లలో మరీచి పేరులేదు. అయితే మరీచి అనే మాటకు తేజస్సు అని అర్థం. అందువల్ల మరుత్తులలో నేను మరీచిని అంటే మరుత్తులలో వ్యాపించియున్న తేజస్సును నేనే అని భగవానుడు తన విభూతిని చెప్పినట్లుగ గ్రహించవచ్చు. తనకు ప్రబల శత్రువు అని తెలిసి దితిగర్భంలోని శిశువును దేవేంద్రుడు తన వజ్రాయుధంతో కొట్టగా అది 49 ముక్కలైంది. ఆ ముక్కలన్నీ 49 రూపాలుగా జన్మించి, దేవగణంలోకి చేర్చబడినట్లు భాగవతం

తెలియజేస్తున్నది. అంతగొప్ప తేజస్సు గనుకనే అది నావిభూతి అంటున్నాడు భగవానుడు.

ఇక ఆధ్యాత్మికంగా "మరుత్తులలో నేను మరీచిని" అంటే ఏమిటో చూద్దాం. మరుత్తులంటే మెరిసేవి - ఆకర్షణీయమైనవి అని అర్థం. మరీచి అంటే ఎండమావి అని అర్థం. బాహ్యంగా విషయవస్తువులన్నీ ఆకర్షణీయంగా కనపడేవే. అంటే మరుత్తులే. ఆకర్షణీయంగా కనిపించే విషయవస్తువులలో (మరుత్తులలో) నేను ఎండమావిని (మరీచిని) అని భగవానుడు తెలియజేస్తున్నాడు. ఎండమావి ఆకర్షణీయంగా ఉంటుంది, దప్పిక తీర్చుకోవచ్చునని ఆశలు కలిగిస్తుంది. కాని చివరకు నిరాశే మిగులుతుంది. అలాగే ఆకర్షణీయ వస్తువులన్నీ ఎండమావులలాగా నిరాశ కలిగించేవే - అని ఆంతర్యం.

4.నక్షత్రాణాం అహం శశీ:- జ్యోతిషశాస్త్రం ప్రకారం నక్షత్రాలు చంద్రమార్గంలో పరచి ఉండే స్థిరగోళాలు. నక్షత్రాలను శాసించి, వాటిపై ఆధిపత్యం వహించి, వాటిని క్రమపరుస్తూ, వాటికంటే ఎక్కువ ఆహ్లాదాన్ని, చల్లదనాన్ని కలిగించే కాంతినిస్తాడు కనుక నక్షత్రాలలో కెల్ల చంద్రుడు ప్రముఖుడు.

ఐతే శాస్త్రీయవిజ్ఞానం (సైన్స్) ప్రకారం నక్షత్రాలు స్వయం ప్రకాశాలు. చంద్రునికి స్వయంప్రకాశం లేదు. అది భూమికి ఉపగ్రహం. ఐతే చంద్రుని గొప్పతనం ఏమీ లేదుగదా! అనవచ్చు. కాని రాత్రిపూట ప్రకాశించే అన్నిరకాల కాంతులలోను చంద్రుని కాంతియే చాలా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎక్కువ. ఆహ్లాదం కలిగించేది. నక్షత్రాలు మిణుకుమిణుకు మంటూ మెరుస్తాయేగాని చంద్రునిలాగా నిండువెన్నెలను, ఆహ్లాదం కలిగించే కాంతిని ఇవ్వలేవు.

పురాణాల ప్రకారం నక్షత్రాలు 27. అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి - - - అని. వీరి భర్తచంద్రుడు. అంటే నక్షత్రాల అధిపతి చంద్రుడు. కనుక భగవంతుని విభూతి చంద్రుడు.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే నక్షత్ర అంటే సాధించి అందుకోవటం. శశీ అంటే కుప్పించటం - లంఘించటం. అంటే సాధించి అందుకోవలసిన పరమాత్మను - మోక్షాన్ని కుప్పించి - లంఘించి అందుకోవాలి. అంటే తీవ్రప్రయత్నంతో అందుకోవాలి, తీవ్రసాధనాలు చేసి మోక్షసామ్రాజ్యాన్ని అందుకోవాలి - అని.

ఈ శ్లోకంలో మరో నాలుగు విభూతులు చెప్పబోతున్నారు -

**శ్లో||** వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః|
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా|| (22)

**తా||** వేదాలలో సామవేదాన్ని, దేవతలలో ఇంద్రుణ్ణి, ఇంద్రియాలలో మనస్సును, ప్రాణులలో చేతనత్వాన్ని.

**వ్యాఖ్య:-** 1.<u>వేదానాం సామవేదోఽస్మి:-</u> వేదాలలో నేను సామవేదాన్ని. ఋగ్వేదంలో ఉన్న ఋక్కులే సామవేదంలో గానయోగ్యంగా సామాలుగా ఉన్నాయి. ఇవి శ్రుతిలయలతో రాగయుక్తంగా పాడటానికి

అనుకూలంగా ఉంటాయి. మిగిలిన వేదాలన్నీ చదివేవి. సామవేదం మాత్రం గానయోగ్యమైనది. అంటే గానమాధుర్యం కలిగిఉండేది. ఆత్మ కూడా మాధుర్యం కలిగినదే. అందుకే సామవేదం ఆత్మవిభూతి - భగవంతుని విభూతి. అంతేకాదు. సామ, దాన, భేద, దండోపాయాలనే చతుర్విధ ఉపాయాలలో 'సామం' మొదటిది, శ్రేష్ఠమైనది. సామరస్య పూర్వకమైనది. కనుక సామాన్ని, సామవేదాన్ని భగవంతుని విభూతిగా భావించాలి.

ఇక అంతరార్థంలో - వేదం అంటే జ్ఞానం - విద్య - తెలుసుకోవలసినది - అని. దేనికైనా ఊరికే తెలుసుకుంటే ప్రయోజనం లేదు. తెలుసుకున్న విద్యతో మనస్సును ఎట్టి ఒడుదుడుకులు లేకుండా సమస్థితిలో ఉంచుకోవాలి. అలా ఉంచుకోగలిగినదే శ్రేష్ఠమైన విద్య. విద్యలలో సమస్థితిలో ఉంచే విద్య - సామంలో (సమస్థితిలో) ఉంచే విద్య భగవంతుని విభూతి.

2.దేవానాం వాసవః అస్మి:- దేవతలలో ఇంద్రుణ్ణి. దేవతలంటే అన్నీ ఇచ్చేవారు (దానాత్ దేవః). ఇక్కడ పుణ్యకార్యాలు, దైవకార్యాలు, యజ్ఞయాగాదులు, దానధర్మాలు చేసినవారు మరణానంతరం ఈ చేసిన కర్మలఫలితంగా దేవతలుగా జన్మించి అక్కడ భోగాలనుభవిస్తారు. దేవతలందరికి రాజైన దేవేంద్రుడు అధికంగా భోగాలను అనుభవిస్తాడు. అతడే నా విభూతి అంటున్నాడిక్కడ భగవానుడు.

దేవలోకంలో దేవతలందరిని తన అధీనంలో ఉంచుకొని, వారిని రక్షిస్తూ, పాలిస్తూ, వారికి తగిన సుఖాలు భోగాలు ప్రసాదించేవాడే దేవేంద్రుడు. కనుక ఆయనే (వాసవుడు) భగవంతుని విభూతి. ఆయనలో భగవంతుని తేజస్సు, శక్తి అధికంగా ఉంటుంది.

ఆధ్యాత్మికంగా - దేవ అంటే ఇచ్చేవాడు. సూర్యుడు వెలుగునిస్తాడు. వాయువు ప్రాణాన్ని నిలుపుతాడు. వరుణుడు వర్షాన్నిస్తాడు. భూమి పంటలకు కావలసిన సారాన్నిస్తుంది. ఎవరు ఏమిచ్చినా అన్నీ వచ్చేది ఆ పరమాత్మ (వాసవుని) నుండే అని గ్రహించాలి.

3.ఇంద్రియాణాం మనశ్చాస్మి:- ఇంద్రియాలు మొత్తం 10. కర్మేంద్రియాలు 5, జ్ఞానేంద్రియాలు 5. ఇవి బయటఉండేవి. ఇవన్నీ ఒక్కొక్కటి ఒక్కొక్క పనిచేస్తుంటాయి. మనస్సనేది అంతరింద్రియం. లోపల ఉండేది. మనస్సుకు అన్నిఇంద్రియాలతో సంబంధం ఉంటుంది. జ్ఞానేంద్రియాలు విషయసేకరణ చేసి మనస్సుకు అందిస్తే మనస్సు చేయవలసిన పనులను ఆయా కర్మేంద్రియాలకు చెప్పి చేయిస్తుంది. మనస్సు సహాయం లేకపోతే ఏ ఇంద్రియమూ పనిచెయ్యదు. కనుక మనస్సు భగవంతుని అంశ.

ఇంద్రియాలు అనేకం. కాని మనస్సు ఒక్కటే. అనేకత్వంలో ఏకత్వమే ఈశ్వర లక్షణం. కనుక మనస్సు భగవంతుని విభూతియే.

భగవానుడు హృషీకేశుడు. హృషీకాలంటే ఇంద్రియాలు. ఇంద్రియాలను (హృషీకాలను) ప్రేరేపించేవాడే గనుక హృషీకేశుడు.

మనస్సు కూడా ఇంద్రియాలను ప్రేరేపించేదే గనుక మనస్సును నేనే అంటున్నాడు భగవానుడు.

ఈ మాట చెప్పి భగవానుడు మనకెంతో మేలు చేశాడు. ఎందుకంటే అన్నింటికన్న దగ్గరగా ఉన్న వస్తువు మనస్సే గదా! అట్టి మనస్సు భగవంతుడే అయితే ఆ భగవంతుని కోసం ఎక్కడ వెతకాలి? ఎక్కడకు వెళ్ళాలి? ఎక్కడకూ వెళ్ళనక్కరలేకుండా ఉన్నచోటనే ఉండి అంతర్ముఖమైతే చాలు. అంతేకాదు ఇంద్రియాలను నిగ్రహించి కర్మక్షేత్రంలో మనను నిలిపేది కూడా మనస్సే.

4.భూతానాం చేతనా అస్మి:- ప్రాణులలో చేతనను - చైతన్యాన్ని నేనే.

జడమైన వాటికి ప్రాణులకు మధ్య తేడా ఈ చైతన్యమే. ఈ చేతన నిద్రలో కూడా ఉంటుంది. గోళ్ళు, వెంట్రుకలు పెరగటం గాని, రక్తప్రసరణ జరగటం గాని - అంతా చేతనశక్తి వల్లనే. నిద్రలో మనస్సు లేనప్పుడు చేతన సామాన్యంగా ఉంటుంది. నిద్ర నుండి లేవటంతో చేతన విశేషంగా ఉంటుంది. ఆ చేతన నావిభూతియే అంటున్నాడు భగవానుడు. అసలు చైతన్యం భగవంతుడే. చైతన్యం ఎక్కడ కనిపిస్తే అక్కడ దానిని భగవంతునిగా ఉపాసన చెయ్యాలి. ఏప్రాణిని చూచినా అందులో చైతన్యాన్ని మాత్రమే దర్శించాలి.

ఇంతవరకు మొత్తం 8 విభూతులు చెప్పారు. ఇప్పుడు మరో 4 విభూతులు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో|| రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్ష రక్షసాం|**

**వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణామహం || (23)**

**తా||** రుద్రులలో శంకరుణ్ణి, యక్షరాక్షసుల్లో కుబేరుణ్ణి, వసువులలో పావకుడను. పర్వత శిఖరాల్లో నేను మేరువును.

**వ్యాఖ్య:-** 1.రుద్రాణాం శంకరశ్చాస్మి:- రుద్రులలో నేను శంకరుణ్ణి. రుద్రులు 11 మంది. వారినే ఏకాదశ రుద్రులు అంటారు. వారిలో శంభువు అనే పేరుగల రుద్రుడే శంకరుడు. శంకరుడు అంటే సుఖాన్ని - శుభాన్ని కలిగించేవాడు అని అర్థం. ఏమిటా శుభం? ఆయన లయకారుడు. లయం చేయటమే శుభం. ప్రతి నిర్మాణానికి ముందు నాశనం ఉంటుంది. మొక్క మొలవాలంటే ముందు విత్తనం నాశనం అవుతుంది. పండు వచ్చే ముందు పువ్వు రాలిపోతుంది. కనుక సృష్టికి పూర్వం లయం ఉంటుంది. అందువల్ల సృష్టికి కారణమైన లయమే శుభం. లయం లేకుండా పుట్టిన ప్రాణులు పుట్టినట్లే ఉండిపోతే ఇక సృష్టికి అవకాశం లేదు. వచ్చేవారికి చోటుండదు, ఆహారం ఉండదు, బ్రతుకు భారం అవుతుంది. అందుకే లయం ద్వారా శుభం కలిగించే శంకరుడే నా విభూతి అంటున్నాడు భగవానుడు.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే - రుద్రుడు అంటే ఏడ్చేవాడు, ఏడిపించేవాడు - అని. మనకు అనేక కారణాల వల్ల ఏడుపు వస్తుంది. ఆ ఏడుపుల్లో ఏ ఏడుపు వల్ల మంచి నిర్ణయం తీసుకొని ఉత్తమమార్గాన నడుస్తామో అదే - ఆ ఏడుపే శుభప్రదమైన ఏడుపు (శంకరుడు).

అర్జునుని ఏడుపు (విషాదం) యోగమై మంచికి దారితీసింది. కనుక రుద్రాణాం శంకరశ్చాస్మి - అంటే ఏడ్చేవారిని శుభప్రదమైన మార్గానికి మళ్ళించే వాణ్ణి నేనే అంటున్నాడు భగవానుడు.

2.విత్తేశో యక్షరాక్షసాం:- యక్షరాక్షసులలో ధనాధిపతి కుబేరుణ్ణి. భౌతికమైన నిధులన్నింటికి అధిపతి కుబేరుడు. ధనాన్ని సద్వినియోగం చేసేవాడే కుబేరుడు. శ్రీనివాస కళ్యాణానికి సాయంచేసి పుణ్యం కట్టుకున్నాడు. ఊరికే ధనాన్ని కూడబెట్టేవాడు విత్తేశుడు కాదు, విత్తదాసుడు. విత్తేశుడు భగవంతుని విభూతి.

ఆధ్యాత్మికంగా - యక్ష అంటే తినటం, రక్ష అంటే దాచుకోవటం. లోకంలో కొందరు తిని ఖర్చుచేసుకుంటారు. కొందరు దాచుకొని, కూడబెట్టుకుంటారు. దానికైనా - దీనికైనా విత్తంతోనే పని. తిని ఖర్చు చేసేవాడు దుర్వినియోగం చేసుకొనేవాడు. దాచుకొని కూడబెట్టేవాడు విత్తానికి దాసుడు. విత్తాన్ని సద్వినియోగం చేసుకోనేవాడే విత్తేశుడు. విత్తానికి అధిపతి - ప్రభువు కుబేరుడు. అవసరమైన వారికి సహాయం చేస్తూ అందరినీ ఆదుకొనే వాడే విత్తేశుడు. ఆయనే పరమాత్మవిభూతి. దీనిని బట్టి ధనాన్ని వృధాచేయకూడదు, దుర్వినియోగపరచరాదు, దాచుకోవటం ప్రధానం కాదు. సద్వినియోగం చెయ్యాలి.

3.వసూనాం పావకశ్చాస్మి:- వసువులలో నేను పావకుణ్ణి. అష్టవసువులని వసువులు 8 మంది. వారిలో చిన్నవాడు ప్రభాసుడు. అతడే భీష్ముడయ్యాడు. 6వ వాడు అనలుడు, అంటే అగ్ని. అతడికే పావకుడని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పేరు. అగ్ని అనేది ఎంతో ప్రత్యేకమైనది. అది సాక్షాత్తు భగవంతుని విభూతి. ఎందుకంటే మానవులకు - దేవతలకు మధ్య వారధిగా - మధ్యవర్తిగా - ఏజెంటుగా పనిచేసే వాడే అగ్ని. అగ్నినిష్పక్షపాతి. దేన్నైనా శుద్ధిచేయాలంటే అన్నింటికన్న శ్రేష్ఠమైనది అగ్ని. ఇనుముకు పట్టిన తుప్పును వదిలించి శుద్ధంచేసేది అగ్ని. బంగారంలో మలినాలను తీసివేసి శుద్ధం చేసేది అగ్నియే. ఆంజనేయుడు లంకాదహనం చేశాడంటే శ్రీరాముడు ప్రవేశించటానికి వీలుగా లంకను అగ్నితో శుద్ధం చేశాడన్నమాట. సీతాదేవి పాతివ్రత్యాన్ని నిరూపించుకొనుటకు కూడా అగ్నిలో ప్రవేశించింది. అంటే అగ్నిపునీత అయింది. ఈ అగ్నియే మనందరిలో ఉండి సమస్త శారీరక వ్యాపారాలు జరగటానికి ఆధారమవుతున్నది. మనం తిన్న ఆహారాన్ని అరిగించేది కూడా జఠరాగ్ని రూపంలోని ఈ అగ్నియే. కనుకనే అగ్ని నావిభూతి అంటున్నాడు పరమాత్మ.

ఆధ్యాత్మికంగా చూస్తే అష్టప్రకృతే అష్టవసువులు. ఈ అష్టప్రకృతితోనే ప్రపంచం ఏర్పడింది. ఇందులో తిరగటానికి మనకు ఒక అవకాశం వచ్చింది. ఇందులో తిరుగుతూ మన పూర్వకర్మఫలాలను, వాసనలను దగ్ధం చేసుకొని పవిత్రులమై తరించిపోవాలి. అలా వాటిని దగ్ధం చేసుకోవాలంటే అగ్ని - జ్ఞానాగ్ని కావాలి. అదే పావకరూపుడైన పరమాత్మ.

**4.మేరుః శిఖరిణాం అహం:- శిఖరాలలో నేను మేరు పర్వతాన్ని. మేరుపర్వతం చాలా ఎత్తైనది. అది ఈ విశ్వానికి మధ్యభాగంలో ఉన్నది. దాని శిఖరంపై దేవతలు విహరిస్తూ ఉంటారు. క్రింద సప్తద్వీపాలతో ఈ ప్రపంచం ఉంది. అందులో మనది జంబూద్వీపం. మధ్యలో ఉన్న ద్వీపం. మేరువును ఎక్కడం అంత సులువుకాదు. భీమార్జున నకులసహదేవులు, ద్రౌపది మేరుపర్వతాన్ని అధిరోహిస్తూనే పడిపోయారు. ఒక్క ధర్మరాజు మాత్రమే ఎక్కగలిగాడు. ఆత్మ కూడా అట్టిదే. ఎవ్వరూ అందుకోలేరు. ఎంతో గొప్పసాధనలు చేసి, జ్ఞానాన్ని పొందిన జ్ఞానులు మాత్రమే అందుకోగలరు. అందుకే మేరుపర్వతం నావిభూతి అంటున్నాడు భగవానుడు. అన్ని పర్వతాలు రాళ్ళురప్పలు, చెట్లు తుప్పలు. కాని మేరుపర్వతం బంగారు పర్వతం. అందుకే శ్రేష్ఠం.**

**ఆధ్యాత్మికంగా మేరు అంటే మ + ఇరు = కదిలే జ్ఞానం - అని. ఈ జ్ఞానం ద్వారా సమస్త ప్రపంచాన్ని దర్శిస్తాం. కాని అంతటి గొప్ప జ్ఞానాన్ని (మేరువును) అందుకోవటం మాత్రం చాలా చాలా కష్టం. ఆత్మచైతన్యం కారణంగా దేనినైనాతెలుసుకోగలం. కాని ఆత్మచైతన్యాన్ని దేని ద్వారాను తెలుసుకోలేం. అది ఇంద్రియ అగోచరం. కనుక మేరువు ఆత్మ యొక్క అంశ. అదే భగవంతుని విభూతి.**

**ఇంతవరకు 3 శ్లోకాల్లో 12 విభూతులను చెప్పారు మరో 3 విభూతులు.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిం|

సేనానీనామహం స్కందః సరసా మస్మి సాగరః|| **(24)**

**తా||** పార్థా! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేను. సేనానాయకులలో కుమారస్వామిని. సరస్సులలో నేను సాగరాన్ని అని తెలుసుకో.

**వ్యాఖ్య:-** 1.పురోధసాం బృహస్పతిః:-పురోహితులలో బృహస్పతిని. పురోహితుడు అంటే ముందుండి హితాన్ని చెప్పేవాడు అని అర్థం. గృహస్థులు చేయవలసిన పూజాపునస్కారాలు, యజ్ఞయాగాది క్రతువులు, సమస్త కర్మకాండకు అన్నింటికి ముందుండి ఆకర్మకాండను జరిపించి, యజమానికి శ్రేయస్సును కలిగించేవాడు పురోహితుడు. పురోహితుడు లేకపోతే కర్మలకు విలువలేదు. మానవులకు లాగానే దేవతలకు కూడా ఒక పురోహితుడున్నాడు. ఆయనే బృహస్పతి. 'బృహస్పతి' అంటే 'బృహతాం వాచాం పతిః' బృహత్తరమైన, గొప్పవైన పలుకులు పలికేవాడు - అని అర్థం. విలువైన సహాలనిచ్చి దేవతలకు, దేవేంద్రునికి శ్రేయస్సును కలిగించేవాడు గనుక బృహస్పతి ఆయన విభూతియే.

ఆధ్యాత్మికంగా చూస్తే జీవితంలో మనశ్రేయస్సు కోసం ఏపని చేయాలన్నా ఏఆలోచన చేయాలన్నా ముందుండాల్సింది బుద్ధి. బుద్ధిలో అల్పమైన, నీచమైన ఆలోచనలూ ఉంటాయి, గొప్ప ఆలోచనలూ ఉంటాయి. గొప్పగొప్ప ఆలోచనలనే బుద్ధిలో నిల్పి వాటిని

రక్షించేవాడు బృహస్పతియే. భగవంతుడే మన అందరి బుద్ధిని ప్రచోదనం చేసేవాడు కనుక బృహస్పతి భగవంతుని విభూతియే.

2.సేనానీనాం అహంస్కందః:- సేనాధిపతులలో నేను కుమారస్వామిని. యుద్ధం జరిగేటప్పుడు సేనలకు ఉత్తేజం కలిగించి, వారిలో పోరాట పటిమను కలిగించేవాడు సేనానాయకుడు. సేనలకు నాయకత్వవహించే వీరుని యొక్క తేజస్సు, బలం, పరాక్రమం, శౌర్యం, ధైర్యం, తెగువ, తెలివి ఆ సేనలను విజయపథం వైపు నడిపించటానికి తోడ్పడతాయి.

కురుక్షేత్ర యుద్ధంలో కౌరవులకు భీష్ముడు, పాండవసేనలకు దృష్టద్యుమ్నుడు సైన్యాధ్యక్షులుగా ఉండి సైన్యాలను విజయపథం వైపు నడిపించారు. అలాగే దేవతలకు రాక్షసులకు ఎప్పుడూ యుద్ధాలు జరుగుతూ ఉంటాయి. ఆ యుద్ధాలలో దేవతలకు సేనానాయకునిగా కుమారస్వామి ఉంటాడు. ఆయన శివుని పుత్రుడు. ఆయన తేజస్సు, శౌర్యధైర్యాలు, పరాక్రమం వల్ల దేవసేనలు యుద్ధంలో విజయం సాధిస్తుంటారు. అట్టి తేజస్సు భగవద్విభూతే గనుక కుమారస్వామి నేనే అంటున్నాడు. అంతేకాదు దేవసేనను కుమారస్వామిని నడిపిస్తే ఈ సమస్త జగత్తును - 14 లోకాలను నడిపించేవాడు భగవంతుడే.

ఆధ్యాత్మికంగా చూస్తే స్కందః అంటే మాను - శరీరం అని అర్థం. ఈ శరీరంలో 2కోట్ల 65 లక్షల జీవకణాలున్నాయి. ఇవన్నీ సుశిక్షితులైన సైనికులలాగా తమపని తాము చేసుకుంటూపోతాయి.

ఇందరు సైనికులున్న సేనాపతి - శరీరం (స్కందః) తప్ప మరేముంటుంది? కనుక ఈ శరీరం నా విభూతే అని ఆంతర్యం.

3.సరసాం సాగరః అస్మి:- సరస్సులలో నేను సాగరాన్ని. నీరు ప్రవహిస్తూ ఉండేవాటిని వాగులు, నదులు అంటాం. కదలకుండా ఉంటే చెరువులు, సరస్సులు, సరోవరాలు అంటాం. సరస్సులలో నీరు ఒక్కొక్కప్పుడు ఎండిపోతుంది. అందుకే 'శుష్కే నీరే కఃకాసారః' అన్నారు. నీరు లేకపోతే కాసారమెక్కడ? అని. అయితే నీరు ప్రవహించకుండా నిలువ ఉండే సాగరం మాత్రం ఎప్పటికీ ఎండదు.

- అజ్మీరులోని బ్రహ్మసరోవరం,
- కచ్ లోని నారాయణ సరోవరం,
- టిబెట్ లోని మానస సరోవరం,
- గుజరాత్ లోని బిందుసరోవరం - ఇవి ప్రసిద్ధమైన సరస్సులు.

ఈ సరస్సులన్నింటికి ఉత్పత్తిస్థానం మాత్రం సాగరమే. సముద్రం లేకపోతే అన్ని సరస్సులు ఎండిపోతాయి. ఎందుకని? సముద్రపు నీరే వేడెక్కి మేఘాలుగా ఏర్పడి చల్లబడి వర్షాన్నిస్తాయి. ఆ వర్షపు నీటివల్లనే నదులు, సరస్సులు, చెరువులు అన్నీ నిండుతాయి. భగవంతుడు కూడా అంతే. అందరిలోను అంతర్లీనంగా ఉండి అందరినీ చైతన్యంతో నింపుతాడు. కనుక సాగరం భగవంతుని విభూతి.

**విశేషార్థం:-** సరసాం సాగరః అంటే ఆధ్యాత్మికంగా మరొక అర్థం ఉంది. స - రసాం అంటే రసంతో - మాధుర్యంతో కూడినవి అని. మాధుర్యంతో కూడుకున్న వన్నీ విషయవస్తువులే. విషయవస్తువులు మాధుర్యంతో ఉండి, ఆకర్షిస్తాయి. వాటియొక్క భోగం ఎంతో హాయిగా ఉన్నట్లుంటుంది కాని అంతిమఫలితం మాత్రం దుఃఖం, సా - గరః గరం అంటే విషం. సాగరః అంటే విషంతో కూడుకున్నవి - అని. 'స - రసాం అహం సాగరః' = విషయవస్తువులలో నేను విషాన్ని అనే అర్థాన్ని మనం విశ్లేషిద్దాం. ఆకర్షణీయమైన విషయవస్తువుల నుండి మనలను వెనక్కు మళ్ళించటానికి విషయవస్తువులలో విషం రూపంలో ఉన్నది కూడా ఆ భగవంతుడే. కనుక సాగరుడు భగవంతుని విభూతే. భగవంతుడలా విషరూపంలో వాటిలో ఉండకపోతే మనం నిరంతరం విషయవ్యామోహంలో పడిపోయి జీవితాన్ని వ్యర్థం చేసుకుంటాం.

ఇంతవరకు 15 విభూతులు. మరొక 4 విభూతులు ఈ శ్లోకంలో.

**శ్లో||** మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరం|
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః|| **(25)**

**తా||** మహర్షులలో నేను భృగుమహర్షిని. శబ్దములలో నేను ఏకాక్షరమైన ఓంకారాన్ని. యజ్ఞాలలో జపయజ్ఞాన్ని. స్థావరాలలో హిమాలయాన్ని.

**వ్యాఖ్య:-** 1.మహర్షీణాం అహం భృగుః:- మహర్షులలో నేను భృగుమహర్షిని. భృగుమహర్షి గొప్ప తేజస్సు గలవాడు.

ఒకసారి ఋషులందరూ కలసి గొప్పయజ్ఞాన్ని తలపెట్టారు. అయితే ఆహూతులను శ్రేష్ఠుడైన దేవునికి సమర్పించాలని అనుకున్నారు. ఎవరు శ్రేష్ఠుడైన దేవుడు? అని చర్చ ప్రారంభమైంది. కొందరు బ్రహ్మదేవుడు సృష్టికర్త కదా! ఆయనే శ్రేష్ఠుడు అన్నారు. మరికొందరు విష్ణుమూర్తియే శ్రేష్ఠుడన్నారు. ఇంకొందరు శివుడు చాలా శ్రేష్ఠుడన్నారు. కొందరేమో దేవతలకు అధిపతి దేవేంద్రుడు శ్రేష్ఠుడన్నారు. ఇలా చర్చ సాగిపోతున్నది. మొత్తం మీద బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల తర్వాతనే ఎవరైనా అని ఏకాభిప్రాయానికి వచ్చారంతా. అయితే ఆ ముగ్గురిలో ఎవరు శ్రేష్ఠుడు? అనేది తేలలేదు. ఆ ముగ్గురిలో ఎవరు శాంతస్వభావులో వారే ఆ ముగ్గురిలో శ్రేష్ఠుడు అని నిర్ణయించుకున్నారు. మరి ఆ ముగ్గురిలో ఎవరు శాంతస్వభావులో ఎలా తెలుస్తుంది? ఈ విషయాన్ని భృగుమహర్షే తేల్చాలి. అందుకు అతడే సమర్థుడు - అని నిశ్చయించుకొని త్రిమూర్తులను పరీక్షించటానికి భృగుమహర్షిని పంపించారు.

భృగుమహర్షి మొదట బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అయితే బ్రహ్మకు నమస్కరించలేదు. కుమారుడై యుండీ నమస్కరించలేదే అని బ్రహ్మకు కోపం వచ్చింది. అయినా కోపాన్ని లోపలే దిగమ్రింగకున్నాడు.

ఆ తరువాత కైలాసానికి వెళ్ళాడు భృగుమహర్షి. సోదరుడు వచ్చాడని కౌగిలించుకోటానికి దగ్గరకు వచ్చాడు శంకరుడు, "ఉండు, ఉండు. ఆ పుర్రెలు, ఎముకలు, వల్లకాటిలోని బూడిద నాకెందుకు పూస్తావు?" అని దూరంగా జరిగాడు భృగువు. ఆ తిరస్కారానికి రుద్రునికి ఆగ్రహం కలిగింది. త్రిశూలం ఎత్తాడు. అయితే అన్నదమ్ముల మధ్య వైరం వద్దని పార్వతి అడ్డువెళ్ళింది.

అక్కడి నుండి వెనుదిరిగి వైకుంఠం వెళ్ళాడు భృగువు. శేషశయనుడై శ్రీమహావిష్ణువు పవ్వళించియున్నాడు. లక్ష్మీదేవి పాదాలు ఒత్తుతున్నది. అర్ధనిమీలిత నేత్రుడై పరవశించి పోతున్నాడు విష్ణువు. భృగువు రాకను కూడా గమనించనట్లే ఉండిపోయాడు. భృగువుకు కోపం వచ్చింది. సరాసరి వెళ్ళి విష్ణువు వక్షస్థలంపై తన్ని, "లోకాలను పాలించేది ఇలాగేనా?" అన్నాడు. విష్ణువు వెంటనే లేచి భృగువును క్షమాపణ కోరి, "నా కఠినమైన వక్షస్థలంపై గల కౌస్తుభమణి తగిలి నీపాదం ఎంతగా ఒత్తుకుందో! అని పాదాలను పట్టి మెత్తగా మర్దన చేశాడు.

ఇలా త్రిమూర్తులను పరీక్షించి శాంతుడు - శ్రేష్ఠుడు ఎవరో నిర్ణయించినవాడు భృగువు. ఇలాంటి శక్తి ఆ పరమాత్మదే. అందుకే భృగువు నా విభూతి అన్నాడు. ఆధ్యాత్మికంగా - మహర్షులు అంటే గొప్పగొప్ప విషయాలను దర్శించే వారు - అని. భృగు - అంటే ప్రకాశించేది, తెలివైనది అని. గొప్పగొప్ప విషయాలను దర్శించాలంటే

బుద్ధిలో నిశితమైన తెలివికావాలి. ఆ తెలివి పరమాత్మదే. కనుక భృగువు పరమాత్మే. మహర్షుల బుద్ధిలోని తెలివి పరమాత్మదే.

2. గిరాం ఏకం అక్షరం అస్మి:- శబ్దాలలో ఏకాక్షరమైన ఓంకారాన్ని ఐ ఉన్నాను.

మన భావాన్ని ఇతరులకు తెలియజేయటానికి కొన్ని పదాలను వాడుతాం. అవే శబ్దాలు. 'మామిడిపండు' - అనే శబ్దం మన నోటి నుండి రాగానే మన కళ్ళముందు ఒక రూపం నిలుస్తుంది. అలాగే పరమాత్మ కూడా మన ముందు ఒక రూపంతో మెదలాలంటే ఆయనకు కూడా ఒక శబ్దం కావాలి. ఒక పదం కావాలి. ఏమిటది? అదే 'ఓం' అనే ఏకాక్షరం. అదే ప్రణవం. ఓం అనే శబ్దం పలికితే పరమాత్మ మనస్సులో మెదలాలి. ఇది పరమాత్మకు శబ్ద ప్రతీక.

నిశ్శబ్ద పరమాత్మ నుండి మొదటవచ్చిన శబ్దం ఇదే. అందువల్ల ఓంకారం సాక్షాత్తు పరమాత్మే. నిరాకార పరమాత్మకు ఆకారం లేని ఆకారమే 'ఓం'. పంచభూతాలు కూడా ఓంకార నాదం చేస్తుంటాయి.

1. భూమి కంపించినప్పుడు వచ్చే శబ్దం. ఓం.

2. సముద్రఘోషలో వినిపించే శబ్దం. ఓం.

3. అగ్నిఫెళఫెళార్భాటాలతో ఉన్నపుడు వచ్చే శబ్దం. ఓం.

4. తుఫాను గాలులు వీచేటప్పుడు వచ్చే శబ్దం. ఓం.

5. ఆకాశంలో శబ్దం ప్రతిస్పందించినప్పుడు వచ్చే శబ్దం. ఓం.

శబ్దాలన్నీ ఓంకారం నుండి వచ్చినవే. కనుకనే ఓం శ్రేష్టమైనది. అది పరమాత్మ విభూతి.

బీజాక్షరాలన్నింటికి ఆది బీజాక్షరం 'ఓం'. దీనికి 4 పాదాలు. అ - ఉ - మ్. అర్ధమాత్ర (నిశ్శబ్దం).

ఈ నాలుగు పాదాల ప్రాముఖ్యత ఏమిటి?

1. మొదటిపాదం 'అ' కార శబ్దంలో పృథ్వి, ఋగ్వేదం, బ్రహ్మ, అష్టవసువులు, గాయత్రి ఉద్భవించినవి.

2.రెండవపాదం 'ఉ' కార శబ్దంలో అంతరిక్షం, యజుర్వేదం, విష్ణువు,

3.మూడవపాదం 'మ' కార శబ్దంలో దేవలోకం, సామవేదం, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు.

4.నాలుగవపాదం 'అర్థమాత్ర' (నిశ్శబ్దం) లో చంద్రలోకం, అధర్వణవేదం, మరుద్గణం పుట్టాయి. ఇదే తురీయ స్వరూపం కూడా.

అట్టి ఏకాక్షరమైన ఓం కారనాదం నా విభూతియే.

ఆధ్యాత్మికంగా చూస్తే - శబ్దాలన్నీ కదిలేవి; నశించిపోయేవి. అన్నింటికి ముందున్న భగవంతుడు కదిలేవాడు కాదు, నశించేవాడు కాదు. ఆయన అజుడు, అవ్యయుడు, శాశ్వతుడు, నిత్యుడు, స్థిరంగా ఉండేవాడు, శబ్దాలకు మూలమైన ఏకాక్షరం ఆ భగవంతుడే.

3.యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి:- యజ్ఞాలలో నేను జపయజ్ఞాన్ని.

జపం అనేది భగవంతుని చేరుకొనేందుకు ఒక సాధన - తొలిమెట్టు అని పెద్దలు చెబుతుంటారు. 'జపతో నాస్తి పాతకం' - జపం

చేస్తే పాపాలన్నీ తొలగిపోతాయి అని శాస్త్రం చెబుతున్నది. అయితే ఇక్కడ భగవంతుడు మరొక మెట్టు పైకెక్కి చెబుతున్నాడు 'జపం నేనే' అని. నామానికి - నామికి భేదం లేదు. యజ్ఞం కన్న జపం శ్రేష్టం ఎందుకు?

యజ్ఞం అంటే ఒక హోమకుండం నిర్మించి, అందులో అగ్నిని ప్రజ్వరిల్లజేసి, దేవతలకు ఆహూతులు సమర్పిస్తారు. ఇది ఖర్చుతో, శ్రమతో కూడుకున్నది. దైవయజ్ఞం, ఋషియజ్ఞం, పితృయజ్ఞం, నృయజ్ఞం, భూతయజ్ఞం అని ఎన్నో రకాల యజ్ఞాలున్నాయి. అవన్నీ మనస్సును శుద్ధం చేసి ఏకాగ్రం చేయటానికే. జపం కూడా వాక్కుతో మంత్రాన్ని ఉచ్ఛరిస్తూ, మనస్సుతో మంత్రార్థాన్ని భావిస్తూ చేయటం వల్ల మనస్సు శుద్ధమై ఏకాగ్రమవుతుంది. పైగా ఖర్చులేదు. శ్రమలేదు. అన్ని ప్రయోజనాలు ఇందులోనే ఉన్నాయి. ఇంకా విధిపూర్వక యజ్ఞాలలో హింస ఉంటుంది. కాని జపయజ్ఞంలో ఎట్టి హింసకు తావులేదు. ఇది సాత్వికమైనది.

జ = జన్మము నుండి, ప = రక్షించునదే జపం. ఆ జపం నేనే అంటున్నాడు పరమాత్మ. ఈ జన్మ నుండి విముక్తి కలిగించి భగవంతుని వద్దకు చేర్చే ఈజపం నావిభూతే అంటున్నాడు పరమాత్మ.

**4.స్థావరాణాం హిమాలయః:-** స్థావరాల్లో హిమాలయాన్ని నేను. స్థావరాలంటే కదలకుండా అలాగే పడిఉండేవి. స్థిరంగా నిలిచిఉండేవి. వాటిలో నేను హిమాలయాన్ని అంటున్నాడు పరమాత్మ. పర్వతాలు

ఎన్ని ఉన్నా అందులో హిమాలయాలు ప్రత్యేకమైనవి, చల్లనివి. వీటి గుహలలో, పర్వత సానువులలో, చల్లని ఆ ప్రశాంత వాతావరణంలో అనేకమంది మహాత్ములు, మహర్షులు తమ బుద్ధి సరిహద్దులను దాటి పోయేటట్లు, తమ భావాలను తారాజువ్వల్లా పైకి పోనిచ్చారు. మానవజీవితాన్ని తరించి వెళ్ళారు. అట్టి పుణ్యభూమి హిమాలయం. ఎందరో సాధకులకు, మహాత్ములకు నివాసం. ఇక పవిత్రక్షేత్రాలయిన బదరీ, కేదార్, పశుపతినాద్ మరియు పవిత్రనదులు గంగ, యమున, సరస్వతి ఇంకా పవిత్రస్థలాలు హరిద్వార్, ఋషీకేశ్, ఉత్తరకాశి లకు నిలయం హిమాలయం. ముగ్గురు ఆచార్యులు, అనేకమంది మహాత్ములు ఒక్కసారైనా దర్శించటమే గాక అలా దర్శించాలని అందరికి తెలియజేసిన పవిత్రస్థావరం హిమాలయం. భగవద్విభూతి గల స్థలం.

ఇంతకుముందు మేరువును చెప్పుకున్నాం. ఇప్పుడు హిమాలయం. ఏమిటి రెండింటికి తేడా? పర్వతాలలో హిమాలయాన్ని, పర్వతాలకెన్నో శిఖరాలుంటాయి. ఆ శిఖరాలలో నేను మేరువును అని భావం.

మేరువు మనకంటికి కనిపించేది కాదు. హిమాలయ శిఖరాలైన ఎవరెస్ట్, కాంచనగంగ మొ||న వన్నీ కంటికి కనిపించేవి. మేరువు సత్యలోకం వరకు వ్యాపించియున్నదని శాస్త్రాలఘోష.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే - స్థావరాలంటే కదలకుండా ఉండేవి. అంటే జడమైనవి. 'హిమం' అంటే త్వరపెట్టేది అని. స్వయంగా కదలలేని జడప్రకృతిని కదిలించి పరుగులు పెట్టించేది హిమం - హిమాలయం.

అలాగే తమోగుణంతో స్థూలంగా పడి ఉండేవారిలో కోరికలు పుట్టించి, పరుగులు పెట్టించేది పరమాత్మ చైతన్యమే. భగవంతుడే. కనుక 'స్థావరాల్లో హిమాలయాన్ని' అంటే జడపదార్థాలలో ఉండి వాటిని పరుగులు పెట్టించే పరమాత్మను నేనే అని భగవానుడంటున్నాడు.

ఇప్పటివరకు మొత్తం 19 విభూతులు చెప్పారు. మరొక 4 విభూతులు.

**శ్లో||** అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః|

గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః|| **(26)**

**తా||** వృక్షాలన్నింటిలో నేను అశ్వత్థవృక్షాన్ని. దేవర్షులలో నారదుణ్ణి; గంధర్వులలో చిత్రరథుణ్ణి, సిద్ధులలో కపిల మునిని.

**వ్యాఖ్య:-** 1.అశ్వత్థః సర్వవృక్షాణాం:- వృక్షాలన్నింటిలో అశ్వత్థ (రావి) వృక్షాన్ని నేను. రావిచెట్టు చాలా శ్రేష్టమైనది, పవిత్రమైనది, ఎక్కువకాలం జీవించేది, శాఖోపశాఖలుగా విస్తరించి ఉండేది. కనుక శాశ్వతము, సర్వవ్యాపకము అనే పదాలకు దగ్గరగా ఉంటుంది.

రావిచెట్టు మూలంలో విష్ణువు, కాండంలో కేశవుడు, కొమ్మలలో నారాయణుడు, ఆకులలో శ్రీహరి, ఫలాల్లో అచ్యుతుడు - ఇలా సమస్త దేవతలతో విరాజిల్లేది. కనుకనే హిందువులు దీనిని పూజిస్తారు. విష్ణువే రావిచెట్టు రూపాన్ని ధరించాడంటారు. కల్పవృక్షం లాంటిదంటారు.

వృక్షం ఎంత పెద్దదో విత్తనం అంతచిన్నది. అలాగే పరమాత్మ కూడా కారణరూపంలో అణువుకన్న సూక్ష్మం. కార్యరూప జగత్తుగా మహత్తు కన్న గొప్ప. కనుక అంతా పరమాత్మ పోలికే. ఈ వృక్షం యొక్క నీడకు తపస్సు చేసుకొనే వారిని ఆకర్షించే శక్తి ఉన్నది. దీనిక్రింద కూర్చొని తపస్సు చేస్తే త్వరలోనే సిద్ధి కలుగుతుందని మహాత్ముల నమ్మకం.

ఈ వృక్షానికి సంబంధించి మరో విశేషం ఉంది. ఇది పైకి చూడటానికి గొప్పవృక్షంలా కనిపిస్తుంది. కాని లోపల అంతా తొర్రయే. ఈ సంసారం (జగత్తు) కూడా అంతే. ఎంతో గొప్పదిగా, ఆకర్షణీయమైనదిగా కనిపిస్తుంది. కాని లోతుగా ఆలోచిస్తే ఇది మిథ్య మాత్రమే. అందుకే అశ్వత్థవృక్షాన్ని సంసారంతో పోల్చి ఉపనిషత్తులు చెపుతుంటాయి. భగవద్గీత 15వ అధ్యాయంలోని మొదటి నాలుగుశ్లోకాలు ఈ అశ్వత్థవృక్షాన్ని సంసారంతో పోల్చి చెప్పటం జరిగింది. అశ్వత్థం పరమాత్మ విభూతియే .

ఇక ఆధ్యాత్మికంగా 'అశ్వత్థః సర్వవృక్షానాం' వృక్షాలలో అశ్వద్ధాన్ని అంటే ఏమిటో చూద్దాం. వృశ్చనాత్ వృక్షః అంటే

కొట్టివేయవలసింది - ఛేదించవలసిందివృక్షం అని. 'అశ్వద్ధం' అంటే? 'శ్వ' అంటే రేపు; 'అశ్వ' అంటే రేపులేనిది. 'త్థ' అంటే నిలిచియున్నది - అని. అంటే - అశ్వద్ధం అంటే నశించిపోవుటకు నిలిచియున్నది. లేదా అశాశ్వతమై నిలిచియున్నది - అని. అది ప్రపంచమే. కనుక వృక్షాలలో అశ్వద్ధాన్ని అంటే "కొట్టివేయవలసిన వాటిలో నేను ఈనశ్వర ప్రపంచాన్ని" అని. ప్రపంచభావనను తెగనరికి వేస్తేనే పరమాత్మ సాక్షాత్కారం అని గ్రహించాలి.

2.దేవర్షీణాంచ నారదః:- దేవర్షులలో నేను నారదుణ్ణి. నారదుడు భగవంతుని విభూతియే. నారదుడు ఎప్పుడూ లోకాలన్నీ తిరుగుతూ ఉంటాడు. తిరుగుతూ తిరుగుతూ పాడుతుంటాడు; పాడుతూ పాడుతూ తిరుగుతుంటాడు. ఒక తంబురా ఆయన మెడలో వ్రేలాడుతూ ఉంటుంది. నోరు ఎప్పుడూ నారాయణనామాన్ని ఉచ్ఛరిస్తూ ఉంటుంది. ఎందుకలా తిరుగుతూ - పాడుతూ ఉంటాడు? తాను తరిస్తూ ఇతరులను తరింపజేయటానికే. వ్యాసుడు, వాల్మీకి, ధ్రువుడు, ప్రహ్లాదుడు నారదుని శిష్యులే.

నారదుణ్ణి కలహభోజనుడని, తంపులమారి అనీ అంటారు. అయితే ఉద్దేశపూర్వకంగానే కలహాలు కల్పించి వాటి ద్వారా అహంకారుల అహంకారాన్ని, దుర్మార్గుల దుర్మార్గాన్ని, మూఢుల మూఢత్వాన్ని పోగొట్టి వారిని సరైన మార్గంలో నడిపిస్తాడు. లేదా వారికి స్వర్గప్రవేశం కల్పిస్తాడు. ఇలా అందరిని ఉద్ధరించే నారదుడు

లోకకళ్యాణ కారకుడు. మరి భగవానుడు శ్రీకృష్ణుడో! సమస్త మానవులను తరింపజేయుటకు కంకణం కట్టుకొని, యుద్ధరంగ మధ్యంలో అర్జునుని నిమిత్తంగా జేసుకొని సమస్త వేదవేదాంగసారాన్ని నూరిపోశాడు. కనుక ఇద్దరి అభిలాష ఒక్కటే. అందుకే నేను దేవర్షులలో నారదుణ్ణి అంటున్నాడు భగవానుడు.

3.గంధర్వాణాం చిత్రరథః:- గంధర్వులలో చిత్రరధుడను. సంగీతం, నాట్యంలో నైపుణ్యం గలవారు గంధర్వులు. స్వర్గలోకంలో దేవతలకు తమ సంగీత, నాట్యకళావైభవంలో వినోదాన్ని, ఆనందాన్ని కలిగించేవారు ఈ గంధర్వులు. వీరిలో చిత్రరధుడనే పేరుగల గంధర్వుడు మహామేధావి. అర్జునుడు స్వర్గలోకం వెళ్ళినప్పుడు గానంలో, నాట్యంలో మెలకువలు నేర్పినది ఈ చిత్రరథుడే. ఆ నైపుణ్యంతోనే అజ్ఞాతవాసకాలంలో అర్జునుడు బృహన్నలగా ఉత్తరకు నాట్యం నేర్పాడు. చిత్రరథుడు సంగీత నాట్యాల్లోనే గాదు, చిత్ర విచిత్రంగా రథాన్ని నడపటంలో కూడా అద్భుత నైపుణ్యం గలవాడు. ఎక్కడ ఏ విశేషమైన కళ ఉన్నా దానిని భగవద్విభూతిగా గ్రహించటమే విభూతియోగం యొక్క విశిష్టత. అందుకే నేను గంధర్వులలో చిత్రరథుడను అంటున్నాడు భగవానుడు.

ఇక ఆధ్యాత్మికంగా గంధర్వులంటే గంధాన్ని పొందేవారు - లేదా విషయజ్ఞానాన్ని పొందేవారు. విషయజ్ఞానాన్ని పొందేది ఇంద్రియశక్తులే. కనుక ఇంద్రియశక్తులే గంధర్వులు. విషయాలు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**ఎంతదూరంలో ఉన్నా చిత్రవిచిత్రంగా వాటివైపు పరుగెత్తి వాటిని గ్రహిస్తాయి ఇంద్రియాలు. చిత్రవిచిత్రంగా పరుగులెత్తటమే చిత్రరథుడు. ఇంద్రియాలు అలా పరుగెత్తి విషయజ్ఞానాన్ని పొందటానికి శక్తి ఆ భగవంతునిదే గనుక నేను చిత్రరథుడను అంటున్నాడు భగవానుడు. కనుక చిత్రరథుడు భగవంతుని విభూతియే.**

**4.<u>సిద్ధానాం కపిలో మునిః</u>:- సిద్ధులలో నేను కపిలమునిని. సాధనలో సిద్ధి పొందినవారే సిద్ధులు. అట్టివారిలో నేను కపిలమునిని అంటున్నాడు భగవానుడు. కపిలముని సాక్షాత్తు భగవంతుని అవతారమే. జన్మించిన తోడనే ధర్మ, జ్ఞాన, వైరాగ్యములను పొంది, తల్లితండ్రులిరువురికి ముక్తిమార్గాన్ని భోదించిన మహనీయుడు కపిలుడు. అంతేకాదు తన కంటిచూపుతో అరవై వేలమంది సగరపుత్రులను భస్మం చేసినవాడు. సాంఖ్యమతాన్ని బోధించినవాడు. భగవానుడు భగవద్గీతలో సాంఖ్యయోగాన్ని బోధించాడు. కనుక కపిలముని నా విభూతియే అని ప్రకటిస్తున్నాడు భగవానుడు.**

**ఇక ఆధ్యాత్మికంగా చూస్తే సిద్ధులు అంటే సిద్ధిపొందినవారు - అని. ఏ రంగంలోనైనా సిద్ధిపొందాలన్నా, విజయం సాధించాలన్నా కపిలముని కావాలి. కపిల అంటే తేజస్సుతో కూడిన; ముని అంటే తెలివి - అని. అంటే తేజస్సుతో కూడిన తెలివి ఉంటేనే సిద్ధి. ఈ తెలివి లేదా బుద్ధి భగవంతుడే. కనుక కపిలముని భగవంతుని విభూతియే.**

**ఇప్పటికి 23 విభూతులు చెప్పారు. మరొక 3 విభూతులు -**

**శ్లో||** ఉచ్చైః శ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవం|

ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపం|| (27)

**తా||** గుర్రాలలో నేను అమృతంతో కూడా పుట్టి ఉచ్చైశ్రవసమనే గుర్రాన్నని తెలుసుకో. ఏనుగుల్లో ఐరావతాన్ని, నరులలో రాజును నేనే.

**వ్యాఖ్య:-** 1.ఉచ్చైశ్రవసం అశ్వానాం:- గుర్రాలలో నేను ఉచ్చైశ్రవసమనే గురాన్ని. దేవదానవులు అమృతం కోసం పాలసముద్రాన్ని మధించినప్పుడు అనేక వస్తువులు పుట్టినవి. వాటిలో ఉచ్చైశ్రవసమనే తెల్లని రెక్కల గుర్రం, ఐరావతమనే నాలుగుదంతాల తెల్లని ఏనుగు ముఖ్యమైనవి. వాటిని దేవేంద్రుడు తీసుకున్నాడు. గుర్రాలన్నింటిలో ఈ ఉచ్చైశ్రవసం శ్రేష్టమైనది గనుక అది నావిభూతి అంటున్నాడు భగవానుడు.

ఆధ్యాత్మికంగా దీనికి విశేషార్థం ఉన్నది. శ్వ అంటే రేపు. అశ్వ అంటే రేపులేనిది. నశ్వరమైనది. ఏమి చేసినా, ఏమి పొందినా, ఏమి అనుభవించినా ఇక్కడ అన్నీ నశించేవే. అయితే ఇక్కడ - ఈ నశ్వర ప్రపంచంలో చేసే వాటిల్లో నశించనిది ఒక్కటే ఉంది. అదే ఉచ్చైశ్రవసం. ఉచ్చైః అంటే ఉన్నతమైన వాటిని, శ్రవం అంటే వినటం. ఉచ్చైశ్రవం అంటే ఉన్నతమైన విషయాలను వినటం. ఏమిటా ఉన్నతవిషయాలు?

లౌకికవిషయాలు - అవి ఎంత గొప్పవైనా నశించిపోయేవే. అల్పమైనవే, నిలకడలేనివే. కాని పరమాత్మ గురించిన విషయాలు

వింటే అవి మాత్రం శాశ్వతప్రయోజనాన్ని కలిగిస్తాయి. ఈ జన్మలో ఎంతవరకు తెలుసుకుంటావో అది అంతా వచ్చే జన్మకు పెట్టుబడి అవుతుంది. అంతేకాదు ఇలా పరమాత్మ సంబంధమైన విషయాలను వింటే అది అమృతోద్భవ మవుతుంది. అంటే అమృతత్త్వాన్ని - మోక్షాన్ని అందిస్తుంది. కనుక అమృతత్త్వం కోసం ఉన్నతమైన విషయాలను విని జీవితాన్ని సార్థకం చేసుకోవాలని ఆంతర్యం.

<u>2.ఐరావతం గజేంద్రాణాం:-</u> గజరాజులలో ఐరావతాన్ని. ఐరావతం కూడా అమృతమధన సమయంలో పాలసముద్రం నుండి పుట్టినదే. అది తెల్లని ఏనుగు. నాలుగు దంతాలుంటాయి. దేవేంద్రుని పట్టపు టేనుగు అది. ఏనుగులలో అంతటి గొప్ప ఏనుగు మరొకటి లేదు గనుక అది నా విభూతే అన్నాడు భగవానుడు.

ఇక విశేషార్థాన్ని పరిశీలిస్తే - 'గజ్' అంటే అయోమయంగా, అలజడిగా గజిబిజిగా, గందరగోళంగా ఉండటం. అంటే సరైన ఆలోచనలు చేయలేని స్థితి. పరమాత్మ సంబంధమైన ఉత్తమవిషయాలను విని తెలుసుకోలేని వారు భగవంతుని వైపుకు తిరగక - తిరగాలని తెలియక గందరగోళంలో పడిపోయి సరైన ఆలోచనలు చేయలేక, ప్రాపంచిక విషయవ్యామోహాలలో తిరుగుతూ వాటి వెంట పరుగెత్తుతూ ఉంటారు.

ఇలా ఉత్తమమైన ఆలోచనలు చేయలేని వారిలో (గజేంద్రాణాం) నేను ఐరావతాన్ని. ఇరా అంటే సంపద. ఐరావతం అంటే సంపదలతో

కూడుకున్న ప్రపంచం. ఈ ప్రపంచంలో తిరగటానికి మనకు 4 దంతాలు. అవే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనేవి. ఈ నాలుగు దంతాలతో ప్రపంచంలోని లౌకిక సంపదల వెంట పరుగులెత్తుతుంటాం. ఉత్తమవిషయాలు విని, ఉన్నతమైన ఆలోచనలు చేయలేని వారికోసం పరమాత్మయే సంపదలతో కూడుకున్న ప్రపంచంగా కనబడుతున్నాడు. అదే ఐరావతం. అందుకే ఐరావతం నావిభూతి అంటున్నాడు.

<u>3.నరాణాంచ నరాధిపం</u> :- నరులలో నేను రాజును. ప్రజలను పాపాల నుండి తప్పించి, కష్టాల నుండి రక్షించి ఆదుకుంటూ, ధర్మబద్ధమైన పరిపాలన చేస్తూ, ప్రజలను ధర్మమార్గంలో నడిపించేవాడే రాజు. అందుకే 'నావిష్ణుః పృథివీ పతిః" - రాజు విష్ణువు (భగవంతుని) అంశ అని అంటే మానవులందరిలో భగవంతుని అంశ ఉన్నప్పటికీ రాజులో మాత్రం అధికంగా ఉంటుంది. అందుకే మానవులందరిలో రాజు శ్రేష్ఠుడు అనటం. మహాత్ములైన వారు తాము చేసిన తప్పులకు, పాపాలకు రాజు ద్వారా శిక్షను పొంది పాప విముక్తులవుతారు.

అయితే రాజును ఇలా భావించటం అంటే వారు ధర్మపరిపాలకులు, సదాచారసంపన్నులు, పక్షపాతరహితులు ఐనప్పుడే గాని; వారు భోగలాలసులై, పాపాచార పరాయణులై, ప్రజలను పీడించే వారైతే మాత్రం వారిని భగవదంశ సంభూతులుగా భావించలేం. పూర్వకాలంలో చాలామంది రాజులు వంశపారంపర్యంగా

పరిపాలకులైనప్పటికీ వారు ప్రజలను కన్నబిడ్డల వలె పాలించేవారు. తమ పరిపాలన వల్ల సత్పురుషులకు ఎట్టి బాధ కలగకుండా చూచుకొనేవారు. అందుకే రాజులో భగవదంశ అధికంగా ఉంటుంది గనుక నరులలో నేను రాజును అంటున్నాడు భగవానుడు.

ఇంతవరకు 26 విభూతులు చెప్పారు. మరో నాలుగు విభూతులు -

**శ్లో||** ఆయుధానామహం వ్రజం ధేనూనామస్మి కామధుక్|

ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణా మస్మివాసుకిః|| (28)

**తా||** ఆయుధాలలో నేను వజ్రాన్ని. గోవులలో కామధేనువును. పుట్టించే వారిలో నేను మన్మధుడిని. సర్పాలలో వాసుకిని.

**వ్యాఖ్య:-** 1.ఆయుధానాం అహం వజ్రం:- ఆయుధాలలో నేను వజ్రాయుధాన్ని. ఎక్కడ అధిక తేజస్సు, బలం, శక్తి ఉన్నదో అది నేనే అని భగవానుడు చెబుతున్నాడు. ఆయుధాలలో దేవేంద్రుని వద్దగల వజ్రాయుధం అట్టి దివ్యమైన శక్తి గలది. అంతటి గొప్పశక్తి దానికెలా వచ్చింది? అది తయారైంది దధీచి మహర్షి యొక్క వెన్నెముకతో. ఆ మహర్షి యొక్క త్యాగంతో, ఆ మహర్షి యొక్క తపోబలంతో వజ్రాయుధం తయారైంది. అందుకే వజ్రాయుధం భగవంతుని విభూతి.

వజ్రాయుధం పుట్టుక వెనుక ఒక గాధ ఉన్నది. దేవతలకు, రాక్షసులకు మధ్య యుద్ధాలు జరుగుతూ ఉండేవి. ఒకసారి దేవతలు రాక్షసులను జయించటం ఎలాగా? అని తమలో తాము



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మధనపడుతూ బ్రహ్మదేవుని వద్దకెళ్ళి అడిగారు. ఆయన చెప్పాడు, "దధీచి మహర్షియని గొప్ప తపశ్శక్తి సంపన్నుడైన మహాత్ముడు, త్యాగశీలి ఉన్నాడు. మీరు ఆయనను అర్థించి, ప్రార్థించి, ఆయన వెన్నెముకతో విశ్వకర్మ చేత ఆయుధాన్ని తయారు చేయించండి. దానితో దేవతలకు విజయం తథ్యం" అని. దానితో దేవతలంతా దధీచి వద్దకు వెళ్ళి అర్థించారు. వెంటనే ఆయన అంగీకరించి దేవహితం కొరకు తన ప్రాణాలను వదిలివేశాడు. ఆయన వెన్నెముకతో వజ్రాయుధం తయారైంది. కనుక ఆ వజ్రాయుధంలో దధీచి తపోబలం ఉంది; ఆయన త్యాగఫలం ఉంది. అదే పరమాత్మ శక్తి. అమోఘమైన భగవంతుని తేజస్సు. అందుకే వజ్రాయుధం నా విభూతి అంటున్నాడు భగవానుడు. వృత్రాసురుడనే రాక్షస సంహారం దీనితోనే జరిగింది.

ఆధ్యాత్మికంగా చూస్తే -

వజ్ర అంటే విచక్షణా జ్ఞానంతో వేరుచేసేది అని అర్థం. శత్రుసైన్యాలను విచక్షణా జ్ఞానంతో, ఉపాయంతో విభజించి, వేరుచేసి, కలహాలు పెట్టి జయించటం ఒక యుద్ధనీతి - రణతంత్రం, ఆధ్యాత్మిక పరమైన అంతర్యుద్ధంలో ఆత్మ - అనాత్మలను వేరుచేసి, అనాత్మపై విజయం సాధించాలి. క్షేత్ర - క్షేత్రజ్ఞులను విడగొట్టి విభాగించటం నేర్చుకోవాలి.

2.ధేనునాం కామధుక్ అస్మి:- ధేనువులలో నేను కామధేనువును.

క్షీరసాగర మధనంలో ఉద్భవించిన చిత్రవిచిత్రమైన వాటిలో కామధేనువు

ఒకటి. ఇది కూడా దేవేంద్రుని వాటాకు వెళ్ళింది. కనుక ఇది దేవలోకపు గోవు. కోరిన కోరికలన్నింటిని తీర్చేది ఈ కామధేనువు. సాధారణంగా గోవు తన దూడకే పాలు చేపుతుంది, త్రాపుతుంది. కామధేనువు అలాకాదు. ఎవరు ఏ కోరికలను కోరినా, వారివారి కోరికలను తీరుస్తుంది. అదే దాని గొప్పతనం.

కామధేనువు, కల్పతరువు, చింతామణి - ఈ 3 ఋషుల తపస్సిద్ధి స్వరూపాలు. అంతేగాని అవేవో ఆవు, చెట్టు, వస్తువు కాదు

- కామం తొలిగితే కామధేనుత్వం.
- సంకల్పం తొలగితే కల్పవృక్షత్వం.
- చింతలు తొలగితే చింతామణిత్వం.

ఈ మూడు మహాయోగులైనవారికి వారివారి తపస్సిద్ధి ఫలంగా లభిస్తాయి. అందుకే కొందరు మహాయోగులను సందర్శించినప్పుడు కోరికలు తీరుతాయి, సంకల్పాలు నెరవేరుతాయి, చింతలు తీరిపోతాయి.

కోరిన కోరికలు తీర్చేవాడు భగవానుడు. కోరిన కోరికలు తీర్చేది కామధేనువు. అందుకే నేను కామధేనువును అంటూ కామధేనువు భగవంతుని విభూతిగా తెలియజేస్తున్నాడు.

3.ప్రజనశ్చాస్మి కందర్పః:- పుట్టించేవారిలో మన్మధుడను. ధర్మబద్ధమైన సంతానానికి కారణమయ్యే వాడే మన్మధుడు. మన్మధుడికి చిరునవ్వు

ధనుస్సు. చూపులే 5 పుష్పబాణాలు. వీటితో ఆడుతూ పాడుతూ మనస్సును ఆహ్లాదపరుస్తాడు. ఈయనకే కామదేవుడు అనే పేరుంది.

- మృగాలు వాటి నియమిత ఋతుకాలంలో కలుస్తాయి.
- వృక్షాలు పరపరాగ సంపర్కం ద్వారానో, స్వపరాగ సంపర్కం ద్వారానో నూతన వృక్షాలకు బీజాలను తయారుచేస్తాయి. అయితే ఇది ప్రజనం కాదు.

స్త్రీ పురుషులు పరస్పర ప్రేమతో కలిస్తే అది ప్రజనం అవుతుంది. అప్పుడు మంచిసంతానం కలుగుతుంది. పరస్పర ప్రేమతో కలిసిన అదితి కశ్యపులకు దేవతలు జన్మించారు. అట్టి ప్రేమ లేకుండా సంధ్యాకాలంలో బలవంతంగా దగ్గరై కలసిన దితి కశ్యపులకు దైత్యులు - రాక్షసులు జన్మించారు. స్త్రీపురుషులలో పరస్పర ఆకర్షణను కలిగించేశక్తి మన్మథునికే. అందుకే ఒక కవి అన్నాడు, "లోకంలో విల్లంబులు ధరించిన వీరుడెవరైనా సరే ఒకటిని రెండు చేయగలుగుతాడు. కాని రెంటిని ఒకటి చేయగల మహావిలుకాడు, వీరుడు మన్మథుడే" అని. అందుకే ఈశ్వరుని కోపానికి మన్మథుడు దగ్ధమైనా కుమారస్వామి ఉత్పత్తికి తానే కారణమయ్యాడు. పరమాత్మ లాగా మన్మథుడు సర్వవ్యాపి. ఆయన ప్రవేశించలేని చోటులేదు. అందుకే మన్మథునిలో భగవదంశ అధికం. అందుకే మన్మథుడు నావిభూతి అంటున్నాడు భగవానుడు.

**4.సర్పాణాం వాసుకిః అస్మి:-** సర్పాలలో నేను వాసుకిని. ఈ వాసుకినే త్రాడుగా చేసుకొని మంధరపర్వతానికి చుట్టి కవ్వంగా ఉపయోగించి క్షీరసాగరాన్ని మధించారు దేవదానవులు. అంతటి గొప్ప సర్పం కూడా శివుని ఉంగరపు వ్రేలిలో ఆభరణంగా ఉంటుంది. ఆత్మ అణువు కన్న చిన్నది, మహత్తు కన్న పెద్దది అన్న వాక్యం వాసుకి విషయంలో కూడా సరిపోతున్నది. అందుకే నేను సర్పాలలో వాసుకిని అన్నాడు భగవానుడు.

ఆధ్యాత్మికంగా సర్ప అంటే కదలటం. ఈ ప్రపంచం అన్ని వస్తువులతో బాటు కదులుతూనే ఉంటుంది. ఇలా జరిగే అన్ని కదలికలలోను ప్రకృతి ముసుగులో దాగినవాడు భగవంతుడే. వసు అంటే ప్రకృతి. ఈ వసులో దాగినవాడే వాసుకి (భగవంతుడు).

ఇంతవరకు 30 విభూతులు చెప్పారు. మరో నాలుగు విభూతులు

**శ్లో||** అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహం|

పిత్ర్యాణామర్య మా చాస్మి యమస్సంయమతా మహం|| (29)

**తా||** నాగులలో నేను అనంతుణ్ణి, జల దేవతలలో నేను వరుణుడను, పితృదేవతలలో నేను అర్యముడను, నియమించు వారిలో నిగ్రహాన్ని(యముణ్ణి).

**వ్యాఖ్య:-** 1.అనంతశ్చాస్మి నాగానాం:- నాగులలో నేను అనంతుణ్ణి. ఇంతకుముందు శ్లోకంలో 'సర్పాణాం అస్మి వాసుకిః' అన్నారు. అంటే

సర్పాలలో నేను వాసుకిని అని. ఇప్పుడు నాగులలో నేను అనంతుణ్ణి అంటున్నారు. ఇంతకూ సర్పాలకు నాగులకు తేడా ఏమిటి? మన దృష్టిలో అన్నీ పాములే. కాని వీటి మధ్య ఏదో తేడా ఉండబట్టే భగవానుడు రెండింటినీ చెబుతున్నాడు. సర్పాలంటే విషంతో కూడిన పాములు. కొన్ని సంవత్సరాలు గడిచాక వాటిలోని విషం పోయి నాగులౌతాయని అంటారు. ఒకే తల ఉండి విషంతో కూడి ఉన్నవి సర్పాలు. వీటిలో వాసుకి, తక్షకుడు శ్రేష్ఠులు. అయితే తక్షకుని విషం కన్న వాసుకి విషం తీక్షణమైనది. ఇక అనేక శిరస్సులు కలిగి విషంలేని పాములను నాగులు అంటారు. ఇవి దేవజాతికి చెందినవి. వీటిలో అనంతుడు వేయిపడగలు గల ఆదిశేషుడు. నారాయణుడు యోగనిద్రలోకి జారుకున్నప్పుడు ఇతడే ఆయనకు శేషశయ్య అవుతాడు. అనంతుడు అంటే అనంతశక్తి సంపన్నుడు - అని; అనంత మహిమ గలవాడు అని. భూమిని తలపై ధరించి మోసేది ఇతడే. అందువల్ల ఇతడు అందరిలోను శ్రేష్ఠుడు.

పరమాత్మ అనంతుడు. ఆయన శక్తి అనంతం. ఈ శేషుడు కూడా అనంతుడే. ఇతడి శక్తి కూడా అనంతం. కనుకనే నేను నాగులలో అనంతుణ్ణి అంటున్నాడు భగవానుడు.

ఆధ్యాత్మికంగా - విషయాలనే విషం ఉన్నవారు జీవుళ్ళు. ఆ విషయవ్యామోహం వదిలించుకున్నవారు తమలోని పరమాత్మను

వేయిపడగలతో దర్శించి అనంతత్త్వాన్ని పొందుతారు. అంతర్ముఖులైతేనే భగవద్దర్శనం అని.

**2.వరుణో యాదసాం అహం :- జలదేవతలలో నేను వరుణుడను - అని.**

వరుణుడు జలాధిపతి. నీటిలో ఉంటాడు. సగం చేపదేహం, సగం మానవదేహం. ఈయన పశ్చిమదిక్కుకు పాలకుడు. భగవద్భక్తుడు. కనుక భగవంతుని విభూతి. వేదకాలంలో జనులు ప్రకృతి శక్తులను పూజించేవారు. ఆ తరువాత పురాణకాలం వచ్చింది. ఈ కాలంలో దేవతలకు మానవరూపాలను కల్పించారు. దానితో మతభేదాలనే మట్టిగుంటలో పడ్డాం. ఒక మతంలోనే అనేక విభాగాలు కల్పించుకొని శైవమని, వైష్ణవమని, శాక్తేయమని, గాణాపత్యమని అడ్డుగోడలు కట్టుకున్నాం. సందట్లోసడేమియాలాగా ఇందులో రాజకీయనాయకులు దూరి వారి ప్రయోజనాల కోసం రక్తపాతం సృష్టిస్తున్నారు. నిజంగా పరమాత్మను ఈ ప్రకృతి శక్తులలో, పంచభూతాలలో, సూర్యచంద్రులలో చూడటమే శ్రేష్టం. ఇదే వేదకాల పద్ధతి. పంచభూతాలలోని జలానికి అధిపతి వరుణుడు భగవంతుని విభూతి.

ఇక ఆధ్యాత్మిక అర్థంలో 'యాదస' అంటే 'విషయలోలుడు' అని అర్థం. 'వృ' అంటే 'కప్పివేసే' అని. విషయలోలుడు విషయప్రపంచం లోకి పరుగులు తీస్తాడు. అట్టివారి జ్ఞానం కప్పి వేయబడుతుంది. ఆ ఏర్పాటు భగవంతుడే చేస్తాడు. భగవంతుడే వరుణరూపంలో విషయభోగాల వెంట పడేవారి జ్ఞానాన్ని కప్పివేస్తాడు. విషయాలు

విషం లాంటివని గ్రహించి విడిచిపెట్టినప్పుడే అజ్ఞానమనే పొర (జ్ఞానాన్ని కప్పినపొర) తొలగిపోతుంది.

3.పితౄణాం అర్య మా చాస్మి:- పితృదేవతలలో నేను అర్యముడను. మరణమనేది ఒక అనుభవం. జీవుడు పాతశరీరాన్ని వదలి మరొక నూతనశరీరంలోకి ప్రవేశిస్తాడు. ఇలా చేరేటప్పుడు శరీరం మారుతుందే గాని మనస్సు మాత్రం అదే. మారదు. ఇలా శరీరం వదిలిన జీవుణ్ణే పితరుడు, పితృదేవుడు అంటారు. వీరుండే లోకం పితృలోకం, వీరిని పాలించేవాడే అర్యముడు. అతడు శ్రేష్ఠుడు గనుక భగవంతుని విభూతి.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే పితుః అంటే అన్నం - ఆహారం - అని. మన పంచేంద్రియాలకు ఆహారం ఈ ప్రపంచమే. కంటికి రూపం, చెవికి శబ్దం, నాలుకకు రుచి ------ ఇలా. ఈ ప్రపంచంలో తిరిగి భోగాలు అనుభవించేటప్పుడు మనకొక మిత్రుడున్నాడు. అతడే అర్యముడు. అర్యము అంటే ప్రియమిత్రుడు. అంటే భగవంతుడు ప్రియమిత్రునిలాగా ఈ ప్రపంచంలో అనుభవాలు పొందుతూ, ప్రారబ్ధకర్మఫలాలను ఖర్చుచేసుకోవటంలోను, కర్మలు చేస్తూ వాసనలను ఖర్చుచేసుకోవటంలోను సహాయపడతాడు. కనుకనే అర్యముడు భగవంతుని విభూతి.

4. యమస్సంయమతాం అహం:- నిగ్రహించే వారిలో (శాసించే వారిలో) నేను యముడను.

ఏరకమైన పక్షపాతం లేకుండా న్యాయనిర్ణయం చేసి, ఏ తప్పు చేస్తే ఆ తప్పుకు తగిన శిక్షను వేసి అమలు జరిపించేవాడు యమధర్మరాజు. అందుకే ఆయనను 'సమవర్తి' అంటారు. ఆయన దగ్గర లంచాలు, రికమెండేషన్లు చెల్లవు. చట్టాన్ని తు.చ. తప్పక పాటిస్తాడు. అందుకే అప్పుడప్పుడు మొట్టికాయలు పడుతుంటాయి. ఇక నచికేతునికి బ్రహ్మజ్ఞానాన్ని అందించిన మహాజ్ఞాని. పరమాత్మ ఆజ్ఞను తప్పక పాలించేవాడు గనుక ఆయన పరమాత్మ విభూతి.

మృత్యుదేవతను ఎవరూ పూజించరు. ఎందుకంటే ఆయన ప్రాణాలు తీసేవాడు - అని. కాని నూతన సృష్టి జరగాలంటే గతం నశిస్తేనే సాధ్యం. బాల్యం పోతేనే యవ్వనం. ఈ జన్మ అంతమైతేనే మరొక జన్మ. పాతఇల్లు పడగొడితేనే నూతనభవనం. కనుక సృష్టి ఎంత వేగంగా జరుగుతుందో మృత్యువు కూడా అంతవేగంగా పనిచేయాలి. అందరూ యమధర్మరాజును తిట్టుకుంటారు గాని, ఆయన గనుక లయం చేయకపోతే ఎంత ప్రమాదం? పుట్టేవారు పుడుతూ, ఉన్నవారు పోకపోతే ఈలోకంలో జనులు - ప్రాణులు ఎక్కడ నివసిస్తారు? ఇక క్రూరజంతువులు, తేళ్ళు, పాములు మొ||న వన్నీ చావులేకుండా అలాగే ఉంటే మన బ్రతుకు ఎంత దుర్భర మవుతుంది? కనుక సృష్టికర్తకు సహాయం చేసే యముడు ఆ పరమాత్మ విభూతియే.

విశేషార్థంలో సంయమనంతో జీవించే వారిలోని ముఖ్యలక్షణం నిగ్రహం. అది సాక్షాత్తు భగవంతుని ప్రసాదమే. మరో సత్యం ఏమంటే -

ఈ లోకంలో ఎన్నో విషయాలు, భోగాలు ఉన్నాయి. మనం స్వేచ్ఛగా వాటిలో వీరవిహారం చేయకుండా మనకు అడ్డు వచ్చేవి ఆరోగ్యం, వయస్సు, అవకాశాలు. వీటన్నింటి కన్న పెద్ద అడ్డంకి యముడే. ఆయన దృష్టిపడ్డదా అన్ని అనుభవాలు ఆగిపోతాయి. అందుకే నియమించేవారిలో నేను యముణ్ణి అంటున్నాడు భగవానుడు.

ఇప్పటికి 34 విభూతులు పూర్తి అయినవి. మరో నాలుగు విభూతులు.

**శ్లో||** ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహం|
మృగాణాంచ మృగేంద్రోహం వైనతేయశ్చపక్షిణాం|| **(30)**

**తా||** దైత్యులలో నేను ప్రహ్లాదుణ్ణి. లెక్కలు పెట్టే వారిలో కాలాన్ని, మృగాలలో నేను మృగేంద్రుణ్ణి. పక్షులలో నేను గరుత్మంతుణ్ణి.

**వ్యాఖ్య:-** 1.ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం:- దైత్యులలో నేను ప్రహ్లాదుణ్ణి. దితి కుమారులు దైత్యులు. ఆ వంశంలో జన్మించిన వాడు హిరణ్యకశిపుడు. అతడి పుత్రుడే ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడు హరిభక్తుడు. తండ్రి హరి ద్వేషి. తండ్రి ఇష్టానికి వ్యతిరేకంగా నిరంతరం హరిగానం చేస్తుంటాడు. అందువల్ల కుమారుని అనేకవిధాల హింసించాడు హిరణ్యకశిపుడు. ఎంత హింసించినా హరినామస్మరణ వీడలేదు ప్రహ్లాదుడు. చివరకు భక్తియే జయిస్తుంది. అసుర కులంలో పుట్టినా హరిభక్తితో సద్గుణ

సంపన్నుడైన వాడు ప్రహ్లాదుడు. అందుకే నేను దైత్యులలో ప్రహ్లాదుడను అంటున్నాడు భగవానుడు. అంటే భక్తునికి భగవంతునికి తేడా లేదు అని. ప్రహ్లాదుడు భగవంతుని విభూతి.

విశేషార్థంలో చూస్తే ప్రహ్లాదుడంటే ఆహ్లాదాన్ని కలిగించేవాడు - అని. అలాగే దితి అంటే పరిమితమైనది అని. దైత్యులలో ప్రహ్లాదుడను అంటే పరిమితమైన విషయవస్తువులలో ఆహ్లాదాన్ని కలిగించేవాడను - అని. అంటే మనకు కలిగే ఆహ్లాదం భగవంతుడు ప్రసాదించేదే.

2.కాలః కలయతాం అహం:- లెక్కలు కట్టే వారిలో నేను కాలాన్ని. వడ్డీ వ్యాపారులు, ఇన్ కంటాక్స్ అధికారులు, రెవెన్యూ అధికారులు, ఇది వరకటి రోజుల్లో బ్యాంకు అధికారులు లెక్కలు కట్టటంలో ఎంతో నైపుణ్యం గలవారు. ఐతే వీరు కూడా ఎప్పుడో ఒకప్పుడు పొరపాటు పడతారు. అయితే కాలం మాత్రం ఏమరు పాటు లేకుండా నిముషాలు, గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు అంటూ ప్రపంచాన్ని ఖచ్చితంగా కొలుస్తాడు. ఒక్క నిముషం అటూఇటూ కాకుండా లెక్కలు వేయటంలో కాలాన్ని మించిన శక్తి మరొకటి లేదు.

మనం పుట్టటం, పెరగటం, చనిపోవటం అన్నీ కాలపురుషుడి లెక్క ప్రకారమే. ఎవరికన్ను కప్పినా ఆయన కన్ను కప్పటం అసాధ్యం. కాలపురుషుని ద్వారానే ఈ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాలు. జగత్తంతా కాలానికి వశం. అలాగే జగత్తు భగవంతునికి వశం. అంటే

కాలం భగవంతుడే. అందుకే కాలం నా స్వరూపం అంటున్నాడు భగవానుడు.

3.మృగాణాంచ మృగేంద్రోహం:- మృగాలలో నేను సింహాన్ని. మృగాలకు రాజు సింహం. దానికా పదవి ఎవ్వరూ ఇవ్వలేదు. దాని దర్జా, దర్పం, పౌరుషం, ప్రతాపం, శక్తి, బలం - అవే దానికా పదవిని కట్టబెట్టాయి. మృగాలన్నింటిలోను విశేషమైన శక్తి గల జంతువు సింహమే. అంతేకాదు భగవంతుడు సగం సింహం రూపంలో వచ్చి హిరణ్యకశిపుని శిక్షించి, ప్రహ్లాదుని రక్షించాడు. అందుకే మృగాలలో నేను సింహాన్ని అంటున్నాడు.

**విశేషార్థం:**- మృగం అంటే మృత్యువుతో పరుగెత్తేది - అని. మృత్యువుకు ప్రభువు పరమాత్మే. కనుక మృత్యువు పరమాత్మ విభూతియే.

4.వైనతేయశ్చపక్షిణాం:- పక్షులలో వినతా పుత్రుడైన గరుత్మంతుణ్ణి. గరుత్మంతుడు మహాబలశాలి. సూక్ష్మదృష్టి గలవాడు, మిక్కిలి ఎత్తుకు ఎగరగలడు. వినయం, విధేయత ఉన్నాయి. మాతృప్రేమ గలవాడు. దేవతలను జయించి అమృతాన్ని తెచ్చి తల్లిని దాస్య విముక్తురాలిని చేసినవాడు. అన్నింటికన్న విష్ణుభక్తి గలవాడు, విష్ణుమూర్తికి వాహనంగా ఉన్నవాడు. అందుకే నేను వైనతేయుడను అంటున్నాడు భగవానుడు. భక్తుడే భగవంతుడు.

**విశేషార్థం:**-పక్షికి రెండురెక్కలుంటాయి. 1.లౌకికదృష్టి 2.ఆధ్యాత్మికదృష్టి

**ఆధ్యాత్మిక దృష్టిని ఎన్నుకొని స్వర్గం నుండి అమృతాన్ని తెచ్చినవాడు. అతడు వైనతేయుడు. అంటే వినతాపుత్రుడు. వినయం గలవాడే ఉన్నతంగా ఎదిగి ఉత్తమస్థితిలో ఉంటాడు. అతడే భగవంతునికి ప్రీతిపాత్రుడౌతాడు.**

**38 విభూతులు చెప్పారు. మరో నాలుగు విభూతులు తరువాతి శ్లోకంలో.**

**శ్లో||** పవనః పవతామస్మి రామశ్శస్త్ర భృతా మహం|

ఝుషాణాం మకరశ్చాస్మి స్రోత సామస్మి జాహ్నవీ|| **(31)**

**తా||** **శుద్ధపరిచే వారిలో వాయువును. శస్త్రధారులలో రాముణ్ణి. జలచరాలలో మొసలిని. నదులలో గంగానదిని.**

**వ్యాఖ్య:- 1**.పవనః పవతాంఅస్మి:- **పవిత్రం చేసే వాటిలో వాయువును. ఇల్లు, వాకిలిని శుభ్రపరచుకోవటానికి చీపురుతో చిమ్మి, నీళ్ళు చల్లి, తుడిచి శుద్ధి చేస్తారు. వస్తువుల మురికిని పోగొట్టటానికి కడిగి శుభ్రం చేస్తారు. అయితే గాలి బాగా వీచే చోట మురికి చేరదు. గాలి వీయని చోట దుర్గంధం చేరుతుంది. కనుక గాలి శుద్ధం చేసే శక్తి గలది. పవిత్రం చేసే శక్తి గలది. భగవంతుని లక్షణం కూడా పవిత్రం చేయటమే. కనుక వాయువు భగవంతుని విభూతి.**

**విశేషార్థం:-** 'పవతాం' **అంటే వేగముగా చలించునది - అని. మట్టిని, జలాన్ని వాయువు పరుగెత్తుతూ పవిత్రం చేస్తుంది. మట్టిగాని,**

జలంగాని, తమ పరిధిలో తాముండి అశుద్ధ వస్తువులను శుద్ధం చేస్తాయి. కాని వాయువు మాత్రం అలాకాదు. అంతటా పరుగెత్తుతూ పరిశుద్ధం చేస్తుంది.

వాయువు కన్న బలమైనది మరొకటి లేదు. వాయువు యొక్క బలాన్ని, శక్తిని, వేగాన్ని ఎదుర్కొనే శక్తి ఎవ్వరికీ లేదు. వాయుపుత్రులు ఆంజనేయుడు, భీముడు మహాబలవంతులు. భగవంతుని బలం, శక్తి, తేజస్సు అధికంగా వాయువులో ఉంది గనుక వాయువు భగవద్విభూతి.

2.రామఃశస్త్ర భృతాం అహం:- శస్త్రధారులలో నేను శ్రీరాముణ్ణి. రామబాణం తిరుగులేనిది. రాముడు విడిచిన బాణం ముల్లోకాలు తిరిగి మళ్ళీ రాముని చేరుతుంది. శ్రీరాముని శస్త్ర నైపుణ్యం అలాంటిది.

శ్రీరాముడు పూర్ణపురుషుడు. పుత్రుడుగా, భర్తగా, అన్నగా, మిత్రుడుగా, తండ్రిగా, రాజుగా, వీరుడుగా అన్ని విషయాలలోను పరిపూర్ణుడే. భగవంతుడు పరిపూర్ణుడు. కనుకనే శస్త్రధారుల్లో నేను శ్రీరాముణ్ణే అన్నాడు.

3.ఝుషాణాం మకరశ్చాస్మి:- సముద్రంలో ఉండే జీవుల్లో మొసలి భయంకరమైనది. సూర్యోదయానికి ముందు తూర్పు ముఖం ఉంచి ఈదుతుంటుంది మొసలి. అంటే భక్తితో పరమాత్మను ప్రార్థిస్తుంటుందని ప్రతీతి. భగవంతుని వైపు తిరిగితే చాలు. వారు భగవత్ స్వరూపులే అవుతారు. అందుకే జలచరాలలో నేను మొసలిని అంటున్నాడు

భగవానుడు. మొసళ్ళను చంపరు, తినరు. తింటే వంశనాశనం అవుతుందని భయం. అందుకే మత్స్యజాతిలో మొసలి శ్రేష్ఠం. ఆ రూపంలో భగవంతుని శక్తి దానిలో ఉన్నది.

4.స్రోతసామస్మి జాహ్నవి:- నదులలో నేను జాహ్నవిని. జాహ్నవి అంటే గంగానదియే. భగీరథుడు ఎంతో గొప్పతపస్సు చేసి గంగను భూమికి తెచ్చాడు. ఆయన ముందు వెళుతుంటే వెనుకనే గలగల పారుతూ గంగ వస్తున్నది. దారిలో జహ్నుడనే ముని ఆశ్రమాన్ని ముంచివేసింది. దానితో ఆయనకు కోపం వచ్చి గంగను త్రాగేశాడు. భగీరథుని ప్రార్థనపై చెవి నుండి బయటకు వదిలాడు. జాహ్నుని నుండి విడువబడింది గనుక జాహ్నవి అన్నారు.

గంగ ఎంతో పవిత్రం. పాపాలను హరింపజేస్తుంది. విష్ణుపాదాల నుండి జనించినది. శివుని జటాజూటంలో నిలిచింది. అనేక ఓషధుల సారంతో కూడినది. పవిత్రక్షేత్రముల గుండా ప్రవహించేది. హరిద్వార్ నుండి ప్రయాగ ద్వారా కాశీ పుణ్యక్షేత్రంలో ప్రవహిస్తుంది. నీరు కూడా ఎంతో స్వచ్ఛమైనది. అన్ని కాలాలలో ప్రవహించే జీవనది. గంగాతీరంలో అనేకమంది మునులు, ఋషులు తపస్సులు చేసి సిద్ధి పొందారు. పాపనాశనము, పుణ్యప్రదము, మహిమాన్వితము అయిన గంగతో సాటిరాగల నది మరొకటి లేదు. అందుకే నదులలో గంగను అన్నాడు భగవానుడు.

ఇంతవరకు 42 విభూతులు చెప్పారు. మరో 3 విభూతులు.

**శ్లో||** సర్గాణామాది రంతశ్చ మధ్యం చైవాహమర్జున! |

అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహం|| **(32)**

**తా||** సృష్టులన్నింటిలోను ఆదిమధ్యాంతాలు నేనే అర్జునా! విద్యలన్నింటిలో అధ్యాత్మ విద్యను. వాదించే వారిలో నేను వాదాన్ని.

**వ్యాఖ్య:-** 1.సర్గాణాం ఆదిఃఅంతః మధ్యంచ:- సృష్టులన్నింటిలో ఆది, మధ్య, అంతం నేనే. అనాది నుండి సృష్టి స్థితిలయాలు జరుగుతూనే ఉన్నాయి. వాటన్నింటికి మూలకారణం నేనే. ఇప్పుడు కనిపించే సృష్టిలాంటి సృష్టులు ఇంతకుముందు అనేకసార్లు జరిగాయి. ఇకముందూ అనేకసార్లు జరుగుతాయి. వీటి అన్నింటికి ఆది, అంతం, మధ్య కూడా నేనే.

ఈ సృష్టి లేనప్పుడు ఆదిభూతంగా నేనే ఉన్నాను. ఇది నశించిన తరువాత నేనే ఉన్నాను. ఈ సృష్టిలోని చరాచరాలన్నింటిలోను నేనే ఉన్నాను. కనుక ఈ సృష్టికి ఆది మధ్య అంతాల్లో నేనే ఉన్నాను. సృష్టికి ఆదిబ్రహ్మనై సృష్టిచేస్తాను. మధ్యలో విష్ణువునై పరిపాలిస్తాను. అంతంలో రుద్రుడనై సంహారం చేస్తాను. కనుక ఆదిమధ్యాంతాలలో నేనే ఉన్నాను. ఈ విధంగా నాచింతన చేస్తూ నన్ను చేరుకోవచ్చు - అని భగవానుని భావన.

2.అధ్యాత్మ విద్యా విద్యానాం:- విద్యలలో కెల్లా ఆధ్యాత్మిక విద్యను నేను. ఆధ్యాత్మిక విద్య సాక్షాత్తు భగవంతుడే. విద్యలు లౌకికవిద్యలు, ఆధ్యాత్మిక విద్యలు అని రెండురకాలు. లౌకిక విద్యలన్నీ పొట్టకూటి

కోసమే. అవి పరమశాంతిని ఇవ్వలేవు. అయితే ఆధ్యాత్మిక విద్య - బ్రహ్మవిద్య పరమశాంతిని, శాశ్వత ఆనందాన్ని ఇస్తుంది. లౌకిక విద్యలన్నీ మనం చూచే ప్రపంచాన్ని గురించి చెబుతాయి. కాని ఆధ్యాత్మిక విద్య ఈ ప్రపంచాన్ని చూస్తున్న 'నేను' ను గురించి చెబుతుంది. అందువల్ల మనలోని అజ్ఞానాన్ని తొలగించి ఆనందాన్ని, పరమశాంతిని ప్రసాదించేది ఆధ్యాత్మికవిద్య. బ్రహ్మవిద్యా ఆనందమే బ్రహ్మమూ ఆనందమే. సమస్త అనర్థాలు నివృత్తియై, పరమానంద ప్రాప్తి కలగాలంటే ఆధ్యాత్మవిద్య తప్ప అన్యధా శరణం నాస్తి. ఆధ్యాత్మవిద్యకు సేవచేస్తే భగవంతునికి సేవచేసినట్లే. అందుకే ఆధ్యాత్మవిద్య నావిభూతి అంటున్నాడు భగవానుడు.

3.వాదః ప్రవదతాం అహం:- వాదించే వారిలో నేను వాదాన్ని. శాస్త్ర విచారణ చేయటంలో అనేక పద్ధతులున్నాయి. అందులో నేను వాదాన్ని అంటున్నాడు భగవానుడు. ఏమిటా శాస్త్రవిచారణా పద్ధతులు? (1) వాదం (2) జల్పం (3) వితండం.

(1) వాదం:- గురువుల వద్దకు పూజాపుష్పాలతో, ఫలాలతో వెళ్ళి వినయంతో వారిని సేవించి, వారు చెప్పే విషయాలను రాగద్వేషాలు లేకుండా విని, ఆత్మజ్ఞానం కొరకు, సత్యాన్ని తెలుసుకోవాలనే భావనతో సహృదయంతో చేసే చర్చ వాదం. ఇది ఉత్తమమైనది, సత్వగుణంతో కూడినది, సౌమ్యపద్ధతిలో చేసే శాస్త్రచర్చ. ఈ వాదం నావిభూతి అంటున్నాడు భగవానుడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**(2) జల్పం:- తన వాదనను - సిద్ధాంతాన్ని సమర్థించుకోవటం కోసం, ఎలాగైనా నెగ్గటమే ప్రధానంగా పెట్టుకొని కుతర్కాలతో చేసే శాస్త్రచర్చయే జల్పం. ఇది రజోగుణ ప్రధానమైనది. ఇది మధ్యమం.**

**(3) వితండం:- తనకొక సిద్ధాంతం గాని, ఉద్దేశం గాని లేకపోయినా; ఎదటివారిని మాట్లాడనివ్వకుండా, వారు చెప్పే వాటిని వినిపించుకోకుండా ఎంతసేపటికీ ఎదటి పక్షాన్ని దూషించటం, ఖండించటం, నిందించటం, గంటు మాటలతో వాదించి తానే గెలిచానని సంతోషించటం వితండం. వీరికి పెద్దగొంతు ఉంటుంది. వడగళ్ళ వాన కురిసినట్లు, డబ్బాలో గులకరాళ్ళు వేసి మ్రోగించినట్లు మాట్లాడటమే ఈ విధానం. ఈనాడు వార్తాప్రసారాలు చేసే టివి.లలో రాజకీయనాయకులతో చర్చలు పెడుతుంటారు. అందులో పాల్గొనేవారు ఎక్కువగా ఈ వితండవాదననే చేస్తుంటారు. కొందరు మాత్రం జల్పం వాదన చేస్తారు. ఈ వితండం అధమం. తమోగుణ లక్షణం.**

**జల్పం, వితండం అనేవి దురభిమానం, ద్వేషం, హింస, కల్లోలాలకు దారితీస్తాయి. అసలు విషయం మరుగున పడిపోతుంది. కాని వాదం మాత్రం అలాకాదు. కేవలం అసలు సత్యం బయటపడటానికే ఉపయోగపడుతుంది. అందుకే వాదం 'నేనే' నని భగవంతుడంటున్నాడు.**

**ఇప్పటికి 45 విభూతులు చెప్పారు. మరో నాలుగు విభూతులు.**

**శ్లో||** అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వస్సామాసి కస్యచ|

అహమేవా క్షయః కాలః ధాతాఽహం విశ్వతోముఖః|| **(33)**

**తా||** అక్షరాలలో అకారాన్ని. సమాసాలలో ద్వంద్వసమాసాన్ని. నేను అక్షయమైన కాలాన్ని. విశ్వతోముఖుడైన బ్రహ్మన్ని నేను.

**వ్యాఖ్య:-** 1.అక్షరాణాం అకారోఽస్మి:- అక్షరాలన్నింటిలోను 'అ' కారాన్ని. అన్ని అక్షరాలలోను మొదటి అక్షరం 'అ'. అలాగే ఓంకారంలోని 3 శబ్దాలలోను 'అ' మొదటిది, 'అశ్నుతే ఇతి అక్షరః' అన్నింటిలోను వ్యాపించియుండేది అక్షరం అని. 'అ' కారం లేకపోతే ఏ అక్షరాన్ని ఉచ్ఛరించలేము. సంస్కృతంలోని అన్ని హల్లులను అకారంతో చేర్చి చదవాల్సిందే. లేకపోతే స్పష్టంగా చదవలేం. క్, గ్, ట్, త్, మ్ ------- ఇలా ఉంటాయి హల్లులు. వీటికి అకారం చేరిస్తే క, గ, ట, త, మ అవుతాయి. చదవటానికి వీలుంటుంది. కనుక ప్రతి అక్షరంలోని సారం 'అ' కారమే.

అన్నింటికి ఆదియై ఉండటం, అన్నింటికి సారమై ఉండటం, అన్నింటిలోను వ్యాపించియుండటం - ఈ 3 లక్షణాలు 'అ' కారానివే కాదు, భగవంతునివి కూడా. అందుకే అకారము భగవంతుని విభూతి అయింది.

2.ద్వంద్వస్సామాసి కస్య:- సమాసాలలో నేను ద్వంద్వసమాసాన్ని.

రెండుగాని, అంతకంటే ఎక్కువ పదాలను గాని చేర్చి ఒకే ఒక్క పదంగా చెప్పటాన్ని సమాసం అంటారు. వ్యాకరణ శాస్త్రంలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కర్మధారయమని, తత్పురుష అని, బహువ్రీహి అని, ద్వంద్వసమాసమని అనేక సమాసాలున్నాయి. ద్వంద్వసమాసంలో తప్ప ఇతర సమాసాల్లో ఏదో ఒక పదానికే ప్రాధాన్యత ఉంటుంది. రెండవపదం ఈ ముఖ్యపదానికి వివరణగా, విశేషంగా ఉంటుంది. 'ముఖపద్మం' అనేది సమాసం. ఇందులో ముఖం - పద్మం అని రెండు పదాలున్నాయి. వీటిలో ముఖ్యపదం ముఖం. పద్మం అనేది ఆ ముఖం అనే పదానికి విశేషణం. పద్మం వంటి ముఖం అని అర్థం. ఇది విశేషణ ఉత్తరపద కర్మధారయ సమాసం అంటారు. ఇక్కడ విశేషణం తరువాత ఉన్నది. 'పద్మముఖి' అన్నా కూడా అర్థం మాత్రం అదే. అయితే ఇక్కడ పద్మము వంటి అనే విశేషణం ముందే ఉన్నది. అందువల్ల ఇది విశేషణ పూర్వపదకర్మధారయ సమాసం.

అయితే ద్వంద్వ సమాసంలో మాత్రం రెండు పదాలు ప్రధానమైనవే. రెండూ సమానార్థంలో ఉంటాయి. భగవంతుడు కూడా అంతటా, అందరిలో సమానంగా ఉంటాడు. అలాగే ద్వంద్వసమాసంలో రెండు పదాలలోనూ సమానార్థమే ఉంటుంది. గురుశిష్యులు, సూర్యచంద్రులు - ఇవి ద్వంద్వసమాసాలు. వీటిలో గురువు శిష్యుడు - అని; సూర్యుడు - చంద్రుడు అని చెప్పటంలో గురుశిష్యులిద్దరికీ ప్రాధాన్యత ఉంది. అలాగే సూర్యచంద్రులిద్దరికీ ప్రాధాన్యత ఉన్నది. ఇక ద్వంద్వసమాసంలోని రెండు పదాలు సులభంగా కలసిపోతాయి. వ్యాకరణం తెలిసినవారు రెంటిని సులభంగా విడదీయవచ్చు. అలాగే

జీవాత్మ పరమాత్మ రెండూ సులభంగా కలిసిపోతాయి. వివేకం గలవాడు - ఆత్మజ్ఞానం గలవాడు ఈ రెంటిని సులభంగా విడదీయగలడు. కనుక ఈ ద్వంద్వసమాసం భగవంతుని విభూతిగా చెప్పబడింది.

ఇక ఆధ్యాత్మికంగా చూస్తే గురుశిష్యులిద్దరూ కూర్చొని మంత్రార్థాన్ని విచారిస్తూ ఒక నిర్ణయానికి రావటం 'సామాసికం' అంటారు. ద్వంద్వం అంటే 'రహస్యం' అని. విచారణ ద్వారా విశేషరహస్యాన్ని బయటపెట్టటమే ద్వంద్వసమాసం. ఆత్మానుభూతిని విచారణ ద్వారానే పొందాలి. "ఆత్మవిచారణ ద్వారానే ఆత్మానుభూతి" అనే రహస్యం ఇందులో దాగి ఉంది.

3.<u>అహం ఏవ అక్షయకాలః</u>:- నేను అక్షయమైన కాలాన్ని. పరమాత్మలో సంకల్పం లేచినప్పుడు బ్రహ్మాండం సృష్టించబడుతున్నది. సంకల్పం అణగినప్పుడు లయం అవుతున్నది. ఈ సృష్టి - లయాలు నిరంతరం జరుగుతూనే ఉంటాయి. అనంతంగా జరిగిపోతూ ఉంటాయి. ఈ బ్రహ్మాండం క్షయమైపోతుంది గాని, బ్రహ్మాండానికి కారణమైన కాలం మాత్రం అక్షయం. ఈ సృష్టి లయాలకు కారణమైన పరమాత్మే అక్షయకాలం.

ఇంతకుముందు 30వ శ్లోకంలో కాలః కలయతామస్మి అంటూ కాలాన్ని నేనే అని చెప్పాడు భగవానుడు. అక్కడ చెప్పిన కాలం అనిత్యమైనకాలం. గడియారంలో ముళ్ళు తిరగటాన్నిబట్టి నిర్ణయించే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కాలం. అది క్షయమయ్యే కాలం. ఇది మహాప్రళయంలో లయమై పోతుంది. ఇక్కడ చెప్పింది మాత్రం అక్షయకాలం. ఈ క్షయ - అక్షయ కాలాలకు రెండింటికీ ఆధారం పరమాత్మే. కనుక భగవంతుడు ప్రతిక్షణంలోను ఉన్నాడు. అందుకే నేనే అక్షయకాలాన్ని అంటున్నాడు. కాలం అక్షయమే. భగవంతుడూ అక్షయమే.

4.అహం విశ్వతో ముఖః ధాతా:- విశ్వతో ముఖుడైన బ్రహ్మాన్ని నేను. ధాత అంటే కర్మఫల ప్రదాత. విరాట్పురుషుడు. ఈ విశ్వంలోని అన్ని ఉపాధులలోను ఉండి అన్నింటిని ప్రకాశింపజేసేవాడు. ఆయనలా ప్రకాశింపజేయటం వల్లనే మనం మాట్లాడగలుగుతున్నాం, చూడగలుగుతున్నాం, వినగలుగుతున్నాం, చేయగలుగుతున్నాం, ఆలోచించగలుగుతున్నాం.

సమస్తభూతాలకు వారివారి కర్మఫలాలననుసరించి సుఖ దుఃఖాలను కలిగించే కర్మఫలప్రదాత పరమాత్మే. సమస్త దేహాలలోను ఉండి ఈ విశ్వాన్ని చూచేది ఆయనే. కనుక ఆయన విశ్వతోముఖుడు.

**విశేషార్థం**:- సమిష్టి కారణ శరీరాభిమాని ఈశ్వరుడు. ఆయనే ఈ విశ్వానికి కర్మఫలప్రదాత. ఆయనలో నుండి లేచిన ఈ విశ్వంలో ఆయన అంతటా ఉన్నాడు. విశ్వమంతా ఆయన ముఖాలే. కనుకనే ఆయన విశ్వతోముఖుడు. విశ్వమంతటిని చూచే విశ్వతోముఖుడైన ధాత పరమాత్మే.

**ఇంతవరకు 49 విభూతులను తెలియజేయటం జరిగింది. మరో 9 విభూతులను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.**

**శ్లో||** **మృత్యుస్సర్వ హరశ్చాహం ఉద్భవశ్చ భవిష్యతాం|**

**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా|| (34)**

**తా||** **సర్వాన్నీ హరించే మృత్యువును నేను. భవిష్యత్తులో పుట్టబోయే వారి పుట్టుకను. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమా గుణాలను.**

**వ్యాఖ్య:- 1.మృత్యుః సర్వహరశ్చాహం:- సర్వాన్నీ హరించే మృత్యువును నేను. మృత్యువు సర్వాన్నీ హరిస్తుంది. బ్రతికి ఉన్నంతవరకు అతడు రాజు, ఇతడు పేద, అతడు భాగ్యవంతుడు, ఇతడు దరిద్రుడు, అతడు డాక్టరు, ఇతడు యాక్టరు, అతడు మేధావి, ఇతడు సామన్యుడు అని ఎవరి ప్రత్యేకతలు వారివి. ఎవరి గొప్పతనం వారిది. చనిపోవటంతోనే అందరూ మట్టిలో చేరేవారే. అందరూ అగ్నికి ఆహుతయ్యే వారే. అన్ని ప్రత్యేకతలు హరించుకుపోతాయి.**

**కోట్ల కొద్దీ ఆస్తులు సంపాదించినా, వేల ఎకరాలు పొలాలు ఉన్నా, అవి అన్నీ అతడివి కాకుండా పోతాయి. అన్ని అధికారాలు, హక్కులు హరించుకుపోతాయి. అంతేకాదు ఒకడు ఆవేశంతో హత్యచేశాడు. పోలీసులు వెంబడిస్తున్నారు. పరుగెత్తుకుంటూ వచ్చి, వచ్చి ఒకచోట కుప్పకూలి మరణించాడు. ఇప్పుడు పోలిసులేం**

చేస్తారు? అతడి దేహాన్ని అతని ఇంటికి చేరుస్తారు. అంతే . అంటే హత్యానేరం కూడా హరించుకుపోయింది. అందుకే మృత్యువు సర్వాన్ని హరిస్తుంది అని చెప్పటం. ఆ మృత్యువు నేనే అంటున్నాడు భగవానుడు. సమస్త జీవభావాన్ని హరించేది ఆత్మయే. భగవానుడే. కనుక మృత్యువు భగవంతుని విభూతియే.

2.ఉద్భవశ్చ భవిష్యతాం:- భవిష్యత్తులో పుట్టబోయే వారి పుట్టుకకు కారణం నేనే. మృత్యువు భగవంతుడే. పుట్టుకా భగవంతుడే. సముద్రంలో ఒక అలలేస్తుంటే మరో అల పతనమవుతుంది. ఒకటి పతనమైతే మరొకటి లేస్తుంది. అలాగే పరమాత్మలోనే ఈ పుట్టుకలు, మరణాలు జరిగిపోతూ ఉంటాయి. పుట్టుక తర్వాత మరణం, మరణం తర్వాత మళ్ళీ పుట్టుక - వీటన్నింటికి కారణం పరమాత్మయే. కనుక పుట్టబోయే వారి పుట్టుకకు భగవంతుడే కారణం.

3-9, నారీణాం కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి,క్షమ:- స్త్రీలలో కనిపించే ఈ ఏడు గుణాలు నా విభూతులే అంటున్నాడు భగవానుడు. దీనిని బట్టి ఈ ఏడు లక్షణాలు పురుషులలో కన్నా స్త్రీలలోనే ఎక్కువగా శోభిస్తాయని కావచ్చు. లేదా ఈ ఏడు లక్షణాలు స్త్రీలలోనే ఎక్కువగా కనిపిస్తాయని కావచ్చు. ఇవి స్త్రీలకు సహజగుణాలు కూడా. ప్రతి వస్తువులోను ఒక్కొక్క విభూతిని చెప్పి, స్త్రీలలో మాత్రం 7 విభూతులుగా నేనున్నాను అని భగవంతుడు అనటంలో స్త్రీల యొక్క విశిష్టతను చాటుతుంది. ఏమిటా 7 విభూతులు?

**(1) కీర్తి:- సత్కర్మలు, దానధర్మాలు, పూజాపునస్కారాలు, యజ్ఞయాగాదులు మొ||న కర్మల ద్వారా, త్యాగభావన ద్వారా కీర్తిని సంపాదించటం, భర్తకు అనుకూలంగా కుటుంబ నిర్వహణ గావించటం ఇవి స్త్రీ సహజగుణాలు.**

**(2) శ్రీ:- శ్రీ అంటే సంపద. అంతేకాదు సంపదతో బాటు శరీర సౌందర్యాన్ని కాపాడుకుంటూ అందంగా అలంకరించుకోవటం కూడా స్త్రీ యొక్క సహజగుణమే. శ్రీ అంటే లక్ష్మి.**

**(3) వాక్కు:- వాక్కు అంటే సరస్వతి. విద్య, బుద్ధి, జ్ఞానం సంపాదించటం, చల్లగా, తియ్యగా, మధురంగా మాట్లాడటం కూడా భగవంతుని విభూతియే.**

**(4) స్మృతి:- జరిగిపోయిన విషయాలను గుర్తుపెట్టుకొనే జ్ఞాపకశక్తి, జ్ఞానాన్ని మరచిపోకుండా ఉండటం. సందర్భానికి తగినట్లు జరిగిన విషయాలను గుర్తు తెచ్చుకోవటం స్మృతి. ఇదీ భగవంతుని విభూతియే.**

**(5) మేధా:- ధారణా శక్తి. విన్న విషయాలను బుద్ధిలో నిలుపుకొనే శక్తి. జ్ఞానవిషయాలు, తత్త్వవిచారణ చేయటానికి కావలసిన మేధాశక్తి స్త్రీలలో అధికం. ఇది కూడా భగవంతుని విభూతియే.**

**(6) ధృతి:- ధర్మ కార్యాలలో, దైవకార్యాలలో ధైర్యంతో - పట్టుదలతో పాల్గొనటం,మోక్ష సిద్ధి కొరకు పట్టుదల. ఇంద్రియ, మనస్సులను నిగ్రహించగల బలం. ఇది కూడా స్త్రీలలో అధికమే.**

(7) క్షమా:- అత్తమామలను ఆదరించటంలోను, భర్తకు అనుకూలంగా నడుచుకోవటంలోను, పిల్లల పోషణలోను, బావలు, మరుదులు, తోటికోడళ్ళు మొ||న వారితో నేర్పుతో వ్యవహరించటంలోను ఎంతో ఓర్పు ఉండాలి. ఇది కూడా స్త్రీ సహజగుణమే. ఇవన్నీ స్త్రీలలో ఉంటే వాటిని భగవంతుని విభూతులుగా చూడాలి.

**విశేషార్థం**:- 'నార' అంటే భగవత్ సంబంధమైన - అని. భగవత్ కార్యాలలో - లేదా భగవత్ సంబంధమైన జ్ఞానంలో జీవించేవారు పురుషులైనా, స్త్రీలైనా పైన చెప్పిన సద్గుణాలు వారిలో ప్రకాశిస్తే అవి భగవత్ విభూతులే.

ఇంతవరకు 58 విభూతులు చెప్పారు. మరి నాలుగు విభూతులు.

**శ్లో||** బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహం|
మాసానాం మార్గశీర్షోஉహం ఋతూనాం కుసుమా కరః|| **(35)**

**తా||** అలాగే నేను సామాలలో బృహత్ సామాన్ని, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సును. మాసాలలో మార్గశీర్షాన్ని, ఋతువులలో వసంతఋతువును.

**వ్యాఖ్య**:- 1.బృహత్సామ తథా సామ్నాం:- సామాలలో బృహత్ సామాన్ని. వేదాలలో సామవేదాన్ని అని భగవానుడు ఇంతకుముందే చెప్పాడు. ఆ సామవేదంలోని మంత్రాలను సామాలంటారు. ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**సామాలను యజ్ఞప్రక్రియలలో గానం చేస్తారు. అలా గానం చేసే సామాలలో బృహతి అనే సామం ఎంతో శ్రేష్టమైనది, పెద్దది. ఇందులోని ముఖ్యవిశేషం ఏమంటే దేవేంద్రుని సర్వేశ్వరునిగా - పరమాత్మగా కీర్తించటం జరుగుతుంది. ఇలా పరమాత్మ భావనతో చేసే ఇంద్రస్తుతి ఆత్మానుభూతికి దారితీస్తుంది. కనుక బృహత్ సామం భగవంతుని విభూతియే.**

**ఇక విశేషార్థంలో సామ అంటే సంపద. బృహత్ సామ అంటే గొప్ప సంపద. అన్ని సంపదలలోకి గొప్పసంపద భగవత్ సంపదే.**

**సామ అంటే శాంతపరచటం అనే అర్థం కూడా ఉన్నది. బృహత్ అంటే ఎక్కువ. అన్నింటికన్న ఎక్కువగా శాంతపరిచేవాడు భగవంతుడే. అందుకే నేను బృహత్ సామాన్ని అంతున్నాడు భగవానుడు.**

**2.గాయత్రీ ఛందసాం అహం:- ఛందస్సులలో గాయత్రీఛందస్సును.**

**సామాలలో బృహతి కష్టమైనది, క్లిష్టమైనది. అది నా విభూతియే అని చెప్పిన భగవానుడు ఛందస్సుల విషయం గుర్తుకొచ్చేసరికి భగవంతుని మదిలో అనేక ఛందస్సులు మెదిలి ఉంటాయ్. అన్ని ఛందస్సులలోను మరీ పెద్దది కాకుండా, మరీ చిన్నది కాకుండా ఉండి లయబద్ధంగా చదవటానికి వీలయ్యేది గాయత్రీ ఛందస్సు. ఇది మిక్కిలి దివ్యమైనది, అధిక శక్తివంతమైనది. ఇది 3 పాదాలతో, ఒక్కొక్క పాదంలో 8 అక్షరాలతో మొత్తం 24 అక్షరాలతో ఉంటుంది. బ్రాహ్మణుల్లో ఎక్కువమంది ఉభయ సంధ్యలలోను ఈ గాయత్రీ**

మంత్రాన్ని పఠిస్తున్నారు. అందుకే పండితులంతా దీనిని ముక్తకంఠంతో ప్రశంసిస్తున్నారు. అందరూ గౌరవిస్తున్నారు. అధర్వణ వేదంలోని సూర్యోపనిషత్ ఈ గాయత్రీ ఛందస్సులోనే ఉన్నది. ఈ ఛందస్సులోనే విశ్వామిత్రుడు వేదమాతను దర్శించాడు. ఋగ్వేదం ఈ ఛందస్సుతోనే ప్రారంభమైంది. సామవేదంలో ఎక్కువగా వాడింది ఈ గాయత్రీఛందస్సునే. ఇది భగవంతుని విభూతి.

3.మాసానాం మార్గశీర్షోహం:- మాసాలలో మార్గశీర్షాన్ని నేను. ఈ మాసం ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారం నవంబరు, డిశెంబరు నెలల్లో వస్తుంది. చలికాలంలో వచ్చే ఈ మాసంలో ఎండ, వానల బెడద ఉండదు. రాబోయే వేసవితాపాన్ని గురించి ప్రజలింకా ఆలోచించరు, గడచిపోయిన వర్షాకాలాన్ని మరచిపోతారు. కనుక ఈ మాసం చల్లగా, హాయిగా ఉండే నెల. ఈ హేమంతఋతువు ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది.

వైష్ణవ సంబంధమైన ధనుర్మాసం ఈ మార్గశీర్షంలోనే వస్తుంది. మహాభారతకాలంలో ఈ మాసాన్ని మొదటిమాసంగా పరిగణించే వారు. మహాభారత యుద్ధం జరిగింది ఈ మాసంలోనే. అలాగే భగవద్గీత పుట్టుక కూడా ఈ మాసంలోనే. ధృతరాష్ట్రునకు సంజయుడు భగవద్గీతను తెలియజేసింది ఈ మాసంలోనే. ఈ మాసంలో ఆచరించే వ్రతాలకు శాస్త్రాలలో మహాఫలం చెప్పబడింది. ఇన్నివిశేషాల కారణంగా మార్గశీర్షం నావిభూతి అంటున్నాడు భగవానుడు.

**విశేషార్థం:-** మార్గాలన్నింటిలోను శీర్షం వంటిది భగవంతుని వైపు నడవడమే. మార్గశీర్షం అన్నదాని అర్థం ఇదే.

**4.ఋతూనాం కుసుమా కరః:- ఋతువులలో వసంతఋతువును నేను.**

చెట్లన్నీ చిగిర్చి పుష్పాలతో, ఫలాలతో ఉండే కాలం ఇది. వాయువు సుగంధ సువాసనలతో వీస్తుంది. పర్వతప్రాంతాలన్నీ వివిధ వర్ణాలు, రంగులతో నిండిఉంటాయి. పొలాలు పైరు పంటలతో నిండి ఉంటాయి. సరస్సులు, కొలనులు, కలువలతో, కమలాలతో నిండి ఉంటాయి. వనప్రదేశాలు పచ్చని పట్టుపరుపులు పరిచినట్లు పచ్చికతో ఉంటాయి. ప్రపంచం ప్రకృతి సౌందర్యంతో సింగారించబడి ఉంటుంది. పక్షుల కిలకిలారావాలతో, కోయిలల కుహూ కుహూ కూజితాలతో, హృదయం ఆనంద డోలికలలో తేలియాడుతుంది. చంద్రుని వెన్నెల ఈ ప్రకృతిని పరవశింపజేస్తుంది. అందుకే వసంతఋతువును వర్ణించని కవి ఉండడు. అందుకే నేను వసంతఋతువును అంటున్నాడు భగవానుడు.

**విశేషార్థం:-** 'ఋ' అంటే కదలిక. ప్రపంచంలో అందరూ కదులుతూనే ఉంటారు. అయితే వారివారి పరిమితులలో కదులుతూ ఉంటారు. ఎలాంటి కదలిక ఒక వ్యక్తిని పుష్పంలా వికసింపజేస్తుందో, అతనిలోని సుగుణాలనే సువాసనలను పైకి తెస్తుందో అదే ఉత్తమమైన కదలిక - ఉత్తమమైన ఆచరణ. అట్టి ఆచరణయే వసంతఋతువు. భగవంతుని

**వైపు తిరిగే ఆచరణ ఉత్తమఆచరణ. అందుకే వసంతఋతువు భగవంతుని విభూతి. ఇంతవరకు 62 విభూతులు చెప్పారు.**

**ఇంతవరకు 62 విభూతులను చెప్పి ఇప్పుడు మరో 5 విభూతులు చెప్పబోతూ దివ్యమైన గుణాలలోనే గాక నీచమైన వానిలో కూడా నేనున్నానని చెప్పటానికి ఒక ఉదాహరణ ఇవ్వబోతున్నారు.**

**శ్లో|| ద్యూతం ఛలయతా మస్మి తేజస్తే జస్వినామహం|**

**జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహం|| (36)**

**తా|| మోసాలలో నేను జూదాన్ని. తేజోవంతులలోని తేజాన్ని నేను, జయాన్ని, ప్రయత్నించే వారిలో ప్రయత్నాన్ని. సాత్వికులలోని సత్త్వాన్ని.**

**వ్యాఖ్య:- 1.ద్యూతం ఛలయతాం అస్మి:- మోసాలలో నేను జూదాన్ని. అర్జునుని హృదయంలో హత్తుకుపోయే ఉదాహరణ నిస్తున్నాడు భగవానుడు. ఎందుకంటే తన అన్నగారి ద్యూతక్రీడాభిలాష తమకు ఎన్ని తిప్పలు తెచ్చిపెట్టిందో అనుభవించి తెలుసుకున్నవాడు అర్జునుడు.**

**మంచి అంతా భగవంతుని సృష్టి, చెడు అంతా సైతాను సృష్టి అని పాశ్చాత్యుల అభిప్రాయం. కాని భగవంతుని కన్న వేరుగా మరొకటి లేదు గనుక ఈ అభిప్రాయం తప్పు. రెండూ భగవంతుని సృష్టే. అయితే వివేకి మంచిని గ్రహించి చెడును వదిలేస్తాడు.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉప్పునీళ్ళు, మంచినీళ్ళు రెండూ భగవంతుని సృష్టే. మనం ఉప్పునీళ్ళు వదిలేసి మంచి నీళ్ళే త్రాగుతాం. అగ్ని భగవంతుడు కదా! అని ముద్దుపెట్టుకుంటామా? పాము భగవంతుడు కదా! అని మెడకు తగిలించుకుంటామా? జూదం కూడా అంతే. అది భగవంతుని విభూతే అయినా ఆడకూడదు.

మానవ వినాశనానికి కారణమయ్యేది జూదం. జూదమాడి నలుడు రాజ్యాన్ని పోగొట్టుకొని, భార్యకు దూరమై ఎన్ని కష్టాలు పడ్డాడు? ధర్మరాజు జూదమాడి రాజ్యాన్ని, భార్యను ఓడి ఎన్ని అవమానాలు పొందాడు? ఎన్ని క్లేశాలనుభవించాడు? చివరికి ఘోరయుద్ధం జరిగి బంధుమిత్రాదులతోసహా కుమారులను ఆత్మీయులను పోగొట్టుకున్నాడు గదా! జూదంలో గెలిచిన దుర్యోధనాదులు కూడా చివరికి నాశనమయ్యారు గదా!

ఫలానావాడు 'జూదగాడు' అనే మాట నీచ సంబోధన. గౌరవం తక్కువ మాట. జూదం ధర్మాన్ని, అర్థాన్ని రెంటినీ నశింపజేస్తుంది. జూదం కలహానికి కారణమౌతుందని, దానివల్ల వినాశనం జరుగుతుందని విదురుడు మొత్తుకున్నాడు. జూదరులను దేశం నుండి వెళ్ళగొట్టాలని యాజ్ఞవల్క్యుడన్నాడు. జూదంలో గెలిచిన ధనం వెనుకటి సంపదను కూడా నశింపజేసి పోతుంది.

జూదంలో మునిగినవాడికి విచక్షణాజ్ఞానం ఉండదు. తల్లి, తండ్రి, భార్యా, బిడ్డ, గౌరవం - ఇవేవీ పట్టవు. జూదం కలి నివాసమని

భాగవతం చెబుతున్నది. జూదం కామక్రోధాలను వృద్ధి చేస్తుందని కాత్యాయను డన్నాడు. దుష్టసాంగత్యం కలిగించేది జూదం.

ఇట్టి జూదం కూడా నేనే అంటున్నాడంటే భగవంతుడు సర్వత్రా - అన్నింటా ఉన్నాడని తెలుసుకోవాలే గాని, హాయిగా ఆడవచ్చని భావన కాదు. దీనివల్ల ఏయే వస్తువులను చూచినా పరమాత్మ భావన కలగాలి. అంతే.

2. తేజః తేజస్వినాం అహం:- తేజస్సులలోని తేజస్సును నేను. తేజస్సు అనేది ఒక అనుభవం. దానికి నామం, రూపం లేదు. ఆ అనుభవాన్ని తెలుసుకోవటానికి కూడా నీలో తేజస్సుండాలి. రామకృష్ణ పరమహంస అంటాడు, "సత్యం అంటే అదొక జ్యోతి. ఆ జ్యోతికి గుణభావాలు లేవు" - అని. అది కేవలం అనుభవైక వేద్యం. తేజస్సు ఉన్నచోట భగవంతుడున్నట్లే.

3.జయోఽస్మి:- పోరాటంలో - యుద్ధంలో జయాన్ని. ఇదీ అనుభవరూపమే. నామరూపాలు లేవు. ఎక్కడ భగవంతుడున్నాడో అక్కడ విజయం." యత్రయోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః తత్ర శ్రీ విజయ- - -" కృష్ణార్జునులున్న చోట విజయమే అని సంజయుదు తెలియజేశాడు.

4.వ్యవసాయోఽస్మి:- ప్రయత్నించే వారిలోని ప్రయత్నాన్ని నేను. ప్రయత్నం ద్వారా దేనినైనా సాధించగలం . ఆత్మానుభూతిని పొందాలన్నా గొప్ప ప్రయత్నం కావాలి. సోమరికి ఆధ్యాత్మికరంగంలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చోటులేదు. కనుక తేజస్సు జయము, ప్రయత్నము - అన్నీ భగవంతుని విభూతులే.

5.సత్త్వం సత్త్వవతాం అహం:- సాత్వికులలోని సత్త్వగుణాన్ని నేను. జ్ఞానాన్ని పొందాలంటే సత్త్వగుణం ఉండాలి. సత్త్వగుణం ఉన్నవానిలో పరమాత్మ ప్రకాశం అధికం. సత్త్వగుణాన్ని భగవత్స్వరూపంగా భావన చేయాలి. అన్నింటిలో, అన్ని అనుభవాలలో పరమాత్మను దర్శించటమే చేయాల్సింది.

ఇంతవరకు 67 విభూతులు చెప్పారు. మరో నాలుగు ముఖ్య విభూతులు.

**శ్లో||** వృష్ణీణాం వాసుదేవోஉస్మి పాండవానాం ధనంజయః|

మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః|| (37)

**తా||** వృష్ణి వంశస్థులలో వాసుదేవుణ్ణి; పాండవులలో ధనంజయుణ్ణి. మునులలో వ్యాసుణ్ణి. కవులలో శుక్రాచార్యుణ్ణి.

**వ్యాఖ్య:-** 1.వృష్ణీణాం వాసుదేవోஉస్మి:- వృష్ణి వంశస్థులలో నేను వాసుదేవుణ్ణి. యాదవులలో యదు, వృష్ణి, భోజ, అంధక అని నాలుగు వంశాల వారున్నారు. అందులో వృష్ణి వంశానికి చెందినవాడు శ్రీకృష్ణుడు. ఆయన వసుదేవుని కుమారుడు గనుక వాసుదేవుడయ్యాడు.

యాదవులందరికి మూలపురుషుడు యదువు. ఆయన యయాతి మహారాజు కుమారుడు. యయాతికి ఇద్దరు భార్యలు. ఒకామె శుక్రాచార్యుని కుమార్తె దేవయాని.రెండవ ఆమె రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ .

యయాతి - దేవయానిలకు ఇద్దరు పుత్రులు. వారే యదువు, తుర్వసుడు. యయాతి - శర్మిష్ఠలకు ముగ్గురు పుత్రులు. వారే దృహి, అనువు, పూరుడు. రాజ్యంపై ఉత్తరాధికారం తండ్రి కోరికను నెరవేర్చిన పూరునిదే. పూరుని నుండి పురువంశం ప్రారంభమైంది. ఆ వంశంలో జన్మించిన కురురాజు వల్ల అది కురువంశంగా ప్రాముఖ్యత సంతరించుకుంది.

పెద్ద కుమారుడు యదువు నుండి యదువంశం ప్రారంభమైంది. ఆ యదువు పుత్రుడు వృష్ణి.ఆయన కారణంగా వృష్ణి వంశం మొదలైంది. ఆ వంశంలో జన్మించిన వాడే వసుదేవుడు. ఆయన పుత్రుడే వాసుదేవుడు - శ్రీకృష్ణుడు. అందుకే వృష్ణి వంశస్థులలో నేను వాసుదేవుణ్ణి అంటున్నాడు భగవానుడు.

ఇక విశేషార్థంలో చూస్తే - 'వృష్ణి' అంటే 'వర్ణించేది' అని. మానవుడి 10 ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి నిరంతరం చైతన్యాన్ని శక్తిని లోకంలోకి వర్షిస్తూ ఉంటాయి. ఆ చైతన్యం వాసుదేవుడే. వసు అంటే ప్రకృతి సంబంధమైన అని. భగవంతుడు ఈ ప్రకృతి తొడుగుల

(ఇం.మ.బు) ద్వారా నిరంతరం చైతన్యాన్ని వర్షిస్తూ ఉంటాడు. అంటే వర్షించే వాటిలోని చైతన్యాన్ని నేనే అని భావన.

**2.పాండవానాం ధనంజయః:-** పైన చెప్పిన కురువంశంలో ధృతరాష్ట్రుడు, పాండురాజు జన్మించారు. పాండురాజుకు ఐదుగురు పుత్రులు. వారే పాండవులు. ఆ పాండవులలో మధ్యముడు అర్జునుడు. ఆయనకు ధనంజయుడనే పేరుంది. రాజసూయ యాగ సమయంలో ఉత్తర దిక్కు దిగ్విజయయాత్రకు వెళ్ళి రాజు లందరిని జయించి, అపార ధనరాసులను కప్పంగా తెచ్చాడు. అందువల్ల ధనంజయుడనే పేరు.

వృష్ణి వంశంలో శ్రీకృష్ణుడు ఎలా మహావీరుడో, పాండవులలో అర్జునుడు అలాగే మహావీరుడు, సర్వశస్త్రాస్త్ర వేత్త. అందుకే నేను అర్జునుణ్ణి అంటున్నాడు భగవానుడు.

**విశేషార్థం:** పాండవులలో ధనంజయుణ్ణి. పండా అంటే విద్యావంతుడు - పండితుడు అని. విద్యావంతులలో ధనమార్జించే నేర్పు ఉన్నవాడు ధనంజయుడు. ఆ నేర్పు భగవంతునిదే.

**3.మునీనాం అపి అహం వ్యాసః:-** వ్యాసుడు అనేది బిరుదనామం. అప్పటివరకు ఉపనిషత్తులలోని వేదాంత సాహిత్యం అంతా మంత్రాలుగా, సూత్రాలుగా ఉన్నది. ఆ వేదాంత సాహిత్యాన్ని చదవటం, అర్థం చేసుకోవటం ఎంత గొప్ప తెలివితేటలు గలవారికైనా కష్టంగా ఉండేది. అట్టి వేదాంతాన్ని సులువుగా అందరికీ అర్థం కావటానికి వ్యాసుడే ఒక క్రొత్త విధానాన్ని ప్రవేశపెట్టాడు. గొప్పగొప్ప వేదాంత



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

విషయాలను, ఆధ్యాత్మిక రహస్యాలను కథలు కథలుగా చెబుతూ, మూల సిద్ధాంతాలను మళ్ళీ, మళ్ళీ గట్టిగా ఒత్తి చెబుతూ 18 పురాణాలను, లక్షశ్లోకాల మహాభారతాన్ని ఈ లోకానికి అందించాడు. ఇలా వేదాంత రహస్యాలను సులభతరం చేసి అందించినవాడు వ్యాసుడు. అందుకే వ్యాసో నారాయణో హరిః - వ్యాసుడు సాక్షాత్తు నారాయణుడే అన్నారు.

భూలోకాన్ని ఉద్ధరించి, భూభారాన్ని అణచటానికి భగవంతుడు వాసుదేవునిగా జన్మించాడు. ఆత్మలోకాన్ని ఉద్ధరించి, అజ్ఞాన భారాన్ని అణచటానికి భగవంతుడే వ్యాసునిగా జన్మించాడు. భగవంతుని చేరేమార్గం తెలిపినవాడు భగవంతుడే గనుక వ్యాసుడు భగవానుడే.

**విశేషార్థం:-** మునులు అంటే మనన శీలురు అని. మననం బాగా సాగాలంటే విశ్లేషించే శక్తి బాగా ఉండాలి. వ్యాసుడు అంటే వ్యాసనత్ వ్యాసః = విశ్లేషించే శక్తి అని భావం. ఇది భగవంతుని గుణం. కనుక వ్యాసుడు భగవంతుడే.

**4.<u>కవీనాం ఉశనా కవిః:-</u>** కవులలో శుక్రాచార్యుడను. అసలు శుక్రాచార్యుడు కవి కానే కాదు. అతడు రాక్షస గురువు. 'ఉశన' అంటే శుక్రాచార్యుడని ఏ గ్రంథాలలోను కనిపించదు. అయితే ఆనందగిరి మాత్రం ఉశన అంటే శుక్రాచార్యుడే అన్నారు. శుక్రాచార్యుణ్ణి ఋగ్వేదంలో 'కవి' అన్నారు. అంతే. కవి అనే పదానికి 'మంత్రద్రష్ట' అని

**అర్థం. తన అహంకారం నశించిన తర్వాత తనకు కలిగిన అనుభూతులను చెప్పే జ్ఞానిని 'కవి' అన్నారు.**

**శుక్రాచార్యుడు రాక్షస గురువు. సర్వజ్ఞుడు, ఋషి, మృతసంజీవని విద్య తెలిసినవాడు. చచ్చినవారిని బ్రతికించేది మృతసంజీవని. చావులేని విద్య బ్రహ్మవిద్య. అదే మృతసంజీవని.**

**మరొక రహస్యం : వాసుదేవుడు ఉత్తమపురుష (నేను), ధనంజయుడు మధ్యమ పురుష (నీవు). వ్యాసుడు ప్రథమపురుష (అతడు). 3 పురుషలు అంటే నేను - నీవు - అతడు అంతా ఒక్కటే - అంతా - అందరూ భగవంతుడే - అని అద్వైత భావాన్ని ప్రభోదించాడీ శ్లోకంలో. శిష్యుడైన నీవు కూడా 'నేనే' అని ఉపదేశించిన వాడు జగద్గురువు శ్రీకృష్ణుడొక్కడే. నరునికి - నారాయణునికి ఒకే చోట స్థానం ఇవ్వటం జరిగింది.**

**భగవద్గీతను చెప్పిందీ, విన్నదీ, వ్రాసింది శ్రీకృష్ణుడే(భగవంతుడే). చెప్పినవాడు కృష్ణుడు. విన్న అర్జునునికి కృష్ణుడనే పేరుంది. వ్రాసిన వ్యాసుని అసలుపేరు కృష్ణ ద్వైపాయనుడు - కృష్ణుడే. కనుక అందరూ కృష్ణుడే.**

**ఇంతవరకు 71 విభూతులు చెప్పి మరో నాలుగు విభూతులు చెబుతున్నారు.**

**శ్లో||** దండో దమయతా మస్మి నీతి రస్మిజిగీషతాం|

మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామాహం|| **(38)**

**తా||** శిక్షించు వారిలో దండనీతిని. జయం కోరేవారిలో రాజనీతిని. రహస్యాలలో నేను మౌనాన్ని. జ్ఞానం గలవారిలో నేను ఆత్మజ్ఞానాన్ని.

**వ్యాఖ్య:-** 1.దండో దమయతాం అస్మి:- శిక్షించే వారిలో దండనీతిని. ప్రజలు సుఖంగా జీవించాలంటే తప్పు చేసిన వారిని దండించే పాలకులుండాలి. పూర్వకాలంలో రాజులే దండనీతిని పాటించేవారు. ఈ రోజుల్లో న్యాయస్థానాలు దండనీతిని ఉపయోగిస్తున్నాయి. ఈ దండనీతి భగవదంశయే. ఈ దండనీతిని నిర్ణయించటానికి మనుస్మృతి, పరాశర స్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి అని అనేక ధర్మశాస్త్రాలున్నాయి.

దండనీతి లేనిరాజు,పదవి నుంచి తొలగించబడ్డ అధికారి, ఉద్యోగం నుండి తొలగించబడిన పోలీసు - వీరికి తప్పు చేసిన వారిని దండించే అధికారం లేదు. తప్పు చేసిన వారు శిక్షింపబడితే వారు దోషవిముక్తులౌతారు. లేనిచో వారికి మరణానంతరం శిక్ష తప్పదు. అందుకే ఒక మునీశ్వరుడు అనుమతి లేకుండా ఒక పండును తిన్నందుకు రాజు చేత శిక్షింపబడ్డాడు. రెండు చేతులు శిక్షగా నరికి వేయబడగా, ప్రక్కనున్న నదిలో స్నానానికి దిగగా ఆ చేతులు వచ్చినవి. అతడే బాహుకుడు. ఆ నది బాహుకా నది. ఈ దండనీతి నేనే అని భగవానుడు అంటున్నాడు. దండనీతి వల్ల దోషవిముక్తి గనుక.

దండించటానికి దండనీతి అన్నా ఉండాలి. చేతిలో దండం (కర్ర) అన్నా ఉండాలి.

2.నీతిరస్మి జిగీషతాం:- జయాన్ని కోరేవారిలో నీతిని. రాజనీతిని. జయాన్ని పొందాలనుకొనేవారు రాజనీతిని పాటించాలి. మోసంతో పొందే జయం నిజమైన జయం కాదు. దుర్యోధనుడు కపట జూదంతో విజయాన్ని సాధించాడు. కాని చివరకు ఏమైంది? జూదంలో సంపాదించిన దానితో పాటు ఉన్న రాజ్యం కూడా యుద్ధంలో అపజయంతో పోయింది. పాండవులు నియమం ప్రకారం అరణ్య అజ్ఞాతవాసాలు చేసి, సామంతో తమ రాజ్యాన్ని ఇవ్వమని కోరి, చివరకు ఐదూళ్ళైనా ఇవ్వమని (దానం), కర్ణుని తమవైపు త్రిప్ప ప్రయత్నించి (భేదం) అన్నీ విఫలమై పోగా దండోపాయంగా యుద్ధం చేసి విజయం సాధించారు. ఇదే రాజనీతి. ఇదే నిజమైన విజయం. ఈ రాజనీతి భగవంతుని విభూతి.

3.మౌనం చైవాస్మి గుహ్యానాం:- రహస్యాలలో మౌనాన్ని. ఏ రహస్యాన్నైనా దాచాలంటే మౌనమే శరణ్యం. మౌనం వల్ల కలహాలు రావు. పశ్చాత్తాపం చెందే పనిలేదు. శక్తి వృధా కాదు. అపహాస్యాలకు గురికాడు. క్షమాపణ చెప్పుకొనే పనిలేదు. అసత్యదోషం ఉండదు. కాలం వృధాకాదు. చిత్త శాంతి కలుగుతుంది. అందుకే Speech is silver, silence is gold. అన్నారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ముగ్గురు గంధర్వులు ఆకాశంలో పోతున్నారు. కప్పను నోట కరచుకున్న పామును చూచారు. వారిలో ఒకడు సర్పమా! కప్పను విడువు - అన్నాడు. వెంటనే అతడు క్రిందపడిపోయాడు. మరొకడు సర్పమా! కప్పను విడువకు అన్నాడు. వెంటనే వాడూ క్రిందపడ్డాడు. మూడవవాడు మౌనంగా ఉన్నాడు. వాడు మాత్రం గమ్యస్థానం చేరుకున్నాడు . ధర్మసూక్ష్మాన్ని గ్రహించటం ఎవరికైనా కష్టమే. కనుక మౌనం సర్వశ్రేష్ఠం. అది భగవంతుని విభూతియే.

**విశేషార్థం**:- రహస్యాలలో మౌనాన్ని. ఆధ్యాత్మిక విద్య - ఆత్మజ్ఞానం రహస్యమైనది. ఎందుకంటే సాధారణంగా అది అందరికీ అర్థం కాదు. అట్టి విద్యను మౌనం ద్వారానే అనుభవించగలం. "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ" మౌనవ్యాఖ్య ద్వారానే పరమాత్మను తెలుసుకోగలం అని శ్రీదక్షిణామూర్తిస్తోత్రంలో శంకరులన్నారు కనుక మౌనం భగవద్విభూతి.

4.జ్ఞానం జ్ఞానవతాం అహం:- జ్ఞానులలోని ఆత్మజ్ఞానాన్ని నేనే. జ్ఞానం సాక్షాత్తు పరమాత్మయే. అందరిలో ఆత్మచైతన్యం ఉంది. కాని అది 3 పొరలతో కూడిన మాయచే కప్పబడి ఉంది. ఆ పొరలే సత్త్వరజస్తమో గుణాలు. తమోగుణం ఇనుప తెరవంటిది. రజోగుణం గట్టి వస్త్రం వంటిది. సత్త్వగుణం పోలిథిన్ పేపరు వంటిది. జ్ఞానులలో చైతన్యం ఈ పలుచనిపొర (సత్త్వగుణం) ద్వారా వ్యక్తమవుతుంది. అందుకే జ్ఞానులలో ఉండే జ్ఞానం నేనే అంటున్నాడు పరమాత్మ. అసలు ఆత్మను

**జ్ఞానం అని, మౌనం అని కూడా అంటారు. కనుక ఇవి రెండూ భగవత్ విభూతులే.**

**ఇంతవరకు 18 శ్లోకాలలో 75 విభూతులు చెప్పారు. భగవంతుడు ఈ 75 విభూతుల ద్వారా మాత్రమే వ్యక్తమవుతాడనే అపోహను తొలగించటానికి ఇప్పటి వరకు చెప్పిన విషయాన్ని సింహావలోకనంచేస్తూ ఈచర్చను మనోహరంగా ముగించబోతున్నాడు భగవానుడు.**

**ఉత్తమాధికారులకు ఆధ్యాత్మిక విభూతులను, మధ్యమాధికారులకు ఆధిదైవిక విభూతులను, మందాధికారులకు ఆధిభౌతిక విభూతులను విస్తారంగా తెలియజేసిన భగవానుడు, ఇప్పటివరకు జరిగిన చర్చను ఎంతో మనోహరంగా ముగించబోతూ సాధకుడు ఎలాంటి దృష్టి కలిగి ఉండాలో తెలియజేయబోతున్నాడు.**

**శ్లో|| యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున!|**
**నతదస్తి వినాయత్ స్యాత్ మయాభూతం చరాచరం|| (39)**

**తా|| అర్జునా! అన్ని ప్రాణులకు బీజం ఏదైతే ఉన్నదో అది నేనే. స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచం ఏదైతే ఉన్నదో అది నేను తప్ప వేరేమీ కాదు.**

**వ్యాఖ్య:- ఓ అర్జునా! ఇంతవరకు అనంతమైన నా విభూతులలో ముఖ్యమైన వాటిని కొన్ని నీకు చెప్పాను. ఇలా చెప్పినందువల్ల నీవు**

**పొరబడే అవకాశం ఉంది. ఏమంటే - నేను ఈ చెప్పిన వాటిలోనే ఉన్నాను. మిగిలిన వాటిలో నేను లేను అని అనుకుంటావేమో. అదేం కాదు. నిజం చెబుతున్నాను విను.**

**సమస్త ప్రాణికోట్లకు - అంటే మనుష్యులు, జంతువులు, మృగాలు, పక్షులు, క్రిమికీటకాలు, చెట్లు - అన్నింటికి మూలకారణాన్ని- బీజాన్ని నేనేనని తెలుసుకో. నానుండే ఈ సమస్తభూతాలు ఉత్పన్నమైనవని తెలుసుకో. అంతేకాదు స్థావరజంగమాలతో కూడిన - అంటే చరాచరాలతో కూడిన ఈ ప్రపంచం అంతా నేను తప్ప మరేమీ కాదు. యదార్థంగా ఉన్నదంతా నేనే అని తెలుసుకో.**

**లోకంలో ప్రతిప్రాణికి మూలం ఉంటుంది - కారణం ఉంటుంది. ఆకారణం ఆ ప్రాణి యొక్క తల్లిదండ్రులే. అయితే ఆ తల్లికి - తండ్రికి కారణం వారి తల్లిదండ్రులు. వారికి కారణం వారి తల్లిదండ్రులు. ఇలా కారణాలు వెతుక్కుంటూ పోతే అసలు మొదటి కారణం ఏమిటి? అనే ప్రశ్న తలెత్తుతుంది. అలా ముందుకు వెళ్ళగా వెళ్ళగా కారణం లేని కారణం ఒకటి ఉండాలి - అని తెలుస్తుంది. ఎవరి వల్లనో పుట్టినవాడు గాక ఎప్పుడూ ఉండేవాడొకడు ముందు ఉండి ఉండాలి. అతడే భగవంతుడు. అతడే అందరికి మూలకారణం అయి ఉండాలి. అతడినే ఆదిబీజం అంటారు. ఆ బీజం (విత్తనం) నుండే సర్వభూతాలు ఉత్పత్తి అయినవి. కనుక భగవంతుడే అన్ని ప్రాణులకు ఆదిబీజం.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనవాళ్ళు సరదాగా విత్తుముందా? చెట్టు ముందా? అని ప్రశ్న వేస్తుంటారు. 'విత్తుముందు' అంటే చెట్టు లేకుండా విత్తనం ఎలా వస్తుంది? అంటారు. 'చెట్టు ముందు' అంటే విత్తనం లేకపోతే చెట్టు ఎలా వస్తుంది? అంటారు. నిజంగా చెట్టు, వేరు, మొలక, ఆకులు, పూలు, కాయలు - అన్నీ సూక్ష్మరూపంలో ఆ విత్తనంలో ఉండబట్టే ఆ విత్తనాన్ని భూమిలో నాటినప్పుడు అనుకూల పరిస్థితులలో ఆ విత్తనం నుండి ఒక మొలక ఆకాశం వైపుకు పైకి వస్తుంది. వేరు లోతుగా భూమిలోకి చొచ్చుకపోతుంది. దానికి నీరుపోస్తూ పోషిస్తూ ఉంటే త్వరలోనే మొక్క పెరిగి పెద్దదై కాండం, కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు మొ||న వాటితో కళకళలాడుతూ వృద్ధిచెందుతుంది. అయితే ఇంత పెద్ద చెట్టు కూడా తాను ఎక్కడినుండి వచ్చిందో ఆ విత్తనంతో తనకేమీ సంబంధం లేనట్లుగానే ఉండిపోతుంది.

అలాగే అనిత్యమైన, నశించిపోయే ఈ గొప్ప జగత్తును చూస్తూ ఇందులో వచ్చే మార్పులతో, వస్తువులతో, విషయాలతో, భోగాలతో సుఖిస్తూ, దుఃఖిస్తూ కాలం గడిపే ఈ మానవులు కూడా తమకు, ఈ జగత్తుకు మూలకారణమైన బీజమైన ఆ పరమాత్మతో సంబంధం లేనట్లుగానే ఉంటారు. తాము ఎందులో నుండి వచ్చామో, తమకు మూలకారణం ఏదో, ఆధారం ఏదో, బీజం ఏదో అనే ఆలోచన లేకుండా, ఇంగిత జ్ఞానం లేకుండా ఆ మూలకారణమైన భగవంతుని పట్టించుకోరు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇంత గొప్ప చెట్టు, కాండము, కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు - అన్నీ కూడా ఆ చిన్న విత్తనంలోనే సూక్ష్మరూపంలో అవ్యక్తంగా అణగి ఉన్నాయి గదా! అలాగే మన శక్తి సామర్థ్యాలు, విద్యావివేకాలు, తెలివితేటలు, పదవులు, హోదాలు, మానమర్యాదలు - అన్నీ కూడా సుషుప్తి అవస్థలో - గాఢనిద్రలో అణగిఉంటాయి. ఆ అవస్థలో మనకు వ్యక్తిత్వం లేదు. అంటే మన వ్యక్తిత్వం అంతా బీజరూపంలో ఉన్నదన్న మాట. ఎప్పుడైతే మెలకువ వస్తుందో - అంటే జాగ్రదవస్థలోకి మేలుకుంటామో అప్పుడు మన వ్యక్తిత్వం - బీజరూపంలో అంతవరకు ఉన్న వ్యక్తిత్వం తనను తాను వ్యక్తపరచుకుంటుంది. అంటే 'నేను ఫలానా వ్యక్తిని, డాక్టరును - లాయరును - వ్యాపారిని - విద్యార్థిని, పెద్దమనిషిని, మంత్రిని అని' వ్యక్తమవుతుంది.

ఈ కనిపించే చెట్టు మొత్తం ఎలా విత్తనంలో దాగి ఉండి, తగిన అనుకూల పరిస్థితులు ఏర్పడటంతో బయటపడ్డదో అలాగే కనిపించే ఈ జగత్తు, అందులోని సర్వభూతాలు భగవంతుడు అనే విత్తనంలో దాగి ఉండి, తగిన అనుకూలపరిస్థితులు ఏర్పడటంతో అంటే వాసనల ప్రకృతి ప్రకోపించటంతో బయటపడుతున్నది.

ఇక్కడ మరొక సందేహం కలిగే అవకాశం ఉన్నది. ఈ జగత్తుకు నేనే బీజం అంటున్నాడు భగవానుడు. ఈ చెట్టుకు నేనే బీజం అంటున్నది విత్తనం. అయితే విత్తనం చెట్టుకాగానే విత్తనం నశిస్తున్నది.

అలాగే భగవానుడు జగత్తుకాగానే భగవానుడు నశిస్తాడా? - అని. ఈ ఉదాహరణను బట్టి ఎవరైనా అలా భ్రమపడవచ్చు గదా!

అట్టి భ్రమను భగవానుడే తొలగిస్తున్నాడు ఈ శ్లోకంలో. చరాచరమైనది ఏదీ నేను లేకుండా ఉండజాలదు - అని.

భగవంతుడు ఈ జగత్తుకు బీజం మాత్రమే కాదు. ఆ బీజం మొలకెత్తి, పెరిగి పెద్దదయినప్పుడు ఆ వృక్షాన్ని (జగత్తును) పోషించేవాడు కూడా తానే (భగవంతుడే). తాను లేకుండా ఈ జగత్తనే వృక్షం నిలువలేదు. ఈ జగత్తును సృష్టించి దానికి ఆధారంగా - అధిష్టానంగా తానే ఉన్నాడు.

త్రాడు త్రాడుగానే ఉండి పాముగా చీకటిలో కనిపించినట్లు, భగవంతుడు తాను తానుగా ఉండి ఈ జగత్తుగా భ్రమ గొల్పుతున్నాడనేది అసలు యదార్థం. భగవంతుడు లేని సమయం ఉండదు. భగవంతునికి చావు పుట్టుకలు ఉండవు.

అలలన్నీ సముద్రంలోనే పుట్టి పైకి లేస్తాయి. అప్పుడు కూడా తమ పుట్టుకకు ఆధారమైన సముద్రం ఉండి తీరాల్సిందే. సముద్రమే లేకపోతే అలలు పుట్టవు, నిలవవు. అలాగే ఈ జగత్తు భగవంతుని నుండే పుట్టి ఆ భగవంతుని ఆధారంగానే నిలుస్తుంది. అంతేకాదు ఈ జగత్తులో అంతటా వ్యాపించియున్నది కూడా సూక్ష్మాతిసూక్ష్మమై, సర్వవ్యాపకమైన పరమాత్మయే. అలలలో అంతటా వ్యాపించియున్నది ఆ సముద్రమే గదా!

**ప్రత్తి చెబుతున్నది. లోకంలోని నూలుబట్టలన్నింటిలో నేనే ఉన్నాను, అవి అన్నీ నా నుండే ఉద్భవించినవి, వాటికి మూలబీజాన్ని నేనే - అని. నేను లేకుండా ఏ నూలుబట్టా నిలువదు, అన్నింటా వ్యాపించియున్నది నేనే అంటున్నది.**

**అలాగే సమస్త భూతాలలోను ఉన్నది పరమాత్మే గనుక అందరూ పరమాత్మ స్వరూపులే, పరమాత్మ యొక్క విభూతులే. పరమాత్మ లేకుండా ఈ లోకంలో ఏదీ లేదు. పరమాత్మ వల్లనే అన్నీ చైతన్యవంత మవుతున్నాయి. పరమాత్మే ఉపాదాన కారణం, నిమిత్త కారణం. అంటే పరమాత్మ ఉభయకారణం. కనుక పరమాత్మ విభూతి కానిది ఏదీ లేదు.**

**తన విభూతులు ఎంత విస్తారమైనవో, అట్టి విభూతులను తెలియజేయుటకు ఏ పద్ధతిని అవలంబించాడో భగవానుడు చెప్పబోతున్నాడు.**

**శ్లో|| నాంతోఽస్తి మమదివ్యానాం విభూతీనాం పరంతపః!|**

**ఏషతూద్దేశతః ప్రోక్తః విభూతేర్విస్తరో మయా|| (40)**

**తా|| ఇతరులను తపింపజేసే అర్జునా! నా దివ్యమైన విభూతులకు అంతులేదు. అయినప్పటికీ ఈ విభూతుల వివరణ నాచేత సంక్షేపంగా - క్లుప్తంగా చెప్పబడింది.**

**వ్యాఖ్య:- పరమాత్మ అనంతుడు. ఆయన విభూతులు కూడా అనంతమే. ఎన్ని ఉన్నాయో అంతులేదు. అయినప్పటికీ అర్జునుని కోరిక మేరకు**

తన విభూతులను తెలియజేయటం ప్రారంభించాడు భగవానుడు. అయితే ఇలా చెప్పుకుంటూ పోతే అంతమెక్కడ? కనుక ఎలాగో ముగించాలని నిర్ణయించుకున్నాడు. నా విభూతులు అనంతం. అన్నింటిని వివరించాలంటే అది అసాధ్యం. సరస్వతీదేవి ఒకసారి నా విభూతులను వర్ణించాలనుకున్నది. నీలగిరిని సిరాపొడిగా చేసి, సముద్రాన్ని దానికి కలిపి సిరా తయారుచేసి, కల్పవృక్షం యొక్క కొమ్మను కలంగా చేసి, ఈ బ్రహ్మాండాన్నంతటిని ఆకులుగా చేసి వ్రాస్తున్నప్పటికీ ఇంకా పూర్తికాలేదు. ఇంకా ఎంతకాలం వ్రాసినా పూర్తవుతుందనే నమ్మకం కూడా లేదు. అందువల్ల నా అనంతమైన విభూతులను సంక్షిప్తం చేసి సూచనా మాత్రంగా - మచ్చుకు కొన్ని విభూతులను చెప్పటం జరిగింది. మచ్చు ముక్కను బట్టి అసలు వస్తువు యొక్క నాణ్యతను తెలుసుకున్నట్లుగా నీవు ఈ చెప్పిన విభూతుల ద్వారా మొత్తం భగవద్విభూతులను తెలుసుకో.

ఈ కుండ దేనితో తయారైంది? అని అడిగాడు ఒకడు. మట్టితో అని సమాధానం చెప్పావు. మరి ఈ కుండో? అని మరొక దానిని చూపాడు. అదీ మట్టితోనే తయారైందని చెప్పావు. ఈ ఎర్రకుండ కూడానా? అన్నాడు అతడు. ఆ! అన్ని కుండలు - ఎర్రవైనా, నల్లనివైనా - అన్నీ మట్టితోనే తయారైనవి అన్నావు. సరే ఈ కూజా దేనితో తయారైంది? అన్నాడు. అదీ మట్టితోనే అన్నావు. అన్ని కూజాలు కూడా మట్టితోనేనా? అన్నాడు. ఆ! అన్ని కూజాలు మట్టితోనే అన్నావు. మరి

ఈ పిడతలు, మూకళ్ళు, చట్లు దేనితో తయారైనవి? అన్నాడు అతడు. అబ్బ! అన్నీ మట్టితోనే నయ్యా బాబూ! ఇక్కడ ఉన్నవన్నీ మట్టితో తయారైనవే అన్నావు విసుగ్గా. అప్పటికీ అతడు వదలలేదు. ఇదంతా నాకెందుకు మట్టితో తయారైన వస్తువులు లోకంలో ఏమేమి ఉన్నాయో అన్నింటినీ ఒక్కసారి చెప్పు అన్నాడు. అలా చెప్పాలంటే లోకంలో ఉన్న అన్ని కుండలు, కూజాలు, చట్లు, పిడతలు, మూకుళ్ళు, ప్రమిదెలు - ఇంకా అనేకరకాల వస్తువులన్నింటిని ఒక్క చోటకి చేర్చి - ఎక్కడా ఏ ఒక్కదానినీ వదలకుండా చేర్చి ఇదిగో ఇవి అన్నీ మట్టితో తయారైనవి - అని చెప్పాలి. ఇది సాధ్యమా? అసాధ్యం. అందుకే మచ్చుకు కొన్ని కుండలు, కూజాలు, చట్లు, పిడతలు, మూకుళ్ళు, ప్రమిదెలు ఒక చోటకు చేర్చి, వాటిని చూపి - ఇలాంటివన్నీ నీ కెక్కడ కనిపించినా - అవన్నీ మట్టితో తయారైనవే అని తెలియజెయ్యాలి. అప్పుడు మనం ఎక్కడ ఏ కుండను చూచినా, కూజాను చూచినా, దేనిని చూచినా ఇవన్నీ మట్టే అని తెలుసుకుంటాం.

అలాగే ఇక్కడ మచ్చుకు 75 విభూతులను తెలిపినా ఇంకాఇంకా లోకంలో మనకు కనిపించే చరాచర ప్రాణికోట్లు, విషయాలు, వస్తువులు అన్నింటిలోను ఉన్నది ఆ పరమాత్మ విభూతే అని గ్రహిస్తాం. అందుకే అనంతమైన విభూతులను క్లుప్తంగా తెలియజేయటం జరిగింది.

నిజంగా పరమాత్మ ఇంద్రియాలకు గోచరించే వాడు కాదు. అయినప్పటికీ అట్టి పరమాత్మను ఇంద్రియాలతో తెలుసుకోగల వస్తువుల ద్వారా, ప్రాణికోట్ల ద్వారా, మనస్సులోని భావాల ద్వారా అనుభవాల ద్వారా పరిచయం చేస్తున్నాడు భగవానుడు. అంటే అపరిమిత తత్త్వాన్ని పరిమిత రూపాల ద్వారా తెలియజేస్తున్నాడు.

ఎందుకీ మోసం చేస్తున్నట్లు? గురువు శిష్యులను మోసం చేయవచ్చా? చేయకూడదు. మరెందుకలా మోసం చేస్తున్నట్లు?

మెడికల్ స్టూడెంట్స్ కు మృతదేహాలను ఇచ్చి వరుసగా అనేక రకాల జబ్బులకు తగినవిధంగా ఆపరేషన్స్ చేయమంటారు ప్రొఫెసర్లు. కొందరు విద్యార్థులు ఎంతో జాగ్రత్తగా, తెలివిగా, నీట్ గా, పద్ధతి ప్రకారం, ఏ చిన్నపొరపాటు జరగకుండా ఆపరేషను చేస్తారు. కాని ఆ చచ్చినవాడు మాత్రం జబ్బు తగ్గిపోయి బ్రతకడు. మరెందుకిలా ప్రొఫెసరు మోసం చేస్తున్నాడు? నిజంగా ఇక్కడ ప్రొఫెసరు మోసం చేయటం లేదు. విద్యార్థి అనుభవం సంపాదించటానికి, ఆపరేషను చేయటానికి ధైర్యం నూరిపోయటానికి అలా చేయిస్తున్నాడు అంతే. అలాగే ఇక్కడ అవ్యక్తమైన పరమాత్మను వ్యక్తపదార్థాల ద్వారా చూడగలిగే నైపుణ్యాన్ని కలిగించటానికే భగవానుడు అర్జునునికి కొన్ని నిర్దిష్ట ఉదాహరణలు చెప్పి చూపిస్తున్నాడు. గురువుకు ఇంతకన్న మరొక మార్గం లేదు. పరమాత్మ ఒక రూపంలో ఉంటే బొమ్మగీసి చూపవచ్చు. కాని అపరిమిత తత్త్వాన్ని ఎలా చూపటం? అందుకే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**పరిమిత వస్తువుల ద్వారానే చూపుతున్నాడు. సంక్షిప్తంగానే చెబుతున్నాడు.**

**పరిమిత వస్తువులను చూస్తూ దృష్టిని పరమాత్మ పైకి మళ్ళించే ఉపాయాన్ని భగవానుడు ఇక్కడ తెలియజయబోతున్నాడు.**

**శ్లో|| యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా|**

**తత్త దేవావ గచ్ఛత్వం మమ తేజోఽ0శ సంభవం|| (41)**

**తా|| ఏయే వస్తువు ఐశ్వర్యవంతమైనదిగా, కాంతివంతమైనదిగా, ఉత్సాహంతో కూడినట్టిదిగా ఉన్నదో అది అంతా నాతేజంలోని అంశ నుండి పుట్టినదని నీవు తెలుసుకో.**

**వ్యాఖ్య:-ఇంతవరకు చెప్పిన విభూతులన్నీ భగవంతుని దివ్యమహిమను చెప్పినవేగాని ఆత్మతత్త్వాన్ని నిర్వచించలేదు. ఎందుకంటే భగవంతుడు నామరూపాలు లేనివాడు. ఈ విభూతులన్నీ నామరూపాలతో ఉన్నవి. కనుక ఇవి భగవంతుని శక్తితో వ్యక్తమవుతున్న వస్తువులు, విషయాలు, ప్రాణులు మాత్రమే. అంటే ఏఏ వస్తువులలో, ప్రాణులలో ఐశ్వర్యము, కాంతి, ఉత్సాహము బాగా ఉంటుందో అవి అన్నీ పరమాత్మ అంశ నుండి వచ్చినవే. ఆయావస్తువులలో పరమాత్మ ప్రకాశరూపంలో ఉన్నట్లే.**

**ఎవరిలో జ్ఞానము అనే ఐశ్వర్యం అధికంగా ఉంటుందో ఆ జ్ఞానసంపద అంతా భగవంతుని అంశ వల్ల వచ్చినదే. అంటే వారిలో**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవదంశ జ్ఞానరూపంలో ఉన్నట్లు. అలాగే ఎవరిలో కాంతి లేదా మనోనిర్మలత్వం విశేషంగా ఉంటుందో అదంతా ఆ పరమాత్మ అంశవల్ల లభించిందే. అలాగే ధర్మం పట్ల, మోక్షం పట్ల ఉత్సాహము, దృఢమైన ఆసక్తి - పట్టుదల ఎవరిలో ఎక్కువగా ఉంటుందో ఆ పట్టుదల, ఉత్సాహం అంతా భగవంతుని అంశవల్ల లభించినదే. అట్టి వారిలో భగవంతుని ప్రకాశం అధికంగా ఆ రూపంలో ఉన్నట్లే.

ఈ ప్రకారంగా భగవంతుని సంపద, శక్తి, కాంతి, ఉత్సాహం - ఈ నామరూపాత్మక జగత్తులో ఎక్కడ, ఏ రూపంలో, ఎవరిలో, దేనిలో ఉందో చూడగలమే గాని ఆ పరమాత్మ తత్త్వాన్ని మాత్రం చూడలేం.

ఎంత భగవదంశ ఉన్న వస్తువులైనా, ప్రాణులైనా అన్నీ నశించిపోయేవే. కాని పరమాత్మతత్త్వం మాత్రం నిత్యం, సత్యం. అట్టి పరమాత్మతత్త్వాన్ని అంతర్ముఖదృష్టితో, వివేకదృష్టితో వెతకాల్సిందే గాని బాహ్యదృష్టితో చూస్తే దృష్టి ఆ వస్తువుల మీదే - నామరూపాల మీదే ఉంటుంది.

మనం వస్తువులను చూస్తాం. ఆహా! ఈ నగ ఎంత బ్రహ్మాండంగా ఉన్నదీ! ఆహా! ఈ డ్రెస్ చూచారా!, ఆ అమ్మాయి. ఎంత అందంగా ఉన్నదో చూచారా!, ఆ కుక్కబొమ్మను చూడండి! నిజంగా కుక్కే అనుకున్నాను. ఇలా ఎన్నింటిని బాహ్యదృష్టితో చూచినా, చూచుకుంటూ వెళ్ళటమే తప్ప మరేం ప్రయోజనం ఉండదు. అలాగాక వివేకంతో ఆ వస్తువులలోని, వ్యక్తులలోని విశిష్టతలు ఎలా వచ్చినవో,

అవి అలా ఉండటానికి మూలకారణం ఏమిటో, అవ్యక్తంగా ఉన్న ఆశక్తి ఏదో, ఎక్కడిదో అని విశ్లేషిస్తూ పోతే ఆ పరమాత్మ యొక్క యదార్థతత్త్వాన్ని తెలుసుకోగలుగుతాం.

అంటే మనం వివేకంతో, జాగ్రత్తగా ఈ జగత్తును పరిశీలిస్తే నశించిపోయే ఈ జగత్తుకు వెనుక నశించని, దివ్యమైన పరమాత్మ తత్త్వాన్ని చూడగలం. భగవంతుడు సమస్త నామరూపాల్లోను ఉన్నాడు. అందులోను గొప్ప సంపద, మహిమ, విశిష్టత, కాంతి, ఉత్సాహం, పట్టుదల ఉన్న వాటిలో ఇంకా స్పష్టంగా ప్రకాశిస్తున్నాడు - అని చెప్పటం ద్వారా పరమాత్మను ఈ ప్రపంచంలోనే వెతికి తెలుసుకొనే మార్గాన్ని, పరిశీలనా విధానాన్ని భగవానుడు మనకు తెలియజేస్తున్నాడు.

ఈ ప్రపంచం ఎంతో విశాలమైనది. అంతటా భగవంతుడున్నాడన్నది నిజం. మరి భగవంతుని ఈ ప్రపంచంలో ఎక్కడ వెతకాలి? ఎంతదూరం వెళ్ళాలి? ఎంతకాలం వెతకాలి? ఇది సాధ్యమయ్యే విషయం కాదు. దృష్టి జగత్తు మీద, వస్తువుల మీద ఉన్నంతకాలం పరమాత్మకు దూరంగా జరిగిపోవటమే జరుగుతుంది. అలాగాక మనకు కనిపించే ప్రతివస్తువులోని, ప్రాణిలోని విశిష్టత ఆ పరమాత్మ యొక్క అంశయేనని తెలుసుకుంటే దృష్టి పరమాత్మవైపుకే మళ్ళుతుంది; ఆ పరమాత్మను తెలుసుకొని, అందుకొనుటకే

ప్రయత్నిస్తాం. అందుకే ప్రతి ఉదాహరణలోను భగవంతుని అంశను గూర్చి చెప్పటం జరిగింది.

ఇలా ఈ జగత్తులోని ప్రతిపదార్ధంలోను, ప్రతి జీవిలోను అంతర్యామిగా ఉన్న ఆ భగవంతుని తెలుసుకోవటానికి మనకందరికీ ఇదొక చక్కని మార్గం - అవకాశం.

'కాలః కలయతాం అహం' అన్నప్పుడు మనం చూడవలసింది కాలాన్ని కాదు. ఆకాలం యొక్క ఖచ్చితమైన లెక్కగట్టే శక్తిని. 'యమస్సం యతాం అహం' అన్నప్పుడు చూడాల్సింది యముణ్ణి గాదు ఆయనలోని లయశక్తిని. 'ఇంద్రియాణాం మనశ్చాస్మి' అన్నప్పుడు చూడాల్సింది మనస్సును కాదు. 5 ఇంద్రియాల జ్ఞానాన్ని తెలుసుకోగల మనస్సు యొక్క శక్తిని. 'ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం' అన్నప్పుడు మనం చూడవలసింది ప్రహ్లాదుని కాదు. ప్రహ్లాదునిలోని దృఢమైన హరిభక్తిని. ఇలా మన దృష్టిని అన్నింటిలోని, అందరిలోని భగవదంశపైకి మరలించాలి. అప్పుడే మనకు సార్ధకత.

ఈ విభూతుల వివరణను ముగిస్తూ అసలు తనస్వరూపం ఎంతటిదో భగవానుడు తెలియజేయబోతున్నాడు. విశ్వరూపానికి పునాది వేస్తున్నాడు.

**శ్లో||** అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!|
విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్|| **(42)**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||**అర్జునా! ఇదంతా ఎందుకు? ఈ విస్తారమైన జ్ఞానంతో నీకెందుకు? ఈ యావత్తు జగత్తును ఒక్క అంశతో నేను ధరించి ఉన్నాను.

**వ్యాఖ్య:-** అర్జునుడు మొదట శ్రీకృష్ణుని మహిమను ప్రశంసించి, ఏఏ విభూతులతో నీవు ఈ లోకం అంతటా వ్యాపించి ఉన్నావో ఆ విభూతులను నాకు సంపూర్ణంగా తెలియజెయ్యమని భగవానుని అర్థించాడు. దానితో భక్తసులభుడైన భగవానుడు తన విభూతులను చెప్పటం ప్రారంభించాడు. అర్జునునిపై ప్రేమతో, వాత్సల్యంతో ఎంతో ఉత్సాహంగా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక విభూతులను చెప్పటం ప్రారంభించాడు. అయితేకొద్దిసేపటికే తన విభూతులన్నీ చెప్పటం అసాధ్యం గనుక ముగించాలనుకున్నాడు.

ప్రపంచంలోని అన్ని భూతాలు, భావాలు, వ్యక్తులు, అచరాలు, దేవతలు - ఇలా మొత్తంగా చూస్తే అనంతమైనవి. వాటన్నింటినీ వివరించటం ఎవరికైనా అసాధ్యం. అంతేకాదు, అలా విభూతులను మాత్రం తెలుసుకున్నా పరమాత్మ యదార్థతత్త్వం తెలిసే వీలులేదు. కేవలం దేనిలో దేనిలో పరమాత్మ సంపద ఉన్నదో అర్థమవుతుంది. కనుకనే ఈ అధ్యాయంలో చెప్పిన విషయాన్ని మొత్తం ఈ చివరిశ్లోకంలో ఎంతో ప్రతిభతో, ఎంతో రమణీయంగా సంగ్రహం చేసి చెబుతూ రాబోయే అధ్యాయానికి పునాది వేస్తున్నాడు.

వాస్తవంగా ఆలోచిస్తే ఈ ప్రపంచంలోని ప్రతి వస్తువులోను ఉన్న ఆ భగవంతుని శక్తిని - మహిమను వివరించి చెప్పటం అసాధ్యం, వ్యర్థం.

లెక్కల మాస్టారు అన్ని లెక్కలను బోర్డ్ పై చేసి చూపించడు. ఒక లెక్కను చూపించి, మిగిలిన లెక్కలను హోమ్ వర్క్ గా చేసుకరమ్మంటాడు. భగవద్గీతలోని శ్లోకాలు ఎలా చదవాలో నేర్పాలంటే 8 అక్షరాల శ్లోకాలు 4, 11 అక్షరాల శ్లోకాలు నాలుగు చక్కగా నేర్పితే చాలు అన్నీ చక్కగా చదవగలుగుతారు. అన్నీ నేర్పాలంటే కష్టం, విసుగుగా ఉంటుంది.

అందుకే భగవానుడు "అర్జునా! ఎన్ని విభూతులు చెప్పినా ఏం ప్రయోజనం? నీ దృష్టి నామరూపాలతో కూడిన విభూతులపైగాక ఆ విభూతులలోని అవ్యక్త పరమాత్మ తత్త్వం మీద నిలవాలి. ఆ పరమాత్మ గురించి తెలుసుకొని ఆయనను దర్శించాలి. కనుక ఒక్క వాక్యంలో పరమాత్మ యొక్క అనిర్వచనీయ రూపాన్ని నిర్వచిస్తున్నాను. విను" అంటూ "విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాం శేన స్థితో జగత్" - ఈ జగత్తునంతటినీ నా ఒక్క అంశతో ధరించి ఉన్నాను అని తెలియజేశాడు.

ఇక్కడ జగత్తు అంటే ఇంద్రియాల ద్వారా చూడగలిగే పాంచ భౌతిక చరాచర ప్రపంచం మాత్రమే కాదు, మనస్సు చేత గ్రహించే భావప్రపంచం, బుద్ధి చేత గ్రహించే భావనా ప్రపంచం అంతా కూడా.

అంటే ఈ విశ్వమంతా - 14 భువనాలతో కూడిన బ్రహ్మాండం అంతా భగవంతునిలో ఒక భాగం మాత్రమే. దీనికవతల ఇంకా అనేకరెట్లు ఎట్టి రూపాలు, విక్షేపాలు లేని తానున్నాడు.

మన శరీరంలో చెయ్యి ఒకభాగం, కాలు ఒకభాగం, కన్ను ఒకభాగం. ఇవి కాక ఇంకా ఎన్నో భాగాలున్నాయి. అదే శరీరం యొక్క నిజస్వరూపం. అలాగే భగవంతుని ఒక వ్యక్తమైన భాగం ఈ విశ్వం - బ్రహ్మాండం. ఇంకా అవ్యక్తంగా ఆయన ఎంతో ఉన్నాడు. జగత్తులో అన్నింటిలో ఆయనే, జగత్తంతా ఆయనే, జగత్తుకు ఆవలకూడా ఆయనే. అంటే జగత్తంతా ఆయనలో ఒక భాగం మాత్రమే. ఇదే విషయం పురుషసూక్తంలో చెప్పబడింది. "పాదోఽస్య విశ్వభూతాని త్రిపాదస్యా మృతం దివి" - ఈ సమస్త విశ్వం ఒక్క పాదం మాత్రమే ఇంకా అమృతమయమైన దివ్యపరమాత్మ 3 పాదాలు - అని.

ఈ అనంతకోటి బ్రహ్మాండమే మన బుద్ధికి అందకపోతే - ఈ మొత్తం పరమాత్మలో ఒక్క భాగమైతే, ఇక పరమాత్మ యొక్క అనంతత్వం - అపరిమితత్వం - సృష్టించి, పాలించి, లయం చేయగలిగితే ఆ మహాశక్తిని మనం ఎలా తెలుసుకోగలం? ఆ పరమాత్మను మించినదేదీ లేదని తెలుస్తుంది.

ఇలా వర్ణించటంతో ఆ పరమాత్మను దర్శించాలనే కోరిక అర్జునునికి కలిగింది. అర్జునునికే గాదు బుద్ధి గ్రహించగలిగే శక్తి ఎంతో అంతకన్న ఎక్కువగా - బుద్ధికి అసాధ్యంగా అనిపించే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**పరమాత్మను దర్శించాలని ఎవరికి అన్పించదు. అనంతమైన, అద్భుతమైన, అచింత్యశక్తి గల పరమాత్మను దర్శించాలని ఎవరి మనస్సు ఉవ్విళ్ళూరదు? అందుకే 11వ అధ్యాయం విశ్వరూప సందర్శన యోగానికి అంకురార్పణ చేస్తున్నాడు భగవంతుడీ శ్లోకంతో.**

**ఇంతవరకు చెప్పిన విభూతుల ద్వారా పరమాత్మ దివ్యత్వాన్ని తెలుసుకొనుటకు సాధనచేసి, ఈ సమస్తాన్ని విశ్వేశ్వరునిగ భావనచేసి, తపస్సు చేసి ఆ విశ్వరూపాన్ని దర్శించటానికి అర్హతను పొందుదాం. విశ్వరూప సందర్శనానికి దివ్యనేత్రాలు కావాలి. అంటే ఈ నేత్రాలతో చూచే దృష్టిని మనం మార్చుకోవాలి. ఈ 10వ అధ్యాయంలోని విభూతుల ద్వారా మనదృష్టిని మార్చుకొని; అంటే ప్రపంచంవైపుకు - నామరూపాల వైపుకు చూచే దృష్టిని పరమాత్మవైపుకు త్రిప్పి, పరమాత్మపై అచంచల భక్తితో దివ్యనేత్రాలను పొంది, విశ్వరూపుడైన విశ్వేశ్వరుని సందర్శిద్దాం.**

**గద్యం: ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే, విభూతియోగో నామ దశమోఽధ్యాయః**

**దశమ అంటే దృష్టార్థాలు అని. ఈ కనిపించే జగత్తులోని విషయవస్తువులు, స్థావరాలు, ప్రాణికోట్లు - భావాలు అన్నీ దృష్టార్థాలే.**

**వీటి అన్నింటిలోని సారం భగవంతుడే. అన్నింటిలోని సారం, విశిష్టత, తేజస్సు, శక్తి - అంతటిని భగవంతుని అంశగా చూడటమే ఈ అధ్యాయం. విషయార్థాలలో భగవంతుని అంశను అధ్యయనం చేసే యోగం ఇది.**




**Website : WWW.SRICHALAPATHIRAO.COM**

**Email : care@srichalapathirao.com**

**Contact : +91 80085 39770 / +91 98862 65225**

# శ్రీమద్భగవద్గీత : 1 1 వ అధ్యాయం

# విశ్వరూపసందర్శన యోగం



: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**


**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

**పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.**

**1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.**

**1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంధాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.






Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

## : ఉపోద్ఘాతం :

విశ్వరూపసందర్శనంతో అర్జునుడు ధన్యుడయ్యాడు. విశ్వరూప పరమాత్మను దర్శించాలని దేవతలు కూడా ఉబలాట పడతారు . కాని వారికా భాగ్యం లేదు. అది అంత దుర్లభమైనది. అంతే కాదు వేదాధ్యయనం చేసినందువల్ల గాని, గొప్ప తపస్సు చేసి నందు వల్ల గాని, దాన ధర్మాలు చేసినందు వల్ల గాని, యజ్ఞ యాగాది క్రతువులు చేసినందు వల్ల గాని ఈ దివ్య విశ్వరూపాన్నిదర్శించలేరని సాక్షాత్తు భగవానుడే చెప్పాడు. మరెలా సాధ్యమవుతుంది ? దానికీ భగవానుడే సమాధానం చెప్పాడు. అనన్యభక్తి వల్ల మాత్రమే విశ్వరూపాన్ని దర్శించవచ్చు , తెలుసుకోవచ్చు , ప్రవేశించవచ్చు - అని.

కనుక మనం కూడా మనలోని మలినాలను, కల్మషాలను ప్రయత్నం చేత తొలగించుకొని, మనస్సును నిర్మలం - పరిశుద్ధం చేసి, అందులో భగవద్భక్తిని నింపాలి. మనస్సును భగవంతుని ఆలోచనలతో నింపాలి. ఇతర లౌకిక విషయాలను, అన్యమైన చింతనలను విడిచిపెట్టి అనన్యమైన చిత్తంతో భగవంతుని స్మరించాలి . అప్పుడే విశ్వ రూప సందర్శన భాగ్యం కలిగేది.

విశ్వరూపాన్ని చూడటం అంటే ఏదో ఒక అద్భుతమైన పెద్దరూపాన్ని చూడటం కాదు. ఈ విశ్వం మొత్తాన్ని విశ్వేశ్వరునిగా చూడగలగటమే. అర్జునునికి అట్టి అనుభవం భగవంతుని అనుగ్రహంచే కలిగింది. అలా మనమూ దర్శించగలిగితే - ఏమిటి ప్రయోజనం ?

విశ్వంలోని సమస్తమూ భగవానుడే అయితే ఇక ఈ విశ్వంలో

భగవంతుడు కానిదేముంటుంది ? కనుక విశ్వంలోని మానవులు, జంతువులు, క్రూరమృగాలు, పక్షులు, పాములు, చెట్లు, చేమలు, కొండలు, పర్వతాలు, నదులు, సముద్రాలూ, మంచి -చెడు, గొప్ప - తక్కువ, చర - అచర, అంతా - అన్నీ భగవంతుడే. ఈ అనుభవం వంట పట్టిందా! ఇక దేనినీ ద్వేషించే పనిలేదు. దేనినీ అసహ్యించుకొనే పని లేదు. మన ద్వేషానికి, అసహ్యానికి, జుగుప్సకు కారణం ఈ అనుభవజ్ఞానం లేకపోవటమే.

ఇప్పుడు విశ్వంలోని ఎవరిని ద్వేషించినా, దేనిని ద్వేషించినా, దేనిపట్ల జుగుప్స, అసహ్యం కలిగినా, దేనిపై కోపగించినా భగవంతుని ద్వేషించినట్లే - అసహ్యించుకున్నట్లే. అన్ని రూపాలలో వుండేది ఆయనే గదా! అందుకే "నిర్వైరః సర్వభూతేషు"అని ఈ అధ్యాయంలోనే చెప్పటం జరిగింది. అట్టి అనుభవజ్ఞాని సర్వభూతాలపట్ల శతృభావం లేకుండా ఉంటాడు. అన్నింటా - అంతటా - అన్నివేళలా భగవంతునే దర్శిస్తూ ఉంటాడు. ఇదే సర్వత్రా పరమాత్మ దర్శనం.

ఇట్టి స్థితి మనకూ కలగాలంటే విశ్వరూపమును సందర్శించాలి. అలా సందర్శించాలంటే మనకు అనన్య భక్తి తప్పకుండా ఉండితీరాలి .

"అనేక బాహూదర వక్త్రనేత్రం పశ్యామి "అని అర్జునుడు విశ్వరూపాన్ని దర్శిస్తూ ఆశ్చర్యంతో పలుకుతున్నాడు. ఆ విశ్వ రూపధారి భగవంతునికి అనేక బాహువులు, అనేక ఉదరాలు, అనేక నోళ్ళు, అనేక కళ్ళు - ఇన్ని ఎక్కణ్ణించి వచ్చినయ్ ఆయనకు? అంటే - అందరి బాహువులు ఆయనవే. అందరి ఉదరాలు ఆయనవే. ఏ పొట్టలో పట్టెడన్నం వేసినా అది ఆ

భగవంతునికే చేరుతుంది. అందుకే లోకసేవ లోకేశ్వరుని సేవ అవుతుంది. మానవసేవ మాధవసేవ అవుతుంది. అయితే మనకంత విశాలభావం ఉందా? లేదు, కారణం? మన జ్ఞానం కేవలజ్ఞానం, అనుభవంలేని జ్ఞానం.

ఒకాయనకు ఒక్కడే కొడుకు. గొప్ప చదువులు చదివించాడు. ఢిల్లీలో పెద్ద ఉద్యోగం. కొడుకు 20సంవత్సరాలైనా తండ్రి దగ్గరకు రాలేదు. ఈ తండ్రి అక్కడకు పోలేదు. చివరికి ఒకనాడు తల్లి, తండ్రి ఇద్దరూ ధైర్యం చేసి కొడుకు దగ్గరకు వెళ్ళాలని రైలెక్కారు. చాలా దూరప్రయాణం గనుక ఒక్కసారిగా అంత ప్రయాణం  చెయ్యలేక మధ్యలో నాగపూర్ స్టేషన్ లో దిగి ఒక ధర్మశాలలో చేరారు. అదేసమయంలో ఆఫీసరైన కుమారుడికి నాగపూర్ లో పని తగిలింది. అక్కడ పని చూచుకొని స్వగ్రామం వెళ్ళి తల్లితండ్రులను చూచి వద్దామని భార్యతో సహా బయలు దేరాడు. నాగపూర్ స్టేషన్ లో దిగి అనుకోకుండా తల్లితండ్రులున్న ధర్మశాల లోనే వారి ప్రక్కగదిలోనే దిగాడు. ముసలాయనకు కలరా వచ్చింది. దేశం కాని దేశంలో వచ్చిన ఈ కష్టానికి లబోదిబో మంటున్నది ఆ తల్లి. ఈ గోలంతా విని, ఆఫీసర్ గారు బయటికి రాకుండానే తలుపులు బిగించి, సత్రం యజమానికి ఫోన్ చేసి "ఆ కలరా వచ్చిన మనిషి ని బయటకు పంపండి"అంటున్నాడు, హంగామా చేస్తున్నాడు. అంతలో ముసలాయన చని పోయాడు. అదే సమయం లో నీళ్ళ పంపు దగ్గరకువెళ్తూ కోడలు అత్తగారిని గుర్తుపట్టింది. చనిపోయింది మామగారేనని గ్రహించి భర్తతో చెప్పింది. ఆ మాట వినటంతోనే కరెంటు షాక్ తగిలినట్లైంది ఆఫీసరుగారికి. ఎవరో తెలియనప్పుడు బయటికి పంపమని ఆర్భాటం చేశాడు.

ఇప్పుడేమయింది?

సామాన్యుడి ఆర్భాటం ఇలాగే ఉంటుంది. ఏదోదో సాధించాం అనుకుంటాడు. ఎదుటి వాడికి ద్రోహం చేయగలిగానని ఆనందిస్తాడు. కానీ అది భగవంతుడికి ద్రోహం చేయటమేనని, తనకు తాను ద్రోహం చేసుకోవటమేనని తెలియదు. అనుభవంలేని ఒట్టి జ్ఞానం ఇలాగే ఉంటుంది. అందరిని ఒకటిగా చూడ గలిగే అనుభవజ్ఞానం ఉండాలి.

అర్జునునికి ఇటువంటి అనుభవజ్ఞానం కలిగించాలని భగవంతుని ఉద్దేశం. అందుకే విభూతి యోగం చివరిలో "విష్ట భ్యాహమిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్ " - ఈ జగత్తు అంతటిని నేను ఒక్కఅంశతో నిలిపి ఉంచాను - అన్నాడు భగవానుడు. ఇది విన్న అర్జునునికి ఇంత బ్రహ్మాండమైన జగత్తు అంతా తనలో ఒక్క అంశ అయితే అసలు భగవంతుని ఆ మహాస్వరూపం ఎలా ఉంటుందో చూడాలనే కుతూహలం కలిగింది. అందుకే భగవంతుణ్ణి కోరుకున్నాడు, "నీ సంపూర్ణ స్వరూపాన్ని ఒక్క సారి చూపు! అని. భక్తుని కోర్కెను నెరవేర్చటానికి భగవంతుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు ఈ అధ్యయంలో, దీనివల్ల -

(1) ఈ బ్రహ్మాండమైన విశ్వంలో జరిగే పనులన్నీ తనలోనే జరుగుతున్నాయని చూపించి అర్జునునిలోని అహంకారాన్ని పోగొట్టాడు. ఇంత వరకు ఈ గొప్పయుద్ధాన్ని చేసి వీరాధివీరులైన శత్రువులను తన పరాక్రమంతో జయించాలి, ఇది నా కర్తవ్యం అనుకుంటున్నాడు అర్జునుడు, ఇప్పుడు అర్థమయింది. అన్ని పనులు వాటంతట అవే జరిగిపోతుంటాయని, అందులో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కొందరు నిమిత్తమాత్రులవుతారే గాని, నిజంగా వారు చేసేదేమీ లేదని, వారి చేతుల్లో ఏమీలేదని తెలిసింది. అర్జునునికే గాదు, మనకూ అలాంటి అహంకారమే. నా వల్లనే వాడికీ ఉద్యోగం వచ్చింది; నేనే వాడికి మంచి పిల్లను చూచి పెళ్ళిచేశాను; నేనేనండి వాడీ గొప్పస్థితికి రావటానికి కారణం; ఈ ఇల్లు ఇంత గొప్పగా కట్టించింది నేనే; నావల్లనే నండి ఈ సంఘం ఇంత అభివృది చెందింది; ఆ పొగరుబోతువాణ్ణి చూచి అందరూ భయపడి పోతుంటారు. వాణ్ణి ఎక్కడ దెబ్బకొట్టాలో అక్కడ కొట్టి వాడి పొగరంతా దించేశాను - - -. ఇలా ఎక్కడ చూచినా అహంకారమే. విశ్వరూపాన్ని సందర్శించావా? నీ అహంకారం పూర్తిగా తొలగిపోతుంది. నీవు కేవలం నిమిత్త మాత్రుడివి, భగవంతుని చేతిలో పని ముట్టువు అని అర్ధమైపోతుంది.

(2) ఈ విశ్వరూపసందర్శనం వల్ల ఇప్పటి వరకూ అర్జునునిలో ఉన్న సందేహం తీరిపోయింది. ఈ యుద్ధం లో మనమే గెలుస్తామనే నమ్మకం ఏమిటి? అనేదే ఆ సందేహం. విజయం మనకే అని నిశ్చయానికి వచ్చాడు అర్జునుడు. ఎందుకంటే శత్రుసైన్యాలు, మహా వీరాధివీరులు, తన పక్షంలోని కొందరు వీరులు ఆ మహాభీకర అగ్నిలోకి ప్రవేశించి శలభాల్లా మాడి పోతున్నారు.

(3) దేవతలకు కూడా దుర్లభమైన విశ్వరూపాన్ని భగవంతుని అనుగ్రహంతో తాను దర్శించ గలుగుతున్నాడు అర్జునుడు. ఇది అనన్యభక్తి వల్లనే సాధ్యమైనదని తెలుసుకున్నాడు.

ఇన్ని విషయాలను కడుపులో పెట్టుకొని ఈ 11వ అధ్యాయం మన



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ముందుకు వస్తున్నది.

మనం విశ్వం అన్నది విశ్వేశ్వరుని కన్న వేరుకాదు. మనం ప్రపంచం అని దేన్ని అంటున్నామో అది పరమాత్మ కన్న వేరుకాదు. అజ్ఞాన దృష్టికి ఇది ప్రపంచం. జ్ఞాన దృష్టికి ఇది పరమాత్మ. త్రాడును చీకట్లో పాము అని భ్రమపడ్డాం. చీకటిలో చూచావా! అది పాము. వెలుగులో చూచావా!అది త్రాడు మాత్రమే. కనుక జగత్తుగా కనిపించేది యదార్థంగా పరమాత్మే. అంటే విశ్వం విశ్వేశ్వరుడే.

విశ్వరూపాలు 3 రకాలు. 1.గంభీరరూపం. 2.శాంతరూపం. 3.భయంకర స్వరూపం. ఇప్పుడు అర్జునునికి చూపించినది భయంకర స్వరూపమే. అర్జునుడు పరమభక్తుడు గదా! ఇలాంటి రూపాన్ని ఎందుకు చూపినట్లు? ఏయే సందర్భాలలో ఏయే రూపాన్ని చూపించటం జరుగుతుంది?

- సృష్టి సమయంలో చూపేది గంభీర స్వరూపం.
- పోషణ సమయంలో చూపేది శాంత స్వరూపం.
- ప్రళయంలో చూపించేది భయంకర స్వరూపం.

ఇప్పుడు అర్జునుడు ఉన్నది యుద్ధరంగంలో. యుద్ధం అంటే ప్రళయమే. 18 అక్షౌహిణుల సేన 18 రోజులలో లయమైపోబోతున్నది. కనుక ఈ ప్రళయసమయంలో చూపవలసిన భయంకరస్వరూపాన్ని - కరాళ కాలస్వరూపాన్ని చూపిస్తున్నాడు భగవానుడు. జరగబోయే కురుక్షేత్ర సంగ్రామంలో మారణహోమం జరగబోతున్నది. అలా భవిష్యత్తులో

జరగబోయే మారణహోమాన్ని వర్తమానంలోనే అర్జునునికి చూపించి అతడిలో ఉన్న కర్తృత్వ అహంకారాన్ని (నేను చేస్తున్నాను అనే భావాన్ని) ఎగరగొట్టేశాడు భగవానుడు.

విశ్వరూపప్రదర్శనం కేవలం కవి యొక్క చమత్కారం కాదు. ప్రత్యక్షంగా వీక్షించిన రూపం. భక్తుని యొక్క అనన్యభక్తికి వివశుడై భగవంతుడు ప్రత్యక్షమైన ఒక విచిత్రలీల. యోగ్యత ఉంటే ప్రతివ్యక్తీ చూడదగిన రూపం. అయితే అందుకు ఈ చర్మచక్షువులు పనికిరావు. దివ్యనేత్రాలు కావాలి.

మన దేహాన్ని మనం చూచుకోవాలంటే దివ్యనేత్రాలతో పనిలేదు కదా! మరి విశ్వరూపాన్ని దర్శించటానికి దివ్యనేత్రాలెందుకు? ఈ పిండాండం, బ్రహ్మాండం ఒకే పద్ధతిలో నిర్మాణమైనవే గదా!

నిజమే. పిండాండం, బ్రహ్మాండం రెండూ ఒక్కటే. మరి ఈ పిండాండాన్ని (శరీరాన్ని) మాత్రం మామూలు కన్ను చూడగలుగుతున్నదా ? కేవలం పైనున్న చర్మాన్ని, కళ్ళు, ముక్కు, చెవులు, చేతులు, కాళ్ళు, గోళ్ళు వీటిని చూడటానికే ఈ కళ్ళు. శరీరమనే యంత్రంలో ఎన్నో చిన్న చిన్న యంత్రాలు వాటి వాటి పనులను ఎంతో చమత్కారంగా నిర్వహిసున్నాయి. కాలిలో ముల్లు గుచ్చుకుంటే ఆ వార్త ఒక్కక్షణంలో మెదడుకు చేరుతున్నది. వెంటనే చేతికి ఆజ్ఞ వస్తున్నది. ఈ విచిత్ర యంత్రం ఎవరి వల్ల నడుస్తున్నది ? పైపైన విచారిస్తే తేలదు. భౌతిక దృష్టితో పాటు ఆధ్యాత్మిక దృష్టి కావాలి.

ఈ శరీరం అనంత జీవకణాల సమూహం. అనేక జీవకణాల సమిష్టిరూపం. ప్రతి ఇంద్రియము జీవాణువుల సమూహామే.

- అనేక జీవాణువులు కలిస్తే జీవకోశం.
- అనేక జీవకోశాలు కలిస్తే నాడులు.
- అనేక నాడులు కలిస్తే ఇంద్రియాలు.

ఒక చుక్కరక్తంలో కోటానుకోట్ల జీవాణువులున్నాయి. వాటికీ దేహాలున్నాయి. అవీ పుడుతూ చస్తూ ఉంటాయి. ఇలా విచారిస్తూ పోతే ఈ పిండాండం లేదా శరీరం ఒక పెద్ద బ్రహ్మాండమే.

దేహంలో ఉండే జీవక్రిములు ఈ దేహనిర్మాణాన్ని తెలుసుకోలేవు. అలాగే ఈ విశ్వబ్రహ్మాండంలో ఉండే మనం ఈ బ్రహ్మాండం యొక్క విశ్వరూపం యొక్క నిర్మాణాన్ని తెలుసుకోలేం. అందుకే స్థూలనేత్రాలు - చర్మనేత్రాలు పనికిరావు. దివ్యనేత్రాలు కావాలి.

ఇదంతా తలచుకుంటే మనకు నిరాశానిస్పృహలు కలుగుతాయి. అందుకే భగవద్గీత మనకొక ఉపాయాన్ని చెప్పి ధైర్యాన్ని, ఉత్సాహాన్ని ప్రసాదిస్తుంది. అదే భగవంతుని పట్ల అనన్యభక్తి. ఈ భక్తివల్లనే భగవంతుని అనుగ్రహం. ఆ అనుగ్రహం వల్లనే దివ్యనేత్రం. దానితో విశ్వరూప సందర్శనం. కనుక భగవంతుని శరణుపొంది, సద్గురువులను సేవించి, జ్ఞాననేత్రాన్ని - దివ్యనేత్రాన్ని సంపాదించి విశ్వమే విశ్వేశ్వరుడనే అనుభూతిని పొందాలి.

ఈ అధ్యాయంలో మొత్తం 55 శ్లోకాలున్నాయి. ఇవి ఉపాసనా ప్రధానం కనుక తత్త్వ విచారణకు అంతగా అవకాశం లేదు. భక్తితో - తన్మయత్వంతో గ్రహించవలసిన అధ్యాయం. నిరంతరం పారాయణకు అనుకూలమైన అధ్యాయం. ఇక అధ్యాయంలోనికి ప్రవేశిద్దాం.

**తనకు కావలసిన సమాచారాన్ని ఎలా వినయంతో ప్రశ్నించి తెలుసుకోవాలో, ఉత్తమ శిష్యుని విధానం ఎలా ఉంటుందో అర్జునుడు తెలియజేస్తున్నాడు.**

**అర్జున ఉవాచ:-**

**శ్లో||** మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితం|
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ|| **(1)**

**శ్లో||** భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా!|
త్వత్తః కమల పత్రాక్ష! మాహాత్మ్య మపి చావ్యయం|| **(2)**

**శ్లో||** ఏవమేత ద్యథాఽఽ త్థత్వం ఆత్మానం పరమేశ్వర!|
ద్రష్టు మిచ్ఛామి తే రూపం ఐశ్వర్యం పురుషోత్తమ!|| **(3)**

**శ్లో||** మన్యసే యదితచ్ఛక్యం మయాద్రష్టు మితి ప్రభో!|
యోగేశ్వర! తతో మేత్వం దర్శయాత్మాన మవ్యయం || **(4)**

**తా||** అర్జునుడంటున్నాడు :- నన్ను అనుగ్రహించటం కొరకు శ్రేష్టమైన, అత్యంత రహస్యమైన ఏ ఆధ్యాత్మికజ్ఞానాన్ని నీవు చెప్పావో దానివల్ల నా మోహం తొలగిపోయింది (1). కమలపత్రాక్ష! జీవుళ్ళ యొక్క జననమరణాల గురించి, అవ్యయమైన నీ మాహాత్మ్యం గురించి నీ ద్వారా నేను విస్తారంగా విన్నాను (2). పరమేశ్వరా! నీ స్వరూపాన్ని గురించి నీవు ఏమి చెప్పావో అది అంతయు సత్యమే. ఓ పురుషోత్తమా! ఐశ్వర్య తేజస్సులతో కూడిన నీ దివ్య స్వరూపాన్ని చూడగోరుతున్నాను (3). యోగేశ్వరా! ప్రభో! ఆ నీ స్వరూపం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నాచేత చూడటానికి శక్యం అవుతుందనితలచినట్లైతే నాశరహితమైన నీ స్వరూపాన్ని నాకు చూపించు (4).

**వ్యాఖ్య:-** అర్జునుడి వినయం, నమ్రత ఎంత ఎక్కువగా ఉన్నాయో ఈ శ్లోకాలను పరిశీలిస్తే అర్థమవుతుంది. గురువుతో తన కోరికను వెల్లడించే ముందు ఇంతవరకు విన్న విషయాలేమిటో, వాటిని తాను ఎలా అర్థం చేసుకున్నాడో, దాని ఫలితం ఏమో తెలియజేస్తున్నాడు. ఇంతవరకు భగవంతుని ద్వారా తాను విన్న బోధ ఎలాంటిదో 3 విశేషణాలతో వివరిస్తున్నాడు.

1.పరమం:- శ్రేష్ఠమైనది. దేనిని తెలుసుకున్న తర్వాత ఇంక తెలుసుకోవలసింది ఉండదో అదే శ్రేష్టవిద్య. అందులోను భగవంతుని వాక్కు అది. భగవంతుని అధికార వాక్కు. తనకు శ్రేయస్సును కలిగించే వాక్కు. కనుక శ్రేష్టమైనది

2.గుహ్యం:- రహస్యమైనది. రహస్యాలు అందరికీ చెప్పరు. శ్రేయోభిషులు, అర్హత గలవారికే చెబుతారు. ఆధ్యాత్మిక విషయాలను అర్హత గలవారికే చెప్పాలి. స్వాతిచినుకు ముత్యపుచిప్పలో పడితేనే ముత్యంగా మారుతుంది. ఇంక ఎక్కడ పడ్డా వ్యర్థమైపోతుంది. అలాగే ఈ విద్య అర్హత గలవారికే చెప్పాలి.

3. ఆధ్యాత్మ సంజ్ఞితం:- ఆత్మజ్ఞానాన్ని ప్రభోదించే బోధ ఇది. అహంకారమమకారాలు తొలగాలంటే ఆత్మజ్ఞానమే శరణ్యం. ఇదే శ్రేష్టమైన జ్ఞానం. బ్రహ్మవిద్య.

ఇట్టి శ్రేష్టమైన, రహస్యమైన, ఆత్మజ్ఞానాన్ని బోధించటం వల్ల అర్జునునికి ఏం ప్రయోజనం కలిగింది? అతడిలోని మోహం కాస్తా తొలగిపోయింది. ఆ విషయాన్ని స్వయంగా అర్జునుడే చెబుతున్నాడు, నామోహం - అజ్ఞానం తొలగిపోయింది - అని. మరి ఇప్పటికే మోహం -అజ్ఞానం తొలగిపోతే ఇంకా తెలుసుకోవలసిన జ్ఞానం ఏముంటుంది? ఇంకా 8 అధ్యాయాలు ఎందుకు?

మొదట అర్జునునికి మోహం ఉండేది. 'ఈ దేహమే నేను' అనేదే మోహం. ఈ మోహం వల్లనే మమకారం. దానివల్లనే నా వారందరినీ చంపుకోవలసి వస్తున్నదనే విషాదం. ఇప్పుడా విషాదం కాస్తా తొలగిపోయింది. ఎందుకంటే విషాదానికి మూలమైన మోహం తొలగిపోయింది గనుక. అయితే మోహం, విషాదం తొలగిందేగాని పరమాత్మస్వరూపాన్ని దర్శించాలనే కోరిక తీరలేదు.

ఇప్పుడు అర్జునుని మోహం తొలగింది. దీనికి కారణం భగవంతుడు బోధించిన ఆత్మజ్ఞానం. ఈ ఆత్మజ్ఞానాన్ని అర్హులైన వారికే చెప్పేది. ఎవరు అర్హులో వారిపైనే భగవంతుని అనుగ్రహం . అర్జునునిపై భగవానునికి గొప్ప అనుగ్రహం ఉంది. అందుకే 'మదనుగ్రహాయ' - నన్ను అనుగ్రహించటం కోసమే ఈ రహస్యమైన విద్యను చెప్పావు - అంటున్నాడు అర్జునుడు . అర్జునునిపై ఎంత అనుగ్రహం లేకపోతే ముల్లోకాలకు ప్రభువు - జగద్గురువు - సాక్షాత్తు భగవంతుడే అయిన శ్రీకృష్ణుడు గుర్రాలు తోలే పనికి ఒప్పుకుంటాడా? శిష్యునిపై అంతటి అనుగ్రహం ఉంది.

సాధారణంగా గురువు శిష్యులకు కఠినమైన వేదాంత విషయాలు బోధించినప్పుడు ఏదైనా సందేహం కలిగితే గురువును ప్రశ్నించి

తెలుసుకోవాలి. అలా సందేహాన్ని తీర్చుకొనే ముందు ఇంతవరకు చెప్పిన విషయాలు బాగా అర్ధమైనవని తెలియజేస్తాడు శిష్యుడు. అలా తెలియజేయటం ద్వారానే గురువును ప్రశ్నించే అధికారం శిష్యునికి కలుగుతుంది. ఇలా గురువును ప్రశ్నించకుండా, సందేహాలు తీర్చుకోకుండా బుద్ధావతారంలాగా కూర్చొని వినిపోయే శిష్యునికి ప్రగతి ఉండదు. అర్జునుడు అలాంటి వాడుకాదు. సందేహం వచ్చిందా! గురువును ప్రశ్నించి తెలుసుకుంటాడు. ఆ ప్రశ్నను బట్టి భగవానుడు సమాధానం ఇస్తాడు. ఈ సాంప్రదాయాన్ని పాటిస్తూ అర్జునుడు ఇంతవరకు విన్న విషయాలన్నీ అర్థమైనవని చెబుతున్నాడు.

ఈ సమస్తభూతాలు ఎలా పుడుతున్నాయో, ఎలా అంతమై పోతున్నాయో చక్కగా నీ నుండి తెలుసుకొని అర్థం చేసుకున్నాను. సర్వభూతాలు నీ నుండే పుడుతున్నాయి, నీయందే అంతమైపోతున్నాయి.

నీవు కర్తవైనా అకర్తవు. సర్వానికి నియామకుడవైనా ఉదాశీనుడవు. సర్వవ్యాపకుడవైనా అసంగుడవు. శుభాశుభ కర్మఫలాలను ప్రసాదించే కర్మఫల ప్రదాతవు. నీకెలాంటి పక్షపాత బుద్ధీలేదు. నీ మాహాత్మ్యం అంతా విన్నాను. అది అవ్యయం. నీ సర్వాత్మతత్త్వం నాశరహితం. ఇవన్నీ నీ ముఖత విన్నాను, గ్రహించాను. అవన్నీ యదార్థమైనవే.

ఇలా చెప్పి అర్జునుడు ఇప్పుడు తన మనస్సులోని కోరికను వ్యక్తం చేస్తున్నాడు. "పురుషోత్తమా! జగదైశ్వర్యమైన నీ దివ్యస్వరూపాన్ని చూడగోరుతున్నాను" అన్నాడు. భగవంతుని విశ్వరూపాన్ని చూడాలనే

ఆత్మృతలో, ఉత్సాహంలో మర్యాదను అతిక్రమించానా? అనే అనుమానం కలిగింది. అందుకే తన వాక్కులకు మార్దవం కలిగిస్తున్నాడు.

అర్జునునిలో వినయం, విధేయత, నమ్రత, పెద్దలతో మాట్లాడే తీరు ఎంతో చక్కగా ఉన్నాయి. చూడండి. 'పెన్నివ్వండి సంతకం పెట్టి ఇస్తాను' అంటాడు ఒకతను ప్రక్కవానితో. ఇందులో వినయం లేదు. 'దయచేసి మీ పెన్ను ఇవ్వగలరా? సంతకం చేసి ఇచ్చేస్తాను' అన్నావనుకో. ఎంతో మర్యాద. అలాగే నీ విశ్వరూపాన్ని చూడగోరుతున్నాను అనటంలో మార్దవం లేదనిపించింది అర్జునునికి. అందుకే "ప్రభూ! నీ విశ్వరూపాన్ని చూడటానికి నాకు శక్యమవుతుంది అనుకుంటే, నాకు అర్హత కలదు అనుకుంటే అవ్యయమైన నీ రూపాన్ని చూపించు - అని వినయంతో ప్రార్థిస్తున్నాడు.

ఎందుకంటే చూపించే శక్తి నీకున్నా చూడగలిగే శక్తి నాకుండాలి గదా! ఒకవేళ నాకా శక్తి లేకపోతే! స్వామీ! ఫరవాలేదు. నీవు యోగీశ్వరుడవు. అణిమాది అష్టసిద్ధులకు అధిపతివి. అన్ని ఉపాయాలకు ప్రభువువు నీవు. ఏదో ఒక ఉపాయంతో నన్ను అనుగ్రహించగలవు - అంటూ భగవంతుని ఆధిక్యాన్ని, సమర్థతను ప్రశంసిస్తూ వినయంతో ప్రార్థిస్తున్నాడు. వినయం దైవీగుణం. అహంకారం ఆసురీగుణం. అహంకార రాజ్యంలోనికి భగవంతుడు ప్రవేశించడు. భగవంతుని కొలువులో అహంకారికి స్థానం లేదు.

అన్నం బిరుసుగా ఉంటే వదిలేస్తాం. అలాగే లోపల అహంకారం, అభిమానం ఉంటే జీవుణ్ణి భగవంతుడు వదిలేస్తాడు.

ఒక గ్రామం వెలుపల చిన్న కుటీరం వేసుకొని ఒక మాహాత్ముడుంటున్నాడు. ఎప్పుడూ తలుపులు మూసుకొని తపస్సు చేసుకుంటూ ఉంటాడు. అదే గ్రామంలో ఒక భాగ్యవంతుడైన రెడ్డిగారున్నారు. ఈ మహాత్ముని వద్ద ఉపదేశం పొందాలని రెడ్డిగారి కోరిక. ఒకరోజున రెడ్డిగారు కుటీరం వద్దకు వచ్చి తలుపుతట్టాడు.

'ఎవరండీ మీరు?' - లోపలి నుండి మహాత్ముడు.

'నేనేనండి రెడ్డిగారిని' - రెడ్డిగారు. (నేను పూర్తి పేరు చెప్పాల్సిన పనేముంది? ఇంత పెద్దమనిషిని — అని).

'ఏం కావాలండీ?' - లోపలి నుండి (తలుపు తీయకుండానే)

'మీ వద్ద ఉపదేశం కావాలండీ' - రెడ్డిగారు.

'సరే! రేపురండి' - లోపలి నుండి.

రోజూ ఇంతే. ఇలా 4 రోజులు గడిచిపోయినవి. ప్రతిరోజూ రేపు రండి! రేపు రండి! అంటున్నాడేమిటి? విసుగు పుట్టింది రెడ్డిగారికి - 5వ రోజున అసహనంతోనే వెళ్ళాడు రెడ్డిగారు. అంతే 'రేపు రండి!' అనే సమాధానమే. సరే ఏదో ఒకటి తేల్చు కోవాలనుకున్నాడు రెడ్డిగారు.

"రోజూ రేపు రండి! రేపు రండి! అంటున్నారు. ఎప్పుడండీ ఉపదేశం ఇచ్చేది?" అన్నాడు రెడ్డిగారు కాస్త అసహనంగానే.

"నేను చచ్చినాక ఇస్తాను" - లోపల నుండి సమాధానం.

చచ్చినాక ఇస్తాడా? ఇదేమిటి? అని ఆలోచనలో పడ్డాడు. ఆలోచించగా - ఆలోచించగా మరొక అర్థం తోచింది రెడ్డిగారికి. నేను చచ్చినాక ఉపదేశం

ఇస్తాను - అంటే 'నేను' అనే అహంకారం చచ్చినాక అని అర్థం కాబోలు. కనుక నాలోని అహంకారం చావాలి అని తెలుసుకున్నాడు. నాలుగురోజులు సాధువు గారి కుటీరం చుట్టూ తిరిగినందుకు రెడ్డిగారికి ఈ భావన తోచింది. మహాత్ముల సాంగత్యం వృథాపోదు. ఏదో ఒక ప్రయోజనం సిద్ధిస్తుంది.

'నాకు అర్హత ఉంటే ప్రసాదించండి' అంటూ తన పెత్తనానికి స్వస్తి చెప్పి భగవంతుని ఇచ్ఛకు ప్రాధాన్యత ఇచ్చాడు అర్జునుడు. అర్జునా! నీవు దైవీసంపదలో పుట్టావయ్యా అంటూ భగవంతుడే అర్జునునికి సర్టిఫికెట్ ఇచ్చాడు. అంతటి అర్జునునికి అర్హత లేకపోవటం ఏమిటి?

వినయంతో చేసిన అర్జునుని అభ్యర్థనను ఆమోదించాడు భగవానుడు. శ్రద్ధ - వినయం - విధేయత - భక్తి - విశ్వాసం - గౌరవం - నమ్రత గల శిష్యుని కోరిక నిజమైన గురువు యొక్క చెవిలో పడితే వృథా అవుతుందా? అందుకే జగద్గురువైన శ్రీకృష్ణుడు అర్జునుని కోరికను తీర్చబోతున్నాడు. విశ్వరూపాన్ని ప్రదర్శించబోతున్నాడు. ఏమంటున్నాడు భగవానుడు?

- అర్జునుని కోరిక ప్రకారం భగవానుడు తన విశ్వరూపాన్ని చూపబోతూ, ఆ విశ్వరూపం ఎట్టిదో, అందులో ఏమేమి చూడాలో వాటన్నింటిని చూడు! అంటూ అర్జునుని ప్రోత్సహిస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో||** పశ్యమే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః|

నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీనిచ|| (5)

**శ్లో||** పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుత స్తథా|
బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత!|| **(6)**

**శ్లో||** ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరం|
మమదేహే గుడాకేశ! యచ్చాన్యద్రష్టు మిచ్ఛసి|| **(7)**

**శ్లో||** నతుమాం శక్య సేద్రష్టుం అనేనైవ స్వ చక్షుషా|
దివ్యం దదామితే చక్షుః పశ్యమే యోగ మైశ్వరం|| **(8)**

**తా||** భగవానుడంటున్నాడు : పార్థా! వందలు, వేలుగా; అనేక విధములైన; అనేక రంగులు, ఆకృతులు గల; దివ్యమైన నా రూపాలను చూడు (5). భారతా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీదేవతలను, మరుత్తులను చూడు. అలాగే ఇది వరకు ఎన్నడూ చూడని అనేకమైన అద్భుతాలను చూడు (6). ఓ గుడాకేశుడా! చరాచరాత్మకమైన ఈ సమస్త జగత్తును; ఇంకా అన్యమైన వేటిని చూడగోరుతున్నావో వాటన్నింటిని నా దేహం లో ఇక్కడ ఒకేచోట - ఒక్కటిగా ఇప్పుడు చూడు (7). నీ ఈ చర్మచక్షువులతో నన్ను చూడటం శక్యం కాదు. నీకు దివ్యదృష్టిని (నేత్రాలను) ఇస్తున్నాను. నా యోగమహిమను ఈశ్వర తత్త్వాన్ని చూడు (8).

**వ్యాఖ్య** :- పృథా పుత్రా! పార్థా! నామేనత్త కుంతీదేవికి పుత్రుడవైన ఓ అర్జునా! నీవు నాకెంతో ఆత్మీయుడవు, భక్తుడవు, ఇష్టుడవు. ఇదిగో చూడు! వందల కొద్దీ, వేల కొద్దీ కనిపించే నా రూపాలను చూడు. ఇవన్నీ అనేక విధాలుగా ఉన్నాయి. అనేక రంగులలో, అనేక రూపాలతో, ఆకృతులతో కనిపిస్తున్నాయి. పైగా ఇవి దివ్యమైనవి కూడా అంటున్నాడు భగవానుడు.

భగవంతుని విశ్వరూపం ఒక్కటే అయినప్పటికి ఆ రూపంలోనే అనేక రూపాలు, వర్ణాలు, ఆకృతులు ఉన్నాయి. అసలు ఒక్క రూపంలో అనేక రూపాలు కనిపించటం ఏమిటి?

గాజులు, గొలుసులు, ఉంగరాలు, నక్లెస్ లు, వడ్రాణాలు - అనేకమైన ఆభరణాలు అక్కడ ఉన్నాయి. వాటన్నింటిలో ఉన్నది ఒక్కటే బంగారం. అంటే ఒక్కటే అయిన బంగారంలోనే ఈ అన్ని ఆభరణాలు ఉన్నాయి. ఆభరణాలు వస్తు రూపాలు గనుక, దృశ్యరూపాలు. గనుక కంటితో చూడగలం. అలాగే ఆ ఆభరణాలలోని బంగారాన్ని కూడా చూడగలం. కాని బంగారపు ముద్దలో ఈ ఆభరణాలను చూడగలమా? ఆకారాలేమీ కనిపించని ఆ ఆభరణాలను కంటితో చూడలేం. ఎందుకు? రూపం లేదు గనుక. ఐతే బుద్ధితో ఊహించి గ్రహించగలం. ఈ భావాన్ని మనస్సులో పెట్టుకొని ఈ 5వ శ్లోకాన్ని అర్థం చేసుకోవాలి. అనేక రూపాలు, అనేక వర్ణాలు అక్కడ ఉంటే వాటిని ఈ కన్నులతో చూడగలం. ఆ రూపాలలో పరమాత్మ విభూతిని చూడగలం. కాని పరమాత్మలో ఈ రూపాలను చూడగలమా? ఈ కన్నులతో చూడలేం.

అర్జునుడు కూడా అలాగే విశ్వరూపంలోనే ఉన్నప్పటికీ కనిపించకుండా ఉండే ఆయా రూపాలను, వర్ణాలను చూడలేక పోతాడు గనుక ముందు జాగ్రత్తగా అతడికి దృష్టిని సరిచేసుకోవాలని అన్యాపదేశంగా సలహా ఇస్తున్నాడు. అంతేకాదు, తన విశ్వరూపాన్ని ఎక్కువ సేపు చూడలేడు గనుక అక్కడ ఏమేమి ఉంటాయో ముందుగానే చెప్పటం మంచిదని చెబుతున్నాడు.

ప్రయోగశాలలో ఆక్సిజన్ తయారుచేయాటానికి వెళ్ళే ముందే ఆ ప్రయోగం గురించి పూర్తిగా తెలియజేయాలి. అలా చేస్తే ప్రయోగశాలలో తడబాటు ఉండదు. అలాగే దివ్యదృష్టి ప్రసాదించే ముందే చూడదగిన సమస్త విషయాలను వివరిస్తే, విశ్వరూపాన్ని చూపినప్పుడు తడబాటు లేకుండా ఉంటుంది. మరి ఏమేమి దర్శించాలి?

ద్వాదశ ఆదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, కవలలు అశ్వనీ దేవతలు, 49 మంది మరుత్తులు, ఇలా ఒకటేమిటి? ఎవ్వరూ ఎప్పుడూ చూడని అనేకమైన ఆశ్చర్యకరమైన విషయాలను చూడు! అంటున్నాడు భగవానుడు. పైన చెప్పిన వారంతా ఈ సృష్టిని నడిపేవారు. వీరంతా ఎక్కడ ఉంటారు? నిత్యుడు, శాశ్వతుడు, అజుడు, అవ్యయుడు అయిన పరమాత్మ సూక్ష్మ శరీరంలో సదా ఉంటారు. పరమాత్మకు కూడా మనలాగా 3 శరీరాలు ఉన్నాయా? ఉన్నాయి.

- ఈ కనిపించే సమస్త జగత్తు పరమాత్మ యొక్క స్థూలశరీరం.
- ఈ జగత్తును నడిపే పైన పేర్కొన్న దేవతలంతా పరమాత్మ సూక్ష్మశరీరం.
- ఈ దేవతలందరిని వారివారి పనులలో నియమించి నడిపించే తానే కారణశరీరం. మన శరీరం ద్వారా జరిగే పనులన్నీ ముందు మనస్సులో భావిస్తాం. అలాగే ఈ స్థూల ప్రపంచంలో జరిగే అన్ని సంఘటనలు, పనులు పరమాత్మ యొక్క సూక్ష్మశరీరంలో ముందుగానే సిద్ధించి ఉంటాయి. అక్కడి నిర్ణయాలే ఇక్కడ జరుగుతాయి. అయినప్పటికీ అజ్ఞానంతో నేను దీన్ని సాధించాను; నా వల్లనే ఇది ఇలా జరిగింది అని భ్రమ పడుతూ

ఉంటాం. అంతేకాదు ముందు ముందు జరగబోయేవి కూడా అక్కడి దేవతలు గ్రహించే ఉంటారు. అవి మనకు అద్భుతాలుగా ఉంటాయి. అందుకే నీవు కనీవినీ ఎరుగని అద్భుతాలను చూడు! అంటున్నాడు భగవానుడు. అంతేకాదు ఇంకా చూడవలసిన వాటిని చెబుతున్నాడు.

గుడాకేశా! అని అర్జునుని సంభోదిస్తున్నాడు భగవానుడు. 'గుడాక + ఈశ' అంటే నిద్రను జయించిన వాడా! అని. అంటే బద్ధకం, సోమరితనం లేనివాడు, ఎంతో చురుకుగా ఉంటాడు. అట్టివానికే విశ్వరూప సందర్శనానికి యోగ్యత. శ్రీకృష్ణుని ప్రశంసలతో పొంగిపోతున్నాడు అర్జునుడు. అయితే చూడు! చూడు! అంటున్న ఆ వివిధరూపాలను, ఆయా దేవతలను ఎక్కడ చూడాలా? అని మధనపడుతున్నాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు "ఈ చరాచరాత్మకమైన సమస్త జగత్తును నాదేహంలోనే (మహాదేహే) చూడు! అంటున్నాడు. ఈ జగత్తంతా నాలో ఒక్క అంశయే గదా! ఇంకా 3అంశలు నాలో ఉన్నాయి. కనుక అవీ చూడాలనుకుంటే సిగ్గుపడకుండా, మొహమాట పడకుండా చూడు. భయపడకుండా చూడు! అని ప్రోత్సహిస్తున్నాడు భగవానుడు. ఏమేమి చూడాలో చెబుతున్నాడు. అవిగాక ఇంకా ఏమైనా చూడాలనుకుంటే వాటినీ చూడమంటున్నాడు. ఎక్కడ చూడాలో కూడా తెలియజేస్తున్నాడు. అంతేకాదు ఈ శ్లోకాలలో పశ్య! పశ్య అంటూ ఐదుసార్లు అనటంవల్ల భగవానుడు ఎంత ఉత్సాహంతో ఉన్నాడో అర్థమవుతున్నది. తన విశ్వరూపాన్ని చూపించాలనే తపన ఎంతగా ఉన్నదో తెలుస్తున్నది. భక్తుని పట్ల భగవంతుని అనుగ్రహం అలా ఉంటుంది.

'యచ్చాన్యద్రష్టు మిచ్చసి' అంటూ ఇంకా ఏమేమి చూడాలను కుంటావో వాటిని కూడా చూడు! అని అర్జునునికి స్వేచ్ఛను ప్రసాదిస్తున్నాడు. యుద్ధంలో జయం కలుగుతుందో! లేదో! అనే సందేహం అర్జునుని పీడిస్తున్నది. ఆ సందేహం కూడా తీర్చుకోవాలి. ఎలా? స్థూలజగత్తులో భవిష్యత్తులో జరగబోయే విషయాలన్నీ సూక్ష్మజగత్తులో ముందే కనిపిస్తాయి. కనుక కౌరవనాశనాన్ని, పాండవ విజయాన్నీ కూడా అర్జునుడు చూడవచ్చు.

ఇప్పుడా విశ్వరూపాన్ని చూడటానికి కావలసిన దివ్యదృష్టిని ప్రసాదించబోతున్నాడు భగవానుడు.

ఓ అర్జునా! నాయీ విశ్వరూపాన్ని నీ చర్మచక్షువులతో చూడలేవు. కనుక నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాను. నా మహిమను, ఈశ్వరత్వాన్ని చూడు! అంటున్నాడు భగవానుడు.

చర్మచక్షువులతో చూడటం ఎందుకు సాధ్యంకాదు? ఆభరణాలలో దాగి ఉన్న బంగారాన్ని తేలికగానే చూడవచ్చు. ఆభరణాల అందచందాల మీది ఆసక్తిని, అందులో పొదిగిన రాళ్ళపై వ్యామోహాన్ని వదిలిచూస్తే అంతా బంగారమే. కాని బంగారు ముద్దలో ఆభరణాలను చూడమంటే? మామూలు కంటికి సాధ్యం కాదు. కనుక మనోబుద్ధులతో ఆలోచించి ఊహించాలి. అలాగే ఈ ప్రపంచాన్ని చూస్తూ, దానిపై వ్యామోహాన్ని వదిలి కారణమైన పరమాత్మను దర్శించవచ్చు. కాని పరమాత్మలో ఈ జగత్తును, చరాచర వస్తువులను చూడాలంటే? చాలా కష్టం. దివ్యదృష్టి కావాలి. ఎందుకు?

(i) చర్మచక్షువులు స్థూలం. కనుక స్థూలమైన వాటినే చూడగలవు.

**(ii) ఇవి పంచభూతాలతో తయారైనవి. కనుక పంచభూతాలతో తయారైన జీవుళ్ళను, ప్రపంచాన్ని చూడగలవే గాని దివ్యమైన, చిన్మయమైన పరమాత్మను చూడలేవు.**

**(iii) ఈ నేత్రాలు దేశ, కాల, వస్తు పరిచ్ఛేదాలు. భగవంతుడు అపరిచ్ఛిన్నుడు. భగవంతుని రూపం దివ్యం. కనుక దివ్యనేత్రాలు కావాలి. అందుకే నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాను అంటున్నాడు భగవానుడు.**

**ఆనాటి యుద్ధరంగంలో భగవంతుని విశ్వరూపాన్ని సందర్శించింది అర్జునుడు ఒక్కడే కాదు. మరొక వ్యక్తి కూడా ఉన్నాడు. అతడు పాండవపక్షంలో లేడు; అర్జునుని ప్రక్కనా లేడు. అతడు కురుసేనలోని 11 అక్షౌహిణులలో ఉన్న ఒక సామాన్య యోధుడు మాత్రమే. శత్రువులను జయించటంలో అంత నైపుణ్యం లేకపోయినా, అంతః శత్రువులైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలను జయించినవాడు, ఇంద్రియాలను లెస్సగ జయించినవాడు, వ్యాస భగవానుని అనుగ్రహాన్ని చూరగొన్నవాడు, ఆయననుండి దివ్యదృష్టిని ముందే సంపాదించుకున్నవాడు, ధృతరాష్ట్ర మహారాజుకు ఆంతరంగిక సలహాదారుడు. ఆయనే సంజయుడు. ఇప్పుడు యుద్ధవిశేషాలను వినిపించే విలేకరి.**

**ఆయన అదృష్టమే అదృష్టం. ఆయన ఎక్కడో నిలబడి దివ్యదృష్టి ప్రభావంతో భగవంతుని మాటలు వింటున్నాడు, భగవంతుని విశ్వరూపాన్ని దర్శిస్తున్నాడు, విశ్వరూపాన్ని దర్శించే అర్జునునీ చూస్తున్నాడు. ఏం చూస్తున్నాడు?**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

విశ్వరూపాన్ని చూచి అర్జునుడు నిశ్చేష్టుడయ్యాడు. కళ్ళు ఆర్పటం మరచిపోయాడు. గాలిపీల్చటం మరచిపోయాడు. తానెవరో మరచిపోయాడు. తానెక్కడున్నాడో ఏం చేయాలో మరచిపోయి చేష్టలుడిగి నిలబడిపోయాడు. ఇదంతా చూస్తున్నాడు సంజయుడు.

అయితే సంజయుడు మాత్రం అలా నిశ్చేష్టుడు కాలేదు. ఆయన తన కర్తవ్యంలో జాగరూకుడైయున్నాడు. కురుక్షేత్రయుద్ధ భూమిలో జరుగుతున్న యుద్ధవిశేషాలను ధృతరాష్ట్ర మహారాజుకు ఎప్పటికప్పుడు విన్నవించటానికి వ్యాసమహర్షి చేత నియమించబడిన వాడు. అందుకే తన కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి యుద్ధం 10వ రోజున సర్వసైన్యాధిపతి భీష్ముడు శిఖండి చేతిలో పడిపోయిన తరువాత ఆ రాత్రికి హస్తినాపురం చేరుకున్నాడు. విషాదవదనంతో రాజభవనంలో ప్రవేశించాడు. ధృతరాష్ట్రుని కోరికపై యుద్ధ విశేషాలను వినిపిస్తూ యుద్ధం మొదటిరోజున అర్జునుని విషాదాన్ని తెలిపి, ఆ పై శ్రీకృష్ణుని గీతాబోధను తెలియజేసి, అర్జునుని కోరికపై భగవానుడు చూపిన విశ్వరూపాన్ని - ఆ దివ్యవైభవాన్ని వివరిస్తున్నాడు. ఇప్పుడు రంగం కురుక్షేత్రం నుండి హస్తినాపురంలోని ధృతరాష్ట్ర మందిరానికి మారింది.

ధృతరాష్ట్రుని మందిరంలో మహారాజుతో సంజయుని సమావేశం జరిగింది. ఇప్పుడు సంజయుడు మహారాజుతో తరువాత జరిగిన అద్భుత విశేషాలను వివరిస్తున్నాడు. ఏమని?

**సంజయ ఉవాచ:**

**శ్లో||** ఏవముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః||

దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం|| **(9)**

**శ్లో||** అనేక వక్త్ర నయనం అనేకాద్భుత దర్శనం|

అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతా యుధం|| **(10)**

**శ్లో||** దివ్య మూల్యాంబర ధరం దివ్య గంధాను లేపనం|

సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖం|| **(11)**

**శ్లో||** దివి సూర్య సహస్రస్య భవేద్యుగ పదుత్థితా|

యది భాస్సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మనః|| **(12)**

**తా||** సంజయుడంటున్నాడు! మహారాజా! మహాయోగేశ్వరుడైన (హరి) శ్రీకృష్ణుడు ఇలా పలికి, ఆ తరువాత అర్జునుని కొరకు శ్రేష్టమైన ఐశ్వర్యమైన రూపాన్ని చూపించాడు(9). అనేక ముఖాలు, అనేక నేత్రాలు, అనేక అద్భుతమైన దృశ్యాలు, అనేక దివ్యమైన ఆభరణాలు, పైకి ఎత్తబడియున్న అనేక దివ్యమైన ఆయుధాలు (10), దివ్యమైన మాలలు, దివ్యమైన వస్త్రాలను ధరించి, దివ్య గంధాల అనులేపనం కలిగి, మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించే కాంతితో కూడిన అనంతమైన, అంతటా ముఖాలు గలిగిన రూపం అది(11). వేలకొద్దీ సూర్యుళ్ళు ఆకాశంలో ఒక్కసారిగా ఉదయిస్తే ఎంతకాంతి ఉంటుందో ఆ మహాత్ముని కాంతి దానికి సమానంగా ఉన్నది (12).

**వ్యాఖ్య :-** ఆర్య సంస్కృతిని, హిందూ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్న మహాపురుషుడు, మహామేధావి వ్యాసభగవానుడు. ఆయన సాక్షాత్తు

నారాయణాంశయే. ఇలాంటి వ్యక్తి వేరొకరు ఏకాలంలోను, ఏ యుగంలోను ఉన్నట్టుగా మనకు తెలియదు. ఏమిటి ఆయన విశిష్టత ?

(i) సాటిలేని కవితారీతులు,

(ii) చిత్ర విచిత్రమైన సన్నివేశాల సృష్టి,

(iii) మనోహరమైన వచన రచన,

(iv) హృదయపు లోతులను తాకే అద్భుత వర్ణనలు,

(v) సాహిత్యంలో శిల్పకళారీతులు,

(vi) భావంలోనూ, రూపంలోనూ క్రొత్త క్రొత్త తీరులో కల్పనా చాతుర్యం,

(vii) అర్థవంతంగా కథను నడిపించటం,

(viii) వ్యక్తుల మనస్సులలో దాగియున్న భావాలను చిత్రంగా వ్యక్తం చేయటం,

(ix) సంస్కృత భాషలోని పదాల చేత అందంగా నాట్యం చేయించటం,

(x) మనసులోని భావాలను వివిధ రూపాలతో అద్భుతంగా చిత్రించగల నైపుణ్యం,

(xi) కఠినమైన వేదాంత రహస్యాలను అందరికీ అర్థమయ్యేలా కథా రూపంలో అందించటం, వీటన్నింటికీ మించి ఆయన

(1) ప్రతిభాశాలియైన వేదాంతి, (2) సాటిలేని పరమజ్ఞాని (3) లౌకిక వ్యవహార దక్షుడు, (4) నిర్భీతిగా మాట్లాడగల నేర్పరి (5) అవతల వారి భావాలను సూక్ష్మంగా గ్రహించగల బుద్ధిశాలి (6) ఆగత అనాగత జ్ఞానం (7) గురువులకు గురువు (8) అనేక గ్రంధాలను - 18 పురాణాలను, మహాభారతాన్ని, బ్రహ్మసూత్రాలను అందించిన బహుగ్రంధ కర్త (9) వేదమంత్రాలను

చతుర్వేదాలుగా విభాగించిన ప్రజ్ఞాశాలి. (10) పతంజలి యోగ సూత్రాలకు భాష్యకారుడు - ఇలా చెప్పుకుంటూ పోతే వ్యాసమహర్షి యొక్క శక్తి సామర్థ్యాలు, మేధాశక్తి ఏ పాటివో భారతగ్రంథ మంత అవుతుంది.

ఇప్పుడు అంతఃపురంలో ఉంటాడు. ఆత్మీయులకు ఆంతరంగికుడై సలహాలిస్తాడు. మరొకప్పుడు యుద్ధరంగంలో ఉండి ప్రమాదాలు నివారిస్తాడు. ఇంకొకప్పుడు హిమాలయాలలోని తన ఆశ్రమంలో కూర్చొని ఇతిహాసాలను, పురాణాలను రచిస్తాడు. మరొకప్పుడు వేదాంత విషయాలను శిష్యులకు బోధిస్తూ ఉంటాడు. ఇంకొకప్పుడు బదరీలో ఉండి తపస్సు చేసుకుంటాడు. ఇలాంటి మహాత్ముడు 'నభూతో న భవిష్యతి'.

విశ్వరూపంలో ఏమేమి దర్శించాలో, ఆ దర్శించాల్సిన విషయాలను ఎక్కడ దర్శించాలో సూచనల నిచ్చి, అర్జునునికి దివ్యదృష్టిని ప్రసాదించాడు భగవానుడు. ఆ తరువాత వెంటనే రంగస్థలాన్ని మార్చాడు వ్యాసభగవానుడు. దురాత్ములైన దుర్యోధనాదుల తండ్రి గ్రుడ్డిరాజు ధృతరాష్ట్రునికి విశ్వరూప విశేషాలను సంజయుని చేత వినిపింపజేస్తున్నాడు. ఆ సంజయుని యొక్క మనోప్రవృత్తిని, ఆయన మనస్సులోని భావాలను చిత్రించటమే నిజంగా ఇక్కడ ప్రధానమైన విషయం. ఎందుకంటే ఆ విశ్వరూపాన్ని చూపగానే అర్జునుడు ఆ రూపాన్ని చూస్తూ, ఆనందిస్తున్న సన్నివేశాలను అక్కడే వర్ణించవచ్చు. కాని అక్కడ నాటకీయత ఉండదు. సంజయుని పాత్ర యొక్క ఔచిత్యం పాఠకులకు తెలియదు. అందుకే రంగాన్ని మార్చి సంజయుని పాత్రను ముందుకు తెచ్చాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సంజయుడు ధృతరాష్ట్రుని స్వంత విలేకరి. వార్తలు, విశేషాలు సేకరించి తెచ్చి నివేదించవలసిన విలేకరి. అయినా అతడికి ధర్మం పట్ల గొప్పగౌరవం, నిష్ట ఉన్నాయి. అందుకే దుర్యోధనాదుల పక్షాన యుద్ధరంగంలో నిలిచినా, ధృతరాష్ట్రుని వద్ద ఉద్యోగం చేస్తున్నా ఆయనకు ధర్మమేదో, అధర్మమేదో తెలుసు. శ్రీకృష్ణుని మాహాత్మ్యం ఏమిటో తెలుసు. పాండవులు ధర్మాత్ములని, కౌరవులు అధర్మపరులని, శ్రీకృష్ణుడు ధర్మోద్ధరణకు అవతరించిన భగవంతుడని తెలిసినవాడు. అందుకే కౌరవుల శ్రేయస్సు కోరి, నిరంతరము ధృతరాష్ట్రునికి హితబోధ చేస్తూనే ఉన్నాడు, దుర్యోధనాదులను నిరశిస్తూనే ఉన్నాడు. పాండవులతో వైరం క్షేమం కాదని నెత్తీ నోరూ బాదుకుంటూనే ఉన్నాడు. తనకు అన్నం పెట్టి పోషిస్తున్న ధృతరాష్ట్రుని మీద గౌరవం, సానుభూతీ రెండూ ఉన్నాయి. తన యజమాని ఎప్పుడూ క్షేమంగా ఉండాలని కోరుకొనే స్వామిభక్తి పరాయణుడు. ధృతరాష్ట్రుని కన్న వయస్సులో చాలా చిన్నవాడే అయినా, అరణ్యంలో అగ్ని చుట్టుముట్టి ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి అందులో దగ్ధం కావటానికి సంసిద్ధులవుతుండగా తప్పించుకొని వెళ్ళే అవకాశం ఉన్నా వారితో పాటు తానూ అగ్నికి ఆహుతి కావటానికి నిశ్చయించుకున్నవాడు. కాని చివరకు ధృతరాష్ట్రుని బలవంతంపై, ఆయన ఆజ్ఞమేరకు, ఆయన మాటను గౌరవించుటకు తప్పించుకొని వెళ్ళినవాడు.

అట్టి సంజయుడు విశ్వరూప విశేషాలను ధృతరాష్ట్రునికి వివరించబోతూ ఆయనను రాజన్! అని సంభోదిస్తున్నాడు. అలాగే శ్రీకృష్ణుని మహాయోగేశ్వరో హరిః అని విశేషణాలతో వివరిస్తున్నాడు.

ఏమిటి ఈ విశేషణాల ఆంతర్యం?

రాజన్! అంటే మహారాజా! అని. నీవు కొంతమంది ప్రజలను పాలించే రాజువు. ఆ శ్రీకృష్ణుడు నీలాంటి రాజులనే గాక అన్ని లోకాలనూ పాలించే రాజు. ఆయన శ్రీమహావిష్ణువు. అంతేకాదు ఆయన మహాయోగేశ్వరుడు. ఈ మాటలు ధృతరాష్ట్రునికి ప్రాణాంతకాలుగా ఉన్నాయి. రక్తపాతం లేకుండా ఆయనను హత్యచేస్తున్నట్లుగా ఉన్నాయి. ఈ పదాలను సంజయుడు కావాలనే ప్రయోగించాడు. ఎందుకంటే ఈ పదాల ద్వారా తన మనస్సులోని భావాలను ధృతరాష్ట్రునికి వ్యక్తం చేయాలనే. ఏమిటా భావాలు?

"ఓ మహారాజా! ఆ పక్షంలో గొప్ప యోగేశ్వరుడైన హరి - శ్రీకృష్ణుడు ఉండగా నీకు గెలుపు అసాధ్యం" అనే ధ్వని ఇందులో నిక్షిప్తమై ఉంది. 'నీ కెటూ గెలుపు అసాధ్యం గనుక అన్యాయంగా కొడుకులందరినీ పోగొట్టుకొని జీవచ్ఛవంలాగా బ్రతకవలసిన పరిస్థితిని తప్పించుకో. ఈ వంశ క్షేమం కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసిన భీష్ముని ఎలాగూ పోగొట్టుకున్నావు. మిగిలిన గురువులను, పెద్దలను, శ్రేయోభిలాషులను, ఆత్మీయులను యుద్ధరంగానికి బలిపెట్టి జీవితాంతం దుఃఖంలో కూరుకుపోవద్దు. కనుక ఈ యుద్ధం నీకు శ్రేయస్కరం కాదు. ఇప్పటికైనా యుద్ధాన్ని ఆపాలంటే సర్వసంపూర్ణ అధికారం నీకే ఉన్నది. ఎందుకంటే ఇప్పటికీ నీవే మహారాజువు - అనే భావంతోనే రాజన్! అనే పిలుపు. ఇలా సంజయుడు తన భావాన్ని ఈ పిలుపుతో వ్యక్తం చేసి, యుద్ధరంగంలో శ్రీకృష్ణుడు అర్జునునికి చూపిన విశ్వరూపాన్ని వర్ణిస్తున్నాడు. ఏమని?

'శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునితో ఇలా చెప్పి తన అద్భుతమైన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. ఆ విశ్వరూపం ఈశ్వర సంబంధమైనది. చూపిన వాడు మహాయోగేశ్వరేశ్వరుడు' - అని ధృతరాష్ట్రునికి విన్న విస్తున్నాడు. ఇప్పటికైనా ధృతరాష్ట్రుని బుద్ధి మారితే మంచిదే గదా! అని సంజయుని ఆశ.

సంజయుని వాక్యంతో భగవద్గీతా పాఠకులు, శ్రోతలు యుద్ధరంగం నుండి అంతఃపురానికి తరలిపోవాలి. దీనివల్ల మనకొక సందేశం అందుతున్నది. గీతాతత్త్వం యుద్ధరంగం వంటి శాస్త్రాల నుండి, గురుబోధ నుండి, శాస్త్ర శ్రవణం నుండి అంతఃపురం లాంటి అంతఃకరణంలోనికి ప్రవేశించాలి. కేవలం బయటి నుండి చెవుల్లో వేసుకొని దణ్ణం పెట్టినంత మాత్రాన చాలదు. అది మన అంతఃకరణంలో ప్రవేశించినప్పుడే ప్రయోజనం. ఇప్పుడు విశ్వరూపం ఎలా ఉన్నదో, ఆ రూపంలో ఏమేమి ఉన్నాయో, తాను చూచినది చూచినట్లు వర్ణిస్తున్నాడు సంజయుడు.

ఒక చిత్రకారుడు తనలోని భావాలన్నింటిని మూసపోసి ఒక బొమ్మను గీయాలనుకున్నాడు. రకరకాల రంగులు, కుంచెలు సిద్ధం చేసుకొన్నాడు. ముందుగా తాను గీయదలచుకొన్న బొమ్మ యొక్క ఆకార రేఖలను (outline) గీస్తాడు. ఆ తరువాత తన భావాలను చూపటానికి కొంచెం కొంచెంగా రంగులు వేస్తాడు. అలా క్రమంగా మొత్తం చిత్రాన్ని పూర్తిచేస్తాడు.

అలాగే సాహితీ చిత్రకారుడైన వ్యాసుడు తన శబ్ద చిత్రంలో సంజయుని చేత భగవంతుని విశ్వరూపాన్ని గురించి చెప్పించిన వాక్యాలు, వర్ణనలు పైపై

ఆకారాన్ని చూపే రేఖలు మాత్రమే. ఆ తరువాత పూర్తి రూపాన్ని చిత్రిస్తాడు. రేఖా మాత్రంగా ఏమని వర్ణిస్తున్నాడు సంజయుడు?

ఆ విశ్వరూపం అనేక ముఖాలతో, అనేక నేత్రాలతో చూడటానికి పరమాద్భుతంగా ఉన్నది. వేదంలో "సహస్ర శీర్షః పురుషః సహస్రాక్షః సహస్ర పాద్" అని చెప్పిన స్వరూపమే ఇప్పుడు తన కన్నులతో చూస్తున్నది. లెక్కలేనన్ని దివ్యమైన ఆభరణాలు, దివ్యమైన పుష్పమాలలు అలకరించబడి ఉన్నాయి. అనేక రంగుల వస్త్రాలు ధరించియున్నది ఆరూపం. అలాగే శరీరం అంతా గంధం పూయబడియున్నది. అంతేగాదు చేతులతో పైకెత్తి పట్టుకొని యున్న దివ్యమైన ఆయుధాలు అనేకం ఉన్నాయి. అర్జునుడు ఆ రూపాన్ని ఎంతో ఆశ్చర్యంతో తిలకిస్తున్నాడు. ఎందుకు? ఆ అద్భుతరూపం దివ్యమైన కాంతితో కనులు మిరుమిట్లు గొలిపేలా ఉంది. పైగా ఆ రూపానికి ఆది - అంతం కనిపించటం లేదు. విశ్వమంతటా దాని ముఖాలే. ఇలాంటి రూపాన్ని చూస్తే ఎవరైనా ఆశ్చర్యపోతారు, భయపడతారు, గగుర్పాటు కలుగుతుంది. అర్జునునికే గాదు, ఇప్పుడు సంజయుని పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఆ విశ్వరూపం యొక్క కాంతి ఎలా ఉందో సంజయుడు వర్ణిస్తున్నాడు. వేలకొద్దీ సూర్యుళ్ళు ఆకాశంలో ఒక్కసారిగా వెలిగితే ఎంతకాంతి ఉంటుందో ఆ విశ్వరూపం యొక్క కాంతి అంతగా ప్రకాశిస్తున్నది. సాధారణంగా ఎవ్వరైనా ఒక్క సూర్యుని కాంతినే చూస్తారు. ఆ కాంతిని చూడలేకనే కళ్ళు మూసుకుంటారు; ఒక్కొక్కసారి కళ్ళు చికిలించుకొని చూస్తారు. మరి అలాంటిది వేలకొద్దీ సూర్యుళ్ళు ఆకాశంలో ఒక్కసారిగా కనిపిస్తే ఎలా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉంటుంది? చూడటం కాదు గదా! అటువైపుకు తల త్రిప్పటానికి కూడా ధైర్యం చాలదు. ఐతే అర్జునుడు, సంజయుడు దివ్యదృష్టిని పొందినవారు. కనుక వారు దివ్యరూపాన్ని, దివ్యకాంతిని చూడగలరు. అట్టి దివ్యదృష్టి గల సంజయుడే ఆ కాంతిని ఒక్కసారిగా చూడలేకనే ఏమో ఆ విశ్వరూపాన్ని ఒక్కసారిగా వర్ణించలేకపోతున్నాడు. ఉపనిషత్తులలో ఆత్మను వర్ణించిన సందర్భాలలో కూడా కోటిసూర్య సమప్రభా తేజుడు అని వర్ణిస్తారు. ఆ విశ్వరూపాన్ని ఇంకా ఏమని వర్ణిస్తున్నాడు సంజయుడు?

యుద్ధరంగ మధ్యంలో భగవానుడు అర్జునునికి చూపించిన విశ్వరూపాన్ని సంజయుడు ధృతరాష్ట్రునికి వివరిస్తూ ఆ రూపం ఎలా ఉన్నదో, అందులో ఏమేమి ఉన్నాయో వర్ణించి, దానిని అర్జునుడు ఎలా చూస్తున్నాడో తెలియజేయబోతున్నాడు.

**శ్లో||** తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకథా|
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా|| **(13)**

**శ్లో||** తతస్స విస్మయా విష్టః హృష్టరోమా ధనంజయః|
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత|| **(14)**

**తా||** అప్పుడు అర్జునుడు అనేక విధాలుగా విభజించబడియున్న సమస్త జగత్తును దేవదేవుడైన శ్రీకృష్ణుని శరీరంలో ఒక్కటిగా చూచాడు (13).



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** దానితో అర్జునుడు గగుర్పాటుతో పులకరించిపోయి, ఆశ్చర్యంలో మునిగిపోయి, ఆ విశ్వరూపానికి శిరస్సువంచి నమస్కరించి, అంజలి ఘటించి ఇలా అంటున్నాడు (14).

**వ్యాఖ్య:-** ఈ జగత్తంతా అనేక విధాలైన రూపాలతో, జీవుళ్ళతో, చర, అచరాలతో, చెట్లు చేమలు, కొండలు పర్వతాలు, సూర్యచంద్రులు, నక్షత్రాలు, జంతువులు, పశుపక్ష్యాదులతో అనేక విధాలుగా విభాగించబడి యున్నది. అలా నానావిధాలుగా విభాగించబడియున్న ఈ జగత్తునంతటిని అర్జునుడు దేవదేవుడైన శ్రీకృష్ణుని శరీరంలో ఒక్కటిగా చూస్తున్నాడు. జగత్తు అనేక రూపాలతో ఉన్నా పరమాత్మ మాత్రం ఒక్కటే. ఏకం, అద్వయం, అవిభక్తం. కనుక ఈ జగత్తు అంతా ఒక్కటిగా అక్కడ కనిపిస్తున్నది. ఇలా అనేకత్వాన్ని ఏకత్వంగా చూడటం ఈ కన్నులకు సాధ్యం కాదు. అది జ్ఞానదృష్టికే సాధ్యం.

ఈనాడు రసాయనిక శాస్త్రవేత్తలు ఈ జగత్తులోని అంతులేని ధాతువులన్నింటిని 103 గా గుర్తించారు. అయితే ఇటీవల ఈ 103 ధాతువులు కూడా 3 పరమాణువులేనని తేల్చి చెప్పారు. అవే ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్. ఈ మూడు తెలిస్తే బ్రహ్మాండం అంతా తెలిసినట్లే. ఇలా భిన్నత్వాన్ని ఏకత్వంలో శాస్త్రవేత్తలు చూడగలుగుతున్నారు జ్ఞానదృష్టితో - వైజ్ఞానిక దృష్టితో.

అలాగే ఇక్కడ అర్జునుడు కూడా శ్రీకృష్ణుని అనుగ్రహంతో దివ్యదృష్టిని - జ్ఞాననేత్రాలను పొందగానే సమస్త బ్రహ్మాండాన్ని భగవంతుడైన శ్రీకృష్ణునిలో ఒక్కటిగ, ఒక్కచోట చూస్తున్నాడు. భిన్నభిన్నాలుగ ఉన్న జగత్తులోని

వస్తువులను అఖండంగా - ఒక్కటిగా చూచేసరికి అర్జునునికి ఎక్కడ లేని ఆనందం, ఆశ్చర్యం కలిగింది. ఎందుకంటే -

అఖండత్వం మంగళకరం. ఖండత్వం (అనేకత్వం) అమంగళం. గోళ్ళుకాని, వెంట్రుకలు గాని శరీరంతో కలిసి ఉంటే మంగళకరం - అందం. వాటికి గౌరవం, పూజ్యత ఉంటుంది. శరీరం నుండి విడిపోతే అమంగళం - అసహ్యం. అఖండదర్శనం దివ్యనేత్రంతోనే చూడగలం. చర్మచక్షువులతో చూడలేం.

ఒకగొప్ప మట్టిచెట్టు ఉన్నది. అది కొన్ని మైళ్ళదూరం వ్యాపించియున్నది. అది ఇంతగా పెరగక ముందు చిన్నమొక్కగా ఉన్నది. అంతకుముందు సూక్ష్మమైన విత్తనంగా ఉన్నది. అంటే ఇంత విశాలమైన చెట్టు, గొప్పకాండము, మైళ్ళకొద్దీ వ్యాపించిన ఊడలు, కొమ్మలు, ఆకులు, కాయలు - అన్నీ ఆ చిన్న విత్తనం నుండే వచ్చాయి. అంటే అవి అన్నీ సూక్ష్మరూపంలో ముందే ఆ విత్తనంలో ఉన్నాయి. శాస్త్రజ్ఞుడు వృక్షం యొక్క అన్ని భాగాలు ఆ చిన్న విత్తనంలోనే ఉన్నట్లు వైజ్ఞానదృష్టితో గ్రహిస్తాడు. అలాగే అర్జునుడు బ్రహ్మాండం అంతా భగవంతునిలో ఒక్కచోటనే ఉన్నట్లు దివ్యదృష్టితో చూడగలుగుతున్నాడు. అది ఎంతో అద్భుతంగా, ఆశ్చర్యంగా ఉంది. అది చూస్తున్న కొద్దీ అతడి శరీరంలో మార్పులు కలుగుతున్నాయి. అలాగే అతడి మనస్సులో అనేక భావాలు ఉవ్వెత్తున ఎగసిపడుతున్నాయి. వాటన్నింటిని దివ్యదృష్టి వల్ల గ్రహించగలిగిన సంజయుడు ధృతరాష్ట్రునితో అర్జునుని పరిస్థితిని, శారీరక మానసిక స్థితిని వర్ణించబోతున్నాడు.

అద్భుతమైన విశ్వరూపాన్ని చూడటంతోనే అర్జునుడు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. ఏదైనా వినేటప్పుడు వేరుగా ఉంటుంది. కాని విన్న విషయాన్ని ప్రత్యక్షంగా కంటితో చూచేటప్పుడు వేరుగా ఉంటుంది. ఇప్పుడు అర్జునుని పరిస్థితి ఇదే. ఆశ్చర్య చకితుడౌతున్నాడు. విస్మయం చెందుతున్నాడు. శరీరంలో గగుర్పాటు కలుగుతున్నది. శరీరంపై రోమాలు ఆనందంతో, పులకరింతతో నిక్కబొడుచుకున్నాయి. ఇది శరీరస్థితి. ఇక మనస్సులో దిగ్భ్రమ, ఆశ్చర్యం కలిగింది. ఇది మనోస్థితి. ఈ స్థితిలో ఆ రూపం పట్ల గొప్పభక్తి కలిగింది. వినయం, వినమ్రత అధికమైనవి. దానితో రెండు చేతులు జోడించి, అంజలి ఘటిస్తున్నాడు. అందుకే శిరసాప్రణమ్య - శిరస్సు వంచి నమస్కరిస్తున్నాడు - అన్నాడు.

కొందరు మస్కా కొట్టటానికే నమస్కారాలు చేస్తుంటారు. కొందరు కారం కొట్టటానికే నమస్ కారం అంటారు. కొందరు కాకాపట్టి తమపని పూర్తిచేసుకోవటానికి నమస్కారాలు పెడతారు. కొందరు పీడ వదిలించుకోవాలని నమస్కారమయ్యా బాబూ! ఇక వెళ్ళు! అంటారు.

కాని భగవంతునికి భక్తుడు చేసే నమస్కారం అలాంటిది కాదు, కాకూడదు. తనను తాను సమర్పించుకొనటమే నమస్కారం. 'నమమ' అంటే 'నాదేం లేదు, నిన్నే నమ్ముకున్నాను, నీవే దిక్కు' అనియే. కనుక ఈ నమస్కారం వందనం. చందనం లాగా చల్లగా ఉండేది వందనం.

రాయబార సమయంలో ధృతరాష్ట్రుని నిండు సభలో శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని చూపాడు. ఆ రూపాన్ని చూడగల నారదాది మహర్షులు

ఎంతో పారవశ్యంతో చూచి ఆనందించారు. ఆ రూపాన్ని చర్మచక్షువులతో చూడలేని దుర్యోధనాదులు ఎక్కడి వాళ్ళక్కడ కళ్ళుమూసుకొని పడిపోయారు. లేచిన తరువాత దుర్యోధనుడు ఆ విశ్వరూపాన్ని 'కనికట్టు' అన్నాడు. ఇలాంటి గారడీలు మేమూ చేయగలం అన్నాడు. అయితే ఇక్కడ అర్జునునికి మాత్రం ఈ విశ్వరూపం 'కనువిప్పు' అయింది. దుర్యోధనునికి కనికట్టు అయిన విశ్వరూపం అర్జునునికి కనువిప్పు. మతి ఎంతో గతి అంత గదా!

విశ్వరూపాన్ని చూచి శిరస్సు వంచి నమస్కరించిన అర్జునుడు ఆ విశ్వరూపదేవుని స్తోత్రం చేస్తున్నాడు. ఈ స్తోత్రం 'సమాధి' భాషలో చేయటం జరిగింది. ఇది ఉత్కృష్టమైన స్థవరాజం (స్తోత్రపాఠం) ఇది కావ్యభాషలో రచింపబడినది. అద్భుతమైన ఈ శ్లోకాలను కేవలం పఠించినా చాలు పాపాలు పోతాయి, హృదయానికి ఊరట కలుగుతుంది. కనుకనే భక్తులకు అత్యంతప్రియమైన అధ్యాయం ఇది.

విశ్వరూప సందర్శనం అనే టాబ్లెట్ (Tablet) గొప్పటాబ్లెట్. అర్జునుని జీవితంలో ఒకే ఒక్కసారి వాడాడు ఈ టాబ్లెట్ ను భగవానుడు. ఈ టాబ్లెట్ వచ్చిన జబ్బును నయంచేయటమే కాదు. తిరిగిరాకుండా చేసేది కూడా.

అర్జునుని మాటలతో శృతి కలిపి తన్మయత్వంతో, పారవశ్యంతో మనం కూడా భగవంతుని కీర్తిద్దాం. అర్జునుని భావాలను అర్థం చేసుకుందాం. విశ్వరూపాన్ని దర్శించి, ఆ రూపాన్ని వర్ణించిన అర్జునుని మాటల ద్వారా ఆ విశ్వరూపం ఎలా ఉందో తెలుసుకుందాం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇంతవరకు అర్జునుని మాటలను సంజయుడు ధృతరాష్ట్రునికి వినిపించాడు. కురుక్షేత్ర యుద్ధ భూమిలో భగవానుడు చూపిన విశ్వరూపాన్ని చూచి అర్జునుడు ఏమంటున్నాడో అర్జునుని మాటల్లోనే వినాలంటే మళ్ళీ మనం కురుక్షేత్రయుద్ధ భూమికి బయలుదేరాలి. పదండి!

భగవానుని విశ్వరూపాన్ని చూస్తూ ఆశ్చర్యసంభ్రమాలలో మునిగి పోయిన అర్జునుడు ఆ రూపంలో ఏమేమి ఉన్నాయో వర్ణిస్తున్నాడు.

**అర్జున ఉవాచః-**

**శ్లో||** పశ్యామి దేవాం స్తవదేవ! దేహే సర్వాం స్తథా భూత విశేష సంఘాన్|

బ్రహ్మాణ మీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్|| (15)

**శ్లో||** అనేక బాహు దర వక్త్ర నేత్రం పశ్యామిత్వాం సర్వతోఽనంత రూపం|

నాంతం నమధ్యం న పునస్త వాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! || (16)

**శ్లో||** కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తి మంతం|

పశ్యామిత్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలార్క ద్యుతి మప్రమేయం|| (17)

**తా||** అర్జునుడంటున్నాడు: దేవా! నీ దేహంలో అందరు దేవతలను, అన్ని ప్రాణుల సముదాయాలను, పద్మాసనంలో ఉన్న శక్తిమంతుడైన బ్రహ్మదేవుని, ఈశ్వరుని, అందరు ఋషులను, దివ్యమైన సర్పాలను చూస్తున్నాను (15).

**తా||** అనేకమైన బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రాలతో కూడిన నీ అనంతమైన రూపాన్ని సర్వత్రా చూస్తున్నాను. ఓ విశ్వరూపా! విశ్వేశ్వర! నీ ఆది, మధ్య, అంతము లేవీ నాకు కనిపించటం లేదు(16).

**తా||** కిరీటం, గద, చక్రంతో తేజోపుంజంలా అంతటా వెలుగుతున్నావు . ప్రజ్వలిస్తున్న అగ్నిజ్వాలలతో, సూర్యుని కాంతిలాగా అంతటా ప్రకాశిస్తున్న నిన్ను చూడశక్యం కావటం లేదు(17).

**వ్యాఖ్య:-** విశ్వరూపాన్ని సాక్షాత్తుగా దర్శిస్తున్న అర్జునుని మాటలను వింటే ఆ విశ్వరూపం ఎలా ఉందో మనం అర్థం చేసుకోవచ్చు. అద్భుతమైన మంత్రశక్తి గల ఈ శ్లోకాలు (15 నుండి 31 వరకు) సమాధిభాషలో ఉన్న స్తవరాజం. ఈ శ్లోకముల పారాయణం అత్యంత పుణ్యప్రదం.

దేవ! :- శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని దేవా! అని సంభోదిస్తున్నాడు అర్జునుడు. దేవ అంటే స్వామీ! అని, భగవంతుడా! అని. అంతేగాక కాంతివంతమైనది అని కూడా. ఇలా అర్జునుడు సంభోదిస్తూ ఆ రూపంలో ఏమేమి ఉన్నాయో చెబుతున్నాడు. సమస్త దేవతలను, సమస్త భూతరాసులను - ప్రాణికోట్లను, కమలంలో కూర్చొనియున్న సృష్టి కర్త బ్రహ్మదేవుని, పరమశివుని, ఋషులందరిని, దివ్యమైన సర్పములను - నీ దేహంలో చూస్తున్నాను అంటున్నాడు అర్జునుడు. వీటిని విశ్లేషించి చూస్తే ఏం తెలుస్తున్నది? -

విశ్వరూపంలో ఈ లోకంలోని విషయాలనే గాక అన్ని లోకాలలోని విషయాలను - అంటే 7 ఊర్ధ్వలోకాలు, ఏడు అధోలోకాలలోని విషయాలను కూడా ఇక్కడే దర్శిస్తున్నాడు అర్జునుడు. 1.స్వర్గలోకంలో ఉండేవారు దేవతలు, 2. సత్యలోకంలో ఉండేవాడు బ్రహ్మదేవుడు, 3. కైలాసంలో ఉండేవాడు పరమశివుడు, 4. బ్రహ్మలోకం మొదలు భూలోకం వరకు ఉండేవారు ఋషులు, 5. భూలోకంలో ఉండేవి సమస్త భూతాలు, ప్రాణికోట్లు -



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనుష్యులు, జంతువులు, పక్షులు, క్రిమికీటకాలు, చెట్లు చేమలు మొదలైనవి. ఇక అధోలోకాలలో ఉండేవి సర్పాలు - నాగులు. ఈ అన్నింటిని చూస్తున్నాడు అర్జునుడు. ఇలా బ్రహ్మదేవుని మొదలు పాతాళంలోని సర్పాల వరకు వర్ణించి, ఇప్పుడు ధైర్యవంతుని కూడా అధైర్యపరిచే ఆ విశ్వరూపాన్ని వర్ణిస్తున్నాడు. ఏమని?

ఓ విశ్వేశ్వర! విశ్వరూప! ఎన్నో భుజాలు, ఎన్నో ఉదరాలు, ఎన్నో ముఖాలు, ఎన్నో కళ్ళు - అన్నీ నీవే అయిన అనంతరూపాన్ని చూస్తున్నాను.

ఒక రాతి యందు చెక్కిన తల, మొల, కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు - అన్నీ ఆ రాయే అయినట్లుగా విశ్వంలో కనిపించే అన్ని రూపాలు ఆ విశ్వరూపునివే. అసలు విశ్వంలో అనేకం లేవు. అయినా అనేకంగా కనిపిస్తాయి. ఉన్నది ఒక్కటే. ఒక్కడే అనేక రూపులుగా కనిపిస్తుంటాడు.

అందువల్ల ఈ కనిపించే అనేక రూపాలలో ఏ రూపానికి సేవచేసినా భగవంతునికి సేవచేసినట్లే. ఎవరికి ఒక ముద్ద పెట్టినా ఆ భగవంతుని పొట్టలో వేసినట్లే. ఎవరికి ఏమిచ్చినా ఆ భగవంతునికి ఇచ్చినట్లే. ఎవరిని తిట్టినా భగవంతుని తిట్టినట్లే. ఎవరికి ద్రోహం చేసినా భగవంతునికి ద్రోహం చేసినట్లే. ఈ విశ్వం అంతా భగవంతుని శరీరం. అందుకే 'మానవసేవయే మాధవసేవ' అన్నారు. కేవలం మానవులకే గాదు, ప్రపంచంలో ఏ ప్రాణికి సేవచేసినా అది భగవంతుని సేవయే. అంతేకాదు. 10మందికి సేవచేసే కన్నా ఒక్కరికి అపకారం చేయటం ఘోరమైన నేరం.

ఉత్తరదేశంలో ఒక గొప్ప ఇంద్రజాలికుడున్నాడు. ఒక నగరంలో ప్రదర్శన ఏర్పాటు చేశాడు. నగర ప్రముఖులతో పాటు తండోపతండాలుగా జనం హాజరయ్యారు. అతడు స్టేజీ మీదకు వచ్చాడు. అతడి ప్రక్కనే అతడి 5 ఏండ్ల కుమారున్నాడు. ఆ ప్రక్కనే ఒక బుట్ట ఉన్నది. చుట్టూ జనసమూహం. అందులో ఒక యూరోపియన్ మెడలో కెమేరాతో ఉన్నాడు.

ప్రదర్శన ప్రారంభమైంది. అందరూ జాగ్రత్తగా చూస్తున్నారు. యూరోపియన్ మాత్రం తన కెమేరాతో ఈ విచిత్రాలను ఫోటోలు తీస్తున్నాడు. ఇంద్రజాలికుడు బుట్టలో నుండి త్రాడు తీశాడు. ఒక కొసపట్టుకొని రెండవకొనను పైకి ఎగరేశాడు. అది కర్రలాగా నిలబడి పోయింది. కొడుకును ఆ కర్ర పైకి ఎక్కమన్నాడు. కొడుకు గబగబా ఎక్కేశాడు. వాడు ఎక్కిన తర్వాత ఆ ఇంద్రజాలికుడు అగ్గిపుల్ల గీచి ఆ త్రాడును అంటించాడు. త్రాడు, త్రాడుతో బాటు పైకెక్కిన వాడి కొడుకు తగలబడి బూడిదగా మారారు. యూరోపియన్ మాత్రం ప్రతి ఫోజును క్లిక్ మనిపిస్తున్నాడు. దాదాపు 50 ఫోటోలు తీశాడు. అందరూ నిశ్చేష్టులై చూస్తున్నారు. ఇంతలో ఇంద్రజాలికుడు తన కొడుకుని పేరు పెట్టి పిలిచాడు. ఆ పిల్లవాడు జనంలో నుండి పరుగెత్తుకుంటూ వచ్చి స్టేజీ ఎక్కి తండ్రి ప్రక్కన నిలబడ్డాడు. అందరు నోళ్ళు వెళ్ళబెట్టారు. ఆనందంలో ఆహా! ఓహో! అన్నారు.

ఆ యూరోపియన్ తాను తీసిన ఫోటోలన్నింటిని ప్రింట్ వేయించాడు. అన్ని ఫోటోలు, అన్ని ఫోజులు ఒక్కటే. తండ్రీ కొడుకులు స్టేజీ మీద నిలబడి ఉన్న ఫోజు తప్ప ఆ ఫోటోలలో ఇంకేమీ లేదు. త్రాడూ లేదు, కర్రాలేదు,

కొడుకు ఎక్కటం లేదు, తగలబడటం లేదు, చివరకు జనంలో నుండి రావటం గాని - ఏదీ లేదు.

అంటే ఇంద్రజాలకుడి మాయ (గారడీ) చూచేవారి కన్నులను కట్టి వేసిందే గాని కెమేరా లెన్సును కట్టలేకపోయింది. చూచేజనం దృష్టిలో అనేక సీన్లున్నాయి. కాని కెమేరా దృష్టిలో మాత్రం ఒక్కటే సీను. ఎందుకిలా?

నిజంగా అక్కడున్నది ఒక్కటే సీను. తండ్రీ కొడుకులు స్టేజీపై నిలబడి ఉండటం. కాని జనం మాత్రం అనేక సీన్లు చూశారు. ఇదే కనికట్టు - కన్నుకట్టి వేయటం - గారడీ - మాయ - ఇంద్రజాలం.

అలాగే ఉన్నది ఒక్కటే రూపం. విశ్వరూపం. అయినా మాయాప్రభావంలో, అజ్ఞానంలో ఉన్న మనకు అనేక రూపాలుగా కనిపిస్తున్నది. ఆ మాయ జ్ఞానిని ఆవరించదు. అజ్ఞానిని మాత్రమే ఆవరిస్తుంది. అక్కడ జనులందరిని ఆవరించిన మాయ కెమేరాలెన్స్ ను ఆవరించలేనట్లు.

కనుక ఇక్కడ కనిపించే జగత్తు మిథ్య. నిజంగా లేకపోయినా ఉన్నట్లు కనిపిస్తుంది. సత్యమైనది బ్రహ్మమొక్కటే. కనుక బ్రహ్మసత్యం జగన్మిథ్య. ఆ ఉన్న బ్రహ్మానికి - పరమాత్మకు మొదలూ కనిపించటం లేదు, చివరా కనిపించటం లేదు. మధ్యభాగం ఏదో కనిపించటం లేదు. కనుక ఆద్యంతాలు తెలియటం లేదంటున్నాడు అర్జునుడు.

ఇంకా ఆ విశ్వరూపాన్ని వర్ణిస్తున్నాడు అర్జునుడు. ఆ విశ్వరూపంలోని ఆయుధాలను వర్ణిస్తున్నాడు. ఎలా?

ఆ విశ్వరూపుడు వజ్రాలు పొదిగిన బంగారు కిరీటాన్ని ధరించి ఉన్నాడు. ఒక చేతిలో గద, మరొక చేతిలో సుదర్శన చక్రం ఉన్నాయి. రాజులు కిరీటాలను ధరిస్తారు. మరి ఈ విశ్వరూపుడు ఏ దేశానికి రాజు? ఈయన సమస్తబ్రహ్మాండాన్ని పాలించేవాడు. అందుకే గొప్ప కిరీటాన్ని ధరించియున్నాడు. ఇక చేతులలో గద, చక్రం రెండింటినే చెప్పినా, విశ్వరూపునికి అనేక చేతులు గనుక అనేక ఆయుధాలుంటాయి. అయితే ప్రధానమైనవి గద చక్రం అనే భావనతో చెప్పి ఉండవచ్చు. లేదా - విష్ణుమూర్తికి 4 చేతులు, 4 చేతులలో 4 ఆయుధాలు. అవే పద్మం - శంఖం - గద - చక్రం. సాధారణంగా లౌకిక ప్రపంచమే ప్రధానమని భగవంతుని వైపు తిరగక, జీవితాన్ని వ్యర్థం చేసుకొనే వారిని, తమోగుణంలో నిద్రించేవారిని మేలుకొలుపుటకే ఈ 4 చిహ్నాలు. ముందు పద్మంతో కొట్టి, తరువాత శంఖాన్ని ఊది, అప్పటికీ ప్రయోజనం కలగకపోతే గదతో మోది, చివరకు చక్రప్రహారం చేసి భగవంతుని వైపుకు త్రిప్పాలి. అందుకే ఈ 4 చిహ్నాలు 4 చేతులలో ఉంటాయి. మరిప్పుడు రెంటినే చెబుతున్నాడేమిటి? అర్జునుడు. ఇప్పటి విశ్వరూపం ప్రళయభయంకర రూపం. అందుకే ప్రళయ చిహ్నాలైన గద, చక్రాలే ప్రముఖంగా అర్జునునికి కనిపించి ఉండవచ్చు. ఇక ఈ విశ్వరూపం ఎలా ఉంది?

తేజోరాశిం సర్వతో దీప్తిమంతం:- వెలుగుతో నిండిఉన్నది. ఆ వెలుగు అంతటా ఉన్నది. సూర్యుని వెలుగు అంతటా ఉండదు. భూమిపై సగంలోనే పడుతుందికాని ఈ వెలుగు 'సర్వతో దీప్తి మంతం' - అంతటా - సర్వత్రా

ప్రకాశిస్తున్నది. ఎలా? వేలకొద్దీ సూర్యుళ్ళు ఆకాశంలో ఒక్కసారి కనిపిస్తే ఎలా ఉంటుందో అలాంటి ప్రకాశం. పైగా అది –

దుర్నిరీక్ష్యం:- చూడశక్యం గానిది. దివ్యనేత్రాలున్న అర్జునునికే చూడశక్యం కాకుండా ఉన్నది. అలాంటి కాంతిని సామాన్యులు అసలే చూడలేరు. అది సూర్యకాంతిలా ఉన్నది.

దీప్తానలార్కద్యుతం:- ప్రజ్వలిస్తున్న అగ్నిలాగా ఉన్నది.

అప్రమేయం:- సాటిలేనిది. అలాంటి ప్రకాశాన్ని పోల్చటానికి మరొకటి లేదు. ఇలా ఆ విశ్వరూపాన్ని చూస్తూ చూస్తూ ఒక నిర్ణయానికి వస్తున్నాడు.

**శ్లో||** త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానం|
త్వమవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా సనాతనస్త్వం పురుషోమతోమే|| (18)

**తా||** నీవు అక్షరుడవు. శ్రేష్ఠుడవు. తెలుసుకోదగిన వాడవు. ఈ విశ్వానికంతటికి గొప్పఆధారానివి. శాశ్వతమైన ధర్మరాక్షకుడివి. సనాతన పురుషుడివి నీవేనని నా అభిప్రాయము.

**వ్యాఖ్య:-** జ్ఞానం కలిగిన మనుష్యులు తాము చూచిన విషయాల నుండి, విన్న విషయాల నుండి, అనుభవానికి వచ్చిన విషయాల నుండి కొన్ని నిర్ణయాలకు వస్తుంటారు. అర్జునుడు తాను చూచిన విషయాల నుండి ఒక నిర్ణయానికి వస్తున్నాడు. ఏమిటా నిర్ణయాలు?

1. త్వం వేదితవ్యం పరమం అక్షరం:- నీవు తెలుసుకోదగిన అక్షర పరబ్రహ్మ స్వరూపుడవు. ఇది మొదటి నిర్ణయం. లోకంలో జన్మించిన మానవులందరూ

తెలుసుకోవలసిన సత్యం ఒక్కటే. అదే భగవంతుని గురించి తెలుసుకోవటం. ఏమని తెలుసుకోవాలి? భగవంతుడు అక్షరుడు, అంటే నశింపులేనివాడు; శాశ్వతంగా ఉండేవాడు - అని. ఎందుకు తెలుసుకోవాలి? మన యదార్థస్వరూపం పరమాత్మ స్వరూపమే గనుక పరమాత్మ అక్షరుడు అని తెలుసుకుంటే మనం కూడా అక్షరమైన వారమే - నశింపులేనివారమేనని తెలుస్తుంది. అంటే మనం నిత్యులం, శాశ్వతులం. దేహానికి అంతం ఉన్నదికాని ఆత్మనైన నాకు నశింపులేదు, అంతంలేదు. శాశ్వత ఆనందస్వరూపాన్ని అని తెలుస్తుంది. దేహభావనలో ఉన్నవాడికి కష్టాలు, దుఃఖాలు, బాధలు ఉన్నాయి. కాని ఆత్మభావనలో ఉన్నవాడికి కష్టాలు, బాధలు, దుఃఖాలు ఉండవు. కనుకనే 'వేదితవ్యం' తెలుసుకోవలసిన వాడు భగవంతుడు. ఇది మొదటి నిర్ణయం.

2. <u>త్వం అస్యవిశ్వస్య పరం నిధానం:-</u> నీవు ఈ సమస్త విశ్వానికి ఆధార భూతుడవు. ఇది రెండవ నిర్ణయం. ఈ విశ్వానికి ఆధారం భగవంతుడే.

మనం సముద్రం వద్దకు వెళ్ళి చూస్తే పైకి ఎగసిక్రిందపడే అలలు మనకు కనిపిస్తాయి. అలా నాట్యమాడే అలలకు ఆధారం ఏమిటి? సముద్రమే. సముద్రమే లేకపోతే అలలు ఉండవు. కనుక అలలకు ఆధారం సముద్రం. అలలు లేకపోయినా సముద్రం ఉంటుంది. కాని సముద్రం లేకుంటే అలలు ఉండవు. అలాగే విశ్వానికి ఆధారం భగవంతుడు. భగవంతునికి ఏ ఆధారం అక్కరలేదు. కాని భగవంతుడుంటేనే విశ్వం. విశ్వం లేకపోయినా భగవంతుడుంటాడు.

అదే విధంగా మనం చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రమపడతాం; భయపడతాం. ఇంతకీ నిజంగా అక్కడ పాము ఉందా? లేదు. అక్కడ నిజంగా ఉన్నది త్రాడే. త్రాడు లేకపోతే పాములేదు, భ్రమాలేదు, భయమూ లేదు. అలాగే ఈ ప్రపంచం మిథ్య - భ్రమ - అజ్ఞానంలో మాత్రమే కనిపిస్తుంది. అజ్ఞానం తొలగితే నిజంగా ఉన్న పరమాత్మే కనిపిస్తాడు. అప్పుడు ప్రపంచమూ లేదు, వికారాలూ లేవు. కనుక అజ్ఞానం కారణంగా కలిగిన భ్రమవల్ల కనిపిస్తున్న ఈ విశ్వానికి (ప్రపంచానికి) ఆధారం పరమాత్మే. అందుకే దివ్యనేత్రాలు పొందిన అర్జునుడంటున్నాడు ఈ సమస్త విశ్వానికి ఆధార భూతుడవు నీవే (పరమాత్మయే) అని. ఇది అర్జునుని రెండవ నిర్ణయం.

3. <u>త్వం అవ్యయ శాశ్వత ధర్మగోప్తః-</u> నీవు నాశనం లేని శాశ్వత ధర్మ రక్షకుడవు. ఇది మూడవ నిర్ణయం.

ధర్మం శాశ్వతమైనది. దానికి చావులేదు. ఐతే అప్పుడప్పుడు దుర్మార్గులు పెచ్చరిల్లి ధర్మాన్ని అణగత్రొక్కుతారు. ధర్మాన్ని ఆచరించే వారు లేనప్పుడు ఆచరణలో కనిపించకుండా పోతుంది. అప్పుడు ధర్మం మరుగున పడిపోతుందేగాని నశించిపోదు. అలా ధర్మం మరుగునపడిపోతున్న సమయంలోనే అట్టి ధర్మాన్ని ఉద్ధరించటానికి భగవంతుడు యుగయుగములందు తనను తాను సృజించుకొని అవతరిస్తుంటాడు. అందుకే భగవానుడు గీతలో "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" - అని చెప్పటం జరిగింది. ఇంతకూ ధర్మం అంటే ఏమిటి?

మానవుడు తరించటానికి భగవంతుడు కొన్ని నియమాలు ఏర్పాటు చేశాడు - అవే ధర్మాలు. అవి శాశ్వతమైనవి. వాటిని మనం తప్పక అనుసరించాలి. అసురులు, రాక్షసులు వాటిని వ్యతిరేకిస్తారు, అణగద్రొక్కుతారు. చివరకు నాశనమైపోతారు. అట్టి ధర్మాలను రక్షించేవాడు భగవానుడు. ఆయన కూడా శాశ్వతుడే. అందుకే "నాశనం లేని శాశ్వత ధర్మరక్షకుడవు నీవు" అని అర్జునుడు అంటున్నాడు. ఇది మూడవ నిర్ణయం.

4. త్వం సనాతనః పురుషః:- ఈ దేహం నవద్వార పురం. ఈ పురము నందంతటా వ్యాపించియున్న వాడే పురుషుడు. అతడే ఈ సమస్త విశ్వానికి ఆధారభూతుడు. అతడిని ఎక్కడ వెతకాలి? ఈ పంచకోశాల వెనుక, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ అనే కోశాలు ఐదు ఉన్నాయి. ఈ అయిదు కోశాలను ఒక్కొక్క కోశాన్ని తొలగించుకుంటూ లోపలికి వెళ్ళి వెతకాలి. అలా వెతికితే ఆ పంచకోశాల వెనుకనున్నసూక్ష్మాతి సూక్ష్మమై, సర్వవ్యాపకమై, స్వయం ప్రకాశమై, చైతన్య మాత్రమైన పురుషుని కనుగొనవచ్చును. ఆ పురుషుడే సమస్త విశ్వానికి ఆధారభూతుడైన పరమాత్మ అని తెలుస్తుంది. అంతవరకు అంతర్మథనం సాగాలి. అలా ప్రతి ప్రాణిలోను ఉండే ఆ చైతన్యమే - ఆ పురుషుడే సనాతన పురుషుడు. పురాతనుడు - ప్రాచీనుడు. ఎప్పటి నుండో ఉన్నవాడు, ఎప్పుడూ ఉండేవాడు. అతడే ఇప్పుడు అర్జునుని ఎదుట నిలిచిఉన్న విశ్వరూపధారి. 'నీవే సనాతన పురుషుడవు' - అనేదే అర్జునుని 4వ నిర్ణయం. ఎలా ఉంది ఆ విశ్వరూపం?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

విశ్వరూపాన్ని తన దివ్యనేత్రాలతో చూస్తున్న అర్జునుడు, ఆ రూపాన్ని, దాని ప్రకాశాన్ని వర్ణిస్తున్నాడు.

**శ్లో||** అనాది మధ్యాంత మనంత వీర్యం అనంత బాహుం శశి సూర్యనేత్రం|

పశ్యామిత్వాం దీప్త హుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతం|| 19

**తా||** ఆది, మధ్య, అంతాలు లేకుండా, అమితమైన శక్తి కలిగి, అనంతమైన బాహువులతో, సూర్యచంద్రులే నేత్రాలుగా, మండుతున్న అగ్నిలా ప్రకాశించే ముఖంతో, ఈ విశ్వాన్ని తపింపజేస్తున్న నిన్ను చూస్తున్నాను.

**వ్యాఖ్య:-** 1. అనాది మధ్యాంతం:- ఆది, మధ్య, అంతం లేకుండా ఉన్నది నీరూపం. విశ్వరూపాన్ని చూచేది దివ్యనేత్రాలతో. వర్ణించేది సామాన్య వాక్కుతో. ఆద్యంతాలు లేని విశ్వరూపాన్ని చిత్రకారులు సరిగ్గా గ్రహించలేదు. గ్రహించలేరు కూడా. అందుకే విశ్వరూపాన్ని సరిగ్గా చిత్రించలేక పోతున్నారు. ఆది, అంతంలేని రూపాన్ని ఆది, అంతాలు గల పటంలో ఎలా చిత్రించగలుగుతారు?

విశ్వరూపాన్ని భగవంతుని అనుగ్రహంతో, భక్తుడైన అర్జునుడు చూస్తున్నాడు. అక్కడ నిరంతరం సృష్టి, స్థితి, లయాలు జరిగిపోతున్నాయి. అందుకే అది అనాది, అనంతం. ఆది మధ్యాంత రహితం.

2. అనంతవీర్యం:- భగవంతుడు అనంతుడు, ఆయన శక్తి అనంతం. లోకంలో ఎక్కడ ఏ శక్తి ఉన్నా అది అంతా భగవంతుని నుండి వచ్చినదే. ఆయన శక్తికి పరిమితి లేదు. కొలతలు లేవు. ఊహకు అందేది కాదు.

**3. అనంత బాహుం:-** ఈ జగత్తులో ఉన్న జీవుళ్ళందరి చేతులు ఆయనవే. ఆయన యొక్క సత్తుతో తయారై, ఆయన యొక్క శక్తితో పని చేస్తున్నాయి. ఈ ప్రపంచంలో ఏ చెయ్యి పనిచేసినా ఆ చేతి వెనక ఉండే ప్రధానబలం ఆ పరమాత్మదే. అందుకే ఆయన అనంతబాహుం, అనేక బాహువులు గలవాడు.

**4. శశి సూర్యనేత్రం:-** ఆ విశ్వరూపం యొక్క కళ్ళు సూర్యచంద్రులు. సూర్యచంద్రుల సాయం ఉంటేనే మన కళ్ళు చూడగలుగుతాయి. ఆయన కళ్ళే సూర్యచంద్రులు గనుక ఆయన చూడటానికి ఇక ఏ వెలుగు, ఏ సాయము అవసరం లేదు. అంటే కాంతినే కన్నులుగా గలవాడు విశ్వరూపుడు.

ఆధ్యాత్మికంగా మరొక భావం ఉంది. సూర్యనేత్రం - చంద్రనేత్రం అంటే సూర్యదృష్టి - చంద్రదృష్టి అని. ప్రాపంచిక భావాలతో బహిర్ముఖులై జీవించేవారిది సూర్యదృష్టి. ఆధ్యాత్మిక భావాలతో అంతర్ముఖులై భగవంతుని కొరకు సాధన చేసేవారిది చంద్రదృష్టి. ఈ రెండూ ఆ విశ్వరూపునిలో ఉన్నాయి. వ్యక్తుల ఈ దృష్టులే విశ్వేశ్వరుని నేత్రాలు - అవే సూర్యచంద్రులు.

**5.దీప్త హుతాశవక్త్రం:-** ప్రజ్వలిస్తున్న అగ్ని లాగా ఉంది ఆ విశ్వరూపుని ముఖం. అగ్నిలా మండుతుంటే ముఖం నల్లగా మాడిపోదా? పోదు. ఎందుకంటే వాక్కుకు అధిష్టానదేవత అగ్ని. మాట్లాడుతుంటే వేడి పుడుతుంది. అంటే వాక్కు వల్ల అగ్ని పుడుతుంది. వాక్కు ముఖంలోనే ఉంటుంది. అందువల్ల అగ్నిలా ప్రజ్వరిల్లుతున్నది.

**6. స్వతేజసా ఇదం విశ్వం తపంతం:- ఈ విశ్వంలోని జీవుళ్ళకు వెలుగు, వేడి కావాలి. అది అంతా విశ్వరూపుని నుండే వస్తున్నది. అందుకే నీ తేజస్సుతో ఈ విశ్వాన్ని తపింపజేస్తున్నావు అంటున్నాడు అర్జునుడు. తపింపజేయటం అంటే బాధపెట్టటం కాదు. విశ్వంలోని జీవుళ్ళకు ప్రాణశక్తి కావాలి. తగినంత వేడి ఉండాలి. ఎంత? 98.4F. అంతకన్న ఎక్కువ ఉన్నా, తక్కువ ఉన్నా డాక్టరు దగ్గరకు వెళ్ళాల్సిందే. మరి ఇంత ఖచ్చితంగా మనకు ఎక్కణ్ణించి వస్తున్నది? సహజంగానే వస్తున్నది. సహజంగా వస్తే దాని విలువ తెలియదు మనకు? కృత్రిమమైన వాటిని తెచ్చుకున్నప్పుడే విలువ తెలుస్తుంది. కాలు లేకపోతే కృత్రిమకాలు తెచ్చుకుంటే విలువ తెలుస్తుంది. పళ్ళూడి పోతే కొత్తవి కట్టించుకున్నప్పుడు తెలుస్తుంది పళ్ళ విలువ. ఇక్కడా అంతే. ఈ 98.4 F అగ్ని ఆత్మశక్తి నుండే వస్తున్నది. అందుకే 'స్వతేజసా' అన్నారు. కనుక ఈ బాహ్య అంతర జగత్తులను ప్రకాశింపజేసేది ఆత్మతేజస్సే.**

**7. త్వాం పశ్యామి:- ఈ పైన చెప్పిన లక్షణాలు గలవానిగా 'త్వాం పశ్యామి' - నిన్ను చూస్తున్నాను. దీనిని బట్టి అర్జునుడు ఈ వాక్కులన్నీ ఆ విశ్వరూపాన్ని చూస్తూ పలికిన పలుకులే. అంతేగాని ఇవన్నీ ఆలోచించి వర్ణించిన వర్ణనలు కాదు. ఉన్నది ఉన్నట్లు చెప్పటమే.**

**ఇంకా ఈ విశ్వరూపాన్ని చూస్తూ ముల్లోకాలలోని వారు ఎలా స్పందిస్తున్నారో అర్జునుడు చూస్తూ చెబుతున్నాడు. ఏమని?**

**శ్లో||** ద్యావా పృధివ్యో రిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః|
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం త వేదం లోకత్రయం ప్రవ్యధితం మహాత్మన్|| 20

**శ్లో||** అమీహిత్వాం సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి|
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః|| 21

**శ్లో||** రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యాః విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ|
గంధర్వ యక్షా సురసిద్ధ సంఘాః వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే|| 22

**తా||** మహాత్మా! దివి నుండి భువి వరకు మధ్యలో ఉన్న ప్రదేశమంతా, అన్ని దిక్కులా నీవే వ్యాపించియున్నావు. నీ అద్భుతమైన ఈ ఉగ్రరూపం చూచి మూడులోకాలు భీతి చెందుతున్నాయి (20).

**తా||** ఈ దేవసంఘాలు నీలో ప్రవేశిస్తున్నాయి. కొందరు భయంతో అంజలి ఘటిస్తున్నారు. మహర్షి సిద్ధసంఘాలు స్వస్తి వాచకాలు పలుకుతూ అనేకమైన స్తోత్రాలతో నిన్ను ప్రశంసిస్తున్నారు (21).

**తా||** రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులు, మరుత్తులు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధసంఘాలు అన్నీ ఆశ్చర్యచకితులై నిన్ను చూస్తున్నారు (22).

**వ్యాఖ్య:-** విశ్వరూపాన్ని దివ్యనేత్రాలతో దర్శిస్తూ అర్జునుడిలా అంటున్నాడు. "భూమి ఆకాశాల మధ్యనున్న ప్రదేశమంతా - అన్ని దిక్కులా నీవు ఒక్కడవే వ్యాపించియున్నావు. నీ భయంకరమైన రూపం - అద్భుతమైన రూపం చూచి ముల్లోకాలు భయపడుతున్నాయి." జీవితంలో మొదటిసారిగా చూస్తున్నడు ఈ అద్భుతదృశ్యాన్ని. నిజంగా ఎలా వర్ణించాలో తెలియటం లేదు.

ఇంతకుముందు 'అనాది మధ్యాంత మనంతం' - ఆది, మధ్య, అంతం లేవు - అన్నాడు. అంటే మొదలు చివరలేవు. ఇప్పుడేమో భూమి, ఆకాశాల మధ్య ఉన్నది అన్నాడు. అన్ని దిక్కులా ఉన్నదంటున్నాడు. అంటే ఎటు చూచినా ఆరూపమే కనిపిస్తున్నది. ఆ రూపం తప్ప ఇంకేమీ కనిపించటం లేదు. తాను, తనతో పాటు సమస్త జగత్తు, అన్ని లోకాలు, అన్ని దిక్కులు, అన్ని ప్రదేశాలు, అన్ని కాలాలు, అన్ని జీవుళ్ళు, అన్ని అచరాలు - సర్వం అందులోనే దర్శనమిస్తున్నాయి. చూస్తున్న తాను కూడా అందులోనే ఉండటంతో అదొక చిత్రవిచిత్రంగా ఉన్నది. వర్ణనాతీతంగా ఉన్నది. ఒకసారి చెబితే తృప్తి కలగటం లేదు. ఎలా చెప్పాలో తెలియటం లేదు. అందుకే మళ్ళీ మళ్ళీ చెబుతున్నాడు, మార్చి, మార్చి చెబుతున్నాడు. దీనికంతటికి కారణం పరిమితబుద్ధితో అపరిమిత విశ్వరూపాన్ని వర్ణించలేకపోవటమే.

అట్టి రూపాన్ని చూస్తుంటే అర్జునునిలో భయం కలుగుతున్నది. కంపించిపోతున్నాడు. అందుకే అంటున్నాడు "తవ అద్భుతం - ఉగ్రం రూపం దృష్ట్వా లోకత్రయం ప్రవ్యధితం" - నీ అద్భుతమైన ఉగ్రరుపాన్ని చూచి ముల్లోకాలు భయపడి పోతున్నాయి . ప్రళయసమయంలో పరమాత్మ భయంకరమైన ఉగ్రరుపంలో ఉంటాడు. క్రోధంలో కూడా అంతే. హిరణ్యకశిపుని చీల్చి చంపివేసిన నరశింహస్వామి ఉగ్రరూపంతో ఉన్నాడు. ఆ రూపాన్ని చూచి బ్రహ్మాది దేవతలు కూడా ఎదురుగా రాలేక లక్ష్మీదేవిని ముందుకు నెట్టారు. రెండడుగులు వేసిన ఆమెకూ ధైర్యం చాలక ప్రహ్లాదుని ముందుకు నెట్టింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇప్పుడు అర్జునుడు చూస్తున్న విశ్వరూపం అలాగే ప్రళయభీకరంగా ఉన్నది. ఎందుకంటే ఇప్పుడు జరగబోయే కురుక్షేత్ర సంగ్రామం ప్రళయం లాంటిదే. యుద్ధఫలితాన్ని అర్జునునికి ముందే చూపాలి. అందుకే ఆ రూపం ఉగ్రం - అద్భుతం. అట్టి రూపాన్ని చూచి ముల్లోకాలు భయపడుతున్నాయి అంటున్నాడు అర్జునుడు. తనకెలా ఉందో అందరికీ అలాగే ఉంటుందని కావచ్చు. లేదా ముల్లోకాలు భయపడటాన్ని, వ్యధ చెందటాన్ని కూడా దర్శించియే చెప్పి ఉండవచ్చు. మొత్తం మీద ఆ విశ్వరూపం భయంకరమైనది.

ఆ భయంకరమైన విశ్వరూపంలో ఏమి జరుగుతున్నదో చూస్తూ చెబుతున్నాడు అర్జునుడు. ఏమని?

దేవసమూహాలన్నీ ఆ విశ్వరూపంలో ప్రవేశించి కనుమరుగై పోతున్నాయి. వీరంతా భోగజీవులు. వీరికి మరణం అంటే తెలియదు, గనుక తప్పించుకొనే ప్రయత్నం చేయనివారు. వీరు అధములు. వీరిలో కొందరు మధ్యములైన వారు దూరంగా నిలిచి భయపడి పోతున్నారు. ఆ భయంవల్ల కలిగిన భక్తితో ఆ రూపానికి అంజలి ఘటించి నమస్కరిస్తున్నారు. ఇలా భయం వల్ల కలిగిన భక్తితో నమస్కరించే వారు మధ్యములు. ఇక మహర్షులు, సిద్ధులైన వారు భయపడటం లేదు. వారు భక్తితో ఆ విశ్వరూపాన్ని స్తుతిస్తున్నారు, స్వస్తి వాచకాలు పలుకుతున్నారు. గొప్ప గొప్ప స్తోత్రాలతో, కీర్తనలతో స్తుతిస్తున్నారు. స్వస్తి - స్వస్తి అంటూ, సర్వేజనా సుఖినోభవంతు అంటూ, శాంతిః శాంతిః అంటూ స్వస్తి వాచకాలు పలుకుతున్నారు. వారికెందుకు భయం లేదు? వారు పరిపూర్ణ జ్ఞానులు, అచల ప్రతిష్టులు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వారికి తెలుసు ప్రళయకాలంలో పరమాత్మ భయంకర ఉగ్రరూపాన్ని ధరిస్తాడనీ, ఇప్పుడు ప్రళయం సమీపించినదనీ, ఈ ప్రళయం వల్ల తమకేమీ నష్టం వాటిల్లదనీ, పైగా లోకకళ్యాణం జరుగుతుందని. అందుకే వారు ఇదొక శుభపరిణామం అని ఆహ్వానిస్తున్నారు. వీరే ఉత్తములు.

ఇంకా ఈ విశ్వరూపాన్ని ఎవరెవరు ఆశ్చర్యంతో తిలకిస్తున్నారో తెలియజేస్తున్నాడు అర్జునుడు. ఎవరు వారు?

(i) రుద్రులు :- వీరే ఏకాదశ రుద్రులు. 11మంది. వీరు రోదించేవారు, రోదింపజేసేవారు. అందుకే రుద్రులు అన్నారు. సృష్టిని లయం చేసేది వీరే.

(ii) ఆదిత్యులు :- వీరే ద్వాదశాదిత్యులు. 12మంది. ఇందులో సూర్యుడు ప్రత్యక్షదైవం. వీరు వెలుగును ప్రసాదించేవారు. పోషించేవారు.

(iii) వసువులు :- వీరే అష్టవసువులు. 8మంది. వీరు ఋతువులకు అధిష్టాన దేవతలు. సాధనకు పనికి వచ్చే సద్వాసనలే వసువులు అని వేదాంతార్థం.

(iv) సాధ్యులు :- వీరు ఆకాశదేవతలు. పరమాత్మకు, మానవులకు మధ్య ఆకాశంలో నివసించేవారు. మానవుల ప్రార్థనలను భగవంతునికి చేరుస్తూ భగవంతుడిచ్చిన ఫలాలను మానవులకు అందిస్తారు. వీరిని యజ్ఞపురుషులని ఋగ్వేదం చెబుతున్నది. దశరథుడు పుత్రకామేష్టి చేసినప్పుడు పాయసం పాత్రను అందించిన యజ్ఞపురుషుడు సాధ్యులలోని వాడే. పూర్వసృష్టిలో సాధన చెయ్యగా ఏర్పడిన సద్వాసనలే సాధ్యులు - అని వేదాంతార్థం.

(v) విశ్వేదేవతలు :- వీరు 10మంది. కొంచెం తక్కువరకం దేవతలు అని ఋగ్వేదం చెబుతున్నది. సత్య, ధృతి, క్షమా - - - మొ||న గుణరూపులు వీరు.

**సమిష్టి వాసనలకు, సమిష్టి కర్మఫలాలకు అనుగుణంగా విశ్వాన్ని తయారుచేసి అందరికి అన్ని అనుభవాలను ఇచ్చేవారు - అని వేదాంతార్థం.**

**(vi) <u>అశ్వనీదేవతలు</u> :- వీరు ఇద్దరే. దేవలోకాల్లో వైద్యం చేసే డాక్టర్లు. వీరు అశ్వముఖులు. అంటే గుర్రం ముఖం గలవారు. ప్రపంచంలోని ద్వంద్వాలు వీరు. - ఇది వేదాంతార్థం.**

**(vii) <u>మరుత్తులు</u> :- వీరు 7గురు అని, 49 మంది అని రెండు రకాలుగా చెప్పబడ్డారు. వీరు వాయుదేవతలు. మెరిసేవారు. విషయవస్తువుల పైపై మెరుపులు వీరు. - ఇది వేదాంతార్థం**

**(viii) <u>ఊష్మపాః</u> :- ఊష్మపాయులు. వేడిని పానం చేసేవారు. పితృదేవతలు వీరు. శ్రాద్ధం పెట్టే రోజున వచ్చి అన్నం వేడిగా ఉన్నప్పుడే స్వీకరించేవారు. బహుశా వేడిగానున్న అన్నం నుండి పైకెగసే ఆవిరిలోని సువాసననే ఆ పితృదేవతలు ఆస్వాదిస్తారేమో! ఊష్మపాః అంటే ఉత్సాహాన్ని పుంజుకునేవి అని వేదాంతార్థం.**

**(ix) <u>గంధర్వులు</u> :- వీరు అందమైన స్త్రీలు, పురుషులు. గానం, నాట్యం మొ||న అన్ని కళలలోను ఆరితేరిన వారు. అందుకే గంధర్వగానం, గంధర్వనాట్యం అంటారు. వీరు దేవగాయకులు. గంధం మొ||న సువాసనలను స్వీకరించే జ్ఞానేంద్రియశక్తులు అనేది వేదాంతార్థం.**

**(x) <u>యక్షులు</u> :- వీరు చిత్రవిచిత్రమైన విద్యలలో ప్రావీణ్యులు. కుబేరుడు యక్షులకు ప్రభువు; ధనాధిపతి; దిక్పాలకుడు. యక్షులు అంటే భక్షించే వారు - అని వేదాంతార్థం.**

**(xi) అసురులు :- వీరే రాక్షసులు. రక్ష అంటే దాచుకోవటం. ఎప్పుడూ సంపాదించుకోవటం, దాచుకోవటం తప్ప ఇతరులకు ఏ విధంగాను ఉపయోగపడని వారు రాక్షస జాతివారు. (అసురజాతి) అని వేదాంతార్ధం.**

**ప్రకృతిలో చెట్లు, నదులు, సూర్యుడు, చంద్రుడు, భూమి, వాయువు, ఆవులు, గేదెలు, గురువులు, మహాత్ములు పరులకు ఏదో విధంగా ఉపయోగపడతారు. మనిషి మాత్రం అన్నింటినీ స్వీకరిస్తాడు. అందినంతవరకు జుర్రుకుంటాడు, బుద్ధి ద్వారా జ్ఞానాన్నీ అందుకుంటాడు. కాని విషం కక్కుతుంటాడు. ఇంత తెలివి మనషికొక్కడికే ఉన్నది. అసుర అంటే చెడ్డవాటిలో రమించేది అని అర్థం.**

**(xii) సిద్ధసంఘాః :- అన్ని విషయాలలోను పరిపూర్ణులు, మేధాశక్తి గలవారు. సాధనలో పరిపక్వత చెందినవారినే సిద్ధులు - సిద్ధి పొందినవారు - అంటారు.**

**ఇలా ఎవరు విశ్వరూపాన్ని దర్శిస్తున్నారో వారు తమలో ఉన్న భావాలకు, శక్తికి అనుగుణంగా ఆ రూపాన్ని తెలుసుకుంటున్నారు; విస్మితులౌతున్నారు.**

**- అసలు ఇంతటి భయానికి కారణమైన ఆరూపం ఎట్టిది?**

**శ్లో|| రూపం మహత్తే బహువక్త్ర నేత్రం మహాబాహో! బాహుబహూరు పాదం|**
**బహూదరం బహుదంష్ట్రా కరాళం దృష్ట్వాలోకాః ప్రవ్యధితా స్తథాఽహం|| 23**

**శ్లో|| నభః స్పృశం దీప్త మనేక వర్ణం వ్యాత్తాననం దీప్త విశాలనేత్రం|**
**దృష్ట్వా హిత్వాం ప్రవ్యధితాంత రాత్మా ధృతిం న విందామి శమంచ విష్ణో!|| 24**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని|
దిశోన జానేన లభేచశర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస!|| **(25)**

**తా||** మహాబాహో! అనేక ముఖాలతో; నేత్రాలతో; అనేక బాహువులు, ఊరువులు, పాదాలతో; అనేక ఉదరాలతో, భయంకరమైన కోరలతో ఉన్న నీ గొప్పరూపాన్ని చూచి లోకాలన్నీ తల్లడిల్లి పోతున్నాయి. అలాగే నేను కూడా.

**తా||** తెరుచుకొని ఉన్న నోళ్ళతో; ప్రజ్వలిస్తున్న విశాల నేత్రాలతో; ఆకాశాన్ని తాకుతున్న రూపంతో; అనేక రంగులతో ప్రకాశిస్తూ ఉన్న నిన్ను చూచి నా మనస్సు వ్యధ చెందుతున్నది. ఓ విష్ణూ! నిన్ను చూస్తూ ధైర్యాన్ని, శాంతిని పొందలేక పోతున్నాను.

**తా||** భయంకరమైన కోరలతో, ప్రళయ కాలాగ్నులలాగా ఉన్న నీ నోళ్ళు చూచి దిక్కుతోచటం లేదు. స్థిమితంగా ఉండలేక పోతున్నాను. ఓ జగన్నాథా! దేవేశా! ప్రసన్నుడవు కమ్ము.

**వ్యాఖ్య:-** అర్జునుడు చూస్తున్న రూపం విస్తారమైనది, విశాలమైనది, సర్వవ్యాపకమైనది, పరమ భయంకరమైనది, అద్భుతమైనది. అట్టి రూపాన్ని నిజంగా శ్రీకృష్ణుని ఆరడుగుల దేహంలో చూడటం కుదిరే పనికాదు. అదొక బృహత్ రూపం. ఐనప్పటికీ దానినంతా ఒక పరిమితమైన ఆకారంగా, ఒక నిశ్చితరూపంగా చూస్తున్నాడు అర్జునుడు. మనోదృష్టితో చూస్తున్నాడు. "వాడి మంచితనాన్ని నేను చూస్తూనే ఉన్నాను" అంటాం. నిజంగా మంచితనం కన్నులకు కనిపించేదా? కాదు. అది బుద్ధికి తెలిసేది. అలాగే బుద్ధి ద్వారా


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చూడబడుతున్నదే ఈ విశ్వరూపం. ఐతే బుద్ధి ద్వారా ఎంత బాగా గ్రహించినా చెప్పవలసి వచ్చేటప్పటికి పదాలు దొరకటం లేదు.

అనేక ముఖాలు, అనేక నేత్రాలు, అనేక బాహువులు, అనేక తొడలు, అనేక పాదాలు, అనేక ఉదరాలు, అనేక భయంకరమైన కోరలుగల గొప్పరూపాన్ని చూచి లోకాలన్నీ భయపడుతున్నాయి. 'తథా - అహం' - అలాగే నేను కూడా భయ కంపితుడనౌతున్నాను - అంటున్నాడు అర్జునుడు. మనస్తత్వ శాస్త్రం ప్రకారం ఇది నిజమే.

ఒక వ్యక్తి ఆవేశం - ఉద్రేకంతో ఊగిపోయే వ్యక్తుల మధ్య ఉన్నాడు. అప్పుడు తానూ అలాంటి గుణాలనే కలిగిఉంటాడు. ప్రశాంతము, గంభీరము, సౌమ్యము అయిన తాపసుల మధ్యనో, మునుల మధ్యనో, ఋషి పుంగవుల మధ్యనో ఉన్నాడనుకోండి. అప్పుడు అతడు కూడా అలాంటి గుణాలనే కలిగిఉంటాడు. పేకాట, త్రాగుడు, జూదం మొ||న అలవాట్లు గలవారి మధ్య ఉంటే వారి మాటలే అలవాటవుతాయి. ఇక ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడుకొనే వారి మధ్య ఉంటే ఆ మాటలే అలవాటు అవుతాయి. అందుకే అర్జునుడంటున్నాడు, 'ఈ విశ్వరూపాన్ని చూచి లోకాలన్నీ భయపడుతున్నాయి. ఆ లోకాల మధ్యనున్న నేనూ భయపడుతున్నాను' అని.

ఆ రూపం ఎంతో వైవిధ్యం గలది. ముఖాలు, నేత్రాలు, బాహువులు, పాదాలు, తొడలు, ఉదరాలు అనేకంగా ఉన్నాయి. మానవులకు, జంతువులకు, దాదాపు అన్ని ప్రాణులకు ఈ అవయవాలు ఉంటాయి. ఇవన్నీ నిజంగా ఆ పరమాత్మవే. ఎలా? విశ్వంలోని రూపాలన్నీ కలిస్తే విశ్వరూపుడయ్యాడు. కనుక

విశ్వంలోని ముఖాలన్నీ ఆయన ముఖాలుగా, విశ్వంలోని నేత్రాలన్నీ ఆయన నేత్రాలుగా, విశ్వంలోని పాదాలన్నీ ఆయన పాదాలుగా, విశ్వంలోని ఉదరాలన్నీ ఆయన ఉదరాలుగా దర్శిస్తున్నాడు. అందులో కొన్ని ముఖాలు కోరలతో భయంకరంగా ఉన్నాయి. అడవి పందులు, పులులు, సింహాలు, ఏనుగులు, పాములు - ఇవన్నీ రకరకాల కోరలతో ఉంటాయి. అందుకే ఈ కోరలన్నీ ఆ విశ్వరూపునిలో కనిపిస్తాయి. ఒక క్రూరజంతువు ఇతర జంతువులను తినటానికి నోరు తెరిచినప్పుడు అవి భయపడి కేకలు పెడుతుంటాయి. అలా భయపడిపోయే రూపాల మధ్యన ఉండి చూస్తున్న అర్జునుడు కూడా అందుకే భయపడిపోతున్నాడు.

అలా భయపడిపోతున్నట్లు చెప్పాడే కాని అలా చెప్పటం అతడికి కొంత నామర్దాగా ఉన్నది. ఎందుకంటే అతడు దేనికీ, ఎవరికీ భయపడని సుక్షత్రియ వంశంలో జన్మించినవాడు, మహావీరుడు. అందువల్ల తన భయానికి కారణాన్ని వెతుక్కొని తనను తాను సమర్థించు కోవాలనుకున్నాడు. అందుకే ఆ ఉగ్రరూపాన్ని వర్ణిస్తూ, ఇట్టి రూపాన్ని చూచినవారు ఎవరైనా సరే భయపడకుండా ఎలా ఉండగలరు? అనే సమర్ధనకు ప్రయత్నిస్తున్నాడు.

ఆ విశ్వరూపం ఆకాశాన్ని తాకుతున్నట్లుగా ఉన్నది. భూమి ఆకాశం మధ్యన అంతటా వ్యాపించి యున్నది. ఏదిక్కు వైపు చూచినా ఆ రూపమే. నిజంగా ఈ భూమి ఆకాశం రెండూ ఆ విశ్వరూపానికి పెదవులు. ఆ రెండు

పెదవులు తెరుచుకొని ఉన్నాయి. ఆ పెదవుల నడుమ సమస్త జగత్తు పుట్టి, లయమైపోతున్నది. ఒక్కసారి కాదు, అనేకసార్లు. అందుకే భయం.

పైగా ఆ రూపం ప్రజ్వలిస్తున్న అగ్నిహోత్రంలా ఉన్నది. అంటే విశ్వరూపంలో అనేక సూర్యమండలాలు, నక్షత్ర మండలాలు ఉన్నాయి. ఇవన్నీ మండుతున్న అగ్నిగోళాలే. సూర్యచంద్రులే విశ్వరూపుని నేత్రాలు గనుక ఆ రూపం యొక్క ముఖం ప్రజ్వలిస్తున్న అగ్నిలాగా ఉన్నది. ఇక నోళ్లన్నీ భయంకరంగా తెరుచుకొని ఉన్నాయి. మనం తినటానికి నోరుతెరుస్తాం. అలాగే ఇక్కడ ప్రళయ భయంకర రూపం సమస్తాన్నీ లయం చేసుకొనుటకు నోళ్ళు తెరుచుకొని ఉన్నాయి. ఇలా ప్రళయభయంకరరూపం, తెరుచుకున్న నోళ్ళు, జ్వలించే కన్నులు, అగ్నిహోత్రంలా ఉన్న ఆ రూపం చూస్తుంటే ధైర్యం సన్నగిల్లి పోతున్నది. శాంతిని, ధైర్యాన్ని కోల్పోతున్నాడు. మిక్కిలి వ్యధ చెందుతున్నాడు. సృష్టిలో పరస్పర వ్యతిరేకమైన లక్షణాలన్నీ ఒక్కచోట, ఒక్కసారిగా దర్శనమిస్తుంటే మనస్సు తల్లడిల్లిపోతున్నది. అందుకే విష్ణో! అని సంభోదన. విష్ణు అంటే సర్వవ్యాపకుడు అని అర్థం. సర్వత్రా వ్యాపించియున్న ఆ రూపాన్ని జగద్రూపంలో వర్ణిస్తున్నాడు.

విశ్వరూపుని ముఖాలు కోరల చేత భయంకరమైనవి. కాలాగ్నిని పోలియున్నవి. వాటిని చూస్తున్న అర్జునునకు దిక్కుతోచటం లేదు. స్థిమితం చిక్కటం లేదు. శాంతి దొరకటం లేదు. అందుకే ప్రార్థిస్తున్నాడు. ఓ జగన్నివాసా! దేవదేవా! ప్రసన్నుడవు కమ్ము -అని.

ఈ లోకంలో మనకు ఇష్టమున్న వస్తువులే కాదు, ఇష్టం లేనివి కూడా ఎన్నో ఉంటాయి. పులులు, సింహాలు, ఏనుగులు, కోతులు, మొసళ్ళు, పాములు మొదలైనవి. కోరలతో, గోళ్ళతో కూడినవి; విషపు కోరలుగలవి. వాటిని చూస్తే మనకు భయం కలుగుతుంది. అలాంటప్పుడు అనుకుంటాం, అసలు భగవంతుడు వీటి నెందుకు సృష్టించాడు? అని. కాని అవి కూడా భగవంతుని సృష్టియే. వాటిలోనూ భగవంతుడే చైతన్యంగా ఉన్నాడు అని తెలుసుకోవటానికి మనకు అనేక జన్మలు పడుతుంది.

మన దృష్టికి అవి క్రూరజంతువులు. మనం కనిపిస్తే, వాటిని మనం కదిలిస్తే అవి మనను కాటేస్తాయి, కొరికి చంపుతాయి, మ్రింగేస్తాయి. అయితే వాటి దృష్టిలో మనం కూడా క్రూరులమే కదా! ఎందుకంటే వాటంతట అవి మన జోలికి రాకపోయినా, మనకు కనిపించక పోయినా, వాటి దారిన అవి జీవిస్తున్నా, మనం వాటిని వేటాడాలనే నెపంతో అవి ఉన్నచోటుకు అడవికి మనమే వెళతాం. వేటాడతాం, బోనులలో బంధించి సర్కస్ లలోనూ, జంతుప్రదర్శనశాలల్లోను ప్రదర్శనకు పెట్టి బంధిస్తాం, బాధిస్తాం. వాటికీ భార్యాబిడ్డలుంటారు. వాటిని మనం బంధించేటప్పుడు, హింసించేటప్పుడు వాటికి సంబంధించిన జంతువులు - మృగాలు చూచి మనలను ఏమనుకుంటాయి? క్రూరులు అని అనుకోవా? ఇలాంటి దుర్మార్గులను మూగజీవాలను బంధించే, బాధించే, హింసించే ఈ కర్కోటకులను ఎందుకు పుట్టించావురా భగవంతుడా? అని అనుకుంటాయి గదా! కనుక ఒకరికి ఒకరం క్రూరులం - దుర్మార్గులం అవుతున్నాం. ఈ సంబంధాలను దాటి చూస్తే

అందరం జీవుళ్ళమే. అందరిలోను ఒకే పరమాత్మ ఉన్నాడు. అసలు అందరం పరమాత్మ స్వరూపులమే.

ఈ కోరలు గల జంతువులన్నీ నోళ్ళు తెరుచుకొని ఆ విశ్వరూపుని ముఖాలుగా దర్శనమిస్తున్నాయి. అందుకే ఈ కోరలతో కూడిన నీ భయంకరమైన ముఖాలను చూస్తుంటే దిక్కుతోచటం లేదు, శాంతి కలగటం లేదు అని భయపడిపోతున్న అర్జునుడు ప్రసన్నుడవు కమ్ము అని భగవంతుని ప్రార్థిస్తున్నాడు.

ఏం చేయాలో - ఎటు పోవాలో తెలియని స్థితియే దిక్కుతోచని స్థితి. అట్టి స్థితిలో మనశ్శాంతి ఉండదు. అందుకే జగత్తు అంతా నివాసంగా గలిగిన దేవదేవా! శాంతించు! ప్రసన్నుడవుకా! అని అహంకారాన్ని, దంభాన్ని విడిచి ప్రార్థిస్తున్నాడు. ఎదటివాని గొప్పతనం, తన అల్పత్వం ఎవరు తెలుసుకుంటారో వారి నుండే నిజమైన ప్రార్థన వస్తుంది.

ఇంతవరకు విశ్వరూపం ఎలాంటిదో, అందులో ఏమేమి ఉన్నాయో, ఆ రూపం ఎంత భయంకరంగా ఉన్నదో, తానేగాక ముల్లోకాలు ఎలా భయపడుతున్నాయో అర్జునుడు వర్ణించాడు. ఇక రాబోయే 5 శ్లోకాలు ఈ జరగబోయే యుద్ధంలో జయాపజయాలు ఎవరివో నిశ్చయమై పోయిన విషయాన్ని భగవానుడు ప్రదర్శిస్తున్నాడు.

**శ్లో||** అమీచత్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వేసహైవావని పాల సంఘైః|
భీష్మోద్రోణ స్సూత పుత్రస్తథాఽసౌ సహాస్మదీయై రపి యోధ ముఖ్యైః|| **26**

**శ్లో||** వక్త్రాణితేత్వర మాణా విశంతి దంష్ట్రా కరాళాని - భయానకాని|

కేచిద్విలగ్నా దశనాంతరేషు సంధృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః|| **27**

**తా||** ఈ ధృతరాష్ట్రపుత్రులు (దుర్యోధనాదులు) ఇతర రాజ సమూహాలతో సహా; ఇంకా భీష్ముడు, ద్రోణుడు, సూతపుత్రుడైన కర్ణుడు; మావాళ్ళలో కూడా ముఖ్యమైన యోధులు అంతా కోరలచేత భయంకరంగా ఉన్న నీ నోళ్ళలోకి త్వరపడుతూ ప్రవేశిస్తున్నారు. కొందరు నీ పళ్ళ సందులలో చిక్కుకున్న వారై పచ్చడి ఐపోయిన తలలతో కనిపిస్తున్నారు. (26- 27)

**వ్యాఖ్య:-** విశ్వరూపంలో సమస్త బ్రహ్మాండం ఉన్నది. అన్ని లోకాలు ఉన్నాయి. దేవతలు, మానవులు, యక్షకిన్నెర కింపురుష గంధర్వాదులున్నారు. అంతేకాదు భూతకాలంలో జరిగిపోయినవి, వర్తమానంలో జరుగుతున్నవి, భవిష్యత్తులో జరగబోయేవి అయిన సంఘటనలన్నీ కనిపిస్తున్నాయి. అక్కడ భూతభవిష్యత్ వర్తమానాల తేడా కూడా లేదు. భవిష్యత్తు అంతా వర్తమానం లాగా, వర్తమానం అంతా భూతకాలం లాగా కలగలసిపోయినవి.

మొదట్లో అర్జునుడు విషాదంలో మునిగి యుద్ధం చేయనన్నాడు. అసలు ఈ యుద్ధంలో మనమే జయిస్తామో - వారే జయిస్తారో తెలియదు అన్నాడు. కాని భగవానుడు మాత్రం యుద్ధం అనేది నీ కర్తవ్య కర్మ. జయాపజయాలతో సంబంధం లేకుండా నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించాలి అన్నాడు. కేవలం అప్పుడు అన్నాడు; ఇప్పుడు ప్రత్యక్షంగా యుద్ధఫలితాన్ని అర్జునుడు దర్శించేటట్లు చేయాలనుకున్నాడు. అందుకే ఈ సందర్భాన్ని చక్కగా వాడుకున్నాడు.

ఈ సమస్త జగత్తు భగవానుని స్థూలదేహం. దానిలోపల సూక్ష్మదేహం. అక్కడ జరిగేదంతా ఈ స్థూల జగత్తులో వ్యక్తమవుతుంది. అంటే జగత్తులో ఏం జరగబోతోందో అది అంతా సూక్ష్మంలో ముందే కనిపిస్తుంది. కనుక భవిష్యత్తులో జరగబోయే యుద్ధంలో వచ్చే ఫలితాన్ని అర్జునుడు వర్తమానంగా - ప్రత్యక్షంగా ఆ విశ్వరూపంలో చూస్తున్నాడు. ఏం చూస్తున్నాడు?

తన శత్రుపక్షంలోని ధార్తరాష్ట్రులు 100 మందీ మొత్తం మొత్తంగా ఒక్కడు కూడా మిగలకుండా అందరున్నూ, అలాగే వారికి సహాయంగా వచ్చిన రాజసమూహాలతో సహా త్వరపడిపోతూ భయంకరమైన కోరలతో కూడిన విశ్వరూపుని ముఖాల (నోళ్ళ) లోనికి ప్రవేశిస్తున్నారు. మహావీరులు, అవధ్యులు అయిన భీష్మ, ద్రోణ, కర్ణులు కూడా ఆ తెరచిన నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు. వారే కాదు తన పక్షంలోని యొధానయోధులైన వీరులు ఎందరో ఆ విశ్వరూపుని భయంకరమైన నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు. ప్రళయాగ్ని లాగా ప్రజ్వలిస్తున్న తెరచుకొని యున్న నోళ్ళలోనికి అమిత వేగంతో, వెనుక నుండి ఎవరో తరుము తున్నట్లు త్వరత్వరగా ప్రవేశిస్తున్నారు. తెరచుకున్న నోళ్ళు అప్పుడప్పుడు మూసుకుంటూ ఉంటాయి గనుక ఈ ప్రవేశిస్తున్న వారిలో కొందరు ఆయన పండ్ల సందులలో చిక్కి తలలన్నీ పగిలి ముక్కలు ముక్కలుగా, పొడిపొడిగా అయిపోతున్నారు. ఈ అద్భుత దృశ్యాన్ని చూస్తున్న అర్జునుడు ఇలా అనుకుంటున్నాడు.

దుర్యోధనాదులు 100 మందీ కాలుని నోట పడిపోయారు. కాని తాము ఐదుగురు మాత్రం అలా పడలేదు. కనుక ఎదటి పక్షంలో సింహాసనం ఎక్కటానికి వారసుడెవడూ లేడు. ఇక ఎదటి పక్షంలో అజేయులైన వీరులు భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు ఉన్నారు. భీష్ముడు సర్వసైన్యాధిపతి. మహావీరుడు. పరశురామునే ఎదిరించి నిలిచినవాడు. పైగా ఆయనకు స్వచ్ఛంద మరణం వరంగా ఉన్నది. కనుక ఆయనకు చావులేదు. ఇక తన గురువు ద్రోణాచార్యుడు. ఆయన ఉభయపక్షాలలోని వీరులందరికీ గురువు. చేతిలో శస్త్రం ఉన్నంతవరకు ఆయనను ఎవరూ ఏమీ చేయలేరు. పైగా బ్రాహ్మణుడు. బ్రాహ్మణుని చంపితే బ్రహ్మహత్యా పాతకం అని ఎవరూ ముందుకు రారు. ఇక నిరంతరం పాండవులపై కక్షగట్టిన వాడు, దుర్యోధనునికి మిత్రుడు, శ్రేయోభిలాషి, అతణ్ణి నిరంతరం యుద్ధానికి రెచ్చగొట్టేవాడు, పరాక్రమశాలి, అన్నింటికీ మించి దేవేంద్రుని నుండి 'శక్తి' అనే ఆయుధాన్ని పొందినవాడు కర్ణుడు. కర్ణుని చూచుకొనే దుర్యోధనుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. కనుక ఈ భీష్మద్రోణ కర్ణులు అజేయులని అందరి అభిప్రాయం. ఐతే ఈ ముగ్గురు కూడా విశ్వరూపుని ముఖాలలో ప్రవేశిస్తున్నారు.

ఇక రెండు పక్షాలలోని వీరయోధులు, సైనికులు కూడా విశ్వరూపుని ముఖాలలో ప్రవేశిస్తున్నారు. యుద్ధమనేది జరిగినప్పుడు రెండు పక్షాలలోని వీరులు, సైన్యం నశించక తప్పదు. ఇదంతా విశ్వరూపంలో చూస్తున్న అర్జునునికి తమ విజయం తథ్యం అన్న నమ్మకం కలిగింది. ఇది విశ్వరూప సందర్శన లక్ష్యాలలో ఒకటి.

**మరొక విశేషమేమంటే వీరందరిని ఎవరో ఒకరు చంపటం లేదు. ఒకరి నొకరు చంపుకోవటం లేదు. వారే తమంతట తాముగా త్వరపడుతూ, వేగంగా ఆ కాలుని నోట ప్రవేశిస్తున్నారు. అంటే ఈ యుద్ధంలో తాను ప్రధాన పాత్రధారినని, అందరినీ చంపక తప్పదనీ ఇంతవరకు అనుకున్నాడు అర్జునుడు. ఇప్పుడు విశ్వరూపంలోని దృశ్యాలను చూచిన తర్వాత తాను కేవలం నిమిత్తమాత్రుడనని, జరగవలసిన దానిని విధియే జరిపించి తీరుతుందనీ నిశ్చయానికి వచ్చాడు. ఘోరకృత్యం చేసి పాపం మూటకట్టుకోవాలేమోననే సందేహం పటాపంచలై పోయింది. ప్రాణులన్నీ వాటంతట అవే వస్తూపోతూ ఉంటాయని తెలుసుకొని - ప్రత్యక్షంగా చూచి, నిర్లిప్తంగా, వైరాగ్యంతో ఉండిపోయాడు. వైరాగ్యం వల్ల జీవితాన్ని ఆదర్శ వంతంగా, ఉన్నతంగా గడుపుకొనే వీలుంటుంది. ఇది విశ్వరూప సందర్శన లక్ష్యాలలో రెండవది. ఇలా విశ్వరూపసందర్శనంతో అర్జునునిలో అనేక సందేహాలు తీరిపోయాయి.**

**- ప్రాణులన్నీ మృత్యు ముఖంలోకి ఎలా ప్రవేశిస్తున్నాయో 2 ఉపమానాల ద్వారా స్పష్టం చేస్తున్నాడు అర్జునుడు.**

**శ్లో||యథా నదీనాం బహవోఽమ్బు వేగాః సముద్ర మేవాభిముఖాద్రవంతి|**
**తథా తవామి నరలోక వీరాః విశంతి వక్త్రాణ్యభి విజ్వలంతి|| 28**

**శ్లో|| యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః విశంతి నాశాయ సమృద్ధ వేగాః|**
**తథైవ నాశాయ విశంతి లోకాః తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః|| 29**

**తా||** ఏ ప్రకారంగా అనేక నదులు వేగంగా ప్రవహిస్తూ సముద్రానికి అభిముఖంగా పరుగెడుతున్నాయో అలాగే ఈ నరలోక వీరులంతా ప్రజ్వలిస్తున్న నీ నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు(28).

**తా||** ఏ విధంగా ప్రజ్వలిస్తున్న అగ్నిలోకి మిడుతలు నశించటం కోసమే అతివేగంగా ప్రవేశిస్తాయో అలాగే ఈ ప్రాణులన్నీ అతివేగంగా నశించటం కోసమే నీ నోళ్ళలోకి ప్రవేశిస్తున్నాయి (29).

**వ్యాఖ్య:-** ప్రతివ్యక్తికీ ఒక స్వభావం ఉంటుంది. ఆ స్వభావం బాగా పనిచేస్తూ ఉంటుంది. ఆ వ్యక్తిని ఆ స్వభావమే నడిపిస్తుంది. క్రొత్తగా ఎన్ని విషయాలు తెలుసుకున్నా, ఎంత నేర్చుకున్నా అవి అంతగా పనిచేయవు. స్వభావమే పనిచేస్తుంది.

మంచి స్వభావం గలవాడు రామాయణం విని రాముడిలా నడుచుకోవాలనుకుంటాడు. అదే దుష్టస్వభావం గలవాడు విని రావణుడి అంతటి వాడే పరస్త్రీని ఎత్తుకొచ్చాడు గదా! నేను అంతకన్నా గొప్ప వాణ్ణా ఏమిటి? అని తన దుష్టత్వాన్ని సమర్థించుకుంటాడు.

అందుకే ఎంత వేదాంతం విన్నా వైరాగ్యం అబ్బదు. భోగాల పట్ల ఆసక్తి తగ్గదు. కారణం స్వభావం. ఐతే ఈ స్వభావాన్ని ఎలాగైనా మార్చుకోవాలి. నిరంతర సాధనవల్ల కొద్దికొద్దిగా మార్పు వస్తుంది.

మంచి స్వభావం గాని, చెడ్డస్వభావం గాని ఆ రెండూ మహాప్రవాహాలై నదులలాగా ప్రవహిస్తూ ఉంటాయి. అందులో జీవుళ్ళు తమకు తోచిన పనులు చేస్తూ కొట్టుకొని పోతుంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నదులన్నీ సముద్రం వైపు పరుగులు తీస్తున్నట్లుగా జీవుళ్ళందరూ వారివారి స్వభావాల ననుసరించి మోక్షమార్గం వైపుగానో, మృత్యుమార్గం వైపుగానో పరుగులు తీస్తూ ఉంటారు. నదులు సముద్రాన్ని చేరి సముద్రాకారంగా మారి వాశ్రాంతి తీసుకుంటూ ఎలా ప్రశాంతమవుతాయో అలాగే జీవుళ్ళు కూడా ఆ విశ్వరూపునిలో చేరి తమ నామరూపాలు కోల్పోయి ఆ విశ్వరూపునిగా మిగిలిపోవాలి.

ఇక్కడ అర్జునుడు ఆ విశ్వరూపాన్ని చూస్తూ ఆ రూపం వైపుకు పోయే రాజులను, వీరులను, సేనలను, భీష్మద్రోణకర్ణులను చుస్తున్నాడు. వీరంతా విశ్వరూపుని ప్రజ్వలిస్తున్న నోళ్ళలోనికి అతి వేగంగా ప్రవేశిస్తున్నారు. ఐతే వీరంతా ఎందుకు ఆ నోళ్ళలోకి ప్రవేశిస్తున్నారు?

ఈ విషయాన్ని రెండవ ఉపమానం ద్వారా స్పష్టం చేస్తున్నారు. ఈ రాజులు, సైనికులు, వీరులు అందరూ కూడా నశించటం కోసమే ప్రజ్వలిస్తున్న నీ నోళ్ళలోకి వేగంగా ప్రవేశిస్తున్నారు. ఎలాగైతే మిడతలు నశించిపోవటం కోసమే అగ్నిలో దూకుతున్నాయో అలాగే నశించటం కోసమే వీరంతా నీ నోళ్ళలోకి దూకుతున్నారు.

ఒక ఉపమానం చెబితే చాలదా? రెండు ఎందుకు? అనే సందేహం కలుగుతుంది. ఎందుకంటే ఏ ఉపమానం కూడా స్వతహాగా సంపూర్ణమైనది కాదు. రహస్యమైన వేదాంత విషయాన్ని అర్థం చేసుకోవటం కోసం ఉపమానం చెబుతారే గాని ప్రతి ఉపమానంలోను ఎక్కడో ఒక లోపం ఉంటుంది.

నదులు సముద్రాన్ని చేరి శాంతిస్తున్నాయి అని చెప్పిన ఉపమానంలో ఆ నదుల యొక్క ప్రయత్నం ఏమీలేదు. నీరు పల్లానికే పోతుంది గనుక నదులన్నీ సముద్రం వైపుకే సహజంగా ప్రయాణం చేస్తాయి. మరి జీవుళ్ళు కూడా ఏ ప్రయత్నం లేకుండానే ప్రయాణిస్తారా? లేదు. వీరు ప్రయత్నంతో - అంతఃప్రేరణలతో మాత్రమే ప్రయాణిస్తారు. అందుకే మరొక ఉపమానం. మిడతలు, దీపం పురుగులు కాంతికి, వెలుగుకు, మంటలకు ఆకర్షింపబడి అంతఃప్రేరణతో, కావాలని ఆ దీపం చుట్టూనో, మంట చుట్టూనో చేరాలని అతివేగంతో ప్రయాణించి అందులోనే నశించిపోతాయి, ప్రాణాలు కోల్పోతాయి - అని రెండవ ఉపమానం. దుర్యోధనాదులు రాజ్యలోభంతో, పరుల సొమ్ముకు ఆశపడే స్వభావంతో ఎంతటి ఘాతుకానికైనా - ఎలాంటి అడ్డదారులు త్రొక్కటానికైనా సిద్ధంగనుక మాయాజూదంతో పరుల రాజ్యాన్ని చేజిక్కించుకున్నారు. ఆ రాజ్యంలోభంతోనే యుద్ధానికి సిద్ధమయ్యారు. ఇదే అర్జునునికి కనిపిస్తున్నది.

- అలా ప్రాణులన్నీ ప్రజ్వలిస్తున్న నోళ్ళలోకి వచ్చి పడుతుంటే ఆ విశ్వరూపుడు ఏం చేస్తున్నాడు? ఆ భయంకర రూపాన్ని చూచి మతిచెడిన అర్జునుడు భగవంతుని ఏమని ప్రార్థిస్తున్నాడు? -

**శ్లో||** లేలిహ్యసే గ్రసమానస్సమం తాత్ లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః|
తేజోభిరా పూర్య జగత్సమగ్రం భాసస్త వోగ్రాః ప్రతపంతి విష్ణోః|| **(30)**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** ఆఖ్యాహిమేకో భవానుగ్ర రూపః నమోస్తుతే దేవవర! ప్రసీద|

విజ్ఞాతుమిచ్ఛామి భవంతు మాద్యం నహిప్రజానామి తవ ప్రవృత్తిం||(**31**)

**తా||** జ్వలిస్తున్న నీ నోళ్ళతో అన్ని ప్రాణులను అన్ని వైపుల నుండి మ్రింగుతూ చప్పరిస్తున్నావు. ఓ విష్ణో! నీ మహోగ్రోమైన కిరణాలు జగత్తునంతటిని తేజస్సుతో నింపి తపింపజేస్తున్నాయి (**30**).

**తా||** ఉగ్రరూపంతో ఉన్న నీవెవరో నాకు చెప్పు. దేవదేవా! నీకు నా నమస్కారములు. ప్రసన్నుడవుకా! ఆది పురుషుడైన నీవెవరో తెలుసుకోగోరుతున్నాను. నీ ప్రవృత్తి ఏమిటో కూడా తెలుసుకోలేక పోతున్నాను (**31**).

**వ్యాఖ్య:-** సమస్త జీవరాసులు, అన్ని ప్రాణులు, చరాచరములన్నీ విశ్వరూపుని ప్రజ్వలిస్తున్న నోళ్ళలోకి త్వరత్వరగా ప్రవేశించి నశించిపోతున్నాయి. ఆకలిగొన్న ఆ రూపానికి - ప్రళయ భయంకరమైన ఆ రూపానికి విసుగు లేదు, విరామం లేదు. అసలు మృత్యుతత్వమే అంత. అంతులేని ఆకలి. అందుకే 'లేలిహ్యసే' అనే పదాన్ని వాడాడు అర్జునుడు. అంటే ఆ రూపం అన్నింటిని మ్రింగి చప్పరించి వేస్తున్నది. పెదవులు నొక్కుకుంటున్నది. ఇంకా ఏమేమి వస్తాయో వాటిని తినటానికి త్వరపడుతున్నది. ఎంతతిన్నా తృప్తి కలగటం లేదు. అంతేకాదు అలా తింటూ ఉంటే పళ్ళ సందుల్లో ఇరుక్కున్న తలకాయలను; ఏనుగులు, గుర్రాలు, రథాలు మొ||న వాటిని చేతివ్రేళ్ళతో తీసి మళ్ళీ నోట్లో వేసుకొని చప్పరించి వేస్తున్నది. అగ్ని నాలుకలు చాచి సమస్తాన్ని దహించినట్లుగ పరమాత్మ సర్వసంహారం చేస్తున్నాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ ప్రళయ భయంకర కాలాగ్ని స్వరూపాన్ని - అక్కడ జరుగుతున్న సర్వసంహారాన్ని, లయక్రియను, ఆ విశ్వరూపుని తేజస్సుతో నిండిన వెలుగులను చూస్తుంటే అర్జునునికి ఆశ్చర్యం, భయం వేస్తున్నది. మిరుమిట్లు గొలిపే తేజస్సు వల్ల జగత్తంతా తపించిపోతున్నది.

ఇంతటి భయంకర దృశ్యాన్ని చూస్తున్న అర్జునునికి నోటమాట రావటం లేదు. రెండు పక్షాలలోని వీరులందరినీ తన కోరల మధ్య పిప్పి చేస్తున్న భయంకరమూర్తిని చూస్తుంటే ఆశ్చర్యం వేస్తున్నది. అయినప్పటికి జిజ్ఞాసతో ఉన్న అర్జునుడు ధైర్యం కూడగట్టుకొని ఆ విశ్వరూపుని ప్రశ్నించే మానసిక స్థితికి ఎదిగాడు.

ఇంతవరకు శ్రీకృష్ణుడు తన తల్లికి మేనల్లుడు. కనుక తన బావ. ఆయన చెల్లెలు సుభద్రను తనకిచ్చి పెళ్ళిచేశాడు. ఇప్పుడు తన చిరకాల కోరికను తీర్చటానికి యుద్ధభూమిలో తన రథాన్ని తోలటానికి అంగీకరించిన సారథి. అవసరమైనప్పుడు తనకు తగిన సలహాలనిచ్చి ముందుకు నడిపే మేధావి. ఒక కంచంలోతిని, ఒక మంచం మీద పడుకొనేంత స్నేహం గల స్నేహితుడు. అందువల్ల బావగా, మిత్రుడుగా, బంధువుగా, సారథిగా, ఆత్మీయుడుగా, శ్రేయోభిలాషిగా, బృందావన గోపాలుడిగా శ్రీకృష్ణుని ఇంతవరకూ భావించుకుంటూ ఉన్నాడు. కాని ఇప్పుడు తెలుస్తున్నది, ఆయన మానవమాత్రుడు కాదని, మానవాతీత శక్తియని. ఆయన దివ్యత్వం ఏమిటో, ఆయన సర్వజ్ఞత్వం ఏమిటో, ఆయన ప్రభావం, శక్తి సామర్థ్యాలు, మహిమ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఏమిటో ఇప్పుడిప్పుడే కొంచెం కొంచెంగా అర్థమవుతున్నాయి. కాని పూర్తిగా అర్థం చేసుకొనే శక్తి మాత్రం లేదు.

అర్జునుడు ఎంత వివేకం గలవాడే అయినా చూస్తున్న విషయాలను ఎలాగో వ్యక్తం చేయగలుగుతున్నాడే గాని, ఆ విషయాలను లోతుగా విశ్లేషించి, పూర్తిగా జీర్ణం చేసుకొని తాను చూచేరూపం యొక్క సమగ్రతత్త్వాన్ని గాని, శ్రీకృష్ణుని తత్త్వాన్ని గాని తెలుసుకోలేక పోతున్నాడు. కనుక చేయగలిగిందేమీ లేదు. ఆ భగవంతునే శరణుబొంది, ఆయననే ప్రార్థించి తెలుసుకోవాలనుకున్నాడు. అందుకే ఎంతో వినయంతో ప్రశ్నిస్తున్నాడు, ఏమని?

"దేవదేవా! ఉగ్రస్వరూపంలో ఉన్న నీవు ఎవరు? నీ ప్రవృత్తి ఏమిటో తెలుసుకోలేక పోతున్నాను. ఆది పురుషుడవైన నిన్ను నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. నీకు నమస్కారములు. ప్రసన్నుడవుకా!" అన్నాడు అర్జునుడు. నమస్కరించటం, దయచూపమనటం, ప్రసన్నుడవు కమ్మని అర్థించటం - ఇవన్నీ వినయవిధేయతలకు చిహ్నం. అంతేకాదు. నీ ప్రవృత్తి ఏమిటి? నేను తెలుసుకోలేక పోతున్నాను అన్నాడు. అంటే ఇక్కడ అర్జునుని ఆంతర్యం వేరు. "ఓ మహానుభావా! అసలు ఏం చెయ్యాలనుకుంటున్నావు? ఇంతకూ మాకు ఈ యుద్ధంలో గెలుపు ఉన్నదా? లేదా?" - ఈ విషయాన్ని ఆయన నోటి మీదుగానే తెలుసుకోవాలనుకుంటున్నాడు. ఎందుకంటే విశ్వరూపాన్ని చూపించి, అందులో కౌరవులంతా ముఖ్యులైన వీరులతో సహా మృత్యుముఖంలో

పడిపోతున్నట్లు చూపించాడు. అంతేకాదు తన పక్షం వారు కూడా మృత్యుముఖంలో పడిపోయారు. మరి ఇలా చూపటంలో శ్రీకృష్ణుని ఉద్దేశమేమిటి? అది తెలియాలి. ఆయన నోటి మీదుగానే వినాలి.

అర్జునుడు ఏం జరగాలని కోరుకుంటున్నాడో దాన్నే ప్రత్యక్షంగా చూస్తున్నాడు. కాని ఒక్కసారి శ్రీకృష్ణుని ముఖత విని తన అభిప్రాయాన్ని ధృఢపరుచుకోవాలి. అందుకే ఇలాంటి ప్రశ్న.

- అర్జునుని ప్రశ్నలకు సూటిగానే సమాధానం చెబుతున్నాడు భగవానుడు. ఏమని?

**శ్రీ భగవానువాచ:**

**శ్లో||** కాలోఽస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధః లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః|
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్య నీకేషు యోధాః|| **32**

**తా||** భగవానుడంటున్నాడు: లోకాలన్నీ నాశనం చెయ్యటానికి విజ్రుంభించిన కాలపురుషుణ్ణి నేను. ఇక్కడ ఇప్పుడు లోకాలన్నింటిని సంహరించటానికి పూనుకున్నాను. నీవు లేకపోయినా ఈ శత్రు సైన్యాలలోని యోధులు ఎవరైతే ఉన్నారో వారందరు భవిష్యత్తులో ఉండరు.

**వ్యాఖ్య:-** అర్జునుడు రెండు ప్రశ్నలు అడిగాడు. 1.నీవు ఎవరు? 2.నీ ప్రవృత్తి ఏమిటి? అని. వాటికి భగవానుడు సూటిగానే సమాధానం చెప్పాడు.

1.నేను లోకాలన్నింటిని భక్షించేందుకు విజృంభించిన కాలపురుషుణ్ణి.

2.ప్రాణులందరిని సంహరించటమే ఇప్పుడు నా ప్రవృత్తి అని.

అయితే ఇక్కడ మనకొక సందేహం కలగవచ్చు. భగవంతుడు క్రూరుడా? దయలేని వాడా? భీభత్సాన్ని సృష్టించే వాడా? - కానేకాదు. మరి ఎందుకు ప్రాణులందరినీ సంహరించటం?

అధర్మపరులు, దుర్మార్గులు, జీవిత ఉద్దేశాన్ని అపార్థం చేసుకున్నవారు - వీరందరు నశిస్తేనే తిరిగి పునరుద్ధానం జరిగేది. నాశనం ఉంటేనే సృష్టి. చెడును తీసివేస్తేనే మిగిలిన సమాజం బాగుండేది.

బజార్లో వెళుతూ వెళుతూ ఒక తుప్పుపట్టిన సీలను త్రొక్కావు. అది నీ కాలిలో గుచ్చుకొని రక్తం కారింది. ఏదో కట్టుకట్టి రక్తాన్ని ఆపగలిగావు. ఆ తరువాత దానిని గురించి అంతగా పట్టించుకోలేదు. అది సెప్టిక్ అయింది. ఏదో తెలిసీ తెలియని వైద్యం చేశావు. చివరకు డాక్టరు దగ్గర కెళ్ళావు. డాక్టరు పరీక్షచేసి పాదం మొత్తం తీసేయాలన్నాడు. అమ్మో! వద్దు అన్నావు. "ఆ పాదాన్ని అలాగే ఉంచితే మొత్తం శరీరం కుళ్ళిపోతుంది. శరీరాన్ని రక్షించుకోవాలంటే పాదాన్ని తీసివెయ్యక తప్పదు" అని చెప్పి డాక్టరు ఆ పాదాన్ని తొలగించేశాడు. డాక్టరు క్రూరుడా? దయలేనివాడా? భీభత్సాన్ని సృష్టించేవాడా? కానేకాదు. రోగి క్షేమం కోసమే అలా చేశాడు.

హత్యలు చేసినవాడు పట్టుబడ్డాడు. విచారణ జరిగింది. జడ్జీ అతడికి మరణశిక్ష విధించాడు. అతణ్ణి తలారి ఉరితీశాడు. జడ్జీగాని, తలారిగాని క్రూరులా? దయలేనివారా? కాదు గదా! కర్తవ్యాన్ని నిర్వర్తించిన వారు.

దుర్మార్గులు, సన్మార్గులు అందరూ పరమాత్మ స్వరూపులే. దుర్యోధనాదులు విశ్వరూపుని ఒక కాలు, పాండవులు మరొక కాలు.

యాదవులు ఒక చెయ్యి. సమస్త జంతుజాలము మరొక చెయ్యి. దేవతలు హృదయం. సూర్యచంద్రులు కళ్ళు. సముద్రాలు స్వేదం. ఇలా సర్వమూ పరమాత్మే. విశ్వేశ్వరుడే. ఇందులో దుర్యోధనాదులనే కాలు గాయపడి కుళ్ళిపోయింది. అసూయ అనే సీల గ్రుచ్చుకుంది. ధర్మరాజు రాజసూయాన్ని, మయసభావైభవాన్ని చూచి కళ్ళలో నిప్పులు పోసుకున్నాడు. వారి సంపదలను అపహరించాలనుకున్నాడు. శకుని చేత మాయాజూదం ఆడించి వారి రాజ్యాన్ని హరించాడు. అంతటితో ఆగక పాండవపత్ని ద్రౌపదిని సభలోని కీడ్పించి వస్త్రాపహరణం గావించాడు. ఇదే కాలు గాయపడి కుళ్ళిపోవటం అంటే. ఈ పాపాన్ని చేయించిన వాళ్ళు, చేసిన వాళ్ళు, చూసిమౌనంగా ఉన్నవాళ్ళు, భళిభళీ అని వంతపాడిన వాళ్ళు - ఈ పాపంలో పాలుపంచుకున్న వాళ్ళందరి కళ్ళు శాశ్వతంగా మూయించాల్సిన కాలం సమీపించింది. అందుకే భగవానుడంటున్నాడు. "అర్జునా! నేను లోకాలను నాశనం చేసే కాలపురుషుణ్ణి. ప్రాణులందరినీ భక్షించటమే నా ప్రవృత్తి. ఆనాడు పాంచాలిని పరాభవించిన వారు, వారికి తోడుగా నిలిచినవారు, వారికి సహాయంగా వచ్చినవారు - మొత్తాన్ని ఊడ్చి పారేయటమే నా ఇప్పటి పని" - అని.

అంతేకాదు. మరొక ముఖ్య విషయం "ఈ సంహార కార్యక్రమంలో నేను ఎవరి మీదా ఆధారపడి లేను. నాకు ఎవరి సహాయం అక్కరలేదు. నేను యుద్ధం చెయ్యనని నీవు బిర్ర బిగుసుకొని కూర్చున్నా వీరంతా బ్రతుకుతారనుకుంటావేమో! నీ కోడి - కుంపటి లేకపోయినా తెల్లవారే

తీరుతుంది. నీవు యుద్ధం చేయనని వెనుదిరిగి పోయినా ఈ సేనలలో కనిపించే యోధవీరులలో ఒక్కడు కూడా నేలపై నిలవటం కల్ల" అని స్పష్టం చేశాడు భగవానుడు.

ఈ సంహారకార్యం తప్పక నెరవేర్చ వలసిందే. మందుల వాడకంతో తగ్గే జబ్బును అలాగే తగ్గించవచ్చు. ఏ మందూ పనిచేయక పోతే ఆపరేషన్ చేయాల్సిందే. దుష్టాంగాన్ని ఖండించాల్సిందే. కుళ్ళిన కాలు తీసేయాల్సిందే.

ఇప్పుడు కూడా శ్రీకృష్ణుడు తానే కురుసభకు స్వయంగా వచ్చి సామంగా చెప్పి చూశాడు. ఐదుగురికి ఐదూళ్ళైనా ఇచ్చి మిగిలినదంతా మీరే ఉంచుకోమని దానోపాయాన్ని ప్రయోగించాడు. అదీ కుదరకపోతే కర్ణుని వారి పక్షం నుండి వేరుచేయటానికి భేదోపాయాన్ని కూడా ప్రయోగించాడు. కనుక దండోపాయమే శరణ్యమైంది. ఈ సంహారకార్యం ఎవరు సహాయపడినా లేకున్నా జరిగే తీరుతుంది. కాలమే తనపని తాను చేసుకుంటుంది. అలా జరిగే పనిలో వ్యక్తులు విధికి వశులై నడుచుకుంటారు. కాలప్రణాళికలో మార్పులేమీ ఉండవు. "కనుక అర్జునా! నీవు యుద్ధం చేసినా, చేయకున్నా జరగవలసిన సంహార కార్యం జరిగే తీరుతుంది. నీ అహంకారం కన్నా కాలపురుషుని అహంకారం చాలా గొప్పదని తెలుసుకో" అన్నాడు భగవానుడు.

ఒకసారి శివాజీ మహారాజు వేలాదికూలీలతో కోట కట్టిస్తున్నాడు. ఒకనాడు జరుగుతున్న పనిని స్వయంగా పర్యవేక్షిస్తూ "ఇంతమంది నావల్లనే కదా! బ్రతుకుతున్నారు" అనే అహంకారం లేచింది వెంటనే గురువు

సమర్థరామదాసు ప్రత్యక్షమై "శివా! ఇదిగో ఈ రాతిని పగలగొట్టించు" అన్నాడు. ఆ రాతిని పగలగొట్టించగా ఆ రాతి మధ్యలో కొంచెం గుంట; అందులో నీళ్ళు, ఆ నీళ్ళలో ఒక కప్పపిల్ల ఉన్నది. దాన్ని చూపి 'శివా! ఇది కూడా నీవల్లనే బ్రతుకుతున్నదా?' అన్నాడు. ఆ మాట శివాజీ అహంకారంపై చావుదెబ్బ కొట్టింది. "రాతిలోని కప్పకు, నాతిలోని శిశువుకు ప్రాణం పోసేవాడే అందరినీ బ్రతికిస్తున్నాడు. జరగవలసినది జరిపిస్తున్నాడు. నీ అహంకారం ఒట్టి బూటకం" అన్నాడు గురువు సమర్థరామదాసు.

భగవంతుని మాటతో అర్జునుని అహంకారం బ్రద్దలైంది. దానితో ఎలాగూ జరిగే కాలచక్ర ప్రణాళికలో సహాయపడటమే నా కర్తవ్యం అనుకున్నాడు. ఇంతవరకు యుద్ధం అంతా నా భుజస్కంధాలపై ఆధారపడి ఉన్నది అనే అహంకారం పటాపంచలై పోయింది. దానితో భగవానుడు కర్తవ్యోపదేశం చేస్తున్నాడు అర్జునునికి - ఏమని?

**శ్లో||**తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం|
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ || **(33)**

**శ్లో||** ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాऽన్యానపి యోధవీరాన్|
మయాహతం స్త్వం జహిమావ్యథిష్టాః యుద్ధ్యస్వ జేతాऽసి రణే సపత్నాన్||34

**తా||** అందుచేత నీవులే. లేచినిలబడు. కీర్తిని సంపాదించుకో! శత్రువుల్ని జయించి పరిపూర్ణమైన రాజ్యాన్ని అనుభవించు. వీళ్ళందరూ నా చేత పూర్వమే చంపబడ్డారు. సవ్యసాచీ! నీవు నిమిత్త మాత్రుడవుకా!

**తా||** నా చేత చంపబడిన ద్రోణుని, భీష్ముని, సైంధవుని, కర్ణుడు మొ||న ఇతర వీరయోధులను నీవు చంపు. విచారించవద్దు. యుద్ధం చెయ్యి. శత్రువులను యుద్ధంలో జయిస్తావు.

**వ్యాఖ్య :-** "సవ్యసాచీ! అర్జునా! కాలపురుషుడు లోకాలన్నింటిని సహరించటానికి సిద్ధంగా ఉన్నాడు. నీ అవసరం ఆయనకు లేదు. నీవు ఉన్నా లేకున్నా ఆపని ఎలాగూ జరిగిపోతుంది. నీ అహంకారం భగవంతుని అహంకారం ముందు దిగదుడుపే. కనుక ఆ కాలపురుషుడు చేసే పనిలో నిరహంకారివై పాలు పంచుకో. కనుక లే! లేచినిలబడు. యుద్ధం చెయ్యి. శత్రువులను జయించి కీర్తిని పొందు. సమృద్ధమైన రాజ్యాన్ని అనుభవించు. ఈ అన్నింటా నిమిత్త మాత్రుడవుకా! ఇదే ముఖ్యం" అన్నాడు భగవానుడు.

"నిమిత్త మాత్రం భవసవ్య సాచిన్" ఏకాదశ అధ్యాయంలో ఇది. ఏకాదశాక్షరీ మహామంత్రం. ఈ అధ్యాయం యొక్క సారమంతా ఇదే. ఈ వాక్యం సర్వమానవులకు గొప్ప ఉపదేశం. ఈ ఉపదేశాన్ని మంత్రం లాగా పఠిస్తున్నా, జపిస్తున్నా మానవుడు ధన్యుడౌతాడు. అంతటి అమూల్యమైన అద్భుతమైన ఉపదేశం ఈ వాక్యం. నిమిత్త మాత్రుడవై కర్మ చెయ్యి! అనేదే ఈ అద్భుత మంత్ర సారాంశము.

భగవంతుని పనికి నిమిత్త మాత్రుడుగ నిలిచే అదృష్టం పుణ్యాత్ముడైన అర్జునునకు దక్కింది. "భగవంతుని చేతిలో పిల్లనగ్రోవిగా ఉండకపోతే మానె ఆయన కాలికి పాత చెప్పుగా ఉన్నా చాలు" భక్తుడైన వాని కోరిక ఇదే. కాకపోతే ఆ చెప్పు కొరికే చెప్పో, కరిచే చెప్పోకాకూడదు. మెత్తనిదై, సుతి

మెత్తనిదై ఉండాలి. భగవంతునికి ఇష్టమైన కార్యం చేసేవాడే భగవంతునికి ఇష్టుడు. ఆ కార్యాన్ని భగ్నం చేసేవాడే కొరికే చెప్పు, కరిచే చెప్పు. వాడు ఎంతటి వాడైనా సరే భగవంతుడు సహించడు. భగవంతుడు అభిమానాన్ని అహంకారాన్ని సహించడు. భగవంతుడే కాదు, మనమూ అంతే అహంకారంతో అన్నం ఉడకకపోతే మనం దాన్ని తినం కుడితి కుండలో వేస్తాం. భగవంతుడు కూడా అహంకారి జీవుణ్ణి అంగీకరించడు. కాల చక్రంలో పడవేస్తాడు. జననమరణ సంసార చక్రంలో విసిరివేస్తాడు. కనుక అహంకారాన్ని విడిచి నిమిత్త మాత్రుడిగా, భగవంతుని చేతిలోని పనిముట్టుగా పనిచేయాలి.

యుద్ధం భగవంతుని అభిమతం. అందులో అర్జునుడు నిమిత్తమాత్రుడు. అలాగే మనం కూడా ఈ జీవనపోరాటంలో నిమిత్త మాత్రులం కావాలి. నేను నిమిత్తమాత్రుణ్ణి, భగవంతుని చేతిలో పనిముట్టును అనుకున్నావా! ఇక నీకు రాగద్వేషాలుండవు. శోకమోహాలుండవు. బుద్ధిమంతుడైన వానికి ఈ ఒక్కబోధ చాలు.

ప్రపంచంలో అన్ని పనులు భగవంతుడే జరిపిస్తుంటాడు. అయితే అజ్ఞాని, అహంకారి అయిన మానవుడు "నేను చేస్తున్నాను' అనే కర్తృత్వ భావనతో పనులు చేసి కర్మఫలాలను, వాసనలను కూడబెట్టుకుంటూ బంధితుడై దుఃఖసాగరంలో మునిగిపోతున్నాడు. భగవంతుడు అదృశ్యంగా ఉండి చేసే పనిని అజ్ఞాని తెలుసుకోలేక 'నేనే చేస్తున్నాను' అనుకుంటాడు. రేడియోలు కనిపెట్టినా, T.V. లు కనిపెట్టినా, విమానాలు కనిపెట్టినా,

అణుబాంబులు కనిపెట్టినా - అన్నీ పరమాత్మ ఒడిలో ఆటబొమ్మలే. ఎందుకంటే దేనికైనా కావలసింది భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, సూర్యచంద్రులు, వృక్షజాలం, ఖనిజాలు - ఇవన్నీ ఆ భగవంతుని సృష్టే. ఆయన సొత్తే. అవి లేకుండా ఏ శాస్త్రవేత్తా అడుగు ముందుకు వేయలేడు. భగవంతుడిచ్చిన వాటిని అటూ ఇటూ మార్పుచేస్తున్నాడే తప్ప క్రొత్తగా సృష్టి చేస్తున్నదేమీ లేదు. కనుక మనం కేవలం నిమిత్త మాత్రులం.

అందుకే భగవానుడు హితోపదేశం చేస్తున్నాడు. అర్జునా! నీవు కేవలం నిమిత్త మాత్రుడవన్న నిజాన్ని గుర్తించి, ఊరక కాలయాపన చేయక, గాండీవం చేత బట్టి లేచి నిలబడు. యుద్ధం చేసి కీర్తిని పొందు. నీ శత్రువులను సంహరించి రాజ్యభోగాలను అనుభవించు. నీకేమీ బరువూలేదు, బాధా లేదు. యోగ్యుని చేత ఈపని చేయించాలనేది నా అభిమతం. వీరంతా ఇంతకు ముందే నాచేత చచ్చే ఉన్నారు. నీవు యుద్ధం చేస్తేనే చస్తారనుకోవటం ఒట్టి భ్రమ. నిజంగా నీపని చచ్చినవాళ్ళను చంపటమే. అహంకారాన్ని, అధిక ప్రసంగాన్ని, భయసందేహాలను విడిచిపెట్టి నిమిత్తమాత్రుడిగా యుద్ధం చెయ్యి. నేను చెప్పినట్లు చేశావా! నీవు నాకు ఇష్టుడవవుతావు. నన్ను చేరుకో గలుగుతావు. నీకు శ్రేయస్సు కలుగుతుంది.

భగవానుడు తన ఉపదేశాన్ని కొనసాగిస్తూ భయంవీడి యుద్ధం చెయ్యమని అర్జునుని ప్రోత్సహిస్తున్నాడు.

"ఓ అర్జునా! మృత్యువును తన పిడికిట పట్టుకున్నవాడు భీష్మాచార్యుడు. కోదండము పట్టిన వానికెల్లా గురువనిపించుకున్న బ్రాహ్మణోత్తముడు

ద్రోణాచార్యుడు. తండ్రి వాక్కు, పరమశివుని వరం కారణంగా అజేయుడై కూర్చున్న వాడు సైంధవుడు, సహజ కవచకుండలాలతో జన్మించి, భార్గవాస్త్ర, నాగాస్త్ర, ఇంద్రదత్త శక్తి చేత అహంకరిస్తున్న వాడు కర్ణుడు, వీరుగాక ఇంకా అనేకమంది యోధాగ్రేసరులైన వీరులెందరో ఇంతకుముందే నాచేత చచ్చిపడి ఉన్నవారే. అట్టివారిని నీవు చంపు. 'మావ్యధిష్ఠా' భయపడకు. విచారించకు." అంటున్నాడు భగవానుడు.

"మావ్యధిష్ఠా" అనటంలో చక్కని ఉపదేశం ఉంది. ఎవరైతే భగవంతుని శరణుబొంది తన కర్తవ్యాన్ని ధర్మంగా నిర్వహిస్తాడో అట్టివాడు దేనికీ - ఎవరికీ భయపడనక్కరలేదు; విచారించనక్కర లేదు.

'యుద్ధ్యస్వ' అనటంలో కర్మఫలాన్ని ఆశించకుండా నీ కర్తవ్య కర్మయైన యుద్ధాన్ని చెయ్యి - అని. అంతేకాదు. శతృవులను జయిస్తావు అనే ఆశీర్వచనంతో తన ఉపదేశాన్ని ముగిస్తున్నాడు భగవానుడు. అంటే కర్మఫలాన్ని ఆశించకుండా కర్తవ్యకర్మలను ఆచరించే వానికి జయం తథ్యం అని.

అయితే భీష్మాది మహావీరులంతా ముందే నాచేత చంపబడ్డారు. ఆ చచ్చినవారిని నీవు చంపు అనటంలోని ఆంతర్యం ఏమిటి? ప్రతిఒక్క జీవి, ప్రతి ప్రాణి, ప్రతి వ్యక్తీ ఈ లోకంలో ఏరూపంలో ఎంతకాలం బ్రతికి ఉండాలో అంతాముందే నిర్ణయింపబడి ఉన్నది. అది తెలియని అజ్ఞాని నేను చంపుతున్నాను, నేను చంపబడుతున్నాను. నావల్ల ఏదో జరిగిపోతున్నదని బాధపడతారు, అహంకరిస్తారు. ఎవరెవరికి అంత్యకాలం

సమీపించిందో వారంతా యుద్ధంలో మరణించటానికే నిలిచిఉన్నారు. అది తెలిసినవాడు భగవానుడు. తెలియనివాడు అర్జునుడు. అందుకే భగవానుడు భీష్మాదులంతా నాచేత ముందే చంపబడ్డారు అన్నాడు. అంటే వారి ఆయుష్కాలం తీరిపోయి మరణానికి సిద్ధంగా రణంలో ఉన్నారు అని. నీవు ఎలాగూ చావబోయే వారిని చంపి విజయాన్ని సాధించు. కీర్తిని పొందు అనేదే భగవానుని మాటల ఆంతర్యం.

భీష్మాదులందరూ భగవంతుని దృష్టిలో చనిపోయిన వారే. కాని అర్జునుని దృష్టిలో ఇంకా బ్రతికే ఉన్నారు. మన దృష్టిలో బ్రతికి ఉన్నవాడు డాక్టరు దృష్టిలో చనిపోయిన వాడవుతున్నాడు. ఎలా? అతడు బాగానే ఉన్నాడు, మాట్లాడుతున్నాడు, ఏదో జ్వరం వచ్చింది. కనుక మనదృష్టిలో బ్రతికి ఉన్నట్లే. కాని డాక్టరు పరీక్షించి ఇది సాధారణ జ్వరం కాదు, ఇతడు ఒక గంటకన్నా బ్రతకడు అని గ్రహిస్తాడు. కనుక అతణ్ణి చేర్చుకోకుండా పంపించి వేస్తాడు. అంటే డాక్టరు దృష్టిలో అతడు చనిపోయిన వాడి క్రిందే లెక్క.

అందుకే భగవానుడు విచారించకు. యుద్ధంచెయ్యి. జయం నీకే అంటున్నాడు. నిమిత్తమాత్రుడవై యుద్ధంచెయ్యి అని ఉపదేశిస్తున్నాడు. 'భగవంతుని సంకల్పం వల్ల చనిపోవలసిన వారే యుద్ధభూమిలో ఉన్నారు' అని భావిస్తేచాలు తాను నిమిత్తమాత్రుడౌతాడు. తన కర్తవ్యాన్ని నెరవేర్చటానికి సిద్ధపడతాడు. ఎటువంటి సంశయాలు ఉండవు. విచారంగాని, భయం గాని, దుఃఖం గాని కలగదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇంతవరకు భగవంతుడు తన విశ్వరూపాన్ని చూపి అర్జునుని సంశయాలు తొలగించి, కర్తవ్యాన్ని బోధించాడు. జయం కలుగుతుందని ఆశీర్వదించాడు. ఇప్పుడు రంగం మళ్ళీ మారింది. హస్తినాపురంలోని ధృతరాష్ట్ర మందిరంలో సంజయుడు ధృతరాష్ట్రునికి యుద్ధవిశేషాలు వినిపిస్తూ, భగవానుని విశ్వరూపాన్ని వర్ణించి, అర్జునునికి భగవానుడు బోధించిన ఉపదేశాన్ని తెలిపి, యుద్ధానికి అర్జునుని ప్రోత్సహిస్తూ కర్తవ్యోన్ముఖుని చేయటాన్ని చెప్పి, ఇప్పుడు అర్జునుని పరిస్థితిని గురించి తన మాటలలోతెలియజేస్తున్నాడు. ఏమని?

**సంజయ ఉవాచ:**

**శ్లో||** ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటి|

నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య|| (**35**)

**తా||** సంజయుడంటున్నాడు: శ్రీకృష్ణుని యొక్క ఈ పలుకులు విని వణుకుతూ ఉన్న అర్జునుడు చేతులు జోడించి నమస్కరించి భయపడుతూ గద్గద స్వరంతో కృష్ణునితో వినమ్రుడై తిరిగి ఇలా అంటున్నాడు.

**వ్యాఖ్య:-** హృదయాలను కదిలించే సన్నివేశాలతో ప్రేక్షకులను కంటనీరు పెట్టించే సినిమాను చూస్తున్నప్పుడు చూచేవారికి హృదయం భారమవుతుంది. అంత బాధను ఎక్కువసేపు భరించటం కష్టం. అందుకే మధ్య మధ్య హాస్యపాత్రలను ప్రవేశపెట్టి కొన్ని హాస్యసన్నివేశాలను చూపి కొంత రిలీఫ్ కలిగిస్తుంటారు. అలాగే నాటకీయతను ప్రదర్శించే నేర్పుగల వ్యాసుడు

భీభత్సము, భయంకరము అయిన యుద్ధరంగం నుండి మన దృష్టిని మళ్ళించటానికా! అన్నట్లు మన మనస్సుకు కొంత విశ్రాంతిని, రిలీఫ్ ను ఇవ్వటానికి రంగాన్ని ధృతరాష్ట్రుని అంతఃపురానికి మార్చాడు.

శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని చూచి, ఆయన పలుకులు విన్న అర్జునుని పరిస్థితిని వర్ణించి చెబుతున్నాడు సంజయుడు ధృతరాష్ట్రునికి. అర్జునునిలో భయము, భక్తి, వినయము - అనేవి సంపూర్ణంగా ఉన్నట్లు నిరూపించే పదాలను ఉపయోగిస్తున్నాడు సంజయుడు. వణకటం, చేతులు జోడించటం, భయపడటం, వందనము చేయటం, గద్గద స్వరంతో పలకటం - ఇవన్నీ భయాన్ని, భక్తిని, నమ్రతను సూచించే పదాలు. ఇలా నమ్రతతో, గద్గదస్వరంతో ఏమంటున్నాడు అర్జునుడు?

భగవద్గీతలో సంజయుడు యుద్ధవిశేషాలను వినిపించే ఒకానొక కథకుడు. అతడు గొప్పమేధావి, తాను నమ్మిన సత్యాన్ని నిర్భయంగా చెప్పగల సాహసి, గొప్పస్వామి భక్తి పరాయణుడు, ధృతరాష్ట్రుని క్షేమాన్ని మనస్ఫూర్తిగా కాంక్షించేవాడు. ధర్మం కోసం యుద్ధం చేస్తున్న పాండవులపై అభిమానం ఉన్నది. కౌరవులు అన్యాయంగా పరుల రాజ్యాన్ని హరించారనీ తెలుసు. అందుకే కౌరవసేనలోని భీష్మాది మహావీరులంతా ఇంతకుముందే మృత్యుముఖంలో పడిపోయారని, నాచేత చంపబడ్డారని, శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పగానే ఈ మహాప్రళయాన్ని గురించి, జరగబోయే అనర్థాన్ని గురించి ధృతరాష్ట్రుని మనస్సుకు బాగా ఎక్కేటట్లు చెప్పాలని తలపెట్టాడు సంజయుడు. ఏ క్షణంలోనైనా యుద్ధాన్ని నిలుపుదలచేసే అధికారం

ఉన్నవాడు ధృతరాష్ట్రుడే. యుద్ధఫలితం తనకు ప్రతికూలమని, యుద్ధంలో పుత్రులను కోల్పోతే హీనాతిహీనమైన జీవితాన్ని గడపవలసి వస్తుందని ధృతరాష్ట్రుడు గుర్తించాలి. అలా గుర్తించేటట్లు తాను చెయ్యాలి. అందుకే ఈ ప్రయత్నం. భీష్మ ద్రోణాదులతో బాటు దుర్యోధనాదులు 100 మందీ భగవంతుని చేతిలో హతులు కావటాన్ని చూచిన అర్జునుని పరిస్థితిని విపులంగా వర్ణించటం - వణికి పోతున్నాడని, భయపడుతున్నాడని, గగుర్పాటు చెందుతున్నాడని, చేతులు జోడిస్తున్నాడని, గద్గద స్వరంతో మాట్లాడుతున్నాడని - చెప్పటంలో సంజయుని ఉద్దేశం వేరే ఉంది. ఈ యుద్ధం ఎలాగైనా జరగకుండా చూడాలి. అయితే అంధరాజుకు ఇవేమీ ఎక్కటం లేదు.

అర్జునుని కిరీటి అంటున్నాడు. కిరీటాన్ని ధరించేవాడు రాజు. కనుక రాజ్యం పాండవులకు తథ్యం. అంటే కౌరవపరాజయం, పాండవ విజయం తప్పదు - అని స్పష్టం చేయటానికే 'కిరీటి' సంభోదన.

మరి గద్గదస్వరంతో అర్జునుడేమంటున్నాడో 36-46 వరకు 11 శ్లోకాల్లో.

- ముందుగా విశ్వరూపుని ప్రభావాన్ని వర్ణిస్తున్నాడు అర్జునుడు.

**అర్జున ఉవాచ:**

**శ్లో||** స్థానే హృషీకేశ! తవప్రకీర్త్యా జగత్ ప్రహృష్య త్యనురజ్యతేచ|

రక్షాంసి భీతాని దిశోద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః|| (36)

**శ్లో||** కస్మాచ్చతేన నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాది కర్త్రే|

అనంత దేవేశ జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్పరం యత్|| **(37)**

**తా||** అర్జునుడు అంటున్నాడు: హృషీకేశా! నీ మాహాత్మ్యాన్ని కీర్తించటం చేత జగత్తంతా సంతోషిస్తున్నది. రాక్షసులు భీతి చెంది నలుదిక్కులకు పరుగులు తీస్తున్నారు. సమస్త సిద్ధసంఘాలు నీకు నమస్కరిస్తున్నాయి. ఇవి అన్నియు నీకు తగియే ఉన్నవి (36).

**తా||** మహాత్మా! సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మకు కూడా ఆది కారణమైన గొప్పవాడవు నీవు. అట్టి నీకు సిద్ధసంఘాలు ఎందుకు నమస్కరించవు? అనంతా! దేవదేవా! జగత్తుకు నివాసమైన వాడా! సత్ పదార్థానికి, అసత్ పదార్థానికి - రెండింటికి అతీతమైన అక్షర పరబ్రహ్మవు నీవు.

**వ్యాఖ్య:-** సంజయుడు యుద్ధవిశేషాలు వినిపించే నెపంతో జరగబోయే ఘోరపరిణామాల గురించి, కురువంశనాశనాన్ని గురించి ధృతరాష్ట్రునికి ఎంతగా చెప్పినా గ్రుడ్డిరాజు బుద్ధి ఏమాత్రం మారలేదు. దీనికంతటికి కారణం విధి. విధి బలీయమైనది. అది బలవంతంగా మనిషిని నడిపిస్తుంది. బలవత్తరమైన విధికి వశుడైనవాడు ఎంతటి తెలివిగలవాడైనా ఏమీ చేయలేడు. అందుకే మొదటిసారి జూదంలో ఓడిపోయి, ద్రౌపదికి అంతగా పరాభవం జరిగినా తిరిగి మళ్ళీ జూదానికి రమ్మని ధృతరాష్ట్రుడు కబురు పంపితే మధ్యదారిలో నుండే వెనుదిరిగి వచ్చాడు ధర్మరాజు.

- బంగారు లేడి ఉండదని తెలిసినా కావాలన్నది సీత.

- రాక్షస మాయ అని తెలిసినా సీత మాటను కాదనలేకపోయాడు శ్రీరాముడు.
- లక్ష్మణుని భక్తి ఎట్టిదో తెలిసినా సీత నీచాతి నీచంగా మాట్లాడి అతణ్ణి బాధపెట్టింది.
- శ్రీరాముని శక్తి ఎంతటిదో తెలిసినా సీతమాటలకు చలించి వెళ్ళాడు లక్ష్మణుడు.

కనుక విధిని తప్పించటం ఎవరి తరమూ కాదు. కన్నులు మాత్రమే కాక బుద్ధి కూడా చెడి తమోగుణవశుడైన ధృతరాష్ట్రుడు మాత్రం ఏం చేయగలడు? సంజయుని మాటలను బొమ్మలాగా వింటున్నాడు.

ధృతరాష్ట్రుని బుద్ధిలోని భావాలను అర్థం చేసుకున్న సంజయుడు యుద్ధరంగంలో అర్జునుడు విశ్వరూపుని ఏమని స్తుతిస్తున్నాడో చెబుతున్నాడు.

హృషీకేశా! నీ మాహాత్మ్యాన్ని కీర్తించటం చేత లోకాలన్నీ సంతోషిస్తున్నాయి. మిక్కిలి ప్రీతిని పొందుతున్నాయి. రాక్షసులు భయంతో నలుదిక్కులకు పరుగులు పెడుతున్నారు. సిద్ధగణాలన్నీ నీకు నమస్కరిస్తున్నాయి.

ఈ శ్లోకంలో బీజాక్షరాలు అధికంగా ఉన్నాయని శ్రీమధుసూదన సరస్వతీ స్వాముల వారన్నారు. ఈ శ్లోకం రాక్షసులను నాశనం చేసే 'రక్షోఘ్న మంత్రం'. దీనిని నారాయణ మంత్రంతో గాని, సుదర్శన మంత్రంతో గాని,

సంపుటం చేసి జపం చేస్తే పీడలు, పిశాచాలు తొలగిపోతాయని పండితులు చెబుతున్నారు.

ఈ శ్లోకం నుండి 46వ శ్లోకం వరకు గల 11 శ్లోకాలలో చేయబడ్డ ఈ స్తోత్రం హిందూమతంలో గల గొప్ప స్తోత్రాలలో ఒకటి. ఇక్కడ ఉపయోగించిన పదాలలో గల భావాలు ఎంతో రమ్యమైనవి, గంభీరమైనవి, అర్థవంతమైనవి. ఇది విశ్వజనీన ప్రార్థన.

విశ్వరూపంలోని విశేషాలను, ఆ రూపాన్ని, తదేకంగా, ఉత్సాహంగా చూస్తున్న అర్జునునికి ఆ విశ్వరూపం వెనుకనున్న తత్త్వం అర్థం కాలేదు. ఇప్పుడా రూపం నుండి దృష్టి మరలిస్తున్న కొద్దీ నెమ్మదినెమ్మదిగా అర్జునుని బుద్ధి ఆ తత్త్వాన్ని తెలుసుకుంటున్నది.

మనం అద్దంలో మన ప్రతిబింబాన్ని తదేకంగా చూసుకుంటుంటే ఆ ప్రతిబింబానికి ఆధారంగా ఉన్న అద్దాన్ని చూడలేం. క్రమక్రమంగా మన దృష్టిరూపం మీది నుండి తొలగిందా అప్పుడు అద్దాన్ని చూడగలం. సినిమాలో లీనమై పోయి చూస్తున్నంతకాలం తెర కనిపించదు. కథ మీద, దృశ్యాల మీద నుండి దృష్టి చెదిరిందా అప్పుడు తెర కనిపిస్తుంది. అలాగే విశ్వరూపంలోని విషయాలను తదేకంగా ధ్యానిస్తున్నంతకాలం ఆధారమైన ఆత్మతత్త్వం అర్థం కాలేదు అర్జునునికి. ఇప్పుడా రూపం నుండి దృష్టి తొలగటంతో ఆ తత్త్వాన్ని అర్థం చేసుకుంటున్నాడు. మనం కూడా అంతే. ప్రపంచం మీద, వస్తువుల మీద, భోగాల మీద, కోరికల మీద, వ్యామోహాలమీద, భాధ్యతలమీద దృష్టి పెట్టినంతకాలం పరమాత్మ తత్త్వం - మన యదార్థతత్త్వం తెలియదు. ఈ

ప్రపంచభావన వీడితే పరమాత్మతత్త్వం అవగతమవుతుంది. పరమాత్మతత్త్వం అర్థమవుతున్న కొద్దీ పరమాత్మపై భక్తి కలుగుతుంది. భక్తి కలిగితే స్తుతించటం ప్రారంభమవుతుంది. ఇప్పుడు అర్జునుడు భక్తితో స్తోత్రం చేస్తున్నాడు. ఏమని?

1.తవప్రకీర్త్యా జగత్ ప్రహృష్యతి:- నిన్ను కీర్తిస్తుంటే - నీమాహాత్మ్యాన్ని స్తోత్రం చేస్తుంటే లోకాలన్నీ సంతోషంగా ఉన్నాయి. అంటే మనం సంతోషంగా ఉండాలంటే భగవంతుని కీర్తించటం, భగవంతుని మాహాత్మ్యాన్ని స్తుతించటం చక్కని మార్గం అని మనం గ్రహించాలి.

2.రక్షాంసి భీతాని దిశోద్రవంతి:- భగవంతుని కీర్తించటం, స్తుతించటం వల్ల మరొక ప్రయోజనం రాక్షసులు భయంతో నలుదిక్కులకు పరుగులెత్తటం. భగవన్నామం జరిగేచోట భూతప్రేత పిశాచాలకు స్థానం లేదు. రాక్షసులంటే రాక్షస గుణాలు - ఆసురీగుణాలు. అజ్ఞానం, దంభం, దర్పం, కామక్రోధాదులు, రాగద్వేషాలు, లోభమోహమదమాత్సర్యాలు వీటికి హృదయంలో స్థానం ఉండదు.

3. సర్వేనమస్యంతిచ సిద్ధ సంఘాః:- పరమాత్మ మహిమను ఎవరైనా కీర్తిస్తూ, స్తుతిస్తూ ఉంటే సిద్ధులు, సాధ్యులు మొదలగువారంతా నమస్కరిస్తారు. దుష్టులు దూరంగా పారిపోతారు. సత్పురుషులు ఆకర్షింపబడుతూ ఉంటారు. వారంతా ఎందుకు నమస్కరిస్తున్నారు? - ఎందుకంటే -

మహాత్మా! నీవు సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మకన్న అధికుడవు. నీవు ఆదిపురుషుడవు. అటువంటి నీకు నమస్కరించకుండా ఎలా ఉండగలం? అని.

(i) బ్రహ్మణః అపి ఆదికర్త్రే :- అందరిని సృష్టించే వాడు బ్రహ్మదేవుడు. ఐతే ఆ బ్రహ్మదేవుని సృష్టించిన ఆదికర్తవు నీవు. నీవు ఎప్పుడూ శాశ్వతంగా ఉండేవాడవు. పుట్టుక - చావు లేనివాడవు. కాని బ్రహ్మదేవుడు ఒకప్పుడు పుడతాడు, ఒకప్పుడు అంతమైపోతాడు. పైగా నీవు సర్వత్రా వ్యాపించియున్న వాడవు. అట్టి ఆదికర్త, సర్వత్రా వ్యాపించియున్న పరమాత్మవు నీవే గనుక, నీ కన్నా అధికులు ఎవరూ లేరు. అట్టి నీకు ఎవరు నమస్కరించరు? అన్నాడు అర్జునుడు.

(ii) అనంత :- నీవు అనంతుడవు. అనంతశక్తి సంపన్నుడవు. ప్రతి ప్రాణికీ అంతం ఉన్నది. ఈ జగత్తుకూ అంతం ఉన్నది. కాని నీకు అంతం లేదు. ఎవరికి కావలసిన శక్తినైనా ఇచ్చేవాడవు నీవే. అందరికీ అన్నీ ఇచ్చి పోషించేవాడవు నీవు. అందుకే నీకు నమస్కారం.

(iii) దేవేశ :- దేవతందరికీ ఈశుడవు. అంటే ప్రభువువు. శాసకుడవు. దేవతలందరిని ఆయా భాద్యతలతో నియమించేవాడవు నీవు. నీ అధీనంలో ఉండేవారు దేవతలు, వెలుగునిచ్చేందుకు సూర్యుడు, చల్లదనానికి చంద్రుడు, వర్షాన్నివ్వటానికి వరుణుడు, వేడినిచ్చేందుకు అగ్ని, సృష్టి చెయ్యటానికి బ్రహ్మ, పోషణకు విష్ణువు, లయం చేసేందుకు శివుడు, ఆధారంగా ఉండేందుకు భూమి, ఇలా - - - ఒక్కొక్క పనికి ఒక్కొక్క దేవతను నియమించావు. వారు ఎలా నడుచుకోవాలో శాసించేవాడివి గనుక దేవేశుడవు.

(iv) జగన్నివాస :- ఈ జగత్తుకు నివాసమైన వాడవు. అంటే ఈ జగత్తంతా నీ ఆధారంగా ఉన్నది. నీలోనే ఉన్నది. కనుకనే యశోదా మాతకు నీ పొట్టలోనే

ఉన్న 14 లోకాలను చూపావు. ఈ జగత్తుకు నీవు ఆధారమే కాదు, అధిష్టానం కూడా నీవే. అంటే అసలు ఉన్నది నీవే. నీవే జగత్తులాగా అజ్ఞానులకు భ్రమగొల్పుతున్నావు.

(v) సత్, అసత్ తత్ పరం యత్ :- సత్తు - అసత్తులు రెండింటికీ పరమైనదేదో అది నీవే. స్థూల సూక్ష్మ జగత్తులకు విలక్షణమైన వాడవు నీవు. స్థూలజగత్తులో గాని, స్థూలశరీరంలో గాని ఏమిజరిగాలన్నా నీచైతన్యం వల్లనే జరుగుతుంది. అలాగే సూక్ష్మజగత్తులోగాని, సూక్ష్మశరీరంలో గాని ఏమి జరిగినా అది అంతా నీవల్లనే - చైతన్యం వల్లనే. అయినప్పటికీ ఆరెండింటికి ఏమాత్రం సంబంధం లేకుండా, వాటికి అంటకుండా - వేరుగా - విలక్షణంగా సూక్ష్మాతి సూక్ష్మంగా, స్వయంప్రకాశమై ఉండే పరమాత్మవు.

సినిమా కామెడీ అయితే నవ్వుకుంటాం. ట్రాజెడీ అయితే ఏడుస్తాం. అయితే ఎలాంటి సినిమా అయినా కథనడిచేది మాత్రం వెండితెర మీదనే. ఆ తెరకు ఈ నవ్వుతో గాని, ఏడుపుతో గాని ఏ సంబంధమూ లేదు. అలాగే పరమాత్మవైన నీకు ఈ సత్తు - అసత్తుల కర్మలతో గాని, కర్మఫలాలతో గాని ఏ సంబంధము ఉండదు. అలా దేనికీ సంబంధం లేకుండా అసంగంగా, ఎప్పుడూ ఉండే - నాశనం లేని అక్షరస్వరూపుడవు నీవు. అందుకే 'త్వంఅక్షరం' నీవు అక్షరుడవు, క్షరం లేనివాడవు, నాశనం లేనివాడవు అంటున్నాను. నీవు ఇంతటి వాడవు కనుకనే సిద్ధసంఘాలన్నీ వినమ్రతతో నమస్కరిస్తున్నాయి - అంటున్నాడు అర్జునుడు.

ఇంకా భగవంతుని దివ్యలక్షణాలు ఏమిటో —

భగవంతుని మహిమను, అనంతత్వాన్ని క్రమక్రమంగా తెలుసుకుంటున్న అర్జునుడు భగవంతుని అనేక విధాల స్తుతిస్తూ, భగవత్తత్త్వం అర్థమవుతున్న కొద్దీ ఆయన పట్ల అనన్యమైన, అచంచలమైన భక్తి పారవశ్యంలో మునిగిపోతున్నాడు. ఎలా?-

**శ్లో||** త్వమాది దేవః పురుషః పురాణః త్వమస్య విశ్వస్య పరం నిధానం|
వేత్తాఽసి వేద్యంచ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనంత రూప!|| (38)

**శ్లో||** వాయుర్య మోఽగ్ని ర్వరుణ శ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ|
నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే|| (39)

**శ్లో||** నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ|
అనంత వీర్యా మిత విక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః|| (40)

**తా||** నీవు ఆదిదేవుడవు. పురాణ పురుషుడవు. నీవు ఈ విశ్వానికంతటికి పరమనిధివి. తెలియబడవలసిన వాడవు. తెలుసుకొనే వాడివి కూడా - శ్రేష్టమైన, సర్వోత్కృష్టమైన స్థానం నీవు. అనంత రూపుడవైన నీ చేత ఈ విశ్వమంతా వ్యాపించబడి యున్నది (38).

**తా||** వాయువు, అగ్ని, వరుణుడు, యముడు, చంద్రుడు, ప్రజాపతి - అన్నీ నీవే. సృష్టికర్త బ్రహ్మకు తండ్రివి నీవే. నీకు నమస్కారం. నీకు వేయి నమస్కారములు. నీకు మళ్ళీ మళ్ళీ నమస్కారములు (39).



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** నీకు ముందు నుంచి నమస్కారం. వెనుక నుంచి నమస్కారం. అన్ని వైపుల నుండి అన్నీ అయిన నీకు నమస్కారం. అనంత వీర్యా! అమిత విక్రమా! అంతటా నిండి ఉన్న నీవే సర్వమూ కూడా (40).

**వ్యాఖ్య:-** ముందుగా పరమాత్మ యొక్క 8 లక్షణాలను తెలియజేస్తూ స్తుతిస్తున్నాడు అర్జునుడు.

(1) ఆదిదేవః :- నీవు ఆదిదేవుడవు. అంటే అందరికన్నా ముందున్నవాడవు. సృష్టికర్తయైన బ్రహ్మదేవునికి కూడా కారణం నీవే. కనుక ఆదిదేవుడవు.

(2) పురాణపురుషః :- నీవు పురాణపురుషుడవు. అంటే పురాతనమైన వాడవు. సనాతనుడవు. అలాగని నీవు పాతబడి పోయిన వాడవుకాదు. సదా నూతనుడవు. ఎవరికి ఎలా కావాలంటే అలా కనిపించే వాడవు.

(3) త్వం అస్య విశ్వస్య పరం నిధానం :- నిధానం అంటే విశ్రమించే స్థలం. ఈ జగత్తు అంతా నీలోనే ఇమిడి ఉన్నది. విశ్రమించి యున్నది. సమస్త లోకాలు, సమస్త ప్రాణులు, అన్నీ నీలోనే ఉన్నట్లు. ఎప్పుడో చిన్నప్పుడే యశోదామాతకు చూపించావు.

(4) వేత్తాసి :- దేన్నైనా తెలుసుకోవాలంటే బుద్ధిలో తెలివిఉండాలి. బుద్ధి వికసించాలి. ఆ బుద్ధిని వికసింపజేసేది - జడమైన బుద్ధికి ప్రకాశాన్నిచ్చి ప్రకాశింపజేసేది ఆత్మయే కనుక ఆత్మయే బుద్ధి ద్వారా అన్నింటిని తెలుసుకోగలుగుతున్నది.

(5) వేద్యంచ :- తెలియబడేది కూడా ఆత్మయే. బుద్ధిలోని ఈ జ్ఞానం ద్వారా ఆలోచనలు పెరిగి, అజ్ఞానం తొలగి, ఆత్మ తెలియబడాలి. ఈ జడమైన బుద్ధికి

చైతన్యం ఎక్కడి నుండి వస్తున్నది? అని ప్రశ్నించుకుంటే సరి - మన ఆలోచనలన్నీ అంతర్ముఖమై ఆ కారణాన్ని వెతుక్కుంటూ వెళ్ళిపోతాయి. చివరకు ఆలోచనలు ఆగి ఆత్మతత్త్వం అనుభవానికొస్తుంది. కనుకనే వేద్యం - తెలియబడేది - అన్నారు.

(6) పరంధామ :- పరమాత్మ స్థానం శ్రేష్టమైన, సర్వోత్కృష్టమైన స్థానం. దానిని మించిన స్థానం మరొకటి లేదు. అందరు చేరుకోవలసింది ఆ స్థానానికే. ఆ స్థానాన్ని చేరుకొనే దాకా ఆందోళనలు, అశాంతి. చేరుకున్నామా! ప్రశాంతత. పరమానందస్థితి.

(7) త్వయా ఇదం విశ్వం తతం :- నీచేత ఈ విశ్వమంతా వ్యాపించియున్నది. ఈ విశ్వమంతా ఎక్కడ చూచినా నీవే. కుండల్లో అంతటా మట్టి వ్యాపించియున్నట్లు, అలలలో ఎక్కడ చూచినా సముద్రమే వ్యాపించియున్నట్లు. నీవు ఈ బ్రహ్మాండం అంతటా వ్యాపించియున్నావు. అందుకే 'తతం' అన్నారు.

(8) అనంతరూప :- భగవంతుడు అనంతరూపుడు. విశ్వంలోని రూపాలన్నీ ఆయనలోనే ఉన్నాయి కనుక ఆయన అనంతరూపుడు. ఆ రూపాలకు అంతులేదు. అనంతకాలం నుంచి ఈ సృష్టి, స్థితి, లయాలు జరుగుతూనే ఉన్నాయి. అందులో అనంతరూపాలు ఆయనవి. అందుకే అనంతరూపుడు.

ఇలా ప్రశంసిస్తూ భగవత్తత్త్వం అర్థం కావటంతో ఆ భగవంతునిపై భక్తి వృద్ధి అవుతున్నది. భక్తితో పరవశించి పోతున్నాడు అర్జునుడు. ఆ పరవశంలో ఏమంటున్నాడో చూడండి. అతనిలో ఏ ఆలోచనలు కదులుతున్నాయి?

ఇంతవరకు - భగవంతుడు, దేవుడు, పరమాత్మ అంటూ ఎందరినో పూజించాడు అర్జునుడు. వారికి, ఈ విశ్వరూపుడైన పరమాత్మకు తేడా ఉన్నదా? లేక అందరూ ఒక్కటేనా? వేదకాలంలో ప్రకృతి శక్తులనే అందరూ పూజించేవారు. వారే వాయువు, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, వరుణుడు, ప్రజాపతి, యమధర్మరాజు మొ||న వారు. ఇప్పుడు సందేహం తొలగిపోతున్నది. ఈ ప్రకృతి శక్తులైన దేవతలంతా ఎవరో కాదు. ఈ విశ్వరూపుని వివిధరూపాలు. అంటే ఈ విశ్వరూపుడే (పరమాత్మే) వేరువేరు రూపాలలో పూజలందుకుంటున్నాడు. అంటే పరమాత్మే వాయువుగా గాలినిస్తున్నాడు, వరుణుడిలా వర్షాన్నిస్తున్నాడు, యమునిలా కర్మఫలాలు తీరినవారిని లయం చేస్తున్నాడు, అగ్నిలా వేడినిస్తున్నాడు, సూర్యచంద్రుల లాగా వెలుగును, చల్లదనాన్ని ఇస్తున్నాడు. ఇలా అందరికీ అన్నింటినీ ఇచ్చి అందరి చేత పూజింపబడే వాడు యదార్థంగా ఆ పరమాత్మే. అందుకే నీవే వాయువు, నీవే యముడు, నీవే అగ్ని, నీవే వరుణుడు, నీవే సూర్యుడు, నీవే చంద్రుడు, నీవే ప్రజాపతి, నీవే బ్రహ్మదేవుని తండ్రివి అంటున్నాడు అర్జునుడు. ఇలా అన్ని రూపులలో, అంతటా పరమాత్మనే చూస్తున్న అర్జునునిలో అమితమైన భక్తి కలుగుతున్నది. అందుకే నమస్కరిస్తున్నాడు. వేయి నమస్కారాలు, మళ్ళీ మళ్ళీ నీకు నమస్కారాలు అంటూ హృదయం భక్తితో - ప్రేమతో పులకరించి మళ్ళీమళ్ళీ నమస్కారాలు చేస్తూ, పరవశించి పోతున్నాడు. ఎలా?

నీకు ముందు నమస్కారం, వెనుక నమస్కారం, అంతటా - అన్ని దిక్కులా నమస్కారం. ఏమిటి ఇలా పరవశించిపోవటం? ఎందుకు? ఎందుకంటే? - భగవంతుడు సర్వవ్యాపి. అంతటా ఆయన ఉన్నాడు. ఆయన లేని చోటు అంటూ లేదు. ఇది కేవలం అర్జునుని భావమే కాదు. మహర్షులు అనుభవంతో కనుగొన్న విషయం. ఉపనిషత్తులు నిరంతరమూ బోధిస్తున్న విషయం. భాగవతంలో ప్రహ్లాదుడు కూడా తన జ్ఞానానుభవంతో స్పష్టంగా తెలిపిన విషయం - "ఇందు గలడందులేడను సందేహము వలదు చక్రి సర్వోపగతుండు ఎందెందు వెదకి చూచిన అందందే గలడు - అని. అలా అంతటా పరమాత్మ ఉన్నాడు గనుక ఎదుట నమస్కరిస్తున్నాడు. తన వెనుక కూడా ఆయనే ఉన్నాడు గనుక వెనుక నమస్కారం. ఏ దిక్కుకు తిరిగినా అన్ని వైపులా ఆయన ఉన్నాడు. గనుక అన్ని వైపులకు తిరిగి నమస్కారములు తెలియజేస్తున్నాడు. మళ్ళీమళ్ళీ నమస్కరిస్తున్నాడు.

భగవంతుడు సర్వవ్యాపి మాత్రమే కాదు ఆయన అమిత వీర్యం, పరాక్రమం గలవాడు. మానవశక్తి పరిమితం. భగవంతుని శక్తి అపరిమితం. మనం ఒక దీపం వెలిగిస్తే కొంచెం కాంతి వస్తుంది. కొంతదూరం మాత్రమే కనబడుతుంది. కాని సూర్యుడు ప్రకాశిస్తే ప్రపంచం అంతా కాంతితో నిండిపోతుంది. మనకు గాలి కావాలంటే విసనకర్రతో విసురుకుంటాం. అది ఒక్కరికే. లేదా ఫ్యాన్ వేసుకుంటే ఐదుగురురికి గాలివస్తుంది. కాని వాయువు ప్రసారమైతే కోట్లాది మందికి గాలి వస్తుంది. కనుక భగవంతుని శక్తి అత్యధికం, అపరిమితం, అనంతవీర్యం.

'సర్వమున్నతని దివ్యకళా వైభవం' అన్నట్లు ఉన్న శక్తి, బలం, పరాక్రమం, తేజస్సు - అంతా ఆ పరమాత్మదే, అసలు ఆ పరమాత్మే ఈ సర్వం అని తెలుసుకోవటంతో అర్జునునిలో అమితభక్తి - భయము కలిగినవి.

ఇంతటి పరమాత్మను ఇంతకాలం తన ప్రక్కనే పెట్టుకొని ఆయనతో ఎలా ప్రవర్తించాను నేను? అనే ఆలోచన వచ్చింది. అది తలచుకుంటే ఎంతో భయంవేసింది. అందుకే అంటున్నాడు -

**శ్లో||** సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి|
అజానతా మహిమానం తవేదం మయాప్రమాదాత్ ప్రణయేన వాపి|| **(41)**

**శ్లో||** యచ్ఛాప హాసార్థ మ సత్కృతోఽసి విహార శయ్యాసన భోజనేషు|
ఏకోఽథవా ప్యచ్యుత! తత్ సమక్షం తత్ క్షామయే త్వామహ మప్రమేయం||

**శ్లో||** పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్|
నత్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః లోకత్రయేఽప్య ప్రతిమప్రభావ|| **(43)**

**శ్లో||** తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశ మీడ్యం|
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం|| **(44)**

**తా||** నీ ఈ మహిమను తెలియని అజ్ఞానంలో స్నేహము చేత నీవు నా చెలికాడవని తలంచి, ఓ కృష్ణా! ఓ యాదవా! ఓ మిత్రమా! అని ప్రేమతోను, నిర్లక్ష్యంగాను పిలిచాను (41).

**తా||** అచ్యుతా! విహారం చేసేటప్పుడు, భోజనం చేసేటప్పుడు, పడుకొనేటప్పుడు, కూర్చున్నప్పుడు నలుగురిలో ఉన్నా, ఒక్కడివే ఉన్నా పరిహాసానికి అనంతుడవైన నీపట్ల అపచారం చేశాను. నన్ను క్షమించు (42).

**తా||** సాటిలేని ప్రభావం కలవాడా! స్థావరజంగమాలతో కూడిన ఈ ప్రపంచానికి నీవు తండ్రివి, పూజ్యుడవు, శ్రేష్ఠుడైన గురువువు. ఈ ముల్లోకాలలోను నీకు సమానమైన వాడే లేడు. ఇక నిన్ను మించిన వాడెక్కడుంటాడు? (43).

**తా||** అందుచేత శరీరాన్ని వంచి నీకు నమస్కరిస్తున్నాను. ప్రభువువు, ఆరాధనీయుడవు అయిన నీ అనుగ్రహాన్ని కోరుతున్నాను. పుత్రుని తండ్రి,, మిత్రుని మిత్రుడు, ప్రియురాలిని ప్రియుడు క్షమించినట్లు నీవు నన్ను క్షమించుటకు తగినవాడవు (44).

**వ్యాఖ్య:-** ఇంతవరకు శ్రీకృష్ణుని ఒక గొప్పమేధావిగా, పరాక్రమశాలిగా, మహావీరునిగా, ఆత్మీయుడైన బంధువుగా, బావగా, చెలికానిగా, మిత్రునిగా, సమవయస్కునిగా చూచాడేగాని ఆయనే మహామహిమాన్వితుడైన పరమాత్మ అనే విషయం తెలియదు. ఎప్పుడైతే ఒక్కసారిగా తన ఎదురుగా ఉన్నది ఆ ఏకమైన పరమాత్మే అని తెలియటంతో భయం కలిగింది. అంతటి పరమాత్మను ఇంతవరకు చనువు చేతనో, నోరుజారియో కృష్ణా! యాదవా! మిత్రమా! బావా! అంటూ సామాన్యుణ్ణి పిలిచినట్లు పిలిచాడు. అందరి ఎదుటగాని, ఏకాంతంలో ఉన్నప్పుడు గాని, ఆహారవిహారాలయందు; ఆసన, శయనాదుల యందు; వేళాకోళం చేస్తూనో, తృణీకరిస్తూనో

మాట్లాడియున్నాడు. ఇదంతా అజ్ఞానంలోనే చేసి ఉండొచ్చు. అయినా సరే తన తప్పులకు క్షమాపణ కోరుకుంటే గాని తన మనస్సుకు శాంతికలగదు.

సాధారణంగా మనం కూడా అంతే. మనతో పాటు తింటూ, తిరుగుతూ ఉండే వ్యక్తి యొక్క గొప్పతనాన్ని గుర్తించం. అయితే ఆ వ్యక్తి యొక్క గొప్పతనాన్ని ఇతరులు - ఎక్కడో ఉన్నవారు గుర్తించి అతడిని ప్రశంసిస్తుంటే - గౌరవిస్తుంటే - ఆరాధిస్తుంటే అప్పుడు మనలో స్పందన కలుగుతుంది. అంతేకాదు జీవించి ఉన్న వ్యక్తి యొక్క గొప్పతనం మరణానంతరం ప్రచారంలోకి వస్తుంది. అప్పుడనుకుంటాం, ఇంతటి మహాత్మునితో కలిసి ఉన్న మనం ఎంతో అదృష్టవంతులం; ఐతే ఆనాడు ఈయన మహానుభావుడు అని కనిపెట్టి గౌరవించి, పూజించలేక పోయామే - అని. అయితే ఎంత బాధపడ్డా చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నట్లు ప్రయోజనం ఉండదు.

ఇప్పుడు అర్జునుడు కూడా శ్రీకృష్ణుని గొప్పతనాన్ని విశ్వరూపప్రదర్శనతో తెలుసుకున్నాడు. అలా తెలుసుకోవటంతో ఇంతవరకు తాను ఎంతటి అజ్ఞానంలో ఉన్నాడో తెలిసింది. సిగ్గు వేసింది. క్షమాపణ కోరాలనుకున్నాడు. అందుకే అంటున్నాడు, స్వామీ! నా అపరాధానికి నన్ను క్షమించు - అని. క్షమాపణ కోరితే గాని మనస్సు శాంతించదు. అందుకే భయంతో, భక్తితో, వినయంతో, శిరస్సు వంచి నమస్కరిస్తూ క్షమాపణ కోరుకున్నాడు.

ప్రేమతో పెద్దవాళ్ళు పిల్లలతో చనువుగా ఉంటారు. అలాగే మహాత్ములు సామాన్యులలాగా అందరితో కలిసిమెలిసి దగ్గరగా ఉంటారు. స్నేహభావంతో,

ఆత్మీయంగా ఉంటారు. అవివేకులు, అజ్ఞానులు, అహంకారులు దానిని అలుసుగా తీసుకొని అనర్థాలు తెచ్చుకుంటూ ఉంటారు. కాని అర్జునుడు మాత్రం తన తప్పు తెలుసుకొని మనఃపూర్వకంగా క్షమాపణ కోరుకుంటున్నాడు.

ఇలా క్షమించమని కోరుకోవటంలో కూడా భగవంతుని ఆధిక్యతను వెల్లడిస్తూ ఆయన మహిమను ప్రశంసిస్తూ క్షమాపణ కోరుకుంటున్నాడు. పైకి చెప్పటానికి వీలులేని మనోభావాల ఒత్తిడితో ఉప్పొంగిపోతున్నాడు అర్జునుడు. తన చెలికాడు, తన బంధువు, తన ఆత్మీయుడు ఈ సమస్త లోకాలకు (విశ్వానికి) ప్రభువు అని తెలియటంతో ప్రశంసించటానికి మాటలు రావటం లేదు. ఎంత ప్రశంసించినా తృప్తి కలగటం లేదు.

నవలలు వ్రాసేటప్పుడు అందమైన కథానాయకిని కథానాయకుడు ప్రశంసిస్తుంటాడు. భాషలో ఉన్న పదాలేవీ ఆమె అందాన్ని వర్ణించటానికి చాలవన్నట్లుగా ఉంటాయి. అప్పుడు చివరికి అంటాడు, నీఅందాన్ని మాటలతో వర్ణించలేను - అని. ఇప్పుడు అర్జునుని పరిస్థితీ ఇంతే. భగవంతుని మహిమను మాటలతో వర్ణించలేకపోతున్నాడు; ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు; పరవశించిపోతున్నాడు. భక్తితో తన్మయం చెంది అంటున్నాడు, "ఈ చరాచర ప్రపంచానికి నీవు తండ్రివి, మూలపురుషుడవు, ఆద్యుడవు నీకన్నా ముందు ఎవ్వరూ లేరు. నీవు పూజనీయుడవు. గురుశ్రేష్ఠుడైన వాడవు. ఇక్కడి గురువులంతా సామాన్యగురువులు. నీవు ఈ జగత్తులోని గురువులందరికీ

గురువువు. నీతో సమానులైన వారు లేరు. అయినప్పుడు నీకన్నా అధికులైన వారు ఎలా ఉంటారు? అంటూ నమస్కరిస్తున్నాడు.

నమస్కారం అనేది అహంకారాన్ని అణచివేయటానికి మొదటిమెట్టు, అహంకారం అణిగితే జీవుడు దేవుడే. కనుక భక్తితో, గౌరవంతో, వినయంతో పెద్దలకు నమస్కరించాలి. అందుకే అర్జునుడు కాయాన్ని (శరీరాన్ని) వంచి, శిరస్సు వంచి, వినయంతో నమస్కరిస్తున్నాడు. మనకు తల ఎగురవేయటమే తెలుసుగాని తలవంచటం చేతకాదు. తలవంచటం నామోషీగా భావిస్తాం. మన గురించి తక్కువగా అనుకుంటారేమోనని భయం.

అర్జునుడు అలాంటి శషభిషలు లేకుండా, కాయాన్ని వంచి, తలవంచి నమస్కరిస్తూ క్షమాపణలు కోరుతున్నాడు. ఎలా తనను క్షమించాలో కూడా చెబుతున్నాడు. తండ్రి తన కుమారుణ్ణి క్షమించినట్లు, మిత్రుడు తన మిత్రుని క్షమించినట్లు, ప్రియుడు తన ప్రియురాలిని క్షమించినట్లు క్షమించమంటున్నాడు. దీనికి కారణం పై వారిలో క్షమాగుణం త్వరగా వస్తుంది. ఇతరులలో అంత త్వరగా రాదు. అందుకే అలా క్షమించమని కోరి ఇక ఈ విశ్వరూపాన్ని ఉపసంహరించమని కోరుతున్నాడు. ఎందుకు? ఎలాంటి రూపం కావాలంటున్నాడు? -

**శ్లో||** అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేనచ ప్రవ్యధితం మనో మే|
తదేవ మే దర్శయ దేవ! రూపం ప్రసీద దేవేశ! జగన్నివాస!|| **(45)**

**శ్లో||** కిరీటినం గదినం చక్రహస్తం ఇచ్ఛామిత్వాం ద్రష్టుమహం తథైవ|
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే!|| **(46)**

**తా||** ఇంతకుముందు ఎన్నడూ చూడని ఈ విశ్వరూపాన్ని చూచి ఆనందిస్తున్నాను. భయంతో నా మనస్సు వ్యధచెందుతున్నది. దేవా! దేవదేవా! జగన్నివాసా! నన్ను అనుగ్రహించి నాకు ఆ వెనుకటిరూపాన్ని చూపు (45).

**తా||** ఓ సహస్రబాహూ! విశ్వరూపా! కిరీటం, గద, చక్రంతో కూడిన నిన్ను అలాగే చూడగోరుతున్నాను. మునుపటి రూపంతోను చతుర్భుజాలతోను నాకు కనిపించు (46).

**వ్యాఖ్య:-** ఇదివరకు ఎన్నడూ చూడని విశ్వరూపాన్ని చూచి ఆనందించాడు అర్జునుడు. భయంతో వ్యధచెందుతున్నాడు. సంతోషం, భయం రెండూ కలుగుతున్నాయి. రెండూ ఎలా కలుగుతున్నాయి?

అపూర్వమైనది, ఎవ్వరూ చూడలేనిది, తాను ఇంతవరకు ఎప్పుడూ చూడనిది, అత్యాశ్చర్యకరమైనది అయిన అద్భుతమైన విశ్వరూపాన్ని చూచే అదృష్టం తనకు కలిగినందుకు ఆనందంతో ఉప్పొంగిపోతున్నాడు. మరి భయం ఎందుకు? విశ్వరూపంలోని భయంకరమైన దృశ్యాలను చూస్తుంటే భయం కలుగుతున్నది.

అల్పమైన మనోబుద్ధులు అనంతమైన తత్త్వంలో ఎక్కువకాలం నిలువలేవు. బుద్ధి ఉత్సాహంతో చొచ్చుకపోయి అలసిపోతుంది. మనస్సు వెరగుపడుతూ కంపిస్తుంది. అర్జునుడికి కాలపురుషుని దర్శనంతో ఇలాంటి అనుభవమే కలిగింది. అందుకే భయం. సూర్యకాంతిని ఒక్కసారి sudden గా

అలా చూడలేం. ఎక్కువసేపు చూడలేం. అలాగే ఈ భయంకరరూపాన్ని అర్జునుడు ఎక్కువసేపు చూడలేకపోతున్నాడు.

అనంతమైన పరమాత్మశక్తిని అల్పమైన మనోబుద్ధులు అందుకోలేవు. అలా అందుకోవాలంటే మనోబుద్ధులు అజ్ఞానమనే పొరలను చీల్చుకొని రావాలి. దేహభావన, మనోభావాన తొలగనిదే ఆత్మభావనకు అవకాశం లేదు. అందుకే అల్పమయిన మనోబుద్ధులు చూడగలిగే అనువైనరూపాన్ని చూపమని ప్రార్థిస్తున్నాడు అర్జునుడు.

'తత్ దేవరూపం ఏవమే దర్శయ' ఆ దేవరూపాన్నే నేను చూడాలనుకుంటున్నాను - అంటే శాంతస్వభావంతో కనిపించే రూపాన్ని చూపమని అర్థం. ఎలాంటి రూపం కావాలనుకుంటున్నాడు అర్జునుడు?

కిరీటం, గద, సుదర్శనచక్రం ధరించిన సౌమ్యరూపం శ్రీకృష్ణునిది. ముందు అర్జునుడు చూచింది ఈ రూపాన్నే. ఇప్పుడు మళ్ళీ ఆ రూపాన్నే చూడాలనుకుంటున్నాడు. సహస్రబాహువులతో, సహస్రభుజాలతో, వివిధ ఆయుధాలతో, ప్రజ్వలిస్తున్న అగ్నిలాగా ప్రకాశిస్తున్న ముఖాలతో ఉన్న భయంకరమైన కాలపురుషుడి రూపాన్ని చూడలేకపోతున్నాడు. భయం కలుగుతున్నది. కనుక సౌమ్యమైన వెనుకటిరూపాన్నే చూపమంటున్నాడు. అందులోనూ మరొక కోరిక 'చతుర్భుజేన' - నాలుగు భుజాలతో ఉన్న పూర్వరూపాన్నే చూపుఅంటున్నాడు. ఈ రూపాన్ని ఇంతకుముందు ఎప్పుడు చూచాడు?

'తేనైవ చతుర్భుజేన రూపేణ' - నాలుగు భుజాలతో ఉన్న ఆ రూపాన్నే చూపు అనటంతో ఈ రూపంతో అర్జునునికి ఇంతకుముందే పరిచయం ఉండిఉండాలి. ఇంతకుముందు ఆ రూపాన్ని చూచి ఉండాలి. కాని నిజంగా అర్జుననితో ఇంతవరకు కలిసిమెలిసి తిరిగిన శ్రీకృష్ణునికి అందరిలాగా రెండు భుజాలే ఉన్నాయి. అందుకే కృష్ణా! యాదవా! సఖా అని తేలికగా మాట్లాడాను క్షమించు అన్నాడు అర్జునుడు. 4 భుజాలతో కనిపిస్తే అలా అనేవాడు కాదుగదా! కనుక 4 భుజాలతో ఇంతకుముదు పరిచయం లేదు. చూచి ఉండే వీలులేనేలేదు. మరి ఎందుకలా అన్నాడు?

యుద్ధరంగంలో ప్రవేశించి, విషాదంలో పడిపోయేంత వరకు శ్రీకృష్ణుని చతుర్భుజాలతో ఎప్పుడూ అర్జునుడు చూచి ఉండలేదు. ఇది నిజం. కాని ఈ యుద్ధభూమిలో భయంకర విశ్వరూపాన్ని చూపేముందు చతుర్భుజుడై; శంఖు, చక్ర, గదా, పద్మాలను హస్తములందు దాల్చి; శిరస్సున కిరీటంతో; చతుర్భుజాలతో సౌమ్యరూపాన్ని చూపించి ఉండాలి. కనుక చతుర్భుజాలతో, కిరీటం, గదాచక్రాలతో ముందు చూపిన రూపం సౌమ్యరూపం గనుక, ఆ రూపాన్ని మళ్ళీమళ్ళీ చూడాలనే కోరికతో ఆ పూర్వరూపాన్నే చూపు అంటున్నాడు. తన ఇష్టదైవాన్ని తన కిష్టమైన రూపంలో చూడాలనుకోవటం భక్తుల లక్షణం. భక్తుడికి ఇష్టదైవం అనంతమూర్తిగా దర్శనమిచ్చినా తాను కొలుచుకొనే చిన్నరూపం మీద ప్రేమపోదు. దానిని తిరిగి తిరిగి చూడాలని కోరుకుంటాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆర్తితో అర్జునుడు చేసిన ఆ విన్నపాన్ని విని శ్రీకృష్ణుడు ఏమంటున్నాడో, విశ్వరూప మహిమ ఎట్టిదో 3 శ్లోకాల ద్వారా భగవానుడు తెలియజేస్తున్నాడు.

**శ్రీభగవానువాచ:**

**శ్లో||** మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మ యోగాత్|
తేజోమయం విశ్వమనంత మాద్యం యన్మే త్వదన్యేన న దృష్ట పూర్వం|| **(47)**

**శ్లో||** న వేద యజ్ఞా ధ్యయ నైర్న దానైః నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః|
ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర!|| **(48)**

**శ్లో||**మాతే వ్యధా మాచ విమూఢ భావః దృష్ట్వారూపం ఘోరమీదృఙ్మ మేదం|
వ్యపేత భీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూప మిదం ప్రపశ్య|| **(49)**

**తా||** భగవానుడన్నాడు: నా అనుగ్రహం వల్ల, నా యోగశక్తి చేత ఈ శ్రేష్ఠరూపం నీవు చూడగలిగావు. తేజోమయం, అనంతం అయిన నా ఈ విశ్వరూపాన్ని నీవు తప్ప మరెవరూ ఇంతవరకు చూడలేదు (47).

**తా||** ఓ కురుశ్రేష్టా! వేద, యజ్ఞ, అధ్యయన, దాన, తపస్సు, కర్మలు దేనివల్ల కూడా మానవలోకంలో నా ఈ రూపాన్ని నీకు తప్ప ఇతరులెవ్వరికీ చూడటం సాధ్యం కాదు (48).

**తా||** భయంకరమైన నా ఈ రూపాన్ని చూచి భయపడవద్దు. మనోవైకల్యం చెందకు. భయం వీడి, సంతోషంతో కూడిన మనస్సుతో నా మునుపటి రూపం ఇదిగో చూడు (49).

**వ్యాఖ్య:-** అర్జునా! నీయందు నాకు గల అనుగ్రహం వల్ల, నా యోగశక్తి ప్రభావంతో ఈ శ్రేష్ఠమైన విశ్వరూపాన్ని చూచావు. తేజోమయము, అనంతము అయిన ఈ విశ్వరూపాన్ని నీవు తప్ప మరెవరూ ఇంతకుముందు చూడలేదు. నిజంగా ఇంతవరకూ ఎవరూ చూడలేదా? ఎవరికీ చూపలేదా? (i) శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని తాను చెరసాలలో జన్మించబోయే ముందు కన్నతల్లి దేవకీదేవికి చూపించాడు. (ii) మన్ను తిన్నాడని బలరాముడు రిపోర్టు చేసినప్పుడు పెంచిన తల్లి యశోదకు తన విశ్వరూపాన్ని చూపించాడు. (iii) మధురానగరంలో తన భక్తుడైన అక్రూరునికి చూపించాడు. (iv) సంధిచేయటం కోసం వెళ్ళిన తనను బంధించటానికి వచ్చిన దుష్టచతుష్టయం వెరగుపడునట్లు చేయుటకు కురుసభా భవనంలో మహర్షులకు, భీష్మవిదుర ద్రోణాదులకు, అంధరాజు ధృతరాష్ట్రునకు తన విశ్వరూపాన్ని చూపాడు. అలా తన విశ్వరూపాన్ని నాలుగు సందర్భాలలో ఇంతకుముందే చూపిన శ్రీకృష్ణుడు ఇప్పుడు యుద్ధభూమిలో ధనుర్బాణాలు ఆవల పారవేసి విషాదంలో మునిగిన అర్జునునికి చూపి, ఈ నా విశ్వరూపాన్ని నీవు తప్ప ఇతరులెవ్వరూ ఇంతకుముందు చూడలేదు - అంటున్నాడు. మరి వారంతా విశ్వరూపాన్ని చూడటం అబద్ధమా? కాదు. ఇప్పుడు చూపిన ఈ విశ్వరూపం ఇంతకుముందు చూపిన విశ్వరూపాలన్నింటి కన్న శ్రేష్టమైనది, ప్రత్యేకమైనది, విశిష్టమైనది, విశేషమైనది, విస్తారమైనది, పరిపూర్ణమైనది; భయంకరమైనది. భవిష్యత్తును వర్తమానంలో చూపేది.

ఇటువంటి విశిష్టమైన రూపాన్ని ఇంతకుముందెప్పుడూ చూపలేదు. కనుకనే ఇట్టి రూపాన్ని చూచే అదృష్టం ఎవరికీ కలగలేదు. మరి అర్జునునకు ఈ అదృష్టం ఎలా దక్కింది? అర్జునుడు భగవానునికి ప్రియభక్తుడు, మిత్రుడు, ఆత్మీయుడు. అందుకే అతడిపై అనుగ్రహం. అంతటి అనుగ్రహం ఉన్నది గనుకనే యుద్ధరంగ మధ్యంలో మనస్థిమితం లేకుండా, విషాదంతో, అశాంతితో, కర్తవ్య విమూఢుడై యున్న అర్జునునికి - విశ్వరూపాన్ని దర్శించటానికి కావలసిన అర్హత లేని, ప్రశాంతత లేని అర్జునునికి - తన యోగశక్తి ప్రభావంతో ఈ అత్యద్భుతమైన, పరమ భయంకరమైన విశ్వరూపాన్ని చూపించాడు. అంటే భగవానుడే అర్జునునికి అట్టి రూపాన్ని చూడటానికి కావలసిన జ్ఞాననేత్రాన్ని ప్రసాదించి అవకాశం కల్పించాడు. ఇదే భక్తునిపై భగవంతునికి గల అనుగ్రహం.

దీనిని బట్టి భగవద్దర్శనం కావాలంటే భగవంతుని అనుగ్రహాన్ని పొందాలి. భగవంతుని అనుగ్రహాన్ని పొందటానికి షార్ట్ కట్ మార్గాలేమీ ఉండవు. ఇక్కడ ఎవరి అనుగ్రహాన్నైనా పొందాలంటే కాకాపట్టాలి, లేదా సన్మానాలు చేయాలి, లేదా డబ్బులు, కానుకలు ఇచ్చి సంతోషపెట్టాలి, లేదా వాళ్ళపైనా, వీళ్ళపైనా చాడీలు చెప్పాలి. కాని భగవంతుని దగ్గర ఈ పప్పులేమీ ఉడకవు. ఆయనపై అనన్యమైన భక్తి ఉంటేనే ఆయన అనుగ్రహాన్ని పొందగలం. కనుక భగవద్దర్శనానికి భక్తి ప్రధానం.

ఈ విశ్వరూపాన్ని ఇంకా వేరే ఉపాయాల ద్వారా, సాధనల ద్వారా దర్శించటం సాధ్యమవుతుందా? ఆ సందేహాన్ని కూడా తీరుస్తున్నాడు

భగవానుడు. అంతేగాక అభయప్రదానం చేసి తన సౌమ్యరూపాన్ని చూపుతున్నాడు.

వేదాధ్యయనం వల్లగాని, యజ్ఞయాగాది క్రతువుల నాచరించటం వల్లగాని, శాస్త్రాలను అధ్యయనం చేయటం వల్లగాని, దానధర్మాలను చేయటం వల్లగాని, కర్మాచరణ వల్లగానీ, ఉగ్రమైన తపస్సులు చేయటం వల్లగాని, ఈ లోకంలో ఇట్టి రూపాన్ని ఎవ్వరూ దర్శించలేరు.

(i) వేదవేదాంగాలను, శాస్త్రాలను అధ్యయనం చేస్తే శాస్త్రజ్ఞానం కలుగుతుందేగాని భగవంతుని విశ్వరూపాన్ని సందర్శించటం కుదరదు. (ii) యజ్ఞయాగాది క్రతువులను, పూజాపునస్కారాలను, సత్ కర్మలను ఆచరిస్తే పుణ్యం వస్తుంది, స్వర్గలోక భోగాలు లభిస్తాయేగాని భగవంతుని చూడటం సాధ్యంకాదు. (iii) దానధర్మాల వల్ల ఇహలోక, పరలోక సుఖాలు లభిస్తాయే గాని విశ్వరూపసందర్శనం అసాధ్యం. (iv) శరీరాన్ని శుష్కింపజేసే తపస్సులు చేస్తే ఇంద్రియ, మనోనిగ్రహం సాధించవచ్చునే గాని భగవదనుగ్రహం, భగవత్ సాక్షాత్కారం కలగదు. అయితే ఇవన్నీ వృధాయేనా? కాదు. ఇవి చిత్తశుద్ధికి ఉపయోగపడతాయి. భగవత్ సాక్షాత్కారానికి సహాయం చేస్తాయి.

భూమి సారవంతంగా ఉన్నది. విత్తనం శక్తివంతమైనది. అంతమాత్రాన చాలదు, తగినంత నీరుంటేనే అది మొలకెత్తుతుంది, ఫలాలనిస్తుంది. అలాగే భూమి, విత్తనం అనే కర్మ, జ్ఞానాలు ఎంత చక్కగా ఆచరించి పొందినా, భక్తి అనే జలంతో తడిసినప్పుడే ఫలాలు. అంతటి భక్తి కలవాడు గనుకనే అర్జునుడు విశ్వరూపదర్శనం చేసుకోగలిగాడు.

అయితే విశ్వరూపాన్ని దర్శించగలగటం అదృష్టమే అయినా భయపడిపోయాడు అర్జునుడు. అందుకే భగవానుడు అంటున్నాడు, "అర్జునా! నా ఈ ఉగ్రమైన విశ్వరూపాన్ని చూచి భయపడకు. ఇదిగో నీవు కోరినట్టు నా పూర్వరూపాన్ని - సౌమ్యరూపాన్ని చూపిస్తున్నాను. సంతోషంతో చూడు – అని, విశ్వరూపాన్ని - భయంకర ఉగ్రరూపాన్ని ఉపసంహరించి సౌమ్యరూపాన్ని చూపటంతో అర్జునునిలో భయం తొలగిపోతుంది, ఆనందం కలుగుతుంది. తాను కోరిన రూపాన్ని చూడగలిగితే అర్జునునికి ఎంతో సంతోషం. ఎవరికైనా వారివారి కోరికలు ఫలించినప్పుడు సంతోషంగానే ఉంటుంది గదా!

ఇలా భగవానుడు తన సౌమ్యరూపాన్ని చూడు అని చెప్పి ఏం చేశాడో సంజయుని ద్వారా మనం తెలుసుకోవాలి. అలా తెలుసుకోవాలంటే మళ్ళీ హస్తినకు వెళ్ళాలి. వెళదాం పదండి.

హస్తినలో, ధృతరాష్ట్రుని అంతఃపురంలో, సంజయుడు ధృతరాష్ట్రునితో యుద్ధవిశేషాలు వినిపిస్తున్నాడు. శ్రీకృష్ణుడు అర్జునునికి చూపిన విశ్వరూపాన్ని వర్ణించి చెప్పి, అర్జుని కోరికపై శ్రీకృష్ణుడు ఏమి చేశాడో తెలియజేస్తున్నాడు.

**సంజయ ఉవాచ:-**

**శ్లో|| ఇత్యర్జునం వాసుదేవస్త థోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః|**
**ఆశ్వాస యామాస చ భీతమేనం భూత్వా పునస్సౌమ్య వపుర్మహాత్మా|| (50)**

**తా||** సంజయుడన్నాడు: ఇలా అర్జునునితో వాసుదేవుడు పలికి భగవానుడు తన పూర్వపు రూపాన్ని - అందమైన రూపాన్ని తిరిగి చూపించాడు. భయపడిన అర్జునునికి తన సౌమ్యరూపాన్ని చూపి ఓదార్చాడు.

**వ్యాఖ్య:-** భగవంతుని అనుగ్రహాన్ని గురించి బాగా తెలిసిన ఇతరులు ఎవరైనా చెబితే గాని చక్కగా అర్థంకాదు. అందుకే సంజయుడు నేపథ్య సంగీతంలాగా నేపథ్యంలో నుండి భగవంతుని మహిమను, ఆయన అనుగ్రహాన్ని వివరించి చెబుతున్నాడు.

వాసుదేవుడు అర్జునునితో అలా పలికి తన అందమైన పూర్వపు రూపాన్ని చూపించాడు. మహాత్ముడు, పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు శాంతరూపుడై భయపడుతున్న అర్జునుని ఓదార్చాడు. తిరిగి తన సౌమ్యరూపాన్ని చూపి స్వాంతన కలిగించాడు, సంతోషపరచాడు. మొత్తం మీద సంజయుని మాటలను బట్టి భగవానుడు తన పూర్వపు అందమైన రూపాన్ని, సౌమ్య (శాంత) రూపాన్ని చూపినట్లు తెలుస్తున్నది. ఇలా రెండు రూపాలను చూపించాడా? ఎందుకు?

భయంకరమైన, ఉగ్రమైన విశ్వరూపాన్ని చూచి భయపడిన అర్జునుడు చతుర్భుజాలతో కూడిన పూర్వపు రూపాన్ని చూపమని తన కోరికను వెల్లడించాడు. అందువల్ల అర్జునుని కోరిక మేరకు అతడిలోని భయాన్ని పారద్రోలటం కోసం కిరీటం, గదా, చక్రం మొదలైన వాటితో కూడిన అందమైన రూపాన్ని, నాలుగు భుజాలతో ఉన్న రూపాన్ని చూపాడు. అది శ్రీమహావిష్ణువు యొక్క అందమైన రూపం. ఆ రూపం ఎంతో అందంగా,

చూచిన కొద్దీ మరీ మరీ చూడాలనిపించే సుందరరూపం. ఈ రూపాన్ని చూడటంతో భయంపోయింది. ఇంతవరకు తాను చూచిన విశ్వరూపధారియైన పరమాత్మ ఈ శ్రీమహావిష్ణువే అని తేలిపోయింది. ఆ తరువాత రెండు చేతులతో కూడిన శ్రీకృష్ణుని యొక్క సౌమ్యరూపాన్ని - చిరునవ్వులు చిందించే రూపాన్ని - తనకు పరిచయమైన రూపాన్ని - తన మిత్రుడు - బంధువు - సర్వస్వమూ అయిన రూపాన్ని చూపించాడు. అందుకే ఇక్కడ 'వాసుదేవ' అనే పదాన్ని వాడి ఉండాలి. అంటే వసుదేవుని ఇంటియందున్నప్పటి రూపాన్ని చూపించాడు. దానితో ఆనందం కలిగింది అర్జునునికి. భయం పోవటం మాత్రమే గాక ఆనందం కలిగించటం కూడా శ్రీకృష్ణుని ఉద్దేశం.

చతుర్భుజరూపం చూపినప్పుడు భయం తొలగిపోయింది. సాధారణ శ్రీకృష్ణుని రూపం చూపటంతో సంతోషం కలిగింది. దీనితో అర్జునుని కోరికను తీర్చాడు, భయం పోగొట్టాడు, ఆనందం కలిగించాడు. విశ్వరూపాన్ని పూర్తిగ ఉపసంహరించాడు.

దీనితో విశ్వాత్ముడు, విశ్వేశ్వరుడు అయిన పరమాత్మయే శ్రీమహావిష్ణువని, ఆ శ్రీమహావిష్ణువే తన బావ శ్రీకృష్ణుడని, ఆ శ్రీకృష్ణుడే పాండవ అభిమానిగ, పాండవులకు తోడునీడగ, పాండవ పక్షంలో ఉండి వారి విజయాన్ని కాంక్షిస్తున్నాడని అర్జునునికి అవగతమైంది. అంతేకాదు, ఇది అర్థం కావాల్సింది ధృతరాష్ట్రునికి అని సంజయుని కోరిక.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ధృతరాష్ట్రునికి అర్థమైనదని సంజయుడు గ్రహించాడు. తన కర్తవ్యాన్ని నెరవేర్చగలిగానని లోలోపల సంతోషించాడు. కాకపోతే స్వాతిచినుకు ముత్యపుచిప్పలో పడితే ముత్యమవుతుంది గాని, భూమిపై ఎక్కడ పడ్డా ఇంకిపోయినట్లు గానే; శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మేనని ధృతరాష్ట్రుని దుష్టబుద్ధికి ఎక్కినా ప్రయోజనం లేకుండా పోయింది. గ్రహించిన మంచి విషయాలను ఆచరించే అలవాటు లేని అంధుడు గదా ధృతరాష్ట్రుడు. అంధుడు లోకాన్ని చూడలేడు; అంధబుద్ధి గల ధృతరాష్ట్రుడు సత్యాన్ని గ్రహించి ఆచరించడు.

మొత్తం మీద ఈ విశ్వరూప సందర్శనమనే ఈ సంఘటనలో శ్రీకృష్ణుడు మొదట అర్జునునికి నాలుగు భుజాలు గలిగిన విష్ణుమూర్తి రూపాన్ని - కిరీటంతో, శంఖు, చక్ర, గదా, పద్మాలతో అందమైన రూపాన్ని ముందు చూపి; ఆ తరువాత భయంకరమైన - అనేక బాహువులు, ముఖాలు, నేత్రాలు గల అద్భుతమైన కాలస్వరూపాన్ని చూపాడు. తిరిగి చివరలో ఈ భయంకరరూపాన్ని ఉపసంహరించి నాలుగు భుజాలతో కూడిన విష్ణుమూర్తి రూపాన్ని చూపి, చివరకు రెండు భుజాలుగల శ్రీకృష్ణుని రూపాన్ని చూపి అర్జునుని భయాన్ని పోగొట్టి ఆనందం కలిగించాడు.

సంజయుడు ఇలా చెప్పటంతో మళ్ళీ రంగం యుద్ధభూమికి మారింది. అర్జునుడు శ్రీకృష్ణుని ఎప్పటి రూపాన్ని చూడగానే అతడిలో కలిగిన శారీరక, మానసిక స్థితిని అర్జునుడే ఏమని వర్ణిస్తున్నాడో యుద్ధభూమికి వెళ్ళి విందాం.

**అర్జున ఉవాచ:-**

**శ్లో|| దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!|**

**ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః|| (51)**

**తా||** అర్జునుడన్నాడు:- జనార్దనా! నీ ఈ సౌమ్యమైన మానుషరూపాన్ని చూచి నేను శాంతచిత్తుడనయ్యాను. ఇప్పుడు స్వస్థతను పొందాను.

**వ్యాఖ్య:-** సౌమ్యరూపాన్ని చూడటంతోనే అర్జునుని మనస్సులోని కలవరం, భయం, ఆందోళన తొలగిపోయింది. అందుకే అంటున్నాడు అర్జునుడు, శాంతి కలిగింది, స్వస్థ చిత్తుడనైనాను, విశ్వరూపసందర్శనానికి ముందు ఎలాంటి మనోస్థితిలో ఉన్నానో ఇప్పుడు అలాగే ఉన్నాను - అని.

మనస్సు నిర్మలమై, నిశ్చలం కాకముందే - ఆందోళనతో ఉన్నప్పుడే అర్జునుని ఒక్కసారిగా ఆత్మతత్త్వాన్ని అందుకోమని ఎగదోశాడు శ్రీకృష్ణుడు. మనోబుద్ధులకు అతీతమైన ఆ పరతత్త్వానుభూతిని పరిమితమైన మనోబుద్ధులు గ్రహించలేకపోతున్నాయి. అందుకే ఆ ఆనందలోకంలో కూడా ఆందోళన చెందాడు అర్జునుడు. అందుకే విశ్వరూపాన్ని చూచి భయపడి, తిరిగి నీ సౌమ్యరూపాన్ని చూపమని కోరాడు. అలా చూపగానే మామూలు స్థితికి చేరుకున్నాడు. ఆ విషయాన్నే ఇక్కడ చెబుతున్నాడు, "జనార్దనా!" అంటే భయపెట్టేవాడు, భయం నుండి రక్షించేవాడు అనే రెండు పరస్పర విరుద్ధ అర్థాలున్నాయి. ఇప్పుడు భగవానుడు విశ్వరూపాన్ని చూపి అర్జునుని భయపెట్టాడు; చివరకు భయం నుండి రక్షించాడు. కనుక 'జనార్దన' అనే పదం చక్కగా సరిపోయింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**అర్జునుని మాటలు విన్న శ్రీకృష్ణుడు ఆ విశ్వరూపం యొక్క విశిష్టతను 2 శ్లోకాల్లో తెలియజేస్తున్నాడు.**

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో||** సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ!|
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః|| **(52)**

**శ్లో||** నాహం వేదైర్న తపసా నదానేన నచేజ్యయా|
శక్య ఏవం విదోద్రష్టుం దృష్టవానసి మాం యధా|| **(53)**

**తా||** భగవానుడంటున్నాడు: నాయొక్క ఏరూపాన్ని నీవు చూచావో ఈ విశ్వరూపం అత్యంత దుర్లభమైనది. దేవతలు కూడా ఈ విశ్వరూపాన్ని దర్శించాలని నిత్యము కోరుకుంటూ ఉంటారు (52).

**తా||** ఏ రూపంతో ఉన్న నన్ను చూచావో ఇట్టి స్వరూపం గల నన్ను వేదాలను అధ్యయనం చేయటంవల్ల గాని, తపస్సు చేతగాని, దానం చేతగాని, యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించటం వల్లగాని చూడటం సాధ్యం కాదు (53).

**వ్యాఖ్య:-** "అర్జునా! నీవిప్పుడు చూచిన ఈ విశ్వరూపాన్ని చూడటం అత్యంత దుర్లభం. ఇది ఎవ్వరికీ సాధ్యమయ్యే విషయంకాదు. దివ్యలోకాలలో భోగాలనుభవించే దేవతలు కూడా ఇట్టి దివ్య విశ్వరూపసందర్శనం కోసం నిత్యము తహతహ లాడుతూ ఉంటారు. అట్టి రూపాన్ని నీవు చూడగలిగావు. నీ అదృష్టమే అదృష్టం. నీ పుణ్యమే పుణ్యం. నీ భాగ్యమే భాగ్యం. దేవతలకు

లభించని భాగ్యం ఒక భక్తుడైన మానవునకు లభించింది. అంటే దేవజన్మ కన్న భక్తమానవుని జన్మయే శ్రేష్టమైనది.

విశ్వరూపాన్నిదర్శించటం సామాన్య విషయం కాదు. చాలా శ్రమించాలి. కఠినమైన నియమాలు పాటించాలి. త్యాగం చెయ్యాలి. సత్కర్మలు ఆచరించాలి. భగవంతుని గురించి తెలుసుకొని ఆ భగవంతునిపై భక్తి కలిగిఉండాలి. శాస్త్రజ్ఞానం తెలుసుకోవాలి. అలా తెలుసుకోవాలంటే సద్గురువులను ఆశ్రయించాలి. వారి ద్వారా శాస్త్రాలను తెలుసుకోవాలి. అలా తెలుసుకోవాలంటే అర్హతలు సంపాదించాలి. గురుసేవ చెయ్యాలి. శ్రవణం చేసి తెలుసుకున్న జ్ఞానాన్ని మననంతో స్థిరపరచుకోవాలి. ఆ తరువాత నిధిధ్యాసన ద్వారా ఆ జ్ఞానాన్ని అనుభవానికి తెచ్చుకోవాలి. అవరోధాలన్నింటిని అధిగమించాలి. ప్రాపంచిక విషయభోగవాసనలన్నింటిని వదిలివేయాలి. ఇంత కష్టం ఉంది. ఇంత శ్రమలేకుండానే అర్జునుడు ఈ విశ్వరూపాన్ని సందర్శించగలిగాడు.

దేవలోకాల్లో దేవతలుంటారు. దేవతలంటే ఎవరో కాదు. మానవులుగా జన్మించినప్పుడు పుణ్యకర్మలు ఆచరించిన వారే దేవతలుగా జన్మలెత్తుతారు. వారికి గొప్పబుద్ధి ఉంటుంది. అనుభవాలు పొందే మనస్సుంటుంది. దీర్ఘకాలం ఆయుష్షుంటుంది. అయినప్పటికీ వారు కూడా ఈ విశ్వరూపాన్ని దర్శించలేరు. ఎందుకంటే సాధనలు చేయటానికి కావలసిన శరీరం వారికి ఉండదు గనుక. అందుకే దేవతలు ఈ దివ్యానుభూతి కొరకు నిరంతము తపిస్తూ ఉంటారు. కాని వారికి అవకాశం లేదు.

ఐతే మానవులకు అవకాశం ఉంది గదా! మరి దీని కొరకు ఏం చేయాలి వారు? వేదాలను అధ్యయనం చేయాలా? దానధర్మాలు చేసి పుణ్యం సంపాదిస్తే సరిపోతుందా? యజ్ఞయాగాది క్రతువులు చేయాలా? లేక కఠోరమైన తపస్సులు దీర్ఘకాలం చెయ్యాలా? ఇవి ఏవి చేసినా - అన్నీ చేసినా ప్రయోజనం లేదు; వీటివల్ల విశ్వరూపసందర్శనం సాధ్యం కాదు - అంటున్నాడు భగవానుడు.

ఈ విషయాన్ని ఇంతకుముందే 48వ శ్లోకంలోనే భగవానుడు తెలియజేశాడు గదా! మళ్ళీమళ్ళీ అదే విషయాన్ని చెప్పటం దేనికి? సాధారణంగా లోకంలో చాలామంది - అంటే దాదాపుగా అందరూ ఈ శాస్త్రాలు, గీస్త్రాలు మాకవసరం లేదు, హాయిగా ఇంట్లో కూర్చొని దానధర్మాలు చేసుకుంటూ ఉంటే చాలు అనో; పూజలు యజ్ఞాలు చేస్తే సరిపోతుందనో, విష్ణుసహస్రనామమో, లలితాసహస్రనామమో, శివసహస్రనామమో చదువుకుంటూ ఉంటే సరిపోతుందనో; ఎవరైనా మహాత్ములు మన ఊరికి వచ్చినప్పుడు ఎంత ధనాన్నైనా ఇచ్చి వారికి పాదపూజ చేస్తే సరిపోతుందనో దానితో పుణ్యం వస్తుంది, స్వర్గం వస్తుంది, మోక్షం వస్తుంది - అని భావిస్తూ ఉంటారు. ఎందుకంటే పైన చెప్పిన వాటికి డబ్బు కావాలి. అది మన దగ్గరుంది గనుక కష్టంలేదు. ఇక పూజలు యజ్ఞాలు మొదలైనవి చేయాలంటే వాటిని చేయించే పురోహితులే ఆ తంటాలేవో పడతారు; మనం పీటలమీద కూర్చొని పట్టుకోమంటే పట్టుకుంటాం, ముట్టుకోమంటే ముట్టుకుంటాం; దీనికోసం మనం బుర్రబద్దలు కొట్టుకోవాల్సిన పనిలేదు - అని భావిస్తూ ఉంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇలాంటి అజ్ఞానంలో ఉన్న మానవుల అభిప్రాయాలను తప్పు అని చెప్పటానికే భగవానుడు రెండుసార్లు ఈ విషయాన్ని చెప్పటం జరిగింది. వేదాధ్యయనం - తపస్సు - యజ్ఞం - దానం - ఇవేవీ భగవంతుని ఎందుకు దర్శింపజేయలేవు.

- వేదాలన్నీ ఆ పరమాత్మ నుండి వచ్చినవే.
- తపస్సులలో పెద్దతపస్వి భగవంతుడే. ఎప్పుడూ తపోనిష్ఠలోనే ఉంటాడు.
- సృష్టి అనే మహాయజ్ఞానికి కర్త భగవంతుడే.
- దాతలలో పెద్ద దాత కూడా భగవంతుడే. అందరికీ అన్నీ ఇచ్చేవాడు. కనుక అన్నీ ఆయనకు లోబడి ఉన్నవే. కనుక వీటి ద్వారా ఆయనను అందుకోలేం.

వేదాధ్యయనం గాని, యజ్ఞదాన తపస్సులు గాని పరమాత్మ దర్శనానికి సాధనాలు కాకపోతే ఇక సకామంగా చేసే పూజాదికాలు గాని, తీర్థయాత్రలు గాని, క్షేత్రదర్శనాలు గాని, సత్కర్మలు గాని పరమాత్మ దర్శనానికి సాధనాలుగా ఊహించటానికైనా వీలవుతుందా? లేదు. ఇవన్నీ మళ్ళీ మళ్ళీ మనను బంధాలలో ఇరికించేవే. భగవంతునికి దూరం చేసేవే. మరి భగవద్దర్శనానికి కావలసిందేమిటి?-

శ్లో|| భక్త్యాత్వ నన్యయా శక్యః అహమే వం విదోఽర్జున!|
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!|| **(54)**

**తా||** పరంతప! అర్జున! అనన్యమైన భక్తితో మాత్రమే నన్ను ఈ విధంగా యదార్థంగా తెలుసుకోవటానికి, చూడటానికి, ప్రవేశించటానికి సాధ్యమౌతుంది.

**వ్యాఖ్య:-** భగవంతుని గురించి - భగవత్తత్త్వం గురించి తత్త్వతః = యదార్థంగా తెలుసుకోవాలన్నా (జ్ఞాతుం), ప్రత్యక్షంగా భగవంతుని దర్శించాలన్నా (ద్రష్టుం), భగవంతునితో తాదాత్మ్యం చెంది మోక్షం పొందాలన్నా (ప్రవేష్టుం) అనన్యభక్తి వల్లనే సాధ్యం.

అనన్యభక్తి అంటే అన్యము కాని భక్తి. అంటే ఒక్క భగవంతుని మీద తప్ప అన్యమైన ఎవరిమీదా - దేనిమీదా మన పరిపూర్ణమైన ప్రేమ ఉండకూడదు. అన్నింటికన్న అధికంగా భగవంతుని ప్రేమించాలి. భగవంతుని గురించే చింతన చేయాలి. భగవంతుని కోసం దేనినైనా త్యాగం చెయ్యాలి. భగవంతునికే ప్రథమస్థానం. తరువాతే మిగతావన్నీ. అట్టి భక్తి వల్లనే భగవత్ సాక్షాత్కారం.

భక్తి అంటే ప్రేమయే. మనందరం భక్తిగల వారమే. కొందరికి భార్యపైన, కొందరికి భర్తపైన, కొందరికి తల్లిదండ్రులపైన, కొందరికి బిడ్డలపైన, కొందరికి డబ్బుమీద, కొందరికి బంగారంపైన, కొందరికి ఇళ్లువాకిళ్ళపైన, కొందరికి పదువులపైన, కొందరికి కీర్తిప్రతిష్టలపైన, కొందరికి తిండిపైన, కొందరికి వ్యర్థప్రసంగాలపైన, కొందరికి చాడీలు చెప్పటంపైన, కొందరికి వాటిని వినటంపైన భక్తి ఉంటుంది. వీటికి ఏలోపం రాకుండా ఉండేవిధంగా అప్పుడప్పుడు భగవంతుని పైన కూడా ఉంటుంది భక్తి. అయితే ఇది అనన్య భక్తి

కాదు. భగవంతుని కోసం దేనినైనా వదులుకోగలిగిన భక్తియే నిజమైన భక్తి - అనన్యమైన భక్తి. లౌకిక విషయాల కోసం భగవంతుని వదులుకొనే భక్తి అసలు భక్తియే కాదు.

ఒక రాజుగారు ఏనుగు అంబారీపై ఊరేగుతున్నారు. ఎదురుగా ఒక సన్యాసి ఆ దారినే వస్తున్నాడు. ఆ సన్యాసిని చూసి రాజుగారు ఏనుగు దిగి సన్యాసికి నమస్కారం చేశాడు. సన్యాసి కూడా రాజుగారి పాదాలకు అలాగే నమస్కరించాడు. అప్పుడు రాజుగారు, "అదేమిటి స్వామీ! మీరు సర్వసంగపరిత్యాగులు, భక్తులు. కనుక మేం మీకు నమస్కరించటం పద్ధతి. కాని మీరు మాకు నమస్కారం చేయకూడదు గదా! అన్నాడు. దానికా సన్యాసి, "మహారాజా! నేను భగవంతుని కోసం అల్పమైన ప్రాపంచిక విషయాలను వదిలేశాను. కాని నీవో ఈ లౌకిక విషయాల కోసం, భోగాల కోసం ఆ భగవంతుణ్ణే త్యాగం చేశావు కదా! మీ త్యాగం తరువాతనే ఎవరి త్యాగమైనా. అందువల్ల మీరు గొప్పత్యాగమూర్తులనే భావంతో నమస్కారం చేస్తున్నాను - అన్నాడట.

మనం కూడా అలాంటి త్యాగులమే. భగవద్గీత వినటానికి రాలేదేం? అంటే - ఈరోజు మా చుట్టాల ఇంట్లో భోజనాలండీ!, వంట చేసుకుంటూ ఉన్నానండీ!, సినిమాకు వెళ్ళానండీ!, నిద్ర వస్తుంటే పడుకొని నిద్రపోయానండీ, మార్కెట్ లోకి క్రొత్తరకం చీరలు వచ్చినయ్ రమ్మని మా ప్రక్కింటి పిన్నిగారు పిలిస్తే బజారుకెళ్ళానండీ! అంటాం. భగవద్గీతనే కాదు, భగవంతుణ్ణి వదలటానికి కూడా చీమకుట్టినంత బాధ ఉండదు.

భగవంతుని కోసం మనకు ఎంత ఇష్టమైన పనినైనా, ఎంత లాభాన్ని కలిగించే పనినైనా వదలగలగటమే నిజమైన భక్తి. అన్యమైన దేనిమీదా ఆసక్తి లేకుండా కేవలం ఒక్క భగవంతుని మీదనే భక్తి ఉంటే, ఆ భగవంతుని వదల లేకుండా ఉంటే అదే అనన్యభక్తి. ఈ లోకంలో అన్నీ అనిత్యమైనవే. నిత్యమైనది పరమాత్మ ఒక్కటే. అట్టి నిత్యవస్తువైన పరమాత్మ కొరకు అనిత్యవస్తువులను వదులుకోగలగటమే నిజమైన త్యాగం. అదే నిజమైన భక్తి - అనన్యభక్తి.

భగవంతునిపై భక్తి తన్మయత్వంలో మునిగిపోయి ఎవరో తిండి తినటం మరచిపోతే అది ఉపవాసం అయింది. ఉపవాసం అంటే భగవంతునికి సమీపంగా ఉండటం. అంతే గాని తిండి మానటం కాదు. కాని తిండి తినకుండా సినిమాలు చూస్తూ, సీరియల్స్ చూస్తూ, పేకాట ఆడుకుంటూ కాలక్షేపం చేయటమే ఉపవాసం అనే భావం మనలో ఉంటున్నది. భగవంతుని కోసం భార్యను, లేదా భర్తను మరిచిపోవటం బ్రహ్మచర్యం అయింది. బ్రహ్మంలో చరించటమే బ్రహ్మచర్యం. కాని భర్తనో, భార్యనో దూరంగా ఉంచటమే బ్రహ్మచర్యం అనే భావం మనలో స్థిరపడి పోయింది. ఇందులో భగవంతుని ప్రసక్తే లేదు.

భగవంతుని కోసం దేనినైనా ఎవరినైనా వదలగలిగిన వారి భక్తియే అనన్యభక్తి.

ఎవరికైతే ఇటువంటి అనన్యభక్తి ఉంటుందో వారు మాత్రమే భగవంతుని తెలుసుకోగలరు, భగవంతుని దర్శించగలరు, భగవంతునిలో ప్రవేశించగలరు - అని భగవానుడు ఈ శ్లోకం ద్వారా స్పష్టం చేస్తున్నాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**1.జ్ఞాతుం** :- తెలుసుకోవటం. దేనిని తెలుసుకోవటం? భగవంతుని గురించి తెలుసుకోవటం. ఆ తెలుసుకోవటం కూడా తత్త్వతః - యదార్థంగా తెలుసుకోవాలి. సాధారణంగా భగవంతుని గురించి తెలుసుకోవాలంటే శాస్త్రాల ద్వారానే తెలుసుకోవాలి. ఐతే శాస్త్రాలను చదివి తెలుసుకొంటే పైపైన తెలుస్తుందే గాని యదార్థతత్త్వం అవగతం కాదు. కనుక గురువుల ద్వారా - అందునా శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు ఐన గురువు ద్వారా శ్రవణం చేసినప్పుడే భగవంతుని యదార్థతత్త్వం తెలుస్తుంది. శాస్త్రాలను శ్రవణం చేసే అదృష్టం పూర్వజన్మ సుకృతం ఉన్నవారికే. అట్టివారికే సద్గురువులు లభించగలరు.

ఇలా భగవంతుని గురించి తెలుసుకుంటున్న కొద్దీ ప్రాపంచిక విషయాల పట్ల వైముఖ్యం కలుగుతుంది, భగవంతుని పట్ల భక్తి కలుగుతుంది. దానితో నిత్యము, నిరంతరము భగవంతుని స్మరిస్తూ, భగవంతునికి దగ్గరౌతారు. దానినే 'సామీప్యం' అంటారు. ఇలా భగవంతుని గురించి శాస్త్రాల ద్వారా, సద్గురువుల ద్వారా తెలుసుకున్నా, అనన్యభక్తి ఉన్నప్పుడే భగవంతుని యదార్థతత్త్వం అవగాహన అవుతుంది.

**2.ద్రష్టుం** :- అంటే చూచుట. భగవంతుని గురించి తెలుసుకున్నవారు, ఆయన వైపుకు తిరిగినవారు, ఆయన గురించే నిత్యమూ స్మరిస్తూ మరింత దగ్గరౌతారు. తాము శ్రవణం ద్వారా తెలుసుకున్న శాస్త్రవిషయాలను నిరంతరం మననం చేసుకుంటూ ఉంటారు. అలా మననం చేసుకుంటూ ఉన్నందువల్ల, సాధనవల్ల, అభ్యాసంవల్ల భగవంతునికి మరింత దగ్గర కావటం జరుగుతుంది. భగవంతుని రూపం స్పష్టమవుతుంది. అలా స్పష్టం

కావటమే 'సారూప్యం' అంటారు. ఇలా భగవంతుని రూపాన్ని దర్శించాలన్నా అనన్యభక్తి వల్లనే సాధ్యం.

3.ప్రవేష్టుంచ :- ప్రవేశించుట. శ్రవణం ద్వారా భగవంతుని గూర్చి తెలుసుకొని, మననం ద్వారా భగవంతుని ప్రత్యక్షంగా దర్శించి, ఆ తరువాత సాధకుడు తీవ్రధ్యానంతో - నిధిధ్యాసనతో తన దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యాన్ని వదిలి ఆత్మతో - తన స్వస్వరూపంతో ఐక్యతచెంది, తాను ఆత్మకన్న వేరుకాదని, ఆత్మయే తానని అనుభూతి చెందుటే భగవంతునిలో ప్రవేశించుట. నిర్మలమైన మనస్సు ఆత్మతో తాదాత్మ్యం చెంది ఆత్మయే మిగులుతుంది. ఇప్పటి వరకు జీవునిగా భావిస్తున్న అహంకారం ఆత్మతో ఐక్యమైపోయి అహంకారం అదృశ్యమై ఆత్మగా ఉండిపోవటం జరుగుతుంది.

ఉప్పు బొమ్మను సముద్రంలో ముంచి త్రిప్పితే కొంతసేపటికి ఆ బొమ్మ కరిగిపోయి కనిపించదు. ఏమైంది అది? ఆ బొమ్మ ఇప్పుడు సముద్రాకారంగా మారిపోయింది. అలాగే జీవుడు పరమాత్మను స్మరిస్తూ స్మరిస్తూ ఆ పరమాత్మలో కలిసిపోయి, కరిగిపోయి పరమాత్మాకారంగా మారిపోతాడు. ఇక జీవుడనే వాడుండడు. ఇప్పుడు భక్తుడు - భగవంతుడు ఒక్కడే అయిపోవటం జరుగుతుంది. ఇదే 'సాయుజ్యం'. ఇదే అద్వైతసిద్ధి.

ప్రతి వ్యక్తీ - ప్రతి జీవుడు ఇలా శాస్త్రశ్రవణం ద్వారా భగవంతుని గురించి తెలుసుకొని, మననం ద్వారా భగవంతుని యదార్థరూపాన్ని దర్శించి, నిధిధ్యాసన ద్వారా భగవంతునిలో ప్రవేశించాలి. లీనమై పోవాలి. భగవంతునిగా మిగిలిపోవాలి.

కొందరు కేవలం శ్రవణం చేసి భగవంతుని తెలుసుకొని తృప్తి చెందుతారు. అంతటితో తమ పని పూర్తయిందని భావిస్తారు. దానివల్ల కొద్ది ప్రయోజనమే. సాధన కొనసాగించి భగవంతునితో సాయుజ్యం చెందాలి. అప్పటిదాకా వెనుకడుగు వేయరాదు.

బజారులో మంచి మామిడిపండ్లు ఉన్నాయని, రంగుగాని, రుచిగాని చాలా బాగున్నాయని స్నేహితుడు చెప్పాడు. దానితో మామిడి పండు గురించి తెలుసుకున్నావు (జ్ఞాతుం). అలా తెలుసుకున్న తర్వాత దానిని గూర్చే ఆలోచిస్తున్నావు. నోట్లో లాలాజలం ఊరుతున్నది. తెచ్చుకోవాలనే ఆసక్తి పెరిగింది. ఇక ఆగలేక బజారుకు వెళ్ళావు. అందంగా పేర్చి ఉన్న మామిడిపండ్లు కనిపించాయి. వాటిని ఆసక్తితో చూచావు (ద్రష్టుం) - చూచిన తర్వాత ఆగుతావా? దాని రేటు ఎంతో తెలుసుకొని బేరం చేసి తెచ్చుకున్నావు. ఆ తర్వాత కోసుకొని తిన్నావు. అది బొజ్జలోకి పోయింది - (ప్రవేష్టుంచ). దానితో పరిపూర్ణమైన తృప్తి - ఆనందం కలుగుతుంది.

మామిడిపండు గురించి తెలుసుకుంటే నీకు ఎంత ఆనందమో - భగవంతుని గూర్చి తెలుసుకున్నా అంతే ఆనందం. కాని పండును తింటే కలిగే ఆనందం రావాలంటే జీవుడు దేవుడిలో ఐక్యం కావాల్సిందే.

కనుక తెలుసుకుంటే చాలదు. చూడాలి. చూస్తే చాలదు తిని ఆనందించాలి. అలాగే భగవంతుని గురించి తెలుసుకుంటే చాలదు. తెలుసుకొని ఆ రూపాన్ని దర్శించాలి. దర్శించినంత మాత్రాన చాలదు. ఆయనతో ఐక్యం కావాలి. అప్పుడే పరిపూర్ణ ఆనందం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కేవలం వేదాధ్యయనం వల్లనే ముక్తి కలుగుతుంది అంటే చదువురాని వారు అయ్యో! మన గతి ఏమిటి? అని దిగులుపడాలి. గొప్పగొప్ప తపస్సుల వల్ల మాత్రమే ముక్తి లభిస్తుంది అంటే - సంసారబంధాలలో చిక్కుకున్న వారికి ముక్తి లేనట్లే. కనుక వారు మాగతి ఏమిటి? అని దిగులు చెందాలి. దానధర్మాలు బాగా చేసినందువల్లనే ముక్తి అంటే ధనము, సంపదలు లేని పేదవారు అయ్యో! మాగతి ఏమిటి? మాకు ముక్తి లేదుగదా! అని బాధపడాలి. ఇక యజ్ఞయాగాదులు చేసినవారికే ముక్తి అంటే ధనబలం, జనబలం, లేనివారికి ముక్తి లేనట్లే. కనుక వారు బాధ డాలి.

ముక్తి అనేది ఏ కొందరికో హక్కు భుక్తం కాదు. ధనం లేకపోయినా, జనం లేకపోయినా, సంపదలు లేకపోయినా, విద్య - మేధాశక్తి లేకపోయినా పరమాత్మను అందుకోవచ్చు. అయితే ఎలా? అదే అనన్యభక్తి. అనన్యభక్తి వల్లనే ముక్తి - మోక్షం.

అందుకే "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అని భగవానుడు గీతను ముగిస్తూ తెలియజేశాడు. భగవంతుని సంపూర్ణంగా నమ్మి, భగవంతునిపై అనన్యభక్తితో, ఆయనను శరణుకోరాలి. ఇంతకన్నా జన్మ సార్థక్యానికి మరో ఉపాయం లేదు.

కనుక అనన్యభక్తితో మాత్రమే భగవంతుని తెలుసుకోగలం, భగవంతుని దర్శించగలం, భగవంతునిలో ప్రవేశించగలం - ఆయనతో ఐక్యం చెంది భగవంతునిగా ఉండిపోగలం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- భక్తిలేకపోతే ఏమి ఉన్నా ప్రయోజనం లేదు.
- భక్తి - అనన్యభక్తి ఉంటే ఏమీ అక్కరలేదు.

అట్టి అనన్యభక్తి కలగాలంటే ఏం చేయాలి? అని అడగకుండానే భగవానుడు ఉపాయాన్ని తెలియజేయబోతున్నాడు.

తరువాత శ్లోకంలో -

ఇది గీతార్థసార సంగ్రహశ్లోకం. సాధనామార్గాన్ని చూపే శ్లోకం.

**శ్లో||** మత్కర్మ కృన్మత్పరమః మద్భక్త స్సంగ వర్జితః|

నిర్వైర స్సర్వభూతేషు యస్స మామేతి పాండవ!|| **(55)**

**తా||** నాకొరకు కర్మచెయ్. నన్నే లక్ష్యంగా పెట్టుకో. నాకు భక్తుడవుకా! ప్రాపంచిక విషయాలతో సంగభావాన్ని విడిచిపెట్టు. అర్జునా! సర్వప్రాణుల పట్ల విరోధం లేనివాడవుకా! అట్టివాడే నన్ను పొందుతాడు.

**వ్యాఖ్య:-** అనన్యభక్తి కలవాడెవారైనా సరే నన్ను తెలుసుకొని, దర్శించి, నాలో ప్రవేశించి నేనుగానే మిగిలిపోతాడు అని భగవంతుడు తెలియజేయగానే క్షత్రియుడైన అర్జునుని మదిలో ఒకభావం తళుక్కున మెరిసింది. 'ఎలాగైనా సరే తాను అట్టి పరమాత్మస్థితిని పొందాలి' - అని. ఇంతవరకు అస్త్రశస్త్ర విద్యలు నేర్చుకోవటమే గొప్ప అనుకున్నాడు. ఆపదలలో ఉన్న ప్రజలను రక్షించటమే గొప్ప అనుకున్నాడు. యుద్ధరంగంలో వీరాధివీరులైన శత్రువులను చీల్చి చెండాటం కన్న ఈ క్షత్రియజన్మకు ఇంకేం కావాలి? అనుకున్నాడు. కాని ఇప్పుడు అర్థమైంది. అన్నింటికన్న గొప్ప విషయం తాను పరమాత్మలో

లయమై పరమాత్మగా ఉండిపోవటమే - అని. అలా పరమాత్మగా ఉండిపోవాలంటే ఏమేమి సాధనలు చేసి ఆ పరమాత్మస్థానంలో లయమై, పరమాత్మగా మిగిలిపోవటం జరుగుతుంది? అనే సంశయం అతడి ముఖంలో కనిపించి ఉంటుంది. అందుకే అర్జునుడు అడగకుండానే అతడి సంశయం తీర్చాలని భావించిన భగవానుడు వరుసగా 5 సాధనా మార్గాలను ఒక ప్రణాళికగా తెలియజేయబోతున్నాడు. అవే -

1.భగవంతుని కొరకు, భగవదార్పణ బుద్ధితో కర్మలు చేయుట.

2.భగవంతునే పరమలక్ష్యంగా పెట్టుకొనుట.

3.భగవంతుని యందు అనన్యమైన భక్తిని కలిగియుండుట.

4.ప్రాపంచిక విషయాలలో సంగభావం లేకుండా ఉండుట.

5.సర్వభూతముల పట్ల - సర్వప్రాణుల పట్ల శతృభావం లేకుండుట.

ఈ సాధనలను ఎవరు చేస్తారో అట్టివారు ఏ కులం వారైనా, ఏమతం వారైనా, ఏజాతి వారైనా, ఏదేశం వారైనా, ఏవర్గం వారైనా, ఏ వర్ణంవారైనా, స్త్రీ యైనా - పురుషుడైనా - ఎవరైనా సరే ఆ పరమాత్మను చేరి పరమాత్మగా నిలిచిపోవచ్చు - అని ఖండితంగా చెప్పాడు భగవానుడు. ఇక్కడ యః = ఎవరైతే అనే పదప్రయోగం వల్ల స్త్రీలు - శూద్రులు భగవంతుని అందుకోలేరు అనే అపోహ పటాపంచలైపోయింది. ఆ ఐదు సాధనలను వివరంగా తెలుసుకుందాం:

(1) మత్కర్మకృత్ :- నాకొరకు కర్మలు చేయుట, లేదా నాకు సంబంధించిన కర్మలు చేయుట. మనం చేసే పనులన్నీ భగవత్ కార్యాలే కావాలి. అలా చేసే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కర్మలన్నీ భగవంతునివే అయితే నిత్యమూ నిరంతరము మనస్సుకు భగవంతునితో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. ఏమిటా పనులు? జపం, ధ్యానం, పూజ, వ్రతం, భజన, ప్రార్థన, పారాయణం, ఉపవాసం, దేవాలయాలకు, తీర్థయాత్రలకు వెళ్ళి రావటం, శాస్త్రశ్రవణం, మననం, నిధిధ్యాసనం, స్వాధ్యాయం, దీనజనసేవ మొ||న వన్నీ భగవంతుని కొరకు చేసే కర్మలే.

ఇవిగాక మన కొరకు చేసే పనులు కూడా అనేకం ఉంటాయి. వ్యాపారం, ఉద్యోగం, వృత్తి, ఇంటిపని, వంటపని, తినటం, తిరగటం, సినిమాలు చూడటం, షికార్లు చేయటం - ఇలా ఎన్నో ఉన్నాయి. కాని మనం అన్నీ భగవంతుని పనులు, భగవంతుని కొరకే పనులు చేయాలి గాని మనకొరకు పనులు చేయకూడదు. మరి మన పనులన్నీ మానుకుంటే ఎలా జీవనయాత్ర జరుగుతుంది?

అంటే ఎప్పుడూ జపధ్యానాలు, పారాయణలు, శ్రవణ మననాలు, పూజాపునస్కారాలు చేస్తూ కూర్చోవాలా? వ్యాపారం, ఉద్యోగం, ఇంటిపని, వంటపని, తినటం, నిద్రపోవటం మానుకోవాలా? అంటే - కానేకాదు.

మనం మన పనులు అన్నీ చేసుకుంటూ ఉండవచ్చు. అసలు చేస్తూ ఉండాల్సిందే. అయితే ఈ పనులన్నీ మన పనులుగా కాక భగవంతుని పనులుగా, భగవంతుని ప్రీతికోసం, భగవదార్పణ బుద్ధితో చేయాలి. భగవంతుని ఇచ్ఛప్రకారం - భగవంతుని ఆజ్ఞమేరకు ఈ పనులు చేస్తున్నాను. ఇందులో నేను నిమిత్తమాత్రుణ్ణి. నాదేం లేదు. భగవంతుడు సూత్రధారి, నేను పాత్రధారిని. ఇలా చేయటం నా కర్తవ్యం అనుకుంటూ ఈ కర్మల యొక్క

ఫలితాలను భగవంతునికే అర్పిస్తూ భగవదార్పణ బుద్ధితో చేస్తుండాలి. అప్పుడు మన పనులన్నీ భగవంతుని పనులే అవుతాయి. ఉదాహరణకు

(i) వంట చేస్తున్నారు. అందరిలోనూ వైశ్వానర రూపంలో ఉన్న ఆ పరమాత్మ కొరకు నైవేద్యం తయారుచేస్తున్నాను అనే భావన ఉంటే అది భగవత్ కర్మయే అవుతుంది.

(ii) భోజనం చేస్తున్నారు. లోపల ఉన్న పరమాత్మకు ఆహుతులను, ఆజ్యాన్ని సమర్పించుకుంటున్నాను అనే భావన ఉంటే చాలు అది యజ్ఞమే అవుతుంది, భగవంతుని కొరకు చేసే యజ్ఞం అవుతుంది.

(iii) ఉద్యోగమో, వ్యాపారమో, వృత్తియో చేస్తున్నారు. భగవత్ స్వరూపులైన తోటివారికి సౌకర్యాన్ని కలిగించటానికి, సహాయపడటానికి పని చేస్తున్నాను అనుకుంటే అది భగవత్ సేవయే అవుతుంది.

(iv) ఆఫీసుకు నడిచి వెళుతున్నావు. దేవాలయానికి వెళుతున్నాను, ప్రదక్షిణ చేస్తున్నాను అనుకుంటే అదీ భగవత్ కర్మయే అవుతుంది.

(v) ఇల్లు కడుతున్నారు మేస్త్రీలు, కూలీలు. భగవంతునికి ఆలయం నిర్మిస్తున్నాం అనే భావన ఉంటే అది భగవత్ కర్మ అవుతుంది.

ఇలా అన్ని కర్మలను భగవత్ కర్మలుగా, భగవదార్పణ బుద్ధితో చేయటంవల్ల అది దైవపూజగా మారిపోతుంది. అందువల్ల అన్ని కర్మలు మోక్షహేతువులుగా మారిపోతాయి. అందుకే దేవాలయంలో పూజలు, అభిషేకాలు చేసిన తర్వాత 'ఏతత్ ఫలం' సర్వం పరమేశ్వరార్పణ మస్తు' అని చదువుతారు. అర్థం తెలిస్తే చాలామంది బాధపడతారు. ఇంత కష్టపడి నేను

పూజచేయటం, ఫలితమేమో భగవంతునికా? అని. అయితే సర్వకర్మలు పరమాత్మకు అర్పించి చేయుటే తెలివైన పని. పైకి అనకపోయినా భగవదార్పణ బుద్ధి ఉండాలి. అదే మత్ కర్మకృత్ అని చెప్పినది.

(2) మత్పరమః :- నన్నే లక్ష్యంగా పెట్టుకో. మనం భగవంతుని పొందటమే జీవితలక్ష్యంగా పెట్టుకోవాలి. మనం సుఖం కోసం, సంతోషం కోసం, భోగాల కోసం ఎంతో కష్టపడతాం. కొందరు అన్యాయంగా, అక్రమంగా సంపాదిస్తూ ఉంటారు. అయితే వీటి ద్వారా వచ్చే సంతోషం తాత్కాలికమే. కాని మన లక్ష్యం శాశ్వతానందాన్ని పొందటమే కావాలి. దానికి పరమాత్మను తెలుసుకొని, ఆయనతో ఐక్యమై పోవటమొక్కటే పరిష్కారం. కనుక మన దృష్టి ప్రాపంచిక విషయభోగాలపై గాక పరమాత్మపైనే ఉండాలి. ఐతే మనకు ఆ దృష్టి ఉండటంలేదు.

మనం గాలిని పీల్చుకున్నప్పుడు వాయుదేవుని తలచుకోవాలి. నీటిని త్రాగి దప్పిక తీర్చుకున్నప్పుడు వరుణదేవుని స్మరించాలి. నిరంతరం వెలుగునిస్తున్న సూర్యున్ని తలచుకోవాలి. మనకు ఆధారంగా ఉన్న భూమి నుండే మనకు ఆహారం లభిస్తున్నది గనుక భూమిని స్మరించాలి. మన దృష్టి ఆ ధేయంపై ఉంటుందే గాని ఆధారంపై ఉండదు. సినిమా కథ మీద దృష్టే గాని ఆ సినిమాకు ఆధారమైన తెరను తలచుకోము. ప్రపంచంలోని అన్ని వస్తువులను, విషయాలను అనుభవిస్తూనే ఉంటాం. కాని ఈ ప్రపంచానికి ఆధారంగా ఉన్న పరమాత్మను మాత్రం స్మరించం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మన దృష్టి పరమాత్మపై ఉంటేనే ఆ పరమాత్మకోసం పాటుపడతాం. ఆయనను దర్శించి, ఆయనను అందుకోవటమే లక్ష్యంగా పెట్టుకుంటాం. కనుక నిరంతరము మనం ఈ ప్రపంచంలోనే ఉండి, ఈ ప్రపంచమంతటా వ్యాపించియున్న, ఈ ప్రపంచానికి ఆధారంగా ఉన్న ఆ పరమాత్మనే దర్శిస్తూ, స్మరిస్తూ, ఆయనను చేరుకోవటమే పరమలక్ష్యంగా పెట్టుకోవాలి. అదే మత్పరమః అంటే.

(3) మద్భక్తః :- నా భక్తుడివికా! భగవంతుని యందు ప్రీతిని కలిగియుండుటే భక్తి. నిరంతరము భగవంతుని విడిచి ఉండలేని స్థితియే నిజమైన భక్తి. ఈ ప్రాపంచిక వస్తువులను, విషయాలను, భోగాలను వదలలేక ఎల్లప్పుడూ వాటి గురించే ఆలోచిస్తూ, వాటి కొరకే ప్రాకులాడుతూ ఉంటే ఈ సంసారజననమరణచక్రంలో ఇరుక్కుపోవలసిందే. బంధంలో పడిపోవాల్సిందే. ఈ బంధాలు తొలగాలంటే ఈ ప్రాపంచిక విషయాలపట్ల, భోగాలపట్ల ఏమాత్రం ఆసక్తి, ప్రీతిలేకుండా పరమాత్మయందే ప్రీతి కలిగిఉండాలి. ఇదే భక్తి. అన్యమైన విషయాలపై ఆసక్తి లేకుండా ఒక్క పరమాత్మపైనే ఆసక్తి ఉంటే అదే అనన్యభక్తి.

కాని మనం ప్రపంచానికి భక్తులం, సుఖాలకు భోగాలకు భక్తులం, ధనానికి - సంపదలకు భక్తులం, భార్యకో - భర్తకో భక్తులం, కీర్తిప్రతిష్ఠలకు భక్తులం. భగవంతునిపై మాత్రమే భక్తి గలవారు కోటికొక్కరు ఉంటారేమో! ఏదో ఒక గంటో, అరగంటో భగవంతునిపై భక్తిని కలిగి, మిగిలిన

సమయమంతా లౌకికవిషయాలకు దాసులమైతే మనం చేసేది పేరుకు శివపూజ - కాని నిజంగా అది శవపూజ.

అందుకే భగవానుడు పదేపదే తెలియజేస్తున్నాడు. నన్ను చేరుకోవాలంటే నా భక్తుడివి కావాలి - అని. ఆ భక్తి కూడా అనన్యభక్తియై ఉండాలి. "నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ కావవే ఈశ్వర! సంరక్షించు భద్రాత్మక!" అని గజేంద్రుడు ఆక్రోశించినట్లు ఆక్రోశించాలి. అదీ భక్తి అంటే.

భగవంతునితో విభక్తము కానివాడు భక్తుడు. విభక్తి లేనిదే భక్తి. "తత్ చింతనం, తత్ కథనం, అన్యోన్యం తత్ ప్రభోదనం" అన్నట్లుగా భగవంతుని గురించే చింతనచేస్తూ, భగవంతుని గురించే మాట్లాడుతూ, భగవంతుని గురించే వింటూ, భగవంతుని గురించే పరస్పరం చర్చించుకుంటూ నిత్యమూ భగవంతునితో తాదాత్మ్యం చెంది, భగవంతునితో కలిసి ఉండేవాడే భక్తుడు. అట్టి భక్తుడే భగవంతుని గురించి తెలుసుకొని ఆయనను చేరుకోగలడు. భగవంతుడంటే మన దేహంలోనే నఖశిఖపర్యంతం వ్యాపించియున్న పరమాత్మ చైతన్యమే. అట్టి చైతన్యంతో - ఆత్మ చైతన్యంతో అనుసంధానమై యుండుటే భక్తి. అందుకే శంకరుల వారు వివేక చూడామణిలో భక్తిని నిర్వచిస్తూ "స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభి ధీయతే" - అన్నారు. అంటే మన యదార్థ స్వరూపంతో అనుసంధానమే, - 'అదేనేను' అనే భావనతో ఉండిపోవటమే భక్తి అని అర్థం.

(4) సంగవర్జితః :- సంగం అంటే అతుక్కుపోవటం. సంగవర్జితం అంటే విడిపోవటం. వదిలేయటం. నిజంగా మనం మన దేహంతోను, విషయవస్తువులతోను, భోగాలతోను, ధనంతోను, భార్యబిడ్డలతోను, పదవులతోను, కీర్తిప్రతిష్టలతోను అతుక్కుపోయాం, సంగభావం పెట్టుకున్నాం, మమకారాన్ని పెంచుకున్నాం, వదలలేక పోతున్నాం. ఇలా వాటిని మన మనస్సు విడవలేక వాటితో పెనవేసుకొని పోయి ఉండటం వల్ల, మనస్సంతా వాటితోనే నిండిపోవటం వల్ల భగవంతునికి చోటు లేకుండా పోయింది. అలా కాకుండా మన మనస్సు నుండి వాటన్నింటిని తరిమేస్తే అప్పుడు భగవంతునికి కావలసినంత చోటు దొరుకుతుంది. అయితే వాటిని తొలగించటం అంత తేలికకాదు. దానికి నిత్యానిత్య వస్తు వివేకం కావాలి. నిత్యవస్తువేది? అనిత్యవస్తువేది? అని ప్రతిక్షణం విశ్లేషణ చేసుకుంటూ ఉండాలి. అప్పుడే వాటిపట్ల వైముఖ్యం కలిగి సంగభావం పోతుంది. అదే వైరాగ్యం. ఇలా దృశ్యప్రపంచంపై ఆసక్తి తొలగిపోవటమే సంగవర్జితం.

(5) నిర్వైర స్సర్వ భూతేషు :- సమస్తభూతాల పట్ల శతృభావం లేకుండుట. కేవలం మనష్యుల పట్లనే గాదు, జంతువులు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు, క్రూరమృగాలు - దేనిపట్లా, ఎవరిపట్లా శతృభావం ఉండకూడదు. అన్నింటిపై, అందరిపై దయ, కరుణ, ప్రేమ, వాత్సల్యం ఉండాలి.

ఐతే పాములు విషజంతువులు కదా! పులులు క్రూరజంతువులు కదా! అలాంటి క్రూరమైన మనుష్యులుంటారు కదా! మరి వీరిపట్ల కూడా ప్రేమతో ఉండటం సాధ్యమా? దయతో ఉండటం కుదురుతుందా? అని సందేహం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సర్వభూతాల పట్ల శత్రుభావం లేకుండా ఉండాలేగాని పాముల్ని మెడలో వేసుకొని తిరగమని, పులినోట్లో చేయిపెట్టమని, క్రూరునితో స్నేహం చేసి అతడితో సంబంధబాంధవ్యాలు కలుపుకోమని అర్థంకాదు. వారికి దూరంగా ఉండాల్సిందే. ఐనప్పటికీ వారిపై ద్వేషం మాత్రం కూడదు. ఈ పగ, ద్వేషం మనస్సును అల్లకల్లోలం చేస్తాయి. సమభావం మనస్సును ప్రశాంతంగా ఉంచుతుంది. అట్టి ప్రశాంతము, నిర్మలము ఐన మనస్సే భగవంతుని చేరుకొనుటకు అర్హత కలిగిఉంటుంది. కనుక ఎవరిపట్ల శత్రుభావం లేకుండా ఉండాలి. అలా ఉండాలంటే అందరిని ఆత్మస్వరూపులుగా చూడగలగాలి. అందరూ, అన్నీ భగవత్స్వరూపులే. మనిషిలోను, కుక్కలోను, పులిలోను, పాములోను, దోమలోను, ఏనుగులోను - అన్నింటిలోను ఉన్నది ఒకే ఒక ఆత్మచైతన్యం. అంటే అందరూ ఆత్మస్వరూపులే. కనుక ఎవరిని ద్వేషించినా ఆత్మను ద్వేషించినట్లే. ఎవరిని పూజించినా పరమాత్మను పూజించినట్లే. ఈ భావం ఉంటే ఎవరూ ఎవరినీ ద్వేషించలేరు.

నీకంట్లో వేలు పొడుచుకున్నది. వ్రేలు మీద కోపమా? మీ నాలుకను మీ పండ్లు కరిచినవి. పండ్లపై కోపమా? లేదు. కారణం కన్నూనీదే. వ్రేలూ నీదే. నాలుకా నీదే, పండ్లూ నీవే. కనుక కోపం లేదు. అలాగే సర్వభూతాలు నీకన్న వేరుకాదు. ఈ భావన ఉంటే ఎవరినీ ద్వేషించలేవు.

కొందరు భక్తులు విష్ణువును - విష్ణువు అవతారాలను పూజిస్తారు. కాని శివుని ద్వేషిస్తారు. ఆ పదాన్ని కూడా ఉచ్చరించటం మహాపాపం అంటారు.

**అలాగే శైవులు శివుని భక్తితో పూజిస్తారు. విష్ణువును స్మరించరు. ద్వేషిస్తారు, మరి వీరు భక్తులు ఎలా అవుతారో వారి గురువులే చెప్పాలి.**

**ఇలా పైన పేర్కొన్న 5 లక్షణాలు ఎవరు అలవరుచుకుంటారో వారే భగవంతుని చేరుకోగలరు. 'మామేతి' అని భగవానుడు అభయమిస్తున్నాడు. ఈ శ్లోకంలో చెప్పిన మత్కర్మకృత్, మత్ పరమః, మద్భక్తః, సంగవర్జితః అనే 4 లక్షణాలు 4 యోగాలు. ఈ నాలుగు యోగాలకు అవసరమైన 'నిర్వైర స్సర్వభూతేషు' - సర్వభూతదయ కూడా వివరించబడింది. కనుకనే ఇది గీతాసార శ్లోకం అనటంలో సందేహం లేదు.**

**ఈ శ్లోకమే రాబోయే 12వ అధ్యాయానికి బీజశ్లోకం. అంటే భక్తియోగానికి ఇక్కడే విత్తనం నాటాడు భగవానుడు.**

**గద్యం:** ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు - బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూప సందర్శన యోగోనామ ఏకాదశోధ్యాయః||

**ఇలా భగవద్గీత అనే ఉపనిషత్తులో, బ్రహ్మవిద్య, యోగశాస్త్రములో శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య జరిగిన సంవాదరూపంలోని విశ్వరూపసందర్శనమనే పదునొకండవ అధ్యాయం సమాప్తం.**

**ఏకాదశ అంటే 10+1. ఇంద్రియాలు 10 + మనస్సు 1. ఇంద్రియాలు మనస్సుని లాగకుండా; మనస్సును అనుసరించి ఇంద్రియాలు నడుచుకొనే అధ్యాయం.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

# శ్రీమద్భగవద్గీత : 12 వ అధ్యాయం

# భక్తి యోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

పూజ్య గురుదేవులు

జ్ఞానప్రపూర్ణ
శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)
వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com

Visit www.srichalapathirao.com to listen Pravachanas

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అర్ధమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంథాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంథాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్థులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్థంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

సర్వాంతర్యామియైన పరమాత్మ అనుగ్రహంతో భగవద్గీతలోని 12వ అధ్యాయం భక్తియోగంలో అడుగుపెడుతున్నాం. భగవంతుని అనుగ్రహం, అనేక జన్మల నుండి ఆర్జించుకున్న పుణ్యఫలం ఉంటేనే భగవద్గీతను తెలుసుకోగలం. ఎన్ని అవాంతరాలు కలిగినా వాటిని అధిగమించి ముందుకు పోగలం. అలాంటి పూర్వజన్మ సుకృతం లేకపోతే - - -

ఇదిగో ఇల్లు కట్టుకుంటున్నాం. ఇది కాస్తా పూర్తయి, గృహప్రవేశం ఐతే ఇకనాకు ఏ ఆటంకం ఉండదు. మీ సత్సంగానికి వచ్చేస్తా -
ఇదిగో అమ్మాయి పెళ్ళి చేయాలనుకుంటున్నాం. మంచి సంబంధం దొరికి అమ్మాయి పెళ్ళయిపోతే నా భాధ్యతతీరిపోతుంది. ఇక ఆటంకం లేదు -
ఇదిగో మావాడికి ఉద్యోగమో, వ్యాపారమో - ఏదో ఒకదారి చూపిస్తే ఇక నన్ను కదిలించే వాడుండడు. అప్పుడు భగవద్గీతను ప్రశాంతంగా వింటా -

ఇదిగో ఇంకెంతండీ రెండు సంవత్సరాలు ఓపిక పడితే చాలు రిటైర్మెంటే. అప్పుడంతా తీరికే. అన్ని వేదాంతాలు అప్పుడు తప్పక నేర్చుకుంటా -
ఏదండీ! ఈ సంసారంలో తీరిచస్తేనా! పిల్లల చదువులు, వంటపని, ఇంటిపనీ, అబ్బబ్బ; కోడలు వస్తేగాని నా భాధ్యతలు తీరవు. అప్పుడు గాని తీరికగా వినలేను. అప్పుడు తప్పక తెలుసుకుంటా.

అప్పుడే ఏం తొందరొచ్చిందండీ! నాకింకా 50 ఏళ్ళు కూడా లేవు. ఎప్పుడో చివర్లో చూసుకోవాల్సిన వాటిని ఇప్పుడే ఎందుకండీ! ఏం తొందరొచ్చింది? ఈ వేదాంతాలు వినటానికి ఇంకా చాలా టైముంది. అప్పుడు

వస్తా. ఇంకెంతండీ! నాకు రెండే రెండు కోరికలున్నాయి. ఇవి తీరగానే తప్పక వచ్చేస్తా. ఈ జన్మలో కాకపోయినా వచ్చే జన్మలో ఐనా సరే మీ ఆశ్రమంలో గోడమీద పాకే బల్లిగానైనా పుట్టి మీ సత్సంగంలో పాల్గొంటా -

ఇలా అంటూ భాద్యతలనే ముసుగులో, కోరికలను విడిచిపెట్టలేక, పూర్వవాసనలకు లొంగిపోయి ప్రవర్తిస్తున్నంత కాలం -

కోరికలు తీరవు! అలవాట్లు మారవు!!

భావాలు చెదరవు!!! వాసనలు మాడవు!

తీరిక చిక్కదు తత్త్వం అర్థం కాదు

అంతిమకాలం సమీపిస్తుంది. నేనున్నానంటూ యమధర్మరాజు వస్తాడు. దానితో మానవజన్మ వ్యర్థమైపోతుంది. కనుక -

- కోరికలు తీరిన తర్వాత -
- సంసార బాధ్యతలు నెరవేర్చిన తర్వాత -
- ఒంట్లో ఆరోగ్యం బాగా ఉన్నప్పుడు -
- మనస్సులో అశాంతి పూర్తిగా పోతే - అన్నీ బాగుంటే -

ఎప్పుడో ఇష్టం కలిగినప్పుడు వేదాంత శ్రవణం చేస్తా. సత్సంగంలో పాల్గొంటా - అనే సోమరితనాన్ని - పలాయన వాదాన్ని పెంచుకోరాదు. ఎందుకంటే - కోరికలు తీరటంగాని, తీరికచిక్కటం గాని, భాద్యతలు నెరవేర్చటం గాని, ఆరోగ్యం భేషుగ్గా ఉండటం గాని, మనస్సులో అశాంతి శాశ్వతంగా తొలగిపోవటం గాని, అన్నీ బాగుండటం గాని, ఇష్టం కలగటం గాని, - కొన్ని కోట్ల జన్మలకైనా జరగటం కల్ల.

ఇటువంటి అసందర్భప్రలాపాలు కట్టిపెట్టి; వారాలు వర్జ్యాలు, రాహుకాలాలు, మీనమేషాలు చూచుకోకుండా ఇప్పుడే, ఈ రోజే ఆధ్యాత్మిక రంగంలోకి దిగిపోవాలి. శాస్త్రశ్రవణం చేయాలి. సాధనలు ప్రారంభించాలి. కాలం వృథా చేసుకోరాదు. ఈ లోకంలో పోగొట్టుకుంటే తిరిగిరానిది కాలమే.

ప్రస్తుతం మనం భగవద్గీత 12వ అధ్యాయం భక్తి యోగంలో ఉన్నాం. ఇది ద్వాదశాధ్యాయం. 'ద్వాదశి' అనేది ప్రసిద్ధమైన సంఖ్య. ప్రశస్తమైన సంఖ్య. చాలామందికి ఇష్టమైన సంఖ్య.

ద్వాదశ జ్యోతిర్లింగాలు - ద్వాదశాదిత్యులు - ద్వాదశ ఆళ్వారులు - భాగవతంలో ద్వాదశస్కంధాలు - కాలచక్రంలో ద్వాదశ (12) నెలలు - వాసుదేవ మహామంత్రంలో ద్వాదశాక్షరాలు. ద్వాదశి ప్రసిద్ధ సంఖ్య.

అలాగే భగవద్గీతలోని ద్వాదశాధ్యాయం భక్తియోగం చాలా ప్రశస్థమైనది. భగవద్గీతా పారాయణాన్ని క్రొత్తగా ప్రారభించే వాళ్ళు ఈ ద్వాదశాధ్యాయం నుండే ప్రారంభించటం ఒక సంప్రదాయం కూడా. మహర్షి సద్గురు మళయాళస్వాముల వారు అలా జరిపించేవారు.

ఈ అధ్యాయంతో భక్తిషట్కం ముగుస్తుంది. ఈ భక్తిషట్కం భగవద్గీతలో ఇటు కర్మషట్కానికి, అటు జ్ఞానషట్కానికి మధ్యన ఉన్నది. గడపమీద దీపం లాగా భక్తి అనేది అటు కర్మకు, ఇటు జ్ఞానానికి రెండింటికీ ప్రకాశాన్ని ఇస్తుంది.

❖ భక్తిలేని కర్మ జడం!

❖ భక్తిలేని జ్ఞానం శుష్కం!!

భక్తితో కూడినప్పుడే కర్మకు, జ్ఞానానికి రెండింటికీ సాఫల్యత. అట్టి భక్తియోగం ఈ భక్తిషట్కానికి కలశంలాంటిది. భగవద్గీతలోని 18 అధ్యాయలలోను ఇది చిన్నది. కేవలం 20 శ్లోకాలు మాత్రమే ఉన్నది. ఐతే ఎంతో ప్రశస్థమైనది, ప్రసిద్ధమైనది.

ఈ అధ్యాయంలో ప్రధానంగా 4 విషయాలు చెప్పబడ్డాయి. అవి.

(i) భగవంతుని స్వరూప స్వభావాలు.

(ii) భక్తియొుక్క పద్ధతులు.

(iii) భగవంతుని చేరుకొనేందుకు ఉపాయాలు.

(iv) భక్తుల లక్షణాలు.

స్వయంగా భగవంతుడే తనగురించి, తన భక్తుని గురించి, తనపై ఉండవలసిన భక్తి గురించి చెప్పటం వల్ల మరొక మానవమాత్రునితో పనిలేకుండా - మార్పులు, చేర్పులు, తీర్పులు లేకుండా స్వయంసిద్ధమై నిలిచిందీ అధ్యాయం.

ఈ అధ్యాయాన్ని ప్రారంభించే ముందు భగవద్గీతను గురించి కూడా ఒక్కసారి ఆలోచిద్దాం. అసలు ఏమిటీ భగవద్గీత? భగవద్గీతకు మనకు సంబంధం ఏమిటి? అందులోని విషయాలను తెలుసుకోవటం వల్ల మనకు ఏం ప్రయోజనం కలుగుతుంది? మానవజన్మను సార్ధకం చేసుకొనుటకు భగవద్గీత ఎలా సాయపడుతుంది?

మీరు సరదాగా మీ బంధువులింటికి వెళ్ళాలని హైదరాబాదు వెళ్ళారు. ఒకరోజు బిర్లామందిరానికని, ఒకరోజు పార్కుకు, జూకు వెళ్ళివస్తున్నారు.

ఒకరోజున ఎవరో స్వామీజీ భగవద్గీతపై ప్రవచనములు చేసున్నారని అక్కడికి వెళ్ళారు. ఒక గంటసేపు ఆ ప్రవచనాలు విని ఆనందించారు. అక్కడి నుండి తిరిగి ఇంటికి వచ్చి భోజనం చేసి పడుకుంటే హాయిగా ఉండేది. కాని మధ్యలో స్నేహితుడు కనిపించి దగ్గరలో సర్కస్ ఉంది. వెళ్దాం అంటే వెళ్ళారు. జనంలో త్రోసుకొని టికెట్టు కొనుక్కొని లోపలికెళ్ళారు. స్నేహితుడు కనిపించలేదు. 2 గంటలు సర్కస్ చూశారు. తిరిగి ఇంటికి బయలుదేరారు. దారి తెలియలేదు. కరెంటు పోయింది. అయినా ముందు కెళ్ళారు. అక్కడ చిమ్మచీకటి. కీచురాళ్ళ ధ్వనులు, భయం వేసింది. వడివడిగా అడుగులు వేస్తున్నారు. వెనుక కుక్క మొరుగుతూ వెంటబడుతున్నట్లు అనుమానం వచ్చి పరుగులంకించుకున్నారు. ఒక ముళ్ళకంపపై పడ్డారు. ఒళ్ళంతా చీరుకుపోయింది. బాధ, దుఃఖం, ఆకలి, అలసట. దిక్కు తెలియక అలా వెళుతున్నారు. అలా ఎంతదూరం వెళ్ళినా మీ బంధువుల బజారు రాలేదు. కనిపించిన వారినల్లా అడ్రసు అడుగుతున్నారు. ఎవరూ తెలియదంటున్నారు. చివరకు ఒకాయన - ఆ ప్రాంతాలన్నీ పరిచయమున్న వ్యక్తి తటస్థపడి "ఇదిగో ఇటు వెళ్ళు. ఒక ఫర్లాంగు వెళ్ళిన తరువాత దారి చీలుతుంది. ఎడమవైపు తిరిగి సరాసరి వెళ్ళిపో. మీ బజారు వస్తుంది" అని చెప్పాడు. ఆ దారివెంట వెళ్ళి ఇల్లు చేరుకున్నారు. నీ బాధలు, భయాలు తొలగిపోయి హాయిగా ఉన్నావు.

ఇదే విధంగా మనం కూడా మన స్వస్థానాన్ని - పరమాత్మ స్థానాన్ని విడిచి ఈ మానవలోకంలోకి వచ్చిపడ్డాం. ఇక్కడ ఏవోవో పనులు చేస్తూ వాటి ఫలితంగా సుఖాలు, దుఃఖాలు అనుభవిస్తున్నాం. ఈ జన్మను విడిచిపెట్టి మనం

చేసిన పుణ్యకర్మల ఫలితంగా స్వర్గలోకానికి వెళ్ళి అక్కడ అనేకమైన భోగాలు అనుభవిస్తాం. అలాగే పాపకర్మల ఫలితంగా నరకయాతనలు, భయంకరమైన దుఃఖాలు అనుభవిస్తాం. ఆ పుణ్య, పాపలర్మల ఫలితాలు అనుభవించిన తరువాత తిరిగి ఈ లోకంలో కుక్కగా, నక్కగా, పిల్లిగా, బల్లిగా, పక్షిగా, పందిగా, పులిగా, ఏనుగుగా, చెట్టుగా, పుట్టగా, లేక మానవుడిగా అనేక రకాల జన్మలు ఎత్తుతూ ఉంటాం. అనేక సుఖాలు, భోగాలు, దుఃఖాలు, కష్టాలు అనుభవిస్తూ ఉంటాం. ఇలా అనంత కోటిజన్మలు. ఈ ప్రయాణం ఇలా సాగుతూనే ఉంటుంది. మనం రోజుకొక డ్రస్సు వేసుకున్నట్లు ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క దేహాన్ని తగిలించుకొని ఈ అంతులేని ప్రయాణాన్ని కొనసాగిస్తూ ఉంటాం. అయితే మనం ఎక్కడికి వెళ్ళాలో, ఎటు వెళ్ళాలో, ఎలా వెళ్ళాలో తెలియకుండానే ఈ ప్రయాణం సాగిస్తుంటాం. "కస్త్వం కో2హం కుత ఆయుతః" - నీవెవరు? నేనెవరు? ఎక్కణ్ణుంచి వచ్చాం? (భజగోవిందం) అని పెద్దలు, శాస్త్రాలు మనను అడుగుతూనే ఉన్నారు. "సోదరా! ఎక్కడి నుండి ఎక్కడకు నీ ప్రయాణం? అని. ఏమో! ఎక్కణ్ణించి వస్తున్నామో తెలియదు. ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. గ్రుడ్డి ఎద్దు చేలో పడ్డట్టుగా, గాలి ఎటువీస్తే అటు ఎగిరిపోయే ఎండుటాకులా ఎలాగో జీవయాత్ర సాగిస్తున్నాం. కాని మన ప్రయాణానికి ఒక గమ్యంలేదు. ధ్యేయం లేదు. లక్ష్యం లేదు." అచ్చపు చీకటింబడి" అన్నట్లు చీకట్లో ప్రయాణం చేస్తున్నాం. మన ప్రయాణానికి పుట్టు పూర్వోత్తరాలు తెలియవు. పెద్దలు చెబుతున్నా, శాస్త్రాలు ఘోషిస్తున్నా మనం మాత్రం కుంభకర్ణ నిద్ర నుంచి మేల్కోవటం లేదు.

ఇలా దిక్కులు మరచి, దిక్కుతోచక, చీకటిలో ప్రయాణిస్తున్న మనకు అన్ని మార్గాలు తెలిసిన స్నేహితునిలాగా 'భగవద్గీత' మనం ఎక్కడి నుండి బయలుదేరామో, ఎక్కడికి వెళ్ళాలో, ఎలా వెళ్ళాలో అన్ని విషయాలను చెప్పి, మనలను చేయిపట్టుకొని మన స్వస్థానానికి నడిపిస్తుంది. సమస్త దుఃఖాలను అంతం చేసుకొని, దుఃఖంలేని ఆనంద సామ్రాజ్యంలో మనలను ఓలలాడేటట్లు చేస్తుంది. అయితే మనం ఈ భగవద్గీత అనే స్నేహితుని చేయిపట్టుకొని వదలకూడదు. ఎటునడిపిస్తే అటు నడవాలి.

ఈ విధంగా మానవుడికి తన గమ్యస్థానం ఏమిటో తెలియజెప్పి అక్కడకు చేర్చే స్నేహితుడు గనుక భగవద్గీత మానవుడికి సంబంధించినది. మనకు సంబంధించినది. మానవజన్మను సార్థకం చేసుకొనుటకు ఉపయోగపడేది భగవద్గీత.

కనుక భగవద్గీత చెప్పే విషయాలను గ్రహించాలి. ఈ లోకం మనది కాదు. ఇక్కడి వస్తువులు మనవి కావు. ఇక్కడి దుఃఖాలు, బాధలు కూడా మనవి కావు. ''ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున'' అన్నట్లు ఈ పదునాలుగు లోకాలు కూడా మన మజిలీలే. ఆ లోకం నుంచి ఈ లోకానికి, ఈ లోకం నుంచి ఆ లోకానికి ఏతం బానలాగా పైకీ క్రిందికీ తిరుగుతూ ఉండాల్సిందే . ఎందుకీ గ్రహచారం మనకు? "యద్గత్వాన నివర్తంతే తద్ధామ పరమం మమ" అన్నట్లు తిరిగిరాని ఆ పరంధామాన్ని - శాశ్వతస్థానాన్ని - స్వస్థానాన్ని చేరుకోవాలి. అదే సచ్చిదానంద పరబ్రహ్మప్రాప్తి. అదే మోక్షం. కైవల్యం, జీవన్ముక్తి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇప్పుడు మనం ప్రయాణం మధ్యలో ఉన్నాం. అటూఇటూ దిక్కులు చూడకూడదు; ఉన్నచోటనే ఆగిపోకూడదు, నిరాశతో వెనుదిరిగి పోకూడదు, ముందుకే వెళ్ళాలి. త్వరత్వరగా వెళ్ళాలి. ఎప్పుడో ఒకప్పుడు చేరవచ్చు లెమ్మని నీరసంగా అడుగులు వెయ్యకూడదు. ఆ! మనకా అదృష్టం ఉంటే వెళతాం లేకపోతే లేదు అని సోమరులమై పోకూడదు. ప్రయత్నం చెయ్యాలి. పురుషార్థం చెయ్యాలి. సాధన చెయ్యాలి. మానవజన్మ పురుషార్థం చెయ్యటానికి అనువైన జన్మ. అలా పురుషార్థం చెయ్యని జన్మకు - పశుజన్మకు తేడా ఉండదు. పశువులు పురుషార్థాన్ని చెయ్యలేవు.

మానవుడుగా జన్మించిన మనం అన్ని లౌకిక విషయాలలోను పురుషార్థాన్ని - ప్రయత్నాన్ని చేస్తూనే ఉంటాం. స్నేహితుని ఇంటికి వెళ్ళావు. కాఫీ ఇచ్చారు. బాగా వేడిగా ఉంది. అదే చల్లారుతుందిలే! అని కాసేపు అలా ప్రక్కనబెట్టి ఊరుకుంటావా? అహ! కప్పులో నుండి సాసరులో పోసుకొని ఉఫ్, ఉఫ్ అని ఊదుకొని త్రాగుతావు. అలాగే భగవంతుని విషయంలో కూడా ప్రయత్నంతో సాధించాలి.

ప్రయత్నం చేసి ప్రయాణించాలి అనుకున్నాం. సరే. మన గమ్యాన్ని మనం ఎప్పుడు చేరుకుంటాం? ఎంతకాలంలో చేరుకుంటాం? - అది మన ప్రయాణసాధనాన్ని బట్టి ఉంటుంది. మనం బాంబే వెళ్ళాలనుకున్నాం. బస్సులో వెళితే 2 రోజులు పడుతుంది. ట్రైన్ లో అయితే ఒక్కరోజు, విమానంలోనో! 2 గంటలు. దూరమెంత? అనే దానితో సంబంధం లేకుండా మనం ఎంచుకొనే ప్రయాణసాధనాన్ని బట్టి గమ్యస్థానం చేరుకుంటాం.

ముక్తిని పొందాలనుకొనే జీవుడికి భగవద్గీత కొన్ని మార్గాలను తెలియజేసింది. అవే కర్మమార్గం, భక్తిమార్గం, జ్ఞానమార్గం అని 3 మార్గాలు. కర్మమార్గం బస్సు ప్రయాణం వంటిది. భక్తిమార్గం రైలు ప్రయాణం వంటిది. జ్ఞానమార్గం విమానప్రయాణం వంటిది. మూడు మార్గాలూ మంచివే. మన స్థితిని బట్టి, మన అవసరాన్ని బట్టి మనం ప్రయాణం చేయాల్సి ఉంటుంది.

ఈ 3 మార్గాలలోను కర్మమార్గం శారీరకంగా కష్టం చేయాల్సి ఉంటుంది. జ్ఞానమార్గం బుద్ధి బాగా వికసించిన మేధావులకు బాగా ఉంటుంది. కాని భక్తిమార్గం మాత్రం అందరికీ సులువైనది; నిరపాయమైనది. కనుక అందరికీ అనుకూలంగా ఉండేది భక్తిమార్గమే. దానినే ఈ 12వ అధ్యాయంలో చెప్పటం జరిగింది. అందుకే ఈ 12వ అధ్యాయం భగవద్గీతలోని అధ్యాయాలన్నింటికన్నా విశిష్టమైనది.

గంగానది గంగోత్రిలో పుట్టింది. అక్కడి నుండి ఎన్నో మలుపులు తిరిగి, ఎంతోదూరం ప్రయాణించి చివరకు కలకత్తా వద్ద సముద్రంలో కలుస్తుంది. అది ప్రయాణించే దూరం దాదాపు 2500 మైళ్ళు ఉంటుంది. గంగానదిలోని గంగాజలం ఈ 2500 మైళ్ళలో ఎక్కడైనా, ఎప్పుడైనా పవిత్రమైనదే. ఈ గంగానదిలోని జలం పాపాలను తొలగించేదని, పవిత్రమైనదని భావిస్తారు చాలామంది. భౌతికంగా కూడా ఈ జలానికొక ప్రత్యేకత ఉన్నది. ఒకసారి జర్మనీ నుంచి ఒక శాస్త్రవేత్త కాశీవచ్చి, గంగాజలన్ని పరీక్షించాలని, ఒక సీసాలోనికి ఆ జలాన్ని తీసుకున్నాడు. మరొక సీసాలోనికి మామూలు భావినీరు తీసుకున్నాడు. రెండు సీసాల్లోకి కలరా క్రిములను వదిలాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భావినీటిలో ఆ కలరాక్రిములు తండోపతండాలుగా వృద్ధి చెందాయి. కాని గంగాజలంలో ఆ క్రిములన్నీ చచ్చి ఊరుకున్నాయి. అంటే గంగాజలానికి క్రిమినాశకశక్తి ఉన్నదన్నమాట.

అట్టి గంగానది ఆద్యంతమూ ఎక్కడైనా పవిత్రమైనదే. అయినా కొన్నిచోట్ల దాని పవిత్రత మరింత హెచ్చుగా ఉంటుంది. కాశి, ప్రయాగ, హరిద్వార్ మొ॥న చోట్ల దాని విశిష్టత ఎంతో హెచ్చుగా ఉంటుంది. ఆ తీర్థప్రదేశాలన్నీ పుణ్యక్షేత్రాలై విలసిల్లినాయి.

అలాగే భగవద్గీత కూడా గంగానదివలెనే పవిత్రమైనదే. పరమపావనము, ముక్తిదాయకము అయిన జ్ఞానామృతాన్ని ప్రవహింపజేసేది. ఇందులోని 18 అధ్యాయాలూ 18 గంగా ఘట్టములే. అన్ని ఘట్టాలూ పవిత్రమైనవే అయినా కొన్నింటికి మరింత ప్రశస్తి ఉంది. అలాంటి ప్రశస్థమైన అధ్యాయాలలో ఈ 12వ అధ్యాయం భక్తియోగం ఒకటి. ఈ మాటను ఆచార్య వినోబాభావే గారు చెప్పారు. వినోబా ఏమిటి? సాక్షాత్తు భగవానుడైన శ్రీకృష్ణుడే స్వయంగా ఈ అధ్యాయంలోనే చెప్పారు.

"యేతు ధర్మ్యామృత మిదం" - అని.

ఇది ధర్మ్యామృతం. ధర్మస్వరూపమైన అమృతం. అమృత స్వరూపమైన ధర్మం. భక్తియోగం అమృతం వంటి ధర్మం. ఈ అమృతం స్వర్గంలోని అమృతం వంటిదికాదు.

స్వర్గలోకంలోని అమృతాన్ని ఈ లోకంలో పుణ్యకర్మలు చేసిన వారెవరైనా దేహాన్ని వదిలిన తర్వాత అక్కడకు వెళ్ళి పానం చేయవచ్చు. కాని

ఈ అమృతాన్ని - భక్తి అనే అమృతాన్ని ఇక్కడే, ఈ లోకంలోనే, ఈ శరీరంతో ఉండగానే పానం చేయవచ్చు. అందువల్ల ఇది అప్పుసప్పుల బేరం కాదు. అచ్చగా నగదు బేరం లాంటిది. రేపు ఎప్పుడో కలిగే ప్రయోజనం కాదు. ఇప్పటికిప్పుడే కలిగే ప్రయోజనం. అట్టి పరమ పవిత్రమైన, విశిష్టమైన, ప్రశస్థమైన అధ్యాయాన్ని - భక్తియోగాన్ని చెప్పుకొనే యోగం మనకు కలిగింది.

గడచిన అధ్యాయంలో భగవంతుడు అర్జునునికి విశ్వరూపాన్ని దర్శింపజేశాడు.

లోకము - లోకేశ్వరుడు వేరువేరు కాదు.

విశ్వము - విశ్వేశ్వరుడు విడివిడిగా లేరు.

ప్రపంచము - పరమాత్మ భిన్నంకాదు. ఒక్కటే.

అజ్ఞాని దృష్టిలో లోకం అని భావించినదే జ్ఞానిదృష్టితో చూచినప్పుడు లోకేశ్వరుడు. అజ్ఞానిదృష్టిలో విశ్వం అని భావించినదే జ్ఞానిదృష్టితో చూచినప్పుడు విశ్వేశ్వరుడు. అజ్ఞాని ఈ కనిపించే దాన్ని ప్రపంచంగా మాత్రమే చూడగలడు. జ్ఞాని ఈ ప్రపంచాన్నే పరమాత్మగా దర్శించగలడు.

స్త్రీలు నక్లెస్ అని పిలుస్తూ, దాని అందచందాలను చూస్తుంటారు. అదే ఒక షరాబు దానిని నక్లెస్ గా చూడడు. బంగారంగానే చూస్తాడు. అలాగే అజ్ఞానికి ప్రపంచం కనిపిస్తుంది. పరమాత్మ కనిపించడు. కాని జ్ఞానికి ఈ ప్రపంచం మిథ్య. సత్యంగా ఉన్నది పరమాత్మే. భక్తునికీ జ్ఞానికీ ఇక్కడే ఒక భేదం ఉన్నది.

- తాను తప్ప మిగతా అంతా పరమాత్మే అని భావిస్తాడు భక్తుడు.
- తనతో సహా సమాస్తము పరమాత్మేనని భావిస్తాడు జ్ఞాని.
- తాను ఆయనకు దాసుడనని భావిస్తాడు భక్తుడు.
- తనకు ఆయనకు తేడా ఏమీలేదని, అసలు ఉన్నది ఒక్కటేనని, తానే పరమాత్మనని భావిస్తాడు జ్ఞాని.

భక్తునికీ జ్ఞానికీ ప్రారంభదశలో ఈ తేడా ఉంటుంది. అయితే ఈ తేడా చివరివరకూ ఉండదు. భక్తుడు జ్ఞాని కాగానే ఉండేది ఒక్కటే. ఒక్కటే భావం - ఉన్నదంతా పరమాత్మే; పరమాత్మ కన్న అన్యంగా కించిత్తు కూడా లేదు - అని.

దివ్యనేత్రాన్ని పొందిన అర్జునుడు సమస్తము భగవత్స్వరూపమే అని దర్శించాడు. విశ్వమంతా విశ్వేశ్వరునిగా దర్శించాడు. అయితే అట్టి పరమాత్మ దర్శనంతో తనపని తీరిపోలేదు. తాను ఆయనలో ఐక్యమైపోవాలి. తన నిజస్వరూపంలో - స్వస్థితిలో నిలిచిపోవాలి. ఎలా?

దానికే భగవానుడు ఉపాయం చెప్పాడు. భగవంతుని తెలుసుకోవాలన్నా, దర్శించాలన్నా, ఆయనలో ప్రవేశించాలన్నా అనన్యభక్తి కావాలి - అని. అట్టిభక్తిని సాధించి పరమాత్మతో ఐక్యం కావటానికి 5 సాధనలను చెప్పారు. అవే 1. మత్కర్మకృత్ 2. మత్పరమః 3. మద్భక్తః 4. సంగవర్జితః 5. నిర్వైర సర్వభూతేషు - అని. నిజంగా ఈ 5 సాధనలు కర్మ, భక్తి, జ్ఞాన యోగాలకు సంబంధించినవే. ఏదో ఒక యోగాన్ని పట్టుకొని లక్ష్యాన్ని చేరుకోలేం. అన్ని యోగాలను సమన్వయం చేసి ఆచరణ చేస్తూ పరమాత్మను అందుకోవాలి.

**మత్కర్మకృత్ అని కర్మయోగాన్ని,**

**మత్పరమః, మద్భక్తః అని భక్తియోగాన్ని,**

**సంగవర్జితః, నిర్వైర స్సర్వభూతేషు అని జ్ఞానయోగాన్ని 3 యోగాలను సమన్వయం చేసి ఇక్కడ చెప్పటం జరిగింది.**

**భగవద్గీత ఒక సమన్వయ శాస్త్రం. అన్ని యోగాలను, అన్ని ధర్మాలను, అన్ని శాస్త్రాలను, అన్ని మతాలను క్రోడీకరించి సమన్వయం చేసిన శాస్త్రం గీతాశాస్త్రం.**

**కొందరు కర్మయోగం గొప్పదని, కొందరు భక్తియోగం గొప్పదని, కొందరు జ్ఞానయోగం గొప్పదని కొందరు ధ్యానయోగం గొప్పదని పిడివాదాలు చేస్తూ ఉంటారు. నిజంగా ఈ యోగాలు దేనికదే ప్రత్యేకమైనది కాదు. ఒకదాని కొకటి సమన్వయం చేసుకుంటూ అన్నింటిని ఆచరించవలసిందే. భగవద్గీత అన్ని యోగాలకు తగిన స్థానమిచ్చి ఆదరించింది. సాధారణంగా మనం చేసే పనులలో, అన్ని లౌకిక కార్యాలలో కూడా ఈ 4 యోగాలు కలసి ఉండాల్సిందే. అలాంటిది పరమపురుషార్థమైన మోక్షప్రాప్తికి వీటన్నింటి అవసరం లేకుండా ఎలా ఉంటుంది?**

**ఉదాహరణకు వంట విషయాన్నే తీసుకోండి, వంట అనేది మీరు ప్రతిరోజూ చేసే ముఖ్యమైన పని. ఈ పనిలో కూడా 4 యోగాలు కలిసే ఉండాలి. ఏ యోగం లోపించినా వంట చెడిపోతుంది.**

**(i) వంట చేయాలంటే బియ్యం, పప్పు, ఉప్పు, కూరగాయలు అన్నీ సమకూర్చుకోవాలి. కూరగాయలు తరిగి ఉంచుకోవాలి. పొయ్యి వెలిగించాలి.**

పాత్రలు శుభ్రం చేసుకోవాలి. ఇదంతా కర్మయోగం.

(ii) బియ్యానికి తగినన్ని నీళ్ళు, పప్పుకు తగినంత ఉప్పు, వంటకు తగినంత మంట, వంట చేసే విధానము - ఈ పరిజ్ఞానం ఉండాలి. ఇదంతా జ్ఞానయోగం.

(iii) పాత్రను పొయ్యి మీద పడేసి వీధిలో కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే; పాలు పొయ్యి మీద పెట్టి బయట కూరగాయల బేరం చేస్తుంటే - వంటంతా చెడిపోతుంది, స్టౌ ఆరిపోతుంది. కనుక చేసే పనిమీద నిఘా ఉంచాలి. ధ్యాస ఉండాలి. ఇదే ధ్యానయోగం.

(iv) తిట్టుకుంటూ తిమ్ముకుంటూ, లోకులను ఆడిపోసుకుంటూ చేసిన వంట తిన్నవారికి వంటబట్టదు. అది విషంగా మారిపోతుంది. అందువల్ల ఎంతో ప్రీతితో, ఇష్టంతో వంట చెయ్యాలి. తాను చేసిన వంటను ఇంటిలోని వారందరూ ఆరగించి ఆనందించాలి, తృప్తి చెందాలి అని భావిస్తూ, భగవంతుని స్మరిస్తూ, పవిత్రమైన ఆలోచనలతో వంట చెయ్యాలి. ఇదే భక్తియోగం.

ఈ నాలుగు యోగాలూ వంటచేసే వారికే అవసరమవుతుంటే పరమాత్మ ప్రాప్తికై చేసే సాధనలో ఈ నాలుగు యోగాల అవసరం లేకుండా ఎలా ఉంటుంది? 4 యోగాలూ అవసరమే.

(i) కర్మయోగం:- నిష్కామంగా, ఫలాసక్తి లేకుండా కర్మలు చేస్తుంటే మనస్సు

---

కోరికలనే కల్మషాలు అంటక నిర్మలము, శుద్ధము అవుతుంది. మనస్సు నిర్మలము, శుద్ధము అయితేనే భగవంతునిపై నిలపటానికి ఆ మనస్సుకు

అర్హత కలుగుతుంది.

(ii) భక్తియోగం:- మనస్సు భగవంతునిపై నిలిస్తే నిరంతరము భగవంతుని స్మరించటము, భగవంతుని మహిమను తెలుసుకోవటము; నిజంగా భగవంతుడు మనకు చేస్తున్న మేలును తెలుసుకొని కృతజ్ఞతా పూర్వకమైన భక్తిని కలిగి ఉండటము జరుగుతుంది.

(iii) జ్ఞానయోగం:- ఇలా భక్తి భావన వృద్ధి అయ్యేకొద్దీ అసలు భగవంతుని తత్త్వం ఏమిటి? భగవంతుడంటే ఎవరు? నేను ఎవరిని? భగవంతునికి నాకు మధ్యనున్న సంబంధమేమిటి? అసలు ఈ జన్మకు సార్థకత ఏమిటి? ఆ భగవంతుని చేరుకొని ఆయనతో ఐక్యత నెలా సాధించాలి? అనే జ్ఞానాన్ని - ఆత్మజ్ఞానాన్ని పొందటం జరుగుతుంది.

(iv) ధ్యానయోగం:- ఆత్మజ్ఞానాన్ని పొందిన తరువాత ఆ జ్ఞానాన్ని అనుభవంలోనికి తెచ్చుకొనుటకు ధ్యానమగ్నులై, విచారణా శీలురై, ఈ దేహేంద్రియ మనోబుద్ధుల కన్న వేరుగా ఉండి, జడమైన వీటికి చైతన్యాన్ని ప్రసాదించే ఆత్మనైన నేను సర్వత్రా ఉన్న సచ్చిదానంద స్వరూప పరమాత్మనే అనే అనుభూతిని పొంది పరమాత్మగా ఉండిపోవాలి. ఇదే ధ్యానయోగం. ఇదే జీవ బ్రహ్మైక్యత; ఇదే జీవన్ముక్తి; ఇదే మోక్షం.

ఇలా మోక్షాన్ని పొందాలంటే నాలుగు యోగాలు అవసరమే. ఈ నాలుగు యోగాల సమన్వయమే భగవద్గీత. భగవద్గీత త్రివేణీసంగమం. ఎలా?

భగవద్గీత త్రివేణీ సంగమం. భక్తి గంగ లాంటిది. కర్మ యమున లాంటిది. జ్ఞానము సరస్వతి లాంటిది. భక్తికర్మలు (గంగ - యమునలు) బయటకు

కనిపించేవి. జ్ఞానం(సరస్వతి) అంతర్వాహిని. బయటకు కనిపించేది కాదు. గుప్తంగా ప్రవహించేది.

భక్తుడు గంగానది లాగా పవిత్రుడు, పరిశుద్ధుడు అయి ఉండాలి. భక్తుడు ఎంత పవిత్రుడుగా ఉండాలో ఏకనాథస్వామి వారి ఉదంతం ద్వారా తెలుస్తుంది.

ఏకనాథస్వామి ఒకసారి కొంతమంది మిత్రులతో కలసి కాశీయాత్రకు వెళ్ళాడు. ఆనాడు రైళ్ళు, బస్సులు మొ||న ప్రయాణ సౌకర్యాలు లేవు. అందరూ కాలినడకన వెళ్ళాల్సిందే. ఆయన కూడా కాలినడకన ప్రయాణం ప్రారంభించాడు. తీర్థాలలో ప్రసిద్ధి చెందిన ప్రయాగలోని గంగాజలాన్ని కావడి కుండల కెత్తుకొని తిరుగు ప్రయాణం రామేశ్వరానికి బయలుదేరాడు. గంగాజలంతో రామలింగేశ్వరుని అభిషేకిస్తే యాత్ర పరిపూర్ణ మైనట్లు, సాఫల్యం చెందినట్లు భావించేవారు పూర్వీకులు. ఆ సాంప్రదాయాన్ని అనుసరించి ఏకనాథస్వామి తన మిత్రులతో కలసి దక్షిణ దిశగా ప్రయాణిస్తూ వస్తున్నాడు. గంగకావడిని భుజం మీద నుంచి దించి నేలమీద పెట్టకూడదు. అందువల్ల వంతుల వారీగా భుజాలు మార్చుకుంటూ వస్తున్నారు. అలా వస్తూ ఒక ఎడారి గుండా ప్రయాణిస్తున్నారు. అక్కడ నీటికి మహాఎద్దడి. చుక్కనీరు దొరకదు. అక్కడ ఒకచోట ఒక గాడిద నేలపై బడి విలవిలా తన్నుకుంటున్నది. స్వామివారు దాని వద్దకు పరుగు పరుగున వచ్చి చూచారు. వడదెబ్బకు విపరీతమైన దప్పికతో విలవిలలాడిపోతున్నది. ఇక ఎంతో సేపు బ్రతికి ఉండే అవకాశం కనిపించటం లేదు. వెంటనే తటపటాయించకుండా కడవలోని

గంగాజలాన్ని దాని గొంతులో పోశాడు. దాని దప్పిక తీర్చి, మిగిలిన జలంతో దాని శరీరాన్ని తడిపి తాపాన్ని తీర్చాడు. అంతవరకు అవసానదశలో ఉన్న గాడిద తన ప్రాణదాతవైపుకు చూస్తూ తన దారిన తాను వెళ్ళిపోయింది. ఇంతదూరం కష్టపడి మోసుకొచ్చిన గంగాజలాన్ని రామేశ్వరం చేర్చకపోతినే, రామలింగేశ్వరుని అభిషేకించలేక పోతినే అనే విచారం ఏకోశానా ఆయనకు లేదు. పైగా సజీవంగా ఉన్న రామలింగేశ్వరునికి అభిషేకం చేసి తన శ్రమను సార్థకం చేసుకున్నానని ఏంతో సంతోషించాడు. అదీ భక్తుని వ్యక్తిత్వం అంటే. సర్వభూత దయ అంటే ఇదే. సర్వత్రా పరమాత్మ దర్శనం అన్నా ఇదే. భక్తుడనే వాడు ఇలా ఉండాలి. అదే నిజమైన భక్తి.

భక్తి అంటే ఏమిటో తెల్పి, భక్తుల లక్షణాలను వివరించే ఈ అధ్యాయం భక్తిమార్గంలో చివరి అధ్యాయం. సాకారోపాసన నుండి నిరాకరోపాసనకు మలుపు తిరిగే దశ ఇది. భక్తి నుండి జ్ఞానానికి మళ్ళే దశ.

అర్జునుడు క్షత్రియుడు. ఎక్కడైనా గొప్ప వస్తువు ఉన్నదని తెలిస్తే ఎదిరించి, పోరాడి దానిని అందుకోవాలనుకుంటాడు క్షత్రియుడు. గొప్ప సవాలు ఎదురైనప్పుడు ఎంతటి ప్రమాదాన్నైనా ఎదిరించి ముందుకు దూకుతాడు. గొప్పవీరుడు తనకు ఎదురునిలిస్తే పోరాడి జయించాలనుకుంటాడు. పోరాటం అతడి లక్షణం. అందుకే యుద్ధరంగంలో అడుగుపెట్టాడు. ఐతే అహంకార, మమకారాల కారణంగా కర్తవ్య విమూఢుడై శోకసంవిగ్న మానసుడయ్యాడు. అట్టి అర్జునుని రెచ్చగొట్టాడు శ్రీకృష్ణుడు. నీ కర్తవ్యాన్ని నేరవేర్చమన్నాడు. విజయమో - వీరస్వర్గమో ఏదైనా మేలేనన్నాడు.

కర్తవ్య విమూఢుడైన వాణ్ణి కర్తవ్యోన్ముఖుడుగా చేశాడు.

ఇప్పుడు విశ్వరూపాన్ని చూపించి జరగబోయే విషయాన్నంతా వర్తమానంగా చూపించాడు. ఇట్టి రూపాన్ని చూడాలన్నా, అందుకొని ప్రవేశించాలన్నా అనన్యభక్తి కావాలన్నాడు.

వెంటనే అర్జునునిలో ఒక స్థిరనిశ్చయం కలిగింది. ఆ దివ్యరూపాన్ని ఎలాగైనా అందుకోవాలి - అని. ఇంతవరకు తన సారథి, సచివుడు అనుకున్న శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మ. ఆయన చెప్పినట్లే తన కర్తవ్యాన్ని నిర్వహించాలి. ఆ దివ్యస్వరూపాన్ని అందుకోవాలి అని నిశ్చయించాడు.

ఇప్పుడు అర్జునుని మోహం తొలగిపోయింది. మమకారం పోయింది. తనలోని ఆందోళన అదృశ్యమైంది. కర్తవ్య నిర్వహణే తన ధర్మం అనే నిశ్చయానికి వచ్చాడు. దీనితో తన శరీరానికి స్వస్థత చిక్కింది. మనస్సులోని ఆందోళన తొలగి శాంతించింది. బుద్ధి సూక్ష్మంగా పని చేస్తున్నది. అందుకే ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని అందుకోవటమే గొప్ప విషయం అని తీర్మానించుకున్నాడు.

ఇంతవరకు యుద్ధం గురించి ఎంతో ఆందోళన పడ్డాడు. ఇప్పుడు ఆ సమస్య పరిష్కారమై పోయింది. ఒక స్థిర నిర్ణయానికి వచ్చాడు. దానితో యుద్ధ సమస్య చిన్నదైపోయింది. ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని జయించటమే ఇప్పుడు గొప్ప సమస్య అయికూర్చుంది. ఎలాగైనా సాధించాలని నిర్ణయించాడు.

మనమూ అంతే. ఇక్కడ తిండి, బట్ట, ఇల్లు, వస్తువులు, భోగాలు,

సుఖసంతోషాలు, ఆస్తులు సంపాదించటం - ఇవే ప్రధానం అనుకుంటాం. ఈ కోరికలు తీరినా - వీటిపై విరక్తి కలిగినా ఈ జన్మ ఎందుకు వచ్చిందో తెలుసుకొని జన్మను సార్థకం చేసుకోవటమే ప్రధానం అనుకుంటాం, దానికై తీవ్రంగా ప్రయత్నిస్తాం.

ఆత్మసామ్రాజ్యాన్ని అందుకోవాలంటే, పరమాత్మ దర్శనమై ఆయనలో ప్రవేశించాలంటే 5 సాధనలను చెప్పాడు భగవానుడు. అందులో భగవదార్పణ బుద్ధితో పనులు చేయటం, భగవంతునే లక్ష్యంగా పెట్టుకొని అనన్యమైన భక్తిని చూపటం ముఖ్యమైనవి.

తానిప్పుడు భగవదార్పణ బుద్ధితో యుద్ధం చేస్తాడు. బాగానే ఉంది. ఇక భగవంతుని ఎలా లక్ష్యంగా పెట్టుకోవాలి? ఎలా ఆయనను ఉపాశించాలి? ఎలా అనన్యభక్తిని చూపాలి? ఇదే ఇప్పటి సమస్య.

భగవంతుడు నిరాకారుడు, నిర్గుణుడు, నిరవయవుడు, అవ్యక్తుడు, అచింత్యుడు, అనిర్దేశ్యుడు, సూక్ష్మాతిసూక్ష్ముడు, సర్వవ్యాపి అని ఇంతకు ముందే తెలుసుకున్నాడు. చిన్నతనంలో వేదాధ్యయనం చేసినప్పుడే ఈ విషయాలను అధ్యయనం చేశాడు. ఆ తరువాత అనేకమంది మహర్షులు, మహాత్ముల ద్వారా విన్నాడు కూడా. కాని ఆ పరమాత్మను ఇప్పుడు సాకారుడుగా - విశ్వరూపుడుగా చూచాడు. "నన్నే లక్ష్యంగా పెట్టుకొని నా భక్తుడివి కా!" అంటూ ఆ సాకారమూర్తి ఆదేశిస్తున్నాడు.

ఇంతకూ ఇప్పుడు ఉపాసించవలసింది సాకారుణ్ణా? నిరాకారుణ్ణా? ఇదే గజిబిజిగా, గందరగోళంగా, సందేహాస్పదంగా ఉన్నది. ప్రతి మతంలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కూడా ఈ విషయమై చర్చ జరుగుతూనే ఉంటుంది. కొందరు విగ్రహారాధనను విమర్శిస్తారు. కొందరు సమర్థిస్తారు. కనుక సాకార సగుణమా? నిరాకార నిర్గుణమా? ఎలా ఉపాసన సాగాలి? ఎలా సాగితే ఆ పరమాత్మను చేరుకోవటం జరుగుతుంది? ఇదీ సంశయం. ఈ సంశయం తీరితే గాని సాధన సాగదు. ఉపాసన ప్రారంభించలేడు. అందుకే ఈ అధ్యాయం అర్జునుని ప్రశ్నతో ప్రారంభమైంది. విశ్వరూపోపాసకుడు గొప్పా? అక్షరోపాసకుడు గొప్పా? అంటే సాకారసగుణోపాసనా? నిరాకార నిర్గుణోపాసనా? ఏది తీరాన్ని చేరుస్తుంది? ఏది తరుణోపాయం? అని మొదటి శ్లోకంలో అడిగిన ఈ అర్జున ప్రశ్నకు భగవానుడు ఎంతో వివరంగా 11 శ్లోకాల్లో సాధనోపాయాన్ని గురించి తెలియజేశాడు. రెండురకాల ఉపాసనను, వాటిమధ్య గల ఐక్యతను, తేడాను, తీసుకోవలసిన జాగ్రత్తలను, ఎదురయ్యే కష్టనష్టాలను, అధిగమించే ఉపాయాలను వివరించాడు. ఆ తరువాత 7 శ్లోకాల్లో సాధ్యవిషయం - అంటే భగవంతునికి సంబంధించిన సమాచారం - అంటే ఎలాంటి లక్షణాలు గలవానిని తన నిజమైన భక్తునిగా భగవంతుడు భావిస్తాడో తెలియజేయటం జరిగింది. చివరి శ్లోకంలో ప్రత్యేకంగా ఫలశ్రుతి ఇవ్వబడింది. మొత్తం 20 శ్లోకాలతో ఈ భక్తియోగం ముగుస్తుంది.

భక్తులు సగుణ భక్తులు, నిర్గుణ భక్తులు అని రెండు విధాలు. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు - వీరు సగుణ భక్తులు. జ్ఞాని నిర్గుణ భక్తుడు.

ఆయా సందర్భాలను బట్టి సగుణ భక్తులనూ ప్రశంసించాడు, నిర్గుణ భక్తులనూ ప్రశంసించాడు భగవానుడు. ఎందుకంటే భగవంతుని దృష్టిలో

**సగుణ నిర్గుణాలు, సాకార నిరాకారాలు అనేవి లేనేలేవు. కాని భక్తుల దృష్టిలోనే ఈ తేడాలున్నాయి. అందుకే ఈ ఇద్దరు భక్తులలో ఎక్కువ తక్కువలను తెలుసుకోవటం కోసమే అర్జునుడు ప్రశ్న వేస్తున్నాడు.**

**అర్జునుని ప్రశ్నతో ప్రారంభమయ్యే ఈ అధ్యాయాన్ని, పరిమాణంలో చిన్నదైన ఈ గొప్ప అధ్యాయాన్ని అధ్యయనం చేయటానికి, అవగాహన చేసుకొని శ్రేయస్సును పొందటానికి రంగంలోకి దిగుదాం. ప్రథమ శ్లోకం చూడండి.**

**అర్జున ఉవాచ:**

**శ్లో||** ఏవం సతత యుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే|

యేచాప్యక్షర మవ్యక్తం తేషాంకేయోగ విత్తమాః || **(1)**

**తా||** అర్జుడన్నాడు : ఈ ప్రకారంగా నిరంతరము నీ యందే మనస్సు నిలిపి ఏ భక్తులు నిన్ను ఉపాసన చేస్తూ ఉన్నారో వారు; ఎవరైతే అవ్యక్తము, నాశరహితము ఐన పరబ్రహ్మమును ఉపాసన చేస్తున్నారో వారు; ఈ ఇరువురిలోను ఎవరు యోగాన్ని తెలిసిన శ్రేష్ఠులు?

**వ్యాఖ్య:-** **11వ అధ్యాయం చివరలో "ఎవరైనా స్థిర భక్తి కలిగిఉంటే నన్ను చేరుకోవచ్చు" - అని భగవానుడు చెప్పగానే ఆ భగవంతుని చేరుకోవాలని నిశ్చయించుకున్నాడు అర్జునుడు. అయితే ఇప్పుడు భక్తిని చూపవలసింది ఎవరి మీద? సాకారుడైన విశ్వరూపుని మీదనా? లేక అవ్యక్తుడు, అక్షరుడు, నిరాకారుడు, నిర్గుణుడు, సర్వవ్యాపి అయిన పరమాత్మ మీదనా? అనే**

సందేహం కలిగింది అర్జునునికి. అందుకే ఈ ప్రశ్నవేసి తన సందేహాన్ని నివారించుకోవాలనుకున్నాడు.

మేడ మీదకు వెళ్ళాలి. కుడివైపున గుండ్రటి మెట్లున్నాయి. ఎడమవైపున బారుగా ఏటవాలు దారి ఉన్నది. ఇప్పుడెటు వెళ్ళాలి? అని సంశయం కలుగుతుంది ఒక్కొక్కప్పుడు మనకు. ఇప్పుడు అర్జునునిది కూడా అలాంటి సందేహమే.

ప్రపంచంలో ఈ నాటికీ ఈ విషయంలో వివాదం ఉండనే ఉన్నది. మహమ్మదీయులు విగ్రహారాధనకు వ్యతిరేకులు. హిందువులలో కూడా ఆర్యసమాజం వారు విగ్రహారాధనను తీవ్రంగా వ్యతిరేకిస్తారు. మిగిలిన వారిలో చాలామంది విగ్రహారాధకులే. ఒక విగ్రహం, ప్రతిమ ఏదీ కూడా నిరాకార నిర్గుణ పరమాత్మకు ప్రతీక కాలేదని, ప్రాతినిధ్యం వహించలేదని ఆర్యసమాజం వారి వాదన. ఒక తరంగం (అల) సముద్రానికి ప్రాతినిధ్యం వహించకుండా పోతుందా? అని విగ్రహారాధకుల సమాధానం.

ఈ విషయంలో అనేక మతాల వారి అభిప్రాయాలు అనేక విధాలుగా ఉన్నాయి. ఈ శ్లోకంలోని భావాన్ని బయటకు లాగటానికి చాలామంది వ్యాఖ్యాన కర్తలు ఎంతో హంగామా చేశారు.

సాకార సగుణ భక్తులు తక్కువని కొందరు, నిరాకార నిర్గుణ భక్తులు మనస్సును స్థిరంగా భగవంతుని యందు నిలపలేరని, కనుక వారు ఏమీ సాధించలేరని కొందరు - ఎవరికి వారు శ్రీకృష్ణుని అభిప్రాయంతో సంబంధం లేకుండా తీర్మానాలు చేసేశారు.

ఐతే భగవంతునికి మాత్రం ఈ విషయంలో ఏ భేదమూ లేదు. నిజంగా సగుణం - నిర్గుణం అనేవి, సాకారం - నిరాకారం అనేవి సాధకుని దృష్టిలోనే గాని సిద్ధులైన వారి దృష్టిలో ఈ తేడా లేనేలేదు. భగవంతుని దృష్టిలో ఈ తేడా ఉండే వీలు లేనేలేదు.

అర్జునుని ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పకుండా భగవానుడు పద్ధతి మార్చి చెబుతున్నాడు. ఆయన చెప్పిన సమాధానాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే ముందు ఈ ఉపమానం వినండి.

ఒక స్త్రీకి ఇద్దరు కుమారులు. పెద్దవాడు బాగా ఎదిగినవాడు, తెలివితేటలు, శక్తియుక్తులు కలవాడు. స్వతంత్రంగా వ్యవహారాలు నిర్వహించ గలిగినవాడు. రెండవాడు మైనరు. తల్లి చాటున ఉండవలసినవాడు. వాడి ఆలనాపాలనా ఆమె స్వయంగా చూసుకోవాలి. వాడి అవసరాలను తెలుసుకొని తల్లి తీర్చాలి. ఇద్దరిలో ఎవరు శ్రేష్ఠులు? అంటే ఆ తల్లి ఏమని చెబుతుంది?

ఒకసారి ఆ దేశానికి యుద్ధం వచ్చింది. అత్యవసర పరిస్థితి విధించారు. ప్రభుత్వం వారు ఇంటికొకరి చొప్పున నిర్బంధంగా ప్రభుత్వ సేవలోకి రావాలని ఆదేశించారు. ఆమె ఇంటికి కూడా వంతు వచ్చింది. అమ్మా! నీ ఇద్దరి కొడుకుల్లో ఒకణ్ణి మాకు ఇవ్వాలి అన్నారు. ఇప్పుడు తల్లి ఏం చేస్తుంది? తప్పనిసరిగా ఇవాల్సివస్తే పెద్దవాణ్ణే ఇస్తుంది. ఎందుకంటే వాడు స్వతంత్రుడు, సమర్థుడు. చిన్నవాడి బాగోగులను, వాడి యోగక్షేమాలను వాడు స్వతంత్రంగా చూసుకోలేడు. తనే చూడాలి. కనుక వాణ్ణి వదిలేందుకు

ఇష్టపడదు. అంతమాత్రాన తల్లికి చిన్న కొడుకంటే ఇష్టమని, పెద్దకొడుకంటే ఇష్టం లేదని అనగలమా? నిజంగా పెద్దకొడుకు తన దగ్గర ఉంటేనే తనకు ఆసరాగా ఉంటాడు. తన బాగోగులు కూడా అతడే చూస్తాడు.

అలాగే భగవంతునికి సాకార సగుణ భక్తుడు - నిరాకార నిర్గుణ భక్తుడు ఇద్దరూ బిడ్డలే. ఎవరు గొప్ప? అని అడిగితే ఏం చెప్పాలి? ఇప్పుడు భగవానుని పరిస్థితి కూడా ఆ తల్లి పరిస్థితి లాగానే ఉన్నది. కనుకనే స్పష్టంగా, సూటిగా చెప్పక పద్ధతి మార్చి చెబుతున్నాడు.

సగుణోపాసకుడు భగవంతునిపై ఆధారపడవలసిన వాడు. అతడికి స్వశక్తి లేదు. అతడిని ఈ సంసార సాగరం నుండి ఉద్ధరించవలసిన భాధ్యత భగవంతునిదే. ఇక నిర్గుణో పాసకుని విషయం అలాకాదు. అతడు సర్వతంత్ర స్వతంత్రుడు. సమర్ధుడు. ఎక్కువని - తక్కువని అత్ణణ్ణి తూచే త్రాసు లేదు. అతడు జ్ఞాని. అతీతుడు. ఎవరి సహాయం లేకుండానే తనను తాను ఉద్ధరించుకోగలిగిన వాడు. అందుకే నిర్గుణోపాసకులను ప్రాఢుల స్థానంలోను, సగుణోపాసకులను బాలుర స్థానంలోను నిలిపి భగవానుడు సమాధానం ఇవ్వబోతున్నాడు రెండవ శ్లోకం నుండి.

సగుణ భక్తులంటే ప్రపంచాన్ని, అందులోని సమస్త ప్రాణులను పరమాత్మ స్వరూపులుగా చూచేవారు, పూజించేవారు. నిజంగా ఈ 12వ అధ్యాయంలో వివరించబడిన సగుణభక్తి యొక్క స్వరూపం ఇదే. ఆకలిగొన్న వాడికి ఒక్క ముద్ద అన్నం పెడితే ఆ ముద్ద పరమాత్మకు చేరినట్లే భావించాలి. కేవలం భావించటమే కాదు. నిజం కూడా అదే. అన్ని దేహాలలోను వైశ్వానర



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రూపంలో ఉన్నది ఆ పరమాత్మే కదా! ఇదే పరమాత్మ పూజ. ఇదే సగుణోపాసన. ప్రాణులన్నీ - అందరు మానవులు నడచివచ్చే దేవుళ్ళే అనే భావనే గొప్పపూజ. ఇదే ఆరాధన.

ఇక నిర్గుణ భక్తుల విషయం వేరు. వారికి ప్రపంచము - పరమాత్మ అని రెండు లేవు. జీవుడు - దేవుడు అని ఇద్దరు లేరు. ఉన్నది ఒక్కటే. ఏకమైన - అద్వయమైన పరమాత్మ మాత్రమే. పరమాత్మ కన్న అన్యంగా మరొకటి ఉండే వీలులేదు. మన దృష్టి దోషం వల్ల పరమాత్మే ప్రపంచంగా కనిపిస్తున్నది. మన అజ్ఞానం వల్లనే దేవుడు జీవుడుగా కనిపిస్తున్నాడు. చీకటి వల్ల త్రాడు పాముగా కనిపించినట్లు అజ్ఞానం వల్ల పరమాత్మ ప్రపంచంగా కనిపిస్తున్నది. ప్రపంచం మిథ్య. అది కనిపిస్తున్నా లేనిదే. పరమాత్మ సత్యం. కనిపించకపోయినా సత్యమే. పరమాత్మ సత్యమే అయినా ప్రత్యక్ష ప్రమాణాలకు అందేవాడు కాదు. అనుమాన ప్రమాణం ద్వారానే గ్రహించాలి. చెట్ల ఆకులు కదిలితే గాలి ఉన్నట్లు గ్రహిస్తాం. అలాగే జడమైన దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులు పనిచేస్తుంటే పరమాత్మ ఉన్నట్లు గ్రహించాలి. ఇదే అనుమాన ప్రమాణం అంటే. పరమాత్మ అవ్యక్తుడే కాదు, అక్షరుడు కూడా. అంటే క్షరం (నాశనం) లేనివాడు. అట్టి తత్వాన్ని ఉపాసన చేసేవారు నిరంతరం 'సో2హం' భావనలో ఉంటారు. అంటే సో2హం భావనయే నిరాకార నిర్గుణోపాసన. ఈ విధంగా సగుణోపాసకునికి, నిర్గుణోపాసకునికి ప్రారంభంలో భేదం ఉంటుంది.

తాను తప్ప ప్రపంచం అంతా - అందరూ పరమాత్మ స్వరూపులేనని; వారిని పూజించటం, సేవించటం, ఆరాధించటమే భగవంతుని పూజ అనేది

సగుణోపాసకుని భావం. తనతో పాటు సమస్తమూ పరమాత్మే. ప్రపంచం అనేది కనిపిస్తున్నా లేనిదే- మిథ్యయే- గారడీ వాడు చూపించే వస్తువు లాంటిదే. కనుక నిరంతరం సోऽహం భావనలో నిలిచిపోవటమే నిజమైన భక్తి అనేది నిర్గుణోపాసకుని భావం. రెండూ రెండు స్థాయిలలో శ్రేష్టమైనవే. కనుకనే ఇది గొప్ప- అది గొప్ప అని చెప్పకుండా రెండింటిని- ఇద్దరిని గొప్పగానే భావించాలని చెబుతూ, రెండింటి విషయంలోనూ తీసుకోవలసిన జాగ్రత్తలను తెలిపి, హెచ్చరిస్తూ భగవానుడు తన సమాధానాన్ని చెప్పబోతున్నాడు. భగవంతుని సమాధానాన్ని సరిగ్గా గ్రహించ గలిగితే తత్త్వం చక్కగా బోధపడుతుంది; మనం ఏ విధంగా భగవంతుని భక్తులం కాగలమో తెలుస్తుంది. కనుక భగవంతుని సమాధానం ఏమిటో చూద్దాం.

**శ్రీ భగవానువాచ:**

**శ్లో||** మయ్యా వేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే|
శ్రద్ధయా పరయోపేతాః తేమేయుక్తతమా మతః|| **(2)**

**తా||** భగవానుడంటున్నాడు: నాలో మనస్సు నిలిపి, నిరంతర దైవచింతనా పరులై, మిక్కిలి శ్రద్ధతో కూడిన వారై ఎవరు నన్ను ఉపాసిస్తారో వారే శ్రేష్ఠులని నా అభిప్రాయం.

**వ్యాఖ్య:-** సగుణోపాసకుడు శ్రేష్ఠుడా? నిర్గుణోపాసకుడు శ్రేష్ఠుడా? అని అర్జునుడు ప్రశ్నవేశాడు. ఎందుకంటే తాను ఏ విధంగా ఉపాసన చేస్తే పరమాత్మను అందుకొని, పరమాత్మతో ఐక్యతను సాధించటం

సాధ్యమౌతుందో తెలుసుకోవాలనే తపన అర్జునునిది. అయితే భగవానుడు మాత్రంగా సూటిగా సమాధనం చెప్పటం లేదు. మరేం చెబుతున్నాడు?

ఎవరైనా సరే నాయందే మనస్సును నిల్పి, నిరంతరము నన్నే చింతన చేస్తూ, మిక్కిలి శ్రద్ధతో నన్ను ఉపాసన చేస్తారో వారే శ్రేష్ఠులు, యోగయుక్తులు అని చెబుతున్నాడు. ఇలా చెప్పటంతో భగవంతుని ఆంతర్యం ఏమిటి? సగుణోపాసన అయినా, నిర్గుణోపాసన అయినా అది సాధకుల మనోస్థితిని, బుద్ధి సూక్ష్మతను బట్టి ఉంటుందని; ఏదైనా భగవంతుని అందుకొనేందుకు సాధనయే గనుక అది గొప్ప - ఇది గొప్ప అనేదేమీ లేదని ఆయన ఆంతర్యం. భగవంతుని దృష్టిలో అసలు సగుణ నిర్గుణ అనే భేదాలు లేనేలేవు. ఆ భేదం సాధకుల దృష్టిలోనిదే.

నీ దగ్గర సైకిలుంది. రోడ్డుపై ప్రయాణం చేస్తావు. నీ దగ్గర పడవ ఉంటేనో రోడ్డుపై ప్రయాణం చేయలేవు, తప్పనిసరిగా నీటిపై ప్రయాణం చేయవలసిందే. అలాగాక నీ దగ్గర విమానమో, హెలికాప్టరో ఉంటే ఆకాశంలో ప్రయాణం చేయవలసి ఉంటుంది.

అలాగే నీ మనస్సు సహజంగా ఆవేశపూరితమై, భక్తి పరవశం (Emotional)గా ఉంటే నీవు తప్పక సగుణోపాసన అనే మార్గాన్ని ఆశ్రయించవలసిందే. పూజ, ప్రార్థన, జపం, సంకీర్తన, నామస్మరణ మొ||న దైవకార్యాలు చేయాలి. వాటియందు సహజంగానే అభిరుచి ఉంటుంది. వాటివాల్లనే వారికి ఎంతో ఆనందంగా ఉంటుంది. వీటి ద్వారానే వారు క్రమంగా చిత్తశుద్ధిని పొంది, ఆత్మజ్ఞానాన్ని పొంది, నిర్గుణోపాసకులై ముక్తిని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పొందటం జరుగుతుంది.

ఇక కొందరి మనస్సు విచారణాపరంగా ఉంటుంది. అన్నింటిని జాగ్రత్తగా గమనిస్తూ ఉంటారు. గమనించిన ప్రతి విషయాన్ని విశ్లేషణ చేసి చూస్తారు. సత్యమేదో - అసత్యమేదో, ఆత్మ ఏదో - అనాత్మ ఏదో, క్షేత్రమంటే ఏమిటో - క్షేత్రజ్ఞుడంటే ఏమిటో అని విచారణాశీలురై ఉంటారు. వారి బుద్ధి బాగా సూక్ష్మంగా ఉంటుంది. అట్టి స్వభావం గలవారు నిరాకార నిర్గుణ పరబ్రహ్మమును ఉపాసిస్తారు. శ్రవణ, మనన, నిధిధ్యాసనల పైన, ఆత్మవిచారణ పైన అభిరుచి ఉంటుంది. దీని ద్వారానే వారు ముక్తిని పొందగలరు.

కనుక ముక్తిని పొందటానికి ఏ మార్గంలోనైనా ప్రయాణించవచ్చు. అయితే ఏ మార్గంలో ప్రయాణించినా ఆ ప్రయాణం చక్కగా సాగి లక్ష్యాన్ని చేరుకోవాలంటే కొన్ని జాగ్రత్తలు మాత్రం తప్పనిసరి. ఏమిటవి?

1. మయి ఆవేశ్య మనః - మనస్సును నా యందే నిలుపుట.

2. నిత్యయుక్తః - నిరంతరము స్మరించుట - భజించుట.

3. పరయాశ్రద్ధయా ఉపేతః - మిక్కిలి శ్రద్ధతో కూడియుండుట.

ఈ 3 విషయాలలోను గొప్ప పట్టుదల ఉండాలి. జాగ్రత్త ఉండాలి.

1. <u>మయి ఆవేశ్యమనః :-</u> మనస్సును పూర్తిగ పరమాత్మ యందే నిలపాలి. మనస్సు అంటే ఆలోచనలే. అంటే మన ఆలోచనలన్నీ భగవంతునికి సంబంధించినవే కావాలి. ఆయన గుణగణాలు, ఆయన పనులు, ఆయన మహిమ, ఆయన దయ, ఆయనకు మనతో గల సంబంధము - ఇలా అన్నీ భగవంతునికి సంబంధించిన ఆలోచనలే మనలో కదలాలి. సామాన్యంగా

లోకంలోని మానవులందరి యొక్క ఆలోచనలు ప్రాపంచిక విషయాలలోనే తిరుగుతుంటాయి. భార్యాబిడ్డల గురించి, ఇళ్ళువాకిళ్ళు గురించి, సంపాదన గురించి, మాటవినని పిల్లల గురించి, పెళ్ళి కావాలసిన అమ్మాయి గురించి, అబ్బాయి ఉద్యోగం గురించి, చేసే వ్యాపారం లేదా వృత్తి గురించి, ఇరుగుపొరుగు ఇళ్ళలోని లోపాలగురించి, దేశరాజకీయాల గురించి, సినిమాల గురించి, సీరియల్స్ గురించి, దేశంలో జరిగే అన్యాయాల గురించి - ఒకటేమిటి ఎన్నో విషయాలు ఒకదాని తరువాత ఒకటిగా తరుముకుంటూ మనస్సులోనికి వస్తుంటాయి. మనస్సంతా వాటితోనే నిండిపోతుంది. అందుకే వారి మనస్సులో భగవంతునికి చోటు దొరకదు.

ఇక కొద్దిమంది ఇలాంటి అన్ని విషయాల మధ్య అప్పుడప్పుడు కొంత తీరిక చేసుకొని భగవంతుని గురించి కూడా ఆలోచిస్తారు. అంటే వీరు భగవంతునికి కూడా తమ మనస్సులో కొంత చోటు కల్పిస్తుంటారు.

ఎంతో అరుదుగా - బహుకొద్ది మంది మాత్రం ఎక్కువగా భగవంతుని గురించే ఆలోచిస్తూ, భగవంతునే స్మరిస్తూ అప్పుడప్పుడు కొన్ని కొన్ని భాద్యతల గురించి, కుటుంబ వ్యవహారాల గురించి, పోషణ గురించి ఆలోచిస్తారు. అంటే భగవంతునికి మనస్సులో ఎక్కువ చోటును కల్పించి, అన్య విషయాలకు తక్కువ చోటు చూపుతారు.

అయితే ఇక్కడ భగవంతుడు చెప్పిన విషయం అలాకాదు. మనస్సు పూర్తిగ భగవంతుని యందే నిలపాలి. మనస్సులో ప్రాపంచిక విషయాలకు తావుండరాదు. ఇలా మనస్సును పూర్తిగా భగవంతునికే అర్పిస్తే,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతునిలోనే నిలిపితే ఆ మనస్సు భగవంతుని చింతించి, చింతించి చివరకు భగవదాకారంగా మారిపోతుంది.

గోపికల మనస్సులో శ్రీకృష్ణునికి తప్ప మరొకరికి చోటు లేదు. తల్లిదండ్రులు, భర్త, బిడ్డలు, పాలు, పెరుగు, వెన్న - మొ||నవి ఏవీ వారి మనస్సులో ఉండవు. వారి ఆలోచనలన్నీ కృష్ణుని చుట్టూనే తిరుగుతుంటాయి. వారి మనస్సు కృష్ణమయం. కృష్ణునే స్మరిస్తారు. కృష్ణునే కీర్తిస్తారు. కృష్ణా! కృష్ణా! అని ఉన్మత్తులై గానం చేస్తుంటారు. మురళీగానం వారి చెవులలో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. బృందావనం అంతటా వారికి కృష్ణుడే కనిపిస్తుంటాడు. కృష్ణుడు కనిపించకపోతే విరహం. తిండి పట్టదు. నిద్ర పట్టదు. భర్త, బిడ్డల ఆలనాపాలనా పట్టదు. ఒకటే రంథి.

నారదుడు ఒకసారి బృందావనం వచ్చినప్పుడు గోపికలను చూచాడు. "వీరు కేవలం మూఢభక్తిలో ఉన్నారు. కృష్ణతత్త్వం వీరికి తెలియదు. వీరికి భక్తి ఉన్నదేగాని జ్ఞానం లేదు. కనుక వీరికి తత్త్వాన్ని బోధించి, జ్ఞానులుగా మారుస్తాను" అని అనుకొని ఒకనాడు ద్వారకలో శ్రీకృష్ణుని దర్శించి, ఆయనకు తన అభిప్రాయాన్ని చెప్పి గోపికలకు తత్త్వాన్ని బోధించేందుకు అనుమతి నిమ్మని శ్రీకృష్ణుని ప్రార్థించాడు. సరే. అలాగే చెయ్యమన్నాడు కృష్ణుడు.

నారదమహర్షి ఎంతో సంతోషంతో ఎగిరి గంతువేసి పరుగుపరుగున బృందావనానికి విచ్చేశాడు. గోపికలందరిని ఒకచోటికి రమ్మని కబురు పంపించాడు. అందరూ వచ్చారు. అప్పుడు నారదుడు గొంతు సవరించుకొని,

"ఓ గోపకాంతలారా! మీరందరు శ్రీకృష్ణునికి గొప్పభక్తులు. కాని మీకు కృష్ణతత్త్వం తెలియదు. అందువల్ల మీకు తత్త్వజ్ఞానాన్ని బోధించాలని మిమ్ములనందరిని ఇక్కడకు రప్పించాను. సావధాన చిత్తులై నా ఉపదేశాన్ని ఆలకించండి" అన్నాడు. అది విని ఆ గోపభామలు, "అయ్యా! మహానుభావా! మీ బోధను ఆలకించే తీరుబాటు మాకులేదు. మా మనస్సులన్నీ ఆ శ్రీకృష్ణుని ప్రేమలో ఉన్మత్తత చెంది ఉన్నాయి. మా చిత్తానికి ఇతర సుద్దులు వినే తీరిక లేదు. మాకు ఇంకేవీ వినిపించవు. ఆ శ్రీకృష్ణునికి దప్ప మరి దేనికీ మా మనస్సులలో చోటు లేదు. క్షమించి దయచేయండి" అన్నారు.

ఆశ్చర్యపోయాడు నారదుడు. నోటమాట రాలేదు. కృష్ణభక్తి పరవశచిత్తులైన గోపకాంతల భక్తితత్త్వాన్ని తానిప్పుడు అర్థం చేసుకున్నాడు. గురువుగా వారికి బోధించాలని వచ్చి, శిష్యుడుగా వారి వద్ద నుండి భక్తిని గ్రహించి తిరిగివెళ్ళిపోయాడు. తాను వ్రాసే భక్తి సూత్రాలలో భక్తి అంటే గోపికల భక్తియే భక్తి అనే భావనతో "యధా వ్రజ గోపికానాం" అనే భక్తి సూత్రాన్ని రచించాడు. అదీ మయ్యా వేశ్య మనః అంటే. మనస్సంతా భగవంతునితో నిండిపోవాలి. మనస్సులో ఇతర ప్రాపంచిక విషయాలకు, భోగాలకు చోటుండరాదు. వాటిపై ఆసక్తి ఉండరాదు.

గాంధీ మహాత్ముడు నిరంతరం స్వాతంత్రోద్యమంలో పాల్గొంటూ రాజకీయాలలో ఉన్నప్పటికీ ఆయన పరమభక్తుడు. గీతాజ్ఞానంతో తన జీవితాన్ని ఆనందమయం చేసుకున్న మహాత్ముడు. జీవించి ఉన్నంతకాలం ఎన్ని ఉద్యమాలు నడిపినా, సత్యాగ్రహాలు చేసినా ప్రాణాలు వదిలేటప్పుడు

మాత్రం 'హే రామ్! హే రామ్!' అంటూ ప్రాణాలు వదిలాడు. అంటే ఆయన మనస్సులో ఖద్దరు లేదు, రాట్నం లేదు, స్వరాజ్యం లేదు, ఉద్యమాలు లేవు. ఉన్నది రాముడే. దానిముందు అన్నీ తక్కువే. కాబట్టే తుపాకీ గుండు గుండెల్లో దూసుకుపోయేటప్పుడు కూడా భగవంతుణ్ణి స్మరించగలిగాడు. ఎవరి మనస్సు పూర్తిగ భగవంతుని ఆలోచనలతో నిండిపోతుందో వారే అంత్యకాలంలో భగవంతుని స్మరణ చేయగలుగుతారు. ఇదే 'మయ్యా వేశ్య మనః' - అంటే.

శ్రీకృష్ణుని అభిప్రాయంలో ఎవరు ఉత్తమయోగులు?భగవంతుని యందే సంపూర్ణంగా మనస్సు లగ్నం చేసినవారే ఉత్తమయోగులు. వారు స్త్రీలా? పురుషులా? చిన్నలా? పెద్దలా? పండితులా? పామరులా? అనే పట్టింపు లేదు. భగవంతునియందు మనస్సు నుంచినవాడే యోగి, మహాయోగి. ఇది శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయం.

సామాన్య మానవులు సంసారంలో మనస్సు నుంచుతారు. యోగులు భగవంతుని యందు మనస్సు నుంచుతారు. మనస్సు ద్రవపదార్థం లాంటిది. ద్రవం ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకారాన్ని ధరిస్తుంది. గ్లాసులో పోస్తే గ్లాసు ఆకారం, చెంబులో పోస్తే చెంబు ఆకారం, బిందెలో పోస్తే బిందె ఆకారం. అలాగే మనస్సును ఏ వస్తువులో ఉంచితే ఆ వస్తువు యొక్క ఆకారాన్ని ధరిస్తుంది . విషయాల్లో చేరితే విషయాకారం, భగవంతునిలో చేరితే భగవదాకారం. ఈ విధంగా మనస్సులో భగవంతునికి మాత్రమే చోటు ఉండాలి. ఇదే 'మయ్యా వేశ్య మనః' - అంటే.

**2. నిత్యయుక్తా :- మనస్సు భగవంతునిలోనే ఉండాలని ఇంతవరకు చెప్పుకున్నాం. అయితే ఎప్పుడో రోజులో కొద్దిసేపో, వారానికి ఒకరోజో కాదు. నిత్యము, నిరంతరము భగవంతుని యందే ఉండాలి. రోజూ ఒక గంటో - రెండు గంటలో డ్యూటీ లాగా భగవంతుని స్మరిస్తే అది నిజమైన భక్తికాదు. నిజమైన ఉపాసన కాదు.**

**పూజ చేసేటప్పుడో, భజన చేసేటప్పుడో, జపధ్యానాలు చేసేటప్పుడో, దేవాలయంలో కూర్చున్నప్పుడో, లేదా ఇలా సత్సంగాలలో పాల్గొన్నప్పుడో భగవంతుని యందు మనస్సు పెట్టి మిగిలిన సమయాలలో ఇక భగవంతుని స్మరణయే లేకుండా ఉంటే అది నిత్యభక్తి కాదు, అతడు నిత్యయుక్తుడు కాదు. సర్వకాల సర్వావస్థలలోను భగవత్ స్మరణను విడిచిపెట్టరాదు. నిజంగా భగవంతుడెప్పుడూ మనను విడిచి ఉండటం లేదు. మనం కూర్చున్నా, పడుకున్నా, నిద్రపోయినా, బస్సులో ఉన్నా, విమానంలో ఉన్నా, ఏం చేస్తున్నా చివరకు చనిపోయినా సరే ఆయన మనలోనే స్థిరంగా ఉన్నాడు. కాని మనమే ఈ ప్రాపంచిక విషయాలకోసమో, భోగాల కోసమో ఆయనను విడిచిపెడుతున్నాం. అలా ఉండకూడదని భగవానుని ఉపదేశం. పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్నన్, అశ్నన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్ - కంటూ, వింటూ, తింటూ, తిరుగుతూ, తెస్తూ, ఇస్తూ, లేస్తూ, కూర్చుంటూ సర్వకాల సర్వావస్థలలోను చిత్తం భగవదాయత్తమై ఉండాలి. అంతటా ఆ భగవంతునే చూస్తూ, నిరంతరమూ ఆ భగవంతుని చింతించటమే నిత్యయుక్తః అంటే. అట్టి భక్తుడే శ్రేష్టతముడు అని భగవానుడు తన అభిప్రాయాన్ని తెలియజేస్తున్నాడు.**

తేనెటీగ పుష్పాలలోని మకరందాన్ని పీల్చుకుంటుంది. ఈగ కొద్దిసేపు బెల్లం మీద వాలుతుంది. కొద్దిసేపు పెంటకుప్పల మీద వాలుతుంది. పేడపురుగు ఎప్పుడూ పెంటకుప్పలలోనే ఉంటుంది. ఒకవేళ దానిని తెచ్చి పుష్పాలలో వేస్తే చచ్చి ఊరుకుంటుంది. మనం తేనెటీగలాగా ఎల్లప్పుడూ భగవంతునిలోనే చరించాలి. ఈగలాగా కొద్దిసేపు భగవంతునిపైన, కొద్దిసేపు ప్రపంచవిషయాల మీద వ్రాలకూడదు.

నిరంతరము శ్రీకృష్ణుని యందే మనస్సు నిల్పిన గోపికలు నిత్యయుక్తులు. శ్రేష్టభక్తులు. ఒక్క క్షణం కూడా శ్రీకృష్ణుని స్మరించకుండా ఉండలేరు. తమ తిండితిప్పలు మరచిపోతారే గాని శ్రీకృష్ణుని మాత్రం మరచిపోరు. రాత్రింబవళ్ళు అనే తేడా లేకుండా నిత్యము, నిరంతరము శ్రీకృష్ణ సందర్శనాభిలాషులై తపించిపోతూ ఉంటారు. ఆయన కనిపించకపోతే వారికి నిముషమొక యుగంలా ఉంటుంది.

ఒక గోపికకు కృష్ణుని చూడాలనే తపన అధికమైంది. పెద్దల చాటున ఉండవలసిన ఆ గోపిక, స్వతంత్రించి కృష్ణ దర్శనానికి పోయే అవకాశం లేక తపనపడి పోతున్నది. ఎలాగో మనసు బిగబట్టుకొని సాయంకాలం వరకు వేచి ఉన్నది. సాయంత్రం గోధూళి వేళ అయింది. గోవులను తోలుకుంటూ కన్నయ్య వస్తున్నాడు. ఆ గోధూళిలో మసకమసకగా అప్పుడప్పుడు కనిపించి కనుమరుగై పోతున్నాడు కన్నయ్య. అతడిని దర్శించాలంటే నందుని ఇంటికి పోవాలి. ఇదే సరైన సమయం. ప్రమిద - వత్తి తీసుకొని ముట్టించుకొని వచ్చేందుకని నందుని ఇంటికి బయలుదేరింది. నందుని ఇంట ఎప్పుడూ దీపం

వెలుగుతూ ఉంటుంది. ఆ ఊరి వారంతా సంధ్యవేళ అక్కడికి వెళ్ళి దీపం ముట్టించుకొని వస్తుంటారు. ఆ గోపిక అలాగే నందుని ఇంట ప్రవేశించి దీపం గూటి వద్దకు వెళ్ళింది. దీప దర్శనంతో పాటు దివ్యమంగళ విగ్రహం ఆ శ్రీకృష్ణుని కన్నులారా దర్శించింది. నందుని ఇంటిలో ఆ సజీవ దీపాన్ని చూస్తూ ఈ నిర్జీవ దీపాన్ని మరచింది. దీపం వద్ద వత్తిని పెట్టి వెలిగించాలనుకున్నది. కాని ఆమె పరధ్యానంతో - శ్రీకృష్ణ ధ్యానంతో తనవ్రేలును పెట్టింది. అగ్నికి దయ ఎక్కడుంటుంది? వ్రేలు కాలిపోతున్నది. ఆ సమయంలో ఆమె దేహాన్నే కాదు, ప్రపంచాన్నే మరచింది. ఆమె మనస్సు మనస్సులో లేదు, ఆమెలో లేదు, ప్రపంచంలో కూడా లేదు. భక్తితో కరిగిపోయిన ఆమె మనస్సు భగవంతునిలో లీనమై పోయింది. ఇది చూస్తున్న యశోద ఒక్క పరుగున వచ్చి ఏమిటమ్మా! ఇది? నిద్రపోతున్నావా? రాత్రి నిద్రపోకుండా మేలుకొని ఉన్నావా? అని ఆమెను కదిపి మందలించింది. అప్పుడు కదిలింది ఆమె మనస్సు. ఆమెకు కాలం తెలియలేదు. వ్రేలు కాలటం తెలియలేదు. బాధ తెలియటం లేదు. తన కృష్ణ సందర్శన కుతూహలం నెరవేరింది. ఇలా గోపికలు నిరంతరం కృష్ణస్మరణలో తరించారు.

నిరంతర భగవత్ స్మరణలో తరించిన వారిలో గోపికలే కాదు. పరమ భక్తాగ్రేసుడైన ఆంజనేయుడు కూడా ఉన్నాడు. ఆంజనేయుడు భక్తులలో సుప్రసిద్ధుడు - అగ్రగణ్యుడు.

రావణసంహారం తరువాత అందరూ అయోధ్యకు వచ్చారు. ఘనంగా శ్రీరామ పట్టాభిషేకం జరిగింది. ఆంజనేయుడు, సుగ్రీవుడు, అంగదుడు,

జాంబవంతుడు, విభీషణుడు మొ॥న వానర, రాక్షసయోధులెందరో శ్రీరాముని విడిచి ఉండలేక అయోధ్యలోనే ఉన్నారు. శ్రీరామునికి యుద్ధంలో సహాయం చేసిన యోధులందరూ రాముని చెంతజేరి ఒకనాడు శ్రీరామునితో, "స్వామీ! యుద్ధకాలంలో మీకు సేవచేసి మా జన్మలు సార్థకం చేసుకున్నాం. ఈ శాంతి కాలంలో కూడా మీ సేవ చేసుకొనే భాగ్యం మాకు కల్గించండి" అని ప్రార్థించారు. శ్రీరాముడు మంత్రిగారిని పిలిచి, "మంత్రివర్యా! వీరందరికి నా పనులు ఒక్కొక్కటి చొ॥న అప్పగించండి" అన్నాడు. మంత్రిగారు అలాగే తలా ఒకపని అప్పగించాడు. అలా అందరికి పనులు కేటాయించిన విషయం తెలుసుకొని ఆంజనేయుడు శ్రీరాముని చేరి, "స్వామీ! నాకు కూడా ఏదో ఒక పనిని అప్పగించండి. మీ సేవ చేసుకొని తరిస్తాను" అని వేడుకున్నాడు. శ్రీరాముడు మంత్రిగారిని పిలిచి "మంత్రివర్యా! మా ఆంజనేయునికి కూడా నా పనినొక దానిని అప్పగించు" అన్నాడు . మంత్రిగారు ఆలోచించి, "దేవా! పనులన్నీ ఇప్పటికే పూర్తయిపోయినవి. ఇప్పుడిక చేయటానికి ఏపనీ మిగలలేదు" - అన్నాడు. అప్పుడు ఆంజనేయుడు ఎంత చిన్నపనినైనా సరే ఏదో ఒకటి నాకు అప్పగించవలసిందే అని ప్రాధేయపడ్డాడు. దానితో మంత్రిగారు దీర్ఘంగా ఆలోచించి, "ప్రభూ! ఒక్క పని మాత్రం మిగిలి ఉంది. అదేమిటంటే ఎవరైనా ఆవలించినప్పుడు చిటికెవేస్తారు గదా! కనుక తమరు ఎప్పుడైనా ఆవలస్తే అప్పుడు ఆంజనేయుడు చిటికెవేస్తే సరిపోతుంది. ఇంతకన్నా వేరేపని ఏదీలేదు." అన్నాడు. ఇంత చిన్నపనిని ఆంజనేయునికెలా ఇవ్వటమా? అని శ్రీరాముడు తటపటాయిస్తున్నాడు. ఐతే

ఆంజనేయుడు మాత్రం వెంటనే ప్రభూ! అదే నా భాగ్యం. ఏ పనైనా ఫరవాలేదు. ఏదో విధంగా మీ సేవాభాగ్యం కలిగితే అంతే చాలు" అన్నాడు. అలా తనకు పనిని కేటాయించుకొని వెళ్ళిపోయాడు ఆంజనేయుడు.

ఆంజనేయునిపై గల అపార వాత్సల్యంతో శ్రీరాముడు తన మనస్సులో ఇలా అనుకున్నాడు. "నేను ఆవలిస్తే ఆంజనేయుడు చిటికెవేయాలి కదా! అంతటి పరమభక్తాగ్రేసరుణ్ణి నేనెందుకు ఇబ్బంది పెట్టటం? కనుక అతడు ఎప్పుడు చిటికెవేస్తే అప్పుడే ఆవలిస్తాను. అంతేగాని ఎప్పుడు పడితే అప్పుడు ఆవలించకూడదు" - అనుకున్నాడు. అదే సమయంలో దూరంగా ఒక చెట్టు మీద కూర్చొని రామనామస్మరణ చేసుకుంటూ ఉన్న ఆంజనేయుడికి చిటికె వేయాల్సిన విషయం గుర్తుకువచ్చింది. అతడు తన మనస్సులో ఇలా అనుకున్నాడు, నా ప్రభువు ఎప్పుడు ఆవలిస్తాడో తెలియదు. ఆ సమయంలో నేను చిటికె వేయకపోతే నా సేవలో లోపం జరిగినట్లే గదా! కనుక దీనికి ఏదైనా ఒక ఉపాయాన్ని ఆలోచించాలి - అని చాలా సేపు ఆలోచించి, నేనెప్పుడూ, రాత్రింబవళ్ళు చిటికెవేస్తూ ఉంటే ఆయన ఎప్పుడు ఆవలించినా ఇక ఇబ్బంది ఉండదు గదా! అని నిశ్చయించుకొని నిర్విరామంగా చిటికె వేస్తూ కూర్చున్నాడు.

అక్కడ శ్రీరాముడు తన నిర్ణయం ప్రకారం ఆంజనేయుడు చిటికె వేసినప్పుడల్లా ఆవలించాలి గనుక; అలా ఎప్పుడూ ఆవలిస్తూ నోరు తెరుచుకొనే ఉన్నాడు. ఆయన చిటికె ఆపలేదు. ఈయన నోరు మూతపడలేదు.

శ్రీరాముని నోరు మూతబడకపోవటం చూచి మంత్రులకు మతిపోయింది. వైద్యులను పిలిపించారు. ఆరోగ్యంలో ఏ లోపమూ లేదని వారు తేల్చివేశారు. ఇక ఏమీ తోచక వశిష్ఠుల వారి వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. ఆయన దివ్యదృష్టితో గమనించి వెంటనే ఆంజనేయుని చేత చిటికె వేయటం మాన్పించండి అన్నాడు. అందరూ ఆంజనేయుని దగ్గరకు వెళ్ళి చిటికె వేయటం ఆపమన్నారు. "నా ప్రభువు సేవలో ఎలాంటి లోపం జరగటానికి వీలులేదు. కనుక చిటికె వేయటం ఆపను" అన్నాడు ఆంజనేయుడు. అప్పుడంతా ఆలోచించి ఆంజనేయునికి వేరొక సేవా కార్యక్రమం అప్పగించి ఈ చిటికె వేసే పనిని ఇతరులకు అప్పగించారు. దానితో రాముని నోరు మూతబడింది.

కథలో ఆంజనేయుడు, ఏ క్షణంలో రాముడు ఆవలిస్తాడో తెలియక నిరంతరం చిటికె వేయుటకు నిశ్చయించుకున్నట్లు గానే ఏ క్షణంలో మృత్యువు మనను కబళిస్తుందో తెలియదు గనుక నిరంతరం దైవచింతన చేయాలి. ఇక మృత్యువు ఎప్పుడు వచ్చినా చిక్కులేదు. కనుక మోక్షార్థి ఐనవాడు నిరంతరం దైవచింతన చేయాలి. దైవస్మరణ చేయాలి అతడే నిత్యయుక్తుడు. అతడే నిజమైన భక్తుడు. అంతేగాని సంకటమొస్తే వెంకటరమణ అన్నట్లు, కష్టాలు వచ్చినప్పుడో, కోరికలు తీరనప్పుడో, ఎన్నికలు వచ్చినప్పుడో చేసేది దైవచింతన కాదు. నిరంతరం దైవచింతన చేయుటే భక్తుని లక్షణం. ఇలా నిత్యము - నిరంతరము దైవచింతనలో - దైవస్మరణలో ఉంటే ప్రయోజనం ఏమిటి?

భ్రమర కీటక న్యాయాన్ని అనుసరించి భక్తుడు భగవంతుడే అవుతాడు. జీవుడు దేవుడే అవుతాడు. నరుడు నారాయణుడే అవుతాడు.

భ్రమరం కీటకాన్ని తెచ్చి మట్టి గూటిలో పెడుతుంది. ఆ గూటికి ఒకచోట రంధ్రం చేసి లోపలున్న కీటకాన్ని చూస్తూ దాన్ని పొడుస్తూ ఉంటుంది. దాని నుండి తప్పించుకోవటానికి ఆ కీటకం భ్రమరాన్నే తలచుకుంటూ తలచుకుంటూ లోపల తిరుగుతూ చివరకు ఆ కీటకం భ్రమరమే అవుతుంది. ఇదే భ్రమర కీటక న్యాయం. కనుక నిరంతరము భగవంతుని తలచుకుంటూ ఉండాలి భక్తుడు.

3. శ్రద్ధయా పరయా ఉపేతాః:- శ్రద్ధ అంటే విశ్వాసం. శాస్త్రాలు చెప్పిన విషయాలను శ్రద్ధగా విని విచారణ చేయాలి. అలా విచారణ చేసి నిశ్చయించుకొని అనుభవంలో నిలవాలి. అందుకు ఒక సద్గురువును ఆశ్రయించాలి. అతడు శాస్త్రబద్ధమైన విషయాలు చెబుతున్నాడా? లేదా? అని ముందు పరిశీలన చేయాలి. ఆ తరువాత గురువును పూర్తిగ నమ్మాలి. అలా గురువుపై విశ్వాసం లేకపోతే ఆచరణ చేయాలనిపించదు. కనుకనే శ్రద్ధ(విశ్వాసం) ముఖ్యం. అనుకూల పరిస్థితులలో నమ్మి, ప్రతికూల పరిస్థితులలో జారిపోయే శ్రద్ధ కాకుండా ఎట్టి పరిస్థితులలోను చెక్కుచెదరని శ్రద్ధ కావాలి. శ్రద్ధ(విశ్వాసం) లేకపోతే మనస్సు స్థిరంగా నిలవదు, జ్ఞానం తలకెక్కదు. అందుకే భగవద్గీతలో 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' - శ్రద్ధ గలవానికే జ్ఞానం లభిస్తుంది అన్నారు. అందుకే శ్రద్ధ ఉంటేనే సిద్ధి అన్నారు. గురువుకు పంగనామాలు పెడదామని ఆలోచించే వాడికి జ్ఞానం ఎలా ఎక్కుతుంది?

తత్త్వజ్ఞానాన్ని కోరుకొనే వారికి 9 లక్షణాలు ఉండాలి. వివేకం, వైరాగ్యం, శమం, దమం, 'తితిక్ష, శ్రద్ధ, సమాధానం ఉపరమం, ముముక్షుత్వం. ఈ అన్నింటిలో శ్రద్ధయే మొదటిది. అయితే ఈ శ్రద్ధ వివేక శ్రద్ధ కావాలి; విచారశ్రద్ధ కావాలి. అంతేగాని అంధశ్రద్ధ కాకూడదు. అంధశ్రద్ధ - మూఢశ్రద్ధ - మూఢవిశ్వాసం వల్ల ఏ ప్రయోజనమూ ఉండదు.

ఒక గ్రామంలో గృహస్థు ఒకాయన ఉన్నాడు. ఆయనది పెద్దకుటుంబం. ఆయన ప్రతియేటా నవగ్రహ పూజ చేయిస్తాడు. పురోహితుణ్ణి పిలిచి కావలసిన వస్తువుల జాబితా ఇమ్మన్నాడు. ఆ పురోహితుడు తన ఇంట్లో కొరతగా ఉన్న వస్తువులతో కలిపి పెద్ద జాబితానే ఇచ్చాడు. గృహస్థు అన్నీ తెప్పించాడు. పూజ జరిగిపోతున్నది. ఇంతలో ఇంటిలో తిరుగుతున్న పిల్లి పూజ దగ్గర పెట్టిన కొబ్బరిచిప్పల మీదికి ఉరుకుతున్నది. అది సరుకులను పాడుచేస్తున్నది. అందువల్ల ఒక గంపను తెప్పించి పిల్లిని దాని క్రింద వేశారు. పూజ పూర్తి అయింది. ప్రతి సంవత్సరం ఇదే తంతు. ఆ గృహస్థుకు 5 ఏళ్ళ కొడుకున్నాడు. అతడు ప్రతి సంవత్సరం జరుగుతున్న పూజను జాగ్రత్తగా గమనిస్తూనే ఉన్నాడు. కొన్నాళ్ళ తరువాత ఆ గృహస్థు మరణించాడు. అతని కుమారుడు 30 సం||ల వయస్సుగల వాడయ్యాడు. తండ్రి చేయించినట్లుగా తాను కూడా నవగ్రహపూజను ప్రతి సంవత్సరము చేయించాలని నిర్ణయించుకున్నాడు. అందువల్ల తన పురోహితుని పిలిచాడు. ఈ పురోహితుడు ఎవరోకాదు. అంతకుముందు తండ్రిచేత నవగ్రహపూజ చేయించిన పురోహితుని కుమారుడే. సరే పూజ మొదలైంది. ఇంతలో ఆ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పూజ చేయించే కుర్రవాడు పురోహితునితో "అయ్యా గంపక్రింద పిల్లిని వేసే విధానం మీకు తెలియదా?" అన్నాడు. పురోహితుడు అర్థం కానట్లు చూచాడు. ఈ మాత్రం పూజ తెలియని వాడివి మాకెందుకు? వేరొకరిని పిలుస్తాం, ఆపండి పూజ అన్నాడు. అంతలో కుశలుడైన పురోహితుడు ఆ కిటుకు కనిపెట్టి ఒక పిల్లిని ఎక్కడి నుండో తెప్పించి గంప క్రింద వేసి పూజ పూర్తిచేసి తన మూట, ముల్లె సర్దుకుపోయాడు. ఇది మూఢశ్రద్ధ. అంధశ్రద్ధ. గ్రుడ్డి విశ్వాసం ఇట్టి శ్రద్ధ వల్ల ఎట్టి ప్రయోజనమూ ఉండదు. నిజమైన శ్రద్ధ కావాలి. అసలు శ్రద్ధ అంటే ఏమిటి?

"గురు వేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధ" - అన్నారు. గురువుపట్ల, శాస్త్రం పట్ల నిజమైన విశ్వాసమే శ్రద్ధ. దానివల్లనే జ్ఞానలాభం కలుగుతుంది. గురువు మీద నిజమైన విశ్వాసం ఉంటే శాస్త్రం మీద కూడా చెక్కుచెదరని విశ్వాసం కుదురుతుంది.

కనుక ఇక్కడ భక్తుడైనవాడు భగవంతునిపై అచంచల విశ్వాసం కలిగి ఉండాలి. తాను భగవంతునిపై భక్తిని కలిగి ఉంటే భగవంతుని అనుగ్రహం తనకు కలుగుతుందనే విశ్వాసం ఉండాలి. భగవంతుడున్నాడనే విశ్వాసం, ఆయన తన ప్రార్థనను ఆలకిస్తాడనే విశ్వాసం, తనపై ఆయన అనుగ్రహవర్షాన్ని కురిపిస్తాడనే విశ్వాసం భక్తునికి ఉండాలి.

ఈ ప్రకారంగా సగుణోపాసన ఐనా, నిర్గుణోపాసన ఐనా ఈ 3 జాగ్రత్తలు తీసుకోవాలి. అటువంటి వాడే శ్రేష్ఠభక్తుడు, యుక్తతముడు అని భగవంతుని అభిప్రాయం. అందుకే -

మే మతాః- నా అభిప్రాయం అని స్వయంగా భగవానుడే చెబుతున్నాడు. కనుక భగవానుని అభిప్రాయమే ఎవరికైనా స్వీకరించదగినది గాని; వారి అభిప్రాయం - వీరి అభిప్రాయం కాదు. కనుక గృహస్థు - సన్యాసి అనిగాని, బ్రాహ్మణుడు - శూద్రుడు అనిగాని, సగుణోపాసకుడు - నిర్గుణోపాసకుడు అనిగాని - వీటితో ఏ సంబంధము లేకుండా యే = ఎవరైతే ఈ 3 జాగ్రత్తలు తీసుకొని ఉపాసన చేస్తే అతడే శ్రేష్ఠభక్తుడు.

ఉపాసన అంటే ఉప + ఆసన = సమీపంలో కూర్చొనుట. ఎవరి సమీపంలో కూర్చోవాలి? భగవంతుని సమీపంలో. మన మనస్సు సంసారంలో కూర్చుంది. ఈ మనస్సును ఇక్కడి నుండి మకాం మార్చి భగవంతుని సమీపంలో కూర్చోబెట్టాలి. శిశువు గర్భంలో ఉన్నప్పుడు వాని చుట్టూ తల్లి శరీరమే ఉంటుంది. బయటకు వచ్చిన తరువాత ఆమె పాలు త్రాగి పెరుగుతుంది. ఆ తల్లిపాలను వేడి చేయనక్కరలేదు, పంచదార కలపనక్కర లేదు. ఆ తరువాత ఆటబొమ్మలను మరిగి తల్లికి దూరమవుతాడు. ఆకలి కాగానే ఆటబొమ్మలను అవలకు నెట్టి తల్లి చంకనెక్కుతాడు. ఇప్పుడు ఆ తల్లిపాలే కావాలి. ఆటబొమ్మలతో ఆకలి తీరదు.

అలాగే తనస్థితికి, గతికి ఆధారమైన పరమాత్మను మరచి, మనం ప్రాపంచిక వస్తువులపై మోహం పెంచుకుంటాం. భార్య అని, భర్త అని, బిడ్డలని, ఇళ్ళూవాకిళ్ళని, ధనమని, సొమ్ములని - ఈ ఆటబొమ్మలను చూసి మురిసిముప్పందు మౌతాం. కాని ఇవన్నీ తోలుబొమ్మలు. ఎప్పుడో ఒకప్పుడు దూరమయ్యేవి, దుఃఖాన్నిచ్చేవి. వీటిలో నిత్యసుఖం లేదు. నిరతిశయానందం

లేదు. తల తిరిగి నోటికి వచ్చినప్పుడు గాని 'నీవే తప్ప నితః పరం బెరుగ' నని భగవంతుని ఆశ్రయించం. కనుక ఇలా కష్టం వచ్చినప్పుడు గాక నిత్యము భగవంతుని ఉపాసించాలి.

విషయాధీనమైన మనస్సు భగవదాధీనం కావటమే ఉపాసన. అట్టి భక్తుడే శ్రేష్ఠుడని భగవంతుని తీర్మానం.

ఈ శ్లోకంలో సగుణ - నిర్గుణ అనే భేదాలను గురించి చెప్పకపోయినా ఇది సగుణోపాసనకు చెందినదే. వారికే ప్రధానంగా ఈ 3 జాగ్రత్తలు చెప్పాలి.
ఇక నిర్గుణ భక్తుని గురించి తరువాతి 2 శ్లోకాల్లో -
ముందుగా నిర్గుణ పరమాత్మ స్వరూపస్వభావాల గురించి - 3వ శ్లోకంలో -

**శ్లో||** యేత్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే|
సర్వత్ర గమచింత్యంచ కూటస్థమ చలం ధ్రువం || **(3)**

**తా||** ఎవరైతే అక్షరుడు, అనిర్దేశ్యుడు, ఇంద్రియ అగోచరుడు, సర్వవ్యాపి, చింతించనలవి గానివాడు, కూటస్థుడు, కదలిక లేనివాడు, స్థిరంగా ఉండేవాడు అయిన పరమాత్మను ఉపాసిస్తారో - - -

**వ్యాఖ్య:-** పరమాత్మ ఒక్కటే. అది సాకారసగుణంగా వ్యక్తంగానూ ఉన్నది; నిరాకార నిర్గుణంగా అవ్యక్తంగానూ ఉన్నది. సగుణోపాసన అయినా - నిర్గుణోపాసన అయినా అంతిమలక్ష్యం ఆ పరమాత్మను చేరుకొనుటే. నిర్మలమైన భక్తితోను, శ్రద్ధతోను నిరంతరము భగవంతుని యందే మనస్సు నిలిపి ఎలా ధ్యానించినా - ఎలా ఉపాసించినా ఆ పరమాత్మను చేరుకోవటం

తథ్యం. సగుణరూపాన్ని ఆరాధిస్తూ పరమాత్మను చేరుకోవాలంటే సాధకునిలో ఉండవలసిన 3 ముఖ్యలక్షణాలను భగవానుడు 2వ శ్లోకంలో వివరించాడు. ఇప్పుడు నిర్గుణరూప పరమాత్మను ఆరాధిస్తూ ఆయనను చేరుకోవాలంటే ఉండవలసిన ముఖ్యమైన 3 లక్షణాలను తెలియజేయబోతూ ముందుగా నిర్గుణ పరమాత్మ యొక్క స్వరూప స్వభావాలను 3వ శ్లోకంలో తెలియజేస్తున్నారు. ఏమిటవి? -

1. అక్షరం 2. అనిర్దేశ్యం 3. అవ్యక్తం 4. సర్వగం 5. అచింత్యం 6. కూటస్థం 7. అచలం 8. ధ్రువం

1. అక్షరం:- ఆక్షరం అంటే క్షరం లేనిది - నాశనం లేనిది. పరమాత్మ నాశనం లేనిది - దానికి పుట్టుక కూడా లేదు. పుట్టాలంటే నాశనం కావాలి. నాశనం కావాలంటే పుట్టాలి. పరమాత్మ 'అజం' పుట్టుకలేనిది; 'అక్షరం' నాశనం లేనిది. అంటే ఎప్పుడూ శాశ్వతంగా ఉండేది. ప్రపంచం వస్తూపోతూ ఉంటుంది. అలాగే ప్రాణులన్నీ వస్తూపోతూ ఉంటాయి. అయితే పరమాత్మ శాశ్వతం. మట్టి నుండి కుండ తయారవుతుంది. కుండ పగిలిపోతే మట్టి రూపంలోకి వచ్చేస్తుంది. అంటే మట్టి మాత్రం ఎప్పుడూ ఉండేది. సినిమా తెర శాశ్వతంగా అలా ఉండేది. దాని మీదకు బొమ్మలు మాత్రం వస్తూ పోతూ ఉంటాయి. అలాగే పరమాత్మ కూడా ఎప్పుడూ ఉండేది - నాశనం లేనిది. అక్షరం. ఈ అక్షర పరబ్రహ్మను అర్థం చేసుకోవటానికే ఈ శ్లోకంలోని విశేషణాలన్నీ. ఇవన్నీ శాస్త్రీయ విషయాలు. ఈ శాస్త్రీయ విషయాలను వినాలన్నా, తెలుసుకోవాలన్నా అంతఃకరణానికి తగిన సంస్కారం ఉండాలి. మాసినబట్టకు

రంగు పట్టదు. జ్వరం వచ్చిన వానికి రుచి తెలియదు. తుప్పుపట్టిన ఇనుమును అయస్కాంతం ఆకర్షించలేదు. కల్మషమైన మనస్సుకు వేదాంతబోధలు అర్థంకావు. కనుక వేదాంతాన్ని వినేముందు మనస్సులోని కల్మషాలను కడిగెయ్యాలి.

ఒకనికి అజీర్ణవ్యాధి. ఎన్ని మందులు వాడినా తగ్గటం లేదు. చివరికొక సన్యాసి ఉపశాంతి కోసం "ఉప్పు రాళ్ళు జేబులో వేసుకొని ఒకదాని తరువాత ఒకటిగా నోటిలో వేసుకొని ఆరసాన్ని త్రాగుతూ ఉండు ఉపశాంతి లభిస్తుంది" అన్నాడు. అలాగే చేస్తున్నాడు ఆరోగి. ఒకనాడు అతడు మిఠాయి కొందామని స్వీటుషాపు కెళ్ళాడు. శాంపిల్ గా మిఠాయి నోట్లో వేసుకున్నాడు. తీపిలేదు. ఉప్పగా ఉంది. 4, 5 షాపులు తిరిగాడు. అన్ని షాపులలోను మిఠాయి అలా ఉప్పగానే ఉంది. చివరికొక షాపు వాణ్ణి అడిగాడు. "ఏమయ్యా! ఇప్పుడు మిఠాయిలన్నీ బెల్లంతో, పంచదారతో కాకుండా ఉప్పుతో చేస్తున్నారా ఏమిటి?" అని. దానికా షాపువాడు "అయ్యా! శుభ్రంగా నోరు కడుక్కొని రా! అప్పుడు మిఠాయి అసలు రుచి తెలుస్తుంది" అన్నాడు.

నోట్లో ఉప్పుగల్లు పెట్టుకొని ఎంత తియ్యటి మిఠాయి తిన్నా ఉప్పగానే ఉంటుంది, రుచి తెలియదు. అలాగే వెనుకటి విషయవాసనలను అంతఃకరణంలో పెట్టుకొని ఎంత గొప్ప వేదాంతాన్ని విన్నా అర్థంకాదు. దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనే ఈషణ త్రయాలతో మరిగిపోతున్న అంతఃకరణంతో భగవద్గీతను సంజయుని ద్వారా విన్న ధృతరాష్ట్రుని గతి ఏమైంది? అంతే. వంటపట్టదు.

కనుక వేదాంత శ్రవణం చేసేటప్పుడు అంతఃకరణాన్ని శుద్ధిచేసుకొని; పూర్వవాసనలను క్షాళన చేసుకొని నిర్మలమైన అంతఃకరణంతో వినాలి. మనస్సులో ఏ అన్యవిషయాలకు తావివ్వకుండా చెప్పే విషయాలకు మాత్రమే చోటివ్వాలి. అప్పుడే పరమాత్మ యదార్థతత్త్వం తెలుస్తుంది.

ఈ పాడుమనస్సుకు రెండే రెండు అవస్థలు. (1) శూన్యావస్థ. అదే నిద్ర. (2) విక్షేపావస్థ. అదే చంచలస్థితి. ఈ రెండూకాక 3వది ఐన ఏకాగ్రావస్థ ఏ కొద్దిమంది పుణ్యాత్ములకో లభిస్తుంది. చెప్పే విషయం మీదనే దృష్టి ఉంటే దుర్భేద్యమైన వేదాంతం అర్థమవుతుంది.

పరమాత్మను వర్ణించటం, ఇలా ఉంటుందని తెలియజెప్పటం ఎవ్వరికీ సాధ్యంకాదు. అలా సాధ్యంకాని విషయాన్ని ఎన్నో విధాలుగా నూరిపోయాలి. రకరకాల కూరలు, పిండివంటలతో విందుభోజనాన్ని ఆరగించినట్లుగ రకరకాల దృష్టాంతాలతో - యుక్తులతో - అనుమాన ప్రమాణాలతో - అనుభూతులతో పరమాత్మను ఆకళించుకోవాలి. అప్పుడే అక్షరపరమాత్మ అవగతమయ్యేది. పరమాత్మ అక్షరుడే కాదు.

2. <u>అనిర్దేశ్యం</u>:- ఎదురుగా ఉన్న వస్తువును దాని రూపాన్ని గాని, లక్షణాలను గాని, గుణాలను గాని, కొలతలను గాని వర్ణించి ఇదిగో ఇలాంటిది అని నిర్దేశించి చెప్పవచ్చు. కాని నిరాకారమై, నిర్గుణమై, సూక్ష్మాతిసూక్ష్మమైన పరమాత్మను ఎలా నిర్దేశించి చెప్పాలి? నిర్దేశించి చెప్ప వీలులేనిది గనుకనే అది అనిర్దేశ్యం అన్నారు. పరమాత్మ అప్రమేయం. అంటే సాటిలేనిది. ప్రత్యక్షప్రమాణానికి అందుబాటయ్యేది ప్రమేయ వస్తువు. అందుబాటు కానిది

పరమాత్మ. పరమాత్మను ఇంద్రియాలు పట్టుకోలేవు. మనస్సు ఊహించలేదు. అందుకే అన్నింటిని తెలుసుకోగల వాడిని ఎవరు తెలుసుకోగలుగుతారు? అన్నాడు యాజ్ఞవల్క్యమహర్షి. అంటే అనుభవంతో తెలుసుకోవాల్సిందే. లోకంలో వర్ణించి చెప్పటానికి వీలులేని అనుభవాలు కొన్ని ఉంటాయి.

ఒక టీచరు బెత్తంతో విద్యార్థిని గొడ్డును బాదినట్లు బాదాడు. వాడు లబోదిబోమని ఏడుస్తున్నాడు. కొద్దిసేపటి తర్వాత టీచరు ఆ విద్యార్థితో "ఏరా! ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నాడు, "మీరు కొట్టారుగదా! ఆ నొప్పికి ఏడుస్తున్నానన్నాడు. ఎంత నొప్పిగా ఉంది? అన్నాడు టీచరు. 'చాలా నొప్పిగా' అన్నాడు విద్యార్థి. చాలా అంటే ఎంత? అని టీచరు అనగానే ఆ బెత్తం నాకివ్వండి. ఎంతో తెలుస్తుంది - అన్నాడు విద్యార్థి. అలాగే పరమాత్మను మాటలతో వర్ణించటం సాధ్యంకాదు. అది అనుభవైక వేద్యం.

3. <u>అవ్యక్తం:-</u> దేనిని గురించైనా మనం ఒక అభిప్రాయాన్ని వ్యక్తం చెయ్యాలంటే అది కనిపించాలి. వ్యక్తం కావాలి. మరి పరమాత్మ కనిపించేవాడు కాదు. అసలు కంటికి కనిపించటమే కాదు. ఏ ఇంద్రియాలకు గోచరించనివాడు. ఎందుకంటే సూక్ష్మాతి సూక్ష్మం గనుక. సూక్ష్మమైన వాయువు చర్మానికి తెలుస్తుంది. ఆకాశం శబ్దగుణం గనుక చెవికి గోచరం. కాని పరమాత్మ ఏ ఇంద్రియాలకు అందడు. అందుకే ఇంద్రియ అగోచరుడు. ఏదైనా ఒక వస్తువును 'ఫలానా అని నిశ్చయించటానికి జాతి, గుణం, క్రియ, సంబంధం అనే 4 లక్షణాలతో నిర్ణయించవచ్చు. ఈ నాలుగు లేని పరమాత్మను ఎలా నిశ్చయించి చెప్పటం? అయితే శాస్త్రాలలో

పరమాత్మను వర్ణించి చెప్పటానికి ఒక ఉపాయాన్ని చెప్పారు. అదే "అతత్ వ్యావృత్తి" లక్షణం. ఏమిటది?

తత్ అంటే అది. అంటే పరమాత్మ. అతత్ అంటే అదికానిది - అంటే పరమాత్మ కానిది - అదే అనాత్మ. ఈ అతత్ రూప వస్తువులను - అనాత్మ వస్తువులను - మిథ్యావస్తువులను ఒక్కొక్క దానిని త్రోసి పుచ్చుతూ నేతి - నేతి (న ఇతి - న ఇతి = ఇదికాదు, ఇదికాదు) అంటూ అన్నింటిని త్రోసివేయగా మిగిలేదేదో అదే పరమాత్మ. అవ్యక్త పరమాత్మను అలా వ్యక్తం చేయాల్సిందే. అలా తెలుసుకోవాల్సిందే.

సీతాదేవి అరణ్యవాస కాలంలో అత్రిమహర్షి ఆశ్రమానికి వచ్చినప్పుడు ఋషి పత్నులంతా సీతాదేవితో "అమ్మా! నీ భర్త ఎవరు?" అని అడిగితే భర్తను వ్రేలు పెట్టి చూపటం ఆనాడు తప్పు గనుక మౌనంగా ఉన్నది. అప్పుడు వారిలో ఒకరు అమ్మా! ఆయనేనా నీ భర్త? అని ఒకరిని చూపింది. కాదు అని తల ఊపింది. ఇలా ఒక్కొక్కరుగా అందరినీ చూపి అడుగుతుంటే కాదు - కాదు అని తల ఊపింది. చివరకు ఒక్కరే మిగిలారు. అప్పుడు వారు అర్థం చేసుకున్నారు అతడే సీత భర్త రాముడు - అని. అంటే రాముడు కాని వారందరిని నేతి - నేతి అని తీసివేస్తే ఇక మిగిలిన ఒకే ఒక్కడు రాముడని తెలిసిపోయింది. అలాగే ఆత్మవస్తువు అవ్యక్తం. అనాత్మవస్తువులు వ్యక్తం. ఆత్మవస్తువు అనాత్మవస్తువులతో కలిసి ఉన్నది. కనుక అనాత్మవస్తువులను నేతి - నేతి అంటూ అన్నింటిని త్రోసివేస్తే ఇక మిగిలేది ఆత్మవస్తువేనని తెలిసిపోతుంది.

అవ్యక్త పరమాత్మను తెలుసుకొనే ఉపాయాన్ని కేనోపనిషత్ ఇలా తెలియజేసింది.

"యత్ చక్షుషానపష్యతి యేన చక్షూం షి పశ్యతి|

తదేవ బ్రహ్మాత్వం విద్ధి నేదం యదిదముపాసతే ||"

- దేనిని కన్ను చూడలేదో - కంటికి చూచే శక్తినిచ్చేది ఏదో -
- దేనిని మనస్సు భావించలేదో - మనస్సుకు భావించే శక్తినిచ్చేది ఏదో -
- దేనిని బుద్ధి తెలుసుకోలేదో - బుద్ధికి తెలుసుకొనే శక్తినిచ్చేది ఏదో -

అదే పరమాత్మ. ఇక్కడ నీవు 'ఇది' అని ఉపాశించేది ఏదీ పరమాత్మ కాదు - అని.

బుద్ధి జడమైనదే అయినా అనాత్మవస్తువులను కాదు - కాదు అని నిషేధించటం ద్వారా ఆత్మను తెలుసుకొనేందుకు సాధనం బుద్ధియే. లక్షల రూపాయల విలువచేసే బంగారానికి ధర నిర్ణయించాలంటే 10/- విలువ చేసే రాతిముక్క గీటురాయిగా పనికి వస్తుంది. అలాగే సచ్చిదానంద పరమాత్మను తెలుసుకోవాలంటే భౌతికము, జడమూ అయిన శుద్ధ బుద్ధియే పనికివస్తుంది. అందుకే భగవద్గీత 6వ అధ్యాయంలో "బుద్ధి గ్రాహ్య మతీంద్రియం" అన్నారు. ఏ బుద్ధికి గ్రాహ్యం? నిర్మలమైన బుద్ధికే గ్రాహ్యం (తెలియబడుతుంది).

పరమాత్మ దృశ్యవస్తువు కాదు. కనుకనే అనిర్దేశ్యం అన్నారు. అన్ని ఇంద్రియాలు అక్కడ పనిచేయవు. మన ఇంద్రియాలు ఇక్కడి విషయాలను పట్టుకుంటాయి గాని తమకు అధిష్టానమై, అవ్యక్తమైయున్న పరమాత్మను పట్టుకోలేవు. పోలీసుకానిస్టేబుల్ లేదా ఇన్ స్పెక్టరు దొంగను పట్టుకోగలడు

గాని తనపై అధికారియైన మేజిస్ట్రేట్ ను పట్టుకోలేడు గదా! మరి ఇంద్రియాలేవీ ఆత్మను పట్టుకోలేకపోతే - ఆత్మసాక్షాత్కారం ఎలా సాధ్యమవుతుంది? దానికి ఒక్కటే మార్గం. నీ అంతఃకరణంలోని దోషాలను తొలగించుకుంటే సరి. నిర్మలమైన అంతఃకరణంలోనే ఆత్మస్వరూపం ప్రతిబింబిస్తుంది. అద్దం మీది మసిని తొలగిస్తే చాలు మన ప్రతిబింబం చక్కగా కనిపిస్తుంది.

అంతఃకరణం(బుద్ధి) ఎలా శుద్ధమౌతుంది? ఎలా నిర్మలమవుతుంది? అంతఃకరణంలోని కోరికలు, భోగాసక్తి, విషయాసక్తి, అహంకార మమకారాలు, రాగద్వేషాలు, కామక్రోధాలు - అన్నీ మటుమాయమై పోవాలి. అప్పుడే ఆత్మప్రకాశం. ఆత్మ ప్రతిబింబించేది. నిర్మల అంతఃకరణంలో ఆత్మ తప్ప మరేమీ కనిపించదు.

ద్వారకానగరంలో ఒక గొప్ప చిత్రకారుడున్నాడు. మనిషిని ఒక్కసారి అలా చూస్తే చాలు అచ్చం అలాగే చిత్రం గీస్తాడు. చిత్రలేఖనంలో అతడు అందెవేసిన చెయ్యి. అతని కీర్తి నలుదిక్కులా వ్యాపించింది. దీనితో అతడిలో అహంభావం పెరిగింది. విదేశాలకు కూడా వెళ్ళి ప్రశంసాపత్రాలు తెచ్చుకున్నాడు . అతడికి ఇంకా కీర్తికాంక్ష పెరిగింది. స్వయంగా శ్రీకృష్ణుని వద్ద నుండి ప్రశంసాపత్రాన్ని పొందాలనుకున్నాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు సభ తీర్చిఉండగా వెళ్ళాడు. సరాసరి కృష్ణుని వద్దకు వెళ్ళి నమస్కరించాడు.

శ్రీకృష్ణుడు : ఎవరయ్యా నీవు?

చిత్రకారుడు : నేను గొప్ప చిత్రకారుణ్ణి స్వామీ! ఇవిగో నా సర్టిఫికెట్లు.

శ్రీకృష్ణుడు : చాలా గొప్పవాడివే. అయితే ఏమిటి విశేషం?

చిత్రకారుడు : స్వామీ మీ చిత్రం గీస్తాను. నాకు మీరు సర్టిఫికెట్ ఇవ్వాలి.

శ్రీకృష్ణుడు : సరే! ఎన్నాళ్ళకు గీసుకొస్తావు?

చిత్రకారుడు : సరిగ్గా వచ్చేవారం ఇదే రోజుకు తీసుకొని వస్తాను.

శ్రీకృష్ణుడు : సరే! అలాగే గీసుకురా. వెళ్ళు.

చిత్రకారుడు శ్రీకృష్ణుడు ఆసనంపై కూర్చొన్న విధానాన్ని ఆపాద మస్తకం జాగ్రత్తగా పరికించి చూచి నేరుగా ఇంటికి వెళ్ళాడు. ఎలాగైనా సరే ఈ పందెంలో గెలిస్తే ఇక తనకు తిరుగుండదు అనుకొని, రా త్రింబవళ్ళు కష్టపడి తదేక దీక్షతో - ఏకాగ్రతతో శ్రీకృష్ణుని చిత్రపఠాన్ని తయారుచేశాడు. ఆరోజే వాయిదా. శ్రీకృష్ణుని వద్దకు తాను గీసిన చిత్రపఠంతో వెళ్ళాడు.

శ్రీకృష్ణుడు: ఏమయ్యా! చిత్రపఠాన్ని తెచ్చావా? ఏదీ చూపించు.

చిత్రకారుడు పఠాన్ని తీశాడు. పఠంవైపూ శ్రీకృష్ణుని వైపూ పదేపదే మార్చిమార్చి చూచాడు. అదేమిటో గాని పఠంలోని కృష్ణునికి, ఆసనం పైనున్న కృష్ణునికి కొంత తేడా కనిపించింది. దానితో ఆ పఠాన్ని ఆయనకు చూపకుండానే, "దేవా! ఏదో కొంచెం పొరపాటు జరిగింది. ఈసారి వారానికి చక్కగా తయారుచేసుకొని తీసుకొని వస్తాను - అని వెళ్ళిపోయాడు. మళ్ళీవారం కూడా అంతే. ఇలా అనేక వారాలు గడచినవి, ప్రతిసారీ ఇదే వరుస.

చిత్రకారుడు ఎన్నిసార్లు వాయిదా కోరి వెళ్ళి మళ్ళీ మళ్ళీ వ్రాసుకొని వచ్చినా శ్రీకృష్ణుడు మారి కూర్చుంటున్నాడు. చిత్రకారుడికి శృంగభంగమైంది. నెత్తిమీద కెక్కిన కళ్ళు క్రిందికి దిగాయి. చిత్రం గీయకపోతే పరువు పోతుంది. గీస్తే తేడా వస్తున్నది . ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లుంది పరిస్థితి.

ఎలాగో ముఖం చాటువేసి తప్పించుకొని వచ్చాడు. మార్గమధ్యంలో నారదుడు ఎదురయ్యాడు. సంగతేమిటని అడిగి విషయమంతా తెలుసుకున్నాడు. "పిచ్చివాడా! నీ తెలివి తెల్లారినట్లే ఉంది. భగవంతుని స్వరూపాన్ని చిత్రిద్దామనుకున్నావా? అది నీ తరమయ్యేపనేనా? భూమ్యాకాశాలు పట్టక 10 అంగుళాలు పైగా మిగిలినవాడు (అత్య తిష్టత్ దశాంగుళం). మూరెడు చట్రంలో బిగించాలనుకున్నావా? అదికాదు పద్ధతి. నీకో ప్లాన్ చెబుతాను. అలా చెయ్యి సరిపోతుంది - అన్నాడు నారదుడు.

నారదుని ద్వారా గురూపదేశం పొందిన చిత్రకారుడు తిన్నగా ఇంటికి వెళ్ళి, సర్వసన్నద్ధుడై కృష్ణుని సభకు వచ్చాడు. శ్రీకృష్ణునికి నమస్కరించి నిలబడ్డాడు. ఏదీ! ఫోటో చూస్తానని కృష్ణుడు చేయి చాపాడు. వెంటనే పై ముసుగును తొలగించి, పటాన్ని కృష్ణుని చేతికి అందించాడు. అది పటం కాదు. నిర్మలమైన అద్దం. కృష్ణుడు చకితుడయ్యాడు. చిత్రకారుడు ఏమీ ఎరగనట్లుగా ఉండిపోయాడు. కృష్ణుని ప్రక్కనే ఆసనంపై కూర్చున్న నారదుడు" చూసుకోండి. ఒక అవతారం కాదు. వెయ్యి అవతారాలెత్తి బాగా చూసుకోండి. బొమ్మ మీలాగే ఉందా? లేదా? అంటూ నవ్వాడు. కనుక బుద్ధిని అద్దంలాగా ఉంచితే భగవత్ స్వరూపాన్ని గ్రహిస్తుంది.

పరమాత్మ అవ్యక్తం కదా! ఇంద్రియాలకు గోచరించడు గదా! మనస్సుతో భావించే వీలులేదు గదా! అని దిగులు పడనక్కరలేదు. బుద్ధిని శుద్ధం చేసుకుంటే సరి. అవ్యక్తంలోని పరమాత్మ బుద్ధిలో సాక్షాత్కరించటం తథ్యం. కనుక బుద్ధిని నిర్మలమైన అద్దంలా తయారుచేయాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

4. సర్వత్రగం:- పరమాత్మ సర్వత్రా ఉండేవాడు. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మం గనుక సర్వవ్యాపకం. ప్రపంచంలోని అన్ని వస్తువులకు త్రివిధపరిచ్ఛేదం ఉంటుంది. అవే దేశ - కాల - వస్తుపరిచ్ఛేదం. ఈ ప్రదేశంలో ఉన్న వస్తువు మరొక ప్రదేశంలో ఉండదు. ఈ కాలంలో ఉన్న వస్తువు మరొక కాలంలో ఉండదు. ఇప్పుడిలా ఉన్న వస్తువు ఇలాగే ఉండిపోదు. మారిపోతుంది. అయితే పరమాత్మకు ఈ త్రివిధపరిచ్ఛేదం లేదు. పరమాత్మలేని ప్రదేశం లేదు. సర్వత్రా పరమాత్మ ఉన్నది. అన్నికాలాలలో పరమాత్మ ఉన్నది. ఎప్పుడూ ఏ మార్పులు లేకుండా ఒక్కటిగా, వికారరహితంగా పరమాత్మ ఉంటుంది. కనుక త్రివిధపరిచ్ఛేదం లేదు.

పరమాత్మ సర్వవ్యాపి అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి. "ఇందుగల డందు లేడను సందేహము వలదు, చక్రిసర్వోపగతుండెందెందు వెదకి చూచిన అందందే గలడు దానవాగ్రణి వింటే" - అని ప్రహ్లాదుడు తన తండ్రి హిరణ్యకశిపునకు చెప్పిన తన నిశ్చయం కూడా ఇదే. పరమాత్మ సర్వవ్యాపకుడు - అనియే. కనుక భాగవతం కూడా ఈ విషయాన్ని తెలియజేస్తున్నది.

అంతటా ఉండేవాడు పరమాత్మ. అంతటా ఉండేవాణ్ణి మోసం చేయటం ఎవరి తరమూ కాదు. జిత్తులమారి నక్క భూదేవిని మోసం చేద్దామనుకుంది. ఒక పైసా అప్పు తీసుకొని రాత్రికి రాత్రే 40 మైళ్ళు పరుగుతీసింది. పాపం అక్కడా భూమి అడిగింది - నా బాకీ సంగతేమిటి? అని. కనుక అంతటా ఉన్నదాన్ని మోసం చెయ్యలేరు.

- కార్యవస్తువులు అంతటా వ్యాపించి ఉండలేవు.
- కారణమైన పరమాత్మ సర్వవ్యాపి

5. అచింత్యం:- పరమాత్మను అలాంటిది, ఇలాంటిది అని చింతించే వీలులేదు. దేనినైనా చింతించేది మనస్సు. ఆ మనస్సేమో జడం. కనుక స్వతహాగా మనస్సుకు దేనినీ చింతించే అవకాశంలేదు. అయితే పరమాత్మ చైతన్యం కారణంగా మనస్సు చైతన్యవంతమై అన్నింటినీ చింతించగలుగుతుంది. అన్నింటినీ చింతించ గలుగుతుంది గాని, తనకు చైతన్యాన్ని ప్రసాదించిన పరమాత్మను మాత్రం చింతించలేదు. బ్యాటరీ లైటులోని బల్బు స్వతహాగా వెలిగి దేనినీ చూపలేదు. అయితే అందులోని సెల్సు వల్ల బల్బు చైతన్యవంతమై అన్నింటిని చూపగలుగుతుంది. అయితే తనకు శక్తినిస్తున్న సెల్సును చూడాలంటే మాత్రం కుదిరేపని కాదు. ఈ విషయాన్ని కేనోపనిషత్తు కూడా తెలియజేసింది.

"దేనిని మనస్సు చింతించలేదో, దేనివల్ల మనస్సు అన్నింటిని చింతించగలుగుతుందో అదే బ్రహ్మము - పరమాత్మ" - అని.

పరమాత్మను మనస్సు చింతించలేదు గనుక 'అచింత్యం' అన్నారు.

6. కూటస్థం:- కూటం అంటే కంసాలి ఉపయోగించే 'దాగలి'. ఒక పెద్దకొయ్య, దానికి మధ్య ఒక ఇనుపదిమ్మె అమర్చి ఉంటుంది. అది స్థిరంగా కదలకుండా ఉంటుంది. దానిపైన కంసాలి ఎన్నో వస్తువులను తయారుచేస్తాడు ఆదిమ్మె మీద బంగారపు రేకును అనేక ఆకారాలలోకి మారుస్తాడు. తీగచుడతాడు. వంపులు తిప్పుతాడు. పలుచని రేకులుగా చేస్తాడు. వస్తువు ఎన్ని రూపాలుగా

మారినా ఆ కూటం మాత్రం మారదు. అలాగే ఉండిపోతుంది. అదేవిధంగా పరమాత్మ మార్పులు చెందే ఈ ప్రపంచానికి ఆధారంగా ఉండి, తానుమాత్రం ఏ మార్పులు లేకుండా స్థిరంగా ఉంటాడు. అందుకే పరమాత్మను కూటస్థుడు అన్నారు. ఆయన ఆధారంగా ఈ ప్రపంచం నిరంతరం మార్పులు చెందుతూ ఉంటుంది.

సినిమా తెరమీద ఎన్నో కథలు, విశేషాలు జరుగుతూ ఉంటాయి. అయినా తెరమాత్రం ఏ మార్పులు లేకుండా ఒక్కటిగా అలాగే ఉండిపోతుంది. సినిమా కథలో ఎంత వర్షం కురిసినా తెరతడవదు. ఎన్ని అగ్నిపర్వతాలు ప్రేలినా తెర తగలబడదు. ఎన్ని బాణాలు వదిలినా తెర చినిగిపోదు. ఆ తెర ఈ కథతో అంటకుండా, కథ జరగటానికి ఆధారంగా ఉంటుంది. అది మాత్రం ఏమార్పులు లేకుండా ఉంటుంది. అలాగే మార్పులతో కూడిన ఈ ప్రపంచానికి ఆధారంగా ఏమార్పులు లేకుండా పరమాత్మ కూటస్థునిలా స్థిరంగా ఉంటాడు. అందుకే 'కూటస్థం' అన్నారు.

7. <u>అచలం:-</u> అచలం అంటే చలనం లేనిది అని. సాధారణంగా పర్వతాలన్నీ కదలకుండా ఉంటాయి. అందుకే సింహాచలం, అరుణాచలం, హిమాచలం, శేషాచలం అని ఆయా పర్వతాలను పిలుస్తారు. ఈ జగత్తంతా కదులుతూ ఉంటుంది. కదులుతూ ఉండే ఈ జగత్తుకు ఆధారం కదలకుండా ఉండే పరమాత్మే. ఇక్కడ మనుషులు, జంతువులు, బస్సులు, రిక్షాలు కదులుతున్నాయంటే వాటికి ఆధారంగా కదలకుండా ఉండే భూమి ఉండటం వల్లనే. అసలు పరమాత్మ ఎలా కదులుతాడు? ఆయనలేని చోటు లేదు.గదా!

ఆయన అంతటా ఉన్నాడు గదా! కనుక కదలటానికి వీలులేదు. శరీరాలు ఎక్కడికైనా కదలవచ్చు. కాని ఆత్మ కదిలేది గాదు, అచలం.

8. ధ్రువం:- ధ్రువం అంటే నిర్వికారం అని ఒక అర్థం. మార్పులేనిది, నిత్యమైనది, త్రిగుణాలలో ఉండేది అని మరొక అర్థం.

జగత్తుకుగాని, జీవుడికిగాని 6 వికారాలున్నాయి. పుట్టటం, ఉండటం, పెరగటం, మార్పుచెందటం, కృశించటం, నశించటం - అని 6 వికారాలు. అయితే ఈ జగత్తుకు గాని, జీవుడికి గాని ఆధారమైన పరమాత్మ ఏవికారాలు లేనివాడు. ఆయన నిర్వికారుడు. కనుక ధ్రువం.

ఇక ధృవం అంటే మార్పులేనిది - పరమాత్మ ఏమార్పులూ లేనివాడు. ధృవం అంటే నిత్యమైనది - పరమాత్మ నిత్యుడు, శాశ్వతుడు. ఆయనకు జననమరణాలు లేవు. ధృవం అంటే త్రికాలాలలో ఉండేది. త్రికాలాలలో ఉండేది పరమాత్మ ఒక్కటే. అసలు పరమాత్మ కాలాతీతుడు.

ఈ పదాలన్నీ ఉపనిషత్తుల నుండి ఎరువు తెచ్చుకొన్నవే. ఇలా నిరాకార నిర్గుణ పరమాత్మకు ఇక్కడ 8 విశేషణాలను చెప్పారు. ఈ లక్షణాలను అనుసంధానం చేస్తూ, ఎవరైతే ఆ పరమాత్మను ఉపాసిస్తారో వారికి కలిగే ప్రయోజనం ఏమిటో 4వ శ్లోకంలో తెలియజేశారు. అంతేకాదు ఆ ఉపాసన చేసేవారు తీసుకోవలసిన 3 ముఖ్యమైన జాగ్రత్తలను కూడా తెలియజేశారు. ఈ జాగ్రత్తలను తీసుకుంటూ నిర్గుణ పరమాత్మను ఉపాసన చేసేవారు తప్పక ఆత్మస్వరూపాన్ని అందుకోగలుగుతారు. చుట్టూ ఉన్న అజ్ఞానపు తెర తొలగిపోతుంది. కర్మరాశి అంతా దగ్ధమౌతుంది - చివరకు ఆత్మ


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దర్శనమౌతుంది.

ఈ నిర్గుణోపాసన చక్కగా సాగి దానికారణంగా పొందవలసిన ప్రయోజనాన్ని పొందాలంటే తీసుకోవలసిన 3 జాగ్రత్తలను, పొందే ఫలితాన్ని 4వ శ్లోకంలో చెప్పబోతున్నారు.

**శ్లో||** సంనియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః|
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః|| **(4)**

**తా||** అన్ని ఇంద్రియాలను నిగ్రహించి, అంతటా సమబుద్ధితో వ్యవహరిస్తూ, సమస్త ప్రాణుల యొక్క శ్రేయస్సునందు ఆసక్తి గలవారై ఎవరు నన్ను ఉపాసిస్తారో వారు నన్నే పొందుతారు.

**వ్యాఖ్య:-** ఇంతకుముందు 2వ శ్లోకంలో చెప్పిన 3 జాగ్రత్తలను ఉపాసకుల కందరికీ అవసరమే అయినా నిర్గుణోపాసకులకు ప్రత్యేకంగా 3జాగ్రత్తలను ఈ శ్లోకంలో భగవానుడు తెలియజేస్తున్నాడు. ఎలాంటి జాగ్రత్తలు తీసుకోకుండా చేసే పనులు వ్యర్థమైపోతాయి. కళాయిలేని పాత్రలో వండిన పులుసు చిలుమెక్కి విషపూరితం అవుతుంది. దానిని పారబొయ్యవలసిందే. అలాగే హృదయనైర్మల్యం లేకుండా, ఇంద్రియనిగ్రహం లేకుండా భగవంతుని ఎలా ఉపాసించినా - సాకారంగానైనా, నిరాకారంగానైనా ఎలా అర్చించినా ఫలితం కలగదు. అందుకే నిర్గుణోపాసకులు ముఖ్యంగా తీసుకోవలసిన జాగ్రత్తలు మూడింటిని భగవానుడు ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు. ఏమిటవి?

1. సంనియమ్యేంద్రియ గ్రామం = అన్ని ఇంద్రియాలను గ్రహించుట.

**2. సర్వత్ర సమబుద్ధయః = అన్నివేళలా, అందరిపట్ల సమబుద్ధి.**

**3. సర్వభూత హితే రతాః = సమస్త ప్రాణులకు మేలు కలిగించుట యందు ఆసక్తి.**

**ఈ 3 జాగ్రత్తల గురించి వివరంగా తెలుసుకుందాం.**

**1. సంనియమ్యేంద్రియ గ్రామం:- ఇంద్రియగ్రామం సంనియమ్య. అంటే ఇంద్రియ సమూహాన్ని = అన్ని ఇంద్రియాలను లెస్సగ నిగ్రహించుట. నిరాకార నిర్గుణ పరమాత్మను ధ్యానించాలన్నా, ఉపాసన చేయాలన్నా ఇంద్రియాలన్నింటిని చక్కగా నిగ్రహించాలి. ఏదో ఒక ఇంద్రియాన్ని గాక అన్నింటిని పూర్తిగా నిగ్రహించాలి.**

**బయటి ప్రపంచంలో ఎన్నో విషయవస్తువులు, ఎన్నో ప్రలోభాలు ఉన్నాయి. అవి మనలో ప్రవేశించి తుఫానులు రేపటానికి ముఖ్యద్వారాలు మన ఇంద్రియాలే. అవే కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక. వీటిని మన అధీనంలో ఉంచక అవి చెప్పినట్లు మనం విన్నామా మనను అవి అల్లకల్లోలం చేస్తాయి. మన జీవశక్తిని వ్యర్థం చేస్తాయి. అందుకే వీటిని మన చెప్పుచేతల్లో ఉంచుకోవాలి. వాటికి బానిసలం కాకుండా యజమానులం కావాలి.**

**ఇంద్రియాలు గుర్రాల వంటివి. వాటిని స్వేచ్ఛగా వదిలితే అవి ఎటుపడితే అటు మనను పరుగెత్తించి ఎక్కడో మనను పడవేస్తాయి. బండిని గోతిలో పడవేస్తాయి. అలాగాక వాటిని మన చెప్పుచేతల్లో ఉంచుకున్నామా ప్రయాణం సాఫీగా సాగుతుంది. చేరవలసిన చోటికి చేరతాం. కనుక ఇంద్రియాలను నిగ్రహించాలి. అంటే వాటిని ప్రపంచం మీదకు వదలకుండా**

అంతర్ముఖం చేయాలి. లోపలకు త్రిప్పాలి. ఆత్మవైపుకు త్రిప్పాలి. అప్పుడే ఆత్మజ్ఞానాన్ని పొందటానికి తగిన అర్హత లభిస్తుంది. మనకు కావలసింది పుస్తకజ్ఞానం కాదు, మస్తకజ్ఞానం. బయట నుండి లోపలకు కూరేదిగాక, లోపలనుండి బయటకు ఊరేది కావాలి.

మన ఇంద్రియాలకు 3 అవస్థలున్నాయి. అవి -

1. ప్రపంచంలో తిరుగాడటం.

2. నిద్రపోవటం.

3. భగవంతుని వైపుకు తిరగటం.

మొదటి రెండూ అందరికీ సాధారణమే. ఐతే 3వదే కష్టమైనది. తీవ్రంగా ప్రయత్నించవలసింది. భగవంతుని కొరకు, భగవత్పరమైన కర్మలు చేసేవారు ఆ ఉత్తమస్థితిని - ఇంద్రియ నిగ్రహాన్ని సాధించగలుగుతారు.

TVలో వచ్చే ప్రోగ్రాములను చూడాలనుకున్న మీ కళ్ళను నిగ్రహించి, ఎందుకూ పనికిరాని విషయాలను, లోకాభిరామాయణాన్ని వినాలనుకొనే మీ చెవులను నిగ్రహించి ప్రతిరోజూ ఇలా గంటల తరబడి కూర్చొని ఈ గీతాప్రవచనాలను మీరు వినగలుగుతున్నారంటే మీ కళ్ళను చెవులను ఈ కొద్దిసేపైనా నిగ్రహించినట్లే. నోటికి - చేతికి తెంపు లేకుండా ఏదో ఒకటి నోట్లోకి విసిరే చేతులను, తినే నోటిని కూడా నిగ్రహించినట్లే. ఇలా ఆయా ఇంద్రియాలను, ఆయా విషయాలలో తిరగకుండా నిగ్రహించి,

గీతాశ్లోకాలను కంటితో చూస్తూ, వాక్కుతో పలుకుతూ,

గీతాప్రవచనాలను చెవులతో వింటూ,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గీతాశాస్త్రాన్ని చేతులతో పట్టుకుంటూ,

భగవత్ సంబంధమైన పనులను చేతుతో - ఇంద్రియాలతో చేస్తూ, ఇలా నిత్యము అభ్యాసం చేస్తూ ఇంద్రియాలను పూర్తిగా అధీనంలో ఉంచుకోగలిగితే నిర్గుణోపాసన చేయటం సులభమవుతుంది. ఇంద్రియనిగ్రహం లేనివానికి నిర్గుణోపాసన సాధ్యం కాదు. ధ్యానం కుదరదు. ఇంద్రియాలు బయటకు లాగుతుంటే మనస్సు నిరాకార పరమాత్మపై నిలువలేదు. కనుక ఇంద్రియాలను నిగ్రహించాలి. ఇక్కడ 'నియమ్య అనక సంనియమ్య' అన్నారు. అంటే మాములుగా నిగ్రహిస్తే చాలదు. లెస్సగా నిగ్రహించాలి. బాగుగా నిగ్రహించాలి. నేను ఇంద్రియాలను నిగ్రహించాను. కనుక హాయిగా గుండెల మీద చేయివేసుకొని ఉండవచ్చు అని ఎవ్వరూ భరోసాతో ఉండకూడదు. ఎందుకంటే -

విశ్వామిత్రుని వంటి పట్టుదల కలిగిన తపశ్శాలి కూడా ఇంద్రియాలకు లొంగిపోయి తన తపశ్శక్తిని వృధా చేసుకున్నాడు. విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సు యొక్క అగ్నిజ్వాలలు స్వర్గాన్ని తాకినవి. దానితో దేవేంద్రుడు భయపడిపోయి అప్సరసలలో శ్రేష్ఠురాలైన మేనకను పంపించాడు. ఆమె తన అభినయంతో, నాట్యంతో, సౌందర్యంతో విశ్వామిత్రుని తపస్సు నుండి మరలించింది. విశ్వామిత్రుడు కామానికి లొంగిపోయాడు. అతడి ఇంద్రియాలు అతణ్ణి దాసునిగా చేసుకున్నాయి. దానితో అతడు మేనక పొందుకోసం తహతహ లాడిపోయాడు. వారి కలయికతో శకుంతల జన్మించింది. ఆ తరువాత తన తప్పును

తెలుసుకున్నాడు. తన తపస్సు భగ్నమైనందుకు పశ్చాత్తాపం చెంది తిరిగి ఘోరమైన తపస్సు చేశాడు. ఇక ఎన్నటికీ కామానికి లొంగి కామదాసుడు కాకూడదని నిశ్చయించుకున్నాడు.

తిరిగి విశ్వామిత్రుని తపోగ్నిజ్వాలలు స్వర్గాదిలోకాలను తాకినవి. దానితో దేవేంద్రుడు ఈ సారి రంభను పంపించాడు. ఆమె విశ్వామిత్రుణ్ణి తనవైపుకు ఆకర్షించాలని విశ్వప్రయత్నం చేసింది. కాని విశ్వామిత్రుడు ఎంతో పట్టుదలతో నిగ్రహంతో ఉన్నాడు. అయినా సరే రంభ వదిలిపెట్టలేదు. తన ప్రయత్నం తాను చేస్తూనే ఉన్నది. చివరకు విశ్వామిత్రుడు తీవ్రమైన కోపంతో కళ్ళు తెరచి రంభను బండరాయివై పోదువుగాక అని శపించాడు. అప్పుడు కామానికి లొంగి తపస్సును భగ్నం చేసుకున్నాడు. ఇప్పుడు క్రోధానికి లొంగి తపస్సును భగ్నం చేసుకున్నాడు. మొత్తం మీద ఇంద్రియాలకు లొంగిపోవటం జరిగింది. అంతటి విశ్వామిత్రుడే ఇంద్రియాలకు లొంగిపోతే మనలాంటి సామాన్యుల పరిస్థితి ఏమిటి? కనుక ఇంద్రియనిగ్రహాన్ని లెస్సగా సాధించాలి. అట్టి ఇంద్రియనిగ్రహపరుడే నిర్గుణోపాసనకు అర్హుడు. నిర్గుణోపాసన అనేది కత్తి మీద సాములాంటిది. మనస్సు ఏమాత్రం చలించినా పతనం తప్పదు. అందుకే మొదటి జాగ్రత్తగా ఇంద్రియనిగ్రహాన్ని గురించి చెప్పటం జరిగింది.

2. సర్వత్ర సమబుద్ధయః:- అందరిపట్ల, అన్ని ప్రాణుల పట్ల, అన్ని వేళలా సమబుద్ధి కలిగిఉండాలి. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనిగాని, ఒకరిపై రాగం ఒకరిపై ద్వేషంగాని ఉండరాదు. కన్ను, చెవి, కాలు, చెయ్యి వీటన్నింటిని మనం

ఒక్క విధంగానే చూస్తున్నమా? ఆ! చూస్తున్నాం. అన్నింటిని సమంగానే చూస్తున్నాం. అలాగని అన్నీ ఒకే పని చేస్తున్నాయా? లేదు. దేనిపని దానిదే. కన్ను చూస్తుంది, చెవి వింటుంది, కాలు నడుస్తుంది, చేయి పట్టుకుంటుంది. అయినప్పటికి మనకు దేనిమీదా ప్రత్యేకంగా రాగం గాని, దేనిమీదా ప్రత్యేకంగా ద్వేషం గాని లేదు. ఎందుకు? కాలూ నాదే, చెయ్యి నాదే, కన్నూ నాదే, చెవీ నాదే. అన్నీ నావే కనుక అన్నింటిని సమంగా చూస్తున్నాం. కాని అందరిని ఒక్కటిగా చూస్తున్నామా ? లేదు. ఎందుకని? ఇక్కడ అందరిని నా వారు అని అనుకోవటం లేదు. అందుకే ఒకరంటే రాగం, ఒకరంటే ద్వేషం. సమబుద్ధి ఉండటం లేదు. నిర్గుణోపాసన చేసేవారికి సమబుద్ధి తప్పకుండా ఉండాలి. అప్పుడే సత్ఫలితం కలిగేది.

అసలు ఈ ప్రపంచం అనేది ఎప్పుడూ మనం కోరుకున్నట్లుగా ఉండదు. అలాగే మన జీవితం కూడా మనం కోరుకున్నట్లు ఉండదు. అది ఎలా ఉన్నాసరే మనం మాత్రం అన్ని సమయాల్లోనూ సమభావంతో ఉండాలి. బయట ఎలాంటి మార్పులు కలిగినా, తనకు ఎటువంటి ఫలితాలు కలిగినా, తన కోరికలు తీరినా తీరకున్నా, జయమైనా, అపజయమైనా, సుఖమైనా దుఃఖమైనా, లాభమైనా, నష్టమైనా సమబుద్ధి ఉండాలి. అన్నింటిని సమానంగా చూడాలి. అలా చూడగలగాలి.

తన కుమారుడు ఉదయం నవ్వుతాడు, మధ్యాహ్నం ఏడుస్తాడు, సాయంత్రం కోపగిస్తాడు, రాత్రి చికాకు పరుస్తాడు. అయినా అన్ని సమయాలలోను అతణ్ణి పుత్రుడు గానే చూస్తాడు. అన్ని అవస్థలలోను

పుత్రభావమే. అలాగే సాధకుడు అనుకూల పరిస్థితులు కలిగినా, ప్రతికూలతలెదురైనా, ఎన్ని ఆటంకాలు వచ్చినా తన ఆరాధ్యదైవాన్ని ప్రేమించాలి. ఇట్టి సమబుద్ధియే మనస్సును ధ్యానంలో నిలుపుతుంది. ఎందుకంటే మనస్సులో సమభావన ఉంటే ఆ మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ప్రశాంత మనస్సే ధ్యానానుకూలంగా ఉంటుంది.

భాగవతంలో కుచేలుణ్ణి చూడండి. తినటానికి తిండిలేదు. కట్టుకోవటానికి బట్టలేదు. భార్యకు ఒక్కపూట గంజినీళ్ళు కూడా ఇచ్చి కడుపు నింపే పరిస్థితి లేదు. శరీరాన్ని దాచుకోవటానికి సరిపడినంత బట్టను కూడా ఇవ్వలేక పోయాడు. అందుకే అతణ్ణి అందరూ కుచేలుడు అన్నారు. చేలం అంటే వస్త్రం. కుచేలం అంటే చినిగిన వస్త్రం. ఎంత దరిద్రం అనుభవిస్తున్నా, కన్నబిడ్డలకు ఒక్క పూటైనా పట్టెడు అన్నం పెట్టలేని హీనమైన, దీనమైన, దయనీయమైన స్థితిలో ఉన్నా భక్తిలో మాత్రం ఏ లోటూ రానివ్వలేదు. దైవంపై గల నమ్మకం వమ్ముకాలేదు. మళ్ళీ భగవంతుని అనుగ్రహంతో అష్టైశ్వర్యాలతో తులతూగిననాడు కూడా ఆయనలో ఏమార్పులేదు. ఉన్న సంపదలను చూచుకొని పొంగిపోలేదు. అదే భక్తితో ఉన్నాడు. అదే జీవన విధానంగా ఉన్నాడు. సర్వత్ర సమబుద్ధి అంటే అదే. లేనినాడు క్రుంగిపోలేదు, ఉన్ననాడు పొంగిపోలేదు. కటిక దరిద్రం అయినా, అష్టైశ్వర్యం ఐనా కుచేలునిలో ఏమార్పులేదు. రెంటినీ సమంగా చూచాడు. అదే సర్వత్రా సమబుద్ధి. గోడగడియారంలోని పెండ్యులం లాగా అటూఇటూ కొట్టుకుపోయే మనస్సుకు సమత్వం ఉండదు. అట్టి మనస్సు ధ్యానానికి అనుకూలం కాదు.

కనుక ఎల్లప్పుడూ మనస్సును సమస్థితిలో ఉంచుకోవాలి. కష్టంలోను, సుఖంలోను మనస్సు ఒకేవిధంగా ఉండాలి.

తుకారాం గొప్పభక్తుడు. ఆయన ఎంత భక్తుడో ఆయన భార్య అంత గయ్యాళి. అవునంటే కాదంటుంది. కాదంటే ఔనంటుంది. అంతా వితండవాదమే. ఆయనను క్షణం కూడా సంతోషంగా ఉండనివ్వదు. కుటుంబపోషణ కోసం ఆయన చేత ఎన్ని పనులు చేయించిందో లెక్కలేదు. అయినా సరే ఆయన భార్యను పల్లెత్తు మాట అనలేదు. ఆయన భగవంతుణ్ణి ఇలా ప్రార్థించేవాడు, "పాండురంగా! ఎంతటి దయామయుడవయ్యా నీవు? గయ్యాళి భార్యను నాకు అంటగట్టి ఈ సంసారంపై రోత పుట్టించావు. నేను పెద్దగా ప్రయత్నం చేయకుండానే నాకు తీవ్రవైరాగ్యాన్ని కలిగించి నన్ను ఉద్ధరించావు. ప్రభూ! నీవు చేసిన ఈ మహోపకారాన్ని ఎంతని కొనియాడేది స్వామీ" అని భగవంతునితో మనవి చేసుకొనేవాడు. ఏమి జరిగినా మన మంచికే అనే సిద్ధాంతం ఇది.

ఆ ప్రాంతంలోనే సంత్ ఏక్ నాథ్ మహారాజ్ అనే పరమభక్తాగ్రేసరుడున్నాడు. ఆయనకు ఎంతో అనుకూలవతియైన భార్య ఉండేది. ఆమె యొక్క పతిభక్తి, అణకువ, పతిసేవా పరాయణత అనన్యసామాన్యం. పతిదేహాన్ని నీడలా అనుసరించేది. కంటికి రెప్పలా, నోట్లో నాలుకలా ఉండి అన్నివిధాల భర్త అడుగుజాడలలో నడిచేది. ఆయన చేసే పూజా పునస్కారాలకు ఎంతో సంతోషంతో అన్నీ సమకూర్చేది. ఆయన భగవంతుణ్ణి ఇలా ప్రార్థించేవాడు, "పాండురంగా! ఎంతటి దయామయుడి

వయ్యా నీవు? గుణవంతురాలు, పతిసేవా పరాయణ, అనుకూలవతి అయిన భార్యను నాకు ప్రసాదించి నీపై అచంచల భక్తికి ఎంతో సానుకూలత చూపించావు. నీవు చేసిన ఈ మహోపకారాన్ని ఎంతని కొనియాడేది?" అని భగవంతుని అనేకవిధాల ప్రశంసించేవాడు. అదీ బాగానే ఉంది, ఇదీ బాగానే ఉంది. చూచారా! ఇదే సర్వత్ర సమబుద్ధి అంటే - ఇట్టిబుద్ధి అన్ని వేళలా, అందరిపట్ల, అన్ని విషయాలలోను ఉండాలి. కాని మన బుద్ధి అలా ఉంటుందా?

జానకమ్మ, తులశమ్మ ప్రక్కప్రక్క ఇళ్ళలో ఉండేవారు. తులశమ్మ సామాన్య కుటుంబీకురాలు, జానకమ్మ భాగ్యవంతురాలు. అయినా వారి మధ్య గొప్పస్నేహం ఉంది. ఇద్దరూ ఎంతో ఆత్మీయంగా, ఆప్యాయంగా ఉండేవారు. కొంతకాలానికి తులశమ్మ వాళ్ళు వ్యాపారం నిమిత్తం వేరే ఊరుకు వెళ్ళిపోయారు. అలా వాళ్ళు వెళ్ళిపోతుంటే జానకమ్మకు ఎంతో దుఃఖంగా ఉంది. అయినా చేసేదేమీ లేదు గనుక క్రమంగా ఆ విషయాన్ని మరచిపోయింది. దాదాపు 10 సం||ల తరువాత జానకమ్మ శ్రీశైలం వెళ్ళింది. అదే సమయంలో తులశమ్మ కూడా అక్కడికే వచ్చింది. ఇద్దరూ కలుసుకున్నారు. పలకరించుకున్నారు. జానకమ్మ ఎంతో ఆప్యాయంగా తులశమ్మను తన రూముకు తీసుకవెళ్ళింది. ఇద్దరూ అరమరికలు లేకుండా ఎన్నో విషయాలు మాట్లాడుకుంటున్నారు. మాటల మధ్యలో తులశమ్మ అడిగింది, వదినా! అమ్మాయికి పెళ్ళి చేశావా? అని. ఆహా! మంచి సంబంధం వస్తే 20 లక్షలు కట్నం ఇచ్చి పెళ్ళి చేశాం వదినా, అల్లుడికి బెంగుళూరులో

ఉద్యోగం అని సంతోషంగా చెప్పింది. ఎంతొస్తుందేం? అని అడిగింది తులశమ్మ. సంవత్సరానికి 22 లక్షలంట వదినా! అని ముఖం చాటంత చేసుకొని చెప్పింది జానకమ్మ. అహా! అలాగా - అని మరి మీ అబ్బాయికి కూడా పెళ్ళిచేశావా? అంది తులశమ్మ. ఆ! చేశానులే. అదే వదినా! నా బాధంతా. ఏమని చెప్పేది నా కష్టాన్ని? అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకొని భోరుమంది జానకమ్మ. అదేంటి వదినా! అంతబాధ పడుతున్నావు. అబ్బాయికి ఉద్యోగం లేదా ఏమిటి? అంటే అదేం లేదు వదినా! ఢిల్లీలో పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడు. అదిగో ఆ కొరివి వచ్చింది గదా! వాడికన్నీ కష్టాలే - అంది జానకమ్మ.

తుల:- ఎవరు కోడలా? ఏం మంచిది కాదా? కట్నం తేలేదా?

జాన:- కట్నం తేకపోయినా నేను అసలు బాధపడటం లేదు వదినా! అసలు వాడికి సుఖం లేదు. అదొక బ్రహ్మరాక్షసి. అందుకే నా బాధ.

తుల:- ఏం చేస్తుందేమిటి అంత బాధపడటానికి.

జాన:- ఏం చెప్పేది వదినా! ఉదయం 9 గంటలైనా బెడ్ రూం దాటి బయటకు రాదు. వాడి సంగతి పట్టించుకోదు. టిఫెన్ కూడా చెయ్యదు. ప్రతిరోజూ వాడే టిఫెన్ తయారుచెయ్యాలి. తీసుకెళ్ళి బెడ్ రూంలో ఆవిడగారికి అందించాలి. అన్ని పనులు చేసుకొని తొమ్మిదింటి కల్లా ఆదరాబాదరా ఆఫీసుకు వెళ్ళాలి వాడు.

తుల:- మరి అన్నం, కూరలు వండుతుందా? అదీ లేదా?

జాన:- అబ్బే! అలా చేస్తే నాకెందుకొదినా! ఈ బాధంతా? వాడే అన్నం వండి, కూరలు చెయ్యాలి. అంతేకాదు వదినా! వాడే ప్లేట్ లో పెట్టుకొని తీసుకెళ్ళి బెడ్



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**రూంలో అందించాలి. వాడి బాధ ఏమని చెప్పను వదినా? (అంటూ ఏడుస్తూ చీది అవతల పడేసింది)**

**తుల:- మరింతకీ రోజు మొత్తం మీద ఏం చేస్తుంది మీ కోడలు?**

**జాన:- ఏముంది? బెడ్ రూం లోనే పడుకొని టివి చూస్తూ, నవలలు చదువుకుంటూ ఉంటుంది. మధ్యమధ్యలో ఏదన్నా తినాలనిపిస్తే మొగుణ్ణి పిలిచి తెప్పించుకుంటుంది. ఆ పిచ్చి మొఖం వాడు ఇంటిపని, వంటపని, ఆమెసేవ చేసుకొని ఉద్యోగానికి వెళతాడు. ఇది వదినా నాబాధ. (అంటూ భోరున ఏడ్చింది)**

**తుల:- మరి అమ్మాయి పరిస్థితి ఏంటి వదినా? అదన్నా సుఖంగా ఉంటున్నదా? అల్లుడు బాగానే చూసుకుంటున్నాడా?**

**జాన:- (ముఖం లో చెప్పలేనంత ఆనందంతో) దాని జాతకమే వేరు వదినా! అల్లుడు బంగారంలాగా చూసుకుంటాడు. అసలు దానిచేత ఒక్కపని కూడా చేయించడు. అది ఏపని చేద్దామన్నా అతడే వచ్చి అడ్డుపడి తానే చేస్తాడు. ఇంటిపనీ, వంటపనీ అన్నీ అల్లుడుగారే చేస్తారు. పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు.**

**తుల:- మరి అమ్మాయి ఏం చేస్తుంది వదినా?**

**జాన:- ఉదయం 9 గంటలైనా బెడ్ రూమ్ దాటి బయటకు వచ్చే పనేలేదు. అల్లుడుగారే బెడ్ కాఫీ తెచ్చిస్తాడు. ఆ తరువాత టిఫెన్ తయారుచేసి బెడ్ రూంలోకే తెచ్చిపెడతాడు.**

**తుల:- మరి అన్నం, కూరలు - - -**

**జాన:- అబ్బే! దానికేం ఖర్మ వదినా! అన్నీ అల్లుడుగారే చేసేస్తారు. ఆయనకు వంట చెయ్యటం బాగా అలవాటేనట. బాగా రుచిగా కూడా చేస్తాడు.**

**తుల:- మరి భర్తకు వడ్డిస్తుందా?**

**జాన:- అబ్బే అది కూడా చెయ్యనివ్వడు వదినా అల్లుడుగారు. తానే ప్లేట్ లో పెట్టి, తెచ్చి బెడ్ రూంలో అందిస్తాడు.**

**తుల:- మరింతకీ అమ్మాయి రోజు మొత్తం మీద ఏం చేస్తుంది వదినా?**

**జాన:- దానికి ఏదో చెయ్యాల్సిన ఖర్మేమిటి వదినా! హాయిగా బెడ్ రూంలో పడుకొని, A/C వేసుకొని, ఎదురుగా ఉన్న టి.వి. పెట్టుకొని సీరియల్స్, సినిమాలు, ప్రోగ్రాంలు చూస్తుంటుంది. విసుగనిపిస్తే నవలలు చదువుకుంటుంది. మధ్యమధ్యలో ఏదన్నా తినాలనిపిస్తే అల్లుడిగారికి చెబితే వెంటనే తెచ్చిపెడుతుంటాడు. అసలు దాని అదృష్టమే అంత. ఇలా ఉంటుంది మన బుద్ధి. సర్వత్రా అసమబుద్ధి. కోడలు చేస్తే అది హింస. అదే కూతురు చేస్తే అదృష్టం. ఇలాంటి అసమబుద్ధి ఉన్నవారు ఏనాటికీ నిర్గుణోపాసనే కాదు, సగుణోపాసన కూడా చేయలేరు. అసలు ఉపాసన అనేదేమిటో అర్థం చేసుకోలేరు. నిర్గుణోపాసకులకు తప్పక సర్వత్రా సమబుద్ధి ఉండాల్సిందే.**

**3. <u>సర్వ భూతహితే రతాః</u>:- సర్వభూతాలకు - సమస్త ప్రాణులకు మేలుచేయుట యందు ఆసక్తి కలిగిఉండాలి. అంటే కేవలం మనుష్యులకే కాదు పశువులు, పక్షులు, క్రిములు, కీటకాలు, చెట్లు, చేమలు, పాములు, తేళ్ళు - ఇలా అన్నింటికి మేలు కలగాలనే భావన ఉండాలి. శత్రువైనా, మిత్రుడైనా**

ఎవరైనా సరే అందరి మేలును కాంక్షించాలి. అన్నిప్రాణుల పట్ల దయకలిగి ఉండాలి. ప్రాణులన్నింటికి దుఃఖాలు సహజం. కనుక వాటి దుఃఖాన్ని తొలగించటానికి, సుఖాన్ని కలిగించటానికి, అవసర సమయాలలో మేలుచేయటానికి ప్రయత్నించాలి. అలా మేలు చేయుటయందు ఆసక్తి ఉండాలి. అట్టివారే అక్షరోపాసనకు అర్హులవుతారు. వారే ధ్యానంలో మనస్సు నిలుపగల వారవుతారు. అయితే ఇలా సమస్త భూతాలపట్ల దయ కలగాలన్నా కష్టమే. మనకు మేలుచేసిన వారిపై అనురాగం ఉంటుంది. కనుక తిరిగి వారికి మేలు చేయాలనిపిస్తుంది. కాని మనకు కీడుచేసిన వారైతేనో వారికి కూడా మేలు చేయాలనుకుంటామా? అనుకోలేము. కాని శాస్త్రం చెబుతున్నది, పెద్దలు చెబుతున్నారు. సుమతి శతకకారుడంటున్నాడు.

ఉపకారికి ఉపకారము

విపరీతము గాదు సేయ వివరింపంగాన్

అపకారికి ఉపకారము

నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ! - అని

నిజమే. వినటానికి బాగానే ఉంది. కాని ఆచరణకు వచ్చేటప్పటికి ఈ నీతి సూత్రాలన్నీ గుర్తుకురావు. ఐతే ఎవరికి సర్వత్ర సమబుద్ధి ఉంటుందో, అందరిని ఒకేవిధంగా, ఆత్మస్వరూపులుగా, ఒక్కటిగా చూడగలుగుతారో వారే అపకారులకు కూడా ఉపకారం చేయగలుగుతారు. మేలు చేయాలనే ఆసక్తి కలిగిఉంటారు. ఇలా సర్వభూతాలకు చేసే హితం - సేవ పరమాత్మకు చేసినట్లే. ఎందుకంటే సమస్త భూతాలు పరమాత్మే గనుక.

ఏకనాథస్వామి ఉదంతంలో ప్రయాగ నుండి రామేశ్వరానికి కావడిలో తెస్తున్న గంగాజలాన్ని హీన జంతువైన గాడిదకు పోసి, అది జీవించి ఉన్న రామలింగేశ్వరునికి చేసిన అభిషేకమే అని భావించాడు. అలాగే తుకారాం కూడా. తనయింట్లో కుక్క దూరి అన్నం పెళ్ళను నోట్లో పెట్టుకొని పరుగెత్తుకు పోతుంటే, నేతిగిన్నెను పట్టుకొని, "పాండురంగా! ఆగు! ఆగు! ఒట్టి అన్నం తింటే జీర్ణం కాదు. కొద్దిగా నెయ్యి వేస్తానుండు" అని దానివెంట పరుగుతీశాడు. ఇదే సర్వభూత హితం - అంటే. కనుక అది కుక్కా? నక్కా? మనిషా? అనిగాని, శత్రువా? మిత్రుడా? అనిగాని చూడకుండా అంతా ఆత్మస్వరూపులే అని చూడాలి. వారికి చేసే సేవ భగవంతుని సేవయే అని భావించాలి. అట్టి వానికే నిర్గుణోపాసన తేలిక.

ఇలా ఈ 3 లక్షణాలతో కూడి ఎవరు నిర్గుణోపాసన చేస్తారో అట్టివారు తప్పక పరమాత్మ నందుకోగలరు. "తే ప్రాప్నువంతి మామేవ" వారు నన్నే చేరుకుంటారు అని భరోసా ఇస్తున్నాడు భగవానుడు.

నిర్గుణోపాసకునకు స్వతంత్రం ఉంది. స్వేచ్ఛ ఉంది. అతడు తన సాధన ద్వారా తానే స్వయంగా పరమాత్మను అందుకోగలడు. అందుకే 'తేప్రాప్నువంతి మాం ఏవ' అన్నాడు భగవానుడు. సగుణోపాసకునికి స్వతంత్రం లేదు. అందుకే "తేషాం అహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్" అట్టివారిని జననమరణ రూప సంసారం నుండి నేను ఉద్ధరిస్తాను అన్నాడు భగవానుడు 7వ శ్లోకంలో. అయితే నిర్గుణోపాసన ఎంత గొప్పదైనా అది ఎంత కష్టమో, ఎందుకు కష్టమో 5వ శ్లోకంలో తెలియజేస్తున్నాడు భగవానుడు.

**శ్లో||** క్లేశోఽధిక తరస్తేషాం అవ్యక్తా సక్త చేతసాం|

అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే|| **(5)**

**తా||** నిర్గుణోపాసన యందు ఆసక్తి గలవారికి ప్రయాస చాలా ఎక్కువ. ఎందుకంటే దేహధారులైన వారు నిర్గుణోపాసన ద్వారా అవ్యక్త పరమాత్మను అందుకోవటం కష్టం.

**వ్యాఖ్య:-** నిర్గుణపరబ్రహ్మతత్త్వాన్ని 8 విశేషణాలతో తెలియజెప్పి భగవానుడు; ఎవరైతే ఇంద్రియనిగ్రహం, సర్వభూతదయ, సమబుద్ధితో నిర్గుణ పరమాత్మను ఉపాసిస్తారో వారు నన్నే చేరుకుంటారు అని తెలియజేశాడు. అలా చెప్పటంతోనే పరమాత్మప్రాప్తికి నిర్గుణోపాసనయే సరియైనది గదా! అని అర్జునుడు భావించాడు. అర్జునుడే కాదు ఎవరైనా అలాగే అనుకుంటారు. ఎందుకంటే సగుణోపాసన చేస్తే వారంతటవారు పరమాత్మను అందుకోలేరు. వారికి భగవంతుని సాయం కావాలి. కాని నిర్గుణోపాసన చేస్తే 'తేప్రాప్నువంతి మామేవ' - వారు నన్నే చేరుకుంటారు అని భగవానుడే స్పష్టం చేశాడు గనుక ఆలస్యం లేకుండా పరమాత్మను అందుకోవచ్చు అని ఎవరైనా అనుకుంటారు. భగవంతుని మాటపై విశ్వాసంతో నిర్గుణోపాసనకు కూర్చోవచ్చు. కాని ఎంత ప్రయత్నించినా, ఎంత సాధన చేసినా ఆ సాధన కుదరదు. కనుక నిరాశ పడవచ్చు. భగవంతుని మాటపై విశ్వాసం తొలగిపోవచ్చు. అందుకే నిర్గుణోపాసనలోని కష్టనష్టాలను తెలియజెప్పి, ఎందుకు కష్టమో కూడా తెలియజేస్తున్నాడు భగవానుడు. రెండు మార్గాలను పోల్చి చెప్పాలనే ప్రయత్నం కూడా ఇందులో ఉంది.

అంతేగాని నిర్గుణ పరబ్రహ్మమును ఆరాధించుట చాలా కష్టం అన్నారు గనుక భగవంతుడు కూడా సగుణోపాసననే సమర్థిస్తున్నాడు అని అనుకోరాదు. అలా అనుకోవటం ఉపనిషత్తులు, భగవద్గీత భోదించే జ్ఞానానికి విరుద్ధం అవుతుంది. కనుక భగవంతుడు దేనినో సమర్థిస్తున్నాడు, దేనినో వ్యతిరేకిస్తున్నాడు అనుకోవటం తప్పు. భగవంతుడు స్పష్టంగా ఈ రెండు ఉపాసనా మార్గాలలోని కష్టనష్టాలను వివరించటమే అభిమతంగా గలవాడు.

నిర్గుణోపాసన గొప్ప ఫలితాన్ని ఇచ్చేదే. ఇందులో సందేహం లేదు - 'తేప్రాప్నువంతి మామేవ' - వారు నన్నే చేరుకుంటారు అని భగవానుడు ముందు శ్లోకంలో స్పష్టంగానే చెప్పాడు. మరి భగవంతుని చేరుకోవటం కన్న గొప్పప్రయోజనం, ఫలితం ఏదీ ఈ మానవజన్మకు లేదు. అయితే ఇది ఎంత గొప్ప ఫలితాన్ని ఇచ్చేదే అయినా ఈ మార్గం చాలా కంటక ప్రాయం. ముళ్ళత్రోవ. ఈ మార్గంలో నడవాలంటే అందరికీ అర్హత ఉండదు. అందరికీ సాధ్యం కాదు. ఎందుకంటే నిర్గుణ పరమాత్మకు ఆకారం లేదు. కనుక దృష్టి నిలవదు. గుణాలు లేవు కనుక ఆలోచనలకు అందదు. పోనీ బుద్ధితో విచారణ చేద్దాం అంటే అది ఎక్కడో ఒకచోట ఉండేది కాదు. సర్వవ్యాపి - అందుకే పరబ్రహ్మ తత్త్వాన్ని అవగాహన చేసుకోవటం చాలా కష్టం. 'క్లేశః అధికం' అనక 'క్లేశః అధికతరం' అన్నారు. అంటే చాలా కష్టం అని భావం. అసలు వేదాంత శ్రవణం చేయాలంటేనే చాలా కష్టం. వినే అర్హతలేని వారు వినటానికి కూర్చోనే కూర్చోలేరు. ఇక వినటానికి కూర్చున్న వారిలో కూడా అర్హతలేకపోతే నిద్రవస్తుంది. మరి వేదాంత శ్రవణానికే ఇంత కష్టం ఉంటే

నిర్గుణపరమాత్మను ఉపాసించటం ఎంత కష్టంగా ఉంటుంది? అందుకే 'క్లేశోధికతరం' అన్నారు. ఏమిటి దీనికి కారణం?

దేహవద్భిః అవాప్యతే:- దేహధారులకు కష్టం అని. ఇది పైపై అర్థం మాత్రమే. ఎందుకంటే దేహం ధరించిన వారు గాక దేహాన్ని వదిలిన వారెవరైనా సగుణోపాసనో, నిర్గుణోపాసనో చేయగలుగుతారా? అసలు వేదాంతాన్ని వినగలుగుతారా? మరైతే లక్ష్యార్థం ఏమిటి? దేహవద్భిః అంటే దేహమునందు ఆసక్తి గలవారు, లేదా దేహాభిమానం గలవారు - అని శంకరులవారు తమ భాష్యంలో తెలియజేశారు. అంటే దేహాభిమానం గలవారికే నిర్గుణోపాసన చాలా కష్టం గాని, దేహాభిమానం వదిలిన వారికి తేలికే నని భావం.

చూపు లోపించినవారు, చేతులు వణికే వారు సూదిలో దారం ఎక్కించలేరు. అయితే చూపు సరిచేసుకొని, చేతులు వణకకుండా చేసుకోగలిగితే ఆ పని ఎంతో సులువవుతుంది. కనుక ముందు మనలోని లోపాన్ని సరిచేసుకోవాలి. అంటే దేహాభిమానాన్ని వదలాలి. నిజంగా మనం అందరం దేహాభిమానంతోనే ఉంటాం. అంత తేలికగా దేహాభిమానాన్ని వదలం.

ధర్మాన్ని ఉద్ధరించటానికి జన్మించిన మహనీయులలో గురునానక్ ఒకరు. ఆయన శిక్కుల మతగురువు. గొప్ప దైవభక్తి సంపన్నుడు. ఒకసారి ఆయన కొలత పాత్రతో ధాన్యాన్ని కొలుస్తూ ఏక్, దో, తీన్, చార్ అంటూ లెక్కబెడుతూ 13వ సారి కొలిచేటప్పుడు తేరా అన్నాడు. ఆ తరువాత వరుసగా తేరా, తేరా, అంటున్నాడే గాని చౌదః, పంద్రా, సోలహ్, సత్రహ్ అని

అనటం లేదు. చుట్టూ ఉన్నవారు ఆశ్చర్యపోతున్నారు. తేరా అంటే 13 అని మాత్రమే గాదు. నీ వాడను అనే అర్థం కూడా ఉన్నది. "దేవా! నేను నీవాడను, నీ భక్తుడను అనే భావం ఆయనలో కలిగి భక్తి పారవశ్యంతో అదేపదాన్ని మళ్ళీమళ్ళీ ఉచ్ఛరించాడు.

అట్టి పరమభక్తాగ్రేసరుడైన 'నానక్' ఒకసారి తన కుమారుణ్ణి వెంటబెట్టుకొని మఠమంతా తిరుగుతున్నాడు. గోశాల దగ్గరకు రాగానే అది చాలా అపరిశుభ్రంగా ఉన్నది. దానిని శుభ్రం చేయమని కుమారునితో అన్నాడు. తన గౌరవప్రతిష్ఠలకు అట్టి పని చేయటం వల్ల కళంకం కలుగుతుందని భావించి ఆయన కుమారుడు తండ్రి మాటను వినిపించుకోనట్లు మౌనంగా ఉన్నాడు. అతడికి దేహాభిమానం అడ్డు వచ్చింది. నానక్ మాటలను ఆ ప్రక్కనే ఉన్న నానక్ శిష్యుడొకరు విని వెంటనే నడుం బిగించి చీపురు కట్టను చేత బట్టుకొని గోశాల అంతా ఊడ్చి, కడిగి శుభ్రం చేశాడు. శిష్యుని యొక్క గురుభక్తికి, అహంకార - అభిమాన రాహిత్యానికి ఎంతో సంతోషించాడు నానక్. కొంతకాలం తర్వాత మఠం భాద్యతలను మరొకరికి అప్పగించి తాను వైదొలగాలని నిశ్చయించుకున్నాడు నానక్. తగిన వ్యక్తి కోసం ఆలోచిస్తున్నాడు. ఆ పదవి తనకే వస్తుందని కుమారుడు గట్టి నమ్మకంతో ఉన్నాడు. కాని నిరాడంబరుడు, దేహాభిమానం లేనివాడు అయిన ఆ శిష్యునికే పదవిని అప్పగించాడు నానక్.

ఈ వార్త తెలియగానే కుమారుడు "నాన్నా! మఠాధికారం నాకెందుకు ఇవ్వలేదు? అన్నాడు. "గోశాలను బాగుచేయలేనివాడవు లోకాన్నెలా బాగు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేస్తావు?" అని కుమారుని మందలించాడు. కుమారుడు తన పొరపాటును గ్రహించి సిగ్గుపడ్డాడు. కనుక దేహాభిమానం లేకుండా ఉంటే ఉన్నతస్థితికి మార్గం సుగమ మవుతుంది.

అంతేకాదు. ఒక్కొక్కసారి దేహాభిమానం ప్రాణాల మీదకు తెస్తుంది. కొంప ముంచుతుంది.

ఒక పట్టణంలో ఒక గొప్ప శిల్పి ఉన్నాడు. అతడు జీవకళ ఉట్టిపడేటట్లు శిల్పాలను చెక్కుతాడు. అతడు శిల్పాలను చెక్కితే అది శిల్పం లాగా కాక ఆ మనిషే అక్కడ నిలబడి ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఆయనకు ముసలితనం వచ్చింది. ఎప్పుడో ఒకప్పుడు చావు తప్పదు అని అతడికి తెలుసు. అయినప్పటికి చావును తప్పించుకోవాలనుకొని ఒక ఆలోచన చేశాడు. రూపం, రంగు, ఒడ్డు, పొడుగు, డ్రెస్ అన్నీ తనలాగే అచ్చు గ్రుద్దినట్లుగా ఉండే 9 శిల్పాలను తయారుచేశాడు. వాటిని చూసిన వారెవరైనా వాటిని శిల్పాలు అని అనుకోరు. ఆ శిల్పియే అనుకుంటారు. ఆ తొమ్మిదింటిని జాగ్రత్తగా దాచిపెట్టాడు.

కొంతకాలం గడిచింది. అతడికి జబ్బు చేసింది. డాక్టర్లు పరీక్షించి ఇక ఎంతోకాలం జీవించటం జరగదు. బహుశా రెండు మూడు గంటలు మాత్రమే అని చెప్పారు. అప్పుడా శిల్పి తన ఇంటి బయట 9 శిల్పాలను పరుండబెట్టి అన్నింటిపై ఒకేరకం వస్త్రాన్ని కప్పి, తాను కూడా వాటి మధ్య పడుకొని అదే రకం వస్త్రాన్ని కప్పుకున్నాడు.

మరణసమయం ఆసన్నమైంది. యమధర్మరాజు చేత పాశాన్ని ధరించి ఆ శిల్పి కోసం వచ్చాడు. అయితే అక్కడ 10 మంది శిల్పులు పరుండినట్లు గమనించాడు. ఒక్కొక్క శిల్పం మీద వస్త్రాన్ని తొలగించి చూస్తుంటే అందరూ ఒక్కటిగానే ఉన్నారు. ఇందులో ఆయుష్షు తీరిపోయిన శిల్పి ఎవరా? అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఎంత ఆలోచించినా ఆయనకు బోధ పడటం లేదు. ఒకరికి బదులు మరొకరి మెడలో పాశాన్ని వేయటం తన వృత్తి ధర్మానికే కళంకం. తనకున్న 'సమవర్తి' అనే పేరు తొలగిపోతుంది. అందువల్ల అందరినీ మరొకసారి పరికించి చూచి తిరిగివెళుతూ వెళుతూ "వీడెవడో గాని అన్నింటిని ఎంతో నైపుణ్యంతో, జీవకళ ఉట్టి పడేటట్లుగా చక్కగా చెక్కాడు గాని ఒక్క పొరపాటు చేశాడు" అని పెద్దగా అన్నాడు. ఆ మాట వినటంతోనే విగ్రహాల మధ్య పడుకున్న శిల్పి అమాంతంగా లేచి "ఏమిటయ్యా! ఆ పొరబాటు?" అన్నాడు. "నీవు లేవటమే ఆ పొరపాటు" అని యమధర్మరాజు అతడి మెడలో యమపాశాన్ని వేసి ప్రాణాలు గైకొని పోయాడు.

ఆ శిల్పి కొద్దిసేపు ఆగితే ప్రాణాలు దక్కేవి. కాని దేహాభిమానం అతణ్ణి వీడలేదు. నేను ఇంతటి గొప్పశిల్పినే! నేనేం పొరపాటు చేశాను? అనే అభిమానం పొడుచుకు వచ్చింది. లేచాడు. పొయ్యాడు. దేహాభిమానమే అతడి కొంప ముంచింది; అతడి ప్రాణాలు తీసింది.

దేహాభిమానం గలవారు 'ఈ దేహమే నేను' అనే భావంతో 'నేను' 'నేను' అనే అహంకారాన్ని కలిగి ఉంటారు. ఈ దేహానికి సంబంధించిన వారిని 'నావారు' అని, ఈ దేహానికి సంబంధించిన వాటిని 'నావి' అనే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మమకారాన్ని కలిగి ఉంటారు. ఈ అహంకార మమకారాల కారణంగానే జీవితంలో ప్రశాంతతను పోగొట్టుకొని, మనస్సును అనవసరమైన ఆందోళనలకు, ఉద్రేకాలకు లోను గావించుకొని అశాంతిని, దుఃఖాన్ని కొని తెచ్చుకుంటారు. అర్జునుడు యుద్ధరంగంలో ప్రవేశించి ఈ అహంకార మమకారాల వల్లనే విషాదానికి లోనయ్యాడు; కర్తవ్య విముఖుడయ్యాడు, వలవలా ఏడ్చాడు, దుఃఖాన్ని కొని తెచ్చుకున్నాడు. లోకంలో సాధారణంగా అందరూ ఈ అహంకార మమకారాలకు లోనవుతూనే ఉంటారు. అందుకే నిర్గుణోపాసన అనేది కష్టతరమవుతున్నది. ఈ దేహతాదాత్మ్యమే మనకున్న పెద్దదోషం.

ఆధ్యాత్మికరంగంలో ప్రవేశించిన అనేకమంది సాధకులు జపధ్యానాదులు, ఉపాసనలు చేస్తున్నప్పటికీ మంచి ఫలితాన్ని పొందలేక పోవటానికి కారణం ఈ దేహాభిమానమే - దేహతాదాత్మ్యమే - దేహమే నేను అని భావించే అహంకారమే. క్షేత్రాన్ని శుద్ధం చేయకుండా - పొలాన్ని సరిగ్గా దున్ని తయారుచేయకుండా విత్తనాలు చల్లితే ఏంప్రయోజనం? పునాది గట్టిగా వేయకుండా 7 అంతస్థుల మేడ కడితే అది ఎంతకాలం ఉంటుంది? అలాగే అంతరంగంలోని దేహాభిమానం తొలగకుండా పరమాత్మ యందు మనస్సు నిలుపుదాం అని ప్రయత్నిస్తే నిలుస్తుందా? నిలవదు. కనుక ముందుగా దేహాభిమానాన్ని వదలాలి. ఆ దోషం తొలిగితే గాని నిర్గుణోపాసన కుదరదు. అప్పటిదాకా సగుణోపాసనే శ్రేయస్కరం. దేహాభిమానం తొలగించాలంటే ఏంచేయాలి?

(i) <u>నిష్కామ కర్మాచరణ చేయాలి:</u> కోరికలు లేకుండా, లేదా చేసే పనిలో ఫలితాన్ని ఆశించకుండా కర్మలు చేస్తూ ఉండాలి. అలాగే భగవదార్పణ బుద్ధితో, కర్తవ్యతా భావంతో - అంటే నేను చేస్తున్నాను అని గాక ఇది నా కర్తవ్యం, భగవంతుడే నాచేత ఇలా చేయిస్తున్నాడు - అనే భావంతో కర్మలు చేయాలి. అలా చేస్తున్నప్పుడు 'నేను' అనే అహంకారం తొలగిపోతుంది. దేహాభిమానం తొలగి నిమిత్తమాత్రులమౌతాం.

(ii) <u>సాకార సగుణోపాసన చేయాలి:</u> అంటే అందరూ భగవత్స్వరూపులే ననే భావనతో, నేను భగవంతుని దాసుడను అనే భావనతో నిత్యము భగవంతుని ఉపాసించాలి. దీనివల్ల దాసభావం కలిగి అహంకారం తొలగిపోతుంది.

(iii) <u>నిత్యానిత్య వస్తు వివేకం కావాలి:</u> నిత్యమైనదేదీ, అనిత్యమైనదేదీ అని ప్రతి సందర్భంలోను ప్రశ్నించుకుంటూ ఉంటే ఈ శరీరంగాని, దీనికి సంబంధించిన భార్యాబిడ్డలు గాని, బంధుమిత్రులు గాని, అన్యులు గాని అందరూ అనిత్యమైన వారేనని, నిత్యమైనది పరమాత్మే అని భావన కలిగి దేహం కూడా అనిత్యం గనుక దేహాభిమానం తొలగిపోతుంది.

ఇలా ఈ సాధనలతో దేహాభిమానాన్ని తొలగించుకోవాలి. అప్పుడే నిరాకార నిర్గుణ ఉపాసన సాధ్యమవుతుంది.

కనుక ముందుగా విశ్వంలోని అనంతరూపాలు భగవత్స్వరూపాలే అని భావించి ఉపాసన ప్రారంభించాలి. ఇదే సగుణోపాసన. దీనివల్ల ఇంద్రియవాంఛలు నశించి, అహంకార మమకారాలు తొలగి, వైరాగ్యభావన సుస్థిరమై అంతఃకరణం పరిశుద్ధమౌతుంది. అప్పుడే మనస్సు సూక్ష్మమై నిర్గుణ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

బ్రహ్మతత్త్వాన్ని ఉపాసించటం తేలికవుతుంది. ఇక సగుణోపాసన ఎలా చేయాలి?

- నిర్గుణోపాసన చాలా కష్టమని క్రిందటి శ్లోకంలో చెప్పారు. దానికి కారణం దేహాభిమానమేనని కూడా చెప్పారు. దేహాభిమానాన్ని వదులుకోవటం అంత తేలికకాదు. మరి దేహాభిమానం ఉన్నంతవరకు ఏంచేయాలి? సగుణోపాసనయే చేయాలి. అది కూడా దేహాభిమానాన్ని తొలగించుకొనుటకు సాయపడే విధంగా చేయాలి. ఎలా చేయాలో 6వ శ్లోకంలో చెబుతున్నారు.

**శ్లో||** యేతు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః|
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే|| (6)

**తా||** సర్వకర్మలను నాయందే సన్యసించి, నన్నే పరమలక్ష్యంగా పెట్టుకొని, అనన్యమైన యోగంతో ఎవరైతే నన్ను ధ్యానిస్తూ ఉపాసిస్తారో - - -

**వ్యాఖ్య:-** మానవుడు అంటే తన నిజస్వరూపాన్ని తెలుసుకొనుటకు ప్రయత్నించేవాడు అని అర్థం. మానవుణ్ణే 'వ్యక్తి' అనికూడా అంటారు. 'వ్యక్తి' అంటే అవ్యక్తమైన పరమాత్మను వ్యక్తం చేసుకొనుటకు (సాక్షాత్కరించుకొనుటకు) ప్రయత్నించేవాడే. మానవజన్మ యొక్క లక్ష్యం ఆత్మసాక్షాత్కారమే. ఆత్మవిచారణ ద్వారా ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలంటే ఒక్క మానవజన్మకే సాధ్యం. దేవతలకు కూడా ఈ అవకాశం లేదు. ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలంటే దేవతలు కూడా తిరిగి మానవులుగా

జన్మించాల్సిందే. ఒట్టి మానవుడుగా జన్మిస్తే చాలదు. మోక్షాపేక్ష ఉండాలి. మాహాత్ముల సాంగత్యం లభించాలి. అట్టివానికే జన్మను తరింపజేసుకొనే అవకాశం.

నిర్గుణోపాసన చేసే అర్హత రావాలంటే ముందుగా సగుణోపాసన చేయాలి. సగుణోపాసనే గదా! అనే చులకనభావం కూడదు. సగుణోపాసనను మాత్రం లోకంలో ఎంతమంది చేయగలుగుతున్నారు? మనమందరం నిరంతరం ఎన్నో ఉపాసనలు చేస్తుంటాం. పుత్రోపాసన, కళత్రోపాసన, దేహోపాసన, గేహోపాసన, విత్తోపాసన, క్షేత్రోపాసన - ఇలా ఎన్నో ఉపాసనలు చేస్తుంటాం. కాని ఈశ్వరోపాసన చేసేవాడు మాత్రం నూటికొకడు ఉంటాడేమో. కనుక సగుణోపాసన అల్పమైనదనే భావం ఉండకూడదు. ఎందుకంటే మోక్షాన్ని అందుకోవటమే మానవజీవిత పరమలక్ష్యం. అందుకు నిర్గుణోపాసనయే దారి. అయితే ఆ నిర్గుణోపాసనకు సాధనం సగుణోపాసన. ఆ పద్ధతినే ఈ శ్లోకంలో వివరిస్తున్నారు. ఏమిటది?

(i) సమస్త కర్మలను పరమాత్మయందే సన్యసించుట.

(ii) పరమాత్మనే పరమగతిగ ఎంచుకొనుట.

(iii) అనన్య చిత్తంతో పరమాత్మను ధ్యానిస్తూ ఉపాసించుట.

అలా చేస్తే ప్రయోజనం ఏమిటో భగవానుడు తరువాత శ్లోకంలో చెబుతున్నాడు. భక్తులపై ప్రేమతో భగవానుడు చెబుతున్న ఈ 3 ఉపాయాలను విశ్లేషిద్దాం.

**1. సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య:-** సమస్తకర్మలను భగవంతునికి సమర్పించాలి. భగవంతునిలో వదలాలి. అంటే ఏమిటి? ఒక ఆశయం కోసం మనం చేసే పనులన్నింటిని వదలిపెట్టి ఆ ఆశయంతో తాదాత్మ్యం చెందుతాం. ఇప్పుడు మీరంతా భగవద్గీత ప్రవచనాలను వినటానికి ఈ టైం లో చేసే పనులన్నింటిని వదిలి ఇక్కడకు వచ్చారు. రేపు ఒక యజ్ఞం చేయాలనుకున్నారు. దానికోసం రేపు చెయ్యాల్సిన పనులన్నింటిని విడిచిపెడతారు. నీకు వైజాగ్ లో ఉద్యోగం వచ్చింది. ఇప్పటివరకు నీవు చేస్తున్న పనులను, నీ ఊరిని వదిలేసి అక్కడకి వెళతావు. మీ అమ్మాయికి పెళ్ళిచేశావు. ఆమె తన భర్త దగ్గరకు వెళ్ళటానికి పుట్టింటిని, ఇంటిపేరుని, తల్లిదండ్రులను, పుట్టిన ఊరును వదిలేసి వెళ్ళిపోతుంది.

అంటే ఒక ఉన్నత ఆశయం కోసం అప్పటివరకు చేస్తున్న పనులను వదిలేస్తున్నాం. అలాగే భగవంతుని కొరకు సర్వకర్మలను వదిలివేయాలి. వదిలేయాలి అంటే ఆ కర్మలను భగవత్పరంగా - భగవంతుని పనులుగా చేయాలి. దీనినే సర్వకర్మలను భగవంతుని యందు సమర్పించుట అంటారు. అంతేకాదు సమస్త కర్మలను - వ్యాపారం, ఉద్యోగం, వృత్తి, వ్యవహారం, పని, పాట - ఏం చేస్తున్నా సరే 'నేను చేస్తున్నాను' అనే కర్తృత్వాన్ని - అహంకారాన్ని వదిలి భగవంతునికి సమర్పించాలి. ఆ కర్మల ద్వారా వచ్చే ఫలితాన్ని కూడా భగవంతునికే సమర్పించాలి. అంటే ఆ ఫలితం గురించి ఆలోచించకుండా, నీ కర్తవ్యంగా కర్మలు చేస్తూ, వచ్చిన ఫలితాన్ని భగవంతుని ప్రసాదంగా స్వీకరించాలి. దానివల్ల అంతఃకరణం శుద్ధమవుతుంది. ఇలా కర్తృత్వ

అహంకారాన్ని, ఫలాపేక్షను వదలి కర్మలు చేస్తే సమస్త కర్మలను భగవంతునిలో సన్యసించినట్లే.

విశ్వరూప సందర్శనం తరువాత అర్జునుడు యుద్ధానికి తాను కర్తను అనే అభిమానాన్ని వదిలేశాడు. తాను చంపక ముందే సైన్యాలు, వీరులు హతమైపోతున్నారు. విశ్వరూపుని ముఖాలలో ప్రవేశిస్తున్నారు. అంటే సర్వకర్త భగవంతుడే. ఈ జగన్నాటక రంగంలో సూత్రధారి ఆయనే. నేను కేవలం పాత్రధారిని మాత్రమే. ఆయన చేతిలో పనిముట్టును నేను. నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి అని కర్తృత్వాహంకారాన్ని వదిలి యుద్ధానికి సిద్ధమయ్యాడు.

అహంకారాన్ని వదిలితే చాలు, భగవంతుని చేతిలో పనిముట్టుమై పోతాం. ఆయన చేతిలో మురళిగా మారిపోతాం. మురళి ఎప్పుడూ శ్రీకృష్ణుని అంటిపెట్టుకొనే ఉంటుంది. ఆయన పెదవులపై నాట్యం చేస్తుంది. చేతుల్లో కులుకుతుంది. బొడ్డున నిద్రపోతుంది.

మురళిని చూస్తే చాలు గోపికలకు ఎంతో అసూయ. అదెప్పుడూ శ్రీకృష్ణుని విడిచి ఉండదు. తమకా భాగ్యం కలగటం లేదు. ఏమిటి దాని గొప్పతనం? ఏం పుణ్యం చేసుకుంది ఆ మురళి? ఆ మురళినే అడిగి తేల్చుకోవాలనుకున్నారు గోపికలు. ఒకనాడు యమునా తీరంలో ఒక చెట్టు క్రింద నిద్రపోతున్నాడు శ్రీకృష్ణుడు. ఇదే సమయమని మురళిని పట్టుకున్నారు. నీవు ఏం నోములు నోచావు? ఏం వ్రతాలు చేశావు? ఏం పుణ్యం సంపాదించుకున్నావు? తపస్సు చేశావా? జపం చేశావా? ధ్యానం చేశావా?

మంత్రమా? తంత్రమా? ఏం మాయచేసి మా కృష్ణుని వశపరచుకున్నావు? అని అడిగారు గోపికలు.

ఆ మురళి వారితో అన్నది, "అమ్మా! నాకు మీరు చెప్పినవి ఏవీ తెలియదు. అన్ని గొప్ప గొప్ప సాధనలను, పుణ్యకర్మలను నేనేం చేస్తాను? ఏమీ ఎరుగను. అయితే ఒక్కసారి మీరు నన్ను బాగా పరికించి చూడండి. నాలో ఏమున్నది? ఏమీలేదు. ఒట్టి లొట్ట. ఖాళీ గొట్టాన్ని. నా దగ్గర ఏమైనా ఉంటే శ్రీకృష్ణుడు నన్ను దరిచేరనిస్తాడా? అంతా వదులుకున్నాను గనుకనే ఆయన నన్ను పట్టుకున్నాడు. నేను ఆయనను పట్టుకోలేదు. ఆయనే నన్ను పట్టుకున్నాడు - అన్నది ఎంతో వినయంగా.

మురళిలాగా మనం కూడా ఖాళీ కావాలి. సర్వకర్మలను సన్యసించాలి. నేను అనే అహంకారాన్ని వదలాలి. నిమిత్తమాత్రంగా ఉండాలి. అంతా నా గొప్పతనం అనుకోరాదు.

- గొడ్డలి కట్టెలను కొడుతుంది. గొడ్డలి గొప్పతనం కాదు.
- కలం గొప్ప గ్రంధాలను వ్రాస్తుంది. కలం గొప్పతనం కాదు.
- మనం గొప్ప గొప్ప పనులు చేస్తాం. మన గొప్పతనం కాదు.

అన్నింటికి కర్తఅయిన భగవంతునిదే ఆ గొప్పతనం. మనం కేవలం నిమిత్తమాత్రులం. భగవంతుని చేతిలో పనిముట్లం - అని భావిస్తూ సర్వకర్మలను, కర్మఫలాలను భగవంతుని యందు వదిలి భక్తుడు నిశ్చింతుడై యుండాలి.

బాంబే వెళ్ళే ట్రైను కదిలింది. ఆదరాబాదరాగా పరుగెత్తుకుంటూ ఒక పల్లెటూరి వ్యక్తి రెండు పెట్టెలు నెత్తిమీద పెట్టుకొని ఎలాగో శ్రమపడి రైలు ఎక్కాడు. అతడు రొప్పుతూ రోజుతూ, చెమటలు పట్టి ఉన్నాడు. అటూఇటూ చూచి ఒకచోట సీటు ఉంటే కూర్చున్నాడు. కూర్చొని తాను తెచ్చిన పెట్టెలను తన తలపై ఉంచుకొని ప్రయాణం చేస్తున్నాడు. ప్రక్కన కూర్చున్న వ్యక్తి ఈ పల్లెటూరు ఆసామిని అడుగుతున్నాడు. అయ్యా! ఆ పెట్టెలను ఎందుకు నెత్తిమీద పెట్టుకొని మోస్తున్నావు? నీ సీటు క్రింద పెట్టుకోవచ్చు గదా! అన్నాడు. దానికా పల్లెటూరి ఆసామి అంటున్నాడు; "బాబూ! నేను నాకే టికెట్టు తీసుకున్నాను. వీటిని రైలు మోస్తుందో మోయలేదో తెలియదు గదా! అందుకే నేనే మోస్తున్నాను అని అన్నాడట. దానికా వ్యక్తి అతడి అమాయకత్వానికి నవ్వి నాయనా! నిన్నూ, నీ పెట్టెలను అన్నింటిని ఆ రైలే మోస్తుంది. నీవు నెత్తిమీద పెట్టుకున్నా వాటి బరువును రైలే మొయ్యాలి. ఎందుకు అనవసరంగా నెత్తిన పెట్టుకొని హైరాన పడతావు? క్రింద పెట్టుకో! ఏం ఫరవాలేదు అన్నాడు.

అలాగే అన్ని భారాలు మోసేవాడు పరమాత్మ. అనవసరంగా అహంకారాన్ని నెత్తిన పెట్టుకొని అన్నీ నేనే మోస్తున్నానని భ్రమ పడుతూ ఉంటాం. అన్నీ నావల్లనే జరుగుతున్నవి అంటాం. ఇదంతా ఒట్టి అహంకారం. ఈ అహంకారాన్ని వదిలితేనే భగవంతుని సాన్నిధ్యం లభించేది.

కనుక కర్మలన్నింటిని భగవంతుని యందే విడిచిపెట్టాలి. అంటే భగవంతుని స్మరిస్తూ కర్మలు ప్రారంభించు. భగవంతుని స్మరిస్తూనే కర్మలను కొనసాగించు. భగవంతుని స్మరణతోనే కర్మలను ముగించు. కర్మఫలాలను



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గురించి ఆలోచించకు. లభించిన దానిని ప్రసాద బుద్ధితో స్వీకరించు. నేను నిమిత్తమాత్రుడను అని భావించు. కర్త భగవంతుడే అనే నమ్మకంతో ఉండు. ఏమి జరిగినా నిశ్చితంగా ఉండు. నేను చేస్తున్నాను, ఇది నా వల్లనే జరుగుతుంది అనే అహంకారాన్ని వదులు. ఈ అహంకారాన్ని వదలటమే కర్మలను భగవంతునిలో సన్యసించుట. అలాచేస్తే నీవు భగవంతుని చేతిలో మురళివై పోతావు.

ఇలా సర్వకర్మలను భగవంతునిలో సన్యసించి, భగవంతునే లక్ష్యంగా పెట్టుకోవాలి. అదే 'మత్పరః'.

2. మత్పరః- భరతనాట్యం చేసే కళాకారిణి నెత్తిమీద నీటికలశాన్ని పెట్టుకొని చక్కగా హావభావాలు ప్రదర్శిస్తూ నాట్యం చేస్తుంది. తాళానికి అనుగుణంగా ఎంతగా నాట్యంలో లీనమైపోయినా ఆమె దృష్టి అంతా నెత్తిమీది నీటి కలశంపైనే ఉంటుంది. అంటే ఆమె లక్ష్యం నెత్తిమీద నీటి కలశంలో నుండి నీరు క్రింద పడిపోకూడదు. ఆ కలశం కూడా పడిపోకూడదు. అందుకే ఆమె దృష్టినంతా లక్ష్యం మీదనే ఉంచుతుంది. బాణప్రయోగం చేసేవాడు తన దృష్టినంతా లక్ష్యం మీదనే ఉంచుతాడు. గురితప్పకుండా లక్ష్యాన్ని వేయాలనే పట్టుదలతో ఉంటాడు. మిగిలిన విషయాలేవీ అతడికి పట్టవు.

ద్రోణాచార్యుడు శిష్యుల విలువిద్యా పాటవాన్ని పరీక్షించటం కోసం ఒక చెట్టుమీద పక్షిబొమ్మనుంచాడు. అందరిని పిలిచి ఒక్కొక్కరితో బాణాన్ని సంధించమన్నాడు. ధర్మనందనా! పక్షి కనబడుతున్నదా? అన్నాడు. ఆ! అన్నాడు ధర్మరాజు. కొమ్మ కనిపిస్తున్నదా? అన్నాడు. ఆ అన్నాడు ధర్మరాజు.

చెట్టు కనిపిస్తున్నదా? అంటే ఆ కనిపిస్తున్నది అన్నాడు. సరే! నీవు లక్ష్యాన్ని ఛేదించలేవు పొమ్మన్నాడు. అలాగే దుర్యోధన దుశ్శాసనులను, నకుల సహదేవులను పిలిచి అడిగితే వారూ అలాగే చెప్పారు. అప్పుడు అర్జునుని పిలిచి శరసంధానం చేసిన తర్వాత, అవే ప్రశ్నలు అడిగాడు. పక్షి కన్ను కనిపిస్తున్నది. పక్షిగాని, కొమ్మగాని, చెట్టుగాని ఏమీ కనిపించటం లేదు అన్నాడు అర్జునుడు. సరే వెయ్ బాణాన్ని అనగా అర్జునుడు బాణాన్ని వేశాడు. అది పక్షి కంటికి తగిలింది. అంటే దృష్టి లక్ష్యం మీదనే ఉన్నది. అలాగే మనదృష్టి పరమాత్మ మీదనే ఉండాలి. పరమాత్మను లక్ష్యంగా పెట్టుకొని కర్మలు చెయ్యాలి . మనం ఏపని చేసినా అది మనను భగవంతునికి దగ్గర చేస్తుందా? లేదా? అని ఆలోచించాలి. ప్రతి సందర్భంలోను మనం ఇలా ప్రశ్నించుకోవాలి. ఈ పనివల్ల నాకు భగవంతుని అనుగ్రహం లభిస్తుందా? లేదా? నేను భగవంతునికి దగ్గరవుతానా? లేదా? అని చూడాలి.

డబ్బు సంపాదించటానికి భగవంతుణ్ణి ఆశ్రయిస్తాం, పూజిస్తాం, ఆరాధిస్తాం. అలాగాక భగవంతుణ్ణి పూజించటం కోసం, ఆరాధించటం కోసం, దగ్గరకావటం కోసం డబ్బు సంపాదించాలి. ఏపని చేసినా, ఏ ఆలోచన చేసినా భగవంతునికి చేరువయ్యే మార్గాన్నే అనుసరించాలి.

సర్వకర్మలను భగవంతుని యందు వదలాలి అని ఇంతకు ముందు చెప్పిన భగవానుడు ఇప్పుడు మత్పరః అనటంలో ఒక స్వారస్యం ఉంది. నేను అన్నీ వదులుతున్నాను; అన్నింటినీ భగవంతుని కొరకు వదిలిపెడుతున్నాను, త్యాగం చేస్తున్నాను అనే అభిమానాన్ని - సూక్ష్మాహంకారాన్ని కూడా వదలాలి.

అన్నీ వదిలి, వదిలాననే అహంకారం, - త్యాగమూర్తిననే అహంకారం ఉంటే ఎలా? దాన్ని కూడా వదలాలి. అందుకే ఇక్కడ మత్సరః అన్నది .

నిజంగా త్యాగం చేస్తున్నాను - త్యాగం చేస్తున్నాను అంటే ఎవరిని ఉద్ధరించటానికి త్యాగం చేస్తున్నావు? నీకోసం, నీ ఉన్నతికోసం, నీ జన్మసార్థకృత కోసం చేస్తున్నావు. కనుక త్యాగం చేస్తున్నానే అహంకారం కూడదు. ఈ త్యాగం మనకు ఉపయోగపడాలి అనే భావంతోనే చేయాలి. ఒక్కొక్కసారి మనం చేసే త్యాగం అక్కరకు రాకుండా పోతుంది.

మేరీ అనే ఒక అందమైన అమ్మాయి క్రిష్టియన్ అయినప్పటికీ ఒక హిందువుల అబ్బాయిని ప్రేమించి వివాహం చేసుకుంది. ఇద్దరికి ఒకరిపై ఒకరికి ఎంతో ప్రేమ. తల్లిదండ్రుల నెదించి వివాహం చేసుకోవటం వల్ల వేరు కాపురం పెట్టారు. అబ్బాయికి చిన్నఉద్యోగం ఉంది. సంసారాన్ని నెట్టుకరావటమే కష్టంగా ఉంది. అయినా వారి మధ్య గొప్పప్రేమ ఉన్నది.

అబ్బాయికి ఒక వాచీ ఉన్నది. కాని ఆవాచీ స్ట్రాపు తెగిపోయింది. మంచి స్ట్రాపు కొంటే ఆ వాచీ పెట్టుకుంటాడు అని ఆ అమ్మాయి ఆలోచిస్తూ ఉన్నది. అమ్మాయికి అందమైన పొడవాటి జుట్టు ఉన్నది. అందువల్ల మంచి ఖరీదైన దువ్వెన ఒకటి కొనాలని అతడు ఆలోచిస్తున్నాడు. రోజులు గడిచిపోతున్నాయి. ఒక పండుగ రోజున భర్తకు వాచీ స్ట్రాపు కొనాలని మేరీ తన జుట్టును తీసివేయించుకొని, దానిని అమ్మి, ఆ డబ్బుతో మంచి స్ట్రాపు కొనుక్కొచింది. అ విషయం తెలియని అబ్బాయి అదే రోజు పండుగ కానుకగా భార్యకు ఇవ్వాలని తన వాచీని అమ్మివేసి ఒక మంచి ఖరీదైన దువ్వెన

తీసుకొచ్చాడు. ఆ పండుగ రోజున ఎంతో సంతోషంతో మేరీ వాచీస్ట్రాపును భర్తకు ప్రెజెంట్ చేసింది. భర్త దువ్వెనను ప్రెజెంట్ చేశాడు. కాని ఏం ప్రయోజనం? దువ్వుకోటానికి ఈమెది బోడిగుండు. పెట్టుకోవటానికి అతడి దగ్గర వాచీలేదు.

కనుక త్యాగం చేసినా ఇలాంటి త్యాగం వల్ల ప్రయోజనం లేదు. మనం చేసే త్యాగం మన ఉన్నతికి దారితీయాలి. భగవంతుని లక్ష్యంగా పెట్టుకొని చెయ్యాలి. త్యాగం చేశాననే అహంకారం ఏమాత్రం తలెత్తకూడదు. ఇలా భగవంతుని లక్ష్యంగా పెట్టుకొన్న మత్పరుడే అనన్యయోగంతో భగవంతుని భజించటం జరుగుతుంది.

3. <u>అనన్యయోగేన:-</u> అనన్యయోగం. నిజంగా ఇదే అన్నింటికన్న ముఖ్యం. అన్యమైన వాటికి మనస్సులో తావు ఇవ్వకుండా కేవలం ఒక్క భగవంతునికే స్థానం ఇవ్వాలి. ఇదే అనన్యయోగం. భగవద్గీతలో కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం, ధ్యానయోగం, సాంఖ్యయోగం, విజ్ఞానయోగం, విభూతియోగం అనే యోగాలున్నాయి గాని అనన్య యోగమనే పేరు లేదు. పై యోగాల మాదిరిగా ఇది కూడా ఒక యోగమా? - నిజంగా ఇది ఒక ప్రత్యేకమైన యోగం కాదు. అయితే ఇది కలిస్తేనే ఏ యోగానికైనా రాణింపు. ఏ యోగాన్ని ఆచరించినా అనన్యమైన చిత్తంతో ఆచరించాలి. అన్యము అంటే ఇతరమైనది. అనన్యము అంటే ఇతరము కానిది. ఇతరమైనవి లేనిది. కనుక ఇతర ఆలోచనలు లేకుండా ఒక్కదాని మీదనే దృష్టిని నిలిపి ఏ పనినైనా చేసినప్పుడు అనన్యయోగంతో చేసినది అంటాం. అప్పుడే ఆ పనిని సక్రమంగా

నెరవేర్చటం కుదురుతుంది. అంటే భక్తి కూడా ఇతరమైన దేనిమీద లేకుండా ఒక్క భగవంతుని మీదనే మనస్సును నిలపాలి. అదే అనన్యభక్తి. అనన్యయోగం.

ఇప్పుడిక్కడ భగవద్గీతా ప్రవచనాన్ని వింటున్నారు. మీ మనస్సు ఏ ఇతరవిషయాన్నీ ఆలోచించకుండా కేవలం ఇక్కడ చెప్పే విషయం మీదనే ఉంటే అది అనన్యయోగం అవుతుంది. ఈ అనన్యయోగాన్ని భక్తిపరంగాను, జ్ఞానం పరంగాను చెప్పుకోవాలి. నారదుడు భక్తిపరంగా తన భక్తి సూత్రాలలో ఒక సూత్రాన్ని ఇలా వ్రాశాడు.

"అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా" - అంటే అన్యమైన వాటిని ఆశ్రయించకుండా ఉండటమే అనన్యయోగం - అని. ఎవరికి అన్యమైన వాటిని? భగవంతునికి అన్యమైన వాటిని విడిచిపెట్టాలి. ముంచినా, తేల్చినా భగవంతుడొక్కడే తనకు ఆశ్రయం, తనకు దిక్కు. భగవంతుని తప్ప మరి ఎవరినీ, దేనినీ ఆశ్రయించేది లేదు. ఇదే అనన్యత. అనన్యయోగం.

మరి మనం ఎటువంటి భక్తులం? అనన్య భక్తులమేనా? ఆలోచించండి. ఇళ్ళువాకిళ్ళు, ఆస్తిపాస్తులు, నగలునాణేలు, ధనధాన్యాలు - అన్నింటిని సంపాదించుకుంటూ, కూడబెట్టుకుంటూ, రక్షించుకుంటూ, ఏదో కొద్దిసేపు భగవంతుడున్నాడని, ఆయన్ను పూజిస్తే ఇంకా బాగా కలిసి వస్తుందని చేసే పూజ, భక్తి అనన్యమైనదేనా?

భోజనం చేస్తూ మధ్య మధ్య అప్పడం కొరికనట్లు, ఉల్లిపాయ కొరికినట్లు, ఊరగాయ నంజుకున్నట్లు మనం కూడా అప్పుడప్పుడు

భగవంతుడు, భక్తి అంటాం. ఇంకెవరినైనా ఆశ్రయిస్తే ఇంకా గొప్పలాభం కలుగుతుంది అనుకున్నప్పుడు ఈ దేవుణ్ణి వదిలి ఆ దేవుణ్ణి పట్టుకుంటాం. మన స్వంతపనులు గనుక అడ్డువస్తే భగవంతుడూ లేడు, భక్తీ లేదు, అన్నీ వదులుకుంటాం. పూజ చెయ్యటానికి కూర్చుంటాం. T.V. లో మంచి సినిమా వస్తుంటే ఆ! ఈ పూజ తర్వాత చేసుకోవచ్చు. ఈ దేవుడెక్కడికి పోతాడు? నేనెక్కడికి పోతాను. ఈTV వాడు మళ్ళీ వెయ్యాలంటే వేస్తాడా? అని పూజను ఆపి సినిమా కోసం TV ముందుకు వచ్చి కూర్చుంటాం. నిన్న వేదాంతం వినటానికి రాలేదేం? అంటే వద్దామని బయలు దేరానండి - అదే సమయానికి మా ఫ్రెండ్ వచ్చాడు. వాడితో మాట్లాడుతూ ఉంటే టైమ్ అయిపోయింది అంటాం. అంటే వేదాంతం కోసం ఫ్రెండ్ ను వదులుకోలేదు. ఫ్రెండ్ కోసం వేదాంతాన్ని వదిలేశావు. భగవంతుని కోసం మనకర్మలను వదలటం కాదు, మనపనుల కోసం భగవంతునికి టాటా చెప్పేస్తాం. ఇదీ మనభక్తి - అనన్యభక్తి.

మనం నిజంగా భగవంతుని ఆశ్రయంతో బ్రతుకుతున్నాం. అప్పుడప్పుడూ అంటూ ఉంటాం. ఏదో అంతా భగవంతుని దయండీ! ఆయన దయవల్లనే ఏదో కడుపు నిండా తినగలుగుతున్నాం - అని. అలా అంటామే గాని నిజంగా ఆ భావన మనలో ఉందా? లేదు. ఏదో ఫ్యాషన్ కోసం అంటాం; అలవాటుగా అంటాం; ఊతపదంగా అంటాం. ఇలా భగవంతుని దయ అన్న మనమే ఎవరైనా దూరపు బంధువు కనిపించి 'అంతా బాగున్నారా? ఏం చేస్తున్నావిప్పుడు? అంటే "అమ్మాయి పెళ్ళి చేశాను. అబ్బాయిలిద్దరికి ఉద్యోగాలు వేయించాను. పెద్దవాడికి పెళ్ళి చేశాను. ఇక రెండో వాడికి కూడా

చెయ్యాలని చూస్తున్నాను. పాత ఇల్లు పడేసి బిల్డింగు కట్టించాను. ఇద్దరబ్బాయిలకు రెండు ఇళ్ళుకొని వారి పేరన పెట్టేశాను. ఇక వృద్ధాప్యంలో వీళ్ళ మీద ఆధారపడకుండా 15 లక్షలు బ్యాంకులో వేసుకున్నాను. ఇక వాళ్ళు చూచినా, చూడకపోయినా దిగులులేదు. ఆ డబ్బులే చూస్తాయి" - అంటాం. అన్ని జాగ్రత్తలు మనమే పడితే, అన్ని తెలివితేటలు మనకే ఉంటే, అన్నీ మన చేతుల్లోనే ఉంటే ఇంక భగవంతుని దేముంది? ఆయన దయతో పనేమిటి? అంతా మన ప్రతిభయే గాని భగవంతుని దయ ఎక్కడుంది? కనుక అది అలావాటుగా పలికే మాటయే గాని, హృదయపూర్వకంగా నమ్మిన మాటకాదు.

ఎవరన్నా తెలిసినవాణ్ణి ఎలా ఉన్నావు? ఎలా జీవనం సాగిస్తున్నావు? అంటే పొలాలున్నాయి గదా! అంటాడు. వ్యాపారం ఉందిగదా! అంటాడు. ఉద్యోగం ఉందిగదా! అంటాడు. పెన్షను వస్తున్నదిగదా! అంటాడు. అద్దెలు వస్తున్నాయిగదా! అంటాడు. కొడుక్కి జీతం వస్తుందిగదా! అంటాడు. ఆశ్రమం ఉందిగదా! అంటాడు. కాని భగవంతుని ఆశ్రయంతో బ్రతుకుతున్నానని చెప్పేవాడే ఉండడు. నిజంగా భగవంతుని దయ, అనుగ్రహం లేకపోతే ఒకక్షణం జీవించగలమా? మనం ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా భగవంతుడు కళ్ళుతెరిస్తే ఒక్కక్షణం పట్టదు అన్ని ఆశలు పేకమేడల్లా కూలిపోవటానికి.

మహారాష్ట్రలో వచ్చిన భూకంపంలో ఇళ్ళు, వాకిళ్ళూ, బ్యాంకులు, స్కూళ్ళు, మనుషులు, పిల్లలు అంతా తిరిగి చూచేటప్పటికి లేరు. నిర్భాగ్యులుగా మిగిలిన కొద్దిమంది తప్ప ఏమీలేదు. ఆ సమయంలో నీ మేడలు, నీ

పొలాలు, నీ నగలు, నీ బ్యాంక్ బ్యాలెన్స్ లు, నీ పదవులు ఏవీ నీకు కూడుపెట్టవు. ప్రభుత్వం వాళ్ళు హెలికాప్టరు నుండి వదిలే ఆహారపొట్లాల కోసం పోరాడి, యుద్ధం చేసి దక్కించుకుంటే తప్ప నీకు గతి ఏమిటి? కోట్లున్న వాడివైనా ఆకలితో నకనకలాడాల్సిందే. భగవంతుని దయలేకపోతే ఏమీ లేనివాడివే. అందుకే జీసస్ క్రైస్ట్ అన్నాడు, మనిషి రొట్టె వల్లకాదు బ్రతుకుతున్నది, దేవుని మాట వల్ల" - అని.

"మనిషి ప్రాణ అపానాల వల్ల జీవించటం లేదు; ప్రాణానికి ప్రాణమైన భగవంతుని వల్ల జీవిస్తున్నాడు" - అని కఠోపనిషత్ చెబుతున్నది. కాని మనిషి మాత్రం అవిశ్వాసి - అల్పవిశ్వాసి. భగవంతుణ్ణి పూర్తిగ నమ్మడు. భగవంతుడే దిక్కని శరణాగతి చెందడు. ఆయన మీదనే భారం వెయ్యడు. అనన్యయోగంతో నమ్మడు.

నిజమైన భక్తుడికి ఇతర విషయాలన్నీ అల్పమైనవి. తనకు వచ్చే కష్టాలు కూడా అల్పమైనవే. భగవంతుడొక్కడే తనకు ఆధారం. ఆయనే ఆశ్రయం. పాలముంచినా, నీటముంచినా నీదే భారం అంటాడు. భగవంతుని కొరకు దేనినైనా వదులుకుంటాడు. ఎన్ని అవమానాలైనా భరిస్తాడు. ఎన్ని కష్టాలైనా - బాధలైనా అనుభవిస్తాడు.

గుజరాతు రాష్ట్రంలో నరసీమెహతా అనే భక్తుడు ఉండేవాడు. తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోవటంతో అన్న బన్సీధరుడు వదిన దురితగౌరి యొక్క సంరక్షణలో ఉంటున్నాడు. వదినగారిది క్రూరస్వభావం. భర్తకు చాడీలు చెప్పి నరసీమెహతాను ఎప్పుడూ కొట్టిస్తూ ఉండేది. 15సం||ల



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వయస్సు రాగానే అతనికి పెళ్ళిచేశారు. ఇద్దరు పిల్లలు కలిగారు. నరసీమెహతాతో పాటు అతని భార్యాపిల్లలను కూడా అనేక విధాల హింసించేది అతడి వదిన. చివరకు ఒకరోజున వారిని ఇంటినుండి వెళ్ళగొట్టింది.

భార్యాపిల్లలతో, కట్టుబట్టలతో బయటకు వచ్చిన నరసీమెహతా ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. కుటుంబభారాన్ని భగవంతునిపై ఉంచి నిరంతరం కృష్ణ కథాగానంతో కాలక్షేపం చేసేవాడు నరసీ. భక్తులు ఆయనను దర్శించి కానుకలిచ్చేవారు. అదే భగవత్ ప్రసాదమని జీవిస్తున్నది ఆ కుటుంబం.

నరసీ తన కుమార్తెకు బాల్యంలోనే వివాహం చేశాడు. ఆమె అత్తవారింట్లోనే ఉండి అక్కడే రజస్వల అయ్యింది. అందువల్ల భార్య నరసీతో అన్నది; "ఏమండీ సారె తీసుకొని వెళ్ళి ఇవ్వాల్సిన ధర్మం మనమీద ఉన్నది" - అని. అవును. నీవు చెప్పినది ధర్మమే. నేను వెళ్ళి సారె ఇచ్చి వస్తాను అని తంబూర చేత ధరించి, చిరుతలు తగిలించుకొని సంకీర్తన చేస్తూ నరసీ బయలుదేరాడు. అల్లుడిగారి ఇంట్లో కాలు పెట్టగానే "హరిదాసులాగా కీర్తన చేస్తూ వస్తున్నావు. చేతిలో తంబుర తప్ప సారె ఏదీ" అన్నారు వియ్యాలవారు.

"సారభూతమైన భగవన్నామమే నేను ఇవ్వగల సారె" - "భగవన్నామము కన్న మించిన సారె ఏముంటుంది? అన్నాడు పరవశంతో. బంధువులలో గుసగుసలు ప్రారంభమైనవి. వియ్యంకుడు రుసరుసలాడుతున్నాడు. "కన్నబిడ్డకు తొలిసారిగా సారె పెట్టలేని దౌర్భాగ్య కుటుంబమా మీది" అన్నాడు వియ్యంకుడు. అల్లుడుగారు కోడెత్రాచు అయ్యాడు. "మర్యాద తెలియని

మందభాగ్యులు. బుద్ధిహీనులు. తమ చేతగానితనాన్ని కప్పిపుచ్చుకోవటానికి 'భక్తి' అనే బురఖా తగిలిచుకున్నాడు"అన్నాడు. ఇక అబ్బాయి తల్లి తీర్పు చెప్పేసింది. "అమ్మాయిని కూడా తండ్రితో పంపిస్తే సరి. అందరూ కూర్చొని భజన చేసుకుంటూ ఉంటారు" అని. ఇది అంతా చూస్తూ, వింటున్న కుమార్తె తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా! మీ ప్రవర్తన ఇక్కడ నాకు నిలువ నీడ లేకుండా చేస్తున్నది. నా బ్రతుకు ఇలా నలుగురిలో నగుబాట్లు కావాలని రాసిపెట్టి ఉన్నది" అని దుఃఖించింది.

నరసీ హృదయం ద్రవించిది. కుమార్తె ముఖం చూడలేకపోయాడు. దానితో నరసీ తన వియ్యంకుణ్ణి పిలిచి, "మీరెవరూ నాకుమార్తెను తూలనాడవలసిన పనిలేదు. సారెకు సంబంధించిన వస్తువులు ఏమేమి కావాలో లిస్టు వ్రాసి ఇవ్వండి. అన్నీ తెచ్చి ఇస్తాను" అన్నాడు. చీరెలు, నగలు, పాత్రలు, బీరువా, మంచం, పిండివంటలు - ఇలా కావలసిన వన్నీ లిస్టు వ్రాయించి ఇచ్చాడు వియ్యంకుడు. ఇంకా ఏమైనా కావాలంటే చెప్పండి అన్నాడు నరసీ. లిస్టు వ్రాసిన వాడితో నీకేమైనా కావాలంటే వ్రాసుకో అన్నాడు వియ్యంకుడు. వాడు వెటకారంగా గుండ్రాయి కావాలని వ్రాశాడు.

ఆ లిస్టు చేత బట్టుకొని నరసీ ఆ ఊరిలో ఉన్న పాండురంగస్వామి దేవాలయంలో ప్రవేశించాడు. ఆ లిస్టును ముందుంచుకొని కన్నీరు కారుస్తూ సంకీర్తన ప్రారంభించాడు. తనకు భగవంతుడే దిక్కు. ఏం చేసినా ఆయన చేయాల్సిందేనని భావిస్తూ హృదయావేదనతో సంకీర్తన చేస్తున్నాడు. అలా సంకీర్తన చేస్తూనే అలసి, సొలసి అక్కడే పడిపోయాడు.

నరసీ హృదయావేదన భగవంతుణ్ణి కదిలించింది. లిస్టులోని సరుకులన్నీ బండిలో వేసుకొని, పాండురంగడే ఒక బాలుని వేషంలో బండి తోలుకుంటూ నరసీ వియ్యంకుడి ఇంటికి వెళ్ళాడు. మారువేషంలో ఉన్న పాండురంగణ్ణి ఎవ్వరూ గుర్తించలేదు. ఆ వియ్యంకుడితో ఈ బాలుడు ఇలా అన్నాడు. "అయ్యా! నేను నరసీ మెహతా సేవకుణ్ణి. మీకివ్వమని నన్ను పంపటంతో ఈ సామాను తీసుకొని వచ్చాను. అన్నీ సరిగ్గా ఉన్నాయో లేదో చూడండి" - అన్నాడు. విలువైన ఆభరణాలతో సహా లిస్టులో వ్రాసిన వన్నీ ఉన్నాయి. చివరకు గుండ్రాయి కూడా ఉన్నది. అందరూ ఆశ్చర్యపోయారు. 'అయ్యా! నాకు సెలవిప్పించండి' అన్నాడు బండి కుర్రవాడు. 'మా నరసీ ఎక్కడ?' అని వియ్యంకుడు అడిగాడు. "ఆయన పాండురంగ స్వామి ఆలయంలో ఉన్నాడని" చెప్పి ఆ బండి కుర్రవాడు వెళ్ళిపోయాడు. ఆ మాటవిని బంధువులంతా ఆలయానికి వెళ్ళారు. అక్కడ అలసిపోయి పడిఉన్న నరసీ మెహతాను లేపారు. నరసీ లేస్తూనే అక్కడున్న అందరికీ నమస్కరించి, "బావగారూ! మీరు కోరిన వస్తువులనింటితో సారె పంపుతాను. నాకు కొద్దిరోజులు గడువివ్వండి" అని ప్రార్థించాడు. బంధువులంతా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "అదేమిటి బావగారూ! నీవు పంపిన సారెను మీ సేవకుడు అప్పగించి వెళ్ళాడు గదా! మీరు ఇక్కడున్నారని అతడు చెప్పటం వల్లనే మేమందరం ఇక్కడకు వచ్చాం. మమ్ములను మీరే క్షమించాలి" అన్నాడు వియ్యంకుడు ఎంతో వినయంతో.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నరసీ జరిగిన సంఘటనను అర్థం చేసుకున్నాడు. హే భక్తవత్సలా! పాండురంగా! ఈ దీనుణ్ణి రక్షించటానికి స్వయంగా నీవే వెళ్ళావా? పైగా నా సేవకుడనని చెప్పావా? నీ దర్శనం పొందిన వీరెంతో ధన్యులు. నాకు నీ దర్శన భాగ్యం కలిగించావా? అని ఆవేశంతో కీర్తించాడు.

ఇలా అన్యమైన దేనినీ - ఎవరినీ ఆశ్రయించకుండా కేవలం భగవంతునే ఆశ్రయిస్తే, ఆయననే శరణాగతి కోరితే అదే అనన్యయోగం.

ఇలా సర్వకర్మలను భగవంతునికే సమర్పించి - భగవంతుని కొరకు సన్యసించి ఆ భగవంతునే లక్ష్యంగా పెట్టుకొని అన్యమైన ఆలోచనలు లేకుండా భగవంతునే నమ్మి మనస్సును భగవంతుని యందే నిలుపగల ఇట్టి భక్తులకు భగవానుడు ఏమి హామీ ఇస్తున్నాడో 7వ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

**శ్లో||** తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్|
భవామి నచిరాత్ పార్థ! మయ్యావేశిత చేతసాం|| (7)

**తా||** పార్థా! నా యందే మనస్సు నిలిపిన అట్టివారిని నేనే ఈ మృత్యురూప సంసార సాగరం నుండి అచిరకాలంలోనే ఉద్ధరిస్తాను.

**వ్యాఖ్య:-** సగుణోపాసకులు ఎవరు? నిర్గుణోపాసకులు ఎవరు?

(i) మనస్సు పరవశంలో ఉండే భక్తులు, ఆవేశపరులు సాకారాన్ని ఉపాసిస్తారు. వారే సగుణభక్తులు . (ii) ఆలోచనాపరులు బుద్ధి ద్వారా నిరాకారాన్ని ఉపాసిస్తారు. వీరు నిర్గుణభక్తులు - అంటే జ్ఞానులు. ఎవరి స్థాయికి తగ్గట్లు

వారు ఉపాసన చేయాలి. భగవంతుడు మాత్రం ఒక్కడే.

తేషాం:- అట్టివారిని. ఎట్టివారిని? సర్వకర్మలను భగవంతుని కొరకు సన్యసించి, భగవంతునే పరమలక్ష్యంగా పెట్టుకొని, ఇతర భావనలు లేకుండా అనన్యయోగంతో, మనస్సును భగవంతుని యందే నిలిపే అట్టి భక్తులైన వారిని ప్రశంశిస్తూ భగవంతుడు వారికి ఒక హామీయిస్తున్నాడు. ఏమని?

తేషాం అహం సముద్ధార్తా మృత్యు సంసార సాగరాత్ :- అట్టివారిని నేనే మృత్యురూప సంసార సాగరం నుండి ఉద్ధరిస్తాను. ఈ సంసారం మృత్యు రూపమైనది. సాగరం వంటిది. సంసారం అంటే జననమరణ రూప జీవనచక్రం. నిరంతరం పుట్టటం, చావటం, తిరిగి పుట్టటం, చావటం - దీనికి అంతూ పొంతూ లేదు. ఈ మార్పులు ఎప్పుడూ జరుగుతూనే ఉంటాయి. అందుకే ఇది మృత్యురూపం. మార్పులతో కూడుకున్నది. దీనిని సముద్రంతో ఎందుకు పోల్చారు? సముద్రంలో అలలు పుడుతూ ఉంటాయి. కొంతదూరం ప్రయాణించి పడిపోతూ ఉంటాయి. నిరంతరం ఈ లేవటం, పడటం జరిగిపోతూనే ఉంటుంది. అంతం లేదు దీనికి. అందుకే సంసారసాగరం అన్నారు. దీని నుండి ఉద్ధరించబడాలంటే ఎలా? ఈ జననమరణాల నుండి తప్పించుకోవటం ఎలా? దానికి భగవంతునే ఆశ్రయించాలి. నేనే ఉద్ధరిస్తానని భగవానుడు హామీ ఇస్తున్నాడు. ఈ సంసారమనే సముద్రాన్ని దాటటానికి భగవంతుని కన్న గొప్ప 'కెప్టెన్' ఎవరుంటారు? ఎంత అల్లకల్లోల సాగరం నుండైనా భగవంతుడు తరింపజేయగలడు. అయితే ఎప్పుడు?

అచిరాత్:- అచిరకాలంలోనే. శీఘ్రంగానే. కాకపోతే మనం మాత్రం భగవంతుని వదిలిపెట్టకుండా, నిరంతరం ఆయననే స్మరిస్తూ, ధ్యానిస్తూ, ఉపాసిస్తూ ఉండాలి.

సముద్ధార్తా:- ఉద్ధార్తా అనక సముద్ధార్తా అనటం వల్ల ఉద్ధరించగలను, తప్పక ఉద్ధరించగలను అనే హామీ ఇస్తున్నాడు. అయితే ఎట్టివారిని?

మాంధ్యాయంత ఉపాసతే :- ఊరికే ఉపాసించటం గాక నన్ను ధ్యానిస్తూ ఉపాసించేవారిని. భగవంతుని గుణగణాలను ధ్యానించాలి. భగవంతుని ఉపాసించేటప్పుడు ఆయన స్వరూప స్వభావాలను, గుణగణాలను ధ్యానించాలి.

మయి ఆవేశిత చేతసాం:- అన్నింటికన్న ముఖ్యం మనస్సు పూర్తిగా నాయందే నిలపాలి. అట్టివారిని అచిరకాలంలోనే ఉద్ధరిస్తాను అంటున్నాడు భగవానుడు ఏ సాధన ద్వారానైనా మనస్సును పూర్తిగ - నిరంతరము భగవంతుని యందే నిలపాలి. భగవంతునికే ప్రథమస్థానం ఇవ్వాలి. భగవంతుని కొరకు దేనినైనా త్యాగం చేయగలగాలి. భగవంతునే లక్ష్యంగా - పరమగతిగా భావించాలి.

ఇక్కడొక ముఖ్య విశేషాన్ని గమనించండి -

సగుణభక్తుల విషయంలో - 'తేషాం అహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్' అని, నిర్గుణ భక్తుల విషయంలో - 'తే ప్రాప్నువంతి మామేవ' అని అంటున్నాడు భగవానుడు. సగుణభక్తులను నేనే ఉద్ధరిస్తాను అన్న భగవానుడు నిర్గుణభక్తుల గురించి చెబుతూ వారు నన్నే పొందగలరు అంటున్నాడు. ఎందుకిలా? నిర్గుణభక్తులు జ్ఞానులు, సర్వస్వతంత్రులు. కనుక వారంతట వారే

నన్ను చేరుకోగలరు. సగుణ భక్తులు మైనరు పిల్లల లాంటి వారు. కనుక వారికి తానే దారి చూపించాలి. తానే వారిని ఉద్ధరించాలి. అంటే వారు తరించటానికి కావలసిన జ్ఞానాన్ని తానే ప్రసాదిస్తాడు.

(i) <u>సగుణ భక్తుల విషయంలో మార్జాల కిశోర న్యాయం</u>:- పిల్లి తన పిల్లలను తానే గట్టిగా పట్టుకొని కావలసిన చోటికి తీసుకువెళుతుంది. పిల్లలు జాగ్రత్తలు తీసుకోవు. తల్లే జాగ్రత్తలు తీసుకుంటుంది.

(ii) <u>నిర్గుణభక్తుల విషయంలో మర్కట కిశోర న్యాయం</u>:- కోతి తన పిల్లలను పొట్టకు కలిపించుకొని తీసుకెళ్ళేటప్పుడు పిల్లలే తల్లిని జాగ్రత్తగా పట్టుకొని ఉంటాయి. తల్లికి ఏ భాద్యతా లేదు. కనుక సగుణోపాసన నిరపాయకరం.

- ఇక సాధనా మార్గాన్ని 8వ శ్లోకం నుండి ప్రారంభిస్తున్నారు.

ఇంతవరకు అర్జునుని ప్రశ్నకు సమాధానంగా సగుణ - నిర్గుణ ఉపాసనలను, తీసుకోవలసిన జాగ్రత్తలను, వచ్చే ఫలితాలను తెలియజేశాడు భగవానుడు. ఇప్పుడు సాధనా మార్గాలను 5 శ్లోకాలలో తెలియజేయబోతున్నాడు. అన్నింటికన్నా ఉత్తమోత్తమ సాధనను 8వ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో||** మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ|
నివశిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః|| (8)

**తా||** నా యందే మనస్సును నిలుపు. నాలోనే బుద్ధిని చొప్పించు. ఆపైన నాలోనే నివసిస్తావు. సందేహం లేదు.

**వ్యాఖ్య:-** ఉపాధ్యాయుడు స్కూల్లో పాఠాలు చెప్పినట్లుగా "ఇలా చెయ్యాలి. అలా చెయ్యలేక పోతే ఇలాగైనా చెయ్యి. అదీ చెయ్యలేకపోతే పోనీ కనీసం ఇలాగన్నా చెయ్యి". అంటూ విద్యార్థికి సులభంగా ఉండేటట్లు బోధించటం ప్రారంభిస్తున్నాడు భగవానుడు.

అన్నింటికన్నా ఉత్తమోత్తమ సాధన నాలోనే మనస్సు నిలుపు. నాలోనే బుద్ధిని చొప్పించు. దానితో నీవు నాలోనే నిలుస్తావు. ఇందులో సంశయం లేదు. మనోబుద్ధులు రెండూ పరమాత్మకు సమర్పించాలి. ఆయనలోనే స్థిరంగా నిలపాలి. మనోబుద్ధులు రెండింటినీ కలిపే ఇక్కడ చెబుతున్నారు. ఎందుకంటే బుద్ధి చెప్పిన విధంగా మనస్సు నడుచుకోదు. మనస్సు కోరిన దాన్ని బుద్ధి అంగీకరించదు. కనుక రెండూ ఒకదారికి రావాలి.

సాకారోపాసనలో మనం దివ్యమంగళ విగ్రహుడైన ఆ శ్రీకృష్ణ పరమాత్మ చలువరాతి విగ్రహాన్ని చూచి ఎంతగానో తన్మయమైపోతూ దానిని మనస్సుతో ఎంతగా మెచ్చుకున్నా, పరవశం చెందినా, ఆనందించినా ప్రయోజనం లేదు. విగ్రహాన్ని తయారుచేయటంలోని నైపుణ్యాన్ని గురించి పరవశిస్తాం. లేదా విగ్రహానికి ఉపయోగించిన చలువరాతి యొక్క నిర్మలత్వానికి ఆనందిస్తాం. లేదా అలంకారాల గురించి, ఆభరణాలను చూచి ఆనందిస్తాం. అంతేగాని పరమాత్మ తత్త్వాన్ని గూర్చి బుద్ధితో ఆలోచించటం లేదు. ఇలా బుద్ధిని ఉపయోగించకుండా మనస్సు ద్వారా పరవశం చెందితే ప్రయోజనం లేదు. అలాగాక ఒకవేళ బుద్ధి నిరాకార నిర్గుణ పరబ్రహ్మ తత్త్వంలో నిలిచి, మనస్సు ఆ తత్త్వంలో నిలవక చలిస్తూ ఉన్నా ప్రయోజనం

లేదు.

సూదిలా కుట్టుకుంటూ అన్నింటినీ కలుపుకుంటూ పోవటం మనస్సు పని. కత్తెరలా కత్తిరించుకుంటూ అన్నింటి విశ్లేషించి తెలుసుకోవటం బుద్ధి పని. ఇవి రెండూ పరస్పర వర్ధకాలు. వ్యక్తిలో రెండూ ఉంటాయి. ఈ రెండూ కలిసి భగవంతుని అందుకోవటానికి ప్రయత్నిస్తేనే వ్యక్తి భగవంతునిలో ఉండిపోతాడు.

కనుక బుద్ధి నిరాకారంలో నిలిచి ధ్యానిస్తున్నప్పుడు మనస్సు ఆ తత్త్వాన్నే ప్రేమించాలి, పరవశం చెందాలి. మనస్సు సాకారంలో పరవశించి కరిగిపోయినప్పుడు బుద్ధి ఆ విగ్రహం వెనుక నన్ను పరమాత్మ తత్త్వాన్ని శోధించాలి, విచారణ చేయాలి. ఇలా మనోబుద్ధులు రెండింటిని పరమాత్మలో నిలిపితేనే మనం భగవంతునిలో నిలిచేది. అయితే దేహాభిమానం ఉన్నంతవరకు మనోబుద్ధులు రెండింటిని భగవంతునిలో నిలపటం కష్టం.

'ఈ దేహం నేను', 'ఈ మనోబుద్ధులు నేను' అనే అభిమానం, అహంకారం ఉన్నంతవరకు భగవత్ ప్రాప్తి లేదు. వాటిపై గల అభిమానాన్ని వదిలించుకుంటేనే మనోబుద్ధులు భగవంతునిలో నిలిచేది. మనోబుద్ధులు రెండింటినీ నీ పట్టునుంచి తొలగించాలి. భగవంతుని కర్పించాలి. అయితే అది అంత సులభమా? కాదు. శివానందలహరిలో ఒక స్తోత్రంలో శంకరాచార్యులవారు ఇలా అంటారు.

శంకరాచార్యులవారు కాశీవిశ్వేశ్వరుని దర్శించి భక్తితో పరవశించారు. ఆయన హృదయంలో ఒక భావం కలిగింది. "ఓ పరమేశ్వరా! విశ్వనాథా! నీ

కష్టం చూచి నేను భరించలేక పోతున్నానయ్యా! నీకొక ఉపకారం చెయ్యాలని నాకనిపిస్తున్నది. నీవెటూ భిక్షాటనకు వెళుతున్నావు గదా! ఊరికే అడిగితే ఎవరు భిక్ష వేస్తారు. నీకో ఉపాయం చెబుతాను. నా దగ్గర ఒక కోతి ఉన్నది. దానిని నీకు ఫ్రీగా ఇచ్చేస్తాను. అది గనుక నీ దగ్గర ఉంటే నీకు బాగా భిక్ష దొరుకుతుంది; నీ వృత్తికి బాగా అనుకూలంగా ఉంటుంది. నాకేమో ఈ పీడా వదిలిపోతుంది. ఇద్దరికీ మేలే" - అని మనవి జేసుకున్నాడు.

ఏమిటా కోతి? మనస్సే. ఆ మనస్సే మనను దుఃఖాలకు గురిచేస్తున్నది. దాన్ని వదిలిచుకొని భగవంతునికిచ్చేస్తే మనం ఆయనలో ఉన్నట్లే. ఎంత గొప్పభావం? మనస్సు ఆత్మలో లయం కావటం అంటే ఇదే. దేహాభిమానం వదిలితే జీవుడు దేవుడే. బ్రహ్మ సాక్షాత్కారం అయినట్లే. అయితే సామాన్యులకు అది సాధ్యం కాదు.

జనక మహారాజు బ్రహ్మజ్ఞానియైన అష్టావక్రమహర్షి వద్దకెళ్ళి బ్రహ్మజ్ఞానాన్ని బోధించమని, పరమాత్మ సాక్షాత్కారాన్ని కలిగించమని ప్రార్థించాడు. దానికి అష్టావక్రమహర్షి, "నేను బ్రహ్మవిద్యను బోధిస్తాను. అయితే గురుదక్షిణగా నాకేమిస్తావో చెప్పు" అన్నాడు. ఆలోచనలో పడ్డాడు జనకమహారాజు. మనం కూడా అంతే. బ్రహ్మజ్ఞానాన్ని బోధించిన గురువుకు గురుదక్షిణ ఇవ్వాలంటే గొప్ప ఆలోచనలో పడిపోతాం. ఎవరెవరు ఎతెంత ఇస్తున్నారో పదిమందినీ విచారించి తెలుసుకుంటాం. ఆ తరువాత లెక్కలు వేసి ఎంత తక్కువ ఇవ్వటానికి వీలవుతుందో చూసి ఇస్తుంటాం. అయితే జనకమహారాజు ఆలోచనలో పడ్డది మాత్రం అందుకు కాదు. ఆయన



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

బ్రహ్మజ్ఞానం విలువ తెలిసినవాడు గదా! బ్రహ్మజ్ఞానానికి సరితూగే వస్తువు గురుదక్షిణగా ఇవ్వటానికి తన దగ్గర ఏముంది? తన దగ్గర ఉన్నవన్నీ అనిత్యవస్తువులు. తన రాజ్యం కూడా అనిత్యమైనదే. బ్రహ్మజ్ఞానమేమో నిత్యమైనది. నిత్యవస్తువుకు బదులుగా అనిత్యవస్తువుల నెలా ఇవ్వటం? సమాధానం దొరకక ఊరుకున్నాడు. ఇక గురుదేవునే అడిగి ఆయన ఇష్టప్రకారం చేయాలనకున్నాడు.

ఒకనాడు వేటకై అరణ్యానికి బయలుదేరుతూ జనకమహారాజు గుర్రాన్ని ఎక్కబోతున్నాడు. అంతలో అష్టావక్రుడు అక్కడికి వచ్చి, "మహారాజా! బ్రహ్మజ్ఞానాన్ని బోధించమని చాలా కాలంగా అడుగుతున్నారు గదా! కాలం గడిచిపోతున్నది. కనుక నీ కోరికను తీర్చుకో" అన్నాడు. రాజు గుర్రాన్ని ఎక్కబోతూ, "మహాత్మా! ఎంత కాలంలో నాకు బ్రహ్మసాక్షాత్కారాన్ని కలిగించ గలుగుతారు?" అన్నాడు. దానికాయన "రాజేంద్రా! మీరు ఒక కాలు రికాబులో పెట్టిన తర్వాత రెండవ కాలును రెండవ వైపు రికాబులో పెట్టే లోపల బ్రహ్మసాక్షాత్కారం కలిగిస్తాను" - అన్నాడు మహర్షి.

"అయితే గురుదక్షిణ ఏమడుగుతారో అడగండి" అన్నాడు జనకుడు -

"నీ దేహాభిమానాన్ని నాకిచ్చేసెయ్" అన్నాడు గురువు.

శిష్యుడు సామాన్యుడా! ముత్యపు చిప్ప రెడీగా ఉంది. చినుకు పడటమే తరువాయి. జనకుడు గుర్రంపై నిలిచే సాక్షాత్కారం పొందాడు.

- దేహాభిమనాన్ని వదిలితే జీవుడు దేవుడే.
- ఘటాభిమానాన్ని వదిలితే ఘటాకాశం మహాకాశమే.

అందుకే నీ మనోబుద్ధులు నాకు సమర్పించు అంటున్నాడు భగవానుడు.

గోపికలు దేహాభిమానాన్ని వదిలారు. అదే వస్త్రాపహరణలీల. దేహాన్ని వస్త్రంతో పోల్చారు వేదాంతంలో. వస్త్రాన్ని హరించటమంటే దేహాభిమానాన్ని హరించటమే. అందుకే చిన్నికృష్ణుడు తమ ఇండ్లలో కుండలను పగలగొట్టి వెన్నను దొంగలించినప్పుడు అంటుంటారు, "కృష్ణా మా ఉపాధులనే కుండలను పగులగొట్టి హృదయమనే వెన్నను దొంగాలించావా! ఎంత దొంగవయ్యా నీవు? అని.

అసలు భగవంతుడు మనకు మనోబుద్ధులను ప్రసాదించింది మోక్షాన్ని అందుకొనుటకే. కాలం వృధా చేసుకోకుండా వాటి సహాయంతో సాధన చేసి మోక్షాన్ని పొందాలి. భగవంతుడిచ్చిన వాటిని తిరిగి ఆయనకే సమర్పించాలి. లేకపోతే భగవత్ ద్రోహులమవుతాం.

మనసు నిజంగా గయ్యాళిగంప. అది తనకు నచ్చిన పనులు చేస్తుందే గాని మనం చెప్పిన పనులు చేయదు. తల దువ్వుకోటానికో; బొట్టు పెట్టుకోటానికో; చీరలు నగలు సింగారించుకోటానికో; బూటు పాలిష్ చేసుకోవటానికో; కాలరు టై బిగించుకోటానికో; పౌడర్లు, స్నోలు రాసుకోవటానికో గంటలు గంటలు ఖర్చు పెడుతుంది గాని, జపం చెయ్యటానికో; ధ్యానం చెయ్యటానికో పట్టుమని 10 నిమిషాలు కేటాయించదు. ఏదో కొంపలు మునిగిపోయినట్లు తపించి పోతుంది. జపం చెయ్యటం లేదేం? ధ్యానం చెయ్యటం లేదేం? అంటే చాలు - ఏదండీ తీరుబాటు కావటం లేదంటాం. మీలాగా మేం సన్యాసులం కాదు గదా! అని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పైకి అనకపోయినా అనుకుంటాం. ఇల్లూ, వాకిలి, పెళ్ళాం, బిడ్డలు, ఉద్యోగం, వ్యాపారం బోలెడు జంజాటకం. ఇవన్నీ కదలనివ్వటం లేదు అంటాం. నిజంగా అవి మనను పట్టుకున్నాయా? మనం వాటిని పట్టుకొని విడిచిపెట్టలేక పోతున్నామా?

ఎరుకల వాళ్ళు మామిడితోటల్లో కోతులను పట్టుకోవటం కోసం కడవను తీసుకెళతారు. దాని మూతి చిన్నది. పొట్ట పెద్దది. దానిని భూమిలో గుంటతీసి పూడ్చి మూతి మాత్రం భూమిపై కనిపించేట్లు ఉంచుతారు. దానిలో వేరుశెనగపప్పులు వేస్తారు. వాళ్ళు చెట్టు చాటున నక్కిఉంటారు. మానవుడి తర్వాత పెద్ద ఆశపోతు కోతే. కోతి వచ్చి కుండలో చేయి పెట్టి వేరుశెనగపప్పులను గుప్పిటి నిండా గట్టిగా పట్టుకుంటుంది. చెయ్యి బయటకు తీయబోతే రాదు. ఎందుకంటే లోపల పెట్టేటప్పుడు ఒట్టి చెయ్యి. బయటకు తీసేటప్పుడు పప్పులతో ఉన్న గుప్పెట. చెయ్యి బయటకు రాకపోయే సరికి అసలే చపలచిత్తం గదా! లోపల ఎవరో తన చేతిని గట్టిగా పట్టుకున్నారనుకుంటుంది. తాను పట్టుకున్న గుప్పెట వదిలేస్తే తంటా తీరిపోతుంది. కాని అది గుప్పెట మాత్రం వదలదు. అలా చేతిని బయటకు లాగిలాగి పడిపోతుంది. దానితో ఎరుకల వాడొచ్చి పట్టుకుంటాడు.

మనం కూడా ఇక్కడి విషయవస్తువులను పట్టుకొని వదలం. అవే మనను పట్టుకున్నాయని వాదిస్తాం. పోరాడి పోరాడి చివరకు శరీరాన్ని వదిలేస్తాం గాని పట్టు మాత్రం వదలం. మనం పట్టువదలం. దానితో యమధర్మరాజు వచ్చి పట్టుకుపోతాడు మనలను.

కనుక మనస్సు విషయవస్తువుల వ్యామోహం నుండి విడివడాలి. వాటిని విడిచి మనస్సును పరమాత్మలో నిలపాలి. అలా ఎవరైతే మనోబుద్ధులను పరమాత్మలో నిలుపుతారో వారు పరమాత్మలోనే నిలుస్తారు, నివశిస్తారు. అంటే మనోబుద్ధుల అడ్డం తొలిగితే జీవుడు దేవుడే. ఇందులో ఎటువంటి సంశయం అవసరం లేదు' అని భగవంతుడు హామీ ఇస్తున్నాడు.

మనోబుద్ధులు రెండూ మన వ్యక్తిత్వం. ఆ రెండూ భగవంతునిలో చేరితే మన వ్యక్తిత్వం నశించి ఆయనలో ఐక్యమైపోవటం జరుగుతుంది. ఉప్పుబొమ్మ సముద్రపు లోతులను కొలుస్తున్నట్లే మనస్సు ఆత్మసాగారాన్ని మధించాలి. చివరకు ఉప్పుబొమ్మ కరిగిపోయి సముద్రాకారంగా మారిపోయినట్లు మనస్సు కరిగి ఆత్మాకారంగా మారిపోతుంది.

మన దివ్యత్వాన్ని మరచి నేను సామాన్యుణ్ణి అనుకొనే మనం ఈ విషయాన్ని నమ్మలేక పోతున్నాం. అందుకే 'న సంశయః' - ఇందులో సందేహించవలసిందేమీ లేదు అని భగవానుడు హామీ ఇస్తున్నాడు.

పరమాత్మ యందే మనోబుద్ధులు రెండింటినీ పూర్తిగా నిలపటం తీవ్రవైరాగ్య మూర్తులకే గాని సామాన్యులకు సాధ్యం కాదు. మరి అట్టివారికి ఏమిటి ఉపాయం?

**శ్లో||** అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయిస్థిరం|
అభ్యాసయోగేన తతః మామిచ్ఛాప్తుం ధనంజయ!|| **(9)**

**తా||** ధనంజయా! ఒకవేళ చిత్తాన్ని నాయందు స్థిరంగా నిలుపుటకు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

శక్తిలేకపోతే అప్పుడు అభ్యాసయోగంతో నన్ను పొందటానికి ప్రయత్నించు.

**వ్యాఖ్య:-** ఆత్మసాక్షాత్కారాన్ని పొందటానికి గల ఉత్తమమైన ధ్యానస్థితిని - సమాధిస్థితిని ఇంతకు ముందు శ్లోకంలో చెప్పారు. మన మనస్సును భగవంతుని పాదపద్మముల యందు స్థిరంగా నిలపాలి. బుద్ధిని ఆదివ్యరూపంలో చొప్పించి అందులోని సత్యతత్త్వాన్ని - ఆత్మతత్త్వాన్ని, భగవత్తత్త్వాన్ని విచారణచేసి గ్రహించాలి. ఇలా చేయాలంటే మనస్సుకు ఏకాగ్రత ఉండాలి; బుద్ధిలో సూక్ష్మత ఉండాలి. ఐతే మన మనోబుద్ధులు ఇన్నాళ్ళు బాహ్యప్రపంచంలో, ప్రాపంచిక వ్యవహారాలలో, భోగాలలో తిరిగి తిరిగి అలవాటుపడి ఉన్నాయి. ఈ జన్మలోనే కాదు, ఇంతకుముందు అనేక జన్మల నుంచి ఇదే అలవాటు. శరీరాలు మారిపోతున్నాయే గాని, మనోబుద్ధులు అవే గదా! ఎన్నికోట్ల సంవత్సరాల నుండి ఈ మనోబుద్ధులు ఆనందం పొందాలని, దుఃఖాన్ని పోగొట్టుకోవాలని, ఎన్నో ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాయి. డబ్బు సంపాదించుకోవటం, వస్తువులను సమకూర్చుకోవటం, భోగాలను అనుభవించటం - ఇలా అలవాటు పడ్డ ఈ మనోబుద్ధులు అంత తేలికగా భగవంతుని వైపుకు తిరగవు. అలా తిరగలేదని మనం నిరాశ చెందకూడదు, బాధ పడకూడదు. వెంటనే బలవంతంగానైనా భగవంతుని వైపుకు త్రిప్పాలని ఆత్ర పడిపోకూడదు, శరీరాన్ని హింసించకూడదు. దీనిని భగవానుడే నిరశించాడు. ఇల్లు వదిలి ఎక్కడకో వెళ్ళి, తిండి తిప్పలు మానేసి, ఘోరమైన తపస్సు పేరుతో చలికాలంలో చన్నీటి

మధ్య, వేసవికాలంలో పంచాగ్ని మధ్యంలో నిలిచి, గడ్డాలు మీసాలు పెంచుకొని తపస్సుల పేరుతో పిచ్చిపనులు చేయరాదు. ముళ్ళ మీద పడుకోవటం, తలక్రిందులుగా చెట్టుకొమ్మకు వ్రేలాడటం - ఇవన్నీ మందబుద్ధుల పనులు. ఇట్టివారిని మూఢులని భగవానుడే తెలియజేశాడు. వీరికి ఏఫలితం దక్కదు. మరేం చేయాలి?

తెలివితో మనస్సును స్వాధీనంలోనికి తెచ్చుకొనే ఉపాయాలను భగవానుడు గృహస్థులైన మోక్షార్థులకు తెలియజేస్తున్నాడు. అదే అభ్యాస యోగం. మనస్సును నీవు ముందుగా మచ్చిక చేసుకోవాలి. నీ దారికి తెచ్చుకోవాలి.

క్రొత్తగా వచ్చిన గుర్రం నిన్ను దగ్గరకు రానివ్వదు. ఒక పట్టాన ఎక్కనివ్వదు. పరుగులు తీస్తుంది. నీవు కూడా దానితో పాటు పరుగులు తియ్యాలి. అదను కనిపెట్టి ఎక్కి కూర్చోవాలి. కళ్ళెం చేత పట్టుకోవాలి. అప్పుడిక నీకేం ఫరవాలేదు. అది చచ్చినట్టు నీ చెప్పుచేతల్లో ఉంటుంది. అంతేగాని దానిని చచ్చేటట్లు కొట్టటమో, తిండి పెట్టకుండా మాడ్చటమో, చేస్తే ఆ తర్వాత నీవు ఆ గుర్రం మీద ఎక్కినా ఒకటే, గోడమీద ఎక్కి కూర్చున్నా ఒకటే. కనుక ముందు మచ్చిక చేసుకొని దారికి తెచ్చుకోవాలి. ఇదే అభ్యాసయోగం.

రామకృష్ణపరమహంసగారి వద్ద ఒక శిష్యుడుండేవాడు. వాడికి నల్లమందు పిచ్చి. ప్రతిరోజూ నల్లమందు తినేవాడు. సన్యాసుల్లో చాలమందికి గంజాయి, నల్లమందు అలవాటు ఉంటుంది. వీరంతా భగవంతుని కోసం సన్యసించిన వాళ్ళు కాదు. భుక్తి కోసం, పొట్టకూటి కోసం. ఒకసారి ఈ పిచ్చి

పట్టిం తర్వాత అది వదలదు. రామకృష్ణపరమహంసగారు ఆ శిష్యుణ్ణి అనేకసార్లు హెచ్చరించారు. అయినా అతడు మానలేక పోతున్నాడు. ఆ టైం అయ్యేసరికి కాళ్ళు అక్కడికి లాక్కొని పోయేవి. అనుకోకుండానే తినేవాడు. ఎందరు తోటి శిష్యులు చెప్పినా మానలేదు.

ఒకనాడు పరమహంసగారు ఆ శిష్యుణ్ణి పిలిచి దగ్గర కూర్చోబెట్టుకొని, "నాయనా! రోజూ నీవు ఎంత నల్లమందు తింటావు? అని అడిగాడు. 'బేడ ఎత్తు' అన్నాడు అతడు. వెంటనే పరమహంస గారు ఒక బలపం ముక్కను తెప్పించి బేడ ఎత్తు ముక్కను తుంపి, నాయనా! ఇక ముందు ప్రతిరోజూ ఈ బలపం ముక్క ఎత్తు నల్లమందును తూచుకొని తిను. దీన్ని పారవేయవద్దు. ఇది గురువు ఆజ్ఞ. జాగ్రత్తగా దాచుకో! అయితే ప్రతిరోజూ దీని ఎత్తు నల్లమందు తిన్న తరువాత దీనిని దాచుకోబోయే ముందు మరచిపోకుండా దీనితో ఒక పలక మీద 'ఓం' అని వ్రాసి దాచుకో. ప్రతిరోజూ ఇలా 'ఓం' అని వ్రాయటం మరచిపోవద్దు - అని హెచ్చరించాడు. శిష్యుడు అలాగే చేశాడు. ప్రతిరోజూ 'ఓం' అని వ్రాస్తుంటే బలపం కొద్దికొద్దిగా అరిగి, వాడు తినే నల్లమందు మోతాదు తగ్గిపోతున్నది. చివరకు ఆ పిచ్చి పూర్తిగా పోయింది. ఇదే యుక్తి. శక్తితో కానిది యుక్తితో సాధించాలి. అభ్యాసం క్రమంగా చేస్తుంటే ఏదైనా సాధ్యమే.

కనుక మనోబుద్ధులను భగవంతుని యందు నిలుపుటకు శక్తి చాలకపోతే అభ్యాసయోగం ద్వారా సాధించాలి. అభ్యాసయోగం అంటే మరేం కాదు. విడిచి పెట్టకుండా నిరంతరం సాధన చెయ్యుటమే. దైవచింతన,

జపం, ధ్యానం, మానసిక పూజ - వీటితో పాటు నిత్యము శ్రవణం, మననం, స్వాధ్యాయం, నిధిధ్యాసన - వీటిని నిరంతరం కొనసాగిస్తూ ఉండటమే. మన మనస్సు అన్యవిషయాలలోనికి, ప్రాపంచిక విషయాలలోనికి వెళుతూ ఉన్నప్పటికీ, వాటితో సంయోగం చెందుతున్నప్పటికీ సమయం కనిపెట్టి మనస్సును మెల్లమెల్లగా భగవంతుని వైపుకు త్రిప్పాలి. ఇదే అభ్యాసయోగం.

ఉన్నత విషయాలను ధ్యానించటానికి ప్రయత్నించినప్పుడు మనస్సు దానిపై ఏకాగ్రంగానిలవదు. అల్పవిషయాల వైపుకే పరుగులు తీస్తుంది. ఒక పండితుడు భగవద్గీతకు అంతరార్థాన్ని వ్రాస్తూ ఒక కథను ఇలా చెప్పాడు. -

సృష్టికి ముందు నిరాకార నిర్గుణ పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. ఆయనకు మాయ అనే భార్య ఉన్నది. వారికొక కుమారుడు. అతడే మనస్సు. అయితే కుమారుడికి అంతా తల్లి పోలికే. తండ్రి అంటేనే దరిచేరడు. ఎప్పుడూ తల్లికొంగు పట్టుకొని తల్లి చుట్టూ తిరుగుతూ ఉంటాడు. ఆ మనస్సనే వాడికి ఇద్దరు భార్యలు. ఒకరు ప్రవృత్తి, మరొకరు నివృత్తి. వీడికెప్పుడూ ప్రవృత్తి అంటేనే ఇష్టం. నివృత్తి అంటే అస్సలు గిట్టదు. ప్రాపంచిక వ్యామోహాలే ప్రవృత్తి. అవి పట్టక పరమాత్మపై అనురాగమే నివృత్తి. ప్రవృత్తి సంతానం అసురులు (ఆసురీగుణాలు). నివృత్తి సంతానం దేవతలు (దైవీగుణాలు) ఈ రెండూ శరీరమనే ఈ కురుక్షేత్రంలో పోరాటం చేస్తూఉంటాయి.

మనస్సుకెప్పుడూ ప్రవృత్తి యందే (ప్రాపంచిక విషయభోగాల యందే) పక్షపాతం. దానిని మెల్లమెల్లగా 'శనైః శనైః రుపరమేత్' అన్నట్లుగ మెల్లమెల్లగా మచ్చిక చేసుకోవాలి తప్ప మరొక ఉపాయం లేదు. మనస్సే బంధానికైనా

మోక్షానికైనా కారణం అవుతుంది. ("మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః") కనుక తెలివిగా మనస్సును మచ్చిక చేసుకోవాలి. దానికే అభ్యాసయోగం. అనేక ఉపాయాలతో మనస్సును స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. తొందర పనికిరాదు. ఎలా?

నీ ఇంట్లో దొంగగొడ్డు ఉన్నది. ఏమాత్రం ఏమారినాచాలు కట్లుతెంచుకొని పరుగెడుతుంది. ఇతరుల పొలాల్లో పడిమేస్తుంది. దానిని ఎలా దారికి తేవాలి? మూర్ఖులు దానిని కొడుతూ బలవంతంగా తెచ్చి, గొలుసులతో స్తంభానికి కట్టివేసి కసిదీరా కొడతారు. తప్పించుకొని పోవటానికి వీలులేక వెళ్ళకుండా ఉంటుందేగాని, వీలు కుదిరితే మళ్ళీ చిక్కకుండా పారిపోతుంది. ఎప్పుడో సమయం వస్తుంది. అప్పుడది తప్పించుకొని పోతుంది, దొంగగడ్డి మేస్తుంది. ఎప్పటికీ కనిపించకుండా తప్పించుకొని ఎక్కడకో పోతుంది. ఇక ఎప్పటికీ దాని గతి అంతే. అదే తెలివిగల వాళ్ళు ఏంచేస్తారు? అది పొలాల్లో మేసే మేతకన్న ఎక్కువ నాణ్యమైన, రుచికరమైన, దానికి ఇష్టమైన మేతను సప్లై చేస్తారు. ఇక ఫరవాలేదని ఊరుకోకుండా అలా దానికి మంచి మేత ఇస్తూ ఉండాల్సిందే. ఈ మేతను తినటం దానికి అలవాటై పోతుంది. అప్పుడు దానిని వదిలినా అది ఇక దొంగ తిండికోసం వెళ్ళదు. హాయిగా ఇంట్లోనే మేస్తుంది; దారికి వస్తుంది.

మన మనస్సు కూడా దొంగ గొడ్డు లాంటిదే. దానికి వైరాగ్యమనే కళ్ళెం బిగించి అభ్యాసమనే మంచిమేత వేయాలి. ఇందులో రుచి మరిగిందా ఇక నెట్టినా ఎక్కడికీ పోదు. రుచి మరిగేంత వరకే కష్టం. కనుక అభ్యాసం చేస్తూనే

ఉండాలి.

అభ్యాసంలో ఉన్న శక్తి చాలా గొప్పది. దేవాలయంలో క్రొత్తగా వచ్చిన పూజారి మంత్రం చదువుతూ, హారతి ఇస్తూ గంట మ్రోగించాలి. గంట మ్రోగిందా! హారతి తిరగదు. హారతి తిరిగిందా! గంట ఆగిపోతుంది. ఆయన క్రొత్త పూజారిగదా! ఈ రెంటి విషయంలో జాగ్రత్తపడితే మంత్రం తడబడుతుంది లేదా ఆగిపోతుంది. ఐతే నిరాశపడకుండా అభ్యాసం చేస్తే హారతి తిరుగుతుంది, గంట మ్రోగుతుంది, మంత్రం కొనసాగుతుంది. ఎవరెంత దక్షిణ వేస్తున్నారో కూడా గమనిస్తూ ఉంటాడు. ఇదే అభ్యాసం మహిమ.

అభ్యాసం వల్లనే సర్కస్ లో ఏనుగు సైకిలు త్రొక్కుతుంది. అమ్మాయిలు తీగమీద నడుస్తారు. అభ్యాసం వల్లనే సముద్రాన్ని ఈదవచ్చు. ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కవచ్చు. అభ్యాసం వల్లనే జీవుడు దేవుడవుతాడు. అందుకే 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్నారు.

కనుక ఎవరైతే మనోబుద్ధులను భగవంతుని యందే నిలిపి, ఏకాగ్రచిత్తంతో ధ్యానించలేరో, సమాధిలో నిలువలేరో అట్టి వారు అభ్యాసం చేయాలి. మనోబుద్ధులు భగవంతుని యందు నిలవటానికి వీలుగా మనోబుద్ధులకు ట్రైనింగ్ ఇవ్వాలి. అభ్యాసం చేయాలి.

శాస్త్రాన్ని గురువుల ద్వారా నిత్యము శ్రవణం చేస్తూ, ఆ శ్రవణం చేసిన విషయాలను మననం చేసుకుంటూ భావాలను స్థిరపరచుకోవాలి. సందేహాలుంటే స్వాధ్యాయం ద్వారా గాని, గురువు ద్వారా గాని నివృత్తి చేసుకుంటూ ఆ భావాలను స్వానుభవంలోకి తెచ్చుకోవాలి. అందుకు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నిరంతరము ఆత్మవిచారణ చేసుకుంటూ, నిదిధ్యాసన చేసుకుంటూ బుద్ధికి బాగా పదునుపెట్టాలి. అప్పుడే బుద్ధి సూక్ష్మమై పరమాత్మ తత్త్వాన్ని బాగా గ్రహిస్తుంది. అదే సమయంలో మనస్సుకు నిర్మలత్వాన్ని, ఏకాగ్రతను కలిగించటం కోసం జపం, మానసిక పూజ, ధ్యానం, స్తోత్రపాఠాలు, పారాయణలు మొ||న వాటిని విడవకుండా అభ్యాసం చేస్తూ మనస్సుకు ఒక స్థిరత్వాన్ని కలిగించాలి. అప్పుడే మనస్సు నిర్మలమై, శుద్ధమై పరమాత్మపై నిలుస్తుంది. అదే సమయంలో ప్రాపంచిక విషయాలపై ఆసక్తిని, వ్యామోహాన్ని తగ్గించుకొని పూర్తిగ తొలగించుకోవాలి. అలా వైరాగ్యాన్ని కలిగి ఉండాలంటే, వైరాగ్యాన్ని వృద్ధి గావించు కోవాలంటే నిత్యానిత్య వస్తు వివేకం ఉండాలి. ప్రతి సందర్భంలోను ఇది నిత్యమా? అనిత్యమా? ఇది నాకు శాశ్వతమైన సుఖాన్నిస్తుందా? తాత్కాలిక సుఖాన్నిచ్చి, కష్టాలలోనికి త్రోసివేస్తుందా? అని మనను మనం ప్రశ్నించుకోవాలి. అలా ప్రశ్నించుకుంటూ పరమాత్మ తప్ప అన్నీ అనిత్యమైనవేనని, వాటివల్ల వచ్చే సుఖం కూడా అనిత్యమైనదేనని తెలుసుకుంటూ వైరాగ్యభావనను పెంపొందించుకోవాలి. ఇదే అభ్యాసయోగం.

ప్రాపంచిక వ్యవహారాలలో ఉన్నవారు ఈ అభ్యాసయోగాన్ని కూడా ఆచరించలేరు. మరి అట్టివారికి ఏమిటి ఉపాయం? దాన్ని గురించి 10వ శ్లోకంలో చెబుతున్నారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** అభ్యాసేఽప్య సమర్థోఽసి మత్కర్మ పరమోభవ|

మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి|| **(10)**

**తా||** అభ్యాసం చెయ్యటానికి కూడా నీవు అసమర్థుడివైతే నాకు సంబంధించిన కర్మలలో నిమగ్నం కా! నా కొరకు కర్మలు చేస్తున్నప్పటికీ సిద్ధిని పొందుతావు.

**వ్యాఖ్య:-** మనస్సులో రజోగుణం అధికంగా ఉన్నప్పుడు ఆ గుణం నిన్ను ప్రశాంతంగా ఒకచోట కూర్చోనివ్వదు. అన్ని విషయాలను పట్టించుకుంటుంది మనస్సు. అన్నింటి మీదకు పరుగులు తీస్తుంది. కనుక అభ్యాసయోగం కూడా కష్టమే. ఒకే పనిని నిరాశానిస్పృహలు చెందకుండా మళ్ళీ మళ్ళీ చెయ్యటమే అభ్యాసం. మానసిక పూజగాని, జపంగాని, ధ్యానం గాని, శ్రవణమననాలు గాని, శాస్త్రాధ్యయనం గాని, బ్రహ్మచింతన గాని - ఇవన్నీ పట్టు వదలని విక్రమార్కునిలా ఎంతో పట్టుదలతో చేయాలి. అలా చెయ్యాలంటే మనం సత్త్వగుణంలో ఉండాలి. మనస్సు ప్రశాంతంగా ఉండాలి. అందువల్ల రజోగుణంలో ఉన్నవారికి ఇక్కడొక ఉపాయాన్ని తెలియజేశారు. భగవత్పరమైన కర్మలు చేయండి - అని. ఎప్పుడైతే భగవంతుని కొరకు, భగవత్సంబంధమైన పనులను చేస్తూ ఉంటామో అప్పుడు మనస్సు క్రమక్రమంగా భగవంతుని పైకి మరలుతుంది. భగవంతునిపై నిలుస్తుంది. అదే ప్రేమగా - భక్తిగా మారుతుంది. కనుక శారీరకమైన కర్మలు చేయాలి. అలా చేస్తే రజోగుణం క్రమక్రమంగా తగ్గిపోతుంది. భగవంతునిపై నిలుస్తుంది. అందుకే చెబుతున్నారు - దైవకార్యాలు, పండుగలు, పూజాపునస్కారాలు,

యజ్ఞయాగాదులు, ఆధ్యాత్మిక సభలను ఏర్పాటు చేయటం, ఆధ్యాత్మిక గ్రంథాల ప్రచురణ, అమ్మకం, దేవాలయాల నిర్మాణం, మహాత్ముల సేవ, సత్సంగంలో పాల్గొనుట, పారాయణలు చేయుట, పరోపకారార్థం కొన్ని పనులు చేయుట - ఇవన్నీ శారీరక కర్మలు. వీటిని చేస్తూ ఉండటం వల్ల క్రమక్రమంగా ఆ పనులలో ప్రీతి ఏర్పడుతుంది. వాటితో తాదాత్మ్యం వల్ల భగవంతుని యందు భక్తి ఏర్పడుతుంది. దానితో బాహ్యవిషయాల పట్ల ఆసక్తి తగ్గిపోతుంది. భగవంతునిపై ఇష్టం ఏర్పడుతుంది. ఇలా భగవంతుని కొరకు చేసే శారీరక కర్మలే భగవత్ప్రీతికరమైన కర్మలు.

నిజంగా ఇవి భగవంతునికి ప్రీతి కల్గించటానికి చేస్తున్నామా? అంటే ఇప్పటివరకు భగవంతుడు కొరతలతో, అసంతృప్తితో జీవిస్తున్నాడా? బాధపడుతున్నాడా? అదేంలేదు. ఈ పనులేవీ ఆయనకు అవసరం లేదు. ఇవి లేకపోతే ఆయనకు బ్రతుకుభారం కాదు, ఇవన్నీ నిజంగా మనకు అవసరం, మన ఉన్నతికి అవసరం, మనలోని రజోగుణాన్ని తగ్గించుకొని, వాసనలు క్షయం చేసుకోవటానికి అవసరం. ఇలా భగవత్ప్రీతికరమైన కర్మలు చేయుట వల్ల మనలోని పాపవాసనలు క్షయమై, పుణ్యవాసనలు ఏర్పడతాయి. దీనివల్ల మనస్సు శుద్ధమై, నిర్మలమై భగవంతుని యందు నిలుస్తుంది. అలా భగవంతుని యందు చిత్తాన్ని నిలిపితే భగవంతుని అనుగ్రహం కలుగుతుంది, జ్ఞానం అంకురిస్తుంది. అందువల్ల అభ్యాసయోగం బాగా చేయవచ్చు.

కనుక మనస్సు ద్వారా అభ్యాసయోగం చేయలేనివారు శరీరంతో భగవంతుని కొరకు కర్మలు చేస్తూ క్రమక్రమంగా సిద్ధిని పొందవచ్చు. మొత్తం

మీద ఈ మార్గం కూడా మోక్షానికి దారితీస్తుంది.

ప్రపంచంలో అందరికీ ఒకే సాధన పనికిరాదు. వారివారి స్వభావాన్ని బట్టి, స్థితిని బట్టి, అర్హతలను బట్టి సాధనలు వేరువేరుగా ఉండాలి. ఇలా అనేక మార్గాలను (సాధనలను) చూపితే ఎవరికి కావలసిన మార్గాన్ని వారు ఎంచుకోవచ్చు.

అయితే ఇక్కడే ఒక సందేహం. అన్నీ భగవంతుని కొరకే చేస్తుంటే మనపనులు ఎవరు చేస్తారు? మనకోసం కొన్ని పనులు తప్పవు గదా! అని. ఐతే - 'అన్నీ మన పనులే చేసుకోవాలి' - అంటే భగవంతుని కోసం పనులు చేయనక్కర్లేదా? అని ఎవరికీ సందేహం రాదు. అన్నీ భగవంతుని కొరకే పనులు చేయండి అంటేనే మరి మనపనులో? అనే సందేహం.

సాధారణంగా మన తిండితిప్పల కోసం, సుఖం కోసం, భోగాల కోసం, అవసరాల కోసం కొన్ని పనులు చేస్తుంటాం. ఇవి మనకొరకు చేసే పనులు. ఇక సమాజం కోసం సభలు, సమావేశాలు; దేవాలయాలు, కళ్యాణమండపాలు కట్టించటం, భావులు త్రవ్వించటం, వృద్ధాశ్రమాలు నిర్వహించటం - ఇవన్నీ సమాజం కోసం. ఇక పూజలు, వ్రతాలు, నోములు, యజ్ఞాలు, వేదాధ్యయనం మొ||నవి భగవంతుని కొరకు చేసేవి. ఇలా 3 రకాలుగా చేస్తుంటాం. అయితే భగవంతుడేమో అన్నీ నాకొరకే(మదర్థం) చేయాలి అంటున్నాడు. ఎలా మరి? మనం చేసే పనులన్నీ మన కోసమైనా,సమాజం కోసమైనా, భగవంతుని కోసమైనా - అన్నింటిని భగవంతుని పనులు గానే చెయ్యాలి. ఎలా? నేను కర్తను, నేనే వీటిని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేస్తున్నాను అనే అహంకారాన్ని - కర్తృత్వ భావాన్ని వదిలి, నా కర్తవ్యం అనుకుంటూ చేస్తే సరి. నావల్లనే ఈ పనులు జరుగుతున్నాయి అనే అహంకారం లేకుండా మనం భగవంతుని చేతిలో పనిముట్టులా చేస్తే అవి అన్నీ భగవత్ కర్మలే అవుతాయి. అన్ని అనర్థాలకు కర్తృత్వమే మూలం.

బల్బులు వెలుగుతున్నాయంటే బల్బుల గొప్పతనం కాదు. కరెంటు గొప్పతనమే. కలం కవిత్వాన్ని వ్రాస్తున్నదంటే కలం గొప్పతనం గాదు. దానిని పట్టుకున్న వాడి గొప్పతనమే. అవయవాలన్నీ పనిచేస్తున్నాయంటే వాటి గొప్పతనం కాదు. వాటికి శక్తినిస్తున్న చైతన్యం యొక్క గొప్పతనమే. పరిస్థితి ఇదైతే మధ్యలో మనకు లేనిపోని పెత్తనం - అహంకారం ఎందుకు? అహంకారం విడిచిపెడితే ఆత్మప్రాప్తియే.

కనుక కర్మలు చేస్తున్నాం అంటే అవి మనను బంధంలో పడేస్తాయి. కర్మబంధం నుండి తప్పించుకోవాలంటే కర్తృత్వబుద్ధిని విడిచిపెట్టాల్సిందే. మనదృష్టిని భగవంతునిపై నిలిపి ఏరకం కర్మలు చేసినా, ఎన్ని కర్మలు చేసినా అవి అన్నీ భగవత్పరమైన కర్మలే అవుతాయి. ఎలా అవుతాయి?

ఒకరాజు గారు చాలాకాలం రాజ్యపాలన చేసి మరణించారు. ఆయనకు సంతానం లేదు. మంత్రులు, సేనాధిపతులు అందరూ కలిసి ఆ దేశ ఆచారం ప్రకారం పట్టపుటేనుగుకు పూలదండను అమర్చి - అది ఆ దండను ఎవరికి వేస్తుందో వారే కాబోయే మాహారాజు అని ప్రకటించారు. ఎందరో సామంతులు, శ్రీమంతులు, మేధావులు ఎదురుగా వచ్చారు. కాని ఎవరి మెడలోనూ పూలదండ పడలేదు. ఆ ఏనుగు చాలా ఊళ్ళు, పట్టణాలు,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అరణ్యాలు దాటి ఒక గ్రామం వెలుపల కౌపీన ధారియైన ఒక సన్యాసి తపస్సు చేసుకుంటూ ఉంటే అతడి మెడలో వేసింది దండను. అందరూ హర్షధ్వానాలు చేస్తున్నారు. ఆ సన్యాసికి విషయాన్ని తెలియజేశారు. అతడు "నాకెందుకు ఈ రాజ్యం, ఈ భోగాలు? నేను సర్వసంగ పరిత్యాగిని, నిరంతరము భగవంతుని కొరకు తపస్సు చేసుకుంటూ ఉన్నాను"- అన్నాడు. రాజ్యాధికారాన్ని స్వీకరించటానికి అతడు ససేమిరా! అన్నాడు. అయినప్పటికీ మంత్రులు, సేనాపతులు అనేక విధాల నచ్చజెప్పారు. ఇది రాజాజ్ఞ అన్నారు. దీనిని తప్పటానికి ఎవరికీ అధికారం లేదు - అన్నారు. బలవంతంగా అతణ్ణి రాజభవనానికి తీసుకెళ్ళి రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేసి సింహాసనాన్ని అలంకరింపజేశారు. అతడు మాత్రం అన్నింటిని నిర్లిప్తంగా చూస్తున్నాడు.

ఆ తరువాత ఆ సాధువు గొప్పగొప్ప వస్తువులు దాచిపెట్టే ఒక బీరువాను చూచి, అందులోని వస్తువులన్నింటిని ఖాళీ చేయించి, అందులో తన కౌపీనాన్ని దాచిపెట్టాడు. తన వైరాగ్యానికి గుర్తుగా ప్రతిరోజూ దానిని చూస్తూ ఉండేవాడు. తన వైరాగ్యదశను స్మరిస్తూ రాజ్యపాలన చేస్తున్నాడు. 4సం||లు రాజ్యపాలన గావించాడు. రాజభవనాల్లో తిరుగుతున్నా, హంసతూలికా తల్పాలపై పరుండినా, రాజలాంఛనాలు, కిరీటం ధరించినా, అధికారం చలాయిస్తున్నా తన కౌపీనాన్ని, వైరాగ్యాన్ని, దైవభక్తిని, భగవంతుని స్మరణను మరచిపోలేదు. దేహం వ్యవహారాలలో ఉన్నా చిత్తం మాత్రం దైవం మీదనే నిత్యము, నిరంతరము ఉన్నది. అతడు నిర్లిప్తంగా రాజకార్య వ్యవహారాలను చూస్తున్నాడేగాని, ఏమాత్రం ఆసక్తి గాని, ఆశగాని లేదు.

కొంతకాలానికి శత్రువులు ఆ రాజ్యాన్ని ముట్టడించారు. సైన్యాధికారి యుద్ధానికి సైన్యాన్ని సంసిద్ధం చేసి, యుద్ధసన్నద్ధుడై రాజుగారి వద్దకు వచ్చి అనుమతిని కోరాడు. రాజు అన్నాడు, "మనం 4 సం||లు పరిపాలించాం గదా! వారిని కూడా కొంతకాలం పరిపాలించనీ" అని వెంటనే బీరువా దగ్గరకు వెళ్ళి తన కౌపీనాన్ని ధరించి ఎటో వెళ్ళిపోయాడు. మంత్రులు, ఇతర అధికారులు, సేనానులు, పారిపోగా రాజ్యం శత్రువుల వశమైంది.

సాధువు రాజ్యవ్యవహారాలు, లోకవ్యవహారాలు చూస్తున్నప్పటికీ తన దృష్టి మాత్రం నిరంతరం పరమాత్మ మీదనే ఉన్నది. తన వైరాగ్యాన్ని, భగవంతుణ్ణి మరచిపోలేదు. నిరంతరం స్మరిస్తూనే ఉన్నాడు. అలాగే మనం కూడా ఇక్కడ ఎన్ని వ్యవహారాలు చేస్తున్నా భగవత్స్మరణను విడిచిపెట్టకూడదు. మన దృష్టిని భగవంతునిపై నిలిపి మనం ఏకర్మలు చేసినా అవి భగవత్కర్మలే అవుతాయి. భగవంతుని కొరకు చేసిన కర్మలే అవుతాయి అని గ్రహించాలి.

ఒకవేళ ఇది కూడా సాధ్యం కాకపోతేనో -

మరీ సామాన్యులైన వారు భగవంతుని నిరంతరం తలచుకోవటం గాని, భగవంతునిపై దృష్టి పెట్టి నిర్లిప్తంగా కర్మల నాచరించటం గాని మాకెలా కుదురుతుందీ అంటే ఏమిటి ఉపాయం? 11వ శ్లోకంలో చెబుతున్నారు.

**శ్లో||** అథైతదప్య శక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః|
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్|| **(11)**

**తా||** ఇక నాకొరకే కర్మలు చేయటానికి కూడా శక్తి లేనివాడవైతే ఇక అప్పుడు ప్రయత్నంతో సమస్త కర్మల యొక్క ఫలాన్ని విడిచిపెట్టు.

**వ్యాఖ్య:-** కొందరికి మనస్సు కుదురుగా ఉండదు. పూర్తిగా దైవకార్యాలలో మునిగిపోతే బ్రతుకుతెరువు ఎట్లా? అని సందేహం. వాళ్ళు స్వంతపనులు మానుకోలేరు. "అయితే కర్తృత్వాన్ని వదిలి ఎట్టి పనులు చేసినా సరిపోతుంది; అప్పుడవి భగవత్ కర్మలే అవుతాయి గదా!" అని తెలిసినా అలా కర్తృత్వాన్ని వదిలి ఉండలేరు. కర్తృత్వంతో కర్మలు చేయటం అలవాటు. ఎంతకాదనుకున్నా నేను కర్తననే అహంకారం వదిలిపోదు. మరి అలాంటి వారి గతిఏమిటి? వారికి కూడా భగవానుడు ఇక్కడొక ఉపాయాన్ని తెలియజేస్తున్నాడు. అదే "సర్వకర్మ ఫలత్యాగం"

మనం పనులు చేస్తున్నప్పుడు ఏదో ఒక ఫలితం వచ్చి తీరుతుంది. ఆ వచ్చే ఫలితం మీదనే దృష్టి పెట్టి వస్తుందా? రాదా? అనుకున్నంతగా వస్తుందా? తక్కువగా వస్తుందా? అని ఆలోచిస్తూ ఉంటే చేసేపని మీద శ్రద్ధ ఉండదు. అందువల్ల నైపుణ్యంగా పనులు చేయలేము. అలా కాకుండా వచ్చే ఫలితాన్ని గురించి పట్టించుకోకుండా, దానిమీద ఏమాత్రం ఆసక్తి లేకుండా శ్రద్ధగా, కర్తవ్య భావంతో, తన విద్యుక్త ధర్మంగా కర్మలు చేస్తుంటే ఆ కర్మలు సక్రమంగా జరుగుతాయి, పనిలో నైపుణ్యం కూడా ఉంటుంది. కనుక కర్మఫలాలను భగవంతునికి అర్పించాలి. అలాచేస్తే లోపల పేరుకున్న రజోగుణం అణగిపోతుంది. సరే సర్వకర్మ ఫలత్యాగం అన్నారు గదా! అంటే పాపకర్మల ఫలాన్ని కూడా అర్పించాలా? చెడ్డకర్మలను, పాపకర్మలను వదిలివేయాలని

ముందే చెప్పుకున్నాం. కనుక శాస్త్రవిహిత కర్మలనే చేయాలి. వాటి ఫలాన్నే వదిలివేయాలి. పాపకర్మలు అసలు చేయకూడదు.

ఈ సర్వకర్మల ఫలత్యాగం అనేది దాదాపుగా అందరికీ అనుకూలమైనదే. కొద్ది ప్రయత్నంతో ఎవరైనా అనుసరించవచ్చు. అందుకే "యతాత్మవాన్" అన్నారు. ప్రయత్నించి సాధించుకోవాలి.

నిజంగా భగవద్గీత యొక్క సారమంతా ఇదే. "కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన". కర్మలు చేయుట యందే నీకు అధికారం. ఫలితాన్ని ఎప్పుడూ కోరవద్దు. ఫలాలు కోరేవాడు పిసినిగొట్టు - 'కృపణా ఫల హేతవః' - అని అన్నారు. ఇది భగవద్గీత సారమే గాదు. భగవానుని జీవితసారం కూడా ఇదే.

1. దేవకీ వసుదేవులకు జన్మించినా తల్లిదండ్రుల వాత్సల్యాన్ని కోరలేదు.

2. నంద గోకులంలో వెన్న దొంగిలించినా తనకోసం కాదు, స్నేహితులకు కోతులకు పెట్టేవాడు .

3. కంసుని చంపినా రాజ్యాధికారాన్ని కోరలేదు. ఉగ్రసేనునికే కట్టబెట్టాడు.

4. జరాసంధుని చంపించినా రాజ్యాన్ని అతడి కుమారుడు సహదేవునే పట్టాభిషిక్తుని చేశాడు.

5. శిశుపాలుని వధించినా అతని కుమారుడు దృష్టకేతువుకే రాజ్యాన్ని అప్పగించాడు. నరకుని చంపి అతని కుమారుడు భగదత్తుని రాజుగా చేశాడు.

6. దంతవక్త్రుని చంపి అతడి రాజ్యాన్ని అతని కుమారునికే ఇచ్చాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

7. పౌండ్రక వాసుదేవుని చంపి అతని కుమారునే రాజ్యాభిషిక్తుని చేశాడు.

8. దుర్మార్గుడైన దుర్యోధనుడు సాయం కోరితే తన సైన్యం మొత్తాన్ని త్యాగం చేశాడు. నాకేం ఇస్తావు? అని అడగలేదు.

9. పాండవులకు ఎంతమేలు చేసినా, యుద్ధంలో ఎంత సాయపడినా తానేమీ ఫలితాన్ని కోరలేదు. రాజ్యంలో వాటా కోరలేదు.

10. రథాన్ని తోలేపని అప్పగించినా అప్పగించిన పనిని శ్రద్ధగా - సక్రమంగా నిర్వర్తించాడే గాని ఏ ఫలితాన్ని ఆశించలేదు. ఇంత చిన్నపనియా? అనలేదు.

ఆయన ఏపని చేసినా, ఆ పనిని సక్రమంగా నిర్వర్తించటమే గాని కర్మఫలంపై ఏమాత్రం ఆసక్తి లేదు. దేనినీ కోరలేదు.

మరి మనం మాత్రం ఏఫలితం లేకుండా ఎందుకు కర్మలు చేయాలి? అంటాం.

❖ సూర్యుడు వెలుగునిచ్చి నీవద్ద నుండి ఏం కోరుతున్నాడు?

❖ వాయుదేవుడు గాలినిచ్చి నీ ప్రాణాన్ని నిలబెడుతూ ఏం కోరుతున్నాడు?

❖ నదులు నీటినిచ్చి దప్పిక తీర్చి నీనుండి ఏమి కోరుతున్నాయి?

❖ భూమి నీకు ఆధారంగా ఉండి, పంటల నిచ్చి ఏమి కోరుతున్నది?

❖ చెట్లు ఫలాలను, పుష్పాలను, నీడను ఇచ్చి ఏమి కోరుతున్నాయి?

❖ చంద్రుడు చల్లదనాన్నిచ్చి ఏమి కోరుతున్నాడు?

❖ మన సమస్త ఇంద్రియాలకు శక్తి నిచ్చి పరమాత్మ ఏమి కోరుతున్నాడు?

కానీ దేవాలయంలో పుజగాని, అభిషేకం గాని చేయించిన తరువాత "ఏతత్ ఫలం సర్వం పరమేశ్వరార్పణ మస్తు" అని పూజారి మంత్రం

చదవగానే ఖర్చు మనదీ ఫలితం పరమాత్మకా? అని లోలోపల గొణుక్కుంటాం అర్థం తెలిస్తే. మనకు పనికన్నా ఫలితం ముఖ్యం. అందువల్ల మనకు బంధమే గాని మోక్షం లేదు.

కర్మఫలం కోరినందువల్ల మళ్ళీమళ్ళీ జన్మలను తెచ్చిపెడుతుంది. జన్మలు మళ్ళీమళ్ళీ కర్మలకు - కర్మఫలాలకు కారణమౌతాయి. ఇలా కర్మ - కర్మఫలం - జన్మ - కర్మ - కర్మఫలం - జన్మ అనే కర్మ - జన్మ వలయంలో, జననమరణ చక్రంలో, కర్మసుడి గుండంలో చిక్కుకుపోతాం. కనుక కర్మలు చేస్తూ కర్మఫలాన్ని త్యాగం చెయ్యాలి. సర్వం శ్రీకృష్ణార్పణం, రామార్పణం, భగవదార్పణం అంటూ సర్వకర్మలను చేయటం నేర్చుకోవాలి. గాలికి పోయే పేలపిండిని కృష్ణార్పణం' అనటం కాదు. ఇంట్లో ఉన్నదానిని, నోట్లోకి పోయేదానిని కూడా అనగలగాలి.

అయితే పనిమీదనే దృష్టి నుంచి ఫలితంపై ఆసక్తి చూపకుండా ఉండటం ఎలా సాధ్యం? అని చాలామందికి సందేహం. దీనికి మహాభక్తుడైన పుండరీకుని కథయే మనకు మార్గదర్శకం.

లోహ దండపురంలో మహాభక్తులైన బ్రాహ్మణదంపతులకు పుండరీకుడనే కుమారుడున్నాడు. అతడు యవ్వనంలో అనేక దురలవాట్లకు లోనై తల్లిదండ్రులను కష్టపెట్టాడు. అతడికి చక్కని కన్యను చూచి పెళ్ళిచేశారు. భార్యా వ్యామోహంలో పడి తల్లిదండ్రులను ఇంకా ఇంకా బాధలు పెట్టాడు కుమారుడు.

ఒకనాడు భార్యతో కలసి కాశీక్షేత్రం బయలుదేరాడు. మార్గమధ్యంలో

కుక్కుట మహాముని ఆశ్రమం ఉంది. అక్కడ ముగ్గురు స్త్రీలు ఆ ఆశ్రమ ప్రదేశాన్ని ఊడ్చి శుభ్రం చేస్తుండగా చూచి 'మీరెవరు?' అని అడిగాడు పుండరీకుడు.

"నాయనా మేము గంగ,యమున, సరస్వతులం. పవిత్రులమైన మాలో పాపాత్ములు స్నానం చెయ్యటం వల్ల వారి పాపాలు మాకు చుట్టుకుంటున్నాయి. ఆ పాపపరిహారం కోసం ఈ మహాత్ముని ఆశ్రమాన్ని ఇలా ప్రతిరోజూ శుభ్రం చేసి పరిశుద్ధులమౌతున్నాం అన్నారు వారు. (ఇదే స్థాన శుశ్రూష)

కుక్కుట మహాముని యొక్క శక్తికి ఆశ్చర్యపోయిన పుండరీకుడు సతీసమేతంగా ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడ ఆ మహాముని తన తల్లిదండ్రులకు పాదసేవ చేస్తున్నాడు. పుండరీకుడు ఆయనకు నమస్కరించి, మహాత్మా! గంగ, యమున, సరస్వతుల పాపాలను కూడా కడిగి వేయగల అద్భుతశక్తిని మీరెలా సాధించగలిగారు? అని అడిగాడు.

దానికా ముని "నాయనా! నాకు ఏ సాధనలు తెలియవు. తల్లిదండ్రుల పాదసేవయే పరమాత్మసేవగా భావించాను. నాకు దీనియందే మనస్సు నిలిచింది; బుద్ధి ప్రశాంతతను పొందింది. ఇంతకన్న నాకు కావాల్సిందేమీ లేదు. తల్లిదండ్రుల పాదసేవ చేసుకొనే అదృష్టం పూర్వజన్మ సుకృతం ఉన్నవారికే కలుగుతుంది" అన్నాడు. దానితో పుండరీకునికి జ్ఞానోదయమయ్యింది. "తానింత వరకు తల్లిదండ్రుల పట్ల చేసిన అపరాధానికి తనను క్షమించు" మని ఆ ముని పాదాలపై బడ్డాడు పుండరీకుడు. ముని

ఆశీర్వాదాన్ని పొంది, కాశీ ప్రయాణం మానుకొని, లోహదండపురం వచ్చి తల్లిదండ్రుల పాదాలను పట్టుకొని తనను మన్నించమని కంటికి మింటికి ఏకధారగా విలపించాడు. తల్లిదండ్రులు కుమారునిలో కలిగిన పరివర్తనకు ఎంతో ఆనందించారు.

అది మొదలు చంద్రభాగా నదీ తీరంలో ఒక కుటీరాన్ని ఏర్పాటుచేసి తల్లిదండ్రులను అక్కడే ఉంచి, నిత్యం వారి సేవనే చేస్తూ తన జన్మను చరితార్థం చేసుకుంటున్నాడు పుండరీకుడు. అతడి భార్య కూడా అతడికి ఎంతగానో సహకరిస్తున్నది. తల్లిదండ్రుల సేవయే అతడికి జపం - తపం - ధ్యానం. దానితో అతడి అంతఃకరణం శుద్ధమైంది. అహంకారం నశించింది. రాగద్వేషాలు తొలగిపోయాయి. అజ్ఞానం నశించింది. అంతరంగం ప్రశాంతమైంది. ఆత్మానుభూతికి హృదయకవాటాలు తెరుచుకోబోతున్నాయి.

భక్తుని అనుగ్రహించటానికి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే ఆశ్రమ గుమ్మం దగ్గర ప్రత్యక్షమయ్యాడు. "పుండరీకా! ఇలా చూడు. నేను జగన్నాథుడను. నీ భక్తికి మెచ్చి నిన్ను అనుగ్రహించుటకు వచ్చాను. నాతో రా! అన్నాడు. దానికి పుండరీకుడు "స్వామీ! శతకోటి జన్మల పుణ్యఫలం ఉంటేగాని మీ దర్శనం లభించదు. నాయందు మీకు గల కరుణ వల్లనే నాకీ అదృష్టం కలిగింది. నాజన్మ తరించింది. కానీ భగవాన్! నీవు నన్ను క్షమించాలి. నీ ఆదేశం ప్రకారం నేను నీతో రావటానికి వీల్లేదు. నేను నా తల్లిదండ్రుల సేవలో పూర్తిగ మునిగి ఉన్నాను. వారిసేవను మధ్యలో ఆపి నేను మీతో రాలేను. ఈ సేవ పూర్తికాగానే తప్పక వస్తాను. అప్పటిదాకా మీరు దీనిపై నిలబడి ఉండండి

అంటూ ఒక ఇటుకరాయిని భగవంతుని వైపుకు విసిరివేశాడు.

పుండరీకుని సేవా పరాయణతకు సంతసించిన భగవానుడు ఆ ఇటుకపై నిలిచి కటిహస్తుడై (నడుముపై చేతులు పెట్టుకొని) సుందరవిగ్రహంగా నిలిచాడు. ఆయనే పాండురంగడు - పండరినాథుడు. పండరిలోని దేవుడు.

తల్లిదండ్రుల సేవకు ఫలితం భగవత్సాక్షాత్కారం. భగవంతుడే వచ్చి పిలిచినా ఆ సమయంలో కూడా అతడికి తల్లిదండ్రుల సేవ మీదనే దృష్టిగాని ఫలితం మీద లేదు. భగవద్భావనతోనే తల్లిదండ్రుల సేవ చేస్తున్నాడు తప్ప అతడికి శరీరదృష్టి లేదు. (సాక్షాత్ భగవంతుని సేవయే అని చేస్తున్నాడు) తల్లిరూపంలో, తండ్రిరూపంలో, భార్యరూపంలో, భర్తరూపంలో, బిడ్డలరూపంలో, గురువురూపంలో - అన్ని రూపాలలో ఉండేది ఆ భగవంతుడే అని భక్తుని అభిప్రాయం. "త్వమేవ సర్వం మమదేవ దేవ!"

పుండరీకుడు భగవంతుని అలా ఇటుక మీద నిలబెట్టినప్పుడు తుకారాం స్వామి అక్కడికి వచ్చాడు. అతడు పుండరీకునితో "ఏమిటోయ్ పుండరీకా! అతడెవరనుకున్నావు? సాక్షాత్తు జగన్నాథుడు, భగవంతుడు. ఏమిటింత నిరాదరణ. ఆయనకు సత్కారాలు చేసి జన్మచరితార్థం చేసుకో!" అన్నాడు తుకారాం. ఆ మాటకు పుండరీకుడు "స్వామీ! వీరు దేవుళ్ళు కారా ? ఆయనేనా దేవుడు? ఈ దేవుళ్ళను వదిలి ఆ దేవుణ్ణి పట్టుకోమంటావా? నాది 'ఏ' సిద్ధాంతం కాదు. 'ఊ' సిద్ధాంతం. అతడే దేవుడు అనను, అతడూ దేవుడే అంటాను. నా తల్లిదండ్రులూ దేవుళ్ళే. ఇతడూ దేవుడే అని నాభావన"

అన్నాడు. పుండరీకుని కర్మనిష్ట అలాంటిది. అతడికి కర్మయందే ఆసక్తి. కర్మఫలంపై ఎలాంటి ఆసక్తీ లేదు. అలా చెయ్యాలి కర్మలను.

తుకారాం కూడా కర్మఫలంపై ఆసక్తి లేకుండా కర్మను చేసే గొప్పభక్తుడే. ఒకనాడు ఇంట్లో పూజాదికాలు ముగించుకొని వసారాలోకి వచ్చి నిలబడ్డాడు. బ్యాండుమేళాలు, పూలమాలలు తీసుకొని పల్లకీతో సహావచ్చారు రాజసేవకులు. అది చూచి తుకారాం, "ఎవరయ్యా మీరు? మనుషుల్ని మోసుకుపోయే ఈ వాహనం ఏమిటి? ఈ ఇంటిలో అందరూ బ్రతికే ఉన్నారు కదా!" అన్నాడు. దానికి రాజసేవకులు, "మహాత్మా! తమరిని ఈ పల్లకీలో కూర్చుండబెట్టుకొని రమ్మని శివాజీ మహారాజు గారు పంపగా వచ్చాం. చక్రవర్తిగారు తమకు పాదపూజ చేస్తారట" అన్నారు.

ఆమాట వినటంతోనే దుఃఖంతో లోనికి పరుగెత్తి విగ్రహం ముందు సాగిలబడి, "పాండురంగా! ఎంత మోసగాడివయ్యా! లంచమిచ్చి నాభక్తిని హరించాలనుకున్నావా? ఈ తుచ్ఛమైన గౌరవాల కోసమేనా నేను నీసేవ చేస్తున్నది? అని వలవలా ఏడ్చాడు.

ఇదీ తుకారాం స్వామి యొక్క ఫలాసక్తి రహితస్థితి. నిష్కామస్థితి. తాను ఇంతకాలంగా చేసిన సేవకు, భక్తికి ఫలం ప్రత్యక్షమైనా భక్తుడు దానివెంట పడలేదు. భక్తునికి పనియందే శ్రద్ధగానీ ఫలితం మీద కాదు. ఇలా ఫలితాన్ని ఆశించకుండా, ఫలితం మీద ఏమాత్రం ఆసక్తి లేకుండా శ్రద్ధతో కర్మలు చేస్తుంటే అహంకారం కరిగిపోతుంది. కర్తృత్వబుద్ధి పోతుంది. వాసనలు క్షయమౌతాయి. మనస్సు నిర్మలమై పరమాత్మ యందు నిలుస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**ఇంతవరకు ఉపాసనామార్గాలను చెబుతూ భగవానుడు (1) 'నీ మనోబుద్ధులు నా యందే ఉంచు. నీవు నాలోనే ఉంటావు' అన్నాడు. (2) 'అలా సాధ్యం కాకపోతే అభ్యాసయోగం ద్వారా వాటిని నాయందుంచు' అన్నాడు. (3) 'అదీ సాధ్యం కాకపోతే నిరంతరం నా కొరకు కర్మలు చేస్తూ ఉండు' అన్నాడు. (4) 'దానికీ నీవు అసమర్థుడివైతే కర్తగా నీపనులే చేసుకో. అయితే ఆపనుల వల్ల వచ్చే ఫలితాన్ని నాకు సమర్పించు. ఫలితంపై దృష్టి పెట్టకు దానితో క్రమంగా నీ కర్తృత్వబుద్ధి తొలగిపోతుంది' అన్నాడు. - ఇక ఈ సాధనాక్రమంలో దేనికి ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలి?**

**- సాధనాక్రమంలో ఏదిముఖ్యం? దేనికి ప్రాధాన్యత నివ్వాలి? అనే విషయాన్ని 12వ శ్లోకంలో తెలియజేస్తూ ఈ ప్రకరణాన్ని ముగిస్తున్నారు.**

**శ్లో||** శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే|
ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరం|| **(12)**

**తా||** అభ్యాసం కన్న జ్ఞానం శ్రేష్ఠం. జ్ఞానం కన్న ధ్యానం మేలైనది. ధ్యానం కన్న కర్మఫలత్యాగం ఎక్కువైనది. త్యాగం తరువాత శాంతి లభిస్తుంది.

**వ్యాఖ్య:-** భగవానుడు సాధనాక్రమాన్ని ప్రారంభిస్తూ 8వ శ్లోకం నుండి 11వ శ్లోకం వరకు 4 శ్లోకాల్లో 4 సాధనామార్గాలను తెలియజేశారు. ఉత్తమసాధకులైన వారికి మనోబుద్ధులు రెండింటిని పరమాత్మయందు నిలుపుట. ఇదే సమాధిస్థితి. భావాతీతస్థితి. నిస్సంకల్పస్థితి. అయితే ఇది అందరికి సాధ్యంకాదు. కనుక ఆస్థితిని అందుకోవటానికి ఉపాయంగా

అభ్యాసయోగాన్ని రెండవ సాధనగా చెప్పారు. అంటే అభ్యాసం ద్వారా మనోబుద్ధులను ఆత్మయందు నిలిపే నైపుణ్యం కలుగుతుంది - అని. ఇక ఈ అభ్యాసయోగాన్ని చేయలేని రజోగుణ సంపన్నులకు వాళ్ళలోని రజోగుణాన్ని తొలగించుకొనుటకు భగవంతుని కొరకు కర్మలు చేయవలసిందిగా ఉపాయాన్ని తెలియజేశాడు. అన్ని కర్మలను భగవంతుని కర్మలుగా చెయ్యాలంటే కర్తృత్వభావాన్ని - 'నేను చేస్తున్నాను' అనే భావాన్ని వదిలి 'ఇది నా కర్తవ్యం' అంటూ చెయ్యాలి. ఇక అది కూడా చేయలేని సామాన్యులకు నీవు కర్తగానే నీపనులు చేసుకుంటూ ఉండు. కాకపోతే ఆ కర్మల వల్ల వచ్చే ఫలితాలను వదిలేసెయ్. అంటే కర్మఫలంపై ఆసక్తిని వదిలెయ్. కర్మలు నైపుణ్యంతో చేస్తూ, కర్మఫలాలను భగవదర్పణం చెయ్యి - అని 4 మార్గాలను తెలియజేశారు.

ఇప్పుడు ఈ నాలుగుమార్గాల యొక్క ఎక్కువ తక్కువలను, వాటి వేరువేరు లక్ష్యాలను బట్టి దేనికి ఎక్కువ ప్రాముఖ్యత నివ్వాలో చెబుతున్నారు.

కేవలం వేదాంత సత్యాలను చెప్పుకుంటూపోతే ప్రయోజనం లేదు. అందులోని భావాలను గ్రహించటానికి వాటిని సూక్ష్మీకరించి, సంక్షిప్తం చేసి చెప్పాలి. అందుకే ఈ శ్లోకంలో ఆ ప్రయత్నం.

(i) <u>శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ :-</u> జ్ఞానం అంటే ఇక్కడ శాస్త్రజ్ఞానం అని. ప్రతిరోజూ ఒకగంట జపం చేయండి; అలాగే పూజచేయండి; ఎంతో మంచిది; బాగా కలిసివస్తుంది - అంటే అలా చేస్తాం అనుకోండి. ఆ ఆశతో అలా ఎప్పటికీ చేస్తూ ఉంటే అదొక అలవాటుగా మారిపోతుంది. ఏదన్నా ఒకరోజు

చేయలేకపోతే ఏదో అపచారం జరిగినట్లుగా భావిస్తాం. దానికి తగినట్లుగానే ఆరోజు ఏదన్నా కష్టం రావటమో, నష్టం జరగటమో, దుర్వార్త వినటమో జరిగితే ఇక మూఢనమ్మకం ఇంకా బాగా పెరిగిపోతుంది. రోజూ పూజచేస్తేనే మనకు కలిసివస్తుంది. ఈరోజు చేయకపోయినందునే ఇలా జరిగింది అని తీర్మానించుకుంటాం. ఇలా పూజలు, జపాలు చేస్తే నిజంగా ఏఫలితం వస్తుందో తెలియక, తెలిసిన ఫలితం రాక తికమక పరిస్థితి ఏర్పడుతుంది. కనుక శాస్త్రజ్ఞానం కావాలి. ఏ కర్మలు ఎలా చేయాలి? ఎందుకు చేయాలి? చేస్తే వచ్చే ఫలితం ఏమిటి? చెయ్యకపోతే నష్టం ఏమిటి? అందరూ చేస్తున్నారు గనుక నేనూ చెయ్యాలి అనే గొర్రెదాటు పద్ధతి కాకుండా అన్ని విషయాలు కూలంకషంగా తెలుసుకొని చేయాలి. తెలుసుకోక ఎంత గొప్పసాధనలు చేసినా, ఉపయోగం ఉండదు. అది మూఢాచారంగా అయిపోతుంది? ఒక్కొక్కసారి నలుగురిలో నగుబాటు అవుతుంది కూడా.

అనగనగా ఒక రాజు. ఆయనకొక రాణి. ఆ రాణీగారి బట్టలు ఉతకటానికి ఒక చాకలి ఉన్నది. ఆమె అందంగా ఉంటుంది. మంచి మాటకారి. అందువల్ల రాణీగారికి ఎంతో అంతరంగికురాలైంది. ఒకరోజున చాకలి - రాణీగారి బట్టలు మడుచుకుంటూ ఏడుస్తున్నది. ఎందుకు ఏడుస్తున్నావు? అని రాణీ అడిగింది. 'మా మల్లన్న చచ్చిపోయెనే' అన్నది చాకలి. పాపం ఆ మల్లన్న చాకలికి ఎంత ఆప్తుడో అనుకుని రాణీ కూడా కంట తడిపెట్టింది. రాణీగారు కంటతడిపెట్టేటప్పటికి ఆమె పరిచారికలు, దాసీలు ఊరుకుంటారా? వారూ గగ్గోలుపెట్టి ఏడ్చారు. ఇది చూచి రాజుగారు అక్కడికి వచ్చి రాణీ, అంతఃపుర

దాసీలు ఏడుస్తుంటే ఆయనా ఏడ్చాడు. రాణీగారి ఆప్తులెవరైనా పోయారేమోననుకున్నాడు రాజు. రాజుగారు ఏడుస్తుండేటప్పటికి మంత్రులు, పరివారము ఏడవటం ప్రారంభించారు. దానితో రాజభవనం చుట్టుప్రక్కల ఉన్న జనం - దానితో నగరంలోని అందరూ భోరున ఏడుస్తున్నారు.

ఇంతలో ఒక సాధువు ఆ నగరంలో ప్రవేశించి దారిలో అందరూ ఏడుస్తూ ఉండటం చూచాడు. 'ఎందుకయ్యా ఏడుస్తున్నావ్?' అంటే వాడు ప్రక్కనున్న వాణ్ణి చూపించాడు. అతణ్ణి అడిగితే వాడూ ప్రక్కవాణ్ణి చూపాడు. అలా కూపీతీసుకుంటూ రాజభవనానికి వచ్చి, మంత్రిని అడిగితే రాజుగారు ఏడుస్తున్నారు. అందుకే నేనూ ఏడుస్తున్నాను అన్నాడు. రాజుగారిని అడిగితే రాణీగారు ఏడుస్తున్నారు అందుకే అన్నాడు. రాణిగారిని అడిగాడు సాధువు. మా చాకలి ఏడుస్తున్నది. అదంటే నాకు ఎంతో ఇష్టం అన్నది. చాకలిని అడిగితే మా మల్లన్న చచ్చిపోయెనే - అందుకు అన్నది. ఎవరా మల్లన్న? అని అడిగితే '3 రోజుల క్రిందట పుట్టిన మా గాడిదపిల్ల' అంది చాకలి. కనుక ఏపనీ మూఢంగా, ఏమీ తెలుసుకోకుండా చేయకూడదు.

అలాగే అభ్యాసంకూడా ఏమీ తెలియకుండా మూఢంగా చేయకూడదు. మనం చేసే సాధన ఏమిటో; ఎందుకు చేస్తున్నామో, చేస్తే ఫలితం ఏమిటో, గమ్యస్థానం ఏమిటో అన్నీ తెలుసుకోవాలి.

మనం విజయవాడ వెళ్ళాలి. బస్టాండ్ కు వెళ్ళి ఏదో ఒక బస్సు వెంటనే కదిలిపోతున్నది గదా! అని ఎక్కితే నెల్లూరుపోతామో, మద్రాసు పోతామో తెలియదు. అలాగే ఒక పూజ చేస్తున్నాం; జపం చేస్తున్నాం. ఆపూజ లేదా

జపం మన మనస్సును శుద్ధం చేసుకొనుటకు లేదా ఏకాగ్రం చేసుకొనుటకు ఉపయోగిస్తుంది అని తెలియకుండా చేస్తే ఏంప్రయోజనం? కనుకనే భగవానుడు అభ్యాసం కన్నా జ్ఞానం (తెలుసుకొనుట) ముఖ్యం అన్నాడు.

(ii) జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే:- ఏ సాధన ఎలా చేయాలో, ఎందుకు చేయాలో, గమ్యం (ఫలితం) ఏమిటో తెలుసుకోవటం జ్ఞానం. ఇది కేవలం శాస్త్రజ్ఞానం. శాస్త్రం మనకు గమ్యం ఏమిటో తెలియజెప్పి, ఆ గమ్యాన్ని చేరుకోవటానికి అనేక మార్గాలను చూపుతుంది. అయితే ఇలా గమ్యాన్ని, మార్గాన్ని ఎంతకాలం తెలుసుకున్నా అణుమాత్రం ప్రయోజనం లేదు. ఆ మార్గం వెంట నడిచి గమ్యాన్ని చేరుకుంటేనే ప్రయోజనం. అందువల్ల శాస్త్రం ద్వారా తెలుసుకున్న విషయాలను మరల మరల మననం చేసుకుంటూ, ఆ భావాలను స్థిరపరుచుకొని, అనుభవంలోనికి తెచ్చుకోవాలి. అలా తెచ్చుకొనేందుకే ధ్యానం. నిరంతర ధ్యానం వల్ల చిత్తశుద్ధి, ఏకాగ్రత కలిగి ఆత్మానుభూతికి మార్గం దగ్గరవుతుంది. కనుకనే జ్ఞానం కన్న ధ్యానం శ్రేష్ఠమని చెప్పటం జరిగింది.

(iii) ధ్యానాత్ కర్మఫలత్యాగః:- ధ్యానం చేసేవారికి ఆ ధ్యానం చేస్తున్నంత సేపు మనస్సు నిర్మలంగా, శుద్ధంగా ఉంటుంది. కాని అతడెప్పుడూ ధ్యానం చేస్తూ కూర్చోలేడుగదా! రోజంతా అనేక పనులు చేస్తూ ఉండాలి. మరి అప్పుడు మనస్సు నిర్మలంగా, భగవద్భావనలో ఉంటుందా? ఉండదు. అనేకరకాల కర్మలు చేస్తూ, అనేక ఆలోచనలతో మనస్సు విక్షేపం చెందుతూ ఉంటుంది. దానివల్ల మనస్సు అశాంతి పాలౌతుంది. అంటే బాహ్యవిషయాలతో సంగభావం వల్ల

మనస్సు దోషపూరితం అవుతుంది. కనుక ఏమిటి ఉపాయం? అదే కర్మఫల త్యాగం. అంటే సమస్త కర్మలు చేస్తూ కర్మఫలాన్ని కోరకుండా భగవంతునికి సమర్పించుట. అంటే కర్మఫలంపై ఏమాత్రం ఆసక్తి లేకుండా నైపుణ్యంతో కర్మలు చేయటం. నిర్లిప్తంగా చేయటం.

అందుకే ధ్యానం కన్న కర్మఫలత్యాగం గొప్పది అన్నారు. ఇది సులువైనది, సురక్షితమైనది, అన్ని సాధనలకు అర్హత కలిగించేది. మనస్సును శాంతపరచేది. కర్మఫలంపై ఆసక్తి ఉంటే ఆందోళన, అశాంతి. ఆసక్తిని వదిలేస్తే ఏ ఆందోళన ఉండదు. కనుక కర్మఫలాన్ని ఊహించుకోవద్దు.

మనం ఎప్పుడూ ఈ ప్రాపంచిక వ్యవహారాలలో మునిగిపోయి ఉంటాం. ఎంతటి భక్తుడైనా రోజులో గంటో, రెండు గంటలో దైవానికి కేటాయిస్తాడేగాని మిగిలిన సమయమంతా లౌకిక వ్యవహారాలే. మన సుఖం కోసం, సంతోషం కోసం, అవసరాల కోసం, భోగాల కోసం పనులు చేయక తప్పదు. కనుక చేసే కర్మలేవో చేస్తూనే ప్రయత్నపూర్వకంగా ఆ కర్మల యొక్క ఫలాన్ని త్యాగం చెయ్యాలి. అలా చేయగలిగితే అతడు జ్ఞానాభ్యాసి కన్న, ధ్యానాభ్యాసికన్న శ్రేష్ఠుడే. కర్మఫలత్యాగం లేదా నిష్కామ కర్మవల్లనే మనశ్శుద్ధి. ఆధ్యాత్మిక రంగంలో ఏ సాధన చేయాలన్నా మనశ్శుద్ధి అవసరం. మనోనిర్మలత్వం అవసరం. దానికి కర్మఫలత్యాగమే ఉత్తమమార్గం. ఇదే గట్టి పునాది. ఈ కర్మఫలత్యాగం వల్ల ప్రయోజనం ఏమిటి?

(iv) త్యాగాత్ శాంతి రనంతరం:- కర్మఫలత్యాగం వల్ల శాంతి కలుగుతుంది. కర్మఫల త్యాగంతో, లేదా ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేసినందువల్ల

మనస్సులో కోరికల గోల తొలగిపోయి మనస్సు శుద్ధమౌతుంది. ఫలితాలతో సంగభావం ఉండదు గనుక వాటి గురించిన ఆలోచనలు, ఆందోళనలు, ఉద్రేకాలు ఉండవు. అందువల్ల మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. లోకంలో అందరూ ప్రశాంతతనే కోరుకుంటారు. ఆ ప్రశాంతంత ఎక్కడ దొరుకుతుందా? అని దేవాలయాలకు, ఆశ్రమాలకు, క్షేత్రాలకు, తీర్థాలకు వెళ్ళి వెతుకుతారు. కాని ప్రశాంతత దొరకదు. అది నీలోనే ఉంది. బయట ఎక్కడా లేదు. కర్మఫల త్యాగంతో నీలోనే ఉన్న శాంతి నీకు అందుతుంది. అందుకే త్యాగాత్ శాంతి రనంతరం - అన్నారు. కనుక కర్మఫల త్యాగంతో కర్మలు చేయుటే అన్నింటి కన్న శ్రేష్ఠం.

ఇంతటితో ఈ సాధనామార్గాలను తెలియజెప్పే ప్రకరణం పూర్తి అయింది. ఇక మరొక ముఖ్యప్రకరణం భక్తుల లక్షణాలను తెలిపే ప్రకరణాన్ని భగవానుడు ప్రారంభిస్తున్నాడు.

ఎటువంటి లక్షణాలు గల భక్తులు తనకు ఇష్టులో భగవానుడు 13 నుండి 19 వరకు గల 7 శ్లోకాలలో తెలియజేస్తున్నాడు. మొత్తం 36 లక్షణాలను ఇక్కడ తెలియజేస్తూ ఇట్టివారే నాకు ప్రియులు అంటున్నాడు. కనుక మనం భగవంతునికి ప్రియులం కావాలంటే మనం భగవానుడు చెప్పిన లక్షణాలను కొన్నింటినైనా అలవరచుకోవాలి. భగవంతుడు మనకు ఎంత ఇష్టుడు అన్నది ప్రధానం కాదు. భగవంతునికి మనం ఎంత ఇష్టులం అన్నదే ప్రధానం. భగవంతునికి మనపై ప్రేమ, కరుణ, దయ, వాత్సల్యం, అనుగ్రహం ఉంటేనే మనకు సరైన జ్ఞానాన్ని కలిగించి, మోక్షాన్ని ప్రసాదిస్తాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఐతే భగవంతునికి ఎవరి మీదనైనా పక్షపాతం ఉంటుందా? కొందరిపై ప్రేమ, కొందరిపై ద్వేషం ఉంటుందా? ఉండదు. అలా ఉంటే ఆయన భగవంతుడే కాదు. అయితే ఎవరైతే ఆయన చెప్పిన విధంగా నడుచుకుంటారో, ఆయననే ఆశ్రయిస్తారో, ఆయన చెప్పిన గుణగణాలను అలవరచుకుంటారో వారిపై ఆయనకు ప్రేమ ఉంటుంది. ఆయన చెప్పినదానికి విరుద్ధంగా ఎవరు నడుచుకుంటారో వారు ఆయనకు ఇష్టులు కాకుండా పోతారు. స్వయంగా తెలియజేసిన ఈ 36 లక్షణాలలో కొన్నింటినైనా అలవరచుకోవాలి. అప్పుడే నిజమైన భక్తులుగా ఉండిపోతాం.

భక్తుడంటే నామాలు పెట్టుకొనేవాడు, విభూతి రేఖలు దిద్దుకొనేవాడు, తులసిమాలలో, రుద్రాక్షమాలలో కంఠము నందు తగిలించుకున్న వాడూ, ప్రతిరోజూ దేవాలయాల చుట్టూ తిరిగేవాడు కాదు. మరి భక్తుడంటే ఎవరు? ఈ 7 శ్లోకాల్లో చెప్పిన గుణాలు, లక్షణాలు గలవాడే. అట్టివాడే భగవంతునికి ప్రియుడు.

కనుక భగవంతునికి ఎన్ని పూలతో పూజలు చేసినా, స్తోత్రపాఠాలతో స్తుతించినా, భజనలు చేసినా, అభిషేకాలు చేసినా చాలదు. ఈ చెప్పిన లక్షణాలను అలవరచుకొన్న వారే నిజమైన భగవద్భక్తులు.

భగవంతునికి ఇష్టులైన, ప్రియులైన భక్తుల లక్షణాలను చెప్పటంతోనే ఈ అధ్యాయం ముగుస్తుంది.

- 2వ అధ్యాయంలో స్థితప్రజ్ఞుని లక్షణాలను చెప్పారు.
- 6వ అధ్యాయంలో యోగి యొక్క లక్షణాలను చెప్పారు.

- **13వ అధ్యాయంలో జ్ఞాని యొక్క లక్షణాలను చెప్పారు.**
- **14వ అధ్యాయంలో గుణాతీతుని లక్షణాలను చెప్పారు.**
- **ఈ 12వ అధ్యాయంలో ప్రియమైన భక్తుల లక్షణాలను చెప్పారు. అయితే ఈ అన్ని లక్షణాలు దాదాపు ఒకేవిధంగానే ఉంటాయి. అంటే స్థితప్రజ్ఞుడు, యోగి, జ్ఞాని, గుణాతీతుడు - వీరంతా నిజమైన భక్తుని కన్న వేరుకాదు.**

**భగవద్గీత మనం అందుకోవలసిన పరమలక్ష్యాన్ని (మోక్షాన్ని) గురించి వివరిస్తుంది. ఆ పరమలక్ష్యాన్ని చేరుకొనే మార్గాన్ని తెలియజేస్తుంది. ఆ మార్గంలో వచ్చే ఆటంకాలను, అవరోధాలను, ఇబ్బందులను వివరించి చెబుతుంది. వాటిని అధిగమించే ఉపాయాలను తెలిపి, ఆ మార్గం వెంట నడవటానికి కావలసిన శక్తిసామర్థ్యాలను ఇచ్చి, చేయిపట్టుకొని నడిపిస్తుంది. అందుకే భగవద్గీతను 'అనుష్టాన వేదాంతం' అన్నారు.**

**మనం జీవితంలో ఆచరించటానికి వీలుగా మొత్తం 36 లక్షణాలను 7 శ్లోకాల్లో తెలియజేయబోతూ ముందుగా ఈ 13వ శ్లోకంలో 7 లక్షణాలను తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**శ్లో|| అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ|**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖ క్షమీ|| (13)**

**తా|| సమస్త ప్రాణులనూ ద్వేషించనవాడు; అందరిపట్ల స్నేహభావం గలవాడు; దీనులపట్ల దయగలవాడు; మమకారము, అహంకారము లేనివాడు, సుఖదుఃఖము లందు సమభావం గలవాడు, క్షమాగుణం గలవాడు –**

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో భక్తుల యొక్క 7 లక్షణాలను తెలియజేశారు.

(1) అద్వేష్టా సర్వభూతానాం:- ఏ ప్రాణి పట్ల ద్వేషభావం చూపనివాడే నిజమైన భక్తుడు. అతడంటేనే భగవంతునికి ఇష్టం.

నీటికి నిప్పుకు పొత్తుకుదరదు. ఏరూపంలోనైనా సరే అంతఃకరణంలో ద్వేషబుద్ధి (వృత్తి) ఉన్నదా? అతడు భక్తుడు కానేకాదు. భక్తుడికి ద్వేషం ఉండకూడదు.

'అద్వేష్టా సర్వభూతానాం' - ఇది హిందూధర్మంలోని గొప్పవిశేషం. 'ఇస్లాం మతస్థులను ద్వేషించకూడదు' - అని మహమ్మద్ పై గంబర్ తన మతం వారికి బోధించాడు. 'మానవులందరూ ఒకే తండ్రిబిడ్డలు. కనుక వారిని (మానవులను) ద్వేషించవద్దు' అని క్రీస్తుప్రభువు చెప్పాడు. 'ఏ ప్రాణినీ - మానవులే కాదు జంతువులు, పక్షులు, క్రూరమృగాలు, విషజంతువులు, క్రిమికీటకాలు - దేనినీ - ఎవరినీ ద్వేషించవద్దు' - అని భగవద్గీతలో భగవానుడు చెబుతున్నాడు.

నీ మతం వారిని ద్వేషించవద్దని పైగంబర్, మానవులను ద్వేషించ వద్దని క్రీస్తు చెబితే - నీమతం వారు, మానవులే కాదు, ఏ ప్రాణినీ ద్వేషించవద్దని భగవానుడు తెలియజేస్తున్నాడు. ఎంతటి విశాల హృదయం?

'వాసుదేవ స్సర్వమితి' అంటే ఈ సర్వమూ వాసుదేవుడే; అందరూ - అన్నీ వాసుదేవుడే - పరమాత్మే - పరమాత్మ స్వరూపాలే. అయినప్పుడు దేనిని ద్వేషించాలి? ఎవరిని ద్వేషించాలి? దేనిని ద్వేషించినా - ఎవరిని ద్వేషించినా భగవంతుని ద్వేషించినట్లే గదా!

'ఆత్మౌపమ్యేన సర్వత్ర' - అంటే ఆత్మయే సర్వత్రా ఉన్నది. ఆత్మ కన్నా అన్యంగా మరేమీ లేదు. ఆత్మ అంటే నీవే. కనుక అందరిలో ఉన్నది నీవే. మరి అలాంటప్పుడు ఎవరిని ద్వేషించినా నిన్ను నీవు ద్వేషించుకున్నట్లే గదా!

అయితే ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు తప్పనిసరిగా కొందరిపై అనురాగం, కొందరిపై ద్వేషం ఉంటుంది. వాటి బారి నుంచి తప్పుకోవాలి. ఎలా? ఆత్మదృష్టి ఉండాలి. దేహదృష్టిని, మనోదృష్టిని అధిగమించాలి. అంటే దేహాన్ని చూచి అతడే అనుకోరాదు. అలాగే మనస్సును చూచి అతడే అనుకోరాదు. దేహం అందంగా ఉంటే అందగాడని; దేహం అనాకారంగా ఉంటే అనాకారియని; అవయవ లోపం ఉంటే కుంటి, గ్రుడ్డి అనిగాని ఇలా భావించటం; అలాగే కరుణ, దయ, సహాయం చేసే స్వభావం ఉంటే మంచివాడని; స్వార్థం, దుర్మార్గం మొ||న మనస్సు గలవాడైతే చెడ్డవాడని భావించటం - ఇవే దేహదృష్టి - మనోదృష్టి. ఈ రకమైన దృష్టి ఉంటే రాగద్వేషాలు ఉండక తప్పదు. అలాగాక ఆత్మదృష్టి - అంటే అతడు ఆత్మ; ఇతడు ఆత్మ, ఈమె ఆత్మ, ఆమె ఆత్మ, అది ఆత్మ - అనే దృష్టి ఉంటే ఆత్మకు మంచి - చెడు, పాపం - పుణ్యం, అందం - అనాకారం, పొడవు - పొట్టి, లావు - సన్నం అనే తేడాలు ఉండవు గనుక అందరిపై సమదృష్టి ఉంటుంది. ఒకరిపై రాగం, ఒకరిపై ద్వేషం ఉండే అవకాశమే లేదు. అందరూ - అన్నీ నా స్వరూపమే అనే భావం వల్ల ఈ సమదృష్టి కలుగుతుంది. కనుక అంతటా ఆత్మను దర్శించాలి.

ఇదే విషయాన్ని ఈశావాస్యోపనిషత్ లో "యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాను పశ్యతి। సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే||" అనే

మంత్రంలో స్పష్టం చేశారు. ఎవరైతే సమస్త భూతాలలోను ఆత్మను; సమస్త భూతాలను ఆత్మలోను దర్శిస్తారో ఇక అట్టివారు ఎవరిని అసహ్యించుకుంటారు? ఎవరిని ద్వేషిస్తారు?

నీవు నిన్న మధ్యాహ్నం T.V సీరియల్ చూస్తూ కాలక్షేపానికి బఠాణీలు తింటున్నావు. అందులో ఒకటి బాగా గట్టిగింజ వచ్చింది. దానిని నములుతుంటే పొరపాటున నీ నాలుక పండ్లసందున పడి నలిగింది. భరించలేని బాధ కలిగింది. పాడుపళ్ళు, మెత్తటి నాలుకను అమాంతంగా కొరికేశాయి. వీటికి తగిన బుద్ధి చెప్పాలి - అని ఒక గుండ్రాయిని తెచ్చి పళ్ళను ఊడగొట్టేస్తావా? అహా! అలా ఎప్పటికీ చేయలేవు. ఎంత బాధ కలిగినా, ఎంత కోపం వచ్చినా ఓర్చుకుంటావే గాని ప్రతీకారం తీర్చుకోవాలని అనుకోవు. ఎందుకు? ఆ నాలుకా నీదే, ఆ పళ్ళూ నీవే. పళ్ళూడ గొట్టుకుంటే ఆ బాధ కూడా నీకే. అందుకు. అంటే అన్నీ నీవే అయితే నీకు దేనిమీదా కోపం రాదు, ద్వేషం కలగదు.

నీ కంట్లో పొరపాటున నీవ్రేలు పొడుచుకున్నది. నీకు నీవ్రేలిపై కోపం వస్తుందా? రాదు. ఎందుకని? కన్నూ నీదే, వ్రేలూ నీదే గనుక. అదే మరొకరి వ్రేలు నీ కంట్లో పొడుచుకుంటే ఎక్కడ లేని కోపం వస్తుంది. ఆ వ్రేలిని నరికివేయాలనిపిస్తుంది. కారణం? అది ఇతరుల వ్రేలు. కనుక నీకు ఎవరి మీదా ద్వేషం కలగకుండా ఉండాలంటే సర్వభూతాలు నేనే. నాకంటే వేరు కాదు. అందరిలోను, అన్నింటిలోను ఉన్నది నేనే, ఆత్మయే అనే భావన ఉండాలి. 'ఆత్మవత్ సర్వభూతాని' అనే సూత్రాన్ని అనుసరిస్తే ఏవిధంగాను ద్వేషభావం కలగదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

"చంపగా వచ్చిన వారియందు, కరవాల మందును, కాళి యందు తానచ్యుత భావముంచి"- మహాత్ముడైన జడభరతుడు ప్రవర్తించిన పద్ధతి ఇదే. తనను చంపవచ్చిన వాడూ, ఆ కత్తీ, ఆ కాళీమాత - అందరూ పరమాత్మ ననే భావంతో మిన్నకుండి పోయాడు జడభరతుడు.

తండ్రి తనను ఎన్ని విధాలుగా హింసించినా ప్రహ్లాదునికి అంతటా నారాయణుడే కనిపించాడు. తనను త్రొక్కవచ్చిన ఏనుగులోను, తనను కాటు వేయబోయిన పాములోను, తనను విసిరివేసిన అగ్నిలోను, సముద్రునిలోను, తనను నరకబోయిన కత్తిలోను, నరకబోతున్న భటులలోను, తనకు త్రాగమని ఇచ్చిన విషంలోను - అంతటా అతడికి నారాయణుడే కనిపించాడు. కనుకనే అతడికి తండ్రిపై ఏమాత్రం కోపం లేదు, ద్వేషం లేదు. చివరకు అట్టి తండ్రికి ముక్తిని ప్రసాదించమని ఆ శ్రీమన్నారాయణుని ప్రార్థించాడు. కనుక భక్తుడైన వానికి ఉండవలసిన ముఖ్యలక్షణం ఎవ్వరిపైన ద్వేషం ఉండకూడదు.

కాని ఇప్పుడు చూడండి కొందరు భక్తుల మనుకొనే వారిని. వారికి దేవుళ్ళ మీద కూడా ద్వేషమే. వారు పూజించే దేవుళ్ళు గొప్పవాళ్ళు. మిగిలిన వారు పనికిమాలిన దేవుళ్ళు. కొందరికి విష్ణుమూర్తి, రాముడు, కృష్ణుడు, నరశింహస్వామి - వీరు గొప్పదేవుళ్ళు. శివుడు, పార్వతి, విఘ్నేశ్వరుడు వీరు ఎందుకూ పనికి రానివారు. శివుని పేరు నోటితో పలికితే మహాపాపం. శివాలయం గనుక అక్కడ ఉంటే ఆదారిన వెళ్ళక మరొక దారిన వెళతారు. వీరు వైష్ణవులు. ఇక శైవులున్నారు. వీరికి శివుడు, పార్వతి - వీరే దేవుళ్ళు. విష్ణుసంబంధమైన వారిని తలచుకోకూడదు. ఇలా దేవుళ్ళను ద్వేషించేవారు

ఏరకం భక్తులో ఆలోచించుకోవాలి. "శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే" అని ఉపనిషత్తు చెబుతున్నది. శ్రీరాముడు శివుని పూజిస్తాడు. శ్రీకృష్ణుడు శివుని పూజిస్తాడు. శివసహస్రనామం చెబుతాడు. శివుడు విష్ణువును పూజిస్తాడు. కాని వీరు మాత్రం అది మహాపాపం అంటారు. దేవుళ్ళను ద్వేషించే వీరు మానవులను వదిలిపెడతారా?

కనుక మనం కూడా ప్రహ్లాదుని లాగా మనను ద్వేషించేవారిలోను, మనపై ద్వేషంతో ఉన్నవారిలోను, మనపై కోపించేవారిలోను, మనపై అసూయతో రగిలిపోయే వారిలోను ఆ పరమాత్మనే దర్శిస్తూ వారిని ద్వేషించకుండా ఉండాలి. దీనికి ముందు మనను ప్రేమించే వారిలోనూ, మన శ్రేయస్సు కోరేవారిలోను, మనకు సాయపడేవారిలోనూ, మనకోసం త్యాగం చేస్తున్నవారిలోను ఆ పరమాత్మను దర్శిస్తూ, ఎట్టి పరిస్థితులలోను ద్వేషబుద్ధి లేకుండా ఉండాలి. ఎందుకంటే కొందరిలో ఇది కూడా చాలా అవసరం. కొందరికి అన్నం పెట్టిన చేతిని కరిచే అలవాటు ఉంటుంది. కనుక ఇది ముందు అలవాటు చేసుకోవాలి. ఇక మానవుల పట్ల మాత్రమే గాక సమస్తప్రాణికోట్ల పట్ల కూడా ద్వేషభావం కూడదు. హాని కలిగించే జంతువులు - క్రిమికీటకాలు - అన్నింటి పట్ల సమభావం ఉండాలి. ద్వేషించరాదు. మనను కుట్టే దోమలు, నల్లులు మొ||న వాటిలో కూడా పరమాత్మనే దర్శిస్తూ ద్వేషబుద్ధిని వదిలిపెట్టాలి. అట్టివారే నిజమైన భక్తులు. భగవంతునికి ఇష్టులైన భక్తులవుతారు.

**(2) మైత్రః (3) కరుణః- ఎవరినీ ద్వేషించకుండా ఉండటం భక్తుని యొక్క ముఖ్యలక్షణమే. అయితే అది మాత్రమే చాలదు. ఎందుకంటే చెట్టు ఎవరినీ ద్వేషించదు. స్తంభం ఎవరినీ ద్వేషించదు. అవి భక్తులా? కాదు. కనుక ద్వేషించకుండా ఉండటంతో పాటు భక్తునికి ఉండవలసిన రెండు ముఖ్యలక్షణాలను ఇక్కడ తెలియజేస్తున్నారు. అవే మైత్రి, కరుణ. ద్వేషం అనేది నిషేదాత్మక లక్షణం (తొలగించుకోవాల్సినది). మైత్రి, కరుణ అనేవి నిర్మాణాత్మక లక్షణాలు. (అలవరచుకోవాల్సిన లక్షణాలు).**

**మనకు భూమి నుండి మంచి పంట రావాలంటే రెండు పనులు చేయాలి. ముందు ఆ భూమిలోని గడ్డి, గాదం, కలుపుమొక్కలను పీకేసేయాలి. ఆ తరువాత మంచి విత్తనాలను చల్లాలి. మొదటిది విధ్వంసక పద్ధతి. రెండవది విధాయక (నిర్మాణాత్మక) పద్ధతి. రెండూ కలిస్తేనే కార్యసాఫల్యం. అందుకే అక్కడ 'అద్వేష్టా సర్వభూతానాం' అని వెంటనే 'మైత్రః కరుణ ఏవచ' అన్నారు. అయితే మైత్రీభావం ఎవరిపట్ల చూపాలి? కరుణ ఎవరిపట్ల చూపాలి?**

**జ్ఞానులు, పెద్దలు, భక్తులు మొ॥న వారియందు గౌరవం చూపిస్తాం. అయితే సమానుల యందు మైత్రిని - స్నేహభావాన్ని చూపాలి. అలాగే దీనుల యందు, బాధలలో ఉన్నవారి పట్ల దయ - కరుణ చూపాలి.**

**యోగశాస్త్రంలో యోగికి ఉండవలసిన 4 లక్షణాలను చెప్పారు. అవే "మైత్రీ కరుణ ముదితా ఉపేక్షా" - అని.**

- **సమానుల పట్ల మైత్రి; .**
- **దీనుల పట్ల కరుణ,**

❖ సుఖంగా - హాయిగా జీవించేవారి పట్ల ముదిత(ఆహ్లాదం - సంతోషం),

❖ దుష్టులు, నీచులు అయినవారి పట్ల ఉపేక్ష.(ఉదాశీనత).

దుష్టులు, నీచులు అయినవారి పట్ల ఉపేక్ష చూపమన్నారే గాని ద్వేషం చూపమని చెప్పలేదు. కనుక ద్వేషం అనేది భక్తులకు పనికిరాదు.

ఇంతవరకు భక్తుల లక్షణాలలో (1) అద్వేష్టా సర్వభూతానాం, (2) మైత్రః (3) కరుణ అనే 3 లక్షణాలను చెప్పారు. ఇక నాలుగవది

(4) నిర్మమః- ఇది భక్తునికి ఉండవలసిన నాలుగవ లక్షణం. భక్తునికి దేనిమీదా, ఎవరి మీదా మమకారం ఉండరాదు. నాది నాది అని కొన్నింటిపై మమకారం ఉన్నదీ అంటే కొన్ని నావి కానట్లే గదా!

తల్లి తన పిల్లలను ఎప్పటికీ ద్వేషించదు. పిల్లలు ఎన్ని తప్పులు చేసినా, చెప్పిన మాట వినకపోయినా, చివరకు తనపైనే కత్తి గట్టినా ద్వేషించదు. పైగా వారియందు వాత్సల్యం చూపుతుంది. అంతేకాదు వారికేదైనా ఆపదవస్తే కరుణ చూపుతుంది. అంటే పైన పేర్కొన్న 3 లక్షణాలు సహజంగానే తల్లికి పిల్లలపై ఉంటుంది. ఇవన్నీ ఎందుకుంటున్నాయి? అంటే వారిపై మమకారం వల్ల. అయితే ఆమె ప్రేమ అంతా తనబిడ్డల వరకే పరిమితం. పొరుగింటి బిడ్డలమీద ఆ మమకారం ఉండదు. అందుకే వారిపట్ల మైత్రిగాని, కరుణగాని చూపలేదు. సమయమొస్తే ద్వేషిస్తుంది కూడా. తల్లి తనబిడ్డలను కొట్టేటప్పుడు అరచేతిని దొప్పలాగా చేసి కొడుతుంది. పరాయిబిడ్డలను కొట్టేటప్పుడు బాగా చాచి కొడుతుంది. ఎందుకీ తేడా? కేవలం మమకారం వల్ల మాత్రమే. అంటే మమకారం వల్ల మనలో పక్షపాత బుద్ధి కలుగుతున్నది, ద్వేషబుద్ధి

కలుగుతున్నది. అంతేకాదు తన వారికి ఏదైనా ఆపదవస్తే, కష్టం వస్తే ఆమె దుఃఖిస్తుంది. అంటే మమకారం వల్ల దుఃఖం కూడా కలుగుతుంది. అందుకే ఈ మమకారం అనేది భక్తునికి ఎట్టి పరిస్థితిలోనూ ఉండరాదు.

ఈ మమకారమే అర్జునుని విషాదగ్రస్తుణ్ణి చేసింది. అనేక యుద్ధాలలో ఎందరినో వధించాడు అర్జునుడు. కాని భీష్మద్రోణాదులు ఎదురుపడగానే వీరందరూ నావారు, నా తాత, నాగురువు, నా మేనమామలు, నా సోదరులు, నా బావమరుదులు - - - అంటూ దుఃఖించటం మొదలుపెట్టాడు. ఈ మమకారం అందరిమీదా ఉన్నదా? లేదు. ఈ పరిచ్ఛిన్న మమకారం అర్జునునంతటి వాణ్ణి ముప్పుతిప్పలు పెట్టిందంటే ఇక సామాన్యుల విషయం వేరే చెప్పాలా?

అర్జునుడు వీరుడు, శూరుడు, ధీరుడు. దేవేంద్రుని అంశలో పుట్టినవాడు. మహాభక్తురాలైన కుంతీదేవికి కుమారుడు. ధర్మాత్ముడైన ధర్మరాజుకు సోదరుడు. సాక్షాత్తు భగవంతుడైన శ్రీకృష్ణునికి ఆప్తమిత్రుడు, ప్రియశిష్యుడు, బావమరిది. సాక్షాత్తు పరమేశ్వరునే తన భుజబలంతో మెప్పించి పాశుపతాస్త్రాన్ని సాధించిన దిట్ట. 13 సం||లు అరణ్యాలలో కాయ కసురులు తింటూ ఘోరమైన తపస్సు చేసిన మహనీయుడు. త్రిభువన సుందరియైన ఊర్వశి తనంతతట తాను వలచి వచ్చినప్పటికీ ఆమెపైపు కన్నెత్తి చూడని జితేంద్రియుడు. సర్వశస్త్రాస్త్ర సంపన్నుడైన మహావీరుడు. ఆశ్రితులను, శరణాగతులను రక్షించుటలో ప్రతిజ్ఞాబద్ధుడు. అంతటివాడే మమకారం దెబ్బకు బోల్తా పడిపోయాడు. "మహాగజాః పలాయంతే మశకానాంతు కాంగతిః" -

పెద్ద పెద్ద మదపుటేనుగులే పారిపోతూఉంటే ఇక దోమల గతి ఏమిటన్నట్లు ఈ మమకారం దెబ్బకు సామాన్యులైన మనగతి ఏమిటి? కనుక మమకారాన్ని వదలాలి. అలా వదిలిన వాడే భక్తుడు.

(5) నిరహంకారః:- భక్తుడు అహంకారం లేనివాడై యుండాలి. మమకారానికి మూలం అహంకారం. అహంకారం ఉన్నప్పుడే మమకారం కలుగుతుంది. 'నేను' అనుకున్నప్పుడే 'నాది' అనే భావం పుడుతుంది. నేనే లేకపోతే ఇక నాది అనేదేం ఉంటుంది? కనుక అహంకారం తొలగాలి.

ఇంతకూ అహంకారం అంటే ఏమిటి? ఈ శరీరమనోబుద్ధులే నేను అనుకోవటం అహంకారం. ఈ శరీర మనోబుద్ధులు 'నేను' అయితే ఆ శరీర మనోబుద్ధులు 'నీవు'. ఈ రెండు శరీరాలలో, మనోబుద్ధులలో ఎన్నో తేడాలున్నాయి. గనుక నేను వేరు, నీవు వేరు అయ్యాం. నాకన్నా వేరుగా ఉన్న నీవు నాకు ఇష్టుడవో అయిష్టుడవో అవుతున్నావు. అంటే నీపై మమకారమన్నా కలుగుతుంది; ద్వేషమన్నా కలుగుతుంది. అంటే భేదదృష్టి ఏర్పడుతున్నది.

అలాగాకుండా ఈ శరీర మనోబుద్ధులు జడమైనవి, అశాశ్వతమైనవి, నశించిపోయేవి. ఇవి 'నేను' కానేకాదు. వీటికి వేరుగా ఉండి, వీటన్నింటికి చైతన్యాన్ని శక్తిని ప్రసాదించే 'ఆత్మయే నేను' అని తెలుసుకొని ఆత్మగా ఉన్నప్పుడు; నీ శరీర మనోబుద్ధులకు వేరుగా ఉండి, వీటన్నింటికి చైతన్యాన్ని ప్రసాదించే 'ఆత్మయే నీవు' అని తెలుసుకుంటావు. అంటే నేనూ ఆత్మనే, నీవూ ఆత్మవే. అసలు ఆత్మ అనేది అఖండం. ముక్కలయ్యేది కాదు; ఆ ముక్క నేను, ఈ ముక్క నీవు అనుకోవటానికి వీలు లేదు. ఆత్మలో ఏ బేధాలు లేవు. అది ఒక్కటే.

అలాంటప్పుడు నీవు ఆత్మ, నేను ఆత్మ అయి, ఆత్మ ఒక్కటే అయితే. నీవూ నేను ఒక్కటే కదా! నీవే నేను, నేనే నీవు. అసలు ఇద్దరం లేము. కనుక నేను ఆత్మను అనే భావమే నిరహంకారం. ఆత్మగా ఉంటే అహంకారం లేనట్లు, దేహంగా ఉంటే అహంకారం ఉన్నట్లు. కనుక భక్తుడైన వాడు ఆత్మగా ఉండాలి. నిరహంకారుడై ఉండాలి. అప్పుడే నేను గొప్ప, నీవు తక్కువనే భేదభావం తొలగిపోతుంది. అందరిని సమానంగా చూడటం సాధ్యమౌతుంది.

(6) సమ దుఃఖసుఖః:- భక్తుడైన వాడు సుఖదుఃఖములందు సమంగా ఉండాలి. సుఖాలకు పొంగటం, దుఃఖాలకు క్రుంగటం సామాన్యుల లక్షణం. భక్తుల లక్షణం కాదు. ఈ సుఖదుఃఖాలు రెండూ మన మనస్సును ఉద్రేకాలకు, అలజడులకు, ఆందోళనలకు లోను చేస్తాయి. దానితో ఆరోగ్యసమస్యలు కూడా తలెత్తుతాయి. మనస్సు యొక్క ప్రశాంతతను చెడగొడతాయి. దానితో భగవంతుని ప్రశాంతంగా స్మరించలేము. మనస్సు పెట్టి పూజ, జపం, ధ్యానం మొ||నవి చేయలేము. కనుక భక్తుడైనవాడు సుఖదుఃఖాలను సమంగా చూడగలగాలి. అయితే ఇది ఎలా సాధ్యం? ఎప్పుడైతే సుఖదుఃఖాల అసలు తత్త్వాన్ని - యదార్థ తత్త్వాన్ని గ్రహించగలుగుతామో అప్పుడే వీటిని సమానంగా చూడగలుగుతాం. ఏమిటా యదార్థతత్త్వం?

(a) మనకు ఇప్పుడు సుఖం కలిగిందీ అంటే మనం పూర్వజన్మలలో పుణ్యకర్మలు - సత్ కర్మలు చేయటం వల్లనే గదా! వాటి ఫలితంగా ఇప్పుడు సుఖభోగాలు అనుభవిస్తే ఇప్పుడా పుణ్యం కాస్తా ఖర్చైపోతున్నదన్నమాట. అలాగే మనకు ఇప్పుడు దుఃఖం కలుగుతున్నదీ అంటే దానికి కారణం మనం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పూర్వజన్మలలో చేసుకున్న పాపకర్మలు దుష్టకర్మలే. ఇప్పుడు వాటి ఫలితంగా దుఃఖాన్ని అనుభవిస్తున్నాం అంటే ఆ పాపం కాస్తా ఖర్చైపోతున్నదనే గదా! పుణ్యం ఖర్చైపోతుంటే మనం బాధపడాలా? పాపం ఖర్చైపోతుంటే బాధపడాలా? మన దగ్గరున్న డబ్బు ఖర్చైపోతుంటే బాధపడతామా? మనం చేసిన అప్పులు రద్దై పోతుంటే బాధపడతామా? డబ్బు ఖర్చైపోతుంటేనే గదా! అలాగే అయ్యయ్యో! మనం చేసుకున్న పుణ్యం ఖర్చైపోతున్నదే అని సుఖాలు పొందేటప్పుడు బాధపడి వాటికి బదులుగా ఇప్పుడు పుణ్యకర్మలు చేసి పుణ్యఫలాన్ని కూడబెట్టుకోవాలి. అలాగే దుఃఖాలు వచ్చినప్పుడు మన పాపకర్మలు ఖర్చైపోతున్నాయని సంతోషించాలి. ఈవిధంగా సుఖాలు వచ్చినప్పుడు పొంగిపోరాదు, దుఃఖాలు కలిగినప్పుడు క్రుంగిపోరాదు. మన పాపం ఖర్చైపోతున్నది గదా! అని సంతోషంతో దుఃఖాలు అనుభవించాలి. ఇలాంటి భావన గుర్తుపెట్టుకొని సుఖదుఃఖాలకు పొంగక, క్రుంగక వాటిని సమంగా చూడాలి.

(b) మరొక విశేషం. సుఖాలు అనుభవించేటప్పుడు ఆనందంగా ఉంటుంది. దానితో అహంభావంతో విర్రవీగుతారు. నా అంతటివాడు లేడు అనుకుంటాడు. అలాంటి సమయంలో భగవంతుడు గుర్తురాడు. అదే కష్టాలు, దుఃఖాలు వచ్చినప్పుడు ఎంత వద్దనుకున్నా భగవంతుడు గుర్తుకు వస్తాడు. దేవుడులేడని వాదించే నాస్తికుడు కూడా చాటుగానైనా దేవుని ప్రార్థిస్తాడు. సంకటమొస్తే వెంకటరమణ అన్నట్లు ఈ కష్టాలు, బాధలు, దుఃఖాలు మనను భగవంతునికి దగ్గర చేస్తాయి. ఆయనను తలచుకుంటాం, ఆశ్రయిస్తాం,

శరణుకోరతాం, ధ్యానిస్తాం, పూజిస్తాం. కనుక భగవంతుని దగ్గరకు చేర్చే దుఃఖమే ఎంతో మంచిది అనే భావన చెయ్యాలి. అప్పుడు దుఃఖాలకు చలించకుండా ఉంటాం. అందుకే మహాభక్తులైనవారు దుఃఖాలనే ఆశ్రయిస్తారు.

ఒకసారి మహాభక్తురాలైన కుంతీదేవిని పలకరించటానికి వచ్చాడు శ్రీకృష్ణుడు, "అత్తా నీకేం కావాలో కోరుకో! నేను అనుగ్రహిస్తాను అన్నాడు శ్రీకృష్ణుడు. దానికి కుంతీదేవి, "నేను కోరిన కోరికను నీవు తీర్చలేవులే కృష్ణా!" అన్నది. అదేమిటత్తా! అలా అంటావు? నీవు నిస్సందేహంగా కోరుకో, తీరుస్తాను అన్నాడు కృష్ణుడు. అప్పుడు కుంతీదేవి, "కృష్ణా! అయితే నాకెప్పుడూ కష్టాలు, దుఃఖాలు ఉండేటట్లుగా అనుగ్రహించు" అన్నది. ఆశ్చర్యపోయాడు కృష్ణుడు. అత్తా ఏమిటి నీ విపరీతమైన కోరిక? అన్నాడు. దానికి కుంతీదేవి, "నాయనా! మేము కష్టాలలో ఉన్నప్పుడే గదా! నీవు పరుగులు తీసుకుంటూ మావద్దకు వచ్చింది. ఆనాడు ఏకచక్రపురంలో భిక్షాటన చేస్తున్నప్పుడు వచ్చావు. ఖాండవప్రస్థంలో దిక్కులేకుండా ఉన్నప్పుడు వచ్చావు. ద్రౌపదీ వస్త్రాపహరణమనే అత్యంత దుర్భర కష్టస్థితిలో ద్రౌపది మానసంరక్షణ గావించావు. అరణ్యాలలో క్లేశాలు అనుభవిస్తుంటే ధైర్యం చెప్పటానికి వచ్చావు. దుర్వాసుని బారినుండి కాపాడటానికి పిలవకుండానే వచ్చావు. మహాయుద్ధంలో వెన్నంటి ఉండి నా పుత్రులను రక్షించావు. ఇప్పుడు సకల సంపదలతో, రాజ్యభోగాలతో సుఖసంతోషాలతో ఉన్నప్పుడు ఒక్కసారైనా వచ్చావా? అందుకే నీ దర్శనాన్ని కలిగించే కష్టాలే కావాలి అన్నదట. అదీ

భక్తుల ఆలోచన.

ఈ ప్రపంచానికి ఆత్మజ్ఞానాన్ని అందించే భగవద్గీత కూడా విషాదయోగంతోనే ప్రారంభమైంది. దుఃఖాన్ని యోగంగా మార్చుకున్నాడు అర్జునుడు పరమాత్మ సాయంతో. దుఃఖం ముక్తికి సోపానం అని ఋజువుచేశాడు.

- దుఃఖంతో గొప్ప వాడయ్యాడు అర్జునుడు.
- హాలాహలమనే దుఃఖాన్ని మ్రింగి పరమేశ్వరుడు మహాదేవుడయ్యాడు.
- అమృతం త్రాగిన వారంతా చిల్లర దేవుళ్ళయ్యారు.

కనుక దుఃఖం భగవంతుని సన్నిహితుని చేస్తుంది. సుఖం భగవంతునికి దూరం చేస్తుంది - అని భావించగలిగితే రెండింటి పట్ల సమభావం ఉంటుంది.

(c) సుఖదుఃఖాల పట్ల సమభావం కలగాలంటే మరొక ఆలోచన చేయాలి. సుఖాలు గాని, దుఃఖాలు గాని అవి ఎల్లప్పుడూ ఉండేవికావు. అవి రాకడపోకడ కలిగినవి. అందుకే కష్టాలలో ఉన్నవారిని పరామర్శిస్తూ అంటారు - "కష్టాలు కలకాలం ఉంటాయా ఏమిటి?" అని. అంటే కష్టాలు శాశ్వతంగా ఉండవు. కష్టాల తరువాత సుఖాలు, సుఖాల తరువాత కష్టాలు వస్తూనేఉంటాయి. కనుక ఎవరైనా కష్టాలలో ఉన్నప్పుడు తరువాత వచ్చేది సుఖాలే గదా! అని సంతోషంతో ఉండాలి. అలాగే సుఖాలలో ఉన్నప్పుడు ఇవి శాశ్వతంగా ఉండవు గదా! వీటి తరువాత వచ్చేది కష్టాలే అని భావించి జాగ్రత్తగా ఉండాలి. అందుకే భగవద్గీతలో కష్టసుఖాలను "ఆగమాపాయినోஉనిత్యాః తాం తితిక్ష స్వభారత!" అని భగవానుడు చెప్పటం

జరిగింది. అంటే 'రాకడ పోకడ కలిగినవి ఈ సుఖదుఃఖాలు. అనిత్యమైనవి ఇవి. కనుక వాటిపట్ల ఓర్పుతో ఉండు' అని భగవానుడు తెలియజేశాడు. కష్టాలను కూడా సంతోషంతో అనుభవించాలంటే 'ఆగమాపాయినో2నిత్యా' అనేది అష్టాక్షరీ మహామంత్రం.

(d) సుఖం గాని, దుఃఖం గాని మన ప్రారబ్ధవశాత్తు వచ్చేవి గాని మనం రమ్మంటే వచ్చేవి, పొమ్మంటే పోయేవి కావు. కనుక ఎలాగూ వచ్చే వాటిని; తప్పక అనుభవించవలసిన వాటిని ఆనందంగా అనుభవించాలే గాని, ఏడుస్తూ ఎందుకు అనుభవించాలి? కనుక సుఖదుఃఖాలను నిర్లిప్తంగా, సమభావంతో అనుభవించాలి. అందుకే భక్తుడైన వాడు సుఖదుఃఖాలను భగవత్ ప్రసాదంగా స్వీకరిస్తాడు. సుఖానికి పొంగడు, దుఃఖానికి క్రుంగడు.

(e) ప్రారబ్ధానుసారంగా వచ్చిన దుఃఖాలకు కష్టాలకు భీతి చెందక ఢీకొని పోరాడిన వారే మహాత్ములయ్యారు.

- ❖ అరణ్యాలలో అనేక కష్టాలు అనుభవించిన శ్రీరాముడే విజయాన్ని సాధించాడు.
- ❖ అరణ్య అజ్ఞాతవాసాలలో క్లేశాలనుభవించిన పాండవులే విజయం సాధించారు.
- ❖ అరణ్యాలలో దుర్భరకష్టాలనుభవించిన నలుడే విజయం సాధించి మహారాజయ్యాడు.
- ❖ జనారణ్యంలో క్లేశాలనుభవించిన హరిశ్చంద్రుడే చిరకీర్తిని సంపాదించాడు.
- ❖ బండరాయి అనేక సుత్తిదెబ్బలు తింటేనే దేవాలయంలో ప్రతిష్ఠింపబడి

పూజలందుకుంటుంది.

కనుక దుఃఖాలకు భయపడరాదు. సుఖదుఃఖాలను సమంగా చూడాలి. అలా చూడగలవాడే భక్తుడు, భగవంతునికి ఇష్టుడు, అలలు పర్వతాన్ని చలింపజేయలేనట్లు సుఖదుఃఖాలు భక్తుని చలింపజేయలేవు. కనుక రెండింటిని సమదృష్టితో చూచి భగవంతుని దృష్టిలో పడాలి.

(7) క్షమిః- భక్తునికి ఉండవలసిన ముఖ్యగుణాలలో క్షమా గుణం ఒకటి. క్షమ అంటే ఓర్పు - సహనం. ఇది చివరిలో చెప్పినా మొదట్లోనే ఉండవలసిన గుణం. విధిలేక, గతిలేక ఓర్చుకోవటం క్షమకాదు. పరిస్థితులు ఎదురైనప్పుడు ఆత్మస్థైర్యంతో సహించటం, ఓర్చుకోవటమే క్షమ. ఒక యజమాని తన క్రింద పనిచేసే పనివాణ్ణి తిడుతున్నా, కొడుతున్నా నోరెత్తకుండా పడిఉంటాడు. ఎందుకంటే అతణ్ణి పనిలో నుండి తీసివేస్తే ఇంతజీతం ఇచ్చే యజమాని దొరకడు. కనుక అన్నింటిని సహించి ఉంటాడు. ఇది క్షమకాదు. తనకు ఎదురుతిరిగే శక్తి ఉన్నప్పటికీ ఎదటివాణ్ణి క్షమించగలిగితేనే అది క్షమ అవుతుంది. పరమభక్తులు, మహాత్ములు ఐన వారికి ఈ క్షమాగుణం ఉంటుంది.

ఛత్రపతి శివాజీకి మొదటి గురువు తుకారాం స్వామి. రెండవ గురువు సమర్థరామదాసు. సమర్థ రామదాసు ఒకసారి శివాజీ వద్దకు బయలుదేరాడు. పదిమంది శిష్యులు కూడా వెంట నడిచివస్తున్నారు. ప్రయాణం చాలా దూరాభారం. మధ్యాహ్నం సమయం. ఎండ మండిపోతున్నది. బాగా ఆకలివేస్తున్నది అందరికీ. ఒక పెద్ద చెట్టును చూచి శిష్యులతో సహా ఆ చెట్టు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నీడలో విశ్రమించాడు గురువు. ఆ ప్రక్కనే ఒక చెఱకు తోట ఉన్నది. చెరకుగడలు బాగా పక్వానికి వచ్చి ఉన్నాయి. శిష్యులకు నోరూరుతున్నది. వారందరూ గురువుగారిని సమీపించి, "స్వామీ! ఆకలి దహించి వేస్తున్నది. ఆ చెరకుతోటలో చెరకుగడలు బాగా పక్వానికి వచ్చి ఉన్నాయి. తలా ఒక చెరకుగడ తెచ్చుకుందాం. సమయానికి యజమాని లేడు. వచ్చిన తరువాత కావాలంటే డబ్బు ఇద్దాం. లేదా సాధువులు తింటే అతడికే పుణ్యం గదా!" అన్నారు. వద్దని చెప్పినా వినేటట్లు లేరు శిష్యులు. అందుకని ఊకొట్టి ఊరుకున్నాడు గురువు. శిష్యులు తలా ఒక గడ తెచ్చుకొని, గురువు గారికి ఒకటి తెచ్చి ఇచ్చారు. స్వామి చేతిలో పట్టుకొని కూర్చున్నాడు. శిష్యులు తినటం ప్రారంభించారు.

ఇంతలో యజమాని పరిగెత్తుకుంటూ వస్తున్నాడు. సాధువులందరూ చేలో పడి తింటున్నారు. కడుపు భగ్గుమంది ఆ రైతుకు. అరికాలి మంట నెత్తికెక్కింది. వెనకా ముందు చూడలేదు. సమర్థుని చేతిలోని గడను సర్రున లాగి ఫెళీఫెళీ మంటూ వీపులు వాయించేస్తున్నాడు. వారేదో చెబుతున్నా వినిపించుకోవటంలేదు రైతు". తినండి తినండి. కమ్మగా తినండి"అని నవ్వుతూ అంటున్నాడు గురువు.

సాయంకాలానికి అందరూ శివాజీ భవనానికి చేరుకున్నారు. గురువుగారి రాక విని శివాజీ ఎదురువెళ్ళి ఒకరాగి రేకును గురువుగారి జోలెలో వేశాడు. అది తీసి చూచాడు గురువు. "గురుదేవా! నేను, నాకుటుంబం, నారాజ్యం సమస్తం ఇక నుండి మీ అధీనం. మీకు

సమర్పిస్తున్నాను. ఇట్లు శివ" అని ఉంది అందులో. "శివా! ఇదేమిటి?" అన్నాడు గురువు. గురుదేవా! ఇది నా గురుదక్షిణ స్వీకరించండి" అన్నాడు శివాజీ. "సరే! అలాగే కానివ్వు. ఇక ఈ రాజ్యం నాది. అయితే పాలించేవాడవు మాత్రం నీవే. ఇది నారాజ్యం అని అనుకోకుండా గురువుగారి రాజ్యాన్ని పరిపాలిస్తున్నాను అనుకుంటూ కర్తవ్యంగా ఆచరించు. నిర్లిప్తుడవై, అహంకార రహితంగా పాలించు" - అన్నాడు గురువు.

ఇలా గురువుకు సర్వసమర్పణ చేసినందువల్ల నాది అనే మమకారం, నేను పాలిస్తున్నాను అనే కర్తృత్వం, నేను చక్రవర్తిని అనే అహంకారం పోతుంది. గురువుగారి ఆజ్ఞను పాలించటమే నా కర్తవ్యం అని భావిస్తాడు. కనుక కర్తవ్యతా బుద్ధితో కర్మలు చేయటం అలవాటవుతుంది. కర్తృత్వ బుద్ధి నశించిపోతుంది. అందుకే రాజసూయ యాగానంతరం ధర్మరాజు సమస్తరాజ్యాన్ని వ్యాసునికి ధారపోస్తాడు. అహంకారాన్ని అధిగమించటానికి ఇదొక మార్గం.

శివాజీ మహారాజు ఆ క్షణమే కాషాయజెండా ఎగురవేయించాడు. గురువుగారికి స్నానాదికాలు చేయిస్తున్నాడు. స్వయంగా తానే దగ్గరుండి గురుసేవ చేస్తున్నాడు. స్నానం చేయించేటప్పుడు గురువుగారి వీపు మీద వాతలు చూచాడు. స్నానం ముగించిన తర్వాత శిష్యులను విషయం అడిగాడు. ఇదే సమయమని శిష్యులు జరిగిన విషయాన్ని పూసగ్రుచ్చినట్లు చెప్పారు. ఏదో నూకలుండి బయట పడ్డాంగాని, చచ్చి ఊరుకునే వాళ్ళం అన్నారు శిష్యులు.

మరునాడు రాజసభ జరిగింది. మంత్రులు, సామంతులు, సేనానాయకులు, పురప్రముఖులు వారివారి స్థానాల్లో ఆశీనులైయున్నారు. సింహాసనంపై సమర్థరామదాసును కూర్చోబెట్టారు. ఆ ప్రక్కనే ఒక ఆసనంపై శివాజీ కూర్చొన్నాడు.

ఆ సమయంలో చెరకు తోట రైతును తెచ్చి నిలబెట్టారు భటులు. సింహాసనంపై కూర్చొని ఉన్న సమర్థ రామదాసును చూడగానే ఆ రైతుకుపై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. చేతులు కట్టుకొని మౌనంగా ఉండిపోయాడు రైతు. "గురుదేవా! ఇతడే నిన్న మీకు మహాపచారం చేసిన ద్రోహి. దేవరవారు ఏమి శిక్షవిధిస్తారో చెప్పండి" అన్నాడు శివాజీ.

"శివా! ఇతడు తన పొలానికి ఎంత పన్ను చెల్లిస్తున్నాడు? అని అడిగాడు సమర్థుడు. 'యాభైరూపాయలు' అన్నాడు శివాజీ. సరే ఇకనుండి పన్ను నుండి పూర్తి మినహాయింపు ఇచ్చి శాశ్వతంగా ఆ భూమిని అనుభవించుకోవచ్చు - అన్నాడు సమర్థుడు. సభ స్థబ్దమై పోయింది. రైతు బ్రతుకుజీవుడా! అనుకున్నాడు. ఇదీ క్షమ అంటే. అందుకే -

"మూఢులతో మాట్లాడే కన్నా జ్ఞానులతో పోట్లాడినా మంచిదే" అన్నారు.

ఇలా ఈ శ్లోకంలో 7 లక్షణాలను భక్తుల లక్షణాలుగా చెప్పి భగవానుడు తరువాత శ్లోకంలో మరో 5 లక్షణాలను చెప్పబోతున్నాడు - 14వ శ్లోకంలో.

శ్లో|| సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః|
మయ్యర్పిత మనోబుద్ధిః యోమద్భక్తస్సమేప్రియః|| (14)

**తా||** ఎల్లప్పుడూ సంతుష్టి గలవాడు, యోగయుక్తుడు, మనస్సు స్వాధీనంలో ఉన్నవాడు, దృఢ నిశ్చయం గలవాడు, మనోబుద్ధులను నాకు అర్పించినవాడు అయిన ఏ భక్తుడు కలడో అతడు నాకు ప్రియుడు.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో భక్తుని లక్షణాలు ఐదింటిని చెప్పారు.

(1) సతతం సంతుష్టః:- ఎల్లప్పుడూ సంతృప్తితో, సంతోషంతో ఉండేవాడు భక్తుడు. ఎప్పుడూ ఏదో కొరతతో, కోరికలతో, ఏదో కావాలని ఆశపడటం, దానికోసం తపించిపోవటం, ఏదో పోగొట్టుకున్నట్లు ఎప్పుడూ ఆముదం త్రాగిన ముఖం పెట్టుకొని ఉండటం సామాన్యుడి లక్షణం. సాధారణంగా ప్రతీవ్యక్తీ తనకు లేనిదానిని కోరుతూఉంటాడు, ఉన్నదానిని చాలదని, ఇంకా ఇంకా కావాలనుకుంటాడు. ఎంత డబ్బున్నా చాలదు, ఎన్ని ఇళ్ళున్నా చాలవు. ఎంత పొలం ఉన్నా చాలదు, ఎంత గొప్ప వ్యాపారమున్నా చాలదు. ఎంత జీతం వస్తున్నా చాలదు; ఎంత గొప్ప పదవిలో ఉన్నా చాలదు. ఇంకా ఇంకా గొప్ప గొప్ప పదవులు కావాలని, కీర్తిప్రతిష్ఠలు సంపాదించాలని - ఇలా ఏవేవో ఆశలతో, కోరికలతో, ఆశయాలతో నిరంతరం తపనపడిపోతూ ఉంటాడు. ఒక కోరిక తీరిన తర్వాత సంతృప్తి చెందడు, మరో క్రొత్త కోరిక పుడుతుంది. అందువల్ల ఎప్పుడూ అసంతృప్తే. తృప్తికి సంతృప్తికి ఒక తేడా ఉంది. మనం ఏదైనా కావాలని కోరుకున్నప్పుడు ఆ కోరిక తీరేదాకా అసంతృప్తి. కోరిక తీరితే తృప్తి, ఇక మరో కోరిక అనేది పుట్టకుండా లభించిన దానితో తృప్తి చెందితే సంతృప్తి. అంటే నీకు ఉన్నదానితో నీవు సంతృప్తి చెందితే ఇక కోరికలు పుట్టవు. గాలిలో మేడలు కట్టవు. మళ్ళీ కోరిక పుట్టిందా నీది తృప్తేగాని

సంతృప్తి కాదు. భక్తుడైనవాడు నిత్య సంతుష్టుడు. ఏమి లభించినా అది భగవత్ ప్రసాదంగా భావించి స్వీకరిస్తాడు. ఎంత ఉంటే అంతతోనే సంతృప్తి చెందుతాడు. ఇంకేదో కావాలని కోరడు. అందుకే అతడు నిత్యసంతుష్టుడు. భోగంలో గాని, రోగంలోగాని, లాభంలో గాని, నష్టంలో గాని, సుఖంలో గాని, దుఃఖంలో గాని, కోరిక నెరవేరినప్పుడు గాని, నెరవేరనప్పుడు గాని మనస్సు ఏమాత్రం చలించకుండా ఎల్లప్పుడూ సంతృప్తితో ఉండటం భక్తుని లక్షణం.

సామాన్యులైన వారు ఎలా ఉంటారో చూడండి. ఎప్పుడూ ఏదో అసంతృప్తి, బాధ, విచారం, కోరిక, తపన. పొరుగు వాడు సంతోషంగా ఉన్నాడని భావించి బాధపడిపోయే వారు కొందరు. 4 ఇళ్ళున్నా సరే వాళ్ళు చూడు సంవత్సరానికొక ఇల్లు కట్టిస్తున్నారు అని బాధ. వాడికేం రోగం లేదు, నాకు చూడు ఎప్పుడూ డాక్టర్ల చుట్టూ తిరగటమే అని ఆక్రోశం. వీరు నిత్యఅసంతృప్తులు. ఇక కొందరు తాత్కాలిక తృప్తితో ఉంటారు. కడుపు నిండినప్పుడు, పండుగలు పబ్బాలు వచ్చినప్పుడు, అన్నీ వైనంగా అమరిఉన్నప్పుడు, కోరిన కోరికలు తీరినప్పుడు, లాటరీలో డబ్బు వచ్చినప్పుడు - అలాంటప్పుడు తాత్కాలికంగా తృప్తి చెందుతారు. అదే వారి కోరికలు తీరకపోతేనో, సమయానికి కాఫీ చేతికందక పోతేనో, టైముకు సరిగ్గా బస్సుగాని - ట్రైన్ గాని రానప్పుడో, ఒకవేళ మనది లేటై, అవి సరిగ్గా టైముకు వచ్చినప్పుడో, వారానికొక సినిమా చూడలేకపోతేనో, TV లో ఎప్పుడూ పాతసినిమాలే వేస్తుంటేనో - ఇలాంటి విషయాలకు అసంతృప్తితో రగిలిపోతుంటారు. అయితే భక్తుడి విషయం వేరు. అతడి మనస్సు


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతునిలో ఉండిపోతుంది గనుక అతడికి ఎప్పుడూ సంతృప్తే.

ఆచార్యవినోబాభావే ఒకరోజున మిత్రునితో కలసి షికారు వెళ్తున్నాడు. గ్రామం దాటి కొంతదూరం వెళ్ళారు. అది చైత్రమాసం. ఎండలు ముదురుతున్నాయి. అక్కడొక దృశ్యం మిత్రుని కంటబడింది. వినోబాను అడిగాడు, బాబూ! రోడ్డుకు ఇరువైపులా ఉన్న ఈ పెద్దవృక్షాలు పచ్చగా కళకళలాడుతున్నాయి. దూరంగా ఆ పొలాల్లో ఉన్న చిన్నచిన్న చెట్లు, మొక్కలు ఎండలకు మలమల మాడిపోతున్నాయి? ఈ చెట్లు కళకళలాడటానికి, అవి మలమల మాడిపోవటానికి కారణం ఏమిటి?" అన్నాడు. దానికి వినోబా, "మిత్రమా! ఈ పెద్దచెట్ల వ్రేళ్ళు బాగా లోతుగా నీటిమట్టం వరకు పోయాయి. అందుకే వీటికి బాగా నీరు అందుతున్నది. కళకళలాడుతున్నాయి. ఆ పొలంలోని చిన్నచెట్ల వ్రేళ్ళు పైపైనే ఉన్నాయి. కనుక వాటికి నీరు అందక ఈ ఎండలకు మలమలమాడిపోతున్నాయి - అని సమాధానం ఇచ్చాడు.

దీనిని బట్టి ఎవరి మనస్సు భగవంతుని వరకు వ్యాపించి ఉంటుందో అతడు భగవంతుని కృపతో నిత్యం కళకళలాడుతూ ఉంటాడు. అతడే నిత్యసంతుష్టుడు. అలాకాక ఎవరి మనస్సు పైపైన - అంటే అనిత్యమైన లౌకిక వస్తువులపైనే ఉంటుందో వారికి భగవంతుని కృప లభించక మలమల మాడిపోతుంటారు. అంటే నిత్య అసంతుష్టులుగా ఉంటారు. కనుక నిత్యసంతుష్టుడైన వాడే భగవంతునికి ప్రియభక్తుడు.

(2) యోగీ:- యోగి అంటే యోగంలో ఉండేవాడు. యోగం అంటే కలయిక.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

జీవుడు దేవుడితో కలయిక. అంటే తానెప్పుడూ ఆత్మనని భావించాలి. లేదా తన మనస్సును ఆత్మతో కలిపి ఉంచేందుకు ప్రయత్నించాలి. అట్టివాడే యోగి. భక్తుడైన వాడు అలా ఎల్లప్పుడు యోగిగానే ఉంటాడు. సాధారణంగా మనం ఉదయం యోగులుగా, మధ్యాహ్నం జోగులుగా, రాత్రిపూట భోగులుగా, మూడు పూటలా రోగులుగా ఉంటాం. ప్రతిరోజూ అనేక అవతారాలు ఎత్తుతూ ఉంటాం. భక్తుడు మాత్రం ఎప్పుడు ఏపని చేస్తున్నా మనస్సును ఆత్మతో - భగవంతునితో కలిపి ఉంచుతాడు. మనం మాత్రం ఉదయం ఒక గంట, వీలైతే రాత్రికి ఒకగంట లిమిట్ ప్రకారం, టైమ్ ప్రకారం,డ్యూటీ లాగా మనస్సును భగవంతునిపై ఉంచేందుకు ప్రయత్నిస్తాం. అదీ కష్టమైతే శరీరాన్ని మాత్రం భగవంతుని దగ్గర పడేస్తాం. అంటే 2 గంటలపాటు యోగులం, 22 గంటలు వియోగులం. ఎప్పుడో కాసేపు సరదా కోసమో, కాలక్షేపం కోసమో, నలుగురిలో ప్రత్యేకత కోసమో, కోరికలను తీర్చుకోవటం కోసమో యోగులం అయినంత మాత్రాన భక్తులం కాలేము, భగవంతునికి ఇష్టులం కాలేము. నిరంతరము చిత్తం భగవంతునితో అనుసంధానమై ఉంటేనే యోగులం - భక్తులం - భగవంతునికి ప్రియులం అవుతాము.

భక్తుడు మనలాగే పని, పాటలు చేస్తుంటాడు. మనలాగే తింటాడు, కంటాడు, వింటాడు, విహరిస్తాడు. అయితే తేడా ఎక్కడ? అతడు మనలాగా ప్రపంచంలోనే ఉన్నా అతడిలో ప్రపంచం లేదు. పరమాత్మే ఉంటాడు. మనకు మాత్రం లోపల, వెలుపలా ఒకటే సరుకు. అదే ప్రపంచం. అంటే ప్రాపంచిక విషయాలు, వస్తువులు, అవసరాలు, భోగాలు - ఇవే.

"నీవు ప్రపంచంలో ఉండవచ్చు. కాని ప్రపంచం నీలో ఉండకూడదు." "పడవ నీటిలో ఉండవచ్చు. కాని నీరు పడవలోకి చేరకూడదు." అన్నారు రామకృష్ణ పరమహంస. కనుక నీలో ఉండవలసింది భగవంతుడే కాని ప్రపంచం కాదు. నీవు ఈ ప్రపంచంలో తిరుగు. ప్రాపంచిక విషయాలను పొందు, అనుభవించు. కాని నీలో ఆ ప్రాపంచిక భావనలకు చోటు ఇవ్వరాదు. ఎల్లప్పుడూ నీ మనస్సులో భగవంతుడే ఉండాలి. భగవత్ విషయాలే ఉండాలి. 'అందుకే హాత్ మే కామ్ దిల్ మే రామ్' అన్నాడు కబీరుదాసు. నీ చేతులతో నీవు ఏ పనులు చేస్తున్నా నీహృదయంలో రాముడే ఉండాలి. చేతులతో పనులు చేస్తూ హృదయంలో భగవంతుని నిలపటం ఎలా?

ఒకసారి వ్యాసమహర్షి యమునా నదిని దాటి వెళ్ళవలసి వచ్చింది. ఆయన నది ఒడ్డుకు చేరుకొనే సమయానికి అక్కడ గోపికలు కొందరు ఉన్నారు. వారు పాలు, పెరుగు, వెన్న అమ్ముకొనేందుకు వచ్చినవారు. వారు కూడా నదిని దాటి ఆవలి ఒడ్డుకు వెళ్ళాలి. అయితే అక్కడ ఒక్క పడవ కూడా లేదు. అయ్యో! ఎలాగ? అని గోపికలు విచారంలో మునిగిపోయారు. అక్కడే ఉన్న వ్యాసుని చెంతకేగి, మహాత్మా! మేము వెంటనే ఈ నదిని దాటివెళ్ళాలి? ఇక్కడ ఒక్క పడవ కూడా లేదు. మీరే ఏదో ఒక తరుణోపాయాన్ని సెలవివ్వరా? అని ప్రార్థించారు.

అంతట వ్యాసుడు, "ఓ గోపికలారా! దిగులు చెందకండి. నేను తప్పకుండా మిమ్ములను ఈ నది దాటిస్తాను. అయితే నాకు ఆకలిగా ఉన్నది. తినటానికి ఏమైనా మీ దగ్గర ఉంటే పెట్టగలరా? అని అడిగాడు. గోపికలు

తమవద్ద ఉన్న పాలు, పెరుగు, వెన్న, మీగడ వ్యాసునికి భక్తితో సమర్పించారు. ఆయన వాటినన్నింటిని తిని ఆకలి తీర్చుకున్నాడు. అంతట గోపికలు మమ్ములను నది దాటించరా? అని అడిగారు. అప్పుడు వ్యాసుడు ఆ గోపికలతో సహా నది ఒడ్డున నిలిచి, "ఓ యమునా! నేను ఈరోజున ఏమీ తినకుండ ఉపవశించిన వాడినైతే మేమందరము నిన్ను దాటి నడిచిపోవటానికి వీలుగా నీరు పాయలు చేసి మాకు త్రోవ నిత్తువు గాక!" అని ప్రార్థించాడు. ఆయన నోట నుండి ఈ మాటలు వెలువడగానే యమునా జలం రెండు పాయలుగా చీలి దారి ఇచ్చింది. దానితో వ్యాసుడు, గోపికలు నడిచి ఆవలి ఒడ్డుకు క్షేమంగా చేరారు.

ఇప్పుడు గోపికలకు ఒక సందేహం వచ్చింది. మనం పెట్టిన వన్నీ తిని, "నేనేమీ తినని వాడినైతే" అని ఈ మహానుభావుడు అన్నాడు. దానితో యమున దారి ఇచ్చింది. ఏమిటీ విచిత్రం? అనుకున్నారు. వ్యాసుడు స్వయంగా తానేమీ తినలేదని, తన హృదయంలోని పరమాత్మయే సర్వాన్ని ఆరగించాడనే విశ్వాసం గలవాడు. తానేం చేస్తున్నా పరమాత్మ యందే మనస్సు నిల్పిన మహాత్ముడు గనుకనే తిన్నది " అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం" అన్నట్లు వైశ్వానరరూపంలో ఉన్న పరమాత్మయే సర్వాన్ని తిన్నాడని ఒకభావం. మరొక భావం కూడా ఉంది.

వ్యాసుడు తాను జీవుణ్ణి కాదని, సాక్షాత్తు పరమాత్మనే ననే అనుభూతి గలవాడు గనుక; నిరంతరం అట్టి పరమాత్మ గానే ఉండిపోయే వాడు గనుక;

పరమాత్మ అకర్త, అభోక్త గనుక తాను ఏమీ తినలేదని ఆత్మ స్థానంలో నిలిచి నేనేమీ తినలేదు - అన్నాడు.

ఇదే తాను ప్రపంచంలో ఉన్నా తనలో ప్రపంచం లేదని, పరమాత్మే ఉన్నాడని ఋజువు చేసే అద్భుత దృష్టాంతం. అలా ఎల్లప్పుడూ తాను పరమాత్మతో అనుసంధానమై కలసి ఉన్నవాడే యోగి. అతడే గొప్ప భక్తుడు, నిజమైన భక్తుడు, భగవంతుడు మెచ్చే భక్తుడు.

(3) యతాత్మా:- ఆత్మ అంటే ఇక్కడ దేహము, ఇంద్రియాలు, మనస్సు అని అర్థం. యత అంటే నియమించుట - నిగ్రహించుట - స్వాధీనంలో పెట్టుకొనుట. యతాత్మా అంటే దేహ, ఇంద్రియ, మనస్సులను తన చెప్పుచేతులలో పెట్టుకున్నవాడు - తన అధీనంలో ఉంచుకో గలిగినవాడు. అట్టివాడే యతాత్ముడు. అతడే భగవంతునికి ఇష్టుడైన భక్తుడు.

ఇతరుల నెవరినైనా జయించవచ్చు, లోకాలను జయించవచ్చు, కాని తనను తాను జయించటం మహాకష్టం. దేవలోకాన్ని జయించి, దేవేంద్రుణ్ణి, దిక్పాలకులను, సమస్త దేవతలను పాదాక్రాంతం చేసుకొని, అహంకరిస్తున్న హిరణ్యకశిపుని ఆయన కుమారుడు ప్రహ్లాదుడు అడిగాడు, తండ్రీ! వారందరినీ జయించావు. కాని నీలోని కామక్రోధాలను, రాగద్వేషాలను జయించగలిగావా? నిన్ను నీవు జయించుకొన్న నాడే నీవు నిజంగా గొప్పవాడి వవుతావు" - అన్నాడు.

"అన్ని కంట్రోళ్ళ కన్నా సెల్ఫ్ కంట్రోల్ చాలా గొప్పది."

అది ఉన్నవాడే నిజమైన భక్తుడు.

అసలు ఈ దేహం గాని, ఇంద్రియాలు గాని నీకోసం ఉన్నాయి గాని, నీవు వాటి కోసం లేవు. వాటిని నీవు ఉపయోగించుకుంటూ, నీ లక్ష్యాన్ని సాధించుకోవాలి. అంతేగాని వాటికి నీవు బానిసవై నీ లక్ష్యాన్ని నీవు విడిచిపెట్టకూడదు. అవి నీ పట్టులో ఉండాలి. నీ అధీనంలో ఉండాలి. అంతేగాని నీవు వాటివెంట చొంగ కార్చుకుంటూ పరుగులు తీయరాదు. అప్పుడే నీవు యతాత్ముడ వవుతావు; భగవంతుని ప్రియభక్తుడవవుతావు.

"చూడవలసిన వస్తువులను, దృశ్యాలనే నాకన్నులు చూస్తాయి. వినవలసిన మాటలనే నా చెవులు వింటాయి. చేయవలసిన పనులనే నాచేతులు చేస్తాయి. పలుకవలసిన పలుకులనే నా వాక్కు పలుకుతుంది. తలచవలిసిన విషయాలనే నా మనస్సు తలుస్తుంది" అని మహాభక్తుడైన జ్ఞానేశ్వరుడు అంటాడు. అంటే అతడి దేహము, ఇంద్రియాలు, మనస్సు అతడి అధీనంలోనే ఉన్నాయి అని భావం.

గొప్ప భక్తుడుగా, భగవంతుని ప్రియభక్తుడుగా కావాలంటే అతడు యతాత్ముడు కావాలి. నిజంగా భక్తులం కావాలనే కోరిక ఉంటే గదా యతాత్ములయ్యేందుకు మనం ప్రయత్నించేది. బడాయి కోసం శివభక్తుణ్ణి అంటాం. నిజంగా శవభక్తులం. (ఈ శరీరానికి భక్తులుగా ఉండి, ఎల్లప్పుడూ ఈ శరీరపోషణ రంధే) చేసేదంతా శవపుజే గాని. శివపూజకు ఆస్కారమెక్కడ? మనం చేసే పూజలు, హారతులు, బొట్లు, బోనాలు - అన్నీ ఈ శవానికే. నిజంగా దేవుడికి నైవేద్యం పెడుతున్నామంటే పెట్టింది పెట్టినట్లు మొత్తం - మొత్తం మనకే వస్తున్నదనే గట్టినమ్మకం ఉండబట్టే పెడుతున్నాం.

కనుక దేహేంద్రియ మనోనిగ్రహం భక్తునికి ఉండవలసిన లక్షణం.

(4) ధృఢనిశ్చయం:- భక్తుడెప్పుడూ ధృఢనిశ్చయుడై యుండాలి. సంశయాలతో, సందేహాలతో ఉండకూడదు. 'సంశయాత్మా వినశ్యతి' అన్నారు. భగవంతుని చేరుకోవాలనే దృఢనిశ్చయం ఉండాలి.

మనకు లౌకిక ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు అనేకమైన ప్రాపంచిక ఆకర్షణలుంటాయి. భక్తుడైనవాడు భగవంతుని కొరకు, ఆయనను పొందటం కోసం అన్నింటిని వదిలివేస్తాడు. అన్ని సుఖాలను, భోగాలను వదిలి కఠినమైన జీవితాన్ని అనుభవిస్తాడు. అయితే మనస్సు భగవంతుని యందు దృఢంగా నిలువనప్పుడు, ప్రపంచంలోని ఆకర్షణలు తన వలను విసిరినప్పుడు సామాన్యుడు తన నిర్ణయాలను వెనక్కు తీసుకుంటాడు. అలా వెనక్కు తీసుకొనేవాడు ఈ ప్రాపంచిక విషయాలలో చిక్కి పతనమై పోతాడు. ఈ లోకంలో ఎన్ని ఆకర్షణలున్నా, ఎన్ని అవాంతరాలు - ఆటంకాలు వచ్చినా, ఎన్ని కష్టాలు వచ్చినా భగవంతుని శరణుకోరి ఆయనను అందుకొనుటయే తన జీవితలక్ష్యం అనే భావనతో దృఢ నిశ్చయంతో ఎవరైతే ఉంటారో వారే నిజమైన భక్తులు, భగవంతునికి ప్రియభక్తులు.

మనకూ ధృఢనిశ్చయం ఉంటుంది. ఎప్పుడు? ఇలా వేదాంతాన్ని వినేటప్పుడో, మహాత్ములను సందర్శించినప్పుడో, ఆశ్రమ వార్షికోత్సవంనాడో, ఏదైన పెద్దకష్టం వచ్చి జీవితం మీద విరక్తి కలిగినప్పుడో, ఉపన్యాసాలు చెప్పేటప్పుడో, పూలదండ మెడలో పడి పూనకం వచ్చినప్పుడో - ఏమైనా సరే భగవంతుని చేరుకోవాలి, మోక్షాన్ని పొందాలి, ఈ ప్రాపంచిక భోగాలతో

నాకు పనిలేదు. ఇవేవీ నాతో వచ్చేవి కాదు - అని ధృఢనిర్ణయాన్ని - గట్టినిర్ణయాన్నే తీసుకుంటాం, ప్రకటన చేసేస్తాం.

అయితే కాస్త ఆవేశం తగ్గితేనో, కడుపు మాడుతుంటేనో, ఇతరులు తనకన్న ఎక్కువగా భోగాలు అనుభవిస్తూ ఉంటేనో, తనకన్న అధికంగా ధనసంపదలు కలిగిఉంటేనో, కష్టాలు - దుఃఖాలు వెంటబడి తరుముతూ ఉంటేనో మనం తీసుకున్న నిర్ణయాలన్నీ గాలికి పోతాయి. ఆ! కడుపు నిండిన తర్వాతేనండి భగవంతుడు - అని తీర్మానం చేసేస్తాం. ఇలా ఊసరవెల్లిలాగా రంగులు మార్చేవాడు ఎన్నటికీ భక్తుడు కాలేడు. అతడు భగవంతునికి భక్తుడు కాదు పరిస్థితులకు భక్తుడు మాత్రమే.

అక్బరు చక్రవర్తి ఆస్థానంలో బీర్బల్ అని ఒక ఆంతరంగికుడు ఉండేవాడు. అతడు గొప్ప చమత్కారి. మాటలలో నేర్పరి. సమయస్ఫూర్తి గలవాడు, మహాతెలివితేటలు గలవాడు. అతడెప్పుడూ చక్రవర్తిని అంటిపెట్టుకొని ఉండి అన్ని విషయాలలో ఆయనకు తోడు - నీడగా ఉండటమే గాక ఆయనకు వినోదం కలిగిస్తూ ఉంటాడు.

ఒకరోజున వంటవాడు వంకాయ కూరను భలే బ్రహ్మాండంగా చేశాడు. అక్బరు చక్రవర్తికి ఆ కూర భలేనచ్చింది, భలే మజాగా ఉంది. మళ్ళీ మళ్ళీ వడ్డించుకొని భుజించి, మహాఆనందపడి పోయాడు. కడుపునిండా తిని బ్రేవ్ మని త్రేన్చుతూ బయటకు వచ్చిన తర్వాత బీర్బల్ తో అన్నాడు. "బీర్ బల్! అబ్బ. వంకాయకూర బ్రహ్మాండంగా ఉందయ్యా! ఎంత తిన్నా ఇంకాఇంకా తినాలనిపించింది. అసలు వంకాయ లక్షణం ఎలాంటిదంటావు? అన్నాడు.

ప్రభూ! చెప్పేదేముంది? "వంకాయ వంటి కూరయు, శంకరుని వంటి దైవం మరిలేడు" అనేది లోకమంతా ప్రసిద్ధే కదా! కాయకూరల్లో ఏదైనా సరే, వంకాయ తర్వాతనే అంటే నమ్మండి - అన్నాడు బీర్బల్. ఇలా సందర్భోచితంగా, యుక్తి - యుక్తంగా చెప్పేటప్పటికి ఎంతో ఆనందించాడు చక్రవర్తి.

నాల్గురోజులు గడిచాయి. చక్రవర్తి గారికి వంకాయ కూరంటే భలే ఇష్టపడుతున్నాడు గదా! అని వంటవాడు ప్రతిరోజూ వంకాయ కూరను చేస్తున్నాడు. రోజూ అదే కూర తినేటప్పటికి అక్బరు చక్రవర్తికి మొఖం మొత్తింది. ఆ రోజున బయటకు వస్తూ బీర్బల్ తో మళ్ళీ అన్నాడు అక్బరు, "బీర్బల్! వంకాయ లక్షణం ఎలాంటిదంటావు? అని. అక్బరు ముఖాన్ని బాగా పరిశీలనగా చూచిన బీర్బల్, "హుజూర్! వంకాయ ఒట్టి పనికిమాలినది. ఏ వైద్యుణ్ణి అయినా అడగండి. ముందు నిషేధించేది వంకాయనే. అందుకే అవి మార్కెట్లో కారుచౌకగా అమ్ముతుంటారు" అన్నాడు.

ఆ మాటలకు విస్మయం చెందాడు అక్బరు. "బీర్బల్! మొన్న అడిగితే అలా చెప్పావు. ఈ రోజు అడిగితే ఇలా చెబుతున్నావు. ఏమిటయ్యా నీ అవకతవక? అన్నాడు అక్బర్. దానికి బీర్బల్ - "ప్రభూ! నేను మీకు జీతగాణ్ణి గాని, వంకాయకు కాదు గదా!" అన్నాడు.

వంకాయ ఎప్పుడూ ఒక్కటే. అయినా దానిని తిన్న ప్రభువు యొక్క మనస్సును బట్టి వంకాయ లక్షణం మారిపోయింది. పరిస్థితులను బట్టి మనం కూడా ఇలాగే నిశ్చయాలను మార్చుకుంటూ ఉంటాం. ఇక్కడున్న గంటసేపూ "భగవంతుణ్ణి అందుకోలేని జన్మఎందుకు? ఎన్నాళ్ళు ఎలా బ్రతికినా

చివరకు అన్నీ వదిలి పోవాల్సిందే కదా!" అనుకుంటాం. ఇంతలో సెల్ ఫోన్ మ్రోగుద్ది. అంతే ఆ! ఉన్న ఈ నాలుగు రోజులూ హాయిగా - ఆనందంగా అన్నీ అనుభవించాలి గాని, ఏమీ అనుభవించకుండా బండరాయిలా బ్రతికే బ్రతుకు కూడా ఒక బ్రతుకేనా? అనుకుంటాం. దృఢనిశ్చయం అనేది ఉండదు. దృఢనిశ్చయమే గాదు అసలు నిశ్చయమే ఉండదు. పురమేలేని వానికి అంతఃపురమా? అన్నట్లు అసలు నిశ్చయమే లేనివానికి దృఢ నిశ్చయం ఎలా ఉంటుంది?

భక్తుడు ఒకసారి ఆత్మనిశ్చయం - బ్రహ్మనిశ్చయం - ఈశ్వరనిశ్చయం చేశాడంటే ఇక దానికి తిరుగుండ కూడదు. ఇదే భగవంతుని ప్రియభక్తుడైన వాని లక్షణం.

(5) <u>మయ్యర్పిత మనోబుద్ధిః</u>- తన మనోబుద్ధులను ఎవరు భగవంతుని యందే సమర్పిస్తారో - వారే భగవంతుని ప్రియులైన భక్తులు.

ఆలోచనలన్నీ భగవంతుని యొక్క రూపం, గుణగుణాల చుట్టూ తిరుగుతూ ఉండాలి. బుద్ధి భగవత్తత్త్వాన్ని విచారణ చేస్తూ ఉండాలి. అప్పుడే మన మనోబుద్ధులు పూర్తిగ భగవంతునికి సమర్పించినట్లు.

నదులన్నీ ఏప్రకారంగా ప్రవహించి - ప్రవహించి తటాలున సముద్రంలోకి దూకి, ఆ సముద్రంలో కలిసి, సముద్రాకారంగా మారిపోతాయో, అదే విధంగా భక్తుని మనోబుద్ధులు భగవంతునే స్మరించి - స్మరించి, తటాలున ఆ భగవంతునిలో పడిపోయి భగవదాకారంగా మారిపోవాలి. సముద్రంలో పడిపోయే నదీప్రవాహాన్ని ఎవరు ఆపగలరు?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**అందుకే ప్రహ్లాదుడు అన్నాడు -**

**"అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేష మత్త**

**చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు వినుత గుణశీల మాటలు వేయునేల" అని.**

**"అలా ఎవరి మనోబుద్ధులు నిరాటంకంగా పరమాత్మలో చేరిపోతాయో అట్టి వాడే నాకు ప్రియమైన భక్తుడు" అంటున్నాడు భగవానుడు. భగవంతుడు భక్తుని ప్రేమిస్తేనే భక్తికి పూర్తి ప్రయోజనం అదే భక్తుని అదృష్టం. భగవంతుని చిట్టాలో తన పేరు రిజిస్టరు అయితేనే భక్తుని జన్మకు సార్ధకత.**

**మరొక మూడు ప్రియభక్తుల లక్షణాలను తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**శ్లో|| యస్మాన్నో ద్విజతే లోకః లోకాన్నో ద్విజతే చయః|**

**హర్షా మర్ష భయోద్వేగైః ముక్తో యస్సచ మేప్రియః|| (15)**

**తా|| ఎవరివల్ల లోకానికి భయంకలగదో; లోకం వల్ల ఎవరికి భయం కలగదో; సంతోషం, అసూయ, భయం, ఉద్వేగాల నుండి ఎవడు ముక్తుడో అతడే నాకు ప్రియుడు.**

**వ్యాఖ్య:- ఈ శ్లోకంలో 3 లక్షణాలను తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**(1) యస్మాత్ లోకః న ఉద్విజతే :- ఎవరివల్ల లోకానికి భయం కలగదో -**

**భక్తుడైన వానిని చూచి లోకం భయపడాల్సిన పనిలేదు. అతడు ఇతరులను భయపెట్టడు. ఒక పరిపూర్ణ పురుషుని చుట్టూ ప్రశాంత వాతావరణం అలుముకొని ఉంటుంది. అతడిలో ఉన్న ఆ ప్రశాంతత బయటకు వ్యాపించి; అశాంతితో అలమటించేవారు అతడి దగ్గరకు పరుగెత్తుకొని వచ్చినప్పుడు వారి**

అశాంతిని కూడా పోగొడుతుంది. అందుకే జీవనపోరాటంలో మునిగిఉన్న వారు ప్రశాంతత కోసం వారి సన్నిధికి వెళుతూ ఉంటారు. కనుక లోకం అతడిని చూచి భయపడే ప్రసక్తే ఉండదు. పైగా అతడి సాన్నిధ్యం శాంతిని ప్రసాదిస్తుంది. సాధారణంగా భక్తుడు సర్వభారాన్ని భగవంతుని పైవేసి నిర్లిప్తంగా ఉండేవాడు. కనుక అతడు ఈ లోకంలో ఎవరితోను, దేని కొరకూ పోటీ పడేవాడు కాదు. తనలోకంలో తానుండి పోతాడు.

కొందరిని చూస్తే చాలు భయం కలుగుతుంది. మన గురించి అక్కడా, ఇక్కడ విషప్రచారం చేస్తుంటారు. ఇది సర్పలక్షణం. పామును చూస్తే ఎలా భయం కలుగుతుందో వారిని చూచినా అంతే భయం. కొందరితో మాట్లాడాలంటే భయం. ఎందుకంటే ఏమి మాట్లాడినా అపార్థం చేసుకొని, లేదా అందులోని తప్పులను వెదికి మనమీద విజృంభిస్తారు. ఇది మృగలక్షణం. కొందరితో స్నేహం చేయటానికి కూడా భయపడాలి. ఎందుకు? ఎప్పుడు ఏ ఎత్తులు, జిత్తులు వేసి మనను మోసగిస్తారో అని. ఇది నక్కలక్షణం. ఇలాంటి లక్షణాలు గలవారు ఎంతటి భక్తులైనా వారు భగవంతునికి ఇష్టులు కాలేరు. అసలు నిజమైన భక్తులు కూడా కాలేరు. తమ చర్యల ద్వారా, మాటల ద్వారా ఎవరినీ భయపెట్టని వారే నిజమైన భక్తులు.

(2) <u>లోకాత్ యః న ఉద్విజతే:- లోకం వల్ల ఎవరు భయపడరో - భయపడని</u> వాడే భక్తుడు. భక్తుడు భయపెట్టడు, భయపడడు. మంచి మార్గంలో నడిచేవాడు, భగవంతునితో సంబంధం పెట్టుకున్నవాడు లోకుల యొక్క నిందాస్తుతులను పట్టించుకోడు. అందుకే భయపడడు.

లోకంలో ఎన్ని ఉపద్రవాలు జరుగుతున్నా, ఎన్ని మార్పులు జరుగుతున్నా, లోకులు అతణ్ణి నిందిస్తున్నా అతడి మనస్సు వీటిని పట్టించుకొనే స్థితిలో ఉండదు. అతడి మనస్సెప్పుడూ భగవంతునిలోనే ఉంటుంది. భగవంతునితో తాదాత్మ్యం చెంది ఉంటుంది. ఆయన స్మరణలో, ఆయన పూజలో, ఆయన సేవలో, ఆయన కీర్తనలో అతడు తన్మయత్వం చెందుతూ ఉంటాడు. కనుక ఇవి పట్టించుకోడు. అందువల్లనే అతడి మనస్సు నిశ్చలస్థితిలో ఉంటుంది. కనుక భయం పడడు.

నదిలో నీటిపై తేలియాడే కొయ్యముక్కలు అటూఇటూ చలించి పోతుంటాయి. కాని నదిలోని నీరు పరవళ్ళు త్రొక్కి ప్రవహిస్తున్నా దీపస్తంభం మాత్రం కదలకుండా స్థిరంగా ఉంటుంది.

అలాగే పరమభక్తుడు, మహాత్ముడు అయినవాడు నిరంతరం భగవంతునితో సంబంధం పెట్టుకొని ఉండటంవల్ల ఈ అల్పమైన, అనిత్యమైన బాహ్యవిషయాలను పట్టించుకోడు. కనుక దేనికీ చలించడు.

దీనిని బట్టి భక్తుడైనవాడు భయపడడు - భయపెట్టడు. భయపడటం పశులక్షణం. భయపెట్టటం మృగలక్షణం. తనచుట్టూ భగవంతుడు కవచంలా ఉండి రక్షిస్తుంటే అతడు దేనికి భయపడాలి? కనుక భయపడడు.

తనలోని జలచరాలు, మొసళ్ళు మొ||నవి ఎంతెంత అలజడి సృష్టిస్తున్నా తనకేమీ పట్టనట్లుగా ఉంటుంది సముద్రం. దానికి నిరంతరం తన ప్రణవగానం తప్ప మరేమీ పట్టదు. సముద్రతీరంలో నిలిచినప్పుడు మనకు వినిపించే శబ్దం ప్రణవనాదమే. అందుకే అది జలచరాల విజృంభణకు భయపడదు.

(3) హర్షం, అమర్షం, భయం, ఉద్వేగం:- వీటి నుండి విడువబడిన వాడే భక్తుడు.

(i) హర్షం:- తనకి ఏదో వస్తువు కొరతగా ఉన్నది. లేదా ఒక వస్తువుపై మోజుతో కావాలనుకున్నాడు. అది లభిస్తే ఎంత బాగుంటుంది? అనుకున్నాడు. అప్పుడా వస్తువు అతడికి లభించింది. అప్పుడు కలిగేది హర్షం (సంతోషం).

(ii) అమర్షం:- తనకు కొరతగా నున్న వస్తువు, తాను కోరుకుంటున్న విషయం, తనకు లభించకుండా ఎదటివాడి పరమైంది. లేదా తనకన్నా ఎదటివాడు పైచేయిగా ఉన్నాడు. అప్పుడు కలిగేది అమర్షం (అసూయ).

(iii) భయం:- తనకు లభించిన వస్తువు ఇక తన చెయ్యి జారిపోతుందేమోననే ఆలోచనవచ్చింది. అప్పుడు కలిగేది భయం. లేదా ఎవరివల్లనైనా తనకు ఆపద కలుగుతుందేమోననే ఆలోచన వచ్చింది. అప్పుడూ భయమే. తన భవిష్యత్తు ఎలా ఉండబోతుందో అనే ఆలోచన కలిగింది. అప్పుడు కలిగేదీ భయమే.

(iv) ఉద్వేగం:- తాను కోరుకున్న వస్తువు కొరకు ప్రయత్నం చేసేటప్పుడు ఆ వస్తువు లభిస్తుందో లేదో అనుకున్నప్పుడు కలిగేది ఉద్వేగం.

ఇవేవీ భక్తునిలో ఉండరాదు - ఉండవు.

ఇవన్నీ కలగటానికి ఏవేవో కొరతలుండాలి. అవి కావాలనే కోరికలుండాలి. ప్రాపంచిక విషయాలపట్ల వస్తువులపట్ల ఆసక్తి - వ్యామోహం ఉండాలి. పెద్దపెద్ద ఆశలుండాలి. ఎల్లప్పుడూ తననూ ఇతరులను పోల్చుకుంటూ ఉండే స్వభావం ఉండాలి. ఇలా ఉన్న వారందరికీ సహజంగానే

ఈ లక్షణాలు ఉంటాయి. అలాంటివారు నిజమైన భక్తులు కాలేరు.

అయితే భక్తులైన వారికి - నిజమైన భక్తులైన వారికి ఈ లక్షణాలు ఉండే అవకాశం లేదు. ఎందుకంటే అతడు ఈలోకంలోని వస్తువుల యొక్క స్వభావం తెలిసినవాడు. ఈ లోకంలోని సమస్త వస్తువులు, విషయాలు, భోగాలు అన్నీ అనిత్యమైనవి, అశాశ్వతమైనవి, తన వెంటరానివి; అంతేకాదు ఈ అనిత్యమైన విషయాల ద్వారా కలిగే సుఖం కూడా శాశ్వతమైనది కాదు. తాత్కాలిక సుఖం మాత్రమే. నిత్యమైన వస్తువు భగవంతుడు మాత్రమే. కనుక నిత్యమైన సుఖం - ఆనందం కావాలంటే నిత్యమైన పరమాత్మను ఆశ్రయించటం ద్వారా మాత్రమే లభిస్తుందనే విషయం తెలిసినవాడు. అనిత్యవిషయాల కోసం అర్రులు చాచడు. వాటికోసం పరుగులు తీయడు. అందువల్ల అతడిలో ఈ హర్షం, అమర్షం, భయం, ఉద్వేగం - ఏవీ ఉండవు. అతడు ప్రశాంతమైన మనస్సుతో ఉంటాడు. ఎల్లప్పుడూ భగవంతుని స్మరణలో ఉంటాడు. అంటే అతడిలో అనిత్య వస్తువులకు స్థానం లేదు. కేవలం భగవంతునికి మాత్రమే స్థానం ఉంటుంది. అందుకే అతడు నిజమైన భక్తుడు. ఈ నాలిగింటిని వివరంగా తెలుసుకుందాం.

(i) <u>హర్షం</u>:- అంటే పరవశించటం, సంతోషించటం. సాధారణంగా కోరిన కోరికలు నెరవేరినప్పుడు, ఆశించినవి లభించినప్పుడు, కోరకుండానే మంచి జరిగినప్పుడు కలిగేది సంతోషం. అలాగే అబ్బ! గురువుగారు ఎంత చక్కగా ప్రవచనాలు చేస్తున్నారో అని ఎవరైనా కాస్త పెద్దగా, వినపడేటట్లుగా అన్నారా? ఇక చూడండి ముఖం వెయ్యి క్యాండిల్ బల్బు వెలిగినట్లు వెలిగిపోతుంది.

శరీరం 2 అంగుళాలు" ఉబ్బుతుంది. ఎవరైనా పూలదండ వేశారా? ముఖంలో ఎక్కడలేని కళ వచ్చేస్తుంది. ఎవరన్నా ఏదైనా బహుమతి తెచ్చి ఇస్తే శరీరం మెలికలు తిరుగుతుంది. ఇవన్నీ వికారాలు. భక్తుడైన వానికి ఈ వికారాలు ఉండవు. ఈ వికారాలు లేనివాడే నిజమైన భక్తుడు.

(ii) అమర్షం:- అమర్షం అంటే ఈర్ష్య. అసూయ. అవతలివాడు పచ్చగా ఉంటే చూచి సహించలేక కళ్ళల్లో నిప్పులు పోసుకొనే స్వభావమే ఈర్ష్య - అసూయ. ఇది చాలా తుచ్ఛమైన గుణం. మనకు లేదని ఏడిస్తే ఒక కన్ను పోతుంది. అవతలవాడికి ఉన్నదని ఏడిస్తే రెండు కళ్ళు పోతాయని సామెత.

దుర్యోధనుడు ఈ అసూయకు పెద్దకొడుకు. పాండవ రాజసూయ యాగానికి వెళ్ళి అక్కడ పాండవులచే జయించబడిన రాజులు తెచ్చి ఇస్తున్న కానుకలను స్వయంగా చూచి కళ్ళల్లో నిప్పులు పోసుకున్నాడు. పాండవుల సంపదలను చూస్తున్న కొద్దీ ముఖం నల్లగా మాడిపోతున్నది. అంతే గాకుండా వారి మయసభా వైభవాన్ని తిలకించి మరింత అసూయా గ్రస్థుడయ్యాడు. సుదర్శన చక్రంతో శ్రీకృష్ణుడు శిశుపాలుని శిరస్సును తెగవేస్తే రాజులందరూ జయజయ ధ్వానాలు చేయటంతో దిక్కుతోచక, చేసేది లేక దిగమ్రింగుకొని ఊరుకున్నాడు. అతడు హస్తినాపురం తిరిగి వచ్చినా పాండవ వైభవాన్ని మరచిపోలేకపోతున్నాడు. అసూయతో రగిలిపోతున్నాడు. రాజకార్య వ్యవహారాలలో పాల్గొనటం లేదు. చివరకు శకుని వచ్చి కారణం అడిగితే తానే స్వయంగా చెప్పాడు శకునితో, "మామా! అతుల పరాక్రమార్జితములైన ధనంబుల పేర్మిచేసి ఉన్నత మగుచున్న పాండు నరనాథ తనూజుల లక్ష్మి

నాకసమ్మతమై సూవెలింగె" - అన్నాడు.

ఏమిసేయుదము? ఏ విధంబున పాండవుల లక్ష్మి నపహరించనగు" అన్నాడు. ఇదీ అసూయ - ఈర్ష్య - ద్వేషం. ఈ అసూయతో మాయాజూదం ఆడించి పాండవ సంపదను హరించాడు దుర్యోధనుడు. కాని 13 ఏళ్ళ తర్వాత వారి రాజ్యంతో పాటు తనదీ పోగొట్టుకున్నాడు; తాను తనవారందరితో పాటు యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు.

ఒక గ్రామంలో ఇరుగుపొరుగున ఇద్దరు వ్యక్తులున్నారు. ఇద్దరికీ బద్ధ వైరం. ఒక రంటే ఒకరికి పడదు. వాడికి కష్టం వస్తే వీడు సంతోషిస్తాడు. వీడికి కష్టం వస్తే వాడు సంతోషిస్తాడు. ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకుంటారు. ఒకనాడు శంకరుని గూర్చి తపస్సు చేస్తే సిద్ధులు కలుగుతాయని ఎవరో చెబితే ఆ ఊరి వెలుపల తపస్సుకు కూర్చున్నాడొకడు. ఈ విషయం తెలుసుకొని ఆ ప్రక్కనే మరొక చెట్టు క్రింద తపస్సుకు కూర్చున్నాడు రెండవవాడు. కొంతకాలానికి శంకరుడు ప్రత్యక్షమై మొదటివాడి వద్దకు వచ్చి, నీకేం కావాలో కోరుకో అన్నాడు. వాడు ప్రత్యేకంగా ఏమీ కోరకుండా, ఆ రెండవవానికి కూడా వరమిస్తారు గదా! వాడు ఏం కోరితే దానికి డబుల్ నాకు ఇవ్వండి చాలు అన్నాడు. అప్పుడు రెండవవాని వద్దకు వెళ్ళి అడిగాడు శంకరుడు. ఏం కావాలి నీకు? అని. తమరు ముందుగా వాడి దగ్గరకు వెళ్ళారు గదా! వాడేం కోరాడు? అన్నాడు. చెప్పాడు శంకరుడు. అయితే నాకు ఒక కన్ను పోవాలి అన్నాడు. వీడికి ఒక కన్ను పోయింది. మొదటివాడికి రెండు కళ్ళూ పోయాయి.

తాను సగం చెడ్డా అవతలవాడు పూర్తిగ చెడ్డాడు గదా! అని

భావించటం తుచ్ఛమైన గుణం. ఈ గుణం కారణంగానే తపస్సు వృథా ఐపోయింది.

అసూయ అనేది ఎప్పటికైనా చేటు కలిగించేదే. ఈ గుణం ఎవ్వరినీ అంత తేలికగా వదలదు. చివరకు సర్వసంగపరిత్యాగులైన సన్యాసులు కూడా దీని దెబ్బకు లొంగేవారే. అతడికి 4 ఆశ్రమాలున్నాయి. నాకు ఒక్కటే. అతడి ఉపన్యాసాలకు లక్షలమంది వస్తారు. నాకు 10 వేలకు మించిరారు. అతడికి కార్లు, శిష్యులు, టన్నుల కొద్దీ బంగారం, డబ్బు ఉంది. నాకెంత ఉంది? అని బాధ. భక్తులకు ఈ అసూయ ఉండరాదు.

(iii) భయం:- భయం అనేది అజ్ఞానం వల్లనే కలుగుతుంది. అజ్ఞానం తొలగితే భయం పోతుంది.

ఒక పిట్ట రెపరెపలాడే కొమ్మపై కూర్చుంది. ఆ సన్నని రెమ్మ పిట్ట బరువుకు ఊగుతున్నది. ఆ ఊగే రెమ్మపై కూర్చున్న పిట్ట ఊగుతూనే ఉందిగాని భయపడటం లేదు. పైగా కేరింతలు కొడుతున్నది. ఎందుకంటే అది రెమ్మపై ఆధారపడిలేదు. దాని రెక్కలపై ఆధారపడి ఉన్నది. రెమ్మ విరిగితే తుర్రుమంటుంది.

మనం కూడా ఈ సంసారమనే రెమ్మపై కూర్చున్నాం. ఇది అశ్వద్ధం. ఎప్పుడూ ఊగేదే. మనకు స్వంతబలం లేదు. ఆత్మబలం లేదు. అందుకే భయం. ఎప్పుడేమవుతుందో అని భయం. ఈ అనిత్య సంసారంపై దృష్టి పెట్టినంత కాలం భయమే. కాని నీవు పరమాత్మపై ఆధారపడ్డావా? ఇంక భయం లేదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భక్తుడైనవాడు ఈ అనిత్యమైన ప్రపంచంపై ఆధారపడడు. నిత్య, సత్య పరమాత్మపై ఆధారపడి ఉంటాడు. మార్కండేయుడి లాగా శివలింగాన్ని కౌగిలించుకుంటాడు. కనుకనే భక్తునికి భయమే ఉండదు.

(iv) ఉద్వేగం:- ఉద్వేగం అంటే కలవరపాటు. భయముంటేనే కలవరం. భయంలేని వారికి కలవార పాటుండదు. భక్తుడు భయంలేని వాడే గనుక కలవరపాటు ఉండదు.

ఇట్టి లక్షణాలు గలవాడు నాకు ప్రియభక్తుడు అని భగవానుడు తెలియజేస్తున్నాడు.

- మరొక 6 లక్షణాలను తరువాత శ్లోకంలో చెబుతున్నాడు భగవానుడు.

**శ్లో||** అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యధః|

సర్వారంభ పరిత్యాగీ యోమద్భక్తస్సమే ప్రియః|| (16)

**తా||** అపేక్షలేనివాడు, శుచిగా ఉండేవాడు, దక్షత గలవాడు, ఉదాసీనుడు, వ్యధలు నశించినవాడు, కార్యారంభంలో కర్తృత్వం లేనివాడు అయిన నా భక్తుడు నాకెంతో ఇష్టుడు.

**వ్యాఖ్య:-** (1) అనపేక్షః:- భక్తుడు అపేక్ష లేనివాడై యుండాలి. అపేక్ష జీవుని లక్షణం, అనపేక్ష భక్తుని లక్షణం. అపేక్ష వల్ల మునుగుతాం, అనపేక్ష వల్ల తేలుతాం; భక్తుడు భగవంతుని తప్ప, బ్రహ్మపదాన్ని తప్ప దేనినీ అపేక్షించడు. అపేక్షించాడా? అతడు భక్తుడే కాదు.

సాధారణంగా మనం మన చుట్టూ ఉన్న బాహ్యవిషయాలతో సంబంధం పెట్టుకుంటాం, వాటివల్లనే మనకు సంతోషం - సుఖం కలుగుతుందని భావిస్తాం. వాటిని సంపాదించుకోవాలని తపిస్తాం. వాటికోసం ఎన్నో ప్రయత్నాలు చేస్తాం, ఇదే అపేక్ష. అందితే ఆనందిస్తాం. అందకపోతే దుఃఖిస్తాం.

అయితే భక్తుడైన వానికి ఆనందం బయటి వస్తువుల ద్వారా రాదని, అది లోపల నుండే వస్తుందని తెలుసు. ఆ ఆనందమే నిత్యమైన ఆనందమనీ తెలుసు. అందువల్లనే ఏ బాహ్యవస్తువులనూ కోరడు.

నరేంద్రుడు(వివేకానందుడు) చాలా పేదరికంలో ఉన్నవాడు. పూట గడవటం కూడా కష్టంగా ఉన్నది. ఒకసారి పరమహంసగారు ఆయనను పిలిచి, నరేంద్రా! దరిద్రంతో సతమత మవుతున్నావు గదా! ఒక్కసారి కాళీమాతను ప్రార్థించి నీ అవసరాలు తీర్చుకోరాదా! అన్నాడు. దానికి నరేంద్రుడు, "స్వామీ! నాకు ఈ అభిప్రాయం ఇంతకుముందే ఉన్నది. కాని అదేమి చిత్రమో తెలియదు. అమ్మ ఎదటికి పోగానే నాదారిద్ర్యాన్ని, నాకుటుంబాన్ని, అసలీ ప్రపంచాన్నే మరచిపోతాను. "అమ్మా! చలించని భక్తిని నాకు ప్రసాదించు" అని వేడుకుంటాను. సంపదలను కోరాలనే అనిపించదు - అన్నాడు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన పరమాత్మయే తనకు తల్లి, తండ్రి, ప్రభువు, ప్రాణరక్షకుడు అయి ఉండగా, ఆయనను అవికావాలి, ఇవి కావాలి అని ఆటబొమ్మలను, చిలిపి కోరికలను, క్షుద్ర భోగాలను ఎలా కోరుకుంటాడు? కల్పవృక్షం దగ్గరకెళ్ళి కాకరకాయలు కోరుకుంటాడా?

అందుకే భక్తుడైనవాడు అనపేక్షుడు - అపేక్షలేనివాడై యుంటాడు.

(2) శుచిః- భక్తుడు శుచియై ఉంటాడు. అన్నింటిని, అందరిని ఒకే పరమాత్మగా భావించేవానికి అశుచి ఏమి ఉంటుంది? ఈ శుచి లోపల - బయట అంతటా ఉండాలి. కొందరు శరీరం, వస్త్రాలు, పరిసరాలు శుభ్రంగా ఉంటే చాలు అనుకుంటారు. అంతః శుచిని - మనస్సు యొక్క శుచిని పట్టించుకోరు. కొందరు లోపలి మనస్సు కామక్రోధాదులు, రాగద్వేషాలు లేకుండా శుచిగా ఉంటే చాలు, బాహ్య శుచికి అంత ప్రాధాన్యత లేదు అంటారు. రెండూ సరికాదు. బాహ్యశుచి, అంతఃశుచి - రెండూ ఉండాలి భక్తుడైన వానికి. ఐతే బయట శుభ్రంగా ఉండి లోపల మురికి అలాగే ఉంటే ఏం ప్రయోజనం లేదు.

కబీర్ దాస్ గొప్పభక్తుడు. అతడు మహమ్మదీయుడు. పూర్వజన్మ సంస్కారం వల్ల గొప్ప భక్తుడయ్యాడు. గురుముఖత విద్యను పొందాలని సద్గురువు కోసం అన్వేషణ చేస్తున్నాడు. చివరికి ఒక ఆశ్రమానికి వెళ్ళగా అక్కడి వారు ఇతడు మహమ్మదీయుడని తెలుసుకొని పంపించేశారు. ఇలా 4,5 ఆశ్రమాలు తిరిగాడు. అంతటా ఇదే తంతు. చివరకు ఎవరో చెప్పారు, రామానందుల వారిని ఆశ్రయించు, నీ ఆశయం సిద్ధిస్తుంది - అని.

రామానందుని ఆశ్రమానికి బయలుదేరాడు కబీరు. రామానందుడు చరాచర ప్రాణికోట్లలో భగవంతుని చూడగలిగిన వాడు. ఆయనకు అందరూ సమానమే. అయితే శిష్యుల భావం అలాంటిది కాదు. వారికి జాతి, మత, కుల భేదాలున్నాయి. ఒకనాడు కబీరు రామానందుని చేరి, వినయంతో నమస్కరించి, "మహానుభావా! ఈ సంసార ఘోరారణ్యంలో దరిగానక



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తల్లడిల్లుతున్నాను. ఇప్పటికి ఎన్ని జన్మలో వ్యర్థమైనవి. ఈ పవిత్ర మానవజన్మ కూడా అజ్ఞానంలోనే గడిచిపోవటం నాకు ఇష్టం లేదు. కనుక తరించే మార్గం తెలుపండి" అన్నాడు. గురువు అతణ్ణి శిష్యునిగా స్వీకరించి ఆశ్రమంలో చేర్చుకున్నాడు. కబీరు గురుఆజ్ఞను తు - చ - తప్పక పాటిస్తున్నాడు.

శిష్యులు కొంతకాలానికి కబీరు మహమ్మదీయుడని తెలుసుకున్నారు. ఎలాగైనా అతణ్ణి ఆశ్రమం నుంచి వెళ్ళగొట్టాలని గురువు దగ్గరకెళ్ళి, "గురుదేవా! కొంప మునిగింది. ఇతడు మహమ్మదీయుడు. కనుక దైవసేవను అప్పగించకండి. వంటపాత్రలు తోమే పని మాత్రం ఇవ్వండి" అన్నారు. అలాగే అని గురువు కబీరుకు ఆపనిని అప్పగించాడు. అదే మహద్భాగ్యం అని కబీరు ఆపనినే చేస్తున్నాడు.

శిష్యులంతా కబీరును వెళ్ళగొట్టటం ఎలాగా? అని ఆలోచన చేస్తున్నారు. అది గమనించి కబీరు ఒకరోజున పాత్రలు బయట తోమి లోపల అలాగే ఉంచాడు. శిష్యులు గురువుగారికి ఫిర్యాదు చేశారు. గురువు కబీరును పిలిచి ఇలా ఎందుకు చేశావు? అని అడిగాడు. దానికి కబీరు "మహాత్మా! తమ శిష్యుల స్వభావం ఇలా ఉన్నదని తెలియజేయటానికే ఈరోజు మాత్రం అలా తోమాను. వారు స్నానాదులతో శరీరాన్ని శుభ్రపరుచుకున్నారే గాని మనస్సులో అసూయా, ద్వేషం అనే మాలిన్యాలు అలాగే ఉంచుకున్నారు. ఈ విషయాన్ని తమదృష్టికి తెచ్చేందుకే ఇలా చేశాను" అన్నాడు కబీరు. శిష్యులు శిగ్గుతో తలవంచుకున్నారు. కనుక భక్తుడైన వాడు బాహ్యశుచితో పాటు అంతఃశుచిని కూడా కలిగిఉండాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(3) దక్షః:- భక్తుడు సోమరిగా ఉండరాదు. దక్షత కలిగిఉండాలి. ఆధ్యాత్మిక కార్యక్రమాలను, సాధనలను, దైవకార్యాలను నిర్వహించేటప్పుడు సమర్థత ఉండాలి. అన్నింటికి వెనక్కు పోయేవాడు వెనుకబడే పోతాడు. ధనసంపాదనలో, వస్తు సంపాదనలో, ఇళ్ళు కట్టించటంలో, ఉద్యోగ వ్యాపారాలు నిర్వహించటంలో, భోగాలను అనుభవించటంలో ఎంత గొప్ప దక్షత ఉన్నా అతడు భక్తుడు కాలేడు. దైవకార్యాలలో దక్షత ఉంటేనే అతడు భక్తుడు.

బ్రహ్మమానస పుత్రులలో దక్షుడు ఒకడు. అతని సంతానం అంతా ఆడపిల్లలే. అందులో సతీదేవిని శివునికిచ్చి వివాహం చేశాడు; మిగిలినవారిని చంద్రునికిచ్చాడు. సతీదేవి అంటే బ్రహ్మవిద్య అని. మిగిలినవారు లౌకిక విద్యలు. అన్ని విద్యలకు తండ్రి దక్షుడు - అంటే దక్షత గలవాడు అని. అలాగే భక్తుడు అన్ని విషయాలలోను సమర్థత చూపాలి.

(4) ఉదాసీనః:- నిర్లిప్తత. ఎందులోను ఆసక్తి లేకుండుట. దేన్నీ పట్టించుకోకుండా ఉండుట. అంటే 'అసమర్థుడుగా - చేతకాని వాడిలా ఉండాలి' - అనా? కాదు. ఉన్నతమైన విషయాల కోసం అల్పమైన విషయాలను పట్టించుకోకుండా ఉండటమే ఉదాసీనత. ఉత్ + ఆసీన = ఉదాసీన. అంటే ఉన్నతంగా కూర్చొనుట. అయితే ఉన్నత విషయాలేవీ? అల్పవిషయాలేవీ?

సంపాదించుకోవటం, భార్యాబిడ్డల పోషణ, పిల్లల చదువులు, వివాహాలు, ఇళ్లువాకిళ్ళు కట్టించటం, కొనటం, భోగాలు అనుభవించటం,

కీర్తిప్రతిష్టలు సంపాదించటం - ఇవి మనకు గొప్పవిషయాలు. వీటికోసం ఎంతైనా కష్టపడతాం. ఎన్ని తెలివితేటలైనా ఉపయోగిస్తాం. జీవితాన్నంతా ఖర్చుచేస్తాం. అయితే నిజమైన భక్తులకు ఇవి అల్పవిషయాలు. వారికి అపురూపంగా లభించిన ఈ మానవజన్మను వ్యర్థం చేసుకోకుండా ఈ జన్మలోనే తమ అజ్ఞానాన్ని పోగొట్టుకొని ఆ భగవంతుని చేరుకోవటమే ఉన్నత విషయం. అలాంటి ఉన్నతవిషయం కోసం - అంటే భగవంతుని కోసం మిగిలిన అన్ని ప్రాపంచిక విషయాలను పట్టించుకోక ఉదాసీనంగా ఉండేవాడే పరమభక్తుడు. అలాగాక లౌకిక విషయాల కొరకు భగవంతుని పట్టించుకోని వాడు పరమఅజ్ఞాని.

కబీర్ దాస్ భార్య లూయీ. కుమారుడు కమాల్. అందరు గొప్పభక్తులే. ఒకసారి తీర్థయాత్రలు సేవిస్తూ కాశీపట్టణానికి వచ్చిన నామదేవ్, జ్ఞానదేవ్ లు తమ శిష్యబృందంతో సహా కబీరు ఇంటికి వచ్చారు. అది అర్ధరాత్రి. వారు విశ్రమించటానికి ఏర్పాట్లు చేశాడు కబీర్. తెల్లవారగానే వారికి ఆతిథ్యం ఇవ్వాలి. ఇంట్లో సరుకులు లేవు. ఎలాగా అని భార్యాభర్తలు ఆలోచించారు. ఇప్పుడు ఏషాపు తెరిచిఉండదు. డబ్బులేదు. కనుక దొంగతనం ఒక్కటే మార్గం. భగవత్ స్వరూపులకు ఆతిథ్యం ఇవ్వటానికి దొంగతనం పాపమనే విషయాన్ని పట్టించుకోలేదు.

కబీర్ కుమారుడు కమాల్ తో కలసి గునపం, కత్తి మొ||నవి తీసుకొని ఒక కిరాణాకొట్టు దగ్గరకు వెళ్ళారు. అందరూ నిద్రిస్తున్నారు. ఇద్దరూ కన్నం వేశారు. కుమారునితో కబీర్ అన్నాడు, "నాయనా! నీవు లోపలకు వెళ్ళి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అవసరమైనంత వరకే సరుకులు తీసుకొనిరా!" అని. కుమారుడు లోపలికి వెళ్ళి అన్ని సరుకులు మూటగట్టి కన్నం ద్వారా తండ్రికి అందించాడు. అతడూ బయటకు రావాలనుకున్నాడు. అయితే అక్కడ బంగారం, డబ్బు, ఆభరణాలు ఉన్నాయి. వాటిని ఎవడైనా దొంగ ఈ కన్నం ద్వారా వచ్చి కాజేస్తాడేమోనని యజమానిని నిద్రలేపి, "ఏమండీ! మేము దొంగలం కాదు, అతిథి సత్కారం కోసం కొన్ని సరుకులు తీసుకెళుతున్నాం. మేము వేసిన కన్నం అలాగే ఉంది. జాగ్రత్తగా ఉండండి" అని చెప్పి కన్నంలో దూరాడు. ఆ వ్యాపారి పరుగెత్తుకుంటూ వచ్చి కన్నంలో దూరిన వాని కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు. దొంగ, దొంగ అని కేకలు వేశాడు. పరిస్థితి తారుమారైంది. తండ్రితో అన్నాడు, "నాన్నా! లాభం లేదు. అతడు నా కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు. జనం పోగవుతారు. మనం దొంగతనం చేశామని తెలిస్తే అతిథులు ఒక్క క్షణం కూడా ఉండరు. వెంటనే కత్తితో నాతల నరికి ఇంటికి తీసుకెళ్ళు" అని చెప్పగానే కుమారుని ఔదార్యానికి మెచ్చుకొని తలను కోసి ఇంటికి తీసుకెళ్ళాడు.

కబీరు సరుకులను భార్యకు అప్పగించాడు. కుమారుడు ఏడి? అని అడిగితే శిరస్సునిచ్చి జరిగిన విషయం చెప్పాడు. లూయీ ఆనందబాష్పాలు రాల్చి అలాంటి పుత్రునికి తల్లినైనందుకు గర్విస్తున్నానంది. కుమారుని శిరస్సును దాచి, ఉదయాన్నే అందరికీ కావలసిన వన్నీ అమర్చిపెట్టింది. అందరూ భోజనాలు చేశారు. నామదేవుడు భగవన్నామాన్ని పరవశంతో ఆలపించాడు. జ్ఞానదేవుడు తత్త్వోపదేశం చేశాడు. అందరూ సంకీర్తన

చేసుకుంటూ బయలుదేరారు.

ఆ వ్యాపారి తెల్లవారగానే గ్రామస్థులను చేర్చి ఆ మొండెం ఎవరిదో చెప్పమంటే ఎవ్వరూ గుర్తుపట్టలేక పోయారు. వీధిలో ఒక స్థంభానికి ఆ మొండాన్ని కట్టారు. తల్లిదండ్రులు తప్పక వస్తారని వారి ఆలోచన.

భక్త సమూహం ఆదారినే వస్తున్నది. నామదేవుని సంకీర్తనకు కమాల్ మృతదేహం పరవశించి రెండు చేతులతో తాళం వేస్తున్నది. జ్ఞానదేవుడు ఇది చూచి నిశ్చేష్టుడయ్యాడు. కబీరును పిలిచి ఏమిటిది? అన్నాడు.

"మహాత్మా! ఇతడెవరో విష్ణుభక్తుడు. మీ దర్శనం కోసం, మీ సంకీర్తన నాలకించటం కోసమే జీవించి ఉంటాడు" - అనగానే కంఠం రుద్ధమైంది. జ్ఞానదేవుడు దివ్యదృష్టితో జరిగింది తెలుసుకొని, లోయిని పిలిపించి, కమాల్ శిరస్సును తెప్పించి ఆ మొండానికి అతికించి పాండురంగ నామ సంకీర్తన చేశారు. జ్ఞానదేవుడు తన చేతితో స్పృశించాడు. కమాల్ లేచి కూర్చొని, అందరికీ నమస్కరించాడు.

- సాధుపురుషులకు ఆతిథ్యం ఇవ్వటానికి దొంగతనానికి సిద్ధపడ్డాడు, కుమారుని త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డాడు కబీరు. ఇదీ ఉదాసీనత - అంటే.
- తండ్రి యొక్క లక్ష్యం నెరవేర్చటానికి తనను తాను ఆహుతి చేసుకున్నాడు కమాల్. ఇది ఉదాసీనత - అంటే.
- భర్త, కుమారుని త్యాగశీలతను మెచ్చుకొని అతిథి సత్కారం కన్న కుమారుని ప్రాణం గొప్పది కాదని భావించింది భార్య. ఇదీ ఉదాసీనత.

- ఒక జ్ఞానికి భోజనం పెడితే కోటిమంది సద్బ్రాహ్మణులకు విందుభోజనం పెట్టినట్లు అనే సత్యాన్ని నమ్మి కబీరు, కమాల్, లూయీ - అందరూ ఉదాసీనత చూపారు. ఉన్నత విషయం కోసం మిగిలినవన్నీ అల్పమైనవని భావించి ఉండిపోవటమే ఉదాసీనత. అదే చేసింది కబీరు కుటుంబం.

(5) గతవ్యధః:- వ్యధలన్నీ తొలగినవాడు భక్తుడు. భోగాలకోసం వెంటపడినప్పుడు అవి లభిస్తాయో లేదోనని వ్యధ చెందుతారు సామాన్యులు. కాని నిరంతరం పరమాత్మయందే దృష్టి నిలిపిన ఉదాసీనునికి ఇక్కడ ఆశలు, కోరికలు ఏమి ఉంటాయి? కనుక వ్యధ చెందవలసిన పనిలేదు. అన్ని వ్యధలు గతించినట్లే. జరిగేవన్నీ ఇలా జరగాలని పూర్వమే నిర్ణయమైపోయినవి, కనుక వాటికోసం వ్యధచెందటం వృథాకదా! అని భావించి నిశ్చలంగా ఉండేవాడే భక్తుడు. అతడికి చావంటే భయం లేదు, బ్రతుకంటే ఆశలేదు. దేనికీ పరుగులు తీయడు. కోపతాపాలుండవు. దేనికీ వ్యధ చెందడు. ప్రశాంతంగా ఉంటాడు.

(6) సర్వారంభ పరిత్యాగీ:- కార్యములను పరిత్యజించిన వాడు. అంటే సోమరియా? కాదు. మరి? నిజంగా ఈ ప్రపంచంలో ఏదీ క్రొత్తగా ప్రారంభం కావటం లేదు. అన్నీ కాలచక్ర గమనంలో జరిగిపోతూ ఉంటాయి. ఈ సత్యాన్ని గుర్తించినవాడు ఇదంతా నేనే చేస్తున్నాను అనే కర్తృత్వభావన లేకుండా అన్నింటికీ భగవంతుడే కర్త. నేను నిమిత్తమాత్రుణ్ణి అనుకుంటాడు. భగవంతుని చేతిలో పనిముట్టుగా, నిరహంకారియై పనులు చేస్తాడు. ఇదే కార్యములను పరిత్యజించుట అంటే. అట్టివాడే నిజమైన భక్తుడు.

ఒక మంత్రిగారు త్వరలో ప్రభుత్వం పడిపోతుంది అని గ్రహించి, ఈ పదవి ఉన్నప్పుడే త్వరత్వరగా ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు చేయాలని భావించి, తన అనుచరులకు వార్త పంపాడు. ఆవార్త రావటంతోనే అనుచరులు ప్రారంభోత్సవానికి సన్నాహాలు చేశారు. కరపత్రాలు ముద్రించారు. మంత్రిగారి సన్మానానికి ఏర్పాట్లుచేశారు. వేదపండితులను సిద్ధం చేశారు. మేళాలు, తాళాలు, నృత్యప్రదర్శనలు, ఉపన్యాసానికి ఒక స్టేజీ అంతా సిద్ధం చేశారు.

ఇక ఆరోజు రానే వచ్చింది. మంత్రిగారిని ఆహ్వానించారు. ఆయన సభా స్థలానికి విచ్చేశాడు. ప్రారంభోత్సవం దేనికో వీరు చెప్పలేదు, ఆయన అడగలేదు. అది ఒక నదీతీరం. వేదపండితులు మంత్రిగారికి సన్మానకార్యక్రమం పూర్తిచేసి, మంత్రిగారిని ఆహ్వానించి నదివద్దకు తీసుకువచ్చారు. అందరూ కలసి నదిలో దిగారు. మంత్రిగారిని చేతులు చాపమని 3 సార్లు చెంబుతో ఆ నదిలో నీటిని ఆయన చేతిలో పోశారు. ఆ! ఇప్పుడు నదికి ప్రారంభోత్సవం అయిపోయింది. ఇప్పుడిక సాంస్కృతిక కార్యక్రమాలు, మంత్రిగారి ఉపన్యాసం ప్రారంభమవుతుంది - అని మైకులో వినపడుతుంటే అందరూ అక్కడికెళ్ళి కూర్చున్నారు. నదికి ప్రారంభోత్సవం అంటే ఈ రోజే ప్రవహిస్తున్నదా నది? కొన్నివందల - లేదా వేలసంవత్సరాల నుండి అలా ప్రవహిస్తూనే ఉన్నది. అయినా ఈరోజు ప్రారంభోత్సవం అట. ఇదే అనవసర అహంకారం. ఎలాగూ జరిగిపోతున్న దానిని నేనే అలా జరిపిస్తున్నానని అహంకరించటం అల్పుల లక్షణం. భక్తుడైన వాడు తాను కేవలం నిమిత్తమాత్రుణ్ణి అని భావిస్తాడు.

**ఈ లక్షణాలున్న భక్తుడే నాకు ప్రియుడు అని భగవానుడు తెలియజేస్తున్నాడు.**

**- ఇప్పటికి 21 లక్షణాలు చెప్పి మరి కొన్నింటిని 17వ శ్లోకంలో చెప్పబోతున్నారు.**

**శ్లో|| యోన హృష్యతి నద్వేష్టి నశోచతి న కాంక్షతి|**
**శుభా శుభ పరిత్యాగీ భక్తి మాన్యస్సమేప్రియః|| (17)**

**తా|| ఎవడు సంతోషించడో, ద్వేషించడో, శోకించడో, కాంక్షించడో, శుభాశుభాలను వదిలివేస్తాడో అట్టి భక్తుడే నాకు ప్రియుడు.**

**వ్యాఖ్య:- నహృష్యతి - నద్వేష్టి - నశోచతి - నకాంక్షతి:- కోరికలు తీరితే, అనుకున్నది అనుకున్నట్లు జరిగితే సంతోషం. అదే హృష్యతి. అనుకున్నది అనుకున్నట్లు జరగకపోయినా, నష్టం కలిగినా కలిగేది శోకం. అదే శోచతి. మనకెవరైనా అపకారం చేస్తే అతడిపై ద్వేషం. అదే ద్వేష్టి. మనకులేని దాన్ని కోరుకుంటే కాంక్ష అదే కాంక్షతి. ఈ హృష్యతి, శోచతి, ద్వేష్టి, కాంక్షతి - ఈ లక్షణాలన్నీ సామాన్యులకే గాని భక్తులకు ఉండవు. ఉంటే అతడు భక్తుడు కాడు.**

**మనం సామాన్యులుగా ఉన్నంతకాలం ఈ లక్షణాలు మనను వదలవు. ఎప్పుడైతే మనం భగవంతుని వైపుకు తిరిగి, భగవంతునితో సంబంధం పెట్టుకుంటామో ఆక్షణం నుండే ఈ అవలక్షణాల నుండి మనకు విముక్తి. అప్పుడు సంతోషంతో ఉప్పొంగిపోవటమో, బాధతో విలవిలలాడి**

పోవటమో, ద్వేషంతో తుకతుకలాడటమో, కోరికలతో వేగిపోవటమో ఉండదు. భగవంతునిలో కూర్చుంటే తృప్తి - సంతృప్తి.

ఒక అందమైన అమ్మాయి ఉంది; 18 సం||ల వయస్సు. ఐతే కటిక పేదరికం. తల్లిదండ్రులు దుర్భర దారిద్ర్యంతో ఉండటాన ఆమెకు సరైన తిండిలేదు. మంచి బట్టలు లేవు. ఐనా సహజ సౌందర్యంతో ఉన్నది. ఒకరోజున నీరు తేవటానికి చెరువు దగ్గరకు వెళుతున్నది. ఆ సమయంలో ఒక పారిశ్రామిక వేత్త కుమారుడు కారులో వెళుతూ చూచాడు. ఆ అమ్మాయినే వివాహం చేసుకోవాలనుకున్నాడు. తండ్రికి చెప్పి ఒప్పించాడు. తండ్రి అంగీకరించాడు.మూడు ముళ్ళు పడ్డాయి. ఇంతకువరకు 18 సం||ల నుండి సంబంధం పెట్టుకున్న ఇంటితోను, తల్లిదండ్రులతోను, పేదరికంతోను సంబంధం తెగిపోయింది. ఇప్పుడా భర్తతోను, ఆ కుటుంబంతోను, సంపదలతోను సంబంధం పెట్టుకుంది. దానితో గొప్ప ఐశ్వర్యం. కోరుకున్నవన్నీ కాళ్ళ దగ్గరకు వస్తున్నాయి. నౌకర్లు చాకర్లు, ఒకటేమిటి? ఇప్పుడు తన పూర్వపు కుటుంబం వంటి కుటుంబాలను 100 కుటుంబాలను పోషించగలదు. ఆమెకు ఏలోటూ లేదు.

అలాగే మనం ప్రపంచంతో సంబంధం పెట్టుకున్నంత కాలం సంతోషం, దుఃఖం, ద్వేషం, కాంక్ష - వీటితో సతమతమౌతూఉండాలి. ఒక్కసారిగా ఈ ప్రపంచంలో సంబంధం వదులుకొని పరమాత్మతో సంబంధం పెట్టుకున్నామా? - ఆ క్షణం నుండే మనం ఈ అన్ని అవలక్షణాల నుండి - అంటే కోరికలు (కాంక్ష), దుఃఖం (శోచతి), సంతోషం(హృష్యతి), ద్వేషం(ద్వేష్టి) అనే

వాటినుండి విముక్తులమౌతాం. భగవత్ సంపదలో ఆనందిస్తాం. భక్తుడికి ఇది ఎలా సాధ్యం? మరి_ _ _ భక్తుడైన వానికి కోరికలు, దుఃఖం, సంతోషం, ద్వేషం ఉండవా?

మహారాష్ట్రలో టెర్డో అనే గ్రామంలో గోరాకుంభార్ అనే కుమ్మరి ఉండేవాడు. అతడు పాండురంగ భక్తుడు. అతడి భార్య గంగాబాయి. వారికి 1సం||రం వయస్సుగల కుమారుడు విఠూ. గోరా నిత్యమూ పాండురంగ దివ్యనామామృతాన్ని పానం చేస్తూఉంటాడు. కూర్చున్నా, నిలుచున్నా, నడుస్తున్నా, మాట్లాడుతున్నా, చూస్తున్నా, పడుకున్నా నిరంతరం పాండురంగ సంకీర్తనమే.

అతడు తన కులవృత్తిని అనుసరిస్తూ, లభించిన దానితో సంతృప్తిగా జీవించేవాడు. కుర్రవానికి 1సం||రం నిండింది. జన్మదినం జరపాలని, తల్లివాడికి స్నానం చేయించి, క్రొత్త బట్టలు వేసి నీటికై నదికి వెళ్ళింది. ఇంటిముందు గోరా కుండలు చేయాటానికి మట్టి త్రొక్కుతున్నాడు. విఠూ గుమ్మం దగ్గర కూర్చున్నాడు. బిడ్డను చూస్తుండమని భర్తతో అన్నది గాని అతడు నామసంకీర్తనలో వినిపించుకోలేదు. గోరా మట్టి త్రొక్కుతూ చిందులు వేస్తున్నాడు. తన్మయత్వంతో చేతులతో విన్యాసం చేస్తున్నాడు. విఠూ మెల్లగా తండ్రి దగ్గరకు వచ్చి తనను ఎత్తుకోమన్నట్లుగా చేతులు పైకెత్తాడు. కాని గోరా ఈ లోకంలో లేడు. బిడ్డ మట్టిని పట్టుకొని పైకెక్కి తండ్రిపాదాలు పట్టుకో బోయాడు, కాని పట్టుజారి మట్టిలో పడ్డాడు. బిడ్డ స్పర్శ గోరాకు తెలియదు. కాలి అడుగులు బిడ్డపై బడ్డాయి. చావు బ్రతుకుల మధ్య సతమతమై బిడ్డ

మట్టిలో కలిసిపోయాడు. మట్టి అంతా రక్తంతో ఎర్రగా మారిపోయింది.

గంగాబాయి నీరు తెచ్చి బిడ్డను కేకవేసింది. ఎక్కడాలేడు. భర్తను అడిగింది. ఆయన వినిపించుకొనే స్థితిలో లేడు. గట్టిగా కేకవేసింది. గోరా మెల్లగా ఈ లోకంలోకి వచ్చి తన పాదాలను మట్టి నుండి పైకి తీసుకున్నాడు. అప్పుడు చూచింది మట్టివైపు. పరిస్థితి అర్థమైంది. గుండెలు పగిలేలా రోదించింది.

ఇరుగుపొరుగు చేరారు. తలా ఒకమాట అన్నారు. గోరాను కిరాతకుడన్నారు, హృదయం లేదన్నారు, తల్లి కడుపును పుత్రశోకంతో నింపిన కఠినాత్ముడన్నారు. గోరా ఎంతో బాధపడుతూ "మహాజనులారా! ఏ తండ్రి ఐనా తనబిడ్డను చేజేతులా చంపుకుంటాడా? పాండురంగ నామామృతాన్ని పానం చేస్తున్న నాకు బాహ్యస్మృతి లేదు. నా ఒక్కగా నొక్క బిడ్డ నాకు దక్కకుండా పోయాడు. మీరు నాపట్ల సానుభూతి చూపటానికి బదులు అపనిందలు వేస్తున్నారే! ఇది న్యాయమా? అన్నాడు.

ఆ తరువాత భార్యను ఓదార్చబోయాడు. ఆమెకు తీవ్రమైన కోపం వచ్చింది. మీరు నాకు తీరని అన్యాయం చేశారు. నన్ను నా బిడ్డను వేరుచేశారు. కఠినాత్ములు మీరు అన్నది. దానికి గోరా, "కర్మలకు ఫలితాలనిచ్చే వాడు పాండురంగడు, విఠూకి మనకీ సంబంధం ఒక్క సంవత్సరమే. ఆ బంధం నేటితో తీరిపోయింది. నేను మధ్యలో కారణభూతుణ్ణయ్యాను" - అన్నాడు. భార్య ఆ పాండురంగణ్ణి కూడా దూషించింది. భక్తుడు తనను తిడితే ఒప్పుకుంటాడు. కాని భగవంతుని తిడితే సహించలేడు. అందుకే కోపంతో

భార్యపై చెయ్యెత్తాడు. భయపడిన గంగాబాయి "నన్ను ముట్టుకుంటే ఆ పాండురంగని హింసించినట్లే" అన్నది. ఆవేశంలో అన్నమాట గంగాబాయి పాలిట శాపమైంది. ఆనాటి నుండి గోరా భార్యను ముట్టుకోలేదు. గంగాబాయి బ్రతుకు గంగలో కలిసిపోయింది. ఇక తమకు సంతానప్రాప్తి లేదు, ఎలాగా? అని ఆలోచించిన గంగాబాయి, తన భర్తకు రెండవ వివాహం చేయటమే తగినదని భావించి, పుట్టింటికి వెళ్ళి జరిగిన విషయం చెప్పి, తన చెల్లెలు విమలాబాయి నిచ్చేటట్లు తండ్రిని ఒప్పించింది. కుమార్తె నిచ్చి పెళ్ళిచేసిన తండ్రి అల్లుడితో, "నాయనా! నీవు గుణవంతుడివి. బుద్ధిమంతుడివి. నీకు ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు." మా గంగాబాయి నెలా చూసుకుంటున్నావో అలాగే మా విమలాబాయిని కూడా చూసుకో!" అన్నాడు.

మామగారి మాటలు మరొక రకంగా స్ఫురించాయి గోరాకు. అందుకే ఇద్దరికీ దూరంగా ఉంటున్నాడు. ఒకనాటి రాత్రి గోరా క్రింద నేలపై పడుకొని నిద్రిస్తుండగా, భార్యలిద్దరూ చెరొక వైపున పరుండి, ఆయన చేతుల్ని తమ హృదయాలపై ఉంచుకున్నారు. గోరాకు మెలకువ వచ్చింది. తెలిసి చేసినా - తెలియక చేసినా తప్పు తప్పే ననుకున్నాడు. కత్తిని స్తంభానికి కట్టి రెండు చేతులూ నరుక్కున్నాడు. కూర్చొని పాండురంగ నామసంకీర్తన చేస్తున్నాడు. గంగాబాయికి మెలకువ వచ్చింది.అంతా చూచింది. కలత చెందింది. తాను ఏంచేసినా పరిస్థితులు విషమంగా తయారౌతున్నాయి. ఇక తమ జీవితంలో శాంతి లేదని భావించింది. గోరా భార్యలను ఓదార్చాడు. "నా ప్రారబ్ధాన్ని

అనుసరించి నా చేతులు తెగిపోయినవి. దిగులు పడకండి. భుక్తి ఎలాగా అని దిగులు పడవద్దు. నాకు రెండు చేతులే. కాని భగవంతునికి అనేక చేతులు. ఆయన చేతులే భక్తుని రక్షిస్తూ ఉంటాయి." అని ఓదార్చాడు.

ఒకనాడు పాండురంగడు మారువేషంతో గోరా వద్దకు వచ్చి నాకు ఏదైనా పని ఇప్పించండి అన్నాడు. గోరా, "నాయనా! నేను ఉపయోగించే ఈ పనిముట్లతో కుండలు చేసి, విక్రయించి వచ్చిన డబ్బును పాండురంగ ప్రసాదంగా భావించి జీవిద్దాం" - అన్నాడు.

ఆ పాండురంగడే ఆనాటి నుండి మట్టి కలిపి, కుండలు చేసి, విక్రయించుకొని వస్తున్నాడు. ఆ కుండలపై శంఖుచక్రాల ముద్రలు చూచి జనం విరివిగా కొంటున్నారు. ఒకనాడు జ్ఞానదేవ నామదేవులు పండరీపురం వెళ్ళి స్వామిని చూడగా ఆ విగ్రహం చైతన్యహీనమై కళ తప్పి ఉన్నది. వారు భగవంతుని కోసం వెతుకుతూ ఈ శంఖు చక్రాల గుర్తులున్న కుండల్ని చూసి వాటిని తయారుచేసిన గోరాకుంభార్ ఇంటికి వచ్చారు. వారు, "గోరా! మీ ఇంటిలో కుండలు చేసే వ్యక్తి ఎవరో చూపు" అన్నారు. లోనికి వెళ్ళిచూస్తే అతడు లేడు. నామదేవుడు, "గోరా! అతడు ఇంకెక్కడ ఉంటాడు? అంతటా నిండి ఉన్నవాడు ఎక్కడికి పరిమితం?" అన్నాడు. గోరాకు అర్థం కాలేదు. జ్ఞానదేవుడు, "గోరా! అతడే నయ్యా పాండురంగడు. నీ ఇంటిలో సేవచేశాడు, నీ కోసం మట్టి కలిపాడు, కుండలు చేశాడు, విక్రయించాడు. ఆహా! నీ అదృష్టమే అదృష్టం, గోరా! మేము స్వామి దర్శనార్థం పండరీపురం వెళుతున్నాం. నీవూ మాతో రా!" అన్నాడు. భార్యలతో కలసి గోరా వారివెంట

వెళ్ళాడు. చంద్రభాగ నదీ స్నానం చేసి గర్భాలయం చేరుకున్నారు. అందరూ నృత్యం చేస్తూ గానం చేస్తున్నారు. గోరా గంతులు వేస్తూ లయబద్ధంగా చప్పట్లు చరచటానికి ప్రయత్నించాడు. అంతే . రెండు చేతులూ వచ్చాయి. భక్తులు ఆశ్చర్యపోయారు. వెంటనే పాండురంగడు ప్రత్యక్షమై దర్శనం ఇచ్చాడు. రుక్మిణీదేవి ప్రత్యక్షమై విరూని గంగాబాయికి అందించింది. భార్యలతో కలసి గృహస్థాశ్రమాన్ని కొనసాగించమని ఆదేశించాడు పాండురంగడు. మహాప్రసాదం అన్నాడు గోరా.

- పసిబిడ్డ తన పాదాల క్రిందబడి మరణించినా, రెండు చేతులను ఖండించుకున్నా శోకించలేదు. (నశోచతి).
- బిడ్డ తిరిగి లభించినా, రెండు చేతులు వచ్చినా పొంగిపోలేదు. (నహృష్యతి).
- జనులు తనను ఎన్ని విధాల దూషించినా వారిని ద్వేషించలేదు. (నద్వేష్టి).
- భగవంతుని అనుగ్రహాన్ని తప్ప దేనినీ కోరలేదు. (నకాంక్షతి).

ఇదీ భక్తుని లక్షణం.

(5) <u>శుభాశుభ పరిత్యాగీ:-</u> శుభాన్ని, అశుభాన్నీ రెండింటినీ త్యజించాలి. అలా త్యజించ గలవాడే భక్తుడు. మనం అశుభాన్ని పరిత్యజిస్తాం. కాని శుభాన్ని ఎలా పరిత్యజిస్తాం? రెండూ విడిస్తేనే భక్తుడు.

శుభాశుభాలు మనోబుద్ధులకే గాని, వాటిని దాటి ఆ పరమాత్మలోనే స్థితిగలిగిన వారికి శుభాలు, అశుభాలు అంటూ ఏమీ ఉండవు.

సాధనదశలో మొదట అశుభాన్ని వదిలి శుభకర్మలు చేయాలి. చివరకు

ఆ శుభకర్మఫలాలు కూడా అడ్డంకే. అవి కూడా బంధాలే అవుతాయి. కనుక వాటిని కూడా వదలాలి. చెడ్డపనులు చేస్తే ఇనుప సంకెళ్ళు. మంచిపనులు చేస్తే బంగారు సంకెళ్ళు. కనుక కర్మఫలత్యాగంతో, కర్తృత్వం లేకుండా కర్మలు చేసినా చేయనివాడే అవుతాడు. అదే శుభాశుభ పరిత్యాగీ అంటే.

భక్తుని దృష్టిలో పరమాత్మే ఉంటాడు గాని కర్మలుండవు. కనుక అవి శుభమని, అశుభమని ఉండవు. కనుక అతడు రెంటినీ విడిచినవాడే.

ఇట్టి భక్తుడే నాకు ప్రియుడు అని భగవానుడు తెలియజేస్తున్నాడు.

- ఇంతవరకు 26 లక్షణాలను చెప్పి మరొక 5 లక్షణాలను చెప్పబోతున్నారు. 18వ శ్లోకంలో –

**శ్లో||** సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావ మానయోః|
శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః|| (18)

**తా||** శత్రువుల యందు, మిత్రులయందు సమంగా ప్రవర్తించేవాడు, అలాగే మానావమానములయందు, శీతోష్ణములయందు, సుఖదుఃఖములయందు సమంగా ఉండేవాడు, సంగభావాన్ని విడిచిన వాడు(నా ప్రియభక్తుడు).

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో ప్రియభక్తులైన వారి కుండవలసిన 5 లక్షణాలు చెప్పారు.

(1) సమః శత్రౌచ మిత్రేచః- తనకు అపకారం చేసినవాడు శతృవు. తనకు ఉపకారం చేసినవాడు మిత్రుడు. వీరిద్దరిని సమానంగా చూడగలవాడు భక్తుడు. వేరువేరుగా భావించేవాడు సామాన్యుడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తన తండ్రి హిరణ్యకశిపుడు నారాయణ నామస్మరణను మానుకోమని తనను ఎన్ని విధాలుగా హింసించినా - పాముల చేత కరిపించినా, ఏనుగుల చేత త్రొక్కించినా, సముద్రంలోకి విసిరివేసినా, అగ్నిలోకి త్రోసివేయించినా, కాలకూట విషాన్ని త్రాగించినా తండ్రిపై శతృభావం లేదు. చివరకు నరశింహస్వామి చేతిలో హతుడైన తండ్రికి ముక్తిని ప్రసాదించమని స్వామిని వేడుకున్నాడు ప్రహ్లాదుడు. భక్తులలో అగ్రగణ్యుడు గనుకనే అలా చేయగలిగాడు.

పరిపూర్ణ భక్తుడు మనస్సు యొక్క పరిధిని దాటినవాడు. ఆత్మతో నిరంతర సంబంధం పెట్టుకున్నవాడు. ఆ స్థాయిలో ఉన్నవానికి మిత్రులు - శతృవులు ఉండరు. అందుకే రాగద్వేషాలుండవు. అందరిని సమంగా చూడగలుగుతారు. మనస్సుతో తాదాత్మ్యం చెందిన సామాన్యులెవరైనా మనస్సుకు బాధ కలిగించినవాడిని శతృవుగా చూచి ద్వేషిస్తాడు. మనస్సుకు సంతోషం కలిగించిన వాణ్ణి మిత్రునిగా భావించి ప్రేమిస్తాడు.

విదురుడు ధృతరాష్ట్రుని సోదరుడు. సోదరుని క్షేమాన్ని కాంక్షించేవాడు. ఎల్లప్పుడూ కౌరవ హితాన్ని కోరి సరైన సలహాలిస్తూ ఉంటాడు. అలాంటి విదుర్ణ్ణి కోపగించుకొని ఆ పాండవుల వద్దకే వెళ్ళమన్నాడు ధృతరాష్ట్రుడు. ఎందుకంటే పాండవులను మాయాజూదంలో ఓడించి అరణ్యాలకు పంపటం క్షేమం కాదు, వారిని పిలిపించి వారి రాజ్యాన్ని వారికిచ్చి పంపమని ధృతరాష్ట్రునికి సలహా ఇచ్చినందుకు. ధృతరాష్ట్రుడు అలా ఆదేశించటంతో మారు మాట్లాడకుండా పాండవుల వద్దకు వెళ్ళిపోయాడు విదురుడు. వెంటనే

తన తొందరపాటుకు పశ్చాత్తాపం చెంది పిలిపించగా తిరిగి వచ్చాడు ధృతరాష్ట్రుని వద్దకు. అంటే విదురునికి ఎవరైనా ఒకటే. ఏ తేడాలేదు. అదీ భక్తుడంటే.

(2) మానావ మానయోః సమః:- మానావమానాలు బుద్ధి పరిధిలోనివి. తన ప్రతిభను అందరూ ప్రశంశిస్తుంటే మానం. సన్మానం. తనను కించపరిస్తే అది అవమానం. సామాన్యుడు బుద్ధి పరిధిలో ఉంటాడు గనుక, బుద్ధితో తాదాత్మ్యం చెంది ఉంటాడు గనుక మానావమానాల వల్ల సంతోషాన్ని, విషాదాన్ని పొందుతూ ఉంటాడు. భక్తుడైన వాడు బుద్ధి పరిధిని దాటినవాడు గనుక, ఆత్మతో అనుసంధానమైనవాడు గనుక అతడికి రెండూ సమానమే. ఈ మనుష్యులు తనకిచ్చే గౌరవాన్ని గాని, అగౌరవాన్ని గాని, పట్టించుకోడు. లోకులు పలుగాకులు అన్నారు. ఒక్కొక్కప్పుడు వారే గౌరవిస్తుంటారు. ఒక్కొక్కప్పుడు వారే అవమానిస్తారు, హీనంగా చూస్తారు. భక్తుడు వాటిని పట్టించుకోడు.

ఒక గ్రామంలో ఇద్దరు వ్యక్తులున్నారు. ఒకడు ఎప్పుడూ ఎక్కడికి వెళ్ళినా గుర్రమెక్కి వెళుతుంటాడు. దాన్ని వదిలి ప్రయాణం చెయ్యడు. అది అతడి అలవాటు. మరొకడు ఎక్కడ కూర్చున్నా పరుపు దిండు లేకుండా కూర్చోడు, పడుకోడు. ఎక్కడికి వెళ్ళాలన్నా చిన్న పరుపు, దిండు మూట గట్టుకొని వెళుతుంటాడు.

ఆ ఇద్దరూ ఒకే రోజున, ఒకే సమయంలో, పొరుగురికి బయలుదేరారు. గుర్రమెక్కి వెళ్ళేవాడు ముందు వెళుతున్నాడు. రెండవవాడు పరుపు, దిండు

మూటగట్టుకొని నెత్తిన పెట్టుకొని ఆ వెనుకనే వెళుతున్నాడు. ఇద్దరూ ఒకరికొకరు సంబంధం లేకపోయినా ఆ ప్రయాణం అలా కుదిరింది.

ఒక పల్లె గుండా అలా వెళుతున్న వారిద్దరిని చూచి ఆ పల్లెప్రజలు అనుకుంటున్నారు, "ఆ గుర్రమెక్కి వెళుతున్నవాడు తాసిల్దారు అయిఉంటాడు. ఆ నెత్తిన మూటపెట్టుకొని వెళ్ళేవాడు బంట్రోతు అయిఉంటాడు" - అని.

సరే ఇద్దరూ చేరవలసిన గమ్యం చేరుకున్నారు. గుర్రమెక్కి వచ్చినవాడు ముందుగా వచ్చి ఊరి మధ్యలో ఉన్న ధర్మశాల వద్ద ఆగుర్రాన్ని దిగి, గుర్రాన్ని కట్టివెయ్యటానికి అటూఇటూ తచ్చాడుతున్నాడు. చివరకు ఒకచోట స్థంభాన్ని చూచి దానికి కట్టివేశాడు. అంతలో రెండవవాడు ఆ ధర్మశాల దగ్గరకే వచ్చి అక్కడి వరండాలో పరుపు పరుచుకొని, దిండు వేసుకొని ఠీవిగా కాలుమీద కాలువేసుకొని శేషపాన్పు వేసి విశ్రాంతి తీసుకుంటున్నాడు. మొదటివాడు గుర్రాన్ని కట్టివేసి, దాని మేతకోసం వెళ్ళి కొంతమేతను తెచ్చి గుర్రానికి వేస్తున్నాడు. ఇది చూచిన అక్కడివారు అనుకుంటున్నారు, "ఆదిండు వారగా పరుపు మీద ఠీవిగా పడుకున్నవాడు తాసిల్దారు అయిఉంటాడు, ఈ గుర్రానికి మేతవేస్తున్నవాడు బంట్రోతు అయిఉంటాడు - అని. లోకం గ్రుడ్డిది. వివేకం లేనివారి మాటలతో, మానమర్యాదలతో ఒరిగేది, తరిగేది ఏమీ ఉండదు. తాసీల్దారు బంట్రోతు కావటానికి, బంట్రోతు తాసీల్దారు కావటానికి ఎంతోసేపు పట్టలేదు. లోకుల మానవమానాలకు ఏమాత్రం విలువలేదు. భక్తుడు వీటిని అల్పమైనవిగా భావిస్తాడు. మానావమానాలను సమంగా చూస్తాడు. అసలు నిజమైన భక్తుడు ఎంతటి అవమాన్నైనా సంతోషంగా

స్వీకరిస్తాడు.

పరమభక్తాగ్రేసరుడైన ఏకనాథస్వామి ఉండే గ్రామంలో ఒక పేదబ్రాహ్మణుడు తన కుమార్తె వివాహానికి సహాయం చేయమని ఒక పండితుని వద్దకు వెళ్ళి అర్థించాడు. ఆ పండితుడు ధనవంతుడు. ధనగర్వం బాగా తలకెక్కిన వాడు. అతడిది పుస్తక పాండిత్యమే గాని, మస్తక పాండిత్యం కాదు. ఆ పండితుడు బ్రాహ్మణునితో, "నేను తప్పకుండా నీకు ధనసహాయం చేస్తాను, అయితే నీవొక పనిచేయాలి. ఏకనాథుని బాగా అవమానించి, అతడికి కోపం తెప్పించాలి" అన్నాడు. దానితో విధిలేక ఆ బ్రాహ్మణుడు ఏకనాథుని అవమానించటానికి సమయం కోసం ఎదురుచూస్తున్నాడు.

ఒకరోజు ఏకనాథుడు గోదావరిలో స్నానం చేసి; ఆలయంలోనికి వెళ్ళాలనుకుంటూ ఉండగా, ఆ గోదావరి గట్టున కూర్చున్న బ్రాహ్మణుడు అదే సరైన సమయమని భావించి, ఏకనాథునిపై ఉమ్మివేశాడు. ఏకనాథుడు ఏమీ మాట్లాడకుండా మళ్ళీ గోదావరిలో స్నానం చేశాడు. తిరిగిరాగానే బ్రాహ్మణుడు మళ్ళీ ఉమ్మివేశాడు. ఏకనాథుడు ఏమీ మాట్లాడకుండా శాంతచిత్తంతో మళ్ళీ గోదావరిలో దిగి స్నానం చేసి వస్తున్నాడు. అతనికి ఎలాగైనా కోపం తెప్పించాలని బ్రాహ్మణుడు మళ్ళీ ఊశాడు. అతడు మౌనంగా వెళ్ళి స్నానంచేసి వస్తున్నాడు. చివరకు బ్రాహ్మణునిలో పశ్చాత్తాపం కలిగింది. ఏకనాథుని పాదాలపై బడి క్షమించమని వేడుకున్నాడు. దానికి ఏకనాథుడు, "నాయనా! నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను. ఎందుకంటే పవిత్రగోదావరిలో 108 సార్లు స్నానం చేయాలని ఎప్పటి నుండో

అనుకుంటున్నాను. ఇప్పుడా కల నెరవేరింది" అన్నాడు.

ఆ బ్రాహ్మణుడు తానిలా ఎందుకు అవమానించిందీ తెలియజేశాడు. దానితో ఆ బ్రాహ్మణుని ఆలింగనం చేసుకొని "నాయనా! నీవు ఇంత కష్టంలో ఉన్నావా? నేను కోపగిస్తే నీకు ధనం వస్తుంది, నీ అవసరం తీరుతుంది - అని తెలిస్తే తప్పకుండా కోపగించేవాణ్ణి"అన్నాడు ఏకనాథుడు. అదీ అవమానం పట్ల భక్తుని వైఖరి. ఎంత సన్మానమైనా, అవమానమైనా అతడికి పట్టవు. అతడు దేహానికి జరిగే మానావమానాలను నిర్లిప్తంగా చూస్తూ పరమాత్మలోనే ఉండిపోతాడు. కనుక మానావమానాల పట్ల సమబుద్ధితో ఉంటాడు.

(3) శీతోష్ణసమః- భక్తుడైనవాడు శీతోష్ణాలకు చలించడు. శీతోష్ణాలు శరీరానికి సంబంధించినవి. సామాన్యుడు వీటికి చలించి పోతుంటాడు.

ఒక ఆశ్రమంలో గురువుగారు శిష్యుణ్ణి పిలిచి, "నాయనా! పాఠాలు బాగా చదువుతున్నావా? అని అడిగాడు. ఆ! చక్కగా చదువుతున్నాను గురువుగారూ అన్నాడు శిష్యుడు.

గురువు : 'జ్ఞాపకం ఉంటున్నాయా?'

శిష్యుడు : 'శ్రద్ధగా చదువుతున్నాను గురుదేవా!'

గురువు : "చదువుతున్నావు సరే! జ్ఞాపకం ఉంటున్నాయా?"

శిష్యుడు : కొన్ని జ్ఞాపకం ఉంటున్నాయి. కొన్ని ఉండటం లేదు.

గురువు : అలా కాదు. అన్నీ (జ్ఞాపకం ఉంచుకోవాలి)

శిష్యుడు : "అలాగే ఉంచుకుందాం అనుకున్నాను గురువుగారూ! కాని మొన్న ఒకాయన అన్నీ గుర్తుపెట్టుకుంటే బుర్ర వేడెక్కిపోతుంది అనటంతో జాగ్రత్త

పడుతున్నాను."

గురువు : అందుకని ఏం చేస్తున్నావు?

శిష్యుడు : "కొన్ని గుర్తుపెట్టుకొని, కొన్ని వదిలేశాను.

గురువు : ఏం గుర్తుంచుకున్నావు, ఏమి వదిలేశావు?

శిష్యుడు : చలికాలంలో ఏం తినాలి? ఎండాకాలంలో ఏమి తినాలి? చలికాలంలో ఎక్కడ నిద్రించాలి? ఎండాకాలంలో ఎక్కడ నిద్రించాలి? అనేవి జాగ్రత్తగా గుర్తుపెట్టుకున్నాను.

గురువు : "మరి పాఠాలో?"

శిష్యుడు : అవి వదిలేశాను గురువుగారూ! బుర్ర వేడెక్కుతుంది గదా! అసలే నేను వేడిని భరించలేను.

గురువు : "ఓరి సోమరిపోతా! పాఠాలు చక్కగా గుర్తుపెట్టుకో! తిండి నిద్ర గురించి మరిచిపో!

ఇలా చలికి వేడికి చలించేవాడూ, కర్తవ్యాలను విడిచిపెట్టే వాడూ భక్తుడు కాదు, సోమరిపోతు. భక్తుడు శీతోష్ణాలకు చలించకూడదు.

(4) <u>సుఖదుఃఖ సమః-</u> మహాత్ములు, భక్తులు అయినవారు సుఖాలకు పొంగరు, దుఃఖాలకు క్రుంగరు. రెండింటిని సమంగానే చూస్తారు. ఇవి మనో స్థాయిలోనివి. భక్తుడు మనోస్థాయిని దాటి ఉంటాడు గనుక సమదృష్టితో ఉంటాడు.

మనచేతలే మనరాతలని, ఆరాతలను బట్టే మనకిక్కడ పడే వాతలని తెలుసుకుంటే సుఖదుఃఖాలకు చలించే పనిలేదు. మన సుఖదుఃఖాలకు

కారణం మన పూర్వజన్మ కర్మలేనని తెలుసుకోలేనివాడు ఎంతటి గొప్పవాడైనా చలించిపోతాడు.

ఒక గొప్పహరిదాసు గారున్నారు. ఆయన చేత హరికథను చెప్పించుకోవాలని 2,3 నెలల ముందే అడ్వాన్సులిచ్చి ఖాయం చేసుకుంటారు అందరూ. ఒక గ్రామంలో పెద్దలందరూ కలసి ఆయనతో మాట్లాడి కార్యక్రమం సిద్ధం చేసుకున్నారు. రాత్రి 9 గంటలకు హరికథ ప్రారంభం. 8గంటల నుండే భక్తులు వస్తున్నారు. సభాస్థలం నిండిపోయింది, సరిగ్గా 9 గంటలకు భాగవతార్ గారు స్టేజీ మీదకు వచ్చారు. ఆహ్వానసంఘం వారు ఒకపెద్ద గజమాలను కట్టించి నలుగురు జాగ్రత్తగా మోసుకొచ్చి దానిని భాగవతార్ మెడలో వేశారు. ఆ పూలదండను చూడగానే దాసుగారి ముఖం వెలిగిపోయింది. దానితో ఆయన "Today is the most happiest day in my life. నాజీవితంలో ఇంత ఆనందాన్ని నేనెరుగను" అన్నాడు. సభికులు చప్పట్లు కొట్టారు. కథ ప్రారంభమైంది.

రఘురాముడు - రమణీయ - రమణీయ - ఘనశ్యాముడూ - అంటూ చిడతలు వాయిస్తూ, పాడుతూ నృత్యం చేస్తున్నాడు. తన్మయత్వంతో - ఆనందంతో పరవశించి పాడుతున్న ఆయన ముఖంలో క్రమంగా కళ తగ్గిపోతున్నది. ఏదో తెలియని వేదన. క్రమంగా పాటమీద శ్రద్ధ తగ్గింది. ఇక ఓర్చుకోలేక శరీరాన్ని గోకటం మొదలుపెట్టాడు. పిచ్చిపిచ్చిగా గోకుతున్నాడు. శరీరమంతా మంటెక్కి పోతున్నది. జనానికేమీ అర్థం కావటం లేదు. ఇక లాభం లేదని ఆ పూలదండను తీసి విసిరి అవతలపడేశాడు. ఎందుకంటే ఆ

పూలదండలో ఎర్రచీమలు చేరాయి. అవి కుడుతున్నాయి. దండ తీసేయటానికి ప్రాణం ఒప్పక ఎలాగో భరిస్తున్నాడు. చివరకు భరించలేక తీసి విసిరేశాడు. అప్పుడు నానాయాతన పడుతూ అన్నాడు, "Today is the most miserable day in my life" - ఈ రోజు నా జీవితంలో గొప్ప దౌర్భాగ్యమైన రోజు అని.

ఆనందంతో పొంగిపోయినంత సేపు పట్టలేదు దుఃఖించటానికి. ఈ లోకంలో సుఖాలు గాని దుఃఖాలు గాని శాశ్వతంగా ఉండేవికాదు. వస్తూ పోతూ ఉంటాయి. కనుక వీటిని చూచి పొంగే పనీలేదు, క్రుంగే పనీలేదు. రెంటిని సమానంగా చూడాలి. అట్టివారే భక్తులు. సుఖదుఃఖాల అసలు తత్త్వం తెలుసుకోలేని వారే వాటికి చలిస్తారు. పొంగుతారు, క్రుంగుతారు.

(5) సంగవివర్జితః:- తామరాకు నీటిలో ఉన్నా నీటిని అంటించుకోకుండా ఉంటుంది. అలాగే భక్తుడైన వాడు ఈ ప్రపంచంలో తిరుగుతున్నా ఈ ప్రాపంచిక విషయాలను అంటించుకోడు. వాటితో సంగభావం లేకుండా ఉంటాడు. విషయాలన్నీ విషం కన్నా ప్రమాదమని, చివరికి అవి దుఃఖాన్ని మిగిల్చిపోతాయని అతడికి తెలుసు. కాని సామాన్యులు తమ ధనం, సంపదలు, అధికారం, కీర్తిప్రతిష్టలు, ఇళ్ళువాకిళ్ళూ - ఇవన్నీ తమకు ఎంతో ఆనందాన్నిస్తాయని భావించి వాటితో సంగభావం పెట్టుకుంటారు. అవి ఉన్నప్పుడు సంతోషం, దూరమైతే దుఃఖం. అవి ఇచ్చే సంతోషం కూడా తాత్కాలికమే. కనుక వాటితో సంగభావం కూడదు.

"మా కురు ధన జన యవ్వన గర్వం హరతి నిమేషాత్కాలః సర్వం" - అని శంకరులు చెప్పినట్లు సమస్తం ఒక్క నిముషంలో హరించిపోతాయి. కనుక ఆ పరమాత్మతోనే సంగభావం పెట్టుకోవాలి. సత్ పురుషులతో సంగభావం పెట్టుకోవాలి. పరమాత్మతో సంగభావం పెట్టుకుంటేనే సుఖము - శాంతి. పరమాత్మతో సంగభావం పెట్టుకోకుండా ఎన్ని భోగ్యవస్తువులతో సంగభావం పెట్టుకున్నా ఏమీ ప్రయోజనం ఉండదు.

ఒక పట్టణంలో ఒక శ్రీమంతుడు గొప్ప భవనాన్ని కట్టించాడు. దేశంలో ఎక్కడెక్కడ ఏయే గొప్పవిలువైన, అందమైన వస్తువులున్నాయో వాటన్నింటిని తెప్పించి భవననిర్మాణంలో ఉపయోగించాడు. అలాగే ఎంతో విలువైన ఫర్నీచర్ ను, చిత్రవిచిత్ర వస్తువులను విదేశాల నుండి తెప్పించి అమర్చాడు. అందరూ ఆ భవనాన్ని చూచి ఎంతగానో ప్రశంసిస్తున్నారు. అయినా అతడికి తృప్తిలేదు. తన బాత్ రూంలో ఒక బంగారు కుళాయి ఏర్పాటు చేయాలనుకున్నాడు. నవరత్నాలు,వజ్రాలు పొదిగిన ఒక బంగారు కుళాయిని తయారుచేయించి బాత్ రూంలో బిగింపజేశాడు. లక్షల విలువచేసే ఆ కుళాయిని ఒక ప్రముఖవ్యక్తి చేతుల మీదుగా ప్రారంభోత్సవం చేయించాలనుకున్నాడు. మంత్రిగారిని ఆహ్వానించాడు. కరపత్రాలు ముద్రించి, ప్రచారం చేశాడు. ప్రముఖులకు ఆహ్వానాలు పంపాడు. మేళతాళాలతో మంత్రిగారిని ఆహ్వానించాడు. ప్రజలు తండోపతండాలుగా వస్తున్నారు. ధనికులు,పురప్రముఖులు, పెద్ద ఉద్యోగులు, రాజకీయనాయకులు, పత్రికా విలేకరులు వారి వారికి కేటాయించిన స్థలంలో ఆశీనులయ్యారు.

ముహూర్తం టైముకు బ్రాహ్మణులు వేదమంత్రాలతో మంత్రిగారిని కుళాయి దగ్గరకు తీసుకెళ్ళి 'ప్రారంభించండి' అన్నారు. 'అయం ముహూర్త స్సుముహూర్తమస్తు ' అంటుండగా మంత్రిగారు కుళాయిని త్రిప్పారు. తుస్సుమని గాలి వచ్చింది గాని చుక్కనీరు కూడా రాలేదు. కారణమేమిటా అని ప్లంబరును పిలిచారు. అతడు వడివడిగా అంతా పరీక్షించి, తొందరలో ఓవర్ హెడ్ టాంక్ తో కుళాయికి కనెక్షన్ ఇవ్వలేదని తెలుసుకున్నాడు. ప్రారంభోత్సవం విఫలమైంది. అందరూ వెళ్ళిపోయారు.

కనుక ఎన్ని భోగాలున్నా, భగవంతునితో కనెక్షన్ పెట్టుకోకుండా ఈ భోగాలతో సంగభావం పెట్టుకుంటే ఏమీ ప్రయోజనం ఉండదు. శాంతి లభించదు. కనుక భగవంతునితో సంగం. విషయాలతో సంగవర్జితం.

నాటకంలో రాజు పాత్ర వేసినవాడు నా రాజ్యం, నాప్రజలు, నా మంత్రులు అని ఎంతగా కేకలు వేసినా వాటితో నిజంగా తనకే సంబధం లేదు. అలాగే ఈ ప్రపంచంలో నాభార్య, నాబిడ్డలు, నాఇల్లు, నాడబ్బు అని ఎంతగా వాటిలో తిరుగుతున్నా వాటితో నిజంగా తనకే సంబంధం లేదు. వాటితో సంగభావం వదిలి భగవంతునితో సంగం పెట్టుకోవాలి. అదే భక్తుని లక్షణం. ఇంతవరకు 31 లక్షణాలు చెప్పారు. చివరి 5 లక్షణాలు ఈ శ్లోకంలో -

**శ్లో||** తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్|
అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియోనరః|| **(19)**

**తా||** నిందాస్తుతులను సమంగా భావించేవాడు, మౌనంగా ఉండేవాడు, ఉన్న దానితో సంతృప్తి చెందేవాడు, నియమిత స్థానం లేనివాడు, స్థిరబుద్ధి గలవాడు అయిన భక్తుడు నాకు ప్రియుడు.

**వ్యాఖ్య:-** (1) తుల్య నిందాస్తుతిః:- దూషణ భూషణ తిరస్కారాలు దేహానికే గాని ఆత్మకు కాదు. నీవు ఆత్మవే గాని దేహానివి కాదు . కనుక నిందాస్తుతులు నీవి కాదు. అందువల్ల వాటికి చలించాల్సిన పనిలేదు. అందుకే నిజమైన భక్తులు నిందాస్తుతులకు చలించరు.

ఒక వ్యక్తి ఒక మహాత్ముని వద్దకెళ్ళి, 'అయ్యా! నిన్ను ఫలానావ్యక్తి నిందిస్తున్నాడని' చెప్పాడు. దానికాయన అతడు నిందించేది ఆత్మనైన నన్నా? లేక నా దేహాన్నా? ఆత్మను నిందించాడంటే అతడు ఆత్మే గనుక తనను తానూ నిందించుకున్నట్లే. ఇక దేహాన్ని నిందించాడా? అలా అయితే అతడు నాకు చాలా సహాయం చేసినట్లు. ఎందుకంటే ఈ దుర్గంధ భూయిష్టము, అనిత్యము, అశౌచము అయిన ఈ దేహాన్ని నేను నిందిస్తూనే ఉంటాను. ఇప్పుడు నాశ్రమను అతడు పంచుకుంటున్నట్లే గదా! అన్నాడు. ఎంతటి అవగాహన? నిందలపట్ల నిర్లిప్తత ఇలా ఉండాలి. నిందలే గాదు స్తుతించినా అంతే. స్తుతి ఆత్మకు (తనకు) కాదుగదా! నిర్లిప్తత. కనుక పట్టించుకోడు.

నీకెవరైనా ఒక లెటరు వ్రాశారు. పోస్ట్ మేన్ నీకు తెచ్చి ఇవ్వబోతే నీవు తిరస్కరించావనుకో. ఏమవుతుంది? ఫ్రం అడ్రస్ కే పోతుంది. అలాగే నిన్ను ఎవరైనా నిందిస్తే నిర్లిప్తంగా ఉన్నావనుకో. అది ఫ్రం అడ్రస్ కే పోతుంది. కనుక ఆ నిందకు ప్రతిస్పందించి నీవు వాడిని నిందించటమో, తగాదాకు వెళ్ళటమో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేయకపోతే అది వాడికే పోతుంది. స్పందించావా? అది నీకే.

రామాంజనేయ యుద్ధంలో రాముడు బాణం వేశాడు. ఆంజనేయుడు నమస్కారం చేశాడు. రామబాణం వెనుదిరిగింది. భక్తి ముందు ఏ శక్తీ పనిచేయదు. ఏ నిందలూ పనిచేయవు.

సంత్ తుకారం పూనా దగ్గర ఒక గ్రామంలో సంకీర్తన చేస్తున్నాడు. ఆ గ్రామంలో తుకారాం భక్తుడు శివశంకర్ అనే యువకుడున్నాడు. అతడికొక బిడ్డ. ఆ బిడ్డకు ఆరోగ్యం బాగాలేదు. వైద్యుణ్ణి పిలిచాడు. వైద్యం జరుగుతున్నది. బిడ్డ చావుబ్రతుకుల్లో ఉన్నాడు. అదే సమయంలో తుకారాం దేవాలయంలో సంకీర్తన ప్రారంభించాడు. భార్య ఎంత వద్దని వారించినా వినకుండా అతడు దేవాలయానికి వెళ్ళాడు. తుకారాం సంకీర్తనలో అతడూ లీనమయ్యాడు. తుకారాం బోధ ప్రారంభించాడు. జనులందరూ ఆయన మాటలతో తన్మయం చెందుతున్నారు.

ప్రశాంతంగా సాగుతున్న ఆ భగవద్గోష్టి ఒక్కసారిగా ఆగిపోయింది. భక్తులంతా దిగ్భ్రాంతులై చూస్తున్నారు. శివశంకర్ భార్య బిడ్డ శవంతో గోలుగోలున ఏడుస్తూ సభలోకి వచ్చింది. ఆ బిడ్డ శవాన్ని తుకారాం పాదాల వద్ద ఉంచి, "నీవేనా తుకారాం?" భక్తి అనే ముసుగుకప్పుకొని అందరినీ మోసం చేస్తున్న దౌర్భాగ్యుడివి నీవే కదా! నీలాంటి వాళ్ళు సమాజానికి పట్టిన చీడపురుగులు. కష్టపడి జీవించటం చేతగాక భక్తియనే పేరుతో ఋణగ్రస్తపు తిండి తినటానికి అలవాటు పడ్డ అసమర్థులు మీరు. ఓరి అప్రయోజకుడా! నీ సంసారాన్ని పాడు చేసుకున్నావు. అంతటితో ఆగక అందరి సంసారాలను



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నాశనం చెయ్యటానికి కంకణం కట్టుకున్నావా? నీవు భక్తుడివా? నీ పాండురంగడు దేవుడా? అని నిందిస్తూ, అడుగో అతడే నాభర్త. నీ పిచ్చిలోపడి కన్నబిడ్డ చావు బ్రతుకుల్లో ఉన్నా పట్టించుకోకుండా నీ దగ్గరకు వచ్చి కన్నబిడ్డ చావుకు కారణమైన కర్కోటకుడు" అని భర్తను దూషించింది. భర్త భార్యను సమీపించి, "అనవసరంగా నోరు పారవేసుకోకు. ఈ లోకంలో ఎవరి ఆయుష్షు ఎంతవరకో అంతవరకే ఉంటారు. నీ బిడ్డను తీసుకురావాల్సింది ఆలయానికి కాదు, స్మశానానికి" అన్నాడు. దానితో ఇంకా రెచ్చిపోయి నోటికి వచ్చినట్లు తిడుతున్నది.

తుకారాం ఆలోచించాడు. "హే పాండురంగా! ఏమిటీ వైపరీత్యం? నీవే శరణని నమ్మిన భక్తుని నీవు రక్షించకపోతే ఎలా? నీ భక్తుడు పవిత్రుడని నీవు నిరూపించాలి. లేదా ఈ తుకారాం ఇక ప్రపంచానికి మిగలడు" అని ప్రార్థించి భగవన్నామ సంకీర్తన ప్రారంభించాడు. ఆయన పరవశించి పాడుతుంటే బిడ్డలో కదలిక ప్రారంభమై, ఆ బిడ్డ తుకారాం కాళ్ళు పట్టుకున్నాడు. వెంటనే తుకారాం ఈ లోకంలోకి వచ్చి బిడ్డను తల్లికి అప్పగించాడు.

ఆ తల్లి తన తప్పు తెలుసుకొని తుకారాం పాదాలపై బడి క్షమాభిక్ష కోరింది. తుకారాంను ఎంతగానో స్తుతించింది. అయినా తుకారాం చలించలేదు. ఇంతకుముందు నిందిస్తున్నప్పుడు ఎలా ఉన్నాడో ఇప్పుడు స్తుతించినప్పుడు కూడా అలాగే ఉండిపోయాడు. తన సహజ ధోరణిలో సంకీర్తన ప్రారంభించాడు. అదీ భక్తుల లక్షణం. వారి దృష్టిలో నిందాస్తుతులు రెండూ ఒక్కటే. నిందించిన వారే స్తుతిస్తుంటారు, స్తుతించిన వారే

నిందిస్తుంటారు. కనుక రెండింటిలోను భేదాన్ని చూడరు. వారి మనస్సు నిరంతరం భగవంతునిలోనే ఉంటుంది. నిందాస్తుతులకు చలించకుండా నిర్లిప్తంగా ఉంటూ భగవంతుని ప్రియభక్తులుగా ఉండాలి.

(2) మౌని:- మౌని అన్నా ముని అన్నా ఒక్కటే. ముని అంటే మనన శీలుడు అని. తాను విన్న భగవత్ సంబంధమైన విషయాలను నిరంతరం మననం చేసుకుంటూ ఇక అన్యవిషయాలను మాట్లాడకుండా ఉండేవాడు మౌని. మౌనం అంటే మాట్లాడకుండా ఉండటం అని మాత్రం తెలుసుకొని ఏ విషయమూ మాట్లాడకుండా మూతి బిగించుకొని కూర్చున్నవాడు మౌని కాదు. ఏ భగవత్ సంబంధమైన విషయాలను మాట్లాడవలసి వచ్చినా, ఎవరన్నా ఏదన్నా సందేహం అడిగినా ఈ రోజు మౌనంలో ఉన్నాను కనుక మాట్లాడను అని మూతి బిగించుకొని కూర్చున్నవాడు మౌనికాడు. ఇంకా విచిత్రం ఏమిటంటే అన్ని విషయాలకు సైగల ద్వారా సమాధానం ఇస్తుంటారు ఈ మౌనులు. తాళపుచెవి ఎక్కడపెట్టావు? అని ఇంట్లోని వారు అడిగారనుకో. ఫలానా గదిలో పెట్టాను అని చెప్పటానికి అర్ధనిముషం సరిపోతుంది. దానిని సైగలతో తెలియజేయటానికి 10 నిముషాలు చాలదు. ఇదొక రకం మౌనం.

తాను విన్నటువంటి లేదా చదివినటువంటి ఆధ్యాత్మికవిషయాలను గాని, భగవత్తత్వాన్ని - భగవంతుని వైభవాన్నిగాని, కథలనుగాని ప్రశాంతమైన, నిర్మలమైన మనస్సుతో నిరంతరం మననం చేస్తూ ఉండటమే నిజమైన మౌనం. అట్టివాడే నిజమైన మౌని. అలా మననం చేసుకుంటూ ఉండేవానికి

ఇతరులతో మాట్లాడవలసిన అవసరమే ఉండదు; మాట్లాడటం కుదరదు. అందువల్ల వ్యర్థమైన విషయాలకు ఆస్కారం లేదు. ఒకవేళ తప్పనిసరైతే ఒకటిరెండు మాటలు క్లుప్తంగా మాట్లాడినా ఫరవాలేదు. అసలు ముఖ్యంగా గమనించవలసింది ఒక్కటే. మనం భగవత్ సంబంధ విషయాలను మననం చేస్తూ ఉన్నామా? లేదా? అని మాత్రమే. అతడే మౌని. అతడంటేనే భగవంతునికి ప్రీతి. అంతేగాని కేవలం వాగ్బంధనం చేసి వ్యాపారాలు, ఉద్యోగాలు, డబ్బు సంపాదన, లంచాలు, రాజకీయాలు, లోకాభిరామాయణం మొ||న విషయాలను తలచుకుంటూ, నిర్ణయాలు తీసుకుంటూ ఉండటం కాదు. దీనిని బట్టి మౌనం అంటే మూగబోవాల్సింది మనస్సేగాని వాక్కు కాదు అని గ్రహించాలి.

అసలు వాక్కు నాలుగువిధాలు. అవే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అని. ఇక ఐదవరకం లేదు.

(i) ఎల్లప్పుడూ లోకవ్యవహారాలు, వ్యర్థప్రసంగాలు, చెప్పిందే చెప్పి సాగదీయటాలు - ఇవన్నీ 'వైఖరీ' అంటారు. లోకంలో వీరే ఎక్కువ. వీరు వాక్కును వ్యర్థం చేయటమే గాక, అనేక అబద్ధాలు మాట్లాడటం జరుగుతుంది.

(ii) కొందరు ప్రాపంచికవిషయాలు, వ్యర్థప్రసంగాలతో బాటు అప్పుడప్పుడు భగవత్ సంబంధమైన విషయాలు కూడా మాట్లాడుతారు. వీరి వాక్కులనే 'మధ్యమ' అంటారు.

(iii) భగవత్ సంబంధవిషయాలు గాని, ప్రాపంచిక విషయాలు గాని ఏవైనా సరే ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడేవారి వాక్కులు 'పశ్యంతి'.

(iv) పూర్తిగా ఆత్మకు సంబంధించిన విషయాలు, పరమాత్మ తత్త్వాన్ని తెలిపే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీతలకు సంబంధించిన విషయాలను మాత్రమే మాట్లాడితే ఆ వాక్కును 'పరా' అంటారు.

మనం వైఖరీ వాక్కును మధ్యమ వాక్కునందు, మధ్యమ వాక్కును, పశ్యంతినందు, పశ్యంతి వాక్కును పరావాక్కునందు లయంజేసి 'ఆ పరబ్రహ్మను నేనే' అని గ్రహించి అలా ఉండిపోవటమే నిజమైన మౌనం.

భక్తుడు వాక్కును అధీనంలో ఉంచుకొని కేవలంగా ఉండాలి. అదే నిజమైన మౌనం. అట్టివాడే భగవంతునికి ప్రియభక్తుడు.

(3) <u>సంతుష్టో యేన కేనచిత్</u>:- ఉన్నదానితో సంతృప్తి చెందేవాడు, లేదా లభించిన దానితో సంతృప్తి చెందేవాడు. ఇతడే లోకంలో అదృష్టవంతుడు. ఇతడే నిజమైన భక్తుడు. తృప్తివేరు, సంతృప్తి వేరు.

మనమందరం ఏవేవో కోరికలతో ఉంటాం. ఆ కోరిక తీరేవరకు అసంతృప్తిగా ఉంటాం. తీరిందా తృప్తి కలుగుతుంది. అయితే ఆ తృప్తి ఎంతోకాలం ఉండదు. వెంటనే మరొక కోరిక కలుగుతుంది. మళ్ళీ అసంతృప్తి. అదీ తీరితేగాని మళ్ళీ తృప్తి కలగదు. ఇలా ఎన్నిసార్లు తృప్తి కలిగినా ఇక నాకు ఏ కోరికా లేదు, ఏ అవసరమూ లేదు అని అనుకోం. ఏమీ కోరకుండా ఉండం. ఒకదాని తర్వాత ఒకటిగా కోరికలు పుడుతూనే ఉంటాయి. ఇలా తృప్తి - అసంతృప్తి మధ్య పరుగులు తీస్తూనే ఉంటాం.

ఇక సంతృప్తి అంటే ఏమిటి? ఇక ఎప్పటికీ దేనినీ కోరకుండా ఉన్నదానితో లేదా లభించిన దానితో ఇకచాలు అని తృప్తిపడి ఉండటమే సంతృప్తి. నిజంగా ఈ స్థితి ఎలా కలుగుతుంది? ఇది బయటి వస్తువుల ద్వారా లభించేది కాదు. లోపలే ఉన్న ఆత్మవస్తువు ద్వారా లభించేది. బయటనుండి ఏమి వచ్చినా రాకున్నా అతడు సంతృప్తితో జీవిస్తాడు.

ఒకడు కూలిపని చేస్తూ రోజుకు 200 రూపాయలు సంపాదిస్తున్నాడు. చాలా కష్టపడి పనిచేయాల్సి వస్తున్నది గనుక ఏదైనా వ్యాపారం చేసుకుందాం అని ఆలోచిస్తున్నాడు. ఇప్పుడు అసంతృప్తి. కొన్నాళ్ళకు వ్యాపారం ప్రారంభించాడు. అప్పుడు తృప్తి కలిగింది. అయితే కొన్నాళ్ళకు ఈ చిన్నవ్యాపారంతో ఏమి సంపాదిస్తాను. గొర్రెతోక బెత్తెడే అన్నట్లుంది - కనుక ఏదైనా పెద్దవ్యాపారం చెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు అసంతృప్తి. ఎలాగైతేనేం అవకాశం కలిసివచ్చి పెద్దవ్యాపారం ప్రారంభించాడు. తృప్తి. ఇలా బాగా సంపాదిస్తూ ఉండగానే ఒక పెద్ద పారిశ్రామికవేత్తతో పరిచయం ఏర్పడింది. అతడితో భాగం కలిసి చేస్తున్నాడు. బాగా తృప్తిగానే ఉంది. కాని ఇంత సంపాదిస్తూ అతడికెందుకు భాగం ఇవ్వటం? అని అసంతృప్తితో రగిలిపోతూ చివరకు భాగస్థుని మరణంతో మొత్తం స్వంతం చేసుకున్నాడు. ఇప్పుడు బాగా తృప్తిగానే ఉంది. అయితే ఇన్ కంటాక్సు వారి దృష్టిపడి వారితో నానాతిప్పలు పడుతున్నాడు. అసంతృప్తి. ఇలా కాదని తన పరిశ్రమలు ఏ ఇబ్బందులు లేకుండా ఉండాలంటే రాజకీయాల్లో దిగాలనుకున్నాడు. మళ్ళీ అసంతృప్తి. M.L.A. అయ్యాడు. తృప్తి.

మంత్రిగాకపోతే ఏవరేం ఉంటుంది? అనుకున్నాడు అసంతృప్తి. మంత్రి అయ్యాడు తృప్తి. ముఖ్యమంత్రి పదవికోసం ప్రయత్నిస్తున్నాడు అసంతృప్తి - - - ఇలా తృప్తి కలుగుతుందే గాని సంతృప్తి ఎన్నటికీ కలగటం లేదు. అదే ఏ కోరికా లేకుండా "కూలిపని చేసుకొనేవాణ్ణి ఇంతటి వాణ్ణయ్యానుగదా! ఇక సర్వము భగవంతునిపై భారంవేసి ఉన్నదానితో తృప్తి చెందుతాను. ఇక నాకేమీ అక్కరలేదు" అని నిశ్చయించుకుంటే అప్పుడు కలిగేదే సంతృప్తి. దానితో ఇక కోరికలు పుట్టవు. వాటికోసం ప్రయత్నాలు చేయనక్కరలేదు. ఇదే హాయిగా ఉంటుంది.

నదులు రానీ, పోనీ సముద్రానికి కొరత లేదు. విషయాలు లభించనీ లభించక పోనీ భక్తునికి వెలితి లేదు. అతడు నిత్యసంతుష్టుడు. కుచేలుని లాగా కటిక పేదరికంలోను, అష్టైశ్వర్యాలతో ఉన్నప్పుడూ ఒకే విధమైన సంతృప్తే భక్తుని లక్షణం. ఉన్నదానితో సంతృప్తి చెందేవాడే నిజమైన భక్తుడు.

ఒక గ్రామంలో ఒక సామాన్యకుటుంబం ఉన్నది. భార్యా, భర్త, ముగ్గురు పిల్లలు. స్వంత ఇల్లు ఉన్నది. ఇతర ఆస్థిపాస్థులున్నాయి. ఆదాయమూ ఉంది. దేనికీ కొరతలేదు. భార్యాభర్తలు ఎంతో అన్యోన్యంగా ఉంటారు. పిల్లలు బుద్ధిమంతులు. అంతా ఆనందంగానే గడిచిపోతున్నది. అయితే ఒక్క విషయంలో మాత్రం వారికి అసంతృప్తి ఉన్నది. భార్యాభర్తలిద్దరూ ఆరోగ్యంగానే ఉంటారు. కాని వారి ముక్కులు మాత్రం చట్టిముక్కులు. ఇతరులు వారిని చూచి ఎగతాళి చేస్తున్నారని బాధ పడేవారు. మమ్మల్ని ఇలా ఎందుకు పుట్టించావయ్యా బ్రహ్మదేవుడా! అని లోలోపల బాధపడుతూ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉండేవారు.

ఇలా ఉండగా ఒకసారి ఒక అనుభవజ్ఞుడైన జ్యోతిష్యుడు తటస్థపడటం తో "మాకు ఈ అవమానం తొలగే అవకాశం ఉన్నదా?" అని అడిగారు.

దానికా జ్యోతిష్కుడు, "అయ్యా! ఇది భగవంతుని నిర్ణయం కదా! దీనిని మార్చే శక్తి బ్రహ్మకు తప్ప ఎవ్వరికీ లేదు. మీరు ఆయన గూర్చి ధ్యానించండి" అన్నాడు. వారు అలాగే బ్రహ్మను గురించి ఉపాసించారు. బ్రహ్మ ప్రత్యక్షమై, ఏమి కావాలో కోరండి అనగా మాకు మంచిముక్కులు రావాలి అన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. అయితే ముక్కులు అన్నారేగాని ఎన్నో చెప్పలేదు గదా! అందువల్ల వారి దేహమంతటా ముక్కులే వచ్చాయి.

ఈ బాధను తొలగించుకొనుటకు మళ్ళీ బ్రహ్మను ప్రత్యక్షం చేసుకొని మాకీ ముక్కులు వద్దు అన్నారు. తథాస్తు అన్నాడు బ్రహ్మ. ఇప్పుడు మొత్తం ముక్కులు పోయినవి. ఇది మరింత బాధాకరమైంది. మళ్ళీ బ్రహ్మను వేడుకున్నారు. మాముక్కులే మాకు ప్రసాదించండి అన్నారు. దానితో వారి చట్టిముక్కులు వారికి వచ్చినవి. వారికేం ప్రయోజనం కలిగింది? ఏమీలేదు. కనుక ఉన్నదానితో సంతృప్తి చెందాలే గాని కోరికలను పెంచుకుంటూ పోయినందున అశాంతి, అసంతృప్తియే అని గ్రహించాలి.

(4) అనికేతః:- నికేతం అంటే ఇల్లు. నివాసం. అనికేతం అంటే స్థిరనివాసం లేకపోవటం. భక్తుడైన వానికి నాకు ఇది కావాలి, నేను ఇక్కడే ఉండాలి అనే ఆలోచన ఉండరాదు. భక్తునికి భగవంతుడే నివాసస్థానం. మిగిలిన స్థానాలన్నీ తాత్కాలికం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కేవలం నాలుగు గోడల మధ్య ఉన్నంతమాత్రాన అది స్వగృహం కాదు. రైల్వే విశ్రాంతి గదిలోనో, విమానాశ్రయంలోనో, లాడ్జి గడిలోనో ఒకరోజు గడిపితే అది స్వగృహమవుతుందా? భక్తుడైన వానికి ఈ లోకంలోని నివాసస్థానాలన్నీ అలాంటి విశ్రాంతి గదులే. అతడి స్వగృహం - నివాసస్థానం పరమాత్మ పాదాలే. అందుకే అతడు ఇక్కడ అనికేతుడు. స్వంత నివాసస్థానం లేనివాడు.

(5) స్థిరమతిః- స్థిరమతి అంటే స్థిరమైన బుద్ధి గలవాడు. స్థిరభావం గలవాడు. అతడే స్థితప్రజ్ఞుడు. పరమాత్మ యందు బుద్ధిని స్థిరంగా నిల్పి పరమాత్మతో ఐక్యతను సాధించటమే తన జీవిత పరమార్థం అని నిశ్చయించుకొని, దానికొరకే నిరంతరం పాటుబడుతూ, దానికి అనుగుణంగా దివ్యజీవనం గడిపేవాడే స్థిరమతి. అట్టి భక్తుడైన నరుడే నాకు ప్రియుడు అన్నాడు భగవానుడు. 'నరః' అన్నారు గనుక పరిపూర్ణ పదవిని పొందలేకపోయినా సాధన ప్రారంభించిన ప్రతి నరుడూ నాకు ప్రియుడే అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.

- చివరిగా ఈ అధ్యాయ ఫలశ్రుతిని తెలియజేస్తున్నాడు భగవానుడు 20వ శ్లోకంలో –

**శ్లో||** యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే|
శ్రద్ధధానా మత్పరమాః భక్తాస్తే2తీవమే ప్రియాః|| (20)

**తా||** ఎవరైతే శ్రద్ధావంతులై, నన్నే పరమగతిగా నమ్మి, ఈ అమృతరూప ధర్మమును పైన చెప్పిన విధంగా ఉపాసిస్తారో అట్టి భక్తులు నాకు పరమప్రియులు.

**వ్యాఖ్య:-** ఇదం ధర్మ్యామృతం:- అమృతం అంటే చావులేకుండా చేసేది. అది స్వర్గంలో ఉంటుంది. పుణ్యకర్మలు చేసినవారు శరీరాన్నివదిలిన తర్వాత స్వర్గంలో ఆ అమృతాన్ని త్రాగుతారు. కాని ఇది ధర్మ్యామృతం. ధర్మాచరణ వల్ల వచ్చే అమృతం. ధర్మరూప అమృతం. అమృతరూప ధర్మం. అంటే మోక్షాన్ని ప్రసాదించే ధర్మం. ఇది దేహం ఉండగానే పొందగలిగే అమృతం.

ఆ అమృతానికి ఆకలి దప్పులుండవు. జబ్బులు రావు, ముసలితనం రాదు. ఈ అమృతం పానం చేస్తే మోక్షమే. ఇక జన్మే ఉండదు. ఇది భక్త్యామృతం. ఇది ఎలా లభిస్తుంది? ఏ జాగ్రత్తలు తీసుకోవాలి? శ్రద్ధధానా, మత్పరమాః అని 2 జాగ్రత్తలు చెబుతున్నారు.

(1) శ్రద్ధధానా:- ఆధ్యాత్మిక రంగంలో శ్రద్ధ చాలా ప్రధానమైనది. శ్రద్ధ అంటే విశ్వాసం - నమ్మకం. గురువుపట్ల, వేదాంత వాక్యాలపట్ల గొప్ప శ్రద్ధ ఉండాలి. గురువుపట్ల గాని, వేదాంత వాక్యాలపట్ల గాని విశ్వాసం లేకుండా పొందిన జ్ఞానం వ్యర్థం. అది ఎప్పుడూ నీకు ఉపయోగపడదు. ఈ శరీరం రాలిపోక ముందే ఆత్మజ్ఞానాన్ని పొందాలి. అప్పుడే జన్మసార్థకం. అయితే ఆత్మజ్ఞానాన్ని పొందాలన్నా, ఆత్మానుభూతిని చెందాలన్నా పవిత్రగ్రంథాలను కేవలం చదవటం గాని,వినటం గాని చేసినంత మాత్రాన ప్రయోజనం లేదు. అందులోని భావాలను బాగా జీర్ణించుకొని, వాటిని జీవితంలో ఆచరించాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అలా ఆచరించాలంటే ఆవేదాంత సూత్రాలపై నీకు నమ్మకం ఉండాలి. అంతేగాదు వాటిని బోధించే గురువుపై కూడా పూర్తి విశ్వాసం ఉండాలి. గురువు తనను ఉన్నతమార్గంలోనికి పయనింపజేసే శక్తి సామర్థ్యాలు గలవాడు, అట్టి గురువు తనకు లభించటం తన పూర్వజన్మ సుకృతమని ఒక నమ్మకం ఉంటేనే ఆచరించటం జరుగుతుంది. లేకపోతే ఎంతగొప్ప జ్ఞానాన్నైనా విని వదిలేస్తాం. కనుక శ్రద్ధ అనేది సిద్ధికి సోపానం అని గ్రహించాలి.

(2) మత్పరమాః- నన్నే లక్ష్యంగా పెట్టుకో. ప్రతివ్యక్తి యొక్క జీవితపరమ లక్ష్యం మోక్షమే. కనుక భగవంతుని చేరుకోవటమనే ఉన్నత లక్ష్యాన్ని పెట్టుకొని మాత్రమే సాధన సాగించాలి. ఒక లక్ష్యమంటూ లేకుండా ఎంత సాధన చేసినా ఎంత కష్టపడ్డా అంతా వృథా అవుతుంది. కనుక పరమాత్మను లక్ష్యంగా పెట్టుకొని శ్రద్ధతో సాధన సాగించాలి. ఉపాసన చెయ్యాలి.

(3) యేతు:- యఃతు అంటే ఎవరైతే. ఎవరైతే అనటం వల్ల జాతి, కులం, మతం, అనే భేదం లేకుండా స్త్రీలైనా, పురుషులైనా, పాపాత్ములైనా - పుణ్యాత్ములైనా, భాగ్యవంతులైనా - నిరుపేదలైనా, పండితులైనా - పామరులైనా ఎవరైనా సరే పరమాత్మ యొక్క వాత్సల్యాన్ని చూరగొన వచ్చును అని భగవానుడు హామీ ఇస్తున్నాడు. ఇలా చెప్పవలసిన అవసరం ఏమిటి? ఎందరో పండితులు సంకుచిత భావంతో స్త్రీలకు, శూద్రులకు మోక్షార్హత లేదని, వారు వేదమంత్రాలను చదవరాదని అనేకమైన మూఢనమ్మకాలను కలిగించారు. శాస్త్రప్రమాణంతో సంబంధం లేకుండా మిడిమిడి జ్ఞానంతో ఇలా చెప్పిన వారి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మాటలు మనలో బాగా జీర్ణించుకు పోయి ఉన్నాయి. అందుకే భగవానుడు అనేక సందర్భాలలో, అవకాశం వచ్చినప్పుడల్లా యః, యః అనే పదాన్ని ప్రయోగించటం జరిగింది. భక్తిగాని, జ్ఞానం గాని ఎవరో కొందరి హక్కు మాత్రం కాదు. ఎవరైనా సరే భగవంతుని చేరుకోవచ్చు, సాధనలు చెయ్యవచ్చు. కాకపోతే -

(4) యధోక్తం పర్యుపాసతే:- ఏ ప్రకారంగా పైన చెప్పిన 19 శ్లోకాలలో వివరించటం జరిగిందో ఆ ప్రకారంగా ఉపాసన చెయ్యాలి. ఆచరణ చేయాలి. చెప్పిన అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. సాకారోపాసనకు ఏ జాగ్రత్తలు తీసుకోవాలో, నిరాకారోపాసనకు ఏ జాగ్రత్తలు తీసుకోవాలో - అన్ని జాగ్రత్తలు తీసుకుంటూ సాధన సాగించాలి.

మనయొక్క స్థితిని బట్టి మన ఉపాసన ప్రారంభించాలి. ముందు సగుణోపాసనతో ప్రారంభించి, క్రమంగా నిర్గుణోపాసనకు అర్హత సంపాదించాలి. మనోబుద్ధులు పరమాత్మలో ఉంచగలిగితే పరమాత్మ ప్రాప్తియే. అది సాధ్యం కాకపోతే అభ్యాసయోగాన్ని ఆచరించాలి. అదీ కుదరకపోతే భగవంతునికి సంబంధించిన కర్మలు చేయాలి. అదీ కుదరకపోతే ఏరకమైన కర్మలు చేసినా కర్మఫలత్యాగం చెయ్యాలి.

ఇలా సాధన చేస్తూ భక్తుల లక్షణాలు అలవరచుకోవాలి. అందుకే -

(5) తేభక్తాః:- అట్టి భక్తులు - అన్నారు. అంటే ఇక్కడ చెప్పిన లక్షణాలను అలవరచుకున్న భక్తులు - నిజమైన భక్తులు ఒక క్రమపద్ధతిలో, గురువు చూపిన మార్గంలో, శాస్త్రం చెప్పిన మార్గంలో ప్రయాణించినట్లైతే - అందులోను

గురువుపైన, శాస్త్రంపైన విశ్వాసంతో ఉపాసనను చక్కగా చేసినట్లైతే భగవంతునే లక్ష్యంగా పెట్టుకొని సాధన సాగిస్తే ఈ అమృతరూప ధర్మాన్ని ఆచరించినట్లైతే వారికి ఫలితం కలుగుతుంది. ఏమిటి ఆ ఫలితం?

(6) మే అతీవ ప్రియః:- నాకు అట్టివారు మిక్కిలి ప్రియులు అవుతారు. ఇష్టులవుతారు అని భగవానుడు నొక్కి చెబుతున్నాడు. ఎందుకు?

ఏదైనా ఒక విషయాన్ని బోధించినప్పుడు దానివల్ల కలిగే ఫలితాన్ని కూడా చెప్పినట్లైతే, ఒక హామీ ఇచ్చినట్లైతే ఎలాగైనా సరే ఆ ఫలితాన్ని అందుకోవాలనే పట్టుదల కలుగుతుంది. ఆచరించాలనుకొనే వారికి గొప్పవిశ్వాసం కలుగుతుంది. అందుకే 7 శ్లోకాల్లో భక్తుల లక్షణాలను - అదీ భగవంతునికి ఇష్టులైన భక్తుల లక్షణాలను తెలియజేసి చివరిగా ఈ ఫలశ్రుతిని కూడా తెలియజేస్తున్నారు. సాధారణంగా భగవద్గీతలో ఫలశ్రుతిని చెప్పటంలేదు, ఏ అధ్యాయంలోనూ చెప్పలేదు. కాని ఈ భక్తియోగానికి మాత్రమే ఫలశ్రుతిని చెప్పారు.

భగవంతునికి ప్రీతిపాత్రుడైన భక్తుడు కావటమే మానవజన్మకు చరితార్థత; సాఫల్యత. భగవంతునికి ఎవరి మీద ప్రేమ, వాత్సల్యం, ఇష్టం కలుగుతుందో వారిపంట పండినట్లే. అట్టివారికి సమస్త సందేహాలను నివృత్తిచేసి, వారికి కావలసిన జ్ఞానాన్ని అందిస్తాడు భగవానుడు. అట్టి జ్ఞానం వల్లనే జననమరణ చక్రం నుండి విముక్తి - మోక్షం. అంటే భగవత్కృప మోక్షానికి దారితీస్తుంది. కనుక ఆచరణ ద్వారా భగవంతునికి ఇష్టులం కావాలి.

**ఈ అధ్యాయం మొత్తంలో ముఖ్యమైనది "ఇదం ధర్మ్యామృతం" అనేది. ఈ భక్తియోగం అమృతరూప ధర్మం. అంటే మోక్షరూప ధర్మం. ఈ ధర్మాన్ని ఆచరిస్తే అమృతత్వమే - మోక్షమే. దానితో మానవజన్మ చరితార్థమే.**

**ఇది భక్తియోగం. భక్తి పేరుతో ఇప్పటివరకు ఉన్న మన భావనలు మారాలి. భక్తి అంటే వేషానికి సంబంధించినది కాదు, మనోబుద్ధులకు సంబంధించింది అని గ్రహించాలి. ఏదో కొద్దిసేపు భజన - పూజ - కీర్తన చేస్తే భక్తికాదు. నిరంతరము మన మనోబుద్ధులను పరమాత్మ పాదారవిందముల వద్ద వదలాలి. మన ఆంతరంగిక వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి.**

**గద్యం:-** ఓం తత్సత్ ఇతి శ్రీమత్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగోనామ ద్వాదశోధ్యాయః||

**ఇది సాకారం నుండి నిరాకారానికి మళ్ళే దశ. భగవంతుని వైపుకు పూర్తిగా తిరిగేదశ. అలా మళ్ళితే మనకు జ్ఞానాన్ని పొందే అర్హత వచ్చినట్లే. అందుకే వెంటనే జ్ఞానషట్కం ప్రారంభం కాబోతున్నది. భక్తి పరాభక్తి ఐతే పరిపూర్ణ జ్ఞానమే. తద్వారా మోక్షమే.**

**భగవత్స్వరూపులైన మీ అందరి కృపాకటాక్షం చేతనే ఈ భక్తియోగాన్ని ఇంత వివరంగా వినిపించే అదృష్టం, అదే సమయంలో చక్కగా మననం చేసుకొనే భాగ్యం నాకు కలిగింది. దీనిని శ్రవణం చేసిన మీరంతా ఈ లక్షణాలను అలవరచుకొని భగవంతునికి ప్రియభక్తులై తరించగలరని ఆశిస్తూ - - - -**

# శ్రీమద్భగవద్గీత : 1 3 వ అధ్యాయం

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : [WWW.SRICHALAPATHIRAO.COM](http://WWW.SRICHALAPATHIRAO.COM)

Email : [care@srichalapathirao.com](mailto:care@srichalapathirao.com)

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ||న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది. 1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.**

**'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.**

**ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను. జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

భక్తి అంటే మనస్సు, బుద్ధి రెండూ భగవంతునిలో నిలిచిపోవటమేనని 12వ అధ్యాయం భక్తియోగంలో తెలుసుకున్నాం. శరీరం ఎక్కడున్నా, ఎక్కడ తిరిగినా, ఏం చేస్తున్నా ఫరవాలేదు. మనోబుద్ధులు మాత్రం అన్నీ ప్రాపంచిక విషయాలను వదిలి, పరమాత్మలో నిలవాలి, పరమాత్మతో తాదాత్మ్యంచెందాలి, పరమాత్మతో కలసిపోవాలి, ఒక్కటైపోవాలి. అదే భక్తి, అనన్య భక్తి, పరాభక్తి - మోక్షస్థితి.

అట్టి స్థితి కలగాలంటే మనస్సు ప్రేమతో నిండిపోవాలి, బుద్ధి విచారణా శక్తితో నిండిపోవాలి. సాకారమే అయినా - నిరాకారమే అయినా మనస్సు ప్రేమిస్తూ ఉండాలి. బుద్ధి చీల్చి, చెండాడి, విశ్లేషించి, విచారణ చేసి లోతును తెలుసుకోవాలి. మనస్సు ప్రేమతో, భక్తితో ఎలా నిండిపోవాలో ప్రధానంగా భక్తి యోగం తెలియజేసింది. మనస్సు అలా భక్తితో నిండిపోవాలంటే మనం ఏఏ లక్షణాలు అలవరచుకోవాలో కూడా విపులంగా తెలియజేసింది. అంతేకాదు పరమాత్మ యొక్క శక్తి సామర్థ్యాలేమిటో; ఆయన గొప్పతనం - విశిష్టత ఏమిటో; ఆయన జీవుళ్ళకు ఎలా మేలుచేస్తుంటాడో; తనను అనన్య భక్తితో కొలిచినవారిని - శ్రద్ధతో, విశ్వాసంతో నమ్మినవారిని ఎలా ఉద్ధరిస్తాడో; ఆయన యొక్క విభూతులు ఏమిటో; ఆయన స్వరూప స్వభావాలు ఎట్టివో కూడా భక్తి షట్కం తెలియజేసింది.

ఇప్పుడు పరమాత్మను కేవలం ఊహలతో, బుద్ధితో తెలుసుకోవటమే గాక పరమాత్మ అనుభూతిని పొంది, పరమాత్మతో ఐక్యత చెంది, 'నేను ఆ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మనే' - 'ఆ పరమాత్మను నేనే' అని అనుభవపూర్వకంగా ఎలా గ్రహించాలో జ్ఞానషట్కం (13-18 అధ్యాయాలు) తెలియజేయబోతున్నది. అనంతుడైన పరమాత్మను అందుకొనుటకు సాధకుడు అనంతస్థాయికి ఎదగాలి. 'నేను జీవుణ్ణి' అనే జీవభావం పూర్తిగా నశించాలి. అది సాధించటానికే ఈ జ్ఞానషట్కం.

భగవంతుడు ఈ అధ్యాయం నుండి మొదలు పెట్టి 18వ అధ్యాయం వరకు ఏకధాటిగా జ్ఞానామృతవర్షాన్ని కురిపించబోతున్నాడు. ఆ జ్ఞానామృతవర్షంలో తడిసి, ఆనందంతో గంతులు వేశాడు అర్జునుడు. మరి మనమో? జలుబు చేస్తుందని ఆగుదామా? అహ వద్దు. మనమూ ఈ జ్ఞానామృత వర్షంలో తడిసి, అందినంతవరకు అమృత పానం చేసి, ఆనంద తాండవనృత్యం చేద్దాం. జీవితాలను సార్థకం చేసుకుందాం. సరేనా ? -

ఈ 6 అధ్యాయాలను జ్ఞానషట్కం అంటారు. జ్ఞానం అంటే తెలివి, షట్కం అంటే ఆరు. ఏమిటీ తెలివి? ఉన్నదానిని ఉన్నట్లు చూచే తెలివి. ఇప్పుడు మన తెలివి తెల్లారినట్లే ఉంది. ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చూచే తెలివి మనది.

అదిగో లైటు. ఆ లైటు ఇప్పుడు వెలుగుతున్నది - అంటాం. అంతవరకే మన తెలివి. నిజం ఏమిటి? లైటు ఎప్పుడూ అలాగే ఉంటుంది. అయితే అందులోకి కరెంటు ప్రవేశించి, తన శక్తిని వ్యక్తం చేస్తున్నది. కాని మనం చూచేది, భావించేది జడమైన లైటునే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అలాగే ఇది శరీరం. మనం ఈ శరీరాన్నే చూస్తుంటాం. ఇక్కడ ఉన్నది ఒక్కటే అని భావిస్తాం. కాని ఈ జడమైన శరీరాన్ని కదిలించి, ఆడించే చైతన్యం ఒకటి ఉన్నదని తెలుసుకోలేము, చూడలేము. అదే ఆత్మ. ఈ జడశరీరాన్ని - దానిని ఆడించే చైతన్య రూప ఆత్మను విడగొట్టి చూచే తెలివియే నిజమైన తెలివి. హంస పాలను నీళ్ళను వేరుచేసి పాలను త్రాగి నీటిన వదిలేస్తుంది. అలాగే మనం జడమైన దేహాన్ని (క్షేత్రాన్ని) - చైతన్య రూప ఆత్మను (క్షేత్రజ్ఞుని) విడగొట్టి క్షేత్రాన్ని వదిలి క్షేత్రజ్ఞునితో ఐక్యం కావాలి. అదే ఈ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగం. ఈ షట్కంలో ఇలా విభాగం చేసి చూచే తెలివిని ప్రసాదించే అధ్యాయాలు నాలుగు ఉన్నాయి. అవే 1.క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం, 2. గుణత్రయ విభాగయోగం, 3.దైవాసుర సంపద్విభాగయోగం, 4.శ్రద్ధాత్రయ విభాగయోగం.

ఈ జ్ఞానషట్కంలోని మొదటి అధ్యాయమే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం. ఇది జ్ఞానప్రధానమైన యోగం. విషయం ఎంతో క్లిష్టం - సంక్లిష్టం - కష్టం. కనుక జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలి. పాలు - నీరు కలిసి ఉన్నప్పుడు అన్నీ పాలే అంటాం. కాని అందులోని పాలను - నీటిని వేరుచేసి, ఆ నీటిని పారబోస్తే చిక్కని, చక్కని పాలు మిగులుతాయి. అలాగే క్షేత్రము - క్షేత్రజ్ఞుడు కలసి ఉన్నప్పుడు మొత్తాన్ని క్షేత్రమే అంటాం. కాని అందులోని క్షేత్రాన్ని - క్షేత్రజ్ఞున్ని విడదీసి, ఆ క్షేత్రాన్ని నిరసిస్తే - వదిలేస్తే క్షేత్రజ్ఞుడే మిగులుతాడు. ఆ క్షేత్రజ్ఞుడే మన యదార్థ స్వరూపం. 'ఆ క్షేత్రజ్ఞుడు నేనే' అనే అనుభూతిని పొందాలంటే ఈ క్షేతాన్ని మన దృష్టిపథం నుండి తొలగించాలి. మనం

పరమాత్మను దర్శించాలంటే ఈ ప్రపంచాన్ని దృష్టిపథం నుండి తొలగించుకోవాలి. సినిమా తెరను మనం చూడాలంటే ఆ తెరపై ఆడే బొమ్మల నుండి దృష్టి తొలగించుకోవాలి. ఇలా క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుని నుండి విడదీసి ఆ క్షేత్రాన్ని దృష్టిపథం నుండి తొలగించుకొని పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందటానికే ఈ విభాగించే తెలివి కావాలి.

మానవుడికి అన్నీ తెలుసు. కాని తానెవరో తెలియదు. అన్నింటిని తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తాడు. కాని తననుతాను తెలుసుకోవటానికే తీరిక లేదు. ఇదే దౌర్భాగ్యం. తననుతాను తెలుసుకోకుండా తక్కిన అన్నింటినీ తెలుసుకోవాలని తపన పడటమే గొప్ప అజ్ఞానం.

కనిపించిన ప్రతివాణ్ణి నీవు ఎవరు? ఏం చేస్తుంటావు? ఎక్కడకు వెళ్తున్నావు? ఏం చదువుతున్నావు? అని విచారిస్తూ ఉంటాం. కాని నేనెవరు? ఎక్కణ్ణుంచి వచ్చాను? ఎక్కడకు వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి? అని మాత్రం ఎన్నడూ విచారణ చేయం. విచారణ చేయాల్సింది వీటి గురించే, నేనెవరు? అనే.

నేను ఎవరు? ప్రతి రోజూ ప్రతి క్షణమూ ఈ నేనును వాడుకుంటూనే ఉంటాం. కాని దాని స్వరూపం ఏమిటో తెలియదు. తెలుసుకోవాలని కూడా అనుకోం, ప్రయత్నం చెయ్యం. నేను చూస్తున్నాను, నేను వింటున్నాను, నేను చెబుతున్నాను, నేను ఆలోచిస్తున్నాను, నేను నడుస్తున్నాను, నేను కూర్చున్నాను, నేను వ్రాస్తున్నాను – అంటూ ప్రతి విషయంలోనూ ఈ 'నేను'ను ఉపయోగిస్తూనే ఉన్నాం. ఈ నేనుతో కలసినప్పుడే ప్రతి ఇంద్రియమూ పని చేస్తుంది. 'నేను' అనే కరెంటు కంటితో కలిసినప్పుడే కన్ను

చూడగలుగుతున్నది. నేను చెవిలోజేరితేనే చెవి వినగలుగుతున్నది. ఇలా నేను చేరినప్పుడే ఏ అవయవమైనా పని చేస్తుంది, శరీరం కదులుతున్నది. అది చేరకపోతే ఎక్కడి దొంగలు అక్కడే గప్ చుప్.

బ్రహ్మ ముహూర్తంలో నిద్రలేచి, నెమ్మదిగా కూర్చొని, అన్ని ఆలోచనలు కట్టిపెట్టి, మనస్సులోనికి ఎటువంటి సంకల్పాలను రానీయక, నీ హృదయం వైపు దృష్టి సారించు. 'నేను', 'నేను' అనే స్ఫురణ నీటిలో బుడగలాగా స్ఫురిస్తుంది. అది ఎక్కడ నుండి వస్తున్నదో, దాని స్వరూపమేమో విచారణ చెయ్యి. అదే ఈ అధ్యాయంలో చెప్పబడ్డది.

మొదటి అధ్యాయంలో అర్జునుడు ఏడ్చాడు, యుద్ధం చెయ్యనన్నాడు. భీష్మద్రోణాదులు తన తాత, గురువులు కనుక వారు చంపదగినవారు కాదన్నాడు. వారిని చంపి పాపం మూట కట్టుకోలేనన్నాడు.

తానెవరో, భీష్మద్రోణాదులెవరో నిజంగా తెలియకనే అర్జునుని ఈ దుఃఖం - విషాదం. కనిపించే దేహాలను, కనిపించని మనోబుద్ధులను చూచి ఇతడు భీష్ముడు, ఇతడు ద్రోణుడు, నేను అర్జునుడు అని భావించాడు. ఈ శరీరమనోబుద్ధులకు చైతన్యాన్ని ప్రసాదించి నడిపించిన అసలు శక్తిని గుర్తించలేదు. అదే చైతన్యం. అదే ఆత్మ. అదే నిత్యం, సత్యం, శుద్ధం, బుద్ధం. దానిని గాలి కదిలించలేదు, అగ్ని మండించలేదు, నీరు తడపలేదు, కత్తి నరకలేదు. అదే నేను. నా యధార్థ స్వరూపం అదే.

అపురూపమైన మానవజన్మ మనకు లభించింది. మరల ఎటువంటి జన్మ వస్తుందో తెలియదు. మనం రోజూ భగవద్గీతను, వేదాంతాన్ని

తెలుసుకుంటున్నాం గదా! మళ్ళీ ఉత్తమ జన్మ రాకపోతుందా? అనే భరోసా పనికిరాదు. ఇక్కడ కూర్చున్నంతసేపూ రెండవ ఆలోచన లేకుండా సాత్విక భావనలో ఉంటాం. గడప దాటగానే ఈర్ష్య, ద్వేషం, రాగం మొ||న లక్షణాలు బయటకు వస్తాయి. దానివల్ల ఏం ప్రయోజనం? మనం ఈ జన్మలో ఏమేమి చేస్తున్నామో, ఏమేమి మాట్లాడుతున్నామో, ఏమేమి ఆలోచనలు చేస్తున్నామో - వీటిని బట్టే మన జన్మలు నిర్ణయమౌతుంటాయి. కనుక ఏ పూర్వపుణ్య విశేషం చేతనో లభించిన ఈ మానవ జన్మను సార్థకం చేసుకోవాలి. మళ్ళీ జన్మ లేకుండా జన్మ రాహిత్యాన్ని పొందాలి. జీవుడుగా ఉన్నంత కాలం జన్మలు తప్పవు. నిద్రపోతున్నంత సేపు కలలు తప్పవు. మేలుకుంటేనే కలలు అంతమయ్యేది. అలాగే జీవ భావంలో ఉన్నంతవరకు కర్మఫలాలు నీతోనే ఉండి జన్మలు ఇస్తూనే ఉంటాయి. జన్మలు లేకుండా పోవాలంటే జీవ భావం తొలగిపోవాలి. అలా జీవభావాన్ని - నేను జీవుణ్ణి అనే భావాన్ని తొలగించుకొని నేను ఆత్మను అనే స్థిర నిశ్చయంలో ఉండాలి. ఆత్మగా ఉండిపోవాలి. జీవుడు అజ్ఞానాన్ని వదిలితే - ఉపాధులు విడిచిపెడితే దేవుడే, ఆత్మయే. ఇదే అద్వైత జ్ఞానం. ఉన్నదొక్కటే. అజ్ఞానంలో ఆ ఉన్నది మరొకటిగా అనిపిస్తుంది. అదే భ్రమ. అదే అజ్ఞానం.

మనది సహజంగానే భేదజ్ఞానం. వేరు వేరుగా చూచే జ్ఞానం. ఎందుకంటే మనం అజ్ఞానంలో ఉంటాంగనుక. నేను వేరు, నీవు వేరు అతడు వేరు, మనందరికన్నా ఆ పరమాత్మ వేరు అని మనం భావిస్తుంటాం. ఈ వేరు - వేరు అనే భేద దృష్టివల్లనే జీవభావంలో ఇరుక్కుపోతున్నాం. సంసార



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

బంధంలో ఇరుక్కుంటున్నాం; జననమరణాల పాలౌతున్నాం. ఈ భేద దృష్టి తొలగాలంటే ఋషులు మనకు ప్రసాదించిన అతీంద్రియ జ్ఞానం కావాలి. అదే శాస్త్రజ్ఞానం - ఆత్మజ్ఞానం. శాస్త్రం సత్యాన్ని చెబుతుంది. అయితే చెబుతుందే తప్ప అనుభూతి కలగదు. దానికి మన ప్రయత్నం కావాలి. సాధన చెయ్యాలి.

శ్రీకృష్ణుడు స్వయంగా అర్జునునికి బోధించాడీశాస్త్రాన్ని. నా స్వరూపం ఇది; జగత్తు యొక్క స్వరూపం ఇది - అని పదే పదే బోధించాడు. అర్జునునికి ఎదురుగానే ఉన్నాడు శ్రీకృష్ణుడు, ఎదురుగానే ఉన్నది జగత్తు. ఆ రెంటినీ కళ్ళారా చూస్తూనే ఉన్నాడుగదా అర్జునుడు. మరి ఇంకా బోధించవలసిన అవసరమేమిటి?

మీలో ఒకరిని లేపి, మిమ్మల్నిగూర్చి మీరు వివరంగా తెలియజేయండి అన్నాను. వెంటనే లేచి "నేను స్త్రీని. ఎర్రగా ఉన్నాను. ముఖాన బొట్టు పెట్టుకున్నాను. గ్రీన్ కలర్ చీర కట్టుకున్నాను. మాచింగ్ బ్లౌజ్ వేసుకున్నాను. కుడి చేతికి నాలుగు గాజులు, ఎడమ చేతికి రిస్ట్ వాచి, రెండు వ్రేళ్ళకు రెండు ఉంగరాలు, మెడలో రెండు గొలుసులు, చెవులకు జూకాలు ఉన్నాయి. నేను ఫలానా వారి కుమార్తెను. ఫలానా వారి భార్యను'' అని తెలియజేస్తున్నారు. ఎందుకిదంతా? నీవు చెప్పినవన్నీ నాకు తెలిసినవేగదా! నేను కంటితో చూస్తున్నవేగదా! చూపు సరిగ్గా లేకపోతే చెప్పాలి.

అలాగే అర్జునునికి శ్రీకృష్ణుడు నేను ఇలాంటి వాణ్ణి, జగత్తు ఇలాంటిదని చెప్పవలసిన పనేమిటి? అర్జునుడు చూస్తూనే ఉన్నాడు గదా! చూస్తున్నాడు గాని చూపు సరిగ్గా లేదు. అది సంకుచితమైన చూపు. తన కంటికి

కనిపించినంతవరకు చూస్తున్నాడేగాని ఉన్నదంతా చూడలేకపోతున్నాడు. నీ కంటికి కనిపించినంతవరకే నిజమని అనుకుంటే ఇక శాస్త్రంతో పనేముంది? మనం చూడలేనిదాన్ని, తెలుసుకోలేని విషయాన్ని తెలియజేయడానికే శాస్త్రం ఉన్నది. మనకు తెలిసిన దాన్నే తెలిపితే అది శాస్త్రం అనిపించుకోదు. తెలిసిన దాన్ని చెప్పటానికి శాస్త్రం అవసరం లేదు, గురువూ అవసరం లేదు.

ఒక గ్రామంలో ద్వైత సిద్ధాంతం బాగా తెలిసిన గురువు ఉన్నాడు. అతడు అందులో పండితుడే.

"జీవుడు వేరు, దేవుడు వేరు. ఈ ఇద్దరూ ఒక్కరు కానే కారు, కాలేరు. భక్తుడు ఏనాటికీ భగవంతుడు కావటం జరగదు. భక్తుడు భక్తుడే, భగవంతుడు భగవంతుడే" - అంటూ ద్వైతాన్ని ప్రచారం చేస్తూ అనేక గ్రామాలు, పట్టణాలు తిరుగుతూ తన వాక్చాతుర్యంతో జనులను విపరీతంగా ఆకర్షిస్తున్నాడు. అనేక చోట్ల సన్మానాలు, బిరుదప్రదానాలు, బహుమానాలు పొందుతున్నాడు. అలా ఆయన సంచారం చేస్తూచేస్తూ ఒక గ్రామం వచ్చాడు. అక్కడ అద్వైత సంఘం ఉన్నది. ఈ పండితుడు ఆనాడు పెద్ద సభను తీర్చి అనర్గళంగా ఉపన్యసిశిస్తున్నాడు. "జీవుడు జీవుడే, దేవుడు దేవుడే, వారికెప్పుడూ భేదమే" అంటూ అద్వైత సంఘాన్ని ఛాలెంజ్ చేస్తున్నాడు.

అంతలో ఆ దారిన ఒక చాకలి బట్టలమూట భుజాన వేసుకొని వస్తున్నాడు. రెండునిముషాలు ఆ పండితుణ్ణి దర్శించుకువెళదామనుకున్నాడు. ఇంతలో అద్వైత సంఘంలోని ఒక వ్యక్తి వేదిక పైకి వచ్చి, ఆ చాకలిని పిలిచాడు. అతడు భయపడుతూ భయపడుతూ వేదికనెక్కి ఆ పండితునికి నమస్కారం

చేసి నిలుచున్నాడు. అప్పుడా అద్వైత సంఘానికి చెందిన వ్యక్తి ఆ చాకలితో “అయ్యా! నీవు పరబ్రహ్మనివి, పరమాత్మవు, నీవు దేవుడివి, భగవంతుడివి” అంటూ నమస్కారం చేశాడు. చాకలివాడు అదిరిపడ్డాడు. భయంతో వణికిపోతూ, "బాబయ్యా! ఎంత మాట. పాపాత్ముడైన మానవుణ్ణి నేనెక్కడ? ఆ భగవంతుడు ఎక్కడ? అపచారం. మహాపచారం అలా అనవద్దు" అని చెంపలు వేసుకుంటూ కాళ్ళమీద పడిపోయి లబోదిబోమంటున్నాడు.

అప్పుడా వ్యక్తి పండితుణ్ణి చూస్తూ, "అయ్యా! పండితుల వారూ తాము చెప్పే మాట మా చాకలికి కూడా తెలుసు. దేవుడు వేరు - జీవుడు వేరు అని చెప్పటానికి శాస్త్రాలతో పనేముంది? పాండిత్యంతో అవసరమేముంది? మా చాకలి చాలు గదా! దాని కోసం తమరు ఇంత దూరం కష్టపడి రావటం ఎందుకు? కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా మీరు శాస్త్రాలన్నీ శోధించి తెలుసుకొన్నది మా చాకలికి తెలిసిన విషయాన్నే గదా!" అని మెత్తగా చీవాట్లు వేశాడు. దానితో పండితులవారు ముఖం చారెడు చేసుకొని వచ్చిన త్రోవనే వెళ్ళిపోయాడు. కనుక మనకు తెలియని విషయాన్నే శాస్త్రం చెప్పాలి.

సమస్త దుఃఖాల నుండి మనలను విముక్తులను చేసి మోక్షప్రాప్తిని కలిగించే ఈ అభేద జ్ఞానాన్ని - అద్వైత జ్ఞానాన్ని- అఖండ జ్ఞానాన్ని ఈ షట్కంలో ఈ అధ్యాయంతో ప్రారంభించి బోధించబోతున్నాడు.

ఈ షట్కంలో మొదటి అధ్యాయం క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం. క్షేత్రం అంటే పొలం అని, శరీరం అని, స్థలం అని అర్థాలున్నాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

క్షేత్రజ్ఞుడు అంటే పొలం యొక్క యజమాని, శరీరాన్ని నడిపించేవాడు, స్థలం యొక్క హక్కుదారు అని అర్థం. ఇక్కడ శరీరమే క్షేత్రం.

కనుక ఈ శరీరం క్షేత్రం. ఈ శరీరానికి చైతన్యాన్ని ప్రసాదించి, దీన్ని నడిపించే ఆత్మయే క్షేత్రజ్ఞుడు. జీవుడు నిజంగా క్షేత్రజ్ఞుడే గాని క్షేత్రం కాదు. అంటే జీవుడు ఆత్మయే గాని శరీరం కాదు. శరీరాన్ని తగిలించుకొన్న ఆత్మయే జీవుడు. శరీరం అనిత్యం. జీవుడు (ఆత్మ) నిత్యం.

తనను తాను మరచిన ఆత్మ ఈ శరీరంతో తాదాత్మ్యం చెంది జీవుడై అనేక కష్టాలను, బాధలను, దుఃఖాలను వాటితో పాటు సుఖాలను, భోగాలను అనుభవిస్తున్నాడు. అంటే క్షేత్రజ్ఞుడనైన నేను క్షేత్రంతో తాదాత్మ్యం చెంది; క్షేత్రాన్ని వాడుకుంటూ జీవుడినై దుఃఖాలు పొందుతున్నాను. ఈ దుఃఖాలను తొలగించుకోవాలి. ఎలా?

క్షేత్రం అంటే ఏమిటో క్షేత్రజ్ఞుడంటే ఏమిటో తెలుసుకొని, రెండింటి మధ్య ఉన్న భేదాలు ఏమిటో తెలుసుకొని, రెండింటిని విడగొట్టి, నేను క్షేత్రజ్ఞుణ్ణేగాని క్షేత్రాన్ని కాదు అని గ్రహించాలి. క్షేత్రం యొక్క ధర్మాలు నా ధర్మాలు కాదు అని గ్రహించాలి. నేను కేవలంగా ఉండే ఆత్మను అని గ్రహించి అలా ఉండిపోవాలి. అప్పుడే దుఃఖరాహిత్యం - ఆనందప్రాప్తి.

క్రిందటి అధ్యాయం భక్తి యోగంలో సగుణ - నిర్గుణ ఉపాసనల గురించి చెప్పారు. రెండూ భగవంతుని చేరే మార్గాలే అయినా నిర్గుణోపాసన దేహాభిమానం ఉన్నవారికి కష్టం గనుక సగుణోపాసనయే శ్రేష్టమని తెలిపారు. అలాగే భక్తుల లక్షణాలు వివరించారు. అయితే అక్కడ నిర్గుణ ఉపాసన

గురించి, ఆత్మతత్త్వం గురించి చెప్పలేదు. అందువల్ల దానిని ఇక్కడ ప్రారంభిస్తున్నారు.

నిర్గుణ పరమాత్మ అంటే ఏమిటో, అట్టి జ్ఞానాన్ని పొందాలంటే సాధకునిలో ఎలాంటి లక్షణాలు ఉండాలో, ఆ పరమాత్మను ఎలా ధ్యానించాలో, ఎలా పొందాలో మొదలైన విషయాలను ఈ అధ్యాయంలో చెప్పబోతున్నారు.

పరమాత్మ శరీరమనోబుద్ధులలో కూర్చొని వాటితో తాదాత్మ్యం చెంది, వాటితో వ్యవహరిస్తున్నప్పుడు జీవుడవుతున్నాడు. వాటి నుండి తొలగి తాను తానుగా ఉంటే పరమాత్మే అవుతున్నాడు.

ఒక వ్యక్తి గుర్రమెక్కి ప్రయాణిస్తే 'రౌతు' అవుతున్నాడు. రథాన్ని నడిపితే 'సారథి' అవుతాడు. కారు నడిపితే 'డ్రైవరు', విమానం నడిపితే 'పైలెట్' అవుతున్నాడు. అన్నింటిని వదిలి రోడ్డుపై నడుస్తుంటే 'వ్యక్తి' గానే మిగిలిపోతాడు. అలాగే ఆత్మ దేహమనోబుద్ధులలో కూర్చొని వాటితో తాదాత్మ్యం చెందినప్పుడు జీవుడవుతున్నాడు. వాటి నుండి విడిపోయి కేవలంగా ఉంటే ఆత్మయే అవుతాడు. కనుక ముందు ఆత్మను - అనాత్మను, క్షేత్రజ్ఞుని - క్షేత్రాన్ని విడగొట్టాలి. ఆ తర్వాత క్షేత్రాన్ని వదిలి తాను తానుగా క్షేత్రజ్ఞునిగా - ఆత్మగా ఉండిపోవాలి. ఇలా రెండింటిని విభాగించి చూచే నేర్పును కలిగించేదే ఈ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం.

నశించిపోయేది క్షేత్రం. ఆ క్షేత్రాన్ని తెలుసుకొనేవాడు క్షేత్రజ్ఞుడు. తెలుసుకోవలసినది ఏమేమి ఉన్నదో తెలుసుకొంటే గాని తెలుసుకొనేవాని

అసలు స్వరూపం - యదార్ధ స్వరూపం తెలియదు. అందుకే తెలుసుకోబడవలసిన క్షేత్రాన్ని తరచి తరచి తెలుసుకొని క్షేత్రజ్ఞుని నుండి విడదీయాలి. అలా విడదీయాలంటే సాధకుని బుద్ధి సూక్ష్మంగా ఉండాలి. అలా బుద్ధి సూక్ష్మంగా ఉండాలంటే మనసు ప్రశాంతంగా ఉండాలి. మనస్సు ఏవేవో సమస్యలతో, తీరని కోరికలతో, భయాలతో, దుఃఖాలతో సతమతమై పోతూ ఉంటుంది. అయితే పరమలక్ష్యమైన మోక్షాన్ని పొందాలనే తీవ్ర తపనగల మోక్షార్ధి - ముముక్షువు ఈ ప్రాపంచిక విషయాలన్నీ అనిత్యమని, మిథ్యయని, అసలు యదార్ధంగా లేనివేనని దృఢ నిశ్చయం కలిగిఉండి, వాటికి ఏమాత్రం చలించకుండా ప్రశాంతతనలవరుచుకోవాలి. అప్పుడే ఈ క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీసే తెలివి -నైపుణ్యం కలుగుతుంది. అట్టి నైపుణ్యాన్ని సంపాదించి క్షేత్రక్షేత్రజ్ఞులను విభాగం చేద్దాం. ఇక అధ్యాయంలోనికి ప్రవేశిద్దాం.

- అర్జునుడు ప్రశ్నిస్తున్నాడు.

**అర్జున ఉవాచః-**

**శ్లో|| ప్రకృతిం పురుషం చైవ**
**క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ |**
**ఏతద్వేదితు మిచ్ఛామి**
**జ్ఞానం జ్ఞేయంచ కేశవ ! || (1)**

**తా||** కేశవా! ప్రకృతి - పురుషుడు; క్షేత్రము - క్షేత్రజ్ఞుడు; మరియు జ్ఞానము - జ్ఞేయము - వీటిని గురించి తెలుసుకోవాలనుకుంటున్నాను - అంటున్నాడు అర్జునుడు.

**వ్యాఖ్య :-** ఈ శ్లోకం కొన్ని ప్రతులలో ఉన్నది; కొన్నింటిలో లేదు. అందువల్ల ఈ శ్లోకం మూలంలో ఉన్నదా? లేదా? అనే విషయంలో పరిశోధకుల మధ్య వాదోపవాదాలున్నాయి. ఈ శ్లోకాన్ని కలిపితే భగవద్గీతలో మొత్తం శ్లోకాలు 701. దీన్ని వదిలేస్తే మొత్తం శ్లోకాలు 700. చాలామంది వ్యాఖ్యాతలు ఈ శ్లోకాన్ని వదిలేసి వ్యాఖ్యానాలు వ్రాశారు. కొందరు ఈ శ్లోకాన్ని స్వీకరించి వ్యాఖ్యానం వ్రాశారు. కొందరు దీనికి అంకె వేయకుండా వదిలేశారు. కొందరు అంకె వేశారు. దీనంతటికి కారణం ఏమిటి?

ఇంత గొప్ప జ్ఞానబోధను శిష్యుడు అడగకుండానే చెప్పటం మంచిది కాదు - అనే ఉద్దేశం కొందరిది. కనుక మూలంలో ఉన్నదంటారు కొందరు. మధ్యలో ఎవరో ఈ శ్లోకాన్ని ప్రక్షిప్తం చేశారు అని కొందరు భావిస్తున్నారు. కనుక ఇది మూలంలో లేదు - అని వారి ఉద్దేశం. ఇది కొంతవరకు నిజం కావచ్చు. ఎందుకంటే శిష్యుడు అడిగితేనే చెప్పాలి - అనే ఉద్దేశంతో చేసే బోధ వేరు; అనన్య భక్తితో, గురువుపై అపారమైన విశ్వాసంతో తనను నమ్ముకొని వచ్చి, సేవించే శిష్యుని ఉద్ధరించటానికి "దూడను చూడగానే ఆవు చేపినట్లు" ఆత్మజ్ఞానమనే అమృతాన్ని తనంతటతానే వర్షించే సద్గురువు బోధ వేరు. కనుక ఈ శ్లోకం ప్రక్షిప్తం అంటారు. అయినప్పటికీ ఈ శ్లోకాన్ని స్వీకరిస్తే ఏ మాత్రం దోషం లేదు. ఎందుకంటే అర్జునుని ప్రశ్న ద్వారా ఈ అధ్యాయంలో

రాబోయే విషయం ఏమిటో విషయసూచిక (INDEX) లాగా తెలిసిపోతున్నది గనుక.

ఈ శ్లోకంలో అర్జునుడు ప్రకృతి - పురుషులంటే ఎవరు? క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అంటే ఏమిటి? జ్ఞానము - జ్ఞేయము అంటే ఏమిటి? ఈ విషయాలను తెలుసుకోగోరుతున్నాను అని భగవానుని ప్రార్థిస్తున్నాడు. అంటే ఈ 3 విషయాలే ఈ అధ్యాయంలో రాబోతున్నాయి అని తెలుస్తున్నది.

అయితే భగవానుడు తన సమాధానంలో ముందుగా క్షేత్రక్షేత్రజ్ఞుల గురించి, ఆ తరువాత జ్ఞానము - జ్ఞేయము గురించి చెప్పి చివరిలో ప్రకృతి - పురుషుల గురించి వివరించారు. మూడు జంటలుగా ఉన్న ఈ పదాలు షడ్దర్శనాలలో వాడబడ్డాయి. శాస్త్రాలలో వాడిన సాంకేతిక పదాల అర్థాలు తెలియకపోతే శాస్త్రాలలోని విషయాలను తెలుసుకోవటం చాలా కష్టం. అర్జునుడు కేవలం పదాల యొక్క అర్థాలనే అడిగినప్పటికీ భగవానుడు మాత్రం వాటి అర్థాలతో బాటు సమన్వయమూ, వేదాంతపు లోతులు కూడా బోధ చేస్తున్నాడు; అఖండమైన ఆత్మజ్ఞానాన్ని అందిస్తున్నాడు.

ఇందులో క్షేత్రం అన్నా, ప్రకృతి అన్నా ఒక్కటే. అలాగే క్షేత్రజ్ఞుడన్నా, పురుషుడన్నా ఒక్కటే. ఇక జ్ఞానం అంటే ఏమిటో, జ్ఞేయం అంటే ఏమిటో చెప్పటం మాత్రమే గాక, ఎట్టి లక్షణాలు గలవాడు జ్ఞేయాన్ని (లక్ష్యాన్ని) అందుకోగలడో తెలియజేయటం జరిగింది.

క్షేత్రక్షేత్రజ్ఞుల గురించి 7శ్లోకాలలోను, జ్ఞానం జ్ఞేయం గురించి 12 శ్లోకాలలోను, 20 నుండి 23 వరకు 4 శ్లోకాల్లో ప్రకృతి పురుషుల గురించి

బోధించి, 24 నుండి చివరి 11 శ్లోకాల్లో ధ్యాన - విచారణల గురించి వివరించటం జరిగింది. ముందుగా క్షేత్ర - క్షేత్రజ్ఞుల గురించి - క్షేత్రం అంటే ఏమిటో, క్షేత్రజ్ఞుడంటే ఎవరో తెలియజేయబోతున్నాడు భగవానుడు.

**శ్రీ భగవానువాచ:-**

**శ్లో|| ఇదం శరీరం కౌంతేయ!**
**క్షేత్ర మిత్యభి ధీయతే|**
**ఏతద్యో వేత్తితం ప్రాహుః**
**క్షేత్రజ్ఞ ఇతి తద్విదః || (2)**

**తా||** భగవానుడంటున్నాడు: కౌంతేయా! ఈ శరీరమే క్షేత్రము అని చెప్పబడుతున్నది. దీనిని ఎవరు తెలుసుకుంటారో వానిని క్షేత్రజ్ఞుడు అని తెలిసినవారు చెబుతున్నారు.

**వ్యాఖ్య :-** క్షేత్రక్షేత్రజ్ఞులను తెలియజేస్తూ భగవానుడు "ఈ శరీరమే క్షేత్రం. దీనిని తెలుసుకొనే వాడే క్షేత్రజ్ఞుడు" అని వివేకం గల పెద్దలు చెబుతున్నారు - అని అంటున్నాడు. ఇక్కడ భగవానుడు అర్జునుని, 'కౌంతేయా'! అని సంబోధిస్తున్నాడు. జ్ఞానబోధను ప్రారంభించబోతూ భగవానుడు అర్జునుని 'కౌంతేయా'! అనటంలో ఏదో ప్రత్యేకమైన అర్థం ఉండి ఉండాలి. కేవలం కుంతీ కుమారుడు గనుక కౌంతేయా! అని పిలిచాడనుకుంటే అందులో పెద్దగా విశేషం ఏమీ లేదు. మరి ఏమై ఉంటుంది? కుంతం అంటే పదునైన ఆయుధం. కుంతాన్ని విసరటంలో ధర్మరాజు మంచి నైపుణ్యం గలవాడు. కుంతంలాగే

పదునైన (సూక్ష్మమైన) బుద్ధి గల అర్జునా! నీవు ఈ చెప్పబోయే జ్ఞానాన్ని బాగా అర్థం చేసుకోగలవులే! అనే భావంతోనే కౌంతేయా! అని ఉండాలి. చెప్పే విషయాన్ని సూక్ష్మమైన బుద్ధితో శ్రద్ధగా ఆలకించే వాడు కౌంతేయుడు. తన్మయత్వంతో, సూక్ష్మమైన బుద్ధితో శ్రద్ధగా విషయాన్ని వినేవాడెవడైనా కౌంతేయుడే. కౌంతేయా! అంటే ఇదే వేదంతార్థం.

**ఇదం శరీరం క్షేత్రం ఇతి అభిధీయతే:-** 'ఈ శరీరం క్షేత్రము అని చెప్పబడుతున్నది' అంటున్నాడు భగవానుడు. నిజంగా దీనికి అనేక పేర్లున్నాయి. శరీరం, దేహం, దేవాలయం, గృహం, బండి, రథం, క్షేత్రం అని అనేక పేర్లతో అనేకమంది పిలుస్తుంటారు, భావిస్తుంటారు.

(i) **శరీరం:** శరీరం అని ఎందుకంటున్నారు? **'శీర్యతే ఇతి శరీరః'** అని వ్యుత్పత్తి అర్థం. శీర్యతే అంటే శీర్ణమైపోయేది, జీర్ణమైపోయేది, శిథిలమైపోయేది అని అర్థం. జీర్ణించి పోవటం - శిథిలమైపోవటం దీని లక్షణం. ముసలితనం కావాలని మనం మందులు మాకులు మ్రింగనక్కరలేదు. అమృత భాండంలో పెట్టినా సరే ఈ శరీరం శిథిలమైపోయేదే, నశించిపోయేదే అందుకే శరీరం అన్నారు.

(ii) **దేహం:** దేహమని ఎందుకన్నారు? **'దహ్యతే ఇతి దేహః'** అని వ్యుత్పత్తి అర్థం. దహింపబడేది గనుక దీనిని దేహం అన్నారు. చచ్చిన తరువాత కట్టెలలో కాలుస్తారు గనుక దహింపబడేది అన్నారా? మరి కొందరి దేహాలను కట్టెలతో కాల్చరు గదా! అవి దహింపబడవు గదా! మరి వాటిని దేహాలు అని అనరా? చనిపోయిన తర్వాత దహింపబడటం కాదు. జీవించి ఉన్నప్పుడే

తాపత్రయాలనే అగ్ని చేత నిరంతరం దహింపబడుతూ ఉండేదే ఈ దేహం. ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపాలే తాపత్రయం.

(iii) **దేవాలయం:** దేహాన్ని దేవాలయం అని వేదాలు, ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఎందుకు? **"దేహో దేవాలయ ప్రోక్తః జీవోదేవస్సనాతనః"** - అనేది ఉపనిషద్ వాక్యం. ఈ దేహం ఎలాంటి దేవాలయం? ఇది ఒక చోట స్థిరంగా ఉండే దేవాలయం కాదు. ఇది చరదేవాలయం. కదులుతూ ఉండేది. బయట కనిపించే దేవాలయాన్ని మానవులే కట్టిస్తారు. అందులో దేవుణ్ణి కూడా మానవులే ప్రతిష్టిస్తారు. కాని ఈ శరీరమనే దేవాలయాన్ని భగవంతుడే నిర్మించి, హృదయమనే గర్భగుడిలో తనకు తానే ప్రతిష్టితుడై కూర్చున్నాడు. బయటి గుడికి - ఈ గుడికి అదే తేడా. ఇక్కడ భగవంతుడు 'స్వయంభూః' అన్నమాట. మరి ఏ దేవాలయం ముఖ్యమైనది? ఏ దేవుని పూజ గొప్పది? ఆలోచించుకోవాలి.

(iv) **గృహం:** మహాత్మాగాంధీ ఈ దేహాన్ని గృహం అన్నారు. అంటే ఇల్లు అని. ఈ ఇల్లు జీవుడు నివశించే ఇల్లు. అయితే ఇది జీవుడికి స్వంత ఇల్లు కాదు. అద్దె ఇల్లు. ఈ రోజు (ఈజన్మలో) ఈ ఇంటిలో ఉంటాడు. రేపటి రోజు (మరు జన్మలో) మరొక ఇంటిలో ఉంటాడు. ఈ ఇంటి స్వంతదారుడెవరు? ఇంకెవరు? భగవంతుడే. ఆయనకు అద్దె చెల్లించి ఈ ఇంట్లో ఉండాలి జీవుడు. మామూలుగా ఇక్కడి ఇళ్ళకు నెలకొకసారి అద్దె చెల్లించాలి. కాని ఈ ఇంటికి మాత్రం అలా కుదరదు. ప్రతిరోజూ పూట పూట చెల్లించాలి. రోజుకు 3 సార్లు, 4 సార్లు, కొందరు 5 సార్లు కూడా చెల్లించాలి. మనుష్యుల మీద ఆయనకు

నమ్మకం లేదేమో ఇలాంటి నియమం పెట్టాడు. అంతేకాదు ఈ ఇంటిని ఖాళీ చేయించటంలో కూడా నిక్కచ్చిగా ఒక్క నిమిషం అటూ ఇటూ గాకుండా ఖాళీ చేయిస్తాడు. అయితే ముందు జాగ్రత్తగా 3 నోటీసులు ఇస్తాడు. ముందుగా జుట్టు తెల్లబడుతుంది. ఇది ఫస్ట్ నోటీసు. మనం జుట్టుకు రంగు వేసుకొని ఆ నోటీసును ఖాతరు చేయం. సరేనని పళ్ళూడి పోతాయి. ఇది సెకండ్ నోటిసు. మనం డెంటిస్టు దగ్గరకు వెళ్ళి పళ్ళు కట్టించుకుంటాం. ఈ నోటీసును కూడా ఖాతరు చెయ్యం. చివరిగా చూపు కనిపించక, శరీరం పటుత్వం తగ్గి, చేతికి కర్ర వస్తుంది. ఇదే థర్డ్ నోటిసు. అప్పటికీ మనం గుర్తించం, కంటి డాక్టరు దగ్గరకు వెళ్తాం. నోటీసును తిరస్కరిస్తాం. అంతే. ఆయనకు కోపం వస్తుంది. దానితో ఆయన ఈ ఇల్లు ఖాళీ చేయించటానికి పోలీసులను పంపిస్తాడు. ఈ పోలీసులు ఎవరి మాటా వినరు? దున్నపోతునెక్కి పాశం చేతబట్టి, భయంకర రూపంతో ఉండే ఆ యమ ఇన్ స్పెక్టరును చూడటంతోనే అన్ని సామానులు, సంపదలు, ఆత్మీయులు - అందరినీ వదిలి ఒకటే పరుగు. అలాంటిది ఈ అద్దె ఇల్లు. ఒక్కొక్క జన్మకు ఒక్కొక్క ఇల్లు (దేహం), స్వంత ఇంటికి (పరమాత్మ స్థానానికి) వెళ్ళేదాకా ఈ అద్దె ఇళ్ళ బాధ తప్పదు.

(v) **బండి:** బండి అని ఎవరన్నారు? ఎందుకన్నారు? భగవాన్ రమణ మహర్షి ఈ శరీరాన్ని బండి అన్నారు. ఎందుకంటే ఈ శరీరం అనేది జీవుణ్ణి జన్మస్థానం నుండి మరణ స్థానం వరకు మోసుకపోతుంది గనుక ఇది జీవుడికి బండి లాంటిదే అని. ఒకసారి ఒక శిష్యుడు రమణ మహర్షిని తన ఇంటికి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రమ్మని బయట ఒక బండిని తెచ్చి పెట్టాడు. స్వామీ! తమరు నా గృహానికి వచ్చి పావనం చేయండి. మీ కోసం ఒక బండిని తెచ్చాను - అన్నాడట. దానికాయన "ఈ బండికి మరొక బండియా?" అన్నాడట. అంటే దేహమే జీవుని మోసుకొని పోయే బండి కదా! అని.

(vi) **రథం:** భగవద్గీతలోను, కఠోపనిషత్తులోను ఈ దేహాన్ని రథంతో పోల్చారు. శరీరమే రథం. జీవుడే అందులో ప్రయాణించే రథికుడు. ఇంద్రియాలే గుర్రాలు. మనస్సే పగ్గం. బుద్ధియే సారథి - అని వర్ణించటం జరిగింది. ఈ రథం సక్రమంగా - క్షేమంగా ప్రయాణించాలంటే పగ్గాలు సారథికి అప్పగించాలి. అంటే మనస్సును బుద్ధికి అప్పగించాలి. మనస్సు ఇంద్రియాల వెంట పడితే రథం బోల్తా పడిపోతుంది. అలాగాక మనస్సు బుద్ధిని అనుసరిస్తే ఈ ప్రయాణం సాఫీగా భగవంతుని వద్దకు చేరుతుంది - అని భావం.

ఇలా శరీరం, దేహం, దేవాలయం, గృహం, బండి, రథం అని ఎన్నో పేర్లున్నప్పటికి భగవానుడు మాత్రం ఈ శరీరాన్ని క్షేత్రం అన్నాడు.

కాశీ, రామేశ్వరం, తిరుపతి, శ్రీశైలం, బదరీ — ఇవన్నీ పుణ్యక్షేత్రాలు. భగవంతుని విభూతి బాగా ఉన్నచోట, పవిత్రమైన నదులు ప్రవహించే చోట క్షేత్రాలు వెలుస్తాయి. సాక్షాత్తు భగవంతుడే స్వయంగా హృదయ స్థానంలో కూర్చున్నాడు గనుక ఈ దేహం ఒక క్షేత్రం. పుణ్యక్షేత్రం. ఆ క్షేత్రాలలో పుణ్యం మాత్రం సంపాదించుకోవచ్చు. అదీ సరిగ్గా ప్రవర్తిస్తే. కాని ఈ శరీరమనే క్షేత్రంలో పుణ్యాన్నే కాదు, జ్ఞానాన్ని, మోక్షాన్నీ కూడా సంపాదించుకోవచ్చు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

క్షేత్రం అంటే అసలైన అర్థం పొలం అని. పొలంలాగా ఈ శరీరమనే క్షేత్రం కూడా జడమైనదే. ఆ పొలంలో పంటలు పండించుకోవచ్చు. ఈ పొలంలో సాధనను పండించుకోవచ్చు.

ఆ పొలంలో ఏ విత్తనాలు వేస్తే ఆ పంట వస్తుంది. ఈ పొలంలో కూడా అంతే. ఏ కర్మలు చేస్తే ఆ ఫలితాలే వస్తాయి. పుణ్యకర్మలనే విత్తనాలను చల్లి సుఖాన్ని పండించుకోవచ్చు. పాపకర్మలనే విత్తనాలను చల్లి దుఃఖాలను పండించుకోవచ్చు. జ్ఞానమనే విత్తనాలను చల్లి మోక్షమనే పంటను పండించుకోవచ్చు.

అయితే ఆ పొలంలో ఋతువులనుబట్టి, వాతావరణాన్నిబట్టి విత్తనాలు చల్లి వ్యవసాయం చెయ్యాలి. కాని ఈ పొలంలో ఆ కాలం ఈ కాలం అని లేదు. ఋతువులు, వాతావరణం చూడనక్కరలేదు. రాత్రి పగలు అనే తేడా లేదు. వారం వర్జ్యం అనే తేడాలు లేవు. ఎప్పుడైనా సరే జ్ఞానం అనే విత్తనాలు చల్లుతూ మోక్షమనే పంటను పండించుకోవచ్చు. కనుక ఆ పొలం కన్నా ఈ పొలం వ్యవసాయానికి యోగ్యమైనది. పంట పండించుకోవటానికి ఎంతో అనుకూలమైనది. పైగా ఈ పొలాన్ని free గా భగవంతుడు సప్లయ్ చేశాడు. ఆ పొలంలాగా డబ్బు పెట్టి కొనుక్కొనే పనిలేదు. ఎంత అదృష్టవంతులం! ఇంత సారవంతమైన పొలాన్ని ఫ్రీగా ఇచ్చి సాగుచేసుకోమంటే పట్టించుకోనివారు మూర్ఖులే.

ఇంతవరకు క్షేత్రాన్ని గురించి తెలుసుకున్నాం. ఇక క్షేత్రజ్ఞుడంటే ఎవరో తెలియజేయబోతున్నారు. క్షేత్రాన్ని తెలుసుకొనేవాడే క్షేత్రజ్ఞుడు.

"ఇప్పుడు నేను చెప్పిన విషయం తెలిసిందా?" అని ప్రశ్నించాను. "ఆ! తెలిసింది" అన్నారు. ఎవరికి తెలిసింది? తెలిసినట్లుగా అనుభూతి పొందినదెవరు? 'ఆ తెలిసింది' అని సమాధానం ఇవ్వాలనుకున్నది ఎవరు? నీ శరీరమా? కాదు. అది తెలియబడేదే గాని తెలుసుకొనేది కాదు. తెలియబడే దానికన్నా తెలుసుకొనేది వేరుగా ఉంటుంది. చూడబడే దానికి చూచేవాడు వేరుగా ఉంటాడు. కనుక ఇక్కడ శరీరం కన్నా వేరుగా ఏదో ఉన్నది. అదే క్షేత్రజ్ఞుడు. క్షేత్రం జడం కాబట్టి అది తనను తానూ తెలుసుకోలేదు, వేరే దేనినీ తెలుసుకోలేదు. కనుక దానిని (శరీరాన్ని- క్షేత్రాన్ని) తెలుసుకొనేవాడు వేరే ఉన్నాడు. అతడే క్షేత్రజ్ఞుడు. అతడే తెలుసుకొనేవాడు, చూచేవాడు, ద్రష్ట. ద్రష్ట వేరు దృశ్యం వేరు. ద్రష్ట ఎప్పుడూ దృశ్యం కాదు. కాని మనం అజ్ఞానం చేత క్షేత్ర (శరీర) ధర్మాలను క్షేత్రజ్ఞునిలోను, క్షేత్రజ్ఞుని ధర్మాలను క్షేత్రంలోను కలగాపులగం చేసి - అన్యోన్య అధ్యాస చేసి జనన మరణ యాతనలకు గురైపోతున్నాం. అంటే శరీరం చేసే పనులను నేనే చేస్తున్నాను అని ఆత్మపై ఆరోపిస్తున్నాం. ఆత్మ ధర్మాలైన సత్, చిత్, ఆనందములను ఈ శరీరంపై ఆరోపిస్తున్నాం. నేను తెలుసుకున్నాను; నేను ఆనందంగా ఉన్నాను అంటూ ఈ శరీరమే నేను అనే భావంతో ఉంటాం. ఈ రెండింటిని - క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుని చక్కగా విడగొట్టి చూచే నేర్పుకావాలి. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల ధర్మాలను విభాగించి చూచి, ఆత్మ- అనాత్మ వివేకం కలిగితే అదే సంసార బంధవిముక్తికి తారక మంత్రం.

నీటిని వదిలి పాలను గ్రహించే హంసలాగా క్షేత్ర క్షేత్రజ్ఞులను విడగొట్టి, క్షేత్రాన్ని వదిలి క్షేత్రజ్ఞుడైన ఆత్మయే తన స్వరూపమని గ్రహించాలి. అలా గ్రహించగలవాడే పరమహంస - పరమజ్ఞాని. అలా తెలుసుకోలేనివాడు సామాన్యుడే.

అది కాశీ నగరం. అద్వైత వేదాంత భాస్కరుడు శంకరాచార్యులవారు గంగా నదిలో స్నానంచేసి విశ్వనాథుని దర్శించుకొనుటకు వస్తున్నాడు. అదే సమయంలో ఒక ఛండాలుడు కొన్ని కుక్కలను వెంటబెట్టుకొని ఆ దారిలోనే ఎదురు వస్తున్నాడు. కేరళలోని బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన శంకరుల వారికి అస్పృశ్యతా వాసన పోలేదు. అందుకే అతణ్ణి చూచి 'గచ్ఛ దూరం - గచ్ఛ దూరం' అంటే దూరంగా తొలగిపో అన్నాడు. ఇది అలవాటు యొక్క ప్రభావం. అలవాట్లు అంత త్వరగా వదలవు.

ఒక బ్రాహ్మణుడు వీపు జిలగా ఉన్నప్పుడు జంధ్యంతో బరికేవాడు. వాడికది అలవాటు. క్రొత్తగా సన్యాసం తీసుకున్నాడు. జిల పుట్టినప్పుడల్లా జంధ్యం కోసం వెతుక్కుంటాడు. సన్యాసం పుచ్చుకుంటే మాత్రం అలవాటు ఎక్కడకు పోతుంది? అలవాటును కూడా సన్యసించాలిగదా!

అలాగే అంతటి మహాజ్ఞాని అయినా శంకరుల వారిలో కూడా పాత అలవాటు ప్రభావం చూపింది. ఆ వచ్చిన వాడు నిజంగా ఛండాలుడు కాదు. శంకరునిలోని ఆ ఛండాల దోషాన్ని పారద్రోలటం కోసం వచ్చిన పరమశివుడు. అలాగే దారికి అడ్డంగా నిలబడ్డాడు. నెమ్మదిగా ఆచార్యునితో అంటున్నాడు, "స్వామీ! దూరంగా పొమ్మంటున్నారే! ఎవరినో కాస్త వివరంగా చెప్పండి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇందులో 2 అంశాలున్నాయి. 1. జడమైన శరీరం. 2. చైతన్యరూప ఆత్మ. శరీరాన్ని పొమ్మంటూరా? అది జడం కదా! స్వయంగా పోలేదు. చెప్పిన మాటవిని అర్థం చేసుకొనే తెలివి దానికి లేదు. కనుక శరీరాన్ని పొమ్మనటంలో అర్థం లేదు. అంతేకాదు తమరి శరీరం, నా శరీరం రెండూ అన్నవికారాలే గదా! అన్నంతో పుట్టి, అన్నంతో పెరిగి, అన్న రూపమైన భూమిలో కలిసిపోయేవే. కనుక మీవంటి జ్ఞాని మీ శరీరం నుండి నా శరీరాన్ని దూరంగా పొమ్మనటంలో అర్థం లేదు. లేదూ! ఆత్మను పొమ్మంటున్నారా? అదెక్కడికి పోతుంది? ఆత్మ లేని చోటంటూ లేదు గదా! అది కదిలేది కాదుగదా! కనుక మహాత్మా! మీ మాట నాకు అర్థం కావటం లేదు, దయచేసి కాస్త వివరంగా చెప్పండి'' అన్నాడు.

ఈ దెబ్బతో శంకరాచార్యులవారి లోకవాసన కాస్తా ఎగిరిపోయింది. మూడవ నేత్రం తెరుచుకుంది. జ్ఞాననేత్రం తెరుచుకుంది. ఆ ఛండాలునికి చేతులు జోడించాడు. అతడి పాదాలపై పడ్డాడు. శరీరం వేరని, తాను వేరని ఆత్మానాత్మ వివేకంగలిగి తాను తానుగా ఉన్న మహాత్ముడు ఛండాలుడైతేనేం బ్రాహ్మణుడైతేనేం? అతడే నా సద్గురువు అని భావించాడు. కనుక ఆత్మానాత్మ వివేకం వేదాంతానికి సింహద్వారం వంటిది. దానినే పేరు మార్చి క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం అన్నారు భగవద్గీతలో.

ఇంతవరకు భగవంతుడు గొప్ప సిద్ధాంతాన్ని బోధించాడు. లోకంలో రెండే వస్తువులున్నాయి. అవే క్షేత్రం - క్షేత్రజ్ఞుడు, శరీరం - ఆత్మ, జడం - చైతన్యం,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అనిత్యం - నిత్యం, అనాత్మ - ఆత్మ. అయితే ఈ రెండింటిని మనం ఒక్కటిగా చూస్తున్నాం.

ఇలా ఎవరు చెబుతున్నారట? భగవానుడు డైరెక్టుగా చెప్పటం లేదు. తద్విదులు చెబుతున్నారు అని అంటున్నాడు. తద్విదులు అంటే ఈ విద్యలో ఆరితేరినవారు. ఏ విద్యలో? క్షేత్ర క్షేత్రజ్ఞులను విడదీసి చూచే విద్యలో. అంతేగాదు తద్ విదులు అంటే 'తత్+విదులు' అంటే ఆ తత్ (పరమాత్మను) తెలిసినవారు అని కూడా అర్థం. ఇలా చెప్పటంలో భగవానుడు ఆత్మానాత్మ వివేకం తెలిసినవారిని ఎంతగానో గౌరవిస్తున్నాడు. నేనే చెబుతున్నాను అనిగాక ఇలాగని తెలిసినవారు చెబుతున్నారు అనటంలో అహంకార రాహిత్యం ఉన్నది.

క్షేత్రం నుండి క్షేత్రజ్ఞుని విడగొట్టే ముందు క్షేత్రజ్ఞుని స్వరూప స్వభావాలేమిటో తెలుసుకోవాలి.

**శ్లో|| క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి**
**సర్వ క్షేత్రేషు భారత ! |**
**క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్ జ్ఞానం**
**యత్తత్ జ్ఞానం మతం మమ|| (3)**

**తా||** భారతా! అన్నిక్షేత్రాలలోని క్షేత్రజ్ఞుణ్ణి నేనే అని తెలుసుకో. క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలుసుకొనే జ్ఞానమే నిజమైన జ్ఞానమని నా అభిప్రాయం.

**వ్యాఖ్య :-** ఈ శ్లోకంలో అర్జునుని భారతా! అని సంభోదిస్తున్నాడు భగవానుడు. భారతా! అంటే భరత వంశంలో పుట్టినవాడా! అని అర్థం. ఐతే వేదాన్తార్థం

మరొకటి ఉన్నది. 'భా' అంటే వెలుగు, జ్ఞానం, బ్రహ్మవిద్య అని. 'రతః' అంటే రమించేవాడు అని. భారత! అంటే వెలుగులో ఉండేవాడు, జ్ఞానంలో మునక వేసేవాడు, బ్రహ్మవిద్యలో రమించేవాడు అని అంతరార్థం. ఇవన్నీ వేదాంతార్థాలు. అర్జునుడు నిజంగా అంతటి ప్రతిభావంతుడే. కాకపోతే 11 అక్షౌహిణుల శత్రు సేనను ఎదురుగా పెట్టుకొని; నిరాయుధుడై, రణరంగంలోని రణగొణ ధ్వనుల మధ్య ఉపనిషత్ సారము, బ్రహ్మవిద్య, యోగశాస్త్రముయైన ఈ బ్రహ్మజ్ఞానాన్ని ఆలకించి తన మోహాన్ని పోగొట్టుకోగలిగేవాడా? కనుక అతడు భారతుడే - బ్రహ్మ జ్ఞానంలో రమించేవాడే.

క్షేత్రమంటే శరీరమని; క్షేత్రజ్ఞుడంటే దానిని తెలుసుకొనేవాడని; రెండూ వేరువేరని; ఒకటి అనాత్మ అయితే రెండవది ఆత్మ అని; ఒకటి జడమైతే మరొకటి చైతన్యమని; ఒకటి చూడబడేది ఐతే మరొకటి చూచేదని మొదటి శ్లోకంలో చెప్పిన విషయాన్ని గ్రహించాడు అర్జునుడు.

ఐతే ఇప్పుడొక సందేహం కలిగింది అర్జునునికి. క్షేత్రం వేరు - క్షేత్రజ్ఞుడు వేరు కదా! క్షేత్రాలు ఎన్నో ఉన్నాయి గనుక క్షేత్రజ్ఞులు కూడా ఎందరో ఉండాలి కదా! అంటే ఒక్కొక్క క్షేత్రంలో (శరీరంలో) ఒక్కొక్క క్షేత్రజ్ఞుని(ఆత్మ) చొ||న ఎన్ని క్షేత్రాలున్నాయో అన్ని ఆత్మలుండాలి గదా! ఇదీ సందేహం. ఈ సందేహాన్ని తొలగించటానికే ఈ శ్లోకం.

అందుకే భగవానుడంటున్నాడు, 'అర్జునా! అన్ని క్షేత్రాలలోని క్షేత్రజ్ఞుడను నేనే' - అని. ఇక్కడ క్షేత్రాలకు 'క్షేత్రేషు' అని బహువచనం చెప్పి క్షేత్రజ్ఞుని విషయంలో 'క్షేత్రజ్ఞం' అని ఏకవచనం వాడటం జరిగింది.

కనుక క్షేత్రాలు అనేకం కాని క్షేత్రజ్ఞుడు మాత్రం ఏకం. దేహాలు అనేకం కాని ఆత్మ ఏకం. శరీరాలు ఎన్ని ఉన్నా అన్నింటిలోని ఆత్మ ఒక్కటే. పూలు అనేకం ఉన్నా వాటిని కట్టి ఉంచిన దారం మాత్రం ఒక్కటే. కుండలు అనేకంగా ఉన్నా వాటన్నింటిలోని ఆకాశం మాత్రం ఒక్కటే. లైట్లు, ఫ్యాన్లు అనేకం ఉన్నా వాటిని కదిలించే కరెంటు ఒక్కటే. అలాగే శరీరాలు అనేకం ఉన్నా అన్నింటా ఉన్న ఆత్మ ఒక్కటే. అనేక ఆత్మలు లేవు. ఆత్మ ముక్కలు చేయటానికి వీలు లేనిది. నీ శరీరంలోని ఆత్మ, నా శరీరంలోని ఆత్మ, అతడి శరీరంలోని ఆత్మ, కుక్క శరీరంలోని ఆత్మ అంతా ఒక్కటే. అన్ని శరీరాలలోని ఆత్మ నేనే. అన్ని క్షేత్రాలలోని క్షేత్రజ్ఞుడను నేనే.

సూర్యునికెదురుగా 100 నీటి కుండలను పెట్టాం. అన్నింటిలోను సూర్యుని ప్రతిబింబాలు పడతాయి. అయితే ఈ ప్రతిబింబాలు 100 మంది సూర్యులవా? లేక ఒక్క సూర్యునివా? ఒక్క సూర్యునివే. అలాగే అన్ని శరీరాలలోని ఆత్మ ఆ పరమాత్మే. ఇదే శ్రీకృష్ణుడు లోకానికి ఇచ్చిన దివ్యసందేశం. ప్రపంచంలోని మానవులంతా నేను - నేను అంటున్నారుగదా! ఆ నేను యొక్క లక్ష్యార్థం ఆత్మయే - పరమాత్మయే. అంటే ప్రతి వ్యక్తీ నిజంగా భగవంతుడే. కనుక శివోఽహం; సోఽహం; అహంబ్రహ్మాస్మి అని తెలుసుకోవాలి, అనాలి, అలా ఉండాలి.

వానరులను నరులను చేయటానికి శ్రీరాముడు జన్మించాడు. నరులను నారాయణులుగా తీర్చిదిద్దటానికి శ్రీకృష్ణుడు జన్మించాడు. ఎంత చక్కని భావన! ఎంత సత్యమైన భావన!


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

జీవుడుగా వ్యవహరిస్తున్న మన అసలు స్వరూపం ఆత్మయే. జీవుడే దేవుడని, నరుడే నారాయణుడని, ఆత్మయే పరమాత్మయని శ్రీకృష్ణుడు జీవేశ్వర ఏకత్వాన్ని స్పష్టంగా చెప్పివేశాడు. '**జీవో బ్రహ్మైవ నా పరః**' అని వేదాల ఘోష. జీవుడే పరమాత్మ- పరబ్రహ్మం. మీరు నరులు కాదు నారాయణులు, జీవులు కాదు శివులు, మానవులు కాదు మాధవులు, జనులు కాదు జనార్ధనులు - మీ నిజస్వరూపం ఏదో తెలుసుకోండి. మీ స్వస్వరూపాన్ని తెలుసుకోండి. 2గంటల నాటకంలో బిచ్చగాడి వేషం కట్టావే గాని, నీవు నిజంగా బిచ్చగాడివి కాదు నీవు కోటీశ్వరుడివి. ఈ నాటకంలోని బాధలు కూడా నీవి కాదు, అవి ఆయా పాత్రలకు సంబంధిచినవే - అని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు.

నీవు రామారావు కాదు, సుబ్బారావు కాదు, సుబ్బాయమ్మవు కాదు, వెంకాయమ్మవు కాదు, నీవు పరమాత్మవు. భారతరత్న, పద్మశ్రీ, పద్మభూషణ్ బిరుదుల కోసం మొహం వాచిపోతాం, దేబిరిస్తుంటాం. కాని తత్త్వమసి - ఆ పరమాత్మవు నీవే; '**క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి**' - క్షేత్రజ్ఞుణ్ణి నేనే', నీవు నేనే అని భగవంతుడిచ్చే అసలుసిసలైన బిరుదుల్ని మాత్రం పెడచెవిన పెడతాం - పట్టించుకోం. ఎంతటి దౌర్భాగ్యమో చూడండి. పదిమందిని సమావేశపరచి నేను నీకు ఈ బిరుదునిస్తాను. నీవు నాకు ఆ బిరుదునివ్వు అని తంటాలు పడటమేగాని, అసలు ఉన్న బిరుదు సంగతి తెలుసుకోలేరు ఈ మూర్ఖ మానవులు. భగవంతుని మాటను వదిలి భ్రష్టమైన ఆలోచనలు చేస్తుంటాడు మానవుడు. భగవంతునిపై విశ్వాసం లేనివానికి ఉద్ధారకమే లేదు. 'శ్రద్ధావాన్

లభతే జ్ఞానం' అన్నారు. శ్రద్ధలేని వానికి జ్ఞానం లభించదు. జ్ఞానం లేనివానికి మోక్షం లేదు. కనుక భగవంతుని మాటపై శ్రద్ధ ఉండాలి.

ఈ రోజు ఏకాదశి. ఈ రోజు ద్వాదశి అని చెప్పేవారి మాటను నమ్ముతాం. ఎందుకంటే అది పంచాంగంలో ఉంటుంది గనుక. ఆ పంచాంగాన్ని వ్రాసింది ఒక సిద్ధాంతి. అతడు మానవమాత్రుడే. అతడి మాటపై నమ్మకముంది. కాని భగవంతుని మాటపై విశ్వాసం లేదు. నమ్మలేక పోతున్నాం. **'సంశయాత్మా వినశ్యతి'** అన్నారు. భగవంతుని మాటపైన, వేదాంత శాస్త్ర వ్యాక్యాలపైన, గురువులు పెద్దల వాక్యాలపైన విశ్వాసం లేనివాడు నిజంగానే చెడిపోతాడు. వ్యర్థజీవి అవుతాడు.

ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానమే నిజమైన జ్ఞానమని భగవంతుడు తన అభిప్రాయంగా చెబుతున్నాడు. క్షేత్రం కేవలం జడమని, భ్రమాత్మకమని; అలాగే క్షేత్రజ్ఞుడు జ్ఞాన స్వరూప పరమాత్మయేనని తెలుసుకొనుటయే నిజమైన జ్ఞానం. భగవద్గీత యొక్క సారం కూడా ఇదే. క్షేత్రంలోని క్షేత్రజ్ఞుణ్ణి తెలుసుకో. ఆ క్షేత్రజ్ఞుడు నీవే అని భగవద్గీత చెబుతున్నది.

కనుక ఈ శరీరంలోని క్షేత్రజ్ఞుణ్ణి - ఆత్మను నేనే. ఈ శరీర మనోబుద్ధులకు చైతన్యాన్నిచ్చి నడిపించేది నేనే. నేనే అన్ని క్షేత్రాలను నడిపించేటప్పుడు అన్నింటిని ఒకే విధంగా ఎందుకు నడపటం లేదు?

లైటు, ఫ్యాన్, ఫ్రిజ్, టి.వి, హీటరు - అన్నింటిని నడిపేది ఒకే కరెంటు. మరి లైటు వెలుగుతున్నది, ఫ్యాన్ తిరుగుతున్నది, ఫ్రిజ్ చల్లబరుస్తున్నది, హీటరు వేడి

**చేస్తున్నదేం? అవన్నీ క్షేత్రాల స్వభావం వల్లనే. కరెంటు కేవలం అవి పనిచేయటానికి శక్తినిస్తుంది. అంతే.**

**సర్వక్షేత్రేషు అనటం వల్ల పాపాత్మునిలోను, పుణ్యాత్మునిలోను, కుక్కలోను, పందిలోను అన్నింటిలోను ఉన్నది ఆ పరమాత్మే. అయితే మానవుడు మాత్రమే ఆ విషయాన్ని తెలుసుకోగలడు.**

**ఇక క్షేత్రక్షేత్రజ్ఞుల రెండింటి వివరం తెలియాలి.**

ఈ మార్గంలో నడిచేవాడికి ఈ జ్ఞానం విపులంగా కావాలి ; క్షేత్రమంటే ఏమిటో -క్షేత్రజ్ఞుడంటే ఏమిటో తెలియాలి. అందుకే భగవానుడంటున్నాడు-

**శ్లో|| తత్ క్షేత్రం యచ్చ యా దృక్ట**
**యద్వి కారి యతశ్చ యత్|**
**సచయో యత్ ప్రభావశ్చ**
**తత్ సమాసేన మే శృణు ||** **(4)**

**తా||** క్షేత్రమంటే ఏమిటో, ఎలాంటిదో, ఎలాంటి వికారాలు (మార్పులు) చెందుతుందో, ఎక్కడినుండి వచ్చిందో, ఆ క్షేత్రజ్ఞుడు ఎవరో, ఎటువంటి ప్రభావం కలవాడో, దానిని సంక్షిప్తంగా చెబుతాను, విను.

**వ్యాఖ్య** :- సాధకుడు చేయవలసినదేమిటి? క్షేత్రాన్ని, క్షేత్రజ్ఞుని విడగొట్టి తెలుసుకోవాలి. ఆ తరువాత క్షేత్రాన్నినిరశించి నేను క్షేత్రాన్ని గాదు, క్షేత్రజ్ఞుడను అని అనుభూతి చెందాలి. అలా క్షేత్రంపై విజయం **సాధించాలంటే** ఆ క్షేత్రం యొక్క స్వరూప స్వభావాలు, గుణగణాలు, బలాబలాలు **అన్నీ**

చక్కగా తెలుసుకోవాలి. శత్రువు యొక్క ఆనుపానులు తెలుసుకొంటే తప్ప ఆ శత్రువును దెబ్బకొట్టటానికి, విజయం సాధించడానికి వీలు కుదరదు.

శ్రీరాముని దూతగా లంకకు వెళ్ళిన ఆంజనేయుడు కేవలం సీతాదేవిని చూచి సంతోషంతో తిరిగిరాలేదు. రావణుని యొక్క బలం ఏమిటో, బలహీనత ఏమిటో, అతడి ఎత్తులేమిటో, లంకా నగర స్థితిగతులేమిటో అన్నీ జాగ్రత్తగా పరిశీలించాలనే ఉద్దేశంతోనే ఇంద్రజిత్తు చేతికి చిక్కాడు. రావణునితో మాట్లాడాడు. అతడి బలాన్ని (సేనను ) అంచనా వేసుకొన్నాడు. తన బలాన్ని ప్రదర్శించి శత్రువు గుండె గుభేలనిపించాడు.

అలాగే పాండవ పక్షాన రాయబారిగా వెళ్ళదలచిన శ్రీకృష్ణునికి తమతమ అభిప్రాయాలను ఐదుగురు పాండవులు వ్యక్తం చేసిన తరువాత, ధర్మరాజు భయాన్ని వ్యక్తం చేసి 'ఆ దుర్మార్గుల మధ్యకు వెళ్ళవద్దు' - అన్నాడు. అయితే ఆ మాటను అంగీకరించక శ్రీకృష్ణుడు "ఐనను పోయిరావలయు హస్తినకు; అచటి సంధిమాట ఎటులున్నను శత్రు రాజుల బలాబలంబులు చూడగవచ్చు" అన్నాడు. కనుక శత్రువు యొక్క బలాబలాలను అంచనా వేసుకోవటం తెలివిగల వారి లక్షణం.

అసలు కురుక్షేత్రయుద్ధ ప్రారంభంలో కూడా శత్రువుల యొక్క బలాబలాలను అంచనా వేయటానికే అర్జునుడు రథాన్ని రెండు సేనల మధ్య నిలపమని సారథియైన శ్రీకృష్ణుని ఆదేశించాడు. ఐతే దాని పరిణామం వేరైందనుకోండి - అది వేరే విషయం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అలాగే మనకు దుఃఖాలను, బాధలను, మృత్యువును తెచ్చిపెట్టే మన శత్రువైన ఈ క్షేత్రాన్ని మనం జయించాలంటే ముందుగా దీని స్వరూప స్వభావాలను, బలం - బలహీనతలను, దీని పుట్టుపూర్వోత్తరాలను - అన్నింటిని పరిశీలించాలి. అందుకే ఆ విషయాలను చెప్పబోతున్నాను - అని భగవానుడు తెలియజేస్తున్నాడు. అలాగే క్షేత్రజ్ఞుని గొప్పతనం ఏమిటో, అతడి ప్రభావం ఏమిటో తెలిస్తేనే అతడితో స్నేహం చేస్తాం. చివరికి అతడిలో ఐక్యమవుతాం.

ఈ శ్లోకంలోనే మరొక విషయం కూడా అవగతమవుతుంది. క్షేత్రం వికారాలతో కూడుకున్నదని, క్షేత్రజ్ఞుడు ప్రభావం గలవాడని, తెలుస్తుంది. 'యత్ వికారి' - 'యత్ ప్రభావశ్చ' అనే పదాలు ఆ విషయాన్ని తెలియజేస్తున్నాయి. కనుక వికారాలన్నీ క్షేత్రానికి సంబంధించినవే గాని క్షేత్రజ్ఞుని అంటవు - అని గ్రహించాలి.

క్షేత్రాన్ని గురించిన పూర్తి జ్ఞానం ఉంటేనే క్షేత్రజ్ఞుని క్షేత్రం నుండి విడదీయటానికి వీలవుతుంది. అలాగే క్షేత్రజ్ఞుని గురించి స్పష్టంగా తెలిసి, అతడి మహిమను - గొప్పతనాన్ని గ్రహించగలిగితేనే అతడిలో ఐక్యత సంభవమవుతుంది. అందుకే క్షేత్రక్షేత్రజ్ఞుల గురించి వివరించబోతున్నానని భగవానుడు ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

అయితే ఈ విషయాలను సంక్షిప్తంగా చెప్పబోతున్నాను అని భగవానుడు అంటున్నాడు. ఇంతకు ముందు రెండు శ్లోకాల్లో చెప్పింది కూడా సంక్షిప్తంగానే. ఇప్పుడు దానినే వివరించి చెప్పబోతూ కూడా 'సమాసేన' - అంటున్నాడు. అంటే సంక్షిప్తంగా చెబుతున్నాను అంటున్నాడు.

అంటే దీని ఆంతర్యం ? విషయం అనంతమైనది అని అర్థం. అంతా చెప్పటం సాధ్యంగాదు అని. ఇలాంటి ఉన్నతోన్నత జ్ఞాన సంబంధ విషయాలను అనుభవభూమికనెక్కి అవగాహన చేసుకోవాలే తప్ప మాటలతో చెప్పగలిగింది కాదు - అని. అయినప్పటికీ విషయం తెలియకుండా అనుభవం కలుగదు గదా! అందుకే క్లుప్తంగా తెలియజేయబోతున్నాడు. అదీగాక ఇది తీరికగా కూర్చొని చెప్పుకొనే సమయం కాదు గదా! ఇది యుద్ధ సమయం. ఇక యుద్ధం ప్రారంభం కాబోతున్నది అనగా తప్పని సరిగా చెప్పవలసివచ్చిన విషయం. సంక్లిష్ట సమయం. అందుకే క్లుప్తంగాను, వివరంగాను చెప్పాలని శ్రీకృష్ణుని ఉద్దేశం.

ఇలా చెబుతున్నాడంటే ఏదో కట్టుకథకాదు, ఉబుసుపోకకు చెప్పేదీ కాదు, తూతూ మంత్రంగా చెప్పేదీకాదు, తప్పని సరిగా చెప్పాల్సిన అద్భుత విషయం.

- ఈ చెప్పే విషయాలకు ఆధారాలు, ప్రమాణాలు ఉన్నాయా? ఆ ఉన్నాయి. ఏమిటవి ?

శ్లో|| ఋషి భిర్ బహుధా గీతం
ఛందో భిర్వి విధైః పృథక్ |
బ్రహ్మ సూత్ర ప్రదైశ్చైవ
హేతు మద్భిర్ వినిశ్చితైః || (5)

**తా|| ఈ విషయాలన్నీ ఋషుల చేత అనేక ప్రకారాలుగా చెప్పబడింది. వేదాల ద్వారా గానం చేయబడింది. బ్రహ్మసూత్ర పదాల ద్వారా హేతుబద్ధంగా నిశ్చయించబడింది.**

**వ్యాఖ్య :-** ఇప్పుడు శ్రీకృష్ణుడు సంక్షిప్తంగా చెప్పబోయే విషయాలు ఆయన కపోల కల్పనలు కాదు. నిస్సారమైనవీ కావు. హేతువాదానికి నిలువనివీ కాదు. మరి ఎలాంటి విషయాలు ఇవి?

(i) ఋషుల చేత విస్తారంగా చెప్పబడిన విషయాలే, ఋషులు అంటే ఇంద్రియ నిగ్రహం గలవారు. వారు చెప్పే విషయాలకు ఎంతో ప్రాధాన్యత ఉన్నది. ఎందుకంటే వారు ఏదో స్వలాభం కోసమో, కీర్తిప్రతిష్ఠల కోసమో తంటాలు పడేవారు కాదు. సర్వమానవుల శ్రేయస్సు కోసం పరితపించేవారు. మానవజాతి ఉద్ధారకానికి ప్రయత్నం చేసేవారు. శాస్త్రాలలో చెప్పబడ్డ విషయాలను తెలియజెప్పేవారు. అందుకే వారు చెప్పే విషయాలకు ప్రాధాన్యత ఉంటుంది. అంతేకాదు మానవ శ్రేయస్సు కోసం వారు వేరువేరు బుద్ధి స్థాయిలలో ఉన్న మానవులకు వేరువేరు విధాలుగా - అనేక ప్రకారాలుగా చెబుతూ ఉంటారు. ఇంకా -

(ii) వేదాల ద్వారా గానం చేయబడిన విషయాలే. వేదాలలో చెప్పబడిన విషయాలన్నీ పరమ ప్రమాణమైనవి. ఎందుకంటే అవి ఎవరో మహాత్ములు - మహర్షులు రచించిన గ్రంథాలు కాదు. అవి శ్రుతులు. అంటే 'విన్నవి' అని అర్థం. విన్నవారెవరు ? ధ్యాననిష్టలో మునిగియున్న మహర్షులు. వినిపించిన

వారెవరు ? సర్వప్రాణుల హృదయాలలోను ఉన్న పరమాత్మ. అంటే పరమాత్మ చెప్పిన విషయాలే వేదాలు. అందుకే అవి పరమప్రమాణం.

(iii) బ్రహ్మసూత్ర పదాల ద్వారా **హేతు**బద్ధంగా నిశ్చయించబడినది : వేదాలలో చెప్పబడ్డవి గదా! గ్రుడ్డిగా నమ్మాల్సిందేనా? అనే సందేహం గలవారికి 'అలా గ్రుడ్డిగా నమ్మనవసరంలేదు, ప్రతి విషయాన్ని బుద్ధితో ఆలోచించి తర్కసమ్మతంగా ఉంటేనే నమ్మాలి' అని చెప్పేందుకు బ్రహ్మసూత్రాల ప్రసక్తిని తెచ్చారు. బ్రహ్మసూత్రాలన్నీ తర్కం, **హేతు**బద్ధత అనే పునాదులపై నిర్మించబడినవి. కనుక తర్కించి, నిశ్చయించుకోవచ్చు.

కనుక భగవానుడు తెలియజేయబోయే విషయాలన్నీ పరమ ప్రమాణమైన వేదాలలో గానంచేయబడినవి; బ్రహ్మసూత్ర పదాలతో **హేతు**బద్ధంగా నిశ్చయించబడినవి. మానవ శ్రేయస్సుకు పాటుబడే ఋషుల చేత చెప్పబడినవి - అని భగవానుడే స్వయంగా తాను చెప్పే విషయాల ప్రామాణ్యతను తెలియజేస్తున్నాడు.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత - ఈ మూడింటిని ప్రస్థానత్రయం అన్నారు. ఈ మూడూ వేదాంతానికి మూలధారం. భగవద్గీత వాటిలో చివరిది. మొదటి రెండూ భగవద్గీతకు ప్రమాణం అని భగవానుడు సూచన ఇస్తున్నాడు.

ఉపనిషత్తులు పరిపక్వం చెందిన సాధకులకు, బ్రహ్మసూత్రాలు **హేతు**బద్ధంగా తర్కించేవారికి, భగవద్గీత ప్రాపంచిక వ్యవహారాలలో ఉండి పరమాత్మ గురించిన జిజ్ఞాసగలవారికి సహాయపడతాయి.

శ్రీకృష్ణుడు స్వయంగా భగవానుడు. తన మాటకు అడ్డు అంటూ ఉండదు. అర్జునుడు కూడా ఆయన మాటను తు.చ. తప్పక అక్షరాల నూటికి నూరు పాళ్ళు నమ్మే శిష్యుడు. అయినాసరే తన మాటకు అథారిటి చూపిస్తున్నాడు. ప్రమాణాన్ని చూపిస్తున్నాడు. అదే నియమబద్ధత అంటే. భగవంతుడు తన ఆచరణ ద్వారా లోకానికి ఒక ఆదర్శాన్ని చూపిసున్నాడు. ప్రపంచానికి ఒక హెచ్చరిక కూడా చేస్తున్నాడు. ఏమిటది ? - శాస్త్ర ప్రమాణం లేని మాటను ఎంత గొప్పవాడు చెప్పినా అంగీకరించవలసిన అవసరం లేదు. నా అంతరాత్మ చెప్పింది, నాకు ధ్యానంలో భగవంతుడు కన్పించి చెప్పాడు, నాకు భగవంతుని అంతర్వాణి వినిపించింది, నాకు మురళీనాదం వినిపించింది అని చెప్పే కబుర్లన్నీ డంబాచారాలే. ప్రతి మాటకు శాస్త్రాధారం ఉండాలి. శాస్త్రప్రమాణం ఉండాలి. శాస్త్రాలను అధ్యయనం చేసే తీరిక, ఓపిక లేక ఏదో నోటికి వచ్చిన మాటలను చిలుక పలుకుల్లాగా వల్లెవేసినంత మాత్రాన వాటిని నమ్మి మోసపోరాదు. శాస్త్రప్రమాణం లేకుండా చెప్పే పలుకులన్నీ చెల్లని రూపాయి బిళ్ళలే.

గౌతమబుద్ధుని వంటి మహాత్ములు చెప్పిన మాటలు కూడా కొన్ని ప్రమాణబద్ధం కాకపోవటం వల్ల కొంతకాలం వెలిగినట్లే వెలిగినవి గాని ఒక్కసారిగా చల్లారిపోయినవి. వేదభూమియైన భారతదేశపు సరిహద్దులు దాటిపోయినవి. అలాగే అనేక మతాలు వెలసి, కొంతకాలం ఒక వెలుగువెలిగి కనిపించకుండా పోయినవి. శాస్త్రప్రమాణం లేకపోతే అంతే.

**ఈ కాలంలో కూడా అనేక మతాలు వస్తూ ఉన్నాయి. ఇంకా వస్తూనే ఉంటాయి. అన్నీ చివరకు కాలగర్భంలో కలసిపోక తప్పదు. సనాతనధర్మాన్నీ, సనాతనశాస్త్రాలను అనుసరించిన ధర్మాలు, మతాలూ మాత్రమే చెక్కుచెదరక నిలబడతాయి. అందుకే భగవానుడు తాను చెప్పే విషయాలకు కూడా శాస్త్రప్రమాణాన్ని జోడిస్తున్నాడు. ప్రమాణబద్ధ విషయాలనే సంక్షిప్తంగా తెలియజేయబోతున్నాను - అని చెబుతున్నాడు.**

**ఇలాచెప్పి భగవానుడు క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీయాలంటే ఆ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపస్వభావాలను వివరించబోతున్నాడు.**

- ముందుగా క్షేత్రాన్ని గురించి 2 శ్లోకాలలో తెలియజేస్తున్నాడు.

**శ్లో|| మహా భుతాన్యహంకారః**

**బుద్ధి రవ్యక్త మేవచ |**

**ఇంద్రియాణి దశై కంచ**

**పంచచేంద్రియ గోచరాః || (6)**

**తా||** మహాభూతాలు, అహంకారం, బుద్ధి, అవ్యక్తం, పదిఇంద్రియాలు, మనస్సు, ఇంద్రియగోచర విషయాలు ఐదు.

**వ్యాఖ్య :-** క్షేత్రంయొక్క స్వరూప స్వభావాలు, వాటి పుట్టుపూర్వోత్తరాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు. క్షేత్రంపై ఆసక్తిని వదిలించుకోవాలంటే క్షేత్రం యొక్క దోషాలను తెలుసుకోవాలి. అందుకే క్షేత్రం యొక్క స్వరూప స్వభావాలను, వాటి పుట్టుపూర్వోత్తరాలను ముందుగా వివరిస్తున్నారు.

ఈ శ్లోకంలో చెప్పినవి సాంఖ్యశాస్త్రంలో పేర్కొన్న 24 తత్త్వాలే. ఐదుపంచభూతాలు, అహంకారం, బుద్ధి, అవ్యక్తం, 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు (మొత్తం 10 ఇంద్రియాలు), మనస్సు, ఇంద్రియగోచర శబ్దాది విషయాలు 5. మొత్తం 24 తత్త్వాలు. ఈ 24 తత్త్వాలతో కూడియున్నదే క్షేత్రం.

(i)మహాభూతాలు:- ఇంద్రియగోచరమయే ఈ స్థూలశరీరం ఎలా ఏర్పడింది ? పంచభూతాలలో, ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి అనే 5 పంచభూతాలు పరమాత్మ నుండి సూక్ష్మభూతాలు (తన్మాత్రలు )గా వచ్చినవి. అవి పంచీకరణం చెంది స్థూలభూతాలుగా మారుతాయి. ఈ స్థూలభూతాల తోనే స్థూలదేహం ఏర్పడింది. ఎముకలు మొ||న గట్టి పదార్థాలు భూమికి సంబంధించినవి. రక్తం, చీము మొ||నవి జల సంబంధమైనవి. శరీరంలోని ఉష్ణోగ్రత అగ్ని సంబంధమైనది. ఉచ్ఛ్వాస నిశ్వాలతో బయటి గాలి లోపలికి, లోపలి గాలి బయటకు వస్తుంది. ప్రాణంగా మారే ఈ గాలియే వాయు సంబంధమైనది. మనం తినే, త్రాగే పదార్థాల కొరకు లోపల ఉండే ఖాళీ ప్రదేశాలు (Vacuoles) ఆకాశ సంబంధమైనవి. ఇలా పంచభూతాలనబడే మహాభూతాలతో స్థూలశరీరం వచ్చింది.

ఇక ఈ శరీరంలోని ఇతర పరికరాలు, కరణాలు గురించి,

(ii) అహంకారం :- వ్యక్తిలోని శరీరమనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది తనను తాను మరచి జీవుడుగా వ్యవహరించే ఆత్మయే అహంకారం. విషయ ప్రపంచంతో సంబంధం పెట్టుకొని నేను - నాది అని భావిస్తుంది ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అహంకారం. ప్రపంచంలోని విషయాలను అనుభవించేది కూడా ఇదే. ఆత్మకు ఏ అనుభూతి ఉండదు. అది కేవల సాక్షి.

(iii) బుద్ధి :- ఈ అహంకారానికి సహాయంగా ఉండేది, మంచి చెడ్డలను విచక్షణ చేసి నిర్ణయాలు తీసుకొనేది, ఒక స్వభావాన్ని కలిగి ఉండేది బుద్ధి. బుద్ధిలోని నిర్ణయాల ప్రకారం అహంకారం పనిచేస్తుంది.

(iv) అవ్యక్తం :- బుద్ధి యొక్క స్వభావానికి కారణం అవ్యక్తం - ప్రకృతి. అంటే వాసనలతో కూడిన కారణశరీరమే అవ్యక్తం. ఇది ఎలా ఏర్పడింది ? బుద్ధి పూర్వకంగా చేసిన కర్మలు - ఆలోచనల వల్ల మనస్సులో వాసనలు ముద్రించబడతాయి. ఆ వాసనలే అవ్యక్తం లేదా ప్రకృతి. ఈ వాసనలే మళ్ళీమళ్ళీ కర్మలకు ప్రేరణ ఇచ్చేది.

(v) పదిఇంద్రియాలు :- 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక ఇవి జ్ఞానేంద్రియాలు. వీటిద్వారా బాహ్యావిషయాల జ్ఞానం లోపలకు వస్తుంది. ఈ జ్ఞానానికి తగినట్లు కర్మలు చేయటానికి వాక్కు, చేతులు, కాళ్ళు, గుదము, జననేంద్రియం అనే 5 కర్మేంద్రియాలు ఉన్నాయి. ఈ మొత్తం 10 ఇంద్రియాలు - దశేంద్రియాలు.

(vi) మనస్సు(ఏకంచ) :- ఇది అంతరింద్రియం. ఇదే అన్నింటిలో ముఖ్యమైనది. బయటివిషయాలకు సంబధించిన జ్ఞానాన్ని జ్ఞానేంద్రియాలు గ్రహించి మనస్సుకు తెలియజేస్తాయి. దానితో మనస్సు ఆ విషయ జ్ఞానాన్ని బుద్ధికి నివేదిస్తుంది. బుద్ధి ఒక నిర్ణయం తీసుకొని మనస్సుకు తెలియజేస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అప్పుడు మనస్సు కర్మేంద్రియాలను ఉపయోగించుకొని ఆ నిర్ణయాన్ని అమలు చేస్తుంది. ఇదీ మనస్సు యొక్క పని.

(vii) పంచేంద్రియ గోచరా :- పంచేంద్రియాలకు గోచరమయ్యే విషయాలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ అనేవి. చెవితో వినేది శబ్దం, చర్మంతో తెలుసుకొనేది స్పర్శ, కంటితో చూచేది రూపం, నాలుకతో గ్రహించేది రసం (రుచి), ముక్కుతో తెలుసుకొనేది గంధం (వాసన). ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క క్షేత్రంలో పని చేస్తుంది.

ఇలా మొత్తం 24 తత్త్వాలతో కూడినదే ఈ క్షేత్రం, ఈ క్షేత్రం జడమైనది. చైతన్యం ఉంటేనే ఈ జడక్షేత్రం పని చేస్తుంది. ఈ క్షేత్రం ఇలా 24 తత్త్వాలతో కూడియున్నదని సాంఖ్యులు చెబుతారు.

ఈ క్షేత్రం (శరీరం) ఎలా వచ్చిందో ఆ సృష్టిక్రమం కూడా అంతర్లీనంగా ఇక్కడ చెప్పబడింది. అది ఏమిటో కథా పూర్వకంగా అర్థం చేసుకొందాం.

పరమాత్మ మాయ అనే శక్తితో కూడి ఉంటాడు. మాయ అంటే ఉన్నట్లుగా కనిపించే లేనివస్తువు. అదే ప్రకృతి - స్త్రీ. పరమాత్మ పురుషుడు. పరమాత్మ అనే పురుషుడు మాయ అనే స్త్రీకి గర్భాదానం చేస్తాడు. అప్పుడే క్షేత్రం అనేది పుడుతుంది. అయితే భగవంతునికి ఏమి అవసరం ?

పూర్వకల్పంలోని జీవుల్లు దేహాలను వదిలిన తర్వాత అవ్యక్తంలో - అంటే పరమాత్మలో ఉండిపోతారు. వారి అందరి వాసనలను సమిష్టివాసనలు అంటారు. అవి పక్వానికి వచ్చి అనుభవాలు పొందాలని భగవంతుని తొందర పెడతాయి. కనుక భగవంతుడు గర్బాదానానికి సిద్ధమయ్యాడు. మనం పండ్ల



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కోసం విత్తనం నాటినట్లు ఆయన వివిధ క్షేత్రాల సృష్టి కోసం ఈ వాసనలనే విత్తనాలను మాయ యొక్క గర్భంలో నాటుతున్నాడు. ఈ విత్తనం సూక్ష్మాతి సూక్ష్మం. కంటికి కనిపించదు. అందుకే దానిని అవ్యక్తం అన్నారు.

ఈ అవ్యక్తమే క్రమంగా మార్పుచెంది మహతత్త్వమనే బుద్ధిగా మారుతుంది. అంటే వాసనలే స్వభావంగా మారిపోతాయి. చెడ్డ వాసనలున్నవాడు చెడ్డవాడవుతాడు. మంచి వాసనలున్నవాడు మంచి స్వభావం గలవాడవుతాడు.

విత్తనం మొదట చిన్నదిగా ఉంటుంది. తరువాత అదే ఉబ్బి కాస్త పెద్దదవుతుంది. ఆ తరువాత దాని నుండి చిన్న అంకురం పుడుతుంది. అలాగే అవ్యక్తం బుద్ధిగా మార్పుచెంది, దాని నుండి నేను, నాది అనే అహంకారం బయలుదేరుతుంది. అంకురం మొక్కగా వృక్షంగా వృద్ధి చెందినప్పుడు దానికి శాఖలు ఏర్పడ్డట్లు ఈ అహంకారం నుండి మహాభూతాలు అయిదు ఏర్పడతాయి. ఇవి అపంచీకృత సూక్ష్మభూతాలు(తన్మాత్రలు) వీటికి సత్వరజస్తమోగుణాలనే త్రిగుణాలుంటాయి. ఎక్కడివి ఇవి? పిల్లలకు తల్లిదండ్రుల అలవాట్లు వచ్చినట్లు ఇవి తల్లి నుండి వస్తాయి. తండ్రి పరమాత్మ గుణరహితుడు. తల్లి మాయకు ఈ 3 గుణాలు ఉన్నాయి. అవే ఈ మహాభూతాలనే పిల్లలకు వచ్చాయి. అంటే తల్లి చాలు అన్నమాట.

పంచభూతాలకున్న ఈ త్రిగుణాలలో సాత్విక అంశాల వల్ల అంతఃకరణం మరియు 5 జ్ఞానేంద్రియాలు, రజోగుణాంశాల వల్ల 5 కర్మేంద్రియాలు, 5 ప్రాణాలు వస్తాయి. ఇవి అన్నీ కలిపి సూక్ష్మశరీరం

అవుతున్నది. ఇక పంచభూతాల తామసికఅంశాల వల్ల పంచీకరణం జరిగి స్థూలభూతాలు ఏర్పడతాయి. ఆ స్థూలభూతాలలో స్థూలశరీరం ఏర్పడుతుంది. ఈ స్థూల సూక్ష్మ శరీరాలు రెండూ కలసి క్షేత్రం అంటారు. ఇదీ క్షేత్రం యొక్క పుట్టుక.

క్షేత్రాన్ని గురించి ఇంతగా చెప్పటం దేనికి ? ఇది పుట్టుక గలదియని కనుక ఎప్పుడో ఒకప్పుడు అంతమైపోతుందని, అలాగే ఇది వికారాలతో కూడియున్నదని, సుఖాలను ఇచ్చినట్లే ఇచ్చి దుఃఖాలను మన మెడకు చుడుతుందని, కనుక దీనిని వదిలించుకోవాలని, అలా వదిలించుకోవాలంటే క్షేత్రజ్ఞుడవైన నీకన్న ఇది వేరని గ్రహించాలి. ఇప్పటి వరకు ఈ 'క్షేత్రమే నేను' అనే తప్పుడు అభిప్రాయంలో ఉన్నాం. ఇప్పుడు క్షేత్ర స్వభావం తెలిస్తే నేను ఇది కాదు. దీని కన్నా వేరుగా ఉన్నాను అని తెలుస్తుంది.

ఆ విచారణ ఎలా చేయాలి ? స్థూల సూక్ష్మ కారణశరీరాలతో గాని, వాటి వృత్తులతో గాని క్షేత్రజ్ఞుడవైన నీకు ఏ సంబంధమూ లేదు. నీవు వాటిని కేవలంగా చూచే సాక్షివి మాత్రమే. నీ ప్రకాశం వల్లనే అవి తమ పనులు తాము చేసుకొంటున్నాయి. అంతే.

జాగ్రదవస్థలో స్థూలశరీరం, సూక్ష్మశరీరం, కారణశరీరం అన్నీ పని చేస్తుంటాయి. వాటిని పనిచేయించే జీవుణ్ణి 'విశ్వుడు' అంటారు. వాడు నిద్ర లేచింది మొదలు నిద్రపోయే వరకు ఏదేదో చేస్తుంటాడు. ఆ సంసారాన్ని వాడికి వదులు. ఇక నిద్రకుపక్రమించిన తర్వాత స్థూలశరీరం ప్రక్క మీదికి చేరి అలసి పోతుంది. అప్పుడు సూక్ష్మశరీరం పని చేస్తుంది. దాని పని స్వప్నాన్ని

సృష్టించటం. ఆ స్వప్నావస్థలో పని చేసే జీవుణ్ణి 'తైజసుడు' అంటారు. వాడి చిత్ర విచిత్ర వ్యవహారాలను వాడి నెత్తిన పెట్టు. ఇక గాఢనిద్రలో ఏమీ చేయకుండా హాయిగా ఉండే జీవుణ్ణి 'ప్రాజ్ఞుడు' అంటారు. వాడి గొడవను వాడికే అప్పగించు.

మరి ఇంతకీ నీవెవరు ? నీవు సాక్షివి. కేవల సాక్షివి. స్వయం ప్రకాశానివి. నిత్య సత్యానివి. ఆత్మవు. సాక్షివైన నీవు సాక్షిగానే ఉండు. వారి వ్యవహారాలలో జోక్యం చేసుకోకు. జోక్యం చేసుకొన్నవా ? సుఖదుఃఖాలు, లాభనష్టాలు, జయాపజయాలు, మానావమానాలు, అలజడులు, ఆందోళనలు, అశాంతి. కనుక దూరంగా, కేవలంగా, సాక్షిగా, నిర్లిప్తంగా ఉండిపో.

జాగ్రదవస్థలో స్థూలశరీరంతో విశ్వుడు వచ్చాడు. స్వాగతం చెప్పావు. స్థూలశరీరంతో వాడు ఏదేదో చేస్తుంటాడు, అనుభవిస్తుంటాడు, వాడి స్థితీ, గతీ అన్నీ చూచావు. వాడు పోతానన్నాడు, పొమ్మన్నావు. స్వప్నావస్థలో తైజసుడు వచ్చాడు. స్వాగతం చెప్పావు. సూక్ష్మశరీరంతో ఎక్కడెక్కడో తిరిగి ఏదేదో చేసి, సుఖదుఃఖ అనుభవాలు పొందాడు. వాడి పరిస్థితీ గమనించావు. వాడు కాసేపు నవ్వి, కాసేపు ఏడ్చి పోతానన్నాడు. పొమ్మన్నావు. గాఢ నిద్రావస్థలో ప్రాజ్ఞుడు వచ్చాడు. కారణశరీరంతో - అజ్ఞానంతో ఏమీ తెలియకుండా అలా పడి ఉన్నాడు. వాడి బాగోగులూ చూచావు. అతడూ కొంత సేపటికి ఉడాయించాడు. సరేనన్నావు. ఆ ముగ్గరిలో ఒకడున్నప్పుడు మరొకడు లేడు. ఒకరి విషయం మరొకరికి తెలియదు. నీకు మాత్రం అందరి విషయం తెలుసు. వచ్చే వాడితో నీవు రాలేదు. పోయే వాడితో నీవు పోలేదు.

వారు వచ్చినప్పుడూ పోయినప్పుడూ; వారు ఉన్నప్పుడూ లేనప్పుడూ నీవు మాత్రం సాక్షిగా – కేవలసాక్షిగా ఉన్నావు. ఏ క్షేత్రంలో జరిగిన విషయాలైనా, పొందిన అనుభవాలైన వాటితో నీకు ఏ మాత్రం సంబంధం లేదు. ఆయాశరీరాలతో జరిగిన అనుభవాలు నీకు చెందవు. అవన్నీ ఆయా క్షేత్రాలకు సంబంధించినవి మాత్రమే. నీవు నీవుగా కేవలంగా ఉన్నావు. వాటితో తాదాత్మ్యం పెట్టుకొని కలసిపోయావా ? ఆ అనుభవాలన్నీ నీవిగా భావించి నవ్వుతావు, ఏడుస్తావు. అలాగాక వాటితో సంబంధాన్ని వదిలి; అబద్ధపు సంబంధాన్ని పెట్టుకోకుండా ఉన్నావా ? నీవు హాయిగా ఆనందంగా ఉండిపోతావు. అలా ఆనందంగా ఉండిపోవటానికే ఈ క్షేత్రం యొక్క పుట్టు పూర్వోత్తరాలు, అనిత్యత్వం గురించి తెలుసుకోవటం.

ఇలా స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడూ క్షేత్రమేనని తెలుసుకొంటే దానితో గల అబద్ధపు తాదాత్మ్యాన్ని విడిచిపెట్టవచ్చు. దానియందుగల అభిమానాన్ని విడిచిపెట్టవచ్చు. క్షేత్రం దృశ్యం గనుక అది నీ చేత చూడబడేది. నీకన్న వేరుగా ఉన్నది; అది నీ స్వరూపం కాదు. నీవు చూచేవాడివి - ద్రష్టవు. అది నీచే చూడబడేది, దృశ్యం. రెండూ వేరు. అంటే దానికన్న నీవు వేరుగా ఉన్నావు. దానిని చూచే సాక్షిగా ఉన్నావు. కనుక దాని పనులతో, దాని అనుభవాలతో, ఏకం కాకూడదు - అని నిశ్చయించుకొని,ఆనందస్వరూప ఆత్మగా మిగిలిపోవుటే ఈ క్షేత్ర విచారణ యొక్క ఫలం. ఇక ఈ క్షేత్రం యొక్క వికారాలేమిటో తరువాతి శ్లోకంలో -

- క్షేత్రం యొక్క స్వరూప స్వభావాలు, దాని పుట్టుపూర్వోత్తరాలు చెప్పి ఇక దాని వికారాలు ఏమిటో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు భగవానుడు.

**శ్లో|| ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం**
**సంఘాతః చేతనా ధృతిః ।**
**ఏతత్ క్షేత్రం సమాసేన**
**సవికార ముదాహృతం ||** **(7)**

**తా||** ఇచ్ఛ, ద్వేషం, సుఖం, దుఃఖం, శరీరం, చేతనత్వం, పట్టుదల ఇలా వికారాలతో కూడినది ఈ క్షేత్రం అని ముక్తసరిగా చెప్పటమైనది.

**వ్యాఖ్య :-** ఈ శ్లోకంలో పేర్కొన్న 7 వికారాలు షడ్దర్శనాలలోని వైశేషిక దర్శనంలో చెప్పబడిన ఆత్మ లక్షణాలే. నిజంగా ఇవి ఆత్మ లక్షణాలు కాదు. ఇవి క్షేత్రంలోని వికారాలు (మార్పులు ) మాత్రమే.

(i) ఇచ్ఛా ద్వేషాలు కారణశరీరంలోని ద్వందాలు. ఈ ఇచ్ఛాద్వేషాలనే వాసనల ప్రేరణతోనే సూక్ష్మశరీరంలో సుఖదుఃఖాలనే ద్వంద్వాలు ఏర్పడతాయి. ఎలా ? ఇచ్ఛాద్వేషాల ప్రేరణతో జీవుడు ఈ ప్రపంచంలో కర్మలు చేస్తాడు. అందువల్ల సూక్ష్మశరీరంలో (మనస్సులో) సుఖదుఃఖాలు కలుగుతాయి. ఇచ్ఛ అంటే రాగం. కావాలనుకోవటం. ద్వేషం అంటే వద్దు అనుకోవటం. ఒకప్పుడు అనుభవించి సుఖం కలిగిస్తుందని తెలుసుకొన్న వస్తువును మళ్ళీమళ్ళీ కావాలనుకోవటం ఇచ్ఛ. ఆ వస్తువు లభించినప్పుడు మనలో ప్రసన్నత - సంతోషం కలుగుతుంది. అదే సుఖం. ఒకప్పుడు అనుకోకుండా అనుభవించి, దుఃఖం కలిగిస్తుంది అని తెలుసుకొన్న వస్తువు తనకు అవసరం లేదనే నిరసన

భావం ద్వేషం. అట్టి అవసరంలేని - తనకు అయిష్టమైనవస్తువు లభిస్తే కలిగే క్లేశమే దుఃఖం. కావలనుకోనేదీ, వద్దనుకొనేదీ మనస్సులోనే, సుఖమైనా - దుఃఖమైనా ఆ అనుభవం కూడా మనస్సుకే. కనుక ఈ రాగ ద్వేషాలు, సుఖ దుఃఖాలు - ఇవి అంతఃకరణంలోని వికారాలు. అంటే మనస్సులోని వికారాలే. ఈ మనస్సు క్షేత్రానికి సంబంధించినదే గనుక ఇవి క్షేత్ర వికారాలే.

(ii) సంఘాతం :- అనేక వస్తువులతో - భాగాలతో కూడిన రూపాన్ని సంఘాతం అంటారు. ఈ శరీరం ఎలా ఏర్పడింది ? కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు, ముక్కు, నోరు - ఇలా అనేక అవయవాలతో కూడి ఉన్నది. వీటన్నింటికి వెనుక కనిపించని కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, అంతఃకరణం, ప్రాణాలు ఉన్నాయి. అందుకే ఈ శరీరాన్ని - క్షేత్రాన్ని సంఘాతం అన్నారు. ఇల్లు కూడా అంతే. గోడలు, స్థంభాలు, పైకప్పు, దర్వాజాలు, కిటికీలు మొ||న అనేక వస్తువులతో కూడి ఉంటుంది. అందుకే ఇల్లు కూడా సంఘాతమే. ఈ సంఘాత వస్తువులన్నీ వాటి ఉపయోగం కోసం కాదు. పరుల ఉపయోగం కోసమే. ఇల్లు ఇంటి కోసం కాదు యజమాని కోసం; దేహం దేహం కోసం కాదు దేహి కోసం (క్షేత్రజ్ఞునికోసం). కనుక సంఘాత వస్తువు క్షేత్రం. దాని ప్రభువు - యజమాని క్షేత్రజ్ఞుడు.

(iii) చేతన :- అంటే చైతన్యం. ఇది కూడా క్షేత్రమే. నిజంగా చైతన్యం అంటే ఆత్మయే. క్షేత్రజ్ఞుడే. కాని ఇక్కడ చైతన్యం నిజమైన చైతన్యం కాదు. ఇది చైతన్యాభాసం. చైతన్యంలాగా అనిపించేది. దేహం, ఇంద్రియాలు, ప్రాణాలు, అంతఃకరణాలలో తోచే చైతన్యం అంతా చైతన్యాభాసమే.

సూది కదులుతుంది. కాని ఆ కదలిక సూదిది కాదు. అయస్కాంతానిది. ఇనుము కాలుతుంది. ఆ కాలటం ఇనుము స్వభావం కాదు. అది ఇనుమును అంటిన అగ్నిది. అలాగే ఈ దేహేంద్రియాలు, అంతఃకరణం కదులుతూ వాటి పనులు అవి చేసుకొంటున్నాయి. చైతన్యవంతంగా కనిపిస్తాయి. అయినా ఆ చైతన్యం వాటిది కాదు. ఆత్మ చైతన్యం యొక్క సాన్నిహిత్యం వల్ల - దగ్గరగా ఉండటం వల్ల చైతన్యవంతాలుగా కనిపిస్తాయి. నిజంగా ఇవి జడవస్తువులు. ఈ జడవస్తువులలో తోచే చైతన్యాభాసాన్నే చేతనం అన్నారు. కనుక ఈ చేతన అనేది క్షేత్ర ధర్మమే.

ఈ శరీరం పుట్టినప్పుడు ఎంత పొడవుంది ? 15 నుండి 18 అంగుళాలు. 10 సంవత్సరాల తర్వాతనో ? 4 అడుగులు ఉంటుంది. ఇది ఎలా పెరిగింది ? చైతన్యం ఉండబట్టేనా ? అలాగే అనిపిస్తుంది. కాని ఇది క్షేత్రధర్మమే.

ఒక ఉదాహరణ చూడండి. **మీ** ఇంట్లో రోజూ రెండుసార్లు కసువు ఊడుస్తారు. దానిని **మీ** పెరట్లో ఒక మూలన వేస్తున్నారు. దీని కోసమే ఒక దిబ్బగుంట ఏర్పాటు చేస్తారు. రోజు ఊడ్చేకసువు, చెత్తాచెదారం ఆ దిబ్బగుంటలో వేస్తుంటారు. ఒక ఏడాది తర్వాత చూస్తే అది మనిషెత్తు దిబ్బగా ఉంటుంది. ఈ దిబ్బ ఇంతగా పెరగటానికి కారణం చైతన్యమా ? కాదు. మనం రోజు వేసే కసవు, చెత్తా చెదారమే.

అలాగే ఈ దేహం కూడా పెరుగుతున్నది. దీనికి కూడా రోజూ ఇడ్లీ, దోసె, సాంబారు, ఉప్మా, పూరీ, అన్నం, కూరలు, పెరుగు, పప్పు, పాయసం మొ॥న

వాటిని రోజుకు 2 సార్లు, 3 సార్లు, 4 సార్లు ఇంకా వీలుంటే ఎక్కువ సార్లు వేసి వేసి దిబ్బను పెంచినట్లు పెంచాం. ఈ పెరగటం అంతా చైతన్యస్వభావం కాదు. అది ఆభాసచైతన్యం. ఈ ఆభాసచైతన్యాన్నే చేతన అంటారు. ఈ పెరిగే స్వభావం దేహానిదే - క్షేత్రానిదే. నిజంగా చైతన్యానికి పెరిగే స్వభావం ఉంటే ఆత్మ పెరిగి పెరిగి పెద్దది కావాలి గదా ! అవుతున్నదా ? లేదే. కనుక ఈ పెరుగుదల అనే వికారం క్షేత్రానికి సంబంధించినదే.

విరిగిన ఎముకలు అతుక్కునేది ఈ చేతన వల్లనే. ఎముకలు క్రమంగా పెరిగి అతుక్కుంటాయి. ఈ చేతనను చైతన్యంగా భావించి నాస్తిక వాదులు శరీరంలోనే ఆత్మ పుడుతుందని అంటారు. కాని భగవంతుడు మాత్రం ఈ చేతనను ఆత్మ కన్న వేరైనదిగా చెప్పి క్షేత్ర సముదాయంలో చేర్చాడు.

(iv)ధృతి :- ధృతి అంటే ధారణా శక్తి - పట్టి ఉంచే శక్తి. ఈ దేహేంద్రియాలన్నింటిని ఒక్కటిగా నిలిపి ఉంచే శక్తినే ధృతి అన్నారు.

సర్కస్ లో పులులు, సింహాలు, ఏనుగులు, గుర్రాలు, మేకలు అన్నీ కలసికట్టుగా, ఒక్కటిగా ఉంటాయి. నిజంగా సింహానికీ ఏనుగుకు పడదు, పులికి మేకకు పడదు. అయినా అన్నీ కలసి ఒకదానితో మరొకదానికి ఏ పొరపొచ్చం లేకుండా ఒక్కటిగా ఉంటాయి. ఎలా సాధ్యం ? రింగ్ మాస్టర్ యొక్క ధారణాశక్తి - ధృతి.

అలాగే ఇక్కడ పంచభూతాలన్నింటికి ఒక దానికొకటి పడవు. భూమిని జలం మ్రింగేస్తుంది. జలాన్ని అగ్ని పీల్చేస్తుంది. అగ్నిని వాయువు అపహరిస్తుంది. వాయువును ఆకాశం కబళిస్తుంది. అయినా ఇవన్నీ వాటి

యొక్క వైరాన్ని విడిచి పెట్టి అన్నీదేహంలో ఒక్కటిగా ఉండి ఒకదానికొకటి పోషిస్తున్నాయి. ఈ ఐకమత్యానికి కారణమైన శక్తియే ధృతి.

ఆత్మ కన్న వేరైనదంతా విషయప్రపంచమే - క్షేత్రమే. ఈ శరీరం, ఇంద్రియాలు, అంతఃకరణాలు, ప్రాణాలు, ఇంద్రియాలు గ్రహించే శబ్ద స్పర్శ రూప రస గంధాలు, మనస్సులోని భావాలైన సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, బుద్ధిలోని కోరికలు, అభిప్రాయాలు - ఈ అన్నీ క్షేత్రానికి సంబంధించినవే. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ క్షేత్రం ఒక పెద్ద సామ్రాజ్యం. అందులో స్వేచ్ఛగా సంచరించే మహారాజే క్షేత్రజ్ఞుడు.

ఈ క్షేత్రజ్ఞుణ్ణి క్షేత్రం కన్న వేరుగా తెలుసుకుంటేనే దుఃఖ నివృతి - అలా తెలుసుకోవాలంటే క్షేత్రాన్ని గూర్చి, దాని వికారాలను గూర్చి, దాని పుట్టుపూర్వోత్తరాలను గురించి లోతుగా పరిశోధించి తెలుసుకోవాలి. అందుకే ఈ క్షేత్రాన్ని 'సవికారం' అన్నారు. అంటే వికారాలతో కూడినది - అని. ఆ వికారాలే ఇచ్ఛ ద్వేషం సుఖం దుఃఖం సంఘాతం(శరీరం) చేతన, ధృతి. కనుక వికారాలు కనిపించినప్పుడల్లా అవన్నీ క్షేత్రధర్మాలు, నావి కాదు అని త్రోసిపుచ్చు. రాగద్వేషాలు, సుఖదుఃఖాలు కలిగినప్పుడల్లా ఇవన్నీ ఈ క్షేత్రం యొక్క ధర్మాలే, క్షేత్రజ్ఞుడనైన నావి కావు అని త్రోసి వేసి నేను నిర్వికారుడనైన ఆత్మను అని భావించు. అన్ని క్షేత్రాలలోని ఆత్మ ఒక్కటే ఐతే అన్ని క్షేత్రాలకు సుఖమో దుఃఖమో ఎందుకు కలగటం లేదు. సుఖదుఃఖాలు ఆత్మ ధర్మం కాదు గనుక అవి క్షేత్ర ధర్మాలు గనుక అని తెలుసుకోవాలి. దీనితో క్షేత్రం గురించి చెప్పటం పూర్తి అయింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇంత వరకు క్షేత్రం గురించి చెప్పిన భగవానుడు ఇక క్షేత్రజ్ఞుని గురించి చెప్పాలి. కానీ వెంటనే చెప్పటం లేదు. జ్ఞానాన్ని గురించి చెబుతున్నాడు. ఏమని ?

**శ్లో|| అమానిత్వ మదం భిత్వం**

**అహింసాక్షాంతి రార్జవం |**

**ఆచార్యో పాసనం శౌచం**

**స్థైర్య మాత్మ వినిగ్రహః || `** **(8)**

**తా||** అభిమాన రాహిత్యం, దంభరాహిత్యం, అహింస, ఓర్పు, నిజాయితీ, గురు ఉపాసన, శుచిత్వం, ఆత్మనిగ్రహం. (జ్ఞాని లక్షణాలు)

**వ్యాఖ్య :-** భగవానుడు 'క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి సంక్షిప్తంగా చెప్పబోతున్నాను' అని మాట ఇచ్చి, ఆ మాట ప్రకారం రెండు శ్లోకాల్లో క్షేత్రం అంటే ఏమిటో, దాని స్వరూప స్వభావాలేమిటో, దాని పుట్టుపూర్వోత్తరాలేమిటో, దాని వికారాలేమిటో తెలియజేశాడు. ఇక క్షేత్రజ్ఞుని గురించి చెప్పాలి. ఎందుకంటే క్షేత్రాన్ని గురించి విచారణ జరిపితే దుఃఖ నివృత్తి, క్షేత్రజ్ఞుని గురించి విచారణ జరిపితే ఆనంద ప్రాప్తి, 'క్షేత్రం నేను కాదు' అని తెలియటంతో వేదాంతం పూర్తి కాలేదు. 'నేను క్షేత్రజ్ఞుడనే' అని తెలుసుకొనితీరాలి. అప్పుడే సమస్త దుఃఖాల నుండి, వికారాల నుండి విముక్తి, నిత్యానంద ప్రాప్తి. శాశ్వతానంద ప్రాప్తి.

మరి ఈ క్షేత్రజ్ఞుని విచారణను వెంటనే ప్రారంభించటం లేదు భగవానుడు. ఎందుకని ? క్షేత్రజ్ఞుడన్నా, పురుషుడన్నా, జ్ఞేయమన్నా - అన్నీ ఒక్కటే. అన్నీ సమానార్థక పదాలే. పురుషుని గురించి చెప్పినా, జ్ఞేయాన్ని

గురించి చెప్పినా క్షేత్రజ్ఞుని గురించి చెప్పినట్లే. అంతే కాదు మరొక ముఖ్య విషయం ఉన్నది.

క్షేత్రం అనేది అనాత్మపదార్థం, అనిత్యమైనది, అది చైతన్యం కాదు. ఇట్టి జడపదార్థాన్ని-అనాత్మపదార్థాన్ని, దృశ్యపదార్థాన్ని గురించి తెలుసుకోవటానికి అధికారి - అనధికారి అనే తేడా లేదు. అర్హత ఉన్నదా ? లేదా ? అని చూడాల్సిన పని లేదు. అందుకే వెనకా ముందూ చూడకుండా ఎకాఎకిన చెప్పేశాడు భగవానుడు. కాని క్షేత్రజ్ఞుని విషయం వేరు. అది సూక్ష్మాతి సూక్ష్మం, ఇంద్రియ అగోచరం, ఆత్మ విషయం కనుక అధికారి అయిన వారికే చెప్పాలి. గురువు పట్ల విశ్వాసం గల వారికే చెప్పాలి.

అమృతాన్ని త్రాగాలంటే దేవతలకే అర్హత. రాక్షసులకు ఆ అర్హత లేదు. సింహం పాలను పట్టాలంటే బంగారు పాత్రే కావాలి. చిల్లర పాత్రలలో పోస్తే చిల్లులు పొడుచుకొని పోతాయి. నాగస్వరాన్ని ఆలకించటానికి నాగుపాములే కావాలి. మట్టి పాములు, తుట్టె పురుగులు అందుకు పనికిరావు.

అలాగే సకల దుఃఖాలను పోగొట్టి, ఆత్మానందాన్ని ప్రసాదించే ఆత్మ విద్యను - బ్రహ్మవిద్యను గ్రహించాలంటే అధికారి కావాలి. అర్హత ఉండాలి. లౌకిక విద్యలను నేర్చుకోవటానికే అర్హత పరీక్షలను పెడతారు. మరి ఈ బ్రహ్మవిద్యకు అర్హత ఉండనవసరం లేదా ?

అయితే ఇట్టి బ్రహ్మవిద్యకు అర్హతను నిర్ణయించటం ఎట్లాగ ? డ్రస్సులో, గుండు గీయించటమో, గడ్డాలు - మీసాలు పెంచటమో, రుద్రాక్ష మాలలు

ధరించటమో కాదు. అంతఃకరణాన్ని బట్టి అర్హత నిర్ణయించబడుతుంది. మన అంతఃకరణం ఎన్నో ఏండ్ల బట్టి, ఎన్నో జన్మల నుండి బయటి విషయ ప్రపంచంలో తిరిగి తిరిగి చెడిపోయి ఉన్నది. కల్మషపడిపోయి ఉన్నది. ఇప్పుడు దానిని సంస్కరించి, కల్మషాలను వదిలించి, శుద్ధం చేసి, అంతర్ముఖం చేసి, ఏకాగ్రం చేయాలి. అప్పుడే బ్రహ్మ విద్యను గ్రహించే అర్హత వస్తుంది. అట్టి అర్హతను సంపాదించాలంటే ఎట్టి గుణగణాలు, ఎట్టి నీతినియమాలు, ఎట్టి మనోప్రవృత్తులు ఉండాలో వాటిని ముందుగా వివరిస్తున్నాడు భగవానుడు. అమానిత్వాది 20 గుణాలను రాబోయే 5 శ్లోకాల్లో వివరించబోతున్నాడు. ఇవే జ్ఞానికి ఉండవలసిన లక్షణాలు - గుణాలు. ఈ జ్ఞాన సాధనాలే జ్ఞానం. ఇప్పుడా జ్ఞాని లక్షణాలేమిటో చూద్దాం.

ముందుగా ఈ శ్లోకంలో 9 జ్ఞాని లక్షణాలను వివరిస్తున్నారు.

1. అమానిత్వం :- మానిత్వం లేకుండుట; అభిమానం లేకుండుటయే అమానిత్వం. 'మానం ఉన్నచోట జ్ఞానం ఉండదు' అంటారు. మహాభారతంలో మనకొక అహంకారి - అభిమానధనుడు కనిపిస్తాడు. అతడే దుర్యోధనుడు. తన గురించి తానే అభిమానధనుడనని చెప్పుకున్నాడు. పాండవులు సర్వ సంపదలతో తులతూగుతూ ఉంటే చూచి నేను ఎలా సహించగలను ? "మానధనాఢ్యుడైన భూపతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు ఆత్మ హానియున్" అంటాడు. అతడంతటి మానధనుడు గనుకనే జ్ఞాన శూన్యుడై సర్వ నాశనమయ్యాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అందరూ తననే గౌరవించాలని, తననే గొప్పగా భావించాలని అనుకోవటం అభిమాని లక్షణం. నిజంగా గౌరవం పొందటానికి అర్హుడు భగవంతుడే. విష్ణు సహస్రనామాల్లో భగవంతునికి ఒక నామం "అమానీ మానదో మాన్య" అని. కనుక గౌరవం ఇచ్చేందుకైనా, పుచ్చుకొనేందుకైనా అర్హుడు భగవంతుడే.

అసలు మనకు ఎన్ని రకాల అభిమానమో చూడండి. దేహాభిమానం, కులాభిమానం, మతాభిమానం, విద్యాభిమానం, ధనాభిమానం, పండితుడిననే అభిమానం, వేదాంతిననే అభిమానం, భక్తుడిననే అభిమానం, జ్ఞానిననే అభిమానం, ధ్యానులమనే అభిమానం, తపస్వినని అభిమానం - ఒకటా రెండా ? తండోపతండాలు. తాను ఎంత గొప్పవాడైనా, ఎన్ని ఉత్తమ గుణాలున్నా, అందరికన్న అన్ని విషయాలలో గొప్పవాడైనా విర్ర వీగకుండా ఉండటమే అమానిత్వం. కనుక Simple living and high thinking - సాధారణంగా జీవించాలి, ఉన్నతంగా ఆలోచించాలి. ఎండుటాకులా ఎగిరెగిరిపడకూడదు.

ఒక్కసారి నీటిని చూడండి. మన దప్పిక తీర్చేది నీరు. ఏదన్నా తినేటప్పుడు గొంతు పట్టుకుంటే నీరు కావాలి. లేకపోతే ప్రాణానికే ప్రమాదం. కాలకృత్యాలు తీర్చుకొనుటకు నీరు కావాలి. అన్నం వండాలంటే నీరు కావాలి. బురద కడుక్కోవాలంటే నీరు కావాలి. అయినప్పటికీ ఆ నీటికి ఏమైనా అభిమానం అహంకారం ఉన్నాయా ? ఎంత మెత్తగా, అణుకువగా ఉంటుందో చూడండి. నీటికి ఏ రంగూ, రుచీ ఉండవు. కాని ఏ రంగు కలిపితే ఆ రంగులో

కనిపిస్తుంది. దానిలో ఉప్పు వేస్తే నీరు ఉప్పగా మారిపోతుంది. పంచదార వేస్తే తియ్యగా మారిపోతుంది. ఆ! నేనింత గొప్పదాన్ని గదా! వాళ్ళు ఏది వేస్తే దానికి అనుగుణంగా నేనెందుకు మారాలి ? అని అనుకుంటుందా ? తన గొప్ప తనాన్ని ప్రదర్శించాలనుకుంటుందా ? లేదు. ఎంతటి అభిమానరాహిత్యం ? కాని మన వ్యవహారం ఎలా ఉంటుంది ? ఎదుటి వాళ్ళకు అనుకూలంగా మనం మారం. వాళ్ళే మనకు అనుకూలంగా మారాలి. మనం తగ్గకూడదు. వారే తగ్గాలి. ఇదే అభిమానం. ఇది వదులుకుంటే అమానిత్వమే. ఎవరికైన ఏదైనా ఉపకారం చేస్తే చాలు ఆ ఉపకారం పొందిన వాళ్ళు మన పట్ల కృతజ్ఞత చూపిన దాకా ఊరుకోం. వారు కృతజ్ఞత చూపకపోతే వారి ఎదుటనే కడిగేస్తాం. నాలాగా ఉపకారం చెయ్యటం లేదని అవతలవారిని తేలికగా చూస్తాం. వీలైతే అవమానిస్తాం. మనలో గోరంత మంచి ఉంటే చాలు కొండంతగా చూపి మన తప్పెట మనమే వాయిస్తాం. మన జెండా మనమే ఎగురవేస్తాం.

అయితే జ్ఞానాన్ని కోరుకొనేవాడు ఈ దుర్లక్షణాన్ని, అభిమానాన్ని వదులు కోవాలి. నీలో ఎంత మంచి ఉన్నా, ఎంత గొప్పతనం ఉన్నా దాన్ని పదిలంగా దాచుకోవాలి. అలా గుప్తంగా దాచుకొంటేనే కాలక్రమంలో అదివృద్ధియై నిన్ను కాపాడుతుంది.

మనం భూమిలో విత్తనాలు నాటుతాం. జాగ్రత్తగా విత్తనం నేలలోకి వెళ్ళేట్లు వేలితో నొక్కుతాం. ఆ తర్వాత నీరు చేల్లేటప్పుడు గాని, మట్టి అటూ ఇటూ చెదరటం వల్ల గాని కొన్ని విత్తనాలు పైకి వస్తాయి. కొన్ని భూమిలోనే

ఉండి పోతాయి. అలా మట్టి క్రింద గుప్తంగా ఉన్న విత్తనాలే మొలకెత్తి, పెద్ద వృక్షాలై ఫలాలనిస్తాయి. అలాగాక ఇంత గొప్ప ఫలాల నివ్వగల శక్తి ఉన్న మేము పిచ్చి మొహాల్లాగా భూమి లోపల పడిఉండటమేమిటి ? పైకి వెళ్ళి మన తెలివిని, గొప్పతనాన్ని ప్రదర్శిద్దాం అనుకొని బయటకు వచ్చిన విత్తనాలు అంతే చెల్లు, కుళ్ళి చచ్చిపోతాయి. మళ్ళీ నాటటానికి ఉపయోగపడవు. కనుక అభిమానం లేకుండా ఉండాలి. అణుకువ ఉండాలి. దాన్నే అమానిత్వం అన్నారు. జ్ఞానాన్ని పొందాలంటే అమానిత్వం అత్యంత ముఖ్యమైన లక్షణం.

2. అదంభిత్వం :- దంభం లేకుండుట. ఇదొక గొప్ప సుగుణం. ఈనాడు ప్రపంచంలో ఎక్కడ చూచినా డంబాచారమే. తనకు ఏ గొప్పతనం లేకపోయినా అందరి ముందు గొప్పగా కనపడాలి. తనకేమీ తెలియక పోయినా సర్వజ్ఞుడుగా ఫోజ్ ఇవ్వాలి. ఇంట్లో పైసా విలువ లేకపోయినా బయట ఎంతో గొప్పవాడిగా కనిపించాలి. భక్తుడు కాకపోయినా భక్తుడిలా కనిపించాలి. దేనినీ వదలకపోయినా సర్వ సంగ పరిత్యాగిలా దర్శనమివ్వాలి. లోపల అగ్ని పర్వతాలు ప్రేలుతున్నా ఆత్మానందంలో రమించేవాడుగా ప్రసన్నంగా కనిపించాలి. పండితుడు కాకపోయినా పండిత శాలువా కప్పుకొని పండితునిలా ఫోజ్ కొట్టాలి. ఇదంతా దంభుని సామ్రాజ్యం.

రాజకీయ నాయకులు, సమాజ సేవకులు, ధార్మిక ప్రచారకులు, పండితులు, పామరులు, సాధువులు, సన్యాసులు - వారు వీరేమిటి ? అందరికందరూ వారి వారి అంతస్థుల్లో ఈ దంభ దేవతకు పూజారులే. ఇదొక పెద్ద లోకవాసన. సాధు సన్యాసుల విషయం ఫోటో తీసేటప్పుడో,

సందర్శకులెవరైన వచ్చినప్పుడో చూడాలి. ఆ ఊర్ధ్వదృష్టి, అర్ధనిమీలిత నేత్రాలు, చిన్ముద్ర, సమాధినిష్ఠాగరిష్టత్వం, పాదుకలు, యోగదండాలు, జపమాలలు, కమండలాలు, కృష్ణాజినాలు - ఒకటేమిటి మారుమూలల్లో ఎక్కడో పడిఉండి తుప్పుపట్టిపోయిన వాటికి దుమ్ముదులిపి, శుభ్రంచేసి ఉపయోగిస్తారు. వట్టి డంబాచారం. వట్టి ఆడంబరం. ఊరికే సాదా సీదాగా ఉంటే ఏం నష్టం ?

రమణమహర్షిని చూడండి, రామకృష్ణ పరమహంసను చూడండి, షిరిడీ సాయిబాబాను చూడండి. గడ్డం తీయించుకోరు, క్రాఫ్ చేయించుకోరు. ఒంటి మీద ఏమి బట్ట ఉన్నదీ చూచుకోలేదు. తినేది ఏ పదార్థమో పట్టించుకోలేదు. వారికి వచ్చిన లోపం ఏమిటి ? వారికున్న కీర్తి ఎవరికి ఉన్నది ? డంబం అనేది ఒక్కటి తగ్గించుకుంటే చాలు, సగం రోగం పోయినట్లే.

డంబం అనేది ఆసురీ సంపద. ఇది మానవుణ్ణి నాశనం చేస్తుంది. అదంభిత్వం అంటే తనలో కించిత్తు దోషం ఉన్నా, దాన్ని సమాజం ఎదుట పారవెయ్యాలి; వెల్లడి చేయాలి. సమాజం క్షమిస్తుంది. భగవంతుడు మన్నిస్తాడు. గాంధీగారు తన ఆత్మ కథలో తన లోపాలను ఎన్నిటినో చెప్పుకున్నారు. లక్ష శ్లోకాల మహాభారతాన్ని వ్రాసిన వ్యాసుడు తన పుట్టుకను ఎలా వ్రాసుకున్నాడో చూడండి.

- తన మంచిని దాచుకోవటం అమానిత్వం.
- తన చెడ్డను బయట పెట్టుకోవటం అదంభిత్వం.

ఈ రెండు గుణాలు జ్ఞానికి ఎంతగానో సహాయపడతాయి.

3. అహింస :- అహింస అంటే హింస చేయకుండా ఉండుట. శారీరకంగాగాని, మానసికంగాగాని, మాటల ద్వారాగాని ఎవరినీ హింసించరాదు. కేవలం మానవులనే కాదు జంతువులను, పశువులను, పక్షులను, క్రిమికీటకాదులను వేటినీ హింసించరాదు. అయితే కొన్నిసార్లు అనుకోకుండా హింస జరిగిపోతూనే ఉంటుంది. చిమ్మేటప్పుడు, వంట చేసేటప్పుడు, దంచేటప్పుడు, విసిరేటప్పుడు అనుకోకుండా కొన్ని సూక్ష్మజీవులు చనిపోతూ ఉంటాయి. ఇప్పుడు నేను ప్రవచనాలు చేస్తున్నాను. ఈ మాటల ఉరవడికి, మాట్లాడేటప్పుడు విడుదలయ్యే అగ్ని(వేడి)కి అనేక సూక్ష్మ జీవులు మలమల మాడిపోతాయి. మనం నడిచేటప్పుడు, పడుకొనేటప్పుడు అనేక సందర్భాలలో మనకు తెలియకుండానే హింస జరిగిపోతుంది. అయితే ఇది అనుకొని చేసేది కాదు, స్వార్థంతో చేసేది కాదు, ఉద్దేశపూర్వకంగా చేసేది కాదు. అందువల్ల ఇది హింస కాదు.

ఒక్కొక్కప్పుడు హింస కూడా అహింసే అవుతుంది. ఒక తుప్పు పట్టిన సీల మీద కాలు వేశావు. గాయం అయింది. అశ్రద్ధ చేశావు. మందులు వాడలేదు. సెప్టిక్ అయింది. అయినా అన్నీ తింటూనే ఉన్నావు. పాదమంతా కుళ్ళిపోయింది. చివరకు డాక్టరు దగ్గరకెళ్ళావు. కుళ్ళిన పాదాన్ని తీసివేయకపోతే ప్రాణానికే ప్రమాదం అన్నాడు డాక్టరు. అంగీకరించావు. డాక్టరు ఆపరేషన్ చేసి పాదాన్ని తీసివేసాడు. ఇదొక ఘటన.

ఒక బాలిక కాళ్ళకు క్రొత్త పట్టీలు పెట్టుకొని వెళుతున్నది. ఆ ప్రాంతంలో ఆ సమయంలో జనసంచారం లేదు. అదే సమయంలో ఒక దొంగ చూచాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పట్టీలు లాగితే రాలేదు. బాలిక ఏడుస్తున్నది. తటాలున కత్తితో పాదాలను నరికి పట్టీలు కాజేసి వెళ్ళిపోయాడు దొంగ. ఇదొక ఘటన.

పాదాన్ని నరకటం డాక్టరూ చేశాడు, దొంగా చేశాడు. రెండు సంఘటనలలోను ఎంతో రక్తం పోయింది. భీభత్సంగా ఉంది. అయితే డాక్టరు మన మేలు కొరకు పాదాన్ని తీసేశాడు కనుక అది అహింస. దొంగ తన స్వార్థం కోసం పాదాన్ని నరికాడు కనుక అది హింస అయింది. అంటే చేసిన పనిని బట్టి గాక ఆ పని వెనుక ఉన్న భావాన్ని బట్టి అది హింసో, అహింసో నిర్ణయమౌతుంది.

ఎవడైనా ఇల్లు తగలబెడితే ఆతతాయి అంటారు. వాణ్ణి పట్టుకొని తంతాం. ఆంజనేయుడు ఒక్క యింటిని కాదు బంగారం వంటి లంకా నగరాన్ని మొత్తం మొత్తంగా తగలబెట్టాడు. ఆయన్ని దేవుడుగా పూజిస్తున్నాం. శ్రీకృష్ణుడు 18 అక్షౌహిణుల సేనను సర్వనాశనం చేయించాడు. అయినా అహింసామూర్తియే. ఒక్కొక్కప్పుడు ఇలా హింస కూడా అహింసే అవుతుంది. ఎలా ?

ఈ ప్రపంచమంతా ఆ విరాట్ పురుషుని శరీరమే. ఈ శరీరంలో కౌరవులనే అవయవం సెప్టిక్ అయింది. ఎన్ని మందులు వేసినా తగ్గలేదు, కుళ్ళిపోయింది. ఆ అవయవాన్ని ఆపరేషన్ చేసి తీసివేయకపోతే ప్రపంచమనే ఈ శరీరమంతా పాకిపోతుంది. విషపూరితం అవుతుంది. అందుకే ఆపరేషన్ చేయవలసి వచ్చింది. సంధులు, రాయబారాలు అనే మందులు మాకులు పని చేయలేదు. అందుకే జగద్వైద్యుడు శ్రీకృష్ణుడు

అర్జునుడనే కాంపౌండరును దగ్గర బెట్టుకొని ఆపరేషన్ చేసి కౌరవులనే కుళ్ళిన అవయవాన్ని తీసేశాడు. మిగిలిన లోకమనే దేహాన్ని రక్షించాడు. ధర్మరక్షణ అనే సదాశయంతో చేసిన ఈ హింస హింస కాదు, అహింసయే.

ఈ అహింసావ్రతంలో చాలవరకు విజయం సాధించిన కర్మవీరుడు మన భారత రాజకీయరంగంలో వెలిశాడు. ఆయనే మహాత్మాగాంధీ. రాజకీయరంగంలో అహింస అనే ఆయుధాన్ని చేపట్టి విజయాన్ని సాధించటం ఆయనకే చెల్లింది. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కేవలం అహింస ద్వారా - ఉపవాసం ద్వారా - సత్యాగ్రహం ద్వారా గడగడలాడించి దేశం నుండి వారిని పారద్రోలటం సామాన్యమైన విషయం కాదు. ఆయన అనేకులకు మార్గదర్శకుడయ్యాడు.

ఆధ్యాత్మికరంగంలో అహింస యొక్క ప్రాధాన్యత ఎంతో ఉంది. ఈ రంగంలో శారీరక హింస ఉండదు కాని మానసిక హింస, వాచికహింస ఉంటుంది. దీనిలో బాగా పని చేసేది నాలుక. ఈ నాలుక ఎంత మెత్తనిదో అంత పదునైనది. మాటలతోనే అవతలి వారి గుండెను పరపర కోయవచ్చు. మాటలతో వ్యక్తుల మనస్సులను చెడగొట్టి, వారిని ఇక్కట్లపాలు చేయవచ్చు. నిందలు వేసి నానా రకాలుగా హింసించవచ్చు.

ఆధ్యాత్మికంగా పురోగమించాలని భావించేవారు ఈ హింసకు దూరంగా ఉండాలి. అంటే మాట్లాడే ప్రతి మాట ఎంతో మృదువుగా, నమ్రతగా, హితంగా ఉండాలి. కర్ణకఠోరంగా గాక కర్ణపేయంగా ఉండాలి. తన మాటలవల్ల గాని,

చేతల వల్ల గాని ఇతరుల మనస్సు గాయపడరాదు. అలా మృదువుగా మాట్లాడాలి. అదే అహింస.

4. క్షాంతి :- క్షాంతి అంటే క్షమాగుణం, ఓర్పు, సహనం. అయితే ఈ సహనం రెండు రకాలు. తనకన్న బలవంతుడు, ధనవంతుడు, పదవిలో ఉన్నవాడు తనకు బాధ కలిగించినప్పుడు చేసేదిలేక సహనం వహించటం ఒకటి. తనకు ఎదిరించే శక్తి ఉన్నప్పటికీ తనకు అపకారం చేసిన, తనను బాధపెట్టినవాణ్ణి క్షమించి ఊరుకోవటం రెండవది. మొదటి సహనం సహనం కాదు. విధిలేక ఓర్చుకోవటం. అది పశులక్షణం. పశువులు గతిలేక, విధిలేక తన్నులు తింటూ పనిచేస్తూ ఉంటాయి. రెండవది నిజమైన సహనం. "చెల్లి యుండియుసైరణ చేయుటే" ఎదురు తిరిగే శక్తి ఉండికూడా ఓర్చుకొనుటే క్షమ - క్షాంతి.

క్షమాశీలుడు పరులు చేసిన అపకారాలను నీటి మీది రాతలు లాగా వెంటనే మరచిపోతాడు. అతడికి ప్రతీకార బుద్ధి ఉండదు. విధిలేక ఓర్చుకున్న వాడి మనస్సంతా ఆందోళనతో నిండిపోతుంది. లోపల అంతా అశాంతియే. ఇలా బయట క్షాంతి, లోపల అశాంతి ఉంటే అది నిజామైన క్షాంతి కాదు. శాంతితో కూడినప్పుడే క్షాంతికి విలువ. సాధకుడు నిజమైన క్షాంతితో శాంతిని నింపుకోవాలి. అప్పుడే ఆధ్యాత్మిక అవగాహన సాధ్యం.

5.ఆర్జవం :- ఆర్జవం అంటే నిజాయితీ, ఋజుత్వం. మనసులో ఉన్న భావాన్నే మాటల్లో వ్యక్తం చేయాలి. అలా వ్యక్తం చేసిన దానినే చేతల్లో చేయాలి. ఇదే త్రికరణ శుద్ధి. నిజాయితీ. స్వార్ధపరుడు అలా నిజాయితీతో ఉండలేడు. చెప్పేది ఒకటి, చేసేది ఒకటిగా ఉంటుంది. తండ్రీబిడ్డల మధ్య, భార్యాభర్తల మధ్య,

గురుశిష్యుల మధ్య, ప్రభువుసేవకుల మధ్య ఈ ఆర్జవం - నిజాయితీ లేకపోతే వారి నిత్యజీవిత వ్యవహారాలన్నీ అశాంతితో కూడి ఉంటాయి. మనస్సు శాంతితో ఉండాలంటే ఆధ్యాత్మిక రంగంలో కూడా ఈ ఆర్జవం (ఋజుత్వం - నిజాయితీ) తప్పక ఉండాలి.

6. ఆచార్యోపాసనం :- జ్ఞాన మార్గంలో - మోక్ష మార్గంలో పయనించే సాధకునికి అతి ముఖ్యమైన లక్షణం ఈ ఆచార్యోపాసనం. మోక్ష మార్గంలో ముందుకు పోవాలంటే భగవంతుని అనుగ్రహం కావాలి. భగవంతుని అనుగ్రహం కేవలం గురుసేవ ద్వారానే లభిస్తుంది. ఎందుకంటే భగవంతునితో ఐక్యతను కలిగించే మార్గాన్ని బోధించేవాడు గురువే - సద్గురువే. అందుకే "ఆచార్యవాన్ పురుషో వేదః" అని వేదం చెబుతున్నది. 'గురువు లేని విద్య గ్రుడ్డి విద్య' అంటారు. అయితే గురువు ఉంటే చాలదు. ఆయనను సేవించి ఆయన అనుగ్రహాన్ని పొందాలి. గురువు పట్ల వినయం, విధేయత, విశ్వాసం, పూజ్యభావం ఉండాలి. గురుసేవ, గురుభక్తి వల్లనే శిష్యుని పై అపార వాత్సల్యం కలుగుతుంది.

శంకరాచార్యుల శిష్యులలో పద్మపాదాచార్యులు ఒకరు. అతడు మంద బుద్ధి. మిగిలిన శిష్యులు మేధావులు. పద్మపాదుడే మొద్దబ్బాయి. అయితే అతడికి గురువుపై అచంచల విశ్వాసం. గురువుపై ఈగ వాలనివ్వడు. గురుదేవుల స్వంత విషయాలు - అంటే బట్టలు ఉతకటం, భోజనాదికాలు, శరీర సేవ - అన్నీ పద్మపాదుడే స్వయంగా చూస్తాడు.

ఒకరోజున కట్టెలు తేవటానికి నది ఆవలివైపుకి వెళ్ళాడు పద్మపాదుడు. అదే సమయంలో ఆశ్రమంలో గురువు బోధ ప్రారంభించబోతున్నాడు. ఒక శిష్యుడు తక్కువగా ఉన్నాడు. అతడు తన ప్రియ శిష్యుడే. అందుకే అతడు వచ్చేవరకు పాఠం ఆపి కూర్చున్నాడు. అంతలో ఒక శిష్యుడు లేచి "గురుదేవా! అతడు పాఠం విన్నా వినక పోయినా తేడా ఏమీ ఉండదు. కనుక మీరు పాఠం ప్రారంభించండి" అన్నాడు. శిష్యుని అహంకారాన్ని గుర్తించిన గురువు "శిష్యా! కట్టెల మోపు నెత్తిన పెట్టుకొని వచ్చేసెయ్" అన్నాడు. అంతే మోపు నెత్తిన పెట్టుకొని పరుగు తీశాడు పద్మ పాదుడు. నది ఉరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్నది దిగితే మునిగిపోవటం ఖాయం. అయినా ఒక్క క్షణం ఆలోచించలేదు. అడుగు ముందుకు వేసాడు. అయితే అతడి అడుగులు నీటిపైన నిలిచిపోతున్నాయి. అతడి పాదాలకు అడుగున తామరాకులు నిలిచి ఉంటున్నాయి. అవి నీటిలో మునగటం లేదు. అతడలా నీటి మీద నడుచుకుంటూ ఒక్కక్షణంలో గురువుగారి ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఇదంతా గురుకృపయేనని మనస్సులో భావించాడు. అందుకే అతడి పేరు పద్మ పాదాచార్యులు అయింది. శిష్యులందరిలో ప్రప్రథముడయ్యాడు.

ఈ రోజుల్లో ఇట్టి గురువులు, శిష్యులు మృగ్యమయ్యారు. అరుదుగా ఉంటున్నారు. వాలుకుర్చీమీద వయ్యారంగా పడుకొని వార్తాపత్రికను చదివినట్లు చదివే విద్య కాదు వేదాంత విద్య. "తత్ విజ్ఞానార్థం స గురుమే వాభి గచ్ఛేత్ సమిత్పాణిం శ్రోత్రియం బ్రహ్మ నిష్టం" అని ముండకోపనిషత్తు

చెబుతున్నది. బ్రహ్మ విద్యను పొందటానికి గురువును శరణు పొందాలి. అందుకే "ముక్తి మూలం గురోఃకృపా" అని గురుగీత చెబుతున్నది.

భగవంతుని పూజిస్తే ఎప్పుడో ఫలితం. కానీ గురువును పూజిస్తే సద్యో ఫలితం - ఇప్పటికిప్పుడే ఫలితం. గురువూ గోవిందుడు నా ఎదుటే ఉన్నారు. నేను ఎవరికి ముందు నమస్కరించాలి ? అని ప్రశ్నించుకొని గురువుకే ముందు నమస్కరిస్తాను, ఎందుకంటే గురువు ద్వారానే గోవిందుని దర్శనం కలుగుతుంది అని సంత్ కబీర్ దాస్ వర్ణించాడు.

గురువుకే ముందు ఎందుకు నమస్కరించాలి ? భగవంతుడికి కోపం వస్తే గురువు సర్ది చెబుతాడు. కాని గురువుకి కోపం వస్తే సర్ది చెప్పాల్సిన అవసరం భగవంతునికి ఉండదు గదా! అన్నాడొక చమత్కారి.

కనుక ఆచార్యోపాసనం - గురుపూజ - గురుసేవ ఎంతో నిష్టగా, మనసు నిండా భక్తి నింపుకొని చేసే వానికే ఈ జ్ఞానం అబ్బుతుంది - అని గ్రహించాలి. జ్ఞానార్జనకు ఆచార్యోపాసనం అత్యవసరం.

7. శౌచం :- శౌచం అంటే శుచిత్వం. జ్ఞానాన్ని పొందాలనుకొనే సాధకుడు అలవరచుకోవలసిన సుగుణం ఈ శౌచం. ఈ శౌచం రెండు విధాలు. (i) బాహ్యశుచి (ii)అంతఃశుచి. అంతఃశుచి చాలా ముఖ్యం. అలాగని బహ్యశుచి విషయంలో అశ్రద్ధ పనికి రాదు.

నలమహారాజు పాదాలు పూర్తిగా తడవకుండా కాళ్ళు కడుక్కోవటం వల్ల ఎన్ని పడరాని పాట్లు పడ్డాడో మహాభారతం మనకు చెబుతున్నది. కనుక బాహ్యశుచి కూడా అవసరమే. ఒక రైతు తన పంట అంతా ఎవరో

కోసుకుపోతున్నారని స్నేహితునితో చెబితే, ఆ స్నేహితుడు, "చేనుకు - కంచె ఒక్కటే చాలా ముఖ్యం. ఆ కంచెను కాపాడుకుంటూ ఉంటే చాలు ఇక నీకు ఏ దిగులూ ఉండదు" అన్నాడు. దానితో అతడు మరుసటి సంవత్సరం చక్కగా కంచెవేసి దానిని కాపాడుతున్నాడు. ఒకనాడు ఆ స్నేహితుడు అటుగా వచ్చి చూచి, "ఏమయ్యా! పైరు వెయ్యలేదేం ?" అన్నాడు. దానికా - రైతు "కంచె ఒక్కటే ముఖ్యం, దాన్ని కాపాడుకుంటూ ఉంటే చాలు ఏ దిగులూ ఉండదు" అన్నావు గదా! అందుకే కంచె వేసి కాపాడుకుంటున్నాను అన్నాడు. వాడి తెలివి తెల్లారినట్లే ఉంది. పైరు లేకుండా కంచె దేనికి ? అలాగే అంతఃశౌచం లేని బాహ్యశౌచం వ్యర్థమే.

ఆధ్యాత్మికరంగంలో అంతఃశౌచం చాలా ముఖ్యం. జలంతో దేహాన్ని శుద్ధి చేసుకోవచ్చు. మనశ్శుద్ధి కావాలంటే సత్యం ద్వారానే సాధ్యం. రాగద్వేషాలు, కామక్రోధాలు విడిచిపెట్టి సాత్వికమైన దైవీగుణాలను అలవరుచుకుంటే మనస్సు శుద్ధమౌతుంది. అందుకే చిత్త శుద్ధి లేని శివపూజలేలయా విశ్వదాభిరామ వినురవేమా! అన్నాడు వేమన యోగి. చిత్తం శుద్ధంగా ఉంటేనే మనస్సు నిర్మలమై ప్రశాంతమవుతుంది. అప్పుడే బుద్ధి సూక్ష్మమై జ్ఞానం అవగతుమవుతుంది.

8. స్థైర్యం :- స్థైర్యం అంటే స్థిరత్వం - పట్టుదల - దీక్ష. చపలచిత్తుడు ఏ కార్యాన్నీ సాధించలేడు; దేన్నీ పూర్తి చేయడు. చివరికి అతడికి ఫలితం శూన్యం - పట్టుదల - దీక్షగలవాడు ఎన్ని ఆటంకాలు కలిగినా, నిరాశపడకుండ

ముందుకు వెళతాడు, కార్యాన్ని సాధిస్తాడు. మోక్షప్రాప్తి కలిగేంతవరకు సాధకుడు తన ప్రయత్నాన్ని విడిచిపెట్టరాదు. అదే స్థైర్యం.

. 'కార్యం వా సాధయామి - దేహం వా పాతయామి'.

. 'విజయమో - వీర స్వర్గమో ఏదో ఒకటి తేలాలి'.

. "Do or Die". - 'కరో యా మరో' అనే ధృఢచిత్తుడే ఆత్మజ్ఞానాన్ని పొందగలడు, ముక్తినందుకోగలడు. బుద్ధునిలాగా లేక ధృవునిలాగా, ఎన్ని ఆటంకాలుకలిగినా కార్యం నెగ్గేవరకు కంకణ విసర్జనం చేయకూడదు. విజయం లభించేంత వరకు ఆయుధాన్ని విడిచిపెట్టరాదు. "మనుష్యుడు ప్రయత్నిస్తే నరకాన్ని స్వర్గంగా మార్చగలడు" అని మిల్టన్ మహాకవి అన్నాడు.

"సతు దీర్ఘకాల నైరంతర్య సత్కార సేవితో దృఢ భూమి" - అని పతంజలి మహర్షి సెలవిచ్చాడు. సాధన పట్టు వదలక చేస్తేనే సిద్ధి. కనుక మిన్ను విరిగి మీదపడ్డా, మేరు పర్వతం ఒరిగిపోయినా, దిక్కులు దిక్కులేకుండాపోయినా, తనకు ఎలాంటి కష్టం - నష్టం కలిగినా సాధకుడు సాధన విడిచిపెట్టకూడదు. సాధన ఆపినవారికి జ్ఞాన ప్రాప్తీ లేదు, మోక్ష ప్రాప్తీ లేదు. జ్ఞాన ప్రాప్తికి ఈ పట్టుదల ఎంతో అవసరం. నిజంగా మీరు ఎంత పట్టుదల గలవారు కాకపోతే ఈ ఆత్మజ్ఞానాన్ని పొందటానికి సంవత్సరాలు సంవత్సరాలుగా ప్రతిరోజూ సత్సంగానికి హాజరవుతారు ? ఎన్ని ఆటంకాలు కలిగినా, అవాంతరాలు వచ్చినా 20-25 సంవత్సరాల నుండి ప్రతిరోజూ ఇలా హాజరుకావటం నభూతోనభవిష్యతి అని చెప్పాలి.

ఈ పట్టుదలకు సంబంధించి ఒక ఉదాహరణను గౌడపాదాచార్యులు తన మాండుక్యకారికలలో ఇలా తెలియజేసాడు.

సముద్రంఒడ్డున ఒక టిట్టిభపక్షి గూడు కట్టుకొని గ్రుడ్లు పెట్టింది. సముద్ర అలల తాకిడికి గూడు చెదిరింది. గ్రుడ్లు సముద్రంలోనికి పోయినవి. ఒక్కసారే కాదు అనేకసార్లు ఇలాగే జరిగింది. దానితో టిట్టిభానికి సముద్రంపై పట్టరాని కోపం వచ్చింది. సముద్రంలోని నీటిని మొత్తాన్ని తోడిపోయాలనుకుంది. అంతే. ఒక గడ్డిపోచను ముక్కున కరచుకొని సముద్రంలో దానిని ముంచి ఒడ్డున దానిని విదిలిస్తున్నది. ఇలా సముద్రంలోని నీటిని ఖాళీ చేయాలనుకుంది. పిట్ట పిడికెడు. పోనీ సాధనమో గడ్డిపరక. ఇలా రోజులకు రోజులు చేస్తూనే ఉంది. మిత్రులంతా ఎగతాళి చేస్తున్నారు, నీ పిచ్చిగాని ఈ గడ్డిపరకతో ఈ మహాసముద్రాన్ని ఖాళీ చేస్తావా ? అని. కొందరు మిత్రులు నచ్చజెప్పారు. ఎవరెన్నిచెప్పినా, ఎందరు ఎగతాళిచేసినా పిట్టకు ఒకటే పట్టుదల. రాత్రింబవళ్ళు కార్యసాధనలో నిమగ్నమైంది. పని సాధించటమో - ప్రాణం వదలటమో - అంతేగాని మరొక ఆలోచన లేదు. ప్రయత్నపరునికి భగవంతుడే సాయపడతాడని పెద్దల వాక్కు.

ఆ మార్గంలో ఒకనాడు నారదడు ప్రయాణం చేస్తున్నాడు. ఆ టిట్టిభపక్షి యొక్క పట్టుదలను చూచి సంతోషించి, విషయాన్ని గరుత్మంతునికి తెలియజేసాడు. "అయ్యా! మీ జాతికి చెందిన పక్షి ఒకటి ఎంతో పట్టుదలతో సముద్రునిపై కక్ష కట్టింది. దానికి సాయం చెయ్యగలవా!" అన్నాడు. వెంటనే

గరుడుడు వచ్చి సముద్రునికి చెప్పి పక్షి గ్రుడ్లు ఇప్పించాడు. సాధకుడికి స్థైర్యం ఒక మంత్ర దండం అనటానికి ఇది ఒక ఉదహరణ.

9. ఆత్మవినిగ్రహ :- ఆత్మవినిగ్రహం అంటే ఇంద్రియ నిగ్రహం అని అర్థం. ఇంద్రియాలను గుర్రాలతో పోల్చారు ఉపనిషత్తులో. గుర్రాలు స్వాధీనంలో లేకపోతే సారధి రథాన్ని గమ్యస్థానం చేర్చలేడు. అలాగే ఇంద్రియాలు స్వాధీనంలో లేకపోతే జీవుడు తన గమ్యస్థానమైన బ్రహ్మ పదవిని పొందలేడు.

బ్రేకులేని బండి - కళ్ళేనికి లొంగని గుర్రం - కాడి క్రిందికి రాని ఎద్దులాగా ఇంద్రియనిగ్రహంలేని మనుజుడు ప్రమాదంలో పడిపోతాడు. ఇంద్రియాలు, మనస్సు నీవు ఉపయోగించుకొనుటకు ఉన్నాయే గాని వాటికోసం నీవు లేవు. నీవు చెప్పినట్లు అవి వినాలేగాని, అవి చెప్పినట్లు నీవు తల ఆడించరాదు. ఇంద్రియాలకు లొంగినవాడి బ్రతుకు ఎలా ఉంటుందంటే 10 మందికి సేవచేయాల్సిన వాడి బ్రతుకు ఎలా ఉంటుందో అలా ఉంటుంది. ఒక యజమాని బజారుకు వెళ్ళి సరుకు తెమ్మంటాడు. మరొక యజమాని కాళ్ళు వత్తమంటాడు. మరొకడు పొరుగూరికి వెళ్ళమంటాడు. మరొక యజమాని పొలానికి వెళ్ళి పని చేయమంటాడు. మరొకడు పిల్లలను ఆడించమంటాడు. ఏ పని చేయాలి ? ఏది ఆపాలి ? ఒక్కసారే అన్ని పనులు చేయటం ఎవరికైనా సాధ్యమవుతుందా ? ఎంత కష్టం? ఎవరి పనిచేయకపోతే ఆ యజమానికి కోపం వస్తుంది. అదే ఒక యజమానికి 10 మంది సేవకులున్నారనుకోండి. ఎంత హాయి. ఒకడిని బజారుకు వెళ్ళమంటాడు. ఒకడిని పొలానికి

వెళ్ళమంటాడు, ఒకడిని కాళ్ళు వత్తమంటాడు. ఇలా ఒక్కొక్కడికి ఒక్కొక్క పని చెప్పి అన్నీ చేయించుకొంటాడు. అలాగే మనం 10 ఇంద్రియాలకు దాసులమైతే నరకమే. అదే 10 ఇంద్రియాలను మన దాసులుగా చేసుకొంటే ఎంత హాయి ! ఎంత సంతోషం ! కనుక ఇంద్రియాలను మన ఆధీనంలో - మన అదుపు ఆజ్ఞలలో పెట్టుకోవాలి.

ఇంద్రియనిగ్రహం అంటే అస్తులు - పస్తులు ఉండి, దేహానికి తిండి-తీర్థాలు ఇవ్వక కృశింపజేయటం కాదు. శరీరంపై వాతలు పెట్టుకొని బాధింపజేసి సాధించేదీ కాదు. అది తామసిక లక్షణం. మనస్సుతో ఇంద్రియాలపై విజయం సాధించాలి. నిరంతరం భగవత్స్మరణతోను, విచారణతోను, సత్సాంగత్యంతోను, జపధ్యానాలతోను, ప్రాపంచిక విషయ వైరాగ్యంతోను క్రమక్రమంగా సాధించాలి.

అప్పుడే జ్ఞానార్జనకు వీలవుతుంది.

- మరొక 3 లక్షణాలు తరువాతి శ్లోకంలో -

- జ్ఞానార్జన చేయాలనుకొనే సాధకునికి ఉండవలసిన 9 లక్షణాలను ఇంత వరకు చెప్పి మరొక 3 లక్షణాలను 9 వ శ్లోకంలో చెబుతున్నారు.

**శ్లో|| ఇంద్రియార్థేషు వైరాగ్యం**
**అనహంకార ఏవ చ |**
**జన్మ మృత్యు జరా వ్యాధి**
**దుఃఖ దోషాను దర్శనం ||** **(9)**


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** ఇంద్రియవిషయాలైన శబ్ద స్పర్శ రూప రస గంధాల పట్ల వైరాగ్యం, అహంకారం లేకపోవటం, జన్మ, మృత్యు, జరా, వ్యాధి దుఃఖాలనే దోషాలను నిత్యము దర్శించటం.

**వ్యాఖ్య :-** 1. ఇంద్రియార్థేషువైరాగ్యం :- ఇంద్రియవిషయాలంటే శబ్ద స్పర్శ రూప రస గంధాలే. అంటే కంటితోచూచేవి, చెవితోవినేవి, ముక్కుతో వాసనచూచేవి, నాలుకతో రుచిచూచేవి. చర్మంతో తాకేవి. ఈ విషయ వస్తువులన్నీ విషం లాంటివే. విషం తింటేనే ప్రమాదం - కాని ఇవి చూస్తేనే ప్రమాదం. ఈ విషయాలకు గొప్ప ఆకర్షణ ఉంది. ఎంతటి వారినైనా బోల్తా కొట్టిస్తాయి. వీటికి లొంగితే పతనం తప్పదు. కనుక వీటి పట్ల వైరాగ్యం ఉండాలి.

శంకరాచార్యుల వారు వివేకచూడామణిలో ఈ విషయాల ప్రభావం ఎంతటిదో ఒకే ఒక్క శ్లోకంలో ఎంతో అద్భుతంగా చెప్పారు. శబ్దానికి లొంగిపోయి లేడి, స్పర్శకు లొంగిపోయి ఏనుగు, రూపానికి లొంగి మిడుత, రసానికి (రుచికి) లొంగిపోయి చేప, గంధానికి (వాసనకు)లొంగిపోయి తుమ్మెద ప్రాణాలు పోగుట్టుకుంటున్నాయి. ఒక్కొక్క విషయానికి లొంగి అవి ప్రాణాలు కోల్పోతూ ఉంటే అయిదు విషయాలకు లొంగిపోయే మానవుడి పరిస్థితి ఏమిటి ? - అని ఆవేదన చెందాడు.

ఇంద్రియాలెప్పుడూ తమకు కావలిసిన వాటిని కోరుతాయేగాని, మనకు కావలసిన వాటిని కోరవు. మనస్సు ఇంద్రియాలు చెప్పినట్లు వింటుందే కాని మనం చెప్పినట్లు వినదు. అందుకే మనం విషయవ్యామోహాల నుండి

బయటపడలేకపోతున్నాం. వాటికి దాసులమై పోతున్నాం. మరి పరిష్కారం ఏమిటి? విషయ వస్తువుల పట్ల వైరాగ్యం కలగాలి. వైముఖ్యం కలాగాలి. ఆ వైరాగ్యం వివేకంతో కూడినదై ఉండాలి. దానికి ఏం చేయాలి ?

విషయవస్తువులన్నీ అనిత్యమైనవని, అనాత్మ పదార్థాలని, సుఖాన్ని ఇచ్చినట్లే ఇచ్చి దుఃఖాన్ని కలిగిస్తాయని, వాటివల్ల వచ్చే సుఖం ఆభాస సుఖమేగాని నిజమైన సుఖం - నిత్యమైన సుఖం కాదని, భోగాలన్నీ రోగాలకు దారి తీస్తాయని, విషయవస్తువులు విషంకన్నా ప్రమాదకరమైనవని నిరంతరం భావిస్తూ - విచారణ చేస్తూ ఉండాలి. అంతే కాదు విషయవస్తువులన్నీ విషం లాంటివని, ఆత్మ ఒక్కటే అమృతస్వరూపమని గ్రహించాలి. అలా గ్రహించగలిగిన వారే విషయాల పట్ల వైరాగ్యం కలిగి ఉంటారు. అదే నిజమైన వైరాగ్యం. అట్టి వైరాగ్యవంతులే జ్ఞానసముపార్జనకు అర్హులు.

2. అనహంకారం :- అహంకారం లేకుండుట. అసలు దేవుడికి జీవుడికి మధ్యనున్న అడ్డుగోడ అహంకారమే. అహంకారం తొలగించుకోగలిగితే జీవుడు దేవుడే అవుతాడు. ఈ అహంకారం అవగుణాల పుట్ట. పుణ్యం పాపం, మంచీ చెడు, ధర్మం అధర్మం, న్యాయం అన్యాయం అనేవేవీ ఈ అహంకారికి పట్టవు. పొలంలో మంచి పంట రావాలంటే కలుపు మొక్కలను పీకివెయ్యాలి. అలాగే పరమాత్మను చేరుకొని మన జన్మను పండించుకోవాలంటే ఈ అహంకారమనే కలుపు మొక్కను పీకి వెయ్యాలి.

"హృదయంలో 'నేను' ఉన్నంతవరకు గురువు లేడు. గురువు వచ్చాడా ! 'నేను' ఉండదు" అంటాడు కబీర్ దాస్. ఆ 'నేను' అహంకారమే. అహంకారికి

సర్వనాశనం తప్పదు. దుర్యోధనుడు అహంకారాన్ని ముందు పెట్టుకొని సర్వనాశనమయ్యాడు. అర్జునుడు భగవంతుని ముందు పెట్టుకొని సార్థక జీవి అయ్యాడు. అహంకారి అన్నాడు, 'నేనెవ్వరికీ తలవంచను' అని. మరి మంగలికో ? అన్నాడు పొరుగువాడు. దానికి పాపం జవాబు చెప్పలేకపోయాడు. 'పెద్దలకు, వృద్ధులకు, జ్ఞానులకు, గురువులకు, భగవంతునికి తలవంచి నమస్కరించాలి' - అనే బుద్ధి అందరికీ కలగదు. పూర్వజన్మ సుకృతం ఉన్నవారికే కలుగుతుంది. అహంకారికి అధోగతి తప్పదు.

అహంకారం తియ్యని విషంలాంటిది. మిత్రుడుగా కనిపించే శత్రువు - తేనె పూసిన కత్తి. దీని లీలలు బహువిచిత్రాలు. భాగవతంలో గోపికల వస్త్రాలనపహరించాడు బాలకృష్ణుడు. ఇది పైకి కనిపించే కథ. నిజంగా జీవుళ్ళ యొక్క అహంకారాన్ని హరించటమనే దివ్యలీలయే ఈ కథలోని అంతరార్థం.

అహంకారాన్ని భగవంతుడే కరుణించి తొలగించాలి. స్వప్రయత్నంతో సాధ్యం కాదు. అందుకే ఈశావాస్యోపనిషత్తులో 15 వ మంత్రం ఇలా చెబుతున్నది.

**మం||** హిరణ్మయేన పాత్రేణ
సత్యస్యాపిహితం ముఖం ।
తత్త్వం పూషన్న పావృణు
సత్య ధర్మాయ దృష్టయే ||



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

"అంటూ పరమాత్మ ముఖం బంగారుపాత్రతో కప్పబడింది. ఓ భగవానుడా! నేను నిన్ను దర్శించటానికి వీలుగా నీవు ఈ పాత్రను తొలగించు" అని ప్రార్థిస్తాడు శిష్యుడు. అయితే భగవంతునిపై మనకు అనన్యభక్తి ఉండాలి. ఉన్నప్పుడే ఈ అహంకారమనే బంగారుపాత్ర తొలగింపబడి సత్యదర్శనమవుతుంది. ఈ అహంకారం జ్ఞానార్జనకు అడ్డంకి. అహంకారి గురువు వద్ద తలవంచలేడు. అందుకే జ్ఞానాన్ని పొందలేడు, పొందినా అర్థం చేసుకోలేడు. అర్థం చేసుకొన్నా అనుభూతి కలగదు. కనుక అహంకారం తొలగించుకోవాలి.

3. జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనం :- మానవ జీవితం అంతా దోషభూయిష్టం. దుఃఖభూయిష్టం. అప్పుడప్పుడు కొన్ని సుఖాలున్నా దుఃఖాలు మాత్రం తప్పవు. ఇలా దుఃఖాలతో కూడినదే ఈ మానవజన్మ అని తెలిస్తే దీనిపై వైముఖ్యం కలుగుతుంది. వైరాగ్యం కలుగుతుంది. ఇక ఈ జన్మలు వద్దు అనిపిస్తుంది. జన్మరాహిత్యానికి ప్రయత్నించాలి అనిపిస్తుంది. కనుక ఈ జన్మలోని దుఃఖ దోషాలను నిశితంగా పరిశీలించాలి.

'ప్రపంచం దుఃఖమయం, దేహం రోగమయం' అని పెద్దలు చెబుతారు. 'అనిత్యమసుఖంలోకం' అని గీతాచార్యుడే అన్నాడు. 'విద్ధి వ్యాద్యభి మానగ్రస్తం లోకం శోక హతం చ సమస్తం' అని భజగోవిందంలో శంకరాచార్యుల వారన్నారు. వ్యాధులతోను, అభిమానంతోను కూడి దుఃఖాల చేత సతమతమైపోతున్నదీ జన్మ అని.

పుట్టేటప్పుడు ఏడుస్తాడు, చచ్చేటప్పుడూ ఏడుస్తాడు, మధ్యలో రోగాలొస్తే ఏడుస్తాడు, ముసలితనం వచ్చినా ఏడుస్తాడు. ఇవే జన్మ దుఃఖం, జరా దుఃఖం, వ్యాధి దుఃఖం, మరణ దుఃఖం.

**(i) జన్మదుఃఖం :-** ఇది ఎలాంటిదో గర్భోపనిషత్ చెబుతున్నది. తలచుకొంటే సిగ్గుతో చచ్చిపోవాలి. సిగ్గోయెగ్గో అది బహిరంగ రహస్యం. కోడిగ్రుడ్డు అంత గర్భకోశంలో 9 నెలల నివాసం. అక్కడి క్రిములచేత పీడించబడటం, జఠరాగ్ని చేత తపించిపోవటం, తల్లి ఆహారవిహారాల వల్ల అలమటించిపోవటం, మావిచేత బిగించబడి తలక్రిందులుగా ఉండటం, పూర్వజన్మలస్మృతితో విపరీతంగా దుఃఖించటం, ప్రసూతివాయువుల చేత త్రోయబడటం, బయటబడి మలమూత్రాలలో పెద్దపురుగులాగా పొర్లాడటం - ఇవన్నీ జన్మదుఃఖాలే.

**(ii) మృత్యుదుఃఖం :-** పుట్టిన ప్రతిజీవి తప్పించుకోలేని దుఃఖం ఈ మృత్యుదుఃఖం. ఈ దేహం మృత్యుదేవత సొత్తు. పాలు, వెన్న, నెయ్యి, జీడిపప్పు, స్వీటు, హోటులతో చక్కగాపెంచి, ఫారిన్ సెంట్లు, పౌడర్లు, సోపులు, కాస్మెటిక్స్ తో పోషించిన ఈ బంగారంలాంటి శరీరానికి చివరిదశ ఏమిటో కళ్ళు మూసుకొని ఒక్కసారి భావనకు తెచ్చుకోండి. మర్మస్థానాలు భేదించబడటం, అంగసంధులు వికలమైపోవటం, నాడుల నుంచి ప్రాణాలు నిర్బంధంగా బయటకురావటం, ప్రాణోత్క్రమణ జరిగేటప్పుడు లక్ష తేళ్ళు ఒక్కసారిగా కుడితే కలిగేంత బాధ, వశం దప్పి మలమూత్రాలు విడిచి పెట్టటం, భరించలేని యాతన. ఇవి మృత్యురోగాలు. ఇంతేనా ? ఇక

మరణించబోతున్నాను అని తెలియగానే అమ్మాయి పెళ్ళి, అబ్బాయి ఉద్యోగం, కట్టాలనుకున్న మేడలు, భార్యాబిడ్డలు అంతా గుర్తుకు వస్తారు. ఇంత సంపాదించి అన్నీ వదిలిపెట్టి పోతున్నానే అనే బాధ. ఇదంతా మృత్యు బాధ.

(iii) జరాదుఃఖం :- ముసలితనం వస్తే అవయవాల పటుత్వం తగ్గుతుంది. శరీరం ముడుతలు పడి బలహీనమవుతుంది. తల పండిపోతుంది. నోరు బోసిదవుతుంది. కళ్ళు కనపడవు. చెవులు వినపడవు. దేహం వణుకుతుంది. కర్ర చేతికి వస్తుంది. తన వారనుకున్న వారు నిరాదరణ చూపుతారు, హీనంగా మాట్లాడుతారు. దీనితో కోపతాపాలు అధికమవుతాయి. ఇవన్నీ జరా దుఃఖ దోషాలు.

(iv) వ్యాధిదుఃఖం :- వ్యాధులు శతృవులలాగా సతాయిస్తూ ఉంటాయి. కొందరిని చుట్టపుచూపుగా అప్పుడప్పుడు వచ్చి పలకరించి పోతాయి. కొందరి విషయంలోనైతే రావటంపోవటం ఎందుకు. ఈ ఇల్లు నాదే కదా అంటూ నిత్యం దేహంలో కాపురం ఉంటాయి. భూమిలోపల మురికి కాలువలను నింపుకొనిపైకి దర్జాగా కనిపించే పట్టణ వీధులలాగా ఈ శరీరం అంతా అనేక మురికి కూపాలను, ఛండాలాన్ని దాచుకొని, చర్మం అనే ముసుగు వేసుకొని రమ్యంగా కనిపిస్తుందీ శరీరం. ఇది రోగాల పుట్ట.

ఒక రైల్లో ఒక ముసల్మాన్ తోలుతిత్తినిండా నీరు తెచ్చుకొన్నాడు. కావలసిన వారికి పోస్తున్నాడు. ఒకడికి దాహం వేసింది. ""ఏమయ్యా ! తిత్తి శుభ్రమైనదేనా ? అన్నాడు. దానికాముసల్మాన్'' త్రాగే తిత్తి కన్న పోసే తిత్తి శుభ్రమైనదే అన్నాడట. అదీ ఈ దేహం పరిస్థితి.

వ్యాధితో బాధపడుతున్నవాణ్ణిచూచి, ముసలితనంతో బాధపడుతున్న వాణ్ణిచూచి, మరణించిన వాణ్ణిచూచి సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు. మనం రోజూ ఎంత మందినో చూస్తూ బద్ధులమవుతున్నామే గాని బుద్ధులం కావటంలేదు. అందుకే ఈ జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాలను మళ్ళీ మళ్ళీచూస్తూ ఆత్యంతిక దుఃఖనివృత్తికి మార్గం వెతుక్కోవాలి. వివేకంతో వైరాగ్యాన్ని పొంది జ్ఞానసిద్ధికి ప్రయత్నించాలి. మరో 3 లక్షణాలు తరువాతి శ్లోకంలో -

- మరో మూడు జ్ఞానికి ఉండవలసిన లక్షణాలు 10 వ శ్లోకంలో.

**శ్లో|| అసక్తి రస భిష్వంగః**
**పుత్ర దార గృహాదిషు |**
**నిత్యంచ సమ చిత్తత్వం**
**ఇష్టా నిష్టో ప పత్తిషు || (10)**

**తా||** విషయాల పట్ల ఆసక్తి లేకుండుట, పుత్రులు, భార్య గృహము మొ||న వాటితో తాదాత్మ్యం చెందకుండుట, ఇష్ట - అయిష్టాలు సంభవించినప్పుడు మనస్సును సమత్వంలో ఉంచుకొనుట.

**వ్యాఖ్య :-** 1. అసక్తి :- ఆసక్తికి వ్యతిరేక పదం అనాసక్తి లేదా అసక్తి. సాధారణంగా లోకంలో అందరికీ విషయవస్తువుల పట్ల, భోగాల పట్ల ఆసక్తి ఉంటుంది. ఆ ఆసక్తి వల్ల - విషయచింతన వల్ల వాటితో సంగభావం ఏర్పడుతుంది. ఎలాగైనా వాటిని సంపాదించుకొని అనుభవించాలనిపిస్తుంది. దానివల్ల కోరికలు, కోపాలు కలుగుతాయి. దానితో మనస్సు అదుపు తప్పి

పోతుంది. అది జ్ఞానార్జనకు ఆటంకం. కనుక విషయాలపై భోగాలపై, వస్తువులపై ఆసక్తి కూడదు. నిజంగా ఇక్కడ చూచిన వాటన్నింటిని నాది - నాది అని ముద్ర వేసుకొంటున్నామే ! దీనిలో ఏమైనా న్యాయం ఉన్నదా ? మనం వచ్చేటప్పుడు మన వెంట ఏమి తెచ్చాం ? వెళ్ళేటప్పుడు ఏమి తీసుకవెళ్తాం ? అన్నీ వదిలి వెళ్ళాల్సిందే గదా ! చచ్చే ప్రతివాడూ గుప్పెడు మట్టిని తీసుకెళితే ఇక్కడ మట్టి ఉండేదా? కనుక ఇక్కడి వస్తువులను గాని, ఇళ్ళువాకిళ్ళను గాని, డబ్బునుగాని, స్థలాలు పొలాలు గాని, భార్యా భర్త బిడ్డలు, తల్లి దండ్రులు మొ||న వారిని గాని - అందరిని - అన్నింటిని విడిచిపెట్టి పోవాల్సిందే. కనుక దేని మీదా ఆసక్తిలేకుండా లభించినదానిని అనుభవించు. లభించలేదా! నిర్లిప్తంగా ఉండిపో. అప్పుడే మనస్సు ప్రశాంతమవుతుంది. అందుకే వేమన కవి అంటాడు "భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వు" అని. ఈ భూమి నాదియని గర్వించేవాణ్ణి చూచి భూమి ఫక్కున నవ్వుతుందంట. ఎందుకంటే "ఒరే నాయనా ! నీవు నాది నాది అని చంకలు గుద్దుకొంటున్నావు; నేను ఎప్పుడూ ఇక్కడే ఉన్నాను. నీవు పుట్టక ముందూ ఇక్కడే ఉన్నాను. నీవు పోయిన తర్వాతా ఇక్కడే ఉంటాను. నాది నాది అన్నవాళ్ళెందరో నాలో కలసిపోయారు. రేపు నీ గతి కూడా ఇంతే" అని.

ఇక్కడున్న సమస్తం ఈశ్వరుని సొత్తు. అసలు owner ఆయనే. మనం అనుభవించటానికి మాత్రమే అవకాశం ఇచ్చాడు ఈశ్వరుడు. కనుక వీటిపై ఆసక్తిని విడిచి - మమకారాన్ని విడిచి నిర్లిప్తంగా అనుభవించాలి. విడిచిపెట్ట

వలసి వచ్చినప్పుడు స్వేచ్ఛగా - విడిచిపెట్టిపోవాలి. విడిచిపెట్టి వెళ్ళే పద్ధతులు రెండు విధాలున్నాయి.

ఒక ధనవంతుడు చనిపోయేటప్పుడు తన మేడలు, భూములు, ఆస్తి పాస్తులు, భోగ్యవస్తువులను, భార్యా బిడ్డలను వదలలేక - వదలలేక ఏడుస్తూ - భోరున విలపిస్తూ విడిచివెళ్తాడు. అదే ఒక హెడ్మాస్టరు హైస్కూలులోని బిల్డింగులను, ఆఫీస్ రూమ్ ను తోటిటీచర్లను, విద్యార్థులను - అందరిని - అన్నింటిని స్వేచ్ఛగా ఉపయోగించుకొంటూ ట్రాన్స్ఫర్ అయినప్పుడో, రిటైరు అయినప్పుడో వాటిపై ఏమాత్రం ఆసక్తి మమకారం లేకుండా - దిగులు పెట్టుకోకుండా సంతోషపూర్వకంగా వదిలివెళ్ళిపోతాడు. ఎందువల్ల ? ప్రతి వస్తువు మీద నాది నాది అని ముద్రవేసుకొన్నవాడు ధనవంతుడు. అతడు వదిలి వెళ్ళాల్సి వచ్చినప్పుడు భోరున ఏడ్చిపోతాడు. ఈ వస్తువులన్నీ ప్రభుత్వానివి. ఎప్పుడో ఒకప్పుడు వీటిని నేను వదిలిపెట్టి వెళ్ళాల్సిందేనని భావించే హెడ్మాస్టరు ఉన్నంత కాలం అనుభవించి వెళ్ళేటప్పుడు నిర్లిప్తంగా - ఏ బాధా లేకుండా వెళ్తాడు.

అలాగే జ్ఞాని మమకారాన్ని - ఆసక్తిని వదిలి వస్తువులను నిర్లిప్తంగా అనుభవిస్తూ వదలాల్సి వచ్చినప్పుడు సంతోషంగా వదిలి పరమాత్మను పట్టుకుంటాడు. ఈ భావన ఉంటేనే అతడు జ్ఞాని. మహాత్మాగాంధీ భగవద్గీతకు 'అనాసక్తి యోగం' అని పేరు పెట్టాడు.

2. పుత్రదార గృహాదిషు అనభిష్వంగః :- అభిష్వంగః అంటే అతిస్నేహం. అనభిష్వంగః అంటే తగులుకోకుండా ఉండటం. సంతానం, భార్య భర్త, ఇల్లు

మొ||న విషయాల పట్ల అతిస్నేహం పనికి రాదు. వీటినే ఈషణత్రయం అంటారు. దారేషణ, ధనేషణ, పుత్రేషణ - వీటిలో మానవుడు తగులుకోరాదు. వీటిని కలిగి ఉండటంలో తప్పులేదు. కాని వాటిపై అతిస్నేహం కూడదు - అని గ్రహించాలి. నిజంగా ఇవి ఏవీ శాశ్వతం కాదు. అవి నీనుండైనా దూరమౌతాయి, లేదా నీవైనా వాటికి దూరం అవుతావు. ఈ విషయాన్ని గ్రహించి వాటి కొరకే నా జీవితం, అవి లేకపోతే నేను లేను. అనే భ్రమను తొలగించుకోవాలి.

పప్పులో ఉప్పు వేస్తేనే రుచి గదా ! అని పప్పంత ఉప్పు వేస్తే దాని గతి ఏమి అవుతుంది ? కనుక భార్యా బిడ్డలపై, సంపదలపై వ్యామోహం ఎంత వరకు ఉండాలో అంతవరకే ఉండాలి. ఎక్కువ వ్యామోహం - మమకారం ప్రాణాంతకం.

. ద్రోణాచార్యునంతటివాడు పుత్రవ్యామోహంతో ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

. రావణునంతటి వాడు స్త్రీ వ్యామోహంతో సర్వ నాశనమయ్యాడు.

. దుర్యోధనుడు రాజ్య సంపదలపై వ్యామోహంతో బంధుమిత్ర సోదర సహితంగా యుద్ధంలో ప్రాణాలు వదిలాడు.

కనుక వ్యామోహం అనే జిడ్డును వదిలించుకోవాలి. అద్దాన్ని చూడండి. అది అన్నింటిని కౌగిలించుకొంటుంది. అందరితో సంబంధం పెట్టుకుంటుంది. కాని దేనికీ అంటుకోదు. అన్నింటిని వదిలేస్తుంది. కనుక సాధకుడు అద్దంలాగా ఉండాలి.

**3. ఇష్టా నిష్టోప పత్తిషు సమచిత్తత్వం :- ఇష్టా ఇష్టాలలో, మంచి చెడులలో, సుఖ దుఃఖాలలో మనస్సును సమస్థితిలో ఉంచుకోగలటం జ్ఞాని లక్షణం. మంచి జరిగితే - ఇష్టమైనది లభిస్తే పొంగిపోవటం, చెడు జరిగితే, అయిష్టం జరిగితే క్రుంగిపోవటం సామాన్యుల లక్షణం. మన పరిస్థితి కొలిమితిత్తి లాంటిది. అంతలోని పొంగిపోయి ఇంత లావు అవుతుంది. మళ్ళీ అంతలోనే పూర్తిగా అణగారి పోతుంది. పరమార్ధ సాధనలో సాధకుడు అలా ఉండరాదు.**

**"లెక్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్, సుఖంబున్ మదిన్". లోకంలో ముళ్ళు ఉండకూడదు అని భావించరాదు. చెప్పులు వేసుకో. తంటా తీరిపోతుంది. తప్పనిసరిగా వచ్చే వాటిని గూర్చి బాధపడి - దుఃఖించి ప్రయోజనం లేదు. వాటినుండే మార్గాన్ని ఏర్పరచుకోవాలి. ఈ సుఖ దుఃఖాలనేవి సాధకునికి గీటురాళ్ళు. భగవంతుడు పెట్టే పరీక్షగా భావించాలి. ఈ పరీక్షలో నెగ్గినవాడే కృతార్ధుడు. ఇష్టానిష్టాలను ఈశ్వర ప్రసాదంగా భావించి సమచిత్తంతో ఉండాలి. మనస్సును అద్దంలా ఉంచుకోవాలి. అద్దం అందమైన వాటినీ, వికారమైన వాటినీ - అన్నింటినీ చూపుతుంది. కాని దానికేమీ పట్టవు. అది ఎప్పుడూ ఒకేలాగ ఉంటుంది. అలాగే మనస్సు అన్నింటినీ చూస్తూ - అన్నింటినీ అనుభవిస్తూ సమభావంతో ఉండాలి. అదే సమచిత్తం.**

**శక్తిని వృధా చేసుకోకుండా నిలువచేసుకొని, దానిని ఉపయోగకరమైన వాటికి వినియోగించుకొనేందుకు మార్గాలను 11 వ శ్లోకంలో......**

**శ్లో|| మయి చానన్య యోగేన**

**భక్తి రవ్యభి చారిణీ |**

**వివిక్త దేశ సేవిత్వం**

**అరతిర్జన సంసది ||** **(11)**

**తా||** ఇంకా నాకన్నా ఇతరమైన దేనియందు మనస్సు లేనివాడై వ్యభిచరించని భక్తి కలిగియుండుట; ఏకాంతప్రదేశంలో గడపటం; జన సముదాయములందు అభిరుచి లేకుండుట.

**వ్యాఖ్య :-** మనస్సు పరిపరివిధాల పోకుండా దానిని ఏకాగ్రం చేస్తే గొప్ప శక్తి వస్తుంది. ఆ మనోశక్తిని ధ్యానానికి వినియోగించుకోవాలి. భక్తికి వినియోగించుకోవాలి. ఆ మార్గాలనే ఈ శ్లోకంలో చెబుతున్నారు.

1. మయిచానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ :- అవ్యభిచారిణీభక్తి అంటే వ్యభిచరించని భక్తి. మనస్సు అనేక లౌకిక విషయాల పైకి పరుగులు తీస్తుంది. అలా ఉంటే మనస్సుకు నిలకడ ఉండదు. ఏకాగ్రత కుదరదు. పరమాత్మపై నిలపాలంటే నిలవదు. కనుక ప్రాపంచిక విషయాలు, వస్తువులు, భోగాలు అన్నీ అనిత్యమైనవని, తాత్కాలిక సుఖాలనిచ్చి దుఃఖాన్నే మిగిలిస్తాయని, అవి దోషాలతో కూడియున్నవని తెలుసుకొని వాటి నుండి మనస్సును మరలించాలి. పరమాత్మపై నిలపాలి. జప ధ్యానాలు చేసేటప్పుడు మనస్సు చలించకుండా ఉండాలి.

జ్ఞాని ఇలా నిశ్చల మనస్సుతో - ఏకాగ్రమైన మనస్సుతో - అనన్య యోగంతో పరమాత్మయందు మనస్సు నిల్పి, భక్తి కలిగి ఉండాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'సంకటమొస్తే వెంకటరమణ ' అన్నట్లుగాక 'నీవే తప్ప నితఃపరంబెరుగన'న్నట్లు సంపూర్ణ శరణాగతి చెందాలి. ఊరగాయ నంజుకున్నట్లు అడపాదడపా భగవంతుణ్ణి గుర్తుతెచ్చుకొన్నా, భక్తి కలిగి ఉన్నా పూర్తి ప్రయోజనం సిద్ధించదు. భగవంతునితో నిరంతరము విభక్తుడు కాని వాడే భక్తుడు. కరెంటు తీగ తెగిపోకుండా ఉంటేనే కరెంటు వస్తుంది. అలాగే భగవంతుని పట్ల భక్తి అఖండంగా నిరంతరంగా ఉంటేనే భగవంతునికీ తనకూ డైరెక్ట్ కనెక్షన్ ఉంటుంది. మధ్యలో అన్య విషయాలనే బ్రేకులు ఉండకూడదు. అదే అనన్యయోగం. భక్తి ఫలిస్తే జ్ఞానం లభిస్తుంది. ఆ జ్ఞానంతోనే మోక్షం. కనుక భక్తి లేని వాడు జ్ఞాని కాలేడు. భక్తి లేని జ్ఞానం మోక్ష ప్రాప్తికి దారి తీయదు. కనుక జ్ఞాన ప్రాప్తికి అనన్యయోగం కావాలి. మనస్సు అన్యంగాపోకుండా ఉండాలి.

2. వివిక్త దేశ సేవిత్వం :- ఏకాంత ప్రదేశంలో ఉండాలనే భావన. జ్ఞాని ఏకాంత ప్రదేశంలో ఎందుకు ఉండాలనుకుంటాడు ? ధ్యానం చక్కగా కుదిరేందుకు. ధ్యానానికి అనుకూల పరిస్థితిని కైవల్యోపనిషత్తు చెబుతున్నది. "వివిక్త దేశేచ సుఖాసనస్థః" అని. అంటే ఏకాంత ప్రదేశంలో సుఖాసనంలో కూర్చొని - అని. రకరకాల మనస్తత్వాలు గల మనుష్యుల మధ్య అనేక ఆకర్షణలతో కూడిన విషయ వస్తువుల మధ్య ధ్యాన సాధన చక్కగా సాగదు. ప్రారంభంలో ఇది మరీ కష్టం. అందుకే ఏకాంతంలో ఉండాలి. ఏకాంతంలో అంటే నదీ తీరాలలో, పర్వత ప్రదేశాలలో, వనాలలో ప్రశాంతమైన ఆశ్రమాలలో, లేదా కనీసం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గృహంలోనైనా ప్రత్యేకంగా ధ్యానానికి కేటాయించుకున్న గదిలో ధ్యానం చక్కగా సాగుతుంది.

3. అరతిర్జన సంసది :- జన సమూహములందు ప్రీతి లేకుండుట. జనులు అంటే పామర జనులు. ఎప్పుడూ ప్రాపంచిక విషయాలలో మునిగితేలేవారు. వారికి సంపాదన, క్రొత్తవస్తువులు కొనుగోలు చేయుట, సినిమాలు సీరియల్స్ చూడటం, వాటి గురించే మాట్లాడటం, లోకాభిరామాయణం, రాజకీయాలు, దురలవాట్లు, చాడీలుచెప్పటం, అసూయ, ఈర్ష్య ద్వేషాలతో ఉండటం - ఇవే ముఖ్యవృత్తి. వారితో కలిస్తే వారి సొదవింటూ ఉండాలి. మనస్సును చెడగొట్టుకోవాలి. అందుకే వారికి దూరంగా ఉండాలి. అయితే ఇదే సందర్భంలో భక్తులతో - జ్ఞానులతో - మహాత్ములతో - సాధకులతో సాంగత్యం చేయాలి. కనుక పామరులతోనే పొత్తు పనికిరాదు. అట్టి వారికి సిద్ధి పొందటం అసాధ్యం.

ఎలాంటి వారితో సాంగత్యం చేస్తే అలాంటి బుద్ధులే వస్తాయి.

. దుమ్ము గాలితో స్నేహం చేస్తే ఆకాశానికి ఎగురుతుంది.

. అదే నీటితో స్నేహం చేస్తే అడుగుకు చేరి పోతుంది.

. ఇనుము మట్టితో స్నేహం చేస్తే తుప్పు పట్టి పోతుంది.

. అదే అగ్నితో స్నేహం చేస్తే శుద్ధమై నిర్మలమవుతుంది.

కనుక సంగ ప్రభావం అద్భుతమైనది. కనుక పామరులకు దూరంగా ఉండాలి.

సత్సాంగత్యం అనేది ఏకాంతవాసం కన్నా - అన్నింటికన్నా అధిక ఫలదాయకం,

. సత్సాంగత్యం వల్లనే రత్నాకరుడు వాల్మీకియై రామాయణాన్ని రచించాడు.

. సత్సాంగత్యం వల్లనే దాసీ పుత్రుడు దేవర్షి నారదుడయ్యాడు.

. సత్సాంగత్యం వల్లనే పరీక్షిత్తు ఏడు రోజులలో ముక్తిని పొందాడు.

కనుక సత్పురుషులకు దగ్గరగా ఉండాలి. దుర్జనులకు, పామరులకు దూరంగా ఉండాలి. నిజంగా సత్పురుషులతో సాంగత్యం చేస్తూ జ్ఞానార్జన చేస్తూ ఉంటే పామరజనులతో సంబంధం దానంతట అదే తెగిపోతుంది.

మరొక 2 లక్షణాలను చివరిగా 12 వ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో|| ఆధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం**
**తత్త్వ జ్ఞానార్థ దర్శనం |**
**ఏతత్ జ్ఞాన మితి ప్రోక్తం**
**అజ్ఞానం యదతోఽన్యథా || (12)**

**తా||** నిత్యము ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కలిగి ఉండటము, తత్త్వజ్ఞానం యొక్క అర్థాన్ని నిరంతరము గుర్తుంచుకోవటము - ఇది జ్ఞానము అని చెప్పబడింది. దీనికన్న వేరుగా ఉన్నది ఏదైతే ఉన్నదో అది అజ్ఞానం.

**వ్యాఖ్య :-** 1. ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం :- నిత్యము నిరంతరము ఆత్మజ్ఞానాన్ని కలిగియుండుట జ్ఞాని యొక్క ముఖ్య లక్షణం. ఆధ్యాత్మికజ్ఞానం అంటే ఆత్మను గురించి శాస్త్రాల ద్వారా - గురువుల ద్వారా తెలుసుకొనుట, ఆత్మను గురించి తెలుసుకున్న తర్వాత ఆ ఆత్మ లేదా పరమాత్మ నాలోనే - ఈ దేహంలోనే

ఉన్నదని గ్రహించుట. అలా గ్రహించి నిత్యము, నిరంతరము ఆ స్పృహలో ఉండుట. ఇదే ఆధ్యాత్మజ్ఞానం. అధి+ఆత్మజ్ఞానం. ఆత్మ నాలోనే ఉన్నదనే జ్ఞానం.

ఈ లోకంలోని అన్ని విషయాలు, వస్తువులు, భార్యాబిడ్డలు, బంధు మిత్రులు, ఇళ్ళు వాకిళ్ళు - అన్నీ అనాత్మ పదార్థాలే. అనిత్య వస్తువులే. మరి నిత్య వస్తువు ఏమిటి ? నిత్య వస్తువు పరమాత్మ మాత్రమే. అయితే ఆ పరమాత్మ (i ) ఎక్కడ ఉన్నాడు. (ii ) ఎలా ఉన్నాడు. (iii ) ఏం చేస్తుంటాడు ?

(i ) పరమాత్మ ఈ అనాత్మ పదార్థాలకు, అనిత్య వస్తువులకు ఆవల వీటికి ఆధారంగా - అధిష్టానంగా ఉన్నాడు. నిత్యంగా - సత్యంగా ఉన్నాడు. మన దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ప్రాణాలు, కారణ శరీరం - ఈ మొత్తం అనాత్మ. జడ పదార్థాలు. అయితే వీటన్నింటికి వేరుగా, వీటికి ఆధారంగా ఉండి చైతన్యాన్ని ఇస్తున్న చైతన్య శక్తి ఏది గలదో అదే ఆత్మ - పరమాత్మ. కనుక పరమాత్మ ఎక్కడో లేడు - ఈ జడమైన దేహంలోనే ఉన్నాడు. అతడు మరెవరోకాదు. 'నేనే '. నేను అతడినే - ఆ పరమాత్మనే. 'అహంబ్రహ్మాస్మి '.

(ii ) ఆ నేను (ఆత్మ) ఒక రూపం లేకుండా, సూక్ష్మాతి సూక్ష్మంగా, చైతన్య మాత్రంగా, ఆకాశంలా సర్వవ్యాపకంగా, అవ్యక్తంగా ఉన్నాను. ఒక చోట ఉండటం, ఒక చోట లేకపోవటం అంటూ లేదు. అన్నింటిలోను ఉన్నాను. అవ్యక్తంగా ఉన్న నేను వ్యక్తం కావటానికే ఈ క్షేత్రం.

(iii ) ఆ నేను (ఆత్మ - పరమాత్మ) కు నిర్వర్తించవలసిన కర్తవ్యాలంటూ ఏమీ లేవు. ఏ అవసరాలు లేవు. ఏ కోరికలు లేవు. దేహం లేదు గనుక తిండీ తిప్పలు అక్కర లేదు. రోగాలు - ముసలితనం లేవు. కనుక ఏ కర్మలు

చేయవలసిన అవసరం లేదు. దేహేంద్రియ మనోబుద్ధుల యొక్క అన్ని వృత్తులకు కేవల సాక్షిగా ఉండటం తప్ప మరే పనీ లేదు.

ఈ విధంగా నిరంతరం 'నేను ఆత్మను ; ఈ క్షేత్రాన్ని కాదు' అనే భావన ఉంటే చాలు అదే ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం అంటే.

ఇది ఎలా సాధ్యమవుతుంది ? నిత్యము ఆత్మ జ్ఞానాన్ని శ్రవణం చేస్తూ, మననం చేస్తూ, అధ్యయనం చేస్తూ, విచారణ చేస్తూ ఉంటే తప్పక ఈ స్థితిలో ఉండవచ్చు. ఇదే జ్ఞాని యొక్క అత్యుత్తమ లక్షణం.

నేను ఆత్మను - పరమాత్మను - నా స్వరూపం ఇది అనే నిశ్చయజ్ఞానం ఎప్పుడో ఒకప్పుడు ఉండటం కాదు. ఎల్లప్పుడూ ఉండాలి. అందుకే నిత్యత్వం అన్నారు. ఈ దేహేంద్రియాలు ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమై ఉంటాయి. మనస్సు ఎప్పుడూ ఏదో ఆలోచన చేస్తూనే ఉంటుంది. అవి ఎప్పుడు ఎలా ఉన్నా ఏం చేస్తున్నా మనం మన నిజ స్వరూపంలో - స్వస్వరూపంలో నిలిచి ఉండాలి. ఆత్మగా - పరమాత్మగా ఉండాలి. మనం నిరంతరం ఎలా గాలి పీలుస్తూ వదులుతూ ఉంటామో, రోజూ ఎలా తిండి తింటూ ఉంటామో, రోజూ ఎలా నిద్రపోతూ ఉంటామో అలా అలవాటుగా, సహజ సిద్ధంగా ఆత్మగా ఉండిపోవాలి.

కనుక నీవు ఏ పనులు చేస్తున్నా, ఏ ఆలోచనలు చేస్తున్నా భగవంతుని స్మరణ - ఆత్మస్మరణ - పరమాత్మ స్మరణ నేపథ్య సంగీతంలా జరిగిపోతూనే ఉండాలి. పడవ ఎటు తిరుగుతున్నా దిక్సూచిలో ఉత్తర దిక్కు వైపుకే ముల్లు చూపుతున్నట్లు ఈ జీవన నావ సంసారమనే సముద్రంలో ఎటు తిరుగుతున్నా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనస్సు అనే దిక్సూచిలో ముల్లు మాత్రం ఆత్మవైపే - పరమాత్మ వైపే తిరిగి ఉండాలి. అదే జ్ఞాని ముఖ్యాతి ముఖ్యమైన లక్షణం.

2. తత్వజ్ఞానార్థ దర్శనం :- తత్వజ్ఞానం వల్ల కలిగే అంతిమ ప్రయోజనం ఏదో దానియందే దృష్టిని ఉంచటం తత్వజ్ఞానార్థ దర్శనం అంటారు. తత్వజ్ఞానం వల్ల - అంటే ఆత్మజ్ఞానం వల్ల అంతిమ ప్రయోజనం ఏమిటి ? మోక్షమే. జన్మ రాహిత్యమే. శాశ్వత ఆనందమే. కనుక జ్ఞాని ఎప్పుడూ మోక్ష ప్రాప్తి గురించే ఆలోచిస్తూ దానియందే దృష్టిని నిలపాలి. ఎలాగైనా ఈ జన్మలోనే మోక్షాన్ని పొందాలని, ఈ సంసార జననమరణ చక్రం నుండి విడుదల పొందాలని, మళ్ళీ జన్మంటూ లేకుండా జన్మ రాహిత్యాన్ని పొందాలని, నిరంతరం నిత్యానందంలో - ఆత్మానందంలో - బ్రహ్మానందంలో నిలిచి పోవాలని - ఎవరైతే తపన పడుతూ ఉంటారో, దాని మీదనే దృష్టి పెడతారో అట్టి వారు మోక్షాన్ని పొందటానికి తగిన మార్గాన్ని చూపే సద్గురువును వెతుక్కొని సద్గురువును ఆశ్రయించి, ఆయన ద్వారా శాస్త్రాలలో చెప్పబడిన మోక్ష మార్గాలను తెలుసుకొని, వాటిని సాధన చేసి చివరకు తమ అంతిమ లక్ష్యమైన మోక్షాన్ని అందుకుంటారు. అలాంటి నిశ్చయంగాని, మోక్ష ప్రాప్తికై ప్రయత్నించాలనే దృష్టి గాని లేని వారికి ఒకవేళ గురువు తటస్థ పడినా, లేక తన ఎదురుగానే ఉన్నా, శాస్త్రాలు చెవినిబడ్డా వాటికేమీ విలువనివ్వక తమ సాధారణ లౌకిక జీవితాన్నే గడుపుతూ ఉంటారు. లోపలి భావాలను -కోరికలను బట్టే అతడి చేతలు ఉంటాయి.

ఇల్లు కట్టించాలనుకున్నవాడు ఇంటి ప్లాను చూచుకుంటాడు. ఎవరైనా ఇల్లు కడుతూ ఉంటే వారు పిలవకపోయినా వెళ్ళి చూస్తాడు. ఇటుక, సిమెంటు, ఇనుము, రేట్లు ఎలా ఉన్నాయో విచారిస్తాడు. కూలి రేట్లు అడిగి తెలుసుకుంటాడు. ఏ మేస్త్రీ అయితే నమ్మకంగా పనిచేయిస్తాడో విచారిస్తాడు. తగినంత డబ్బును సమకూర్చుకొనేందుకు ప్రయత్నిస్తాడు. ఇలా తన కృషిని కొనసాగించి, చివరకు ఇల్లు కడతాడు.

అలాగే అమ్మాయికి పెళ్ళి చేయాలనుకొనే తండ్రి మ్యారేజి బ్రోకర్లను సంప్రదిస్తాడు. అడ్రసులు తీసుకుంటాడు. అబ్బాయి గురించి, వాళ్ళ కుటుంబం గురించి, ఆస్తి పాస్తుల గురించి వివరాలు రాబడతాడు. కట్నం ఎంత అడుగుతారో తెలుసుకుంటాడు. ఇలా అన్నీ పెళ్ళికి సంబంధించిన విషయాలపై మనసు పెడతాడు.

అదే విధంగా మోక్షాన్ని పొందాలనే తీవ్ర తపన ఉన్న సాధకుడు ఆ మోక్ష మార్గాన్ని చూపే గురువును వెతుక్కుంటాడు. ఆ గురువును ఆశ్రయించి గురుసేవ చేస్తూ, గురు అనుగ్రహాన్ని పొందుతాడు. ఆయన ద్వారా జ్ఞానాన్ని పొందుతాడు. గురువు చూపిన మార్గంలో సాధన చేస్తాడు. చివరికి లక్ష్యాన్ని అందుకుంటాడు. కనుక జ్ఞానియైన వాడు నిరంతర మోక్షాపేక్ష కలిగి ఉండాలి. దృష్టి మోక్షంపైనే ఉండాలి. అదీ తీవ్రంగా ఉండాలి.

అయితే ఎందరో వేదాంతాన్ని వింటూ ఉండవచ్చు. అధ్యయనం చేస్తూ ఉండవచ్చు. గురువులను వెతుక్కోనూవచ్చు. గురుసేవను చేస్తూ ఉండవచ్చు.

వారి ద్వారా ప్రవచనాలను వినవచ్చు. ఉపదేశాలనూ పొందవచ్చు. అంత మాత్రాన వారందరినీ తీవ్ర ముక్షువులు అని భావించలేం.

కొందరు కుతూహలం కొద్దీ ఇందులో ఏమున్నదో తెలుసుకుందాం అని సరదాగా ప్రవేశించవచ్చు. కొందరు విషయాలను తెలుసుకొని పండితులమైపోదామని, పదిమంది చేత గౌరవించబడదామని అనుకొని రంగంలోకి దిగవచ్చు. కొందరు దీనిని వ్యాపారంగా మార్చుకొని లాభాలపంట పండించుకుందామని అనుకోవచ్చు. అంతే గాని ఈ రంగంలో ప్రవేశించిన వారంతా తీవ్ర మోక్షాపేక్ష గలవారని భావించలేం. అయితే జ్ఞాని మాత్రం అలా ఉండరాదు.

తగలబడుతున్న ఇంటిలో నుండి తప్పించుకొని బయటపడాలని తాపత్రయం చెందినట్లుగా; నీటిలో మునిగి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరైన వాడు బయటపడాలని తాపత్రయపడినట్లుగా అజ్ఞానంతో కూడిన ఈ సంసారబంధం నుండి త్వరగా విముక్తి చెందాలని ఆవేదన పడే వాడే - ఆర్తితో ఏడ్చే వాడే ముముక్షువు. మోక్షం పట్ల తీవ్ర ఆసక్తి గలవాడు అని తెలుసుకోవాలి.

నది ఎన్ని వంకరలు తిరిగినా చివరకు తన గమ్య స్థానమైన సముద్రుణ్ణి చేరినట్లుగా, సాధకుడు జీవితంలో ఎలా ఉంటున్నా ముక్తిని అందుకొనుటకు తగిన మార్గంలోనే ప్రయాణించాలి. అదే 'తత్త్వజ్ఞానార్థ దర్శనం' అంటే. నిరంతరం ఆత్మ విచారణ చేస్తూ, అందులోని లోతులు గ్రహించాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇంతవరకు చెప్పిన ఈ 20 లక్షణాలు జ్ఞానం అన్నారు. దీనికి వ్యతిరేకమైనదంతా అజ్ఞానమే. నిజంగా ఇవి జ్ఞానసాధనలే గాని జ్ఞానం కాదు. అయినా భగవానుడు దీనికి 'జ్ఞానం' అని గౌరవనామాన్ని ప్రసాదించాడు.

ఒక గృహస్థుడు వంటవాణ్ణి 'అన్నదాతా' అంటారు. నిజంగా వంట సరుకులన్నీ తనవే. అతడికి జీతం తనే ఇస్తున్నాడు. అయినా రుచిగా వండి, వడ్డించి కడుపు నింపుతున్నాడు గనుక అలా గౌరవించాడు. అలాగే జ్ఞాన లక్షణాలను జ్ఞానం అనే పిలుస్తున్నాడు భగవానుడు.

ఎవరైతే ఈ 20 లక్షణాలను సాధన చేస్తారో అట్టివారు నిజంగా జ్ఞానులే అవుతారు. ఇందులో సందేహం లేదు. అయితే ఈ 20 లక్షణాలను ఒక్కసారిగా సాధించటం - అలవరచుకోవటం ఎవరికీ సాధ్యం కాదు, అంత అవసరం కూడా లేదు. ఇందులో ఏ ఒకటి - రెండు లక్షణాలను సాధన పూర్వకంగా ప్రయత్నించినా చాలు మిగిలిన లక్షణాలు అన్నీ అప్రయత్నంగానే మనను వరించి వస్తాయి. వారి వారి అభిరుచి, అనుకూలతలను బట్టి ఇక్కడ 20 లక్షణాలలో వేటినైనా సాధించటానికి ప్రయత్నించవచ్చు.

ఈ 20 లక్షణాలు జ్ఞానమనీ వీటికి వ్యతిరేకమైనవి అజ్ఞానమని భగవానుడు తెలియజేసాడు. అంటే అభిమానం, దంభం, హింస, అసహనం, నిజాయితీ లేకపోవటం, గురువును గౌరవించకపోవటం, గురుద్రోహం చెయ్యటం, చంచలత్వం, ఇంద్రియ చాపల్యం, అహంకారం, భోగాసక్తి, ఈషణత్రయం, భేదబుద్ధి మొ॥న వన్నీ అజ్ఞాన లక్షణాలే.

**అజ్ఞాన లక్షణాలను వదిలించుకొని, జ్ఞాని లక్షణాలను సాధించటానికి ప్రయత్నించాలి. అప్పుడే క్షేత్రజ్ఞుని గురించి - లేదా ఆత్మ సంబంధ జ్ఞానాన్ని గ్రహించటానికి అర్హత వస్తుంది.**

**ఇంతవరకు భగవానుడు క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి చెప్పబోతున్నాను - అంటూ క్షేత్రాన్ని గురించి చెప్పి క్షేత్రజ్ఞుని గురించి చెప్పకుండా అది అర్థం చేసుకొనుటకు అర్హతగా జ్ఞాని లక్షణాలను వివరించారు. ఇక క్షేత్రజ్ఞుని గురించి చెప్పబోతున్నారు. ఏమని ?**

**క్షేత్రజ్ఞుడు - జ్ఞేయ వస్తువు ఐన పరమాత్మను తెలుసుకోవాలంటే అర్హత ఉండాలి. అధికారి కావాలి. అందుకే 5 శ్లోకాల్లో (8-12) జ్ఞాని లక్షణాలను చెప్పారు. ఇక క్షేత్రజ్ఞుని గురించి చెప్పాలి. క్షేత్రజ్ఞుడన్నా- జ్ఞేయమన్నా రెండూ ఒక్కటే గనక ఇప్పుడు 6 శ్లోకాల్లో (13-18) జ్ఞేయాన్ని గురించి చెప్పబోతున్నారు. ఏమని?**

**శ్లో|| జ్ఞేయం యత్ తత్ ప్రవక్ష్యామి**
**యత్ జ్ఞాత్వా2మృత మశ్నుతే|**
**అనాది మత్ పరంబ్రహ్మ**
**నసత్ తన్నాస దుచ్యతే|| (13)**

**తా|| దేనిని తెలుసుకొంటే జీవుడు అమృతత్వాన్ని పొందగలుగుతాడో అట్టి జ్ఞేయ వస్తువును (పరమాత్మను) గురించి చెప్పబోతున్నాను. అది అనాది, పరంబ్రహ్మ, సత్తు కాదు అసత్తూ కాదు అని చెప్పబడుతున్నది.**


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య :-** క్షేత్రజ్ఞుని గురించి ఎంతచెప్పినా అంత తేలికగా అవగాహన కాదు.ఎందుకంటే క్షేత్రం బాహ్య విషయం. క్షేత్రజ్ఞుడు లోపలి విషయం - అంతరంగ విషయం. అంతఃదృష్టి గలవారికే అవగతమవుతుంది. అందుకే సరాసరి క్షేత్రజ్ఞుని గురించి చెప్పకుండా; అర్హతను సంపాదించటానికి వీలుగా అమానిత్వాది 20 లక్షణాలను ముందుగా తెలియజేశారు.

ఇప్పుడు క్షేత్రజ్ఞుని గురించి చెప్పబోతున్నాను అని భగవానుడు ప్రారంభిస్తున్నాడు. క్షేత్రజ్ఞుడన్నా - జ్ఞేయమన్నా రెండు ఒక్కటే. పరమాత్మే. కనుక జ్ఞేయాన్ని గురించి చెబితే క్షేత్రజ్ఞుని గురించీ చెప్పినట్లే, జ్ఞేయ వస్తువు గురించీ చెప్పినట్లే.

జ్ఞేయం అంటే జ్ఞానంతో తెలుసుకోదగినది. అదే పరమాత్మ. పరమాత్మను జ్ఞానం ద్వారా మాత్రమే తెలుసుకోగలం, పొందగలంగాని కర్మల ద్వారా సాధ్యం కాదు. అందుకే **'జ్ఞానే నైవతు కైవల్యం'** అన్నారు. కర్మలవల్ల ఎందుకు పొందలేం పరమాత్మను?

(i) కర్మలవల్ల ఉత్పత్తి జరుగుతుంది. ఆత్మ ఉత్పత్తి అయ్యేది కాదు. తయారయ్యేది కాదు. అది ఎప్పుడూ ఉండేది.

(ii) కర్మలవల్ల లేని వస్తువును పొందటం జరుగుతుంది. ఆత్మ లేని వస్తువు కాదు. పొందే వస్తువు కాదు. అది నిత్యం. శాశ్వతం.

(iii) కర్మలవల్ల సంస్కారం జరుగుతుంది - శుద్ధి జరుగుతుంది. ఆత్మ నిత్య శుద్ధం. ఏ కల్మషాలు లేనిది. కనుక శుద్ధి జరగటం అంటూ లేదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(iv) కర్మలవల్ల అనేక వికారాలు (మార్పులు) జరుగుతాయి. ఆత్మ ఏ వికారాలు లేనిది. నిర్వికారం. కనుక ఆత్మ కర్మల ద్వారా పొందబడేది కాదు. కేవల జ్ఞానం ద్వారా మాత్రమే ఆత్మానుభూతి సాధ్యం.

గీతాజ్ఞానబోధ పూర్తయిన తర్వాత భగవానుడు అర్జునుని అడిగాడు, "అర్జునా! నీ మోహం నశించిందా?" అని. దానికి అర్జునుడన్నాడు "**నష్టో మోహః స్మృతిర్లబ్ధః త్వత్ ప్రసాదాన్మయాచ్యుత!**" నీ దయవల్ల అచ్యుతా! నా మోహం నశించింది, స్మృతి కలిగింది - అని.

చీకటిలో ప్రయాణమై పోతున్నావు. నిర్జనప్రదేశం. ఒంటరితనం. భయం. దూరంగా దయ్యం కనిపించింది. భయంవేసింది. అంతలో మెరుపుమెరిసింది. ఒక్కసారి కాంతి వచ్చింది. ఆ వెలుగులో చూచావు. నీ ఎదుటనున్నది, ఇంతవరకు నీవు చూచి భయపడినది దయ్యం కాదు. అది ఒక చెట్టు మొద్దు. దయ్యాన్ని నీవు చెట్టు మొద్దుగా మార్చలేదు. అసలక్కడ ఉన్నది చెట్టే. అయితే చీకటిలో దానిని చూచి దయ్యం అనుకున్నావు. మెరుపు వెలుగులో నీ భ్రమ తొలిగింది. చెట్టును చెట్టుగా గుర్తించావు. అంతే.

అలాగే అజ్ఞానంలో ఈ దేహమే నేను అనుకుంటున్నావు. అది భ్రమ, మోహం. శ్రీకృష్ణుని జ్ఞాన బోధతో అజ్ఞానమనే చీకటి తొలగింది. జ్ఞానమనే వెలుగు ప్రసరించింది. అంతే. ఇప్పటిదాకా దేహమే నేను అనే భ్రమ తొలగింది. ఆత్మను అనే అనుభూతి కలిగింది. స్మృతి కలిగింది. అజ్ఞానం వల్ల స్మృతి తప్పింది - భ్రమ కలిగింది. జ్ఞానంతో భ్రమ తొలగింది. స్మృతి కలిగింది. ఈ కొద్ది సమయంలోనే అర్జునుని భ్రమ తొలగటానికి కారణం ఏమిటి?

స్వస్వరూపాన్ని దర్శించగలగటానికి ఏం కర్మ చేశాడు? ఏ సాధన చేశాడు? ఏమీ లేదు; భగవంతుని జ్ఞాన బోధ వల్లనే. కనుక జ్ఞానం వల్లనే ఆత్మానుభూతి సాధ్యమైంది.

**యత్ జ్ఞేయం తత్ ప్రవక్ష్యామి :-** ఏది జ్ఞేయమో దానిని లెస్సగా చెప్పబోతున్నాను అంటున్నాడు భగవానుడు. జ్ఞేయాన్ని 'తత్' అనే పదంతో చెబుతున్నాడు. తత్ అంటే అది అని. అంతేకాదు పరమాత్మను కూడా 'తత్' అనే పదంతోనే వేదాలలో చెప్పటం జరిగింది. ఇక్కడ 'వక్ష్యామి' అనకుండా 'ప్రవక్ష్యామి' అంటున్నాడు. అంటే లెస్సగా చెబుతాను అని. అంటే ఏదో చెప్పుకుంటూ పోవటం గాక, చెబితేనే నీకు ఒక్కసారి పూర్తిగా అర్థం అయ్యేట్లు చెబుతాను అని.

ఇలా జ్ఞేయాన్ని గురించి చెబుతాను, లెస్సగా చెబుతాను, సందేహాలకు తావు లేకుండా చెబుతాను అనగానే 'ఆ జ్ఞేయాన్ని తెలుసుకుంటే - వింటే నాకు ప్రయోజనం ఏమిటి? అని అర్జునుడు అనుకుంటున్నాడేమోనని భావించి భగవానుడు **'యత్ జ్ఞాత్వా అమృతం అశ్నుతే'** - దేనిని తెలుసుకుంటే అమృతత్వం లభిస్తుందో అదే ఈ జ్ఞేయం అన్నాడు. అమృతత్వం అంటే శాశ్వతతత్వం. అదే జనన మరణాలు లేని మోక్షస్థితి. ఫలితం తెలిస్తే విషయం మీద అభిరుచి కలుగుతుందని ఫలితాన్ని కూడా చెప్పేశాడు. కనుక జ్ఞేయ వస్తువును తెలుసుకుంటే తక్షణ ఫలితం అమృతత్వమే. ఏమిటా జ్ఞేయం?

(i) **అనాది మత్ :-** ఆది లేనిది. ఈ సృష్టిలో ప్రతి వస్తువుకు, ప్రతి జీవికి ఆది ఉన్నది. అంతం కూడా ఉంటుంది. అసలు ఈ సృష్టికే ఆది ఉన్నది. అంతం

ఉన్నది. సృష్టికర్త బ్రహ్మదేవునికి కూడా ఆది - అంతం ఉన్నాయి. కాని ఆత్మకు - పరమాత్మకు ఆది - అంతం రెండూ లేవు. అజం - అవ్యయం. ఈ సృష్టి అంతా కూడా ఆయనలో కనిపించి, కొంత కాలం ఉండి, ఆయనలోనే లయమై పోతున్నది. ఆయన సర్వానికి ఆధారంగా ఉండి ఎప్పుడూ నిశ్చలంగా ఉంటాడు. అందుకే 'అనాది మత్' అన్నారు.

(ii) **పరంబ్రహ్మ** :- బ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ. సృష్టి కర్త. ఆయనకు ఆది అంతం ఉన్నవి. కాని ఈ జ్ఞేయం - ఆత్మ - క్షేత్రజ్ఞుడు పరంబ్రహ్మ, బ్రహ్మ కన్న వేరైనది. ఆత్మ ఒక కాలానికి లోబడినది కాదు. అన్ని కాలాల్లోనూ ఉండేది. ఒక ప్రదేశానికి - లోకానికి లోబడినది కాదు. అన్ని ప్రదేశాలలోనూ, అన్ని లోకాలలోనూ ఉండేది. అది సర్వవ్యాపి. అది లేని చోటు లేదు. అది గుణాలకు లోబడినది కాదు. దానికేగుణమూ లేదు. అది గుణరహితం. గుణాతీతం. అందుకే దానిని పరంబ్రహ్మ అన్నారు. దేహేంద్రియ మనోబుద్ధులను, దృశ్య వస్తువులను తెలుసుకుంటూ వాటికి విలక్షణమై, వేరుగా, కేవల సాక్షిగా ఉంటూ 'నేను' అనే మాటకు లక్ష్యార్థమైయుండే చైతన్యం సాక్షాత్తు పరంబ్రహ్మయే.

(iii) **నసత్ న అసత్ ఉచ్యతే** :- అది సత్తూ కాదు. అసత్తూ కాదు అని చెప్పబడింది. అంటే అది ఉన్నదీ కాదు. లేనిదీ కాదు అని.

పరమాత్మ అవాఙ్మానసగోచరం. అంటే వాక్కుకు వర్ణించవీలైనది కాదు. మనస్సు చేత భావించగలిగినదీ కాదు. దేహేంద్రియ మనోబుద్ధులను అది ప్రకాశింపజేస్తుంది. కానీ దానిని ఈ దేహేంద్రియ మనోబుద్ధులు ప్రకాశింపజేయలేవు. కనుకనే దానిని 'న సత్' – 'సత్ అనలేము' అన్నారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**పోనీ అసలు లేనిదా? అది లేకపోతే ఈ జడమైన దేహేంద్రియాలు, మనోబుద్ధులు ఎలా పని చేస్తున్నాయి? లైటు వెలగటానికి, ఫ్యాను తిరగటానికి ఎలా కరెంటు అవసరమో అలాగే కన్ను చూడటానికి, చెవి వినటానికి చైతన్యం ఉండాలి గదా! మరి లేదు అని ఎలా అనగలం? - న అసత్ లేనిది అనలేము. అందుకే అది నసత్ - న అసత్ అన్నారు.**

**పరమాత్మ ఇంద్రియ గోచరమయ్యేది కాదు, గనుక ఉన్నదీ అనలేం. దాని ప్రభావంతోనే జడమైన దేహంలో చలనం కలుగుతున్నది, గనుక లేదనీ అనలేం. మరి ఎలా దానిని భావించటం? 14వ శ్లోకంలో-**

**శ్లో|| సర్వతః పాణి పాదం తత్**
**సర్వతో2క్షి శిరో ముఖం|**
**సర్వత్ర శ్రుతి మల్లోకే**
**సర్వ మావృత్య తిష్టతి ||** (14)

**తా||** దానికి అంతటా కాళ్ళు చేతులు; అంతటా కళ్ళు, తలలు, ముఖాలు, అంతటా చెవులు ఉండి లోకంలో అంతటినీ ఆవరించియుంటుంది.

**వ్యాఖ్య** :- ఈ లోకంలో అంతటా ఆయన అవయవాలు వ్యాపించి ఉన్నాయి, ఆయనా వ్యాపించియున్నాడు. అంటే ఈ లోకంలో కనిపించే అన్ని కాళ్ళు, చేతులు, కళ్ళు, తలలు, ముఖాలు, చెవులు అన్నీ ఆయనవే. ఆయన లేని చోటే లేదు.

ఋగ్వేదంలోని పురుష సూక్తంలో ఉన్నదే ఈ శ్లోకంలో చెప్పబడింది. "**సహస్ర శీర్షాః పురుషః సహస్రాక్షః సహస్రపాద్**" పరమాత్మ

యొక్క తలలు, కళ్ళు, పాదాలు వేలకొద్దీ ఉన్నాయి - అని. వేలకొద్ది ఉన్నాయి అంటే ప్రపంచంలోని అన్ని తలలు, అన్ని కళ్ళు, అన్ని కాళ్ళు ఆయనవే అని భావం. అందుకే గీతలో **సర్వతః పాణి పాదం తత్ సర్వతోక్షి శిరో ముఖం** అనటం జరిగింది. భగవంతుని చేతులు, పాదాలు, కళ్ళు, తలలు, ముఖాలు అంతటా వ్యాపించి ఉన్నాయి - అని. అంటే మన కాళ్ళు, చేతులు, తలలు, కళ్ళు, నోళ్ళు అన్నీ పరమాత్మవే.

ఇవన్నీ నావి - నావి అని అనుకుంటున్నాం మనం. మరి భగవంతుడేమో నావి - నావి అంటున్నాడు. ఇంతకీ ఇవి ఎవరివి? ఏది నిజం? రెండూ నిజమే. నేను పరమాత్మను అనే అనుభూతి ఉంటే అన్నీ భగవంతునివే. నేను జీవుణ్ణి అనే అజ్ఞానంలో ఉంటే నావి నావి అనుకుంటున్నాం.

వీటన్నింటి వెనుక ఆ పరమాత్మ శక్తి - చైతన్యం ఉన్నదని ఎలా చెప్పగలం? ఈ జడమైన కాళ్ళు, చేతులు, కళ్ళు, ముఖాలు, తలలు - అన్నీ కదులుతున్నాయి, వాటి పనులు అవి చేసుకుంటున్నాయి అంటే వాటిని కదిలించే ఆ చైతన్య శక్తిని - పరమాత్మ శక్తిని - బ్రహ్మశక్తిని తెలుసుకోవచ్చు.

అండ, పిండ, బ్రహ్మాండాలన్నీ కదిలి వాటి పని అవి చేసుకుంటున్నాయి అంటే వాటిని కదిలించే చైతన్య శక్తి ఒకటి ఉండాలి. అదే బ్రహ్మశక్తి.

అవ్యక్తము, అనిర్వచనీయము, అవాఙ్మానసగోచరము అయిన పరమాత్మ శక్తిని - జ్ఞేయ వస్తువును జడము, కంటికి కనిపించేవీ మనకు తెలిసినవీ అయిన కాళ్ళు, చేతులు, కళ్ళు, ముఖాలు, తలలు, చెవులు మొ||న అనిత్యమైన, తాత్కాలికమైన వస్తువుల ద్వారా తెలుసుకొనే విధానాన్ని ఇక్కడ

తెలియజేశారు. ఇవి కదులుతున్నాయి, వాటి పనులు అవి చేసుకుంటున్నాయి - అంటే దానికి కారణం పరమాత్మ చైతన్య శక్తియే. కనుక ఇవన్నీ పరమాత్మకు చెందినవే. అందుకే ఆయన కాళ్ళు, చేతులు, కళ్ళు, ముఖాలు, తలలు, చెవులు అంతటా వ్యాపించి ఉన్నాయి అని చెప్పటం జరిగింది.

**సర్వం ఆ వృత్యతిష్టతి** :- ఈ అవయవాలు ఎక్కడెక్కడ ఉన్నాయో అక్కడల్లా పరమాత్మ వ్యాపించియున్నాడు. ఐతే మిగిలిన చోట్ల ఉండడా? అంటే అంతటా ఉన్నాడు. అన్ని లోకాల్లో ఆయనే వ్యాపించియున్నాడు. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మం. కనుక సర్వవ్యాపకం. సర్వమూ ఆయనలోనే. అన్నింటిలోనూ ఆయనే.

ఈ ప్రకారంగా జ్ఞేయవస్తువు అంతటా ఉన్నదని తటస్థ లక్షణ పద్ధతి ద్వారా తెలుసుకొనే విధానాన్ని ఈ శ్లోకంలో తెలియజేశారు.

ఇంకా మరికొన్ని లక్షణాలతో జ్ఞేయవస్తువు గురించి తెలియజేస్తున్నారు.

**శ్లో|| సర్వేంద్రియ గుణాభాసం**
**సర్వేంద్రియ వివర్జితం|**
**అసక్తం సర్వ భృచ్చైవ**
**నిర్గుణం గుణ భోక్తృచ || (15)**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** సర్వ ఇంద్రియ గుణాలను ప్రకాశింపజేసేది; ఇంద్రియాలు తనలో లేనిది; సమస్త జగత్తును భరించేది, ధరించేది; అయితే దేనికీ అంటకుండా ఉన్నది; అన్ని గుణాలను భోగించేది; అయితే అది మాత్రం ఏ గుణాలు లేనిది.

**వ్యాఖ్య :-** అనిర్వచనీయమైన జ్ఞేయ వస్తువును విరోధభాసాలంకారం ద్వారా పరస్పర వ్యతిరేక భావాలతో చెప్పటం వేదాంతంలో ఒక విశేష పద్ధతి. ఇది ఉపనిషత్తుల భాష. ఇది శ్వేతాశ్వతరోపనిషత్తులోనిది.

భగవంతుడు వ్యక్త స్వరూపంతో ప్రపంచంలో ఎలా వ్యవహరిస్తూ ఉంటాడో అవ్యక్త స్వరూపంతో ఎలా ఉంటాడో ఈ శ్లోకం చెబుతున్నది.

ఇలా వ్యతిరేక భావాలతో, విరుద్ధ భావాలతో చెప్పినప్పుడు అది బుద్ధిని కదిలించి, ఉల్లాసపరచి చురుకుదనాన్ని కలిగిస్తుంది, ఆత్మను తెలుసుకొనేటట్లు చేస్తుంది.

(i) అన్ని ఇంద్రియ గుణాలను ప్రకాశింపజేసేది, ఇంద్రియాలు తనలో లేనిది :- కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక అనే జ్ఞానేంద్రియాలు గాని, కాళ్ళు, చేతులు, వాక్కు, గుదము, జననేంద్రియము అనే కర్మేంద్రియాలుగాని వాటి పనులు అవి చేసుకుంటున్నాయి అంటే ఆ శక్తి వాటికి ఎక్కడి నుండి వచ్చింది? ఆ శక్తి పరమాత్మ చైతన్యమే. అంటే ఆయన శక్తులు జీవుళ్ళ ఇంద్రియాల ద్వారా వ్యక్తమౌతున్నది. అయితే ఆయనలో ఏ ఇంద్రియాలు లేవు. ఎందుకంటే ఆయనకన్న వేరైనది ఏమీలేదు గనుక ఆయన దేన్ని చూడవలసిన పని, వినవలసిన పని, మాట్లాడవలసిన పని అంటూ ఏమీలేవు. అందుకే ఆయనకు ఇంద్రియాలతో పనిలేదు. ఆయనలో ఇంద్రియాలు లేవు.

బల్బు వెలుగుతున్నది. ఫ్యాను తిరుగుతున్నది. వీటికి శక్తి ఎక్కడిది? అదే విద్యుచ్ఛక్తి. ఈ విద్యుచ్ఛక్తియే బల్బుకు, ఫ్యానుకు కదలికనిస్తున్నది. అయితే బల్బులోని వెలుగుగాని, ఫ్యానులోని గాలిగాని కరెంటులో ఉన్నాయా? లేవు. ఈ రెండు గుణాలు బల్బు, ఫ్యానుల నిర్మాణంలోనే ఉన్నాయి. కరెంటులో లేనే లేవు. అలాగే ఆత్మచైతన్యం ఈ అన్ని ఇంద్రియాలకు శక్తినిస్తున్నది. కాని ఇంద్రియాలేవీ ఆత్మలో లేవు.

మనం సూక్ష్మంగా పరిశీలిస్తే ఇంద్రియాలన్నీ నశించేవి. అనిత్యమైనవి. వాటికి శక్తినిస్తూ వాటి ద్వారా వ్యవహరించే ఆత్మ మాత్రం నిత్యమైనది. అనిత్య వస్తువులు - కల్పిత వస్తువులు ఆత్మనేమి చేయలేవు.

- ఎండ మావులు ఏ నాటికీ నేలను తడుపలేవు.
- కల్పిత సర్పం త్రాడును ఎన్నటికీ విషపూరితం చెయ్యలేదు.

(ii) **అసక్తం సర్వ బృత్ చ :-** దేనినీ అంటకుండా అన్నింటిని ధరిస్తుంది, అన్నింటిని భరిస్తుంది. అద్దం అన్నింటిని చూపిస్తుంది. కాని దేనినీ అంటించుకోదు. అన్నింటిని తనలోకి తీసుకుంటుంది. కాని దేనిని తనదిగా చేసుకోదు. కల్పితమైన పామును త్రాడే ధరిస్తుంది. అయితే ఆ పాముతో త్రాడుకు ఎటువంటి సంగభావము లేదు.

అలాగే ఆత్మ అన్నింటిని ధరిస్తుంది, భరిస్తుంది. కాని దేనితోను సంగభావం లేకుండా అసక్తంగా ఉంటుంది. త్రాడుకు, పాముకు సంబంధం లేదు. అయినా త్రాడే పాముకు ఆధారం. అలాగే పరమాత్మకు జగత్తుకు

సంభంధం లేదు. అయినా పరమాత్మే జగత్తుకు ఆధారం. జగత్తుకు అంటకుండా జగత్తును ధరిస్తున్నది.

(iii) **నిర్గుణం గుణ భోక్తృచ:-** ఆత్మ స్వయంగా గుణ రహితం. నిర్గుణం. అయితే ప్రకృతితో తాదాత్మ్యం చెందినప్పుడు - శరీర మనోబుద్ధులతో తాదాత్మ్యం చెందినప్పుడు గుణాలతో - త్రిగుణాలతో ఉన్నట్లు కనిపిస్తుంది. అంటే ప్రకృతి యొక్క గుణాలు ఆత్మపై ఆరోపించబడుతున్నాయి. ఐతే ఆత్మకు గుణాలు లేవని - నిర్గుణం అని ఎలా చెప్పగలం?

ఆత్మ మేలుకున్నప్పుడూ ఉంది. గాఢ నిద్రలోను ఉంది. అయితే మేలుకున్నప్పుడు గుణాలు తెలుస్తూనే ఉంటాయి. మంచి గుణాలు - చెడ్డ గుణాలు అని. ఈ గుణాలనే నావిగా - ఆత్మవిగా భావిస్తుంటాం. అయితే గాఢ నిద్రలో ఏ గుణాలు లేవు. అయినా ఆత్మ ఉంది. అంటే ఆత్మకు ఏ గుణాలు నిజంగా లేవు. ఇదే ఆత్మ నిర్గుణం అని చెప్పటానికి ఋజువు.

ఆత్మకు గుణాలు లేవు. కాని గుణాలను భోగించేది ఆత్మయే - అంటున్నారు. ఈ ప్రకృతితో తాదాత్మ్యం చెందిన ఆత్మయే జీవుడు. ఆ జీవుడే అన్ని గుణాలను భోగిస్తున్నాడు. అంటే ఆత్మయే గుణాలను భోగిస్తున్నట్లు గదా! ఇదంతా మన అజ్ఞానంలోనే. అజ్ఞానం తొలగి ఆత్మను - అనాత్మను వేరుచేసి నేను కేవల ఆత్మగా ఉంటే అప్పుడు అనాత్మకు చెందిన గుణాలతో నాకు సంబంధం ఉండదు గదా! నేను (ఆత్మ) నిర్గుణమే గదా!

దీనిని బట్టి ఆత్మ దేహేంద్రియమనోబుద్ధులలో కూర్చొని జీవుడుగా ఉన్నపుడు గుణాలను భోగించేదీ అదే. దేహేంద్రియమనోబుద్ధులతో కూడిన

అనాత్మను వేరుచేసి తానుతానుగా ఉన్నప్పుడు గుణాలు లేనిదీ అదే. ఈ విధంగా పరస్పర విరుద్ధభావాలతో ఆత్మను - జ్ఞేయ వస్తువును తెలియజేస్తున్నారు.

- ఉపనిషత్తుల శైలిలో పరస్పర విరుద్ధ భావాలతో జ్ఞేయ వస్తువును చెబుతున్నారు.

**శ్లో|| బహిరంత శ్చ భూతానాం**
**అచరం చరమే వచ|**
**సూక్ష్మత్వాత్ తద విజ్ఞేయం**
**దూరస్థం చాంతి కేచ తత్||** **(16)**

**తా||** జీవుళ్ళకు బయటా లోపలా ఉంటూ, కదిలేది కదలనిదీ తానే అయి, సూక్ష్మత్వం కారణంగా తెలియబడదు. అది దూరంగా ఉండేది, దగ్గరగాను ఉండేది.

**వ్యాఖ్య :-** (i) **బహిరంత శ్చ భూతానాం:-** ఒక వస్తువు బయట ఉన్నది అంటే లోపల ఉన్నది అనలేం. లోపల ఉన్నది అంటే బయట ఉన్నది అనలేం. పుస్తకం సంచి లోపల, బయట ఉన్నది అని అనగలమా? లోపలో, బయటో ఒక్క చోటే ఉంటుంది. అయితే జ్ఞేయ వస్తువైన పరమాత్మ పుస్తకంలా స్థూలం కాదు. అది సూక్ష్మాతి సూక్ష్మం. ఆకారం లేదు. అది సర్వత్రా వ్యాపించి యున్నది. కనుక లోపలా బయటా ఉంటుంది. ఆకాశం కూడా అంతే. ఒక కుండను తెచ్చి అక్కడ పెట్టావు. ఇప్పుడు కుండ లోపల ఆకాశం ఉందా? ఉంది. కుండ బయటనో!

అక్కడా ఉంది. అలాగే ఆత్మకు లోపల - వెలుపలా అనే తేడా లేదు. ఉపాధి దృష్టితో చూచినప్పుడే ఈ లోపల - వెలుపల అనేది. ఉపాధులను తొలగించి చూస్తే అంతటా ఆత్మయే.

నిజంగా ఈ బ్రహ్మాండం అంతా జ్ఞేయవస్తువులోనే ఉంది. ఇదే శ్రీకృష్ణుని మన్నుతిన్న లీల. సమస్త బ్రహ్మాండం చిన్ని కృష్ణుని నోటిలో చూచింది యశోద.

(ii) **అచరం చర మేవచ :-** పరమాత్మ కదలనిదీ, కదిలేదీ కూడా. నిజంగా రెండూ పరస్పర విరుద్ధ విషయాలు. కదులుతూ కదలటం లేదని ఎలా చెప్పగలం? కదలకుండా ఉన్నదాన్ని కదులుతున్నదని ఎలా చెప్పగలం?

స్వప్నంలో మనం ఎక్కడెక్కడో తిరుగుతాం. నిజంగా అప్పుడు మనం బెడ్ మీద కదలకుండా పడిఉన్నాం. రైలులో మనం కదలకుండా కూర్చున్న చోటనే ఉంటాం. అయినా ఎంతో దూరం ప్రయాణం చేస్తున్నాం. కదలకుండా కదులుతూ ఉంటాం. కదులుతూ కదలకుండా ఉండటం అంటే ఇదే.

అంటే ఏదో ఒక ఉపాధి ఉన్నప్పుడే ఇది సాధ్యం. మనం ఇక్కడ కదలకుండా గంటసేపటి నుండి కూర్చున్నాం. కాని కొన్ని వేల మైళ్ళు కదిలిపోయాం. ఎలా? భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. కనుక మనకు తెలియకుండానే కదులుతున్నాం.

జ్ఞేయవస్తువైన పరమాత్మ కూడా స్వరూపత :- అచ్చంగా స్థిర వస్తువు. కదిలేది కాదు. కదలటానికి తనకన్న వేరుగా చోటు లేదు. అయితే అదే పరమాత్మ సర్వవ్యాపకం గనుక అన్ని ఉపాధులలోను, అన్ని జీవుళ్ళలోను

ఉన్నది. ఆ జీవుళ్ళు కదులుతుంటే పరమాత్మే కదులుతున్నాడని అనుకుంటాం. నా దేహం కదిలితే నేను కదులుతున్నాను అంటాం. కనుక ఉపాధుల దృష్టితో చరం (కదిలేది), తనంతట తానుగా (అచరం) కదలనిది.

(iii) **సూక్ష్మత్వాత్ తత్ అవిజ్ఞేయం:-** సూక్ష్మత్వం కారణంగా జ్ఞేయ వస్తువు తెలుసుకొనుటకు వీలు లేనిది. ఒక వస్తువు స్థూలం అయిన కొద్దీ తెలుస్తుంది. సూక్ష్మం అయిన కొద్దీ తెలియకుండా పోతుంది. భూమి, నీరు, స్థూలం కనుక తెలుస్తుంది. అగ్ని కొంచెం సూక్ష్మం, కనుక తెలుస్తుంది. వాయువు ఇంకా సూక్ష్మం కనుక చర్మానికి తప్ప తెలియదు. ఆకాశం ఇంకా సూక్ష్మం. శబ్దగుణం వల్ల తెలియాల్సిందే తప్ప ఇక ఏ ఇంద్రియానికి గోచరం కాదు. పరమాత్మ ఆకాశం కన్నా సూక్ష్మాతి సూక్ష్మం కనుక ఏ ఇంద్రియానికి తెలియదు. బాహ్య దృష్టి గలవారు ఎన్నటికీ తెలుసుకోలేరు. అంతర్దృష్టితో మాత్రమే తెలుస్తుంది. కనుక సూక్ష్మాతి సూక్ష్మమైన జ్ఞేయ వస్తువు పరమాత్మ అవిజ్ఞేయం.

(iv) **దూరస్థం చాంతికే చతత్ :-** పరమాత్మ సుక్ష్మాతి సూక్ష్మము, సర్వవ్యాపకము కనుక చూచేవాని దృష్టిని బట్టే అది దూరంగానో - దగ్గరగానో ఉంటుంది. దూరంగా ఉన్నది అంటే పరమాత్మను అందుకోవటం చాలా కష్టం అని, అలాగే దగ్గరగా ఉన్నది అంటే అందుకోవటం చాలా తేలిక అని భావం.

భగవంతునిపట్ల విముఖులై, ఆయన గురించి తెలుసుకోవాలనే ఆలోచన లేక, ఆయనకు సంబంధించిన పనులు చేయకుండా, నిరంతరం లౌకిక వ్యవహారాలలో మునిగిన వారికి పరమాత్మ చాలా దూరం. కోటి జన్మలకైనా సాధ్యం కాదు. అదే దూరస్థం. అలాగాక బాహ్య విషయాల

పట్ల ఆసక్తిని విడిచి, ఆ పరమాత్మను అందుకొనుటే ప్రధానంగా భావించి, శ్రవణ, మనన, నిధి ధ్యాసనల ద్వారా నిరంతరం సాధనలతో ఉండేవారికి పరమాత్మ దగ్గర. ఒక్క జన్మ చాలు.

దీనిని బట్టి దృష్టి బాహ్యంగా లౌకిక వస్తువుల పట్ల ఉంటే పరమాత్మ దూరం. అంతరంగం వైపుకు తిరిగితే పరమాత్మ దగ్గర.

తాళపు చెవి మొలత్రాడులో కట్టుకున్నావు. కాని మరచిపోయావు. ఇల్లంతా వెతికావు, ఊరంతా గాలించావు. కనిపించలేదు. ఎక్కడుందో - ఎక్కడుందో అని నీ దృష్టి ఎక్కడెక్కడికో పరుగు తీస్తున్నది. ఎప్పుడో గుర్తుకువచ్చింది. చేతితో తడిమి చూచావు. దగ్గరే ఉన్నది.

నీ దృష్టి బాహ్యంగా వెళ్ళినంత కాలం ఎంతదూరం వెళ్ళినా - ఎందరినడిగినా అది దూరమే. కారణం నీ మతిమరపే. అది తొలగి జ్ఞాపకం వచ్చిందా - అది నీ దగ్గరే ఉంది. నీవు ఎక్కడా వెతకాల్సిన పనిలేదు.

అజ్ఞానంలో ఉన్న హిరణ్యకశిపుడు శ్రీహరి కోసం అంతటా వెతుకుతున్నాడు. ఎక్కడా కనిపించలేదు. ఎక్కడరా నీ హరి? అని ప్రహ్లాదుని ప్రశ్నించాడు. ప్రహ్లాదుడు పరమభక్తుడు - జ్ఞాని. అంతటా పరమాత్మను దర్శిస్తూనే ఉన్నాడు. ఆయనకు చాలా దగ్గర. అందుకే అన్నాడు, "ఎందెందు వెదకి చూచిన అందందే గలడు" అని.

కస్తూరిమృగం ఆ సువాసన తన నుండే వస్తున్నదని తెలియక సతమతమైపోతూ అరణ్యమంతా అలసిపోయే దాకా తిరుగుతూనే ఉంటుంది. మనం కూడా అంతే. మనలోనే స్థిరంగా, నిశ్చలంగా,

**సర్వకాలసర్వావస్థలలోను ఉండే పరమాత్మ కొరకు ప్రపంచం అంతటా తిరుగుతూ ఉంటాం.**

- **పరస్పర విరుద్ధమైన మరోపదం ద్వారా జ్ఞేయవస్తువును మరింతగా వివరిస్తున్నారు.**

**శ్లో|| అవి భక్తంచ భూతేషు**
**విభక్త మివచ స్థితం|**
**భూత భర్తృచ తజ్జ్ఞేయం**
**గ్రసిష్ణు ప్రభ విష్ణు చ|| (17)**

**తా||** ఒక్కటిగా ఉన్న జ్ఞేయవస్తువు జీవుళ్ళలో విభజించబడిన దానివలె ఉంటుంది. జీవుళ్ళను పోషించేది, అలాగే జీవుళ్ళను పుట్టించేది, లయం చేసేది ఆ జ్ఞేయవస్తువు.

**వ్యాఖ్య :-** (i) **అవి భక్తం చ భూతేషు విభక్తం ఇవ:-** ఆత్మ నిజంగా ఏకం, అద్వయం. అది అఖండం. విభజించే వీలులేనిది. అది ఆకాశం కన్న సూక్ష్మం గనుక దానిని విభజించే వీలు లేదు. ఆకాశాన్ని స్థూల వస్తువుతో విభజించవచ్చు. ఎందుకంటే స్థూలమైన వస్తువులో ఆకాశం ఉండే అవకాశం లేదు. కాని ఆత్మస్థూల వస్తువులో కూడా ఉంటుంది. కనుక విభాగించలేము. అయితే మన దృష్టి అజ్ఞానంతో కూడి యుండి, దేహాదులను చూస్తూ ఉండటం వల్ల 'దేహంలోని ఆత్మ' అని భావిస్తూ అన్ని దేహాలలో ఉన్న ఆత్మను

ఒక్కటిగా గాక అనేకంగా భావిస్తున్నాం. అన్ని క్షేత్రాలలోని క్షేత్రజ్ఞుడను నేనే అని భగవానుడు ముందే తెలియజేయటం జరిగింది. అయినా ఉపాధి భేదాన్ని బట్టి నాలోని ఆత్మ, నీలోని ఆత్మ, అతడిలోని ఆత్మ అని వేరువేరుగానే చూస్తున్నాం. 'వేరు వేరు అని' ఇలా అజ్ఞాన దృష్టితో అనిపిస్తుందే తప్ప నిజంగా ఆత్మ ఒక్కటే.

మీ ఇంటి నుండి ఒక చెంబును తెచ్చారు. మీరు తెచ్చింది చెంబునే గాని ఆకాశాన్ని కాదు గదా! నిజం చెప్పాలంటే లోపలా వెలుపలా అంతటా వ్యాపించియున్న ఆకాశంలో ఈ చెంబు అటూ ఇటూ తిరుగుతున్నది. అలాగే ఈ క్షేత్రాలన్నీ- ఉపాధులన్నీ అంతటా వ్యాపించియున్న ఆత్మ యందు అటూ ఇటూ తిరుగుతున్నాయి. కనుక ఆత్మ అవిభక్తం.

అందుకే ఈ శ్లోకంలో 'విభక్తం ఇవ' అంటూ విభజించబడినట్లుగా ఉంటుంది అన్నారు. అంటే ఆత్మ అవిభక్తమే అయినా విభక్తమైన దానివలె కనిపిస్తుంది అన్నారు. అంటే నిజంగా విభక్తమై లేదు, అలా కనిపిస్తుంది - అని.

మనం ఒక మనిషిని చూస్తే ఒక్కరుగానే కనిపిస్తారు. కాని కంటిపాపలను దగ్గరగా చేర్చి చూస్తే ఒకరు ఇద్దరుగా కనిపిస్తారు. ఇద్దరుగా కనిపిస్తారేగాని ఇద్దరు కాదు. ఒక్కరే. అలాగే ఆత్మ ఉపాధుల దృష్టితో చూచినప్పుడు అనేకంగా కనిపిస్తుందే గాని, అది ఒక్కటే. అవిభక్తం.

అజ్ఞాన దృష్టికి నానాత్వం గోచరిస్తుంది. జ్ఞాన దృష్టికి ఏకత్వమే. అందుకే శంకరులవారు "**దృష్టిం జ్ఞాన మయీం కృత్వా పశ్యేత్ బ్రహ్మ మయం జగత్**" అన్నారు. కనుక దేహదృష్టి, మనోదృష్టిని వదిలి ఆత్మదృష్టిని అలవరచుకోవాలి.

ఇంకా జ్ఞేయవస్తువైన క్షేత్రజ్ఞుడు ఎట్టివాడో చెబుతున్నారు.

(ii) **భూత భర్తృచ, గ్రసిష్ణు, ప్రభవిష్ణుచ:-** సమస్త భూతములను సృష్టించేది, పోషించేది, లయంచేసేది ఆ పరమత్మే.

- అలలు సముద్రంలోనే పుట్టి, కొంతసేపు ప్రయాణించి, తిరిగి ఆ సముద్రంలోనే లయమైపోతాయి.
- వర్షంలో పైనుంచి పడ్డ చినుకుల వల్ల క్రింద పారే నీటిలో బుడగలు పుట్టి, కొంత దూరం ప్రయాణించి, అందులోనే 'టప్' మని పగిలిపోతాయి.
- స్వప్నం అనేది నిద్రించిన జీవుడి మనస్సులో సృష్టించబడి, కొంతసేపు ఉండి, తిరిగి ఆ మనస్సులోనే లయమై పోతుంది.

అలాగే ఈ జగత్తు - జీవుళ్ళు అన్నీ కూడా ఆత్మయందే పుట్టి, కొంత కాలం ఉండి చివరకు ఆత్మయందే లయమైపోతాయి.

జగత్తు సత్యమనే భ్రమలో ఉన్న సామాన్యులందరికీ పై ఉపమానాల ద్వారా తెలుసుకొన్న సృష్టి - స్థితి - లయాలన్నీ నిజమే అనిపిస్తాయి. కాని లోతుగా ఆలోచిస్తే ఈ జగత్తు - జీవుళ్ళు అంతా మిథ్య. అంటే సత్యం కాదు. కాని అజ్ఞానంలో ఉన్నట్లు అనిపిస్తుంది. ఇట్టి మిథ్యా జగత్తు యొక్క మిథ్యా భూతాల యొక్క పుట్టుక - ఉండుట - లయించుట అనేది ఆత్మలో ఎలా ఉంటుందో ఒక ఉపమానం ద్వారా చూద్దాం.

ఒక పెద్దచెట్టు నిర్జన ప్రదేశంలో ఉంది. మనం అటుగా చీకటిలో వెళ్తున్నాం. ఆ చీకటిలో గాలికి చెట్టు కొమ్మలు ఆకులు కదులుతూ ఉంటే దానిని చూచి దయ్యం అనుకున్నాం. దానితో భయం వేసింది.

తప్పించుకోవటం ఎలాగా అనుకున్నాం. ఆంజనేయ దండకం చదువుకున్నాం. అంతలో మెరుపు మెరిసింది. ఇప్పుడు చూస్తే దయ్యం లేదు. చెట్టు ఉన్నది. భయం పోయింది. చీకటి కారణంగా దయ్యం పుట్టింది. కొంతసేపు మనను భయపెట్టింది. చివరకు వెలుగు రాగానే అదృశ్యం అయ్యింది. ఇదంతా ఎక్కడ జరిగింది? ఆ చెట్టులోనే. ఎప్పుడు? చీకటిలో. కనుక చీకటిలో ఉన్నంతవరకు ఆ చెట్టే దయ్యంగా కనిపించింది; కొంతసేపు భయపెట్టింది. చీకటి తొలగి కాంతి రాగానే అదృశ్యమైంది. ముందు ఉన్నది చెట్టే. వెనుక ఉన్నది ఆ చెట్టే. దయ్యం పుట్టుక, ఉండటం, పోవటం అబద్ధం.

అలాగే అజ్ఞానంలో ఉన్నంతవరకు ఆత్మయే జగత్తుగా కనిపిస్తుంది. కొంతకాలం సుఖం, దుఃఖం, భయం, బాధా కలిగిస్తుంది. ఎప్పుడైతే అజ్ఞానం తొలగి జ్ఞానం కలుగుతుందో - ఆత్మజ్ఞానం కలుగుతుందో - నేను ఆత్మను అనే స్థితిలో నిలచిపోయామో జగత్తు మాయం. ఆత్మ ప్రత్యక్షం.

చెట్టు సాక్షాత్కారమైతే దయ్యం మాయం. ఆత్మ సాక్షాత్కారమైతే జగత్తు మాయం. కనుక మిథ్యయైన జగత్తు యొక్క పుట్టుకా ఆత్మలోనే; ఉండటమూ ఆత్మలోనే. ఈ రెండూ మన అజ్ఞానంలోనే. జ్ఞానం కలిగిందా - జగత్తు మాయం. అదే లయం. మిగిలేది ఆత్మయే - జ్ఞేయవస్తువే.

ఇంతవరకు 4 శ్లోకాల్లో జ్ఞేయవస్తువు గురించి - క్షేత్రజ్ఞుని గురించి తటస్థ లక్షణ పద్ధతిలో చెప్పిన భగవానుడు ఇప్పుడీ శ్లోకంలో స్వరూప లక్షణ పద్ధతిలో చెప్పబోతున్నారు.

**శ్లో|| జ్యోతిషా మపి త జ్జ్యోతిః**

**తమసః పర ముచ్యతే|**

**జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం**

**హృది సర్వస్య విష్ఠితం ||          (18)**

**తా||** అది (జ్ఞేయవస్తువు) వెలుగుకు వెలుగు. తమస్సు కన్న వేరైనదని చెప్పబడింది. అదే జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానగమ్యము అనే త్రిపుటి. అందరి హృదయాలలోనూ నిలిచిఉన్నది.

**వ్యాఖ్య :-** పరమాత్మ స్వరూప లక్షణాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

(i) **జ్యోతిషాం అపి తత్ జ్యోతిః :-** మనకు ఈ ప్రపంచంలో వెలుగును ఇచ్చే జ్యోతులు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, అగ్ని, దీపం, విద్యుత్తు. ఇవన్నీ వెలుపలి జ్యోతులు. కన్ను, ముక్కు, మనస్సు, బుద్ధి - ఇవి అంతరంగ జ్యోతులు. ఇవన్నీ స్వయం జ్యోతులు కాదు. ఎవరో ఒకరు శక్తినిస్తే వెలిగేవి మాత్రమే.

'వేడినీరు' అన్నప్పుడు వేడి ఆ నీటిది కాదు. అది అగ్ని లక్షణం. అలాగే ఈ జ్యోతులన్నింటికి వెలిగే శక్తి వాటిది కాదు. ఆ శక్తి ఆత్మది. సూర్యుడు - నక్షత్రాలు స్వయం ప్రకాశాలు అని సైన్స్ చెబుతుంది. కాని అవి కూడా ఆత్మ యొక్క శక్తి వల్లనే ప్రకాశిస్తున్నాయి. అలాగే మన కన్ను, ముక్కు మొ||న ఇంద్రియాలు కూడా ఆత్మశక్తి వల్లనే పనిచేస్తున్నాయి. అన్నింటిని తెలుసుకో గలుగుతున్నాయి.

పరమాత్మ జ్యోతిస్వరూపుడని కొందరు కళ్ళు మూసుకొని ప్రకాశ రూపంలో - వెలుగు రూపంలో చూడటానికి ప్రయత్నిస్తారు. కాని పరమాత్మ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దృశ్య వస్తువు కాదు. ఈ కంటితో చూచేందుకు, మనస్సుతో భావించేందుకు. ఈ కంటికి కనిపించేది ఏదైనా భ్రమ మాత్రమే, మిథ్య మాత్రమే.

ఈ విషయాన్ని తెలియజేసే ఘట్టం బృహదారణ్యకోపనిషత్తులో ఉన్నది. అది జనక యాజ్ఞవల్క్యుల సంవాదరూపంలో ఉన్నది. దానిని గురుశిష్య సంవాద రూపంలో శంకరాచార్యుల వారు ఒక్క శ్లోకంలో చెప్పారు. దాని భావం వినండి -

**గురువు:** నీకు జ్యోతి ఏది?

**శిష్యుడు:** పగలు సూర్యుడు, రాత్రి దీపం.

**గురువు:** ఆ సూర్యుణ్ణి గాని, దీపాన్ని గాని చూడటానికి నీ దగ్గర ఉన్న సాధనం ఏమిటి?

**శిష్యుడు:** కన్ను.

**గురువు:** కళ్ళు మూసుకుంటే అప్పుడు నీకు ప్రకాశం (సాధనం) ఏది?

**శిష్యుడు:** బుద్ధి.

**గురువు:** ఆ బుద్ధిని తెలుసుకోవాలంటే?

**శిష్యుడు:** 'నేనే'.

**గురువు:** కనుక నీవు పరమజ్యోతివి గదా! స్వయం జ్యోతివి గదా!

**శిష్యుడు:** అవును ప్రభూ! ఆ పరమ జ్యోతిని - జ్యోతులకు జ్యోతిని నేనే.

సూర్యచంద్రులే నిజమైన జ్యోతులని బాహ్యదృష్టిగల శిష్యుడన్నాడు. గురువు క్రమంగా అతడి దృష్టిని అంతర్ముఖం చేయాల్సివచ్చింది. అందుకే కన్నే జ్యోతియని, బుద్ధియే జ్యోతియని, చివరకు ఆత్మయే జ్యోతియని స్థిర నిశ్చయం

కలిగించాడు. అన్నింటిని చూపగలిగినదేదో అదే జ్యోతి. బయటి వస్తువులన్నింటిని దీపం చూపుతుంది. కళ్ళు లేనివాడు దీపాన్ని చూడలేడు. కంటిని చూపేది బుద్ధి. బుద్ధిని ప్రకాశింపజేసేది ఆత్మ. 'ధియోయోనః ప్రచోదయాత్' అని వేదమాత గాయత్రి బుద్ధిని ప్రచోదనం చేసేది ఆత్మయని తెలియజేసింది. కాబట్టి జ్యోతులకు జ్యోతి ఆత్మయే - జ్ఞేయమే - క్షేత్రజ్ఞుడే.

(ii) **తమసః పరం:-** ఆత్మ తమస్సు కన్న వేరైనది. తమస్సు అంటే చీకటి - అజ్ఞానం - అవిద్య. వీటికి వ్యతిరేకమైనదీ, వేరైనదీ ఆత్మ. తమస్సు చీకటి. ఆత్మ స్వయంజ్యోతి. సూర్యునికీ చీకటికీ సంబంధం లేదు. సూర్యుడున్న చోటికి చీకటి రాలేదు. చీకటి ఉన్న చోటికి సూర్యుడు రాగలడు, చీకటిని పారద్రోలగలడు. అలాగే ఆత్మకు అజ్ఞానానికి సంబంధం లేదు. అజ్ఞానంలో ఉన్నవాడు ఎన్నటికీ ఆత్మనందుకోలేడు. ఆత్మ మాత్రం అజ్ఞానాన్ని పారద్రోలగలదు. క్షేత్రం గాని, జగత్తు గాని మిథ్యమాయ. మరి పరమాత్మ మాయకు - అజ్ఞానానికి ఆవల ఉన్నవాడు, అజ్ఞాన ఆవరణ తొలగితే ఆత్మ దర్శనమే.

కళ్ళు మూసుకున్నావు. అంతా చీకటే. అయితే నీవు చీకటిని చూచేవాడివే గాని ఆ చీకటి నీవు కాదు గదా! అంటే నీవు చీకటికి ఆవల ఉన్నావు అనే. నీవు స్వయం జ్యోతివి. అజ్ఞానాన్ని తెలుసుకొనే జ్ఞాన స్వరూపుడివి. చీకటిని తెలుసుకొనే వెలుగువు. చీకటికి వేరైనవాడివి. 'తమసః పరః'.

(iii) **జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం** :- జ్ఞానం అంటే తెలివి. జ్ఞేయం అంటే తెలుసుకోవలసినది. జ్ఞానగమ్యం అంటే తెలివి ద్వారా పొందవలసినది. మూడూ ఆత్మయే.

(a) **ఆత్మయే జ్ఞానం** :- జ్ఞాన గుణాలు - అమానిత్వాది గుణాలు 20 చెప్పుకున్నాం. అదంతా జ్ఞానం. ఆ లక్షణాలు గలవాడే జ్ఞాని. జ్ఞాని పరమాత్మే. కనుక పరమాత్మే జ్ఞానం.

(b) **ఆత్మజ్ఞేయం** :- అంటే తెలుసుకోవలసినది. ప్రపంచంలో ఎన్నింటిని తెలుసుకున్నా ప్రయోజనంలేదు. ఆ తెలివి ఎప్పుడో ఒకప్పుడు నిష్ప్రయోజనం అవుతుంది. ఎప్పుడు? ఎప్పుడైతే జ్ఞేయవస్తువును - ఆత్మను తెలుసుకున్నావో - ఇక ఇప్పటివరకు తెలుసుకున్నదంతా నిష్ప్రయోజనం. ఎందుకంటే ప్రపంచజ్ఞానం అంతా అనిత్యం - అంతంతో కూడుకున్నది. కనుక అంతా వ్యర్థమయ్యేదే.

ఒక శాస్త్ర పరిశోధకుడు ఎన్నో పరిశోధనలు చేసి అనేక క్రొత్త విషయాలు కనిపెట్టాడు. అయితే ఏం లాభం? మరణంతో నేర్చుకున్నదంతా వృథా. అదే ఒక వేదాంతి ఆత్మను గురించి పరిశోధన చేశాడు. ఇంకా ఆత్మ సాక్షాత్కారం కలగలేదు. మరణించాడు. మరి పరిశోధన అంతా వృథా అవుతుందా? కాదు. మరుజన్మలో ఈ ఆత్మశోధన - జ్ఞానం - సాధన అన్నీ ఉపయోగపడతాయి. అదే ఈ జన్మలోనే స్వరూప జ్ఞానం కలిగితే ఇక జనన మరణాలు లేవు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కనుక ఎవరికైనా తెలియదగినది (జ్ఞేయం) ఆత్మయే. ఆత్మను తెలుసుకుంటే ఇక తెలుసుకోవాల్సింది ఏమీ ఉండదు. అది తెలిస్తే అన్నీ తెలిసినట్లే.

"చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!" అన్న ప్రహ్లాదుని పలుకులలోని మర్మం ఇదే. జ్ఞేయవస్తువును తెలుసుకుంటే చాలు ఇక తెలుసుకోవలసినది ఏమీలేదు - అని.

"*చదివి చదివి చదివి చావంగ నేటికి చావులేని చదువు చదువవలయు*" అన్న వేమన పలుకులలోని వేదాంత రహస్యం కూడా ఇదే. చావులేని చదువు అంటే జనన మరణాల నుండి తప్పించే చదువు. అదే ఆత్మవిద్య. బ్రహ్మవిద్య. కనుక తెలుసుకోవలసింది పరమాత్మ గురించే. ఇతర లౌకిక విద్యలన్నీ చావును తప్పించలేవు. అంటే జననమరణాలను తప్పించలేవు.

(c) **జ్ఞానగమ్యం కూడా ఆత్మయే.** జ్ఞేయవస్తువే. ఆత్మజ్ఞానంతో పొందదగినది - జ్ఞానసాధన ద్వారా పొందదగినది ఆత్మయే గనుక అది జ్ఞానగమ్యం. కనుక జ్ఞానము - జ్ఞేయము - జ్ఞానగమ్యము - మూడూ ఆత్మయే.

(iv) **హృది సర్వస్య విష్ఠితం:-** ఇంతకూ పొందవలసిన ఆత్మ (జ్ఞేయవస్తువు) ఎక్కడుందో - ఎంత దూరంలో ఉందో అని భయపడవలసిన పనిలేదు. అది సర్వుల హృదయాలలోను ఉన్నది. ఆత్మ అంతటా ఉన్నదే అయినా దర్శించాల్సింది మాత్రం హృదయంలోనే.

పసివాడుగా ఉన్న శ్రీరాముడు ఆకాశంలో పూర్ణచంద్రుని చూచి 'నాకు కావాలి' అని హఠం పట్టి ఏడుస్తున్నాడు. ఎలా ఓదార్చాలో కౌసల్యకు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తెలియలేదు. అంతలో అక్కడకు వచ్చిన వశిష్ఠుడు అద్దాన్ని తెప్పించి అందులో చంద్రుని చూపాడు.

అలాగే సర్వవ్యాపి అయిన పరమాత్మను మొదట హృదయంలోనే చూడాలి. నిర్మలమైన అంతఃకరణంలోనే ప్రతిబింబింప చేసుకోవాలి.

* మట్టితో చేసిన అద్దంలో చంద్రుని చూచినట్లు -
* మాయతో చేసిన అంతఃకరణంలోనే ఆత్మను దర్శించాలి.
* గేదెకు పాలు శరీరం అంతటా ఉన్నా పొదుగు నుండే తీసుకోవాలి.
* ఆత్మ సర్వత్రా ఉన్నా ఆ అనుభవాన్ని హృదయం నుండే పొందాలి.

హిందూధర్మంలో ఒక ఆచారం ఉంది. ఏ క్షేత్రానికి వెళ్ళినా భగవంతుని విగ్రహాన్ని చూడగానే కళ్ళు మూసుకుంటాం. కొన్ని మతాల వారు చెవులు మూసుకుంటారు. కొందరు చేతులు పైకెత్తుతారు. కొందరు ఆకాశంవైపు చూస్తారు. మనం మాత్రం ఆ భగవంతుని చూచే దాకా కళ్ళు తెరుచుకొని క్యూలో నిలబడతాం. తీరా అక్కడకు వెళ్ళగానే కళ్ళు మూసుకుంటాం. కళ్ళు తెరిచేటప్పటికి గార్డులు లాగి అవతల పడేస్తారు. ఎందుకిలా చేస్తుంటాం?

భగవంతుడు (పరమాత్మ) ఎక్కడో ఆకాశంలోనో, ఏ గుడిలోనో, ఉంటాడని గాక అతడు అంతర్యామిగా, ఆత్మ స్వరూపంగా మన హృదయంలోనే ఉన్నాడనే నమ్మకం. కనుక కళ్ళు తెరచి బయటకు చూడటం గాక కళ్ళు మూసుకొని మన హృదయంలోనే దర్శించాలి - అనే భావం. కనుక అంతర్ముఖం కావటమే పరమార్థం.

**యుద్ధానంతరం ధర్మరాజు సభదీర్చి ఉండగా అక్కడే ఉన్న శ్రీకృష్ణునితో ద్రౌపది అన్నదట. "అన్నా! ఆనాడు నిండు సభలో పరాభవం కలిగినప్పుడు దగ్గరే ఉన్న భర్తలను గాక నిన్ను మొరపెట్టుకున్నానే. అంత ఆలస్యం చేశావేమిటి? అని. దానికి కృష్ణుడు, "అమ్మా! నేరం నా మీదకు నెట్టకు. నీవారోజు ఏమని పిలిచావు? అన్నాడు. ద్రౌపది, "హే కృష్ణా! ద్వారకావాసా! రక్షించు" అన్నాను అన్నది. మరినేను ద్వారక నుండి రావాలి గదా! అన్నాడు కృష్ణుడు. హృదయవాసీ! కృష్ణా! అని పిలిచాను గదా! అన్నది ద్రౌపది. అందుకే వెంటనే వస్త్రప్రదానం జరిగింది గదా! అన్నాడు కృష్ణుడు. కనుక భగవంతుడు అందరి హృదయాలలోనే ఉన్నాడు.**

**ఇంతవరకు భగవానుడు తాను చెప్పిన విషయాలను సింహావలోకనం చేసి ఫలితాన్ని, ఆ ఫలితాన్ని పొందే ఉపాయాన్ని చెప్పి ఈ ప్రకరణను ముగిస్తున్నాడు.**

**శ్లో|| ఇతి క్షేత్రం తథా జ్ఞానం**
**జ్ఞేయం చోక్తం సమాసతః |**
**మద్భక్త ఏతద్వి జ్ఞాయ**
**మద్భావా యోప పద్యతే || (19)**

**తా||** ఈ ప్రకారంగా క్షేత్రం అలాగే జ్ఞానం, జ్ఞేయం క్లుప్తంగా చెప్పబడినవి. నా భక్తుడు దీనిని తెలుసుకొని నా భావాన్ని పొందుతాడు.

**వ్యాఖ్య :-** ఇంతవరకు చెప్పినవన్నీ వేదాంతంలోని సిద్ధాంతాలే. వశిష్టుడు, యాజ్ఞవల్క్యుడు, అష్టావక్రుడు మొ||న మహర్షులంతా అనేక విధాలుగా తెలియజేసిన విషయాలే. వాటన్నింటిని క్రోడీకరించి, సంక్షిప్తంగా భగవానుడు అర్జునునికి ఈ యుద్ధ సమయంలో బోధిస్తున్నాడు.

క్షేత్రం అంటే దర్శించబడేది. జ్ఞానం అంటే ఆత్మను తెలుసుకోవటానికి పనికివచ్చే తెలివి, జ్ఞానం - (జ్ఞానిలక్షణాలు). జ్ఞేయం అంటే తెలుసుకోబడవలసిన ఆత్మ. ఈ మూడు క్లుప్తంగా - సంక్షిప్తంగా ఇంతవరకు చెప్పబడ్డాయి. ఇక మిగిలిందేమిటి? అందుకోవటమే. ఎవరు అందుకోగలరు? ఏమిటా అర్హత? ఒక్క వాక్యంలో చెప్పారు. **'మద్భక్తః ఏతత్ విజ్ఞాయ మద్భావా యోప పద్యతే'** - నా భక్తుడైనవాడు దీనిని తెలుసుకొని (పైన చెప్పిన మూడింటిని క్షేత్రం - జ్ఞానం - జ్ఞేయం - వీటిని తెలుసుకొని) నా భావాన్నే పొందుతాడు. అంటే నన్నే పొందుతాడు. అంటే నేనే అవుతాడు. అంటే భగవంతుడే అవుతాడు - అని.

ఈ వాక్యాన్ని సూక్ష్మబుద్ధితో గ్రహించాలి. నా భక్తుడే నన్ను అందుకుంటాడు అని భగవానుడే చెప్పాడు గనుక భక్తి ఉంటే చాలు పరమాత్మను అందుకోవచ్చు - అని భక్తులు తేల్చిపారేశారు. భక్తియే ముక్తికి సాధనం అంటారు వీరు.

ఇక జ్ఞాన సాధనలో ఉన్న జ్ఞానులేమో - **'ఏతత్ విజ్ఞాయ'** - దీనిని ఎవరైతే తెలుసుకుంటారో అన్నారు గనుక, క్షేత్రాన్ని- జ్ఞానాన్ని- జ్ఞేయాన్ని ఎవరు తెలుసుకుంటారో వారే ముక్తినందుకోగలరు - అని తీర్మానించి వేస్తారు.

ఈ రెండు రకాల వాదాలు లోతుగా ఆలోచించకుండా త్వరపడి తీసుకొనే నిర్ణయాలే. కేవల భక్తి వల్ల - లేక కేవల జ్ఞానం వల్ల పరమాత్మ సాక్షాత్కారం లభించదు. భక్తి - జ్ఞానం రెండూ ఉన్నవారికే అవకాశం. అందుకే భగవానుడు 'నా భక్తుడు దీనిని తెలుసుకొని నా భావాన్ని పొందుతాడు' అన్నాడు. అంటే భగవంతుని పొందాలంటే - ముక్తి కలగాలంటే జ్ఞానం కావాల్సిందే. జ్ఞేయవస్తువును తెలుసుకోవాల్సిందే. అయితే జ్ఞేయవస్తువును అందరూ సరిగ్గా తెలుసుకోలేరు. ఎవరు తెలుసుకుంటారు? ఎవరు నా భక్తులో వారే తెలుసుకోగలుగుతారు. కనుక భక్తుడే సరైన జ్ఞానాన్ని పొంది పరమాత్మనందుకుంటాడు అని అంతిమతీర్పు.

కనుక కేవలభక్తిగాని, కేవలజ్ఞానంగాని నిష్ప్రయోజనం. భక్తితో కూడిన జ్ఞానమే ఫలితాన్నిస్తుంది. జీవ బ్రహ్మైక్య సిద్ధిని కలిగిస్తుంది. నిజంగా జ్ఞానిలక్షణాలుగా చెప్పిన 20 లక్షణాలలో భక్తిలక్షణం కూడా ఉంది. **'మయి చా నన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ'** - అని. కనుక అనన్య భక్తి కూడా తప్పక అవసరమే.

భక్తునిలో అహంకారం నశించిపోతుంది. అహంకారం నశించినవాడే నిజంగా భక్తుడు. అహంకారం నశించిన భక్తుడు జ్ఞానియై ఆత్మను అందుకుంటాడు. నా భావాన్ని పొందుతాడు. బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి.

## ఇక ప్రకృతి పురుషుల ప్రకరణం

క్షేత్రము - క్షేత్రజ్ఞుడు; జ్ఞానము - జ్ఞేయము గురించి ఇంతవరకు చెప్పిన భగవానుడు ప్రకృతి - పురుషుల గురించి తెలియజేయబోతున్నాడు. ఏమని?

**శ్లో|| ప్రకృతిం పురుషం చైవ**
**విద్ధ్య నాదీ ఉభావపి|**
**వికారాంశ్చ గుణాం శ్చైవ**
**విద్ధి ప్రకృతి సంభవాన్ ||** **(20)**

**తా||** ప్రకృతి - పురుషులు ఇద్దరు కూడా అనాది అని తెలుసుకో. వికారాలూ, గుణాలు అన్నీ కూడా ప్రకృతి వల్ల పుట్టినవి అని తెలుసుకో.

**వ్యాఖ్య :-** క్షేత్రము - క్షేత్రజ్ఞుడు అన్నా ప్రకృతి - పురుషులు అన్నా రెండూ ఒక్కటే. క్షేత్రమే ప్రకృతి; క్షేత్రజ్ఞుడే పురుషుడు. అయినప్పుడు మళ్లీ చెప్పవలసిన అవసరం ఏమిటి? అందుకోవలసిన క్షేత్రజ్ఞుని గురించి, విడిచిపెట్టాల్సిన క్షేత్రం గురించి పదే పదే వింటేగాని నిష్ఠ కుదరదు. అందుకే భగవానుడు పేర్లు మార్చి ప్రకృతి-పురుషులనే పేర్లతో మళ్లీ బోధిస్తున్నాడు.

(i) ప్రకృతి - పురుషుడు ఇద్దరూ అనాది:- ప్రకృతి అంటే శరీరం గదా! ఇది అనాది ఏమిటి? ఎప్పుడో ఒకప్పుడు పుట్టినదే గదా! పురుషుడు అనాది అంటే సరే. మరి ప్రకృతిని అనాది అన్నారేమిటి?

ప్రకృతి అంటే శరీరం. శరీరం అనేది ఒకటి కాదు. స్థూల, సూక్ష్మ కారణ అని మూడు శరీరాలు. స్థూల శరీరం సూక్ష్మ శరీరం వల్ల, స్థూల సూక్ష్మ

శరీరాలు కారణ శరీరం వల్ల వచ్చినవి. అంటే కారణ శరీరమే ప్రకృతి. వాసనలే ప్రకృతి. మరి కారణ శరీరం అనే వాసనలు - కర్మఫలాలు ఎలా వచ్చినవి? పూర్వ జన్మలలో చేసిన ఆలోచనలు కర్మల వల్ల. మరి అప్పుడు కూడా ఒక శరీరం ఉండబట్టే గదా! ఆలోచనలు, కర్మలు చేసింది. ఆ శరీరం ఎలా వచ్చింది? అంతకు ముందు చేసిన ఆలోచనలు కర్మల వల్ల. ఇలా వెనక్కు వెళితే ఈ కారణశరీరం ఎప్పుడు మొదలైంది? ఎవ్వరూ చెప్పలేరు. అందుకే కారణశరీరం (ప్రకృతి) అనాది.

ఇప్పుడొక చిక్కుడుగింజను తీసుకోండి. ఇది ఎలా వచ్చింది? చిక్కుడు చెట్టుకు కాయలుకాయటం వల్ల. ఆ చిక్కుడుచెట్టు ఎలా వచ్చింది? చిక్కుడు విత్తనం భూమిలో నాటటం వల్ల. అంటే చెట్టువల్ల విత్తనం, విత్తనం వల్ల చెట్టు. ఇందులో ఏది ముందు? చెట్టు ముందా? విత్తు ముందా? ఎవ్వరూ చెప్పలేరు. అందుకే అనాది. విత్తనం అనాదియే గాని అంతం. ఎందుకంటే విత్తనాన్ని నిప్పుపై వేయించినట్లైతే జీవశక్తి నశించి ఇక మొలకెత్తదు. కనుక విత్తనం యొక్క ఆది మనకు తెలియదు గాని, దాని అంతం మాత్రం మనకు తెలుసు.

విత్తనం లాగానే క్షేత్రమనబడే ఈ శరీరం కూడా అనాది, కాని అంతం? ఎప్పుడైతే జీవుడు తన వాసనలను క్షయం చేసుకొని, కర్మఫలాలను జ్ఞానాగ్నిలో దగ్ధం చేసుకుంటాడో అతడి జీవభావం నశించి పురుషుడుగా - క్షేత్రజ్ఞుడుగా – ఆత్మగా మిగిలిపోతాడు. కనుక పురుషుడు అనాది - అనంతం.

ఇక్కడే మరొక సత్యాన్ని దర్శించాలి. ఒక వేళ కొన్నిమతాలవారు చెప్పినట్లు అసలు జన్మలే లేవు; జీవుడు పుడతాడు - చస్తాడు; అంతే - అనే వారి

మాటను తీసుకుందాం. పూర్వజన్మ పాపపుణ్యాలు - కర్మఫలాలు లేకపోతే ఈ జన్మలో పాపం చేసినా పుణ్యం చేసినా ఈ జన్మలోనే అనుభవించాలి. అనుభవించక పోతే రద్దై పోవాలి. మరి పాపాలు చేసిన వారు దుఃఖాలు అనుభవిస్తూ - పుణ్యాత్ములంతా సుఖాలు అనుభవిస్తూ ఉన్నారా? లేదు. ఇది మన అనుభవం. సరే ఏమిచేసినా మరణంతో రద్దై పోతాయనుకుందాం. అలాంటప్పుడు ఎలాగూ రద్దై పోతాయి గనుక పుణ్యకర్మలే చేయాల్సిన పనిలేదు. ఎంతటి పాపాలకైనా ఒడిగట్టవచ్చు. స్వార్థంతో హత్యలు, అన్యాయాలు, అక్రమాలు ఏవైనా చేయవచ్చు. దీనిని ఏ మతమైనా అంగీకరిస్తుందా? లేదు. కనుక జన్మలున్నవి. చేసిన కర్మలు ఊరికే పోవు, అనుభవించి తీరాల్సిందే. ఈ దేహంతో కాకపోతే మరో దేహాన్ని ధరించినప్పుడైనా అనుభవించాలి.

(ii) వికారాలు - గుణాలు ప్రకృతి నుండి పుట్టినవి:- ప్రకృతి పురుషులు ఇద్దరూ అనాది. ప్రకృతి మాత్రం అంతం - పురుషుడు అనంతం. అంతేకాదు వికారాలు, గుణాలు ప్రకృతి నుండి పుట్టినవి. పురుషునికి వాటితో సంబంధం లేదు. వికారాలేమో స్థూలం. కంటికి కనిపించేవి. గుణాలేమో సూక్ష్మం. కంటికి కనిపించనివి.

ఇక్కడ ఉపన్యాసం చెబుతుంటే చాలా మంది శ్రద్ధగా వింటున్నారు. కొద్ది మంది ఎలాగైనా వీలు చూచుకొని ప్రక్క వాళ్ళతో మాట్లాడాలని తపించిపోతున్నారు. ఒకరిద్దరు హాయిగా నిద్రపోతున్నారు. ఇవే వికారాలు. ఇవన్నీ కనిపిస్తూనే ఉంటాయి. కనుక ఇవి ప్రకృతి యొక్క స్థూల భాగాలు.

ఈ వికారాలకు కారణమైన గుణాలున్నాయి గదా! అవి కనిపించవు. కాని అర్థం చేసుకోవచ్చు. ఎలా? శ్రద్ధగా వినేవారు సత్త్వగుణంలో ఉన్నారు. ప్రక్కవారితో మాట్లాడాలని తపించేవారు రజోగుణులు. చక్కగా నిద్రపోయే వారు తమోగుణ సంపన్నులు. కనుక ఇవి ప్రకృతి యొక్క సూక్ష్మభాగాలు. అంటే వికారాలు, గుణాలు ప్రకృతి నుండి పుట్టినవే. పురుషుడు స్థిరంగా ఉండేవాడు. నిర్వికారుడు, నిర్గుణుడు. ఈ ప్రకృతి పురుషుల వల్లనే జీవుళ్ళు ఏర్పడుతున్నారు.

తిరగలిని చూడండి. గింజల నుండి పిండి ఎలా తయారవవుతున్నది. దానిలో రెండు రాళ్లుంటాయి. ఒకటి ఎప్పుడూ తిరిగేది. వికారంతో కూడినది. మరొకటి స్థిరంగా ఉండేది. నిర్వికారం. రెండూ ఉంటేనే పని జరుగుతుంది. అలాగే స్థిర పురుషుడు, చర ప్రకృతి వల్లనే ప్రపంచ వ్యవహారం సాగుతుంది. -

మరి జీవుళ్ళు సుఖదుఃఖాలెందుకు అనుభవిస్తున్నారు ?

వికారాలు, గుణాలు అన్నీ ప్రకృతికి చెందినవే గాని పురుషునివి కావు. మరి సుఖదుఃఖాలు అనుభవించేది జీవుళ్ళే కదా! పురుషుడే కదా! ప్రకృతి కాదు గదా!

**శ్లో|| కార్య కారణ కర్తృత్వే**

**హేతుః ప్రకృతి రుచ్యతే |**

**పురుషః సుఖదుఃఖానాం**

**భోక్తృత్వే హేతు రుచ్యతే || (21)**

**తా||** కార్యకారణాలకు కర్త ప్రకృతి అని చెప్పబడుతున్నది. సుఖ దుఃఖాలను అనుభవించే భోక్త పురుషుడని చెప్పబడుతున్నది.

**వ్యాఖ్య :-** ఇలాంటి శ్లోకాల భావాలు తెలుసుకోవాలనుకున్నప్పుడు గురువు యొక్క అవసరం తప్పదు. అందుకే వేదాంతాన్ని గురుముఖత తెలుసుకోవాలి అనటం. అసలు సుఖదుఃఖాలు ఎలా కలుగుతున్నాయి ?

మనలోపల గాని, వెలుపల గాని అనేక మార్పులు జరుగుతుంటాయి. ఆ మార్పులు మనకు తెలిస్తే సుఖమో - దుఃఖమో కలుగుతుంది. తెలియకపోతే ఏమీ లేదు.

(i) లాటరీలో కోటి రూపాయల బంపర్ ప్రైజు వచ్చింది. అదొక మార్పు. అయితే ఆ విషయం రెండు రోజుల తర్వాత పేపర్ లో చూచాం. అప్పుడు ఆనందం కలిగింది. అప్పటిదాకా ప్రైజు వచ్చినా ఆనందంలేదు.

(ii) తీర్థయాత్రలకని వెళ్లావు. దొంగలు పడి ఇల్లంతా దోచుకున్నారు. అదొక మార్పు. 20 రోజుల తర్వాత వచ్చి చూచావు. అప్పుడు లబోదిబో - దుఃఖం. అప్పటివరకూ నీకు దుఃఖం లేదు. హాయిగా ఆనందంగా క్షేత్ర దర్శనం చేశావు.

అంటే ఏదైనా మార్పు జరిగి, ఆ మార్పు తెలిస్తేనే దుఃఖమో, సుఖమో. మార్పు - తెలియటం (జ్ఞానం) అనే రెండూ కలిస్తేనే సుఖదుఃఖాలు. మార్పు లేకపోయినా - తెలియకపోయినా సుఖం లేదు. దుఃఖం లేదు.

మార్పులన్నింటికి కార్యకారణ సంబంధం ఉంటుంది.

(i) లాటరీ టికెట్టు కొనటం కారణం. డబ్బు రావటం కార్యం.

(ii) తీర్థయాత్రలకు వెళ్ళటం కారణం. దొంగలు దోచుకోవటం కార్యం.

కనుక కార్యకారణ సంబంధం అనే నియమాన్ని బట్టే మార్పులు. దీనిని బట్టి ఈ స్థూల సూక్ష్మ శరీరాలు కార్యం. పూర్వ జన్మలలోని వాసనలు కర్మఫలాలు కారణం (కారణశరీరం). ఈ శరీరం గాని, కర్మఫలాలు వాసనలతో కూడిన కారణశరీరం గాని రెండూ ప్రకృతికి చెందినవే. రెండూ పంచభూతాల నుండి వచ్చినవే. కనుక కార్యకారణాలకు రెండింటికి కర్త ప్రకృతే.

మరి ఈ కార్యకారణ సంబంధం వల్ల కలిగే మార్పులను తెలుసుకొని సుఖదుఃఖాలను అనుభవించేది ఎవరు? ఈ ప్రకృతే అనుభవిస్తున్నదా? అంటే స్థూలశరీరం గాని, సూక్ష్మశరీరం గాని, కారణశరీరం గాని అనుభవిస్తున్నదా? లేదు. ఎందుకంటే ఈ 3 శరీరాలు జడం. మరెవరు అనుభవిస్తున్నారు? చైతన్యం గల పురుషుడే.

పురుషుడు అకర్త - అభోక్త అంటున్నారు గదా! అవును. మరి సుఖదుఃఖాలు అనుభవించే భోక్త పురుషుడెట్లా అవుతాడు?

ఇక్కడ చెప్పిన పురుషుడు సోపాధిక పురుషుడు. అంటే ఉపాధులతో తాదాత్మ్యం చెందిన పురుషుడే కాని ఉపాధులు లేని శుద్ధ చైతన్యం కాదు. ఉపాధులతో కూడియున్నప్పుడు - ప్రకృతితో కూడియున్నప్పుడు ఆ ప్రకృతి యొక్క సుఖదుఃఖాలను అతడే అనుభవిస్తున్నట్లు కనిపిస్తుంది.

ఇనుముకు కాల్చే శక్తి లేదు. కాని అగ్నితో కూడిన ఇనుము దేన్నైనా కాలుస్తుంది. ఇనుము కాల్చింది - అంటామే గాని నిజంగా కాల్చింది ఇనుముతో కూడిన అగ్నియే. అలాగే పురుషుడు సుఖదుఃఖాలనుభవించే భోక్త కాదు. కాని

ప్రకృతితో కూడియున్నప్పుడు ఆ ప్రకృతి గుణాలను పురుషునిపై ఆరోపించి సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాడు - అంటాం.

ఇంతకూ సుఖదుఃఖాలు అనుభవించే పురుషుడు, జ్ఞాన స్వరూపుడు - ఆనందస్వరూపుడు అయిన పురుషుడు ఒక్కరేనా? లేక వేరు వేరా?

**శ్లో|| పురుష ప్రకృతిస్థో హి**
**భుంక్తే ప్రకృతి జాన్ గుణాన్|**
**కారణం గుణ సంగోస్య**
**సదసద్యోని జన్మసు||** (22)

**తా||** పురుషుడు ప్రకృతి యందు నిలిచినవాడై ప్రకృతి వల్ల పుట్టిన గుణాలను భోగిస్తున్నాడు. గుణాలతో కూడటం వల్లనే జీవుడు మంచి - చెడు జన్మలను ఎత్తుతున్నాడు.

**వ్యాఖ్య :-** ఆత్మ - పరమాత్మ ఆనందస్వరూపుడు. నిర్వికారుడు, నిర్గుణుడు. మరి ఇక్కడేమో సుఖదుఃఖాలు అనుభవించేవాడు అంటున్నాం. ఇంతకూ ఇద్దరూ వేరు వేరా? ఒక్కరా ?

ఆనందరావు నిన్న బజార్లో కనిపించాడు. ఎంతో సంతోషంతో ఉన్నాడు. జోక్స్ పేలుస్తున్నాడు. అదే ఆనందరావు ఈ రోజు హాస్పిటల్ బెడ్ మీద ఉన్నాడు. పలకరించటానికి వెళ్ళితే కళ్ళ నీరు పెట్టుకొని ఏడుస్తున్నాడు. ఏమిటని అడిగితే 'పెరాలసిస్ వచ్చి కాలు చెయ్యి ఆడటం లేదు. నా భార్య గతి ఏం కాను?' అని కళ్ళు తుడుచుకుంటున్నాడు.

ఆ ఆనందరావు, ఈ ఆనందరావు ఒక్కరేనా? కాదా? ఒక్కరే. తేడా ఏమిటి? ఆ ఆనందరావు స్వస్థతలో ఉన్నవాడు. ఈ ఆనందరావు స్వస్థత తప్పినవాడు. హాస్పటల్ పాలైనవాడు. కనుకనే దుఃఖంలో ఉన్నాడు.

అలాగే పురుషుడు స్వస్థతలో - అంటే స్వస్థితిలో - అంటే తానుతానుగా ఉంటే ఆనందస్వరూపుడు. అయితే అలా స్వస్థితిలో ఉండక ప్రకృతితో తాదాత్మ్యం పెట్టుకొని, తనను తాను మరిచి జీవుడిగా ఉంటున్నప్పుడు ఆ ప్రకృతికి చెందిన సుఖదుఃఖాది గుణాలను తనపై ఆరోపించుకొని ఆనందానికి దూరమవుతున్నాడు. ప్రకృతికి దూరంగా ఉంటే ఆనందం. ప్రకృతితో కలిస్తే సుఖదుఃఖాలు.

ఒక నిర్జన అరణ్యంలో ఒక సన్యాసి అక్కడ దొరికిన ఫలాలు తింటూ, స్వాదుజలాలను త్రాగుతూ, స్వాధ్యాయం, జపం, ధ్యానం, తపస్సు సాగిస్తూ ఆనందంగా ఉంటున్నాడు. అతడికి రాగద్వేషాలు గాని, కామక్రోధాలు గాని ఏమీలేవు. అయితే ఒకనాడు దారితప్పి సమీపంలోని పల్లెకు వచ్చాడు. అక్కడ ఒక భార్యా భర్తల జంటను చూచాడు. వారు ఎంతో హాయిగా, ఉల్లాసంగా ఉన్నట్లు గమనించాడు. దానితో అతడు సన్యాసాన్ని సన్యశించి వివాహం చేసుకున్నాడు. పిల్లలు పుట్టారు. ఇల్లు తీసుకున్నాడు. వస్తువులు సమకూర్చుకున్నాడు. ధన సంపాదనకు వృత్తిని చేపట్టాడు. ఆశలు, కోరికలు కలిగినవి. అవి తీరకపోతే కోపం వస్తున్నది. తనవారిపై రాగం, మమకారం కలిగింది. వారికి ఏదైనా బాధ కలిగితే విలవిలలాడిపోతున్నాడు. ఇలా అన్ని ఒడిదుడుకులు చేరినవి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ప్రపంచానికి దూరంగా ఉన్నప్పుడు హాయి - ఆనందం. ప్రపంచాన్ని తగిలించుకోవటంతో ఈ ప్రపంచపు వికారాలు, సుఖదుఃఖాలు, రాగద్వేషాలు అన్నీ అనుభవించవలసి వచ్చింది. ప్రపంచానికి దూరంగా ఉంటే సన్యాసి. ప్రపంచాన్ని తగిలించుకుంటే సంసారి.

అలాగే పురుషుడు దేనితోను సంగభావం లేకుండా తాను తానుగా ఉంటే ఆనందస్వరూపుడు. ఉపాధులతో (ప్రకృతితో) తాదాత్మ్యం చెందితే జీవుడై ఈ ప్రకృతికి చెందిన గుణాలను తనవిగా భావించి సుఖదుఃఖాలననుభవిస్తున్నాడు.

ఇలా ప్రకృతిస్థుడై - ప్రకృతితో తాదాత్మ్యం పెట్టుకున్న పురుషుడు ప్రకృతి వల్ల పుట్టిన గుణాలను భోగిస్తూ, కర్మలు చేస్తూ, ఆ కర్మల కారణంగా మంచి, చెడు జన్మలనెత్తుతున్నాడు.

శరీరంలో ఉన్న పరమాత్మ శరీరతాదాత్మ్యం వల్ల జీవుడై జననమరణ వలయంలో చిక్కుకున్నాడు. మరి ఆ పరమాత్మ సర్వశక్తివంతుడు గదా! ఏం చేస్తున్నట్లు?

**శ్లో|| ఉపద్రష్టాను మంతా చ**
**భర్తా భోక్తా మహేశ్వరః|**
**పరమాత్మేతి చాప్యుక్తః**
**దేహేఽస్మిన్ పురుషః పరః ||** **(23)**

**తా||** ఈ దేహంలోని పరమపురుషుడు సాక్షి అని, అనుమతించే వాడని, భరించేవాడని, భోగించేవాడని, మహేశ్వరుడని, పరమాత్మ అని చెప్పబడుతున్నాడు.

**వ్యాఖ్య :-** పరఃపురుషుడైన పరమాత్మ అన్ని శరీరాలలో ఉండటం వల్లనే ఆయన చైతన్యాంశ ప్రకృతిలో నిలిచి, గుణాలతో కలిసి క్షేత్రజ్ఞుడిగా మారి, ఆలోచనలు, కర్మలు చేస్తూ, వాసనలను - కర్మఫలాలను కూర్చుకుంటూ మళ్లీ మళ్లీ జన్మలెత్తుతూ ఈ జననమరణ చక్రంలో పరిభ్రమించటం జరుగుతున్నది.

దీనిని బట్టి పరమాత్మ ఎక్కడో ఉన్నాడనే భావాన్ని వదిలి, ఆయన ఈ శరీరంలోనే - ఈ క్షేత్రంలోనే ఉన్నాడు; అయినా ఈ క్షేత్రానికి అంటకుండా వేరుగా ఉన్నాడు అని గ్రహించాలి. కనుక పరమాత్మను ఎక్కడో వెతకాల్సిన పనిలేదు. అంతర్ముఖుడవై నీ దేహంలోనే వెతుక్కోవాలి. అంతేకాదు మరొక ముఖ్య విషయం. మనం ఏ ఏ పనులు చేస్తున్నామో, ఏమేమి ఆలోచనలు చేస్తున్నామో వాటన్నింటిని చిత్రంగా - గుప్తంగా మన దేహంలోనే ఉన్న పరమాత్మ తెలుసుకుంటూనే ఉంటాడు. ఆయన కన్నుగప్పి ఏదేదో చేద్దామనుకుంటే కుదరదు. నీవు ఎవరినైనా మోసగించవచ్చునేమో గాని నీలోనే ఉన్న పరమాత్మను ఎన్నటికీ మోసం చేయలేవు.

పరమాత్మ శరీరంలోనే ఉన్నా ఈ శరీరానికి గాని, శరీరధర్మాలకు గాని అంటకుండా వేరుగానే ఉంటాడు. కనుకనే శరీరం యొక్క గుణధర్మాలు అంటవు. అంటకుండా ఆ పరమపురుషుడు ఈ దేహంలో ఎలా ఉంటాడో ఆరు

విశేషణాలతో ఇక్కడ చెబుతున్నారు. అవే - 1. ఉపద్రష్ట, 2. అనుమంత, 3. భర్త, 4. భోక్త, 5. మహేశ్వరః, 6. పరమాత్మ.

అందరిలో - అన్ని క్షేత్రాలలో ఉన్నది ఒకే పరమాత్మగదా! మరి, కొందరిలో ఉపద్రష్టగా, కొందరిలో భర్తగా, కొందరిలో భోక్తగా ఇలా వేరు వేరుగా ఉండటమేమిటి? ఏమిటి ఈ 6 వేషాలు? కొందరిలో ఉండి దుర్మార్గాలు, కొందరిలో ఉండి సత్కార్యాలు ఎలా చేయిస్తున్నాడు?

కరెంటు ఒక్కటే. అది లైటులో ఉండి వెలుగునిస్తున్నది. ఫ్యానులో ఉండి గాలినిస్తున్నది. ఫ్రిజ్ లో ఉండి వస్తువులను చల్లబరుస్తున్నది. హీటర్ లో ఉండి నీటిని వేడి చేయిస్తున్నది. ఒకే కరెంటు ఇలా వేరు వేరు పనులను ఎలా చేయిస్తున్నది? నిజంగా ఆయా పరికరాలు - లైటు, ఫ్యాను, ఫ్రిజ్, హీటరు అనేవి వాటి వాటి ప్రత్యేకమైన పనులు చేయటానికి తయారుచేయబడ్డాయి. అయితే కరెంటు స్పర్శ తగిలితేనే అవి ఆయా పనులు చేయగలుగుతాయి. కరెంటు పని ఏమిటి? ఆ పరికరాలు పనిచేయటానికి శక్తి నివ్వటమే. ఏ పని చేయాలో, ఎలా చేయాలో - అదంతా ఆ పరికరాలదే.

అలాగే ఈ దేహాలన్నీ పరికరాలు. ఇవి ఎలా పనిచేయాలో అంతా ఆ దేహాలలోని కారణ శరీరమనే యంత్రం చెబుతుంది. అయితే ఆ కారణశరీరం గాని, ఈ స్థూల సూక్ష్మ శరీరాలు గాని పనిచెయ్యటానికి కావలసిన శక్తి మాత్రం పరమాత్మ చైతన్యం వల్లనే - పరమాత్మ స్పర్శ తగిలితే చాలు కారణశరీరం పనిచేస్తుంది. అది ఈ స్థూల సూక్ష్మ శరీరాలు ఎలా పనిచేయాలో నిర్ణయిస్తుంది.

కనుక అన్ని క్షేత్రాలలో ఉన్నది ఒకే పరమాత్మ అయినా ఆ క్షేత్రాల పనిని నిర్దేశించేది, నిర్ణయించేది మాత్రం పరమాత్మ కాదు. పరమాత్మ కేవలం చైతన్య శక్తి మాత్రమే.

అట్టి పరమాత్మ ఒక్కొక్క క్షేత్రంలో ఒక్కొక్క విధంగా కనిపించటానికి కారణం ఆ క్షేత్రం యొక్క స్వభావాన్ని బట్టి - వాసనల తెరనుబట్టి. గర్భగుడిలోని విగ్రహాన్ని బాగా మందంగా ఉన్న తెరనుండి చూస్తే కనిపించదు. అదే పలుచని తెరగుండా చూస్తే మసకమసకగా కనిపిస్తుంది. అదే పోలిథిన్ పేపరు ద్వారా చూస్తే ఇంకా బాగా కనిపిస్తుంది. నిర్మలమైన అద్దం గుండా ఇంకా స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే ఈ క్షేత్రాల యొక్క వాసనల తెరను బట్టి పరమాత్మ వేరు వేరుగా కనిపిస్తుంటాడు. అవే 6 విశేషణాలు. అవి –

1. **ఉపద్రష్ట** :- సాధారణంగా యజ్ఞాలు చేసేటప్పుడు 15 మంది ఋత్విక్కులు, యజమాని, యజమాని భార్య మొత్తం 17 మంది ఉంటారు. వీరు గాక అందరిని చూస్తూ, అన్ని పనులను పర్యవేక్షిస్తూ ఒకరుంటారు. అతడే ఉపద్రష్ట. ఉప అంటే సమీపంగా; ద్రష్ట అంటే చూచేవాడు. ఉపద్రష్ట అంటే సమీపంగా ఉండి అందరిని - అన్నింటిని జాగ్రత్తగా చూస్తూ ఉండేవాడు. సాక్షి - అని అర్థం.

ఎవరైతే పూర్తిగ రజోగుణ తమోగుణాలతో నిండి యుండి, పరమ దుర్మార్గులుగా, నీచులుగా, స్వార్థపరులుగా, అన్యాయాలు, అక్రమాలు చేసేవారుగా ఉంటారో అట్టి వారిలో పరమాత్మ కేవల సాక్షిగా ఉంటాడు. అసలు ఆయన తనలో ఉన్నట్టుగా అతడు గుర్తించలేదు. అట్టి వానికి పరమాత్మ ప్రభావం తెలియదు. దట్టమైన వాసనల కారణంగా పరమాత్మ ప్రకాశం -

పరమాత్మ ప్రభావం వ్యక్తం కాదు. వారు ఎన్ని దుర్మార్గాలు చేసినా, అన్యాయాలు - అక్రమాలు చేసినా క్షేత్రజ్ఞ పురుషుడు పట్టించుకోడు. కేవల సాక్షిగా మాత్రం ఉంటాడు. అలాంటి వాణ్ణి చూచి, "వీడింత దుర్మార్గంగా ప్రవర్తిస్తుంటే భగవంతుడేం చేస్తున్నాడు" అంటారు కొందరు. భగవంతుడేమీ చేయడు. కేవలంగా ఉంటాడు. అప్పుడే 'ఉపద్రష్ట' అని ఆ పురుషుణ్ణి అంటారు.

2. **అనుమంత** :- అనుమతించేవాడు. కొందరిలో తమోగుణం చాలవరకు తగ్గిపోతుంది. రజోగుణం మాత్రం ప్రబలంగా ఉంటుంది. సత్వగుణం చాల తక్కువగా ఉంటుంది. అట్టి వారిలో తమోగుణం తగ్గిపోవటం వల్ల వాసనల తెర పలుచనవుతుంది. ఇట్టి స్థితిలో పరమాత్మ ప్రకాశం కొద్దిగా - మసకమసకగా పడుతుంది. అట్టి క్షేత్రాలలో పరమాత్మ అనుమతించే వాడుగా ఉంటాడు. అంటే అతడు చేస్తున్న పనులను గమనిస్తూ, మంచి పనులు చేస్తుంటే - అనుమతిస్తూ ఉండటం, చెడ్డపనులు చేస్తున్నప్పుడు బుద్ధిని మంచి వైపుకు మళ్లించటం చేస్తాడు. సత్వగుణం కొద్దిగా ఉండటం వల్ల సత్కార్యాలు చేస్తాడు. రజోగుణం వల్ల తన అవసరాలు, స్వార్థపూరిత కర్మలు చేస్తాడు. అయితే పరమాత్మ మంచి పనులకు అనుమతిస్తూ, స్వార్థపూరిత కర్మల నుండి బుద్ధిని మరలిస్తూ ఉంటాడు. ఒక్కొక్కసారి చెడ్డపనులు చేయాలనే తలంపు వచ్చినా, లేక చేస్తున్నా, 'అయ్యో! తప్పుచేస్తున్నామేమో' అనే ఆలోచనలు వస్తుంటాయి. దీనికి కారణం లోపల ఉన్న పరమాత్మ సాన్నిధ్యమే.

3. **భర్త** :- భరించేవాడు. ఎవరైతే తమోగుణాన్నిపూర్తిగా విడిచిపెట్టి, రజోగుణాన్నితగ్గించుకుంటూ, సత్వగుణాన్ని పెంచుకొనుటకు ప్రయత్నిస్తూ

ఉంటారో అట్టి వారిలో పురుషుడు భర్తగా ఉంటాడు. సాధారణంగా భర్త ఏం చేస్తుంటాడు? భార్య కోరికలు తీరుస్తూ, ఆమె బాధలను, కష్టాలను తొలగించటానికి ప్రయత్నిస్తూ, భరిస్తూ ఉంటాడు. అలాగే రజోగుణాన్ని తగ్గించుకొంటూ సత్వంలో నిలవటానికి ప్రయత్నిస్తూ ఉండే భక్తుని భగవంతుడు భర్త లాగా భరిస్తూ ఉంటాడు. అతడికి కష్టనష్టాలు వస్తే వాటిని తొలగించటానికి ప్రయత్నిస్తాడు. అతడి పోషణభారం కూడా తానే వహిస్తాడు. వారి కోరికలను తీరుస్తూ ఉంటాడు.

4. **భోక్త** :- ఎవరిలోనైతే తమోగుణ రజోగుణాలు పూర్తిగా తొలగిపోయి; కేవలం సత్వగుణంలో మాత్రమే ఉంటారో అట్టివారు పూర్తిగ భగవంతుని కొరకే జీవితాన్ని అర్పిస్తారు. అతడికి ఈ లోకంలో కర్మలు చేయవలసిన అవసరం ఉండదు. ఒకవేళ కర్మలు చేసినా అతడికి కర్తృత్వం ఉండదు. తాను చేస్తున్నాననే భావన ఉండదు. ఎల్లప్పుడూ ఆత్మ జ్ఞానంలో రమిస్తూ ఉంటాడు. శ్రవణ మననాలు, సాధనలు చేస్తూ ఉంటాడు. అట్టి వారిలో పురుషుడు వారికి ఎంతో దగ్గరగా ఉంటాడు. పరమాత్మకు తనకు మధ్య వాసనతెర అతి పలుచగా - ట్రాన్స్పరెంటుగా - పోలిథీన్ పేపర్ లాగా ఉంటుంది. కనుక అన్నింటికీ భోక్తగా పరమాత్మే ఉంటాడు. అంటే అతడి కష్టాలు, దుఃఖాలు, బాధలు స్వయంగా పరమాత్మే స్వీకరిస్తాడు.

5. **మహేశ్వరః** :- ఇక సత్వగుణాన్ని కూడా తొలగించుకొని శుద్ధసత్వంలో నిలిచినవాడు - నిలవటానికి ప్రయత్నించేవాడు యోగి. అంటే నిరంతరం పరమాత్మతో కలయికకు యత్నించేవాడు. సత్వగుణాన్ని వదిలించు

కోవాలంటే భగవంతుని సాయం కావాలి. అందుకు భగవంతుని త్రికరణశుద్ధిగా ఆశ్రయించాలి. ఆయన సాయం కోసం అర్థించాలి - ఆక్రోశించాలి. అతడే యోగి స్థితిలో ఉన్నవాడు. తనకు పరమాత్మకు మధ్యనున్న వాసనల తెర నిర్మలమైన అద్దంలా ఉంటుంది. అట్టి స్థితిలో పరమాత్మ ప్రభావం అతడిలో నుండి వ్యక్తమౌతుంది. అందుకే అతడు అన్నమాటలు జరుగుతుంటాయి. భూతభవిష్యత్ వర్తమానాలు తెలుస్తుంటాయి. కొన్ని సిద్ధులు అతడిలో ప్రవేశిస్తాయి. అట్టి స్థితిలో అతడిలోని పురుషుని మహేశ్వరుడు - అన్నారు.

మహేశ్వరుడంటే ఈశ్వరులకు ఈశ్వరుడు. మనలో ఒక్కొక్క ఇంద్రియానికి ఒక్కొక్క ఈశ్వరుడు (అధిష్టాన దేవత) ఉన్నారు. కంటికి సూర్యుడు, చెవికి ఆకాశం, ముక్కుకు అశ్వినీ దేవతలు, నాలుకకు వరుణుడు, చర్మానికి వాయువు - ఇలా. అయితే ఆయా దేవతలకు - ఈశ్వరులకు శక్తిని ప్రసాదించే ప్రభువు మహేశ్వరుడు. ఆయన అంతర్యామిగా ఉండి ఈ ఇంద్రియాలను, మనోబుద్ధులను శాసిస్తూ ఉంటాడు. కనుకనే వీటి ద్వారా వ్యక్తమయ్యేవన్నీ ఆ భగవంతుని శక్తులే. అలా సిద్ధులు - శక్తులు గలవారిలో పురుషుడు మహేశ్వరుడిగా ఉంటాడు.

6. **పరమాత్మ:-** ఇక సత్వగుణాన్ని కూడా విడిచిపెట్టి గుణాతీతుడైన వాడు జీవన్ముక్తుడే. 3 గుణాలతో వాసనల తెర ఏర్పడ్డది. 3 గుణాలు పోవటంతో వాసనల తెర కరిగిపోయింది. ఇప్పుడు జీవుడే క్షేత్రజ్ఞుడు. క్షేత్రజ్ఞుడే పరమాత్మ.

**జీవభావం కరిగిపోవటంతో జీవుడు దేవుడయ్యాడు. అతడే పరమాత్మ-జీవన్ముక్తుడు.**

**ప్రకృతిలో కూర్చున్న పురుషుడు ప్రకృతిని పూర్తిగ వదిలించు కుంటే అతడు పరమాత్మగానే మిగిలిపోతాడు. అతడికి దేహం ఉన్నా లేనట్టే. అతడికి దేహం ఉన్నా ముక్తుడే. జీవన్ముక్తుడే.**

**ప్రకృతి పురుషుల గురించిన జ్ఞానాన్ని తెలుసుకుంటే ప్రయోజన మేమిటి ? -**

**ప్రకృతి పురుషుల స్వరూప స్వభావాలు చెప్పి, వాటి మధ్యగల సంబంధాలను తెలిపి, పురుషుడు ఏ ప్రకృతిలో ఎలా ప్రవర్తిస్తాడో చెప్పి ఇప్పుడీ ప్రకృతి పురుషుల గురించిన జ్ఞానాన్ని తెలుసుకుంటే ప్రయోజనం ఏమిటో చెబుతున్నారు.**

**శ్లో|| య ఏవం వేత్తి పురుషం**
**ప్రకృతిం చ గుణై స్సహ ।**
**సర్వథా వర్త మానోఽపి**
**న సభూయోఽభి జాయతే ॥** (24)

**తా||** ఎవరైతే ఈ ప్రకారంగా పురుషుని, గుణాలతో కూడిన ప్రకృతిని తెలుసుకుంటారో అతడు ఎలా ప్రవర్తించినప్పటికీ తిరిగి జన్మించడు.

**వ్యాఖ్య :-** పురుషుడు 'ప్రకృతి' అనబడే కారణశరీరంలో కూర్చుంటాడు. అందులో అంతకు ముందు జన్మలలో సేకరించుకున్న వాసనలున్నాయి. అవి

గుణాలతో కూడి ఉంటాయి. ఆ గుణాలతో సంగభావం పెట్టుకున్న పురుషుడు తనను తాను మరచి, జీవుడిగా అనేక కర్మలు చేస్తూ పాత కర్మఫలాలను, వాసనలను ఖర్చుచేసుకుంటూ; క్రొత్త వాసనలను, కర్మఫలాలను ప్రోగు చేసుకుంటూ మళ్ళీ వాటిని ఖర్చుచేసుకోవటానికి తగిన శరీరాన్ని ధరించి ఈ లోకంలోకి వస్తూ - ఈ సంసార జనన మరణ చక్రంలో ఇరుక్కుంటున్నాడు. ఐతే దీనికి విముక్తి ఎప్పుడు?

ప్రకృతి అంటే ఏమిటి? ఎటువంటిది? పురుషుడంటే ఎవరు? ఎలాంటి వాడు? అని విచారణ చేస్తూ ఈ ప్రకృతి - పురుషులను, క్షేత్రక్షేత్రజ్ఞులను విభాగించి తెలుసుకొని; ఈ గుణదోషాలు, వికారాలు అన్ని క్షేత్రానికి సంబంధించినవే గాని క్షేత్రజ్ఞుడైన పురుషునికి (నాకు) సంబంధించినవి కావు - అని; తాను నిత్యమైన, ఆనంద స్వరూపమైన పురుషుడను అని అపరోక్ష జ్ఞానం ద్వారా తెలుసుకొని ప్రకృతిని ఆశ్రయించక, పురుషుడనని నిరంతరం ఆ స్థితిలో నిలచినచో అతడు తిరిగి పుట్టడు. అతడు జీవన్ముక్తుడే.

**సర్వథా వర్త మానోపి :-** అతడు ఎలా ప్రవర్తించినప్పటికీ - అతడు మళ్ళీ పుట్టే పనిలేదు. అంటే అతడు ముక్తుడే. జీవన్ముక్తుడే. ఎలా ప్రవర్తించినా - అంటే అన్యాయాలు అక్రమాలు చేస్తున్నా - హత్యలు చేస్తున్నా అని కాదు. ఆ స్థాయికి వచ్చిన వాడిలో ఏ స్వార్థమూ ఉండదు. ఈ ప్రాపంచిక విషయాల పట్ల ఏ మాత్రం ఆసక్తి ఉండదు. అతడికి ఇక్కడి వస్తువులు - విషయాలు - అన్నీ విలువలేనివే. అట్టి ఆత్మజ్ఞాని - నేను ఈ క్షేత్రం కాదు — క్షేత్రజ్ఞుడను - ఆత్మను - పరమాత్మను అనే నిశ్చయ జ్ఞానం కలిగి ఉంటాడు. తనకొక శరీరం ఉన్నట్లు, ఆ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

శరీరంలో తానునున్నట్లు, ఏవేవో కర్మలు చేస్తున్నట్లు ఇతరుల దృష్టికి కనిపిస్తున్నా తన దృష్టిలో మాత్రం శరీరమూ లేదు; ఆ శరీరం ద్వారా చేయబడుతున్న కర్మలతో సంబందమూ లేదు. ఆ శరీరం ఉన్నా అతడికి లేనట్లే. కనుక ముక్తుడే. అతడికిక ఏ ప్రారబ్ధమూ లేదు. జ్ఞానాగ్నిలో అతడి సంచిత కర్మలన్నీ దగ్ధమైపోయినవి. కనుక వాటిలో నుండి ప్రారబ్ధ కర్మలంటూ వచ్చేది లేదు. ప్రారబ్ధంలేదు గనుక జన్మలేదు. అలాగే అతడు ముక్తిని పొందినవాడు గనుక అతడికి ఆగామి కర్మలు కూడా ఉండవు. ఎందుకంటే అతడు ఏదో అలోచించి కర్మలు చేసేవాడు కాదు. కర్తృత్వంతో కర్మలు చేసేవాడు కాదు. నిర్లిప్తంగా - ఏ ఆలోచనా లేకుండా అతడి దేహం ద్వారా కర్మలు జరిగిపోతాయి. కనుక అతడికి ఏ ఫలమూ ఉండదు. అతడు ఎలా ప్రవర్తించినా తిరిగి జన్మలేదు - అనేమాట జ్ఞాని యొక్క గొప్పతనాన్ని చాటి చెప్పేమాటయే. అంతేగాదు, ఎలా ప్రవర్తించినా అంటే - గృహస్తుడైనా, వానప్రస్థుడైనా, సన్యాసియైనా అని కూడా అర్థం.

'య ఏవం వేత్తి' ఎవరైతే ఇలా తెలుసుకొంటారో అనటంవల్ల ఈ జ్ఞానాన్ని- ప్రకృతి పురుషులకు సంబంధించిన జ్ఞానాన్ని ఎవరైనా పొందవచ్చు అని భావం. స్త్రీలైనా, పురుషులైనా, సన్యాసులైనా, గృహస్తులైనా, చదువుకున్న వారైనా, చదువులేని వారైనా ఎవరైనా పొందవచ్చు. అలా పొంది క్షేత్రాన్ని నిరశించి క్షేత్రజ్ఞుడిగా - పురుషునిగా - ఆత్మగా ఉండిపోవచ్చు. - ఇట్టి అద్భుత జ్ఞానాన్ని పొందటానికి మార్గాలేమిటి?

ప్రకృతి పురుషుల జ్ఞానాన్ని పొందితే ఇక వారికి జన్మలేదు. అంటే మోక్షమే. మరి అట్టి జ్ఞానాన్ని ఎలా పొందాలి? దానికి మార్గాలేమిటి?

**శ్లో|| ధ్యానే నాత్మని పశ్యంతి**
**కేచి దాత్మన మాత్మనా |**
**అన్యే సాంఖ్యేన యోగేన**
**కర్మ యోగేన చాపరే || (25)**

**తా||** కొందరు ఆత్మను శుద్ధమైన మనస్సుతో ధ్యానం ద్వారా తమలోనే దర్శిస్తారు. కొందరు జ్ఞానయోగం ద్వారాను, మరికొందరు కర్మయోగం ద్వారాను తెలుసుకొంటారు.

**వ్యాఖ్య :-** క్షేత్రజ్ఞుడు లేదా జ్ఞేయవస్తువు, లేదా పురుషుడు - లేదా ఆత్మ- దీనిని తెలుసుకోవాలి. తెలుసుకుంటేనే తిరిగి జన్మలేకుండా పోయేది; మోక్షం కలిగేది. మరి తెలుసుకోవటం ఎలా? దానికి అర్వాతగా అమానిత్వాది 20 గుణాలను చెప్పారు. అవే జ్ఞాని లక్షణాలు. వీటిని ఒక్కసారిగా అభ్యసించటం కష్టం. కొందరు ఎన్నో జన్మల నుండి ఈ గుణాలను అభ్యసిస్తూ ఉండవచ్చు. కొందరు ఈ జన్మలోనే చాలాకాలం నుండి అభ్యసిస్తూ ఉండవచ్చు. మరి కొందరు ఇప్పుడే తెలుసుకొని వాటి అభ్యాసం ప్రారంభించవచ్చు. వీరందరిని 1. ఉత్తమాధికారులు, 2. మధ్యమాధికారులు, 3. మందాధికారులు అని 3 తరగతుల వారిగా విభజించవచ్చు. ఈ 3 తరగతుల వారికీ తగిన మార్గాలను - ఉపాయాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు. ఇన్ని

**మార్గాలెందుకు? ఒక్కొక్క స్థాయిలో ఉన్నవారికి ఒక్కొక్క మార్గం తగిఉంటుంది. అందుకే ఇన్ని మార్గాలు.**

**1. మొదటి మార్గం: ఎవరికైతే మనోబుద్ధులు నిశ్చలంగా ఉంటాయో, ప్రాపంచిక విషయాల పట్ల వైముఖ్యం; పరమాత్మ యందు ఆసక్తి ఉంటుందో, పూర్తి సత్వగుణం ఉంటుందో - అలాగే అమానిత్వాది గుణాలను అనేక జన్మల నుండి అభ్యసిస్తూ ఇప్పుడు వాటిని పూర్తిగా ఆచరణలో పెట్టుకుంటున్నారో అట్టివారే ఉత్తమాధికారులు. ఇట్టి ఉత్తమాధికారులు ధ్యానయోగం ద్వారా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతారు. "పరమాత్మ నాకన్నా వేరు కాదు. నేనే పరమాత్మను. ఇంతవరకు క్షేత్రంతో తాదాత్మ్యం పెట్టుకొని - క్షేత్రమే నేనుగా భ్రమపడ్డాను. ఇప్పుడు భ్రమ తొలగింది, స్మృతి కలిగింది. క్షేత్రం నేను కాదు. ఈ క్షేత్రమునందంతటా నఖశిఖపర్యంతం వ్యాపించియున్న సుక్ష్మాతిసూక్ష్మ - సర్వవ్యాపక - స్వయంప్రకాశ చైతన్య స్వరూపమైన క్షేత్రజ్ఞుడను - ఆత్మను - పరమాత్మనే నేను" అనే అనుభూతి ధ్యానంలో స్థిర పడిపోతుంది.**

**ధ్యానం అంటే? బాహ్యవిషయాల నుండి ఇంద్రియాలను పూర్తిగ మరలించి, నిగ్రహించి, మనస్సును బుద్ధిలో నియమించి, పరమాత్మను ధ్యానించటమే ధ్యానం - అని శంకరాచార్యుల వారు నిర్వచించారు.**

**అయితే ఇట్టి ధ్యానంలో ఆత్మదర్శనం ఎక్కడ కలుగుతుంది? - "ఆత్మానం ఆత్మనా ఆత్మని" అన్నారు. అంటే ఆత్మను శుద్ధబుద్ధి ద్వారా తనలోనే దర్శించటం - అనుభూతి చెందటం జరుగుతుంది - అని. ఐతే ఇది అందరికీ**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**సాధ్యం కాదు. సత్వగుణ సంపన్నులై, పరిపక్వసాధకులైన ఉత్తమాధికారులకే సాధ్యం. మరి మధ్యమాధికారులకో -**

**2. రెండవ మార్గం:- కొందరిలో బుద్ధి రజోగుణంతో రెపరెపలాడుతుంది. కొంత సత్వగుణం ఉన్నా రజోగుణం ప్రబలంగా ఉంటుంది. అట్టివారి మనస్సు విక్షేపాలతో ఉంటుంది. ప్రశాంతంగా - స్థిరంగా ఉండదు. ఇట్టివారినే మధ్యమాధికారులు అంటారు. అప్పుడప్పుడూ వీరు ధ్యానాన్ని చక్కగా చేయగలిగినా ఏకాగ్రత కుదరదు. వారి కొరకే సాంఖ్యయోగం చెప్పబడింది. సాంఖ్యయోగం అంటే భక్తితో కూడిన జ్ఞానయోగం. వీరు ఆత్మదర్శనానికి ఏం చేయాలి?**

*** భగవంతునిపై అచంచలమైన - అనన్యమైన భక్తితో -**

*** ఆత్మజ్ఞానాన్ని అందించే శాస్త్రాలపై, సద్గురువులపై విశ్వాసంతో -**

*** శాస్త్రాలను - ఉపనిషత్తులను శ్రవణం చేస్తూ -**

*** ఆత్మ విచారణ సాగించటం ద్వారా -**

*** సాక్షీభావన - ఆత్మనిష్ట అనే సాధనల ద్వారా -**

**ఆత్మను - శుద్ధ బుద్ధితో - తమలోనే దర్శించగలుగుతారు. ఇది సాధ్యం కానటువంటి మందాధికారులకో-**

**3. మూడవ మార్గం: వీరు శాస్త్రాలను అధ్యయనం చెయ్యలేరు. వీరిలో సత్వగుణం పాలు మరీ తక్కువ. ఎక్కువ రజోగుణంలో ఉంటారు. కనుక ప్రశాంతంగా ఒకచోట కూర్చోలేరు. అందువల్ల శ్రవణంగాని, జపధ్యానాలుగాని, సాధనలుగాని చేయలేరు. ప్రయత్నించినా ఎంతోకాలం కొనసాగించలేరు.**

మనస్సు ప్రాపంచికవిషయాలలో తిరుగుతుంది. విషయ వస్తువ్యామోహంతో ఆసక్తితో, భ్రమలతో మనస్సు విషపూరితం అవుతుంది. అట్టివారికి ఆధ్యాత్మిక సాధనలు కష్టం. కనుకనే వారికి కర్మయోగం చెప్పబడ్డది.

విషయాల కొరకు, వస్తువుల కొరకు, భోగాల కొరకు ఎలాగూ కర్మలు చేస్తారు గనుక ఆ కర్మలను చేయనిస్తూ క్రమంగా నిష్కామంగా, ఫలాసక్తి లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో ఆ కర్మలను కొనసాగించేటట్లు చేయాలి. ఇదే కర్మయోగం. దీనివల్ల అంతఃకరణ శుద్ధి కలుగుతుంది. మనస్సు శాంతిస్తుంది. అప్పుడు శాస్త్రాల శ్రవణం సాధ్యమవుతుంది. శాస్త్ర విషయాలను, ఆత్మజ్ఞానాన్ని అందుకుంటున్నకొద్దీ బుద్ధి సూక్ష్మమవుతుంది. అప్పుడు అహంకారం అణుగుతుంది. గురువులను ఆశ్రయిస్తారు. వారిని సేవిస్తారు. దానితో శ్రవణం వల్ల పూర్తి ప్రయోజనాన్ని పొందుతారు. ఇలా మందాధికారులు మధ్యమాధికారులుగా మారి ఆ తరువాత జ్ఞానయోగం ద్వారా ఆత్మను శుద్ధ బుద్ధితో తమలోనే దర్శిస్తారు. ఈ ప్రకారంగా

- సాత్విక గుణం గలవారు ధ్యానయోగం ద్వారాను -
- సత్వ రజోగుణాలు గలవారు సాంఖ్యయోగం ద్వారాను -
- రజోగుణం ప్రబలంగా ఉన్నవారు కర్మయోగం ద్వారానూ

ఆత్మ సాక్షాత్కారాన్ని పొందవచ్చు. ఇదే సరైన మార్గం. అయితే రజోతమోగుణాలతో నిండి పూర్తిగా ప్రాపంచిక భావనలో మునిగిపోయినవారు పైన చెప్పిన సాధన లేవీ చేయలేరు. మరి అట్టి వారి గతి ఏమిటి?

**- అతి మందాధికారులకు మార్గం ఈ శ్లోకంలో**

**శ్లో|| అన్యేత్వేవ మజానంతః**

**శ్రుత్వా2న్యేభ్య ఉపాసతే |**

**తే2పి చాతి తరం త్యేవ**

**మృత్యుం శ్రుతి పరాయణాః || (26)**

**తా||** ఈ ప్రకారంగా తెలుసుకోలేని ఇతరులు కూడా అన్యుల ద్వారా విని, అనుష్టిస్తారు. విన్నదానిపై ఆసక్తి కలిగిన అట్టివారు కూడా మృత్యువు నుండి తరిస్తారు.

**వ్యాఖ్య :-** ఇంతకు ముందు శ్లోకంలో ఉత్తమాధికారులకు ధ్యానయోగం, మధ్యమాధికారులకు శాస్త్రవిచారణ, ఆత్మానాత్మ వివేకంతో కూడిన సాంఖ్యయోగం, మందాధికారులకు కర్మయోగం చెప్పబడింది. ఆయా మార్గాల ద్వారా వారు జన్మరాహిత్యాన్ని పొందగలుగుతారు. అయితే ధ్యానయోగాన్ని ఆచరించటం గాని, శాస్త్రాల అధ్యయనం గాని, ఆత్మవిచారణ గాని, ఆత్మానుసంధానం గాని అందరికీ సాధ్యం కాదు. కర్మయోగాన్ని ఆచరించటం కూడా కొందరికి సాధ్యం కాదు. మరి అలాంటి వారి గతి ఏమిటి? వారికీ మార్గం చూపుతున్నాడు భగవంతుడు. ఏమిటది?

ఇతరుల ద్వారా విని, విన్న విషయాలపై గురి ఉంచి, విశ్వాసం ఉంచి, అనుష్టానం చేస్తే వారు కూడా మృత్యువు నుండి తరిస్తారు - అని.

శ్రవణానికి గల ప్రాధాన్యతను అద్భుతంగా తెలియజేసిన శ్లోకం ఇది. అతిసామాన్యుల నుండి, మేధావుల వరకు ఎవరికైనా సరే ఈ శ్రవణ భాగ్యం లేకపోతే సాధనలో ముందుకు వెళ్ళటం గాని, ఆశయసిద్ధిని పొందటంగాని జరుగదు. కేవలం శ్రవణం వల్లనే ప్రయోజనం పొందిన వారుకూడా ఎందరో ఉన్నారు. వినిపించే వారి సమర్థత, వినేవారి విశ్వాసం - ఏకాగ్రత ఇక్కడ ముఖ్యం. శ్రద్ధగా వినటం కూడా గొప్పయోగమే. తమకు ఎవరిపై విశ్వాసం ఉంటుందో, గౌరవభావం - పూజ్యభావం ఉంటుందో అట్టివారి బోధనలను వింటూ, వారు చెప్పిన విధంగా నడుచుకుంటూ ఉన్నవారు తప్పకుండా ఈ జనన మరణరూప సంసారాన్ని తరించగలరు.

ఇలా ఎవరైతే గురువుపై విశ్వాసంతో, ఏకాగ్రచిత్తంతో, పూజ్యభావంతో వింటారో - విని ఆ విన్న విషయాలపై విశ్వాసం ఉంచుతారో - ఆసక్తిని చూపుతారో, ఆచరిస్తారో అట్టివారినే ఇక్కడ 'శ్రుతిపరాయణులు' అని గౌరవనామంతో సంబోధిస్తున్నాడు భగవానుడు. పెద్దలు చెప్పిన మాటలను శ్రద్ధగా ఆలకించటమే వారి పాలిటికి తపస్సూ, యోగము అవుతున్నది. కనుక శ్రవణాసక్తి అనేది చాలా గొప్పవిషయం. పరీక్షిత్తు 7 రోజులలో శుకమహర్షి ద్వారా భాగవతాన్ని వినటంవల్లనే ముక్తినందినట్లు మనకు భాగవతం తెలియజేస్తున్నది. ఇదీ శ్రవణ మహిమ.

కర్ణుడు లేని భారతమా? అంటారు కొందరు. ఎందుకంటే కర్ణుడే లేకపోతే భారత యుద్ధమే జరిగేదికాదు అనే ఉద్దేశంతో. ఈ శరీరమనే భారతానికి కర్ణము కూడా అంతే. ఇది తారకమూ మారకమూ కూడా.

**వేదాంతవిషయాలను వినటం వల్ల ఈ చెవి సార్థకమవుతుంది. అప్పుడే తారకం. అలాగాక ఒక చెవితో విని మరొక చెవితో వదిలితే నిరర్థకం. అదే మారకం. వినే విషయంలో చిత్తం కరిగిపోవాలి. చిత్తం ఆ విషయంగా మారిపోవాలి. అదే నిజమైన శ్రవణం. ఇట్టి శ్రవణ పరాయణులే - శ్రుతిపరాయణులే కాలక్రమంలో మనన నిధిధ్యాసనలతో జ్ఞానసిద్ధికి అర్హులవుతారు. కనుక ఏ తెలివీలేని వారు కూడా గురువుపై భక్తి శ్రద్ధలతో ఆయన చెప్పిన దానిని వింటూ, ఆయన చెయ్యమన్న దాన్ని చేస్తూ ఉంటే తప్పక తరిస్తారు అని గ్రహించాలి.**

**ఇక భగవానుడీ ప్రకరణాన్ని ముగించబోతున్నాడు. ఇంతవరకు చెప్పిన విషయంలోని సారభూతమైన వాక్యాలనే - మనం తప్పనిసరిగా జ్ఞాపకం పెట్టుకోవాల్సిన విషయాలనే చివరిగా మాటలు మార్చి తెలియజేయబోతున్నాడు.**

**శ్లో|| యావత్ సంజాయతే కించిత్**
**సత్త్వం స్థావర జంగమం |**
**క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగాత్**
**తద్విద్ధి భరతర్షభ! || (27)**

**తా||** భరతసత్తమా! స్థావరం గాని, జంగమం గాని ఏ కొంచమైనా పుడుతున్నదో - ఉంటున్నదో అది క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగం వల్లనే అని తెలుసుకో.

**వ్యాఖ్య :-** స్త్రీ రూపంలో ఉన్న క్షేత్రం, పురుషరూపంలోని క్షేత్రజ్ఞుడు కలిస్తేనే ప్రాణుల ఉనికిగాని పుట్టుకగాని. జంగమాలలో అంటే కదిలేవాటిలో క్షేత్రక్షేత్రజ్ఞుల కలయిక ఉన్నది. అంటే మనకొక క్షేత్రం, మనం క్షేత్రజ్ఞుడు. మరి స్థావరాలలో అంటే కదలికలేని జడవస్తువులలో క్షేత్రమున్నది. కాని క్షేత్రజ్ఞుడు ఎక్కడున్నాడు?

ఇదొక పెన్. ఇది జడం. ఇది పెన్ అని తెలుసుకున్నదెవరు? చైతన్యం, క్షేతజ్ఞుడు. అలా క్షేత్రజ్ఞుడు దానిని పెన్ అని తెలుసుకోకపోతే అది లేనిదాని క్రిందేలెక్క. సూర్యచంద్రాదులను, పర్వతాలను, నదులను క్షేత్రజ్ఞునిలోని చైతన్యం తాకినప్పుడే వాటి ఉనికి. అందువల్ల జడవస్తువులు కూడా క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగంలోనే సత్తా కలిగి ఉంటున్నాయి.

అయితే ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల కలయిక ఎలాంటిది? నిజంగా రెండూ ఒక జాతి వస్తువులు కాదు. విజాతి వస్తువులు. ఎందుకంటే క్షేత్రం జడం. క్షేత్రజ్ఞుడు చైతన్యం. ఈ రెంటికి 36 సంబంధం. 3 ఒకవైపుకు చూస్తే 6 మరోవైపుకు చూస్తుంది. సజాతి వానికే పొత్తు కుదురుతుంది గాని విజాతి వానికి పొత్తు కుదరదు. నీళ్ళు పాలు కలుస్తాయి గాని; నీళ్ళు, రాళ్ళు కలవవు. అలాగే క్షేత్రక్షేత్రజ్ఞులు విజాతి వస్తువులు. కనుక కలవవు. కాని కలిసినట్లుగా ఉంటాయి. ఇదే తాదాత్మ్య సంబంధం. కల్పిత తాదాత్మ్యం.

ఒకదాని ధర్మాలను మరొక దానిపై ఆరోపించుటయే కల్పిత తాదాత్మ్యం. ఇదే అన్యోన్య అధ్యాస. క్షేత్రజ్ఞుని ధర్మాలైన సత్తు - చిత్తు - ఆనందం క్షేత్రం పైన;

అలాగే క్షేత్ర ధర్మాలైన సుఖదుఃఖాలు క్షేత్రజ్ఞుని యందు ఆరోపించ బడుతున్నాయి. ఇదే అన్యోన్య అధ్యాస.

గుండ్రని ఇనుపగుండును కొలిమిలో ఎర్రగా కాల్చాం. ఇప్పుడు దానిని పట్టుకుంటే చెయ్యి కాలిపోతుంది. ఇనుము కాల్చేసింది అంటాం. నిజంగా కాల్చే ధర్మం ఇనుముది కాదు. అది అగ్ని ధర్మం. అగ్నిధర్మాన్ని ఇక్కడ ఇనుముపై ఆరోపిస్తున్నాం. అలాగే నిప్పు గుండ్రంగా ఉన్నది అంటాం. నిజంగా నిప్పుకు ఆకారం లేదు. ఆకారం ఇనుముది. అంటే ఇనుము ధర్మాన్ని అగ్నిపై ఆరోపిస్తున్నాం. ఇదే అన్యోన్య అధ్యాస అంటే.

ఇలాగే ప్రకృతితో సంయోగం వల్ల ఆత్మ క్షేత్రజ్ఞుడయ్యాడు. ఆత్మతో సంయోగం వల్ల ప్రకృతికి - క్షేత్రానికి చైతన్యం కలిగింది. ఇదే అన్యోన్య అధ్యాస. ఈ అధ్యాస కారణంగానే జగత్తు యొక్క పుట్టుక, ఉండుట. కనుక క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగం పూర్తి నిజంకాదు. ఇది కేవలం అన్యోన్య అధ్యాస మాత్రమే. ఈ కలయికను అర్థం చేసుకోవటమే జ్ఞానం. ఈ జ్ఞానం కలగనిదే సంసార విముక్తి లేదు. కనుకనే ప్రియశిష్యునికి ఇలా చెబుతున్నాడు భగవానుడు.

సత్యదర్శనం ఎలాగో - దాని గొప్పతనం ఏమిటో ఇప్పుడు చెబుతున్నాడు.

**శ్లో|| సమం సర్వేషు భూతేషు**
**తిష్ఠంతం పరమేశ్వరం |**
**వినశ్యత్స్వ వినశ్యంతం**
**యః పశ్యతి సపశ్యతి || (28)**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** నశించిపోయే వాటిలో నశించని వానిగా సమస్త భూతాలలోను సమంగా ఉన్న పరమేశ్వరుణ్ణి ఎవరు చూడగలరో వారే నిజమైన చూపు గలవారు.

**వ్యాఖ్య :-** పరమాత్మ అన్ని ప్రాణులలోను సమంగా ఉన్నాడు. పైగా నశించిపోయే దేహాలలో నశించని తత్త్వంగా ఉన్నాడు. అట్టి శాశ్వత తత్త్వమైన పరమాత్మనే చూడగలగాలి. అలా చూడగలిగిన వారి దృష్టియే నిజమైన దృష్టి. అలా నశించని పరమాత్మను గాక నశించిపోయే ఈ దేహాదులను చూచే దృష్టి మిథ్యా దృష్టి. అలాంటివాడు కళ్ళున్న గ్రుడ్డివాని క్రిందే లెక్క. అంటే సత్యవస్తువును చూడగలవాడే జ్ఞాని. కల్పిత నామ రూపాలను చూచేవాడు అజ్ఞానియే. పై పై దృష్టి వృథా. లోదృష్టి కావాలి.

దేవీ ఉపాసన చేసే ఒక భక్తుడు భక్తి బాగా ముదిరి రాతివిగ్రహాన్ని పూజిస్తేనే ఇంత లాభం వస్తున్నది, బంగారంతో చేయిస్తే ఇంకా ఎంత లాభం వస్తుందో! కుబేరుణ్ణి కావచ్చు అనుకొని 20 తులాల బంగారం తీసుకెళ్ళి కంసాలితో అన్నాడు. 4 తులాలతో దేవీ విగ్రహాన్ని, 4 తులాలతో పీఠాన్ని, 4 తులాలతో సింహాసనాన్ని, 4 తులాలతో కిరీటాన్ని, 4 తులాలతో ఛత్రాన్ని చక్కగా తయారుచేసి ఇమ్మన్నాడు. తయారైన తర్వాత ఇంటికి తెచ్చుకున్నాడు. ఎంతో అందంగా ఉన్నాయని మురిసిపొయ్యాడు. అమ్మవారు వచ్చిన తర్వాత బెడిసికొట్టింది. ఉన్నదంతా ఊడ్చుకుపోయింది. బికారి అయ్యాడు. కూటికి గుడ్డకు కరువైంది. అమ్మవారిని సపరివార సమేతంగా అంగడికి తరలించాడు. అమ్మకానికి పెట్టాడు. అంగడివాడు తూకం

చూచుకొని బిల్లువేసి ఇచ్చాడు. "ఇదేమిటయ్యా ! అమ్మవారికీ ఒకటే ధర, వాహనానికీ ఒకటే ధర, ఛత్రానికీ ఒకటే ధరా? మనిషికి జంతువుకీ ఒకటే ధరా? ఇదేం అన్యాయం?" అన్నాడు. దానికా షరాబు "అయ్యా! నీ దృష్టిలో అది దేవత, ఇది జంతువు, ఇది పీఠం, అది ఛత్రం అని తేడాలున్నాయిగాని నా దృష్టిలో అన్నీ ఒకటే. అన్నీ బంగారమే. నేను వెలకట్టేది బంగారానికే గాని దేవతకు, జంతువుకు కాదు. కావాలంటే బంగారం వరకు నాకు ఇచ్చి నీ దేవతను, జంతువును నీవే పట్టుకుపో!" అన్నాడు. అజ్ఞాని పై పై నామరూపాలు చూస్తాడు. జ్ఞాని అసలు వస్తువును చూస్తాడు.

ఆభరణాల రూపురేఖలు మారినా బంగారం మారదు. అలాగే దేహాల రూపురేఖలు మారినా ఆత్మ మారదు. నశించిపోయే ఈ నేత్రాలతో - చర్మచక్షువులతో నశించని ఆత్మను చూడలేం. గురువు అనుగ్రహంతో, భగవదనుగ్రహంతో జ్ఞాననేత్రం - దివ్యనేత్రం లభించాలి. సంజయునిపై వాత్సల్యంతో వ్యాస భగవానుడు, అర్జునునిపై వాత్సల్యంతో శ్రీకృష్ణ భగవానుడు దివ్యనేత్రాలను ప్రసాదించగా వారు భగవంతుని దర్శించారు. ఇదే జ్ఞాననేత్రం. జ్ఞానదృష్టి. జ్ఞానదృష్టి లేనివాడు భగవంతుని దృష్టిలో గ్రుడ్డివాడే.

ఇట్టి జ్ఞాన దృష్టి వల్ల ప్రయోజనం ఏమిటి?

శ్లో|| సమం పశ్యన్ హి సర్వత్ర
సమ వస్థిత మీశ్వరం |
నహిన స్త్యాత్మ నా22త్మానం
తతో యాతి పరాం గతిం || (29)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** సర్వత్ర సమంగా ఉన్న పరమాత్మను సమంగా చూస్తున్నవాడే తనను తాను ఆత్మహత్య చేసుకోనివాడు. దానివల్లనే అతడు పరమగతిని చేరుకుంటాడు.

**వ్యాఖ్య :-** అందరికీ రెండు కళ్ళుంటాయి. కాని పరమేశ్వరునికి 3 కళ్ళు. మనమందరం రెండు కళ్ళతో ఈ ప్రపంచాన్ని చూస్తుంటాం. నామరూపాలతో కూడిన దేహాన్ని చూస్తుంటాం. ఇది దేహదృష్టి. ఇంకా మనస్సుతో చూస్తాం. ఇది మనోదృష్టి. ఈ రెండు రకాల దృష్టులు భేదదృష్టులే. ఈ కళ్ళు క్షేత్రం గనుక క్షేత్రం ద్వారా ఈ ప్రపంచాన్ని చూచినప్పుడు అన్నీ భేదాలే. ప్రపంచం అంతా దుఃఖమయంగా కనిపిస్తుంది.

అలాగాక 3వ నేత్రం - అంటే జ్ఞాన నేత్రం ద్వారా చూస్తే ఈ ప్రపంచం అదృశ్యం. అంతటా పరమాత్మే దర్శనమౌవుతుంది. ఇదే ఆత్మదృష్టి - జ్ఞానదృష్టి. ఈశ్వరుడు ఒకసారి మూడవ నేత్రం తెరిచాడు, మన్మధునిపై కోపంతో. దానివల్ల ఏం జరిగింది? మన్మధుడు భస్మమైపోయాడు. మన్మధుడంటే అనేక ఆకర్షణలతో కూడియున్న ఈ నామరూప జగత్తే. అంటే 3వ కన్ను తెరిస్తే జగత్తు భస్మం. ఆ స్థానంలో సర్వత్రా వ్యాపించియున్న పరమాత్మే గోచరిస్తాడు. ఎందువల్ల? పరమాత్మయే ఈ ప్రపంచంగా భ్రమకొల్పుతున్నాడు. ప్రపంచమనే భ్రమ తొలిగితే ప్రపంచం అదృశ్యం. ఆ స్థానంలో పరమాత్మ ప్రత్యక్షం.

ప్రపంచ దృష్టి ఉన్నదా అంతా దుఃఖమయం. జ్ఞాననేత్రంతో ప్రపంచం అదృశ్యమై పరమాత్మ దర్శనమైనదా! ఆనందం. కనుక జ్ఞానదృష్టితో చూస్తే ఆనందం. అజ్ఞాన దృష్టితో చూస్తే దుఃఖం.

అంతేకాదు. జ్ఞాననేత్రంతో అంతటాఉన్న పరమాత్మను చూడగలవాడే ఆ పరమగతిని చేరుకుంటాడు. ఆత్మను తెలుసుకోలేనివాడు ఆత్మను హింసించినవాడే అవుతాడు. ఆత్మహత్య చేసుకున్నవాడే అవుతాడు. ఇదే విషయాన్ని ఈశావాస్యోపనిషత్ మంత్రం తెలియజేస్తున్నది.

**మం॥ అసూర్యా నామతే లోకాః అంధేన తమసావృతాః ।**

**తాగ్ంస్తే ప్రేత్యాభి గచ్ఛంతి ఏకే చాత్మహనోజనాః ॥**

ఆత్మను తెలుసుకోనివాడు ఆత్మాహత్య చేసుకొన్నవాడే. అతడికి చీకటిలో కాలేగతి. అంటే నీచ నికృష్ట జన్మలే గతి - అని.

ఎట్టివాడు నిజమైన చూపుగలవాడు? –

**శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి**

**క్రియామాణాని సర్వశః ।**

**యః పశ్యతి తదా22త్మానం**

**అకర్తారం స పశ్యతి ॥ (30)**

**తా॥** అన్ని సందర్భాలలోను కర్మలు ప్రకృతి వల్లనే జరుగుతున్నాయని, ఆత్మ ఏమీ చేసేది కాదు - అకర్తయని ఎవరు చూస్తారో అతడే నిజమైన చూపుగలవాడు.

**వ్యాఖ్య :-** కర్మలన్నీ ప్రకృతి వల్లనే జరుగుతున్నాయి. ప్రకృతి అంటే వాసనలతో కూడిన కారణశరీరమే. ఇదే సూక్ష్మప్రకృతి. కారణశరీరంలోని వాసనలవల్ల ప్రేరణలు కలుగుతాయి. ఆ ప్రేరణలకు అనుగుణంగా బుద్ధిలో కోరికలు

కలుగుతాయి. ఆ కోరికలను తీర్చుకొనుటకు మనస్సులో ఆలోచనలు వస్తాయి. ఈ ఆలోచనల ప్రకారం స్థూల శరీరం కర్మలు చేస్తుంది. కనుక కర్మలన్నీ ప్రకృతి వల్లనే - వాసనలవల్లనే జరుగుతున్నాయి.

ఐతే పురుషుడి పనేమిటి? అతడేం చేస్తున్నట్లు? అతడు ఏమీ చెయ్యడు. ఎందుకంటే అతడు అకర్త. అతడి సాన్నిధ్యంలోనే ప్రకృతి తన పనితాను చేసుకుంటూపోతుంది. పురుషుని సాన్నిధ్యంలోనే ప్రకృతికి కదిలే శక్తి వస్తుంది. చైతన్యవంతమౌతుంది. విద్యుచ్ఛక్తి సాన్నిధ్యంలో లైట్లు, ఫ్యాన్లు తమ పని తాము చేసుకుంటున్నట్లు పరమాత్మ చైతన్యం యొక్క సాన్నిధ్యంలోనే కారణశరీరంలోని వాసనలు కదిలి స్థూల సూక్ష్మ శరీరాలకు కదలికనిస్తాయి.

ఇది సరిగ్గా తెలుసుకొని నేను ఆత్మను - అకర్తను అని చూడగలవాడే నిజమైన చూపుగలవాడు - జ్ఞాని. తక్కినవారు అజ్ఞానులే.

ఒకడు రైలులో ప్రయాణం చేస్తూ రైలుకు బరువు తగ్గించాలని తన పెట్టెను తన నెత్తిపై పెట్టుకొని కూర్చొని ప్రయాణం చేస్తున్నాడు. రైలుకు బరువేమైనా తగ్గిందా? లేదు. ప్రకృతి అనే పెద్ద రైలు తన బరువును తాను ఎటూ మోసుకొని వెళుతూనే ఉంది. అయితే అజ్ఞాని అయిన పురుషుడు తాను అకర్తగా - అసంగుడుగా ఉండలేక అది నాది, ఇది నాది, ఈ పని నేను చేస్తున్నాను అనుకుంటూ లేనిపోని భారాన్ని (కర్తృత్వాన్ని) నెత్తిన వేసుకుంటున్నాడు. అలా వేసుకొని అనవసరంగా ఈ సంసార సముద్రంలో మునిగిపోతున్నాడు. అలాగాక తాను ఆత్మనని, అకర్తనని, చైతన్య స్వరూపుడనని, ఈ కర్మలతో నాకేమీ సంబంధం లేదని, ఈ కర్మలను చేసే

క్షేత్రం కన్నా నేను వేరుగా ఉన్నానని, నేను ఈ దేహంలోనే గాక అంతటా ఉన్నానని, సూక్ష్మాతి సూక్ష్మ స్వయం ప్రకాశ చైతన్యాన్నని ఎవరు తెలుసుకొంటారో అట్టివాడే జ్ఞాని. అతడే నిజమైన చూపుగలవాడు అని ఈ శ్లోకం స్పష్టం చేస్తున్నది.

ఇక ఆత్మానుభూతికి మార్గాలను చూపుతున్నాడు భగవానుడు.

కర్మలన్నింటికి కర్త క్షేత్రమేగాని ఆత్మ కాదు అని తెలుసుకున్నవాడే ఆత్మను నిజంగా చూడగలవాడు అని క్రిందటి శ్లోకంలో చెప్పిన భగవానుడు ఆత్మను అందుకొనే మార్గాన్ని చూపుతున్నాడు.

**శ్లో|| యదాభూత పృధగ్ భావం**
**ఏకస్థ మనుపశ్యతి |**
**తతఏవచ విస్తారం**
**బ్రహ్మ సంపద్యతే తదా|| (31)**

**తా||** నానా విధాలుగా - అనేక నామరూపాలతో కనిపించే ఈ జగత్తు, జీవుళ్ళు అంతా ఒక్కచోటనే ఉనికి కలిగిఉన్నట్లు, దానినుండే విస్తరించు కొంటున్నట్లు ఎప్పుడు చూడగలరో అప్పుడే బ్రహ్మమును పొందుతారు.

**వ్యాఖ్య :-** ఈ జగత్తంతా భిన్నత్వంతో కూడిఉన్నది. సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలతో నిండియున్నది. (i) ఒకే జాతికి చెందిన మనుషులుగాని, కుక్కలుగాని, కోతులుగాని, పశువులుగాని ఒకేరకంగా ఉండవు. ఒకే జాతికి చెందిన చెట్లుగాని, కొండలుగాని, నదులుగాని ఒకేరకంగా ఉండవు. (ii) ఇక

వేరువేరు జాతుల మధ్య భేదాలు మరీ అధికం. మనిషికి జంతువుకు తేడా, జంతువుకు పక్షికి తేడా, పక్షికి పాముకు తేడా. పాముకు చెట్టుకు తేడా. (iii) ఇక ఒకే జాతిలోని మనిషిలోనే కాలికి చేతికి తేడా, కన్నుకు ముక్కుకు తేడా, కాలుకు వ్రేలుకు తేడా. ఇలా అన్ని తేడాలే.

జగత్తులోని నానావిధ నామరూపాలన్నీ అనిత్యమైనవే. అవి యదార్థం కాదు. మిథ్యామాత్రం. నిత్యమైనది, సత్యమైనది ఆత్మ ఒక్కటే. అట్టి ఏకమైన ఆత్మలోనే ఈ అన్ని భూతాలు అస్థిత్వం కలిగిఉన్నాయి. ఆత్మనుండే ఇవన్నీ విస్తరించుకున్నాయి. ఇట్టి అనుభూతి కలవాడే బ్రహ్మము అవుతాడు. ఆత్మయే అవుతాడు.

(i) ఆభరణాలు అనేక విధాలుగా ఉంటాయి. గాజులు, గొలుసులు, ఉంగరాలు, జూకాలు, ముక్కుపుడకలు - ఇలా అనేక నామాలు - అనేక రూపాలు. అయినా ఇవన్నీ కూడా ఒక్క బంగారంలోనే అస్థిత్వం కలిగిఉన్నాయి. అవి అన్నీ బంగారం నుండే విస్తరించుకొన్నాయి. బంగారాన్ని రేకులుగా, తీగలుగా సాగదీసి, ముక్కలు చేసి, అతికించి, రాళ్ళు, డైమండ్స్ పొదిగి ఆభరణాలు తయారుచేస్తారు.

వాటి పేర్లు గాని, ఆ రూపాలు గాని వేరువేరుగా ఉంటాయి. పైగా అవి శాశ్వతం కాదు. అనిత్యం. కొంతకాలానికి వాటిని చెడగొట్టి బంగారం ముద్దగా చేస్తారు. మళ్ళీ మరొక రూపంలోకి మారుస్తారు. బంగారం ఎప్పుడూ ఉన్నదే. ఒక్కటిగానే ఉంటుంది. నామరూపాలు ఏర్పడక ముందు, నశించిన తర్వాత బంగారంగానే ఉంటుంది. అంతేకాదు నామరూపాలతో ఉన్నప్పుడు

కూడా అది యదార్థంగా బంగారమే. అది నిత్యం, శాశ్వతం. దానినుండే అన్ని నామరూపాలు విస్తరించుకొంటున్నాయి.

(ii) కలలో అనేక నామరూపాలతో కూడిన జగత్తు దర్శనమిస్తుంది. అయితే అదంతా ఎక్కడ నుండి వచ్చింది? ఎక్కడ అదృశ్యమవుతున్నది. ఆ స్వప్నజగత్తు మనస్సు నుండే విస్తరించుకున్నది. మనస్సులోనే కొంతసేపున్నది. ఆ తరువాత మనస్సులోనే కలిసిపోయింది. సమస్త నామరూపాలు మెలకువతోనే నశించిపోతున్నాయి. మనస్సు మాత్రం అలా స్థిరంగా నిలిచిపోతున్నది. అంటే స్వప్నం మిథ్య, మనస్సు సత్యం.

కాబట్టి ఈ నానాత్వమంతా మాయావిలాసం - అనిత్యం - భ్రమాత్మకం. అధిష్ఠాన వస్తువు ఒక్కటే సత్యం - నిత్యం. ఈ జ్ఞానం అందరికీ ఒక్కసారిగా ఎకాఎకీగా కలగదు. శాస్త్రాలచేత, గురువు యొక్క ఉపదేశంచేత, అంతఃకరణం సంస్కరించబడటం వల్ల ఈ అనుభూతి కలుగుతుంది. మనకెందుకు అట్టి అనుభూతి కలగటం లేదు? ఎందుకంటే మన అంతఃకరణం ప్రాపంచిక విషయాలతో సంపర్కం పెట్టుకొని కలుషితమైపోవటమనే ఒకే ఒక్క కారణం చేతనే. కనుకనే ఎన్ని శాస్త్రాలను విన్నా, విచారణ చేస్తున్నా అనుభూతి కలగటంలేదు. కనుక మనసులోని మాలిన్యాలను కడిగివేసుకోవాలి.

అంతఃకరణాన్ని శుద్ధిగావించుకున్న బుద్ధిశాలి దృష్టి ఎలా ఉండాలో చెబుతున్నారు, "అనేక నామరూప భేదాలతో భిన్నత్వంగా, వేరువేరుగా కనిపిస్తున్న ఈ భూతజాలం - ఈ జగత్తు అంతా ఆత్మనుండే విస్తరించుకొన్నది. ఆత్మలోనే అస్థిత్వం కలిగిఉన్నది"- అని చూడాలి. ఎప్పుడు చూడాలి? ఎప్పుడో

ఒకప్పుడు కాదు. ఎల్లప్పుడూ చూడాలి. అందుకే పశ్యతి అనకుండా అనుపశ్యతి అన్నారు.

ఉన్నది ఒక్కటే వస్తువు. అజ్ఞానుల దృష్టికి వేరువేరుగా కనిపిస్తుంది. జ్ఞానికి మాత్రం ఉన్నది ఉన్నట్టుగా ఒక్కటిగా కనిపిస్తుంది.

నీవు పొరుగూరికి ప్రయాణమయ్యావు. జనసంచారం లేదు. చీకటి పడింది. కరెంటు పోయింది. అక్కడ ఎదురుగా ఒక చెట్టు మొద్దు ఉంది. అది ఎండిపోయి మనిషి ఎత్తులో ఉంది. ఆ చీకటిలో భయంభయంగా ఉన్ననీకు ఆ చెట్టుమొద్దు దయ్యంలాగా కనిపించింది. అంతే భయపడి వెనుకకు పరుగుతీశావు.

ఒక యువతి ఆభరణాలు ధరించి అటుగా వెళుతున్నది. ఆమె కూడా ఆ చెట్టుమొద్దును చూచింది. ఆ చీకట్లో అది ఆమెకు ఒక దొంగలా కనిపించాడు. ఆమె పరుగు తీసుకుంటూ వెనుకకు వెళ్ళిపోయింది.

అప్పుడే ఎక్కడో దొంగతనంచేసి సరుకుల మూటతో ఒక దొంగ అటుగా వచ్చాడు. చీకట్లో ఈ మొద్దును చూచాడు. అంతే. వాడొక పోలీస్ అని, అతడు తనకోసమే కాపువేసి నిలబడిఉన్నాడని భావించి బిక్కచచ్చిపోయాడు. అంతలో తేరుకొని వెనుకకు పరుగెత్తాడు.

అయితే ఆ చెట్టుమొద్దులో ఏ తేడాలేదు. ఏ చలనమూ లేదు. ఏ వికారమూ లేదు. అది అలాగే ఉంది అందరికి అన్ని విధాలుగా కనిపించింది. వేరువేరుగా తోచింది. అలా తోచటానికి నిజంగా అక్కడ ఏ మార్పులేదు. ఉన్నదంతానీలోనే. నీ దృష్టిలోనే. నీ అజ్ఞానములోనే.

**అదేవిధంగా ఏ వికారాలు లేని నిర్వికార ఆత్మ అజ్ఞానుల దృష్టికి వేరువేరుగా, అనేక విధాలుగా కనిపిస్తుంది.**

**ఆ చెట్టులోనే దయ్యం ఉంది, దొంగ ఉన్నాడు, పోలీసు ఉన్నాడు. వీరంతా ఆ చెట్టు నుండే విస్తరించుకొని ఉన్నారు. మనలోని మలిన మనస్సు కారణంగా - చీకటి కారణంగా అలా వేరువేరుగా కనిపించారు.**

**అలాగే ఈ జగత్తు ఇందులో కనిపించే నానా విధాలుగా ఉన్న నామరూపాలతో కూడిన భూతజాలం అంతా ఆత్మలోనే అస్థిత్వం కలిగి ఉన్నది. ఆత్మనుండే విస్తరించుకొని ఉన్నది. నానాత్వం అంతా కల్పితం. సత్యవస్తువు ఒక్కటే ఆత్మ. ఎవరైతే ఈ నానాత్వంతో కూడిన జగత్తు అంతా కల్పితమని, దీనికి ఆధారంగా, అధిష్టానంగా ఉన్న ఆత్మ ఒక్కటే సత్యమని అనుభవపూర్వకంగా తెలుసుకొని, దృఢ చిత్తంతో ఉంటాడో అతడు అంతటా సత్యవస్తువునే దర్శిస్తూఉంటాడు. అలా దర్శించటానికి అతడు ఆత్మగా మారిపోయాడు. ఆత్మయే అయ్యాడు. ఇదే ఆత్మను అందుకొనే విధానం.**

**ఆత్మనుండే అన్ని ప్రాణులు విస్తరించుకొని ఉన్నాయి, ఆత్మలోనే అన్ని ప్రాణులు అస్థిత్వం కలిగిఉన్నాయి అని ఇంతకుముందు శ్లోకంలో తెలుసుకున్నాం. అట్టి ఆత్మ యొక్క స్వభావం ఏమిటి?**

**శ్లో|| అనాదిత్వా న్నిర్గుణ త్వాత్**
**పరమాత్మా2య మవ్యయః ।**
**శరీరస్థో2పి కౌంతేయ!**
**న కరోతి న లిప్యతే ||          (32)**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** అనాది ఐనందువల్ల, గుణాలు లేనందువల్ల ఈ పరమాత్మ నశింపు లేనివాడు. కౌంతేయా! అతడు శరీరంలో ఉన్నా కర్మ చెయ్యడు, మలినపడడు.

**వ్యాఖ్య :-** అన్ని ప్రాణులలోను ఉండి, తన ఉనికి మాత్రం చేత - తన స్పర్శ మాత్రం చేత ఆ ప్రాణులచే, వివిధకర్మలు చేయిస్తున్నప్పటికీ నిజంగా ఆత్మ ఏ పనీ చేయటం లేదని, దేనికీ కర్తకాదని, అది అకర్త అని శాస్త్రాలన్నీ పదేపదే చెబుతున్నాయి. అయితే ఈ భావాన్ని వేదాంతాన్ని అభ్యసించే శిష్యులు ప్రారంభదశలో సులభంగా అర్థం చేసుకోలేరు.

అందుకే ఉపనిషత్తులు 'ఆత్మ అనాది అనీ, అనంతం అనీ, అవ్యయం అనీ, పుట్టుక - చావు లేనిదనీ, దానికి సాధించవలసిన పనులు ఏవీలేవని' - మళ్లీ మళ్లీ చెబుతూనే ఉన్నాయి.

ఇక్కడ జరిగే పనులన్నీ క్షేత్రం వల్లనే జరుగుతున్నాయని, ఆత్మ ఆ క్షేత్రాన్ని అభిమానించుకొని, దానితో తాదాత్మ్యం చెంది క్షేత్రజ్ఞుడైన పురుషుడు అవుతున్నాడని, ఆ పురుషుడే కర్మలలో ప్రవర్తించి ఫలితాన్ని పొందుతున్నాడని ఇంతకు ముందే ఈ అధ్యాయంలో తెలియజేయటం జరిగింది. అయితే యదార్థంగా ఇది అధ్యాస మాత్రమే.

ఇప్పుడీ శ్లోకంలో ఆత్మ ఎలా నిష్క్రియం - నిర్లిప్తం అయిఉన్నదో తెలియజేస్తున్నారు. ఇదే విషయాన్ని రాబోయే 2 శ్లోకాల్లో ఉపమానాలతో తెలియజేయబోతున్నారు. ఎందుకంటే ఎంతగా చెప్పినా సందేహాలు ముళ్ళలాగా గుచ్చుకుంటూనే ఉంటాయి గనుక.

ఒక జడ్జీ హత్యానేరాన్ని గురించి విచారణ జరుపుతున్నాడు. ముద్దాయి హంతకుడేనని పబ్లిక్ ప్రాసిక్యూటర్ సాక్ష్యాలతో సహా నిరూపిస్తున్నాడు. సాక్ష్యాలన్నీ అతడు హంతకుడేనని నిరూపిస్తున్నాయి. దానితో అతడికి ఉరిశిక్ష విధిస్తూ తీర్పు చెప్పాడు జడ్జి.

ఇప్పుడీ వ్యవహారంలో హంతకుడికి ఉరిశిక్ష పడ్డది గనుక అతణ్ణి 3 నెలల్లో ఉరితీస్తారు. ఈ పాపంలో జడ్జీకి కూడా భాగం ఉంటుందా? ఉండదు. ఎందుకంటే అతడు న్యాయపీఠం మీద కూర్చొని, ఎటువంటి పక్షపాత బుద్ధి లేకుండా, తనకు అందిన సాక్ష్యాధారాలను బట్టి హంతకుడికి ఉరిశిక్ష విధించాడు గాని, అతడికి హంతకునిపై కోపంగాని, ద్వేషంకాని లేవు. ఏ శతృత్వం లేదు. కనుక అతనికి ఏ పాపం లేదు, రాదు. అతడు నిర్లిప్తంగా, నిస్సంగంగా, నిష్పక్షపాతంగా తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తున్నాడే గాని, ఉద్దేశ పూర్వకంగా ఏమీ చెయ్యటం లేదు.

అలాగే ఆత్మ క్షేత్రమనే పీఠం మీద కూర్చొని, ఆ క్షేత్రం తన పనులు తాను చేసుకోవటానికి కావలసిన శక్తిని - చైతన్యాన్ని ఇస్తున్నది. అలా ఇవ్వటం ఆత్మ యొక్క ధర్మమే గాని, ఆత్మకు ఏ ఉద్దేశాలు లేవు. అది ఏ క్షేత్రంలో ఉన్నా శక్తిని - చైతన్యాన్ని ఇవ్వటమనే ధర్మాన్ని- విధిని నిర్వర్తిస్తున్నదే గాని ఆ క్షేత్రంతో తనకెట్టి సంబంధము లేదు. కనుక ఆత్మ ఏ కర్మను చేసినట్లు కాదు, దేనికీ కర్త కాదు. అందువల్ల ఏ ఫలితాన్నీ అనుభవించవలసిన అవసరం లేదు. అంటే అది శరీరంలో ఉన్నా ఏ పనీ చేయదు, ఏ ఫలితాన్నీ పొందదు. అట్టి ఆత్మ యొక్క లక్షణాలు ఏమిటి? అనాది - అవ్యయం - నిర్గుణం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(i) **అనాది :-** ఆత్మకు ఆదిలేదు. అంటే పుట్టుక లేదు. ముందు లేకుండా తరువాత ఉండటమే పుట్టుక. అన్ని వస్తువులు, అన్ని ప్రాణులు పుట్టక ముందు లేవు. పుట్టిన తర్వాత ఉంటాయి. అయితే ఆత్మ అలాకాదు. అదిలేని సమయం అంటూ లేదు. అది ఎప్పుడూ ఉన్నదే. కనుక 'ఆది' అంటూ లేదు. పుట్టుక అంటూ లేదు.

ఈ ప్రపంచం అంతా కాలబద్ధమై నడుస్తున్నది. ఇందులో పుట్టిన వాటన్నింటికీ ఆది ఉంటుంది. ఎందుకంటే అన్నీ కాలంలోనే పుట్టి, కాలంలోనే ఉండి, కాలగర్భంలోనే కలిసిపోతున్నాయి. కనుక ఈ కాలంలో ఉన్న వాటన్నింటికి 'ఆది' ఉన్నది. మరి ఆత్మో! అది కాలానికి ముందే ఉన్నది. అసలు కాలమే దానినుండి పుట్టింది. అందువల్ల ఆత్మ అనాది.

నీవెప్పుడు పుట్టావు? ఈ వస్తువు ఎప్పుడు తయారైంది? కలియుగం ఎప్పుడు ప్రారంభమైంది? ఈ సృష్టిని చేసిన బ్రహ్మదేవుడు ఎప్పుడు జన్మించాడు? అంటే సమాధానం ఉన్నది. లెక్కకట్టి చెప్పవచ్చు. ఎందుకంటే ఇవన్నీ కాలంలోనే పుట్టి నడుస్తున్నాయి గనుక. కాని ఆత్మ ఎప్పుడు పుట్టింది? పరమాత్మ వయస్సు ఎంత? అంటే సమాధానం లేదు. ఎందుకంటే అది కాలం కంటే ముందే ఉన్నది గనుక. ఆ పరమాత్మలోనే కాలం ప్రారంభమైంది గనుక. కనుక పరమాత్మకు ఆది లేదు. అనాది.

(ii) **అవ్యయం:-** ఆత్మకు పుట్టుక లేదు. అనాది అని తెలుసుకున్నాం. ఈ లోకంలో పుట్టిన వాటికే మరణం. పుట్టుకలేని ఆత్మకు నాశనం కూడా ఉండదు. కనుక అవ్యయం. అసలు నాశనం స్థూలవస్తువుకే. ఆత్మ స్థూలవస్తువు కాదు.

అందుకే అది అవ్యయం. పైగా గుణాలుంటే మార్పులు జరుగుతాయి. మార్పులలో - వికారాలలో చివరి మార్పు (వికారం) నాశనం. మరి ఆత్మ గుణాలేలేనిది. కాబట్టి వికారాలు లేవు. అందువల్ల నాశనం అనే వికారం కూడా లేదు. అవ్యయం.

(iii) **నిర్గుణం:-** ఆత్మకు ఏ గుణాలు లేవు. అది నిర్గుణం. కాలంలో పుట్టి నశించే వాటికే గుణాలు. గుణాలుంటేనే వికారాలు. కాలం కన్నా ముందే ఉన్న ఆత్మకు గుణాలు లేవు. ఏ వికారాలు లేవు. అందువల్ల నిర్గుణం.

**శరీరస్థోపి :-** ఆత్మ శరీరంలోనే ఉన్నది. అన్ని శరీరాలలో - అన్ని భూతాలలో, అన్ని స్థావర జంగమాలలో అంతటా వ్యాపించియున్నది ఆత్మ. శరీరం ఉన్నా ఆత్మ ఉంటుంది. శరీరం నశించినా ఆత్మ ఉంటుంది. నశించే వాటన్నింటిలోను నశించకుండా ఉండేది ఆత్మ. అన్ని శరీరాలలో - అన్ని క్షేత్రాలలో నశించకుండా ఉండేదే ఏకమైన ఆత్మ. ఆత్మ శరీరంలో ఉన్నా ఏ పనీ చేయదు.

**నకరోతి - నలిప్యతే :-** ఆత్మ శరీరంలో ఉన్నా ఏ పనీచేయదు. కరెంటు ఏ పరికరంలో ఉన్నా అది ఏమీ చేయదు. అయితే ఆ కరెంటు శక్తిని ఆ పరికరం స్వీకరించి పనిచేస్తూ ఉంటుంది. అలాగే ఆత్మ ఏ శరీరంలో ఉన్నా అదేమీ చేయదు. అయితే ఆత్మచైతన్యశక్తిని ఆ శరీరం - క్షేత్రం స్వీకరించి పనిచేస్తుంది. దాని పనులతో ఆత్మకు ఏ సంబంధమూ లేదు. అందుకే ఏ మలినాలు ఆత్మకు అంటవు. 'నలిప్యతే'. కర్మ చేసినప్పుడల్లా ఆ కర్మఫలమనే మలినం చేసిన క్షేత్రానికి అంటుకుంటుందే గాని, సాక్షిగా - కేవలంగా ఉన్న ఆత్మకు అంటదు.

అనుపానంతో కూడిన మందులాగా దృష్టాంతంతో చెబితేనే తత్త్వం బాగా అర్థం అవుతుంది. అందుకే ఆత్మ శరీరంలో ఉన్నా - శరీరానికి శక్తినిస్తున్నా - ఆ శక్తితో శరీరం ఏ పనిచేసినా అ కర్మఫలమనే మలినం ఆత్మకంటదు - అని చెప్పిన వాక్యం అర్థం కావటానికి ఇప్పుడు ఆకాశ ఉదాహరణతో తరువాతి శ్లోకంలో తెలియజేస్తున్నారు.

ఆత్మ శరీరంలో ఉన్నా దేనిచేతా అంటబడదు. ఏ మలినాలు అంటవు అనటానికి ఉదాహరణంగా ఆకాశాన్ని చెబుతున్నారీ శ్లోకంలో –

**శ్లో|| యథా సర్వగతం సౌక్ష్మ్యాత్**
**ఆకాశం నోపలిప్యతే |**
**సర్వత్రా వ స్థితో దేహే**
**తథా22త్మా నోపలిప్యతే || (33)**

**తా||** ఏ ప్రకారంగా అంతటా వ్యాపించియున్న ఆకాశం సూక్ష్మత్వం కారణంగా దేనిచేతా అంటబడకుండా ఉంటున్నదో అలాగే దేహమునందు అంతటా వ్యాపించియున్న ఆత్మ దేనిచేత మలినపడదు, అంటబడదు.

**వ్యాఖ్య :-** 'శరీరంలో ఉన్నప్పటికీ ఆత్మ కర్మ చెయ్యదు. కర్మ మాలిన్యాన్ని అంటించుకోదు' అని క్రిందటి శ్లోకంలో తెలియజేశారు. నిజమే. ఆత్మ కర్మ చేసేదికాదు గనుక ఫలితాన్ని పొందదు. మాలిన్యాన్ని అంటదు అంటే సరిపోతుంది. కాని ఈ శరీరం ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూనే ఉంటుంది గదా! కర్మ చేసినప్పుడల్లా ఆ కర్మఫలలు - మాలిన్యాలు ఆ శరీరానికి అంటక

తప్పదు. మరి శరీరానికి అంటిన మాలిన్యాలు ఆ శరీరంలోనే అంతటా వ్యాపించియున్న ఆత్మకు అంటకుండా ఎలా ఉంటాయి? అనే సందేహం ఎవరికైనా కలగవచ్చు.

ఎందుకంటే ప్రతిరోజూ గిన్నెలో నీళ్ళుపోసి స్టౌ మీద ఉంచి, స్టౌను ముట్టించారు. దానితో గిన్నె వేడెక్కుతుంది. అ వేడికి గిన్నెలోని నీరు కూడా వేడెక్కుతుంది గదా! అలాగే శరీరానికి అంటిన మలినం ఆ శరీరంలోని ఆత్మకు అంటకుండా ఉంటుందా? అని సందేహం. ఆ సందేహాన్ని తీర్చటానికే ఇక్కడ ఆకాశ దృష్టాంతం. అయితే ఆకాశాన్నే ఎందుకు దృష్టాంతంగా తీసుకొంటున్నారు? ఆత్మకు - ఆకాశానికి దగ్గర పోలికలున్నాయి. ఏమిటవి?

(i) ఆత్మ సూక్ష్మాతి సూక్ష్మం. ఆకాశం పంచభూతాలన్నింటిలోకి సూక్ష్మం. ఇక అంతకన్నా సూక్ష్మమైనది ఏదీలేదు.

(ii) ఆత్మ సర్వవ్యాపకం. ఆకాశం కూడా సర్వవ్యాపకమే. కాకపోతే స్థూలవస్తువులలో ఆకాశం ఉండదు.

(iii) ఆత్మ ఇంద్రియగోచరం. ఆకాశం కూడా అగోచరమే. ఒక్క శబ్దానికి తప్ప ఇతరత్రా తెలుసుకొనే వీలులేదు.

(iv) ఆత్మ అచరం. ఆకాశం కూడా అచరమే. కదిలే వీలులేదు.

ఇలా ఆత్మకు దగ్గర పోలికలున్నది ఆకాశం తప్ప మరొకటి లేదు. ఇప్పుడు ఆకాశం ఏ మాలిన్యాలు అంటనిదైతే ఆత్మ కూడా ఏ మాలిన్యాలు అంటనిదని నిర్ద్వంద్వంగా ఋజువవుతుంది.

ఆకాశం అంతటావ్యాపించి అన్నింటికీ అవకాశం ఇస్తుంది. ఆకాశంలో గాలి ఉంది, అగ్ని ఉంది, నీరు ఉంది, భూమి ఉన్నది.

(i) ప్రచండంగా గాలి వీస్తున్నప్పటికీ ఆకాశం చలించదు.

(ii) జ్వాజ్వల్యమానంగా అగ్ని మండుతున్నా ఆకాశం కాలిపోదు.

(iii) కుంభవృష్టిగా వర్షం కురిసినా ఆకాశం తడిసిపోదు.

(iv) గాలిదుమారం వచ్చి దుమ్ము రేగినా ఆకాశానికి దుమ్ము పట్టదు.

(v) గాలిలో మల్లెపూల వాసన కదిలినా, భరించలేని కంపువాసన కదిలినా ఆకాశాన్ని తాకదు. దానికి ఏ వాసనా అంటదు.

(vi) ఆకాశంలో మెరుపులు మెరుస్తాయి, పిడుగులు పడతాయి, ప్రళయ భయంకర గర్జనలు వినిపిస్తాయి. అయినా ఆకాశం తనకేమీ కానట్లు, ఏ సంబంధంలేనట్లు ఎప్పటి మాదిరిగానే ఉంటుంది.

(vii) ఏదైనా హత్య జరిగితే రక్తంతో భూమి తడిసిపోతుంది. అయినా ఆకాశంపై ఏ మరకలు పడవు.

(viii) ఆకాశంలో ఎన్నో పక్షులు ప్రయాణిస్తూ ఉంటాయి. కాని వాటి కాళ్ళ గోళ్ళ గుర్తులు గాని, రెక్కల గుర్తులు గాని ఆకాశంలో పడవు. దానికేమీ అంటదు.

కనుక అన్నింటికి అవకాశం ఇచ్చి, అన్నింటిలోను వ్యాపించియున్నా ఈ ఆకాశం ఆయా గుణదోషాలు అంటకుండా ఉంటుంది. ఎందుకంటే ఆకాశం సూక్ష్మం గనుక. సూక్ష్మవస్తువుపై స్థూలవస్తువులు తమ ప్రభావాన్ని

చూపించలేవు. ఆకాశం సూక్ష్మం గనుక స్థూలవస్తువుల దెబ్బలు, గుర్తులు ఆకాశం మీద పడవు.

మరి భౌతిక వస్తువైన ఆకాశానికే ఇట్టి పరిస్థితి ఉంటే, ఆకాశం కన్నా సూక్ష్మాతిసూక్ష్మమై, స్థూలవస్తువులతో సహా అన్నింటిలోను, అంతటా వ్యాపించియుండే ఆత్మ సంగతి వేరే చెప్పాలా? ఆత్మకు ఏ మలినాలు అంటవు.

(i) ఏ శరీరంలో ఉన్నా అది శరీరానికి అంటకుండా అసంగంగా ఉంటుంది గనుక ఆ శరీరం యొక్క కర్మకలాపాలకు, మాలిన్యాలకు ఆత్మ అసంగం.

(ii) దేవాతాశరీరంలో ఉన్నా, మనుష్యశరీరంలో ఉన్నా, పశు-పక్షి-క్రిమి-కీటకాది శరీరాలలో ఉన్నా వాటి మంచి చెడ్డలు, గుణదోషాలు ఆత్మను అంటవు.

(iii) శరీరదోషం, మనోదోషం, బుద్ధిదోషం, శీతోష్ణ, సుఖదుఃఖాదులు - ఏవీ ఆత్మనంటవు.

నీవు అట్టి ఆత్మవే గనుక, శరీరానివి కాదు గనుక వాసనలు - కర్మఫలాలు అనే మలినాలు నిన్ను అంటవు. నీవు అసంగుడవు. స్వచ్ఛమైనవాడవు. నేను దేహాన్ని అని అజ్ఞానంలో భావించేవాడే దేహమలినాలతో దుఃఖిస్తాడు. మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ కర్మఫలాలు అనుభవిస్తాడు. నేను ఆత్మను అని గ్రహించి అలా ఆత్మగా ఉన్న జ్ఞానికి దేహమలినాలు అంటవు గనుక ఆనందస్వరూపుడిగా ఉండిపోతాడు.

సర్వక్షేత్రాలను ఆత్మ ఎలా ప్రకాశింపజేయగలుగుతున్నదో సూర్యుని ఉపమానంతో -

**శ్లో|| యథాప్రకాశ యత్యేకః**

**కృత్స్నం లోక మిమం రవిః |**

**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం**

**ప్రకాశయతి భారత! ||** **(34)**

**తా||** ఏ ప్రకారంగా ఒక్కడే అయిన సూర్యుడు ఈ యావత్తులోకాన్ని ప్రకాశింపజేస్తున్నాడో అలాగే అర్జునా! ఈ యావత్తు క్షేత్రాన్ని ఒక్కడే క్షేత్రధారి ప్రకాశింపజేస్తున్నాడు.

**వ్యాఖ్య :-** ఆత్మ నిర్లిప్తము. అది కర్మ చేయదు, ఫలమును అంటించుకోదు - అని ఆకాశాన్ని దృష్టాంతంగా తీసుకొని ఇంతవరకు వివరించారు. ఇప్పుడు సూర్యుని దృష్టాంతంగా తీసుకొని ఆత్మయొక్క ప్రకాశాన్ని తెలియజేయబోతున్నారు. ఈ రెండు విషయాలనే ఎందుకు చెబుతున్నారు?

"ఆత్మ ఆకాశవత్ అస్తి రవివత్ భాతి"

ఆత్మ ఆకాశంవలె ఉంటుంది. సూర్యునివలె ప్రకాశిస్తుంది - గనుక. అందుకే ఈ రెండు దృష్టాంతాలను భగవంతుడు ఎన్నుకున్నాడు.

ఆత్మకు ప్రకృతికి గల సంబంధాన్ని చెప్పి ప్రకృతి నుండి ఆత్మకు విముక్తి కలిగించటానికే ఈ శ్లోకం తోడ్పడుతుంది. ప్రకృతి నుండి విముక్తి చెంది నీవు నీవుగా - ఆత్మగా ఉంటేనే ఆత్మానుభూతి. పరమాత్మానుభూతి. అట్టి ఆత్మానుభూతియే మానవజీవిత పరమలక్ష్యం గనుక ఆ లక్ష్యాన్ని సాధించటానికి ఈ దృష్టాంతాన్ని వినియోగిస్తున్నాడు భగవానుడు. అదే సూర్యదృష్టాంతం - ఏమిటది?

ఒకే సూర్యుడు ఈ జగత్తునంతటిని ప్రకాశింపజేస్తున్నట్లు మహాభూతాలు మొదలుకొని సమస్త ప్రాణికోటిని, సమస్త క్షేత్రాలను ఒకే ఆత్మ ప్రకాశింపజేస్తున్నది, చైతన్యవంతం చేస్తున్నది.

అనేక ఇళ్ళలోను, స్థలాలలోను, నీటిలోను ఒక్కడే సూర్యుడు వెలుగునిస్తున్నాడు. ఎక్కడెక్కడ స్వచ్ఛమైన, నిర్మలమైన స్థానాలుంటాయో వాటన్నింటిలోను తన ప్రతిబింబాన్ని చూపిస్తాడు. నిర్మలమైన అద్దంలోను, స్వచ్ఛమైన నీటిలోను సూర్యుడు ప్రతిబింబిస్తాడు. సూర్యుడు ఒక్కడే. అనేక నీటికుండలలో ప్రకాశిస్తాడు.

అలాగే స్థూల సూక్ష్మ శరీరాలనే సమస్త క్షేత్రాలలోను తన ప్రతిబింబాన్ని ప్రవేశపెట్టి ఒక్కడే అయిన పరమాత్మ అన్ని క్షేత్రాలను ప్రకాశింపజేస్తున్నాడు. ఎక్కడెక్కడ నిర్మలమైన, స్వచ్ఛమైన క్షేత్రాలున్నాయో అక్కడ తన ప్రతిబింబాన్ని-ప్రకాశాన్ని బాగా వ్యక్తం చేస్తుంటాడు. అలాగాక ఎక్కడెక్కడ కలుషితమైన, పాపకూపాలైన క్షేత్రాలు ఉంటాయో, అక్కడ తన ప్రకాశాన్ని అంతగా వ్యక్తంచేయడు పరమాత్మ. అంటే ఎవరైతే తన మనోబుద్ధులను సరిచేసుకొని శ్రవణ, మనన, నిధిధ్యాసనలతోను, జపధ్యానాది సాధనలతోను, పెద్దల ఆచార్యుల సేవలతోను క్షేత్రాన్ని స్వచ్ఛంగా ఉంచుకుంటారో వారిలో భగవంతుడు సాక్షాత్తుగా దర్శనమిస్తున్నట్లుగా దివ్యంగా ప్రకాశిస్తూ ఉంటాడు. అలాగాక కలుషిత మనస్సుతో ఉండేవారిలో ప్రకాశం బాగా ఉండదు.

జగత్తును ప్రకాశింపజేసేవాడు సూర్యుడు కదా! కనుక సూర్యుణ్ణి అన్నింటికి కర్త అంటామా? అనలేం. ఎందుకని? ఎందుకంటే సూర్యునికి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇక్కడ జరిగే పనులలో కర్తృత్వం లేదు. ఏదో కోరిక తీర్చుకోవాలనో, ఏదో ఫలితాన్ని పొందాలనో, లేదా కర్తవ్యాన్ని నిర్వర్తించుకోవాలనో పనులు చేస్తే కర్త అవుతాడు. కాని సూర్యుడికి ఏ కోరికా లేదు, ఏ ఫలాపేక్షా లేదు, ఏ కర్తవ్యమూ లేదు. మరైతే ఎందుకు ఈ జగత్తును ప్రకాశింపజేస్తున్నాడు? ఏమి ఆశించి ఈ జగత్తునంతటిని వెలిగిస్తున్నాడు. అది అతడి సహజసిద్ధమైన లక్షణం. అది అతడి ధర్మం అంతే. అసలు నిజంగా ఈ జగత్తును వెలిగించాలి అనే ఆలోచన కూడా సూర్యునికి లేదు. అతడు దివ్యప్రకాశం. నిరంతరాయంగా వెలుగులు విరజిమ్మటం అతడి స్వభావం. అతడు ఎప్పుడూ ఇంకొక విధంగా ఉండలేడు. ఒక్కసారి కూడా కోపంతోనైనా సరే చీకటిని ఇవ్వడు, ఇవ్వలేడు.

అలాగే ఆత్మ అన్ని క్షేత్రాలను ప్రకాశింపజేస్తుంది. అయినా ఆత్మను కర్త అనలేం. ఆత్మకు ఏ కర్తృత్వమూ లేదు. ఎందుకంటే ఆత్మకు ఏ కోరికా లేదు; ఏ కొరతా లేదు; ఏ ఆశా - ఆశయమూ లేవు; దానికి పొందవలసింది అంటూ ఏమీ లేదు. అది కేవలం క్షేత్రాన్ని ప్రకాశింపజేస్తుంది. అంతే. కోరికలుగాని, ఫలాపేక్షగాని, కొరతలుగాని, ఆశలుగాని, ఆశయాలుగాని, కర్తవ్యాలుగాని, భోగాసక్తిగాని ఇవన్నీ క్షేత్రానివే. అంతఃప్రేరణలతో - కారణశరీరంలోని వాసనల ప్రేరణలతో క్షేత్రమే అనేక కర్మలను చేస్తుంది. కనుక అదే కర్త - భోక్త కూడా. ఐతే ఆత్మ ఎందుకు - ఏమి ఆశించి ఈ క్షేత్రాన్ని ప్రకాశింపజేస్తున్నది?

అది ఆత్మయొక్క సహజ సిద్ధ లక్షణం. ఆత్మ యొక్క ధర్మం. అసలు ఆత్మకు ఈ క్షేత్రాన్ని వెలిగించాలనే ఉద్దేశము కూడా లేదు; కావాలని వెలిగించటమూ

లేదు. మరి? ఆత్మ స్వయంప్రకాశం. కోటిసూర్యసమప్రభాకాంతులు గలది. దాని అస్థిత్వం వల్ల ఈ సమస్తక్షేత్రాలు ప్రకాశిస్తూ ఉన్నాయి. అంటే ఆత్మ యొక్క ప్రకాశాన్ని ఈ క్షేత్రాలు స్వీకరిస్తున్నాయి. ఆత్మ ఎప్పుడూ ఇంకొక విధంగా ఉండలేదు. ఉండదు. కనుక ప్రకాశం దానియొక్క ధర్మమేగాని కావాలని చేసే కర్మకాదు. కనుక ఆత్మకు ఏకర్మఫలాలు అంటవు. ఏ మలినాలు అంటవు.

సూర్యుడు ఒక్కడే. అతడి వెలుగులో అనేక పుణ్యకార్యాలు, పాపకార్యాలు జరిగిపోతూ ఉంటాయి. వాటితో ఆ సూర్యునికి ఎట్టి సంబంధము లేదు. అవన్నీ చేసినవారికే. అలాగే ఆత్మ ఒక్కటే. దాని సాన్నిధ్యంలోనే క్షేత్రాలు అనేక పుణ్యకార్యాలు, పాపకార్యాలు చేస్తూ ఉంటాయి. వాటితో ఆత్మకు ఎలాంటి సంబంధమూ లేదు. అవన్నీ కూడా కర్మలు చేసిన క్షేత్రాలకే.

ఆత్మ శుద్ధచైతన్యం, సచ్చిదానందస్వరూపం, అది అన్ని దేహమనోబుద్ధులనూ చైతన్యవంతం చేస్తుంది, ప్రకాశింపజేస్తుంది. ఆ చైతన్యం వల్ల ఈ దేహమనోబుద్ధులు అనేక వ్యవహారాలతో కర్మలలో మునిగిపోతూ ఉంటాయి. అయితే వాటి గుణదోషాలతో ఆత్మకు ఏ సంబంధము లేదు. అది ఎప్పటిలాగా స్వచ్ఛంగా - నిర్మలంగా ఉంటుంది.

ఈ సత్యాన్ని గ్రహించిన సాధకుడేం చేయాలి?

ఆత్మ అన్ని క్షేత్రాలను ప్రకాశింపజేస్తుందని, అది దాని ధర్మమని, అన్ని కర్మలకు అది కేవలం సాక్షియని, దానికి ఏ మలినాలు అంటవని, గుణదోషాలు దానికి అంటవని, నిరంతరం మననం చేసుకుంటూ, తాను యదార్థంగా అట్టి

**అసంగుడైన, నిర్మల ఆత్మనేగాని, ఈ దేహేంద్రియ ప్రాణమనోబుద్ధులతో కూడిన క్షేత్రాన్ని కాదని, ఈ క్షేత్రం జడమని, తాను చైతన్య స్వరూప ఆత్మనని, జడమైన క్షేత్రం కన్న తాను వేరైన వాడినని - స్థిరచిత్తంతో, నిరంతరం దృఢంగా భావన చేయాలి. అలా చేయుటే జ్ఞానం; అలా చేయగలవాడే 'జ్ఞాని' అని తెలుసుకొని అలా ఉండేందుకు ప్రయత్నం చేయువాడే ఆత్మానుభూతికి - మోక్షానికి అర్హుడు.**

**'అది నేనే' – 'సో2హం' – 'అహం బ్రహ్మాస్మి' అనే అనుభూతినే చివరకు పొందవలసింది. అదే వేదాంత విద్యకు పరాకాష్ట.**

**ఇక చివరగా ఈ అధ్యాయం యొక్క ఫలశృతిని చెబుతున్నారు.**

**ఈ అధ్యాయం యొక్క ఫలశృతి:-**

**శ్లో|| క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం**
**అంతరం జ్ఞాన చక్షుషా |**
**భూత ప్రకృతి మోక్షంచ**
**యే విదుర్యాంతి తేపరం|| (35)**

**తా|| ఈ ప్రకారంగా క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్యగల భేదాన్ని, ఈ భూత ప్రకృతి నుండి విముక్తి చెందే ఉపాయాన్ని, జ్ఞానదృష్టితో ఎవరు తెలుసుకుంటారో వారు పరమాత్మను - మోక్షాన్ని పొందుతారు.**

**వ్యాఖ్య :- (i) ఏవం:- ఈ ప్రకారంగా, అంటే ఈ అధ్యాయంలో చెప్పిన ప్రకారంగా అని. ఏం చెప్పారు ఈ అధ్యాయంలో?**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

క్షేత్రక్షేత్రజ్ఞులంటే ఎవరో, ఆ రెండింటిని ఎలా విడదీయాలో ఆ పద్ధతిని గూర్చి చెప్పారు. అలా క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీయాలంటే నీలో ఉండవలసిన లక్షణాలు ఏమిటో అమానిత్వాది 20 లక్షణాలను కూడా చెప్పారు. ఆ లక్షణాలను అలవరచుకొని, క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీయుటకు తగిన సాధనలను చెప్పారు. అలా విడదీసి క్షేత్రాన్ని నిరసించి క్షేత్రజ్ఞునితో తాదాత్మ్యం చెందితే కలిగే ప్రయోజనం ఏమిటో ఈ శ్లోకంలో ఫలశృతిగా చెప్పబోతున్నారు.

(ii) **క్షేత్రక్షేత్రజ్ఞయో అంతరం:-** క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్య గొప్ప అంతరం - భేదం ఉన్నది. ఏమిటా భేదం?

(i) క్షేత్రం జడం. క్షేత్రజ్ఞుడు చైతన్యం.

(ii) క్షేత్రం అంటే స్థూల సూక్ష్మ కారణశరీరాలు. దీనినే ప్రకృతి అంటారు. క్షేత్రజ్ఞుడు అంటే నిరాకారుడు, సర్వవ్యాపి, సూక్ష్మాతిసూక్ష్మము అయిన చైతన్య శక్తి.

(iii) క్షేత్రం నశించిపోయేది. క్షేత్రజ్ఞుడు శాశ్వతంగా ఉండేవాడు.

(iv) క్షేత్రం ఇంద్రియ గోచరం. క్షేత్రజ్ఞుడు ఇంద్రియ అగోచరుడు.

(v) క్షేత్రాలు అనేకం ఉంటాయి. క్షేత్రజ్ఞుడు మాత్రం ఒక్కడే.

(vi) క్షేత్రాలు విభక్తం. క్షేత్రజ్ఞుడు అవిభక్తం - అఖండం.

(vii) క్షేత్రం సమస్త కార్యాలకు కర్త, భోక్త. క్షేత్రజ్ఞుడు అకర్త, అభోక్త.

(viii) క్షేత్రం వికారాలతో, గుణాలతో కూడినది. క్షేత్రజ్ఞుడు అవికారి, గుణరహితుడు, ప్రభావశీలి.

(ix) క్షేత్రం పరిచ్ఛిన్నం. ఒకచోట ఉంటే మరొక చోట ఉండదు. పరిమితం. క్షేత్రజ్ఞుడు అపరిచ్ఛిన్నం. సర్వవ్యాపి.

(x) క్షేత్రం చూడబడేది, తెలుసుకోబడేది. క్షేత్రజ్ఞుడు చూచేవాడు, తెలుసుకొనేవాడు.

ఇలా క్షేత్రక్షేత్రజ్ఞుల మధ్య ఎన్నో విభేదాలున్నాయి. అయితే ఇలా ఎన్ని విభేదాలున్నా సామాన్యులు ఈరెంటిని విడగొట్టి చూడలేరు. అసలు క్షేత్రం - క్షేత్రజ్ఞుడనే రెండు ఉన్నట్లు గ్రహించలేరు. కేవలం జ్ఞానవంతులే - ఆత్మజ్ఞానం తెలిసినవారే విడగొట్టగలరు.

కొయ్యతో తయారు చేసిన గుర్రంతో పసివారు ఆడుకుంటూ ఉంటారు. వారికి అక్కడ గుర్రం మాత్రమే కనబడుతుంది. కాని పెద్దవారికి మాత్రం కొయ్య - గుర్రం అనే రెండు కనిపిస్తాయి. బంగారు గాజుల్లో స్త్రీలు గాజులనే చూస్తారు. షరాబు మాత్రం అందులో బంగారాన్నీ చూస్తాడు, గాజులనూ చూస్తాడు.

అలాగే సామాన్యులకు క్షేత్రక్షేత్రజ్ఞులిద్దరూ కలిసి ఒక్కటిగా, క్షేత్రంగా కనిపిస్తారు. మహాత్ములకు మాత్రం రెండుగా కనిపిస్తారు. ఒకటి బాహ్యదృష్టికి కనిపించేది. మరొకటి అంతర్దృష్టికి కనిపించేది. క్షేత్రం మిథ్య, క్షేత్రజ్ఞుడు సత్యం.

నేను దేహాన్ని, నేను ఉద్యోగిని, నేను వ్యాపారిని, నేను గృహస్థును, నేను గృహిణిని, నేను గొప్పవాణ్ణి, నేను అల్పుణ్ణి అని ఈ క్షేత్రంతో కలిసిపోతున్నాం. ఈ పేరు, ఆకారం, శరీరం, మనోబుద్ధులు, గొప్పతనం, అల్పత్వం - ఇవన్నీ

క్షేత్రధర్మాలు. 'నేను' మాత్రం క్షేత్రం కన్న వేరుగా, ఆ క్షేత్రాన్ని తెలుసుకొనేవాడిగా ఉన్నాను అని భావన చేయాలి.

క్షేత్రంతో ఐక్యం చెందినప్పుడు క్షేత్రం చేసే పనులను నేను చేస్తున్నానని, వచ్చిన సుఖదుఃఖాలను నేను అనుభవిస్తున్నానని అనుకుంటూ చలించి పోతున్నాం. క్షేత్రం నుండి విడిపోయి క్షేత్రజ్ఞుడిగా ఉంటే ఆ కర్మలతో గాని, వాటివల్ల వచ్చే సుఖదుఃఖాలతో గాని నాకు సంబంధం ఉండదు; వాటికి చలించవలసిన అవసరం లేదు.

కనుక క్షేత్రం నుండి క్షేత్రజ్ఞుణ్ణి వేరు చేయాలంటే - విడగొట్టాలంటే ముందు ఆరెండింటి మధ్యగల భేదాలను అధ్యయనం చేయాలి. బాగా వంటబట్టించుకోవాలి. ఇలా రెండింటి మధ్య అంతరాన్ని తెలుసుకొని ఏం చేయాలి?

(iii) **భూత ప్రకృతి మోక్షంచ:-** భూతప్రకృతి అంటే క్షేత్రమే. క్షేత్రమంటే స్థూల సూక్ష్మ కారణశరీరాలే. అయితే ఇప్పుడా మూడు శరీరాల క్షేత్రంతో కూడి క్షేత్రజ్ఞుడున్నాడు. క్షేత్రజ్ఞుడు ఆ 3 శరీరాలతో కప్పబడి ఉన్నాడు. ఆ మూడు శరీరాలతో కూడిన క్షేత్రం నుండి విముక్తి చెందితే క్షేత్రజ్ఞుడు ఆత్మగా - పరమాత్మగా - ఆనందస్వరూపంగా ఉండిపోతాడు. కనుక క్షేత్రం నుండి క్షేత్రజ్ఞుడు విడిపోవాలి. విడుదల చెందాలి. విముక్తి చెందాలి.

అందమైన శ్రీకృష్ణుని పాలరాతి విగ్రహం ఉంది. దాన్ని చాలా దూరప్రాంతం నుండి పార్శెల్ సర్వీస్ ద్వారా తెప్పించుకున్నాం. పార్శెల్ ఆఫీస్ నుండి ఒక చక్కపెట్టె వచ్చింది. మనం ముందుగా చెక్కపెట్టెను తెరిచాం. ఆ

పెట్టెలో గడ్డి ఉంది. ఇప్పుడా గడ్డిని తొలగించాం. ఆ లోపల గట్టి పోలితీన్ పేపర్లు చుట్టి ఒక వస్తువు ఉంది. ఇప్పుడా పోలితీన్ పేపర్లను తొలగించాం. అంతే. అందమైన శ్రీకృష్ణుని పాలరాతి విగ్రహం దర్శనమిచ్చింది. అంటే ఆ చక్కని విగ్రహం కనిపించాలంటే చక్కపెట్టె మూతను తొలగించాం; ఆ తరువాత గడ్డిని తొలగించాం, ఆ తరువాత పోలితీన్ పేపర్లను తొలగించాం. అన్నింటిని తొలగించిన తరువాత అందమైన విగ్రహం కనిపించింది.

అదేవిధంగా మనం శుద్ధమైన చైతన్య స్వరూప పరమాత్మ స్వరూపులమే. కాకపోతే కారణశరీరమనే పోలితీన్ పేపరులో చుట్టిఉన్నాం. దాని చుట్టూ గడ్డి అనే సూక్ష్మశరీరంతో కప్పబడ్డాం. ఈ మొత్తాన్ని స్థూలశరీరమనే చక్కపెట్టెలో బంధించివేయబడ్డాం. అందువల్లనే మనని మనం తెలుసుకోలేక - ఆత్మను అని తెలుసుకోలేక, శరీరమనే చక్కపెట్టెను అనుకుంటున్నాం. చక్కపెట్టెను అనుకుంటున్నాం గనుకనే సుఖదుఃఖాలనే సుత్తి దెబ్బలు, తన్నులు పడుతున్నాయి. అల్పులుగా అవమానించబడుతున్నాం. ఎవరన్నా కూర్చోవాలనుకున్నప్పుడు చక్కపెట్టే గదా అని మన మీద కూర్చుంటున్నారు. ఇందులో ఏమి ఉన్నది? అని వేలితో తన్ని అడుగుతున్నారు. ఈ అవమానాలు, తన్నులు తప్పాలంటే చక్కపెట్టెను తెరచి అందులోని చెత్తను తొలగించి, పోలితీన్ పేపర్లను తొలగించి శ్రీకృష్ణుని విగ్రహాన్ని బయటకు తీసినట్లు మన స్థూలశరీరాన్ని తొలగించి, సూక్ష్మశరీరాన్ని విడిచి, కారణశరీరంతో తాదాత్మ్యాన్ని విడిచి ఆత్మస్వరూపంగా - ఆనందస్వరూపంగా అందమైన శ్రీకృష్ణ విగ్రహంగా ఉండిపోవాలి. అప్పుడే గౌరవం, ఆనందం అన్నీ లభిస్తాయి.

**అయితే చక్కపెట్టెను తెరవటం, చెత్తను తొలగించటం, పోలిథీన్ పేపర్లను తొలగించటం మనకు చేతనవుతుంది. కాని ఈ స్థూల, సూక్ష్మ కారణశరీరాలతో కూడిన క్షేత్రాన్ని తొలగించటం క్షేత్రంతో పెట్టుకున్న తాదాత్మ్యాన్ని తొలగించటం - కల్పిత తాదాత్మ్యాన్ని తొలగించటం - అజ్ఞానం కారణంగా కల్పించబడిన తాదాత్మ్యాన్ని తొలగించటం ఎలా? దానికి ఉపాయాన్ని చెబుతున్నారు. అదే -**

**(iv) జ్ఞాన చక్షుషా :- క్షేత్రంతో క్షేత్రజ్ఞుని కలయిక కారణశరీర స్థాయిలో జరిగింది. అదే సూక్ష్మ శరీర స్థాయిలోకి వచ్చి చివరకు స్థూల శరీర స్థాయిలో రెండూ విలీనమైపోయాయి. నిజంగా ఈ కలయిక - సంయోగం - తాదాత్మ్యం భ్రాంతి వల్ల - అజ్ఞానం వల్ల వచ్చినదే. మరి భ్రాంతి ఎలా తొలగుతుంది? జ్ఞానంతో తొలగిపోతుంది. అందుకే ఇక్కడ భూత ప్రకృతి నుండి విడివడాలంటే జ్ఞాననేత్రం కావాలి - అంటున్నారు. అదే 'జ్ఞానచక్షుషా'. మామూలు నేత్రంతో - ఈ చర్మచక్షువులతో చూస్తే స్థూలవస్తువులు మాత్రమే కనిపిస్తాయి. జ్ఞాననేత్రంతో చూస్తేనే సూక్ష్మవిషయం - ఆత్మవిషయం అర్థమవుతుంది.**

**మామూలు ఫోటో కెమెరా పైపై రూపాన్ని, వస్త్రాన్ని, అందచందాలను ఆభరణాలను, కనుముక్కు తీరును ఫోటో తీస్తుంది. అదే x - ray కెమెరా ఐతే శరీరం లోపల ఉన్న ఎముకలను - ఇతర భాగాలను ఫోటో తీస్తుంది. దీనిది లో దృష్టి. ఫోటోకేమేరాది బాహ్యదృష్టి. అలాగే మనకు లోదృష్టి కలగాలి. ఆ లోదృష్టియే జ్ఞానదృష్టి.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మరి ఈ జ్ఞానదృష్టి ఎలా కలుగుతుంది?

(i) అమానిత్వాది గుణ సంపదవల్ల; (ii) గురువుపై, శాస్త్రాలపై విశ్వాసంవల్ల; (iii) భగవంతుని యందు అనన్య భక్తివల్ల; (iv) శాస్త్ర శ్రవణ మనన నిధి ధ్యాసనలవల్ల; (v) సాధనలవల్ల; (vi) ఆత్మతో అనుసంధానం వల్ల ఈ జ్ఞానదృష్టి కలుగుతుంది. ఈ దృష్టివల్లనే మాయా ప్రకృతి నుండి విముక్తి లభిస్తుంది. జ్ఞాననేత్రం పొందిన మహాత్మునికి విలక్షణమైన అనుభవం కలుగుతుంది. ఈ జగత్తు అంతా మిథ్యయని, పరమాత్మ ఒక్కటే సత్యపదార్థమని, ఉన్నది ఒక్కటేనని, అది తానేనని అనుభవమవుతుంది. అజ్ఞాని ఎలా దేహాత్మభావనలో (దేహమే నేను అనే భావనలో) ఉంటాడో అలాగే జ్ఞాని బ్రహ్మాత్మ భావనలో (బ్రహ్మమే నేను అనే భావనలో) ఉంటాడు. అట్టి స్థితిలో ఉన్నవారికి లభించే ఫలితం ఏమిటి?

(v) **యే విదుః తే పరం యాంతి:-** ఎవరు ఇలా జ్ఞాననేత్రంతో తెలుసుకుంటారో వారే పరమాత్మను చేరుకుంటారు. జీవన్ముక్తిని పొందుతారు.

గొప్ప పాండిత్యంగాని, గొప్ప వాగ్ధాటిగాని, గొప్ప గొప్ప పనులు చేసే సమర్థత గాని, గొప్ప సంపదలు గాని, గొప్ప పదవులు గాని, గొప్ప కీర్తిప్రతిష్ఠలు గాని - ఇవి ఏవీ పరమాత్మను పొందటానికి ఉపయోగపడవు. పరమాత్మను పొందాలంటే జ్ఞాననేత్రం తెరుచుకోవాలి. అలా జ్ఞాననేత్రం తెరుచుకోవాలంటే సద్గురుకృప, సద్బోధలు, శాస్త్రజ్ఞానం - అందుకు తగిన సూక్ష్మబుద్ధి, అమానిత్వాది గుణాలు - ఇవి అవసరం.

కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానయోగాల ద్వారా ఏ కులంలో, ఏ మతంలో, ఏ దేశంలో జన్మించినవారైనా, చతుర్వర్ణాశ్రమాలలో దేనికి చెందినవారైనా, ఏ ధర్మంలో ఉన్నవారైనా సరే - అట్టివాడు పరమాత్మ సాక్షాత్కారాన్ని - మోక్షాన్ని - జీవన్ముక్తిని పొందవచ్చును.

- అజ్ఞానం వల్ల ప్రకృతితో తాదాత్మ్యం కలిగింది. క్షేత్రం ఏర్పడింది.
- జ్ఞానంతో ఆ తాదాత్మ్యం వదిలిపోతుంది. క్షేత్రం మాయమయింది.
- దానితో మిగిలేది క్షేత్రజ్ఞుడే. క్షేత్రాన్ని వదిలించుకున్నాడు గనుక శుద్ధచైతన్య ఆత్మస్వరూపుడిగా మిగిలిపోతాడు.
- అదే స్వస్థితి - ఆత్మస్థితి - ఆత్మసాక్షాత్కారం.

మనలో ఉండే అవ్యయము, శాశ్వతము, ఆనందస్వరూపము అయిన ఆత్మతత్వాన్ని సూటిగా ధ్యానించుటకు తగిన మార్గాన్ని చూపే అధ్యాయాలలో ఈ 13 వ అధ్యాయం ఉత్తమోత్తమమైన అధ్యాయం.

స్వప్నంలోని దుఃఖాలు తొలగించాలంటే స్వప్నం నుండి మేలుకోవాలి. జాగ్రత్తులోని దుఃఖాలు తొలగించాలంటే జాగ్రత్తు నుండి మేలుకోవాలి.

స్వప్నం నుండి మేలుకోవటం అంటే జాగ్రత్తులోనికి ప్రవేశించాలి. జాగ్రత్తు నుండి మేలుకోవటం అంటే జ్ఞానంలోనికి ప్రవేశించాలి. రాత్రి వచ్చిన స్వప్నం చిన్నకల. ఇప్పటి ఈ జాగ్రత్తులోని జగత్తు అంతా పెద్దకల. స్వప్నం నుండి అప్రయత్నంగానే మేలుకోగలుగుతాం. ఇది ప్రకృతి నియమించిన ధర్మం. జాగ్రత్తు నుండి ప్రయత్నం ద్వారానే మేలుకోగలం. అందుకే ఈ శాస్త్రాలు - గురువులు. అలా ప్రయత్నించి జ్ఞానంలోకి మేలుకోవాలి. ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

జగత్తులోని దుఃఖాలు కూడా స్వప్నంలోని దుఃఖాల వంటివేనని గ్రహించి వీటి నుండి విముక్తి కావాలంటే జాగ్రదావస్థ నుండి జ్ఞానావస్థలోనికి మేలుకోవాలి; స్వస్థితిలో నిలిచిపోవాలి.

సూటిగా ఆత్మను గురించి తెలియజేసిన అధ్యాయం భగవద్గీతలో ఇది ఒక్కటే.

**గద్యం :-**

ఓం తత్ సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం,

యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే,

క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగోనామ త్రయోదశోధ్యాయః

**ఓం తత్ సత్**. ఈ ప్రకారంగా శ్రీమద్భగవద్గీత అనే ఉపనిషత్తులో బ్రహ్మవిద్య, యోగశాస్త్రము నందు శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య సంవాదరూపంలో క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమనే 13 వ అధ్యాయం సమాప్తం.

**వ్యాఖ్య :-** ఇది శ్రీమద్భగవద్గీత. అంటే భగవంతుని గీత. భగవంతుని వాక్యం. ఇది ఉపనిషత్తులసారం. ఉపనిషత్తులు అనేకం. వాటిల్లో పైపైన కనిపించే వైరుధ్యాలన్నింటిని సమన్వయం చేసిన గ్రంధం భగవద్గీత. ఉపనిషత్తులు ఆవులైతే భగవద్గీత వాటినుండి పితికిన పాలు. ఆవులలో ఎన్నోరకాలు - తెల్లావు, నల్లావు, కర్రావు, మచ్చల ఆవు అని..... కాని అన్నింటి పాలు మాత్రం ఒక్కటే. కనుక భగవద్గీత ఉపనిషత్తుల సారం. పైగా ఇది బ్రహ్మవిద్య. బ్రహ్మన్ని

అందుకోనుటకు మార్గం చూపే విద్య. అంతేకాదు. ఇది యోగశాస్త్రం. యోగం అంటే కలయిక. జీవునికి దేవునికి కలయిక. జీవుని దేవునితో కలిపి ఒక్కటిగా చేసే శాస్త్రం కనుక యోగశాస్త్రం.

ఇది శ్రీకృష్ణ - అర్జున సంవాదరూపంలో ఉన్నది. కృష్ణుడు గురువు. అర్జునుడు శిష్యుడు. ఇద్దరి మధ్య బంధుత్వం, మిత్రత్వం, చనువు అన్నీ ఉన్నాయి. కనుక గురువు చెప్పే విషయంలో సందేహం కలిగినప్పుడు నిస్సంకోచంగా అడిగే చనువు అర్జునునికి ఉన్నది. అంతేకాదు గురువుపై అచంచల విశ్వాసం, భక్తి, గౌరవం కూడా ఉన్నాయి. కనుక ఆయన తనకు వచ్చిన సందేహాలను అడగటం మనకెంతో ఉపయోగకరం.

ఇది 13 వ అధ్యాయం. త్రయోదశోధ్యాయం. త్రయోదశ అంటే దృష్టార్థాలను తరించిపోయే దశ అని అర్థం. క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుని విడదీసి చూచే తెలివిని ప్రసాదించే అధ్యాయం ఇది. మార్పులు, చేర్పులు, కూర్పులు - అన్నీ దేహానివే, క్షేత్రానివే గాని తనివి కావు అని గ్రహించి తనను తాను తెలుసుకొనే అధ్యాయం ఇది. అలా తెలుసుకోవటంతోనే మోక్షప్రాప్తి.

గీతాచార్యుడైన భగవంతుడు మనందరకు జ్ఞాననేత్రాన్ని ప్రసాదించాలని, ఆ జ్ఞాననేత్రంతో - గీతామాత అనుగ్రహంతో మనం అమృతస్వరూపులం కావాలని ఆశిస్తూ - ఆశీర్వదిస్తూ -



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

# శ్రీమద్భగవద్గీత : 14 వ అధ్యాయం

# గుణత్రయ విభాగయోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ॥న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంథాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములుచేస్తూ జ్ఞాన సుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 179 ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞములను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

త్రయం అంటే మూడు. గుణత్రయం అంటే మూడు గుణాలు. అవే సత్త్వరజస్తమోగుణాలు. ఈ మూడు గుణాలను విభాగించి తెలుసుకొనే అధ్యాయం గనుక ఇది గుణత్రయ విభాగయోగం అన్నారు.

12వ అధ్యాయం భక్తి యోగం. అది పూర్తిగావటంతోనే 13నుండి 18వరకు గల ఆరు అధ్యాయాలలో భగవానుడు అఖండ జ్ఞానబోధను చేశాడు. ఇలా భక్తిని గురించి చెప్పిన తరువాతనే జ్ఞానబోధనెందుకు ప్రారంభించినట్లు ? భగవద్గీతను ముగించి, భగవానుడు దీనిని ఎవరికి చెప్పాలో తెలియచేశాడు.

**శ్లో :** "ఇదంతే నా తపస్కాయ నా భక్తాయ కదాచన

న చా శుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్య సూయతి" (18 అ 67శ్లో)

"ఈ జ్ఞానాన్ని తపస్సు చెయ్యనివానికి, భక్తుడు కానివానికి, గురుసేవ చెయ్యనివానికి, నన్ను ద్వేషించేవానికి చెప్పరాదు." అని గీతాబోధ చివరలో భగవానుడు చెప్పటం జరిగింది. అంటే అలాంటివానికి ఈ జ్ఞానాన్ని చెప్పినా ప్రయోజనం లేదు - అని. కనుక భక్తుడైనవానికే జ్ఞానబోధను తెలుసుకొనే అర్హత. 13వ అధ్యాయం 19వ శ్లోకంలో "మద్భక్త ఏతద్విజ్ఞాయ"- నా భక్తుడే ఈ జ్ఞానాన్ని తెలుసుకోగలుగుతాడు. - అని కూడా చెప్పాడు భగవానుడు. అంటే భక్తుడైనవానికే జ్ఞానాన్ని పొందే అర్హత ఉన్నది - అని అర్థం.

అందుకే భక్తియోగాన్ని చెప్పిన వెంటనే జ్ఞానషట్కం ద్వారా అఖండ జ్ఞానబోధను ప్రారంభించాడు భగవానుడు.

13వ అధ్యాయంలో క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క లక్షణాలను చెప్పి వాటిని విభాగించే పద్ధతిని వివరించాడు.

క్షేత్రమంటే శరీరమని, క్షేత్రజ్ఞుడంటే ఈ శరీరాన్ని తెలుసుకొనేవాడు - దీనిని ఆడించేవాడు - అని, అతడే ఆత్మయని, ఆత్మయే పరమాత్మయని తెలియచేశాడు. ఆ తరువాత ప్రకృతి-పురుషుల పేరుతో ఇదే విషయాన్ని మరొక రూపంలో మార్చి చెప్పటం జరిగింది.

ఈ జగత్తులోని స్థావర జంగమాలన్ని ప్రకృతి-పురుష సమ్మేళనం వల్లనే ఉద్భవించినవని చెబుతూ - ప్రకృతిలో (వాసనల ప్రకృతిలో) ప్రతిఫలించాడు పురుషుడు. ప్రకృతి మారిపోతూ ఉంటే పురుషుడు ఆ మార్పులను తనపై ఆపాదించుకుంటూ వేరువేరు యోనులలో పుడుతూ ఉంటాడని, అలా మార్పులను తనపై ఆపాదించుకొనుటకు కారణం ప్రకృతి నుండి పుట్టిన గుణాలతో, అతడి సంయోగమేనని 22వ శ్లోకంలో చెప్పటం జరిగింది.

ఒక వ్యక్తి నాటకంలో స్త్రీ పాత్రను పోషిస్తున్నాడు. స్త్రీ వేషంలో, స్త్రీ యొక్క హావభావాలను ప్రదర్శిస్తూ ఆ పాత్రలో జీవిస్తున్నాడు. అతడు అలా ప్రవర్తించడానికి కారణం ఆ పాత్ర యొక్క స్వభావము, గుణాలే. అలాగే పురుషుడు ప్రకృతి గుణాలతో సంయోగం చెందటం వల్ల తనను తాను మరచిపోతున్నాడు. మళ్లీ తన స్థితిలో తాను ఉండాలంటే ఆ గుణాల పట్టు నుండి విడిపించుకోవాలి. అలా విడిపించుకోవాలంటే ఆ గుణాల యొక్క పుట్టుకను, లక్షణాలను, స్వభావాన్ని, వాటి బలాన్ని, బలహీనతలను తెలుసుకోవాలి. వీటన్నిటిని తెలియచెప్పే అవకాశం 13వ అధ్యాయంలో

భగవానునికి లభించలేదు. ఈ గుణాల గురించిన వివరాలను తెలియచెప్పకుండానే అక్కడ ప్రకృతి - పురుషులను వేరుచేసే వివేకాన్ని అందించే ప్రయత్నం జరిగింది.

అయితే అర్జునునికి అక్కడే సందేహం వచ్చి ఉండవచ్చు. ప్రకృతి నుండి పురుషుణ్ణి వేరుచేయాలంటే ప్రకృతియొక్క గుణాల సాంగత్యాన్ని తొలగించాలి గదా! అలా తొలగించాలంటే అసలు మనలో ఏఏ గుణాలు ఉంటాయి? ఆ గుణాలతో జీవుడికి ఎలా సంయోగం కలుగుతున్నది? ఆ గుణాలు పురుషుణ్ణి ఎలా బంధించ గలుగుతున్నాయి ? ఏ గుణాల ప్రభావం వల్ల ఏ జన్మలు వస్తున్నాయి ? ఈ గుణాల నుండి విడివడే ఉపాయం ఏమిటి ? గుణాలనుండి విడివడిన సిద్ధపురుషుడు - గుణాతీతుడు ఈ లోకంలో ఎలా వ్యవహరిస్తాడు ? అనే సందేహాలు అక్కడే కలిగిఉండవచ్చు. కాని అర్జునునికి ఈ సందేహాలను వ్యక్తంచేసే అవకాశం రాలేదు. అయినప్పటికీ భగవంతుడు సర్వజ్ఞుడు గనుక శిష్యుని మనస్సులోని సందేహాలను కనిపెట్టి ఈ అధ్యాయాన్ని ప్రత్యేకంగా కేటాయించాడు.

అందుకే త్రిగుణాలంటే ఏమిటి ? వాటి పుట్టుపూర్వోత్తరాలేమిటి ? వాటి లక్షణాలు, కర్మధర్మాలు, అవి జీవుణ్ణి ఎలా బంధిస్తాయి? ఎలా వృద్ధి చెందుతాయి? అనే విషయాలను; ఏ లక్షణాలు ప్రబలంగా ఉన్నప్పుడు ఏ గుణాలున్నట్లు? ఏ గుణాలు ప్రబలంగా ఉన్నప్పుడు మరణిస్తే ఎటువంటి జన్మలు వస్తాయి? అనే విషయాలను పూర్తిగ వివరించి చివరకు అర్జునుని ప్రశ్నతో

గుణాలన్నీ వదిలిన గుణాతీతుడైన సిద్ధపురుషుడు ఎలాంటి లక్షణాలు కలిగిఉంటాడో, ఎలా వ్యవహరిస్తాడో తెలియచేశాడు.

13వ అధ్యాయంలో చెప్పకుండా వదిలిన విషయాలకొనసాగింపే ఈ 14వ అధ్యాయం. అందుకే అర్జునుని ప్రశ్నతో పనిలేకుండా నేరుగా బోధ ప్రారంభమైంది. ప్రత్యేకంగా మూడు గుణాల గురించి చెప్పిన అధ్యాయం గనుక దీనికి గుణత్రయ విభాగయోగం అని పేరు పెట్టడం జరిగింది.

అధ్యాయం చిన్నదే అయినా ఇందులోని వస్తువు ఎంతో విలువైనది, ఉపయోగకరమైనది. జీవుడు దేవుడయ్యేందుకు - ఇంకా చెప్పాలంటే జీవుడు దేవుడేనని తెలియచెప్పేది ఈ అధ్యాయం.

ఒకే పరమాత్మ అనేక క్షేత్రాలలో ప్రతిఫలించినప్పుడు, జీవుళ్ళు అని పిలువబడుతున్నారు. అయితే జీవుళ్ళంతా ఒక్కటిగా ఉంటున్నారా ? లేదు. వేరువేరు రూపాలతో, స్వభావాలతో ఉంటున్నారు. కారణం ఏమిటి? క్షేత్రాలయొక్క గుణాలలోని బేధాలవల్లనే. ఒకే కరెంటు అన్ని బల్బులలోనికి, అన్ని పరికరాలలోనికి వస్తున్నది. అయితే అన్ని పరికరాలు ఒక్కటిగా ఉంటున్నాయా? లేదు. బల్బు వెలిగి కాంతినిస్తుంది. ఫ్యాను తిరిగి గాలినిస్తున్నది. ఫ్రిజ్ వస్తువులను చల్లబరుస్తున్నది. హీటరు నీటిని వేడి చేస్తున్నది. దీనికి కారణం ఆయా పరికరాలలోని తేడాల వల్లనే.

అలాగే జీవుళ్ళంతా ఒక్క విధంగా ఉండకపోవటానికి కారణం ప్రకృతియొక్క (క్షేత్రాల యొక్క) గుణసంయోగం వల్లనే. ఈ సంయోగం వదిలించుకుంటే జీవుడు పరమాత్మే అవుతాడు.

మనం జబ్బు చేసినప్పుడు డాక్టరు దగ్గరికి వెళ్తాం. ఆయన మన జబ్బు ఏమిటో, దానికి కారణం ఏమిటో పరీక్షించి రోగనిర్ధారణ చేసి తగిన మందు ఇస్తాడు. అలాగే ఈ జీవభావం అనేది ఒక జబ్బు. దీనికి కారణం ఈ గుణాల సంయోగం. కనుక ఆ గుణాల లక్షణాలను తెలుసుకొని, అవి జీవుణ్ణి ఎలా బంధిస్తున్నాయో తెలుసుకొని, వాటిని వదిలించుకొనే వైద్యం చేయించుకోవాలి. దానివల్ల జీవభావమనే జబ్బు పోతుంది. దైవభావం కలుగుతుంది. కనుక ఈ అధ్యాయాన్ని బాగా అర్థం చేసుకొంటే మన మనస్సును వశపరచుకొనే గుణాల గురించి చక్కగా తెలుస్తుంది. దానితో మనలోని చెడును బయటకు నెట్టివేయవచ్చు. కనుక ఆచరణకు చక్కగా ఉపయోగపడే అధ్యాయం ఇది.

మనం తిరుపతికి వెళ్ళాలనుకున్నాం. అందుకోసం ఒక కారును అద్దెకు తీసుకున్నాం. స్వంతంగా డ్రైవ్ చేస్తున్నాం. ఆ కారులోని యంత్రాలను గురించిన పూర్తి అవగాహన లేకపోయినా డ్రైవింగ్ నేర్చుకున్నాం గనుక స్వంతంగా డ్రైవ్ చేసుకుంటూ వెళుతున్నాం. అయితే ప్రయాణం మధ్యలో కారు ఆగిపోయింది. తేడా ఎక్కడున్నదో తెలియటం లేదు. లోపలి యంత్రాలను కలిపే వైర్ల గురించి అసలు తెలియదు. అది తెలిసిఉంటే ఎక్కడ ఏ వైరును సరిచేయాలో తెలిసేది, ప్రయాణం నిరాటంకంగా కొనసాగేది .

అలాగే ఇప్పుడు మన ప్రయాణం పరమాత్మ వద్దకు. దానికి మన శరీరమనే కారును అద్దెకు తెచ్చుకున్నాం, ఇందులోని యంత్రాలు మన మనోబుద్ధులే. వాటిని గుణాలనే వైర్లతో కలిపిఉంచటం జరిగింది. ఈ గుణాల

కారణంగానే మనోబుద్ధులు ప్రకోపిస్తాయి. అవి ప్రకోపించినప్పుడు వాటిని సరిచేయాలి. వాటిని సరిచేయాలంటే గుణాల గురించిన అవగాహన ఉండాలి. ఆ అవగాహన ఉంటే ఈ శరీరమనే కారు భగవంతుని వద్దకు చేరే ప్రయాణంలో చక్కగా ఉపయోగపడుతుంది. అందుకొరకే ఈ అధ్యాయం.

చాలామంది సాధకుల స్థితి దయనీయంగా ఉంటుంది. జపం, ధ్యానం, శ్రవణం, మననం, విచారణ, సాక్షీభావన మొ||న అనేక ఆధ్యాత్మికసాధనలు చేస్తూనే ఉంటారు. అయినా ప్రగతి కనిపించదు. కొందరు అధఃపతనం చెందుతుంటారు. దీనికి కారణం ఏమిటి? అని ఎంత ఆలోచించినా తెలుసుకోలేరు. దీనికి కారణం వారి అంతఃకరణం చెడటమే. తమ మనోబుద్ధులు ఎక్కడ దారితప్పాయో తెలుసుకోలేక కామక్రోధవశులై నిరాశానిస్పృహలతో దుఃఖపూరిత సంసారంలో మునిగిపోతుంటారు. జననమరణ వలయంలో చిక్కి దారీతెన్ను గానక పరితపించిపోతుంటారు. ఈ ప్రమాదం తప్పాలంటే తమ మనో బుద్ధులు ఎలా ప్రవర్తిస్తున్నాయో తెలుసుకోవాలి. అలా ప్రవర్తించటానికి ఏ గుణాలు ప్రకోపిస్తున్నాయో తెలుసుకుంటూ తగిన విధంగా సర్దుబాటు చేసుకోవాలి. అలా సర్దుబాటు చేసుకోవాలంటే మూడు గుణాలకు సంబంధించిన జ్ఞానాన్ని చక్కగా తెలుసుకోవాలి. కనుక సాధకులు దీని ప్రాముఖ్యతను గుర్తించి ఈ గుణ సంబంధమైన జ్ఞానాన్ని మనసుకు పట్టించుకోవాలి. అందుకే సాధకులకు ఈ గుణత్రయవిభాగయోగం ఎంతో ముఖ్యమైనది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మూడు గుణాలను వదిలించుకున్నవాడు గుణాతీతుడు. అట్టి గుణాతీతుని లక్షణాలేమిటో ఈ అధ్యాయంలో చక్కగా తెలియచేశారు.

2వ అధ్యాయంలో స్థితప్రజ్ఞుని లక్షణాలు చెప్పారు.

12వ అధ్యాయంలో భక్తుని లక్షణాలు చెప్పారు.

ఇప్పుడీ 14వ అధ్యాయంలో గుణాతీతుని లక్షణాలు చెప్పారు.

స్థితప్రజ్ఞుడు జ్ఞానమూర్తి.

భక్తుడు ప్రేమమూర్తి.

గుణాతీతుడు వైరాగ్యమూర్తి.

నిజంగా ఈ ముగ్గురూ వేరువేరు కాదు. దత్తాత్రేయునిలాగా 3 శిరస్సులు గల ఒకే వ్యక్తి. ముగ్గురిలోనూ గుణాలన్నీ సామ్యంగా ఉంటాయి.

భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు పరమాత్మ సాక్షాత్కారానికి సోపానాలు. భక్తుని స్వభావం కోమలం, మృదువైనది. జ్ఞాని, వైరాగ్యమూర్తి యొక్క గుణాలు - స్వభావాలు గట్టివి. కోమలమైన భక్తికి రక్షణగా ఇరువైపుల జ్ఞానవైరాగ్యాలుంటాయి. అందుకే 12వ అధ్యాయానికి ముందు వెనుకలుగా ఈ జ్ఞాని, గుణాతీతులను (వైరాగ్యమూర్తిని) చెప్పటం జరిగింది.

గుణాలు గుణాలు అని మనం అంటున్నాం కాని నిజంగా ఇవి దోషాలే. ఇవి ప్రకృతి (మాయ) యొక్క బిడ్డలు. ప్రకృతి యొక్క లక్షణం బంధించటం. తల్లి లక్షణం బిడ్డలకూ వచ్చింది. అందుకే ఈ గుణాలకు కూడా బంధించే స్వభావం వచ్చింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మ ప్రకృతిలో ప్రతిబింబించగానే ఈ ప్రకృతి బిడ్డలైన గుణాలు ఆ పరమాత్మ ప్రతిబింబాన్ని బంధించి వేస్తున్నాయి. ఆ బంధంలో చిక్కుకున్న పరమాత్మ జీవుడై అహంకార మమకారాలతో, అజ్ఞానంతో అనేక కర్మలు చేస్తూ, ఆ కర్మల కారణంగా అనేక జన్మలెత్తుతూ, సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. ఎప్పుడైతే ప్రయత్నంతో ఈ గుణాల విషవలయం నుండి తప్పించుకుంటాడో అప్పుడు మాత్రమే తన స్వరూపంలో తాను నిలిచి ఆనందంగా ఉండిపోతాడు. కనుక గుణాతీతుడు కావాలి.

అందుకే 'నిస్త్రై గుణ్యోభవార్జున!' అన్నాడు శ్రీకృష్ణుడు రెండవ అధ్యాయంలోనే. అంటే మూడు గుణాలను వదిలించుకోవయ్యా అర్జునా! అని. ఇది కేవలం అర్జునునికే గాదు, సమస్త మానవాళికి ఇచ్చిన సందేశం.

గుణాతీతుడివయ్యావా! వెంటనే పురుషోత్తమప్రాప్తి (15వ అధ్యాయం). కనుక గుణాతీతులమై పురుషోత్తమప్రాప్తిని అనుభవించాలి. అందుకే వచ్చింది ఈ మానవజన్మ. అందుకోసం వచ్చిన ఈ మానవ జన్మను ఎందుకోసమో వినియోగించక అందుకోసమే ఉపయోగిద్దాం. అల్పమైన ప్రాపంచిక విషయాల కోసం, భోగాల కోసం వినియోగించి లభించిన ఈ దుర్లభమైన మానవజన్మను వృథా చేసుకోకుండా ఉందాం.

గుణాతీతుడవైతే పురుషోత్తమప్రాప్తి. అంటే గుణాతీతుడు పరమాత్మే. మరి గుణబద్ధుడో? 3 గుణాలతో బంధించబడ్డవాడు పురుషుడే కాదు, స్త్రీ యే. స్త్రీ అనే అక్షరంలో స-త-ర అనే మూడు పదాలున్నాయి. 'స' అంటే సత్త్వగుణం,

'త' అంటే తమోగుణం, 'ర' అంటే రజోగుణం. ఈ మూడు గుణాలచే బంధించబడ్డవారంతా స్త్రీలే.

ఈ గుణాలను అధిగమించి, గుణాతీతులమై పురుషోత్తమప్రాప్తికి అర్హులం కావాలంటే ముందుగా గుణాలంటే ఏమిటో, వాటి లక్షణాలేమిటో, ఏ గుణాల వల్ల ఎలా ప్రవర్తిస్తామో, ఏ గుణాలు ఎప్పుడు ప్రకోపిస్తాయో, ఏ గుణాలు ప్రబలంగా ఉన్నప్పుడు మరణిస్తే ఏ జన్మలు వస్తాయో, ఏ గుణాలను ఎలా వదిలించుకోవాలో, మనలో ఏ గుణాలు ప్రబలంగా ఉన్నాయో ఎలా తెలుసుకోవాలో - అన్నింటిని వివరంగా తెలియజేస్తున్న ఈ అధ్యాయాన్ని చక్కగా వంటబట్టించుకోవాలి .

భగవంతుని పలుకులతో ప్రారంభమయ్యే ఈ అధ్యాయంలోకి ప్రవేశిద్దాం. ఈ జ్ఞానగంగలో మునకలు వేద్దాం. స్వస్వరూప ఆనందస్థితిలో నిలవటానికి ప్రయత్నిద్దాం.

తాను చెప్పబోయే విషయాల పట్ల శ్రోతకు ఆసక్తి కలిగించి, చక్కగా విని, ఆచరించేట్లు చేయటానికి జ్ఞానం యొక్క మహిమను భగవానుడు ప్రశంసిస్తున్నాడు మొదటి శ్లోకంలో -

**శ్రీ భగవానువాచ :**

శ్లో: పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞాన ముత్తమం |
యజ్ఞాత్వా మునయ స్సర్వే
పరాం సిద్ధి మితో గతాః ‖ (1)

**తా :** భగవానుడంటున్నాడు. మునులందరు దేనిని తెలుసుకొని ఈ సంసారబంధం నుండి విడివడి శ్రేష్ఠమైన మోక్షసిద్ధిని పొందుతారో అట్టి శ్రేష్ఠమైన జ్ఞానాన్ని తిరిగి (మరల) చెబుతున్నాను.

**వ్యాఖ్య :** 1. భూయః ప్రవక్ష్యామి :- 'మరల లెస్సగా చెబుతున్నాను' - అంటున్నాడు భగవానుడు. అంటే ఇంతకు ముందు చెప్పిన జ్ఞానాన్ని - శ్రేష్ఠమైన జ్ఞానాన్ని - జ్ఞానాలలోకెల్లా ఉత్తమమైన జ్ఞానాన్ని మరల చెబుతున్నాను అంటూ గొంతు సవరించుకొంటున్నాడు. మరలమరల చెప్పటం ఎందుకు? చెప్పే వాడికి పనిలేదా ? వినే వాడికి మతిమరపా? చెప్పే భగవంతుడు పనిలేని వాడూ కాదు, కేవలం ఉబుసుపోకకు కబుర్లు చెప్పేవాడూ కాదు. మరి ?

సాధారణంగా మానవులు ఈ ప్రాపంచిక వ్యవహారాలలో మునిగి; అనేక రకాల కోరికలతో; అనేక కర్మలు చేస్తూ; వాటి కారణంగా సుఖ దుఃఖాలను అనుభవిస్తూ; ఆవేశాలు, ఉద్రేకాలు, అలజడులు పొందుతూ, సాంసారిక విషయాలలో మనస్సును నింపటంవల్ల ఆధ్యాత్మిక సత్యాలను అంత తొందరగా అవగాహన చేసుకోలేరు. ఏవేవో సందేహాలు వస్తూనే ఉంటాయి. అందుకే ప్రధాన విషయాలను మరల మరల గుర్తుచేస్తూ ఉంటే క్రమంగా వారికి ఆ విషయాలలో స్థిరత్వం ఏర్పడుతుంది. ఈ ఆధ్యాత్మికజ్ఞానం అర్జున్ణి నిమిత్తంగా చేసుకొని సర్వమానవాళికి చెబుతున్నదే గనుక మళ్లీమళ్లీ చెబుతున్నాడు భగవానుడు. ఇది కేవలం అర్జునునికొరకు చెబుతున్నది కాదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అయితే మళ్లీమళ్లీ చెప్పేటప్పుడు ఒకే విషయాన్ని ఒకే విధంగా చెబితే "పాడిందే పాటరా పాచి పళ్ళ దాసుడా" అన్నట్లు వినే వారికి విసుగు పుడుతుంది. అందుకే మాటలను మార్చిమార్చి చెప్పాలి. ఇక్కడ 'భూయః' అనే పదంలో ఆ భావమే ధ్వనిస్తున్నది. అంటే అదే విషయాన్ని మరొక రూపంలో హృదయానికి హత్తుకొనేట్లు చెప్పబోతున్నాను - అని. అంతే కాదు. ఇంతవరకు చెప్పిన విషయాలను పైపైన చెప్పాను. సూక్ష్మంగా చెప్పాను. కాని ఇప్పుడు అదే విషయాలను ఇంకా లోతుగా చెప్పబోతున్నాను అనే భావం కూడా ఇమిడి ఉన్నది.

ఇక వక్ష్యామి = చెబుతున్నాను అనక ప్రవక్ష్యామి = లెస్సగ చెబుతున్నాను అనటంతో ఉత్తమ గురువుల లక్షణం ఇమిడి ఉన్నది. ఏదో జీతం తీసుకుంటున్నాం గనుక భాద్యతగా చదువు చెప్పాలి - అని బడిపంతులు పాఠాలు చెప్పినట్లుగాక తన శిష్యుల మస్తకాలకు విషయం ఎక్కేంత వరకు సంతృప్తి చెందరు ఉత్తమ గురువులు. మంచి మంచి ఉపమానాలతోను, జీవితంలో ఎదురయ్యే సంఘటనలతోను సమన్వయం చేసి ఆధ్యాత్మిక విషయాలను శిష్యులకు అవగాహన అయ్యేటట్లు చెబుతుంటారు సద్గురువులు. లేకపోతే వారికి సంతృప్తి ఉండదు. తల్లి పసిపిల్లలకు పాటలు పాడుతూ, ముద్దుముద్దుగా మాటలు చెబుతూ, చందమామను చూపించి పిలుస్తూ ఎలా గోరుముద్దలు తినిపిస్తుందో అలాగే

ఉత్తములైన గురువులు శిష్యులకు ఎన్నో విధాల యుక్తులతో, అనుభవాలతో మేళవించి జ్ఞానాన్ని అందిస్తారు. అందుకే 'ప్రవక్ష్యామి' అన్నారు.

అయితే ఇప్పుడు భగవానుడు అందించబోయే జ్ఞానం ఎట్టిది?

2. పరం, జ్ఞానానాం జ్ఞాన ముత్తమం :- శ్రేష్ఠమైనది, జ్ఞానాలలోకెల్లా ఉత్తమమైన జ్ఞానం - అని రెండు విశేషణాలను చెబుతున్నారు.

'ఆకర్ణనీయంబు లయుత సంఖ్యలు గలవు' అని భాగవతంలో శుకమహర్షి పరీక్షిత్తుతో అంటాడు. అంటే వినటానికి చాలా ఉన్నాయి అని. సైన్స్, భూగోళం, చరిత్ర, కవిత్వం, శిల్పం, నాట్యం, సంగీతం, వ్యాకరణం, పెయింటింగ్, వంట.... ఇలా అనేక జ్ఞానాలున్నాయి. ఇవన్నీ శరీరాన్ని పోషించుకొనుటకు, కీర్తిప్రతిష్టలు సంపాదించటానికే. జీవించి ఉన్నంత వరకే వీటి అవసరం. అయితే తాను చెప్పబోయే జ్ఞానం వీటన్నింటి కన్నా శ్రేష్ఠమైనది, ఉత్తమమైనది. ఎందుకంటే ఈ అద్భుతజ్ఞానం జీవితాన్ని సార్థకం చేసుకొనేందుకు; అసలు జన్మలే లేకుండా మోక్షాన్ని పొందటానికి అవసరమైన జ్ఞానం. శరీరాన్ని విడిచిన తరువాత కూడా ఉపయోగపడే జ్ఞానం ఇది. అందుకే ఇది పరం, ఉత్తమం.

దేవర్షి నారదుడు 84 విద్యలలో ఆరితేరినవాడు. అయినా శాంతిని పొందలేకపోయాడు. చివరకు ఆత్మవిద్యను పొందినప్పుడే శాంతిలభించింది. కనుక పరమాత్మను తెలియచేసే జ్ఞానమే ఉత్తమజ్ఞానం. అందుకే రామకృష్ణ పరమహంస అంటారు, ఆత్మజ్ఞానం లేని జ్ఞానాలు '1 లేని సున్నాలు'. సున్నాలెన్ని ఉన్నా వాటికి విలువ లేదు. వాటి ముందు '1' ఉంటేనే విలువ.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఈ చెప్పబోయే జ్ఞానం ప్రకృతి - పురుషుల స్వరూపాలను వివరించి, వేరుచేసి, పురుషుని యొక్క యదార్ధస్థితిని తెలియచెప్పి, ప్రకృతి యొక్క బాధలనుండి (గుణాలబంధం నుండి) ఆ పురుషుణ్ణి వేరుచేసి, పురుషోత్తమునిగా తీర్చిదిద్దే జ్ఞానం గనుక దీనిని పరం - ఉత్తమం అని రెండు విశేషణాలతో భగవానుడు తెలియచేస్తున్నాడు.

- పరమాత్మకు సంబందించిన జ్ఞానం గనుక పరంజ్ఞానం.
- ఉత్తమమైన ఫలితాన్ని ప్రసాదించేది గనుక ఉత్తమజ్ఞానం.

ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే ఇందులో మూడు గుణాల చర్చ సాగుతుంది. మిగిలిన అధ్యాయాలలో ఇంతవరకు ఈ చర్చ సాగలేదు. త్రిగుణాతీతుడు కావాలంటే ముందు సత్త్వగుణాన్ని వృద్ధి చేసుకోవాలి. అలా చేయాలంటే మూడు గుణాలను చక్కగా విశ్లేషణ చేసి చూడాలి. తినకూడని పదార్ధాలేవో తెలుసుకొని వదిలేస్తేనే రోగి ఆరోగ్యం చక్కబడుతుంది. మందులు వాడటమే కాదు, పత్యం కూడా సరిగ్గా ఉండాలి. ఆయుర్వేదంలో ఒక సూక్తి ఉంది. "పత్యం సరిగ్గా ఉంటే ఔషధంతో పని ఏమిటి ? పత్యం సరిగ్గా లేకపోతే ఇక ఔషదంతో పని ఏమిటి ? -అని. కనుక వదలవలసిన దాన్ని వదలాలన్నా, పట్టుకోవలసిన దాన్ని పట్టుకోవాలన్నా వాటిని విశ్లేషించి చూడాలి. కనుకనే 3 గుణాల యొక్క లక్షణాలను విశ్లేషించి చెప్పే జ్ఞానం గనుక దీనిని ఉత్తమ జ్ఞానం అన్నారు.

3. <u>యత్ జ్ఞాత్వా మునయః సర్వే</u> :- ఔషదం చాలా గొప్పది అని ఎప్పుడు చెబుతాం? అది జబ్బును పూర్తిగా తగ్గించగలిగినది అయినప్పుడు చెప్పగలం.

అలాగే ఈ జ్ఞానం గొప్పదని, శ్రేష్టమైనదని, ఉత్తమమైనదని ఎప్పుడు చెప్పగలుగుతాం? ఈ జ్ఞానం వల్ల పరమసిద్ధిని - మోక్షాన్ని పొందినప్పుడు చెప్పగలుగుతాం. అందుకే భగవానుడు ఇక్కడ సాక్ష్యాన్ని ఇస్తున్నాడు. ఈ జ్ఞానాన్ని తెలుసుకొని మునులందరూ పరమసిద్ధిని - మోక్షాన్ని పొందారు అని. అంటే ఇది తప్పనిసరిగా మోక్షప్రాప్తిని కలిగించే జ్ఞానం అని భావం. అయితే వారెవరో పొందితే పొందారేమో గాని మనం కూడా పొందగలమా? అని కొందరు సందేహంతో ఉండవచ్చు. అందుకే 'సర్వే' - అందరూ అని కూడా చెబుతున్నారు. ఎవరో కొందరుగాక అందరూ దీనిని తెలుసుకొని సిద్ధిని పొందారు గనుక తప్పకుండా మనం కూడా సిద్ధిని పొందగలమనే ధైర్యం, ఆత్మవిశ్వాసం మనకూ కలుగుతుంది.

అయితే మునయః అనటం వల్ల మునులందరూ పొందగలరే గాని మనం మునులం కాదు కదా! గడ్డాలు, మీసాలు పెంచుకొని, ఏ అరణ్యాలకో వెళ్లి ఆకులు, అలములు తింటూ, తపస్సు చేసుకుంటూ కూర్చోవటం లేదు కదా! అని సందేహించనక్కర లేదు. ఎందుకంటే మునులు అంటే మననశీలురు అని అర్థం. అంటే వేదాంత శాస్త్రాలను, ఆధ్యాత్మిక విషయాలను సద్గురువుల ద్వారా శ్రవణం చేస్తూ, శ్రవణం చేసిన విషయాన్ని నిరంతరం మననం చేసుకుంటూ ఉండేవారే మునులు. అలా మనం కూడా మునులం కావాలి. శాస్త్రవిషయాలను మననం చేస్తూ భావాలను స్థిర పరుచుకుంటూ, వాటిని జీవితంలో ఆచరణచేస్తూ ఉంటే తప్పకుండా సిద్ధి కలుగుతుంది. తరించిన వారంతా తత్త్వాన్ని బాగా విని, మననం చేసి తరించారే గాని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కేవలం వినటం వల్ల, చదవటం వల్ల, చెప్పటం వల్ల తరించలేదు. కనుక మనం కూడా విషయాలను (తత్త్వాన్ని) విని, మననంచేసి, స్థిరపరచుకొని అనుభూతి చెందాలి, తరించాలి. కనుక మునులమై తరించవచ్చు. తరించటం అంటే ?

4. పరాం సిద్ధిం గతాః :- మోక్ష సిద్ధిని పొందటమే. మోక్షం అన్నిటికన్నా శ్రేష్ఠమైనది, ఉన్నతోన్నతమైనది. మనం ఎంతో గొప్పగా భావించే ఈ లోకంలోని వైభవాలు గాని, భోగాలు గాని అన్నీ క్షణ భంగురాలు. పై లోకంలో - అంటే స్వర్గలోకంలోని భోగాలు కూడా అనిత్యమైనవి, అల్పమైనవే. శాశ్వతమైన ఆనందం బ్రహ్మానందమే. అదే మోక్షస్థితి. అందుకోసమే ఈ జన్మ. అట్టి శాశ్వత ఆనందాన్ని ఎక్కడ పొందుతాం?

5. ఇతః :- ఇక్కడే. ఈ దేహంలో ఉన్నప్పుడే, జీవించి ఉన్నప్పుడే సాధించగలిగింది మోక్షం. చనిపోయిన తర్వాత వచ్చేవి తాత్కాలిక స్వర్గ సుఖాలు. మోక్షం అనేది ఈ జన్మలోనే - ఇక్కడే సాధించగలిగేది.

- ఇట్టి సిద్ధి వల్ల ప్రయోజనం ఏమిటి?

ఈ జ్ఞానం ద్వారా పరమసిద్ధిని పొందటం అంటే ఏమిటి? అట్టి సిద్ధిని పొందినవారు ఏమౌతారు? వారి పరిస్థితి ఏమిటి?

శ్లో : ఇదం జ్ఞాన ముపాశ్రిత్య
మమసాధర్మ్య మాగతాః |
సర్గేపి నో పజాయంతే
ప్రళయే న వ్యధంతిచ ‖ (2)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా :** ఈ జ్ఞానాన్ని ఆశ్రయించి నా స్వభావాన్ని పొందినవారు సృష్టి జరిగినప్పుడు పుట్టరు. ప్రళయం సంభవించినప్పుడు వ్యధ చెందరు.

**వ్యాఖ్య :** 1. ఇదం జ్ఞానం ఉపాశ్రిత్య :- ఈ జ్ఞానాన్ని అంటే ఈ అధ్యాయంలో చెప్పబోయే శ్రేష్టమైన, ఉత్తమమైన జ్ఞానాన్ని ఆశ్రయిస్తే - అంటే ఈ జ్ఞానాన్ని తెలుసుకొని ఆచరణలో పెడితే - ఏం జరుగుతుంది? నా స్వభావాన్నే పొందుతారు అంటున్నాడు భగవానుడు. ఇంతకూ ఇక్కడ చెప్పబోయే జ్ఞానం ఏమిటి? ప్రకృతితో మనను బంధించి ఆత్మ అయిన మనకు జీవభావాన్ని కలిగించే త్రిగుణాల యొక్క లీలలే. ఒకసారి ఈ త్రిగుణాల యొక్క లీలలను తెలుసుకొంటే వాటి ఆట కట్టించి; ఈ జీవభావం నుండి విముక్తిచెంది ఆ క్షణమే ఆత్మగా ఉండగలం; మన స్థితిలో మనం నిలువగలం, 'పరాం సిద్ధి మితో గతాః' అని చెప్పిన మొదటి శ్లోకంలోని వాక్యమూ, ఈ శ్లోకంలోని 'మమ సాధర్మ్య మా గతాః' అనే వాక్యమూ రెండూ ఒకే అర్థాన్నిస్తున్నాయి.

2. మమ సాధర్మ్యం ఆగతాః :- నా స్వభావం - అంటే భగవంతుని స్వభావాన్నే పొందుతాడు - అంటే ఏమిటి ?

గుణాలచేత బంధింపబడి పురుషోత్తముడు పురుషుడయ్యాడు. ఈ గుణాలను అధిగమిస్తే పురుషుడు కాస్తా పురుషోత్తముడవుతాడు. జీవుడు కాస్తా దేవుడౌతాడు. అదే భగవంతుని స్వరూపం. గుణరహితుడే భగవంతుడు. గుణాలను వదిలించుకొని గుణాతీతుడైనవాడూ భగవంతుడే. గుణరహితమే భగవంతుని స్వరూపం. అదే భగవంతుని స్వభావం. గుణాలను వదిలించుకున్న



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గుణాతీతుడు భగవంతుని స్వభావాన్ని పొందుతాడు అంటే ఇదే. ఇదే పరమ సిద్ధి. ఇదే మోక్షం.

దీనిని బట్టి గుణాలకు సంబంధించిన జ్ఞానం ముక్తికి కారణమౌతుంది. ఇక్కడ సాధర్మ్యం అను మాటకు సమానధర్మము, సమస్వభావము అని అర్థం. సమానధర్మం అనటంలో అసలు రెండు వస్తువులున్నట్లా? ఆ రెండింటికీ ఒక్కటే ధర్మం అని చెప్పినట్లా? కాదు. రెండు వస్తువులు లేవు. ఉన్నదొక్కటే. దేవుడే జీవుడౌతున్నాడు. తిరిగి ఈ జీవుడే దేవుడౌతున్నాడు. నీవు నాటకంలో శ్రీరాముని వేషం వేశావు. అప్పుడు శ్రీరాముడివి. రంగు కడుక్కోగానే ఇప్పుడు సుబ్బారావువి. ఇంతకీ శ్రీరాముడు, సుబ్బారావు ఇద్దరా? ఒక్కరేనా ? ఒక్కరే. శ్రీరామునిగా కనిపిస్తున్నప్పుడూ సుబ్బారావువే. రంగు కడుక్కొని వేషం తీసేసిన తర్వాతా సుబ్బారావువే. అలాగే ఉన్నదొక్కటే పరమాత్మ. ఆ పరమాత్మే క్షేత్రమనే వేషంతో జీవుడయ్యాడు. వేషం తీసేస్తే అతడు పరమాత్మయే. కనుక ఉన్నదొక్కటే. అందువల్ల సాధర్మ్యం అంటే సమాన ధర్మం కాదు. ఒకే స్వరూపం. ఒకే స్వభావం. అదే 'నిర్గుణ స్వరూప ప్రాప్తి' అని తెలుసుకోవాలి.

స్వప్నంలో పేదవాడుగా ఉండి, తిండి కూడా దొరకక అనేక బాధలు అనుభవించిన నేను మేలుకోగానే నా అసలు స్వరూపంలో నిలిచాను. ఇప్పుడు నాకు తిండి బాధలు లేవు. స్వప్నంలో నేను, ఇప్పటి నేను అని ఇద్దరం లేము. నా స్వరూపం ఒక్కటే. స్వప్నాన్ని విడిచినట్లు గుణాలను విడిచిపెడితే నా స్వరూపంలో నేనుంటా. ఇదే సాధర్మ్య స్థితి. ఇలా ఎవరయితే సాధర్మ్యస్థితిని పొందుతారో, పరాంసిద్ధిని పొందుతారో వారి పరిస్థితి ఏమిటి?

3. సర్గే అపిన ఉపజాయంతే:- సృష్టి జరిగినప్పుడు పుట్టడు. సృష్టి అనేది మనస్సు యొక్క పని. గుణాతీతుడైనవానికి మనస్సు లేదు. మనస్సు లేకపోతే సృష్టి లేదు. పుట్టటం లేదు. ఉదాహరణకు నీవు చాలా మంచి వాడవు. నిన్ను అనవసరంగా ఒకరు నిందించారు. దానితో నీకు కోపం వచ్చింది. దానితో నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టావు. అప్పుడు నిన్ను చూసిన వాళ్ళు 'నిన్ను చాలా చెడ్డవాడు' అనుకున్నారు. అంటే కోపం అనేది చెడ్డతనాన్ని సృష్టించింది. కోపం పోయింది ఇప్పుడు మంచివాడివయ్యావు. అంటే కోపం చెడ్డతనాన్ని సృష్టించింది, కోపం అంతమైతే సృష్టి లేదు. అలాగే మనస్సు ఉంటే సృష్టి చేస్తుంది. మనస్సు అంతమైతే ఇక సృష్టి లేనేలేదు. అందుకే గుణాతీతుడికి మనస్సు లేదు గనుక పుట్టుక అనేదే లేదు. అలాగే

4.ప్రళయేన వ్యధంతిచ :- ప్రళయంలో నశించడు. పుట్టుక లేనివానికి నాశనం లేదు గనుక గుణాతీతుడు నశించడు. అంతే కాదు. ఏ వ్యధలూ ఉండవు. నీకు రాత్రి కల వచ్చింది. ఆ స్వప్నంలో నీకు జబ్బు చేసింది. మృత్యుకోరలలో చిక్కుకున్నావు. ఎంతో వేదన అనుభవించావు. మెలుకువ రావటంతోనే నీకు జబ్బులేదు, మరణవేదనా లేదు. పైగా స్వప్నంలో జరిగినదానికి నవ్వుకుంటావు.

అలాగే ఈ జాగ్రదావస్థలోని కష్టాలకు, ఇబ్బందులకు ఎంతో బాధపడతావు. వ్యధ చెందుతావు. ఈ జాగ్రదావస్థను దాటి, త్రిగుణాలను అధిగమించి జ్ఞానావస్థలో - నీ స్వరూపస్థితిలో - ఆత్మస్థితిలో నిలిస్తే ఇక నీకు ఏ కష్టాలు, ఇబ్బందులు, వ్యధలు ఏమీలేవు. అంటే జీవభావంలో - అజ్ఞానావస్థలోని నీ కష్టాలకు ఇప్పుడు ఎలాంటి వ్యధ లేదు.

స్వప్నంలోని కష్టాలకు జాగ్రత్ లో వ్యధచెందనట్లుగా జాగ్రత్ లోని కష్టాలకు జ్ఞానావస్థలో వ్యధ చెందవు. కనుక ఈ త్రిగుణాల యొక్క లీలలను బాగా తెలుసుకొని వాటిని అధిగమించినవాడు పరమసిద్ధిని పొందినట్లే. స్వస్వరూపస్థితిని పొందినట్లే. అట్టివానికి ఇక పుట్టుకలేదు; మరణం లేదు; అతడికి ఏ వ్యధలూ ఉండవు. వ్యధలన్నీ మనోసృష్టిలోనే. ఆత్మస్థితిలో మనస్సుండదు కనుక సృష్టి లేదు. ప్రళయమూ లేదు.

ఈ ప్రసంగంలో ఉపాసకుల ముక్తికి, జ్ఞానుల ముక్తికి తేడాను గమనించాలి.

యజ్ఞయాగాది కర్మలు చేస్తూ, భగవంతుని భక్తితో భజిస్తూ, పూజించేవారు, ఉపాసించేవారు; అలాగే సదాచారసంపన్నతతో జీవించే వారు ఆ కల్పం వరకు ముక్తిని సాధిస్తారు. అంటే మళ్ళీ కల్పం (బ్రహ్మదేవుని పగటికాలం) ప్రారంభమయ్యే వరకు వారు వైకుంఠంలోనో, కైలాసంలోనో స్వర్గభోగాలు అనుభవిస్తూ ఉంటారు. ఇది **సాలోక్యముక్తి**. అయితే తిరిగి కల్పం ప్రారంభంకాగానే వారు వేరువేరు దేహాలతో మళ్ళీ పుడుతుంటారు, మరణిస్తూ ఉంటారు.

అదే గుణాతీతుడైన జ్ఞాని కైవల్యముక్తి (**సాయుజ్యముక్తి**)ని పొందుతారు. వారు మరణానంతరం ఏ లోకాలకు వెళ్ళవలసిన పనిలేదు. నిరాకారనిర్గుణ పరమాత్మతో ఐక్యమై అలాగే శాశ్వతంగా ఉండిపోతారు. కనుక వారికి జననమరణాలు ఉండవు. కనుక జ్ఞానం ఎంతో విశిష్టమైనది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**జ్ఞానం యొక్క గొప్పతనాన్ని భగవద్గీత అనేక సార్లు ప్రశంసించింది. భగవద్గీత చివరలో 'ఇతితే జ్ఞాన మాఖ్యాతం' (18-63) అన్న వాక్యాన్ని బట్టి గీత జ్ఞానప్రధాన శాస్త్రమని గ్రహించవచ్చు. నరుడు నారాయణుడయ్యేది జ్ఞానంతోనే. ఇట్టి జ్ఞాన మహిమను 2 శ్లోకాల్లో చెప్పి సృష్టి గురించి చెప్పబోతున్నారు.**

**గుణాల గురించి చెప్పబోయే ముందు ఆ గుణాల యొక్క వంశవృక్షాన్ని తెలుసుకోవాలి. కనుక వాటి పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకొనుటకు వీలుగా సృష్టి రహస్యాలను తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**శ్లో||** **మమయోని ర్మహద్బహ్మ**

**తస్మిన్ గర్భం దధా మ్యహం|**

**సంభవ స్సర్వ భూతానాం**

**తతో భవతి భారత ! ||** **(3)**

**తా||** **అర్జునా! మూలప్రకృతి లేదా సమిష్టివాసనలే నా యోని. అందులో నేను బీజాన్ని ఉంచుతాను. అన్ని ప్రాణుల పుట్టుక దాని నుండే సంభవిస్తుంది.**

**వ్యాఖ్య:** **ఈ సృష్టిలో ఏదైనా ఒక ప్రాణి పుట్టుక జరగాలంటే తల్లి యోని, తండ్రి బీజం రెండూ ఉండాలి. ఆ రెండింటి కలయికతోనే శిశుజననం. ఈ విషయం తెలియనిదెవరికి? అందరికీ తెలిసినది రహస్యమెలా అవుతుంది? మరి?**

**తల్లిదండ్రుల కలయిక కారణంగా ఒక శరీరం, అవయవాలు వస్తున్నాయి. అంతేనా? పుట్టిన వారందరికి మనోబుద్ధులు కూడా ఉంటాయి. వాటిల్లో అనేక**

తేడాలుంటాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా ప్రవర్తిస్తూ ఉంటారు. ఒక్కొక్కరిది ఒక్కొక్క స్వభావం. అలా ఉండటానికి కారణం వారివారి గుణాలలోని భేదాలే. ఈ గుణాలు ఎక్కడినుండి వస్తున్నాయి? వీటిని కూడా తల్లిదండ్రులే సృష్టిస్తున్నారా? లేదు. ఇవి వాసనల కారణంగా వచ్చినవి. ఈ వాసనలెక్కడివి? పూర్వంలో ఆయా జీవుళ్ళు చేసిన ఆలోచనలు కోరిన కోరికలు, భావాల నుండి వచ్చినవి. ఇవే **వాసనలు**. ఈ వాసనలతో కూడిన దానినే కారణశరీరం అన్నారు. అంటే పైకి కనిపించే స్థూల శరీరం, వేరు వేరు మనోబుద్ధులతో కూడిన సూక్ష్మశరీరం, దీనికి కారణమైన వాసనలతో కూడిన కారణశరీరం.

ఈ మూడు శరీరాలతో కూడిన వానినే **జీవుడు** అంటాం. మరి ఈ 3 శరీరాలు తల్లిదండ్రుల కలయిక కారణంగానే వస్తున్నాయా? అంటే కాదు అనే చెప్పాలి. అందుకే అంటారు "మనం బిడ్డలను కంటామే గాని వారి రాతల్ని కంటామా?" అని. అంటే స్థూలశరీరం మాత్రమే తల్లిదండ్రుల కలయిక ద్వారా వస్తున్నది. సూక్ష్మ కారణ శరీరాలు మాత్రం మరేదో కారణం వల్ల వస్తున్నాయి. దానినే భగవంతుడు ఇక్కడ తెలియజేస్తున్నాడు.

**1. మమ యోనిః మహత్ బ్రహ్మ:-** ఈ సర్వానికి జన్మస్థానం మహత్ బ్రహ్మ అని చెప్పబడే నా యోని. అందులో నేను బీజాన్ని ఉంచుతున్నాను, దానివల్లనే సర్వభూతాలు జనిస్తున్నాయి అని భగవానుడంటున్నాడు.

మమయోని అంటున్నాడు గనుక యోని (ప్రకృతి) భగవంతుని అధీనంలో ఉంటుంది. ఇక మహత్ బ్రహ్మ అన్నారు. అంటే చాలా గొప్పది,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పెద్దది, బృహత్తరమైనది, ఎక్కువగా ఎదిగేది అని అర్థం. భగవంతుని అధీనంలోని యోని - ప్రకృతి ఎక్కువగా ఎదిగేది - అంటే అర్థమేమిటి? వ్యష్టివాసనలు ఎదిగి వ్యక్తిగా, అతడు చూచే ప్రపంచంగా మారుతాయి. సమిష్టి వాసనలు ఎదిగి మొత్తం ప్రాణులుగా, అవి చూచే ప్రపంచంగా మారుతాయి. అందుకే మహత్ బ్రహ్మ అన్నారు.

ఇక అన్ని జీవరాసుల సృష్టికి యోని స్థానమైన ఈ ప్రకృతి ఎలా భగవంతుని అధీనంలో ఉన్నదని చెప్పటం?

ప్రళయకాలంలో స్థూలశరీరాలన్నీ నశించిపోతాయి. ఇక మిగిలిన సూక్ష్మశరీరాలు, కారణశరీరాలు అన్నీ కలసి అంతటా ఉన్న నిరాకార,నిర్గుణ, సూక్ష్మాతిసూక్ష్మ సర్వవ్యాపక చైతన్యమైన భగవంతునిలో ఉండిపోతాయి. అలా సమిష్టి కారణశరీరం అనే ప్రకృతి - మాయ - యోని భగవంతుని అధీనంలో ఉంటుంది. ఇదే మమయోని అని భగవంతునిచే చెప్పబడినది.

**2. తస్మిన్ అహం గర్భం దధామి:-** అందులో నేను బీజాన్ని ఉంచుతాను. బీజాన్ని ఉంచటమంటే ఏమిటి? సృష్టి ప్రారంభంలో "ఏకోఽహం బహుస్యాం ప్రజాయేమ" - ఒక్కటిగా ఉన్న నేను అనేకంగా అవుతాను - అని సంకల్పం చేయటమే బీజాన్నుంచటం. అంటే భగవంతుని చైతన్యం సమిష్టి కారణ శరీరమైన యోనిలో - ప్రకృతిలో ప్రసరిస్తుందన్నమాట. అప్పుడా ప్రకృతి పరవశిస్తుంది, పులకిస్తుంది. ఇలా సమిష్టి కారణశరీరం అనే యోనిలో పరమాత్మ బీజంపడగానే సమిష్టి సూక్ష్మశరీరాభిమాని హిరణ్యగర్భుడు

(చతుర్ముఖ బ్రహ్మ) జన్మిస్తాడు. అతడే సృష్టి కార్యాన్ని నిర్వర్తించే సృష్టికర్త. కనుక బ్రహ్మదేవుడు స్థూలశరీరంతో ఉండేవాడు కాదు.

ఇప్పుడా బ్రహ్మ ఒక్కొక్క వ్యష్టి వాసనకు అనుగుణంగా వ్యష్టి సూక్ష్మశరీరంతో జీవుణ్ణి తయారుచేస్తాడు. ఈ జీవుడే పురుషుని వీర్యకణం ద్వారా స్త్రీ గర్భంలో ప్రవేశించి అండంతో కలసి పిండంగా ఏర్పడతాడు. ఆ పిండం తల్లి గర్భంలో 9నెలల పాటు పెరిగి అన్ని అవయవాలతో కూడిన స్థూలశరీరంతో జన్మిస్తాడు. ఇలా వేరు వేరు కారణ, సూక్ష్మశరీరాలతో కూడిన జీవుళ్ళు వేరువేరు చోట్ల తగిన స్థూలశరీరాలతో తల్లి గర్భాల నుండి జన్మిస్తారు.

కనుక సమస్త జీవుల యొక్క సమిష్టి కారణశరీరమే యోని. భగవంతుడు సృష్టి చేయాలని సంకల్పించటమే యోని యందు బీజాన్ని ఉంచుట. ఈ కారణంగా మొదట జన్మించిన జీవుడే హిరణ్యగర్భుడు. ఆ పదవికి తగిన అర్హతలు గల అదృష్టవంతుడే అలా సృష్టికర్తగా జన్మిస్తాడు. ఆ బ్రహ్మయే ఇతర జీవుళ్ళకు తగిన స్థూలశరీరాలను సమకూర్చటానికి వారిని పురుష వీర్యకణాలలో ప్రవేశపెడతాడు. దానితో 3 శరీరాలతో కూడిన ప్రాణికోటి తల్లి గర్భముల నుండి ఉద్భవించటం జరుగుతుంది. ఇలా సమస్త ప్రాణికోటి అవ్యక్తం నుండి వ్యక్తానికి రావటం జరుగుతుంది.

- సర్వయోనుల నుండి జన్మించే అన్ని ప్రాణులకు తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అయితే ఇక్కడి తల్లిదండ్రులెవరు?

**శ్లో||** సర్వ యోనిషు కౌంతేయ!

మూర్తయః సంభవంతి యాః |

తాసాం బ్రహ్మ మహద్యోనిః

అహం బీజప్రదః పితా || (4)

**తా||** కౌంతేయా! సకల యోనుల నుండి ఏయే మూర్తులు జన్మిస్తున్నాయో వాటి అన్నింటికి యోని మహద్ బ్రహ్మ (సమిష్టి వాసనలు) తండ్రిని బీజాన్ని ఇచ్చే నేనే.

**వ్యాఖ్య:** ఈ లోకంలో మానవులే గాక పశువులు, పక్షులు, మృగాలు, సర్పాలు, క్రిమికీటకాలు - ఇలా ఎన్నో విధాలైన ప్రాణులున్నాయి. ఇవన్నీ ఎలా పుడుతున్నాయి? వాటి వాటి తల్లిదండ్రుల కలయిక ద్వారా పుడుతున్నాయి. మరి అందరూ వారి వారి తల్లిదండ్రుల వల్ల పుడుతున్నట్లు మనకు తెలుస్తూ ఉంటే ఇక్కడ భగవంతుడేమో అందరికీ తల్లి ప్రకృతి అని, తండ్రి భగవంతుడనై నేనే అంటున్నాడే. ఇంతకూ తల్లి తండ్రి వేరువేరుగా మనకు తెలిసినవారా? లేక అందరికీ తల్లీ తండ్రి మూకుమ్మడిగా ప్రకృతి, పరమాత్మా?

సైన్స్ ప్రకారం పురుషుని నుండి వీర్యకణాలు స్త్రీ గర్భంలో ప్రవేశించినప్పుడు అందులో ఏదో ఒక్క వీర్యకణం మాత్రమే స్త్రీ గర్భంలోని అండాన్ని తొలుచుకొని అండంతో కలిసి పిండంగా మారుతుంది. ఆ తరువాత క్రమక్రమంగా శిశువుగా ఎదిగి స్త్రీ గర్భం నుండి బయటపడుతుంది. అంటే స్త్రీ గర్భవతి కావాలంటే ఒక వీర్యకణానికి అండాన్ని తొలుచుకొని లోపలికి

ప్రవేశించే శక్తి కావాలి. ఆ శక్తి ఒక్క వీర్యకణానికి మాత్రమే ఎక్కడి నుండి వస్తున్నది?

ఆ దంపతులకు పుట్టి తన కర్మఫలాలకు తగిన సుఖదుఃఖాలను అనుభవించవలసిన జీవుడు ఆ వీర్యకణంలోకి ప్రవేశించాలి. అలా ప్రవేశించటానికి పరమాత్మ యొక్క సంకల్పమే కారణం. ఏ తల్లిదండ్రులకు ఏ జీవుడు జన్మించాలో ఆ ఏర్పాటును భగవంతుడే చేస్తాడు. అందుకే భగవంతుణ్ణి ఇక్కడ 'బీజప్రదాత' అంటున్నారు. అంటే తండ్రి అని అర్థం. దీనిని బట్టి జీవుని యొక్క సూక్ష్మ - కారణ శరీరాలు, మహత్ బ్రహ్మ అనబడే తల్లి నుండి, పరమాత్మ చైతన్యం అనే తండ్రి నుండి వస్తుంటే స్థూలశరీరం మాత్రం ఇక్కడి భౌతిక తల్లిదండ్రుల నుండి వస్తున్నది.

అంటే జీవుని యొక్క స్థూలశరీరానికి తల్లిదండ్రులు ఇక్కడి భౌతిక తల్లిదండ్రులైతే; జీవుని యొక్క సూక్ష్మ - కారణశరీరాలకు తల్లిదండ్రులు ప్రకృతి పరమాత్మలే. ఇంకా చెప్పాలంటే ప్రకృతిలో ప్రతిఫలించిన పరమాత్మ ఆ ప్రకృతి గుణాలచే కట్టివేయబడి జీవుడై; ఆ జీవుడు ఇక్కడి తల్లిదండ్రుల ద్వారా స్థూలశరీరంతో వ్యక్తమవుతున్నాడు. కనుక ఈ తల్లిదండ్రులు కేవలం నిమిత్తమాత్రులే. ఎప్పుడు కావాలంటే అప్పుడు బిడ్డను పుట్టించే శక్తి వీరికి లేనేలేదు.

దీనిని బట్టి మన మనోబుద్ధులు, ఆలోచనలు, సుఖదుఃఖాలు ఇవన్నీ భౌతిక తల్లిదండ్రుల వల్ల వచ్చినవి కావు. వారివారి ప్రకృతి (వాసనలను) ని బట్టి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వచ్చినవే. దేహం కొద్దికాలం ఉండిపోయేది. అది కేవలం ఒక పరికరం లాంటిదే. పరికరాన్ని ఉపయోగించే తెలివితేటలన్నీ మనోబుద్ధులవే.**

**ఒక కవిత్వాన్ని చదివినప్పుడు "ఆహా! ఎంత గొప్ప కలం వ్రాసిందో ఈ కవిత్వాన్ని!" అని ఆశ్చర్యపోము. "ఆహా! ఈ కవిత్వాన్ని వ్రాసిన కవి ఎంత గొప్పవాడో!" అంటాం. కలం ఒక పరికరం మాత్రమే. గొప్పతనం అంతా వ్రాసిన వాడిదే. కనుక సూక్ష్మ - కారణ శరీరాలకు తల్లిదండ్రులైన ప్రకృతి పరమాత్మలే మన అందరి తల్లిదండ్రులు. అందరం సోదరులమే.**

**మంచి చెడ్డ జన్మలకు కారణం గుణాలతో సంగభావమే. మరి గుణాలేమిటి? అవి జీవుణ్ణి ఎలా బంధిస్తాయి? అనే విషయాన్ని తెలియజేయబోతున్నారు.**

**శ్లో|| సత్త్వం రజస్తమ ఇతి**
**గుణాః ప్రకృతి సంభవాః |**
**నిజధ్నంతి మహాబాహో!**
**దేహే దేహిన మవ్యయం||** (5)

**తా|| ఓ మహాబాహుడా! సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు ప్రకృతి నుండి పుట్టినవి. అవి అవ్యయమైన దేహిని (జీవుణ్ణి) దేహంలో బంధిస్తున్నాయి.**

**వ్యాఖ్య: సమిష్టి వాసనలలో (ప్రకృతిలో) బీజాన్ని ఉంచే పరమాత్మకు ఏ భ్రాంతి గాని, బంధం గాని లేదు. వ్యష్టిగా పుట్టిన జీవుడికే అన్ని భ్రమలు, బంధాలు. ఎలా కలుగుతున్నాయి? గుణాల వల్లనే. ఏమిటా గుణాలు?**


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**1. సత్త్వం, రజః తమః ఇతి గుణాః :-** గుణాలు 3. అవి సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం. వీటిని గుర్తించటం ఎలా?

- ✓ సత్త్వగుణం తేజస్సు, ప్రకాశంతో గుర్తించవచ్చు. తెలుపురంగు.
- ✓ రజోగుణం దుమ్ము,ధూళి, మలినంతో గుర్తించాలి. ఎరుపురంగు.
- ✓ తమోగుణం చీకటి, అజ్ఞానంతో గుర్తించవచ్చు. నలుపురంగు.

ఈ మూడు గుణాలు ఎక్కణ్ణించి వచ్చాయి? వాటి జన్మస్థానం ఏది?

**2. ప్రకృతి సంభవాః :-** ఇవి ప్రకృతి నుండి పుట్టినవి. అంటే కారణశరీరంలోనే ఈ గుణాలుంటాయి. ప్రకృతిలో ఆత్మ ప్రతిఫలించగానే ఈ గుణాలు ఆత్మను బంధించివేస్తున్నాయి. ఎక్కడ?

**3. అవ్యయం దేహినం దేహే నిబధ్నంతి :-** అవ్యయమైన దేహిని (ప్రకృతిలో ప్రతిఫలించిన ఆత్మను) దేహంలో - శరీరంలో బంధించివేస్తున్నాయి. బంధించటమంటే ఏమిటి? జీవుడు వేరు, దేహం వేరు. అయినా ఆ వివేకాన్ని మరుగుపరచి దేహంతో తాదాత్మ్యం కలిగించుటే బంధంలో పడవేయుట.

దేహంలో బందీ అయిన జీవుణ్ణి తమ వికారాలతో ఆకర్షించి తన నిజస్వరూపాన్ని మరచేటట్లుచేసి సుఖదుఃఖమోహాలలో ముంచివేస్తుంటాయి.

నేను ఆత్మను, పరమాత్మను, ఆనందస్వరూపుడను, జ్ఞానస్వరూపుడను, శాశ్వతుడను అనే సత్యాలను మరచిపోయి; మోహంలో - అజ్ఞానంలో పడిపోయి; ఈ దేహమే నేను అనే అభిమానంతో - తాదాత్మ్యంతో సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాను. అజ్ఞానంలో ఉన్నాను, పరిమితుణ్ణి అనే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భావంలో ఉండిపోతున్నాను. దీనికంతటికి కారణం మూడు గుణాలే. కనుక ఈ 3 గుణాలే జీవుణ్ణి దేహంలో బంధించివేస్తున్నాయి.

ఇక్కడే ఒక సందేహం కలిగే అవకాశం ఉంది.

13వ అధ్యాయంలో క్షేత్రజ్ఞుని గురించి చెబుతూ క్షేత్రజ్ఞుడు ఈ శరీరంలో ఉండికూడా దేనినీ అంటడు అని చెప్పి ఇక్కడ క్షేత్రజ్ఞుడు శరీరంలో బంధించబడి గుణాల వికారాలకు లొంగి సుఖదుఃఖాలు అనుభవిస్తాడు అని చెబుతున్నారు. ఇందులో ఏది నిజం?

రెండూ నిజమే. **స్వరూపత :-** అంటే ఉన్నది ఉన్నట్లుగా చూచే స్వరూప దృష్ట్యా క్షేత్రజ్ఞుడు నిర్వికారుడు. అయినా మాయా ప్రభావంతో దేహంలో బంధింపబడి, దేహంతో తాదాత్మ్యం చెంది, నేను-నాది అంటూ అభిమానానికి లోనై జననమరణరూపసంసారానికి బద్ధుడైపోతున్నాడు. దీనిని చిన్న ఉపమానంతో పరిశీలిద్దాం.

చిలకను పట్టుకోవాలని వేటగాడు ఒక గిలకను తయారుచేస్తాడు. దానినొక చెట్టుమీద ఉంచుతాడు. దానిపై తినుబండారాలు పెడతాడు. ఆ తినుబండారాలకు ఆశపడి చిలుక వచ్చి ఆ గిలక మీద కూర్చుంటుంది. ఆ చిలుక బరువుకు గిలక గిర్రున తిరగటం ప్రారంభిస్తుంది. ఆ వేగానికి బుద్ధిలేని చిలుక పడిపోతాననే భయంతో ఆ గిలకను కరచిపట్టుకుంటుంది. దానితో వేటగాడు ఆ చిలుకను పట్టుకుంటాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గిలక తిరగటానికి కారణం చిలుక బరువే. తనకు ఎగిరిపోయేందుకు రెక్కలున్నాయి గదా! కాని భయంతో దాని బుద్ధి అప్పుడు పనిచేయదు. అంటే అజ్ఞాన బంధంలో పడిపోయి వేటగానికి చిక్కిందన్నమాట.

జీవుడి విషయం కూడా అంతే. గుణాలు జడం. తాను చైతన్యం. జడమైనవి చైతన్యపురుషుని అధీనంలో ఉంటాయి. కనుక అవెలా బంధించగలవు? ఈ మాత్రం జ్ఞానంలేక జడమైన గుణాలకు లొంగిపోయి ఈ జీవుడు సంసారబంధంలో చిక్కుకుంటున్నాడు. ఇదంతా స్వయం కృతాపరాధమే.

నిజంగా క్షేత్రజ్ఞుడైన పురుషుడికి ఎప్పుడూ ఎలాంటి వికారాలు అంటవు. కాని అధ్యాసతో - భ్రమతో - భ్రాంతితో - మోహంతో - అజ్ఞానంతో - వికారాలతో కూడినట్లుగ కనిపిస్తాడు. అలా కనిపించటమే గాని నిజం కాదు.

బకెట్ లోని నీరు కదులుతుంటే అందులోని సూర్యబింబం కదులుతున్నట్లు, మేఘాలు కదులుతుంటే చంద్రుడు కదులుతున్నట్లు, రైలు ముందుకు వెళుతుంటే ప్రక్కనున్న చెట్లు వెనుకకు పరుగెడుతున్నట్లు కనిపించినప్పటికీ అవేవీ నిజం కాదు. అలాగే క్షేత్రజ్ఞునికి ఈ గుణాలతో సంబంధం కూడా మాయయే - భ్రమయే. నిజం కాదు.

**4. మహాబాహో :-** అర్జునా! నీవు గొప్ప బాహువులు గలవాడవు. ఇవి నీకు శుభచిహ్నం. నీ భుజాలతో - భుజబలంతో బందీలను విడిపించగలవు. ఇప్పుడు నీ దేహమనే బందికానాలో బందీయైన దేహిని (ఆత్మను) బంధ విముక్తుని గావించు. గుణాలను జయించు ఆత్మను ఉద్ధరించగల

పరాక్రమశాలివి. నీకే గాదు, మానవులందరికీ ఆ హక్కు ఉన్నది - అని ఒక విధంగాను; మరొకవిధంగా - అర్జునా! నీ భుజాలను చూచుకొని మురిసిపోతుంటావు గదా! అజేయులైన శత్రువులనెందరినో జయించావు గదా! ఏదీ చూద్దాం. ఈ గుణాల పట్టునుండి విడిపించుకో - అని వ్యంగ్యంగా ఛాలెంజ్ చేయటం - ఈ సంబోధనలో ఉన్నది.

ఇంతవరకు గుణాలు బంధించేవి అని చెప్పి ఇక ఏ గుణం ఎలా బంధిస్తుందో చెప్పబోతున్నాడు. తమో రజోగుణాలను గెంటినా సత్త్వం కూడా బంధమే. బంగారంలో ఎంత కల్తీ ఉంటే అంతగా వన్నె తగ్గినట్లు సత్త్వగుణంలో రజస్తమో గుణాలు ఎంతగా కల్తీ అయితే సత్త్వగుణం అంత బంధకరమౌతుంది. దాన్నీ గెలిచి శుద్ధసత్త్వంలో నిలిస్తేనే గుణాతీతుడయ్యేది. ఎలా?

- ముందుగా సత్త్వ గుణం జీవుణ్ణి ఎలా బంధిస్తున్నదో చెబుతున్నారు.

**శ్లో||** తత్ర సత్త్వం నిర్మలత్వాత్

ప్రకాశక మనామయం |

సుఖ సంగేన బధ్నాతి

జ్ఞాన సంగేన చానఘ ! || (6)

**తా||** అనఘా! ఆ మూడు గుణాలలోను సత్త్వగుణం నిర్మలమైనది గనుక ప్రకాశవంతంగా, స్వచ్ఛంగా ఉంటుంది. ఇంద్రియ సుఖాలతోను, జ్ఞానంతోను ముడిపెట్టి జీవుణ్ణి బంధిస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:** ప్రకృతి నుండి పుట్టిన గుణాలు అవ్యయుడైన పరమాత్మను దేహంలో బంధిస్తున్నాయి. దీనిని బట్టి పరమాత్మ ఎక్కడోలేడని, ఈ దేహంలోనే ఉన్నాడని అర్థమవుతున్నది. కనుక పరమాత్మను ఈ దేహంలోనే వెతకాలి. ఈ దేహంలోనే ఆయనను సాక్షాత్కరింపజేసుకోవాలి. ఆయన నేనే అని గ్రహించి అనుభూతి చెందాలి.

ఆయన ఈ దేహంలోనే ఉన్నా 3 గుణాలు బంధించి వేస్తున్నాయి. ఇందులో సత్త్వగుణం తెల్లని గాజు చిమ్నీ వంటిది. రజోగుణం ఎర్రని రంగు గల గాజు చిమ్నీ వంటిది. తమోగుణం నల్లగా మసిబారిన గాజు చిమ్నీవంటిది. దీపం చుట్టూ ఈ నల్లని, పొగబారిన చిమ్నీ ఉంటే ఆ దీపం యొక్క కాంతి అసలు కనిపించదు. ఎర్రని గాజు చిమ్నీ ఉన్నప్పుడు రంగు మారి, కాంతి తగ్గి కనిపిస్తుంది. అదే తెల్లని, నిర్మలమైన గాజు చిమ్నీ ఉంటే కాంతి స్పష్టంగా కనిపిస్తుంది. అయినా ఉన్నది ఉన్నట్లు కనిపించదు.

ఇప్పుడు సత్త్వగుణం నిర్మలమైనది గనుక, స్వచ్ఛమైన గాజు చిమ్నీ లాంటిది గనుక ప్రకాశాన్ని కలుగజేసేది; దుఃఖాలు, ఉపద్రవాలు లేకుండా చేసేది. ఏదైనా ఒక వస్తువును మనం గుర్తించాలంటే ఆ వస్తువును వర్ణించి చెబితే గుర్తించగలం. ఏదైనా జబ్బును గుర్తించాలన్నా ఆ జబ్బు వల్ల కలిగే మార్పులను, లక్షణాలను విశ్లేషించి చూసి డాక్టరు ఆ జబ్బు ఏమిటో నిర్ధారణ చేస్తాడు. అలాగే మనను బంధించే గుణం ఏదో తెలుసుకోవాలంటే ఆ గుణం వల్ల మన మనస్సులో కలిగే ఆలోచనలను బట్టి ఆ గుణం ఏదో - ఎలాంటిదో తెలుసుకుంటాం. కనుక మన ఆలోచనలను బట్టి, ఆచరణను బట్టి ఏ గుణం

మనలో ప్రబలంగా ఉందో తెలుసుకుంటాం. మనం ప్రశాంతంగా, సంతోషంగా, ఉత్తమ జ్ఞానంతో ఉంటే మనం సత్త్వగుణంలో ఉన్నట్టు.

సత్త్వగుణం నిర్మలమైనదైనా, స్వచ్ఛమైనదైనా, అది కూడా బంధించేదే. ఎందుకంటే అది కూడా ఒక ఆవరణమే గదా! అయితే అది రజోగుణంలాగా ఉన్నదాన్ని మరొక రకంగా చూపేదీగాదు; తమోగుణం లాగా అసలు కనపడకుండా చేసేదీ కాదు. బాగా ప్రకాశవంతంగా చూపే మంచి గుణం సత్త్వగుణం.

అయితే ఎంత మంచి గుణమైనా అది అహంకారానికి, అభిమానానికి దారి తీసిందా - బంధానికి కారణమై కూర్చుంటుంది.

నేను సుఖంగా ఉన్నాను, ప్రశాంతంగా ఉన్నాను, వివేకం గలిగిన వాణ్ణి, వికారాలు లేని వాణ్ణి, జ్ఞానిని అనే అహంకారం కలిగిందా బంధమే. ఎలా?

**సుఖ సంగేన** :- సత్త్వగుణ ప్రభావం వల్ల భగవంతునిపై భక్తి ఉంటుంది. దానితో పూజలు, వ్రతాలు, యజ్ఞయాగాదులు, పారాయణలు, జపధ్యానాలు చేస్తారు. వీటి వల్ల మనస్సు ప్రశాంతంగా, ఆందోళన లేకుండా, సుఖంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఈ సుఖాన్ని దూరం చేసుకోవటం ఇష్టంలేక భగవత్ కార్యాలలో నిమగ్నమవుతూ అందులోనే మునిగిపోతారు.

**జ్ఞాన సంగేన**:- అలాగే సత్త్వగుణంలో ఉన్నవారు భగవంతునికి సంబంధించిన జ్ఞానాన్ని పొందటానికి తపిస్తారు. రామాయణ, భారత, భాగవత గ్రంథాలనో, వేదాంత గ్రంథాలనో, పురాణాలనో చదవాలని, వినాలని, తెలుసుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు. పెద్దలను, మహాత్ములను, గురువులను ఆశ్రయిస్తూ,

పూజిస్తూ ఉంటారు. శాస్త్ర శ్రవణం చేస్తూ ఆత్మజ్ఞానాన్ని పొందుతూ ఉంటారు. దీనితో వారిలో తేజస్సు వృద్ధి అవుతుంది. హృదయంలో ఒక సంతృప్తి కలుగుతుంది. దీనితో ఇంకాఇంకా జ్ఞాన సముపార్జన చేయాలనే ఆసక్తి కలిగి ఇందులో మునిగిపోతుంటారు. ప్రశంసలకు లొంగి అందులోనే ఉంటారు.

ఇలా సత్త్వగుణంలో ఉండేవారు సుఖాన్నిపొందుతూ, జ్ఞానాన్ని పొందుతూ అందులోనే ఉండిపోతారు. అదే జీవుడు దేహానికి బంధించబడటం. సత్త్వగుణ ప్రభావం వల్ల కలిగే ఈ సుఖం గాని, జ్ఞానం గాని ఈ రెండూ కూడా అంతఃకరణ ధర్మాలేగాని ఆత్మ ధర్మాలు కాదు. ఆత్మ ధర్మాలైతే ఇక బంధం అనేదే లేదు. అంతఃకరణంలో కలిగే సుఖాన్ని నాది అనుకోవటం కూడా అంతే అజ్ఞానం. కనుక సత్త్వగుణం వల్ల కలిగే సుఖం దేహేంద్రియాలకు సంబంధించినదే గాని ఆత్మకు సంబంధించినది కాదు. మనస్సులో అలజడులు తగ్గటం వల్ల వచ్చిందే ఈ సుఖం.

ఇలా దేహేంద్రియ మనోబుద్ధులు సుఖంలో ఉండటం వల్ల ఆ సుఖాన్ని వదులుకోలేక, దాని మీద ఆసక్తితో అటువంటి సుఖాన్ని ఇంకాఇంకా పొందాలని, అలాగే శాస్త్ర జ్ఞానాన్ని, పాండిత్యాన్ని ఇంకాఇంకా సంపాదించి పది మందిలో గొప్పగా ఉండాలని, గౌరవం పొందాలని సంగభావం పెట్టుకుంటాడు. వీటిలోనే మునిగిపోతుంటాడు. ఇలా చేస్తే బంధం ఏమిటి?

తాను దేహాన్ని కాదని, ఆత్మనని తెలియక; లేదా తెలిసినా ఆత్మతో తాదాత్మ్యం చెంది ఆత్మగా - బ్రహ్మముగా ఉండేందుకు సాధనలు చేయక; తన స్వస్థితిలో నిలిచి ఈ జననమరణ రూప సంసారం నుంచి బయట పడక;

మళ్ళీమళ్ళీ పుడుతూ, మళ్ళీమళ్ళీ తల్లి గర్భంలో ప్రవేశిస్తూ జన్మలను కొనసాగించటమే బంధం - క్షేత్ర సుఖంలో బంధించబడటమే బంధం.

**అనఘ ! :-** అనఘ అంటే పాపరహితుడా! అని. పాపాలు చేయని వాడే సత్త్వ గుణంలో ఉన్నవాడు. పాపియైన వాడు సుఖంగా ఉండలేడు, జ్ఞానాన్ని పొందలేడు. అర్జునుడు పాపరహితుడే. ముందుగా పాపరహితుడై ఆ తరువాత బంధం నుండి - సత్త్వగుణబంధం నుండి విడుదల పొందేందుకు ప్రయత్నించాలి.

- ఇక రజోగుణ స్వభావం ఏమిటి? అది కలిగించే లక్షణాలేవి? అది ఆత్మను దేహంలో ఎలా బంధిస్తున్నది? –

**శ్లో||** రజో రాగాత్మకం విద్ధి
తృష్ణా సంగ సముద్భవం |
తన్ని బధ్నాతి కౌంతేయ !
కర్మ సంగేన దేహినం || (7)

**తా||** కౌంతేయా! రజోగుణం దృశ్యవిషయాలపై ఆసక్తిని కలిగించి; కోరికను, సంగభావాన్ని కలిగిస్తుందని తెలుసుకో. అది కర్మలయందు ఆసక్తి కలిగించి ఆత్మను దేహంలో బంధిస్తుంది.

**వ్యాఖ్య: రజో రాగాత్మకం** :- రాగాత్మకం అంటే రంజన స్వభావం గలది – అని. అంటే అనురాగ రూపమైనది రజోగుణం. రజోగుణం మనసుపై ప్రభావం చూపినపుడు కంటి ద్వారా విషయవస్తువులను చూచినప్పుడు గాని, చెవి

ద్వారా విన్నప్పుడు గాని, లేదా మనస్సులో స్మరించినప్పుడు గాని ఆ విషయాలపై, వస్తువులపై ప్రీతి కలుగుతుంది. ఇదే రాగం. అందుకే రజోగుణం రాగాత్మకం.

ఈ రాగ వృత్తి వల్ల  జీవుడు తన స్వస్వరూపం నుండి జారి దృశ్య విషయాలపై, విషయవస్తువులపై వ్యామోహం చెందుతాడు. ఇక్కడ రాగమనే దానిలో ద్వేషం కూడా ఇమిడి ఉంది. కనుక రాగద్వేషాలు రెండూ రజోగుణం యొక్క స్వభావాలే. ఈ రాగం వల్ల ఏం జరుగుతుంది?

రాగం వల్ల వస్తువులపై కోరిక కలుగుతుంది. కోరిక వల్ల వాటిని సంపాదించుకొని భోగించాలనిపిస్తుంది. అంటే రజోగుణం భోగాసక్తిని కలిగిస్తుంది. దాని కారణంగా దుఃఖాలుపడాల్సి వస్తుంది. కోరిక తీరకపోతే దుఃఖం. తీరితే సుఖమే గాని మళ్ళీ క్రొత్త కోరిక పుడుతుంది.

పనసతొనల మాధుర్యాన్ని చవిచూడాలని ఈగ ఆ తొనలలో ప్రవేశిస్తుంది. దాని శరీరానికి, రెక్కలకు జిగురు  అంటుకుంటుంది. ఆ మాధుర్యాన్ని ఈగ తింటుందో లేదో కాని ఆ మాధుర్యం మాత్రం ఈగను తింటుంది. "మశకం మాధుర్యంలో హతాహతం".

**తృష్ణా సంగ సముద్భవం :-** ఈ రజోగుణం తృష్ణను, సంగభావాన్ని కలిగిస్తుంది. తృష్ణ అంటే లేనిదాన్ని సంపాదించుకోవాలనే ఆశ - కోరిక. సంగం అంటే ఉన్నదానిపై మమకారం పెంచుకొని, దానిని మన నుండి జారిపోకుండా ఆసక్తి పెంచుకోవటం. ఈ కారణంగా ఆ వస్తువులకు మనం బానిసలమై పోతాం.

'తృష్ణ' అంటే దప్పిక - దాహం అనే అర్థం కూడా ఉన్నది. ఉప్పు నీరు ఎంత త్రాగినా దప్పిక తీరదు. అలాగే విషయభోగాలను ఎన్ని అనుభవించినా తృష్ణ తీరదు. ఆశకు అంతం లేదు. ఆశకు ఆకాశమంత నోరు, సముద్రమంత పొట్ట. ఆశను తృప్తి పరచినవాడు ఇంతవరకు పుట్టలేదు. చూచినవన్నీ కావాలి. విన్నవన్నీ కావాలి. తలచినవన్నీ కావాలి.

ధనం మీద తృష్ణ, సంపదల మీద తృష్ణ, ఇల్లు వాకిళ్ళ మీద తృష్ణ, భార్యా బిడ్డల మీద తృష్ణ, విషయాల మీద తృష్ణ, భోగాల మీద తృష్ణ, పదవుల మీద తృష్ణ, కీర్తి ప్రతిష్టల మీద తృష్ణ. ఈ తృష్ణ వదిలితే తప్ప ప్రగతి లేదు. అందుకే శంకరులవారు "మూఢ జహీహి ధనాగమ తృష్ణాం" అంటూ భజగోవిందంలో తృష్ణపై మొదట్లోనే అస్త్రాన్ని ప్రయోగించారు. దారేషణ (భార్యపై మక్కువ), ధనేషణ (ధనంపై మక్కువ), పుత్రేషణ (బిడ్డలపై మక్కువ) అనేవి ఈషణత్రయాలు. దారేషణ పక్షులలోను, ధనేషణ మానవులలోను, పుత్రేషణ జంతువులలోను చాలా ఎక్కువగా ఉంటుంది. అందుకే "ధనాగమ తృష్ణాం జహీహి" అంటూ మానవుణ్ణి 'మూఢా' అని దాడి ప్రారంభించారు శంకరాచార్యుల వారు.

ఈ రజోగుణం వల్ల తృష్ణతో పాటు సంగభావం ఉద్భవిస్తుంది. సంగం అంటే ఆసక్తి. దొరికిన వస్తువు మీద విశేషమైన ప్రీతి. దానికి కాలం చెల్లినా సరే రక్షించుకోవాలనే పట్టుదల. ఇదే ఆసక్తి - సంగభావం. ఈ తృష్ణ సంగభావాల వల్ల జీవుడు ఎలా బంధింపబడుతున్నాడు?

తృష్ణతో (ఆశలు, కోరికలతో) ఉన్నవాడు వేటిపైన కోరికతో ఉంటాడో వాటిని సంపాదించుకొనుటకు కర్మరంగంలోకి దిగుతాడు. డబ్బుమీద తృష్ణ ఉంటే వృత్తి, వ్యాపారం, ఉద్యోగం, పరిశ్రమలు, మోసాలు, గూండాయిజం .... ఇలా ఏదో ఒక వ్యవహారంలోకి దిగుతాడు. ఇలాగే మిగిలినవన్నీ. ఆశ అనేది మనిషిని ఊరకే ప్రశాంతంగా ఉండనివ్వదు. దప్పికతో ఉన్నవాడు ఊరకే ఉంటాడా? దప్పికతో ఉన్న గజేంద్రుడు వనమంతా తిరిగి సరోవరంలో దిగాడు గదా! అలాగే ఆశతో ఉన్నవాడు అది చేయాలి, ఇది చేయాలి అంటూ కాడిమాను తన మెడ మీద తానే వేసుకుంటాడు. ఈగలాగా కొట్టుకుంటాడు, పాదరసంలాగా పారాడుతాడు. కనుక రజోగుణం ప్రశాంతంగా ఉండనివ్వదు.

ఈ రజోగుణం కర్మలపై ఆసక్తిని పెంచి ఆత్మను దేహంలో బంధిస్తుంది. ఆత్మ ఏ కర్మలు చేసేది కాదు. అయితే రజోగుణం కారణంగా ఆశలు కోరికలు పుట్టి, కర్మలు చేస్తూ అవి చేస్తున్నది నేనే అంటూ ఈ దేహంలో బంధించబడుతున్నాడు మానవుడు. ఇదే కర్మసంగం. ఈ పనులు నేను చేస్తున్నాను అనేది కర్మసంగం. ఈ ఫలితం నాకే రావాలి అనేది ఫలసంగం. ఇలా కర్మలలో మునిగిపోయి నా స్థితిని మరచి, నా స్వరూప స్థితి నుండి దిగజారి జీవుడిగా జననమరణ రూపసంసారంలో ఇరుక్కుపోతున్నాను. కోటి కోటి జన్మలకు కారణం ఈ రజోగుణమే. ఇలా రజోగుణం కర్మలలో దింపి మన స్వరూపాన్ని మనం మరచేటట్లు చేసి ఈ దేహమే నేను - అనే భ్రమను కల్పించి బంధిస్తున్నది.

**రజోగుణం వల్ల కర్మలు, కర్మల వల్ల కర్మఫలాలు, వాటిని అనుభవించుటకు జన్మలు, ఆ జన్మలలో మళ్ళీ కర్మలు, కర్మఫలాలు, తిరిగి జన్మలు. ఇలా కర్మ జన్మ వలయంలో త్రిప్పి మన నిజస్థితిని - ఆత్మ స్థితిని మరుగున పడవేస్తున్నది. దీనికి కారణం రజోగుణమే. ఇక్కడ బధ్నాతి అనక నిబధ్నాతి అనటం వల్ల బాగా గట్టిగా బంధిస్తున్నది రజోగుణం అని అర్థం చేసుకోవాలి.**

**- ఇక తమోగుణ స్వభావం ఏమిటో, అది జీవుణ్ణి ఎలా బంధిస్తున్నదో -**

**శ్లో|| తమస్త్వ జ్ఞానజం విద్ధి**
**మోహనం సర్వ దేహినాం |**
**ప్రమాదాలస్య నిద్రాభిః**
**తన్ని బధ్నాతి భారత! || (8)**

**తా|| భారతా ! తమస్సు అనేది అజ్ఞానం నుండి పుట్టి అన్ని ప్రాణులను మోహంలో పడవేస్తుందని తెలుసుకో. ఏమరపాటు, బద్ధకం (సోమరితనం), నిద్రలతో జీవుణ్ణి ఈ తమోగుణం గట్టిగా బంధిస్తుంది.**

**వ్యాఖ్య: తమః తు అజ్ఞానజం విద్ధి :- తమోగుణం అజ్ఞానం నుండి పుట్టినది. జ్ఞానం వ్యక్తం కాకపోవటమే అజ్ఞానం. మేఘాలు సూర్యుణ్ణి కప్పి వేసినట్లు, నల్లగా పొగచూరిన గాజు చిమ్నీ దీపాన్ని కప్పినట్లు తమోగుణం జ్ఞానాన్ని కప్పి వేస్తుంది. అందుకే ఇట్టి గుణం గలవాడు 'తనకు తోచదు ఎవరన్నా చెబితే వినడు' అన్నట్లుగా ఉంటాడు.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తమోగుణం అజ్ఞానం నుండి పుట్టి అజ్ఞానాన్ని వృద్ధి చేస్తుంది. తమఃతు అని 'తు' ప్రయోగం చేశారు. అంటే తమోగుణమైతేనో - అని అర్థం. అంటే ఇంతవరకు చెప్పిన సత్త్వ రజో గుణాల వంటిది కాదు, ఇది వాటికన్న దోషపూరితమైనదని చెప్పటానికే ఈ 'తు' ప్రయోగం. ఈ గుణం ఏం చేస్తుంది?

**'మోహనం సర్వ దేహినాం'** :- మానవులందరినీ మోహంలో పడవేస్తుంది. మోక్షాన్ని పొందాలి అనే మానవుడి దివ్యభావనను కప్పివేసి ఈ తమోగుణం సోమరితనంలో, నిద్రలో ముంచివేస్తుంది. లోకంలో చాలా మందిని చూడండి మనం ఎందుకు పుట్టాం? ఈ జన్మకు పరమార్థం ఏమిటి? అనే ఆలోచనే లేకుండా, జీవితానికి ఒక ఉన్నత లక్ష్యం గాని, చేసే పనులలో ఉదాత్తత గాని లేకుండా ఎలాగో జీవితాన్ని గడిపివేసి వెళ్ళిపోతూ ఉంటారు. ఈ తమోగుణం అలా వారిని ఆలోచించుకోనివ్వకుండా అందరినీ మోహంలో పడేస్తుంది. విచక్షణా జ్ఞానాన్ని నశింపజేస్తుంది. ఏ కొద్ది మందో వివేకవంతులు, ఆత్మ జ్ఞాన సంపన్నులను తప్ప అందరిని పడవేస్తుంది. అందుకే 'సర్వదేహినాం' అన్నారు.

ఈ తమోగుణం జీవుణ్ణి ఎలా బంధిస్తున్నది?

**ప్రమాద, ఆలస్య, నిద్ర:-** 'ప్రమాద' అంటే ఏమరుపాటు, మతిమరపు, పరాకు, కర్తవ్యాన్ని మరచిపోవటం. 'ఆలస్య' అంటే సోమరితనం, బద్ధకం, చేయాలనిపించక పోవటం. 'నిద్ర' అంటే అతిగా నిద్రపోవటం. ఎప్పుడూ నిద్రలో జోగుతూ మత్తులో ఉండిపోవటం.

ఈ లక్షణాలు ఆత్మను తెలుసుకోనీయకుండా, తన స్వరూపాన్ని తాను మరచేటట్లుగా చేసి జీవుణ్ణి బంధిస్తున్నాయి. ఈ మూడు లక్షణాలతో తాదాత్మ్యం చెందిన జీవుడు వాటినే తన స్వరూపంగా భావించి బంధానికి గురౌతున్నాడు.

**ప్రమాదం** :- చేయవలసినవి చేయకపోవటం, చేయకూడని వ్యర్ధమైన పనులు చేయటం ప్రమాద లక్షణాలు. గోళ్ళు గిల్లుకోవటం, పుల్లలు విరవటం ఇలాంటి పనులే.

ఒకడు కూర్చున్న చోటనే కూర్చొని గడ్డిపోచలను ముక్కలు ముక్కలు చేస్తూ పెద్ద కుప్పను చేశాడు. ఆ దారిన పోతున్న ఒక మహాత్ముడు, అయ్యా! ఈ గడ్డిని ఆవు తిని పాలు ఇస్తుంది. ఆ పాలు త్రాగితే రక్తంగా మారుతుంది. ఆ రక్తం మనకు పుష్టినిస్తుంది. ఇప్పుడు నీవు చేసిన పని ఎంత ప్రమాదమో గుర్తించావా? అన్నాడు. ఇలా వ్యర్ధమైన పనులు చేస్తుంటాడు. కొందరు వ్యర్ధమైన ఆలోచనలు చేస్తుంటారు. గాలిలో మేడలు కడతారు.

లాటరీలో లక్ష రూపాయలు వస్తే ఇల్లు కొంటాను, పెళ్ళి చేసుకుంటాను, వ్యాపారం చేస్తాను. బాగా లాభాలు వస్తాయి. ఆ డబ్బుతో పరిశ్రమ స్థాపిస్తా. పెద్ద పేరు వస్తుంది. MLA గా పోటీ చేస్తా. గెలిచి మంత్రినవుతా. అప్పుడు నా దర్జా, హంగు, ఆర్భాటం .... ఆహా! అనుకుంటూ ఎప్పుడో ఈ ప్రపంచంలోకి వచ్చి పడతాడు. ఉన్నచోటనే ఉసూరుమంటూ ఉంటాడు. ఇలా ప్రమాదంతో మోహంలో పడిపోయి వ్యర్ధ జీవితాన్ని గడుపుతాడు. తామస ప్రకృతి గల మూఢులు ఇలా ప్రవర్తిస్తూ ఉంటారు.

**ఆలస్యం:-** సోమరితనం - బద్ధకం. ఆ రేపు చూద్దాంలే అంటూ పనులను వాయిదా వేసుకుంటూ పోవటం ఆలస్య లక్షణం. రేపు రేపు అంటారు గాని వాడికి ఆ రేపు అనేది ఎప్పటికీరాదు. రాజకీయనాయకులకు మంత్రులకు సాధారణంగా ఈ స్వభావం ఉంటుంది. ఏమి అడిగినా చూద్దాం, చేద్దాం, కమిటీ వేద్దాం అంటూ ఉంటారు. ఐతే వీరు సోమరులై కాదు, ప్రయోజనం లేదని తప్పించుకొనుటకు అలా అంటూ ఉంటారు. సోమరులెలా ఉంటారో చూడండి.

ఇద్దరు వ్యక్తులు నేరేడు చెట్టు క్రింద పడుకున్నారు. ఆ దారిన సైకిలుపై ఒక వ్యక్తి వెళుతున్నాడు. అయ్యా! అయ్యా! అని ఒకడు కేక వేశాడు. ఏమిటోనని అతడు వచ్చి అడిగాడు. దానికి వాడన్నాడు, "ఆ! ఏమీ లేదు. నేరేడు పండు నా పొట్ట మీద పడ్డది. కాస్త దానిని నా నోట్లో పెట్టండి" అన్నాడు. దానితో అతడు కర్ర తీసుకొని నాలుగు వడ్డించాడు. అది చూచి ప్రక్కనున్న వాడంటున్నాడు, "అంతే కావాలి. సోమరిపోతు వెధవ. నా ముఖం మీద కుక్క మూత్రం పోస్తుంటే అరగంట నుండి దానిని తోలకుండా చూస్తూ ఉన్నాడు. వెధవ" అన్నాడు. వాడు సోమరి. వీడు మహా సోమరి.

**నిద్ర :-** "అభాగ్యునికి ఆకలి ఎక్కువ నిర్భాగ్యుడికి నిద్ర ఎక్కువ" అని సామెత. కూర్చున్నా, పడుకున్నా, పుస్తకం చదువుతున్నా, పురాణం వింటున్నా, బస్సులో ప్రయాణం చేస్తున్నా, జపం చేస్తున్నా పిలవకుండానే వస్తుంది నిద్ర. దీనివల్ల ఇంద్రియాలలో జడత్వం కలుగుతుంది. మనస్సు మొద్దు బారుతుంది. ఆవలింతలు వస్తాయి. ఒళ్ళు విరుచుకుంటారు. నిద్రపడితే స్వర్గంలో ఉన్నట్లు

భావిస్తారు. నిద్రపోయే సమయంలో ఏ దేవతన్నా వచ్చి 'ఇదిగో అమృతం' తీసుకో! అంటే రేపు రా! అంటాడు. 'నిద్ర పోవటానికి అసలు టైము చాలటం లేదు' అంటాడు.

ఇలాంటి తమో గుణ లక్షణాలు గలవాడు ముక్తికీ - ముక్తి సాధనలకీ దూరమైపోతాడు. అసలు భగవంతుడే గుర్తుకు రాడు, తలచుకోడు. అట్టి వాడికి మళ్ళీ వచ్చే జన్మలు నీచజన్మలే. ఈ ప్రకారంగా తమోగుణం ప్రమాద (ఏమరుపాటు) ఆలస్య (సోమరితనం) నిద్రలతో జీవుళ్ళను ఈ లోకానికి బంధించి వేస్తుంది. అట్టి వారికి ఉద్ధారకమే లేదు. ఇలా తమోగుణం ఆత్మను మరుగు పరుస్తుంది, జీవుణ్ణి దేహంలో బంధిస్తుంది.

- జీవుణ్ణి బంధించే ఈ మూడు గుణాలు ఎలా వృద్ధి పొందుతాయి?

**శ్లో||** సత్త్వం సుఖే సంజయతి
రజః కర్మణి భారత ! |
జ్ఞానమావృత్యతు తమః
ప్రమాదే సంజయత్యు త || (9)

**తా||** భారత! సత్త్వగుణం ఇంద్రియ సుఖాలను కలుగజేసి, రజోగుణం కర్మల యందు ఆసక్తి కలిగించి, తమోగుణమేమో జ్ఞానాన్ని కప్పివేసి ఏమరుపాటు కలిగించి వృద్ధి చెందుతాయి. ఎంత ఆశ్చర్యం!

**వ్యాఖ్య :** క్రిందటి మూడు శ్లోకాలలో త్రిగుణాలు ఎలా బందిస్తున్నాయో చెప్పారు.

- సత్త్వ గుణం జీవుణ్ణి సుఖంలో ఆసక్తుణ్ణి చేసి బంధిస్తున్నది.
- రజోగుణం కర్మల యందు ఆసక్తి కలిగించి బంధిస్తున్నది.
- తమోగుణం జ్ఞానాన్ని కప్పి మరపు, బద్ధకం కలిగించి బంధిస్తున్నది.

ఇదే విషయాన్ని రామకృష్ణ పరమహంస గారు ఇలా చెప్పారు.

❖ జీవుణ్ణి సత్త్వగుణం ఆవరిస్తే దీపంపై గాజు చిమ్నీ బోర్లించినట్లు,

❖ జీవుణ్ణి రజోగుణం ఆవరిస్తే దీపంపై అలకని గంప బోర్లించినట్లు,

❖ జీవుణ్ణి తమోగుణం ఆవరిస్తే దీపంపై కుండను బోర్లించినట్లు ఉంటుంది.

కనుక మూడు గుణాలు ఆత్మ(జ్ఞానము) అనే దీపాన్ని కప్పి వేసేవే. అందువల్ల మూడు గుణాలను దాటి ఆత్మ అనే దీపాన్ని చేరుకోవాలి, దర్శించాలి. గుణాతీతునికే ఆత్మ దర్శనం.

ఈ మూడు గుణాలు జీవుణ్ణి బంధించటం భగవంతునికే ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. అందుకే 'ఉత' అంటున్నాడు. ఎందుకు ఆశ్చర్యం?

"బలవంతమైన సర్పము చలి చీమల చేత చిక్కి చావదె సుమతీ!" అని సుమతిశతకకారుడు కూడా చెప్పాడు. నిజంగా ఎంత ఆశ్చర్యమో చూడండి. పాము యొక్క బలం ఏమిటి? చలి చీమల బలం ఏమిటి? అందుకే ఆశ్చర్యం. అలాగే అంతటి ఆత్మ - సచ్చిదానంద స్వరూప ఆత్మ జడమైన ఈ ప్రకృతి యొక్క గుణాల చేత బంధించబడటం ఆశ్చర్యంగాక మరేమిటి?

ఈ 3 గుణాలు ఏఏ పరిస్థితులలో వృద్ధి చెందుతాయో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

సత్త్వం సుఖంలో వృద్ధి చెందుతుంది. రజస్సు కర్మలు చేస్తుంటే వృద్ధి చెందుతుంది. తమస్సు ఏమరు పాటులో జ్ఞానాన్ని కప్పి వృద్ధి చెందుతుంది. ఇది తెలిస్తే మనకేమిటి ప్రయోజనం?

మూడు గుణాలు పుట్టుకతోనే అందరిలోనూ ఉంటాయి. అయితే అవి ఎప్పుడూ ఒకేలా ఉండవు. మనం చేసే పనులను బట్టి, మన పరిస్థితులను బట్టి మారిపోతూ ఉంటాయి. ఈ విషయం మనకు తెలిస్తే - అంటే ఎప్పుడు వృద్ధి చెందుతాయో తెలిస్తే ప్రయత్నంతో అక్కరలేని వాటిని తగ్గించుకోవచ్చు. అవసరమనుకున్న దాన్ని పెంచుకోవచ్చు. మనం సత్త్వాన్ని పెంచుకోవాలి. రజోగుణ తమోగుణాలను వదిలించుకోవాలి.

(1) సత్త్వాన్ని పెంచుకోవటం ఎలా?

సుఖంగా ఉంటే సత్త్వగుణం పెరుగుతుంది. సుఖంగా ఎప్పుడుంటాం? మనస్సులో ఏ ఆందోళన, భయం, అలజడి, ఆరాటం లేనప్పుడు. మనకు ఏదైనా కోరిక కలిగిందనుకోండి. ఆ కోరిక తీరేదాకా ఒకటే ఆరాటం. తీరితే ఆరాటం పోతుంది. అప్పుడు సుఖంగా ఉన్నది అంటాం. దీనిని బట్టి సుఖం ఎలా వస్తున్నది? అని పరిశీలిస్తే మనస్సులోని తీరని కోరిక తీరిపోయినప్పుడు మనస్సులో ఆరాటం, ఆందోళన తొలగి మనస్సు స్థిమితపడుతుంది. అప్పుడు సుఖంగా ఉన్నది అంటాం. అంటే స్థిమితంగా ఉన్న మనస్సు వెనుక సుఖం ఉన్నదన్న మాట. కాబట్టి బాహ్యంగా పరిస్థితులు ఎలా ఉన్నా మనస్సు చెదరకుండా, శాంతంగా నిలుపుకోగలిగితే సుఖం వస్తుంది. అప్పుడు సత్త్వ గుణం వృద్ధి అవుతుంది. సత్త్వం వృద్ధి చెందిన కొద్దీ సుఖం వస్తూనే ఉంటుంది.

సుఖం వస్తున్న కొద్దీ సత్త్వం వృద్ధి చెందుతుంది. కనుక మనస్సుకు సర్ది చెప్పుకుంటూ, ఆందోళనలను తగ్గించుకుంటూ, సుఖాన్ని పొందుతూ, సత్త్వ గుణాన్ని పెంచుకోవాలి.

(2) రజోగుణం ఎప్పుడు పెరుగుతుంది?

జాగ్రత్తగా ఆలోచించి కర్మలు చేస్తుంటే రజోగుణం పెరుగుతుంది. తమోగుణాన్ని తగ్గించుకోవటానికి, వదిలించుకోవటానికే రజోగుణాన్ని పెంచుకోవాలి. అంటే తమోగుణంలో ఉన్నవాడు ఆ తమోగుణాన్ని తగ్గించుకోవటానికి కోరికలను పెంచుకొని, ఆ కోరికలు తీర్చుకోవటానికి కర్మలు చేయాలి. ఆ కర్మలను ఆలోచనతో, జాగ్రత్తగా, నైపుణ్యంతో చేయాలి. అప్పుడే రజోగుణం పెరుగుతుంది. ఆ తరువాత ఈ రజోగుణాన్ని కూడా తగ్గించుకొని సత్త్వంలో నిలవటానికి నిష్కామ కర్మలు, భగవత్ కర్మలు, కర్తృత్వ రహిత కర్మలు చేయాలి. భగవంతునిపై భక్తిని పెంచుకుంటూ ప్రశాంతంగా ఉండటానికి ప్రయత్నించాలి. అప్పుడే సత్త్వగుణం పెరిగేది.

(3) తమోగుణాన్ని ఎలా వదిలించుకోవాలి?

సోమరితనంతో, పనులు చేయకుండా, మతిమరపుతో ఉంటే తమోగుణం పెరుగుతుందని తెలుసుకున్నాం. తమోగుణాన్ని అణచాలంటే రజోగుణాన్ని పట్టుకొనే అణచాలి. అందుకు ఆలోచించి, జాగ్రత్తగా కర్మలు చేయాలి. కర్మలు చేస్తున్న కొద్దీ రజోగుణం పెరిగి తమోగుణం వదిలి పోతుంది.

ఇక ఈ అధ్యాయంలో చాలాసార్లు అర్జునుని 'భారత'! అని సంబోధిస్తున్నాడు భగవానుడు. ఈ శ్లోకంలో కూడా అలాగే అన్నాడు. ఎందుకు? 'భా' అంటే ప్రకాశం - జ్ఞానం అని. రతః అంటే రమించేవాడా! అని. కనుక జ్ఞానము నందు ఆసక్తి గలవాడు గనుక ఈ గుణాలను అధిగమించు అని సూచన ఇస్తున్నాడు భగవానుడు. అర్జునుడు రజోగుణాన్ని దాటాలి.

కనుక ఆధ్యాత్మిక రంగంలో ఉండే అందరం జ్ఞానము నందు ఆసక్తి గలవారమై ఈ త్రిగుణాల యొక్క బంధం నుండి విడివడాలి, ఆత్మానుభూతిని - ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలి.

- ఇక మూడు గుణాల మధ్య గల అవినాభావ సంబంధం ఏమిటో - ఈ 3 గుణాలు ఒక్కరిలోనే ఉంటాయా? ఒక్కసారే అన్నీ పని చేస్తాయా? ఒక దాని కొకటి అనుగుణంగా పని చేస్తాయా? వ్యతిరేకంగా పనిచేస్తాయా? ఈ 3 గుణాల మధ్య గల సంబంధం ఎలాంటిది అనే విషయాన్ని ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

శ్లో|| రజస్తమ శ్చాభి భూయ
సత్త్వం భవతి భారత! |
రజస్సత్త్వం తమశ్చైవ
తమస్సత్త్వం రాజస్తథా || (10)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** భారత ! సత్త్వగుణం రజస్తమోగుణాలను అణచివేసి పైకివస్తుంది. రజోగుణం సత్త్వతమోగుణాలను, అలాగే తమోగుణం సత్త్వరజోగుణాలను అణచి అభివృద్ధి చెందుతాయి.

**వ్యాఖ్య:** ఈ మూడు గుణాలు ప్రతి ఒక్కరిలోను ఉంటాయి. అయితే అన్నీ ఒక్కసారే పని చేయవు. అవి ఒకదానికొకటి పరస్పర విరుద్ధమైనవి. అందువల్ల ఒక సమయంలో ఏదో ఒక గుణమే పనిచేస్తుంది. ఆ సమయంలో మిగిలిన రెండు గుణాలు అణగి ఉంటాయి. ఒక గుణం పెరిగితే మిగిలిన రెండిటిని అణచివేస్తుంది.

అంటే మనం సత్త్వగుణాన్ని పెంచుకోవటానికి ప్రయత్నిస్తే తక్కిన రెండింటిని అణచివేయటానికి ప్రత్యేకంగా ప్రయత్నించవలసిన అవసరం లేదు. అలాగే రజోగుణాన్ని పెంచుకోవటానికి ప్రయత్నిస్తే తమోగుణాన్ని గురించి బాధ పడనక్కర లేదు. ఈ రహస్యాన్ని తెలుసుకుంటే మనం మన జీవితాన్ని చక్కగా, మనం కోరుకున్నట్లు మలచుకోవచ్చు.

ఒకడు సత్త్వగుణం గలవాడు అని చెప్పినప్పుడు మిగిలిన రెండు గుణాలు అతడిలో లేవనికాదు; అవి అతడి మీద ఆ సమయంలో పనిచేయటం లేదు అని అర్థం.

నీటిలో బెల్లం కలిపితే పానకం అవుతుంది. అందులో వేపకాయలు వేస్తే అంతా చేదుగా ఉంటుంది. ఇప్పుడు చేదుగా ఉన్న దానిలో తీపి లేదని కాదు. ఉన్నది. కాని చేదు ముందు తీపి అణగిపోయింది. అలాగే ఒక గుణం అధికంగా

ఉంటే మిగిలిన రెండూ లేవని కాదు. ఉంటాయి. కాకపోతే అణగి పోయి ఉంటాయి.

ఆధ్యాత్మికరంగంలో ఉన్న సాధకుడు ముక్తిని అందుకోవాలంటే తమోగుణం నుండి రజోగుణానికి, రజోగుణం నుండి సత్త్వానికి ప్రయాణం చేయాలి. గుణం ఒక్కటే అయినా స్థితులను బట్టి అది 3 విధాలుగా ఉంటుంది. ఒక్కొక్క స్థితిలో ఒక్కొక్క గుణంగా వ్యక్తమవుతుంది.

నీటి యొక్క రూపాలు చూడండి.

(i) హిమాలయాల్లో మంచు గడ్డ రూపంలో గట్టిగా, జడంగా ఉంటుంది.

(ii) అదేమంచు కరిగి నీరై చలనంతో ఉంటుంది. గలగలా పారుతూ ఉంటుంది.

(iii) అదే నీరు వేడి చేస్తే ఆవిరై పైకి పోతుంది. ఇలా 3 రూపాలు.

మంచు గడ్డ తమోగుణం. నీరు రజోగుణం. ఆవిరి సత్త్వగుణం.

ఇప్పుడు మనం ఏ గుణం పెంచుకోవాలనుకుంటామో దానికి తగినట్లు ప్రవర్తించాలి. ప్రయత్నం చేయాలి. ఏ గుణమైనా 10 రకాల కారణాలతో వృద్ధి చెందుతుంది. వాటిని భాగవతంలో ఇలా తెలియజేశారు.

శ్లో|| ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మచ జన్మచ |

ధ్యానం మంత్రోఽధ సంస్కారో దశైతే గుణహేతవః || (భా11-13-4)

1. శాస్త్రం 2. జలం 3. జనులు 4. ప్రదేశం 5. కాలం 6. కర్మలు 7. జన్మలు 8. ధ్యానం 9. మంత్రం 10. సంస్కారం - ఈ 10 కారణాలు.

**1. శాస్త్రం :-** తత్త్వజ్ఞానాన్ని ప్రసాదించేవి, మహావాక్యాలను వివరించేవి, జన్మసార్థక్యానికి ఉపకరించేవి సాత్త్వికశాస్త్రాలు. లౌకికమైన సుఖాలను, భోగాలను అందించటానికి తగిన కర్మలు ప్రభోదించే గ్రహచారాలు, న్యూమరాలజీలు, రత్నాలు ధరించటం, జ్యోతిష్యం, పూజాదికాలు రాజసికమైనవి. ఇక పాషండత్వాన్ని ప్రబోధించే శాస్త్రాలు, నాస్తికవాదాలు, డిటెక్టివ్ నవలలు, ఉద్రేకాలను కలిగించేవి తామసగ్రంథాలు.

**2. జలం :-** పవిత్ర నదీజలం, తీర్ధజలం - సాత్త్వికజలం. పన్నీరు, సెంట్లు, సుగంధ జలాలు, రాజసిక జలాలు. కల్లు, సారా, మత్తు పదార్ధాలు తామసికం.

**3. జనులు :-** భగవద్భక్తులు, సాధుపురుషులు, జ్ఞానులు, సన్యాసులు, దైవకార్యాలు చేసేవారు, గురువులు సత్త్వగుణానికి చెందినవారు. వ్యాపారులు, ఉద్యోగులు, నటులు, రాజకీయనాయకులు, క్రీడాకారులు, పారిశ్రామికవేత్తలు రాజసిక గుణప్రతినిధులు. దుష్టకార్యాలు చేసేవారు, దోపిడీలు, హత్యలు చేసేవారు, రౌడీలు, గూండాలు, క్షుద్ర మాంత్రికులు - వీరంతా తామస గుణం గలవారు.

**4. ప్రదేశాలు :-** పుణ్యక్షేత్రాలు, పవిత్రతీర్ధాలు, దైవమందిరాలు, ఆశ్రమాలు - ఇవి సాత్త్వికప్రదేశాలు. వ్యాపారకూడళ్ళు, సంతబజారులు, మార్కెట్ సెంటర్లు - ఇవి రాజసికప్రదేశాలు. మద్యశాలలు, జూదశాలలు, వ్యభిచారగృహాలు, క్లబ్ లు - ఇవి తామసిక ప్రదేశాలు.

**5. కాలం :-** ప్రాతఃకాలం శుభ ప్రదం - సాత్త్విక సంబంధమైనది.

పగటి సమయం మధ్యమం - రాజసిక సంబంధమైనది.

రాత్రి కాలం. నిషిద్ధ కాలం - తమో సంబంధమైనది.

**6. కర్మలు :-** నిత్యకర్మలు - సాత్త్వికాలు; కామ్యకర్మలు - రాజసాలు; నిషిద్ధకర్మలు - తామసాలు.

**7. జన్మలు :-** జన్మసార్ధక్యానికి దీక్షాస్వీకారం చేయాలి. సద్గురువుల నుండి మంత్రదీక్షను స్వీకరించటం మంచిది. శైవ, వైష్ణవ, బ్రహ్మదీక్షలు - సాత్త్వికాలు; శాక్తదీక్ష రాజసం; క్షుద్రదీక్షలు తామసికం.

**8. ధ్యానం :-** భగవధ్యానం, ఆత్మధ్యానం - ఇవి సాత్త్వికాలు; కోరికలతో, సంపదల కోసం, భోగాలకోసం చేసే ధ్యానం రాజసికం; శత్రునాశనానికి చేసే ధ్యానం తామసికం.

**9. మంత్రం :-** ప్రణవమంత్రం, ఇష్ట దైవమంత్రాలు సాత్త్వికాలు; ఫలసిద్ధి కొరకు చేసే కామ్యమంత్రాలు రాజసాలు; క్షుద్రదేవతా మంత్రాలు తామసికం.

**10. సంస్కారాలు (ఆలోచనలు) :-** చిత్తశుద్ధిని కలిగించేవి, ఆత్మనిష్టలో నిలిపేవి, భగవద్భావనను స్థిరంచేసేవి సాత్త్విక సంస్కారాలు. దేహభావనను కలిగించేవి, భోగాసక్తిని కలిగించేవి రాజసిక సంస్కారాలు. శతృనాశనాన్ని కోరేవి, దుష్ట భావనలకు సంబంధించినవి తామసిక సంస్కారాలు.

పైన పేర్కొన్న వాటిలో సాత్త్వికమైన వాటిని అనుసరించే వారిలో సత్త్వగుణం పెరుగుతుంది. రజోగుణ తమోగుణాలు అణగారిపోతాయి. రాజసమైన వాటిని అనుసరిస్తే సత్త్వగుణం, తమోగుణం అణగిపోయి రజోగుణం వృద్ధి చెందుతుంది. తామసికమైన వాటిని అనుసరించే వారిలో తమోగుణం పెరిగిపోతుంది. సత్త్వగుణం, రజోగుణం అణగారిపోతాయి.

ఈ శ్లోకంలో కూడా అర్జునుని భారత! అని సంబోధిస్తున్నాడు భగవానుడు. అంటే జ్ఞానము నందు ఆసక్తి గలవాడవై సత్త్వగుణాన్ని అభివృద్ధి చేసుకో! అని సూచన ఈ పిలుపులో అంతర్లీనమై ఉన్నది.

ఇంతవరకు భగవానుడు ఒక గుణం ప్రబలంగా ఉంటే మిగిలిన రెండు గుణాలు అణగిఉంటాయని బోధించాడు. అయితే మనం ప్రయత్నంతో ఒక గుణాన్ని పెంచుకున్నాం అనుకుందాం. ఆ గుణం మనలో పెరిగిందని ఎలా తెలుస్తుంది? ఆ విషయాన్ని వరుసగా 3 శ్లోకాల ద్వారా చెప్పబోతున్నాడు. ముందుగా సత్త్వగుణం గురించి చెబుతున్నారు.

- సత్త్వగుణం మనలో అభివృద్ధి చెందినది అని మనలోని ఏ లక్షణాలను బట్టి తెలుసుకోగలం?

**శ్లో||** సర్వ ద్వారేషు దేహేఽస్మిన్
ప్రకాశ ఉప జాయతే |
జ్ఞానం యదా తదా విద్యాత్
వివృద్ధం సత్త్వ మిత్యుత || (11)

**తా||** ఈ దేహంలోని అన్ని ద్వారాల నుండి ప్రకాశరూపమైన జ్ఞానం ఎప్పుడు వ్యక్తమవుతుందో అప్పుడు సత్త్వగుణం వృద్ధి అవుతున్నట్లు తెలుసుకో.

**వ్యాఖ్య :** మన దేహంలో కర్మేంద్రియాలు; జ్ఞానేంద్రియాలు; మనస్సు, బుద్ధి అనే అంతరింద్రియాలు - ఇవన్నీ 'ద్వారాలే'. ఇంటికి ద్వారాలుంటాయి. అవి దేనికి ఉపయోగపడతాయి? బయటి నుండి లోపలకు, లోపల నుండి బయటకు

తిరగటానికి ఉపయోగపడతాయి. అలాగే దేహంలోని ఈ ఇంద్రియాలు కూడా బయటనున్న విషయాలను గ్రహించి లోపలకు చేర్చటానికి; లోపల నుండి సూచనలను, ఆజ్ఞలను బయటకు వెలువరించటానికి ఉపయోగపడతాయి. అందుకే వీటిని “ద్వారాలు” అన్నారు.

ఎప్పుడు సత్త్వగుణం వృద్ధి చెందుతూ ఉంటుందో అప్పుడు అంతఃకరణంలోని జ్ఞానం ఇంద్రియాల ద్వారా వెలుపలకు వ్యక్తమవుతుంది. హంస ఎలాగైతే పాలు - నీరును వేరు చేయగలుగుతుందో అలాగే సత్త్వగుణ సంపన్నుడు ఇది సత్యము - ఇది అసత్యము అని, ఇది మంచి, ఇది చెడు అని విచక్షణ చేయగలుగుతాడు.

- అతడి కన్నులు చూడవలసిన వాటినే చూస్తుంటాయి.
- అతడి చెవులు వినవలసిన వాటినే వింటుంటాయి.
- అతడి నాలుక అనవలసిన మాటలనే అంటుంది.
- అతడిలో వాక్శుద్ధి ఏర్పడుతుంది.

అతడిలో దైవీ గుణాలు వృద్ధి చెందుతూ ఉంటాయి. ఆసురీగుణాలు తొలగిపోతూ ఉంటాయి. అతడి ముఖం ప్రసన్నంగా ఉంటుంది. ప్రశాంతంగా ఉంటాడు.

వసంత ఋతువులో పుష్పముల యొక్క సుగంధ సువాసనలు ఎలా నలువైపుల వ్యాపిస్తూ ఉంటాయో అలాగే అతడి నుండి జ్ఞానమనే సుగంధం అన్ని వైపులా వ్యాపిస్తుంది. అతడి సాన్నిధ్యం ప్రశాంతతను, సంతోషాన్ని, సంతృప్తిని కలిగిస్తుంది.

అతడు ఈ లోకంలో దేన్ని చూస్తున్నా దాని నుండి జ్ఞానాన్ని గ్రహిస్తాడు. ఏం మాట్లాడుతున్నా జ్ఞానమే అతని నోటి నుండి జాలువారుతుంది. భగవత్సంబంధమైన జ్ఞానాన్ని అందరికి అందించాలని తహతహ లాడుతుంటాడు. అందుకోసం ఎంతటి త్యాగానికైనా వెనుకాడకుండా ఉంటాడు. ఈ లక్షణాలను బట్టి అతడు సత్త్వగుణసంపన్నుడని చెప్పవచ్చు.

ఒకడు ఎలాంటి ఆహారాన్ని భుజిస్తాడో, ఎలా మాట్లాడుతాడో, ఎలాంటి పనులు చేస్తుంటాడో, ఎలా నడుస్తాడో చూస్తే దానిని బట్టి అతడిలో ఏ గుణం అధికంగా ఉన్నదో చెప్పవచ్చు.

సత్త్వగుణ సంపన్నుడు మాట్లాడేటప్పుడు ప్రశాంతంగా మాట్లాడుతాడు, స్థిరంగా మాట్లాడుతాడు, అవసరమైన విషయాలనే మాట్లాడుతాడు. ఉద్రేకం చెందడు. భుజించేటప్పుడు సాత్త్విక ఆహారాన్నే భుజిస్తాడు. చదివేటప్పుడు ఉత్తమ గ్రంధాలనే చదువుతాడు. ఆలోచించేటప్పుడు సద్విషయాల గురించే ఆలోచిస్తాడు. అతడి సమస్త ఇంద్రియాల నుండి ప్రకాశరూపమైన జ్ఞానమే వెల్లివిరుస్తుంది. అట్టి వానిలో సత్త్వగుణం బాగా వృద్ధి చెందుతున్నదని తెలుసుకోవచ్చు.

కొందరికి ఇంకాఇంకా జ్ఞానాన్ని తెలుసుకోవాలని అనిపిస్తుంది. జన్మను సార్ధకం చేసుకోవాలని అనిపిస్తుంది. కొందరికి తెలుసుకున్న జ్ఞానం చాలులే అనిపిస్తుంది. కొందరైతే ఈ జ్ఞానం గీనం మనకెందుకు? అనవసరంగా మన టైం వేస్ట్ చేసుకుంటున్నాం అనిపిస్తుంది. ఇలా వారివారి భావాలు ఎలా ఉంటున్నాయో దానిని బట్టే వారి స్థితి అర్ధమవుతుంది. దీనిని బట్టే ఎవరిలో ఏ

గుణం ఉన్నదో, ఏ గుణం వృద్ధి అవుతున్నదో, ఏ గుణ ప్రభావంలో ఉన్నాడో తెలుస్తుంది. ఇలా తెలిస్తే తమోగుణం నుండి రజోగుణానికి, రజోగుణం నుండి సత్త్వగుణానికి ప్రయాణం చెయ్యవచ్చు.

- ఇక రజోగుణం అధికంగా ఉన్నవాడు ఎలా ప్రవర్తిస్తాడో...

**శ్లో||** లోభ ప్రవృత్తి రా రంభః
కర్మణా మశమః స్పృహా ।
రజస్యేతాని జాయంతే
వివృద్ధే భరతర్షభ ! || (12)

**తా:** ఓ భరత శ్రేష్టుడా! రజస్సు పెరుగుతూ ఉన్నప్పుడు లోభము, కర్మల యందు ప్రవృత్తి, కర్మలనారంభించుట, అశాంతి, ఆశ - ఇవి కలుగుతుంటాయి.

**వ్యాఖ్య :** రజోగుణం అభివృద్ధి చెందుతున్నది అని మనలోని ఏ లక్షణాలను బట్టి చెప్పవచ్చు అనే దానికి సమాధానంగా ఇక్కడ 5 లక్షణాలను చెప్పారు. అవే 1. లోభం 2.ప్రవృత్తి 3. కర్మణా ఆరంభః 4. అశమః 5. స్పృహా ..

**1. లోభం** :- లోభం అంటే డబ్బుపై అధికదాహం, పిసినారితనం. నిరంతరం ధనసంపాదన; సంపాదించిన దానిని ఇళ్ళరూపంలోనో, బంగారం రూపంలోనో, పొలాలు - స్థలాల రూపంలోనో, వ్యాపారాలు - పరిశ్రమల రూపంలోనో, బ్యాంకు పత్రాల రూపంలోనో, ప్రామిసరీ నోట్ల రూపంలోనో దాచుకొని, చూచుకుంటూ ఆనందించటం; సంపాదించిన దానిని ఏ మాత్రం


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఖర్చు పెట్టకుండా, తాను  తినకుండా ఇతరులకు పెట్టకుండా ఉండటం. ఇదే లోభం. తనంత తానుగా పైసా వదలకపోయినా ప్రకృతి గాని, అదృశ్య శక్తి గాని బలవంతంగా అతడి వద్ద నుండి లాగివేస్తుంది. ఎంతకాలం, ఎంత సంపాదించినా, ఎంత నిలవ చేసినా ఎప్పుడో ఒకప్పుడు అది మనలను వదిలి పోవటమో, మనమే దానిని వదిలిపోవటమో తప్పక జరుగుతుందని ఊహించలేడు రజోగుణసంపన్నుడు.

లోభికి సంబంధించిన వేదాంత వాక్యం ఒక దానిని చమత్కారంగా చెబుతారు. "అనిత్యాని శరీరాణి అందరి సొమ్ము నాకే రానీ" - అని. అందరూ  ఎప్పుడో ఒకప్పుడు అంతో ఇంతో త్యాగం చేస్తుంటారు. కాని లోభికి అసలు త్యాగమంటే ఏమిటో తెలియదు అంటారు. కాని ఇది నిజం కాదు. ఎందుకంటే తానుతింటూ, అనుభవిస్తూ, ఇతరులను అనుభవించనిస్తూ మిగిలిన దానినే ఎవరైనా త్యాగం చేస్తుంటారు. కాని లోభి అలా కాదు. తాను తినడు, ఇతరులను తిననివ్వడు, ఏమీ సుఖాలు అనుభవించడు, పైసా ఖర్చు చెయ్యడు. జీవితమంతా కూడబెట్టి, కూడబెట్టి మొత్తం మొత్తంగా ఒక్కసారిగా అప్పగించి వెళతాడు. ఇదెంత గొప్ప త్యాగం? కనుక లోభి మహా త్యాగి అని అంగీకరించాలి.

లోభి విషయంలో 'నేను' కన్నా 'నాది' కి ఎక్కువ విలువ. మనిషి కన్నా డబ్బుకే ఎక్కువ విలువ. డబ్బు కన్నా మనిషి గొప్పవాడని అంగీకరించడు. భార్యాబిడ్డలకన్న, బంధుమిత్రులకన్న, తల్లిదండ్రులకన్న, గురువుకన్న, దైవంకన్న

డబ్బే గొప్పదని భావిస్తాడు. లోభం రజోగుణానికి పెద్ద కొడుకు లాంటిది. కనుక లోభి రజోగుణ సంపన్నుడు.

**2 ప్రవృత్తి:-** ఎప్పుడూ ప్రాపంచికవిషయాలపైనే ఆసక్తి. పారమార్థిక విషయాలు కూడా గొప్ప కోసం చేస్తుంటాడు. నిరంతరం ఏవో ఆలోచనలు చేస్తుంటాడు. గాలిలో మేడలు కడుతుంటాడు. ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమై యుంటాడు. ప్రశాంతంగా ఉండలేడు. హడావుడి, ఆందోళన, పరుగులు . ఏదో సంపాదించాలని తహతహ. అంతులేని కోరికలతో వేగిపోతుంటాడు.

ఉద్యోగాలు చేసి రిటైరైనా, వ్యాపారాలు - వృత్తులు చేసి వృద్ధాప్యం వచ్చినా ఇంకా ఏదో చేయాలని, సంపాదించాలని తహతహలాడేవారు ఈ జీవిత చరమాంకంలో నన్నా భగవత్సేవకై జీవితాన్నిఅంకితం చేయాలని భావించక ఇంకా లౌకికప్రవృత్తిలో ఉన్నవారంతా ఈ రాజసికలక్షణం గలవారే.

**3. కర్మణా ఆరంభః :-** ధనదాహం కలిగిన లోభి నిరంతరం ప్రవృత్తిలోనే ఉంటాడు. ఏవేవో కర్మలను ప్రారంభిస్తాడు. అవి పూర్తి చేసిగాని, చేయకుండాగాని మళ్ళీ క్రొత్త పనులు ప్రారంభిస్తాడు. పని చెయ్యటానికి ముందే వచ్చే ఫలితం గురించి ఆలోచిస్తాడు. అంచనా వేస్తాడు. ఇది లాభం లేదని - అది బాగాలేదని పనులను మార్చిమార్చి చేస్తుంటాడు. వాడి మనస్సు నిలకడగా ఉండదు. కందెనలేని ఇరుసులాగా ఎప్పుడూ గరగరమంటూ పనులలో మునిగిపోతుంటాడు.

ఒకసారి కోతులు మామిడితోటను వెయ్యాలనుకున్నాయి. ఎంతో ప్రయత్నం చేసి మంచి విత్తనాలు తెచ్చి నాటినవి. అయితే మరుసటి రోజు నుంచి తమ విత్తనాలు ఎలా పెరుగుతున్నాయో చూడాలని రోజూ ఆ విత్తనాలను బయటకు తీసి వాసన చూచి మళ్ళీ యధా ప్రకారంగా నాటుతున్నాయి. ఎన్నాళ్ళు ఇలా గడిచిపోయినా అవి అలాగే చేస్తూ ఉన్నాయి. కాని మొలక మాత్రం రాలేదు. రాజసగుణం ప్రధానంగా ఉన్న వ్యక్తి పనులు ఇలాగే ఉంటాయి. త్వరత్వరగా ఫలితాల కోసం ఎదురుచూస్తూ చేసే పనులను సక్రమంగా చేయడు.

**4. అశమం (అశాంతి)** :- లోభ బుద్ధి గలవాడు నిరంతరం ప్రవృత్తి యందే ఉంటాడు. కర్మలను చేస్తూ ఉంటాడు. మార్చిమార్చి చేస్తుంటాడు. ఇలా ఎప్పుడూ లేనిపోని కర్మలను నెత్తిపై వేసుకుంటూ ఉండటం వల్ల శాంతి ఉండదు. ప్రశాంతత ఉండదు. అశాంతి కలుగుతుంది. చేసిన పనులవల్ల ఎంత ప్రయోజనం సిద్ధించినా సంతృప్తి కలగదు. ఇంకాఇంకా ఎక్కువ పొందాలనుకుంటాడు. ఎప్పుడూ అవే ఆలోచనలు. అప్పుడప్పుడు చేసిన పనిలో ప్రయోజనం కలగకపోయినా, నష్టం కలిగినా విపరీతంగా చలించిపోతాడు. అందుకే అశాంతి పాలౌతాడు. కోరిన కోరికలు తీరుతున్నా క్రొత్తగా కోరికలు కలిగి వాటికోసం ప్రయత్నం ప్రారంభిస్తాడు. ఉన్న దానితో తృప్తిచెందక, వచ్చే దానితో తృప్తిచెందక అన్నింటికీ అశాంతితో అలమటిస్తుంటాడు. ఇలా అశాంతి పాలయ్యేవారంతా తప్పకుండా రజోగుణంతో ఉండే వారేనని గ్రహించవచ్చు.

**5. స్పృహ(ఆశ)** :- ఏది చూచినా నాకే కావాలి. ఇవ్వాళ ఇది చేశాను, రేపు అది చేస్తాను అంటూ తలమునకలయ్యే ప్రణాళికలు వేస్తుంటాడు. సామాన్యమైన ఆశయే స్పృహ. ఇది ముదిరితే లోభం అవుతుంది. కలిసి రాకపోతే కలసి రాలేదని బాధ. కలిసి వస్తే ఇంకా ఇంకా కావాలని ఆశ. ఒక ఇల్లుంటే రెండు, మూడు కావాలి. ఒక వ్యాపారం చేస్తూ మరో రెండు మూడు వ్యాపారాలు చెయ్యాలని ఆశ. ఒక పరిశ్రమ ఉంటే ఇంకా నాలుగైదు నెలకొల్పాలని ఆశ. ఒక ఆశ్రమం ఉంటే ఇంకా నాలుగైదు ఆశ్రమాలు స్థాపించాలని ఆశ. దేశంలో 10 ఆశ్రమాలుంటే విదేశాల్లో 100 ఆశ్రమాలను కట్టించాలని కోరిక. ఇలా కోరికలను పెంచుకుంటూ, అవి ఆశలుగా మారి, వాటినే ఆశయాలని భావిస్తూ నిరంతరం కర్మ రంగంలో ఉంటూ తృప్తి పరచలేని మనస్సు గలవాడే రజోగుణ సంపన్నుడు. ఇలా ఈ పై లక్షణాలున్నవాడు రజోగుణ సంపన్నుడని తెలుసుకోవచ్చు.

- ఇక తమోగుణంలో ఉన్నాడని ఏ లక్షణాలను బట్టి తెలుసుకోగలం.

శ్లో|| అప్రకాశోఽప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహ ఏవచ |
తమస్యే తాని జాయంతే
వివృద్ధే కురు నందన ! || (13)

**తా||** కురునందనా! అర్జునా! తమోగుణం పెరుగుతున్నప్పుడు బుద్ధి మందగించటం (అయోమయ స్థితి), ఏమరుపాటు, బద్ధకం (సోమరితనం), భ్రాంతి జనిస్తాయి.

**వ్యాఖ్య:-** తమోగుణం ఒకరిలో వృద్ధి అవుతున్నది - అని ఎలా తెలుసుకోగలమో ఇక్కడ నాలుగు ముఖ్య లక్షణాలను చెబుతున్నారు. అవి 1. అప్రకాశం (బుద్ధి మాంద్యం - అయోమయం), ప్రమాదం(ఏమరుపాటు), అప్రవృత్తి (బద్ధకం - సోమరితనం), మోహం( భ్రమ, భ్రాంతి).

**1. అప్రకాశం:** అంటే బుద్ధిమాంద్యం. ఏమీ తెలియని అయోమయ స్థితి. సాధారణంగా లోకంలో చాలామంది తమ కర్తవ్యాల గురించి, భాద్యతల గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా, అసలు ఆలోచనే చేయకుండా ఉంటారు. అలాంటి వారు ఆలోచించాలనుకున్నా సరైన ఆలోచనలే చేయలేరు. వారి బుద్ధి అసలు పని చేయదు. అందువల్ల ఏ పనీ చేయకుండా ఉంటారు. ఇక ఆధ్యాత్మిక రంగంలో కూడా తమోగుణ సంపన్నులుంటారు. శాస్త్రాల గురించి, ఆత్మజ్ఞానాన్ని గురించి ఆచార్యులు - గురువులు ఎంతగా బోధిస్తున్నా, ఎన్ని విధాలుగా స్థాయి దిగివచ్చి చెప్పినా వారికి ఏ మాత్రం జ్ఞానం బుద్ధిలోకి ఎక్కదు. ఎందుకంటే బుద్ధి మందగించి ఉంటుంది, నిద్రావస్థలో ఉంటుంది గనుక. అందువల్ల వారి స్థితి అంతా అయోమయ స్థితియే. అదే అప్రకాశం.

ధృతరాష్ట్రుడు ఇలాంటి లక్షణం గలవాడే. విదురుడు గాని, సంజయుడు గాని, భీష్మ ద్రోణులు గాని, వ్యాసుడు గాని ఎన్ని మంచి మాటలు చెప్పినా అన్నీ

వింటాడు గాని ఏ ఒక్కదాన్నీ ఆచరించడు. వాళ్ళు చెప్పిన మాటలు బాగున్నాయంటాడు. కాని వారు చూపిన మార్గానపోడు. చివరికి సర్వ నాశనం జరిగింది. ఇదే తమోగుణ లక్షణం.

కొందరు గంటలు గంటలు, రోజులకు రోజులు ప్రవచనాలు విన్నా వారిలో ఏమీ నిలవదు. కారణం తమోగుణ ప్రవృత్తియే. అలాగే నిర్ణయాలు తీసుకోవలసి వచ్చినప్పుడు అందరినీ అడిగి దేనినీ పాటించరు. ఇదే అయోమయం. అప్రకాశం అంటే ఇదే.

**2. అప్రవృత్తిశ్చ :-** ప్రవృత్తి అంటే నిరంతరం లౌకిక విషయాల పట్ల ఆసక్తితో కర్మలు చేయుట. అప్రవృత్తి అంటే వేటి పట్ల ఆసక్తి ఉండదు. ఏమీ చేయడు. బద్ధకంతో, సోమరితనంతో, ఎక్కువగా నిద్రకు అంకితమై కర్తవ్య అకర్తవ్యాల పట్ల ఏ మాత్రం ధ్యాస లేకుండా ఉండిపోతాడు. ఇదే సోమరి లక్షణం. ప్రపంచంలో అన్నీ ఉన్నాయి. కాని సోమరికి ఏమీ లేదు. సోమరి తలకాయలో దయ్యాలు నివసిస్తాయి. ఇదంతా తమోగుణ లక్షణం.

**3. ప్రమాదం:-** అంటే ఏమరుపాటు, మతిమరపు, తెలివి తక్కువతనం - అని. ఇలాంటి వారికి ఏమిచేయాలో తోచదు. ఏమీ గుర్తుండదు. గోళ్ళు గిల్లుకుంటూ, పుల్లలు విరుచుకుంటూ ఉంటారు. చిన్నచిన్న పనులకు కూడా జాము సేపు గడుపుతుంటారు. వీరికి మతిమరపు ఎక్కువ. ఒకవేళ ఏదన్నా పనిచేయటానికి సిద్ధమైనా తెలివి తక్కువ తనంతో ఆ పనిని చెడగొడతారు.

**4. మోహం :-** అంటే భ్రమ - భ్రాంతి - మూఢత్వం అని కూడా అర్థం. చూచిన వాటిని నాది అని పట్టుకోవటమే మోహం. తనకు ఏది అవసరమో, ఏది



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అవసరం లేదో కూడా తెలియదు. తనకు కావలసిన దాన్ని ఎదురుగా ఉన్నా వదిలేసుకుంటాడు. ఎందుకూ పనికిరానిదాన్ని ఎంతో అపురూపంగా దాచుకుంటాడు. ఇదంతా తమోగుణ లక్షణమే.

సాధకుడైన వాడు ముందుగా ఈ తమోగుణ కార్యాలను నిరోధించాలి, నిగ్రహించాలి. రజోగుణాన్ని ఆశ్రయించి తమోగుణాన్ని తొలగించాలి. సత్త్వగుణాన్ని ఆశ్రయించి రజోగుణాన్ని పారద్రోలాలి. చివరకు సత్త్వాన్ని కూడా దాటి శుద్ధసత్త్వంలో నిలవాలి.

చెట్టు మొదట్లో నీరుపోస్తే పిందె కాయగా మారి, కాయ పండుగా మారి చివరకు చెట్టు నుండి రాలిపడిపోతుంది. పిందె వగరుగా ఉంటుంది. కాయ పులుపుగా ఉంటుంది. పండు తియ్యగా ఉంటుంది. పిందె తమోగుణం, కాయ రజోగుణం పండు సత్త్వగుణం. చివరకు పండు చెట్టు నుండి రాలి పడుతుంది. అలాగే మనలో ఏ గుణం ఉందో కనిపెట్టి, సాధన (ప్రయత్నం) చేసి క్రమంగా ఒక్కొక్క గుణాన్ని వదులుతూ చివరకు గుణాతీతుడై జీవన్ముక్తుడు కావాలి. ఈ గుణ సంబంధ విషయాలను తెలుసుకొంటే మనలో ఏ గుణం ప్రబలంగా ఉన్నదో తెలుసుకొని తొలగించుకోగలుగుతాము.

- ఏ గుణం ఆధిక్యంలో ఉన్నప్పుడు మరణిస్తే ఏ జన్మ వస్తుంది? ఇంతవరకు ఏ గుణం ప్రబలంగా ఉంటే ఏ లక్షణాలు మనలో ఉంటాయో చెప్పారు. దీనివల్ల మనలో ఏ గుణం ప్రబలంగా ఉన్నదో తెలుసుకుంటాం. ఇప్పుడు ఏ గుణం ప్రబలంగా ఉన్నప్పుడు మరణిస్తే ఏ జన్మ వస్తుందో చెప్పబోతున్నారు.

**శ్లో||** యదా సత్త్వే ప్రవృద్ధేతు

ప్రళయం యాతి దేహభృత్ ।

తదోత్తమ విదాన్ లోకాన్

అమలాన్ ప్రతి పద్యతే ॥ (14)

**తా||** ఎప్పుడు సత్త్వగుణం వృద్ధి చెందుతుండగా దేహధారి మరణిస్తాడో అప్పుడు ఉత్తమజ్ఞానంగల నిర్మలమైన లోకాలను పొందుతాడు.

**వ్యాఖ్య :-** మనం ఈ జన్మలో ఎంతవరకు సాధనచేస్తామో అక్కడి నుండే మరుజన్మ ప్రారంభమవుతుంది అని 6 వ అధ్యాయంలో తెలుసుకున్నాం. దాని వివరాలనే ఇక్కడ ఇస్తున్నారు. ఇక్కడ మనం సంపాదించిన లౌకిక వస్తువులు అన్నీ ఇక్కడే వదిలిపోవాలి. ఇళ్ళువాకిళ్ళు గాని, ధనధాన్యాలు గాని, భార్యాబిడ్డలు గాని, వస్తువులు గాని - అన్నింటినీ పూచికపుల్లతో సహా వదిలి పోవాల్సిందే. అయితే మనతో వచ్చేవేమిటి? మనం చేసుకున్న పుణ్యకర్మల తాలూకూ పుణ్యఫలం, పాపకర్మల తాలూకూ పాపఫలం - ఇవి తప్పకుండా మనతోనే వస్తాయి. అలాగే ఈ జన్మలో చేసిన సాధనలు - అంటే శ్రవణం, మననం, నిధిధ్యాసనం, జపం, ఆత్మవిచారణ మొ||న వన్నీ మనతో వస్తాయి. వాటిని కొనసాగించటానికి తగిన జన్మయే తర్వాత మనకు లభిస్తుంది.

ఈ లోకంలో కొందరు పుట్టుకతోనే భాగ్యవంతులుగా పుడతారు. కొందరు పుట్టుకతోనే కటిక దరిద్రులుగా పుడతారు. పుట్టుకతోనే ఇలా తేడాలు రావటానికి ఆ పసికూనలు చేసిందేమిటి? ఏదో కారణం ఉండాలి

గదా! వారు ఇప్పుడేమీ చేయలేదు. వారి పూర్వజన్మలలో వారు చేసిన పుణ్య, పాప కర్మలే ఇప్పటి ఈ సుఖస్థితికి, దుస్థితికి కారణాలు. అంటే పునర్జన్మ సిద్ధాంతం ఇక్కడ ఋజువౌతున్నది. క్రైస్తవులు, మహమ్మదీయులు పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్మరు. మరి పుట్టుకతోనే ఈ తేడాలు ఎందుకు వస్తున్నవి? అంటే సరైన సమాధానం చెప్పలేరు.

మరణం అంటే స్థూలశరీరాన్ని విడచిపెట్టటమే. ఎవరు విడిచి పెడుతున్నారు? సూక్ష్మశరీరం కారణశరీరం - ఈ రెండింటితో కూడిన జీవుడు విడిచి పెడుతున్నాడు. సూక్ష్మశరీరం అంటే మనోబుద్ధులే. ఈ మనోబుద్ధుల ప్రకారమే ఇంతకాలం స్థూలశరీరం పనిచేసింది. ఇప్పుడా మనోబుద్ధులు ఇక ఈ స్థూలశరీరం తమ అనుభవాలకు పనికిరాదని వదిలేసి వెళుతున్నాయి. అయితే ఏ మార్గాన వెళుతున్నాయి? అనే విషయం తేలాలి. దేనిని బట్టి తేలుతుంది? ఇప్పటి స్థూలశరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళే సమయంలో ఈ మనోబుద్ధులు ఏ ఆలోచనలు చేస్తున్నాయో, ఎట్టి స్థితిలో ఉన్నాయో, ఎట్టి సంకల్పాలు చేస్తున్నాయో దానిని బట్టే వాటి ప్రయాణం. దానిని బట్టే మరుజన్మ.

ఒక డాక్టరు ఒక్క క్షణంలో లాయరుగా మారి కోర్టులో వాదించలేడు. ఒక లాయరు డాక్టరుగా మారి మందులిచ్చి జబ్బు నయంచేయలేడు. ఏం చేయాలన్నా ఆయా వృత్తులలో, విషయాలలో కొంతకాలం పాటు సాధన చెయ్యాలి. అంటే మనస్సుకు కొంతకాలం ఆయా రంగాలలో శిక్షణ ఇవ్వాలి. అప్పుడే మనస్సు ఆ రంగంలో పనిచేస్తుంది. అలాగే మనస్సు ఏ సంకల్పాలు

చేస్తున్నప్పుడు దేహాన్ని విడిచిపెడుతుందో, ఆ సంకల్పాలను నేరవేర్చుకోనుటకే ఆ తరువాత ప్రయత్నిస్తుంది. అందుకొరకే తగిన దేహాన్ని తెచ్చుకుంటుంది.

ఇప్పుడు ఇక్కడ కూర్చొని భగవద్గీత వింటున్నారు. ఇక్కడి నుండి వెళ్ళేటప్పుడు అయ్యో! వంట చెయ్యలేదే! అనుకున్నారు కొందరు. మరి ఒకరు హైదరాబాద్ వెళ్ళటానికి బస్సు 10 గంటలకే గదా! అనుకున్నారు. అబ్బ! ఇవ్వాళేమిటో బాగా ఆకలవుతున్నది అనుకున్నారు ఒకరు. ఈరోజెందుకో నిద్ర తూలుతున్నది అనుకున్నారు కొందరు. ఇప్పుడు వంట చేయ్యలేదనుకున్న వారు ఇంటికి చేరటంతోనే వంటగదిలో అడుగుపెడతారు. ఆకలి అనుకున్న వారు కంచం దగ్గరికి, నిద్ర తూలుతున్నదనుకున్నవారు మంచం దగ్గరకు వెళతారు.

అలాగే ఈ జన్మ చివరిలో దేహాన్ని విడిచివెళ్ళేటప్పుడు ఏ సంకల్పాలు ఉన్నాయో దాని ప్రకారమే తరువాతి జన్మ. అంటే ఇప్పటి ఈ జన్మ పూర్వజన్మలో శరీరాన్ని వదిలేటప్పటి మనోస్థితి యొక్క కొనసాగింపే. అలాగే ఈ జన్మ చివరిలో మన మనోస్థితి యొక్క కొనసాగింపే వచ్చే జన్మ. కనుక మరణంతో అంతా ముగిసిపోయినట్లు కాదు. జీవుడితో పాటుగా అతడి ఆలోచనలు, సంకల్పాలు, పాపపుణ్యాలు ప్రయాణం సాగిస్తాయి. ఆ దేహం వదిలి పోవటంతో ఆ ఆలోచనలు, సంకల్పాలు వ్యక్తం కావటానికి తగిన దేహంతో తిరిగి రావాలి.

మనకు జన్మతో పాటుగా కొన్ని అవకాశాలు లభించటమో, లభించక పోవటమో జరుగుతుంది. జన్మ రావటమనేది కేవలం ఛాన్సు కాదు. జీవుడు

ముందు జన్మలో చేసిన ప్రయత్నాన్ని బట్టే - సంకల్పాలను బట్టే ఉంటుంది. ముందు జన్మలో దేహం రాలిపోతున్నప్పుడు ఇచ్చిన మలుపే ఈ జన్మకు కారణం.

అయితే దేహం రాలిపోతున్నప్పుడు ఎలాంటి ఆలోచనలు ఉంటే ఎలాంటి జన్మ వస్తుంది? ఎలాంటి లోకాలను దర్శిస్తాడు? ఎలాంటి అనుభవాలను పొందుతాడు అనేది ఈ శ్లోకం ద్వారా తెలియజేస్తున్నారు.

దేహం వదిలేసమయంలో సత్త్వగుణం అధికంగా ఉంటే - అంటే భగవత్ సంబంధమైన జ్ఞానం, ఆలోచనలు, మోక్షసంబంధమైన ఆలోచనలు ఉన్నట్లయితే ఉత్తమజ్ఞానుల లోకాలను - నిర్మల లోకాలను చేరుతాడు అని ఇక్కడ చెబుతున్నారు. లోకాలంటే దేహాలు, జన్మలు అని అర్థం. కనుక ఉత్తమ జ్ఞానుల లోకాలు అంటే జ్ఞానులుగా జన్మిస్తారు అని. అలాగే నిర్మల లోకాలు అంటే ప్రశాంత జీవనాన్ని గడిపే నిర్మల మనోబుద్ధులు గలవారు అని అర్థం. కనుక జ్ఞానుల ఇండ్లలో, తత్త్వవేత్తల గృహాలలో, సహృదయుల ఇళ్ళలో జన్మిస్తారు.

అయితే సత్త్వగుణం అప్పటికప్పుడు అలవడేది గాదు. అంత్యకాలంలో అలవరుచుకుందామంటే కుదిరే పని గాదు. అసలు అంత్యకాలం ఎప్పుడో ఎవరికీ తెలియదు. కనుక జీవితమంతా ప్రయత్నించాలి. సాధన చెయ్యాలి. అప్పుడే సత్త్వగుణం సహజగుణంగా మారుతుంది. అదే చివరి దాకా ఉంటుంది.

- ఇక రజోగుణ, తమోగుణాలు ప్రబలంగా ఉన్నప్పుడు మరణిస్తేనో!....

**శ్లో||** రజసి ప్రళయం గత్వా
కర్మ సంగిషు జాయతే ।
తదా ప్రలీన స్తమ సి
మూఢ యోని షు జాయతే ॥ (15)

**తా||** రజోగుణంలో ఉన్నప్పుడు మరణించినవాడు కర్మాసక్తులగు వారియందు జన్మిస్తాడు. అలాగే తమస్సులో మరణిస్తే మూఢ యోనులలో జన్మిస్తాడు.

**వ్యాఖ్య :** జీవితంలో ఎక్కువ కాలం సత్త్వగుణంలో గడిపినవాడైనా, అలాగాక తమోగుణంతో అజ్ఞానిగా, మూఢునిగా, సోమరిపోతుగా గడిపిన వాడైనా మరణసమయంలో రజోగుణంలో నిలిస్తే అతడు పొందే జన్మ కర్మాసక్తుల జన్మయే. అంటే నిరంతరం కర్మలు చేయుటయందే ఆసక్తి కలిగి ఉంటాడు. ఒక్క క్షణం కూడా ప్రశాంతంగా, నిశ్చలంగా కూర్చోలేడు. అలాంటి జన్మయే వస్తుంది.

అలాగే ఒకడు సత్త్వగుణం కలిగి ఉండి, జ్ఞానాన్ని ఆర్జిస్తూ, జపం, ధ్యానం మొదలైన సాధనలు చేస్తూ, శ్రవణ మనన విచారణలను కొనసాగించినా; లేక రజోగుణ ప్రాబల్యంతో నిరంతరం కర్మలలో మునిగిపోయిన వాడైనా ఏ కారణం చేతనైనా మరణసమయంలో అతడిలో తమోగుణం ప్రవేశించిందా, అదే ప్రాబల్యం వహించిందా - అతడు మూఢ యోనులయందు జన్మిస్తాడు. అంటే బుద్ధిలేని జంతువులుగానో, పశుపక్ష్యాదులుగానో, క్రిమికీటకాలుగానో నీచనికృష్ట జన్మలెత్తాలి. అలాగాక ఒకవేళ మానవ జన్మ వచ్చినా బుద్ధి మాంద్యం

గలవాడిగా, పిచ్చివాడిగా, తెలివి తక్కువ వాడిగా జన్మిస్తాడు. అతడు మూఢుడు గానే జీవితాన్ని గడుపుతాడు.

కనుక జీవితమంతా ఎలా గడిపినా శరీరాన్ని విడిచే సమయంలోని ఆలోచనలు - సంకల్పాలే ముఖ్యం. కొందరు ప్రారంభంలో పూర్వజన్మ సుకృతం వల్ల ఆధ్యాత్మికమార్గంలో ప్రవేశించినా; జీవితంలో ఎదురయ్యే సంఘటనల వల్లనో, కష్టనష్టాల వల్లనో మనసు మార్చుకొని దేవుడు - దేవుడు అని కూర్చుంటే ప్రయోజనం లేదు, ముందు మన కష్టాలు, బాధలు తీరాలి - అని కర్మరంగంలో ప్రవేశించి కోరికలతో, ఆశలతో కర్మలు చేస్తూ, తీరిన కొద్దీ ఇంకాఇంకా ఆశలు పెరిగి, వాటిని తృప్తి పరచుకొనుటకు కర్మలలో మునిగిపోతే కర్మరంగంలో ఇరుక్కుపోతాడు, రజోగుణం వృద్ధి అవుతుంది. అప్పుడు మరణం సంభవిస్తే అయ్యో! నేను అది చేద్దాం, ఇది చేద్దాం అనుకున్నాను. ఏదీ పూర్తిగా చెయ్యకుండానే వెళ్ళిపోతున్నానే అనే చింతతో ప్రాణం విడిస్తే అతడు అలాంటి కర్మలు చేయుటకు తగిన దేహాన్నే తెచ్చుకుంటాడు. కర్మలలో నిమగ్నమవుతాడు. అదే కర్మసంగులలో జన్మించుట. అలా జన్మించి ఈ వాసనల కారణంగా నిరంతరం లౌకిక విషయాల గురించే ఆలోచిస్తూ, లౌకిక కర్మలనే చేస్తూ ఈ సంసారబంధంలో చిక్కుకొని అనేక యాతనలను అనుభవిస్తూ అశాంతితో జీవిస్తాడు.

ఇక కొందరు జీవితమంతా ఎలా ప్రవర్తించినా, ఎలాంటి సత్కర్మలు చేసినా, జ్ఞానాన్ని సంపాదించినా అంత్య దశలో కుమారుల వల్లనో, కోడళ్ళ వల్లనో, వ్యాధుల వల్లనో జీవితం మీద విరక్తి చెంది ఏ కుక్కలనో, పందులనో,

పశువులనో చూచి, “నాకంటే అవే నయం. హాయిగా తింటూ తిరుగుతూ స్వేచ్ఛగా జీవిస్తున్నాయి. నా బ్రతుకే హీనాతిహీనమైపోయింది. ఎలా బ్రతికాను? ఎంత గౌరవాన్ని పొందాను? చివరికి వీళ్ళ చేతుల్లోపడి అవమానాలు పొందాల్సి వచ్చింది” - అనుకుంటూ ఉంటారు. అలాగే మనకు ఎంతటి వివేకం ఉన్నా, దాని విలువను మరచిపోయి ఏ పిచ్చివాణ్ణో చూచి, “మనకంటే వాడే నయం. వాడికి ఏ బాధా తెలియదు. ఏ దిగులూ లేదు” అని వాణ్ణి చూచి కూడా అసూయపడతాం. బుద్ధి గల మానవ జన్మ కన్నా బుద్ధి లేని జన్మలే నయం అనుకుంటూ ఉన్నప్పుడు ప్రాణంపోతే దేహాన్ని విడిచిన మనోబుద్ధులు ఆ దిశలోనే ప్రయాణంచేసి అలాంటి బుద్ధిహీనజన్మలనే పొందటం జరుగుతుంది. మూఢయోనులందు పశుపక్ష్యాదులుగా జన్మించటం జరుగుతుంది. లేదా పిచ్చివాడుగా, మెదడు మొద్దుబారినవాడిగా పుట్టటం జరుగుతుంది. ఆ జన్మలలోని బాధ అప్పుడు అనుభవానికి వస్తుంది. ఇది తమోగుణ ప్రభావం వల్ల కలిగే జన్మ.

ఇలాంటి నీచనికృష్టజన్మలు కలగకుండా మనలో రజోగుణ తమోగుణాలు తలెత్తకుండా చూసుకోవాలి. అందునా అంత్యకాలంలో ఈ రజోగుణ తమోగుణ లక్షణాలు లేకుండా నిరంతరం జ్ఞానసంబంధ విషయాలనే విచారణచేస్తూ ఉండాలి. భగవంతుని పట్ల భక్తి, ప్రాపంచిక విషయవైరాగ్యం, భగవన్నామస్మరణ, శ్రవణ, మనన, నిధిధ్యాసనలు, జపం లేదా నేను సర్వవ్యాపక, ఆనందస్వరూప ఆత్మననే భావన నిరంతరం కలిగి ఉండాలి. అప్పుడే లభించిన ఈ మానవ జన్మకు సార్థకత.

అయితే ఇక్కడే ఒక సందేహం. అంత్యకాలంలో స్మరణ చెయ్యాలంటే జీవితమంతా అలా భగవత్ స్మరణ చెయ్యాలి అన్నారు గదా! అలా భగవత్ స్మరణ జీవితమంతా కొనసాగించే వారికి ఇంకా భయమెందుకు? అని సందేహం. నిజంగా జీవితమంతా - చివరి శ్వాస వరకు భగవంతుని తలచుకునేవారికి భయంలేదు. నిరంతరం శ్రవణ భాగ్యం పొందేవారికి భయం లేదు. కాని చాలాకాలం ఆచరణచేసి మధ్యలో ఏ కారణం చేతనైనా దారి తప్పితేనే ఈ భయం. కనుక ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా భగవచ్చింతనను వదిలిపెట్టరాదు. శ్రవణ మననాలను వదలరాదు. సాధనలు మధ్యలోనే ఆపి వేయరాదు. కనుక కష్టాలకు భయపడక, ఆటంకాలకు లొంగిపోక, జీవితంలో ఎదురయ్యే సంఘటనలకు చలించక వాటన్నింటిని అల్పమైనవిగా భావించి, త్రోసివేసి, ఏ క్షణంలో దేహం రాలిపోతుందో తెలియదు గనుక ప్రతి క్షణము సత్త్వగుణంలో ఉండాలి. ఆత్మ భావనలో ఉండాలి. లేదా కనీసం భగవంతుని స్మరణలో ఉండాలి.

- ఏ గుణాలు ప్రబలంగా ఉన్నప్పుడు మరణిస్తే ఎలాంటి జన్మలు వస్తాయో ఇంతవరకు చెప్పారు. ఐతే ఉత్తమ జన్మలు పొందిన వారంతా ఎప్పుడూ సుఖాలే అనుభవిస్తారా? నీచజన్మలు పొందినవారు ఎప్పుడూ దుఃఖాలే అనుభవిస్తారా? కాని మన అనుభవంలో దుర్మార్గులు, నీచ జన్మలెత్తిన వారు సుఖాలు అనుభవించటం, భక్తులు - జ్ఞానులు ఐనవారు దుఃఖాలు అనుభవించటం చూస్తూనే ఉన్నాం గదా! దీనికి కారణం ఏమిటి?

**శ్లో||** కర్మణ స్సుకృత స్యాహుః
సాత్త్వికం నిర్మలం ఫలం |
రజసస్తు ఫలం దుఃఖం
అజ్ఞానం తమసః ఫలం || (16)

**తా||** పుణ్యకర్మలకు, మంచిపనులకు సాత్త్వికమైన, నిర్మలమైన ఫలం లభిస్తుందని అంటారు. రజోగుణ కర్మలకు దుఃఖమే ఫలమని, తమోగుణ కర్మలకు అజ్ఞానం ఫలమనీ చెబుతారు .

**వ్యాఖ్య :-** జీవితం ఒక పొలం లాంటిది. పొలంలో ఏ విత్తనం వేస్తే ఆ పంట వచ్చినట్లు ఈ జీవితమనే పొలంలో ఏ గుణ సంబంధమైన కర్మను చేస్తే దానికి తగిన ఫలమే వస్తుంది.

వివేకవంతుడు జీవితాన్ని దివ్యంగా మలుచుకుంటాడు. వివేక హీనుడు - ఆలోచనా రహితుడు జీవితాన్ని దుఃఖమయం చేసుకుంటాడు. గోడకట్టే వాడు పైకి పోతాడు. భావి త్రవ్వేవాడు లోపలకు వెళ్తాడు. చేసిన కర్మ ఊరకే పోదు. ఫలితాన్ని ఇచ్చే తీరుతుంది.

పుణ్యకర్మలు చేసిన వారికి నిర్మల ఫలం - అంటే చిత్తశుద్ధియే. అతడు తన మనస్సును పెడదారులకు పోనీయడు. తాను ఉద్ధారకమవుతూ ఇతరులకు మార్గదర్శకంగా ఉంటాడు.

ఇక ఆశ, లోభం, అహంకారం, కీర్తిప్రతిష్టలు, పదవులు - వీటికి లోబడి కర్మలు చేసేవాడు చేజేతులా కర్మబంధంలో ఇరుక్కొని దుఃఖాలను నెత్తిమీదకు


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తెచ్చుకుంటాడు. విషయాల వైపుకు ఆకర్షించబడుతాడు. వీరు రజోగుణ కర్మల ఫలం అనుభవించేవారు.

అలాగే తామస కర్మలఫలంగా ఏమరుపాటు, సోమరితనం, నిద్ర, అజ్ఞానం మొ||న లక్షణాలతో స్థబ్దుగా ఉంటారు. వీరు జ్ఞానశూన్యులు.

కనుక మంచిగాని-చెడుగాని ఏది పండించుకోవాలన్నా మన చేతుల్లోనే ఉన్నది. మన చేతుల్లోనే ఉంటుంది. ఉత్తమ కర్మలకే ఉత్తమఫలం.

ఐతే ఉత్తముల ఇళ్ళలో - జ్ఞానుల ఇళ్ళలో జన్మించిన వారంతా సుఖ పడతారని, మధ్యములు, అధముల ఇళ్ళలో పుట్టినవారు దుఃఖాలు పొందుతారని అనుకొనే వీలులేదు. మన సుఖదుఃఖాలకు కారణం మనం పూర్వంలో చేసిన కర్మలే కారణం. పూర్వజన్మలలో చేసిన కర్మలన్నీ సంచితమై మనతో పాటుగా ప్రయాణిస్తాయి. అందులో నుండి ఏవి పక్వానికి వస్తాయో వాటి ఫలితాన్నే ఇప్పుడు అనుభవించాలి.

పూర్వజన్మలలో చేసిన కర్మలు సంచితాలై మన వెంట వస్తాయి. అందులో సాత్త్వికభావంతో చేసిన పుణ్యకర్మలూ ఉంటాయి; రజోగుణంతో చేసిన స్వార్ధపూరిత కర్మలూ ఉంటాయి; తమోగుణంతో చేసిన విపరీత కర్మలు, నిషిద్ధకర్మలూ ఉంటాయి. ఆ కర్మలన్నింటిలో నుండి ఏవి అనుభవించటానికి సిద్ధంగా పక్వానికి వచ్చి ఉంటాయో వాటినే ప్రారబ్ధకర్మలు అంటారు. ఆ ప్రారబ్ధాన్ని తప్పక ఎవరైనా అనుభవించి తీరవలసిందే. కనుక మంచి పుట్టుక అయినా చెడ్డ పుట్టుక అయినా సుఖదుఃఖాలు మాత్రం ప్రారబ్ధాన్ని బట్టి అనుభవించవలసిందే.

దీనిని బట్టి అంత్యకాలంలోని ఆలోచనలు - సంకల్పాలు - గుణ ప్రభావాన్ని బట్టి తగిన జన్మ వస్తుంది. ఆ జన్మలో అనుభవించే సుఖ దుఃఖాలు మాత్రం అంతకు ముందు జన్మలలో చేసి, వెంట తెచ్చుకున్న సంచిత కర్మలలో నుండి పక్వానికి వచ్చిన ప్రారబ్ధకర్మలను బట్టే అనుభవించాలి అని గ్రహించాలి.

కనుక ఇప్పుడు సుఖపడే వాళ్ళంతా పూర్వజన్మలలో సాత్త్వికగుణంతో కర్మలు చేసినవారని, ఇప్పుడు దుఃఖాలు అనుభవించే వారందరూ పూర్వం రజోగుణంతో స్వార్ధపూరిత కర్మలు చేసినవారని, ఇప్పుడు అజ్ఞానంలో మునిగిపోయి సోమరిపోతుల్లా, తెలివితక్కువ దద్దమ్మల్లా, పిచ్చి వాళ్ళలా, జీవితాలను వ్యర్ధం చేసుకొనే వారంతా తమోగుణంతో నిషిద్ధ కర్మలను, విపరీత కర్మలను చేసినవారని గ్రహించాలి. ఇంత తెలుసుకున్న తర్వాత రాబోయే జన్మలలోనైనా దుఃఖాలులేని, అజ్ఞానంలేని ఉత్తమజన్మలు రావాలంటే రజోగుణ తమోగుణ కర్మలు చేయకూడదని, సత్త్వగుణంతో కూడిన సత్కార్యాలు, దైవకార్యాలు చేస్తూ ఆత్మజ్ఞానంపై ఆసక్తితో శ్రవణ మనన విచారణలతో జీవితాన్ని గడపాలని గ్రహించి మన ఆచరణను, ఆలోచనలను సరిదిద్దుకోవాలి.

- మనం మన ప్రారబ్ధం ప్రకారం సుఖదుఃఖాలు అనుభవించి తీరాల్సిందే. తప్పించుకొనే వీలు లేదు, కనుక దాని గురించి పట్టించుకొని ప్రయోజనం లేదు. కాని ఏదైనా సాధించాలంటే మాత్రం పురుషార్ధం ముఖ్యం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పుట్టుక(జన్మ) ముఖ్యం. ఎలాంటి జన్మను పొందటానికి ఎలాంటి గుణాలను వృద్ధి చేసుకోవాలి? ....

**శ్లో||** సత్త్వాత్ సంజాయతే జ్ఞానం

రజసో లోభ ఏవచ |

ప్రమాద మోహౌ తమసః

భవతోఽజ్ఞాన మేవచ || (17)

**తా||** సత్త్వగుణం వల్ల జ్ఞానం వస్తుంది. రజోగుణం వల్ల లోభం కలుగుతుంది. తమస్సు వల్ల ఏమరుపాటు, భ్రాంతి, అజ్ఞానము కలుగుతాయి.

**వ్యాఖ్య :-** ప్రపంచంలో కొందరు జ్ఞానులుగా ఉండి గౌరవ మర్యాదలు పొందుతూ ఉంటారు. కొందరు స్వార్థబుద్ధిగలవారుగా, లోభులుగా ఉంటున్నారు. మరికొందరు అజ్ఞానులుగా, అయోమయ అవతారాలుగా ఉంటారు. ఎందుకిలా జరుగుతున్నది? ఆ స్వభావాలు వారికెలా వచ్చినవి? పూర్వంలో వారు చేసిన కర్మలు, వారి ఆలోచనలు, ఆచరణయే కారణం.

సత్త్వగుణంలో ఉండి కర్మలు చేసినందున జ్ఞానులుగా పుడతారు. వారి వాసనలే వారి స్వభావంగా మారి జ్ఞానమునందే వారి మనస్సు నిలుస్తుంది ఈ జన్మలో. అందుకే జ్ఞానార్జన వారికి స్వభావమవుతుంది.

రజోగుణంతో కర్మలు చేసిన వారు నిరంతరం కోరికలతో, ఆశలతో, స్వార్ధంతో కర్మలు చేస్తూ కర్మలయందే ఆసక్తి గలవారవుతారు. వారి వాసనలే వారి స్వభావంగా మారి ఒక్కక్షణం ప్రశాంతంగా ఉండనివ్వదు.

ఇక తమోగుణంతో కర్మలు చేసినవారు నీచజన్మలెత్తి మతిమరపు, జడత్వం, బుద్ధిహీనత, నిద్ర, వ్యర్ధమైన పనులు చేసే స్వభావం గలిగి వారి జీవితాన్ని వ్యర్ధం చేసుకుంటారు. కాని ఆ విషయం కూడా తెలియదు.

వాసనలన్నీ పూర్వజన్మలకు సంబంధించినవే. అవే ఈ జన్మలో పురుషార్ధానికి పెట్టుబడి. ఒక్క విషయాన్ని గుర్తించాలి. మనం చేసిన కర్మల కారణంగా మనకు వచ్చే జన్మను, కర్మఫలాలైన సుఖదుఃఖాలను మనం మార్చుకోలేము. కాని వాసనలను మాత్రం మార్చుకొనేందుకు, పురుషార్ధాన్ని సమర్ధవంతంగా నేరవేర్చుకొనేందుకు అవకాశం ఉన్నది. కనుక మానవజన్మ మనం బాగుపడేందుకువచ్చిన ఒక సువర్ణావకాశం. ఈ ఛాన్సును వదులుకున్నామో సమీప భవిష్యత్తులో ఉత్తమమైన మానవజన్మ రాదు. నీచ జన్మలే గతి అని హెచ్చరిక. కనుక దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకో.

- మరణానంతరం ఏ గుణాలు గలవారు ఏ లోకాలకు వెళతారో ...

శ్లో|| ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః
మధ్యే తిష్టంతి రాజసాః |
జఘన్య గుణ వృత్తిస్థాః
అధో గచ్ఛంతి తామసాః || (18)

**తా||** సత్త్వంలో నిలిచినవారు ఊర్ధ్వలోకాలకు వెళతారు. రాజసులు మధ్యలోనే ఉండిపోతారు. అధమగుణమైన తమస్సులో నిలిచినవారు అధోలోకాలకు వెళ్ళిపోతారు.

**వ్యాఖ్య** :- ఊర్ధ్వలోకాలు, అధోలోకాలు అంటే నిజంగా ఆయాలోకాలకు వెళ్ళటం కాదు. ఊర్ధ్వలోకాలంటే ఉత్తమజన్మలు, మధ్యలోకాలంటే మధ్యమ జన్మలు; అధోలోకాలంటే నీచజన్మలు అని అర్థం చేసుకుంటేనే ఈ శ్లోక సౌందర్యం తెలుస్తుంది.

సత్త్వగుణంలో నిలిచినవారికి తరువాత వచ్చే జన్మ ఉత్తమజన్మ. అంటే తన స్వస్థితిలో - ఆత్మ స్థితిలో నిలిచిపోవటానికి ప్రయత్నించే జన్మయే ఉత్తమ జన్మ. అంటే ఆత్మజ్ఞానాన్ని పొంది మోక్షం కొరకు సాధన చేస్తారు వీరు.

ఇక రజోగుణంలో నిలిచినవారు మధ్యే తిష్ఠంతి – మధ్యలోనే ఉండిపోతారు అన్నారు. అంటే మధ్యస్థమైన జన్మ వస్తుంది. నిరంతరం తమ కోరికలు తీర్చుకొనుటకు, ఆశలను నెరవేర్చుకొనుటకు, కర్తవ్యపాలన చేయుటకు కర్మలుచేస్తూ కర్మాసక్తులవుతారు వీరు. వీరు మళ్ళీమళ్ళీ పుడుతూ, మళ్ళీమళ్ళీ చస్తూ, మళ్ళీమళ్ళీ తల్లి గర్భంలో ప్రవేశిస్తూ ఈ ప్రపంచంలోనే బొంగరంలా తిరుగుతూ ఉంటారు. కర్మలు చేయటం, కర్మఫలాలు రావటం, వాటి అనుభవానికి మళ్ళీ జన్మించటం, ఆ జన్మలో తిరిగి కర్మలు చేయటం ... ఇలా కర్మ - జన్మ వలయంలో చిక్కి సతమతమైపోతుంటారు. వీరు ఉత్తమస్థితిని చేరుకోవాలని అనుకోరు. అసలు కొందరు తెలుసుకోరు కూడా.

ఇక తమోగుణంలో ఉండేవారు అధోగచ్ఛంతి - అంటే అల్పమైన, నీచమైన జన్మలెత్తుతుంటారు. అంటే జంతువులుగా, పక్షులుగా, క్రిమి కీటకాలుగా జన్మించి కర్మఫలాలు అనుభవించి జన్మ నుండి విడుదల పొంది తిరిగి అలాంటి నీచజన్మలనే పొందుతుంటారు. నీచ యోనులలో జన్మించి, కర్మఫలాలు అనుభవించి ఖర్చు చేసుకుంటారు. లేదా ఒకవేళ మానవజన్మ వచ్చినా పూర్తి అజ్ఞానంతో, ఏమరుపాటుతో, సోమరులుగా, దేశ దిమ్మరులుగా, పిచ్చివారుగా, తెలివితక్కువవారుగా జన్మించి వ్యర్థ జీవితాన్ని గడుపుతారు. ఇలా మూఢ జన్మలెత్తుతూ ఇంకా ఇంకా అధోగతికి దిగజారిపోతారు.

ఇక్కడే ఒక విశేషం ఉంది. తామసుల స్వభావం నిద్ర, ఏమరుపాటు, బద్ధకం. ఇవి అప్పుడప్పుడు సాత్త్వికులలో కూడా కనిపిస్తాయి. మరి అలాంటప్పుడు వారికి కూడా నీచజన్మలు వస్తాయా? రావు రానేరావు. ఎందుకు?

తామసలక్షణాలైన నిద్రాదులు సాత్త్వికులకు అప్పుడప్పుడు సంభవించేవే గాని, అవి వారి స్వభావం కాదు. కాని తామసులకు అవి వారి స్వభావం. సాత్త్వికులలో, రాజసులలో తమోగుణం ప్రధానం కాదు. గౌణంగా ఉంటుంది. అందుకే వారికి నీచజన్మలు రావు. అధోగతి కలగదు. తమోగుణం స్వభావంగా ఉన్న వాడికే నీచ, నికృష్ట జన్మలు. అందుకే అతడి స్థితిని తెలియజేయటానికి 'జఘన్య గుణ వృత్తిస్థాః తామసాః' అన్నారు. అంటే నికృష్టగుణాలు స్వభావంగా గలిగిన తామసులు అని అర్థం.

ఈ ప్రపంచంలో ఉత్తమ కర్మలు ఆచరిస్తూ ఉన్నత స్థితిని - మోక్ష స్థితిని పొందేవారు కొందరైతే, సకామ కర్మలతో గానుగెద్దులా ఈ సంసారచక్రంలో తిరిగేవారు మరికొందరు. నీచయోనులందు జన్మించేవారు ఎందరో. వారంతా అధోగతికి పోయేవారే.

రామాయణంలో ఈ మూడు గుణాలకు ప్రతినిధులైన ముగ్గురు సోదరులున్నారు. దూతను వధించటం నింద్యమని చెప్పిన విభీషణుడు తన సర్వస్వాన్ని శ్రీరాముని పాదాల వద్ద నివేదించాడు. అతడు సత్త్వగుణ సంపన్నుడు. పరకాంతా వ్యామోహపీడితుడై, సీతాపహరణం గావించి, ప్రశాంత జీవనానికి దూరమై, బంధు మిత్ర సపరివార సమేతంగా నాశనమైన రావణుడు రజో గుణసంపన్నుడు. నిద్రకు జీవితాన్ని అంకితం చేసిన కుంభకర్ణుడు తమో గుణప్రధానుడు. - మోక్ష ప్రాప్తికి ఉపాయం ఏమిటో తరువాతి 2 శ్లోకాల్లో......

**ఉపోద్ఘాతం** : ఇంతవరకు గుణాల గురించి వివరంగా తెలియజేసిన భగవానుడు ఈ ప్రకరణాన్ని ముగించబోతూ గుణబంధాల నుండి విడిపించుకొని గుణాతీతుడయ్యే మార్గాన్ని - భగవత్సాక్షాత్కారాన్ని పొందే విధానాన్ని - ఆత్మానుభూతిని పొందే ఉపాయాన్ని రాబోయే 2 శ్లోకాలలో తెలియజేయబోతున్నాడు. ఎల్లప్పుడూ గుర్తుంచుకోవలసిన శ్లోకాలు 19 - 20 శ్లోకాలు.

మనం సచ్చిదానంద స్వరూపులం. అయితే ఈ క్షేత్రంలో ప్రతిఫలించి ప్రకృతితో సంబంధం పెట్టుకున్నాం. దానితో ప్రకృతి యొక్క గుణాలైన సత్త్వ

రజ స్తమో గుణాలు ఆత్మస్వరూపులైన మనను ఈ ప్రకృతితో బంధించినవి. ఎలా బంధించినవి?

- సత్త్వగుణం జ్ఞానాన్ని, సుఖాన్ని ఇచ్చి బంధిస్తున్నది.
- రజోగుణం కర్మల యందు ఆసక్తి కలిగించి బంధిస్తున్నది.
- తమోగుణం అజ్ఞానం, మతిమరుపు, బద్ధకం, నిద్ర కలిగించి బంధిస్తున్నది.

అయితే ఈ 3 గుణాల మధ్య ఒక విచిత్రమైన సంబంధం ఉన్నది. ఒక గుణం పెరిగితే మిగిలిన 2 గుణాలు అణగిపోతాయి. కనుక మనకు ఇష్టంలేని గుణాలను వదిలించుకోవాలంటే ఆ మిగిలిన ఒక్క గుణాన్ని వృద్ధి చేసుకుంటే సరి.

ఈ గుణాలలో ఏ గుణం మనలో వృద్ధి అవుతున్నదో తెలుసుకోవటం ఎలా? అన్ని ఇంద్రియద్వారాల నుండి జ్ఞానం కలుగుతూ ఉంటే సత్త్వగుణం వృద్ధి అవుతున్నట్లు; లోభ బుద్ధితో కర్మలుచేస్తుంటే రజోగుణం పెరుగుతున్నట్లు; ఏమరుపాటు, బద్ధకం, నిద్ర కలుగుతుంటే తమోగుణం పెరిగినట్లు.

ఇక సత్త్వ గుణం పెరుగుతున్నప్పుడు మరణిస్తే ఉత్తమ జ్ఞానులు గాను, రజోగుణం పెరుగుతున్నప్పుడు దేహాన్ని వదిలితే కర్మాసక్తులు గాను, తమోగుణం వృద్ధి అవుతున్నప్పుడు మరణిస్తే మూఢులు గాను జన్మిస్తారని కూడా తెలియ జేశారు.

ఈ గుణాల వల్ల కలిగే ఫలితాన్ని కూడా చెప్పారు. సాత్త్విక గుణాల వల్ల నిర్మలఫలం, సుఖం లభిస్తుందని, రజోగుణం వల్ల దుఃఖం వస్తుందని,

తమోగుణం వల్ల అజ్ఞానం కలుగుతుందని చెప్పి చివరకు ఏ గుణం వల్ల ఎలాంటి స్థితి కలుగుతుందో చెప్పారు. సత్త్వగుణం వల్ల ఊర్ధ్వగతి - ఉన్నత స్థితికి వెళ్ళే అవకాశం కలుగుతుందని; రజోగుణం వల్ల ఈ సంసార చక్రంలో ఇరుక్కుపోవటం జరుగుతుందని; తమస్సు వల్ల అధోగతియని చెప్పారు.

దీనితో మనకొక విషయం అర్థమవుతుంది. మనం ఉన్నతస్థితికి చేరాలంటే ముందుగా తమోగుణాన్ని వదిలించుకోవాలని, ఆ తర్వాత రజోగుణాన్నీ వదిలించుకోవాలని; అలా రెండు గుణాలను వదిలించుకొని సత్త్వంలో నిలవాలని తెలుస్తున్నది. అలా సత్త్వగుణంలో ఉన్నవాడు ఆ సత్త్వ గుణాన్ని కూడా వదిలి శుద్ధసత్త్వంలో నిలిచి, గుణాతీతుడై ఆత్మానుభూతిని పొందాలంటే ఏం చేయాలో రాబోయే రెండు శ్లోకాలలో తెలియజేస్తున్నారు. ముందుగా 19 వ శ్లోకం -

శ్లో|| నాన్యం గుణేభ్య కర్తారం
యదా ద్రష్టాఽను పశ్యతి |
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావం సోఽధి గచ్ఛతి || (19)

**తా||** ఎప్పుడు గుణాల కన్న వేరైన కర్త లేడని వివేకంతో తెలుసుకుంటాడో, త్రిగుణాలకన్న వేరైనవానిగా తనను తెలుసుకుంటాడో అతడు నా భావాన్నే పొందుతాడు. (కర్త గుణాలు. తాను గుణాల కన్న వేరు)


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య :-** ఈ శ్లోకంలో భగవాన్ రమణ మహర్షులు చెప్పిన నేనెవరు? అనే ప్రశ్నకు సమాధానం చక్కగా ఇవ్వబడింది.

ఇక్కడ కర్మలు చేసే కర్త గుణాలేనని, అంతకన్న వేరెవడూ కర్త కాదని; తానేమో గుణాలకు అతీతమైన సాక్షిని(ఆత్మను) అని తెలుసుకుంటాడో అతడు పరమాత్మ భావాన్ని పొంది ముక్తుడగుచున్నాడు.

మనం ఈ లోకంలో జన్మించి అనేక కర్మలు చేస్తున్నాం. చేస్తున్నాం అంటే నేనే కర్తను అనుకుంటున్నాం. ఆ కర్మ యొక్క ఫలం సుఖం గాని, దుఃఖం గాని నాదే అనుకుంటున్నాం. కనుకనే బంధంలో ఇరుక్కుంటున్నాం. అయితే ఇది నిజమా? కాదు. ఇక్కడ జరిగే కర్మలకు కర్తను నేను కాను. మరి ఎవరు? గుణాలే. ఎలా ?

ఇక్కడ మన దేహం ద్వారా కర్మలు జరుగుతున్నాయి. అలా జరగటానికి కారణం ఏమిటి? లోపలి వాసనల యొక్క ప్రేరణ వల్లనే. అంటే గుణాల యొక్క ప్రేరణ వల్లనే. వాటి ప్రేరణతో దేహేంద్రియాలు కర్మలు చేస్తున్నాయి. కర్మలు చేసేది దేహేంద్రియాలే అయినా చెయ్యటానికి ప్రేరణ గుణాలే గనుక కర్మలకు కర్త గుణాలే అని తెలియజేస్తున్నది. అంటే నిజంగా కర్మలకు కర్త గుణాలతో కూడిన మనస్సు. ఆ కర్మఫలాలననుభవించేది కూడా మనస్సు. ఈ భావన బాగా దృఢపడాలి. సత్త్వగుణంలో ఉన్న వాడికే ఇలాంటి భావన కలుగుతుంది. కనుక ఎప్పుడూ ఈ గుణాల విషవలయంలో పడి కొట్టుకోకుండా సత్త్వ గుణంలో నిలిచి ఈ భావన గట్టి చేసుకోవాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

కర్మలు చేసేదీ, కర్మఫలాలు అనుభవించేదీ మనస్సైతే మరి నేనెవరిని? నేను గుణాలతో కూడిన మనస్సు కన్న వేరుగా - సాక్షిగా ఉండే ఆత్మను అని తెలుస్తుంది. ఎలా? గుణాలు కర్మలు ఎవరి ఆధారంగా జరుగుతున్నాయి? అని ఆలోచిస్తే ఈ గుణాలకు ప్రేరణనిచ్చే శక్తి, కర్మలు చేసేందుకు దేహేంద్రియాలకు శక్తి వీటికన్న వేరైన దాని వల్ల వస్తున్నదని తెలుస్తున్నది. అదే ఆత్మ చైతన్యం. అలా తెలుసుకోవటంతో అతడికి భగవంతునితో సంబంధం ఏర్పడుతున్నది. అది నేనే (సః అహం) అని తెలుస్తుంది.

అంటే కర్మలు చేసేది, ఫలాలు అనుభవించేదీ త్రిగుణాత్మకమైన మనస్సు - 'నేను కాదు' అనే భావం ఎవరిలో ఏర్పడుతుందో అట్టివారు నేను కేవల సాక్షిగా ఉండే ఆత్మను అని తెలిసి పరమాత్మ స్వరూపుడే అవుతున్నాడు. అదే స్వస్థితిలో నిలుచుట, ముక్తి పొందుట.

అయితే ఈ భావం ఎలా కలుగుతుంది? పూర్వంలో చేసుకున్న సుకృతం ఉంటే సద్గురువు లభిస్తాడు. ఆ గురువు యొక్క ఉపదేశంతో - శాస్త్ర వాక్యాలతో ఇక్కడ జరిగే శారీరక, వాచిక, మానసిక కర్మలన్నింటికి కర్త గుణాలతో కూడిన మనస్సే గాని తాను కాదని తెలుస్తుంది.

బక్కెట్ లోని నీటిలో సూర్యుని ప్రతిబింబం పడింది. అది ఒకటే కదిలిపోతున్నది. నేను కదిలి పోతున్నాను, వణికి పోతున్నాను అని ఆ ప్రతిబింబం అనుకోవటం భ్రమ. నిజం కాదు. మరి నిజమేమిటి? కదులుతున్నది బక్కెట్ లోని నీరే గాని ప్రతిబింబం కాదు. నీటి యొక్క కదలికను ప్రతిబింబం తనపై ఆరోపించుకొని కదిలి

పోతున్నాననుకుంటున్నది. బక్కెట్ లోని నీటితో గాని, ఆ నీటి కదలికతో గాని సూర్యబింబానికి ఎలా సంబంధం లేదో అలాగే ద్రష్టయైన తనకు దృశ్యాలైన గుణాలతో గాని, గుణకార్యాలతో గాని ఎటువంటి సంబంధము లేదు. కాని సాక్షిగా ఉండే తాను, సర్వత్రా ఉండే తాను, ఆనందస్వరూపుడైన తాను, జ్ఞాన స్వరూపుడైన తాను ఈ గుణాలతో కూడిన మనస్సులో కూర్చొని, దానితో తాదాత్మ్యం చెంది, తనను తాను మరచి, ఆ మనస్సు చేసే కర్మలను తానే చేస్తున్నానని, అది పొందే సుఖదుఃఖాలను తానే పొందుతున్నానని భ్రమ పడి, ఈ జనన మరణ చక్రంలో ఇరుక్కుంటున్నాడు. తన మనస్సు నుండి విడిపోయి, వేరైపోయి, ఆ మనస్సును ఒక దృశ్యంగా ఎల్లప్పుడూ చూడ గలిగితే తనకిక ఏ దుఃఖాలు, బాధలు ఉండవు. మనస్సుతో తాదాత్మ్యమే బంధం. మనస్సుతో విడిపోయి తానుతానుగా ఉండి పోవటమే మోక్షం. ఇది అనుభూతి కావాలి. ఎలా?

నేను పురుషుణ్ణి అని ఎవరితోను చెప్పనక్కరలేదు, నేను గుర్తు చేసుకోనక్కర లేదు. మరచిపోతానేమోనని మననం చేసుకోనక్కరలేదు, కాని అన్ని వ్యవహారాలలో పురుషుడుగానే ఉంటాను. అలానే స్త్రీ కూడా. తనకెప్పుడూ స్త్రీని అనే అనుభవమే ఉంటుంది. అలాగే నేను పరమాత్మను అని ఎవరికీ చెప్పనవసరం లేకుండా, గుర్తు చేసుకొనే అవసరం లేకుండా, ఇతరుల ద్వారా వినాల్సిన పని లేకుండా, మననం చేసుకోవాల్సిన పని లేకుండా ఎల్లప్పుడూ దేహేంద్రియ మనోబుద్ధులు ఏమి చేస్తున్నప్పటికీ తాను కేవల పరమాత్మగా ఉండిపోవాలి. అదే అనుభూతి.

ఇలా ఆత్మానుభూతిలోనున్నవాడు 'న అన్యం గుణేభ్య కర్తారం' గుణాల కన్నా ఇక్కడ కర్మలు చేసే కర్త లేడు, నేను ఆ కర్మలకు కేవల సాక్షినైన ఆత్మనే. 'గుణేభ్య పరం వేత్తి' - నేను గుణాల కన్న వేరైన ఆత్మను అనే స్థితిలోనే ఉంటాడు. అనుభూతి పొందినవాడు అలా ఉండిపోతాడు. సాధకుడు అలా ఉండేందుకు ప్రయత్నించాలి. ఇలా మనస్సు కన్న- గుణాల కన్న వేరుగా - సాక్షిగా ఉన్న ఆత్మను నేను అని అనుభూతి చెందినవాడే ముక్తుడు.

ఘటం పగిలిపోకముందు కూడా ఘటంలోని ఆకాశం మహాకాశమే. ఘటాకాశమంటూ ప్రత్యేకంగా లేదు. ఘటాభిమానం వదిలితే చాలు. ఉన్నదంతా మహాకాశమే. అలాగే మనస్సుతో తాదాత్మ్యం వదిలితే చాలు - గుణాలతో తాదాత్మ్యం వదిలితే చాలు – గుణాతీతుడైతే చాలు అతడు పరమాత్మే - పరబ్రహ్మమే.

నేను సాక్షిని అనే భావం కలిగితే చాలు వెంటనే బ్రహ్మభావం కలుగుతుంది. "నిన్ను నీవు తెలుసుకో, భగవంతుని తెలుసుకున్నట్లే" అనే మాటకు అర్థం ఇదే.

మద్భావం సోऽధి గచ్ఛతి:- ఎవరైతే నా మనస్సు కన్న నేను వేరైన వాణ్ణి అనే స్థిర భావనతో ఉంటాడో అతడు భగవద్భావనతో – 'నేను భగవంతుణ్ణి' అనే భావనతో ఉంటాడు. అదే మద్భావం అంటే.

- ఈ లక్ష్యాన్ని చేరుకుంటే ఫలితం ఏమిటి?

**శ్లో||** గుణా నేతా నతీత్య త్రీన్

దేహీ దేహ సముద్భవాన్ |

జన్మ మృత్యు జరా దుఃఖైః

విముక్తోఽమృత మశ్నుతే || (20)

**తా||** దేహాలను పుట్టించే ఈ మూడు గుణాలను అధిగమించిన దేహధారి జన్మమృత్యుజరా దుఃఖాల నుండి విముక్తుడై అమృతత్వాన్ని పొందుతాడు.

**వ్యాఖ్య:-** ఇక్కడ కర్మలన్నింటికీ కర్త త్రిగుణాలేనని ఇంతకు ముందు శ్లోకంలో తెలియజేశారు. ఈ త్రిగుణాల వల్లనే దేహేంద్రియాలు కర్మలు చేస్తున్నాయి, వచ్చిన కర్మఫలాలను మనస్సు అనుభవిస్తున్నది. అనుభవించగా మిగిలిన కర్మఫలాల కొరకు క్రొత్త దేహాలను ధరించి వచ్చి, మళ్ళీ కర్మలు చేస్తూ, క్రొత్త దేహాలను ధరిస్తూ తిరుగుతూ ఉంటాయి. అంటే దేహాలు రావటానికి కారణం త్రిగుణాలే. ఈ దేహాల వల్లనే దుఃఖాలు వస్తున్నాయి. కనుక దుఃఖాలు రాకుండా ఉండాలంటే దేహాలు రాకుండాపోవాలి. దేహాలు రాకుండా పోవాలంటే త్రిగుణాలను అధిగమించాలి. త్రిగుణాలను అధిగమించిన త్రిగుణాతీతుడు ఎలా దుఃఖాలను దాటిపోతాడో, ఎలా అమృతత్త్వ స్థితిని - మోక్ష స్థితిని అందుకుంటాడో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

వంటగదిలో స్టౌ వెలిగించి దగ్గరగా నిలబడి వంట చేస్తుంటే వేడి తగులుతుంది. కాని వంటగది దాటి బయటకు వచ్చి బెడ్ రూంలో ఏ.సి వేసుకొని కూర్చుంటే వేడి తగలదు, పైగా చల్లగా హాయిగా ఉంటుంది. అలాగే గుణాలతో తాదాత్మ్యం చెంది ఆ గుణాలతో కలిసి ఉంటే ఆ గుణాల

కారణంగా వచ్చిన దేహాల వల్ల దుఃఖం కలుగుతుంది. ఆ గుణాలను దాటి తాను తానుగా ఆత్మలో నిలిస్తే దుఃఖాలుండవు, ఆనందమే ఆనందం.

త్రీన్ గుణాన్ అతీత్య :- అయితే మూడు గుణాలను అధిగమించాలి. ఏదో ఒకటి రెండు గుణాలను అధిగమిస్తే చాలదు. సత్త్వగుణం మంచిదే గదా అని అందులో ఉంటే కుదరదు. దానినీ అధిగమించాలి. త్రిగుణాలను అధిగమిస్తేనే త్రిగుణాతీత స్థితి. అయితే ఒక్కసారిగా మూడు గుణాలను అధిగమించటం కుదరదు. తమోగుణం ప్రబలంగా ఉంటే ముందు దానిని వదిలించుకోవాలి. కోరికలతో కర్మలు చేస్తుంటే తమోగుణం వదిలిపోతుంది. అయితే రజోగుణం పెరిగిపోతుంది. ఇప్పుడు రజోగుణాన్ని వదిలించుకోవాలంటే చేసే కర్మలను నిష్కామంగా, ఫలాసక్తి లేకుండా, కర్తృత్వ భావం లేకుండా నిర్లిప్తంగా చేయాలి. భగవదార్పణ బుద్ధితో చేయాలి. అలా చేయగా చేయగా రజోగుణం తగ్గిపోయి మనస్సు శుద్ధమై శాంత స్థితి లోనికి వస్తుంది. అప్పుడు దైవంపై భక్తి కుదిరి సత్త్వగుణం వృద్ధి అవుతుంది. అప్పుడు సద్గురువును చేరి శాస్త్ర శ్రవణం చేస్తూ, మనన నిధిధ్యాసనలు కొనసాగిస్తూ, జప ధ్యానాది సాధనలు చేస్తుంటే చివరకు ఆ సత్త్వగుణం కూడా శుద్ధ సత్త్వంగా మారుతుంది. అప్పుడు ధ్యాన సమాధి అభ్యాసంతో త్రిగుణాలను దాటి భావాతీత స్థితికి - నిర్వికల్ప స్థితికి - నిస్సంకల్ప స్థితికి రావటం జరుగుతుంది. అదే మూడు గుణాలను అధిగమించిన స్థితి.

ఐతే ఈ గుణాలను అధిగమించటం వల్ల ప్రయోజనమేమి?

దేహ సముద్భవాన్:- దేహాలు కలగటానికి కారణమయ్యేది ఈ గుణాలే. ఈ గుణాల వల్లనే రకరకాల దేహాలు వస్తున్నాయి. సత్త్వగుణంలో ఉండే వారికి ఉత్తమ జన్మలు. రజోగుణంలో ఉండేవారికి కర్మాసక్తుల జన్మలు. తమోగుణంలో ఉండేవారికి నీచజన్మలు, మూఢయోనులందు జన్మించుట జరుగుతుందని ఇంతకు ముందే చెప్పారు.

గుణాలనే విత్తనాలు పదేపదే దేహాలనే ఫలాలనిస్తుంటాయి. విత్తనాలున్నంతకాలం ఫలాలు వస్తూనే ఉంటాయి. అంటే గుణాలున్నంత కాలం దేహాలు వస్తూనే ఉంటాయి. దేహాలు వచ్చినవంటే దుఃఖాలు తప్పవు. కనుక దుఃఖాలు తప్పాలంటే దేహాలు రాకూడదు. దేహాలు రాకుండా ఉండాలంటే గుణాలను వదిలించుకోవాలి.

దేహాలు వస్తే ఏం? సుఖాలు కూడా ఉంటాయి గదా! అనుకోవచ్చు. సుఖాలు ఉంటాయి. వాటితో పాటు దుఃఖాలూ ఉంటాయి. ఏది తప్పినా తప్పకపోయినా జన్మదుఃఖం (గర్భ నరకం), జరాదుఃఖం, వ్యాధి దుఃఖం , మరణ దుఃఖం - ఇవి మాత్రం తప్పవు. ఈ దుఃఖాలన్నీ పుట్టినవారికీ, పుట్టబోయే వారికీ అందరికీ. అసలు జన్మే లేకపోతే ఇక దుఃఖమే లేదు. అంతా ఆనందమే. కనుక దుఃఖాలు పోవాలంటే జన్మలు రాకుండా పోవాలి. జన్మలు రాకుండా పోవాలంటే గుణాలను అధిగమించాలి. గుణాలను అధిగమిస్తే దుఃఖాలు తొలగిపోవటమేనా? ఇంకా ఏమైనా ప్రయోజనం ఉన్నదా?

అమృతం అశ్నుతే :- అమృతత్త్వాన్ని పొందుతారు. శాశ్వత ఆనందాన్ని - దుఃఖంలేని ఆనందాన్ని - బ్రహ్మానందాన్ని పొందుతారు.

మన అనుభవాన్ని చూడండి. జాగ్రదావస్థలో గుణాలున్నాయి. దేహం ఉన్నది. దుఃఖాలున్నాయి. స్వప్నావస్థలో కూడా గుణాలున్నాయి. అప్పుడూ ఒక దేహం ఉన్నది స్వప్నపురుషుడున్నాడు. అప్పుడూ దుఃఖాలున్నాయి. కాని సుషుప్తిలో దేహం లేదు. మనస్సు లేదు. గుణాలు లేవు. అయినా ఆనందం ఉంది. ప్రతి వారి అనుభవమూ ఇదే. అంటే గుణాలుంటే దుఃఖాలు. గుణాలు లేకపోతే ఆనందం. అయితే తిరిగి మేలుకోవటంతోనే దేహం, గుణాలు అన్నీ వస్తున్నాయి. దానితో దుఃఖాలు. ఈ దుఃఖాలు శాశ్వతంగా పోయి శాశ్వత ఆనందం కలగాలంటే ఈ గుణాలను శాశ్వతంగా తొలగించుకోవాలి. అదే గుణాతీతుడు కావటం. గుణాతీతుడైతే అనంతమైన, శాశ్వతమైన బ్రహ్మానందమే. అదే అమృతత్త్వ స్థితి.

రామాయణంలో సుందరకాండ ఉన్నది. సీతాన్వేషణకై మహావీరులైన కపులు దక్షిణ దిక్కుగా వెళ్ళారు. సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించగల వీరుడెవరా? అని ఆలోచిస్తున్నారందరూ. హనుమంతుడు మాత్రం దూరంగా ఊరకే కూర్చున్నాడు. అది తమోగుణం. ఆ తర్వాత ఆయనను అందరూ ప్రశంసించి సముద్రలంఘనం నీవల్ల తప్ప ఎవరివల్ల కాదన్నారు. దానితో హనుమ సముద్రాన్ని లంఘించాడు. అంటే తమోగుణాన్ని దాటాడు. ఆ తర్వాత లంకలో ప్రవేశించి లంకిణి దెబ్బకొట్టి సీతాన్వేషణ గావించాడు. ఇది రజోగుణం. ఆ తరువాత అశోకవనంలో ప్రవేశించాడు. 'అ - శోక' అంటే శోకం లేని అని అర్థం. అంటే రజోగుణాన్ని దాటి సత్త్వగుణంలో ప్రవేశించాడు - అని.

అశోకవనంలో శింశుపా వృక్షం క్రింద సీతాదేవిని దర్శించాడు. ఇదే ఆత్మ సాక్షాత్కారం - అమృతత్త్వసిద్ధి. 3 గుణాలను దాటితే అమృతత్త్వ సిద్ధియే.

మన చేతికి 5 వ్రేళ్ళుంటాయి. 4 కలిసే ఉంటాయి. ఒకటి దూరంగా ఉంటుంది. అది పరమాత్మ. ఈ నాలుగు వ్రేళ్ళలో చూపుడు వ్రేలు జీవుడు. మిగిలిన వ్రేళ్ళు 3 గుణాలు. జీవుడెప్పుడూ 3 గుణాలతో కూడియే ఉంటాడు. అందుకే నాలుగు వ్రేళ్ళు కలిసే ఉంటాయి. అయితే ప్రయత్నంతో చూపుడు వ్రేలు అనబడే జీవుడు మిగిలిన 3 వ్రేళ్ళు అనే గుణాలకు దూరంగా జరిగితే పరమాత్మ అనే బొటన వ్రేలితో కలసిపోతాడు. ఇలా చూపుడు వ్రేలు, బొటన వ్రేలు కలిసి సున్నాగా ఏర్పడితే అదే చిన్ముద్ర. ఆలయాల్లో దేవతా విగ్రహాలు చూపే చిన్ముద్ర లోని ఆంతర్యం ఇదే. 3 గుణాలను వదిలించుకొని నాతో ఐక్యంకండి అని చెప్పటమే.

- మానవుడు జీవించి ఉండగానే మూడు గుణాలను దాటితే అమృతత్త్వ పదవి సిద్ధిస్తుందని భగవానుని మాటను వినగానే, తీవ్ర జిజ్ఞాస గల అర్జునుడు అట్టి స్థితిని పొందాలనే తీవ్ర జిజ్ఞాసతో భగవంతుని ప్రశ్నిస్తున్నాడు. ఏమని?

**అర్జున ఉవాచ :-**

**శ్లో||** కైర్లింగై స్త్రీన్ గుణా నేతాన్
అతీతో భవతి ప్రభో! |
కిమాచారః కథం చైతాన్
త్రీన్ గుణా నతి వర్తతే || (21)

**తా||** అర్జునుడంటున్నాడు ప్రభూ! ఈ మూడు గుణాలను దాటిన వాడు ఏ లక్షణాలతో కూడిన వాడవుతున్నాడు? అతడి ప్రవర్తన ఎలా ఉంటుంది? ఈ మూడు గుణాలను ఎలా దాటగలడు?

**వ్యాఖ్య :-** అర్జునుడు క్షత్రియుడు. రజోగుణ ప్రధానుడు. సత్త్వగుణం కూడా ఉన్నవాడే. కార్యదక్షుడు. ఏదైనా విషయాన్ని తెలుసుకుంటే వెంటనే కార్య రంగంలోకి దూకే స్వభావం గలవాడు. ఆదర్శం కనిపిస్తే అమలు చేసేవాడు. శ్రీ కృష్ణుడు చెప్పే అద్భుత ఆధ్యాత్మిక విషయాలను ఎంతో భక్తి శ్రద్ధలతో వింటున్నాడు. ఆయన చెప్పే మాటలు దుఃఖాన్ని పూర్తిగ తొలగించేవి, శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదించేవి అని నమ్మినవాడు. అలాంటి అర్జునుడు ఈ జన్మలోనే - జీవించి ఉండగానే మానవుడు త్రిగుణాలను అధిగమించి, గుణాతీతుడు కావచ్చునని, గుణాతీతుడైతే సమస్త దుఃఖాల నుండి విముక్తుడై అమృతత్త్వాన్ని అందుకోగలడని శ్రీకృష్ణుడు చెప్పటంతోనే అతడికి ఒక సందేహం కలిగింది. అందుకే వెంటనే సందేహాన్ని వెలిబుచ్చుతున్నాడు.

అసలు గుణాతీతుడు ఎలా ఉంటాడు? ఎటువంటి లక్షణాలతో ఉంటాడు? అతన్ని గుర్తించటం ఎలా? అతడు ఈ లోకంలో ఎలా ప్రవర్తిస్తాడు? ఏ ఉపాయాలతో ఈ త్రిగుణాలను అధిగమించగలడు? అని అడిగాడు. ఈ ప్రశ్నలను అర్జునుడు వేయకపోతే మనకు ఎంతో ఇబ్బంది కలిగేది. ఎందుకంటే లోకంలో కొన్ని నకిలీ సరుకులు వస్తుంటాయి. చూడటానికి అసలు సరుకులాగానే ఉన్నా నాణ్యతలో తేడా ఉంటుంది. అయితే అసలు ఏదో నకిలీ ఏదో గుర్తు పట్టటానికి వీలు లేకుండా

అచ్చు ఒకలాగే ఉంటాయి. ఏదో గుర్తు ద్వారా అసలు ఏదో నకిలీ ఏదో గుర్తించాలి. నిజమైన సాధువులెవరో-నకిలీ సాధువులెవరో తెలుసుకోవటానికి ఏవో కొన్ని కొండ గుర్తులుండాలి.

అలాగే నిజమైన గుణాతీతుని ఎలా తెలుసుకోవాలి? ఎలాంటి లక్షణాలు కలిగినవాణ్ణి గుణాతీతుడు అంటారు? అనే విషయాన్ని తెలుసుకోవాలనుకున్నాడు అర్జునుడు. అలాగే గుణాతీతుని ఆచరణ ఎలా ఉంటుందో కూడా తెలుసుకోవాలనుకున్నాడు అర్జునుడు. ఎందుకంటే ఆచరణను బట్టి గుణాతీతుడు అవునా? కాదా? అని నిశ్చయించుకోవచ్చు.

ఇలా గుణాతీతుని లక్షణాలను, ఆచరణను తెలుసుకోవటం వల్ల నిజమైన గుణాతీతులెవరో, నటించే వారెవరో తెలిసిపోతుంది. ఆధ్యాత్మిక రంగంలో మోసగాళ్ళకు చోటులేకుండా చేస్తేనే భగవంతునిపై విశ్వాసం సన్నగిల్లకుండా ఉంటుంది. అలాగే 'కిం ఆచారః' అనటం వల్ల ఆధ్యాత్మికరంగంలో ఆచరణ అనేది ఎంత ప్రధానమైనదో తెలుస్తున్నది.

ఇక చివరి ప్రశ్న; అత్యంత ముఖ్యమైన ప్రశ్న -

త్రీన్ గుణాన్ కధంచ అతి వర్తతే :- మూడు గుణాలను ఎలా దాటగలము? - అని. ఇక్కడొక కాలువ ఉన్నది దాదాపు 15 అడుగుల వెడల్పు ఉన్నది. లోతు ఎంతో సరిగ్గా తెలియదు. మరి దానిని దాటటం ఎలా? అని సందేహం. దూకి ఆవలి ఒడ్డును చేరగలమా? మనం ఆంజనేయులం అయితే అలాగే దూకవచ్చు. ఈదుకుంటూ పోవటమా? ఈత బాగా వస్తే అలాగే వెళ్ళవచ్చు. ఏదైనా చిన్న పడవ ఉంటే ఇంకా మంచిది? ఇలా ఆలోచించి ఏదో ఒక ఉపాయాన్ని

ఆశ్రయించాలి. అయితే అపాయంలేని ఉపాయం కావాలి. ఆచరణ సాధ్యమైన ఉపాయం కావాలి.

అలాగే ఈ 3 గుణాలను అధిగమించటానికి కూడా ఆచరణ సాధ్యమైన ఏదో ఒక ఉపాయం కావాలి. ఏమిటా ఉపాయం? ఎవరి సాయం తీసుకోవాలి? ఇవీ అర్జునుని మనస్సులోని సందేహాలు.

ఉత్తమ శిష్యుల లక్షణం ఇలాగే ఉంటుంది. గురువు చెప్పే విషయాలను ఎంతో సావధానంగా, శ్రద్ధతో వినాలి. అలా విని తెలుసుకున్న విషయాన్ని ఆచరణలో పెట్టుకోవాలంటే సందేహాలు - సంశయాలు ఉండకూడదు. సందేహాలు ఉన్నంతకాలం ఆచరణ అనేది సాధ్యం కాదు. అలాగే విశ్వాసం లేకపోయినా ఆచరణ కుదరదు. కనుకనే ఆమూలాగ్రంగా సందేహ నివృత్తి చేసుకుంటున్నాడు అర్జునుడు.

అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణుడు వరుసగా సమాధానం ఇవ్వబోతున్నాడు. ఒక్క శ్లోకంతో గుణాతీతుని లక్షణాలను, 3 శ్లోకాలలో అతడి ఆచరణను చివరి శ్లోకంలో గుణాలను అధిగమించే ఉపాయాన్ని వివరించబోతున్నాడు.

2 వ అధ్యాయంలో చెప్పిన స్థితప్రజ్ఞ లక్షణాలు, 12 వ అధ్యాయంలో చెప్పిన భక్తుని లక్షణాలు, 13 వ అధ్యాయంలో చెప్పిన జ్ఞాని లక్షణాలు, ఈ అధ్యాయంలో చెప్పబోయే గుణాతీతుని లక్షణాలు - అన్నీ కూడా ఆత్మనిష్ఠుని లక్షణాలే. జీవన్ముక్తుని వేరు రూపాలే వీరంతా.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇప్పుడు అర్జునుని ప్రశ్నకు భగవానుడేమని సమాధానం ఇస్తున్నాడో చూద్దాం. మనమూ మన సందేహాలను తీర్చుకొని గుణాలను అధిగమించటానికి ప్రయత్నిద్దాం. ముందుగా గుణాతీతుని లక్షణాలు -

- అర్జునుని ప్రశ్నలకు 4 శ్లోకాలలో భగవానుడు సమాధానం చెబుతూ, ముందుగా గుణాతీతుని లక్షణాలు ఎట్టివో 22 వ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

**శ్రీ భగవానువాచ :-**

**శ్లో|| ప్రకాశం చ ప్రవృత్తిం చ**
**మోహమే వచ పాండవ ! |**
**నద్వేష్టి సంప్రవృత్తాని**
**న నివృత్తాని కాంక్షతి || (22)**

**తా||** భగవానుడంటున్నాడు, పాండుపుత్రా! అర్జునా! ప్రకాశం, ప్రవృత్తి, మోహము తటస్థించినప్పుడు ద్వేషించడు; పోయినప్పుడు కోరడు.

**వ్యాఖ్య:-** అర్జునుడు ఈ సందేహాలను వ్యక్తం చేయకపోతే సాధకునికి స్పష్టమైన అవగాహన ఉండేది కాదు. ఎందుకంటే 3 గుణాలను దాటిన వాడు గదా! త్రిగుణాతీతుడంటే. కనుక అతడిలో అసలు ఏ గుణమూ ఉండదు - అని అనుకుంటారు ఎవరైనా. కాని అర్జునుని ప్రశ్న భగవానుని సమాధానం వల్ల, ఒక విషయం స్పష్టమైంది. ఎంతటి త్రిగుణాతీతుడైనా అతడిలోనూ ఈ సత్త్వ, రజో, తమో గుణాలు ఉంటాయని, ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క గుణం

కనబడిపోతూ ఉంటుందని; కాకపోతే సామాన్యుడు ఆ గుణాలకు లొంగి పోతాడు. త్రిగుణాతీతుడు లొంగకుండా తటస్థంగా ఉంటాడు. అని తెలుసుకొనే అవకాశం కలిగింది.

త్రిగుణాతీతునిలో సత్త్వగుణ ప్రభావం వల్ల జ్ఞాన ప్రకాశం కలిగినా, రజోగుణ ప్రభావం వల్ల కార్య ప్రవృత్తిలో పడిపోయినా; తమోగుణ ప్రభావం వల్ల మోహం కలిగినా అతడు దేనినీ ద్వేషించడు; దేనినీ కావాలని కోరడు. 3 గుణాలకు తటస్థుడుగా ఉంటాడు.

మన చిత్తం - లేదా మనస్సు స్థిరంగా ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. కోతి ఎట్లాగైతే ఒక చెట్టు మీదనే ప్రశాంతంగా కూర్చోదో అలాగే చిత్తం ఎప్పుడూ ఒకే స్వభావంలో ఉండదు. ఒక్కొక్కప్పుడు ప్రశాంతంగా ఉండి జ్ఞాన ప్రధానంగా ఉంటుంది. మానవజన్మనెత్తి వచ్చినందుకు ఈ జన్మను సార్థకం చేసుకోవాలి, మోక్షాన్ని పొందాలి. అనుకుంటుంది. దైవం వైపుకు తిరుగుతుంది.

ఒక్కొక్కప్పుడు కర్మ ప్రధానంగా ఉంటుంది. ఈ ప్రపంచంలో ఎన్నో వస్తువులున్నాయి, భోగాలున్నాయి. వాటిని అనుభవించేందుకే మనకు ఈ జన్మ వచ్చింది. కనుక ఎంత కష్టమైనా సరే వాటిని సంపాదించుకొని అనుభవించాలి అనే కోరికతో వాటికోసం కర్మలు చేస్తూ; ఫలిస్తే అనుభవించి ఆనందిస్తూ, ఫలించకపోతే మరొక విధంగా ప్రయత్నాలు చేస్తూ నిరంతరం కర్మల యందు ఆసక్తి కలిగి ఉంటుంది.

కొన్ని సందర్భాలలో మోహ ప్రధానంగా ఉంటుంది మనస్సు. అన్నింటి మీదా విసుగు, విరక్తి కలిగి దేనినీ పట్టించుకోకపోవటం, ఏ పనీ చేయ బుద్ధి కాక పోవటం, బుద్ధి సరిగ్గా పనిచేయక పోవటం, ఏమరుపాటు, మతిమరపు, సోమరితనం, నిద్ర, పనులు వాయిదా వేయటం జరుగుతుంది. ఇక జన్మ సార్థక్యత గురించిన స్పృహ ఉండనే ఉండదు.

ఇలా ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విధంగా మనస్సు ప్రవర్తిస్తూ ఉంటుంది. ఇవే జ్ఞాన ప్రకాశం, కర్మ ప్రవృత్తి, నిద్ర. వివేకి ఐనవాడు ఈ మూడింటిని వాటి వాటికి తగిన ప్రాధాన్యతనిచ్చి తగిన విధంగా స్పందిస్తాడు.

ఐతే గుణాతీతుడు మాత్రం వాటిని గురించి ఏ మాత్రం పట్టించుకోడు. అన్నింటిపట్ల తటస్థంగా, నిర్లిప్తంగా ఉంటాడు, దేనికీ చలించడు. అతడు జ్ఞానాన్ని కాంక్షించడు. ప్రవృత్తిని, మోహాన్ని ద్వేషించడు. అతడు రాగ ద్వేషాలకు అతీతుడు. అంటే -

- సత్త్వగుణం వల్ల వచ్చే జ్ఞానానికి, సుఖానికి అతుక్కుపోడు.
- రజోగుణం వల్ల కలిగే ప్రవృత్తిలో మునిగిపోడు, పట్టించుకోడు.
- తమోగుణం వల్ల కలిగే మోహానికి చలించడు. ఇదీ గుణాతీతుని లక్షణం.

గుణాతీతుడంటే ఈ గుణాలన్నింటిని అధిగమించినవాడు కదా! అతడిలో గుణాలేవీ లేవు కదా! మరి ఈ గుణాలకు ఆనందించడు, ద్వేషించడు అని చెప్పటం ఏమిటి? అతడిలో కూడా ఈ 3 గుణాలు ఉంటాయి. అప్పుడప్పుడు వాటి ప్రభావాన్ని చూపుతూనే ఉంటాయి. అయితే సామాన్యుడు వాటికి లొంగిపోతాడు, స్పందిస్తాడు. సాధకుడు అల్పమైన



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వాటిని ద్వేషించి ఉన్నతమైన వాటికి ఆనందిస్తాడు. గుణాతీతుడు వేటినీ పట్టించుకోడు.

పట్టించుకోకుండా ఎలా ఉంటాడు?

ఈ గుణాలన్నింటికి తాను వేరుగా ఉన్నానని, గుణాలే కర్మలను చేస్తూ కర్మఫలాలను అనుభవిస్తున్నాయని, తాను మాత్రం ఏమీ చేయకుండా ఉండే కేవల సాక్షినని దృఢ భావన కలిగి ఉంటాడు; ఉదాసీనంగా, నిర్లిప్తంగా ఉంటాడు.

గుణాలను బట్టి ప్రేరణ కలుగుతున్నదని, ప్రేరణను బట్టి కర్మలు జరుగుతున్నాయని గ్రహించిన వానికి కర్మలకు కర్త తాను కాదని, గుణాలేనని ధృఢ భావన కలుగుతుంది. అప్పుడు "మరినేనెవరిని?" అనే ఆలోచన వస్తుంది. దానితో ఈ కర్మలతో నాకు ఏ సంబంధము లేదు, నేను కేవల సాక్షిని అని తటస్థంగా, నిర్లిప్తంగా ఉండగలుగుతాడు. కనుకనే దేనినీ ద్వేషించడు, దేనినీ కాంక్షించడు.

అదేమిటి? తమోగుణ కార్యాలను - అంటే ప్రమాద, ఆలస్య, నిద్రాదులను ద్వేషించక పోతే ఎలా? సాధనకు అంతరాయం కదా! - అంటే అది సాధకులకే గాని సిద్ధుడైన గుణాతీతునికి కాదు. మరి ఇతడు ఆ తమోగుణంలో పడి ఉంటాడా? అంటే అలా ఉండడు. ముందు చెప్పబోయే శ్లోకాలలో ఇతని ఆచరణ ఎట్టిదో గమనిస్తే తమోగుణంలో ఉండే వాడికీ, ఇతడికీ ఎంత తేడా ఉందో తెలుస్తుంది. సాధన దశలో వీటన్నింటిని వదులుకున్నాడు గనుక ఈ దశలో వాటిని గురించి పట్టించుకొనే పని లేదు.

ఈ గుణకార్యాలు దుఃఖపూరితంగా ఉన్నాయని ద్వేషించడు; సుఖంగా ఉన్నాయని కాంక్షించడు. అతడెప్పుడూ ప్రశాంతంగా, ఆనందంగానే ఉంటాడు. ఇక్కడి సుఖదుఃఖాలతో అతడికేమీ సంబంధం లేదు. దేనికీ భయపడడు.

సముద్రాన్ని నింపటానికి వర్షం కావాలా? - గుణాతీతునికి ఆనందం ఇవ్వటానికి ఇక్కడి లౌకిక సుఖాలు కావాలా?

హిమాలయపర్వతం ఎప్పుడైనా చలికి వణికిందా? - ఆనంద స్వరూపుడైన గుణాతీతుడు ఇక్కడి లౌకిక దుఃఖాలకు చలిస్తాడా?

గుణాతీతుడు అంతే. దేనికీ చలించడు. ఏదీ అవసరం లేదు. ఒక కోటీశ్వరుడు కారులో వెళుతుంటే రోడ్డుపై ఒక రూపాయి బిళ్ళ కనిపించింది. దాని కోసం అతడు కారు దిగి ఆ రూపాయి బిళ్ళను తీసుకోవటానికి అటూ ఇటూ చూస్తాడా? అతడు దానిని అసలు పట్టించుకోడు, దొరికినందుకు ఆనందించడు, ఎగిరి గంతు వేయడు. దానిని తీసుకోడు. అదే ఒక పేదవాడికో, బిచ్చగాడికో కనిపిస్తే వెంటనే తీసుకుంటాడు. దొరికినందుకు సంతోషిస్తాడు. ఇంకా దొరుకుతాయేమోనని చుట్టూ చూస్తాడు.

కోటీశ్వరుడు తన స్థితిలో తానుండి ఆనందంగానే ఉంటాడు. బిచ్చగాడు ఈ దొరికే వాటితో తాదాత్మ్యం చెంది సుఖం, దుఃఖం రెండూ అనుభవిస్తాడు. గుణాతీతుడు కూడా అంతే. తన స్వస్థితిలో - ఆత్మ స్థితిలో - ఆనంద స్థితిలో ఉండి ఆనందంగా ఉంటాడు. క్రిందికి దిగిరాడు. ఇక్కడి గుణాలను, వాటి కార్యాలను అన్నింటిని మిథ్యగా భావించేవాడు గుణాతీతుడు. మరి మిథ్యా

**భూత పదార్థాలు గాని, కలలోని వస్తువులు గాని, గారడీవాడు చూపించే విలువైన వస్తువులు గాని, వివేకవంతునిలో రాగద్వేషాలు కలిగిస్తాయా? కనుకనే తటస్థంగా, నిర్లిప్తంగా ఉండగలుగుతున్నాడు.**

**నేలపై ఉన్నవానికే వర్షాలు, తుఫానులు, సంక్షోభాలు. మేఘాలకు ఆవల ఉన్నవానికి అంతా ప్రశాంతమే. అలాగే గుణాల బంధికానాలో ఉన్న వానికే సుఖదుఃఖాలు, అశాంతీ. గుణాలను అధిగమించిన గుణాతీతునికి అంతా ఆనందమే, ప్రశాంతతే. కనుక రాగం లేదు, ద్వేషం లేదు. అతడు ఇచ్ఛా ద్వేషాలకు అతీతుడు.**

**తనలో రాగ ద్వేషాలు ఉన్నదీ లేనిదీ తనకే తెలుస్తుంది. ఇతరులకు తెలిసే వీలు లేదు. కనుకనే ఇది 'స్వసం వేద్య లక్షణం' అన్నారు.**

**- ఇట్టి గుణాతీతుడైన యోగి లోకంలో ఎలా ప్రవర్తిస్తాడు? అతడి ఆచరణ ఎలా ఉంటుంది? రాబోయే 3 శ్లోకాలలో చెప్పబోతున్నాడు.**

**శ్లో|| ఉదాసీన వదాసీనః**
**గుణై ర్యో న విచాల్యతే |**
**గుణా వర్తంత ఇత్యేవ**
**యోఽవ తిష్ఠతి నేంగతే || (23)**

**తా|| తటస్థుని వలె నిర్లిప్తంగా ఉన్నవాడై, గుణాల చేత చలించకుండా ఉంటాడు. గుణాలు ప్రవర్తిస్తున్నాయి అనుకుంటూ ఎవడు చలించకుండా ధృఢంగా ఉంటాడో అతడే గుణాతీతుడు.**

**వ్యాఖ్య :-** 1. ఉదాసీన వత్ ఆసీనః :- ఉదాసీనుని వలె ఉండేవాడు. ఈ లోకంలో ఏమి జరుగుతున్నా సరే ఏమీ పట్టకుండా ఉండేవాణ్ణే ఉదాసీనుడు అంటారు. అతడికి ఒకరి పట్ల రాగంగాని, మరొకరి పట్ల ద్వేషంగాని ఉండవు. అలాగే గుణాతీతునికి మంచి గుణాల పట్ల రాగంగాని, చెడ్డ గుణాల పట్ల ద్వేషంగాని ఉండవు. అసలు ఈ జగత్తంతా మిధ్యఅయినప్పుడు, కలలాంటిదే అయినప్పుడు కలలోని విషయాల పట్ల రాగ ద్వేషాలు ఎందుకుంటాయి? ఉండవు.

అయితే ఇక్కడ గుణాతీతుడు నిజంగా ఉదాసీనుడు కాదు, ఉదాసీనుని వలె ఉంటాడు. ఈ 'వలె' అనే పదంలో గొప్ప అర్థం ఇమిడి ఉన్నది. ఎందుకంటే తమోగుణంలో ఉండేవాడు, అసమర్థుడు, సోమరిపోతు ఉదాసీనుడే. అతడేమీ చేయలేక, చేయక, బుద్ధి మాంద్యంతో ఏమీ పట్టకుండా ఉంటాడు. కాని గుణాతీతుడు ఏమీ చేయలేక, బుద్ధిమాంద్యంతో ఉదాసీనుడు కాదు. అతడు అన్నీ తెలిసినవాడు, అతడి దృష్టిలో ఈ ప్రపంచంలోని విషయాలకు విలువ లేదు. అందుకే 'ఉదాసీన వత్ ఆసీనః' - ఉదాసీనుని వలె ఉంటాడు అన్నారు.

అద్దం మంచి వస్తువులనైనా, చెడ్డ వస్తువులనైనా, అందమైన వాటినైనా, వికారమైన వాటినైనా - వేటినైనా చూపుతుంది. దేనికీ అంటుకోదు. దేని ప్రభావము దానిపైబడదు. గుణాతీతుడు కూడా అంతే.

సాధారణంగా చిన్న పిల్లలు మాట్లాడుకుంటున్నా, పోట్లాడుకుంటున్నా, కొట్టుకుంటున్నా వాళ్ళ మాటలు, చేతలు ముద్దుగా ఉంటాయి. వాళ్ళను చూచి ఆ! ఏదో చిన్న పిల్లలులే, పాపం వాళ్ళకేం తెలుసు అని పెద్దలు

ఉదాసీనంగా ఉంటారు. అలాగే గుణాతీతుడు కూడా ఇక్కడ జరిగే వాటిని అల్పమైన విషయాలుగా భావించి నిర్లిప్తంగా ఉంటాడు.

2. గుణైర్యోన విచాల్యతే :- సినిమా హాలులో తెర మీద ఎన్నో ఘటనలు, ఘోరాలు జరిగిపోతూ ఉంటాయి. ఇది సినిమా అని గుర్తున్నంత కాలం వాటికి చలించం. ఆ సంగతి మరచిపోయి కథలో లీనమైపోయామా అప్పుడు దుఃఖం, బాధ, కోపం, భయం, రాగం, ద్వేషం కలుగుతాయి. అలాగే గుణాతీతుడైన వాడు గుణాలచేత నడుపబడే ఇక్కడి కథతో తాదాత్మ్యం చెందడు. లీనమైపోడు. ఇదంతా గుణాలు నడిపే సినిమా కథలాంటిదే అని నిరంతరం గుర్తుంచుకుంటాడు. తాను ఆ సినిమా కన్న వేరుగా ఉండి కేవల సాక్షిగా ఉన్నవాణ్ణి అని గ్రహిస్తాడు. కనుకనే దేనికీ చలించకుండా తటస్థంగా, స్థిరంగా ఉదాసీనంగా ఉండిపోతాడు. కనుక గుణాలు తమ ప్రభావాన్ని చూపిస్తున్నా, అవి సుఖదుఃఖాలను కలిగిస్తున్నా చలించకుండా ఉండగలుగుతాడు గుణాతీతుడు.

3. గుణా వర్తంత ఇత్యేవ :- గుణాతీతుడు ఉదాసీనునిలాగా, ఏమీ పట్టని వానిలాగా నిర్లిప్తంగా ఉండగలగటానికి అతడి భావన ఇలా ఉంటుంది. సాధారణంగా పసిపిల్లలు కొట్టుకుంటారు. అంతలోనే ఒక్కటైపోతారు. అన్నీ మరచిపోతారు. పెద్దలు వారినిచూచి ఏమనుకుంటారు? 'పసిపిల్లలు అంతేలే' అనుకుంటారు. దాని గురించి పట్టించుకోరు. ఆ పిల్లల పట్ల రాగద్వేషాలు లేకుండా ఉంటారు. అలాగే గుణాతీతుడు కూడా గుణాలను పసిపిల్లలు గానే భావిస్తాడు. ఆ! వాటి స్వభావం అంతేలే అవి అలాగే ప్రవర్తిస్తుంటాయిలే ! అని

ఉదాసీనంగా ఉంటాడు. దేని సహజ స్వభావం ఎలాంటిదో అది అలాగే ప్రవర్తిస్తుందిలే అనే నిర్లిప్త భావమే గుణాతీతునిది.

4. యః అవతిష్ఠతినేంగతే :- దేనికీ చలించని వాడే గుణాతీతుడు. ఇక్కడ జరిగే సమస్తము గుణాల కారణంగానే జరిగి పోతున్నాయి. వాటిని నేను కేవలంగా - కేవల సాక్షిగా చూచే వాణ్ణి మాత్రమే అని భావించినవాడు దేనికీ చలించకుండా దృఢంగా ఉండిపోతాడు. ఎందుకంటే గుణాలు వాటి పనులు అవి చేసుకుంటూ ఉంటే గుణాలకు వేరుగా ఉన్న గుణాతీతుడు - వేరుగా ఉన్నానని నిరంతరము గుర్తుంచుకున్న గుణాతీతుడు దేనికీ చలించకుండా నిర్లిప్తంగా ఉండిపోతాడు.

రోజూ మేడ మీది వరండాలో నిలబడి చూస్తున్న వాడికి నీటి కుళాయి దగ్గర జరిగే తంతు వినోదంగా ఉంటుంది. నేను ముందు వచ్చానని ఒకరు అంటే, నేను నీకంటే ముందే బిందె ఇక్కడ పెట్టి వెళ్ళాను, కనుక నేనే ముందు పట్టుకోవాలి అంటుంది వేరొకావిడ. బిందెలు పెట్టిపోతే కుదరదు. ఎవరు ముందు వస్తే వారే ముందు పట్టుకోవాలి అన్న ఆమె రేపు ఆలస్యంగా వస్తుంది. కాని ముందుకు వెళ్ళి పట్టుకోబోతుంది. అప్పుడు ఇవతల ఉన్నవారు తగాదా ఆడుతారు. అప్పుడామె అంటుంది. ముందు వచ్చినంత మాత్రాన ముందు పట్టుకుంటావా? అదేం కుదరదు ఇళ్ళ వరుసలో పట్టుకోవాలి. మా ఇల్లు ముందుంది గనుక నేనే ముందు పట్టుకోవాలి అంటుంది. దానితో పెద్ద గొడవ. చేతులు కలుస్తాయి. ఇదంతా దూరంగా ఉండి చూస్తున్నవాడికి ఎవరి మీద కోపం వస్తుంది? ఎవరి పట్ల సద్భావం కలుగుతుంది? అన్నింటిని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వినోదంగా తిలకిస్తాడు. వీళ్ళు ఇంతేలే అనుకుంటాడు. తాను తటస్థంగా ఉంటాడు. తాను అందులో పాత్రధారి కాదు గనుక, కేవలసాక్షి గనుక, అందులో తనవారెవరూ లేరు గనుక వినోదంగా తిలకిస్తాడు. అలాగే గుణాతీతుడు గుణాల కన్న వేరుగా ఉండి తనను తాను ఆత్మగా గుర్తించి, గుణాల యొక్క కార్యాలను వినోదంగా తిలకిస్తాడు. ఈ త్రిగుణాల యొక్క పోరాటాన్ని చూస్తూ శాంతి, సమత్వాల నుండి చలించడు. ఎప్పుడూ తన దివ్యత్వం లోనే ఉండి పోతాడు.

- గుణాతీతుని ఆచరణ ఇంకా ఎలా ఉంటుందో తరువాతి శ్లోకంలో -

**శ్లో||** సమ దుఃఖ సుఖః స్వస్థః
సమలోష్టాశ్మ కాంచనః |
తుల్య ప్రియా ప్రియో ధీరః
తుల్య నిందాత్మ సంస్తుతిః || (**24**)

**తా||** సుఖ దుఃఖాలలో సమంగా ఉంటూ, ఆత్మలో నిలిచి, మట్టి రాయి బంగారాలను ఒక్కటిగా చూస్తూ, ప్రియ, అప్రియములందు, దూషణ భూషణలందు సమంగా ప్రవర్తిస్తాడు.

**వ్యాఖ్య :-** ఈ ప్రపంచం ఎప్పుడూ మార్పులతో కూడి ఉంటుంది, వికారాలతో కూడి ఉంటుంది. మనం కోరుకున్నట్లుగా ప్రపంచం ఉండదు. మనం కోరుకున్నంత మాత్రాన అల్లకల్లోలాలు తొలగిపోవు. అనేక వికారాల మధ్య యోగి ఎలా సమత్వంలో ఉంటాడో వివరిస్తున్నారీ శ్లోకంలో.


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సామాన్యుడు సుఖ దుఃఖాలతో, రాగ ద్వేషాలతో, ప్రియ అప్రియాలతో, నిందాస్తుతులతో నిరంతరం చలించిపోతూ ఉంటాడు. అయితే గుణాతీతుడు ధీరుడు; స్వస్థుడై యుంటాడు గనుక అతడు ఈ వికారాలకు అతీతంగా ఉంటాడు. ఇవేవీ అతణ్ణి చలింపజేయలేవు. ఎందుకంటే అతడు స్వస్థతిలో - అంటే తన స్థితిలో - ఆత్మ స్థితిలో ఉంటాడు గనుక అతడిది సమబుద్ధి. అన్నింటి పట్ల సమ భావంతో - నిర్లిప్తంగా - తటస్థంగా ఉండగలుగుతాడు. దేనికీ చలించడు. అతడికి ఆనందం లోపలి నుండే వస్తుంది. ఈ ప్రపంచం నుండి ఆనందాన్ని తెచ్చుకోవలసిన పనిలేదు.

- గుణాలలో కూర్చున్నవాణ్ణి ఆ గుణవికారాలు చలింపచేస్తాయి.
- ఆత్మలో కూర్చున్నవాణ్ణి ఆ గుణవికారాలు చలింపజేయలేవు.
- పడవలో కూర్చొని ప్రయాణించేవాణ్ణి ఆటుపోట్లు చలింపజేస్తాయి.
- ఒడ్డున కూర్చొని చూస్తున్నవాణ్ణి ఆటుపోట్లు ఏమీ చేయలేవు.
- స్వప్నంలో ఉన్నవాణ్ణి స్వప్న విషయాలు చలింపజేస్తాయి.
- మెలకువలో ఉన్నవాణ్ణి స్వప్నవిషయాలేవీ చలింపజేయలేవు.

అలాగే గుణాలలో బంధింపబడ్డవాణ్ణి గుణవికారాలు చలింపజేస్తాయి గాని గుణాలకు అతీతంగా, వేరుగా, ఆత్మలో స్థితుడైన గుణాతీతుణ్ణి ఈ గుణ వికారాలు ఎలా చలింపజేస్తాయి? చేయలేవు. కనుకనే గుణాతీతుడు ఏ వికారాలకు, మార్పులకు చలించడు.

ఈ వికారాల పట్ల, మార్పుల పట్ల గుణాతీతుడు ఎలా వ్యవహరిస్తాడో ఆ విషయాలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**1. సమ దుఃఖ సుఖః :- సుఖ దుఃఖాల పట్ల సమత్వం కలిగి ఉంటాడు. ఇంద్రియాల ద్వారా బయటి విషయాలను గ్రహించి వాటిని పూర్వ అనుభవంతో విలువ కట్టగానే సుఖమో దుఃఖమో వస్తుంది.**

**ఈ రోజు మన ఆదాయం వంద రూపాయలు. ఇంతవరకు ఎప్పుడూ 50 రూపాయలు దాటలేదు. అప్పుడు సుఖం. అలాగాక ఎప్పుడూ 200 రూపాయలకు తగ్గలేదు. ఇప్పుడు దుఃఖం.**

**ఈ రోజు కాలునొప్పి, ఇంతకముందు ఎప్పుడూ నొప్పి లేదు. ఇప్పుడు దుఃఖం. డాక్టరు దగ్గర కెళితే 50 రు.లు ఫీజు, 20 రు. లు మందులు. ఇప్పుడూ దుఃఖమే. మందులు కొనక ముందే నొప్పి తగ్గిపోయింది. ఇప్పుడు సుఖం.**

**కొందరి సుఖం మరికొందరికి దుఃఖం అవుతుంది. ప్రక్కయింటి వ్యక్తి కారు కొన్నాడు, హాయిగా దానిలో ప్రయాణం చేసి వస్తున్నాడు. వాడికి సుఖం, మనకు దుఃఖం.**

**ఒకప్పటి సుఖం మరొకప్పుడు దుఃఖంగా కూడా మారిపోతుంది. పెళ్ళి చేసుకొనేటప్పుడు గొప్ప సుఖం - ఆనందం. వంశోద్ధారకుడు పుట్టి మనశ్శాంతి లేకుండా చేస్తున్నాడు. భార్య పోరు ఎక్కువైంది. ఇప్పుడు దుఃఖం.**

**కనుక సుఖ దుఃఖాలనేవి స్థిరం కాదు. అసలు నిజంగా అక్కడ సుఖం గాని, దుఃఖం గాని లేవు. వాటిని చూచే నీ దృష్టి వల్లనే సుఖమో, దుఃఖమో అనుకుంటున్నావు. మనోబుద్ధులనే రంగుటద్దాల ద్వారా ఈ ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు సుఖమో దుఃఖమో కలుగుతున్నాయి. ఆ అద్దాలను తొలగించి చూస్తే ఉన్నది ఉన్నట్లు కనిపిస్తుంది. సుఖ దుఃఖాలు కేవలం మిధ్యా**

మాత్రాలు. కనుకనే గుణాతీతుడు ఈ సుఖ దుఃఖాలను సమంగా - ఒక్కటిగా భావించి సుఖానికి పొంగడు, దుఃఖానికి క్రుంగడు. వాటికి ఏ మాత్రం చలించడు. వాటిని సమంగా చూస్తాడు.

2. స్వస్థః :- స్వ అంటే స్వస్వరూపమైన ఆత్మ. స్వస్థుడు అంటే ఆత్మ యందే స్థితుడై - సమాహితుడై ఉంటాడు అని. సాధారణంగా అందరూ ఈ దేహంతోను, మనస్సుతోను తాదాత్మ్యం చెంది ఉంటారు. కనుక దేహ వికారాలు, మనో వికారాలు సామాన్యులను చలింపజేస్తూ ఉంటాయి. గుణాతీతుడు ఆత్మ యందే ఉండి, ఆత్మతో తాదాత్మ్యం చెంది ఉంటాడు కనుకను; ఆత్మ ఏ వికారాలు లేనిది గనుకను గుణాతీతుడు ఎట్టి వికారాలు లేకుండా సుఖ దుఃఖాలు, రాగ ద్వేషాలు లేకుండా సమత్వంతో ఉంటాడు.

3. సమలోష్టా శ్మ కాంచనః :- గుణాతీతుడు మట్టి రాయి బంగారాన్ని ఒక్కటి గానే చూస్తాడు. ఎలా చూడగలుగుతాడు? మనం చూడలేం గదా! అలాగ. రాత్రి కలలో కనిపించిన బంగారాన్ని మేలుకున్న తర్వాత తూకం వేసి దాచుకుంటామా? లేదు గదా! అలాగే ఈ జగత్తు స్వప్నం లాంటిదే గుణాతీతునికి. కనుక ఈ జాగ్రత్తులోని బంగారం అతడికి స్వప్నంలోని బంగారమే అవుతుంది. కనుక అతడికి బంగారమంటే ఏ మాత్రం విలువ లేనిదే అవుతుంది.

ఒకనాడు కబీరుదాసు కుమారుడు కమాల్ తో కలిసి ప్రయాణం చేస్తున్నాడు. ముందు నడుస్తున్న కబీరుదాసుకు బంగారు కడియం కనిపించింది. కొడుకు దాని ఆకర్షణకు లొంగిపోతాడేమోనని కాలితో మట్టిని

త్రోసి దాన్ని కప్పి వేశాడు. కుమారుడు అది చూచి ఏం చేస్తున్నావు నాన్నా? అన్నాడు. కబీరుదాసు నిజం చెప్పేశాడు. అప్పుడు కమాల్ అన్నాడు, "తండ్రీ! నీ దృష్టిలో ఆ బంగారు కడియము, మట్టి వేరుగా ఉన్నాయేమో గాని నా దృష్టిలో రెండూ ఒక్కటే. భేదం లేదు అన్నాడు. తెల్లబోయాడు కబీరుదాసు. నిజమైన గుణాతీతునికి అన్ని లౌకిక వస్తువులు ఒక్కటే విలువ కలిగినవి.

4. తుల్యప్రియ అప్రియ :- ప్రియమైన వాటిని ఒక విధంగా, అప్రియమైన వాటిని మరొక విధంగా చూడటం రాగ ద్వేషాలు గల సామాన్యుల పని. మనస్సుతో తాదాత్మ్యం చెందిన వారికి ఇష్ట - అయిష్టాలు ఉంటాయి. తాదాత్మ్యం లేని గుణాతీతునికి అన్నీ ఒక్కటే. అతడు మనస్సుకు అతీతుడు.

5. ధీర :- 'ధీ' అంటే బుద్ధి. బుద్ధిని బయటకు పోనీయకుండా అంతర్ముఖం చేసి ఆత్మాకారం చేయగలవాడే ధీరుడు. అలా ఆత్మాకారంలో ఉన్న గుణాతీతునికి ప్రియ అప్రియాలు, నిందాస్తుతులు, సుఖ దుఃఖాలు అన్నీ ఒక్కటే.

6. తుల్య నిందాత్మ సంస్తుతిః :- సాధారణంగా ఎవరైనా నిందిస్తే దుఃఖం, స్తుతిస్తే సంతోషం. గుణాతీతుడు అలా ఉండడు. అతడికి నిందాస్తుతులు రెండూ సమానమే. నిందాస్తుతులు దేహ మనస్సులకే గదా! గుణాతీతుడు దేహ మనస్సుల కన్నా వేరుగా ఆత్మగా ఉండేవాడు. కనుక నిందాస్తుతులు అతణ్ణి చలింపజేయవు. ఎవరు నిందించినా, స్తుతించినా తనను (ఆత్మను) కాదు గనుక స్థిరంగా ఉంటాడు.

మనస్సు అల్లకల్లోలాలతో ఉంటుంది. అందులో కూర్చున్నవాడు చలించి పోతాడు. అలాగాక నిశ్చలము, ప్రశాంతము, ఆనందమయము అయిన ఆత్మలో

కూర్చున్నవాడికి ఏ అల్లకల్లోలాలు, అలజడులు ఉండవు. అన్నింటిని సమానంగా చూడగలుగుతాడు.

- ఇంకా గుణాతీతుని వ్యవహార శైలి ఎలాంటిదో 25 వ శ్లోకంలో.

- గుణాతీతుని వ్యవహార శైలి ఎలా ఉంటుంది? అని అడిగిన అర్జునునికి భగవానుడు సమాధానం చెబుతూ, "ఉదాసీనుడిలా ఉంటూ, గుణాల వల్ల ఏ మాత్రం చలించకుండా, గుణాలు అలాగే ప్రవర్తిస్తాయిలే అని స్థిరంగా ఉంటాడని, సుఖ దుఃఖాలలోను, నిందాస్తుతులలోను సమంగా ఉంటూ, ఎల్లప్పుడూ ఆత్మలో స్థితుడై, ప్రియ అప్రియములందు సమ బుద్ధి కలిగి, మట్టి, రాయి, బంగారం - అన్నింటిని ఒక్కటిగానే చూస్తాడు"అని ఇంతవరకు చెప్పి ఇంకా ఏ విధంగా ప్రవర్తిస్తాడో తెలియజేస్తున్నాడు.

**శ్లో||** మానావ మాన యో స్తుల్యః
తుల్యో మిత్రారి పక్ష యోః ।
సర్వారంభ పరి త్యాగీ
గుణాతీత స్స ఉచ్యతే ।। (25)

**తా||** మానావమానముల పట్ల సమభావంతో ఉంటూ, మిత్రపక్షాలను శత్రు పక్షాలను ఒక్కటిగా చూస్తూ, సమస్త కర్మలను త్యజించి బ్రహ్మనిష్టలో ఉండేవాడు గుణాతీతుడు అని చెప్పబడతాడు.

**వ్యాఖ్య :-** 1. మానావ మానయోః తుల్యః :- మానావమానాల పట్ల సమంగా ఉంటాడు గుణాతీతుడు. అంటే ఎవరైనా పూజించినా, గౌరవించినా

పొంగిపోడు. అలాగే ఎవరైనా అవమానిస్తే కృంగిపోడు. ఇంతకు ముందు శ్లోకంలో నిందాస్తుతులపట్ల సమంగా ఉంటాడు అని చెప్పారు. ఇక్కడ మానావమానాల పట్ల సమంగా ఉంటాడని చెబుతున్నారు. నిందాస్తుతులకు, మానావమానాలకు తేడా ఏమిటి? నింద అంటే తప్పులెన్నటం, స్తుతి అంటే గుణాలను పొగడటం. ఈ రెండూ శబ్ద మాత్రాలు. అంటే వాక్కు ద్వారా వెల్లడించేవి. మానావమానాలు క్రియారూపాలు. మానం అంటే గౌరవించటం; అవమానం అంటే అగౌరవ పరచటం. ఈ రెండూ క్రియలకు సంబంధించినవి. చేతల ద్వారా వ్యక్తమయ్యేవి. అంటే గుణాతీతుడు మాటల ద్వారా వ్యక్తమయ్యే నిందాస్తుతులకు గాని, చేతల ద్వారా వ్యక్తమయ్యే మానావమానాలకు గాని చలించకుండా ఉంటాడు - అని. ఎలా ఉండగలుగుతాడు?

మానావమానాలు బుద్ధి పరిధిలోనివి. గుణాతీతుడు బుద్ధికి అతీతంగా నిలిచినవాడు. ఆత్మలో నిలిచినవాడు. ఆత్మగా ఉండేవాడు. కనుక తనకు సంబంధించిన వాటిగా భావించడు.

జైలుకు వెళ్ళటమంటే ఎవరికైనా అవమానం. కాని రాజకీయ నాయకులకు - ముఖ్యంగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళిన వారికి అదొక గొప్ప గౌరవం. అయితే ఇప్పుడు ఆ స్థితి కూడా మారి పోయింది. ఆర్థిక నేరాలు చేసి జైలుకు వెళ్ళేవారు దేశ సేవ చేస్తున్నట్లు, గొప్ప ఘనకార్యం చేసినట్లు ఫోజులిస్తూ జైలుకు వెళుతున్నారు.

దేహస్థాయిలో ఉన్నవాడికి ఏది అవమానమో, దేహస్థాయిలో లేనివాడికి అది ఏ మాత్రం అవమానంగా భావించడు.

ఆర్కిమెడీస్ సిద్ధాంతాన్ని కనుగొన్నది బాత్ రూంలో స్నానం చేస్తూ. అయితే ఆ సూత్రాన్ని కనుగొనటంతోనే అమితమైన ఆనందంతో తొట్టి నుండి లేచి హుర్రే - హుర్రే అంటూ (తెలిసింది, తెలిసింది అంటూ) వీధుల వెంట నగ్నంగా పరుగెత్తాడు. అతడప్పుడు దేహస్థాయిలో గాని, మనోస్థాయిలో గాని లేడు. అందుకే శరీరం మీద బట్ట ఉన్నదీ లేనిదీ గమనించలేదు.

అలాగే దేహభావనలో ఉన్నవాడికి (అంటే దే. మ.బు.ల. భావనలో ఉన్న వాడికి) ఇది సన్మానం - ఇది అవమానం అని తెలిసి సన్మానానికి పొంగి పోతాడు, అవమానానికి క్రుంగి పోతాడు. అదే ఆత్మ భావనలో ఉన్న గుణాతీతునికి సన్మానము - అవమానము రెండూ ఒక్కటే.

గౌతమ బుద్ధుడు భిక్షాటనకు వెళ్ళినప్పుడు ఒక గృహస్థుడు రోజూ భిక్ష వెయ్యకపోగా అవమానించేవాడు. ఆయన మాత్రం మారు మాట్లాడకుండా వెళ్లి పోయేవాడు. ఒకనాడు అతడే అడిగాడు. ఏమయ్యా! రోజూ నిన్ను అవమానిస్తున్నా అలాగే వెళ్ళిపోతున్నావు. నీకసలు సిగ్గు లేదా? అని. దానికి బుద్ధుడు అన్నాడు. నాయనా! నీవు అవమానించేది ఈ దేహాన్నే గాని నన్ను కాదు గదా! సిగ్గు పడవలసిన అవసరం నాకేమిటి? పైగా నీవు ఎన్ని మాటలన్నా వాటిని నేను స్వీకరిస్తే బాధ పడాలి. కాని నేను వాటిని స్వీకరించటం లేదు గదా! కనుక నాకు సిగ్గూ లేదు, బాధా లేదు. నీవు ఎవరికైనా ఉత్తరం వ్రాస్తే వారు తీసుకోకపోతే ఏమవుతుంది? తిరిగి నీకే వస్తుంది గదా! అలాగే నీవు అన్న మాటలను నేను స్వీకరించకపోతే అవి నీకే తిరిగి వస్తాయి. కనుక నాకేమీ సిగ్గు, బాధా లేనేలేవు అన్నాడట. కనుక

మహాత్ములు ఆత్మ స్థితిలో కూర్చొని దేహ మనో బుద్ధులకు సంబంధించిన విషయాలను పట్టించుకోరు. అందుకే నిందాస్తుతుల పట్ల, మానవమానముల పట్ల సమభావం కలిగి ఉంటారు.

2. తుల్యో మిత్రారి పక్షయోః :- శత్రు మిత్రుల పట్ల గుణాతీతుడు సమంగా ఉంటాడు. గుణాతీతుడు ఆత్మస్థితిలో ఉంటాడు. అతడు అందరినీ ఆత్మగానే చూస్తాడు. ఎవరిని చూచినా వారు తనకన్నా వేరైన వారిగా భావించడు. అయినప్పుడు ఎవరిని మిత్రుడుగా భావిస్తాడు?ఎవరిని శత్రువుగా భావిస్తాడు? నా కుడిచేయి నాకు మిత్రుడూ కాదు, ఎడమ చేయి శత్రువూ కాదు. రెండూ నాకు సమానమే. ఎందుకంటే రెండూ నేనే గదా! నాకంటే వేరైన దానితో మిత్రత్వమో, శతృత్వమో ఉంటుంది. నాకు నేను మిత్రుణ్ణీ గాదు, శత్రువునీ కాదు. అంతా ఒక్కటే. ఇదే గుణాతీతుని స్థితి.

3. సర్వారంభ పరిత్యాగీ :- అన్ని కర్మలను వదిలి పెట్టినవాడు గుణాతీతుడు. ఇక్కడ 'ఆరంభం' అంటే ఈ పని నాది; ఈ ఫలం నాకు రావాలి అనే భావమే. ఈ ఆరంభాన్ని వదిలినవాడే గుణాతీతుడు. ఎందుకంటే గుణాతీతుడు పూర్ణ కాముడు. కృతకృత్యుడు. ఏ కోరికలు లేనివాడు, ఏ పనులు చేయవలసిన అవసరం లేనివాడు. సంపాదించటం, కూడబెట్టటం, ఖర్చుచేయటం, అనుభవించటం - అంటూ ఏమీ లేవు. లౌకికమైన సుఖాలు గాని, దుఃఖాలు గాని లేవు. అతడు దివ్య మానవుడు. అయితే గుణాతీతుడు అసలు ఏ పనీ చేయడా? గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాడా? లేదు. అతడూ పనులు చేయవచ్చు. కాకపోతే అతడు భగవత్ ప్రేరితుడై, లోక సంగ్రహార్థం

కర్మలు చేస్తే చేస్తాడు గాని అతడికి కర్తృత్వమనేది లేదు. అంటే వ్యవహారదృష్టిలో అతడు పనులు చేస్తున్నట్లు కనిపిస్తాడే గాని, పరమార్థ దృష్టిలో అతడు ఏమీ చేయనివాడే. అంతేగాని అతడు సోమరిగాదు.

రజోగుణంలో ఉన్నంతవరకు ఏదో ఒక పని చేస్తూ ఉండాల్సిందే. ఎక్కువగా కామ్య కర్మలనే చేస్తుంటారు. ఇక తమోగుణంలో ఉండే అజ్ఞానులు సోమరులై ఏమీ చేయరు. అయితే వారు సర్వారంభ పరిత్యాగులు కాదు. ఎందుకంటే ఏమీ చెయ్యకుండా ఉన్నామనే క్రియను తమపై ఆరోపించుకుంటారు. చెయ్యవలసిన పనిని చెయ్యకుండా తప్పించు కుంటున్నామనే భావన ఉంటుంది వారికి. ఐతే గుణాతీతులకు ఏ భావనా ఉండదు. కర్తృత్వం గాని, భోక్తృత్వం గాని ఏమీ ఉండదు. కామసంకల్పాలు (కోరికలు) లేకుండా నిర్లిప్తంగా కర్మలు చేస్తున్నా వారు సర్వారంభపరిత్యాగులే. వారికి ఫలాసక్తే గాదు కర్మాసక్తి కూడా ఉండదు.

ఈ శ్లోకంలో 'సర్వారంభ పరిత్యాగీ' అనే పదానికి 'సర్వారంభ ఫల త్యాగీ' అనే పాఠాంతరం ఉన్నది. అయినా భావంలో ఏ మార్పూ లేదు. కర్మాసక్తి - ఫలాసక్తి రెండూ లేని వారే గుణాతీతులు.

'ఉదాసీన వదాసీనః' అని మొదలుపెట్టి 'సర్వారంభ పరిత్యాగీ' అన్న వరకు చెప్పిన ఈ లక్షణాలన్నీ సాధకులైన వారు ప్రయత్నించటానికీ, సాధన చెయ్యటానికీ వీలైనవే. ఇవి జ్ఞానికి సహజ లక్షణాలు అవుతాయి. అతడు ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు.

అర్జునుడు మూడు ప్రశ్నలు అడిగాడు ఈ అధ్యాయంలో - అవి.

**1. గుణాతీతుని లక్షణాలేమిటి?**

**2. అతడి వ్యవహారశైలి ఎలా ఉంటుంది.**

**3. గుణాతీత స్థితిని పొందటానికి ఉపాయం ఏమిటి? - అని**

**ఈ 3 ప్రశ్నలలో రెండింటికి అంటే 1 శ్లోకంలో గుణాతీతుని లక్షణాలను, 3 శ్లోకాలలో అతడి వ్యవహారశైలిని తెలియజెప్పి ఇప్పుడు 3వ ప్రశ్నకు సమాధానంగా గుణాతీత స్థితిని పొందటానికి గల చక్కని ఉపాయాన్ని తెలియజేయబోతున్నాడు భగవానుడు.**

**- గుణాతీతుడు కావాలంటే ఉపాయం ఏమిటి? అని అర్జునుడడిగిన మూడవ ప్రశ్నకు సమాధానం**

**శ్లో|| మాంచయోఽవ్యభిచారేణ**
**భక్తి యోగేన సేవతే |**
**స గుణాన్ సమతీత్యైతాన్**
**బ్రహ్మ భూయాయ కల్పతే || (26)**

**తా||** ఎవరైతే వ్యభిచరించని (అనన్యమైన) భక్తితో నన్ను సేవిస్తారో అతడు ఈ గుణాలన్నింటిని చక్కగా అధిగమించి బ్రహ్మముగా అగుటకు (జీవన్ముక్తుడగుటకు) సమర్ధుడౌతాడు.

**వ్యాఖ్య :-** గుణాతీతుడు కావాలంటే ఏ విధమైన విచారణ చేయాలో ఏ సాధన చేయాలో ఈ అధ్యాయంలోని 19 వ శ్లోకంలోనే చెప్పారు. ఇక్కడ జరిగే కర్మలన్నింటికి కర్త గుణాలేనని, నేను ఆ గుణాలకు వేరుగా, దూరంగా, కేవల


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సాక్షిగా ఉన్న ఆత్మను - పరమాత్మను - అని ఎవరు తెలుసుకొంటారో అతడే గుణాతీతుడు అని ఆ శ్లోకంలోతెలియజేశారు. ఆ తరువాత గుణాతీతుని లక్షణాలేమిటి? అతడి వ్యవహార శైలి - ప్రవర్తన ఎలా ఉంటుంది? అన్న అర్జునుని ప్రశ్నకు 4 శ్లోకాలలో భగవానుడు సమాధానం తెలియజేశాడు. అయినా ప్రత్యేకంగా మళ్ళీ అర్జునుడు గుణాతీతుడయ్యే ఉపాయం ఏమిటి? అని అడుగుతున్నాడు. అంటే ఇంతకన్నా సరళమైన - తేలికైన ఉపాయం ఏదన్నా ఉన్నదేమో చెప్పమని కావచ్చు లేదా కర్మలకు కర్తలైన గుణాలకు వేరుగా - సాక్షిగా ఉండాలంటే చక్కని ఉపాయం ఏమిటో తెలుసుకోవాలని కావచ్చు. అందుకే భగవానుడు ఇక్కడ చక్కనిఉపాయాన్ని తెలియజేస్తున్నాడు.

భగవద్గీత కేవలం సిద్ధాంతాలను బోధించి, తత్త్వ విచారణ చేసి విడిచిపెట్టే గ్రంథం కాదు. ఆ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టే విధానాన్ని కూడా వివరించే అనుష్టాన వేదాంత గ్రంథం.

త్రిగుణాలనే నదికి ఆవలి ఒడ్డున పరమాత్మ ఉన్నాడు. ఆ పరమాత్మను చేరుకోవాలంటే త్రిగుణాలనే ఈ నదిని దాటాలి. నదిని దాటాలంటే పడవ కావాలి. అదే భక్తియనే పడవ. 'అనన్యభక్తి' - అనే పడవ. భగవద్గీతలో ప్రతి అధ్యాయంలోను భక్తిని గురించి చెప్పటం జరిగింది. అనన్యభక్తి వల్లనే జ్ఞాన సిద్ధి. జ్ఞానం వల్లనే మోక్షసిద్ధి. కనుక మోక్షసాధనకు భక్తి అనేది ఎంతో ముఖ్యమైనది. ఆ భక్తి అవ్యభిచారిణీ భక్తి కావాలి. అనన్యభక్తి కావాలి.

"పరమాత్మ సర్వాధికుడు. ఆయనే తల్లి, తండ్రి, ప్రభువు. ఆయనే ప్రాణం. ఆయన తప్ప నాకు అన్యధాశరణం నాస్తి" అని తలచుకుంటూ ఆయననే సర్వ కాల సర్వావస్థలలోను నమ్మి, స్వార్థంలేని ప్రేమను కలిగి ఉండటమే భక్తి. భగవంతుని తప్ప మరి ఎవ్వరినీ, దేనినీ ప్రేమించని భక్తియే అనన్య భక్తి - అవ్యభిచారిణీ భక్తి. ఇట్టి భక్తితో ఎవరైతే నిరంతరం ఆ భగవంతునే స్మరిస్తూ, ధ్యానిస్తూ ఉంటారో వారే భగవంతుని సేవించే నిజమైన భక్తులు. వారే గుణాలకు అతీతంగా ఆత్మలో నిలువగలుగుతారు.

గుణాతీతుడు కావాలని గుణాలతో కుస్తీ పట్టే ముందు భగవంతుని అనన్యభక్తితో సేవించాలి. అదే గుణాలను దాటేందుకు సులభమైన ఉపాయం. నిరంతరం వారి మనస్సులో భగవంతుడే ఉంటాడు గనుక ఇక గుణాలకు చొరబడే అవకాశం లేదు. అందుకే "రాముడున్న చోట కాముడు ఉండడు"- అని తులసీదాసు అంటాడు. భక్తి వారికి స్వభావం. భక్తిని విడిచి వారు ఉండలేరు. గుణరహితుడైన భగవంతుని చింతనలో ఉండే వాడికి గుణాల బంధం ఊడిపోతుంది. ఎంతవరకు భగవంతుని చింతనలో ఉంటామో అంతవరకు గుణాలతో సంబంధం తెగిపోతుంది.

నిరంతరము భగవచ్చింతన సాధ్యమా? కాదు. ఈ విషయం భగవానునికి తెలియనిది కాదు. అందుకే నిత్యమూ నీవు చేసే కర్మలన్నింటిని భగవంతునికి సమర్పించి, వాటిని భగవత్ కర్మలుగా చేయాలి. భగవదార్పణ బుద్ధితో చేయాలి. భక్తి అంటే కేవలం పూజలే గాదు. పూజామందిరం నుండి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భక్తిని ప్రపంచ వ్యవహారంలోకి తీసుకురావాలి. భక్తితో ప్రపంచాన్ని మరచిపోవాలి.

తులసీదాసుకు భార్యపై ఎనలేని ప్రేమ. ఒకరోజు తప్పనిసరై, పుట్టింటి నుండి కబురువస్తే, భర్త ఇంట్లో లేని సమయాన ప్రక్క ఇంటి వారికి చెప్పి భార్య పుట్టింటికి వెళ్ళింది. భర్త వచ్చి, విషయం తెలుసుకొని, అర్ధరాత్రి సమయానికి అత్తగారిల్లు చేరుకున్నాడు. తలుపు తడితే ఎవరూ పలకలేదు. ఒక త్రాడును పట్టుకొని పైకివచ్చాడు. భార్య లేచి వచ్చి, భర్తను చూచింది. శరీరమంతా రక్తం. ఏమిటని చూస్తే అతడు ఆధారంగా పట్టుకొని పైకి వచ్చింది త్రాడు కాదు. అది పాము. అప్పుడన్నది భార్య, "నా మీద చూపే ప్రేమలో 100 వ వంతు ఆ రామునిపై చూపితే ముక్తి వస్తుంది గదా !" అని. అంతే దానితో అతడు భక్తుడయ్యాడు. అతిగా ప్రేమ ఉన్నప్పుడు బాధలు తెలియవు. అలా ప్రేమించాలి భగవంతుని. కనుకనే తులసీదాసు అంతటి భక్తుడయ్యాడు.

భక్తితో ఉంటే మనసులోని విక్షేపాలన్నీ తొలగిపోతాయి. అప్పుడు మనస్సు ధ్యానానుకూలం అవుతుంది. ఆ ధ్యానంలో మనస్సు లయమైపోతుంది.

<u>బ్రహ్మ భూయాయ కల్పతే</u> :- బ్రహ్మమే అగుటకు సమర్ధత కలుగుతుంది. గుణాలలో ఉన్నంతకాలం అవి నిన్ను బాధపెడతాయి. గుణాలను దాటి ఆత్మలో ఉన్నావా? అన్ని బాధలు మాయం. కలలో ఉన్నంత కాలం నీ ఆరవ కుమార్తె పెళ్ళి కోసం ఏంతో బాధ పడుతున్నావు. కల కరిగి మేలుకున్నావా! కూతురూ లేదు. పెళ్ళి లేదు. బాధలు లేవు. కనుక గుణాలను దాటితే ఆనందమే. బ్రహ్మమే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- నన్ను భక్తితో సేవిస్తే బ్రహ్మమే అవుతావు అన్నారు. శ్రీ కృష్ణుని సేవిస్తే బ్రహ్మమునెలా పొందుతారు? శ్రీకృష్ణునికి - బ్రహ్మానికి మధ్య గల సంబంధమేమి ?

శ్లో|| బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహం
అమృత స్యా వ్యయ స్య చ ।
శాశ్వతస్య చ ధర్మ స్య
సుఖస్యై కాంతి కస్య చ || (27)

**తా||** అమృతము, అవ్యయము, శాశ్వత ధర్మము, ఏకాంత సుఖము అయిన బ్రహ్మమునకు నేను ఆధారాన్ని.

**వ్యాఖ్య:-** శ్రీ కృష్ణుడు, బ్రహ్మము వేరువేరు కాదు. ఇద్దరూ ఒక్కటే. అందుకే నేను బ్రహ్మమునకు ప్రతిష్ఠను అంటున్నాడు భగవానుడు. నిరాకార, నిర్గుణ బ్రహ్మమునకు ఘనీభవించిన ప్రతిష్టయే శ్రీకృష్ణుడు. కనుకనే అట్టి శ్రీకృష్ణుని అనన్యభక్తితో సేవిస్తే ఆయన వ్యాపక తత్త్వమైన బ్రహ్మములో చేరిపోవటం జరుగుతుంది. శ్రీకృష్ణుడు వేరు - పరబ్రహ్మము వేరు కాదు. ఒక్కటే.

నిర్గుణ పరమాత్మను ఉపాసించటం అందరికీ కుదరదు. అందుకే సాకార సగుణ రూపాలు చెప్పబడ్డాయి. మాయకు అతీతుడైన పరమాత్మ యొక్క నిర్గుణ స్వరూపం ఒక్కటే. అయితే సగుణ స్వరూపాలు రెండు. ఒకటి సాకారం . మరొకటి నిరాకారం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సర్వాశ్రయము, సర్వవ్యాపకము, సర్వకర్త, సర్వభోక్త, సర్వభర్త అయినది పరమాత్మ యొక్క నిరాకార నిర్గుణ స్వరూపం.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శివుడు, విష్ణువు అనేవి సాకార సగుణ రూపాలు. ఇక్కడ శ్రీకృష్ణుడే పరబ్రహ్మనికి ప్రతిష్ఠ. పరబ్రహ్మతత్త్వాన్ని భక్తులలో ప్రతిష్టించటానికే ఆయన అవతరించినది. ఆయన అవ్యయము, అమృతము. అంటే వికార రహితము, మార్పులు లేని తత్త్వం. ఆయన శాశ్వత ధర్మానికి - అంటే మోక్షానికి ప్రతిష్ట. ఆయన ఏకాంత సుఖానికి ప్రతిష్ట. 'ఏకాంతం' అంటే ఏకమే అంతముగా గలిగినది. అదే సుఖమైనది. అనేక నదులు సముద్రంలోకి చేరి శాంతిస్తాయి. అలాగే ఇక్కడ కనిపించే నానాత్వం అంతా ఏఏ లోకంలో అంతమవుతుందో అదే ఏకాంతం. ఆ పరబ్రహ్మమే ఏకాంతం. ఏకాంత సుఖం అంటే బ్రహ్మ సుఖం. ఆత్మసుఖం. ఆత్మానందం. శాశ్వతానందం అని అర్థం.

శ్రీకృష్ణుడు తాను సాక్షాత్ పరబ్రహ్మమునే అని చెప్పటానికి ఇక్కడ ఆ బ్రహ్మము యొక్క 3 లక్షణాలను వివరించటం జరిగింది.

1. అమృతస్య అవ్యయస్య :- నాశనం లేని అమృతత్వం - ఇది 'సత్' అనే లక్షణం.

2. శాశ్వతస్య చ ధర్మస్య :- సనాతన ధర్మ స్వరూపం, మోక్ష స్వరూపం. ఇది 'చిత్' లక్షణం.

3. ఏకాంతి కస్య సుఖస్య :- సమస్తము అంతమయ్యే ఏకం తాను. అలా అంతమైనప్పుడు కలిగే సుఖమే. ఏకాంత సుఖం. నిరతిశయ ఆనందం. ఇది 'ఆనంద' లక్షణం.

ఈ సత్, చిత్, ఆనందమనే 3 లక్షణాలు ఆ పరబ్రహ్మము యొక్క స్వరూపమే. అంటే శ్రీకృష్ణుడు యశోదానందనుడు, రుక్మిణీ వల్లభుడు, దుర్యోధన కులాంతకుడు, గోపికా వస్త్రాపహారకుడు మాత్రమే కాదు. ఆయన 'సచ్చిదానంద స్వరూపుడు' అని కూడా స్పష్టం.

ఎవరు తనను అనన్యభక్తితో సేవిస్తారో వారు భ్రమర కీటక న్యాయాన్ని అనుసరించి తనయందే - అనగా బ్రహ్మమునందే లయంచెంది బ్రహ్మముగా అవుతారు.

కనుక సాకార సగుణోపాసన ద్వారా చేరుకొనేది నిరాకార నిర్గుణ పరమాత్మనే - పరబ్రహ్మన్నే. సాకార సగుణోపాసన అల్పమైనది కాదు. దానికీ నిరాకార నిర్గుణోపాసనకు ఫలితంలో తేడా లేదు. అందుకే 'ద్వైతులు' కేవలం యశోదాతనయుడు, దేవకీసుతుడు, రుక్మిణీవల్లభుడు, సత్యభామాప్రియుడు, పూతనాసంహారకుడు, గోపికావస్త్రాపహారకుడు, మురళీగానలోలుడు, వెన్నదొంగ అని శ్రీ కృష్ణుని సాకార సగుణ మూర్తిని భక్తితో పూజిస్తారు. వారికి ఆయన రూపం, ఆయన లీలలు, ఆయన మాహాత్మ్యం వీటితో ప్రభావితులై తన్మయులౌతారు.

ఇక 'విశిష్టా ద్వైతులు' ఆయన రూపాన్ని, అనంత చైతన్యము, సర్వ వ్యాపకము, సచ్చిదానందము అయిన నిరాకార నిర్గుణ పరమాత్మకు ప్రతీకగా భావించి సేవిస్తారు.

అద్వైతులు ఆయన రూపంతో నిమిత్తం లేకుండా నిరాకార, నిర్గుణ పరమాత్మగానే భావన చేసి ధ్యానిస్తారు. ఆత్మ విచారణ చేస్తారు. ఎవరెలా

కొలిచినా, సేవించినా, ధ్యానించినా తన యదార్ధ స్వరూపం సచ్చిదానంద స్వరూపమేనని, తాను బ్రహ్మమునకు ప్రతీకనని శ్రీకృష్ణుడు స్వయంగా ఇక్కడ తెలియజేస్తున్నాడు.

'నివసిష్యసి మయ్యేవ' - నాలోనే నివసిస్తావు అని 12 వ అధ్యాయంలో చెప్పిన దానికి 'బ్రహ్మభూయాయ కల్పతే' - బ్రహ్మములోనే చేరిపోతావు అని క్రిందటి శ్లోకంలో చెప్పిన దానికి తేడా ఏమీ లేదు. రెండూ ఒక్కటే.

మనోబుద్ధులు పూర్తిగా పరమాత్మలో లయమైతే మిగిలేది పరమాత్మ మాత్రమే. అదే పరమాత్మ అనుభూతి. ఒక అవస్థను విడిస్తేనే మరొక అవస్థ. జాగ్రదవస్థను విడిస్తేనే స్వప్నావస్థ. స్వప్నావస్థను వీడితేనే సుషుప్తి. సుషుప్తిని వీడితేనే జాగ్రదవస్థ. అలాగే మేలుకున్న విశ్వుడే స్వప్నాన్ని చూచే తైజసుడు. స్వప్నాన్ని చూచే తైజసుడే సుషుప్తిలోని ప్రాజ్ఞుడు. జీవభావాన్ని వీడితేనే ఆత్మభావన. ఆత్మలో చేరి ఆత్మగా ఉండిపోయేది. దేహ మనో బుద్ధుల స్పృహ ఉన్నంత వరకు జీవ భావం. ఆ స్పృహ వీడితేనే బ్రహ్మానుభూతి. కనుక సర్వాన్ని శ్రీకృష్ణమయం చేయాలి.

శ్రీకృష్ణునికి జీవ భావం లేదు. అందుకే ఆయన పరమాత్మ. కనుకనే 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్నారు.

**గద్యం :**

ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం

యోగ శాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే గుణ త్రయ విభాగ యోగో నామ

చతుర్దశోఽధ్యాయః

ఈ ప్రకారంగా ఉపనిషత్తుల సారమై, బ్రహ్మ విద్య, యోగ శాస్త్రము అయి, శ్రీకృష్ణ అర్జునుల మధ్య సంవాద రూపంగా ఉన్న భగవద్గీతలోని పదునాలుగవ అధ్యాయం గుణత్రయ విభాగయోగం సమాప్తం.

మనందరం భగవంతుని అనుగ్రహంతో గుణాతీతులం కావాలి. గుణ బద్ధులమై పశువులాగా జీవించటానికి కాదు ఈ జన్మ వచ్చింది. గుణాతీతులమై పశుపతిత్వం - బ్రహ్మత్వం పొందటానికే ఈ మానవజన్మ. కనుక ఈ జన్మను సార్ధకం చేసుకోవాలి. అలా గుణాతీతులై ఈ జన్మను సార్ధకం చేసుకుంటారని ఆశిస్తూ ఆశీర్వదిస్తూ ఈ అధ్యాయాన్ని ముగిద్దాం.




**Website : WWW.SRICHALAPATHIRAO.COM**

**Email : care@srichalapathirao.com**

**Contact : +91 80085 39770 / +91 98862 65225**

# శ్రీమద్భగవద్గీత : 15 వ అధ్యాయం

# పురుషోత్తమప్రాప్తి యోగం



: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# పూజ్య గురుదేవులు

జ్ఞానప్రపూర్ణ

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)**

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com

Visit www.srichalapathirao.com to listen Pravachanas

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ॥న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములుచేస్తూ జ్ఞాన సుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 179 ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞములను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంథాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్థమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్థం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంథాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంథాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్థులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్థంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

ఈ అధ్యాయానికి మరోపేరు ప్రసాదయోగం. ప్రసాదాన్ని ఆరగించే సమయంలో - అంటే భోజనం చేసే సమయంలో ఈ అధ్యాయాన్ని పారాయణ చేసే సాంప్రదాయం అనేక ఆశ్రమాలలో పాటిస్తుంటారు. అందుకే దీనికీ పేరు వచ్చిందంటారు పెద్దలు. ఏది ఏమైనా ఇది మామూలు ప్రసాదం కాదు. మహాప్రసాదం. మామూలు ప్రసాదాన్ని మనం పూట పూట ఆరగించాలి. కాని ఈ మహాప్రసాదాన్ని ఒక్కసారి ఆరగిస్తే చాలు. మళ్ళీ మళ్ళీ ఆరగించాల్సిన పని ఉండదు. ఈ ప్రసాదాన్ని చక్కగా సద్గురువుల ద్వారా స్వీకరించి ఆరగిస్తే నరుడు నారాయణుడవుతాడు. మానవుడు మాధవుడు అవుతాడు. జీవుడు దేవుడవుతాడు. పురుషుడు పురుషోత్తముడవుతాడు.

ఇది పురుషోత్తమప్రాప్తి యోగం. అంటే పరమాత్మను పొందే ఉపాయం. పురుషోత్తముడన్నా పరమాత్మ అన్నా అంతా ఒక్కటే. పురుషోత్తముడు ఈ దేహమనే పురంలో కూర్చొని పురుషుడయ్యాడు. పురుషుడన్నా - జీవుడన్నా - క్షేత్రజ్ఞుడన్నా అంతా ఒక్కటే. పరమాత్మ దేహంలో కూర్చొని దేహభావంతో జీవుడయ్యాడు. దేహభావాన్ని విడిచి ఆత్మభావంతో ఉన్నాడా? నరుడు నారాయణుడే. పరమాత్మయే.

అలా నారాయణుడు కావటానికే అసలు ఈ మానవజన్మ వచ్చింది. నరుడు చేయవలసినదేదో చేసేస్తే సరి నారాయణుడే అవుతాడు. కాని అనాది కాలం నుంచి మన బుద్ధి గుహ మూసుకుపోయింది. బుద్ధి గుహను తెరిచి సర్వసాక్షి అయిన పరమాత్మను సాక్షాత్కరింపజేసుకోవాలి. అందుకే ఈ

మానవ జన్మనెత్తి వచ్చామని మరచిపోతున్నాడు మానవుడు. తన ప్రప్రధమ కర్తవ్యం - ముఖ్య కర్తవ్యం "తానెవరో తెలుసుకొని తాను తానుగా ఉండిపోవటమే" ననే విషయాన్ని విస్మరిస్తున్నాడు. కర్తవ్యాన్ని విడిచిపెట్టటం మహాపాపం. ఆ పాపానికి తగిన శిక్షను ప్రకృతే ఇచ్చింది. ఏమిటి ఆ శిక్ష? మన మీద పడ్డ ఈ దండగ మారి చాకిరీయే. పుడుతూ - చస్తూ - దుఃఖాలు అనుభవిస్తూ - తల్లి గర్భం నుండి కాటి వరకు ఈ స్థూలదేహాన్ని మోసుకుంటూ పోవటమే. ఎన్ని జన్మలెత్తినా ఇంతే. ఇదే పని.

మన అసలు కర్తవ్యాన్ని మరచిపోయాం. అసలు దానిని మన కర్తవ్యం అని కూడా అనుకోవటం లేదు. ఈ దేహానికి సంబంధించిన అవసరాలను, దీని కోసం చేయవలసిన అడ్డమైన చాకిరీనే మన కర్తవ్యంగా భావిస్తున్నాం. ఈ గాడిద చాకిరీ చేయటానికే మనం వచ్చింది అని అనుకుంటున్నాం. అలాగే చేసుకుంటూ పోతున్నాం.

ఒకసారి అంటుకున్న ఈ జిడ్డును వదిలించుకోలేక తంటాలు పడుతున్నాం. జన్మలకు జన్మలు గడిచిపోతున్నాయి. యుగాలు గడిచిపోతున్నాయి. మహాయుగాలు గడిచిపోతున్నాయి. కల్పాలు, బ్రహ్మ ప్రళయాలు గడిచిపోతున్నాయి. ఈ జిడ్డును ఎప్పటికైనా వదిలించుకుంటేనే నరుడు నారాయణుడయ్యేది, జీవుడు దేవుడయ్యేది, పురుషుడు పురుషోత్తముడయ్యేది.

నిజంగా నర్ణుణ్ణి నారాయణుడుగా చెయ్యటానికే శ్రీకృష్ణ భగవానుడు అవతరించాడు. కల్పితమైన ఉపాధులతో తాదాత్మ్యం చెంది మీరు

నరులయ్యారు. మీ నిజస్వరూపాన్ని మరచి దేహేంద్రియ మనోబుద్ధుల తాదాత్మ్యంతో నరులుగా వ్యవహరిస్తున్నారు. మీరు నరులం అనుకుంటున్నారు. కాదుకాదు, "మమైవాంశః" మీరంతా నా అంశయే. నా స్వరూపాలే. పరమాత్మ స్వరూపులే. నా మాట నమ్మండి అని ఆయన హితబోధ చేస్తున్నాడు.

నీవు ఖాళీ అయిపో. నిన్ను భర్తీ చేస్తాను అని బైబిల్ వాక్యం. నీవు నరభావాన్ని వదిలితే చాలు. నీవు స్వయంగా నారాయణుడివే - ఇది గీతాచార్యుని వాక్యం. నారాయణత్వాన్ని క్రొత్తగా ఎక్కడినుంచో సంపాదించే పనిలేదు.

ఇంతవరకు ఒక్కొక్క మెట్టు ఎక్కిస్తూ భగవద్గీత మనను ఈ ప్రపంచానికి దూరంగా - పరమాత్మ దగ్గరకు నడిపిస్తున్నది. మొదటి ఆరు అధ్యాయాలతో కూడిన కర్మషట్కంలో కర్మలను ఫలాపేక్ష లేకుండా, సంగభావం లేకుండా, నేనుచేస్తున్నాను అనే కర్తృత్వ బుద్ధి లేకుండా, నిష్కామంగా చేసి చిత్తశుద్ధిని పొందాలని; అలా శుద్ధమైన చిత్తంతో భగవంతుని గురించి తెలుసుకొని ధ్యాన సాధన సాగించాలని భగవానుడు తెలియజేశాడు. ఆ తరువాతి ఆరు అధ్యాయాలతో కూడిన భక్తిషట్కంలో భగవంతుని మహిమను గురించి, ఆయన విభూతుల గురించి తెలియజేసి భక్తితో ఆయననెలా ఉపాసన చెయ్యాలో తెలియజేయటం జరిగింది. ఇక 13వ అధ్యాయం నుండి అఖండ జ్ఞాన బోధను ప్రారంభించారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మ క్షేత్రంలో కూర్చొని క్షేత్రజ్ఞుడయ్యాడని, క్షేత్రం నుండి విడిపోతే తిరిగి పరమాత్మగానే ఉండిపోతాడని తెలియజెప్పి, క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుని విడదీసే - విభాగించే ఉపాయాన్ని 13వ అధ్యాయంలో చెప్పారు. క్షేత్రక్షేత్రజ్ఞులను బంధించిన తాళ్ళు గుణాలేనని - త్రిగుణాలేనని తెలియజెప్పి; ఆ త్రిగుణాలను, వాటి స్వరూప స్వభావాలను, వాటి వ్యవహారాలను, అవి జీవుణ్ణి ఎలా బంధిస్తున్నాయో, ఆ బంధనాల నుండి విడిపించుకోవటం ఎలాగో 14వ అధ్యాయంలో చెప్పారు. ఆ గుణాలను అధిగమించి గుణాతీతుడైతే పరమాత్మ ప్రాప్తియే. గుణాలలో చిక్కితే పురుషుడు; గుణాతీతుడైతే పురుషోత్తముడు. ఆయనే పరమాత్మ. ఆయనను అందుకోవటమే మానవజీవిత కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలంటే ఆయన ఎక్కడ ఉన్నదీ, ఎలా ఉన్నదీ తెలుసుకోవాలి. ఆయనను ఎలా సమీపించాలో, ఎలా ఆయనతో ఐక్యం కావాలో తెలుసుకోవాలి. ఆయనతో ఐక్యతకు అడ్డువచ్చే ఆటంకాలేమిటో తెలుసుకోవాలి. వాటిని అధిగమించి ముందుకు వెళ్ళే ఉపాయాలేమిటో గ్రహించాలి. అందుకే ఈ అధ్యాయం పరమాత్మ యొక్క శక్తిసామర్థ్యాలను, ఆయన ప్రభావాన్ని, ఆయన మహిమను, ఆయన ఎక్కడ ఉన్నదీ, ఆయన మనకు చేస్తున్న మేలును, ఆయన గుణగణాలను, ఆయన అస్థిత్వాన్ని పూర్తిగ తెలియజేయటమే గాక ఆయనను అందుకొనేందుకు అడ్డువస్తున్న ఈ సంసార వృక్షాన్ని ఎలా తెగనరికి వేయాలో, ఈ ప్రాపంచిక వస్తువులు, విషయాలు, భోగాలు ఎట్లా అనిత్యాలో తెలియజేసి, వాటిపై ఆసక్తిని పోగొట్టుకొని పరమాత్మతో ఎలా ఐక్యతను సాధించాలో అన్ని విషయాలను కూలంకషంగా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- పూసగ్రుచ్చినట్లు తెలియజెప్పిన చిన్న అధ్యాయం ఈ పురుషోత్తమ ప్రాప్తియోగం.

పురుషోత్తమ ప్రాప్తికి అనన్యభక్తి కావాలి. అదే సమయంలో విషయాల పట్ల విరక్తి ఉండాలి. అటువంటి విరక్తిని - వైరాగ్యాన్ని కలిగించటానికే ఈ అధ్యాయంలో సంసారాన్ని అశ్వద్ధ వృక్షంగా పోల్చి చెప్పారు. అంతేగాక ఈ వృక్షాన్ని అసంగమనే శస్త్రంతో ఛేదించాలని కూడా చెప్పారు.

అధ్యాయంలోని 20 శ్లోకాలలో చెప్పిన విషయాలను నాలుగు విభాగాలుగా చేయవచ్చు.

(1) మొదటి 6 శ్లోకాలు పురుషోత్తమ ప్రాప్తికి అడ్డువచ్చే ఈ సంసార వృక్షం ఎలాంటిదో, దానిని ఏ ఆయుధంతో ఛేదించాలో చెప్పి ఆ తరువాత పరమాత్మను ఎలా శరణుపొందాలో, దానికి మనలో ఎలాంటి లక్షణాలు ఉండాలో తెలియజెప్పారు.

(2) 7 నుండి 11 శ్లోకాల వరకు జీవుడు యదార్ధంగా పరమాత్మ అంశయేనని, ఆ అంశయే ఈ క్షేత్రంలో కూర్చొని, క్షేత్రంలోని వాసనల కారణంగా భోగాలను అనుభవించాలనే కోరికతో మనస్సుతో సహా 6 ఇంద్రియాలను తీసుకొని, ఒక దేహం నుండి మరో దేహానికి ప్రయాణిస్తున్నదని, ఇలా ప్రయాణిస్తూ ఆయా దేహాలలో ఉన్నప్పుడు భోగాలననుభవిస్తూ, అందులో మునిగిపోయి తనను తాను మరచిపోయినదని - జ్ఞాననేత్రంతో తిరిగి తన స్వరూపాన్ని తెలుసుకోవాలని; దానికి తీవ్రప్రయత్నము, చిత్తశుద్ధి కావాలని తెలియజేశారు.

**(3) ఇక 12 నుండి 15 వరకు గల 4 శ్లోకాలలో భగవంతుడు - తానెవరో, ఎలాంటి మహిమలు గలవాడో, ఎక్కడెక్కడ ఎలా వ్యక్తమవుతూ ఉంటాడో, ఏం చేస్తుంటాడో తానే స్వయంగా తెలియజేశాడు.**

**(4) ఇక 16 నుండి 20 వరకు గల 5 శ్లోకాలలో ఉత్తమాధికారులకు తన యదార్ధ స్వరూపాన్ని తెలియజెపుతూ, తాను క్షర - అక్షర పురుషులకన్న వేరైన వాడనని, అధికుడనని, పురుషోత్తముడనని చెప్పి, తనను అలా ఎవరు తెలుసుకొంటారో అతడే జ్ఞాని అని, అతడే తనకు శరణాగతుడై తనను సర్వవిధాలుగా సేవించి, ఈ అత్యంత రహస్య శాస్త్రాన్ని తెలుసుకొని, బుద్ధిమంతుడై, కృతకృత్యుడై తనను చేరుకుంటాడని తెలియజేయటం జరిగింది.**

**ఇది పురుషోత్తమప్రాప్తి యోగం. ఈ అధ్యాయానికి ఈ పేరు ఎలా తగి ఉన్నదో విచారణ చేద్దాం. ఈ పేరులో 4 పదాలున్నాయి. పురుష, ఉత్తమ, ప్రాప్తి, యోగం అనేవి ఆ 4 పదాలు.**

**(1) పురుషుడు అంటే మగవాడు అని. ఇది కేవలం శరీర దృష్టితో చూసినప్పుడే ఈ అర్ధం సరిపోతుంది. వేదాంత పరంగా ఆలోచిస్తే మగ, ఆడ అనే దానికి అర్ధమే లేదు. మరి పురుషుడంటే అసలైన అర్ధం ఏమిటి? ఈ కనిపించే జడమైన శరీరాన్ని నఖశిఖపర్యంతం పూరించి పూర్ణంగా ఉండేవాడే పురుషుడు. ఈ దేహం ఒక పురం వంటిది. ఈ పురాన్ని పూరించి ఆడించేవాడు, కదిలించేవాడు పురుషుడు. (జీవుడు).**

(2) పురుషులలో ఉత్తముడు - ఎవరు? ఈ ఒక్కొక్క శరీరాన్ని పూరించి, నిలబెట్టేవాడు పురుషుడైతే - ఈ సమిష్టి బ్రహ్మాండాన్ని, అన్ని ఉపాధులను పూరించి పూర్ణంగా నిలబెట్టేవాడే పురుషోత్తముడు. ఉపాధిని బట్టి వేరువేరుగా పేర్లు పెట్టినా అసలు వస్తువు మాత్రం ఒక్కటే.

ఇత్తడి రేకును సాగగొట్టి చిన్నదిగా చేస్తే చెంబు. పెద్దదిగా చేస్తే బిందె. సైజులో తేడాయే గాని, వస్తువులో తేడా ఏ మాత్రం లేదు.

(3) ఇక ప్రాప్తి అంటే? పొందటం. పురుషోత్తముని పొందటం. పురుషోత్తముని పొందటం మన అందరి జన్మహక్కు. అసలు మనం ఈ జన్మ ఎత్తి వచ్చింది అందుకే. అందుకోసం వచ్చినా ఆ విషయం తెలియక ఈ జన్మను ఎందుకోసమో బలిపెడుతున్నాం. పురుషోత్తముని అందుకోవాలంటే ఆయన ఎక్కడున్నాడు? ఆయన ఎక్కడో, ఏ లోకంలోనో లేడు. మనం అందుకోలేనంత ఎత్తులోనూ, పొందరానంత దూరంలోనూ లేడు. ఆయన అంతటా సూక్ష్మాతి సూక్ష్మంగా ఉన్నాడు. ఇందుగలడు - అందులేడు అనే సందేహం అక్కరలేదు. ఆయన సర్వోపగతుడు. ఎందెందు వెదకి చూచిన అందందే గలడు అని చెప్పిన ప్రహ్లాదుని పలుకులు పరమ సత్యములు.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః" అని తానే స్వయంగా సమస్త భూతాలలో నేనున్నాను అని అర్జునునికి చెప్పాడు. అసలు ఆయన మనలో ఉండటం కాదు, ఆయన మనమే. మనం ఆయనే. అందుకే "నిన్ను నీవు తెలుసుకో. నిన్ను నీవు తెలుసుకుంటే పరమాత్మను తెలుసుకున్నట్లు. నిన్ను నీవు తెలుసుకోలేకపోతే పరమాత్మను ఎప్పటికీ తెలుసుకోలేవు" అని చెప్పటం

జరిగింది. నీ అసలు స్వరూపం తెలుసుకుంటే చాలు. ఎందుకంటే అదే పరమాత్మ స్వరూపం. నా అసలు స్వరూపం పరమాత్మ స్వరూపమే అయితే ఇంకా ప్రాప్తి = పొందటం ఏమిటి? దేనిని పొందాలి? ప్రాప్తి అనేది రెండు రకాలు. (i) అప్రాప్యరూప ప్రాప్తి. (ii) ప్రాప్యరూప ప్రాప్తి.

(i) అప్రాప్యరూప ప్రాప్తి : - తనవద్ద లేని వస్తువును పొందటం.

(ii) ప్రాప్యరూప ప్రాప్తి :- వస్తువు నా దగ్గరే ఉన్నది. కాని ఆ విషయం మరిచిపోయాను. దానికోసం వెతుకుతున్నాను. మరొకడు వచ్చి నాకు జ్ఞాపకం చేశాడు. ఆ దొరికింది - దొరికింది అన్నాను. అంతే.

ఒకావిడ పెళ్ళికి పోతూ ప్రక్క ఇంటి పిన్నిగారి గొలుసు అరువు తీసుకొని వెళ్ళింది. కార్యక్రమం పూర్తయినతర్వాత చిరాకుగా - అలసటగా ఉండటంతో అలా మంచం మీద పడుకొంది. కొంతసేపటికి గొలుసు గుర్తుకు వచ్చింది. చేతితో ఎదపైన తడిమిచూచింది. గొలుసు కనిపించలేదు. దడ పుట్టింది. ఇల్లంతా వెతికింది. దారిలో ఎక్కడన్నా జారి పడ్డదేమోనని ఆదారి వెంట వెతికింది. ఎక్కడా కనిపించలేదు. భర్త తిట్ల పురాణం లంకించుకున్నాడు. ఆమె వణికిపోతూ ఏడుస్తున్నది. అంతలో తల్లి వచ్చి సరిగ్గా చూసుకున్నావా మెడలో? అన్నది. అప్పుడు మళ్ళీ తడిమి చూచింది. గొలుసు చేతికి తగిలింది. 'ఆ! దొరికింది, దొరికింది' అన్నది. నిజంగా గొలుసు పోనూ లేదు; ఇప్పుడు దొరకనూ లేదు. మంచం మీదపడుకున్నప్పుడు దిండు ఉన్న వైపుకు కాళ్ళు వ్రేలాడదీసి పడుకుంది. దానితో గొలుసు గొంతు దగ్గరకు పోయింది. ఇప్పుడు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మళ్ళీ క్రిందికి జారి చేతికి తగిలింది. అంతే. ఇదే ప్రాప్యరూప ప్రాప్తి. ఉన్న వస్తువునే లేదనుకోవటం, తరువాత కనిపించటం.

మన స్వరూపం పరమాత్మ స్వరూపం. అది మరచి జీవుణ్ణని భావిస్తాం. ఎవరో తెలియజేస్తే పరమాత్మనని గ్రహిస్తాం. మన పెరట్లో పిచ్చి మొక్కలు పెరుగుతున్నాయి. అందులో ఒక ఔషధ మొక్క కూడా ఉన్నది. దాని ఆకు పసరు పిండితే పాముకాటుకు చచ్చేవాడు కూడా బ్రతుకుతాడు. ఎందరో మనకంటి ఎదురుగా పాము కాటుకు చనిపోతున్నా అది ఔషధ మొక్క అని తెలియక పిచ్చి మొక్కగా భావించటం వల్ల ఏమీ చేయలేకపోయాం. ఒకనాడు ఒక సాధువును భోజనానికి పిలిచి భోజనం పెట్టాం. ఆయన చెయ్యి కడుక్కుంటూ పెరటిలోకి చూచాడు. ఈ మొక్క విషయం చెప్పాడు. అంతే అప్పటి నుండి ఒక్కడు కూడా పాము కాటుకు చావలేదు.

మనం కూడా అంతే. మనం పరమాత్మ స్వరూపులమని, ఆనంద స్వరూపులమని తెలుసుకోలేక జీవుడిలాగా, దుఃఖాలతో కాలం గడుపుతున్నాం. పిచ్చిమొక్క లాగా పెరుగుతున్నాం. ఎప్పుడో ఒక మహాత్ముడు మన పూర్వపుణ్య విశేషం చేత మనకు గురువుగా తటస్థపడి "నీవు జీవుడివి కాదు. దుఃఖ స్వరూపుడివి కాదు. ఆత్మవు. ఆనంద స్వరూపానివి" - అని చెప్పినప్పుడు మనం ఆయన మాటపై విశ్వాసంతో సాధనచేసి మన స్వరూపం ఏమిటో అనుభూతి చెందుతాం. అదే పురుషోత్తమ ప్రాప్తి.

చెప్పవసినదంతా చెప్పి శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుణ్ణి అడిగాడు.

కృ :- అయ్యా అర్జునా! నా ఉపదేశాన్ని ఏకాగ్రతతో విన్నావా?

అ :- ఆ! విన్నాను స్వామీ! ఏకాగ్రతతో విన్నాను.

కృ :- అయితే మరి నీ అనుభవం ఏమిటి?

అ :- (వెంటనే చెప్పేస్తున్నాడు) "నష్టో మోహః స్మృతిర్లబ్ధా" - నా మోహం తొలగింది. నేనెవరినో నాకు గుర్తు వచ్చింది.

సాధారణంగా గురువులు ఉపదేశం చేసిన తరువాత 12 సం||లు ఆ ఉపదేశాన్ని మననం చేసుకుంటూ, నిధిధ్యాసన చేస్తూ, విచారణ చేస్తూ ఆత్మతో అనుసంధానమైన శిష్యుడు గురువుతో తన అనుభవాన్ని చెబుతాడు. కాని ఇక్కడ గురువు సామాన్య గురువు కాదు. జగద్గురువు. అలాగే శిష్యుడూ సామాన్య శిష్యుడు కాదు. అలౌకిక శిష్యుడు. శ్రద్ధ, భక్తి కలబోసిన శిష్యుడు. అందుకే అనుభవాన్ని చెప్పమని గురువు అడగటం, వెంటనే ఒక్కక్షణం తటపటాయించకుండా శిష్యుడు చెప్పటం జరిగింది. జగద్గురువు బోధలకు గడువులు, వాయిదాలు ఉండవు. అందుకే వెంటనే సమాధానం వచ్చింది. "దేవా! నీ ఉపదేశంతో నా మోహం తీరిపోయింది. ఈ మోహమనే రోగంతో నేను క్షత్రియుణ్ణని, కుంతీ పుత్రుడనని, యుద్ధానికి కర్తనని, యుద్ధఫలానికి భోక్తనని అనుకున్నాను. కాని ఇప్పుడు "స్మృతిర్లబ్ధా" నాకు స్మృతి కలిగింది. నేనెవరో నాకు తెలిసింది. నా స్వరూపాన్ని ఇంతవరకు మరచిపోయాను. నీ ఉపదేశంతో ఇప్పుడు తెలిసింది. నేను క్షత్రియుడనూ, కుంతీపుత్రుడనూ కాదు. అలాగే ఈ యుద్ధానికి నేను కర్తనూ కాదు, యుద్ధఫల భోక్తనూ కాదు. నేను అకర్తను, అభోక్తను, నిత్యుడను, ఆనందస్వరూపుడను, పరబ్రహ్మను. 'తత్ ప్రసాదాత్' - ఇదంతా నీ అనుగ్రహం వల్లనే పొందాను. నా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**పాండిత్యంతోనో, ప్రభావంతోనో కాదు, నీ కృపచేత - నీ అనుగ్రహం చేత లభించింది. అంతేకాదు "గత సందేహః" నా సందేహాలన్నీ తీరిపోయాయి. ఇదీ అర్జునుని అనుభవం, అర్జునునికే కాదు; ప్రతి గీతా విద్యార్థికి కలుగవలసిన అనుభవం ఇది. ఇట్టి అనుభవం కలుగలేదు అంటే - శ్రద్ధ, గట్టి ప్రయత్నము లేదన్నమాట. తనకు స్మృతి కలిగిందని అన్నాడే గాని కొత్తగా ఎక్కడినుండో సంపాదించుకున్నానని అనలేదు. అది (ఆత్మ) తన స్వరూపమే. తాను ఆత్మయే.**

**(4) యోగం:- పురుషోత్తముని ప్రాప్తింపజేసుకొనే ఉపాయమే 'యోగం'. - ఇట్టి పురుషోత్తమ ప్రాప్తికి మనం అధ్యాయం లోతుల్లోకి వెళదాం.**

**ప్రపంచం అనిత్యమైనదని చెప్పి దానిపై వైరాగ్యం కల్గించుటకు ప్రయత్నిస్తున్నాడు భగవానుడు, ఈ శ్లోకంలో -**

**శ్రీ భగవానువాచ:**

**శ్లో|| ఊర్ధ్వ మూల మధశ్శాఖం**
**అశ్వత్థం ప్రాహు రవ్యయం |**
**ఛందాంసి యస్యపర్ణాని**
**యస్తం వేదస వేదవిత్ ||** (1)

**తా||** భగవానుడంటున్నాడు : మొదలు పైకీ శాఖలు (కొమ్మలు) క్రిందికీ ఉన్న అశ్వత్థవృక్షాన్ని నాశనం లేనిదంటారు ప్రాజ్ఞులు. దేని ఆకులు వేదాలో అట్టి అశ్వత్థ వృక్షాన్ని ఎవడు తెలుసుకుంటాడో అతడే వేదముల సారం తెలిసినవాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** ఈ అధ్యాయంలో పురుషోత్తమ ప్రాప్తి ఎలా కలుగుతుందో చెప్పటం ప్రధాన విషయం. 14వ అధ్యాయంలో అర్జునుని ప్రశ్నకు సమాధానంగా భగవానుడు బ్రహ్మప్రాప్తికి ఉపాయం తెలియజేశాడు. ఏమని? బ్రహ్మప్రాప్తికి త్రిగుణాలను అతిక్రమించాలి. త్రిగుణాలను అతిక్రమించాలంటే అనన్యభక్తితో భగవంతుని సేవించాలి - అని. బ్రహ్మప్రాప్తి అన్నా పురుషోత్తమప్రాప్తి అన్నా రెండూ ఒక్కటే. కనుక పురుషోత్తమప్రాప్తికి అనన్యభక్తి అత్యంత అవసరం. భగవంతునిపై అంతటి భక్తి కలగాలంటే ఎదురుగా ఉండే ఈ నామరూపాలతో కూడిన ప్రపంచం (సంసారం) అడ్డంగా ఉంది. ప్రపంచం మీద రక్తి తగ్గితేనే పరమాత్మపై భక్తి కుదురుతుంది. ఈ నామరూపాల మాయకు లోబడి మానవుడు భగవంతుణ్ణి మరిచిపోయి భంగపడుతున్నాడు.

❖ మయసభలో దుర్యోధనుడు భంగపడ్డాడు ఆ శిల్పకళా సౌందర్యంలో మునిగి.

❖ ఈ మాయాసభలో అందరూ భంగపడిపోతూనే ఉన్నారు. ఇక్కడి విషయాల్లో మునిగి, ఈ ఆకర్షణలకు లొంగిపోయి. మరి ఈ మాయను దాటటం ఎలా?

మాయకు అధిపతి అయిన భగవంతుణ్ణి భక్తితో, ప్రేమతో ఆశ్రయించటం ఒక్కటే ఉపాయం. మాయాధిపతి భగవానుడే. ఆయనను ఆశ్రయిస్తేనే త్రిగుణాత్మకమైన మాయను దాటగలం.

మనం ఒక అధికారి ఇంటికి పనిమీద వెళ్ళాం. ఆయన ఇంటి ముంగిట కుక్క ఉంది. అది మనను చూచి భౌ భౌ అంటున్నది. మనకు భయం

వేస్తున్నది. మరి దానిని దాటి ఆ అధికారిని కలుసుకోవటం ఎలా? దానికి ఒక్కటే ఉపాయం. ఆ కుక్కకు యజమాని అయిన ఆ అధికారిని పిలవాలి. ఆయన సహాయం కోరాలి. ఆయన కేకవేస్తే ఆ కుక్క మౌనంగా ఉండిపోతుంది. దానితో మనం నిర్భయంగా దానిని దాటి లోనికి వెళ్ళగలుగుతాం.

అలాగే మాయ అనే కుక్కకు యజమాని భగవంతుడు. కనుక ఆయననే పిలవాలి. ఆయన సహాయం కోరాలి. ఆయనను ఆశ్రయించాలి. అప్పుడే ఈ మాయ అనే కుక్కను దాటి పరమాత్మను చేరుకోగలం.

ఇలా భగవంతుని ఆశ్రయించాలన్నా, ఆయనపై భక్తి కలగాలన్నా ఈ నామరూప ప్రపంచంపై, ఇక్కడి విషయాలు - భోగాలపై విరక్తి కలగాలి. వైరాగ్యం కలగాలి. ముందు మనం పట్టుకున్న వస్తువును విడిస్తేనే మరొక వస్తువును పట్టుకోగలం. అందుకే ముందుగా మన మనస్సు ఏ ప్రపంచాన్ని(సంసారాన్ని) గట్టిగా పట్టుకొని కూర్చున్నదో ఆ ప్రపంచాన్ని - ప్రాపంచిక వ్యామోహాలను మనస్సు యొక్క పట్టునుండి విడిపించాలి. వైరాగ్యం కలగాలి. ఈ సంసారంపై వైరాగ్యం కలిగితే తప్ప ఈ ప్రాపంచిక వస్తువులు, విషయాలు, భోగాల యొక్క వ్యామోహం నుండి - ఈ సంసార బంధం నుండి విముక్తులం కాలేము, విడుదల పొందలేము. ఈ వ్యామోహంలో ఉన్నంతకాలం బంధమే.

మామిడితోటల్లో కోతులు ఎంతో నష్టం కలిగిస్తాయి. వాటిని పట్టుకోవాలంటే ఒక ఉపాయాన్ని అనుసరిస్తారు. ఒక చెట్టు ప్రక్కనే గుంట

త్రవ్వి అందులో మూతి సన్నగా ఉండే కూజాను దించి, మూతిని తప్ప మిగతా అంతా కప్పివేస్తారు. అందులో వేరుశనగ కాయలు పోస్తారు. కొన్ని వేరుశనగ కాయలను నేలపై అక్కడక్కడ ఆ దారిలో పోసి ఉంచుతారు. కోతి వేరుశనగ కాయల ఆశతో వాటిని తింటూ వచ్చి వచ్చి ఈ కూజాలో చేయి పెడుతుంది. అక్కడి కాయలను గుప్పెట పట్టుకుంటుంది. ఆ తరువాత చేతిని పైకి తీయబోతుంది. అది రాదు. ఎందుకంటే కాయలతో గుప్పెట పట్టి ఉంది గనుక చిన్న మూతిలో నుండి చెయ్యి పైకి రాదు. ఎవరో తన చేతిని లోపల గట్టిగా పట్టుకున్నారని భావించిన ఆ పిచ్చి కోతి అరుస్తుంది. అంతేగాని అది గుప్పెట వదలదు. దానితో చెట్టు చాటున ఉన్న వ్యక్తి ఆ కోతిని పట్టుకపోతాడు. గుప్పెట వదిలితే అది హాయిగా చేతిని పైకి తీసుకొని స్వేచ్ఛగా వెళ్లిపోయేది. కాని అది పట్టువదలదు. దానితో వాడు దానిని పట్టుకుపోతాడు.

మనమూ అంతే. ఈ ప్రాపంచిక వ్యామోహాలను వదలలేక అన్నింటిని పట్టుకు కూర్చుంటాం. వీటిని వదలనే వదలం. దానితో యమధర్మరాజు వచ్చి మనను పట్టుకుపోతాడు. కనుక ఈ పట్టునుండి విడిపోవాలి. ప్రపంచ విషయాల పట్ల వైరాగ్యం కలగాలి. అందుకే ఈ సంసారాన్ని అశ్వత్థ వృక్షంతో పోల్చారు ఈ శ్లోకంలో. ఈ ప్రపంచం యొక్క, వస్తువుల యొక్క, భోగాల యొక్క అనిత్యత్వాన్ని తెలియజేయటానికే ఈ పోలిక.

ఈ ప్రపంచం అనిత్యమని తెలియజేయటం ఎందుకు? దీనిపై వ్యామోహాన్ని- ఆసక్తిని తగ్గించటానికే. అప్పుడే మనదృష్టి పరమాత్మపైకి

మళ్ళేది. అందుకోసమే దీనిని అశ్వత్థంతో పోల్చారు దీనితో ఈ సంసారంపై - ఈ ప్రాపంచిక వ్యామోహాలపై విరక్తి కలిగి పరమాత్మపై దృష్టి నిలుస్తుంది.

మనం బొమ్మ యొక్క అందచందాలను చూస్తున్నంత సేపు కొయ్య యొక్క నాణ్యత మీదకు దృష్టిపోదు. మనం సినిమా కథలో లీనమై పోయినంత సేపు ఆ సినిమాకు ఆధారమైన తెర మీదకు దృష్టి పోదు. అలాగే మనం ఈ ప్రాపంచిక వ్యామోహాలపై ఆసక్తితో ఉన్నంతకాలం ఈ ప్రపంచానికి ఆధారమైన పరమాత్మ మీదకు దృష్టిపోదు.

ఈ ప్రాపంచిక వ్యామోహం మరి ఎలా తొలగుతుంది? ఈ సంసారంపై ఎలా విరక్తి కలుగుతుంది? ఈ సంసారంలో ఉన్న దోషాలను చూడాలి. ఈ ప్రపంచం యొక్క అనిత్యత్వాన్ని గుర్తించాలి. అందుకే దీనిని అశ్వత్థ వృక్షంతో పోల్చి చెబుతున్నారు ఈ శ్లోకంలో. ఇది అనిత్యమైనదనే భావాన్ని వ్యక్తం చేస్తున్నారు.

పురుషోత్తమ ప్రాప్తిని కోరే ఎవరైనా సరే తప్పక ఛేదించాల్సింది ఈ సంసారాన్నే. అంటే ఈ ప్రాపంచిక వ్యామోహాలనే. అందుకే దీనిని వృక్షంతో పోల్చారు. 'వృక్షం' అంటే ఛేదనాత్ ఇతి వృక్షః = ఛేదించబడేది వృక్షం అని అర్థం. వృక్షాన్ని ఎప్పుడో ఒకప్పుడు ఛేదించాల్సిందే - తెగనరికి వేయాల్సిందే. అలాగే ఈ సంసారాన్ని కూడా ఎప్పుడో ఒకప్పుడు ఛేదించాల్సిందే. ఇదే సంసారాన్ని వృక్షంతో పోల్చటంలోని స్వారస్యం.

'శ్రీ భగవానువాచ' అంటూ ఇది భగవానుని మాట అని వ్యాసమహర్షి అడపాదడపా మనకు హుషారు కలిగిస్తుంటారు. ఇది భగవంతుని సందేశం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గనుక తప్పక ఆలకించి, ఆచరించి కృతార్థులం కావాలి. జీవితాలను సార్థకం చేసుకోవాలి. ఇంతకన్న కడతేరే మార్గం వేరే ఏమీలేదు - అనే హెచ్చరిక కూడా ఇందులో అంతర్లీనంగా దాగిఉంది. ఇంతకూ ఈ సంసారం ఎలాంటిది?

(1) ఊర్ధ్వమూలం అధఃశ్శాఖం అశ్వత్థం :- ఇది అశ్వత్థ వృక్షం. అంటే రావిచెట్టు. ఇది మామూలు చెట్టుకాదు. దీని మూలం - అంటే వేర్లు ఊర్ధ్వంగా అంటే పైకి ఉన్నాయి. శాఖలు - అంటే కొమ్మలు 'అధః' క్రిందికి ఉన్నాయి. ఇది సామాన్య అర్థం.

'అశ్వత్థం' అంటే విశేషార్థం ఉంది. 'శ్వ' అంటే రేపు. 'శ్వత్థం' అంటే రేపటి వరకూ ఉండేది అని. అశ్వత్థం అంటే రేపటి వరకు ఉండనిది అని అర్థం. అంటే నశ్వరమని, అనిత్యమని, అశాశ్వతమని, నశించిపోయేదని విశేషార్థం. అలాగే 'ఊర్ధ్వం' అంటే ఉన్నతమైనది, ఉత్కృష్టమైనది, శ్రేష్టమైనది - అని. 'అధః' అంటే అల్పమైనది - నికృష్టమైనది, అని విశేషార్థం. అంటే మూలం ఉన్నతమైనదని, శాఖలు అధమమైనవని అర్థం. ఈ రెండు రకాల అర్థాలను బట్టి ఈ సంసారం ఎలాంటిదో మనకు తెలియజెప్పాలనేదే గీతాచార్యుని ఉద్దేశం.

(1) ముందుగా సామాన్య అర్థంలో ఊర్ధ్వమూలం అధశ్శాఖం అని ఎందుకన్నారో చూద్దాం.

వ్రేళ్ళు పైకి కొమ్మలు క్రిందికి ఉన్నది తిరిగబడిన చెట్టు. ఇదొక విచిత్రమైన చెట్టు. సాధారణంగా చెట్లు ఇలా ఉండవు. కాని జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఇలాంటి చెట్లు కనిపిస్తాయి అక్కడక్కడ. ఎక్కడ?

(i) ఒక చెరువు గట్టున పెద్దచెట్టు ఉన్నది. అది బాగా ఒడ్డును ఆనుకొని ఉన్నది. చెరువు వైపుకు కొంచెం వంగి ఉన్నది. ఆ చెరువులోకి తొంగిచూస్తే ఆ చెట్టు యొక్క ప్రతిబింబం నీటిలో స్పష్టంగా కనిపిస్తుంది. ఎలా ఉన్నది ఆ ప్రతిబింబం? తలక్రిందులుగా ఉన్నది. దాని మొదలు పైన; కొమ్మలు ఆకులు క్రిందకు ఉన్నాయి. అదీ తిరగబడిన చెట్టు.

ఇప్పుడీ తిరగబడిన చెట్టు ఎవరికైనా నీడను ఇవ్వగలదా? ఇవ్వలేదు. దాని ఆకులుగాని, పూలుగాని, కాయలుగాని కనిపిస్తున్నా కోసుకొని ఉపయోగించుకోగలమా? లేదు. ఈ సంసారం కూడా అంతే. నీటిలో కనిపిస్తున్న తిరగబడిన చెట్టులాంటిదే. మనకు ఈ ప్రపంచంలో కనిపించే ధన సంపదలుగాని, వస్తువులుగాని, భోగాలుగాని, కీర్తిప్రతిష్ఠలుగాని ఏవీ కూడా మన జన్మసార్థక్యానికి ఉపయోగపడవు అని భావం. ఆ వృక్షంలాగే ఈ సంసారం కూడా మనను మోసగించేదే. అన్నీ చూపించి ఆకర్షణీయంగా ఉంటుందే గాని మనకు ఉపయోగపడదు అని అర్థం చేసుకోవాలి.

(ii) ఇలాంటి తిరగబడిన చెట్టు - అంటే మూలంపైకి శాఖలు క్రిందికి ఉన్న చెట్టు మనకు మరొక చోట కూడా దర్శనమిస్తుంది. ఎక్కడ? విరిగిపోయి - తుఫాను గాలికి రోడ్డుకు అడ్డంగా పడిపోయిన చెట్టు. దీని వ్రేళ్ళు పైకి, కొమ్మలు క్రిందికి ఉంటాయి. ఆ చెట్టు ఇప్పుడు మన ప్రయాణానికి ఆటంకం కలిగిస్తుంది. సేదదీర్చుకొనేందుకు ఉపయోగపడదు. అలాగే ఈ సంసారం, ఇందులోని విషయాలు, భోగాలు అన్నీ కూడా భగవంతుని చేరుకొనే మార్గంలో మనకు ఆటంకాన్ని కలిగిస్తాయి అని చెప్పటానికే ఈ ఉపమానం.

(iii) తలక్రిందులైన చెట్టును ఈ బ్రహ్మాండం విషయంలో చెప్పినా ఈ పిండాండం విషయంలో కూడా అంటే ఈ శరీరం విషయంలో కూడా నిజమే. ఎందుకంటే ఈ శరీరానికి మూలం - ఉన్నతమైనది - ఊర్ధ్వంగా ఉన్నది. అదే శిరస్సు - తల. 'సర్వేంద్రియాణాం శిరః ప్రధానం' అన్నారు. ఈ శిరస్సు శరీరానికి ఊర్ధ్వంగా ఉన్నది. ఇక శాఖలు - అంటే చేతులు - కాళ్ళు క్రిందికి (అధః) ఉంటాయి. అంటే ఈ శరీరం కూడా ప్రాపంచిక విషయాలలో మునిగిపోతే పరమాత్మప్రాప్తికి ఆటంకమే అని గ్రహించాలి.

(2)ఇక విశేషార్థంలో 'ఊర్ధ్వమూలం అధశ్శాఖం' అని ఎందుకన్నారో చూద్దాం.

'ఊర్ధ్వమూలం' అంటే ఈ సంసారానికి మూలం ఉన్నతమైనది, శ్రేష్టమైనది, ఉత్కృష్టమైనది - అని. అంటే ఈ సంసారానికి ఆధారం ఉన్నతమైన పరమాత్మే అని.

'అధః శాఖం' అంటే ఈ సంసారం యొక్క శాఖలు అంటే జీవుళ్ళు, ఇక్కడి వస్తువులు, విషయాలు, భోగాలు - అన్నీ అల్పమైనవి, నికృష్టమైనవి, అనిత్యమైనవి, పరమార్థ సాధనకు ఎందుకూ పనికిరానివి - అని.

'అశ్వత్థం' అంటే సామాన్య అర్థం రావిచెట్టు. రావిచెట్టులో తినేందుకు పళ్ళులేవు. వాసన చూచేందుకు పూలులేవు. ఆకులు దేనికీ పనికిరావు. అయితే యజ్ఞంలో సమిధలుగా రావిపుల్లలను ఉపయోగిస్తారు. అలాగే ఈ జగత్తు మనకు ఎంత ఆకర్షణీయంగా కనిపించినా నిజమైన ఆనందాన్ని - నిత్యమైన ఆనందాన్ని ఇవ్వదు; అయినప్పటికీ పరమాత్మను చేరేందుకు ఉపయోగపడుతుంది. ఈ జగత్తే కాదు. దేహం కూడా అంతే. ఎంత

ఆకర్షణీయంగా కనిపించినా ఈ దేహం నిజమైన - నిత్యమైన ఆనందాన్ని ఇవ్వదు; కాని శాశ్వత ఆనందాన్ని ప్రసాదించే మోక్షసాధనలో చక్కగా ఉపయోగపడుతుంది.

'అశ్వత్థం' అంటే మరో అర్థం నశ్వరమైనది - అని. ఈ జగత్తుగాని, ఈ దేహంగాని రెండూ నశ్వరమైనవే - నశించిపోయేవే. కాని ఆ పరమాత్మ సాధనలో ఉపయోగపడతాయి. ఇలా ఈ ప్రపంచం అనిత్యమని, నిష్ఫలమని, నిత్యసుఖాన్ని ఇవ్వలేదని, నిన్ను భ్రమలకు గురిచేసి మోసం చేస్తుందని, భోగాలలో ముంచివేస్తుందని - హెచ్చరించి, దీనిమీద వైరాగ్యాన్ని కలిగించి, బ్రహ్మనిష్టను నెలకొల్పటమే ఈ పోలిక ఉద్దేశం.

(3) అవ్యయం ప్రాహుః :- అవ్యయం - నశింపులేనిది అంటున్నారు. ఎవరు? వేదాలు, ఋషులు, పెద్దలు, తెలిసినవారు (జ్ఞానులు) అంటున్నారని భావం. ఇంతవరకు దీనిని రేపులేనిదని, నశ్వరమైనదని, అశాశ్వతమైనదని చెప్పి ఇప్పుడు అవ్యయం అని పెద్దలు చెబుతున్నారనటం ఏమిటి?

ఇంతకూ ఈ సంసారం నశించేదా? నశించనిదా? రెండూ నిజమే. జ్ఞానం కలిగేంతవరకు నశించనిది. జ్ఞానం కలిగితే నశించేది. జ్ఞానుల దృష్టిలో ఈ జగత్తు లేనిదే. మిథ్య మాత్రమే. అయితే అజ్ఞానుల దృష్టిలో ఇది అంతులేనిది. కోటికోటి జన్మల నుండి చూస్తున్నా దీనికి అంతు కనపడటం లేదు. పరంపరగా నిత్యం ఇది కొనసాగుతూ ఉండటం వల్ల ఈ నామరూపాలకు ఆశ్రయంగా ఉండటంవల్ల, ఆత్మజ్ఞానంతో తప్ప నశించనిది కావటం వల్ల దీనిని అవ్యయం - నాశనం లేనిది అన్నారు. సృష్టికాలంలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వ్యక్తంగాను, ప్రళయకాలంలో అవ్యక్తంగా బీజరూపంలోనూ ఉంటుంది గనుక దీనిని అవ్యయం అన్నారు. అంతేగాని నిజంగా ఈ ప్రపంచం అవ్యయమే అయితే - నిత్యమే అయితే - నశించనిదే అయితే అసంగ శస్త్రంతో దీనిని ఛేదించమని 3వ శ్లోకంలో భగవానుడు ఎందుకు చెబుతాడు? కనుక ఇది నశించేదే. కాని అజ్ఞానంలో నశించనిది. అంతే.

(4) ఛందాంసి యస్యపర్ణాని :- ఈ సంసార వృక్షానికి ఆకులు వేదాలు. ఆకులు కొమ్మల నుండే పుడతాయి. ఈ బ్రహ్మాండ వృక్షానికి మొదటి కొమ్మ బ్రహ్మదేవుడు. ఆ బ్రహ్మదేవుని నుండే వేదాలనే ఆకులు పుట్టాయి.

- ఆకుల ద్వారా ప్రాణవాయువును గ్రహించి చెట్టు జీవిస్తుంది.
- వేదాలలోని కర్మకాండ ద్వారా ఈ బ్రహ్మాండ వృక్షం జీవిస్తున్నది.

యజ్ఞకర్మ ద్వారా మేఘాలు. మేఘాల వల్ల వర్షాలు. వర్షాల వల్ల సస్యాలు. సస్యాల వల్ల పురుషునిలో వీర్యం. వీర్యం వల్ల స్త్రీలో అండం పిండంగా మారుట. పిండం వృద్ధి చెంది శిశువుగా జననం. ఇలా సంసార వృక్షం కర్మకాండ ద్వారా నిలిచి ఉంటున్నది.

ఆకులు ఎలా వృక్షాన్ని కప్పి వేస్తాయో అలాగే కర్మకాండాత్మకమైన వేదాలు ఈ ప్రపంచం యొక్క నిజస్వరూపాన్ని కప్పివేస్తాయి.

ఛందస్సులంటే కోరికలనే అర్థం కూడా ఉన్నది. కోరికల వల్లనే ఈ సంసారం పోషించబడుతున్నది అనే అర్థం కూడా ఉన్నది.

(5) యస్తం వేద సవేదవిత్ :- ఎవడు ఈ సంసార వృక్షాన్ని ఈ విధంగా తెలుసుకుంటాడో అతడే వేదవిదుడు - వేదవేత్త. ఏమి తెలుసుకోవాలి? ఈ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సంసారానికి మూలం పరబ్రహ్మమేనని; జీవకోట్లన్నీ కొమ్మలని; ఈ సంసారం నశించనిదీ, నశించేదీ అని; కర్మలతో వృద్ధి చెందుతుందని; జ్ఞానంతో ఛేదించబడుతుందని; దీని ఆకులు వేదాలని ఎవరు తెలుసుకుంటారో అతడే జ్ఞాని - వేదవేత్త.

ప్రపంచాన్ని ప్రపంచంగా చూచేవాడు సామాన్యుడు. అలా చూచి భ్రమలకులోనై, ఈ ఆకర్షణలలో చిక్కుకొని మోసపోతాడు. కాని ఈ ప్రపంచానికి ఆధారము - మూలము పరమాత్మయేనని తెలుసుకొన్నవాడు ఇక మోసపోయే అవకాశమే లేదు. అతడికి అంతటా బ్రహ్మదృష్టే.

సంసారవృక్షం యొక్క స్వరూపస్వభావాలను ఇంతవరకు సామాన్య రూపంతో చెప్పిన భగవానుడు ఇక విశేషరూపంతో చెప్పబోతున్నాడు.

ఎందుకంటే ఒక వస్తువు యొక్క సమగ్ర స్వరూపాన్ని తెలుసుకోవాలంటే బహిరంగ నిరీక్షణతోబాటు అంతరంగ నిరీక్షణ కూడా కావాలి.

అబ్బాయికి పెళ్ళి చేయాలంటే అమ్మాయి రూపురేఖా విలాసాలు - అందచందాలు చూస్తే చాలదు. ఆమె గుణగణాలు కూడా చూడాలి. అలాగే మొదటి శ్లోకంలో ఈ ప్రపంచం యొక్క బహిరంగ నిరీక్షణ గురించి చెప్పి ఇప్పుడు రెండవ శ్లోకంలో అంతరంగ నిరీక్షణ గురించి చెబుతున్నారు.

ఈ సంసార వృక్షం ఎలా వృద్ధి చెందిందో చెబుతున్నారు.

శ్లో|| అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖాః
గుణ ప్రవృద్ధా విషయ ప్రవాలాః |
అధశ్చ మూలాన్యను సంతతాని

కర్మాను బంధీని మనుష్య లోకే|| (2)

**తా||** దాని (ఆ అశ్వత్థ వృక్షం యొక్క) కొమ్మలు క్రిందికీ పైకీ విస్తరించుకొని ఉన్నాయి. గుణాలచేత వృద్ధి చెందుతాయి. విషయవస్తువులే చిగుళ్ళుగా గలవి. దాని వ్రేళ్ళు బాగా క్రిందకు పాతుకొని ఉండి మనుష్యలోకంలో కర్మలలో బంధిస్తాయి.

**వ్యాఖ్య:** ఈ జగత్తు లేదా బ్రహ్మాండం ఎంతో విశాలమైనది. దీనిని తిరగబడిన అశ్వత్థ వృక్షంతో పోల్చారు క్రిందటి శ్లోకంలో. ఈ జగత్తు అనిత్యమైనది అని చెప్పి దీని పట్ల వైరాగ్యం కలిగించటమే ముఖ్య ఉద్దేశం. ఇప్పుడీ శ్లోకంలో ఈ జగత్తు అనే వృక్షం ఎలా వృద్ధి చెందుతున్నదో వివరంగా తెలియజేస్తున్నారు.

ఇది అనంత కోటియుగాల నుండి వృద్ధి చెందుతున్నదే. ఇది బాగా విస్తరించుకొని యున్నది. దీని మూలం బాగా వ్రేళ్ళు తన్నుకొని యున్నది, బాగా లోతుగా నాటుకొని ఉన్నది. వేటితో ఇలా నాటుకొని, విస్తరించుకొని ఉన్నదో ఈ శ్లోకంలో వివరిస్తున్నారు.

1. అధశ్చ ఊర్ధ్వంప్రస్సృతాః తస్య శాఖాః :- ఈ సంసారవృక్షం యొక్క కొమ్మలు పైకీ క్రిందికీ అంతటా వ్యాపించి ఉన్నాయి. కొమ్మలంటే జీవుళ్ళే. బ్రహ్మ మొదలు దేవతా జన్మలన్నీ పైకి వ్యాపించిన కొమ్మలు. అలాగే పశుపక్ష్యాది జంగమాలు, నీచమైన రాక్షస జన్మలు క్రిమికీటకాదులు, చెట్లుపుట్టల వంటి స్థావరాలు - ఇవన్నీ క్రిందకు వ్యాపించిన కొమ్మలు. ఇక పైకీ క్రిందకీ కాకుండా మధ్యలో విస్తరించుకొని ఉన్న కొమ్మలున్నాయి. అవే మానవజన్మలు. ఈ విధంగా సంసార వృక్షం యొక్క కొమ్మలు అంతటా వ్యాపించి ఉన్నాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

2. గుణ ప్రవృద్ధాః :- ఇవి దేనితో వృద్ధి పొందుతున్నాయి. సాధారణంగా వృక్షం యొక్క కొమ్మలు నీటితో వృద్ధి పొందుతూ ఉంటాయి. మరి ఈ సంసార వృక్షంయొక్క కొమ్మలైన ఈ జన్మలన్నీ వేటితో వృద్ధి చెందుతున్నాయి? గుణాల చేత. సత్త్వరజస్తమో గుణాలనే త్రిగుణాల చేత వృద్ధి చెందుతున్నాయి. ఉన్నదంతా పైకి విస్తరించుకోవటానికి గాని, అంటే దేవజన్మల నెత్తటానికి గాని, మధ్యలో విస్తరించుకొనుటకు - అంటే మానవజన్మలెత్తేందుకు గాని, నీచ స్థితికి, అధోస్థితికి విస్తరించుకొనుటకు - అంటే నీచ జన్మలను పొందటానికి గాని గుణాలే కారణం.

సత్త్వగుణం వల్ల ఉన్నతమైన దేవజన్మలు, రజోగుణం వల్ల మధ్యజన్మలు - అంటే మానవజన్మలు, తమోగుణం వల్ల పశుపక్షి - క్రిమికీటకాది నీచజన్మలు వస్తుంటాయి. ఇలా ఈ సంసార వృక్షం యొక్క కొమ్మలు అంతటా వ్యాపించటానికి కారణం త్రిగుణాలే.

3. విషయః ప్రవాలాః :- కొమ్మలకు చిగుళ్ళుంటాయి. అవి కొమ్మలను ఎండి పోనీయకుండా రక్షిస్తుంటాయి. ఈ చిగుళ్ళ వల్లనే కొమ్మలు ఎప్పటికప్పుడు కళకళలాడుతూ కనిపిస్తుంటాయి. ఏమిటీ చిగుళ్ళు? విషయాలే చిగుళ్ళు. శబ్ద స్పర్శ రూప రస గంధ అనే 5 రకాల విషయాలే - విషయవస్తువులే చిగుళ్ళు. ఈ విషయవస్తువులు అత్యంత ఆకర్షణీయంగా కనిపిస్తూ ఈ జన్మలను ఎండిపోనీయకుండా కళకళలాడేటట్లు చేస్తున్నాయి. ఈ విషయభోగాల పట్ల ఆసక్తే మళ్ళీమళ్ళీ జన్మ పరంపరలకు కారణం అవుతున్నది. అంటే విషయాసక్తి - భోగాసక్తి ఉన్నంతవరకు జన్మరాహిత్యం - మోక్షం లేదు. ఈ విషయాలపట్ల

ఆకర్షితులైన మానవులు కోరికలతో వేగిపోతుంటారు. దానితో సంకల్పాలు, ఆలోచనలు కలుగుతాయి. వాటిని తీర్చుకొనేందుకు కర్మలు చేస్తారు. కర్మల వల్ల కర్మఫలాలు, వాటివల్ల మళ్ళీ మళ్ళీ జన్మలు. కనుకనే విషయాలనే చిగుళ్ళు మళ్ళీ మళ్ళీ జీవుళ్ళనే కొమ్మల పుట్టుకకు కారణం అవుతున్నాయి. పాతవి తీరిపోతుంటే కొత్త కోరికలు పుడుతూ ఎప్పుడూ నిత్య నూతనంగా ఈ జన్మ పరంపరలు వస్తూనే ఉంటాయి.

4. అధశ్చ మూలాని అనుసంతతాని :- వ్రేళ్ళు బాగా లోతుకు పాతుకొని పోయి ఉన్నాయి. ఏ వృక్షమైనా బలంగా నిలిచి ఉండాలంటే వ్రేళ్ళు బలంగా భూమిలోనికి బాగా చొచ్చుకొని పోయి లోతుగా - విశాలంగా వ్యాపించి యుండాలి. అలాగే ఈ సంసార వృక్షం బలంగా నాలుగు కాలాలపాటు నిలిచి ఉండటానికి దీని మూలం బాగా లోతుకు పోయిఉన్నది. ఆ వ్రేళ్ళే సమిష్టివాసనలు. వ్రేళ్ళు కంటికి కనిపించనట్లే ఈ సమిష్టి వాసనలు కూడా కంటికి కనిపించకుండా ఈ ప్రపంచ వృక్షాన్ని బలంగా నిలిపి ఉంచుతున్నాయి. అహంకార మమకారాలు, రాగద్వేషాలు అనే సూక్ష్మవాసనలే ఈ వ్రేళ్ళు. ఎలా వచ్చినవి? గతజన్మలలో జీవుళ్ళు చేసిన, చేయాలనుకున్న కర్మల ద్వారా వచ్చినవే. కర్మలు చేసేటప్పుడు నేను చేస్తున్నాననే అహంకారం, కర్మల వల్ల పొందిన ఫలాలపై నావి అనే మమకారం, ఇష్టమైన వస్తువులపట్ల రాగం, అనిష్టవస్తువుల పట్ల ద్వేషం - ఇవే వాసనలుగా ఏర్పడినవి. ఈ వాసనలు ఖర్చుకావాలంటే కర్మలు చేయాలి. ఆ కర్మలు చేయటానికే జన్మలు వస్తుంటాయి. ఇలా వాసనలే జన్మలను తెచ్చి

పెడుతుంటాయి, ఆ జన్మలలో పుణ్యపాపకర్మలకు - మంచి చెడు కర్మలకు ప్రేరణలు కలిగిస్తుంటాయి. ఈ వాసనలు సూక్ష్మశరీరాలతో గట్టిగా పెనవేసుకొని ఉంటాయి. అందువల్ల స్థూలశరీరం రాలిపోయినా ఇవి సూక్ష్మ శరీరంతో కలిసే ఉంటాయి. అసలు సృష్టిలేని ప్రళయకాలంలో కూడా ఈ వాసనలు సమిష్టిగా పరమాత్మలోనే స్థితి కలిగిఉంటాయి. కనుక ఇవి ఎంతో లోతుగా, చొచ్చుకొనిపోయి గట్టిగా ఉండి ఈ సంసారవృక్షాన్ని నిలబెట్టి ఉంచుతున్నాయని చెప్పటం జరిగింది. వీటిని (ఈ సమిష్టి వాసనలను) ఛేదిస్తేనే మానవుడు ఊర్ధ్వమూలానికి - అంటే పరమాత్మ వైపుకు ప్రయాణం చేయగలుగుతాడు. అంటే వాసనాక్షయం జరిగితేనే పరమాత్మతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. ఇవి ఏం చేస్తున్నాయి?

5. కర్మాను బంధీని మనుష్యలోకే : మనుష్యలోకంలో కర్మబంధాన్ని కలిగించేవి ఈ వాసనలే. అంటే మళ్ళీమళ్ళీ జన్మలెత్తుతూ ఈ లోకానికి రావటం, ఇక్కడినుండి పోవటం, పోయినవాడు తిరిగి మళ్ళీ రావటం జరుగుతున్నదంటే దీనికి కారణం ఈ వాసనలనే వ్రేళ్ళే.

చెట్టు యొక్క వ్రేళ్ళు బలంగా లోతుకు పాతుకొని పోయి ఉన్నతకాలం కొమ్మలను నరికినా, చెట్టును కొట్టి వేసినా మళ్ళీ మళ్ళీ చిగిర్చి కాండం, కొమ్మలు, ఆకులు, పూలు, కాయలు ఎలావస్తాయో అలాగే ఈ వాసనలున్నంత కాలం జన్మలు వస్తూనే ఉంటాయి. ఈ లోకానికి బంధించబడియే ఉంటాం.

కర్మలతో ఎలా బంధిస్తున్నాయి ఈ వాసనలు?

వాసనల ప్రేరణల వల్ల బుద్ధిలో కోరికలు కలుగుతాయి. బుద్ధిలోని కోరికలవల్ల మనస్సులో ఆలోచనలు, సంకల్పాలు వస్తాయి. ఆ సంకల్పాలకు - ఆలోచనలకు అనుగుణంగా దేహేంద్రియాలు కర్మలు చేస్తుంటాయి. ఈ కర్మల వల్ల కర్మఫలాలు, ఆలోచనల వల్ల వాసనలు పేరుకుంటాయి. ఈ వాసనలు కర్మఫలాల వల్లనే వాటిని ఖర్చు చేసుకొనేందుకు తగిన జన్మలు వస్తుంటాయి. ఇదే బంధం, కర్మలతో బంధించబడటం.

ఇంతవరకు ఈ సంసారవృక్షం ఎలా వృద్ధి చెందుతున్నదో తెలియజేయటం జరిగింది. ఇది వృద్ధి చెందితే మనకు బంధం, దుఃఖం. కనుక దీనిని అంతం చేయాలి. ఈ సంసార వృక్షం విచిత్రమైనది. ముక్తిని ప్రసాదించే మూలం - పరమాత్మ పైన (ఉన్నతంగా) ఉంటే, బంధించే వాసనలు-మూలాలు క్రింద ఉన్నాయి. ఈ వాసనలే కర్మలకు ప్రేరణనిస్తున్నాయి. ఈ కర్మలు గుణాలతో, విషయభోగాలతో జీవుణ్ణి బంధించి వేస్తున్నాయి. మళ్ళీమళ్ళీ జన్మలకు కారణమవుతున్నాయి.

మరి ఈ సంసార వృక్షం ఎలా అంతమవుతుంది? జీవభావం అంతమైతే సర్వత్రా ఆ పరమాత్మ ఉంటాడు. ఇక ప్రపంచం అనేదే ఉండదు అంటే జీవభావం అంతమైతే సంసారవృక్షం అంతమై పోయినట్లే.

మరి జీవభావం అంతమయ్యేదెలా? అసలు ఎవరికి వీలవుతుంది?

దేవజన్మలు గాని, పశుపక్ష్యాది నీచజన్మలు గాని కర్మఫలాలను అనుభవించటమే గాని స్వయంగా ఆలోచించి కర్మలు చేసే వీలులేదు. ఎందుకంటే కర్మలు చేసేందుకు దేవతలకు శరీరం లేదు; పశుపక్ష్యాదులకు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆలోచించేందుకు బుద్ధిలేదు. ఒక్క మానవులకు మాత్రమే కర్మ చేసే అధికారం ఉంది. ఒకప్రక్క కర్మఫలాలను అనుభవిస్తూనే మరొక ప్రక్క కర్మలు చేసే అధికారం మానవులకు ఉన్నది. ఈ చేసే కర్మల యొక్క స్వభావాన్ని బట్టి అతడు పైకో, క్రిందికో వెళ్ళిపోతుంటాడు. అంటే దేవజన్మలనో లేక నీచజన్మలనో పొందుతూ ఉంటాడు.

తాను చేసే కర్మలతో ఈ అధో మూలాన్ని ఛేదించి ఊర్ధ్వంగా పరమాత్మ వైపుకు ప్రయాణించవచ్చు. లేదా ఈ విషయభోగాలలో చిక్కి మరింత బద్ధుడై అధోగతికి చేరవచ్చు. పశుపతీ కావచ్చు. పశువూ కావచ్చు. ఎలా?

(i) శబ్ద స్పర్శ రూప రస గంధాలనే విషయాలపట్ల విరక్తి కలిగితే చిగుళ్ళు నాశనమౌతాయి.

(ii) త్రిగుణాలను అధిగమించితే కొమ్మలు నాశనమౌతాయి.

(iii) వాసనలన్నింటిని క్షయం చేసుకుంటే వ్రేళ్ళు (మూలం) నాశనమవుతాయి.

ఇలా వ్రేళ్ళు, కొమ్మలు, చిగుళ్ళు నాశనమైతే ఇంకా ఈ సంసారవృక్షం ఎలా బ్రతుకుతుంది? సంసారం అదృశ్యమైతే అక్కడ ఉండేది అధిష్ఠానమైన పరమాత్మే.

ఈ ప్రపంచమే పరమాత్మకు అడ్డుగా ఉన్నది. ప్రపంచాన్ని చూస్తున్నంత సేపు పరమాత్మ కనిపించదు. సినిమాకథలో లీనమైనంతవరకు తెర కనిపించదు. కనుక పైన చెప్పిన విధంగా వాసనలను ఖర్చుచేసుకొని, విషయ



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వైరాగ్యంతో, త్రిగుణాతీతుడైతే ఈ ప్రపంచం అదృశ్యం. పరమాత్మ సాక్షాత్కారం తథ్యం.

అలాగాక విషయ భోగాలపట్ల ఆసక్తితో, స్వార్ధపూరితమైన కర్మలతో, రాగ ద్వేషాలతో వ్యవహరిస్తే కర్మబంధాలలో ఇరుక్కొని పోతాం. దానివల్ల మళ్ళీమళ్ళీ పుడుతూ, మళ్ళీమళ్ళీ చస్తూ పరమాత్మకు దూరంగా ఉండిపోతాం.

వృక్షం పెరిగి పెద్దదైన కొద్దీ మూలానికి దూరమైనట్లు మనం ఈ ప్రాపంచిక వ్యవహారాలలో మునిగిపోయి, విషయాసక్తితో కర్మలు చేస్తూ, ఈ సంసార వృక్షాన్ని విస్తరింపజేస్తున్న కొద్దీ ఊర్ధ్వ మూలమైన పరమాత్మకు దూరమై పోవటం జరుగుతుంది. కనుక ఈ సంసార వృక్షాన్ని ఈ మానవ జన్మలోనే ప్రయత్నపూర్వకంగా ఛేదించాలి. అలా ఛేదించాలంటే మనకొక గొడ్డలి కావాలి. ఏమిటా గొడ్డలి? తరువాత శ్లోకంలో -

ఈ సంసార వృక్షం ఎలా వృద్ధి చెంది విస్తరిస్తున్నదో క్రిందటి శ్లోకంలో చెప్పారు. ఇది విస్తరిస్తున్న కొద్దీ మూలమైన పరమాత్మకు దూరమై పోవటం జరుగుతుంది. కనుక దీనిని ఛేదించాలి. తెగనరికి వేయాలి. ఎలా? ఏ సాధనంతో? సంసారవృక్షాన్ని ఛేదించే గొడ్డలి ఏది? ఈ శ్లోకంలో చెబుతున్నారు.

శ్లో|| నరూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా|
అశ్వత్థ మేనం సువిరూఢ మూలం
అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా || (3)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** దానియొక్క (సంసారవృక్షం యొక్క) రూపం ఇక్కడ అలా కనిపించదు. దానియొక్క అంతంగాని, మొదలుగాని, స్థితిగాని ఏవీ కనిపించటం లేదు. గట్టిగా పాతుకపోయిన ఈ అశ్వత్థ వృక్షాన్ని దృఢమైన అసంగశస్త్రంతో ఛేదించాలి.

**వ్యాఖ్య :- 1. అస్యరూపం ఇహ తథాన ఉపలభ్యతే :-** దాని రూపం ఇక్కడ అలా కనిపించదు. ఈ సంసారాన్ని అశ్వత్థ వృక్షంతో పోలుస్తూ మొదటి రెండు శ్లోకాల్లోనూ చెప్పారు. అయితే ఇలా వర్ణించిన వృక్షాలు మనకు ఎక్కడా ఈ భూమి మీద కనిపించవు. నీటిలో ప్రతిబింబంగా కనిపిస్తాయే గాని యదార్ధంగా మూలం పైకీ కొమ్మలు క్రిందికీ ఉన్న చెట్లు ఎక్కడా కనిపించవు. ఇంకా చెప్పాలంటే అసలు ఈ సంసారం (జగత్తు) అనేది ఉంటే గదా ! దానికొక రూపం ఉండేది. ఇది అజ్ఞానుల దృష్టిలో మాత్రమే ఉంటుంది. ఈ చెప్పిన ఉపమానం వారికోసమే. ప్రపంచంలో ఎక్కువ అజ్ఞానులే ఉన్నారు గనుకను, వారిని ఉద్ధరించవలసిన భాధ్యత భగవంతునిదే గనుకను భగవంతుడు ఇలా ప్రపంచాన్ని తలక్రిందులైన అశ్వత్థ వృక్షంతో పోల్చి చెబుతున్నారు.

2. న అంతః న ఆదిః చ న సంప్రతిష్ఠాచ :- జ్ఞానుల దృష్టిలో అసలు ప్రపంచమే లేదు గనుక దీనికి రూపం కూడా ఉండే అవకాశం లేదు. రూపం లేదు గనుక ఆది, అంతం, మధ్య అనేవి కూడా లేవు. కనుక దీని గురించి విచారణ కూడా అనవసరం. ఎండమావులలోని నీళ్ళు ఎక్కడి నుండి వచ్చాయి? ఎక్కడ కలుస్తాయి? రుచిగా ఉన్నాయా? చప్పగా ఉన్నాయా? తెలుపా? నలుపా?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎరుపా? అని విచారించి ఏం లాభం? ప్రపంచం కూడా అంతే. లేని ప్రపంచం ఎప్పటి నుండి ఉన్నది? ఎప్పటిదాకా ఉంటుంది? అని ఆలోచించి ఏం ప్రయోజనం? ఈ ప్రపంచం మిథ్య. అంటే నిజంగా లేకపోయినా కనిపిస్తున్నది.

మిథ్యా వస్తువు సత్తుకాదు, అసత్తూ కాదు. సత్తు అయితే మూడు కాలాల్లోను ఉండాలి. ప్రపంచం అలా ఉండదు. కనుక సత్తు కానేకాదు. అసత్తు గనుక అయితే అసలు కనపడకూడదు. కుందేటి కొమ్ములాగా, గొడ్రాలి బిడ్డలాగా అసలు లేనిదే కావాలి. మరి ప్రపంచం వీటిలాగా అసలు లేనిదా? కాదు. మధ్యలో కనిపిస్తున్నది. సృష్టికి ముందులేదు, ప్రళయం తరువాతా లేదు. కాని ఇప్పుడు కనిపిస్తున్నది. కనుక అసత్తూ కాదు. సత్తూ అసత్తూ రెండూ కాని దానిని మిథ్య అంటారు. ఎంతో స్పష్టంగా కనిపిస్తున్నది గదా! నాకే కాకుండా అందరికీ కనిపిస్తున్నది గదా! మిథ్య ఎలా అవుతుంది? అని శంకిస్తారు చాలామంది. గారడీవాడు చూపించే వస్తువు కంటికి స్పష్టంగా కనిపిస్తుంది గదా! అయినా నిజం అంటామా? ఎండమావులలో నీరున్నట్లు కనిపిస్తుంది గదా! మరి నిజమా? కాదు. ఈ ప్రపంచం కూడా అంతే. కన్పిస్తున్నప్పటికీ నిజంకాదు.

జ్ఞానులకు, అజ్ఞానులకు ఈ ప్రపంచం కనిపిస్తూనే ఉంటుంది. కాని అజ్ఞానులు దీని ఆకర్షణలకు లొంగిపోయి, మోసపోయి కష్టాల పాలవుతుంటారు. జ్ఞానులు ఇది సత్యం కాదని తెలుసుకొని మోసపోరు, కష్టాల పాలుగారు. ఎండమావులు వివేకం లేని జంతువులను మోసం చేస్తాయిగాని, వివేకం గల మానవులను మోసం చేయలేవు.

కలలోని వస్తువులు లేనివే అయినా కనిపిస్తున్నాయి, సుఖదుఃఖాలను కలిగిస్తున్నాయి. అంతమాత్రాన అవి నిజమా? కాదు. నిద్రించినప్పుడు మనస్సులో ఎలాగైతే స్వప్న ప్రపంచం కల్పించబడిందో అలాగే పరమాత్మలో ఈ జాగ్రత్ ప్రపంచం కల్పించబడింది. త్రాడు త్రాడుగానే ఉండి భ్రాంతి వల్ల పాముగా కనిపించినట్లు పరమాత్మ పరమాత్మగా ఉండి ప్రపంచంగా అజ్ఞానులకు కనిపిస్తున్నది.

శాస్త్రాలలో సృష్టిని గురించి అనేక విధాలుగా చెప్పారు. ఇదంతా ఎందుకంటే ఈ సృష్టి మొత్తం మిథ్య అని చెప్పటానికే.

ఒక ధనవంతుని ఇంటిలో వైభవంగా వివాహం జరుగుతున్నది. మేరువాణి వేడుకకు బాణసంచా తెప్పించారు. ఒక పెద్ద ఏనుగును తయారుచేసి దానిలోపల ప్రేలుడు పదార్థాలను కూర్చారు. ఇక నిప్పు అంటించటమే తరువాయి. ఏనుగు ఆకాశంలోకి ఎగిరి పేలిపోతుంది. ఈ వింతను చూడటానికి జనం దాని చుట్టూ మూగారు. అందులో ఒకడన్నాడు, అంతా బాగానే ఉంది గాని దాని చెవులు చిన్నవిగా ఉన్నవి అన్నాడు. మరొకడు తోక మరీ పొట్టిగా ఉందే అన్నాడు. ఇలా ఒక్కొక్కరు ఒక్కో లోపాన్ని చెబుతున్నారు. అంతలో మరొకడన్నాడు, ఆ! స్థిరంగా ఇంట్లో పెట్టుకొని చూచుకొనేదైతే మీరు చెప్పే మాటలు నిజమేగాని ఇంకొక్క నిముషంలో కాలి బూడిదై పోయేది ఎలా ఉంటే ఏముంది? అన్నాడు.

సృష్టిని గురించి అనేకమంది అనేక విధాలుగా చెప్పటం కూడా ఇంతే. అది మిథ్య అని చెప్పటానికే. మానవుడికి కావలసింది ప్రపంచ జిజ్ఞాస కాదు.

బ్రహ్మజిజ్ఞాస. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాస' అని బ్రహ్మ సూత్రాలలో మొదటి సూత్రంగా చెప్పినదిదే. అయితే లోకంలో అందరికి బ్రహ్మజిజ్ఞాస కన్నా ప్రపంచజిజ్ఞాసయే ఎక్కువ. అందరూ ప్రాపంచిక వ్యామోహాలకే ప్రాధాన్యత ఇస్తారు. వాటికోసమే జీవిస్తారు.

ఈ ప్రపంచం మనను మోసగించేదని, పరమాత్మను చేరుకొనేందుకు అడ్డు వస్తుందని, పరమాత్మకు మనను దూరం చేస్తున్నదని అజ్ఞానంలో ఉన్న మనం తెలుసుకోలేక పోతున్నాం. అలా తెలుసుకోలేక పోవటం వల్లనే ఈ ప్రపంచం వెంటపడి ఏవేవో సుఖాలు పొందాలని భావిస్తూ పరమాత్మకు దూరమై మోసపోతున్నాం. మరి ఎందుకు తెలుసుకోలేక పోతున్నాం ఈ ప్రపంచ తత్త్వాన్ని గురించి? ఎందుకంటే మనం పూర్తిగా ఈ ప్రపంచ వ్యామోహాలలో మునిగిపోవటం వల్లనే. చీకటిలో ఉన్నవాడికి వస్తువులు కనిపించవు. అలాగే అజ్ఞానాంధకారంలో ఉన్నవాడికి ఈ ప్రపంచ తత్త్వం తెలియదు. ఇంటికి పునాదులు ఆధారంగా ఉంటాయి. ఇంటి మీద వ్యామోహంతో ఇంట్లో కూర్చున్న వాడికి పునాదులు కనిపించవు. వ్యామోహం తీరి బయటకు వచ్చి త్రవ్వి చూస్తే పునాదులు కనిపిస్తాయి. అలాగే ప్రపంచ వ్యామోహంలో మునిగిపోయి, ఇక్కడి వస్తువులతో సంగభావం పెట్టుకొని వాటిలోనే తిరిగే వాడికి ప్రపంచానికి ఆధారమైన పరమాత్మ కనిపించడు. కనుక వ్యామోహాన్ని విడిచి విషయ విరక్తితో విచారణ చేస్తే, సూక్ష్మ బుద్ధితో విశ్లేషణ చేస్తే పరమాత్మ కనిపిస్తాడు. అందుకే ఈ సంసార వృక్షాన్ని

ఛేదించాలని చెప్పి భగవానుడు అలా ఛేదించటానికి ఎలాంటి ఆయుధం కావాలో తెలియజేస్తున్నాడు.

ఈ సంసార వృక్షాన్ని దృఢమైన వైరాగ్యమనే గొడ్డలితో నరికివేయాలి అంటున్నాడు భగవానుడు. ఈ సంసార వృక్షం అనేక కోట్ల జన్మల నుండి బాగా వ్యాపించి ఉన్నది. శాఖోపశాఖలుగా అంతటా విస్తరించుకొని యున్నది. వ్రేళ్ళు బాగా తన్నుకొని లోపలికి చొచ్చుకపోయి ఉన్నాయి. అందుకే దానిని రూఢ మూలం అనక విరూఢ మూలం అనక 'సువిరూఢ మూలం' అన్నారు. గట్టిగా పాతుకొనిపోయి ఉన్నది గనుక దీనిని ఛేదించాలంటే పదునైన గట్టి ఆయుధమే కావాలి. అదే 'అసంగ శస్త్రం'.

3. అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా:- వైరాగ్యమనే గొడ్డలితో ఛేదించాలి. వైరాగ్యం లేనిదే ఈ సంసారాన్ని ఛేదించటం సాధ్యంకాదు. అంతేకాదు. ఈ వైరాగ్యం వివేకంతో కూడుకున్నదై ఉండాలి. వస్తువులో ఉన్న దోషాన్ని చూడగలగటమే వివేకం. నీవు ఎంతో ఇష్టపడే స్వీటును ఎవరో తెచ్చి ఇచ్చారు. దానిని ఎంతో ఇష్టంతో తినబోతున్నావు. అంతలో ఒకరు వచ్చి దానిలో విషం కలిసింది అన్నారు. అయితే అయిందిలే ఈ స్వీటు నాకెంతో ఇష్టమైనది అని తింటావా? తినవుగదా!

ఈ ప్రపంచంలోని ప్రతి విషయమూ దోషాలతో కూడుకొనే ఉంటుంది. ముఖ్యంగా 3 దోషాలున్నాయి. అవే క్షయ, సాతిశయ, పతనదోషాలు. ఈ లోకంలోనే కాదు స్వర్గలోకంలోని భోగాలలో కూడా ఈ 3 దోషాలున్నాయి.

ఎన్నికలలో బాగా ఖర్చుపెట్టి MLA అయ్యాడు. అక్కడ హంగ్ అసెంబ్లీ ఏర్పడి తంతే బూరెలబుట్టలో పడ్డట్లు మంత్రి పదవి కూడా వచ్చింది. ఎంత సంతోషమో! తన జీవితలక్ష్యం నెరవేరింది. ఒక నెలరోజులు ఆనందంతో గడిచిపోయినవి. ఆ తరువాత ఆలోచనలో పడ్డాడు. ఈ ప్రభుత్వం పూర్తిగా ఉంటే 5సం||లు. అప్పుడే 1సం||రం గడిచిపోయింది. ఇక నాలుగేళ్లే గదా! అని దిగులు. ఇదే క్షయదోషం. ఇప్పుడు తాను సహాయమంత్రి. కేబినేట్ మంత్రిని చూస్తే కడుపు మంట. తనకన్న వాడు ఏం గొప్పని వాడికి పెద్ద పదవి - అని బాధ. ఇది సాతిశయదోషం. ఇక ఈ ప్రభుత్వం అవిశ్వాస తీర్మానం నెగ్గటంతో 3 సంవత్సరాలకే పడిపోయింది. దానితో తన మంత్రి పదవి ఊడిపోయింది. ఇప్పుడు పలకరించే దిక్కులేదు. పైగా మంత్రి పదవిలో ఉండి దోచుకున్న దానికి CBI వారు సంజాయిషీ అడుగుతున్నారు. FIR వ్రాసి అరెస్టు చేసి జైలుకు పంపారు. ఇది పతనదోషం. స్వర్గలోకంలో కూడా ఈ దోషాలే. వెయ్యి సంవత్సరాలు భోగాలనుభవించటానికి స్వర్గానికి వచ్చాడు. 100 సంవత్సరాలు గడిచింది. ఇక 900 సం||లు మాత్రమే. ఇది క్షయదోషం. ఇక్కడి సుఖాల కన్న సత్యలోకంలో ఇంకా బాగున్నాయి. ఇది సాతిశయదోషం. 1000 సం||లు పూర్తయి, కుక్క జన్మ వచ్చింది. ఇది పతనదోషం.

ఇదంతా జాగ్రత్తగా గమనించినవాడు, వివేకి అయినవాడు ఇహలోక, పరలోక సుఖాలపై ఆసక్తిని విడిచిపెట్టి పరబ్రహ్మ ప్రాప్తికి ప్రయత్నం చేస్తాడు. అందుకే అసంగ శస్త్రాన్ని- వైరాగ్యమనే గొడ్డలిని చేత ధరించాలి.

సంగం అంటే రాగం. అసంగం అంటే విరాగం - వైరాగ్యం. వైరాగ్యమనే శస్త్రంతో ఈ సంసార వృక్షాన్ని ఖండించాలి. ఆ వైరాగ్యం దృఢంగా ఉండాలి. కత్తిని వదులుగా పట్టుకుంటే పెన్సిలు చెక్కటానికి కూడా పనికిరాదు. గట్టిగా పట్టుకుంటే తలకాయలు కూడా తెగిపోతాయి. 'నేను ఆత్మను' 'అసంగ స్వరూపుణ్ణి' అనే భావనే సంసార తాపం నుండి తప్పిస్తుంది. ఇది సామాన్యులకు అర్థమయ్యేది కాదు.

ఒక సాధువు ధనవంతుని ఇంటికి భిక్షకు వెళ్ళాడు. ఆ మహాత్మునికి షడ్రసోపేతమైన భోజనం పెట్టించాడు ధనవంతుడు. తరువాత విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు యజమాని ఆ సాధువుతో "స్వామీ! భోజనం ఎలా ఉంది? తమకు తృప్తిగా ఉన్నదా?" అన్నాడు. అందుకా సాధువు, "నన్నెందుకయ్యా అడుగుతావు? తిన్నవాణ్ణి అడుగు" అన్నాడు. ఆత్మ అసంగమనే పాఠం చెప్పాడు సాధువు. అది సిద్ధావస్థకు చెందిన అసంగస్థితి. అది లభించే వరకు 'నేను అసంగరూప ఆత్మను' 'నేను అకర్తను అభోక్తను' అనే భావన చేస్తూ రావాలి. అప్పుడు కలిగే వైరాగ్యమే పూర్ణవైరాగ్యం.

'ఛిత్వా' ఛేదించి అని ఆగారు ఈ శ్లోకంలో. క్రియ ఇంకా పూర్తికాలేదు. వైరాగ్యం కలగటం కాదు ముఖ్యం బ్రహ్మభావన కలగాలి. వైరాగ్య శస్త్రంతో ఛేదించిన తర్వాత ఏమి చేయాలో నాలుగవ శ్లోకంలో చెబుతున్నారు.

సంసార వృక్షాన్ని అసంగ శస్త్రంతో ఛేదించి ఏమి చెయ్యాలి?



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** తతః పదం తత్పరి మార్గి తవ్యం
యస్మిన్ గతాన నివర్తంతి భూయః|
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ|| (4)

**తా||** ఆ తరువాత ఎక్కడికి చేరి మళ్ళీ తిరిగిరారో ఆ పదాన్ని వెతకాలి. ఎవరి నుండి పురాతనమైన సంసార ప్రవృత్తి వ్యాపిస్తున్నదో ఆ ఆది పురుషుణ్ణే నేను శరణు వేడుతున్నాను.

**వ్యాఖ్య:-** ప్రపంచంలో ప్రతి మానవుడు కోరుకొనేది దుఃఖ నివృత్తి, ఆనందప్రాప్తి. మానవుడే కాదు ప్రతి ప్రాణీ దుఃఖం పోవాలని, సుఖం రావాలని కోరుకుంటుంది. అందుకే ప్రతి వ్యక్తీ ఈ లోకంలో ఏదో ఒక పనిచేస్తూ ఉంటాడు. వ్యాపారం చేసినా, ఉద్యోగం చేసినా, వృత్తిని చేసినా అన్నింటి ఆశయం ఇదే. అలాగే పూజలు చేసినా, వ్రతాలు చేసినా, యజ్ఞయాగాదులు చేసినా అన్నింటి ఆశయం ఇదే. ఇప్పుడు వచ్చిన ఈ కష్టం - ఈ దుఃఖం తొలగిపోతే చాలు భగవంతుడా! నీకు 100 కొబ్బరికాయలు కొడతాను; సహస్ర నామార్చన చేయిస్తాను. ప్రసాదం నైవేద్యం పెడతాను అంటాం. ఆ దుఃఖం కాస్తా తొలగిపోయిందనుకోండి; ఊరుకుంటామా? భగవంతుడా! నీవు ఎంతో దయామయుడివి. నా కష్టాన్ని తొలగించావు. ఆ చేత్తోనే మా అబ్బాయికి మంచి ఉద్యోగం వేయించు. నాకు లాటరీ తగిలేట్లు చెయ్యి - అంటూ కోరికల మూటను విప్పుతాం. కనుక మనందరికీ కావలసింది దుఃఖనివృత్తి. దానితో పాటే ఆనందప్రాప్తి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మోక్షం అనే పదాన్ని అందరూ వాడుతుంటారు. కాని అదేమిటో చాలా మందికి తెలియదు. చచ్చిన తర్వాత వెళ్ళే స్వర్గలోకమే మోక్షమని చాలామంది అభిప్రాయం. కాని అది నిజం కాదు. మోక్షమంటే ఆత్యంతిక దుఃఖ నివృత్తి, శాశ్వత ఆనందప్రాప్తి. ఈ రెంటిని కలిపి ఒకే మాటగా 'మోక్షం' అన్నారు వేదాంతులు.

ఈ దుఃఖనివృత్తిని, ఆనందప్రాప్తిని సాధించుటకు మనం ఎన్నో పనులు చేస్తుంటాం. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల ద్వారా డబ్బు సంపాదిస్తారు. కొందరు జనులను మోసం చేసి డబ్బు సంపాదిస్తారు. కొందరు దొంగతనం చేసి, లంచాలు తీసుకొని, తప్పుడు పనులు చేసి సంపాదిస్తుంటారు. కొందరు రాజకీయాలలో దిగి పదవులు సంపాదించి సుఖించాలనుకుంటారు. కొందరు సర్వసంగపరిత్యాగులై సన్యాసులౌతారు. కొందరు స్వామీజీలై ఆశ్రమాలను స్థాపించి ప్రజలను ఉద్ధరిస్తుంటారు. ఇలా రకరకాల వేషాలతో రకరకాల పనులు చేసి దుఃఖాలను తొలగించుకోవాలని, ఆనందం పొందాలని ప్రయత్నిస్తుంటారు. కాని ఎవ్వరూ నిత్యమైన - నిజమైన ఆనందాన్ని పొందటం లేదు. ఎందుకని? ఎందుకంటే తాత్కాలికంగా దుఃఖాన్ని తొలగించుకొనేందుకు ఆనందాన్ని పొందేందుకు తొందర పడుతున్నారే గాని శాశ్వత పరిష్కారం కోసం ప్రయత్నించటం లేదు. అసలు దుఃఖం ఎందుకొస్తున్నదో మూలకారణాన్ని శోధించటం లేదు. అందుకే సిద్ధి లభించటం లేదు. ప్రతి మానవుని పరిస్థితీ ఇంతే. ఇలా విఫల ప్రయత్నం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేస్తున్న మానవులను ఉద్ధరించటానికీ, వారికి సరైన మార్గాన్ని చూపించటానికే భగవానుడు హితోపదేశం చేస్తున్నాడు.

సంసార భ్రమవల్లనే దుఃఖం కలుగుతున్నదని, ఆ సంసార త్యాగం వైరాగ్యంతో సాధించాలని ఇంతవరకు చెప్పారు. సంసార త్యాగంతోనే దుఃఖ నివృత్తి. అయితే దుఃఖ నివృత్తి కలిగితే చాలదు. ఆనందం కలగాలి. గాఢనిద్రలో దుఃఖ నివృత్తి ఉంది. కాని ఆనందప్రాప్తి లేదు. గాఢనిద్రలో ఆనందం ఉన్నదనుకుంటాం. అది దుఃఖం లేని అభావస్థితి మాత్రమే. మనకు పెద్ద కష్టం వచ్చి క్రిందుమీదులైన తరువాత అది తొలగిపోతే గుండెల మీద బరువు తొలగినట్లు ఆనందిస్తాం. అది నిజమైన ఆనందం కాదు - కష్టం తొలగిన స్థితి మాత్రమే.

నెత్తిమీద కట్టెల మోపు పెట్టుకొని ప్రక్క ఊరికి ప్రయాణమయ్యావు. నడచి, నడచి ఆ బరువుతో ఏడుపువస్తున్నది. ఆకలి దంచేస్తున్నది. అలాగే ఏడుస్తూ నడుస్తున్నావు. ఆ మోపును దించితే మళ్ళీ ఎత్తటానికి మనిషి కావాలి. అందుకని అలాగే మోస్తూ నడుస్తున్నావు. ఇంతలో ఒక వ్యక్తి తారసపడి నీ బాధ చూచి మోపును క్రిందికి దించాడు. దీనితో బరువు తీరిపోయింది. హాయిగా ఉంది. కాని ఆకలి అలాగే ఉంది. కనుక దుఃఖనివృత్తే కాదు, ఆనందప్రాప్తి కూడా మన లక్ష్యం కావాలి.

అందుకే దుఃఖనివృత్తికి సంసార వృక్షాన్ని వైరాగ్యమనే ఆయుధంతో ఛేదించాలని చెప్పి ఇప్పుడు ఆనందప్రాప్తికి మార్గం చెబుతున్నారు. నిష్కాముడైన సాధకుడు ఉన్నతోన్నతమైన పదవిని చేరుకోవాలి. ఎలాంటిది ఆ

పదవి? ఈ సంసారానికి ఆధారమైనట్టిది; అధిష్ఠానమైనట్టిది. అదే పరమాత్మ పదం. లోకంలోని పదాలన్నీ అనిత్యమైనవి; సామాన్యమైనవి. కాని పరమాత్మ పదం నిత్యమైనది, శాశ్వతమైనది; చాలా గొప్పది. దానికన్న ఉన్నతపదం మరొకటి లేదు. ఒకసారి ఆ పదవిలో కూర్చున్న తరువాత ఇక పదవీ వియోగం ఉండదు. అక్కడి నుండి జారిపడే ప్రశ్నేలేదు. ఉప్పు బొమ్మ సముద్రం లోతు చూడాలని సముద్రంలో దిగింది. అలా దిగి సముద్రపు లోతును చూస్తున్నది. కాని ఎంతసేపైనా ఇక తిరిగి వచ్చే అవకాశమే లేదు. ఎందుకంటే అది ఆ సముద్ర స్వరూపమే అయిపోయింది. జీవుడూ అంతే. అన్ని బంధాలు వదిలించుకొని సంపూర్ణ వైరాగ్యంతో ఆ పరమాత్మ పదంలో - పరమపదంలో ప్రవేశిస్తే అతడు పరమాత్మ స్వరుపుడే అవుతాడు. ఇక తిరిగి వచ్చే ప్రశ్నేలేదు. తిరిగి జన్మించే వీలూలేదు.

ఈ బ్రహ్మాండంలో ఎక్కడికి వెళ్ళినా తిరిగి రావాల్సిందే. స్వర్గలోకం, చంద్రలోకం, పితృలోకం, వరుణలోకం - - - ఇలా ఏ లోకం వెళ్ళినా అక్కడ అనుభవాలు పూర్తయిన తరువాత తిరిగి ఈ మానవ లోకానికి రావలసిందే. అయితే బ్రహ్మప్రాప్తి - పురుషోత్తమప్రాప్తితో ఇక తిరిగి రావలసిన అవసరంలేదు. పిల్ల గ్రుడ్డు కానట్టుగా, ముత్యం తిరిగి నీరు కానట్టుగా బ్రహ్మభావం పొందిన జీవుడికి తిరిగి జన్మలేదు. సముద్రరూపాన్ని పొందిన ఉప్పుబొమ్మ తిరిగి ఉప్పుబొమ్మ రూపాన్ని పొందలేదు. "యస్మిన్ గతాన నివర్తంతి భూయః" - దేనిని పొందిన తర్వాత తిరిగి వచ్చే పనిలేదో అంటే ఇదే. ఇదే మోక్షస్థితి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుని అనుగ్రహంతో, గురువు యొక్క అనుగ్రహంతో, అనేక జన్మల సుకృతం కారణంగా, ఈ జన్మలో చేసిన తీవ్రప్రయత్నం కారణంగా ఒక్కసారి ఆ పదవిని - ఆ పరంధామాన్ని అందుకున్నావా! - తిరిగి జారిపోయే ప్రసక్తేలేదు. ఐతే ఆ మోక్షపదవిని పొందాలనుకున్నవాడు భగవంతుని శరణుకోరాలి. సంపూర్ణ శరణాగతుడు కావాలి. కేవల ప్రయత్నం చాలదు. పరమాత్మ అనుగ్రహం తప్పకుండా కావాలి. తన పురుషార్థం అంతా - తన ప్రయత్నం అంతా ఆ పదవిని పొందటానికి పూర్వరంగాన్ని సిద్ధం చేసుకొనుట కొరకే. కావలసిన సామాగ్రిని, సంపదను సిద్ధం చేసుకొనేందుకే అన్ని సాధనలు, ప్రయత్నాలు.

ఎన్నికలలో గెలిచి MLA పదవినో, MP పదవినో సాధించాలంటే ముందుగా నీ ప్రయత్నాలు కావాలి. ముఖ్యంగా డబ్బు సమకూర్చుకోవాలి. బ్యానర్లు, జెండాలు సమకూర్చుకోవాలి. కొందరు పెద్దలను కలుసుకొని సహాయం అర్థించాలి. రౌడీలను, గూండాలను మేపుతుండాలి. అధిష్టానం అనుగ్రహాన్ని సంపాదించుకోవాలి. కొన్ని ప్రాంతాలలో బాంబులను సమకూర్చుకోవాలి. కార్లు, రిక్షాలు, ఆటోలు మొ||న వాటిని కూర్చుకోవాలి. ఇదంతా పూర్వరంగం. ఇక ఎన్నికల రోజున కావలసింది ఓటర్ల అనుగ్రహం. వారి అనుగ్రహం ఉంటేనే నీవు ఎన్ని ప్రయత్నాలు చేసినా పదవి లభించేది. వారి అనుగ్రహం లేకపోతే అంతా వృథాయే.

అలాగే మోక్షపదవిని పొందాలంటే భగవంతుని అనుగ్రహం కావాలి. అందుకు భగవంతుని శరణు పొందాలనే శుభేచ్ఛ కలగాలి. ఎంతో పుణ్యం

చేసిన వారికి మాత్రమే అటువంటి శుభేచ్ఛ కలుగుతుంది. పూర్వజన్మలలో భగవత్ సంబంధమైన చింతన ఎంతో కొంత చేసి ఉంటేనే; భగవత్ సంబంధమైన పూజాధికాలు, యజ్ఞయాగాదులు కొన్నైనా చేస్తేనే; భగవంతుని స్మరిస్తూ జపధ్యానాదులు సాగిస్తేనే భగవంతుని శరణు పొందాలనే కోరిక కలుగుతుంది. సాధారణంగా ప్రతివాడూ తన సంసారానికి, తన పాండిత్యానికి, తన గొప్పతనానికి, తన సంపదకు, తన పదవికి, తన కీర్తికి, తన ఠీవికి, తన ప్రతాపానికి, తన తెలివి తేటలకు శరణా గతుడవుతాడే గాని భగవంతుని శరణు పొందాలనే సద్బుద్ధి నూటికో కోటికో ఏ ఒక్కరికో తప్ప అందరికీ కలగదు.

నిజమైన శరణాగతి ఏది? సర్వమూ భగవంతుడేనని, తనదేమీ లేదని, తాను కేవలం నిమిత్తమాత్రుడనని, సర్వమూ ఆయన ఇచ్ఛ ప్రకారమే జరుగుతున్నదనే విశ్వాసం ఉండాలి. మనకు ఏ ఇష్టాఇష్టాలు ఉండకూడదు. భగవంతుడు ఏది అనుగ్రహిస్తే దానితో సంతుష్టులం కావాలి. ఇదీ శరణాగతి.

అట్టి శరణాగతిని పొందటం ఎలాగో 5వ శ్లోకంలో తెలియజేస్తున్నారు. ఈ శ్లోకంలో చెప్పిన లక్షణాలను తెలుసుకొని, ఆ లక్షణాలను మన స్వభావంగా చేసుకొనుటకు ప్రయత్నం చేస్తే మనం భగవంతునికి సంపూర్ణ శరణాగతులమై ఆయన అనుగ్రహాన్ని పొందగలుగుతాం. ఆ బ్రహ్మపదవిని చేరుకుంటాం. అది ఎలాగో- బ్రహ్మపదవిని పొందటానికి అర్హులైన వారి లక్షణాలేమిటో తెలియజేస్తున్నారీ శ్లోకంలో -

**శ్లో||** నిర్మాన మోహా జిత సంగదోషాః
ఆధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః ।
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛంత్య మూఢాః పదమవ్యయం తత్ || (5)

**తా||** అభిమానం, అవివేకం లేనివారు; ఆసక్తిని వదిలినవారు; నిత్యము ఆధ్యాత్మిక జ్ఞానంలో ఉన్నవారు; కోరికలను పూర్తిగ వదిలినవారు; సుఖదుఃఖాలనే ద్వంద్వాల నుండి విడుదల పొందినవారు, మూఢత్వంతొలగి ఆ అవ్యయమైన బ్రహ్మపదాన్ని చేరుకుంటారు.

**వ్యాఖ్య:-** బ్రహ్మప్రాప్తి పరమ జ్ఞానికే. అట్టి జ్ఞాని కావాలంటే అతడు భగవంతుని శరణు పొందాలి. అనన్య భక్తి గలవాడై యుండాలి. అందుకు తగిన 5 సాధనలను ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

(i) అభిమానం, అవివేకం లేనివాడు:- మానము జ్ఞానానికి విరోధి. నేను గొప్ప అనే అహంకారమే అభిమానం. మహాభారతంలో దుర్యోధనుడు తన అభిమానం గురించి తానే చెప్పుకున్నాడు. "మానధనాఢ్యుడైన భూపతి సహియింపనోపునే సపత్నుల వృద్ధియు ఆత్మ హానియున్" అని. అతడు అంతటి మాన ధనాఢ్యుడు గనకనే మయసభలో పరాభవం పాలయ్యాడు. పరుల ధనాన్ని అపహరించాలని కపట జూదం ఆడించి భగవంతునికి విరోధి అయ్యాడు.

నేను ధనవంతుణ్ణి, నేను అందగాడిని, నేను గొప్ప బుద్ధిమంతుణ్ణి, నేను గొప్ప విద్యాధికుడిని, నేను పండితుణ్ణి, నేను అధికారిని, నేను బలవంతుణ్ణి -

ఇలా భావించే వారంతా అభిమానధనులే. దురాభిమానులే. ఈ అభిమానమే అవివేకులను చేస్తుంది. మోహంలో పడవేస్తుంది. భగవంతునికి దూరం చేస్తుంది. కనుక అభిమానాన్ని వదలి నమ్రత నేర్చుకోవాలి.

రామాయణంలో ఆంజనేయుడు లంకకు వెళ్ళి సీతాదేవిని చూచిన తరువాత రావణునితో మాట్లాడుతూ "సుగ్రీవుని వద్ద నా కన్నా తక్కువ కోతి లేద" న్నాడు. ఇదీ అభిమాన రాహిత్యం అంటే. అందుకే ఆంజనేయుడు పరమభక్తాగ్ర గణ్యుడయ్యాడు.

మోహం అంటే అవివేకం. దేహం నేను అనుకోవటం, ఈ జగత్తు సత్యం అనుకోవటం, ఇక్కడి వస్తువులు - విషయాలతో నేను సుఖిస్తాను అనుకోవటం మోహం. మోహం మోక్షానికి పెద్ద ప్రతిబంధకం. అసలు మోక్షం అంటే మోహాన్ని క్షయం చేసుకోవటం అని అర్థం.

2. జిత సంగదోషాః :- సంగం అంటే అతుక్కుపోవటం. చేసే పనితో, కలిసే వ్యక్తులతో, సుఖాన్నిచ్చే వస్తువులతో, తిరిగే రంగంతో అతుక్కుపోవటమే సంగం. 'ఇవి లేకపోతే నేను బ్రతకలేను' అనే భావమే సంగదోషం. సంగదోషం తొలిగితేనే భగవత్ప్రాప్తి.

సంగం మహాదోషం. భూమ్యాకర్షణ శక్తి కన్న, విద్యుచ్ఛక్తి కన్న, అయస్కాంతశక్తి కన్న ఈ సంగశక్తి చాలా బలమైనది, ప్రమాదకరమైనది. పట్టుకుంటే వదలదు. ఈ సంగదోషం మానవుణ్ణి సర్వనాశనం చేసి వదిలిపెడుతుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భార్యాబిడ్డలు, ఇల్లువాకిళ్ళు, ధనసంపదలు - ఇవన్నీ నావి నావి అనేది మమత్వసంగం. కర్మలన్నింటికి కర్తను నేను. నేను గాబట్టి ఇంత బాగా చేశాను అనేది కర్తృత్వసంగం. ఈ రెంటినీ జయించిన వారే జిత సంగదోషులు. అట్టివారు ఏ వస్తువుల మధ్య ఉన్నా, ఎవరి మధ్యన ఉన్నా రాగద్వేషాలు లేకుండా ఉండగలుగుతారు. అట్టివారే భగవత్ప్రాప్తికి అర్హులవుతారు.

3. అధ్యాత్మ నిత్యాః- నిత్యము ఆత్మజ్ఞానంలో ఉన్నవారే భగవంతుని చేరుకోగలరు. భగవంతునితో సంగం, భగవంతుని గురించిన జ్ఞానంతో సంగం పెట్టుకున్నవారు మిగిలిన సంగదోషాలన్నింటిని తొలగించుకోగలుగుతారు. కనుక నిరంతరము ఆత్మజ్ఞానం, ఆత్మవిచారణ, శ్రవణ మనన నిధిధ్యాసనలతో ఉండేవారు భగవంతుని చేరుకొనుటకు అర్హులు. ఆత్మజ్ఞానాన్ని శాస్త్రాల ద్వారా గురుబోధల ద్వారా తెలుసుకుంటూ ఉండాలి. నిత్యమూ పరమాత్మ చింతనలో, ఆత్మజ్ఞానంలో ఉంటే పూర్తి అర్హత ఉంటుంది. కొంత ఆత్మజ్ఞానం మీద కొంత ప్రాపంచిక చింతనలోను ఉంటే ఎప్పటికైనా అర్హత సంపాదించగలుగుతారు. అసలు ఆత్మచింతన లేక లౌకిక జీవితం గడిపేవారికి అసలు భగవంతుని చేరుకొనే అర్హత - అవకాశం ఉండదు.

నిత్యము ఆధ్యాత్మిక చింతనలో ఉండలేకపోతే కాచుకొని కూర్చున్న మాయ అజ్ఞానంలోనికి నెట్టివేస్తుంది. కనుక నిత్యము ఆధ్యాత్మిక చింతనలో, ఆత్మజ్ఞానంలో రమిస్తూ ఉండాలి.

**4. వినివృత్త కామాః :- నిత్యము ఆత్మజ్ఞానంలో, భగవత్ చింతనలో ఉంటే కోరికలన్నీ వాటంతట అవే తొలగిపోతాయి. వస్తువులపై కోరిక ఉంటే మనస్సు వాటివైపు పరుగులు తీస్తుంది. అంటే భగవంతునికి దూరమైపోతుంది. కోరికలు నశిస్తే మనస్సు అంతర్ముఖమై భగవంతునికి దగ్గరౌతుంది. కనుక నిత్యం పరమాత్మ స్మరణలో ఉండి కోరికలను త్యజించాలి. రాముడున్న చోట కాముడుండడు అంటారు. కనుక అన్ని కోరికలను నివృత్తి గావించుకోవాలి. మోక్షం కావాలనే ఒకే ఒక్క కోరికను పట్టుకొని మిగతా అన్నింటిని వదలాలి. చివరకు ఆ మోక్షం కావాలనే కోరిక కూడా ఫలితంలోనే కలిసిపోయి మోక్షసన్యాసం సిద్ధిస్తుంది.**

**5. సుఖదుఃఖ ద్వంద్వైః విముక్తాః :- సంసారం ఒక సాగరం అన్నారు. ఈ సముద్రంలో ద్వంద్వాలనే అలలు నిరంతరం వస్తూనే ఉంటాయి. అవి సుఖదుఃఖాలను, శీతోష్ణాలను, లాభనష్టాలను, జయాపజయాలను, మానావమానాలను - ఇలా అనేక ద్వంద్వాలను కలిగిస్తూనే ఉంటాయి. వీటి వల్ల మనస్సు ఆందోళనలతో అల్లకల్లోలమవుతుంది.**

- **❖ అడవిలో ఉండేవాడికి క్రూరమృగాల పీడ తప్పదు.**
- **❖ సంతలో కాపురం ఉన్నవాడికి సంతగోల తప్పదు.**
- **❖ గొంగట్లో కూర్చొని తినేవాడికి పురుగుల బాధ తప్పదు.**

**అలాగే ఈ ప్రపంచంలో జీవించేవాడికి ఈ ద్వంద్వాల బాధ తప్పదు.**

**సామాన్య మానవుడు వీటి దెబ్బలకు గోడగడియారంలోని పెండ్యులం లాగా అటూఇటూ కంపించి పోతాడు. వివేకం గలవాడు సముద్ర తరంగాలను**

**తట్టుకొని స్థిరంగా నిలిచే గండశిలలాగా నిబ్బరంగా, నిశ్చలంగా ఉండగలుగుతాడు. అట్టివాడే పరమాత్మను చేరుకొనుటకు అర్హుడు.**

**ఈ చెప్పిన 5 లక్షణాలు గలవారు అవ్యయమైన - నాశరహితమైన ఉన్నతోన్నతమైన తత్ పదాన్ని- ఆ పరమాత్మ పదాన్ని - పరంధామాన్ని చేరుకోగలరు. ఎలా? అమూఢులై. మూఢత్వాన్ని పై సాధనల ద్వారా వదిలించుకొని జ్ఞానులై ఆ పరమపదాన్ని చేరుకుంటారు.**

**ఈ ప్రపంచం పట్ల వైరాగ్యంతో దుఃఖనివృత్తిని, పైన చెప్పిన 5 లక్షణాలతో అవ్యయ పరమాత్మను అందుకొని ఆనందప్రాప్తిని సాధించగలరు. ఈ దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తియే మోక్షం. కైవల్యం.**

**- ఆ అవ్యయ పరమాత్మపదం ఎలాంటిదో తరువాత శ్లోకంలో -**

**శ్లో|| నత ద్భాస యతే సూర్యః**
**న శశాంకో న పావకః |**
**యద్గత్వా న నివర్తంతే**
**తద్ధామ పరమం మమ || (6)**

**తా|| దానిని సూర్యుడు వెలిగించలేడు. చంద్రుడు వెలిగించలేడు. అగ్ని కూడా వెలిగించలేదు. ఎక్కడికి వెళితే తిరిగి వచ్చే పనిలేదో అదియే నా పరంధామం - పరమపదం.**

**వ్యాఖ్య:- అదియే నా పరమపదం - పరంధామం అంటున్నాడు భగవానుడు. 'ధామం' అంటే ప్రకాశించేది అని అర్థం. అన్నింటికన్నా గొప్పది అనే**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అర్థం కూడా ఉన్నది. ఏకాలంలో అయినా, ఎన్నింటిలోనైనా అదే గొప్పది - అన్నింటిని ప్రకాశింపజేసే శక్తి గలది-అని. ఐతే నా పరంధామం అంటే పరంధామం అనేది పరమాత్మకన్నవేరుగా ఉన్న ఒక లోకమా? ఒక భవనమా? ఇలా పరంధామం పరమాత్మ కన్న వేరైనదని ద్వైతులు భావిస్తూ ఉంటారు. వైకుంఠం విష్ణువుదని, కైలాసం శివునిదని, సత్యలోకం బ్రహ్మదని భావిస్తూఉంటారు. ఇదంతా ద్వైతబుద్ధి. ఐతే పరంధామం, పరమాత్మ వేరుకాదు. పరమాత్మే పరంధామం. పరంధామమే పరమాత్మ.

అదేమిటండీ! నా ఇల్లు అంటే నేనువేరు, ఇల్లు వేరు అని కదా! మరి నా పరంధామం అంటే నేను వేరు, పరంధామం వేరు కాదా? అని సందేహం. రాహువు తల అంటే రాహువు వేరు, తల వేరుకాదు గదా! ఎందుకంటే రాహువుకు తలతప్ప మొండెం లేదు. అలాగే నిరాకార పరమాత్మయే పరంధామం. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మము, సర్వవ్యాపకము, స్వయంప్రకాశము. పరంధామం కూడా సూక్ష్మాతి సూక్ష్మము, సర్వవ్యాపకము, స్వయంప్రకాశము. కనుక నా పరంధామం అంటే నేనే పరంధామం - నేను పరంధామమునే - అని అర్థం.

ఇక ఆ పరమాత్మ స్వరూపం ఎంతటి వెలుగు గలదీ అంటే సూర్యుడు గాని, చంద్రుడు గాని, అగ్ని గాని ఏదీ దానిని వెలిగించి చూపలేదు. ప్రపంచంలోని అన్ని వస్తువులను వెలిగించి చూపేవి సూర్య, చంద్ర, అగ్నులే. అన్నింటిలోకి సూర్యుడు గొప్ప వెలుగు. మనం అన్నింటినీ ఆ సూర్య కాంతిలోనే చూస్తున్నాం. అయితే ఇంతటి వెలుగుగల సూర్యుడు కూడా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పరమాత్మను వెలిగించి చూపలేడు. ఒక క్యాండిల్ ట్యూబ్ లైట్ వెలుగును ఎలా చూపలేదో, ఒక దీపం సూర్యుణ్ణి ఎలా వెలిగించి చూపలేదో, అలాగే సూర్యుడు పరమాత్మను వెలిగించి చూపలేడు. ఎందుకంటే ఈ సూర్యుని వెలుగు అంతా ఆ పరమాత్మ నుండి వచ్చినదే.

చంద్రుడు వెన్నెల సాయంతో చీకటిలో మనకు వస్తువులను చూపుతున్నాడు. అయితే అది చంద్రుని స్వయంప్రకాశం కాదు. అది సూర్యుని నుండి గ్రహించిన ప్రకాశమే. కనుకనే తనకు ప్రకాశాన్ని ఇచ్చిన సూర్యుని మాత్రం చంద్రుడు వెలిగించి చూపలేడు. అలాగే పరమాత్మ నుండి శక్తిని - కాంతిని పొందిన సూర్యుడు ఆ పరమాత్మను వెలిగించి చూపలేడు. పరమాత్మది కోటి సూర్య సమప్రభా తేజం. ఆ తేజం ముందు అన్ని వెలుగులు దిగదుడుపే.

ఈ శ్లోక భావాన్ని తెలిపే మంత్రాలు కఠోపనిషత్తు (5-15) లోను, ముండకోపనిషత్తు (2-2-11) లోను, శ్వేతాశ్వతరోపనిషత్తు (6-14) లోను ఉన్నాయి. ఇప్పుడు అసలు విషయానికి వద్దాం.

ఈ బ్రహ్మాండంలోని సూర్యుడే పిండాండంలోని కన్ను. బ్రహ్మాండంలోని చంద్రుడే పిండాండంలోని మనస్సు. బ్రహ్మాండంలోని అగ్నియే పిండాండంలోని వాక్కు. కన్ను, మనస్సు, వాక్కు - ఇవి ఇంద్రియాలు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని - ఇవి ఇంద్రియ అధిష్టాన దేవతలు. కన్ను మనస్సు వాక్కు జీవ పురుషుని ఇంద్రియాలైతే, సూర్య చంద్ర అగ్నులు బ్రహ్మాండ పురుషుని ఇంద్రియాలు.

'సూర్యుడు పరమాత్మను ప్రకాశింపజేయలేడు' అంటే కన్ను ఆత్మను చూడలేదు అని. కన్ను జ్ఞానేంద్రియాలకు ప్రతినిధి. కనుక జ్ఞానేంద్రియాల ద్వారా ఆత్మను తెలుసుకొనే వీలు లేదు అని అర్థం.

'చంద్రుడు పరమాత్మను ప్రకాశింపజేయలేడు' అంటే మనస్సుతో ఆత్మను తెలుసుకోలేము అని. మనస్సు అంతఃకరణాలకు ప్రతినిధి. కనుక అంతఃకరణాలైన మనోబుద్ధి చిత్త అహంకారాలు ఆత్మను తెలుసుకోలేవు అని.

'అగ్ని పరమాత్మను ప్రకాశింపజేయలేడు' అంటే వాక్కుకు ఆత్మ అందేది కాదు - అని. వాక్కు కర్మేంద్రియాలకు ప్రతినిధి. కనుక కర్మేంద్రియాలు ఆత్మను తెలుసుకోలేవు అని అర్థం.

ఇక సూర్యుడు, కన్ను ప్రత్యక్ష ప్రమాణానికి సంకేతాలు. కనుక ప్రత్యక్ష ప్రమాణంతో ఆత్మ తెలియబడేది కాదు.

చంద్రుడు, మనస్సు అనుమాన ప్రమాణానికి సంకేతాలు. కనుక అనుమాన ప్రమాణంతో (ఊహించి తెలుసుకోవటం ద్వారా) ఆత్మ తెలియబడేది కాదు.

అగ్ని, వాక్కు శబ్ద ప్రమాణానికి సంకేతాలు. కనుక శబ్ద ప్రమాణంతో (వినటం ద్వారా) ఆత్మ తెలియబడేది కాదు - అని అర్థం.

కేనోపనిషత్తులోని అగ్ని, వాయువు, ఇంద్రుడు ఆ యక్షుని తెలుసుకోలేక - ప్రయత్నించి విఫలమైన కథ ఇదే.

'పరమాత్మను వాక్కు ద్వారా తెలుసుకొనే వీలులేదు' అని తెలిసిన తరువాత మనకొక సందేహం కలుగుతుంది. 'పరమాత్మను తెలుసుకొనుటకు ఈ ఉపన్యాసాలు, ఉపదేశాలు, ప్రవచనాలు దండగే కదా!' అని.

వాక్కులు రెండు రకాలు. 1. లౌకిక వాక్కులు, 2. అలౌకిక వాక్కులు. లౌకిక వాక్కులు పరమాత్మను తెలుపుటకు అసలు పనికి రావు. ఇక అలౌకిక వాక్కులైన శాస్త్రాలు, ఉపనిషత్తులు కూడా పరమాత్మను సాక్షాత్తుగా తెలుపలేవు. సాక్షాత్తుగా తెలిపితే పరమాత్మ దృశ్య వస్తువైపోతుంది. దృశ్యం నశించిపోతుంది. నశించేది పరమాత్మ కాదు. కనుక పరమాత్మను సాక్షాత్తుగ తెలుపకుండా పరమాత్మకు వేరైన అనాత్మ పదార్థాలను నిషేధించటం ద్వారా సార్థకమౌతాయి. పరమాత్మ స్వయంప్రకాశం గనుక ఇతర సహాయం లేకుండానే తనకు తానుగా వ్యక్తమౌతాడు.

ఇలా తెలియబడే ఆ పరమాత్మను - పరంధామాన్ని చేరుకున్నవారు తిరిగి జననమరణరూప సంసారంలో ఇరుక్కొనే ప్రశ్నేలేదు, ఏ లోకానికి వెళ్ళి రావాల్సిన అవసరంలేదు. బ్రహ్మలోకం వరకు గల లోకాలన్నీ తిరిగి వచ్చేవే. ఒక్క పరమాత్మ పదమే తిరిగిరానిది; శాశ్వతమైనది. అందుకే అది పరమం - శ్రేష్టం అన్నారు. సమస్త జీవులు చేరుకోవలసిన గమ్యస్థానం అదే. ఎందుకంటే జీవుడు స్వతహాగా పరమాత్మే. జీవుడనేది ఒక భ్రమ మాత్రమే. భ్రమ తొలిగితే తాను పరమాత్మననే అనుభూతి కలుగుతుంది. శాశ్వతంగా పరమాత్మగా ఉండిపోతాడు.

జీవుడు యదార్థంగా పరమాత్మయేనా? తరవాత శ్లోకంలో -

**శ్లో||** మమై వాంశో జీవలోకే

జీవ భూతః సనాతనః |

మనః షష్ఠాణీంద్రియాణి

ప్రకృతిస్థాని కర్షతి || (7)

**తా||** సనాతనమైన నా అంశయే జీవలోకంలో జీవుడిగా మారి ప్రకృతి యందున్న మనస్సుతో కూడిన ఆరు ఇంద్రియాలను ఆకర్షిస్తున్నది.

**వ్యాఖ్య :-** పరమాత్మ అంశయే ఈ లోకంలోని జీవుడుగా ఉన్నది. జీవుడు యదార్ధంగా పరమాత్మయే.

రాజుగారికి ఒక కుమారుడు కలిగాడు. జ్యోతిష్కులు అతణ్ణి చూచి తండ్రి గండంతో పుట్టాడన్నారు. రాజువాణ్ణి అడవిలో వదిలి రమ్మని భటుణ్ణి ఆజ్ఞాపించగా భటుడు అలాగే చేశాడు. ఆ దారిన వెళ్తున్న చాకలి ఆ బాలుణ్ణి తీసుకెళ్ళి పెంచుకున్నాడు. వాడు పెద్దవాడై కులవృత్తిని బట్టి గాడిదలను కాచుకుంటున్నాడు. ఒకసారి ఒక మహాత్ముడు వీణ్ణి చూచి వీడు రాజలక్షణాలతో ఉన్నాడని గమనించి, వాడి జన్మస్థానం గురించి తెలుసుకున్నాడు. ఆ తర్వాత అతణ్ణి తండ్రి దగ్గరకు చేర్చాడు. ఇప్పుడా రాజు తన కుమారుణ్ణి పట్టాభిషిక్తున్ని చేశాడు. ఇంతవరకు వాడు గాడిదలు కాచుకున్నాడు. ఇప్పుడు రాజ్యపాలన చేస్తున్నాడు.

వాడు నిజంగా రాజకుమారుడు. కాని అజ్ఞానం వల్ల (తెలియనితనం వల్ల), చాకలి ఇంటి సాంగత్యం వల్ల చాకలి అయ్యాడు. గాడిదలు

కాచుకున్నాడు. ఐతే గాడిదలు కాచేటప్పుడు కూడా అతడు యదార్ధంగా రాకుమారుడే. అయితే అతడికి తెలియదు. అతడిప్పుడు క్రొత్తగా రాకుమారుడు కావాల్సిన పనిలేదు. అజ్ఞానం తొలగించుకుంటే చాలు. నేను రాకుమారుణ్ణి అని తెలుసుకుంటే చాలు. అలాగే జీవుడుగా వ్యవహరించేటప్పుడు కూడా అతడు పరమాత్మే. అయితే జీవుణ్ణనే భ్రమను తొలగించుకుంటే చాలు. పరమాత్మనని తెలుసుకుంటే చాలు.

అందుకే అంటున్నాడు భగవానుడు, "సనాతనమైన నా అంశయే ఈ శరీరంలో జీవుడుగా ఉన్నాడు. అతడు ప్రకృతిలోని 5 జ్ఞానేంద్రియాలను మనస్సును ఆకర్షిస్తున్నాడు అని."మీరు మట్టి నుండి రాలేదు. కోతి నుండి రాలేదు. భగవంతుడనైన నా నుండి వచ్చారు. నాకు మీకు తేడా లేదు. కాకపోతే నేనెవరో నాకు తెలుసు. మీరెవరో మీకు తెలియదు అదే అజ్ఞానం. మీరు 5 ఇంద్రియాలను, మనస్సును తగిలించుకున్నారు. అందుకే వేరుగా భావించుకుంటున్నారు.

జీవుడు పరమాత్మ అంశ అన్నంత మాత్రాన పరమాత్మలోని ఒక ముక్క కాదు. అలా అయితే అనేక ముక్కలు జీవుళ్ళుగా ఏర్పడి పరమాత్మ మిగలడు. నశించిపోతాడు. క్షేత్రం దృష్టితో జీవుణ్ణి వేరుగా చెప్పినా అది పరమాత్మ కన్న వేరుకాదు. అంతా ఒక్కటే అయిన పరమాత్మయే. చెంబు నీటిని చూపించి ఇది గంగాజలం అన్నంతమాత్రాన గంగాజలం ఈ చెంబెడు నీళ్ళే అనికాదు. పోనీ ఈ జలం గంగాజలం కన్న వేరా? కాదు. అలాగే దేహంతో ఉన్న జీవుణ్ణి చూపి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇతడు పరమాత్మ అంటే పరమాత్మ దేహమనీ కాదు. ఇతడు పరమాత్మ కన్న వేరు అని కూడా కాదు.

పరమాత్మ అంశయే అయిన జీవుడు తనను తాను మరచి, ఒక్కొక్క శరీరాన్ని ధరిస్తూ, దానిని వదిలివేస్తూ ఆ శరీరం ఉన్నంతకాలం ఇంద్రియాలతో విషయాలను అనుభవిస్తూ, ఆ తర్వాత ఆ దేహాన్ని వదలి మరొక దేహాన్ని తగిలించుకుంటున్నాడు. ఈ జీవుడు నిజంగా పరమాత్మయే. చెంబులోని మలినాలు గంగాజలానికి అంటినట్లు ఉపాధుల మలినాలు ఈ జీవుడికి అంటుతున్నాయి.

- ✓ అజ్ఞానం వల్ల రాకుమారుడు చాకలివాడయ్యాడు. చాకలితో సంగభావం వల్ల గాడిదలు కాచుకున్నాడు.
- ✓ అజ్ఞానం వల్ల పరమాత్మ జీవుడయ్యాడు. ఉపాధులతో సంగభావం వల్ల సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు; కష్టాల పాలవుతున్నాడు.

తాను రాజకుమారుడనని తెలియక గాడిదల వెంటపడినట్లు, తాను ఆనంద స్వరూప పరమాత్మనని తెలియక ఈ జీవుడు ఇంద్రియాల వెంట పడుతున్నాడు. విషయ భోగాలకై వెంపర్లాడుతున్నాడు.

కనుక ఈ లోకంలో జన్మించిన ప్రతిజీవి పరమాత్మ స్వరూపమే. మన స్వరూపాన్ని మనం మరచిపోయాం. ఈ ఉపాధులలో (దేహేంద్రియ మనోబుద్ధులలో) కూర్చున్నాం. ఎదురుగా ఉన్న విషయ ప్రపంచాన్ని చూస్తున్నాం. ఇంద్రియాలను ఆకర్షించి విషయభోగాలను అనుభవిస్తున్నాం. ఈ ఉపాధుల తాదాత్మ్యాన్ని వదలి మన స్వరూపాన్ని - యదార్థ స్వరూపాన్ని

అనుభవానికి తెచ్చుకుంటే ఆనందమే ఆనందం. అదే ముక్తి. అదే మోక్షం. అదే బ్రహ్మప్రాప్తి. అదే పురుషోత్తమ ప్రాప్తి.

ప్రతిరోజూ మన ఇంద్రియాలు గాఢనిద్రలో వాటి మూలకారణంలో కలిసిపోతాయి. నిద్రలేవగానే మళ్ళీ వాటిని ఆకర్షించి సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాడు జీవుడు. అలాగే ప్రళయకాలంలో ఇంద్రియాలు వాటి మూలకారణంలో కలిసిపోతాయి. మళ్ళీ జన్మించినప్పుడు ఆ మూలకారణం నుండి - ప్రకృతి నుండి ఆకర్షించి భోగాలను అనుభవిస్తున్నాడు జీవుడు.

ఇలా పరమాత్మ అంశ సూక్ష్మశరీరమనే ఉపాధిలో కూర్చొని మనస్సు, 5 జ్ఞానేంద్రియాలను ఆకర్షించి జీవుడై సుఖదుఃఖ అనుభవాలను పొందుతున్నాడు. ఇది చూచి పరమాత్మ "అయ్యో! మనిషి మంచివాడే కాని పాపం ఉపాధితో తాదాత్మ్యం చెంది ఈ గతి పట్టించుకున్నాడే" అని జాలి పడుతుంటాడు.

జీవుడు 6 ఇంద్రియాలను ఆకర్షిస్తున్నాడు. అలాగే ప్రాణాలను కూడా ఆకర్షిస్తున్నాడు. సైకిల్ ట్యూబుకు చిన్న రంధ్రం పడితే మొత్తం గాలి తుస్సుమని పోతున్నది. మరి శరీరమనే ఈ ట్యూబుకు ఒకటి - రెండు కాదు, 9 రంధ్రాలున్నాయి. పెద్దపెద్ద రంధ్రాలే ఉన్నాయి. మరి ప్రాణమనే గాలి పారిపోవటం లేదేమిటి? ఈ విచిత్రాన్ని గురించి ఎప్పుడైనా ఆలోచించామా?

నవద్వారాలు గల ఈ శరీరమనే పంజరం నుంచి ప్రాణమనే హంసపక్షి ఎందుకు ఎగిరిపోవటం లేదు? లోపల ఉన్న జీవుడు ఈ ప్రాణమనే హంసపక్షిని ఆకర్షించి పట్టి ఉంచినందువల్లనే.

జీవుని యొక్క నిజస్వరూపం పరమాత్మయే. ఆ చాకలిబాలుని నిజస్వరూపం రాజకుమారుడే. తన నిజస్వరూపం తెలియక గాడిదలు కాచాడు. తెలుసుకొని రాజై సింహాసనం అధిష్టించాడు. అలాగే మన నిజస్వరూపం తెలియక ఇక్కడ సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాం. రాగద్వేషాలలో ఇరుక్కుపోతున్నాం. భాద్యతలతో, బాంధవ్యాలలో ఇరుక్కుపోయాం. మన నిజస్వరూపం తెలిస్తే చాలు ఆనంద సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్టిస్తాం. అదే పరమాత్మప్రాప్తి. పురుషోత్తమప్రాప్తి.

జీవుడు ఇంద్రియాలను ఎలా ఆకర్షిస్తున్నాడు? వాటితో అతడి సంబంధం ఎలా ఉంటున్నది?

**శ్లో||** శరీరం యద వాప్నోతి
యచ్చా ప్యుత్క్రా మతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గంధా నివాశయాత్ ॥ (8)

**తా||** దేహేంద్రియాలకు ప్రభువైన ఈశ్వరుడు ఎప్పుడు శరీరాన్ని పొందుతున్నాడో, ఎప్పుడు విడిచిపెడుతున్నాడో అప్పుడు వాయువు

పూలలోని వాసనలను తీసుకొని పోయినట్లు ఈ ఆరు ఇంద్రియాలను గ్రహించి ప్రయాణిస్తున్నాడు.

**వ్యాఖ్య:-** భగవంతుని అంశయే జీవుడని, ఈ జీవుడు ఇంద్రియాలు, మనస్సు అనే ఆరింటిని ప్రకృతి నుండి సంపాదించుకొని అనుభవాలు పొందుతాడని ఇంతవరకు చెప్పుకున్నాం. అయితే అనుభవాలు పొందాలంటే ఈ ఆరు ఇంద్రియాలు ఉంటే చాలదు. ఇవి భోగసాధనాలు మాత్రమే. ఇవి నిలవటానికి, బాహ్యప్రపంచాన్ని చూడటానికి ఒక ఇల్లుకావాలి. అదే స్థూలశరీరం - భోగాయతనం.

అయితే స్థూలశరీరం ఎంతోకాలం నిలవదు. అది వికారాలతో - మార్పులతో కూడినది. వృద్ధి చెందుతూ, ఉంటూ, కృశించిపోతూ, చివరకు నశించిపోతుంది. అందువల్ల జీవుడు అనుభవాలు పొందటానికి మరొక క్రొత్త శరీరాన్ని ధరించాలి. దాని అవసరం తీరగానే దాన్ని వదిలేసి మళ్ళీ ఒక క్రొత్త శరీరాన్ని ధరిస్తాడు. ఇలా ఒక శరీరం నుండి మరొక శరీరానికి మారేటప్పుడు ఈ జీవుడు తనతో పాటు ఏమి తీసుకవెళతాడు? ఈ ఆరింటినే. మనం ఇల్లు మారినప్పుడల్లా పాత ఇంటిలోని మన వస్తువులను మూటగట్టుకొని క్రొత్త ఇంటిలోనికి చేర్చి సర్దుకున్నట్లుగా జీవుడు ఈ భోగసాధనాలైన 5 ఇంద్రియాలు, మనస్సు అనే ఆరింటిని తనతో పాటుగ క్రొత్త శరీరంలోకి తెచ్చి సర్దుకుంటాడు.

ఈ శ్లోకంలో వాడిన పదాల ద్వారా కొన్ని ముఖ్య విశేషాలను, సూచనలను భగవానుడు మనకు అందిస్తున్నాడు. ఏమిటవి?

1. ఈశ్వరః :- ఈ శ్లోకంలో జీవుణ్ణి ఈశ్వరుడు (ప్రభువు) అన్నారు. అంటే జీవుడు ఈ ఇంద్రియాలకు ప్రభువే కాని బానిసకాదు - అని. కాని ఈ అజ్ఞాన మానవుడు ఇంద్రియాలకు బానిసగా బ్రతుకు వెళ్ళదీస్తున్నాడు. కనుక ఈ విషయాన్ని గ్రహించి మనం ఇంద్రియాలకు దాసులం కాకుండా బాసులం కావాలి. ప్రభువులాగా ఇంద్రియాలను శాసించ గలగాలి. వాటికి అధీనులం కాకుండా అధీశులం కావాలి.

2. అవాప్నోతి, ఉత్క్రామతి :- ఈ శరీరాన్ని పొందేటప్పుడు, విడిచేటప్పుడు అని చెప్పటం ద్వారా జీవుడు శరీరం కన్న వేరుగా ఉన్నాడని; మనం ఒక వస్త్రాన్ని ధరించి, వదిలిపెట్టినట్లు జీవుడు శరీరాన్ని ధరించి విడిచిపెడుతున్నాడని గ్రహించాలి. అంటే నేను శరీరాన్ని కాదు; నేను ఈశ్వరుడను, ప్రభువును, ఆత్మను, సాక్షిని అనే ఎరుకలో ఉండాలి.

3. ఏతాని గృహీత్వా సంయాతి:- జీవుడు ఈ 6 ఇంద్రియాలను గ్రహించి ప్రయాణిస్తాడు అనటంవల్ల ఎప్పుడైతే ఈ శరీరం తన అనుభవాలకు పనికిరాదని భావిస్తాడో అప్పుడు జీవుడు క్రొత్త శరీరంలోకి ప్రవేశిస్తాడు. అప్పుడు 5 ఇంద్రియాలు, మనస్సు అనే ఆరింటిని వెంటబెట్టుకునే ప్రయాణిస్తాడు. అంటే జీవుని వెంట వచ్చేది ఇంద్రియాలు, మనస్సే.దేహంలో ఉన్నప్పుడు గాని బయటకు వెళ్ళేటప్పుడు గాని జీవుడితో కలిసిఉండేది ఈ ఆరే.

అంటే జీవితకాలంలో నీవు ఎంత ధనాన్ని సంపాదించినా; ఎన్ని భోగ్యవస్తువులు సంపాదించినా; ఎన్ని ఇళ్ళు వాకిళ్ళు స్థలాలు, పొలాలు, తోటలు, దొడ్లు, భూములు సంపాదించినా; ఎందరు భార్యాబిడ్డలను,

బంధుమిత్రులను సంపాదించినా; ఈ శరీరాన్ని ఎంత బాగా పోషించినా నీతోపాటుగా ఇవన్నీ ఏవీ రావుగాక రావు. నీవు శరీరాన్ని విడిచిపెట్టటంతోనే వీటితో గల సంభంధం తెగిపోతుంది. ఎందరు ఆత్మీయులున్నా కొందరు ఇంటిబయట వరకు, కొందరు కాటివరకు మాత్రమే వస్తారు. ఈ శరీరం కట్టెల మీద వరకు వస్తుంది. ఆ తరువాత నీ ప్రయాణం అంతా ఒంటరి ప్రయాణమే. ఆ ప్రయాణంలో నీతోపాటుగా దారిబత్తెంగా వచ్చేది ఈ ఆరు ఇంద్రియాలే. కనుక నీతోపాటుగా వచ్చే వీటిని శుద్ధంగా ఉంచుకోవాలి. జీవితమంతా అందుకోసం కృషి చెయ్యాలి. కనుక నీ మనస్సును, ఇంద్రియాలను కలుషితం కాకుండా పవిత్రం చేసుకోవాలి. ఎల్లప్పుడూ వాటిని పరమాత్మ భావంతో నింపాలి. అలాకాక కలుషితం చేశావా? క్షుద్రజన్మ తప్పదు. కనుక నీతో పాటుగా, నీకు రక్షకులుగా, body guards లాగా వచ్చేవారి గురించే నీవు యోచించాలి. విడిచిపెట్టి వెళ్ళేవారి గురించి ఆలోచించి ప్రయోజనం లేదు. ఆ ప్రయత్నం ఇప్పుడే చెయ్యి.

4. వాయుః ఆశయాత్ గంధాని ఇవ :- వాయువు పుష్పాల నుండి సుగంధాన్ని తీసుకెళ్ళినట్లుగ జీవుడు ఒక శరీరం నుండి మరో శరీరానికి ఈ ఆరు ఇంద్రియాలను తీసుకెళతాడు. ఈ ఉపమానంలోని విశేషం ఏమిటి? వాయువు పూలనుండి సుగంధాన్నీ, కుళ్ళిన పదార్థాల నుండి దుర్గంధాన్నీ ఏ పక్షపాత బుద్ధి లేకుండా తీసుకెళుతుంది. అలాగే జీవుడు శరీరం నుండి ఎలాంటి మనస్సునైనా, ఇంద్రియాలనైనా ఏ పక్షపాత బుద్ధీ లేకుండానే తీసుకెళుతాడు. వాయువు గంధాన్ని గ్రహించి పుష్పాన్ని వదిలేస్తుంది. జీవుడు

ఈ 6 ఇంద్రియాలను గ్రహించి స్థూల శరీరాన్ని వదిలేస్తాడు.పుష్పానికేమీ కాకుండా వాయువు గంధాన్ని తీసుకున్నట్లు స్థూల శరీరానికేమీ కాకుండా జీవుడు ఈ ఆరింటిని తీసుకెళతాడు.

దీనిని బట్టి ఎవరికైనా ఉత్తమజన్మ కలిగిందీ అంటే - అతడు అంతకు ముందు జన్మలో ఇంద్రియాలను, మనస్సును నిష్కల్మషం - శుద్ధం చేసుకున్నవాడు అని అర్థం. పరమాత్మ చింతనలో పవిత్రం చేసుకున్నాడు అని అర్థం. పరమాత్మ చింతనలో పవిత్రం చేసుకున్నాడు అని తెలుస్తుంది. అలాగాక సామాన్య జన్మ - నీచజన్మ లభించిందీ అంటే అతడు మనస్సును ప్రాపంచిక విషయాలతో, స్వార్థంతో అపవిత్రం చేసుకున్నాడు - అని అర్థం.

కనుక మనం ఇప్పుడు ఎంత సంపాదించాం? ఎన్ని భోగాలననుభవించాం? ఎంత గొప్ప పదవులు చేపట్టాం? ఎంతటి అధికారాన్ని వెలగబెట్టాం? అనేవి ముఖ్యం కాదు. మనస్సును ఎంత పవిత్రం చేసుకున్నాం? అనేదే ప్రధానం. దీనిని బట్టే రాబోయే జన్మ ఉంటుంది.

పరమాత్మ అంశ అయిన జీవుడు 6 ఇంద్రియాలను పాత శరీరం నుండి గ్రహించి క్రొత్త శరీరంలో అమర్చుకుంటాడు, అనుభవాలు పొందుతాడు అని చెప్పుకున్నాం. అయితే ఆ ఇంద్రియాలేమిటి? వాటిని ఎలా అమర్చుకొని అనుభవాలు పొందుతాడు?

**శ్లో||** శ్రోతం చక్షుః స్పర్శనం చ

రసనం ఘ్రాణ మేవచ |

అధిష్టాయ మనశ్చాయం

విషయా నుపసేవతే || (9)

**తా||** చెవి, కన్ను, చర్మం, నాలుక, ముక్కు, మరియు మనస్సు - వీటిని అధిష్టించి ఈ జీవుడు శబ్దాది విషయాలను భోగిస్తూ ఉంటాడు.

**వ్యాఖ్య :-** జీవుడు ఒక శరీరం నుండి మరొక శరీరంలోకి వచ్చేటప్పుడు మనస్సుతో కలిపి ఆరు ఇంద్రియాలను తెచ్చుకుంటాడు అని చెప్పుకున్నాం. అలా వచ్చిన జీవుడు ఈ క్రొత్త శరీరంలో అంతఃకరణమనే గద్దెపై కూర్చుంటాడు. తాను ఆనందస్వరూపుడనని మరచిపోయి అల్పుడై పోతాడు. దానితో ఆనందాన్ని వస్తువుల ద్వారా విషయాల ద్వారా పొందాలనుకుంటాడు, అంతే. రూపాలను, దృశ్యాలను చూడాలనే కుతూహలంతో కంటిని జత చేసుకుంటాడు. వాసన చూడాలనే ఉబలాటంతో ముక్కును జత చేసుకుంటాడు. శబ్దాలను వినాలనే ఆరాటంతో చెవిని ఉపయోగించుకుంటాడు. అన్నింటిని తాకి స్పర్శ సుఖం అనుభవించాలని చర్మంతో సంబంధం పెట్టుకుంటాడు. రుచికరమైన పదార్థాలను తినాలని నాలుకతో సంబంధం పెట్టుకుంటాడు. ఈ అన్నింటి ద్వారా వచ్చే అనుభవాలను పొందటానికి, ఆనందించటానికి మనస్సుతో జంఝాటం పెట్టుకుంటాడు.

మనస్సనే ప్రియురాలితో ఆడుకుంటూ, శబ్ద స్పర్శ రూప రస గంధ అనే స్వీట్సు తింటూ విధి విరామం లేకుండా (1) భోగాల కోసం జీవిస్తాడు, జీవించటం కోసం భోగాలనుభవిస్తూ ఉంటాడు. (2) తినటం కోసం బ్రతుకుతూ, బ్రతకటం కోసం తింటూ ఉంటాడు. (3) చావటం కోసం పుడుతూ, పుట్టటం కోసం చస్తున్నాడు. (4) తనను తాను మరచిపోయి ఎందుకు బ్రతుకుతున్నాడో తెలియకుండానే బ్రతుకుతున్నాడు.

ఇక్కడ తెలుసుకోవాల్సిన విషయం ఒకటి ఉన్నది.

జీవుడు మనస్సును, ఇంద్రియాలను ఆశ్రయించి విషయాలననుభవిస్తున్నాడు - అంటే జీవుడు మనస్సు కన్న ఇంద్రియాల కన్న వేరైనవాడు అని స్పష్టమవుతున్నది. అయితే ఈ వేరైన జీవుడు ఎవరు? అతడి యదార్థ స్వరూపం ఏమిటి? అతడి స్వభావం ఏమిటి? అని విచారణ చేయాలి. శాస్త్రాల ద్వారా తెలుసుకోవాలి. అతడు పరమాత్మయే. పరమాత్మ అంశయే జీవుడు. అన్యం కాదు. ఐతే ఇంద్రియాలు, మనస్సు ఉపాధులు. ఆ ఉపాధులను ఆశ్రయించి అవి తాను ఒక్కటే; అవే తాను అన్నట్లు తాదాత్మ్యం చెంది సుఖదుఃఖాలననుభవిస్తున్నాడు.

వెనుకటి శ్లోకంలో జీవుణ్ణి 'ఈశ్వరః' అని ప్రభోదించారు. ఈ శ్లోకంలో 'అయం' శబ్దంతో ప్రబోధిస్తున్నారు. రెండూ ఆత్మనుద్దేశించినవే. రెండూ కలిపితే అయం ఈశ్వరః అనే వాక్యం 'అయమాత్మా బ్రహ్మ' అనే మహావాక్య అర్థాన్ని సూచిస్తున్నది.

దీనిని బట్టి మన అసలు స్వరూపం - యదార్థ స్వరూపం పరమాత్మ స్వరూపమేనని, వాసనల క్షేత్రంలో ప్రతిబింబించటంతో ఆ వాసనల మలినం వల్ల - అజ్ఞానం వల్ల జీవుడిగా భావించుకొని ఆనందం కోసం, అనుభవాల కోసం ఆరు ఇంద్రియాలను వెంటబెట్టుకొని ఒకదాని తరువాత ఒకటిగా స్థూలదేహాలలో ప్రవేశిస్తున్నామని అర్థమవుతున్నది. అయితే ఈ విషయాన్ని మనం తెలుసుకోలేకపోతున్నాం.

ఎవరు మన అసలు స్వరూపం పరమాత్మ స్వరూపమని తెలుసుకోలేకపోతున్నారు? ఎవరు తెలుసుకోగలుగుతున్నారు?

**శ్లో||** ఉత్క్రామంతం స్థితం వాపి
భుంజానం వా గుణాన్వితం |
విమూఢా నాను పశ్యంతి
పశ్యంతి జ్ఞాన చక్షుషః || (10)

**తా||** దేహం నుంచి వెళ్ళేటప్పుడు గాని, దేహంలో ఉన్నప్పుడు గాని, భోగాలనుభవించేటప్పుడు గాని, గుణాలతో కూడి ఉన్నప్పుడు గాని విమూఢులైనవారు పరమాత్మను తెలుసుకోలేరు. జ్ఞాననేత్రం గలవారు చూడగలరు.

**వ్యాఖ్య:-** పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మం, సర్వ వ్యాపకం, ఇంద్రియ అగోచరం. కనుక కంటితో చూడలేం, వాక్కుతో వర్ణించలేం, మనస్సుతో చింతించలేం, బుద్ధితో గ్రహించలేం. అంటే పరమాత్మను ప్రత్యక్షంగా తెలుసుకొనే వీలులేదు.

కాని జ్ఞాననేత్రంతో తెలుసుకోవచ్చు. జ్ఞాననేత్రం అంటే మన రెండు నేత్రాలు (చర్మ చక్షువులు) కాక మరొక నేత్రం అని కాదు. ఆత్మజ్ఞానంతో కూడిన శుద్ధ బుద్ధియే జ్ఞాననేత్రం. సామాన్యులకు అర్థం కావటానికే దానిని 3వ నేత్రం అన్నారు. పరమశివునికి 3వ నేత్రం ఉన్నది. రెండు నేత్రాలు ఈ ప్రపంచాన్ని చూస్తాయి. ఆయన ఎప్పుడూ ఈ రెండు నేత్రాలను మూసుకొని ధ్యాన ముద్రలో ఉంటాడు. అంటే ప్రపంచంతో ఆయనకు సంబంధం లేదు. ప్రపంచం మీద ఆసక్తి లేదు. ఇక 3వ నేత్రాన్ని ఒక్కసారి తెరిచాడు. మన్మధుడు తపోభంగం కలిగిస్తే అతడిపై కోపంతో 3వ నేత్రం తెరవగానే మన్మధుడు భస్మమైపోయాడు. ఇది పైకి కనిపించే కథ. ఇందులోని వేదాంత రహస్యం ఏమంటే 3వ కన్ను (జ్ఞాననేత్రం) తెరుచుకుంటే ప్రపంచ భావన భస్మమైపోతుంది - అదృశ్యమైపోతుంది - అని అర్థం. ప్రపంచభావన పోతే ఇక పరమాత్మ సాక్షాత్కారమే. దీనిని బట్టి ప్రాపంచిక వ్యవహారాలన్నీ చర్మచక్షువులతో చూడబడతాయి. పరమాత్మ దర్శనం మాత్రం జ్ఞాన చక్షువు వల్లనే - అని. జ్ఞానచక్షువును సంపాదించలేని సామాన్యులను 'విమూఢాః' గొప్ప మూఢులు అంటున్నారు. వారు ఎన్నటికీ పరమాత్మను దర్శించలేరు అని ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

కనుక భగవంతుని దర్శించాలంటే ఒక సద్గురువు ద్వారా శాస్త్ర శ్రవణం చేసి, మనన నిధి ధ్యాసనలు చేసి, జ్ఞాన సాధనలు - విచారణ చేసి తానెవరో తెలుసుకొని, తానుతానుగా ఉండాలి. అదే జ్ఞాననేత్రాన్ని సంపాదించటం అంటే. అలాగాక ప్రాపంచిక విషయాలలో, వ్యామోహాలలో మునిగిపోయి,

తినటం - త్రాగటం - నిద్రించటం - సుఖదుఃఖాలు అనుభవించటం - వీటిలోనే మునిగినవాడు జ్ఞానాన్ని పొందలేడు, సాధనలు చేయలేడు, పరమాత్మను తెలుసుకోలేడు. వారే విమూఢులు. గొప్ప మూఢులు.

చిన్నపిల్లలు మేఘాలు కదులుతుంటే చంద్రుడు కదులుతున్నాడని అనుకుంటారు. కాని చదువుకున్న వారికి, పెద్దలకు తెలుసు కదులుతున్నది మేఘాలే గాని చంద్రుడు కాదు - అని. అలాగే బహిర్ముఖులైన మానవులు పరమాత్మను తెలుసుకోలేరు. అంతర్ముఖులైన ఆత్మజ్ఞాన సంపన్నులే తెలుసుకోగలరు.

అలాగే ఈ దేహమునందతటా నఖ శిఖ పర్యంతం వ్యాపించియున్న పరమాత్మ చైతన్యం వల్ల ఈ దేహేంద్రియ మనోబుద్ధులు పనిచేస్తున్నాయి. అయితే 'ఇలా పనిచేస్తున్నది జీవుడు' అనుకోవటం భ్రమ. ఈ జీవుడి యొక్క అసలు స్వరూపం పరమాత్మ అని గ్రహించినవాడు జ్ఞాని. గ్రహించలేని వాడు అజ్ఞాని, మూఢుడు.

కనుక ఆత్మ జీవుడిగా ఈ దేహంలోనే ఉన్నా, భోగాలను అనుభవిస్తున్నా, త్రిగుణాలతో కూడియున్నా, ఒకప్పుడు ఈ దేహాన్ని వదిలిపోయినా దానిని బాహ్యదృష్టితో గాక జ్ఞానదృష్టితో చూడగలగాలి. అతడే జ్ఞాని.

ఒక తండ్రీ, కుమారుడు - ఇద్దరూ ప్రయాణమై పోతున్నారు. రాత్రి కావటంతో మార్గ మధ్యంలో ఒక చెట్టు నీడన విశ్రమించారు. తెల్లవారుతుండగా ముందుగా తండ్రి నిద్రలేచి "అబ్బాయీ! సూర్యుడు పొడుస్తున్నాడు, ఇక నిద్ర లే" అన్నాడు. ఆ చెట్టు మీద ఒక గుడ్లగూబ

తన పిల్లలతో ఉంటున్నది. ఆ పిల్ల అంటున్నది, "అమ్మా! సూర్యుడంట పొడుస్తున్నాడంట, ఎవరమ్మా ఆ సూర్యుడు? అన్నది. దానికి తల్లి "పో! పో! సూర్యుడూ లేడు, పొడవటమూ లేదు. మనకు తెలియని సూర్యుడు ఎక్కడ ఉన్నాడు? వారికేదో పిచ్చిపట్టి అలా మాట్లాడుతున్నారు" అన్నది ఎప్పుడూ సూర్యుని చూడని ఆ గుడ్లగూబ. పగలంతా కళ్ళు మూసుకొని ఉండే గుడ్లగూబలకు సూర్యుడు ఎలా తెలుస్తాడు?

పరమాత్మ సాక్షాత్కారం కోసం జ్ఞాన సంపాదనకు ప్రయత్నించే వారికి ఇలాంటి అనుభవాలే తటస్థపడతాయి. జన్మరాహిత్యం కోసం - మోక్షం కోసం ప్రయత్నించే సాధకులు శ్రవణం చేస్తున్నా - సాధనలు చేస్తున్నా "ఆ! జన్మలు లేవు గిన్మలు లేవు. మోక్షం లేదు గీక్షం లేదు. పరమాత్మంట వీళ్ళకు కనబడతాడంట అనే గుడ్లగూబల పలుకులు వినిపిస్తూనే ఉంటాయి. అయినా పట్టించుకోకుండా సాధనలు సాగించి జ్ఞాన చక్షువును పొందాలి.

అయితే ప్రయత్నం చేసిన అందరూ జ్ఞానచక్షువును పొందగలరా? -

**శ్లో||** యతంతో యోగిన శ్చైనం
పశ్యంత్యా త్మన్యవస్థితం |
యతంతోఽప్య కృతాత్మానః
నైనం పశ్యంత్య చేతసః || (11)

**తా||** సాధన చేసే యోగులు తమలో ఉన్న భగవంతుని చూడగలరు. చిత్తశుద్ధి లేని అవివేకులు సాధన చేసినప్పటికీ భగవంతుని చూడలేరు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** యోగులంటే ఎవరు? ఎవరైతే ఇంద్రియాలను విషయాల నుండి మరలించి, మనస్సులో లీనం చేసి, ఆ మనస్సును ఆత్మలో ఐక్యం చేయటానికి ప్రయత్నిస్తారో వారే యోగులు. అంటే వీరు మనస్సును నిర్మలం చేసి, స్వాధీనంలో ఉంచుకోగలవారు. మనస్సును శుద్ధం చేసుకున్నవారు. అట్టి యోగులు సాధన చేసి - అంటే శ్రవణ మనన నిధి ధ్యాసనలతో ఆత్మ విచారణ చేసి తమ యందే గల పరమాత్మను దర్శించగలరు. అయితే ఇలా ప్రయత్నించే వారిలో - సాధన చేసే వారిలో కొందరు మాత్రం పరమాత్మను దర్శించలేరు. ఎందుకంటే చిత్తశుద్ధి లేకపోవటం వల్ల. అంటే మనస్సును విషయ వాసనలతో - కోరికలతో నింపి - అంటే ధన సంపదల గురించి, భోగాల గురించి, వస్తువులు విషయాల గురించి, భార్యాబిడ్డలు బంధుమిత్రాదుల గురించి రాగద్వేషాలతో ఉండి, మనస్సును కలుషితం చేసుకున్నందువల్ల ఎంతగా శాస్త్రాన్ని శ్రవణం చేసినా, ఎన్ని సాధనలు చేసినా ప్రయోజనం శూన్యం. అంటే పరమాత్మను తెలుసుకోవాలంటే చిత్తశుద్ధి, తీవ్ర ప్రయత్నం - రెండూ ఉండాలి.

- భూమిని బాగా దున్ని విత్తనాలు నాటి వ్యవసాయం చేస్తే మంచి పంట.
- భూమిని దున్నకుండా విత్తనాలు నాటి వ్యవసాయం చేసినా అంతా వ్యర్థమే.

అలాగే మనస్సు అనే భూమిని బాగా శుద్ధి చేసి సాధన అనే వ్యవసాయం చేస్తేనే భగవత్సాక్షాత్కారం అనే పంట పండుతుంది. చిత్తశుద్ధి

లేని సాధన బూడిదలో పోసిన పన్నీరే. అందుకే "చిత్తశుద్ధి లేని శివపూజలేలయా విశ్వదాభిరామ వినురవేమ!" అని వేమన అన్నారు.

'యతంతః' అన్నారు గనుక పరమార్ధ సాధనలో ప్రయత్నం చాలా ముఖ్యమైనదే. అయినప్పటికీ చిత్తశుద్ధి కూడా అవసరమే. ఈ చిత్తశుద్ధి లేనివారినే అచేతసః - అవివేకి అన్నారు. అయితే ఇక్కడ అవివేకులు అంటే నాస్తికులు కాదు. భగవంతుని కొరకు ప్రయత్నం చేయని లౌకికాసక్తి గలవారు కాదు. దైవాన్ని పొందాలని ప్రయత్నించే వారే. కాకపోతే చిత్తశుద్ధి లేదు.

గురువు లేకుండా నేర్చుకున్న విద్య ఫలితాన్నివ్వనప్పుడు అట్టివారు గురువును ఆశ్రయించాలి. పెద్దల, మహాత్ముల సాంగత్యం చేయాలి. పెద్దల పట్ల పూజ్యభావంతో ఉండాలి. చిత్తశుద్ధితో, విశ్వాసంతో, మనస్ఫూర్తిగా గురువును సేవించి సాధన సాగించాలి. అప్పుడే భగవత్ప్రాప్తి.

ఈ ప్రకారంగా మనం భగవంతుని అంశయేనని, ఆ భగవంతుని అంశయే ఈ వాసనా క్షేత్రంలో ప్రతిఫలించి, భోగాలననుభవించాలనే కోరికతో ప్రకృతిలోని మనస్సుతో కలిపి ఆరు ఇంద్రియాలను ఆకర్షించి ఒక శరీరం నుండి మరొక శరీరానికి ప్రయాణం చేస్తున్నదని, ఇలా ప్రయాణిస్తూ ఆయా దేహాలలో ఉండి మనస్సుతో భోగాలననుభవిస్తూ, ఇంద్రియాలను వాడుకుంటూ మన స్వరూపాన్ని మరచి పోయామని, తిరిగి జ్ఞాననేత్రంతోనే మనను మనం తెలుసుకోగలమని, అయితే దానికి తీవ్ర ప్రయత్నము (సాధన), చిత్తశుద్ధి కావాలని, తద్వారా ఆత్మసాక్షాత్కారాన్ని పొందగలమని ఈ 5 శ్లోకాల ద్వారా భగవానుడు తెలియజేశాడు.

ఇక పరమాత్మ దర్శనానికి ఆయన మహిమను, ఆయన ఎక్కడ ఎలా వ్యక్తమవుతున్నదీ రాబోయే 4 శ్లోకాల్లో; తెలియజేయబోతున్నారు. దీనివల్ల సర్వత్రా భగవంతుని దర్శించి ఆయనతో అనుసంధానం కావటం తెలుస్తుంది.

**శ్లో||** యదాదిత్య గతం తేజః
జగద్భాసయతేఽఖిలం |
యచ్చంద్ర మసి యచ్చాగ్నౌ
తత్తేజో విద్ధి మామకం|| (12)

**తా||** ఈ జగత్తు నంతటినీ వెలిగించే సూర్యుని తేజస్సు ఏది గలదో, చంద్రునిలోను, అగ్నిలోను ఏ తేజస్సు గలదో ఆ తేజస్సు నాది అని తెలుసుకో.

**వ్యాఖ్య:-** ప్రపంచాన్ని, ప్రపంచంలోని వస్తువులను, వ్యక్తులను వెలిగించి చూపే శక్తి సూర్య, చంద్ర, అగ్నులది. అయితే వాటికి ఆ శక్తి ఎలా వచ్చింది? ఎక్కడి నుండి వచ్చింది? అదంతా పరమాత్మ నుండి వచ్చిన తేజస్సే అంటున్నారు.

ఈ విషయం ఇప్పటి సైన్స్ విద్యార్థులకు తికమకగా ఉంటుంది. ఈ భూమి ఎక్కడి నుండి వచ్చింది? అని అడిగితే సూర్యునిలో ఒక ముక్క విడిపోయి, క్రమంగా చల్లబడి, పరస్పర ఆకర్షణ శక్తితో నిలిచి ఉంది - అంటారు. మరి సూర్యుడు ఎక్కడి నుండి వచ్చాడు? అని అడిగితే, ఆ వేడి ఎలా వచ్చింది? అని అడిగితే టీచరుకు కోపం వస్తుంది. ఎందుకంటే సమాధానం తెలియదు గనుక.

దానికి వేదాంతం సమాధానం ఇస్తున్నది. ప్రపంచాన్నంతటిని వెలిగిస్తున్న సూర్యుని తేజస్సు అంతా పరమాత్మ నుండి వచ్చినదే - అని. కోటి సూర్య సమప్రభా తేజుడైన సర్వవ్యాపక - స్వయంప్రకాశ పరమాత్మ వల్లనే సూర్యుడు అలా వెలిగి పోతున్నాడు. పరమాత్మ తేజస్సు ఒక్కటే అయినా ఉపాధి భేదాల కారణంగా సూర్యునిలో ఎండలాగా, చంద్రునిలో చల్లదనంగా, అగ్నిలో వేడిగా వ్యక్తమవుతున్నది. జగత్తును సృష్టించటానికి పరమాత్మ ఇలా విభిన్న రూపాలలో చైతన్యాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

ఇది తెలుసుకున్న తర్వాత ఇప్పుడు సూర్యుణ్ణి చూచినా, చంద్రుణ్ణి చూచినా, అగ్నిని చూచినా అంతా పరమాత్మయే అనే భావన కలుగుతుంది. అలా కలగాలి. భగవంతునికి ఇవి ప్రతీకలుగా కనిపిస్తాయి. వేదకాలంలో ఈ ప్రకృతి శక్తులనే దేవతలుగా పూజించేవారు. సూర్యుడు,చంద్రుడు, అగ్ని, వాయువు, జలం, భూమి - వీటినే దేవతలుగా పరిగణించి పూజించేవారు. ఈ విధమైన అభ్యాసం కుదిరితే - అన్నింటిలోని శక్తి పరమాత్మదే అని చూడటం చేతనైతే క్రమంగా మనకు ఉపాధి దృష్టి తొలగి వస్తుదృష్టి సిద్ధిస్తుంది. దేవాలయాల్లోని విగ్రహాన్ని అందమైన చలువరాతి బొమ్మగా చూస్తూ చూస్తూ చివరకు ఆ విగ్రహస్థానంలో సర్వాంతర్యామియైన పరమాత్మయే కనిపించాలి. అలాగే ఈ సూర్యచంద్ర అగ్నులు కూడా భగవంతుని వ్యక్త స్వరూపాలుగా భావన కలగాలి. అందుకే వైదిక ధర్మాన్ని అనుసరించి ఈ ముగ్గురు దేవతలను ప్రత్యక్ష సాక్ష్యంగా పెట్టుకొని యజ్ఞయాగాది క్రతువులు చేస్తూ ఉంటారు.

6వ శ్లోకంలో సూర్యచంద్ర అగ్నులు తనను ప్రకాశింపజేయలేవని చెప్పిన భగవానుడు ఇప్పుడు వాటిలోని తేజస్సు తనదేనని తెలియజేస్తున్నాడు. అంటే వారితో తనకేం పనిలేదు. తనతోనే వారికి పని - అని.

సూర్యుడు,చంద్రుడు,అగ్ని పెద్ద బల్బులు. పరమాత్మయే కరెంటు. కరెంటు ఉంటేనే అవి వెలుగుతాయి, వస్తువులను వెలిగించి చూపిస్తాయి. బ్రహ్మాండంలో సూర్యచంద్రఅగ్నులు ఎలాగో పిండాండంలో కన్ను, మనస్సు, వాక్కు అలాగే. కంటిలోని చూచేశక్తి, మనస్సులోని సంకల్పశక్తి, వాక్కులోని మాట్లాడేశక్తి నిజంగా వాటిది కాదు. వాటిలోని ఆత్మశక్తియే. అలాగే సూర్యచంద్ర అగ్నులలోని ఎండ, చల్లదనం, వేడి అంతా ఆ పరమాత్మ శక్తియే - పరమాత్మ ఎక్కడెక్కడ ఏమేమి చేస్తున్నాడు?

**శ్లో||** గామా విశ్య చ భూతాని
ధారయామ్యహ మోజసా |
పుష్ణామి చౌషధీ స్సర్వాః
సోమో భూత్వా రసాత్మకః || (13)

**తా||** భూమిలోకి ప్రవేశించి ప్రాణులందరినీ నేను నా శక్తితో భరిస్తాను. ఇంకా రసాత్మకుడైన చంద్రుణ్ణి అయి సస్యాలన్నింటిని వృద్ధి పొందిస్తుంటాను.

**వ్యాఖ్య:-** ప్రాణులు నిలవటానికి భూమి ఆధారంగా ఉన్నది. మరి ఈ భూమి ఇలా ప్రాణులందరిని ధరించి నిలిచి ఉన్నదీ అంటే ఏ ఆధారంగా ఉన్నది? అదే

ఆకర్షణ శక్తి. ఈ ఆకర్షణశక్తి ఎక్కడి నుండి వచ్చింది? పరమాత్మ నుండే. ఈ ఆకర్షణశక్తి వల్లనే భూమి సమస్త ప్రాణులకు - అంటే అండజ, పిండజ, స్వేదజ, ఉద్భిజాలనే నాలుగు రకాల ప్రాణులకు ఆధారంగా ఉన్నది. అండజాలంటే గ్రుడ్డు నుండి వచ్చేవి. ఉదా: పక్షులు. పిండజాలంటే పిండం నుండి వృద్ధి చెంది తల్లి గర్భం నుండి వచ్చేవి. ఉదా: జంతువులు, మానవులు. స్వేదజాలంటే స్వేదం నుండి పుట్టేవి. క్రిమికీటకాలు, సూక్ష్మజీవులు. ఉద్భిజాలంటే విత్తనం ద్వారా వృద్ధి చెందే చెట్లు చేమలు. ఇవన్నీ భూమి పుట్టినప్పటి నుండి భూమి మీద నిలిచి ఉన్నాయి, బ్రతుకుతున్నాయి, పుడుతున్నాయి, చస్తున్నాయి. ఈ ప్రాణులన్నింటికి భూమి ఆధారంగా ఉండటమే కాదు, ఈ ప్రాణికోట్లకు కావలసిన శక్తి సామర్థ్యాలన్నీ కూడా భూమి నుండే వస్తున్నాయి. ఈ జీవరాసులన్నింటికి ఆహారం కూడా ఈ భూమి నుండే వస్తున్నది. ఎన్నో కోట్ల సంవత్సరాల నుండి ఈ సమస్త ప్రాణులు భూమి మీద ఆధారపడి జీవిస్తున్నాయి. ఏనాడు "నేనిక మీకు ఆహారం ఇవ్వలేను" అని భూమి చేతులెత్తేయటం లేదు. ఎలా వచ్చింది ఈ శక్తి భూమికి? ఇదంతా భగవంతుని శక్తియే.

ప్రాణులన్నింటికి ఆకలి అనే జబ్బు ఉన్నది. ఈ జబ్బుకు మందు ఏమిటి? ఆహారమే. ఈ ఆహారం ఎక్కడి నుండి వస్తున్నది? భూమి నుండే వస్తున్నది. సస్యాల రూపంలో, ఓషధుల రూపంలో. ఓషధులంటే ఏమిటి? ఒక పంటతో నశించే వాటిని ఓషధులంటారు. అయితే ఈ సస్యాలు, ఓషధులు, పండ్లు, కాయలు, ఆకులు - ఇవన్నీ ఎలా వృద్ధి చెందుతున్నాయి? సూర్యకిరణాల



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి తేజస్సు, విటమినులు లభిస్తున్నాయి. చంద్రుని కాంతి నుండి పోషకశక్తి లభిస్తున్నది. నిజంగా ఈ సూర్యచంద్రులలోని శక్తి పరమాత్మ నుండి వస్తున్నదేనని ఇంతకు ముందు శ్లోకంలోనే తెలియజేయటం జరిగింది. అందుకే అంటున్నాడు, "రసాత్మకుడైన చంద్రుణ్ణి అయి ఓషధులకు పుష్టినిస్తున్నాను" అని. అంటే బ్రతకటానికి సూర్యకిరణాలు, పోషణకు చంద్రకిరణాలు ఉపయోగపడుతున్నాయి.

సైన్సు వృద్ధి చెందని రోజుల్లో ఈ చంద్రుని శక్తి స్పష్టంగా తెలిసేదికాదు. సస్యాల వృద్ధికి చంద్రుని వెన్నెల ఎంత అవసరమో ఇప్పుడు శాస్త్రీయంగా ఋజువైంది.

(i) పౌర్ణమి రోజున నాటిన టొమాటో మొక్క నుండి వచ్చిన టొమాటోలను పౌర్ణమినాడు కోస్తే అవి అధిక సారవంతమైనవని తెలుస్తున్నది.

(ii) విత్తటానికి సేకరించిన వడ్లను (ధాన్యాన్ని) వెన్నెలలో ఆరబెట్టినట్లైతే ఎక్కుసారవంతమవుతాయని ఋజువైంది.

(iii) ఆయుర్వేద ఔషధాలు కొంతకాలం చంద్రుని వెన్నెలలో ఉంచితే రోగనివారణ శక్తి అధికంగా ఉంటుందని ఋజువైంది.

(iv) ఔషధ మొక్కలను, ఆకులను పౌర్ణమి నాడు సేకరిస్తే వాటిలో రోగనివారణ శక్తి అధికంగా ఉంటుందని ఆయుర్వేదం చెబుతున్నది.

కనుక సస్యాల వృద్ధిలో చంద్రుని పాత్ర ఎంతో ఉన్నది. ఆ చంద్రునికి గల శక్తి ఆయనది కాదు. అది పరమాత్మ శక్తియే. అందువల్ల మనం జీవించటానికి

**కావలసిన ఏర్పాట్లు - వేడి, వెలుతురు, ఆధారంగా భూమి, ఆహారంగా సస్యాలను ఇచ్చి కాపాడేవాడు పరమాత్మయే.**

**అంటే మనం భుజించే ఆహారాన్ని ఇచ్చింది నిజంగా ఆ పరమాత్మయే. కనుక ఆయన పట్ల మనం కృతజ్ఞులమై ఉండాలి. ఎలా? భగవంతుడిచ్చిన దానిని ఆయనకే సమర్పించాలి - నివేదించాలి. దానినే భగవదర్పితం చేయటం అంటారు. కనుక మనం తినబోయే ఆహారాన్ని ముందుగా భగవదర్పితంచేయాలి. అప్పుడే అది ప్రసాదం అవుతుంది. ఇది భగవంతుడు మనకు ప్రసాదించినదేనని జ్ఞాపకం పెట్టుకొని ఆయనకు కృతజ్ఞులమై ఉండాలి.**

**ఇలా ప్రాణులు జీవించటానికి బయట ఎన్నో ఏర్పాట్లు చేశాడు భగవంతుడు. ఇంక లోపల కూడా ఎన్నో ఏర్పాట్లు చేశాడు. ఏమిటవి? - జీవుళ్ళందరికి బయట కావలసిన ఏర్పాట్లను - వెలుగును, ఆహారాన్ని, ఆధారాన్ని - అన్నింటినీ కల్పించిన పరమాత్మ జీవుళ్ళ లోపల ఎలా సహాయపడుతున్నాడు?**

**శ్లో|| అహం వైశ్వానరో భూత్వా**
**ప్రాణినాం దేహమాశ్రితః |**
**ప్రాణాపాన సమాయుక్తః**
**పచామ్యన్నం చతుర్విధం || (14)**

**తా||** నేను వైశ్వానరుణ్ణి (జఠరాగ్ని) అయి ప్రాణుల శరీరాలను ఆశ్రయించి ఉంటాను. ప్రాణ అపానాలతో కూడి నాలుగు రకాల అన్నాన్ని ఆరగిస్తాను.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకం ప్రసిద్ధమైన శ్లోకం. భారతదేశంలో చాలామంది, అనేక ఆశ్రమవాసులు అన్నదోష నివారణకై భోజనకాలాలలో ఈ శ్లోకాన్ని పఠించి భుజించటం ఆచారంగా వస్తున్నది.

పరమాత్మ సర్వవ్యాపి. అంతటా ఉన్నాడు. వెలుపల అంతటా ఎలా వ్యాపించియున్నాడో అలాగే ప్రాణుల లోపల కూడా అలాగే వ్యాపించియున్నాడు. ఎలాంటి రూపంలో ఉన్నాడు?

1. వైశ్వానరో భూత్వా:- వైశ్వానర రూపంలో - జఠరాగ్నిరూపంలో ఉన్నాడు. ప్రాణం ఉన్నంత కాలం శరీరం వెచ్చగా ఉండాలి. ఆ వెచ్చదనాన్ని ఇచ్చేది భగవంతుడే. అందుకే మండు వేసవిలోను, చల్లని శీతాకాలంలోను ఒకేవిధంగా 98.4 F వేడి ఉంటుంది. ఆ అగ్నియే జఠరాగ్ని- వైశ్వానరాగ్ని. అదే పరమాత్మ. ఏం చేస్తున్నాడు పరమాత్మ వైశ్వానరాగ్ని రూపంలో?

2. పచామ్యన్నం చతుర్విధం:- మనం తినే 4 రకాల అన్నాన్ని పచనం చేస్తున్నాడు పరమాత్మ జఠరాగ్ని రూపంలో ఉండి. మనం హాయిగా తిని పడుకుంటే ఆయన మాత్రం నిద్రపోకుండా తిన్నదాన్ని పక్వం చేస్తున్నాడు. మనం నిద్రించినా ఆయన నిద్రపోడు. మనం నిద్రలేచి మళ్ళీ తినాలనుకుంటే తింటాం. అలా తినాలంటే అంతకుముందు తిన్నది జీర్ణం కావాలి. ఆ పనిని ఆయన చేసి మనకు సహాయపడుతున్నాడు.

మనం తినే అన్నం చతుర్విధం. అంటే నాలుగు రకాలుగా ఉంటుంది. అవి. 1. భక్ష్యం:- గట్టి పదార్థాలు. పళ్ళతో కొరికి, నమిలి తినేవి. గారెలు, వడలు, లాంటివి. 2. భోజ్యం:- మెత్తని పదార్థాలు. ముద్దలుగా చేసుకొని తినేవి. అన్నం, కూరలు, పచ్చళ్ళు, పప్పు మొదలైనవి. 3. చోష్యం:- జుర్రుకోనేవి,త్రాగేవి అయిన ద్రవపదార్థాలు. సాంబారు, రసం, మజ్జిగ, కూల్ డ్రింక్స్, పాయసం మొ||వి. 4. లేహ్యం:- నాలుకకు రాసుకొనేవి, నంజుకోనేవి, చప్పరించేవి. ఊరగాయలు, కొన్నిరకాల పచ్చళ్ళు, తేనె మొ||వి.

ఈ నాలుగు రకాల ఆహారాలను పరమాత్మే జఠరాగ్ని రూపంలో పక్వం చేస్తాడు. ఎలా?

3. ప్రాణ అపాన సమాయుక్తః:- ప్రాణ, అపాన శక్తులతో కూడి పక్వం చేస్తాడు. మనం నోట్లో వేసుకున్న ఆహారాన్ని లోపలకు లాగివేసి, దానిని జఠరాగ్నితో బాగా పచనం చేసి, జీర్ణింపజేసి, అన్ని అవయవాలకు రక్తం ద్వారా సరఫరా చేసి, మిగిలిపోయిన సారంలేని, అవసరంలేని ఆహారపు పిప్పిని బయటకు పంపటానికి సిద్ధం చేసేది ప్రాణం. ఈ పనికిరాని పిప్పిని బయటకు త్రోసివేసేది అపానం. ఈ రెండు చర్యల ద్వారా మనకు కావలసిన శక్తి వస్తుంది. దానితో పనులు చేసుకోగలుగుతాం. మళ్ళీ శక్తి కోసం తినగలుగుతాం. ఈ నిరంతర ప్రక్రియతో ప్రాణ అపానములనే శక్తులను పరమాత్మ వినియోగిస్తున్నాడు. ఈ సహాయాన్ని పరమాత్మ చేయకపోతే మళ్ళీ మళ్ళీ తినలేం. శక్తిని పొందలేం.

**నిజంగా ఇక్కడ ప్రాణ అపానాలను రెండింటినే చెప్పినా ఇంకా 3రూపాలలో - వ్యాన, ఉదాన, సమాన అనే రూపాలలో పరమాత్మ మనకు నిరంతరం సాయం చేస్తూనే ఉన్నాడు.**

**వ్యాన అంటే జీర్ణమైన ఆహారంలోని సారాన్ని శరీరంలోని అన్ని భాగాలకు చేర్చేది. ఈ సారాన్ని రక్తంలో కలిపి రక్తం ద్వారా సరఫరా చేస్తుంది.**

**సమాన అంటే ఏ అవయవాలకు ఎంతెంత అవసరమో అంత అన్నసారాన్ని ఆయా అవయవాలకు సరఫరా చేసేది.**

**ఉదాన అంటే అన్ని శరీరభాగాలకు వార్తలు పంపటమేగాక శరీరాన్ని విడిచిన తర్వాత జీవుణ్ణి చేర్చవలసిన స్థానానికి చేర్చేది.**

**"జఠరాగ్ని అనేది బొడ్డు దగ్గర ఉండే కుంపటి. ఆ కుంపటిని ప్రజ్వలింపజేసే కొలిమితిత్తులే ప్రాణ అపానాలు".**

**ఈ పనులన్నింటిని పరమాత్మ ఎక్కడ ఉండి నిర్వహిస్తున్నాడు? నిజంగా పరమాత్మ అడ్రస్ లేనివాడు. అన్ని అడ్రస్ లు ఆయనవే. ఎక్కడో ఒకచోట ఉండేవాడికే అడ్రసులు. అంతటా ఉండేవానికి అడ్రస్ ఎందుకు? "ఇందుగలడందు లేడను సందేహము వలదు చక్రి సర్వోపగతుండు"అన్న ప్రహ్లాదుని పలుకు ఇదే.**

**4. ప్రాణినాందేహం ఆశ్రితః:- ఈ పనులన్నీ చేయటానికి అన్ని ప్రాణుల యొక్క దేహాలను ఆశ్రయించుకొని పరమాత్మ లోపలే ఉన్నాడు. కనుక పరమాత్మను ఎక్కడా వెతకనక్కరలేదు. బస్సులలో, రైళ్ళలో, విమానాలలో ప్రయాణించాల్సిన పనిలేదు. ఈ 5 అడుగుల దేహంలోనే వెతికి**

తెలుసుకోవచ్చు. అయితే బయటకు చూడకుండా లోపలకే చూడాలి - అంతర్ముఖులు కావాలి.

ఈ ప్రకారంగా పరమాత్మే సూర్యచంద్రుల రూపంలో ఆహారాన్ని ఇస్తున్నాడు. ఆయనే జఠరాగ్ని రూపంలో తిన్న అన్నాన్ని అరిగిస్తున్నాడు. ఆయనే దేహంలోని అన్ని భాగాలకు పంపిస్తున్నాడు. ఇంతటి ఉపకారం చేసే పరమాత్మకు మనం చూపే కృతజ్ఞత ఏమిటి? అదే నివేదన. ఆయన ఇచ్చిన దాన్ని ఆయనకే సమర్పించి భుజించాలి. అలా నివేదించకుండా, సమర్పించకుండా, అనుమతి తీసుకోకుండా తింటే దొంగలమవుతాం. కనుక జాగ్రత్త తీసుకోవాలి.

ఆహారాన్ని ఇస్తున్నదీ ఆయనే, తయారుకావటానికి అగ్నిరూపంలో సాయం చేస్తున్నదీ ఆయనే, తిన్న అన్నాన్ని అరిగించి అన్ని అవయవాలకు సరఫరా చేస్తున్నదీ ఆయనే. కనుక అన్నం ముద్ద నోట్లోకి పోయేముందు పరమాత్మ జ్ఞాపకానికి రావాలి. కృతజ్ఞత తెలుపాలి. అంతేకాదు. పట్టెడన్నం అతిథికి పెట్టినప్పుడు ఆ అతిథిని భగవంతునిగా భావించాలి. ఒక కుక్కకు పిడికెడు అన్నం పెడితే అక్కడ జఠరాగ్ని రూపంలో ఆరగించి అరిగించేవాడు పరమాత్మేననే భావనచేయాలి. దీనివల్ల ఏమిటి ఫలితం?

అన్నం ఆరగించే వానిలోను, పచనం చేసే జఠరాగ్నిలోను, వెలుపల ఉండే సూర్యచంద్రులలోను, క్రింద ఆధారంగా ఉండే భూమిలోను, సస్యాలలోను, ప్రాణికోట్లలోను - సర్వేసర్వత్రా - అంతటా, అన్నింటా, అన్ని వేళలా బ్రహ్మబుద్ధి - పరమాత్మ భావన చేయగా - చేయగా మన పరిమిత

వ్యక్తిత్వం (జీవభావం) కరిగిపోయి నీవు - నేనూ - అతడు - ఆమె -అదీ - అన్నీ - సర్వమూ బ్రహ్మమే - పరమాత్మే అనే స్థిరభావన సిద్ధిస్తుంది. 'అప్పుడే ఊర్ధ్వమూలం' అనే తత్వార్థం అనుభవానికి వస్తుంది. ఇంకా లోపల ఉండి పరమాత్మ ఏం చేస్తున్నాడు? స్థూలశరీరాలకు కావలసిన ఆహారాన్నిచ్చి అరిగించటమే గాక, సూక్ష్మ శరీరాల కొరకు ఏంచేస్తున్నాడు?

**శ్లో||** సర్వస్య చాహం హృది సన్నివిష్టః
మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ |
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః
వేదాంత కృద్వేద విదేవ చాహం|| (15)

**తా||** నేను అందరి హృదయాలలో ఉన్నాను. నా నుండే జ్ఞాపకం, జ్ఞానం, మరపు కలుగుతున్నాయి. అన్ని వేదాల ద్వారా తెలియబడేది నేనే. వేదాంతాన్ని చేసింది నేనే. వేదాలను తెలిసినవాణ్ణి కూడా నేనే.

1. అహం సర్వస్య హృది సన్నివిష్టః- నేను అందరి హృదయాలలోనూ ఉన్నాను. ఇంతకు ముందు ప్రాణుల శరీరాలలో ఉన్నాను అని చెప్పి ఇప్పుడా శరీరాలలో ఎక్కడ ఉన్నదీ తెలియజేస్తున్నాడు. ఆయన సర్వవ్యాపి గదా! మరి హృదయంలో ఉండటమేమిటి? ఆయన అంతటా ఉన్నవాడే అయినా ధ్యాన మగ్నుడైన సాధకునికి పరమాత్మ త్వరగాను, స్పష్టంగాను వ్యక్తమయ్యే స్థానమే హృదయం. హృదయం అంటే రక్త ప్రసరణం చేసే గుండె కాదు. కొంచెం

కుడిప్రక్కగా ఉండే స్థానం. 'నేను' అని జీవభావం ఉదయించే స్థానం ఇదే. ఇదే ఆధ్యాత్మిక హృదయం.

ఇలా పరమాత్మ హృదయంలో ఉన్నందువల్ల ప్రయోజనమేమిటి?

2. మత్తః స్మృతి, జ్ఞానం, అపోహనం:- స్మృతి అంటే జ్ఞాపకశక్తి. మనిషికి జ్ఞాపకశక్తి ఎంతో అవసరం. తానెవరో, తనవారెవరో, తన ఊరు, పేరు, ఇల్లు, వాకిలి ఏదో, తన హోదా ఏమిటో - అన్న జ్ఞాపకం ఉండాలి. వీటిని మరచిపోతే జీవించలేడు మానవుడు. ప్రతిరోజూ రాత్రి అన్నింటిని మరచిపోయి నిద్రిస్తాడు. తెల్లవారి నిద్రలేచే సరికి ఈ సమాచారాన్నంతటిని అందిస్తాడు పరమాత్మ.

సామాన్యులకు నిన్న మొన్నటి విషయాలు, ఈ జన్మలోని విషయాలు జ్ఞాపకం చేస్తాడు. యోగులకు గత జన్మలలోని విషయాలు చెబుతాడు, కనుక అంతా మా గొప్పతనం అని అహంకరించరాదు.

'జ్ఞానం' అంటే క్రొత్త విషయాలను అర్థం చేసుకొనే తెలివితేటలు. సామాన్యులది లౌకిక జ్ఞానం. అంటే ప్రత్యక్షంగా కనిపించే వస్తువుల గురించి, విషయాల గురించి తెలుసుకొనే జ్ఞానం. ఇక యోగుల జ్ఞానం అలౌకిక జ్ఞానం - పరోక్షజ్ఞానం. దేశాంతర, కాలాంతర, జన్మాంతర విషయాలను తెలుసుకోగల జ్ఞానం. ఈ లౌకిక, అలౌకిక జ్ఞానాలన్నీ పరమాత్మ వల్లనే లభిస్తాయి.

'అపోహనం' అంటే మరపు. ఇదివరలో కలిగిన చిక్కులు, బాధలు, భయంకర అనుభవాలు, జరిగిన అన్యాయాలు, అవమానాలు అన్నీ మరచిపోవాలి. లేకపోతే బ్రతుకు దుర్భరమవుతుంది. కాలక్రమంలో అన్ని

బాధలను, కష్టాలను, నష్టాలను మరిపింపజేసి, బ్రతుకు మీద ఆశతో - తీపితో ముందుకు నడిచేటట్లు చేసేది కూడా పరమాత్మయే.

ఏమిటి ఇంకా పరమాత్మ ఆధిక్యత –

3. వేదైశ్చ సర్వైః అహం ఏవ వేద్యః:- అన్ని వేదాల ద్వారా తెలియబడవలసింది నేనే. వేదాలన్నీ అంతిమంగా చెప్పేది పరమాత్మను అందుకొనే మార్గాల గురించే. పరమాత్మ యొక్క స్వరూపజ్ఞానాన్ని బోధించుటకే కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ అని 3 కాండల గురించి వేదం చెబుతున్నది . కనుక వేద ప్రతిపాద్య విషయం పరమాత్మ. తెలియబడవలసింది పరమాత్మ.

4. వేదాంత కృత్:- వేదాంత కర్త ఆయనే. వేదాలను ఎవరో రచించలేదు. అవి అపౌరుషేయాలు. మహర్షులు, మహాత్ములు ప్రగాఢ ధ్యానస్థితిలో ఉన్నప్పుడు వారికి వినిపించినవే ఈ వేదమంత్రాలు. అందుకే వీటిని 'శ్రుతులు' అన్నారు. అయితే వారికి వినిపించింది ఎవరు? వారిలోని పరమాత్మయే. కనుక వేదాలను అందించినది పరమాత్మయే. కనుక ఇవి భగవన్నిర్మితాలు. అందుకే వేదాలపై విశ్వాసం తప్పక ఉండాలి. వేదం అంటే భగవంతుని తెలిపే వాఙ్మయం. వేదాలలో కనిపించే విరోధాలన్నింటిని సమన్వయపరచే శాస్త్రమే వేదాంత శాస్త్రం. వాటి మూలపురుషుడు పరమాత్మే. వేద విజ్ఞానాన్ని మానవలోకంలో ప్రచారం చేసి శాంతిని ప్రసాదిస్తున్న వ్యాస, వాల్మీకి, వశిష్టాది మహర్షులంతా నా స్వరూపులే అని భగవానుడు చెబుతున్నాడు.

**5. వేదవిత్ అహం ఏవ:- వేదములను ఎరిగిన వాణ్ణి నేనే. వేదాలను తెలుసుకోవాలంటే మానవులకు సాధ్యంకాదు. సర్వవేదాలను ఎరిగినవాడు పరమాత్మే. వేదాలను తెలుసుకొనే బుద్ధికి ఆధారం పరమాత్మ చైతన్యమే.**

**ఈ శ్లోకానికి మరొక అర్థం శంకరభాష్యంలో ఉన్నది.**

**ప్రాణులందరి బుద్ధిగుహలో జీవరూపంలో ఆ పరమాత్మే ఉన్నాడు. ఎవరైతే ఈ జీవుడు పరమాత్మే అనే అభేధ దృష్టితో ఉపాసన చేస్తారో వారు భగవంతుని అనుగ్రహంతోను; శాస్త్రాల యొక్క, గురువుల యొక్క అనుగ్రహంతోను అంతఃకరణ శుద్ధి కలిగి చివరకు 'నేనే పరమాత్మను' 'అహం బ్రహ్మాస్మి' అనే 'జ్ఞాపకం' (స్మృతి) కలుగుతుంది. అలాగే నాతో సహా అంతా (ఇదం సర్వం) పరమాత్మయే అనే 'జ్ఞానం' కలుగుతుంది. అలా అభేద దృష్టిలేని బహిర్ముఖులు - మలిన చిత్తులు అయిన సామాన్యులకు ఈ స్మృతి - జ్ఞానం రెండూ కలిగే అవకాశం లేదు. వారికి అంతా మరపే. అంటే ఆత్మను - పరమాత్మను అనే విషయంలో మరపు మాత్రమే ఉంటుంది. తమ స్వరూపాన్ని ఎప్పుడూ మరచిపోతూనే ఉంటారు.**

**ఇంతవరకు సామాన్య సాధకులకు, మంద - మధ్యమాధికారులకు తన స్వరూపాన్ని గురించి, తన మహిమను గురించి చెప్పిన భగవానుడు ఇప్పుడు ఉత్తమాధికారులకు తన యదార్థ స్వరూపాన్ని తెలియజేయబోతున్నాడు.**

**శ్లో|| ద్వావిమౌ పురుషౌ లోకే**

**క్షర శ్చాక్షర ఏవచ ।**

**క్షర స్సర్వాణి భూతాని**

**కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ (16)**

**తా॥** లోకంలో క్షర, అక్షర అని ఈ ఇద్దరు పురుషులున్నారు. అన్ని ప్రాణులు, ఉపాధులు క్షరమైనవి. కూటస్థుణ్ణి అక్షర పురుషుడు అంటారు.

**వ్యాఖ్య:-** క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు - అని ముగ్గురు పురుషులున్నారు. వీరిలో క్షర - అక్షర అనే ఇద్దరు పురుషుల గురించి ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

క్షర అంటే నాశనమయ్యేది. అక్షర అంటే నాశనం కానిది అని అర్థం.

1. క్షర :- అన్ని ప్రాణుల యొక్క దేహాలు ఉత్పత్తి, నాశనాలు గలవి. కాలంలో పుట్టి కాలంలో నశించేవి దేహాలన్నీ. కనుక అన్ని దేహాలు - భూతాలు క్షరం. అన్ని ప్రాణుల యొక్క స్థూల దేహాలు మరణానంతరం కనిపించవు. కనుక అన్ని దేహాలు, ఉపాధులు నాశనమయ్యేవి గనుక క్షరం అన్నారు.

2. అక్షర:- అంటే నాశనం లేనిది అని. కూటస్థుడైన జీవుడు అక్షరుడు - నాశనం లేనివాడు. జీవుడు కాలంలో పుట్టి కాలంలో నశించేవాడు కాదు. శరీరాలు నశించినా ఆ శరీరాలను ఆడించిన సూక్ష్మశరీరం నశించదు. ఆ సూక్ష్మశరీరంలో ఉన్న జీవుడు ఒక స్థూల శరీరం నుండి మరొక స్థూలశరీరంలోకి ప్రవేశించి, అక్కడ అనుభవాలు పొందుతూ, ఆ శరీరం తన అనుభవాలకు ఇక పనికిరాదని అనుకున్నప్పుడు దానిని వదలి అప్పటి తన వాసనలు, కర్మఫలాలకు (ప్రారబ్ధానికి) తగిన శరీరం కొరకు వెతుక్కుంటూ వెళ్ళిపోతాడు. కనుక అతడు కాలంలో నశించేవాడు కాదు. అతణ్ణి

కూటస్థుడు అంటారు. కూటంపై ఎన్ని వస్తువులనైనా తయారుచేయవచ్చు, మార్పులు చేయవచ్చు. కాని కూటం మాత్రం ఏ మార్పులు లేకుండా అలాగే ఉంటుంది. అలాగే పరమాత్మ ప్రతిబింబం క్షేత్రంలో ప్రతిఫలించినప్పుడు దానిని జీవుడు అంటారు. ఆ జీవుడు ఎన్ని శరీరాలు నశించినా ఒక దాని నుండి మరొక దానికి ప్రయాణిస్తూ మనస్సుతో పాటు ఆరు ఇంద్రియాలను తనతో పాటుగా ఆకర్షించి తీసుకొని వెళుతుంటాడు. ఇలా అనంతకాలం కొనసాగేవాడు గనుక కూటస్థుణ్ణి అక్షరుడు అంటున్నారు. అయితే అసలు నశింపులేదా? అంటే జీవుడికి నిజంగా నశింపులేదు. జీవుడు జీవభావాన్ని వదలి ఆత్మగా ఉండిపోతాడు. అంటే ఆత్మజ్ఞానం కలిగేంత వరకు - ముక్తిని పొందేంత వరకు జీవుడిగా ఉంటాడు. ఆ తరువాత ఆత్మగా తన యదార్థ స్వరూపంతో ఉండిపోతాడు. ఈ శరీరాలు ధరించటానికి, అందులో కూర్చొని అనుభవాలు పొందటానికి కారణమైన వాసనలు, కర్మఫలాలు పూర్తిగ అంతమయ్యేంత వరకు ఉపాధులతో కూడి జీవుడుగా ఉంటాడు. తరువాత ఉపాధులు లేని ఆత్మగా ఉంటాడు.

- కాలప్రవాహంలో - నిర్ణీత కాలంలో నశించేది క్షరం.
- కాలంతో సంబంధం లేకుండా ఆత్మజ్ఞానం కలగటంతో అంతమయ్యేది అక్షరం.

మరి పురుషోత్తముడెవరు? అసలు నశించనివాడు. అజం - అవ్యయం

క్షర అక్షర పురుషులకు వేరైన పురుషోత్తముని గురించి

క్షర - అక్షర పురుషుల గురించి తెలియజేశారు. ఇక పురుషోత్తముని గురించి 17వ శ్లోకంలో తెలియజేయబోతున్నారు.

**శ్లో||** ఉత్తమః పురుష స్త్వన్యః

పరమాత్మే త్యుదా హృతః |

యో లోకత్రయ మావిశ్య

బిభర్త్యవ్యయ ఈశ్వరః || (17)

**తా||** ఇక ఉత్తమ పురుషుడో - వేరే ఉన్నాడు. అతణ్ణి పరమాత్మ అని పిలుస్తారు. ఎవరు ముల్లోకాల్లోను ప్రవేశించి భరిస్తున్నాడో అతడు నాశనం లేనివాడు, సర్వానికి ప్రభువు.

**వ్యాఖ్య:-** 1. ఉత్తమః పురుషః తు అన్యః:- పైన చెప్పిన క్షర అక్షర పురుషులకన్న వేరైనవాడు ఉత్తమపురుషుడు, అతడే పురుషోత్తముడు. అతడే పరమాత్మ. ఉపాధులు లేనివాడు. సర్వవ్యాపి. కల్పిత సర్పంలో తాడు వ్యాపించియున్నట్లు ఈ కల్పిత 3 లోకాల్లోనూ, 3 అవస్థలలోను తన మాయాశక్తితో వ్యాపించియున్నాడు.

క్షణికమైన దేహం కన్నా, బద్ధుడైన జీవుడి కన్నా శాశ్వతుడైన పురుషోత్తముడు - పరమాత్మ శ్రేష్ఠుడు.

జీవుడు గుణాలతో ఉంటాడు. గుణాల కారణంగా సుఖదుఃఖాలతో ఉంటాడు. బందీయై ఉంటాడు. తనను తాను తెలుసుకోలేని అజ్ఞాని జీవుడు. పురుషోత్తముడు గుణరహితుడు. సుఖదుఃఖాలు లేనివాడు. సర్వస్వతంత్రుడు.

**తానెవరో తెలిసినవాడు. ఎరుకలో ఉండేవాడు. ఆనందస్వరూపుడు. కనుక ఉత్తముడు - పురుషోత్తముడు.**

**2. లోకత్రయం ఆవిశ్య బిభర్తః:- క్షర అక్షరు లిద్దరిని జాగ్రత్ ప్రపంచంలో చూస్తాం. అయితే జీవుడికి జాగ్రత్ ప్రపంచమే గాక మరో రెండు ప్రపంచాలు ఉన్నాయి. అవే స్వప్న ప్రపంచం, సుషుప్తి శూన్యం. ఈ రెండూ కూడా అతడి జీవితంలోని భాగాలే. పరమాత్మ ఈ జాగ్రత్ ప్రపంచాన్ని నిలబెడుతున్నాడు. ఎలా? జీవుడిలో చేరి అన్ని ఇంద్రియాలకు- మనస్సుకు చైతన్యాన్ని ప్రసాదించి ఈ జాగ్రత్ ప్రపంచంలో వ్యవహరించేట్లు చేస్తున్నాడు. నిజంగా జాగ్రత్ ప్రపంచం జీవుడి సృష్టియే. ఇక మిగిలిన రెండు ప్రపంచాలను కూడా పరమాత్మే నిలబెడుతున్నాడు. ఎలా? ఆ రెండు ప్రపంచాలలోకి ప్రవేశించి నిలబెడుతున్నాడు. అంటే జీవుడు నిద్రించిన తర్వాత మనస్సులో ప్రవేశించి ఆ మనస్సు కలల ప్రపంచాన్ని సృష్టించుకొని అందులో కొంతకాలం వ్యవహరించేట్లు చేస్తున్నాడు. అలాగే సుషుప్తిలో కేవలం తాను మాత్రమే ఉండి అన్నింటిని మరపించి విశ్రాంతిని, హాయిని అనుభవించేటట్లు చేస్తున్నాడు. ఇలా 3 అవస్థలలోను - 3 లోకాలలోను తాను మారకుండా కేవలంగా ఉంటూ, 3 అవస్థలను కేవలసాక్షిగా తెలుసుకుంటూ, తటస్థంగా ఉంటాడు. 3 అవస్థల యొక్క రాక పోకలను చూస్తూ సాక్షిగా ఉన్న ఉత్తమ పురుషునికి ఆ అవస్థల కళంకం ఏమాత్రం అంటదు.**

ఈ మూడున్నర మూరల శరీరంలో ఉన్నానని, ఈ శరీరాన్ని పోషించుకోవటమే తన కర్తవ్యమనీ పరమాత్మ భావించడు, అజ్ఞానంలో ఉన్న జీవుడు భావిస్తాడు. కనుక పరమాత్మకు ఏ అంటు సొంటు లేదు.

జీవుడు 3 లోకాల్లో 3 విధాలుగా ప్రవర్తిస్తూ ఉంటాడు. జాగ్రత్ లో అనుభవాలు ఒక విధం. స్వప్నంలోని అనుభవాలు వేరే విధం. ఇక గాఢనిద్రలో ఏ అనుభవమూ లేకుండటం, ఏమీ తెలియకుండటం మరింత ప్రత్యేకం. ఒక అవస్థలోని అనుభవాలు మరొక అవస్థలో తెలియకుండా ఉండేవాడు జీవుడు. అయితే 3 అవస్థలలోని అనుభవాలను కేవలంగా చూచే సాక్షియైన పరమాత్మకు అన్ని అవస్థల అనుభవాలు తెలుసు. కనుక 3 అవస్థలలో ప్రవేశించి వాటిని నిలబెట్టేవాడు పరమాత్మయే.

3. అవ్యయః ఈశ్వరః :- పరమాత్మ అవ్యయుడు. అంటే నాశరహితుడు. దేహం నశిస్తుంది. అది నిర్ణీతమైన కొంతకాలం మాత్రమే ఉంటుంది. జీవుడు ముక్తి కలిగితే (ఆత్మ జ్ఞానంతో) నశిస్తాడు. అంతవరకు జీవుడు అవ్యయుడే - అక్షరుడే. ఇక పరమాత్మకు ఎప్పటికీ నాశనం లేదు. అందుకే ఆయనను అవ్యయుడు అన్నారు. కాలంతో నిమిత్తం లేకుండా శాశ్వతంగా ఉండేవాడు. రెండవది ఈశ్వరః - అంటే ప్రభువు, శాసకుడు, నియామకుడు అని. ఆయన మరొకరి అధీనంలో ఉండేవాడు కాదు. సర్వస్వతంత్రుడు, 'ఈశ్వరానాం ఈశ్వరః' అన్ని ఇంద్రియాలను శాసించేవాడు. ఆయన ఏమీ చేయకుండానే అన్ని ఇంద్రియాలకు శక్తినిచ్చి వాటి పనులు అవి చేసుకొనేటట్లు నియమించేవాడు. కనుక ప్రభువు.

- **దేహ తాదాత్మ్యంతో ఉన్నవాడు సామాన్యుడు.**
- **జీవ తాదాత్మ్యంతో ఉన్నవాడు మధ్యముడు.**
- **ఆత్మ తాదాత్మ్యంతో ఉన్నవాడు ఉత్తముడు, పురుషోత్తముడు.**

**ఆయనను పురుషోత్తముడు అనటానికి కారణం ఏమిటి?**

**శ్లో|| యస్మాత్ క్షర మతీ తోఽహం**
**అక్షరాదపి చోత్తమః |**
**అతోఽస్మి లోకే వేదేచ**
**ప్రథితః పురుషోత్తమః || (18)**

**తా||** నేను క్షరానికి అతీతుణ్ణి గనుకను, అక్షరుని కన్నా కూడా ఉత్తముడను గనుకను లోకంలోను, వేదంలోను పురుషోత్తముడనని కీర్తిని పొందాను.

**వ్యాఖ్య :-** క్షర పురుషుడంటే కాలంలో పుట్టి కాలంలో గతించిపోయే శరీరమే. ఏ ప్రయత్నం లేకుండానే కాలగర్భంలో కలిసిపోతాయి. కనుక అల్పమైనవి. బల్బు పగిలిపోతే అందులో నుండి వెలుగురాదు. అలాగే స్థూల శరీరం రాలిపోతే అందులో ఇంతకాలం తిరుగులాడిన జీవుడు ఇక కనిపించడు. కనుక అల్పమైనది. ఇక అక్షర పురుషుడు కాలంలో కలిసిపోయేవాడు కాదు. శాశ్వతుడు. అంటే చాలాకాలం ఉండేవాడు. ఎన్ని శరీరాలు రాలిపోయినా అతడు మాత్రం రాలిపోడు. బాహ్య, అంతర కూటం మీద కూర్చుని - అంటే స్థూలశరీరంలో - సూక్ష్మశరీరంలో కూర్చొని కర్మలు చేస్తూ, సుఖదుఃఖాలు అనుభవిస్తూ, మార్పులు చెందుతూ బాధలు పడుతూ, కర్తగా - భోక్తగా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఉండేవాడు. తన జీవభావాన్ని - శరీరమనోబుద్ధులతో గల తాదాత్మ్యాన్ని వదిలించుకోవటానికి ప్రయత్నం చేస్తూ - సాధనలు చేస్తూ ఎన్నో జన్మల అనంతరం జీవభావాన్ని వదిలించుకుంటాడు. అప్పటిదాకా సుఖదుఃఖాలు అనుభవించాల్సిందే. ఇతణ్ణి అల్పుడు అనటానికి వీల్లేదు. పురుషార్థం చేసేవాడు కనుక సామాన్యుడు - అనవచ్చు. ఈ క్షర అక్షర పురుషుల కన్న వేరైనవాడు పురుషోత్తముడు. అతడు అన్నింటిని నిలబెడుతూ, భరిస్తూ, దేనిచేత అంటబడనివాడు.

- పురుషోత్తముడు ఎప్పటికీ నశించేవాడు కాదు. నిత్యుడు, శాశ్వతుడు.
- అక్షర పురుషుడైన జీవుడు ఆత్మజ్ఞాన పర్యంతం ఉండేవాడు. ఉన్నంతకాలం సుఖదుఃఖాలతో ఉండేవాడు. బద్ధుడైనవాడు.

పురుషోత్తముడో - ఎల్లప్పుడూ ఉండేవాడు. సృష్టిలోను, ప్రళయంలోను ఆయన ఉన్నాడు. వ్యక్తస్వరూపంగాను, అవ్యక్త స్వరూపంగాను, సోపాధికంగాను, నిరుపాధికంగాను ఉంటాడు. ఎలా ఉన్నా సుఖదుఃఖాలు అంటకుండా శాశ్వతానంద స్థితిలో ఉంటాడు. కనుక క్షర పురుషుని కన్న వేరైనవాడు, అక్షర పురుషుని కన్న అధికుడుడైన వాడు - ఉత్తముడు. కనుకనే పురుషోత్తముడు అన్నారు. లోకంలోనే కాదు, వేదాలలో కూడా కీర్తించబడుతున్నాడు.

వేదాలు మనకు పరమప్రమాణం. కనుక అవీ అలాగే చెబుతున్నాయి. పురుషోత్తముని పరమాత్మ అని కీర్తిస్తున్నాయి. ఆయనను చేరుకోవటమే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మానవ జీవితలక్ష్యం. ఆయనను చేరుకొనే మార్గాలను - ఉపాయాలను తెలియజేసేవే వేదాలు.

ఆత్మ శరీరంలో కూర్చొని జీవుడిగా వ్యవహరిస్తున్నదని; మనస్సు ప్రపంచం వైపు తిరిగితే జీవులమవుతున్నామని, మనస్సును ఆత్మ వైపు త్రిప్పి ఆత్మయందు లయం చేస్తే మనస్సు అంతమై ఆనంద స్వరూప ఆత్మగా మిగిలిపోతామని తెలుసుకొని ఆత్మగా - పరమాత్మగా మిగలటమే ఆత్మస్థితి - ముక్తస్థితి - జీవన్ముక్త స్థితి. అదే పురుషోత్తమప్రాప్తి. శరీరం ఉన్నా అతడికి లేనట్టే. ఈ జగత్తు ఉన్నా- కనిపిస్తున్నా అతడి దృష్టిలో లేనట్టే. అట్టి స్థితికి చేరుకోవటమే ఈ మానజీవిత పరమలక్ష్యం. అసలు అనేక జన్మల సుకృతంతో ఈ మానవజన్మను తెచ్చుకున్నది కూడా అందుకోసమే. పురుషోత్తమప్రాప్తి కొరకే. పురుషోత్తమప్రాప్తికి ఉపాయం ఏమిటి?

**శ్లో||** యో మామేవ మసం మూఢః
జానాతి పురుషోత్తమం |
స సర్వ విద్భజతి మాం
సర్వ భావేన భారత! || (19)

**తా||** భారతా! ఎవరైతే నన్నే ఈ ప్రకారంగా అసం మూఢుడై పురుషోత్తముడనని తెలుసుకుంటాడో అతడు సర్వము తెలిసినవాడై అన్ని విధాలుగా నన్ను భజిస్తాడు.

**వ్యాఖ్య :- 1. భారత! : అర్జునుణ్ణి అల్లారు ముద్దుగా భారత! అంటున్నాడు భగవానుడు. భారత! అంటే భరతవంశంలో జన్మించిన వాడా! అనే కన్న ఆత్మజ్ఞానంలో రమించేవాడా! అనే అర్థమే మిన్నగా కనిపిస్తుంది, సందర్భానికి చక్కగా సరిపోతుంది.**

**2. యః :- 'యః' ఎవరైతే అనే శబ్దాన్ని మళ్ళీ మళ్ళీ వాడి మనకు హుషారు కలిగిస్తున్నాడు పరమాత్మ. ఎందుకంటే బ్రాహ్మణులు తప్ప ఎవరూ వేదాలు చదువరాదని, స్త్రీలు గాయత్రీ మంత్రాన్ని ఉచ్ఛరించరాదని, శూద్రులు మోక్షాన్ని అందుకోకూడదని అనేక రకాల అపభ్రంశపు మాటలు వాడుకలో ఉన్నాయి. అలాంటి అభిప్రాయాలు మనస్సులో పెట్టుకోరాదని 'యః' - ఎవరైనా సరే - జాతి, మత, కుల, వర్గ, వర్ణ, లింగ భేదాలతో నిమిత్తం లేకుండా భగవంతుని తెలుసుకోవచ్చు, చేరుకోవచ్చు, భజించవచ్చు అని చెప్పటానికే ఈ పదప్రయోగం. కాకపోతే భగవత్తత్త్వాన్ని తెలుసుకోవాలంటే యోగ్యత కావాలి. ఏమిటది?**

**3. అసంమూఢః :- మోహం - భ్రమలేనివాడు ఐ ఉండాలి. మోహమంటే ఏమిటి?ఈ జగత్తు నిత్యమనుకోవటం, ఇక్కడి వస్తువులు - విషయాలు - భోగాలు సుఖాన్నిస్తాయనుకోవటం, అన్నింటియందు ఆసక్తిని పెంచుకోవటం, మమకారం పెంచుకోవటం - ఇదే మోహం. ఇది లేనివాడే అసంమూఢుడు. అట్టివాడు ఎవరైనా సరే పురుషోత్తముని చక్కగా తెలుసుకోగలడు ఏమని, ఎలా?**

**4. ఏవం పురుషోత్తమం జానాతి :- ఈ ప్రకారంగా పురుషోత్తముడనని తెలుసుకోవాలి. ఏ ప్రకారంగా? క్షర అక్షర పురుషులకు వేరైనవాడినని, ఉత్తముడైనవాడినని, ముల్లోకాలలోను ప్రవేశించి వాటిని ధరించి నిలబెట్టేవాడినని, అవ్యయయుడనని, ఆనందస్వరూపుడనని తెలుసుకోవాలి. తెలుసుకోవటమంటే ఊరకే తెలుసుకోవటం కాదు. నిశ్చయజ్ఞానం ఉండాలి. అతడే -**

**5. సర్వవిత్ :- సర్వము తెలిసినవాడు. ఈ లోకంలో ఎవ్వరికైనా కొన్ని విషయాలు తెలుస్తాయి. కొన్ని తెలియవు. కనుక ఎవ్వరూ సర్వవిత్ కాలేరు. అయితే పరమాత్మను అనుభవపూర్వకంగా తెలుసుకొంటే సర్వమూ తెలిసినట్లే. ఎందుకంటే పరమాత్మ పరిపూర్ణుడు, సంపూర్ణ జ్ఞానస్వరూపుడు. దేనిని తెలుసుకుంటే ఇక తెలుసుకోవాల్సింది లేదో అదే పరమాత్మ. అదే బ్రహ్మవిద్య. అన్ని విద్యలు, అన్ని శాస్త్రాలు, అన్ని కళలు, అన్ని సంపదలు, అన్ని తెలివితేటలు - సర్వమూ పరమాత్మలోనే ఉన్నాయి. కనుక ఆయనను తెలుసుకుంటే అన్నీ తెలిసినట్లే. ఇలా సర్వవిత్ అయినవాడు ఆ పరమాత్మనే అన్ని విధాల భజిస్తాడు - ఎలా?**

**6. సర్వభావేన :- పరిపూర్ణ మనస్సుతో, అన్ని విధాలుగా, అన్ని వేళలలో పరమాత్మను భజిస్తాడు. సృష్టిలోని యావత్తు రహస్యాన్ని తెలుసుకున్న అతడు ఎక్కడ ఏమి చేస్తున్నా అది భగవంతుని భజిస్తున్నట్లే. భగవంతుని యదార్థ స్థితిని, మహిమను తెలియనివారు గాని, తెలిసినా విశ్వాసం లేనివారు గాని భగవంతుని మనస్ఫూర్తిగా భజించలేరు.ఈ దృశ్యమంతా మాయామయమని;**

**వీటికి ఆధారమైన పరమాత్మ సత్యమని; ఆయన కన్న వేరైనదేదీ నిజంగా లేనే లేదని తెలిసినవాడే అన్ని విధాల సేవిస్తాడు. అతడికి సర్వము భగవంతుడే. కాని మనకో? మన ఇల్లే సర్వస్వం, భార్యాబిడ్డలే సర్వస్వం, ధనసంపదలే సర్వస్వం, కీర్తిప్రతిష్ఠలే సర్వస్వం. కనుకనే పరమాత్మ మనకు దూరం. అతడికి సర్వమూ పరమాత్మే.**

**ఇలా ఎవరైతే పరమాత్మ గురించి మోహాన్ని వదలి తెలుసుకోగలరో అతడే పురుషోత్తమప్రాప్తికి అర్హుడు. ఇక ఫలశ్రుతిః**

**ఈ 15వ అధ్యాయం ఫలశ్రుతిని తెలియజేస్తున్నాడు భగవానుడు -**

**శ్లో|| ఇతి గుహ్య తమం శాస్త్రం**
**ఇద ముక్తం మయానఘ! |**
**ఏతత్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్**
**కృత కృత్యశ్చ భారత! || (20)**

**తా||** భారతా! అనఘా! ఈ ప్రకారంగా అత్యంత రహస్యమైన ఈ శాస్త్రం నా చేత చెప్పబడింది. దీనిని అర్థం చేసుకుంటే బుద్ధిమంతుడవుతాడు, కృతకృత్యుడవుతాడు.

**వ్యాఖ్య :-** (1) 'ఇతి' అనే పదంతో ఈ అధ్యాయం ముగుస్తున్నది. శాస్త్రాన్ని ఉపక్రమించేటప్పుడు 'అధ' అనే మంగళవాచకంతోను, ముగించేటప్పుడు 'ఇతి' అనే పదంతోను పుర్తిచేయటం శాస్త్ర సంప్రదాయం. చెప్పదలచుకున్న విషయం పూర్తయిందనే భావం 'ఇతి' అనే పదంలో ఉంది. దీనిని బట్టి ఈ

అధ్యాయంతో భగవద్గీత పూర్తయినదని, దీని తరువాత ఉన్న 3 అధ్యాయాలు పరిశిష్ట అధ్యాయాలని పెద్దలు చెబుతుంటారు. ఈ ప్రకారంగా అత్యంత రహస్యమైన గీతాశాస్త్రాన్ని నీకు భోదించాను అని భగవానుడు తెలియజేస్తున్నాడు.

(2) శాస్త్రం :-భగవద్గీత ఒక శాస్త్రం. వేదాంతంలో కొన్ని శాస్త్రాలున్నాయి, కొన్ని ప్రకరణ గ్రంధాలున్నాయి. తత్త్వబోధ, వివేకచూడామణి, వేదాంత పంచదశి, విచారసాగరం, నైష్కర్మ్య సిద్ధి - - - మొదలైనవి ప్రకరణగ్రంధాలు. ఇవి శాస్త్రంలో చెప్పబడిన విషయాన్ని విపులంగా వివరిస్తాయి. శాస్త్రాన్ని అర్థం చేసుకొనుటకు ఇవి బాగా ఉపయోగపడతాయి.

'శాస్త్రం' మనం అందుకోవలసిన లక్ష్యాన్ని అందుకోవటానికి మనను శాసిస్తుంది. ఇలా చెయ్యి. అలా చెయ్యకు అని శాసిస్తుంది. అంతేగాక గుప్తంగా ఉన్న వస్తువును అభివ్యక్తం చేసేది శాస్త్రం. అందుకే 'శాసనాత్ శంసనాత్ ఇతి శాస్త్రం' అన్నారు. అంటే శాసనము, శంసనము శాస్త్రం యొక్క ధర్మాలు.

'సత్యం వద - ధర్మం చర' అని వేదంలో శాసనాలున్నాయి. ఇది వేదశాస్త్రం. సత్యాన్ని పలుకు - ధర్మాన్ని ఆచరించు - అని వేదశాస్త్రం నిర్దేశిస్తున్నది. అలాగే భగవద్గీతలో కూడా అనేక శాసనాలున్నాయి.

- క్లైబ్యం మాస్మ గమః పార్థ!' - అర్జునా నపుంసకత్వాన్ని వదులు;
- 'తాం స్తితిక్షస్వ భారత!' - అర్జునా తితిక్షను అలవరచుకో;
- 'తస్మాత్ యోగీభవ అర్జున!' - అర్జునా! అందువల్ల నీవు యోగివికా!;

➢ 'నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్' - సవ్యసాచీ! నిమిత్త మాత్రుడవు కా!

➢ 'మాం ఏకం శరణం వ్రజ' - నన్నొక్కనినే శరణు పొందు —

ఇలా భగవద్గీతలో శాసించి చెప్పిన మాటలు ఎన్నో ఉన్నాయి. అందుకే ఇది శాస్త్రం.

ఇక 'శంసనం' అంటే గుప్తంగా ఉన్నదానిని వ్యక్తం చెయ్యటం. అజ్ఞానం కారణంగా ఆత్మ మరుగున పడిపోయింది. దానిని వ్యక్తం చెయ్యటం జరిగింది భగవద్గీతలో. జీవభావమనే పొరచేత ఆత్మ కప్పబడి ఉన్నది. అందువల్ల ఆత్మ మరుగునపడ్డది. సాధన చేసి, ప్రయత్నం చేసి ఆ జీవభావమనే పొరను తొలగించుకొనే ఉపాయాన్ని చెప్పి ఆత్మ వ్యక్తమయ్యే విధానం ఇందులో చెప్పబడింది. అంటే శంసనమనే లక్షణం కూడా ఉన్నది. శాసనం - శంసనం ఈ లక్షణాలు ఉన్నది గనుక భగవద్గీత శాస్త్రం. ఈ శాస్త్రం ఎలాంటి శాస్త్రం?

(3) గుహ్యతమం :-గుహ్యం అంటే రహస్యం. గుహ్యతరం అంటే అతిరహస్యం. గుహ్యతమం అంటే అత్యంత రహస్యం. positive - comparative — superlative degrees.

రాముడు మంచి బాలుడు. (positive degree)

రాముడు గోపాలుని కన్న మంచి బాలుడు. (comparative Degree)

రాముడు అందరికన్న మంచిబాలుడు. (Superlative Degree)

అలాగే భగవద్గీత గుహ్య (రహస్య) శాస్త్రం కాదు; గుహ్యతర (అతిరహస్య) శాస్త్రం కాదు. మరి? గుహ్యతమ (అత్యంత రహస్య) శాస్త్రం.

➢ ధర్మాన్ని తెలియజేప్పేది గుహ్యశాస్త్రం.

➢ ధర్మ స్వరూపుణ్ణి పరోక్షంగా తెలిపేది గుహ్యతర శాస్త్రం.

➢ ధర్మ స్వరూపుణ్ణి అపరోక్షంగా తెలియజేప్పేది గుహ్యతమ శాస్త్రం.

భగవద్గీత పరమాత్మ యొక్క అపరోక్ష జ్ఞానాన్ని తెలియజెప్పిన శాస్త్రం గనుక గుహ్యతమ శాస్త్రం - అత్యంత రహస్యశాస్త్రం.

భగవద్గీతను అత్యంత రహస్య శాస్త్రం అని ఎందుకంటున్నారు? ఈ శాస్త్రాన్ని ఎవరికి పడితే వారికి చెప్పకూడదు. అర్హత గలవారికే చెప్పాలి. ఆకలి అయిన వాడికే అన్నం పెట్టాలి. ఆకలి లేనివాడికి పెడితే వంకలు పెట్టి వెళ్ళిపోతాడు. అలాగే అర్హత లేనివాడికి వేదాంతం చెబితే వాడు వినడు, విన్నా అర్థం కాదు. అంతర్ముఖులైన వారే అర్థం చేసుకుంటారు, బహిర్ముఖులైన వారు ఎంతవిన్నా - ఎన్ని సార్లు విన్నా ఇది రహస్యమే. ఏమిటా అర్హతలు? భగవానుడే చెప్పాడు తపస్సు చేయనివానికి, భక్తుడు కానివానికి, గురుసేవ చేయనివాడికి చెప్పకూడదు – అని.

ఈ గీతాశాస్త్రం చాటింపు వేసి చెప్పినా అర్హతలేని వాడికి అర్థం కాదు. అందుకే రహస్యం అన్నారు. గురువు ద్వారా తెలుసుకోవలసినది గనుక రహస్యం అన్నారు. ఇంతటి రహస్యశాస్త్రాన్ని అర్జునునికే ఎందుకు చెప్పాడు?

(4) భారత! అనఘ! :- 'భారత!' అంటే జ్ఞానప్రకాశంలో రమించేవాడా! అని. నిరంతరం జ్ఞానాన్ని ఆర్జించాలని తపించటం ఒక అర్హత. అర్జునుడు అలా జ్ఞానార్జన కొరకు తపిస్తూ, జ్ఞానంలో రమిస్తున్నవాడు. 'అనఘ' అంటే పాపరహితుడా! అని. అర్జునుడు నిజంగా పాపరహితుడే. మెత్తని మనస్సు

గలవాడు. ఆపన్నులైన వారిని, శరణన్న వారిని దయతో రక్షించేవాడు, ఎన్ని కష్టాలు ఎదురైనా కాపాడేవాడు. ఆవేశపడడు, ఆలోచిస్తాడు. అన్నగారిపై అమితమైన భక్తిగలవాడు. తనంత తావలచి వచ్చిన ఊర్వశిని నిరాకరించిన ఇంద్రియ నిగ్రహపరుడు. అర్జునుని జీవితంలో ఎక్కడా బ్లాక్ మార్క్ లేదు. అందుకే అనఘా! అన్నాడు, భగవద్గీతను బోధించాడు భగవానుడు. నిర్మలచిత్తుడు, సౌమ్యుడు, దయార్ద్ర హృదయుడు. యుద్ధ ప్రారంభంలో తాతలు, తండ్రులు, గురువులను చూచి విషాదగ్రస్తుడైన వాడు. అందుకే ఈ రహస్య విద్యను అర్జునునికే బోధించాడు భగవానుడు .

ఇట్టి గీతాశాస్త్రాన్ని, అత్యంత రహస్యశాస్త్రాన్ని వింటే ప్రయోజనం ఏమిటి?

(5) ఏతత్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ :- సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మ - జగద్గురువు అర్జునుని నిమిత్తంగా చేసుకొని శోకమోహాలలో మునిగిన సమస్త మానవ జాతిని తరింపజేసేందుకు ఉపదేశించిన ఈ అత్యంత రహస్య జ్ఞానాన్ని మొదట శ్రద్ధగా వినాలి. అది శ్రవణం. విన్నదానిని విచారణ చేసుకోవాలి. అది మననం. ఇలా స్థిరపరుచుకున్న జ్ఞానాన్ని సాధన ద్వారా - ధ్యానం ద్వారా అనుభూతి పొందాలి. ఇది నిధిధ్యాసనం.

ఎవరైతే నిర్మల చిత్తంతో, సూక్ష్మబుద్ధితో వింటారో వారు విషయాన్ని బుద్ధితో గ్రహిస్తారు. అయితే అది చాలదు. విన్న విషయాన్ని మననం చేసుకొని, సందేహాలను గురువుల ద్వారా తీర్చుకుంటేనే బుద్ధిమంతులౌతారు. - బుద్ధిమంతుడు కృతకృత్యుడెప్పుడవుతాడు?

(6) కృతకృత్యశ్చ:- నిర్వహించవలసిన పనిని చక్కగా నిర్వహించిన వాడు కృతకృత్యుడు. సంవత్సరం అంతా బాగా చదివి, పరీక్షలు చక్కగా వ్రాసి, పాసైన వాణ్ణి కృతార్థుడు అంటారు. అలాగాక సరిగ్గా చదవక, పరీక్షలు సరిగ్గా వ్రాయక బజార్ల వెంట బలాదూరుగా తిరిగిన వాణ్ణి ఫెయిలయ్యాడు - అంటారు. అతడు మళ్ళీ మళ్ళీ ఆ తరగతినే చదవాలి.

అలాగే జీవితంలో మనం చేయవలసిన పనిని - అంటే ఈ మానవజన్మను సార్థకం చేసుకొనుటకు, ముక్తిని - మోక్షాన్ని పొందటానికి మనం ఏఏ శాస్త్రాలను శ్రవణం చేయాలో, ఎలా గురువులను సేవించాలో, ఏఏ సాధనలను ఎలా చేయాలో తెలుసుకొని, వాటిని నిర్వర్తించి లక్ష్యాన్ని సాధిస్తే మనం కృతార్థులము, కృతకృత్యులము అయినట్లు. మనం ఈ మానవజన్మను ఎందుకు తెచ్చుకున్నామో తెలుసుకొని అందుకు పాటుపడితే కృతార్థులం అయినట్లు. అలాగాక మనం వచ్చిన పని మరచిపోయి ఇక్కడి ప్రాపంచిక వ్యామోహాలలో మునిగిపోయి, విషయవస్తువుల వెంటబడి తిరుగుతూ, తాత్కాలికమైన సుఖ భోగాల కొరకు అర్రులు చాస్తూ ఈ జన్మను వ్యర్థం చేసుకుంటే ఫెయిలయినట్లు. పరీక్ష తప్పినవాడు అదే తరగతిని మళ్ళీ మళ్ళీ చదివినట్లు ఇందులో మునిగిపోయిన వాడు మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ ఈ దుఃఖాలను పొందుతూ ఉండవలసిందే. ఈ సంసార జననమరణ చక్రంలో ఇరుక్కోవలసిందే. అందుకే -

"అర్జునా! అత్యంత రహస్యమైన ఈ గీతాశాస్త్రాన్ని నీకు బోధించాను, ఎవరు దీనిని చక్కగా తెలుసుకుంటారో వారే బుద్ధిమంతులు, ఎవరు తమ

పరమలక్ష్యాన్ని చేరుకుంటారో వారే కృతార్థులు - కృతకృత్యులు. సాధన చేసి పొందవలసిన దాన్ని పొందిన వారౌతారు - అని భగవానుడు తెలియజేశాడు.

కనుక మనం అందరం ఈ శాస్త్రాన్ని తెలుసుకొని బుద్ధిమంతులమై కృతకృత్యులమై జన్మను సార్థకం చేసుకుందాం.

**గద్యం:-** ఓం తత్ సత్. ఇతి శ్రీ మద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం, యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే పురుషోత్తమప్రాప్తి యోగోనామ పంచదశోఽధ్యాయః

ఇలా భగవద్గీత అనే ఉపనిషత్తులో బ్రహ్మవిద్య. యోగశాస్త్రంలో శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య సంవాద రూపంలో ఉన్న పురుషోత్తమప్రాప్తి యోగం అనే 15వ అధ్యాయం సమాప్తం.

పక్వమైన దశ పంచమదశ. సర్వానికి ఆధారమైన పరమాత్మను పురుషోత్తమునిగా తెలుసుకొని ఆయనను చేరుకుందాం –

(స్వస్తి)



Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# శ్రీమద్భగవద్గీత : 16 వ అధ్యాయం

# దైవాసురసంపద్విభాగ యోగం



: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

## శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]


వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ॥న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్త్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంధాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అర్ధమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.



## : ఉపోద్ఘాతం :

ఈ లోకంలో కనిపించే సమస్త ప్రాణికోటి ఆ పరమాత్మయే - పురుషోత్తముడే. చుట్టూ 50 అద్దాలు పెట్టుకొని మధ్యలో నీవు నిలబడితే అన్ని అద్దాలలోను నీ ప్రతిబింబాలు కనిపిస్తాయి. అద్దాల వైపుకే చూసే వాడికి ప్రతిబింబాలే తప్ప అసలు వ్యక్తి కనిపించడు. అద్దాలపై నుండి నీ దృష్టిని తొలగించి, ఆ ప్రతిబింబాలకు కారణమైన బింబాన్ని వెతకటానికి ప్రయత్నిస్తే అసలు వ్యక్తి కనిపిస్తాడు.

అలాగే ఈ ప్రపంచం మీద వ్యామోహాన్ని పెంచుకొని, దీనినే చూస్తూ, దీనిలోనే అనుభవాలు పొందుతూ ఉండేవానికి ఈ ప్రపంచమే కనిపిస్తుంది. ప్రతిబింబమే కనిపిస్తుంది. ఈ ప్రపంచం మీద వ్యామోహాన్ని వదలి, దృష్టిని అంతర్ముఖం చేస్తే పరమాత్మ దర్శనమే అవుతుంది. పురుషోత్తమ ప్రాప్తియే అవుతుంది. ఇదే 15 వ అధ్యాయం సారాంశం.

నిజంగా ఈ 15 వ అధ్యాయంతో భగవద్గీత పూర్తయినట్లే. ఎందుకంటే మానవ జీవిత పరమ లక్ష్యం మోక్షప్రాప్తి - పురుషోత్తమ ప్రాప్తి. ఆ లక్ష్యాన్ని అందుకున్న తరువాత ఇంకా తెలుసుకోవలసింది ఏముంటుంది? కాని ఇంకా 3 అధ్యాయాలు ఉన్నవి గదా! ఎందుకోసం ఉన్నట్లు? అంటే - 16, 17 అధ్యాయాలు పరిశిష్ఠఅధ్యాయాలని, 18వ అధ్యాయం ఉపసంహారాధ్యాయం అని చెబుతారు. ఏమిటీ పదాల వెనుకనున్న అర్థం?

ఒక గ్రంథం ముగిసిన తరువాత "ఇంకా ఏమైనా అతి ముఖ్య విషయాలను వదిలిపెట్టామా? " అని గ్రంథం వ్రాసిన వారు ఒకసారి వెనక్కు

తిరిగి ఆలోచించి; ఏదో ఒక కారణం చేత చెప్పకుండా విడిచిపెట్టిన విషయాలను, లేదా వివరంగా తెలుపకుండా కేవలం సూచించి విడిచిన విషయాలను ప్రత్యేకంగా మళ్ళీ అధ్యాయాలుగా వ్రాస్తే వాటిని 'పరిశిష్ఠ అధ్యాయాలు' అంటారు. అలాంటివే ఈ 16,17 అధ్యాయాలు. ఇక 18 వ అధ్యాయం ఉపసంహారాధ్యాయం. ఒక్కసారి వెనక్కు తిరిగి గ్రంధంలోని విషయాన్నంతటిని సంక్షిప్తంగా చెప్పి ముగించటమే ఈ చివరి అధ్యాయం యొక్క లక్ష్యం.

అందుకే జ్ఞానేశ్వరుల వారు భగవద్గీత 15 అంతస్థుల భవనం అని; 16,17 అధ్యాయాలు గోపురం అని; 18 వ అధ్యాయం కలశం వంటిదని అన్నారు.

ఈ 16 వ అధ్యాయం దైవాసురసంపద్విభాగయోగం. అంటే దైవీసంపదను, ఆసురీసంపదను విభాగించి చూపే అధ్యాయం. ఈ అధ్యాయానికి మరొక పేరు సుగుణ దుర్గుణ విభాగయోగం; సుజన దుర్జన వివేకయోగం అని మరో పేరు కూడా ఉన్నది.

పాండవులు సుజనులు. కౌరవులు దుర్జనులు.

పాండవుల గుణాలు సుగుణాలు. కౌరవుల గుణాలు దుర్గుణాలు.

పాండవులవి దైవీ గుణాలు. కౌరవులవి ఆసురీ గుణాలు.

మొదటి అధ్యాయంలో పాండవులను, కౌరవులను దుర్యోధనుడు వేరు వేరుగా పేర్కొన్నాడు. ఇక్కడ వారి పేర్లు చెప్పకుండా వారి వారి గుణాలను వేరు వేరుగా పేర్కొంటున్నారు.

ఇంకొక విచిత్రం ఏమంటే అక్కడ ప్రథమాధ్యాయంలో దుర్యోధనుడు పాండవ సేనను వివరిస్తూ 3 శ్లోకాలను చెప్పి, తన సేనను మాత్రం ఒక్క శ్లోకంలోనే తెలియజేశాడు. ఇక్కడ 16 వ అధ్యాయంలో భగవానుడు దైవీ సంపదను 3 శ్లోకాలలో చెప్పి, ఆసురీ సంపదను ఒక్క శ్లోకంలోనే చెప్పటం జరిగింది. ఈ పోలికను జాగ్రత్తగా పరిశీలించగలిగితే ఇది మొదటి అధ్యాయానికి పూరకం అని భావించే వీలుంది. పాండవులు దైవీ సంపద గలవారు, కౌరవులు ఆసురీసంపద గలవారని తెలుస్తుంది.

భగవంతుని అందుకోవాలంటే శాస్త్రం ద్వారా ముందు జ్ఞానాన్ని పొందాలి. అయితే శాస్త్రాన్నివినాలన్నా, విన్న విషయాలను నిలుపుకోవాలన్నా అర్హత ఉండాలి. దానినే అధికారి అంటారు. శాస్త్రాన్ని తెలుసుకొనుటకు అధికారి ఎవరో - అనధికారి ఎవరో తేల్చి వేసే అధ్యాయం ఇది. కనుక ఇది గ్రంథానికి మొదట్లోనే ఉండాలి. గ్రంథంలో ఎక్కడ ఉన్నా సాధకుడి విషయంలో మాత్రం ఇది మొదట్లోనే తెలుసుకోవలసిన విషయం.

అధికారి కాని వానికి తత్త్వబోధ ఫలించదు. అందుకే చాలామంది వేదాంతాన్ని వింటున్నా ఆచరణలోకి వచ్చేది మాత్రం ఏ ఒకరిద్దరికో. అంతేకాదు వినగానే ఆచరించేవారు అరుదు. వినగా వినగా ఎప్పటికో ఆచరించాలనే భావన కలుగుతుంది. దీనికి కారణం వారు వినే ముందే అధికారులు కాకపోవటమే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

పాలలో తోడు వేస్తే పెరుగు అవుతుంది. కాని నీళ్ళల్లో వేస్తే అవుతుందా? అలాగే అధికారి కాని వానికి జ్ఞానం అందిస్తే ఫలిస్తుందా? లేదు. కనుక అర్హత లేని వానికి ఎంత జ్ఞానబోధ చేసినా ప్రయోజనం లేదు.

ఒక మహానుభావుడు పరుసవేదిని సంపాదించాలని భగవంతుని గూర్చి తపస్సు చేశాడట. భగవంతుడు ప్రత్యక్షమై అతడు కోరిన పరుసవేదిని ప్రసాదించాడు. అతగాడికి బుద్ధి మట్టం. పరుగెత్తుకుంటూ ఇంటికి వచ్చి భార్యకు చెప్పాడు. ఇల్లంతా బంగారం చేయాలని ఆ ఇల్లాలి ఆశ. అందుకని ఎక్కడెక్కడో పడి ఉన్న ఇనుప ముక్కలన్నింటిని తెచ్చి రాశి పోసింది. పరుసవేదిని తాకిస్తే పాపం ఒక్కటీ బంగారం కాలేదు. లబోదిబోమని ఏడుపు లంకించుకున్నారు. దేవుడు కూడా మోసం చేస్తున్నాడు. ఇక మనుషులకు దిక్కెవరు? అని రాగాలు తీస్తున్నారు. దారిన పోయే పెద్ద మనిషి ఈ ఏడుపు విని, సంగతి అడిగి తెలుసుకున్నాడు. అతడు "ఓ బుద్ధి లేని పెద్ద మనిషీ! ఎందుకయ్యా అలా అల్లాడిపోతున్నావు. ఇది పరుసవేదే కాని తుప్పు పట్టిన ఇనుమును బంగారం చేయ్యలేదు. ముందు ఆ ఇనుప ముక్కలన్నింటిని కొలిమిలో వేసి కాల్చి శుద్ధి చేసుకొనిరా! "అన్నాడు.

అలాగే ఈ బ్రహ్మ జ్ఞానం పరుసవేది లాంటిదే. కనుక దీనికి కూడా తుప్పు లేని ఇనుము - అంటే అర్హత కలిగిన హృదయం కావాలి. 'తపో భిః క్షీణ పాపానాం' అన్నట్లు తపస్సు చేత పాపాలను పోగొట్టుకున్న పవిత్ర హృదయులు కావాలి. అట్టి పవిత్ర హృదయాలను తయారు చేయుటకే - అధికారులను తయారు చేయుటకే ఈ అధ్యాయం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఒక గృహస్థుడు రోజూ బుద్ధునికి భిక్ష పెట్టే వాడట. ఆ సమయంలో, "స్వామీ! నాకు ఉపదేశం ఇవ్వండి! దీక్ష ఇవ్వండి" అంటూ గౌతమబుద్ధుని ప్రార్థించేవాడు. బుద్ధుడు ఒకరోజు భిక్షా పాత్రలో దుమ్ము, ధూళి పెట్టుకొని భిక్షకు వచ్చాడు. ఆ గృహస్థుడు బిక్ష వేసేందుకు వచ్చి పాత్రను చూచాడు. "అయ్యా! పాత్రను శుద్ధి చేయకుండా భిక్ష భిక్ష అంటావేమయ్యా! ఆ మురికి పాత్రలో భిక్ష వేస్తే వ్యర్ధమై పోదా?" అన్నాడట.

అప్పుడు బుద్ధుడు "అయ్యా! నా పాత్ర సంగతి అలా ఉండనీ, నీ అంతఃకరణమనే పాత్ర సంగతి ఏమిటి? నీ అంతఃకరణాన్ని శుద్ధి చేసుకోకుండా ఉపదేశం అంటే ఎలా? కల్మషమైన అంతః కరణంలో చేసిన ఉపదేశం వ్యర్ధమే కదా! " అన్నాడట.

భగవద్గీత సిద్ధాంత ప్రధానమైన గ్రంధమే కాదు. ఆచరణ ప్రధానమైన గ్రంధం కూడా. భగవద్గీత మొత్తం సంగతి అలా ఉంచితే ఈ అధ్యాయం మాత్రం సాధకునికి ముఖ్యంగా కావలసిన అధ్యాయం. ఆచరణకు పెద్ద పీట వేసే అధ్యాయం.

మోక్షం పొందాలంటే ఆత్మజ్ఞానం కావాలి. ఆత్మజ్ఞానం భగవద్గీతను తెలుసుకోవటం వల్ల తప్పక లభిస్తుంది. అయితే భగవద్గీతను తెలుసుకోవాలంటే - శ్రవణం చెయ్యాలంటే అర్హత కావాలి. ఆ అర్హతయే అంతఃకరణ శుద్ధి. అంతఃకరణ శుద్ధికి దైవీ సంపద కావాలి, దైవీ గుణాలను అలవరచుకోవాలి. ఆసురీ గుణాలను దూరం చేసుకోవాలి. ఎలా?

సాధకుడు ముందుగా తన అంతఃకరణాన్ని పరిశోధించుకొని, ఈ గుణాలు దైవీగుణాలు, ఇవి ఆసురీగుణాలు అని నేర్పుతో విచారించి; దైవీ గుణాలను గ్రహించాలి, ఆసురీ గుణాలను వదలివేయాలి. సాధకుడు తన అంతిమ లక్ష్యమైన భగవత్ప్రాప్తిని పొందాలంటే తన సాధనకు ఉపయోగించే గుణాలతో బాటు, తన సాధనను నిర్వీర్యం చేసే గుణాలను గురించి కూడా చక్కగా తెలుసుకోవాలి. ఈ ఉద్దేశంతోనే అనుకూల - ప్రతికూల విషయాలను - అంటే దైవీగుణాలను - ఆసురీగుణాలను రెండింటినీ ఈ అధ్యాయంలో చెప్పటం జరిగింది. ఆసురీ సంపద పరమాత్మప్రాప్తికి ప్రతి బంధకం. దైవీసంపద కలిగి ఉంటేనే పరమాత్మ ప్రాప్తి. రాష్ట్రపతికో, ప్రధానమంత్రికో, గవర్నరుకో, ముఖ్యమంత్రికో, మంత్రికో, ప్రజాప్రతినిధికో స్వాగతం ఇవ్వాలంటే ఎంత హంగామా చేస్తాం? రోడ్లన్నీ ఊడ్పించి, కాలువల్లో మందు చల్లించి, మురికి కూపాలను శుభ్రం చేయించి, స్వాగత ద్వారాలను కట్టించి, రంగురంగుల తోరణాలతో, పూల దండలతో అలంకారాలు చేసి - అబ్బో ఎంతో హడావుడి చేస్తాం? ఎంత ఖర్చయినా వెనుకాడం. మరి బ్రహ్మాండాధిపతిని నీ హృదయంలోకి ఆహ్వానించాలంటే ఆయన స్వాగతానికి ఏం సన్నాహాలు చేస్తున్నావు? ఏం త్యాగం చేస్తున్నావు? ఆయన కూర్చొనే నీ హృదయ సింహాసనాన్ని శుభ్రం చేయ వద్దా? దాని మీద ఉన్న ఈ లౌకిక ధూళిని దులిపి వేయవద్దా? నీలోని ఆసురీగుణాలను దూరం చేసుకోవద్దా? దైవీగుణాలకు స్వాగతం పలకవద్దా? అలా చేస్తేనే భగవంతుడు నీ హృదయంలో ప్రవేశిస్తాడు. నీ హృదయ సింహాసనంపై ఆశీనుడౌతాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

- నరుణ్ణి, నారాయణునిగా చేసేది దైవీసంపద.
- నరుణ్ణి వానరుడిగా చేసేది ఆసురీసంపద.
- మనిషిలో దైవంశా ఉన్నది, రాక్షసాంశా ఉన్నది. తన కర్మలతో

తాను దేవుడూ కావచ్చు. రాక్షసుడూ కావచ్చు.

"యధేచ్ఛసి తథాకురు" - నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో- అంటూ భగవంతుడు మనకు కర్మ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించాడు.

నా కర్మ! నా గ్రహచారం! అంటూ ఏడుస్తూ కూర్చోవాల్సిన పని లేదు. 'క్లైబ్యం మాస్మ గమః' - పిరికి పందవు కావద్దు! - అని హెచ్చరిక. మరి ఏం చేయాలి? 'ఉద్ధరేదాత్మనాత్మానం' - నిన్ను నీవు ఉద్ధరించుకో! పురుషార్థం చెయ్యి - అని ప్రోత్సహిస్తున్నాడు.

తన వెంట వచ్చే సంపద (పుణ్యం, పాపం, జ్ఞానం) గురించి ఆలోచించడు మానవుడు. విడిచి పెట్టిపోయే సంపదల (డబ్బు, ఇల్లు, పొలం, స్థలం, నగలు .....) కోసం జీవితం చివరి రక్తపు బొట్టు వరకు - చివరి శ్వాసవరకు తపించి పోతూనే ఉంటాడు. అన్నీ ఉన్నప్పుడు అహంకారం. అంతా ఉడిగిపోయిన తరువాత శ్రద్ధ. శ్వాసలున్నంత వరకు ఎవరన్నా లెక్కలేదు. శ్వాస ఎగిరిపోయే సమయంలో డాక్టర్ల కాళ్ళ మీద పడతాం. వాళ్ళు మాత్రం ఏం చేస్తారు? వాళ్ళ దగ్గర మందు ఉంటుందే గాని ఆయుష్షు ఉండదు గదా! రోగానికి మందు ఉంటుంది గాని రోగికి మందు ఉండదు. కనుక ఓ మానవుడా! నీ గడియ గడియా అయిపోతున్నదని గడియారం టకటకా గంటలు కొట్టి హెచ్చరికలు చేస్తున్నది. ఖబడ్దార్ మేలుకో! మేలుకొని దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకో.

నీలో జరిగే ఈ ఆసురీసంపదకు దైవీసంపదకు మధ్య పోరాటాన్ని గమనించు. నీ బలం దైవీసంపదకు ఇవ్వు. ఆసురీసంపదను పారద్రోలు. అప్పుడే నీ లక్ష్యం నెరవేరుతుంది.

మన జీవితమే మహాభారతం.

మహాభారతం స్వర్గ పతనంతో ప్రారంభమైంది. స్వర్గారోహణంతో ముగిసింది. స్వర్గంలోని మహాభిషుడు గంగా దేవిని చూచి కామ మోహితుడయ్యాడు. అతడే శంతనుడు. 'శం' అంటే మంగళకరమైన - కళ్యాణప్రదమైన; 'తను' అంటే శరీరం గలవాడు అని. అంటే - భగవంతుడు అని అర్ధం. భగవంతుడు తన స్వస్థానం నుండి జారిపడ్డాడు. తిరిగి తన స్వస్థానాన్ని చేరుకోటానికి ఎన్నో ప్రయత్నాలు జరిగినవి. రాజసూయాలు, అశ్వమేధాలు జరిగినవి. అరణ్య - అజ్ఞాతవాసాలు జరిగినవి. ధర్మానికి కట్టుబడి అనేక క్లేశాలు అనుభవించటం జరిగినది. చివరకు సుగుణాలకు - దుర్గుణాలకు, దైవీసంపదకు - ఆసురీసంపదకు, ధర్మానికి అధర్మానికి మధ్య యుద్ధం జరిగింది. ఆసురీసంపద నశించింది. దైవీసంపద విజయం సాధించింది. కనుకనే స్వర్గారోహణం జరిగింది. ఎక్కడి నుండి జారిపడ్డాడో తిరిగి అక్కడికి చేరుకోవటంతో కథ సమాప్త మయింది.

పరమాత్మ నుండి జారిపడ్డ మనం మళ్ళీ పరమాత్మ ప్రాప్తితోనే మన జీవితం సమాప్తం. సమ + ఆప్తం. సమ అంటే బ్రహ్మం. ఆప్తం అంటే పొందుట. సమాప్తం అంటే బ్రహ్మప్రాప్తియే. అంతేగాని సమాప్తం అంటే చావటమో - ముగింపో కాదు. చస్తే మళ్ళీ పుడతాం. కనుక అట్టి సమాప్తి (బ్రహ్మప్రాప్తి) కోసం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మనం రాక్షస ప్రకృతిపై యుద్ధం చెయ్యాలి. దైవీ ప్రకృతిని ఆశ్రయించాలి. దాని కొరకు ముందుగా ఆ రెండింటిని విభాగించి, విశ్లేషణచేసి, విచారణ చెయ్యాలి - చేద్దాం.

ఈ అధ్యాయంలో మొత్తం 24 శ్లోకాలున్నాయి.

1-2-3 శ్లోకాలు దైవీ సంపద గురించి, 4 వ శ్లోకం ఆసురీసంపద గురించి -

5 వ శ్లోకంలో ఆ రెండు సంపదల ఫలశ్రుతి -

6 నుండి 20 వరకు ఆసురీసంపద గలవారి ఆచారాలు, ఆలోచనలు, ఫలితాలు.

21 వ శ్లోకంలో నరక ద్వారాల వివరణ -

22 నుండి 24 వరకు శాస్త్ర విరుద్ధ ఆచరణ వదలి శాస్త్ర విధిని ఆచరించమని బోధ. ఇవి ఈ అధ్యాయంలోని విశేషాలు.

- ఉదయం ఆకాశం ఎరుపు రంగుకు తిరిగితే చాలు ఇక సూర్యుడు వచ్చినట్లే.
- చెట్టుకు పూలు పూస్తే చాలు, ఇక ఫలాలు వచ్చినట్లే.
- అలాగే నీ అంతః కరణంలో దైవీసంపద కూడుకుంటే చాలు ఆత్మజ్ఞానం - తద్వారా పరమాత్మ నీలో ప్రవేశించినట్లే.

కనుక ఈ అధ్యాయంలోని విశేషాలను చక్కగా గ్రహించి ఆసురీసంపదను దూరంగా త్రోసివేసి దైవీసంపదను ఆహ్వానిద్దాం, వృద్ధి చేసుకుందాం.

వేదాంతంలో జీవుణ్ణి పక్షితో పోలుస్తారు. పక్షికి ముఖం సన్నగా ఉండి రెండు కళ్ళూ ముఖానికి అటూ ఇటూ ఉండి వేరు వేరు దృశ్యాలను చూపిస్తాయి. కాని మానవుడిలో ఆధ్యాత్మికమో - ప్రాపంచికమో ఏదో ఒక్క దృష్టే ప్రబలంగా ఉంటుంది. ఆధ్యాత్మిక దృష్టి ఉన్నవాడు ఇంద్రియాలను, మనస్సును స్వాధీనంలో ఉంచుకొని తనలోనే ఉన్న పరమాత్మను తెలుసుకొనే ప్రయత్నం చేస్తాడు. ప్రాపంచిక దృష్టి ప్రబలంగా ఉన్నవాడు ప్రపంచంలోనే కూరుకుపోతాడు. అతడు తనలోని వాసనలను గురించి పట్టించుకోడు. దాని కారణంగా మళ్ళీ మళ్ళీ జన్మిస్తూ - మరణిస్తూ ఈ సంసార జనన మరణ చక్రంలో కూరుకుపోతాడు. ఆధ్యాత్మిక దృష్టి గలవాడు తనలోని వాసనల గురించి విశ్లేషించి, అవి ఆసురీసంపద అయితే త్రోసివేసి, దైవీసంపదను వృద్ధి చేసుకుంటాడు. పరమాత్మకు దగ్గరవుతాడు.

అలాంటి విశ్లేషణకు వీలుగా మొత్తం 26 దైవీసంపదకు చెందిన లక్షణాలను 3 శ్లోకాల ద్వారా అందించబోతున్నాడు భగవానుడు.

- ముందుగా దైవీసంపదకు చెందిన 9 లక్షణాలను ఈ శ్లోకంలో -

**శ్రీ భగవానువాచ :-**

శ్లో|| అభయం సత్త్వ సంశుద్ధిః
జ్ఞాన యోగ వ్యవస్థితిః |
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయస్త ప ఆర్జవం || (1)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా ||** భగవానుడంటున్నాడు. అభయం, అంతఃకరణ శుద్ధి, జ్ఞాన యోగంలో నిలవటం, దానం, ఇంద్రియనిగ్రహం, యజ్ఞం, స్వాధ్యాయం, తపస్సు, నిజాయితీ - (దైవీ సంపద)

**వ్యాఖ్య :-** ఈ శ్లోకంలో మొత్తం 9 లక్షణాలను దైవీ సంపదగా చెప్పారు.

(1) **అభయం :-** అభయం అంటే భయం లేకుండుట. Be fearless - నిర్భయంగా ఉండు - అనేది స్వామి వివేకానంద నిరంతరం చేసే ఉపదేశం. ఆయనలా బోధించటమే కాదు. అలా జీవించాడు కూడా.

వీరుడు ఒక్కసారే చస్తాడు. భీరుడు పదేపదే చస్తుంటాడు. క్షణ క్షణమూ చస్తూ బ్రతుకుతుంటాడు. అందుకే మహాభారతంలో -

**శ్లో||** శోకస్థాన సహస్రాణి భయస్థాన శతానిచ |
దివసే దివసే మూఢః మా వింశతి న పండితం - అన్నారు.

- మూర్ఖుడికి రోజుకు వందల భయాలు, వేలకొద్దీ దుఃఖాలు. శోకాలు భయాలు అతణ్ణి వెతుక్కుంటూ వస్తాయి. వాటితో వాడి జీవితమంతా మునగానాం తేలానాం. పండితుడి జోలికి అవి రావు.

ఈ ప్రపంచంతోను; ఇక్కడి వస్తువులు, ధన సంపదలు, భోగాలు మొదలైన వాటన్నిటితోను అతుక్కుపోయి, అవి లేకపోతే జీవించలేననుకొనే వారే మూఢులు. వారికి పిల్లిని చూచినా భయమే. బల్లిని చూచినా భయమే. శకునాలు చూచుకొని భయపడుతుంటారు. ఇలా భయపడేవారు మూరెడు ముందుకు బారెడు వెనక్కు అన్నట్లుంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భయంలేని చోటు స్వర్గం. భయముండే చోటు నరకం. వైకుంఠంలో గరుత్మంతుడు, ఆదిశేషువు కలిసే ఉంటారు. వారిద్దరూ బద్ధ శత్రువులు. అలాగే కైలాసంలో నంది, సింహం కలిసే ఉంటాయి. అవీ శత్రువులే అయినా ఆ చోటు భయానికి దూరం.

స్వామి వివేకానంద పాశ్చాత్య దేశాలలో తిరిగేటప్పుడు ఆయన వేషాన్ని చూచి చాలా మంది వెటకారం చేసేవారు. ఒకనాడు ఒక నవనాగరిక స్త్రీ ఆయనను "ఏ దేశమండీ మీది?" అని ఎగతాళిగా అడిగిందట. "గుడ్డలకు కాకుండా గుణాలకు విలువ ఇచ్చే దేశం మాది" అని మూతిమీద కొట్టినట్టు సమాధానం చెప్పాడట. ఆమె తెల్ల మొఖం వేసింది.

ఒకసారి ఆయన ట్రైన్ లో మొదటి తరగతిలో ప్రయాణం చేస్తున్నాడు. కాళ్ళకు తొడుక్కున్న బూట్లు ప్రక్కన విడిచి పడుకున్నాడు వివేకానందుడు. ఒక తెల్లదొర ఆ కంపార్ట్ మెంట్ లోనే ప్రయాణం చేస్తున్నాడు. అతడు ఈ స్వామిని చూచి "ఈ బిచ్చగాడికి బూటు కావాల్సి వచ్చిందా?" అనే తృణీకార భావంతో ఆ బూటును కిటికీ గుండా బయట పారవేసి పడుకున్నాడు. స్వామి లేచి చూచాడు. విషయాన్ని గ్రహించాడు. వెంటనే చుట్టూ చూచాడు. దొరగారి కోటు అక్కడ కొండీకి వ్రేలాడుతూ కనిపించింది. వెంటనే దాన్ని కిటికీ గుండా బయటకు విసిరేసి కూర్చున్నాడు. దొరగారు లేచి చూచారు. కోటు కనిపించలేదు. 'నా కోటు ఏది?' అని కోపంగా స్వామిని అడిగాడు. "నా బూటును వెదకటానికి పోయింది" అని తాపీగా చెప్పాడు స్వామి. తెల్లదొర ముఖం కందగడ్డ అయ్యింది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఒకసారి స్వామి తెల్లదొరలుండే పెట్టెలో ప్రయాణిస్తున్నాడు. "ఈ బికారి సాధువులకు ఇంగ్లీషు ఏం తెలుస్తుందిలే" అని వాళ్ళు ఇంగ్లీషులో స్వామిని గురించి హేళనగా మాట్లాడుతున్నారు. ఒక స్టేషనులో బండి ఆగింది. స్టేషను మాస్టరును పిలిచి స్వామి "కొద్దిగా మంచి నీళ్ళు తెప్పించండి" అని ఇంగ్లీషులో అడిగాడు. ఓహో! ఈయనకు ఇంగ్లీషు కూడా తెలుసు అనుకొని ఇంత వరకు హేళనగా మాట్లాడిన వాళ్ళు బిక్కచచ్చి, తేలు కుట్టిన దొంగల్లాగా అయిపోయి, "స్వామీ! ఇంతవరకు మేము లోక విషయం మాట్లాడుకున్నాం, తమరి మాట కాదు. తమరేమీ అనుకోకండి" అన్నారట. దానికి స్వామి, "అబ్బే! మూర్ఖులను చూడటం నాకు ఇదే మొదటిసారి కాదు అన్నాడు. అంతే. వాళ్ళు అవాక్కయ్యారు.

'నిస్పృహస్య తృణం జగత్' ఆశలేని వాడికి ఈ ప్రపంచం గడ్డిపోచ. జ్ఞాని ఈ ప్రపంచంలో దేనికి భయపడతాడు? సర్వమూ భగవంతుడే అని నమ్మిన భక్తుడికి భయమేమిటి? శిక్షించేవాడికి రెండు చేతులైతే రక్షించేవాడికి వెయ్యి చేతులు. భక్తుడు భయపడడు. భయపెట్టడు.

భయపడేది పశు లక్షణం. భయపెట్టేది మృగ లక్షణం. పూర్ణ భక్తుడు పశువూ కాదు. మృగమూ కాదు. ఆనంద స్వరూప ఆత్మయే.

మృత్యువుకు అందరూ భయపడతారు. ఒకసారి కలరా వచ్చి అందరు చనిపోతున్నారు. దానితో అందరూ కలరా దేవతను పూజిస్తున్నారు. "అమ్మా! ఏమిటి ఈ ప్రళయం? ఇంతమందిని పొట్టన పెట్టుకుంటావా?" అని దీనంగా వేడుకుంటున్నారు. ఆ కలరా దేవత ప్రత్యక్షమై వారితో ఇలా అన్నదట.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

"అయ్యా! నేను చంపింది 10 మందినే. మిగతా 90 మందీ భయంతో చనిపోయారు. ఆ భారమూ నా నెత్తినే వేస్తారా?" అని. కలరా దేవతకన్నా ఈ భయం దేవత చాలా చెడ్డది. కనుకనే దైవీ సంపదలో అభయానికి అగ్రతాంబూలం ఇచ్చారు. కనుక ముందుగా భయం నుండి విముక్తి సంపాదించాలి. - ఇక రెండవ లక్షణం సత్త్వ సంశుద్ధి -

(2) **సత్త్వసంశుద్ధిః** :- 'సత్త్వం' అంటే అంతఃకరణం - మనస్సు. 'శుద్ధి' అంటే కల్మషాలు లేకుండా స్వచ్ఛంగా ఉండటం. 'సంశుద్ధి' అంటే పూర్తిగ స్వచ్ఛంగా, నిర్మలంగా ఉండటం. ఇలా మనస్సు పూర్తిగా నిర్మలంగా, నిష్కల్మషంగా, స్వచ్ఛంగా ఉంటే అది దైవీసంపద అవుతుంది. మనస్సు స్వచ్ఛంగా ఉంటేనే అందులో పరమాత్మ ప్రకాశం ఉండేది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం బాగా ప్రకాశిస్తుంది గాని, దుమ్ము కొట్టుకొని ఉన్న అద్దంలో ప్రతిబింబం సరిగ్గా కనిపించదు గదా! కనుక నీలో పరమాత్మ జ్ఞానం ప్రకాశించాలంటే నీ అంతఃకరణం స్వచ్ఛంగా - నిర్మలంగా ఉండాలి.

మనస్సు నిర్మలంగా ఉంటేనే బయటి ప్రవర్తన - ఆచరణ పవిత్రంగా ఉంటుంది. బయటి ప్రవర్తన - లోపల మనస్సు రెండూ ఒక్కటిగా ఉంటేనే ధ్యానంలో మనస్సు నిలుస్తుంది. జ్ఞానాన్ని చక్కగా గ్రహించగలుగుతారు. అప్పుడే పరమాత్మకు సమీపంగా నీ మనస్సు ఉంటుంది.

ఇలా మనస్సు నిర్మలంగా స్వచ్ఛంగా ఉండాలంటే - నిరంతరము భగవత్ సంబంధమైన పూజాదికాలు, యజ్ఞ దాన తపస్సులు, శ్రవణం, సత్సంగం, గురుభక్తి, గురుసేవ, ఆధ్యాత్మిక సాధనలు ప్రీతితో ఆచరించాలి. అలాగాక

ఆచరణ గొప్పగా ఉండి మనస్సు మాత్రం ప్రాపంచిక విషయాలతో, స్వార్థపూరిత భావాలతో, రజోగుణ తమోగుణ ప్రాబల్యంతో ఉన్నట్లైతే అది ఆసురీ సంపదను పెంచి పరమాత్మకు దూరం చేస్తుంది.

(3) **జ్ఞానయోగ వ్యవస్థితిః**:- శాస్త్రాలలోని విషయాలను గురుసమ్ముఖంలో కూర్చొని శ్రవణం చేసి, గ్రహించిన జ్ఞానాన్ని ఏకాగ్రమైన మనస్సుతో అనుభవానికి తెచ్చుకొనే నిష్ఠయే జ్ఞానయోగ వ్యవస్థితి. నీ స్వరూపాన్ని తెలుసుకోవటం 'జ్ఞానం'. ఆ జ్ఞానాన్ని ఏకాగ్రతతో అనుభవానికి తెచ్చుకొనుటకు ఆచరించే ఉపాయమే 'యోగం'. అలాంటి జ్ఞానం కలిగి, నిరంతరం యోగం నందే స్థితిని కలిగి ఉండటమే 'జ్ఞానయోగ వ్యవస్థితి' అంటారు. ఇక్కడ స్థితి అనక వ్యవస్థితి అంటున్నారు. అంటే ఇంటికి వచ్చిన అతిథిలా కాకుండా ఇంటి యజమానిగా ఉండాలి. అతిథి 1-2 రోజులుండి పోయేవాడు. యజమాని శాశ్వతంగా ఉండేవాడు. అంటే ఏదో కొద్దిసేపు నేను ఆత్మను అనే జ్ఞానంలో ఉండటం కాక శాశ్వతంగా - స్థిరంగా ఆత్మగా ఉండిపోవాలి.

ఇలా ఉండాలంటే శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడే గాక కరుణా సముద్రుడైన గురువును ఆశ్రయించాలి. నిత్యము శాస్త్రశ్రవణం చేయాలి. సందేహాలను తొలగించుకోవాలి. అలా నిత్యశాస్త్ర శ్రవణం వల్ల జ్ఞానంలో నిలబడటం జరుగుతుంది. బుద్ధి ద్వారా పరమాత్మను గురించి శ్రవణం చేయటం, విచారణ చేయటం. ఆయనను చేరుకొనేందుకు కృషి చెయ్యటం. ఇదే జ్ఞానయోగ వ్యవస్థితి. ఇది దైవీసంపద.

(4) **దానం:-** కలియుగంలో దానానికి పెద్ద ప్రాధాన్యత ఉన్నది. "దానమేకం కలౌయుగే" అన్నారు. దానం చేస్తే దరిద్రులమై పోతామని కొందరి భావన. మరికొందరు దానం చేయకపోతే దరిద్రులమై పోతామని భావిస్తుంటారు. రెండోది నిజం. న్యాయార్జితమైన ధనాన్ని సత్పాత్రులకు, సత్పురుషులకు సమర్పించుటే నిజమైన దానం. ఈశ్వరుడు మహాదాత. మరి ఆ ఈశ్వర పుత్రులమైన మనం తండ్రికి తగిన బిడ్డలుగా ఉండవద్దా? కనుక అన్నదానం, వస్త్రదానం, ధనదానం, భూదానం, గోదానం, సువర్ణదానం, వైద్యదానం, విద్యాదానం, కన్యాదానం, శ్రమదానం, జ్ఞానదానం - వీటిలో వేటినైనా దేశకాల పాత్రానుగుణంగా చేస్తూ జీవించాలి.

పశువు దాని పొట్ట అది చూసుకుంటుంది. దాని దృష్టి అంతవరకే. మనిషి అలాకాదు. తన పొట్టతో పాటు ఎదటివాడి పొట్టను కూడా చూచే చూపు ఇచ్చాడు భగవంతుడు. దానం వల్ల సమాజంలోని అసమానతలు కొంతవరకైనా తొలగుతాయి.

గృహస్థాశ్రమానికి దానం ప్రాణంతో సమానమైనది. "నీవు తిన్నది మట్టిపాలు. ఇతరులకు పెట్టింది నీ పాలు"- అని సామెత. ఇతరులకు పెట్టిందేదో అదే నీది. దానిపైనే నీకు హక్కు. దాచిపెట్టింది నీది కాదు. దానిపై నీకు హక్కు ఉండదు.

**శ్లో||** యద్దదాసి విశిష్టేభ్యో యచ్చాశ్నాసి దినే దినే |
తత్తే విత్త మహం మన్యే శేషం కస్యాపి రక్షసి ||

నీవు ఏది దానం చేస్తావో, దేనిని అనుభవిస్తావో ఆ సొత్తే నీది . మిగిలింది ఎవరి కోసమో భద్రపరుస్తున్నావు అని గ్రహించు.

ఒకడు బ్యాంకులో డబ్బు దాచుకొని 'నాది నాది' అని ఆనందిస్తుంటాడు. వాడలా తలుచుకొని ఆనందించేవాడే కాని, అనుభవించి ఆనందించేవాడు కాదు గదా! లేనివాడు కూడా అలాగే అనుకొని ఆనందించవచ్చు. "ఈ బ్యాంకులో ఉన్నదంతా నాదే. ఇది విజయాబ్యాంక్ అన్నారెందుకో తెలుసా? నా భార్యపేరు విజయ కదా!" ఇలా అనుకొని, చెప్పుకొని ఆనందించవచ్చు.

ఒక పిసినిగొట్టును చూచి ఆ ప్రక్కవాడంటున్నాడు, "వాడా! అబ్బో. వాడు పరమలోభి. పైసా ఇవ్వడు ఎవ్వరికీ. వాడు తినడు. ఒకరిని తిననివ్వడు. ఇంట్లో భార్యా పిల్లలను కూడా తిండికి మొఖం వాచిపోయేట్లు చేస్తున్నాడు. ఒంటి మీద చొక్కా ఉండదు. కాళ్ళకు చెప్పులుండవు. కుళ్ళిపోయిన కూరగాయలు తెచ్చుకుంటాడు. ఒట్టి పిసినారి" అన్నాడు. అది విన్న అతని స్నేహితుడన్నాడు, "వాడు పిసినారి అంటే నేను ఒప్పుకోను. వాడు మహాత్యాగి. గడ్డి తిని, గాదం తిని సంపాదించి, పైసా పైసా కూడబెట్టి, పొట్టకు తినకుండా, ఎవ్వరికీ పెట్టకుండా, కూడబెట్టిన మొత్తం మొత్తం ఒకేసారి ఎవరికో ఒకరికి ఇచ్చి పోతున్నాడు గదా! ఎంత త్యాగమూర్తి?" అన్నాడు. ఇలా చేసిన వాడికి ఈ త్యాగం ఎప్పటికైనా తప్పదు. వాడు పూర్వజన్మలో అందరికీ ఋణపడి ఉన్నాడు, ఆ ఋణం తీర్చుకొనుటకే ఈ నికృష్ట జన్మ ఎత్తాడు. "దరిద్ర కోటీశ్వరుడు" - వాడి బిరుదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దానాన్ని గురించి మహాభారతంలో చక్కగా చెప్పారు. "దానం చేయటం వల్ల ధనవంతుడుగా పుడతాడు. ఈ ధనంతో పుణ్యం సంపాదిస్తాడు. పుణ్యంతో స్వర్గాన్ని చేరుకుంటాడు. తిరిగి ధనవంతుడుగా పుడతాడు, మళ్ళీ దానం చేస్తాడు. ఇదొక చక్రం. దానం చేయకపోవటం వల్ల దరిద్రుడై పుడతాడు. దరిద్ర దోషంతో పాపం చేస్తాడు. పాపంతో నరకప్రాప్తి. మళ్ళీ దరిద్రుడుగా జన్మిస్తాడు. పాపం చేస్తాడు. నరకం. ఇదొక చక్రం".

ఇక దానం చేసేటప్పుడు కొందరు ఎంతో తెలివిగా చేస్తారు. చెల్లని నోట్లను, చెడిపోయిన వస్తువులను, కుళ్ళిపోయిన పండ్లను దానం చేసే బుద్ధిమంతులుంటారు. వీటిని నిరభ్యంతరంగా దేవుడికో, మహాత్ములకో గురువులకో సమర్పిస్తుంటారు. ఎందుకంటే వారు చూచి, లెక్కబెట్టుకొని తీసుకొనే వారు కాదు గనుక. ఇలా చెల్లని నోట్లను కవరులో పెట్టి ఇచ్చేవారు, కుళ్ళిన కాయలను Red పేపరులో ప్యాక్ చేసి సమర్పించేవారు ఎక్కడా చెల్లని మనుషులు గానో, జబ్బులతో కుళ్ళిన దేహాలతోనో జన్మిస్తారు.

మళయాళ స్వాములవారు ఒకసారి అగరం శ్రీనివాసాశ్రమంలో వేదాంత జ్ఞానసభను జరుపుతున్నారు. ఆ సమయంలో ఒక అమ్మగారు పండ్లు కొంటున్నారు. ప్రక్కనున్న ఆమె అంటున్నది, "అమ్మా! ఆ పండ్లు కుళ్ళినవి, తినటానికి పనికిరావు గదా! డబ్బు దండగ. ఎందుకమ్మా కొంటున్నావు?" అన్నది. దానికామె, "ఆ! అవి మనకు కాదులే. స్వాములవారికి ఇచ్చేందుకు" అన్నది ఆ పుణ్యాత్మురాలు. ఇది కట్టుకథ కాదు.

దానం దైవీసంపద. కొందరికి ఈ సంపద పుట్టుకతోనే వస్తుంది. కొందరికి మధ్యలో వస్తుంది. కొందరికి ధనం కలిసి వస్తే వస్తుంది. కొందరికి ఎంత కలిసి వచ్చినా మచ్చుకు కూడా ఆ గుణం ఉండదు. అయితే భగవంతుని చేరటమే లక్ష్యంగా పెట్టుకున్న సాధకులు త్యాగబుద్ధితో తమకు ఉన్నదానిలో కొంత పాత్రులకు ఇవ్వాలి. సంతోషంతో ఇవ్వాలి. ఇది నా అదృష్టం అనుకుంటూ ఇవ్వాలి. ఇది గొప్ప దైవీసంపద. ఈ దానగుణం వల్ల మనుష్య యజ్ఞం నిర్వర్తించినట్లే.

(5) **దమః చ** :- దమం అంటే "బాహ్యేంద్రియ నిగ్రహం" అని. మనలోని శక్తి వృథా కావటానికి 5 దారులున్నాయి. అవే కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక. వీటిని నిగ్రహించాలి. వీటన్నింటిలోను కన్ను, చెవి రెండూ ప్రమాదకరమైనవి. చూచినదల్లా కావాలని, విన్నదల్లా కావాలని ఆరాటపడితే మనస్సు అశాంతి పాలౌతుంది. మానవుని యొక్క విశిష్టత - ఆధిక్యత ఈ 'దమం' మీదనే ఆధారపడి ఉన్నది.

పచ్చగా కనిపిస్తే చాలు పరుగెత్తటం పశువు లక్షణం. కనిపించినా వెనకా ముందులు ఆలోచించటం మనిషి లక్షణం. ఇంద్రియాలన్నీ పశువులు . ఏది కనిపిస్తే దాని వెంట పరుగులు తీస్తాయి. ఇక ఆ ఇంద్రియాల వెంట పరుగెత్తే వాడు, వాటికి బానిసై ప్రవర్తించేవాడు ఆ పశువు కన్నా హీనం, నికృష్టుడు. పశువుకు దేహమే ప్రధానం గనుక దానికి భోగజీవితం కావాలి. కాని మనిషికి బుద్ధియే ప్రధానం గనుక భోగజీవితం ప్రధానం కాదు. అది అధమం. మనిషికి కావలసింది యోగజీవితం. యోగమార్గంలో జీవిస్తూ భోగాల పట్ల నిరాసక్తత



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చూపాలి. అపేక్ష లేకుండా ఉండాలి. అందుకే "ఇంద్రాది భోగాలన్నీ భోగాలు కాదు. అవి భవరోగాలు" అన్నాడు సంత్ తుకారాం.

గాంధీ మహాత్ముని 3 కోతుల కథ తెలుసుగదా! ఒక కోతి కళ్ళు మూసుకుంటుంది. ఒకటి చెవులు మూసుకుంటుంది. మరొకటి నోరు మూసుకుంటుంది. ఈ 3 ఇంద్రియాలను జయిస్తే చాలు అన్నింటిని జయించినట్లే. ఇంద్రలోకాన్ని జయించినట్లే. చెడు కనకు, చెడు వినకు, చెడు మాట్లాడకు. ఇదే దమం.

'దమ' అనే పదాన్ని తిరగేస్తే 'మద' అవుతుంది. దమం దైవీసంపద. మదం ఆసురీసంపద. దమం మోక్షానికి దారితీస్తుంది. మదం బంధానికి దారితీస్తుంది. మదం సంసారచక్రంలో ఇంకా ఇంకా ఇరికిస్తుంది.

అరణ్యాలలో ఉండే మృగాలలో సింహం గొప్పప్రాణి. అది 'దమం' గలిగిన ప్రాణి. సంవత్సరానికి ఒక్కసారే అది రతిసుఖాన్ని అనుభవిస్తుంది. అందుకే అది మృగరాజైంది. అరణ్యానికి మకుటం లేని మహారాజు అది. దాని రాజరికం ఎన్నికలలో నిలబడి గెలుచుకున్నది కాదు. అది తన పరాక్రమంతో - నిగ్రహశక్తితో స్వయంగా సంపాదించుకున్నది.

అరణ్యంలో మరొక గొప్ప భారీ శరీరం గల ప్రాణి ఉన్నది. అది ఏనుగు. అది మదం గలిగిన ప్రాణి. దాని చెవుల నుండి ఎప్పుడూ మదజలం కారుతూ ఉంటుంది. అందుకే దానిని మదగజం - మదపుటేనుగు అంటారు. సింహం కన్న చాలా పెద్దది. అయితే ఏం లాభం? ఆడఏనుగును చూస్తే చాలు పరుగెత్తుకుంటూ వెళుతుంది. అందుకే వేటగాళ్ళు ఒక పెద్ద గోతిని తీసి పైన

చెత్తతో కప్పి అవతలగా ఆడపనుగును కట్టివేస్తారు. అంతే. దానితో పరుగులు తీసుకుంటూ వచ్చి మగపనుగు ఆ గోతిలో పడిపోతుంది. చేతులారా చావును కొని తెచ్చుకుంటుంది. ఇది ఇంతగా నిగ్రహం లేనిది గనుకనే సింహం కలలోకి వస్తే చాలు చచ్చి ఊరుకుంటుంది. అందుకే అంత పెద్దపనుగు ఒక్క కన్నే మూసి నిద్రపోతుంది - కల రాకుండా ఉండటానికి.

మహాభారతంలో అర్జునుని గురించి తెలుసుకదా! ఇంద్రలోకం వెళ్ళినప్పుడు అప్సరస ఊర్వశి తనంత తాను వలచి వచ్చినా నిగ్రహంతో ఉన్నాడు. శాపానికి గురయ్యాడు. అయినప్పటికీ ఆ శాపం అజ్ఞాతవాసంలో వరంగా పరిణమించింది. అదే రామాయణంలో రావణుడున్నాడు. ఇంద్రుణ్ణి జయించాడు కాని ఇంద్రియాలను జయించలేకపోయాడు. అంతటి పరాక్రమశాలీ దొంగ సన్యాసి వేషం వెయ్యాల్సి వచ్చింది. మారీచుని చేత బలవంతంగా దొంగవేషం వేయించాల్సి వచ్చింది. తన సర్వనాశానాన్నీ చేజేతులా కొని తెచ్చుకున్నాడు. కనుక దమం దైవీసంపద.

(6) **యజ్ఞః చ :-** యజ్ఞం కూడా దైవీసంపదగా చెబుతున్నారు. యజ్ఞయాగాదుల గురించి వేదాలలో ప్రస్తావించారు. ఫలానా యజ్ఞం చేస్తే ఫలానా ప్రయోజనం కలుగుతుంది - అని. ఇవన్నీ కామ్యకర్మలు. ఎందుకిలా కామ్యకర్మల గురించి చెప్పారు? నిషిద్ధ కర్మలాచరించే వారిని, సోమరులను భగవంతుని వైపుకు, సత్కర్మల వైపుకు త్రిప్పటానికే. అయితే సత్కర్మలు చేయటం అలవాటైన తరువాత కామాసక్తిని, ఫలాసక్తిని తొలగించుకోవటం సాధ్యమవుతుంది. అందుకే అనేక యజ్ఞాల గురించి చెప్పారు, ఆచరించారు.

పుత్రకామేష్టి ద్వారా పుత్రులను కన్నారు. రాజసూయం ద్వారా రాజ్యాలను విస్తరించుకున్నారు. అశ్వమేధం ద్వారా పాపాలు తొలగించుకున్నారు. ఇక జన్మించిన ప్రతివారూ నిర్వర్తించవలసిన పంచ యజ్ఞాలున్నాయి. అవే దైవయజ్ఞం, ఋషి యజ్ఞం, పితృయజ్ఞం, మనుష్య(నృ) యజ్ఞం, భూతయజ్ఞం.

ఇంకా రకరకాల యజ్ఞాల గురించి నాలుగవ అధ్యాయంలో విపులంగా వివరించారు. యజ్ఞం అనేది దైవీసంపద. దైవానికి దగ్గరగా తీసుకెళ్ళేది యజ్ఞం. ఒక్కమాటలో చెప్పాలంటే యజ్ఞం అంటే త్యాగం - అని. భగవంతుని ప్రీతికోసం, లోకకళ్యాణం కోసం మనం చేసే కర్మ ఏదైతే ఉన్నదో అదే యజ్ఞం. భగవత్ప్రీతికరంగా, నిస్వార్థంగా పట్టెడన్నం పెట్టినా, గ్లాసు మంచి నీళ్ళిచ్చినా అది యజ్ఞమే.

మహాభారతంలో సక్తుప్రస్థుడనే పేద బ్రాహ్మణుడున్నాడు. అతడు భిక్షగా తెచ్చుకున్న పేలపిండిని ఆకలితోనున్నవానికి సమర్పించి భగవంతునికి ప్రీతి పాత్రుడయ్యాడు. రామాయణంలో శబరి అని ఒక అనాగరిక ముదుసలి ఉన్నది. ఆమె శ్రీరామునికి ఎంగిలి పండ్లు పెట్టి శ్రీరాముని అనుగ్రహాన్ని సంపాదించింది. భగవంతుడు నీవు ఏమి ఇస్తున్నావో చూడడు. ఎలా ఇస్తున్నావో చూస్తాడు. ఆయన చూచేది నీ విత్తాన్ని కాదు. నీ చిత్తాన్ని. కనుక యజ్ఞభావనతో - త్యాగ భావనతో కర్మలు చేయాలి. అదే దైవీసంపదలో చేరిన యజ్ఞం. కనుక లౌకికమైన కోరికలు లేకుండా, నిస్వార్థంతో చేసే కర్మయే

యజ్ఞం అవుతుంది. అన్ని యజ్ఞాలలోను శ్రేష్ఠమైన యజ్ఞం ఏదో భగవద్గీత తెలియజేస్తున్నది.

శాస్త్రాలలో ఉన్న అద్భుతమైన జ్ఞానాన్ని - మానవులు తరించటానికి భగవంతుడే గుప్తంగా నిక్షిప్తం చేసి ఉంచిన జ్ఞానాన్ని వెలికితీసి పదిమందికీ పంచి ఇవ్వటమే జ్ఞానయజ్ఞం. ఇదే శ్రేష్టమైన యజ్ఞం. ఇది చేతకాదని బాధపడవలసిన పనిలేదు. సకలదేవతలను ఆహుతులతో తృప్తిపరచే యజ్ఞాలను నిష్కల్మష హృదయంతోను, భక్తిభావంతోను, ఏ మాత్రం అహంకారం లేకుండా చేస్తే భగవంతుని అనుగ్రహం తప్పక లభిస్తుంది. దైవానికి దగ్గర చేస్తుంది. అందుకే యజ్ఞం కూడా దైవీసంపదగా పరిగణించబడుతున్నది.

(7) **స్వాధ్యాయం** :- స్వాధ్యాయం అంటే స్వయంగా శాస్త్రాలను అధ్యయనం చేయటం అని. స్వ అంటే ఆత్మ. అధ్యాయం అంటే అధ్యయనం చేయటం. కనుక స్వాధ్యాయం అంటే ఆత్మ సాక్షాత్కారానికి తోడ్పడే శాస్త్ర గ్రంధాలను స్వయంగా అధ్యయనం చేయటమే.

ప్రారంభంలో అంతలోతైన విషయాలతో కూడిన గ్రంధాలను చదవలేరు గనుక రామాయణ, భారత,భాగవత, పురాణాలను చదవాలి. ఆ తరువాత చిన్నచిన్న వేదాంత గ్రంధాలను, అ తరువాత భగవద్గీత, బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు మొ||న వాటిని అధ్యయనం చెయ్యాలి. మరి చదువురాని వాళ్ళేం చెయ్యాలి? వాళ్ళు ఇతరుల చేత చదివించుకొని వినాలి. ఇలా ప్రతిరోజూ శాస్త్ర గ్రంధాలలోని విషయాలను తెలుసుకుంటూ ఉంటే మన

జీవన విధానం మారిపోతుంది. మనస్సు ప్రశాంతమై ధ్యానానుకూలమవుతుంది.

స్వాధ్యాయం వల్ల శాస్త్రంలోని మర్మం బోధపడుతుంది. సత్సంగం సంపూర్ణమవుతుంది. సత్పురుషుల బోధలలోని జ్ఞానం నిర్ధారణవుతుంది.

"నన్ను నరకంలో పెట్టినా ఫరవాలేదు. మంచి పుస్తకాలు నా దగ్గర ఉండాలి. మంచి పుస్తకాలు నరకాన్ని స్వర్గం చేస్తాయి"- అన్నాడు లోకమాన్య బాలగంగాధరతిలక్. మంచి గ్రంధం మంచి మిత్రుడు, ఆప్తుడు.

ఈ రోజుల్లో వార్తాపత్రికలు - వారపత్రికలు - నవలలు - డిటెక్టివ్ నవలలు - ఇవే శాస్త్రగ్రంథాల బదులుగా ఉన్నాయి. వీటితో మనస్సు చెడుతుంది. సమాజం చెడుతుంది. ఇప్పటి చదువులన్నీ ఇందుకే ఉపయోగపడతాయి. నిజమైన చదువు ఏదో వేమన తెలియజేశాడు, "చదివి చదివి చదివి చావంగ నేటికి చావులేని చదువు చదువ వలయు - అని. ఏమిటి ఈ చావులేని చదువు? అదేమిటో ప్రహ్లాదుడు తెలియజేశాడు, "చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు"- అని. పరమాత్మను తెలియజేసే చదువే నిజమైన చదువు. పొట్టనింపు కొనేది గాక జీవితాన్ని తరింపజేసేదే అసలైన చదువు. అట్టి చదువునే చదవాలి. అదే స్వాధ్యాయం. స్వాధ్యాయం అందుకే దైవీసంపద అయింది. వేదాంత గ్రంధాలను, ఉత్తమ శాస్త్రాలను అధ్యయనం చేయటం ఋషియజ్ఞం అవుతుంది. దానితో ఋషిఋణం తీర్చుకున్న వారమవుతాము.

(8) **తపః**:- తపస్సు అంటే ఏమిటి? శరీరాన్ని కష్టపెట్టటం తపస్సు కాదు. ధర్మం కోసం, పరమాత్మ కోసం, మోక్షం కోసం తపించి పోవటమే అసలైన తపస్సు.

ఆ ప్రయత్నంలో కలిగే ఆటంకాలను అధిగమించాలి. కష్టాలను తట్టుకోవాలి. అంతేగాని గోచిగుడ్డ పెట్టుకొని, గడ్డాలు మీసాలు పెంచుకొని, తిండి తిప్పలు వదిలేసి, కళ్ళుమూసుకొని ఏ చెట్టు క్రిందనో, ఏ కొండగుహలోనో కూర్చోవటం తపస్సు కాదు. పరమాత్మ కోసం తపించటమే తపస్సు.

శరీరంతో చేసేది శారీరక తపస్సు. వాక్కుతో చేసేది వాచికతపస్సు. మనస్సుతో చేసేది మానసిక తపస్సు. తపస్సుతో సాధించలేని కార్యం ఏదీలేదు. తపస్సు చేసి బ్రహ్మదేవుడు సృష్టి చేశాడు. తపస్సు చేసియే బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించాలని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.

మనలో ఉన్న తపనను బట్టే జ్ఞానం మనకు లభిస్తుంది. శాస్త్రాలు తెలుసుకోవాలనే తపన ఉన్నవాడే ఆ శాస్త్రాలను బోధించే గురువుల మాటలను శ్రద్ధగా వింటాడు. శాస్త్రాలను బోధించాలనే తపన ఉన్నవారే శాస్త్రంలోని పదాల యొక్క లోతైన అర్థాల కొరకు ప్రయత్నిస్తారు.

ఐతే సామాన్యుడికి భగవంతునికై తపించటానికి సమయం ఉండదు. మెగాస్టార్ పిక్చర్ కు మొదటిరోజు టికెట్టు కొరకు క్యూలో నిలబడి చెమటలు దిగగారుతున్నా సహించి ఎలాగైనా టికెట్టుకొనాలని తపిస్తాడు. ఇక డబ్బు సంపాదనలో పడ్డవారు తిండీ నిద్రలేకుండా ఏమేం వ్యాపారాలు చేయాలి? అని నిరంతరం తపిస్తారు. కిరోసిన్ కోసం కొండవీటి చాంతాడంత ఉన్న క్యూలో నిలబడి ఎంతో సహనాన్ని చూపిస్తూ ఎలాగైనా సాధించాలని తపన పడతాడు. ఇవన్నీ తపస్సులే. అయితే లౌకిక తపస్సులు ఇవి. భగవంతుని దూరం చేసేవి. భగవంతుని దగ్గర చేసేది భగవంతుని కొరకు తపించే తపస్సే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

'తపసా కిల్బిషం హంతి' - తపస్సుతో పాపాలు పోతాయి. శరీరంలోను ముఖంలోను తేజస్సు వృద్ధి అవుతుంది.

సరే తపస్సు చేయని వారి గతి ఏమిటి? 'తప' తిరగేస్తే 'పత' అవుతుంది. అంటే పతనమే వారి గతి. కనుక భగవంతుని కోసం తపించాలి. అది దైవీసంపద. తపించేవానికే పరమాత్మ జ్ఞానం. పరమాత్మ దర్శనం.

కనుక దేవతలను, బ్రాహ్మణులను, మహాత్ములను, గురువులను పూజించటం అనే శారీరక తపస్సు చేయాలి . సత్యంగా, హితంగా, ప్రియంగా పలుకుతూ వేదవేదాంగ విషయాలను వాక్కు ద్వారా తెలియజేస్తూ వాచిక తపస్సు చేయాలి. ప్రసన్నత, ప్రశాంతత, మౌనం, ఇంద్రియ నిగ్రహం ద్వారా మానసిక తపస్సు చేయాలి. ఈ తపస్సుల కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడాలి. అప్పుడే పరమాత్మ అనుగ్రహం. కనుక తపస్సు దైవీసంపద.

(9) **ఆర్జవం:-** ఆర్జవం అంటే నిజాయితీ. ఋజువర్తనం. త్రికరణ శుద్ధి. మనసులో ఉన్నదే మాట ద్వారా చెప్పాలి. వాక్కు ద్వారా చెప్పినదే దేహేంద్రియాల ద్వారా ఆచరించాలి. ఇలా త్రికరణాల (మూడు పనిముట్లు - మనస్సు వాక్కు దేహం) ద్వారా నిజాయితీగా ఉండాలి. కల్లాకపటాలు, మాయా మర్మాలు లేకుండా ఉండాలి. అంతేగాని మనస్సులో ఉండేదొకటి, చెప్పేదొకటి, చేసేదొకటి అయితే అతడికి త్రికరణ శుద్ధిలేదు అని. దీనివల్ల మానసిక ఆందోళన అధికమవుతుంది. ఆందోళన వల్ల శక్తి వృధా అవుతుంది. దానితో ధ్యానంలో మనస్సు నిలవదు. ఆధ్యాత్మిక రంగంలో నిజాయితీ లేనివారు ఏ మాత్రం ప్రగతిని సాధించలేరు.

ఆధ్యాత్మిక రంగంలోనే కాదు. లౌకిక రంగంలో కూడా ఆర్జవం - నిజాయితీ ఉండాలి. భార్యాభర్తల మధ్య; తండ్రీబిడ్డల మధ్య, గురుశిష్యుల మధ్య; యజమాని సేవకుల మధ్య; సోదరుల మధ్య, మిత్రుల మధ్య, బంధువుల మధ్య నిజాయితీ లేకపోతే జీవిత వ్యవహారం అంతా అస్తవ్యస్తమై అశాంతి పాలౌతుంది. లౌకిక జీవితంలోనే అశాంతి అయినప్పుడు ఇక ఆధ్యాతిక జీవితం గురించి చెప్పవలసినది ఏముంటుంది?

ఈ ఆర్జవాన్ని ఎందుకు దైవీసంపద అన్నారు? దైవానికి దగ్గరగా తీసుకెళ్ళేది గనుక దైవీసంపద. అబద్ధాలు చెప్పేవారు, ఇతరులపై ఊరకే అభాండాలు వేసేవారు, ఎప్పుడు నిజం బయటపడుతుందో అని భయపడుతూనే ఉంటారు. అట్టివారికి మనస్సు అలజడితో ఉంటుంది. కనుక శ్రవణం గాని, జపధ్యానాది సాధనలుగాని చెయ్యలేరు. నిజాయితీగా ఉన్నవాడికి ఏ అలజడి ఉండదు. సాధనలు చక్కగా సాగించి దైవానికి దగ్గరవుతారు. అందుకే ఆర్జవం దైవీసంపద.

దైవీసంపదకు చెందిన మరొక 11 లక్షణాలను ఈ శ్లోకంలో చెబుతున్నారు.

శ్లో|| అహింసా సత్య మక్రోధః
త్యాగః శాంతి రపై శునం|
దయా భూతేష్వ లోలుప్త్వం
మార్దవం హ్రీర చాపలం|| (2)

**తా||** అహింస, సత్యం, కోపం లేకుండుట, త్యాగం, శాంతి, చాడీలు చెప్పకుండుట, భూతదయ, విషయలోలత్వం లేకుండుట, మృదుస్వభావం, సిగ్గు, చపలత్వం లేకుండుట - (దైవీసంపద)

**వ్యాఖ్య:-** క్రిందటి శ్లోకంలో 9 లక్షణాలు చెప్పి ఇప్పుడు మరొక 11 లక్షణాలు చెప్పబోతున్నారు. వీటిలో ఏవో కొన్ని లక్షణాలను అలవరుచుకోవాలి. అప్పుడే మనలో దైవీసంపద పెరుగుతుంది. ఆసురీసంపద దూరమై పోతుంది.

(10) **అహింస:-** హింస చేయకుండా ఉండటమే అహింస. హింస అంటే కొట్టటం, నరకటం, చంపటం మాత్రమే కాదు; తిట్టటం, దుష్ప్రచారం చేయటం, నిందలు వేయటం, ఇతరులను తమ చర్యల ద్వారా బాధించటం కూడా హింసయే. శరీరంతోగాని, వాక్కుతోగాని, మనస్సుతోగాని, సాధ్యమైనంత వరకు ఇతరులకు బాధ కలిగించకుండా ఉండటమే అహింస, ఒక్కొక్కప్పుడు ఏది హింసయో, ఏది అహింసయో చెప్పటం కూడా కష్టమే.

కాయకూరలు తరిగేటప్పుడు, చిమ్మేటప్పుడు, వంట చేసేటప్పుడు, నడిచేటప్పుడు ఎన్నో సూక్ష్మజీవులు చనిపోతాయి. హింస చేసినట్లేనా? నేను ఉపన్యాసం చేస్తుంటే మాటల ఉరవడికి వేడి పుడుతుంది. ఆ వేడిలో కొన్ని సూక్ష్మజీవులు చనిపోతాయి. హింస చేసినట్లేనా? డాక్టరు సూదితో ఇంజెక్షన్ చేసేటప్పుడు, కత్తులతో ఆపరేషన్ చేసేటప్పుడు ఎంతో బాధ. హింస చేసినట్లేనా? తల్లిదండ్రులు బిడ్డలను తిట్టి, కొట్టి మంచి మార్గంలో పెట్టాలనుకుంటారు. హింస చేసినట్లేనా? ఇదంతా హింస క్రిందకు రాదు. అలాగే యజ్ఞాలలో పశుహింస, యుద్ధాలలో శత్రునాశనం హింస క్రిందకు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రాదు. స్వార్థంతో చేసే హింసయే హింస. సొమ్ముల కోసం దొంగలు గొంతుపిసికి చంపితే హింస అవుతుంది. మత కల్లోలాలు రెచ్చగొట్టి రాజకీయ నాయకులు చేసేది హింస అవుతుంది. ఉగ్రవాదులు బాంబులుపెట్టి అమాయకులను చంపితే హింస అవుతుంది.

అందుకే ఇళ్ళు తగలబెట్టిన వారిని ఆతతాయినులు అంటారు. మరి హనుమంతుడు ఒకటీ రెండు కాదు మొత్తం లంకా నగరాన్నే తగులబెట్టాడు. ఆయనను దేవుడుగా పూజిస్తున్నాం.

ఒకడు ఎవరినైనా హత్యచేస్తే ఉరిశిక్ష పడుతుంది. అదే యుద్ధంలో శత్రుసేనలను చీల్చిచండాడిన వాడికి పరమవీర చక్ర బిరుదు నిచ్చి సత్కరిస్తాం. 18 రోజులలో 18 అక్షౌహిణుల సైన్యాన్ని సర్వనాశనం గావించిన శ్రీకృష్ణుని భగవంతునిగా పూజిస్తాం. మరి ఆయన అహింసామూర్తి ఎలా అయ్యాడు? ఈ జగత్తంతా విరాట్ పురుషుని శరీరం. ఆ శరీరంలో కౌరవులనే ఒక అంగం కుళ్ళి చెడిపోయింది. అది సంధులు, రాయబారాలు, రాజీలు అనే మందులతో తగ్గే జబ్బుకాదు. ఆపరేషన్ చేయాల్సివచ్చింది. మంచి కాంపౌండరు కావాల్సి వచ్చింది. అందుకు అర్జునుడే తగిన వాడని నిశ్చయించి జగద్ వైద్యుడైన శ్రీకృష్ణుడు చక్కగా ఆపరేషన్ నిర్వహించాడు. చెడిపోయిన - కుళ్ళిపోయిన అంగాన్ని తీసివేసి మిగిలిన దేహాన్ని ఆరోగ్యంగా ఉంచాడు. అందుకే శ్రీకృష్ణుడు అహింసావాది అయ్యాడు.

ఈ యుగంలో మనకు ముగ్గురు గొప్ప అహింసా మూర్తులు కనబడుతున్నారు. ఒకరు గౌతమబుద్ధుడు, రెండవవారు ఏసుక్రీస్తు. మూడవవారు మహాత్మాగాంధి.

భయంకరమైన అంగుళీ మాలుడనే రాక్షసుడు ఎదురుపడినా, నిర్భయంగా నిలిచి తన ప్రశాంత వదనంతో అతడిలో మార్పు తెచ్చిన మహాత్ముడు బుద్ధుడు. అహింసయే పరమ ధర్మమని బోధించిన మహాత్ముడు. తనను రాజభటులు హింసిస్తున్నా - శిలువ వేస్తున్నా ఈ పాపులను రక్షించమని ప్రార్థించిన అహింసామూర్తి ఏసుక్రీస్తు. రాజకీయాలలో శాంతి అహింసలను ప్రవేశపెట్టి, రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని ఎదుర్కొని భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించిన మహాపురుషుడు గాంధీ మహాత్ముడు.

ఈనాడు ఎక్కడ చూచినా హింసా ప్రవృత్తియే. రాజకీయం అంతా హింసామయం. వినోదాన్నందించే సినిమాలు హింసామయం. ఇప్పుడు టి.వి. లలో ప్రసారమయ్యే సీరియల్స్ అన్నీ కుట్రలు - కుతంత్రాలు - మోసాలు - హింసలతో నిండిపోయాయి. ఇక ఆధ్యాత్మిక ముసుగులో దొంగ బాబాలు, సన్యాసులు, స్వామీజీలు ధనకాంక్షతో హింసాప్రవృత్తిని పెంచి పోషిస్తున్నారు. ఒక బాబాను కోర్టు ఆజ్ఞపై అరెస్టు చేయాలంటే 14000 మంది పోలీసులను, బుల్ డోజర్లను ఉపయోగించాల్సి వచ్చిందంటే పరిస్థితి ఏ స్థాయికి పోయిందో తెలుస్తుంది. కొందరు స్వామీజీలు ఉపన్యాసాలతో జనాన్ని హింసిస్తారు. కొందరు శిష్యులు గురువులపై చాటుగా నిందలువేస్తూ

హింసిస్తారు అంతా హింసామయం. హింస ఏ రంగానికీ అతీతం కాకుండా పోయింది.

దైవానికి దగ్గర కావాలంటే అహింసా మార్గంలో ప్రయాణించాలి. సంపాదించుకున్న పుణ్యఫలం వ్యర్థం కాకుండా ఉండాలంటే అహింసయే పరమధర్మం.

(11) **సత్యం:-** సత్యం అంటే తెలిసింది తెలిసినట్లు, చూచింది చూచినట్లు, విన్నది విన్నట్లు చెప్పటమే. అయితే ఈ సత్యం హితంగా - ప్రియంగా కూడా ఉండాలి. ఇక్కడే గొప్ప చిక్కు వస్తుంది. మీ ప్రక్క ఇంటిలో ఉండే యజమానికి గుండెజబ్బు ఉన్నది. ఆయన కుమారుడికి యాక్సిడెంట్ అయింది. హాస్పిటల్ లో చేర్చారు. పరిస్థితి సీరియస్ గా ఉంది. ఈ వార్త ఆయనకు చెప్పాల్సి వచ్చింది. జరిగింది జరిగినట్లు చెబితే ఆయన హరీ! అంటాడు. మార్చి చెబితే అబద్ధం అవుతుంది. ఎలా? అలాంటప్పుడు నిజం చెప్పక పోయినా - కొంత మార్చి చెప్పినా అసత్యదోషం అంటదు.

ఒక అమ్మాయిని రౌడీలు తరుముతున్నారు. నీ ఇంట్లో దాక్కుంది. వాళ్ళు వచ్చి అడిగారు. నిజం చెబితే అమ్మాయికి ప్రమాదం. చెప్పకపోతే అబద్ధం అవుతుంది. కనుక ఏదో తెలివిగా సమాధానం చెప్పి తప్పించాలి. ఇలాంటి సమస్యే ఒక ఆశ్రమంలో సాధువుగారికి ఎదురైతే ఆయన, "చూచినవాడు చెప్పలేడు, చెప్పగలవాడు చూడలేదు" అన్నాడట. వాళ్ళు ఇదేదో మెంటల్ కేస్ అని వెళ్లిపోయారు. చూచింది కళ్ళు. చెప్పగలిగింది నోరు అని ఆయన ఆంతర్యం.

అందుకే శుక్రనీతి చెబుతున్నది. వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణ విత్తమానభంగమందు _ _ _బొంకవచ్చు - అని. సత్యం దైవీసంపద.

సత్యం పలకాలి గదా! అని గుండెలు పగిలేటట్లు నిజాలు చెప్పకూడదు. అలాగే ప్రియంగా ఉండాలి గదా! అని కట్టుకథలు, పచ్చి అబద్ధాలు చెప్పరాదు. ఇతరులకు బాధ కలగకుండా, నీకు స్వార్థ బుద్ధి లేకుండా ఉండే విధంగా సత్యం పలకాలి.

వేదంలో 'సత్యంవద ధర్మంచర' - అన్నారు. సత్యాన్ని పలుకు - ధర్మాన్ని ఆచరించు అని. దానినిప్పుడు 'సత్యంవధ ధర్మం చెర' - చేశారు. సత్యాన్ని వధించు, ధర్మాన్ని చెరబట్టు అని. సత్యానికే ప్రథమస్థానం ఇవ్వాలి.

'సత్యమేవజయతే' అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. సత్యానికి మించిన ధర్మం లేదు. 'Truth is god' అన్నారు. భూదేవి అంటుంది "పర్వతాలు అరణ్యాలు మోయటం నాకు బరువు కాదు. అసత్య వాదులను మోయటమే నాకు సాధ్యం కాదు" - అని. ధర్మరాజు ఒక చిన్న అబద్ధం ఆడాడు. భూమికి 4" ఎత్తున నడిచే ఆయన రథం ఆ దెబ్బతో నేలకు ఆనింది. చివరలో నరకదర్శనం చేయాల్సి వచ్చింది. మరి రోజూ కోకొల్లలుగా అబద్ధాలాడే వారిగతి ఏమిటి?

'ఆ! ఏదో చెబుతారు గాని నిజం మాట్లాడితే ముద్ద కూడా దొరకదు' అంటారు. ముద్ద కోసమేనా నిజం పలకాల్సింది? కష్టాలు రాకుండా ఉండటానికా? లాభం కోసమా సత్యం? సత్యం దైవీసంపద. దైవానికి దగ్గర చేసేందుకు సత్యవాక్పాలన. మోక్షసాధనకు సత్యసాధన మెట్టు. "హరిశ్చంద్రుడు సత్యాన్ని పలికితే ఏమయిందో మనకీ అంతే. కనుక సత్యాన్ని పలుకరాదు" అని

కొందరు లాపాయింటు తీస్తారు. సత్యం కోసం అన్ని కష్టాలు పడ్డాడు గనుకనే ఆయన సత్యహరిశ్చంద్రుడై శాశ్వతంగా మన హృదయాలలో జీవించి ఉన్నాడు. అబద్ధాలు పలికిన రాజులను ఎవరు తలుచుకుంటారు? ఏ కాలంలోనైనా సత్యం సత్యమే. అసత్యం అసత్యమే.

అసలు అబద్ధాలు అసత్యాలు పలకటానికి ఒక హెడ్డాఫీసు ఉంది. అదే కోర్టు. అక్కడ లాయర్లు ఎలా అబద్ధాలు చెప్పాలో, తప్పుడు సాక్ష్యాలు చెప్పాలో ట్రైనింగ్ ఇస్తారు. నేను ఇలా అడుగుతాను. నీవు ఇలా చెప్పు - అని పాఠం నేర్పుతారు. కోర్టులో ప్రశ్నలు అడిగే ముందు భగవద్గీతపై చేతులు పెట్టించి భగవంతుని సాక్షిగా అంతా నిజమే చెబుతాను. అబద్ధం చెప్పను, అని చెప్పిస్తారు. ఇదే మొదటి అబద్ధం. భగవద్గీత, భగవంతుడు ఈ అబద్ధాలకు మౌనసాక్షులు. ఇదొక అబద్ధాల ప్రపంచం. అబద్ధం తాత్కాలికంగా విజయాన్ని, లాభాన్ని కలిగించవచ్చు. కాని దాని ఫలితం మాత్రం ఘోరాతి ఘోరంగా అనుభవించవలసి ఉంటుంది.

గాంధీమహాత్మునికి సత్యం అంటే ప్రాణం. బ్రిటీషు వారిపై పోరాటంలో ఆయన ఆయుధం సత్యాగ్రహం. సత్య+ఆగ్రహం. సత్యాన్ని ఆయన తనతో పాటు తీసుకెళ్ళాడు. ఇప్పుడాయన శిష్యులు ఆగ్రహాన్ని ఆయుధంగా చేసుకొని శాసనసభల్లోను, వెలుపల వికృత తాండవం చేస్తున్నారు. సత్యాన్ని పలకటానికి ధైర్యం ఉండాలి. త్యాగబుద్ధి ఉండాలి. నిబద్ధత ఉండాలి. భగవంతుడంటే భయం ఉండాలి.

వేదాంతపరంగా సత్యం అంటే పరమాత్మ అని. అందుకే ఈశావాస్యోపనిషత్తులో 'సత్యస్యాపి హితం ముఖం' అన్నారు. అంటే సత్యస్య ముఖం అపిహితం - పరమాత్మ ముఖం కప్పబడింది - అని. సత్యాన్ని పలికితే మనం సత్య స్వరూపులమవుతాం. అంటే పరమాత్మ స్వరూపులమే అవుతాం. అందుకే సత్యాన్ని దైవీసంపదగా చెప్పటం జరిగింది. సత్యానికి మించిన పుణ్యం లేదు . అసత్యానికి మించిన పాపం లేదు. కనుక కష్టాలకు వెరవక సత్యానికి కట్టుబడిన వారే పరమాత్మ అనుగ్రహానికి పాత్రులు.

(12) **అక్రోధః** :- కోపం లేకుండుట. వచ్చిన కోపాన్ని నిగ్రహించుకొనుట. కోపం ఒక పాపం. అది విషంతో సమానం. కోపంతో ఆవేశం వస్తుంది. ఆవేశంలో విచక్షణా జ్ఞానం నశిస్తుంది. నోటికి ఏ మాటలు వస్తాయో తెలియదు. సభ్యత సంస్కారం అదృశ్యమైపోతాయి. బుద్ధిహీనస్థితికి దిగజారిపోతుంది. అందువల్ల సర్వనాశనం. 'క్రోధాద్భవతి సమ్మోహః' అంటూ క్రోధం వల్ల కలిగే నష్టాన్ని 2వ అధ్యాయంలో వివరించారు. ఈ కోపంతో శరీరానికి ఎంతో హాని జరుగుతుంది. గుండెజబ్బులు ఉంటే గుండె ఆగిపోయే ప్రమాదం ఉంది. లేనివారికి ఈ గుండెజబ్బు కోపం వల్ల వచ్చే ప్రమాదం ఉంది. బి.పి. పెరుగుతుంది. ఆరోగ్యాన్ని అన్ని విధాలా దెబ్బతీసేది ఈ కోపం. కనుక కోపాన్ని జయించాలి.

కోపంలో కోసిన ముక్కు శాంతంలో అతుక్కోదు. కోపం ఒక దయ్యం లాంటిది - భూతం లాంటిది. 'నాకు కోపం వచ్చిందా? నేను మనిషిని కాను'-

అంటాడొకడు. అది నిజం. కోపం వచ్చినప్పుడు అద్దంలో ముఖం చూసుకుంటే తెలుస్తుంది ఆ విషయం.

కోపం వచ్చిందా - కళ్ళున్నా గ్రుడ్డివాడౌతాడు, చెవులున్నా చెవిటివాడౌతాడు. తెలివి ఉన్నా బుద్ధిహీనుడవుతాడు. మంచిని చూడలేడు, వినలేడు, చదివిన చదువంతా వ్యర్థమవుతుంది.

కోపం ఛండాలుని వంటిది. ఛండాలుని తాకితే స్నానం చేస్తారు. క్రోధాన్ని తాకినా అంతే. స్నానం చేయాలి. గంగలో స్నానం చేసి ఒక బ్రాహ్మణుడు పైకి వచ్చాడు. అలాగే ఒక ఛండాలుడు కూడా స్నానం చేసి అదే రేవు మీదకువచ్చాడు. ఛీ! ఛీ! ఛండాల స్పర్శ అయిందని బ్రాహ్మణుడు మళ్ళీ గంగలో దిగాడు. ఆ ఛండాలుడు కూడా దిగాడు. నీవెందుకురా దిగావు? అని బ్రాహ్మణుడడిగితే నీవెందుకు దిగావని వాడు అడిగాడు. 'నాకు ఛండాల స్పర్శ అయింది, అందుకు - అన్నాడు బ్రాహ్మణుడు. నాకు కోపఛండాలుని స్పర్శ అయింది అన్నాడు వాడు. ఒకడు జాతి ఛండాలుడు. మరొకడు కోపఛండాలుడు.

కోపం వల్ల హృదయంలో క్షోభ కలుగుతుంది. శాంతం వల్ల శోభ కలుగుతుంది. చిన్నపాత్రలు తొందరగా వేడెక్కుతాయి. అలాగే చిన్న హృదయాలకు కోపం తొందరగా ఎక్కుతుంది. కోపం వల్ల ఇహము, పరము - రెండూ చెడతాయి.

కోపాన్ని తగ్గించుకోవటం ఎలా? ఎలా? అని అందరూ ఆరాటపడతారు. దానికి ఒకటి నుండి 50 వరకు అంకెలు లెక్కించటం ఒక

ఉపాయం. అలాగే అద్దంలో తదేకంగా ముఖాన్ని చూసుకోవటం మరొక ఉపాయం.

కోపం సర్వ అనర్థాలకు హేతువు. లౌకిక వ్యవహారాలలో గాని ఆధ్యాత్మిక వ్యవహారాలలో గాని కోపం లేకుండా ఉండాలి. అది దైవీసంపద.

(13) **త్యాగః :-** త్యాగం అంటే విడిచిపెట్టటం. వేటిని విడిచిపెట్టాలి? దీనికి అనేకమంది అనేక రకాల సమాధానాలు చెబుతారు.

- వస్తువులను వదలటం త్యాగం అంటారు కొందరు,
- వస్తువులపై గల వ్యామోహాన్ని వదలటం త్యాగమని కొందరు,
- వస్తువులు కలిగించే వికారాలను వదలటం త్యాగమని కొందరు,
- నేను దేహాన్ని - జీవుణ్ణి అనే భావన వదలటమే గొప్పత్యాగమని కొందరు,
- జీవుడు - దేవుడు అనే రెండు ఉన్నాయనే ద్వైత భావనను వదలటమే అసలైన త్యాగమని మరికొందరు అంటారు.

ఇవన్నీ త్యాగాలే. ఒక దానిని మించినది మరొకటి.

- వస్తువులను విడిచిపెట్టటం దానం క్రిందికి వస్తుంది గనుక త్యాగానికి మరొక ఉన్నతమైన అర్థాన్ని చెప్పారు పెద్దలు,
- వస్తువులపై గల రాగాన్ని విడిచిపెట్టటమే - అంటే వైరాగ్యమే త్యాగం అన్నారు రామానుజులు,
- ఆత్మకు వేరైన అనాత్మ భావాన్ని - జీవభావాన్ని విడిచిపెట్టటమే అసలైన త్యాగమని శంకర భగవత్పాదులు అన్నారు.

అనాత్మ భావనను త్యజిస్తే మిగిలేది ఆత్మభావనే. అదే నీవు. అందుకే "తేన త్యక్తేన భుంజీదా" - కనుక త్యజించి అనుభవించు అని ఈశావాస్యోపనిషత్తు అనాత్మభావనను త్యజించి ఆత్మగా ఉండిపో - అంటున్నది.

'త్యాగేనైకే అమృతత్వ మానసుః' - త్యాగం వల్లనే అమృతత్వం లభిస్తుంది - అని కైవల్యోపనిషత్తు త్యాగాన్ని గురించి చెబుతున్నది.

'త్యాగివి కమ్ము!' అని భగవద్గీత సారం.

త్యాగి ఉన్నదానికి అతుక్కోడు. లేనిదానిని కోరడు.

నేను త్యాగినా? కాదా? అని ఎవరికైనా తెలుసుకోవాలని ఉందా? అయితే ఈ రెండు ప్రశ్నలు మీకు మీరే వేసుకోండి.

1. నేను అది కావాలి, ఇది కావాలి అని కోరుకుంటున్నానా? లేదా?

2. ఉన్నవాటితో అతుక్కుపోయి వాటిని వదలలేకపోతున్నానా? లేదా?

త్యాగి భోగాలకు వ్యతిరేకి. భోగాలకు బానిసకాడు. తాను సంసారంలో ఉన్నా తనలో సంసారం ఉండదు. త్యాగం వల్లనే శాంతి లభిస్తుంది. 'త్యాగాచ్ఛాంతి రనంతరం' - అని 12వ అధ్యాయంలో చెప్పారు.

ఒక సాధువు బజార్లో వెళుతున్నాడు. ఒక పెద్ద షావుకారు ఎదురొచ్చి వినయంగా నమస్కరించాడు. సాధువు, "అయ్యా! తమరెవరో నాకు తెలియదు. నేను ఎవరినని మీరు నమస్కారం చేస్తున్నారో?" అన్నాడు. అప్పుడు షావుకారు, "స్వామీ! మీరు చాలా గొప్పవారు. సర్వసంగ పరిత్యాగులు. అందుకే మీకు నమస్కారం" అన్నాడు. "అయితే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

షావుకారుగారూ! నేను మీకు సాష్టాంగ నమస్కారం చేయాలి గాని, మీరు నాకు నమస్కారం చేయటమేమిటి? అన్నాడు షావుకారు.

దానికా సాధువు, "అయ్యా! నేను భగవంతుని కోసం ఈ అల్పమైన సంసారాన్ని, వస్తువులను, ఇళ్ళను, భోగాలను త్యాగం చేశాను. కాని మీరో! ఈ సంసారం కోసం, భోగాల కోసం ఆ భగవంతునే త్యాగం చేశారు గదా! త్యాగంలో మీరే గొప్పవారు గదా! అందుకే మీకు సాష్టాంగ నమస్కారం" అన్నాడు.

కనుక అంత పెద్ద త్యాగం మనం చెయ్యకూడదు. చిన్నచిన్న త్యాగాలే చెయ్యాలి. కాని మనం చిన్న వాటిని మాత్రం వదలలేక పోతున్నాం.

బుద్ధిపూర్వకంగా త్యాగం చెయ్యటం ఇష్టం లేకపోతే ప్రకృతే మన నెత్తిన మొట్టి బలవంతంగా త్యాగం చేయిస్తుంది. జబ్బులో, దొంగతనమో, దుబారాయో, అగ్నిప్రమాదాలో, పోగొట్టుకోవటమో - ఏదో ఒక దారిన త్యాగం చేయిస్తుంది. బలవంతపు త్యాగివి కావద్దు. దానివల్ల మనశ్శాంతి చెడుతుంది. బుద్ధి పూర్వకంగా, ఇష్టంతో త్యాగం చెయ్యి. అప్పుడే శాంతి. అప్పుడే ప్రయోజనం. అదే దైవీసంపద అవుతుంది.

(14) **శాంతిః** :- 'త్యాగాత్ శాంతిః అనంతరం' - త్యాగం తర్వాత శాంతి. అందుకే ఇక్కడ త్యాగాన్ని చెప్పి శాంతిని చెబుతున్నారు. ఇంగ్లీషు అక్షరాలు 26. మధ్య అక్షరాలు M.N. (13,14). అలాగే ఇక్కడ దైవీసంపదలో మధ్యనున్న లక్షణాలు త్యాగం. శాంతి. ప్రాపంచిక విషయాలతో - వస్తువులతో - వ్యక్తులతో సంగభావాన్ని వదలటమే త్యాగం. త్యాగం వల్లనే శాంతి.

బాండీని పొయ్యి మీద పెట్టారు . అందులో నీటి చుక్కలున్నంత వరకు చిటపటలు తప్పవు. అలాగే హృదయంలో లౌకిక విషయాలు, కోరికలు ఉన్నంతవరకు మనస్సుకు అశాంతి తప్పదు. శాంతి లేకపోతే సుఖం లేదు. 'శాంతమూ లేక సౌఖ్యమూ లేదు' అని త్యాగయ్య పాడతారు. 'అశాంతస్య కుతః సుఖం' - అశాంతితో ఉండేవానికి సుఖమెక్కడ? అని గీత ప్రశ్నిస్తున్నది.

మనం రోజూ కోరికలతో, కోపంతో, ద్వేషంతో, అసంతృప్తితో, ఆలోచనలతో, అసూయతో, గజిబిజితో, గాభరాతో పనులు చేస్తుంటాం. దీనివల్ల సుఖంగా ఉండటంలేదు. కాని రాత్రి పడుకొని గాఢ నిద్రపోయినప్పుడు ఇక మనస్సులో ఏమీ ఉండవు. అసలు మనస్సే ఉండదు. దానివల్ల సుఖంగా - హాయిగా ఆనందంగా ఉంటున్నది. ఎందువల్ల? అన్నింటిని త్యాగం చేయటం వల్లనే. అంటే త్యాగం వల్లనే శాంతి. శాంతి ఉంటేనే సుఖం అని ఋజువౌతున్నది. కనుక ఈ ప్రపంచం మిథ్యయని, ఇక్కడి వస్తువులు, విషయాలు, భోగాలు, లాభాలు, నష్టాలు అన్నీ కలలోని సంఘటనల వంటివేనని భావించి, వాటితో సంగభావాన్ని విడిచి, కేవలంగా ఉంటే శాంతియే. అట్టి శాంతి దైవీసంపదయే.

(15) **అపైశునం** :- అపైశునం అంటే చాడీలు చెప్పకుండా ఉండటం. చాడీలు చెప్పటం అనేది సమాజంలో సర్వవ్యాపకమైన రోగం. ఇంటిలో పిల్లలు ఒకరి మీద ఒకరు తల్లిదండ్రులకు చాడీలు చెబుతారు. స్కూల్లో టీచరుకు చాడీలు చెబుతారు. ఇక ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు ఒకచోట చేరితే ప్రధాన విషయం

ఇదే. ఇక రాజకీయ నాయకులు, సినిమా వాళ్ళు - అందరూ ఇందులో ఆరితేరినవారే. పల్లెల్లో రచ్చబండలుంటాయి. పేకాట, పులిజూదాలు ఆడుతూ నోరు ఊరికే ఎందుకుండాలని వారి మీద వీరు, వీరి మీద వారు చాడీలు చెబుతుంటారు ఇందరినీ చెప్పి ఆధ్యాత్మికరంగాన్ని వదిలితే తప్పే. ఆశ్రమాలలో శిష్యులు తోటివారిపై ఆశ్రమాధిపతికి చాడీలు చెబుతుంటారు. ఇక గురువులు, స్వామీజీలు వీరూ తక్కువ తినలేదు. ఈ పైశున వృత్తి వల్ల ఎవరికి ప్రయోజనం? ఎవ్వరికీ ప్రయోజనం లేకపోగా కావలసినంత పాపాన్ని మూటగట్టుకోవచ్చు. గొప్పవారిని పదిమందిలో పలుచన చేయాలని చూచే దృష్టి కాకిదృష్టి. కాకి ఎప్పుడూ ఛండాలాన్నే చూస్తుంది. హంసది గుణదృష్టి.

ఇలా చాడీలు చెప్పి ఇతరులను, మహాత్ములను పలుచన చేసేవారికి నికృష్ట జన్మలే గతి. కాకులుగానో, గడ్డి పురుగులుగానో జన్మించి వాసనలను ఖర్చు చేసుకోవాలి. ఇతరులలో దోషాలు వెతికే వారికి తమ దోషాలు తెలియవు.

చెడిపోయిన గడియారం కూడా రోజుకు రెండుసార్లు ఖచ్చితమైన టైమును చూపించినట్లు, చెడ్డవానిలో కూడా ఏవో కొన్ని మంచి గుణాలుంటాయి. హంసలాగా ఆ మంచిగుణాలను చెడ్డగుణాల నుండి వేరుచేసి గ్రహించాలి.

ప్రపంచంలో మనం సూదిలాగా ఉండకూడదు. దారంలాగా ఉండాలి. సూది బెజ్జాలు వేసుకుంటూ పోతుంది. దారం పూడ్చుకుంటూ వస్తుంది. అందుకే పెద్దలు చెబుతుంటారు. చేటలాగా ఉండు. జల్లెడలాగా ఉండవద్దు -

అని. చేట చెడును చెరిగి పారేసి మంచిని తనలో ఉంచుకుంటుంది. జల్లెడ మంచివాటిని దూరం చేసి, చెత్తాచెదారాన్ని తనలో ఉంచుకుంటుంది. చాడీలు చెప్పటం ఆసురీసంపద. చెప్పకుండా ఉండటం దైవీసంపద.

(16) **దయాభూతేషు** :- సర్వ భూతదయ దైవీసంపద. ఇది భక్తుల లక్షణం కూడా. జైన, బౌద్ధ ధర్మాలలో ఇది ముఖ్యమైనది. అల్పులపై అధికులు దయచూపించాలి. మానవులు అల్పజీవులపై దయచూపాలి. అది భూతఋణం తీర్చుకోవటమే.

దయలేనివాడు దైత్యుడు. ఆంజనేయుడు లంక నుండి తిరిగివచ్చిన తర్వాత రామునితో అన్నాడట. "దయ, సత్యం, శౌచం - రాక్షసులకు లేవు" - అని. దయ దైవత్వం. నిర్దయ రాక్షసత్వం. దయగల హృదయమే భగవన్నిలయం అన్నారు మళయాళ స్వాములవారు. నిజంగా దయ అనేది హృదయమునందే ఉన్నది.

సీతమ్మవారిని వెదకటానికి లంకకు వెళ్ళిన హనుమంతుడు అశోకవనంలో సీతాదేవిని చూచాడు. చుట్టూ రాక్షసస్త్రీలు ఆమెను తమ మాటలతో ఎలా హింసిస్తున్నారో కూడా చూచాడు. అందుకే ఆమెతో మాట్లాడేటప్పుడు, "అమ్మా! ఈ రాక్షస స్త్రీలు నిన్ను ఇంతగా హింసిస్తున్నారు గదా! నీవు గనుక అనుమతిస్తే వీళ్ళందరిని హతంచేసి వెళతాను" అని అడిగాడు. దానికి సీతాదేవి, "నాయనా! ఇలాంటి దుష్టకోరిక నీకెలా కలిగింది? పాపం వాళ్ళు మాత్రం ఏం చేస్తారు? వారు రావణుని ఆజ్ఞకు లోబడి పనిచేయవలసిన వాళ్ళు. వారికి స్వతంత్రం లేదు గదా! యజమాని చెప్పినట్లు

**సేవకులు వినక తప్పదు గదా! అదీగాక వారు రాక్షసులు. హింస వారి ప్రవృత్తి - స్వభావం. మళ్ళీ తిరిగి హింస చేయటానికి మనం రాక్షసులం కాదు గదా! దయ చూపటమే మన స్వభావం. నాయనా! సుఖం గాని, దుఃఖం గాని, ప్రతివాడికి వాడివాడి కర్మఫలంగానే వస్తాయి. వాళ్ళు చేశారు - వీళ్ళు చేశారు అనుకోవటం అర్థంలేనిపని. తనపళ్ళతో తన నాలుక కొరుక్కొని ఎవరినో అంటే ఏం ప్రయోజనం?నిరపరాధి, పరమభక్తుడు, త్యాగశీలి అయిన లక్ష్మణుని అనరాని మాటలన్నాను. ఘోరమైన నిందవేశాను. ఆ పాప ఫలాన్ని నేను అనుభవించవద్దా?" అన్నది. "అయ్యకు దయలేదు గాని రాక్షసులంటే అమ్మకెంత దయో!" అనుకున్నాడు హనుమ. దయ దైవీసంపద.**

**(17) అలోలుప్త్వం :- లోలత్వం అంటే లొంగిపోవటం. అలోలుప్త్వం అంటే నిగ్రహంగా ఉండటం. ఇంద్రియాలకు, విషయాలకు బానిసలు గాకుండటం. మానవుడిలో శక్తి సామర్థ్యాలన్నీ వృధా అయ్యేది ఈ ఇంద్రియలోలత్వం వల్లనే. ఇంద్రియాలు విషయాలతో సంపర్కం పెట్టుకొని మనస్సును ఆత్మకు దూరంగా, ప్రపంచానికి దగ్గరగా తీసుకెళతాయి.**

**ఆధ్యాత్మిక సాధకులకు ఈ విషయలోలత్వం ఉండరాదు. ఈగ తేనె యొక్క రుచికి మరిగి, దానిని వదలలేక అందులోనే చిక్కుకొని మరణిస్తుంది. అలాగే సామాన్యులు విషయలంపటంలో చిక్కుకొని, విషయానందాన్ని వదులుకోలేక అందులోనే మునిగిపోయి శాశ్వతానందానికి దూరమై నాశనమై పోతుంటారు. ఈ లోలత్వానికి గురై సామ్రాజ్యాలే పతనమయ్యాయి.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

❖ లోలత్వం వల్లనే రావణుడు సామ్రాజ్యంతో సహా పతనమయ్యాడు.

❖ కీచకుడు లోలత్వం వల్లనే భీముని చేతిలో ముద్ద ముద్దయ్యాడు.

❖ దయ అనే లోలత్వం వల్లనే భరతుడు జింకగా జన్మించాడు.

❖ అజామీళుడు ఈ లోలత్వం వల్లనే పతనమయ్యాడు.

❖ విశ్వామిత్రుడు ఈ లోలత్వం వల్లనే తపోభంగమై పతనమయ్యాడు.

కనుక లోలత్వం పతనానికి దారితీస్తుంది. పాశ్చాత్యదేశాలలో భోగాలు ఎంత పెంచుకుంటే అంతగొప్ప. మనదేశంలో ఎంత తగ్గించుకుంటే అంత గొప్ప. అలోలుప్త్వం అనేది అందుకే దైవీసంపద అయ్యింది.

(18) **మార్దవం:-** అంటే మృదుత్వం. దేహం ఎంత గట్టిగా ఉన్నా మనస్సు మాత్రం మెత్తగా - మృదువుగా ఉండాలి. కఠినత్వంతో ఉండకూడదు. కొందరిని చూడండి పైకి మెత్తగా కనిపిస్తారు. కాని గుండెలు తీసిన బంట్లు. కొందరు మాట్లాడుతుంటే ఫెళ ఫెళా రాళ్ళ వర్షం కురిసినట్లే ఉంటుంది. ఎలాంటి నిందలు వెయ్యటానికైనా, ఎలాంటి మాటలు మాట్లాడటానికైనా వెనుదీయరు. పరుషంగా మాట్లాడతారు. వారి మాటలకు అవతల వారు చాలా రోజులు బాధపడాల్సిందే. పరుషత్వం సప్తవ్యసనాలలోను ఒకటి. ఇది రాక్షస లక్షణం.

మాటలో మృదుత్వం, మనస్సులో మృదుత్వం, నడకలో మృదుత్వం, నడతలో మృదుత్వం, నవ్వులో మృదుత్వం - ఇలా అంతటా మృదుత్వం కలిగి ఉన్నవారిని భగవంతుడు మెచ్చుతాడు. కనుకనే ఇది దైవీసంపద.

ఒక మహాత్ముడు అవసానదశలో ఉన్నాడు. ఆయన శిష్యులు చుట్టూ చేరి దుఃఖిస్తూ తమకు అంతిమ సందేశం ఏదైనా ఇమ్మని ప్రాధేయపడ్డారు.

దానికి ఆయన తననోరు తెరిచి, "పళ్ళున్నాయా?" అన్నాడు. లేవు అన్నారువారు. 'మరి నాలుక ఉందా?' అన్నాడు. ఆ! ఉన్నది అన్నారు శిష్యులు. ఇదే నా సందేశం అన్నాడు. అంటే కఠినమైనవి(పళ్ళు) మధ్యలో వస్తుంటాయి, పోతుంటాయి. మెత్తగా ఉండేదే శాశ్వతంగా ఉండేది అని ఆయన భావం. పళ్ళు మధ్యలో వచ్చి పోతుంటాయి. నాలుక మొదటి నుండి చివరి దాకా ఉండేది. మృదుత్వం ఒక్కటే శాశ్వతమైనది అని చెప్పటమే ఇందులోని విశేషం.

(19) **హ్రీః :-** హ్రీః అంటే లజ్జ అని అర్థం. యోగ్యమైన లజ్జ ఒక భూషణం లాంటిది. అపకీర్తిని కలిగించే పనులకు భయపడటం, అలాంటి పనులు చేయవలసి వచ్చినందుకు సిగ్గుపడటం లజ్జ యొక్క ముఖ్యలక్షణం.

కొందరు తప్పుడు పనులు చేసేటప్పుడు భయపడతారు. అదే లజ్జ. కొందరు అదే గొప్ప విషయంగాను, ఎవరేమనుకుంటే నాకేం అనే మదంతోను చేస్తుంటారు. అలాంటి వారికి లజ్జ అనేదే లేదని అర్థం.

ఈనాటి మానవులకు సిగ్గు ఉన్నది కాని దేనికి సిగ్గు పడాలో దానికి సిగ్గుపడరు. దేనికి సిగ్గు పడాల్సిన పనిలేదో దానికి సిగ్గు పడుతుంటారు.

క్లబ్బులకు పోవటానికి, పేకాట ఆడటానికి, త్రాగటానికి, సినిమాలకు పోవటానికి, బార్ షాపుల కెళ్ళటానికి సిగ్గుపడరు. కాని దేవాలయాలకు వెళ్ళాలంటేనో, వేదాంతోపన్యాసాలు వినటానికో, గురువులను మహాత్ములను సేవించటానికో ఎక్కడ లేని సిగ్గు - లజ్జ కలుగుతుంది. కొందరికి భగవంతునికి నమస్కరించాలన్నా సిగ్గే. కొందరికి బొట్టు పెట్టుకోవాలంటే సిగ్గు. కాని సిగ్గు పడాల్సింది వీటికి కాదు, చేయకూడని పనులు చేసినప్పుడు సిగ్గుపడాలి.

(20) **అచాపలం:-** చపలం అంటే స్థిరత్వం లేకపోవుట. అచాపలం అంటే స్థిరత్వం. ఆధ్యాత్మిక రంగంలో వృద్ధిలోకి రావాలనుకొనేవారికి స్థిరత్వం ఉండాలి. ఎందుకంటే పూర్వజన్మ సుకృతం వల్ల, లభించిన గురువులవల్ల బ్రహ్మజ్ఞానాన్ని పొందుతూ, అందులో ఎంతో కొంత కృషి చేస్తున్నవారు ఈ చపలత్వం కారణంగా ఎవరో స్వాములవారు వచ్చి ఫలానా పూజ చేసుకోండి, ఫలానా మాసంలో దీపాలు వెలిగించండి ముక్తి వస్తుంది అంటే ఇక దీన్ని వదిలి దాని వెంటపడతారు. మళ్ళీ ఎవరో యోగా చేస్తేనే ఆరోగ్యం, భగవంతుని చేరుకోవటం జరుగుతుంది అనగానే ఆ వైపుకు పరుగెడతారు. అబ్బే ఇవన్నీ అక్కరలేదండీ! నామసంకీర్తనమే కలియుగంలో ముక్తికి దారిచూపేది అని చెబితే, ఓహో! అలాగా అని అటువైపుకు తిరుగుతారు. ఇలా నాలుగు రకాలుగా తిరిగి తర్వాత ఒక అనుభవం వస్తుంది, 'అబ్బే! అసలు ఇవేవీ అక్కరలేదు. హాయిగా T.V. సీరియల్స్ చూసుకుంటూ, T.V.లలో వచ్చే ఉపన్యాసాలు వింటే చాలు' అనుకొని అన్నింటికి సున్నా చుట్టేస్తారు. ఇలా ఎందరో ఉన్నతోన్నతమైన మార్గం నుండి పతనమై పోతుంటారు. అందుకే స్థిరత్వం కావాలి. చపలత్వం పోవాలి. భగవంతుని చేరుకొనే సరైన మార్గం తెలిసిన తరువాత ఆ మార్గంలోనే ప్రయాణించాలి. ఆ మార్గాన్ని చూపిన గురువునే విశ్వసించాలి. అలాగాక చపలత్వంతో - చాపల్యంతో స్థిరత్వాన్ని కోల్పోయి అటూఇటూ తిరుగుతూ ఉంటే భగవంతుడు ప్రసాదించిన అమూల్యమైన సంపదను పోగొట్టుకున్న వారవుతారు. ఇలాంటి వారికోసమే ఎందరో బాబాలు, కల్కిభగవానులు, నిత్యానందులు పుట్టుకొస్తూ ఉంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుడు మనకిచ్చిన సంపద బుద్ధి. మనం తెచ్చుకున్న సంపద మనస్సు, ఇంద్రియాలు. వీటిని బురదలో పొర్లించి, పొర్లించి వెంట తెచ్చుకున్నాం. ఇప్పుడు వీటిని బుద్ధి అనే నీటితో శుభ్రం చేసుకోవాలి. ప్రాపంచిక విషయ భోగాలలో పొర్లాడాలని తపించే మనస్సును బుద్ధి అనే పగ్గంతో కళ్ళెం వేసి, కంట్రోల్ చేసి పరమాత్మ వైపుకు త్రిప్పాలి.

కాళ్ళు ఆడిస్తాం. చేతులను త్రిప్పుతుంటాం, వాక్కుతో ఇంటి విషయాల నుండి అంతర్జాతీయ విషయాల దాకా చర్చిస్తుంటాం. కళ్ళు చపలం, కాళ్ళు చపలం, నాలుక చపలం, మనస్సు చపలం. అన్నీ చపలమే.

వీటన్నింటిని స్థిరంగా ఉంచాలి. అన్నింటికి స్థిరమైన ఆధారాన్ని చూపాలి. అప్పుడే ఈ కళ్ళు భగవంతుని చూడటానికి, చెవులు భగవంతుని గురించి వినటానికి, చేతులు భగవంతుని పూజకు, కాళ్ళు భగవంతుని చేరుటకు, మనస్సు భగవంతుని స్మరించుటకు, నాలుక భగవంతుని కీర్తించుటకు ఉన్నాయనే భావన కలిగి సర్వం భగవన్మయం అవుతుంది. నిరంతరం భగవంతుని సేవలో ఈ దేహేంద్రియాలకు సార్థకత కలగాలి. అదే అచాపలం. అది దైవీసంపద అవుతుంది. ఈ దైవీలక్షణాలను అలవరుచుకోవాలి.

ఇంతవరకు 2 శ్లోకాల్లో దైవీసంపదకు చెందిన 20 లక్షణాలను చెప్పి, ఇప్పుడీ శ్లోకంలో మరో ఆరు లక్షణాలను తెలియజేస్తున్నారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** తేజః క్షమా ధృతిః శౌచం

అద్రో హో నాతి మానితా|

భవంతి సంపదం దైవీం

అభిజాతస్య భారత!|| (3)

**తా||** తేజస్సు, ఓర్పు, పట్టుదల,శుచిత్వం, ద్రోహచింతన లేకపోవటం, అభిమాన రాహిత్యం. అర్జునా! దైవీసంపదలో పుట్టినవారి లక్షణాలు ఇవి. లేదా - పుట్టిన ప్రతివానికి ఇవే దైవీసంపద అవుతున్నాయి.

**వ్యాఖ్య:-** ఈ శ్లోకంలో మరో 6 దైవీసంపద లక్షణాలు చెబుతున్నారు.

(21) **తేజః:-** ఇదొక గొప్ప దైవీసంపద. ఇది నేర్చుకుంటే వచ్చేదికాదు. గురువు చూపిన మార్గంలో శ్రద్ధతో సాధన చేస్తే తనంతట తానుగా లభించే తేజస్సు ఇది. దీనినే బ్రహ్మతేజస్సు అంటారు. ఇది చక్కగా మేకప్ చేసుకుంటేనో, ఆకర్షణీయమైన డ్రస్ వేస్తేనో, ఆభరణాలు ధరిస్తేనో, బొట్లు పెట్టుకుంటేనో వచ్చేది కాదు. ఇలా చేస్తే అందం, ఆకర్షణ పెరగవచ్చు గాని తేజస్సు రాదు. ఈ బ్రహ్మతేజస్సు శ్రద్ధగా శాస్త్ర శ్రవణం చేయటం వల్లను, జపధ్యానాది సాధనలు చేయటం వల్లను, తపస్సు వల్లను, యోగం వల్లను లభిస్తుంది. వారి కంటి చూపులో జ్ఞానజ్యోతి కనిపిస్తుంది. వారిలో ఒక పరిపూర్ణత, సంతృప్తి, శాంతి కనిపిస్తాయి.

మహాత్ముల చిత్ర పఠాలలో వారి తలచుట్టూ ఒక తేజో వలయం ఉంటుంది. అది వారి దివ్యతేజస్సుకు సూచన. దానిని 'అరా' అంటారు. ఇది కంటికి కనిపించదు. దీనిని ఫోటో తీసే కిర్లియన్ ఫోటోగ్రఫీ అనేది

**రష్యాలో ఉన్నదంటారు. దీనిని గ్రహించలేని వారు పైపై వేషాలకే మోస పోతుంటారు. ఈ తేజస్సు దైవీసంపద.**

**(22) క్షమ:- ఓర్పు. ఎవరిలో ఓర్పు ఉంటుందో - క్షమాగుణం ఉంటుందో వారిలో కోపం, దుఃఖం మొ॥న వికారాలుండవు. తనకు ఎవరైనా అపకారం చేస్తే తిరిగి అపకారం చేసే శక్తి ఉన్నా చేయని వాడే క్షమాగుణం గలవాడు. ఇలాంటి వాడు సుఖదుఃఖాల పట్ల, లాభనష్టాల పట్ల, జయాపజయాల పట్ల - అన్ని ద్వంద్వాల పట్ల సమభావం కలిగి ఉంటాడు. దూషణ భూషణ తిరస్కారాల పట్ల సమభావంతో ఉంటాడు. ఈ క్షమాగుణం దైవీసంపద. క్షమాగుణం కలవాడిని దైవ సమానంగా చూస్తారు.**

**భూమిది గొప్ప క్షమాగుణం. తనను నాగలితో దున్ని, దోకి, అనేక హింసలు పెట్టిన వారికి భూమి అన్నం పెడుతుంది. తనను నరికిన కొడవలికి, గొడ్డలికి గంధపుచెట్టు సువాసననిస్తుంది. తనపై రాళ్ళు విసిరిన వారికి వృక్షం ఫలాలనిస్తుంది. అందుకే అవధూతలు భూమిని, చెట్లను కూడా గురువులుగా భావిస్తారు. భూమి తన మొదటి గురువు అని దత్తాత్రేయుడు అన్నాడు.**

**ఘోషయాత్ర పేరుతో పాండవులను అవమానించి, వారి ఎదుట తమ వైభవాన్ని చాటుకోవాలని దుర్యోధనుడు సంకల్పిస్తే గంధర్వుల చేతిలో తానే సోదర భార్యా సమేతుడై బందీ అయ్యాడు. ఈ విషయం తెలుసుకున్న ధర్మరాజు భీమార్జునులను పంపి కౌరవులను బంధవిముక్తులను గావించాడు. ఇదీ క్షమ. ఇతరులు చేసిన చెడును మరచిపోయి తిరిగి అవసరమైతే వారికి ఉపకారం చేయటం గొప్ప క్షమాగుణం.**

(23) **ధృతి :-** ధృతి అంటే పట్టుదల - స్థైర్యం - దృఢ నిశ్చయం. చపల చిత్తుడైన వాడు దేనినీ సాధించలేడు. విజయం సాధించేంత వరకు పట్టు వదలకుండా సాధన సాగించటమే ధృతి. ఇది దైవీసంపద.

విజయమో వీరస్వర్గమో, కరో యా మారో, Do - or Die - అంటూ ఈ ధృతిని ప్రశంశిస్తుంటారు.

ఎన్ని అడ్డంకులు వచ్చినా నిజమైన సాధకుడు సాధన ఆపకూడదు. అలా ఆపితే సిద్ధార్థుడు బుద్ధుడయ్యేవాడు కాదు. ధృవుడు చిరస్థాయిగా ఆచంద్రతారార్కం నిలిచేవాడు కాదు.

ఆధ్యాత్మికరంగంలో కూడా అనేక ఆటంకాలు వస్తుంటాయి. అనేక భయాలు, సందేహాలు కలుగుతుంటాయి. ఒకసారి ఒకరు గీతా పారాయణం చేయించారు. ఆ రోజే ఆ ఇంట్లో వారి గొడ్డు చచ్చిపోయింది. అంతే. ఆ బజారులో ఇంకెవ్వరూ గీతాపారాయణం జోలికి పోలేదు. వేదాంత శ్రవణం చేసే వారొకరు వారి స్నేహితుణ్ణి బలవంతంగా తీసుకొచ్చాడు. ఆ రోజు నుండి అతడికి జ్వరం వచ్చింది. అంటే వేదాంతం వింటే జ్వరం వస్తుందని శాసనం చేశాడు. ఇక ఎప్పుడూ దాని జోలికి పోలేదు. ఇవన్నీ మూఢనమ్మకాలు. అర్హత లేనివారికి ఇలాంటి ఆటంకాలు వస్తాయి. ఇది నిజం ఏమిటో తెలుసుకోలేని మూర్ఖుల అజ్ఞానం తప్ప మరేమీ కాదు.

గురువుగారు శిష్యుణ్ణి పిలిచాడు, 'అరే నాయనా! ఈ రోజు క్లాసుకు రాలేదేం?' అన్నాడు. దానికి శిష్యుడు, 'గురువుగారూ! ఈ రోజు భరించలేనంత కడుపు నొప్పి వచ్చింది' అన్నాడు. 'రాత్రి ఏం తిన్నావు?'

అడిగాడు గురువు. 'బాగా మజ్జిగ త్రాగాను' అన్నాడు శిష్యుడు. గురువు, "మజ్జిగ త్రాగితే కడుపు నొప్పి ఎందుకు వస్తుంది? మజ్జిగ మంచి చేస్తుంది. అంతకుముందు ఏం తిన్నావు?" అన్నాడు. దానికి శిష్యుడు, ఏమీలేదు గురువుగారూ 20 గారెలు 10 బూరెలు తిన్నానంతే' అన్నాడు. 'ఆ! అదీ సంగతి. కడుపునొప్పి రాత్రి త్రాగిన మజ్జిగ వల్ల కాదు. అంతకు ముందు తిన్న గారెలు, బూరెల వల్ల' అన్నాడు గురువు. ఇదీ అంతే. వేదాంతం వింటే జ్వరం రాదు, గీతా పారాయణం చేస్తే గొడ్డు చావదు. వీటికన్నా ముందు చేసిన కర్మల యొక్క ఫలితంగానే ఇలా జరుగుతాయి.

అసలు కారణం తెలుసుకోకుండా అపార్థాలు చేసుకొని, సందేహాలు, భయాలు పెట్టుకొని సత్కార్యాలను, సాధనలను విడిచిపెట్టకుండా ధైర్యంతో - పట్టుదలతో - ధృఢదీక్షతో వాటిని కొనసాగించాలి. అదే ధృతి. అట్టివారికే విజయం.

గౌడపాదుని మాండూక్య కారికలలో ధృతికి ఒక ఉదాహరణ ఉంది. ఒక 'టిట్టిభ పక్షి' సముద్రం ఒడ్డున గూడుకట్టుకొని గ్రుడ్లుపెట్టింది. అలలు వాటిని తనలోకి లాక్కున్నాయి. దానితో కోపం వచ్చిన పక్షి ఈ సముద్రాన్ని ఖాళీ చేయాలి అని నిశ్చయించుకొని, ఒక గడ్డిపోచను ముక్కున కరచుకొని సముద్రంలో ముంచి ఒడ్డున విదిలిస్తూ ఉంది. ఎందరు చెప్పినా వినలేదు. ఏమైనా సరే ఈ సముద్రాన్ని ఖాళీ చేసి నా గ్రుడ్లను తెచ్చుకుంటాను అని రోజులకు రోజులు అలా చేస్తూనే ఉంది. ఒకరోజు నారదుడు ఆ మార్గాన వెళుతూ చూచాడు. పక్షిని అడిగి విషయం తెలుసుకున్నాడు. ఆ తర్వాత

నారదుడు శ్రీహరిని దర్శించి, అక్కడే ఉన్న గరుడునితో, ఈ విషయాన్ని చెప్పి మీ జాతివాడికి సహాయం చెయ్యరాదా ? అనగా గరుడుడు వచ్చి సముద్రాన్ని బెదిరించి గ్రుడ్లు ఇప్పించాడట. ఇది కథే. అయినా ధృతి అంటే ఎలా ఉండాలో చెప్పటానికి గొప్ప ఉదాహరణ ఇది.

(24) **శౌచం:-** శౌచం అంటే శుచిత్వం. ఇది 2 విధాలు. బాహ్యశుద్ధి, అంతఃశుద్ధి. శరీరం, వస్త్రాలు, స్థలం, పరిసరాలు అన్నీశుభ్రంగా ఉండాలి. ఇది బాహ్యశౌచం. మనస్సు - అంతఃకరణం నిర్మలంగా ఉండాలి. ఇది అంతఃశౌచం. ఈ రెండూ లేకపోతే ధార్మిక - ఆధ్యాత్మిక రంగంలో ముందుకు పోలేం. బాహ్యశౌచం అవసరమే అయినా అంతఃశౌచం అంతకన్నా ముఖ్యం. ఇది ముఖ్యం అన్నారు గదా! అని బాహ్యశౌచాన్ని విడిచిపెట్టకూడదు.

ఒకరైతు ప్రతి సం||రం కష్టపడి పంట పండిస్తున్నాడు. అయితే పశువులు పంటను నాశనం చేస్తుంటే ఒక పెద్దరైతు ఇతడితో అన్నాడు, 'చేనుకు కంచే ముఖ్యం' అని. దానితో అతడు కంచె వేసి చక్కగా రక్షిస్తున్నాడు. ఒకరోజు ఆ పెద్దరైతు, ‘‘ఏమయ్యా! పైరు పేట్టలేదేం?’’ అన్నాడు. దానికి ‘మీరు కంచే ముఖ్యం’ అన్నారు గదా! అన్నాడీ దిక్కుమాలిన తెలివిగల బుద్ధిశాలి.

కనుక బాహ్యశుద్ధీ, అంతఃశుద్ధీ రెండూ కావాలి. జలంతో దేహాన్ని, సత్యంతో మనస్సుని, జ్ఞానంతో బుద్ధినీ, విద్యాతపస్సులతో జీవాత్మను శుద్ధి చేసుకోవాలి. 'చిత్తశుద్ధి లేని శివపూజ లేలయా' - అన్నాడు వేమన.

అయితే చిత్తశుద్ధి కలిగినట్లు ఎలా తెలుస్తుంది?

ఎప్పుడైతే అంతఃకరణంలో కామక్రోధాలు గాని, రాగద్వేషాలు గాని లేకుండా సాత్త్విక గుణాలు నిండి ఉంటాయో అప్పుడే చిత్తశుద్ధి ఉన్నట్లు. చిత్తశుద్ధి లేకుండా చేసిన సాధనాలన్నీ బోర్లించిన కుండపై కురిసిన వర్షమేఔతుంది.

ధర్మరాజు సంపూర్ణ తీర్థయాత్రకు వెళుతూ శ్రీకృష్ణుణ్ణి ఆహ్వానించాడు. ఆయన తన ప్రతినిధిగా ఒక సొరకాయను పంపి, దీనిని అన్ని తీర్థాలలో స్నానం చేయించి, దైవదర్శనం చేయించమని కోరాడు. అలాగే అని దానిని కృష్ణునిగానే భావించి, 3 నెలల తీర్థయాత్రల తరువాత వచ్చి ధర్మరాజు సమారాధన జరిపించాడు. అందరూ తాంబూలాలు వేసుకోబోయే ముందు శ్రీకృష్ణుడు, ధర్మజా! నా సొరకాయ ఏది? అన్నాడు. తెప్పించాడు ధర్మరాజు. దీని గుజ్జును తీసి అందరికీ ప్రసాదంగా పెట్టమన్నాడు కృష్ణుడు. ఆ ప్రసాదాన్ని ఆరగించిన అందరూ డోక్కుంటున్నారు. అయ్యో! కటిక చేదుగా ఉందీ ప్రసాదం అన్నారు అందరూ.

అప్పుడు శ్రీకృష్ణుడన్నాడు, ధర్మజా! ఇది అసలు చేదుదే. అయితే అన్ని పుణ్యతీర్థాలలో మునిగితే చేదు పోతుందనుకున్నాను - అన్నాడు. దీనిని బట్టి ఏం తెలుస్తున్నది? లోపల విషం అలాగే పెట్టుకొని ఎన్ని నదుల్లో మునిగినా ప్రయోజనంలేదు. చిత్తశుద్ధి ఉండాలి. చిత్తశుద్ధిలేని పూజలు వ్యర్థం - అని.

కనుక బాహ్యశౌచం కన్నా అంతఃశౌచం ముఖ్యం అని గ్రహించాలి. అందుకే శుచి కూడా దైవీసంపద అయ్యింది. శుద్ధమైన - నిర్మలమైన అంతఃకరణంలోనే పరమాత్మ నివశిస్తాడు.

(25) **అద్రోహః** :- ద్రోహం చేయకుండటం. ద్రోహచింతన కూడ ఉండరాదు. నీకు ఎవరైనా అపకారం చేసినప్పుడు వారికి ఏదో రకంగా కీడు చేయాలనే భావన ఉంటుంది. అది లేకుండా ఉండాలి అంటున్నారిక్కడ. ఇలా ద్రోహచింతన చేస్తుంటే మనస్సు కలుషితమవుతుంది. కలుషిత మనస్సులో పరమాత్మ నివశించడు. కనుక ఎవరిపట్ల కూడా ద్రోహచింతన ఉండరాదు. 'అద్వేష్టా సర్వభూతానాం' - అనేది భక్తుల లక్షణాలలో మొదటిది.

పాండవుల పట్ల దుర్యోధనునిది ద్రోహబుద్ధియే. చిన్నతనం నుండి వారికి అనేక అపకారాలు తలపెట్టాడు, చంపాలని ప్రయత్నించాడు. ఈ ద్రోహబుద్ధివల్ల సర్వనాశనమయ్యాడు. ధృతరాష్ట్రునిదీ అదే బుద్ధి. కనుకనే 100 మంది పుత్రులను కోల్పోయి ఆ పాండవుల పంచన 13 సం||లు బ్రతకాల్సివచ్చింది. కాని ధర్మరాజుకు మాత్రం కౌరవుల పట్ల ద్రోహబుద్ధి లేదు. పైగా వారు ఆపదలో ఉంటే సాయపడాలనే భావనే. అందుకే తమను అవమానించాలని ఘోషయాత్రా నెపంతో వచ్చిన దుర్యోధనాదులను గంధర్వుల చెర నుండి విడిపించి పంపించాడు. కనుకనే ధర్మరాజుకు ధర్మవిజయం కలిగింది. కనుక అద్రోహం దైవీసంపద.

(26) **నాతి మానితా**:- న+అతిమానిత: నేను గొప్పపండితుణ్ణి, గొప్పభక్తుణ్ణి, గొప్పజ్ఞానిని, గొప్పబలవంతుణ్ణి - అనే అభిమానం - మానిత్వం అంటారు. ఇలాంటి అభిమానం లేకుండుటే నాతిమాన్వితం అంటారు. అమాన్వితం అని కూడా అనవచ్చు. అమానిత్వమన్నా, నాతిమానిత్వమన్నా రెండూ ఒక్కటే. Simple living, High thinking. నీరు ఏమాత్రం గర్వం లేనిది. నేను లేకపోతే

ఎంతెంతటి మొనగాళ్ళయినా నోళ్ళు వెళ్ళబెట్టాల్సిందే - అని గర్విస్తున్నదా? ఎంత అణకువగా ఉంటుందో చూడండి. ఏ రంగు కలిపితే ఆ రంగులో కనిపిస్తుంది. ఏది కలిపితే దాని రుచే ఇస్తుంది. ఎప్పుడూ తలవంచుకొనే ఉంటుంది. క్రిందికే ప్రవహిస్తుంది. మనం నీరు లేకుండా ఒక్కరోజు కూడా గడపలేం. ఎంతటి వారైనా నీరు లేకుండా బ్రతకలేరు. ఇందరికి ప్రాణదానం చేసే నీరు తలవంచుకుంటుంటే, చిన్న సహాయం చేసినా తలఎగరేస్తాం. పేపర్లలో ఫొటోలతో సహా పేర్లు రావాలి.

మట్టిలో దాగిఉన్న విత్తనం మొలకెత్తి ఫలాన్నిస్తుంది. బయటపడ్డ విత్తనం నశించిపోతుంది. కనుక అహంకారం అభిమానం సర్వానర్థదాయకం.

ఈ పైన చెప్పిన గుణాలన్నీ దైవీసంపదకు చెందినవి. ఈ గుణాలన్నీ ఉంటే నీవు సామాన్య మానవుడవు కాదు. దైవ మానవుడవుతావు. దైవానివే అవుతావు. దైవీసంపదలో పుట్టిన వాడనని గ్రహించాలి. వీటిల్లో నీలో ఉన్న గుణాలేవో, లేనివేవో గమనించు. ఉన్నవాటిని వృద్ధి చేసుకో. లేనివాటిని సాధించ ప్రయత్నించు. కొందరిలో ఈ దైవీసంపద పుట్టుకతోనే వస్తుంది. కొందరు ప్రయత్నించి సాధించుకుంటారు. ప్రయత్నించి సాధించుకొనేవారు వీటిలో ఆచరణకు అనుకూలమనుకున్న ఏవో ఒకటి - రెండు లక్షణాలను సాధించటానికి ప్రయత్నించాలి. ఆ తరువాత మిగిలినవన్నీ తేలికగా సాధించవచ్చు.

మనలో ఏ కొంచమైనా సాత్త్వికగుణాలు ఉంటేనే వీటిని గురించి వినాలనుకుంటాం, అర్థం చేసుకుంటాం, సాత్వికగుణం బాగా ఉంటేనే

ఆచరించాలనుకుంటాం. పూర్తిగా ఉంటే ఆచరించి సిద్ధిని పొందుతాం. తీవ్రప్రయత్నంతో దైవీసంపదను పెంచుకోవాలి.

ఇంతవరకు దైవీసంపదను గురించి వర్ణించి, ఇక ఆసురీసంపద గురించి ఒక్క శ్లోకంలో తెలియజేస్తున్నారు.

**శ్లో||** దంభో దర్పోఽభిమానశ్చ

క్రోధః పారుష్య మేవచ|

అజ్ఞానం చాభిజాతస్య

పార్థ! సంపద మాసురీం|| (4)

**తా||** అర్జునా! దంభం, దర్పం, అభిమానం, క్రోధం, పారుష్యం, అజ్ఞానం - ఇవి అసురసంపదలో జన్మించిన ప్రతివానిలోను ఉండే లక్షణాలు ఇవి.

**వ్యాఖ్య:-** ఈ లోకంలో జన్మించిన ప్రతి మానవునిలోను కొద్దో గొప్పో - ఈ ఆసురీసంపదకు చెందిన లక్షణాలు ఉంటాయి. ఇవి దైవానికి దూరం చేసే లక్షణాలు. వీటిని తొలగించుకుంటేనే దైవానికి దగ్గరవుతారు. అసలు దైవీసంపదను పొందటం కన్నా ఆసురీ సంపదను దూరం చేసుకోవటమే ముఖ్యం. అందుకే ఆసురీ సంపదలో ఉన్నవారు ఎలా ప్రవర్తిస్తారు? ఎలాంటి ఆలోచనలు చేస్తారు? అట్టివారు భగవంతునికి దూరమై ఎటువంటి జన్మలను పొందుతారు? వారిగతి ఏమిటి? అనే విషయాలను గురించే ఈ అధ్యాయంలో చివరివరకూ తెలియజేయటం జరిగింది. కనుక ఆసురీ సంపద విషయంలోనే చాలా జాగ్రత్తగా ఉండాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దంభం, దర్పం, అభిమానం, క్రోధం, పారుష్యం, అజ్ఞానం - అని ఇక్కడ ఆరింటిని ఆసురీ సంపదగా చెప్పినా ఈ ఆసురీసేన చాలా పెద్దదే. దైవీసంపదలో చెప్పిన లక్షణాలకు వ్యతిరేకమైనవన్నీ ఆసురీసంపదయే. ఈ ఆరూ రోగాల వంటివి. ఒక్కరోగం ఉన్నా చాలు పీక్కోలేక చావటానికి . ఇక ఆరూ ఉంటే చెప్పేపనేలేదు. ఇక వాటిని వివరంగా తెలుసుకుందాం.

ఆసురీసంపద యొక్క లక్షణాలు.

(1) **దంభం:-** దీనినే డంబాచారం అంటారు. ఇతరులకు తన గొప్పతనాన్ని చాటటానికి చేసే ప్రయత్నమే దంభం. గొప్పతనం లేకున్నా ఉన్నట్లుగా చాటుకోవాలి.

- మ్రింగ మెతుకులేదు - మీసాలకు సంపెంగ నూనె.
- పొట్టకు రొట్టె లేకపోయినా జుట్టుకు మల్లెపూలు కావాలి.
- పైన పటారం - లోన లొటారం.
- పండితుడు కాకపోయినా పండితుడిలాగా కనిపించాలి.
- భక్తుడు కాకపోయినా భక్తుడిలాగా కనిపించాలి.
- లోపల అగ్నిపర్వతం బ్రద్దలవుతున్నా పరమ ప్రశాంతంగా ఉన్నట్లు గొప్ప జ్ఞానిలాగా ఫోజ్ ఇవ్వాలి.
- అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతున్నా గొప్ప జ్ఞానిలాగా ఫోజ్ ఇవ్వాలి.
- వార్డు మెంబరుగా ఓడిపోయినా MLA గా ఫోజ్ ఇవ్వాలి.
- చెల్లని రూపాయికి గీతలెక్కువ.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

రాజకీయనాయకులు, సమాజసేవకులు, ధార్మిక ప్రచారకులు, దొంగబాబాలు, పండితులు, పామరులు, సాధువులు, సన్యాసులు - అందరూ కూడా వారివారి అంతస్థులలో ఈ దంభదేవత పూజారులే. కొద్దో గొప్పో ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాడూ ఈ దంభానికి లొంగాల్సిందే.

మహాత్ములు, స్వామీజీలు, గురువులు, పీఠాధిపతులు ఫోటోలు దిగేటప్పుడు చూడాలి. ఆ ఊర్ధ్వదృష్టి, ఆ చిన్ముద్రలు, ఆ సమాధి నిష్ఠాగరిష్టత్వం, జపమాలలు, కమండలాలూ, కృష్ణాజినాలు, యోగదండాలు, పాదుకలు - అన్నింటిని ప్రత్యేకంగా ప్రదర్శిస్తూ ఉంటారు. సాదాసీదాగా ఉంటే ఏమిటి నష్టం? ఆ! ఎవరు చెప్పుకుంటారు గొప్పగా వారిని? నిజంగా నీలో సరుకుంటే ఎవ్వరూ చెప్పుకోనవసరం లేదు.

రామకృష్ణ పరమహంస వేషం ఎలా ఉంటుందో చూడండి. రమణమహర్షి వేషం చూడండి. గాంధీమహాత్ముని వేషం చూడండి. ఆచార్య వినోబాభావే వేషం చూడండి. వారికేం తక్కువైంది?

నీ దోషాన్ని దాచుకొని పైకి నటించటమే దంభం. ఇలాంటి డాంబికాల వల్ల ధార్మిక విశ్వాసాలు దెబ్బతింటాయి. కాషాయవస్త్రాలు ధరించి అన్ని లౌకిక విషయాలకోసం, భోగాలకోసం అర్రులు చాస్తూ ఉంటే వీడేం సన్యాసండీ. ఏం వదులుకున్నాడు? ఆశ్రమంలో అన్ని కుటీరాలు సామాన్యంగా ఉంటే వీడిది మాత్రం Special. A/C రూము, Special Meals, Costly Dressలు, ఎక్కడికన్నా రావాలంటే A/C కార్లు, ప్రవచనాలకు పిలిస్తే ముందే ఇంతని మాట్లాడుకోవటం, ముందుగానే సమర్పించుకోవటం - అని సామాన్యులు

విమర్శించే అవకాశం ఇస్తారు. ఈ విమర్శలు వారిని మాత్రమే తాకి ఊరుకోవు. వారు చెప్పే శాస్త్రాలపై కూడా దాడి జరుగుతుంది. ఆ! ఏముంది గొప్ప ఆ శాస్త్రాల్లో? మనకు తెలియని శాస్త్రాలా? అంటుంటారు. కనుక డాంబికప్రవర్తన ధార్మికరంగాన్ని కూడా దెబ్బతీస్తుంది.

ఈ డంబాచారులు కొంతకాలం, లేదా చాలాకాలం తప్పించుకోవచ్చు గాని ఎప్పుడో ఒకప్పుడు బయటపడక తప్పదు. నిజం నిలకడమీద తెలుస్తుంది. అప్పుడు నేరానికి తగిన శిక్ష కూడా పడుతుంది.

అనేకమంది దేశాధినేతలను తన చెప్పుచేతుల్లో పెట్టుకొని, ప్రపంచ వ్యాప్తంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న తాంత్రికవేత్త చంద్రస్వామి ఈ దేశంలోని అనేకమంది రాజకీయనాయకులను, అధికారులను, ఉద్యోగులను, న్యాయమూర్తులను తన మాయాజాలంలో ముంచాడు. చివరకు ఏమైంది? తీహారు జైలులో ఊచలు లెక్కబెట్టాడు. ఏమి డంబాచారం వెలగబెట్టాడు? సొంతవిమానం, సొంత విమానాశ్రయం, తన ప్రయాణ ఖర్చులు 200 కోట్లరూపాయలని ఈ దొంగసన్యాసి CBI వారికి వాంగ్మూలం ఇచ్చాడు. ఇలాంటి వారెందరో పుట్టుకవస్తున్నారు. కల్కిభగవానులు, నిత్యానందులు, రాంపాల్ బాబాలు. పాపం పండితేగాని ఫలితం అందదు. ఇలాంటి వారివల్ల కాషాయ వస్త్రాలకు, దైవకార్యాలకు, వేదాంత శాస్త్రాలకు ఎంతటి హాని కలుగుతున్నదో చెప్పలేం.

పులితోలు కప్పుకొని గాడిద ఒకటి దండగ మేత మేసిందంట. దాని గుట్టు బయటపడే సరికి దాని ప్రాణానికే ముప్పుకలిగింది. డాంబికుల కథ ఇంతే. ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం ఉందిగాని దంభానికి లేదు.

(2) **దర్పం:-** దంభానికి దగ్గర చుట్టం దర్పం. అక్కడ ఏమీలేకపోయినా గొప్పగా నటించటం. ఇక్కడ కించిత్తు ఉంటేచాలు పట్టపగ్గాలు లేకపోవటం. నాలుగు ఇంగ్లీషు ముక్కలు వస్తే చాలు. వాళ్లు మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్య మధ్యన so, but, No, Alright, Yes లాంటి పదాలను ఉపయోగించి ఇంగ్లీషులో పెద్ద పండితుణ్ణని ఫోజ్ ఇస్తారు. ఇక కొందరికి నాలుగు రూపాయలు చేతిలో ఉంటేచాలు చూపులు చుక్కల్లో ఉంటాయి.

ఒక కప్పకు రూపాయి దొరికిందట. ఇక దాని దర్పం చెప్పటానికి వీలులేదు. ఒక ఆబోతు ఆ దారిన వస్తున్నది. దాన్ని చూచి కప్ప అంటున్నది, 'ఇదిగో నా దగ్గర రూపాయి ఉంది. జాగ్రత్తగా వెళ్ళు. నేను తలచుకుంటే నిన్ను ఏమైనా చేస్తాను. నీవే పెద్దగొప్ప అనుకుంటున్నావేమో అన్నదట. తానూ ఆబోతంత కావాలని నీరు త్రాగి ఉబ్బి ఉబ్బి పొట్ట పగిలి చచ్చిందట. ఇదే దర్పం యొక్క మహిమ. కలెక్టరు కానక్కరలేదు. కండక్టరైతే చాలు. ఇకవాడి దర్పం పట్టశక్యం కాదు. తానేదో జాలితలచి ఈ ప్రయాణికులందరిని వారివారి గమ్యస్థానం చేరుస్తున్నానని, తనంతటి త్యాగపురుషుడు మరొకడు లేడని, తను ఆగమంటే బస్సు ఆగాలి, పొమ్మంటే పోవాలి అనీ, తనకు తానే కిరీటం తగిలించుకుంటాడు. అందరినీ తిరస్కరిస్తాడు. తనను తాను ప్రశంశించుకుంటాడు.

ఆధ్యాత్మికరంగంలో దర్పం సాధకుడికి శత్రువు. ఏవో రెండు ఉపన్యాసాలు విని, రెండు గ్రంధాలు చదివి, నాలుగు ముక్కలు నోటబెట్టుకొని ఎక్కడకు వెళ్ళినా ఆ నాలుగు ముక్కలూ వాడేస్తూ గొప్ప ఉపన్యాసకుడుగా ఫోజు ఇస్తాడు. అంతా తనకే తెలుసునని ఏవోవో అసందర్భ ప్రలాపాలు సాగిస్తాడు. అయితే ఎక్కడో ఒకచోట ఎదురుదెబ్బ తగిలితే గాని తత్త్వం బోధపడదు. కనుక దర్పం పనికిరాదు. దైవానికి దూరం చేసిది దర్పం.

(3) **అభిమానం:-** ఇదే అతిమానం. కులాభిమానం, జాత్యభిమానం, మతాభిమానం, విద్యాభిమానం, రూపాభిమానం, ధనాభిమానం, శీలాభిమానం - ఇలా ఎన్నిరకాల అభిమానాలో - మానమున్న చోట జ్ఞానముండదు. మానం వదిలినవాడికి విమానం వస్తుందట. తలవంచితే శివం. తలఎత్తితే శవం. అభిమానంతో మానవుడు ఉబ్బే కొద్దీ ప్రకృతి ప్రవాహంలో బాధలు తప్పవు. ఫుట్ బాల్ ను చూడండి. గాలి లేకుండా ఉంటే హాయిగా ఉంటుంది. గాలితో ఉబ్బే కొద్దీ తన్నులు జాస్తి. ఉడకని మెతుకును మనం తినం. అభిమానిని భగవంతుడు అంగీకరించడు.

ఇది నాతిమానితా అనే దైవీసంపదకు వ్యతిరేకం. తాను చాలా గొప్పవాణ్ణని, అందరూ తనను గొప్పగా చూడాలని, గౌరవించాలని, భావించుకోవటమే అభిమానం. అలాగాక తనలో ఏదన్నా గొప్ప ఉంటే అదంతా పరమేశ్వర కృప అనే భావన ఉంటే అదే వినయం. నిరాడంబరత ఉండాలి .



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మహాభారతంలో దుర్యోధనుడున్నాడు. తన గురించి తానే చెప్పుకున్నాడు 'మానధనాఢ్యుడైన భూపతి సహించుపనోపునే సపత్నుల వృద్ధియు ఆత్మహానియున్' అని. అందుకే పతనమయ్యాడు. సర్వనాశనమయ్యాడు.

(4) **క్రోధః-** దైవీసంపదలో అక్రోధం చెప్పారు. ఇప్పుడు ఆసురీసంపదలో క్రోధాన్ని చెబుతున్నారు. నిజంగా ఇది ఆసురీసంపదలో గొప్పగుణం. కోపం మానవుణ్ణి సర్వనాశనం చేస్తుంది. కోపం ఎవరికి?

కోరికలు బలంగా ఉన్నవాడికే కోపం ఎక్కువగా వస్తుంది. కోపం తారాస్థాయినందుకుంటే విచక్షణాజ్ఞానం నశిస్తుంది. తన స్థితిని, హోదాను చూడదు, అలాంటి వానికి ఏం మాట్లాడాలో - ఏం మాట్లాడకూడదో తెలియదు.

దైవాన్ని గురించి ధ్యానించాలన్నా, దైవస్మరణచేయాలన్నా మనస్సు ప్రశాంతంగా ఉండాలి. కోపంలో ఉన్నవాడికి మనస్సులో ప్రశాంతత ఉండదు. ఉద్రేకాలతో ఊగిపోతుంది. కనుక పరమాత్మను తెలుసుకొనే వీలులేదు. క్రోధం అనేది కామంవల్ల - కోరికవల్ల కలుగుతుంది. లోభం, మోహం, మదం, మాత్సర్యం - ఇవి దీని సోదరులే. కనుక దైవాన్ని తెలుసుకోవాలంటే ముందు ఈ క్రోధాన్ని జయించాలి. క్రోధం ఆసురీగుణం.

(5) **పారుష్యం:-** కఠినంగా మాట్లాడటమే పారుష్యం. పరుషం అనే పదం నుండి వచ్చినదే పారుష్యం. దైవీసంపదలో మృదుత్వాన్ని చెప్పారు. ఇక్కడ దానికి వ్యతిరేకమైన పరుష వాక్కుల గురించి చెబుతున్నారు. ఇదీ ఆసురీసంపదయే.

కొందరు స్వభావసిద్ధంగానే కటువుగా మాట్లాడటం అలవాటు. కటువుగా మాట్లాడేవారు పశ్చాత్తాపం చెందాల్సిన సందర్భాలు అనేకం వస్తుంటాయి.

మహాభారతంలో విదురనీతి అని ఉంది. అందులో "పరుషంగా మాట్లాడనివాడు, పాపపుపనులు చేయనివాడు ఉత్తముడుగా ప్రఖ్యాతి చెందుతాడు" అని విదురుడు ధృతరాష్ట్రునితో చెబుతాడు. ఇంకా విదురుడు ఇలా అంటాడు, "హితవుగా, ప్రియంగా, మనస్సుకి తృప్తిగా ఉండే మాటలు మాట్లాడగలిగితే మంచిది. లేకుంటే నోరుమూసుకొని కూర్చోవటం శ్రేయస్కరం. మనం మాట్లాడే తీరులోనే మనకు ఎవరితోనైనా స్నేహం ఏర్పడుతుంది. అలాగే దానితోనే శతృత్వం ఏర్పడుతుంది. మన వివేకం, పలుకుబడి - అన్నీ మాట్లాడే విధానంలోనే ఉన్నాయి. అందుకే పెదవి కదిపి మాట్లాడబోయే ముందు బాగా ఆలోచించి జాగ్రత్తగా మాట్లాడాలి. గొడ్డలి దెబ్బతిన్న మ్రాను మళ్ళీ చిగురించి యేపుగా పెరగవచ్చు గాని ఒక్క పరుషవాక్యం వల్ల విరిగిన మనస్సు తిరిగి కుదుటబడటం చాలా కష్టం. అలాగే శరీరంలో గ్రుచ్చుకున్న బాణాన్ని తీయవచ్చు. కాని మనస్సును నొప్పించే మాటను పలికి వెనక్కు తీసుకోవటం సాధ్యమయ్యేది కాదు" - అని ధృతరాష్ట్రునికి చేసిన బోధలో పరుషవాక్కుల వల్ల కలిగే నష్టాన్ని వివరించాడు.

వాక్కే విషం. వాక్కే అమృతం. మన శరీర అంగాల్లో అన్నింటికన్న మెత్తనిది నాలుక. అయితే అది కత్తికన్న పదునైనది. నాలుక ఎప్పుడూ కత్తిలాగానో, తేలుకొండీలాగానో ఉండకూడదు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సీతాదేవి బంగారులేడిని తెమ్మని రాముని పంపించింది. రామునికి ఆపద కలిగిందేమోనని లక్ష్మణుని పొమ్మంది. అతడు ఎంతగా నచ్చచెప్పినా వినకుండా అనరాని మాటలను, వినలేని మాటలను, పరుషమైన వాక్కులను పలికింది. ఫలితం ఏమైందో మనకు తెలుసు.

ఇలా పరుషంగా మాట్లాడటానికి క్రోధం కూడా ఒక కారణం. కనుక క్రోధాన్ని జయిస్తే - నిగ్రహిస్తే పారుష్యాన్ని కూడా నిగ్రహించవచ్చు.

నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది - అని సామెత. కటువుగా మాట్లాడేవారికి ఎక్కడ చూచినా శత్రువులే. ప్రియంగా మాట్లాడటం పూర్వజన్మ సుకృతం. పారుష్యం ఆసురీసంపద. భగవంతుని దూరం చేసేది.

(6) **అజ్ఞానం:-** అజ్ఞానం అన్ని అవలక్షణాలకు 'కుదురు'. చేయదగిన పనులేవో, చేయకూడని పనులేవో నిర్ణయించుకోవలసి వచ్చినప్పుడు సరైన నిర్ణయం తీసుకోలేక పోవటం, విపరీత నిర్ణయం తీసుకోవటమే అజ్ఞానం. అజ్ఞానం ఒక్కటుంటే చాలు అన్ని అవలక్షణాలు ఉన్నట్లే.

మావాడికి ఏ రోగం లేదండీ ఒక్కటి తప్ప అన్నాడొకడు. ఏమిటయ్యా అది? అంటే 'కుష్టు' అన్నాడు. అదొక్కటుంటే చాలు అన్నీ ఉన్నట్లే. అలాగే అజ్ఞానం ఒక్కటుంటే చాలు అన్ని అసురగుణాలు ఉన్నట్లే.

ఆధ్యాత్మిక రంగంలో ప్రగతిని సాధించటానికి పెద్ద అవరోధం అజ్ఞానమే. ఈ అజ్ఞానం తొలిగితేనే ఆత్మదర్శనం. భగవంతుని దర్శించకుండా మనకు అడ్డుపడేది ఈ అజ్ఞానమే. అందుకే ఇది ఆసురీసంపదలో చెప్పారు. ఆసురీసంపదకు మొదటిది దంభం. చివరిది అజ్ఞానం. ఈ రెండూ

ఆసురీసేనను రక్షిస్తున్నాయి. ఆసురీ సంపదలో జన్మించిన వానికి ఈ లక్షణాలన్నీ ఉంటాయి.

దైవీసంపద వల్ల ఫలితం ఏమిటి? ఆసురీ సంపద వల్ల ఫలితం ఏమిటి?

**శ్లో||** దైవీ సంపద్వి మోక్షాయ
నిబంధా యా సురీమతా |
మాశుచ స్సంపదం దైవీం
అభిజాతో2సి పాండవ! || (5)

**తా||** దైవీ సంపద మోక్షానికి, ఆసురీ సంపద బంధానికి కారణమవుతుందని నిశ్చయం. అర్జునా! దిగులు చెందకు. నీవు దైవీసంపదలోనే జన్మించావు.

**వ్యాఖ్య:-** ఓ పాండుకుమారా! అర్జునా! ఇంతవరకు నీకు దైవీసంపద అంటే ఏమిటో, ఆసురీసంపద అంటే ఏమిటో తెలియజేశాను. ఎందుకంటే దైవీసంపదను సంపాదించుకోవాలి, ఆసురీసంపదను వదిలించుకోవాలి. కారణం ఏమిటంటావా? దైవీసంపద సర్వ కర్మబంధ విమోచనానికి అంటే మోక్షానికి దారితీస్తుంది. అదే ఆసురీసంపద బంధానికి - కర్మబంధంలో - సంసార జననమరణ చక్రంలో నిన్ను గట్టిగా ఇరికించటానికి దారితీస్తుంది.

ఇంతకీ బంధమంటే ఏమిటి? నా యదార్థ స్వరూపం సర్వవ్యాపక చైతన్య స్వరూపమైన పరమాత్మయే అయినా ఆ భావన స్థిరంగా ఉండదు. నేను దేహాన్ని, మనస్సును, బుద్ధిని అని ఈ దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది, అవేనేను అనుకుంటూ నా యధార్థ స్వరూపాన్ని మరచి ఉండటమే బంధం. నేను కాని దానిలో బంధించబడి ఉండటమే బంధం. ఈ

శరీరం కదలటానికి కారణం ప్రాణం అని అనుకుంటాం. కాని ఈ ప్రాణం జడమైనదని తెలియదు. మనస్సు ఆలోచనలు చెయ్యటానికి కారణం మరేమీలేదు, అది మనస్సు యొక్క స్థితియే ననుకుంటున్నాం. ఇలా జడమైన దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ప్రాణాలు - అన్నీ చైతన్యమని భావించటమే బంధం. ఇవన్నీ చైతన్యం వల్ల పని చేస్తున్నవే - అని గ్రహించాలి. ఆ చైతన్యం ఈ దేహానికి, ఇంద్రియాలకు, మనస్సుకు, బుద్ధికి, ప్రాణాలకు ఆధారంగా ఉన్నదని, ఆ చైతన్యమే నేనని, అదే ఆత్మయని, కనుక నేను ఆత్మను - పరమాత్మను అని తెలుసుకొని, అట్టి పరమాత్మగా కేవలంగా ఉండిపోవటమే మోక్షం. అదే ఆత్మానుభూతి.

ఈ మోక్షం ఎలా కలుగుతుంది? జ్ఞానం వల్లనే. 'జ్ఞానే నైవతు కైవల్యం' - కనుక జ్ఞానం ద్వారానే మోక్షం. అయితే ఆ జ్ఞానం ఎలా కలుగుతుంది? దైవీసంపద ఉంటేనే. కనుక దైవీసంపద వల్ల జ్ఞానం, జ్ఞానం వల్ల మోక్షం. కనుక మోక్షానికి దైవీసంపద విశేషకారణం అవుతున్నది. అందుకే 'దైవీసంపద్విమోక్షాయ' అని ఈ శ్లోకంలో స్పష్టంగా చెప్పారు. అలాగే బంధం ఎలా కలుగుతుంది? అజ్ఞానం వల్ల. ఆ అజ్ఞానం ఆసురీసంపద వల్లనే బాగా వృద్ధి అవుతుంది. కనుక బంధానికి విశేషకారణం - మూలకారణం ఆసురీసంపదయే గనుక 'నిబంధాయాసురీమతా' - అని చెప్పబడింది.

దైవీసంపదలో పుట్టినవానికి 26 లక్షణాలుంటాయని, ఆసురీసంపదలో పుట్టినవానికి 6 లక్షణాలుంటాయని; దైవీసంపద మోక్షానికి, ఆసురీసంపద బంధానికి దారితీస్తుందని భగవానుడు తెలుపగానే అర్జునునిలో సందేహం

కలిగింది. ఏమిటి? దైవీసంపదలో పుట్టినవారికి 26 గుణాలుంటాయా? మరి నేను దైవీసంపదలో పుట్టానని భగవానుడు అంటున్నాడు గదా! అంటే నాలో ఆ సుగుణాలన్నీ ఉన్నాయా? అసలు మొదటి దైవీగుణం 'అభయం' గదా! అదే నాలో లేదుగదా! అభయం అంటే భయపడకుండా ఉండటం. మరి నేను యుద్ధరంగంలోకి రావటంతోనే భయపడుతున్నాను గదా! చేతులు వణికి, పెదవులు ఆరిపోయి, శక్తిహీనుడనై, గాండీవం చేతిలో నుండి జారిపోయి రథంలో కూలబడిపోయాను గదా! అందుకే గదా! శ్రీకృష్ణుడు ఇన్ని విషయాలు చెప్పి, నన్ను యుద్ధానికి ప్రోత్సహిస్తున్నది! 'యుద్ధస్య విగత జ్వరః' అని హెచ్చరిస్తున్నది. మరి దైవీసంపదలో పేర్కొన్న 'అభయం' అనే మొదటి గుణమే తనలో లేకపోతే ఇక తాను దైవీసంపదలో పుట్టినట్లు ఎలా నమ్మటం? మరి ఏమిటి తనగతి? - ఇదీ అర్జునుని సందేహం - ఆందోళన.

అర్జునుని ఆందోళనకు కారణం సరైనదేనా? విశ్లేషణ చేద్దాం.

అర్జునుడు యుద్ధరంగంలో ప్రవేశించి విషాదంతో యుద్ధం చేయనని అనటం భయపడటమా? ఇది అసుర గుణమా? కాదు. ఎందుకంటే అర్జునుడు ఎదురుగా ఉన్న సేనను చూచి భయపడటం లేదు. వీరులను చూచి భయపడటం లేదు. ఇంతకు రెండు నెలల ముందు ఇదే వీరులు - భీష్మ, ద్రోణ, కృప, అశ్వద్ధామ, దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణులు - ఇంకా అనేకమంది వీరయోధులు, రథగజ తురగ పదాతులతో కూడిన అపారసేనావాహిని విరాటనగారానికి ఉత్తరదిక్కున ఉన్న గోవులను తరలించుకు పోవటానికి వచ్చినప్పుడు ఈ అర్జునుడు బృహన్నలగా, ఏకాకిగా, కేవలం ఉత్తరుని సారథిగా

చేసుకొని, సైన్యంగాని, వీరయోధులు గాని, సోదరులు గాని ఎవ్వరు తోడు లేకుండా వచ్చి అపారసేనావాహినిని, అస్త్ర, శస్త్ర విద్యా ప్రవీణులైన వీరాధివీరులను ఎదుర్కొనుటకు వెనుకాడలేదు. ఇంకా భయపడిపోయిన ఉత్తరుని భయాన్ని పోగొట్టి ప్రోత్సహించాడు. ఆనాటి యుద్ధంలో అవక్రపరాక్రములైన భీష్మద్రోణాది వీరులను నిలువరించి, జయించి, గోవులను తరలించుకొని వెళ్ళిపోయాడు, మరి ఈనాడు సాక్షాత్తు భగవానుడైన శ్రీకృష్ణుడే తనకు సారథిగా ఉన్నాడు. తన సోదరులంతా తనకు అండగా ఉన్నారు. ప్రత్యేకించి భీమసేనుడు కొండంత అండ. మహావీరులైన పాంచాల యోధులు అండగా ఉన్నారు. 7 అక్షౌహిణులసేన తన వెనుక ఉన్నది. మరి ఇప్పుడెందుకు భయపడతాడు? కనుక అది యుద్ధానికి భయపడటం కాదు. మానసిక వేదన. ధర్మానికి భయపడటం, పాపానికి భయపడటం, తనవారిని - అందునా తనను ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేసిన తాతను, తనపై అపారమైన వాత్సల్యంతో విద్యలు నేర్పిన గురువును - శతృపక్షంలో చూచి వారిని చంపవలసివచ్చిందే అని ఆవేదన, బాధ, విషాదం. ఇది భయంకానేకాదు. పాపానికి వెరవటం. అందువల్ల అర్జునునిలో దైవీసంపదలేదని అనుకోవాల్సిన పనిలేదు.

మరి దుర్యోధనుడు యుద్ధానికి భయపడలేదు గనుక అభయం అనే దైవీసంపద కలిగియున్నాడా?

దుర్యోధనుడు భీమునికి విషాన్నం తినిపించాటానికి భయపడలేదు. పాములచే కరిపించటానికి భయపడలేదు. గంగలో త్రోయించటానికి

భయపడలేదు. లక్కయింటిలో తగలబెట్టటానికి భయపడలేదు. మాయాజూదానికి భయపడలేదు. నిండుసభలో ద్రౌపదిని ఘోరాతి ఘోరంగా అవమానించటానికి భయపడలేదు. అందువల్ల అభయం అనే సుగుణం ఉన్నదా? లేదు. ఎందుకంటే ఇవన్నీ చేసింది పాండవులంటే భయం వల్లనే. దుర్మార్గం చెయ్యటానికి భయపడితే సుగుణం. దుర్మార్గాలకు భయపడకపోతే అది దుర్గుణం. అసురగుణం.

అందుకే భగవానుడు అర్జునా! దుఃఖించవద్దు. నీవు పాండుపుత్రుడవు. పేరుకు తగ్గట్టు నీ స్వభావం కూడా పరిశుద్ధమే. (పాండు = పరిశుద్ధం). నీవు దైవీసంపదలో పుట్టినవాడవు. దైవీసంపదలో పెరిగినవాడవు ఎన్ని కష్టాలు వచ్చినా ధర్మం తప్పకుండా ప్రవర్తించినవాడవు. నీవు దైవీసంపన్నుడవనటానికి ఒక్క ఉదాహరణ చాలు.

నీవు, దుర్యోధనుడు నా సహాయంకోసం ద్వారకకు వచ్చారు. దుర్యోధనుడేమో నన్నుకాదని నా సేనను కోరుకున్నాడు. నీవేమో యుద్ధం చేయని నన్ను కోరావు. నీ రథానికి సారథిగా కోరుకున్నావు. భగవంతుని కోరేవాడు దైవీసంపద గలవాడు, భగవానుని వదలి లౌకిక సంపదలను కోరేవాడు ఆసురీసంపన్నుడు. కనుక నీవు దైవీ సంపన్నుడవు - చింతించవద్దు - అంటున్నాడు భగవానుడు. పరమాత్మ చెంత ఉంటే, రథానికి - జీవన రథానికి సారథి అయి ఉంటే ఇంక చింత ఎందుకు?

దైవీసంపదలో పుట్టిన అర్జునుడు భగవంతుని ఆశ్రయించి ఉత్తీర్ణుడయ్యాడు. మనమూ అంతే. దైవీసంపదలో పుట్టినా భగవంతుని

బోధను ఆలకించాలి. దైవీసంపదను వృద్ధి చేసుకోవాలి. ఆసురీసంపదను దూరం చేసుకోవాలి. జ్ఞానాన్ని పొందాలి. మోక్షానికి మార్గం వేసుకోవాలి. అంతేగాని నా ప్రారబ్ధం ఎలా ఉంటే అలా జరుగుతుందని ఏ ప్రయత్నం చేయకుండా కూర్చోరాదు. కనుక మోక్షసాధనలో పురుష ప్రయత్నం ఎంతో ముఖ్యమైనది. 'ఉద్ధరే దాత్మ నాత్మానం' అన్నారు. ఈ అధ్యాయంలో చెప్పినట్లుగ ఆసురీగుణాలను ప్రయత్నపూర్వకంగా తొలగించుకోవాలి. తద్వారా బంధాన్ని వదిలించుకోవాలి. అదే సమయంలో దైవీగుణాలను అలవరుచుకోవాలి, వృద్ధి చేసుకోవాలి. తద్వారా మోక్షప్రాప్తికి దారి వేసుకోవాలి.

ఇక ఆసురీ సంపద గలవారు ఎలా ప్రవర్తిస్తారో తెలియజేస్తున్నారు-

**శ్లో||** ద్వౌ భూత సర్గౌ లోకే2స్మిన్

దైవ ఆసుర ఏవచ ।

దైవో విస్తరశః ప్రోక్తః

ఆసురం పార్థ! మేశ్రుణు ॥ (6)

**తా||** ఈ లోకంలో దైవాసురులనే రెండు రకాల ప్రాణులున్నారు. పార్థా! దైవజాతిని గూర్చి విస్తారంగా చెప్పాను. అసుర జాతిని గురించి ఇక నా నుండి విను.

**వ్యాఖ్య:-** ఈ లోకంలో సృష్టి అంతా రెండు విధాలు. దైవీవర్గం, ఆసురీవర్గం. వేదం కూడా అలాగే తెలియజేస్తున్నది. "ద్వయాహావై ప్రాజాపత్య దే

వశ్చా2సురాశ్చా" - ప్రజాపతి సంతానం దేవతలు - అసురులు అని రెండు విధాలు. అయితే 3వ వర్గం కూడా ఒకటి ఉన్నది. అదే రాక్షస వర్గం. దానిపట్ల భగవానుడిక్కడ మౌనం వహిస్తున్నాడు. ఎందుకంటే వారు సంస్కరింపబడటం అసాధ్యం కనుక. వారిలో ఏ మాత్రం వికాసం ఉండదు. వారు నీచయోనులందు జన్మించినవారు. కాలమే వారిని పరిపక్వం చేసి అసురవర్గంలో చేర్చాల్సిందే గాని వారు ఏ ప్రయత్నమూ చేయరు, చేయాలనే ఊహరాదు. తెలియదు.

- మంచివాడు ప్రయత్నంతో తన మంచితనం నిలుపుకోవాలి.
- చెడ్డవాడు తనలోని చెడును తొలగించుకొని మంచివాడుగా మారాలి.
- కాని పరమ దుర్మార్గుడో - వాడికి మంచి - చెడూ తెలియదు. మార్పు చెందడు. అందుకోసం ప్రయత్నించడు. బాగుపడటానికి వీలులేని జన్మ. వాణ్ణి వదిలేద్దాం.

అన్నం వేడిగా ఉన్నప్పుడు రెండవ ఆలోచన లేకుండా తినేస్తాం. ఒకవేళ మరునాటికి తినాల్సివస్తే జాగ్రత్తగా చూస్తాం. మెత్తబడి చెడిపోయిందేమో గమనిస్తాం. పైన అంతా బాగుండి అడుగున బాగా లేకపోతే దానిని తీసేసి బాగున్న దానిని తినవచ్చు. అలాగాక 2,3 రోజుల తర్వాత చూస్తే అంతా పాచిపోయి, కంపు కొడుతుంది. దాన్ని ఏంచేస్తారు? దాన్ని దూరంగా ఎక్కడో పారవెయ్యాలి. అంతే.

అలాగే దైవీసంపద గలవాడు దైవీసంపదను వృద్ధి చేసుకుంటూ ఆసురీ గుణాలు చేరకుండా ప్రయత్నిస్తాడు. ఆసురీ గుణాలున్నవాడు వాటిని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దూరంగా త్రోసివేస్తూ దైవీ గుణాలను అలవరుచుకోవటానికి ప్రయత్నిస్తాడు. రాక్షస ప్రవృత్తి గలవాడు మారడు, మారాలని తెలియదు. అందుకే పాచిపోయిన అన్నాన్ని వదిలేసినట్లు వదిలేయాలి. కనుక ఇద్దరినే చెప్పటం జరిగింది.

దైవీసంపదను గూర్చిఇంతవరకు అనేక విధాలుగా చెప్పటం జరిగింది. భగవద్గీత అంతా అదే. భగవంతుని వైపు నడిపించటమే. ఆసురీ సంపదను అక్కడక్కడ సూచన మాత్రంగా మాత్రమే చెప్పటం జరిగింది. కనుక ఇక్కడ ప్రత్యేకంగా ఆసురీ గుణాలు గలవారి పనులు ఎలా ఉంటాయో వారి ఆలోచనలు, ఆచరణ ఎలా ఉంటుందో వివరంగా ఇక నుండి తెలియజేయబోతున్నారు.

సాధారణంగా ప్రపంచంలోని అన్ని మతగ్రంధాలు మంచితనం, ధర్మం, సద్భావనలు, సద్గుణాలు, సత్కర్మలు - వీటిని వివరంగా తెలియజేస్తాయి. మనం వాటిని చదివి, విని, తెలుసుకొని అలా మంచి భావాలు, మంచి లక్షణాలతో పయనం సాగించాలని తెలుసుకుంటాం. అయితే చెడ్డగుణాల గురించి, నిషిద్ధ కర్మల గురించి, దుర్మార్గపు ఆచరణ గురించి ఆయా మతగ్రంధాలు చెప్పవు. కాని హిందూ ధర్మ శాస్త్రాలు గాని, మత గ్రంధాలు గాని, ఈ చెడ్డ విషయాల గురించి వివరణ ఇస్తున్నాయి. ఎందుకు? మానవుడు తనలోని లోపాలను, చెడును తెలుసుకోగలిగితేనే ఆ లోపాలను, చెడును తొలగించుకొనుటకు వీలవుతుంది. తెలుసుకోలేకపోతే ఇక ప్రయత్నమే జరగదు గదా!



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

సుగుణాలు, దుర్గుణాలు - రెండింటికి నిలయం హృదయం. అవి రెండూ గుణాలే. సుగుణాలకు కళంకం కలిగితే దుర్గుణాలవుతాయి. ఇప్పుడు దుర్గుణాలను గుర్తించగలిగితే, వాటిలోని మలినాలను తొలగించగలిగితే చాలు అవి సుగుణాలౌతాయి. అందుకే ఆసురీ సంపదను గూర్చి కూడా వివరంగా వర్ణించవలసి వచ్చింది. 'వాటిని నా నుండి విను' అంటూ భగవానుడు అందుకే చెబుతున్నాడు.

ఇక ఈ శ్లోకం నుండి ఆసురీ సంపన్నులైన వారు ఎలా ప్రవర్తిస్తారో, వారి భావాలేమిటో, వారి ఆలోచనలు ఎలా సాగుతాయో వివరించబోతున్నారు. ఎవరైతే ఈ విషయాలను శ్రద్ధతో విని, అర్థం చేసుకొని, తమను తాము పరిశీలన చేసుకుంటారో - వారు తమలోని చెడును కనుగొనగలగుతారు, దానిని తొలగించుకొనేందుకు ప్రయత్నం చేస్తారు.

ఆసురీ సంపన్నుల గుణాలు, ఆచారాలు గురించి -

**శ్లో||** ప్రవృత్తించ నివృత్తించ
జనాన విదురా సురాః|
నశౌచం నాపి చాచారః
న సత్యం తేషు విద్యతే|| (7)

**తా||** అసుర స్వభావం గల మానవులు ధర్మప్రవృత్తిని గాని, అధర్మ నివృత్తిని గాని తెలుసుకోలేరు. వారికి శుచిత్వం ఉండదు. ఆచారం కూడా సరిగా ఉండదు. వారిలో సత్యం కూడా కానరాదు.


Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**వ్యాఖ్య:-** లోకంలో సాధారణంగా 3 రకాల మానవులుంటారు. వారు -

(i) ఉత్తములు:- వీరు అసలు ఎప్పుడూ తప్పులే చేయనివారు. ఒకరిచేత చెప్పించుకోవలసిన పనిలేని వారు.

(ii) మధ్యములు:- వీరు అప్పుడప్పుడు తప్పులు చేస్తుంటారు. అయితే ఇతరులు చెప్పినప్పుడు విని, వారి ప్రవర్తనను మార్చుకుంటారు. ఇక ఆ తరువాత ఎప్పుడూ తప్పులు చేయరు.

(iii) అధములు:- వీరు ఎప్పుడూ తప్పులే చేస్తుంటారు. వీరికి మంచి ఏమిటో తెలియదు. తెలిసినా ఆ మార్గాన నడవరు. ఒకవేళ ఎవరైనా చెప్పినా వినిపించుకోరు, తమ ప్రవర్తనను మార్చుకోరు.

ముఖ్యంగా ఈ శ్లోకంలో ఇలాంటి వారిని గూర్చే తెలియజేస్తున్నారు. వీరికి ప్రవృత్తి - నివృత్తులంటే ఏమిటో తెలియదు. వాటిని పట్టించుకోరు. ప్రవృత్తి అంటే ధర్మకార్యాలు, పుణ్యకార్యాలు, సత్కర్యాలు చేయుటయందు ఆసక్తి. నివృత్తి అంటే అధర్మకార్యాలు, పాపకార్యాలు, దుష్కార్యాలు - మొ||న వాటి వైపుకు మనస్సు పోకుండుట, వీరికి ఆ రెండూ తెలియవు.

చేయవలసిన పనులు ఏమిటో తెలియనందున చేయవలసిన పనులు చేయరు. చేయకూడని పనులు ఏవో తెలియనందున వాటిని చేస్తారు. వారికి విధినిషేధాలు తెలియదు. వారి స్వభావం అంతా అకటావికటం. వారి పద్ధతులన్నీ అస్తవ్యస్తం - అయోమయం.

- తమకు తెలియదు. తెలిసిన వాళ్ళను ఎగతాళి చేస్తారు.
- తాము చేయరు. చేసేవాళ్ళను ఎగతాళి చేస్తారు.

- **తమకు తోచదు. ఎవరన్నా చెబితే వినరు.**

**ఇదీ ఆసురీ స్వభావం గల వారి ప్రవర్తన.**

**వారిలో ఏకోశానా శుచిత్వం ఉండదు. రూపులోకాని, చూపులో కాని, పలుకులో గాని, భావంలో గాని, కాగడాపట్టి వెతికినా శౌచం లేదు. పైగా శుచిగా ఉన్నవారిని చూసి ఎగతాళి చేస్తారు.**

**ప్రతిరోజు కళ్ళు తెరవకముందే - పళ్ళు తోమక ముందే బెడ్ కాఫీ కావాలి. 'ఆచారః ప్రథమో ధర్మః' - ధర్మాలలో మొదటిది ఆచారం అన్నారు. ఆచార హీనుని వేదాలు కూడా కాపాడలేవు. అందరూ అంగీకరించే ఆచారాలను, అందరూ పాటించే ఆచారాలను, సర్వసాధారణమైన వాటిని అందరూ పాటించాలి. కాని ఆసురీ స్వభావం గలవారికి ఆచారాలను పాటించటం చిన్నతనం - నామోషీ. ఆచారహీనులు సత్యాన్ని పలకరు. సత్యము - శౌచము మోక్షార్థికి చాలా ముఖ్యం. అందుకే యమ నియమాలలో ఈ రెండింటిని చెప్పారు.**

**యమ అంటే అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం. నియమ అంటే శౌచం, తపస్సు, స్వాధ్యాయం, సంతోషం, ఈశ్వర ప్రణిధానం.**

**'దయా సత్యంచ శౌచంచ రాక్షసానాం నవిద్యతే' - రాక్షసులకు దయ, సత్యం, శౌచం అనేవి తెలియదు - అని లంక నుండి తిరిగివచ్చిన హనుమంతుడు శ్రీరామునితో అన్నాడు. కనుక ఇవి లేనివారు అసురులే. కనుక వీటిని తెలుసుకొని వాటి కొరకు ప్రయత్నించాలి. సాధన చేయాలి.**

**ఆసురీ సంపన్నుల ఆలోచనలు ఎలా ఉంటాయి?**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** అసత్య మప్రతిష్ఠంతే

జగదాహు రనీశ్వరం |

అపరస్పర సంభూతం

కిమన్య త్కామ హైతుకం || (8)

**తా||** అసురగుణ సంపన్నులు ఈ జగత్తు అసత్యమని, ధర్మాధర్మ వ్యవస్థ లేనిదని, అసలు పరమేశ్వరుడు లేడని అంటారు. ఈ జగత్తు ఎవరివల్లనో పుట్టింది కాదని, కామమే కారణంగా గలిగినదని అంటారు. స్త్రీపురుష సంయోగం వల్ల తప్ప ఇతరకారణం ఏదీ లేనిదని వారి భావం.

(i) ఆసురీ సంపన్నులది నాస్తికవాదం. ఈ జగత్తు అసత్యం, అప్రతిష్టం, అనీశ్వరం అనేది వీరి భావన.

- 'అసత్యం' అంటే పట్టించుకోవలసినది కాదు - అని.
- 'అప్రతిష్టం' అంటే దీనికి ఆధారంగా, అధిష్టానంగా ఏదో దివ్యశక్తి లేదని -
- 'అనీశ్వరం' అంటే అందరిని, అన్నింటిని శాసించే ప్రభువు లేడని.

జగత్తు అసత్యం అని అసుర స్వభావం గలవారు - నాస్తికులు అంటున్నారు. వేదాంతులు కూడా బ్రహ్మ సత్యం జగన్మిధ్య - పరమాత్మ సత్యం, జగత్తు మిథ్య అనే అంటున్నారు - అంటే జగత్తు లేనిదే - అసత్యమే అంటున్నారు. ఐతే ఇద్దరిలోనూ ఒక భేదం ఉన్నది. జగత్తు అసత్యమే అయినా దీనికి ఆధారంగా ఒక దివ్యశక్తి ఉన్నదని, దీనిని సృష్టించి, పాలించే ఈశ్వరుడున్నాడని వేదాంతులంటారు. అలాంటి దివ్యశక్తి ఉన్నదని ఆసురీ సంపన్నులు అంగీకరించరు.

జగత్తు అంటే కదిలేది, మార్పులు చెందేది అని అర్థం. ఈ కదలటం మార్పులు చెందటం దాని స్వభావమని ఆసురీ సంపన్నులంటారు. ఈ కదలటం మార్పులు చెందటం వెనుక ఒక స్థిరమైన ఆధారం ఉన్నదని వేదాంతులు అంటారు. తాము కంటితో చూచేదే సత్యమని, ఆసురీ సంపన్నులు నమ్ముతారు. బాహ్యంగా కనిపించే దానికన్న శుద్ధమైన బుద్ధికి అందే విషయం మరొకటి ఉన్నదని వేదాంతులు నమ్ముతారు.

- మార్పులు లేని ఒక స్థిరమైన ఆధారం ఉంటేనే మార్పు అనేది జరుగుతుందని శాస్త్రజ్ఞులు కూడా అంగీకరిస్తారు.
- స్థిరమై నిశ్చలంగా ఉండే తెర ఒకటి ఉంటేనే దానిపై బొమ్మలు కదిలి సినిమా ప్రకాశిస్తుంది.
- చలనం లేని నదీగర్భం ఉంటేనే దానిపై నదీజలం ఉరవడిగా ప్రవహించి చలిస్తుంది, పరుగులు తీస్తుంది.

మరి ఈ జగత్తులో భూమితో పాటు అనేక గ్రహాలు నిరంతరం తిరుగుతూ ఉంటాయి. ఈ సూర్యకుటుంబం అంతా కదులుతూనే ఉంటుంది. మరి కదిలే ఈ జగత్తుకు ఆధారంగా కదలకుండా స్థిరంగా ఒక శక్తి ఉండాలి కదా! అదే పరమాత్మశక్తి. కనుక కదిలేదానికి ఆధారంగా ఉన్న తత్వమే సత్యతత్త్వం. అదే ప్రతిష్ఠం. కాని ఈ ఆసురీ సంపన్నులు అట్టి సత్యాన్ని అంగీకరించరు. అందుకే జగత్తు అసత్యమే కాదు అప్రతిష్టం అని కూడా అంటారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అంతేకాదు 'అనీశ్వరం' అని కూడా అంటున్నారు. ఈశ్వరుడు అంటే శాసించేవాడు - ప్రభువు అని అర్థం. మన మంచి చెడ్డలను చూసేవాడు, తప్పు చేస్తే శిక్షించేవాడు, మంచి చేస్తే ప్రశంసించేవాడు, ఫలితాన్నిచ్చే వాడు ప్రభువు. అంతేకాదు అందరినీ శాసించేవాడు. ఇలా నడుచుకోవాలి - అలా నడుచుకోకూడదు అని చెప్పేవాడే ప్రభువు - శాసకుడు.

అట్టి ప్రభువు - ఈశ్వరుడు ఒకడు ఉన్నాడని వీరు అంగీకరించరు. ఈ జగత్తులో ఉన్న గ్రహాలు, ఉపగ్రహాలు అన్నీ ఎంత వేగంతో తిరగాలో, ఏ మార్గంలో తిరగాలో ఎవరు శాసించారు? పాపాలు చేసినవారికి దుఃఖాలు, పుణ్యం చేసినవారికి సుఖాలు ఎవరు ఇస్తున్నారు? వీటన్నింటిని ఇచ్చే కర్త - ఈశ్వరుడు - ప్రభువు ఒకరు ఉండాలని వేదాంతులు నమ్ముతారు. అయితే పాపపుణ్యాలు లేవు, జగత్తును శాసించేవాడు లేడు, అలా తిరగటం ఈ జగత్తు యొక్క స్వభావం - అంతే. అలాగే సుఖదుఃఖాలనేవి మన తెలివితేటల వల్లనే వస్తుంటాయి అని నమ్మేవారు ఆసురీ సంపన్నులు. నిరీశ్వర వాదులు వీరు.

వీరెందుకిలా నాస్తికులవుతున్నారు? - దేవుడు లేడని, పాపపుణ్యాలు లేవని, ధర్మం అధర్మం లేదని త్రోసివేస్తే స్వేచ్ఛగా సంచరించవచ్చునని, ఎన్ని అన్యాయాలు, అక్రమాలు చేసినా ఫరవాలేదు అనే భావం. ఈ ప్రపంచం ముణ్ణాళ్ళ ముచ్చట అని, బ్రతికినన్నాళ్ళు హాయిగా తిని, త్రాగి చావాలని, అప్పుచేసైనా పప్పు కూడు తినాలని, ఎందరిని హింసించినా మనం హాయిగా బ్రతకాలి అని భావిస్తుంటారు. కాలి భస్మమైన తరువాత ఈ శరీరం మళ్ళీ ఎలా

వస్తుంది? కనుక ఉన్నన్నాళ్ళు భోగజీవితం అనుభవించాలనే భావన వీరిది. అందుకే ఈ నాస్తిక వాదన చేస్తుంటారు. మరి ఈ జగత్తు ఎలావచ్చింది? -

(ii) **అపరస్పర సంభూతం:-** అపర అంటే పురుషుడు, పర అంటే స్త్రీ. అసలు ఈ సృష్టి అంతా స్త్రీపురుషుల కలయిక వల్లనే జరుగుతున్నది. ఇందులో దేవుని జోక్యం ఎక్కడుంది? వేదాంతులు ఏవో చెబుతారు - భగవంతుడని - ఆయన వల్లనే సృష్టి అనీ - అవన్నీ ఒట్టిది. ఇవన్నీ కాకమ్మ కథలు అనేది వీరి వాదన. వీరి వాదనలో నిజమెంత?

స్త్రీ పురుషుల కలయిక వల్లనే సృష్టి జరుగుతున్నదంటే - మరి స్త్రీపురుషులు కలిసినా ఎందుకు సంతానం కలగటంలేదు? కొందరికి ఏదో లోపం ఉంటే కలగటం లేదు అనుకుందాం. లోపం లేని వారికి కూడా ఎందుకు కలగటం లేదు? దీనికి వారేదో కాకమ్మకథలు చెబుతారు గాని, కర్మఫలం కారణంగానే ఇలా జరుగుతున్నదని చెప్పక తప్పదు.

సరే కర్మలను బట్టే ఫలితం గదా! ఇంక ఇందులో భగవంతుని ప్రసక్తి ఎందుకు? అని మీమాంసకుల సందేహం. ఈ సందేహాన్ని భగవాన్ రమణ మహర్షి తన ఉపదేశసారంలో మొదటి శ్లోకంలోనే తీర్చేశారు.

**శ్లో||** కర్తృ రాజ్ఞయా ప్రాప్యతే ఫలం |
కర్మ కింపరం కర్మ తజ్జడం||

కర్మ జడమైనది గనుక తనంత తాను ఫలితాన్నివ్వదు. ఫలితం కర్త (భగవంతుని) యొక్క ఆజ్ఞ చేతనే లభిస్తుంది - అని.

నీ ఇంట్లో నెలరోజులు పనిచేసిన పనిమనిషికి జీతం ఇచ్చేది ఎవరు? ఆ పనిఇస్తుందా? ఆ ఇంటి కర్తవైన నీవు ఇస్తున్నావా?

అలాగే కర్తయైన భగవంతుడే కర్మ ఫలాలనిస్తాడు. అదీ మనం చేసిన కర్మలను బట్టి.

దీనిని బట్టి సృష్టి కేవలం స్త్రీపురుషుల కలయిక వల్ల మాత్రమే కాదు. స్త్రీపురుషుల కలయిక అనే మార్గం ద్వారా భగవంతుడే మన కర్మఫలాలను బట్టి ఇస్తాడు. ఆయన ఇవ్వటానికి కర్మఫలాలు లేకపోతే ఎన్నాళ్ళు స్త్రీపురుషులు కలిసినా ప్రయోజనం ఉండదు.

(iii) **కిమన్యత్ కామ హైతుకం** :- కామం తప్ప వేరొక కారణం ఏదీలేదు - అని వారి విశ్వాసం. వాళ్ళు తెలివి తక్కువ వారు కాదు, ఆలోచించలేని వారూ కాదు. కాని బుద్ధి శుద్ధంగా లేనివారు. అందుకే వారు - కనిపించేదే నిజం, కమ్మగా తినేదే తిండి, అందినంతవరకు అనుభవించటమే కర్తవ్యం, కడుపే కైలాసం, విలాసమే వైకుంఠం; వారికి రెండే పురుషార్థాలు - అర్థం, కామం. Wealth - wine - women - ఇవే వారి ప్రస్థాన త్రయాలు.

రూపం మీద - రూపాయల మీద పడిచస్తారు. బ్లాక్ మార్కెట్ చేసో, దొంగనోట్లు వేసో, లంచాలు పట్టో, మోసాలు చేసో - ఏదో విధంగా వచ్చే డబ్బే వారికి పరమాత్మ. అందుకే 'పైసామే పరమాత్మహై' అంటారు. సిగ్గులేని సినిమా తారలు, రంగులు మార్చే రాజకీయనాయకులు వారికి ఆచార్యులు. ఇవీ ఆసురీ స్వభావం గలవారి ఆలోచనలు -

ఇలాంటి వారికి ఎలాంటి జన్మలు వస్తాయి? -

**శ్లో||** ఏతాం దృష్టి మవష్టభ్య
నష్టాత్మా నోఽల్ప బుద్ధయః|
ప్రభవం త్యుగ్ర కర్మాణః
క్షయాయ జగతోఽహితాః|| (9)

**తా||** ఈ రకమైన దృష్టిని అవలంబించి, సంకుచిత బుద్ధి గలవారై, భ్రష్టులైన వీరు లోకకంటకులై, దాని నాశనాన్ని కోరుతూ క్రూరకర్మలు చేసేవారై పుడతారు.

**వ్యాఖ్య:-** (i) **ఏతాం దృష్టిం అవష్టభ్య :-** ఈ రకమైన దృష్టిని అవలంబించినవారు. ఏ రకమైన దృష్టి? ఈ జగత్తు అప్రతిష్టం, అనీశ్వరం - అంటే ఈ జగత్తు నిరాధారమైనది, భగవంతుడనే వాడెవడూ లేడు అనే దృష్టి గలవారు. ఇది ధర్మం - ఇది అధర్మం అనిగాని, ఈ పని చెయ్యవచ్చు - ఈ పని చెయ్యకూడదు అనిగాని, ఇది పాపం - ఇది పుణ్యం అనిగాని చూడకుండా విచ్చలవిడి తనంతో, నీతినియమాలు లేకుండా, హింస, క్రూరత్వంతో తమ సుఖాల కోసం - భోగాల కోసం, స్వార్థం కోసం ఎలాంటి ఘోరాలకైనా తెగబడతారు. జీవితాలను పశుప్రాయంగా గడుపుతారు. చివరకు సర్వనాశనమై పోతారు. వీరే నష్టాత్ములు, అల్ప బుద్ధులు. వీరు క్రూరకర్ములై, లోకకంటకులై తమకు, లోకానికి నాశనాన్ని తెచ్చిపెడతారు.

(ii) **నష్టాత్మా:-** ఇక్కడ ఆత్మ అంటే మనస్సు. నష్టాత్మా అంటే మనస్సు చెడినవారు. సరైన ఆలోచన చేయలేరు. అశాంతితో ఏపని సరిగ్గా చేయలేరు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఏ తెలివీ ఉండదు. అతితెలివి ఉంటుంది. వారికి మనస్సే కాదు, మనస్సుతో పాటు బుద్ధి కూడా చెడుతుంది. భ్రష్టులై యుంటారు.

(iii) **అల్పబుద్ధయః**:- అల్పబుద్ధులు అల్పమైన వస్తువులపై ఆసక్తి కలిగిఉంటారు. అల్పవస్తువు లేవి? అధిక వస్తువేది? పరమాత్మయే అధికవస్తువు పరమాత్మతో సమానమైనది గాని, అంతకన్న అధికమైనది గాని మరేదీ లేదు, ఉండదు. ఈ ప్రాపంచిక వస్తువులన్నీ అల్పవస్తువులే. వీటిని పట్టుకొని ప్రాకులాడే వాడల్లా అల్పబుద్ధియే.

రావణాసురినికి 10 తలలు . అన్నింటిలోని బుద్ధిని ఒకచోట చేర్చి కుప్పవేస్తే ఎంత పెద్దది? కాని అతడిది అల్పబుద్ధియే. రాక్షస బుద్ధియే. అతడు మహాభక్తుడే అయినా అల్పమైన విషయాన్ని పట్టుకొని నాశనమైపోయాడు. నాస్తిక దృషిగలవారు అల్పమైన విషయాలను పట్టుకొని ఇంకా నాశనమైపోతారు.

అటువంటి అల్పబుద్ధులైన వారు ఎటువంటి కర్మలు చేస్తారు? ఎలా ప్రవర్తిస్తారు? ఎలాంటి కర్మలు చేసే వారుగా పుడతారు?

(iv) **ఉగ్రకర్మాణం** :- క్రూరమైన కర్మలు చేసేవారుగా జన్మిస్తారు. ఎంతటి హింసకైనా తెగబడతారు. వారికి భగవంతుడే లేడు గనుక భయమూ లేదు. భక్తీ లేదు.

పరభార్యాపహరణం చేయాలనుకున్నాడు రావణుడు. దానికోసం తపస్సు చేసుకొనే మారీచుని తపస్సును భగ్నం చేశాడు. బంగారులేడిగా మాయారూపాన్ని ధరించి దండకారణ్యంలో తిరుగుతూ ఉండమని, రాముడు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

బాణం వేయగానే రాముని కంఠ స్వరంతో హా! సీతా! హా! లక్ష్మణా! అని కేకలు వేయమని చెప్పాడు. తానేమో దొంగసన్యాసి వేషం వేశాడు. ఇలాంటి దొంగవేషాలు వేయవలసిన ఖర్మ అంతటి లంకేశ్వరునికి ఎందుకు వచ్చింది? బుద్ధి అల్పవిషయాల మీదకు పోవటం వల్లనే. దానివల్లనే సర్వనాశనం అయ్యాడు.

పరులరాజ్యం మీద, సంపదల మీద ఆశపడ్డాడు దుర్యోధనుడు. అందుకోసం విషం పెట్టాడు, గంగలో త్రోయించాడు, లక్కయింట తగలబెట్టాలనుకొన్నాడు. మాయాజూదం ఆడించాడు, ద్రౌపదీదేవిని నిండు సభలో వలువలూడ్పించి అవమానించాడు, అరణ్యవాసానికి పంపాడు. అక్కడవారు సుఖంగా ఉన్నారేమోననే అసూయతో ఘోషయాత్రకని వెళ్ళి అవమానాల పాలయ్యాడు. దుర్వాసుని ప్రయోగించాడు, ఉత్తరదక్షిణ గోగ్రహణాలు జరిపించాడు, భగవంతునే బంధించబోయాడు. చివరకు కురుక్షేత్రయుద్ధంలో సర్వనాశనమయ్యాడు. ఈ క్రూరకర్మలన్నీ ఎందుకు చేసినట్లు? అల్పబుద్ధి గనుక. దంభం, దర్పం, క్రోధం, పారుష్యం, అజ్ఞానం, అభిమానం మూర్తీ భవించినవాడు కావటంవల్ల. ఆసురీ సంపన్నుడు గనుక.

(v) **క్షయాయ జగతోఽహితాః**:- ఇలాంటివారు లోకకంటకులే. జగత్తుకు అహితులై తమ క్రూరకర్మల ద్వారా లోకకంటకులౌతారు. ఈనాడు కూడా ఆసురీగుణాలు గల వారెందరో అల్పవిషయాల పట్ల ఆసక్తులై, భ్రష్టమనస్కులై, మూర్ఖులై ఎంతటి క్రూరకర్మలైనా తెగబడుతున్నారు. మతం పేరుతో దేశం పేరుతో ఉగ్రవాదానికి పూనుకొని అమాయకుల నెందరినో బలి తీసుకొనే

దౌర్భాగ్యులు ఈ కోవకు చెందినవారే. వీరే సమాజానికి పట్టిన చెదపురుగులు. శరీరంలో క్యాన్సర్ క్రిమి లాంటివారు. విమానాలు హైజాక్ చేయటం, ఆకాశంలో పేల్చివేయటం, శక్తివంతమైన బాంబులు పెట్టి జనసంచారం ఎక్కువగా ఉన్నచోట పేల్చి హింసాకాండను సృష్టించటం, భవనాలను కూలగొట్టటం, నాయకులను చంపటానికి వాహనాలను పేల్చివేయటం - ఇలా క్రూరమైన, ఘోరమైన కర్మలకు తెగబడి చివరకు నాశనమైపోయే వారంతా ఈ భ్రష్టమైన దృష్టి గలవారే. నాశనం చేయటమే వీరి పని. వీరిది విధ్వంసక పద్ధతి. విధాయక పద్ధతి కాదు. ఇలా జగత్తుకు - లోకానికి అహితం చేసి చివరకు తామూ నాశనమైపోతారు.

వీరిలో ఏ మాత్రం మానవత్వం ఉన్నా - బుద్ధిలో ఏ మాత్రం జ్ఞానం ఉన్నా ఇలాంటి ఆలోచనలు చెయ్యరు. ఇలాంటి క్రూరకర్మలు చేయరు. ఇలా జన్మలకు జన్మలు నీచులుగా - భ్రష్టులుగా జన్మిస్తూ ఉంటారు ఈ ఆసురీ సంపన్నులు.

ఇంకా వారి ఆలోచనలు ఎలా ఉంటాయో, ప్రవర్తన ఎలా ఉంటుందో . . .

శ్లో|| కామ మాశ్రిత్య దుష్పూరం
దంభ మాన మదాన్వితాః |
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్
ప్రవర్తంతేఽశుచివ్రతాః || (10)

**తా||** తనివి తీరని కోరికలతో, దంభమాన మదాలతో, అవివేకంతో, మొండి పట్టుదలలు గలవారై నీచప్రవృత్తులు గలవారై ప్రవర్తిస్తుంటారు.

**వ్యాఖ్య:-** ఆసురీస్వభావం గలవారు నిరీశ్వరవాదులు. అనగా భగవంతుడులేడని, ఉన్నదేదో ఈ ప్రపంచమేనని, అదీ మూణ్ణాళ్ళ ముచ్చటేనని, కనుక త్వరత్వరగా అనుభవించవలసిన భోగాలన్నింటిని అనుభవించాలని, పాపపుణ్యాలంటూ ఏమీలేవని భావించేవారు. వీరు భౌతికవాదులు. వీరు ఈ ప్రపంచంలో తిరిగేటప్పుడు వీరి మనస్సులోని వికారభావాలు ఎలా ఉంటాయో ఈ శ్లోకంలో చక్కగా వర్ణిస్తున్నారు.

(i) **కామం ఆశ్రిత్య దుష్పూరం :-** దుష్పూరం కామం అంటే తనివితీరని కోరికలు. ఇలా అనంతమైన కోరికలను ఆశ్రయించేవారు ఈ శుద్ధభౌతికవాదులు. మనం ఏ పని చేయాలన్నా దానికి మూలకారణం కోరికలే. కోరికలు లేకపోతే ప్రయత్నాలు ఉండవు. పనులు చేయాల్సిన అవసరం ఉండదు.

సంతోషంగా - ఆనందంగా ఉండాలనుకుంటున్నాం గనుక ఏవో వస్తువులు కావాలనుకుంటున్నాం. వాటిని తెచ్చుకోవాలంటే డబ్బుకావాలి. ఆ డబ్బు కావాలంటే ఏదో ఒక పని - వృత్తి, వ్యాపారం, వ్యవసాయం - - - ఏదో ఒకటి చేయాలి. ఒక కోరిక తీరితే మరొక కోరిక పుడుతుంది. అనంతంగా కోరికలు పుడుతూ ఉంటే సంకల్పాలకు, ప్రయత్నాలకు, పనులకు అంతు ఉండదు. కొందరికి గొంతెమ్మ కోరికలుంటాయి. అవి ఎప్పటికీ తీరవు. కోరికల స్వభావం అనంతంగా సాగిపోవటమే.

యయాతి 10వేల సంవత్సరాలు కామోప భోగాలలో తేలియాడాడు. అయినా తృప్తి లేదు. చివరకు మనస్సును నిగ్రహించుకొని కోరికలను త్యజించాడు. కట్టెలు వేసిన కొద్దీ అగ్ని ప్రజ్వరిల్లినట్లు అనుభవించిన కొద్దీ కోరికలు ఇంకా ఇంకా పెరిగిపోతుంటాయి. ఇదొక విషవలయం. ఈ కోరికల విషవలయంలో పడిపోతే ఏం జరుగుతుంది?

(ii) **దంభమాన మదాన్వితాః**:- దంభమానమదాలు పెరిగిపోతుంటాయి. అనంతమైన కోరికలు కలిగినవాడు ఒక కోరిక తీరిన తర్వాత మరొక కోరికను తీర్చుకొనుటకు ప్రయత్నిస్తూ - ఇలా కోరికల విషవలయంలో పడిపోతాడు. కోరిన కోరికలన్నీ తీరిపోతూ ఉంటే అతడిలో దంభం, మానం, మదం పెరిగిపోతాయి.

దంభం అంటే డంభాచారం. నేనే గొప్పభాగ్యవంతుడనని, విద్యావంతుడనని, తెలివిగలవడినని గొప్పలకు పోతుంటాడు. దానితో మానం - అంటే అభిమానం - దురభిమానం కలుగుతుంది. తనకన్న అధికులు ఉంటే సహించలేని మనస్తత్వం ఏర్పడుతుంది. ఈ లోకంలో ఒకరి కన్న ఒకరు గొప్పవారుంటారు. దుర్యోధనుని లాగా పరుల గొప్పతనాన్ని, సంపదలను చూచి సహించలేని కుళ్ళుబోతుతనం ఏర్పడుతుంది. ఇదే దురభిమానం. దానితో మదం హెచ్చుతుంది. దక్షప్రజాపతి దంభమానమదాన్వితుడే. ఈశ్వరుని కన్నా తానే గొప్ప అనుకున్నాడు. ఈశ్వరుడు లేకుండా యాగం చెయ్యాలనుకున్నాడు. అహంకరించాడు. అందరినీ పిలిచి ఈశ్వరునికి ఆహ్వానం పంపలేదు. నిరీశ్వర యాగం యుద్ధరంగమైంది. తలతెగి

హోమగుండంలో పడిపోయింది. అహంకారం అణగటంతో మేకతల వచ్చింది. ఈశ్వరుని దయతో యజ్ఞం పూర్తయింది.

- లేనిదానిని ఉన్నట్లు ప్రదర్శించటం దంభం.
- ఉన్నదానిని అన్నింటికన్నా గొప్పగా భావించటం అభిమానం.
- ఈ అభిమానం వల్ల కలిగేది మదం. నేనే గొప్ప అనుకోవటం.

ఈ మదంతో విచక్షణాజ్ఞానం నశిస్తుంది.

దంభం, దర్పం, మానం, మదం ఉన్న ఒక రాజుగారు పండితులను పిలిచి నాకూ శత్రురాజుకు జరిగిన యుద్ధాన్ని, అందులో మనకు కలిగిన విజయాన్ని వర్ణిస్తూ నన్ను ధర్మరాజుగా - ఎదటి శత్రురాజును దుర్యోధనునిగా పోల్చి మహాభారతం వ్రాసి తెమ్మన్నాడు. ఆ రాజుకు కీర్తికాంక్ష. ఎవరైతే వ్రాయరో వారి తలలు కోటగుమ్మానికి వ్రేలాడదీస్తానన్నాడు. దానితో పండితులు భయంతో గజగజలాడుతూ వెళ్ళారు. అందరూ సమావేశమై ఏంచేయాలా? అని ఆలోచించారు. ఒకరోజున అందరూ రాజుగారి వద్దకు వెళ్ళి, రాజా! అందరం తలకొక రకం వ్రాస్తే బాగుండదు గదా! మా అందరి తరపునా మన ప్రధాన పండితులవారు మహాభారతాన్ని వ్రాస్తారు. అనుజ్ఞ ఇవ్వండి అని వేడుకున్నారు. 6నెలలు గడిచింది. రాజు పండితుని అడిగాడు, ఎంతవరకు వచ్చింది నీ రచన? అని. పూర్తయి పోతున్నది మహారాజా! ఇంకొక్క వారంరోజుల్లో మీకు సమర్పిస్తాను అన్నాడు. వారం తరువాత ఒక బండిపై వేలకొద్దీ ఎండిన ఖాళీ తాటాకులకట్టలు ఎక్కించి వెంట తెచ్చాడు. 'మహారాజా! ఇదిగో గ్రంథం పూర్తయింది' అన్నాడు. మహారాజు చదివి వినిపించమన్నాడు.

జనంతో క్రిక్కిరిసి పోయింది సభ. ఆ పండితుడు, 'మహారాజా! అంతా పూర్తయి పోయింది. కాని ఒక్క సందేహం మిగిలి ఉంది. అది మీరు తీరిస్తే పూర్తిచేసి చదివేస్తాను' అన్నాడు పండితుడు. 'ఏమిటా సందేహం?' అన్నాడు రాజు.

"మహారాజా! ధర్మరాజుగా మిమ్మల్ని పోల్చి వ్రాశాను. మీ భార్యను ద్రౌపదిగా పోల్చి బ్రహ్మాండంగా వర్ణించాను. మరి ద్రౌపదికి ధర్మరాజు కాక ఇంకా నలుగురు భర్తలున్నారు గదా! మరి మీ భార్యకు ఆ మిగిలిన నలుగురిని ఎవరిని పెట్టి వ్రాయమంటారు?" అన్నాడు పండితుడు ఎంతో వినయంతో.

దానితో మహారాజు క్రోధంతో, "ఛీ!ఛీ! ఈ గ్రంథాన్ని తగులబెట్టేయండి" అన్నాడు. వెంటనే బండి వద్ద ఉన్న సేవకుడు నిప్పంటించగా ఆ తాటాకుల కట్టలన్నీ బూడిద కుప్పగా మారిపోయినవి.

దంభమాన మదాలకు లొంగినవానికి వివేకం ఉండదు. వివేకం లేనివాడికి మొండిపట్టుదల ఎక్కువగా ఉంటుంది.

సాధారణంగా ఫ్యాక్షన్ రాజకీయాలలో మునిగిన వారికి ఇలాంటి మొండిపట్టుదలలు ఎక్కువ. వారికి వివేకం ఉండదు. మదం - అభిమానం అధికం. అందుకే వాణ్ణి నరికేయాల్సిందే అని పట్టుబట్టి ఎదుటివాణ్ణి చంపేస్తారు. ఆ వర్గం వాళ్ళు అదే పట్టుదలతో వీళ్ళను చంపుతారు. ఇలా చంపుకుంటూ తరతరాలు పగను పెంచుకుంటూనే ఉంటారు. అంతేకాదు.

(iii) **ప్రవర్తంతే అశుచివ్రతాః**:- ఇలాంటి వారి ప్రవర్తన కూడా నీచమైనదే. జూదం, మద్యపానం సర్వ సాధారణం. దీనివల్ల కాపురాలు నాశనమైపోతాయి. ఇక మాంసభోజనం ఎలాంటిదో వేదాలు, స్మృతులు చెబుతున్నాయి.

"మాంసభోజనం విడిచి శుద్ధాన్నం భుజించేవారు శ్రేష్ఠుల" ని ఋగ్వేదం 2వ అష్టకం మొదటి మంత్రం చెబుతున్నది.

"ప్రాణిహింస నరకహేతువని, కనుక మాంసభోజనం మానమని" మనుధర్మ శాస్త్రం 5వ అధ్యాయం చెబుతున్నది.

శాస్త్రం చెప్పినట్లు నడుచుకొనే వారే దైవీసంపన్నులు.

మహాభారతం అనుశాసనిక పర్వంలో 116వ అధ్యాయంలో ఒక శ్లోకం ఉన్నది. అందులో మాంసం అంటున్నదట -

'నన్ను తినే వాణ్ణి నేను తింటాను' అని.

భాగవతంలో కూడా మాంసభక్షణ చేసేవారి గురించి చెబుతూ, "ఎవరైతే జంతువులను, పక్షులను చంపితింటారో వారి కొరకు నరకంలో ఉక్కు ముక్కులతో ఆ జంతువులు, పక్షులు ఎదురుచూస్తూ ఉంటాయి" అని చెప్పారు.

మాంసభక్షణం వల్ల సాత్త్వికతత్త్వం నాశనమవుతుంది. రజోగుణం పెరుగుతుంది. మదం - దురభిమానం - దంభం పెరుగుతాయి. దానితో ఆత్మజ్ఞానాన్ని అందుకొనే అవకాశం లేకుండా పోతుంది. ఇదే ఆత్మనాశనం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆసురీ గుణసంపన్నుల ఆలోచనలు, ఆచారవ్యవహారాలు ఇలా ఉంటాయి. ఆసురీ స్వభావం గల నిరీశ్వరవాదులు నిరంతరం ఏది ముఖ్యంగా భావిస్తారు?-

శ్లో|| చింతా మపరి మేయాంచ
ప్రళయాంతా ముపాశ్రితాః |
కామోప భోగ పరమాః
ఏతావదితి నిశ్చితాః || (11)

తా|| చనిపోయేంతవరకు అంతులేని కోరికలలో మునిగితేలుతూ, కామభోగాలు తప్ప జీవితానికి వేరే లక్ష్యం ఏదీలేదని నిశ్చయించుకుంటారు.

**వ్యాఖ్య:-** (i) **ప్రళయాంతాం అపరిమేయాం చింతాం ఉపాశ్రితాః:-** చచ్చేంతవరకు అంతులేని కోరికలలో మునిగితేలుతూ ఉంటారు. కట్టు విప్పుకొన్న గొడ్డు ముందూ వెనకలు చూడకుండా ఎలా పడితే అలా పరుగులు తీస్తుంది. ఎవరో ఒకరు దానిని హింసించి అదుపులోకి తీసుకొనేదాకా అది ఆగదు. ఊపిరి ఉన్నంతవరకు, ఓపిక ఉన్నంతవరకు అలా పరుగులు తీస్తూనే ఉంటుంది.

తెగిన గాలిపటం గాలి ఎటు వీస్తే అటు కదిలిపోతుంది. అది ఎక్కడో ఒక చోట, చెట్టుకొమ్మల మధ్య చిక్కుకొనే దాకా ఎగురుతూనే ఉంటుంది.

అలాగే అసురస్వభావి భగవంతునిపై విశ్వాసం లేనివాడు గనుక వాడికెప్పుడూ విషయచింతనే. చిన్న వ్యాపారం ప్రారంభిస్తాడు. కలిసొస్తే

ఇంకా పెద్దది - ఇంకా పెద్దది అని పెంచుకుంటూ పోతాడు. ఇళ్ళు కొంటాడు. స్థలాలు కొంటాడు. పరిశ్రమను స్థాపిస్తాడు. సినిమాహాలు కట్టిస్తాడు. ఆశ తీరదు. కాలేజీలు కట్టించి విద్యావ్యాపారం బాగుందనుకుంటాడు. హాస్పిటల్స్ కట్టించి పెద్దపెద్ద డాక్టర్లను రప్పించి వైద్యవ్యాపారం ప్రారంభిస్తాడు. ఇక ఇక్కడ లాభంలేదని విదేశాలకు వెళతాడు. నిరంతరం శ్రమిస్తూనే ఉంటాడు. శరీరం, మనస్సు, బుద్ధి - అన్నీ విషయ చింతనలోనే. భార్యకు సుఖంలేక పోయినా, కొడుకులు చెప్పినమాట వినకపోయినా, బంధువులు శత్రువులుగా మారినా ఆ జీవుడు ఆశల పల్లకిలో ఊరేగుతూనే ఉంటాడు. తనంతట తాను మారడు. ఎప్పుడో భగవంతుడే దయతలచి ఏ విమాన ప్రమాదంతోనో, హార్ట్ ఎటాక్ తోనో అతణ్ణి బంధవిముక్తుణ్ణి చెయ్యకపోతే అతడికీ గాడిద చాకిరీ తప్పదు. ప్రకృతి వేసిన శిక్షను అనుభవించక తప్పదు. ఒకవేళ ఆరోగ్యం చెడినా, కాలోచేయ్యో విరిగినా, మంచంలో పడిఉన్నా మనస్సు మాత్రం ప్రపంచాన్ని చుట్టి వస్తుంది. కోరికల వేడితో - విషయచింతన అనే అగ్నిలో కాలిపోతుంటాడు.

**శ్లో॥** బాలస్తావత్ క్రీడాసక్తః తరుణస్తావత్ తరుణీసక్తః ।
వృద్ధస్తావత్ చింతాసక్తః పరమే బ్రహ్మణి కోఽపినసక్తః॥

బాల్యం ఆటపాటలతో, యవ్వనం కామప్రేరిత చర్యలతో, వృద్ధాప్యం చింతలతో గడిచిపోతే పరమాత్మను తలచుకోనేది ఎప్పుడు? అని భజగోవిందంలో శంకరులు ప్రశ్నించినట్లుగ - అతడికి అన్నీ చింతలే. అన్నీ కోరికలే. తుది శ్వాస వరకూ ఊహల లోకాలలో ఊరేగుతూ ఉంటాడు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అప్పుడు రాజకీయాల్లో దిగినట్లయితే ఎంత బాగుండేది? చిన్నప్పుడు బాగా చదువుకొని డాక్టరునైతే ఎంత బాగుండేది? అని చింతలలో మునిగిపోతుంటాడు.

(ii) **కామోప భోగపరమాః :-** ఆసురీ సంపన్నులకు కామోపభోగమే పరమలక్ష్యం. దైవీ సంపన్నులకు మోక్షమే పరమలక్ష్యం. ఆసురీ సంపన్నులకు లోపలవాసనలన్నీ ప్రాపంచికమైనవే. అవి కోరికలుగా వ్యక్తమవుతూ ఉంటాయి. వాటిని ఎలాగో తీర్చుకుంటారు. తీరే కోరికలు తీరుతుంటే పుట్టే కోరికలు పుడుతూ ఉంటాయి. ఒకవేళ వారు దైవకార్యాలను చేస్తున్నా వాటిని కూడా ప్రాపంచిక వాసనలను తృప్తిపరచుకొనుటకు లౌకికకార్యాల మాదిరిగానే చేస్తుంటారు. మనం చేసే పూజకు - యజ్ఞానికి ఎంత ప్రచారం వచ్చింది? ఎందరు వస్తున్నారు? భోజనాలలో ఏమేం వైరెటీస్ చేయిస్తున్నాం? పూజకు పూలు ఎక్కడెక్కడి నుండి తెప్పిస్తున్నాం? మైకు పెడదాం. బ్యానర్స్ కట్టిద్దాం - అంటూ అంతా హడావుడి. ఈ మధ్యలో అసలు కార్యక్రమం ప్రాధాన్యత కోల్పోతుంది.

ఇలా నిరంతరం లౌకిక కర్మలు చేస్తూ, కోరికలు తీర్చుకుంటూ, అసలు ఈ జన్మ వచ్చిందే అందుకు అనుకుంటూ నిరంతరం సంతోషాన్ని వెతుక్కుంటారు. అంతేతప్ప ఈ జన్మ ఎందుకు వచ్చిందో తెలియదు, తెలుసుకోవాలనుకోరు, ఎవరన్నా చెబితే వినరు, పైగా ఎగతాళి చేస్తారు. కోరికలు తీర్చుకోవటం, అందినంతవరకు భోగాలు అనుభవించటం, అందని వాటిని ఎలాగైనా అందుకోవటం, దీనికోసం మోసాలనెన్నింటినైనా

**చేయటానికి సిద్ధం. ఎన్ని నక్కజిత్తులైనా వేస్తాడు. ఎన్ని క్షుద్ర ఉపాసనలైనా చేస్తాడు. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు అంటాడు.**

- **కాకులను కొట్టి గ్రద్దలకు వేస్తాడు.**
- **ఆవులను చంపి చెప్పులను దానం చేస్తాడు.**

**తన సుఖం కోసం, సంతోషం కోసం, స్వార్థం కోసం, ఎన్ని అబద్ధాలైనా ఆడటానికి సిద్ధపడతాడు. అసలు ఈ జన్మ వచ్చింది దేనికి? ఈ ప్రపంచంలో సుఖాలున్నది దేనికి? హాయిగా మనం అనుభవించి ఆనందించటానికే. చచ్చిన తర్వాత ఏముంటుంది? బూడిద తప్ప అంటాడు. ఇవీ ఆసురీ సంపన్నుల ఆలోచనలు, భావాలు.**

**ఇంకా వారి ఆచరణ ఎలా ఉంటుంది?**

**శ్లో||** ఆశాపాశ శతైర్బద్ధాః

కామక్రోధ పరాయణాః|

ఈహంతే కామభోగార్థం

అన్యాయే నార్థ సంచయాన్|| (12)

**తా||** వందలాది ఆశాపాశాల చేత కట్టబడిన వారై, కామక్రోధాలకు వశులై, వారి కోరికలు తీర్చుకొనుటకు అన్యాయంగానైనా సరే సంపాదించుకోవాలనుకుంటారు.

**వ్యాఖ్య:-** (i) **ఆశాపాశ శతైర్బద్ధాః** :- లోకంలో ఎవరినైనా ఒక్క త్రాడుతో కట్టివేస్తే ఆ బంధం నుండి తప్పుకొనుటకు ఎంతో కష్టపడాలి. శరీరానికి ఎన్నో చోట్ల

గాయాలవుతాయి. అలాంటిది వందల కొద్దీ త్రాళ్ళతో కట్టివేస్తే! వారి పరిస్థితి ఏమిటి? ఇక ప్రయత్నించటం కూడా అనవసరమే. ఎవరో వచ్చి విడిపిస్తే తప్ప విముక్తి లేదు.

మరి ఈ ఆసురీసంపద గలవారి పరిస్థితి ఏమిటి? 'ఆశాపాశ శతైఃబద్ధాః' వందల కొద్దీ ఆశలనే త్రాళ్ళతో బంధించబడ్డారు. ఈ త్రాళ్ళు పాశాలు - యమపాశాల లాగా చాలా గట్టివి. మరి ఇలా వందల కొద్దీ పాశాలచేత బంధించబడ్డవారు ఎలా బయటపడగలుగుతారు? అసంభవం. అయితే ఎవరో వచ్చి సాయం చేస్తే బంధవిముక్తిని పొందవచ్చు. ఎవరతడు? అతడే సద్గురువు. గురువు లభిస్తే నీ ఆశాపాశాలన్నీ తొలగించుకోవచ్చు. గురువు ఎలా లభిస్తాడు? సన్మార్గం కోసం, దైవం కోసం అనేక జన్మలలో తపిస్తేనే గురువు లభించేది.

(ii) **కామక్రోధ పరాయణాః** :- ఆసురీ సంపద గలవారు కామక్రోధపరాయణులు. కోరికలు తీర్చుకోవటం, భోగాలనుభవించటం తప్ప ఈ లోకంలో మరొక కర్తవ్యం ఏమీ లేదనుకొనేవారు. ఎప్పుడూ కోరికలతో వేగిపోతూ ఉంటారు. కర్మరంగంలో ఊగిపోతూ ఉంటారు. ఎప్పుడైతే తమ కోరికలు తీర్చుకోవటానికి ఆటంకం కలుగుతుందో, వారి భోగాలకు ఎవరు అడ్డువస్తారో వారిపై క్రోధం కలుగుతుంది. కామం క్రోధం విడదీయ వీలులేని జంటప్రేమికులు. కనుక ఆశలు కోరికలతో తేలియాడే వారికి తప్పక వచ్చే భయంకరమైన జబ్బు క్రోధం. ఇది మనిషిని సర్వనాశనం చేస్తుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

దుర్యోధనునికి ధర్మరాజు రాజసూయం అసూయ కలిగించింది. మయసభలో అవమానం జరిగిందనుకున్నాడు. దానితో క్రోధం. దానివల్ల జూదం, ద్రౌపదీ వస్త్రాపహరణం, అరణ్య అజ్ఞాతవాసాలు, యుద్ధం, సర్వనాశనం.

(iii) **అన్యాయేన అర్థసంచయాన్:-** కోరికలు తీరాలంటే వస్తువులు, విషయాలు కావాలి. అందుకు ధనం కావాలి. కష్టపడి సంపాదించాలి. న్యాయంగా సంపాదిస్తే కొద్దిపాటి ధనమే. ఆ కొద్దిపాటి ధనం ఆశపోతులకు చాలదు. అందువల్ల బాగా దండిగా సంపాదించటానికి ఎన్ని అన్యాయాలు, అకృత్యాలు చేయటానికైనా వెనకాడరు. ఎన్ని అడ్డదారులు త్రొక్కటానికైనా, ఎందరిని మోసం చెయ్యటానికైనా తెగిస్తారు. ఎలా సంపాదిస్తున్నాం అన్నది ప్రధానం కాదు, ఎంత సంపాదిస్తున్నాం అన్నదే ప్రధానం వీరికి. పొట్టలు, పెట్టెలు, పాకెట్లు నింపుకోవటమే వారిపని.

'అనిత్యాని శరీరాణి - అందరి సొమ్ము నాకేరానీ' - ఇదే వారి వరస. రావణాసురునికి ఏం తక్కువ? అష్టదిక్పాలకులు అధీనులు. పుష్పకవిమానం స్వంతం. దేవేంద్రునిపై విజయం సాధించాడు. ఎందరో భార్యలు, బిడ్డలు, శత్రుదుర్భేద్యమైన లంకానగరం, చుట్టూ సముద్రం. పరమ భక్తాగ్రేసరుడు, మహావీరుడు. అయినా పరస్త్రీని అపహరించాడు. దానితో సర్వనాశనమై పోయాడు. కాంతా - కనకం - కీర్తి - ఈ 'క' కారత్రయంతో చస్తారు ఆసురీ మానవులు. దుర్యోధనుడు అన్యాయంగా పాండవ సంపదను కాజేశాడు. కాని

**క్రొత్త నీళ్ళు వచ్చి పాతనీళ్ళు కొట్టుకపోయినట్లు వారి రాజ్యంతో పాటు తన రాజ్యాన్నీ పోగొట్టుకున్నాడు.**

**ఆసురీ సంపన్నుల మాటలు ఎలా ఉంటాయో 13-14-15 శ్లోకాలలో చెబుతున్నారు.**

**శ్లో|| ఇద మద్య మయా లబ్ధం**
**ఇమం ప్రాప్స్యే మనోరథం |**
**ఇద మస్తీద మపిమే**
**భవిష్యతి పునర్ధనం||** (13)

**శ్లో|| అసౌమయా హతః శత్రుః**
**హనిష్యే చాపరా నపి|**
**ఈశ్వరోఽహ మహం భోగీ**
**సిద్ధోఽహం బలవాన్ సుఖీ||** (14)

**శ్లో|| ఆఢ్యోఽభి జనవానస్మి**
**కోఽన్యోఽస్తి సదృశోమయా|**
**యక్ష్యే దాస్యామి మోదిష్య**
**ఇత్య జ్ఞాన విమోహితాః||** (15)

**తా|| ఇది ఇప్పుడు నాకు లభించింది. ఈ కోరికను తీర్చుకుంటాను. ఇది ఉన్నది. ఈ ధనం కూడా ఇక ముందు నాకు లభిస్తుంది.**

**తా||** ఈ శత్రువు నా చేతులో హతమయ్యాడు. మిగిలిన వాళ్ళను కూడా చంపేస్తాను. నేను ఈశ్వరుణ్ణి. నేను భోగిని. నేను సిద్ధుణ్ణి. బలవంతుణ్ణి. సుఖిని.

**తా||** నేను ధనవంతుణ్ణి. గొప్పకులంలో పుట్టాను. నాతో సమానమైనవాడు ఎక్కడున్నాడు? యాగాలు చేస్తాను, దానాలిస్తాను. సంతోషాన్ని పొందుతాను. ఈ విధంగా అజ్ఞానంలో మోహం చెందుతుంటారు ఆసురీ సంపన్నులు.

**వ్యాఖ్య:-** అసురసంపద నాశ్రయించిన వారి స్వభావం గాని, వారి చిత్తవృత్తి గాని ఎలా ఉంటుందో తెలియాలంటే వారి మాటలు వినాలి. వారు మాట్లాడే విధానాన్ని భగవానుడు ఇక్కడ ఎంతో చక్కగా తెలియజేస్తున్నాడు. ఈ మాటలను మనం ఎక్కడో అక్కడ అప్పుడప్పుడూ వింటూనే ఉంటాం. అప్పుడప్పుడు మనం కూడా అంటూనే ఉంటాం.

ఈ కనిపించే ప్రపంచం శాశ్వతమని నమ్మి, అనిత్యమైన విషయభోగాల యందు, వస్తువుల యందు ఆశ; ఆసక్తి కలిగి ఉండి; ఆ వస్తువులను, భోగాలను సంపాదించటమే గొప్పగా భావించి, గర్వంతో పలికే మాటలే ఇక్కడ చక్కగా వివరించబడ్డాయి. ఈ మాటల వెనుక పలికిన వాడి హృదయం కనిపిస్తుంది. వారి యొక్క అహంభావం, దర్పం, గర్వం, డంబం తెలుస్తాయి.

ఇలాంటి మాటలను విన్నప్పుడు మనం వాటిని విశ్లేషణ చేస్తే చాలు. మనం అలా మాట్లాడటానికి ఆ తర్వాత వెనుకాడతాం.

కోరికల వెంట కోరికలు కలుగుతుంటే ఒక దాని తర్వాత ఒకటి తీరుతుంటే ఇదంతా నా ప్రతిభ, గొప్పతనం అనుకునేవాడు ఇలా మాట్లాడుతూ ఉంటాడు.

ఆ! ఇప్పటికి ఈ కోరిక తీరింది. మా పెద్దమ్మాయి పెళ్ళి చేసేశాను. ఇంత గొప్ప సంబంధం తేగలననుకోలేదు. ఎలాగైతేనేం? నా తెలివితేటలు, చాకచక్యం ఉపయోగించి గొప్పసంబంధాన్ని తెచ్చాను. 10 లక్షల కట్నం కన్న తక్కువ సంబంధాలు అసలు చూడం అన్నారట. అయినప్పటికీ 6 లక్షలతో వాళ్ళను ఒప్పించాను. వాళ్ళ బలహీనత తెలుసుకొని దెబ్బకొట్టాను. ఇక మా రెండవ అమ్మాయి పెళ్ళి నాకో లెక్కకాదు. ఇంకా గొప్పసంబంధాన్ని తెస్తాను. ఇప్పటి అనుభవం ఉందిగదా! నేను తలచుకొంటే ఎలాంటి వాళ్ళనైనా బుట్టలో వేయగలను. ఇక మా అబ్బాయికి ఒక బిల్డింగ్ కట్టించేసి, వాడు పెద్ద డాక్టరు అయిన తర్వాత హాస్పిటల్ కట్టించేసి, పెళ్ళిచేస్తే నా భాద్యత తీరిపోతుంది. వాడి బ్రతుకు వాడు బ్రతుకుతాడు.

ఇక నా విషయం అంటారా! ప్రత్యేకంగా నా కోసం 10 లక్షలు F.D చేశా. రిటైరయ్యేటప్పటికి మరో 20 లక్షలు వస్తాయి. దానిలో ఒక్కపైసా కూడా ఎవ్వరికీ ఇవ్వను. అదీ F.D. చేస్తా. ఆ 30 లక్షల మీద వడ్డీ వస్తుంది గదా! కాలుమీద కాలువేసుకొని కూర్చొంటాను. నన్ను కదిలించే వాడుండడు. ప్రతి సంవత్సరం ఇద్దరమ్మాయిలను తీసుకొచ్చి చెరొక లక్ష ఇచ్చి పంపిస్తాను. ఇంకా కావాలనుకుంటే రిటైరయిన తర్వాత మరొక ఉద్యోగమో - లేకపోతే వ్యాపారమో చేస్తా. లేదా Finance కంపెనీని పెట్టి సంపాదిస్తా. నేను

తలచుకుంటే చెయ్యలేని పనేం ఉంటుంది? మా ఆఫీసులో నాలాగ తెలివైనవాడు, ముందు చూపుగలవాడు ఒక్కడు కూడా లేడు. అందరూ చచ్చుదద్దమ్మలే. అసలు మా ఆఫీసులో నాలాగా సంపాదించిన వాడెవడున్నాడు? నేను ఇంతవరకు సంపాదించినది ఒక లెక్కలోది కాదు. ఇకముందు చూపిస్తా నా తడాఖా ఏమిటో.

ఫలానావాడు అనవసరంగా నాతో శత్రుత్వం పెట్టుకున్నాడు. అక్కడికీ చెప్పాను వాడితో. 'ఒరే! నాతో పెట్టుకోకురా ఖర్చయిపోతావు' - అని. వింటేనా! అందుకే వాణ్ణి తెలివిగా మన చేతులకు మట్టి అంటకుండా మట్టుబెట్టేశాను. నాతోనా పెట్టుకొనేది? ఇంకా ఇద్దరున్నారు. వాళ్ళను కూడా వదిలే ప్రసక్తే లేదు. వాళ్ళ అంతుచూస్తా. శని పడితే 7 ఏళ్ళు. నేను పడితే 14 ఏళ్ళు. వాళ్ళకింకా నా సంగతి పూర్తిగా తెలియదు. శత్రుశేషం, ఋణశేషం ఉంచకూడదంటారు గదా! కనుక వాళ్ళ అంతు తేల్చకుండా వదిలే ప్రసక్తే లేదు. వాళ్ళే కాదు. ఎవడైనా సరే నా జోలికి వచ్చాడా? ఒకటి రెండుసార్లు చెప్పిచూస్తా. విన్నారా సరేసరి. వినకుండా తల ఎగరేశారా? తలకాయలు ఎగిరిపోతాయి. ఎవ్వడైనా సరే నాకు లొంగిఉండాల్సిందే. నా మాటకు విలువ ఇవ్వాల్సిందే. నేను చెప్పినట్లు చేయాల్సిందే. అసలు వీళ్ళంతా నా గురించి ఏమనుకుంటున్నారు? నేనంటే ఎవరనుకుంటున్నారు?

నా సంగతి ఇంకా వీళ్ళకు తెలిసినట్లు లేదు. నేను చెప్పిందే వేదం. నేను గీచిందే గీత. నేను అన్నానా - అలా జరిగిపోవాల్సిందే. నేను అన్నదాన్ని ఎవడైనా కాదన్నాడా? వాడిపని అంతటితో సరి. నా కత్తికి ఎదురేలేదు.

అన్నింటిలో నేనే ఫస్టు. నా మాటకు తిరుగులేదు. నాది సిద్ధహస్తం. నేను భాగ్యవంతుణ్ణి, ధనవంతుణ్ణి, బలవంతుణ్ణి. ఏది కావలసి వచ్చినా డబ్బు పారేసి కొనుక్కుంటాను. నా మాట వినకపోతే నాలుగు తన్ని నా దారికి తెచ్చుకుంటాను. ఏ కోర్కెలు తీర్చుకోవాలనుకుంటే వాటిని తీర్చుకుంటాను. సకల భోగాలు అనుభవిస్తాను. కొండ మీది కోతిని దిగిరమ్మన్నా దిగి రావాల్సిందే. పాపం - పుణ్యం, ధర్మం - అధర్మం, న్యాయం - అన్యాయం అంటూ చేతగాని మాటలు చెప్పే అసమర్థుణ్ణి కాదు. అవి నా డిక్షనరీలోనే లేవు. నాకు ఎవరన్నా భయంలేదు. నన్ను చూస్తే భయం కూడా భయపడాల్సిందే. అసలు అన్నింటికీ భయపడేవాడు ఏం అనుభవిస్తాడు? వాడికా భయంతోనే సరిపోతుంది. సుఖపడాలంటే అలాంటి వాడి వల్ల ఏమవుతుంది? నేను అలా కాదు. డబ్బుపారేసి మనుషులను కొంటాను. సుఖాన్ని కొంటాను, ఆనందాన్ని కొంటాను, కావాలంటే దేవుణ్ణి కూడా కొంటాను. డబ్బుతో పనికాకపోతే బలప్రయోగంతోనైనా అనుకున్నది సాధిస్తాను. అంతేగాని మీనమేషాలు లెక్కబెడుతూ కూర్చోను. నేను ఏమనుకుంటే దాన్ని సాధిస్తాను. అసలు చిన్నప్పటి నుంచి నేనంతే. నా పట్టుదల అలాంటిది. అనుకున్నది సాధించేంతవరకు నిద్రపోను.

అసలు మాది ఎలాంటి వంశం? మా తాతల దగ్గర నుండీ నాకు తెలుసు. శుద్ధ శ్రోత్రియ వంశం. అసలు ఈ కులంలో పుట్టటం నా అదృష్టం. మా ఊళ్ళో మా కుటుంబం అంటే అందరికీ ఎంత గౌరవం! మేం బజారులో వెళ్తుంటే అందరూ లేచి నిలబడతారు. ఎదురొచ్చిన వారంతా తలవంచి నమస్కరిస్తారు.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

మాకు ఇచ్చే గౌరవం ఇక ఊళ్ళో ఎవ్వరికీ ఇవ్వటానికి వీలులేదు. అసలు మా వంశం వంటి వంశం ఈ రాష్ట్రంలో లేదు. రాష్ట్రంలోనే కాదు దేశంలోనే లేదు. అందుకే నేనంటే అందరికీ హడల్. నాతో సమానమైనవాడు ఈ జిల్లాలోనే లేడు. జిల్లాలో ఏంటి రాష్ట్రంలోనే లేడు. నన్ను చెప్పిన చోట వేరొకణ్ణి చెప్పే వీలులేదు.

నేను అన్నింట్లో ఉన్నాను. యజ్ఞాలు చేస్తాను. పూజలు చేస్తాను. సప్తాహాలు జరిపిస్తాను. సమారాధనలు చేయిస్తాను. దానధర్మాలు చేస్తాను. ఎక్కడ దేవాలయం కడుతున్నా నా పేరు అక్కడ రాతి మీద ప్రత్యక్షం కావాల్సిందే. మొన్ననే శివాలయంలో రాళ్ళు పరిపించాను. వెంకటేశ్వర స్వామి గుడికి ధ్వజస్థంభం ఇచ్చాను. గీతామందిరంలో శ్రీకృష్ణ విగ్రహం ఇచ్చింది నేనే. మొన్ననే గాయత్రీయజ్ఞం చేయించాను, 200 మందికి షడ్రసోపేతంగా భోజనాలు ఏర్పాటు చేశాను. ఇంకా 2 నెలల్లో రుద్రయాగం చేయించబోతున్నాను. శ్రీశైల అన్నసత్రంలో నా ఫోటో చూశారా? తిరుపతిలో మొన్ననే సత్రంలో గది నిర్మాణానికి డబ్బు ఇచ్చాను. కాశీ సత్రంలో కూడా నాగది ఉన్నది. ఇవన్నీ నాకొక లెక్క కాదు. ఒక్క సంవత్సరం వడ్డీ నాది కాదను కుంటే సరి. ఎన్నైనా చెయ్యవచ్చు. అసలు అడిగినవాడికి లేదనటం నా వల్ల అయ్యే పనికాదు.

ఇలా సాగిపోతుంటాయి అసుర స్వభావం గలవారి మాటలు. వీరంతా అజ్ఞానంలో - భ్రాంతిలో పడి కొట్టుకపోయేవారు. ఇలాంటి వారు చేసే యజ్ఞాలుగాని, దానాలు గాని, సత్కార్యాలు గాని - అన్నీ ఇతరుల వద్ద

**డంబాచారం కొరకే. ఇతరుల మెరమెచ్చుల కోసమే. వీరుచేసే యజ్ఞాలు రాజసిక యజ్ఞాలు. వీరుచేసే దానాలు రాజసిక దానాలు. వీరుచేసే తపస్సులు రాజసిక తపస్సులు. ఈ విషయం తరువాతి శ్లోకాల్లో చెప్పబోతున్నారు. వారి విలాసాలు ఇలా ఉంటాయి.**

**వారివి వంగే మెడలు కాదు. దిగే చూపులు కాదు. ధనం, దర్పం, అధికారం, అహంకారం, అవివేకం - వీటిల్లో ఒక్కటి ఉన్నాచాలు పుట్టి మునగటానికి. ఇక అన్నీ ఉంటే చెప్పేపనేముంది? అసలే కోతి. కల్లు త్రాగింది. తేలు కుట్టింది. దయ్యం పట్టింది - అన్నట్లుంటుంది వీరి వ్యవహారం.**

**మరి ఇలాంటి వారికి అంతిమ ఫలితం ఏమిటి?**

**శ్లో|| అనేక చిత్త విభ్రాం తాః**

**మోహజాల సమావృతాః |**

**ప్రసక్తాః కామ భోగేషు**

**పతంతి నరకేఽశుచౌ||** (16)

**తా|| అనేక రకాల చిత్త భ్రాంతులలో మునిగిపోయి, మోహంలో చిక్కుకొని, కామభోగాలలో ఆసక్తి గలవారై వీరు అపవిత్రమైన నరకంలో పడిపోతారు.**

**వ్యాఖ్య:- ఇలాంటి మాటలు మాట్లాడే ఆసురీ సంపన్నులైన మానవులు దంభమాన మదాన్వితులై ఎంతగా ఆనందాన్ని, సంతోషాన్ని అనుభవిస్తున్నట్లు కనిపించినా వారి మనస్సు స్థిరంగా ఉండదు. చంచలంగా ఉంటుంది. వారి మనస్సులో అనేక ఆందోళనలు, భయాలు, వ్యథలు ఉంటాయి.**

అవసరమైనప్పుడు సరైన నిర్ణయాన్ని తీసుకోలేరు. మోహజాలంలో చిక్కుకుపోతారు. అంటే ఈ ప్రపంచం, ఇక్కడి సుఖాలు, భోగాలు - ఇవే ప్రధానంగా అనుకుంటారు. ఇదే మోహం. ఇదే భ్రమ. ఇదే అజ్ఞానం. ఈ అజ్ఞానం ఒక సుడిగుండం లాంటిది. సుడిగుండంలో పడినవాడు అక్కడే గిరగిర తిరుగుతూ చిక్కుకు పోతాడు. తప్పించుకోలేక, తపనపడుతూ చివరకు ప్రాణాలు వదులుతాడు. వీరి పరిస్థితి కూడా ఇంతే. ఈ ప్రాపంచిక విషయాలనే విషవలయంలో చిక్కుకుపోయి జన్మలకు జన్మలు వృధా చేసుకుంటారు. వీరికి కామభోగాల యందు విపరీతమైన ఆసక్తి. ప్రాపంచిక వస్తువులతో విడదీయరాని బంధం పెట్టుకొని వాటితోనే సర్వనాశనం అవుతారు. ఆత్మనాశనాన్ని కొని తెచ్చుకుంటారు.

తేనెలో పడిన ఈగ ఆ తేనె యొక్క రుచిని ఆస్వాదిస్తూ ఆనందిస్తూ మైమరచిపోతుంది. ఇంకా ఇంకా ఆ రుచిని ఆస్వాదించాలని అందులో నుండి బయటకు రావాలనుకోదు. చివరకు ఆ తేనేలోనే చిక్కుకొని ప్రాణాలు వదిలేస్తుంది. కామభోగాల్లో మునిగిన వాడి పరిస్థితి కూడా అంతే. మహాభారతంలో విచిత్రవీర్యుడు భార్యలతో భోగాలలో మునిగి రాజకార్యవ్యవహారాలను కూడా పట్టించుకోలేదు. చివరకు రాజ యక్ష్మ వ్యాధితో మరణించాడు.

ఒక భ్రమరం షికారుగా అలా వెళ్తున్నది. అక్కడొక ఉద్యానవనం. అందులో ఒక సరస్సు. అందులో పరిమళాలు వెదజల్లే పద్మాలు కనిపిస్తున్నాయి. ఆ పుష్ప సువాసనలకు ఆకర్షింపబడ్డ భ్రమరం ఒక పద్మంపై

వాలింది. దానిలోని మకరందాన్ని పీల్చుకుంటూ తన అదృష్టానికి పొంగిపోతున్నది. ఇంకా ఇంకా మందార మకరంద మాధుర్యాన్ని చవిచూస్తూ ఆనంద డోలికలలో తెలియాడుతున్నది. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. ఆ పుష్పం కాస్తా ముడుచుకున్నది. దానితో భ్రమరం అందులో ఇరుక్కుపోయింది. జైలులో పడ్డ ఖైదీ లాగా అందులో బందీ అయింది. అది బయటపడాలి అనుకుంటే ఆ పుష్పాన్ని చీల్చుకొని బయటకు రావచ్చు. కాని అది మకరందం యొక్క మాధుర్యాన్ని గ్రోలుతూ మైమరపులో ఉంది. ఆనందాన్ని వదులుకోలేక ఇలా అనుకుంటున్నది. "మరి కొద్దిసేపు ఓర్చుకుంటే రాత్రి గడిచిపోతుంది. తెల్లవారుతుంది. అప్పుడు సూర్యుడు రానే వస్తాడు. అప్పుడే కమలం ఎలాగూ తనంతట తానే విచ్చుకుంటుంది. అప్పుడు మకరందాన్ని జుర్రుకొని ఈ పుష్పం నుండి హాయిగా బయటకు వెళ్ళిపోవచ్చు. అప్పటిదాకా హాయిగా ఈ రాత్రంతా మహారాజు లాగా విశ్రాంతి తీసుకోవచ్చు. అప్పుడప్పుడు మకరందాన్ని పీల్చుకుంటూ ఉండవచ్చు. ఇంతమాత్రానికి అందమైన ఈ పుష్పాన్ని చీల్చుకొని బయటకు వెళ్ళటం ఎందుకు?" అనుకుంటున్నది.

ఇంతలో వేకువజాము అయింది. ఒక ఏనుగు అటుగా వచ్చింది. సరస్సులోకి దిగింది. కమలాన్ని, దానికాడను లాగి నోట్లో వేసుకుంది. 'సహేంద్ర తక్షకాయ స్వాహా' అన్నట్లు కమలంతో పాటు భ్రమరం కూడా గుటకాయ స్వాహా అయింది.

కామోప భోగాలపై ఆసక్తితో మోహజాలంలో చిక్కి, చిత్త చాపల్యం పొందిన వారిగతి కూడా ఇలాగే అవుతుంది. వారు మళ్ళీమళ్ళీ అపవిత్రమైన ఘోర నరకంలోనే పడిపోతారు. అంటే ఈ జననమరణ రూప సంసార చక్రంలో ఇరుక్కుపోతారు. జననమరణ చక్రంలో ఇరుక్కుంటే నష్టం ఏమిటి? దేహాన్ని వదిలిన తర్వాత జీవుడి ప్రయాణంలో అనేక యాతనలు; ఆ తరువాత చేసిన పాపాలకు నరకలోక శిక్షలు; తిరిగి జన్మకు రావటానికి యాతనలు; తల్లి గర్భంలో చేరి గర్భనరకం అనుభవించటం; ఇక భూమి మీద పడ్డ తరువాత బాల్య, యవ్వన, వార్ధక్యాలలో రకరకాల యాతనలను అనుభవించాలి.

ఇక ఆసురీ సంపన్నుల యజ్ఞాలు ఎలా ఉంటాయి?

**శ్లో||** ఆత్మ సంభావితాః స్తబ్ధాః
ధన మాన మదాన్వితాః ।
యజంతే నామ యజ్ఞైస్తే
దంభేనాఽవిధి పూర్వకం ॥ (17)

**తా||** తమని తాము గొప్పగా భావించుకొనేవారు; వినయము, గౌరవము లేనివారు, ధనమున్నదనే దురాభిమానంతో మదోన్మత్తులైనవారు, దంభంతో, శాస్త్ర విధిని పాటించకుండా నామమాత్రపు యజ్ఞాలు చేస్తారు.

**వ్యాఖ్య:-** (i) ఆత్మ సంభావితాః, స్తబ్ధాః- ఆసురీ సంపన్నులు తమను తాము గొప్పగా భావించుకుంటారు. ఆత్మస్తుతి చేసుకుంటూ ఉంటారు. ఆత్మస్తుతి



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

చేసుకొనేవారు పరనిందకు కూడా పాల్పడుతూ ఉండటం సహజం. స్తబ్ధాః వినయ విధేయతలు లేనివారు, పెద్దల యెడల గౌరవం లేనివారు. ఇలాంటి వారు అంతా మాకు తెలుసంటారు. తమకు తెలియని విషయం లేదని విర్రవీగుతుంటారు. వీరికి జ్ఞానమార్గం మూసుకుపోతుంది.

అంతా నాకు తెలుసు అన్నవాడి తెలివి అంతటితో ఆగిపోతుంది. వాడు ఇక ఇతరుల నుండి ఏమీ వినడు, వినిపించుకోడు. తాను చెబుతుంటే ఇతరులు వినాల్సిందే. ఒకవేళ ఎవరైనా తెలిసినవారు తటస్థ పడినప్పుడు ఒక ప్రశ్న వేస్తాడు. ఆ ప్రశ్నకు సమాధానం కూడా తనకు తెలుసు. అందుకనే ప్రశ్నగా ప్రారంభించి సమాధానాన్ని చెబుతాడు. నాకేమీ తెలియదు అని గాని, లేదా ఆ! నాకు తెలిసింది ఎంత? తెలుసుకోవాల్సింది ఎంతో ఉంది అని గాని భావించేవాడే మహాత్ముల దరి చేరతాడు. వారు చెప్పే విషయాలను ఎంతో జాగ్రత్తగా విని అర్థం చేసుకుంటాడు. నా కన్నా అతడు బాగా తెలిసినవాడు అని విశ్వసించినప్పుడే నీవు ఏదైనా నేర్చుకోగలుగుతావు. ఆ! వాడికేం తెలుసు. నాకు తెలిసిన దానిలో 100వ వంతు కూడా వాడికి తెలియదు. నా సర్వీసంత లేదు వాడి వయస్సు అని అనుకుంటే - అహంకరిస్తే తెలుసుకొనేది ఏమీ ఉండదు.

ఇలా ఆత్మస్తుతి చేసుకొనే వారు ఎవరు చెప్పినా వినరు. అలా వినటం తమ ఘనతకు లోపంగా భావిస్తారు. పైన పటారం - లోన లొటారం. మేడిపండు చూడ మేలిమై ఉండును పొట్ట విప్పి చూడ పురుగులుండు అన్నట్లుంటుంది వారి పరిస్థితి. ఆధ్యాత్మిక రంగంలో కూడా ఇలాంటి ఆత్మస్తుతి

పరాయణులుంటారు. ఇతరుల దగ్గరవినటం అవమానంగా భావిస్తారు. కనుక ఎవరు చెప్పినా వినరు. గురువు చెప్పినా వినరు. వినకపోతే నష్టం వారికే.

ఆత్మస్తుతి చేసుకొనే వారి పరిస్థితి ఇది. అయితే కొందరు స్వంత తెలివితేటలు లేనివారు గురువు చెప్పినది చెప్పినట్లు వినాలని నిర్ణయించుకున్నా ప్రమాదమే.

ఒక గురువుగారు బండిలో వెళుతున్నారు. శిష్యులు వెంట నడుస్తున్నారు. గురువుగారు నిద్రలో ఉండగా శాలువా జారి క్రిందపడ్డది. శిష్యులు చూశారు గాని గురువుగారి ఆజ్ఞలేదని ముట్టుకోలేదు. కొంతసేపటికి గురువుగారు లేచి చూచి, శాలువా ఏదిరా? అన్నాడు. 'క్రింద పడ్డదండీ! ' అన్నారు శిష్యులు. 'మరి తియ్యలేదేమిటి? అనగా, 'తమ ఆజ్ఞకాలేదు గదా!' అన్నారు శిష్యులు. ఓరి మూర్ఖులారా! మన వస్తువులు ఏవి పడ్డా ఎత్తి బండిలో వెయ్యాలి - అన్నాడు గురువు. సరేనన్నారు శిష్యులు.

మరికొంత దూరం ప్రయాణం చేసిన తర్వాత బండికి కట్టిన ఎద్దుపేడ వేసింది. మన ఎద్దు వేసింది గనుక అది మన పేడయేనని నిశ్చయించుకొని ఎత్తి బండిలో వేశారు. గురువుగారు ఉలిక్కిపడి చూసి 'అరే వెధవల్లారా! అన్నీ వెయ్యమన్నాం గదా! అని పేడ కూడా వేస్తారా?' అన్నాడు.

"గురువుగారూ! ఇదంతా ఎందుకు? ఏమేమి పడిపోతే ఎత్తి బండిలో వెయ్యాలో లిస్టు వ్రాసి ఇవ్వండి" అన్నారు. గురువుగారు అలాగే చేశారు. అంతలో ఒక నది అడ్డు వచ్చింది. అందరూ బండి దిగి సామానంతా పడవలోకి ఎక్కించి, అందరూ పడవ ఎక్కారు. నది మధ్యకు పోయిన తర్వాత పడవలో



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నుండి గురువుగారు జారిపడ్డారు. పాపం ఆయన మునకలు వేస్తున్నారు. నోటమాట రావటం లేదు. శిష్యులు లిస్టు చూచారు. లిస్టులో గురువుగారి పేరులేదు. దానితో వారు మెదలకుండా ఊరుకున్నారు. గురువుగారు హరీమన్నారు. 'నదీనాం సాగరో గతిః' అన్నట్లు సముద్రంలో తేలారు. ఇలాంటి వారు విన్నా ప్రమాదమే. తెలివైన వారు వినకపోయినా ప్రమాదమే.

ఆత్మస్తుతి పరాయణులకు వినయ విధేయతలుండవు. ధనసంపదలు ఉన్నాయనే అహంకారం, మదం, దురభిమానం ఉంటుంది. ధనమదం - జనమదం - విద్యామదం - వైభవమదం - మదం మీద మదం. కాలపురుషుని దెబ్బతో తప్ప ఈ కైపుదిగదు. కల్లుత్రాగిన వాడి కైపు కొంతసేపటికి దిగుతుంది, కాని మద మెక్కిన వాడి కైపుకు హద్దులు లేవు.

ఇలాంటి వారు యజ్ఞాలు, యాగాలు, సంతర్పణలు, సమారాధనలు, దానాలు, ధర్మాలు - అన్నీ చేస్తారు. గుళ్ళు గోపురాలు కట్టిస్తారు. ఇవన్నీ భగవంతునిపై భక్తితో కాదు. కీర్తికాంక్షలతో. పత్రికల్లో ప్రచారం కోసం. ఫొటోలతో సహా మొదటి పేజీలో పడాలనే తహతహ. ఇదంతా ఒట్టి పటాటోపం. తమకు పెత్తనం ఇవ్వకపోతే ఆ గుళ్ళుగోపురాలను కూలద్రోయటానికి కూడా వెనుకాడరు. ఆశ్రమాలు కట్టిస్తారు. అందులోని వారు తమ మాట వినకపోతే దేహశుద్ధి చేయిస్తారు. ఉత్సవాలు ఊరేగింపులు చేయిస్తారు. దేవుడి మీద భక్తితో కాదు, భోగం మేళాలపై రక్తితో. సినీతారల డ్యాన్సులపైనే భక్తి అంతా.

ఇలాంటివారు ఏదైవ కార్యాన్ని చేసినా వారి మనస్సులో ఉండేది అంతా అహంకారమే. డంబాచారమే. పేరుకోసం, కీర్తికోసం మాత్రమే. ఇలాంటి వారికి విధివిధానాలు అసలే పట్టవు. ఇవీ వారి ధర్మకార్యాల పద్ధతి. ఆసురీ సంపన్నులు భగవంతుని పట్ల ఎలాంటి దృక్పధం కలిగి ఉంటారు?

**శ్లో||** అహంకారం బలం దర్పం

కామం క్రోధంచ సంశ్రితాః|

మామాత్మ పరదేహేషు

ప్రద్విషంతోఽభ్య సూయకాః|| (18)

**తా||** అహంకారం, పశుబలం, దర్పం, కామం, క్రోధం - వీటిని ఆశ్రయించుకున్నవారు తమలోను, ఇతరులలోను ఉన్న నన్ను అసూయాపరులై ద్వేషిస్తారు.

**వ్యాఖ్య:-** నోటిలో సిగరెట్టు, చేతిలో భగవద్గీత - ఇదీ అహంకారం, దర్పం ఉన్నవారి పద్ధతి. వారి బలం పశుబలం. ఆ బలం ఇతరులను రక్షించటానికి పనికిరాదు. అమాయకుల, అల్పుల భక్షణకు మాత్రం ఉపయోగపడుతుంది. ఇక కామక్రోధాలు వారి నిత్యకృత్యాలు. వారిని ఎట్టి పరిస్థితిలోను అవి వదలవు. అంతులేని కోరికలు, ఆశలు కలుగుతున్నప్పుడు వాటికి ఎవరైనా ఆటంకం కలిగిస్తే అగ్గిమీద గుగ్గిలం అవుతారు. కనుక ఈ జంట (కామక్రోధాలు) వారిని విడిచిపెట్టి ఉండలేదు. వారి రోమ రోమంలోనూ

అసూయ నిండి ఉంటుంది. తమకు లేదనికాదు, ఇతరులకు ఉన్నదనే ఏడుపు. అసూయ అసుర గుణాలన్నింటికీ ప్రతినిధి.

**మాం ఆత్మ పరదేహేషు ప్రద్విషంతి:-** ఇటువంటి వారు తమలోను, ఇతరులలోను ఉన్న నన్ను (ఆత్మను - భగవంతుని) ద్వేషిస్తుంటారు. తమలోను, ఇతరులలోను ఉన్న నన్ను అనటం వల్ల మనకొక విషయం రూఢి అవుతుంది. పరమాత్మ అన్ని దేహాలలోను ఉన్నాడు. కనుక పరమాత్మ కోసం ఎక్కడెక్కడికో వెళ్ళి వెతకనక్కరలేదు. ఆయన అందరిలోను - అన్నింటిలోను, అన్ని కాలాలలోను ఉన్నాడు. నాలోను, నీలోను, అతడిలోను - అందరిలోను - అన్ని శరీరాలలోను ఉన్న పరమాత్మను తెలుసుకోలేక ఒకరు మరొకరిని ద్వేషిస్తున్నారు. అలా ద్వేషిస్తున్నారంటే ఎదటివానిలో ఉన్న పరమాత్మను ద్వేషించినట్లే. అలాగే ఎదటివాడికి చేతనైన సహాయం చేస్తే సాక్షాత్తు పరమాత్మను సేవించినట్లే, పూజించినట్లే. అందుకే "మానవ సేవయే మాధవ సేవ" అన్నారు. అలాగే ఎవరిని ద్వేషించినా తనను తాను ద్వేషించినట్లే. మరి భగవంతుని ద్వేషించకుండా ఉండాలంటే సాధన ఏమిటి? ఎలా ఆచరణ చేయాలి?

సాధకులైన వారు ముందుగా భక్తులను, జ్ఞానులను, సాధుపురుషులను, గురువులను, మహాత్ములను, పండితులను, పెద్దలను ద్వేషించకుండా ఉండాలి. అది క్రమంగా అలవాటైతే ఇక ఎవరినీ ద్వేషించకుండా ఉండటం సాధ్యమవుతుంది.

అలాగే భగవత్ స్వరూపములే అయిన వేదాలను, శాస్త్రాలను కూడా ద్వేషించకుండా ఉండాలి. వీటిని ద్వేషించినా, పైన చెప్పిన వారిని ద్వేషించినా మానవజన్మను వ్యర్థం చేసుకున్నవారే అవుతారు. ముక్తికి సాధనమైన ఈ మానవజన్మను వృథాచేసుకుంటే అపూర్వమైన అవకాశాన్ని పోగొట్టుకున్నట్టే.

ఈ మానవదేహం మురికి మూటయే అయినప్పటికీ, మనస్సు అజ్ఞానంతో కూడినదే అయినప్పటికి ముక్తి నందుకొనుటకు, పరమాత్మ సాక్షాత్కారానికి ఈ దేహం, మనస్సు అనేవే సాధనాలు.

కనుక భగవత్స్వరూపులైన భక్తులను, మహాత్ములను ద్వేషించకూడదు. అలాగే భగవత్ స్వరూపాలైన వేదాలను, శాస్త్రాలను ద్వేషించకూడదు.

'ప్రద్విషంతః' అంటే ద్వేషించుట. విచక్షణా జ్ఞానం గల బుద్ధిని మానవులకు మాత్రమే ఇచ్చి పంపించాడు భగవంతుడు. 84లక్షల రకాల జీవరాసులలో 83,99,999 రకాల జీవరాసులకు బుద్ధిలేదు. కేవలం శరీరం, మనస్సు మాత్రమే వాటికి ఉన్నాయి. కాని ఒక్క మానవుడు మాత్రం బుద్ధిని కూడా కలిగిఉన్నాడు. అట్టి బుద్ధిని సరిగ్గా ఉపయోగించకుండా - ద్వేషబుద్ధితో తన నాశనాన్ని తానే కొనితెచ్చుకుంటున్నాడు మానవుడు. తనకు బుద్ధిని ప్రసాదించిన భగవంతుని ద్వేషిస్తున్నాడు బుద్ధిలేని మానవుడు.

ఒక పిల్లి ఎలుకను తరుముకుంటూ వస్తున్నది. ఎలుక భయంతో పరుగెడుతూ ఒక ఋషీశ్వరుని ఆశ్రయించింది. భయపడుతున్న ఆ ఎలుకను చేరదీసి అభయమిచ్చి, 'మార్జాలోభవ' అని ఆశీర్వదించాడు. దానితో ఆ ఎలుక పిల్లిగా మారిపోయింది. ఇప్పుడు దానికి పిల్లి భయం తీరిపోయింది గాని

కుక్క తరుముతున్నది. మళ్ళీ ఋషి పాదాలపై పడ్డదా పిల్లి. ఆయన జాలితో 'శునకోభవ' అని దీవించాడు. దానితో ఆ పిల్లి కుక్కగా మారిపోయింది. దానితో కుక్క భయం తీరిపోయింది. ఆ తరువాత ఒకనాడు ఈ వేటకుక్కను పులి తరుముకుంటూ వచ్చింది. ఋషీశ్వరుడు చూచి ఆ కుక్కను 'వ్యాఘ్రోభవ' అని దీవించాడు. దానితో ఆ వేటకుక్క పులి అయిపోయింది. ఇక దానికి ఎవరి భయమూ లేకుండా పోయింది.

నాలుగు రోజులు గడిచిన తరువాత ఆ పులికి అనుమానం వచ్చింది. మళ్ళీ ఏదో ఒక జంతువు భయంతో వస్తే ఈ ఋషిపుంగవుడు దాన్ని సింహంగా మారిస్తే నా గతేమవుతుంది? కనుక ఈ ప్రమాదం తప్పాలంటే ఈ ఋషిని మ్రింగేస్తే సరిపోతుంది అని అనుకుంది. "అల్పబుద్ధి వాని కధికారమిచ్చిన దొడ్డవారి నెల్ల తొలగగొట్టు" అన్నట్లు దానికి ఇంత మేలుచేసిన ఋషికి కీడు తలపెట్టింది. దాని తెలివిని అర్థం చేసుకున్న ఋషి, 'పునః మూషికోభవ' అన్నాడు. అంతే అది మళ్ళీ ఎలుకై పోయింది.

మనం అనేక జన్మలు గడిపి ఒక్కొక్క మెట్టు ఎక్కి మానవజన్మకు వచ్చాం. ఈ స్థితిని మనకు కల్పించిన భగవంతుని ద్వేషిస్తే ఆయన ఊరుకుంటాడా? 'పునః నీచజన్మోభవ' అంటాడు. అలాగాక ఆ పరమాత్మను విడవకుండా పట్టుకుంటే 'ముక్తోభవ' అంటాడు. కనుక భగవంతుని ద్వేషించరాదు.

అజ్ఞానమనే వ్యాధికి ఔషధమూ ఇక్కడే, చికిత్సా ఇక్కడే. ఈ మానవజన్మను విడిచి ఏ జన్మను పొందినా ఔషధం లేదు, చికిత్సా లేదు. కనుక 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవా' అన్నట్లు ఈ అపురూపమైన,

దుర్లభమైన మానవజన్మలో భగవంతుని గూర్చి తెలుసుకోవాలి, అజ్ఞానాన్ని తొలగించుకోవాలి, సాధన చెయ్యాలి.

- గోడ కట్టేవాడు పైకి పోతాడు.
- భావి త్రవ్వేవాడు క్రిందికి పోతాడు.

భగవంతుని ద్వేషించేవాని గతి అధోగతియే.

కాబట్టి ఈ ఆసురీ గుణాలు ఎవరిలో గూడుకట్టుకొని ఉన్నా, వారు ఎంతటి ధనవంతులైనా, బలవంతులైనా, గొప్పవారైనా, అధికారులైనా, సాధువులైనా, సన్యాసులైనా ఎవరైనా సరే వారు అసురుల క్రిందనే లెక్క. కనుక ప్రతివారూ తమతమ హృదయాలను శోధించి, తమలోనే కాపురం ఉంటున్న ఆసురీ గుణాలను గుర్తించి, ప్రయత్నపూర్వకంగా ఒక్కొక్క దానిని బయటకు పంపివేయాలి. ఒక్కటి కూడా మిగలకుండా ఆసురీ గుణాలను పూర్తిగా ప్రక్షాళన చేయాలి.

"ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం" అంటూ గంటకొట్టి దీపం వెలిగిస్తున్నామంటే ఆసురీ గుణాలను బయటకు పంపి, దైవీ గుణాలను రప్పించుకొని జ్ఞానజ్యోతిని వెలిగించాలి - అనే భావం.

ఆసురీ సంపన్నులకు ఎలాంటి జన్మలు వస్తాయి? "పెక్కుభంగులు వివేక భ్రష్ట సంపాతముల్" అని భర్తృహరి తన సుభాషితాలలో చెప్పటం జరిగింది. గంగ ఆకాశం నుండి శివుని శిరస్సుపైకి, అక్కడి నుండి హిమాలయం పైకి, అక్కడి నుండి భూమిపైకి, ఆ తరువాత జహ్నుని నోటిలోనికి, ఆయన చెవి నుంచి పాతాళానికి వచ్చింది. అలాగే వివేక శూన్యుడైనవాడు అంత

ఎత్తునుండి (మానవజన్మ నుండి) అనేక విధాలుగా పతనమై పాతాళానికి పడిపోతాడు. (హీనజన్మలు)

ఈ మానవజన్మ నుండి కాలు జారిందా - ఇక తట్టుకోవటం చాలా కష్టం. మళ్ళీ ఈ ఛాన్సు దొరుకుతుందనే గ్యారెంటీ లేదు. భగవత్సాక్షాత్కారానికి - శాశ్వతమైన ఆనందాన్ని పొందటానికి వీలులేని జన్మలు ఎన్ని వస్తే మాత్రం ఏం లాభం?

అయ్యో! భగవంతుడిలాచేశాడేం? అని ఎంత ఏడ్చినా ప్రయోజనంలేదు? భగవంతుడిపై నెపం పెట్టినా, తిట్టినా లాభం లేదు. 'చేసుకున్న వాడికి చేసుకున్నంత మహాదేవ!'అన్నారు. నీవు నీ బుద్ధిని ఉపయోగించుకొని, ఆత్మజ్ఞానాన్ని పొంది సాధనలు చేశావా? వాటి ఫలితాన్నే భగవంతుడు అందిస్తాడు. భగవంతుణ్ణి మర్చిపోయి, పెద్దలను - మహాత్ములను దూషించి, ద్వేషించి, దుఃఖాల పాలుచేసి నీ సుఖాలు, భోగాలు చూసుకున్నావా? దాని ఫలితాన్నే అందిస్తాడు భగవంతుడు. ఆయనకు ఏ పక్షపాత బుద్ధీ లేదు. నీవు చేసిన దాన్ని బట్టే నీకు ఫలితం. మిరపకాయనమిలితే అబ్బా! అనాల్సిందే, మైసూర్ పాక్ నోట్లో పెట్టుకుంటే ఆహా! అనాల్సిందే.

ఇప్పుడు ఎన్ని జన్మల పుణ్యఫలంగానో దుర్లభమైన మానవజన్మ వచ్చింది. ఈ జన్మ ద్వారా నీవు రాక్షసుడవూ కావచ్చు, దానవుడవూ కావచ్చు, దేవతవూ కావచ్చు, మాధవుడవూ కావచ్చు. ఏది కావటానికైనా భగవంతుడు నీకు చేతులిచ్చాడు. నీ భవిష్యత్తును నీ చేతులతో నీవే వ్రాసుకో - అని నీకు

చేతులిచ్చాడు. పశుపక్ష్యాదులకు చేతులనివ్వకుండా మూతులనిచ్చాడు. ఎందుకంటే తినటమే వాటి ముఖ్యమైన పని.

భగవంతుడు మనపై కృపతో చేతుల నిచ్చినందుకు మనం ఆయనకు కృతజ్ఞులం కావాలి. అందుకే కొందరు ప్రొద్దున్నే నిద్రలేవటంతో చేతులను చూసుకుంటారు. అవి చూసుకున్నప్పుడు భగవంతుడు మనకు చేసిన మేలేమిటో? గుర్తువస్తుంది. అందుకే 'ప్రభాతే కరదర్శనం' అన్నారు. అయితే ఈనాడు చాలామంది కరదర్శనం కాకుండా కప్పు దర్శనం చేసుకుంటున్నారు. కరములు లేకపోతే కప్పునెలా పట్టుకుంటాం అనే జ్ఞానం కూడా ఉండటం లేదు. నీ ప్రారబ్ధంలో ఉన్న కాఫీ ఎక్కడకూ పోదు. కరములిచ్చి, వరములిచ్చి, నరజన్మ నిచ్చి, బుద్ధినిచ్చిన భగవంతుని ముందుగా గుర్తు చేసుకోవాలి. మళ్ళీ మళ్ళీ జన్మలు వద్దు. గర్భనరకం వద్దు - అని కంకణం కట్టుకోవాలి. ఇది సాధించాలంటే అసురగుణాలు పోవాలి. వాటివల్ల మనకు ఎటువంటి దుర్గతి కలుగుతుందో తెలుసుకోవాలి. అందుకే ఆ దుర్గతిని తెలియజేయటానికి, ఎలాంటి జన్మలు వస్తాయో చెబుతున్నారు.

శ్లో|| తానహం ద్విషతః క్రూరాన్

సంసారేషు నరాధమాన్|

క్షిపామ్య జస్ర మశుభాన్

ఆసురీ ష్వేవ యోనిషు|| (19)

**తా||** ఇలా నన్ను ద్వేషించే ఈ క్రూరులైన నరాధములను నేను ఎల్లప్పుడు జననమరణ సంసార మార్గంలో నీచయోనుల్లో విసిరేస్తాను.

**వ్యాఖ్య:-** అసురస్వభావం గలవారు ఇతరుల శరీరంలో కూడా భగవంతుడు ఉన్నాడని తెలియక వారిని ద్వేషిస్తుంటారు. అలా ద్వేషిస్తే వారు పరమాత్మను ద్వేషించినట్లే. అలాంటివారు ఎలాంటి క్రూరకర్మలకైనా వెనుదీయరు. అందుకే వారిని 'క్రూరాన్' - క్రూరకర్ములు అన్నారు. అట్టి క్రూరులను నరులు అనరు. నరాధములు అంటారు. మానవాధములు అంటారు. అంటే భగవంతునికి వారిపట్ల ఎంతటి హేయభావం ఉన్నదో ఈ పదాన్ని బట్టి తెలుసుకోవచ్చు. నరాధముడవయ్యావా! తగిన శాస్తి తప్పదు. ఏమిటా శాస్తి?

తాన్ నరాధమాన్ ఆశుభాన్ ఆసురీషు యోనిషు ఏవ అహం క్షిపామి:-

అలాంటి క్రూరులను - నరాధములను నీచమైన నికృష్టమైన ఆసురీ యోనులందు ఎల్లప్పుడూ విసిరేస్తుంటాను అంటున్నాడు భగవానుడు. నేనే విసిరేస్తాను అంటున్నాడు గనుక భగవంతుడు కర్మఫల ప్రదాత. శాసకుడు. అంతమాత్రాన ఆయన పక్షపాత బుద్ధితోనో, అస్తవ్యస్తంగానో చేయడు. వారివారి కర్మలను బట్టే చేస్తాడు. ఎలాంటి కర్మలు చేస్తే అలాంటి జన్మలే వస్తాయి. నీచయోనులంటే పశుపక్షి క్రిమికీటకాది జన్మలే. అంతేగాక 'యోనిషు' అని బహువచనం వాడటం వల్ల అనేక నీచజన్మలు ఎత్తాల్సివస్తుంది.

కసాయివాడు గొర్రెను తెచ్చి నరకబోతుంటే అది ఎలాగో తప్పించుకొని పరుగెత్తి పోతుంది. కొంతదూరం పోగానే కసాయివాడు దానివెంట పరుగెత్తి పట్టితెచ్చి బలిఇస్తాడు. అలాగే ఈ నీచ జన్మల నుండి తప్పించుకుందామని

ఎంత గింజుకున్నా ప్రయోజనం లేదు. క్రూరకర్మలు చేసినవాడికి ఆ కర్మఫలం ఉన్నంతవరకు ఒకదాని వెంట ఒకటి నీచ జన్మలు వస్తూనే ఉంటాయి. తప్పించుకొనే వీలులేదు. ఈ భయంకరమైన సత్యాన్ని దృష్టిలో ఉంచుకొని అసురగుణాలను పారద్రోలాలి. ఇప్పుడు తెలివిగా తప్పులు చేశాం అని ఆనందిస్తే సరిపోదు, అప్పుడు ఏడుస్తూ కష్టాలు, దుఃఖాలు అనుభవించాలి. నికృష్టం అనుభవించాలి.

'సంసారేషు క్షిపామి' అంటున్నందున ఈ సంసార జననమరణ చక్రంలో పడి గిలగిల కొట్టుకోవాల్సిందే. పైగా ఈ అసుర జన్మలలో - నీచ జన్మలలో విసిరివేస్తాను అంటున్నాడు. అంటే భగవంతునికి వీరిపట్ల ఎంతటి నిరసన భావమో - ఏహ్యభావమో చూడండి. భగవంతునికి ఇంతగా అసహనం కలిగించే ఈ క్రూరకర్మలను చేయరాదు.

- దుర్మార్గాలకు - దుర్మార్గులకు దూరంగా ఉండాలి.
- సత్కార్యాలకు - సత్పురుషులకు దగ్గరగా ఉండాలి.

సత్పురుష సాంగత్యం వల్లనే భగవంతుని కృపను పొందగలుగుతావు. భగవంతుని వద్దకు నిన్ను చేర్చేవాడే సజ్జనుడు, సత్పురుషుడు అయిన గురువు.

**అజస్రం:-** ఈ భగవంతుని నియమం (Rule) ఎప్పుడూ ఉండేది. అన్ని యుగాలలో, అన్ని కాలాలలో, అన్ని దేశాలలో, అంతటా ఎల్లప్పుడూ ఉండేదే.

పోనివ్వండి, కొంతకాలం కొన్ని నీచజన్మలు పొందినా ఆ తర్వాతైనా మంచిజన్మ రాక పోతుందా! అని ఆశపడతావేమో! ఏం జరుగుతుందో చూడు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**శ్లో||** **ఆసురీం యోని మాపన్నాః**

**మూఢా జన్మని జన్మని ।**

**మామప్రాప్త్యేవ కౌంతేయ!**

**తతోయాం త్యధమాం గతిం||** (20)

**తా||** అర్జునా! ఆసురికమైన నీచ యోనులందు జన్మించిన మూఢులు జన్మలకు జన్మలు నన్ను చేరుకోలేక ఇంకా ఇంకా అధోగతికి పోతుంటారు.

**వ్యాఖ్య:-** నీచ యోనులలో జన్మించిన వారికి భగవంతుని తలంపే ఉండదు. కనుక ఒక్క మెట్టు కూడా పైకి ఎక్కటం జరగదు. ఏ జంతువుగానో, క్రిమిగానో, కీటకంగానో, మట్టిదినే తుట్టె పురుగుగానో జన్మించి, కర్మఫలాన్ని అనుభవించవలసిందే. అలా వేలకు వేల జన్మలెత్తి భయంకరమైన యాతనలను అనుభవించాల్సిందే. పైగా ఆ జన్మలలో ఏదైనా మంచి చెయ్యటానికి కూడా వీలులేదు. ఎందుకంటే అవి భోగజన్మలేగాని, కర్మజన్మలు కాదు. కనుక మంచిపనులు చేసి ఒక్క మెట్టు కూడా ఎక్కేవీలులేదు.

ఒకవేళ మధ్యలో ఎప్పుడైనా మానవజన్మ వచ్చినా పిచ్చివాడుగానో, మెదడు మొద్దుబారిన వాడుగానో, మూర్ఖుడు గానో, నాస్తికుడు గానో జన్మించి భగవంతుని చేరుకొనుటకు ఏ మాత్రం ప్రయత్నం చేయడు. ఇంకా ఇంకా పాపకర్మలను, క్రూరకర్మలను, దుర్మార్గాలను చేసి మరింత నీచమైన జన్మ పరంపరలను కొనసాగించటం జరుగుతుంది.

ఒక బంతి మేడ మెట్ల పైన బడి జారితే అది మధ్యలో ఎక్కడా ఆగదు. ఒక మెట్టు నుండి మరో మెట్టుకు దిగజారుతూ చివరి మెట్టుకు వచ్చి, అక్కడి నుండీ

క్రిందకు నేలపైకి వచ్చి, ఇంకా క్రిందికి జారటానికి వీలుందేమోనని అటూఇటూ తిరిగి తిరిగి వీలులేక ఆగిపోతుంది. ఈ క్రూరకర్మలు చేసే ఆసురీ సంపన్నుల గతి కూడా ఇంతే. వారి గతి అధోగతియే.

కనుక ఒక్క మానవ జన్మలో చేసిన తప్పిదానికి ఎన్ని వేల నీచ, నికృష్ట జన్మలెత్తాలో తెలుసుకుంటే ఈ మానవజన్మ యొక్క ప్రాధాన్యం ఏమిటో, ఈ జన్మను ఎంత జాగ్రత్తగా సార్థకం చేసుకోవాలో తెలుస్తుంది. కనుక ఈ ఒక్క జన్మలో మంచి సాధన చేస్తే, భగవంతుని ఆశ్రయిస్తే, ఆయన గురించి తెలుసుకుంటే, అజ్ఞానాన్ని పారద్రోలే ప్రయత్నం చేస్తే ఎంతో ముందుకు వెళ్ళగలుగుతాం. భగవంతుని దరి చేరుకోగలుగుతాం. 'మాం అప్రాప్యైవ' - నన్ను చేరుకోలేక - అని భగవంతుడంటున్నాడంటే భగవంతుని చేరుకోవటమే మానవజన్మ యొక్క పరమార్థం అని తెలుస్తున్నది.

అయితే ఇక ఈ రకమైన జీవుళ్ళు తరించే అవకాశమే ఉండదా? అంటే ఉంటుంది. తరించవచ్చు. ఎప్పటికి? కొన్ని లక్షల, కోట్ల జన్మలు ఎత్తిన తర్వాత. ఈ జన్మలన్నింటిలో దుర్భరమైన దుఃఖాన్ని, నరకయాతనలను అనుభవించిన తర్వాత; లేదా కొన్ని యుగాల తరువాత. గడచిన అనేక జన్మలలో ఏవో కొన్ని మానవ జన్మలు ఎత్తి ఏ కొంచెమైనా సత్కార్యాలు చేస్తే, మంచి ఆలోచనలు చేస్తే, అవి సద్వాసనలుగా ముద్రించబడి, అవి పక్వానికి వచ్చినప్పుడు మంచి మానవజన్మ కలిగి, ఆ జన్మలో ఈ సద్వాసనల ప్రేరణలతో భగవంతుని వైపుకు తిరగాలనే ఆలోచన వస్తుంది. ఆ ఆలోచనల కనుగుణంగా సత్కర్మలను, జ్ఞాన

సాధనలను చేస్తే రూట్ మారి భగవంతుని వైపుకు ప్రయాణం చేసే జన్మలు వస్తాయి. అలా క్రమక్రమంగా తరించే అవకాశం ఉంటుంది.

అయితే దీర్ఘకాలపు శిక్ష మాత్రం తప్పదు. దొంగతనాలు, తప్పుడు పనులు చేసినవాడు ఆ పనుల ఫలితాన్ని అనుభవించాల్సిందే. మంచివాడుగా మారాలనుకుంటే మారవచ్చు గాని, చేసినవాటికి శిక్షలు అనుభవించక తప్పదు గదా! అలాగే ఈ ఆసురీ సంపన్నులు దీర్ఘకాలం నీచజన్మలెత్తి యాతనలను అనుభవించక తప్పదు.

ఈ ఘోరాలు జరగకుండా తప్పించుకోవాలంటే అపురూపంగా లభించిన మానవజన్మను సార్థకం చేసుకోవాలి. అందుకు ఇప్పుడే ప్రయత్నం ప్రారంభించాలి. తిథులు, వారాలు, నక్షత్రాలు, వర్జ్యాలు, రాహుకాలాలు చూసుకుంటూ ఆలస్యం చేశావా? మృత్యుదేవత ఊరుకుంటుందా? కనుక పుణ్యకాలం అయిపోయే దాకా ఎదురుచూడవద్దు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుందామంటే ప్రయోజనం లేదు. మనలోని ఆసురీ గుణాలను గుర్తించి పారద్రోలాలి. దైవీగుణాలను ఆహ్వానించాలి, పెంపొందించుకోవాలి. అప్పుడే

- హీనమైన జన్మలను తప్పించుకుంటాం -
- భగవంతుని చేరుకొనుటకు వీలయ్యే జన్మలను పొందుతాం.

కనుక ఆసురీ గుణాల వల్ల జరిగే ఘోరం ఏమిటో, నష్టం ఏమిటో మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకుందాం. ఆ గుణాలను దూరంగా తరిమివేద్దాం.

మరి ఈ నీచజన్మల నుండి, నరక యాతనల నుండి తప్పించుకొనే ఉపాయం ఏమైనా ఉన్నదా? - ఉన్నది. అద్భుతమైన ఉపాయం ఉన్నది. ఏమిటా ఉపాయం?

**శ్లో||** త్రివిధం నరక స్యేదం
ద్వారం నాశన మాత్మనః|
కామః క్రోధః స్తథా లోభః
తస్మాదే తత్త్రయం త్యజేత్|| (21)

**తా||** కామం, క్రోధం అలాగే లోభం - ఈ మూడూ ఆత్మనాశనానికి దారితీసే నరకద్వారాలు. అందువల్ల ఈ మూడింటిని విడిచిపెట్టాలి.

**వ్యాఖ్య:-** నరకంలో ప్రవేశించటానికి ద్వారాలు 3 ఉన్నాయి. అవే కామం, క్రోధం, లోభం. ఈ 3 దుర్గుణాలు ఉంటే నరకద్వారాలు తెరుచుకుంటాయి. ఈ 3 గుణాలు లేకపోతే నరకద్వారాలు మూసుకుపోతాయి. నిజంగా ఆసురీ గుణాలన్నింటిని ఈ మూడుగా ఇక్కడ విభజించి చెబుతున్నారు. ఈ 3 గుణాల చరిత్ర రామాయణం అంత ఉంటుంది. అయినా రామాయణాన్ని 3 ముక్కలలో చెప్పండి' అంటే కట్టె - కొట్టె - తెచ్చె అని చెబుతారు మనవాళ్ళు.

ఒక హరిదాసు గారిని ఒకామె అడిగిందట. రామాయణాన్ని 3 ముక్కల్లో చెబుతారు గదా! 3 చర్యలతో చేసి చూపిస్తారా? అని అడిగిందట. ఓ అలాగే అన్నాడు హరిదాసు. 2 మంచాలు వేసి ఆ మంచం మీద నుండి ఈ మంచం మీదికి, దీనిమీద నుండి దానిమీదికి ఎగిరి తొక్కటంతో ఆ మంచాలు

విరిగిపోయినవి. ఇదే సముద్ర లంఘనం అన్నాడు. ఆ తర్వాత వాళ్ళింట్లో ఒక ముసలమ్మ కూర్చొని ఉంది. ఆమె దగ్గరకెళ్ళి చెంప ఛెళ్ళుమనిపించాడు. ఆ దెబ్బతో ఆమె హరీ మన్నది. ఇదే రావణవధ అన్నాడు. ఆ తర్వాత ఇదంతా కుర్చీలో కూర్చొని చూస్తున్న ఆమెను ఎత్తుకొని పరుగెత్తాడు. ఇదే సీతను తీసుకెళ్లటం అన్నాడు.

అలాగే ఆసురీ గుణాలన్నింటికి తలమానికం ఈ 3 గుణాలు. ఈ ముగ్గురు ఆసురీసేనకు సేనానాయకులు. వీరిని జయిస్తే ఆసురీసేన అంతా చెల్లా చెదరైపోతుంది. ఈ మూడింటిలోను కామమే ప్రధానమైనది. కామం అంటే కోరిక. మనం దేనిని తలచుకుంటామో దానినే తెచ్చుకొని అనుభవించాలనిపిస్తుంది. ఈ కోరికనే 'కామం' అంటారు. కోరికలు తీరుతున్న కొద్దీ కొత్త కోరికలు పుడుతూ ఉంటాయి. అవి తీరే సమయానికి ఎవరైనా అడ్డుపడితే వారిపైక్రోధం కలుగుతుంది. ఇక కోరిన వాటిని సంపాదించుకుంటే వాటిని జాగ్రత్తగా దాచుకోవాలని, వాటిని వదలకుండా పట్టుక కూర్చొని, చూచుకొని ఆనందించాలనిపిస్తుంది. ఇది లోభం. ఈ మూడూ ఆసురీ సంపదకు పెట్టని కోటలు.

(i) నరకస్య ద్వారం:- ఈ 3 నరకద్వారాలు అన్నారు. వీటిలో దేని ద్వారా ప్రయాణించినా చేరుకొనేది నరకాన్నే. ఇక ఈ మూడింటిని ఆశ్రయించి మూడింటి ద్వారా ప్రయాణిస్తే సరాసరి నరకానికే వెళతాడు. ఈ మూడూ ఆత్మనాశానానికి - అంటే తన నాశనానికి - సర్వనాశనానికి కారణమౌతాయి. ఆత్మనాశనమంటే అధోగతికి పోవటమే. నీచ నికృష్ట జన్మలెత్తుతూ

భగవంతునికి దూరం కావటమే. ఈ మూడింటికి లోనైనవాడు మానవుడుగా జన్మించినా పశువులాగా జీవిస్తాడు. జన్మను వృధా చేసుకుంటాడు. దుర్మార్గంగా ప్రవర్తిస్తాడు. ఎప్పుడూ ప్రాపంచిక విషయాల కొరకు, భోగాల కొరకు అంగలార్చుస్తూ ఉంటాడు. కోరికలతో వేగిపోతుంటాడు. వాటిని తీర్చుకొనుటకు ఆరాటపడుతూ న్యాయమార్గంలో వీలుకాకపోతే అన్యాయ మార్గంలోనో, బలప్రయోగంతోనో - ఎలాగో ప్రయత్నాలు చేస్తుంటాడు. ఈ కారణంగా అతడిలో దైవానికి చోటుండదు. ఇలా పశుజీవితాన్ని కొనసాగించి చివరకు కోరికలనే వాసనల మూటను నెత్తిన పెట్టుకొని హీనంగా - దీనంగా నీచ నికృష్ట జన్మల వైపు ప్రయాణం సాగిస్తాడు. మరేం చేయాలి?

(ii) తస్మాత్ ఏతత్ త్రయం త్యజేత్ :- అందువల్ల ఈ మూడింటిని వదలాలి. ఎందువల్ల? ఈ మూడింటికి లోనైనవాడు పశుజీవితాన్ని గడిపి భగవంతునికి దూరమైపోతాడు గనుక. ఏ మూడింటిని వదలాలి? కామ, క్రోధ, లోభాలనే మూడింటిని. వదలాలి అని కోరుకోవటం మంచిదే గాని, వదలటం అంత తేలికకాదు. అనుకున్నంత మాత్రాన వదలవు. ఎందుకంటే - వాటిపట్టు ఉడుంపట్టు. కనుక గొప్పప్రయత్నం కావాలి. చాలాకాలం తపస్సు చేయాలి. దీర్ఘకాలం చెయ్యాలి. ఎందుకంటే అవి ఏళ్ళకు ఏళ్ళు - జన్మలకు జన్మలు హక్కుభుక్తం చేసుకొని మనలో తిష్ఠవేసుకొని కూర్చున్నాయి. కనుక తీవ్రప్రయత్నం చేయాలి. సహాయనిరాకరణం చేయాలి. సత్యాగ్రహం చేయాలి. Quit ఉద్యమం చేపట్టాలి. నిరంతరం మెలకువతో జాగరూకతతో ఉండాలి. తెల్లవార్లూ మేలుకొని ఉంటే దొంగల భయం ఉండదు. అలాగే

నిరంతరం వాటిని జయించాలనే భావనతో ఉంటే కొంతవరకైనా భయం తీరుతుంది. తిరిగి ప్రవేశించకుండా No Vacancy board పెట్టాలి.

మన ప్రారబ్ధం ఎలా ఉంటే అలా జరుగుతుందిలే - అని కూర్చుంటే పోయేవి కాదీ మూడూ. ఆయుస్సు తీరిపోతే ప్రాణాలు పోతాయే గాని, ఇవి మాత్రం పోవు. ఇవి మనస్సును అంటిపెట్టుకొనే ఉంటాయి. కనుక ప్రయత్నపూర్వకంగా పంపించాల్సిందే. కాబట్టే మోక్షం అనేది ప్రారబ్ధం ద్వారా వచ్చేది కాదని, పురుషార్థం చెయ్యవలసిందేనని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. కనుక జ్ఞానప్రాప్తికి పురుషార్థం తప్పనిసరి. 'ఏదో చూద్దాంలే' - అనే అలసత్వం - సోమరితనం పనికిరాదు.

ఈ కామక్రోధ లోభాలు ఎంత గట్టివంటే మనం ఒక ద్వారం మూసేస్తే మరో ద్వారం గుండా లోనికి ప్రవేశిస్తాయి.

పరమశివుడు సతీవియోగం తరువాత తీవ్రమైన తపస్సులో మునిగిపోయాడు. ఆయనకు లోకస్పృహ లేదు. యుగాలు గడిచిపోయాయి. జన్మాంతరంలో సతీదేవి హిమవంతుని పుత్రిక పార్వతిగా జన్మించింది. ఆమె పరమశివుని వివాహమాడాలనుకుంది. ఈయనేమో కళ్ళు తెరచి చూడడు. పోనీ దగ్గరకు వెళ్ళి చెప్పాలంటే దేవతలంతా గజగజలాడుతున్నారు. మరెలాగ? చివరకు దేవతలంతా ఆలోచించి మన్మథుని పంపించారు. మన్మథుడు కామదేవుడు. ఆయన తన పుష్పబాణాలను వదిలాడు శివునిపైకి. దానితో కన్నులు తెరచి గమనించాడు పరమశివుడు. వెంటనే తనకు

తపోభంగం కలిగించిన మన్మధునిపై తీవ్రమైన క్రోధం కలిగింది. దానితో మూడవనేత్రాన్ని తెరిచాడు. మన్మధుడు కాలి బూడిదైపోయాడు.

❖ మన్మధుణ్ణి కాల్చేశాను గదా! నేనే గెలిచాననుకున్నాడు శివుడు.

❖ పార్వతితో పెళ్ళి జరిపించాను గదా! నేనే గెలిచాననుకున్నాడు మన్మధుడు.

ఎవరు గెలిచినట్లు?

కాముణ్ణి జయించాననుకున్నాడు శివుడు కాని క్రోధుడు ప్రవేశించాడు. కనుక కామక్రోధాలు సామాన్యమైనవి కావు. ఒకదాన్ని పంపితే రెండవది ప్రవేశిస్తుంది. పరమశివుని అంతటివాడినే లోబరుచుకున్నాయి. ఇక సామాన్యుడి సంగతి చెపాల్సిందేమున్నది?

కామక్రోధాలను జయించటం దుర్లభం. ఒకవేళ ఎవరైనా అలా జయిస్తే అతడు మానవుడు కాదు, మహాత్ముడు - మాధవుడు అని చెప్పవచ్చు. అయితే అర్జునుడు సామాన్యుడు కాదని శ్రీకృష్ణునికి తెలుసు. అందుకే అంటున్నాడు, "అర్జునా! నీవు దేవరాజు ఇంద్రుని పుత్రుడవు. ధర్మాత్ముడైన ధర్మరాజు సోదరుడవు. నీ యోగ్యతను బట్టి నీవు ఈ కామక్రోధ లోభాలను గెలవటం గొప్పవిషయం కాదు. నిజంగా నీవు ఇంతకు ముందే వీటిని జయించావు.

నీవు స్వర్గలోకం వెళ్ళినప్పుడు త్రిభువన సుందరి, అప్సరస ఊర్వశి నిన్నుకోరి, వలచి తనంత తాను నీ దగ్గరకు వస్తే ఆమెను తిరస్కరించి నీవు కామాన్ని జయించావు. తిరస్కరించబడిన ఆడపులి ఆ ఊర్వశి క్రోధంతో నిన్ను 'నపుంసకుడివి కమ్ము' ని శపించింది. అయినా నీకు కోపం రాలేదు. ధర్మమే రక్షిస్తుందని మౌనంగా ఉన్నావు. అలా క్రోధాన్ని జయించావు.

ఇప్పుడు నీ రాజ్యాన్ని శత్రువులు హరించారు. ద్యూత నియమం ప్రకారం ఇప్పుడు మీ రాజ్యాన్ని మీ కివ్వాలి. కాని ఇవ్వలేదు. దానితో యుద్ధానికి సిద్ధపడ్డారు. నీవూ యుద్ధానికి వచ్చావు. అయినా బంధుప్రీతితో, జాలితో యుద్ధానికి విముఖుడవై రాజ్యాన్ని వదులుకోవటానికి సిద్ధపడ్డావు. భిక్షాన్నం స్వీకరిస్తానని కూడా అంటున్నావు. అంటే లోభాన్ని కూడా జయించావు.

ఇలా కామ, క్రోధ, లోభాలను మూడింటిని జయించిన వాడవు నీవు. అందుకేనయ్యా నిన్ను చూస్తుంటే నాకింత Love - ప్రేమ - ఇష్టం. నా నుండి ఈ బ్రహ్మజ్ఞానాన్ని అందుకొనుటకు అర్హత సంపాదించినవాడవు గనుకనే ఈ జ్ఞానాన్ని అందించటానికి నిన్నే ఎన్నుకున్నాను.

పేరుకు పెద్ద దేవేంద్రుడే గాని మీ అయ్యకు ఈ సద్గుణా లెక్కడ ఉన్నాయి? అహల్య పొందుకోసం దొంగవేషాలు వేసి, సూర్యచంద్రుల సాయం తీసుకొని పడరాని పాట్లుపడి కామానికి లొంగిపోయాడు. గౌతముని చేత శపించబడ్డాడు. గోకుల బృందావనంపై 7రోజులపాటు నిరంతర వర్షధారలు కురిపించి క్రోధానికి లొంగిపోయాడు. కారణం ఏమిటి? గోపాలురు గోవర్ధన పూజ జరిపిస్తున్నారనే చిన్నకారణంగా.

అనంతుని దయతో, దేవతలు రాక్షసులు అందరూ కలసి సముద్రమథనం చేసి అమృతాన్ని సంపాదిస్తే కొద్దిగా పంచి మిగతా మొత్తం తెచ్చుకొని స్వర్గంలో దాచుకున్నాడు. తను త్రాగడు, ఇతరులకు పోయడు.

చుట్టూ మహావీరులను కాపలాగా ఉంచి చూచుకొని ఆనందిస్తూ లోభానికి లొంగిపోయాడు.

అలాంటి తండ్రికి జనించిన కుమారుడవు. నీవు తండ్రిని దిగదుడిచిన తనయుడవు. నీ జన్మధన్యం. అందుకే నీ వంటి శిష్యుని పొందిన నేనూ ధన్యుడనయ్యాను.

నీలాగా ఈ కామ, క్రోధ, లోభాలను మూడింటిని ఎవరు జయించగలుగుతారో వారికిక నరకంతో పనిలేదు. నరక ప్రవేశం లేదు. వారు నీలాగా నాకు ఎంతో ఇష్టులౌతారు; శిష్యులౌతారు, జ్ఞానాన్ని పొందుతారు, చివరకు వారు నన్నే చేరుకుంటారు.

మానవజన్మకు ముఖ్యపురుషార్థం మోక్షం. దానికి ప్రతిబంధకాలు ఈ కామ, క్రోధ, లోభాలు మూడూ. ఈ ప్రతిబంధకాలతో మానవజన్మను నాశనం చేసుకొని పశుజీవితాన్ని గడుపుతారు ఆసురీ సంపన్నులు. వారికి మానవజన్మ యొక్క గొప్పతనం తెలియదు. అందుకే -

- శ్రీ గంధపు చెట్లను బొగ్గులు చేసి అమ్ముకున్నట్లు -
- రత్నాలను పిట్టలను తోలటానికి రాళ్ళుగా ఉపయోగించినట్లు -
- అపురూపమైన, దుర్లభమైన మానవజన్మను ప్రాపంచిక భోగాలకోసం, తాత్కాలిక సుఖాలకోసం ఉపయోగించుకుంటారు ఆసురీ సంపన్నులు. కనుక నరకద్వారాలైన ఈ కామక్రోధ లోభాలను పూర్తిగా విడిచిపెట్టాలి.

అలా విడిచిపెడితే ప్రయోజనమేమిటంటావా - విను.

కామక్రోధలోభాలను మూడింటిని విడిచిపెడితే ఫలితం ఏమిటి?

**శ్లో||** ఏతైర్వి ముక్తః కౌంతేయ!

తమోద్వారై స్త్రి భిర్నరః ।

ఆచర త్యాత్మన శ్రేయః

తతోయాతి పరాం గతిం|| (22)

**తా||** కౌంతేయా! ఈ మూడు తమో ద్వారాల నుండి విడుదల పొందిన నరుడు శ్రేయస్సును సాధించిన వాడవుతాడు. దానివల్ల పరమగతిని పొందుతాడు.

**వ్యాఖ్య:-** కౌంతేయా! ఓ కుంతీ పుత్రా! అర్జునా! వింటున్నావా? కామ క్రోధ లోభాలు మూడూ నరకద్వారాలు. వీటినే తమోద్వారాలంటారు. తమస్సు అంటే చీకటి. అంటే ఈ మూడింటిని ఆశ్రయించిన వాడు చీకటిలో - అంటే అజ్ఞానంలో పడిపోతాడు. చీకటి ఉన్నచోట అన్ని విషపురుగులు చేరతాయి. అజ్ఞానం ఉన్నచోట అన్ని దోషాలు చేరిపోతాయి.

అజ్ఞానంలో పడవేసే ఈ 3 అసురగుణాలను పూర్తిగ బయటకు నెట్టు. వీటినుండి విముక్తుడవుకా! కేవలం ముక్తుడవైతే చాలదు. విముక్తుడవు కావాలి. పైపైన మొక్కను త్రుంచితే చాలదు. అడుగున ఉన్న వేర్లతో సహా తొలగించాలి. కనుక మూలచ్ఛేదనం చెయ్యి. మూలమైన అజ్ఞానంతో సహా పెకలించి వెయ్యి.

రామాయణంలో శ్రీరాముడు ముందు తాటకిని చంపాడు. అదే బోణీ. ఆ తరువాత మారీచుని చాలా కాలానికి చంపాడు. తాటక అంటే అజ్ఞానం. మారీచుడంటే కామం. ముందు అజ్ఞానాన్ని నశింపజేసి తర్వాత కామాన్ని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నశింపజేయాలి. అజ్ఞానం అలాగే ఉందా, కామం మళ్ళీ చేరుతుంది. అజ్ఞాన నాశనంతో కామక్రోధలోభాల కున్న పట్టు కాస్తా సడలిపోతుంది.

అర్జునా! నీవు కౌంతేయుడవు. కుంతీ పుత్రుడవు. కుంతం అంటే బల్లెం. బల్లెం చివర చాలా పదునుగా ఉంటుంది. మీ తల్లి కుంతం లాగా పదునైన - సూక్ష్మమైన బుద్ధిగలది. అందుకే ఆమెది సార్థకనామధేయం. ఆమె పుత్రుడవు కదా! నీదీ సూక్ష్మబుద్ధే. లేకపోతే యుద్ధరంగ మధ్యలో వేదాంత శ్రవణం చేయగలవా? అందుకే చెబుతున్నాను. ముందుగా నీ సూక్ష్మబుద్ధితో అజ్ఞానాన్ని తొలగించుకొని ఆ తర్వాత కామక్రోధలోభాల నడ్డి విరగగొట్టు. నీకు తప్పక విజయం లభిస్తుంది.

ఇలా కామక్రోధలోభాల నడ్డి విరగగొడితే ప్రయోజనం ఏమిటంటావా? **ఆత్మనః శ్రేయః ఆచరతి** :- నీ శ్రేయస్సును సాధించినవాడివవుతావు. శ్రేయస్సంటే ఏమిటి? ఆత్మానుభూతిని పొందుటే శ్రేయస్సు. మోక్షమే శ్రేయస్సు. ఆత్మజ్ఞానాన్ని అందుకోవాలని భావించేవారిని ఈ మూడూ బంధించివేస్తాయి. ఈ బంధం నుండి తప్పించుకుంటేనే శ్రేయస్సు.

నేరస్థుడు జైలునుండి విడుదలైనట్లు, గజేంద్రుడు మొసలి పట్టునుండి విడిపించుకొన్నట్లు జీవుడు ఈ కామ క్రోధ లోభాలనే బందిఖానా నుండి విడుదల పొందాలి.

- కామం ఇంద్రియాలకు సంబంధించినది.
- క్రోధం మనస్సుకు సంబంధించినది.
- లోభం బుద్ధికి సంబంధించినది.

ఈ కామక్రోధలోభాలు మూడింటిని జయిస్తే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి - ఈ మూడూ శుద్ధమైనట్లే.

దేహేంద్రియ మనోబుద్ధులను సవరించుకున్నవాడే - వాటిని సరైన స్థితిలో ఉంచుకో గలిగినవాడే ఆత్మజ్ఞానాన్ని - వేదాంత జ్ఞానాన్ని - బ్రహ్మజ్ఞానాన్ని అందుకోగలడు. అట్టి జ్ఞానాన్ని అందుకో గలిగితేనే మోక్షం.

అన్నింటి కన్న శ్రేష్టమైన పదవి ఆ మోక్షపదవి - పరమాత్మ పదవి. అట్టి పదవిని పొందాలంటే ఆత్మజ్ఞానాన్ని పొందాలి. వేదాలు, ఉపనిషత్తులు తెలియజేసిన బ్రహ్మజ్ఞానాన్ని పొందాలి. అట్టి జ్ఞానాన్ని పొందాలంటే నిగ్రహించబడిన ఇంద్రియాలు, శాంతించిన మనస్సు, సూక్ష్మబుద్ధి ప్రధానం. ఇంద్రియ మనోబుద్ధుల యొక్క శుద్ధి ఈ కామక్రోధలోభాలనే మూడు కల్మషాలను పారద్రోలితేనే సాధ్యం. కనుక ఈ మూడింటిని పారద్రోలాలి. ఎలా? కామక్రోధలోభాలను పారద్రోలే ఉపాయం ఏమిటి?

బృహదారణ్యకోపనిషత్తులో ఒక కథ ఉంది. 3 లోకాల్లో ఉండేవారంతా ఒకనాడు బ్రహ్మదేవుని సమీపించి తాము తరించే మార్గాన్ని బోధించమని ప్రార్థించారట. బ్రహ్మదేవుడు కనికరించి వారికి ద - ద - ద అని ఉపదేశించి, దీనితో మీరు తరిస్తారు ఆత్మ శ్రేయస్సు కలుగుతుంది - అని దీవించి పంపించాడు.

ఈ మూడు 'ద' లు ఏమిటా? అని అందరూ ఆలోచనలో పడ్డారు. చివరకు అవి దమం - దయ - దానం అని నిశ్చయించుకొని ఆ మూడు గుణాలను ఆశ్రయించుకొని, ఆత్మశ్రేయస్సును పొందారట.

కామం - క్రోధం - లోభం వీటిని విడిచిపెడితే ఆత్మశ్రేయస్సు - అని భగవానుడంటున్నాడు. దమం - దయ - దానం వీటిని ఆశ్రయిస్తే ఆత్మశ్రేయస్సు అని బ్రహ్మదేవుడంటున్నాడు. ఇప్పుడు మనం ఆలోచించాలి.

ఈ రెండూ నిజమేనా? నిజమే. ఎలా? ఎలాగంటే -

(i) కామాన్ని జయించాలి. ఎలా? దమంతో - ఇది దేవతలకు

(ii) క్రోధాన్ని జయించాలి. ఎలా? దయతో - ఇది దానవులకు

(iii) లోభాన్ని జయించాలి. ఎలా? దానంతో - ఇది మానవులకు. ఎలాగో చూద్దాం.

(i) **కామం:-** కామం అంటే కోరిక. చూచినవాటిని, విన్నవాటిని, తిన్నవాటిని, బాగున్నవాటిని కావాలనుకోవటమే కామం, కోరిక.

పచ్చగ కనబడితే చాలు పరుగెత్తేది పశులక్షణం. ప్రపంచంలోని వస్తువులను, విషయాలను, భోగాలను ఇంద్రియాల ద్వారా తెలుసుకోవటంతో వాటివైపుకు పరుగెత్తితే అతడు పశువులాంటివాడే. చూచిన గడ్డినల్లా మేయాలనుకుంటుంది పశువు. కాని మనిషి తనకు తగినటువంటి దానిని - సరైన దానిని మాత్రమే కావాలనుకుంటాడు. బుద్ధితో ఆలోచించగలిగే శక్తి మానవుడికి మాత్రమే ఉన్నది. కనుక ఇంద్రియాలను బుద్ధి యొక్క అధీనంలో ఉంచి - నిగ్రహంతో ఆలోచించి అనుభవించాలి.

పశువుకు దేహం ప్రధానం. మనిషికి బుద్ధి ప్రధానం. అందుకే పశువుకు భోగజీవితం కావాలి. మనిషికి యోగజీవితం కావాలి. ఇలా ఇంద్రియనిగ్రహం ద్వారా - దమం ద్వారా కామాన్ని జయించాలి.

(ii) **క్రోధం:-** క్రోధాన్ని దయతో జయించాలి. క్రోధం అంటే కోపం. అదొక భూతం. క్రోధుడు తన గొప్ప తనాన్ని ఇలా చెబుతున్నాడట.

"నేను తలచుకొన్నానా! నీవు కళ్ళున్నా గ్రుడ్డివాడివైపోతావు. చెవులున్నా చెవిటివాడివైపోతావు. మాటఉన్నా మూగవాడివైపోతావు. తెలివి ఉన్నా బుద్ధిహీనుడవైపోతావు. నీ చదువు, సంస్కారం అన్నింటిని వ్యర్థం చేస్తాను. నీ నోటితో అనరాని మాటలను అనిపిస్తాను. అసలు నీరూపాన్ని కూడా మార్చేస్తాను. నీ శరీరాన్ని వణికిస్తాను. నీ పెదవులను అదిరిస్తాను. గజగజ వణికిస్తాను. ఆప్తుల మాటలు వినకుండా చేస్తాను. నీ చేత చిందులు వేయిస్తాను. చివరకు నిన్ను నలుగురిలో నగుబాట్లు గావిస్తాను" - ఇది క్రోధుడి ప్రతిజ్ఞ.

మనస్సు దయతో నిండిపోయినప్పుడు క్రోధం నిరోధించబడుతుంది. అసలు కోపం వచ్చినా నిలవదు. 'దయగల హృదయమే భగవన్నిలయం' అన్నారు. దయ ఉంటేనే అది హృదయం. దయలేకపోతే హృదయం ఎలా అవుతుంది? 'హృము' అవుతుంది. మధ్యలో దయను నింపితేనే హృదయము.

అశోకవనంలో సీతాదేవిని చూచి హనుమంతుడు, "అమ్మా! ఈ రాక్షస స్త్రీలు నిన్ను హింసిస్తున్నారు గదా! నీవు అనుమతిస్తే వీరిని చంపేస్తాను" అన్నాడు. అప్పుడు సీతాదేవి, "నాయనా! నీకీ పాపిష్టి క్రోధం ఎలా కలుగుతున్నది? పాపం వాళ్ళు రాజాజ్ఞను పాటించవలసిన సేవకులు గదా! పైగా వాళ్ళు రాక్షసులు. హింస వాళ్ళ ప్రవృత్తి. మరి మనం రాక్షసులం కాదుగదా! దయచూపవలసిన హృదయం మనది. ఏది ఏమైనా మన

సుఖదుఃఖాలకు కారణం మన కర్మలే. ఆనాడు లక్ష్మణుని నోటికి వచ్చినట్లు ప్రేలానుగదా! ఆ పాపం ఊరికే పోతుందా? అందుకే ఇప్పుడు అనుభవిస్తున్నాను" - అన్నది.

"అమ్మకు రాక్షసులపై ఎంత దయో" అనుకున్నాడు హనుమ. హృదయం దయతో నిండాలి. దయతో కోపాన్ని జయించాలి.

(iii) **లోభం:-** లోభాన్ని దానంతో జయించాలి. చేతచిక్కిన దాన్ని వదలకుండా పట్టి ఉంచటం లోభం. అంటే పిసినారితనం. దీనిని దానంతో జయించాలి.

దానం చేస్తే ఉన్నది పోతుందని భావిస్తారు. కాని దానం చేస్తుంటే పోవటం కనబడుతుంది గాని రావటం కనిపించదు. అదే అదృష్టం. కనిపించనిది. నీవు చేసిన దానం అదృష్టంగా - కనిపించకుండా నీకు తిరిగి వస్తుంది. కొందరికి వెంటనే రావచ్చు. కొందరికి కొంతకాలం తర్వాత రావచ్చు. కొందరికి మరుజన్మలో రావచ్చు. మొత్తం మీద రెట్టింపై తిరిగి వస్తుంది.

ఇప్పుడు ధనవంతులు పూర్వం దానం చేసినవారే. ఇప్పటి దరిద్రులు దానం చేయనివారే. దానం చేసినా భగవంతుని ఆశ్రయించని వారికి ఇప్పటి ధనం అహంకారాన్ని కలిగిస్తుంది. దానం చేయకపోయినా భగవంతుని ఆశ్రయించిన వారికి దరిద్రంలో కూడా ఆనందమే. దానం ఎలా ఉండాలి?

(i) ప్రతిఫలం పుచ్చుకోకుండా ఇవ్వగలిగినది ఇవ్వాలి.

(ii) అవతలివారికి పనికి రాని దానిని దానం చెయ్యరాదు.

(iii) పాత్రులకు మాత్రమే ఇవ్వాలి. దుష్టులకు ఇవ్వరాదు.

(iv) ప్రచార పటాటోపం పనికిరాదు.

ఇలా చేసిన దానం లోభాన్ని జయించటమే గాక మరుజన్మలో ఎన్ని సంపదలున్నా అహంకారం ఉండదు. ఆ సంపదలు సద్వినియోగమౌతాయి.

ఈ ప్రకారంగా ఎవరైతే దమం - దయ - దానం తో కామ - క్రోధ - లోభాలను జయిస్తారో అట్టివారే దేహేంద్రియ మనోబుద్ధులను శుద్ధిగావించుకొని ఆత్మశ్రేయస్సును పొందగలుగుతారు. ఆ తరువాత మోక్షప్రాప్తితో పరమపదాన్ని పొందుతారు. తిరిగి జన్మలు ఉండవు. ఇదంతా శాస్త్రం చెప్పే పద్ధతి. శాస్త్రం చెప్పినట్లు నడుచుకోకపోతే ఏమవుతుంది?

**శ్లో||** యః శాస్త్ర విధి ముత్సృజ్య
వర్తతే కామ కారతః|
న స సిద్ధి మవాప్నోతి
న సుఖం న పరాం గతిం|| (23)

**తా||** ఎవరు శాస్త్రవిధిని విడిచిపెట్టి తన కోరికల ప్రకారం ప్రవర్తిస్తాడో అతడు కార్యసిద్ధిని పొందడు; సుఖాన్నీ పొందడు; పరమగతినీ పొందడు.

**వ్యాఖ్య:-** ఇంతవరకు భగవానుడు ఈ అధ్యాయంలో పట్టుకోవలసిన దైవీసంపదను, విడిచిపెట్టవలసిన ఆసురీ సంపదను గురించి చెప్పి, ఆసురీ సంపన్నుల ఆచారవ్యవహారాలు, వారి ఆలోచనలు, వారి మాటలు, వారి చర్యలు ఎలా ఉంటాయో వివరంగా తెలియజేశారు. చివరకు ఆసురీ సంపద మొత్తాన్ని సంక్షిప్తం చేసి కామ, క్రోధ, లోభాలనే మూడు గుణాలుగా విభజించి, ఆ మూడింటిని వదలమని, అలా వదిలిన వారికే మోక్షప్రాప్తి అని

కూడా తెలియజేశాడు. అయినా ఈ బోధ చాలదనుకున్నాడు భగవానుడు. ఎందువల్ల?

మానవ జీవన ప్రయాణం ఎంతో క్లిష్టమైనది. ఎన్నో కర్మలు జరిగిపోతుంటాయి. అలా కర్మలు చేస్తూ ఉండటమే జీవనప్రయాణం.

అయితే ఎలాంటి కర్మలు చేయాలి? ఎలాంటి కర్మలు చేయకూడదు? అనే సందేహం జీవితంలో అనేకసార్లు కలుగుతూనే ఉంటుంది. ప్రతి కర్మను ఇది చేయదగినదా? కాదా? దీనివల్ల మనం భగవంతుని వైపుకు ఒక అడుగు ముందుకు వేస్తున్నామా? వెనక్కు వేస్తున్నామా? అని ఆలోచించుకోవాలి. బ్రతికి ఉన్నంతకాలం కర్మలు చేస్తుండాలి. కర్మలు చేస్తున్నంతకాలం ఇలా ఆలోచించి చేయాల్సిందే. ఇలా ఎప్పటికప్పుడు తెలుసుకోవాలంటే మనకు ఏదో ఒక ఆధారం కావాలి. అదే శాస్త్రం. కనుక శాస్త్రసహాయం తీసుకొని మనం మన కర్మలను కొనసాగించాలి. శాస్త్ర సహాయం లేకుండా స్వేచ్ఛగా ప్రవర్తించేవాడు దీపం లేకుండా చీకటిలో నడిచేవాడే.

ఇంతకూ శాస్త్రం అంటే ఏమిటి?

'శాసనాత్ - శంసనాత్ ఇతి శాస్త్రం' శాసించేది - శంసనం చేసేది శాస్త్రం. స్టేషన్ మాస్టరు చేతిలో పచ్చజెండా, ఎర్రజెండా రెండూ ఉంటాయి. అలాగే శాస్త్రం చేతిలో శాసనం - శంసనం అని రెండూ ఉన్నాయి.

(i) **శాసనం:-** శాసనం అంటే శాసించి చెప్పటం. విధినిషేధాల గురించి - అంటే ఇది చెయ్యాలి - ఇది చెయ్యకూడదు. ఇలా చెయ్యాలి - అలా చెయ్యకూడదు

అని తేల్చిచెప్పటం శాసనం. ఇలా చేస్తే బాగుపడతావు. అలా చేస్తే చెడిపోతావు అని శాసించి చెప్పటం శాసనం.

(ii) **శంసనం:-** శంసనం అంటే అవ్యక్తమైన విషయాలను వ్యక్తం చెయ్యటం. కర్మఫలాలు, వాసనలు, గతజన్మలు, రాబోయే జన్మలు - ఇవన్నీ అవ్యక్తం. అసలు పరమాత్మే అవ్యక్తం. అవ్యక్తమైన విషయాలను మనంతట మనం తెలుసుకోలేం. కనుక వాటిని వ్యక్తం చేసి తెలియజెప్పేది శాస్త్రం. మనం మరచిపోయిన విషయాలను, మనకు తెలియని విషయాలను తెలియజెప్పటాన్నే శంసనం అన్నారు.

ఇలా శాసనం - శంసనం - ఈ రెండిటిని తెలియజేసేదే శాస్త్రం. ఈ శాస్త్రాలన్నీ అతీంద్రియశక్తులు గల ఋషుల యొక్క అనుభవాలే. ఈ శాస్త్రాలన్నీ మనుషుల కోసమేగాని పశువుల కోసమో పక్షుల కోసమో కాదు. 'ఇక్కడ మూత్రవిసర్జన చేయరాదు' అని గోడమీద హెచ్చరికగా ఒక వాక్యం వ్రాసి ఉంటుంది. ఎవరికోసం అది? కేవలం మనుష్యుల కోసమే. మనుష్యులు ఆ హెచ్చరికను ఉల్లంఘిస్తే యజమాని అతణ్ణి శిక్షిస్తాడు. అదే జంతువులు చేస్తే ఏం చేస్తాడు? పబ్లిక్ ప్లేస్ లో మనిషి మలమూత్రాలు విసర్జిస్తే చట్టం అతణ్ణి శిక్షిస్తుంది. అదే ఒక గొడ్డు చేస్తే ఏ చట్టం దాన్ని శిక్షిస్తుంది?

కనుక శాసనాలన్నీ మనుషులకే గాని, పశువులకు కాదు.

❖ శాస్త్రాన్ని అనుసరించి నడుచుకొనేవాడు మనిషి.

❖ శాస్త్రాన్ని అనుసరించకుండా స్వేచ్ఛగా నడుచుకొనేవాడు పశువు.

అందుకే పెద్దలంటారు -

**శ్లో|| శ్రుతయో యత్ర వర్తంతే - తత్ర తిష్టంతి వైనరాః |**

**మతయో యత్రవర్తంతే - తత్ర తిష్టంతి వానరాః ||**

- **శ్రుతిని అనుసరించేవాడు నరుడు**
- **మతిని అనుసరించేవాడు వానరుడు.**

- **శ్రుతి తప్పి పాడరాదు.**
- **తాళం తప్పి ఆడరాదు.**
- **శాస్త్రం తప్పి నడవరాదు.**

**శాస్త్రం తప్పినడిచే వాడికి ఇహంలేదు - పరం లేదు. అందుకే నసిద్ధిం, నసుఖం, నపరాంగతిం అవాప్నోతిః- కార్యసిద్ధి లేదు, సుఖం లేదు. మోక్షం లేదు - అని చెబుతున్నారు. ఎవరైతే శాస్త్ర విధిని తప్పి నడుస్తున్నారో అట్టి వారికి లక్ష్యం సిద్ధించదు, సుఖం కలగదు, పరమగతిని పొందలేరు అని స్పష్టం చేస్తున్నారు.**

**శాస్త్రం చెప్పినట్లు నడుచుకోక పోవటానికి కారణం ఏమిటి? కామమే. కోరికలే, ఆశలే, స్వార్ధమే. క్రిందటి శ్లోకంలో కామం వల్ల క్రోధం, లోభం కలుగుతాయని, ఈ మూడింటిని వదలాలని చెప్పారు. కోరికల కారణంగా శాస్త్రాన్ని కూడా ధిక్కరిస్తారు. కనుక కోరికలను వదలాలి. అంటే కామప్రేరితులు, క్రోధపూరితులు, లోభగ్రస్తులు అయినవారు విషయాలకు లొంగిపోయి శాస్త్రవిధిని తిరస్కరిస్తే అశాంతి - సంక్షోభం తప్పదు అని స్పష్టం. మరి ఏం చేయాలి?**

శాస్త్రవిధిని పాటించకపోతే సిద్ధిలేదు, సుఖం లేదు, మోక్షం లేదు. కనుక ఏం చేయాలో స్పష్టం చేస్తున్నారు.

**శ్లో||** తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యా కార్య వ్యవస్థితౌ|
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం
కర్మ కర్తు మిహార్హసి || (24)

**తా||** అందువల్ల చేయదగిన పనిఏది? చేయకూడని పనిఏది? అని నిర్ధారణ చేసుకొనటంలో నీకు ప్రమాణం శాస్త్రమే. కనుక శాస్త్రం చెప్పిన విధి విధానాలను చక్కగా తెలుసుకొని ఇక్కడ కర్మ చేయటానికి అర్హుడవు.

**వ్యాఖ్య:-**ఎటువంటి కార్యాలు చెయ్యాలి? ఎటువంటి కార్యాలు చేయకూడదు? అనే సందేహం కలిగినప్పుడు శాస్త్రమే నీకు ప్రమాణం. శాస్త్రంలో చెప్పిన దానిని బట్టే నడుచుకోవాలి. అంతేగాని ఎవరికి వారు నిర్ణయించుకోకూడదు. ఎవరి మనస్సుకు తగ్గట్టు వారు నిర్ణయించుకుంటే అది శాస్త్ర విధి అనిపించుకోదు. అట్టివారికి సుఖంలేదు, శాంతిలేదు, మోక్షంలేదు.

**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం:-** కర్మలు చేసే ముందు ఇది శాస్త్రసమ్మతమా? కాదా? అనే విషయం తెలుసుకోవాలంటే శాస్త్రవిధిని గురించి ముందు తెలుసుకోవాలి. అలా తెలుసుకున్న తరువాతనే చేయవలసిన కర్మలను చెయ్యాలి.

"ఓ అర్జునా! నీ వెలాగూ శస్త్ర ప్రవీణుడవే గదా! ఇక శాస్త్ర ప్రవీణుడవు కావాలి. శాస్త్రం జన్మజన్మలకు తల్లి. శాస్త్రమనే దీపాన్ని నీ చేతిలో ఉంచుకొని, అంధకార బంధురమైన ఈ జీవితాన్ని నడుపుకో. మహాత్ముల చరిత్రలే నీకు మార్గదర్శకాలు. వారి బోధలే నిన్ను సంసారసముద్రాన్ని దాటించే ఓడలు.

శాస్త్రం అనేది ఒక గైడ్ లాంటిది. మనం క్రొత్తగా ఢిల్లీకో,బాంబేకో, బెంగుళూరుకో వెళ్ళామనుకోండి. అక్కడ ఏమేమి చూడదగిన ప్రదేశాలు ఉన్నాయో, ఎక్కడికి పోవాలో, ఏ నెంబరు బస్సు ఎక్కాలో - అంతా తెలిస్తే హాయిగా తిరిగిరావచ్చు. అందుకే ఒక గైడ్ మనతోపాటు ఉండాలి. లేదా ఒక గైడ్ ను (పుస్తకాన్ని) కొనుక్కోవాలి.

అలాగే ఒక పుణ్యక్షేత్రానికి వెళ్ళినప్పుడు కూడా అక్కడ చూడవలసిన దృశ్యాలను, విశేషాలను తెలుసుకోవాలంటే అక్కడి విషయాలతో పరిచయం ఉన్న గైడ్ ఉండాలి. మనకన్నా అక్కడి విశేషాలు, ప్రదేశాలు, గుడులు, గోపురాలు - అన్నీ బాగా తెలిసినవాడే గైడ్. లేదా వాటిని తెలియజేసే పుస్తకాలే గైడ్. అలాగే శాస్త్రం కూడా.

**కర్మకర్తుం ఇహ అర్హసి:-** ఈ లోకంలో మనం కర్మలు చేస్తూనే జీవించాలి. "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" - కర్మలు చేస్తూనే ఇక్కడ నూరేళ్ళు జీవించాలి - అని ఈశావాస్యోపనిషత్ చెబుతున్నది. ‘‘నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్’’ - కర్మలు చేయకుండా ఒక్కక్షణం కూడా ఉండలేము అని భగవద్గీత చెబుతున్నది. కనుక కర్మ చేయక



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తప్పదు. అయితే ఆ కర్మ ఎలా ఉండాలి? శాస్త్రానుకూలంగా ఉండాలి. శాస్త్రం చెప్పినట్లుగా ఉండాలి. కనుక శాస్త్రాన్ని తెలుసుకొని చేయాలి.

శాస్త్రాన్ని, దాని అవసరాన్ని ఇంత గట్టిగా నొక్కి చెప్పటంవల్ల భగవంతుని దృష్టిలో వేదాలు - శాస్త్రాలు ఎంతటి పరమప్రమాణ గ్రంథాలో తెలుస్తున్నది. సాక్షాత్తు భగవానుడే అవి పరమప్రమాణాలు అని చెప్పటం వల్ల వాటిపై మనకెంతటి విశ్వాసం ఉండాలో అర్థం చేసుకోవచ్చు.

ఐతే మనం ఏ శాస్త్రాన్ని అనుసరించాలి? ఏది ఆచరణ యోగ్యం? బ్రహ్మవిద్యను, ఆత్మజ్ఞానాన్ని, మోక్షప్రాప్తికి తగిన జ్ఞానాన్ని అందించేవే వేదశాస్త్రాలు. ఆ శాస్త్రాలు అంత తేలికగా అర్థం చేసుకోలేము గనుక వాటికి అనేక వ్యాఖ్యానాలుగా వెలువడిన గ్రంధాలే ప్రకరణ గ్రంథాలు. ఇవి ఆచరణ విధానాన్ని తెలియజేస్తాయి. అయితే భగవద్గీతలో శాస్త్రవిషయాలూ ఉన్నాయి, ఆచరణ పద్ధతులూ ఉన్నాయి. అందుకే భగవద్గీతను అనుష్టాన వేదాంతం అన్నారు. కనుక నిజమైన శాస్త్రం - ప్రమాణ గ్రంథం ఏది? అంటే భగవద్గీతయే. భగవద్గీతను కూలంకషంగా తెలుసుకుంటే మానవుడు పరిపూర్ణ జీవితాన్ని గడపవచ్చు. మానవుడు ఉత్తముడుగా - మహాత్ముడుగా - పరమాత్మగా ఎదగవచ్చు. అలా కూలంకషంగా తెలుసుకోవాలంటే సద్గురువులను ఆశ్రయించి తెలుసుకోవాలి.

**గద్యం:** ఓం తత్సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసుర సంపద్విభాగ యోగోనామ షోడశోఽధ్యాయః||

**తా||** ఈ ప్రకారంగా ఉపనిషత్తుల సారము, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము అయిన భగవద్గీతయందు శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్యగల సంవాద రూపంలోని దైవాసుర సంపద్విభాగ యోగమనే పేరుగల 16వ అధ్యాయం సమాప్తం.

**వ్యాఖ్య:-** మనలో ఉన్న దైవీసంపదను, ఆసురీసంపదను పరిశోధించి, విశ్లేషణ చేసి ఆసురీగుణాలను అధిగమించే పద్ధతిని అధ్యయనం చేయటం జరిగింది.




Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# శ్రీమద్భగవద్గీత : 17 వ అధ్యాయం

# శ్రద్ధాత్రయ విభాగ యోగం




: వ్యాఖ్యాత :

**"అభినవ వ్యాస", "జ్ఞానప్రపూర్ణ"**

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు B.Sc[Ag]**

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం : చిలకలూరిపేట.

Website : WWW.SRICHALAPATHIRAO.COM

Email : care@srichalapathirao.com

Contact : +91 80085 39770 / +91 98862 65225

# పూజ్య గురుదేవులు

జ్ఞానప్రపూర్ణ

**శ్రీ దేవిశెట్టి చలపతిరావు గారు B.Sc., (Ag)**

వ్యవస్థాపకులు : ఆధ్యాత్మిక జ్ఞానపీఠం, చిలకలూరిపేట

Contact : (Mobile) 80085 39770 / (Land Line) 08647 254716

Email : care@srichalapathirao.com

Visit www.srichalapathirao.com to listen Pravachanas

# గురుదేవుల పరిచయము

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు 1946 సెప్టెంబర్ 12వ తేదీన గుంటూరు జిల్లా తుర్లపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, తల్లి పుల్లమ్మ. వీరి నివాసం చిలకలూరిపేట. ప్రాధమికవిద్య తుర్లపాడు గ్రామంలోను, ఉన్నత విద్య చిలకలూరిపేటలోను అభ్యసించి, బాపట్ల వ్యవసాయకళాశాల నుండి B.Sc. (Ag.) ప్రధమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే నానుడి ప్రకారం 4 సంవత్సరాల వయస్సు నుండి 8 సంవత్సరాల వయస్సు వరకు వీరి నోటి నుండి ఏ వాక్కు వస్తే అలాగే జరిగేది. పూర్వజన్మ సంస్కారం వల్ల వీరు 12 సంవత్సరాల వయస్సు నుండే రామాయణ, భారత, భాగవత గ్రంధాలను, పురాణాలు - ప్రబంధాలను అధ్యయనం చేయటం ప్రారంభించారు. ప్రత్యేకంగా మహాభారతంపై విశేషమైన ఆసక్తి కలిగి, 20 సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాభారతం, సంస్కృతమహాభారత గ్రంధాలపై తీవ్ర పరిశోధనలు గావించి, చిలకలూరిపేటలో 1988 నుండి 1992 వరకు ధారావాహిక ప్రవచనములు చేసి, శ్రోతల ప్రశ్నలకు అప్పటికప్పుడే జవాబులిస్తూ వారికి సందేహనివృత్తి గావించారు.

1990 నుండి చిలకలూరిపేట చిన్మయమిషన్ కార్యదర్శిగా అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, హోమాలను, పూజలను, గీతాజ్ఞానయజ్ఞాలను, సత్సంగాన్ని నిర్వహించారు. 1994 లో 'ఆధ్యాత్మిక జ్ఞాన పీఠాన్ని' స్థాపించి, ప్రసన్న బండ్లమాంబ శ్రీ రాజమాతాదేవి వారిచే ప్రారంభింపజేశారు. అప్పటి

నుండి ప్రతిరోజూ సత్సంగము, ప్రతినెల గీతాపారాయణలతోబాటు శ్రీకృష్ణ జన్మాష్టమి, గీతాజయంతి, శంకరాచార్యజయంతి, రమణమహర్షిజయంతి, ఆషాఢ - కార్తీక - మాఘ - వైశాఖ పౌర్ణమిల యందు ఆధ్యాత్మిక సదస్సులు, జన్మదినోత్సవం, విజ్ఞానయాత్రలు, వనసమారాధనలు, ధ్యానతరగతులు, వార్షికోత్సవం మొదలగు అనేక కార్యక్రమాలను జరుపుకొనుటలోను, నిరంతర జప, ధ్యాన, ఆత్మవిచారణ, సాక్షీభావన, బ్రహ్మనిష్ఠ మౌ॥న సాధనలతో, పూర్తి ఆధ్యాత్మిక జీవితాలను గడుపుటలోను, మాకు సదా మార్గదర్శకులుగా ఉండి మా వెన్నుతట్టి, చేయిపట్టి ముందుకు నడిపిస్తున్న కర్మయోగులు, జ్ఞాన ప్రపూర్ణులు మా గురుదేవులు.

భగవంతుడు నిర్దేశించినబాటలో పయనిస్తూ, తనలో నిక్షిప్తమైయున్న ఆధ్యాత్మికజ్ఞానాన్ని పదిమందికీ పంచాలనే సంకల్పంతో 1996 నుండి వివిధ పట్టణాలలో ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞముల ద్వారా భగవద్గీత, ప్రకరణ గ్రంధాలైన శంకరాచార్యులవారి భజగోవిందం, తత్వబోధ, ఆత్మబోధ, వివేకచూడామణి, అద్వైతసారం, శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం, అపరోక్షానుభూతి, శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి ఆత్మవిద్యావిలాసం, శంభునటనం, భగవాన్ శ్రీ రమణమహర్షుల వారి ఉపదేశసారం, నారదభక్తిసూత్రములు, బ్రహ్మసూత్రములు, ఇంకా రామాయణ, భారత, భాగవతములు, అలాగే ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, కైవల్య, తైత్తిరీయ, సూర్య, మొదలగు 108 ఉపనిషత్తులపైనను ప్రవచనములు చేస్తూ జ్ఞానసుగంధాలను నలువైపుల ప్రసరింపజేస్తున్నారు. ఇప్పటివరకు చిలకలూరిపేట, విజయవాడ ధర్మల్

పవర్ స్టేషన్, రాయలసీమ ధర్మల్ పవర్ ప్రాజెక్ట్, వినుకొండ, శ్రీశైలం, కాశీ, తిరువణ్ణామలై, నెల్లూరు, బాపట్ల మొదలగుచోట్ల 180 'ఆధ్యాత్మిక జ్ఞానయజ్ఞము'లను చేశారు. 1998 లో వి.టి.పి.యస్. ఎ.కాలనీ యందు 108 హోమకుండాలతో వాసుదేవ మహాయజ్ఞాన్ని నిర్వహించారు.

1993లో భగవద్గీత ప్రవచనముల ముగింపు సందర్భంగాను, 2001లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపు సందర్భంగా చిలకలూరిపేటలోను; 1999లో భగవద్గీత ప్రవచనముల ముగింపుసందర్భంగాను, 2002లో వివేకచూడామణి ప్రవచనముల ముగింపుసందర్భంగా వి.టి.పి.యస్.లోను శిష్యులందరూ గురుదేవులను ఘనంగా సన్మానించారు. 2006లో 100 జ్ఞానయజ్ఞాలు పూర్తిగావించిన సందర్భంగా శిష్యులందరూ కలసి 'జ్ఞానప్రపూర్ణ' బిరుదుతోను, 2011లో మహాభారత పరిశోధనలో గురుదేవుల కృషికి 'అభినవ వ్యాస' బిరుదుతోను గురుదేవులను సత్కరించటం జరిగింది.

1994లో సామాన్యులకు కూడా వేదాంత విషయాలు సులభంగా అర్థమయ్యేరీతిలో గురుదేవులు 'కర్మసిద్ధాంతం' అనే చిన్న గ్రంధాన్ని రచించి ప్రచురింపజేశారు. తిరిగి 2002లోను, 2008లోను, 2009లోను పునర్ముద్రణ జరిగింది. 1998లో శుక్లయజుర్వేదమునందలి 'ఈశావాస్యోపనిషత్తు' పై అందరికి అర్థమయ్యే విధంగా సరళమైన, వాడుకభాషలో విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. 1999లో శంకరాచార్యుల వారి 'భజగోవిందం' పై అందరికీ అతి సులభంగా

అర్ధమయ్యే విధంగా, ఎంతో వివరంగా, వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపజేశారు. తిరిగి 2009లో ద్వితీయ ముద్రణ జరిగింది.

'భగవద్గీత' అనగానే "అమ్మో! అది మనలాంటి సామాన్యులకు కాదు" అనుకొనేవారు "భగవద్గీతను ఇంత తేలికగా అర్ధం చేసుకోగలమా?" అనుకొనేటట్లు ప్రవచనములు చేస్తున్న గురుదేవులు 2011లో 1, 2 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2012లో భగవాన్ రమణమహర్షుల "ఉపదేశసారము" నకు, సామవేదం నుండి గ్రహించబడిన 'కేనోపనిషత్తు'కు విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. ఇవిగాక 'శ్రీ నారదభక్తిసూత్రాలు', శంకరాచార్యుల వారి 'ఆత్మబోధ', 'శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం' పై ఎంతో వివరణాత్మకంగా, సోదాహరణంగా, విపులమైన వ్యాఖ్యను వ్రాసి ప్రచురింపచేశారు. 2013 లో శ్రీ సదాశివబ్రహ్మేంద్రసరస్వతి స్వామివారి 'ఆత్మవిద్యావిలాసం', భగవద్గీత 3,4,5 అధ్యాయములను ప్రచురింపచేశారు. 2015 లో ప్రస్తుతం ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు, భగవద్గీత 13, 14, 15, 16 అధ్యాయములు ప్రచురణకు సిద్ధం చేయబడుతున్నాయి.

ఇవిగాక విజయవాడ నుండి వెలువడే *ధ్యానమాలిక* మాసపత్రికలో 2008 నుండి భగవద్గీతను, 2009 నుండి మహాభారతమును ధారావాహికంగా ప్రచురిస్తున్నారు. ఇక దేశవిదేశాలలోనున్న తెలుగువారు ఈ జ్ఞానాన్ని గ్రహించటానికి వీలుగా www.srichalapathirao.com పేరుతో ఒక వెబ్సైట్ ను ప్రారంభించటం జరిగింది. దీని ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానపీఠం

కార్యక్రమాలను, గురుదేవుల ప్రవచనాలను, గురుదేవుల వివిధ రచనలను, భజనలు, కీర్తనలను వినవచ్చును, చదువవచ్చును, డౌన్లోడ్ చేసుకొనవచ్చును. ఇక వివిధ గ్రంధాలపై గురుదేవుల ప్రవచనములను CD.ల రూపంలోను, వీడియో DVD ల ద్వారా, PEN Drive, External Hard Disk ద్వారా అందిస్తున్నారు.

ముందుముందు మోక్షమార్గంలో పయనించే ఎందరికో మార్గ నిర్దేశనం చేయగల ఎన్నో గ్రంధాలు ముముక్షుజనావళిని తరింపజేయుటకు అందుబాటులోనికి రావాలని, అందుకు త్యాగధనులైన భక్తులు, సాధకులు, మోక్షార్ధులు ముందుకు రాగలరని భగవంతుని మనసారా ప్రార్ధిస్తున్నాను.

జ్ఞాన సూర్యునిలా ప్రకాశిస్తూ, నిస్వార్ధంగా తన సేవలను అందిస్తున్న కర్మయోగి, సనాతనమైన వైదికధర్మాన్ని ప్రచారంచేస్తూ, మాకు మార్గదర్శకులైన భగవంతుని ముద్దుబిడ్డ మా గురుదేవులను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగించినందులకు భగవంతునికి శతసహస్రవందనములు సమర్పించుకుంటున్నాను.

- శ్రీమతి రావూరి అన్నపూర్ణ

కార్య నిర్వాహక అధ్యక్షులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం, చిలకలూరిపేట.






Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

# : ఉపోద్ఘాతం :

**ఈ అధ్యాయానికి అనేక పేర్లున్నాయి. 1. శ్రద్ధా యోగము. 2. శ్రద్ధా వివేక యోగము. 3. శ్రద్ధా త్రివిధ యోగము. 4. శ్రద్ధా గుణనిర్దేశ యోగము. 5. శ్రద్ధా గుణబేధ యోగము. 6. గుణకర్మ శ్రద్ధావివేక యోగము. 7. అనుష్టాన యోగము.**

**ఇలా ఎన్ని రకాల పేర్లు ఉన్నా 'అనుష్టాన యోగము' అనే పేరు ఎంతో సమంజసంగా ఉంటుంది. మొత్తం 18 అధ్యాయాలలోను సాధారణ మానవులకు అనుష్టానయోగ్యమైనది ఈ అధ్యాయం.**

**'శ్రద్ధ' – ఈ పదం సాధనచతుష్టయసంపదలో 3వదైన శమాదిషట్కసంపత్తిలో చెప్పబడింది. వేదాంతజ్ఞానాన్ని శ్రవణం చేయాలన్నా, అందలి జ్ఞానాన్ని అవగాహన చేసుకోవాలన్నా అర్హత కావాలి. ఆ అర్హతే సాధనచతుష్టయ సంపద. అందులో మొదటిది వివేకం, రెండవది వైరాగ్యం, మూడవది శమాది షట్క సంపత్తి. అంటే ఏమిటి ఆ ఆరు? శమము, దమము, ఉపరమము, తితిక్ష, శ్రద్ధ, సమాధానం.**

**శ్రద్ధ అంటే ఏమిటి? "గురు వేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధ!" అని తత్త్వబోధలో శంకరాచార్యుల వారు శ్రద్ధకు నిర్వచనం ఇచ్చారు. గురువు పట్ల, వేదాంత వాక్యాల పట్ల విశ్వాసం కలిగి యుండటమే శ్రద్ధ.**

**ఈ శ్రద్ధ 3 విధాలు (1)సాత్త్విక శ్రద్ధ. (2) రాజసిక శ్రద్ధ. (3) తామసిక శ్రద్ధ. ఈ మూడు రకాల శ్రద్ధను విభాగించి, విశ్లేషించి, వివరించే అధ్యాయమే ఇది**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గనుక దీనికి శ్రద్ధాత్రయవిభాగయోగం అని పేరు వచ్చింది. ఇది సప్తదశోఽధ్యాయం. అంటే 17 వ అధ్యాయం.

సప్త అంటే 'సృప్తా సంఖ్య' - అని. అంటే జాలువారే సంఖ్య అని. సప్తాదశ అంటే జాలువారేదశ. అంటే సరైన శ్రద్ధతో మోక్షం వైపు జాలువారే దశ అని. ప్రతి మానవుడు మోక్షం వైపు ప్రయాణం సాగించాల్సిందే.

నదికి గమ్యస్థానం సముద్రం. విద్యార్థికి లక్ష్యం పరీక్షలో పాస్ కావటం. అలాగే మానవుడై పుట్టిన ప్రతి వానికీ లక్ష్యం - గమ్యం మోక్షప్రాప్తి. అయితే మోక్షాన్ని పొందాలంటే అర్హత కావాలి. - అధికారి కావాలి. దైవీసంపద కలిగి ఉండటమే అధికారం.

పొందవలసిన దైవీసంపద గురించి, వదిలించుకోవలసిన ఆసురీసంపద గురించి వివరిస్తూ 16 వ అధ్యాయం బయలు దేరింది. పరమగతిని చేరుకోవాలంటే ఆటంకం కామక్రోధాలే గనుక వాటిని త్యజించమని చెప్పటం జరిగింది. ఆసురీసంపదను తొలగించుకోలేకపోతే ఆత్మశ్రేయస్సు కలగదని కూడా చెప్పారు. అయితే ఆసురీసంపదను ఎలా తొలగించుకోవాలో, దైవీసంపదను ఎలా పొందాలో అక్కడ వివరించలేదు. ఇక్కడ 17 వ అధ్యాయంలో ఆ లోటును తీరుస్తూ ఆసురీసంపదను దైవీసంపదగా మార్చుకొనే ఉపాయాలను, సాధనా పద్ధతులను తెలియజేయబోతున్నారు. అందుకే దీనిని అనుష్టానయోగం అనటం ఎంతో సమంజసంగా ఉంటుంది.

అసలు ఈ ఆసురీసంపద ఎక్కడ ఉన్నది? - కారణ శరీరంలోనే

బాహ్యదృష్టిని కలిగించేవి, చెడ్డకార్యాలకు ప్రేరేపించేవి సూక్ష్మాతి సూక్ష్మమైన వాసనలే. అవే కారణశరీరంలో నిక్షిప్తమై ఉంటాయి. వాటినే గుర్తించి తొలగించుకోవాలి. లేదా మార్చుకోవాలి.

స్థూలశరీరం చేసే దుష్కార్యాలకు మూలం కారణశరీరంలో ఉన్న కామ క్రోధ లోభాలేనని 16 వ అధ్యాయంలో వివరించారు. వాటిని వదిలించుకోవటానికి, చేయదగిన సత్కర్మలు చేయటానికి శాస్త్రాన్ని ప్రమాణంగా తీసుకొని, పాటించమని ఆ అధ్యాయాన్ని ముగించారు.

అర్జునునికి ఇప్పుడొక సందేహం. శాస్త్రాలా అనంతం. అవి అన్నీ తెలుసుకోవాలంటే ఈ జన్మ చాలదు. అసలు కొందరికి శాస్త్రాలను తెలుసుకోవాలనే ఆలోచన కూడా రాదు. ఒకవేళ వచ్చినా శాస్త్రాలను చదివి అర్థం చేసుకొనే తెలివి గాని, పాండిత్యం గాని, అర్హత గాని అందరికీ ఉండదు. ప్రతి చిన్న పనికీ శాస్త్రాలను తిరగేస్తూ కూర్చోవటం ఆచరణలో సాధ్యమయ్యే పని కాదు. మరి అలాంటప్పుడు శ్రద్ధతో మంచి కార్యాలు చేయవచ్చు గదా! పెద్దలు నడిచిన బాటను అనుసరిస్తూ, వారు చెప్పిన మాటలకు తగినట్లుగా సత్కర్మలను చేస్తే సరిపోదా? శాస్త్రాలను తెలుసుకోకుండా శ్రద్ధతో పూజాదికాలను, సత్కార్యాలను, పుణ్యకార్యాలను చేస్తే ఆ అభ్యాసం ఎలాంటిదవుతుంది? ఆ నిష్ట సాత్వికం కాదా? దానివల్ల ఫలసిద్ధి లబించదా? - ఇదీ అర్జునుని సందేహం.

దీనికి భగవానుడు సూటిగా సమాధానం చెప్పకుండా 3 విధాలైన శ్రద్ధను గూర్చి విపులంగా తెలియజేస్తున్నాడు. శ్రద్ధ సాత్వికమని, రాజసికమని,

తామసికమని 3 విధాలుగా విభాగించి తెలియజేశాడు. ఇక అధ్యాయం చివరిలో అశ్రద్ధ వల్ల కలిగే అనర్ధాన్ని తెలియజెప్పాడు. ఈ విధంగా శ్రద్ధతో ప్రారంభించి, అశ్రద్ధను నిరశిస్తూ అధ్యాయాన్ని ముగించాడు.

భగవద్గీతలో శ్రద్ధ గురించి అనేక పర్యాయాలు చెప్పటం జరిగింది. శ్రద్ధ లేకుండా భగవంతునిపై భక్తి కుదరదు. శ్రద్ధ లేకుండా జ్ఞానసాధన కూడా అసాధ్యం. భక్తి జ్ఞానాలు రెంటికీ శ్రద్ధ అనేది ఎంతో అవసరం.

భక్తియోగంలో 'శ్రద్ధయాపరయోపేతాః' అంటూ 2 వ శ్లోకంతో ప్రారంభించి 'శ్రద్ధ దానా మత్పరమా' అంటూ 20 వ శ్లోకంలో శ్రద్ధతోనే ముగించారు. అంటే భక్తి అనేది శ్రద్ధ మీదనే ఆధారపడి ఉన్నది. ఇక జ్ఞానాన్ని పొందాలంటే ఉపనిషత్తులను (వేదాంత శాస్త్రాలను) అర్ధం చేసుకోవాలి. అందుకు సాధనచతుష్టయసంపద కావాలి. అందులో ముఖ్యమైనది శ్రద్ధ. నిజంగా శ్రద్ధ అనేది అన్నింటికీ కుదురు లాంటిది. వివేక వైరాగ్యాలు, శమ దమ ఉపరమ తితిక్షలు - అన్నీ కూడా శ్రద్ధపై ఆధారపడినవే. శ్రద్ధ లేనిచో అన్నీ వ్యర్ధమయ్యే ప్రమాదం ఉన్నది. అడుగున గుండ్రంగా ఉండే కుండలు, పాత్రలు ఉంటాయి. వాటినిండా నీరు నింపి ఉంచాలంటే వాటి అడుగున ఒక కుదురు ఉండాలి. అది లేకపోతే అవి కాస్తా దొర్లిపోతాయి. నీరంతా వ్యర్ధమై పోతుంది. అలాగే అన్ని సాధనలకు, లక్షణాలకు కుదురు లాంటిది శ్రద్ధ.

ఆచార్య వినోబాభావే అభిప్రాయంలో శ్రద్ధ పాత్ర వంటిది. మిగతా సాధనలన్నీ పదార్ధాల వంటివి. అన్నం, కూర, పప్పు, పులుసు - అన్నీ తయారు చేస్తాం. అయితే వాటిని ఉంచటానికి, మనం ఉపయోగించుకోవటానికి

తగిన పాత్రలు కావాలి. పాత్రలు లేకపోతే వాటిని ఎక్కడ ఉంచుతాం? అలాగే అన్ని సాధనలకు శ్రద్ధ కావాలి. శ్రద్ధ లేకపోతే సిద్ధి లేదు.

'శ్రద్ధ ఎంత గొప్పదో సిద్ధి అంత దగ్గర' అన్నారు రమణ మహర్షి. శాశ్వత బ్రహ్మానందానికి కీలకం ఏమిటి? అని పార్వతీదేవి అడిగితే 'శ్రద్ధ' అని సమాధాన మిచ్చాడు పరమశివుడు. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అని గీత బోధిస్తున్నది. అంటే శ్రద్ధ గల వానికే జ్ఞానం లభిస్తుంది - అని.

దేవునిలో కాని, వేదములో కాని, గురువులో కాని, మంత్రంలో కాని, తీర్థంలో కాని, పెద్దలలో కాని, వైద్యులలో కాని ఎంత శ్రద్ధ ఉంటుందో అంత సిద్ధి లభిస్తుంది.

ఒక గొప్ప డాక్టరుగారున్నారు. చుట్టుప్రక్కల చాలా ఊళ్ళలో ఆయన హస్తవాసిపై ఎంతో నమ్మకం. ఒకరోజు రాత్రి హాస్పిటల్ మూసేసి ఇంటికి బయలుదేరాడు ఆ డాక్టరు. ఇంతలో ఒకడు విపరీతమైన కడుపునొప్పితో మెలికలు తిరిగిపోతూ వచ్చాడు. డాక్టరు గారితో చెప్పి వలవలఏడ్చాడు. డాక్టరు గారు అతడి బాధను చూచి, కోటు జేబులో నుండి ఒక మాత్రను తీసి ఇచ్చి ఇది నోటిలో పెట్టుకొని రసాన్ని పీలుస్తూ ఉండు. ఎట్టి పరిస్థితిలోనూ మ్రింగవద్దు అని చెప్పి, ఇంటికి రమ్మని చెప్పాడు. అతడు ఆ మాత్రను నోటిలో పెట్టుకొని రసాన్ని పీలుస్తూ ఉన్నాడు. ఒక గంట తర్వాత డాక్టరు గారింటికి వెళ్ళాడు. ఆయన స్నానపానాదులు ముగించుకొని వచ్చి ఎలా ఉంది? అని అడిగాడు. 'చాలా వరకు తగ్గి పోయిందండీ' - అన్నాడు వాడు. ఏదీ ఉయ్

దానిని అన్నాడు డాక్టరు. అతడు ఊశాడు. అది డాక్టరు గారి కోటు గుండీ. అప్పుడు మందు ఇచ్చి పంపించాడు. విశ్వాసం అలా పనిచేసింది.

ఒక శిష్యుడు గురువుపై గల అచంచల విశ్వాసం (శ్రద్ధ) తో గురునామ స్మరణ చేసుకుంటూ నీటి మీద నడచి పోతున్నాడు. అది చూచిన గురువు నా నామంలో ఇంత మహాత్యం ఉంటే ఇక నాకెంత మహత్తో అని నీటిపై అడుగులు వేశాడు. అంతే డభీమని క్రిందపడి మునిగిపోయాడు. విశ్వాసానికి అంత మహత్తు ఉన్నది.

ఒక అనాథయైన పేదరాలున్నది. ఒక్కడే కొడుకు. ఆరేండ్ల పిల్లవాడు. చదువు మీద కోరికతో చదువుకుంటానని తల్లిని అడిగాడు. అప్పుడా తల్లి, వాడితో, "నాయనా! తినటానికే లేదు, ఇంకా చదువుకుంటానంటే డబ్బు ఎక్కడ తెచ్చేదిరా?" అన్నది. ఆ పసివాడు, "అమ్మా ! అందరు పిల్లలు చదువు కుంటున్నారు గదా! నన్ను వద్దం టావేమిటి?" అన్నాడు. దానికా తల్లి, "నాయనా ! మనం దిక్కులేని వాళ్ళం నాయనా! అన్నది. అమ్మా! మనకెవ్వరూ దిక్కులేరా? అని బుంగమూతి పెట్టాడు. తల్లి అన్నది, "దిక్కులేని వారికి దేవుడే దిక్కు" అంటారు. ఆయన సహాయం చేయాల్సిందే తప్ప ఇంకెవ్వరూ చేయరు నాన్నా"అన్నది. ఆ మాటలకు ఉత్సాహంతో, "అమ్మా! దేవుడు ఎక్కడుంటాడో చెప్పు. లెటరు వ్రాస్తాను" అన్నాడు. తల్లి పిల్లవాడి మాటలకు ముచ్చట పడుతూ, "నారాయణ మూర్తి, వైకుంఠం" అన్నది. పిల్లవాడు కార్డు తెచ్చి లెటరు వ్రాయించుకున్నాడు. అడ్రసు వ్రాయించుకొని పోస్టాఫీసుకెళ్ళి బాక్స్ లో

వేయాలనుకున్నాడు. కాని ఆ బాక్స్ అందటం లేదు. పోస్టుమాస్టర్ చూచి ఆ పిల్లవాణ్ణి అడిగాడు. అంతా చెప్పాడు.

"అబ్బాయీ! వారం రోజులకు సమాధానం వస్తుంది" - అన్నాడు పోస్టుమాస్టర్. వారానికి వచ్చి చేతులు కట్టుకొని వినయంగా నిలబడ్డాడు. "అబ్బాయి! దేవుడు నాకు డబ్బు పంపుతానన్నాడు. నేను నీకు ఇస్తాను. చదువుకో!" అన్నాడు పోస్టుమాస్టారు. సంతోషంతో తల్లి దగ్గరకు వెళ్ళి చెప్పాడు. శ్రద్ధ ఉంటే చాలు, సిద్ధి తప్పదు.

శ్రద్ధ గురించి మనకు రామాయణ భారత భాగవతాలలో కూడా అనేక సంఘటనలున్నాయి.

రామాయణంలో శబరిని చూడండి. ఆమెకు గురువు ఒక మాట చెప్పాడు. నీకు ఎప్పటికైనా శ్రీరామ దర్శనం అవుతుంది - అని. ఆ గురువు మాటపై విశ్వాసంతో ప్రతిరోజూ శ్రీరాముని దర్శనానికి వేచి చూస్తున్నది. ఏళ్ళకు ఏళ్ళు గడిచిపోతున్నాయి. అయినా ఆమె నమ్మకం సడలలేదు. నిరాశ చెందలేదు. వృద్ధాప్యంలో కూడా ఆమె ప్రతిరోజూ శ్రీరాముని రాకకై ఎదురు చూస్తూ ఉండేది. చివరకు ఒకనాడు రామ లక్ష్మణులు స్వయంగా ఆమె కుటీరానికి రానే వచ్చారు. ఒక అనాగరిక భిల్లస్త్రీ అయిన శబరి యొక్క కోరిక నెరవేరింది. అదీ శ్రద్ధ (విశ్వాసం) అంటే.

మహాభారతంలో ఏకలవ్యుడు ఉన్నాడు. ఆటవికుడు. ద్రోణాచార్యుని వద్ద విలువిద్య నేర్చుకోవాలనుకున్నాడు. కాని ద్రోణుడు నిరాకరించాడు. అయినా ఆయనపై భక్తి సడలలేదు. అడవికి వచ్చి, ద్రోణుని మట్టి విగ్రహాన్ని తయారు

చేసుకొని ఆయనే విద్య నేర్పుతున్నట్లు భావించుకొని విలువిద్యను అభ్యాసం చేశాడు. అద్భుతమైన విలువిద్యను నేర్చుకున్నాడు. ఇదంతా ద్రోణాచార్యునిపై గల శ్రద్ధ వల్లనే. అదీ శ్రద్ధ అంటే.

భాగవతంలో సుదాముడనే మాలాకారుడున్నాడు. అతడు ప్రతిరోజూ శ్రీకృష్ణుని కొరకు ఒక మాలను తయారుచేసి ఆయన కొరకు ఎదురుచూస్తూ ఉండేవాడు. ప్రతిరోజూ అదే పని. అతడికి శ్రీకృష్ణునిపై అచంచల విశ్వాసం. ఒకనాడు బలరామునితో కలసి శ్రీకృష్ణుడు తనను వెతుక్కుంటూ రానే వచ్చాడు. తన పూజను అందుకున్నాడు. శ్రద్ధ ఉంటే సిద్ధి తప్పదు.

మనం కూడా అచంచలమైన విశ్వాసంతో పట్టు వదలకుండా భగవంతుని కోసం ఆరాటపడితే ఆయన దర్శనం తప్పక లభిస్తుంది. ఏది ఏమైనా శ్రద్ధ - విశ్వాసం ముఖ్యం.

గంగానదీ పుష్కరాలు జరుగుతున్నాయి. గంగలో స్నానం చేస్తే సమస్త పాపాలు తొలగిపోతాయి. అందుకే అందరూ ఎంతో శ్రమకోర్చి, ఎంతో ఖర్చు పెట్టుకొని గంగా స్నానానికి వెళుతూ ఉంటారు. పుష్కరాల సమయం గనుక జనం తండోపతండాలుగా ఉన్నారు. స్నానాలు చేస్తున్నారు. పార్వతీ పరమేశ్వరులు అటుగా వెళుతూ క్రిందికి చూచారు. ఆ జన సందోహాన్ని చూచి పార్వతీదేవి భక్తితో, "స్వామీ! వీళ్ళందరూ గంగలో స్నానం చేసి పాపాలన్నీ తొలగించుకొని, పుణ్యాత్ములై కైలాసానికి వస్తే వీళ్ళందరికీ అక్కడ చోటెక్కడ ఉంటుంది? అన్నది. దానికి పరమశివుడు, "పార్వతీ! వీళ్ళందరికీ పాపాలన్నీ తొలగి పుణ్యాత్ములమౌతామని, కైలాసానికి వెళతామనే విశ్వాసం

**ఉంటే గదా! వీళ్ళు కైలాసానికి వచ్చేది" అన్నాడు. "ఆ! అలాగా! మరి అందరూ ఇలా ఎందుకు గంగా స్నానాలు చేస్తున్నట్లు?" అని ప్రశ్నించింది పార్వతి. "సరే. వీరిలో ఎంత మందికి అలాంటి నమ్మకం ఉందో పరీక్షిద్దాం అన్నాడట పరమేశ్వరుడు. ఇద్దరు వృద్ధ దంపతుల వేషంలో భూమి మీదకు వచ్చి, గంగా స్నానం చేయటానికి సిద్ధమయ్యారు. ముసలాయన గంగలో దిగుతూ జారిపడ్డాడు. "బాబూ! రక్షించండి" అని కేకలు వేస్తున్నది ముసలమ్మ. ఇది విని ఒక భక్తుడు, "అమ్మా! నేను రక్షిస్తాను నీ భర్తను" అని చెయ్యి అందించబోయాడు. అంతలో ఆ ముసలమ్మ అన్నది, "నాయనా! పాపాత్ములు నా భర్తను తాకితే చాలు వెంటనే వారు తల పగిలి చనిపోతారు. జాగ్రత్తగా ఆలోచించు కొని చేయి అందించు" అన్నది. "అమ్మో! అలాగా! ఇంకా నయం ముందే చెప్పావు" అని అతడు జారుకున్నాడు. ఆ ముసలమ్మ మళ్ళీ రక్షించమని కేకలు వేస్తున్నది. స్నానం చేసి పైకి వస్తున్న వారిలో ఒక్కొక్కరు రక్షించేందుకు వస్తున్నారు కాని ఈ ముసలమ్మ మాటలు విని తప్పుకొని పోతున్నారు. అలా ఎందరో వచ్చి వెళ్ళిపోతున్నారు. ఒక్కరు కూడా ధైర్యం చెయ్యటం లేదు. అలా 4 గంటలు గడిచి పోయింది.**

**ఒక వేశ్య ఎంతో కాలం నుండి పుష్కరస్నానం చెయ్యాలనే కోరికతో ఈ నాటికి ఆ కోరిక తీర్చుకొంది. గంగా స్నానం చేసి ఒడ్డుకు వస్తూ ఈ ముసలమ్మ కేకలు విన్నది. ఆ ముసలాయనను రక్షించటానికి చెయ్యి అందించబోయింది. అంతలో పార్వతీ దేవి, "అమ్మా! నీలో పాపం ఉంటే తల పగిలి చనిపోతావు, జాగ్రత్త!" అన్నది.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

గంగలో మునిగి పుష్కరస్నానం చేసిన తర్వాత ఇంకా పాపమేమిటమ్మా! అసలు ఇక్కడకు వచ్చింది ఎందుకు? పాపాలు పోగొట్టుకోవటానికే గదా! " అన్నది.

అప్పుడు శివుడు అన్నాడు, "ఈమెకు కైలాసంలో సీటు ఖాయం" అని. కనుక శ్రద్ధ - విశ్వాసం - నమ్మకం ముఖ్యం.

ఈ విషయం అందరికీ తెలుసు. వేదాంతాన్ని చెప్పే వాళ్లకు, వినే వాళ్ళకు, చదివేవాళ్లకు - అందరికీ తెలుసు. కాని అది లోపలకు ఎక్కదు. అంతరాంతరాల్లో నిలవదు. ఇతరులకు చెప్పాలంటే చక్కగా చెబుతాం.

కొందరు ఆశ్రమాలకు వెళతారు. గురువులను ఆశ్రయిస్తారు, భక్తితో సేవలు చేస్తారు. వారు చెప్పిన మాటలను లొట్టలేసుకుంటూ వింటారు. వారి గొప్ప తనాన్ని గూర్చి పది మందికీ చెబుతారు. కాని చాటుగా చేసే పని వేరు. ఆయన లోని లోపాలను వెతుకుతారు. నిందలు వేస్తారు. అలాంటి వారు ఏమి కోల్పోతారో, ఎంత కోల్పోతారో వారికి తెలియదు.

పైనున్న కుళాయి నుండి ఎంత నీరు తొట్టిలో పడుతున్నా క్రిందనున్న రంధ్రాన్ని తెరచి ఉంచితే తొట్టి ఎప్పటికీ నిండదు. పడ్డ నీరంతా వృథా. అలాగే శ్రద్ధ - విశ్వాసం అనే తొట్టికి రంధ్రం వేసి, ఆ రంధ్రాన్ని తెరచి ఉంచి, ఎంత జ్ఞానాన్ని సంపాదించినా ఆ జ్ఞానం అంతా వృథా అయిపోవటమే జరుగుతుంది.

గురువుపై నీకున్న శ్రద్ధ వల్లనే - అచంచలమైన విశ్వాసం వల్లనే నీవు అద్భుతంగా ముందుకుపోగలవు. ఆ గురువులో ఒకవేళ లోపం ఏదైనా ఉన్నా

అది ఆ గురువుకే నష్టంగాని, విశ్వాసంతో సేవించిన నీకు మాత్రం గొప్ప ప్రయోజనమే. కనుక శ్రద్ధ అనేది ఎంతో ముఖ్యం. సిద్ధికి సోపానం.

అందుకే శ్రద్ధ యొక్క అవసరాన్ని నొక్కి చెప్పి, సాధకులను సరైన మార్గంలో నడిపించటానికి, వారు చేసే కర్మలను, యజ్ఞ దాన తపస్సులను, ఎలా చెయ్యాలో, ఎలా చెయ్యకూడదో తెలియజేసి వారిని సరియైన మార్గం వెంట చెయ్యిపట్టి నడిపించటానికే ప్రత్యేకంగా ఈ అధ్యాయం ఉన్నది. ఇక అధ్యాయంలోనికి ప్రవేశిద్దాం.

- అర్జునుని సందేహం ఏమిటో వ్యక్తం చేస్తున్నాడు.

**అర్జున ఉవాచ:**

**శ్లో ||** యే శాస్త్ర విధి ముత్సృజ్య
యజంతే శ్రద్ధ యాఽన్వితాః |
తేషాం నిష్టాతు కా కృష్ణ !
సత్త్వ మాహో రజ స్తమః || (1)

**తా||** అర్జునుడంటున్నాడు, కృష్ణా! ఎవరైతే శాస్త్రవిధిని పాటించకుండా శ్రద్ధతో ఆరాధిస్తారో అట్టివారి నిష్ట ఎలాంటిది! అది సాత్త్వికమా? రాజసికమా? తామసికమా?

**వ్యాఖ్య:-** కొందరు శాస్త్రాన్ని చక్కగా తెలుసుకొని పరిపూర్ణమైన శ్రద్ధతో దైవ కార్యాలు, లోక కళ్యాణ కారకమైన కార్యాలు చేస్తుంటారు. అది దైవీసంపత్తి.

అట్టి వారి గురించి ఆలోచించవలసిన పనిలేదు. ఎందుకంటే వారికి సిద్ధి తథ్యం గనుక.

ఇక మరికొందరు శాస్త్రాన్ని తెలుసుకొనీఉండవచ్చు, తెలుసుకోకుండాను ఉండవచ్చు. కాని వారికి శ్రద్ధ ఏ మాత్రం లేదు. కనుక వారు చేసే కర్మలు స్వార్ధానికి, కోరికలను తృప్తి పరచుకోటానికి, కీర్తిప్రతిష్టల కొరకు చేస్తుంటారు. కనుక వారిది ఆసురీసంపత్తి. అట్టి వారి గురించి కూడా ఆలోచించనక్కర లేదు. ఎందుకంటే వారికి సిద్ధి లేదు గనుక.

మరి ఎవరి గురించి ఆలోచించాలి?

కొందరికి శాస్త్రాన్ని గురించి తెలుసుకోవాలనే తెలియదు. ఒకవేళ తెలిసినా వారికి ఆ అవకాశం లభించదు. సమయం లేకపోవచ్చు, శక్తి లేకపోవచ్చు, అర్ధం చేసుకొనే తెలివి లేకపోవచ్చు, పాండిత్యం లేకపోవచ్చు. అయినప్పటికీ పెద్దలు చెప్పినట్లుగానో, శిష్టాచార సాంప్రదాయాన్ని అనుసరించియో ఎంతో శ్రద్ధతో - విశ్వాసంతో సత్కర్మలను ఆచరిస్తుంటారు. త్యాగ బుద్ధితో, లోక కళ్యాణ కాంక్షతో చేస్తుంటారు.

- పూజలు, యజ్ఞాలు, ఆరాధనలు, ఉపాసనలు, పారాయణలు చేస్తారు.
- దానధర్మాలు చేస్తుంటారు.
- తపస్సు చేస్తారు.

ఇలాంటి వారి గతి ఏమిటి? వారిది దైవీ సంపదా? ఆసురీ సంపదా? వారి నిష్ఠ సాత్త్వికమా? రాజసికమా? తామసికమా?

శాస్త్రవిధిని విడిచి పెట్టారు గనుక ఆసురీసంపద అనాలా?

శ్రద్ధతో చేస్తున్నారు గనుక దైవీసంపద అనాలా? ఇదీ అర్జునుని సందేహం.

వీరు కోరికలతో వేగిపోయి, స్వేచ్ఛాచారులై శాస్త్రవిధిని వదిలినవారు కాదు. శాస్త్రాన్ని తెలుసుకోవాలని తెలియక, తెలిసినా వీలుపడక, తెలుసుకొనే సమర్ధత లేక వదిలినవారు. శ్రద్ధ మాత్రం ఉన్నది. దైవం పట్ల, పెద్దల పట్ల నమ్మకం - విశ్వాసం ఉన్నది. వారు చెప్పినట్లుగానే చేస్తుంటారు. అలాంటి వారి పరిస్థితి ఏమిటి? అనేది అర్జునుని ప్రశ్న.

అసలు శాస్త్రాన్ని వదిలేవారు 2 విధాలుగా ఉంటారు?

1. కామచారులై భోగాలాలసులై శాస్త్రాన్ని వదలినవారు కొందరు.

2. శ్రద్ధ ఉన్నా శాస్త్రం తెలియక, తెలుసుకోక శాస్త్రాన్ని వదలినవారు కొందరు.

ఇద్దరూ శాస్త్రాన్ని వదిలినట్లే గదా! మరి ఈ ఇద్దరి నిష్టలో భేదం ఉన్నదా? అని అర్జునుని సందేహం.

శాస్త్రానికి ప్రాముఖ్యమా? శ్రద్ధకు ప్రాముఖ్యమా?

ఈ సందేహాన్ని తీర్చటానికే ఈ అధ్యాయం అంతా. ఇది సాధకునికి బాగా ఉపయోగపడే అధ్యాయం. అందుకే అనుష్టానయోగం అన్నారు.

ఈ అధ్యాయం యొక్క సారమంతా ఏమిటంటే?-

1. శ్రద్ధ గనుక లేకపోతే శాస్త్ర విధిని పాటించినా ప్రయోజనం లేదు.

2. అయితే కేవలం శ్రద్ధ మాత్రం ఉండి, శాస్త్ర విధిని పాటించకపోతే - శాస్త్రం యొక్క సహాయాన్ని తీసుకోకపోతే సిద్ధి వరకు చేరే అవకాశం ఉండదు. అది దేవతోపాసన వరకే చేరుస్తుంది గాని పరమాత్మోపాసన వరకు చేర్చలేదు. ముందుకు పోవటం ఉంటుంది గాని పరమ సిద్ధి లేదు మోక్ష ప్రాప్తి లేదు.

**శ్లో|| యాంతి దేవ వ్రతాదేవాన్ పిత్రూన్ యాంతి పితృవ్రతాః |**

**భూతాని యాంతి భూతేజ్యాః యాంతి మద్యాజినోఽపిమాం ||**

**- దేవతలను పూజించేవారు దేవతలను, పితృ దేవతలను పూజించేవారు పితృ దేవతలను, భూతాలను పూజించేవారు భూతాలను, నన్ను పూజించేవారు నన్నే చేరుకుంటారు - అని 9 వ అధ్యాయంలో చెప్పినట్లు పరమాత్మను చేరుకోవటమే పరమసిద్ధి - మానవ జీవిత పరమ లక్ష్యం. కనుక తప్పకుండా శాస్త్ర విధిని పాటించవలసిందే. అప్పుడే పరమసిద్ధి, మోక్షం. దీనిని బట్టి శాస్త్ర విధి కన్నా శ్రద్ధ ముఖ్యమైనదని, అయినప్పటికీ శాస్త్ర విధి కూడా అవసరమేనని భగవంతుని అభిప్రాయం.**

**ఇక్కడి ప్రశ్న ఇలాంటి వారిని గురించే గనుక వారికొక ఉపాయాన్ని - అంటే సాధనామార్గాన్ని తెలియజేస్తున్నాడు భగవానుడు.**

**శ్రద్ధ సాత్వికంగా ఉండాలంటే సాత్వికాహారం యొక్క ప్రయోజనాన్ని తెలియజెప్పారు. అలాగే యజ్ఞ దాన తపస్సుల గురించి కూడా చెబుతూ సాత్వికయజ్ఞ, సాత్వికదాన, సాత్వికతపస్సులను కూడా తెలియజేస్తున్నారు.**

**శాస్త్రం ముఖ్యమా? శ్రద్ధ ముఖ్యమా? అంటే శ్రద్ధయే ముఖ్యమని, శ్రద్ధ లేని శాస్త్రం 'అసత్' అన్నారు. ఇక శ్రద్ధ సాత్వికమైనా శాస్త్రవిధి లేకపోతే దోషాలుంటాయని, కనుక వాటి నివారణ కోసం ఒక మహామంత్రాన్ని ఉపదేశించటం జరిగింది. అంటే భగవన్నామస్మరణతో కర్మలాచరించి పవిత్రం చేసుకొనే పద్ధతిని చెప్పటం జరిగింది.**

శాస్త్రం చదవటం, తెలుసుకోవటం ముఖ్యం కాదు. శాస్త్రం చెప్పినట్లు ఆచరణ చేయటం ముఖ్యం. శాస్త్రం చదివినంత మాత్రాన శ్రద్ధా భక్తులు కలగవు. అవి పూర్వజన్మ పుణ్యసంస్కారాల వల్ల లభిస్తుంటాయి.

సాధకుడికి కావలసిన విధి విధానం అంతా ఒక పద్ధతి ప్రకారం ఈ అధ్యాయంలో బోధించటం జరిగింది. 9 వ అధ్యాయంలో -

శ్లో || యత్ కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ |

యత్ తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణం || (27)

- నీవు ఏమి చేసినా, ఏమి తిన్నా, ఏ యజ్ఞం చేసినా, తపస్సు చేసినా అది నాకు అర్పణం చెయ్యి - అని చెప్పటం జరిగింది. ఆ శ్లోకంలో ఎలా అర్పణ చెయ్యాలో చెప్పలేదు. దానినే ఈ అధ్యాయంలో చెబుతున్నారు. అంటే ఈ అధ్యాయానికి అది బీజశ్లోకం అన్నమాట.

మనిషి ఏ పనిచేసినా ముందు తిండి తినాలి. ఏ పాటు తప్పినా సాపాటు తప్పదు గదా! ఎంత తినాలో ఇంతకుముందు చెప్పినప్పటికీ ఎలాంటిది తినాలో అక్కడ చెప్పలేదు. అందుకే ఇక్కడ చెబుతున్నారు. quantity గురించి అక్కడ చెబితే quality గురించి ఇక్కడ చెప్పబోతున్నారు.

ఆహారం తీసుకుంటూ మనం చేయవలసిన ముఖ్యమైన పనులున్నాయి. అవే యజ్ఞ దాన తపస్సులు.

❖ దేవతలను తృప్తి పరచటానికి యజ్ఞాలు,

❖ సమాజంలోని అసమానతలను తొలగించటానికి దానాలు,

❖ దేహంలోని లోపాలను సరి చేయటానికి తపస్సులు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఎలాంటి యజ్ఞ దాన తపస్సులు సాత్త్వికమో, ఎలాంటివి రాజసికమో, ఎలాంటివి తామసికమో వివరించబోతున్నారు.

ఇలా అర్జునుని ప్రశ్నతో - తీసుకొనే ఆహారం, చేయవలసిన పనులైన యజ్ఞ దాన తపస్సులు; వాటిని గురించి విశ్లేషించి, విభాగించి వివరించి చెప్పబోతున్నారు.

కనుక ఏ పని చేసినా శ్రద్ధ ముఖ్యం. అన్ని రకాల కూరగాయలు, వస్తువులు, అగ్ని ఉన్నా వండేవారికి శ్రద్ధ లేకపోతే ఆ వంటకం ఎలా అధ్వాన్నంగా తయారవుతుందో - అలాగే సాధకుడికి ఎన్ని మంచి గుణాలున్నా శ్రద్ధ లేకపోతే సాధన ఫలించదు. ఈ ఉద్దేశంతోనే అశ్రద్ధతో ఏమి చేసినా అసత్తేనని, ఇహపరాలు రెండూ ఉండవని ఈ అధ్యాయాన్ని ముగించబోతున్నారు.

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" - శ్రద్ధగలవానికే జ్ఞానప్రాప్తి అన్నారు. శ్రద్ధ లేని వానికి జ్ఞాన ప్రాప్తి లేదు. జ్ఞానం అంటే ఈ వేదాంతాన్ని అర్ధం చేసుకోవటం కాదు. జ్ఞానం అంటే మన స్వరూపమే. 'అది నేనే' అని తెలుసుకోవటమే జ్ఞానం. నేను ఆత్మనని అనుభవపూర్వకంగా నిశ్చయానికి రావటమే జ్ఞానం.

అనాత్మ వస్తువులనైతే ముందుగా వాటిని చూడాలి, లేదా వాటి గురించి విని తెలుసుకోవాలి. ఆతర్వాత బయటనుండి తెచ్చుకోవాలి. కాని జ్ఞానస్వరూప ఆత్మ అలా బయటనుండి తెచ్చుకొనే వస్తువు కాదు. అది సిద్ధవస్తువు. కనుక 'అది నేనే' అనే అనుభూతి కలిగితే చాలు. ఆత్మ వస్తువును తెలుసుకోవాలంటే

అనాత్మ వస్తువులను - ఆత్మ కాని వాటన్నింటిని "నేతి - నేతి"; - న ఇతి - న ఇతి; ఇది కాదు - ఇది కాదు అంటూ అన్నింటిని నిషేధిస్తే సరి. మిగిలేది ఆత్మవస్తువే.

అనేకమైన నకిలీ వస్తువులను, ఒక్క అసలైన వస్తువును ఒకచోట కుప్పగా పోశారనుకోండి. అందులో అసలు వస్తువేదో మనకు తెలియదు. కాని నకిలీవన్నీ తెలుసు. అప్పుడు అసలు వస్తువును కనిపెట్టాలంటే ఏం చేయాలి? ఒక్కొక్క నకిలీ వస్తువును తీసి అవతల పడేస్తే సరి. అసలు వస్తువు మిగులుతుంది.

నాటకంలో నీవొక వేషం వేశావు. అది సేవకుడి వేషం. నీ అసలు రూపం బయట పడాలంటే ఏం చేయాలి? వేషం తీసేస్తే సరి.

ఒకాయన ఒక వడ్రంగిని పిలిచి ఒక శ్రీకృష్ణ విగ్రహాన్ని చెక్కి ఇవ్వమన్నాడు. ఆ వడ్రంగి అడిగాడు, 'మీ ఇంట్లో ఏవైనా చెక్కలు ఉన్నాయా'! అని. లోపలకు తీసుకెళ్ళి చూపించాడు. అందులో ఒక చెక్కను తీసుకొని వెళ్ళాడు వడ్రంగి. నెల రోజుల తర్వాత ఆ వడ్రంగి అద్భుతమైన, అందమైన శ్రీకృష్ణ విగ్రహాన్ని తెచ్చి ఇచ్చాడు. నిజంగా ఆ వడ్రంగి ఏవో రకరకాల వస్తువులను తెచ్చి విగ్రహాన్ని తయారు చేశాడా? లేదు. ఆ చెక్క తప్ప మరే వస్తువూ లేదు. అంటే శ్రీ కృష్ణుడు ఆ చెక్కలోనే ఉన్నాడు. అయితే ముందు కనిపించ లేదు గదా! లేదు. మరి ఆ వడ్రంగి ఏమి చేశాడు? ఆ చెక్కలోని శ్రీకృష్ణుడు కాని కొయ్య ముక్కలన్నింటిని తన పరికరాలతో జాగ్రత్తగా తీసి వేశాడు. ఉన్న కృష్ణుడు ఉన్నట్టుగా మిగిలాడు. ఇది వేదాంతం చెప్పే సత్యం.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఆత్మ అనేది ఉండనే ఉన్నది. అయితే అది అనాత్మ పదార్థాలతో కలిసి పోయి ఉన్నది. దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ప్రాణాలు అనే ఈ అనాత్మపదార్థాలను తొలగించి వేస్తే సరి - ఇప్పుడు ఆత్మ మాత్రమే మిగులుతుంది. తాను తానుగా మిగిలిపోతుంది. స్వయం ప్రకాశం, స్వయం వ్యక్తం అంటే అదే. ఇలా అనాత్మ పదార్థాలను ఆత్మ నుండి విభాగించి, తొలగించే విధానాన్ని తెలియజేయటానికే 13 వ అధ్యాయం నుండి విభాగ యోగాలు ప్రారంభమైనవి. క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగం, గుణత్రయవిభాగయోగం, దైవాసురసంపద్ విభాగయోగం, ఇప్పుడు శ్రద్ధాత్రయ విభాగయోగం. -

'శ్రద్ధ' అంటే విశ్వాసం. గురువుపట్ల, శాస్త్రాలపట్ల విశ్వాసం ఉండాలి. విశ్వాసం లేని వాడికి నిశ్వాసం లేదు - అంటారు. ఒకడు ఒట్టి అనుమానపు మనిషి. ఎవరినీ నమ్మడు. తాను బజారుకు పని మీద వెళితే భార్య ఇంట్లో ఉన్న డబ్బు నగలు మూట గట్టుకొని పుట్టింటికి పోతుందేమోనని అనుమానం. ఇంటికి తాళం వేస్తే ప్రక్కఇంటి వాళ్ళు తాళం పగలగొట్టి అన్నీ దోచుకుపోతారేమోనని అనుమానం. తాళం వేసిన తర్వాత పడ్డదో లేదో అని అనుమానం. అన్నీ అనుమానాలే. దేనినీ నమ్మడు, ఎవరినీ నమ్మడు, తనను తానే నమ్మడు. ఒకసారి ఒక విచిత్రమైన అనుమానం వచ్చింది. "గాలిని బయటకు వదులుతున్నాను గదా! అది తిరిగి వస్తుందో - రాదో" అని అనుమానం వచ్చి గట్టిగా ముక్కు మూసుకున్నాడు. పది కాలాల పాటు బ్రతికి బట్టకట్టాల్సినవాడు టా అన్నాడు. కనుక విశ్వాసం ముఖ్యం. గురువు మీద, శాస్త్రాల మీద, భగవంతుని మీద, డాక్టరు మీద, మందుల మీద తప్పకుండా

**విశ్వాసం ఉండాలి. 'విశ్వాసః ఫలదాయకః' అన్నారు. విశ్వాసం ఉంటేనే ఫలితం ఉంటుంది.**

**- అర్జునుని ప్రశ్నకు భగవానుని సమాధానం ఏమిటో చూద్దాం -**

**- శాస్త్రవిధిని పాటించక, శ్రద్ధతో సత్కార్యాలు చేసేవాని శ్రద్ధ ఎలాంటిది? అనే అర్జునుని ప్రశ్నకు భగవానుడు సమాధానం ఇవ్వటం ప్రారంభిస్తున్నాడు.**

**శ్రీ భగవానువాచ :-**

**శ్లో ||  త్రివిధా భవతి శ్రద్ధా**
**దేహినాం సా స్వభావజా |**
**సాత్త్వికీ రాజసీ చైవ**
**తామసీ చేతి తాం శృణు ||  (2)**

**తా||** భగవానుడంటున్నాడు; మానవుల స్వభావం వల్ల పుట్టిన శ్రద్ధ సాత్త్వికము, రాజసికము, తామసికము అని మూడు విధాలుగా ఉంటుంది. వాటిని గురించి విను.

**వ్యాఖ్య :-** 'శ్రద్ధ'అంటే భగవంతునిపై నమ్మకం. ఆయన ఉన్నాడనే విశ్వాసం. ఆయనను చేరుకొని, ఆయనతో ఐక్యతను సాధించేందుకు మార్గాలను చూపే శాస్త్రాలపై విశ్వాసం. ఆ శాస్త్రాలను బోధించే గురువులపై విశ్వాసం. అయితే ఈ శ్రద్ధ ఎవరిలో ఉంటుంది? అంటే - 'దేహినాం' - దేహధారులలో - అంటే మానవులందరిలో అని అర్థం. మానవులందరిలోను శ్రద్ధ ఉంటుందా? -

ఉంటుంది. కాకపోతే అందరిలోనూ ఒకే విధంగా ఉండదు. శ్రద్ధ మానవులలో 3 విధాలుగా ఉంటుంది. అవే సాత్త్వికం, రాజసికం, తామసికం - అని.

అసలు శ్రద్ధ దేనిమీద ఆధారపడి ఉంటుంది? 'స్వభావజా' వారివారి స్వభావాన్ని బట్టి, పూర్వజన్మలలో వారు చేసిన ఆలోచనలు, సంకల్పాలు ఏవైతే ఉన్నాయో ఆ సంస్కారాలను బట్టి, వాసనలను బట్టి వారి స్వభావం ఉంటుంది. స్వభావాన్ని బట్టి శ్రద్ధ. కనుక శ్రద్ధ అనేది స్థిరంగా ఒకే విధంగా ఉండేది కాదు. అది 3 విధాలు:

(i) పూర్వజన్మలలో దైవం గురించిన ఆలోచనలు చేస్తూ, దైవ కార్యాలు చేస్తూ, ఇతిహాస, పురాణ, వేదాంత గ్రంధాలను చదవటం, వినటం మొ||న వాటితో కాలం గడిపి ఉన్నట్లైతే ఈ జన్మలో అట్టివారి స్వభావం భగవంతుని వైపుకు మళ్ళుతుంది. అంటే ఈ జన్మలో నీవు భగవత్సేవలో ఉన్నావంటే - సాధకుడిగా, ముముక్షువుగా ఉన్నావంటే పూర్వజన్మలలో నీ ఆలోచనలు, సంకల్పాలు దీనికి అనుగుణంగా ఉండబట్టేనని తెలుసుకోవచ్చు. ఇదే సాత్త్వికశ్రద్ధ.

(ii) పూర్వజన్మలలో తిండి, సంపాదన, సుఖాలు, భోగాలు మొ||న వాటిలో ఎల్లప్పుడూ నిమగ్నమై ఉంటే, వాటి గురించే ఆలోచిస్తూ ఉంటే అట్టివాడు ఈ జన్మలో నిరంతరం సంపాదనలోను, సుఖాలను భోగాలను అనుభవించటంలోను ఆరాటపడుతూ, శ్రమిస్తూ, సంపాదించిపెట్టే యంత్రంలా పనిచేస్తాడు. లేదా జంతువు గానో, పక్షిగానో పుట్టి ఆహార, నిద్రా, మైధునాలతో ఒక్క క్షణం తీరిక లేకుండా గడుపుతాడు. ఇదే రాజసిక శ్రద్ధ.

(iii) పూర్వజన్మలలో ఏ మాత్రం భగవంతునిపై శ్రద్ధ అనేది లేకుండా, పెద్దలపై గౌరవం, విశ్వాసం లేకుండా, శాస్త్రాలపై విశ్వాసం లేకుండా, ఏ పనీ చేయకుండా సోమరిపోతులా తిరిగినవాడు ఈ జన్మలో బుద్ధిహీనుడు గానో, పిచ్చివాడు గానో, దుష్టుడుగా దుర్మార్గుడు గానో పుట్టి అందరిచేత ఛీత్కారాలు పొందుతూ, భగవంతుని గురించిన ఆలోచన ఏ మాత్రం లేకుండా హీనమైన బ్రతుకు బ్రతుకుతాడు. ఇదే తామసిక శ్రద్ధ. వీరు పేడకుప్పలోని పురుగులాంటి వారు. పేడపురుగు ఎప్పుడూ పేడలోనో, పెంటకుప్పలలోనో ఉంటూ, అందులోనే దాని పనులన్నీ పూర్తి చేసుకుంటూ, అందులోనే ఉన్నట్లు ఈ తామసికులు అలాగే హీనంగా బ్రతుకుతుంటారు. వీరికి లోక చింతన తప్ప భగవచ్చింతన ఉండదు, ఒక్కోసారి నీచ జన్మలు ఎత్తుతారు.

రాజసికశ్రద్ధ గలవారు అలా కాదు. వాళ్ళు ఈగలాంటి వారు. ఈగ అసహ్యకరమైన పుండు మీద, పెంటకుప్పల మీద వాలుతుంది. భగవంతుని కర్పించే నైవేద్యం పొంగలి మీద, బెల్లం మీద వాలుతుంది.

కొలిమిలో కాలుతున్నంత సేపు ఇనుము ఎర్రగా చంద్రనిప్పులా ఉంటుంది. కాని కొలిమిలో నుండి తీయటంతోనే నల్లబడి పోతుంది. అలాగే ఈ రాజసికులు సజ్జన సాంగత్యంలోనో, దేవాలయాల్లోనో, ఆశ్రమాలలోనో, మహాత్ముల సాన్నిధ్యంలోనో ఉన్నప్పుడు భక్తితో పరవశించిపోతుంటారు. కాని మరుక్షణంలోనే లౌకిక వ్యవహారాలలోను, లోకాభి రామాయణంలోను మునిగిపోతారు. అంతకు ముందున్న పవిత్రభావాలన్నీ అంతమైపోతాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇక సాత్త్వికశ్రద్ధ గలవారు తేనెటీగ వంటివారు. తేనెటీగలు ఎప్పుడూ సుగంధభరితమైన సువాసనలు వెదజల్లే పుష్పాలపై వ్రాలి వాటిలోని మకరందాన్ని పీల్చుకుంటాయే గాని, ఎప్పుడూ పేడ కుప్పలపై వ్రాలవు. అక్కడి కంపును భరించలేవు. ఆ కంపు వాటికి అసహ్యం వేస్తుంది. అది భరించలేక చనిపోతాయి. అలాగే సాత్త్వికశ్రద్ధ గలవారు ఎల్లప్పుడూ భగవత్ కార్యాలను చేస్తూ సత్కాలక్షేపాన్ని, వేదాంతజ్ఞానాన్ని ఇష్టపడతారు గాని దుష్ట ఆచారాలను పాటించరు, దురలవాట్లకు లోనుగావటం ఉండదు. లౌకిక జీవనానికి దూరంగా ఉండాలనుకుంటారు.

ఇలా మూడు రకాల శ్రద్ధ గలవారు ఉండటానికి కారణం వారివారి పూర్వజన్మలలోని సంకల్పాలు, సంస్కారాలు, వాసనల ప్రభావమే. ఆ వాసనలే అతడి స్వభావంగా మారి, ఆ స్వభావాన్నే అతడు వ్యక్తం చేస్తుంటాడు.

శాస్త్రం తెలిసి, శ్రద్ధ ఉన్నవాడు ఆ శాస్త్రాన్ని అనుసరిస్తూ, తనలోని దోషాలను తొలగించుకుంటూ, తన స్వభావాన్ని మార్చుకోగలుగుతాడు. శాస్త్రం తెలియనివాడు, తెలుసుకోవాలనే ఆలోచన లేనివాడు తన స్వభావాన్ని బట్టే ప్రవర్తిస్తుంటాడు గాని, తనలో దోషాలను గుర్తించలేడు, మార్చుకోలేడు. ఇక శాస్త్రమూ తెలియక, శ్రద్ధాలేనివాడు అస్తవ్యస్త జీవితాన్ని గడుపుతూ, తనలోని దోషాలను కూడా గొప్ప గుణాలుగా భావిస్తూ దుర్మార్గంగా ప్రవర్తించటం కూడా గొప్పగా భావిస్తాడు.

ఇలా వారివారి స్వభావాన్ని బట్టి శ్రద్ధను మూడు విధాలుగా విభజన చేసి ఈ అధ్యాయంలో వివరించబోతున్నారు. అర్జునుని ప్రశ్న శాస్త్రం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

తెలియక శ్రద్ధతో సత్కార్యాలు చేసే వారి గురించే గనుక అట్టి వారి శ్రద్ధను సాత్త్విక శ్రద్ధ, రాజసిక శ్రద్ధ, తామసిక శ్రద్ధ అని మూడు విధాలుగా విభాగించి తెలియజేయబోతున్నారు.

పూర్వ జన్మ సంస్కారాలను బట్టి స్వభావం,

స్వభావాన్ని బట్టి శ్రద్ధ,

శ్రద్ధకు తగినట్లుగా వారి వారి పనులు ఉంటాయని , కనుక వారు వారుచేసే పనులను బట్టి, వారు ప్రవర్తించే తీరును బట్టి వారి నిష్ఠను గుర్తించ వచ్చునని భగవానుడు తెలియజేయబోతున్నాడు.

శాస్త్రం తెలుసో, తెలియదో అనేది ముఖ్యం కాదు. అతడు ఎలా ప్రవర్తిస్తున్నాడో, ఎలాంటి పనులు చేస్తున్నాడో, ఏ ఉద్దేశంతో చేస్తున్నాడో తెలుసుకుంటే తప్ప వాడి నిష్ఠ సాత్త్వికమో రాజసికమో, తామసికమో చెప్పే వీలు లేదు. ఎవడిది ఎటువంటి శ్రద్ధో వాడి ముఖం చూసి, వాడి ఆకారం చూసి, వాడి అందచందాలు చూసి చెప్పలేం. మరి? వాడు చేసే పూజ, యజ్ఞం, దానం, తపస్సు, ఉపాసన - వీటిని బట్టి చెప్పాలి. ఎలాగ?

పూజ, యజ్ఞం, దానం ... ఇలా ఏదో ఒకటి చేసేటప్పుడు

(i) ఏ ఆడంబరం లేకుండా, మనః పూర్వకంగా, తన కర్తవ్యం ఇది అనుకుంటూ భక్తితో, తృప్తితో చేసే వాడిదే సాత్త్విక శ్రద్ధ అవుతుంది.

(ii) మందిరాన్ని అలంకరించటంలో విపరీతమైన ఆసక్తిని చూపుతూ, ఆటపాటల యందు ఆసక్తితో, మేళ తాళాలతో, ఫోటోలు - వీడియో షూటింగులతో, అట్టహాసంగా, బాగా డబ్బు ఖర్చు చేస్తూ, జనాన్ని సమకూర్చి,

వారి ముందు తన గొప్పతనాన్ని ప్రదర్శించటానికి, కీర్తి ప్రతిష్టలకు ప్రాకులాడుతూ, మైకులతో హోరెత్తిస్తూ, రకరకాల ప్రసాదాలు, భోజనాలు మొ||న వాటితో, అసలు విషయం కన్నా వీటికే ప్రాధాన్యత నిచ్చి చేసేవాడు రాజసిక శ్రద్ధ గలవాడు.

(iii) నోరులేని మేకలను, గొర్రెలను బలిఇస్తూ, మద్య మాంసాల మత్తులో ఒళ్ళు తెలియకుండా చిందులు త్రొక్కుతూ, ఇతరులకు అసౌకర్యం కలిగిస్తూనో, పీడిస్తూనో, అసలు విషయానికి ఏ మాత్రం ప్రాధాన్యత ఇవ్వకుండా తినటం, త్రాగటం, చిందులు త్రొక్కటం మాత్రమే ముఖ్యంగా భావిస్తూ చేసేవాడు తామసిక శ్రద్ధ గలవాడు.

ఈ 3 రకాల శ్రద్ధ గలవారు ఎలా వ్యవహరిస్తారో వారి వ్యవహార సరళి ఆలోచనా విధానం ఎలా ఉంటుందో చూడండి.

ఒకడికి శాస్త్రం తెలియదు. కాని ఎలాగో మొత్తం మీద ఒక సత్కార్యం చేశాడు. ఆ సమయంలో ఎవరైనా తటస్థ పడి, "ఏమయ్యా! ఇలా చేశావేమిటి? ఇది శాస్త్రం అంగీకరించే పద్ధతి కాదు గదా!" అంటే -

(i) <u>సాత్త్విక శ్రద్ధ గలవాడు</u>, "నిజమే కావచ్చు. నాకు తెలియక అలా చేశాను. ఇకముందు నీవు చెప్పినట్లుగానే చేస్తాను, శాస్త్ర విధిని పెద్దల ద్వారా తెలుసుకుంటాను" - అంటాడు. అదే

(ii) <u>రాజసిక శ్రద్ధ గలవాడు</u>, " ఏం? ఎందుకు ఇలా చేయకూడదు? ఇలా చెయ్యకూడదని, నీవు చెప్పినట్లే చెయ్యాలని ఎక్కడైనా రూలు ఏమైనా ఉన్నదా? నీవు చెప్పినట్లే చెయ్యాలా? నా పద్ధతి ఇంతే. నాకూ తెలుసు

**పద్ధతులు. నేను ఇలాగే చేస్తాను. ఎవడు కాదంటాడో రమ్మను నా ముందుకు" - అంటాడు. అదే**

**(iii) తామసిక శ్రద్ధ గలవాడు వినిపించుకోడు, సమాధానం చెప్పడు, ఒక వేళ గట్టిగా అడిగితే "ఆహా! అలాగా! అసలు నీవు చెప్పింది తప్పు. నేను చెప్పిందే రైటు. ఇదే శాస్త్రం చెప్పిన పద్ధతి. నాకు తెలియని శాస్త్రాలా ఇవి?" అంటాడు. అసలు నన్నడిగే శాస్త్రాలు వ్రాయాలి - వాళ్ళకేం తెలుసు? అంటాడు.**

**ఇలా వారి వారి ప్రవర్తనను బట్టి, మాటలను బట్టి వారి వారి నిష్ఠ ఎట్టిదో నిర్ణయించవచ్చు. సాత్త్వికస్వభావం గలవారిది సాత్త్వికశ్రద్ధ. రాజసిక స్వభావం గల వారిది రాజసిక శ్రద్ధ. కనుక స్వభావాన్ని బట్టే శ్రద్ధ ఉంటుంది. ఈ విషయం 3 వ శ్లోకంలో ...**

**- శ్రద్ధ దేని మీద ఆధారపడి ఉంటుంది? వ్యక్తిత్వం దేని మీద ఆధారపడి ఉంటుంది?**

**శ్లో|| సత్త్వాను రూపా సర్వస్య**
**శ్రద్ధా భవతి భారత! |**
**శ్రద్ధామయోఽయం పురుషః**
**యో యచ్ఛ్రద్ధః స ఏవసః || (3)**

**తా || సర్వజీవులకు వారివారి అంతఃకరణాన్ని బట్టి శ్రద్ధ ఉంటుంది. మానవులందరూ శ్రద్ధామయులే ఎవరి శ్రద్ధను బట్టి వారి వ్యక్తిత్వం ఉంటుంది.**

**వ్యాఖ్య :-** లోకంలో ప్రతి వాడికీ శ్రద్ధ ఉంటుంది. అయితే ఆ శ్రద్ధ వాడివాడి అంతఃకరణాన్ని బట్టి ఉంటుంది. మరి ఈ అంతఃకరణం దేన్నిబట్టి ఉంటుంది? పూర్వజన్మలలో అతడు చేసిన ఆలోచనలు, కర్మలను బట్టి ఉంటుంది.

పూర్వజన్మల వాసనలను బట్టి స్వభావం, స్వభావాన్ని బట్టి శ్రద్ధ - అని ఇంతకుముందు శ్లోకంలో చెప్పి, ఇప్పుడు పూర్వజన్మల వాసనలను బట్టి అంతఃకరణం, అంతఃకరణాన్ని బట్టి శ్రద్ధ - అని ఈ శ్లోకంలో చెబుతున్నారు. అంటే స్వభావం, అంతఃకరణం రెండూ ఒక్కటే.

ఇక్కడే మరొక విషయాన్ని కూడా తెలుసుకోవాలి. అంతఃకరణాన్ని బట్టి శ్రద్ధ కలుగుతున్నదా? లేక శ్రద్ధను బట్టి అంతఃకరణం ఏర్పడుతున్నదా? అంటే అవి రెండూ ఒకదానితో ఒకటి సహకరించుకుంటూ పరస్పరం సమ్మిళితమై పోయి ఉంటున్నాయి. కనుక ఒక్కొక్కప్పుడు స్పష్టంగా చెప్పటం కష్టమే. ఏది ఏమైనా అంతఃకరణాన్ని బట్టి శ్రద్ధ అనేది భగవద్గీత తెలుపుతున్న సత్యం. భగవంతుడు చెబుతున్న యదార్థం. మన అంతఃకరణాన్ని బట్టియే మన శ్రద్ధ ఉండేమాట నిజమే అయినా ఆ శ్రద్ధను బట్టే మరు జన్మలో అంతఃకరణం (స్వభావం) ఏర్పడటం కూడా నిజమే. అంటే సాత్త్విక శ్రద్ధ గలవారు సాత్త్విక కర్మలను, రాజసిక శ్రద్ధ గలవారు రాజసిక కర్మలను చేస్తుంటే వారికి అట్టి వాసనలే చేకూరుతుంటాయి. ఆ వాసనలే అంతఃకరణంగా మారుతున్నాయి. అయితే ప్రయత్న పూర్వకంగా శ్రద్ధను మార్చుకున్నప్పుడు మాత్రం అంతఃకరణం కూడా మారిపోతున్నది.

సాధారణంగా మన అంతఃకరణంలో వాసనలనే బీజాలు రహస్యంగా దాగి ఉన్నాయి. వాటికి అనుగుణంగానే వ్యక్తులు తమ జీవితాలను మలచుకుంటున్నారు, కర్మలు చేస్తున్నారు.

అయంపురుషః శ్రద్ధామయః :- ఈ మానవులంతా శ్రద్ధామయులే. అంటే - అందరి అంతఃకరణాలలో ఏవేవో బీజాలున్నాయి. వాసనలు ఉన్నాయి. కనుక వారందరికీ ఏదో ఒక శ్రద్ధ ఉంటుంది. వారి అంతఃకరణానికి - బుద్ధికి తగినట్లు వారి శ్రద్ధ ఉంటుంది. బుద్ధి సాత్త్వికమైతే సాత్త్విక శ్రద్ధ, బుద్ధి రాజసికమైతే రాజసిక శ్రద్ధ, బుద్ధి తామసికమైతే తామసిక శ్రద్ధ ఉంటుంది.

యో యచ్ఛ్రద్ధ స్స ఏవసః :- ఎవరిలో ఎటువంటి శ్రద్ధ ఉంటుందో వారు అలాగే ప్రవర్తిస్తూ ఉంటారు. అంటే శ్రద్ధను బట్టే ఆలోచనలు, కర్మలు ఉంటాయి. వాడు సామాన్యుడైనా - మహాత్ముడైనా - రాక్షసుడైనా - అంతా శ్రద్ధకు లోబడియే ఉంటారు.

త్రిగుణాలలో ఒక గుణం ప్రధానంగా ఉంటుంది. అదే మిగతా రెండు గుణాలను అణచివేస్తుంది - అని 14 వ అధ్యాయంలో తెలుసుకున్నాం. ఏ గుణం ప్రబలంగా ఉంటే వాడికి అలాంటి శ్రద్ధ ఉన్నట్టు. సత్త్వగుణం ప్రబలంగా ఉంటే సాత్త్వికశ్రద్ధ; రజోగుణం ప్రబలంగా ఉంటే రాజసికశ్రద్ధ; తమోగుణం ప్రబలంగా ఉంటే తమోగుణశ్రద్ధ - తామసికశ్రద్ధ. వారి వారి శ్రద్ధను బట్టే వారి వారి జీవితాచరణ ఉంటుంది.

కొందరి ఇళ్ళలో ఎక్కువగా దేవతామూర్తుల ఫోటోలు, లేదా మహాత్ముల ఫోటోలు ఉంటాయి. అట్టి వారిది సాత్త్విక శ్రద్ధ. కొందరి ఇళ్ళలో

రాజకీయ నాయకులు, సినీ తారలు, క్రికెట్ క్రీడాకారులు మొ||న వారి ఫోటోలుంటాయి. ఇట్టి వారిది రాజసిక శ్రద్ధ. ఇక కొందరి ఇళ్ళలో సింహాలు, పులులు, కుక్క పిల్లలు, మృగాల కొమ్ములు, అసభ్య దృశ్యాలు ఉంటాయి. వారి ఆలోచనలన్నీక్రూరంగా, నీచంగా ఉంటాయి. వారిది తామసిక శ్రద్ధ.

ఇలా రకరకాల శ్రద్ధ గల వారుంటారు. వారి నిష్ఠను తెలుసుకోవాలంటే వారు చేసే పనులను బట్టి, వారి ఆలోచనలను బట్టి, వారి ఉద్దేశాలను బట్టి తెలుసుకోవచ్చు. వారూ పూజలు చేస్తారు, యజ్ఞాలు చేస్తారు, దానాలు చేస్తారు, తపస్సులు చేస్తారు. ఐతే ఎవరిని ఉద్దేశించి చేస్తున్నారు? ఎందుకోసం చేస్తున్నారు? ఇది గమనిస్తే వారి నిష్ఠ ఎలాంటిదో తెలిసిపోతుంది. అలాగే వారూ తిండి తింటారు, నిద్ర పోతారు. ఐతే ఎలాంటి ఆహారాన్ని వారు ఇష్టపడుతున్నారో తెలిస్తే వారి శ్రద్ధ ఎలాంటిదో తెలిసిపోతుంది. కనుక ఈ విషయాలన్నింటిని నానుండి సావధానంగా విను - అని ప్రారంభిస్తున్నాడు భగవానుడు.

ఇక్కడి నుండి ప్రారంభించి భగవానుడు 22 వ శ్లోకం వరకు

(i) ఎలాంటి శ్రద్ధ గలవారు ఎవరిని పూజిస్తారో -

(ii) ఎలాంటి శ్రద్ధ గలవారు ఎలాంటి తపస్సులు చేస్తారో -

(iii) ఎలాంటి శ్రద్ధ గలవారు ఎలాంటి ఆహారాన్ని ఇష్ట పడతారో -

(iv) ఎలాంటి శ్రద్ధ గలవారు ఎలాంటి యజ్ఞాలను చేస్తారో -

(v) వివిధ రకాల తపస్సులేవో వాటిని వివిధ శ్రద్ధలు గలవారు ఎలా చేస్తారో -



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(vi) ఏ శ్రద్ధ గలవారు దానాలను ఎలా చేస్తారో - వివరంగా తెలియజేయబోతున్నారు. దీనిని తెలుసుకొని మన శ్రద్ధలను మార్చుకోవాలి. మన అంతఃకరణాన్ని ప్రయత్నంతో మార్చుకోవాలి.

మనం ఏ ప్రయత్నం చేయకపోతే నీరు ఎప్పుడూ పల్లానికే పోతుంది. అలాగే మనం ఏ ప్రయత్నం చేయకపోతే మన అంతఃకరణం - మనస్సు ఎప్పుడూ క్రిందికే, నీచ స్థితికే, అల్ప విషయాలపైకే పోతుంది. కనుక ప్రయత్నం చేసి - సాధన చేసి మన అంతఃకరణాన్ని ఉన్నతంగా తీర్చి దిద్దుకోవాలి. అప్పుడే మనలోని ఆసురీగుణాలను దైవీగుణాలుగా మార్చుకొనుటకు వీలవుతుంది. తామసిక, రాజసిక గుణాలను సాత్త్వికగుణంగా మార్చుకొనే వీలు కలుగుతుంది.

- ఏ నిష్ఠ గలవారు ఎవరిని పూజిస్తారు? ఎవరిని ఆరాధిస్తారు?

**శ్లో||** యజంతే సాత్త్వికా దేవాన్
యక్ష రక్షాంసి రాజసాః |
ప్రేతాన్ భూత గణాం శ్చాన్యే
యజంతే తామసా జనాః || (4)

**తా** || సాత్త్వికులు దేవతలను ఆరాధిస్తారు. రాజసికులు యక్ష రాక్షసులను, ఇతర తామసిక జనులు భూత ప్రేత గణాలను ఆరాధిస్తారు.

**వ్యాఖ్య** :- (i) సాత్త్వికనిష్ఠ గలవారు రాముడు, కృష్ణుడు, విష్ణువు, శివుడు, గణపతి, ఆంజనేయుడు, లక్ష్మీదేవి, సరస్వతి మొ||న దేవతలను పూజిస్తారు. ఈ మానవజన్మనిచ్చి, ఇంద్రియాలను, బుద్ధిని ప్రసాదించి, తరించటానికి కావలసిన

వేదాంత శాస్త్రాలనిచ్చి అన్ని అవకాశాలు కల్పించినవాడు పరమాత్మ గనుక; ఆ పరమాత్మకు ఏజంట్లుగా ఉండి ఆయన ఆదేశాల ప్రకారం గాలి, నీరు, వెలుతురు, ఆధారంగా భూమిని, తిరిగేందుకు అవకాశంగా ఆకాశాన్ని ఇచ్చి, ఆహారం కొరకు పంటలను పండించుకోనేందుకు భూమి, సూర్య చంద్రులు, వర్షం మొ||న వాటిని ఇచ్చి, ప్రాణులను రక్షించేవారు దేవతలు గనుక; వారి పట్ల కృతజ్ఞతా పూర్వకంగా వారిని పూజించేవారు సాత్త్వికులు. అలా దేవతల పట్ల భక్తిని కలిగియుండుటే యజనం.

దేవతలు అంటే శాంతస్వభావులు. 'దానాత్ దేవః' అన్నారు. అంటే అర్థించే మానవులకు అవసరమైన సంపదలనిచ్చి రక్షించేవారు. అలాగే 'ద్యోతనాత్ దేవః' అన్నారు. అంటే సకలాన్ని వెలిగించి చూపేవారు. దేవతలు సమదృష్టి గలవారు, కరుణాస్వభావులు, వారివారి అర్హతలను బట్టి కావలసిన వాటిని ప్రసాదిస్తూ ఉంటారు. కనుక వారిపట్ల కృతజ్ఞత చూపటం మానవ ధర్మం. అందుకే సాత్త్వికులు దేవతలను పూజిస్తారు. వారిది స్వభావ సిద్ధమైన ఆసక్తి. ఆ దేవతల ద్వారా కార్యసిద్ధిని పొందాలనుకోనేవారు సాత్త్విక నిష్ఠ గలవారు.

(ii ) <u>రాజసికనిష్ఠ</u> గలవారు యక్ష రాక్షసులను పూజిస్తారు అని ఈ శ్లోకంలో భగవానుడు తెలియజేస్తున్నాడు. రజోగుణంలో ఉండే వారికి ఆశలు, కోరికలు ఎక్కువ. వారికి కోరికలను తీర్చుకోవటమే ప్రధానం. కృతజ్ఞత చూపుట యందు అంతగా ఆసక్తి ఉండదు. కనుక వారి కోరికలను తీర్చే దేవతలు ఎవరా? అని ఆలోచించి అట్టి వారినే ఆశ్రయిస్తారు, పూజిస్తారు. యక్షులు సంపదలతో తుల

తూగేవారు. వారి అధిపతి కుబేరుడు. అతడు దేవతల కోశాధికారి. ధనాగారం అంతా అతడి అధీనం. శ్రీనివాసుడు కూడా తన వివాహ ఖర్చుల కోసం కుబేరుణ్ణి అడిగి అప్పు తీసుకున్నాడు. కనుక రాజసిక నిష్ట గలవారు సంపదలను ప్రసాదించే వారిని, కోరికలను తీర్చే వారిని ఆశ్రయిస్తారు. అలాగే రాక్షసులు అంటే బలం గలిగిన వారు అని. రాజసిక ప్రవృత్తి గలవారు తమకు అవసర సమయాలలో సాయం చేస్తారనే ఉద్దేశంతో బలవంతులైన వారిని ఆశ్రయిస్తూ ఉంటారు. రాజసికులు యక్ష రాక్షసులను పూజిస్తారు అంటే ధనం గల వారిని, పదవులు గల వారిని, బలం గల వారిని ఆశ్రయిస్తూ, వారిని సేవిస్తూ, వారి చుట్టూ తిరుగుతూ తమ తమ ఆశలను, కోరికలను, స్వార్థాన్ని తీర్చుకుంటూ ఉంటారు. యక్ష రాక్షసులు చిలిపి వాళ్ళు. ఒక్కోసారి మంచిని, ఒక్కోసారి చెడును కూడా చేస్తుంటారు.

(iii) ఇక తామసిక నిష్ట గలవారు భూత ప్రేత గణాలను పూజిస్తారు. ధర్మ భ్రష్టులై చనిపోయిన వారు వాయు శరీర ధారణం చేస్తే వారిని భూతాలు, ప్రేతాలు అంటారు. అయితే ఈ కాలంలో వీటిని నమ్మని వారు చాలామందే ఉంటారు. అయితే ఇక్కడ మాయలు, మంత్రాలు, వశీకరణాలు, టక్కుటమారాది విద్యలు, చేతబడులు మొదలైన వాటిని నేర్చుకొని తమ నీచమైన దురాశలను తీర్చుకొనుటకు లేదా ప్రతీకారాన్ని తీర్చుకొనుటకు ప్రయత్నించే వారే భూతాలు - ప్రేతాలు అని అర్థం చేసుకోవాలి. భూత ప్రేతాలంటే మానవత్వాన్ని కోల్పోయిన వారు, ఎలాంటి ఘాతుకానికైనా వెనుకాడని వారు, ఆరితేరిన

మోసగాళ్ళే ఈనాటి సమాజంలోని భూత ప్రేతాలు. వీరిని ఎవరు ఆశ్రయిస్తారో వారే తామసిక నిష్ట గలవారు.

భాగవతంలో శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఆధ్యాత్మబోధ చేస్తూ ఇలా అన్నాడు.

శ్లో|| సాత్త్వి క్యాధ్యాత్మి కీ శ్రద్ధా - కర్మశ్రద్ధాతు రాజసీ |

తామస్య ధర్మేయా శ్రద్ధా - మత్సేవా యాంతు నిర్గుణా ||

- సాత్త్విక శ్రద్ధ గల వారికి ఆధ్యాత్మిక ఆసక్తి,

రాజసిక శ్రద్ధ గల వారికి కర్మల యందు ఆసక్తి,

తామసిక శ్రద్ధ గల వారికి అధర్మము నందు ఆసక్తి,

నిర్గుణ శ్రద్ధ గల వారికి నా యందు ఆసక్తి ఉంటుంది - అని. దీనిలో ఎంతో వేదాంతం దాగి ఉంది. ఈ వేదాంతాన్ని గీతలోని ఈ శ్లోకంతో అనుసంధానం చేసి సమన్వయం చేయవచ్చు. అంతేకాదు పూజా పునస్కారాలు చేయటంలో ఏమాత్రం ఆసక్తిలేని ఈనాటి ఆధునికుల మనుకొనే వారికి, విదేశాలలోని వారికి, మేధావులకు కూడా ఇందులో ఒక అద్భుతమైన ఆంతర్యం ఉన్నది.

ఏమిటది?

(1) సాత్వికులు దేవతలను పూజిస్తారు - అనే వాక్యాన్ని చూడండి. దేవతలు అంటే ఇచ్చేవారు, వెలిగించి చూపేవారు. అంటే మానవులు తమ తమ మానవ జన్మలను సార్థకం చేసుకోవాలంటే, పరమ లక్ష్యమైన మోక్షాన్ని పొందాలంటే వేదాంత జ్ఞానం, ఆధ్యాత్మిక జ్ఞానం కావాలి. ఈ జ్ఞానాన్ని ఇచ్చేవారు జ్ఞాన సంపన్నులైన మహాత్ములు, మహర్షులు. అలాగే వారు ప్రసాదించిన జ్ఞానాన్ని

మనకు వెలిగించి చూపేవారు గురువులు. కనుక సాత్త్విక నిష్ఠ గలవారు తమ జన్మసార్ధక్య హేతువైన మోక్షాన్ని పొందటానికి మహాత్ములను, మహర్షులను, సాధు పురుషులను, గురువులను ఆశ్రయించి జ్ఞానార్జన చేస్తూ ఉంటారు. జ్ఞాన సంపాదనలో నిమగ్నులౌతారు. ఆధ్యాత్మిక ఆసక్తిని కలిగి ఉంటారు. ఇలా జ్ఞానార్జనకై జ్ఞాన ప్రకాశాన్ని కలిగించే మహాత్ములను, గురువులను ఆశ్రయించుటే దేవతలను పూజించుట.

(2) రాజసికులు యక్ష రాక్షసులను పూజిస్తారు - అనే వాక్యాన్ని చూడండి. యక్ష అంటే తినటం, రక్ష అంటే దాచుకోవటం. ఎప్పుడూ డబ్బు సంపాదించుకోవటం, సుఖాలు భోగాలు అనుభవిస్తూ, సంపదలను ప్రోగు చేసుకుంటూ దాచుకోవటం సాధారణంగా మానవులందరి మనస్తత్వం. అందుకోసం చివరి శ్వాస వరకు నిరంతరం కృషి చేస్తుంటారు. ఇలా నిరంతరం కర్మల యందు ఆసక్తి కలిగి కర్మరంగంలో మునిగిపోయే వారే రాజసిక నిష్ఠ గలవారు. రజోగుణం అధికంగా ఉండేవారు ఒక్క నిమిషం కూడా ఊరికే కూర్చోలేరు. వారికి ఆధ్యాత్మిక జ్ఞానమునందు ఆసక్తి ఉండదు. ఒకవేళ దేవతలను పూజించినా అది కూడా తమకు బాగా కలిసి రావాలని, నష్టాలు కష్టాలు దరి చేరరాదనే కోరికతోనే. అయితే ఈ రాజసికులు తమ కోరికలను, ఆశలను తృప్తి పరచుకొనుటకు యక్ష అంటే - ధనవంతులను, పారిశ్రామిక వేత్తలను, రాజకీయ నాయకులను, పెద్ద పెద్ద ఉద్యోగులను ఆశ్రయిస్తూ ఉంటారు. అలాగే రక్ష - అంటే - రౌడీలను, గూండాలను, అండర్

గ్రౌండ్ దాదాలను ఆశ్రయిస్తూ ఉంటారు. ఇదే యక్ష రాక్షసులను పూజించటం అంటే. అంతేగాని ఎవ్వరూ యక్షులను, రాక్షసులను పూజించరు.

(3) తామసికులు భూత ప్రేతాలను పూజిస్తారు - అనే వాక్యాన్ని చూడండి. భూత అంటే జరిగి పోయిన కాలం; ప్రేత అంటే చనిపోయిన వారు. అంటే తామసికులైన వారు సత్త్వ గుణ సంపన్నులవలె దైవం వైపు తిరిగేవారు కాదు. అలాగే రజోగుణ సంపన్నుల వలె నిరంతరం కర్మలు చేసేవారూ కాదు. తమోగుణం గలవారు సోమరులు, ఏ పనీ చేయరు. చేయవలసి వస్తే అస్తవ్యస్తంగా చేస్తారు. వీరికి తిండి - నిద్ర ఈ రెండే ప్రధానం. వీరి మనస్సు కూడా విపరీతమైన ఆలోచనలతో ఉంటుంది. ఈ తామసిక ప్రవృత్తి గలవారు గతించిపోయిన విషయాలను తలచుకుంటూనో, ఇతరులతో చెబుతూనో కాలం గడుపుతారు. అలాగే చనిపోయిన పూర్వీకుల గురించి, వారి గొప్పతనాన్ని, లేదా చేతగాని తనాన్ని గురించి చెబుతూనో, ఆలోచిస్తూనో ఉంటారు. అసలు మా తాత ముత్తాతలు ఎంతటి గౌరవాన్ని పొందేవారో అని, మా తాత ఒట్టి దరిద్రుడు. ఆస్తినంతా పేకాటలో హారతి కర్పూరం చేశాడు అని, 1960 లో నేను గనుక ఆ ఇల్లు కొన్నట్లయితే ఇప్పుడు కోటీశ్వరుణ్ణి అయ్యే వాడిని అనో ఇలా గతాన్ని తలచుకుంటూ ఉంటారు. ఇదే భూత ప్రేతాలను పూజించుట అనే దాని లోతైన అర్థం. కనుక వీరికి అధర్మమునందు ఆసక్తి అని భాగవతంలో చెప్పటం జరిగింది. ఎందుకంటే ఇప్పుడు తమ కర్తవ్యం ఏమిటో, తమ ధర్మం ఏమిటో ఆలోచించరు.

ఈ పై మూడు రకాల శ్రద్ధ గలవారు గాక శాస్త్రవిధిని పాటిస్తూ శ్రద్ధ గలవారు నిర్గుణ పరమాత్మను ఆరాధిస్తారు.

- ఇంతవరకు 3 రకాల శ్రద్ధ గలవారు ఎలాంటి పనులు చేస్తారో చెప్పి శ్రద్ధ లేనివారు, శాస్త్రాలు నిషేధించిన పనులు చేసేవారు అయిన ఆసురీ సంపన్నుల గూర్చి రాబోయే 2 శ్లోకాల్లో తెలియజేస్తున్నారు.

శ్లో|| అశాస్త్ర విహితం ఘోరం
తప్యంతే యే తపో జనాః |
దంభాహంకార సంయుక్తాః
కామరాగ బలాన్వితాః || (5)

శ్లో|| కర్శయంతః శరీరస్థం
భూత గ్రామ మచేతసః |
మాం చైవాంత శ్శరీరస్థం
తాన్ విద్ధ్యా సుర నిశ్చయాన్ || (6)

**తా||**దంభాహంకారాలతోను, బలమైన కామరాగాలతోను కూడి అవివేకంతో, శరీరంలోని జీవకణాలను, శరీరంలో ఉండే నన్ను కూడా హింసపెడుతూ, శాస్త్ర విరుద్ధమైన, క్రూరమైన తపస్సులను ఏ జనులు చేస్తుంటారో వారంతా ఆసురికమైన గుణాలు గలవారిగా తెలుసుకో (5,6)

**వ్యాఖ్య :-** సాత్త్వికుల శ్రద్ధ శాస్త్రానికి అనుకూలంగా ఉంటుంది. కనుక వారి కర్మలు భగవంతుని సన్నిధికి చేర్చటంలో సాయపడతాయి. రాజసిక శ్రద్ధ గలవారు ప్రయత్నంతో మారవచ్చు. ఇక తామసిక శ్రద్ధ గలవారు శాస్త్ర

విరుద్ధమైన కర్మలు చేస్తుంటారు. వారికి శాస్త్రాలతో పని లేదు. పెద్దల మాటలతో పని లేదు. తాము పట్టిందే పట్టు. తాము చెప్పిందే వేదం. తాము మునిగిందే గంగ. వీరి కర్మలు వీరిని భగవంతునికి దూరం చేస్తాయి. ఇలాంటి వారి చర్యలు ఎలా ఉంటాయో, వారి స్వభావం ఎలా ఉంటుందో ఈ రెండు శ్లోకాలలో వివరించబోతున్నారు. వీరే ఆసురీ సంపన్నులు. వీరి తపస్సులు ఎలా ఉంటాయో చెబుతున్నారు.

(i) శరీరస్థం భూత గ్రామం కర్శయంతః :- వీరి తపస్సులు ఎలా ఉంటాయి? శరీరంలో ఉన్న పంచభూతాలను శుష్కింపజేస్తారు. ఇంద్రియాలను శుష్కింపజేస్తారు. ఇంద్రియాలకు పీడ కలిగిస్తారు. ఇంద్రియాలను తమ స్వాధీనంలో ఉంచుకోవాలనే కోరికతో వాటిని బాగా కృశింపజేస్తారు. ఇదే కఠినమైన తపస్సు అని, దీనితో భగవంతుడు అనుగ్రహిస్తాడని భావిస్తారు. అందుకోసం చలికాలంలో కుత్తుక బంటి నీటిలో నిలబడటం, రెండు చేతులూ పైకెత్తి నిలబడటం, ఒంటి కాలి మీద నిలబడటం లాంటివి చేస్తారు. ఇక వేసవి కాలంలో పంచాగ్ని మధ్యంలో నిలిచి తపస్సు సాగిస్తారు. చెట్టు కొమ్మకు తలక్రిందులుగా వేలాడుతారు. ఇలా దేహాన్ని పీడిస్తుంటారు. అలాగే గోచి గుడ్డ ధరించి మంచు గడ్డపై కూర్చుంటారు. ఇలా దేహాన్ని, ఇంద్రియాలను తమ చెప్పు చేతుల్లో పెట్టుకుంటున్నామని, ఇదే ఇంద్రియ నిగ్రహం, మనో నిగ్రహం అని భ్రమ పడుతుంటారు. ఈ నిగ్రహం తాత్కాలికం మాత్రమే. తపస్సు ముగిసిన తరువాత ఆ ఇంద్రియాలే ద్విగుణీకృత శక్తితో తమ ప్రభావాన్ని చూపుతాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇక కొందరు శరీరంలోని పంచభూతాలను కృశింపజేస్తారు. అంటే శరీరానికి కావలసిన ఆహారాన్ని ఇవ్వరు. ఈ శారీరక హింస జరిగినప్పుడు ఇంద్రియాలు అణగినట్లే ఉంటాయి, తరువాత విజృంభిస్తాయి. శరీరంలో ఓపిక లేనప్పుడు ఏ ఇంద్రియాలు పనిచేయవు. కంటితో చూడలేరు, చెవితో వినలేరు, కాళ్ళతో నడవలేరు, చేతులతో పని చేయలేరు. మనస్సుతో ఆలోచించలేరు. తిరిగి శరీరానికి బలం చేకూరటంతో అన్ని ఇంద్రియాలు యదావిధిగా పని చేస్తుంటాయి. కనుక ఈ రకమైన శారీరక హింస లక్ష్య సిద్ధికి ఏ మాత్రం ఉపయోగపడదు.

గౌతమబుద్ధుడు ఒకసారి పూర్తిగా ఉపవాసం ఉండి తపస్సు చేయాలనుకున్నాడు. కొద్ది రోజులు నిష్టగా ఉపవాసం ఉండటంతో బుద్ధి కూడా పని చేయలేదు. ఏమీ ఆలోచించ లేకపోయాడు. చివరకు నీరసంతో సొమ్మసిల్లి పడిపోయాడు. అప్పుడు ఒక స్త్రీ ఇది గమనించి ఆయనకు పాయసం తెచ్చి ఇచ్చింది. ఆ పాయసాన్ని త్రాగిన తరువాత శరీరానికి కావలసిన బలం వచ్చి బుద్ధి ఆలోచించటం ప్రారంభించింది. అసలు 'ఉపవాసం' అనే పదం యొక్క సరైన అర్థం తెలుసుకోక అనేక మంది ఇలా ప్రవర్తిస్తూ ఉంటారు.

'ఉపవాసం' అంటే సమీపంగా ఉండటం. ఎవరికి? భగవంతునికి. అంటే భగవంతుని స్మరణలో, భగవత్ భావనలో మైమరచి, పరవశించి, భోజనం మరచి పోయారెవరో. దానితో ఉపవాసం అంటే భోజనం చెయ్యకుండా

ఉండటం అని నిశ్చయించుకున్నారు. భగవంతుని స్మరణను మరచిపోయారు. ఇది ఆసురిక తపస్సు.

(ii) అంతః శరీరస్థం మాంచ ఏవ :- శరీరంలో ఉన్న నన్ను కూడా హింసిస్తున్నారు. సమస్త శరీరాలలోను భగవంతుడున్నాడు. ఎలా ఉన్నాడు? వైశ్వానరాగ్ని రూపంలో - 'అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః' - నేను వైశ్వానరుణ్ణై ప్రాణుల దేహాలను ఆశ్రయించుకొని ఉన్నాను. అని భగవానుడే స్వయంగా 15 వ అధ్యాయంలో తెలియ జేశాడు. అలా ఉండి ఏం చేస్తున్నాడు? మనం తినే ఆహారాన్ని పంచప్రాణాల సాయంతో లోనికి తీసుకోవటం, దాన్ని జీర్ణింపజేసి, ఆ అన్నసారాన్ని శరీరంలోని అన్ని అవయవాలకు సరఫరా చేస్తూ, పనికిరాని వ్యర్థ పదార్థాలను బయటకు పంపిస్తున్నాడు. దీనివల్ల శరీరానికి కావలసిన శక్తి వస్తున్నది. దానితో అన్ని పనులు జరిగిపోతున్నాయి. అంటే మనం చక్కగా పనిచేస్తున్నామంటే దానికి కారణం భగవంతుడే అని గ్రహించవచ్చు. మనం తీసుకున్న ఆహారాన్ని భగవంతుడిలా ఆరగించి శరీర అవయవాలకు అందించకపోతే శరీర నియమాలన్నీ ఆగిపోతాయి. అంటే మనం తపస్సుల పేరుతో శరీరాన్ని శుష్కింపజేస్తే భగవంతుని ఆదేశాలకు విరుద్ధంగా ఉన్నట్టే.

అసలు భగవంతుని హింసించటం ఎవరివల్లా అయ్యే పని కాదు. మరి ఎందుకలా అన్నారు? ఈ దేహేంద్రియాలతో, మనస్సుతో సాధన చేసి తరించమని భగవంతుని ఆదేశం. దేహేంద్రియాలను మనస్సును శుష్కింప జేసి శరీర వ్యాపారాలన్నింటిని బంధింపజేసి నిష్క్రియా పరులమైతే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భగవంతుని ఆదేశాన్ని ఉల్లంఘించినట్లే గదా! ఇది తప్పని - నేరమని చెప్పటానికే శరీరంలో ఉన్న నన్ను హింసించినట్లేనని చెప్పటం. ఎలా చేస్తున్నారు ఈ తపస్సులను?

(iii) దంభాహంకార సంయుక్తాః :- ఇలా శరీరాన్ని హింస పెట్టి తపస్సులు, ఉపవాసాలు చేసేవారు ఎలా చేస్తున్నారు వీటిని? దంభంతో, అహంకారంతో కూడినవారై చేస్తున్నారు. దంభం అంటే తమ గొప్పతనాన్ని ప్రదర్శించుకోవటం. అందుకోసం చేస్తారు తపస్సులు.

రావణుడు వెయ్యి సంవత్సరాల కొకసారి తన ఒక్కొక్క శిరస్సును ఖండించి అగ్నిలో కాలుస్తూ తపస్సు చేశాడు. కుంభకర్ణుడు నిరాహారుడై గాలిని కూడా బంధించి, ఏకపాదంపై నిలిచి తపస్సు చేశాడు. భస్మాసురుడు ఘోరమైన తపస్సు చేశాడు, హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు కూడా అలాగే ఘోరమైన తపస్సులు చేశారు. భగవంతుని అణకువతో, నమ్రతతో, భక్తితో, వినయంగా ప్రార్థించటం కాదు. నా కోరిక తీరుస్తావా? చస్తావా? అంటూ బెదిరించటం కనపడుతుందీ చర్యలలో. దీనివల్ల వారి కోరికలు తీరినవే గాని, చివరకు ఆ వరాలే వారి నాశనానికి కారణమయ్యాయి. ఇలాంటి తపస్సులను భగవంతుడు మెచ్చడు.

ఇప్పుడు ఉపవాసాలు చేసేవారు చెబుతుంటారు, "నేనసలు పచ్చి మంచి నీళ్ళు కూడా ముట్టలేదండి. ఎంత ఆకలైనా సరే ఒక్క పండు కూడా తినలేదు" - అని అదొక గొప్ప ఘనకార్యమైనట్లు చాటింపు వేస్తుంటారు. ఇదే దంభం. ఇదే అహంకారం. నేను ఇంతటి వాణ్ణి, అంతటి వాణ్ణి అని పది మందిలో గొప్ప

కోసం తంటాలు పడటం. అంతేగాని "నేను ఈ రోజంతా భగవంతుని స్మరిస్తూ, జప ధ్యానాలు చేస్తూ, భగవంతుని కథలు వింటూ, చదువుతూ, ఎవరితోనన్నా మాట్లాడినా భగవంతుని గురించే మాట్లాడుతూ ఉన్నాను" అని అంటాడా? అనడు. ఎందుకంటే అతనికి భోజనం చేయకుండటం గొప్ప విషయం గాని, భగవంతుని తలచుకుంటూ ఉండటం గొప్ప కాదు. అయితే ఇలా ఎందుకు ప్రవర్తిస్తారు వీళ్ళు? -

(iv) కామరాగ బలాన్వితాః :- ప్రాపంచిక వస్తువులు, భోగాల పట్ల రాగం; ఆ రాగం వల్ల భోగ్య వస్తువులను సంపాదించుకోవాలనే కోరిక; ఆ కోరికను తీర్చుకొనుటకు కావలసిన శారీరక బలం ఉన్నది గదా అనే అహంకారం, దానితో శరీరాన్ని హింసించే కార్యాలు చేస్తూ ఉంటారు. తమకు చావు లేకుండా ఉండాలని రావణ కుంభకర్ణులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, భస్మాసురుడు మొ||న రాక్షసులు ఘోరాతి ఘోరమైన తపస్సులు చేశారు. ఎందుకంటే విపరీత భోగాసక్తి కారణంగానే, ఏదో జీవించి ఉన్నంత వరకు హాయిగా, ఏ లోటూ లేకుండా, ఆనందంగా ఉండాలని కోరుకోవటంలో తప్పు లేదు. కాని అసలు చావే లేకుండా ఉండాలని కోరుకోవటం అంటే ఏమిటి? పుట్టిన వారికి చావు తప్పదు గదా! ఇది భవగవంతుని నియమం. శాసనం. ప్రకృతి ధర్మం.

ఈ అసాధారణ కోరికలే కామం; భోగాల పట్ల ఆసక్తే రాగం; వీటిని సాధించటానికి ఉపయోగించేదే రాక్షస బలం - శారీరక బలం. ఈ

మూడింటితోను ఇలా ప్రవర్తిస్తారు ఆసురిక మానవులు, ఇలా ప్రవర్తించే వారు ఎలాంటివారు?

(v) అచేతసః :- అసాధారణ కోరికలను తీర్చుకొనుటకు శరీరాన్ని హింసించే కటిక తపస్సులు చేసేవారే అచేతసులు - అవివేకులు. యుక్తా యుక్త విచక్షణా జ్ఞానం లేనివారు. వీటివల్ల అంతిమంగా ఎటువంటి ఫలితం కలుగుతుందో సరిగ్గా అంచనా వేయలేనివారు. సర్వనాశనం జరుగుతుందని ఊహించ లేనివారు. ఆసురిక స్వభావంతో కేవలం భోగాసక్తి కారణంగా ఇలా అస్తవ్యస్తంగా ప్రవర్తిస్తారు. ఇక ఈ తపస్సులు ఎలాంటివో కూడా చెబుతున్నారు.

(vi ) అశాస్త్ర విహితం :- శరీరాన్ని కష్టపెడుతూ చేసే ఈ కఠిన తపస్సులు, ఉపవాసాలు శాస్త్ర విహితమైనవి కావు, శాస్త్ర విరుద్ధమైనవి. శాస్త్రం ఎప్పుడూ అపాయం లేని ఉపాయాన్నే చెబుతుంటుంది. అనేక కోణాల నుండి విచారించి లక్ష్యసిద్ధిని పొందే మార్గాన్ని తెలియజేస్తుంది. ఏదైనా పొరపాటు జరిగితే దానిని సరిదిద్దుకొనే మార్గాన్ని కూడా చెబుతుంది. భగవంతుని యొక్క శాసనాలకు, ఆజ్ఞలకు, అభిప్రాయాలకు లోబడి చెబుతుంది. కనుక శాస్త్రవిధిని పాటించిన వానికి ఎప్పటికీ నాశనం ఉండదు. కాని శాస్త్ర విరుద్ధంగా ప్రవర్తించే వానికి దారుణమైన ఫలితాలే ప్రాప్తిస్తాయి.

కనుకనే కఠిన తపస్సులను శాస్త్ర విరుద్ధమైనవిగా ఖండించటం జరిగింది. సత్త్వగుణంలో ఉండేవారు శాస్త్ర విరుద్ధమైన వాటిని పాటించరు. రజోగుణంలో ఉండేవారు దురాశ వల్లనో, సహవాస దోషం వల్లనో

పాటిస్తుంటారు. అయితే తమోగుణంలో ఉండే వారికి ఇవే బాగా నచ్చుతాయి. ఇవి శాస్త్ర విరుద్ధమే కాదు. ఇంకా -

(vii) ఘోరం :- ఇవి ఘోరమైన తపస్సులు అంటున్నారు. అంటే తనకు, ఇతరులకు కూడా ఇవి పీడాకరమైనవి. తన శరీరాన్ని శుష్కింప జేసుకోవాలి. అనేక బాధలను ఓర్చుకోవాలి. దీనితో మనస్సు కరడుగట్టి పోతుంది. దయ, జాలి, కరుణ, పరహితం, సమాజ శ్రేయస్సు పట్టవు. కఠినంగా మాట్లాడుతారు. కార్యసిద్ధి తరువాత లోకకంటకులౌతారు. యజ్ఞ యాగాలు ధ్వంసం చేయటం, సాధుపురుషులను హింసించటం, ప్రజలను పీడించటం, దుర్మార్గాలు చేయటం, అహంకారంతో విర్రవీగటం, తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళనటం - ఇవన్నీ వారి దిన చర్యలవుతాయి. రావణాది రాక్షసుల చర్యలన్నీ ఈ రకమైనవే.

యేజనాః తపః తప్యంతే :- ఎవరు ఇలాంటి తపస్సులు చేస్తారో వారు 'అసుర నిశ్చయాన్ విద్ధి' - అసుర స్వభావం గల వారని తెలుసుకో.

నిజంగా తపస్సులు ఎందుకు చేయాలి? నీ అంతఃకరణంలో ఉన్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలను జయించటానికి చేయాలి. భగవంతునికి సన్నిహితమయ్యేందుకు చేయాలి. కాని ఈ పైన చెప్పిన కఠిన తపస్సులు - ఉపవాసాలు దోషాలను పోగొడుతున్నాయా? లేదు. అసలు ఈ తపస్సులు చేసేదే తీవ్రమైన కోరికలతో, అసాధ్యమైన కోరికలతో, అలవి గాని ఆశలతో. మరి ఈ తపస్సులు కామాన్ని (కోరికలను) ఎలా అరికడతాయి? పైగా కోరికలు తీరకపోతే క్రోధం. తీరినా ఆ తర్వాత

అహంకారంతో క్రోదాన్నే కలిగి ఉంటారు. ఇంతవరకు తాను శారీరకంగా ఎంతో హింసను అనుభవించి వరాలను సాధించాడు గనుక, ఇతరులను ఇంకా ఎక్కువగా హింసించటానికే ఈ వరాలను వినియోగిస్తాడు. క్రోధం పెరిగిపోతుంది. తానొక్కడే సకల భోగాలను అనుభావించాలనే లోభం పెరుగుతుంది. వరాలను పొందటం వల్ల లోకంలో తనను మించినవారు లేరని, తాను అసాధారణ వ్యక్తినని, పై నుండి దిగివచ్చిన దైవాన్ననే మోహం కలుగుతుంది. దానితో మదం హెచ్చుతుంది. తనకన్నా అధికుణ్ణి చూస్తే మాత్సర్యం కలుగుతుంది. కనుక ఈ తపస్సులు దోషాలను తొలగించక పోగా, దోషాలను పెంచుతాయి. అందుకే వీరిని అసురులు అంటారు.

ఈ అసుర బుద్ధి పోవాలంటే, రాజసిక తామసిక గుణాలు తొలగి సాత్త్విక గుణాలు వృద్ధి చెందాలంటే ఎలాంటి ఆహారం తీసుకోవాలి? యజ్ఞ, దాన, తపస్సులనెలా చేయాలి అనే విషయాలను వివరించబోతున్నారు.

- ముందుగా ఆహారం గురించి. ఎలాంటి ఆహారాన్ని ఏ గుణాలు గలవారు ఇష్ట పడతారు? –

శ్లో|| ఆహార స్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం
తేషాం భేద మిమాంశ్రుణు || (7)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా||** అందరికి ఆహారం కూడా మూడు విధాలుగా ప్రియమవుతుంది. అలాగే యజ్ఞం, దానం, తపస్సులలో కూడా వాటి భేదాన్ని ఇదిగో విను.

**వ్యాఖ్య :-** అసుర స్వభావాన్ని దైవ స్వభావంగా మార్చుకోవాలన్నా, రాజసిక తామసిక గుణాలను సాత్త్విక గుణంగా మార్చుకోవాలన్నా మనం తీసుకొనే ఆహారం విషయంలో ముందుగా జాగ్రత్తపడాలి. అలాగే మనం చేసే యజ్ఞ దాన తపస్సుల విషయంలో కూడా జాగ్రత్తపడాలి. అందుకే ఇక్కడ ముందు ఆహార విషయాన్ని ప్రస్తావిస్తున్నారు. ముందు ఆహార విషయాన్ని చెప్పి, తరువాతనే యజ్ఞ దాన తపస్సులను గూర్చి చెబుతున్నారంటే ఆహారం యొక్క ప్రాధాన్యత ఆధ్యాత్మికరంగంలో ఎంతటి ప్రాధాన్యత గలిగిన అంశమో గ్రహించవచ్చు.

అర్జునుడు మొదటి శ్లోకంలో ప్రశ్నవేస్తూ 'యజంతే' అంటూ యజ్ఞ విషయాన్ని ప్రస్తావించాడు. భగవానుడేమో 'యజంతే' అన్న దానికి యజ్ఞ దాన తపస్సులు మూడింటిని చెబుతున్నాడు. అంటే ఈ మూడూ 'యజంతే' అనే పదానికి సంబంధించినవే. ఈ యజ్ఞ, దాన, తపస్సులు మూడింటికి ముందు ఆహార చర్చ వచ్చింది. "అన్న మీమాంస లేకపోతే బ్రహ్మ మీమాంస జీర్ణం కాద" ని పెద్దలు చెబుతారు. మానవుల యొక్క ఆధ్యాత్మిక ప్రగతికి ఆహార శుద్ధి ఎంతో ప్రధానం. మనం తినే ఆహారంలో స్థూలభాగం శరీరానికి శక్తిని, పుష్టిని ఇస్తుంది. ఇక సూక్ష్మభాగం మనస్సుగా ఏర్పడుతుంది. కనుక ఆహారాన్ని బట్టే మనస్సు. అంటే ఆహార శుద్ధి వల్లనే మనశ్శుద్ధి. మనశ్శుద్ధి వల్ల బుద్ధిసూక్ష్మత. దానివల్లనే ఆధ్యాత్మిక జ్ఞానప్రాప్తి. "నీవు ఏ ఆహారాన్ని

తీసుకుంటావో చెప్పు. నీ ఆలోచనలేమిటో చెబుతా" నంటాడు పైథాగరస్ అనే శాస్త్రవేత్త.

ఛాందోగ్యోపనిషత్ ఇలా చెబుతున్నది.

**మం||** ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః సత్త్వ శుద్ధౌ ధృవా స్మృతిః |

స్మృతి లంభే సర్వ గ్రంథీనాం విప్రమోక్షః ||

- ఆహార శుద్ధితో అంతఃకరణ శుద్ధి. అంతఃకరణ శుద్ధితో నిశ్చలమైన స్మృతి. నిశ్చలస్మృతితో హృదయగ్రంధులన్నీ విచ్ఛిన్నమౌతాయి - అని. అంటే ఆహారశుద్ధి వల్ల హృదయగ్రంధి విమోక్షణం.

మహాభారతయుద్ధంలో భీష్ముడు 10 వ రోజున అర్జునుని బాణ వర్షంతో అంపశయ్యపై నేలకూలాడు. యుద్ధం పూర్తయిన తరువాత జరగవలసిన కర్మకాండలన్నీ జరిగి ధర్మరాజు పట్టాభిషిక్తుడయ్యాడు. భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చే వరకు ప్రాణాలు దేహంలో నిలుపుకొని శరతల్పగతుడై జీవించి ఉన్నాడు. ఉత్తరాయణ పుణ్యకాలం సమీపిస్తుండగా శ్రీకృష్ణుడు పాండవులను, బంధువర్గాన్ని వెంటబెట్టుకొని భీష్ముని సందర్శనానికి వచ్చాడు. ఆ సమయంలో భగవానుని ఆదేశంపై భీష్ముడు ధర్మరాజుకు అనేక రాజధర్మాలు, స్త్రీ ధర్మాలు, మోక్ష ధర్మాలు అన్నీ చెబుతున్నాడు. పాంచాలితో సహా పాండవులందరూ ఆయన మాటలను ఎంతో వినమ్రతతో - దప్పిక గొన్నవాడు అమృతం లభిస్తే పానం చేసినట్లు - వింటున్నారు. అంతలో ద్రౌపదీ దేవికి ఏదో జ్ఞాపకం వచ్చి పుటుక్కున నవ్వింది. అది చూచి భీష్ములవారు కారణం అడిగారు. అప్పుడు ద్రౌపది, తాతగారూ! ఇప్పుడిన్ని ధర్మాలను

బోధిస్తున్నారు; అనేక శాస్త్రాలలోని రహస్యాలను తెలియజేస్తున్నారు - బాగానే ఉంది. కాని నాకొక సందేహం . ఆనాడు కౌరవుల నిండు సభలో పట్టపగలు, పెద్దలందరి సమక్షంలో నాకు జరగరాని ఘోర పరాభవం జరుగుతుంటే మరి ఈ ధర్మసూత్రాలేవీ మీకు జ్ఞాపకం రాలేదా? ఈ ధర్మపన్నాలన్నీ అప్పుడే మయిపోయాయా? అని నాకు నవ్వు వచ్చింది; క్షమించండి" అన్నది. దానికి భీష్ముడు, "అమ్మా! అప్పుడు నేను దుర్యోధనుని కొలువులో పనిచేస్తున్నాను. ఆ దుష్టుని దుష్టాన్నాన్ని తిన్నాను. అందువల్ల ఈ ధర్మాలన్నీ మరుగున పడిపోయాయి. అర్జునుని బాణాల దెబ్బకు ఆ దుష్టరక్తం కారిపోయింది. దానితో ఈ ధర్మాలన్నీ బయటపడ్డాయి" - అన్నాడు భీష్ముడు. ఆహారం యొక్క ప్రభావం ఎట్టిదో తెలియజెప్పే సంఘటన ఇది.

శ్రీకృష్ణుడు రాయబారిగా హస్తినలో అడుగుపెట్టిన తరువాత దుర్యోధనుని గృహానికి వెళ్ళి క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకున్నాడు. ఆ సందర్భంలో తన ఇంట విందు ఆరగించమని ప్రార్థించాడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని. అప్పుడు శ్రీకృష్ణుడు, బావా! ఇప్పుడు నేను పాండవ రాయబారిగా వచ్చాను. నేను పాండవుల క్షేమం కోరేవాడిని, కాని నీవేమో పాండవులను ద్వేషించేవాడివి. వారికి ఎన్నో అపకారాలు చేసినవాడవు. కనుక నాకు శత్రుతుల్యుడవు. కనుక నీ అన్నం దూషితం. విదురుని అన్నమే నాకు స్వీకరించ తగినది, అని చెప్పి ఆహ్వానం లేకుండగానే విదురుని ఇంటికేగి ఆయన ఇచ్చిన విందును ఆరగించాడు. దీనిని బట్టి ఆహారం ఎంత ప్రాముఖ్యమైనదో తెలుస్తుంది.

అంతేకాదు. ఒకసారి జైమిని మహర్షి ఒక చెట్టు క్రింద కూర్చొని తపస్సు చేస్తున్నాడు. ఆ చెట్టుపైన ఒక పక్షి 'కాభుక్ కాభుక్' ఏమి తినాలి? ఏమి తినాలి? అని అరిచింది. దానికాయన "మితభుక్ హితభుక్" - మితంగా తినాలి, హితంగా తినాలి అన్నాడట.

స్నిగ్ధమైన, ఉత్తమమైన, మధురమైన ఆహారాన్ని, భగవత్ ప్రీతికరంగా, పొట్టలో పావు భాగం ఖాళీగా వదలి భుజించుటయే మితాహారం - అని హఠయోగప్రదీపిక చెబుతున్నది. మితాహారి కానివాడు యోగసాధన చేస్తే అతడికి రోగ సిద్ధియేగాని, యోగసిద్ధి లేదని శాస్త్రాలు చెబుతున్నాయి.

కడుపులో సగభాగం అన్నంతోను, పావుభాగం నీళ్ళతోను నింపి మిగిలిన పావుభాగాన్ని గాలికోసం వదలాలి అని ఆయుర్వేదశాస్త్రం చెబుతున్నది. ఆహారం మితంగానే కాక న్యాయార్జితం గాను, యజ్ఞశేషం గాను, భగవన్నివేదితంగాను ఉంటేనే అది సాత్త్వికాహారం అవుతుంది.

ఆహారం 3 విధాలు. అలాగే యజ్ఞ దాన తపస్సులు కూడా ఒక్కొక్కటి మూడు విధాలు. వారివారి శ్రద్ధను బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్కరకం ప్రీతిగా ఉంటుంది. సాత్త్వికశ్రద్ధ గలవారికి సాత్త్వికాహారం, రాజసికశ్రద్ధ గలవారికి రాజసికాహారం, తామసికశ్రద్ధ గలవారికి తామసికాహారం ప్రీతికరంగా ఉంటుంది. ఈ విషయం 3 శ్లోకాలలో రాబోతున్నది.

- ముందుగా సాత్త్వికశ్రద్ధ గల వారికి ఎలాంటి ఆహారం ప్రియమో ఈ శ్లోకంలో చెబుతున్నారు.

**శ్లో||** ఆయుస్సత్త్వ బలారోగ్య
సుఖ ప్రీతి వివర్ధనాః |
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా
ఆహారాస్సాత్త్విక ప్రియాః || (8)

**తా ||** ఆయుస్సు, సత్త్వగుణం, బలం, ఆరోగ్యం, సుఖం, ప్రీతి - వీటిని వృద్ధి చేసేది, రసము గలది, జిడ్డు గలది, జీర్ణమయ్యేది, మనస్సుకు ఇంపితమయ్యేది అయిన ఆహారం సాత్త్వికులకు ఇష్టంగా ఉంటుంది.

**వ్యాఖ్య :-** ప్రపంచంలో ముఖ్యంగా ఆహారం రెండు రకాలే. అవి - మాంసాహారం, శాకాహారం. వీటిని భుజించేవారి స్వభావాలు వాటిని బట్టే ఉంటాయి మాంసాహారం మంచిది కాదని, శాకాహారమే శ్రేష్ఠమని భగవానుని అభిప్రాయం. అందుకే శ్రీకృష్ణుడు గోపాలుడయ్యాడు. స్వయంగా గోపాలన, గోసేవ చేశాడు. బాల్య క్రీడలలో - లీలలలో పాలు, పెరుగు, వెన్న, నెయ్యి దొంగిలించటం, తానుతినటం, ఇతరులకు పెట్టటం ద్వారా వాటి శ్రేష్టత్వాన్ని లోకానికి చాటాడు. భగవద్గీతలో చెప్పేముందే సాత్త్వికాహారాన్ని గూర్చి బాల్యంలోనే ఆచరించి చూపాడు.

దీనిని బట్టి భగవానుడు మాంసాహారానికి వ్యతిరేకమని తెలుస్తుంది. సాత్త్వికులకు ఇష్టమయ్యే ఆహారం 10 లక్షణాలతో కూడి ఉన్నది. ఇలాంటి ఆహారాన్ని స్వీకరిస్తే ఎవరిలోనైనా సాత్త్వికగుణం వృద్ధి అవుతుంది. తద్వారా చిత్తశుద్ధి కలుగుతుంది.

(i) ఆయుః :- ఈ మానవజన్మను తరింపజేసుకోవాలంటే ధర్మాచరణ ఉండాలి. అందుకోసం ఆయుస్సును వృద్ధి చేసుకోవాలి. ఆయుస్సును వృద్ధి చేసుకొనుటకు తగిన ఆహారాన్ని తీసుకోవాలి. పోషక పదార్థాలు ఎక్కువగా ఉండి, రక్తాన్ని వృద్ధిచేసి, ప్రాణశక్తిని బలిష్టం చేసే ఆహారాన్ని స్వీకరించాలి. అది ఆయుస్సును వృద్ధి చేస్తుంది. సాత్త్వికులకు అట్టి ఆహారమే ఇష్టంగా ఉంటుంది.

(ii) సత్త్వం అంటే సత్త్వగుణం. సత్త్వగుణాన్ని పెంచే ఆహారం తీసుకుంటే ధ్యాన శక్తి పెరుగుతుంది. మనిషిలో శుద్ధమైన బుద్ధిని ఉత్పన్నం చేసే శక్తి ఈ సత్త్వగుణానిదే. మనం తీసుకునే ఆహారం ద్వారా మనలో సత్త్వగుణం వృద్ధి అయిందా? లేదా? అని ఎలా తెలుస్తుంది? ముఖం ప్రసన్నంగా, మనస్సు ఆనందంగా, అందరి పట్ల ప్రీతి, పెద్దల పట్ల వినయ విధేయతలు - ఇవి ఉంటే సత్త్వం వృద్ధి అయినట్లే.

(iii) బలం :- ఆహారం బలాన్ని ఇచ్చేది కావాలి. పుష్టిని కలిగించే ఆహారం తీసుకున్నప్పుడే శారీరక బలం కలుగుతుంది. అది మనస్సుకూ బలాన్ని కలిగించి ఇంద్రియాలను జయించగలిగే శక్తి కలుగుతుంది. శరీరంలో బలహీనత వస్తే బుద్ధి కూడా మందగిస్తుంది.

(iv) ఆరోగ్యం :- ఆహారం ఆరోగ్యాన్ని కలిగించాలి. దోష యుక్తమైన ఆహారం రోగాలను తెస్తుంది. దానితో సాధనకు ఆటంకం కలుగుతుంది.

(v) సుఖం :- ఆహారం స్వీకరించిన తర్వాత సుఖంగా ఉన్న భావన కలగాలి. కడుపునిండా తిన్నప్పుడో, కడుపు మాడ్చుకున్నప్పుడో అసహనంగా ఉంటుంది. కడుపులో ఏదో త్రిప్పినట్లు ఉండరాదు. మితాహారం సుఖ ప్రదం.

(vi) ప్రీతి వివర్ధనా :- ఇంపితమైన ఆహారం ప్రీతి కలిగిస్తుంది. ఇష్టంగా ఆహ్లాదంగా ఉన్న ఆహారాన్నే స్వీకరించాలి. అలా కాకపోతే ఆహారం మనస్సును ప్రభావితం చేస్తుంది. కనుక ఇష్టం లేని దానిని తినరాదు.

(vii) రస్యాః :- రసవంతమైన ఆహారం - అంటే పండ్లు, కాయలు, కూరలు - ఇవి రసవంతములైనవి. ఇవే సాత్త్వికులకు ప్రియం.

(viii) స్నిగ్ధాః :- బాగా ఉడికిన పదార్థాలు ఆరోగ్యానికి మంచిది. అలాగే జిడ్డు కలిగిన పదార్థాలు - పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, నూనెలు -ఇవి సాత్త్వికమైనవి.

(ix) స్థిరా :- త్వరగా జీర్ణమయ్యే పదార్థాలు సాత్త్వికులకు ప్రియం. అవే పీచు పదార్థాలు.

(x) హృద్యా :- అనుకూలమైనవి, ఇష్టమైనవి. అంటే మనం తినే ఆహారం మన ప్రకృతిని - స్వభావాన్ని బట్టే ఉంటుంది. కొన్ని రుచులంటేనే మనకు ఇష్టంగా ఉంటాయి. వాటినే తినాలనుకుంటాం. జంతువులు మాత్రం శరీర అవసరాలను బట్టి ఆహారాన్ని మార్చుకుంటాయి.

కుక్కలు, పిల్లులు అప్పుడప్పుడు గడ్డి తింటాయి.

పశువులు అప్పుడప్పుడు ఉప్పు రాళ్ళను నాకుతాయి.

యోగశాస్త్రాలలో ఇలా చెబుతారు. సులువుగా జీర్ణమయ్యేది, తినటానికి ఇష్టమైనది, విటమినులతో - పోషకాలతో కూడినది, జిడ్డు కలిగినవి, పుష్టికరమైనవి, మనస్సుకు ఇంపితమైనవి అయిన ఆహారాన్నే యోగులు స్వీకరించాలి - అని.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఏది ఏమైనా సాత్త్వికస్వభావం గల వారికి సాత్త్విక ఆహారమే ఇష్టంగా ఉంటుంది. అట్టి సాత్త్విక ఆహారాన్ని తీసుకుంటున్న కొద్దీ వారిలో సాత్త్విక గుణం బాగా వృద్ధి అవుతుంది, పాలు, పాల పదార్థాలు, పండ్లు, ఆకుకూరలు, కాయగూరలు, పప్పులు మొ||నవి సాత్త్వికమైనవి.

- రాజసికులకు ప్రీతికరమైన ఆహారం ఏమిటో తెలియజేస్తున్నారు.

**శ్లో||** కట్వామ్ల లవణా త్యుష్ణ
తీక్ష్ణ రూక్ష విదాహినః |
ఆహారా రాజస స్యేష్టాః
దుఃఖ శోకామయ ప్రదాః || (9)

**తా||** చేదు, పులుపు, ఉప్పు, ఎక్కువ వేడి, కారం, ఎండిపోయినవి, దాహం కలిగించేవి, దుఃఖాన్ని, రోగాలను కలిగించే ఆహారం రాజసికులకు ఇష్టంగా ఉంటుంది.

**వ్యాఖ్య :-** రాజసగుణం గల వాడికి నోటి రుచి ఎక్కువ. ఉప్పు, కారం, పులుపు, వేడి ఏ మాత్రం తగ్గినా వారికి ఇష్టం ఉండదు. ఆ తగ్గిన కాస్త కలుపుకొని మాత్రమే ఆ పదార్థాలను తింటారు. వీరికి ఎలాంటివి ఇష్టం?

కటు అంటే చేదు, ఆమ్ల అంటే పులుపు, లవణ అంటే ఉప్పు, అత్యుష్ణ అంటే ఎక్కువ వేడి, తీక్ష్ణ అంటే కారం, రూక్ష అంటే ఎండినవి (జిడ్డు లేనివి), విదాహినః అంటే ఎక్కువ దప్పిక కలిగించేవి. ఇలాంటి ఆహారం రాజసికులకు ఇష్టం. ఇటువంటి ఆహారం దుఃఖాన్ని, శోకాన్ని కలిగించటమేగాక ఆమయాన్ని

అంటే రోగాన్ని కలిగిస్తుంది. కొద్దిగా ఉప్పు, కొద్ది కారం. కొద్ది వేడి, కొద్ది పులుపు సాత్త్వికులకు కూడా ఇష్టమే. కాని అతివేడి, అతి పులుపు, అతికారం, అతిఉప్పు రాజసికులకు ఇష్టం.

(i) కటు :- బాగా చేదుగా ఉండేవి రాజసికులకు ఇష్టం. కాకరకాయల వంటి వాటిని రాజసికులు ఇష్ట పడతారు. సాత్త్వికులు అందులోని చేదును తగ్గించి వాడుకుంటారు. కొంచెం సేపు ఉప్పులో వేసి ఉంచి గాని, లేదా చింతపండు నీటిలో ఉడకబెట్టి గాని వాడుకుంటారు.

(ii) ఆమ్ల :- బాగా పులుపు పదార్థాలు రాజసికులకు ఇష్టం. కొందరు మామిడి కాయలు, చింతకాయలు మొ||న వాటిని పక్వానికి రాకముందే తింటారు. అప్పుడవి కొరుడు పులుపుగా ఉంటాయి. వీరు సామాన్యమైన పులుపుతో సరి పెట్టుకోరు. నిమ్మరసం సరాసరి త్రాగేస్తారు.

పులుపు ఎక్కువగా తింటే వీర్య క్షయం అవుతుంది. కంఠస్వరం దెబ్బ తింటుంది. రక్త దోషాలు వృద్ధి చెందుతాయి. చంచలత్వం సిద్ధిస్తుంది.

(iii) లవణ:- ఉప్పు ఎక్కువగా వాడే రాజసికులకు వెంట్రుకలు త్వరగా తెల్లబడతాయి. చర్మ రోగాలు వస్తాయి. దప్పిక వేస్తుంది. అసలు వాడకపోతే Low B.P.

(iv) అత్యుష్ణః :- కాఫీ త్రాగటం కొందరికి అలవాటు. కొందరికి నాగరికత. కొందరికి ఫ్యాషన్. ఆఫర్ చేయటం కొందరికి మర్యాద. చాలా మందికి వేడి వేడిగా పొగలు వస్తున్నప్పుడు త్రాగాలనుకుంటారు. కొద్దిగా చల్లారితే త్రాగరు. తిరిగి వేడి చేసుకొని త్రాగాల్సిందే. అలాగే అన్నాన్ని కూడా స్టౌ మీద నుండి

దించటంతోనే తినాలనుకుంటారు. కొద్దిగా చల్లారినా తినరు. ఇదంతా రాజసికుల చేష్టయే.

ఇలా అతి వేడి పదార్థాలను తిన్నా, త్రాగినా అతిగా దప్పిక కలుగుతుంది. వీర్య క్షయం కలుగుతుంది. శరీరంలో వణుకు ఏర్పడుతుంది. ఎముకలకు సంబంధించిన జబ్బులు కలిగే అవకాశం ఉంటుంది.

(v) తీక్ష్ణ :- ఎక్కువ కారం జీర్ణశక్తిని పాడు చేస్తుంది. మసాలాలు, ఊరగాయలు, మిరపకాయలు - ఇలాంటివి రాజసికులకు ఇష్టం. పచ్చిమిరపకాయలు ఎలుకలకు, ఎండుమిరపకాయలు కాకులకు ఇష్టం. ఎలుకల, కాకుల స్వభావం గల వారికి ఇవి ఎంతో ఇష్టంగా ఉంటాయి. కారం అతిగా తింటే కడుపులో అల్సర్స్ ప్రమాదం ఉంది.

(vi) రూక్ష :- ఎండిన పదార్థాలు. అంటే జిడ్డు లేనివి, రసం లేనివి. ఇలాంటి పదార్థాలు రాజసికులకు ఇష్టంగా ఉంటాయి. కాని ఇవి రక్తహీనతను కలిగిస్తాయి. వండిన తర్వాత వారం రోజుల దాకా తినేవి. చక్రాలు, కారప్పూస, ఇతర పదార్థాలు.

(vii) విధాహినః :- దప్పిక కలిగించే వేడి వస్తువులు, ఉప్పు, కారం అతిగా ఉన్న పదార్థాలను ఎక్కువ వాడితే జీర్ణశక్తి నశిస్తుంది. శరీరం బలహీనమై పోతుంది. రుచులు కోరుకునే వారు ఇలాంటి పదార్థాలనే కోరుకుంటారు.

"అధరానికి రుచి - ఉదరానికి బాధ" అన్నారు. రాజసికులు ఇష్టపడే ఇలాంటి ఆహారపదార్థాలు దుఃఖాన్ని, మనస్సుకు బాధను కలిగించి ఆరోగ్యాన్ని దెబ్బ తీస్తాయి. అందుకే 'దుఃఖ శోకామయప్రదాః' అన్నారు.

(i) దుఃఖ :- దుఃఖం అంటే శరీరానికి కలిగేది. తిన్న వెంటనే శరీరానికి కలిగే బాధయే దుఃఖం.

(ii) శోకా :- తిన్న తర్వాత మనస్సుకు కలిగే బాధ శోకం.

(iii) ఆమయం :- ఆమయం అంటే రోగం. ఇది తిన్న వెంటనే రాదు. కొంత కాలం తరువాత వస్తుంది. శరీరంలోని ధాతువులలో కలిగే వికారం వల్ల రోగాలు వస్తాయి. శరీరం యొక్క స్థితి ధాతువులపై ఆధారపడి ఉంటుంది. ఈ రకమైన పదార్థాలు మనస్సును స్వస్థతలో ఉంచవు.

మనస్సు స్వస్థత తప్పితే ధాతువులు నశిస్తాయి. ధాతువులు నశిస్తే ఆరోగ్యం దెబ్బ తింటుంది. కనుక ఆరోగ్యాన్ని కోరుకొనేవారు తప్పక ఆహార నియమాన్ని పాటించాలి. రాజసాహారం వల్ల దుస్వప్నాలు వస్తాయి. దుష్ట వాసనలు కూడుకుంటాయి. కనుక చిత్తం చెడకుండా - ధాతువులు నశించకుండా - ఆరోగ్యం చెడకుండా ఉండాలంటే సాత్త్వికాహారాన్ని భుజించాలి. రాజసాహారాన్ని నిషేధించాలి. మాంసాహారం ఏదైనా రాజసిక ఆహారమే.

సాత్త్వికాహారం ఆయుస్సత్వ బలారోగ్య అని చెబితే రాజసిక ఆహారం దుఃఖ శోకామయ ప్రదాః అని చెప్పారు. కనుక రెండూ పరస్పర విరుద్ధమైనవి.

- ఇక తామసికులకు ఇష్టమైన ఆహారమేదో చెబుతున్నారు .

శ్లో|| యాతయామం గతరసం

పూతి పర్యుషితం చ యత్ |

ఉచ్ఛిష్టమపి చామేధ్యం



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

భోజనం తామస ప్రియం || (10)

**తా ||** వండిన తర్వాత జాముదాటి పోయినది; రసహీనమైనది(సారం లేనిది), కంపు కొట్టేది, పాచి పోయినది, ఎంగిలిది, భగవంతునికి నివేదించనిది, అయిన భోజనం ఏది గలదో అది తామసికులకు ఇష్టం.

**వ్యాఖ్య :-** (i) యామం అంటే జాము అని. వండిన తరువాత జాము గడిస్తే అది యాతయామం అని. ఈ కాలంలో వండిన తర్వాత ఆ వేడి తగ్గకుండా 2,3 జాముల కాలం ఉంచే Hot paches వస్తున్నాయి. కనుక చల్లారినది అని గాక 'సగం ఉడికింది' అని శంకరులు వ్యాఖ్యానించారు.

(ii) గతరసం :- సారం పోయినది - అంటే పోషక పదార్థాలు నశించినది అని అర్థం. ఉత్తరదేశంలో ముందు రోజు చేసిన రొట్టెలు తింటుంటారు. సారం పోయిన పదార్థాలను తినటం తామసికులకు ఇష్టం.

(iii) పూతి :- కంపు కొట్టేవి. దుర్వాసన వేసే పదార్థాలను, బూజు పట్టిన రొట్టెల లాంటి పదార్థాలను, కల్లు సారాలాంటివి పులియబెడతారు గనుక కంపు కొడుతుంటాయి. అలాంటి వాటిని తామసులు ఇష్ట పడతారు. సారాలాంటి మత్తు పదార్థాలను సేవించే వారంతా తామసికులే. వారు ఎంతో ఇష్టంతో వాటిని సేవిస్తారు. పులిసినవి మత్తెక్కిస్తాయి గనుక తామసికులకు ఎంతో ఇష్టం.

(iv) పర్యుషితం :- పాచి పోయినవి. చద్ది అన్నం ఒక్కొక్కసారి నీరు వచ్చి, వాసన వస్తుంది. దానిని ఇష్ట పడతారు తామసులు. ఇది రోగాలకు దారితీస్తుంది .



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(v) ఉచ్ఛిష్టం :- ఎంగిలి తిండి, ఒకరి తిండి ఒకరు తింటే ప్రేమకు చిహ్నం అనుకుంటారు. అది కూడా అనారోగ్యాన్ని కలిగించేదే. అయినప్పటికీ భర్త ఉచ్ఛిష్టం భార్యకు, బ్రహ్మనిష్ఠులైన గురువుల ఉచ్ఛిష్టం శిష్యులకు దోషం కాదని శాస్త్ర వచనం, పెద్దల మాట.

(vi) అమేధ్యం:- భగవన్నివేదితం కానిది. యజ్ఞమునకు యోగ్యం కానిది. మద్యం, మాంసం, చేపలు మొ||నవి నిషిద్ధాలు. ప్రకృతి వైద్యులు కూడా వీటిని నిషేధించారు. ఒక కూలి పని చేసే కుర్రవాడు మద్య మాంసాలు ముట్టడు. అతడి ముఖంలో సాత్త్విక కళ ఉంటుంది. అతడే సైన్యంలో చేరి అన్నీ అలవాటు చేసుకుంటాడు. వాడి ముఖంలో కళ మారిపోతుంది. ఇవి తామసికులకు ఇష్టం. శాస్త్రం నిషేదించిన పదార్థాలు ఇవి.

ఇక్కడ గ్రహించవలసిన ముఖ్య విషయం ఒకటి ఉన్నది. సాత్త్వికాహారం తినేవారంతా సాత్త్వికులు కాదు. సాత్త్వికాహారం ఎవరికి ఇష్టమో వారు సాత్త్వికులు. రాజసాహారం తినేవారంతా రాజసికులు కాదు. రాజసాహారం ఎవరికి ఇష్టమౌతుందో వారు రాజసికులు. అలాగే తామసాహారం తినేవారంతా తామసికులు కాదు. ఈ తామసాహారం ఎవరికి ఇష్టమో వారే తామసులు. అందుకే సాత్త్విక ప్రియా, రాజస ప్రియా, తామస ప్రియా అన్నారు. సాత్త్వికాన్ని గ్రహించాలి. రాజసిక, తామసికాహారాలు విడిచిపెట్టాలి . అందుకే ఆహార చర్చ.

- ఇక యజ్ఞం గురించి - ముందుగా సాత్త్విక యజ్ఞం అంటే ఏమిటో -

**శ్లో॥** అఫలా కాంక్షి భిర్యజ్ఞః

విధి దృష్టో య ఇజ్యతే ।

యష్ట వ్య మే వేతి మనః

స మాధాయ స సాత్త్వికః ॥ (11)

**తా ॥** ఫలాకాంక్ష లేకుండా, శాస్త్ర విధిని అనుసరించి, తప్పక చేయవలసినది అనే భావంతో, ధర్మమునందు స్థిరచిత్తం కలిగియుండి చేయబడే యజ్ఞం సాత్త్వికయజ్ఞం అవుతుంది.

**వ్యాఖ్య :-** మానవుడు పుట్టుకతోనే దైవానికి ఋణపడియున్నాడు. పెరిగేటప్పుడు సమాజానికి ఋణపడతాడు. అలాగే శరీరానికి కూడా ఋణ పడి యుంటాడు. ఈ 3 ఋణాల నుండి విడుదల పొందాలి. ఈ 3 ఋణాలు తీర్చుకుంటేనే జన్మరాహిత్యం. ఏ ఋణం మిగిలిఉన్నా మళ్ళీ మళ్ళీ తిరిగి రావాల్సిందే. ఈ 3 ఋణాలు తీరేది ఎలా? దైవఋణం తీర్చుకోవాలంటే యజ్ఞం చేయాలి. సమాజఋణం తీర్చుకోవాలంటే దానం చెయ్యాలి. శరీర ఋణం తీర్చుకోవాలంటే తపస్సు చెయ్యాలి. ఈ యజ్ఞ దాన తపస్సులతోనే ఈ 3 ఋణాల నుండి విముక్తులం కావాలి. అందుకే భగవానుడు ముందుగా యజ్ఞాన్ని గురించి తెలియజేస్తున్నాడు.

గుణ భేదాన్ని బట్టి యజ్ఞం 3 విధాలు. అవే సాత్త్విక యజ్ఞం, రాజసిక యజ్ఞం, తామసిక యజ్ఞం.

సాత్త్విక యజ్ఞం అని దేనినంటారు?

(i) ఫలాపేక్ష లేకుండా చేసినప్పుడు,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(ii) శాస్త్ర విధిని పాటించినప్పుడు,

(iii) ఇది తప్పక చేయదగినది అనే కర్తవ్యతా భావం ఉన్నప్పుడు,

(iv) ధర్మము నందు స్థిర చిత్తం ఉన్నప్పుడు. అంటే -

కర్త యొక్క నిస్వార్థం, కర్మ యొక్క విహితత్త్వం, హృదయంలో కర్తవ్యతా భావం, మనస్సులో స్థిరత్వం - ఈ నాలుగూ ఉండాలి.

యజ్ఞం అంటే పశుహింసతో చేసేది కాదు. యుగ ధర్మాన్ని బట్టి యజ్ఞం యొక్క స్వభావం మారిపోతుంది. కృత త్రేతా ద్వాపర యుగాలలో యజ్ఞంలో పశుహింస ఉండేది. కాని ఈ కలియుగంలో యజ్ఞం అనే పదానికి అర్థం పూర్తిగా మారిపోయింది. దైవసంబంధమైన కార్యాలు, భగవధ్యానం, పరోపకారం, సమాజసేవ, భూతతృప్తి అన్నీ యజ్ఞాలే. అలాగే దైవ ఋణం, ఋషి ఋణం, పితృ ఋణం, మనుష్య ఋణం, భూత ఋణం తీర్చుకొనేందుకు దైవయజ్ఞం, ఋషియజ్ఞం, పితృయజ్ఞం, నృయజ్ఞం, భూతయజ్ఞం అని పంచయజ్ఞాలు చెప్పబడ్డాయి. ఇంకా భగవద్గీతలోని 4 వ అధ్యాయంలో ఇంద్రియ నిగ్రహం, వైరాగ్యం, మనో నిగ్రహం, స్వాధ్యాయం, ప్రాణాయామం, ఆహార నియమం, జ్ఞాన యజ్ఞం మొదలైన అనేక యజ్ఞాలు చెప్పబడ్డాయి. వీటిలో చాలా వాటిలో అగ్ని మధనంతో కూడా పని లేదు. పశుహింస దేనిలోనూ లేదు. అయితే ఈ యజ్ఞాలు చేసేటప్పుడు కర్త యొక్క భావాన్ని, మనోస్థితిని బట్టి అవి సాత్త్వికమో, రాజసికమో, తామసికమో అవుతాయి. ఈ శ్లోకంలో సాత్త్విక యజ్ఞం అనేది ఏదో తెలియజేస్తున్నారు. ఎలా చేస్తే సాత్త్విక యజ్ఞమౌతుందో తెలియజేస్తున్నారు. అందుకు 4 లక్షణాలను చెబుతున్నారు.

(i) ఫలాపేక్ష లేకుండా :- ఈ చేసే యజ్ఞం వల్ల ఏదో ఫలితం, ప్రయోజనం కలగాలి - అనే ఉద్దేశం లేకుండా చెయ్యాలి. నిజంగా మనం భగవంతునికి ఋణపడి ఉన్నాం. ఎందుకంటే ఆయన మన దగ్గర ఏమీ వసూలు చేయకుండా, ఏమీ ఆశించకుండా మనకు ఆహారాన్ని, నీటిని, గాలిని, వెలుతురును, భూమిని, ఆకాశాన్ని, తరించేందుకు వేదాలను, శాస్త్రాలను - అన్నింటిని ఇచ్చాడు. కనుక ఋణపడి ఉన్నాం. ఆ ఋణం తీర్చుకోనేందుకే నేను యజ్ఞం చేస్తున్నాను అనే భావన ఉండాలి. అలాగాక మనం భగవంతుణ్ణి ఏవేవో కోరుకుంటే మనం మళ్ళీ ఋణపడిపోతాం.

మీ అబ్బాయిని బాగా చదివించి ఉద్యోగం వేయించటానికి అప్పు తీసుకున్నావు. ఉద్యోగం వచ్చింది. నెలనెలా కొంత అప్పు తీరుస్తుంటే కొంత కాలానికి అప్పు తీరిపోతుంది. అలాగాక మధ్య మధ్యలో అమ్మాయి పెళ్ళికని, భార్యకు జబ్బు చేసిందని, అప్పు చేస్తూ ఉంటే ఇక ఆ అప్పు తీరేది ఎప్పుడు? అలాగే యజ్ఞం ద్వారా భగవంతుని ఋణం తీర్చుకోవాలేగాని, కోరికలు కోరి మళ్ళీమళ్ళీ ఋణగ్రస్తులం కారాదు. కనుక ఫలాపేక్ష లేకుండా యజ్ఞం చెయ్యాలి.

(ii) శాస్త్ర విధిని పాటించాలి :- శాస్త్రం చెప్పిన విధంగా యజ్ఞం చేయాలి. శాస్త్రాన్ని అనుసరిస్తే సులభంగాను ఉంటుంది, సుఖంగాను ఉంటుంది. శాస్త్రం మన యొక్క క్షేమాన్ని కోరి చెబుతుంది. శాస్త్రం అంటే మహాత్ములు అనుసరించినది, నిర్ణయించినది మాత్రమే. కనుక ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు చేస్తే అది అస్తవ్యస్తమవుతుంది.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(iii) <u>ఇది నా కర్తవ్యం అనే భావనతో చేయాలి</u> :- ఏదో తప్పక చేయవలసి వచ్చింది అని తిట్టుకుంటూనో, అందరిపై విసుక్కుంటూనో, ఖర్చును గురించి ఆలోచించుకుంటూనో, యజ్ఞాన్ని చేయించే వారికిచ్చే దక్షిణను ఎలా తప్పించుకోవాలనో, తగ్గించాలనో చేస్తే ఆ యజ్ఞం వల్ల మనశ్శాంతి కరువవుతుంది. అలాగాకుండా ఇది నా ధర్మం, నా కర్తవ్యం, భగవంతుడు నాకు ప్రసాదించిన అవకాశం అనుకుంటూ ప్రీతితో, ఇష్టంతో చెయ్యాలి. అరణ్యవాస కాలంలో ధర్మరాజును ద్రౌపది నిష్ఠూరమాడుతూ "ఇన్ని ధర్మాలు, సత్కార్యాలు కష్టాలు పడటానికేనా చేస్తున్నది?" అంటుంది. దానికి ధర్మరాజు "ఓ రాజపుత్రీ ! ఏదో ఫలితం కోసం నేనీ ధర్మం చేయటం లేదు. ధర్మం చేయటం నా స్వభావం, నా కర్తవ్యం, నా విధి" అన్నాడు. ఇదే కర్తవ్యతా భావం. దీనివల్ల అహంకారం, అభిమానం తొలగిపోతాయి.

(iv) <u>మనస్సమాధానం</u> :- మనస్సు నిర్వికారంగా, నిర్మలంగా, స్థిరంగా, శాంతంగా ఉండాలి. అప్పుడే అది సాత్త్వికయజ్ఞమవుతుంది.

- ఇక రాజసిక యజ్ఞం అంటే ఏమిటో -

శ్లో|| అభిసంధాయ తు ఫలం
దంభార్థ మపి చైవ యత్ |
ఇజ్యతే భరత శ్రేష్ఠ !
తం యజ్ఞం విద్ధి రాజసం || (12)

**తా** || భరత శ్రేష్ఠుడా! ఫలితాన్ని ఆశిస్తూనో, డంబంకోసమో చేయబడేది ఏదైతే ఉన్నదో ఆ యజ్ఞం రాజసికయజ్ఞం అవుతుంది.

**వ్యాఖ్య :-** రాజసికయజ్ఞం అంటే ఫలితాన్ని ఆశించిచేసేది, డంబాచారం కోసం(ఇతరుల ముందు గొప్ప కోసం) చేసేది.

ఫలాపేక్ష లేకుండా చేసేది సాత్త్వికయజ్ఞం. ఫలాపేక్షతో చేసేది రాజసిక యజ్ఞం. ఇది నా కర్తవ్యం అని చేసేది సాత్త్వికయజ్ఞం. డంబం కోసం చేసేది రాజసికయజ్ఞం. ఈ రెండూ భేదాలు. ఇక శాస్త్రవిధిని వారూ పాటిస్తారు, వీరూ పాటిస్తారు. అక్కడ మనస్సు స్థిమితంగా ఉంటుంది. ఇక్కడ స్థిరంగా ఉండదు.

(i) <u>అభిసంధాయతు ఫలం</u> :- ఫలితాన్ని కోరుకున్నంతసేపు మనస్సు అశాంతితో, ఆందోళనతో ఉంటుంది. ఏమవుతుందోననే ఆరాటం, ఆందోళన. డాక్టరు దగ్గర కెళ్ళిన రోగికి ఏం చెబుతారో, ఏమవుతుందో అనే ఆందోళన ఉంటుంది. అదే ఇతరుల విషయంలోనైతే మనకు ఏ ఆరాటం, ఆందోళనా ఉండదు. ప్రశాంతంగానే ఉంటాం. కనుక ఫలాసక్తి మనస్సును ఆందోళన పరుస్తుంది.

(ii) <u>దంభార్థ మపి చైవయత్</u> :- పదిమందిలో గొప్ప కోసం, పేరు ప్రఖ్యాతుల కోసం, డంబం కోసం, తమ సంపదలను ప్రదర్శించటం కోసం చేసే యజ్ఞాలన్నీ రాజసికమైనవే. దీనివల్ల అహంకారం పెరుగుతుంది. గొప్ప గొప్ప సాధువులు, సన్యాసులు కూడా ఈ డంబాచారానికి లొంగిపోతూనే ఉంటారు. కొందరు తమలోని దోషాలను కప్పి పుచ్చుకోవటానికి, నీచ కార్యాలను కప్పి పుచ్చుకోవటానికి కూడా యజ్ఞాలు చేస్తుంటారు.

నటన ఎక్కువ, చిత్తశుద్ధి తక్కువ.

అంతరంగంలో శాంతి ఉండదు. సంతృప్తి ఉండదు.

**అయితే వీరు శాస్త్ర విధిని పాటిస్తారు, అదొక గొప్పగా భావిస్తారు.**

**- ఇక తామసిక యజ్ఞం అంటే ఏమిటో -**

**శ్లో|| విధిహీన మసృష్టాన్నం**
**మంత్రం హీన మదక్షిణం |**
**శ్రద్ధా విరహితం యజ్ఞం**
**తామసం పరి చక్షతే || (13)**

**తా || శాస్త్రవిధిని పాటించకుండా, అన్నదానం చేయకుండా, మంత్రాలు చదవకుండా, దక్షిణలు సమర్పించకుండా, శ్రద్ధ లేకుండా చేయబడే యజ్ఞం తామసయజ్ఞంగా పరిగణించబడుతుంది.**

**వ్యాఖ్య :- ఇక్కడ ఐదు దోషాలను చెప్పారు.**

**(i) విధిహీనం :- శాస్త్రవిధిని పాటించకుండా చిత్తం వచ్చినట్లు చేసేది తామసిక యజ్ఞం. నియమాలను, విధివిధానాలను పాటించకపోతే శ్రేయస్సు కలగదు. అలాంటి యజ్ఞం చేసినా చేయనట్లే. ఫలితం లేకపోగా ఒక్కొక్కప్పుడు మానవత్వం నుండి పతనం జరగవచ్చు.**

**శ్రుతులు చెప్పినట్లు నడిచేవారు నరులు.**

**మతులు చెప్పినట్లు నడిచేవారు వానరులు.**

**ఇలా చేస్తే శక్తి, సమయం రెండూ వృధాయే. స్వేచ్ఛగా చేసే యజ్ఞం దక్ష యజ్ఞం అవుతుంది. దానివల్ల ఘోరాలు జరగవచ్చు.**

(ii) అస్పృష్టాన్నం :- యజ్ఞానికి కూడా రెండు దేహాలున్నాయి. అవి 1. స్థూల దేహం. 2. సూక్ష్మదేహం. అన్నదానం స్థూలదేహం, దక్షిణదానం సూక్ష్మదేహం.

అన్నదానం అన్ని దానాలలోను శ్రేష్ఠమైనది. అందరిలో భగవంతుని చూడటం లేదా అందరిని తనలాగా చూడటం అనే సాధన ఇందులో ఇమిడి ఉన్నది.

అన్ని పుణ్యకార్యాలలోను, ప్రత్యేక సందర్భాలలోను అన్నదానం ప్రధానంగా ఉంటుంది. "అన్నం బహు కుర్వీత్, తద్ వ్రతం" - అన్న వృద్ధి బాగా చేయాలి. ఇది వ్రతం - అని ఉపనిషత్తులు పేర్కొన్నాయి. అట్టి అన్నదానం లేని యజ్ఞం తామసిక యజ్ఞమవుతుంది.

(iii) మంత్రహీనం:- 'మంత్రా ధీనంతు దైవతః' - దేవతలు మంత్రానికి అధీనులై ఉంటారు. ఎక్కడ ఏ లోకంలో ఉన్నా మంత్రోచ్చాటనతో ఆ దేవతలు మన ముందుకు రావాలి. జనమేజయుని సర్పయాగంలో తక్షకుడు ఇంద్రుని సింహాసనాన్ని చుట్టుకున్నాడు. మంత్రోచ్చాటనతో ఇంద్రుని సింహాసనం కూడా కదిలింది. మంత్రం లేని యజ్ఞం ప్రాణం లేని జీవితో సమానం.

(iv) అదక్షిణం :- దక్షిణలు లేని యజ్ఞం త్యాగం లేని యజ్ఞం అవుతుంది. త్యాగం లేని యజ్ఞం తామసయజ్ఞమే. దక్షిణలు ఇవ్వలేదంటే కర్తకు లోభగుణం ఉన్నట్టు. లోభం అన్ని పాపాలకు మూలం.

కొట్టకపోతే వాదులేదు. పెట్టకపోతే ముక్తిలేదు అని సామెత. ఇతరులకు పెట్టిందే నీది. నీవు అట్టి పెట్టుకున్నది ఎప్పటికైనా పరుల పాలే. ఇతరులకు పెట్టావంటే దానిమీద నీకు హక్కు - అధికారం ఉన్నదని అర్థం. అది నీది. దాని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఫలితం నీకే వస్తుంది. కాని నీవు అట్టి పెట్టుకున్నది నీవు తింటావో లేదో తెలియదు. దానివల్ల ఏ ఫలితమూ రాదు. ఉన్నది అని చెప్పుకోవటం తప్ప ఇంక ఏ ప్రయోజనము లేదు. అసలు 'యజ్ఞం' అంటే త్యాగం అనియే అర్థం. దక్షిణ లేకపోతే త్యాగం లేనట్టే.

(V) శ్రద్ధా విరహితం :- శ్రద్ధతో చేస్తేనే సత్ఫలితం. కపట శ్రద్ధ వల్ల, స్వార్థ పూరిత శ్రద్ధ వల్ల అంతా అస్తవ్యస్తమే - నష్టమే.

పై లక్షణాలతో చేసేది తామసిక యజ్ఞం. చేయకూడనిది. ఇంతవరకు ఆహారాన్ని, యజ్ఞాన్ని గూర్చి చెప్పారు. ఇక తపస్సు గురించి –

## తపస్సు :

**ఉపోద్ఘాతం** :- యజ్ఞం, దానం, తపస్సు. ఈ మూడింటిని అందరూ తప్పక చేయవలసిందే. ఇవి పరమ పావనమైనవి. ఇంతవరకు ఆహార నియమం గురించి, యజ్ఞం గురించి తెలియజేసిన భగవానుడు ఇప్పుడు తపస్సుల గురించి తెలియజేస్తున్నాడు. అసలు తపస్సు అంటే ఏమిటో చెప్పి, ఆ తరువాత 3 రకాల తపస్సుల గురించి వివరించటం జరిగింది. సాత్త్విక, రాజసిక, తామసిక తపస్సులను వివరించే ముందే అసలు తపస్సు అంటే ఏమిటో ప్రత్యేకంగా తెలియజేయటం వల్ల తపస్సు యొక్క ప్రాధాన్యత ఏమిటో తెలుస్తున్నది. ఈ తపస్సు అనేది ముక్తికి ఒక గట్టి సోపానం.

'ముక్తి' అంటే జీవ బ్రహ్మైక్య సిద్ధియే. జీవుడు బ్రహ్మము ఒక్కటైపోవటమే. జీవుడు బ్రహ్మముతో కలసి ఒక్కటై పోవాలంటే ముందుగా జీవుడు తనలోని జీవ భావమనే మాలిన్యాన్ని తొలగించుకోవాలి.

ఒక గ్లాసులో స్వచ్ఛమైన నీరుంది. మరొక దానిలో మురికి నీరు ఉన్నది. రెండూ కలిపితే మురికి నీరే అవుతుంది. అలాగాక మురికి నీటిలోని మురికిని తొలగించి ఆ స్వచ్ఛమైన నీటిని స్వచ్ఛమైన నీటితో కలిపితే ఇప్పుడు ఏమవుతుంది? మొత్తం స్వచ్ఛమైన నీరే అవుతుంది. ఇక్కడ మురికి నీరే జీవుడు. స్వచ్ఛమైన నీరే బ్రహ్మము. మురికి నీటిలోని మురికిని తొలగించే చిల్లగింజయే తపస్సు. తపస్సు ద్వారా జీవునిలోని జీవ భావమనే మాలిన్యాన్ని తొలగించినప్పుడు ఈ జీవుడు బ్రహ్మమే అవుతాడు. అదే జీవబ్రహ్మల ఐక్యత. కనుక తపస్సు ఎంతో ముఖ్యమైనది.

ఆచరణకు అసాధ్యమైన మాటలు ఎంత మంచివైనా, ఎంత ఆకర్షణీయమైనవైనా, ఎంత వినసొంపుగా ఉన్నా, ఎంత గొప్పవారు చెప్పినా వింటామే గాని ఆచరించలేము. అందుకే తపస్సు అనగానే ఇది ఏదో -

(i) ఇళ్ళు వాకిళ్ళు విడిచిపెట్టి,

(ii) భార్యా బిడ్డలను, బంధు మిత్రులను విడిచిపెట్టి,

(iii) సమస్త సంపదలను, భోగాలను విడిచిపెట్టి,

(iv) ఏ అరణ్యాలకో, గుహలకో, స్మశానాలకో వెళ్ళి,

(v) ఎండలో ఎండి, వానలో తడిసి, చలిలో వణుకుతూ,

(vi) తిండి, తిప్పలు లేకుండా, దొరికిన కాయ గసురులు తింటూ,



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

(vii) గడ్డాలు, మీసాలు, జుట్టు, గోళ్ళు పెంచుకుంటూ,

(viii) కట్టు కొనేందుకు బట్టలు లేక గోచిగుడ్డ ధరించి,

(ix) శరీరాన్ని విపరీతంగా కష్ట పెడుతూ,

(x) మంచుపైన, ముళ్ళపైన కూర్చుని,

(xi) ఒంటరిగా, ఏకాకిలా, ఏ దిక్కూ లేనివాడిలా ముక్కు మూసుకొని, భగవంతుని తలచుకుంటూ ఉండటమే 'తపస్సు' అని చాలామంది భ్రమ పడుతుంటారు, భావిస్తుంటారు. అటువంటి భ్రమను - భ్రాంతిని పోగొట్టి ఇది అందరూ చేయదగినది, చేయగలిగినది, సులభమైనది, స్త్రీలు - పురుషులు - వృద్ధులు - వారు వీరు అనే భేదం లేకుండా సర్వులకు ఆచరణ సాధ్యమైనదే 'తపస్సు' - అని చెప్పి అందరిని మోక్షమార్గం వైపుకు మళ్ళించటానికే భగవానుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నాడు. తప్పక ఆచరించమని ఆచరణ యోగ్యమైన విధానాన్ని తెలుపుతున్నాడు.

ఈ 8 శ్లోకాలలో చెప్పిన దానిని ఆచరించకపోతే 100 జన్మలు భగవద్గీతను విన్నా, 108 ఉపనిషత్తులను పూర్తిగా అర్థం చేసుకున్నా ముక్తి లేదు. ఈ 3 విధాలైన తపస్సులను ఆచరిస్తే నీవు ఏ విధమైన వాసనలతో ఉన్నా, ఎన్ని పాపాలు చుట్టుకొని ఉన్నా అన్నింటిని తుడిచిపెట్టేది ఈ తపస్సు. ఎందుకంటే 'తపసా కల్బిషం హంతి' - 'సర్వం ఏతత్ తపో మూలం(శాంతి పర్వం) - అంటే

- ✓ తపస్సు చేసిన వానికి పాపాలు నశించిపోతాయి.
- ✓ సమస్తమునకు తపస్సు మూలం (శాంతి పర్వం) - అని

బ్రహ్మదేవుడు సృష్టి చేయటానికి ముందు దీర్ఘకాలం తపస్సు చేశాడు. అప్పుడే సృష్టి చేసే శక్తి కలిగింది. వ్యాసుడు తపస్సు చేసిన తరువాతనే 18 పురాణాలు వ్రాశాడు. మనలో కూడా సృజనాత్మక శక్తి కలగాలంటే తపస్సు చేయాలి. క్షీణించిన శక్తిని పుంజుకొనుటకే తపస్సు. 'తప' తిరగవేస్తే 'పత' అవుతుంది. అంటే తపస్సు చేయని వాని గతి పతనమే - అని.

తపస్సు శారీరక, వాచిక, మానసిక అని 3 విధాలు. అంటే తపస్సు ద్వారా మనో వాక్కాయములనే త్రికరణములు శుద్ధి కావాలి. తద్వారా మనస్సులోని మలినాలు, వాక్కులోని మలినాలు శరీరంలోని మలినాలు - మొత్తం తొలగిపోయి మనో వాక్కాయములు శుద్ధమౌతాయి. ఆ విధంగా ఆత్మ సాక్షాత్కారానికి మనలను సిద్ధం చేసేది తపస్సు. ఇట్టి అమోఘ తపస్సును మనం కూడా చేయాలి అని నిర్ణయించుకున్నారా? ఇక అదేమిటో తెలుసుకోండి.

- ముందుగా శారీరక తపస్సు గురించి

శ్లో|| దేవ ద్విజ గురు ప్రాజ్ఞ
పూజనం శౌచ మార్జవం |
బ్రహ్మ చర్య మహింసాచ
శారీరం తప ఉచ్యతే || (14)

**తా ||** దేవతలను, ద్విజులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించటం, శుచిత్వం, నిజాయితీ, బ్రహ్మచర్యం, అహింస - వీటిని ఆచరిస్తే అదే శారీరక తపస్సు అవుతుంది.

**వ్యాఖ్య** :- ఇందులో మొత్తం 5 సాధనలను చెప్పారు.

1. దేవతలను, ద్విజులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించుట.
2. శౌచం.
3. నిజాయితీగా ఉండటం.
4. బ్రహ్మచర్యం.
5. అహింస.

ఈ 5 రకాల సాధనలకు వాక్కుతోను, మనస్సుతోను సంబంధం ఉన్నా ఇవి ప్రధానంగా శరీరంతో చేసేవి గనుక శారీరక తపస్సు అన్నారు.

1. (A) దేవపూజనం :- దేవతలను - ఇష్ట దైవాన్ని పూజించటం వల్ల ఆయా దేవతల అనుగ్రహం సిద్ధిస్తుంది. మనలో దైవం పట్ల భక్తి భావం కలుగుతుంది. కష్టాలను ఎదుర్కొనే ధైర్యం వస్తుంది. దైవ ఋణం తీర్చుకున్న వారిమౌతాం.

దేవతాపూజల వల్ల నేను నిమిత్తమాత్రుణ్ణి, భగవంతుని చేతిలో పనిముట్టును. నేను పాత్రధారిని ఆయన సూత్రధారి, ఆయనే నా చేత ఇలా చేయిస్తున్నాడు అనే భావం స్థిర పడుతుంది. దానితో వినయం - నమ్రత కలుగుతాయి.

బ్రహ్మాండంలోని దేవతలంతా పిండాండంలో ఉన్నారు. ఇది ఉపనిషత్తులు తెలియజేసే సత్యం. బ్రహ్మాండంలోని దేవతలను పూజిస్తే

పిండాండంలోని దేవతలకు (ఇంద్రియాలకు) పుష్టి లభిస్తుంది. కనుక ఈ దేవ పూజనం మనలో శక్తి వృద్ధి చెందటానికి తోడ్పడుతుంది. ప్రపంచంలో మనం పనులు చేసేటప్పుడు ఇంటా - బయటా మన శక్తి వృథా అవుతుంది. అలా వృథా అయ్యే శక్తిని ఈ దేవ పూజనం ద్వారా పూరించుకోవటం జరుగుతుంది.

(B) ద్విజ పూజనం :- ద్విజుడు అంటే రెండవసారి పుట్టినవాడని అర్థం. తల్లి గర్భాన్ని ఛేదించుకొని, ఆ గర్భంలోని అంధకారాన్ని, మలినాలను ఛేదించుకొని బాహ్య ప్రపంచంలోకి వచ్చి పడేది మొదటి జన్మ. జ్ఞాన సంపాదనతో, సాధనలతో, సంస్కారాలతో అజ్ఞానమనే అంధకారాన్ని ఛేదించుకొని పాత భావాలను వదిలిపెట్టి బ్రహ్మ జ్ఞాన ప్రాప్తితో కూడినది రెండవ జన్మ. ఇట్టి వానిని ద్విజుడు అంటారు. వీరు బ్రహ్మ తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటారు. వీరి వల్ల సమాజానికి, మానవ జాతికి శాంతి లభిస్తుంది. మేలు కలుగుతుంది. సాధారణంగా ద్విజుడు అంటే బ్రాహ్మణుడు అని అంటారు. కేవలం బ్రాహ్మణ కులంలో పుడితే చాలదు. "బ్రహ్మ జ్ఞానేన బ్రాహ్మణః" - బ్రహ్మ జ్ఞానం గలవాడే బ్రాహ్మణుడు - అనేది శాస్త్ర నిర్ణయం. అట్టి బ్రహ్మ జ్ఞాన సంపన్నులైన ద్విజులను శ్రద్ధతో పూజించటం శారీరక తపస్సు అవుతుంది.

(C) గురు పూజనం :- ఆధ్యాత్మిక రంగంలో ఉన్న వారికి అత్యంత ముఖ్యమైనది ఈ గురుపూజ. శ్రోత్రియుడు, బ్రహ్మనిష్టుడు అయిన గురువు లభించి, ఆయన ద్వారా జన్మసార్థక్య హేతువైన ఆత్మజ్ఞానాన్ని పొందుతున్న శిష్యులు తప్పని సరిగా ఆచరించవలసినది ఈ గురుపూజ. గురువు అలారం టైంపీసు



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

లాంటివాడు. నిద్రపోయే వాణ్ణి నిద్ర లేపేది అలారం టైంపీసు. అజ్ఞానమనే నిద్రలో ఉన్న జీవుణ్ణి నిద్ర లేపేవాడు గురువు. అటువంటి గురువును సేవించి, పూజించి, ప్రార్థించి, ప్రసన్నం గావించుకొని తనలోని అజ్ఞానాన్ని పోగొట్టుకోవాలి. అజ్ఞానమనే రాక్షసి జ్ఞానం వైపుకు వెళ్ళనీయకుండా అడ్డు తగులుతుంది. అంధకారంలోనే కట్టి పడవేస్తుంది. ఈ ప్రమాదం నుండి తప్పించుకొనుటకే మానవుడు ఒక మహాశక్తిని ఆశ్రయించాలి. ఆ మహాశక్తి ఎవరో కాదు. అతడే సద్గురువు. అట్టి సద్గురువును పూజించి, ఆయన అనుగ్రహాన్ని పొంది, జ్ఞానాన్ని గ్రహించి, సమస్త కర్మబంధనాల నుండి విడుదల పొందాలి. ఇది సనాతన సాంప్రదాయం.

(D) ప్రాజ్ఞ పూజనం :- ప్రజ్ఞ అంటే తెలివి - జ్ఞానం - మేధాశక్తి, విద్య లేకపోయినా అనుభవం ఉంటే ప్రాజ్ఞులే. విదురుడు, ఉద్ధవుడు, ధర్మవ్యాధుడు మొ||న వారంతా ప్రాజ్ఞులే. అట్టి వారిని పూజిస్తే తానూ ప్రాజ్ఞుడవుతాడు. ఈ పూజల వల్ల అహంకారం తొలగిపోతుంది.

(2) శౌచం :- శరీరం, పరిసరాలు శుచిగా ఉంటేనే దైవమార్గం బోధపడుతుంది. ఈ శౌచం కూడా శారీరకతపస్సు. జపధ్యానాలు కుదరాలన్నా ఈ శుచిత్వం అనేది చాలా అవసరం.

(3) ఆర్జవం :- ఋజుత్వం. నిజాయితీ. కపటం లేకుండా ఉండటం. చేయవలసిన దానిని చేయటం, చేయకూడని దానిని చేయకుండటం, చేసిన తప్పులను నిజాయితీగా ఒప్పుకోవటం, ఇతరులను మోసగించకుండా ఉండటం - ఇవన్నీ ఆర్జవం అవుతుంది. ఇది కూడా శారీరక తపస్సే.

(4) బ్రహ్మచర్యం :- ఇది కూడా శారీరక తపస్సే. వీర్య సంగ్రహమే బ్రహ్మచర్యం. బ్రహ్మచర్యం వల్ల శరీరంలో శక్తి వృద్ధి అవుతుంది. తేజస్సు కలుగుతుంది. మానసిక వికారాలను జయించిననే గాని ఇది సిద్ధించదు. అందువల్ల దృఢమైన పట్టుదల ఉండాలి. పూర్ణసిద్ధికి ఇది తొలిమెట్టు. టెంకాయ చెట్టు నీటిని ఊర్ధ్వ ముఖంగా తీసుకుంటుంది. ఆ నీరు అమృత తుల్యంగా మారుతుంది, అలాగే బ్రహ్మచర్యం ద్వారా ఊర్ధ్వరేతస్కుడైన సాధకుడు పూర్ణసిద్ధిని పొంది స్థిత ప్రజ్ఞుడౌతాడు. అన్ని సాధనలకు పునాది లాంటిది బ్రహ్మచర్యం.

(5) అహింస :- ఎవరినీ శారీరకంగా హింసించకుండా ఉండటమే అహింస. ఇదే శారీరక తపస్సు. మానవులకే గాక పశుపక్ష్యాదులకు కూడా హాని తలపెట్టరాదు. ఏ ప్రాణినీ, అది ఎంత అల్పమైనదైనా హింసించరాదు. హింస మహాపాపం.

బ్రహ్మచర్యం, అహింస - ఈ రెండింటిని శారీరకతపస్సు అనటంలోని ఆంతర్యం ఏమిటి? బ్రహ్మచర్యం ద్వారా కామాన్ని, ఆహింస ద్వారా క్రోధాన్ని కలగకుండా చేసుకోవటమే ఇందులోని ఆంతర్యం. కామక్రోధాల వేగాన్ని అరికట్టాలనటమే ఇందులోని విశేషం. దేవ ద్విజ గురు ప్రాజ్ఞుల పూజ, శౌచం, ఆర్జవం, బ్రహ్మచర్యం, అహింస - ఈ ఐదింటితో శరీరంలోని దోషాలను తొలగించుకొని, జీవితాన్ని తీర్చిదిద్దుకోమని ఈ శారీరకతపస్సు ద్వారా సలహా ఇస్తున్నారు.

- ఇక వాచిక తపస్సు గురించి -

**శ్లో||** అనుద్వేగ కరం వాక్యం

సత్యం ప్రియ హితం చయత్ |

స్వాధ్యాయాభ్య సనం చైవ

వాఙ్మయం తప ఉచ్యతే || (15)

**తా||** ఉద్రేకం లేని మాటలు; సత్యమైన, ప్రియం కలిగించే, ఇతరులకు శ్రేయస్సు కలిగించే మాటలు మాట్లాడటం, స్వాధ్యాయాన్ని అభ్యసించటం - ఇవి వాచిక తపస్సు అనబడుతుంది.

**వ్యాఖ్య :-** మనం కొన్ని జాగ్రత్తలు తీసుకోకపోతే నోరు దాని ఇష్టం వచ్చినట్లు వాగేస్తుంది. (i) కొందరు తమకు ఏమీ ఉపయోగం లేకపోయినా సరే రపీమని అబద్ధం ఆడతారు. కొందరు నిజం చెప్పలేక దాచేస్తుంటారు.

(ii) కొందరు చెవి దగ్గర గంట కొట్టినట్లో, గులకరాళ్ళు డబ్బాలో వేసి వాయించినట్లో, రాగి రేకుతో తారు రోడ్డు మీద గీకినట్లో, ఛాటర్ బాక్స్ లాగానో వాగేస్తుంటారు. (iii) కొందరు ఇతరులను - బాధలలో ఉన్న వారిని మరింత బాధించేటట్లు తమ అతి తెలివితేటలను ప్రదర్శిస్తుంటారు. ఒక వ్యక్తి కుమార్తె వివాహం కోసం తప్పని సరై అప్పు చేశాడు. అప్పు తీర్చే అవకాశం లేక ఉన్న ఇల్లు అమ్ముకున్నాడు. అతడితో ఒక దౌర్భాగ్యుడు అంటున్నాడు. "నీకే హాయి. ఇక ఇంటి పన్ను చెల్లించే అవసరం లేదు" - అని. దానికి ఆయన ఎంతో ఖిన్నుడయ్యాడు. వెంటనే ప్రక్కనే ఉన్న ఆయన కుమారుడు అన్నాడు, "అంకుల్! నీకూ ఆ అదృష్టం కలుగుతుందిలే!" అని. ఆ మాటతో నోరు వెళ్ళబెట్టాడు ఆ నోటి దురుసు పొగరుబోతు.

(iv) కొందరు నోరు విప్పితే స్పెషల్ భాష. కర్ణ కఠోరంగా మాట్లాడుతారు. వినలేక తలలు వంచుకోనేటట్లు మాట్లాడుతుంటారు. అదంతా తమ గొప్పతనం అనుకుంటారు. ఇలాంటి మాటలు శబ్ద కాలుష్యాన్ని కలిగిస్తాయి.

(v) కొందరు వారేం మాట్లాడుతున్నారో వారికీ అర్థం కాదు, వినే వారికీ అర్థం కాదు. శక్తి వృథా తప్ప ప్రయోజనం లేదు.

(vi) కొందరు వాక్కును దుర్వినియోగం చేయకూడదని మౌనవ్రతం పడతారు. ఆ వ్రతం పూర్తి కాగానే లోకంలోని అనవసర విషయాలన్నీ వారికే కావాలి. ఆ రెండు రోజులు మాట్లాడనివన్నీ ఇప్పుడు పూర్తి చేయాలి.

(vii) కొందరు ఏం మాట్లాడినా తమ గొప్పతనాన్ని పది మందికీ ప్రదర్శించాలనే తహ తహ తప్ప ఇంకేమీ ఉండదు. రెండవ వారిని మాట్లాడనివ్వకుండా మాట్లాడేస్తారు.

(viii) కొందరు దాన ధర్మాలు చేస్తుంటారు. కాని స్నేహితుడు ఏదైనా సత్కార్యం చేయాలనుకుంటే అతడితో అంటాడు - "నేను చెయ్యను, నీవు చేయవద్దు" - అని.

(ix) మరికొందరు ధర్మాత్ములుంటారు. ఎవరైనా ఏదైనా వాగ్దానం చేస్తుంటే ఎలాగైనా చెడగొట్టాలని అదంతా నేను చూసుకుంటాను. మీకెందుకు మీరు వెళ్ళండి అని పంపించి సంతృప్తి చెందుతాడు. ఈ పుణ్యం అంతా చిత్రగుప్తుడి చిట్టా కెక్కుతుంది.

(x) మరికొందరుంటారు. తమకు ఎంత ఉన్నా ఎదటివారు బాగుంటే చూడలేరు. కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారు. ఇలాంటి వారంతా తమ వాక్కును వాచిక తపస్సుతో సరి చేయాలి.

వాక్కును ఎలా ఉపయోగించుకోవాలో చెబుతున్నారు.

1. అనుద్వేగకరం వాక్యం :- ఇతరులకు ఉద్వేగం కలిగించేటట్లు, బాధ కలిగించేటట్లు, కోపం - ఉద్రేకం కలిగించేటట్లు మాట్లాడకూడదు. అది పైశాచికత్వం అవుతుంది. ఒక్కో సందర్భంలో ఆందోళనలో ఉండి మంచివారు కూడా అలా మాట్లాడి ఇతరులను బాధ పెడుతుంటారు. తర్వాత వారే పశ్చాత్తాపం చెందుతారు. (1) సీతాదేవి అలాగే లక్ష్మణుని కఠినమైన మాటలతో, అనరాని మాటలన్నది అరణ్యంలో. అశోకవనంలో హనుమంతుని వద్ద పశ్చాత్తాపం చెందింది. (2) నిండుసభలో ద్రౌపదిని అనరాని మాటలన్నాడు కర్ణుడు. వికటాట్టహాసం చేశాడు. ఘోరంగా అవమానించాడు. చివరకు శ్రీకృష్ణుని వద్ద తన పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు కర్ణుడు. (3) శ్రీకృష్ణుని దర్శనార్థం వస్తున్న దూర్వాసాది మహామునులను అవమానించారు యాదవ బాలురు. యదువంశ నాశనానికి కారకులయ్యారు. కనుక మాటే అమృతం. మాటే విషం. కనుక అనుద్వేగకరంగా ఉండాలి మాట.

2. సత్యం :- కొందరు ఊరకే అలవాటుగా అబద్ధాలు ఆడేస్తుంటారు. లోకోపకారం కోసమో, ప్రమాదాన్ని తప్పించుకోవటం కోసమో, ఇతరులను రక్షించటానికో అబద్ధం ఆడితే ఆడవచ్చుగాని స్వార్థం కోసం అసత్యం పలుక కూడదు. రాజ్యాన్ని, సంపదలను పోగొట్టుకొని, చివరకు భార్యా బిడ్డలను

కూడా పోగొట్టుకొని సత్యానికి కట్టుబడ్డాడు హరిశ్చంద్రుడు. సత్యహరిశ్చంద్రుడిగా శాశ్వతకీర్తిని పొందాడు. ఒక్కసారి - అదీ శ్రీకృష్ణుని ప్రోత్సాహంతో అబద్ధమాడిన ధర్మరాజు నరకదర్శనం చేయాల్సి వచ్చింది. ఇక రోజూ అబద్ధాలాడే వారి గతి ఏమిటో ఆలోచించుకోవాలి. సత్యం పలకమన్నారు గదా! అని ఇతరుల గుండెలు పగిలే సత్యం చెప్పరాదు. ప్రాణ, విత్త, మాన భంగమందు బొంకవచ్చునన్నాడు శుక్రాచార్యుడు.

3. ప్రియం :- మనం పలికే పలుకు ఇతరులకు ప్రియంగా, సంతోషంగా ఉండాలి. తృప్తిగా ఉండాలి. అందుకోసం లేనిపోని కల్పనలు, అబద్ధాలు చెప్పరాదు. ఒకరికి ప్రియం కలిగించాలని మరొకరికి అప్రియం కలిగించరాదు. దుర్యోధనాదులకు ప్రీతిని కల్గించటానికి పాండవులను అనేక విధాల దుర్భాషలాడాడు కర్ణుడు. ఈ మాట తానే స్వయంగా శ్రీకృష్ణునితో చెబుతాడు. 'ప్రియార్థం ధార్త రాష్ట్రస్య తేన తప్యేహ్య కర్మణా' - అని. సత్యం పలుకుతున్నాం గదా! అని ఎదుటి వారి గుండెలు పగలగొట్టరాదు. అలాగే ప్రియంగా పలకమన్నారు గదా! అని అబద్ధాలు చెప్పరాదు. మాట మృదువుగా ఉండాలి. ఇతరులకు శ్రేయస్కరంగా ఉండాలి. బాధల్లో ఉన్న వారికి ఓదార్పు కలిగేలా మాట్లాడాలి.

4. హితం :- మనం మాట్లాడే ప్రతి మాట సత్యంగాను, ప్రియంగాను ఉండటమే కాదు, ఎదుటి వారికి శ్రేయస్సు కలిగేలాగా ఉండాలి. ఒక్కొక్కసారి శ్రేయస్సు కలగటానికి కఠినంగా మాట్లాడవలసి రావచ్చు. అయినా తప్పులేదు. విదురుడు గొప్ప ధర్మాత్ముడు, దూరదృష్టి గలవాడు, కౌరవ శ్రేయస్సును కోరుకున్నవాడు.

అందుకే ఎల్లప్పుడూ ధృతరాష్ట్రునికి శ్రేయస్సునే చెబుతూ ఉంటాడు. తన మాట వినకపోయినా సరే అతడు ఎల్లప్పుడూ ధృతరాష్ట్రునికి శ్రేయస్సునే చెబుతుంటాడు. అలాగే భీష్మ, ద్రోణ, కృప, సంజయులు కూడా ధృతరాష్ట్రునికి ఎల్లప్పుడూ శ్రేయస్సునే చెప్పేవారు. అదే కర్ణుడు మాత్రం దుర్యోధనుని ప్రీతి కొరకు అతడి దుర్మార్గాలను సమర్థించేవాడు, దుర్మార్గాల వైపుకు ప్రోత్సహించే వాడు. తల్లి బిడ్డల శ్రేయస్సు కోసం ఒక్కొక్కప్పుడు కఠినంగా మాట్లాడుతుంది. గురువు శిష్యుల శ్రేయస్సు కోసం కఠినంగా మాట్లాడుతాడు. కఠినమైన పరీక్షలకు గురిచేస్తుంటాడు. ఇది వారి భాద్యత.

(5) <u>స్వాధ్యాయ అభ్యసనం</u> :- 'స్వ + అధ్యాయ అభ్యసనం' అంటే స్వరూపాన్ని గురించి - స్వస్వరూపాన్ని గురించి - ఆత్మ స్వరూపాన్ని గురించి అధ్యయనంచేయటం . అంటే ఆత్మ సాక్షాత్కారానికి - మోక్షానికి మార్గం చూపే వేదాంత శాస్త్రాలను చదవటం, ఇతరులకు చెప్పటం, వినటం, తెలుసుకోవటం - ఇదంతా వాచికతపస్సే.

అలాంటి శాస్త్రాలు ఏమి ఉన్నాయి? ప్రధానంగా భగవద్గీత, బ్రహ్మ సూత్రాలు, ఉపనిషత్తులు. ఈ మూడింటిని ప్రస్థానత్రయం అంటారు. వీటిని గ్రహించలేని వారికి ప్రకరణ గ్రంథాలున్నాయి. వీటిని లోతుగా అర్థం చేసుకోవటమే గాక ఇతరులకు బోధించటం కూడా వాచికతపస్సే.

ఆత్మానుభూతి కలగాలంటే ధ్యానం చేస్తే సరిపోతుంది గదా! ఈ శాస్త్రాల అధ్యయనం ఎందుకు? అంటారు కొందరు.

ఒకడికి జబ్బు చేసింది. తిన్నది అరగటం లేదు. జీర్ణకోశంలో ఏదో తేడా వచ్చింది. ఆపరేషన్ చేస్తే సరిపోతుందని డాక్టరు చెప్పాడు. అంటే కత్తితో పొట్టను కోసి లోపల ఉన్న తేడాను సరి చేయటమే గదా! ఈ మాత్రం దానికి MBBSలు, MSలు చెయ్యాలా? మనం రోజూ కూరగాయలు తరగటం లేదా? అని కత్తితో పొట్ట కొస్తే సరిపోతుందా? ఇదీ అంతే. అలాగే ధ్యానించాలంటే విషయం కావాలి. అది శాస్త్రాలను అధ్యయనం చేస్తేనే లభిస్తుంది. శాస్త్రజ్ఞానం లేని ధ్యానం డిగ్రీ లేని డాక్టరు చేసే ఆపరేషన్ లాంటిది. కనుక శాస్త్రాధ్యయనం ముఖ్యమైనది.

ప్రణవమంత్రం, లేదా ఏదో ఒక మంత్రం జపం చేయటం వాచిక తపస్సు అవుతుంది. ఇది వాక్కును శుద్ధి చేస్తుంది. వాక్కు ద్వారా కూడిన మాలిన్యం అంతా తొలగి వాక్శుద్ధి జరుగుతుంది. - ఇక మానసిక తపస్సు గురించి. మానసిక తపస్సు అంటే ఏమిటో - ఎలా చేయాలో 16 వ శ్లోకంలో.

**శ్లో||** మనః ప్రసాద స్సౌమ్యత్వం
మౌన మాత్మ వినిగ్రహః ।
భావ సంశుద్ధి రిత్యేతత్
తపో మానస ముచ్యతే || (16)

**తా||** మనస్సును ప్రసన్నంగా ఉంచటం, క్రూరత్వం లేకుండా శాంతితో ఉండటం, భగవంతుని గూర్చి మననం గావించటం, మనస్సును బాహ్య విషయాల నుండి నిగ్రహించటం, పరిశుద్ధ భావాలు కలిగిఉండటం - ఇది మానసిక తపస్సు అనబడుతుంది.

**వ్యాఖ్య** :- మానవునిలో ఉన్న త్రికరణాలలో మనస్సు ప్రధానమైనది. మనస్సు బాగుంటే మనిషి బాగుంటాడు. మనస్సు చెడిపోతే మనిషి చెడిపోతాడు. మనస్సు చెడకుండా ఉండాలంటే మానసిక తపస్సు దివ్యౌషధం. ఎలా ఉంచాలి మనస్సును? ఇక్కడ 5 లక్షణాలను తెలియజేశారు.

1. <u>మనః ప్రసాదః</u> :- మనస్సు నిర్మలంగా ఉండాలి. మనస్సులో కోరికలు, రాగ ద్వేషాలు లేకుండా ఉంటే నిర్మలంగానే ఉంటుంది. మనస్సులో ఏవేవో కోరికలుంటే అనేక రకాల ఊహాగానాలు బయలుదేరతాయి. అనుకున్నవి అనుకున్నట్టు జరగకపోతే కొందరిపై రాగం, కొందరిపై ద్వేషం. విషయ వాంఛల వల్ల మనస్సు ప్రశాంతంగా ఉండదు. ఆశ నిరాశల వల్ల ఆందోళనలు, ఉద్రేకాలు అధికమై ఆ భావాలన్నీ ముఖంలో కనిపిస్తాయి. అందుకే ఈనాడు ఎవరి ముఖం చూచినా ఆముదం త్రాగిన ముఖంలా, కంద గడ్డలా, కుమ్ములో పెట్టిన వంకాయల్లా మాడిపోతూ ఉంటున్నది. కోరికలు, ఆశలు, రాగద్వేషాలు, ఉద్రేకాలు, అలజడులు లేకుండా దైవ సాన్నిధ్యంలోనో, సత్సంగంలోనో, జప ధ్యానాలలోనో నిలుపగలిగితే తాత్కాలికంగానైనా మనస్సు నిర్మలంగా ఉంటుంది. కనుక మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలంటే

- కోరికల వత్తిడి తగ్గిపోవాలి.
- రాగ ద్వేషాలు సమసిపోవాలి.
- విషయ వస్తువుల పట్ల వైరాగ్యం కలగాలి.
- త్యాగబుద్ధి ఉండాలి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ఇవన్నీ కావాలంటే మనస్సుకొక ఆలంబనం కావాలి. అదే పరమాత్మ. పరమాత్మను ధ్యానిస్తున్నా, ఆత్మజ్ఞానాన్ని తెలుసుకుంటున్నా, భగవంతుని పూజలు చేస్తున్నా, యజ్ఞ యాగాదులు ఆచరిస్తున్నా, భగవత్ కధలను శ్రవణం చేస్తున్నా మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. మనస్సు పరమాత్మ వైపుకు పరుగులెత్తుతుంటే అల్పమైన కోరికలు మనస్సునంటవు. విషయ వస్తువులు విషంలాగా అనిపిస్తాయి. దానితో నిర్మలత్వం. ఇలా చేస్తే అది మానసిక తపస్సు అవుతుంది.

2. సౌమ్యత్వం :- మనస్సు సౌమ్యంగా - అంటే మెత్తగా ఉండాలి. ప్రేమ, దయ, కరుణ, హృదయం ద్రవించిపోవటం - ఇలాంటివి మనస్సులో ఉంటే సౌమ్యత్వం ఉన్నట్లు. తన స్వార్ధం కోసం, సుఖం కోసం, ప్రయోజనం కోసం ఇతరులను బాధించటానికి, హింసించటానికి వెనుకాడని వాని ముఖంలో క్రూరత్వం కనిపిస్తుంది. కేవలం చుట్టూ ఉన్న మనుష్యులపైననే కాదు పశు పక్ష్యాదులపై, సమస్త భూత కోట్లపై దయ ఉండాలి. మనస్సు మృదువుగా ఉంటే ఎటువంటి ఉద్రిక్తతలు, అలజడులు ఉండవు. ఇలా మనస్సును ప్రేమతో నింపుకొని, కరుణ, దయ కలిగి ఉండటమే మానసిక తపస్సు.

3. మౌనం :- మౌనం అంటే మాట్లాడకుండా ఉండటం అనేది మామూలు అర్ధం. వ్యర్థమైన ఆలోచనలు లేకుండా ఉండటమే నిజమైన మౌనం. మరేం చేయాలి? భగవత్ సంబంధమైన ఆలోచనలనే చేయాలి. ఇది గొప్ప శక్తినిచ్చే సాధన. కొందరికి దీనిపై సరైన అవగాహన లేక సినిమాలు చూస్తూనో, కధలు - నవలలు - డిటెక్టివ్ నవలలు చదువుతూనో, గంట గంటకు ఏదన్నా

తింటూనో, ఏవైనా ఆటలు ఆడుకుంటూనో మౌనంగా ఉంటారు. ఏదైనా మాట్లాడవలసి వస్తే సైగలు చేస్తుంటారు. ఇది మాట్లాడకుండా ఉండటమే గాని మౌనం కాదు. వాక్కును కట్టడి చేస్తే అది వాచిక తపస్సు అవుతుందే గాని మానసిక తపస్సు కాదు. మానసిక తపస్సంటే మనస్సు మౌనంగా ఉండాలి. అంటే ఆలోచనలు లేకుండా ఉండాలి. మనన శీలత్వమే మౌనం. ఇదే మానసిక తపస్సు లక్షణం.

4. ఆత్మ వినిగ్రహః :- మనో నిగ్రహం - అంటే మనస్సును అదుపులో ఉంచటం. మనస్సు కోతిలాంటిది. ఎటువైపు కదిలితే అటువైపు ఆలోచనలు చేస్తుంది. ఒకదాని తర్వాత ఒకటిగా ఆలోచనలు సాగిపోతుంటాయి. వర్తమాన విషయాలు, గతకాలపు జ్ఞాపకాలు, భవిష్యత్తుకు సంబంధించిన భయాలు అన్నీ ముప్పిరిగొని మనిషిని అతలాకుతలం చేస్తాయి.

అట్టి మనస్సును స్వాధీనంలో ఉంచుకోవాలి. అలా స్వాధీనంలో ఉంచుకోవాలంటే మనస్సును జప ధ్యానాలతో, ప్రాణాయామంతో ప్రశాంతంగా ఉంచుకోవాలి. ఇలా ప్రయత్నించి మనస్సును స్వాధీనంలో ఉంచుకోవటం మానసిక తపస్సు అవుతుంది.

5. భావసంశుద్ధి :- మనస్సులోని భావాలు శుద్ధమైనవి, పవిత్రమైనవి కావాలి. జ్ఞానసిద్ధిని పొందాలంటే భావశుద్ధి ఉండాలి. శుద్ధమైన భావాలుంటే, మనస్సు శుద్ధమౌతుంది. శుద్ధమైన మనస్సు ఉంటే ఆత్మతత్త్వం ఎరుక పడుతుంది. ఇది కూడా మానసిక తపస్సే.

ఇలా శారీరకతపస్సు ప్రమిద. వాచికతపస్సు వత్తి. మానసికతపస్సు ఆవునెయ్యి. ఈ మూడూ ఉంటేనే జ్యోతి చక్కగా వెలిగేది. ఈ మూడూ ప్రతి వ్యక్తీ చేయవలసిన తపస్సు. అయితే ఈ తపస్సు వల్ల ఫలితాలు మాత్రం వేరు వేరుగా ఉంటాయి. ఎందుకంటే వారి వారి గుణాలను బట్టి. ఏ గుణంవారి తపస్సు ఎలా ఉంటుందో దానిని బట్టి వారికి ఫలితాలు. ఇలా తపస్సులు 3 గా విభజించబడ్డాయి.

- ముందుగా సాత్త్విక తపస్సు ఎలా ఉంటుందో -

**శ్లో||** శ్రద్ధయా పరయా తప్తం
తపస్త త్త్రివిధం నరైః ।
అఫలా కాంక్షి భిర్యుక్తైః
సాత్త్వికం పరిచక్షతే ॥ (17)

**తా ||** మిక్కిలి శ్రద్ధతో, ఫలాకాంక్ష లేకుండా సమచిత్తంతో కూడి ఆ మూడు విధాలైన తపస్సులను మానవులు ఆచరిస్తే దానిని సాత్త్విక తపస్సు అంటారు.

**వ్యాఖ్య :-** 1. పరయా శ్రద్ధయా :- ఈ తపస్సు నా జన్మను చరితార్ధం చేసుకొనేందుకు తప్పక ఉపయోగపడుతుందనే నమ్మకంతో చేస్తేనే అది సాత్త్విక తపస్సు అవుతుంది. ఇంత గొప్ప శ్రద్ధ లేకపోతే తపస్సు మధ్యలోనే ఆగిపోతుంది. శ్రద్ధ ఉంటే తప్పక లక్ష్యాన్ని సాధించగలరు.

ఒక గురువు శిష్యుని ప్రశ్నించాడు, నిన్న క్లాసుకు రాలేదేమని? నది బాగా పొంగి ప్రవహిస్తున్నది. అందుకే రాలేక పోయానన్నాడు శిష్యుడు.

దానికి గురువు "నీకేం భయం లేదు. గురువుపై శ్రద్ధతో ఉంటే తప్పక గురు అనుగ్రహంతో దాటగలవు" అన్నాడు. తరువాత 10 రోజులకు మళ్ళీ నది పొంగి ప్రవహిస్తున్నది. గురువును స్మరించి, ఆత్మార్పణ భావంతో నదిలో దిగాడు. ఆశ్చర్యం! అతడు నది మీద నడచివచ్చాడు. గురువు ఆశ్చర్యంతో అడిగాడు ఎలా వచ్చావు? అని. మీరే దాటించారు గురుదేవా! అన్నాడు శిష్యుడు. గురువు పరీక్షించాలని శిష్యునితో కలసి వచ్చాడు. శిష్యుని ఆవలి వడ్డుకు పొమ్మన్నాడు. శిష్యుడు గురువును స్మరించి నడచి వెళ్ళాడు. దానితో తన శక్తి ఏమిటో గురువుకు తెలిసింది. వెంటనే నదిలో దిగాడు. కొంత దూరం పోగానే ఠపీమని మునిగి కొట్టుకుపోయాడు. శ్రద్ధ తప్ప అన్యం తెలియని వాడు శిష్యుడు. శ్రద్ధతో పాటు అహంకారం గలవాడు గురువు. ఇది రాజసిక శ్రద్ధ అవుతుంది. అందుకే మునిగి పోయాడు. కనుక మిక్కిలి శ్రద్ధ ఉండాలి. కేవల శ్రద్ధ ఉండాలి. సాత్త్విక శ్రద్ధ ఉండాలి.

ఆంజనేయుడు శ్రీరామునికి విశ్వాసపాత్రుడు. రామనామం తనను తరింపజేస్తుందనే విశ్వాసం గలవాడు. అహంకారం లేని భక్తుడు. అందుకే నూరు యోజనాల సముద్రాన్ని దాటాడు. మరి ఆ శ్రీరాముడో కష్టపడి వారధి నిర్మింపజేశాడు.

- ❖ ఆంజనేయుని శ్రద్ధ సముద్రాన్ని దాటిస్తే -
- ❖ ప్రహ్లాదుని శ్రద్ధ అగ్నిని చల్లబరచింది -
- ❖ మార్కండేయుని శ్రద్ధ మృత్యువును జయిస్తే -
- ❖ మీరాబాయి శ్రద్ధ విషాన్ని అమృతంగా మార్చింది -



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

❖ ధృవుని శ్రద్ధ శాశ్వత స్థానాన్ని అందిస్తే -

❖ ద్రౌపది శ్రద్ధ మానసంరక్షణ గావించింది.

ఇలా పరమ శ్రద్ధ గలవారు అద్భుతాలు చేయగలిగారు. ఇలా శ్రద్ధతో చేసే తపస్సే సాత్విక శ్రద్ధ అవుతుంది. ఇట్టి వారినే తపోధనులు, తపస్సంపన్నులు అంటారు.

తాత్కాలిక భోగాలకు ఆశపడక, లభించిన సిద్ధులకు ప్రాధాన్యత నివ్వక, లక్ష్యాన్ని సాధించే వరకు శ్రద్ధతో తపస్సును సాగించేవారే తపోధనులు, - తపస్సంపన్నులు, వారి తపస్సే సాత్త్వికతపస్సు.

2. అఫలాకాంక్షిభిః :- ప్రతిఫలాన్ని ఆశించకుండా చేస్తేనే అది సాత్త్విక తపస్సు అవుతుంది. అల్పమైన ప్రాపంచిక భోగాలను కోరకుండా ఇది నా కర్తవ్యం అని చేసేవారే నిజమైన శ్రద్ధ గలవారు. ఫలితాన్ని- భోగాలను కోరినప్పుడు దృష్టి అంతా వాటి మీదనే ఉంటుంది. చేసే పనిలో నిష్ట కుదరదు. ఏకాగ్రత ఉండదు. అందుకే భగవద్గీత నిష్కామ కర్మయోగాన్ని విధించింది. ఫలితం మీద ఆసక్తి ఉంటే అసత్యానికి, అన్యాయానికి పాల్పడవలసి ఉంటుంది. అప్పుడది సాత్వికం కాదు.

3.యుక్తైః :- యోగమునందే చిత్తం గలవాణ్ణి 'యోగయుక్తుడు' అంటారు. యోగమంటే సమత్వం గనుక సమచిత్తం గలవాడు అని. సమచిత్తం అన్నా, నిర్వికార చిత్తం అన్నా రెండూ ఒక్కటే. కనుక ఎలాంటి వికారాలు లేకుండా, దేనికీ చలించకుండా, అన్నింటిని సమంగా భావిస్తూ నిర్మల చిత్తంతో చేసే తపస్సే సాత్త్వికతపస్సు. ఈ సమచిత్తం ఎలా కలుగుతుంది?

భగవంతునితో సంగభావం, ప్రపంచంతో అసంగభావం ఉంటే సరి, చిత్తం సమమవుతుంది.

4. నరైః :- మానవులెవరైనా సరే ఈ తపస్సు చేయవచ్చు - అని

- ఇక రాజసిక తపస్సు గురించి.

**శ్లో||** సత్కార మాన పూజార్థం
తపో దంభేన చైవయత్ |
క్రియతే తదిహ ప్రోక్తం
రాజసం చల మధ్రువం || (18)

**తా ||** ఇతరులచే సత్కరించబడాలని, పూజింపబడాలనే కోరికతో, దంభంతో మాత్రమే ఏదైతే చేయబడుతుందో ఆ తపస్సును రాజసిక తపస్సు అంటారు. అది నిలకడలేనిది. ఫలితం నమ్మకం లేనిది.

**వ్యాఖ్య :-** దేనిని రాజసిక తపస్సు అంటారు?

1. సత్కార :- ఇతరుల నుండి సత్కారాలు, ప్రశంసలు, బిరుదులు అందుకోవాలనే ఉద్దేశంతో శారీరక, వాచిక, మానసిక తపస్సులు ఏవి చేసినా అది రాజసిక తపస్సే అవుతుంది.

2. మాన :- తనను అందరూ గౌరవించాలని, సన్మానించాలని, శాలువ కప్పాలని, పూలదండ వేయాలని, అందరూ లేచి నిలబడి గౌరవవందనాలు సమర్పించాలని చేసే తపస్సులు రాజసిక తపస్సులే.

3. పూజార్థం :- తనను అందరూ పూజించాలని, తన కాళ్ళకు మొక్కాలని, పాద పూజలు చేయాలని, సేవలు చేయాలని భావించి చేసే తపస్సులన్నీ రాజసిక తపస్సులే.

4. దంభేన :- పది మందిలో తన ఆధిక్యతను ప్రదర్శించాలనే డంబాచారంతో చేసే తపస్సు రాజసిక తపస్సే అవుతుంది. అందరూ చూచేటప్పుడు ఒకవిధంగా , ఎవరూ చూడనప్పుడు మరో విధంగానూ చేస్తుంటే ఆ తపస్సుల ఫలం వ్యర్ధమైపోతుంది.

5. చలం :- ఇలాంటి తపస్సు చంచలమైనది, నిలకడ లేనిది. అసలు రజోగుణం ఉన్న వారంతా స్థిర చిత్తం లేనివారే. పని ప్రారంభిస్తారు. కాని పూర్తి చేయరు. మరొక పని ప్రారంభిస్తారు. ఒక పని చేస్తూ మరొక దాని గురించి ఆలోచిస్తుంటారు.

6. అధృవం :- తపస్సు పూర్తిగా కొనసాగించగలరనే నమ్మకం లేదు. ఇట్టి తపస్సు వల్ల ఫలితం శూన్యం.

- ఇక తామసిక తపస్సు గురించి

శ్లో|| మూఢ గ్రాహేణాత్మ నోయత్
పీడయా క్రియతే తపః |
పర స్యోత్సాదనార్థం వా
తత్తా మస ముదాహృతం || (19)

**తా ||** మూర్ఖపు పట్టుదలతో, తనను తాను హింసించుకుంటూ; లేదా ఇతరులకు పీడాకరంగా చేయబడే తపస్సు ఏది గలదో అది తామసం అని చెప్పబడుతుంది.

**వ్యాఖ్య :-** (1) మూఢ గ్రాహేణ :- పట్టుదల మంచిదే. సత్కార్యాలు చేసేటప్పుడు పట్టుదల కార్య సిద్ధిని కలిగిస్తుంది. అయితే ఆ పట్టుదల వివేకంతో, విచక్షణా జ్ఞానంతో కూడినదై ఉండాలి. అలాగాకుండా మూర్ఖపు పట్టుదల గలవారిలో వివేకం ఉండదు. ఆలోచన ఉండదు. ఇది మంచిదా? చెడ్డదా? అనే విచక్షణ ఉండదు. తాను చేసే కార్యం ఎందుకు చేస్తున్నాడో తెలియదు. శాస్త్ర విహితమో - కాదో తెలియదు. ఈ పట్టుదల మంచిది కాదు.

తపస్సు అనేది మనస్సును భగవంతుని వైపు త్రిప్పటానికి, భగవంతునిలో నిలపటానికి మనస్సుకు ఇచ్చే శిక్షణ. ఇది తెలియనప్పుడు తపస్సు అంటే మనస్సును హింసించటం, శిక్షించటం అని భావించి మూర్ఖపు పట్టు పడతాడు. దేహాన్ని ఎంతగా హింసిస్తే అంత గొప్ప అనుకుంటాడు. ఇలా చేసేవాడు తామసికుడే.

(2) ఆత్మనః పీడయా :- తనను తాను పీడించుకుంటాడు. ఉపవాసాల ద్వారానో, ఎండకు ఎండి - వానకు తడుస్తూనో, ఆరోగ్యానికి కావాలని హాని చేసుకుంటూనో కఠిన తపస్సులు చేస్తాడు. ఎండాకాలంలో పంచాగ్ని మధ్యంలో నిలబడి, వర్షాకాలంలో కుత్తుకబంటి నీటిలో నిలబడి, చలికాలంలో మంచు గడ్డపై కూర్చొని, కొన్ని సమయాలలో చెట్టు కొమ్మకు తల క్రిందులుగా వ్రేలాడుతూ గొప్ప తపస్సు చేస్తున్నాననుకొని చివరకు తపస్సు చేయలేని

స్థితికి చేరుకుంటాడు. దీనితో మనస్సు కరడు గట్టుక పోతుంది. ఇలాంటి తపస్సులు రాక్షసులు చేసేవి. వీటిని భగవంతుడు నిరసిస్తున్నాడు. ఈ తపస్సుల వల్ల ఏ వరాలు పొందుతారో ఆ వరాల వల్లనే నాశనమైపోతారు.

3. పరస్య ఉత్సాద నార్థంవా :- ఇలాంటి తపస్సులు చేసేవారు తమను తాము హింసించుకోవటమే కాదు; ఇతరులను కూడా హింసిస్తారు. ఇతరులకు పీడాకరంగా తయారవుతారు. ఇతరుల నాశనాన్ని కోరుకుంటారు. కొండ మీద నుండి దొర్లి పడే రాయి అదొక్కటే పడదు. తనతో పాటు మరి కొన్నింటిని పతనం చేస్తుంది.

ఒక గ్రామంలో ఇరుగు పొరుగున ఇద్దరు శత్రువులున్నారు. ఇద్దరూ రెండవవాడు చెడిపోవాలని కోరుకుంటారు. ఎలాగైనా ఎదుటివాణ్ణి నాశనం చెయ్యాలని ఒకడు తపస్సుకు వెళ్ళాడు. ఇది తెలిసి రెండవవాడు కూడా వెళ్ళాడు. శంకరుని గూర్చి ఇద్దరూ ఘోర తపస్సు చేశారు. శంకరుడు ఒకడికి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. రెండవ వాడు ఏం కోరతాడోనని భావించి, స్వామీ ఆ రెండవ వానికి కూడా వరం ఇస్తారు గదా! వాడేం కోరితే నాకు దానికన్నా డబల్ (రెండు రెట్లు) ఇవ్వమన్నాడు. రెండవ వాడి దగ్గరకు వెళ్ళాడు శంకరుడు. వరం కోరుకోమన్నాడు. వాడేం కోరాడు స్వామీ! అన్నాడు వీడు. చెప్పాడు శంకరుడు. అయితే నాకు ఒక కన్ను పోయేట్లు వరమివ్వమన్నాడు. తథాస్తు అన్నాడు శంకరుడు. దానితో వీడికి రెండు కళ్ళుపోయినవి. ఇదే తామసికుల లక్షణం.

**మనకు కోర్టుల దగ్గర కనిపిస్తారు ఇలాంటి వాళ్ళు. ప్లీడరుగారూ! నా ఆస్తి మొత్తం పోయినా సరే. వాడికి మాత్రం జైలు శిక్ష పడాలి, బొచ్చకూడు తినాలి అంటారు. తామసలక్షణం. భస్మాసురుడు తపస్సు చేసి నేను ఎవరి నెత్తిన చెయ్యి పెడితే వాడు భస్మమైపోవాలని వరం కోరుకున్నాడు.**

**"నాకు నిద్ర వరంగా కావాలని" కుంభకర్ణుడు వరం కోరుకున్నాడు. ఇవే తామసిక తపస్సులు.**

**ఇక దానం గురించి - దానం 3 రకాలు.**

**- ముందుగా సాత్త్వికదానం**

**శ్లో|| దాతవ్య మితి యద్దానం**
**దీయతేఽనుపకారిణే |**
**దేశే కాలేచ పాత్రే చ**
**తద్దానం సాత్త్వికం స్మృతం || (20)**

**తా || దానం చేయటం తన విధి అని భావిస్తూ; దేశ, కాల, పాత్రలను బట్టి, ప్రత్యుపకారం చేసే శక్తి లేని వారికి ఏ దానం చేయబడుతుందో అట్టి దానాన్ని సాత్త్వికదానం అని అంటారు.**

**వ్యాఖ్య :- 1. దాతవ్యం ఇతి :- ఇతరుల మెప్పు పొందటానికో, తన గొప్పతనాన్ని ప్రదర్శించటానికో గాక దానం చెయ్యటం నా విధి, తప్పక చేయవలసినది అని చేయాలి. దానం ఇతరులనుద్ధరించటానికి కాదు, తనను తాను ఉద్ధరించుకొనుటకే.**

విత్తనం ఎలాగైతే భూమి, నీరు, గాలి, వెలుతురు సహాయంతో మహా వృక్షమై ఫల పుష్పాలను ఇస్తుందో అలాగే మానవుడు కూడా తల్లి, తండ్రి, గురువు, మిత్రులు, బంధువులు, ఇతర మానవులు, భూతజాలాలు, భగవంతుడు - వీరందరి సహకారంతోనే అభివృద్ధి చెందుతాడు. దానం చేయటమంటే వారందరి పట్ల విద్యుక్త ధర్మాన్ని నేరవేరుస్తున్నాడు - అని అర్థం చేసుకోవాలి.

దానం చేయటమంటే సమాజ ఋణం తీర్చుకోవటమే, ఒక్కొక్కప్పుడు బిచ్చగాడంటూ ఉంటాడు, "ధర్మం చెయ్యి బాబూ! నీకే పుణ్యం. ధర్మం చెయ్యి తల్లీ! నీకే పుణ్యం" - అని. అంటే ధర్మం చేస్తే నీకే మంచిది అని. బిచ్చగాడు మనకొక నీతిని నోటితో చెప్పకుండానే బోధిస్తుంటాడు. అదేమిటంటే - దానం చెయ్యక నేనిలా అయ్యాను. నీవు కూడా మరుజన్మలో నాలాగా కావద్దు - అని మన కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాడు. కనుక దానం చేయటం నా కర్తవ్యం, నా విధి అని భావిస్తూ అహంకారం లేకుండా, ప్రచార పటాటోపం లేకుండా చేయగలిగినంత చేయాలి. ఎవరికి చేయాలి?

2. అనుపకారిణే :- తనకు ఇంతకు ముందే ఉపకారం చేసిన వారికి చేసేది దానం కాదు. అలాగే భవిష్యత్తులో వీడు నాకు తప్పక సాయం చేస్తాడు అని గాని, లేదా వీడి పలుకుబడిని, అధికారాన్ని భవిష్యత్తులో ఉపయోగించుకోవచ్చు అని గాని చేసేది కూడా దానం కాదు. తనకు ఏ విధంగాను తిరిగి ప్రత్యుపకారం చేసే శక్తి లేనివారికి ఇచ్చేదే దానం అవుతుంది. పేదలు, బాధలలో ఉన్నవారు, అనారోగ్యంతో ఉన్నవారు, అశక్తులు - ఇలాంటి

వారికి దానం చేయాలి. అలాగే ఈ దానం పది మందికీ తెలిసి నన్ను గొప్పగా భావించాలని చేసేది కూడా సాత్త్విక దానం కాదు.

3. దేశేకాలేచ పాత్రేచ :- ఏ ప్రదేశంలో దానం చెయ్యాలో, ఏ సమయంలో చెయ్యాలో, ఎలాంటి వారికి చెయ్యాలో - ఈ మూడు విషయాలను జాగ్రత్తగా లెక్కలోకి తీసుకోవాలి.

పుణ్యక్షేత్రాలు, తీర్ధస్థలాలు, దేవాలయాలు, నదీతీరాలు, ఆశ్రమాలు; తుఫానులు - భూకంపాలు వచ్చిన ప్రదేశాలలో చేసే దానం శ్రేష్టం. బ్రాందీ షాపులు, కల్లుదుకాణాలు, పేకాట క్లబ్బుల వద్ద చెయ్యకూడదు.

పర్వదినాలలో, గ్రహణకాలంలో, పుణ్యకార్యాలు జరిగిన సందర్భంలో, ఇంటిలో శుభకార్యాలు జరుపుకున్నప్పుడు చేసే దానం శ్రేష్టం.

ఇక యోగ్యత గలవారికే దానం చెయ్యాలి. తపోనిష్ఠులు, జ్ఞానులు, సాధువులు, భిక్షుకులు అర్హత గలవారు. దురలవాట్లకు లోనైన వారికి, పాపాత్ములకు దానం చేస్తే ఆ పాపంలో దాతకు భాగం ఉంటుంది.

పుచ్చుకున్నవాడు ఇచ్చిన వానికి కృతజ్ఞత తెలియజేయటం పాశ్చాత్య సాంప్రదాయం. దానంచేసి పుచ్చుకున్నవారికి నమస్కరించటం మన సాంప్రదాయం. ఇదీ సాత్త్వికదానం.

- రాజసిక దానం అంటే ఏమిటి?

శ్లో|| యత్తు ప్రత్యుపకారార్థం

ఫల ముద్దిశ్య వా పునః ।

దీయతే చ పరిక్లిష్టం

తద్దానం రాజసం స్మృతం || (21)

**తా** || ప్రత్యుపకారాన్ని ఆశించి, ఫలితాన్ని కాంక్షించి, బలవంతంగా గాని – బాధపడుతూ గాని ఏ దానం ఇవ్వబడుతుందో దానిని రాజసికదానం అంటారు.

**వ్యాఖ్య** :- పైకి చూడటానికి సాత్త్విక దానమైనా, రాజసిక దానమైనా రెండూ ఒక్కటి గానే ఉంటాయి. కాని ఆ దానం చేసేటప్పుడు దాత మనస్సులో ఉండే భావాన్ని బట్టి అది సాత్త్వికమో - రాజసికమో అవుతుంది.

సాత్త్వికదానం ప్రత్యుపకారాన్ని, ఫలితాన్ని ఆశించకుండా చేసేది. రాజసిక దానం ప్రత్యుపకారం కోరి, ఏదో ఒక మంచి ఫలితాన్ని ఆశించి చేసేది. దానం చేసేటప్పుడు నాకీ అవకాశం కలగటం నా అదృష్టం అని చేసేది సాత్త్విక దానమైతే, దానం చేసేటప్పుడు అయ్యో ! తప్పకపోయెనే, ఇవ్వాల్సి వచ్చిందే! అని బాధ పడుతూ, తిట్టుకుంటూ చేసేది రాజసిక దానం.

1.<u>ప్రత్యుపకారార్థం</u> :- ఇంతకుముందు ఇతరుల వల్ల ఏదో ఉపకారాన్ని పొంది, అప్పుడు ప్రత్యుపకారం చేయలేకపోయాం గనుక ఇప్పుడు చేద్దాం అని దానం చేసినా లేక భవిష్యత్తులో మనకు ఏదైనా ప్రత్యుపకారం చెయ్యక పోతాడా! అనే భావంతో చేసినా ఆ దానం రాజసికమే అవుతుంది.

2. <u>ఫలం ఉద్దిశ్య</u> :- మనం ఇప్పుడు చేసిన దానం వల్ల మరణానంతరం స్వర్గ లోక భోగాలు లభిస్తాయనో, లేక మరుజన్మలో భాగ్యవంతుల ఇంట జన్మించి సుఖభోగాలు అందుకోగలననో, లేదా ఈ జన్మలోనే ధనం, సంపదలు కలుగుతాయనో, కోర్టు వ్యవహారాలలో విజయం కలుగుతుందనో, పదవులు

సంపాదించగలననో, కష్టాలు తొలగిపోతాయనో ఏవో ఫలితాలను ఆశించి దానం చేస్తే అది రాజసిక దానం.

మహాభారతంలో కర్ణుడన్నాడు. ప్రతిఫలాన్ని కోరి, పుచ్చుకొని, ఆ తర్వాతనే కవచకుండలాలు దేవేంద్రునికి ఇచ్చాడు. ఇది రాజసిక దానం. అందుకే ఫలితాన్నివ్వలేదు. బలి చక్రవర్తి, శిబి చక్రవర్తి, దధీచి మహర్షి మొ||న వారు ఏ ప్రతిఫలాన్ని కోరకుండానే తమ రాజ్యాలను, దేహాలను దానం చేశారు. అదీ సాత్త్విక దానం అంటే.

3. పరిక్లిష్టంచ :- మనస్సులో బాధ పడుతూ, దానం చేయవలసి వచ్చిందే అని తనను తాను తిట్టుకుంటూ, ఇతరులను తిడుతూ చేసే దానం రాజసిక దానం అంటారు. ఇతరుల ఒత్తిడి వల్లనో, పిసినారి అని అనిపించుకోకుండా ఉండటానికో, పదిమందిలో పలుచన అవుతానేమోననో ఇష్టం లేకపోయినా మనస్సును కష్టపెట్టుకుంటూ ఇచ్చే దానం రాజసిక దానం. దానం ఇచ్చే ముందు గాని, ఇచ్చిన తర్వాత గాని, ఇచ్చేటప్పుడు గాని మనస్సులో ఏ మాత్రం బాధ ఉన్నా అది రాజసిక దానమే అవుతుంది.

- ఇక తామసిక దానం అంటే -

శ్లో|| అదేశ కాలే యద్దానం
అపాత్రేభ్యశ్చ దీయతే |
అసత్కృత మవ జ్ఞాతం
త త్తా మస ముదాహృతం || (22)

**తా ||** దానం చెయ్యటానికి తగని ప్రదేశంలో, తగని సమయంలో, అర్హులు కాని వారికి - నిరాదరణ పూర్వకంగా, అవమానిస్తూ లేదా హేళన చేస్తూ ఇచ్చే దానం ఏదైతే ఉందో దానిని తామసిక దానం అంటారు.

**వ్యాఖ్య :-** దేశకాల పాత్రలను బట్టి చేసే దానం సాత్త్వికదానం అయితే వాటిని పట్టించుకోకుండా చేసే దానం తామసిక దానం.

అదేశ :- దానం ఇవ్వాలనుకున్నా ఇచ్చే ప్రదేశం యోగ్యమైనది కావాలి. అయోగ్య ప్రదేశాలలో ఇచ్చే దానం నిరుపయోగం, వ్యతిరేక ఫలితం ఇస్తుంది. జూదరులుండే జూదశాలల్లో, త్రాగుబోతులుండే పానశాలల్లో, వ్యభిచారులుండే వ్యభిచారకూపాల వద్ద, దురాచారులు - దుష్టులు - దుర్మార్గులు - రౌడీలు - గూండాలు - ఖూనీకోరులు ఉండే ప్రదేశాలలో దానం చేస్తే ఆ డబ్బు దుర్మార్గాలకు, దురాచారాలకు, వ్యసనాలకు ఖర్చైపోతుంది. అలాగే

అకాలే :- ఇచ్చే సమయం కూడా తగినదై ఉండాలి. ఇచ్చే వాడికి శక్తి లేని కాలంలో, పుచ్చుకొనే వాడికి అవసరం లేని కాలంలో దానం చేయకూడదు. బాగా అవసరంలో ఉన్నప్పుడు, కష్టంలో ఉన్నప్పుడు, సద్వినియోగం అవుతుందనుకున్నప్పుడు ఇవ్వాలి. అలా కాకుండా అవసరం లేని సమయాల్లో చేసిన దానం వృథా అవుతుంది. ఇదే తామసిక దానం.

3. అపాత్రేభ్యశ్చ :- అపాత్ర దానం తామసిక దానం అవుతుంది. దుర్వ్యసనాలు గల వాడికి, దండిగా భోగాలకు ఖర్చు పెట్టే వాడికి, కపటాచారులు, దుర్మార్గులు అయిన వారికి ఇచ్చేది తామసిక దానం. అటువంటి దానం దాతను నరకంలో

పడవేస్తుంది. ఇచ్చిన దానాన్ని పాప కార్యాలకు వాడితే ఆ పాపంలో భాగం దాతకు వస్తుంది.

4.అసత్కృతం :- తిరస్కారభావంతో, విసుక్కుంటూ, ఏ మాత్రం ఆదరణ లేకుండా, దానం పుచ్చుకోనేవాణ్ణి అల్పుడుగా - హీనుడుగా భావిస్తూ చేసే దానం తామసిక దానం అవుతుంది.

5. అవజ్ఞాతం :- తిడుతూనో, వెటకారం చేస్తూనో, వ్యంగ్యంగా మాట్లాడుతూనో, అవమానిస్తూనో ఇచ్చే దానం వల్ల ఫలితం శూన్యం. వ్యతిరేక ఫలితం కూడా కలుగుతుంది.

కొందరు తమ భాషా పరిజ్ఞానాన్ని బయటపెడుతుంటారు. "అడుగో. తయారయ్యాడండి. కలెక్టరు గారు ఆఫీసుకు రావటం లేటవుతుందేమో గాని వీడు మాత్రం టంచనుగా వస్తాడు" - అని; "మన వాడికి పావలా అర్ధా అంటే లెక్కలేదండి. 5 రూ., 10 రూ. పడాలి. డిగ్నిటీ మైన్ టైన్ చేస్తాడు. అని; "వీడు పట్టుకుంటే వదలడండి, జిడ్డు. శని పడితే 7 ఏళ్ళు. వీడు పడితే 14 ఏళ్ళు. నాకు అన్ని పీడాలు "విరగడయ్యాయి గాని వీడి పీడ విరగడ కాలేదండి" - అని - ఇలా మాట్లాడుతుంటారు. కొందరు డబ్బును విసిరేస్తుంటారు. విసుక్కుంటారు. ఇది తామసిక లక్షణం. కొందరు బూతులు తిడతారు. కొందరు కొట్టబోతారు. ఇలా చేసే దానం అసలు దానమే కాదు. దీనివల్ల వ్యతిరేక ఫలితాలే వస్తాయి. పాచిపోయిన అన్నం, కుళ్ళిన పండ్లు, చినిగిన నోట్లు ఇచ్చే వారంతా తామసికులే.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**ఉపోద్ఘాతం :- యజ్ఞ దాన తపస్సులు ఎందుకు చేయాలి? -**

- **దేవతలకు ప్రీతి కలిగించేందుకు చేయవలసినవి యజ్ఞాలు.**
- **సమాజానికి మేలు చేకూర్చేవి దానాలు.**
- **దేహేంద్రియ మనో బుద్ధులను శుద్ధి చేసేవి తపస్సులు.**

**అయితే ఈ యజ్ఞ, దాన, తపస్సులు చక్కగా ఫలించాలంటే శ్రద్ధ ఉండాలి, శాస్త్ర జ్ఞానం ఉండాలి. శ్రద్ధ రాజసికమో, తామసికమో అయితే ప్రయోజనం లేదు. సాత్త్విక శ్రద్ధ ఉండాలి. దానితో పాటు శాస్త్ర జ్ఞానం లేకపోతే దోషాలు దొర్లుతాయి. ఈ దోషాలను తొలగించుకోవాలి. ఎలా?**

**ఈ దోషాలను తొలగించుకొనుటకు ఒక గొప్ప మంత్రాన్ని అర్జునునికి; తద్వారా సమస్త మానవలోకానికి ఉపదేశిస్తున్నాడు భగవానుడు. అదే 'ఓం తత్సత్' ఇది భగవంతుని నామమే. భగవంతుని స్ఫురింపజేసేదే. ఈ మంత్రోచ్చారణ ద్వారా చేసే కర్మలన్నీ మోక్షానికి దారి తీస్తాయి.**

**ఈ మంత్రాన్ని ఎక్కడ? ఎప్పుడు? ఉపదేశిస్తున్నాడు? పట్టపగలు, రెండు సేనలు యుద్ధానికి సన్నద్ధమై కత్తులు నూరుకుంటున్న వేళ; ఆ రెండు సేనల మధ్య నిలిచి, రణరంగ రణగొణ ధ్వనుల మధ్య, యుద్ధరంగంలో నిలబడి చేశాడు. సాధారణంగా మంత్రోపదేశం రహస్యంగా చేస్తారు. కాని జగద్గురువుకు ఆ నియమాలు లేవు. అందుకే అలా ఉపదేశించాడు.**

**భగవంతుడు ఉపదేశించిన ఈ మంత్రాన్ని ముట్టుకొని, స్పర్శించి, స్మరించి, మననం చేసి మన దోషాలను తొలగించుకొని మనం చేసే ఈ యజ్ఞ దాన తపస్సులనే కర్మలను పవిత్రం చేసుకోవాలి.**



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అట్టి శుద్ధ సాత్విక శ్రద్ధ కావాలంటే -

భగవంతుని యందు శ్రద్ధ - శాస్త్రము నందు శ్రద్ధ - గురువు యందు శ్రద్ధ ఉండాలి. అపుడే కర్మలన్నీ పవిత్రం అవుతాయి.

- ఇంతకూ ఈ మంత్రం దేనినుద్దేశించినదో - దాని మహాత్మ్యం ఏమిటో తెలుసుకుందాం.

**శ్లో||** ఓం తత్స దితి నిర్దేశః
బ్రాహ్మణ స్త్రి విధః స్మృతః ।
బ్రహ్మణా స్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చ విహితాః పురా ॥ (23)

**తా ||** ఓం తత్ సత్ అనేవి బ్రహ్మన్ని(పరమాత్మను) నిర్దేశించి చెప్పే మూడు విధములైన సంకేతాలు. వీటిని అనుసరించియే బ్రాహ్మణులు - వేదాలు - యజ్ఞాలు పూర్వం నిర్ణయించబడ్డాయి.

**వ్యాఖ్య** :- ఓం తత్ సత్ అనేవి పరమాత్మను నిర్దేశించే 3 విధాలైన పేర్లు. దారిన పోయే వారిని పిలిచి మాట్లాడాలంటే వారిని పేరుతో పిలవాలి. వారి పేరు తెలియనప్పుడేం చేస్తాం? సార్ అనో, అంకుల్ అనో, పెద్దాయనా! అనో, అబ్బాయ్ అనో, ఏమండీ అనో పిలుస్తాం. అలాగే ఏ పేరూ లేని, పరమాత్మను స్మరించుటకు, చింతించుటకు ఏదో ఒక గుర్తు ఉండాలి. అందుకే ఈ ఓం - తత్ - సత్ అనే పదాలు.

పరమాత్మను స్మరిస్తూ యజ్ఞ దాన తపస్సులేమి చేసినా వాటిలో ఇక ఏ దోషాలు ఉండవు. పైగా అవి సత్ఫలితాలనిస్తాయి, విఘ్నాలు తొలగిపోతాయి.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

అందుకే చాలామంది ఓం అంటూ ప్రణవ శబ్దంతో కార్యాలు ప్రారంభిస్తారు. ఇదంతా దోషాలు ఏమీ లేకుండా పోయేందుకే. అంతేగాక తన ప్రయత్నానికి భగవంతుని సాయం లభించటానికే.

నిజంగా ఇదొక సమర్పణ మంత్రం. ఓ పరమాత్మా! అన్నీ నీవే. అన్నీ నీ నిర్ణయం ప్రకారమే జరుగుతాయి. నేను కేవలం నిమిత్త మాత్రుడను అనే సమర్పణ భావం ఈ మంత్రోచ్ఛారణలో ఉన్నది.

ఈ మంత్రోచ్ఛారణ వల్లనే పూర్వం బ్రహ్మదేవుడు బ్రాహ్మణులను, వేదాలను, యజ్ఞాలను సృష్టించటం జరిగింది.

(i) <u>బ్రాహ్మణులు :-</u> ప్రారంభంలో బ్రహ్మదేవుడు విష్ణువు నాభి కమలం నుండి బయటకు వచ్చి కర్తవ్యమేమని విష్ణువును అడిగాడు. సృష్టి చేయమని ఆయన ఆదేశించాడు. కాని ఎలా సృష్టి చేయాలో బ్రహ్మకు తెలియదు. అందుకే ఆయన 'ఓం' అనే ప్రణవ మంత్రాన్ని జపించి బ్రాహ్మణులను - అంటే సనకసనందనాదులనే బ్రహ్మజ్ఞానులను సృష్టించాడు. వారే బ్రాహ్మణులు. వారు నిరంతరం పరమాత్మను దర్శిస్తూ, పరమాత్మ భావనలోనే ఉంటారు. వారికి పరమాత్మ జీవుల రూపంలో వ్యక్తంగా కనిపిస్తుంటే, ఆత్మ రూపంలో అవ్యక్తంగా కనిపిస్తూ ఉంటాడు.

(ii) <u>వేదాలు :-</u> బ్రహ్మదేవుడు సనకసనందనాదులను సృష్టి చేయమనగా వారు తిరస్కరించారు. వారు ముక్త జీవులు. అకర్త. కనుక అంగీకరించలేదు. దానితో బ్రహ్మ ప్రజాపతులను సృష్టించి సృష్టిని కొనసాగించమన్నాడు. అంగీకరించారు. అంతట బ్రహ్మ ఈ ప్రజాపతులందరు తరించే మార్గం

ఏమిటూ? అని ఆలోచించి వేదాలను సృష్టించాడు. వేదాలంటే తెలుసుకోవలసినవి. పరమాత్మను అందుకొనే మార్గాలను, సాధనలను తెలియజేసేవి. వీటి ద్వారా ఆ ప్రజాపతులు తరించగలరు అని బ్రహ్మ యొక్క భావన.

(iii) యజ్ఞాలు :- ఆ ప్రజాపతులంతా సృష్టి కార్యాన్ని ప్రారంభించారు. మరి ఈ సృష్టిలో జన్మించే సామాన్యులంతా తరించే మార్గం ఏమిటి? అని ఆలోచించి బ్రహ్మదేవుడు వారికి సత్కర్మలైన యజ్ఞాలను సృష్టించాడు. సత్కర్మలైన యజ్ఞాలను ఆచరించినప్పుడు సత్ఫలితాలు కలుగుతాయని, ఆ ఫలితాలనిచ్చే కర్త పరమాత్మయేనని గ్రహించి యజ్ఞాచరణ చేయాలి.

ఓం అంటే పరబ్రహ్మ - పరమాత్మ. తత్ అంటే అది. సత్ అంటే ఉన్నది, సత్యమైనది అని. కనుక ఓం తత్ సత్ అంటే పరబ్రహ్మ అనేది ఒక్కటే సత్యమైనది అని. పరబ్రహ్మమొక్కటే సత్యమైనప్పుడు కనిపించే ఈ జగత్తు అంతా అసత్ - మిధ్య - లేనిదే - అని గ్రహించాలి. దీనితో బ్రహ్మసత్యం - జగన్మిధ్య అనే సర్వ వేదాంత సిద్ధాంత సారం స్థిర పడుతుంది. ఎలా జపించాలి ఈ మంత్రాన్ని?

'తజ్జపః తదర్ధ భావనం' మంత్రం యొక్క అర్ధాన్ని భావన చేస్తూ జపించాలి - అని పతంజలి మహర్షి వచనం. భావశుద్ధి లేని జపం వృధాయే. మరి ఓం తత్ సత్ అనే మంత్రాన్ని జపిస్తూ ఏ భావన చెయ్యాలి? బ్రహ్మము ఒక్కటే సత్యము - నిత్యము అని; అది తప్ప ఈ సమస్త జగత్తు, ఈ సృష్టి అంతా కలలోని వస్తువులాగా మిధ్యయేనని జపించాలి.

కలలోని వస్తువు కలలో ఉన్నంత వరకు సత్యమనే అనిపించినా మేలుకోవటంతోనే అసత్యమై పోతున్నది. అలాగే జాగ్రదవస్థలో కనిపిస్తున్న - సత్యమని నమ్ముతున్న ఈ జగత్తు అంతా మన స్వరూపం లోనికి మనం మేలుకుంటే ఇది అంతా మిధ్యయే - లేనిదే అవుతుంది.

ఈ మంత్రాన్ని జపిస్తూ ఈ భావన చేస్తుంటే క్రమంగా మనకు వైరాగ్యం కలుగుతుంది. కలలోని వస్తువులపై గాని, గారడీ వాడు సృష్టించే వస్తువులపై గాని మనకు రాగం, ఆసక్తి ఉంటున్నదా? అలాగే మనకీ జగత్తుపై రాగం - ఆసక్తి తొలగిపోతుంది. ఇలా మంత్రాన్ని జపిస్తూ, అర్ధ భావాన చేస్తూ ప్రాపంచిక విషయాలపై వైరాగ్యం పెంచుకుంటూ, పరమాత్మను అందుకొనే ప్రయత్నం చేయాలి. ఈ ప్రయత్నం లోనే జీవించాలి. ఈ ప్రయత్నంలోనే మరణించాలి. ఇది మంగళకర మంత్రం.

- ఓం తత్ సత్ అనే ఈ పరబ్రహ్మ వాచకాలను ఎవరు ఎలా ఉపయోగించుకుంటూ తరిస్తున్నారో రాబోయే 3 శ్లోకాల్లో వివరిస్తున్నారు. ముందుగా ఓం ను ఎవరు ఉపయోగించుకుంటారు?

శ్లో|| తస్మాదో మిత్యు దాహృత్య
యజ్ఞ దాన తపః క్రియాః |
ప్రవర్తం తే విధానోక్తాః
సతతం బ్రహ్మ వాదినాం || (24)



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

**తా ||** అందువల్ల బ్రహ్మవాదులైనవారు (వేదముల నెరిగినవారు) శాస్త్రములందు చెప్పిన ప్రకారం 'ఓం' అంటూ యజ్ఞ దాన తపః క్రియలలో నిమగ్నులై యుంటారు.

**వ్యాఖ్య :-** అందువల్ల - - - ఎందువల్ల ? ఓం తత్ సత్ అనే పదాలు మూడూ ఆ పరబ్రహ్మాన్ని సూచించే పదాలు గనుక, ఈ మహామంత్ర ఉచ్చారణ చేతనే బ్రాహ్మణులు, వేదాలు, యజ్ఞాలు ఉత్పన్నమైనవి గనుక - బ్రహ్మవేత్తలైనవారు లోక కల్యాణం కొరకు శాస్త్రం విధించిన యజ్ఞ దాన తపస్సులను 'ఓం' అనే ఉచ్చారణతో చేస్తుంటారు. 'బ్రహ్మవేత్తలు' అంటే పరమాత్మను వ్యక్తంగాను, అవ్యక్తంగాను దర్శిస్తూ పరమాత్మ సాన్నిధ్యాన్ని అనుభవించేవారు. వారు లోక కల్యాణం కొరకు యజ్ఞ దాన తపస్సులు ఆచరించేవారు. వారు చేసే కర్మలలో ఏవైనా దోషాలు, పొరపాట్లు దొర్లవచ్చు. ఆ దోషాల నివారణ కొరకు వారు 'ఓం' అంటూ ప్రణవ నాదాన్ని చేస్తూ, ఆ పరమాత్మను దర్శిస్తూ యజ్ఞాది కర్మలు చేస్తుంటారు. వృక్షానికి విత్తనం ఎలా మూలకారణమో అలాగే అన్ని మంత్రాలకు ఆధారం ఈ ఓంకారం. ఏడుకోట్ల మంత్రాలన్నింటిలోకి ఏకాక్షరమైన 'ఓం' కారం మంగళకరమైనది, పరమ పవిత్రమైనది. అందుకే అనాది నుండి మహాత్ములు, మహర్షులు, భక్తులు, జ్ఞానులు, సామాన్యులు - అందరూ ఓంకారం తోనే పూజలు, యజ్ఞాలు, పారాయణలు, సద్గోష్టులు, సత్సంగాలు - అన్నింటిని ప్రారంభిస్తూ ఉంటారు. దీనితో వారుచేసే కర్మలలోని దోషాలు తొలగిపోతాయి. అదీ ఓంకారం యొక్క మహిమ.



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

నిజంగా బ్రహ్మవిదులు, బ్రహ్మవేత్తలు అయిన వారికి ఏ కర్మలు చేయవలసిన అవసరం లేదు; ఏ సాధనలు చేయనవసరం లేదు. ఏ ఫలితాలు అవసరం లేదు. అయినప్పటికీ సాధకులను ఉద్ధరించటం కోసం, సామాన్యులకు మార్గదర్శకులుగా ఉండటం కోసం దేహం ఉన్నంత వరకు ఓంకార ఉచ్ఛారణతో, పరమాత్మ స్మరణతో యజ్ఞాది సత్కర్మలు చేస్తూనే ఉంటారు.

విధానోక్తాః :- వారు శాస్త్రాల యందు విధించబడిన కర్మలనే చేస్తుంటారు. అయినప్పటికీ మంత్రాలు చదవటంలో ఉచ్ఛారణ దోషాలు ఉండవచ్చు. క్రియాచరణలో మానవ సహజమైన దోషాలు ఉండవచ్చు. ఋత్విజులు స్వాహా అన్నప్పుడు ఆహూతులివ్వ లేకపోవచ్చు. ఇలా ఏవైనా దోషాలుంటే వాటిని నివారించాలి. అందుకే 'ఓం' కార ఉచ్ఛారణ.

సతతం :- ఎల్లప్పుడూ ప్రతి కార్యానికీ ముందు ఓంకారాన్ని ఉచ్ఛరించాలి. ఇంజనుంటేనే రైలు పెట్టెలకు చైతన్యం. 1 అంకె ఉంటేనే 'సున్నా' లకు విలువ. అలాగే ఓంకారాన్ని ఉచ్చరిస్తూ భగవంతుని స్మరిస్తేనే కార్య సాఫల్యత. అందుకే బ్రహ్మవేత్తలైనా సరే ఓంకారోచ్ఛారణతోనే యజ్ఞ కర్మలు చేస్తుంటారు.

- ఇక మోక్షాన్ని కోరి అందుకొరకై ప్రయత్నించే సాధకులు, ముముక్షువుల విషయం.

శ్లో|| తదిత్య నభి సంధాయ
ఫలం యజ్ఞ తపః క్రియాః |
దాన క్రియాశ్చ వివిధాః

క్రియంతే మోక్ష కాంక్షిభిః ॥ (25)

**తా** ॥ మోక్షాన్ని కోరేవారు ఫలితాన్ని ఆశించకుండా 'తత్' అంటూ యజ్ఞాలు, తపస్సులు అనేక రకాల దానాలు చేస్తుంటారు.

**వ్యాఖ్య** :- 1. మోక్ష కాంక్షిభిః :- మోక్షాన్ని కోరుకొనే వారు. వీరినే ముముక్షువులు అంటారు. వీరు సాత్త్వికస్వభావం గలవారు. వీరు ప్రాపంచికమైన భోగాలను కోరరు. కేవలం వారికి మోక్షం మాత్రమే కావాలి. స్వర్గ భోగాలను కూడా వీరు కోరరు. మోక్షం కొరకు వీరు తీవ్ర సాధనలు చెయ్యాలి. శాస్త్ర శ్రవణం, మననం, నిధిధ్యాసనం చెయ్యాలి. యజ్ఞ దాన తపస్సులు చేయాలి. అనేక కఠిన సాధనలు కూడా చెయ్యాలి. వీరికి ఈ కర్మలు, సాధనలు చేసేటప్పుడు దృష్టి అంతా పరమాత్మ మీదనే ఉండాలి. అందుకే 'తత్' అని ఆ పరమాత్మ నామాన్ని ఉచ్ఛరిస్తూ; ఆ పరమాత్మను వేదాలు నిర్దేశించి చూపినట్లుగా దర్శిస్తూ, స్మరిస్తూ ఆయా కర్మలను ఆచరిస్తూ ఉంటారు. దీనివల్ల ఆయా కర్మలలోని దోషాలు తొలగిపోతాయి.

'తత్' అనే పదం పరమాత్మను సూచించే సర్వనామం. సమస్తము పరమేశ్వరుడే. ఇచ్చేవాడూ ఆయనే. పుచ్చుకొనే వాడూ ఆయనే. ఇవ్వాలన్నా, పుచ్చుకోవాలన్నా ఆయనకు ఉపకరణం - నిమిత్తం కావాలి. అందుకే మానవులు. కనుక మనం నిమిత్తమాత్రులం. ఒక కవి కలాన్ని వాడుకొని అద్భుతమైన కవిత్వం వ్రాసినట్లు భగవంతుడు కూడా మానవులమైన మనను వాడుకొని తన అద్భుత శక్తిని ప్రదర్శిస్తున్నాడు. మనం అజ్ఞానం వల్ల, అహంకారం వల్ల ఇక్కడ జరిగే కర్మలన్నింటికీ కర్తలం అని అనుకుంటున్నాం.

ఇక్కడ ఏదైనా గొప్ప సంఘటన జరిగితే నా తెలివితేటల వల్లనే ఇదంతా జరిగింది అని భ్రమ పడుతూ ఉంటాం. అలాగే భగవంతుని కోసం ఈ చందా ఇస్తున్నాను అంటాం. నిజంగా భగవంతుడే మనకు ఇస్తున్నాడు. ఆయన ఇవ్వకపోతే మనం గిల గిల కొట్టుకుంటాం. అలాంటి మనం భగవంతుడికి ఇచ్చేదేమిటి? నిజంగా నీకంత ఉదారస్వభావం ఉంటే ప్రక్కవాడికి ఇవ్వవేం? ఒక్కొక్కప్పుడు నీవు ఇవ్వకపోయినా ఇచ్చేవాణ్ణి చూచి సహించలేక పోతున్నావెందుకు? కనుక మనం భగవంతునికిచ్చేదేమీ లేదు.

మనం భగవంతునికి ఇస్తున్నాం అనే ఆలోచన వెనుక ఒక సత్యం దాగి ఉంది. మనం భగవంతునికేదన్నా ఇస్తే దానికి 10 రెట్లు మనకు తిరిగివస్తుంది అనే భావన. ఇదే ఫలాసక్తి. ఈ ఫలాసక్తి వల్ల మనశ్శుద్ధి ఏర్పడదు. భగవంతునికి మనం ఇస్తున్నాం అనే భావన తప్పు.

ఒకాయన బెల్లంతో గణపతిని తయారు చేయించి పూజిస్తున్నాడు. ఆ బెల్లం నుండే ముక్కను త్రుంచి నైవేద్యం పెడుతున్నాడు. అలాగ ఉంది మన పరిస్థితి. కనుక ఈ సర్వము ఆ భగవంతునిదే. మనం కర్తవ్యతా భావంతో, మోక్ష కాంక్షులమై కర్మలు చేయాలి. ఫలాపేక్ష లేకుండా కర్మలు చేస్తే చిత్తశుద్ధి. చిత్తశుద్ధి వల్ల మోక్షం. కనుక యజ్ఞ దాన తపస్సులను 'తత్' అంటూ సాధకులు మోక్ష ప్రాప్తి వరకు చెయ్యవలసిందే.

- ఇక సామాన్యులు ఈ మంత్రాన్ని ఎలా ఉపయోగించుకోవాలో -

శ్లో|| సద్భావే సాధు బావేచ
సదిత్యే తత్ప్ర యుజ్యతే |



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

ప్రశస్తే కర్మణి తథా

సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ॥ (26)

**తా ॥** 'ఉన్నది' అనే అర్థంలోను, 'మంచిది' అనే అర్థంలోను 'సత్' అనే ఈ పరబ్రహ్మ వాచకాన్ని(పదాన్ని) వాడుతూ ఉంటారు. అలాగే మంచి కర్మలకు ఓ అర్జునా! సత్ అనే శబ్దాన్ని ప్రయోగిస్తుంటారు.

**వ్యాఖ్య :-** 'సత్' అనే పదం కూడా పరమాత్మను నిర్దేశించి చెప్పే పదమే. ఐనప్పటికీ దానిని రెండు అర్థాలలో వాడుతుంటారు.

1. 'సత్' అంటే ఎల్లప్పుడూ ఉండేది అనే భావంలోను,
2. 'సత్' అంటే మంచిది అనే భావంలోను వాడుతుంటారు.

**1. సత్ :-** కుర్చీ ఉన్నది, బల్ల ఉన్నది, చెట్టు ఉన్నది, నది ఉన్నది, కుండ ఉన్నది, కొండ ఉన్నది - - - ఇలా ఉన్నది అనే భావంలో 'సత్' అనే పదాన్ని చెప్పవచ్చు. అంటే కుర్చీ సత్, బల్ల సత్, చెట్టు సత్, నది సత్, కుండ సత్, కొండ సత్ - - - అని.

అయితే వేదాంతార్థంలో సత్ అంటే తాత్కాలికంగా ఉండటం గాదు. శాశ్వతంగా ఉండటం. చావు పుట్టుకలు లేకుండా ఎల్లప్పుడూ ఉండటం. త్రికాలాలలో ఉండటం. అదే ఆత్మ - అదే పరమాత్మ. పరమాత్మ ఒకప్పుడు ఉండి ఒకప్పుడు లేనివాడు కాదు. పరమాత్మకు పుట్టు లేదు. అలాగే చావు కూడా లేదు. ఎల్లప్పుడూ ఉండే నిత్య సత్యం పరమాత్మ. త్రికాలాలలోను, త్రికాలాతీతం గాను ఉండేది పరమాత్మ. అందుకే పరమాత్మ 'సత్'.

ఈ జగత్తు సృష్టికి ముందు లేదు. ఇప్పుడు కనిపిస్తున్నది. అలాగే ప్రళయం తరువాత కూడా ఈ సృష్టి లేదు. ఇలా ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేని దానిని 'అసత్' అంటారు. కుండ, కుర్చీ, బల్ల మొ|| తయారు కాకముందు లేవు. ఇప్పుడున్నవి. అవి విరిగిపోయిన తరువాత, పగిలి పోయిన తరువాత, శిధిలమైన తర్వాత లేవు. కనుక అసత్. అలాగే ఈ మనుషులు, జంతువులు, ఇతర ప్రాణికోట్లన్నీ పుట్టకముందు లేవు. మరణించిన తర్వాత ఉండవు. మధ్యలో కొంత కాలం ఉంటాయి . కనుక అవి త్రికాల సత్యం కాదు. అందుకే వీటన్నింటిని 'అసత్' అన్నారు.

మరి సత్ ఏది? సత్య వస్తువు ఏది? నిత్య వస్తువు ఏది? "నిత్య వస్త్వేకం బ్రహ్మ, తద్ వ్యతిరిక్తం సర్వం అనిత్యం". నిత్యవస్తువు - సత్యవస్తువు పరమాత్మ ఒక్కటే . దానికి వేరైనవన్నీ అనిత్యం, అసత్యం. అంటే 'అసత్'. పరమాత్మ ఒక్కటే 'సత్'

2. <u>సత్ :-</u> ఇక సత్ అంటే మంచిది అనే అర్థం కూడా ఉన్నది. మంచి మనుషులను 'సత్ పురుషులు' - 'సజ్జనులు' అంటారు. మంచి కర్మలను 'సత్ కర్మలు' అంటారు. మంచి ఆలోచనలను 'సద్ భావనలు' అంటారు. మంచి గ్రంధాలను 'సద్ గ్రంధాలు' అంటారు. మంచి ఆచారాలను 'సదాచారాలు' అంటారు. పది మంది కూడి మంచి విషయాలతో కాలక్షేపం చేస్తే 'సత్ సంగం' అంటారు. ఇలా మంచిని 'సత్' అంటారు.

ఈ సత్ మనను భగవంతుని దరిచేర్చేది. సత్సంగం మనను భగవత్ సాన్నిధ్యానికి చేరుస్తుంది. భగవంతుని చేరుకొనుటకు సత్పురుషులు మనకు

మార్గం చూపుతారు. సద్ గ్రంథాలు, సత్ శాస్త్రాలు మనకు భగవంతుని గురించి చెప్పి భగవంతునితో ఐక్యతకు మార్గం చూపుతాయి. సత్కర్మలు మనను భగవంతుని స్మరణలో నిలుపుతాయి. కనుక భగవంతుని దగ్గరకు చేర్చే మార్గాన్ని తెలియజేసే పదం 'సత్' భగవంతుని సూచించే పదం 'సత్'

మనిషి చనిపోయిన తర్వాత 'అయ్యో! పోయాడండీ పాపం!' అంటారు. పోయేది ఎప్పటికైనా పోయేదే. అది అసత్తు. అదే దేహం. ఈ దేహం పోవటానికే వచ్చింది. దేహం పోయినా పోకుండా ఉండేది ఒకటి ఉంది. అదే ఆత్మ. అదే 'సత్'. దానితో ఇక్యం చెంది అదిగా అనుభూతి చెందేవారు అరుదుగా ఉన్నారు. వారికి మృత్యు భయం లేదు. మృత్యువును జయించిన వారు. వారే ఆత్మానుభూతి చెందినవారు. ముక్తులు. వారే పరమాత్మ. పరమాత్మ ఎప్పుడూ ఉండే సత్. ఒక దేహాన్ని తగిలించుకొని జీవుడుగా ఉండి తిరిగి దేహం రాకుండా చేసుకొని ఆత్మగా - పరమాత్మగా - సత్ గా ఉండి పోతారు.

కనుక సత్ భావంలోను, సాధుభావంలోనూ - అంటే ఉన్నది అనే భావంలోను, మంచిది అనే భావంలోను అధిష్టాన రూపంలో ఉన్నది పరమాత్మే.

సాత్త్వికులు కానివారు - అంటే సత్త్వగుణం లేనివారు రజోగుణం ఉన్నా, వారు మంచి బుద్ధి గలవారైతే పరమాత్మను అందుకోవాలనే కోరికతో సత్కర్మలు ఆచరించాలి. యజ్ఞ దాన తపస్సులు చెయ్యాలి. సత్పురుష సాంగత్యం చెయ్యాలి. సద్గ్రంథాలను అధ్యయనం చేయాలి. దానితో వారు కూడా సాత్త్వికులుగా మారిపోతారు. ఐతే వారు చేసే కర్మలలో ఏవైనా

దోషాలు దొర్లుతుంటాయి గనుక వాటిని నివారించుకొనేందుకు 'సత్' అంటూ ఆ కర్మలను చేయాలి.

- 'సత్' అని ఇంకా వేనిని అంటారు?

శ్లో|| యజ్ఞే తపసి దానేచ
స్థితి స్సదితి చోచ్యతే ।
కర్మ చైవ తదర్థీయం
సది త్యే వాభి ధీయతే || (27)

**తా ||** యజ్ఞ దాన తపస్సులలో నిష్ట కలిగి ఉండటం 'సత్' అని చెప్పబడుతున్నది. భగవత్ ప్రీతి కొరకు చేసే కర్మలను కూడా 'సత్' అనే అంటారు.

**వ్యాఖ్య:-** యజ్ఞ దాన తపస్సుల యందు నిష్టను, - వీటిని చేయాలనే భావనను, భగవత్ ప్రీతి కోసం చేసే కర్మలను - అన్నింటిని సత్ అంటారు. ఎందుకు? ఇవన్నీ సత్ (భగవంతుని) వైపుకు నడిపించేవి గనుక.

ఈ ప్రపంచాన్ని, ప్రకృతిని, సమాజాన్ని, జీవులను సృష్టించింది పరమాత్మే. మనకు ఈ శరీరాన్ని ఇచ్చింది కూడా ఆయనే. పరమాత్మ ప్రసాదించిన ఈ శరీరాన్ని, మనో బుద్ధులను సరిగ్గా వినియోగించుకొని, ఆ పరమాత్మను చేరుకొనుటకు దారి చూపే సాధనలే యజ్ఞ దాన తపస్సులు.

- యజ్ఞం ద్వారా ప్రకృతిని, దేవతలను ఆరాధించి తృప్తి పరచాలి.
- దానం ద్వారా సమాజంలోని దోషాలను తొలగించి మానవ అభ్యుదయం కొరకు పాటు పడాలి.

- తపస్సు ద్వారా మనో వాక్కాయములను సరి చేసుకొని, ఆత్మ నిగ్రహాన్ని పాటించి, సన్మార్గం వైపు తిరగాలి.

వీటిని మనం శ్రద్ధతోను, శాస్త్ర విధిని అనుసరించి చేయాలి. ఎందుకు?

❖ శాస్త్ర విధిని పాటిస్తే - ఒకవేళ మన శ్రద్ధ రాజసిక శ్రద్ధ అయినా, ప్రతిఫలాన్ని కోరి చేసినా క్రమంగా మనలను పరమాత్మ వైపుకు తిరిగేటట్లు చేస్తుంది శాస్త్రం. అందుకే వీటిని సత్కర్మలు అన్నారు. ఎందుకంటే ఇవి సత్ వైపుకు త్రిప్పేవి గనుక.

❖ తదర్థీయం కర్మచ ఏవ సత్ ఇతి ఏవ అభిధీయతే: "తత్ - అర్థీయం" - ఆ భగవంతుని పొందుట కొరకు, భగవత్ ప్రీతి కొరకు చేసే కర్మలను కూడా సత్కర్మలే అని చెబుతున్నారు.

పరమాత్మకు సమర్పించని కర్మలలో ఒక దోషం ఉంటుంది. ఏదో ఒక రూపంలో ఆ కర్మలో స్వార్థం ప్రవేశిస్తుంది. పరమాత్మకు ఆ కర్మను సమర్పిస్తే ఆ స్వార్థ కర్మ కూడా పరమార్థమై పోతుంది. 'మదర్థ' కర్మ కాస్తా 'తదర్థ' కర్మ అవుతుంది. కనుక కర్మ తదర్థీయం కావాలంటే ఆ కర్మను భగవత్ భావనతో, భగవత్ ప్రీతికరంగా, నిష్కామంగా, ఫలాపేక్ష వదిలి, త్యాగ బుద్ధితో చేయాలి. అప్పుడే ఆ కర్మకు పవిత్రత, ఔన్నత్యం. అలాగాక స్వార్థం కొరకు చేసే కర్మ కర్మగానే మిగిలిపోతుంది. కనుక కర్మలో లోపం లేదు, కర్మ చేసే సమయంలో మన భావనలోనే లోపం. దైవ బుద్ధితో, భగవత్ భావనతో చేసిన కర్మ భగవత్ రూప కర్మయే అవుతుంది.

సాధారణంగా మానవుడు ఏ కర్మలు ఆచరించినా స్వార్ధంతోనే, ఏదో లౌకిక ప్రయోజనాన్ని ఆశించే చేస్తాడు. లేదా కీర్తి కోసమైనా చేస్తాడు. ఇలా జీవితమంతా కుస్తీలు పడుతూ జీవితాన్ని కొనసాగిస్తే ఈ జీవితానికి అర్ధమే ఉండదు, వ్యర్ధమైపోతుంది.

మరి సార్ధకం చేసుకొనుటకు, మనంతట మనం తెలుసుకొని, మన జీవితాలను మలుపు త్రిప్పుతున్నామా? - లేదు. ఏదో ఒక సంఘటన జరిగి గాని, ఏవో బాధలు కష్టాలు చుట్టి ముట్టి గాని, అకస్మాత్తుగా పరిస్థితులలో మార్పు వచ్చి గాని, మహాత్ముల సాంగత్యం వల్ల గాని, అనుకోకుండా ఒక మంచి మాట వినటం వల్ల గాని, మహాత్ముల ఉపదేశం వల్ల గాని, ఎవరో ఒక మిత్రుని ప్రోద్బలం వల్ల గాని తెలియకుండానే భగవంతుని వైపు తిరుగుతాం. అలా తిరిగే అవకాశం వస్తుంది. ఆ అవకాశం అందరికీ వస్తుందా? రాదు. ఏ కొద్ది మందికో వస్తుంది. ఎందువల్ల? ఎప్పుడో ఒకప్పుడు, ఏ జన్మలోనో సత్కర్మలు చేసి ఉన్నావు గనుక, వాటి ఫలితం ఇప్పుడు పక్వానికి వచ్చింది గనుక అలా తిరిగే అవకాశం వచ్చింది. కనుక సత్కర్మలు భగవంతుని వైపు త్రిప్పుతాయి.

కనుక సామాన్యులు కూడా భగవంతుని వైపుకు తిరగాలంటే యజ్ఞ దాన తపస్సులనే సత్కర్మలు చేసి ఉండాలి. సత్ అంటూ ఈ కర్మలను భగవత్ స్మరణతో చేయాలి.

- ఓం తత్ సత్ అనే మహామంత్రం బ్రహ్మవిద్యను భద్రంగా రక్షించే బీరువా లాంటిది. మన కర్మలను దోషరహితం చేసే మంత్రం. దీనిని భగవద్గీత ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో మనకు బోధిస్తున్నది.

- లక్ష్మణ గీతను దాటిన సీత రామునికి దూరమై కష్టాల పాలైంది.
- భగవత్ గీతను దాటితే మనం పరమాత్మకు దూరమై కష్టాలపాలవుతాం. కనుక శాస్త్రం తెలుసుకొని శ్రద్ధతో కర్మలు చేయాలి. ఒకవేళ శ్రద్ధ ఉన్నా శాస్త్రం తెలియకపోతే పరమాత్మ స్మరణతో కర్మలు చేసి దోషాలను తొలగించుకోవాలి. ఇదే అర్జునుని ప్రశ్నకు భగవానుని సమాధానం.

- ఇలా అర్జునుని ప్రశ్నకు సమాధానం చెప్పిన భగవానుడు అడగని ప్రశ్నకు కూడా చెప్పబోతున్నాడు. శ్రద్ధ లేని వాని కర్మ ఫలితం ఏమిటి?

**శ్లో||** అశ్రద్ధయా హుతం దత్తం
తపస్తప్తం కృతం చ యత్ ।
అసది త్యుచ్యతే పార్థ!
నచ తత్ప్రేత్య నో ఇహ || (28)

**తా ||** శ్రద్ధ లేకుండా చేసే హోమం, దానం, తపస్సు గాని మరి ఏ ఇతర కర్మలు గాని అసత్ అని చెప్పబడతాయి. అర్జునా! ఆ కర్మలు ఇహంలో గాని, పరంలో గాని ఫలితాన్నివ్వవు.

**వ్యాఖ్య :-** శాస్త్రం తెలియకపోయినా శ్రద్ధతో చేస్తే భగవత్ స్మరణతో దోషాలను తొలగించుకోవచ్చు. కాని శ్రద్ధ గనుక లేకపోతే ఇక ఉద్ధారకం లేదు. అసలు శ్రద్ధ అంటే ఏమిటి?

(1) భగవంతుడున్నాడనే విశ్వాసం, (2) ఆయనకు దూరమై బాధలు పడుతున్నాం కనుక మళ్ళీ ఆయనకు దగ్గరైతేనే ఆనందం కలుగుతుందనే నమ్మకం, (3) భగవంతుని చేరుకొనేందుకే ఈ మానవజన్మ వచ్చిందనే

విశ్వాసం. (4) ఆయనను చేరుకొనే మార్గాన్ని తెలియజేప్పేందుకే శాస్త్రాలున్నాయని నమ్మకం. (5) ఆ శాస్త్రాలలో చెప్పిన విధంగా మనకు మార్గం చూపే వారే గురువులు అని నమ్మకం. ఇదంతా కలిపి 'శ్రద్ధ' అంటారు. ఇవి లేకపోతే శ్రద్ధ లేనట్లే, శ్రద్ధ లేకపోతే సిద్ధి లేదు.

✓ శ్రద్ధతో కర్మలు చేస్తే అవి సాత్త్వికం కాకపోయినా 'ఓం తత్ సత్' మంత్రోచ్చారణతో సాత్త్వికాలు అవుతాయి.

✓ శ్రద్ధ లేకుండా చేస్తే అవి సాత్త్వికాలైనా సరే మంత్రోచ్చారణ వల్ల సఫలత కలుగదు. అవి తామసికమైపోతాయి.

ఆధ్యాత్మిక రంగంలో శాస్త్రంపై, గురువుపై శ్రద్ధ ఉండాలి. గురువులో లోపాలు వెతికితే ఆయన చెప్పే మాటలపై విశ్వాసంపోయి సిద్ధి లభించదు. డాక్టరుపై రోగికి విశ్వాసం ఉంటేనే మందు పని చేస్తుంది. అలాగే గురువుపై శ్రద్ధ (విశ్వాసం) ఉంటేనే జ్ఞానం అవగతమవుతుంది.

- అశ్రద్ధతో చేసే యజ్ఞం ఇతరులను మోసం చేయటానికే.
- అశ్రద్ధతో చేసే దానం ఫలితాన్నివ్వదు.
- అశ్రద్ధతో చేసే తపస్సు డాంబిక తపస్సు అవుతుంది.
- అశ్రద్ధతో చేసే కర్మలన్నీ తామసిక కర్మలవుతాయి.

అలా చేసిన వారికి ఇహమూ లేదు, పరమూ లేదు.

(1) దక్ష ప్రజాపతి గొప్ప 'యజ్ఞం' చేశాడు. అది నిరీశ్వర యాగం. అతడికి పరమేశ్వరునిపై కోపం, ద్వేషం. ఆయనను అవమానించటమే తన యాగ లక్ష్యం. భగవంతునిపై ద్వేషంతో చేసే యాగం సఫలమవుతుందా? అందుకే



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

యజ్ఞ వేదిక రసాభాస అయింది. కుమార్తె సతీదేవి అగ్నికి ఆహుతి అయింది. దేవతలంతా పారి పోయారు. యజ్ఞం భగ్నమైంది. చివరకు దక్షుని తల తెగి పడిపోయింది. అంతా వ్యర్థమై పోయింది.

(2) కర్ణుడు కవచ కుండలాలను దానం చేశాడు. ఇచ్చింది కపట బ్రాహ్మణునకు అని తెలిసీ ఇచ్చాడు. ఇవ్వకుండా ఉండేందుకు, వచ్చినవాడు ఇంద్రుడని తెలిసీ తెలియనట్లు నటించి ఎంతో ప్రయత్నం చేశాడు. చివరకు ప్రతిఫలంగా 'శక్తి' ని కోరి, ముందుగానే దానిని ఇంద్రుని వద్ద నుండి గ్రహించి ఆ తరువాతనే ఇచ్చాడు. ఇచ్చిన కవచ కుండలాలు ఇంద్రునికి పనికి రావు. తీసుకున్న 'శక్తి' ఒక మహావీరుని సంహరించటానికి తగినది. కనుక ఇది సాత్త్విక దానం కాదు. అందుకే పుచ్చుకున్న శక్తి ఎవరిని సంహరించటానికి తీసుకున్నాడో వారిని చంపలేదు. కవచ కుండలాలు పోయినవి. దీనిని దానం అనటానికి వీల్లేదు. ఇది వస్తు వినిమయం. ఈ మాటను కర్ణుడే ఇంద్రునితో అన్నాడు. వినిమయం చేసుకుందాం - అని.

(3) రావణ కుంభ కర్ణులు, హిరణ్యాక్ష హిరణ్య కశిపులు, భస్మాసురుడు మొ||న రాక్షసులెందరో శరీరాన్ని హింసపెట్టే కఠిన తపస్సులు చేసారు. ఇవి తామసిక తపస్సులు. ఈ తపస్సులకుమెచ్చి భగవంతుడు వారు కోరిన వరాలు ప్రసాదించాడు. అయినా ఏం ప్రయోజనం? వారి వరాలతోనే వారు సంహరించబడ్డారు.

కనుక ఇలాంటి యజ్ఞ దాన తపస్సులు వ్యర్థమై పోయేవే.

శ్రద్ధ సాత్త్వికం కావాలంటే సత్ సంగము, భగవత్ చింతన తప్పనిసరి అని గ్రహించాలి. అందుకే ఓం తత్సత్ మంత్రోచ్చారణ ద్వారా మన శ్రద్ధను సాత్త్వికం చేసుకోవాలి.

దీనితో అన్ని అనర్ధాలకు కారణమైన అజ్ఞానాన్ని, అజ్ఞాన రూప సంసారాన్ని దాటి ధన్యులమయ్యే మార్గం తెలుస్తుంది.

- ❖ శ్రద్ధ వల్ల. పాపుల పాపం భస్మమైపోతుంది,
- ❖ జిజ్ఞాసువుల జిజ్ఞాస పూర్తవుతుంది,
- ❖ జ్ఞాని యొక్క జ్ఞానం సార్ధకమవుతుంది.

చివరకు ఆత్మ సాక్షాత్కారం - మోక్షం ప్రాప్తిస్తుంది.

కనుక శ్రద్ధ - సాత్త్విక శ్రద్ధ కావాలి. ఇదే ఈ అధ్యాయం యొక్క ఆంతర్యం.

- ప్రపంచం తీరు తెలుసుకోకుండా,
- ఆచరించవలసిన పద్ధతి తెలుసుకోకుండా,
- జీవితం యొక్క పరమ లక్ష్యం తెలుసుకోకుండా,
- వీటిని తెలియజేసే శాస్త్రాలను పట్టించుకోకుండా,

డబ్బు కోసం, పదవుల కోసం, కీర్తి ప్రతిష్టల కోసం, స్వలాభం కోసం, డంబం కోసం, కోర్కెలు తీర్చుకోవటం కోసం, ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే అది శ్రద్ధ కాదు. తామసిక ఆచరణ.

దీనివల్ల ఇహమూ లేదు, పరమూ లేదు.

వాసనలను మార్చుకొని శ్రద్ధతో తరించే అధ్యాయం ఇది. అయితే వాసనలు మార్చుకొనటం సాధ్యమా? అనేక జన్మల నుండి వచ్చే ఈ సంస్కారాలు ఎలా మారుతాయి? వాసనలవల్ల వచ్చే ప్రేరణలను నిరోధించటం ఎలా? మానవులకు మాత్రమే అవకాశం ఉన్నది. ఎలా?

జీవులు పూర్వజన్మ సంస్కారాలను బట్టి ప్రవర్తించటమే నిజమైతే దుర్మార్గాలు చేసేవారు దుర్మార్గులుగానే ఉంటారు. ప్రపంచం వైపుకు తిరిగిన వారు ప్రాపంచిక వ్యవహారాలలోనే మునిగిపోతారు. మరి వారు పరమాత్మ వైపుకు ఎలా తిరగగలుగుతారు? అలా తిరగక ఎవరి వాసనలను బట్టి వచ్చే ప్రేరణల ప్రకారం వారు ప్రవర్తిస్తుంటే శాస్త్రాలెందుకు? గురువులెందుకు?

జీవుల యొక్క నిజ స్వభావం దైవ స్వభావం. వారి తత్త్వం దైవతత్త్వం. వారిది శుద్ధ జ్ఞాన స్వరూపం, ఆనంద స్వరూపం. కనుక ప్రతి జీవుడు ఆనందాన్ని అందుకొనుటకే ప్రయత్నిస్తూ ఉంటాడు. కాకపోతే ఎలాగో తెలియక దారి తప్పుతున్నాడు.

క్రొత్తగా ఒక ఊరికి వెళ్ళాలనుకున్న వాడు 4 రోడ్ల కూడలి దగ్గరకు చేరినప్పుడు తాను ఎటువెళ్ళాలో తెలియక తికమకపడతాడు. తాను వెళ్ళవలసిన ఊరికి ఒకటే రూటు. మిగిలిన రోడ్లతో తనకు పని లేదు. అందుకే అలాంటి చోట్ల బోర్డు లేకపోయినా, అతడికి చదువు రాకపోయినా అక్కడి స్థానికులు చెప్పాలి. దానిని బట్టి గమ్యస్థానం చేరుకుంటాడు.

అలాగే మార్గం తెలియక ప్రయాణించే వారికి అక్కడి బోర్డులాగా శాస్త్రాలు మార్గాన్ని చూపుతాయి. శాస్త్రాన్ని అవగాహన చేసికోలేని



Email : care@srichalapathirao.com Contact : +91 8008539770 / +91 9886265225

వారికి శాస్త్రం తెలిసిన గురువులు ఆ మార్గాన్ని చెబుతారు. కనుక శాస్త్రాలను తెలుసుకొనుటకు గురువులను ఆశ్రయించి వారు సూచించిన మార్గాలలో సాధనలను సాగించాలి .

అలా మారటానికి ఇష్టపడక, గురువుల వద్దకు వెళ్ళక, శాస్త్రాలను నమ్మక, తమకు అన్నీ తెలుసుననే అహంభావంతో ఉండే వారే తామసులు. వారిలో ఏ మార్పూ రాదు. ఇక రాజసికులైన వారు తమకు విధించిన నియమాలను పాటిస్తూ సాత్త్వికులుగా మారవచ్చు .

కనుక మనలోని వాసనలు మారాలంటే జ్ఞానాన్ని ఉపదేశించే గురువులను ఆశ్రయించాలి. పవిత్రమైన శాస్త్రాలను తెలుసుకోవాలి. గురువులు చూపించిన మార్గంలో ప్రయాణించాలి. అలా చేసినప్పుడే తమ వాసనలలోని మార్పులను తెలుసుకోగలుగుతారు. దీనిని బట్టి -

సద్గురువు లభిస్తేనే నీ వాసనలలో మార్పులు సంభవం. ఒకవేళ సద్గురువు, లభించినా నీవు గుర్తించలేకపోయినట్లయితే ఆయనను ఆశ్రయించలేకపోయినట్లయితే ఏమీ ప్రయోజనం లేదు. వ్యర్థజీవితాన్ని గడపవలసిందే. కనుక సద్గురువులనాశ్రయించి నీ జీవితాన్ని ధన్యం చేసుకో. నీ జన్మను సార్థకం చేసుకో. 'నాన్య పంథా అయనాయ విద్యతే '.

**గద్యం** : ఓం తత్ సత్ ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం, యోగ శాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగ యోగో నామ సప్త దశోఽధ్యాయః

ఏ కోరికలు లేకుండా బ్రహ్మజ్ఞానులై శాస్త్రాలను ఆచరించేవారు మహాత్ములు. మోక్షార్థులై శాస్త్ర విహిత కర్మలు చేసేవారు సాత్త్వికులు. ఇహ పర సుఖాల కోసం శాస్త్రంలో విశ్వాసం ఉంచి ఆచరించేవారు రాజసికులు. అదీ ఇదీ లేక శాస్త్రాలను వదలి మూర్ఖంగా ప్రవర్తించేవారు తామసులు. శ్రద్ధతో సునాయాసంగా తరించే అధ్యాయం ఇది.




**Website : WWW.SRICHALAPATHIRAO.COM**

**Email : care@srichalapathirao.com**

**Contact : +91 80085 39770 / +91 98862 65225**

# శ్రీమద్భగవద్గీత

## 18 వ అధ్యాయం

# మోక్షసన్యాస యోగం



వ్యాఖ్యాత

పూజ్య గురుదేవులు

'అభినవ వ్యాస', 'జ్ఞాన ప్రపూర్ణ'

శ్రీ దేవిశెట్టి చలపతిరావుగారు

వ్యవస్థాపకులు

ఆధ్యాత్మిక జ్ఞాన పీఠం :: చిలకలూరిపేట

Website : www.srichalapathirao.com
Email: care@srichalapathirao.com
Ph : 8008539770 / 8885539770

# మోక్షసన్యాస యోగం

*ఉపోద్ఘాతం :-*

**సమస్త ప్రాణికోట్ల అంత:కరణమునందు సాక్షి స్వరూపుడై వెలసియున్న పరమాత్మ శ్రీకృష్ణభగవానునికి అనంత కోటి ప్రణామాలను అర్పిస్తూ-**

**ప్రజ్ఞా స్వరూపంలో ఉండి మనలను సన్మార్గం వైపు నడిపిస్తున్న గురుదేవుల పాదపద్మాలకు వినమ్రతతో శిరస్సు వంచి నమస్కరిస్తూ-**

**ఈ అద్భుతమైన, అపూర్వమైన, అనంతమైన, ఆనంద ప్రదాయిని అయిన, అఖండ జ్ఞానసాగరమైన గీతామృతాన్ని తనివిదీరా పానంచేయాలనే ఆకాంక్షతో ఈ భగవద్గీతా శాస్త్రాన్ని శ్రవణం చేస్తున్న ఆత్మ స్వరూపులైన మీ అందరికీ మరీ మరీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను తెలియజేస్తూ భగవద్గీతలోని చివరి ఘట్టం ఈ 18వ అధ్యాయాన్ని ప్రారంభించటానికి అవకాశం ఇచ్చిన అందరికీ ధన్యవాదాలు.**

**ఈ భగవద్గీతా శాస్త్రాన్ని విన్నవారూ ప్రయోజనం పొందుతారు, అలాగే చెప్పిన వారూ ప్రయోజనం పొందుతారు. చెప్పిన వారికి కలిగే ప్రయోజనం ఏమిటో ఈ అధ్యాయంలోనే 68 వ శ్లోకంలో ఇలా భగవానుడు తెలియజేశాడు. ''పరమ రహస్యమైన ఈ జ్ఞానాన్ని నా భక్తులకు వినిపించిన వారు నా యందు పరమ భక్తిని పొంది, నన్నే చేరుకుంటారు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు" -అని; అలాగే 69 వ శ్లోకంలో "మనుజులలో అట్టి వాని కన్న ప్రియుడైన వాడు, ఇష్టుడైన వాడు**

నాకు ఈ భూలోకంలో మరియొకడు ఎవడూ లేడు". -అని స్వయంగా భగవానుడే తెలియజేశాడు.

ఇక వినే వారికి కలిగే ప్రయోజనం ఏమిటో 71 వ శ్లోకంలో భగవానుడు తెలియజేశాడు. "ఎవరు శ్రద్ధతోను, అసూయ లేకుండా ఈ గీతా శాస్త్రాన్ని వింటారో అట్టి వారు పాప విముక్తులై పుణ్య లోకాలను పొందుతారు" అని. కనుక ఈ గీతా శాస్త్రాన్ని చెప్పినా , విన్నా ఇద్దరికీ అత్యంత ప్రయోజనమే సిద్ధిస్తుంది.

ఈ మోక్ష సన్యాస యోగాన్ని శ్రద్ధతో ఆలకించండి, అధ్యయనం చేయండి. ఆచరణ విషయం తర్వాత చూసుకోవచ్చు. ఎందుకంటే మోక్షం అనేది సన్యాసం ద్వారా - త్యాగం ద్వారా మాత్రమే సిద్ధిస్తుంది. అయితే ఏం త్యాగం చెయ్యాలి? ప్రాపంచిక వస్తువులతో -విషయాలతో- భోగాలతో ఉన్న సంగ భావాన్ని పూర్తిగా త్యాగం చెయ్యాలి. అలాగే అనాత్మ సంబంధమైన ఈ దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధులతో గల తాదాత్మ్యాన్ని త్యాగం చెయ్యాలి. ఇది అంత తేలికైన విషయం కాదు. ముందుగా మన యొక్క మనస్సులను ఈ సంసారంలోనే - అంటే ఈ ప్రపంచంలోనే ఉంచి సరి చేసుకోవాలి. శుద్ధం చేసుకోవాలి. పవిత్రం చేసుకోవాలి. అలా మానసికంగా తయారైన తరువాతనే సర్వసంగ పరిత్యాగం చెయ్యాలి. అన్నింటితోను గల సంగాన్ని - తాదాత్మ్యాన్ని పరిత్యాగం చెయ్యాలి. అలాగాక ఆవేశంతో త్యాగాలు చేస్తే ఆ త్యాగం హాస్యాస్పదం అవుతుంది. ప్రయోజనం లేకుండా పోతుంది.

క్రొత్తగా వివాహం చేసుకున్న దంపతుల జంట ఉన్నది. ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ ఉన్నది. ఒకరి కోసం మరొకరు ఎంతటి త్యాగానికైనా వెనుదీయని మనస్తత్వం వారిది. అయితే

వారిది కటిక పేదరికం. వివాహం తరువాత మొదటి సంవత్సరం మ్యారేజ్ డే వస్తున్నది. భార్య కోసం ఏం బహుమతి తెచ్చి ఇవ్వాలా ? అని భర్త ; భర్త కోసం ఏ గొప్ప బహుమతి నిద్దామా? అని భార్య ఒకటే ఆలోచన. గొప్ప గొప్ప బహుమతులు తెచ్చేందుకు ఇద్దరి వద్దా ధనం లేదు. భర్త వద్ద ఒక వాచీ ఉంది. కానీ దానికి స్ట్రాపు లేక దాచిపెట్టి ఉంచాడు. ఇప్పుడు దానిని అమ్మి ఆ డబ్బుతో ఏదైనా బహుమతి కొనాలనుకున్నాడు. ఆ వాచీని అమ్మాడు. కాని చాలా తక్కువ డబ్బు వచ్చింది. ఏమి తీసుకుందామా ? అని ఆలోచించాడు. భార్యకు నల్లని పొడవాటి జుట్టు ఉంది. దానికి తగినట్లు మంచి దువ్వెన లేదు. అందుకే షాపుకు వెళ్లి మంచి విలువైన దువ్వెన తెచ్చి రహస్యంగా దాచుకున్నాడు. భార్య కూడా ఆలోచిస్తున్నది. భర్తకు ఏ బహుమతి తీసుకుందామా? అని. చివరకు ఒక నిర్ణయానికి వచ్చింది, "ఆయనకు వాచీ ఉన్నది గాని ఉపయోగించటానికి స్ట్రాపు లేదు. కనుకు విలువైన స్ట్రాపును కొందామనుకొని, డబ్బు లేదు గనుక తన అందమైన నల్లని జుట్టును అమ్మేసి స్ట్రాపును తెచ్చింది. మరునాడే వారి *marriage day*. భర్త ఎంతో ఆనందంతో దువ్వెన ప్రెజెంట్ చేశాడు. కాని బోడి గుండు చూచి అవాక్కయ్యాడు. భార్య వాచీ స్ట్రాపు ఇచ్చింది. కాని వాచీ లేదని తెలిసి బాధ పడింది. ఇద్దరి త్యాగాలు వ్యర్థమై పోయినవి. కనుక త్యాగం ప్రయోజనకరంగా ఉండాలి. ఎవరికీ ప్రయోజనం లేని త్యాగం వ్యర్థమే కదా!

17 వ అధ్యాయం శ్రద్ధాత్రయ విభాగయోగం. ఇందులో చెప్పిన విషయాలన్నీ మనకు జీవితంలో ఎంతగానో ఉపయోగపడతాయి. ఆధ్యాత్మిక రంగంలో ముందుకు వెళ్ళటానికి, మోక్ష ప్రాప్తికి ఆ అధ్యాయంలో చెప్పిన విషయాల ఆచరణ ఎంతో ప్రయోజనకరం.

కారు నడిపేటప్పుడు డ్రైవరు ముందు ఒక *PANEL BOARD* ఉంటుంది. దానిలో వేగం, పెట్రోలు, ప్రయాణించిన దూరం మొ//న వివరాలు ఉంటాయి. వాటిని చూస్తూ డ్రైవరు వేగం పెంచుకోవటమో, తగ్గించుకోవటమో చేస్తాడు. అలాగే పెట్రోలు అయిపోయేటట్లుంటే దారిలోని పెట్రోలు బంకులో నింపుకుంటాడు. ఈ జాగ్రత్తలు పాటిస్తేనే ప్రయాణం సాఫీగా సాగుతుంది. లేకపోతే కారు ఎక్కడో నిర్జన ప్రదేశంలో ఆగిపోయి ప్రయాణానికి ఆటంకం కలిగే ప్రమాదం ఉంటుంది.

అలాగే జీవితంలో మనం చేసే పనులు, ఆలోచనలు అన్నీ త్రిగుణాలపై ఆధారపడి ఉంటాయి. ఈ గుణాలే *PANEL BOARD*. మనం చేసే కర్మలను బట్టి, మనకు కలిగే ఆలోచనలను బట్టి, మన గుణం సాత్త్వికమైతే జన్మ సార్థక మౌతుందని గ్రహించి ముందుకు ప్రయాణిస్తాం. అలాకాక రాజసికమైతే, శ్రద్ధతో గమనించి, శాస్త్ర విధిని పాటించి, భగవత్ స్మరణతో మన గుణాన్ని సాత్త్వికంగా మార్చుకోవాలి. ఇక మన గుణం తామసికమని గుర్తిస్తే కొంచెం ఆగి -కర్మలను ఆపు చేసి అంతః కరణమనే ఇంజన్‌ను పారమార్థికం అనే కర్మాగారంలో రిపేరు చేయించి రాజసికానికి, తరువాత సాత్త్వికానికి మారాలి. అప్పుడే తగిన అర్హత.

ఇలా అన్ని అర్హతలు సంపాదించిన తరువాత చేరవలసింది ఈ మోక్షమనే గమ్య స్థానానికే. ఇదే చివరి మెట్టు. *18* వ మెట్టు. అయ్యప్ప స్వామిని దర్శించాలంటే *18* మెట్లు ఎక్కాలి. అలాగే పరమాత్మ దర్శనానికి భగవద్గీతలోని *18* అధ్యాయాలు *18* మెట్లుగా ఉపయోగపడతాయి. అన్ని అధ్యాయాలలోను ఇదే పెద్ద అధ్యాయం. దీనిలో *78* శ్లోకాలున్నాయి. దీని తర్వాత పెద్ద అధ్యాయం *2* వ అధ్యాయం-

సాంఖ్య యోగం. ఇందులో 72 శ్లోకాలున్నాయి. ఈ రెండు అధ్యాయాలకు ఒక ప్రత్యేకత ఉన్నది.

*2 వ అధ్యాయం ఉపక్రమాధ్యాయం.

* 18 వ అధ్యాయం ఉపసంహారాధ్యాయం.

*2 వ అధ్యాయం విషయాలను తెలిపే విషయ సూచిక.(INDEX)

*18 వ అధ్యాయం అన్ని విషయాలను సంగ్రహించిన సంక్షిప్త గీత.

ఇంతకు ముందు భగవద్గీతలో చెప్పిన అన్ని విషయాలను సంగ్రహ పరచి సంక్షిప్తంగా ఇందులో చెప్పటం జరిగింది. అందుకే ఇది అన్నింటికన్నా పెద్ద అధ్యాయం అయింది.

నది ఎక్కడో పుట్టి, ఎన్నో వంపులు తిరిగి ప్రవహిస్తూ చివరకు సముద్రాన్ని చేరే సరికి చాలా వెడల్పు అవుతుంది., విశాలమవుతుంది. అలాగే ఈ గీతా జ్ఞాన గంగా ప్రవాహం కూడా ఎన్నో వంపులు తిరుగుతూ ముగింపుకు వచ్చేసరికి విశాలమై పెద్ద అధ్యాయం అయింది. జ్ఞాన గంగ ప్రవహిస్తూ ప్రవహిస్తూ మోక్షమనే ఆనంద సాగరాన్ని చేరేటప్పటికి చాలా విశాలమైంది. ఈ గొప్ప అధ్యాయాన్ని, విశాలమైన అధ్యాయాన్ని 'ఏకాధ్యాయీగీత' -'సంక్షిప్త గీత' అని కూడా అంటారు. ఎందుకంటే గీతాసారమంతా ఇందులో నిక్షిప్తమై ఉన్నది.

ఈ అధ్యాయంపై భాష్యం వ్రాస్తూ శంకర భగవత్పాదులు - " ఈ అధ్యాయం గీతా సారమే కాదు, సమస్త వేదాంత సారం" అన్నారు. ఇలాంటి అధ్యాయాన్ని తెలుసుకొనుటకు సిద్ధమైన వారంతా గొప్ప అదృష్టవంతులే. ఎందుకంటే- జ్ఞానేశ్వరులు ఈ అధ్యాయాన్ని 'కలశాధ్యాయం' అన్నారు.

భగవద్గీత 15 అంతస్థుల భవనం. ఒక్కొక్క అధ్యాయం ఒక్కొక్క అంతస్థు. 15 వ అంతస్థులో పురుషోత్తముడున్నాడు. పురుషోత్తమ ప్రాప్తితో అసలు శాస్త్రం ముగిసినట్లే. 15 వ అధ్యాయం చివరిలో -

" ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయానఘ"

అంటూ 'ఇతి ' అనే ఉపసంహారక (ముగింపు) పదం కూడా వాడేశారు.

అయితే ఇంకా 3 అధ్యాయాలు 16,17,18 కూడా ఉన్నాయి. 16,17 అధ్యాయాలు ఈ 15 అంతస్థుల గీతా భవనానికి గోపురాలు. చివరి 18 వ అధ్యాయం ఈ గీతా భవనం పై ప్రతిష్టించిన కలశం. అందుకే దీనిని 'కలశాధ్యాయం' అని కూడా అంటారు.

ప్రతి రోజూ దేవాలయానికి వెళ్ళి భగవంతుని దర్శించుకునే వారికి పురుడో, సూతకమో (అశౌచం) వచ్చినప్పుడు దేవాలయంలోనికి ప్రవేశించరాదు., గర్భగుడిలోని భగవంతుని దర్శించకూడదు అంటారు పెద్దలు. మరి అలాంటి వారికి ప్రత్యామ్నాయం ఏమిటి? అలాంటి వారు ఆపద్ధర్మంగా దేవాలయం వెలుపలనే ఉండి కలశ దర్శనం చేసుకుంటే రావలసిన పూర్ణ ఫలితం వస్తుందని ధర్మ శాస్త్రం చెబుతున్నది. అలాగే ఏ కారణం చేతనైనా భగవద్గీతలోని 17 అధ్యాయాలను పూర్తిగా గాని, కొన్ని అధ్యాయాలను గాని, కొన్ని శ్లోకాలను గాని విని తెలుసుకోలేని వారు ఈ 18 వ అధ్యాయాన్ని పూర్తిగా శ్రద్ధతో విన్నట్లైతే మొత్తం భగవద్గీతను విన్న పూర్తి ఫలితం లభిస్తుంది. ఎందుకంటే ఈ అధ్యాయం పూర్తి భగవద్గీతకు సంక్షిప్త రూపం గనుక. అందుకే దీనికి కలశాధ్యాయం అని పేరు. ఈ అధ్యాయాన్ని వినటానికి సంసిద్ధులైన వారు అదృష్టవంతులు అన్నది కూడా అందుకే.

ఈ అధ్యాయం భగవద్గీత మొత్తానికి సింహావలోకనం. అంటే ఇంతకు ముందు చెప్పిన అన్ని ముఖ్య విషయాలు సంక్షిప్త రూపంలో ఈ అధ్యాయంలో రాబోతున్నాయి. కనుక ఇది గీతాసార సంగ్రహం. అంతే కాదు, ఈ అధ్యాయంలోనే భగవానుడు తన బోధను ముగించగా, అంతా విన్న అర్జునుడు యుద్ధానికి సిద్ధపడి, గాండీవం చేతబట్టి "కరిష్యేవచనం తవ" నీవు చెప్పినట్టే నడుచుకుంటానన్నాడు.

కర్తవ్యాన్ని విడిచిపెట్టి గాండీవాన్ని ఆవలపారవేసి యుద్ధ విముఖుడైన అర్జునుడు కర్తవ్యోన్ముఖుడై, గాండీవాన్ని చేతబట్టి 'కరిష్యేవచనంతవ' అంటూ యుద్ధానికి సిద్ధమయ్యాడు. అందుకే దీనిని అభ్యుత్థాన యోగం అని కూడా అన్నారు.

ఇది మోక్ష సన్యాస యోగం.

ఈ అధ్యాయానికి ఈ పేరు ఎలా వచ్చింది? ఏ ఉద్దేశ్యంతో దీనికి ఈ పేరు పెట్టి ఉంటారు?

భగవద్గీత అర్జున విషాద యోగంతో ప్రారంభమై మోక్ష సన్యాస యోగంతో ముగుస్తున్నది. అర్జునుని విషాదం ఒట్టి విషాదం కాదు. అది విషాద యోగం. భగవంతుని సన్నిధిలోనిది ఆ విషాదం. భగవంతుని ముందు వ్యక్తమైనది ఈ విషాదం. ఈ విషాదం యోగానికి దారి తీసేదే గాని రోగానికి దారి తీసేది కాదు. అందువల్లనే ఈ విషాదానికి ఫలితంగా సన్యాసం సిద్ధించింది. మోక్షం ప్రాప్తించబోతున్నది.

ఒక విధంగా చూస్తే ఈ అధ్యాయం 5 వ అధ్యాయం కర్మ సన్యాస యోగానికి కొనసాగింపే. అక్కడ కర్మలకు సన్యాసం చెబితే ఇక్కడ మోక్షానికి సన్యాసం చెబుతున్నారు. లోకంలో అన్నిటినీ సన్యసించవచ్చు, సన్యసించాలి కూడా. కాని మోక్షాన్ని సన్యసించటం ఏమిటి?

దీనికి రెండు విధాలుగా అర్థం చెప్పుకోవచ్చు.

1. మోక్షం కావాలనే కోరికను సన్యసించుట

2. మోక్షం కొరకు అన్నింటినీ సన్యసించుట

1. మోక్షం కావాలనే కోరికను సన్యసించుట :- మోక్షం అంటే విడుదల. అయితే మోక్షం అనేది ఎవరికి? బంధంలో ఉన్నవారికే. బంధంలో ఉన్న వాడు మోక్షాన్ని (విడుదలను) కోరుకుంటాడు.

*జైలులో ఉన్నవాడు ఎలాగైనా జైలు నుండి బయట పడాలనుకుంటాడు, *రోగంతో ఉన్నవాడు ఎలాగైనా ఈ రోగం నుండి బయట పడాలనుకుంటాడు, *ఋణగ్రస్తుడైనవాడు ఋణ విమోచన పొందాలనుకుంటాడు. అలాగే మోక్షం అన్నది బంధంలో వున్న వాడికే - జీవుడికే. బంధంలో ఉన్న వారికి భగవద్గీత బంధ విముక్తిని బోధిస్తున్నది.

17 వ అధ్యాయంలో చెప్పిన విషయాలన్నీ బంధవిముక్తికే, మోక్షానికే. మోక్షానికి మార్గం తెలియజేయబడింది, ఆ మార్గం వెంట ఎలా ప్రయాణం చేయాలో తగిన సాధనలను తెలియజేసింది ఆ అధ్యాయం. ఆ సాధనలను అర్థం చేసుకొని, ఆచరించినట్లైతే సమస్త దుఃఖాలు తొలగిపోతాయి, శాశ్వత ఆనందం కలుగుతుంది. ఇదే మోక్షం. అంటే పైన చెప్పిన విధంగా సాధనలు చేసిన వాడు మోక్షాన్ని తప్పక పొందుతాడు. మోక్షాన్ని తప్పక పొందే వాడు ఇక మోక్షాన్ని కోరవలసిన అవసరం ఏముంది? అందుకే మోక్షమును సన్యసించుట అంటే మోక్షం కావాలనే కోరికను విడిచిపెట్టుట అని అర్థం చెప్పటం జరిగింది.

మనం నిజంగా మోక్ష స్వరూపులమే. కాని ఆ విషయం మనకు తెలియదు. తెలిసినా నమ్మం. లార్వాదశలో ఉన్న పురుగును నీవు అందమైన సీతాకోక చిలుకవు, ఎంత దూరమైనా ఎగిరి పోగలవు అంటే నమ్ముతుందా? నాదేం

అందం? నేనెలా ఎగరగలను? అంటుంది. మనం కూడా అంతే -'తత్త్వమసి'- ఆ పరమాత్మ నీవే- అంటే నమ్మలేక పోతున్నాం. నేనేం పరమాత్మను? అనుకుంటున్నాం. భ్రమలో ఉంటున్నాం. జీవుణ్ణనే భ్రాంతిలో ఉంటున్నాం. బంధంలో ఉంటున్నాం. ఈ బంధం కూడా ఒక భ్రమే.

రాత్రి కల వచ్చింది. ఆ కలలో ఒక దొంగతనం చేశావు. ఆ యింటి వారు మేలుకొని పట్టుకున్నారు. ఒక త్రాడు తెచ్చి అక్కడి స్తంభానికి కట్టి వేశారు. కొడుతున్నారు. నన్ను వదలండి, వదలండి అని ప్రాధేయ పడుతున్నావు. వారు మాత్రం విడిచి పెట్టటం లేదు. నీవు అలా విడిచి పెట్టమని ప్రాధేయపడుతూనే ఉన్నావు. ఇంతలో మెలకువ వచ్చింది. మరి ఇప్పుడు కూడా విడిచి పెట్టండి, విడిచి పెట్టండి అని గోల చేస్తావా? లేదు. విడిచిపెట్టమనే మాటను విడిచి పెడతావు. ఎందుకంటే ఇప్పుడు బంధంలో ఉన్నాను అనే భావన లేదు, అంటే బంధం కూడా ఒక భ్రమే.

అలాగే అజ్ఞానావస్థ అయిన ఈ జాగ్రదావస్థలో నేను జీవుణ్ణి, బద్ధుణ్ణి అని భావించి ముక్తి కోసం- మోక్షం కోసం కేకలు వేస్తావు, ప్రయత్నిస్తావు. సాధనలు చేస్తావు, భగవంతుణ్ణి ప్రార్థిస్తావు. అదే నీవు గురు బోధ ద్వారా శాస్త్ర శ్రవణం చేసి, సాధనలు చేసి, జ్ఞానావస్థలోనికి మేలుకుంటే? ఇప్పటి దాకా ఉన్న నీ జీవ భావం, దానిని తొలగించుకొనుటకు చేసిన సాధనలు - అన్నీ స్వప్న తుల్యమై పోతాయి. కనుక మోక్షాన్ని ప్రసాదించండి అని భగవంతుని ప్రార్థిస్తావా? మోక్షం కావాలనే కోరిక ఉంటుందా? ఉండదు. మోక్షం కావాలనే కోరికను సన్యసించుట అంటే ఇదే.

నేను బంధ విముక్తుణ్ణి అని భావించిన వాడు విముక్తిని కోరడు. నేను మోక్ష స్వరూపుణ్ణి అని గ్రహించిన వాడు మోక్షాన్ని కోరడు.

*ఒక చాకలికి *50* గాడిదలున్నాయి. ప్రతి రోజూ ఉదయం వాటిని బయటకు తోలుకుపోతాడు. ఒకరోజు అతడికి వేరే పని ఉండి పొరుగూరికి వెళుతూ భార్యతో అన్నాడు, "నేను గనుక వెళ్లిన పని కాక రాత్రికి తిరిగి రాకపోతే ఉదయమే గాడిదలను మన వాడి చేత బయటకు తోలించు" అని. ఆయన వెళ్ళి రాత్రికి రాలేదు.

వాడికొక కొడుకున్నాడు. చదువుకుంటున్నాడు. వేకువ జామునే తల్లి వాణ్ణి నిద్ర లేపింది. గాడిదలను తోలుకెళ్లమని చెప్పింది. అలాగేనని వాడు వెళ్ళి వాటిని అదిలించాడు. అవి మాత్రం కదలటం లేదు. ఇలా గాదని ఒక కర్ర తీసుకొని వాటిని కొట్టటం ప్రారంభించాడు. అయినా సరే అవి కదలటం లేదు. వాడికి విసుగు పుట్టి తల్లితో చెప్పాడు.

తల్లికి అసలు విషయం తెలుసు. తండ్రి ప్రతిరోజు రాత్రి కాగానే గాడిదలన్నింటినీ ఒక చోటికి తోలి, పొడవైన త్రాడును తీసుకొని ఆ త్రాటిని వాటి కాళ్ల దగ్గర ఆడించి, వాటన్నిటినీ కట్టివేసినట్లు ఆ త్రాడును వాటి చుట్టూ త్రిప్పే వాడు. ఆ గాడిదలు నిజంగానే యజమాని తమను కట్టి వేశాడని భావించి కదలకుండా ఉండి పోయేవి. వేకువ జామున ఆ చాకలి వచ్చి కట్టు విప్పినట్లు ఆ త్రాడును మళ్లీ దాని చుట్టూ త్రిప్పేవాడు. నిజంగా కట్టిందీ లేదు, విప్పిందీ లేదు. అవి నిజమైన బంధంలో లేక పోయినా భావ బంధంలో ఉన్నాయి. భ్రమలో ఉన్నాయి. తల్లి పిల్లవానికి ఈ సూత్రం చెప్పింది. వాడు అలా చేయగానే అన్నీ బయటకు కదిలి వచ్చినవి.

అలాగే మనం కూడా భ్రమలో ఉండి బద్ధుల మనుకుంటున్నాం. ఈ భ్రమలోనే బాధలు పడుతున్నాం. విముక్తిని కోరుకుంటున్నాం. భ్రాంతి తొలగితే చాలు బంధమూ లేదు, బాధలూ లేవు.

*ఒక అనుమాన చక్రవర్తి పొరుగూరి నుండి తిరిగి వస్తున్నాడు. దారిలో బాగా దప్పికయింది. చీకటి పడింది. ఒక చోట మినుకు మినుకు మంటూ ఒక దీపం వెలుగుతున్నది. ఆ ఇంటి దగ్గరకు వెళ్లి మంచినీళ్ళివ్వమన్నాడు. ఆ యింటి ఇల్లాలు మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చింది. అదే సమయంలో అక్కడ చెట్టు కొమ్మ మీద ఒక బల్లి ఉన్నది. దాని నీడ ఈ చెంబులోని నీళ్ళలో పడ్డది. నీళ్ళు త్రాగిన తర్వాత మన వాడికొక అనుమానం. బల్లి కూడా లోపలికి పోయింది - అని. దానితో కృంగి కృశించి పోతున్నాడు. ఎన్ని వైద్యాలు చేసినా ప్రయోజనం కనిపించటం లేదు. చివరకు ఒక స్నేహితుడు యుక్తిగా ఒక టాబ్లెట్ ఇచ్చి ఇది వేసుకో అన్నాడు. దానితో అతడికి వాంతి అయింది. అదే సమయంలో తాను తెచ్చి దాచి ఉంచిన బల్లిని ఆ వాంతిలో పడేశాడు. "ఆ! అదిగో చూడు నీవు నీటిని త్రాగినపుడు లోనికి పోయిన బల్లి బయటకు వచ్చేసింది" అన్నాడు. అంతే. అతడి ఆరోగ్యం కుదుటబడింది. బల్లి లోపలకు పోలేదు, బయటకు రాలేదు.

అలాగే మనం భ్రాంతిలో బంధంలో ఉన్నామనుకుంటున్నామేగాని నిజంగా బంధం లేదు. కనుక మోక్షాన్ని కోరవలసిన పని లేదు. భ్రాంతిని తొలగించుకుంటే చాలు. ఇదే మోక్ష సన్యాసం.

2. మోక్షం కొరకు సన్యసించుట.

మోక్ష సన్యాస యోగమనే ఈ అధ్యాయానికి మరొక అర్థం మోక్షం కొరకు సన్యసించుట. మోక్షాన్ని పొందాలంటే సర్వసంగపరిత్యాగం (సన్యాసం) తప్పనిసరి. అలాగని

కాషాయ వస్త్రాలు ధరించి, ఏ అరణ్యాలకో వెళ్ళాలని గాదు; అలా వెళ్ళిన వారంతా మోక్షార్థులనీ గాదు, మోక్షాన్ని పొందగలరనీ గాదు. భగవాన్ రమణ మహర్షులు కాషాయ వస్త్రాలను ధరించ లేదు. శ్రీ రామకృష్ణ పరమహంస వివాహితుడు. కాషాయ వస్త్ర ధారి కూడా కాదు. అయినప్పటికీ వారు నిజమైన సర్వసంగ పరిత్యాగులు. అంతటి సర్వ సంగ పరిత్యాగులను కాషాయ వస్త్రాలను ధరించిన వారిలో చూడగలమా? మరి ఏం పరిత్యాగం చేస్తే సన్యసించినట్లు? నేను అనే అహంకారాన్ని, నాది అనే మమకారాన్ని ఎవరు పూర్తిగా విడిచి పెట్టగలరో వారే సన్యసించినట్లు. అట్టి వారే ముక్తి నందు కున్నట్లు. వేష భాషలన్నీ భుక్తి కోసమే గాని ముక్తి కోసం కాదు. అయితే అటువంటి నిజమైన సన్యాసం త్యాగం వల్లనే సాధ్యం. త్యాగం అంటే కర్మ ఫల త్యాగం.

మనం జీవితంలో తప్పనిసరిగా కొన్ని కర్మలను చేస్తుంటాం. అలా చేయటం అవసరం, కర్తవ్యం కూడా. అలా చేసే కర్మలను నిర్లిప్తంగా చేస్తూ, సర్వ కర్మ ఫలాలను భగవంతునికి సమర్పిస్తూ చేస్తున్నట్లైతే క్రమక్రమంగా బాహ్య జగత్తుతోను, ప్రాపంచిక విషయాలతోను సంబంధాన్ని - ఆసక్తిని వదిలించుకోవటానికి సామర్థ్యం కలుగుతుంది. వివేకంతో కూడిన త్యాగ భావంతో మనం జీవించగలుగుతాం. ఇట్టి కర్మ ఫల త్యాగాన్ని అలవరచుకుంటేనే నిజమైన సన్యాసాన్ని - సర్వసంగ పరిత్యాగాన్ని సాధించగలం. దీనివల్లనే మోక్ష సిద్ధి. కనుక మోక్షాన్ని పొందాలంటే సర్వ సంగ పరి త్యాగం (సన్యాసం) ముఖ్యం. అటువంటి స్థితిని పొందాలంటే 'కర్మ ఫల త్యాగం' అనేది అవసరం అని తెలుస్తుంది.

భగవద్గీతను నేరుగా విన్న అర్జునుడు కురు క్షేత్ర యుద్ధానంతరం సోదరులతోను, ద్రౌపదీ దేవితోను కూడి 37

సం||లు గృహస్థ జీవితాన్ని గడిపాడు. ఆ సమయంలో భగవంతుని బోధను ఆచరణలో పెట్టి కర్మ ఫల త్యాగంతో కర్మలు చేశాడు. నిష్కామకర్మలాచరించాడు. కర్తృత్వ భావాన్ని వదలి కర్తవ్యతా భావంతో నిర్లిప్తంగా కర్మలాచరించి మనస్సును శుద్ధం చేసుకున్నాడు. అయితే శరీరాన్ని వదిలేంత వరకు అలా కర్మలు చేస్తూనే ఉన్నాడా? అంటే లేదు. యుద్ధానంతరం *37* సంవత్సరాలకు శ్రీకృష్ణుడు దేహాన్ని చాలించాడు. దానితో పాండవులు రాజ్యపాలనా విముఖులై అర్జునుని మనుమడైన పరీక్షిత్తును హస్తినాపురరాజ్య పట్టాభిషిక్తుని చేసి మహా ప్రస్థానం చేయ సంసిద్ధులయ్యారు. సమస్త భోగాలను, భోగలాంఛనాలను, ఆభరణాలను, కిరీటాలను వదలిపెట్టి, తమకున్న ధనధాన్యాలను, సంపదలను దానం చేసి, నార చీరలను ధరించి, ద్రౌపదీపాండవులు తూర్పు దిక్కుగా ప్రయాణమై వెళ్ళారు. ఇదే మహా ప్రస్థానం, ఇలా ప్రయాణించి తూర్పు నుండి దక్షిణానికి, దక్షిణం నుండి పశ్చిమానికి, పశ్చిమం నుండి ఉత్తర దిక్కుకు వెళ్ళారు. తీర్థ స్నానాలు చేస్తూ, దైవ దర్శనాలు చేసుకుంటూ, తపస్సులు చేసుకుంటూ, స్వల్పమైన ఆహారాన్ని తీసుకుంటూ శరీరాన్ని శుష్కింపజేసుకుంటూ *25* సంవత్సరాలు దేశమంతా సంచరించారు. చివరకు మేరుపర్వతాన్ని చేరి, దానిని అధిరోహిస్తూ దేహాలను వదిలేశారు. యోగ మార్గంలో ముక్తులయ్యారు.

కనుక సన్యాసం అంటే కేవలం కర్మ ఫల త్యాగమే కాదు. త్యాగం ద్వారా సర్వసంగపరిత్యాగం అని తెలుస్తున్నది. కనుక మోక్షార్థి అయిన వాడు అంతఃకరణ శుద్ధి కలిగేంతవరకు కర్మలు చేస్తూనే ఫలాన్ని త్యాగం చేస్తూ, కర్తృత్వ భావం లేకుండా, నిష్కామ కర్మలతో జీవిస్తూ, ఆ తర్వాత

సర్వసంగ పరిత్యాగంతో ముక్తులు కావాలి. అందుకే "త్యాగేనైకే అమృతత్వ మానసుః" అని కైవల్యోపనిషత్తు తెలియజేసింది.

ఈ విధంగా సర్వసంగ పరిత్యాగం చేసి మోక్షాన్ని పొందే యోగం గనుక ఇది మోక్ష సన్యాస యోగం అన్నారు.

ఈ విషయాన్ని ఋజువు చేసే అద్భుత శ్లోకం ఈ అధ్యాయం చివరిలో ఉన్నది. అదే "సర్వధర్మాన్‌పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనేది.

ఈ విషయాన్ని నొక్కి చెప్పే ఈ అధ్యాయంలో కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞాన కాండ ఏక ధాటిగా ప్రస్థావనకు రాబోతున్నాయి. అర్జునుని ప్రశ్నతో ఈ అధ్యాయం ప్రారంభమవుతున్నది.

*-సన్యాసం, త్యాగం- ఈ రెంటిని గురించి ప్రశ్నిస్తున్నాడు అర్జునుడు.*

**అర్జున ఉవాచ:**

శ్లో|| సంన్యాసస్య మహాబాహో !
తత్త్వమిచ్ఛామి వేదితుమ్|
త్యాగస్య చ హృషీకేశ !
పృథక్కేశినిషూదన|| (1)

తా|| అర్జునుడు అడుగుతున్నాడు : మహాబాహో!, హృషీకేశ!, కేశి సంహారా! సన్యాసం యొక్క తత్త్వాన్ని, త్యాగం యొక్క తత్త్వాన్ని వేరు వేరుగా తెలుసుకోవాలనుకుంటున్నాను.

వ్యాఖ్య:- *భగవద్గీతలో అర్జునుని చివరి ప్రశ్న* ఇదే. ఇక చివరి లో భగవానుని ప్రశ్నకు అర్జునుని సమాధానం మాత్రం 72వ శ్లోకంలో ఉంది. అర్జునుని ప్రశ్నలతో పని లేకుండా సన్యాసము, త్యాగము అంటే ఏమిటో వేరు వేరుగా చెప్పటం ప్రారంభించి,

భగవానుడు కర్మ యోగం, భక్తి యోగం, జ్ఞాన యోగం, ధ్యాన యోగాలను అఖండంగా వివరించి ,మోక్ష సిద్ధిని పొందే ఉపాయాన్ని ఉపదేశించటం జరిగింది. భగవంతునికి సంపూర్ణంగా శరణాగతులు కావటమే మోక్ష ప్రాప్తికి అసలైన ఉపాయమని చెప్పి, అంతటితో ఆగకుండా ఈ అద్భుతమైన గీతా జ్ఞానాన్ని వినే అర్హత ఎవరికో చెప్పి; ఈ జ్ఞానాన్ని అందుకున్న వారికి, అధ్యయనం చేసిన వారికి, కలిగే ఫలితం ఏమిటో ఫలశ్రుతిని కూడా తెలియజెప్పటం జరిగింది. చివరకు అర్జునా! ఏకాగ్రతతో ఈ జ్ఞానాన్ని విన్నావా? నీ మోహం - అజ్ఞానం తొలగిందా? అని ప్రశ్నించి ఊరుకున్నాడు. అప్పటి వరకు అర్జునుని ఉలుకూ పలుకూ లేదు. కనుక ఇదే చివరి ప్రశ్న.

"ఓ మహాబాహూ! హృషీకేశ!, కేశినిషూదన! సన్యాసము, యోగము యొక్క తత్త్వమును వేరు వేరుగా తెలుసుకోవాలనుకుంటున్నాను"- ఇదీ అర్జునుని ప్రశ్న.

ఈ ప్రశ్నను అడిగిన విధానం ఇంతకు ముందు అడిగిన విధానంకన్న వేరుగా ఉన్నది. ఇప్పుడు అర్జునునిలో ఎంతో వినయం, విధేయత, భక్తి భావం కనిపిస్తున్నాయి. "అదేమిటో చెప్పు"- అనిగాక 'తెలుసుకోవాలనుకుంటున్నాను' అన్నాడు. 4 వ అధ్యాయంలో గురువును ఉత్తమ శిష్యుడు ప్రశ్నించే విధానాన్ని ఇలా తెలియజేశారు, "తద్విద్ధి ప్రణి పాతేన పరిప్రశ్నేన సేవయా"- అని. అంటే ఆత్మజ్ఞానాన్ని బోధించే గురువును అనువైన సమయంలో సమీపించి, ఆయనకు నమస్కరించి, సేవించి, వినయంతో, తెలుసుకోవాలనే కుతూహలంతో తన సందేహాన్ని వెలిబుచ్చాలి - అని. ఇప్పుడు అర్జునుడు కూడా అలాగే అడుగుతున్నాడు. అంటే అర్జునునిలో నిజమైన శిష్య లక్షణం కనిపిస్తున్నది ఇప్పుడు.

ప్రారంభంలో శిష్యులందరికి గురువు పట్ల వినయం, విధేయత ఉండకపోవచ్చు. అలా ఉండాల్సిన పనికూడా లేదు. అయితే ఆత్మ జ్ఞానాన్ని గురువు ద్వారా పొందుతున్న తరువాత, అది శాస్త్ర యుక్త మైన జ్ఞానం అని గ్రహించిన తరువాత వినయ విధేయతలు కలగాలి. అప్పటికీ వారిలో ఆ లక్షణాలు లేకపోతే వారు పాషాణ హృదయులే. ఇక కొందరు ప్రారంభంలో వినయ విధేయతలు చూపిస్తారు. పరిపూర్ణమైన జ్ఞానాన్ని పొందుతున్న తరువాత, పొందిన తరువాత వారు మహా జ్ఞానులమయ్యామని భావించి పూర్వపు వినయ విధేయతలు లేకుండా పోవటమే గాక, గురువును అవమానించటానికి, అపకారం కలిగించటానికి, తప్పుడు ప్రచారం చేయటానికి కూడా వెనుకాడరు. ఇలాంటి వారే గురు ద్రోహులు.

*ఈ శ్లోకంలో అర్జునుడు 3 విశేషణాలతో భగవంతుని సంబోధిస్తున్నాడు. 1. మహాబాహో, 2. హృషీకేశ, 3. కేశినిషూదన అని.*

*1. మహాబాహో! :-* గాండీవాన్ని ఆవల పారవేసి యుద్ధ విముఖుడైన అర్జునుని బలాన్ని, శౌర్యాన్ని, వీరత్వాన్ని, ప్రతాపాన్ని జ్ఞాపకం చేసి యుద్ధోన్ముఖుని చేయటానికి భగవానుడు ఎన్నో సార్లు అర్జునుని *మహాబాహో!* అంటూ హుషారెక్కించే ప్రయత్నం చేశాడు. మరిక్కడ అర్జునుడే శ్రీ కృష్ణుని ఇలా సంబోధిస్తున్నాడు. ఎందుకు? శ్రీ కృష్ణునికి హుషారెక్కించటానికా? లేక ఆయనను యుద్ధానికి పురి కొల్పటానికా? రెండూ కాదు. మరెందుకు?

యుద్ధం చేయటానికి ఎలా గొప్ప బాహువులు అవసరమో అలాగే రధం తోలాలన్నా గొప్ప బాహువులుండాలి. రోజంతా శత్రువుల బాణాల దెబ్బలను తప్పించుకుంటూ రధాన్ని

నడపటం అంటే సామాన్య విషయం కాదు. తనను తాను రక్షించుకుంటూ రథికుని కూడా రక్షించాలి. అందుకే మహాబాహో! అనే సంబోధన కావచ్చు. లేదా బాధలలో ఉన్న ఆత్మీయులను దగ్గరకు తీసుకోవాలన్నా గొప్ప బాహువులుండాలి. ఇప్పుడు తాను దిక్కుతోచని స్థితిలో ఉన్నాడు. తన సమస్యకు పరిష్కారం తెలియక తికమక పడుతున్నాడు. బాధ పడుతున్నాడు. అయోమయంలో ఉన్నాడు. కనుక తనను దగ్గరకు తీసుకొని ఆదరించాలి. ఒక వేళ యుద్ధం చేయాల్సి వస్తే తనకు సారథిగా ఉండి అన్ని విధాల సాయం అందించటానికి గొప్ప బాహువులు భగవానునికి ఉండాలి, ఉన్నాయి అని మనస్సులో మెదిలి ఉండాలి.

అర్జునునికే కాదు మనందరకూ మన జీవన రథాలను నడపవలసినవాడు ఆ పరమాత్మే కనుక ఆయన బాహువుల ఆశ్రయం మనకూ కావాలి. అందుకే మహాబాహో! అనే సంబోధన ఎంతో అర్థవంతమైనది.

2. హృషీకేశ! :- హృషీకాలంటే ఇంద్రియాలు. ఈ ఇంద్రియాలను ప్రేరేపించేది ఆ పరమాత్మే. ఇంద్రియాలు గుర్రాల వంటివి. వాటిని ప్రేరేపించి స్వాధీనంలో పెట్టుకొని రథాన్ని సరైన మార్గంలో నడిపించే వాడు పరమాత్మే. కనుక బుద్ధిశాలి. మేధావి అని భగవంతునికి ప్రశంస.

ప్రపంచంలోకి పరుగులు పెట్టే మన ఇంద్రియాలను సరైన మార్గంలో నడపమని మనమూ భగవంతుని ఆర్తితో ప్రార్థించాలి- అని అంతరార్థం.

3. కేశినిషూదన! :- 'కేశి' అనే పేరుగల రాక్షసుని కంసుడు పంపగా, అతడు బాలకృష్ణుని చంపాలని వచ్చాడు. వాడిది గుర్రపు మూతి. వాణ్ణి బాగా దగ్గరకు రానిచ్చి, తన చేతిని వాడి నోట్లోకి పోనిచ్చి, ఆ చేతిని పెంచి, శ్రీకృష్ణుడు ఆ రాక్షసుని

సంహరించాడు. బాల్యంలోనే ఎందరో రాక్షసులను యుక్తితో సునాయాసంగా చంపిన వాడు శ్రీకృష్ణుడు. కనుక ఆయనకు శక్తీ ఉంది, యుక్తీ ఉంది, బలమూ ఉంది, బుద్ధి బలమూ ఉంది - అని తెలియజెప్పటానికే ఈ . కేశినిషూదన! అనే సంబోధన.

శ్రీకృష్ణుడు తనకు గురువుగా, సారథిగా, మార్గదర్శకుడుగా, సలహాదారుగా, స్నేహితుడుగా, బంధువుగా, ఆత్మీయుడుగా, శ్రేయోభిలాషిగా లభించినందుకు అర్జునుడు ఎంతగా పొంగిపోతున్నాడో ఈ విశేషణాలను బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. ఇంతటి వాడవు నీవు నాకు అండగా ఉంటే నాకు భయమెందుకు? శిక్షించే వాడికి రెండు చేతులైతే రక్షించే వాడికి వెయ్యి చేతులు - ఇదీ అర్జునుని భరోసా.

ఇలా అర్జునుడు ప్రశంసించటానికి కారణం భగవానునిపై గల భక్తియే. పరిపూర్ణ భక్తి, వినయం, విధేయత, శ్రద్ధ.- ఇవి శిష్యునికి ఉన్నప్పుడే గురువు యొక్క అనుగ్రహం సిద్ధిస్తుంది.

అందుకే అంటున్నాడు అర్జునుడు, నేనేదో ఉబుసుపోకకు అడగటం లేదు, తత్త్వాన్ని తెలుసుకోవాలని, యదార్థ స్థితిని గ్రహించాలని, సందేహం తొలగించుకోవాలని అడుగుతున్నాను- అని. అంతే కాదు. ప్రశ్న అడిగినట్లు గాక తెలుసుకోవాలనుకుంటున్నాను అనే కోరికను వెల్లడించటంలో వినయం విధేయత ఉట్టిపడుతున్నాయి.

ఇంతకూ అసలు ప్రశ్న ఏమిటి? "సన్యాసము, త్యాగము వీటి తత్త్వం ఏమిటి?"- అని.

భగవద్గీతలో ఇంతకు ముందు అనేక పర్యాయాలు సన్యాసము, త్యాగము అనే పదాలు వచ్చినవి. ఒక్కొక్కప్పుడు రెండూ ఒక్కటే అనిపించినవి. ఒక్కొక్కప్పుడు రెండింటి అర్థాలు వేరు వేరేమో ననే భావన కలిగింది. ఇంతకూ వాటి అర్థం

ఒక్కటేనా? వేరు వేరా ? ఏదో భేదం లేకపోతే రెండు పదాలు ఎందుకు వాడినట్లు? ఏమిటా భేదం? - ఇదే అర్జునుని ప్రశ్న.

అసలు అర్జునుడు ఈ ప్రశ్నను ఎందుకు వేసినట్లు ?- కర్మ యోగం ద్వారా నిష్కామ కర్మలను, ఫలాపేక్ష రహిత కర్మలను ఆచరిస్తూ, పాత వాసనలను క్షయం చేసుకుంటూ, క్రొత్త వాసనలు చేరకుండా అంతఃకరణాన్ని శుద్ధం గావించుకొని నైష్కర్మ్యసిద్ధిని పొంది, అప్పుడు కర్మలను సన్యసించాలి - అని ఇంతకు ముందే భగవానుడు తెలియజేశాడు. అంటే కర్మ యోగం ద్వారా కర్మ సన్యాసం గావించాలని, అప్పుడే మోక్ష ప్రాప్తి అని తెలియజేశాడు 5 వ అధ్యాయంలోనే. ఈ మాటలన్నీ అప్పుడే విని వంటబట్టించుకున్న అర్జునుడు ఒక నిశ్చయానికి వచ్చి కర్మ యోగ ఆచరణ ద్వారా కర్మలను సన్యసించాలనుకున్నాడు. ఆ తరువాత భగవానుడు ఆత్మజ్ఞాన సంబంధమైన రహస్యాలనెన్నింటినో అద్భుతంగా తెలియజేశాడు. ఆ తరువాత భగవంతుని స్వరూప స్వభావాలను తెలియ జెప్పి తన విశ్వ రూపాన్ని అర్జునుని కోరికపై చూపాడు. దానితో అర్జునుడు భయం, భక్తి, ఆశ్చర్యం, ఆనందం ముప్పిరిగొనగా ఆ విశ్వరూపుని అనేక విధాలుగా ప్రశంసించి భగవంతుని చేరుకొనుటకు ఉపాయమేమిటని అర్థించగా 'అనన్య భక్తి'యే అందుకు ఉపాయమని భగవానుడు తెలియజేసి తనలో పరమ భక్తిని నెలకొల్పే విశేషాలనెన్నింటినో తెలియజేశాడు.

ఇప్పుడు తాను పరిపూర్ణ భక్తుడు. భగవంతునికి ఇష్టుడైన వాడు. 'భక్తోసిమే సఖాచేతి' -నీవు నాకు భక్తుడవు, సఖుడవు- అని పరమాత్మ చేతనే ప్రశంసా పత్రం అందుకున్న అదృష్టవంతుడు. మరి ఇంతటి భక్తుడైన తాను మోక్షం పొందటానికి కర్మలను సన్యసించటం మంచిదే గదా! ఇంకా

ఈ కర్మలతో తనకేం పని? అసలు ఈ రాజ్యమెందుకు? భోగాలెందుకు? ఇది నీది, అది నాది అనే భావన ఎందుకు? దీని నుండి (యుద్ధం నుండి) తప్పించుకొని వెళ్ళి మోక్ష ప్రాప్తికి పాటు పడితే సరిపోతుంది గదా! కనుక చివరిసారిగా అడిగి చూద్దాం - అనే ఉద్దేశంతో అడుగుతున్నాడు, "మహాత్మా! సన్యాసం- త్యాగం- వీటి భావమేమిటి? వీటి యదార్ధతత్త్వం ఏమిటి? వేరు వేరుగా వాటిని గూర్చి తెలియజేయి?"అని.

అర్జునుడు మహా తొందరలో ఉన్నాడు. తనకు ఇష్టం లేని ఈ యుద్ధాన్ని తప్పించుకోవాలని, జన్మ సార్థక్య హేతువైన మోక్ష ప్రాప్తికి సాధనలు చేయాలని అర్జునుని ఆలోచన. అందుకే ఈ ప్రశ్న వేశాడు. మరి భగవానుడు ఏమని సమాధానం చెబుతున్నాడు?-

*-అర్జునుని ప్రశ్నకు భగవానుని సమాధానం.*

*శ్రీభగవానువాచ:-*

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్యాసం కవయో విదుః|
సర్వకర్మఫలత్యాగం
ప్రాహుస్త్యాగం విచక్షణాః|| (2)

తా:- భగవానుడు చెబుతున్నాడు: కోరికలతోను, ఫలితాన్ని ఆశించి చేసే కర్మలను విడిచిపెట్టటం సన్యాసం అని మహర్షులు, జ్ఞానులు అంటారు. ఇక అన్ని కర్మ ఫలాలను విడిచిపెట్టటం త్యాగం అని వివేకులైన వారు అంటున్నారు.

వ్యాఖ్య:- భగవద్గీతలో సన్యాసం అంటే ఇల్లు వాకిలి వదలి, భార్యా బిడ్డలను వదలి, కాషాయ వస్త్రాలు ధరించి అరణ్యాలకు వెళ్ళటం – అని ఎక్కడా చెప్పలేదు. కామ్యకర్మలను వదలటమే సన్యాసం అన్నారు. సంపదలు కలుగుతాయని సత్యనారాయణ

వ్రతాలు, ధన ప్రాప్తికి లక్ష్మీ పూజలు, సంతానం కొరకు పుత్రకామేష్టి యాగాలు, అశ్వత్థ వృక్షానికి పూజలు, ఎన్నికలలో గెలవటానికి తిరుపతి మ్రొక్కులు, క్షేమ స్థైర్య ధైర్య, అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్ధకామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం అని చేసే పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, దానాలు మొ//న కర్మలే కామ్యకర్మలు. కామ్య కర్మలను వదలి నిష్కామంగా మన నిత్య నైమిత్తిక కర్మలను చేయవచ్చు. కనుక కామ్యకర్మలను వదలుటే సన్యాసం- అని మహాత్ములు అంటారు.

ఇక త్యాగం అంటే సర్వ కర్మ ఫల త్యాగం. మనం నిత్య నైమిత్తిక కర్మలు చేసినా; జీవనోపాధికి, కుటుంబ పోషణకు అవసరమైన- ఉద్యోగం, వ్యాపారం, వృత్తి, పరిశ్రమలు లాంటి కర్మలు ఏవి చేసినా; దైవ కార్యాలైన పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, తపస్సులు, దానాలు - ఏవి చేసినా; శాస్త్ర విహిత కర్మలను వేటిని చేసినా అన్నింటిలోను కర్మ ఫలాలను వదలాలి. ఫలితం భగవదార్పణం, పరమేశ్వరార్పణం- అనే భావన ఉండాలి. ప్రతి కర్మకు ఫలితం ఉంటుంది. అయితే ఆ ఫలితం పై ఆశ, ఆసక్తి ఏ మాత్రం లేకుండా కర్మలు చేయుటే త్యాగం అంటారు. మోక్షార్థులైన సాధకులు చేయవలసింది ఇదే. కోరికతోనే కర్మలను ప్రారంభించినా ఫలితంపై ఆసక్తిని విడిచిపెట్టి భగవదార్పణ బుద్ధితో కర్మలను కొనసాగించాలి అని కొందరు పండితుల భావం. ఒక్క మాటలో చెప్పాలంటే-

*మనం చేసేవి కర్మలు.

*మనకు వచ్చేది కర్మ ఫలం

*చేసే కర్మలను వదలటం సన్యాసం.

*వచ్చే కర్మ ఫలాన్ని వదలటం త్యాగం.

అంతః కరణ శుద్ధి జరిగేంత వరకు కర్మలను వదలటం ఎవ్వరికీ సాధ్యం కాదు. అలా వదలకూడదు కూడా. చేస్తుండాల్సిందే. అయితే ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తుండాలి. ఫలాసక్తిని విడిచి చేయాలి.

నిజంగా సన్యాసము , త్యాగము రెండూ ఒక్కటిగానే అనిపిస్తాయి. ఎందుకంటే రెండూ వదలటమే గనుక. కామ్య కర్మలు చేయవద్దు అంటే కోరికలను వదలమని చెప్పటమే. ఫల త్యాగం అంటే వచ్చే ప్రయోజనాన్ని వదలటమే. అయితే రెంటి మధ్య స్వల్ప భేదం ఉంది. ఏమిటది?

*కర్మ ఇప్పుడు చేసేది. ఫలితం ఎప్పుడో వచ్చేది.
*ఇప్పుడు చేయాల్సిన దానిని వదులుకోవటం సన్యాసం
*ఎప్పుడో వచ్చే దానిని వదులు కోవటం త్యాగం.

ఇంకా చెప్పాలంటే-

*అపేక్షతో కూడిన కర్మలను వదలటం సన్యాసం.
*కర్మలలో అపేక్షను వదలటం త్యాగం.

రేపు ఎప్పుడో వచ్చే ఫలితాన్ని తలచుకుంటూ ఇప్పుడు చేసే కర్మ ఎలా ఉంటుందంటే ఆకాశంలోకి చూస్తూ నేలమీద నడిచినట్లుంటుంది. వేటగాడు వల వేస్తే పక్షులు వలలో పడ్డాయి. వాటిని పట్టుకుందామని పోతే వలతో సహా ఎగిరి పోయినవి. వాటిని పట్టుకోవాలని ఆకాశంలోకి చూస్తూ నేల మీద నడుస్తూ ఏనుగుల కోసం తీసిన గోతిలో పడ్డాడు. అలా ఉంటుంది.

*- మరికొందరి అభిప్రాయాలను ఈ శ్లోకంలో తెలియజేయబోతున్నారు.*

శ్లో|| త్యాజ్యం దోషవదిత్యేకే
కర్మ ప్రాహుర్మనీషిణః|

యజ్ఞదానతపఃకర్మ
న త్యాజ్యమితి చాపరే|| (3)

తా|| కర్మను దోష పూరిత మైనదిగా భావించి వదిలి పెట్టాలని కొందరు బుద్ధి మంతులు అంటారు. యజ్ఞ, దాన, తపస్సులను విడువకూడదని మరికొందరు పండితుల అభిప్రాయం.

*వ్యాఖ్య:- (1).* కర్మలు దోష పూరితాలు గనుక కర్మలను వదిలి పెట్టాలని కొందరు- ముఖ్యంగా సాంఖ్యులు చెబుతారు. జాగ్రత్తగా ఆలోచిస్తే అసలు దోషం లేని కర్మ అంటూ ఈ ప్రపంచంలో ఏదైనా ఉన్నదా? లేదు. పుణ్యకర్మలు చేసినా, పాప కర్మలు చేసినా ఏవైనా సరే కర్మ ఫలాలను ఇవ్వక మానవు. ఆ కర్మ ఫలాలు మళ్ళీ మళ్ళీ జన్మలను తెచ్చి పెడతాయి. కాకపోతే పుణ్య కర్మలు బంగారు సంకెళ్ళవుతాయి. పాప కర్మలు ఇనుప సంకెళ్ళవుతాయి. అడుసు త్రొక్కటం ఎందుకు? కాళ్లు కడుక్కోవటం ఎందుకు? అందం కోసమని కన్ను పొయ్యే కాటుక పెట్టుకుంటామా? కనుక కర్మలు విడిచి పెట్టాల్సిందే అని సాంఖ్యుల అభిప్రాయం.

అయితే ఈ అభిప్రాయాన్ని కొందరు వ్యతిరేకిస్తారు. ఎందుకంటే శరీరం ధరించిన ప్రతి మానవుడికి కర్మలను విడిచి పెట్టటం సాధ్యం కాదు. కర్మలు చెయ్యకుండా ఒక్కక్షణం కూడా ఉండలేడు. దేహయాత్ర జరగాలంటే తిండి తినాలి. అదీ కర్మయే. ధనం సంపాదించాలి. అదీ కర్మే. వండుకోవాలి. ఇతరులతో వ్యవహరించాలి. చదువుకోవాలి. పూజ చెయ్యాలి. యజ్ఞ దాన తపస్సులు చేయాలి. వృత్తి ధర్మాలు పాటించాలి. ఇవన్నీ కర్మలే. కనుక శాస్త్ర విహిత కర్మలను తప్పక ఆచరించవలసిందే అంటారు కర్మ పరాయణులైన మీమాంసకులు.

సామాన్య మానవులకు, సాధకులకు కర్మలను వదలటం సాధ్యం కాదు గాని గుణాతీతుడైన జ్ఞానికి మాత్రం సాధ్యమే. గుణాలే కర్మలకు ప్రేరణ. ఆయన గుణాతీతుడు గనుక ప్రేరణ ఉండదు. అసలు అతడు కర్మలను వదిలాడు అనరాదు. కర్మలే అతణ్ణి విడిచి పోయినవి. ఒక వేళ జ్ఞాని కర్మలు చేస్తున్నాడు- అని అనిపించినా అది చూచే వాడి దృష్టిలోనే గాని ఆయన దృష్టిలో ఆయన అకర్తే. అర్జునుడు అజ్ఞాత వాస కాలంలో పేడిగా ఉన్నాడు. పేరు బృహన్నల. అందరూ అతణ్ణి చూసి పేడిపేడి అంటారే గాని, అతడి దృష్టిలో మాత్రం తాను వీర పురుషుడే. అలాగే మహాత్ముడు నిజంగా అకర్తే. కాకపోతే చూచే వాళ్ళ దృష్టిలో అతడూ కర్మలు చేస్తున్నట్టే ఉంటుంది. కాని అతడి శరీరం ద్వారా జరిగే కర్మలతో అతడికి సంబంధం ఉండదు. అతడు నైష్కర్మ్యసిద్ధిని పొందాడు గనుక అతడికి కర్మల యెక్క అవసరం ఉండదు.

ఐతే ఇక్కడ అర్జునుడు అడుగుతున్నది ఆత్మజ్ఞాని విషయం కాదు. మరెవరి విషయం? ముముక్షువుల విషయం. సాధకుల విషయం. మోక్షాన్ని అందుకోవాలని తపించే తన లాంటి వాళ్ళ విషయం.

*(2).* యజ్ఞ దాన తపస్సులను మోక్షార్థులు విధిగా చేయాలి. - అని అందుకే మరి కొందరు పండితులు చెబుతున్నారు. మోక్షార్థులు కర్మలను విడిచి పెట్టి మనగలిగే వీలు లేదు గనుక వారు తప్పక కర్మలు చేయవలసిందే. అయితే ఎలాంటి కర్మలు చేయాలి? స్వభావ అనుగుణమైన కర్మలు చేయాలి. ముఖ్యంగా యజ్ఞ దాన తపస్సులు చేయాలి. ఆ కర్మల ద్వారానే వారు మనశ్శుద్ధిని పొంది ఆత్మజ్ఞానాన్ని అభ్యసించాలి. తద్వారా మోక్షాన్ని పొందాలి.

మొత్తం మీద *i)* కామ్య కర్మలను వదలుట సన్యాసమని కొందరు, *ii)*కర్మలు చేస్తూ ఫలాన్ని ఈశ్వరార్పణంగావించటం త్యాగమని కొందరు, *iii)* కర్మలన్నీ దోషయక్తాలే గనుక అన్ని కర్మలు విడిచి పెట్టాలని కొందరు, *iV)* యజ్ఞ దాన తపస్సులు విధిగా చేయవలసిందే అని కొందరు చెబుతున్నారు.- అని వివిధ అభిప్రాయాలు తెలియజేశాడు భగవానుడు.

*-లోకంలోని వివిధ పండితుల అభిప్రాయాలను తెలియజేసిన భగవానుడు ఇప్పుడు తన అభిప్రాయం ఏమిటో స్పష్టం చేస్తున్నాడు.*

శ్లో|| నిశ్చయం శృణు మే తత్ర
త్యాగే భరతసత్తమ ! |
త్యాగో హి పురుషవ్యాఘ్ర !
త్రివిధః సంప్రకీర్తితః|| (4)

తా|| భరత శ్రేష్టుడా! ఆ త్యాగ విషయంలో నా నిశ్చయాన్ని విను. పురుష వ్యాఘ్రు! త్యాగమనేది మూడు విధాలుగా కీర్తించబడుతున్నది.

వ్యాఖ్య:- కర్మలన్నీ దోష పూరితాలు గనుక అన్ని కర్మలు వదలమని కొందరు పండితులు చెబుతున్నారని, కొందరేమో యజ్ఞ దాన తపస్సులు తప్పక చేయాల్సిందేనని, మరికొందరు కర్మలు చేస్తూ కర్మ ఫలాలను వదలాలని చెబుతున్నారని ఇంతకు ముందు శ్లోకాల్లో తెలియజేయటం జరిగింది.

ఇప్పుడీ శ్లోకంలో భగవానుడు తన నిశ్చయాన్ని చెబుతానంటున్నాడు. అసలు ఇన్ని అభిప్రాయాలు ఎందుకు?

మనం స్కూలుకు వెళ్ళాం. ఒక క్లాసులో టీచరు తెలుగు వ్యాకరణాన్ని బోధిస్తూ 'భరనభభరవ' అనే గణాలు ఉత్పలమాల

వృత్తానికి సంబంధించినవని, ప్రాస నియమం ఉన్నదని, యతి ఇన్నవ అక్షరం అని తెలియజేస్తున్నాడు. ఆ ప్రక్కనే ఉన్న మరొక క్లాసులోని టీచరు ఆక్సిజన్ తయారు కావాలంటే పొటాషియం క్లోరైడు, మాంగనీస్ డయాక్సైడ్ రెండిటిని వేడి చేస్తే వస్తుందని చెబుతున్నాడు. అది విన్న మనం ఆ ప్రక్కన మరొక క్లాసుకు వెళ్తే అక్కడ $(a+b)^2=a^2+2ab+b^2$ అని ఆల్ జీబ్రా సూత్రాలను తెలియజేస్తున్నాడు. 3 వ తరగతి వరకే చదువుకున్న మనకు అంతా అగమ్య గోచరంగా ఉన్నది. కాని ఆ తరగతి గదుల్లో కూర్చొని వింటున్న విద్యార్థులకు ఏ గజిబిజి లేదు. అంతా అర్థమవుతూనే ఉన్నది.

అలాగే ఒక్కొక్క స్థాయిలో ఉన్న వారి కోసం మహాత్ములు తమకు తోచిన ధర్మాలను తెలియజేస్తుంటారు. అయితే మన స్థాయి ఏమిటో తెలుసుకొని మన కోసం చెబితే అవి మనకు ఉపయోగపడతాయి. అందుకే భగవానుడు మన కోసం తన నిశ్చితాభిప్రాయాన్ని తెలియజేస్తున్నాడు.

(వేరు వేరుగా పండితులు చెప్పిన అభిప్రాయాలు ఒక్కొక్క స్థితిలో ఉన్న వారి కోసం చెప్పినవి. వాటిని క్రోడీకరించి, అందరికి తగిన విధంగా చెబితే అవగాహన చేసుకోవటం తేలికవుతుంది.)

మానవులలో ఉత్తమ సాధకులైన వారు పరిపక్వ స్థితిని పొందిన తర్వాత అన్ని కర్మలు సన్యసించవలసిందే. అయితే అట్టి స్థితిని పొందేంత వరకు -సాధక దశలో ఉన్నవారు కొన్ని శాస్త్ర విహిత కర్మలు తప్పక చేయవలసిందే. అవే యజ్ఞ దాన తపస్సులు . కాకపోతే ఆ చేసే కర్మలు బంధం కాకుండా జాగ్రత్త పడాలి. అందుకే ఫల త్యాగం చెయ్యాలి అని చెప్పటం. కనుక సకామ కర్మలను విడిచిపెట్టి, యజ్ఞ దాన తపస్సులను

ఫలాపేక్ష రహితంగా- లేదా భగవదార్పణ బుద్ధితో చెయ్యాలి. ఇదే సాధకులందరి విద్యుక్త ధర్మం.

సందేహాలు, సంశయాలు పండితులకేగాని, భగవంతునికి ఏ సందేహాలు, సంశయాలు ఉండవు. ఆయనది పరిపూర్ణ జ్ఞానం, నిశ్చయ జ్ఞానం. అందుకే నిశ్చయం శృణుమే- మేనిశ్చయంశ్రుణు- నానిశ్చయం విను అంటున్నాడు. ఇలా అంటున్నాడంటే భగవంతుడు నిశ్చయానికి వచ్చి చెబుతున్నాడని గ్రహించాలి. అందుకే 'మేమతః' - నా అభిప్రాయం అనకుండ 'మేనిశ్చయం'- నానిశ్చయం అని గట్టిగా చెబుతున్నాడు. అంటే మనం ఆచరించటానికి వీలుగా ఆలోచించి చెబుతున్న మాట అని గ్రహించాలి.

అంతే కాదు. త్యాగం కూడా *3* విధాలు అంటున్నారు. ముందు అధ్యాయంలో ఆహారం *3* విధాలని, యజ్ఞ దాన తపస్సులు *3* విధాలని చెప్పినట్లు ఇప్పుడు త్యాగం కూడా *3* విధాలని తెలియజేస్తున్నాడు. ఆ *3* విధాలేమిటో *7* వ శ్లోకం నుండి చెప్పబోతున్నారు.

ఈ శ్లోకంలో భగవానుడు అర్జునుని 'భరతసత్తమ', 'పురుషవ్యాఘ్రు' అని రెండు పదాలతో సంబోధిస్తున్నారు.

భరతసత్తమ*!* :- అంటే భరత వంశంలో ఉత్తముడైన వాడా*!* అని. పురుషవ్యాఘ్రు*!* అంటే పురుషులలో శ్రేష్ఠుడా*!* అని. మొదటిది వంశ ఘనత, రెండవది వ్యక్తి ఘనత.

ఇలా ఎందుకు ప్రశంసిస్తున్నాడు*?*

తాను చెబుతున్నది త్యాగం గురించి. మానవుడికి మనస్సులో త్యాగ భావం కలగటం అంత సామాన్య విషయం కాదు. తాను కోరుకున్న వస్తువును సంపాదించుకొని అనుభవించటంలోనూ, ఇతరులకన్న ఉన్నతంగా ఉండటంలోనూ ప్రతి మానవుడికి ఎంతో ఆసక్తి ఉంటుంది

గాని, ఇతరుల శ్రేయస్సు గురించి అంత ఆసక్తి ఉండదు. మన కోసం ఎంత డబ్బైనా ఖర్చు పెడతాం, చెత్త ఖర్చులన్నీ పెడతాం కాని ఒక సత్కార్యానికి ఖర్చు చెయ్యాలంటే, కష్టంలో ఉన్నవారిని ఆదుకోవాలంటే మనసొప్పదు. అందుకే త్యాగ బుద్ధి అంత సులభం కాదు. ఐతే వారి పెద్దలు అలాంటి త్యాగ బుద్ధి కలిగి ఉంటే, త్యాగాలు చేసిన చరిత్ర ఉంటే వాటిని గొప్పగా చెప్పుకుంటూ తానూ అలా నడుచుకోవాలని కొందరైనా అనుకుంటారు. అందుకే ఇక్కడ అర్జునునికి ప్రశంస -అయ్యా! నీవు భరత వంశ శ్రేష్ఠుడవు, కాబట్టి నీకు త్యాగం గొప్ప విషయం కాదు, మీ వంశంలో ఎందరో గొప్ప వ్యక్తిత్వం గల వారు జన్మించారు. కనుక నీవు కూడా అట్టి వ్యక్తిత్వం గల వాడివే అని ప్రశంస.

ధర్మరాజు దేహంతో సహా స్వర్గానికి వెళ్ళాడు. అయితే అక్కడ దుర్యోధనుడు సింహాసనా రూఢుడై అందరి సేవలు అందుకుంటూ వైభవంగా భోగాలనుభవిస్తున్నాడు. అది చూచి నా సోదరులెక్కడ? అని అడిగితే అప్పుడు ఇంద్రుడు మాయచేత నరకాన్ని సృష్టించి అందున్న సోదరులను, ద్రౌపదిని చూపించటం జరిగింది. వారంతా అనేక యాతనలను అనుభవిస్తున్నారు. ఆ ప్రదేశమంతా భరించలేని దుర్గంధం. అయితే ధర్మరాజు రాకతో అక్కడి పాపులకు ఉపశమనం లభించి, "మహాత్మా! మాకోసం కొంత కాలం మీరు ఇక్కడే ఉండండి" అని అక్కడి పాపులు అభ్యర్థించారు. దేవతల ప్రతినిధి ధర్మరాజును స్వర్గానికి రమ్మని ఆహ్వానించాడు. కాని ధర్మరాజు వెళ్ళ నిరాకరించాడు. "నా పుణ్యం అంతా వీళ్ళకు ధారపోస్తున్నాను. కనుక నాకు పుణ్య ఫలం లేదు. అందువల్ల ఇక్కడే ఉంటాను" అన్నాడు. అప్పుడా దేవభటుడన్నాడు, "

ధర్మరాజా! పుణ్యాన్ని త్యాగం చేస్తే అది ద్విగుణీకృతమవుతుంది" అని. అదీ త్యాగ మహిమ.

17 అధ్యాయాల భగవద్గీతను విన్న తర్వాత, విన్న విషయాలను ఏ మాత్రం నిలుపుకున్నా త్యాగ బుద్ధి కలుగక తప్పదు. ఆ బుద్ధి కలగలేదు అంటే విన్న విషయాలు ఏ మాత్రం తలకెక్కలేదని అర్థం.

త్యాగం సత్త్వ రజస్తమో గుణ భేదాలతో 3 విధాలని చెప్పిన భగవానుడు ఆ మూడు విధాల త్యాగాన్ని గురించి వివరించే ముందు త్యాగం విషయంలో తన నిశ్చయాన్ని తరువాతి 2 శ్లోకాలలో తెలియజేయబోతున్నాడు.

*-త్యాగం విషయంలో భగవానుని నిశ్చయం ఏమిటి? -*

శ్లో|| యజ్ఞదానతపఃకర్మ
న త్యాజ్యం కార్యమేవ తత్|
యజ్ఞో దానం తపశ్చైవ
పావనాని మనీషిణామ్|| (5)

తా:- యజ్ఞ, దాన, తపస్సులనే కర్మలను విడిచి పెట్టరాదు. వాటిని చేస్తూ ఉండవలసిందే. యజ్ఞ దాన తపస్సులు వివేకులను పావనం చేస్తాయి. (పవిత్రం చేస్తాయి).

వ్యాఖ్య:- భగవానుడు ఎంతో స్పష్టంగా, నిశ్చయంగా యజ్ఞ దాన తపస్సులను వదిలి పెట్టరాదు, తప్పక చేయవలసిందే అని ఘంటాపథంగా తెలియజేస్తున్నాడు.

సాధారణంగా వేదాంతంలో పుణ్య కర్మలు చేస్తే బంగారు సంకెళ్ళు, పాప కర్మలు చేస్తే ఇనుప సంకెళ్ళు; రెండూ మానవుని బంధించేవే; - ఆ కర్మలు మళ్ళీ మళ్ళీ జన్మలను తెచ్చి పెట్టేవే; కనుక ఈ కర్మలను -అవి పుణ్య కర్మలైనా సరే చేయకూడదు అని చెబుతారు. అయితే ఇది పూర్ణ జ్ఞానం

గలవారు చెప్పే మాట కాదు. భగవానుడు ఇలాంటి అభిప్రాయానికి వ్యతిరేకి. పుణ్యకర్మలు తప్పక చేయవలసిందే అంటున్నాడు. ఎందుకు చేయాలి?

మనలో వాసనలున్నంత కాలం మనస్సు శుద్ధంగా, శాంతంగా ఉండలేదు. వాసనలు క్షయమైతేనే మనశ్శుద్ధి, మనస్సు శుద్ధి అయితే తప్ప బుద్ధి సూక్ష్మం కాదు. బుద్ధి సూక్ష్మమైతే తప్ప ఆత్మ జ్ఞానాన్ని- బ్రహ్మ విద్యను అందుకునే నైపుణ్యం కలగదు. ఆత్మ జ్ఞానాన్ని అందుకుంటే తప్ప మన యదార్థ స్వరూపం తెలిసే వీలు లేదు. మన యదార్థ స్వరూపం తెలిస్తే తప్ప మోక్షం కలగదు. కనుక మోక్ష ప్రాప్తికి ఈ సత్కర్మలు పరోక్షంగా సహాయపడతాయి. అందుకే యజ్ఞ,దాన, తపస్సులు తప్పక చేయాలి- అనటం.

దీనినే భగవానుడు మరొక విధంగా వాటి అవసరాన్ని తెలియజేస్తున్నాడు. 'యజ్ఞ దాన తపస్సులు వివేకిని పవిత్రం చేస్తాయి'- అని. అయితే ఒక సందేహం. అందరినీ పవిత్రం చేయలేవా? కేవలం వివేకిని మాత్రమే పవిత్రం చేస్తాయా? అని.

ఫలితం అనేది మనం కర్మ చేసే విధానాన్ని బట్టే ఉంటుంది. కర్మ మంచిదైనపుడు ఫలితం మంచిది కాక పోతుందా? అని మరొక సందేహం. కర్మ మంచిదే అయినా చేసే విధానం కూడా మంచిది కావాలి. ఆ విధానం సరిగ్గా తెలియాలి.

భోజనం చేస్తే ఆకలి తీరుతుంది. అయితే అన్నం ఉడక్కపోయినా, కూరలు మాడిపోయినా, ఉప్పు మరీ ఎక్కువైనా తినలేం కదా! అప్పుడు ఆకలి ఎలా తీరుతుంది? అలాగే యజ్ఞ దాన తపస్సులను కూడా చేయవలసిన పద్ధతిలో, మంచి ఉద్దేశంతో చేస్తేనే ఫలితం. అంటే సాత్త్విక శ్రద్ధతో చేస్తేనే ఫలితం. రాజసిక, తామసిక శ్రద్ధతో చేస్తే ప్రయోజనం

ఉండదు. ఒక్కొక్కప్పుడు వ్యతిరేక ఫలితం కూడా రావచ్చు. కనుక భగవత్స్మరణతోను, ఫలాపేక్షను వదలి సత్కర్మలాచరించాలి. అప్పుడే ఆ కర్మలు మనను పవిత్రం చేస్తాయి.

*-మరి ఈ యజ్ఞ దాన తపస్సులనే సత్కర్మలను ఎలా చేయాలి?*

**శ్లో|| ఏతాన్యపి తు కర్మాణి**
**సంగం త్యక్త్వా ఫలాని చ|**
**కర్తవ్యానీతి మే పార్థ**
**నిశ్చితం మతముత్తమం|| (6)**

తా:- పార్థా! ఈ కర్మలను కూడా సంగ భావాన్ని, ఫలాన్ని వదిలి చెయ్యాలని నా నిశ్చితమైన ఉత్తమమైన అభిప్రాయం.

వ్యాఖ్య:- యజ్ఞ దాన తపస్సులను ఎలా చేయాలి? సంగభావాన్ని వదిలి, ఫలితంపై ఆసక్తిని వదిలి చేయాలి. ఇది భగవంతుని నిశ్చితాభిప్రాయం. నిశ్చితాభిప్రాయమే కాదు. ఉత్తమమైన అభిప్రాయం కూడా.

1. సంగం త్యక్త్వా :- కర్మతో అతుక్కు పోకూడదు. మనం సాధారణంగా ఏదైనా మంచి పని చేస్తే దానిని తలచుకుంటూ ఆనందించాలని ఉంటుంది. పది మందితో చెప్పి తృప్తి చెందాలనిపిస్తుంది. ఇదే కర్మతో అతుక్కుపోవటం. ఏదైనా సత్కార్యాన్ని తలపెట్టి చేస్తున్నప్పుడు వచ్చిన వారిలో ఎవరన్నా 'ఎవరండీ ఈ కార్యాన్ని చేస్తున్నది?' అని అడిగితే నేనేనండీ ఇదంతా చేస్తున్నది. నాకు చిన్నప్పటి నుండీ పదిమందికీ ఉపయోగపడే పనులు చేయాలని ఆసక్తి ఉండేది. అందుకే ఇలా చేస్తున్నాను అని ఎంతో సంతోషంతో చెబుతాం. ఒకవేళ ఆ

అడిగిన వ్యక్తి మనకు దూరంలో ఉండి ఎవరినో అడుగుతున్నాడనుకోండి. అతడు మనవైపు చూపి అదిగో ఆయనేనండి అని అంటున్నాడు. అది విననట్లుగ మనం వారి వైపు వెళ్ళి ఎలాగో మాటలు కలిపి ఆ! నేనేనండి ఇదంతా చేస్తున్నది అని చెబుతాం. అంటే మనం కర్తృత్వం అంటగట్టుకుంటున్నాం అన్న మాట. ఇలా మన గురించి, మన గొప్పతనం గురించి, మనం చేసే పని యొక్క గొప్పతనం గురించి అందరూ చెప్పుకోవాలని మన లోపల తహ తహ. ఇదే సంగ భావం. చేసే కర్మతో అతుక్కుపోవటం. ఈ కర్తృత్వం వల్ల వాసనలు కూడుకొని ఈ కర్మను సాత్వికం కాకుండా చేస్తాయి. రాజసిక కర్మగా మారుస్తాయి. కనుక చేసే కర్మకు అతుక్కుపోకూడదు.

*2. త్యక్త్వా ఫలాని చ:* - సాధారణంగా ఏదో ఫలితాన్ని ఆశించే అందరూ కర్మలను ప్రారంభిస్తారు. ఇలా చేయటం వల్ల వాసనలు పేరుకుంటాయి. మరేం చేయాలి? వచ్చే ఫలితాన్ని త్యజించాలి. కర్మ చేసేటప్పుడు గాని, కర్మ పూర్తయిన తరువాత గాని, ఈ కర్మ యొక్క ఫలం సర్వం భగవంతునికే అర్పిస్తున్నాను అని కర్మ ఫలాన్ని త్యాగం చెయ్యాలి.

కర్మ ఫలం పై ఆసక్తి ఉన్నా, కోరుకున్నా కర్మలో నైపుణ్యం తగ్గిపోతుంది. ఒక డాక్టరు ఆపరేషన్లు చేయటంలో సిద్ధ హస్తుడు. ఐతే అదే డాక్టరు తన భార్యకు ఆపరేషన్ చేయాల్సి వస్తే చేతులు వణుకుతాయి. ఇదే సంగ భావ మహాత్యం. ఫలాసక్తి ఉంటే ఆ కర్మ ఫలాన్ని ఎప్పుడైనా అనుభవించాలి. ఈ జన్మలో వీలుకాకపోతే మరో జన్మలోనైనా అనుభవించాలి. అంటే కర్మ ఫలం బంధమవుతుంది. ఇలా ఫలితాన్ని ఆశిస్తే ఈ కర్మ రాజసిక కర్మ అవుతుంది. కనుక కర్మ

ఫలాన్ని త్యజించి కర్మ చేస్తే అది సాత్త్విక కర్మ అవుతుంది. ఈ త్యాగం సాత్త్విక త్యాగం అవుతుంది.

అందువల్లనే యజ్ఞ దాన తపస్సులను సంగభావాన్ని, ఫలాసక్తిని వదిలి చేయాలని భగవానుడీ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

*దీనిని బట్టి భగవంతుని నిశ్చితాభిప్రాయం ఏమిటో తెలుస్తున్నది. సన్యాసం కన్నా త్యాగాన్నే భగవానుడు బలపరుస్తున్నాడు. 4 ఆశ్రమాలలోనూ సన్యాసాశ్రమానికి గౌరవం ఇస్తూనే భగవంతుడు త్యాగమనే పేరుతో కర్మ యోగాన్నే బలపరుస్తున్నాడు. కర్మలను కర్మలుగా కాక కర్మ యోగంగా చేయాలంటున్నాడు. కర్మ ఫలంపై ఆసక్తిని,- అపేక్షను వదిలి, సంగభావాన్ని విడిచి కర్మలు చేయటమే కర్మ యోగం. అదే నిజమైన తెలివి.

తెలివితో చేసినప్పుడు ఆ కర్మ మనకు మనశ్శుద్ధిని కలిగించి మోక్షమార్గం వైపు నడిపిస్తుంది. అదే కర్మను తెలివి తక్కువతో చేస్తే అంటే సంగభావంతో, ఫలాసక్తితో చేస్తే జననమరణచక్రంలో ఇరికించి అధోగతిలో పడవేస్తుంది.

కనుక భగవానుని నిశ్చితాభిప్రాయం ఏమంటే-

*1. యజ్ఞ, దాన, తపస్సులనే సత్కర్మలను ఎట్టి పరిస్థితులలోను విడిచిపెట్టరాదు. చేయవలసిందే.

*2. వివేకులైన వారికి ఈ యజ్ఞ దాన తపస్సులు పవిత్రతను, మనశ్శుద్ధిని కలిగిస్తాయి.

*3. అయితే వీటిని ఆచరించేటప్పుడు కర్మలతో సంగ భావం ఉండకూడదు. ఫలాపేక్ష ఉండకూడదు.

ఇలా చేస్తే అభిక్రమనాశము, ప్రత్యవాయదోషము రెండూ ఉండవు. అంటే నిష్ఫలం కావటం, వ్యతిరేక ఫలితం రావటం రెండూ ఉండవు. స్వర్గ నరకాలకు పోవటం రావటం

అనే ప్రయాస ఉండదు. అంతః కరణ శుద్ధి, మోక్ష సిద్ధి కలుగుతాయి. ఇక *3* విధాల త్యాగం గురించి.

-గుణ భేదాలను బట్టి త్యాగం మూడు విధాలు ఎలాగో భగవానుడీశ్లోకం నుండి చెప్పబోతున్నాడు. ముందుగా తామసిక త్యాగం అంటే ఏమిటో తెలియజేస్తున్నాడు.

శ్లో|| నియతస్య తు సంన్యాసః
కర్మణో నోపపద్యతే|
మోహాత్తస్య పరిత్యాగః
తామసః పరికీర్తితః|| (7)

తా:- శాస్త్రాలలో విధించబడిన కర్మలను ఎన్నటికీ విడిచిపెట్టరాదు. మోహంతో- అజ్ఞానంతో వాటిని విడిచి పెట్టటం తామసిక త్యాగం అని చెప్పబడుతుంది.

వ్యాఖ్య:- నిజంగా గీతాసారం అంతా త్యాగమే. మోక్ష ప్రాప్తి కొరకే *18* మెట్లుగా *18* అధ్యాయముల భగవద్గీత ఉన్నది. ఆ మోక్ష ప్రాప్తి అనేది త్యాగం వల్లనే సాధ్యమవుతుంది. తొడుగులు తొలగిపోతేనే సిద్ధవస్తువు దర్శనం. 'తేనత్యక్తేన భుంజీధా' అనే ఉపనిషద్వాక్యం చెప్పేది ఇదే. త్యాగం వల్లనే అమృతత్త్వం- 'త్యాగేనైకే అమృతత్త్వమానసుః' అని అధర్వణ వేదంలోని కైవల్యోపనిషత్తు చెప్పేది కూడా ఇదే విషయం కనుక త్యాగమే గీతాసారం. ఒక్కొక్కదానిని త్యాగం చేసుకుంటూ పోయి చివరకు నామరూపాలను త్యజించాలి.

ఒకసారి ఒక భక్తుడు రామకృష్ణ పరమ హంస వద్దకు వచ్చి గీతాసారం ఏమిటో ఒక్కమాటలో చెప్పండి అన్నాడట. ఆయనది పుస్తక జ్ఞానం కాదు. మస్తక జ్ఞానం. అందువల్ల ఒక్క క్షణం కన్నులు మూసుకొని గీతా గీతా అంటూ పది సార్లు

అన్నాడట. అందువల్ల తాగీ తాగీ అనే మాట వచ్చింది. బెంగాలీ భాషలో త్యాగిని తాగి అంటారు. దానితో ఆ భక్తుడు గీతాసారం త్యాగమే అని గ్రహించాడట.

అందుకేనేమో భగవద్గీతా సారమైన ఈ 18 వ అధ్యాయాన్ని త్యాగంతోనే ప్రారంభిస్తున్నారు. త్యాగం యొక్క విశిష్టతలను తెలియజేసేందుకే ఇలా ప్రారంభించారు. త్యాగం అంటే కర్మల త్యాగం కాదు. కర్మ ఫల త్యాగం.

ఇప్పుడు 3 విధాల త్యాగంలో ముందు తామసిక త్యాగంతో ప్రారంభిస్తున్నారు. ఎందుకంటే త్యాగం చెయ్యాల్సింది ముఖ్యంగా తామసిక త్యాగాన్నే. ఆ తరువాత రాజసిక త్యాగాన్ని త్యజించాలి. సాత్త్విక త్యాగాన్ని ఆచరించాలి.

తామసిక త్యాగం అంటే శాస్త్రం విధించిన కర్మలను మోహంతో- అజ్ఞానంతో, భ్రమతో విడిచిపెట్టటమే. ఎట్టి పరిస్థితిలోను శాస్త్ర విహిత కర్మలను విడిచిపెట్టకూడదని భగవానుని నిర్ణయం.

కామ్యకర్మలను, నిషిద్ధ కర్మలను వదిలిపెట్టవలసిందే. కాని శాస్త్ర విహిత కర్మలను, కర్తవ్య కర్మలను తప్పక చేయవలసిందే.

నిత్య కర్మలను, నైమిత్తిక కర్మలను వదలటం వీలుపడదు. ఇక శాస్త్రం విధించిన యజ్ఞ దాన తపస్సులను ప్రతివారు అవశ్యం చేయవలసిందే.

శాస్త్రం మనుష్యుల కోసమే ఉన్నది. పశుపక్ష్యాదుల కోసం కాదు. మానవుడికి బుద్ధి ఉన్నది. స్వతంత్రుడు. కాని పశు పక్ష్యాదులు పరతంత్రాలు. వాటికి బుద్ధి లేదు. లోపలి నుండి ఎలా ప్రేరణ వస్తే అలా నడవాల్సిందే తప్ప వాటికి మరో మార్గం లేదు.

అందుకే శాస్త్రం చెప్పినట్లు నడిచే వాడు నరుడు. మనస్సు లాగినట్లు నడిచేవాడు వానరుడు. అంటారు.

అయితే కొందరు ఈ శాస్త్ర విహిత కర్మలను చేయరు. ఎందుకంటే -అజ్ఞానం వల్ల, మోహం వల్ల, శాస్త్రం తెలియనందువల్ల, తెలుసుకోవాలని అనుకోక పోవటం వల్ల. నిరంతరము స్వార్ధంతో తన సుఖం, తన క్షేమాన్ని కాంక్షించి అదే పరమార్థం అనుకోవటం వల్ల; సోమరితనం వల్ల. ఇలా అజ్ఞానంతో కర్మలు విడిచి పెడితే జీవితం ఎటువెళుతుందో తెలియదు.

ఒక ఉద్యోగి రిటైర్ అయిన తర్వాత హాయిగా *PF* తో *Pension* తో కాలం గడుపుతున్నాడు. క్రొత్తగా ఉద్యోగంలో చేరినవాడు ఆయనను చూచి తాను కూడా ఉద్యోగం వదిలేస్తే హాయిగా బ్రతకవచ్చుగదా! అని రాజీనామా చేశాడు. జీతం పోయింది, జీవితం పోయింది. దుఃఖ సముద్రంలో మునిగి పోయాడు. ఎందుకిలా జరిగింది? మోహం-అజ్ఞానం-భ్రమ. కనుక ఎవ్వరైనా అజ్ఞానంతో కర్తవ్య కర్మను వదలరాదు. ఇలా మోహంతో - అజ్ఞానంతో కర్తవ్య కర్మలను త్యజిస్తే అది తామసిక త్యాగం అవుతుంది. ఇది అసలు త్యాగం కాదు. సోమరితనం అవుతుంది. ఇక్కడ ముందుగా తామసిక త్యాగాన్ని చెబుతున్నారంటే ఆచరించవలసిన దానికన్నా జాగ్రత్త పడవలసిన విషయాన్ని గట్టిగా నొక్కి చెబుతున్నారన్నమాట.

*-మోహం చేత చేయవలసిన శాస్త్ర విహిత కర్మలను చేయక పోవటం తామసిక త్యాగమని చెప్పిన భగవానుడు రాజసిక త్యాగం అంటే ఏమిటో తెలియజేస్తున్నాడు.*

శ్లో|| దుఃఖమిత్యేవ యత్కర్మ

కాయక్లేశభయాత్త్యజేత్|
స కృత్వా రాజసం త్యాగం
నైవ త్యాగఫలం లభేత్|| (8)

తా:- ఏ కర్మను శరీరానికి కష్టం కలుగుతుందనే భయంతోను, దుఃఖాన్ని కలిగిస్తుంది అనే భావంతోను విడిచిపెడతాడో అది రాజసిక త్యాగం అవుతుంది. త్యాగఫలం లభించదు.

వ్యాఖ్య:- శాస్త్ర విధిని తెలుసుకోకుండా అజ్ఞానంతో విహిత కర్మలను వదిలిన వాడు తామసిక త్యాగి అయితే - శాస్త్ర విధిని తెలుసుకొని కూడా శరీరానికి కష్టం కలుగుతుందని, మనస్సుకు దుఃఖం కలుగుతుందని సత్కర్మలను వదిలిన వాడు రాజసిక త్యాగి అవుతాడు.

స్వార్థ పూరితులు తమ సుఖం, సంతోషం, ఆనందం తప్ప ఇతరుల గురించి పట్టించుకోరు. అటువంటి వారు ఇతరులకోసం తమ ధనాన్ని, సంపదలను, శక్తిని, తెలివిని, జ్ఞానాన్ని ఖర్చు చేయటానికి ఇష్టపడరు. వీరే రాజసిక త్యాగులు, శరీరాభిమానంతో శరీరానికి కష్టం కలుగుతుందని, మనస్సుకు దుఃఖం కలుగుతుందని వారు కర్మలను వదిలేస్తారు. శ్రేష్ఠమైన కర్మలు మొదట కొంత దుఃఖాన్ని, శ్రమను కలిగిస్తాయి. అందువల్ల వాటిని చేయకుండా తప్పించుకుంటారు.

బ్రహ్మ ముహూర్తంలో నిద్రలేవటం, చన్నీటితో స్నానం చేయటం, జప ధ్యానాలు చేయటం -ఇలాంటివన్నీ కష్టంగానే ఉంటాయి. అలాగే దానం చేయాలంటే డబ్బు ఖర్చవుతుంది. అందువల్ల వదిలేస్తాడు. కాని అతడికి తెలుసు ఈ సత్కర్మలు చేయాలి- అని. దేవతలను, గురువులను పూజించాలి కాని ఖర్చు చెయ్యాలి గదా! కనుక మానేద్దాం. ఎవరన్నా చేస్తుంటే చూసి సంతోషిద్దాం అనుకుంటారు. అయితే ఎవరు చేస్తే వారికే

ప్రయోజనం అనీ తెలుసు. అయినా సరే మనకెందుకు శ్రమ? ఖర్చు? అనుకుంటారు రాజసికులు. ఇలా కర్తవ్య కర్మలను వదిలిన వాడికి ఫలితం ఉండదు. అంటే చిత్తశుద్ధిని పొందటం గాని, ఆత్మ జ్ఞానాన్ని పొందటం గాని, కర్మబంధ విముక్తిని గాని, జన్మను సార్ధకం చేసుకోవటం గాని ఉండదు. త్యాగం చేసిన వాడికే మోక్షం. రాజసిక త్యాగుల త్యాగం విచిత్రమైనది.

ఒకాయన తీర్థ యాత్రలకని బయలు దేరి గయా క్షేత్రం వెళ్లాడు. అక్కడ వట వృక్షం క్రింద ఏదో ఒక కాయ, ఏదో ఒక పండును వదలాలి. ఏ కాయను వదులుతావని పురోహితుడడిగితే 'కుంకుడు కాయ' అన్నాడు. ఏ పండును వదులుతావు ? అంటే బ్రహ్మలోక పర్యంతం ఆలోచించి ఆ మేధావి పనసపండును వదులు తాను అన్నాడట. ప్రక్కన స్నేహితుడు "అదేమిటి? పనసపండు బాగా రుచి గదా! ఎందుకు వదులుతున్నావు? అధరానికి రుచి ఉదరానికి బాధ అని వదులుతున్నావా?" అన్నాడు. దానికా మేధావి, "మా డాక్టరు చెప్పాడు - నీ ఆరోగ్యానికి అసలు పడదు, పనస పండును ఎప్పటికీ తినవద్దు" అని చల్లగా చెప్పాడు. అందువల్ల వదిలాడు. ఒకాయన హృషీకేశ్‌లో శివానందుల వద్ద సన్యాస మిప్పించమని ప్రార్థించాడట. ఎందుకు ? అంటే ఇక్కడ సన్యాసులకు మంచి భోజనం దొరుకుతుందట గదా! అన్నాడట. ఇవే రాజసిక త్యాగాలు.

-ఇక సాత్త్వికత్యాగం అంటే ఏమిటో-

శ్లో|| కార్యమిత్యేవ యత్కర్మ
నియతం క్రియతేzర్జున|
సంగం త్యక్త్వా ఫలం చైవ
స త్యాగః సాత్త్వికో మతః|| (9)

తా:- ఇది నా కర్తవ్యం అనుకుంటూ, సంగభావాన్ని, ఫలాపేక్షను వదిలి, ఏ నియత కర్మ చేయబడుతుందో అర్జునా! అది సాత్త్విక త్యాగం అని నా అభిప్రాయం

వ్యాఖ్య:- మానవ జన్మనెత్తిన వారెవరైనా సరే శాస్త్రం విధించిన కర్మలను ఇది నా విధి- నా కర్తవ్యం అని చేయాలే గాని, ఏదో లోకాన్ని ఉద్ధరిస్తున్నానని భావించరాదు. అంతే గాదు చేసే కర్మలతో సంగభావం ఉండరాదు. వచ్చే ఫలితం మీద ఆసక్తి కూడదు.

ఇక్కడ ప్రతి రోజూ వేదాంతాన్ని చెప్పుకుంటున్నాం. నేను కాబట్టి ఇంత గొప్ప జ్ఞానాన్ని అందించగలుగుతున్నాననే గర్వం ఉండకూడదు. భగవంతుడు ఎన్నో పనిముట్ల ద్వారా తన ఇచ్ఛాను సారం ఇక్కడ జరగవలసిన వాటిని జరిపిస్తున్నాడు. అందులో ఒక పనిముట్టుగా ఈ దేహం ఉపయోగించుకుంటున్నాడు. కనుక ఇది భగవంతుని ఇచ్ఛ. - ఆజ్ఞ. ఆ ఆజ్ఞను యజ్ఞ భావంతో నిర్వర్తించటమే ఈ ఉపాధి యొక్క విధి. ఇలా చేయక పోవటం భగవంతుని ఆజ్ఞను ఉల్లంఘించటమే.

అంతే కాదు ఈ కర్మతో *attachment* లేదా సంగభావం ఉండకూడదు. దీనినింకా పెద్ద ఎత్తున నిర్వహించాలని, ప్రచారం చేయాలని, ఆశ్రమాలు కట్టించాలని, దీనికోసం వాళ్ళ కాళ్ళూ వీళ్ళ కాళ్ళూ పట్టుకొని పేరు తెచ్చుకోవాలని, పేపర్లలో, *TV*ల్లో ప్రచారం జరగాలని - ఇలా కర్మలతో సంగభావం పెట్టుకోరాదు. అలాగే దీని వల్ల వచ్చే ప్రయోజనాలను అంచనాలు వేసుకుంటూ ఫలితం పై ఆసక్తి ఉండరాదు. అలా ఉంటే మొదటికే మోసం వస్తుంది. ఫలితం రాకపోతే పని మీద ఆసక్తి తగ్గి పోతుంది.

ఇలా ఫలాసక్తి లేకుండా, కర్మలతో సంగభావం లేకుండా, నిర్లిప్తంగా కర్తవ్యతాభావంతో కర్మ చేసినప్పుడే మనశ్శుద్ధి అవుతుంది. అలా కాక కర్మతో సంగ భావం పెట్టుకుంటే మనస్సులో ఆరాటం కలిగి ఆందోళనతో ఉండవలసి వస్తుంది.

*తామసుడు శాస్త్ర విధి తెలియని వాడు. అజ్ఞాని. తెలియని వాడు కనుక చేయవలసిన కర్మను చేయడు.

*రాజసుడు శాస్త్ర విధి తెలిసిన వాడు. తెలిసినప్పటికీ ఆచరించటం కష్టమని, శరీరానికి శ్రమ కలుగుతుందని, మనస్సుకు భాధ దుఃఖం కలుగుతుందని కర్మలను విడిచిపెడతాడు. ఫలితం శూన్యం.

*సాత్త్వికుడు శాస్త్ర విధి తెలిసిన వాడు. శాస్త్రం విధించిన యజ్ఞ దాన తపస్సులను తప్పక చేయవలసిందే అని గ్రహించి కర్తవ్యతా భావంతో, - కర్మలతో సంగభావాన్ని, విడిచి పెట్టి, వచ్చే ఫలితంపై ఆసక్తిని విడిచి - చేసేవాడు. అలా ఎన్ని కష్ట నష్టాలెదురైనా, పట్టుదలతో కర్మలు చేసి, నిస్వార్ధ బుద్ధితో చేసి వాసనలను ఖర్చు చేసుకునేవాడు.

*సాత్త్వికునిది ఉత్తమ పద్ధతి; ఉత్తమ త్యాగం. ఫలం చిత్త శుద్ధి. తద్వారా ఆత్మ జ్ఞానం కలుగుతుంది. దాని వల్ల ముక్తి కలుగుతుంది.

*రాజసికుని త్యాగం మధ్యమం. అతడికి మోక్షాపేక్ష ఉంటుందేగాని, దానికి కావలసిన చిత్త శుద్ధి, ఆత్మజ్ఞానం లభించవు.

*తామసికునికి మోక్షమంటే తెలియదు. తెలుసుకునే అర్హత ఉండదు. తెలుసుకునే అవకాశం రాదు. కనుక మోక్షాన్ని అందుకోవటమనే ప్రశ్నే లేదు.

భగవద్గీతలోని కర్మ యోగ, జ్ఞాన యోగ, కర్మ సన్యాస యోగములనే 3,4,5 అధ్యాయముల సారమంతా కలిపి సాత్త్విక త్యాగంగా భగవానుడు ఈ అధ్యాయములో తెలియజేస్తున్నాడు.

*-ఇంతవరకు సాత్త్విక త్యాగం ఎలా ఉంటుందో తెలియజేసిన భగవానుడు సాత్త్విక త్యాగం చేసే వ్యక్తి యొక్క ప్రవర్తన ఎలా ఉంటుందో, కర్మల పట్ల అతడు ఎలాంటి దృష్టి కలిగి ఉంటాడో ఈ శ్లోకంలో-*

శ్లో|| న ద్వేష్ట్యకుశలం కర్మ
కుశలే నానుషజ్జతే|
త్యాగీ సత్త్వసమావిష్టః
మేధావీ ఛిన్నసంశయః|| (10)

తా:- సత్త్వ గుణంతో కూడియున్న మేధావి, కర్మఫల త్యాగి సంశయ రహితుడై ప్రతికూలమైన కర్మను ద్వేషించడు, అనుకూలమైన కర్మకు అతుక్కుపోడు.

వ్యాఖ్య:- సత్త్వ గుణంతో నిండిన వ్యక్తి శుభాశుభములందు, సుఖ దుఃఖములందు సమబుద్ధి కలిగి ఉంటాడు. అన్నింటి పట్ల తటస్థంగానే ఉంటాడు. ఇష్టము, అయిష్టము అనేవి ఉండవు.

ఈ విషయం వినగానే అసలు ఇలాంటి వ్యక్తి ఈ లోకంలో ఎవరైనా ఉంటారా? అనే సందేహం కలుగుతుంది. అందుకే భగవానుడు "సాత్త్విక త్యాగి మేధావి, చిన్న సంశయుడు" అన్నారు.

*(i)*మేధావి:- మేధావి అంటే ప్రజ్ఞాశాలి, గొప్ప జ్ఞాని అని. సాత్త్విక గుణం కలవారే శాస్త్ర విషయాలను, వేదాంత విషయాలను గ్రహించగల నేర్పుగలవారు. ఇట్టి ప్రజ్ఞా పాటవాలు గలవారినే 'మేధావి' అంటారు. రజో గుణంలో ఉన్న వారు వేదాంత శాస్త్ర

విషయాలను చక్కగా తెలుసుకోలేరు. తమో గుణంలో ఉన్నవారు వాటికి పూర్తి వ్యతిరేకులు.

*(ii)ఛిన్న సంశయ:-* ఏ విధమైన కర్మలను చేస్తుంటే శరీర భ్రాంతి తొలగి పోతుందో, అహంకారం అణగి పోతుందో, ఆధ్యాత్మికంగా ముందుకు వెళ్ళటం జరుగుతుందో అట్టి కర్మలనే శాస్త్రం విధిస్తుంది. ఇది తెలుసుకున్న సాత్త్విక త్యాగికి ఇక ఆ కర్మల గురించి ఎటువంటి సందేహాలు, సంశయాలు ఉండవు. అందుకే అతడు ఛిన్న సంశయుడు.

అలా సంశయాలు లేని, ప్రజ్ఞాశాలియైన సాత్త్విక త్యాగియే తాను చేయబోయే కర్మల పట్ల సమభావాన్ని చూపుతాడు. ఈ కర్మ ఎక్కువదీ, ఇది తక్కువదీ అనే వ్యత్యాసం కూడా అతడికి ఉండదు. ఏ పనినైనా యజ్ఞ భావంతోనే చేస్తాడు. అందుకే అంతటి మహిమాన్వితుడైన శ్రీకృష్ణుడు అర్జునుని రథాన్ని తోలటానికి అంగీకరించాడు. ధర్మరాజు చేసిన రాజసూయ యాగంలో మహర్షుల, మహాత్ముల పాదాలను కడిగేందుకు సిద్ధపడ్డాడు. కుచేలుని పాదాలు కడిగి ఆ నీటిని శిరస్సున చల్లుకున్నాడు. అతడు తెచ్చిన అటుకులను ప్రీతితో ఆరగించాడు.

ఇప్పుడు అర్జునుని పరిస్థితి చూడండి. అర్జునునికి ఈ యుద్ధం అకుశల కర్మ. ఇష్టం లేని కర్మ. ఆత్మీయులను, బంధువులను వధించవలసిన కర్మ. పాపంతో కూడిన కర్మ. అందువల్ల ఇష్టం లేనిది అనిపిస్తున్నది. అందుకే నాకు రాజ్యం వద్దు. సుఖం వద్దు. భోగాలు వద్దు. జయం వద్దు. నేను యుద్ధం చేయను అన్నాడు మొదట్లోనే. అప్పుడతడు రాజసిక త్యాగి. యుద్ధ కర్మ నుండి తప్పించుకు పోవాలనుకున్నాడు. అయితే ఈ మాటను బుద్ధి మంతులు మెచ్చరు. భగవంతుడు అసలే మెచ్చడు.

అప్పుడు యుద్ధం అర్జునునికి ఇష్టం లేని కర్మ అయింది. అదే యుద్ధం శ్రీకృష్ణునికి కర్తవ్య కర్మ అయింది. ఈ యుద్ధం అర్జునుని నెత్తిమీదకు కర్తవ్యంగా వచ్చి పడింది. అధర్మాన్ని అణచటానికి, ధర్మాన్ని నిలబెట్టడానికి ఈ యుద్ధం చెయ్యటం క్షత్రియుడైన అర్జునుని కర్తవ్యం, విధి. కనుక జయాపజయాలపై, లాభనష్టాలపై దృష్టిని వదలి కర్తవ్యంగా ఈ యుద్ధం చెయ్యాలి. అందుకే గొప్ప వీరుణ్ణనే భావం లేకుండా, నీ వల్లనే ఈ యుద్ధంలో జయం లభిస్తుందనే అహంకారం లేకుండా, భగవదార్పణబుద్ధితో, చేసే పని మీద శ్రద్ధతో - నేర్పుతో నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు. ఫలితం నీ చేతిలో లేదు- అని తెలియజేశాడు భగవానుడు.

భగవానుని మాటపై విశ్వాసంతో 'కరిష్యేవచనంతవ'- నీ మాట ప్రకారమే చేస్తాను అంటూ జారవిడిచిన గాండీవాన్ని చేత ధరించి, యుద్ధానికి సిద్ధమయ్యాడు అర్జునుడు.

ఇప్పుడతనికి జయాపజయాలపై దృష్టి లేదు. క్షత్రియ వీరునిగా తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తించటమే తన ధర్మం అనే భావంతో నిర్లిప్తంగా కర్తవ్యోన్ముఖుడయ్యాడు. ఇదే సాత్త్విక త్యాగం. అందుకే అర్జునుడు చేసిన యుద్ధం యజ్ఞమైంది. ఇలాంటి కర్తవ్యతా బుద్ధి లేకనే దక్షుని యజ్ఞం యుద్ధమై కూర్చుంది. కనుక చేసే పనిలో గొప్పతనం లేదు. ఆ పని చేసే విధానంలోను, ఆ పని చేసేటపుడు అతడి మనసులోని భావంలోను ఉంది గొప్పతనం.

కనుక సాత్విక త్యాగి ఇష్టానిష్టాలపట్ల సమభావంతో కర్తవ్య కర్మలను చేస్తాడు. అతడికి దేనిపైనా రాగం లేదు, ద్వేషం లేదు, అతడి దృష్టి అంతా తన కర్తవ్యం మీదనే ఉంటుంది.

*-సాత్త్విక త్యాగి యొక్క ప్రవర్తన గురించి చెప్పి - దేహధారులైన మానవులు కర్మ చేయక తప్పదని చెబుతూ, ఆ కర్మనెలా ఆచరించాలో తెలియజేయబోతున్నాడు. భగవానుడు.*

శ్లో|| న హి దేహభృతా శక్యం
త్యక్తుం కర్మాణ్యశేషతః|
యస్తు కర్మఫలత్యాగీ
స త్యాగీత్యభిధీయతే|| *(11)*

తా:- ఎందుకనగా దేహధారియైన వానికి కర్మలను పూర్తిగా విడిచిపెట్టటం సాధ్యం కాదు. ఎవరైతే కర్మ ఫలాన్ని విడిచిపెట్టి కర్మలను చేస్తాడో అతడే త్యాగి అనిపించుకుంటాడు.

వ్యాఖ్య:- దేహాన్ని ధరించిన వాడెవ్వడూ కర్మలను పూర్తిగా విడిచి పెట్టే వీలు లేదు. అసలు పని చేసేందుకే ఈ దేహం వచ్చింది. ఇందులో ఉన్నంత కాలం ఏదో ఒక పని చేస్తూ ఉండాల్సిందే. పనిచేయక పోతే దేహ పోషణ జరగదు. దేహం ఆరోగ్యంగా ఉండదు. అయితే పని చేస్తూ ఉంటే లోపలి వాసనలు ఖర్చు అవుతాయే గాని తిరిగి క్రొత్త వాసనలు చేరుకుంటాయి. కనుక బంధం అవుతుంది. అలాగాక పనిచేస్తూనే కర్మ ఫలాలపై ఆసక్తిని విడిచిపెడితే తిరిగి క్రొత్త వాసనలు చేరవు. ఇలా ఫలితాన్ని వదలి కర్మలు చేస్తే పాత వాసనలు ఖర్చై, క్రొత్తవి చేరకుండా ఉంటాయి. కనుక బంధం కాదు. బంధం కాకుండా కర్మలు చేసే విధానం ఇదే.

లోపల వాసనలు ప్రేరేపిస్తున్నంతకాలం, లేదా కోరికలు ఉన్నంతకాలం కర్మలను బలవంతంగా వదిలేవాడు త్యాగి కాదు. కపటాచారి. ఒక వేళ అతడు కర్మలను వదిలినా వదిలాననే భావనను పట్టుకొంటాడు. అప్పుడు కర్మలను

చేస్తున్నాననే భావనను పట్టుకుంటే, ఇప్పుడు వదిలాననే భావనను పట్టుకున్నాడు. అప్పుడూ - ఇప్పుడూ పట్టుకోవటమే గాని వదిలిందెప్పుడు?

కనుక కర్మ ఫలాన్ని వదిలి కర్మలు చేసే వాడే సాత్త్విక త్యాగి. అతడికి కర్మ ఫలం అంటదు, క్రొత్తగా వాసనలు చేరవు. రెండూ రావు గనుక అతడు కర్మలను సన్యసించినట్లే.

*పనసపండ్లు వలిచే వాడు చేతికి నూనె రాసుకోవాలి.

*కరెంటు పని చేసే వాడు చేతికి రబ్బరు తొడుగులు వేసుకోవాలి. *పాములను ఆడించేవాడు వాటి కోరలను పీకి వేయాలి.

అప్పుడే వారికి ఆ కర్మల వల్ల ప్రమాదాలు, ఇబ్బందులు ఉండవు. వారు ఆ పని చేస్తున్నా దేన్ని గురించి ఆలోచించే పని లేదు. అలాగే కర్మఫలం వదిలి కర్మ చేస్తే అతడికి ఏ బంధమూ ఉండదు. అతడే సాత్త్విక త్యాగి.

*-కర్మ ఫలాలు త్యాగిని ఎలా బంధించలేవో, త్యాగికాని వానిని ఎలా బంధించగలవో తెలియజేస్తున్నారు.*

శ్లో|| అనిష్టమిష్టం మిశ్రం చ
త్రివిధం కర్మణః ఫలమ్|
భవత్యత్యాగినాం ప్రేత్య
న తు సన్యాసినాం క్వచిత్|| (12)

తా||పాపము, పుణ్యము, పుణ్య పాప మిశ్రమం అని మూడు విధాలుగా కర్మల యొక్క ఫలాన్ని త్యాగులు కాని వారు మరణానంతరం పొందుతారు. త్యాగులైన వారు ఎప్పటికీ పొందరు.

*వ్యాఖ్య:-* కర్మలు చేస్తే కర్మ ఫలాలు వస్తాయి. మనం పుణ్య కర్మలు చేస్తే పుణ్య ఫలాలు వస్తాయి, పాప కర్మలు చేస్తే పాప ఫలాలు వస్తాయి. ఈ జన్మలోను, ఇంతకు ముందు అనేక మానవ జన్మలలోను అసంఖ్యాకమైన పుణ్య పాప కర్మలను చేసి ఉన్నాం. శరీరాన్ని విడిచిపెట్టేటప్పుడు ఆ మొత్తం మూటలో నుండి పుణ్య కర్మ ఫలాలు గనుక పక్కానికి వస్తే దేవ జన్మలు వస్తాయి. స్వర్గ ప్రవేశం లభిస్తుంది. అక్కడ అనేక సుఖ భోగాలను సూక్ష్మ శరీరం అనుభవిస్తుంది. అవే ఇష్ట ఫలాలు. స్వర్గ భోగాలు. సుఖ కరమైన ఫలితాలు.

అలా గాక ఆ మొత్తం మూటలో నుండి పాప కర్మ ఫలాలు గనుక పక్కానికి వస్తే నరక ప్రవేశం కలుగుతుంది. అక్కడ అనేక నరక యాతనలను, భయంకరమైన బాధలను, దుఃఖాలను అనుభవించ వలసి ఉంటుంది. లేదా హీనమైన, నికృష్టమైన, నీచమైన జన్మలను ఎత్తి భయంకరమైన బాధలను అనుభవించ వలసి ఉంటుంది. అవే అనిష్ట ఫలాలు. దుఃఖకరమైన, బాధా కరమైన ఫలితాలు. పురుగులుగా నీచమైన జీవులుగా, భయంకరమైన దుఃఖాలు అనుభవించ వలసిన క్రిమి కీటకాలుగా పుట్ట వలసి ఉంటుంది.

పై రెండు రకాలు గాక ఆ మొత్తం మూట నుండి కొన్ని పుణ్య ఫలాలు, కొన్ని పాప ఫలాలు పక్కానికి వస్తే పుణ్య కర్మ ఫలాల కారణంగా స్వర్గ ప్రవేశం జరిగి సుఖ భోగాలను అనుభవించాలి, పాప కర్మ ఫలాల కారణంగా నరక ప్రవేశంతో నరక యాతనలను అనుభవించాలి. ఇందులో ఏది తక్కువగా ఉంటే వాటిని ముందు అనుభవించాలి. పుణ్యం తక్కువ చేస్తే ముందు స్వర్గ భోగాలు, పాపం తక్కువగా ఉంటే ముందు నరక యాతనలు అనుభవించాలి. ఒక వేళ మానవ జన్మ వస్తే ఆ జన్మలో సుఖాలు, దుఃఖాలు రెండూ ఒక దాని తర్వాత

ఒకటిగా అనుభవించాలి. అవే మిశ్రమ ఫలాలు, కొంత కాలం సుఖం, కొంత కాలం దుఃఖం.

అయితే ఇవన్నీ ఎవరికీ? కర్మనిష్ఠులైన భోగులకే. ఎవరైతే కర్మలతో సంగ భావం పెట్టుకొని, కర్మ ఫలాలపై ఆసక్తితో, కోరికలతో కర్మలు చేస్తారో, చేసే కర్మలకు తామే కర్తలమనుకుంటారో అలా చేసే వారికే ఈ కర్మ ఫలాలు.

అలాగాక ఎవరైతే కర్మ ఫలాలపై ఆసక్తిని విడిచి, నిష్కామబుద్ధితో, కర్మఫలాపేక్షను వదిలి, కర్తవ్యతా బుద్ధితో నిర్లిప్తంగా కర్మలు చేస్తారో అట్టి వారికి ఏ కర్మ ఫలాలు రావు. ఆ కర్మలు వారిని బంధించవు. కనుక త్యాగికి -సాత్త్విక త్యాగికి -కర్మ ఫల త్యాగికి ఏ కర్మ బంధాలు లేవు. అత్యాగినాం - త్యాగులు కాని వారికే ఈ కర్మ ఫలాలు, బంధము. అయితే వీరు ఎపుడు అనుభవిస్తారు ఈ కర్మ ఫలాలను? అంటే 'ప్రేత్య'- మరణానంతరం అని కూడా తెలియజేస్తున్నారు.

అందుకే త్యాగానికి భారతీయ సంస్కృతిలో ఇంత విలువ. త్యాగం ముందు-భోగం తరువాత. భోగాలనుభవించిన వాణ్ణి ఎవరూ గొప్పగా చెప్పుకోరు . త్యాగాలు చేసిన వారినే గొప్పగా భావిస్తారు. బలిచక్రవర్తి, శిబి చక్రవర్తి, దధీచి మహర్షి, హరిశ్చంద్ర చక్రవర్తి మొ//న వారు చిర కీర్తిని ఆర్జించటానికి కారణం త్యాగమే.

శ్రీ కృష్ణుని జీవితం త్యాగానికి మచ్చు తునక.

*(i)* చిన్న తనంలో పాలు, పెరుగు, వెన్న, మీగడ హరించినా తోటి పిల్లలకు, కోతులకు పంచి పెట్టాడు.

*(ii)* కంసుణ్ణి చంపినా రాజ్యాన్ని స్వీకరించలేదు. కంసుని తండ్రి ఉగ్రసేనుని రాజ్య సింహాసనంపై కూర్చోబెట్టాడు.

*(iii)* జరాసంధుని భీమునిచే వధింపజేసి, మగధ రాజ్యాన్ని కోరక, ఆ జరాసంధుని పుత్రుడు సహదేవునికి పట్టాభిషేకం జరిపించాడు.

*(iv)*చేది భూపాలుడు, తన మేనత్త కుమారుడైన శిశుపాలుని వధించినా ఆ రాజ్యాన్ని తాను గ్రహించక శిశుపాలుని పుత్రుడు దృష్ట కేతువును పట్టాభిషిక్తునిగావించాడు.

*(v)*దంత వక్తుని చంపినా అతని రాజ్యాన్ని తాను స్వీకరించలేదు.

*(vi)*త్యాగమే ముఖ్య ఉద్దేశంగా అర్జునునికి భగవద్గీతను బోధించాడు.

*(vii)*ఎనిమిది మంది భార్యలతో పైకి భోగిలా కనిపించినా ఆయన త్యాగియే.

*(viii)*ఎంతటి మహా వీరుడే అయినా కురు క్షేత్ర యుద్ధ భూమిలో ఒక వీరుని రధాన్ని నడిపే సారథిగా ఉండటానికి అంగీకరించిన మహా త్యాగి.

*(ix)*యదువంశ నాశనం తన కళ్ల ముందే జరుగుతున్నా నిర్లిప్తంగా ఉండిపోయాడే గాని ఎటువంటి నివారణకు ప్రయత్నించలేదు;

*(x)*పురంలో, అంతఃపురంలో - ఎక్కడున్నా ఆయన నిత్య సంతోషి. త్యాగేశ్వరుడు. కనుకనే త్యాగాన్ని గురించి బోధించాడు.

అందుకే ఫలాపేక్ష వదలి కర్మ చేసిన కర్మ త్యాగి- ఫల త్యాగి- భోగ త్యాగి- సాత్త్విక త్యాగికి ఏ బంధాలు లేవు అని చెప్పటం జరిగింది.

ఇంతవరకు ఈ అధ్యాయంలో మొదటి ప్రకరణం పూర్తయింది. కర్మలు ఎలా చేయాలో, ఎలా చేస్తే అవి బంధం కాకుండా ఉంటాయో ఇంత వరకు చెప్పారు. సంగ భావం

వదిలి, ఫలాసక్తి వదిలి, ఇది నా కర్తవ్యం అంటూ చేయాలి. అలా చేసిన వాడే సాత్త్విక త్యాగి- అని.

ఐతే కోరికను, ఫలాసక్తిని వదలగలుగుతారు గాని కర్తృత్వాన్ని.- అంటే నేను చేస్తున్నాను అనే భావనను అంత తేలికగా వదలలేం. ఎందుకు? నేనే చేస్తూ, నేను చేయటం లేదని ఎలా అంటాం? అనేది గొప్ప సందేహం. దీనికి కారణం ఏమిటి?- ఎందుకు అలా అనలేక పోతున్నాం?

ఈ దేహం నేను అని గట్టిగా భ్రమ పడటం వల్లనే. ఈ దేహం నేను ఉపయోగించుకునే పరికరం మాత్రమే- నేను కాదు. కాని అజ్ఞానం వల్ల- ఆత్మ జ్ఞానం లేక పోవటం వల్ల ఈ దేహమనే పరికరంలో కూర్చొన్న 'ఆత్మనైన నేను' ఆత్మనని మరచిపోయి, ఈ దేహంతో తాదాత్మ్యం చెంది, దేహాన్ని అనుకుంటున్నాను. ఈ దేహం చేసే కర్మను నేను చేస్తున్నాను అని అంటున్నాను. నిజంగా కర్మ చేస్తున్నది దేహం. ఆత్మనైన నేను చేయటం లేదు అని తెలుసుకోలేక పోతున్నాం. సర్వకాల సర్వావస్థలలోను నేను దేహాన్ని కాదు- ఆత్మను అని గుర్తుంటే అపుడు కర్మ చేస్తున్నది నేను కాదు అని గట్టిగా చెప్పగలం. ఈ జరిగే కర్మకు నేను కర్తను కాదు -అని కర్తృత్వాన్ని వదులుకోగలం.

*కరెంటు 'బల్బు'లో కూర్చొని నేను కరెంటును అని మరచిపోయి, బల్బును అనుకుంటున్నది. నేను వెలుగుతున్నాను, నేను గుండ్రంగా ఉన్నాను, పగిలిపోయాను అంటున్నది. కాని నిజంగా వెలిగేది, పగిలేది, గుండ్రంగా ఉన్నది బల్బే గాని కరెంటు కాదు గదా! అలాగే ఆత్మనైన నేను ఈ దేహంలో కూర్చొని; పుట్టాను, పనులు చేస్తున్నాను, పెద్దవాణ్ణయ్యాను, జబ్బు పడ్డాను అంటున్నాను. నిజంగా ఈ వికారాలన్నీ నావి కాదు. ఈ దేహానివి. ఈ విషయం అనుభవ పూర్వకంగా

తెలుసుకుంటే ఈ కర్తృత్వం ఎగిరి పోతుంది. అప్పుడు పనులు చేస్తూ, చేస్తున్నది దేహం. నేను ఆ పనులతో సంబంధం లేకుండా కేవలంగా ఉన్నాను. ఆ పనుల వల్ల వచ్చే ఫలితంతో కూడా నాకు సంబంధం లేదు- అని గ్రహిస్తాం. ఇదే కర్తృత్వం లేకుండా కర్తవ్యతా భావంతో ఉండటం. అలా ఉన్న వాడే నిజమైన సాత్త్విక త్యాగి. *13* వ అధ్యాయంలో

శ్లో|| ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః|
యః పశ్యతి తదాత్మానం అకర్తారం స పశ్యతి|| *(30)*

-ఎవడైతే జరిగే కర్మలన్నీ ప్రకృతి (దేహాదుల)వల్లనే జరుగుతున్నాయని, ఆత్మనైన నేను కర్తను కాదని తెలుసుకుంటాడో అతడే నిజంగా తెలిసిన వాడు- అని ఇదే విషయాన్ని చెప్పటం జరిగింది. కనుక ఇక్కడ జరిగే కర్మలకు నిజంగా నేను (ఆత్మ) కర్తను కాదు. అది ప్రకృతియే. ఇదే కర్తృత్వం లేకుండా కర్మలు చేయటానికి గ్రహించాల్సిన విషయం.

*-కర్మ జరగటానికి కారణం నేను కాదు గదా! మరి ఏవి కారణాలు?*

శ్లో|| పంచైతాని మహాబాహో!
కారణాని నిబోధ మే|
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని
సిద్ధయే సర్వకర్మణామ్|| *(13)*

తా||ఓ మహాబాహుడా! సమస్త కర్మలు సిద్ధించటానికి కర్మ రాహిత్యాన్ని తెలిపే సాంఖ్య శాస్త్రము నందు చెప్పబడిన ఈ ఐదు కారణాలను నా ద్వారా విను.

*వ్యాఖ్య:-* ఏ కర్మ అయినా జరగాలంటే *5* కారణాలు ఉండాలి. ఈ *5* కారణాలు లేకుండా ఏ పని జరగదు. ఈ కారణాలు సాంఖ్య శాస్త్రము వివరించి చెప్పింది. ఈ సాంఖ్య శాస్త్రాన్ని ఇక్కడ 'కృతాంతే' అన్నారు. కృత అంటే కర్మ. అంతః అంటే అంతం చేసేది. కృతాంతే అంటే కర్మలను అంతం చేసేది. కర్మ కాండ అంతం అయ్యేది ఆత్మ జ్ఞానంలోనే. 'సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే' అన్నారు. అంటే సమస్త కర్మలు జ్ఞానమునందు లయించి పరిసమాప్తమవుతున్నాయి- అని. అలా కర్మలన్నీ అంతమై పోయే ఆత్మ జ్ఞాన స్థితిని తెలియజెప్పే వేదాంత శాస్త్రమే కృతాంతే సాంఖ్యే. అట్టి సాంఖ్య శాస్త్రములో కర్మలు జరగటానికి కారణాలను ఐదింటిని చెప్పారు. అలా అక్కడ చెప్పబడిన కారణాలను నేను ఇప్పుడు చెప్పబోతున్నాను- విను అంటున్నాడు పరమాత్మ.

అంటే ఇప్పుడు భగవానుడు చెప్పబోయే ఈ కర్మ కారణాలు క్రొత్తవేమీ కాదు. అనాదిగా సాంఖ్య శాస్త్రములో బోధించి ఉన్నవే.

ఒక కర్మ జరగాలంటే *5* కారణాలు ఉండాలి. అవి లేకపోతే కర్మ జరగదు. కుర్చీ తయారు కావాలంటే కొయ్య, మేకులు, పాలిష్, కొన్ని పరికరాలు, వాటిని ఉపయోగించే వడ్రంగి ఉండాలి. ఇందులో ఏది లేకపోయినా కుర్చీ తయారు కాదు. అలాగే కర్మ జరగటానికి ఏ కారణాలు ఉండాలో, ఏది లేకపోతే పని జరగదో వాటిని తెలియజేస్తున్నారు.

*-కర్మ జరగటానికి కావలసిన 5 కారణాలు ఈ శ్లోకంలో.*

శ్లో|| అధిష్ఠానం తథా కర్తా
కరణం చ పృథగ్విధమ్|
వివిధాశ్చ పృథక్చేష్టా

దైవం చైవాత్ర పంచమమ్||   *(14)*

తా||అధిష్టానమైన శరీరం, అలాగే కర్మ చేసే వాడు, వేరు వేరు ఇంద్రియాలు, నానా విధాలైన వేరు వేరు క్రియలు, ఐదవదైన ప్రారబ్ధం ఈ కర్మాచరణకు కారణాలు.

*వ్యాఖ్య:- 1.* అధిష్టానం :- అధిష్టానం అంటే శరీరం. శరీరం ఉంటేనే కర్మ చేసే వీలుంటుంది. శరీరం లేని దేవతలు కర్మలు చేయలేరు. శరీరం ఉన్న మానవులు, జంతువులు, పశుపక్ష్యాదులకే కర్మలు చేసే అవకాశం వున్నది. అందుకే శరీరం కర్మ సాధనం అన్నారు. మరి శరీరాన్ని అధిష్టానం అని ఎందుకన్నారు*?* చేసే కర్తకు, వేరు వేరు ఇంద్రియాలకు, వేరు వేరు క్రియలకు ఈ శరీరమే ఆశ్రయం- ఇల్లు లాంటిది కనుక అధిష్టానం అన్నారు.

*2.* కర్త :- కర్త అంటే చేసేవాడు. అదే అహంకారం. జీవాహంకారం, నేను, నేను అంటూ ముందుకు వచ్చేవాడు. ఆత్మ తనను తాను మరచినపుడు దానిని జీవుడు అంటారు. అదే కర్త.

*3*. వేరు వేరు కరణాలు- కరణాలు అంటే పనిముట్లు. ఏ పని చేయాలన్నా పనిముట్లు ఉండాలి కదా*! 5* జ్ఞానేంద్రియాలు, *5* కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి - ఈ *12* కరణాలు.

ఒక పూజ చేయాలనుకోండి వస్తువులు సేకరించుకోవాలి. పూజకు పూలు తెచ్చుకోవాలి. కాళ్ళు, చేతులు, కళ్లు ఉండాలి. మంత్రాలు చదవటానికి వాక్కుండాలి. భగవంతుని భావించటానికి మనస్సు, నిర్ణయం తీసుకోవటానికి బుద్ధి -ఇలా ఒక్కొక్క పనికి ఒక్కొక్క కరణం - ఇంద్రియం ఉండాలి. ఒక్కొక్క సారి ఒక్క పనికే *2*, *3* ఇంద్రియాల అవసరం ఉంటుంది.

4. వివిధ చేష్టలు (క్రియలు)- ఇంద్రియాల ద్వారా జరిగే చేష్టలు- చూడటం, వినటం, పలకటం, తాకటం, పట్టుకోవటం, వాసన చూడటం, రుచి చూడటం, నడవటం, భావించటం ఇలా అన్నీ క్రియలే.

5. దైవం - దైవం అంటే ఇక్కడ పరమాత్మ కాదు. దైవం అంటే దేవతలు - వారే అధిష్ఠాన దేవతలు.

కంటికి సూర్యుడు, వాక్కుకు అగ్ని, చెవికి ఆకాశం, చేతులకు ఇంద్రుడు, మనస్సుకు చంద్రుడు, నాలుకకు వరుణుడు, పాదాలకు విష్ణువు - ఇలా అన్ని అంగాలకు అధిష్ఠాన దేవతలు ఉన్నారు. వీరి సహకారం లేకపోతే ఇంద్రియాలు పని చేయవు. చనిపోయిన వానిలో గాని, మూర్ఛపోయిన వానిలో గాని ఇంద్రియాలున్నా పని చేయవు. అంటే అధిష్ఠాన దేవతల సహకారం లేదన్న మాట.

దైవం అంటే ప్రారబ్ధం అని కూడా చెప్పవచ్చు. అదృష్టం అని కూడా చెప్పవచ్చు. అదృష్టం అంటే కనిపించనిది అని. ఎప్పుడో పూర్వ జన్మలలో సంపాదించుకున్న కర్మ ఫలాలు, వాసనలు ఇప్పుడు ఎదురుగా కనిపించవు. అవే అదృష్టం అంటే. ప్రారబ్ధమే అదృష్టం.

ఆ ప్రారబ్ధ వాసనలు ఇప్పుడు మనను కర్మలకు ప్రేరేపిస్తూ ఉంటాయి. కనుక కర్మలు జరిగి పోతుంటాయి. ఈ విధంగా ఈ 5 కారణాల వల్ల కర్మలు జరుగుతుంటాయి.

ప్రారబ్ధంలోని వాసనలు(దైవం) ఆడిస్తుంటే అహంకారం ముందుకు వచ్చి శరీరమనే అధిష్ఠానాన్ని ఆశ్రయించుకొని, వేరు వేరు ఇంద్రియాల ద్వారా వేరు వేరు కర్మలను చేస్తుంటుంది. ఇదే కర్మ. ఏ కర్మ చేసినా పైన చెప్పిన 5 కారణాలు ఉంటాయి.

*- అయితే ఎలాంటి కర్మ అయినా ఈ ఐదే కారణమా? -*

శ్లో|| శరీరవాఙ్మనోభిర్యత్
కర్మ ప్రారభతే నరః|
న్యాయ్యం వా విపరీతం వా
పంచైతే తస్య హేతవః|| (15)

తా||న్యాయమైనది గాని, అన్యాయమైనది గాని - మంచిది గాని చెడ్డది గాని, మానవుడు మనోవాక్కాయములతో చేసే ఏ కర్మ అయినా ఈ అయిదు ఆ కర్మకు కారణం అవుతాయి.

*వ్యాఖ్య:-* 'నరః' నరుడు అని ఎందుకన్నారంటే ఒక్క నరునికే కర్మాధికారం ఉన్నది. మిగిలిన జంతువులు, పక్షులు, క్రిమి కీటకాదులకు కర్మాధికారం లేదు. దేవతలకు కూడా కర్మాధికారం లేదు.

కర్మలు 3 రకాలు. శరీరంతో చేసేవి, వాక్కుతో చేసేవి, మనస్సుతో చేసేవి. ఇలా దేనితో కర్మలు చేసినా పైన చెప్పిన 5 కారణాలు ఉండాల్సిందే. ఈ ఐదింటిలో ఆత్మ లేదు. ఆత్మ అకర్త. అయితే ఆత్మ కారణ శరీరంలో ప్రతిబింబించినప్పుడు ఆ ప్రతిబింబమే జీవుడుగా- అహంకారంగా వ్యక్తమై, బుద్ధిలో పుట్టే కామాదుల వల్ల, తన యదార్థ స్థితిని మరచి, ఇంద్రియ భోగ విషయాల ద్వారా సంతృప్తిని కోరుకుంటూ వివిధ ఇంద్రియాలను ఉపయోగించి కర్మలు చేస్తున్నది.

*ఆత్మ పెట్రోలు వంటిది. శరీరం యంత్రం వంటిది. ప్రయాణించేది యంత్రమే గాని పెట్రోలు కాదు. పెట్రోలు లేకుండా యంత్రం కదలదు. అయినా యంత్రం ప్రయాణిస్తుందంటామేగాని పెట్రోలు ప్రయాణిస్తుందని అనలేం. అలాగే శరీరం పని చేస్తుందే గాని ఆత్మ పని చెయ్యదు. అయితే ఆత్మ లేకుండా శరీరం పని చేయదు. అయినా పని చేసేది మాత్రం శరీరమే.

న్యాయ్యంవా విపరీతంవా:- న్యాయమైన కర్మలైనా అన్యాయమైన కర్మలైనా - శాస్త్ర విహితమైనా శాస్త్ర విరుద్ధమైనా ఏవైనా సరే ఈ *5* కారణాలుంటేనే పని జరిగేది.

ఎవరైతే ఈ 5 కారణాలను నిరంతరం గుర్తుంచుకుంటారో ఎవరిలోనైతే ఈ భావన స్థిర పడుతుందో అట్టి వారు జరిగే కర్మలకు ఆత్మనైన నేను కర్తను కాదు.- అనే భావన చేయగలుగుతారు. తాను ఆత్మగా అకర్తగా ఉండిపోతారు. కర్మలన్నీ ఈ దేహేంద్రియాదుల ద్వారా జరిగిపోతున్నవి అనే స్థితిలో ఉంటారు.

నేను కర్తను అనే భావన కలిగిందా కర్మలతో సంగ భావం ఏర్పడుతుంది. కర్మ ఫలాలపై ఆసక్తి ఏర్పడుతుంది. దానితో అది సాత్త్విక త్యాగం కాకుండా పోతుంది. బంధమై కూర్చుంటుంది. కనుక నేను కర్తను అనే భావన ఉండరాదు. కర్తృత్వ భావన తొలగి కర్తవ్యతా భావనతో కర్మలు చేసేందుకే ఈ కర్మ కారణాలను విశ్లేషించటం. ఎలాంటి కర్మలైనా 'నేను చేస్తున్నాను' అనే భావన లేకుండా చెయ్యాలంటే కర్మలకు కారణాలైన ఈ ఐదింటిని చక్కగా గ్రహించి నిరంతర మననంతో స్థిరం చేసుకొని గుర్తుంచుకోవాలి.

*-నిజం ఇదైతే తానే కర్తనని భావించే వాణ్ణి ఏమనాలి?*

శ్లో|| తత్రైవం సతి కర్తారం
ఆత్మానం కేవలం తు యః|
పశ్యత్యకృతబుద్ధిత్వాత్
న స పశ్యతి దుర్మతిః|| *(16)*

తా||కర్మ విషయంలో సంగతి ఇది అయి ఉండగా అపరిపక్వమైన బుద్ధితో ఎవడు కేవలం తానే కర్తననుకుంటాడో ఆ అవివేకి సరిగ్గా గ్రహించనివాడే.

*వ్యాఖ్య:-* ఈ లోకంలో కర్మ జరగటానికి కారణం శరీరం, ఇంద్రియాలు, ప్రారబ్ధవాసనలు, అహంకారం, క్రియలు. అయితే ఆత్మ చైతన్యం అన్నింటికి అంది అవి పని చేస్తాయి. కాని ఆత్మ అకర్త. కర్మలకు కర్త కాదు. కాని అవివేకి నేనే (ఆత్మయే) అన్ని కర్మలను చేస్తుందని భావిస్తాడు.

-క్రింద బక్కెట్టులో ఉంచిన నీటిలో సూర్య బింబం కదలాడుతూ ఉంటుంది. అవివేకి సూర్యుడు కదులుతున్నాడంటాడు. కాని కదులుతున్నది నీరే. అలాగే మేఘాలు కదిలిపోతూ ఉంటే చంద్రుడు కదులుతున్నాడంటాడు అవివేకి. కాని చంద్రుడు కదలటం లేదు. కదిలేది మేఘాలు మాత్రమే.

అలాగే 5 కారణాల వల్ల కర్మ జరుగుతుంటే ఆ కారణాలకు ఆధారంగా వున్న ఆత్మయే కర్మ చేస్తున్నదని అవివేకి భావిస్తాడు.

ఇక్కడ తెలుసుకోవాల్సిన విషయం ఒకటి వున్నది. ఆధ్యాత్మిక సత్యం ఏమంటే ప్రతీ వ్యక్తి ఆత్మ స్వరూపమే. అంటే 'నేను ఆత్మను' అనేది నిజం. అయితే ఇక్కడ 'కర్మ చేస్తున్నది నేను' అంటున్నాడంటే ఆత్మనైన నేను అని కాదు, "తాను ఆత్మనని" అనుభూతి చెందిన వాడే గ్రహిస్తాడు గాని మిగిలిన అందరూ నేను దేహాన్ని అని అనుకునే వారే. అందుకే ఇక్కడ జరిగిన కర్మకు కర్తను నేనే- అంటే దేహమే అని వారి భావన. ఈ దృష్టితో చూస్తే కర్మకు కర్తను నేనే అంటే అహంకారమే అనే భావన సరైనదే. అప్పుడతడు అజ్ఞానియే. కాని జ్ఞానియైనవాడు నేను ఆత్మనని అనుభూతి చెందినవాడు జరిగే కర్మకు కర్తను నేనే అంటే తప్పు. అంటే కర్మకు కర్త ఆత్మ కాదు గనుక.

ఆత్మనైన నేను ఈ దేహేంద్రియాలకు చైతన్యాన్ని ప్రసాదించటం వల్ల అహంకారం దేహంలో కూర్చొని, ప్రారబ్ధవాసనలను అనుసరించి, ఇంద్రియాలను ఉపయోగించుకొని కర్మలు చేస్తున్నది. అంటే కర్మలు చేస్తున్నది అహంకారం. ఆత్మ కాదు.

-నేను అహంకారం అనుకొనే అజ్ఞాని కర్మలు చేస్తున్నది నేనే అంటాడు.

-నేను ఆత్మను అని అనుభూతి చెందిన జ్ఞాని నేను కర్తను కాదు కర్మలకు కర్త అహంకారం అంటాడు.

- కర్మలకు కర్తను నేనే అనుకొనే అజ్ఞాని ఆత్మను తెలుసుకోలేకపోతున్నాడు, తాను ఆత్మనని తెలుసుకోలేక పోతున్నాడు, తాను దేహాన్ని- అహంకారాన్ని అనే భ్రమలో ఉండిపోతున్నాడు.

"నేను ఒక్క తన్ను తన్నానంటే నడ్డి విరిగి హాస్పటల్ బెడ్ మీద ఉంటావ్" అన్నాడొకడు. ఆ మరునాడే అతడి కాలు నోరు చెయ్యి పడిపోయి బెడ్ ఎక్కాడు. మరిప్పుడు తానున్నాడుగా ! తన్నగలడా? లేదు. ఎందుకు? కాలు, నోరు లేవు. తిట్టలేడు తన్నలేడు. అంటే తిట్టేది తన్నేది నోరు, కాలే కాని తాను కాదు. అంటే కర్త తాను కాదు అనేందుకు ఇదే నిదర్శనం.

*-ఇంతవరకు అవివేకి గురించి చెప్పి ఇప్పుడు వివేకి గురించి చెబుతున్నారు. భగవంతుని ఉద్దేశాన్ని అపార్థం చేసుకొనే అవకాశం ఉన్న శ్లోకాల్లో ఇది ఒకటి.*

శ్లో|| యస్య నాహంకృతో భావః
బుద్ధిర్యస్య న లిప్యతే|
హత్వాzపి స ఇమాన్ లోకాన్

న హంతి న నిబధ్యతే|| (17)

తా||ఎవరికి నేను కర్తను అనే భావన లేదో ఎవరి బుద్ధి విషయాలలో కర్మలలో తగులు కోదో అతడు ఈ లోకులను చంపినా చంపిన వాడు కాడు, కర్మ బంధంలో చిక్కుకోడు.

*వ్యాఖ్య:-* నేను ఈ కర్మకు కర్తను అనే కర్తృత్వభావం లేనప్పుడు ఏ కర్మలు చేసినా అవి అతన్ని బాధించవు.

న్యాయ స్థానాల్లో న్యాయమూర్తి కొందరికి శిక్షలు వేస్తుంటాడు, కొందరిని నిర్దోషులుగా విడిచిపెడతాడు. ఉరిశిక్ష వేసినా ఆయనకు పాపం లేదు, విడుదల చేస్తే పుణ్యమూ లేదు. తాను కర్తవ్యాన్ని నిర్వర్తించే వాడే గాని కర్త కాదు. దోషులతో ఆయనకు ఏ సంబంధము లేదు. తీర్పు చెప్పేటప్పుడు కూడా "లభించిన సాక్ష్యాధారాలను బట్టి ముద్దాయి నేరం చేసినట్లు ఋజువైనది గనుక *IPC302* సెక్షన్ ప్రకారం ఉరిశిక్ష విధించటమైనది". అని తీర్పునిస్తాడు. ఇందులో తన ప్రమేయం ఏమీ లేదు. చట్టం, సాక్ష్యాలు. అంతే.

అలాగే ఉరిశిక్షను అమలు పరిచే తలారికి కూడా ఏ పాపం అంటదు. అతడు కూడా కర్త కాదు. ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తాడు. అంతే. అందుకే ఉరికి ముందు నేరస్తుడి పాదాలకు నమస్కరిస్తాడు.

కర్తృత్వం ఉంటే బంధం. అహంకారం ఉంటే బంధం. ఈ తత్వం తెలియని వాడు దుర్మతి. తెలిసినవాడు సుమతి.

హత్వాzపి స ఇమాన్ లోకాన్ న హంతి :- వాడు ఈ లోకాలను చంపినా చంపిన వాడు కాదు- అనే మాట ఉప లక్షణంగా చెప్పబడ్డది. అంటే ఏమి చేసినా చేయని వాడే అని.

అసలు కర్మ వల్ల పుణ్యపాపాలు ఏమీ రావు. ఆ కర్మలతో సంగభావం వల్లనే పుణ్యపాప కర్మ ఫలాలు వచ్చి బంధిస్తాయి.

నిజమైన భక్తుడు కూడా కర్తృత్వం లేని వాడే. భక్తుని దృష్టిలో తాను కేవలం నిమిత్తమాత్రుడు. నడిపేది నడిపించేది అంతా ఆ భగవంతుడే. ఆయన సూత్రధారి, తాను పాత్రధారిని అని భావిస్తాడు.

'యధా నియుక్తోzస్మి తధా కరోమి'- నన్నెలా నియమిస్తే అలా చేస్తాను అంటాడు. తాను భగవంతుని చేతిలో పనిముట్టును అనుకుంటాడు.

దుర్యోధనుడు లక్కయింటిని తగలబెట్టించాడు. ఆతతాయి అయ్యాడు. హనుమంతుడు లంకా నగరాన్ని మొత్తం మొత్తంగా తగలబెట్టాడు. అయినా ఆతతాయి కాలేదు.

'లోకాలను చంపినా' అనే మాటను సరిగ్గా అర్థం చేసుకోవాలి. తాను అకర్తను అని తెలిసిన ఆత్మ జ్ఞాని ఎవరిని ఎందుకు చంపుతాడు? అయితే అతడు ఏమి చేసినా చేయనట్లే అనే భావాన్ని గట్టిగా చెప్పటానికే అలా లోకాలను చంపినా- అనే పదాన్ని ప్రయోగించటం జరిగింది.

స్వార్థపరులు దీనిని తమకు అనుకూలంగా మలచుకొనే అవకాశం ఉన్నది. ఎవరినో తన స్వార్థం కోసం చంపి, ఇందులో నాదేం లేదు. నేను అకర్తను. ఆత్మను అని గాని, భగవంతుడిలా నిర్ణయించాడు అని గాని అంటే అతడు కపటి. తప్పక ఫలితం అతనికే. ఒక వేళ కోర్టులో ఇదే తెలివి ప్రదర్శిస్తే జడ్జీ చెబుతాడు. నాయనా! నీవు ఆత్మవు. అకర్తవు. నిజమే. నేను శిక్ష నీకు వేయటం లేదు. నీ దేహానికి వేస్తున్నాను అని ఉరిశిక్ష వేస్తాడు.

అయితే అసలు ఇక్కడ చంపటం అనే మాట ఎందుకు చెప్పవలసి వచ్చింది? ఈ జ్ఞానాన్ని అందిస్తున్నది యుద్ధరంగ మధ్యంలో. దుర్మార్గులు, అధర్మపరులే అయినా శతృవులను చంపితే పాపం గదా! అనే అర్జునుని సందేహాన్ని తీర్చటానికే

కర్తవ్యతా భావంతో చంపినా ఏవిధమైన బంధం లేదు అని భగవానుడు తెలియజేస్తున్నాడు.

కనుక జ్ఞాని అయిన వాడు, ఆత్మ యందు స్థితి గలిగిన వాడు, నిరంతరం తాను ఆత్మనని, అకర్తనని భావించేవాడు శరీరం ద్వారా ఎలాంటి కర్మలు జరుగుతున్నా అవి అతడిని బాధించవు, బంధించవు. అతడే సుమతి. సంస్కరింపబడిన బుద్ధి కలవాడు, జ్ఞాని, పరమార్థ సన్యాసి.

- అట్టి స్థితిలో ఉండాలంటే మనకు ఎలాంటి జ్ఞానం ఉండాలో, ఎలా కర్మలు చేయాలో, ఎలాంటి కర్తగా ఉండాలో, ఎలాంటి బుద్ధి, పట్టుదల ఉండాలో, ఎలాంటివి ఉండకూడదో ఇక ముందు తెలియజేయబోతున్నారు.

## ఉపోద్ఘాతం

ఆత్మకు కర్మలతో సంబంధం లేదు. ఆత్మ అకర్త. అది తానే. అలాగని తెలిసిన వాడే జ్ఞాని- సన్యాసి- త్యాగి. అయితే ఎలా తెలుస్తుంది? ఎలా జ్ఞానం కలుగుతుంది? తాను ఆత్మనని గ్రహించటం ఎలా?

కర్మ యోగం ద్వారా చిత్త శుద్ధిని సంపాదించిన వానికే ఆ అర్హత. కర్మ యోగాన్ని సత్త్వ గుణ సంపన్నులే చేయగలరు.

కర్మయోగ ప్రకరణాన్ని ఈ అధ్యాయంలో ప్రముఖంగా తెలియజేస్తున్నారు. భగవద్గీత మొత్తంలో కర్మయోగమే ప్రధానమైనది; శ్రేష్టమైనది. అసలు భగవద్గీత మొత్తం కర్మయోగ శాస్త్రమే అంటారు బాలగంగాధర తిలక్. ప్రపంచంలోని పండితులను, మేధావులను, మహాత్ములను ఆశ్చర్య చకితులను చేసింది ఈ కర్మ యోగమే. ఈ అధ్యాయంలో కర్మ యోగాన్ని సాత్త్విక త్యాగం అనే పేరుతో తెలియజేస్తున్నారు. ఈ సాత్త్విక త్యాగాన్ని తెలియజేయటానికి కారణం ఆత్మ అకర్తయని తెలిపి ఆత్మ జ్ఞాన ప్రాప్తిని కలిగించేందుకే.

సాత్త్విక త్యాగానికి ఆత్మ జ్ఞాన ప్రాప్తికి సంబంధం ఏమిటి?- కర్మ చేస్తున్నది దేహాదులు అని నిశ్చయానికి వచ్చినప్పుడు నేనెవరిని? అనే ప్రశ్న వస్తుంది. అప్పుడు నేను ఆత్మను. అకర్తను అని తెలుస్తుంది. నేను ఆత్మనని గ్రహించుటే ఆత్మ జ్ఞాన ప్రాప్తి.

ఏదైనా ఒక కర్మ జరగాలంటే ముందు ప్రేరణ ఉండాలి. తర్వాత కర్మ జరగటానికి కొంత సంఖారం ఉండాలి. ప్రేరణను కర్మ చోదకమని, సంభారాన్ని కర్మ సంగ్రహమని చెప్పవచ్చు.

మనం ప్రతి రోజూ ఇంట్లో క్రింద నేల మీద కూర్చొని భోజనం చేస్తున్నాం. బంధువుల ఇంటికి వెళ్ళినప్పుడు దర్జాగా టేబుల్ మీద కూర్చొని భోంచేస్తున్నాం. ఇది కర్మ చోదనం. దానితో వడ్రంగిని పిలిచి టేబుల్ , కుర్చీలు చేయించాం. ఇది కర్మ సంగ్రహం.

*-ఇలా ఏ కర్మకైనా చోదన ఉండాలి. సంకల్పం ఉండాలి. ఆ తరువాత కర్మ సంగ్రహం జరిగిపోతుంది. చోదన జ్ఞాన రూపం. అంతరంగంలోనిది. సంగ్రహం కర్మ రూపం. బహిరంగంలోనిది. ఇప్పుడు వీటి వివరణ వస్తున్నది.*

శ్లో|| జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధా కర్మచోదనా|
కరణం కర్మ కర్తేతి
త్రివిధః కర్మసంగ్రహః|| (18)

తా|| తెలివి, తెలుసుకోబడే విషయం, తెలుసుకొనేవాడు. ఈ మూడూ కర్మను ప్రేరేపించే కారణాలు. ఇదే కర్మ చోదన. ఇంద్రియాలు, కర్మ, కర్మ చేసే కర్త - ఈ మూడూ కర్మను నిర్వహించేవి. ఇదే కర్మ సంగ్రహం.

*వ్యాఖ్య:-* కర్మలను ప్రేరేపించే కారణాలు *3*. అవే జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాత. జ్ఞానం అంటే తెలివి. జ్ఞానేంద్రియాల ద్వారా తెలుసుకొనేది. కంటితో చూచి, చెవితో విని, చర్మంతో స్పర్శించి, ముక్కుతో వాసన చూచి, నాలుకతో రుచి చూచి తెలుసుకొనే తెలివియే జ్ఞానం. మనస్సుతో ఆలోచించి కూడా తెలుసుకోవచ్చు. జ్ఞేయం అంటే తెలుసుకోబడే విషయం, లేదా వస్తువు. పరిజ్ఞాత అంటే తెలుసుకొనే వ్యక్తి లేదా జీవుడు. లోకంలో ఏదైనా కర్మ జరగాలంటే ముందుగా ప్రేరణ ఉండాలి. వీటిలో ఏది లేకపోయినా కర్మకు ప్రేరణ ఉండదు. కర్మ చేయాలనే ఆలోచన కలగదు.

*మన ఇంట్లో ఫ్రిజ్ ఉంటే ఎంత బాగుంటుంది? వేసవిలో చల్లని నీటిని, పానీయాలను త్రాగవచ్చు. కూరగాయలు చెడకుండా నిల్వ చేసుకోవచ్చు, డిగ్నిటీ మైన్ టైన్ చేయవచ్చు. స్నేహితులు వచ్చినపుడు కూల్ డ్రింక్స్ ఆఫర్ చేసి మర్యాద చేయవచ్చు. ఇలా భావించటమే జ్ఞానం. ఫ్రిజ్ అనే వస్తువే జ్ఞేయం. దాని గురించి సమాచారం సేకరించిన నేను పరిజ్ఞాత. ఈ మూడింటిలో ఏది లేకపోయినా కర్మకు ప్రేరణ ఉండదు. కర్మ చోదన ఉండదు. ఫ్రిజ్(జ్ఞేయం) లేకపోయినా, దాని గురించిన సమాచారం(జ్ఞానం) లేకపోయినా, ఫ్రిజ్ తెచ్చుకోవాలి అనే ప్రేరణ ఉండదు.

అలాగే కర్మ జరగటానికి కూడా *3* కారణాలుండాలి. కరణం, కర్మ, కర్త. శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి- ఇవి కరణములు. వీటి ద్వారా పని జరగటం కర్మ. వీటితో పని జరిపేవాడు కర్త.

ఫ్రిజ్‌ను తెచ్చుకోవాలని అనుకున్న తర్వాత షాపుకు వెళ్ళాలి. శరీరం, కాళ్ళు, చేతులు, వాక్కు మొదలగు కరణాలు అందుకు ఉపయోగపడతాయి. మాట్లాడుకోవటం, సెలక్టు

చేసుకోవటం, డబ్బు ఇవ్వటం, ఇంటికి ఫ్రిజ్ తెచ్చుకోవటం. ఇదంతా కర్మ. తెచ్చుకొనేవాడు కర్త. ఇందులో ఏవి లేకపోయినా కర్మ జరగదు.

జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాత అనే త్రిపుటి ద్వారా కర్మ చోదన జరుగుతుంది. కరణం, కర్మ, కర్త అనే త్రిపుటి ద్వారా కర్మ సంగ్రహం జరుగుతుంది. మొదటి త్రిపుటిలో జ్ఞానం ముఖ్యం. రెండవ త్రిపుటిలో కర్మ ముఖ్యం. ఈ రెండూ జీవుడికి చెందినవే. విషయ ప్రపంచంలోకి తొంగి చూచినప్పుడు జ్ఞాతగా మారి జ్ఞానాన్ని సేకరిస్తాడు. కర్మ రంగంలోకి తొంగి చూచినప్పుడు కర్తగా మారి కర్మ చేస్తాడు.

***-జ్ఞాతగా సంపాదించుకొనే జ్ఞానము, కర్తగా చేసే కర్మ, జ్ఞాత లేదా కర్త అయిన జీవుడు- ఈ మూడు అహంకారానికి చెందినవే. వీటిని విశ్లేషిద్దాం.***

శ్లో|| జ్ఞానం కర్మ చ కర్తాచ
త్రిధైవ గుణభేదతః|
ప్రోచ్యతే గుణసంఖ్యానే
యథావచ్ఛృణు తాన్యపి|| *(19)*

తా||జ్ఞానం, కర్మ, కర్త - ఈ మూడూ గుణ భేదాలను బట్టి మూడు విధాలుగా ఉన్నాయి. గుణాలను గూర్చి విచారణ చేయబడిన సాంఖ్య శాస్త్రంలో ఈ విధంగా చెప్పబడింది. దానిని కూడా శాస్త్రంలో చెప్పబడిన విధంగా విను.

*వ్యాఖ్య:-* జ్ఞానం- జ్ఞేయం- జ్ఞాత- ఈ *3* కర్మ చోదన- కరణం- కర్మ-కర్త- ఈ *3* కర్మ సంగ్రహం. ఈ మొత్తం *6* కలిస్తే కర్మ సిద్ధి. ఈ ఆరింటిని సంక్షిప్తం చేసి *3* గా చెప్పవచ్చు. ఎలా? జ్ఞాత - కర్త ఒక్కరే. జ్ఞానేంద్రియాల ద్వారా విషయాలను

గ్రహిస్తున్నప్పుడు జీవుణ్ణి 'జ్ఞాత' అన్నారు. ఆ జీవుడే కర్మేంద్రియాల ద్వారా కర్మను చేస్తున్నప్పుడు 'కర్త' అన్నారు. కనుకనే జ్ఞాత కర్త ఒక్క జీవుడే అని చెప్పవచ్చు. కనుక 'కర్త'ను తీసుకున్నారు. ఇక కరణం కర్మలో కలిపి వేయవచ్చు. కర్మ అంటే పని. అది ఇంద్రియాల (కరణాల) ద్వారా జరుగుతుంది. కనుక 'కర్మ' ను తీసుకున్నారు. అలాగే జ్ఞేయం జ్ఞానంలో కలిపి వేయవచ్చు. జ్ఞేయం అనేది జ్ఞానానికి సాధనం. జ్ఞేయం అంటే తెలుసుకునే తెలివి. కనుక రెంటిని కలిపి 'జ్ఞానం'ను తీసుకున్నారు. ఇలా జ్ఞానం- కర్మ- కర్త అని పై ఆరింటిని 3 గా సంక్షిప్తం చేశారు. జీవుడైన కర్త జ్ఞానాన్ని పొంది కర్మను చేస్తాడు.

త్రిధైవ గుణ భేదతః :- ఈ మూడింటికి త్రిగుణ భేదం చెప్పబడింది. ఈ గుణ భేదాలన్నీ సాంఖ్య శాస్త్రంలో చెప్పబడ్డాయి. ఆ సాంఖ్య శాస్త్రాన్నే ఇక్కడ 'గుణ సంఖ్యానే' అన్నారు. గుణముల గురించి చెప్పిన సాంఖ్య శాస్త్రం అని అర్థం. ఈ సాంఖ్య శాస్త్రానికి కర్త కపిల మహర్షి. సత్త్వరజస్తమో గుణ భేదాలను బట్టి ఈ జ్ఞానం-కర్మ-కర్తలను 3 విధాలుగా విభాగించవచ్చు.

మనం చేసే ప్రతి కర్మ సాత్త్వికత్యాగం కావాలంటే కర్మ జరగటానికి కారణమైన ఈ జ్ఞానం- కర్మ- కర్త అనే మూడు సాత్త్వికం కావాలి. కేవలం సాత్త్వికం మాత్రమే తెలుసుకున్నా సందేహాలు మిగిలిపోవచ్చు. అందుకే రాజసిక, తామసిక భేదాలను కూడా తెలియజేసి సందేహనివృత్తి చేస్తున్నారు. మనం సాత్త్విక త్యాగులం కావాలంటే సాత్త్విక సామాగ్రు (జ్ఞానం-కర్మ-కర్త) లనే స్వీకరించాలి. రాజసిక- తామసిక సామాగ్రులను వదిలివేయాలి. అప్పుడే త్యాగ సిద్ధి.

మనందరిలోను 3 గుణాలు ఉంటాయి. అయితే అందరిలోనూ ఒకే రకంగా ఉండవు. ఒక గుణం అధికంగా

ఉంటే మిగిలిన రెండు గుణాలు పరిస్థితుల కారణంగా, పరిసరాల కారణంగా, కాలానుగుణంగా మారిపోతూ ఉంటాయి.

ఒక వ్యక్తిలో సాత్త్విక గుణం అధికంగా ఉన్నది. దైవభక్తితో, మంచి ప్రవర్తనతో, పరోపకార బుద్ధితో ఉంటాడు. అయితే అతడికి అన్నీ కష్టాలే. ఆర్థిక పరిస్థితి దిగజారిపోయింది. పేదరికం దుర్భరంగా ఉన్నది. చుట్టూ అందరూ రకరకాల పనులు చేస్తూనో, మోసాలు చేస్తూనో బాగా సంపాదించి, భోగాలు అనుభవిస్తున్నారు. అలాంటి పరిస్థితులలో అతడిలో మార్పు రావచ్చు. రజోగుణం సత్త్వ గుణాన్ని త్రొక్కి పైకి వస్తుంది. దానితో అతడు ప్రాపంచిక వ్యవహారాలలో మునిగి పోతాడు. ఇలా పరిస్థితులను బట్టి గుణాలు మారవచ్చు. అలాగే కాలాన్ని బట్టి కూడా మారవచ్చు. యవ్వనంలో రజోగుణం ఉంటుంది. వార్ధక్యంలో సాత్త్వికంగా మారి పోవచ్చు. ఒక్కొక్కప్పుడు మహాత్ముల సాంగత్యం వల్ల మారి పోవచ్చు. అలాగే దుష్టుల సాంగత్యంతో సత్త్వం నుండి రజోగుణానికో - తమోగుణానికో మారవచ్చు. కనుక గుణాలేవీ స్థిరంగా ఉండేవి కావు. ఇలా మార్చుకొనే అవకాశమే లేకపోతే ఇక నేర్చుకోవటం వృథాయేగదా!

తాన్ అపియధావత్ శ్రుణు:- వాటిని శాస్త్రంలో తెలిపిన విధంగా విను అంటున్నాడు భగవానుడు. అంటే భగవానుడు కూడా శాస్త్రంలో చెప్పిన విషయాలకే ప్రాధాన్యతనిస్తున్నాడు. ఎవరికైనా శాస్త్రమే ప్రధానం అని చెప్పకనే చెబుతున్నాడు. అంతే కాదు శ్రుణు-విను అనటంలో అయ్యా! చెప్పేది శాస్త్ర విషయం. కనుక శ్రద్ధగా విను అని-ఆంతర్యం. శాస్త్రాలు చదివి అర్థం చేసుకోవటం అందరికీ సాధ్యమైన విషయం కాదు. ఎక్కడో కపిల మహర్షి చెప్పిన సాంఖ్యశాస్త్రాన్ని అర్థం చేసుకొని,

అందులోని గుణ భేదాలను ఏరి, వాటిని ఇక్కడ సాత్త్విక త్యాగంతో సమన్వయం చేసి భగవానుడు చెబుతుంటే ఎంత శ్రద్ధగా వినాలి? నిజంగా అర్జునుడు శ్రద్ధగానే వింటున్నాడు. అయినా జాగ్రత్తలు చెప్పటం దేనికి అంటే ఇంకా శ్రద్ధగా విను అని చెప్పటానికే. అర్జునునికి చెప్పిన ఆ హితవు మనకు ఇంకా బాగా వర్తిస్తుంది. కనుక అత్యంత శ్రద్ధతో విందాం. అలా శ్రద్ధగా విని సాత్త్విక జ్ఞానం, సాత్త్విక కర్మ, సాత్త్విక కర్త అంటే ఏమిటో తెలుసుకొని సాత్త్విక త్యాగులమవుదాం.

*-ముందుగా జ్ఞానాన్ని గుణ భేదాలతో విభాగిస్తున్నారు. సాత్త్విక జ్ఞానం అంటే ఏమిటో తరువాతి శ్లోకంలో.*

**శ్లో|| సర్వభూతేషు యేనైకం**
**భావమవ్యయమీక్షతే|**
**అవిభక్తం విభక్తేషు**
**తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్|| (20)**

**తా||ఏ జ్ఞానం చేత వేరు వేరుగా కనిపించే సమస్త ప్రాణులలోను ఒక్కటే అయిన నాశనం లేని సత్తాను అభిన్నమైన దానిగా - ఒక్కటిగా చూస్తున్నాడో అట్టి జ్ఞానం సాత్త్విక జ్ఞానం అని తెలుసుకో.**

*వ్యాఖ్య:-* **ప్రాణి కోట్లు ఏవీ ఒకదాని వలె ఒకటి ఉండవు. మనిషిలాగా కోతి ఉండదు. కోతిలాగా కుక్క ఉండదు. కుక్కలాగా కాకి ఉండదు. కాకిలాగా పిచ్చుక ఉండదు. అలాగే ఒక మనిషి ఉన్నట్లు మరో మనిషి ఉండడు. ఒక జంతువు ఉన్నట్లు ఇంకో జంతువు ఉండదు. ఆకారంలో భేదం, పరిమాణంలో భేదం, రంగులో భేదం., అవయవాల పొందికలో భేదం.**

ఇలా వేరు వేరుగా ఉన్న సమస్త ప్రాణికోట్లలోను అన్నింటా ఆధారంగా ఉన్న సత్య వస్తువు, ఆత్మ వస్తువు, చైతన్యం ఒక్కటే-ఏకం.

* ఆభరణాలు ఎన్నో ఉండవచ్చు. కాని బంగారం ఒక్కటే.

*కుండలు ఎన్నో ఉండవచ్చు. కాని మట్టి ఒక్కటే.

*వస్త్రాలెన్నో ఉండవచ్చు. కాని ప్రత్తి ఒక్కటే.

అలాగే ప్రాణి కోట్లు ఎన్నో ఉండవచ్చు. కాని ఆత్మ ఒక్కటే. అంతే కాదు. అది అవ్యయం- నాశనం లేనిది.

శరీరాలు, రూపాలు ఎప్పుడో ఒకప్పుడు పుట్టినవి. ఎప్పుడో ఒకప్పుడు నశించేవి. ఆత్మకు పుట్టుకా లేదు, నాశనమూ లేదు. అవ్యయం.

కుమ్మరి ఈ రోజు 100 కుండలు తయారు చేశాడు. ఆ కుండలన్నిటిలోను ఆకాశం ఉన్నది. అవి ఒక రోజున పగిలిపోయినవి. అప్పుడు వాటిలోని ఆకాశం ఏమైంది? ఏమీ కాలేదు. ఎక్కడకు పోలేదు. అది అక్కడే ఎప్పటి లాగానే ఉంది. ఘటాకాశం అని మన చేత పిలవబడ్డది మహాకాశంగా అలాగే ఉన్నది. ఉండటం పోవటం కుండల ధర్మమే గాని ఆకాశం ధర్మం కాదు. ఆకాశం ఎప్పుడూ అక్కడ అలాగే ఉండిపోతుంది.

అలాగే ఈ ప్రాణి కోట్లన్నీ పుట్టుక, చావు కలిగినవి. ఎప్పుడూ శాశ్వతంగా ఉండేవి కాదు. కాని ఆత్మ ఎపుడూ ఉండేది. నాశనం లేనిది. ఇలా ప్రాణి కోట్లు అన్నింటా ఎప్పుడూ ఒక్కటిగా ఉండేది ఆత్మ ఒక్కటేనని, అవ్యయమైనది అని తెలుసుకోవటమే జ్ఞానం. ఈ జ్ఞానమే సాత్త్విక జ్ఞానం.

అంటే ఈ లోకంలో ఉన్న మనుష్యులను, జంతువులను, పక్షులను, మృగాలను, క్రిమి కీటకాలను- అన్నిటినీ వేరు వేరుగా

చూస్తాం. ఒకరిపై రాగం ఒకరిపై ద్వేషం, ఒకరిపై అసహ్యం, ఒకరిపై ప్రేమ. వారి వారి గుణాలను బట్టి ఒకరిని మంచి వారని, మరొకరిని చెడ్డవారని, విభాగించి చూస్తాం. మన తెలివి, మన జ్ఞానం ఇలాంటిదే.

అలా కాకుండా జ్ఞానులు, మహాత్ములలాగా ఏ గుణాలు గలిగినవారినైనా, ఎలాంటి రూపంతో ఉన్న వారినైనా- అందరిని ఆత్మతత్త్వంగా ఒక్కటిగా తెలుసుకొని, చూచే జ్ఞానం ఎవరికుంటుందో వారిదే సాత్త్విక జ్ఞానం.

అభేద దర్శనమే- ఆత్మ దర్శనమే సాత్త్విక జ్ఞానం. సాత్త్విక జ్ఞానం కలవారే సాత్త్విక కర్మలు చేస్తారు. సాత్త్విక కర్మలు చేసేవారే సాత్త్విక త్యాగులు. సాత్త్విక త్యాగులకే మోక్షార్హత.

కనుక ఏ ప్రాణిని చూచినా మనకు ఉండవలసింది దేహ దృష్టి కాదు, మనో దృష్టి కాదు, ఆత్మ దృష్టియే- ఏకత్వదృష్టియే.

*-ఇలా భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగలగటమే సాత్త్విక జ్ఞానం. -ఇక రాజసిక జ్ఞానం గురించి.*

శ్లో|| పృథక్త్వేన తు యజ్జ్ఞానం
నానాభావాన్ పృథగ్విధాన్|
వేత్తి సర్వేషు భూతేషు
తజ్జ్ఞానం విద్ధి రాజసమ్|| *(21)*

తా||ఏ జ్ఞానం చేత సమస్త ప్రాణికోట్లలోను, వేరు వేరు విధాలుగా కనపడే రూపాలలో వేరు వేరు జీవుళ్ళను వేరు వేరు విధాలుగా ఉన్నట్లు తెలుసుకుంటున్నావో ఆ జ్ఞానాన్ని రాజసిక జ్ఞానం అని తెలుసుకో.

*వ్యాఖ్య:-* ప్రాణి కోట్ల శరీరాలు వేరు వేరు రూపాలలో ఉంటాయి. ఒక జాతికి మరో జాతికి భేదం. ఒకే జాతిలో - మానవ జాతిలో ఒక వ్యక్తికి మరో వ్యక్తికి రూపంలో భేదం. ఇలా కనిపించే వేరు వేరు రూపాలలో వేరువేరు జీవుళ్ళు. అంటే వేర్వేరుగా ఆత్మలున్నాయని భావించే జ్ఞానం రాజసిక జ్ఞానం. బాహ్యంగా మనం చూసే దేహాల రూపాలను బట్టి మానవ ఆత్మ, కుక్క ఆత్మ, ఏనుగు ఆత్మ, బల్లి ఆత్మ, పంది ఆత్మ, స్త్రీ ఆత్మ, పురుష ఆత్మ, ఇది మంచి ఆత్మ, అది చెడ్డ ఆత్మ, ఇది పుణ్యాత్మ, అది పాపాత్మ అని వేరు వేరుగా శరీరం యెక్క రూపాన్ని బట్టి, మనస్సు యెక్క ఆలోచనలను బట్టి, బుద్ధిలోని జ్ఞానాన్ని-గుణాలను బట్టి వేరు వేరుగా చూస్తే అది రాజసిక జ్ఞానం అవుతుంది.

ఇక మనుషుల్లో మాత్రమే ఆత్మలుంటాయని, మిగిలిన జంతువులు, మృగాలు, పక్షులు, క్రిమి కీటకాలు ఆత్మలు కాదని చెప్పేవారు, వినేవారు ఎందరో ఉన్నారు. ఇలా అనేక ఆత్మలున్నాయని నమ్మే వారి జ్ఞానం రాజసిక జ్ఞానమే. వారి దృష్టిలో ఆత్మ స్థూలమైనది, సర్వవ్యాపికాదు.

ఆకాశం కుండలో ఉంది, కూజాలో ఉంది, పిడతలో ఉంది, చెంబులో ఉంది, గ్లాసులో ఉంది, బిందెలో ఉంది. ఈ రూపాలన్నీ నశిస్తే వేరు వేరుగా ఉన్నదనుకున్న ఆకాశాలన్నీ ఒక్కటే అయిన మహాకాశమే కదా! ఆకాశం ముక్కలైనట్లు భావిస్తామే గాని ముక్కలు కాదు. అలాగే ఆత్మ కూడా ఎన్ని రూపాలలో ఉన్నా అది ముక్కలయ్యేది కాదు. ఆత్మను ఛేధించ వీలు లేదు, తడప వీలు లేదు, ఎండించ వీలు లేదు, నశింపజేసే వీలు లేదు. అది ఎప్పుడూ ఒక్కటే. సూక్ష్మాతి సూక్ష్మమై, సర్వ వ్యాపకమై యున్నది. ఇంకా చెప్పాలంటే ఆకాశం తాత్కాలికంగానైనా వేరు చేయబడుతుంది గాని ఆత్మను

తాత్కాలికంగా కూడా వేరు చేయడం వీలు కాదు. ఎందుకంటే ఆత్మ ఎప్పుడూ ఒక్కటే. అసలు సత్య వస్తువు అదే. అట్టి ఆత్మలో అన్ని ప్రాణి కోట్లు కేవలం కల్పించబడి ఉంటున్నాయేగాని అవి సత్యం కాదు. అందువల్ల ఆత్మ అఖండం.

ఇలా ఒక్కటే అయిన ఆత్మ వేరువేరు రూపాలతో ఉన్న ప్రాణులలో వేరు వేరుగా ఉన్నదని అజ్ఞానంలో భావించే జ్ఞానం రాజసిక జ్ఞానం అంటారు. సాత్విక జ్ఞానం అభేదాన్ని చూపితే రాజసిక జ్ఞానం భేదాన్ని చూపుతుంది.

*-తామసిక జ్ఞానం గురించి-*

*శ్లో||* యత్తు కృత్స్నవదేకస్మిన్
కార్యే సక్తమహైతుకమ్|
అతత్త్వార్థవదల్పం చ
తత్తామసముదాహృతమ్|| *(22)*

తా||ఏ జ్ఞానం వల్ల ఏదో ఒక కార్యమునందు లేదా శరీరము నందు సమస్తము ఇదేనని పట్టు బట్టి ఉంటాడో, అట్టి తగిన హేతువు లేనట్టి, సత్య వస్తువును తెలుసుకోనట్టి, అల్పమైనట్టి జ్ఞానాన్ని తామస జ్ఞానం అంటారు.

*వ్యాఖ్య:-* పరిమితిగలదానిలో పరిపూర్ణ భావాన్ని ఊహించటమే తామసిక జ్ఞానం. కూపస్థ మండూక జ్ఞానంలాగా తనకు తెలిసిందే అంతా అని అనుకోవటం, మొండి పట్టుదల, అజ్ఞానం అన్నీ కలిసి తామసిక జ్ఞానం.

శరీరమే ఆత్మయని, ప్రతిమయే దేవుడని మొండి పట్టుదలతో ఉండటం తామసిక జ్ఞానం.

*అన్నింటిలో ఒక్క దాన్ని(ఆత్మని) చూడటం సాత్త్విక జ్ఞానం.

*ఒక్క దానిలో సర్వాన్ని భావించటం తామసిక జ్ఞానం.

తామస జ్ఞానిది శరీర దృష్టి(దేహ దృష్టి) మాత్రమే. తామస జ్ఞానిది మూర్ఖపు పట్టుదల.

తాను నమ్మిన దేవుడే నిజమైన దేవుడు. మిగిలినవారు దేవుళ్ళే కాదు. తాను నమ్మిన వ్యక్తియే మహాత్ముడు. మిగిలిన వారంతా అల్పులు. తాను నమ్మిన మతమే నిజమైన మతం, మిగిలినవన్నీ మతాలే కాదు. తనకు తెలిసిన జ్ఞానమే అసలైన జ్ఞానం, ఇంతకన్నా తెలిసిన వారే లేరు. ఇలాంటి భావాలు గలవారినే కూపస్థ మండూకాలు అంటారు. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అనే మూర్ఖులు. వీరే తామసిక జ్ఞానులు.

ఒక పెద్ద చెరువులో ఉండే కప్ప ఒకటి అనుకోకుండా బయట పడి ఒక బావిలోకి చేరింది. ఎప్పుడూ ఆ భావిలోనే ఉండే కప్ప ఈ క్రొత్త కప్పను క్షేమ సమాచారాలు అడుగుతూ ఇంతకు ముందు నీవు ఎక్కడ ఉన్నావు? అని అడిగింది. దానికా కప్ప పెద్ద చెరువులో ఉన్నానంది. "అబ్బా అంత పెద్ద చెరువా? అంటూ ఒక్క గెంతు గెంతి ఇంత పెద్దదా అంది పాత కప్ప.'అబ్బే ఇంకా చాలా పెద్దది' అంది క్రొత్త కప్ప. ఇంకా నాలుగు గెంతులు వేసి 'ఇంత ఉంటుందా?' అంది పాత కప్ప. దానికి అబ్బే! ఇదొక లెక్కా. అది ఎంత పెద్దదో మాటల్లో చెప్పలేను అన్నది. ఆ పాత కప్పకు ఒళ్లు మండింది. 'చాలు చాల్లే. కొయ్యకు కోతలు. అసలు ఇంతకన్నా నీరుండే పెద్ద చెరువు ఎక్కడైనా ఉంటుందా? నాకు తెలియని చెరువులా? ఎంత కాలం నుండి చూస్తున్నాను. అసలు నా వయసు ఎంత అనుకుంటున్నావు? నా సర్వీసంత లేదు నీ వయస్సు. నాకు చెప్పవచ్చావా?' అన్నదట". అది దాని జీవితంలో ఆ భావిని తప్ప మరొకటి ఎరుగదు. కనుక దాని ఊహకు అందదు. ఇదే కూపస్థ మండూకం అంటే.

తామసిక జ్ఞానులు ఇలాంటి వారే. మొండి పట్టు పట్టటం తప్ప తాము చెప్పేదానికి హేతువును చూపించలేరు. సరైన కారణాన్ని తెలుసుకోలేరు. అతడి బుద్ధి అల్ప బుద్ధి. అల్ప బుద్ధికి అధికమైన విషయం తెలియదు.

ఒక తండ్రీ కొడుకు నిర్జన అరణ్యం గుండా ప్రయాణం చేస్తున్నారు. చీకటి పడింది. ఒక చెట్టునీడన పడుకొని నిద్రపోయారు. తెల్లవారుతుండగా తండ్రి నిద్ర లేచి కుమారుడితో "నాయనా ! లే! సూర్యుడు పొడుస్తున్నాడు. మనం చాలా దూరం వెళ్ళాలి". అన్నాడు. ఆ చెట్టు మీద నివాసం ఉంటున్న గుడ్లగూబను పిల్ల అడిగింది. ‘‘అమ్మా! సూర్యుడంట, పొడుస్తున్నాడంట ఎవరే ఆ సూర్యుడు?’’ అని. దానికి తల్లి "చాలు చాల్లే. పిచ్చిదానా? సూర్యుడు లేడు, పొడవటమూ లేదు, నాకు తెలియదా ఏమి?" అన్నదట. నిజంగా గుడ్లగూబ ఏనాడూ సూర్యుణ్ణి చూడలేదు. ఎందుకంటే వెలుగులో గుడ్లగూబకు కళ్ళు కనపడవు. చీకట్లోనే కళ్లు పని చేస్తాయి. అలాగే ఈ తామసులు గుడ్లగూబల్లాగా జ్ఞాన సూర్యుణ్ణి ఏనాటికీ దర్శించలేరు.

విష్ణువు తప్ప వేరే దేవుడే లేడు; శివుడు భిక్షా పాత్ర పట్టుకొని అడుక్కుతినే వాడు. మనకేం ఇవ్వగలుగుతాడు? అని కొందరు వైష్ణవులు; శివుడే దేవుడు. ఉన్న సంపదనంతా తానే ధరించి, లక్ష్మీ దేవిని తన కాళ్ళ దగ్గరే పడవేసి ఉంచిన విష్ణువును పూజిస్తే మనకేం ఇస్తాడు? అని కొందరు వీర శైవులు పోరాడుకుంటూ రాగద్వేషాల విషవలయంలో చిక్కుకుంటారు. అందుకే వీరిని అల్ప బుద్ధులు అంటారు. వీరిది తామసిక జ్ఞానం అంటారు.

తామసిక జ్ఞానం అసలు జ్ఞానమే కాదు. అది పూర్తి అజ్ఞానం. అందుకే భగవానుడు "తత్ జ్ఞానం విద్ధిసాత్త్వికం"

అని, తత్ జ్ఞానం విద్ధి రాజసం అని, ఇక్కడకు వచ్చేటప్పటికి తత్ తామసం ఉదాహృతం" అన్నాడు. తామసిక జ్ఞానం అనకుండా తామసికం అనటం జరిగింది. అంటే ఇది తామసిక లక్షణమే గాని, తామసిక జ్ఞానం కాదు- అని. గొప్ప అజ్ఞానం అని. ఇలా జ్ఞానం 3 విధాలు.

*-జ్ఞానాన్ని బట్టే చేసే కర్మ ఉంటుంది. అట్టి కర్మను గుణ భేదంతో విభాగిస్తున్నారు. సాత్త్విక కర్మ అంటే ఏమిటో ముందుగా-*

శ్లో|| నియతం సంగరహితం
అరాగద్వేషతః కృతం|
అఫలప్రేప్సునా కర్మ
యత్తత్సాత్త్వికముచ్యతే|| *(23)*

తా||శాస్త్ర విహితమైనది, సంగభావం లేనిది, రాగద్వేషాలు లేనిది, ఫలాసక్తి లేకుండా చేసేది ఏ కర్మగలదో అది సాత్త్విక కర్మ అని చెప్పబడుతున్నది.

*వ్యాఖ్య:-* నిజంగా కర్మ సాత్త్వికం, రాజసికం, తామసికం అని 3 రకాలు లేదు. కర్మ చేసేటప్పుడు ఆ కర్మ చేయటానికి వెనుక గల భావనను బట్టి 3 విధాలుగా కర్మ చెప్పబడింది. మరి ఎలాంటి భావాలుంటే అది సాత్వికి కర్మ అవుతుందో ఈ శ్లోకంలో 4 భావాలను చెప్పారు.

*(i)* నియతం :- అంటే శాస్త్రాలలో చెప్పిన విధంగా, లేదా శాస్త్రాలు నిర్దేశించిన కర్మలే చేయాలి. శాస్త్రాలు చెప్పినట్టే ఎందుకు చేయాలి?

మానవుడు ఎలా నడుచుకుంటే తనలోని దైవత్వాన్ని అందుకోగలడో అలాంటి ప్రవర్తన గల కర్మలనే శాస్త్రం విధిస్తుంది. మన వాసనలను ఖర్చు చేసుకుంటూ, మనస్సు నిర్మలం కావటానికి తోడ్పడే కర్మలనే శాస్త్రం చెబుతుంది. అప్పుడే అవి సాత్వికమౌతాయి. అవి మనశ్శుద్ధిని కలిగించి ఆత్మజ్ఞానాన్ని అవగతం చేసుకొని మోక్ష ప్రాప్తికి మార్గాన్ని సుగమం చేస్తాయి. అందుకే భగవానుడు అర్జునునితో "తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే"- అర్జునా నీకు శాస్త్రమే ప్రమాణం. కనుక శాస్త్రమునందు చెప్పిన విధంగా కర్మాచరణ చెయ్యమని చెప్పటం జరిగింది.

*(ii)సంగరహితం:-* కర్మలయందు బుద్ధి అంటుకోకుండా- సంగ భావం లేకుండా ఉండాలి. అందుకే 'బుద్ధిర్యస్యనలిప్యతే'- కర్మలతో బుద్ధి అంటుకోకుండా ఉండాలి, అని 17వ శ్లోకంలో చెప్పటం జరిగింది. అంటే నేను చేస్తున్నాను అనే అభిమానం- అహంకారం - కర్తృత్వం ఉండకూడదు.

*సూర్యుడు వెలుగునిస్తున్నాడు కాని అహంకారం లేదు కర్తృత్వం లేదు.

*వాయువు గాలినిస్తుంది. కర్తృత్వం లేదు.

*వరుణుడు నీటినిస్తున్నాడు. కర్తృత్వం లేదు

*వృక్షాలు ఫల పుష్పాలనిస్తున్నాయి. కర్తృత్వం లేదు.

అలాగే గృహస్థుడు భార్యా బిడ్డలను పోషిస్తూ ఊరికి ఉపకారం చేస్తున్నట్లు భావించరాదు.

ఆంజనేయుడు ఎన్నో ఘనకార్యాలు చేశాడు. ఇదంతా తన గొప్పతనమని ఏనాడూ భావించలేదు. అంతా రాముని మహిమ అనుకున్నాడు. 100 యోజనాల సముద్రాన్ని లంఘించి, ఎందరో రాక్షసులను సంహరించి, రావణుడితో ఏమన్నాడో

చూడండి. 'నాకన్నా తక్కువ కోతి శ్రీరాముని సేవలో లేదు'-అని. ఇదే అహంకార రాహిత్యం.

*(iii)*అరాగద్వేషతః :- కర్మలు చేసేటప్పుడు ఏ రాగ ద్వేషాలు లేకుండా చేయాలి. నా వారు అనుకుంటే రాగం, శతృవు అనుకుంటే ద్వేషం, ధర్మరాజుకు శతృవుల పట్ల కూడా ద్వేష భావం లేదు. భీముని చంపించటానికి, లక్క యింటిలో తామందరిని దగ్ధం చేయించటానికి ప్రయత్నించిన దుర్యోధనుడిపై కూడా ద్వేషం లేదు, ద్రోహ బుద్ధి లేదు. అరణ్యాలలో ద్రౌపది భీములు ఎంతగా రెచ్చగొట్టినా సరే ఆయన ఏ మాత్రం చలించలేదు. అధర్మానికి ఒడిగట్టలేదు. యుద్ధానంతరం ఇంత దుర్మార్గానికి మూల కారకుడైన ధృతరాష్ట్రుని ఒక్క మాట అనలేదు. పైగా ఎంతో గౌరవించాడు. ఆయనకు ఏ అసౌకర్యం కలగకుండా చూచాడు. ఇదే రాగ ద్వేష రహిత ప్రవర్తన.

*(iv)*అఫలప్రేప్సునా :- అంటే ఫలాసక్తి లేకుండా కర్మలు చేయాలి. పూజ చేసినా, దానం చేసినా, సేవ చేసినా, పరోపకారం చేసినా ఏ లౌకిక ఫలితాన్ని కోరకుండా చేసినప్పుడే ఆ కర్మ సాత్వికమౌతుంది. ఫలాసక్తి బంధాన్ని కలిగిస్తుంది. ఫలాసక్తి వదిలితే మోక్షానికి దారితీస్తుంది.

ఇలా సంగ రహితంగా, రాగ ద్వేషాలు లేకుండా, ఫలాసక్తి లేకుండా శాస్త్ర విహితమైన కర్మలు మాత్రమే చేస్తే అవి సాత్త్విక కర్మలౌతాయి. ఇవి చిత్త శుద్ధిని కలిగించి, హృదయంలోని మాలిన్యాలను తొలగించి జ్ఞాన దాయకమై ముక్తి కారకమవుతాయి.

*-ఇక రాజసిక కర్మ అంటే ఏమిటో తరువాతి శ్లోకం-*

శ్లో|| యత్తు కామేప్సునా కర్మ

**సాహంకారేణ వా పునః|**
**క్రియతే బహుళాయాసం**
**తద్రాజసముదాహృతం||** **(24)**

**తా||కోరికతో -ఫలాపేక్షతో, అహంకారంతో, ఎక్కువ ప్రయాస పడుతూ ఏ కర్మ అయితే చేయబడుతుందో దానిని రాజసిక కర్మ అంటారు.**

**వ్యాఖ్య:- రాజసిక కర్మకు 3 లక్షణాలను చెప్పారు. కోరికతో, అహంకారంతో, ఎక్కువ ప్రయాసతో చేస్తే అది రాజసిక కర్మ అని.**

**(i)కామేప్సునా :- శరీర సౌఖ్యం కోసమో, తన సుఖ సంతోషాల కోసమో తన కుటుంబ సౌఖ్యం కోసమో, తీరని కోరికలతో వ్యధ చెందుతూ, ఆ కోరికలను తీర్చుకోవటం కోసం నిరంతరం శ్రమిస్తూ చేసే కర్మలన్నీ రాజసిక కర్మలే. అలాగే ఇతరులను అవమానించాలని చేసే కర్మలు కూడా రాజసిక కర్మలే. రావణుడు సీతాపహరణం చేయటం, దుర్యోధనుడు పాండవులను లక్కయింట తగులబెట్టాలనుకోవడం, ఘోష యాత్ర, జూదం, వస్త్రాపహరణం- ఇలాంటి కర్మలన్నీ రాజసిక కర్మలే.**

**(ii)సాహంకారేణ :- అహంకారంతో, కర్తృత్వంతో, ఈ కర్మలు నేను తప్ప మరెవరు చేయగలరు? అనే భావంతో చేసే కర్మలు రాజసిక కర్మలు.**

**దుర్యోధనుడు అహంభావి. దురభిమాని. రాజసూయానికి వెళ్ళి ధర్మరాజు మయ సభను చూచాడు. తానే కాదు తనతో పాటు శకుని కూడా చూచాడు మయ సభను. కాని దుర్యోధనుడు మాత్రమే అవమానపడ్డాడు కాని శకుని అవమాన పడలా. ఎందుకు? అహంభావి కనుక. దుర్యోధనుడు సేవకుల మాట వినకుండా నాకు తెలియని**

సభలా? అంటూ వెళ్ళి అవమాన పడ్డాడు. అహంకారంతో చేసే పనుల ఫలితం ఇలాగే ఉంటుంది.

*(iii)*బహులాయసం :- ఇలాంటి పనుల వల్ల ఆయాసం అధికంగా ఉంటుంది. మనస్సుకు అశాంతిని, ఆందోళనను కలిగిస్తాయి.

ఒక బ్యాంకు ఉద్యోగి ఫోర్జరీ పత్రాలతో ఒక పారిశ్రామికవేత్త అకౌంటు నుండి 10 లక్షలు డ్రా చేశాడు. ఈ పని కోసం ఆ పారిశ్రామికవేత్త అకౌంటెంటు సాయం తీసుకున్నాడు. పని పూర్తి కావటంతో ఆ సాయం చేసిన వానికి లక్ష రూపాయలిచ్చాడు. ఇదంతా నా ప్రతిభ వల్లే అని మురిసి పోయాడు. బ్యాంకు వారు ఇది ఫోర్జరీ అని తెలుసుకొని కేసు పెట్టారు. ఇది తెలియడంతో అతడి శరీరం చల్ల బడింది. భయం వేసింది. కటకటాలపాలౌతానేమోనని భయంతో గజగజలాడి పోయాడు. ఆ డబ్బులో కొంత ఖర్చు పెట్టి కేసు నుండి తప్పించుకోవాలనుకున్నాడు. సాధ్యం కాలేదు. దానితో ఎక్కడికైనా పారిపోవాలనుకొని దూర ప్రాంతానికి వెళ్ళి పోయాడు. ఇక్కడ ఉద్యోగం పోయింది. పోలీసులు తన కోసం వెతుకుతున్నారు. తన దగ్గరున్న డబ్బు అయిపోవచ్చింది. చేసేదేమీ లేక తిరిగి వచ్చాడు. కాచుకుని కూర్చున్న పోలీసులు అరెస్టు చేసారు. కేసు నడిచింది చివరకు రెండు సంవత్సరముల కారాగార శిక్ష పడింది. ఇదంతా ఎంతో ప్రయాస. అవమానం. ఉద్యోగం ఊడింది. ఆర్థికంగా క్రుంగి పోయాడు. మానసికంగా వ్యథ. కనుక ఇలాంటి పనులు రాజసిక కర్మలు.

రాజకీయ నాయకులు, సంఘసేవకులు, పారిశ్రామిక వేత్తలు, వ్యాపారులు, అవినీతి ఉద్యోగులు, పిల్లల గురించి అతిగా ఆరాటపడే తల్లిదండ్రులు, యోగులు, సాధువులు, సన్యాసులు, గ్రుడ్డిగా ధనం సంపాదించాలనే ఆశ గలవారు-

వారు వీరు అననేల. అవకాశం ఉన్న వారిలో అధికులు రాజస కర్మలు చేసే వారే. వీరంతా ప్రశాంతతకు దూరమై అధిక ప్రయాసకులోనయ్యే వారే. ఒక్కొక్కప్పుడు జీవితాన్ని అంతం చేసుకొనుటకు కూడా సిద్ధపడుతుంటారు. బంధ విముక్తిని కోరే వారు ఇలాంటి రాజసిక కర్మల జోలికి పోరాదు.

*-తామసిక కర్మలు ఎలాంటివో చెప్పబోతున్నారు.*

శ్లో|| అనుబంధం క్షయం హింసాం
అనపేక్ష్య చ పౌరుషం|
మోహాదారభ్యతే కర్మ
యత్తత్తామసముచ్యతే|| *(25)*

తా||బంధంలో ఇరికించేది (తాను చేయబోయే కర్మ వల్ల ముందు ముందు కలగ బోయే సాధక బాధకాలను, దుఃఖాన్ని గురించి ఆలోచించనీయకుండా చేసేది), నాశనాన్ని,-ధన నష్టాన్ని కలిగించేది, తనకు- ఇతరులకు హింసను కలిగించేది, తన శక్తి సామర్థ్యాలను గమనించకుండా చేసేది, అజ్ఞానంతో- అవివేకంతో భ్రమతో ప్రారంభించేది ఏ కర్మ గలదో అది తామసికము అనబడుతుంది.

*వ్యాఖ్య:-* ఇక్కడ తామసిక కర్మకు *5* లక్షణాలను చెప్పారు. అవి:
*(i)*అనుబంధం :- తాను చేయబోయే కర్మ వల్ల ముందు ముందు కలగ బోయే సాధక బాధకాల గురించి ఆలోచించకుండా ప్రారంభించే పనులు తామసికం. వీళ్ళకు తామసం ఎక్కువ. ఇరుగు పొరుగు వారికి గోడ సరిహద్దు దగ్గర తగాదా వచ్చింది. ఈ అంగుళం నా స్థలం అంటే నా స్థలం అని తగాదా పెట్టుకున్నారు. పెద్ద మనుషులు చెప్పినా వినలేదు, పేచీ ముదిరింది. నీ అంతు తేలుస్తానన్నాడు మన తామసరావు. ప్లీడరు దగ్గరకు వెళ్ళాడు. మంచి ఆవేశంతో

ప్రక్కవాడి అన్యాయాన్ని గురించి చెప్పాడు,"ఇంత అన్యాయానికి దిగిన వాడిని ఊరకే వదలకూడదు, నన్ను నోటికి వచ్చినట్టు మాట్లాడాడు. ఎంత డబ్బు ఖర్చు అయినా ఫరవాలేదు వాడికి చిప్ప కూడు తినిపించాలి "అన్నాడు ప్లీడరుతో. ఓ! అదెంత పని. అసలు వాడి స్టాంపుల్లో 16 అడుగుల 3" లే ఉన్నది. నీకే 2"లు రావాలి. ఒక్క 10 వేలు నాది కాదు అనుకుంటే వాడి పని అయిపోయినట్లే అన్నాడు ప్లీడరు. జేబులో నుంచి 10 వేలు తీసి ఇచ్చాడు. కాగితాలపై సంతకాలు పెట్టి వచ్చాడు. ఎప్పుడు వాడు జైలుకెళతాడా అని ఎదురు చూస్తున్నాడు. 3 నెలలకు వాయిదా ఉన్నదని నోటీసు వచ్చింది. మళ్ళీ 2 నెలలకు వాయిదా. మళ్ళీ 40 రోజులకు వాయిదా. మళ్ళీ నెలకు. ఇలా 8 నెలల వాయిదా తర్వాత ప్లీడరుతో అన్నాడు, 'ఏంటయ్యా ! ఇంకా వాడు బయటే తిరుగుతున్నాడు-'అని. దానికి ప్లీడరు ఈ సారి విచారణ జరుగుతుంది. వాడికి శిక్ష తప్పదు. వెంటనే శిక్ష పడాలంటే ఇంకో పదివేలు ఖర్చవుతుంది అన్నాడు. 10 వేలు కాదు 20 వేలు ఇస్తా, ఈ సారి వాయిదా రోజున ఇటు నుంచి ఇటే వాడు జైలుకు పోవాలి అన్నాడు. నీవు 20 వేలు ఇవ్వాలే గాని ముందే పంపిస్తా అన్నాడు ప్లీడరు. 20 వేలు ఇచ్చాడు మనవాడు. మళ్ళీ వాయిదాల పర్వం. ప్రతి వాయిదాకు వెళ్ళటం, సాక్షులకు రాచమర్యాదలు, ప్లీడరు గుమస్తా దానికని దీనికని పీక్కు తినటంతో 2 సం//లు గడిచిపోయింది. ప్లీడరు మాత్రం వాడు జైల్లో వున్నట్లు, చిప్పకూడు తింటున్నట్లు, రాళ్లు కొడుతున్నట్లు సినిమా చూపిస్తున్నాడు మనవాడికి. చేతిలో డబ్బు అయిపోయింది. పెళ్ళాం మెడలో సొమ్ములు ఒక్కొక్కటీ అయిపోయాయి. ప్లీడరును గట్టిగా అడిగాడు. ఎప్పటికయ్యా ఈ కేసు తేలేది? అని. దానికా ప్లీడరు,"ఇదేం మామూలు కేసా? జైలుకు పంపాల్సిన కేసు. చూస్తున్నావుగదా! నేను ఎంత గట్టిగా

వాదిస్తున్నానో. ఏదైనా జడ్జీగారి ఇష్టం గదా! ఇంకెంత వచ్చే నెలలో ఖచ్చితంగా తేలిపోతుంది'' అన్నాడు. మళ్ళీ 4 నెలలు గడిచింది. వాదనలు ప్రారంభమైనవి. ప్రతిసారీ ప్లీడరుకు, గుమాస్తాకు డబ్బు. సాక్షులకు మర్యాదలు, విందు భోజనాలు. ఇక అమ్మటానికి వేరే ఆస్తి లేదు. పుట్టిన చోటల్లా అప్పు చేస్తున్నాడు. విసిగి పోయాడు.

ఒక రోజున ఒక స్నేహితుడితో జరిగిన విషయమంతా చెప్పాడు. ఆ స్నేహితుడు, "మిత్రమా! కోర్టుకు పోయే ముందే ఇదంతా ఆలోచించుకోవాలి అంగుళం స్థలం కోసం కోర్టుకు వెళ్ళావు. ఈ స్థలం చూడటానికి ఎంక్వైరీ వేస్తారు, వాళ్లు వచ్చినపుడు వాళ్లకు లంచం ఇవ్వాలి ఆ తరువాత 5,6 నెలలకు తీర్పు వస్తుంది. ఒక వేళ నీవే గెలిచావనుకో, అపుడు అవతలి వాడు జిల్లా కోర్టుకు వెళతాడు. అక్కడ వాడు గెలిస్తే నీవు హైకోర్టుకు వెళ్లాలి. ఇదంతా జరగాలంటే 2,3 సంవత్సరాలు పడుతుంది. ప్లీడరుకు, నోటీసులకు, చార్జీలకు, ఇతర ఖర్చులకు ఉన్న నీ యింటిని అమ్ముకోవాలి. అసలు ఈ కేసులో వాడిని జైలుకు ఎందుకు పంపుతారు? ఇదేమైనా దొమ్మీ కేసా? నిన్నేమైనా కొట్టాడా? ఇదంతా ఆలోచించకుండా కోర్టుకు పోతే ఇంతే జరుగుతుంది. నీవు గెల్చినా ఓడినా చెప్పుకోలేనంత నష్టం"- అన్నాడు. దానితో కళ్ళు బైర్లు కమ్మినవి. ఇదే అనుబంధం. ముందు జరగబోయే దానిని ఊహించకుండా రంగంలోకి దిగితే ఇంతే. ఇవే తామసుల కర్మలు.

***(ii)*క్షయం** :- తనకు హాని చేసిన వాడో, తనను నిందించిన వాడో, తాను పదవిలో ఉండగా ప్రతిపక్షంలో ఉండి విమర్శంచినవాడో, తన పదవి పోవటానికి కారణమైనవాడో, ఎన్నికలలో తనకు ప్రత్యర్థిగా నిలిచినవాడో తన చేత చిక్కినప్పుడు అతడితో ఘర్షణ పడతాడు, కొడతాడు,

దెబ్బలాడుకుని తగలరాని చోట తగిలి అవతలి వాడు చనిపోతాడు. దానితో అరెస్టులు, కేసులు, కోర్టులు, జైలు శిక్షలు, కారాగారవాసం. దానితో వాడి జీవితం నాశనం కావటమే గాక అతడి కుటుంబం కూడా దెబ్బ తింటుంది. ఇలాంటి కర్మలు తామసంతో ఆవేశంలో చేసేవి. ఇవి నాశనాన్ని కలిగిస్తాయి. ఒక్కొక్కప్పుడు దౌర్జన్యాలు చేస్తే ఆ తరువాత భయం భయంగా తిరగాల్సి వస్తుంది. కొందరు రౌడీలను మేపుతూ బాడీ గార్డులుగా ప్రక్కన ఉంచుకోవాలి. ఇదంతా తామసిక కర్మ ప్రభావమే.

*(iii)*హింసాం :- జూదం, మద్యపానం మె||న దురలవాట్లకు లోనయ్యే వారంతా తామసిక గుణం గలవారే. అందుకే వారికి ఇలాంటి కర్మలు చాలా ఇష్టంగా ఉంటాయి. జూదం వల్ల ధన నష్టం జరుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఆస్తినంతా పోగొట్టుకొని, ఇల్లు వాకిలి అమ్ముకొని, భార్యా బిడ్డలతో సహా తిండికి కూడా అవస్థ పడవలసి వస్తుంది. సమాజంలో అలాంటి వారిని చాలా తేలికగా చూస్తారు. అవమానిస్తారు. కొందరు ఈ పేకాట పిచ్చిలో బాధ్యతలను కూడా వదిలేస్తారు. బాధలు మరచి పోవటానికి త్రాగుడుకు అలవాటు పడతారు. చెడు స్నేహాల వల్ల ఇంకా ఇంకా పతనమై పోతారు. భార్యా బిడ్డలకు ఇంతకన్నా హింస మరేముంటుంది. తప్ప త్రాగి ఆరోగ్యాన్ని నాశనం చేసుకుంటారు. కుటుంబ బాధ్యతలను వదిలి వేయటంతో కుటుంబ పోషణ భారం అంతా భార్యపై పడుతుంది. తాము చెడి, తమ వారిని చెడగొట్టి నాశనమై పోతుంటారు.

ఒకడు పేకాట ఆడుతున్నాడు, డబ్బు బాగా వస్తున్నది. భార్య వద్దని ఎంతగానో మొత్తుకుంది. అయినా వినలేదు. డబ్బు బాగా వస్తుండటంతో జల్సాలు బాగా ఎక్కువైనాయి. త్రాగుడు, వ్యభిచారం వంటి అన్ని దుర్గుణాలు ప్రారంభమైనవి.

పట్టుదలతో ఆడుతున్నాడు, ఆడుతున్న కొద్దీ డబ్బు నష్ట పోతున్నాడు. చివరకు పెళ్లాం మెడలో పుస్తెలతో సహా కోల్పోయాడు. డబ్బు ఇవ్వమని భార్యని వేధిస్తున్నాడు. ఇక పైసా వచ్చే మార్గం లేక దొంగతనాలు చేయటం ప్రారంభించాడు. ఒకసారి పట్టు బడడంతో పోలీసుల మర్యాదలు, కేసులు, జైలు జీవితం. విడుదలైన తరువాత భార్యా బిడ్డలను కొట్టి, ఇక డబ్బు వచ్చే మార్గం లేక ఆత్మ హత్య చేసుకున్నాడు. తామసికుల వ్యవహారం అంతా ఇంతే. వారికీ హింస, వారిని నమ్ముకున్న వారికీ హింస తప్పదు. అందుకే హింసాం అన్నారు. తామసికుల కర్మలు చిత్రవిచిత్రాలు.

*(iv)*అనవేక్ష్యచపౌరుషం :- తమ శక్తి సామర్థ్యాలు ఏమిటో గుర్తించకుండా కర్మలు చేసే వారు తామసికులు.

సాధారణంగా రాజులు శత్రు రాజులతో యుద్ధాలకు సిద్ధపడే ముందు తమ బలం ఏమిటో శత్రు బలం ఏమిటో అంచనా వేసుకుని యుద్ధానికి సిద్ధమౌతారు. అలా బలాబలాల అంచనాలు తెలుసుకోకుండా యుద్ధం చేసేవారికి పరాజయం తప్పదు. కురుక్షేత్ర యుద్ధానికి ముందు పాండవులు శ్రీకృష్ణుని రాయబారిగా పంపారు. రాయబారంతో పాటు శత్రు పక్షం యొక్క బలాబలాలను తెలుసుకోవటం కూడా శ్రీకృష్ణుని రాకలోని పరమార్థం. అందుకే విజయం., కాని దుర్యోధనుడో కర్ణుని నమ్ముకున్నాడు. ఈ విషయం తండ్రితో తానే చెప్పాడు. తండ్రీ! ఈ భీష్మ ద్రోణ కృపాచార్యులను నమ్ముకొని నేను యుద్ధానికి దిగటం లేదు. నాకు తోడుగా కర్ణుడున్నాడు. నేను, దుశ్శాసనుడు, కర్ణుడు ముగ్గురం చాలు పాండవ సేనను పరాజయం పాలు చేయటానికి - అన్నాడు. వీరు ఎప్పుడు పాండవులను పరాజయం పాలు చేశారు గనుక? కర్ణుణ్ణి నమ్ముకోవటం. చివరి 18 వ రోజున గదా యుద్ధానికి భీముణ్ణి

ఎన్నుకోవటం - ఈ రెండూ దుర్యోధనుణ్ణి నిలువునా ముంచేసినవి. సర్వనాశనమయ్యాడు దుర్యోధనుడు.

కొందరు తమ కుటుంబ ఆదాయం 10 వేలు. ఖర్చు కూడా దాదాపు అంతే. అయినా ఇన్‌స్టాల్ మెంట్ల మీద ఫ్రిజ్జు, టివిలు, ఎ.సిలు, కంప్యూటర్‌లు కొంటారు. చివరకు ఆ ఇన్‌స్టాల్‌మెంట్లు కట్టలేక ఆ వస్తువులను కోల్పోతారు.

కొందరు 10 లక్షలు ఉన్నవి గదా అని ఎన్నికలలో నిలబడతారు. 10 రోజుల్లో ఆ డబ్బు అయిపోతుంది. ఎన్నికలకు 4 రోజుల ముందు 50 లక్షలు కావాల్సి వస్తుంది. అప్పు చేసి తెస్తారు. గెలిస్తే ఫరవాలేదు. ఓడితే వాడిపని, అప్పు ఇచ్చిన వారి పని గోవిందా! ఇవే తామస కర్మలు.

(v)మోహాత్ :- ఇలాంటి కర్మలు చేసేవారంతా మోహంలో- అజ్ఞానంలో -అవివేకంలో ఉండి ఇలాంటి పనులు చేస్తారు. ఇలాంటి కర్మలు తామసిక కర్మలు. -ఇక ఈ కర్మలు చేసే కర్తలు గుణ భేదంతో 3 విధాలు.

*-కర్మలు చేసేది కర్త. కనుక కర్తను గుణ భేదాలను బట్టి 3 రకాలుగా విభజిస్తున్నారు. ముందుగా సాత్త్విక కర్త ఎలాంటి లక్షణాలు గలవాడో...*

శ్లో|| ముక్తసంగోzనహంవాదీ
ధృత్యుత్సాహసమన్వితః|
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః
కర్తా సాత్త్విక ఉచ్యతే|| (26)

తా||సంగభావం నుండి విడుదల పొందినవాడు, అహంకారం లేని వాడు, పట్టుదల- ఉత్సాహం తో కూడినవాడు, విజయం

సాధించినా అపజయం పొందినా వికారం చెందకుండా ఉన్నవాడు సాత్త్విక కర్త అనబడతాడు.

*వ్యాఖ్య:-* ఇంతవరకు చేయబడే కర్మను, ఆ కర్మకు ప్రేరణనిచ్చే జ్ఞానాన్ని గుణ భేదాలనాధారంగా చేసుకొని విభాగించి చూపారు. ఇప్పుడు కర్మను నిర్వహించే కర్తను *3* విధాలుగా విభాగించి చూపుతున్నారు. అందులో సాత్త్విక కర్త ఎలాంటి వాడో నాలుగు లక్షణాలు చెబుతున్నారు.

*(i)*ముక్తసంగః :- కర్మతో గాని, విషయాలతో గాని సంగభావం లేకుండా ఉండేవాడే ముక్త సంగుడు. తనవారు-పరవారు అని చూడకుండా, రాగద్వేషాలు లేకుండా కర్మలు ఆచరించే వాడు సాత్త్విక కర్త. అతడు ఎప్పుడూ పరమాత్మతో సంగం పెట్టుకుంటాడు, అంతటా పరమాత్మనే దర్శిస్తూ ఉంటాడు. అందరూ పరమాత్మ బిడ్డలే అని భావిస్తాడు. విదురుడు ధర్మాన్ని చెప్పేటప్పుడు వీరు నా వారు, వారు పరాయి వారు అని చూడడు. పాండవులను లక్కయింట తుద ముట్టించాలనుకున్నప్పుడు గాని, జూదం విషయంలో గాని, వస్త్రాపహరణ విషయంలో గాని, ఘోష యాత్ర విషయంలోగాని, ఎవరి రాజ్యాన్ని వారు పాలించుకోవాలి, యుద్ధం వద్దు అని చెప్పేటప్పుడు గాని, ఎలాంటి రాగ ద్వేషాలు లేకుండా కేవలం ధర్మాన్ని మాత్రమే చెప్పాడు. చివరకు ధృతరాష్ట్రుని హితవు కోరి వనవాసానికి తరలించటం కూడా అతడికి మోక్షమార్గాన్ని చూపటానికే ఇదే. సాత్త్వికుల స్వభావం.

*(ii)*అనహంవాది:- అహంకారం, అభిమానం లేకుండా ఉన్నవాడే సాత్త్విక కర్త. నేను కర్తనని గాని, ఈ కార్యాన్ని చేయగల సమర్థుడను నేనే అని గాని భావించకుండా ఎంత గొప్ప కార్యాన్ని నిర్వహించినా ఇదంతా భగవంతుని ఇచ్ఛ

ప్రకారమే జరిగింది. కేవలం నేను నిమిత్తమాత్రుణ్ణి అని భావిస్తాడు.

ఏకలవ్యుడు సాక్షాత్ ద్రోణుడి వద్ద నుండి విద్యలు నేర్చుకోలేదు. ద్రోణ విగ్రహాన్ని తయారు చేసుకొని, ఆయనను గురువుగా భావించి విద్యలు నేర్చాడు. తనకు లభించిన విద్య గురు కృప వల్ల లభించిందే గాని తన గొప్పతనం కాదని విశ్వసించిన వాడు ఏకలవ్యుడు. అందుకే గురు దక్షిణగా కుడిచేతి బొటన వ్రేలిని కోసి; ఎంతో ఆనందంతో నా అదృష్టం అని భావించి ఇచ్చాడు. ఇదే అహంకార రాహిత్యం.

*(iii)ధృత్యుత్సాహసమన్వితః* :- ఆధ్యాత్మిక రంగంలో శాస్త్ర శ్రవణ మననాలకు గాని, విచారణకు గాని, జపధ్యానాది సాధనలకు గాని గొప్ప పట్టుదల (ధృతి) ఉండాలి. గొప్ప ఉత్సాహం కూడా ఉండాలి. కార్యం ప్రారంభించిన తర్వాత అనేక ఆటంకాలు కలగవచ్చు. ఇతరులు నిరుత్సాహ పరచవచ్చు. ఎన్ని ఆటంకాలు కలిగినా పట్టుదలతో ముందుకు అడుగు వేయాలి. ఎవరు నిరుత్సాహ పరిచినా నూతనోత్సాహంతో తన కర్తవ్యాన్ని నెరవేర్చటమే ప్రధానమనే భావంతో ఉత్సాహాన్ని తెచ్చుకొని కర్మలని నిర్వహించాలి. ఇలా కార్య సిద్ధి జరిగేంతవరకు పట్టుదలతో, ఉత్సాహంతో పని చేసే వాడే సాత్త్విక కర్త.

*(iv)సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః* :- తాను చేసే కార్యం సిద్ధించినా, సిద్ధించక పోయినా, అందులో కష్టాలు వచ్చినా, నష్టాలు కలిగినా; సమ చిత్తంతో, నిర్వికారుడై, నిర్లిప్తంగా ఉండగలవాడే సాత్త్విక కర్త. కలత చెందకుండా, విసుగు చెందకుండా, ఫలితం గురించి ఆలోచించకుండా విద్యుక్త కర్మను చేసి, తన ధర్మాన్ని తాను నిర్వర్తించాననే తృప్తిలో ఉండే వాడే సాత్త్విక కర్త.

హాస్పిటల్లో తన కర్తవ్యాన్ని నిజాయితీతో నిర్వర్తించే నర్సును సాత్త్విక కర్తకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. రోగి ఎవరైనా ఆమెకు పట్టదు. రోగి జబ్బు తగ్గినా, పెరిగినా, రోగి చనిపోయినా ఆమె తన కర్తవ్యాన్ని తన ధర్మంగా భావించి నిర్వర్తిస్తుంది. ఆమె అనహంకారి కూడా. ఈ జబ్బును తానే తగ్గించానని భావించదు. ఆమె సేవల వల్ల తృప్తి చెందుతున్న రోగులను చూస్తుంటే ఆమెకు పనిలో ఉత్సాహం, పట్టుదల పెరుగుతుంది.

సాత్త్విక కర్త సాత్త్విక జ్ఞానంతో సాత్త్విక కర్మలనే చేస్తాడు. అతడికి విజయం తథ్యం. అతడి సేవల వల్ల ప్రాణి కోటికి ఎంతో ప్రయోజనం.

*-ఇక రాజసిక కర్త లక్షణాలేమిటో చూద్దాం.*

*శ్లో||* రాగీ కర్మఫలప్రేప్సుః
లుబ్ధో హింసాత్మకోzశుచిః|
హర్షశోకాన్వితః కర్తా
రాజసః పరికీర్తితః|| *(27)*

తా|| రాగంతో కూడి, కర్మ ఫలాన్ని ఆశిస్తూ, పిసినిగొట్టు అయి, హింసతో కూడిన స్వభావం కలిగి, అశుచి అయి, సుఖ దుఃఖాలకు లోనయ్యే కర్త రాజసికుడని చెప్పబడతాడు.

*వ్యాఖ్య:-* రాజసిక కర్త ఎలాంటివాడో *6* లక్షణాలను ఇక్కడ చెప్పడం జరిగింది.

*(i)రాగీ:-* రాగం గలవాడు, ప్రాపంచిక విషయాల ద్వారా, వస్తువుల ద్వారా, సుఖాలు, భోగాలు అనుభవించాలని భావించే వాడికి విషయాలపట్ల, వస్తువుల పట్ల, భోగాల పట్ల, వ్యక్తుల పట్ల రాగం- అనురాగం- ఆసక్తి ఉంటుంది. రాగంతో పాటు ద్వేషం కూడా ఉంటుంది. ఇలాంటి వ్యక్తి నిరంతరం తన

ఆనందానికి, భోగాలకు, సుఖాలకు, స్వార్ధానికి చేసే ప్రయత్నాలలోనే కాలం అంతా గడిచిపోతుంది.

ప్రాపంచిక విషయాల పట్ల రాగం అన్నది పరమాత్మను అందుకొనుటకు అడ్డం వస్తుంది. ముందరి కాళ్లకు బంధం వేస్తుంది. రాగం బాహ్య దృష్టి కలిగించేది. పరమాత్మను అందుకోవాలంటే అంతర్దృష్టి కావాలి. ప్రాపంచిక విషయాల పట్ల విరక్తి కలిగితేనే పరమాత్మ పట్ల రక్తి- ఆసక్తి కలుగుతుంది. కనుక రాగం ఉన్నవాడు రాజసిక కర్త. అతడు లౌకిక విషయాసక్తుడే.

*(ii)*కర్మఫలప్రేప్సు:- రాగం కలవాడు తప్పకుండా ఫలితాన్ని ఆశిస్తాడు. ఏ ఫలితాన్ని ఆశించకుండా కర్మ చేయటమంటే తెలివి తక్కువ తనంగా భావిస్తాడు. కనుక అతడు కర్మఫల ప్రేప్సు. కర్మ ఫలం అప్పటికప్పుడు బంధించక పోవచ్చు. వర్తమానంలో కర్మ చేస్తే భవిష్యత్తులో కర్మ ఫలం వచ్చి బంధిస్తుంది. అంటే కర్మ ఫలానుభవం కోసం జన్మ. కనుక జన్మ బంధంలో-జనన మరణ చక్రంలో బంధించేది కర్మ ఫలమే. అందువల్ల రాజసిక కర్త కర్మ ఫలాన్ని ఆశించి కర్మ చేసి బంధంలో ఇరుక్కుంటాడు.

*(iii)*లుబ్ధ:- లుబ్ధుడు అంటే పిసినిగొట్టు. తాను తినడు ఇతరులను తిననివ్వడు. ఒకడికి పెట్టడు. సాధారణంగా రాజసిక స్వభావం గల కర్త ధన సంపాదన కోసం ఎలాంటి పని చేయడానికైనా సిద్ధపడుతుంటాడు. ఒకడు చిత్తు కాగితాలు ఏరుకొనే వాడు. అందులో బాగా సంపాదించాడు. ఎంత బాగా సంపాదించినా, అంత బాగా జాగ్రత్తగా ఉంచుకొని కడు పేదవాడిగా జీవనం గడుపుతాడు. అప్పుడు కూడా చిత్తు కాగితాలు కనిపిస్తే వదలడు. ఇలా పోగు చేసుకొని, దాచుకొని, చూసుకొనే బుద్ధియే లుబ్ధత్వం.

***(iv)హింసాత్మక:-*** రాజసిక కర్త తన లాభం కోసం, స్వార్థం కోసం, సుఖ సంతోషాల కోసం ఇతరులను హింసించటానికి కూడా వెనుకాడడు. దుర్యోధనుడు తనది కాని రాజ్యాన్ని తనదిగా చేసుకొనుటకు పాండవులను అనేక విధాలుగా హింసించాడు. భీముడికి విషాన్నం తినిపించాడు, గంగలో త్రోయించాడు. కుంతీ దేవితో సహా పాండవులను అగ్నికి ఆహుతి చేయాలని లక్క యిల్లు నిర్మింపజేసి వారిని అందులో ప్రవేశపెట్టాడు. మాయా జూదం ఆడించి, ధర్మరాజును ఓడించి, ద్రౌపదిని నిండు సభలోకి ఈడ్పించి వస్త్రాపహరణం చేయించాడు. ఘోష యాత్ర నెపంతో పాండవులను అవమానించాలనుకున్నాడు. ఇదంతా హింసయే. రాజసుడికి హింసా ప్రవృత్తి సర్వసాధారణం.

***(v)అశుచి:-*** ఇది శారీరక అశుచి కాదు. మానసిక అశుచి. ఇతడి మనస్సు నిర్మలంగా-శుచిగా ఉండదు. ఎప్పుడూ భయం ఆందోళన, గజిబిజి మొ||న వికారాలుంటాయి.

***(Vi)హర్షశోకాన్విత:-*** తన సుఖభోగాలే ప్రధానమనుకొని, ఫలితం మీద ఆసక్తితో కర్మలు చేస్తూ, ఎవడు తన సుఖం కోసం ఇతరులను కష్టపెడతాడో అతడికి కార్య సిద్ధి మీదనే దృష్టి అంతా. సిద్ధి జరిగిందా సంతోషం. జరగలేదా క్రుంగిపోతాడు, తీవ్ర నిరాశా నిస్పృహలలో ఉండి పోతాడు. దానితో అన్ని అవలక్షణాలు ఉన్నట్లే. ఇది రాజసిక కర్త విషయం.

***-ఇక తామసిక కర్త ఎలాంటివాడో-***

శ్లో|| అయుక్తః ప్రాకృతః స్తబ్ధః
శఠో నైష్కృతికోఽలసః|
విషాదీ దీర్ఘసూత్రీ చ

కర్తా తామస ఉచ్యతే|| (28)

తా|| మనోనిగ్రహం లేని వాడు, పామరుడు, సంకుచిత స్వభావం గలవాడు, మోసగాడు, ఇతరుల పనులు చెడగొట్టే వాడు, సోమరిపోతు, ఎప్పుడూ విషాదంలో ఉండేవాడు, త్వరగా నిర్ణయాలు తీసుకోలేని వాడు తామసిక కర్త అనబడుతాడు.

*వ్యాఖ్య:-* తామసిక కర్తకు *8* లక్షణాలు చెప్పారు

*(i)*అయుక్తః :- మనో నిగ్రహం లేని వాడు, మనస్సు నిలకడగా లేనివాడు, బుద్ధి చెప్పినట్టు మనస్సు నడుచుకోనివాడు మనస్సులో కలిగే కోరికలకు, వాంఛలకు వశుడై ప్రవర్తించేవాడు తామసికుడు. ప్రేమించమని వెంటబడే వాళ్ళ, హత్యలు చేసే వాళ్ళ, గొంతులు కోసేవాళ్ళ, యాసిడ్లు పోసేవాళ్ళ, పసిపిల్లలను మానభంగం చేసే వాళ్ళ, దొంగతనాలు- దోపిడీలకు పాల్పడే వాళ్ళ- అయుక్తులే.

*(ii)*ప్రాకృతః :- పామరులు- సంస్కారం లేని వారు ప్రాకృతులు. ప్రకృతి గుణాలు గలవారు ప్రాకృతులు. తనలో దుష్ట గుణాలు ఉంటే వాటిని మార్చుకొనుటకు ఏ మాత్రం ప్రయత్నించకుండా వాటికి అనుగుణంగా నడిచే వారే ప్రాకృతులు. మనస్సులోని దుష్ట కోరికలకు వశులై పోయినవారే పామరులు. సంస్కార హీనులు.

*(iii)*స్తబ్ధః :- సంకుచిత స్వభావం గలవారు. మొద్దులాగా ఉండేవారు. జంతువులాగా ప్రవర్తించేవారు స్తబ్ధులు. ఎందరు ఎన్ని విధాలుగా చెప్పినా ఏ మాత్రం మారకుండా, ఎందరు ఎన్ని అంటున్నా చలించిపోకుండా బండరాయిలాగా ఉండే వాడినే 'స్తబ్ధః' అన్నారు.

*(iv)*శఠః :- మోసగాణ్ణి శఠుడు అంటారు. కోరికలకు, భోగాలకు బానిసయై మోసాలకు అన్యాయాలకు పాల్పడతాడు.

స్వార్థం కోసం ఎంతకైనా తెగిస్తాడు. గుడి-బడి కట్టిస్తానని చందాలు వసూలు చేసి మొత్తాన్ని స్వాహా చేసేవాడు. చిట్ ఫండ్ కంపెనీలు పెట్టి జనం సొమ్మును మూట గట్టుకు పోయే వాడు, 1000 రూపాయల వస్తువును 500 రూపాయలకే 20 రోజుల్లో ఇస్తానని చెప్పి జనం సొమ్ముతో పరారయ్యే ఇళంగోవన్లు, అధిక వడ్డీల ఆశ జూపి బోర్డు తిప్పేసే కృషి బ్యాంకు ఛైర్మన్‌లు- అంతా ఈ కోవకు చెందినవారే. శరులే.

*(v)*నైష్కృతికః :- ఇతరుల కార్యాలను చెడగొట్టే వారు. అసలు లోకంలో మూడు రకాల మనుషులు వున్నారు. 1. తన సుఖం కోసం చూసుకోకుండా ఇతరుల మంచి కోసం పాటుబడే వారు. 2. తన సుఖం చూసుకుంటూ ఇతరులకు మేలు చేయాలని ప్రయత్నించేవారు. 3. తన సుఖం కోసం ఇతరుల కార్యాలను చెడగొట్టేవారు. ఈ 3 రకాలు కాక మరొక రకం వారున్నారు. 4. తనకు సుఖం లేకపోయినా, నష్టం కలిగినా ఇతరులకు కీడు చేసి సంతోషించేవారు. చివరి రెండు రకాల వారు తామస కర్తలే. వీరి బుద్ధి రాక్షస బుద్ధి.

*(Vi)*అలసః :- సోమరి పోతు, ఏ పని చేయకుండా ఇతరుల శ్రమతో జీవించాలనుకునేవారు. ఒక గురువు దగ్గర సోమరి శిష్యుడు ఉన్నాడు. ఎప్పుడూ ఏవో తప్పులు చేస్తూనే ఉంటాడు. ఒక రోజు గురువు పిలిచి 'అరే! నాయనా! ఎప్పుడూ తప్పులు చేస్తున్నావు గనుక ఒక డైరీ పెట్టుకొని ప్రతిరోజూ నీవు చేసే తప్పులను అందులో వ్రాసుకో. ఇలా చేస్తే ఇక తప్పు చేయవు' అన్నాడు. అలాగే గురువు గారు అంటూ రోజూ తన తప్పులను డైరీలో వ్రాసుకుంటున్నాడు. ఒకనాడు శిష్యుడు ఆశ్రమాన్ని రంగురంగుల తోరణాలతో అలంకరిస్తున్నాడు. గురువు అది చూచి ఎందుకురా ఇలా ఆశ్రమాన్ని అలంకరిస్తున్నావు? అని అడిగితే "గురువు గారూ! రేపటికి 100 తప్పులు పూర్తి

అవుతాయి. శతజయంతి ఉత్సవాన్ని జరుపుకుందాం" అన్నాడట. తప్పులు చేయడంలో శత జయంతి. ఇదీ వరస.

సోమరిగా వున్న వాడికి ఎప్పటికైనా శిక్ష తప్పదు. బ్రహ్మ దేవుడు మనిషిని సృష్టించి రెండు చేతులను సమంగా సృష్టించాడు. కాని ఎడమ చేయి సోమరి. ఇది చూచి బ్రహ్మ ఇద్దరినీ పిలిపించాడు. కుడిచేతిని మెచ్చుకొని వరం ఇచ్చాడు. పూజ, దానం, యజ్ఞం మెదలైన పవిత్రమైన కర్మలు చేసే అధికారాన్ని ఇచ్చాడు. అప్పుడు ఎడమ చేయి కూడా వరాన్ని అడిగింది. బ్రహ్మ దేవుడన్నాడు," నీకు ప్రతి రోజు నిద్ర లేవగానే ఒక పని అప్పజెబుతున్నాను. ఆ అధికారం నీకే" అన్నాడు. అదీ సోమరి గతి. తామస కర్త గతి.

రామాయణంలో ముగ్గురు సోదరులున్నారు. విభీషణుడు సాత్విక కర్త. రావణుడు రాజస కర్త. రాగద్వేషాలు, హింస. కుంభకర్ణుడు తామస కర్త. తిండి, నిద్ర.

*(vii)విషాదీ :- సోమరి పోతు ఇతరుల మీద ఆధారపడి జీవించాలి కనుక, వారు తిట్టినా, హీనంగా చూచినా, ఎగతాళి చేసినా అన్నీ భరించాలి. అదొక విషాదం. ఎప్పుడూ బాహ్యదృష్టేగాని అంతరంగంలోని ఆత్మను దర్శించలేడు. తెలుసుకోలేడు. కనుక ఆనందం రాదు. ఎప్పుడూ విషాదమే.*

*(viii)దీర్ఘసూత్రీచ :- చురుకుదనం ఉండదు. త్వరత్వరగా నిర్ణయాలు తీసుకోడు. మనో బుద్ధులు మందగిస్తాయి. సోమరితనం గదా! ప్రమాదం ముంచుకొచ్చినా 'చూద్దాంలే' అంటాడు. దీర్ఘంగా ఆలోచనలు చేస్తాడు. కాని ఏమీ చేయడు.*

మహా భారతం శాంతి పర్వంలో ఒక కధ ఉన్నది.

ఒక సరస్సులో 3 చేపలున్నాయి. వాటి పేర్లు దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు దీర్ఘసూత్రి. సరస్సు ఎండి పోయే స్థితి వచ్చేట్టుగా కనిపిస్తున్నది. అందువల్ల వేరొక జలాశయాన్ని వెతుక్కొని

అక్కడకు పోదాం అన్నది దీర్ఘదర్శి. అంత ప్రమాదం వస్తే అప్పుడు చూద్దాం అన్నది ప్రాప్తకాలజ్ఞుడు. ఎప్పుడో ఎండి పోతుందని ఇప్పుడు జీవిస్తున్న వాళ్ళం కష్టాలు కొని తెచ్చుకుందామా? అన్నది దీర్ఘసూత్రి. దీర్ఘదర్శి వేరొక జలాశయాన్ని వెతుక్కొని వెళ్ళిపోయింది. ఆ తరువాత *10* రోజులకే సరస్సు ఎండిపోయింది.

చేపలు పట్టేవాడు వచ్చి వల వేశాడు. అన్నీ వలలో పడిపోయాయి. ప్రాప్తకాలజ్ఞుడు ఎలా తప్పించుకోవడమా? అని ఆలోచించి, ఒక భావి వద్ద వాటిని కడగడానికి వల దించగానే చచ్చినట్టు పడి వుంది. దాన్ని అవతల పారవేయగా అది భావిలోకి దూకి తప్పించుకుంది. సోమరిపోతు దీర్ఘసూత్రి మాత్రం ప్రాణాలు పోగొట్టుకుంది. ముందు జాగ్రత్త లేక, అప్పటికప్పుడు తప్పించుకునే ఉపాయం లేక సోమరిపోతులా ఉంటే చావు తప్పదు- అని ఈ కథ ద్వారా తెలుస్తుంది. ఇలా సరైన సమయంలో నిర్ణయాలు తీసుకోలేక ప్రాణాల మీదకు తెచ్చుకొనే వాడే తామస కర్త.

-సాత్త్విక జ్ఞానంతో, సాత్త్విక కర్మను, సాత్త్విక కర్త చేసినపుడు అది సాత్విక త్యాగం అవుతుంది.

*-అయితే కర్మ జరగటానికి ఈ జ్ఞానం, కర్మ, కర్త అనే 3 అంగాలతో బాటు మరో రెండు సహకార అంగాలు కూడా కావాలి. అవే బుద్ధి- ధృతి. అవి కూడా గుణ భేదాలతో ఒక్కొక్కదానిని 3 గా విభాగించవచ్చును. 'ఇప్పుడు వాటి గురించే పూర్తిగా చెబుతున్నాను శ్రద్ధగా విను' అంటున్నాడు భగవానుడు.*

శ్లో|| బుద్ధేర్భేదం ధృతేశ్చైవ
గుణతస్త్రివిధం శృణు|
ప్రోచ్యమానమశేషేణ
పృథక్త్వేన ధనంజయ|| *(29)*

తా|| గుణాలను బట్టి మూడేసి విధాలుగా ఉండే బుద్ధి యొక్క, ధృతి యొక్క భేదాలను వేరు వేరుగా చెబుతాను. అర్జునా! విను.

*వ్యాఖ్య:-* మనం ఎప్పుడూ కర్మలను చేస్తూనే ఉంటాం. ఇలా కర్మలు చేసేటప్పుడు మనం మనచూట్టూ పరిసరాలలోని వ్యవహారాలను, స్థితిగతులను విజ్ఞాన పూర్వకంగా గ్రహించాలి. అంటే వాటి మంచి చెడ్డలను విశ్లేషించి- వివేచన చేయాలి. అలా వివేచన చేసేదే బుద్ధి.

ఒక యజ్ఞం చేయాలనుకున్నాం. దీనికి జ్ఞానం, కర్మ, కర్త ఉండాలి. యజ్ఞమనే ఒక క్రియ ఉన్నదని తెలుసుకోవాలి. ఎలా చేయాలో, చేస్తే ఫలితం ఏమిటో తెలుసుకోవాలి- ఇది జ్ఞానం. చేయటానికి కావల్సిన వస్తువులు సమకూర్చుకోవాలి. వాటిలో యజ్ఞ కర్మను చేయాలి- ఇది కర్మ. ఈ మొత్తాన్ని చేసే వ్యక్తి -కర్త.

కేవలం యజ్ఞం గురించి తెలియజేయటమే కాదు. ఇది చేయదగినదా కాదా?, శాస్త్ర విహితమా? విరుద్ధమా?, బంధాన్ని

కలిగిస్తుందా?, ముక్తికి దారితీస్తుందా?, దీన్ని ఎలా చేస్తే మనకు తగి ఉంటుంది?- ఈ ఆలోచనలు చేయాలి. అలా చేసేది 'బుద్ధి'. అంటే ప్రతి విషయాన్ని లోతుగా అధ్యయనం చేసేది బుద్ధి.

ఇక ఒక సారి నిర్ణయం తీసుకున్న తరువాత కర్మను ప్రారంభించి, అది ముగిసేంతవరకు ఎన్ని ఆటంకాలు అవాంతరాలు వచ్చినా, ఎన్ని అవమానాలు ఎదురైనా, ఎంత కష్టమైనా అన్నింటికి ఓర్చి పట్టుదలతో కొనసాగించి పూర్తి చేయాలి. ఇదే 'ధృతి'.

* సమాచారాన్ని సరిగ్గా తెలుసుకొని దానికనుగుణంగా కర్మలను నియమించేది బుద్ధి.
* ప్రారంభించిన కర్మను ఎలాంటి ఆటంకాలు వచ్చినా పట్టుదలతో పూర్తి చేసేది ధృతి.

-ఇక వాటిని త్రిగుణ భేదాలతో తెలియజేయబోతున్నాను. విను అంటున్నాడు భగవానుడు.

*-ముందుగా సాత్త్విక బుద్ధి గురించి.*

**శ్లో||** ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యాకార్యే భయాభయే|
బంధం మోక్షం చ యా వేత్తి
బుద్ధిః సా పార్థ సాత్త్వికీ|| **(30)**

తా|| అర్జునా! ప్రవృత్తి నివృత్తులు, కార్య అకార్యాలు, భయ అభయాలు, బంధ మోక్షాలు- వీటిని విడమరచి తెలుసుకునే బుద్ధి సాత్త్విక బుద్ధి.

*వ్యాఖ్య:-* ఏదైనా ఒక పని చేసే ముందు దాని మంచి చెడ్డల గురించి చక్కగా వివరంగా ఆలోచన చేయాలి. ఇలా ఆలోచించేదే బుద్ధి. అయితే ఏమి ఆలోచించాలి?

*(i)*ప్రవృత్తించ నివృత్తించ :- ప్రవృత్తి అంటే కర్మ మార్గం. అంటే జీవించి ఉన్నంత వరకు హాయిగా, ఆనందంగా భోగాలననుభవిస్తూ ఉండాలనే కోరికతో అందుకు తగిన కర్మలను చేస్తూ ఈ ప్రపంచంలోనే మునిగిపోయే మార్గమే 'ప్రవృత్తి మార్గం'. అలా కాకుండా మనం ఇక్కడ పొందే సుఖ దుఃఖాలన్నీ ఎలాగూ తప్పక పొందవలసినవేనని, అవి మన ప్రారబ్ధానుసారం తప్పక అనుభవించి తీరవలసినవేనని గ్రహించి, వాటి కోసం కాకుండా సమస్త దుఃఖాలను శాశ్వతంగా అంతం చేసి, అఖండమైన ఆనందాన్ని, మోక్షానందాన్ని పొందటమే ముఖ్యమని భావించి, అట్టి మోక్షం-జన్మ రాహిత్యం మన చేతుల్లోనే - మన చేతల్లోనే ఉన్నదని తెలుసుకొని, ఆ లక్ష్యాన్ని అందుకొనుటకు అడ్డంగా ఉన్న ఈ ప్రాపంచిక విషయాలపై విరక్తి చెంది, పారమార్థిక విషయాలపై రక్తితో శ్రవణమననాదులు, విచారణ చేస్తూ జీవితాన్ని సార్థకం చేసుకొనుటే నివృత్తి మార్గం.

కనుక ముందుగా బుద్ధి ఇది ప్రవృత్తికి దారి తీస్తుందా? నివృత్తికి దారి తీస్తుందా? అని విచక్షణ చేసి, విచారణ చేసి తెలుసుకోవాలి. అలా తెలుసుకునే బుద్ధియే సాత్త్విక బుద్ధి.

*(ii)*కార్యాకార్య :- ఇది చేయదగినదా? చేయకూడనిదా? అని విచక్షణ చేయాలి. మన యొక్క శ్రేయస్సు కోసం శాస్త్రాలు కొన్ని కర్మలను విధించాయి. అవి చేయతగినవి. మనకు అపకారం కలిగించే వాటిని శాస్త్రం నిషేధించింది. అవి చేయకూడనివి. శ్రవణ మనన నిధిధ్యాసనలు, జపం, ధ్యానం, సాక్షీభావన, ఆత్మ విచారణ- ఇవన్నీ మోక్ష ప్రాప్తికి దారి తీసేవి. ఇలాంటి కర్మలను తప్పక చేయాలి. అలాగే పూజాదికాలు యజ్ఞ యాగాదులు మనస్సును శుద్ధి చేసేవి. కనుక ఇవీ చేయదగినవే. అయితే స్వార్థం కోసం చేసే కర్మలు ఏవైనా ఈ జన్మ బంధంలో

ఇరికించేవి. కనుక వాటిని విడిచిపెట్టాలి. ఇలా విచక్షణ చేసేది బుద్ధి.

క్షణికావేశంలో తీసుకొనే నిర్ణయాలకు తీరిగ్గా పశ్చాత్తాపం చెందవలసి ఉంటుంది. యుద్ధ ప్రారంభంలో అర్జునుడు కూడా ఇలానే నిర్ణయం తీసుకున్నాడు. నేను యుద్ధం చేయను-అని. కాని శ్రీకృష్ణుని బోధతో తిరిగి సరైన నిర్ణయం తీసుకున్నాడు. ఆ శ్రీకృష్ణుడే బుద్ధి. మనం కూడా బుద్ధి చెప్పినట్టే నిర్ణయాలు తీసుకోవాలి. బుద్ధి చెప్పినట్లు వింటే అంతా మంచే జరుగుతుంది. కనుక సాత్త్వక బుద్ధియే ఉండాలి.

*(iii)భయాభయే :- దేనిని గురించి భయపడాలి? దేనిని గురించి భయపడనవసరం లేదు?* అని తెలియజేసేది కూడా సాత్త్విక బుద్ధియే.

* దృశ్య రూప ప్రపంచం అంతా భయంతో కూడినది.
* మోక్ష రూపమైన పరమాత్మ స్థితి - ఆత్మ స్థితి భయరహితమైనది.
* జ్ఞానులు భయపడే మార్గంలో నడవటానికి మూర్ఖులు సిద్ధపడతారు.
* జ్ఞానులు నిర్భయంగా ప్రవేశించే మార్గంలో నడిచేందుకు మూర్ఖులు భయపడుతారు. అందుకే ఆధ్యాత్మిక మార్గంలో నడిచే వారిని చూచి మన వారు చెడిపోతారని భయపడుతారు.

ఒకరు అడిగారు," *భగవద్గీత వింటే వైరాగ్యం వచ్చి అన్నీ వదిలి పెట్టి పోతామంటగదండీ*" అని. నేనన్నాను అసలు *భగవద్గీత* చెప్పిన శ్రీకృష్ణుడే *8* మంది భార్యలతో కలిసే ఉన్నాడు. విన్న అర్జునుడు నలుగురు భార్యలతో చివరి వరకు కలిసే ఉన్నాడు. *పోనీ వాళ్ళ సంగతి ఎలా ఉన్నా 20 సం||లు* నుండి *భగవద్గీత*ను చెబుతున్న నేను కూడా ఎక్కడికీ వెళ్ళిపోలేదు.

అంత తేలిగ్గా వైరాగ్యం వచ్చే అదృష్టం ఎవరికీ పట్టదు. వైరాగ్యం వస్తే భయపడనవసరం లేదు. రాకపోవటాన ఈ జనన మరణ చక్రంలో ఇరుక్కొని బాధపడాల్సివస్తున్నదే అని భయపడాలి". అన్నాను.

*(iv)*బంధం మోక్షంచ :- జనన మరణ చక్రంలో ఇరుక్కొని మళ్ళీ మళ్ళీ పుడుతూ మళ్ళీ మళ్ళీ చస్తూ ఉండటమే బంధం. అన్ని కర్మ బంధనాలు వీడి పోవటమే మోక్షం. దేనివల్ల బంధమో- దేనివల్ల మోక్షమో తెలియజేసేదే 'సాత్త్విక బుద్ధి'.

ఆత్మజ్ఞానాన్ని- ఉపనిషత్తుల జ్ఞానాన్ని సద్గురువుల ద్వారా శ్రవణం చేసి, మననం చేసి, ఆత్మ విచారణ ద్వారా నేను ఆత్మను అని దృఢ పరచుకొని, అట్టి ఆత్మగా ఉండగలిగితే 'మోక్షం'. నిరంతరం ఈ లోకంలోని సుఖ భోగాల కొరకు కర్మలు చేస్తూ, ఈ లోకంలోని సుఖాల కొరకు లేదా పై లోకాలలోని భోగాల కొరకు పూజలు, యజ్ఞాలు, తీర్థ యాత్రలు, వ్రతాలు, భజనలు చేస్తూ జీవితాన్ని గడిపేస్తే 'బంధం'. ఎంత పండితుడైనా ఎంత గొప్ప వాడైనా, మేధా శక్తి ఉన్న బుద్ధిశాలి అయినా ఇంతే. దీన్ని తెలియజేసే బుద్ధియే సాత్త్విక బుద్ధి.

*-రాజసిక బుద్ధి ఎలాంటిదో తెలియజేస్తున్నారు.*

శ్లో|| యయా ధర్మమధర్మం చ
కార్యం చాకార్యమేవ చ|
అయథావత్ప్రజానాతి
బుద్ధిః సా పార్థ రాజసీ|| *(31)*

తా||*అర్జునా!* ఏ బుద్ధి ధర్మాధర్మాలను, కార్యాకార్యాలను ఉన్నది ఉన్నట్లుగ నిర్ణయించలేదో అది రాజసికమైనది.

*వ్యాఖ్య:*-శాస్త్రాలలో లేకపోయినా గురువులెవరూ అలా చెప్పకపోయినా ఈ రాజసబుద్ధి విపరీత భావనలు చేస్తుంటుంది.

మోసం చేసిగాని, దొంగతనం చేసిగాని, అన్యాయాలు చేసి గాని ఎలాగైనా సరే ఏదో విధంగా డబ్బు సంపాదిస్తూ బ్రతికేవాడు ఈ మోసాలను, అన్యాయాలను, దొంగతనాలను అధర్మమని గాని, అన్యాయమని గాని అంగీకరించడు. వాటిని చేయకుండా ఉండలేడు. లోపలి నుండి బలమైన ప్రేరణలు వస్తున్నాయి. బయటి నుంచి ప్రాపంచికమైన వ్యామోహాలు, ఆకర్షణలు కలుగుతున్నాయి. కనుక తన కోరికలను తృప్తి పరచుకొనుటకు మరొక మార్గం లేదనుకుంటాడు. అన్యాయాలకు, అక్రమాలకు అలవాటు పడిపోతాడు. అటువంటి వాడు ఇలా విపరీత భావనలు చేస్తుంటాడు.

*(i)*నేను లోకంలో జీవించటానికే కదా పుట్టింది. ఇది ఇలా జరగాలని రాసిపెట్టి ఉంది కదా! ఇందులో నాదేం తప్పుంది? అసలు ఆ సొమ్ము నాది గనుకనే దానిని నేను తెచ్చుకుంటున్నాను. పూర్వ జన్మలో వాడు నా దగ్గర నుండి అన్యాయంగా కాజేసి ఉంటాడు. అందుకే నేనిప్పుడు వాడి దగ్గర కాజేశాను.

*(ii)*అసలు జీవించటం కోసం ఏం చేసినా తప్పు లేదు. నేనేం కోట్ల కొద్దీ దోపిడీ చేస్తున్నానా? ఏదో బ్రతుకు తెరువు కోసమే కదా! దీనివల్ల నాకు ఏ పాపం అంటే అవకాశం లేదు. అవసరం కోసం చేస్తున్నానీ దొంగతనం. అంతేగాని అనవసరంగా చేయటం లేదు.

*(iii)* నేను ఇలా సంపాదించిన దానిని నేనొక్కడినే తింటే పాపంగాని, ఇందులో కొంత దాన ధర్మాలు చేస్తున్నాను. ఎందరో అనాథలను ఆదుకుంటున్నాను. *10%*

వేంకటేశ్వరస్వామికి ఇస్తున్నాను. మరి అలాంటప్పుడు భగవంతుడు పాపాన్ని నా ఖాతాలో ఎందుకు వేస్తాడు?

*(iv) ఆ! నేనొక్కడినేనా ఇలాంటి పనులు చేస్తున్నది? పైగా ఇది* మా తాతల కాలం నుండి వస్తున్న కులవృత్తి. ఇది నా స్వధర్మం. స్వధర్మాన్ని ఆచరించాలనే గదా మొన్న ఆ స్వామి భగవద్గీతను చెబుతూ చెప్పింది! భగవంతుడే నీ స్వధర్మాన్ని ఆచరించమని చెబితే ఇంకా పాపం ఎక్కడ?

ఇలా సాగి పోతాయి అతడి విపరీత ఆలోచనలు. ఉన్న దాన్ని ఉన్నట్లు అంగీకరించలేక దానిని కప్పిపుచ్చుకోవటానికి ఏవో కుంటి సాకులు వెతుక్కుంటూ ఉండే బుద్ధియే రాజస బుద్ధి. కొందరికి ధర్మం తెలుసు అయినా అటు పోరు. స్వార్థమే పరమార్థంగా భావిస్తారు.

దుర్యోధనుడొకసారి శ్రీకృష్ణునితో అన్నాడట. కృష్ణా! ధర్మమేదో నాకు తెలుసు. కాని నా మనస్సు అటు వెళ్లదు. అధర్మం ఏదో కూడా నాకు తెలుసు. కాని నా మనస్సు దాని మీద నుండి వెనుకకు మళ్ళదు -అని. ఇదీ రాజస బుద్ధి.

ఈ బుద్ధి గల వారు పెద్దల వాక్యాలను విని గాని, శాస్త్రాలను తెలుసుకొని గాని, తాము చేస్తున్నది తప్పు అని మనసులో ఎప్పుడైనా భావిస్తే, తాము చేసేది అధర్మమని, అకార్యమని భావించ గలిగితే ఈ బుద్ధిని వారు సంస్కరించుకోవచ్చు. స్వార్థాన్ని వదలి ధర్మ మార్గంలో ప్రయాణించవచ్చు. రాజస బుద్ధికి ఆ అవకాశం ఉన్నది.

*-ఇక తామస బుద్ధి గురించి :-*

శ్లో|| అధర్మం ధర్మమితి యా
మన్యతే తమసావృతా|
సర్వార్థాన్విపరీతాంశ్చ

బుద్ధిః సా పార్థ తామసీ॥ (32)

తా॥అధర్మాన్ని ధర్మమని, అన్ని విషయాలను విరుద్ధంగా ఏ బుద్ధి అజ్ఞానం చేత కప్పబడి భావిస్తుందో అర్జునా! ఆ బుద్ధి తామసికమైనది.

*వ్యాఖ్య:-* అధర్మాన్ని, అన్యాయాన్ని, తప్పుడు పనులను కప్పిపుచ్చుకోవటానికి ప్రయత్నించే బుద్ధి రాజసిక బుద్ధి అయితే అధర్మాన్ని ధర్మంగా, అన్యాయాన్ని న్యాయంగా నిశ్చయించే బుద్ధి తామసిక బుద్ధి. ఇది విపరీత బుద్ధి. బుద్ధిని తమస్సు - అజ్ఞానం కప్పి వేసినప్పుడు ఇలా విపరీతంగా భావించటం జరుగుతుంది.

ఒకడు దొంగతనం చేసి, లేదా మోసాలు చేసి, అక్రమాలు చేసి, అమాయకులను దోచుకొని ధనార్జన చేస్తున్నాడు. అటువంటి వాణ్ణి, "ఎందుకిలా మోసాలు చేసి అక్రమార్జన చేస్తున్నావు? దొంగతనం చేసి పాపం మూట కట్టుకుంటున్నావు?" అంటే చాలు. అతడంటాడు,"ఎవరన్నారు నేను చేసేది పాపం అని? అసలు నేను చేసేది ధర్మ కార్యం. ఇలా చెయ్యక పోతేనే గొప్ప పాపం, అధర్మం అవుతుంది". అని మూర్ఖంగా వాదిస్తాడు. "అదేమిటి దొంగతనం చేస్తే పాపం అని శాస్త్రాలు చెబుతున్నాయి కదా!" అంటే "ఎవడయ్యా అలా చెప్పింది? ఇవన్నీ బాగా డబ్బు సంపాదించుకొని మూటలు గట్టుకున్న వాళ్ళు వ్రాసిన శాస్త్రాలు. వాళ్ళ డబ్బును ఎవరైనా దొంగతనం చేసి దోచుకు పోతారేమోననే భయంతో ఇలా వ్రాశారే గాని ఏ పాపం లేదు. అసలు సంపాదించి దాచుకోవడమే మహా పాపం. అది గొప్ప నేరం. ఆ నేరం చేసిన వాణ్ణి నేను శిక్షిస్తున్నాను. అందువల్ల నేను చేసేది పుణ్య కార్యం. సమాజ శ్రేయస్సు, దుర్మార్గాలు, మోసాలు చేసి అమాయకులను దోచుకున్న వాణ్ణి దోచుకోవటం వల్ల మళ్ళీ

వాడు ఇలాంటి మోసాలకు పాల్పడడు. కనుక నాది పుణ్య కార్యం, ధర్మ కార్యం " అంటాడు వీడు. వీడి బుద్ధిని స్వార్థం, కామం, అజ్ఞానం కప్పి వేసింది. అందుకే ఉన్నది ఉన్నట్లు కనిపించదు. విపరీతంగా కనిపిస్తుంది.

'శశాంక విజయ' మనే ప్రబంధంలో బృహస్పతి భార్య తార చంద్రునితో ప్రేమ కలాపాలు సాగిస్తుంది. ఇది తప్పు అని చెప్పబోయే చంద్రునితో తార ఇలా చెబుతుంది.

ఉ. *లోకములోన కొందరబలుల్ సతులందనియింపలేక య*
*స్తోక మనీష మన్య పురుషుల్ తమ కాంతల నంటకుండ తా*
*టాకులలోన వ్రాసిరి "పరాంగన గూడిన పాప" మంచు న*
*య్యాకుల పాటు చూచి యిపు డాకులపా టెనయంగ నేటికిన్?* -

అన్నది.

ఇదే విపరీత భావన. ఇదే తామస బుద్ధి. నిగ్రహం లేక తప్పు చేస్తే చేయవచ్చు గాక! ఆ తప్పు ఒప్పు అనటమే పెద్ద తప్పు.

మనలో చాలా మంది అంటుంటారు. 'ఎలా సంపాదించావని కాదు ఎంత సంపాదించావనేది ముఖ్యం. డబ్బు లేకపోతే డుబ్బుకు కొరగాడు కనుక ఎలాగైనా సరే ఎక్కువగా సంపాదించటమే ముఖ్యం' అని. ఇలాంటి వారి బుద్ధియే తామస బుద్ధి. అన్ని విషయాలలోను వీరి బుద్ధులు విపరీతంగానే ఉంటాయి. నీటిలో ప్రతిబింబం తలక్రిందులైనట్లు వీరికి అన్నీ తలక్రిందులుగానే కనిపిస్తాయి. అందుకే సర్వార్థాన్ విపరీతాంశ్చ' అన్నారు. ఇలా అనిపించటానికి కారణం వీరి బుద్ధిని తమస్సు కప్పి వేయటమే. మామూలు కంటితో చూస్తే ఉన్నది ఉన్నట్లు కనిపిస్తుంది. కాని ఎర్ర కళ్ళద్దాల జోళ్లు

పెట్టుకుంటే అంతా ఎర్ర గానే కనిపిస్తుంది. అలాగే బుద్ధి తమస్సు చేత కప్పబడినపుడు కూడా అంతే. అంతా విపరీతమే.

సుమారు *40* సంవత్సరముల క్రిందట ఒక వ్యక్తి *20* వేల రూపాయల అప్పు చేసి దివాలా తీశాడు. తనకు తానే పెద్ద మనిషిని అనుకొనే ఒకతను నాతో మాట్లాడుతూ ఉండగా ఎవరో వచ్చి ఈ విషయాన్ని చెవిన వేశారు. అప్పుడా పెద్ద మనిషినని ఫీలయ్యే వ్యక్తి అన్నాడు,"ఇదేనయ్యా మన వాళ్లతో వచ్చిన చిక్కు. ఎలాగూ దివాలా తీస్తున్నాడు గదా*!* ఒక లక్షకు అప్పు చేసి దివాలా తీయవచ్చు కదా*!* బుద్ధి తక్కువ మనుషులు"-అన్నాడు

అప్పుడు నాకు అనిపించింది, "యమధర్మరాజు కూడా" ఎలాగూ వీణ్ణి రంపాలతో కొయ్యాలిగదా*!* ఈ లోపు ఉక్కు ముక్కులు గల గ్రద్దలతో పొడిపించి, వేడివేడి నూనెలో వేయించి, అన్ని రకాల రుచులూ చూపిస్తే బాగుంటుంది గదా*!*" అని అంటే సరిపోతుందేమో -అని.

ఈ విపరీత బుద్ధులు గల వారికి శిక్షలు కూడా విపరీతంగానే ఉంటాయి.

ఇప్పుడు *3* శ్లోకాల సారం ఒక్కసారిగా చూద్దాం.

*(i)* జన్మాంతర సంస్కారాల వల్ల ఏది ధర్మం, ఏది అధర్మం*?* ఏది ప్రవృత్తి- ఏది నివృత్తి*?* ఏది బంధం- ఏది మోక్షం*?* అని తెలుసుకోగల బుద్ధి సాత్త్విక బుద్ధి.

*(ii)* ధర్మాధర్మాలను, కార్యాకార్యాలను తెలుసుకోలేని బుద్ధి రాజస బుద్ధి. వీరు శాస్త్రాల వల్లనో, గురు బోధ వల్లనో, పెద్దలను సేవించటం వల్లనో యదార్థాన్ని తెలుసుకోగలుగుతారు.

*(iii)* అజ్ఞానం బుద్ధిని కప్పి వేయటం వల్ల అధర్మాన్ని ధర్మంగా, అన్యాయాన్ని న్యాయంగా, పాపాన్ని పుణ్యంగా నిశ్చయించి

వాదించే బుద్ధి తామస బుద్ధి. శాస్త్రాలను, పెద్దలను బుద్ధి లేని వారిగా నిరసించే బుద్ధియే ఈ తామస బుద్ధి.

*- నిర్ణయం చేసేది బుద్ధి అయితే ఆ నిర్ణయాన్ని స్థిరంగా నిలబెట్టేది ధృతి(పట్టుదల). ఈ ధృతి కూడా మూడు విధాలు. ముందుగా సాత్త్విక ధృతి గురించి-*

శ్లో|| ధృత్యా యయా ధారయతే
మనఃప్రాణేంద్రియక్రియాః|
యోగేనావ్యభిచారిణ్యా
ధృతిః సా పార్థ సాత్త్వికీ|| *(33)*

తా||*అర్జునా!* చలించని యోగంలో నిలిచి, మనస్సు, ప్రాణాలు, ఇంద్రియాల యెక్క వ్యాపారాలను ఏ పట్టుదలతో తప్పు మార్గంలోకి పోకుండా నియమిస్తున్నాడో అట్టి ధృతి సాత్త్వికమైనది.

*వ్యాఖ్య:-* మానవులందరికీ చతుర్విధ పురుషార్థాలున్నాయి. అవే *1.* ధర్మం. *2.* అర్థం *3.* కామం *4.* మోక్షం అనేవి. ఇందులో అర్థ కామాలు రెండూ సర్వసాధారణమైనవి. అందరూ నిర్వర్తించేవి. అయితే ఈ అర్థ కామాలను ధర్మం తప్పకుండా సాధించుకోవాలని కొందరు, ధర్మంతో నిమిత్తం లేకుండా అర్థ కామాలే పరమార్థంగా భావించే వారు కొందరు. ధర్మం తప్పకుండా అర్థ కామాలు సాధించుకొనే వారికి భవిష్యత్తులో మోక్షాపేక్ష కలిగి ఆ మార్గంలో ప్రయాణిస్తారు. అర్థ కామాలే ప్రధానమనుకొనే వాళ్లు పశువులలాగా వాటిని పొందుతూ, అనుభవిస్తూ భయంకరమైన, క్రూరమైన, నీచమైన జన్మలు ఎత్తుతూ అధోగతి పాలవుతారు. ఈ రెండు రకాల వ్యక్తుల కన్న

వేరైన విధంగా జీవించే వారు అరుదుగా ఉంటారు. మోక్షం పట్ల పూర్తి అపేక్ష కలిగి శాశ్వత ఆనంద స్వరూపమైన మోక్షం కోసం అర్థ కామాలకు ఎటువంటి ప్రాధాన్యత ఇవ్వకుండా ధర్మ మార్గంలో మాత్రమే నడిచేవారు.

ధన సంపాదన లేకపోయినా, కోరికలు తీరకపోయినా, వాటిని ఏ మాత్రం పట్టించుకోకుండా మోక్ష సాధనే లక్ష్యంగా భావించుకొని దాని కొరకే పట్టుదలతో ముందుకు వెళ్ళే వారి పట్టుదలను- ధృతిని సాత్త్విక ధృతి అంటారు. ఇట్టి వారు లౌకిక ప్రపంచంలో అనేక కష్ట నష్టాలను ఎదుర్కొంటారు. అయినప్పటికీ అర్థ కామాల కోసం అర్రులు చాచరు. లభించిన దానితో సంతృప్తి చెందుతూ, తనకెంత లభిస్తే అంతే భగవంతుడు ప్రసాదించాడనుకుంటూ 4వ పురుషార్థమైన మోక్షం కోసం చలించని యోగంలో ఉండిపోతారు.

వీరు చలించని యోగంలో నిలిచి సాధించవలసింది ఏమిటి? ఇంద్రియ కార్యాలను, మనో ప్రవృత్తిని, ప్రాణముల యొక్క విధులను నిగ్రహించాలి.

భాగవతంలో కుచేలుడున్నాడు. ఆయనకు ఏ విధమైన ప్రాపంచిక విషయాసక్తి లేదు, కోరికలు లేవు, ధన సంపాదన గురించి ఆలోచనలు లేవు. ఎల్లప్పుడు శ్రీకృష్ణుని గురించే ఆలోచిస్తూ, కృష్ణ భక్తిలో తన్మయత్వం చెందుతుంటాడు. అలాగని ఆయన సన్యాసి కాదు. బహు సంతానంతో కూడిన సంసారి. కుటుంబ పోషణకు సరిపడా సంపద లేదు, కటిక దరిద్రం, పిల్లలు ఎప్పుడూ ఆకలితో అలమటించి పోతుంటారు. బిక్షాటన చేసి తెచ్చిందే దిక్కు. లభించిన దానితో సంతృప్తి చెందుతున్నాడే గాని ఏనాడూ తన దరిద్రాన్ని గురించి ఆలోచించలేదు. మనస్సు పూర్తిగా కృష్ణమయం. ఇంద్రియాలు కృష్ణ నామంలో, భజనలో, తన్మయం చెందుతున్నాయి. ప్రాణ విధులైన ఆకలి దప్పికల

గురించి పట్టించుకోలేదు. ఒంటి మీద చినిగిన వస్త్రమే తప్ప ఇంకేమీ లేదు. అందుకే కుచేలుడన్నారు. కు-చేలం అంటే చినిగిన వస్త్రం అని అర్థం. పేదరికంలో ఎంత భక్తితో ఉన్నాడో సకల సంపదలు సమకూరినప్పుడు కూడా వాటిపై ఏ మాత్రం ఆసక్తి లేకుండా అదే భక్తితో ఉన్నాడు. సంపదలు సమకూరినప్పుడు ఇలా అన్నాడు,"భగవాన్! నాకీ సంపదల ఆశ చూపి నన్ను దూరం చెయ్యాలనుకుంటున్నావా?" అన్నాడు. ఇదే చలించని భక్తి. చలించని యోగం. ఎంత సంపద కూడినా, కటిక దరిద్రం అయినా ఇదే స్థితి. నిశ్చల స్థితి. ఇదే అవ్యభిచారిణీయోగం.

కొద్ది సేపు మనస్సును యోగం మీద నిలిపి, కొంచం సేపు భోగం మీద నిలిపితే అది వ్యభిచరించే యోగం అవుతుంది. అలా గాక మనస్సును ఎల్లప్పుడు ఆత్మతో అనుసంధానం చేసి, ఆత్మలోనే రమిస్తూ ఉంటే దానిని అవ్యభిచారిణీయోగం అంటారు. అలా పట్టుదలతో, దీక్షతో, ధైర్యంతో, ఆటంకాలను ఎదుర్కొంటూ, మనస్సును నిర్మలం చేసుకొని, ఆత్మతో అనుసంధానం చేస్తుంటే అదే చలించని యోగం. అట్టి యోగాన్ని కొనసాగించే ధృతిని సాత్త్విక ధృతి అంటారు.

కొందరు మహాత్ముల ఉపన్యాసాలు విని, అన్నీ విడిచి ఆత్మానందాన్ని అందుకుందామని ఎక్కడికో వెళ్ళి సాధన సాగిస్తారు. కాని మనస్సులో కల్మషాల కారణంగా కొద్ది కాలానికే అక్కడ ఉండలేకపోతారు. మనస్సులోని కోరికలు వెర్రితలలు వేస్తుంటే కోరికలను అణచలేక, సాధన సాగించలేక రెంటికి చెడిన రేవడలవుతారు. కనుక మనస్సులోని వాసనలను క్షయం చేసుకొని, ఇంద్రియాలను నిగ్రహించి,

పట్టుదలతో సాధన సాగిస్తేనే అది సాత్త్విక ధృతి అవుతుంది. ఈ సాత్త్విక ధృతియే పరమాత్మకు దగ్గర చేస్తుంది.

*-రాజసిక ధృతి ఎట్టిదో ఈ శ్లోకంలో.*

**శ్లో|| యయా తు ధర్మకామార్థాన్**
**ధృత్యా ధారయతేఽర్జున|**
**ప్రసంగేన ఫలాకాంక్షీ**
**ధృతిః సా పార్థ రాజసీ|| (34)**

**తా||అర్జునా! ఏ పట్టుదల ధర్మార్థకామాలను మమకారంతో, ఫలాపేక్షతో నిలబెట్టి ఉంచుతుందో పార్థా! ఆ పట్టుదలనే రాజసికధృతి అంటారు.**

*వ్యాఖ్య:-* సాత్త్విక ధృతి గలవాడు మోక్షమనే పురుషార్థాన్ని సాధించాలనుకుంటాడు. కాని రాజసికధృతి గలవానికి ధర్మార్థకామాలే ప్రధానం. ఫలితం లేకుండా ఏ పనినైనా ఎందుకు చేయాలి? అంటాడు. కనుక పరమార్థ దృష్టితో చూస్తే ఈ రాజసిక ధృతి అంత ఉత్తమమైనది కాదు. ఇది ధర్మార్థకామాలనే కోరుతుంది.

1.ధర్మం :- ఇక్కడ ధర్మం అంటే సామాన్య ధర్మమేనని గ్రహించాలి. ఈ జన్మలో దానధర్మాలు, సత్కార్యాలు చేస్తే మరు జన్మలోగాని, పర లోకంలో గాని సుఖాలు, భోగాలు అనుభవించ వచ్చుననే ఆలోచనలతో, ఆ సుఖ భోగాలపై గల ఆసక్తితో - అపేక్షతో దాన ధర్మాలను, సత్కార్యాలను, పరోపకారాన్నీ చేస్తుంటారు. వాటిని చలించని పట్టుదలతో చేస్తే అదే రాజసిక ధృతి. భగీరథుడు గంగను భూమి పైకి తెచ్చి తన పితరులను తరింప జేయాలని పట్టుదలతో ప్రయత్నించాడు. ఇది రాజసిక ధృతి. భీష్ముడు తన తండ్రికి సంతోషాన్ని కలిగించటానికి ఆజన్మ బ్రహ్మచర్య వ్రతాన్ని

పాటించాడు. ఇది కూడా రాజసిక ధృతియే. ఎన్ని ఆటంకాలు వచ్చినా చలించని పట్టుదలతో కొనసాగించారు వారు.

2. అర్థం :- ఈ జీవితాన్ని సుఖంగా, ఆనందమయంగా గడపాలని, కోరిన కోరికలన్నింటినీ తీర్చుకోవాలని, తన కుటుంబాన్ని అందలం ఎక్కించాలని, విపరీతంగా ధనం సంపాదించాలని, ఆస్తులు కూడబెట్టాలని, నిరంతరం శ్రమిస్తూ ఉండటం, ఎప్పుడో సుఖాలు వస్తాయని ఇప్పుడు వచ్చే సుఖాన్ని కూడా వదులుకొని, నిద్రాహారాలు మాని సంపాదించే ప్రయత్నం చేస్తాడు. ఇది రాజసిక ధృతి. రాజ్యాన్ని ఎలాగైనా దక్కించుకోవాలని దుర్యోధనుడు భీముని చంపాలని ప్రయత్నించాడు. కర్ణునికి అంగ రాజ్యం ఇచ్చి తన వాణ్ణి చేసుకున్నాడు. వారణావతంలో లక్క యింట పాండవులను అగ్నికి ఆహుతి చేయాలనుకున్నాడు. జూదంలో పాండవ సంపదను, రాజ్యాన్ని హరించాడు. ద్రౌపదికి వస్త్రాపహరణం చేయించాడు. ఘోష యాత్రను తలపెట్టాడు. ఉత్తర దక్షిణ గోగ్రహణాలు చేయించాడు. చివరకు కురుక్షేత్రంలో 18 రోజుల యుద్ధం జరిపించాడు. ఇదే రాజసిక ధృతి.

3.కామం :- మానవుడి చిత్తం కోరికల పుట్ట. కోరికలు తీర్చుకుంటున్న కొద్దీ కొత్త కోరికలు పుడుతూ ఉంటాయి. ఈ కోరికలను తీర్చుకొనుటకు తీవ్రమైన పట్టుదలతో ప్రయత్నాలు చేయటమే రాజసిక ధృతి.

రామాయణంలో రావణుడు పులస్త్య బ్రహ్మ మనుమడు. విశ్రావసుపుత్రుడు. కుబేరుని సోదరుడు. వేద వేదాంగాలనభ్యసించిన మహా పండితుడు. రాజనీతి కోవిదుడు. పరిపాలనా దక్షుడు. మహా వీరుడు. అకలంక భక్తుడు. సంగీత శాస్త్ర కోవిదుడు. ఇటువంటి వాడు రంభను బలాత్కరించి శాపగ్రస్తుడయ్యాడు. అనేక మంది స్త్రీలను చెరబట్టాడు. అనేక

మంది భార్యలున్నారు. వేదవతిని పట్టుకోబోయాడు. సీతాదేవిని మోసంతో అపహరించి తెచ్చాడు. ఇది తప్పని తాత చెప్పాడు, సోదరుడు కుంభకర్ణుడు చెప్పాడు. విభీషణుడు చెప్పాడు. భార్య మండోదరి చెప్పింది. కొందరు మంత్రులు చెప్పారు. ఆంజనేయుడు, అంగదుడు చెప్పారు. ఎందరు చెప్పినా వినలేదు. ఇదీ రాజసిక ధృతి అంటే.

ఇలా ధర్మార్థకామాలనే *3* పురుషార్థాల పట్ల విపరీత ఆసక్తితో ప్రయత్నించడమే రాజసిక ధృతి. ఇది మంచిది కాదు. సర్వ నాశనమే గతి.

*-ఇక తామసిక ధృతి ఎలాంటిదో చెప్పబోతున్నారు.*

శ్లో|| యయా స్వప్నం భయం శోకం
విషాదం మదమేవ చ|
న విముంచతి దుర్మేధా
ధృతిః సా పార్థ తామసీ|| *(35)*

తా||పార్థా! స్వప్నం, భయం, శోకం, విషాదం, మదం మొ||న వాటిని ఏ పట్టుదలతో దుర్బుద్ధి గలవాడు వదలకుండా పట్టుకుంటాడో అదే తామసిక ధృతి.

*వ్యాఖ్య:-* పగటి కలలు కనటం, అడుగడుగునా భయపడటం, ఎప్పుడూ దేని కోసమో దుఃఖించటం, దిగులు పడటం, గర్వంతో - మదంతో వ్యవహరించటం, వీటిని వదలకుండా ఉండే ధృతిని తామసిక ధృతి అంటారు. ఈ తామసిక ధృతి గలవారినే 'దుర్మేధా' అంటున్నారు. అంటే మేధస్సు ఉన్నది గాని అది వక్రమార్గంలో - దుష్ట మార్గంలో పని చేస్తున్నది. తప్పుడు పనులు చేయటానికి కూడా తెలివితేటలు కావాలి. ఈ రోజుల్లో మేధావులైన వారే ఎంతో పెద్ద పెద్ద మోసాలు, కుంభకోణాలు

చేస్తున్నారు. ఆర్థిక నేరాలు చేసి తప్పించుకోవాలంటే గొప్ప మేధస్సు, నైపుణ్యం ఉండాలి.

* ఒక రాజు అధికారులందరితో ఒక రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పాటు చేశాడు. అందరూ భోజనాలు చేస్తున్నారు. టేబుల్ మధ్యలో ఒక బంగారు పళ్ళెం, దానిపై ఒక అందమైన నగ ఉన్నది. అంతలో కరెంటు పోయింది, వెంటనే వచ్చింది. నగ మాయం అయింది. రాజు అన్నాడు. మళ్ళీ కరెంటు తీసి, వేసే లోగా ఆ నగ తీసిన వాడు అక్కడ పెట్టేయాలి. లేదంటే తీవ్ర శిక్షకు గురౌతాడు అని కరెంటు ఒక్క క్షణం తీసి వేయించాడు. ఇప్పుడు బంగారు పళ్ళెం మాయం అయింది. ఇదీ మేధస్సును దుష్ట కార్యాలకు వినియోగించుట. అదే "దుర్మేధా" అంటే.

అలాగే దొంగతనాలు, దోపిడీలు చేయాలన్నా, హత్యలు చేసి దొరక్కుండా ఉండాలన్నా ఎంతో నైపుణ్యం, ధైర్యం కావాలి. ఇవన్నీ తెలివితేటలే అయినా చెడు కోసం ఉపయోగిస్తున్నారు.

బ్రహ్మనాయుడి కన్నా నాయకురాలు నాగమ్మ గొప్ప మేధా శక్తి కలిగినదే. అయితే ఆ మేధా శక్తిని సర్వనాశనానికి ఉపయోగించింది. అన్నదమ్ముల మధ్య అనైక్యతను పెంచటానికి, యుద్ధానికి దారి తీసేందుకు ఉపయోగించింది. ఆమె తెలివితేటలు గలిగినదని భావించియే బ్రహ్మనాయుడు విజయం సాధించి కూడా పల్నాటి రాజ్యానికి తిరిగి ఆమెనే ప్రధానిగా నియమించాడు. అందువల్ల మన తెలివితేటలను, మేధా శక్తిని మంచికి వినియోగించాలి. తామసిక ధృతిని రాజసిక ధృతిగా, చివరకు సాత్త్విక ధృతిగా మార్చుకోవాలి. మానవుడు తన జీవిత కాలంలో పరమాత్మ సన్నిధి చేరుకొనుటకే, మోక్షానికే పట్టుబట్టాలి. పట్టిన పట్టును విడువకుండా ఉండాలి.

తామసిక ధృతి గలవాడు ఏ విషయాలలో పట్టుదల కలిగి ఉంటాడో ఈ శ్లోకంలో తెలియజేశారు.

*(i)* వాస్తవంలో జీవించకుండా ఎప్పుడూ ఊహాలోకాలలో ఊరేగటం

*(ii)*వాస్తవం భయంగా ఉండి ఎప్పుడూ భయపడుతూ ఉండటం.

*(iii)* ఎప్పుడూ దుఃఖిస్తూ ఉండటం, చింతలతో విచారంతో ఉండటం.

*(iv)* జరిగిపోయిన వాటిని తలచుకుంటూ దుఃఖించటం, జరగబోయే వాటిని ఊహించుకుంటూ విషాదంలో ఉండటం,

*(v)* తనకు గల ధన సంపదలను చూచి గర్వించటం.

ఇలా ఎల్లప్పుడూ వీటిని వదలకుండా ఉంటే అదే తామసిక ధృతి.

ఇప్పుడీ ప్రకరణాన్ని ముగించబోతున్నాడు భగవానుడు. ఇంతవరకు చెప్పిన విషయాన్ని ఒక్క సారి గుర్తుకు తెచ్చుకుందాం.

అర్జునుడు మోక్షం కొరకు సన్యసించాలనుకున్నాడు. అయితే సన్యాసం అనేది ఎప్పుడు పడితే అప్పుడు అవలంబించేది కాదు. బట్టలు మార్చినట్టు మార్చుకునేది కాదు. నీ లోపల ఒక గొప్ప మార్పు వచ్చిన తర్వాతనే సన్యసించాలని చెప్పటమే భగవానుని ఉద్దేశం. ఏమిటా మార్పు?

మనలో అనేక జన్మల నుండి తెచ్చుకుంటున్న వాసనలున్నాయి. అవి పూర్తిగా క్షయమైతేనే ప్రశాంతత. ప్రశాంతత ఉంటేనే భగవంతునిపై ధ్యాస కుదిరేది. మరి వాసనలు ఎలా క్షయమవుతాయి? శాస్త్రం విధించిన యజ్ఞ దాన తపస్సులను చేస్తేనే వాసనా క్షయం. కర్మలు చేస్తే క్రొత్త వాసనలు చేరుతాయి గదా! అందుకే కర్మతో సంగభావం,

ఫలితంపై ఆసక్తి లేకుండా కర్మ చెయ్యాలి. అదే కర్మ యోగం. అపుడే పాత వాసనలు క్షయం. క్రొత్తవి చేరవు. దాని వల్ల మనస్సు నిర్మలం, శుద్ధం అవుతుంది. కనుక తెలివితో కర్మలు చేయాలి ఎలా?

*(i)* కర్మలను ప్రేరేపించే జ్ఞానం సాత్త్విక జ్ఞానం కావాలి.

*(ii)* చేసే కర్మలు సాత్త్వికమైనవి కావాలి.

*(iii)* కర్మలు చేసేటప్పుడు సాత్త్విక బుద్ధి ఉండాలి.

*(iv)* నిరాటంకంగా కర్మలు పూర్తి చేయాలంటే సాత్త్విక ధృతి ఉండాలి.

*(v)* చేసే కర్త సాత్త్విక కర్త అయి ఉండాలి.

*-ఇలా సాధకుడు సాత్త్విక జ్ఞానంతో ప్రేరేపించబడి, సాత్త్విక బుద్ధిచే పాలించబడి, సాత్త్విక ధృతితో కొనసాగించే వాడై, సాత్త్విక కర్తయై, సాత్త్విక కర్మలను చేస్తే వచ్చే సుఖం కూడా సాత్త్విక సుఖమే అవుతుంది. అందుకే ఇప్పుడు సాత్త్విక, రాజసిక, తామసిక సుఖముల గురించి తెలియజేయబోతూ సుఖం కూడా 3 విధాలని తెలియజేస్తున్నాడు భగవానుడు.*

*శ్లో||* సుఖం త్విదానీం త్రివిధం
శృణు మే భరతర్షభ|
అభ్యాసాద్రమతే యత్ర
దుఃఖాంతం చ నిగచ్ఛతి|| *(36)*

తా||*భరత శ్రేష్టుడా!* ఇప్పుడు *3* విధాలైన సుఖాన్ని గురించి నా ద్వారా విను. అభ్యాసం వల్లనే మానవుడు దుఃఖాన్ని అంతమొందించుకొని సుఖాన్ని పొందగలుగుతాడు.

*వ్యాఖ్య:-* సుఖం కూడా *3* విధాలుగా ఉన్నట్లు చెప్పబోతున్నారు. అంతే గాకుండా దుఃఖాన్ని పూర్తిగా అంతం గావించి, ఆనంద ప్రాప్తిని కలిగించే సుఖం ఎలా వస్తుందో కూడా తెలియజేస్తున్నారు. అదే 'అభ్యాసాత్' - అంటే నిరంతర సాధన వల్లనే ఆత్మ సుఖం - శాశ్వత సుఖం.

ఏ అభ్యాసంతో పని లేకుండా మూడు రోజుల్లో మోక్షాన్నిచ్చే కలియుగ మహాత్ములు తామర తంపరలుగా పుట్టుకొస్తున్నారు. వారి వలలో పడటానికి గొప్ప గొప్ప డిగ్రీలున్న వారు కూడా సిద్ధమౌతున్నారు. కాని భగవానుడు మాత్రం అలా తేలికగా మోక్షాన్నిచ్చే శక్తి లేక 'అభ్యాసాత్' అని చెబుతున్నాడు. శాశ్వత ఆనందాన్ని నీలోనే వెతుక్కోవాలి. నీవే ఆ ఆనంద స్వరూపానివి అని తెలుసుకోవాలి.

ఆనందం మనలోనే ఉన్నదని తెలిసినా మనం మనలోపల వెతకం, బయట ప్రపంచంలోనే వెతుకుతాం. అదే మన దౌర్భాగ్యం.

*ఒక వ్యాపారి యాత్రకు బయలుదేరాడు. దారిలో సత్రాలలో మజిలీలు చేస్తూ ప్రయాణం కొనసాగిస్తున్నాడు. ఇతడి దగ్గర డబ్బు మూట ఉన్నదని ఒక దొంగ కనిపెట్టి ఈయనతో స్నేహం చేస్తూ తానూ వస్తున్నాడు. ఒక రోజు సత్రంలో రాత్రి బసచేసి వ్యాపారి నిద్ర పోతున్నాడు. ఈ దొంగ గదంతా వెతికాడు. అతని సూట్ కేసులో వెతికాడు ఎక్కడా డబ్బు కనిపించలా. మరునాడు ఇద్దరూ మరొక సత్రంలో బస చేశారు. రాత్రి పడుకోబోయే ముందు దొంగ ఈ వ్యాపారితో అంటున్నాడు. మిత్రమా! డబ్బు జాగ్రత్త! దొంగలుంటారు. కొత్త చోటు. మరి డబ్బు ఎక్కడ పెడుతున్నావో జాగ్రత్త! అన్నాడు. దానికా వ్యాపారి అన్నాడు, "అబ్బే! నా డబ్బుకేం ఫరవాలేదు. ఇంతవరకు రాత్రిళ్లు నీ తలగడ క్రిందనే దాస్తూ వస్తున్నాను" అన్నాడు. దొంగ

హతాశుడయ్యాడు. ఇంతకు ముందే ఇతడు దొంగ అని వ్యాపారి కనిపెట్టాడు. అందుకే డబ్బును అతని తలగడ క్రిందనే దాస్తున్నాడు. ఆ దొంగ తన తలగడ క్రింద తప్ప అంతటా వెతుకుతున్నాడు. అందుకే డబ్బు కనిపించటంలేదు. అలాగే మనం మనలో తప్ప అంతటా పరమాత్మను వెతుకుతాం. అలాగాక మనం అంతర్ముఖమై పరమాత్మను మనలోనే చూడాలి. అప్పుడే మనకు నిత్యమైన సుఖం.

*-ముందుగా సాత్త్విక సుఖం ఎలా ఉంటుందో?*

శ్లో|| యత్తదగ్రే విషమివ
పరిణామేzమృతోపమమ్|
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం
ఆత్మబుద్ధిప్రసాదజమ్|| *(37)*

తా|| ఏది ముందు విషంగా తోచి చివరకు అమృతంలాగా ఉంటుందో అదే సాత్త్విక సుఖం. ఆత్మలో నిలిచిన నిర్మల బుద్ధి వల్ల కలిగేది ఈ సుఖం.

*వ్యాఖ్య:-* ఆధ్యాత్మిక సాధనలను అభ్యసించి, బుద్ధిని నిర్మలం గావించి ఆత్మయందు నిలిపినప్పుడు లభించే సుఖం సాత్త్విక సుఖం. ఇది మొదట విషంలాగా తోచి, చివరకు అమృత సమానమవుతుంది. ఎందువల్ల?

ఈ సాధనలు సాధించాలంటే ముందు చాలా కష్టంగా ఉంటుంది. శ్రవణం చేయాలన్నా, మహాత్ములను ఆశ్రయించాలన్నా, వారికి సేవ చేయాలన్నా, శాస్త్ర విషయాలను ఆకళింపు చేసుకోవాలన్నా కష్టంగానే ఉంటుంది. వివేక వైరాగ్యాలను అవలంబించటం మరీ కష్టం. ప్రాపంచిక విషయాల వైపు, భోగాల వైపు పరుగులు తీసే మనస్సును నిరోధించి ఆత్మలో నిలపటం ఇంకా ఇంకా కష్టం. జప ధ్యానాలు, ఇతర సాధనలు చాలా కష్టంగానే ఉంటుంది. అయితే

ఎలాగో కష్టపడి, ప్రయత్నంతో, పట్టుదలతో సాధన సాగిస్తే చివరకు ఎంతో సుఖంగా - అమృతమయంగా ఉంటుంది. ప్రారంభంలోని కష్టాలు విషంలాగా ఉంటాయే గాని విషం కాదు. అందుకే విషమివ- విషంఇవ- విషంలాగా అన్నారు.

*సముద్ర మధనం చేసేటప్పుడు ముందు విషం వచ్చింది. విషం వచ్చిందని ప్రయత్నం మానుకుంటే విషమే మిగిలేది. కాని పట్టుదలతో మధనం సాగించటం వల్లనే అమృతం లభించింది. అలాగే శ్రమకోర్చి సాధన చేస్తే అమృతత్త్వమే - మోక్షమే. దాని నుండి జనన మరణ దుఃఖం తొలగి శాశ్వత ఆనందం లభిస్తుంది.

*అమృతం లభించే ముందు విషం వస్తుంది.

*సాత్త్విక సుఖం లభించే ముందు కొన్ని బాధలను పడాలి.

జన్మజన్మల నుండి సంపాదించుకున్న పాప వాసనలు ఈ క్షేత్రంలో తిష్ట వేసి ఉన్నాయి. ఇప్పుడు ప్రయత్నంతో సాధనల ద్వారా సంపాదించుకున్న పుణ్య వాసనలు ఈ క్షేత్రంలోకి ప్రవేశిస్తున్నాయి. వాటి వాటి స్థానాల కోసం ఈ పాప వాసనలు, పుణ్య వాసనలు పోరాటం చేస్తాయి. అదే కౌరవ పాండవ యుద్ధం. కురుక్షేత్ర యుద్ధం. ఈ యుద్ధంలో క్రొత్తగా వచ్చిన పుణ్య వాసనలు నవ యువకులై పాతవై - ముసలివై పోయిన పాప వాసనలను బయటకు వెళ్ళగొట్టేస్తాయి. ఆ పాప వాసనలు గెలవలేక ఓడిపోయి పోతూ పోతూ ఊరకే ఎందుకు వెళ్లాలా? అని జీవుణ్ణి గిల్లి పోతుంటాయి. ఆ నొప్పియే ఇక్కడ 'విషమివ' అన్నారు. విషంలాగా - బాధగా ఉంటాయి అని. అవి నిజమైన బాధలు కాదు, రాబోయే ఆనందానికి పునాది.

జబ్బు తగ్గాలంటే చేదు మాత్రను వేసుకోవాలి. తప్పదు. దేవాలయంలో విగ్రహంగా ప్రతిష్టించబడి పూజలు అందుకోవాలంటే బండరాయి ముందుగా అనేక సుత్తి దెబ్బలు

తినాలి. పుత్రోదయంతో ఆనందించాలంటే తల్లి ఎంతో ప్రసవ వేదనను అనుభవించాలి.

అందమైన కిరీటంగా తయారై భగవంతుని నెత్తి మీద కూర్చోవాలంటే బంగారం స్వర్ణకారుని చేతిలో ఎన్నో దెబ్బలు తినాలి, కొలిమిలో కాలాలి, ఎంతో రంపపు కోత అనుభవించాలి.

కనుక ఎన్నో బాధలు ఓర్చుకుంటే తప్ప సుఖం అనేది కలగదు.

గొప్ప సుఖం కోసం అల్ప సుఖాలను త్యాగం చెయ్యాలి. అప్పుడే అమృతత్వం, శాశ్వత ఆనందం. ఎలా లభిస్తుంది ఈ సుఖం?

ఆత్మ బుద్ధి ప్రసాదజం :- నిర్మలమైన బుద్ధి ఆత్మలో నిలవటం వల్ల. మనం ఆత్మయే. ఆనంద స్వరూపమే. మరి ఆనందం ఎందుకు అనుభవానికి రావటం లేదు? కలుషిత బుద్ధి వల్లనే. సూర్య కాంతి ప్రకాశవంతమైనదే. కాని మన కిటికీ అద్దం మట్టితో- దుమ్ముతో మలినమై ఉంది. అందుకే ప్రకాశం లేదు. అలాగే సుఖం మనలోనే ఉంది. కాని బుద్ధి కల్మషంగా ఉండటం వల్ల ఆనందం అనుభూతికి రావడం లేదు. కనుక బుద్ధిని శుద్ధం చేసుకోవాలి. అప్పుడే సుఖం.

*-రాజసిక సుఖం ఎలాంటిదో చెప్పబోతున్నారు.*

శ్లో|| విషయేంద్రియసంయోగాత్
యత్తదగ్రేzమృతోపమమ్|
పరిణామే విషమివ
తత్సుఖం రాజసం స్మృతమ్|| (38)

తా||విషయాలతో ఇంద్రియాలు సంబంధం పెట్టుకోవటం వల్ల మొదట అమృతంలాగా ఉండి చివరకు విషంలాగా

తయారయ్యే సుఖం ఏది గలదో అది రాజసిక సుఖం అనబడుతుంది.

*వ్యాఖ్య:-* మొదట అమృతంలాగా ఉండి చివరకు విషంలాగా అయ్యేది రాజసిక సుఖం. మేడి పండు చూడ మేలిమై ఉండును పొట్ట విప్పి చూడ పురుగులుండు అన్నట్లు ఉండేది ఈ రాజసిక సుఖం.

ఈ రాజసిక సుఖం ఎలా వస్తుంది?

విషయేంద్రియ సంయోగాత్ :- శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాలనే విషయాలతో శ్రోత్ర,త్వక్, చక్షు, రసన, ఘ్రాణ అనే జ్ఞానేంద్రియాలు సంబంధం పెట్టుకున్నప్పుడు వచ్చే సుఖం రాజసిక సుఖం.

*మనకు ఎంతో ఇష్టమైన స్వీటు తింటే ఆనందంగా ఉంటుంది. అవి బాగున్నవని అదే పనిగా తింటే ఆరోగ్యం చెడిపోతుంది.

*పేకాట ఆడేవారిని చూచి మనమూ ఆడదామని ప్రారంభించాడు. బాగా కలిసివస్తున్నది. ఎంతో సంతోషం. ఇక ఓడిపోవటం ప్రారంభమైంది. వచ్చిన డబ్బు పోయింది. తీరని దుఃఖం.

ఇలాగే అన్ని ప్రాపంచిక విషయాలు ముందు సుఖంగా ఉంటాయి. క్రమక్రమంగా అవే దుఃఖాలను మిగిల్చి పోతాయి.

విషయ సుఖాలు ఎలా ఉంటాయో చెప్పటానికి ఒక మొరటు సామెత ఉంది. "తీట గల భాగ్యశాలికి వాడిగోళ్ళు, వేడి నీళ్ళు ఉంటే చాలు, వాడు స్వర్గానికి ఒక బారెడు పైనే ఉంటాడట. గోకేటప్పుడు ఆ సుఖం వర్ణనాతీతం. ఇక ఆ తర్వాత చూడాలి వాడి గతి. విషయ సుఖాలన్నీ ఇలాగే ఉంటాయి. విషయ వస్తువుల సంయోగంతో ఎంత సుఖమో వియోగంలో అంతకు పదింతలు దుఃఖం.

విషయ వస్తువులు మొదట అమృతంలాగా ఉండి చివరకు విషంలాగా ఎందుకుంటున్నాయి? విషయ వస్తువుల ద్వారా వచ్చే సుఖం అమృతంలాగా ఉన్నా ఆ అమృతంలో విష బీజాలు ఉంటాయి. వాటిని మనం గమనించం అంతే.

*చేపను పట్టటానికి ఎర వేస్తాడు. ఆ ఎర లోపల గాలం ఉన్న సంగతి చేపకు తెలియదు. చేప ఎర మీది ఆశతో ఎగిరి గాలానికి తగులుకుంటుంది.

అలాగే మనం విషయ వస్తువుల ద్వారా కలిగే సుఖాన్ని తలచుకుంటామే గాని వాటిలోని దుఃఖబీజాలను చూడం. సుఖం కోసం పరిగెడతాం, అందుకుంటాం, ఆనందిస్తాం, తరువాత మిగిలేది దుఃఖమే.

విషయాల ద్వారా వచ్చే సుఖం బలాన్ని, వీర్యాన్ని, రూపాన్ని, ప్రజ్ఞను, ప్రతిష్టను, గౌరవాన్ని, ధనాన్ని, ఉత్సాహాన్ని నిర్మూలిస్తుంది. నిజానికి ఇది భోగం కాదు. భవరోగం. దాన్ని నమ్ముకొని మానవ జీవితాన్ని నాశనం చేసుకోవటం ఎలా ఉంటుందంటే -"మతి చెడి రేగు బండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు" - ముత్యాలు పోసి రేగు పండ్లు కొనుక్కున్నట్లుంటుంది. విషయ సుఖాల కోసం ఆత్మ సుఖాన్ని వదులుకోవటం ఎంత బాధాకరం? మహతీ వినష్టిః. గొప్ప నష్టం తస్మాత్ జాగ్రత్త.

*-తామసిక సుఖం ఎలాంటిదో చెబుతున్నారు.*

శ్లో|| యదగ్రే చానుబంధే చ
సుఖం మోహనమాత్మనః|
నిద్రాలస్యప్రమాదోత్థం
తత్తామసముదాహృతమ్|| *(39)*

తా||నిద్ర, సోమరితనం, అజాగ్రత్త వల్ల పుట్టిన ఏ సుఖం ప్రారంభం నుండి చివరి వరకు తనను భ్రాంతిలో పడ వేస్తుందో ఆ సుఖం తామసం అని చెప్పబడుతుంది.

*వ్యాఖ్య:-* తామస సుఖం నిజంగా సుఖం కాదు. సుఖాభాసం. సుఖంలాగా అనిపిస్తుందే తప్ప నిజమైన సుఖం కాదు. నిద్ర, సోమరితనం, అజాగ్రత్త వల్ల పుట్టే సుఖం బుద్ధిని మందగింపజేస్తుంది.

*1.* నిద్ర *:-* నిద్ర సుఖమే. కాని పరిమితి దాటితే సోమరితనం అవుతుంది. బుద్ధిని మందగింపజేస్తుంది. వాడికి నిద్రే స్వర్గం. నిద్రే సర్వస్వమౌతుంది.

*2.*సోమరితనం *:-* ఏ పనీ పాటా లేకుండా కదలకుండా పడి ఉండటం వల్ల ఇహ పరాలు రెంటికీ దూరమౌతాడు. కర్తవ్య నిర్వహణకు అవకాశం ఉండదు.

*3.* అజాగ్రత్త *:-* దీనినే ఏమరుపాటు అంటారు. ఈ మూడు లక్షణాలు సుఖం అనిపిస్తాయే గాని నిజమైన సుఖం ఉండదు. వీరిదంతా మోహం, అజ్ఞానం.

ఈ నిద్ర, సోమరితనాలతో జీవితాన్ని గడిపేవారు తెలివితేటలు నశించి, బుద్ధి మందగించి, కర్తవ్య విమూఢులై, ఏమరుపాటుగా ఉంటూ వ్యర్ధ జీవితాన్ని గడుపుతారు. దీనినే తామసిక సుఖం అన్నారు.

విషయ ప్రపంచంలో దొరికే సుఖాలన్నీ ఆభాస సుఖాలే. నిజమైన సుఖం నీలోనే ఉన్నది. అదే ఆత్మ సుఖం. ప్రాపంచిక విషయ సుఖాలే నిజమైన సుఖాలని భ్రమ పడి మానవుడు వాటి వెంట పడుతూ ఆత్మ సుఖాన్ని జారవిడుచుకుంటున్నాడు.

*ఒక కుక్క మాంసపు ముక్కను నోట గరచుకొని ఒక వంతెన మీదుగా వెళుతున్నది. అలా వెళుతూ వెళుతూ క్రిందనున్న

నీటిలోనికి చూచింది. అక్కడ నీటిలో ఒక కుక్క మాంసపు ఖండాన్ని నోట కరచుకొని వెళుతూ కనిపించింది. ఎలాగైనా ఆ మాంసపు ముక్కను తానే పొందాలనే దురాశతో నీటిలోని కుక్కను అదిలించటానికి భౌ భౌ అన్నది. అంతే దీని నోటిలోని మాంసపు ముక్క జారి నీటిలో పడిపోయింది.

ఇలాగే మానవుడు బయట విషయ వస్తువులలో లభించే ఆభాస సుఖం కోసం ఆత్మ సుఖాన్ని జారవిడుచుకుంటున్నాడు. కనుక రాజస, తామస సుఖాలకోసం పరుగులు తీయకుండా సాత్త్విక సుఖాన్ని పొందటానికి ప్రయత్నించాలి.

*-ఇక ఈ చర్చను ముగించబోతున్నాడు భగవానుడు. ఈ 3 గుణాలు లేని ప్రాణి విశ్వంలో ఏ ఒక్కటీ ఉండదు. అందుకే 3 గుణాలను విభాగించి చెప్పటం జరిగింది. ఈ 3 గుణాలను వదిలించుకోవటం మానవులకు మాత్రమే సాధ్యం. అందుకే ఆ ఉపాయాన్ని భగవానుడు తెలియజేయాలనుకుంటున్నాడు.*

శ్లో|| న తదస్తి పృథివ్యాం వా
దివి దేవేషు వా పునః|
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం
యదేభిః స్యాత్త్రిభిర్గుణైః|| (40)

తా||ప్రకృతి నుండి పుట్టిన ఈ మూడు గుణాల నుండి విడిపోయిన ప్రాణి భూమి మీద కాని, స్వర్గంలో కాని, దేవతలలో గాని ఏదీ లేనేలేదు.

*వ్యాఖ్య:-* ఈ ప్రపంచంలో మనం అనేక మందిని చూస్తుంటాం. ఒకరి రూపం మరొకరికి లేదు. ఒకరి గుణం మరొకరికి లేదు. ఒకరి బుద్ధి మరొకరికి లేదు. ఒకరి ఆలోచనా విధానం మరొకరికి లేదు. ఒకరి నడవడి మరొకరికి లేదు. ఇలా వైవిధ్యం ఉండటానికి కారణం ఏమిటి? మనలోని త్రి గుణాలే కారణం. ఈ త్రి గుణాలు లేకుండా ఏ ప్రాణి లేదు. భూమి మీద గాని స్వర్గంలో గాని, పాతాళంలో గాని, దేవతలలో గాని ప్రతి ప్రాణీ త్రి గుణాలతోనే ఉంది. ఇలా అందరూ త్రిగుణాలతోనే ఉండటానికి కారణం ఏమిటి?

ఈ విశ్వంలోని సమస్త ప్రాణికోటి ఎలా ఆవిర్భవించింది?- పరమాత్మ ప్రకృతిల సమ్మేళనంతో. పరమాత్మ పురుషుడు. ప్రకృతి లేదా మాయ స్త్రీ. ఈ స్త్రీ పురుషుల కలయిక వల్లనే యావత్ సృష్టి. పరమాత్మ గుణ రహితుడు. ఆయనకు ఏ గుణమూ లేదు. కాని ప్రకృతి లేదా మాయ త్రిగుణాత్మకం. అంటే 3 గుణాలతో ఉన్నదే మాయ. మరి పుట్టిన ప్రాణులన్నీ తల్లిచాలు బిడ్డలే. అంటే అందరికీ ఈ త్రిగుణాలున్నాయి. కాకపోతే ఈ త్రిగుణాల పాలు మాత్రం ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధంగా ఉంటాయి.

ఈ త్రిగుణాలతో ఉన్న మానవులు ఇక్కడ సుఖ దుఃఖాలు అనుభవిస్తూ జనన మరణ సంసార చక్రంలో ఇరుక్కుపోతూ ఉన్నారు. దీని నుండి బయట పడి మోక్షాన్ని పొందాలంటే త్రిగుణాతీతులం కావాలి. నిజంగా ఈ 3 గుణాలను దాటే శక్తి కేవలం మానవులకు మాత్రమే ఉంది. దేవతలకు గాని, జంతువులకు గాని ఆ అవకాశం లేదు.

మరి ఏ విధంగా మానవులు ఈ త్రిగుణాలను అధిగమించి, గుణాతీతులు, జీవన్ముక్తులు అవుతారు? మనం జాగ్రత్తగా తెలుసుకోవలసిన విషయం ఇదే. ఎందుకంటే

త్రిగుణాలతో ఉన్న జీవుడు ఈ త్రిగుణాలను అధిగమించి గుణాతీతుడైతే అతడు పరమాత్మే. పర బ్రహ్మమే. జీవన్ముక్తుడే. ఎందుకంటే పరమాత్మ గుణ రహితుడు. ఈ జీవుడు గుణాతీతుడు. పరమాత్మకు గుణాలు ఎప్పడూ లేవు. జీవుడేమో ఉన్న *3* గుణాలను వదిలించుకొని గుణాతీతుడయ్యాడు. అంటే గుణాలు లేని వాడే అయ్యాడు. గుణాలు లేని వాడు పరమాత్మే కదా! ఇట్టి స్థితిని సాధించాలి. మరేమిటి ఉపాయం?-

ముందు మనను మనం శోధించుకోవాలి. మనలో ఏ గుణాలు ప్రబలంగా ఉన్నాయో, ఏ గుణాలు తక్కువ బలంతో ఉన్నాయో జాగ్రత్తగా ఆత్మ శోధన చేసుకోవాలి. అలా చేసుకోవాలంటే -

మన జ్ఞానం ఎలాంటిది? సాత్త్విక జ్ఞానమా? రాజసిక జ్ఞానమా? తామసిక జ్ఞానమా? అలాగే మనం చేసే కర్మలు ఎలాంటివి? మన ఆలోచనలు ఎలాంటివి? మన బుద్ధి ఎలాంటి నిష్టను కలిగి ఉన్నది? మన ధృతి ఏ విషయాలలో ఉంటున్నది? వీటిని బాగా పరిశీలించి, పరిశోధించి, విశ్లేషించి తెలుసుకోవాలి.

ఇలా మనను మనం పరిశీలించుకొని చూస్తే మనలో ఏ గుణాలు- అంటే సాత్త్విక, రాజసిక, తామసిక గుణాలలో ఏవి ప్రబలంగా ఉన్నాయో తెలుస్తుంది. ఇలా మనం తెలుసుకున్నప్పుడు మనం సాధనల ద్వారా- చేసే కర్మల ద్వారా రాజసిక తామసిక గుణాలను అధిగమించి సాత్త్విక స్థితిని అందుకొనుటకు పాటు పడతాం, ప్రయత్నిస్తాం. అది కూడా మనం మోక్షాన్ని కోరుకున్నవాళ్ళమైతేనే. తీవ్ర ముముక్షుత్వం ఉన్న వాళ్ళు తీవ్ర ప్రయత్నం చేస్తారు. అలా తీవ్ర ప్రయత్నంతోనే ఈ తామసిక, రాజసిక గుణాలను అధిగమించటం సాధ్యపడుతుంది. ఇలా మనను మనం తీర్చిదిద్దుకొనుటకే ఈ

గుణ సంపదను ఉపయోగించుకోవాలి గాని ఇతరులను విమర్శించటానికో, ఎగతాళి చేయటానికో కాదు. ఒక్కొక్కరిలో ఉండే ఈ గుణాల నిష్పత్తిని బట్టి, హెచ్చుతగ్గులను బట్టి వారి వారి వ్యక్తిత్వాలు తయారవుతాయి.

పాలు, పంచదార, కాఫీపొడి- ఈ మూడింటితో కాఫీ తయారవుతుంది. వాటి పాళ్ళలో భేదాలను బట్టి ఎన్ని రుచులుగానో తయారవుతుంది. అన్ని కప్పుల్లోనూ ఉన్నది కాఫీయే అయినా ఒకటి తీపి, ఒకటి చేదు, ఒకటి చప్పన, ఒకటి మరీ తీపి.....ఇలా ఎన్నో- ఎన్నెన్నో రుచులు. ఏది ఎక్కువ వేస్తే దాని గుణం అధికంగా కనిపిస్తుంది. ఒకటి ఎక్కువైతే మిగిలిన రెండు తగ్గినట్లే.

అలాగే సత్త్వం పాలు ఎక్కువగా ఉంటే రజో తమో గుణాలు తక్కువ గాను, రజో గుణం పాలు ఎక్కువగా ఉంటే సత్త్వ తమో గుణాలు తక్కువగానూ... ఇలా ఉంటాయి.

ఇలా గుణ విచారణకు ఇంత వరకు మార్గాన్ని చూపిన భగవానుడు ఆచరణకు నాంది వాచకం పలుకుతున్నాడు. ఆచరణ గురించి చెబితేనే విచారణ సార్థకం అవుతుంది. విచారణ చేస్తేనే ఆచరణకు వీలు కలుగుతుంది.

కనుక మనను మనం ఆంతరంగికంగా పరిశోధన చేసుకోవాలి. విచారణ చేసుకోవాలి. విశ్లేషణ చేసుకోవాలి. అధమమైన తామస ప్రవృత్తిని, రాజసిక ప్రవృత్తిని తొలగించుకుంటూ సాత్త్విక స్థితిని చేరటానికి ప్రయత్నించాలి. ఈ సాత్త్విక స్థితిని పొందితేనే ఆత్మానుభూతికి అవకాశం. దీనిని సాధించటం ఎలాగో ఇక ముందు తెలియజేయబోతున్నారు.

-మనలోని గుణాలను వదిలించుకొని త్రిగుణాతీతులమై మోక్షాన్ని పొందటానికి ఉపాయంగా వర్ణ విభాగాన్ని భగవానుడు తెలియజేస్తున్నాడు.

ఈ త్రిగుణాలనే కొలబద్దను తీసుకొని భగవానుడు సమస్త మానవ జాతిని నాలుగు వర్ణాలుగా విభాగించాడు. వారి వారి గుణాలు ఏ ఏ నిష్పత్తులలో ఉన్నాయో, వాటి కారణంగా వారు ఎలాంటి కర్మలు చేస్తున్నారో దానిని బట్టి వర్ణాలను ఏర్పరచారు. అందుకే "చాతుర్వర్ణ్యం మయా స్పష్టం గుణ కర్మ విభాగశః" అన్నారు. గుణాలను బట్టి, చేసే కర్మలను బట్టి వర్ణాలే గాని, జన్మను బట్టి వర్ణం కాదు. ఈ వర్ణ విభాగం కేవలం భారతదేశంలోనే కాదు. ఇది విశ్వవ్యాప్తం. పేర్లు ఏవి పెట్టుకున్నా అన్ని దేశాలలోని వారికీ ఈ వర్ణ విభజన ఉన్నది. ప్రతి దేశంలోను కులాలు ఎన్నైనా ఉండవచ్చు. కాని వర్ణాలు మాత్రం నాలుగే నాలుగు. కులం జన్మతో వచ్చేది. వర్ణం గుణాలను బట్టి నిర్ణయమయ్యేది. కులం మారేది కాదు. ఏదో బలహీనతతోనో, బలప్రయోగంతోనో, తాత్కాలిక ప్రయోజనాలకు ఆశపడో, అజ్ఞానం వల్లనో, అమాయకత్వం వల్లనో, అతి తెలివి వల్లనో కొందరు మార్చుకుంటే మార్చుకోవచ్చు. అంతే తప్ప కులం అనేది మారకుండా స్థిరంగా ఉండేది. అయితే వర్ణం మాత్రం గుణాన్ని బట్టి మారిపోతూ ఉంటుంది. కులాలనే వర్ణాలుగా అపోహ పడి కొందరు చెడిపోతున్నారు, కొందరు సమాజాన్ని చెడగొడుతున్నారు, కొందరు కొట్టుకు చస్తున్నారు. కాని వర్ణాలు కొట్టుకు చావటానికి గాదు. తరించటానికి మాత్రమే. వర్ణాలు నాలుగూ ఏ ప్రాతిపదికన విభాగించబడ్డాయో చూద్దాం.

*1. బ్రాహ్మణులు :-* సత్త్వ గుణం ప్రధానంగా ఉండి, *2 -3* స్థానాల్లో రజో గుణ తమో గుణాలు ఉంటే ఆ వర్ణం బ్రాహ్మణ వర్ణం. నిర్మాణాత్మకంగా ఆలోచించేవారు, లోక కళ్యాణం గురించి ఆలోచించే మేధావి వర్గం ఈ వర్ణం వారు. సైంటిస్టులు, విద్యావేత్తలు, పరిశోధకులు మొ//వారు.

2. క్షత్రియులు :-రజోగుణం ప్రధానంగా ఉండి, 2- 3 స్థానాలలో సత్వ తమో గుణాలు ఉంటే వారు క్షత్రియ వర్ణానికి చెందినవారు. రాజ్యపాలన చేసే రాజులు, రాజకీయ నాయకులు, దేశ రక్షణలో ఉండే సైనికులు, రక్షక భటులు, ప్రజలకు న్యాయం చేసే వారు, రక్షించేవారు ఈ వర్ణం వారే.

3. వైశ్యులు :-రజో గుణం ప్రధానంగా ఉండి, 2-3 స్థానాలలో తమో గుణ, సత్త్వ గుణాలు ఉన్న వారు వైశ్య వర్ణానికి చెందినవారు. వ్యాపారం వ్యవసాయం, పరిశ్రమలు పశు సంరక్షణ మొ//న వాటిలో ఉండేవారు వైశ్యులు.

4. శూద్రులు :- తమో గుణం ప్రధానంగా ఉండి, 2-3 స్థానాల్లో రజో గుణ, సత్వగుణాలున్న వారు. అన్ని వృత్తుల్లోను, అన్ని సంస్థలలోను ఉండే కార్మికులు, చేతి వృత్తుల వారు.

ఈ పేర్లే అన్ని దేశాలలోను ఉండవు. ఎక్కడైనా మేధావి వర్గం, రక్షక వర్గం, వణిక్ వర్గం, కార్మిక వర్గం అనే పేర్లతో ఉండవచ్చు.

అర్జునుడు క్షత్రియుడు. రాజసిక ప్రవృత్తి ప్రధానం. కనుక ధర్మం కోసం యుద్ధం చేయాల్సిందే. అడవులకు వెళ్ళి తపస్సు చేసుకోవటం కుదరదు. తన ఆంతరిక ప్రవృత్తిని రాజసం నుండి సాత్త్వికానికి మార్చుకోవాలి. అలా మార్చుకొనేందుకు అంది వచ్చిన అవకాశాలను వినియోగించుకోవాలి. ఈ కర్మల ద్వారానే సాత్త్విక గుణాన్ని పెంచుకొని సన్యాసానికి అర్హత సాధించాలి.

*- వర్ణ వ్యవస్థ ఏ ప్రాతి పదికన ఏర్పడిందో, మానవుని స్వభావం, స్వధర్మం ఈ శ్లోకంలో చక్కగా వివరించబడ్డాయి.*

**శ్లో|| బ్రాహ్మణక్షత్రియవిశాం**
**శూద్రాణాం చ పరంతప|**
**కర్మాణి ప్రవిభక్తాని**
**స్వభావప్రభవైర్గుణైః|| *(41)***

**తా||పరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే వర్ణాలు వారి వారి కర్మలను బట్టి, వారి వారి స్వభావాల వల్ల పుట్టిన గుణాలను బట్టి విభాగించబడినవి.**

***వ్యాఖ్య:-*** **ఇంతవరకు కర్మకాండను పూర్తి చేసి ఆచార కాండను ప్రారంభిస్తున్నారు. ఆచారం లేని విచారం కుంటిది. విచారం లేని ఆచారం గ్రుడ్డిది. నాలుగు వర్ణాల వారు చేయవలసిన కర్మలు ఏ ప్రాతిపదికన విభాగించారు? వారి వారి స్వభావాలను బట్టి. స్వభావం ఎలా వచ్చింది? గుణాలను బట్టి.**

**ఎవరిలో ఏ గుణం అధికంగా ఉంటే వారు ఆ స్వభావం గల వారవుతారు. ఆ స్వభావానికి తగిన కర్మ చేస్తారు. దానిని బట్టే వర్ణం నిర్ణయమవుతుంది. సత్త్వ గుణం అధికంగా ఉంటే స్వార్ధం కోసం కాకుండా లోక కళ్యాణం కోసం శ్రమిస్తాడు. విద్యార్జన చేస్తాడు. అందరిచే గౌరవించబడతాడు. కనుక కులంతో సంబంధం లేకుండా వర్ణం ఉంటుంది. శూద్ర కులంలో పుట్టిన వాడు బ్రాహ్మణుడు కావచ్చు. బ్రాహ్మణ కులంలో పట్టిన వాడు వైశ్యుడు కావచ్చు. అలా అవుతుంటారు కూడా.**

బ్రాహ్మణ కులంలో పుట్టిన వాడు వేద వేదాంగాలను అభ్యసించి, పురోహితుడుగా ఉంటూ, సంపాదన మీద దృష్టి లేకుండా దైవ కార్యాలలోను, ధర్మ కార్యాలలోను ఉంటూ అందరి మేలును కోరుతూ ఉంటే అతడి వర్ణం బ్రాహ్మణుడే.

ఇది అంత ప్రయోజనకరంగా లేదని రాజకీయాలలో ప్రవేశించి, పదవులను సంపాదించి, పదిమందికీ మేలు చేయాలనుకుంటే అతడు క్షత్రియుడౌతాడు. పౌరోహిత్యం కలిసి రాలేదని వ్యాపారం ప్రారంభిస్తే వైశ్యుడవుతాడు. అలాగాక ఏదైనా వృత్తిని ఆశ్రయిస్తే, లేదా ఎక్కడైనా గుమస్తాగా చేరితే శూద్రుడవుతాడు.

కనుక వర్ణం పుట్టుకతో వచ్చేది కాదు. స్థిరంగా ఉండేది కాదు. కర్మలలో ఎక్కువ తక్కువలు లేవు. అలాగే వర్ణాలలో ఎక్కువ తక్కువలు లేవు.

అర్జునుడు యుద్ధం చేయకుండా తపస్సు చేద్దామనుకున్నాడు, కాని భగవానుడు అంగీకరించలేదు. యుద్ధ కర్మ ద్వారానే నిన్ను నీవు సరిచేసుకోవాలి – అని నిష్కామ కర్మ యోగాన్ని బోధించాడు.

బ్రాహ్మణునికి విధించబడిన కర్మల ద్వారా బ్రాహ్మణుడు పొందే ముక్తిని శూద్రుడు కూడా తనకు విధించబడిన కర్మల ద్వారా పొందవచ్చు.

ధర్మ వ్యాధుడు బోయవాడు. మాంసం అమ్మి జీవించేవాడు. అయినా అతడు బ్రాహ్మణుడే. బ్రాహ్మణుడైన కౌశికునికి గురువయ్యాడు.

*పాకీ గంపను నెత్తిన పెట్టుకొని రాజును దర్శించాలని వెళితే గేటు దగ్గరున్న సేవకులు బయటకు నెట్టి వేస్తారు. అలాగే త్రిగుణాలతో కూడిన వాసనల గంపను నెత్తిన పెట్టుకున్నంత కాలం భగవద్దర్శనం అసాధ్యం.

అందుకే చర్మ దృష్టి గల వాడిని ఛండాలుడని; బ్రహ్మ దృష్టి గల వాడిని బ్రాహ్మణుడని అన్నారు. కనుక ఎట్టి కర్మలు చేస్తున్నా బ్రహ్మ దృష్టితో ఉండమని భగవద్గీత చెబుతున్నది. ఎవరు ఏ కర్మలు చేయాలో భగవద్గీత చెప్పదు. కర్మలను ఎలా చేయాలో చెబుతుంది. కర్మలన్నీ భగవంతుని దృష్టిలో, భగవద్గీత దృష్టిలో భగవంతుని పూజా పుష్పాలే.

ఒక కుర్చీ తయారు చేయాలంటే అనేక చక్క ముక్కలను మేకులతో కలిపి ఉంచాలి. ఒక మేకుకు బాధ వేసింది. ఎవ్వరూ నన్ను పట్టించుకోవటం లేదు. అందరూ వచ్చి ఆహా! కుర్చీ ఎంత బాగుంది; సీటు ఎంత పటిష్టంగా ఉంది! అంటున్నారే గానీ ఆహా! ఈ చిన్న మేకులు ఎంత చక్కగా ఈ కుర్చీని నిలబెట్టి ఉంచుతున్నాయి అని అనటం లేదు- అని దాని బాధ. ఒకనాడు అన్ని మేకులతో సమావేశం వేసి "మనలను ఎవరూ పట్టించుకోవడం లేదు, అందరం ఈ కుర్చీ నుంచి తప్పు కుందాం, మన విలువ ఏమిటో అప్పుడు తెలిసి వస్తుంది" అని చెప్పింది. అలాగే అని అన్ని మేకులు జారి క్రింద పడిపోయాయి. దానితో కుర్చీ కాస్తా ముక్కలు ముక్కలుగా మిగిలిపోయింది. తెల్లవారి వడ్రంగి వచ్చి చూచాడు. ఒక్కొక్క మేకును తీసుకొని సుత్తితో నెత్తిమీద కొట్టి బిగించాడు. అంతే. అంతా నా మీదనే ఆధార పడి ఉన్నదని గర్విస్తే మొట్టి కాయలు తప్పవు.

సమాజంలో ప్రతీ వాడికీ ఒక స్థానం ఉంటుంది. ఎవరి పని వారు చేయాలి. ఎవ్వరూ స్థాన భ్రష్టులు కావాల్సిన అవసరం లేదు. ఉన్న చోటునే ఉండి ఉన్నతిని పొందవచ్చు. నేను పాకీ పని ఎందుకు చేయాలి? దేశాన్ని పాలిస్తాను అని అందరూ అనుకుంటే దేశమంతా కంపు కొడుతుంది. సమాజంలో ఏ పని చేసే వారైనా ఒక్కటే. అన్ని పనులు

గౌరవమైనవే. ఎవరినీ చిన్న చూపు చూడకూడదు. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే భావన ఉండకూడదు. అలాంటి వివాదం పెట్టుకుంటే సమిష్టి వస్తువుకు ద్రోహం జరుగుతుంది.

చేతి వ్రేళ్ళు అయిదూ ఒక రకంగా ఉండవు. నేను గొప్ప అంటే నేను గొప్ప అని తగవులాడుకున్నాయి. నేను అందరికన్నా లావు. అందరికన్నా వేరుగా ఉన్నా. కనుక నేను లీడరును అన్నది బొటన వ్రేలు. దేనిని చూపాలన్నా చూపేది నేనే. చిన్ముద్ర వేయాలంటే నా అవసరం ఉన్నది అన్నది చూపుడు వ్రేలు. ఇన్ని మాటలెందుకు నిలబడితే ఎవరు గొప్పో తెలుస్తుంది అన్నది మధ్య వ్రేలు. పొడవుగా ఉంటే సరా! అందం ఉండొద్దూ. కిరీటం పెట్టుకున్న వాడే రాజు. ఉంగరం పెట్టుకునేది, పవిత్రం ధరించేది నేనే అన్నది ఉంగరం వ్రేలు. మంచి పనులకు ముందున్న వాడే గొప్ప, నమస్కారం చేసేటప్పుడు భగవంతునికి ముందుండేది నేనే గదా! అన్నది చిటికిన వ్రేలు.

అందరూ పెద్దలే. అందరూ గొప్పే. ఎవరి స్థానంలో వారు గొప్ప. ఎవరు లేకపోయినా సమిష్టి వస్తువుకు ఇబ్బందే. అలాగే అన్ని వర్ణాలు సమాజానికి అవసరమే. అంతా మూల స్థంబాలే. ఏ స్థంబాన్ని పడేసినా సమాజమనే కప్పు కూలిపోతుంది. కనుక పరస్పర ద్వేషం పనికి రాదు. అహంకారం గాని న్యూనత గాని పనికి రాదు. నేను గొప్పంటే నేను గొప్ప అని గొప్పలు చెప్పుకోవటం గాక నేను ఎలా తరించాలి? అని ఆలోచన చేయాలి.

*- వర్ణం అంటే పొర అని అర్థం. అదే వాసనల తెర. జీవుడికీ దేవుడికీ మధ్య నున్న తెర. ఈ తెర అడ్డు తొలగితేనే జీవుడు దేవుడయ్యేది. ఎలా తొలగుతుంది ఈ వాసనల పొర? ఏ వర్ణం వారు ఏ కర్మలను చేస్తే ఈ వాసనల తెర చినిగి పోతుందో రాబోయే మూడు శ్లోకాల్లో తెలియజేస్తున్నారు. ముందుగా బ్రాహ్మణులకు విధించిన కర్మలను చెబుతున్నారు. ఈ శ్లోకంలో...*

**శ్లో|| శమో దమస్తపః శౌచం**
**క్షాంతిరార్జవమేవ చ|**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం**
**బ్రహ్మకర్మ స్వభావజమ్|| *(42)***

**తా||శమం, దమం, తపస్సు, శౌచం, ఓర్పు, నిజాయితీ, జ్ఞాన విజ్ఞానాలు, ఆస్తిక్యభావన- ఇవి బ్రాహ్మణుల స్వభావ సిద్ధ కర్మలు.**

***వ్యాఖ్య:-*** **వర్ణం అనేది గుణాలను బట్టి నిర్ణయమౌతుంది. ఏ వర్ణం వారు ఏ కర్మను చేస్తే ఈ వాసనల పొర - జీవుడికి దేవుడికి మధ్య నున్న తెర చినిగిపోతుందో ఆ కర్మయే ఆ వర్ణం యొక్క ధర్మం, ఆ వర్ణం వారి యొక్క స్వభావ సిద్ధ కర్మలు అవుతాయి.**

**బ్రాహ్మణ వర్ణం వారి స్వభావ సిద్ధ కర్మలను తొమ్మిదింటిని ఇక్కడ చెబుతున్నారు. అవి :-**

***1.శమం :-*** **శమం అంటే మనో నిగ్రహం. కోతిలాగా మనస్సు చంచలమైనది. ఒక విషయం మీద స్థిరంగా ఉండదు. భగవంతుని సేవలో, భగవంతుని స్మరణలో, భగవంతుని**

ధ్యానంలో మనస్సునుంచితే ఆ మనస్సు స్వాధీనంలో ఉంటుంది. బ్రాహ్మణుడు 'శమం' తో ఉండాలి.

*2. దమం :-* దమం అంటే ఇంద్రియ నిగ్రహం. ఇంద్రియాలు గుర్రాల వంటివి. అవి మన స్వాధీనంలో ఉండాలి గాని వాటి చెప్పు చేతల్లో మనం ఉండరాదు. బ్రాహ్మణుడు ఇంద్రియాలను తన స్వాధీనంలో ఉంచుకోవాలి. వాటిని తనకు అనుకూలంగా వినియోగించుకోవాలి. పచ్చ గడ్డి కనిపిస్తే పరిగెత్తటం పశు లక్షణం. వెనుకా ముందు ఆలోచించటం మనిషి లక్షణం.

దమం తిరగేస్తే మదం. దమం మోక్షానికి దారి తీస్తుంది. మదం బంధానికి దారి తీస్తుంది. అరణ్యాలలో సింహం దమ ప్రాణి. సంవత్సరానికి ఒక్క సారే రతి సౌఖ్యం అనుభవిస్తుంది. అందుకే మృగరాజు అయింది. ఏనుగు మద ప్రాణి. ఆడ ఏనుగును చూస్తే చాలు పరిగెత్తుతుంది. అందుకే ఏనుగును పట్టటం వేటగాడికి సులువయ్యింది.

మహా భారతంలో అర్జునుడు దమం గల వాడు. అందుకే దేవ లోకంలో ఊర్వశి తనంతతా వలచి వచ్చినా చలించలేదు. రామాయణంలో రావణుడు సీత కోసం దొంగ వేషం వేసి, మారీచుని చేత కూడా వేయించాడు. దానితో సర్వనాశనమయ్యాడు.

*3.తపః :-* తపస్సు అంటే తపించటం. దేని కోసం? ధర్మం కోసం, దైవం కోసం, మోక్షం కోసం తపించాలి. అంతే గాని అల్పమైన, అనిత్యమైన లౌకిక విషయాల కొరకో, వస్తువుల కొరకో, భోగాల కొరకో కాదు. 'తపసా కిల్బిషం హంతి'- తపస్సు వల్ల పాపాలు హరించుకుపోతాయి. తపస్సు చేయక పోతే 'పత'- పతనమే. ఈ తపస్సు బ్రాహ్మణుని సహజ సిద్ధ కర్మ. తపస్సు చేసిన వాడే బ్రాహ్మణుడు.

4. శౌచం :- శౌచం అంటే శుచిత్వం. బాహ్య శుద్ధి. అంతఃశ్శుద్ధి అని ఇది రెండు విధాలు. బాహ్యంగా పరిసరాలు, వస్తువులు, శరీరం - అన్నీ శుచిగా ఉండటం బాహ్య శుద్ధి. మనస్సు, బుద్ధి - వీటిని ఏ కల్మషాలు లేకుండా శుచిగా ఉంచుకోవటం అంతఃశ్శుద్ధి. అంటే దుష్ట ఆలోచనలు, దుష్ట కోరికలు, దుష్ట సంకల్పాలు లేకుండా ఉండటమే అంతఃశ్శుద్ధి. బాహ్య శుద్ధి లేక నల మహారాజు ఎన్నో కష్టాలు పడ్డాడు. అంతఃశ్శుద్ధి లేక జీవుళ్ళంతా బాధలకు లోనవుతున్నారు.

జలంతో దేహాన్ని, సత్యంతో మనస్సుని, జ్ఞానంతో బుద్ధిని శుద్ధి చేసుకోవాలి. బ్రాహ్మణునికి ఈ శౌచం చాలా ముఖ్యం. చిత్త శుద్ధి లేని శివ పూజలేలయా? అని వేమన కవి చెప్పిన మాట అక్షర సత్యం.

5. క్షాంతి :- క్షమ, ఓర్పు, సహనం - తనకెవరైనా అపకారం చేసినా తిరిగి వారికి అపకారం చేయగలిగి ఉన్నా - చెయ్యకుండా, చెయ్యాలనే భావన లేకుండా క్షమించ గలగటమే ఓర్పు - క్షాంతి.

ఘోష యాత్ర పేరుతో పాండవులను అవమానించాలని వైభవంగా ద్వైత వనానికి వెళ్ళిన దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు తామే పరాభవాన్ని పొంది పాండవుల సాయంతో బంధ విముక్తులయ్యారు. ధర్మరాజు క్షమా గుణంతో కౌరవులను, వారి స్త్రీలను రక్షించాడు.

తనకు అపకారం చేయటానికి వచ్చిన శత్రువే అయినప్పటికీ దుర్యోధనాదులను బంధ విముక్తులను చేసి రక్షించాడు ధర్మరాజు. ఇదీ క్షమ అంటే.

బ్రాహ్మణునికి ఈ క్షమా గుణం స్వతస్సిద్ధంగా ఉండాల్సిన గుణం. ఇది బ్రాహ్మణునికి వన్నె తెస్తుంది.

ద్రోణ దుపదులు అగ్నివేశుడనే ముని వద్ద విద్యాభ్యాసం చేశారు. ద్రుపదుడు రాజైన తర్వాత పేద బ్రాహ్మణుడైన ద్రోణుని అవమానించాడు. ఆ కోపంతో ద్రోణుడు కౌరవ పాండవులకు అస్త్ర విద్యాచార్యుడై గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెమ్మన్నాడు. కౌరవులు వెళ్ళి ద్రుపదుని చేతిలో పరాజయం పాలై వచ్చారు. పాండవులు దృపదుని ఓడించి కట్టి తెచ్చి ద్రోణుని పాదాలపై పడవేశారు. దానితో ద్రోణుని కోపం తీరిపోయింది. దృపదునికి స్నేహ హస్తాన్ని అందించాడు. అందుకే నన్నయగారు భారతంలో "బ్రాహ్మణ కోపము తృణహుతాశనము దీర్ఘమగునే" అన్నారు.

కాని దృపదుడు మాత్రం క్షమా గుణం లేని వాడై ద్రోణుని సంహరించే కుమారుని కోసం తపించి, యజ్ఞం చేసి తన కసి తీర్చుకున్నాడు.

భూమి, వృక్షాలు అన్నీ క్షమా గుణం కలిగినవే. తనను నాగలితో దున్ని హింసించిన వానికి భూమి అన్నం పెడుతుంది. తనను గొడ్డళ్ళతో నరికిన వారికి వంటచెరకుగా - కలపగా ఉపయోగపడుతుంది వృక్షం. తనపై రాళ్ళు విసిరిన వానికి ఫలాలనిస్తుంది ఫల వృక్షం. తనను నరికిన గొడ్డలికి సువాసననిస్తుంది గంధపు చెట్టు. మహాత్ములు కూడా తమకు అపకారం చేసిన వారిని కూడా క్షమించగలుగుతారు. ఇదే బ్రాహ్మణ ధర్మం.

*6*. ఆర్జవం :- ఆర్జవం అంటే ఋజుత్వం, నిజాయితీ, త్రికరణశుద్ధి. బ్రాహ్మణుడు నిస్వార్థ జీవి గనుక అతడు అన్ని విషయాలలోను నిజాయితీగానే ఉంటాడు. ఎవరినీ మోసగించవలసిన అవసరం ఉండదు. అబద్ధాలు చెప్పడు. చెప్పేదొకటి, చేసేదొకటి ఉండదు. అట్టి వాడే బ్రాహ్మణుడు.

**7.** **జ్ఞానం :-** జ్ఞానం అంటే శాస్త్ర జ్ఞానం. మానవుడు తరించేందుకు మార్గాలను తెలియజేసేవి శాస్త్రాలు. ఆ శాస్త్రాలను తెలుసుకోవటమే జ్ఞానం. శాస్త్ర జ్ఞానం కోసం తపించే వాడే బ్రాహ్మణుడు.

ఈగ అన్నింటి మీద వాలుతుంది. కాని నిప్పు మీద వాలదు. అలాగే మనస్సు అన్నింటి మీద వాలుతుంది. కాని ఆత్మ పై వాలదు. అన్ని చింతలకు అవకాశం ఉంటుంది గాని ఆత్మ చింతనకు అవకాశం ఉండదు; సమయం దొరకదు. అందుకే సామాన్యులు, ఆఁ! ఇవన్నీ మాకెందుకండీ! ఈ వేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, గీతలు మాకేం అవసరం లేదు. మా గీతలు బాగుంటే అదే పదివేలు అంటూ ఉంటారు. నీ గీత బాగుండేందుకే భగవద్గీత. నీ గీతను మార్చేదే భగవద్గీత- భగవంతుని గీత. గీత దాటి సీత కష్టాలు పడ్డది. మన గతీ అంతే. అందుకే శాస్త్ర జ్ఞానం తెలుసుకోవాలి. తెలుసుకోవాలనే తపన ఉండాలి. ఆ తపన బ్రాహ్మణునికే ఉంటుంది. ఆ తపన ఉన్న వాడే బ్రాహ్మణుడు. ఈ శాస్త్రాలు గీస్త్రాలు నాకక్కరలేదు. నా కుటుంబాన్ని ఉద్ధరించుకుంటే చాలు అనుకొనేవాడు అబ్రాహ్మణుడే.

**8.విజ్ఞానం :-** విజ్ఞానం అంటే అనుభవ జ్ఞానం. విన్న శాస్త్రాన్ని - లేదా తెలుసుకున్న శాస్త్రాన్ని జీవితంలో ఆచరణలో పెట్టుకొని, అనుభవంలోకి తెచ్చుకోవాలి. అందు కొరకే బ్రహ్మ జ్ఞానాన్ని సంపాదించాలని అట్టి జ్ఞానాన్ని అందించే గురువుల వద్దకు వెళ్తాడు బ్రాహ్మణుడైన వాడు. అహంకారం విడిచి వారిని సేవిస్తాడు. ప్రాపంచిక విషయ వైరాగ్యంతో, జ్ఞానంపై ఆసక్తితో శాస్త్రాలను తెలుసుకుంటాడు, తనలోనే ఉన్న పరమాత్మను అనన్య భక్తితో ఉపాసన చేసి చివరకు తాను ఆ పరమాత్మనే అనే అనుభూతిని చెందుతాడు. ఇదే విజ్ఞానం. ఇదే బ్రాహ్మణ

ధర్మం. తాను తెలుసుకోవటమే కాదు ఇతరులకు సన్మార్గాన్ని బోధించటం కూడా బ్రాహ్మణుని సహజ సిద్ధ ధర్మం.

9. ఆస్తిక్యం :- శాస్త్రములయందు, గురువులయందు, భగవంతుని యందు గట్టి నమ్మకం ఉండటమే ఆస్తికత. దీనికి వ్యతిరేకం నాస్తికత. నాస్తికుడెవడూ బ్రాహ్మణుడు కాదు.

*భగవంతుడున్నాడనే నమ్మకం-

**ఆ భగవంతుని చేరుకునే మార్గాలు, ఉపాయాలు చెప్పేవే శాస్త్రాలు, ఉపనిషత్తులు అనే నమ్మకం-

***ఆ ఉపనిషత్తులలో చెప్పబడ్డ లక్ష్యార్థాన్ని, పరమార్థాన్ని విడమరచి చెప్పి మనలను తరింపజేసే వారే సద్గురువులనే నమ్మకం-

అట్టి గురువులను సేవించి తరించాలనే నిశ్చయం గలవారే ఆస్తికులు. అట్టి ఆస్తిక్యతయే బ్రాహ్మణ ధర్మం.

బ్రాహ్మణుల యొక్క స్వభావ సిద్ధ కర్మలు ఈ పైన చెప్పబడిన తొమ్మిది కూడా. ఈ కర్మల వల్లనే బ్రాహ్మణుడు తనలోని వాసనల పొరను ఛేదించగలుగుతాడు. తద్వారా జీవ భావం నుండి విముక్తుడై తన యదార్థ స్వరూపంలో నిలిచి పోతాడు. అంటే ఈ కర్మలన్నీ జీవుడికి- దేవుడికి మధ్య నున్న వాసనల తెరను చీల్చి వేయటానికే అని గ్రహించాలి.

*-ఏ కర్మల ద్వారా క్షత్రియ వర్ణం వారు తమలోని వాసనల పొరను చీల్చివేసి ఉన్నత స్థితికి చేరుకోగలరో ఆ కర్మలను తెలియజేస్తున్నారు. క్షత్రియులకు స్వభావసిద్ధ కర్మలను ఏడింటిని తెలియజేస్తున్నారు.*

శ్లో|| శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం

యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్॥ (43)

తా॥శౌర్యం, తేజం, పట్టుదల, దక్షత(సమర్థత), యుద్ధం నుండి వెన్నుచూపక పోవటం (పారిపోకుండుట) దానం, ఈశ్వర లక్షణం- ఇవి క్షత్రియునికి స్వభావసిద్ధ కర్మలు.

వ్యాఖ్య:- క్షత్రియునిది రజోగుణ ప్రవృత్తి. ఈ ప్రవృత్తి(స్వభావం) వల్ల అతడు చేసే కర్మలు కూడా రజో గుణంతో కూడుకొనే ఉంటాయి. వాటిని సరైన పద్ధతిలో ఆచరించటం ద్వారానే అతడు తనలోని రాజసిక వాసనలను క్షయం చేసుకోగలుగుతాడు. తద్వారా తమ గుణాలను రాజసిక స్థితి నుండి సాత్త్విక స్థితికి మార్చుకొని బ్రాహ్మణులౌతారు. అప్పుడు బ్రాహ్మణ సహజ స్వభావ కర్మలను ఆచరించటం ద్వారా ఈ జనన మరణ చక్రం నుండి తరించగలుగుతారు. కనుక తమ క్షత్రియ గుణ స్వభావ సిద్ధ కర్మలను తెలుసుకొని వాటిని చక్కగా ఆచరించి తమలోని వాసనల పొరను ఛేదించాలి.

క్షత్రియునికి స్వభావ సిద్ధ కర్మలేమిటి? 1. శౌర్యం, 2. తేజస్సు, 3.ధృతి, 4. దాక్ష్యం(దక్షత), 5. యుద్ధం నుండి పలాయనం చిత్తగించకుండుట, 6. దానం, 7.ఈశ్వర భావం.

1.శౌర్యం :- శౌర్యం అంటే పరాక్రమం. అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కొనటానికి క్షత్రియుడు పోరాడాలి. దేశాన్ని రక్షించే సైనికులు యుద్ధ విద్యలలో ఆరితేరి తమ పరాక్రమాన్ని చూపాలి. రామాయణ కాలంలో శ్రీరాముడు గొప్ప పరాక్రమశాలి. ఖర దూషణాది 14 వేల మంది రాక్షసులను దండకారణ్యంలో ఒక్కడే జయించాడు. రావణ కుంభకర్ణాదులను వధించాడు. అలాగే మహా భారతంలో అర్జునుడు గురుదక్షిణగా ద్రుపదుని ఓడించాడు, అరణ్యాలలో

గంధర్వులను ఓడించాడు. ఉత్తర గోగ్రహణ సమయంలో కౌరవ సేనావాహిని నంతటిని నిలువరించాడు. శౌర్యాన్ని చూపటం క్షత్రియ ధర్మం. అయితే ఇదంతా కర్తవ్యతాభావంతో, పరమాత్మ స్మరణతో చెయ్యాలి.

*2*.తేజః :- ఇది దైవ దత్తమైన దైవీ సంపద. గురువు చూపిన మార్గంలో సాధనలు చేస్తే వచ్చేది బ్రహ్మ తేజస్సు. దీనులను, ఆపన్నులను రక్షించటం ద్వారా వచ్చేది క్షాత్ర తేజస్సు. బ్రహ్మ తేజస్సే నిజమైన తేజస్సు. ఇది మహాత్ముల తల చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది. దీనిని ఫొటో తీయటానికి రష్యన్ల వద్ద కిర్లియన్ ఫొటోగ్రఫీ అని ఉన్నది. ఇక క్షాత్ర తేజస్సు ఉన్నవాడు ధర్మ రక్షణ గావిస్తాడు. ఇది క్షత్రియుని స్వభావసిద్ధ ధర్మం.

*3*.ధృతిః :- ధృతి అంటే పట్టుదల. దేనినైనా సాధించాలనుకున్నప్పుడు ఎన్ని అవాంతరాలనైనా ఎదుర్కొని పట్టుదలతో సాధించటమే ధృతి. ఇది క్షత్రియ స్వభావం కూడా. యుద్ధ రంగంలో విజయమో వీరస్వర్గమో, *DO or DIE*, కరోయామరో అని సైనికులకు ప్రబోధిస్తూ తామూ ఉత్తేజితులౌతూ ఉంటారు. సముద్ర మధనంలో ఎన్నో ఆటంకాలు వచ్చినవి. అయినా అమృతము లభించేంత వరకు పట్టుదలతో మధనం కొనసాగించారు. సముద్ర లంఘనంలో ఆంజనేయునికి ఎన్నో ఆటంకాలు వచ్చినవి. అయినా విజయం సాధించే వరకు పట్టు వీడలేదు. విశ్వ కళ్యాణానికి యాగం చేస్తున్న విశ్వామిత్రునికి ఎన్నో ఆటంకాలు వచ్చినవి. అయినా అన్నింటిని ఎదుర్కొని యాగం పూర్తి చేశాడు. అలాగే ధ్యానం చేసేటప్పుడు ఎన్నో ఆటంకాలు వస్తాయి. అయినా పట్టుదలతో కొనసాగించాలి. ఈ పట్టుదల - ధృతి క్షత్రియుల సహజ స్వభావం.

4. దాక్ష్యం :- దాక్ష్యం అంటే దక్షత. కార్య దక్షత. చేసే పనిలో సమర్థత. క్షత్రియుల స్వభావ సిద్ధ గుణం ఈ దక్షత.

హనుమంతుడు గొప్ప కార్య దక్షుడు. దైన్య స్థితిలో ఉన్న సుగ్రీవునికి అండగా నిల్చి, రామ లక్ష్మణులతో స్నేహాన్ని సంఘటింపజేసి, సుగ్రీవునికి ధైర్యాన్ని కల్పించాడు. సీతాన్వేషణలో సముద్రాన్ని లంఘించటం, సీతను కనుగొనటం, రావణునితో మాట్లాడటం, రాక్షసులను యుద్ధంలో హతం గావించటం, తిరిగి శ్రీరామునికి శుభవార్తను అందించటంలో హనుమంతుని దక్షత ఏమిటో మనందరకు తెలుసు.

5. యుద్ధం నుండి వెనుదిరగకుండటం :- యుద్ధంలో పలాయనం చిత్తగించకుండా ఉండటం క్షాత్ర ధర్మం. అయితే ఈ యుద్ధం ఎప్పుడో జరిగేది. కాని ఈ దేహమనే కురుక్షేత్రంలో ధర్మానికి, అధర్మానికి, దైవ గుణాలకు ఆసురీ గుణాలకు మధ్య పోరాటం ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఈ పోరాటం ఆత్మానుభూతి కలిగేంత వరకు జరుగుతూనే ఉంటుంది. ఇందులో నుండి వెనుదిరగరాదు. అదే క్షాత్ర ధర్మం.

6. దానం :- దానం అనేది అల్పులకు, బిచ్చగాళ్లకు చేసేది కాదు. గొప్ప వారికి, మహాత్ములకు చేసేది. సత్పాత్రులకు సద్బుద్ధితో చేసేది దానం. దానం అనేది అనేక విధాలు. అన్నదానం, వస్త్ర దానం , గో దానం. భూ దానం, సువర్ణ దానం, విద్యా దానం, జ్ఞాన దానం, శ్రమదానం, అభయ దానం మొ||నవి. అహంకారం లేకుండా దానం చేస్తే అంతఃకరణం శుద్ధమౌతుంది.

నీవు తిన్నది మట్టి పాలు. ఇతరులకు ఇచ్చిందే నీ పాలు. దానం చేస్తే దరిద్రులమౌతామని కొందరి భావన. కాని దానం చెయ్యక పోతేనే దరిద్రులౌతారని పెద్దల భావన. కొందరు దానం చేస్తున్నామని పాపం మూట కట్టుకుంటారు.

కొడుకు తండ్రితో అంటున్నాడు,"నాన్నా! గుమ్మడి కాయ కుళ్లి పోయింది" అని. తండ్రి అన్నాడు, "మన బర్రె(గేదె)కు వెయ్యిరా" అని. "వేశాను నాన్నా. తినలేదు" అన్నాడు కుమారుడు. "అయితే మన బ్రాహ్మణుని పిలిచి దానం ఇవ్వు" అన్నాడు తండ్రి. ఈ దానం దానం కాదు. అది దహనం. తన పాపాన్ని పండించుకోవటమే. కనుక దానం అనేది మనకు పనికి రాని దాన్ని ఇవ్వటం కాదు. మంచి వస్తువును, ఉపయోగపడే దానిని మాత్రమే భక్తితో, కర్తవ్యతా బుద్ధితో సమర్పించాలి.

7. ఈశ్వరభావః :- తాను భగవంతుని చేత ప్రజా పాలనకు నియమించబడ్డాననే భావన ఉండాలి. తన మీద, తన సమర్థత మీద విశ్వాసం ఉంటేనే ఇతరులకు నాయకుడు కాగలుగుతాడు. తన చుట్టూ ఉన్నవారిని ఉత్తేజ పరచగలవాడే నాయకుడు. ఒక కార్యాన్ని సాధించాలనుకున్నప్పుడు ఎన్ని ఆటంకాలు ఎదురైనా పట్టుదలతో ప్రయత్నం సాగించాలి.

ఇలాంటి గుణాలు క్షాత్ర స్వభావం కలిగినవే. ఈ కర్మలను చేయటం ద్వారానే క్షత్రియుడు తనలోని వాసనలను క్షయం చేసుకోగలుగుతాడు. వాసనా క్షయం జరిగితేనే మనస్సులోని ఆందోళనలు సమసి పోయేది, చిత్త శుద్ధి కలిగేది. అట్టి చిత్త శుద్ధి వల్లనే భగవంతునిపై ఏకాగ్రమైన భక్తి కలిగేది. అట్టి భక్తితో రజో గుణాన్ని అణచి సత్త్వ గుణంలో ప్రవేశిస్తాడు. ఆ సత్త్వ గుణం వల్లనే జ్ఞాన సముపార్జన చేయగలుగుతాడు. జన్మను సార్ధకం చేసుకుంటాడు.

***-వైశ్య శూద్ర వర్ణాల వారి స్వభావ సిద్ధ కర్మలను ఈ శ్లోకంలో-***

శ్లో||　కృషిగోరక్షవాణిజ్యం
వైశ్యకర్మ స్వభావజమ్|
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజమ్||　(44)

తా||వ్యవసాయం, గో రక్షణ, వాణిజ్యం- ఇవి వైశ్యుని స్వభావసిద్ధ కర్మలు. పరిచర్యా భావంతో కూడిన కర్మలు శూద్ర వర్ణానికి స్వభావ సిద్ధమైన కర్మలు.

*వ్యాఖ్య:-* క్షత్రియ - వైశ్య అనే రెండు వర్ణాలు రజో గుణ ప్రధానులు. అందుకే వారు కర్మ రంగంలో ఉండాలి. అయితే పరుల కోసం, రాజ్యం కోసం ప్రాణాలకు తెగించే కర్మ క్షత్రియులది. తమకూ, ఇతరులకూ ఇరువురికీ ఉపయోగపడే కర్మ వైశ్యులది. అందుకే వ్యవసాయం, పశు పోషణ, వాణిజ్యం వైశ్యుల స్వభావ సిద్ధ కర్మ అని చెప్పింది. వ్యవసాయం, పశు పోషణ వల్ల తమకూ ప్రయోజనం కలుగుతుంది. ఇతరులకు ఆహారమూ దొరుకుతుంది. గోపాలన ద్వాపర యుగం నుండి వైశ్యుల అధీనంలోనే ఉన్నదని భాగవతం వల్ల తెలుస్తుంది. నందుడు, గోపకులు అంతా వైశ్యులే.

ఇక శూద్రుల స్వభావ సిద్ధ కర్మ పరిచర్య అన్నారు. అందరికీ అవసరమైన వస్తువులను తయారు చేయుట, సేవలు - అన్నీ శూద్రులవే. కుండలు చేయటం, బట్టలు నేయటం, వడ్రంగం, చెప్పులు కుట్టటం, బుట్టలు అల్లటం, వ్యవసాయానికి కావలసిన పరికరాలను తయారు చెయ్యటం, బట్టలు ఉతకటం, బంగారు- వెండి వస్తువుల తయారీ, బజార్లు ఊడ్చి శుభ్రం చేయటం మొ||న అన్ని సేవలు శూద్రుల స్వభావ సిద్ధ కర్మలు.

'శూద్రస్య అపి' అనటం వల్ల - శూద్రులకు కూడా ఇవి నిర్ణయించబడిన కర్మలు అనటం వల్ల అన్ని వర్ణాల వారు

ఆచరించదగినదే సేవాభావం అని అర్ధం. అయితే శూద్రులకు మాత్రం స్వభావ సిద్ధ కర్మలు ఇవి.

ఈ కర్మలు చేయటం ద్వారా మాత్రమే వారు తమలోని వాసనల తెరను చీల్చి వేయటానికి అవకాశం కలుగుతుంది. తమలోని తమోగుణాన్ని రజోగుణంగా మార్చుకొని ఆ తరువాత సత్త్వంలో ప్రవేశించగలుగుతారు. ఈ నాలుగు వర్ణాల వారికీ విధించబడ్డ కర్మలలో ఎక్కువ తక్కువలను భావించటం అజ్ఞానం. విద్యాభ్యాసం చేసే వారందరిని ఒకే తరగతిలో - 10వ తరగతిలో కూర్చోబెట్టరు గదా! ప్రారంభం 1 నుండి, క్రమంగా పాసవుతూ వేరువేరు తరగతులలోకి వస్తారు. 1 వ తరగతిలో వారిని చూచి హీనంగా మాట్లాడాల్సిన పని లేదు. ఎందుకంటే వారూ ఒకప్పుడు ఆ తరగతిలో కూర్చొని వచ్చిన వారే గదా! అలాగే ఇక్కడ కూడా వారి వారి స్వభావాన్ని బట్టి రకరకాల కర్మలు విధించబడ్డాయి. అంతే.

కారు రోడ్డు మీదనే నడుస్తుంది. పడవ నీటిలోనే ప్రయాణిస్తుంది. విమానం ఆకాశంలోనే తిరగగలుగుతుంది. నీటిలో ప్రయాణించలేదు. అలాగే సాత్త్విక స్వభావం ప్రధానంగా కలవాడు ప్రశాంతంగా ఉండి శాస్త్రాలను అర్ధం చేసుకోగలుగుతాడు, ధ్యానమగ్నుడై ఉండగలుగుతాడు. ఆత్మ దర్శనం కొరకు పాటు బడతాడు. అలాంటి వాణ్ణి వ్యాపారం చేయమన్నా, రోడ్లు ఊడవమన్నా సాధ్యం కాదు. ఒక వేళ ఆ పనులలోకి బలవంతంగా దింపితే ఆ పనులను సమర్ధవంతంగా చేయలేడు. చేయవలసిన దాన్ని చేయక వాసనలను సమకూర్చుకుంటాడు. అశాంతి పాలవుతాడు. అందువల్ల పాత వాసనలు ఖర్చు కావు. క్రొత్త వాసనలు చేరుకుంటాయి.

అలాగే రజో గుణం ప్రధానంగా ఉన్న వాణ్ణి ధ్యానం చేయమన్నా జపం చేయమన్నా కుదరదు. ప్రశాంతంగా కూర్చోలేడు. తమో గుణంలో ఉన్నవాణ్ణి సాధనలు చేయమన్నా, శాస్త్ర జ్ఞానాన్ని పొందమన్నా సాధ్యం కాదు. నిద్రపోతాడు.

అందువల్ల ఏ స్వభావం గల వారికి ఆ స్వభావసిద్ధ కర్మలనే విధించటం జరిగింది. వాటి ద్వారానే వారు వృద్ధిలోకి రావాలి. తమలోని నీచ గుణాలను వదిలించుకోవాలి. వాసనలను క్షయం చేసుకోవాలి.

బ్రాహ్మణ వర్ణం వారికి దేశ రక్షణను అప్పగిస్తే దేశం పరులపాలవుతుంది. పరిపాలన అస్తవ్యస్తం అవుతుంది. దానితో మనస్తాపం చెందుతారు. క్షత్రియునికి వ్యాపారం అప్పగిస్తే అన్యాయాలనెదిరించటానికి ప్రయత్నిస్తూ శిక్షించటానికి బల ప్రదర్శనకు దిగుతాడు. వైశ్యునికి దేవాలయ పూజాదికాలు అప్పగిస్తే దేవాలయం చిన్న వ్యాపారసంస్థ అవుతుంది. కొబ్బరి చిప్పల అమ్మకం, ఇతర పదార్థాల వ్యాపారం బాగా సాగిపోతుంది.

ఇలా గుణాలను బట్టి - స్వభావాన్ని బట్టి వర్ణాలు, వర్ణాలను బట్టి కర్మలు విధించారు. ఆయా కర్మల ద్వారా వాసనాక్షయంగావించుకొని ఒక్కొక్క మెట్టు పైకెక్కుతూ చివరకు పరిపూర్ణ స్థితిని పొందాలని భగవానుడు స్పష్టం చేస్తున్నాడు. వర్ణాలు ఉన్నది ఉన్నత స్థితిని చేరుకోవటానికే గాని ఒకరినొకరు కించపరుచుకొనుటకు కాదు.

ఈ ప్రకారంగా స్వభావ సిద్ధ కర్మలను చేస్తూ, వాసనా క్షయం గావించుకుంటూ, చిత్త శుద్ధిని - మనో నిర్మలత్వాన్ని పొందుతూ, చిత్త శుద్ధి ద్వారా ఆత్మ జ్ఞానాన్ని పొంది ఏకాగ్రమైన ధ్యానంతో ఆత్మ జ్ఞానంతో ఆత్మాను భూతిని పొంది జన్మను సార్థకం చేసుకోవాలి.

*-స్వభావసిద్ధ కర్మల ద్వారానే ఆత్మానుభూతిని ఎలా పొందాలో తరువాతి శ్లోకం నుండి తెలియ జేయబోతున్నారు. -*

శ్లో|| స్వే స్వే కర్మణ్యభిరతః
సంసిద్ధిం లభతే నరః|
స్వకర్మనిరతః సిద్ధిం
యథా విందతి తచ్ఛృణు|| *(45)*

తా||వారి వారి స్వభావ సిద్ధ కర్మల యందు ఆసక్తులై మానవులు సిద్ధిని పొందుతారు. తన స్వకర్మ యందు ఆసక్తుడై ఏ ప్రకారంగా సిద్ధిని పొందుతాడో దానిని విను.

*వ్యాఖ్య:-* ప్రతి వ్యక్తీ తన స్వభావం కొద్దీ, లేదా తనలోని వాసనల యొక్క ప్రేరణలను బట్టి లభించిన కర్మలయందే ఆసక్తిని కలిగి ఉంటాడు. ఆ కర్మలను ఆచరించటం వల్లనే సిద్ధి కలుగుతుంది.

'సిద్ధి' అంటే ఆత్మజ్ఞానాన్ని పొందటానికి అర్హత అని ఇక్కడ అర్థం. ఈ అర్హతను ప్రతి వ్యక్తీ పొందవలసిందే. ఎందుకంటే - ఆత్మ జ్ఞానం వల్లనే చివరకు మోక్ష సిద్ధి. కనుక ఈ జన్మలో గాని, తరువాత జన్మలోగాని, మరికొన్ని జన్మల తర్వాత గాని ఈ అర్హతను తప్పక పొంది తీరవలసిందే. మోక్ష సిద్ధికి ఆత్మజ్ఞానం, ఆత్మజ్ఞానానికి స్వభావసిద్ధ కర్మలు తప్పదు.

అయితే ఆ కర్మలు ఎలాంటివై ఉండాలి? ఎలా చేయాలి? ఎలా చేస్తే ఆత్మ జ్ఞానానికి అర్హత సిద్ధిస్తుంది?

తనయొక్క స్వభావం వల్ల జనించిన కర్మల ద్వారానే సిద్ధి లభిస్తుంది. ఎవరో బలవంతంగా మన మీద రుద్దిన కర్మల ద్వారా సిద్ధి లభించదు. ఎందుకంటే బలవంతంగా చేయవలసి వచ్చిన కర్మలను నైపుణ్యంతో చేయలేరు. అలాగే ఏదో

స్వార్థంతోనో, తన స్వభావ సిద్ధ కర్మలయందలి దోషాలను చూచి ఆ కర్మలను వదలి వేరొకరి కర్మలను చేస్తేనో ప్రయోజనం ఉండదు.

*ఫ్రాన్స్ దేశంలో ఒక చిన్న గ్రామంలో ఒక గొల్ల పిల్ల వాణ్ణి గొర్రెలు కాచుకొని రమ్మని పెద్దలు పంపిస్తున్నారు. కాని ఆ పని అతని స్వభావానికి విరుద్ధం. అందుకనే సక్రమంగా ఆ పని చేయలేక అసంతృప్తితో రగిలి పోతున్నాడు. ఏదో చేయాలని తపన. దానితో అతడు పారిస్ నగరానికి పారిపోయి ప్రపంచ ప్రఖ్యాత మహావీరుడు, చక్రవర్తి అయ్యాడు. అతడే నెపోలియన్ చక్రవర్తి.

*వ్యాపారం చేసి డబ్బు గడించమని తల్లిదండ్రులు తమ కుమారుణ్ణి వ్యాపారంలోకి దించారు. అతడు వ్యాపారాన్ని వదిలి కవిత్వం వ్రాసి సంతృప్తి చెందుతున్నాడు, అతడే గొప్ప విఖ్యాతిగాంచిన కవిగా ప్రసిద్ధుడైన ఆలివర్ గోల్డుస్మిత్.

*కాళికాదేవి గుడిలో పూజారిగా నియమించబడితే పిచ్చి పూజారిగా మారి, అందరిచేత గేలి చేయబడి విధి నిర్వహణలో విఫలమయ్యాడు. ఆ పిచ్చి పూజారియే ప్రపంచానికి మార్గ దర్శకుడైన మహాత్ముడు శ్రీ రామకృష్ణ పరమహంస.

కనుక ప్రతి వ్యక్తీ తన స్వభావం యొక్క ప్రేరణ చేత కలిగిన కర్మలను చేయటం ద్వారానే కార్య సిద్ధిని పొందుతాడు. అంటే - ఈ కర్మ భూమిలో పుట్టిన ప్రతివ్యక్తీ కర్మకు బద్ధుడై కర్మ గర్తంలో పడి మునిగి పోనక్కరలేదు. ఆ కర్మలను తెలివితో, జ్ఞానంతో, బుద్ధి యోగంతో చేస్తూ చేస్తూనే కర్మ బంధనాల నుండి విముక్తి చెంది, చిత్తశుద్ధిని పొందవచ్చు, తద్వారా ఆత్మ జ్ఞానానికి అర్హత సంపాదించవచ్చు. ఇది మానవుడికి మాత్రమే సాధ్యం అవుతుంది. అందుకే 'నరః' అన్నారు. మానవ జన్మ నెత్తి

ఈ అవకాశం వినియోగించుకోకపోతే అతడు మూర్ఖుడే. కనుక ఎలాంటి భావంతో కర్మలాచరించాలో తెలుసుకోవాలి.

*-ఇప్పుడా ఉపాయాన్ని తెలియజేయబోతూ 'తత్ శ్రుణు' - అని భగవానుడు ఆ ఉపాయాన్ని చెప్పబోతున్నాడు, ఏమని?*

శ్లో|| యతః ప్రవృత్తిర్భూతానాం
యేన సర్వమిదం తతమ్|
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః|| *(46)*

తా||ఎవరి నుండి జీవుళ్ళ ప్రవృత్తి కలుగుతున్నదో, ఎవరి చేత ఈ సర్వము వ్యాపించబడియున్నదో, ఆయనను తన కర్మ చేత ఆరాధించే మానవుడు సిద్ధిని పొందుతాడు.

*వ్యాఖ్య:-* అసలు కర్మలు దేని కోసం? కర్మ కర్మ కోసం కాదు. పరిసమాప్తి కోసం. సన్యాసం కోసం. అందుకే కర్మలను తెలివితో చేయాలి. జ్ఞానంతో చేయాలి. ఉపాయంతో చేయాలి. ఏమిటా ఉపాయం?

1. యతః ప్రవృత్తిర్భూతానాం :- ఈ సమస్త ప్రాణికోటి యొక్క ప్రవృత్తి అంటే ఉత్పత్తి ఎవరి వల్ల జరుగుతున్నది? పరమాత్మ వల్లనే. 'అమృతస్యపుత్రాః' మనం అందరం అమృత పుత్రులం అని వేదమాత చెబుతున్నది. అంటే మనం పరమాత్మ యొక్క బిడ్డలం. 'మమైవాంశోజీవలోకే' - నీవు నా సనాతనమైన అంశమే అని భగవానుడు తెలియజేశాడు. 'అహంబీజప్రదఃపితాః' - నేను బీజాన్ని ఉంచే తండ్రిని. ఈ ప్రకృతి తల్లి. ఆమె గర్భంలో బీజాన్ని ఉంచే తండ్రిని నేను అన్నాడు భగవానుడు. కనుక మనం అంతా పరమాత్మ బిడ్డలమే. అసలు 'మానవ' అంటే - 'మా' 'నవ', 'మా' అంటే

కాదు. 'నవ' అంటే క్రొత్త. మానవ అంటే నీవు క్రొత్తగా వచ్చిన వాడివి కాదు. సనాతనము, పురాతనము అయిన పరమాత్మ స్వరూపమే అని భావం.

మనం పరమాత్మ నుండి వచ్చిన వారం గనుక తిరిగి చేరాల్సింది కూడా పరమాత్మనే. మన ఇంటి నుండి బయలు దేరిన మనం ఎక్కడెక్కడ తిరిగినా, ఏ క్షేత్రాలు దర్శించినా చివరకు మన ఇంటికి చేరుకొంటేనే ప్రశాంతత, విశ్రాంతి. అలాగే మనం మన స్వస్థానమైన పరమాత్మను చేరితేనే ఆనందం, శాంతి, సుఖం, ప్రశాంతత. పరమాత్మయే మన లక్ష్యం, గమ్యం.

*2.యేనసర్వమిదంతతం* :- దేని చేత ఈ సమస్తము వ్యాపించబడియున్నదో. ఈ పదం భగవద్గీతలో 3వ సారి వచ్చింది. పరమాత్మ సర్వ వ్యాపి. అంతటా ఆయనే వ్యాపించి ఉన్నాడు. పాలలో వెన్నలాగా, నువ్వులలో నూనెలాగా, కుండలలో మట్టిలాగా, ఆభరణాలలో బంగారంలాగా సర్వత్రా ఆయనే ఉన్నాడు. అయితే స్థూల నేత్రాలకు కనిపించడు. జ్ఞాన నేత్రానికే కనిపిస్తాడు. అట్టి పరమాత్మను -మన పుట్టుకకు కారణమైన పరమాత్మను- అంతటా ఉన్న పరమాత్మను భక్తితో పూజించాలి. ఎలా పూజించాలి? దేనితో పూజించాలి?

*ఈ జీవితాన్ని పూజా గృహంగా చేసి,

**కర్మలనే పూజా పుష్పాలుగా చేసి,

***తనే పూజారియై పూజించాలి.

అంటే మన కర్మలతోనే పరమాత్మని పూజించాలి. అదే నిజమైన పూజ, నిజమైన ఆరాధన. అయితే ఎలాంటి కర్మలతో పూజించాలి?

*3.స్వకర్మణాతమభ్యర్చ* :- తన స్వభావ జనిత కర్మల చేతనే ఆరాధించాలి, పూజించాలి. సిద్ధిని పొందాలి. అర్హతను

సంపాదించాలి. అంటే ఈశ్వరార్పణ బుద్ధితో భగవంతునిపై మనస్సు నుంచి కర్మలు చేయాలి. ఇదే ఉపాయం. ఇప్పుడే ఒక సందేహం తప్పకుండా కలుగుతుంది.

ఇంతకూ దృష్టిని కర్మలపై ఉంచాలా? భగవంతునిపై ఉంచాలా? అనేదే.

*ఒక గాయకుడు పాట పాడుతూ తన ధ్యాసను ఎప్పుడూ శృతిపైన ఉంచుతాడు.

*ఒక నర్తకి నాట్యం చేస్తూ తన దృష్టిని ఎల్లపుడూ తాళం పైనే ఉంచుతుంది.

*అలాగే కార్య రంగంలో మనం తప్పటడుగులు వేయకుండా దృష్టిని పూర్తిగా పరమాత్మ పైనే నిలపాలి. ఎలాగ? మనం చేసే కర్మలన్నీ పరమాత్మని అందుకొనుటకేననే ధ్యాసను విడిచిపెట్టకూడదు. ఆయనను అందుకోవాలంటే జ్ఞానాన్ని సంపాదించాలి గనుక, ఆ ఆత్మ జ్ఞానాన్ని పొందటానికి చిత్తశుద్ధి కావాలి గనుక ఈ కర్మలను నా చిత్తశుద్ధి కొరకే చేస్తున్నాననే భావనను మరచిపోరాదు. ఇలా మనస్సులో ఆత్మను ధ్యానిస్తూ కర్మలు చేస్తుంటే ఆ కర్మలన్నీ భగవదారాధనలే, భగవంతుని పూజలే అవుతాయి. అందుకే హాత్ మే కామ్- దిల్ మే రామ్ అన్నాడు కబీర్ దాస్. ఇలా ఫల సిద్ధిపై గాని, కోరికలపై గాని ఆసక్తి లేకుండా భగవదార్పణ బుద్ధితో కర్మలు చేస్తుంటే వాసనలు క్షయమై, మనస్సు నిర్మలమౌతుంది. అదే చిత్తశుద్ధి. దానితో బుద్ధి సూక్ష్మత కలిగి జ్ఞాన ప్రాప్తికి అర్హత కలుగుతుంది. ఇదే కర్మ మార్గంలో కీలకం. ఇలా తెలివితో కర్మలు చేస్తే-

4. సిద్ధిం విందతి మానవః :- మానవుడు జ్ఞాన సిద్ధిని, తద్వారా మోక్ష సిద్ధిని పొందుతాడు అని భగవానుడు హామీ ఇస్తున్నాడు. మానవుడికి మాత్రమే ఈ అవకాశం ఉన్నది. మోక్షాన్ని పొందాలన్నా, మోక్ష ప్రాప్తికి జ్ఞానాన్ని పొందాలన్నా, జ్ఞాన

ప్రాప్తికి చిత్తశుద్ధిని సాధించాలన్నా, అందుకొరకు, నిస్సంగంగా, ఫలాపేక్ష లేకుండా, నిష్కామంగా కర్మలు చేయాలన్నా **84** లక్షల జీవరాశులలో ఒక్క మానవునికి మాత్రమే అవకాశం ఉన్నది. దేవతలు కూడా సాధనలు చేయలేరు. ఎందుకంటే వారికి స్థూల దేహం లేదు గనుక. ఇక పశుపక్ష్యాదులు, క్రిమి కీటకాలు - ఇతర జంతువులు జ్ఞానాన్ని పొందలేవు. ఎందుకంటే వాటికి బుద్ధి లేదు గనుక. అందుకే ఇక్కడ సిద్ధింవిందతి మానవః అంటూ మానవుడికి మాత్రమే అర్హత కలదని తెలియజేస్తున్నారు.

కనుక స్వభావ జనిత కర్మ- లేదా స్వధర్మ కర్మల ద్వారానే సిద్ధి. భీష్ముడు యుద్ధ రంగంలో భగవానునే ఎదురించాడు. అయినా భగవంతుని అనుగ్రహాన్ని పొందాడు. కారణం? అది ఆయన స్వధర్మ కర్మ గనుక. కనుక భగవంతుని చేరుకునేందుకే కర్మలు చేస్తున్నానని భావిస్తూ భగవంతుని స్మరిస్తూ కర్మలు చేసి సిద్ధిని పొందాలి.

***-స్వభావ జనిత కర్మల వల్ల ప్రయోజనాలేమిటో తరువాత 3 శ్లోకాల్లో తెలియజేస్తున్నాడు భగవానుడు. ముందుగా స్వధర్మం యొక్క విశిష్టత గురించి-***

**శ్లో|| శ్రేయాన్ స్వధర్మో విగుణః**
**పరధర్మాత్ స్వనుష్ఠితాత్|**
**స్వభావనియతం కర్మ**
**కుర్వన్నాప్నోతి కిల్బిషమ్|| (47)**

తా// చక్కగా అనుష్టించిన పర ధర్మం కన్నా హీనమైనదైనా స్వధర్మమే శ్రేయస్సును కలిగిస్తుంది. తన స్వభావం చేత ప్రేరేపించబడిన కర్మను చేయటం వల్ల పాపాన్ని పొందడు.

*వ్యాఖ్య:- 1. శ్రేయాన్ స్వధర్మః* :- స్వధర్మమే శ్రేయస్కరమైనది. మన వాసనలే మన స్వధర్మం. వాసనల వల్లనే కర్మలకు ప్రేరణ కలుగుతుంది. ఆ కర్మలను ఆచరిస్తే వాసనలు క్షయమై పోతాయి. దానితో కర్మల కొరకు ప్రేరణ ఆగిపోతుంది. అందువల్ల సిద్ధిని పొందదలుచుకున్న వాడు తన ప్రేరణలకు అనుగుణమైన కర్మలను చేయాలే గాని- అయ్యో ఇవి అల్పమైన కర్మలు *గదా!* ఆదాయాన్ని ఇవ్వని కర్మలు *గదా!* కీర్తి ప్రతిష్టలను ఆర్జించి పెట్టని కర్మలు *గదా!* అని వాటిని చెయ్యకుండా బలవంతంగా నిగ్రహించుకొని ఇతరుల దృష్టిలో మంచివి, లాభాలను ఇచ్చేవి, కీర్తిని ఆర్జించేవి అని తన స్వభావానికి విరుద్ధమైన కర్మలను చేయరాదు. *ఎందుకంటే తన స్వభావసిద్ధ కర్మలను వదలి నందువల్ల సహజ వాసనలు ఖర్చు కావు. స్వభావానికి విరుద్ధమైన కర్మలు చేయటం వల్ల క్రొత్త వాసనలు పట్టుకుంటాయి.*

ఒక పెద్ద వ్యాపారి తన కుమారుణ్ణి బలవంతంగా వ్యాపారంలోకి దించాడు. కాని ఆ కుమారుడికి వ్యాపారం అంటే బొత్తిగా ఇష్టం లేదు. అతడికి కళల పట్ల, చిత్రలేఖనం పట్ల విపరీతమైన ఆసక్తి. "ఈ బొమ్మలు గీసుకుంటూ కూర్చుంటే చివరికి తిండి కూడా దొరకదు, హాయిగా వ్యాపారం చేసుకో" అని తండ్రి పోరు. దాని వల్ల ఏం జరిగింది*?* ఇష్టం లేని వ్యాపారాన్ని సరిగ్గా చేయలేక ఉన్న ఆస్తినంతా పోగొట్టుకున్నాడు. 'ఒక గొప్ప కళాకారుణ్ణి కావాలి' అనే తన తపన అలాగే ఉండి పోయింది.

కనుకనే " శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్" అని చెప్పటం. అసలు కర్మలు చేయవలసింది మన గొప్పతనాన్ని ప్రదర్శించటానికి కాదు, మన భవ రోగాన్ని వదిలించుకోవటానికి అని గుర్తుంచుకోవాలి. అందుకే

ఆడంబరం కోసం, పది మందిలో గొప్ప కోసం చేసే పూజలు, యజ్ఞాలు, దానాలు, తపస్సులు, యోగాలు - అన్నీ వ్యర్థమై నిజంగా మనకు ఉపయోగపడకుండా పోతున్నాయి.

2. స్వభావనియతం కర్మ కుర్వన్ కిల్బిషం న ఆప్నోతి:-నీ స్వభావాన్ని అనుసరించి కర్మలు చేస్తుంటే పాపం రాదు. అంటే క్రొత్త వాసనలు రావు. పైగా ఉన్న వాసనలు క్షయమై పోతాయి. వాసనలు క్షయమై కొత్తవి రాకపోవటమే పాపం రాదు అనటం. అంటే వాసనలే పాపం. కాకపోతే ఆ కర్మలు చేసేటప్పుడు పరమాత్మ చింతన ఉండాలి. ఓ భగవంతుడా! నీ సాన్నిధ్యం కోసమే నాకు పట్టిన ఈ పీడను(వాసనలను) వదిలించుకుంటున్నాను అనే భావన నీ మనస్సులో ఎల్లప్పుడూ ఉండాలి.

క్షత్రియుడైన అర్జునుడు ఈ ఘోరమైన యుద్ధం చేస్తే అది ఎంతటి క్రూర కర్మ అయినా, ఎందరికి ప్రాణాంతకమైనా అతడికి ఏ పాపమూ రాదు. పైగా అతడిలోని వాసనలు ఖర్చై పోతాయి. అలాగాక ఈ యుద్ధం నుండి వెనుదిరిగి అడవులకు వెళ్ళి తపస్సు చేసుకుంటాను - అంటే అది అతడి వ్యక్తిత్వాన్ని చెడగొడుతుంది. ఎందుకంటే యుద్ధం చేయాలనే ప్రేరణకు కారణమైన వాసనలు అలాగే ఉండి పోతాయి. వాటి వల్ల ఏం జరుగుతుంది? అరణ్యాలలో తన తపస్సుకు ఆటంకం కలిగించే జంతువులను చంపి పారెయ్యాలనుకుంటాడు. అంటే క్రొత్త వాసనలు పేరుకుంటాయి. చంపటం పాపం గదా! అని చంపకుండా అలాగే ఉంటే పాత వాసనలు అలాగే ఉండిపోతాయి.

కనుక ప్రతివ్యక్తీ తన స్వధర్మాన్నే పాటించాలి. పరధర్మం ఎంత గొప్పదైనా, లాభదాయకమైనదైనా దానిని

అనుసరించరాదు. తన స్వధర్మం ఎంత అల్పమైనదైనా వదలకూడదు.

*నీటికన్నా నెయ్యి చాలా విలువైనది. అలాగని కాళ్ళు కడుక్కోవటానికి, స్నానం చెయ్యటానికి నేతిని ఉపయోగిస్తామా? ఎంత శ్రీమంతుడైనా నీటికి బదులు నేతిని త్రాగుతాడా?

*చేపను నీటిలో ఎందుకు ఉంచటం? ఎంతో విలువైన నేతిలో ఉంచుదాం అనుకొని నేతిలో వేస్తే బ్రతుకుతుందా?

*యుద్ధంలో హింసా దోషం ఉన్నదని దానిని వదలి భిక్షాటన చేస్తానంటే కుదురుతుందా? భిక్ష వెయ్యని వాడి మీద యుద్ధం ప్రకటిస్తాడు.

అందుకే అర్జునా! నీలో ఉన్న రజోగుణం తొలగాలంటే యుద్ధం చేయవలసిందే. అలా కాకుండా ఈ రజో గుణాన్ని ఇలాగే ఉంచి భిక్షాటన చేస్తానన్నా, తపస్సు చేస్తానన్నా కుదరదు. కనుక యుద్ధం చేయటమే నీకు శ్రేయస్సు. దాని ద్వారానే నీ పాపాలు (వాసనలు) తొలగేది అంటున్నాడు భగవానుడు.

*- స్వభావ జనిత కర్మలు దోష భూయిష్టాలే అయినా చేయవలసిందేనా?*

శ్లో|| సహజం కర్మ కౌంతేయ!
సదోషమపి న త్యజేత్|
సర్వారంభా హి దోషేణ
ధూమేనాగ్నిరివావృతాః|| (48)

తా// కౌంతేయా! సహజమైన కర్మ దోషంతో కూడినదైనా వదలకూడదు. ఎందుకంటే పొగచేత అగ్ని కప్పబడినట్లు అన్ని కర్మలు దోషంతో కూడినవే.

*వ్యాఖ్య:-* స్వభావ జనిత కర్మ - లేదా సహజ కర్మ- అంటే తనలోని వాసనల వత్తిడి వల్ల పెల్లుబికి వస్తున్న కర్మ దోషంతో కూడినదే అయినా దానిని వదిలి పెట్టకూడదు. ఎందుకు? అసలు ఈ లోకంలో దోషం లేని కర్మ అనేది ఉండదు గనుక. అగ్ని రాజేసినపుడు ముందు పొగ రాక మానదు. అయితే బాగా విసురుతూ ఉంటే బాగా వెలిగి పొగ తొలగి పోతుంది. అలాగే ఎంత దోషంతో కూడుకున్న కర్మ అయినా క్రమంగా పట్టుదలతో, భగవత్‌స్మరణతో చేస్తుంటే అందులోని దోషం తొలగి పోతుంది. అందుకే-

సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్:-దోషంతో కూడినదైనా సహజ కర్మను వదలవద్దు అని భగవానుడు అర్జునుని నిమిత్తంగా చేసుకొని సర్వమానవాళికి హిత బోధ చేస్తున్నాడు. సహజ కర్మ అంటే జన్మతః వచ్చినది కాదు. స్వభావ రీత్యా వచ్చినది.

జడ్జీ కుమారుడు జడ్జీ, డాక్టరు కుమారుడు డాక్టరు, వ్యాపారి కుమారుడు వ్యాపారి, దొంగ కుమారుడు దొంగ - ఇవి జన్మతః వచ్చిన కర్మలే గాని సహజ కర్మలు కావు. సహజ కర్మలంటే నీలోని వాసనల ప్రేరణతో పెల్లుబికి పైకి వచ్చే కర్మలు. అవి నీ స్వభావానికి అనుగుణమైనవి.

ఒకడు ఉపాధ్యాయ వృత్తిని ఎంచుకున్నాడు. చక్కగా నిర్వహిస్తున్నాడు. మంచి పేరు వచ్చింది. సంతృప్తితో ఉన్నాడు. అది అతని సహజ కర్మ. ఒక ప్రత్తి వ్యాపారితో స్నేహం కుదిరింది. అతడి భోగ జీవితాన్ని చూస్తున్నాడు. లక్షల ఆదాయం. అంతగా శ్రమ లేదు. దానితో ఉద్యోగం మానేసి వ్యాపారంలో దిగాడు. సంపాదించినదంతా పెట్టుబడి పెట్టాడు. ఇంకా లక్షలకు లక్షలు అప్పు తెచ్చాడు. మొత్తం తుడిచి పెట్టుకుపోయింది. ఇప్పుడు నెలకు *2* వేల జీతంతో ప్రైవేటు

స్కూల్లో పాఠాలు చెబుతున్నాడు. కనుక దోషం ఉన్నా (గొప్ప ఆదాయం లేకున్నా) తన సహజ కర్మను విడిచి పెట్టరాదు.

మాంసం అమ్మటం  నీచ కర్మయే. కాని ధర్మవ్యాధుడు దానిని తన సహజ కర్మగా స్వీకరించాడు. ఓర్పుతో నేర్పుతో చేసి సంతృప్తికరమైన జీవితాన్ని గడిపి కౌశికుడనే బ్రాహ్మణునకు గురువయ్యాడు. మాంసం అమ్మటం నీచ వృత్తి గదా! అని వదిలి పెట్టలేదు. మరొక గౌరవనీయమైన వృత్తిని స్వీకరిద్దామనుకోలేదు. ఇదే సహజ కర్మ యొక్క ఘనత.

గాంధీగారి ఆశ్రమంలో వినోబాజీకి ఒక డ్యూటీ ఉంది. అది పాకీ పని. అయితే అది దోష యుక్తమని భావించలేదాయన. మలం తమో గుణం. మూత్రం రజోగుణం. నీరు సత్వ గుణం. ప్రతి రోజు ఈ *3* గుణాలను ఊడ్చి పారేస్తున్నానే భావంతో ఆ పని చేస్తూ సంతృప్తి చెందేవాడు. ఈ విధంగా త్రిగుణాతీతుడనయ్యే అవకాశం కలిగిందని ఆనందించే వాడు. ఇంతటి నీచమైన పని చెయ్యవలసి వచ్చిందే అనే  ఆలోచనే లేదు.

కనుక ఓ అర్జునా*!* యుద్ధం నీ సహజ కర్మ. అందులో దోషం ఉన్నా సరే*!* నీవు తప్పకుండా చేయవలసిందే. దాని ద్వారానే నీవు వాసనారహితుడవై నిర్మలుడవు అవుతావు- అని భగవానుడు శ్రేయస్సును బోధిస్తున్నాడు.

***-సహజ కర్మలు దోషంతో కూడినవైనా చేయాల్సిందే. ఎలా చేయాలి?***

శ్లో||   అసక్తబుద్ధిః సర్వత్ర
జితాత్మా విగతస్పృహః|
నైష్కర్మ్యసిద్ధిం పరమాం

సన్న్యాసేనాధిగచ్ఛతి|| (49)

*తా//* ఏ విషయంలోను తగులుకోని బుద్ధితో, మనస్సుని స్వాధీనంలో ఉంచుకొని, ఆశలు -కోరికలు లేకుండా, కర్మఫల త్యాగంతో కర్మలు చేస్తే ఉత్తమోత్తమమైన నైష్కర్మ్య సిద్ధిని పొందుతాడు.

*వ్యాఖ్య:-* ఇప్పటి వరకు చేయవలసిన కర్మల గురించి చెప్పి ఇప్పుడు ఆ కర్మలను చేసేటప్పుడు ఉండవలసిన నీ భావనలను తెలుపుతూ దానివల్ల కలిగే ప్రయోజనం ఏమిటో తెలియజేస్తున్నారు. అంటే కర్మల నుండి జ్ఞానంలోనికి ప్రవేశించేందుకు మార్గం చూపే సంధి శ్లోకం ఇది.

మోక్షాన్ని పొందాలంటే నైష్కర్మ్య సిద్ధిని పొందాలి. నైష్కర్మ్య సిద్ధిని పొందాలంటే కర్మలు చేసేటప్పుడు ఎలాంటి భావన ఉండాలో మూడు ముఖ్యమైన ఉపాయాలను భగవానుడిక్కడ అందిస్తున్నాడు. అవి-

1. సర్వత్రా అసక్తబుద్ధిః :- విషయాలకు అతుక్కొని పోకుండా ఉండే బుద్ధి. ప్రాపంచిక విషయాలకు, భోగాలకు, ధన సంపదలకు, సుఖాలకు అతుక్కుపోకుండా, చేస్తున్న కర్మల గురించి మాత్రమే ఆలోచించకుండా ఎల్లప్పుడూ పరమాత్మపైనే దృష్టి పెట్టి, ఆ పరమాత్మ సాన్నిధ్యానికై తపిస్తూ చిత్తశుద్ధి కొరకు చేసే కర్మలే అసక్త బుద్ధితో చేసే కర్మలు. సర్వత్రా- అంటే అన్ని వేళలా, అన్ని కర్మల యందు ఈ అసక్త బుద్ధి ఉండాలి.

కొందరు పూజలు, యజ్ఞాలు, దానాలు చేసి అందరితో అవే విషయాలను పదే పదే చెబుతారు, తలచుకుంటారు. నేనెంతో భక్తితో చేస్తాను, నాకు పరమాత్మ తప్ప ఈ ప్రాపంచిక విషయాలే గుర్తు రావు. అన్నీ ఎంతో జాగ్రత్తగా చేస్తాను...... ఇలా ఎప్పుడూ కర్మలతో సంగ భావమే. ఇది కాదు అసక్త బుద్ధి.

2. జితాత్మా :- ప్రపంచం మొత్తాన్నీ జయించవచ్చునేమోగాని తనను తాను జయించటం చాలా కష్టం. తన మనస్సును తన స్వాధీనంలో పెట్టుకోగలవాడు ప్రపంచాన్ని జయించిన వానికన్నా గొప్పవాడే. మనస్సెప్పుడూ ప్రాపంచిక విషయాలపైకే పరుగులు పెడుతుంది. అన్నింటిని కావాలంటుంది, దానితో ఆందోళనలు, ఆక్రోశాలు, ఆగ్రహాలు, అనర్థాలు తప్పవు. ఇలా వెళ్ళే మనస్సును వెనుకకు మళ్ళించి పరమాత్మపైకి మళ్ళించటమే మనో నిగ్రహం. అదే జితాత్మా అంటే. ఇలా మనో నిగ్రహంతో కర్మలు చేస్తేనే నైష్కర్మ్య సిద్ధి.

3. విగతస్పృహః :- ఆశలు, కోరికలు పూర్తిగ వదలిన స్థితియే విగతస్పృహః. ఆశలు, కోరికలు వదిలేస్తే ఇక సంకల్పాలే ఉండవు. బాహ్యంగా మనస్సు యొక్క పరుగులు ఉండవు. దానితో ఏకాగ్రత కలుగుతుంది. ధ్యానానుకూల స్థితి కలుగుతుంది. కర్మలను నిర్లిప్తంగా, నిష్కామంగా చేసి చిత్త శుద్ధిని పొందటం జరుగుతుంది. కనుక ఆశలు, కోరికలు వదలటం చాలా ప్రధానం.

ఈ 3 జాగ్రత్తలను తీసుకొని మన సహజ కర్మలను - వాసనలచే ప్రేరేపించబడే కర్మలను చేస్తే క్రమంగా నైష్కర్మ్య సిద్ధి తథ్యం.

4. నైష్కర్మ్య సిద్ధి :- నైష్కర్మ్య సిద్ధి అంటే కర్మలు చేయాలనే ప్రేరణ లేక పోవటమే. ఎలా వస్తుంది ఈ స్థితి?

5. సన్యాసేన :- సన్యాసం ద్వారానే. సన్యాసం అంటే త్యాగం. ఏమి త్యాగం? సంగ త్యాగం, వాంఛా త్యాగం, ఫల త్యాగం, సంకల్ప త్యాగం.

ఏ త్యాగమూ లేకుండా, ఏ జ్ఞానమూ లేకుండా కేవలం పశువులాగా ప్రేరణలకు అనుగుణంగా కర్మలు చేస్తూ ఉంటే పదే పదే ఆ కర్మలలో కూరుకు పోవటమే. చేసిందే చేయటం

అవుతుంది. గమ్యం తెలియని ప్రయాణం అవుతుంది. కనుక త్యాగంతోనే నైష్కర్మ్య సిద్ధిని పొందాలి.

***-నైష్కర్మ్య సిద్ధిని పొందినవాడు పరమాత్మని ఎలా చేరుకుంటాడు?***

శ్లో|| సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ
తథాప్నోతి నిబోధ మే|
సమాసేనైవ కౌంతేయ!
నిష్ఠా జ్ఞానస్య యా పరా|| (50)

*తా//* నైష్కర్మ్య సిద్ధిని పొందినవాడు బ్రహ్మన్ని ఎలా చేరుకుంటాడో సంక్షిప్తంగా నా వల్ల తెలుసుకో. అర్జునా! ఇది జ్ఞానం యొక్క శ్రేష్టమైన నిష్ట(అభ్యాసం).

*వ్యాఖ్య:-* పంజరంలో పక్షిని బంధించి పైకెగిరి పొమ్మంటే ఎక్కడకు ఎగిరిపోతుంది? స్థంభానికి త్రాళ్ళతో ఒకణ్ణి కట్టి వేసి ఇక పరుగెత్తమంటే ఎలా పరుగెత్తగలుగుతాడు. అలాగే కర్మలతో ఈ లోకానికి బంధించబడ్డ మనం పరమాత్మ దగ్గరకు ఎగిరి పోవాలంటే ఎలా పోగలుగుతాం?

కనుక నైష్కర్మ్య సిద్ధిని పొందితే తప్ప పరమాత్మను చేరుకోవటం అసంభవం. పరమాత్మను చేరుకోవటం అంటే మోక్షాన్ని పొందటమే. అంటే నేను పరమాత్మను అనే స్వస్వరూప అనుభూతిని చెందటమే. అది ఎలాగో సంక్షిప్తంగా చెప్పబోతున్నాను, కనుక అర్జునా! జాగ్రత్తగా విను- అంటున్నాడు భగవానుడు. సంక్షిప్తంగా అని ఎందుకంటున్నాడు? ఇంతకు ముందు విపులంగా 6వ అధ్యాయంలో ఈ ధ్యాన యోగ నిష్టను

చెప్పటం జరిగింది. కనుక దానిని ఇప్పుడు గుర్తు చేయటానికే సంక్షిప్తంగా చెప్పటం. అదీ గాక ఇది యుద్ధ రంగం గనుక చెప్పిన దానినే మళ్ళీ మళ్ళీ చెబుతూ ఉండటానికి అంతగా అవకాశం దొరకదు.

నైష్కర్మ్య సిద్ధిని పొందిన తరువాత ఇక పరమాత్మను అందుకోవటం ఒక్కటే మిగిలి ఉంది. ఆ మిగిలిపోయిన కార్యాన్ని పూర్తి చేయబోతున్నాడు భగవానుడు. అంటే భగవద్గీత యొక్క అంతిమ ఫలాన్ని అనుభవించ బోయే స్థితి ఇది. అందుకే ఈ రాబోయే *3* శ్లోకాలు*(51,52,53)* 'గీతాసారం' -లేదా 'సంక్షిప్త గీత' అని మహాత్ములచే ప్రశంసించబడుతున్నది.

*-ధ్యానయోగ విధానం రాబోయే 3 శ్లోకాలలో సంక్షిప్తంగా-*

శ్లో|| బుద్ధ్యా విశుద్ధయా యుక్తః
ధృత్యాత్మానం నియమ్య చ|
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా
రాగద్వేషౌ వ్యుదస్య చ|| *(51)*

*తా//* అతి నిర్మలమైన బుద్ధితో కూడిన వాడై, పట్టుదలతో, మనస్సును నిగ్రహించిన వాడు, శబ్దాది విషయాలను విడిచి పెట్టి, రాగద్వేషాలను వదలిపెట్టి....

*వ్యాఖ్య:-* ధ్యానం చక్కగా కొనసాగాలంటే దేహం, మనస్సు, బుద్ధి - ఈ మూడింటిని చక్కగా తయారు చేసి సంసిద్ధం చెయ్యాలి. కనుక ముందుగా మనస్సు, బుద్ధి - అనే రెండు పరికరాలను ఎలా సంసిద్ధం చెయ్యాలో తెలియజేస్తున్నారు ఈ శ్లోకంలో-

*1.* విశుద్ధయా బుద్ధ్యా యుక్తః:- విశుద్ధమైన బుద్ధితో కూడినవాడై- అంటే సాత్త్వికబుద్ధి ఉండాలి. పాప వాసనలు, కోరికలు లేని బుద్ధి కావాలి. బుద్ధిలో భోగాసక్తి ఉంటే కోరికలు

కలుగుతాయి. వాటిని తీర్చుకోవాలనే ఆలోచనలు వస్తాయి. అందువల్ల ధ్యానం కుదరదు. కనుక బుద్ధి శుద్ధంగా ఉండాలి.

2. ధృత్యా:-ధృతి అంటే పట్టుదల, ధైర్యం. సాత్త్విక బుద్ధితో పాటు సాత్త్విక ధృతి ఉండాలి. ప్రతి మానవుడు మానవ జన్మ యొక్క పరమ లక్ష్యమైన మోక్షాన్ని పొందాలనే పట్టుదలతో, ఆటంకాలను అధిగమించి, త్యాగాలకు సిద్ధపడి సాధన సాగించటమే సాత్త్విక ధృతి. ఇది కూడా ధ్యానానికి గొప్ప సాధనయే. ఎందుకంటే ధ్యానంలో ఎన్నో ఆటంకాలు వస్తుంటాయి.

దీనిని పురాణాలలో కథల రూపంలో చెబుతారు. ఒక మునీశ్వరుడు దీక్షతో తపస్సు చేస్తుంటే ఇంద్రుడు ఆ తపస్సును చెడగొట్టటానికి అప్సరసలను పంపిస్తుంటాడు. ఆ అప్సరసల వల్ల తపస్సు చెడగొట్టుకొనే వారు కొందరు, దీక్షగా సాగించే వారు కొందరు. తపస్సు అంటే ధ్యానమే. ఇంద్రుడు అంటే ఇంద్రియాలకు అధిపతి అయిన మనస్సే. మనస్సులో కలిగిన వికారాలే అప్సరసలు. అంటే ధ్యానం సాగించేటప్పుడు మనస్సులో కామ వికారాలు కలుగుతాయి. దానితో ధ్యానానికి ఆటంకం. ఆ వికారాలకు లొంగక పట్టుదలతో కొనసాగించే వారు గొప్ప ధ్యాన నిష్టా పరులు. కనుక మనస్సు కల్పించే ఆటంకాలను ధృతితో- పట్టుదలతో అధిగమించాలి.

3. ఆత్మానం నియమ్య చ:-మనస్సును నిగ్రహించటం. ధ్యానానికి ఇది ఎంతో ముఖ్యం. మనస్సు ఏదో కావాలని ఎప్పుడూ గోల పెడుతూనే ఉంటుంది. దేహేంద్రియాలు అందుకు అనుగుణంగా పరుగెడతాయి. దానితో ఒక్కొక్కప్పుడు విజయం, ఒక్కొక్కప్పుడు అపజయం. ఈ వ్యవహారాలలో మునిగి మనస్సు కోతిలాగా చలించి పోతుంది. దానితో ఏకాగ్రత చెడిపోతుంది. కనుక

మనస్సుకు ఒక అభ్యాసం కావాలి. అదే భగవత్‌స్మరణ- ఆత్మ విచారణ.

4.శబ్దాది విషయాలను విడిచి పెట్టుట :- శబ్ద స్పర్శ రూప రస గంధ అనే 5 విషయాలు ఈ లోకంలో ఉన్నాయి. వాటితో ఇంద్రియాలు సంయోగం చెందితే చాలు మనస్సు అల్లకల్లోలం అవుతుంది. చూడకూడని దృశ్యాలను కన్ను చూచినా, వినకూడని అమంగళకర శబ్దాలను చెవి విన్నా మనస్సు అల్లకల్లోలం అవుతుంది. కనుక అన్ని విషయాలను లోనికి ప్రవేశించనీయకుండా ఇంద్రియ ద్వారాల వద్దనే నిలుపు చేయాలి. ఇదే ఇంద్రియ నిగ్రహం,

5. రాగద్వేషౌ వ్యుదస్య చ :-మేలు చేసిన వారిపై రాగం, కీడు చేసిన వారిపై ద్వేషం సహజం. ఈ రాగద్వేషాలు మనస్సును అల్లకల్లోలం చేస్తాయి. కనుక వాటిని వదలాలి. ఎలా? ఈ ప్రపంచం మిధ్యయని, ఇక్కడి వస్తువులు విషయాలు నిజమైన ఆనందాన్ని ఇవ్వజాలవని గ్రహించిననాడు రాగద్వేషాలు వదిలి పోతాయి. అప్పుడే మనస్సు ప్రశాంతమై ఏకాగ్రమవుతుంది.

*-ఇంతవరకు మనో బుద్ధులు ఎలా ఉండాలో తెల్పి, ఇప్పుడు శరీరం ఎలా ఉండాలో - బాహ్య పరిస్థితులు ఎలా ఉండాలో తెలియజేస్తున్నారు.*

శ్లో|| వివిక్తసేవీ లఘ్వాశీ
యతవాక్కాయమానసః|
ధ్యానయోగపరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః|| (52)

తా// ఏకాంత ప్రదేశంలో నివసిస్తూ, మితాహారాన్ని తీసుకుంటూ, మనోవాక్కాయములను స్వాధీనంలో

ఉంచుకుంటూ, నిత్యం ధ్యానయోగంలో ఉంటూ, వైరాగ్యాన్ని ఆశ్రయించి-

*వ్యాఖ్య:-* 1. వివక్తసేవీ :- ఏకాంత ప్రదేశాన్ని ధ్యానానికి ఎంచుకోవాలి. ప్రారంభంలో ధ్యానానికి ఏకాంతం కావాలి. సైకిల్ త్రొక్కటం ముందు జనసంచారం లేని చోట నేర్చుకోవాలి. ఆ తర్వాత ఎందరు జనంలో త్రొక్కినా ఫరవాలేదు. అలాగే ధ్యానంలో కుదురుకున్న తర్వాత ఎందరిలోనైనా చేయవచ్చు. ఒక్కరే ఉంటే భయంగా ఉంటుంది అనుకుంటే భక్తులు, సజ్జనులు, మహాత్ములు మొ||న వారి సాన్నిధ్యంలో చేయవచ్చు.

2.లఘ్వాశీ :- అతిగా తిన్నా, అసలు తినకున్నా ధ్యానం కుదరదు. కనుక మితంగా తినాలి. గాలి ఎక్కువగా తీసుకుంటే ఆయుర్వృద్ధి. ఆహారం ఎక్కువగా తీసుకుంటే ఆయుక్షీణం. ఆకలి తీరటం కోసం తినాలి గాని రుచి కోసం తినరాదు. ఆకలి తీర్చుకొనుటకు తినటం యోగి లక్షణం. రుచి కోసం తినటం భోగి లక్షణం. భోగం రోగానికి దారి తీస్తుంది. అలాగే మనం తినే ఆహారం మితంగా ఉండటం మాత్రమే కాదు, అది సాత్త్విక ఆహారమై ఉండాలి. భగవదర్పితం చేసి తినాలి. న్యాయార్జిత ఆహారం కావాలి. అప్పుడే మనస్సు ధ్యానానుకూలమవుతుంది.

3.యత వాక్కాయ మానసః :- వాక్కు, శరీరం, మనస్సు- వీటిని అదుపులో ఉంచుకోవాలి., వాక్కును అదుపులో ఉంచుకోవటం అంటే అవసరమైనంత వరకే మాట్లాడటం. అతిగా వాగకుండా ఉండటం., ఇతరుల గురించి చెడుగా మాట్లాడటం గాని, పెద్దలను పూజ్యులను అవమానిస్తూ మాట్లాడటం గాని, దైవ దూషణ చేయటం గాని, అబద్ధాలు, ప్రగల్భాలు పలకటం గాని - ఇవి ధ్యాన యోగికి హాని కలిగించేవి అని తెలుసుకోవాలి.

శరీరం పది మందికి మేలు చేయటంలో నిమగ్నం కావాలి. లేదా సత్కార్యాలు, దైవ కార్యాలు చేయటంలో నిమగ్నం కావాలి. నిషిద్ధ కర్మలు ఆచరించరాదు.

ఇక మనస్సు ప్రాపంచిక విషయాలను వదిలి భగవత్ సంబంధమైన విషయాలలో నిమగ్నం కావాలి. జపం, ధ్యానం, తపస్సు, నామస్మరణ, ఆత్మ విచారణ మొ||న వాటితో మనస్సు నింపాలి. నిరంతరం ఆధ్యాత్మిక జ్ఞానాన్ని మననం చేసుకుంటూ ఉండాలి. బాహ్య ప్రపంచంలో మన దృష్టికి వచ్చిన విషయాలను వేదాంత పరంగా పోల్చుకుంటూ ఎల్లపుడూ దైవచింతనలో ఉండాలి. ఇలా మనస్సును, వాక్కును, శరీరాన్ని దైవ విషయాలతో నింపితే అవి స్వాధీనంలో ఉన్నట్లే.

*4. ధ్యానయోగపరః :-* ధ్యాన యోగ పరుడై ఉండాలి. ధ్యానం రోజూ కొద్ది సేపు చేసేది *గదా!* ఎల్లప్పుడు ఎలా చేయటం? అని కొందరి సందేహం. ధ్యానం అంటే ధ్యాస. ఎల్లపుడూ ధ్యాస భగవంతునిపై ఉండటమే ధ్యాన యోగ పరుడై ఉండటం. మనస్సు ఆత్మ గురించి విచారణ చేసీ చేసీ చివరకు ఆత్మలోనే అంతమై పోవాలి. అదే ధ్యాన పరాకాష్ట.

క్రొత్తగా పెళ్ళయిన దంపతులు ఎలా నిరంతరము ఒకరినొకరు తలచుకుంటూ, ఒకరిని విడిచి మరొకరు ఒక్క క్షణం కూడా ఉండలేనట్లు తపన చెంది పోతుంటారో అలాగే ఒక్క క్షణం కూడా వదలకుండా పరమాత్మ ధ్యాసలో ఉండిపోవాలి. మనం ఏమి చేస్తున్నా, ఏమి తింటున్నా, ఏమి చూస్తున్నా, ఎక్కడ తిరుగుతున్నా ఆ పరమాత్మనే లక్ష్యంగా పెట్టుకోవాలి.

*5. వైరాగ్యం సముపాశ్రితః :-* వైరాగ్యం చాలా రకాలు. ప్రసూతి వైరాగ్యం, స్మశాన వైరాగ్యం, పురాణ వైరాగ్యం. ఇవి ఆకస్మికంగా, ఉద్రేకంతో వస్తుంటాయి. అలాగే కొద్ది

సమయంలోనే పోతాయి. అలా కాకుండా వివేకంతో కలిగే వైరాగ్యమే శాశ్వతమైనది. అట్టి వైరాగ్యమే ధ్యానానికి అనుకూలంగా ఉంటుంది. ఈ ప్రపంచం అనిత్యమని, అసత్యమని, మిధ్యయని తెలిసినప్పుడు దీనిపై వైరాగ్యం కలుగుతుంది. అప్పుడే మనస్సు అలజడులకు, ఆందోళనలకు దూరమై భగవంతునికి దగ్గరవుతుంది. అప్పుడే ధ్యానానికి అనుకూలంగా ఉంటుంది.

*-ఇక ముఖ్యంగా విడిచి పెట్టవలసినవేమిటో తెలియజేస్తున్నారు.*

*శ్లో||* అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహమ్|
విముచ్య నిర్మమః శాంతః
బ్రహ్మభూయాయ కల్పతే|| *(53)*

*తా//*:-అహంకారాన్ని, బల దర్పాలను, కోరికలను, క్రోధాన్ని, వస్తు పరిగ్రహాన్ని వదిలి, మమకారాన్ని పరిత్యజించి, శాంతుడై బ్రహ్మస్వరూపుడయ్యేందుకు అర్హతను పొందుతాడు.

*వ్యాఖ్య:*- 1. అహంకారం :- మనం చేసే పనులలో నేను -నేను అని ముందుకు వచ్చేదే అహంకారం. నిజంగా ఇక్కడ జరగవలసినవన్నీ ప్రారబ్ధం ప్రకారం జరిగిపోతున్నాయి. అయితే గొప్ప పనులు జరిగినప్పుడు నేను అని ముందుకు వచ్చేదే అహంకారం. అహంకారం అడ్డు ఉన్నంత వరకు ఆత్మను దర్శించలేము. కనుక అంతా నా వల్లనే జరుగుతున్నదనే భావం పోవాలి.

2. బలం:- మనం కోరుకున్న దానిని పొందాలన్నా, పొందిన దానిని నిలుపుకోవాలన్నా బలం కావాలి. ప్రాపంచిక విషయాల కొరకు చూపే బలం పశుబలం. దీన్ని విడిచిపెట్టాలి.

3. దర్పం :- ధనం ఉన్నా, సంపదలున్నా, విద్య ఉన్నా, రూపం ఉన్నా, శక్తి ఉన్నా కీర్తి ఉన్నా, పదవి ఉన్నా, తెలివితేటలున్నా, వాక్చాతుర్యం ఉన్నా మనకు తెలియకుండానే మనలో ప్రవేశించేది ఈ దర్పమే. ఈ దర్పం వల్ల పెద్దలను తిరస్కరిస్తాం. అన్నీ నాకు తెలుసుననే అహంభావం ప్రదర్శిస్తాం. ఇది కూడా ధ్యానానికి వ్యతిరేకమే కనుక దీనిని తప్పకుండా వదలాలి.

4. కామం, క్రోధం :- దేనిని గురించైనా తెలుసుకున్నప్పుడు అది నాకు కావాలి అనుకుంటాం. అదే కామం. దానిని పొందటంలో ఎవరైనా అడ్డుపడితే వచ్చేది క్రోధం. క్రోధానికి మూలం కామమే. కనుక ముందు కామాన్ని జయించాలి. ఎలా?

ఒక కుక్కను యజమాని ముద్దాడుతున్నాడు. అది చూచి ఒక సాధువు, "నీవిలా కుక్కపై మక్కువతో ఉంటే అది ఎప్పుడో నిన్ను కరుస్తుంది. కనుక దాన్ని దూరంగా తోసెయ్యి" అన్నాడు. ఆ యజమాని దాన్ని దూరంగా త్రోసేశాడు. కాని అలవాటు చొప్పున ఆ కుక్క మళ్ళీ మళ్ళీ యజమాని పైకి వస్తూనే ఉంది. ఆయన ప్రతి సారి దాన్ని ఛీకొట్టి, ముట్టె మీద దెబ్బ వేసి దాన్ని త్రోసేస్తూ ఉన్నాడు. చివరకు అది రావటం మానేసింది.

ఆ కుక్కయే కోరిక. మనం ఎన్నో జన్మల నుండి కోరికలను పెంచుకుంటూ, తీర్చుకుంటూ ఇదే గొప్పని, జీవిత పరమార్థమని భావించాం. ఇప్పుడు మహాత్ముల యొక్క, గురువుల యొక్క మాటలు విని వాటిని దూరంగా త్రోసేయాలనుకున్నాం. అయినా ఆ కోరికలు అంత తేలికగా

మనలను వదలి పోవు. అయినా సరే మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాలి. కోరిక కలిగినప్పుడల్లా వాటిని ఛీ కొట్టాలి. వాటి వల్ల కలిగే కష్ట నష్టాలను, దోషాలను విచారణ చేస్తూ ఉండాలి. ఇలా చేస్తూ నిరంతరం వాటిని ఛీకొడుతుంటే ఏదో ఒకనాటికి అవి మనను వదిలిపోతాయి.

ఇలా కామాన్ని జయిస్తే క్రోధం దానంతట అదే తొలగి పోతుంది. క్రోధమే కాదు, దాని స్నేహితులు లోభం, మోహం, మదం, మాత్సర్యం కూడా తొలగి పోతాయి. మనస్సు నిర్మలమవుతుంది. ధ్యానానుకూలమవుతుంది.

*5. పరిగ్రహం :-* అవసరానికి మించి భోగ సామాగ్రులను చేర్చి పెట్టుకోవటమే పరిగ్రహం. ఆహారం, నివాసం, వస్త్రం మొ॥నవి అవసరాలు. వాటిని తప్పనిసరిగా సంపాదించుకోవాలి. కాని వాటితో తృప్తి చెందక లోకంలోని సమస్త భోగ్య వస్తువుల కొరకు తాపత్రయం చెందితే మనస్సుకు సుఖం, శాంతి కరవవుతాయి.

*కొమ్మలు ఎక్కువగా ఉంటే చెట్టు ఎత్తు పెరగదు.

*సామాను ఎక్కువగా ఉంటే ప్రయాణం సుఖంగా సాగదు.

మనిషి ఒంటరిగా ఉన్నప్పుడు రెండు పాదాలు. పెళ్ళయితే *4* పాదాలు. పశువైపోతాడు. పిల్లలు పుడుతుంటే *6* కాళ్ళు, *8* కాళ్ళు, *10* కాళ్ళు అవుతాయి. అప్పుడు పురుగైపోతాడు. కాళ్ళు ఎన్ని ఎక్కువైతే అంతగా భూమిపై ఆధారపడాలి. కాళ్ళు తక్కువైతే స్వతంత్రం ఎక్కువ. కనుక పరిగ్రహం మానుకోవాలి.

*6.విముచ్య :-* కనుక ఈ ఐదింటిని విడిచి పెట్టాలి. అప్పుడే మనస్సుకు ఏకాగ్రత, ధ్యాననిష్టకుదిరేది. అయితే ఎలా వదలాలి? దేవాలయానికి వెళ్ళినప్పుడు బయట చెప్పులు వదిలినట్లా? కాదు. పూర్తిగా వదలాలి. మళ్ళీ వాటిని తలచుకోకూడదు. అప్పుడే మనస్సులోని కల్మషాలన్నీ తొలగి పోయేది.

4. నిర్మమఃశాంతః :- అన్నీ వదలి. వాటిపై మమకారాన్ని వదిలేస్తేనే శాంతి. ఈ శాంతి స్మశానంలోని నిశ్శబ్దం కాదు. ఎడారిలోని ఏకాంతమూ కాదు. ఆ పరమపదంలో - బ్రహ్మ పదంలో అనుభవించే బ్రహ్మానందం వల్ల కలిగే శాంతి. వివేకం వల్ల కలిగే శాంతి. ఇలా శాంతించిన మనస్సును ధ్యాన యోగం ద్వారా ఆత్మయందు నిలిపి ఆత్మనే ధ్యానిస్తూ ఉంటే చివరకు మనస్సు ఆత్మలో అంతమవుతుంది. ఆత్మా కారం అవుతుంది.

బ్రహ్మభూయాయ కల్పతే :- అలా ఆత్మలో మనస్సును నిల్పి ఆత్మను ధ్యానిస్తూ, ఆత్మ విచారణ చేస్తూ ఆత్మలోనే మనస్సును అంతం చేసిన వాడే బ్రహ్మ ప్రాప్తికి అర్హుడవుతాడు. మోక్ష ప్రాప్తికి అర్హుడవుతాడు.

*-జీవన్ముక్తుడు ఈ లోకంలో ఎలా ప్రవర్తిస్తాడు? అతడికి ఫలితం ఏమిటి?*

శ్లో|| బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి|
సమః సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరామ్|| (54)

*తా//*:-పరమాత్మతో ఐక్యత సాధించిన జీవన్ముక్తుడు ప్రశాంత చిత్తుడై; దేనినీ కోరడు, దేని కొరకు శోకించడు. సమస్త భూతములందు సమబుద్ధి కలిగి ఉంటాడు. నా యందు పరమ భక్తిని కలిగి ఉంటాడు.

*వ్యాఖ్య:-* జీవన్ముక్తుడు ఎలా ఉంటాడు? ఎలా ప్రవర్తిస్తాడు?

1. ప్రసన్నాత్మా :-నీరు నదిలో ఉన్నంత కాలం పరుగులు తీస్తూ ఉంటుంది. సముద్రాన్ని చేరితే? అన్ని ఉరుకులు పరుగులు ఆగి

పోయి ప్రశాంతమవుతుంది. అలాగే మనస్సు జీవ భావంలో ఉన్నంత వరకు పరుగులే పరుగులు. ప్రాపంచిక విషయాల వైపుకే పరుగులు తీస్తుంది. అప్పుడప్పుడు పరమాత్మ వైపుకు కూడా పరుగులు తీస్తుంటుంది. అనుకున్నది సాధిస్తే పొంగి పోతుంది. కోరిన కోరికలు తీరక పోతే క్రుంగి పోతుంది. కొందరిని నా వారు అని దగ్గరకు తీస్తుంది. కొందరిని నా విరోధులు అని దూరం పెడుతుంది. వీటన్నింటి మధ్య నలిగి పోతూ ప్రశాంతంగా నిర్మలంగా ఉండలేదు మనస్సు. ఎప్పుడైతే ఈ జీవ భావాన్ని వదిలి మనస్సు బ్రహ్మ భావనలో చేరి పోతుందో ఇప్పుడిక దానికి ఏ గొడవలు, గందరగోళాలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు ఉండవు. ప్రశాంతంగా ఉంటుంది. నిస్తరంగ జలరాశిలాగా ప్రశాంత గంభీరంగా ఉంటుంది. అది జీవన్ముక్తుని - బ్రహ్మ భావనలో నిలిచిన వాని స్థితి. అతడు ఎలా ప్రవర్తిస్తాడు?

*2.నశోచతి, నకాంక్షతి* :- దేనినీ కోరడు, దేనికీ శోకించడు. ఆత్మ స్థితిలో ఉన్న జీవన్ముక్తుడు ఆనంద స్వరూపంగా - ప్రశాంతంగా ఉండి పోతాడు. అతడికి ఈ లోకంలో కోరవలసింది ఏమీ లేదు. సామాన్యులందరికి ఏవో కొరతలు, అందువల్ల కోరికలు, వాటిని తీర్చుకొనుటకు కర్మలు చేయాలి. ఆ కర్మలు ఫలిస్తే సంతోషం, ఫలించక పోతే దుఃఖం. కాని జీవన్ముక్తుడికి ఏ కోరికలు లేవు. కనుక ఏ కర్మలు చేయవలసిన అవసరం లేదు. కనుకనే నశోచతి - శోకించడు అనటం.

*3. సమస్సర్వేషుభూతేషు*:- అన్ని భూతముల పట్ల సమభావంతో ఉంటాడు. కొందరిపై రాగం, కొందరిపై ద్వేషం ఉండదు. దేహ దృష్టి, మనోదృష్టి ఉన్న సామాన్యులకే ఈ రాగద్వేషాలు. ఆత్మలో ఐక్యమై ఆత్మానుభూతి చెందిన వారు సర్వత్రా ఆత్మనే దర్శిస్తారు గనుక సమదృష్టే ఉంటుంది. పాల కోవా తయారు చేసే వారు

పాకం పట్టిన తర్వాత దానిని ఆరబెట్టి డైమన్ ఆకారంలో, హృదయాకారంలో, కజ్జికాయల రూపంలో, గుండ్రంగాను, కోస్తారు. ఇంకా కొందరు చిలక అచ్చుల్లో పోస్తారు, కొందరు బొమ్మ అచ్చుల్లో పోస్తారు. కొందరు సీతాఫలం అచ్చుల్లో పోస్తారు. ఇలా రకరకాలుగా తయారు చేసి షాపుల్లో పెడతారు. చిన్న పిల్లలు నాకు డైమన్ వద్దు హృదయం కావాలి అంటారు. కొందరు సీతాఫలం కావాలి అంటారు. కొందరు బొమ్మ కావాలి అంటారు. కాని పెద్ద వారైతే ఏదైతే ఏముంది ఒక పావు కిలో ఇవ్వండి అంటారు. ఎందుకంటే పిల్లలు పైపై ఆకారాన్ని చూస్తారు. పెద్దలేమో అసలు వస్తువును చూస్తారు.

అలాగే సామాన్యులు పైపై నామ రూప గుణాలను చూచి రాగంతోనో ద్వేషంతోనో ఉంటారు. జ్ఞానులేమో అంతా ఆత్మయేగదా*!* అని ఏ రాగద్వేషాలు లేకుండా సమంగా చూస్తారు. ఇదే అందరి పట్ల సమదృష్టి- ఆత్మ దృష్టి. ఇట్టి దృష్టిగలవారికి ఫలితం ఏమిటి?-

4. మద్భక్తింలభతేపరాం:- నా యందు పరాభక్తిని కలిగి ఉంటారు. పరాభక్తి అంటే జ్ఞానంతో కూడిన భక్తి. ఇది శ్రేష్ఠమైన భక్తి. భగవత్తత్త్వాన్ని ఉన్నది ఉన్నట్లుగా గ్రహించి, ఆ భగవత్తత్వంలో ఐక్యమైన భక్తి. గోపికలకు శ్రీకృష్ణుని యందు గల భక్తి. ఈ భక్తి విషయాన్నే "నారద భక్తి సూత్రాల"లో నారదుడు తెలియజేశాడు. ఇట్టి భక్తినే "వివేక చూడామణి"లో శంకరాచార్యుల వారు ఇలా తెలియజేశారు.

"స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే" - అని.

అంటే తన స్వరూపమైన ఆత్మను శ్రవణ మనన నిధి ధ్యాసనల ద్వారా తెలుసుకొని నిత్యము నిరంతరము అట్టి స్వరూప ఆత్మతో అనుసంధానమైయుండుటే భక్తి - నిజమైన భక్తి అని. జీవన్ముక్తుడు ఇట్టి భక్తినే కలిగియుంటాడు. ఈ పరాభక్తికి -

జ్ఞానానికి భేదం లేదు. ఇట్టి జీవన్ముక్తుడు సాక్షాత్తు పరమాత్మయే.

*-ఇట్టి భక్తి వల్ల అంతిమ ఫలం ఏమిటో తెలియజేస్తున్నారు.*

**శ్లో|| భక్త్యా మామభిజానాతి**
**యావాన్యశ్చాస్మి తత్త్వతః|**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా**
**విశతే తదనంతరం|| (55)**

*తా//:-*ఇట్టి భక్తి ద్వారా నేనెవరినో, ఎంతటి వాడనో యదార్థంగా తెలుసుకోగలుగుతాడు. దాని వల్ల నా వాస్తవ తత్త్వాన్ని తెలుసుకొని ఆ తరువాత నాలో ప్రవేశిస్తాడు.

*వ్యాఖ్య:-* భగవంతుని యదార్థ తత్త్వం తెలుసుకోవటం భక్తి వల్లనే సాధ్యం అని భగవానుడే స్వయంగా తెలియజేస్తున్నాడు. ఆయన ఎంతటి వాడో, ఆయన మాహాత్మ్యం ఎట్టిదో అంచనా వెయ్యటానికి మన దగ్గర సరైన పరికరాలు లేవు. ఒక్క భక్తి వల్లనే తెలుస్తుంది తప్ప వేరే ఉపాయం లేదు. గోపికలకు తెలిసినట్లు, నారదునికి తెలిసినట్లు, ప్రహ్లాదునికి తెలిసినట్లు ఇతరులకు తెలియదు. ఎందుకంటే అలాంటి పరాభక్తి ఇతరులకు లేదు గనుక. మన దృష్టిలో భక్తి అంటే దేవాలయాలకు, పుణ్యక్షేత్రాలకు వెళ్ళటం, అష్టోత్తరాలు - సహస్రనామార్చనలు చేయించటం. తీర్థ స్నానాలు చేయటం - ఇదే భక్తి అనుకుంటాం. కాని ఇది నిజమైన భక్తి కాదు. మరి నిజమైన భక్తులెవరు?

భగవంతుని యొక్క యదార్థ తత్త్వాన్ని శాస్త్రాల ద్వారా, గురువుల ద్వారా తెలుసుకొని, ఆ భగవంతుని చేరుకోవటమే తన జీవిత పరమార్థమని గ్రహించి, ఆ భగవంతుని కోసం సమస్తాన్నీ తృణప్రాయంగా త్యజించి, సాకారోపాసన ద్వారానో,

నిరాకారోపాసన ద్వారానో నిరంతరము ఆ భగవంతునే భజించేవారు; తింటున్నా, తిరుగుతున్నా, కూర్చున్నా, నిలుచున్నా, మాట్లాడుతున్నా, పోట్లాడుతున్నా ఆ భగవంతుని గురించే ఆలోచిస్తూ ఎవరు సదా భగవంతుని ధ్యాసలో మునిగిపోతారో వారే నిజమైన భక్తులు. భగవంతుని చేత సర్టిఫై చేయించుకున్న భక్తులు.

ఇట్టి పరాభక్తులే భగవత్తత్వాన్ని యదార్థంగా తెలుసుకొని, ఆ తరువాత భగవంతునిలో ప్రవేశిస్తారు. అయితే ముందు తప్పకుండా తెలుసుకోవాలి. అందుకే 'జానాతి' అనకుండా 'అభిజానాతి' అన్నారు. అంటే బాగా తెలుసుకోవాలి - అని. అలా తెలుసుకొని భగవంతునిలో ప్రవేశిస్తారు.

ప్రవేశించటం అంటే ఎలుక కన్నంలోనికి ప్రవేశించినట్లు కాదు. దొంగ ఇంటిలో ప్రవేశించినట్లు కాదు. ఎందుకంటే ఎలుక గాని, దొంగ గాని ప్రవేశించి అలాగే ఉండి పోరు గదా! మరి ఎలాగ? ప్రతిబింబం బింబాన్ని చేరినట్లు జీవాత్మ పరమాత్మయే అయినట్లు. ఎలా?

క్రింద బక్కెట్‌లో నీరు పోసి సూర్యబింబానికి ఎదురుగా పెడతాం. ఆ సూర్యబింబం ఈ నీటిలో ప్రతిబింబిస్తుంది. ఈ ప్రతిబింబం బింబాన్ని ఎలా చేరుతుంది? బక్కెట్‌ను తన్నేస్తే సరి. ఇక నీరుండదు, ప్రతిబింబం ఉండదు. బక్కెట్ శరీరం నీరు మనస్సు. ప్రతి బింబం జీవాత్మ. నీరున్నంత వరకు ప్రతిబింబం ఉండి కదులుతూ, వణుకుతూ, విరిగి పోతూ ఉంటుంది. నీరు తీసేస్తే బింబం మాత్రమే స్థిరంగా ఉంటుంది. అలాగే మనస్సును తీసేస్తే ఇక జీవాత్మ ఉండదు. కేవలం పరమాత్మే ఉంటుంది. అంటే జీవాత్మ పరమాత్మేనని తెలిసిపోతుంది. ఇదే ప్రవేశించటం అంటే. కనుక-

*భక్తి చేతనే భగవంతుని గూర్చిన యదార్థ జ్ఞానం తెలుస్తుంది.

* అట్టి జ్ఞానం చేతనే ముక్తి - లేదా మోక్షం కలుగుతుంది - అని గ్రహించాలి.

*-మరి ఒక సామాన్యుడు ఇలా విన్నదానినంతా ఒక్కసారిగా ఆచరణలోనికి తెచ్చుకోలేడు గనుక అందరికీ ఒక హిత బోధ చేస్తున్నాడు భగవానుడు.*

శ్లో|| సర్వకర్మాణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః|
మత్ప్రసాదాదవాప్నోతి
శాశ్వతం పదమవ్యయమ్|| *(56)*

*తా//*:-ఎల్లప్పుడూ అన్ని కర్మలను చేస్తూ కూడా నన్నే ఆశ్రయించి, నా అనుగ్రహంతో శాశ్వతము, అవ్యయము అయిన స్థానాన్ని పొందుతారు.

*వ్యాఖ్య*:- ఇంతవరకు ఉపాసనతో కూడిన జ్ఞానయోగవిధిని చెప్పారు. అన్ని పరిగ్రహాలను వదిలి, మనో బుద్ధులను శుద్ధి చేసుకొని, కోరికలను, భోగాసక్తిని వదిలి, ఏకాంతంలో ఆత్మ ధ్యానంతో బ్రహ్మ భావనను పొందుతాడని; అట్టి వాడే పరమ భక్తిని పొంది, ఆ భక్తి వల్లనే భగవంతుని యదార్థంగా తెలుసుకొని మోక్ష ప్రాప్తిని పొందుతాడని చెప్పారు.

అయితే కోరికలను, భోగాసక్తిని వదలటం సామాన్యుడికి ఒక్కసారిగా కుదరదు. అలాగని భయపడటం, నిరాశ చెందటం కూడదు. ధైర్యంతో, పట్టుదలతో పరమాత్మ వైపుకు అడుగులు వేయాలంటే ఆచరణ సాధ్యమైన ఏదో ఒక ఉపాయం కావాలి. అందుకే సామాన్యులను దృష్టిలో పెట్టుకొని భగవానుడు తెలియజేస్తున్నాడు.

ప్రతి జీవి అందుకోవలసిన స్థానం మోక్షమే - పరమాత్మ పదమే. ఎలాంటిది ఆ పదం?

1. శాశ్వతం - అవ్యయం పదం :- నాశనం లేనటువంటి - ఎల్లప్పుడూ ఉండేటటువంటి పదం పరమాత్మ స్థానం. అట్టి స్థానాన్ని అందుకోవాలంటే-

2 మత్ప్రసాదాత్:- నా అనుగ్రహం కావాలి. అంటే భగవంతుని అనుగ్రహం ఉంటేనే పరమపదం - మోక్షం. మరి భగవంతుని అనుగ్రహం ఎలా లభిస్తుంది? దానికే ఉపాయం చెబుతున్నాడు భగవానుడు.

3. మద్వ్యపాశ్రయః :- భగవంతుని ఆశ్రయించాలి. శరణాగతి చెందాలి. అంటే భగవంతుడు కాకారాయుడా? తనను ఆశ్రయించిన వారిని అనుగ్రహించటం, ఆశ్రయించని వారిని ద్వేషించటం - ఇదా ఆయన లక్షణం? కాదు. అసలు భగవంతుడు అనుగ్రహ రూపుడే. ఆయన అనుగ్రహ వర్షం అంతటా కురుస్తూనే ఉంటుంది. ఎవరైతే ఆయన వైపుకు తిరుగుతారో వారు ఆ అనుగ్రహ వర్షంలో తడిసి పునీతులవుతారు. ఎవరైతే ఆయనను వదిలి ఈ ప్రాపంచిక విషయాలలో మునిగిపోతారో - తలుపులు బిగించుకొని లోపల కూర్చుంటారో వారు అనుగ్రహ వర్షంలో తడిసి పునీతులు కాలేరు. అంతే.

అంటే మోక్షం పొందాలంటే భగవంతుని అనుగ్రహం కావాలి. భగవంతుని అనుగ్రహం కావాలంటే ఆయనను ఆశ్రయించాలి. మరి మన పనులు మానుకొని ఆయనను ఆశ్రయించాలా? - అవసరం లేదు. మరెలా?

4. సదా సర్వకర్మాణి కుర్వాణ అపి:- సమస్త కర్మలను ఎల్లప్పుడూ చేస్తూనే భగవంతుని ఆశ్రయించవచ్చు. ఎలా ? "హాత్ మేకామ్, దిల్ మేరామ్"- చేతులు కర్మలలో - మనస్సు

భగవంతునిలో ఉండాలి. భగవంతుని స్మరిస్తూనే అన్ని కర్మలు చేస్తూ ఉండాలి. అప్పుడే మనకు భగవంతుని రక్షణ లభిస్తుంది.

*పిల్లవాడు ఒక చేతితో స్థంభాన్ని పట్టుకొని దాని చుట్టూ గిరగిర తిరుగుతాడు. అలా ఎంత సేపు తిరిగినా పడిపోడు. కాని స్థంభాన్ని వదిలాడా? కళ్ళుదిరిగి పడిపోతాడు. స్థంభం భగవంతుడు. తిరగటం పని.

*తలమీద నీటి కలశాన్ని పెట్టుకొని భరతనాట్యం చేసే నాట్యకత్తె పాటకు, తాళానికి అనుగుణంగా కాళ్ళు నాట్య విన్యాసం చేస్తున్నా ఆమె దృష్టి అంతా తలమీద ఉన్న నీటి కలశం మీదనే ఉంటుంది. అలాగే మనం ఎలాంటి లౌకిక కర్మలు చేస్తున్నా మన దృష్టి - మనస్సు మాత్రం పరమాత్మ మీదనే నిలపాలి.

ఇలా భగవంతునే లక్ష్యంగా పెట్టుకొని, భగవంతునే స్మరిస్తూ, భగవంతునే ఆశ్రయించి, ఆయననే పరమగతిగా భావించి ఏ కర్మలు చేసినా ఫరవాలేదు. భగవంతుని అనుగ్రహం తప్పకుండా లభిస్తుంది. దానితో శాశ్వత మోక్ష పదవి సిద్ధిస్తుంది. అని భగవానుడు సర్వ మానవులకు ఉపాయాన్ని తెలియజేస్తున్నాడు.

*-భక్తితో కూడిన కర్మల వల్ల భగవంతుని అనుగ్రహం కలిగి తద్వారా మోక్ష ప్రాప్తి కలుగుతుందని సర్వ మానవులను దృష్టిలో పెట్టుకొని చెప్పి, ఇప్పుడు భగవానుడు అర్జునునికి అంతిమ బోధను - ఆచరణాత్మక బోధను అందిస్తున్నాడు. ఇది అర్జునునికే గాదు- అర్జునుని నిమిత్తంగా చేసుకొని సర్వమానవాళికి భగవంతుడు చేసే చిట్ట చివరి హిత బోధ. ఈ రాబోయే 10 శ్లోకాలలోని బోధ పరమాత్మ యొక్క అంతిమ సందేశం. గీతాసారం.*

**శ్లో|| చేతసా సర్వకర్మాణి**
**మయి సన్న్యస్య మత్పరః|**
**బుద్ధియోగముపాశ్రిత్య**
**మచ్చిత్తః సతతం భవ|| *(57)***

**తా//:- అర్జునా! అన్ని కర్మలను వివేకంతో కూడిన బుద్ధితో నాయందే సమర్పించి, నన్నే పరమ గతిగా పెట్టుకొని, జ్ఞాన యోగాన్ని ఆశ్రయించి, ఎల్లప్పుడూ నాయందే చిత్తాన్ని నిలిపిన వాడవు కమ్ము.**

**వ్యాఖ్య:- పరమాత్మయందే చిత్తాన్ని నిల్పాలి. ఎలా?**

**1. సర్వకర్మాణి మయి సంన్యస్య :- కర్మలు చెయ్యాలి. అవి ఏ కర్మలైనా సరే. లౌకిక కర్మలైనా, భగవత్ సంబంధమైన కర్మలైనా - ఏవైనా సరే. ఎలా చెయ్యాలి? భగవంతునికి అర్పించి చెయ్యాలి. కర్మలనర్పించుట అంటే కర్మ ఫలాలనర్పించుటయే. కర్మలు చేసేది శరీరంతో. మరి కర్మ ఫలాలర్పించేది -'చేతసా' మనస్సుతో. నిర్మలమైన మనస్సుతో- ఇంకా చెప్పాలంటే వివేకంతో కూడిన బుద్ధితో సర్వ కర్మల ఫలాలను**

సమర్పించాలి- కర్మలు చేయటం గొప్ప కాదు. వాటిని భగవంతుని కర్పించుటయే గొప్ప. ఇలా కర్మలు చేస్తూనే మనస్సు భగవంతుని యందు నిలవాలంటే ఎలా?

2 మత్పరః:- నన్నే పరమ ప్రాప్యముగా - పరమగతిగా భావించాలి. భగవంతుని చేరుకొనుట కొరకే ఈ కర్మలను చేస్తున్నాననే భావన ఉండాలి.

మనం ఢిల్లీ వెళ్ళాలి అయితే ఇంటి దగ్గర రిక్షా ఎక్కినా, బస్టాండ్ లో బస్సు ఎక్కినా మన ఆలోచనలన్నీ ఢిల్లీ ప్రయాణం గురించే ఉంటాయి గదా! అలాగే మన అసలు ప్రయాణం పరమాత్మ వద్దకు అనే గ్రహింపు ఉంటే- ఇక్కడ మనం ఏ పని చేసినా మనస్సులో మాత్రం పరమాత్మ భావనే ఉంటుంది. కనుకనే పరమాత్మను పరమ లక్ష్యంగా - పరమగతిగా - గమ్య స్థానంగా దృష్టిలో పెట్టుకోవాలి. అప్పుడే చేతులతో ఏ కర్మలు చేసినా అవి పరమాత్మ యొక్క కర్మలే అవుతాయి. పరమాత్మకు సమర్పించిన కర్మలే అవుతాయి. ఇలా కర్మలు చేస్తూనే మనం ఆశ్రయించవలసిన పరికరం ఒకటి ఉన్నది.అదే-

3. బుద్ధి యోగం ఉపాశ్రిత్య:-బుద్ధి యోగాన్ని- అంటే జ్ఞాన యోగాన్ని ఆశ్రయించాలి. ఎలా? సంసారాన్ని భుజాలపై పెట్టుకో. భగవంతుని బుద్ధిలో పెట్టుకో. ఇదే బుద్ధి యోగం. భక్తితో, జ్ఞానంతో పనులు చేసే ఉపాయం. ఈ బుద్ధి యోగం ఎలా కలుగుతుంది?

"తేషాంసతత యుక్తానాం, భజతాం ప్రీతి పూర్వకం,
దదామి బుద్ధి యోగం" - అని భగవానుడే తెలియజేశాడు.

ఎల్లపుడూ ప్రీతితో నన్ను భజించే వానికి బుద్ధి యోగాన్ని నేనే ప్రసాదిస్తాను - అని. కనుక ప్రపంచం బయట

ఉండాలి. పరమాత్మ లోపల ఉండాలి. ఆలోచనలలో (మనస్సులో) ఉండాలి. ఎలా?

**4. మచ్చిత్తః సతతంభవ :-** నిరంతరము నాయందే చిత్తము గల వాడవు కమ్ము. ఇది ఈ శ్లోకంలో అష్టాక్షరీ మహా మంత్రం వంటిది. తన నిజ స్వరూపం ఏదో విచారణ చేస్తూ ఆ స్వరూపంగానే ఉండిపోవాలి. ప్రగాఢ ధ్యానంలో చిత్తం స్వ స్వరూప ఆత్మలోనే నిరంతరం ఉండిపోవాలి.

నాటకంలో బిచ్చగాడి పాత్ర వేసిన కోటీశ్వరుడు ఆ నాటకంలో నటిస్తున్నంతసేపూ ఒక్క క్షణం కూడా తాను నిజంగా బిచ్చగాడినని అనుకోడు. తాను కోటీశ్వరుడిగానే ఉండిపోతాడు. అలాగే ఆత్మతో అనుసంధానమై, ఆత్మతో తాదాత్మ్యం చెంది ఆత్మగా ఉన్నవాడు ఒక్కక్షణం కూడా ఇక జీవుడిగా ఉండడు. ఎల్లప్పుడూ ఆత్మగానే ఉండిపోతాడు.

శబరి రాముని కోసం రోజూ ఎదురు చూస్తూ ఉన్నది. నిరాశ చెంద లేదు. తప్పక ఎప్పుడో ఒకప్పుడు రాముడు తన వద్దకు వస్తాడని సంపూర్ణ విశ్వాసంతో ఆయన రాకకై ఎదురు చూస్తూ ఉన్నది. మాలా కారుడు సుదాముడు కూడా అంతే, శ్రీకృష్ణుని దర్శనం కోసం ఎదురు చూస్తూ ఉన్నాడు.

అర్జునా! అలాగే ఎల్లప్పుడూ - నిత్యము, నిరంతరము నీ చిత్తాన్ని నాయందే ఉంచు. నా స్మరణలోనే ఉండు. ఇదే ముక్తికి మార్గం.

*-నేను చెప్పినట్టు వినక పోయావా? జాగ్రత్త అని హెచ్చరిక చేస్తున్నాడు.*

శ్లో|| మచ్చిత్తః సర్వదుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి|
అథ చేత్త్వమహంకారాత్
న శ్రోష్యసి వినంక్ష్యసి|| *(58)*

*తా//* నీ మనస్సును నాయందే ఉంచితే దాటటానికి వీలు లేని అన్ని కష్టాలను - ప్రతి బంధకాలను నా అనుగ్రహంతో దాటగలుగుతావు. అలా కాకుండ నీవు అహంకారంతో వినక పోయావా? నశించిపోతావు.

*వ్యాఖ్య:-* ఈ లోకంలో జన్మించిన ప్రతి జీవి- ప్రతి మానవుడు ఏ కష్టాలు, దుఃఖాలు రాకుండా హాయిగా - ఆనందంగా జీవించాలని అనుకుంటాడు. సుఖం. ఆనందం సంగతి ఎలా ఉన్నా ఏ కష్టం - నష్టం రాకుండా ఉండాలనుకుంటాడు. అయితే దానికి ఉపాయం ఏమిటో తెలియక సతమతమై పోతూ హైరాన పడతాడు. అట్టి వారికి ఈ శ్లోకంలో ఉపాయాన్ని తెలియజేస్తున్నారు. అదే - 'మచ్చిత్తః సర్వదుర్గాణి తరిష్యసి'- మనస్సును నాయందే ఉంచితే అన్ని ప్రతి బంధకాలను దాటిపోతావు - అని. భగవంతునియందు మనస్సుంచితే భగవదనుగ్రహం. భగవదనుగ్రహం లభిస్తే కష్టాలన్నింటినీ దాటవచ్చు. ఆ అనుగ్రహం ఎలా వస్తుంది? భగవంతునియందు చిత్తం నిలిపితేనే. కనుక మనస్సునెల్లప్పుడూ భగవంతుని యందుంచాలి.

సర్వదుర్గాణి తరిష్యసి :- ఏవో కొన్ని కష్టాలను, కొన్ని దుఃఖాలను, కొన్ని ప్రతిబంధకాలను దాటటం కాదు. అన్ని ప్రతి బంధకాలను దాటి పోగలుగుతారు. సాంసారిక కష్టాలను, పారమార్థిక మైన వాటిని - అన్నింటిని అధిగమిస్తారు.

అసలు మనస్సున్నంత కాలం ఈ కష్టాలు దుఃఖాలు తప్పవు. కనుక మనస్సు అంతమై పోవాలి.

ఒక చోట పాఠశాల తరగతి గదులన్నీ తగలబడి పోతున్నాయి. పిల్లలంతా కేరింతలు కొడుతూ ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు. ఆ దారిన పోతున్న వ్యక్తి ఒక పిల్లవాడిని అడిగాడు ఎందుకంత ఆనందంగా గంతులేస్తున్నారు? అని. మా స్కూలు తగలబడి పోతున్నది. 4 రోజులు సెలవులే - అన్నాడు. ఒక పిల్లవాడు మాత్రం అక్కడ ఒక చెట్టు క్రింద కూర్చొని ఏడుస్తున్నాడు. ఈ వ్యక్తి వెళ్ళి అడిగాడు, "ఎందుకు నాయనా! ఏడుస్తున్నావు, అందరు సంతోషంగా గంతులు వేస్తుంటే" అని. దానికా పిడుగు అంటున్నాడు; "స్కూలు తగలబడి పోయింది గాని మా టీచరు ఉన్నాడు గదా! 4 రోజుల తర్వాత ఈ చెట్టు క్రింద కూర్చోబెట్టి అయినా పాఠాలు చెబుతాడు.!" అన్నాడు వాడు బాధతో. వాడి కష్టం తీరాలంటే టీచరు కూడా ఆ మంటల్లో పోవాలి. మరి మన కష్టం తీరాలంటే? మన మనస్సు లేకుండా పోవాలి. ఎక్కడకు పోవాలి మనస్సు? ఆత్మలో కలిసిపోవాలి. అంటే ఆలోచనలన్నీ పరమాత్మలో అంతం కావాలి. అప్పుడు అన్ని కష్టాలు తొలగి పోతాయి.

ఇంతవరకు చిత్తం నాలో నిల్పితే కష్టాలన్నీ అధిగమిస్తావు అని చెప్పిన భగవానుడు "అర్జునా! నా మాట వినక పోయావా? జరిగేదేమిటో తెలుసుకో "- అని హెచ్చరిస్తున్నాడు.

న శ్రోష్యసి వినంక్ష్యసి:- నా మాటలు వినక పోయావా! నశించి పోతావు. సంసార కూపంలో మునిగి పోతావు. ఇది భయపెట్టటానికి చెప్పటం కాదు. వాస్తవ పరిస్థితిని తెలియజెప్పటమే. అయితే ఎందుకు వినరు భగవంతుని మాటలను?

అహంకారాత్:- అహంకారం వల్ల. గర్వం వల్ల. అంతా నాకే తెలుసుననుకోవటం వల్ల. కనుక అహంకారాన్ని తొలగించుకొని, భగవంతుని మాటలపై విశ్వాసం ఉంచి భగవంతుడు చెప్పినట్లు చేయాలి.

*-సమస్త మానవులను నిమిత్తంగా చేసుకొని ఇంత వరకు చెప్పిన ఈ భావాన్ని అర్జునుని ప్రస్తుత పరిస్థితికి అన్వయించి భగవానుడు హెచ్చరిక చేస్తున్నాడు. ఏమని?*

శ్లో|| యదహంకారమాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే|
మిథ్యైష వ్యవసాయస్తే
ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి|| *(59)*

*తా//* ఒక వేళ అహంకారంతో యుద్ధం చేయను అని నీవు అనుకున్నా నీ ఈ ప్రయత్నం వ్యర్థమే అవుతుంది. నీ స్వభావమే నిన్ను నియోగిస్తుంది.

*వ్యాఖ్య:-* పెద్దలు, మహాత్ములు ఇతరులకు బోధించే సత్యాలు ఒక్కొక్కప్పుడు వినేవారి మనస్సుకు కష్టం కలిగించవచ్చు. అందువల్ల పరోక్షంగా చెప్పాలనుకుంటారు. అలాగన్నా తెలుసుకుంటారని. కాని కొందరికి అదీ పని చేయదు. ఎందుకంటే - ఎవరి గురించో చెబుతున్నారు, నా గురించి కాదులే అనుకుంటారు.

అబద్ధం ఆడకూడదు. ఎప్పుడూ నిజమే చెప్పాలి అన్నారనుకోండి. వినే వారిలో ఒక అసత్య హరిశ్చంద్రుడు మనస్సులో అనుకుంటాడు, "అవును. అస్సలు అబద్ధం ఆడకూడదు. మా యింటి ప్రక్కనున్న సుబ్బారావు ఎప్పుడూ అబద్ధాలే. ఏమైపోతాడో ఏమో" అని సానుభూతి చూపుతాడు.

చేతనైనంతగా దాన ధర్మాలు చెయ్యాలి అని స్వామీజీ ప్రవచనంలో చెప్పాడు. పిల్లికి బిచ్చం పెట్టని ఒక ఇల్లాలు, "అందుకే నేను ఇప్పుడు చేతనైనంతగా దానధర్మాలు చేస్తున్నాను. మొన్న మా తమ్ముడు *2* డజన్లు అరటి పండ్లు తెస్తే నేను, మా వారు *20* మాత్రమే తిని బాగా నల్లబడిపోయిన వాటిని దానం చేశాను" అని ప్రక్క ఇంటి పిన్నిగారితో చెబుతుంది.

కనుక ఇలాంటి వారికి పరోక్షంగా చెబితే కుదరదు, ప్రత్యక్షంగా చెప్పాల్సిందే. 'న శ్రోష్యసి వినంక్ష్యసి' - నా మాట వినకపోతే నశించి పోతారు అని ఇంత వరకు చెప్పిన భగవానుడు ఇది నీకూ వర్తిస్తుందయ్యా అర్జునా! అని చెప్పాలనుకున్నాడు. అందుకే అంటున్నాడు, "అర్జునా! నేను యుద్ధం చెయ్యను అని ఒక వేళ నీవు భీష్మించుకొని కూర్చున్నా నీ ప్రయత్నం వ్యర్థమే అవుతుంది. నీ స్వభావమే నీ చేత బలవంతంగా ఆ పని చేయిస్తుంది" అని. ఎందుకంటావా?

అర్జునా! నీవు క్షత్రియుడవు. క్షత్రియునిది రాజస ప్రవృత్తి. రజోగుణ ప్రధానుడవు నీవు. నీ కళ్ళ ముందే అన్యాయం జరుగుతుంటే చేతులు ముడుచుకొని కూర్చోలేవు. నీ రజో గుణం నిన్ను అలా కూర్చోనివ్వదు. కర్మ రంగంలోకి దింపి గాని శాంతించదు. ఎవరికైనా అన్యాయం జరిగితే సహించే మనస్తత్వమేనా నీది? అధర్మాన్ని చూస్తూ ఊరుకుంటావా? బ్రాహ్మణుని గోవును దొంగలెత్తుకు పోతే ఆ బ్రాహ్మణుడు నీ దగ్గరకు వచ్చి మొరబెట్టుకున్నాడు. చేతిలో ఆయుధం లేదు. ఆయుధాలన్నీ ధర్మజుని ఏకాంత మందిరం వెనుక ఉన్నాయి. అక్కడకు నియమం ప్రకారం నీవు వెళ్ళకూడదు. అయినా ఊరుకున్నావా? నియమాన్ని ఉల్లంఘించి, ధర్మజుని ఏకాంత మందిరంలో ప్రవేశించి ఆయుధాన్ని తెచ్చుకొని, దొంగలను

శిక్షించి బ్రాహ్మణునికి గోవును ఇచ్చావు గదా! ఇలాంటి నీవు ఇప్పుడు జరిగిన ధర్మ హానిని సహించి ఊరుకుంటావా? ఊరుకోలేవు. ఈ యుద్ధం నీవు చేసియే తీరుతావు.

ఉప్పు తిన్న వాడికి దాహం వేస్తుంది. కారం తిన్న వాడికి మంట పుడుతుంది. అలాగే రజో గుణంలో ఉన్న నిన్ను నీ వాసనలు ఊరుకోనివ్వవు. అవి పైకి తన్నుకొని వస్తూనే ఉంటాయి. వాటిని శాంతింపజేయటానికి నీవు నీ కార్యక్షేత్రాన్ని వెతుక్కుంటూ పోవాల్సిందే. ఇప్పుడా కార్య క్షేత్రం నిన్నే వెతుక్కుంటూ వచ్చింది.

విరాట నగరంలో బృహన్నలగా పేడిగా ఉండి అమ్మాయిలకు నాట్యం నేర్పావు. తప్పని సరై ఉత్తరుని రధానికి సారధి అయ్యావు. అంతవరకు బాగానే ఉంది. మరి ఎవరు చేయమంటే కౌరవులతో యుద్ధం చేశావు? నీ శత్రు యోధులు యుద్ధం చేయమని నిన్ను ఆహ్వానించారా? పోనీ ఉత్తరుడు నిన్ను యుద్ధం చేయమని ప్రాధేయపడ్డాడా? లేదే. ధర్మరాజు అనుమతి తీసుకున్నావా? విరాట మహారాజు ఆజ్ఞాపించాడా? ఎందుకు చేశావు? అదే నీ స్వభావం వల్ల కలిగిన ప్రేరణ, కనుక ఇప్పుడు కూడా నీ స్వభావమే నీ చేత యుద్ధం చేయిస్తుంది- అన్నాడు భగవానుడు.

*-గుణ బద్ధుడైన వాడు అవశుడై కర్మలు చేయవలసిందేనని భగవానుడు వివరించబోతున్నాడు.*

శ్లో|| స్వభావజేన కౌంతేయ!
నిబద్ధః స్వేన కర్మణా|
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్
కరిష్యస్యవశోऽపి తత్|| (60)

*తా//* కౌంతేయా! నీ పూర్వ జన్మ సంస్కారాల వల్ల కలిగిన నీ స్వభావం వల్ల జరిగే కర్మలకు నీవు బద్ధుడవు. మోహంతో దేనిని చేయటానికి నీవు ఇష్టపడవో దానినే అవశుడవై తప్పక చేస్తావు.

*వ్యాఖ్య:-* మానవులంతా కర్మ బంధనాలలో ఇరుక్కుపోయిన వారే. ఎవరి ప్రవృత్తి వారిని వదిలి పెట్టదు. కర్మ రంగంలోకి దించుతుంది. ప్రతివారు పూర్వ జన్మ సంస్కారాల వల్ల కలిగిన స్వభావం చేత బంధించబడ్డ వారే.

అర్జునుని జన్మాంతర సంస్కారాలేమిటో చక్కగా తెలిసిన వాడు త్రికాలజ్ఞుడైన భగవానుడు. ఆ సంస్కారాల వల్ల ఏర్పడిన స్వభావం ఏమిటో కూడా ఆయనకు తెలుసు. అర్జునుని స్వభావం యుద్ధం చేయవలసిన స్వభావమే. అతడి ప్రకృతి అధర్మాన్ని- అన్యాయాన్ని సహించదు, అందుకే అధర్మ పరులైన దుర్యోధనాదులను శిక్షించటానికే ఇప్పుడు కురుక్షేత్ర యుద్ధ భూమిలో ప్రవేశించాడు. ఈ యుద్ధం కోసమే అరణ్యాలలో 5 సంవత్సరాలు తపస్సు చేసి అస్త్ర సంపాదన చేశాడు. దేవలోకం వెళ్ళి దేవతలకు అసాధ్యులైన నివాతకవచులు, కాలకేయులు అనే రాక్షసులను సంహరించి దేవతలకు సాయం చేశాడు. వారంతా వివిధ రకాలైన దివ్యాస్త్రాలను ప్రసాదించారు. పరమ శివునితో పోరాడి, మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. ఇంతా చేసి ఇప్పుడేదో చిన్న కారణంతో యుద్ధాన్ని మానుకుంటే అతడి మనస్సు ప్రశాంతంగా ఊరుకుంటుందా? అతడు యుద్ధం చేసి తన లోపలి ఆందోళనలను అణచవలసిందే.

మోహం వల్ల - అవివేకం వల్ల యుద్ధం చెయ్యటం ఇష్టం లేదని అనుకున్నా అతడి స్వభావం ఊరుకోదు. బలవంతంగా అతడి చేత ఆ పని చేయిస్తుంది. అప్పుడే ఆ స్వభావం శాంతిస్తుంది. అందుకే అంటున్నాడు భగవానుడు,

*"అర్జునా! నీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా అవశుడవై ఈ యుద్ధాన్ని నీవు చేసే తీరుతావు" -అని. ఈ మాట ఆ యుద్ధ రంగంలో ఋజువైంది కూడా 10 వ రోజు యుద్ధంలో.*

కురుక్షేత్ర యుద్ధ భూమిలో 8వ నాటి యుద్ధంలో కౌరవ సేనకు అపజయం కలిగింది. దానితో దుర్యోధనుడు శకుని కర్ణులతో ఆలోచించి, భీష్ముని వద్దకెళ్ళి, "తాతా! పాండవులపై ప్రేమ వల్లనో, నాపై ద్వేషం వల్లనో నీవు పాండవులను సంహరించటం లేదు. పాండవులను సంహరించగల కర్ణుడు నీ కారణంగా యుద్ధానికి దూరంగా ఉన్నాడు. కనుక నీవు దయయుంచి కర్ణుని యుద్ధానికి పంపించు" అన్నాడు. తనను యుద్ధ రంగం నుండి తప్పించాలనే దుర్యోధనుని దురాలోచనను పసిగట్టిన భీష్ముడు అర్జున పరాక్రమాన్ని, శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్ని చెప్పి, 'రేపు చూడు నా ప్రతాపం' అని చెప్పి పంపించాడు. ఆ మరునాడు భీష్ముడు ప్రళయకాల రుద్రుడై పాండవ సేనను చీల్చి చెండాడుతున్నాడు. ఆయన ప్రతాపాన్ని, అర్జునుని మృదు యుద్ధాన్ని గమనించిన శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని ధరించి రథం నుండి క్రిందికి దూకి భీష్ముని పైకి ఉరకటంతో, అర్జునుడు దిగి ఆయన రెండు పాదాలను తన రెండు చేతులతో గట్టిగా పట్టి 16 బారల దూరంలో ఆపగలిగాడు. తాను భీష్ముని సంహరిస్తానని మాట ఇచ్చి శ్రీకృష్ణుని తిరిగి రథంపై అధిరోహింపజేశాడు. ఆ నాటికి యుద్ధం ముగిసింది. ఆ రాత్రి ధర్మరాజు శ్రీకృష్ణుని, సోదరులను వెంటబెట్టుకొని, భీష్ముని శిబిరానికి వెళ్ళి తనకు మాట ఇచ్చిన ప్రకారం, "తాతా నీ వధోపాయం ఏమిటి?" అని అడిగాడు. దానికి భీష్ముడు, "శిఖండిని ముందుంచుకొని నన్ను సంహరించండి" అని సలహా ఇవ్వటంతో భీష్ముని వద్ద సెలవు తీసుకొని తిరిగి వస్తున్నారు. ఆ సందర్భంలో కృష్ణార్జునులు

రెండడుగులు వెనుకగా వస్తున్నారు. అప్పుడు అర్జునుడు, "కృష్ణా! శిఖండిని అడ్డు పెట్టుకొని అస్త్ర సన్యాసం చేసిన భీష్ముని చంపటం నాకు సమ్మతం కాదు. నేను మాత్రం ఆ మహాత్ముని పై బాణాలు వేయలేను, వేయను" అన్నాడు, అప్పుడు శ్రీకృష్ణుడు నవ్వుతూ ఏమి జరుగుతుందో చూద్దాం -అన్నాడు

మరునాడు శిఖండిని ముందుంచుకొని వచ్చిన అర్జునుడు భీష్మునితో పోరాడుతూ శిఖండిని ప్రోత్సహిస్తూ, శిఖండీ! బాణాలు 'వెయ్,వెయ్' అంటూ, తానే భీకరశరాలను గాండీవం నుండి ప్రయోగించాడు. ఇదే అవశుడై స్వభావానికి అనుగుణంగా పని చేయటం. నేను భీష్ముని పై బాణాలు వేయనని రాత్రి పలికిన అర్జునుడే యుద్ధ రంగంలో భీష్ముని శరీరంపై రెండు అంగుళాలు ఖాళీ లేకుండా అసంఖ్యాక బాణాలను ప్రయోగించాడు. అంటే శ్రీకృష్ణుడు మొదటి రోజు చెప్పినదే 10 వ రోజున జరిగింది. మానవుడు ఏం అనుకున్నా, ఎన్ని అనుకున్నా ఏది ఎలా జరిపించాలో భగవంతుడు అలా జరిపిస్తాడు అనేది యదార్థం.

*- ఇంతకీ అన్నింటికీ కారణమైన భగవంతుడు ఎక్కడ ఉండి, ఎలా జరిపిస్తున్నాడు ఈ కర్మలను?*

శ్లో|| ఈశ్వరః సర్వభూతానాం
హృద్దేశేzర్జున తిష్ఠతి|
భ్రామయన్సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా|| (61)

తా// అర్జునా! పరమాత్మ సమస్త భూతాల యొక్క హృదయాలలో నివశించి ఉన్నాడు. యంత్రాన్ని అధిరోహించిన సర్వ జీవుళ్ళను తన మాయ చేత త్రిప్పుచున్నాడు.

*వ్యాఖ్య:-* భగవంతుడెక్కడ ఉన్నాడు? ఏం చేస్తున్నాడు? అనే రెండు ప్రశ్నలకు సమాధానమే ఈ శ్లోకం.

*1. భగవంతుడు సమస్త ప్రాణి కోట్ల హృదయాలలోనే ఉన్నాడు.* ఆయనను చూడాలంటే హృదయంలోనే వెతకాలి. ఆయన మన హృదయంలోనే ఉండి మనం చేసే పనులను, మన మనస్సులోని ఆలోచనలను, బుద్ధిలోని కోరికలను అన్నింటిని రికార్డు చేస్తుంటాడు. మనం అందరికీ మస్కా కొట్టి ఎంతో తెలివిగా ఎవ్వరికీ తెలియకుండా ఏదో ఘన కార్యం చేశామని మురిసి పోతాం గాని ఆయన మాత్రం అన్నింటిని తెలుసుకుంటాడు. ఆయన కేవలం మానవులలోనే కాదు పశువులలో, పక్షులలో, క్రిమికీటకాలలో, పాములు, తేళ్ళు, క్రూరమృగాలు, చెట్లు చేమలు - అన్నింటిలోను ఉన్నాడు. ఇలా అందరిలోను, అన్నింటిలోను ఉండి ఏం చేస్తుంటాడు?

*2.యంత్రాలనధిరోహించిన జీవుళ్ళను తన మాయతో త్రిప్పుతూ ఉంటాడు.*

పిల్లలు రంగుల రాట్నం ఎక్కుతారు. చుట్టూ వారు కూర్చోటానికి రకరకాల వాహనాలుంటాయి. సైకిలు, కారు, గుర్రం, ఏనుగు, చేప, పులి, కోతి... ఇలా ఎన్నో. పిల్లలు వారి వారి ఇష్టమైన వాహనం పై ఎక్కి కూర్చుంటే ఆ యంత్రాన్ని త్రిప్పేవాడు స్పీడుగా త్రిప్పుతూ ఉంటాడు. కొందరు భయపడతారు. కొందరు ఏడుస్తారు. కొందరు కేరింతలు కొడతారు.

అలాగే ఈ జీవుళ్ళంతా వారి వారి కర్మ ఫలాలను బట్టి కొందరు మానవ దేహాన్ని, కొందరు గుర్రంగా, కొందరు కుక్కగా, కొందరు ఏనుగుగా, కొందరు సింహంగా, కొందరు పాముగా - తేలుగా, కొందరు క్రిమిగా - కీటకంగా కొందరు మట్టిదినే తుట్టె పురుగులుగా జన్మిస్తుంటారు. ఇలా వేరు వేరు

దేహాలను ఆశ్రయించిన జీవుళ్ళందరిని త్రిప్పేవాడు ఈశ్వరుడే. ఆయన ఒకే విధంగా త్రిప్పుతాడు ఈ జగచ్చక్రాన్ని. కాని కొందరు నవ్వుతారు, కొందరు ఏడుస్తారు, కొందరు కాయ కష్టంతో జీవిస్తుంటారు. కొందరు కాలిమీద కాలు వేసుకొని దర్జాగా బ్రతుకుతారు. ఎందుకిలా? ఇదంతా వారు వారు తెచ్చుకుంటున్న ప్రారబ్ధ కర్మ ఫలాలను బట్టియే. ఇందులో భగవంతునిదేమీ ఉండదు. ఆయన పని ఈ జగచ్చక్రాన్ని ఒకే విధంగా త్రిప్పటమే.

వివిధ దేహాలనే ఈ యంత్రాలనెక్కిన వారందరికీ ఈ త్రిప్పుట - తిప్పలు తప్పవు. ఈ తిప్పలు వద్దనుకున్నవారు ఈ దేహమనే యంత్రాలను ఎక్కకుండానే ఉండాలి. అంటే జన్మ లేకుండా చేసుకోవాలి.

తోలు బొమ్మలాటలో తోలుతో తయారు చేసిన బొమ్మలకు రంగులు వేసి అందంగా తయారు చేస్తారు. తెర వెనుక ఒకడు ఉండి ఆ బొమ్మలను తన హస్త లాఘవంతో ఒక పుల్లతో ఆడిస్తుంటాడు. వాడే పాటలు పాడుతుంటాడు, వాడే మాట్లాడుతుంటాడు, వాడే శబ్దాలు చేస్తుంటాడు. చూసే వారికి రాముడు రావణుని చంపుతున్నట్లు, హనుమంతుడు మైరావణునితో యుద్ధం చేస్తున్నట్లు అనిపిస్తుంది. అయితే ఈ ఆటకు వెనుక ఉండి తన చాతుర్యంతో ఆడించేవాడి అదృశ్యహస్తం మనకు కనిపించదు. ఆ బొమ్మలే కదులుతున్నట్లు, మాట్లాడుతున్నట్లు, యుద్ధం చేస్తున్నట్లు అనిపిస్తుంది. కాని పాపం ఆ బొమ్మలు ఎక్కడ వేస్తే అక్కడ పిచ్చి మొహాల్లా పడి ఉంటాయి.

అలాగే జీవుళ్ళందరిని భగవంతుడు అదృశ్యంగా ఉండి - హృదయ స్థానంలో కూర్చొని తోలు బొమ్మలని ఆడిస్తున్నట్లు ఆడిస్తుంటాడు.

మరి ఆయన అడ్రస్ ఏమిటి? **Residential Address** ఏమిటి? **Local Address** ఏమిటి? కైలాసమా? వైకుంఠమా? సత్యలోకమా? శ్రీశైలమా? తిరుపతియా? కాశీయా? రామేశ్వరమా? అన్ని ప్రాణుల హృదయాలే ఆయన నివాసం.

ఆయన మహాత్ముల యొక్క, భక్తుల యొక్క హృదయాలలోనే కాదు, సమస్త ప్రాణి కోట్ల హృదయాలలోను ఉన్నాడు. ఆయనను వెదకటానికి ఏ లోకానికీ, ఏ క్షేత్రానికీ వెళ్ళనవసరం లేదు. నీవు ఉన్న చోటనే - నీలోనే వెతకాలి.

భగవంతుడిలా మాయ అనే యంత్రాన్ని త్రిప్పుతుంటే ఆ యంత్రాన్ని ఆశ్రయించుకున్న మనం దానితో పాటుగా తిరుగుతూ, జన్మలెత్తుతూ, చస్తూ, స్వర్గానికో, నరకానికో వెళ్ళి వస్తూ సుఖాలు, దుఃఖాలు, బాధలు పడుతూ సతమతమై పోతున్నాం. మరి ఎలా ఈ మాయా చక్రం నుండి తప్పించుకోవటం?

*-జీవులు సంసార చక్రంలో తగుల్కొని పరిభ్రమిస్తున్నారు. ఇదే మాయా చక్రం. ఈ మాయా చక్రాన్ని ఈశ్వరుడే త్రిప్పుతున్నాడు. మరి ఈ బాధలనుండి తప్పించుకోవటం ఎలా?*

శ్లో|| తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత|
తత్ప్రసాదాత్పరాం శాంతిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్|| (62)

తా|| భారత! అన్ని విధాల ఆ ఈశ్వరునే శరణు బొందు. ఆయన అనుగ్రహంతో సర్వోత్కృష్టమైన శాంతిని, శాశ్వత స్థానాన్ని పొందగలవు.

*వ్యాఖ్య:-* భగవాన్ శ్రీ రమణ మహర్షుల వారిచే అనేక సందర్భాలలో ప్రశంసించబడిన శ్లోకం ఇది. మాయా చక్రంలో ఇరుక్కొని బాధలు పడే జీవుళ్ళు ఆ బాధల నుండి విముక్తి చెందాలంటే మాయాధిపతియైన ఈశ్వరునే అన్ని విధాల శరణు పొందాలి.

*తమేవ శరణం గచ్ఛ :-* తిరగలిలో గింజలు వేసి త్రిప్పినప్పుడు అవి నలిగి పిండి పిండి అయిపోతాయి. అయితే క్రింది రాతి గుంజను ఆశ్రయించిన గింజలు మాత్రం నలిగిపోవు. తిరగలిలో పడ్డ గింజలు గుంజను పట్టుకొని తప్పించుకున్నట్లు ఈ సంసార చక్రంలో పడిపోయిన మనం ఈశ్వరునే పట్టుకొని తప్పించుకోవాలి. మరొక మార్గం లేదు.

చేపలు పట్టే వాడు వల విసిరినప్పుడు వలవైపు వెళ్ళిన చేపలు వలలో చిక్కుకుంటాయి. అలా కాకుండా వల విసిరిన వాని కాళ్ళ వైపుకు పోతే వల నుంచి తప్పించుకుంటాయి. అలాగే జీవులు లౌకిక ప్రపంచంలోకి పరుగెడితే సంసారంలో ఇరుక్కుంటారు. అలాగాక ఈ సంసార చక్రాన్ని త్రిప్పే ఈశ్వరుని పాదాలను పట్టుకుంటే సంసార బంధాల నుండి తప్పించుకుంటారు. కనుక ఈశ్వరునే శరణు వేడాలి. ఎలా?

*సర్వభావేన:-* సర్వ విధాల శరణు పొందాలి. సంపూర్ణ శరణా గతి చెందాలి. మనో వాక్కాయాలన్నింటా- శరణాగత భావం ఉండాలి. శరీరం ద్వారా భగవత్ కర్మలు, వాక్కు ద్వారా భగవత్ కీర్తనం. మనస్సులో భగవత్ భావన - అలా పూర్తిగా శరణాగతులైతేనే సత్ఫలితం. ఏమిటది?

*పరాంశాంతిం:-* ఈ ప్రపంచంలో గాని, ఇతర లోకాలలో గాని, దేవేంద్ర పదవిలో గాని లభించని పరమ శాంతి భగవంతుని శరణుగోరితే ఆయన అనుగ్రహంతో పొందవచ్చు. అంతేకాదు

**శాశ్వతం స్థానం ప్రాప్స్యసి:-** శాశ్వతమైన స్థానాన్ని పొందవచ్చు. అదే పరమాత్మ స్థానం, అదే పరంధామం. అక్కడికి వెళితే తిరిగి వచ్చే పని లేదు. ఆ స్థానం శాశ్వతం, కాలాతీతం. కాలానికి లోబడేది కాదు. కాలంలో పుట్టి కాలంలో అంతమయ్యేది కాదు. అందుకే అది శాశ్వత స్థానం అన్నారు. ఆ స్థానంలో దుఃఖాలు, బాధలు, అలజడులు, అశాంతి ఉండవు. అట్టి శాశ్వత స్థానాన్ని పొందటమే మానవ జీవిత పరమ లక్ష్యం. కనుక భగవంతుని మాటలపై విశ్వాసంతో అందరూ భక్తితో భగవంతునే ఆశ్రయించాలి. కొద్ది సేపు ప్రపంచాన్ని, కొద్ది సేపు పరమాత్మను ఆశ్రయిస్తే అది సంపూర్ణ శరణాగతి కాదు. అప్పుడు భగవంతుని అనుగ్రహం లభించదు.

**భారత! :-** అర్జునుని భారత! అని సంబోధిస్తున్నారు. భ అంటే జ్ఞానము నందు, రత అంటే రమించే వాడా! అని. నిత్యము జ్ఞానము నందు రమించే వాడా! అని భావం. నిత్యము జ్ఞానమునందు రమించమని మనకు సందేశం ఇస్తున్నాడు.

*-ఇప్పుడు భగవానుడు చెప్పవలసిన విషయాలన్నింటిని చెప్పి తన బోధను ముగిస్తున్నాడు.*

శ్లో|| ఇతి తే జ్ఞానమాఖ్యాతం
గుహ్యాద్ గుహ్యతరం మయా|
విమృశ్యైత దశేషేణ
యథేచ్ఛసి తథా కురు|| *(63)*

*తా//* ఈ ప్రకారంగా నీకు రహస్యాలలోకెల్లా రహస్యమైన జ్ఞానం నా చేత చెప్పబడింది. దీనిని సంపూర్ణంగా విమర్శించి తెలుసుకొని నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి.

*వ్యాఖ్య:-* కురుక్షేత్ర యుద్ధ భూమిలో విషాదగ్రస్థుడై, యుద్ధ విముఖుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయుటకై అద్భుతమైన ఆత్మ జ్ఞానాన్ని బోధించిన భగవానుడు బోధను ముగించబోతూ ఇంతవరకు తాను చెప్పిన జ్ఞానం ఎటువంటిదో, ఇది విన్న అర్జునుడు ఏం చేయాలో తేల్చి చెప్పబోతున్నాడు ఈ శ్లోకంలో. ముందుగా ఈ జ్ఞానం ఎట్టిదో తెలియజేస్తున్నాడు.

*1. గుహ్యాద్ గుహ్యతరం:-* రహస్యాలలోకెల్ల పరమ రహస్యమైనది ఈ గీతా శాస్త్రం. ఇది సర్వ ఉపనిషత్తుల సారభూతమైనట్టిది.

మంత్ర, తంత్ర, రసాయన విద్యలన్నీ గుహ్యమైనవి - రహస్యమైనవి. అయితే గీతా శాస్త్రం మాత్రం వాటన్నింటికన్న రహస్యమైనది. ఎందుకంటే పైన చెప్పిన విద్యలు నేర్చుకొనుటకు ఎవరైనా అధికారులే. ఎవరికైనా అర్హత ఉంటుంది. కాని ఈ గీతా శాస్త్రం తెలుసుకోవాలంటే విశేష అర్హత ఉండాలి. ఎన్నో జన్మల సుకృతం ఉండాలి. ఎంతో కృషి, ప్రయత్నం, పట్టుదల ఉండాలి. అన్నీ ఉన్నా ఈ ఆత్మ విద్య మన స్వంతం కావాలంటే వినయం, విధేయత, విశ్వాసం ఉండాలి. ఇవి లేకపోతే అన్నీ సందేహాలే- సంశయాలే. అందుకే ఇది అత్యంత రహస్య విద్య. ఈ బ్రహ్మ విద్యను ఎంత తెలుసుకున్నా అంత తేలికగా బోధ పడదు, అనుభవానికి రాదు. అట్టి ఈ జ్ఞానం-

*2. మయాతే ఆఖ్యాతం:-*నా చేత నీకు బోధించబడింది. ఇంతవరకు ఈ అత్యంత రహస్య జ్ఞానాన్ని బోధించాను. మరి ఇప్పుడేం చేయాలి?

*3. ఏతత్ అశేషణ విమృశ్య:-*దీనిని పూర్తిగా విశ్లేషించి, విచారించి అర్థం చేసుకో, విన్నదానిని అధ్యయనం చెయ్యి. మననం చెయ్యి. స్థిర పరచుకో. నిజాన్ని నిగ్గుతేల్చుకో. అందుకే బ్రహ్మ సూత్రాలలో ఒక సూత్రం "పౌనఃపున్యేన శ్రవణం

కుర్యాత్" - మళ్ళీ మళ్ళీ శ్రవణం చేయాలి అని చెబుతుంది. ఇక ఆ తర్వాత ఏం చేయాలి?

4. యథేచ్ఛసి తథా కురు:-నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో, పూర్వ కాలం నుండి గురువులు శిష్యులకు స్వాతంత్ర్యం ఇచ్చారు. నేను చెప్పినట్లు నడుచుకో - అనరు. నేను చెప్పిన విషయాన్ని బాగుగా విమర్శించి చూచుకొని నీకు ఎలా తోస్తే అలా చెయ్యి అంటారు. జగద్గురువైన శ్రీకృష్ణుడు కూడా ఆ సాంప్రదాయాన్నే పాటించాడు. చెప్పిన విషయాలను జాగ్రత్తగా వినటానికి, విని అర్థం చేసుకోవటానికి గురువుపై విశ్వాసం ఉండాలి గాని అంత మాత్రాన స్వతంత్రంగా తెలివితో ఆలోచించ వద్దు అని కాదు. శిష్యుడు స్వంతంగా విచారణ చేస్తేనే శిష్యుని బుద్ధి వికసించేది. ఎవరు ఎంత విచారణ చేసినా ఇక్కడ చెప్పిన దానికి తిరుగులేదు. ఇదే గీతా శాస్త్రం యొక్క ప్రామాణికత. అందుకే స్వేచ్ఛ. దారి చూపటం గురువు యొక్క పని. తన కాళ్ళతో తాను స్వంతంగా నడవటం శిష్యుని కర్తవ్యం. నేను చెప్పిందే కరెక్టు. నేను చెప్పినట్లే వినాలి. మరొక ఆలోచన చేయవద్దు, తిరిగి ప్రశ్నించ వద్దు అనే గురువులు గురువులు కాదు బరువులు.

*-ఇలా చెప్పదలుచుకున్న విషయాన్నంతటిని చెప్పి, శిష్యునిపై గల దయతో - ప్రేమతో - వాత్సల్యంతో తన మనసులోని మర్మాన్ని - పరమరహస్య బోధను - తన బోధ యొక్క సారాన్ని శిష్యుని మేలు కొరకు చెప్పాలనే భగవంతుని ఆరాటం ఎలాంటిదో ఈ శ్లోకంలో-*

శ్లో|| సర్వగుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః|

ఇష్టోzసి మే దృఢమితి

తతో వక్ష్యామి తే హితమ్|| (64)

*తా//* అన్నింటి కన్న ఎక్కువైన రహస్యాన్ని నా శ్రేష్ఠ వాక్కు ద్వారా మరల విను. నీవు నాకు చాలా ఇష్టమైన వాడివి గనుక నీ మేలు కోరి చెబుతున్నాను.

*వ్యాఖ్య:-* రాబోయే 2 శ్లోకాల ప్రాధాన్యతను వ్యక్తం చేసేందుకే ఈ శ్లోకం. ఆ రెండు శ్లోకాలు భగవానుని హృదయం. భగవద్గీత మొత్తాన్ని వినటంలో ఎలాంటి లోటు పాట్లు ఉన్నా ఈ రెండు శ్లోకాలను చక్కగా తెలుసుకుంటే ఆ లోటు తీరి పోతుంది. ఎలాంటి విషయాన్ని చెప్పబోతున్నాడు?

1. సర్వగుహ్యతమం:- గుహ్యం అంటే రహస్యం. గుహ్యతరం అంటే పరమ రహస్యం. గుహ్యతమం అంటే అత్యంత మిక్కిలి పరమ రహస్యం - అని. అంటే ఇంతటి రహస్య విషయం మరొకటి లేదు అని. ఇంతకు ముందు శ్లోకంలో గుహ్యాత్ గుహ్యతరం అని Comparative degree లో చెప్పారు. అంటే ఇంతవరకు రహస్యాలలోకెల్లా పరమ రహస్యం గురించి చెప్పాను-అని, ఇప్పుడు చెప్పబోయేది గుహ్యతమం అని superlative degree లో చెబుతున్నారు. అంతటితో ఆగక సర్వ గుహ్యతమం అని సర్వ అనే విశేషణాన్ని చేర్చారు. అంటే ఇంతటి రహస్య విద్య మరొకటి లేనే లేదు - అని.

దీనిని బట్టి భగవానుడు చివరిగా చెప్పబోయే రెండు శ్లోకాలను వినటం ఎంత అదృష్టమో, వినకపోతే ఎంత దురదృష్టమో మనం తెలుసుకోవాలి. ఈ విశేషణాలతో మనకు గొప్ప కుతూహలం కలిగిస్తున్నాడు భగవానుడు. ఈ చెప్పబోయేది రహస్యమే కాదు. మరి ఇంకేమిటి?

2. పరమం వచః:- శ్రేష్ఠమైన వచనాలు కూడా. కనుక మంత్రోపదేశం కన్నా భక్తి శ్రద్ధలతో ఈ వచనాలను స్వీకరించాలి.

3. భూయః శృణు:- ఈ అత్యంత రహస్యము, మిక్కిలి శ్రేష్ఠము అయిన నా వచనాలను 'మళ్ళీ విను' అంటున్నాడు. అంటే ఇవి క్రొత్తగా చెబుతున్న మాటలు కాదు. ఇంతకు ముందు చెప్పినవే. కాకపోతే ఆ చెప్పినటువంటి సారాంశాన్ని -లేదా అతి ముఖ్య విషయాలను మరల చెప్పబోతున్నాడని గ్రహించాలి. అయితే మళ్ళీ ఎందుకు చెప్పటం. ఇంతకు ముందు వినకపోయినా - లేదా శ్రద్ధతో గ్రహించక పోయినా,- లేదా మరచిపోయినా మళ్ళీ వింటే మంచిది గనుక. ఆధ్యాత్మిక విషయాలను మళ్ళీ మళ్ళీ వినాలి. మళ్ళీ మళ్ళీ చదవాలి. ఎన్ని సార్లు వింటే అంత ధృఢ పడుతుంది విషయం. మరి ఇంత వాత్సల్యంతో ఎందుకు చెబుతున్నాడు భగవానుడు?

4. ఇష్టోzసి మే దృఢమితి:- నీవు నాకు మిక్కిలి ఇష్టుడవు గనుక. శిష్యునిపై వాత్సల్యం, ప్రేమ అధికంగా ఉన్నప్పుడు, శిష్యుడు గురువు యందు వినయ విధేయతలు కలిగి ఉన్నప్పుడు ఆ శిష్యునికి ఎలాగైనా శ్రేయస్సును కలిగించాలనుకొనే గురువు ఇలా మళ్ళీ మళ్ళీ చెబుతాడు, కనుకనే శిష్యుడు గురువు యొక్క ఇష్టాన్ని, ప్రేమను, వాత్సల్యాన్ని భక్తితో- సేవతో సంపాదించుకోవాలి.

*గురు శుశ్రూష ద్వారా పద్మ పాదా చార్యులు

*భక్తి ద్వారా అర్జునుడు

* అర్హతను పొంది నచికేతుడు

వారి వారి గురువుల అనుగ్రహాన్ని సంపాదించారు, అందుకే ఇక్కడ అర్జునుడు నేను భగవంతునికి ఎంతో ఇష్టుడను, భక్తుడను అని చెప్పుకోవటం లేదు, భగవానుడే

అర్జునుని "నీవు నాకు ఇష్టుడవు, భక్తుడవు" అంటున్నాడు. ఇదీ అర్జునుని అదృష్టం. అలా ఇష్టుడైనందున ఏమిటి ప్రయోజనం?

5. తతో వక్ష్యామి తే హితమ్:-నీ శ్రేయస్సు కొరకై చెబుతున్నాను అంటున్నాడు భగవానుడు. గురువుకు శిష్యుడు ఇష్టుడైతే శిష్యుని శ్రేయస్సుకే గురువు పాటు పడతాడు. ఇదే గొప్ప ప్రయోజనం. అద్వైత జ్ఞానం కలగటమే శ్రేయస్సు- ప్రయోజనం.

సద్గురువుల అనుగ్రహం లేకపోతే అద్వైత జ్ఞానం కలగదు, అందుకే ఎందరో తమ చెంతకే వచ్చిన జ్ఞానాన్ని కూడా అందుకోలేరు. మన హృదయంలోని మాలిన్యం కారణంగా గురు అనుగ్రహం, తద్వారా జ్ఞానం దూరమై పోతుంది. కనుక సర్వ విధాల గురువు యొక్క అనుగ్రహాన్ని సంపాదించాలి.

*- అర్జునునికి - సమస్త మానవాళికి శ్రేయస్సును కలిగించే ఆ భగవంతుని శ్రేష్ఠ వచనములేమిటి?*

శ్లో|| మన్మనా భవ మద్భక్తః
మద్యాజీ మాం నమస్కురు|
మామేవైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోసి మే|| (65)

తా|| మనస్సును నాయందే ఉంచు. నా భక్తుడివికా. నన్ను ఆరాధించు. నాకు నమస్కరించు. నన్నే పొందగలవు. ఇది సత్యం. నీవు నాకు ఇష్టుడవు గనుకు ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను.

*వ్యాఖ్య:-* భగవద్గీత యొక్క సందేశ సారమే ఈ శ్లోకం. ఇదే శ్లోకం 9 వ అధ్యాయం చివరి లోనూ ఉంది. ఇప్పుడు 18 వ అధ్యాయం చివరిలోను ఇచ్చారు. అంటే పూర్వార్థాన్ని ముగించేటప్పుడు, ఉత్తరార్థాన్ని ముగించేటప్పుడు రెండు

సందర్భాలలోనూ రావడం ఈ శ్లోకం విశిష్టత. ఈ శ్లోకంలో మొదటి పాదం సాధన గూర్చి, రెండవ పాదం సాధ్యాన్ని గూర్చి చెబుతున్నది. అంటే మనం చేయవలసిన సాధన, ఆ సాధన వల్ల మనం పొందే ఫలితం చెప్పారు. అంతే గాక అట్టి సాధన వల్ల తప్పక సాధ్య వస్తువును పొందగలవని ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాడు భగవానుడు.

ఈ శ్లోకాన్ని మంగళ శ్లోకం చేయాటానికా అన్నట్లు 9 మకారాలను ప్రయోగించటం జరిగింది. కనుక కవితా సౌందర్యం ఉట్టిపడుతున్నది.

ఇక్కడ 1. నాయందే మనస్సు నిలుపు. 2. నాకు భక్తుడివికా, 3. నన్నే ఆరాధించు. 4. నాకే నమస్కరించు, అనే 4 సాధనలు చెప్పారు. ఈ సాధనలు చేస్తే నన్నే పొందుతావు అని ఫలితాన్ని చెప్పారు. ఇప్పుడా సాధనలేమిటో చూద్దాం:

<u>1. మన్మనా భవ:</u>-మనస్సును నాయందే నిలుపు. మనస్సు అనేది మన సమస్త దుఃఖాలకు, బాధలకు, అశాంతికి కారణం. ఆ మనస్సుగనక లేకపోతే అన్ని దుఃఖాలు, బాధలు, అశాంతి దూరమై పోతాయి. ఆనందం కలుగుతుంది. ఇది ప్రతి రోజూ మనకు అనుభవమే. జాగ్రత్, స్వప్నా వస్థలలో మనస్సుంది. అన్ని అలజడులు ఉన్నాయి. సుషుప్తిలో మనస్సు లేదు. అన్ని అలజడులు అంతమై ఆనందం కలుగుతుంది. కనుక ఈ మనస్సే మన ఆనందానికి అడ్డం వస్తుంది. అందువల్ల మనస్సును భగవంతుని యందు అంతం చెయ్యాలి. అలా అంతం చెయ్యాలంటే ముందు భగవంతునిలో నిలపాలి. అంటే భగవంతుని యొక్క ఆలోచనలతో నింపాలి. నిరంతరము భగవంతుని గురించి తెలుసుకోవటం, స్మరించటం, భావించటం, జపించటం, విచారణ చేయటం- ఇలా మనస్సు భగవన్మయమై పోవాలి. మనస్సు భగవంతుని చేరితే

భగవంతునితో అనుసంధానిస్తే అది చివరకు భగవంతునితో కలిసిపోతుంది. భగవంతుడే అయిపోతుంది. తియ్యటి కొమ్మతో పుల్లటి కొమ్మను అంటుకడితే తియ్యగా మారుతుంది. మంచి వారితో, మహాత్ములతో స్నేహం చేస్తే చెడ్డవాడు కూడా మారిపోతాడు. అలాగే ప్రాపంచిక విషయాలతో కలుషితమై పోయిన మనస్సు ఆనంద స్వరూప పరమాత్మతో స్నేహం చేస్తే అది కూడా ఆనంద స్వరూపమై పోతుంది. కనుక మనస్సును భగవంతునిలో నిలపాలి. ఇదే శాశ్వతానందాన్ని పొందే మార్గం. అయితే ఇది అంత తేలికైన విషయం కాదు. అలాగని వదలటానికి వీలు లేదు. మరి ఎలా సాధ్యం చేయాలి? అందుకే 2వ సాధన.

2. మద్భక్తః:- నా భక్తుడివికా. మనస్సును నిరంతరం పరమాత్మలో నిలపాలంటే పరమాత్మపై ప్రేమ కలగాలి. భక్తి కలగాలి. కనుక ఆ పరమాత్మ గురించి తెలుసుకోవాలి. ఎందుకంటే మనకు ఎవరి మీదన్నా ప్రేమ కలిగిందంటే వారు మనకు మేలు చేసే వారై ఉంటారు. అలాగే భగవంతుడు మనకు మేలు చేసే వాడు అని తెలిస్తే ఆయనపై ప్రేమ కలుగుతుంది.

మరి భగవంతుడు మనకు ఏం మేలు చేస్తున్నాడు? మనం నివసించటానికి భూమిని ఆయనే ఇచ్చాడు. దప్పిక తీర్చుకొనుటకు నీటినిచ్చాడు. తిరగటానికి వీలుగా ఆకాశాన్నిచ్చాడు. భూమి ద్వారా మనకు కావలసిన ఆహారాన్నిచ్చాడు. శరీరాన్ని నిలబెట్టే అగ్నినిచ్చాడు. ఇవన్నీ ఇవ్వటమే కాక మనం తిన్న ఆహారాన్ని అరిగించి దేహంలోని అన్ని భాగాలకు ఆ అన్న రసాన్ని అందిస్తున్నాడు. మిగిలిన పిప్పిని బయటకు పంపే ఏర్పాటు చేస్తున్నాడు. మనం తల్లి గర్భం

నుండి బయటకు వచ్చేటప్పటికి ఆహారంగా కావల్సిన పాలను తల్లి ద్వారా అందించే ఏర్పాటు చేస్తున్నాడు.

*భగవంతుడు నాకేం ఇచ్చాడు?* అని చాలా మంది బాధలలో మాట్లాడుతూ ఉంటారు. లక్షల విలువ చేసే కిడ్నీలు, ఊపిరితిత్తులు, గుండె, ఇతర అనేక శరీర భాగాలు ఇచ్చాడు, ఇవన్నీ మనకు ప్రత్యక్షంగా తెలిసేవి. ఇక ప్రత్యక్షంగా తెలియక పోయినా పరోక్షంగా శాస్త్రాల ద్వారా తెలుసుకోవలసినవి కూడా ఉన్నాయి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసే వాడని, ఆపదలలో నున్న వారిని ఆదుకొనేవాడని, ధర్మాన్ని నిలబెట్టటానికి, అధర్మాన్ని అణచటానికి యుగ యుగములందు తనను తానే సృజించుకొని వస్తాడని- ఇలా అనేక విషయాలు శాస్త్రం ద్వారా తెలుస్తాయి. ఇలా తెలుసుకుంటే ఆయనపై మనకు ప్రేమ కలుగుతుంది. ఇదే భక్తి. భగవంతునిపై అచంచల భక్తితో కర్మలు చేస్తుండాలి. అయితే ఈ భక్తి శిశు పాలుని భక్తిలాగానో, కంసుని భక్తిలాగానో గాక మీరాబాయిలాగా, సక్కుబాయిలాగా, రామదాసులాగా, ఆంజనేయుని లాగా, గోపికలలాగా పూర్ణ భక్తి ఉండాలి. అయితే ఈ ప్రాపంచిక వ్యవహారాలతో, సంసార జంఝూటాలతో ఇంతటి భక్తి కుదరదంటావా! మరో ఉపాయం-

*3. మద్యాజీ:-* నన్ను పూజించు, నన్ను ఆరాధించు. నీ కుటుంబ వ్యవహారాలు, ఇతర లౌకిక విషయాలు చూసుకుంటూ నాకు సంబంధించిన కర్మలను- అంటే పూజలు, వ్రతాలు, నోములు, పారాయణలు, యజ్ఞ యాగాదులు, స్తోత్ర పాఠాలు, అభిషేకాలు మొ||న భక్తి సంబంధమైన -భగవత్ సంబంధమైన కర్మలు చేస్తూ ఉండు. జీవించి ఉన్నంత వరకు ఇలాంటి కర్మలు చేస్తూ ఉండాలి. అని ఈశావాస్యోపనిషత్తు తెలియజేస్తున్నది. "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగం సమాః" - అని. ఎందుకంటే

కర్మలు చేయకుండా ఒక్కక్షణం ఉండలేం, "నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్టత్య కర్మకృత్" అని భగవానుడే చెప్పాడు. ఎలాగూ కర్మలు చేయాలి గనుక భగవత్ సంబంధ కర్మలు చేస్తుంటే క్రమంగా భగవంతునిపై భక్తి కలుగుతుంది. పూజా పుష్పాలతో, నైవేద్యాలతో, కొబ్బరికాయలతో చేసే పూజయేగాదు మన కర్మలతోనే పూజించవచ్చు. కర్మ ఫల సమర్పణ ద్వారా సర్వ కర్మలను భగవత్ కర్మలుగా చేయవచ్చు. మరి ఈ పూజలు, ఆరాధనలు, యజ్ఞాదులు చేయలేక పోతేనో- మరో ఉపాయం-

4. మాం నమస్కురు:-రెండు చేతులు జోడించి, మనస్సులో భగవంతుని స్మరిస్తూ హృదయ పూర్వకంగా నమస్కరించు. అన్నింటి కన్న తేలికైనది, ఏ మాత్రం ఖర్చు లేనిది, వస్తువులను సమకూర్చుకొనే పని లేనిది, సాధన సంపత్తి అవసరం లేనిది నమస్కారం. నీ పనులు నీవు చేసుకుంటూ అప్పుడప్పుడు సందర్భాను సారంగా నమస్కరించటం ఎవరికైనా తేలికైనదే. ఇలా దేవాలయం కనిపించినప్పుడో, విగ్రహం కనిపించినప్పుడో నమస్కారం పెడుతూ ఉంటే భగవంతుడొకడు ఉన్నాడని, ఆయనతో మనకు ఏదో సంబంధమున్నదని, ఆయన మనను కాచి, రక్షించేవాడని, ఆయన గురించి తెలుసుకోవాలనిపిస్తుంది. అలా తెలుసుకుంటున్న కొద్దీ భక్తి ఏర్పడుతుంది. ఇలా ఎవరికి వీలైన సాధనను వారు ప్రారంభించాలి. ఇలా సాధనలు చేస్తే ప్రయోజనం?

5. మాంఏవ ఏష్యసి :- నన్నే పొందుతావు. నన్నే చేరుకుంటావు. నదులన్నీ సముద్రాన్ని చేరి శాంతించినట్లు సమస్త జీవులు పరమాత్మను చేరి శాంతిస్తాయి. అప్పటిదాకా అశాంతియే. ఇది నిజమా? అనే సందేహం మనకు కలగకుండ భగవానుడే

సత్యం- ఇది నిజం అని ప్రతిన చేసి చెబుతున్నాడు. ప్రమాణం చేసి చెబుతున్నాడు. ఈ విషయంలో అర్జునుని గొప్పతనం ఉంది. సాక్షాత్తు భగవంతుని చేతనే ప్రమాణంచేయిస్తున్నాడు.

అయితే ఎంత చెప్పినా ఈ మూర్ఖ మానవులు నమ్మరు. ప్రాపంచిక భోగాలను వదలలేరు. పరమాత్మకు శరణాగతులు కాలేరు.

*భోజరాజు దగ్గరకు ఒక పేద బ్రాహ్మణుడు వచ్చాడు. రాజు అడిగాడు. అయ్యా! తమరు ఎక్కడ నుండి వస్తున్నారు? అని. అతడు ఠపీమని "కైలాసం నుండి" అన్నాడు. రాజు, "ఓహో! అలాగా! శంకరుడు క్షేమమా? పార్వతి, వినాయక కుమార స్వాములు, నంది అంతా క్షేమమే గదా!" అని అడిగాడు. "ఇంకెక్కడి శంకరుడండి! ఆయన బోళాశంకరుడు గదా! మెడలో ఉన్న సర్పాలను నాగ లోకానికి పంపించాడు, చంద్రుణ్ణి ఆకాశానికి పంపాడు, గంగను భూమి మీదకు వదిలాడు, పార్వతీ దేవిని కైలాసంలోనే వదిలి ఒంటరి వాడై వెళుతున్నాడు. నేను ఎదురుగా వెళ్ళి చేయి చాపితే భిక్షా పాత్ర నాకు ఇచ్చాడు. ఆయన బోళాశంకరుడు గదా! అడిగిన వారికి లేదనకుండా ఇచ్చే ఆ దాన గుణాన్ని మీకు ఇచ్చాడు." అన్నాడా బ్రాహ్మణుడు చమత్కారంగా. అంతే పడిపోయాడు రాజు. ఆ బ్రాహ్మణునికి అపార ధన రాసులు ఇచ్చి పంపాడు.

కథలో శంకరుడెలాగైతే తనకున్న వాటిని వారికొకటి వీరికొకటి ఇచ్చాడో అలాగే మనం కూడా మన శక్తినంతా కొంత కోరికలకు, కొంత భార్యాబిడ్డలకు, కొంత పదవులకు, కొంత కీర్తి ప్రతిష్టలకు, కొంత భోగాలకు ఖర్చు చేసి శక్తి హీనులమౌతున్నాం. ఇక పరమాత్మ కొరకు ఖర్చు పెట్టటానికి శక్తి లేని వారమవుతున్నాం. కనుక మన శక్తినంతా పరమాత్మ కొరకు ఖర్చు చేసి - అంటే మనస్సును పూర్తిగా భగవంతుని

యందు నిలిపి జన్మ సార్ధకం చేసుకోవాలి. ఆ పరమాత్మను చేరుకోవాలి.

మే ప్రియోసి ప్రతిజానే:- నీవు నాకు ప్రియుడవు గనుక, ఇష్టుడవు గనుక నీకు ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను, పై సాధనలు చేస్తే నన్నే చేరుకుంటావు- అని భరోసా ఇస్తున్నాడు భగవానుడు. అర్జునుని భాగ్యమే భాగ్యం. అన్ని కాలాలకు, అన్ని దేశాలకు, అన్ని మతాలకు, అన్ని జాతులకు, అందరికీ అనుకూలంగా అందరి శ్రేయస్సుకై భగవానుడు ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాడు.

*-భగవద్గీత సార శ్లోకం. భగవానుని జ్ఞాన బోధ ముగింపు శ్లోకం.*

శ్లో|| సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ|
అహం త్వా సర్వపాపేభ్యః
మోక్షయిష్యామి మాశుచః|| *(66)*

*తా//* సర్వ ధర్మాలను విడిచి పెట్టి నన్నొక్కనినే శరణు పొందు, నేను నిన్ను సమస్త పాపాల నుండి విడుదల చేస్తాను. శోకించకు.

*వ్యాఖ్య:-* గీతా బోధ పూర్తయిన తర్వాత చిట్ట చివరిగా చెప్ప బడ్డ కీలక శ్లోకం ఇది. అద్భుత శక్తి కలిగిన శ్లోకం ఇది. వైష్ణవులు దీనిని చరమ శ్లోకం అంటారు. వారు దీనిని పరమ పవిత్రంగా భావిస్తారు. చరమ శ్లోకం అనటానికి కారణం చరమ దశలో పఠిస్తే మోక్ష ప్రాప్తి అని ఒక నమ్మకం.

ఈ శ్లోకంలో కూడా మొదటి పాదం సాధనను, రెండవ పాదం ఫలితాన్ని చెబుతున్నది.

*1. సర్వధర్మాన్ పరిత్యజ్య మాంఏకం శరణం వ్రజ :-* అన్ని ధర్మాలు విడిచి నన్నొక్కడినే శరణు పొందు - అని. ఇది భగవంతుని సూటి మాట. ఇందులో సగం విని రెండవ సగం వినక పోతే పెద్ద ప్రమాదం. అన్ని ధర్మాలు విడిచి పెట్టమనే మాట సామాన్యులకు అసమంజసంగా అనిపిస్తుంది. కాని వివేకవంతులకు, ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులకు ఎంతో ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఇంతకూ ఏ ధర్మాలను వదలాలి?

దేహ ధర్మాలను, ఇంద్రియ ధర్మాలను, మనో ధర్మాలను, బుద్ధి ధర్మాలను - అన్నింటిని వదలాలి. వదిలి ఆ పరమాత్మను శరణు వేడాలి. అన్ని ధర్మాలను విడిచి పెడితే ఎలా? అంటే అన్ని ధర్మాల యొక్క, కర్మల యొక్క ఫలితాలన్నీ ఆ పరమాత్మలోనే ఉన్నాయి.

కుమార్తె వివాహం కాగానే తల్లిదండ్రులను, సోదరీ సోదరులను, ఉన్న ఊరును, ఇంటిని, స్నేహితులను- అందరినీ వదిలి భర్తను ఆశ్రయించుకొని వెళుతుంది.

కుమారుడు మంచి ఉద్యోగం వస్తే తల్లిదండ్రులను, సోదరీ సోదరులను, ఊరును, ఇంటిని, స్నేహితులను - అందరినీ వదిలి ఉద్యోగాన్ని పట్టుకొని వెళతాడు. మరి అన్నీ వదిలి పెడితే ఎలా అంటున్నాడా? - లేదు.

"నీవు నీ తల్లిదండ్రులను, ఆస్తిపాస్తులను, ఇంటిని వదిలి పెట్టి నాతోపాటు రా నిన్ను దత్తత తీసుకుంటాను "అన్నాడొక కోటీశ్వరుడు ఒక పేదవాని బిడ్డతో," అమ్మో! అన్నీ వదులుకుంటే నాకు ఎలా?" అని అంటాడా? లేదు గదా!

అలాగే అన్ని ధర్మాల ఫలం భగవంతుని శరణాగతిలోనే ఉన్నది గనుక అన్నీ వదిలి భగవంతుని పట్టుకోగలిగితే అదృష్టమే. కనుక పరమాత్మను శరణు కోరితే ఆయనతోడిదేలోకమైతే ఇక ఇతర ధర్మ కర్మలతో పనిలేదు.

అంటే పరమాత్మను ఆశ్రయిస్తే అన్ని ధర్మాలను ఆచరించినట్లే. చెట్టు మొదట్లో నీరు పోస్తే అన్ని భాగాలను తడిపినట్లే.

అన్ని ధర్మాలను వదలమన్నారు గదా! ధర్మాలను వదిలి అధర్మాలను ఆచరించాలా? అని ప్రశ్నించే విపరీత జ్ఞానులు కూడా కొందరుంటారు.

అన్ని ధర్మాలు వదిలి మౌనంగా ఉండమనలేదు. నన్నొక్కనినే శరణు పొందు అని చెప్పిన మాటను మరువరాదు. ఇది శాస్త్ర జ్ఞానం లేని వారికో, మిడి మిడి జ్ఞానంతో మిడిసి పడే వారికో చెప్పిన మాట కాదు. గీతా జ్ఞానాన్ని పూర్తిగా అధ్యయనం చేసిన వారికి చెప్పినది. అందుకే ఇది రహస్య బోధ.

* గీతా శాస్త్రం ప్రారంభంలో కర్మలను చేయమన్నారు.

*తరువాత పురుషార్థంపై ఆధారపడి ఫలాన్ని వదిలి కర్మలు చేయమన్నారు.

*ఇప్పుడు పురుషార్థాన్ని కూడా వదిలి పరమ పురుషుని ఆశ్రయించ మంటున్నారు.

ఇలా ఎందుకు చెప్పారు? ఒకటి విడిస్తేనే రెండవది అందేది. త్యాగం వల్లనే మోక్షం. రాకెట్ చంద్రుని వద్దకు చేరాలంటే భూమ్యాకర్షణ శక్తిని విడిచిపెట్టి దాటి పోవాలి.

*మంచి కర్మలు - ధర్మాలు పుణ్యాన్నిస్తాయి. స్వర్గ సౌఖ్యాలు లభిస్తాయి.

*చెడ్డ కర్మలు - చెడ్డ ధర్మాలు పాపాన్నిస్తాయి. నరక యాతనలు కలుగుతాయి.

*కాని భగవత్ శరణాగతి జన్మ రాహిత్యాన్ని కలిగించి మోక్షాన్నిస్తుంది.

కనుకనే సర్వ ధర్మాలను వదిలి భగవంతునొక్కనినే శరణు పొందాలి.

2. అహం త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి:-సర్వ ధర్మాలు వదిలి పరమాత్మను ఆశ్రయిస్తే ఫలితం ఏమిటి? నిన్ను సమస్త పాపాల నుండి విడుదల చేస్తాను - అని. పాపాలంటే వాసనలు, కర్మ ఫలాలు. ఇవి మళ్ళీ మళ్ళీ జన్మలను తెచ్చిపెడతాయి గనుక వీటిని పాపాలన్నారు. ఇందులో పుణ్య వాసనలు, పాప వాసనలు; పుణ్య కర్మ ఫలాలు, పాప కర్మ ఫలాలు రెండూ ఉంటాయి. రెండూ పాపాలే. ఎందువల్ల? పుణ్య వాసనలైనా, పాప వాసనలైనా రెండూ జన్మను తెచ్చి పెట్టి ఈ లోకంలో బంధించేవే కదా! కనుక అన్నింటి నుండీ విడుదల పొందాలి.

*సర్వ ధర్మాలు వదిలి నన్నొక్కనినే శరణుబొందటం నీ వంతు.

*సర్వ పాపాలనుండి విముక్తం చేసి నిన్ను ఉద్ధరించటం నా వంతు.

నీ డ్యూటీ నీవు సక్రమంగా చేస్తే నా డ్యూటీ నేను సక్రమంగా చేస్తాను- అని భగవానుడు గట్టిగా హామీ ఇస్తున్నాడు. కనుక మనస్సును పూర్తిగ ఈ దృశ్య ప్రపంచం నుండి విముక్తం చేయాలి. అట్టి మనస్సును పరమాత్మలో నిలపాలి. దీనికై నిత్యము, నిరంతరము, భగవంతుని ఆశ్రయించాలి. శరణాగతి చెందాలి. ప్రార్థించాలి. తపించాలి. ఆక్రోశించాలి. ఇదే మన పవిత్ర కర్తవ్యం, మానవుడుగా చేయవలసిన పురుషార్థం, మానవుడు చేయవలసిన దానిని చేస్తే భగవంతుడు ఇవ్వవలసిన దానిని ఇస్తాడు.

భగవంతుడు ఏర్పరచిన నియమం అప్రతిహతం.

*పాపంచేత దుఃఖం * పుణ్యం చేత సుఖం. *శరణాగతి చేత మోక్షం. ఇందులో భగవంతుని పక్షపాతం ఏమీ లేదు. 'చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవా'- అన్నారు.

ఈ లోకంలోని వస్తువుల కోసమో, భోగాల కోసమో, ధన సంపదల కోసమో, ఇళ్ళూ వాకిళ్ళ కోసమో ఏడ్చి ఏడ్చి

ఎంత మొత్తుకున్నా ముక్తి లేదు, మోక్షం లేదు. కాకపోతే తాత్కాలికంగా కొంత సంతోషం కలుగవచ్చు. ఇక మనం అన్నీ సంపాదించుకొని దాచుకుంటూ చుట్టూ ఉన్న వారిని చూసి ఏడిస్తే ఆ తాత్కాలిక భోగం కూడా ఉండదు; ఏ మందులకూ తగ్గని రోగం మాత్రం ప్రాప్తిస్తుంది.

*కనుక భోగాల వెంట పడి రోగాలు తెచ్చుకుంటారో

*సర్వ ధర్మాలను త్యాగం చేసి యోగాన్ని పొందుతారో మీ ఇష్టం- అంటూ ఎవరైతే నేను చెప్పినట్లు నడుచుకుంటారో అట్టి వారు నాకు ప్రియులు- నాకు ఇష్టులు- నాకు భక్తులు. కనుక ఇదిగో ఆశీర్వదిస్తున్నాను అంటూ-

మాశుచః :- శోకించ వద్దు - దిగులు చెందవద్దు అని ఆశీస్సులందిస్తున్నాడు భగవానుడు. సర్వ పాపాల (వాసనలు - కర్మ ఫలాల) నుండి విముక్తులైతే జన్మ లేదు. జన్మకు కారణమైన బీజాలు నశించిపోతాయి. మరి జన్మయే లేకపోతే జన్మ దుఃఖం లేదు, సాంసారిక దుఃఖం లేదు; సామాజికంగా దుఃఖం లేదు; ఆర్థికంగా దుఃఖాలుండవు; శారీరక దుఃఖాలు అసలే ఉండవు. వ్యాధి దుఃఖం లేదు. జరా (ముసలితనం) దుఃఖం లేదు. మరణ దుఃఖం ఉండదు. నరకయాతనలుండవు. తిరిగి తల్లి గర్భంలో ప్రవేశించి గర్భ నరకాన్ని అనుభవించవలసిన అవసరం కూడా ఉండదు. అన్ని దుఃఖాల నుండి విముక్తియే. అందుకే మాశుచః అంటున్నారు.

ఈ పదానికి భగవద్గీతలో ఒక ప్రత్యేకత ఉన్నది. ఎందుకంటే గీతా బోధ ప్రారంభమైనది కూడా 'అశోచ్యా(2-11)' అనే శోక పదంతోనే. ముగింపు 'మాశుచః' అనే శోక పదంతోనే. ఆ శోకానికి ఈ శోకానికి మధ్య గల శ్లోకాలన్నీ మానవుడి యొక్క శోకాన్ని పూర్తిగా పోగొట్టటానికే అనే భగవద్గీతా సందేశం ఈ పదంలో ఇమిడి ఉన్నది.

ఈ విధంగా విషాదంలో మునిగి శరణాగతుడైన అర్జునుని కొరకు చేసిన ఈ అత్యంత రహస్య బ్రహ్మ విద్య- ఏవో కారణాలతో నిత్యమూ విషాదంలో మునిగి పోయే సర్వమానవాళికి- వారు కూడా అర్జునుని లాగా భగవంతునికి శరణాగతులైతే, ప్రపన్నులైతే వారి శోకాన్ని పోగొట్టి శాశ్వతమైన ఆనందాన్ని - పరమానందాన్ని - ఆత్మానందాన్ని- బ్రహ్మానందాన్ని ప్రసాదించటానికి సమర్థత కలిగియున్నది – అని గ్రహించాలి.

*-ఇంతవరకు కర్తవ్య విముఖుడైన అర్జునుని కర్తవ్యోన్ముఖుని చేయటానికి అద్భుత బ్రహ్మ జ్ఞానాన్ని బోధించిన భగవానుడు ఇప్పుడు తన బోధకు కావలసిన ప్రచార పద్ధతిని, ఈ గీతా బోధను వినిపించిన వారికి, విన్న వారికి కలిగే ఫలశ్రుతిని తెలియజేయటానికి సిద్ధ పడుతూ, ముందుగా ఈ జ్ఞానాన్ని ఎవరికి అందించాలో - లేదా దీనిని అందుకొనుటకు ఎవరికి అర్హత ఉన్నదో తెలియజేస్తున్నాడు.*

శ్లో|| ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన|
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాం యోzభ్యసూయతి|| *(67)*

*తా//* నీ కొరకు చెప్పబడ్డ ఈ గీతా శాస్త్రాన్ని తపస్సు చేయని వానికి, భక్తుడు కాని వానికి, గురు సేవ చేయనివానికి, నన్ను ద్వేషించే వానికి ఎట్టి పరిస్థితిలోనూ చెప్పరాదు.

*వ్యాఖ్య:-* శాస్త్రాన్ని తెలుసుకోవాలంటే అర్హత కావాలి. అర్హత లేని వారు ఎంత తెలుసుకున్నా ప్రయోజనం లేదు. అయితే అర్హతలు చెప్పటం బాగానే ఉంటుంది గాని అర్హత లేని వారికి చెప్ప వద్దు అనటం ఏం బాగుంది? అంటారు కొందరు. మరెందుకలా చెప్పినట్లు? భగవంతునిపై భక్తి, గురువుపై విశ్వాసం, శాస్త్రంపై ఆసక్తి లేని అసూయా పరులు ఈ శాస్త్రానికి తప్పుడు అర్థాలు కల్పించి, అవహేళన చేస్తుంటారు. చెప్పేవారిని, వినే వారిని ఎగతాళి చేస్తుంటారు. దీనితో ఈ బ్రహ్మ జ్ఞానంపై అవిశ్వాసం కలిగే ప్రమాదం ఉంది. అందుకే అర్హత లేని వారికి చెప్ప వద్దు అనటం. అనర్హులకు ఈ శాస్త్రాన్ని చెబితే తనలో ఉన్న లోపాన్ని, దోషాన్ని శాస్త్రం మీదకు నెడతారు. అందుకే అనర్హులకు చెప్పకూడదు అనటం.

ఒకడు అలా దారిన వెళుతుంటే ఒక రాయి దొరికింది. అదేమిటో తెలియదు. దాని విలువ కూడా తెలియదు. దానిని అమ్ముదామని కిరాణా కొట్టువానికి చూపితే నాకవసరం లేదన్నాడు. ఒక బుక్ షాపులో చూపితే పేపర్ వెయిట్ గా పనికొస్తుందని 5 రూపాయలిస్తానన్నాడు. ఒక బంగారు దుకాణంలో చూపితే ఇదేదో విలువైన రాయి అని గ్రహించి 500 రూపాయలు ఇస్తానన్నాడు. దానితో వాడికి అనుమానం వచ్చి ఒక వజ్రాల వ్యాపారికి చూపితే 10000 ఇస్తానన్నాడు. అసలది 4 లక్షల విలువ చేసే అపురూప వజ్రం.

వజ్రం విలువ వజ్రాల వ్యాపారికి తెలుస్తుంది గాని కిరాణా కొట్టు వానికి బుక్ షాపు వానికి ఎలా తెలుస్తుంది? నాగ స్వరం ఊదితే నాగు బాము నాట్యం చేస్తుంది గాని మట్టిదినే తుట్టె పురుగుకు ఆ స్వరం విలువ ఏం తెలుస్తుంది? అలాగే ఈ గీతా జ్ఞానం యొక్క విలువ అర్హత ఉన్న వాడికి తెలుస్తుంది గాని అహంకారంతో, అవిధేయతతో మదించి ఉన్న

వాడికి ఎలా తెలుస్తుంది? అందుకే అర్హత లేని వారికి చెప్ప వద్దు - అనటం.

ఈ గీతా శాస్త్రం ఎవరికి చెప్పకూడదో 4 అనర్హతలను చెప్పారు. అవి-

1. న తపస్కాయ :-తపస్సు అంటే సమస్త దుఃఖాలను వదిలించుకొని, శాశ్వత ఆనందాన్ని పొందటానికి తపించటమే తపస్సు. భగవంతుని చేరుకొనుటకు మార్గం ఏమిటా? అని తపించటమే తపస్సు. రాతి నేల మీద విత్తనం నాటకు - అనటం ఎంత సమంజసమో తపస్సు చేయని వానికి గీతా జ్ఞానం వినిపించకు అనటం కూడా అంతే సమంజసం. జ్ఞానం కోసం తపించని వానికి ఈ జ్ఞానాన్ని వినిపిస్తే ప్రయోజనం ఏం ఉంటుంది? రోగం లేని వాడు ఔషధాన్ని స్వీకరించడు, సంసార జనన మరణ దుఃఖం బాధాకరమని తెలియని వాడు ఈ గీతా జ్ఞానమనే ఔషధాన్ని కూడా స్వీకరించడు.

అంతేగాని అరణ్యాలకు వెళ్ళి తపస్సు చేసిన వాడికే చెప్పాలి- అని అర్థం కాదు.

2. న అభక్తాయ :- భక్తుడు కాని వానికి చెప్ప వద్దు అని 2 వ నియమం. భక్తుడు అంటే ఎవరు? ఈ సృష్టి మొత్తానికి ఆధారభూతుడైన అద్భుత దివ్య శక్తి సంపన్నుడొకడు ఉన్నాడని, ఆయనే భగవంతుడని గ్రహించి ఆయనపై అచంచలమైన ప్రేమగలవాడే భక్తుడు. భగవంతుని కోసం నిరంతరం తపించే వాడే భక్తుడు. భగవంతుని అందుకొనుటకు మార్గాన్ని చూపేదే భగవద్గీత. కనుక భక్తునికి ఇది అవసరం. భక్తుడు కాని వానికి ఈ గీతా శాస్త్రం అనవసరం.

3. నచ అశ్రూషవే :- వేదాంతాన్ని గురుముఖత వినాలి. ఎవరంతట వారు చదువుకుంటే అర్థమయ్యేది కాదు. గురుముఖత వినటానికి ముందు ఆ గురువుపై గొప్ప విశ్వాసం

ఉండాలి. ఆ విశ్వాసం గురు సేవ చేస్తేనే కలుగుతుంది. గురు శుశ్రూష 4 విధాలు. 1. స్థాన శుశ్రూష, 2. అంగ శుశ్రూష, 3. భావ శుశ్రూష, 4. ఆత్మ శుశ్రూష. ఈ శుశ్రూష వల్ల గురువు యొక్క అనుగ్రహం, తద్వారా భగవదనుగ్రహం కలుగుతుంది. గురువు ద్వారా విన్న విద్యయే ఉపయోగపడుతుంది. అందుకే గురువు లేని విద్య గ్రుడ్డి విద్య అన్నారు. ఏ శ్రమా లేకుండా, ఏ త్యాగమూ లేకుండా, ఏ సేవా చెయ్యకుండా లభించే జ్ఞానం శ్రవణేంద్రియాలను శుభ్రం చేస్తుందే గాని హృదయాన్ని శుద్ధి చేయలేదు. అందుకే గురువును ఆరాధించాలి. సేవించాలి. పూజించాలి.

తాను యోగీశ్వరుడైనా, జగద్గురువైనా, ఏ విద్యలు నేర్చుకోవలసిన అవసరం లేకున్నా సాందీపని మహర్షిని సేవించి ఆయన ద్వారా విద్యలు నేర్చుకున్నాడు శ్రీకృష్ణుడు.

4. నచ మాంయోభ్యసూయతి :- అసూయాపరుడికి; నన్ను ద్వేషించే వాడికి చెప్ప వద్దు. కొందరు అసూయ కారణంగా భగవంతుని ద్వేషిస్తారు. ఇతరుల సంపదలను చూచి, తమకన్న ఎక్కువ సుఖంగా ఉన్నారు అని భావించి భగవంతుడికి న్యాయం లేదండి అని కొందరు ద్వేషిస్తారు.

కొందరు అకారణంగా ద్వేషిస్తారు. మేం ఈ మతం వాళ్ళం. కనుక  ఆ మతం వాళ్ళ దేవుణ్ణి మేం కొలవం అంటారు. ఇలా భగవంతుని ద్వేషించేవారు ఆ భగవంతుడు చెప్పిన మాటలను - జ్ఞానాన్ని కూడా ద్వేషిస్తారు. అందుకే వారికి చెప్ప వద్దనటం.

ఇట్టి అనర్హతలు గల వారికి చెప్ప వద్దు అంటున్నారు. ఎప్పుడు చెప్ప వద్దు?

కదాచన :- ఎప్పటికీ చెప్ప వద్దు అని. లోకం దృష్టిలో వారు ఎంత గొప్ప వారైనా  ఈ జ్ఞానాన్ని వినటానికి వారు అనర్హులే.

ఇక్కడే మరొక విశేషం ఉన్నది. తపన లేని వారికి, భక్తులు కాని వారికి, గురు సేవ చేయని వారికి, నన్ను ద్వేషించే వారికి చెప్ప వద్దన్నారే గాని పాపపు పనులు చేసే వారికి, దొంగలకు చెప్ప వద్దు అనలేదు. ఎందుకంటే పాపాత్ములను పుణ్యాత్ములుగా చేసేదే ఈ గీతా జ్ఞానం.

ఈ శ్లోకాన్ని చక్కగా అర్థం చేసుకుంటే అర్హతలను సంపాదించటానికి ప్రతి జ్ఞాన పిపాసి ప్రయత్నిస్తాడు. అలా ప్రయత్నించాలనేదే భగవంతుని ఉద్దేశం.

*-ఇక్కడి నుండి రాబోయే 4 శ్లోకాలు ఫల శ్రుతి శ్లోకాలే. ముందుగా రెండు శ్లోకాల్లో ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందించే వారికి ఫలం ఏమిటో తెలియజేస్తున్నారు.*

శ్లో|| యఇమం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి|
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః|| *(68)*

*తా//* ఎవరు ఈ పరమ రహస్యమైన గీతా శాస్త్రాన్ని నా భక్తులకు చెబుతారో వారు నా యందు పరమ భక్తిని కలిగి ఉండి నన్నే చేరుకుంటారు. ఇందులో ఏ సందేహము లేదు.

*వ్యాఖ్య:-* గీతా జ్ఞాన ప్రచారం పట్ల భగవంతునికి ఎంతటి ఆసక్తి, అనురక్తి, అభిలాష ఉన్నదో ఈ శ్లోకం తెలియజేస్తున్నది. ఈ శ్లోకంలో మొత్తం 5 ముఖ్య విషయాలున్నాయి.

1. ఈ గీతా శాస్త్రం ఎలాంటిది? పరమంగుహ్యం. (అత్యంత రహస్యం).

2. దీనిని ఎవరికి చెప్పాలి? మద్భక్తేషు (నా భక్తులైన వారికి).

3. అలా చెబితే ప్రయోజనం? మయి పరాం భక్తింకృత్వా (నాయందు పరమ భక్తి కలిగి).

4. అంతిమ ఫలితం ఏమిటి? మాంఏవఏష్యతి(నన్నే చేరుకుంటాడు).

5. ఏమైనా సందేహం ఉందా? అసంశయః (ఏ సందేహము లేదు).

1. పరమం గుహ్యం :-పరమ రహస్యమైనది ఈ శాస్త్రం అని భగవానుని తీర్పు.

సముద్రం చూడటానికి పైకి నిండుగా, గంభీరంగా, ప్రశాంతంగా కనిపిస్తుంది. కాని లోతుకు వెళ్ళిన కొద్దీ అద్భుతమైన, అనర్ఘమైన, అమూల్యమైన రత్న రాసులు ఎన్ని ఉన్నాయో తెలియదు. ఎన్ని రహస్యాలను తనలో దాచుకున్నదో ఎవ్వరికీ తెలియదు.

అలాగే ఈ భగవద్గీతా శాస్త్రంలోని శ్లోకాలలోని పదాలన్నీ చక్కగా అర్థమైనట్లే ఉంటాయి. కాని లోతుకు వెళ్ళే కొద్దీ - మళ్ళీ మళ్ళీ శ్రవణ మననాలు సాగిస్తుంటేనే ఆ పదాల నుండి ఎన్నో ప్రయోజనకరమైన భావాలు, ఉన్నత మైన భావాలు, అనేక రహస్య సంకేతాలు, సృష్టి రహస్యాలు అవగతమౌతుంటాయి. ఎంత కాలం నీవు ప్రయత్నిస్తావో అంతకాలం అమూల్యమైన రహస్యాలు అందుతూనే ఉంటాయి. అవి మానవ జీవిత వికాసానికి ఎంతగానో తోడ్పడతాయి. అలాంటి జీవిత రహస్యాలను అందుబాటులోనికి తెచ్చి మానవ జీవితాలను తరింపజేయాలనేదే భగవానుని ఆకాంక్ష. అలా తరింప జేయాలంటే ఈ గీతా సాగరంలో మునకలు వేసి, అందులోని రహస్యాలను కనుగొని, వాటిని ఇతరులకు వివరించి చెప్పే సమర్థత గల గురువుల అవసరం ఏంతో ఉంది. అందుకే గురువులకు ప్రశంస. మరి ఇట్టి రహస్య జ్ఞానాన్ని ఎలాంటి అర్హత గల వారికి చెప్పాలి?

*2. మద్భక్తేషు అభిదాస్యతి :-* నా భక్తులైన వారికి చెప్పినట్లయితే- ఇక్కడ భక్తులు అంటే ముముక్షువులే. మోక్షార్థులే. వారే భక్తులు అంటే.

తాము తరించే మార్గం ఏమిటా? అని ఆలోచిస్తూ, తరింపజేసేవారు ఎవరా? అని అన్వేషిస్తూ, నిరంతరం ఈ ఆలోచనలోనే ఉండేవారు; లభించిన ప్రతి అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనే వారు అయిన భక్తులకే ఈ గీతా శాస్త్ర రహస్యాలు, జీవిత ధర్మాలు, మోక్ష ప్రాప్తికి తగిన సాధనలు, అనుసరించ వలసిన మార్గాలు అందాలి. అలా అందాలంటే సద్గురువుల బోధ అవసరం. అలా బోధించే సద్గురువులకు ఫలితం ఏమిటి?

*3 మయి పరాం భక్తిం కృత్వా:-* నా యందు శ్రేష్ఠమైన భక్తిని కలిగి ఉంటారు. సాధారణంగా భక్తులైన వారికి ఈ జ్ఞానాన్ని అందించినప్పుడు భక్తి పూరితమైన ఆ వాతావరణంలో చెప్పిన వారి భక్తి కూడా పరాకాష్ఠను చేరుతుంది. నిరంతరము పరమాత్మ తత్త్వాన్ని, పరమాత్మ స్వరూప స్వభావాలను విశ్లేషించి చెబుతూ ఉండటం వల్ల వారు కూడా పరమాత్మ తత్త్వాన్ని అవగాహన చేసుకుంటారు. తాము కూడా తరించాలనే పట్టుదలతో ఉంటారు. తాను చెప్పేదానిని తానూ ఆచరించాలనే నిశ్చయం కలుగుతుంది. ముందు అంత భక్తులు కాక పోయినా క్రమంగా వారిలో భక్తి వృద్ధి అవుతుంది.

ఒక దొంగ ఒక మామిడి తోటలో ప్రవేశించి మామిడి కాయలను కోసి మూట గట్టుకొని పోబోతుంటే కాపలాదారు ఎదురుగా వస్తున్నట్లు గమనించాడు. దానితో అక్కడే ఒక చోట కూర్చుని, ఆకులను కాల్చిన బూడిద ఉంటే ఒంటినిండా రాసుకొని, తాను కోసిన కాయలను ప్రక్కన పెట్టుకొని కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. అంతలో కాపలావాడు వచ్చి ఇతణ్ణి

చూచి, ఎవరో ముని అని భావించి నమస్కరించి, రెండు కాయలను చెట్టు నుండి కోసి తెచ్చి ఆయన చేతిలో పెట్టాడు. ఆ తర్వాత కొంతసేపటికి ఈ దొంగ కాయలతో సహా వెళ్ళిపోయాడు. ఇప్పుడు అతడిలో ఆలోచన మొదలైంది. తాను కపట మునిగా ఉన్నందుకే తన్నులు తప్పి మరి రెండు కాయలు వచ్చినవి. తన్నటానికి వచ్చినవాడు నమస్కరించి వెళ్ళాడు. మరి నిజమైన ముని అయితే ఎలా ఉంటుంది? అనుకొని నిరంతరం తపస్సు చేసుకొనే మునిగా మారిపోయాడు. అలాగే ముందుగా భక్తి లేక పోయినా భక్తులకు ఈ జ్ఞానాన్ని అందించి, అందించి గొప్ప భక్తుడవుతాడు.

ఇతరులకు ఏ దానం చేసినా పుచ్చుకున్న వాడు ఎప్పటికైనా తిరిగి దానిని ఇచ్చినవానికి వెనక్కు ఇచ్చేయవచ్చు. కాని జ్ఞానం పొందిన తర్వాత నీకు కోపం వచ్చినా సరే ఆ జ్ఞానాన్ని తిరిగి ఇవ్వలేవు. తగిన విలువ కట్టి ఇద్దామన్నా జ్ఞానానికి విలువ కట్టలేవు. అందుకే జ్ఞాన దానం శ్రేష్ఠమైనది.

ఇట్టి జ్ఞానాన్ని భక్తులకు అందించి పరా భక్తుడైన వానికి కలిగే అంతిమ ఫలితం ఏమిటి?

4. మాంఏవ ఏష్యతి :- నన్నే పొందగలడు. ఈ గీతా జ్ఞానాన్ని ఇతరులకు బోధించిన గురువులు పరమ భక్తిని పొంది చివరకు పరమాత్మను చేరుకుంటారు అని భగవానుడు హామీ ఇస్తున్నాడు. ఈ హామీ నిజమా?-

5. అసంశయః :- ఇందులో ఎవరికీ ఎట్టి సందేహము అవసరం లేదు- అని భగవానుడే స్వయంగా తెలియజేస్తున్నాడు. కనుక ఈ శ్లోకంలోని భావాన్ని, సారాంశాన్ని, ఆంతర్యాన్ని ఎవరైనా సరే చక్కగా గ్రహించి నిస్సంశయంగా నమ్మవచ్చు. ఇది భగవానుని ప్రతిజ్ఞ.

గీతా జ్ఞానాన్ని బోధించటం అనేది ఋషి యజ్ఞం అవుతుంది. కనుక ఈ బోధ వల్ల ఋషి ఋణం కూడా తీరుతుంది. భగవద్గీతా గ్రంధ ముద్రణ ద్వారా కూడా ప్రచారం చేయవచ్చు. గ్రంధ ముద్రణ చేసేవారికి సహకరించి కూడా ఋషి ఋణం తీర్చుకోవచ్చు.

*-ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రచారం చేసే గురువుల పట్ల భగవంతునికి ఎలాంటి అభిప్రాయం ఉన్నదో ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.*

శ్లో|| న చ తస్మాన్ మనుష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః|
భవితా న చ మే తస్మాత్
అన్యః ప్రియతరో భువి|| *(69)*

*తా//* మనుష్యలలో అట్టివాని కన్న అధికమైన ప్రియం కలిగించే వాడు నాకు ఎవ్వడూ లేడు. అతడి కన్న నాకు మిక్కిలి ప్రియమైన వాడు మరొకడు ఈ భువిలో ఉండబోడు.

*వ్యాఖ్య:-* భగవానుని ఇచ్ఛను నెరవేర్చుతున్న వారే ఈ గీతా జ్ఞాన బోధకులు; గురువులు, అట్టి వారి వల్ల తనకు కలిగిన ఆనందాన్ని, సంతోషాన్ని దాచుకోలేక వ్యక్తం చేస్తున్న మాటలే ఈ శ్లోకంలోని పదాలు. అలాంటి వారికన్న మిక్కిలి ప్రియులైన వారు ఎవ్వరూ ఉండరు. భవిష్యత్తులో కూడా ఎవ్వరూ ఉండబోరు- అని భగవానుని నిర్ద్వంద్వ ప్రకటన.

'భక్తోసి మే సఖా చేతి' - అర్జునా నీవు నా భక్తుడవు, సఖుడవు అని భగవానుడు అన్నాడు. అర్జునుని అదృష్టమే అదృష్టం అని మురిసిపోయాం. ఇప్పుడు అంతకన్నా ఒక అడుగు ముందుకు వేసి భగవానుడు ఈ గీతా ప్రచారం చేసే

వారి కన్నా నాకు ప్రియమైన వాడు మరొకడు లేడు. భవిష్యత్తులో కూడా అట్టి వాని కన్న ప్రియమైన వాడు మరొకడు ఉండబోడు అంటున్నాడు.

ఈ లోకంలో ప్రజల మెప్పు కోసం తంటాలు పడేవారు ఎందరో ఉంటారు. కాని పరమాత్మ మెప్పు కోసం పాటుపడేవారు ఎవరో కొద్ది మందే. పుణ్య కార్యాలు, దాన ధర్మాలు, పూజలు వ్రతాలు చేసేవారు, గుళ్ళు గోపురాలు కట్టించేవారు, విద్యాలయాలు, వైద్యాలయాలు కట్టించేవారు ఎందరో ఉంటారు. వారందరి కన్న ఇష్టులైన వారు ఈ జ్ఞాన ప్రచారం చేసేవారు – అని భగవానుడే తెలియజేస్తున్నాడు. అంటే జ్ఞాన ప్రచారం అన్ని పుణ్య కర్మల కన్న గొప్ప పుణ్య కర్మ. అంతే కాదు వీరిని ప్రియులు అనకుండా 'ప్రియకృత్తమః' అంటున్నారు.

*ప్రియకృత్ = ప్రియమైన వారు - *(Positive degree)*

*ప్రియకృత్ తరః = చాలా మంది కన్న ప్రియులు. *(comparative degree)*

*ప్రియకృత్తమః = లోకంలో అందరి కన్న ప్రియులు *(superlative degree)*

భూత భవిష్యత్ వర్తమానాలలో ఇక అంతకన్న ప్రియులుండరు-అని.

ఈ విషయాన్ని గట్టిగా నొక్కి చెప్పటానికే ఈ శ్లోకంలో 'భువి'- 'భవితా' అనే రెండు పదాలను వాడారు.

'భువి' అనే పదం వల్ల - ఈ భూమండలం అంతా వెదికినా అలాంటి వాడు మరొకడు లేడని, 'భవితా' అనే పదం వల్ల - భవిష్యత్తులో కూడా అలాంటి వాడు మరొకడు ఉండడు- అని ఎంతో ఉత్సాహంతో భగవానుడు చెబుతున్నాడు.

*గీతను విన్న అర్జునుడు భగవంతునికి ఇష్టుడు.

*గీతను ప్రచారం చేసిన గీతా బోధకుడు అంతకన్నా ఇష్టుడు.

తన బిడ్డకు పెద్ద జబ్బు చేసినప్పుడు అతడికి తగిన చికిత్స చేసి ఔషధమునిచ్చి, ఆ జబ్బును నయం చేసి బిడ్డను బ్రతికించిన డాక్టరుపై ఆ తండ్రికి ఎంతో కృతజ్ఞతా భావం ఉంటుంది. గౌరవం ఉంటుంది. అలాగే తన బిడ్డలైన ఈ మానవులందరికీ అజ్ఞానమనే (భవ రోగమనే) గొప్ప జబ్బు చేసి బాధలు పడుతుంటే; వారికి తగిన చికిత్సలు చేసి, జ్ఞానమనే ఔషధాన్నిచ్చి, సాధనలనే పథ్యం చేయించి, ఆ అజ్ఞానమనే జబ్బును నయం చేసిన ఆధ్యాత్మిక గురువులనే డాక్టర్లపై ఆ భగవంతునికి ఎంత ప్రీతియో, ఎంత ప్రేమయో, ఎంత ఇష్టమో, ఎంత వాత్సల్యమో వ్యక్తం చెయ్యటానికి మాటలను వెతుక్కుంటున్నాడు. మై మరచి మాట్లాడుతున్నాడు.

*-ఇంతవరకు భగవద్గీతను బోధించిన గురువుల గురించి చెప్పి ఇప్పుడా గీతా జ్ఞానాన్ని విన్నవారు, అధ్యయనం చేసిన వారు ఎట్టి ఫలితాన్ని పొందుతారో తెలియజేస్తున్నారు.*

శ్లో|| అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః|
జ్ఞానయజ్ఞేన తేనాహం
ఇష్టః స్యామితి మే మతిః|| (70)

*తా//* ఎవరైతే ధర్మ యుక్తమైన మన ఈ సంవాదాన్ని అధ్యయనం చేస్తారో అతడి చేత నేను జ్ఞాన యజ్ఞం ద్వారా ఆరాధించబడ్డ వాడినవుతాను. ఇది నా నిశ్చయం.

*వ్యాఖ్య:-* 1. ఆవయోఃఇమం సంవాదం :- భగవద్గీత కృష్ణార్జునుల మధ్య సంవాద రూపంలో ఉన్నది. భారతీయ వేదాంత గ్రంథాలన్నీ గురు శిష్య సంవాద రూపంలోనే

ఉంటాయి. అటువంటి సంవాద రూపంలోని ఈ గీతా శాస్త్రం యొక్క హృదయం ఎలాంటిది? ఈ సంభాషణలోని రహస్యం ఏమిటి?

2.ధర్మ్యం :- ఇది ధర్మానికి మూలమైనది. ధర్మంతో కూడుకున్నది. ధర్మాన్ని నిలబెట్టేది. మన స్వధర్మాన్ని మనచేత ఆచరింపజేసేది. అందుకే ప్రప్రధమ శ్లోకం 'ధర్మ' తో ప్రారంభమైనది. అలాగే ముగింపు కూడా సర్వధర్మాన్ అంటూ ధర్మతోనే ఉపసంహరించబడ్డది. కనుక ఇది ధర్మ యుక్తం.

అంతే కాదు మొదటి శ్లోకంలో మొదటి రెండు అక్షరాలు 'ధర్మ' అయితే చివరి శ్లోకం చివరి రెండు అక్షరాలు 'మమ'. రెండూ కలిపితే 'మమ ధర్మ' అంటే నా ధర్మం - స్వధర్మం అని. గ్రహించి ప్రతి వారూ స్వధర్మాన్ని పాటించాలి. స్వధర్మ పాలనయే గీతా సారాంశం. అందుకే ప్రత్యేకంగా 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్' అని 3, 18 అధ్యాయాలలో స్పష్టంగా చెప్పారు. చక్కగా ఆచరించిన పరధర్మం కన్నా గుణంలేనిదైనా స్వధర్మమే మిన్న అని స్వధర్మాన్నే ఆచరించమని నొక్కి చెప్పారు. స్వధర్మంలో మరణించినా శ్రేయస్కరమే. పరధర్మం భయావహం అని కూడా చెప్పారు. కనుక స్వధర్మాచరణమే శ్రేయస్కరం.

క్రొత్తగా పెళ్ళయిన జంట సినిమాకు వెళ్ళి బాక్స్ లో కూర్చున్నారు. ఇద్దరే గనుక ఒకరి చేతిని మరొకరు పెన వేసుకొని కూర్చున్నారు. ఇంతలో భర్తకు చేతి మీద జిల పుడితే రెండవ చేతితో సున్నితంగా గోకాడు. అయితే స్పర్శ జ్ఞానం లేదు. ఎంత గోకినా స్పర్శ జ్ఞానం లేకపోవటంతో భార్యతో కలిసి బయటకు వచ్చి పక్షవాతమనే భయంతో రిక్షాలో హాస్పటల్‌కు బయలుదేరారు. ఎందుకండీ హాస్పటల్‌కు? అని భార్య అడుగుతుంటే విషయం చెప్పాడు. మీకెందుకు

అనుమానం వచ్చిందండీ అని భార్య అంటే జిలగా ఉంటే చేతిపై గోకాను. స్పర్శ జ్ఞానం లేదు. అన్నాడు. దానితో భార్య ముసిముసిగా నవ్వుతూ చంపారుగదండీ! ఇందాకట్నుంచీ మీరు గోకుతున్నది నా చేతిని గదా! సరదాగా గోకుతున్నారనుకున్నాను. ఇప్పుడు మీ చేతిని గోకి చూడండి - అన్నది. గోకేటప్పటికి స్పర్శ తెలుస్తూనే ఉన్నది. భయం తీరిపోయింది. ఆనందంగా ఇంటికి వెళ్ళారు.

నీ చేతికి జిల పుట్టినప్పుడు నీ చేతినే గోకాలి. ఇతరుల చేతిని గోకితే నీకు భయమే మిగులుతుంది. అలాగే నీ స్వధర్మాన్ని నీవు పాటిస్తే మంచిదే. పరధర్మం బాగున్నదని ఆచరిస్తే భయమే మిగులుతుంది. కనుక స్వధర్మాచరణే శ్రేయస్కరం.

అంతే కాదు. భగవద్గీత ధర్మానికే జయం అని కూడా చెబుతున్నది. మొదటి శ్లోకంలోని మొదటి రెండక్షరాలు 'ధర్మ'. చివరి రెండక్షరాలు 'జయ' అంటే ధర్మానికే జయం అని సారాంశం.

ఇలా ధర్మాన్ని ప్రబోధించే ఈ గీతా శాస్త్రాన్ని ఎవరు అధ్యయనం చేస్తారో అట్టి వారికి కలిగే ఫలితం ఏమిటి ?

*3.జ్ఞానయజ్ఞేన ఇష్టస్యామ్* :- జ్ఞానం యజ్ఞం చేత నేను పూజింపబడినట్లు అంటున్నాడు భగవానుడు. పుష్పాలతో పూజించటం సాధారణ పూజ. దానిని అందరూ చేయవచ్చు. అది పసివాడు నడక నేర్చినట్లు. కాని జ్ఞాన యజ్ఞంతో పూజించటం అంటే ఒలింపిక్స్‌లో పరుగు పందెం లాంటిది. ఇది భగవంతునికి ఇష్టమైన పూజ. ఎందుకంటే గీతను అధ్యయనం చేస్తే అందులోని భావాలు తెలుస్తాయి. తద్వారా తనలోని అహంకార మమకారాలను దగ్ధం చేసుకొని పరమాత్మను నిజంగా పూజించినట్లవుతుంది. తుప్పు పట్టిన

ఇనుప ముక్కను నిప్పులో కాలిస్తే తుప్పు వదిలి పోయి శుభ్ర పడుతుంది. అలాగే అజ్ఞానమనే తుప్పు పట్టిన ఈ జీవుడు జ్ఞానాగ్నిలో కాలితే అజ్ఞానం వదిలి వ్యక్తిత్వం శుభ్ర పడుతుంది. ఇదే జ్ఞాన యజ్ఞం వల్ల ప్రయోజనం.

**4.యఃచ** :-ఈ పదం గీతలో దాదాపు 40 సార్లు వచ్చింది. ఎవరైతే అని అర్థం. అంటే జాతి, మత, వర్ణ, వర్గ, కుల, లింగ భేదాలు లేకుండా ఎవరైతే ఈ జ్ఞానాన్ని - గీతా శాస్త్రాన్ని కూలంకషంగా అధ్యయనం చేస్తారో అట్టి వారందరూ భగవంతుని జ్ఞాన యజ్ఞంతో పూజించినట్లే - అని దీని భావం.

**5. ఇతిమేమతిః** :-ఇది నా నిశ్చయం అనటం వల్ల ఇక ఏ సంశయాలు, సందేహాలు అవసరం లేదు, ఇది పరమ ప్రమాణం అని భగవానుని నిష్కర్ష.

కనుక ఈ గీతా శాస్త్రాన్ని చక్కగా విని, మననం చేసి, అధ్యయనం చేసి ఇందులోని విషయాలను కూలంకషంగా గ్రహిస్తే అజ్ఞానాన్ని పోగొట్టుకొని ఆత్మతో అనుసంధానాన్ని సాధిస్తారు.- అని తెలుసుకోవాలి.

*-జాగ్రత్తగా - లోతుగా అధ్యయనం చేయలేని వారు కేవలం వినగలుగుతారు. అలా కేవలం వింటే ఫలితం ఏమిటి?-*

శ్లో|| శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః|
సో2పి ముక్త శ్శుభాన్ లోకాన్
ప్రాప్నుయాత్ పుణ్యకర్మణాం|| (71)

తా// శ్రద్ధావంతుడై, అసూయ లేని వాడై ఏ మానవుడు కేవలం దీనిని వింటాడో అతడు కూడా పుణ్య కర్మలు చేసిన వారికి

లభించే పుణ్య లోకాలను చేరుకుంటాడు. సర్వ పాపాల నుండి విముక్తుడవుతాడు.

*వ్యాఖ్య:-* ఈ గీతా శాస్త్రాన్ని అధ్యయనం చేసే పాండిత్యం లేకపోయినా, ప్రచారం చేసే వాక్చాతుర్యం లేకపోయినా, మహాత్ముల నుండి - గురువుల నుండి విన్నప్పటికీ తగిన ఫలితాన్ని పొందగలుగుతారు. అయితే శ్రద్ధ ఉండాలి. అసూయ లేకుండా ఉండాలి.

*1. శ్రద్ధ :-* శ్రద్ధ అంటే గురువుపైన, వేదాంత వాక్యాలపైన గట్టి నమ్మకం - విశ్వాసం. వేదాంతం కాలక్షేపం కోసం వినేది కాదు, జీవితాన్ని తరింపజేసుకొనుటకు వినాలి. జన్మ సార్థకం చేసుకొనుటకు తగిన ఉపాయాలను మార్గాలను చూపేదే భగవద్గీత. కనుక భగవద్గీతను తెలుసుకుంటే జన్మకు సార్థకత కలుగుతుంది. కేవలం విన్నా ప్రయోజనమే అసలు శ్రద్ధ ఉండాలన్న విషయం తలకెక్కాలనుకున్నా శ్రద్ధ ఉండాల్సిందే.

*2. అనసూయచ :-* అసూయ లేకుండుటే అనసూయ. అందుకే 9 వ అధ్యయనంలో రాజ విద్యను - రాజ గుహ్యమును బోధిస్తూ భగవానుడు అర్జునునితో "ఇదంతుతే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే" నీవు అసూయలేని వాడవు గనుక మిక్కిలి రహస్యమైన ఈ బ్రహ్మ విద్యను నీకు చక్కగా తెలియజేయబోతున్నాను. - అన్నాడు. కనుక బ్రహ్మ విద్యను పొందటానికి అర్హత అసూయ లేకుండుటే.

అనసూయ అత్రి మహర్షి భార్య. అత్రి అంటే త్రిగుణాతీతుడు- అనసూయ అంటే అసూయ లేనిది. అసూయలేని త్రిగుణాతీతునికే దత్తాత్రేయుడు జన్మించేది. దత్తాత్రేయుడంటే పరమ జ్ఞానం. కనుక జ్ఞానం కలిగేది అసూయారహితునకే.

మహాభారతంలో దుర్యోధనునిది ఈ జబ్బే. రాజసూయ యాగానికి వెళ్ళి, ధర్మరాజు సంపదలు చూచి కన్ను కుట్టింది. కంటికి నిద్ర లేదు. పాండవుల సంపదనెలా హరించాలా? అని ఒకటే ఆలోచన. శకుని సలహాతో మాయా జూదం ఆడించి వారి సంపదను హరించి, ద్రౌపదిని పరాభవించి, ద్రౌపదీ పాండవులను అరణ్య అజ్ఞాత వాసాలకు పంపించాడు. చివరకు ఘోరమైన యుద్ధానికి సిద్ధపడి పుత్ర, మిత్ర, సోదర, బాంధవ సహితంగా 18 అక్షౌహిణుల సేన నాశనానికి కారకుడయ్యాడు. 99 మంది సోదరులతో కలసి తానూ సర్వనాశమైపోయాడు. ఈ అసూయ ఆధ్యాత్మిక రంగంలో కూడా జ్ఞానం కలగకుండా అడ్డుపడుతుంది. అసూయ లేకుండా ఈ గీతా శాస్త్రాన్నివినాలి.

3. శ్రుణుయాత్ అపి :- కేవలం విన్నప్పటికీ వారికి కూడా ప్రయోజనమే. యాదాలాపంగా వినటం మొదలు పెట్టినా పూర్వజన్మసుకృతం ఉన్నవారు క్రమంగా శ్రద్ధ కలిగి, అర్థం చేసుకొని, ఎప్పటికైనా ఆచరించి ప్రయోజనాన్ని పొందుతారు. కనుక కేవల శ్రవణం కూడా మంచిదే. ఏమిటి ప్రయోజనం?

4. ముక్తః :- ముక్తః అంటే ముక్తినందుకుంటారు అని కాదు. ఇక్కడ పాప విముక్తులౌతారు, దోష విముక్తులౌతారు అని. అంటే తమలోని వాసనలను క్షయం చేసుకుంటారు- అని మాత్రమే. అలా పాప విముక్తులై,-

5. పుణ్య కర్మణాం శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ :- పుణ్య కర్మలు చేసిన వారు పొందే స్వర్గాది లోకాలను పొందుతారు. గీతా శాస్త్రాన్ని కేవలం వినటం పుణ్య కర్మ. దాన ధర్మాలు చేయలేనివారు, పూజాదికాలు, యజ్ఞ యాగాలు నిర్వహించ లేని వారు, గుళ్ళు గోపురాలు కట్టించలేనివారు, పుణ్యం సంపాదించుకోలేక పోతున్నామే అని బాధపడేవారు కేవలం

భగవద్గీతను శ్రద్ధతో వింటే చాలు. వారికి పుణ్య కార్యాలు చేసిన వారికి లభించే స్వర్గాదిలోకాలు లభిస్తాయి. పితృలోకం, స్వర్గలోకం, చంద్రలోకం...... అంటూ ఇలా భోగాలననుభవించే లోకాలకు చేరుతారు. వినటమే గాక ఆచరణలో పెట్టుకుంటే వాసనా క్షయం- చిత్త శుద్ధి- జ్ఞాన ప్రాప్తి - ముక్తి- మోక్షం- పరమానందం. కనుక శ్రద్ధతో విన్నా ప్రయోజనమే.

*-ఇంతవరకు అర్జునునికి అద్భుతమైన, ఉపనిషత్సారమైన వేదాంత జ్ఞానాన్ని అందించి, అర్హతలను తెలియజేసి, ఈ శాస్త్రాన్ని ఇతరులకు వినిపించిన వారికి ఏమి ఫలితమో, అధ్యయనం చేసిన వారికి - కేవలం శ్రవణం చేసిన వారికి ఎటువంటి ప్రయోజనమో తెలియజెప్పి ఇక చివరిగా తాను చేసిన బోధను అర్జునుడు సరిగ్గా గ్రహించాడా? లేదా? అని తెలుసుకోవాలని ప్రశ్నిస్తున్నాడు. ఇదే భగవానుని చివరి మాట.*

శ్లో|| కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ!
త్వయైకాగ్రేణ చేతసా|
కచ్చిదజ్ఞానసమ్మోహః
ప్రనష్టస్తే ధనంజయ|| (72)

*తా//* అర్జునా! ఈ గీతా శాస్త్రాన్ని నీవు ఏకాగ్ర చిత్తంతో విన్నావా? ఓ ధనం జయా! అజ్ఞానం వల్ల కలిగిన నీ మోహం సంపూర్ణంగా తొలగిపోయిందా?

*వ్యాఖ్య:-* ఇంతవరకు తాను చెప్పిన విషయాన్ని శిష్యుడు ఎంత వరకు అర్థం చేసుకున్నాడో, ఈ జ్ఞానం వల్ల అతడిలో ఏమైనా

మార్పు వచ్చిందో, లేదో, అర్జునుని దుఃఖాన్ని- మోహాన్ని తొలగించిందో - లేదో తెలుసుకోవాలనుకున్నాడు గురువైన భగవానుడు. అది కూడా శిష్యుని నోటిమీదుగానే వినాలనుకున్నాడు. అందుకే ప్రత్యేకంగా ప్రశ్నిస్తున్నాడు. నిజంగా సాధారణంగా ఆధ్యాత్మిక గురువు - సద్గురువు జ్ఞాన బోధ చేసిన తరువాత శిష్యులు తన బోధను చక్కగా అర్థం చేసుకున్నారా? లేదా? అని తెలుసుకోవాలనుకుంటాడు. వారిలో మార్పును చూడాలనుకుంటాడు. ఇది సద్గురువుల లక్షణం. శిష్యుల ఉన్నతి కోసం ఏదో చేయాలనే తపన ఉన్నవాడే సద్గురువు.

రోగికి మందు ఇచ్చిన తరువాత, ఆ మందును రోగి వాడిన తరువాత జబ్బు నయం అయిందా? లేదా? స్వస్థత చేకూరిందా? లేదా? అని అడిగి తెలుసుకోవటం డాక్టరు యొక్క భాద్యత. అలాగే ఆత్మజ్ఞానమనే ఔషధాన్ని ఇచ్చిన తరువాత శిష్యునిలోని అజ్ఞానం తొలగిపోయిందా? లేదా? అని తెలుసుకోవాలనుకోవటం సద్గురువు యొక్క భాద్యత. అందుకే భగవానుని ప్రశ్న. ఇక్కడ మొత్తం 2 ప్రశ్నలు, అవి-

1. అర్జునా! నేను చెప్పిన జ్ఞానాన్ని ఏకాగ్రతతో పూర్తిగా విన్నావా?

2. అజ్ఞానం వల్ల కలిగిన నీ మోహం పూర్తిగా తొలగి పోయిందా?

1. ఏకాగ్రేణ చేతసా :- వేదాంతాన్ని ఏకాగ్రచిత్తంతో వినాలి. సాధారణంగా లోకంలో ఏ పని చేసేటప్పుడైనా ఈ ఏకాగ్రత అవసరమే, కుమ్మరి కుండలు చేసేటప్పుడు గాని, వడ్రంగి చెక్క పనులు చేసేటప్పుడు గాని, కంసాలి ఆభరణాలు తయారు చేసేటప్పుడు గాని, గృహిణులు వంట చేసేటప్పుడు గాని, విద్యార్థులు పాఠాలు వినేటప్పుడు గాని, జాలరి చేపలు

పట్టేటప్పుడు గాని,- అన్ని సందర్భాలలోను ఏకాగ్రత ఉండాలి. వీటన్నింటి కన్నా వేదాంతం వినేటప్పుడు ఎంతో ఎక్కువ ఏకాగ్రత ఉండాలి. చిత్తం అనేక విషయాల మీదకు పరుగెడుతుంటే వేదాంతం అర్ధం కాదు.

*చలించే నీటిలో సూర్యబింబం స్థిరంగా నిలవదు.

*చలించే అద్దంలో ప్రతి బింబం స్థిరంగా నిలవదు. అలాగే

*చలించే మనస్సులో జ్ఞానం స్థిరంగా నిలవదు. అందుకే ఏకాగ్ర చిత్తంతో విన్నావా? అని భగవానుడు ప్రశ్నిస్తున్నాడు. ఇలా అడగటానికి మరొక కారణం కూడా ఉన్నది. ఈ అద్భుత వేదాంత జ్ఞానాన్ని భగవానుడు చెబుతున్నది *18* అక్షౌహిణుల సేనతో కూడిన యుద్ధరంగ మధ్యంలో; ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింపులు, రథ చక్ర ఘోషలు, వీరుల ధనుష్టంకారాలు, యుద్ధ భేరీల మ్రోతల మధ్య, ఇలాంటి వాతావరణంలో విషాదంలో ఉన్న అర్జునుడు ఏకాగ్ర చిత్తంతో విన్నాడా? అర్ధం చేసుకున్నాడా? అనేది భగవానుని సందేహం. అందుకే ప్రశ్న.

*2. ఏతత్ శ్రుతం కశ్చిత్ :-* దీనిని పూర్తిగా విన్నావా? అన్నది మరొక సందేహం. వేదాంతం అరకొరగా వింటే అర్ధం కాదు. మామూలు విషయాలే పూర్తిగా వినకపోతే అర్ధం కావు. అలాంటిది వేదాంతం పూర్తిగా వినకపోతే ఎలా అర్థమవుతుంది? ఒక్కసారి కాదు అనేక సార్లు వింటేనే విషయం అవగాహన అయ్యేది; భావాలు స్థిరపడేది. మనలో అజ్ఞానాన్ని తొలగించుకోవాలంటే వేదాంత జ్ఞానాన్ని మనస్సుకు పట్టించుకోవాలి.

*3. అజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే :-* మోహం, లేదా భ్రమ అనేది కలిగేది అజ్ఞానం వల్ల. అజ్ఞానం తొలగితేనే మోహం తొలగేది. చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రమ పడతాం. ఈ భ్రమ

తొలగాలంటే చీకటి తొలగిపోవాల్సిందే. అలాగే మనలోని భ్రమ- మోహం, - నేను దేహాన్ని అనే మోహం తొలగాలంటే అజ్ఞానం తొలగిపోవాల్సిందే.

*చీకటి వల్ల త్రాడును చూచి పాము అని భ్రమ పడతాం.

*అజ్ఞానం వల్ల ఆత్మను చూచి జీవుడు అని భ్రమ పడతాం.

మరి అజ్ఞానం వల్ల కలిగిన ఈ మోహం పూర్తిగా తొలగిపోయిందా? అనేది భగవానుని సంశయం.

అర్జునుడు తాను దేహాన్ని అనే భ్రమలో ఉన్నవాడు. ఎదురుగా ఉన్న భీష్మద్రోణాదులు కూడా దేహాలనే అనుకుంటున్నాడు. ఆ దేహాలకు తన దేహానికి సంబంధం ఉంది. ఒకరు తాత. మరొకరు గురువు. తాను సంహరిస్తే ఆ దేహాలు నశిస్తాయి గదా! వారు తనవారు గదా! అని విషాదం చెందుతున్నాడు. ధర్మ సంమూఢ చేతస్కుడయ్యాడు. క్షత్రియ ధర్మాన్ని పాటించాలనే ఆలోచన కూడా లేకుండా యుద్ధ విముఖుడయ్యాడు.

ధర్మానికి హాని కలిగించిన వారిని శిక్షించాలి. ఇది క్షత్రియ ధర్మం. కౌరవులు అధర్మపరులు. చిన్నతనంలోనే పాండవులను అంతం చేయాలని చూసిన వారు. లక్కయింట తగులబెట్టాలని ప్రయత్నించిన వారు. మాయా జూదంలో రాజ్యాన్ని హరించిన వారు. ద్రౌపదిని నిండు సభలో అవమానించిన వారు. మోసగించి జూదంలో ఓడించి అరణ్య అజ్ఞాత వాసాలకు పంపినవారు. ఇప్పుడు తమ రాజ్యాన్ని తమకివ్వక యుద్ధానికి సిద్ధపడి వచ్చినవారు. అట్టి అధర్మ పరులకు సహాయంగా వచ్చి నిలిచిన వారు భీష్మ ద్రోణాదులు, కనుక వారిని యుద్ధంలో ఎదిరించటం, సంహరించటం క్షత్రియోచితమైన ధర్మమే. అయినా మమకారం వల్ల, నావారు-నావారు అంటూ యుద్ధ విముఖుడయ్యాడు.

అటువంటి అర్జునుని - విషాదంలో మునిగి, గాండీవాన్ని వదిలి రథోపస్థుడైన అర్జునుని విషాదాన్ని పోగొట్టి కర్తవ్యోన్ముకుణ్ణి చేయటం భగవానుడు తన కర్తవ్యంగా భావించాడు. అర్జునుడు కర్తవ్యోన్ముఖుడు కావాలంటే విషాదం పోవాలి. విషాదం పోవాలంటే అహంకార మమకారాలు పోవాలి. అహంకార మమకారాలు పోవాలంటే అజ్ఞానం పోవాలి. అజ్ఞానం పోవాలంటే జ్ఞానం కలగాలి - ఆత్మజ్ఞానం కలగాలి అందుకే అద్భుతమైన ఆత్మజ్ఞానాన్ని బోధించాడు ఇంతవరకు.

మరి తాను బోధించిన ఆత్మ జ్ఞానం వల్ల అర్జునునిలోని అజ్ఞానం తొలగిందా? అజ్ఞానం వల్ల కలిగిన మోహం - మమకారం తొలగిందా? మమకారం వల్ల కలిగిన విషాదం తొలగిందా? విషాదం కారణంగా కర్తవ్య విముఖుడైన వాడు ఇప్పుడు కర్తవ్యోన్ముఖుడౌతున్నాడా?- తెలుసుకోవాలనుకున్నాడు భగవానుడు. అందుకే నీ అజ్ఞాన సమ్మోహం పూర్తిగా తొలగి పోయిందా? అని అడుగుతున్నాడు. ఇక్కడ నష్టః అనకుండా ప్రనష్ట = పూర్తిగా తొలగి పోయిందా? అనటం విశేషం.

4. ప్రనష్టః :- అజ్ఞానం కొద్దిగా తొలగితే ప్రయోజనం లేదు, పూర్తిగా తొలగాలి. ఒక గురువు శిష్యులకు జ్ఞాన బోధ చేస్తున్నాడు. అక్కడ ఒక ఎలుక కన్నంలోకి పోతూ వస్తూ ఉన్నది. దీనినే చూస్తున్నాడు ఒక శిష్యుడు. గురువు ఆ శిష్యుణ్ణి అడిగాడు. అరే అజ్ఞానం పూర్తిగా పోయిందా? అని. అప్పుడు ఎలుక కన్నంలోకి పోయింది గాని తోకపైకే కనపడుతున్నది. ఠపీమని శిష్యుడు సమాధానం చెప్పాడు, ****పూర్తిగానే పోయింది గాని తోక మాత్రం ఇంకా ఉన్నది గురువుగారూ

అని. ఇలా ఏమీ మిగలకూడదు. పూర్తిగా అజ్ఞానం తొలగితేనే ప్రయోజనం. అందుకే భగవానుని ప్రశ్న.

*-అర్జునా! సరిగ్గా విన్నావా? నీ మోహం పూర్తిగా నశించిందా? అని అడిగిన భగవానునికి అర్జునుడు చెప్పదలుచుకున్న సమాధానాన్ని ఎంతో వివరంగా చెబుతున్నాడు.*

అర్జున ఉవాచః

శ్లో|| నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాచ్యుత!|
స్థితో2స్మి గతసందేహః
కరిష్యే వచనం తవ|| (73)

తా// అర్జునుడు అంటున్నాడు. అచ్యుతా! నీ అనుగ్రహం వల్ల నా మోహం తొలగి పోయింది. స్మృతి కలిగింది. సందేహాలన్నీ తీరిపోయాయి. స్థిరంగా ఉన్నాను. నీవు చెప్పినట్లు చేస్తాను.

వ్యాఖ్య:- గురువు "యధేచ్ఛసితధాకురు" – 'నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో'! అన్నాడు. శిష్యుడు 'కరిష్యే వచనం తవ' -'నీవు చెప్పినట్లే చేస్తాను' అన్నాడు. ఆధ్యాత్మిక రంగంలో దారి చూపటమే గురువు యొక్క పని. ఇలా చెయ్యమని శాసించరాదు. అయితే శిష్యుడు మాత్రం స్వేచ్ఛగా, ఇష్ట పూర్తిగా గురువు చూపిన మార్గంలోనే నడవాలి. అతడే నిజమైన శిష్యుడు. ఏమన్నాడు అర్జునుడు?-

*1. నష్టో మోహః:-* నా మోహం నశించింది -అని. భగవానుని ద్వారా ఇంతవరకు విన్న జ్ఞానం అమోఘము, అద్భుతము, అద్వితీయము, అమూల్యము, అత్యంత రహస్యము, ఆనంద ప్రదము అయినది. ఇట్టి జ్ఞానాన్ని శ్రీ కృష్ణుని అపారమైన దయ వల్లనే వినగలిగాడు. అందుకే ఎంతో ఆనందం. తన ఆనందాన్ని మాత్రం దాచుకోకుండా చెప్పదలచుకొన్న విషయాన్ని సాగదీయకుండా సూటిగా చెప్పేస్తున్నాడు. 'నా మోహం తీరిపోయింది' - అని.

అర్జునుని మోహం దేహభ్రాంతియే. నేను దేహాన్ని అనే భ్రాంతియే. అదే మోహం. ఈ మోహం వల్లనే మమకారం ఏర్పడింది. మమకారం వల్లనే విషాదం కలిగింది. దానితో తన కర్తవ్యాన్ని విడిచిపెట్టాడు. ఈ మోహాన్ని పోగొడితే తప్ప అర్జునుడు తిరిగి కర్తవ్యోన్ముఖుడు కాడు, అందుకే భగవానుడు తగిన ఔషధాన్ని ఇచ్చాడు.

విషాదం తొలగాలంటే మమకారం తొలగాలి. మమకారం తొలగాలంటే అహంకారం పోవాలి. అహంకారం పోవాలంటే భ్రాంతి తొలగాలి. అది తొలగాలంటే నేను ఆత్మను అనే జ్ఞానం కలగాలి. అందుకే ప్రారంభంలోనే ఆత్మ జ్ఞానాన్ని అందించాడు భగవానుడు. అర్జునా! నీవు నశించి పోయే దేహానివి కాదు. నశించని ఆత్మవు అని తెలియజేశాడు. దానితో అర్జునునిలో ఆత్మజ్ఞానం కలిగింది. విశ్వరూప సందర్శనంతో తన మోహాన్ని నశింపజేసుకున్నాడు. అందుకే 'నష్టో మోహః' అనగలిగాడు.

*2. స్మృతిర్లబ్ధా :-* స్మృతి కలిగింది అన్నాడు. ఏదైనా యాక్సిడెంట్ జరిగినప్పుడు స్మృతి తప్పుతారు. తరువాత ఎప్పుడో తిరిగి స్మృతి కలుగుతుంది. మరచిన విషయం గుర్తుకు రావటమే స్మృతి కలగటం అంటే.

అర్జునుడు తన స్వరూపాన్ని మరచిపోయాడు. తాను ఆత్మను అనే సత్యాన్ని మరచిపోయాడు. దేహ భ్రాంతి వల్లనే మరపు. ఇప్పుడు భగవానుని బోధతో ఆ మరుపు తొలగి ఎరుక కలిగింది. నేను ఆత్మను అనే ఎరుక కలిగింది. అయితే ఇదంతా తన గొప్పతనం అని అహంకరించటం లేదు అర్జునుడు. ఇంతటి అదృష్టం తనకు ఎలా కలిగిందో ఆ విషయాన్ని కూడా తెలియజేస్తున్నాడు.

*3. త్వత్ ప్రసాదాత్ మయా :-* నీ అనుగ్రహం వల్లనే నాకీ స్మృతి కలిగింది అంటున్నాడు అర్జునుడు. ఆత్మజ్ఞానం గురువు యొక్క అనుగ్రహం ద్వారానే లభిస్తుంది. గురువు లేకుండా నేర్చుకొనే విద్య ఎప్పటికీ అనుభవానికి రాదు. అందుకే గురువు లేని విద్య గ్రుడ్డి విద్య అన్నారు. ఇక్కడ అర్జునుని గురువు సామాన్య గురువు కాదు. జగద్గురువు. అట్టి గురువు నుండి గ్రహించిన జ్ఞానం అద్బుత జ్ఞానం. అందుకే కృతజ్ఞతా సూచకంగా ఇది అంతా నీ దయ వల్లనే అంటున్నాడు.

నిజమైన శిష్యుడు తనకు లభించిన జ్ఞానం గురువు యొక్క అనుగ్రహంతో లభించినదే అని విశ్వసిస్తాడు. అహంకారి శిష్యుడే ఇదంతా నా ప్రజ్ఞ అంటాడు. ఏకలవ్యుడు నిజంగా ద్రోణుని వద్ద విద్య నేర్వలేదు. ద్రోణ విగ్రహాన్ని ముందు పెట్టుకొని సాధన చేసి అపూర్వమైన విద్యను నేర్చుకొన్నాడు. అయినా అతడు ఇదంతా నా ప్రతిభ అనలేదు. నా గురువు యొక్క ప్రసాదమే అన్నాడు. ''యది శిష్యో2సిమే వేతనం దీయతాం''- ''నీవు నా శిష్యుడివే అయితే నాకు గురు దక్షిణ ఇవ్వాలి'' అన్నప్పుడు నీవు నాకు స్వయంగా విద్యలు నేర్పావా? నేర్పను పొమ్మన్నావు. ఇప్పుడు గురు దక్షిణ ఎందుకివ్వాలి నీకు? అని అనలేదు. నీకేం కావాలో ఆజ్ఞాపించు. నా సర్వస్వం నీ పాదాల వద్ద ఉంచుతానన్నాడు. నీ కుడి చేతి బొటన వ్రేలు కోసి

ఇమ్మని అడిగితే ఒక్క క్షణం ఆలోచించకుండా వ్రేలును కోసి ఇచ్చాడు. ఇదీ శిష్యుని గురు భక్తి. గురువు పట్ల కృతజ్ఞతా భావం.

ఇక్కడ కూడా నీ మోహం తొలగిందా అన్న ప్రశ్నకు 'నీ అనుగ్రహం వల్ల మోహం తొలగింది, స్మృతి కలిగింది'. అని అర్జునుడు కృతజ్ఞత చూపాడు. మోహం తొలగటం, స్మృతి కలగటమే కాదు, ఇంకొక ప్రయోజనాన్ని కూడా తెలియజేస్తున్నాడు.

4. <u>*గతసందేహః*</u> :- *సందేహాలన్నీ* తొలగిపోయాయి. మొదట్లో అర్జునునకు అన్నీ *సందేహాలే* . పూర్తిగ తెలిసిన వాడికీ, ఏమీ తెలియని వాడికీ అసలు *సందేహాలేవీ* ఉండవు. కాని కొంత కొంత తెలుసుకున్నవారికి మాత్రం ఏవో *సందేహాలు* ఉంటూనే ఉంటాయి. అందుకే దేహమున్నంత వరకు *సందేహాలు* తప్పవు అంటారు. అంటే దేహాభిమానం ఉన్నంత వరకు, ఆత్మజ్ఞానం మరుగున ఉన్నంత వరకూ *సందేహాలుంటాయి*. నేను ఆత్మను-బ్రహ్మమును అనే అనుభూతి కలిగిందా*!* ఇక *సందేహాలకు* తావు *లేదు*, ఇప్పుడు అర్జునునకు మోహం తొలగింది*;* స్మృతి కలిగింది*;* దానితో *సందేహాలన్నీ* పటాపంచలైపోయినవి. అందుకే *గత సందేహః* అన్నాడు.

ఇలా *సందేహాలన్నీ* తీరి పోవటంతో తన కర్తవ్యం ఏమిటో కూడా తెలిసింది. గురువు ఇలా చెయ్యి అని శిష్యుని నిర్బంధించడు. శిష్యుడే స్వయంగా నిర్ణయించుకోవాలి. అందుకే తన నిర్ణయాన్ని తెలియజేస్తున్నాడు. ఏమని*?*

5. <u>*కరిష్యే వచనం తవ*</u> :- నీవు చెప్పినట్లే చేస్తాను-అని. ఇదొక అష్టాక్షరీ మంత్రం లాంటి వాక్యం. *భగవానుడు* తన *బోధ* చివరిలో ఏమన్నాడు*?* '*సర్వధర్మాన్ పరిత్యజ్య* మాం ఏకం

శరణం వ్రజ' - అని. దానిని అక్షరాలా పాటిస్తూ 'కరిష్యేవచనం తవ' - అని అర్జునుడంటున్నాడు.

కృత కృత్యుడైన వానికి ఇంకా కర్తవ్యం (చేయవలసిన కర్మ) ఉండదు. అయితే స్వార్థ కర్మలు లేకపోయినా పరమార్థ కర్మలు- లేదా లోక సంగ్రహార్థం కర్మలు ఉంటాయి. అలాంటి వాటిని కర్తవ్యతా బుద్ధితో- భగవదార్పణ బుద్ధితో చెయ్యాలి. అందుకే అర్జునుడు కర్తవ్యోన్ముఖుడవుతున్నాడు. ఇప్పుడు జరగవలసిన యుద్ధం తమ బంధువులు, ఆత్మీయులు, పెద్దలు, గురువులకు- తమకు మధ్య జరుగుతున్నది కాదు. ధర్మానికి అధర్మానికి మధ్య జరుగుతున్న యుద్ధం ఈ యుద్ధంలో ధర్మ సంరక్షణమే తన కర్తవ్యం. తన విధి. ధర్మాన్ని రక్షించటం, అధర్మాన్ని అణచి వేయటం క్షత్రియోచిత ధర్మం, ఈ యుద్ధం కేవలం రాజ్యం కోసం కాదు, భోగాలనుభవించటానికీ కాదు, కేవలం ధర్మ సంరక్షణ కోసం, తనలోని వాసనా క్షయం కోసం. అందుకే ఆయుధాలు జారవిడిచి రధోపస్థుడైన అర్జునుడు, నూతన ఉత్సాహంతో, దృఢ దీక్షతో రధం ముందు భాగంలోని తన స్థానం వద్దకు వచ్చి, గాండీవాన్ని చేతబట్టి, అక్షయ తూణీరాలను ధరించి స్థిర చిత్తంతో 'కరిష్యే వచనం తవ' అంటున్నాడు.

భగవంతుని బోధ పూర్తి అయిన తర్వాత అర్జునుని నోట వెలువడిన ముచ్చటైన *3* మాటలతో కూడిన వాక్యం ఇది. అర్జునుని నోట ఈ వాక్యం వెలువడే దాకా భగవంతుని బోధకు అడ్డుకట్ట లేదు. ఆయన వాక్ప్రవాహం అఖండంగా సాగిపోతూనే ఉన్నది. *11* వ అధ్యాయం ప్రారంభంలోనే 'మోహో2యం విగతో మమ' - నా మోహం తొలగిపోయింది అన్నాడు. కాని 'కరిష్యే వచనం తవ' - నీవు చెప్పినట్లే చేస్తాను అనలేదు. పైగా నీ విశ్వరూపాన్ని దర్శించాలనుకుంటున్నాను -

అన్నాడు. అందుకే భగవానుడు తన బోధను ఆపలేదు. ఇప్పుడు అర్జునుడు పూర్ణ జ్ఞానాన్ని పొందాడు గనుకనే భగవానుడు తన జ్ఞాన బోధను ఆపివేశాడు. పూర్తిగా ఆకలి తీరితేనే భోజనం తినటం ఆపేది. ఆకలి తీరిందని గుర్తు ఎట్లా? ఆకలి తీరితే త్రేపు వస్తుంది. ఆ త్రేపు ఏమిటో కాదు. 'కరిష్యే వచనం తవ' అనటమే. ఈ మాట ద్వారా అర్జునుడు లోకానికి ఒక సందేశం ఇస్తున్నాడు. ఏమని?

"ఓ మానవులారా! శ్రీకృష్ణుడు ప్రసాదించిన ఈ గీతామృతమనే ఔషధాన్ని నేను సేవించాను. దీనితో నా ఆకలి తీరింది. నా జబ్బు నయమైంది. నా దుఃఖం ఉపశమించింది. నాలాగానే సంసార వ్యాధి పీడితులైన మీరు కూడా నిరాటంకంగా, నిస్సంకోచంగా ఈ ఔషధాన్ని సేవించండి. మీ భవరోగం ఉపశమిస్తుంది"- అంటున్నాడు.

*మొదట్లో అర్జునుడు గాండీవాన్ని పారవేశాడు.
అహంకారాన్ని పట్టుకున్నాడు.
*ఇప్పుడో - గాండీవాన్ని పట్టుకున్నాడు.
అహంకారాన్ని పారవేశాడు.

'నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను' అనేది అహంకారం. 'నీవు చెప్పినట్లే చేస్తాను' అనేది అహంకార రాహిత్యం.

కరిష్యేవచనంతవ ఇది ఫల వాక్కు.
*భగవంతుని బోధకు పర్యవసానంగా
*శిష్య వృత్తికి పరిపాకంగా

అర్జునుని నోటి నుండి వెలువడిన అష్టాక్షరీ మహా మంత్రం.

ఇందులో కర్మ- భక్తి - జ్ఞాన చిహ్నాలు మూడూ ఉన్నాయి.
కరిష్యే - ఆచరిస్తాను- ఇది కర్మకు చిహ్నం.
తవ - నీ యొక్క - ఇది భక్తికి చిహ్నం.

వచనం - పలుకులు - ఇది జ్ఞానానికి చిహ్నం.

కనుక ఇది మూడు యోగాల సమ్మేళనం. యోగత్రయానికి ప్రతినిధి.

*6. అచ్యుత :-*మానవులందరిని సంసారచ్యుతులు కాకుండా తప్పించేవాడు భగవంతుడే. ఇక్కడ అర్జునుడు సంసారచ్యుతుడు కాకుండా, మోహ బంధంలో చిక్కుకోకుండా, అజ్ఞానంలో చిక్కుకోకుండా జ్ఞాన బోధతో రక్షించాడు కనుక అచ్యుతుడు, అచ్యుత అనే సంబోధన అందుకే సమంజసంగా ఉంది. శాస్త్రం పూర్తి కావటంతో రంగం మారిపోయింది. ఇక మనం యుద్ధరంగం నుండి ధృత రాష్ట్ర మందిరంలో ప్రవేశించి సంజయధృతరాష్ట్రులను దర్శిద్దాం. భగవద్గీత సంజయధృతరాష్ట్రులతో ప్రారంభమైంది. అందుకే వారిద్దరి సంభాషణతోనే ముగిస్తున్నారు.

యుద్ధ రంగ మధ్యంలో భగవానుడు వినిపించిన జ్ఞాన బోధను విన్నవాడు, ఆయన విశ్వరూపాన్ని దర్శించిన వాడు అర్జునుడు మాత్రమే కాదు, ఇంకొకరున్నారు. అతడే సంజయుడు. అతడు ధృతరాష్ట్ర మహారాజుకు ఆంతరంగిక సలహాదారు *(personal secretary)*. అంతే కాదు ధృతరాష్ట్రునికి యుద్ధ విశేషాలను వినిపించటానికి వ్యాసునిచే నియోగించబడిన వాడు *(news reporter)*. అతడు ఆ శిబిరంలోకి, ఈ శిబిరంలోకి తిరిగి, నగరాల్లోకి, అరణ్యాలలోకి, ఆశ్రమాలలోకి వెళ్ళి కనిపించిన వారందరినీ ఇంటర్వ్యూలు చేసి, వారు చెప్పిన మాటలను బట్టి *news* తయారుచేసే న్యూస్ రిపోర్టర్ కాదు. అతడు ఎక్కడ కూర్చున్నా, ఎక్కడ తిరుగుతున్నా, యుద్ధం చేస్తున్నా యుద్ధరంగంలో జరిగే అన్ని విషయాలను తన కంటి ఎదురుగా సినిమా చూస్తున్నట్లుగ చూడగలవాడు. తన పక్షంలోని వారు, ఎదుటి పక్షంలోని వారు ఎవరైనా సరే

ఎప్పుడెప్పుడు, ఎవరు ఎవరితో మాట్లాడుకున్నా ఆ మాటలన్నీ సెల్ ఫోన్ లో విన్నట్లు వినగలిగిన వాడు, అంతే కాదు. ఎవరెవరు మనస్సులలో ఏమేమి అనుకుంటున్నదీ, ఏ కుట్రలు కుతంత్రాలు పన్నుతున్నదీ - అంతా తెలుసుకోగలిగినవాడు అంటే దూర శ్రవణం, దూరదర్శనం మాత్రమే గాక మదిలోని ఆలోచనలను కూడా పసిగట్టగలడు. ఈ శక్తి ఎలా వచ్చింది? సహజంగా రాలేదు. దీనిని వ్యాసుడు ప్రసాదించాడు. ధృతరాష్ట్రునికి యుద్ధ విశేషాలు వినిపించటానికి వీలుగా దివ్యదృష్టిని ప్రసాదించాడు. యుద్ధ ప్రారంభం నుండి యుద్ధం ముగిసేంతవరకు - అంటే 18 రోజులు ఈ శక్తి ఆయనకుంటుంది. 19 వ రోజు సూర్యోదయంతో ఈ దివ్య శక్తి పోతుంది. అందుకే-

కురుక్షేత్ర యుద్ధ భూమిలో కౌరవ పక్షాన పది రోజులు యుద్ధం చేసిన సంజయుడు భీష్ముడు పడిపోవటంతో ఈ విషయాన్ని తెలియజేయటానికి హస్తినాపురం వచ్చి ధృతరాష్ట్రుని మందిరంలో ప్రవేశించి ఆయనకు శిఖండి చేతిలో భీష్ముడు పడిపోయిన విషయం చెప్పాడు. దానితో అదరిపడిన ధృతరాష్ట్రుడు ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రంలో ఏమి అధర్మం జరిగిందోనని భావించి, ఏం జరిగిందని సంజయుని ప్రశ్నించాడు, దానితో మొదటి రోజు యుద్ధంలో ఏమి జరిగిందో చెప్పటం ప్రారంభించాడు సంజయుడు. అర్జునుడు విషాదంలో పడిపోవటం, ఆ విషాదాన్ని పోగొట్టటానికి భగవానుడు అర్జునునికి ఆత్మ జ్ఞానాన్ని బోధించుటకు గీతా జ్ఞానాన్ని తెలియజేయటం, అలా తెలియజేయగా అర్జునుడు కర్తవ్యోన్ముఖుడై యుద్ధానికి సిద్ధపడటాన్ని చెప్పి చివరిగా కృష్ణార్జునుల మధ్య జరిగిన సంభాషణను తలచుకుంటూ, ఆ

విశ్వరూపాన్ని స్మరించి, స్మరించి పులకరించి పోతూ చివరి మాటలు చెబుతున్నాడు, - ఏమని?-

*సంజయ ఉవాచ :-*

శ్లో|| ఇత్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః|
సంవాదమిమమశ్రౌషం
అద్భుతం రోమహర్షణం|| (74)

*తా//* సంజయుడన్నాడు. ఈ ప్రకారంగా నేను వాసుదేవునికి మహాత్ముడైన పార్థునికి మధ్య జరిగిన ఈ అత్యద్భుతము, ఒళ్ళు పులకరించేటటువంటి సంవాదాన్ని విన్నాను.

*వ్యాఖ్య:-* 18 అక్షౌహిణుల సేనతో కూడిన కురుక్షేత్ర యుద్ధ భూమిలో - రెండు సేనల మధ్య నిలిచిన కృష్ణార్జునుల ఈ సంభాషణను వినే అవకాశం, అదృష్టం నిజంగా ఇతరులకెవరికీ లేదు, ఎందుకంటే వారంతా చాలా దూరంలో ఉన్నారు. కాని వ్యాస మహర్షి ప్రసాదించిన దివ్య దృష్టి వల్ల సంజయుడు మాత్రం వినగలిగాడు. ఆ విషయాన్నే ఇప్పుడు ధృతరాష్ట్రునికి చెబుతూ సంజయుడు, ఆ సంభాషణ ఎట్టిదో తెలియజేస్తున్నాడు.

ఈ కృష్ణార్జునుల సంవాదం ఎలాగున్నదంటే - 1. అద్భుతం. 2. రోమహర్షణం అంటున్నాడు సంజయుడు.

1. అద్భుతం :- ఒక గొప్ప దృశ్యాన్ని చూచినప్పుడో, ఒక ఆశ్చర్యకరము, ఉపయోగకరము అయిన గొప్ప విషయాన్ని విన్నప్పుడో అద్భుతం అంటాం. మరి ఈ గీతా శాస్త్రాన్ని ఎందుకు అద్భుతం అంటున్నాడు?

పరుసవేది ఇనుమును తాకితే ఆ ఇనుము బంగారంగా మారిపోతుంది. దానిని మనం కళ్ళతో మొదటిసారి చూస్తే

అద్భుతం అని అంటాం గదా! మరి ఈ గీతా జ్ఞాన బోధ యొక్క స్పర్శ తగలటంతోనే అర్జునునిలోని విషాదం తొలగి పోయింది. కర్తవ్యవిముఖుడైన వాడు కర్తవ్యోన్ముఖుడయ్యాడు. యుద్ధం చేయనని భీష్మించుకు కూర్చున్న అర్జునుడు ఈ జ్ఞాన బోధతో ఒక్క గంటలో గాండీవాన్ని చేతబట్టి యుద్ధానికి సిద్ధమయ్యాడంటే - దీనినంతా చూస్తున్న సంజయునకు అద్భుతం అనిపించటంలో ఆశ్చర్యం ఏముంది?

మరొక విషయం కూడా ఉంది. ఇది ఉపనిషత్తుల సారం, యోగ శాస్త్రం, బ్రహ్మ విద్య. ఈ విద్యను ఎక్కడో ప్రశాంత ప్రదేశాలలో, చక్కని వాతావరణంలో, గురువు శిష్యునకు బోధించాలి. కాని గందరగోళంతో కూడిన యుద్ధ వాతావరణంలో, చతురంగ బలాలతో కూడిన సేనాహిహిని మధ్య భగవానుడు బోధించటం, అర్జునుడు విని అర్ధం చేసుకొని 'కరిష్యేవచనంతవ' అనటం అద్భుతం.

ఎంతో రహస్యమైన, ఎంతో గొప్పదైన ఉపనిషత్తుల సారమైన ఈ జ్ఞానాన్ని తేలికగా అర్థమయ్యే రీతిలో బోధించటం అద్భుతం.

ఇంతటి జ్ఞానాన్ని స్వయంగా గురువు వద్ద కూర్చొని వినకపోయినా ఈ జ్ఞానాన్ని పూసగ్రుచ్చినట్లు ధృతరాష్ట్రునికి వినిపించాడు సంజయుడు. ఇలా వినిపించగలిగాడు అంటే ఇది అద్భుతం అని సంజయునకే అనిపించింది.

2. రోమహర్షణం :- ఈ జ్ఞానాన్ని వింటుంటే సంజయునకు ఎలా ఉంది? రోమాలు సంతోషంతో, ఆశ్చర్యంతో నిక్కబొడుచుకున్నాయి. పులకరింత కలుగుతున్నది. అందుకే రోమహర్షణం అన్నాడు. దీనిని తలచుకుంటున్న కొద్దీ సంజయుని శరీరం గగుర్పాటు చెందుతున్నది. హర్షంతో

రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. పులకరింత కలిగి ఆశ్చర్యానందాలలో మునిగిపోతున్నాడు.

పురాణాలు వినిపించే సూత మహర్షి పుత్రుడొకాయన ఉన్నాడు. ఆయనను రోమ హర్షణుడు అంటారు. అసలు పేరు గవాల్గణుడు. అయినా ఆ పేరుతో ఎవరూ పిలవరు. రోమ హర్షణుడనే అంటారు. ఎందుకంటే ఆయన పురాణ కధలు వినిపిస్తుంటే కళ్ళకు కట్టినట్లుంటాయి హృదయానికి హత్తుకు పోతాయి. వినే వాళ్ళు హర్ష పులకిత గాత్రులవుతారు. రోమాలు సంతోషంతో నిక్కబొడుచుకుంటాయి. అందుకే ఆయనను రోమ హర్షణుడు అంటారు.

ఇలా రోమ హర్షణమైన ఈ సంవాదం ఎవరి మధ్య జరిగింది?

*3. వాసుదేవస్య పార్ధస్యచమహాత్మనః* :- ఈ సంవాదం వాసు దేవునికి, మహాత్ముడైన పార్థునికి మధ్య జరిగినది అంటున్నాడు సంజయుడు. ఇలా అనటంలో వాసు దేవుణ్ణి వదిలి అర్జునుని మహాత్ముడు అనే విశేషణంతో ప్రశంసిస్తున్నాడు. ఇంతటి అద్భుత జ్ఞానాన్ని అందించిన జగద్గురువు, సాక్షాత్ భగవానుడు అయిన శ్రీకృష్ణుని ప్రశంసించకుండా అర్జునుని ప్రశంసించటమేమిటి? నిజంగా ఇట్టి జ్ఞానాన్ని - గీతా జ్ఞానాన్ని విని అర్ధం చేసుకోగలవారంతా మహాత్ములే. అసలు మానవులలో ఎందరు వినగలుగుతారు?

సంక్రాంతికి పెద్ద పెద్ద ముగ్గులు గృహిణులు వేశారనుకోండి. అదేమంత గొప్ప విషయం కాదు. కాని 8 సం//ల వయస్సు గల ఒక అమ్మాయి తన చిన్ని చిన్ని చేతులతో పెద్ద ముగ్గును అందంగా వేస్తే చూచిన వారంతా ఎంతగానో మెచ్చుకుంటారు, ప్రశంసిస్తారు. అలాగే పెద్దవారు కారు నడుపుతుంటే అంత ఆశ్చర్యం ఏమీ లేదు. గొప్పతనం కూడా

ఏమీ లేదు. అదే *7,8* సంవత్సరాల అబ్బాయి గాని, అమ్మాయి గాని అద్భుతంగా కారు నడుపుతుంటే ఆశ్చర్యంగా చూస్తాం. అభినందిస్తాం.

అదే విధంగా సర్వజ్ఞుడు, సర్వశక్తివంతుడు, మహా జ్ఞాని, అవతారపురుషుడు, సాక్షాత్తు భగవానుడు అయిన శ్రీకృష్ణుడు ఈ గీతా శాస్త్రాన్ని బోధించటం అంత గొప్ప విషయమేమీ కాదు, ఇది ఆయనకొక లీల మాత్రమే అని భావించాడు సంజయుడు. కాని అజ్ఞానంలో మునిగి పోయి, మోహం కారణంగా విషాదంలో మునిగి పోయిన అర్జునుడు, ఈ గొప్ప యుద్ధ వాతావరణంలో ఆ జ్ఞానాన్ని గ్రహించి, తత్త్వాన్ని అర్థం చేసుకొని తన మోహ భ్రాంతి నుండి, విషాదం నుండి బయట పడటం అనేది ఒక మహత్తర సిద్ధిగా - ఘన విజయంగా - గొప్ప అద్భుత విషయంగా భావించాడు సంజయుడు. అందుకే అర్జునునికి ఈ ప్రశంస.

ఈ కారణం చేతనే పరిపూర్ణుడు, మహా జ్ఞాని, భగవానుడు అయిన వాసుదేవుని ప్రశంసించక - ఈ జ్ఞానాన్ని పూర్తిగా అవగాహన చేసుకొని, తన జీవితాన్ని ఉద్ధరించుకొన్న అర్జునుని హృదయ పూర్వకంగా ప్రశంసిస్తున్నాడు, 'మహాత్మనః' – 'మహాత్ముడు' అని.

ఇలా అల్పాత్ముడైన అర్జునుడు గీతా బోధతో మహాత్ముడైనాడు. అర్జునునిలాగానే మనం కూడా శ్రీకృష్ణ బోధామృతాన్ని పానం చేసి సంసార బంధాన్ని- మోహాన్ని- భ్రాంతిని- అజ్ఞానాన్ని పోగొట్టుకోవాలి. జీవితాలను సార్ధకం చేసుకోవాలి. అల్పాత్ములమైన మనం మహాత్ములం కావాలి.

ఇలా అర్జునుని మహాత్ముడుగ ప్రత్యేకంగా ప్రశంసించటంలో సంజయునికి వేరే ఉద్దేశం ఏదో ఉన్నదని కూడా మనం భావించవచ్చు. ఏమిటది?-

కౌరవ పక్షంలో మహా మేధావులు, ధర్మతత్పరులు, నీతిజ్ఞులు, దూర దృష్టి గలవారు, ధర్మాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు నిర్భయంగా చెప్పగలవారు, ధృతరాష్ట్రుని క్షేమాన్ని కోరేవారు ముఖ్యంగా ఇద్దరున్నారు. వారే విదుర సంజయులు. మరి భీష్మ ద్రోణ కృపాదులున్నారుగదా! వారికి పైన చెప్పిన మంచి లక్షణాలు ఎన్నో ఉన్నా నిర్భయంగా ధర్మాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు వెనకడుగు వేస్తుంటారు. ఇప్పుడు ధృతరాష్ట్రునికి ఏదైనా శ్రేయస్సును చెప్పాలంటే సంజయునికి మాత్రమే అవకాశముంది. విదురుడు ఎలాగూ ఇక్కడ లేడు గనుక.

సంజయుడు ధర్మపక్షపాతి. పాండవులది ధర్మ పక్షం. కనుక పాండవ పక్షపాతి. తానేమో ధృతరాష్ట్రుని శ్రేయస్సును కోరే ఆంతరంగిక సచివుడు, ధృతరాష్ట్రుని అన్నం తింటున్నాడు గనుక విశ్వాసపాత్రుడు. ధృతరాష్ట్రునికి కీడు జరుగుతుంటే చూస్తూ ఊరుకోలేడు, యుద్ధం కొనసాగితే ధృతరాష్ట్రునికి కీడు జరుగుతుంది. కనుక మేలు కలిగే ఉపాయాన్ని చెప్పాలి. ఈ *10* రోజుల యుద్ధంలోనే దాదాపు *20* మంది ధృతరాష్ట్ర పుత్రులు భీముని చేతిలో చనిపోయారు. మిగిలిన వారు కూడా చావటం ఖాయం. వంద మంది పుత్రులున్నా పుత్ర హీనుడై వృద్ధాప్యంలో భయంకర జీవితాన్ని గడపవలసి ఉంటుంది కనుక ఇప్పటికైనా యుద్ధం ఆగితే మిగిలిన పుత్రులైనా జీవిస్తారు. భీష్ముడు నేల కూలినా మిగిలిన వీరులు సజీవులే. మరి యుద్ధం ఆపాలంటే ఆ అధికారం ధృతరాష్ట్రునికే ఉన్నది. కనుక ఎలాగైనా ధృతరాష్ట్రుని మనస్సులో సంధి బీజాలు నాటాలి. ఆ ప్రయత్నంలో భాగమే ఈ శ్లోకం. శ్రీకృష్ణుడు అర్జునునిలో నిద్రాణమైయున్న వీరత్వాన్ని మేలు కొలిపాడు. గాండీవం ధరించి యుద్ధ సన్నద్ధుడయ్యాడు అర్జునుడు. కనుక నీకు పుత్ర శోకం తప్పదు అనే హెచ్చరిక దాగి ఉంది ఇక్కడ అర్జునుని ప్రశంసించటంలో. అయితే

ధృతరాష్ట్రుని అంధత్వం కేవలం శరీరానికి సంబంధించినదే కాదు. అతడి మనో బుద్ధులు కూడా గ్రుడ్డివే. అదీ తెలుసు సంజయునికి. చెవిటివాని ముందు శంఖం ఊదుతున్నావని తెలిసినా తన ప్రయత్న లోపం ఉండకూడదనుకొని ప్రసంగాన్ని కొనసాగిస్తున్నాడు.

***-తనకెంతో అద్భుతంగా అనిపించి రోమహర్షణం కలిగించిన ఈ జ్ఞానాన్ని వినటం సంజయునికి ఎలా కుదిరింది.?***

**శ్లో|| వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్**
**ఏతద్ గుహ్యతమం పరం|**
**యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్**
**సాక్షాత్ కథయతః స్వయం|| *(75)***

*తా//* వ్యాసమహర్షి అనుగ్రహం వల్ల అత్యంత రహస్యము, శ్రేష్టము అయిన ఈ జ్ఞానాన్ని - ఈ యోగాన్ని సాక్షాత్తు యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు స్వయంగా చెబుతుండగా వినగలిగాను.

*వ్యాఖ్య:-* యుద్ధ రంగ మధ్యంలో భగవానుడు ఈ జ్ఞానాన్ని అర్జునునికి అందిస్తుంటే కౌరవ పక్షంలో ఎక్కడో ఉన్న సంజయుడు ఎలా వినగలిగాడు? ఎవ్వరూ వినలేక పోయిన ఈ అద్భుత జ్ఞానాన్ని సంజయుడు మాత్రమే వినగలిగాడు ఎలా?

మహా భారత యుద్ధం ఇక జరుగబోతున్నదనగా ముందు రోజు రాత్రి వ్యాసుడు చివరి ప్రయత్నంగా ధృతరాష్ట్రుని వద్దకు వచ్చాడు. ప్రక్కన సంజయుడు ఉన్నాడు. వ్యాసుని రాకను తెలియజేశాడు. జరుగుతున్న దానికి తన అశక్తతను తెలియజేస్తూ ధృతరాష్ట్రుడు దుఃఖించాడు. వ్యాసుడు విధి

బలీయమైనదని, దానిని తప్పించటం ఎవరి వల్లా కాదని ఎక్కడ ధర్మం ఉందో అక్కడ విజయం తధ్యమని చెప్పి, యుద్ధాన్ని చూడాలనుకుంటే దివ్యదృష్టిని ప్రసాదిస్తానని చెప్పాడు వ్యాసుడు. "బంధుజనవధను, పుత్రుల మరణాన్ని నేను చూడలేను, కాని యుద్ధ విశేషాలను వినిపిస్తుంటే వినాలని ఉంది అన్నాడు ధృతరాష్ట్రుడు". అయితే ఇదిగో ఈ సంజయునికి దివ్యదృష్టినిస్తున్నాను. ఇతడు ఎక్కడ ఉన్నా, ఎక్కడ యుద్ధం చేస్తున్నా ఉభయ పక్షాలలో జరిగే అన్ని సంఘటనలను తెలుసుకోగలడు. ఉభయ శిబిరాలలోను ఎవరెవరు ఏమేమి మాట్లాడుకున్నా అన్నీ వినగలడు. ఈ యుద్ధంలో ఇతడు ఎవరిచేతిలోను మరణించడు. ఏ ఆయుధం వల్లా మరణించడు. అని చెప్పి వెళ్ళిపోయాడు. ఈ విధంగా వ్యాసుని అనుగ్రహంతో కృష్ణార్జునుల మధ్య జరిగిన సంభాషణ వినే అదృష్టం కలిగింది. అందుకే వ్యాసునికి కృతజ్ఞత తెలియజేస్తున్నాడు. కేవలం వారి మధ్య జరిగిన సంభాషణ వినటమే కాదు, అర్జునునికి చూపిన విశ్వరూపాన్ని కూడా తాను దర్శించగలిగాడు. ఇది తన జీవితంలోనే ముఖ్య సంఘటన.

ఏతత్ యోగం :- ఇట్టి యోగాన్ని - గుహ్యతమం- అంటే అత్యంత రహస్యమైన దానిని, పరం-అంటే శ్రేష్టమైన దానిని విన్నాడు సంజయుడు. చెప్పినదెవరు?

యోగేశ్వరాత్ కృష్ణాత్ :-యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు. ఆయన స్వయంగా చెబుతుంటే వినటం గొప్ప అదృష్టం. యోగాన్ని యోగేశ్వరుడే చెప్పాలి. ఆయనే స్వయంగా చెబుతుంటే వినే అవకాశం అర్జునునికీ, తనకూ తప్ప ఇంకెవ్వరికీ లేదు. ఎంతటి అదృష్టం!

సాక్షాత్ :- శ్రీకృష్ణుడు చెప్పిన ఈ గీతా శాస్త్రం ఉపనిషత్తుల సారమే. సంజయుడు ఈ జ్ఞానాన్ని ఆ నోటా ఈ నోటా ఇంతకు

ముందు వినే ఉంటాడు. అయినా ఎందుకింత ఆనందం? సాక్షాత్తు భగవానుడే చెబుతున్నాడు గనుక. ఎవరో చెబితే విన్నప్పుడు కొంత ఎగరగొట్టవచ్చు. కొంత కలపవచ్చు. కొంత మార్చి చెప్పవచ్చు. స్వయంగా ఆయనే చెబితే ఏ తేడాలు ఉండవు.

అందుకే సంజయుడు ధృతరాష్ట్రునితో అంటున్నాడు, "స్వయంగా భగవానుడే చెబుతుంటే ప్రత్యక్షంగా విన్నాను గనుక ఇది నమ్మదగిన జ్ఞానం మహారాజా!" అని. వ్యాసుని పట్ల కృతజ్ఞతయే ఇందులో ముఖ్య విశేషం.

*-కృష్ణార్జునుల మధ్య జరిగిన ఈ సంభాషణను తలచుకుంటుంటే సంజయుని మనో భావాలు ఎలా ఉంటున్నాయో----*

శ్లో|| రాజన్! సంస్మృత్య సంస్మృత్య
సంవాదమిమమద్భుతం|
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామి చ ముహుర్ముహుః|| (76)

తా|| మహారాజా! కృష్ణార్జునుల ఈ అద్భుతమైన పుణ్య సంవాదాన్ని తలచుకొని మాటిమాటికి పొంగిపోతున్నాను.

*వ్యాఖ్య:-* సంజయుని హర్షాతి రేకం ఈ శ్లోకంలో చక్కగా తెలుస్తున్నది.

1. కేశవార్జునయోః ఇమం సంవాదం :- ఈ సంభాషణ ఎవరి మధ్యన జరిగిందో తెలియజేస్తున్నాడు భగవానుడు. కేశవునికి - అర్జునునికి మధ్య.

i. శ్రీకృష్ణునికి అర్జునుని మధ్య.
ii. గురువుకు శిష్యునికి మధ్య.
iii. జ్ఞానికి అజ్ఞానికి మధ్య.
iv. పరమాత్మకు జీవాత్మకు మధ్య.
v. పరిపూర్ణతకు పరిమితానికి మధ్య.
vi. ఆనందంలో ఉన్నవానికి - విషాదంలో ఉన్న వానికి మధ్య.
vii. సత్యదృష్టిగలవానికి - భ్రమా దృష్టిగలవానికి మధ్య.
viii. సాక్షాత్ నారాయణునికి నరునికి మధ్య.

ఇక ఇది ఎలాంటి సంభాషణ? ఎందుకంత హర్షం సంజయునికి?

2. అద్భుతం :- ఎందుకు? ఈ సంభాషణ స్పర్శ తగలటంతోనే గొప్ప మార్పులు కనిపించినవి. ఏమిటవి?

i. విషాదంలో ఉన్న అర్జునుడు దుఃఖరహితుడయ్యాడు.
ii. 'ధర్మసంమూఢ చేతా' అన్నవాడు 'నష్టోమోహః స్మృతిర్లబ్ధా' అన్నాడు.
iii. 'నయోత్స్యఇతిగోవింద' అన్న వాడు 'కరిష్యేవచనంతవ' అన్నాడు.
iv. తనను కప్పిన అహంకార మమకారాలు తొలగిపోయినవి.
v. తన స్వస్థితిని కప్పిన అజ్ఞాన పొర చినిగిపోయింది.
vi. కర్తవ్య విముఖుడైనవాడు కర్తవ్యోన్ముఖుడయ్యాడు.
vii. అల్పాత్ముడు కాస్తా మహాత్ముడయ్యాడు.
viii. రథోపస్థుడైన వాడు రథస్తుడైనాడు.

3. పుణ్యం :- ఈ సంభాషణ పుణ్య ప్రదమైనది కూడా.

ఈ జ్ఞానాన్ని తెలుసుకుంటే మనలోని పాపాలు తొలగిపోతాయి. పాపాలు అంటే చెడ్డ ఆలోచనలే. చెడ్డ ఆలోచనలు చేస్తే మనలో చెడ్డ వాసనలు పేరుకుంటాయి. అవి దుష్టకార్యాలకు ప్రేరేపిస్తాయి. ఇలా పాపాలు తొలగటం ఇదొక పుణ్యం. ఈ శాస్త్రాన్ని చదివినా, విన్నా, చెప్పినా ఇందులోని విషయాల వల్ల మానవుడు తనలోని దోషాలను తొలగించుకుంటాడు. కనుక పాపహరం. పుణ్యప్రదం. దీనివల్ల మానవుని మనస్సులోని దోషాలు తొలగి చిత్తశుద్ధి కలుగుతుంది. అట్టి శుద్ధ మనస్సుతో భగవంతుని ఆరాధించినా, ఆత్మజ్ఞానాన్ని పొందినా, సాధనలు చేసినా అజ్ఞానం తొలగి మోక్ష ప్రాప్తికి మార్గం సుగమమౌతుంది.

*కేవలం ఈ జ్ఞానాన్ని వింటే చాలు పుణ్యప్రదం. ఫలితం స్వర్గ ప్రాప్తి.

*విని ఆచరిస్తే మోక్షప్రదం. ఫలితం మోక్ష ప్రాప్తి. శాశ్వతానంద ప్రాప్తి.

ఇట్టి అద్భుతము, పుణ్యప్రదము అయిన సంభాషణ గనుకనే సంజయుడు మరల మరల స్మరిస్తున్నాడు.

4. సంస్మృత్య సంస్మృత్య :- మరల మరల స్మరిస్తూ జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు. మనం సంతోషం కలిగించే-ఆనందకరమైన విషయాలను, సంఘటనలను, స్మృతులను మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ జ్ఞాపకం తెచ్చుకుంటాం.

ఇంతకు ముందు అనుభవించిన మధురానుభూతులను మళ్ళీ మళ్ళీ తలచుకుంటూ ఇక ఆ తలపులనుండి బయట పడాలని అనుకోము. అలాగే సంజయుడు కూడా ఇప్పుడు ఈ మధురానుభూతిని మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ, ఆనందిస్తూ, అందులో నుండి బయటకు రావాలని అనుకోవటం లేదు. ఎంత

తలచుకున్నా తనివి తీరటం లేదు. అందుకే సంస్మృత్య సంస్మృత్య అని రెండు సార్లు చెబుతున్నాడు. అయితే ఇలా రెండు సార్లు పలకటంలో మరొక రహస్యం కూడా ఉంది. ఏమిటది?-

భగవద్గీత శాస్త్రాన్ని ఎలా వినాలో, ఎలా చదవాలో, ఎలా తెలుసుకోవాలో, ఎలా నేర్చుకోవాలో పరోక్షంగా ఒక సూచన ఉంది దీనిలో.

భగవద్గీత మానవ జీవన విధానాన్ని బోధించే శాస్త్ర గ్రంథం. దీనిని మరల మరల వింటూ, మరల మరల చదువుతూ, మరల మరల జ్ఞాపకానికి తెచ్చుకుంటూ, మరల మరల స్మరిస్తూ ఉండాలి. అంటే నిరంతరం మననం చేసుకుంటూ ఉండాలి. మననం లేకుండా కేవలం విని వదిలేస్తే అందులోని విషయాలు గుర్తుండవు, లోతుగా అర్థం కావు. పైపైన తెలుస్తుందే గాని తెలిసిన విషయాలు ఆచరణలోనికి రానే రావు.

ఐతే ఎంతకాలం ఇలా స్మరిస్తూ ఉండాలి? మననం చేసుకుంటూ ఉండాలి? భగవద్గీతలో చెప్పినట్లుగ మనలోని మనో బుద్ధులు మారేంత వరకు- అందులో చెప్పిన జీవిత విధానాన్ని ఆచరణలో పెట్టుకోగలిగేంతవరకు మననం సాగుతూ ఉండాల్సిందే. అందుకే ఇక్కడ సంస్మృత్య - సంస్మృత్య అని రెండు సార్లు పలకటం జరిగింది.

సంజయుడు అలాగే చేశాడు. భగవానుడు స్వయంగా చెబుతుంటే వ్యాసుని అనుగ్రహం వల్ల లభించిన దివ్య దృష్టితో ప్రత్యక్షంగా విన్నాడు. విన్నదానిని మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ అందులోని విషయాలను మననం చేసుకున్నాడు. అందుకే ఈ భగవద్గీతలోని ఆత్మజ్ఞానం చక్కగా అవగతమైంది. అలా అవగతం కావటం వల్లనే ధృతరాష్ట్రునికి పూర్తిగా చెప్పగలిగాడు. తాను ఆ సంభాషణను స్మరిస్తున్న కొద్దీ తనకు

ఆనందం కలుగుతున్నది. ఆ సంతోషం ఎంతగా కలుగుతున్నదో కూడా తెలియజేస్తున్నాడు. ఏమని?

*5. హృష్యామిచముహుర్ముహుః* :- ఆ సంభాషణను స్మరిస్తున్న కొద్దీ మాటిమాటికి ఆనందం కలుగుతున్నది. మళ్ళీ మళ్ళీ సంతోషంతో ఉప్పొంగి పోతున్నాడు. ఎందుకీ ఆనందం?-

పుట్టిన దగ్గర నుండి చనిపోయేంత వరకు సామాన్యంగా జరిగిపోయే ఈ మానవ జీవన యాత్రకు ఒక గొప్ప ప్రయోజనం ఉన్నదని స్మరించగా స్మరించగా తెలిసింది. అలా తెలియటంతో మళ్ళీ మళ్ళీ హర్షపులకిత గాత్రుడవుతున్నాడు సంజయుడు. భగవంతుని బోధను ఎన్ని సార్లు విన్నా, ఎన్ని సార్లు చదివినా, ఎన్ని సార్లు చెప్పినా క్రొత్తగానే ఉంటుంది. ఆనందంగానే ఉంటుంది. ఎందుకంటే అది మానవ జీవితాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దేది గనుక.

భగవద్గీత మనకు మార్గదర్శి. మానవ జీవితానికి ఒక దిక్సూచిలాంటిది. పడవ సముద్రంలో ఏ దిక్కుగా వెళ్ళాలో తెలియజేయటానికి ఒక దిక్సూచీ ఉంటుంది. అలాంటి దిక్సూచియే మానవ జీవితానికి ఈ భగవద్గీత.

లక్ష్మణ గీతను దాటింది సీతాదేవి. దానితో భగవంతునికి (రామునికి) దూరమైంది. రాక్షసుని (రావణుని) చేతికి చిక్కింది. తత్ఫలితంగా అనేక యాతనలను, దుఃఖాన్ని అనుభవించింది. మరి మనం ఈ భగవద్గీతను దాటితే మన గతి అంతకన్నా హీనమవుతుంది. భగవంతునికి దూరమవుతాం, ఈ ప్రాపంచిక వ్యామోహాలనే రాక్షసుని చేతికి చిక్కి నానా రకాల దుఃఖాలను పొందుతాం. జనన మరణ సంసార చక్రంలో చిక్కి పుడుతూ చస్తూ- పుడుతూ చస్తూ జన్మ పరంపరలను కొనసాగిస్తాం. కనుక ప్రపంచాన్ని దుఃఖ

సముద్రం నుండి ఆనందమనే తీరాన్ని చేర్చే జీవన నౌక ఈ భగవత్ గీత.

దుర్గంధపు మురికి గుంటలలో దొర్లే జీవితాన్ని సుగంధపు ఆత్మ సింహాసనంపై అధిష్టింపజేసేది ఈ భగవద్గీత.

*దుఃఖమగ్నుడైన అర్జునుని ఆనందపరవశుని చేసింది ఈ గీత.

*కర్తవ్యవిముఖుడైన వానిని కర్తవ్యోన్ముఖుని చేసింది ఈ గీత.

అందుకే సంజయుడింతగా ఆనంద తాండవ నృత్యం చేస్తున్నాడు. అర్జునుడు, సంజయుడు మాత్రమే గాదు, ఆనందాన్ని కోరుకొనే ప్రతి మానవుడు ఈ గీతా శాస్త్రాన్ని విని, చదివి, అందలి విషయాలను మళ్ళీ మళ్ళీ మననం చేసుకొని, జీర్ణింప జేసుకొని ఆచరణలో పెట్టుకుంటే తప్పకుండా శాశ్వతానందం - మోక్షం లభించి తీరుతుంది. సంజయుని లాగా ***సంస్మృత్య - సంస్మృత్య - హృష్యామిచముహుర్ముహుః అని ఆనంద తాండవ నృత్యం చేయవచ్చు.

గీతా గానంతో

i. అమృత రసం పొంగి పొర్లుతున్నది.
ii. ఉత్సాహం, ఉల్లాసం, సంతోషం కలుగుతున్నది.
iii. సమస్యలనెదుర్కొనే శక్తి వస్తున్నది.
iv. జీవితాన్ని ఆనందంగా గడపటానికి మార్గ దర్శకత్వం లభిస్తున్నది.

ఇదే సంజయుని సంతోషానికి కారణం.

*-శ్రీకృష్ణుని ముఖత వెలువడిన గీతా శాస్త్రాన్ని వినటం మాత్రమే గాక ఆయన అద్భుతమైన విరాట్ విశ్వరూపాన్ని కూడా దర్శించాడు సంజయుడు, ఆ విశ్వరూపాన్ని చూస్తూ ఎలాంటి అనుభూతులు చెందుతున్నాడో, ఎలా ఆశ్చర్యానందాలు వ్యక్తం చేస్తున్నాడో తరువాతి శ్లోకంలో-*

శ్లో|| తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూపమత్యద్భుతం హరేః|
విస్మయో మే మహాన్ రాజన్
హృష్యామి చ పునః పునః|| *(77)*

*తా//* రాజా! హరియొక్క అద్భుతమైన ఆ రూపాన్ని తలచుకొని తలచుకొని నాకు గొప్ప విస్మయం కలుగుతున్నది. మాటిమాటికి ఆనందంతో పొంగిపోతున్నాను.

*వ్యాఖ్య:-* 1. అత్యద్భుతం రూపం :- హరి యొక్క రూపం అత్యద్భుతం. శ్రీకృష్ణుని రూపం ఇంతకు ముందు ఎన్నో సార్లు చూసినదే. కాని ఇప్పుడేమో అత్యద్భుతం, ఆశ్చర్యకరం అంటున్నాడు. ఎందుకు?

ఇప్పుడు చూస్తున్నది సామాన్య రూపం కాదు. భగవానుని విశ్వరూపం. ఈ విశ్వ విరాట్ రూపాన్ని సామాన్య కన్నులతో ఎవ్వరూ చూడలేరు. దివ్య చక్షువులతో మాత్రమే చూడవీలవుతుంది. అర్జునునికి శ్రీకృష్ణుడు దివ్య నేత్రాలనిచ్చి విశ్వరూపాన్ని చూపితే వ్యాసమహర్షి అనుగ్రహంతో సంజయుడు దివ్య నేత్రాలను పొంది భగవానుని విశ్వరూపాన్ని దర్శించాడు. ఈ అదృష్టం 18 అక్షౌహిణుల సేనలోని ఎవ్వరికీ దక్కలేదు. కేవలం అర్జునునికి, సంజయునికి మాత్రమే దక్కింది.

దీనిని ఎందుకు అత్యద్భుత రూపం అంటున్నాడు సంజయుడు? ఎందుకంటే-

అనేక ముఖాలు, అనేక నేత్రాలు, అనేక ఉదరాలు, అనేక బాహువులు, అనేక ఊరువులు, అనేక పాదాలు, అనేక దివ్య వస్త్రాలు, అనేక మాలలు, అనేక దివ్య గంధ అను లేపనాలు, అనేక అద్భుత దర్శనాలతో ఉన్నది ఆ రూపం.

వేల కొద్దీ సూర్యులు ఒక్కసారిగా ఆకాశంలో ఉదయిస్తే ఎలా ఉంటుందో అంతటి మిరుమిట్లుగొలిపే కాంతి; ఆది - మధ్య, అంతములు కనిపించని బ్రహ్మాండమైన రూపం అది.

ఆకాశాన్ని అంటుతున్నట్లున్న రూపంతో, వివిధ వర్ణాలలో ప్రకాశిస్తున్న తెరుచుకున్న నోళ్ళతో, భయంకరమైన కోరలతో, బయటకు చాచి ఉన్న నాలుకలతో, ప్రళయాగ్నులలాగా ఉన్న నోళ్ళతో భయంకరంగా ఉన్నది ఆ రూపం.

సూర్యచంద్రులే కన్నులుగా, మండుచున్న అగ్ని జ్వాలల్లా ప్రకాశించే ముఖాలతో, లలాటంలో బ్రహ్మదేవుడు, హృదయంలో శ్రీ మహా విష్ణువు, శరీరమంతటా ఏకాదశ రుద్రులు, ద్వాదశ ఆదిత్యులు, అష్టవసువులు, సప్తర్షులు, ఇంకా సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, పన్నగులు, విద్యాధరులు, దేవతలు, దానవులు, యాదవులు, కౌరవులు, పాండవులు, సకల రాజన్యులు, మానవులు, విశ్వేదేవతలు, అశ్వినులు, మరుత్తులు, సురులు, అసురులు, పితరులు, సమస్త మానవులు, జంతువులు, మృగాలు, పశుపక్ష్యాదులు మొ||న వారంతా ఒక్క చోట దర్శనమిస్తున్నారు. అంతేగాక ఆ విశ్వరూపుని శరీరం పై కనిపించే స్వేదమే నదులుగా, సముద్రాలుగా కనిపిస్తున్నాయి. అందుకే ఈ రూపం అత్యద్భుతం.

శంఖ, చక్ర, గదా, శార్ఙ్గాలతో సకల ఆయుధాలను ఎత్తి పట్టుకున్న చేతులలో ధరించి, అనేక కిరీటాలతో తేజః పుంజం లాగ ప్రకాశిస్తున్న అద్భుత రూపం అది.

దివి నుండి భువి వరకు ఉన్న యావత్తు స్థలాన్ని, అన్ని దిక్కులను వ్యాపించియున్న ఉగ్ర కాల స్వరూపం అది.

ఇటువంటి దివ్య రూపాన్ని, విరాట్ విశ్వరూపాన్ని, భయంకరమైన రూపాన్ని, కనులు మిరుమిట్లు గొలిపే రూపాన్ని దర్శించిన సంజయుడు ఆ దివ్య స్వరూపాన్ని మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ ఉంటే అద్భుతం గాను, ఆశ్చర్యం గాను ఉన్నది సంజయునికి. అందుకే అంటున్నాడు

2. <u>మహాన్ విస్మయోమే</u> :- గొప్ప విస్మయం కలుగుతున్నది నాకు - అని. ఎన్నడూ ఊహించని దృశ్యాన్ని స్వయంగా చూస్తే కలిగేదే విస్మయం- ఆశ్చర్యం. మాటలు రాని పరిస్థితి అది. అందుకనే-

3. <u>తచ్చ సంస్మృత్య సంస్మృత్య</u> :- భగవంతుని మాటలను మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ ఆనందించిన సంజయుడు ఇప్పుడు భగవంతుని విశ్వరూపాన్ని కూడా మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ గుర్తు తెచ్చుకుంటున్నాడు. తలచుకొని తలచుకొని ఆశ్చర్యపోతున్నాడు. ఇలా అనటంలో కూడా ఒక రహస్య సంకేతం దాగి ఉంది. భగవత్ సాక్షాత్కారాన్ని - ఆత్మానుభూతిని మళ్ళీ మళ్ళీ స్మరిస్తూ ఉండాలి. సమాధి స్థితిలో కలిగిన సాక్షాత్కారానుభూతిని స్మృతికి తెచ్చుకుంటూ ఉండాలి.

అవధూతలు కొందరు పిచ్చి వారిలాగా; కొందరు ఉదాశీనులుగా; తిండి గురించి, బట్ట గురించి, నివాసం గురించి, శుచి శుభ్రతల గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా ఉంటారు. అలా ఉండాలని అనుకొని ఉండటం కాదు. అది వారి సహజ స్థితి. వారి దృష్టిలో ఈ దేహం గాని, ప్రపంచం గాని, ఇక్కడ జరిగే సంఘటనలు గాని అన్నీ మిథ్య. వారు

ఎల్లప్పుడూ ఎక్కడో చూస్తూ ఉంటారు. అది పరధ్యానం కాదు. పరమాత్మ ధ్యానం. తన స్థితిలో తాను కేవలంగా ఉండటం. అందుకే ఈశావాస్యోపనిషత్తులోని 17 వ మంత్రం "ఓంక్రతో స్మరకృతం స్మరక్రతోస్మరకృతంస్మర" అని అవధూతల - జీవన్ముక్తుల స్థితిని వర్ణిస్తున్నది. వారి దివ్యానుభవాన్ని నిరంతరం స్మరిస్తూ స్మరిస్తూ అందులోనే ఉండిపోతారు.

ఇక్కడ సంజయుడు సంస్మృత్య సంస్మృత్య అనటంలో ఆత్మానుభూతి పొందిన వారి స్థితినే తెలియజేస్తున్నది. దానిని స్మరిస్తూ స్మరిస్తూ ఉంటే సంజయునికి ఏమనిపిస్తున్నదో - ఎలా ఉన్నదో చివరి పదంలో తెలియజేస్తున్నాడు.

4. హృష్యామిచపునః పునః :- మాటిమాటికి సంతోషంతో పులకరించి పోతున్నాను-అని. ఆ అద్భుత రూపాన్ని తలచుకొని తలచుకొని 'అతి హర్ష' దశను లేదా పరమానంద దశను చేరుకున్నాడు సంజయుడు. దీనినే భజగోవిందంలో ***నందతి నందతి నందత్యేవ అని చెప్పటం జరిగింది. ఆనందం పట్టలేక చిందులు త్రొక్కుతారు కొందరు. ఆనంద తాండవ నృత్యం చేస్తారు.

ఇక్కడ సంజయుని ఆనందం ఎలాంటిదో ఈ రెండు శ్లోకాల్లోను వాడిన పదాలు సూచిస్తున్నాయి. ఈ పదాల వెనుక నున్న భావాలను గ్రహిస్తే సంజయుని మనోభావం ఎలా ఉందో అవగతమవుతుంది.

"సంస్మృత్య సంస్మృత్య - హృష్యామిచ ముహుర్ముహుః - హృష్యామిచ పునః పునః" - రెండేసి సార్లు ఒకే పదాన్ని ఉపయోగించటం జరిగిందంటే అతడి ఆనందం అవధులు దాటిందని తెలుస్తుంది.

*భగవద్గీతలో చెప్పిన విషయాలు వివేక వంతునికి ఆత్మ జ్ఞానాన్ని కలిగించి ఆనందాన్నిస్తాయి.

*భగవంతుని విశ్వరూపం భక్తునికి హృదయంలో స్పందన కలిగించి మైమరిపించే ఆనందాన్నిస్తుంది.

సంజయుడు వివేక వంతుడే కాదు, గొప్ప భక్తుడు కూడా. అందుకే గీతా జ్ఞానం, విశ్వరూప సందర్శనం ఆనందాన్ని ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఈ విశ్వరూపాన్ని వర్ణించటానికి సంజయునికి అవకాశం ఇచ్చి ఉంటే భగవద్గీత అంతటి ' సంజయ గీత' ను రచించి ఉండే వాడేమో.

వివేకము, విజ్ఞానము పొంగిపొర్లుతుంటే సంజయుడు తన్మయుడై, హర్షపులకితాంగుడై, హృదయం ప్రేమతో నిండి, ఉత్సాహంతో - ఆనందంతో గొంతు పూడుకుపోయి, మాటలు రాక ఆనందాన్ని తన ముఖం ద్వారా వ్యక్తం చేస్తున్నాడు. అలా ఎంత సేపున్నాడో- ఎప్పటికో మామూలు మనిషై తన చిట్ట చివరి ముఖ్య కర్తవ్యాన్ని నిర్వహించబోతున్నాడు. ఎలా?

*- ప్రారంభంలోని ధృతరాష్ట్రుని ప్రశ్నకు ఇంతవరకు విపులంగా సమాధానం చెప్పిన సంజయుడు ఇప్పుడు ధృతరాష్ట్రుని గుండెకు గ్రుచ్చుకొనేటట్లు సూటి సమాధానాన్ని ఇస్తున్నాడు.*

శ్లో|| యత్ర యోగేశ్వరః కృష్ణః
యత్ర పార్థో ధనుర్ధరః|
తత్ర శ్రీర్విజయో భూతిః
ధృవా నీతిర్మతిర్మమ|| (78)

తా// ఎక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధరుడైన పార్థుడు ఉంటారో అక్కడ సంపద, విజయము, గొప్పతనము, స్థిరమైన నీతి ఉంటాయని నా అభిప్రాయము.

*వ్యాఖ్య:-* ధృతరాష్ట్రునికి యుద్ధ విశేషాలు వినిపిస్తూనే సమయం చిక్కినప్పుడల్లా పరోక్షంగా పాండవుల ఆధిక్యతను, శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్ని చెబుతూనే ఉన్నాడు సంజయుడు. అలాగే గెలుపు తమకు లభించదనే భావాన్ని ధ్వనింపజేస్తూనే ఉన్నాడు. అయినా దున్నపోతు మీద వర్షం పడినట్లు ధృతరాష్ట్రుని మీద సంజయుని మాటల ప్రభావం ఏమీ ఉండటం లేదు. దానికి కారణం ధృతరాష్ట్రుని ఆలోచన వేరు. తనకు 11 అక్షౌహిణుల సైన్యం ఉన్నది. స్వచ్ఛంద మరణం వరంగా గలిగిన మహా వీరుడు భీష్ముడు తన సేనకు రక్షణగా ఉన్నాడు. దేశ దేశాల రాజులకు, రాకుమారులకు అస్త్ర విద్యను నేర్పిన ఆచార్యుడు తమ పక్షంలో ఉన్నాడు. అతడు అతి లోక పరాక్రమశాలి. చేతిలో ధనుస్సు ఉన్నంత వరకు ఆయన వైపు తేరిపారచూడగల యోధుడు మరొకడు లేడు. ఇక కృపాశ్వద్ధామలు అవధ్యులు. ద్రోణ కృపాశ్వద్ధామలు బ్రాహ్మణులు గనుక వారిని చంపితే బ్రహ్మ హత్యా పాతకమని ఎంతటి వీరుడైనా వెనుకంజ వేస్తాడు.

ఇక కర్ణుడు సర్వ శస్త్రాస్త్ర విదుడు. పాండవ ద్వేషి. దుర్యోధనుని కొరకు ప్రాణాలైనా అర్పించటానికి సిద్ధపడే మిత్రుడు. దుర్యోధనుడు కూడా స్వయంగా మహా వీరుడు, బలశాలి, గదా యుద్ధ నైపుణ్యం గలవాడు. వజ్ర సద్రుశమైన దేహం గలవాడు, బాహ్లికుడు, సోమ దత్తుడు, భూరిశ్రవుడు, శల్యుడు, భగదత్తుడు, కృతవర్మ మొ॥న రాజులంతా మహావీరులు.

ఇక పాండవ పక్ష సైన్యం కేవలం 7 అక్షౌహిణులే. వారిలో భీముడంటేనే తనకు భయం. నిజంగా అసమాన బల శౌర్యాలు గల యోధాగ్రేసరుడు భీముడు. అతడిని తలచుకుంటేనే తనకు రాత్రిళ్ళు నిద్ర పట్టదు. ఆ తరువాత

చెప్పుకోవలసిన సర్వశస్త్రాస్త్ర సంపన్నుడు అర్జునుడు. వీరిద్దరి తరువాత సాత్యకి, అభిమన్యుడు, ఘటోత్కచుడు, దృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు మాత్రమే చెప్పుకోదగినవారు. ఎలా చూచినా తమకే సైన్యం అధికం, వీరులు అధికం. శ్రీకృష్ణుడున్నాండటే ఆయన యుద్ధం చేయడు, కేవలం సారథ్యం మాత్రమే చేసేవాడు. కనుక ఆయన గురించి భయపడనక్కరలేదు. ఇలా భావించే ధృతరాష్ట్రునికి సంజయుని మాటలు ఎక్కటం లేదు.

అయితే సంజయుని నోటి మీదుగా భీష్ముడు శిఖండి చేతిలో నేలకూలాడనే వార్త వినటంతో నిశ్చేష్టుడయ్యాడు. సింహం నక్క చేతిలో ఎలా కూలింది? ఏదో అధర్మం జరిగి ఉండాలి, అదేమిటో తెలుసుకోవాలి అనుకున్నాడు ధృతరాష్ట్రుడు. అందుకే 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' అంటూ కురు క్షేత్రాన్ని ధర్మక్షేత్రం అన్నాడు. అంటే అక్కడ అధర్మాలు జరగవు గదా! ఏమి అధర్మం జరిగి భీష్ముడు నేల కూలాడు? అని. తాము ఎన్ని అధర్మాలు, అన్యాయాలు చేసినా ఎదుటి పక్షం వారు మాత్రం ధర్మంగా నడవాలని కోరుకొనే బుద్ధిమంతుడు ధృతరాష్ట్రుడు. తమకు కష్టం కలిగినప్పుడు ధర్మం గుర్తుకు వస్తుంది ఇలాంటి వారికి. ఈ ప్రశ్నకు సమాధానంగానే సంజయుడు యుద్ధం ఎలా ప్రారంభమైనదీ, ఎలా జరిగినదీ వివరిస్తూ ప్రారంభంలో అర్జునుని విషాదాన్ని, దానికి విరుగుడుగా భగవానుని జ్ఞాన బోధను తెలియజేస్తున్నాడు. ఈ సందర్భంలోనే శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవంతుడని, అవసర సమయాలలో వారికి తగిన విధంగా సలహాలిచ్చి వారిని విజయపథంలో నడుపుతాడని ధృతరాష్ట్రునికి పరోక్షంగా తెలియజేస్తున్నాడు సంజయుడు. అంతేగాక శ్రీకృష్ణుని జ్ఞాన బోధను, ఆయన చూపిన విశ్వరూపాన్ని స్మరిస్తున్న కొద్దీ తనకు అత్యద్భుతం గాను, ఆశ్చర్యకరం గాను, ఆనందం గాను ఉన్నదని చెప్పటమే గాక,

పాండవులలోని వీరత్వాన్ని మేలుకొలిపి శ్రీకృష్ణుడు వారికి విజయాన్ని సాధించి పెట్టటం జరుగుతుందని చెప్పదలచుకున్నాడు. పరోక్షంగా చెబితే ప్రయోజనం లేదు గనుక సూటిగా చెప్పాలనుకున్నాడు. ధృతరాష్ట్రుని అన్నం తిన్నందుకు తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలని ఇలా సూటిగా తెలియజేస్తున్నాడు. ఇదే భగవద్గీతలోని చివరి శ్లోకం. దీనినే 'ఏక శ్లోకీగీత' అంటారు. అంటే గీత మొత్తాన్ని తెలియజేసే ఒకే ఒక శ్లోకం అని భావం. సత్య ప్రతిపాదన చేసిన శ్లోకం ఇది.

తమకే విజయం కలుగుతుందనే భ్రమలో ఉన్న ధృతరాష్ట్రునికి పాండవుల విజయం తథ్యమని, కౌరవ నాశనం తప్పదని సూటిగ తెలియజేసి తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలనే నిశ్చయంతో చెప్పిన చివరి శ్లోకం ఇది. ఏమంటున్నాడు సంజయుడు?

*1. యత్ర యోగేశ్వరః కృష్ణః* :-ఎక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడున్నాడో - శ్రీకృష్ణుడు యోగ శాస్త్రాన్ని బోధించాడు; స్వయంగా యోగాభ్యాసి; యోగులందరికి మార్గదర్శకుడు. కనుక యోగేశ్వరుడు. ఆయన ఉన్న చోట ఏమవుతుంది?

*2. యత్ర పార్థో ధనుర్ధరః* :- ధనస్సును ధరించిన అర్జునుడు ఎక్కడ ఉన్నాడో - ఉత్సాహంతో గాండీవమనే ధనుస్సును ధరించినవాడు అర్జునుడు. మొదట విషాదంలో ధనుస్సును జారవిడిచాడు. ఇప్పుడు భగవానుని బోధతో కర్తవ్యోన్ముఖుడై గాండీవాన్ని, అక్షయతూణారాలను ధరించి యుద్ధానికి సిద్ధమై ఉన్నాడు. కర్మ యోగానికి ప్రతినిధి అర్జునుడు. ఆయన ఉన్న చోట ఏమవుతుంది?

*3. తత్ర శ్రీః విజయః భూతిః ధృవా నీతిః* :- కృష్ణార్జునులున్న చోట సంపదలు, విజయము, ఐశ్వర్యము, దృఢమైన నీతి తప్పక ఉంటాయి.

4. మమమతిః :- ఇది నా అభిప్రాయము. అని సంజయుడు తెలియజేస్తున్నాడు. సంజయుడు స్పష్టంగా పాండవ విజయాన్ని ధృఢ పరుస్తున్నాడు. ఈ సంజయ సందేశం కేవలం అంధ రాజు ధృతరాష్ట్రునికే కాదు. సమస్త మానవజాతికి కూడా అమూల్య సందేశం అయి ఉన్నది.

ధృతరాష్ట్రునికి ఇస్తున్న సందేశం ఏమిటి?

అర్జునుడు ధనుస్సును చేత బట్టి యుద్ధానికి సిద్ధంగా ఉన్నాడు. అంటే అర్జునుడు కర్మ చేసే శక్తి. శ్రీకృష్ణుడు పగ్గాలు చేతబట్టి రథ సారధ్యానికి సిద్ధంగా ఉన్నాడు. అంటే శ్రీకృష్ణుడు తగిన ఉపాయాలు చెప్పే తెలివి.

శక్తి, తెలివి ఎక్కడ కలుస్తాయో అక్కడ సంపదలు, విజయము తధ్యం. కేవలం మూర్ఖపు బలం ఉన్న వాణ్ణి ఒక్కొక్కప్పుడు తెలివి గల బలహీనుడు కూడా ఓడిస్తాడు. బలానికి తోడుగా తెలివి ఉంటే ఇక వాడికి తిరుగే ఉండదు. కనుకనే ఎక్కడ శ్రీకృష్ణుడు, అర్జునుడు ఉన్నారో అక్కడ సంపదలు, విజయం తధ్యం అన్నాడు సంజయుడు. అంతే కాదు.

5. భూతిః :- ఐశ్వర్యము కూడా. అంటే వారి రాజ్యం ఇప్పటి వరకూ 13 సం||ల నుండి మీ అధీనంలో ఉన్నది. ఇక ఇప్పుడు క్రొత్త నీరు వచ్చి పాత నీరుతో సహా కొట్టుకుపోయినట్లు వారి రాజ్యంతో బాటు మీ రాజ్యం కూడా వారి పాలుకాబోతున్నది అని. ఇక సమస్త రాజ్యలక్ష్మీ వారిదే కాబోతున్నది.

6. ధృవానీతిః :- అంతే గాదు కృష్ణార్జునులున్న చోట దృఢమైన నీతి కూడా ఉంటుంది. నీతి అంటే రాజనీతి - దండనీతి. అంటే ఈ యుద్ధంలో విజయం లభించటం, దానితో సమస్త రాజ్య సంపద లభించటం, ఆ తరువాత ధర్మరాజు రాజ్యపాలన గొప్ప రాజనీతితో - దండనీతితో ఉంటుంది. సరైన దండనీతి

(శిక్షాస్మృతి)ని అనుసరిస్తేనే రాజ్యం సుభిక్షంగా - ప్రజలంతా సుఖ సంతోషాలతో ఉంటారు. ప్రజలకు ఏ ఆపదలు కలుగకుండా చూసుకోవటమే రాజనీతి. అధర్మ పరులకు, అక్రమార్కులకు, మోసగాళ్ళకు శిక్ష- అదే సమయంలో సాధారణ ప్రజలకు రక్షణ ఉంటుంది.

ఈ విధంగా యుద్ధం యొక్క పర్యవసానాన్ని, జయాపజయాలను మాత్రమే గాక భవిష్యత్తులోని రాజ్యపాలన గురించి కూడా సంజయుడు సూటిగా ధృతరాష్ట్రునితో చెబుతున్నాడు. చివరిగా 'మమమతిః'- ఇది నా నిశ్చయం అని కూడా తెలియజేశాడు.

యజమాని విన్నా, వినకపోయినా, అప్రియంగా ఉన్నా సరే యజమానికి మేలు కలిగించే విషయాన్ని, ఆపదలు తొలగించే విషయాన్నే సేవకుడు - నిజమైన శ్రేయోభిలాషి తెలియజేయాలి. అదే సేవా ధర్మం. యజమాని ప్రీతి కోసం కల్ల బొల్లి మాటలు చెప్పి అతణ్ణి నట్టేట ముంచేవాడు నిజమైన సేవకుడు కాదు. ఆప్తుడు, ఆత్మీయుడు అసలే కాదు. యజమాని యొక్క శ్రేయస్సును కాంక్షించే శ్రేయోభిలాషి కాదు.

మహా భారతంలో మనకు ఈ రెండు రకాల వారూ కనిపిస్తారు. సర్వ సైన్యాధిపత్యం వహించమని కోరిన దుర్యోధనునితో భీష్ముడిలా అన్నాడు. "నాకు మీరెంతో పాండవులూ అంతే. కనుక పాండవులను నేను యుద్ధంలో వధించను. దీనికి నీకు ఇష్టమైతేనే నేను సర్వసైన్యాధిపత్యాన్ని అంగీకరిస్తాను" అన్నాడు భీష్ముడు. కాని అర్జునుని తప్ప మిగిలిన పాండవులు నాచేత చిక్కినా వారిని చంపను అని కుంతీ దేవికి మాట ఇచ్చి వచ్చిన కర్ణుడు "యుద్ధంలో పాండవులైదుగురిని నేనే వధిస్తాను. మనదే విజయం" అన్నాడు దుర్యోధనుడితో. పాండవులతో యుద్ధం శ్రేయస్కరం కాదు. వారిని జయించటం

దేవతలకు కూడా సాధ్యం కాదు - అని చెప్పిన భీష్మ ద్రోణ, విదుర, సంజయులు కౌరవుల శ్రేయోభిలాషులు, అప్రియ సత్యాలు పలికిన వారు, పాండవులకు రాజ్యభాగం ఇవ్వవద్దు. యుద్ధంలో మనమే జయిస్తాం అని చెప్పిన దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణులు కౌరవ వినాశనానికి కారకులు. శ్రేయోభిలాషుల మాటలు వినలేదు, దుష్టచతుష్టయం మాట విన్నాడు ధృతరాష్ట్రుడు. వంద మంది కుమారులను, మహావీరులను, మహాత్ములను కోల్పోయి దిక్కులేని వాడిలా యుద్ధానంతరం ఆ పాండవుల పంచన 13 సం||లు పడి ఉన్నాడు. ఆప్త వాక్యం వినకపోతే ఫలితం ఇదీ అని చెప్పేదే మహా భారతం. ధృతరాష్ట్రునికి కోప కారణం అవుతుందని తెలిసినా, అప్రియమైన విషయమని తెలిసినా నిర్భయంగా, సూటిగా పాండవ విజయం తధ్యమని, నీకు అపజయమని సంజయుడు చెప్పేశాడు.

ధృతరాష్ట్రునికి చేసిన ఈ హెచ్చరికలోనే అంతర్గతంగా సమస్త మానవజాతి వికాసానికి అనుసరించవలసిన మార్గం రహస్యంగా నిక్షిప్తమై ఉంది. అది ఏమిటో తెలుసుకుంటేనే మనకు ప్రయోజనం. అది తెలుసుకోకుండా మన బుద్ధికి తోచినట్లు ప్రవర్తిస్తే ధృతరాష్ట్రునికి పట్టిన గతిలాంటిదే మనకూ ప్రాప్తిస్తుంది. అదేమిటి?

ఈ లోకంలో జన్మించిన ప్రతి వ్యక్తీ - అతడు తెలివి గల వాడైనా - తెలివితక్కువ వాడైనా, అల్పుడైనా - అధికుడైనా, ఏ మతం వాడైనా, ఏ వర్ణం వాడైనా, ఏ వర్గం వాడైనా, ఏ కులం వాడైనా, ఆడ అయినా , మగ అయినా - ప్రతి వ్యక్తీ సంపదలను, ఐశ్వర్యాన్ని, చేసే పనులలో విజయాన్నీ, సుఖసంతోషాలను కోరుకుంటాడు. అయితే అవి లభించే ఉపాయం ఏమిటి? ఆ ఉపాయాన్నే ఇక్కడ చెప్పారు. అదే "యత్ర

యోగేశ్వర కృష్ణః యత్ర పార్థోధనుర్ధరః" అనేది. కృష్ణార్జునులున్నచోటనే విజయం, సంపద, ఐశ్వర్యము, దృఢమైన నీతి. అంటే కృష్ణుడు భగవానుడు గనుక, అర్జునుడు నరుడు గనుక భగవంతుని అనుగ్రహం, మానవ ప్రయత్నం - ఈ రెండూ ఉన్న చోటనే సంపదలు, విజయము అని ఆంతర్యం. కనుక మనం ఏ కార్యాన్ని తలపెట్టినా హృదయంలో భగవంతుని ప్రతిష్టించుకొని, ఆయనను స్మరిస్తూ మన ప్రయత్నం మనం చేస్తూ ఉంటే తప్పక విజయం సిద్ధిస్తుంది అని గ్రహించాలి. అంతా నా గొప్పతనం అనుకొని పశుబలాన్ని నమ్ముకున్న వాడు పతనం గాక తప్పదు. ఇదే సర్వమానవాళికి భగవద్గీత ఇచ్చే సందేశం. భగవానుని ఆదేశం. సంజయుని ద్వారా చెప్పబడ్డ సూచన.

అయితే ఇది సామాన్య అర్థంలో చెప్పబడ్డ సూచన. సర్వ మానవాళికీ సంబంధించిన సూచన. అలాగే ఆధ్యాత్మిక రంగంలో ఉన్న కొద్ది మందికి కూడా ఇందులో చక్కని సూచనలు ఉన్నాయి.

1. సాధారణంగా ఆధ్యాత్మిక రంగంలో ప్రవేశించిన వారికి కావలసింది  మోక్షమే. జన్మ రాహిత్యమే. అట్టి వారికి కూడా విజయం లభించాలంటే భగవంతుని అనుగ్రహం, గురువు అనుగ్రహం ఉండాలి. అదే సమయంలో స్వయంగా సాధనలు చేస్తూ మోక్ష ప్రాప్తికై తీవ్ర ప్రయత్నం చేయాలి.

2. ఇక మరొక విధంగా దీనినే చెప్పాలంటే - మోక్ష ప్రాప్తికి ఆత్మ జ్ఞానాన్ని పొందాలి; ఆధ్యాత్మిక సాధనలు చేయాలి. నిధి ధ్యాసన చేయాలన్నా, ఆత్మ విచారణ చేయాలన్నా, సాక్షీ భావనతో ఉండాలన్నా ముందుగా ఆత్మజ్ఞానం కావాలి. జ్ఞానం బుద్ధిలో ఉన్నప్పుడే సాధనలు ఎలా చేయాలో తెలుస్తుంది. ఏ సాధన వల్ల ఏమి ప్రయోజనం కలుగుతుందో తెలుస్తుంది. అలా

తెలిసినప్పుడే సాధనలను పట్టుదలతో సాగించటం కుదురుతుంది. అంటే సాధనలలో విజయం సాధించాలంటే జ్ఞానం కావాలి. పట్టుదలతో ప్రయత్నము చేయాలి.

'యోగేశ్వరః కృష్ణ' - అంటే విచారించి వివేచన చేసే 'జ్ఞాన శక్తి' అదే ఆధ్యాత్మిక జ్ఞానం.

'ధనుర్ధరః పార్థః' - అంటే సాధనలో కర్తవ్యతా నిష్ఠ, ఉత్సాహం. అదే పురుష ప్రయత్నం.

ఈ రెండూ ఉన్న చోట సాధన సఫలీ కృతం అవుతుంది.

*3*. పారమార్థిక జ్ఞానము, లౌకిక సంపద(పురుష ప్రయత్నం) - ఈ రెండింటికి ఇక్కడ సమన్వయం చెబుతున్నారు.

ఎంత ధనమున్నా, ఎన్ని సంపదలున్నా, ఎందరు బిడ్డలున్నా, ఎందరు బంధు మిత్రులు, ఆత్మీయులు ఉన్నా మనస్సుకు శాంతి ఉండదు. ఎప్పుడూ ఏవో సమస్యలతో సతమతమౌతుంటారు. అలాగని ఏ ధన సంపదలు లేకుండా కేవలం పారమార్థిక జ్ఞానం ఉంటే కడుపు నిండుతుందా? అంటే నిండదు. కనుక కేవలం భౌతిక సంపదలతో తృప్తి పడటం జరగదు; కేవలం పారమార్థిక జ్ఞానం వల్ల కడుపు నిండదు. రెండూ అవసరమే. మరి ఏం చేయాలి? శరీర పోషణకు, కుటుంబ పోషణకు కృషి చేస్తూనే, అదీ నిష్కామంగా నీ కర్తవ్య కర్మలు చేస్తూనే పరమార్ధ సాధన కూడా చెయ్యాలి. ఆత్మ జ్ఞానాన్ని పొంది సాధనలు సాగించాలి. శరీర పోషణ గురించీ- కుటుంబ పోషణ గురించీ ఆలోచించవలసిన అగత్యం లేనప్పుడు పూర్తిగా పరమాత్మ సేవలో జీవితాన్ని తరింపజేసుకోవాలి. అప్పుడే జీవితంలో విజయం సాధించటం జరుగుతుంది.

*4*. మరొక సూచన కూడా ఉన్నదీ శ్లోకంలో. ఇది కూడా ఆధ్యాత్మిక రంగంలో ఉన్న వారికి చెప్పబడినదే. శ్రీకృష్ణుడు

సాక్షాత్తు భగవంతుడు. 'కృష్ణస్తు భగవాన్ స్వయం' అన్నారు. ఇక అర్జునుడు నరుడు. మానవులలో శ్రేష్ఠుడు. ఉత్తమ భక్తుడు. భగవంతునికి మిత్రుడు. కృష్ణార్జునులున్న చోట విజయము - అంటే - ఎవరు తమ ఆధ్యాత్మిక సాధనలలో విజయాన్ని సాధించాలనుకుంటారో అట్టి వారు అటు పరమాత్మను, ఇటు మహాత్ములను - గురువులను సేవిస్తూ ఉండాలి. - అనేదే సూచన.

*భగవంతుని హృదయంలో నిలుపుకోవాలి.

*మహాత్ములు, సాధు పురుషులు, భక్తులు, జ్ఞానులు, గురువులు అయిన వారిని సేవిస్తూ ఉండాలి.

ఇలా పరమాత్మ స్మరణ - సజ్జన సాంగత్యం ఉంటే విజయమే.

కనుక మనం అర్జునుని లాగా శరీరమనే ఈ రథంలో కూర్చొని, కార్యరంగమనే యుద్ధ రంగంలో ఈ రథాన్ని నడపటానికి మన మనస్సు అనే పగ్గాన్ని మన హృదయంలోనే ప్రతిష్టించుకొనియున్న పరమాత్మ అనే సారధి చేతికి అందించాలి. అంటే మన మనస్సు, బుద్ధి ఎప్పుడూ పరమాత్మ చేతిలో - పరమాత్మ స్మరణలో ఉండాలి. ఇదే విజయానికి కీలకం.

భగవద్గీతలోని చిట్టచివరి శ్లోకమైన దీనిలోని చివరి పదం 'మమ' అలాగే భగవద్గీతలోని మొట్టమొదటి శ్లోకమైన 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' లోని మొదటి పదం 'ధర్మ' రెండూ కలిపితే 'మమధర్మ' ఈ రెండు పదాల మధ్య *700* శ్లోకాల గీతా హారం ఉన్నది. దీని భావం భగవద్గీత బోధించేది స్వధర్మ పాలననే- అని.

పరమార్థ జ్ఞానంతో, సద్గుణాలతో, సమభావంతో, స్వధర్మాన్ని నిర్వర్తించాలి. లోక కళ్యాణం కొరకు, పరోపకారం

కొరకు ఎట్టి త్యాగానికైనా సిద్ధం కావాలి. త్యాగమే పరమాత్మ తత్త్వం. త్యాగమే కృష్ణ తత్త్వం.

మోక్ష సాధనకై ఆధ్యాత్మిక రంగంలో ప్రవేశించిన అర్జునులందరికీ యోగేశ్వరుడైన శ్రీకృష్ణుని అనుగ్రహం - గురువు యొక్క అనుగ్రహం రెండూ ఉండాలి. గురు శిష్యుల కలయికతోనే జ్ఞాన ప్రాప్తి. కనుక ఈ శ్లోకాన్ని నిరంతరం స్మరిస్తూ మన హృదయాలలోనే ఉన్న పరమాత్మను అనన్య భక్తితో నిత్యము, నిరంతరము సేవిస్తూ , భగవానుడు ఎంతో దయతో అనుగ్రహించిన భగవద్గీత శాస్త్రాన్ని చక్కగా శ్రవణ, అధ్యయన, మనన, నిధిధ్యాసనలతో అనుష్టిస్తూ ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆత్మానుభూతిని బడసి, జన్మ రాహిత్యంతో కూడిన నిత్యానంద శాశ్వత పరమ పదాన్ని - జీవన్ముక్తిని - కైవల్యాన్ని పొందాలి. ఆ విధంగా అపురూపంగా లభించిన ఈ అరుదైన మానవ జన్మను సార్థకం చేసుకోవాలని, చేసుకోగలరని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ..అధ్యాయాంత గద్యంతో ముగిద్దాం.

*గద్యం : ఓంతత్ సత్ ఇతి శ్రీమద్ భగవద్గీతాసు, ఉపనిషత్సు,*
*బ్రహ్మవిద్యాయాం, యోగ శాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే*
*మోక్ష సన్యాస యోగో నామ అష్టాదశోధ్యాయః||*

-ఇలా ఉపనిషత్తుల సారమై, బ్రహ్మ విద్య, యోగ శాస్త్రమై శ్రీ కృష్ణార్జున సంవాద రూపమైన భగవద్గీతయందు మోక్ష సన్యాస యోగమనే 18 వ అధ్యాయం సమాప్తం.

మోక్షం కొరకు సర్వాన్ని సన్యసించమని చెప్పే అధ్యాయం; నీ స్వస్థితిని చేరిన తరువాత ఇక మోక్షమనేదే లేదు గనుక మోక్షాన్ని కూడా సన్యసించమని చెప్పే అధ్యాయం ఇది. 18 మెట్లు ఎక్కిన తర్వాత ఇక మోక్షంతో పని ఏమి? బంధంలో ఉన్న వానికే మోక్షం గాని సమస్త కర్మ బంధనాలు వదిలించుకున్న వాడికి మోక్షంతో పని లేదు గదా! కనుక

జీవుడు అని భ్రమపడిన వాడికి భ్రమ తొలగింది. దేవుడే- భగవంతుడే - నేను అని గ్రహించటంతో సర్వం సమాప్తం.

## చివరిగా నా మాట.

ఈ భగవద్గీతను ఇలా పూర్తిగావించటంలో మొదటిది భగవంతుని కృప. రెండవది మీ అందరి ఆదరణ. వేదాంతం పట్ల మీకు గల ఆసక్తి. బండి నడిపినవాడు భగవంతుడు. నేను నిమిత్తమాత్రుడను. భగవంతునికి అనేక దేహాలు. తనకు కావలసిన పనిని, తాను సంకల్పించిన పనిని ఏదో ఒక దేహం ద్వారా నిర్వర్తిస్తాడు. తాను ఏమీ చేయకుండానే అన్నీ చేస్తాడు భగవంతుడు.

'కరిష్యే వచనం తవ' అంటూ భగవంతుని ఆజ్ఞను పాలించటమే ఇక్కడ జరిగినది, జరుగుతున్నది, జరుగబోయేది. మీరు విన్న దానిలో మంచి ఏమైనా ఉంటే అది ఈ శాస్త్రాన్ని అందించిన వ్యాస భగవానునిది; దానిని వ్యాఖ్యానించిన అనేక మంది మహాత్ములది; గురువులది. లోపాలేవైనా ఉంటే అది నాది. మంచిని మాత్రమే స్వీకరించండి.

గీతా జ్ఞానానికి ముగింపు లేదు. అది అవిరళ ధారాపాతం. మనం మన స్వస్వరూపంలో నిలిచేంతవరకు - ఆత్మానుభూతిని పొందేంతవరకు ఈ జ్ఞానాన్ని మననం చేస్తూనే ఉండాలి. ఎన్ని సార్లు వింటే, ఎన్ని సార్లు చదివితే అంతగా ఈ అద్భుత జ్ఞానం స్థిరపడుతుంది. మానవ జన్మను సార్థకం చేసుకోవాలంటే ఈ భగవద్గీత ఒక్కటి చాలు. అయితే లోతుగా అధ్యయనం చేసి తెలుసుకోవాలి. ఈ మొత్తం భగవద్గీతను మళ్ళీ మళ్ళీ వినాలంటే *18* అధ్యాయాల ఆడియో *CD*లు, వీడియో *DVD*లు ఉన్నాయి. చదవాలంటే *18* అధ్యాయాలు గ్రంధాలుగా ఉన్నాయి. కావలసిన వారు

*8885539770* లేదా *09886265225* నెంబర్లను, లేదా మా ఈమెయిలు *care@srichalapathirao.com* ను సంప్రదించండి.

అనేక ఉపనిషత్తులపై, బ్రహ్మసూత్రములపై, భగవద్గీతపై, వివిధ ప్రకరణ గ్రంధాలపై ప్రవచనములను వినుటకు *CD*లు, *PENDRIVE*లు, *External Hard Disk* రూపములలో లభించును. అలాగే గ్రంధములు కూడా లభించును.

పై నంబర్లను సంప్రదించి వివరములు తెలుసుకోగలరు.

-స్వస్తి-

## మా వద్ద లభించు గ్రంధములు.

1. కర్మ సిద్ధాంతము. -రు.30.
2. శంకరాచార్యుల వారి భజ గోవిందం. -రు.100.
3. శంకరాచార్యుల వారి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం.-రు.100.
4. శంకరాచార్యుల వారి ఆత్మ బోధ. -రు.150.
5. భగవాన్ రమణ మహర్షుల ఉపదేశసారం. -రు.100.
6. సదా శివ బ్రహ్మేంద్రుల ఆత్మ విద్యావిలాసం. -రు.100.
7. నారద భక్తి సూత్రములు. -రు.150.
8. ఈశావాస్యోపనిషత్తు. -రు.100
9. కేనోపనిషత్తు. -రు.100.
10. కఠోపనిషత్తు. -రు.250.
11. ముండకోపనిషత్తు. -రు.200.
12. మాండూక్యోపనిషత్తు. -రు.200.
13. కైవల్యోపనిషత్తు. -రు.100.
14. బ్రహ్మ సూత్రములు. – 1 -రు.200.

*15. బ్రహ్మ సూత్రములు. – 2* *-రు.200.*

*16. గీతమాలిక.* *-రు.100.*

*17. భగవద్గీత 15 పుస్తకముల సెట్. -* *రు.1800.*


<u>వివరములకు.</u>

*సెల్ :* *8008539770*

*8885539770*

*09886265225*

*PHONE:* *08647-254716*

శ్రీమద్భగవద్గీత

అథ ప్రథమోఽధ్యాయః - అర్జునవిషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ

1 ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।

మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ।

ధర్మక్షేత్రే - కురుక్షేత్రే - సమవేతాః - యుయుత్సవః

మామకాః - పాండవాః - చ-ఏవ - కిం - అకుర్వత - సంజయ

సంజయ= ఓ సంజయా, ధర్మక్షేత్రే = ధర్మమైన, కురుక్షేత్రే=కురుక్షేత్రమునకు, యుయుత్సవః= యుద్ధ సన్నద్ధులై, సమవేతాః = కూడినవారైన, మామకాః = నావారును, పాండవాః చ ఏవ = పాండవులును, కిం = ఏమి, అకుర్వత=చేసిరి.

ధృతరాష్ట్రుడు ఇట్లు పలికెను - ఓ సంజయా ! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు యుద్ధసన్నద్ధులై చేకూడియున్న నా వారగు దుర్యోధనాదులును పాండు పుత్రులును ఏమి చేసిరి ?

సంజయ ఉవాచ

2 దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।

ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ।

దృష్ట్వా - తు - పాండవానీకం - వ్యూఢం - దుర్యోధనః - తదా

ఆచార్యం - ఉపసంగమ్య - రాజా - వచనం - అబ్రవీత్

తదా= ఆ సమయమున, రాజా=రాజైన, దుర్యోధనః=దుర్యోధనుడు, వ్యూఢం = వ్యూహ్యరచనతో రణమునకు మోహరించియున్న, పాండవానీకం = పాండవ సైన్యమును, దృష్ట్వా = చూచి, తు = మరియు, ఆచార్యమ్ = ద్రోణాచార్యుల వారిని, ఉపసంగమ్య = సమీపించి, వచనం = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

ధృతరాష్ట్రునితో సంజయుడిట్లు పల్కెను - ఆ సమయమున రాజైన దుర్యోధనుడు వ్యూహరచనతో రణమునకు మోహరించియున్న పాండవసైన్యమును చూచి, ద్రోణాచార్యుని సమీపించి ఇలా పలికెను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 పశ్యైతాం పాండుపుత్రాణామ్ ఆచార్య మహతీం చమూమ్ ।

వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ।

పశ్య - ఏతాం - పాండుపుత్రాణాం - ఆచార్య - మహతీం - చమూం.

వ్యూఢాం - ద్రుపదపుత్రేణ - తవ - శిష్యేణ - ధీమతా

ఆచార్య = ఓ ఆచార్యుడా, తవ = నీ యొక్క, ధీమతా = బుద్ధిమంతుడును, శిష్యేణ=శిష్యుడును, ద్రుపద పుత్రేణ = ద్రుపదుని కుమారుడగు ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢాం = వ్యూహాకారముగ నిలుపబడిన, పాండుపుత్రాణాం =పాండుతనయుల యొక్క, ఏతాం = ఈ , మహతీం = గొప్పదియగు, చమూం = సైన్యమును, పశ్య = చూడుము.

ఓ ఆచార్యా ! బుద్ధిమంతుడైన మీ శిష్యుడును, ద్రుపదపుత్రుడును అయిన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారముగా నిల్పబడిన పాండవుల ఈ గొప్పసైన్యమును చూడుము.

4 అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।

యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ।

అత్ర-శూరాః-మహేష్వాసాః-భీమార్జునసమాః - యుధి

యుయుధానః - విరాటః - చ - దృపదః - చ - మహారథః.

అత్ర = ఇచ్చట, యుధి = సమరమునందు, భీమార్జునసమాః = భీమార్జునులతో సరితూగు వారును, మహేష్వాసాః = గొప్ప విలుకాండ్రును, శూరాః= శూరులును, యుయుధానః = యుయుధానుడు (సాత్యకి), విరాటః = విరాటుడును, చ = మరియు, మహారథః = మహారథుడైన, ద్రుపదః = ద్రుపదుడును, చ = మరియు,

ఈ పాండవ సేనలందు శూరులను, గొప్ప ధనుర్విద్యా సంపన్నులును, భీమార్జునులతో సమానులును గలరు, మరియు సాత్యకి, విరాటుడు, మహారథి ద్రుపదరాజును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

5 ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।

పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః।

ధృష్టకేతుః - చేకితానః - కాశిరాజః - చ - వీర్యవాన్

పురుజిత్ - కుంతిభోజః - చ - శైబ్యః - చ - నరపుంగవః

ధృష్టకేతుః = ధృష్టకేతుడు, చేకితానః = చేకితానుడు, వీర్యవాన్ = బలశాలియైన, కాశిరాజః = కాశీరాజును, చ = మరియు, పురుజిత్ = పురుజిత్తుడును, కుంతిభోజః = కుంతిభోజుడును, చ = ఇంకను, నరపుంగవః = శ్రేష్ఠమానవుడైన, శైబ్యః = శైబ్యుడును, చ = మరియు,

మరియు ధృష్టకేతువు, చేకితానుడు, బలశాలి కాశీరాజు, పురుజిత్తు, కుంతి భోజుడు, మానవశ్రేష్ఠుడగు శైబ్యుడును

6 యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।

సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః।

యుధామన్యుః - చ - విక్రాంతః - ఉత్తమౌజాః - చ - వీర్యవాన్

సౌభద్రః - ద్రౌపదేయాః - చ - సర్వే - ఏవ - మహారథాః॥

విక్రాంతః = పరాక్రమవంతుడైన, యుధామన్యుః = యుధామన్యుడు, చ = మరియు, వీర్యవాన్ - వీరుడగు, ఉత్తమౌజాః = ఉత్తమౌజుడును, చ = మరియు, సౌభద్రః = సుభద్రా పుత్రుడగు అభిమన్యుడును, చ = మరియు, ద్రౌపదేయాః = ద్రౌపదీపుత్రులును, సర్వే = అందరును, మహారథాః ఏవ = మహారథులే.

పరాక్రమవంతుడైన యుధామన్యుడు, వీరుడైన ఉత్తమౌజుడు, సుభద్రాపుత్రుడైన అభిమన్యుడు, ద్రౌపది యొక్క ఐదుగురు పుత్రులును కలరు. వీరందరును మహారథులే.

7 అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।

నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ।

అస్మాకం - తు - విశిష్టాః - యే -తాన్ - నిబోధ - ద్విజోత్తమ

నాయకాః - మమ- సైన్యస్య - సంజ్ఞార్థం - తాన్ - బ్రవీమి - తే

ద్విజోత్తమ= ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా, అస్మాకం = మన పక్షములో, తు = కూడా, యే = ఎవరు, విశిష్టాః = శ్రేష్ఠులో, మమ = నా యొక్క, సైన్యస్య = సైన్యమునకు, నాయకాః = నాయకులో, తాన్ = వారిని, తే = నీకు, సంజ్ఞార్థం = తెలియుటకొరకు, బ్రవీమి = తెలుపుచున్నాను, తాన్ = వారిని, నిబోధ = తెలిసికొనుము

ఓ బ్రాహ్మణోత్తమా ! మన సైన్యములో ప్రధాన యోధులను గూడ గమనింపుడు. మీకు తెలియుటకై మన సేనానాయకులను గూర్చియు తెలుపుచున్నాను.

8 భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।

అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ

భవాన్ - భీష్మః - చ - కర్ణః - చ - కృపః - చ - సమితింజయః

అశ్వత్థామా - వికర్ణః - చ - సౌమదత్తిః - తథా - ఏవ -చ

భవాన్ = తమరును, భీష్మః = భీష్ముడును, చ = మరియు, కర్ణః = కర్ణుడును, చ = మరియు, సమితింజయః = సమరవిజయుడునగు, కృపః = కృపాచార్యుడును, చ = మరియు, అశ్వత్థామా = అశ్వత్థామయును, వికర్ణః = వికర్ణుడును, చ = మరియు, సౌమదత్తిః = సోమదత్తుని పుత్రుడు నగు భూరిశ్రవుడును, తథా = అలాగున, ఏవ చ = మరియు తమరును, భీష్ముడు, కర్ణుడు, సమరవిజయుడగు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడు ఇందు ముఖ్యులు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

9 అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః।

నానాశస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః।

అన్యే - చ - బహవః - శూరాః - మదర్థే - త్యక్తజీవితాః

నానాశస్త్రప్రహరణాః - సర్వే - యుద్ధ విశారదాః

అన్యే = ఇతరులును, చ = కూడ, బహవః = అనేకులు, శూరాః = శూరులు, మదర్థే = నా కొరకు, త్యక్త జీవితాః = జీవితములపై భ్రాంతి వదిలినవారై, సర్వే = వీరందరును, నానాశస్త్ర ప్రహరణాః = అనేకములగు శస్త్రాస్త్రములు గలవారును, యుద్ధవిశారదాః = సమర చాతుర్యము గలవారును

ఇంకను పెక్కుమంది శూరులును, వీరులును మన సైన్యమునందు కలరు. వీరందరును యుద్ధవిశారదులు. నానాశస్త్రాస్త్రధారులై. నాకొరకు తమ జీవితములను ధారపోసియైనను యుద్ధము చేయుటకు సిద్ధముగా నున్నారు.

10 అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।

పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ।

అపర్యాప్తం - తత్ - అస్మాకం - బలం - భీష్మాభిరక్షితం

పర్యాప్తం - తు - ఇదం - ఏతేషాం - బలం - భీమాభిరక్షితం

తత్ = అలాంటి, అస్మాకం = మనయొక్క, భీష్మాభిరక్షితం = భీష్మాచార్యులవారిచే సురక్షిత మైన, బలం = సైన్యం, అపర్యాప్తం = అపారము, తు = అయితే, భీమాభిరక్షితం = భీమునిచే రక్షితమైన, ఏతేషాం = వారియొక్క, ఇదం = ఈ , బలం = సైన్యం, పర్యాప్తం = పరిమితముగ నున్నది.

భీష్మపితామహునిచే సురక్షితమై, అపరిమితముగా నున్న మనసైన్యము అపరిమితమై యున్నది. భీమునిచే రక్షింపబడుచు పాండవసైన్యం పరిమితముగానున్నది.

11 అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।

భీష్మ మేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥

అయనేషు - చ - సర్వేషు - యథాభాగం - అవస్థితాః

భీష్మం - ఏవ - అభిరక్షంతు - భవంతః - సర్వే - ఏవ - హి

భవంతః = మీరు, సర్వే ఏవ = అందరును, చ = అందువల్ల, సర్వేషు = సకలములైన, అయనేషు = వ్యూహస్థానముల యందు, యథాభాగం = మీ మీ నియమిత స్థానముల యందు, అవస్థితాః = ఉండినవారై, భీష్మమేవ = భీష్మాచార్యులవారినే, అభిరక్షంతు హి =చక్కగా రక్షింతురుగాక

కనుక మీరందరును మీమీ స్థానములలో సుస్థిరముగా నిలిచి, అన్నివైపులనుండి నిశ్చయముగా భీష్ముని రక్షించుచుండవలెను.

12 తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।

సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్।

తస్య - సంజనయన్ - హర్షం - కురువృద్ధః - పితామహః

సింహనాదం - వినద్య - ఉచ్చైః - శంఖం - దధ్మౌ - ప్రతాపవాన్

తస్య = ఆ దుర్యోధనునకు, హర్షం = సంతోషమును, సంజనయన్ = కలిగించుచు, ప్రతాపవాన్ = ప్రతాపవంతుడును, కురువృద్ధః = కురువృద్ధుడును, పితామహః - పితామహుడును, ఉచ్చైః = బిగ్గరగా, సింహనాదం = సింహనాదమును, వినద్య = చేసి, శంఖం = శంఖమును, దధ్మౌ=పూరించెను.

కురువృద్ధుడును, ప్రతాపశాలియును ఐన భీష్మ పితామహుడు దుర్యోధనుని సంతోషపఱచుటకై ఉచ్చస్వరముతో సింహనాదముచేసి, తన శంఖమును పూరించెను.

13 తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।

సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోऽభవత్।

తతః - శంఖాః -చ - భేర్యః - చ - పణవానక గోముఖాః

సహసా - ఏవ - అభ్యహన్యంత - సః - శబ్దః - తుములః - అభవత్

తతః=తరువాత, చ=మరియు, శంఖాః = శంఖములును, చ=మరియు, భేర్యః = భేరులును, పణవానక గోముఖాః = పణవములు, తప్పెటలు, రణభేరులును, సహసా+ ఏవ = ఒకేసారి, అభ్య హన్యంత = మ్రోగించబడెను, సః = ఆ, శబ్దః = ధ్వని, తుములః = గొప్ప భయంకరముగ, అభవత్ = ఆయెను.

ఆతరువాత శంఖములు, నగారాలు, తప్పెటలు, మృదంగములు, గోముఖవాద్యములు మొదలగునవి ఒక్కసారిగా మ్రోగినవి. ఆ ధ్వనులతో దిక్కులను పిక్కటిల్లాయి. ( ఆ శబ్దములు భయంకరముగా నుండెను).

14 తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।

మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః।

తతః - శ్వేతైః - హయైః - యుక్తే - మహతి - స్యందనే - స్థితౌ

మాధవః - పాండవః - చ - ఏవ - దివ్యౌ - శంఖౌ - ప్రదధ్మతుః

తతః = తరువాత, శ్వేతైః = తెల్లని, హయైః - గుఱ్ఱములతో, యుక్తే = కూడిన, మహతి = ఉత్తమమైన, స్యందనే = రథమునందు, స్థితౌ= కూర్చొనియున్నట్టి, మాధవః = శ్రీకృష్ణ భగవానుడు, పాండవః = అర్జునుడు, చ = మరియు, ఏవ = కూడా, దివ్యౌ = దివ్యములగు, శంఖౌ = శంఖములను, ప్రదధ్మతుః = పూరించిరి.

పిమ్మట శ్వేతాశ్వములను పూన్చిన మహారథముపై ఆసీనులైయున్న శ్రీకృష్ణార్జునులు తమ దివ్యశంఖములను పూరించిరి.

15 పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।

పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః।

పాంచజన్యం - హృషీకేశః - దేవదత్తం - ధనంజయః

పౌండ్రం - దధ్మౌ - మహాశంఖం - భీమకర్మా - వృకోదరః

హృషీకేశః = శ్రీకృష్ణుడు, పాంచజన్యం = పాంచజన్యమను శంఖమును, ధనంజయః = ధనంజ యుడు, దేవదత్తం = దేవదత్తమను శంఖమును, భీమకర్మా = భయంకర కార్యము లాచరించు, వృకోదరః = భీముడు, పౌండ్రం = పౌండ్రమను, మహాశంఖం = గొప్ప శంఖమును, దధ్మౌ = పూరించిరి.

శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్త మును పూరించిరి. అరివీరభయంకరుడైన భీముడు పౌండ్రము అను గొప్పశంఖమును పూరించెను.

16 అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।

నకులః సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥

అనంతవిజయం - రాజా - కుంతీ పుత్రః - యుధిష్ఠిరః

నకులః - సహదేవః - చ - సుఘోషమణిపుష్పకౌ

కుంతీపుత్రః = కుంతీపుత్రుడును, రాజా = రాజును అగు, యుధిష్ఠిరః = ధర్మరాజు, అనంత విజయం = అనంతవిజయ మనె శంఖమును, నకులః = నకులుడు, చ = మరియు, సహదేవః = సహ దేవుడును, సుఘోష మణిపుష్పకౌ=సుఘోషమణిపుష్పకము లనె శంఖములను

కుంతీపుత్రుడును, రాజును అగు ధర్మరాజు అనంత విజయము అను శంఖమును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకము లను శంఖములను పూరించిరి.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

17 కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః ।

ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః ॥

కాశ్యః - చ - పరమేష్వాసః - శిఖండీ - చ - మహారథః

ధృష్టద్యుమ్నః - విరాటః - చ - సాత్యకిః - చ - అపరాజితః

పరమేష్వాసః = శ్రేష్ఠమైన విల్లుగల, కాశ్యః = కాశీరాజును, చ = మరియు, మహారథః = మహారథుడైన, శిఖండీ = శిఖండియు, చ = మరియు, ధృష్టద్యుమ్నః = ధృష్టద్యుమ్నుడును, విరాటః = విరాటుడును, చ = అలాగుననే, అపరాజితః = పరాజయ మెరుగని, సాత్యకిః = సాత్యకియును, చ = మరియు

ఓ రాజా! మహాధనుర్ధారియైన కాశీరాజా, మహారథుడైన శిఖండి యు, ధృష్టద్యుమ్నుడును, విరాటరాజా, పరాజయమెరుగని సాత్యకి యు మరియును,

18 ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।

సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ।

ద్రుపదః - ద్రౌపదేయాః - చ - సర్వశః - పృథివీపతే

సౌభద్రః - చ - మహాబాహు - శంఖాన్ - దధ్ముః - పృథక్ - పృథక్

పృథివీపతే = హే ధృతరాష్ట్ర మహారాజా, ద్రుపదః = ద్రుపదరాజా, చ = మరియు, ద్రౌపదేయాః = ద్రౌపదీపుత్రులును, చ = మరియు, మహాబాహుః = గొప్ప భుజములుగల, సౌభద్రః = సుభద్రా తనయుడగు అభిమన్యుడును, సర్వశః = అంతటను, పృథక్ పృథక్ = వేరువేరుగా , శంఖాన్ = శంఖములను, దధ్ముః = పూరించిరి.

ద్రుపదమహారాజా, ద్రౌపదియొక్క ఐదుగురు పుత్రులును, భుజబలశాలియు సుభద్రాపుత్రుడును అగు అభిమన్యుడును తమ తమ శంఖములను వేర్వేరుగా పూరించిరి.

19 స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।

నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥

సః - ఘోషః - ధార్తరాష్ట్రాణాం - హృదయాని - వ్యదారయత్

నభః - చ - పృథివీం - చ - ఏవ - తుములః వ్యనునాదయన్

తుములః - భయంకరమైన, సః = ఆ, ఘోషః = శబ్దము, నభః = ఆకాశమును, చ = మరియు, పృథివీం = భూమియును, చ = మరియు, ఏవ = కూడా, వ్యనునాదయన్ = ప్రతిధ్వనించుచు, ధార్తరాష్ట్రాణాం = ధృతరాష్ట్ర పుత్రులయొక్క, హృదయాని = గుండెలను, వ్యదారయత్ = భేదించెను.

పాండవవీరుల శంఖనినాదములకు భూమ్యాకాశముల దద్దరిల్లినవి. ఆ శంఖారావములకు ధార్తరాష్ట్రుల హృదయములు తల్లడిల్లెను.

20 అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।

ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ।

హృషీకేశం తదా వాక్యమ్ ఇదమాహ మహీపతే ।

అథ - వ్యవస్థితాన్ - దృష్ట్వా - ధార్తరాష్ట్రాన్ - కపిధ్వజః

ప్రవృత్తే - శస్త్రసంపాతే - ధనుః - ఉద్యమ్య - పాండవః

హృషీకేశం - తదా - వాక్యం - ఇదం - ఆహ - మహీపతే

అథ = తరువాత, మహీపతే = ఓ రాజా,చ శస్త్రసంపాతే = ఆయుధ ప్రయోగము, ప్రవృత్తే = జరుగబోవుచుండగా, కపిధ్వజః = కపిరాజు చిహ్నముతోడి పతాకముగల, పాండవః = అర్జునుడు, వ్యవస్థితాన్ = సమర సన్నద్ధులై యున్న, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, దృష్ట్వా = చూచి, ధనుః = వింటిని, ఉద్యమ్య = సంధించి, తదా = అప్పుడు, హృషీకేశం= శ్రీకృష్ణునితో, ఇదం = ఈ , వాక్యం = వచనమును, ఆహ = పలికెను.

ఓ ధృతరాష్ట్ర మహారాజా ! యుద్ధమునకై సన్నద్ధులైయున్న ధార్తరాష్ట్రులను చూచి, కపిధ్వజుడైన అర్జునుడు ధనుస్సును పైకెత్తి శ్రీకృష్ణునితో ఇట్లనెను.

అర్జున ఉవాచ

21 సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ।

సేనయోః = ఉభయోః - మధ్యే - రథం - స్థాపయ - మే - అచ్యుత

అచ్యుత = శ్రీకృష్ణా, ఉభయోః = రెండింటి, సేనయోః = సేనల యొక్క, మధ్యే = నడుమ, మే - నా యొక్క, రథం = రథమును, స్థాపయ = నిలుపుము.

ఓ అచ్యుతా! నా రథమును ఇరుసేనలమధ్య నిలుపుము.

22 యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।

కైర్మయా సహ యోద్ధవ్యమ్ అస్మిన్ రణసముద్యమే ।

కైః -మయా - సహ- యోద్ధవ్యం - అస్మిన్ - రణసముద్యమే

అస్మిన్ = ఈ, రణసముద్యమే = సమర సందర్భమున, మయా = నా చేత, కైః - సహ = ఎవరితో, యోద్ధవ్యం = యుద్ధము చేయబడవలయునో, యోద్ధుకామాన్ = సమరము నభిలపించి, అవస్థితాన్ = ఉన్న, ఏతాన్ = ఈ శూరులను, అహం = నేను, యావత్ నిరీక్షే = చూచెదను

ఈ సమరమునందు యుద్ధాభిలాషులై నిలిచియున్న ప్రతిపక్షయోధు లందరిని చూచి వారిలో ఎవరితో నేను యుద్ధము చేయవలసియున్నదో పరిశీలించెదను.

23 యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।

ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః।

యోత్స్యమానాన్ - అవేక్షే - అహం - యే - ఏతే - అత్ర-సమాగతాః

ధార్తరాష్ట్రస్య - దుర్బుద్ధేః - యుద్ధే - ప్రియచికీర్షవః

దుర్బుద్ధేః = దుష్టబుద్ధియైన, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు, యుద్ధే = యుద్ధమునందు, ప్రియ చికీర్షవః = మేలు కోరినవారై, యే = ఏ, ఏతే = ఈ వీరులు, అత్ర = ఈ యుద్ధభూమియందు, సమాగతాః = వచ్చి యుండిరో, యోత్స్యమానాన్ = అలా యుద్ధము చేయువారిని, అహం = నేను, అవేక్షే = చూచెదను.

దుర్బుద్ధియైన దుర్యోధనునకు మేలుకోరి యుద్ధమున పాల్గొనదలచి వచ్చియున్న రాజులను అందరిని వీక్షించెదను.

సంజయ ఉవాచ

24. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।

సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్।

ఏవమ్ - ఉక్తః - హృషీకేశః -గుడాకేశేన - భారత

సేనయోః - ఉభయోః - మధ్యే - స్థాపయిత్వా - రథోత్తమమ్

భారత = ఓ ధృతరాష్ట్రుడా, ఏవం = ఈ విధముగ, గుడాకేశేన - అర్జునుని చేత, ఉక్తః = చెప్పబడిన, హృషీకేశః = శ్రీకృష్ణుడు, ఉభయోః = రెండు, సేనయోః = సైన్యముల యొక్క, మధ్యే = నడుమ, రథోత్తమం = గొప్పదియగు రథమును, స్థాపయిత్వా = నిలిపి

సంజయుడు పలికెను - ఓ ధృతరాష్ట్రా ! అర్జునుని కోరికమేరకు శ్రీకృష్ణుడు ఆ దివ్యరథమును నిలిపెను.

25. భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।

ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ।

భీష్మద్రోణ ప్రముఖతః - సర్వేషాం - చ - మహీక్షితాం

ఉవాచ - పార్థ - పశ్య - ఏతాన్ - సమవేతాన్ - కురూన్ - ఇతి

భీష్మద్రోణ ప్రముఖతః = భీష్మద్రోణుల ఎదుట, చ = మరియు, సర్వేషాం = సర్వులైన, మహీక్షితాం = రాజుల ఎదుట (నిలిపి), పార్థ = ఓ అర్జునా, సమవేతాన్ = సన్నద్ధులై యున్న, ఏతాన్ = ఈ, కురూన్ = కౌరవులను, పశ్య = చూడుము, ఇతి = అని, ఉవాచ = పలికెను.

భీష్మద్రోణులకును, ఆ పక్షమునందలి మహారాజులందరికిని ఎదురుగా ఉభయసేనలమధ్య నిలిపి పిదప అతడు అర్జునునితో పార్థా! ఇక్కడ సమావేశమైన ఈ కౌరవ వీరులందరిని బాగుగా పరికింపుము అని నుడివెను.

26 తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।

ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా ।

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।

తత్ర - అపశ్యత్ - స్థితాన్ - పార్థః - పిత్రూన్ - అథ - పితామహాన్

ఆచార్యాన్ - మాతులాన్ - భ్రాత్రూన్ - పుత్రాన్ - పౌత్రాన్ - సఖీన్ - తథా

శ్వశురాన్ - సుహృదః - చ - ఏవ - సేనయోః - ఉభయోః - అపి

అథ = తరువాత, పార్థః = అర్జునుడు, తత్ర = అక్కడ, ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయందు, అపి = కూడా, స్థితాన్ = ఉన్నట్టి, పిత్రూన్ = తండ్రులను, పితామహాన్ = తాతలను, ఆచార్యాన్ = గురువులను, మాతులాన్ = మేనమామలను, భ్రాత్రూన్ =సోదరులను, పుత్రాన్ = కుమారులను, పౌత్రాన్ = మనుమలను, సఖీన్ = మిత్రులను, తథా = మరియు, శ్వశురాన్ = మామలను, సుహృదః = సుహృదులను, చ = మరియు, ఏవ = కూడా, అపశ్యత్ = గాంచెను.

పిమ్మట అర్జునుడు యిరు సేనలయందును ఉన్న పెదతండ్రులను, పినతండ్రులను, తాతముత్తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, హితులను, మామలను మున్నగు ఆత్మీయులను చూచెను.

27 తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్।

కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్।

తాన్ - సమీక్ష్య - సః - కౌంతేయః - సర్వాన్ - బంధూన్ - అవస్థితాన్

కృపయా- పరయా- ఆవిష్టః - విషీదన్ - ఇదం - అబ్రవీత్

సః = ఆ, కౌంతేయః = అర్జునుడు, అవస్థితాన్ = సన్నద్ధులై యున్న, తాన్= ఆ, సర్వాన్ = సమస్తమైన, బంధూన్ = బంధువులను, సమీక్ష్య = చూచి, పరయా = అత్యంత, కృపయా = కరుణతో, ఆవిష్టః=కూడుకొన్నవాడై, విషీదన్ = శోకించుచు, ఇదం = ఈ విధముగ, అబ్రవీత్ =పలికెను.

కుంతీపుత్రుడైన అర్జునుడు యుద్ధసన్నద్ధులై వచ్చియున్న బంధు వులను అందరిని చూచి, అత్యంత కరుణా సముచితుడై దుఃఖించుచు ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ

28 దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్

29 సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే।

దృష్ట్వా - ఇమం - స్వజనం - కృష్ణ- యుయుత్సుం - సముపస్థితం

సీదంతి-మమ-గాత్రాణి -ముఖం-చ-పరిశుష్యతి

వేపథుః-చ-శరీరే - మే - రోమహర్షః - చ - జాయతే

కృష్ణ= ఓ కృష్ణా, యుయుత్సుం = యుద్ధము చేయగోరి, సముపస్థితం = కూడియున్న, ఇమం = ఈ , స్వజనం = బంధుజనములను, దృష్ట్వా=గాంచి, మమ=నాయొక్క, గాత్రాణి=అంగములు, సీదంతి = శిథిలములై పోవుచున్నవి, చ=మరియు, ముఖం = నోరు, పరిశుష్యతి= ఎండి పోవుచున్నది, చ = మరియు, మే =నాయొక్క, శరీరే= దేహమునందు, వేపథుః = కంపనము, చ = మరియు, రోమహర్షః = గగుర్పాటు, జాయతే = కలుగుచున్నది.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా ! సమరోత్సాహముతో రణరంగమున నిలిచియున్న ఈ స్వజనసమూహమును జూచి, నా అవయవములు పట్టుతప్పుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. శరీరమునందు వణు కు, గగుర్పాటు కలుగుచున్నవి. ఒడలుపులకరించుచున్నది.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

అర్జున ఉవాచ

28 దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్

29 సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే।

దృష్ట్వ - ఇమం - స్వజనం - కృష్ణ- యుయుత్సుం - సముపస్థితం

సీదంతి-మమ-గాత్రాణి -ముఖం-చ-పరిశుష్యతి

వేపథుః-చ-శరీరే - మే - రోమహర్షః - చ - జాయతే

కృష్ణ= ఓ కృష్ణా, యుయుత్సుం = యుద్ధము చేయగోరి, సముపస్థితం = కూడియున్న, ఇమం = ఈ , స్వజనం = బంధుజనములను, దృష్ట్వ=గాంచి, మమ=నాయొక్క, గాత్రాణి=అంగములు, సీదంతి = శిథిలములై పోవుచున్నవి, చ=మరియు, ముఖం = నోరు, పరిశుష్యతి= ఎండి పోవుచున్నది, చ = మరియు, మే =నాయొక్క, శరీరే= దేహమునందు, వేపథుః = కంపనము, చ = మరియు, రోమహర్షః = గగుర్పాటు, జాయతే = కలుగుచున్నది.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా ! సమరోత్సాహముతో రణరంగమున నిలిచియున్న ఈ స్వజనసమూహమును జూచి, నా అవయవములు పట్టుతప్పుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. శరీరమునందు వణుకు, గగుర్పాటు కలుగుచున్నవి.

30 గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।

న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥

గాండీవం - స్రసంతే - హస్తాత్ - త్వక్ -చ - ఏవ - పరిదహ్యతే

న - చ - శక్నోమి-అవస్థాతుం - భ్రమతి- ఇవ - చ-మే-మనః

హస్తాత్= చేతినుండి, గాండీవం = గాండీవము, స్రంసతే = జారిపోవుచున్నది, చ = మరియు, త్వక్ = చర్మము, ఏవ = కూడా, పరిదహ్యతే = మండిపోవుచున్నది, చ = మరియు, అవస్థాతుం = నిలుచుటకు, న శక్నోమి = శక్తి లేక యున్నాను, చ = మరియు, మే = నా యొక్క, మనః = మనస్సు, భ్రమతీవ = భ్రమించుచున్నట్లున్నది.

గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. చర్మము తపించిపోవుచున్నది. ఇక్కడ నిలబడుటకైనను శక్తిలేకున్నది. మనస్సు భ్రమించుచున్నట్లున్నది

31 నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।

న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ।

నిమిత్తాని - చ - పశ్యామి - విపరీతాని - కేశవ

న -చ - శ్రేయః - అనుపశ్యామి - హత్వా - స్వజనం - ఆహవే

కేశవ=కృష్ణా, చ = ఇంకను, విపరీతాని = విపరీతములైన, నిమిత్తాని = శకునములను, పశ్యామి = చూచుచున్నాను, ఆహవే = యుద్ధమునందు, స్వజనం = బంధువులను, హత్వా = వధించి, అను = అటుతర్వాత, శ్రేయః = శ్రేయమును, న చ పశ్యామి = చూడలేకపోతున్నాను.

ఓ కేశవా ! పెక్కు అపశకునములు కనబడుచున్నవి. యుద్ధమున స్వజనసమూహమును చంపుటచే , నేను పొందు శుభమేమిటో తెలియలేకున్నాను.

32 న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ।

కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా।

న-కాంక్షే-విజయం-కృష్ణ-న-చ-రాజ్యం-సుఖాని-చ

కిం-నః-రాజ్యేన-గోవింద-కిం-భోగైః-జీవితేన-వా

కృష్ణ=హే కృష్ణా, విజయం = విజయమును, కాంక్షే = కోరుట, న = లేదు, చ = మరియు, రాజ్యం = రాజ్యమును, చ = మరియు, సుఖాని=సుఖములను, న = లేదు, గోవింద = హే గోవిందా, నః = మాకు, రాజ్యేన = రాజ్యముతో, కిం = ఏమి లాభము, భోగైః = భోగములచేత గాని, జీవితేన వా = బ్రతుకుటచేత గాని, కిం = ఏమి లాభము ?

ఓ కృష్ణా ! నేను విజయము గాని, రాజ్యము గాని, సుఖములు గాని కోరుకోవటంలేదు. గోవిందా ! ఈ రాజ్యమువలనగాని, ఈ భోగములవలన గాని, ఈ జీవితమువలన గాని ఏమి ప్రయోజనము ?

33 యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ।

త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ

యేషాం-అర్థే - కాంక్షితం - నః - రాజ్యం-భోగాః - సుఖాని-చ

తే- ఇమే-అవస్థితాః-యుద్ధే - ప్రాణాన్-త్యక్త్వా-ధనాని-చ

యేషాం అర్థే = ఎవరికొరకు, నః =మావలన, రాజ్యం = రాజ్యము, భోగాః = భోగములు, చ=మరియు, సుఖాని=సౌఖ్యములు, కాంక్షితం = కోరబడినవో, తే=అట్టి, ఇమే=వీరు, యుద్ధే = యుద్ధమునందు, ప్రాణాన్ = ప్రాణములను, చ = ఇంకను, ధనాని = ధనములను, త్యక్త్వా=విడిచి, అవస్థితాః=నిలిచియున్నారు.

మనము ఎవరికై ఈ రాజ్యమును, భోగములను, సుఖములను కోరుకొనుచున్నామో, వారే ధనప్రాణముల యెడ ఆశలు వదులుకొని యుద్ధమునకు వచ్చినిలిచియున్నారు.

34 ఆచార్యాః పితరః పుత్రాః తథైవ చ పితామహాః।

మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా।

ఆచార్యాః-పితరః - పుత్రాః-తథా- ఏవ-చ-పితామహాః

మాతులాః-శ్వశురాః -పౌత్రాః - శ్యాలాః-సంబంధినః - తథా

ఆచార్యాః = గురువులు, పితరః = తండ్రులు, పుత్రాః=కుమారులు, తథా ఏవ చ =అలాగు ననే, పితామహాః = తాతలు, మాతులాః = మేనమామలు, శ్వశురాః=మామలు, పౌత్రాః = మనుమలు, శ్యాలాః=బావలు, తథా=అలాగుననే, సంబంధినః = చుట్టములు.

గురువులు, తండ్రులు, తాతలు, కొడుకులు, మనుమలు, మేనమామలు, మామలు, బావమఱదులు, ఇతర బంధువులు మొదలగువారు అందరును ఇచ్చటికి వచ్చియున్నారు. (34)

35 ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।

అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే।

ఏతాన్-హన్తుం - ఇచ్ఛామి - ఘ్నతః - అపి -మధుసూదన

అపి - త్రైలోక్యరాజ్యస్య-హేతోః-కిం-ను-మహీకృతే

ఏతాన్ = వీరిని, ఘ్నతః అపి = చంపుచున్నవారైనను, హంతుం = వధించుటకు, త్రైలోక్య రాజ్యస్య = త్రిలోకాధిపత్యము, హేతోః అపి = కొరకుగాని, ఇచ్ఛామి = కోరుట, న = లేదు, మధుసూదనః= హే మధుసూదనా, మహీకృతే = భూమి కొరకు, ను కిమ్ = ఎలా కోరను ?

ఓ మధుసూదనా ! ముల్లోకాధిపత్యముకొరకైనను నేను ఎవ్వరినీ చంప ఇచ్ఛగింపను. ఇక ఈ భూమండలవిషయమై చెప్పనేల ? అట్లే వీరిలో ఎవ్వరైనను నన్ను చంపబూనిననూ నేను మాత్రము వీరిని చంపలేను.

36 నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన।

పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః।

నిహత్య-ధార్తరాష్ట్రాన్-నః -కా-ప్రీతిః-స్యాత్-జనార్దన

పాపం - ఏవ - ఆశ్రయేత్-అస్మాన్ - హత్వా - ఏతాన్- ఆతతాయినః

జనార్దనః=హే జనార్థనా!, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, నిహత్య=చంపి, నః = మాకు, కా = ఏమి, ప్రీతిః = సంతోషము, స్యాత్ = కలుగును, ఆతతాయినః = దురాత్ములైన, ఏతాన్ = వీరిని, హత్వా = చంపి, అస్మాన్ = మమ్ములను, పాపమేవ = పాపమే, ఆశ్రయేత్ = కలుగును.

ఓ జనార్దనా ! ఈ దుర్యోధనాదులను చంపి, మనము బావుకొనునది ఏమి? (మనము మూట కట్టుకొనునది యేమి ?) దుర్మార్గులైన వీరిని చంపుటవలన మనకు పాపమే కలుగును.

37 తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।

స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ।

తస్మాత్ -న-అర్హాః-వయం-హంతుం-ధార్తరాష్ట్రాన్-స్వబాంధవాన్

స్వజనం - హి-కథం-హత్వా-సుఖినః స్యామ - మాధవ

మాధవః=కృష్ణ, తస్మాత్=అందువలన, వయం = మేము, స్వబాంధవాన్= బంధువులతో గూడిన, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, హంతుం=చంపుటకు, అర్హాః=అర్హులము, న = కాము, స్వజనం = స్వజనులను, హత్వా = చంపి, కథం = ఏవిధముగా, సుఖినః = సుఖ వంతులము, స్యామ హి = కాగలము

కనుక ఓ మాధవా ! మనబంధువులైన ఈ ధార్తరాష్ట్రులను చంపుటకు మేము అర్హులముకాము. స్వజనులను చంపి మేము ఎలా సుఖపడగలము?

38 యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః ।

కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ।

యద్యపి - ఏతే-న-పశ్యంతి-లోభోపహత చేతసః

కులక్షయకృతం - దోషం - మిత్రద్రోహే - చ-పాతకం

లోభోపహత చేతసః = లోభముచేత చెదరగొట్టబడిన మనస్సుగల, ఏతే = వీరు, కులక్షయ కృతం = కులనాశము వలన కలుగు, దోషం = చెడును, చ=మరియు, మిత్రద్రోహే = మిత్రద్రోహము వలన కలుగు, పాతకం = పాపమును, పశ్యంతి =చూచుట, యద్యపిన = లేకపోయినను.

లోభకారణముగ భ్రష్టచిత్తులైన వీరు కులక్షయము వలన కలుగు దోషములను, మిత్రద్రోహమువలన సంభవించు పాపములను చూడకున్నచో,

39 కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్ ।

కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ।

కథం-న-జ్ఞేయం-అస్మాభిః - పాపాత్-అస్మాత్-నివర్తితుం

కులక్షయకృతం - దోషం-ప్రపశ్యద్భిః-జనార్దన

జనార్దన=హే జనార్దనా, కులక్షయకృతం = కులనాశము వలన కలుగు, దోషం = దోషమును, ప్రపశ్యద్భిః = చక్కగా గ్రహించిన, అస్మాభిః = మాచేత, అస్మాత్ = ఈ పాపాత్ = పాపము నుండి, నివర్తితుం = తొలగుటకు, కథం = ఎటుల, జ్ఞేయం = తెలియదగినది, న = కాదు.

జనార్దనా! కులనాశనమువలన కలుగు నష్టములను ఎరింగిన మనము ఈ పాపములకు దూరముగా ఉండుటకు ఏల ప్రయత్నించకూడదు ?

40 కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః।

ధర్మే నష్టేకులం కృత్స్నమ్ అధర్మోఽభిభవత్యుత।

కులక్షయే - ప్రణశ్యంతి - కులధర్మాః - సనాతనాః

ధర్మే - నష్టే- కులం - కృత్స్నం - అధర్మః - అభిభవతి- ఉత

కులక్షయే = కులనాశము జరుగునపుడు, సనాతనాః = అనాదిగాయున్న, కులధర్మాః = కులధర్మములు, ప్రణశ్యంతి = సంపూర్ణముగా నశించునున, ధర్మే = ధర్మము, నష్టే= నశింపగా, కృత్స్నం = సకలమైన, కులం = కులమును, అధర్మః = అనాచారము, అభిభవేతి ఉత = వ్యాపించునుకదా.

కులక్షయమువలన సనాతనములైన కులధర్మములన్నియును నశించును. ధర్మము అంతరించి పోయినప్పుడు కులము నందు అంతటను పాపమే వ్యాపించును.

41 అధర్మాభిభవాత్ కృష్ణప్రదుష్యంతి కులస్త్రియ ః।

స్త్రీషు దుష్టాసు వార్ష్ణే య జాయతే వర్ణసంకరః।

అధర్మాభిభవాత్-కృష్ణ-ప్రదుష్యంతి - కులస్త్రియః

స్త్రీషు - దుష్టాసు వార్ష్ణే య -జాయతే - వర్ణసంకరః

కృష్ణ= ఓ కృష్ణా, అధర్మాభిభవాత్ = అధర్మము వృద్ధినొందుట వలన, కులస్త్రియః = కులాంగనలు, ప్రదుష్యంతి = చెడిపోవుదురు, వార్ష్ణే య=కృష్ణా, స్త్రీషు దుష్టాసు =స్త్రీలు చెడిపోవుటవలన, వర్ణసంకరః = వర్ణసంకరము, జాయతే = కలుగుచున్నది.

ఓ కృష్ణా ! అధర్మము పెచ్చుపెరిగి పోయినప్పుడు కులస్త్రీలు మిక్కిలి చెడిపోవుదురు. స్త్రీలు చెడినచో వర్ణసాంకర్యము కలుగును.

42 సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।

పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః।

సంకరః - నరకాయ - ఏవ -కులఘ్నానాం - కులస్య - చ

పతంతి - పితరః - హి - ఏషాం - లుప్త పిండోదకక్రియాః

సంకరః=వర్ణసంకరము, కులఘ్నానాం = కులమును చెడిపిన వారలకును, చ = మరియు, కులస్య = కులమునకు, నరకాయ ఏవ = నరకము కొరకే, ఏషాం = వీరియొక్క, పితరః = పితరులు, లుప్తపిండోదక క్రియాః = శ్రాద్ధతర్పణ క్రియలులేనివారై, పతంతిహి = పతనముగు చున్నారు.

వర్ణసాంకర్యము కులఘాతకులను, నరకము నందు పడవేయును. పిండోదకములు (శ్రాద్ధతర్పణములు) లోపించినందువలన వారిపితరులును పతనముగుదురు.

43 దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।

ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః।

దోషైః - ఏతైః - కులఘ్నానాం - వర్ణసంకర కారకైః

ఉత్సాద్యంతే - జాతి ధర్మాః - కులధర్మాః చ - శాశ్వతాః

ఏతైః = ఈ , వర్ణసంకర కారకైః = వర్ణ సంకరమునకు కారణమైన, దోషైః= దోషములచేత, కులఘ్నానాం = వర్ణసంకరమొనర్చిన వారి యొక్క, శాశ్వతాః = శాశ్వతములైన, జాతిధర్మాః = జాతి ధర్మములు, చ = మరియు, కులధర్మాః = కులధర్మములు, ఉత్సాద్యంతే=నశించు చున్నవి.

వర్ణసాంకర్యమునకు మూలములైన ఈ దోషమువలన కులఘాతకులయొక్క సనాతన కులధర్మములు, జాతిధర్మములు నశించుచున్నవి.

44 ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।

నరకేఽనియతం వాసో భవతీత్యనుశుశ్రుమ।

ఉత్పన్న కులధర్మాణాం - మనుష్యాణాం - జనార్దన

నరకే - అనియతం-వాసః-భవతి- ఇతి-అనుశుశ్రుమ

జనార్దన = జనార్దనా, ఉత్పన్నకులధర్మాణాం = చెడిన కులాచారములుగల, మనుష్యాణాం = మనుజులకు, నరకే = నరకమునందు, అనియతం = అనంతకాలము, వాసః = నివాసము, భవతి = కలుగుచున్నది, ఇతి = అని, అనుశుశ్రుమః= ఆలకించుచున్నాము.

ఓ జనార్దనా ! కులధర్మములు నశించినవారికి శాశ్వతముగా నరకప్రాప్తి తప్పదని వినుచున్నాము.

45 అహో బత మహత్ పాపం కర్తుం వ్యవసితా వయమ్।

యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః।

అహో-బత-మహత్పాపం - కర్తుం - వ్యవసితాః - వయం

యత్-రాజ్యసుఖలోభేన-హంతుం స్వజనం - ఉద్యతాః

యత్ = ఏ కారణమువలన, రాజ్యసుఖలోభేన = రాజ్యసుఖమునందలి లోభముచేత, స్వజనం = బంధువులను, హంతుం = చంపుటకు, ఉద్యతాః = ఉద్యమించితిమో, మహత్ = గొప్పదైన, పాపం = పాపమును, కర్తుం = చేయుటకు, వయం = మేము, వ్యవసితాః = సమకట్టితిమి, అహోబత = అయ్యో! ఎంతశోకము ?

రాజ్యసుఖ లోభముచేమనము బుద్ధిమంతులమైయుండియు స్వజనులను చంపుటకు ఉద్యుక్తులమై, ఈ ఘోరపాపకృత్యములను చేయుటకు సమకట్టితిమి గదా! అక్కటా!

46 యది మామప్రతీకారమ్ అశస్త్రం శస్త్రపాణయః।

ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్।

యది-మాం-అప్రతీకారం -అశస్త్రం-శస్త్రపాణయః

ధార్తరాష్ట్రా - రణే-హన్యుః-తత్-మే-క్షేమతరం-భవేత్

అప్రతీకారం = ప్రతీకారముచేయని, అశస్త్రం = శస్త్రరహితమ్మైన, మాం = నన్ను, శస్త్ర పాణయః = శస్త్రధారులైన, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, రణస్త =యుద్ధమునందు, హన్యుః యది = చంపుదురేని, తత్ = అది, మే=నాకు, క్షేమతరం = శ్రేయస్కరము , భవేత్ = అగును.

ఆయుధములు పట్టక ఎదిరింపని నన్ను శస్త్రములను చేబూని దుర్యోధనాదులు యుద్ధమున వధించినను, అది నాకు క్షేమకరమే యగును.

సంజయ ఉవాచ

47 ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।

విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః।

ఏవం - ఉక్త్వా-అర్జునః-సంఖ్యే-రథోపస్థే - ఉపావిశత్

విసృజ్య-సశరం-చాపం-శోకసంవిగ్నమానసః

అర్జునః=అర్జునుడు, ఏవం= ఈ విధముగ, ఉక్త్వా=పలికి, శోకసంవిగ్న మానసః = దుఃఖము చేత చలించిన మనస్సు కలవాడై, సశరం = శరయుక్తమ్మైన, చాపం = ధనుస్సును, విసృజ్య= విడిచి, సంఖ్యే = రణరంగమునందు, రథోపస్థే=రథముమీద, ఉపావిశత్ = కూర్చొనెను.

సంజయుడు పలికెను - అర్జునుడు ఈ విధముగా పలికి శోకముచే కలతచెందిన మనస్సుకలవాడై, యుద్ధభూమియందు ధనుర్బాణములను విడిచి, రథము వెనుకభాగమున చతికిలబడెను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే

అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ ద్వితీయోఽధ్యాయః - సాంఖ్యయోగః

సంజయ ఉవాచ

1 తం తథా కృపయావిష్టమ్ అశ్రుపూర్ణాకులేక్షణమ్ ।

విషీదంతమిదం వాక్యమ్ ఉవాచ మధుసూదనః ।

తం-తథా-కృపయా- ఆ విష్టం - అశ్రుపూర్ణాకులేక్షణం

విషీదంతం - ఇదం-వాక్యం - ఉవాచ-మధుసూదనః

తథా = ఆ విధముగా, కృపయా = కరుణచే, ఆ విష్టం = నిండియున్న వాడును, అశ్రు పూర్ణాకు లేక్షణం = కన్నీరు నిండిన వ్యాకులమైన నేత్రములు గలవాడును, విషీదంతం = శోకించు చున్నవాడును అగు, తం = అట్టి అర్జునుని, మధుసూదనః = శ్రీకృష్ణుడు, ఇదం = ఈ, వాక్యం = వచనమును, ఉవాచ = అనెను.

సంజయుడు పలికెను - ఈ విధముగా కరుణాపూరిత హృదయుడైన కనులలో అశ్రువులు నిండియున్న అర్జునునితో శ్రీకృష్ణభగవానుడు ఇట్లనెను.

శ్రీ భగవాన్ ఉవాచ

2 కుతస్త్వాకశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।

అనార్యజుష్టమస్వర్గ్యమ్ అకీర్తికర మర్జున ।

కుతః-త్వా -కశ్మలం- ఇదం-విషమే -సముపస్థితం

అనార్యజుష్టం - అస్వర్గ్యం - అకీర్తికరం - అర్జున

అర్జున = హే అర్జునా, అనార్యజుష్టం = శ్రేష్ఠులగువారికి తగనిదియు, అస్వర్గ్యం = స్వర్గము నకు అనర్హమైనదియు, అకీర్తికరం = అపకీర్తి నొసగూర్చునదియు, ఇదం = ఈ, కశ్మలం = అజ్ఞానము, విషమే = విషమ సమయమునందు, త్వా = నిన్ను, కుతః = ఎచ్చటనుండి, సముపస్థితం=దాపురించినది.

శ్రీభగవానుడు చెప్పెను - ఓ అర్జునా ! పామరులకు కలిగే, స్వర్గ ప్రాప్తి ఇవ్వనిది,అపకీర్తి కలుగచేసే ఈ మోహము నీకు ఎట్లు దాపురించినది ?



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।

క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ।

క్లైబ్యం - మా స్మ గమః-పార్థ-న-ఏతత్-త్వయి- ఉపపద్యతే

క్షుద్రం-హృదయదౌర్బల్యం - త్యక్త్వా- ఉత్తిష్ఠ-పరంతప

పార్థ=హే అర్జునా, క్లైబ్యం = నపుంసకత్వమును, మా స్మ గమః = పొందకుము, ఏతత్ = ఇది, త్వయి = నీ విషయమున, న ఉపపద్యతే = తగదు, పరంతప = హే పరంతపా, క్షుద్రం=తుచ్ఛమైన, హృదయదౌర్బల్యం = హృదయ దుర్బలత్వమును, త్యక్త్వా=విడిచి పెట్టి, ఉత్తిష్ఠ=లెమ్ము

కావున ఓ అర్జునా ! పిరికితనమునకు లోనుకావద్దు. నీకిది ఉచితము కాదు. ఓ పరంతపా ! తుచ్ఛమైన ఈ హృదయ దౌర్బల్యమును వీడి, యుద్ధముచేయుము.

అర్జున ఉవాచ

4 కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।

ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన

కథం-భీష్మం-అహం-సంఖ్యే-ద్రోణం-చ-మధుసూదన

ఇషుభిః-ప్రతి-యోత్స్యామి-పూజార్హౌ-అరిసూదన

మధుసూదన=హే కృష్ణా, అహం=నేను, పూజార్హౌ=పూజింపదగిన, భీష్మం=భీష్మపితా మహుని, చ=మరియు, ద్రోణం=ద్రోణాచార్యుని, సంఖ్యే=యుద్ధమునందు, అరిసూదన=శ్రీకృష్ణా, ఇషుభిః=శరీరములతో, కథం= ఏ విధముగ, ప్రతియోత్స్యామి = ఎదిరించి పోరాడగలను.

అర్జునుడు పలికెను - ఓ మధుసూదనా! పూజ్యులైన భీష్మపితామహుని, ద్రోణాచార్యులను యుద్ధమున ఎదిరించి బాణములతో ఎట్లు ఎదిరించి పోరాడగలను.

5 గురూనహత్వా హి మహానుభావాన్

శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే।

హత్వార్థకామాంస్తు గురూనిహైవ

భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్

గురూన్-అహత్వా-హి-మహానుభావాన్-శ్రేయః-భోక్తుం-భైక్ష్యం-అపి- ఇహ-లోకే

హత్వా-అర్థకామాన్-తు-గురూన్- ఇహ- ఏవ-భుంజీయ-భోగాన్-రుధిరప్రదిగ్ధాన్

మహానుభావాన్=మహానుభావులైన, గురూన్= గురువులను, అహత్వా= చంపక, ఇహలోకే = ఈ లోకమునందు భైక్ష్యమపి=భిక్షాన్నమైనను, భోక్తుం=భుజించుట, శ్రేయః హి = శ్రేయస్కరము గదా, గురూన్= గురువులను, హత్వా తు = చంపి, ఇహ ఏవ = ఈ లోకమునందే, రుధిర ప్రదిగ్ధాన్ = రక్తసిక్తమైన, అర్థకామాన్= అర్థకామములనే, భోగాన్= భోగములను, భుంజీయ = అనుభవింతును.

మహానుభావులైన ఈ గురుజనులను చంపకుండా బిచ్చమెత్తుకొని యైనను ఈ లోకమున జీవించుట శుభదాయకము. ఏలనన ఈ గురుజనులను చంపినను, రక్తసిక్తములైన రాజ్యసంపదలను, భోగములను మాత్రమే నేను అనుభవింతునుగదా !

6 న చైతద్విద్మః కతరన్నో గరీయో

యద్వా జయేమ యది వా నో జయేయుః।

యానేవ హత్వా న జిజీవిషామః

తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ।

న-చ- ఏతత్-విద్మః-కతరత్-నః-గరీయః- యత్-వా-జయేమ- యది-వా-నః -జయేయుః

యాన్- ఏవ-హత్వా-న-జిజీవిషామః-తే-అవస్థితాః-ప్రముఖే-ధార్తరాష్ట్రాః

యాన్= ఎవరిని, హత్వా=చంపి, న జిజీవిషామః = జీవింపగోరమో, తే = అట్టి, ధార్త రాష్ట్రాః = ధృతరాష్ట్ర సంబంధులు, ప్రముఖే= ఎదుట, అవస్థితాః ఏవ = ఉన్నారుగదా, జయేమ యద్వా= మనము జయించినను, నః = మమ్ములను, జయేయుఃయది వా= వారే గెలిచినను, ఏతత్=చ = ఈ విషయమును కూడా, నః = మాకు, కతరత్ = ఏది, గరీయః = శ్రేష్ఠమో, న విద్మః = మేమెరుగము.

ఈ యుద్ధముచేయుట శ్రేష్ఠమా ? లేక చేయకుండుట శ్రేష్ఠమా ? అనునది ఎఱుగము. యుద్ధమున వారిని మనము జయింతుమా ? లేక మనలను వారు జయింతురా ? అను విషయమునుగూడ ఎఱుగము. మనకు ఆత్మీయులైన ధార్తరాష్ట్రులే ఇచట మనలను ఎదిరించి యుద్ధముచేయ నిలిచి యున్నారు.

7 కార్పణ్య దోషోపహతస్వభావః

అపృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః

యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే

శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్

కార్పణ్య దోషాపహత స్వభావః - పృచ్ఛామి-త్వాం-ధర్మసమ్మూఢ చేతాః

యత్-శ్రేయః- స్యాత్-నిశ్చితం-బ్రూహి-తత్-మే-శిష్యః-తే-అహం -శాధి-మాం-త్వాం-ప్రపన్నం

కార్పణ్యా=కృపణత్వమనెడి, దోషః=దోషముచేత, ఉపహత=కొట్టబడిన, స్వభావః=ప్రకృతి గలవాడనై, ధర్మ సమ్మూఢచేతాః = ధర్మవిచక్షణ చేయలేని చిత్తముగలవాడనై, త్వాం = నిన్ను, పృచ్ఛామి = అడుగుచున్నాను, యత్= ఏది, నిశ్చితం=నిర్ణయింపబడి, మే=నాకు, శ్రేయః=శ్రేయము, స్యాత్=అగునో, తత్=అద్దానిని, బ్రూహి=చెప్పుము, అహం=నేను, తే=నీకు, శిష్యః=శిష్యుడను, త్వాం = నిన్ను, ప్రపన్నం = శరణుపొందిన, మాం = నన్ను, శాధి=శాసింపుము.

కార్పణ్యదోషము పిరికితనమునకు నా స్వభావమును కోల్పోయి గిలగిలలాడుచున్నాను. ధర్మాధర్మములవిచక్షణకు దూరమై నా కర్తవ్యమును నిర్ణయించు కొనలేకున్నాను. నాకు నిజముగా శ్రేయస్కరమైన దానిని తెలుపుము. నేను నీకు శిష్యుడను. శరణాగతుడను, శాసింపుము.

8 న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్

యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్ ।

అవాప్య భూమావసపత్నమృద్ధం

రాజ్యం సురాణామపి చాధిపత్యమ్

న-హి-ప్రపశ్యామి-మమ-అపనుద్యాత్-యత్-శోకం- ఉచ్ఛోషణం- ఇన్ద్రియాణాం

అవాప్య-భూమౌ-అసపత్నం-ఋద్ధం-రాజ్యం-సురాణాం-అపి-చ- ఆధిపత్యం

భూమౌ-భూమియందు, అసపత్నం=తిరుగులేని, ఋద్ధం=సమృద్ధమైన, రాజ్యం=రాజ్యమును, సురాణాం=దేవతలయొక్క, ఆధిపత్యం=తిరుగులేని, ఋద్ధం=సమృద్ధమైన, రాజ్యం=రాజ్యమును, సురాణాం=దేవతలయొక్క, ఆధిపత్యం చ అపి = ఆధిపత్యమునూ, అవాప్య = పొందియును, ఇంద్రియాణాం= ఇంద్రియములను, ఉచ్ఛోషణం = శోషింప జేయు, మమ = నాయొక్క, శోకం = దుఃఖమును, యత్ = ఏది, అపనుద్యాత్ = పోగొట్టునో, న ప్రపశ్యామి హి = తెల్పుకోలేకున్నాను.

ఈ శోకము నా ఇంద్రియములను దహించివేయు చున్నది. సిరిసంపదలతో గూడిన శత్రువులులేని రాజ్యము లభించినను, కడకు సురాధిపత్యము ప్రాప్తించినను ఈ శోకదాహము చల్లారునుపాయమును తెలిసికోలేకున్నాను.

సంజయ ఉవాచ

9 ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప ।

న యోత్స్య ఇతి గోవిందమ్ ఉక్త్వా తూష్ణీం బభూవ హ

ఏవం - ఉక్త్వా - హృషీకేశం - గుడాకేశః - పరంతపః

న-యోత్స్యే- ఇతి-గోవిందం - ఉక్త్వా-తూష్ణీం-బభూవ-హ

పరంతపః = శత్రువులను తపింపజేసెడి, గుడాకేశః = అర్జునుడు, హృషీకేశం = హృషీకేశుని, గోవిందం = గోవిందునితో, ఏవం = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, న యోత్స్యే = యుద్ధము చేయను, ఇతి =అని, ఉక్త్వా = పలికి, తూష్ణీం బభూవ హ= మౌనముగా వుండెను.

సంజయుడు పలికెను - ఓ రాజా! ఈ విధముగా పలికిన పిమ్మట అంతర్యామియైన శ్రీకృష్ణునితో అర్జునుడు, నేనుయుద్ధము చేయనే చేయను అని స్పష్టముగా చెప్పి, మౌనము వహించెను.

10 తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత ।

సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదం వచః ।

తం- ఉవాచ - హృషీకేశః - ప్రహసన్ - ఇవ - భారత

సేనయోః - ఉభయోః - మధ్యే - విషీదంతం - ఇదం - వచః

భారత = భరతవంశజుడవైన ధృతరాష్ట్రా, ఉభయోః = రెండైన, సేనయోః = సేనలయొక్క, మధ్యే = నడుమ, విషీదంతం = శోకించుచున్న, తం = ఆ అర్జునుని గూర్చి, హృషీకేశః = శ్రీకృష్ణుడు, ప్రహసన్ ఇవ = నవ్వుచున్నవానివలె , ఇదం = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

ఓ ధృతరాష్ట్రా ! ఇరుసేనల మధ్య శోకితుడైన అర్జునుని జూచి, శ్రీకృష్ణుడు చిరునవ్వుతో ఇట్లు పలికెను.

శ్రీభగవాన్ ఉవాచ

11 అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।

గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ।

అశోచ్యాన్ - అన్వశోచః - త్వం - ప్రజ్ఞావాదాన్ - చ - భాషసే

గతాసూన్ - అగతాసూన్ - చ - న - అనుశోచంతి - పండితాః

త్వం = నీవు, అశోచ్యాన్ = శోకింపదగనివారిని గూర్చి, అన్వశోచః = శోకించుచున్నావు, ప్రజ్ఞావాదాన్చ = పండిత వచనములను, భాషసే = భాషించుచున్నావు, గతాసూన్ = ప్రాణము పోయినవారిని గూర్చిగాని, అగతాసూన్ = ప్రాణము పోనివారిని గూర్చిగాని, పండితాః = పండితజనులు, న అనుశోచంతి = శోకింపరు.

శ్రీభగవానుడు పలికెను - ఓ అర్జునా! శోకింపదగని వారికొఱకై నీవు శోకించుచున్నావు. పైగా జ్ఞాని వలె మాట్లాడుచున్నావు. జ్ఞానులైనవారు ప్రాణములు పోయిన వారిని గూర్చిగాని, ప్రాణములుపోని వారిని గుఱించిగాని శోకింపరు.

12 న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।

న చైవ న భవిష్యామః సర్వే వయమతః పరమ్ ।

న-తు- ఏవ-అహం-జాతు-న- ఆసం-న - త్వం - న - ఇమే- జనాధిపాః

న-చ- ఏవ-న-భవిష్యామః - సర్వే - వయం-అతః-పరం

అహం=నేను, జాతు = ఒకప్పుడు, న ఆసం = లేను, త్వం = నీవు, న = లే వు, ఇమే = ఈ, జనాధిపాః = రాజులును, న = లేరు అనునది, న తు ఏవ = లేనేలేదు, అతఃపరం = ఇకపిమ్మట, వయం సర్వే = మనమంతా, న భవిష్యామః= లేకపోవుటఅనునది యును, న చ ఏవ= లేనేలేదు.

నీవుగాని, నేనుగాని, ఈ రాజులుగాని ఉండని కాలమే లేదు. ఇక ముందు కూడ మనము ఉండము అనుమాటయే లేదు. (అన్ని కాలములలోను మనము ఉన్నాము. ఆత్మ శాశ్వతము. అది అన్ని కాలములయందును ఉండును. శరీరపతనముతో అది నశించునది కాదు).

13 దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।

తథా దేహాంతరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి

దేహినః-అస్మిన్-యథా-దేహే-కౌమారం-యౌవనం - జరా

తథా - దేహాంతరప్రాప్తిః - ధీరః - తత్ర-న-ముహ్యతి

దేహినః=జీవునకు, అస్మిన్ = ఈ, దేహే - దేహమునందు, కౌమారం = బాల్యమును, యౌవనం =యౌవనమును, జరా=ముసలితనమును, యథా = ఏవిధముగా కలుగునో, తథా = అలాగుననే, దేహాంతరప్రాప్తిః = మరణము మరొక శరీరమును పొందుట, తత్ర = ఆ విషయమున, ధీరః = ధీరపురుషుడు, న ముహ్యతి = మోహము నొందడు.

జీవునకు ఈ దేహమునందు కౌమారము, యౌవనము, వార్ధక్యము ఉన్నట్లే మరణానంతరమున మఱియొక దేహప్రాప్తియు కలుగును. ధీరుడైనవాడు ఈ విషయమున మోహమునొందడు.

14 మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః।

ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత।

మాత్రాస్పర్శాః - తు-కౌంతేయ - శీతోష్ణసుఖదుఃఖదాః

ఆగమాపాయినః = అనిత్యాః - తాన్ -తితిక్షస్వ - భారత

కౌంతేయ = కుంతీకుమారా, మాత్రా స్పర్శాః = శ్రోత్రాదీంద్రియములు, శబ్దాది విషయముల సంయోగము, తు = అయితే, శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణ సుఖదుఃఖములనన కల్గించు నవియును, ఆగమాపాయినః = క్షణభంగురము లైనవియును, అనిత్యాః = అనిత్యమైనవి, భారత = హే అర్జునా, తాన్ = వీనిని, తితిక్షస్వ = సహించుము.

ఓ కౌంతేయా! విషయేంద్రియసంయోగమువలన శీతోష్ణములు సుఖదుఃఖములు కలుగుచున్నవి. అవి ఉత్పత్తి వినాశశీలములు. అనిత్యములు. కనుక భారతా ! వాటిని సహింపుము. (పట్టించుకొనకుము)

15 యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।

సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే

యం-హి-న-వ్యథయంతి- ఏతే-పురుషం-పురుషర్షభ

సమదుఃఖసుఖం-ధీరం-సః-అమృతత్వాయ-కల్పతే

పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠా, ఏతే = ఈ మాత్రాస్పర్శములు, సమదుఃఖసుఖం=సుఖ దుఃఖముల యందు సమానబుద్ధి కలిగిన, ధీరః = ధీరుడైన, యం పురుషం = ఏ పురుషుని, న వ్యథయంతి = చలింపజేయవు, సః హి = అట్టివాడు కదా, అమృతత్వాయ = అమృతత్వమును పొందుటకు, కల్పతే = అర్హుడు.

అర్జునా! ఓ పురుషశ్రేష్ఠా ! ధీరుడైనవానికి సుఖదుఃఖములు సమానముగా తోచును. అట్టి పురుషుని విషయేంద్రియ సంయోగములు చలింపజేయజాలవు. అతడే మోక్షమును పొందుటకు అర్హుడు.

16 నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।

ఉభయోరపి దృష్టోంతః త్వనయోస్తత్త్వదర్శిభిః ।

న-అసతః-విద్యతే-భావః-న-అభావః-విద్యతే-సతః

ఉభయోః-అపి-దృష్టః-అంతః-తు-అనయోః-తత్త్వదర్శిభిః

అసతః = అనిత్యమైనదానికి, భావః = ఉనికి, న విద్యతే=లేదు, సతః = సత్యమైనదానికి, అభావః = లేకపోవుట, న విద్యతే = లేదు, అనయోః = ఈ , ఉభయోః అపి = రెండిటియొక్క, అంతః తు = నిర్ణయము, తత్త్వదర్శిభిః= తత్త్వజ్ఞులచేత, దృష్టః=దర్శించబడినది

అనిత్యమైనదానికి ఉనికియే లేదు. సత్యమైన ఆత్మకులేమి అనునదిలేదు. ఈ విధముగ ఈ రెండింటియొక్క వాస్తవస్వరూపములను తత్త్వజ్ఞానియైనవాడే దర్శించును.

17 అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।

వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ।

అవినాశి-తు-తత్-విద్ధి-యేన-సర్వం- ఇదం-తతం

వినాశం-అవ్యయస్య-అస్య-న-కశ్చిత్-కర్తుం - అర్హతి

యేన = దేనిచేత, ఇదం = ఈ, సర్వం= సర్వమును, తతం=వ్యాపించి యున్నదో, తత్ తు = అది, అవినాశి= నాశరహితమైనదిగ, విద్ధి=తెలిసికొనుము, కశ్చిత్= ఎవడును, అవ్యయస్య = నశించని, అస్య=దీనికి, వినాశం=నాశనము, కర్తుం=చేయుటకు, న అర్హతి=అర్హుడు కాడు.

నాశరహితమైన పరమాత్మ తత్త్వము జగత్తునందు అంతటను వ్యాపించియున్నదని యెరుంగుము. శాశ్వతమైన దానినెవ్వరును నశింపజేయజాలరు.

18 అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ।

అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ।

అంత వంత- ఇమే-దేహాః-నిత్యస్య- ఉక్తాః-శరీరిణః

అనాశినః - అప్రమేయస్య-తస్మాత్-యుధ్యస్వ-భారత

నిత్యస్య=నిత్యుడును, అనాశినః = అవినాశియు, అప్రమేయస్య= అప్రమేయుడును, శరీరిణః=దేహి యొక్క, ఇమే = ఈ, దేహాః=దేహములు, అంతవంతః = నాశము కలవని, ఉక్తాః=చెప్పబడినవి, తస్మాత్ = అందుచేత, భారత = అర్జునా, యుధ్యస్వ=యుద్ధము చేయుము.

ఓ అర్జునా ! ఈ శరీరములు అన్నియును నశించునవియే. కాని జీవాత్మ నాశరహితము కనుక నీవు యుద్ధము చేయుము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

19 య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్।

ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే।

యః ఏనం - వేత్తి-హంతారం-యః-చ- ఏనం-మన్యతే-హతం

ఉభౌ - తౌ - న - విజానీతః - న - అయం - హంతి - న - హన్యతే

యః = ఎవ్వడు, ఏనం = ఈ ఆత్మను, హంతారం=చంపుదానినిగ, వేత్తి = తెలుసుకొనునో, యః చ = మరియెవ్వడు, ఏనం = ఈ ఆత్మను, హతం = చంపబడుదానినిగ, మన్యతే = భావించునో, తౌ = ఆ, ఉభౌ = ఇరువురును, న విజానీతః = అజ్ఞానులే, అయం = ఈ ఆత్మ, న హంతి = చంపదు, న హన్యతే = చంపబడేదిగాదు.

ఆత్మ ఇతరులను చంపునని భావించువాడును, ఆత్మ ఇతరులచే చంపబడునని భావించువాడును, ఆ ఇద్దఱును అజ్ఞానులే. ఏలనన వాస్తవముగా ఆత్మ ఎవ్వరినీ చంపదు, ఎవ్వరిచేతను చంపబడేది కాదు.

20 న జాయతే మ్రియతే వా కదాచిత్

నాయం భూత్వా భవితా వా న భూయః।

అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో

న హన్యతే హన్యమానే శరీరే।

న-జాయతే-మ్రియతే-వా-కదాచిత్-న-అయం-భూత్వా-భవితా -వా-న-భూయః

అజః-నిత్యః - శాశ్వతః-అయం-పురాణః న -హన్యతే-హన్యమానే-శరీరే

అయం= ఈ ఆత్మ, కదాచిత్ = ఎప్పుడును, న జాయతే=పుట్టదు, న మ్రియతే వా=మృతినొందదు, న భూత్వా = లేకనే, భూయః =మరల, భవితా న = ఉండునదియు కాదు, అయం = ఈ ఆత్మ, అజః = పుట్టుక లేనిది, నిత్యః = స్థిరమైనది, శాశ్వతః=నిత్యమైనది, పురాణః = అనాదియైనది, శరీరే = శరీరము, హన్యమానే = చంపబడుచున్నను, న హన్య తే = చావదు.

ఆత్మకు చావుపుట్టుకలులేవు. ఇది జన్మ లేనిది. నిత్యము, శాశ్వతము, పురాతనము, శరీరము చంపబడినను ఇది చావదు.

21 వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।

కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్ ।

వేద-అవినాశినం-నిత్యం-యః- ఏనం-అజం-అవ్యయం

కథం-సః-పురుషః-పార్థ-కం-ఘాతయతి-హంతి-కం

పార్థ=హే పార్థా, యః = ఎవడు, ఏనం = ఈ ఆత్మను, నిత్యం= ఎల్లప్పుడు ఉండు నదిగను, అవినాశినం = నాశములేని దానినిగను, అజం=పుట్టుకలేని దానినిగను, అవ్యయం= అక్షయమైన దానినిగను, వేద=తెలిసికొనుచున్నాడో, సః=, పురుషః=పురుషుడు, కం= ఎవనిని, కథం= ఎట్లు, ఘాతయతి=చంపించును, కం= ఎవనిని, హంతి=చంపును

ఓ పార్థా! ఈ ఆత్మ నాశరహితము, నిత్యము అనియు, జననమరణములు లేనిదనియు, మార్పులేనిదనియు తెలిసికొనిన పురుషుడు ఎవరిని ఎట్లు చంపించును ? ఎవరిని ఎట్లు చంపును ?

22 వాసాంసి జీర్ణాని యథా విహాయ

నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।

తథా శరీరాణి విహాయ జీర్ణా -

న్యన్యాని సంయాతి నవాని దేహీ।

వాసాంసి - జీర్ణాని- యథా - విహాయ-నవాని-గృహ్ణాతి-నరః-అపరాణి

తథా-శరీరాణి-విహాయ-జీర్ణాని-అన్యాని-సంయాతి-నవాని-దేహీ

యథా= ఏప్రకారము, నరః=మనుష్యుడు, జీర్ణాని=చినిగిన, వాసాంసి= వస్త్రములను, విహాయ=విడిచి, అపరాణి=అన్యమైన, నవాని=నూతనమైన వానిని, గృహ్ణాతి=ధరించినట్లు, తథా=అలాగుననే, దేహీ=జీవుడు, జీర్ణాని = శిథిలములైన, శరీరాణి = శరీరములను, విహాయ = విడిచి, నవాని = నూతనమైన, అన్యాని = అన్యములైన శరీరము లను, సంయాతి=ధరించుచున్నాడు.

మానవుడు చిరిగినపాతబట్టలను వదిలి, కొత్తబట్టలను ధరించినట్లు జీవాత్మపాతశరీరములను వీడి నూతనశరీరములను పొందుతోంది.

23 నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।

న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః।

న- ఏనం-ఛిందంతి-శస్త్రాణి-న- ఏనం-దహతి-పావకః

న-చ- ఏనం-క్లేదయంతి- ఆపః - న-శోషయతి-మారుతః

ఏనం= ఈ ఆత్మను, శస్త్రాణి=శస్త్రములు, న ఛిందంతి=ఛేదింపజాలవు, ఏనం= ఈ ఆత్మను, పావకః = అగ్ని, న దహతి=దహింపజాలదు, చ=మరియు, ఏనం = ఈ ఆత్మను, ఆపః = నీరు, నక్లేదయంతి=తడుపలేదు, మారుతః=గాలి, న శోషయతి= ఎండింపజాలదు.

ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. నీరు తడుపజాలదు. వాయువు ఎండింపజాలదు.

24 అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమ్ అక్లేద్యోఽశోష్య ఏవ చ।

నిత్యః సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః।

అచ్ఛేద్యః - అయం-అదాహ్యః-అయం-అక్లేద్యః-అశోష్యః- ఏవ-చ

నిత్యః-సర్వగతః-స్థాణుః-అచలః-అయం-సనాతనః

అయం- ఈ ఆత్మ, అచ్ఛేద్యః=ఛేదింపరానిది, అయం= ఈ ఆత్మ, అదాహ్యః=దహింపరానిది, అక్లేద్యః=తడుపరానిది, అశోష్యః ఏవ చ = శోషింపసాధ్యము కానిది. అయం= ఇది, నిత్యః= నిత్యమైనది, సర్వగతః=అంతటను వ్యాపించినది, స్థాణుః=స్థిరమైనది, అచలః=చలనములేనిది, సనాతనః=శాశ్వతమైనది.

ఈ ఆత్మ ఛేదించరానిది, దహింపరానిది, తడుపుటకును, శోషింపజేయుటకును సాధ్యము కానిది. ఆత్మ నిత్యమైనది. సర్వవ్యాప్తిచెందినది, చలింపనిది స్థిరమైనది సనాతనమైనదిది

25 అవ్యక్తో౽యమచింత్యో౽యమ్ అవికార్యో౽యముచ్యతే ।

తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ।

అవ్యక్తః-అయం-అచింత్యః-అయం-అవికార్యః-అయం- ఉచ్యతే

తస్మాత్- ఏవం-విదిత్వా- ఏనం-న-అనుశోచితుం-అర్హసి

అయం= ఈ ఆత్మ, అవ్యక్తః=వ్యక్తముకానిది, అయం= ఇది, అచింత్యః= మనస్సునకు అందనిది, అయం= ఈ ఆత్మ, అవికార్యః=వికారము లేనిదిగా, ఉచ్యతే=చెప్పబడుచున్నది, తస్మాత్=అందువలన, ఏనం= ఈ ఆత్మను, ఏవం= ఇట్లు, విదిత్వా=తెలిసికొని, అనుశోచితుం=విలపించుటకు, న అర్హసి=తగవు

ఈ ఆత్మ ఇంద్రియములకు గోచరముగానిది. మనస్సునకును అందనిది. వికారములు లేనిది. దీనిని గూర్చి ఇట్లు తెలిసికొనుము. కనుక ఓ అర్జునా ! నీవు దీనికై శోకింపదగవు.

26 అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।

తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ।

అథ-చ- ఏనం-నిత్యజాతం-నిత్యం-వా-మన్యసే-మృతం

తథాపి-త్వం-మహాబాహో-న- ఏవం-శోచితుం-అర్హసి

మహాబాహూ=అర్జునా, త్వం=నీవు, ఏనం= ఈ ఆత్మను, నిత్యజాతం=నిత్యము పుట్టుచున్న దానినిగను, నిత్యం=నిత్యమును, మృతం వా = నశించుచున్న దానినిగను, అథ మన్యసే చ =భావించినప్పటికిని, తథాపి=అట్లయినను, ఏవం= ఈ విధముగ, శోచితుం= శోకింప, న అర్హసి=తగవు.

ఓ అర్జునా ఒకవేళ ! ఈ ఆత్మకు జననమరణములు కలవని నీవు భావించినప్పటికిని దీనికై నీవు శోకింపదగదు.

27 జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।

తస్మాదపరిహార్యేऽర్థే న త్వం శోచితుమర్హసి।

జాతస్య-హి-ధ్రువః-మృత్యుః-ధ్రువం-జన్మ-మృతస్య-చ

తస్మాత్-అపరిహార్యే-అర్థే-న-త్వం-శోచితుం-అర్హసి

జాతస్య=పుట్టినప్రతి వానికి, మృత్యుః=చావు, ధ్రువః హి=తప్పదు, మృతస్య=మృతి చెందిన వానికి, జన్మ చ=పుట్టుకయు, ధ్రువం=తప్పదు, తస్మాత్=అందువలన, అపరిహార్యే=అనివార్యమగు, అర్థే=విషయమునందు, త్వం=నీవు, శోచితుం=శోకింప, న అర్హసి = తగవు.

పుట్టినప్రతి వానికి మరణము తప్పదు. మరణించిన వానికి పునర్జన్మ తప్పదు. కనుక తప్పనిసరియైన ఈ విషయములయందు నీవు శోకింపదగదు.

28 అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।

అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా।

అవ్యక్తాదీని-భూతాని-వ్యక్తమధ్యాని-భారత

అవ్యక్త నిధనాని- ఏవ-తత్ర-కా-పరిదేవనా

భారత=అర్జునా, భూతాని=ప్రాణులు, అవ్యక్తాదీని= పుట్టుటకుముందు గోచరించనివియు, వ్యక్తమధ్యాని=మధ్యన గోచరించునవియు, అవ్యక్త నిధనాని ఏవ = మరణానంతరము కూడ అవి అగోచరములే, తత్ర =అట్టి విషయమున, పరిదేవనా=దుఃఖము, కా = ఏల ?

ఓ అర్జునా ! ప్రాణులన్నియును పుట్టుకకుముందు ఇంద్రియ గోచరములు గావు - మరణానంతరము గూడ అవి అగోచరములే - ఈ జననమరణముల మధ్యకాలము నందు మాత్రమే అవి గోచరములు అగుచుండును. ఇట్టి స్థితిలో వాటికై పరితపించుటవలన ప్రయోజనములేదు.

29 ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్

ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।

ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి

శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్।

ఆశ్చర్యవత్-పశ్యతి-కశ్చిత్- ఏనం- ఆశ్చర్యవత్-వదతి-తథా- ఏవ-చ-అన్యః

ఆశ్చర్యవత్-చ- ఏనం-అన్యః-శృణోతి-శ్రుత్వా-అపి- ఏనం-వేద-న-చ- ఏవ-కశ్చిత్

కశ్చిత్= ఒకానొకడు, ఏనం= ఈ ఆత్మను, ఆశ్చర్యవత్= ఆశ్చర్యమైన దానివలె, పశ్యతి=గాంచుచున్నాడు, తథా ఏవ= అలాగుననే, అన్యః చ = మరియొకడు, ఏనం= ఈ ఆత్మను, ఆశ్చర్యవత్= ఆశ్చర్యమైనదానివలె, వదతి=పలుకుచున్నాడు, అన్యః చ = వేరొకడు, ఏనం= ఈ ఆత్మను, ఆశ్చర్యవత్= ఆశ్చర్యమైనదానివలె, శృణోతి= ఆలకించుచున్నాడు, శృత్వా= వినియును, కశ్చిత్ అపి చ = ఎవ్వడును, ఏనం= ఈ ఆత్మను, న వేద ఏవ = ఎరుగరు.

ఎవరో ఒక మహాపురుషుడు మాత్రమే ఈ ఆత్మను ఆశ్చర్యకరమైన దానినిగా చూచును. మరియొక మహాత్ముడు దీని తత్త్వమును ఆశ్చర్యకరముగా వర్ణించును. వేటొక పురుషుడు దీనిని ఆశ్చర్యకరమైన దానినిగా వినును. ఆ విన్నవారిలో,చూచినవారిలో,చెప్పినవారిలో కూడ కొందరు దీనినిగూర్చి ఏమియు పూర్తిగా ఎఱుగరు.

30 దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత।

తస్మాత్ సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి।

దేహీ-నిత్యం-అవధ్యః-అయం-దేహే-సర్వస్య-భారత

తస్మాత్-సర్వాణి-భూతాని-న-త్వం-శోచితుం-అర్హసి

భారత=అర్జునా, సర్వస్య=ప్రతివానియొక్క, దేహే=దేహమునందు, అయం= ఈ, దేహీ= ఆత్మ, నిత్యం= నిత్యమును, అవధ్యః= వధించబడనిది, తస్మాత్=అందుచేత, సర్వాణి=సమస్తమైన, భూతాని = ప్రాణులకొరకు, త్వం= నీవు, శోచితుం=శోకించుటకు న అర్హసి = తగవు.

ఓ అర్జునా ! ప్రతిదేహమునందును ఉండెడి ఈ ఆత్మచంప వీలుకానిది. కనుక ఏ ప్రాణిని గూర్చియైనను నీవు శోకింపదగదు.

31 స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి ।

ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ।

స్వ ధర్మం-అపి-చ-అవేక్ష్య-న-వికంపితుం-అర్హసి

ధర్మ్యాత్-హి-యుద్ధాత్-శ్రేయః-అన్యత్-క్షత్రియస్య-న-విద్యతే

స్వధర్మం అపి=స్వధర్మమునైనను ; అవేక్ష్య చ = గాంచి, వికంపితుం= చలించుటకు, న అర్హసి = తగవు, క్షత్రియస్య=క్షత్రియునకు, ధర్మ్యాత్=ధర్మయుతమైన, యుద్ధాత్= యుద్ధముకంటె, అన్యత్= అన్యమైన, శ్రేయః = శ్రేయస్సు, న విద్యతే హి= ఏదియును లేదు.

అంతేగాక స్వధర్మమునుబట్టియు నీవు భయపడనక్కరలేదు. ఏలననగా క్షత్రియునకు ధర్మయుద్ధమునకు మించినట్టి శ్రేయస్కరమైన కర్తవ్యము మఱియొక విషయము ఏదియును లేదు.

32 యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।

సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్ ।

యదృచ్ఛయా-చ- ఉపపన్నం-స్వర్గద్వారం-అపావృతం

సుఖినః-క్షత్రియాః-పార్థ-లభంతే-యుద్ధం- ఈదృశం

పార్థ=అర్జునా, యదృచ్ఛయా=అనుకోకుండా, ఉపపన్నం=లభించినదియు, అపావృతం=తెరువబడినదియైన, స్వర్గద్వారం= స్వర్గద్వారము గలదియు, ఈ దృశం చ = ఇటువంటిదియైన, యుద్ధం= యుద్ధమును, సుఖినః= సుఖవంతులైన, క్షత్రియాః=క్షత్రియులు, లభంతే=లభించును.

అనుకోకుండా తటస్థించిన ఇట్టి యుద్ధము అదృష్టవంతులైన క్షత్రియులకే లభించును. ఇది స్వర్గమునకు తెఱచిన ద్వారము వంటిది.

33 అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।

తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ।

అథః-చేత్-త్వం- ఇమం-ధర్మ్యం-సంగ్రామం-న-కరిష్యసి

తతః-స్వధర్మం-కీర్తిం-చ-హిత్వా-పాపం-అవాప్స్యసి

అథ=మరియు, త్వం=నీవు, ధర్మ్యం=ధర్మయుతమైన, ఇమం= ఈ , సంగ్రామం= యుద్ధమును, న కరిష్యసి చేత్= ఆచరింపకున్నచో, తతః=అందువలన, స్వధర్మం=స్వధర్మమును, కీర్తిం చ=కీర్తిని, హిత్వా=పోగొట్టుకొని, పాపం= పాపమును, అవాప్స్యసి= చేసినవాడవగుదువు.

ఈ యుద్ధము నీకు ధర్మబద్ధము. ఒకవేళ నీవు దీనిని ఆచరింపకున్నచో నీ స్వధర్మమునుండి పాఱిపోయినవాడవు అగుదువు. దానివలన నీవు కీర్తిని కోల్పోయి, పాపము చేసినవాడవగుదువు.

34 అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్ ।

సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే ।

అకీర్తిం-చ-అపి-భూతాని-కథయిష్యంతి-తే-అవ్యయాం

సంభావితస్య-చ-అకీర్తిః-మరణాత్-అతిరిచ్యతే

చ=మరియు, అపి=కూడా, భూతాని=లోకులు, తే=నీయొక్క, అవ్యయాం=శాశ్వతమైన, అకీర్తిం=అపకీర్తిని, కథయిష్యంతి=చిలువలుపలువలుగా చెప్పుకొందురు. సంభావితస్య= మాననీయునకు, అకీర్తిః=అపకీర్తి, మరణాత్ చ=మరణముకంటెను, అతిరిచ్యతే=మేలు.

లోకులెల్లరును బహుకాలమువఱకును నీ అపకీర్తినిగూర్చి చిలువలు పలువలుగా చెప్పికొందురు. మాన్యుడైనపురుషునకు అపకీర్తి కన్నను మరణమే మేలు.

35 భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।

యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘువమ్ ।

భయాత్-రణాత్- ఉపరతం-మంస్యంతే-త్వాం-మహారథాః

యేషాం-చ-త్వం-బహుమతః-భూత్వా-యాస్యసి-లాఘవం

యేషాం= ఎవరికి, త్వం= నీవు, బహుమతః=మాననీయుడవు, భూత్వా=అయి, లాఘవం= చులకన, యాస్యసి చ = పొందగలవో, మహారథాః=మహారథులు, త్వాం= నిన్ను, భయాత్=భయమువలన, రణాత్=రణరంగమునుండి, ఉపరతం= పారిపోయినట్లు, మంస్యంతే=పోయుదురు.

ఈ మహారథులదృష్టిలో ఇప్పుడు నీవు మిక్కిలి మాన్యుడవు. యుద్ధవిముఖుడవైనచో వీరి దృష్టిలో నీవు ఎంతో చులకన అయ్యెదవు. అంతేగాక నీవు పిరికివాడవై యుద్ధమునుండి పారిపోయినట్లు వీరు తలపోయుదురు.

36 అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః।

నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ।

అవాచ్యవాదాన్-చ-బహూన్-వదిష్యంతి-తవ-అహితాః

నిందంతః-తవ-సామర్థ్యం-తతః-దుఃఖతరం-ను-కి

తవ=నీయొక్క, అహితాః=శత్రువులు, తవ=నీయొక్క, సామర్థ్యం= సామర్థ్యమును, నిందంతః=నిందించుచు, బహూన్=అనేక విధములుగ, అవాచ్యవాదాన్ చ = అనరాని మాటలును, వదిష్యంతి=అందురు. తతః=అంతకంటెను, దుఃఖతరం=మించిన దుఃఖము, కిం ను= ఏముంటుంది.

శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు నిన్ను గూర్చి పెక్కు అనరాని మాటలను అందురు. అంతకంటె దుఖఃమేముంటుంది ?

37 హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।

తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ।

హతః-వా-ప్రాప్స్యసి-స్వర్గం-జిత్వా-వా-భోక్ష్యసే-మహీం

తస్మాత్- ఉత్తిష్ఠ-కౌంతేయ-యుద్ధాయ-కృతనిశ్చయః

కౌంతేయ = అర్జునా, హతో వా=చంపబడితివా, స్వర్గం=స్వర్గమును, ప్రాప్స్యసి=పొందగలవు, జిత్వా వా=జయించితివా, మహీం=రాజ్యభోగములను. భోక్ష్యసే=అనుభవించగలవు, తస్మాత్= ఈ కారణముచే, కృతనిశ్చయః= దృఢనిశ్చయము కలవాడవై, యుద్ధాయ=యుద్ధమునకు, ఉత్తిష్ఠ=సంసిద్ధుడవు కమ్ము.

ఓ కౌంతేయా ! రణరంగమున మరణించినచో వీరస్వర్గమును పొందెదవు. యుద్ధమున జయించినచో రాజ్యభోగములను అనుభవింపగలవు. కనుక కృతనిశ్చయుడవై యుద్ధమునకు లెమ్ము.

38 సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।

తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి ।

సుఖదుఃఖే-సమే-కృత్వా-లాభాలాభౌ-జయాజయౌ

తతః-యుద్ధాయ-యుజ్యస్వ-న- ఏవం-పాపం-అవాప్స్యసి

సుఖదుఃఖే= సుఖదుఃఖములను, లాభాలాభౌ=లాభనష్టములను, జయాజయౌ =జయాప జయములను, సమే=సమానముగ, కృత్వా=తలంచి, తతః=పిమ్మట, యుద్ధాయ=యుద్ధమునకు , యుజ్యస్వ=సిద్ధముకమ్ము, ఏవం= ఇట్లు చేసితివేని, పాపం=పాపమును, న అవాప్స్యసి=అంటవు.

జయాపజయములను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానముగా తలంచి, యుద్ధసన్నద్ధుడవు కమ్ము. అప్పుడు నీకు పాపములు అంటనే అంటవు.

39 ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।

బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి।

ఏషా-తే-అభిహితా-సాంఖ్యే-బుద్ధిః-యోగే-తు- ఇమాం-శృణు

బుద్ధ్యా-యుక్తః-యయా-పార్థ-కర్మబంధం-ప్రహాస్యసి

పార్థ=అర్జునా, సాంఖ్యే=జ్ఞానయోగవిషయమున, ఏషా= ఇంతవరకు చెప్పిన, బుద్ధిః=వివేకము, తే=నీకొరకు, అభిహితా=చెప్పబడినది, ఇమాం=దీనినే, యోగే తు=యోగ విషయమున, శృణు=వినుము, యయా= ఏ, బుద్ధ్యా=బుద్ధిచే, యుక్తః=కూడినవాడవై, కర్మబంధం=కర్మబంధమును, ప్రహాస్యసి= ముక్తుడవవుతావు

ఓ పార్థా ! సాంఖ్యశాస్త్రమున చెప్పబడిన ఈ సమత్వ బుద్ధిని గురించి తెల్పితిని. ఇప్పుడు దానినే కర్మయోగదృక్పథముతో వివరించెదను, వినుము. దానిని ఆకళింపుచేసికొని, ఆచరించినచో కర్మబంధములనుండి నీవుముక్తుడవయ్యెదవు.

40 నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।

స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్।

న- ఇహ-అభిక్రమనాశః-అస్తి-ప్రత్యవాయః-న-విద్యతే

స్వల్పం-అపి-అస్య-ధర్మస్య-త్రాయతే-మహతః-భయాత్

ఇహ= ఇందు, అభిక్రమనాశః=ప్రారంభనాశము, న అస్తి=లేదు, ప్రత్యవాయః=ప్రత్యవాయ దోషము, న విద్యతే= ఉండదు, అస్య= ఈ, ధర్మస్య= ధర్మముయొక్క, స్వల్పమపి = కొంచెమైనను, మహతః= గొప్పదైన, భయాత్=భయమునుండి, త్రాయతే=కాపాడును.

ఈ నిష్కామకర్మయోగమును ప్రారంభించినచో దీనికి ఎన్నటికిని బీజనాశము లేదు. దీనికి విపరీత ఫలితములే యుండవు. పైగా ఈ (నిష్కామ) కర్మయోగమును ఏ కొంచెము సాధనచేసినను అది జన్మమృత్యురూప మహాభయమునుండి కాపాడును.

41 వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన।

బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్।

వ్యవసాయాత్మికా-బుద్ధిః- ఏకా- ఇహ- కురునందన

బహుశాఖాః-హి-అనంతాః-చ-బుద్ధయః-అవ్యవసాయినాం

కురునందన=అర్జునా, ఇహ=దీనియందు, వ్యవసాయాత్మికా=నిశ్చయాత్మకమైన, బుద్ధిః= బుద్ధి, ఏకా= ఒక్కటే, అవ్యవసాయినాం= నిశ్చయాత్మకబుద్ధి లేనివారల, బుద్ధయః=బుద్ధులు, బహుశాఖాః= అనేక భేదములు గలవియు, అనంతాః చ హి=అనంతములుగా వుంటాయి.

ఓ అర్జునా! ఈ (నిష్కామ) కర్మయోగమునందు నిశ్చయాత్మక బుద్ధి ఒకటియే యుండును. కాని భోగాసక్తులైన వివేకహీనుల బుద్ధులు చంచలములై, ఒకదారీ తెన్నూ లేక కోరికలవెంట నలువైపులా పరుగులు తీయుచూ అనంతములుగావుంటాయి.

42 యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।

వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః।

యాం- ఇమాం-పుష్పితాం-వాచం-ప్రవదంతి-అవిపశ్చితః

వేదవాదరతాః-పార్థ-న-అన్యత్-అస్తి- ఇతి-వాదినః

పార్థ=అర్జునా, వేదవాదరతాః=వేదవాదములయందురమించువారును, అన్యత్=మరియొకటి ,అస్తి= ఉండుట, న=లేదు, ఇతి=అని, వాదినః= వాదించువారును, అవిపశ్చితః=అవివేకులు, పుష్పితాం=వికసిత లతవలె రమణీయమగు, ఇమాం= ఇట్టి, యాం వాచం= ఏ మాటలను, ప్రవదంతి =చెబుతున్నారో.

అర్జునా ! వేదవాదములందు రమించువారు, కామ్య కర్మలే అధికమని వాదించువారు, స్వర్గమే ఉన్నతమైనది భావించి ఇలా అంటారు.

43 కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।

క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ।

కామాత్మానః-స్వర్గపరాః-జన్మకర్మఫలప్రదాం

క్రియావిశేషబహులాం-భోగైశ్వర్యగతిం-ప్రతి

కామాత్మానః=కోరికలతో నిండినవారును, స్వర్గపరాః=స్వర్గమే పరమమైనది యని భావించువారును, జన్మకర్మఫలప్రదాం= జన్మమును, కర్మఫలము నొసంగునదియు, క్రియా విశేష బహులాం=బహుళమైన కార్యకలాపములతో నిండినదియు, భోగైశ్వర్య గతిం ప్రతి= భోగములయొక్క, ఐశ్వర్యములయొక్క ప్రాప్తిని గురించినదియు కోరికలతో కూడినవారు, స్వర్గాభిలాషులును, జన్మమును, కర్మఫలము నొసగునట్టిదియును, భోగైశ్వర్యములనిచ్చునదియు,

44 భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।

వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ।

భోగైశ్వర్య ప్రసక్తానాం-తయా-అపహృత చేతసాం

వ్యవసాయాత్మికా-బుద్ధిః-సమాధౌ-న-విధీయతే

భోగైశ్వర్య ప్రసక్తానాం=భోగైశ్వర్యములయందు ఆసక్తికలవారికి, తయా=అట్టిమాటలచే, అపహృత చేతసాం=అపహరించబడిన మనస్సు కలవారికి, వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మక మైన, బుద్ధిః=బుద్ధి, సమాధౌ= సమబుద్ధి యందు, న విధీయతే=స్థిరముగా ఉండదు.

భోగైశ్వర్య ప్రసక్తికలవారలకు నిశ్చితమైన బుద్ధి ఉండదు.

45 త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్।

త్రైగుణ్యవిషయాః-వేదాః- నిస్త్రైగుణ్యఃభవ-అర్జున
నిర్ద్వంద్వః-నిత్యసత్త్వస్థః- నిర్యోగక్షేమః- ఆత్మవాన్

అర్జున=అర్జునా, వేదాః= వేదములు, త్రైగుణ్యవిషయాః=త్రిగుణములు విషయములుగా గలవి, త్వం=నీవు, నిస్త్రైగుణ్యః= త్రిగుణరహితుడవు, నిర్ద్వంద్వః= ద్వంద్వరహితుడవు, నిత్యసత్త్వస్థః= శుద్ధసత్త్వ రూపుడవు, నిర్యోగక్షేమః= యోగక్షేమములకొరకు ఆరాటంలేనివాడు, ఆత్మవాన్= ఆత్మవిదుడవు, భవ=అగుము.

ఓ అర్జునా ! వేదములు సత్త్వరజస్తమోగుణములకార్యరూపములైన సమస్త భోగములను గూర్చియు, వాటిని పొందుటకై చేయవలసిన సాధనలను గూర్చియు ప్రతిపాదించును. నీవు ఆ భోగముల యెడలను వాటి సాధనలయందును ఆసక్తిని త్యజింపుము. సుఖదుఃఖాదిద్వంద్వములకు అతీతుడవు కమ్ము. నిత్యుడైన పరమాత్మయందే స్థితుడవు కమ్ము. నీ యోగక్షేమముల కొఱకై ఆరాటపడవద్దు. అంతఃకరణమును వశమునందుంచుకొనుము.

46 యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః।

యావాన్-అర్థః- ఉదపానే-సర్వతః-సంప్లుతోదకే
తావాన్-సర్వేషు-వేదేషు-బ్రాహ్మణస్య-విజానతః

సర్వతః=అంతటను, సంప్లుతోదకే=జలముతో నిండియున్న, ఉదపానే= జలాశయము నందు, యావాన్= ఎంతగా, అర్థః=లాభముండునో, విజానతః=జ్ఞానియైన, బ్రాహ్మణస్య=బ్రాహ్మణునకు, సర్వేషు=సర్వములైన, వేదుషు= వేదములవలన, తావాన్= అంతియే వుంటుంది.

అన్నివైపులా జలములతో నిండియున్న మహాజలాశయము అందుబాటులోనున్న వానికి చిన్న చిన్న జలాశయములవలన ఎంత ప్రయోజనమో, పరమాత్మప్రాప్తినంది పరమానందమును అనుభవించు బ్రహ్మజ్ఞానికి వేదములవలన అంతియే ప్రయోజనము వుంటుంది.

47 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।

మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి।

కర్మణి- ఏవ-అధికారః-తే-మా-ఫలేషు-కదాచన

మా-కర్మఫలహేతుః-భూః-మా-తే-సంగః-అస్తు-అకర్మణి

తే=నీకు, కర్మణి ఏవ = కర్మలయందే, అధికారః=అధికారము, ఫలేషు= ఫలములయందు, కదాచన= ఎన్నటికిని, మా = లేదు, తే=నీకు, కర్మఫలహేతుః =కర్మఫలమునకు నీవు హేతువు, మా భూః=కాకుము, అకర్మణి= కర్మచేయక పోవుటయందు, సంగః= సంగత్వము, మా అస్తు=కలుగ కూడదు.

కర్తవ్యకర్మమునాచరించుటయందే నీకు అధికారముగలదు కాని ఎన్నటికినీ దాని ఫలములయందులేదు. కర్మఫలములకు నీవు హేతువు కారాదు. కర్మలను మానుటయందు నీవు ఆసక్తుడవు కావలదు. అనగా ఫలాపేక్షరహితుడై కర్తవ్యబుద్ధితో కర్మలనాచరింపుము.

48 యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।

సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే।

యోగస్థః-కురు-కర్మాణి-సంగం-త్యక్త్వా-ధనంజయ

సిద్ధ్యసిద్ధ్యోః-సమః-భూత్వా-సమత్వం-యోగః- ఉచ్యతే

ధనంజయ=అర్జునా, సంగం=సంగమును, త్యక్త్వా= విడిచి, సిద్ధ్యసిద్ధ్యోః= సిద్ధిని పలించినను పలించకున్నను, సమః=సమానుడవు, భూత్వా=అయి, యోగస్థః= యోగమునందున్నవాడవై, కర్మాణి=కర్మలను, కురు=చేయుము, సమత్వం=సమబుద్ధి, యోగః=యోగముగా, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

ఓ ధనంజయా ! యోగస్థితుడవై ఆసక్తిని వీడి,కార్యములు ఫలించినను ఫలించకున్నను సమత్వ భావమును కలిగియుండి, కర్తవ్యకర్మలను ఆచరింపుము. ఈ సమత్వభావమునే యోగమందురు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

49 దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।

బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ।

దూరేణ-హి-అవరం-కర్మ-బుద్ధియోగాత్-ధనంజయ

బుద్ధౌ-శరణం-అన్విచ్ఛ-కృపణాః-ఫలహేతవః

ధనంజయ=ధనుంజయా, బుద్ధియోగాత్=బుద్ధియోగము కంటెను, కర్మ=కామ్యకర్మ, దూరేణ = మిక్కిలి, అవరం హి=తుచ్ఛమైనదికదా, ఫలహేతవః=ఫలము నాశించువారు, కృపణాః=కృపణులు, బుద్ధౌ= జ్ఞానమునందు, శరణం= ఆశ్రయమును, అన్విచ్ఛ=ఆశ్రయింపుము.

ఓ అర్జునా ! ఈ సమత్వబుద్ధితోకూడిన నిష్కామ కర్మకంటే ప్రతిఫలాపేక్షతో కుడిన సకామకర్మ తక్కువైనది. కాబట్టి నీవు సమత్వబుద్ధియోగమునే ఆశ్రయింపుము. ఏలనన ఫలాసక్తితో కర్మలు చేయువారు అత్యంతదీనులు, కృపణులు.

50 బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।

తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ।

బుద్ధియుక్తః-జహాతి- ఇహ- ఉభే- సుకృతదుష్కృతే

తస్మాత్-యోగాయ-యుజ్యస్వ-యోగః-కర్మసు-కౌశలం

బుద్ధియుక్తః=సమత్వ బుద్ధియుక్తుడు, సుకృతదుష్కృతే ఉభే= పుణ్యపాపముల రెండింటిని, ఇహ= ఈ లోకమునందు, జహాతి=విడుచుచున్నాడు, తస్మాత్= కనుక యోగాయ=యోగము కొరకు, యుజ్యస్వ=సిద్ధము కమ్ము, కర్మసు = కర్మలయందు, కౌశలం=కౌశలము, యోగః=యోగము

సమత్వ బుద్ధియుక్తుడైనవాడు పుణ్యపాపములను రెండింటిని ఈ లోకమునందే త్యజించును. అనగా కర్మఫలములు వానికి అంటవు. కనుక నీవు సమత్వబుద్ధి రూపయోగమును ఆశ్రయింపుము. ఇదియే కర్మాచరణమునందు కౌశలము. ఇదియే యోగము.

51 కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ।

కర్మజం-బుద్ధియుక్తాః-హి-ఫలం-త్యక్త్వా-మనీషిణః
జన్మబంధ-వినిర్ముక్తాః-పదం-గచ్ఛంతి- అనామయం

బుద్ధియుక్తాః= సమబుద్ధియుక్తులైన జ్ఞానులు, మనీషిణః= ఉత్తములు, కర్మజం=కర్మవలన పుట్టిన, ఫలం=ఫలితమును, త్యక్త్వా=విడిచి, జన్మబంధ వినిర్ముక్తాః=జన్మమనెడి బంధము నుండి విడువబడినవారై, అనామయం =దుఃఖరహితమైన, పదం=పదమును, గచ్ఛంతి హి= పొందుదురు.

ఏలనన సమబుద్ధియుక్తులైన జ్ఞానులు కర్మఫలములను త్యజించి, జనన మరణబంధములనుండి ముక్తులయ్యెదరు. అంతేగాక వారు నిర్వికారమైన మోక్షపదమును పొందుదురు.

52 యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ।

యదా-తే-మోహకలిలం- బుద్ధిః-వ్యతితరిష్యతి
తదా-గంతాసి-నిర్వేదం-శ్రోతవ్యస్య-శ్రుతస్య-చ

యదా= ఎప్పుడు, తే= నీయొక్క, బుద్ధిః=బుద్ధి, మోహకలిలం= మోహమనెడి మాలిన్యమునుండి, వ్యతితరిష్యతి=దాటగలదో, తదా=అప్పుడు, శ్రోతవ్యస్య= వినదగినదానికిని, శ్రుతస్య చ = వినినదానికిని, నిర్వేదం= వైరాగ్యమును, గంతాసి=పొందగలవు.

మోహమనెడి మాలిన్యము నుండి పూర్తిగా బయటబడినప్పుడే నీవు వినిన, వినబోవు ఇహపరలోకసంబంధమైన సమస్తభోగములనుండి వైరాగ్యమును పొందగలవు.

53 శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।

సమాధా వచలా బుద్ధిః తదా యోగమవాప్స్యసి ।

శ్రుతివిప్రతిపన్నా-తే-యదా-స్థాస్యతి-నిశ్చలా

సమాధౌ-అచలా-బుద్ధిః- తదా-యోగం-అవాప్స్యసి

శ్రుతివిప్రతిపన్నా= నానావిధములైన మాటలను వినుటవలన, తే=నీ యొక్క, బుద్ధిః=బుద్ధి, నిశ్చలా=చలనములేనిదియై, అచలా=స్థిరముగా, సమాధౌ=సమాధియందు, యదా= ఎప్పుడు, స్థాస్యతి= స్వస్థత నొందియుండునో, తదా= అప్పుడు, యోగం= యోగమును, అవాప్స్యసి= ఏర్పడును.

నానా విధములైన మాటలను వినుటవలన విచలితమైన నీ బుద్ధి పరమాత్మయందు నిశ్చలముగా స్థిరముగా నిలిచి ఉన్నప్పుడే నీకు ఈ యోగము ఏర్పడును.

అర్జున ఉవాచ

54 స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।

స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్ ।

స్థితప్రజ్ఞస్య-కా-భాషా-సమాధిస్థస్య-కేశవ

స్థితధీః-కిం-ప్రభాషేత-కిం- ఆసీత-వ్రజేత-కిం

కేశవ=కృష్ణా, సమాధిస్థస్య = సమాధిస్థితుడై, స్థితప్రజ్ఞస్య=స్థితప్రజ్ఞుని యొక్క భాషా=వాచకము, కా = ఏది, స్థితధీః= స్థిరబుద్ధిగల అట్టి పురుషుడు, కిం = ఏమి, ప్రభాషేత= భాషించును, కిం = ఎటుల, ఆసీత = కూర్చొనును. కిం= ఎటుల, వ్రజేత=నడుచును.

అర్జునుడు పలికెను - ఓ కేశవా ! సమాధిస్థితుడై పరమాత్మ ప్రాప్తినందిన స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములెవ్వి ? అతడు ఎట్లు భాషించును ? ఎట్లు కూర్చొనును ? ఎట్లు నడుచును ?



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

శ్రీభగవాన్ ఉవాచ

55 ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।

ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే।

ప్రజహాతి-యదా-కామాన్-సర్వాన్-పార్థ-మనోగతాన్

ఆత్మని-ఏవ-ఆత్మనా-తుష్టః-స్థితప్రజ్ఞః-తదా- ఉచ్యతే

పార్థ=అర్జునా, యదా = ఎప్పుడు, మనోగతాన్ = మనస్సునందలి, సర్వాన్= సమస్తమైన, కామాన్ = కోరికలను, ప్రజహాతి= విడుచునో, ఆత్మనా= ఆత్మచేత, ఆత్మని ఏవ= ఆత్మ యందే, తుష్టః= సంతుష్టుడైనవానిని, తదా= అప్పుడు, సిత్థిప్రజ్ఞః= స్థిత ప్రజ్ఞుడని, ఉచ్యతే = అందరు.

శ్రీ భగవానుడు పలికెను - ఓ అర్జునా ! మనస్సునందలి కోరికలన్నియును పూర్తిగా తొలగిపోయి, ఆత్మద్వారా ఆత్మయందు సంతుష్టుడైనవానిని, అనగా పరమాత్మ సంయోగమువలన ఆత్మానందమును పొందినవానిని స్థితప్రజ్ఞుడని యందురు.

56 దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।

వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే।

దుఃఖేషు-అనుద్విగ్నమనాః-సుఖేషు-విగతస్పృహః

వీతరాగభయక్రోధః-స్థితధీః-మునిః- ఉచ్యతే

దుఃఖేషు = దుఃఖము ప్రాప్తించినపుడు, అనుద్విగ్నమనాః=కలతచెందని మనస్సు కల వాడును, సుఖేషు = సుఖము ప్రాప్తించినపుడు, విగత స్పృహః= ఆశలేనివాడును, వీతరాగ భయక్రోధః= అనురాగము, భయము, క్రోధము వీడినవాడును అగు, మునిః=మనన శీలుడు, స్థితధీః= స్థితప్రజ్ఞుడని ఉచ్యతే = అనబడును.

దుఃఖములకు క్రుంగిపోనివాడును, సుఖములకు పొంగిపోనివాడును, ఆసక్తిని, భయక్రోధములను వీడినవాడును ఐనట్టి మననశీలుడు (ముని) స్థితప్రజ్ఞుడన బడును.

57 యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।

నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ।

యః-సర్వత్ర-అనభిస్నేహః-తత్-తత్-ప్రాప్య-శుభాశుభం

న-అభినందతి-న-ద్వేష్టి-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా

యః = ఎప్పుడు, సర్వత్ర = అంతటను, అనభిస్నేహః= మమతాసక్తులు లేనివాడును తత్ తత్= ఆయా, శుభాశుభం = మంచిచెడులను, ప్రాప్య= పొంది, న అభినందతి=సంతోషింపడో, న ద్వేష్టి= ద్వేషింపడో, తస్య = అట్టివానియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా=స్థిరమైనది.

దేనియందును మమతాసక్తులు లేనివాడును, అనుకూల పరిస్థితుల యందు హర్షము, ప్రతికూల పరిస్థితులయందు ద్వేషము మొదలగు వికారము లకు లోనుగానివాడును అగు పురుషుడు స్థితప్రజ్ఞుడు అనబడును.

58 యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।

ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ।

యదా-సంహరతే-చ-అయం-కూర్మః-అంగాని- ఇవ- సర్వశః

ఇంద్రియాణి- ఇంద్రియార్థేభ్యః-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా

యదా = ఎప్పుడు, అయం= ఇతడు, కూర్మః=తాబేలు, సర్వశః= అన్ని వైపులనుండి, అంగానీవ= అంగములను వలెనే, ఇంద్రియార్థేభ్యః=శబ్దాది విషయములనుండి, ఇంద్రియాణి= ఇంద్రియములను, సంహరతే= ఉపసంహరించుకొనుచున్నాడో, తస్య=అతని, ప్రజ్ఞా= బుద్ధి, ప్రతిష్ఠితా= స్థిరమైనది.

తాబేలు తనఅంగములను అన్నివైపులనుండి లోనికి ముడుచు కొనునట్లుగా, ఇంద్రియములను విషయాదుల నుండి అన్నివిధముల ఉపసంహరించుకొనిన పురుషుని యొక్క బుద్ధి స్థిరముగా ఉన్నట్లు భావింపవలెను.

59 విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే।

విషయాః-వినివర్తంతే-నిరాహారస్య-దేహినః
రసవర్జం-రసః-అపి-అస్య-పరం-దృష్ట్వా-నివర్తతే

నిరాహారస్య=విషయములను గ్రహించని, దేహినః=పురుషునకు, రసవర్జం =రాగరహితము గాకుండా, విషయాః=విషయములు, వినివర్తంతే= వైదొలగును, అస్య= ఇతనికి, పరం= పరమును, దృష్ట్వా=సాక్షాత్కారము అయినందువలన, రసః=రాగము, అపి=కూడా, నివర్తతే=తొలగిపోవును.

ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహింపనివానినుండి ఇంద్రి యార్థములు మాత్రము వైదొలగును. కాని వాటిపై ఆసక్తి మిగిలియుండును. స్థితప్రజ్ఞునకు పరమాత్మ సాక్షాత్కారమైనందు వలన వానినుండి ఆ ఆసక్తిగూడ తొలగిపోవును.

60 యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః।

యతతః-హి-అపి-కౌంతేయ-పురుషస్య-విపశ్చితః
ఇంద్రియాణి-ప్రమాథీని-హరంతి-ప్రసభం-మనః

కౌంతేయ=అర్జునా, యతతః అపి= ప్రయత్నించినను, విపశ్చితః=వివేకియైన, పురుషస్య=పురుషునియొక్క, మనః=మనస్సును, ప్రమాథీని=ప్రమాదమును కలిగించు, ఇంద్రియాణి = ఇంద్రియములు, ప్రసభం= బలవంతముగ, హరంతి హి=లాగికొని పోవుచునే యుండును.

ఓ అర్జునా ! ఇంద్రియములు మహాశక్తి కలవి, మనుష్యుడు వాటిని నిగ్రహించుటకు ఎంతగా ప్రయత్నించినను, ఆసక్తి తొలగిపోనంతవఱకును అవి అతని మనస్సును ఇంద్రియార్థములవైపు బలవంతముగా లాగికొనిపోవుచునే యుండును.

61 తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।

వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా।

తాని-సర్వాణి-సంయమ్య-యుక్తః- ఆసీత-మత్పరః

వశే-హి-యస్య- ఇంద్రియాణి-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా

తాని= ఆ, సర్వాణి= సర్వ ( ఇంద్రియములను), సంయమ్య= వశమునందు ంచుకుని, యుక్తః= యోగయుక్తుడు, మత్పరః=నాయందు ప్రియముగలవాడై, ఆసీత= ఉండవలెను, యస్య= ఎవనియొక్క, ఇంద్రియాణి= ఇంద్రియములు, వశే=స్వాధీనము నందున్నవో, తస్య=అతనియొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా హి= స్థిరముగా కూడును.

కనుక సాధకుడు ఆ ఇంద్రియములను అన్నింటిని వశము నందుంచుకొని, మత్పరాయణుడై, ధ్యానమునందు కూర్చొనవలెను. ఏలనన ఇంద్రియములను వశమునందుంచుకొనువాని బుద్ధి స్థిరముగానుండును.

62 ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।

సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే।

ధ్యాయతః-విషయాన్-పుంసః-సంగః-తేషు- ఉపజాయతే

సంగాత్-సంజాయతే-కామః-కామాత్-క్రోధః-అభిజాయతే

విషయాన్=విషయములను, ధ్యాయతః= ధ్యానించుచున్న, పుంసః=పురుషునకు, తేషు= వానియందు, సంగః= ఆసక్తి, ఉపజాయతే= కలుగుచున్నది, సంగాత్= సంగత్వము వలన, కామః=కోరిక, సంజాయతే=పుట్టుచున్నది, కామాత్= కోరిక వలన,క్రోధః= క్రోధము, అభిజాయతే=కలుగును.

విషయచింతన చేయు పురుషునకు ఆ విషయములయందు ఆసక్తి ఏర్పడును. ఆసక్తివలన ఆ విషయములను పొందుటకై కోరికలు కలుగును. ఆ కోరికలు తీరనప్పుడు క్రోధముకల్గును.

63 క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।

స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి।

క్రోధాత్-భవతి-సమ్మోహః-సమ్మోహాత్-స్మృతివిభ్రమః

స్మృతిభ్రంశాత్-బుద్ధినాశః-బుద్ధినాశాత్-ప్రణశ్యతి

క్రోధాత్=క్రోధమువలన, సమ్మోహః=వ్యామోహము, భవతి= కలుగుచున్నది, సమ్మోహతః= మోహమువలన, స్మృతివిభ్రమః= విస్మృతియు, స్మృతిభ్రంశాత్= విస్మృతివలన, బుద్ధినాశః= బుద్ధినాశము వలన, ప్రణశ్యతి=పతనమగుచున్నాడు.

అట్టి క్రోధమువలన వ్యామోహము కలుగును. దాని ప్రభావమున స్మృతి ఛిన్నాభిన్నమగును. స్మృతిభ్రష్టమైనందున బుద్ధి అనగా జ్ఞానశక్తి నశించును. బుద్ధినాశమువలన మనుష్యుడు పతనమగుచున్నాడు.

64 రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।

ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి।

రాగద్వేషవియుక్తైః-తు-విషయాన్- ఇంద్రియైః-చరన్

ఆత్మవశ్యైః - విధేయాత్మా- ప్రసాదం-అధిగచ్ఛతి

రాగ=రాగముచేతను, ద్వేష=ద్వేషముచేతను, వియుక్తైః=విడువబడినట్టియు, ఆత్మవశ్యైః= తనవశమైన, ఇంద్రియైః= ఇంద్రియములచేతను, విషయాన్= విషయములను, చరన్ తు = గ్రహించుచున్నాను, విధేయాత్మా= యోగ యుక్తుడు, ప్రసాదం= ప్రశాంతతను, అధిగచ్ఛతి= పొందుచున్నాడు.

ఇంద్రియములను వశమునందుంచుకొనిన సాధకుడు రాగద్వేషరహితుడై, ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహించుచున్నను ప్రశాంతతను పొందుచున్నాడు.

65 ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।

ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ।

ప్రసాదే-సర్వదుఃఖానాం-హానిః-అస్య- ఉపజాయతే

ప్రసన్నచేతసః-హి- ఆశు-బుద్ధిః-పర్యవతిష్ఠతి

అస్య = ఈ యోగయుక్తునకు, ప్రసాదే=ప్రశాంతము వలన, సర్వదుఃఖానాం= సర్వ దుఃఖముల యొక్క, హానిః=వినాశము, ఉపజాయతే= కలుగుచున్నది, ప్రసన్న చేతసః= ప్రసన్నచిత్తుడైన, ఆశు= శీఘ్రముగ, బుద్ధిః=బుద్ధి, పర్యవతిష్ఠతి హి= స్థిరమగును.

మనోనిర్మలత్వము వలన అతనిదుఃఖములన్నియును నశించును. ప్రసన్నచిత్తుడైన కర్మయోగియొక్క బుద్ధి అన్నివిషయముల నుండియు వైదొలగి, పరమాత్మయందు మాత్రమే పూర్తిగా స్థిరమగును.

66 నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా ।

న చాభావయతః శాంతిః అశాంతస్య కుతః సుఖమ్ ।

న-అస్తి-బుద్ధిః-అయుక్తస్య-న-చ-అయుక్తస్య-భావనా

న-చ-అభావయతః-శాంతిః-అశాంతస్య-కుతః-సుఖం

అయుక్తస్య=యోగయుక్తుడు గానివానికి, బుద్ధిః= వివేకము, న అస్తి = లేదు, అయుక్తస్య = యోగ యుక్తుడు గానివానికి, భావనా చ = ఆత్మ భావనయును, న=లేదు, అభావయతః=భావహీనునకు, శాంతిః=శాంతి, న చ=లేదు, అశాంతస్య=శాంతి లేనివానికి, సుఖం= సుఖము, కుతః= ఎట్లు లభించును.

ఇంద్రియనిగ్రహము మనోనిగ్రహము లేనివానికి వివేకము కలుగదు. అట్టి మనుష్యుని అంతఃకరణమునందు ఆస్తికభావమే కలుగదు. తద్భావనా హీనుడైన వానికి శాంతి లభింపదు. మనశ్శాంతి లేనివానికి సుఖము ఎట్లు లభించును ?

67 ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే ।

తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ।

ఇంద్రియాణాం-హి-చరతాం-యత్-మనః-అను-విధీయతే

తత్-అస్య-హరతి-ప్రజ్ఞాం-వాయుః-నావం- ఇవ-అంభసి

చరతాం=చరించుచున్న, ఇంద్రియాణాం= ఇంద్రియార్థములయందు, యత్మనః= ఏ మనస్సు, అనువిధీయతే=అనుసరించి, ప్రవర్తించుచున్నదో, తత్=అట్టి మనస్సు, అస్య= ఈ మనుజుని యొక్క, ప్రజ్ఞాం=విచక్షణాశక్తిని, అంభసి=నీటియందు, నావం= ఓడను, వాయుః ఇవ= గాలివలె, హరతి హి=హరించుచున్నది.

నీటిపై తేలుచున్న నావను గాలినెట్టివేయును. అట్లే ఇంద్రియార్థముల యందు సంచరించు ఇంద్రియములలో మనస్సు ఏ ఒక్క ఇంద్రియముతో కూడియున్నను ఆ ఒక్క ఇంద్రియమే మనోనిగ్రహములేని మనుజునిబుద్ధిని అనగా విచక్షణా శక్తిని హరించిచున్నది.

68 తస్మాద్యస్య మహాబాహో ! నిగృహీతాని సర్వశః ।

ఇంద్రియాణీంద్రియార్థేభ్య ః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ।

తస్మాత్-యస్య-మహాబాహో-నిగృహీతాని-సర్వశః

ఇంద్రియాణి- ఇంద్రియార్థేభ్యః-తస్య-ప్రజ్ఞా-ప్రతిష్ఠితా

మహాబాహూ=అర్జునా, తస్మాత్=అందువలన, ఇంద్రియార్థేభ్యః= ఇంద్రియ విషయముల నుండి, సర్వశః= అన్ని విధముల, యస్య= ఎవనియొక్క, ఇంద్రియాణి= ఇంద్రియములు, నిగృహీతాని=నిగ్రహించిన, తస్య=పురుషుని యొక్క, ప్రజ్ఞా=బుద్ధి, ప్రతిష్ఠితా= స్థిరమై యున్నది.

కనుక ఓ అర్జునా! ఇంద్రియములను ఇంద్రియార్థముల నుండి అన్నివిధములుగ పూర్తిగా నిగ్రహించిన పురుషునియొక్క బుద్ధి స్థిరముగానుండును.

69 యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।

యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః।

యా-నిశా-సర్వభూతానాం-తస్యాం-జాగర్తి-సంయమీ

యస్యాం-జాగ్రతి-భూతాని-సా-నిశా-పశ్యతః-మునేః

సర్వభూతానాం=సమస్త ప్రాణులకు, యా = ఏది, నిశా= రాత్రియో, తస్యాం=దానియందు, సంయమీ= యోగి, జాగర్తి= మేలుకొనియుండును, యస్యాం=దేనియందు, భూతాని= భూతములు, జాగ్రతి=మేలుకొని యుండునో, సా=అది, పశ్యతః= పరమాత్మతత్వమెరిగిన మునికి, మునేః=మునికి, నిశా=రాత్రి.

సమస్త ప్రాణులకు ఏది రాత్రియో అప్పుడు యోగి మేల్కొని యుండును. ఎప్పుడు నశ్వరమైన ప్రాపంచిక సుఖప్రాప్తికై ప్రాకులాడుచు ప్రాణులన్నియు మేల్కొని యుండునో అది పరమాత్మతత్త్వమునెఱిగిన మునికి రాత్రిగానుండును

70 ఆపూర్యమాణమచలప్రతిష్ఠం

సముద్రమాపః ప్రవిశంతి యద్వత్।

తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే

స శాంతిమాప్నోతి న కామకామీ।

ఆపూర్వమాణం-అచల-ప్రతిష్ఠం-సముద్రం- ఆపః-ప్రవిశంతి- యద్వత్

తద్వత్-కామాః యం-ప్రవిశంతి-సర్వే-సః-శాంతి- ఆప్నోతి-న- కామకామీ

ఆపూర్యమాణం= అంతటనిండినదియు, అచలప్రతిష్ఠం=చలించక నిలిచి యున్నదియును అగు, సముద్రం=సముద్రమును, ఆపః=నీరు, యద్వత్= ఏ విధముగ, ప్రవిశంతి=ప్రవేశించుచున్నదో, తద్వత్=అలాగుననే, కామాః=విషయములు, సర్వే= అన్నియును, యం = ఎవనిని, ప్రవిశంతి= చేరుచున్నవో, సః=అట్టి యోగి, శాంతిం=శాంతిని, ఆప్నోతి=పొందుచున్నాడు, కామకామీ=భోగాసక్తుడు, న ఆప్నోతి= పొందలేడు.

సమస్తదిశలనుండి పొంగి ప్రవహించుచు వచ్చిచేరిన నదులన్నియును సముద్రమును ఏ విధముగ చలింపకయున్న ప్రవేశించుచున్నదో అలాగే సమస్తభోగములును స్థితప్రజ్ఞునియందు ఎట్టి వికారములను కల్గింపకయే వానిలో లీనమగును. అట్టి పురుషుడే పరమశాంతిని పొందును. భోగాసక్తుడు శాంతిని పొందలేడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

71 విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిఃస్పృహః ।
నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి

విహాయ-కామాన్-యః-సర్వాన్-పుమాన్-చరతి-నిఃస్పృహః
నిర్మమః-నిరహంకారః-సః-శాంతిం-అధిగచ్ఛతి

యః= ఏ, పుమాన్= పురుషుడు, సర్వాన్=సమస్తములైన, కామాన్= కోరికలను, విహాయ=త్యజించి, నిఃస్పృహః= స్పృహలేనివాడై, నిర్మమః= మమకారము లేనివాడును, నిరహంకారః= అహంకారములేనివాడునునై, చరతి= చరించుచున్నాడో, సః=అట్టివాడు, శాంతిం= శాంతిని, అధిగచ్ఛతి= లభిస్తుంది.

కోరికలన్నింటిని త్యజించి, మమతా-అహంకార, వర్జితుడై శబ్దాదివిషయములపై ఎవనికి ఆశ లేదో అట్టి పురుషునకే శాంతిలభిస్తుంది.

72 ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ।

ఏషా-బ్రాహ్మీ-స్థితిః-పార్థ-న- ఏనాం-ప్రాప్య-విముహ్యతి
స్థిత్వా-అస్యాం-అంతకాలే-అపి-బ్రహ్మనిర్వాణం-ఋచ్ఛతి

పార్థ=అర్జునా, ఏషా= ఇది, బ్రాహ్మీస్థితిః= బ్రహ్మజ్ఞానియొక్క స్థితి, ఏనాం= దీనిని, ప్రాప్య= పొంది, న విముహ్యతి=మోహితుడు కాడు, అంతకాలే అపి= అంత్యకాలము నందు అస్యాం= ఈ యోగమునందు, స్థిత్వా=నిలిచి, బ్రహ్మనిర్వాణం= మోక్షము, ఋచ్ఛతి=పొందుచున్నాడు.

ఓ అర్జునా ! బ్రాహ్మీస్థితి యనగా ఇదియే. ఈ బ్రాహ్మీస్థితిని పొందిన యోగి ఎన్నడును మోహితుడు కాడు. అంత్యకాలము నందును ఈ బ్రాహ్మీస్థితియందు స్థిరముగానున్నవాడు బ్రహ్మానందరూపమగును మోక్షమును పొందు చున్నాడు.

ఓం తత్సదితి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

ఓం శ్రీ పరమాత్మనే నమః

అథ తృతీయోఽధ్యాయః - కర్మయోగః

అర్జున ఉవాచ

1 జ్యాయసీచేత్ కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।

తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ।

జ్యాయసీ - చేత్ -కర్మణః - తే - మతా - బుద్ధిః - జనార్దన

తత్-కిం-కర్మణి-ఘోరే-మాం-నియోజయసి-కేశవ

జనార్ధన = కృష్ణా, బుద్ధిః = జ్ఞానము, కర్మణః = కర్మకంటెను, జ్యాయసీ = మేలైనది, తే = నీ, మతా చేత్ = అభిప్రాయములో, కేశవ = శ్రీకృష్ణా, తత్ =అప్పుడు, ఘోరే = భయంకరమైన, కర్మణి = కర్మయందు, మాం =నన్ను, కిం నియోజయసి = ఏల నియోగించితివి ?

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! నీ అభిప్రాయమునుబట్టి కర్మకంటెను జ్ఞానమే శ్రేష్ఠమైనచో, భయంకరమైన ఈ యుద్ధకార్యమునందు నన్నేల నియోగించుచున్నావు ?

2 వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।

తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్ ।

వ్యామిశ్రేణ - ఇవ - వాక్యేన - బుద్ధిం - మోహయసి- ఇవ-మే

తత్- ఏకం-వద-నిశ్చిత్య -యేన-శ్రేయః-అహం- ఆప్నుయాం

వ్యామిశ్రేణ ఇవ = కలిసిపోయినట్లున్న, వాక్యేన = మాటలలో, మే = నా, బుద్ధిం = బుద్ధిని, మోహయసి ఇవ = భ్రమింప చేయుచున్నావు, అహం = నేను, యేన = దేనిచేత, శ్రేయః = శ్రేయమును, ఆప్నుయాం =పొందుదునో, తత్ = అట్టి, ఏకం = ఒక్కదానిని, నిశ్చిత్య = నిశ్చయించి, వద = చెప్పుము.

కలగాపులగమువంటి నీ మాటలతో నా బుద్ధి భ్రమకు లోనగునట్లు చేయుచున్నావు. కనుక నాకు శ్రేయస్కరమైన ఒక మార్గమును నిశ్చయముగా చెప్పుము.

శ్రీభగవాన్ ఉవాచ

3 లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।

జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ।

లోకే-అస్మిన్-ద్వివిధా-నిష్ఠా-పురా-ప్రోక్తా-మయా-అనఘ

జ్ఞానయోగేన-సాంఖ్యానాం-కర్మయోగేన-యోగినాం

అనఘ=పాపరహితుడవగు అర్జునా, అస్మిన్= ఈ, లోకే= లోకమునందు, పురా=పూర్వము, మయా=నాచే, సాంఖ్యానాం = సాంఖ్యులకు, జ్ఞానయోగేన= జ్ఞానయోగముచేతను, యోగినాం = యోగులకు, కర్మయోగేన= కర్మయోగముచేతను, ద్వివిధా= రెండువిధములగు, నిష్ఠా= నిష్ఠ, ప్రోక్తా= చెప్పబడినది.

శ్రీభగవానుడు పలికెను - ఓ పాపరహితుడవైన అర్జునా! ఈ లోకమున రెండు నిష్ఠలు గలవు. వానిలో సాంఖ్యయోగులకు జ్ఞానయోగముద్వారా యోగులకు కర్మయోగముద్వారా నిష్ఠకలుగును.

4 న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।

న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ।

న-కర్మణాం-అనారంభాత్-నైష్కర్మ్యం-పురుషః-అశ్నుతే

న-చ-సంన్యసనాత్- ఏవ-సిద్ధిం-సమధిగచ్ఛతి

పురుషః=మనుజుడు, కర్మణాం=కర్మలయొక్క, అనారంభాత్=చేయకపోవు టవలన, నైష్కర్మ్యం= నైష్కర్మ్యమును, న అశ్నుతే = పొందడు, సంన్యసనాత్ ఏవ = కర్మలను మాత్రము త్యజించుటవలననే, సిద్ధిం = సిద్ధిని, న సమధిగచ్ఛతి చ = పొందుటయును లేదు.

మనుష్యుడు కర్మలను చేయకపోవుటవలన యోగనిష్ఠాసిద్ధి అతనికి లభింపదు. అట్లే కేవలము కర్మలను త్యజించినంత మాత్రమున సిద్ధిని అనగా సాంఖ్యనిష్ఠను అతడు పొందడు.

5 న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।

కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః।

న-హి-కశ్చిత్-క్షణం-అపి-జాతు-తిష్ఠతి-అకర్మకృత్

కార్యతే-హి-అవశః-కర్మ-సర్వః-ప్రకృతిజైః-గుణైః

కశ్చిత్= ఎవడును, జాతు = ఒకప్పుడును, క్షణమపి = క్షణమైనను, అకర్మకృత్= కర్మచేయనివాడై, న తిష్ఠతి హి = ఉండలేడు, ప్రకృతిజైః= ప్రకృతివలన బుట్టిన, గుణైః= గుణములచేత, సర్వః= ప్రతివాడును, అవశః=అవశుడై, కర్మ = కర్మమును, కార్యతే హి = చేయింపబడుచున్నాడు.

ఎవడైనను ఏ కాలమునందైనను క్షణమాత్రముగూడ కర్మను ఆచరింపకుండ ఉండలేడు. మనుష్యులందరును ప్రకృతిసిద్ధములైన గుణములకు లోబడి కర్మలను చేయుటకు బాధ్యులగుదురు. ప్రతివ్యక్తియు అస్వతంత్రుడై కర్మను ఆచరింపవలసియే యుండును.

6 కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।

ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే।

కర్మేంద్రియాణి-సంయమ్య-యః- ఆస్తే-మనసా-స్మరన్

ఇంద్రియార్థాన్-విమూఢాత్మా-మిథ్యాచారః-సః- ఉచ్యతే

యః= ఎవడు, కర్మేంద్రియాణి = కర్మేంద్రియములను, సంయమ్య = బిగబట్టి, మనసా= మనస్సుచేతను, ఇంద్రియార్థాన్=శబ్దాది విషయములను, స్మరన్=స్మరించుచు, ఆస్తే= ఉండునో, సః=వాడు, విమూఢాత్మా= వివేకము లేనివాడు, మిథ్యాచారః=కపటియును అని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

బలవంతముగా, బాహ్యముగా ఇంద్రియవ్యాపారములను నిగ్రహించి, మానసికముగా ఇంద్రియవిషయములను చింతించునట్టి మూఢుని డంభాచారి అని కపటుడు అని అంటారు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

7 యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।

కర్మేంద్రియైః కర్మయోగమ్ అసక్తః స విశిష్యతే।

యః-తు- ఇంద్రియాణి-మనసా-నియమ్య- ఆరభతే-అర్జున

కర్మేంద్రియైః-కర్మయోగం-అసక్తః-సః-విశిష్యతే

అర్జున=అర్జునా, యః తు = ఎవడయితే, ఇంద్రియాణి = ఇంద్రియములను, మనసా=మనస్సుచేత, నియమ్య= నియమించి, కర్మేంద్రియైః= కర్మేంద్రియములచేతను, కర్మయోగం=కర్మయోగమును, అసక్తః= ఆసక్తిలేనివాడై, ఆరభతే=చేయునో, సః=వాడు, విశిష్యతే=అధికుడగుచున్నాడు.

అర్జునా! మనస్సుతో ఇంద్రియములను వశపఱచుకొని, అనాసక్తుడై ఇంద్రియములద్వారా కర్మయోగాచరణమును కావించు పురుషుడుత్తముడు.

8 నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।

శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః।

నియతం-కురు-కర్మ-త్వం-కర్మ-జ్యాయః-హి-అకర్మణః

శరీరయాత్రా-అపి-చ-తే-న-ప్రసిద్ధ్యేత్-అకర్మణః

త్వం=నీవు, నియతం=నియతమైన, కర్మ=కర్మను, కురు=చేయుము, అకర్మణః=కర్మచేయకుండుటకంటెను, కర్మ=కర్మ, జ్యాయః హి=శ్రేష్ఠముకదా, అకర్మణః=కర్మచేయని, తే=నీకు, శరీరయాత్రా అపి చ=శరీరయాత్రయును, న ప్రసిద్ధ్యేత్=సిద్ధింపదు.

నీవు శాస్త్రవిహితకర్తవ్యకర్మలను ఆచరింపుము. ఏలనన కర్మలను చేయకుండుటకంటెను చేయుటయే మేలుగదా! కర్మలను ఆచరింపనిచో నీ శరీరయాత్రగూడ సిద్ధింపదు.

9 యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।

తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర।

యజ్ఞార్థాత్-కర్మణః-అన్యత్ర-లోకః-అయం-కర్మబంధనః

తదర్థం-కర్మ-కౌంతేయ-ముక్తసంగః-సమాచర

కౌంతేయ-అర్జునా, యజ్ఞార్థాత్=యజ్ఞార్థమైన, కర్మణః=కర్మకంటెను, అన్యత్ర=అన్యమగు కర్మల వలనను, అయం= ఈ, లోకః=లోకము, కర్మబంధనః=కర్మమే బంధముగా గలది, తదర్థం=యజ్ఞము కొరకు, ముక్తసంగః=సంగమును విడిచినవాడవై, కర్మ= కర్మమును, సమాచర=చక్కగా ఆచరింపుము.

ఓ అర్జునా ! యజ్ఞార్థము చేయబడు కర్మలలో గాక ఇతర కర్మలయందు నిమగ్నులగుటవలన మనుష్యులు కర్మ బంధములలో చిక్కుపడుదురు. కనుక నీవు ఆసక్తిరహితుడవై యజ్ఞార్థమే కర్తవ్యకర్మలను చక్కగా ఆచరింపుము.

10 సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।

అనేన ప్రసవిష్యధ్వమ్ ఏషవోఽస్త్విష్టకామధుక్।

సహయజ్ఞాః-ప్రజాః-సృష్ట్వా-పురా- ఉవాచ-ప్రజాపతిః

అనేన-ప్రసవిష్యధ్వం- ఏషః-వః-అస్తు- ఇష్టకామధుక్

ప్రజాపతిః=బ్రహ్మ, పురా=పూర్వము, సహయజ్ఞాః=యజ్ఞములతోగూడిన, ప్రజాః=ప్రజలను, సృష్ట్వా=సృజించి, ఉవాచ=పలికెను, అనేన=దీనిచేతను, ప్రసవిష్యధ్వం=వృద్ధిచెందుడు, ఏషః= ఈ యజ్ఞము, వః=మీకు, ఇష్టకామధుక్= ఇష్టములను ఇచ్చునది, అస్తు= అగుగాక.

కల్పాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞసహితముగ ప్రజలను సృష్టించి, మీరు ఈ యజ్ఞములద్వారా వృద్ధిచెందుడు. ఈ యజ్ఞములు మీకు కామధేనువువలె కోరిన కోర్కెలన్నీ తీర్చునది అగుగాక.

11 దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।

పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ।

దేవాన్-భావయత-అనేన-తే-దేవాః-భావయంతు-వః

పరస్పరం-భావయంతః-శ్రేయః-పరం-అవాప్స్యథ

అనేన=వీనిద్వారా, దేవాన్=దేవతలను, భావయత=భావింపుడు, తే దేవాః= దేవతలు, వః=మిమ్ము, భావయంతు=భావింతురుగాక, పరస్పరం= ఒకరినొకరు, భావయంతః= భావించుచున్నవారలై, పరం=శ్రేష్ఠమైన, శ్రేయః=శ్రేయమును, అవాప్స్యథ= పొందగలరు.

ఈ యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపఱచుడు. మఱియు ఆ దేవతలు మిమ్ములను అనుగ్రహింతురు. నిస్స్వార్థభావముతో మీరు పరస్పరము సంతృప్తిపఱుచుకొనుచు పరమశ్రేయస్సును పొందగలరు.

12 ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।

తైర్దత్తానప్రదాయైభ్యో యోభుంక్తే స్తేన ఏవ సః।

ఇష్టాన్-భోగాన్-హి-వః-దేవాః-దాస్యంతే-యజ్ఞభావితాః

తైః-దత్తాన్-అప్రదాయ- ఏభ్యః-యః-భుంక్తే-స్తేనః - ఏవ-సః

యజ్ఞభావితాః= యజ్ఞములచేత సంభావింపబడినట్టి, దేవాః= దేవతలు, వః=మీకొరకు, ఇష్టాన్= ఇష్టములైన, భోగాన్=భోగములను, దాస్యంతేహి = ఇవ్వగలరు, తైః=వారిచేత, దత్తాన్= ఇవ్వబడినవానిని, ఏభ్యః=వీరికొరకు, అప్రదాయ= ఇవ్వక, యః= ఎవడు, భుంక్తే= భుజించునో, సః= వాడు, స్తేన ఏవ=చోరుడే

యజ్ఞములద్వారా సంతృప్తిని పొందిన దేవతలు మానవులకు అయాచితముగనే ఇష్టములైన భోగములను ప్రసాదించెదరు. ఈ విధముగ దేవతలచే అనుగ్రహింపబడిన ఈ భోగములను ఆదేవతలకు నివేదనచేయక తానే అనుభవించువాడు నిజముగా చోరుడగును.

13 యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ।

యజ్ఞశిష్టాశినః-సంతః-ముచ్యంతే-సర్వకిల్బిషైః
భుంజతే-తేతు-అఘం-పాపాః-యే-పచంతి- ఆత్మకారణాత్

యే తు = ఎవరైతే, ఆత్మకారణాత్= తమ శరీరపోషణార్థము, పచంతి=పచనము చేయుచున్నారో, పాపాః=పాపులైన, తే=వారు, అఘం=పాపమును, భుంజతే=భుజించు చున్నారు, సంతః=సత్పురుషులు, యజ్ఞశిష్టాశినః= యజ్ఞశేషమును అనుభవించుచు, సర్వకిల్బిషైః= సమస్త పాపములనుండి, ముచ్యంతే=విముక్తులగుచున్నారు.

యజ్ఞశిష్టాన్నమును తిను శ్రేష్ఠపురుషులు అన్ని పాపముల నుండి ముక్తులయ్యెదరు. తమ శరీరపోషణకొఱకే ఆహారమును సిద్ధపఱచు కొను పాపులు పాపమునారగించినవారైవున్నారు.

14 అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ।

అన్నాత్-భవంతి-భూతాని-పర్జన్యాత్-అన్నసంభవః
యజ్ఞాత్-భవతి-పర్జన్యః-యజ్ఞః-కర్మసముద్భవః

అన్నాత్=అన్నమువలన, భూతాని=ప్రాణులు, భవంతి=కలుగుచున్నవి, పర్జన్యాత్= మేఘమువలన, అన్నసంభవః= అన్నము కలుగుచున్నది, యజ్ఞాత్= యజ్ఞమువలన, పర్జన్యః= మేఘుడు, భవతి= కలుగుచున్నాడు, యజ్ఞః= యజ్ఞము, కర్మసముద్భవః= కర్మమువలన కలుగుచున్నది.

ప్రాణులన్నియు అన్నము నుండి జన్మించును. అన్నోత్పత్తి మేఘముల వలన ఏర్పడును. మేఘము యజ్ఞములవలన కలుగుతోంది.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

15 కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।

తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ।

కర్మ-బ్రహ్మోద్భవం-విద్ధి-బ్రహ్మ-అక్షరసముద్భవం

తస్మాత్-సర్వగతం-బ్రహ్మ-నిత్యం-యజ్ఞే-ప్రతిష్ఠితం

కర్మ=కర్మము, బ్రహ్మోద్భవం= వేదము వలన ఉత్పన్నమైనదిగను, బ్రహ్మ=బ్రహ్మము, అక్షర సముద్భవం=అక్షరస్వరూపుని నుండి ఉత్పన్నమైనదిగను, విద్ధి=తెలిసికొనుము, తస్మాత్=అందువలన, సర్వగతం=సర్వవ్యాపకమైన, బ్రహ్మ = బ్రహ్మము, నిత్యం= సదా, యజ్ఞే= యజ్ఞమునందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠితమై యున్నది.

సత్కర్మలు యజ్ఞములకు మూలములు. వేదములు సత్కర్మలకు మూలములు. వేదములు పరబ్రహ్మనుండి ఉద్భవించినవని తెలిసికొనుము. అందువలన సర్వవ్యాపకుడగు పరమాత్మ సర్వదా యజ్ఞములయందే ప్రతిష్ఠితుడై యున్నాడు.

16 ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।

అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ।

ఏవం-ప్రవర్తితం-చక్రం-న-అనువర్తయతి- ఇహ-యః

అఘాయుః- ఇంద్రియారామః-మోఘం-పార్థ-సః-జీవతి

పార్థ= అర్జునా, ఏవం= ఈ విధముగ, ప్రవర్తితం= ప్రవర్తింపబడిన, చక్రం = సృష్టి చక్రమును, ఇహ= ఈ లోకమునందు, యః = ఎవడు, న అనువర్తయతి= అనుసరించి జీవించడో, సః = వాడు, అఘాయుః= పాపమే ఆయువుగా గలవాడును, ఇంద్రియారామః= ఇంద్రియ విషయాసక్తుడునై, మోఘం= వ్యర్థముగా, జీవతి = జీవించుచున్నాడు.

ఓ అర్జునా! ఈప్రకారముగా కొనసాగుచున్న సృష్టిచక్రమునకు అనుకూలముగా ప్రవర్తింపనివాడు అనగా తన కర్తవ్యములను పాటింపక ఇంద్రియసుఖలోలుడైన వాడు పాపి. అట్టివాని జీవితము వ్యర్థము

17 యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః ।

ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే ॥

యః-తు- ఆత్మరతిః- ఏవ-స్యాత్- ఆత్మతృప్తః - చ-మానవః

ఆత్మని - ఏవ -చ-సంతుష్టః-తస్య-కార్యం-న-విద్యతే

యః మానవః తు = ఎవడయితే, ఆత్మరతిః ఏవ = ఆత్మయందే ప్రీతిగలవాడు, ఆత్మతృప్తః చ = ఆత్మచేతనే తృప్తిని బొందువాడును, ఆత్మని ఏవ = ఆత్మయందే, సంతుష్టః చ = సంతోషపడువాడు, స్యాత్ = అగునో, తస్య = వానికి, కార్యం = కావలసిన పని, న విద్యతే = లేదు.

ఎవడు కేవలము ఆత్మయందే క్రీడించుచు ఆత్మయందే సంతుష్టుడై యుండునో, అట్టి జ్ఞానికి చేయదగిన కార్యమేదియులేదు.

18 నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।

న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥

న- ఏవ-తస్య-కృతేన-అర్థః-న-అకృతేన- ఇహ-కశ్చన

న-చ-అస్య-సర్వభూతేషు-కశ్చిత్-అర్థ వ్యపాశ్రయః

తస్య= అట్టివానికి, ఇహ= ఈ లోకమునందు, కృతేన= కర్మము చేయుటచేత, అర్థః=ప్రయోజనము, న ఏవ=లేనేలేదు, అకృతే న = కర్మము చేయకపోవుటచేత, కశ్చన= ఏమియును, న=లేదు, చ = మరియు, అస్య= ఇతనికి, సర్వభూతేషు = సర్వభూతముల యందును, అర్థవ్యపాశ్రయః= ప్రయోజనమును గోరిన ఆశ్రయము, కశ్చిత్= ఒకటియును, న = లేదు.

అట్టి మహాత్ముడు ఈ జగత్తునందు కర్మలు చేయుటవలన ప్రయోజనముగాని, చేయకుండుట వలనను దోషముగాని ఉండదు. అనగా అతనికి సర్వప్రాణులతోడను స్వార్థపరమైన సంబంధము ఏ విధముగను లేదు.

19 తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।

అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

తస్మాత్-అసక్తః-సతతం-కార్యం-కర్మ-సమాచర

అసక్తః-హి- ఆచరన్-కర్మ-పరం- ఆప్నోతి-పూరుషః

తస్మాత్ = అందువలన, అసక్తః= ఫలాసక్తి లేనివాడవై, సతతం= ఎల్లప్పుడును, కార్యం=చేయదగిన, కర్మ = కర్మమును, సమాచర = లెస్సగా జేయుము, అసక్తతః= సంగత్వము లేనివాడై, కర్మ = కర్మమును, ఆచరన్ = చేయుచున్న, పూరుషః = పురుషుడు, పరం = మోక్షమును, ఆప్నోతి హి = పొందుచున్నాడు గదా.

అందువలన నీవు నిరంతరము ఫలాపేక్ష లేనివాడవై కర్తవ్య కర్మలను చక్కగా ఆచరింపుము. ఫలాపేక్ష వీడి కర్మలను సదా ఆచరించు మనుష్యునకు పరమాత్మ ప్రాప్తి కలుగును.

20 కర్మణైవ హి సంసిద్ధిమ్ ఆస్థితా జనకాదయః ।

లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥

కర్మణా- ఏవ-హి - సంసిద్ధిం- ఆస్థితాః-జనకాదయః

లోకసంగ్రహం- ఏవ-అపి-సంపశ్యం-కర్తుం అర్హసి

జనకాదయః= జనకుడు మొదలగువారు, కర్మణా ఏవ=కర్మద్వారానే, సంసిద్ధిం = సంసిద్ధిని, ఆస్థితాః హి = పొందిరిగదా, లోకసంగ్రహం ఏవ అపి = లోక కళ్యాణమునే, సంపశ్యన్ = లెస్సగా విచారించువాడవై, కర్తుం = కర్మ చేయుటకు, అర్హసి = తగియున్నావు.

జనకుడు మున్నగువారు ఆసక్తి రహితముగా కర్మలను ఆచరించుటవలననే పరమసిద్ధిని పొందిరి. కావున నీవును లోకహితార్థమై కర్మలను చేయవలయును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

21 యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।

స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥

యత్-యత్- ఆచరతి-శ్రేష్ఠః-తత్-తత్- ఏవ-తరః-జనః

సః-యత్-ప్రమాణం-కురుతే-లోకః - తత్-అనువర్తతే

యత్ యత్= ఎద్దానిని, శ్రేష్ఠః= శ్రేష్ఠుడు, ఆచరతి = ఆచరించునో, తత్తత్ ఏవ = అద్దానినే, ఇతరః = ఇతరమైన, జనః=జనము, (చేయును), సః=అతడు, యత్ = ఏది, ప్రమాణం = ప్రమాణముగ, కురుతే = చేయునో, లోకః=లోకము, తత్=దానిని, అనువర్తతే= అనుసరించుచున్నది.

శ్రేష్ఠుడైన పురుషుడు ఏది ఆచరించునో ఇతరులును దానిని అనుసరింతురు. అనగా ఏ ప్ర మా ణము అతడు నిల్పినో ఇతరులు గ్రహింతురు.

22 న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।

నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

న-మే-పార్థ-అస్తి-కర్త వ్యం-త్రిషు-లోకేషు-కించన

న-అనవాప్తం-అవాప్తవ్యం-వర్తే- ఏవ-చ- కర్మణి

పార్థ=అర్జునా, మే = నాకు, త్రిషు లోకేషు = ముల్లోకములయందును, కర్తవ్యం= చేయదగినది, కించన= కొంచెమైనను, న అస్తి=లేదు, అనవాప్తం =పొందబడనిదియు, అవాప్తవ్యం = పొందవలసినదియు, న=లేదు, కర్మణి = కర్మమునందే, వర్తే ఏవ చ= ఉన్నానుగదా.

ఓ అర్జునా! ఈ ముల్లోకములయందును నాకు కర్తవ్యము అనునదియే లేదు. అట్లే పొందదగిన వస్తువులలో ఏదియును నేను పొందనిదియును లేదు. ఐనను నేను కర్మలను చేయుచునే ఉన్నాను.

23 యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।

మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥

యది-హి-అహం-న-వర్తేయం-జాతు-కర్మణి-అతంద్రితః

మమ-వర్త్మ-అనువర్తన్తే-మనుష్యాః-పార్థ-సర్వశః

పార్థ=అర్జునా, అహం = నేను, జాతు = ఒకవేళ, అతంద్రితః= అప్రమత్తుడనై, కర్మణి= కర్మయందు, న వర్తేయం యది= ప్రవర్తింపకుందునేని, మనుష్యాః= మనుజులు, సర్వశః = సర్వవిధములను, మమ = నాయొక్క, వర్త్మ=మార్గమును, అనువర్తంతే హి = అనుసరించి ప్రవర్తింతురు గదా

ఓ పార్థా! ఎప్పుడైనను నేను సావధానుడనై కర్మలయందు ప్రవర్తింపకున్నచో లోకమునకు గొప్పహాని వాటిల్లును. ఎందుకనగా మనుష్యులందరును సర్వ విధముల నా మార్గమునే అనుసరించుచున్నారు.

24 ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।

సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యామిమాః ప్రజాః ॥

ఉత్సీదేయుః - ఇమే-లోకాః-న-కుర్యాం-కర్మ-చేత్-అహం

సంకరస్య-చ-కర్తా-స్యాం- ఉపహన్యాం- ఇమాః-ప్రజాః

అహం=నేను, కర్మ=కర్మమును, న కుర్యాం చేత్=చేయనిచో, ఇమే = ఈ, లోకాః= లోకములు, ఉత్సీదేయుః = నశించును, సంకరస్య చ = వర్ణసంకరమునకు, కర్తా = కర్తను, స్యాం = అగుదును, ఇమాః = ఈ, ప్రజాః = జనులను, ఉపహన్యాం = చెడగొట్టినవాడనగుదును.

నేను కర్మలను ఆచరించుట మానినచో ఈ లోకములన్నియును నశించును. అంతేగాదు. లోకములందు అల్లకల్లోలములు ఏర్పడును. ప్రజానష్టము వాటిల్లును. అప్పుడు అందులకు నేనే కారకుడనయ్యెదను.

25 సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।

కుర్యాద్విద్వాంస్తథాసక్తః చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥

సక్తాః-కర్మణి-అవిద్వాంసః-యథా-కుర్వంతి-భారత

కుర్యాత్-విద్వాన్-తథా-అసక్తః-చికీర్షుః-లోకసంగ్రహం

భారత= అర్జునా, అవిద్వాంసః= పామరుడు, కర్మణి=కర్మయందు, సక్తాః=ఫలాపేక్ష కలిగి, యథా = ఎటుల, కుర్వంతి=చేయుచున్నారో, తథా=అట్లే, విద్వాన్= జ్ఞాని, లోకసంగ్రహం = లోకసంగ్రహమును, చికీర్షుః= చేయగోరినవాడై, అసక్తః= ఫలాపేక్ష లేక, కుర్యాత్ = చేయవలెను.

ఓ అర్జునా! అజ్ఞానులు కర్మలయందు ఆసక్తులై వాటిని ఆచరించినట్లుగా జ్ఞాని కూడా లోకహితార్థమై ఫలాపేక్షలేక కర్మలను చేయవలెను.

26 న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్ ।

జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥

న-బుద్ధిభేదం -జనయేత్-అజ్ఞానాం-కర్మసంగినాం

జోషయేత్ = సర్వకర్మాణి-విద్వాన్-యుక్తః-సమాచరన్

కర్మసంగినాం=కర్మఫలాసక్తులైన, అజ్ఞానాం=పామరులకు, బుద్ధిభేదం= బుద్ధిసంశయమును, న జనయేత్=పుట్టింపగూడదు, యుక్తః=యోగయుక్తుడైన, విద్వాన్= జ్ఞాని, సర్వకర్మాణి= సమస్త కర్మములను, సమాచరన్=చక్కగా ఆచరించుచున్నవాడై, జోషయేత్ = చేయింపవలయును.

పరమాత్మస్వరూపమునందు నిశ్చలస్థితిని పొందిన జ్ఞాని శాస్త్రవిహిత కర్మలను ఫలాసక్తితో ఆచరించు అజ్ఞానులబుద్ధులను భ్రమకులోనుచేయరాదు. అనగా కర్మలయందు వారికి అశ్రద్ధను కలిగింపరాదు. పైగా తానుకూడ శాస్త్రవిహితములైన సమస్తకర్మలను చక్కగా చేయుచు వారితోగూడ అట్లే చేయింపవలెను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

27 ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।

అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే ॥

ప్రకృతేః-క్రియమాణాని-గుణైః-కర్మాణి-సర్వశః

అహంకార విమూఢాత్మా-కర్తా-అహం- ఇతి-మన్యతే

ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణైః = గుణములచేత, సర్వశః= నానావిధములుగను, క్రియమాణాని = చేయబడుచున్న, కర్మాణి = కర్మలను, అహం = నేను, కర్తా ఇతి = చేయువాడనని, అహంకార విమూఢాత్మా =అహంకారముచేత వివేకమును కోల్పోయినవాడు, మన్యతే = తలచుచున్నాడు.

వాస్తవముగా కర్మలన్నియును అన్నివిధముల ప్రకృతి గుణముల ద్వారానే చేయబడుచుండును. అహంకార విమూఢాత్ముడు ఈ కర్మలకు నేనే కర్తను అని భావించుచున్నాడు.

28 తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।

గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥

తత్త్వవిత్-తు-మహాబాహో-గుణకర్మ విభాగయోః।

గుణాః-గుణేషు-వర్తంతే- ఇతి -మత్వా - న- సజ్జతే

మహాబాహో = అర్జునా, గుణకర్మ విభాగయోః = గుణకర్మముల విభజనయొక్క, తత్త్వవిత్ తు = జ్ఞాని, గుణాః = గుణములు, గుణేషు = ఇంద్రియ విషయములందు, వర్తంతే ఇతి = ప్రవర్తించుచున్నవని, మత్వా = తలచి, న సజ్జతే = ఆసక్తి నొందడు.

ఓ మహాబాహో ! అర్జునా! గుణవిభాగతత్త్వమును, కర్మవిభాగ తత్త్వమును తెలిసికొన్న జ్ఞానయోగి గుణములే గుణములయందు ప్రవర్తిల్లుచున్నవని భావించి, వాటియందు ఆసక్తి నొందడు.

29 ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు ।

తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥

ప్రకృతేః- గుణసమ్మూఢాః - సజ్జంతే-గుణకర్మసు

తాన్-అకృత్స్నవిదః-మందాన్-కృత్స్నవిత్-న-విచాలయేత్

ప్రకృతేః = ప్రకృతియొక్క, గుణసమ్మూఢాః=గుణములచే సమ్మోహమును బొందినవారలై, గుణకర్మసు = గుణకర్మములయందు, సజ్జంతే = ఆసక్తులగుచున్నారు, అకృత్స్నవిదః=విజ్ఞులుకాని, మందాన్=మందమతులైన, తాన్ = వారిని, కృత్స్నవిత్ = విజ్ఞుడు, న విచాలయేత్= చలింపజేయగూడదు.

ప్రకృతిగుణములచే పూర్తిగా మోహితులైన మనుష్యులు ఆ గుణములయందును, కర్మలయందును మిక్కిలి ఆసక్తులగుదురు. అట్టి కర్మసంగులగు అల్పజ్ఞులను, మందబుద్ధులైన అజ్ఞానులను పూర్తిగా తెలిసిన జ్ఞానియైనవాడు భ్రమకు గురిచేయరాదు.

30 మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।

నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥

మయి-సర్వాణి-కర్మాణి-సంన్యస్య-అధ్యాత్మ చేతసా

నిరాశీః-నిర్మమః-భూత్వా-యుధ్యస్వ-విగతజ్వరః

సర్వాణి-సమస్తమైన, కర్మాణి=కర్మములను, మయి = నాయందు, అధ్యాత్మచేతసా=ధ్యానచిత్తముతో, సంన్యస్య = ఉంచి, నిరాశీః= ఆశ లేనివాడవును, నిర్మమః=మమకారము లేనివాడవును, విగతజ్వరః=సంతాపరహితుడవును, భూత్వా = అయి, యుధ్యస్వ= యుద్ధముచేయుము.

సమస్త కర్మలు నాయందు సమర్పించి, ఆశగాని, మమకారముగాని లేనివాడవై నిర్భయముగా యుద్ధము చేయుము.

31 యే మే మతమిదం నిత్యమ్ అనుతిష్ఠంతి మానవాః ।

శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః ॥

యే-మే-మతం - ఇదం-నిత్యం-అనుతిష్ఠంతి-మానవాః

శ్రద్ధావంతః-అనసూయంతః-ముచ్యంతే-అపి-కర్మభిః

శ్రద్ధావంతః=శ్రద్ధగలవారును, అనసూయంతః=అసూయలేనివారును, యేమానవాః= ఏ మనుజులు, మే = నాయొక్క, ఇదం మతం = ఈ అభిప్రాయమును, నిత్యం=సదా, అనుతిష్ఠంతి= అనుసరించుచున్నారో, తే అపి = వారుగూడ, కర్మభిః= కర్మలచేతను, ముచ్యంతే = విడువబడుచున్నారు.

శ్రద్ధాయుక్తులై అసూయలేనివారై నా ఈ మతమును అనుసరించు మానవులుగూడ సమస్త కర్మబంధముల నుండి విడివడుచున్నారు.

32 యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్ ।

సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥

యే-తు- ఏతత్-అభ్యసూయంతః-న-అనుతిష్ఠంతిః-మే-మతం

సర్వజ్ఞాన విమూఢాన్-తాన్-విద్ధి-నష్టాన్-అచేతసః

యే తు- ఎవరయితే, మే = నాయొక్క, ఏతత్ మతం= ఈ అభిప్రాయమును, అభ్యసూయంతః=అసూయగలవారై, న అనుతిష్ఠంతి= అనుసరింపరో, అచేతసః= మూర్ఖులను, సర్వజ్ఞానవిమూఢాన్ = సర్వజ్ఞానశూన్యులను అగు, తాన్= వారిని, నష్టాన్= భ్రష్టులుగను, విద్ధి = గ్రహించుము.

ఈ ఉపదేశమును అనుసరింపని మూర్ఖులు సమస్త ప్రాపంచిక విషయములయందును మోహితులై భ్రష్టులై, కష్టనష్టముల పాలయ్యెదరని గ్రహింపుము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

33 సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।

ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥

సదృశం-చేష్టతే-స్వస్యాః-ప్రకృతేః-జ్ఞానవాన్-అపి

ప్రకృతిం-యాంతి-భూతాని-నిగ్రహః-కిం-కరిష్యతి

జ్ఞానవాన్ అపి =జ్ఞానవంతుడుకూడా, స్వస్యాః=తనయొక్క, ప్రకృతేః=ప్రకృతికి, సదృశం =సమానముగునటుల, చేష్టతే = నడచుకొనుచున్నాడు, భూతాని = ప్రాణులు, ప్రకృతిం = ప్రకృతిని, యాంతి = పొందుచున్నవి, నిగ్రహః= నిగ్రహము, కిం = ఏమి, కరిష్యతి = చేయగలదు.

సమస్త ప్రాణులును తమ తమ ప్రకృతులను అనుసరించి స్వభావములకు లోబడి కర్మలు చేయుచుండును. జ్ఞానియు తన ప్రకృతిని అనుసరించియే క్రియలను ఆచరించును. కావున నిగ్రహమేమి చేయగలదు.

34 ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।

తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ ॥

ఇంద్రియస్య- ఇంద్రియస్య-అర్థే-రాగద్వేషౌ-వ్యవస్థితౌ

తయోః-న-వశం- ఆగచ్ఛేత్-తౌ-హి-అస్య-పరిపంథినౌ

ఇంద్రియస్య = ఇంద్రియమునకు, ఇంద్రియస్య అర్థే = ఇంద్రియ విషయమునందు, రాగద్వేషౌ= రాగద్వేషములు, వ్యవస్థితౌ = ఏర్పడియున్నవి, తయోః= ఆ రాగద్వేషములకు, వశం= వశమును, న ఆగచ్ఛేత్ = పొందగూడదు, తౌ = ఆ రాగద్వేషములు, అస్య = ఈ జ్ఞానికి, పరిపంథినౌ హి = శత్రువులు గదా.

ప్రతి ఇంద్రియార్థమునందును రాగద్వేషములు దాగియున్నవి. మనుష్యుడు ఈ రెండింటికిని వశము కాకూడదు. ఏలనన ఈ రెండే మానవుని శ్రేయస్సునకు విఘ్నకారకములు, ప్రబలశత్రువులుగదా!

35 శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।

స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

శ్రేయాన్-స్వధర్మః-విగుణః-పరధర్మాత్-స్వనుష్ఠితాత్

స్వధర్మే-నిధనం-శ్రేయః-పరధర్మః-భయావహః

స్వనుష్ఠితాత్=బాగుగా ఆచరింపబడిన, పరధర్మాత్=పరధర్మము కంటెను, విగుణః= గుణరహితమైన, స్వధర్మః=తనధర్మము, శ్రేయాన్ = మేలైనది, స్వధర్మే=స్వధర్మము నందు, నిధనం= చావు, శ్రేయః= మంచిది, పరధర్మః= అన్యమైన ధర్మము, భయావహః=భయంకరమైనది.

పరధర్మమునందు ఎన్నో సుగుణములు ఉన్నను స్వధర్మమునందు అంతగా సుగుణములు లేకున్నను చక్కగా అనుష్ఠింపబడు ఆ పరధర్మముకంటెను స్వధర్మాచరణమే ఉత్తమము. స్వధర్మాచరణమునందు మరణించుటయు శ్రేయస్కరమే. పరధర్మాచరణము భయంకరమైనది.

అర్జున ఉవాచ

36 అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।

అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥

అథ-కేన-ప్రయుక్తః-అయం-పాపం-చరతి-పూరుషః

అనిచ్ఛన్-అపి-వార్ష్ణేయ-బలాత్- ఇవ-నియోజితః

వార్ష్ణేయ = కృష్ణా, అథ = అట్లైన, అయం = ఈ, పూరుషః= పురుషుడు, అనిచ్ఛన్ అపి = ఇష్టములేనివాడైనను, బలాత్= బలవంతముగను, నియోజితః ఇవ = నియమింపబడిన వానివలె, కేన = దేనిచేత, ప్రయుక్తః= ప్రేరేపింపబడినవాడగుచు, పాపం = పాపమును, చరతి = చేయుచున్నాడు.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! మానవుడు తనకు ఇష్టము లేకున్నను బలాత్కారముగా దేని ప్రభావముచే ప్రేరితుడై పాపములను చేయుచున్నాడు?

శ్రీభగవాన్ ఉవాచ

37 కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।

మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

కామః- ఏషః-క్రోధః- ఏషః - రజోగుణ సముద్భవః

మహాశనః-మహాపాప్మా-విద్ధి - ఏనం- ఇహ- వైరిణం

ఏషః= ఇది, రజోగుణసముద్భవః = రజోగుణమువలన గలిగిన, కామః = కామము, ఏషః = ఇది, క్రోధః= క్రోధము, మహాశనః = తృప్తినొందనిది, మహాపాప్మా = గొప్ప పాపముగలది, ఏనం = దీనిని, ఇహ= ఈ యోగమునందు, వైరిణం= శత్రువుగా, విద్ధి = తెలిసికొనుము.

శ్రీభగవానుడు పలికెను - రజోగుణమునుండి ఉత్పన్నమగునదే కామము. ఇదియే క్రోధరూపముగా మారును. ఇది తృప్తిలేనిది. పైగా అంతులేని పాపకర్మాచరణములకు ఇదియే ప్రేరకము. కనుక ఈ కామము మోక్షమునకు పరమశత్రువుగా ఎఱుంగుము.

38 ధూమేనావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ।

యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥

ధూమేన - ఆవ్రియతే - వహ్నిః -యథా- ఆదర్శః - మలేన-చ

యథా - ఉల్బేన - ఆవృతః - గర్భః -తథా-తేన- ఇదం - ఆవృతం

యథా = ఏ విధముగా, ధూమేన - పొగచేత, వహ్నిః = అగ్ని, ఆవ్రియతే = కప్పబడుచున్నదో, యథా = ఏవిధముగా, ఆదర్శః చ = అద్దము, మలేన = మాలిన్యముచేత, ఉల్బేన = మావిచేత, గర్భః = శిశువు, ఆవృతః = కప్పబడుచున్నదో, తథా = ఆ రీతిగనే, తేన = దానిచేత, ఇదం = ఇది, ఆవృతం = కప్పబడినది.

పొగచే అగ్నియు, మురికిచే అద్దము, మావిచే గర్భము కప్పివేయబడునట్లు, జ్ఞానము కామముచే కప్పబడి యుండును.

39 ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।

కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥

ఆవృతం- జ్ఞానం - ఏతేన- జ్ఞానినః-నిత్యవైరిణా

కామరూపేణ - కౌంతేయ-దుష్పూరేణ-అనలేన-చ

కౌంతేయ=అర్జునా, దుష్పూరేణ = నింపశక్యముకానిదియును, అనలేన చ = అగ్ని వంటిదియును, కామరూపేణ = కామరూపమైనదియును, జ్ఞానినః = జ్ఞానికి, నిత్యవైరిణా= నిత్యశత్రువును అగు, ఏతేన = దీనిచేతను, జ్ఞానం=జ్ఞానము, ఆవృతం= కప్పబడియున్నది.

ఓ అర్జునా ! కామము అగ్నితో సమానమైనది. అది ఎన్నటికీని చల్లారదు. జ్ఞానులకు అది నిత్య శత్రువు. అది మనుష్యుని జ్ఞానమును వేయనున్నది.

40 ఇంద్రియాణి మనో బుద్ధిః అస్యాధిష్ఠానముచ్యతే ।

ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥

ఇంద్రియాణి-మనః-బుద్ధిః-అస్య-అధిష్ఠానం- ఉచ్యతే

ఏతైః-విమోహయతి- ఏషః-జ్ఞానం- ఆవృత్య- దేహినం

అస్య= ఈ కామమునకు, ఇంద్రియాణి = ఇంద్రియములు, మనః= మనస్సు, బుద్ధిః= బుద్ధియును, అధిష్ఠానం = ఆధారముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది, ఏషః= ఇది, ఏతైః = వీనిచేత, జ్ఞానం = జ్ఞానమును, ఆవృత్య = కప్పి, దేహినం = పురుషుని, విమోహయతి = మోహపెట్టుచున్నది.

కామమునకు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి నివాసస్థానములు. ఈ కామము మనో బుద్ధీంద్రియముల ద్వారా జ్ఞానమును కప్పివేసి, జీవాత్మను మోహితునిగా చేయును.

41 తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।

పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥

తస్మాత్ -త్వం- ఇంద్రియాణి - ఆదౌ-నియమ్య- భరతర్షభ

పాప్మానం - ప్రజహి-హి- ఏనం-జ్ఞాన విజ్ఞాన నాశనం

భరతర్షభ = అర్జునా, తస్మాత్ = అందువలన, త్వం = నీవు, ఆదౌ - మొదట, ఇంద్రియాణి = ఇంద్రియములను, నియమ్య = నియమించి, జ్ఞాన విజ్ఞాన నాశనం = జ్ఞానవిజ్ఞానములను నాశనము చేయునట్టి, పాప్మానం = పాపవంతమునైన, ఏనం = దీనిని, ప్రజహి హి = విడువుము.

కావున ఓ అర్జునా ! మొదట ఇంద్రియములను వశపఱచుకొనుము. పిదప జ్ఞానవిజ్ఞానములను నశింపజేయునట్టి మహాపాపియైన ఈ కామమును అవశ్యముగా సర్వశక్తులనొడ్డి పూర్తిగా విడువుము.

42 ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।

మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥

ఇంద్రియాణి-పరాణి- ఆహుః - ఇంద్రియేభ్యః - పరం-మనః

మనసః-తు-పరా-బుద్ధిః-యః-బుద్ధేః-పరతః-తు-సః

ఇంద్రియాణి - ఇంద్రియములు, పరాణి = గొప్పవి, ఇంద్రియేభ్యః= ఇంద్రియముల కంటెను, మనః = మనస్సు, పరం = గొప్పది, మనసః తు= మనస్సుకంటెను, బుద్ధిః= బుద్ధి, పరా = గొప్పది, యః తు= ఎవడయితే, బుద్ధేః = బుద్ధికంటెను, పరతః = గొప్పవాడో, సః = వాడేయని, ఆహుః = చెప్పుదురు.

స్థూలశరీరముకంటెను ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియముల కంటెను మనస్సు, దానికంటెను బుద్ధి గొప్పది. ఆ బుద్ధి కంటెను మిక్కిలి గొప్పది, సూక్ష్మమైనది ఆత్మ.

43 ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।

జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥

ఏవం - బుద్ధేః -పరం-బుద్ధ్వా-సంస్తభ్య- ఆత్మానం- ఆత్మనా

జహి- శత్రుం-మహాబాహో- కామరూపం - దురాసదం

మహాబాహో= అర్జునా, ఏవం = ఈవిధముగా, బుద్ధేః= బుద్ధికంటెను,పరం = శ్రేష్ఠమైన దానిని, బుద్ధ్వా = తెలుసుకొని, ఆత్మానం = తనను, ఆత్మనా = ఆత్మచేతను, సంస్తభ్య= నియమించి, కామరూపం = కామస్వరూపమైన, దురాసదం = జయింపశక్యముగాని, శత్రుం = శత్రువును, జహి = సంహరింపుము.

ఈ విధముగా బుద్ధికంటెను ఆత్మ అతీతమైనదని తెలిసికొని, ఓ మహాబాహో! బుద్ధిద్వారా మనస్సును వశపఱచుకొని, జయింపశక్యముకాని శత్రువైన కామమును సంహరింపుము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ

తృతీయోఽధ్యాయః

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ చతుర్థోఽధ్యాయః - జ్ఞానకర్మసన్న్యాస యోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।

వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

ఇమం-వివస్వతే-యోగం- ప్రోక్తవాన్-అహం-అవ్యయం

వివస్వాన్-మనవే-ప్రాహ-మనుః- ఇక్ష్వాకవే - అబ్రవీత్

అవ్యయం=అవినాశియైన, ఇమం యోగం= ఈ యోగమును, వివస్వతే = సూర్యునికొరకు, అహం= నేను, ప్రోక్తవాన్ = చెప్పితిని, వివస్వాన్ = సూర్యుడు, మనవే = మనువుకొరకు, ప్రాహ= చెప్పెను, మనుః = మనువు, ఇక్ష్వాకునికొరకు, అబ్రవీత్= చెప్పెను.

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను - నేను నిత్యసత్యమైన ఈ యోగమును సూర్యునకు తెలిపితిని. సూర్యుడు తన పుత్రుడైన వైవస్వతమనువునకు దీనిని బోధించెను. ఆ మనువు తన కుమారుడైన ఇక్ష్వాకునకు చెప్పెను.

2 ఏవం పరంపరాప్రాప్తమ్ ఇమం రాజర్షయో విదుః ।

స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥

ఏవం-పరంపరాప్రాప్తం- ఇమం-రాజర్షయః-విదుః

సః-కాలేన - ఇహ-మహతా-యోగః-నష్టః-పరంతప

పరంతప= అర్జునా, ఏవం = ఈ రీతిగ, పరంపరా ప్రాప్తం = పరంపరగా వచ్చిన, ఇమం = ఈ యోగమును, రాజర్షయః= రాజర్షులు, విదుః=తెలిసికొని యుండిరి, సః= ఆ, యోగః = యోగము, మహతా = చాలా, కాలేన = కాలమునకు, ఇహ = ఇప్పుడు, నష్టః = నశించినది.

ఓ పరంతపా ! ఈ విధముగ పరంపరగా వచ్చిన ఈ యోగమును రాజర్షులు తెలిసికొనిరి. కాని అనంతరము ఈ యోగము కాలక్రమమున భూలోకమునందు అగుపించుటలేదు.

3 స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।

భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥

సః- ఏవ-అయం-మయా-తే-అద్య-యోగః-ప్రోక్తః పురాతనః

భక్తః-అసి-మే-సఖా-చ- ఇతి-రహస్యం-హి- ఏతత్ - ఉత్తమం

పురాతనః = ప్రాచీనమైన, సః = ఆ, యోగః ఏవ = యోగమే, మే = నా యొక్క, భక్తః = భక్తుడవు, సఖా చ = సఖుడవును, అసి ఇతి = అయియున్నావని, తే = నీకు, అద్య = ఇప్పుడు, మయా = నాచేతను, అయం = ఇది, ప్రోక్తః = చెప్పబడినది, ఏతత్ = ఇది, ఉత్తమం = శ్రేష్ఠమైనది, రహస్యం హి = రహస్యమైనది గదా.

ఈ యోగము అతి ఉత్తమమైనది. రహస్యముగా ఉంచదగినది. నీవు నాకు భక్తుడవు. ప్రియసఖుడవు. కనుక మిక్కిలి పురాతనమైన ఈ యోగమును నీకు తెలిపితిని.

అర్జున ఉవాచ

4 అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।

కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥

అపరం-భవతః-జన్మ-పరం-జన్మ-వివస్వతః

కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥

వివస్వతః =సూర్యునియొక్క, జన్మ=జన్మము, పరం=మొదటిది, భవతః= నీయొక్క, జన్మ = జన్మము, అపరం = తరువాతది, ఆదౌ = ఆదియందు, త్వం = నీవు, ప్రోక్తవాన్= చెప్పినవాడవు, ఇతి = అని, కథం = ఎటుల, ఏతత్= దీనిని, విజానీయాం= తెలియగలను.

అర్జునుడు పలికెను - కృష్ణా ! నీ జన్మ ఇటీవలిదే. సూర్యునిజన్మ కల్పాదియందు జరిగినది. అనగా అతి ప్రాచీనమైనది. కనుక నీవు సూర్యునకు దీనిని ఉపదేశించుట ఎట్లు సాధ్యపడును ? దీనిని నేను ఏ విధముగా తెలుసుకోగలను.

శ్రీభగవాన్ ఉవాచ

5 బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।

తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥

బహూని-మే-వ్యతీతాని-జన్మాని-తవ-చ-అర్జున

తాని-అహం-వేద-సర్వాణి-న-త్వం-వేత్థ-పరంతప

అర్జున=అర్జునా, మే నాయొక్కయు, తవ చ =నీ యొక్కయును, బహూని = అనేకములైన, జన్మాని = జన్మములు, వ్యతీతాని = గడిచినవి, తాని= ఆ, సర్వాణి= అన్నిటిని, అహం= నేను, వేద = ఎరుగుదును, పరంతప = అర్జునా, త్వం = నీవు, న వేత్థ = తెలియజాలవు.

శ్రీ భగవానుడు తెలిపెను - ఓ పరంతపా ! అర్జునా ! నాకును నీకును అనేక జన్మలు గడచినవి. కాని వాటిని అన్నింటిని నేను ఎఱుంగుదును. నీ వెఱుగవు.

6 అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్।

ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥

అజః-అపి-సన్-అవ్యయాత్మా-భూతానాం- ఈశ్వరః -అపి-సన్

ప్రకృతిం-స్వాం-అధిష్ఠాయ-సంభవామి- ఆత్మమాయయా

అజః అపి సన్= పుట్టుక లేనివాడనైనను, అవ్యయాత్మా= అవినాశియైనను, భూతానాం = ప్రాణులకు, ఈశ్వరః అపి సన్= ప్రభువునయ్యును, స్వాం = స్వకీయమైన, ప్రకృతిం = స్వభావమును, అధిష్ఠాయ = ఆశ్రయించి, ఆత్మమాయయా = నా మాయ చేతనే, సంభవామి = పుట్టుచున్నాను.

నేను పుట్టుక లేనివాడను, నిత్యుడను, సమస్త ప్రాణులకు ఈశ్వరుడను. అయినను నా ప్రకృతిని అధీనములో నుంచుకొని, నా యోగమాయచే జన్మమెత్తుచున్నాను.

7 యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।

అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

యదా-యదా-హి-ధర్మస్య-గ్లానిః-భవతి-భారత

అభ్యుత్థానం-అధర్మస్య-తదా- ఆత్మానం-సృజామి-అహం

భారత = అర్జునా, యదాయదా= ఎప్పుడెప్పుడు, ధర్మస్య = ధర్మమునకు, గ్లానిః= హాని, అధర్మస్య = అధర్మమునకు, అభ్యుత్థానం= అభివృద్ధి, భవతి = కలుగుచున్నదో, తదా = అప్పుడు, ఆత్మానం= ఆత్మయైన నన్ను, అహం= నేను, సృజామి హి = సృజించుచున్నాను.

ఓ భారతా ! ధర్మమునకు హాని కలిగినప్పుడు, అధర్మము పెచ్చుపెరిగిపోవుచున్నప్పుడును నన్ను నేను సృజించుకొందును. అనగా సాకారరూపముతో ఈ లోకమున అవతరింతును.

8 పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।

ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

పరిత్రాణాయ-సాధూనాం-వినాశాయ-చ-దుష్కృతాం

ధర్మసంస్థాపనార్థాయ -సంభవామి-యుగే-యుగే

సాధూనాం=సాధువులయొక్క, పరిత్రాణాయ = పరిరక్షణకొరకు, దుష్కృతాం= దుర్మార్గుల యొక్క, వినాశాయ చ = సంహారము కొరకు, ధర్మ సంస్థాపనార్థాయ= ధర్మమును స్థాపించుటకొరకు, యుగేయుగే= ప్రతియుగమునందును, సంభవామి=పుట్టుచుందును.

సజ్జనులను పరిరక్షించుటకును, దుష్టులను రూపుమాపుటకును, ధర్మమును సుస్థిరమొనర్చుటకును నేను ప్రతియుగమునందును అవతరించుచుందును.

9 జన్మ కర్మ చ మే దివ్యమ్ ఏవం యో వేత్తి తత్త్వతః।

త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥

జన్మ-కర్మ-చ-మే-దివ్యం- ఏవం-యః వేత్తి-తత్త్వతః

త్యక్త్వా-దేహం-పునః-జన్మ-న- ఏతి-మాం- ఏతి సః-అర్జున

అర్జునః= అర్జునా, యః = ఎవడు, దివ్యం = దివ్యమైన, మే = నాయొక్క, జన్మ= జన్మమును, కర్మ చ = కర్మమును ఏవం = ఈవిధముగ, తత్త్వతః = యథార్థముగా, వేత్తి = గ్రహించుచున్నాడో, సః = ఆ పురుషుడు, దేహం = దేహమును, త్యక్త్వా = విడిచి, పునః = తిరిగి, జన్మ=జన్మమును, న ఏతి= పొందడు, మాం = నన్నే, ఏతి = పొందును.

ఓ అర్జునా ! ఎవరు నా దివ్యమైన జన్మమును, కర్మమును గూర్చి యథార్థముగా తెలుసుకొనునో అట్టివాడు తనువును చాలించిన పిమ్మట మఱల జన్మింపడు సరికదా ! నన్నే పొందుచున్నాడు.

10 వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।

బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥

వీతరాగభయక్రోధాః-మన్మయా-మాం- ఉపాశ్రితాః

హవః-జ్ఞానతపసా-పూతాః-మద్భావం- ఆగతాః

వీతరాగభయక్రోధాః= విడిచిన అనురాగమును, భయమును, క్రోధమును గలవారును, మన్మయాః= నాయందే భావన గలవారును, మాం = నన్ను, ఉపాశ్రితాః = ఆశ్రయించిన వారును నగు, బహవః = అనేకులు, జ్ఞానతపసా = జ్ఞానమనెడి తపస్సుచేత, పూతాః = పవిత్రులైనవారై, మద్భావం = నా స్వరూపమును, ఆగతాః = పొందిరి.

అనురాగము, భయము, క్రోధము వీడిన వారు, దృఢమైన భక్తి తాత్పర్యములతో స్థిరబుద్ధి గలిగి, నన్ను ఆశ్రయించిన భక్తులు పెక్కుమంది జ్ఞానతపస్సంపన్నులై పవిత్రులై నాస్వరూపమును పొందియున్నారు.

11 యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।

మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥

యే-యథా-మాం-ప్రపద్యంతే-తాన్-తథా- ఏవ-భజామి- అహం

మమ-వర్త్మ-అనువర్తంతే - మనుష్యాః-పార్థ-సర్వశః

పార్థ=అర్జునా, యే = ఎవరు, యథా = ఎట్లు, మాం = నన్ను, ప్రపద్యంతే=భజింతురో, అహం = నేను, తాన్ = వారలను, తథైవ= అలాగుననే, భజామి=అనుగ్రహించుచున్నాను, మనుష్యాః= మనుజులు, సర్వశః = సర్వవిధముల, మమ= నాయొక్క, వర్త్మ = మార్గమును, అనువర్తంతే = అనుసరించుచున్నారు.

ఓ పార్థా! భక్తులు నన్ను ఎవరు ఏవిధముగా సేవింతురో ఆ విధముగా నేను వారిని అనుగ్రహింతును. మనుష్యులందరును వివిధరీతులలో నా మార్గమునే అనుసరించుచున్నారు.

12 కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।

క్షిప్రం హి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా ॥

కాంక్షంతః-కర్మణాం-సిద్ధిం-యజంతే- ఇహ-దేవతాః

క్షిప్రం-హి-మానుషే-లోకే-సిద్ధిః-భవతి-కర్మజా

ఇహ= ఈ లోకమునందు, కర్మణాం = కర్మలయొక్క, సిద్ధిం= ఫలసిద్ధిని, కాంక్షంతః= అభిలషించు జనులు, దేవతాః = ఇంద్రాది దేవతలను, యజంతే = సేవించుచునాజ్నిరు, మానుషే = మానవ, లోకే=లోకమునందు, కర్మజా= కర్మవలనపుట్టిన , సిద్ధిః = ఫలప్రాప్తి, క్షిప్రం=శీఘ్రముగ, భవతి హి= కలుగుచున్నదికదా.

ఈ లోకమున కర్మఫలములను ఆశించువారు ఇతర దేవతలను పూజింతురు. ఏలనన అట్లు చేయుటచే కర్మలవలన కలుగు సిద్ధి వారికి శీఘ్రముగా కలుగుచున్నది.

13 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥

చాతుర్వర్ణ్యం-మయా-సృష్టం-గుణకర్మ-విభాగశః
తస్య-కర్తారం-అపి-మాం-విద్ధి-అకర్తారం-అవ్యయం

మయా= నాచేత, చాతుర్వర్ణ్యం= నాలుగు వర్ణములు, గుణకర్మవిభాగశః= గుణకర్మల విభజన చొప్పున, సృష్టం =సృజింపబడెను, తస్య= ఆసృష్టి కర్మమునకు, కర్తారమపి=కర్తనైనను, మాం = నన్ను, అకర్తారం= అకర్తగను, అవ్యయం= అవ్యయునిగను, విద్ధి= తెలిసికొనుము.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల వారిని వారి గుణకర్మల ననుసరించి వేర్వేరుగా సృష్టించితిని. ఈ సృష్టికార్యక్రమమునకు నేనే కర్తనైనను, శాశ్వతుడను పరమేశ్వరుడను ఐన నన్ను వాస్తవముగ అకర్తను గా తెలిసికొనుము.

14 న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥

న-మాం-కర్మాణి-లింపంతి-న-మే-కర్మఫలే-స్పృహా
ఇతి-మాం-యః-అభిజానాతి-కర్మభిః-న-సః-బధ్యతే

కర్మాణి=కర్మములు, మాం=నన్ను, న లింపంతి = అంటవు, మే=నాకు, కర్మఫలే= కర్మఫల మందు, స్పృహా= కోరిక, న=లేదు, ఇతి = ఈ ప్రకారము, మాం = నన్ను, యః= ఎవడు, అభిజానాతి =తెలిసికొనుచున్నాడో, సః=వాడు, కర్మభిః=కర్మచేత, న బధ్యతే=బద్ధుడు కాడు.

నాకు కర్మఫలాసక్తి లేదు. కావున కర్మలు నన్నంటవు. ఈ విధముగా నాతత్త్వమును తెలిసినవారు కర్మలచే బంధింపబడరు.

15 ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వంతరం కృతమ్ ॥

ఏవం-జ్ఞాత్వా-కృతం-కర్మ-పూర్వైః-అపి-ముముక్షుభిః
కురు-కర్మ- ఏవ-తస్మాత్-త్వం-పూర్వైః-పూర్వతరం-కృతం

ఏవం= ఈ ప్రకారముగ, జ్ఞాత్వా= తెలిసికొని, పూర్వైః= పూర్వీకులైన, ముముక్షుభిః అపి = ముముక్షువులచేత సయితము, కర్మ = కర్మము, కృతం = చేయబడెను, తస్మాత్= ఆ కారణమువలన, త్వం = నీవు, పూర్వైః= పూర్వులైనవారిచేత, కృతం = చేయబడిన, పూర్వ తరం = ప్రాచీనమైన, కర్మ ఏవ= కర్మమునే, కురు= చేయుము.

ఓ అర్జునా ! నా తత్త్వ రహస్యమును దెలిసికొని కర్మల నాచరించిరి. కావున నీవును ఆ పూర్వులవలెనే నిష్కామ భావముతో కర్మల నాచరింపుము.

16 కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

కిం-కర్మ-కిం-అకర్మ- ఇతి కవయః- అపి-అత్ర-మోహితాః
తత్-తే-కర్మ-ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-మోక్ష్యసే- అశుభాత్

కర్మ=కర్మము, కిం= ఎట్టిది, అకర్మ= అకర్మము, కిం = ఎట్టిది, ఇతి = ఇట్లని, అత్ర= ఈ విషయమున, కవయః అపి= బుద్ధిమంతులును, మోహితాః= మోహమును పొందిరి, యత్= దేనిని, జ్ఞాత్వా= తెలిసి అశుభాత్ = అశుభమునుండి, మోక్ష్యసే = ముక్తుడవు కాగలవో, తత్=అట్టి, కర్మ=కర్మమును, తే=నీకొరకు, ప్రవక్ష్యామి=చెప్పుదును.

కర్మ అనగా నేమి ? అకర్మ యనగా నేమి ? ఈ విషయమును నిర్ణయించుటలో విద్వాంసులు సైతము తికమకపడుచున్నారు కావున కర్మతత్త్వమును నీకు చక్కగా విశదపరచెదను.

17 కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః।

అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥

కర్మణః-హి-అపి-బోద్ధవ్యం-బోద్ధవ్యం-చ-వికర్మణః

అకర్మణః-చ-బోద్ధవ్యం-గహనా-కర్మణః-గతిః

కర్మణః అపి = కర్మయొక్క, (తత్త్వము), బోద్ధవ్యం= తెలిసికొనదగినది, వికర్మణః చ = వికర్మ యొక్కయును, బోద్ధవ్యం = తెలిసికొనదగినది, అకర్మణః చ= అకర్మము యొక్కయు, (తత్త్వము), బోద్ధవ్యం= తెలిసికొనదగినది, కర్మణః= కర్మయొక్క, గతిః=తత్త్వము, గహనా హి = తెలియశక్యము కానిది కదా.

కర్మ తత్త్వమును తెలిసికొనవలెను. అట్లే అకర్మ స్వరూపమును గూడ ఎరుగవలెను. వికర్మ లక్షణములనుకూడా తెలిసికొనుట చాల అవసరము. ఏలనన కర్మతత్త్వము చాల లోతైనది.

18 కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః।

స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్॥

కర్మణి-అకర్మ-యః-పశ్యేత్-అకర్మణి-చ-కర్మ-యః

సః-బుద్ధిమాన్-మనుష్యేషు-సః-యుక్తః-కృత్స్నకర్మకృత్

యః= ఎవడు, కర్మణి=కర్మమునందు, అకర్మ= అకర్మమును, యః = ఎవడు, అకర్మణి చ = అకర్మమునందు, కర్మ= కర్మమును, పశ్యేత్=చూచునో, సః=వాడు, కృత్స్నకర్మకృత్= సర్వకర్మములను చేసినవాడును,యుక్తః= యోగియును, బుద్ధిమాన్= బుద్ధిమంతుడును.

కర్మయందు అకర్మ ను, అకర్మయందు కర్మను దర్శించువాడు మానవులలో వివేకముయుడు. అతడు యోగి మఱియు సమస్తకర్మలు చేయువాడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

19 యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।

జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥

యస్య-సర్వే-సమారంభాః-కామసంకల్పవర్జితాః

జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం-తం- ఆహుః-పండితం-బుధాః

యస్య = ఎవనియొక్క, సర్వే=సమస్తములైన, సమారంభాః= కర్మలు, కామసంకల్ప వర్జితాః= కామవాంఛలు లేకయుండునో, జ్ఞానాగ్ని= జ్ఞానమనెడి అగ్నిచేత, దగ్ధకర్మాణం= దహింపబడిన కర్మలు గల, తం = వానిని, పండితం= పండితుడని, బుధాః= జ్ఞానులు, ఆహుః= పేర్కొనిరి.

ఎవని కర్మలన్నియును, శాస్త్రసమ్మతములై, కామసంకల్ప వర్జితములై జరుగునో అట్లే ఎవని కర్మలన్నియును జ్ఞానాగ్నిచే భస్మమగునో అట్టి మహాపురుషుని జ్ఞానులు పండితుడని పేర్కొనిరి.

20 త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।

కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్ కరోతి సః ॥

త్యక్త్వా-కర్మఫలాసంగం-నిత్యతృప్తః-నిరాశ్రయః

కర్మణి-అభిప్రవృత్తః-అపి-న- ఏవ-కించిత్-కరోతి-సః

నిత్యతృప్తః=నిత్యతృప్తుడును, నిరాశ్రయః= ఆశ్రయము లేనివాడును, కర్మఫలాసంగం = కర్మఫలమునందలి ఆసక్తిని, త్యక్త్వా= విడిచి, కర్మణి= కర్మయందు, అభిప్రవృత్తః అపి = సంచరించుచున్నవాడైనను, సః=వాడు, కించిత్= కొంచెమైనను, న కరోతి ఏవ= చేయుటయే లేదు.

ఎవడు కర్మఫలమందాసక్తిని విడనాడి నిరంతరము సంతృప్తి కలవాడై దేనిని ఆశ్రయించకనుండునో, అట్టివాడు వాస్తవముగా వాటికి కర్తకాడు.

21 నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।

శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

నిరాశీః-యతచిత్తాత్మా-త్యక్త సర్వ పరిగ్రహః

శారీరం-కేవలం-కర్మ-కుర్వన్-న- ఆప్నోతి-కిల్బిషం

నిరాశీః= ఆశలేనివాడును, యతచిత్తాత్మా= అంతఃకరణను, దేహమును జయించిన వాడును, త్యక్తసర్వపరిగ్రహః = సకల పరిగ్రహములను విడిచినవాడును, శారీరం= శరీరమునకు సంబంధించిన, కర్మ= కర్మను, కేవలం= కేవలము, కుర్వన్= చేయుచు, కిల్బిషం= పాపమును, న ఆప్నోతి= పొందడు.

అంతఃకరణమును, శరీరేంద్రియములను జయించినవాడు, సమస్త భోగసామగ్రిని పరిత్యజించినవాడు, ఆశారహితుడు ఐన సాంఖ్యయోగి కేవలము శారీరికకర్మలను ఆచరించుచును పాపములను పొందడు.

22 యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।

సమః సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥

యదృచ్ఛాలాభసంతుష్టః-ద్వంద్వాతీతః-విమత్సరః

సమః-సిద్ధౌ-అసిద్ధౌ -చ-కృత్వా-అపి-న-నిబధ్యతే

యదృచ్ఛాలాభసంతుష్టః = అయాచితముగ లభించినదానితో తృప్తి చెందువాడును, ద్వంద్వాతీతః= ద్వంద్వాతీతుడును, విమత్సరః= మాత్సర్యము లేనివాడును, సిద్ధౌ= సిద్ధించిన విషయములందును, అసిద్ధౌ చ = సిద్ధించని విషయములందును, సమః= సమబుద్ధి గలవాడును, కృత్వా అపి= కర్మలు చేసినను, న నిబధ్యతే= బంధింపబడడు.

అప్రయత్నముగా అమరిన లాభములతో సంతుష్టుడైనవాడు, అసూయలేనివాడు, హర్షశోకాదిద్వంద్వములకు అతీతుడు అయినవాడు సిద్ధియందును, అసిద్ధియందును సమదృష్టి కలిగియుండును. అట్టి కర్మయోగి కర్మలనాచరించుచున్నను వాటి చేత బంధింపబడడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

23 గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।

యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥

గతసంగస్య-ముక్తస్య-జ్ఞానావస్థిత చేతసః

యజ్ఞాయ- ఆచరతః-కర్మ-సమగ్రం-ప్రవిలీయతే

గతసంగస్య= ఆసక్తిలేనివాడును, ముక్తస్య = జీవన్ముక్తుడును, జ్ఞానావస్థిత చేతసః= జ్ఞానమునందు నిలిచిన చిత్తము గలవాడును, యజ్ఞాయ= యజ్ఞము కొరకు, ఆచరతః= ఆచరించువానియొక్క, కర్మ = కర్మము, సమగ్రం= సంపూర్ణముగ, ప్రవిలీయతే= నశించిపోవుచున్నది.

ఏలనన ఆసక్తి, దేహాభిమానము, మమకారము ఏ మాత్రమూ లేనివాడును, పరమాత్మజ్ఞానమునందే నిరంతరము మనస్సును లగ్నమొనర్చినవాడును, కేవలము యజ్ఞార్థమే కర్మలను ఆచరించువాడును అగు మనుష్యుని యొక్క కర్మలన్నియును పూర్తిగా విలీనములగును. అనగా నశించిపోవును.

24 బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।

బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

బ్రహ్మ-అర్పణం-బ్రహ్మ-హవిః-బ్రహ్మాగ్నౌ-బ్రహ్మణా-హుతం

బ్రహ్మ- ఏవ-తేన-గంతవ్యం- బ్రహ్మకర్మ సమాధినా

అర్పణం= హోమసాధనములు, బ్రహ్మ= బ్రహ్మమే, హవిః= హవిస్సు, బ్రహ్మ= బ్రహ్మమే, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమనెడి అగ్నియందు, బ్రహ్మణా= బ్రహ్మస్వరూపునిచేత, హుతం=హోమం చేయబడినదియును, బ్రహ్మకర్మ సమాధినా= బ్రహ్మకర్మ సమాధి నిష్ఠుడయిన, తేన = అతనిచేత, గంతవ్యం= పొందదగిన ఫలము, బ్రహ్మైవ = బ్రహ్మమే.

యజ్ఞకార్యములయందు ఉపయుక్తమగు స్రువాదిసాధనములు బ్రహ్మము. హోమము చేయబడు ద్రవ్యము బ్రహ్మము. అగ్నియు బ్రహ్మము. యజ్ఞము నాచరించు కర్తయు బ్రహ్మము. హవనక్రియయు బ్రహ్మము. ఈ బ్రహ్మకర్మయందు స్థితుడైయుండు యోగి ద్వారా పొందదగిన యజ్ఞఫలము గూడ బ్రహ్మమే అయియున్నది.

25 దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।

బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥

దైవం- ఏవ- అపరే- యజ్ఞం- యోగినః- పర్యుపాసతే

బ్రహ్మాగ్నౌ- అపరే- యజ్ఞ -యజ్ఞేన- ఏవ- ఉపజుహ్వతి

అపరే=కొందరు, యోగినః=యోగులు, దైవం=దేవతాసంబంధమైన, యజ్ఞం ఏవ= యజ్ఞమునే, పర్యుపాసతే= ఉపాసించుచున్నారు. అపరే = మరికొందరు,బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమను అగ్నియందు, యజ్ఞం= యజ్ఞమును, యజ్ఞేన ఏవ= యజ్ఞముచేతనే, ఉపజుహ్వతి = హోమము చేయుచున్నారు.

కొందఱు యోగులు దైవపూజారూపయజ్ఞమును చక్కగా అనుష్ఠింతురు. మఱికొందఱు యోగులు జీవబ్రహ్మైక్యభావనచే జీవుని పరబ్రహ్మమును అగ్నియందు హోమము చేయచున్నారు.

26 శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।

శబ్దాదీన్ విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥

శ్రోత్రాదీని- ఇంద్రియాణి- అన్యే- సంయమాగ్నిషు-జుహ్వతి

శబ్దాదీన్- విషయాన్-అన్యే- ఇంద్రియాగ్నిషు -జుహ్వతి

అన్యే=కొందరు, శ్రోత్రాదీని=శ్రోత్రము మొదలయిన, ఇంద్రియాణి= ఇంద్రియములను, సంయమాగ్నిషు= సంయమమనెడి అగ్నియందు, జుహ్వతి=హోమము చేయుచున్నారు, అన్యే= మరికొందరు, శబ్దాదీన్= శబ్దము మొదలైన, విషయాన్= విషయములను, ఇంద్రియాగ్నిషు= ఇంద్రియములనెడి అగ్నియందు, జుహ్వతి=హోమముచేయు చున్నారు.

కొందరు యోగులు మనోనిగ్రహము ద్వారా శ్రోత్రాది ఇంద్రియములను అదుపు చేయుదురు. తత్ఫలితముగా శబ్దాది విషయములు ఎదురుగా ఉన్నను లేకున్నను వాటిప్రభావము వారి ఇంద్రియములపై ఏ మాత్రమూ ఉండదు.

27 సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।

ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

సర్వాణి- ఇంద్రియకర్మాణి-ప్రాణకర్మాణి-చ-అపరే

ఆత్మ సంయమ యోగాగ్నౌ- జుహ్వతి-జ్ఞానదీపితే

అపరే=మరికొందరు, సర్వాణి= సమస్తములైన, ఇంద్రియ కర్మాణి= ఇంద్రియ చేష్టలను, ప్రాణకర్మాణి చ = ప్రాణవ్యాపారములను, జ్ఞానదీపితే= జ్ఞానములచేత వెలిగింప బడిన, ఆత్మసంయమ యోగాగ్నౌ = ఆత్మసంయమయోగమనెడి అగ్నియందు, జుహ్వతి= హోమము చేయుచున్నారు.

కొందరు ఇంద్రియముల పంచప్రాణముల వ్యాపారములను జ్ఞానదీప్తమైన ఆత్మ సంయమయోగమనెడి అగ్నియందు హోమము చేయుచున్నారు.

28 ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।

స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥

ద్రవ్యయజ్ఞాః-తపోయజ్ఞాః-యోగయజ్ఞాః-తథా-అపరే

స్వాధ్యాయ జ్ఞానయజ్ఞా-చ-యతయః-సంశితవ్రతాః

అపరే=కొందరు, ద్రవ్యయజ్ఞాః= ద్రవ్యయజ్ఞము గలవారును, తపోయజ్ఞాః= తపస్సనెడి యజ్ఞము గలవారును, యోగయజ్ఞాః= యోగమనెడి యజ్ఞము గలవారును, తథా= ఆరీతినే, స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాః చ = స్వాధ్యాయ జ్ఞానరూపములైన యజ్ఞములు గలవారును, యతయః= ప్రయత్నము చేయువారును, సంశితవ్రతాః= దృఢవ్రతము గలవారై యున్నారు.

కొందఱు ద్రవ్యసంబంధ యజ్ఞములను మఱికొందఱు తపోరూపయజ్ఞములను, కొందఱు యోగరూపయజ్ఞములను చేయుదురు. మఱికొందరు స్వాధ్యాయ యజ్ఞములను జ్ఞానయజ్ఞములను ఆచరించుచున్నారు.

29 అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।

ప్రాణాపానగతీ రుధ్వా ప్రాణాయామపరాయణాః ॥

అపానే-జుహ్వతి-ప్రాణం-ప్రాణే-అపానం-తథా-అపరే

ప్రాణాపానగతీ-రుద్ధ్వా-ప్రాణాయామ పరాయణాః

తథా=అటులనే, అపరే=మరికొందరు, ప్రాణాయామపరాయణాః= ప్రాణాయామ పరాయణులైనవారు, ప్రాణాపానగతీ= ప్రాణాపానగతులను, రుద్ధ్వా= అడ్డగించి, అపానే= అపానమునందు, ప్రాణం= ప్రాణవాయువును, ప్రాణే= ప్రాణవాయువునందు, అపానం= అపాన వాయువును, జుహ్వతి= హోమము చేయుచున్నారు.

కొందరు యోగులు అపానవాయువునందు ప్రాణవాయువును, మఱికొందరు ప్రాణవాయువునందు అపానవాయువును హవనము చేయుదురు.

30 అపరే నియతాహారాః ప్రాణేన్ ప్రాణేషు జుహ్వతి ।

సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥

అపరే-నియతాహారాః-ప్రాణాన్-ప్రాణేషు-జుహ్వతి

సర్వే-అపి- ఏతే-యజ్ఞవిదః-యజ్ఞక్షపిత-కల్మషాః

అపరే=మరికొందరు, నియతాహారాః= ఆహారనియమము గలవారై, ప్రాణాన్= ప్రాణములను, ప్రాణేషు= ప్రాణములందు, జుహ్వతి= హోమము చేయుచున్నారు, ఏతే= ఈ, సర్వేఅపి= అందరునుకూడా, యజ్ఞవిదః= యజ్ఞము నెరిగినవారు, యజ్ఞక్షపిత కల్మషాః= యజ్ఞముచేత కల్మషము నశించినవారు

ఇంకను కొందఱు నియమితాహార నిష్ఠితులై, ప్రాణయామ పరాయణులైనవారు ప్రాణాపాన గమనములను నిలిపి, ప్రాణములను ప్రాణములయందే హవనము చేయుదురు. యజ్ఞవిదులైన వీరందరు యజ్ఞముల ద్వారా పాపములను రూపుమాపుదురు.

31 యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ।

నాయం లోకోఽ_స్త్యయజ్ఞస్య కుతోఽ_న్యః కురుసత్తమ ॥

యజ్ఞశిష్టామృతభుజః-యాంతి-బ్రహ్మ-సనాతనం

న-అయం- లోకః-అస్తి-అయజ్ఞస్య-కుతః-అన్యః-కురుసత్తమ

కురుసత్తమ=అర్జునా, యజ్ఞశిష్టామృతభుజః=యజ్ఞశేషమైన అమృతమును భుజించువారు, సనాతనం= అనాదియైన, బ్రహ్మ= బ్రహ్మమును, యాంతి = పొందుచున్నారు, అయజ్ఞస్య= యజ్ఞము చేయనివానికి, అయం= ఈ ,లోకః=లోకము, న అస్తి= లేదు, అన్యః= ఇతరలోకము, కుతః= ఎక్కడిది ?

ఓ కురుసత్తమా ! యజ్ఞపూరిత శేషమైన అమృతమును అనుభవించు యోగులకు సనాతనుడును, పరబ్రహ్మమును అగు పరమాత్మయొక్క లాభము కలుగును. యజ్ఞము చేయనివారికి ఈమర్త్యలోకమే సుఖప్రదము కాదు. ఇంక పరలోకమెక్కడిది ?

32 ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।

కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥

ఏవం-బహువిధాః-యజ్ఞాః-వితతాః-బ్రహ్మణః-ముఖే

కర్మజాన్-విద్ధి-తాన్-సర్వాన్- ఏవం-జ్ఞాత్వా- విమోక్ష్యసే

ఏవం = ఈప్రకారముగ, బహువిధాః= అనేకవిధములైన, యజ్ఞాః= యజ్ఞములు, బ్రహ్మణః=బ్రహ్మముయొక్క, ముఖే= ముఖమునందు, వితతాః= విస్తరింపబడినవి, తాన్సర్వాన్= వానినన్నింటిని, కర్మజాన్= కర్ణమునుండి పుట్టినవానినిగ, విద్ధి= తెలిసికొనుము, ఏవం= ఇటుల, జ్ఞాత్వా= తెలిసికొని, విమోక్ష్యసే= విముక్తుడవు కాగలవు.

ఈ ప్రకారముగనే ఇంకను బహువిధములైన యజ్ఞములు వేదములలో సవివరముగా వివరింపబడినవి. ఈ యజ్ఞముల నన్నింటిని త్రికరణశుద్ధిగా ఆచరించినప్పుడే అవి సుసంపన్నములగునని తెలిసికొనుము. ఇట్లు ఈ కర్మతత్త్వమును తెలిసికొనుము, అనుష్ఠానము వలన నీవు ప్రాపంచిక బంధములనుండి సర్వథా విముక్తుడవయ్యెదవు.

33 శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।

సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥

శ్రేయాన్-ద్రవ్యమయాత్-యజ్ఞాత్-జ్ఞానయజ్ఞః-పరంతప

సర్వం-కర్మ-అఖిలం-పార్థ-జ్ఞానే-పరిసమాప్యతే

పరంతప = అర్జునా, ద్రవ్యమయాత్= ద్రవ్యమువలన సాధింపబడు, యజ్ఞాత్= యజ్ఞము కంటెను, జ్ఞానయజ్ఞః= జ్ఞానయజ్ఞము, శ్రేయాన్=శ్రేష్ఠమైనది, పార్థ=అర్జునా, సర్వం= సమస్తమైన, కర్మ = కర్మము, అఖిలం= సకలముగా, జ్ఞానే= జ్ఞానమునందు, పరిసమాప్యతే =ముగియుచున్నది.

ఓ పరంతపా ! అర్జునా! ద్రవ్యమయయజ్ఞముకంటెను జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. కర్మలన్నియును జ్ఞానమునందే పరిసమాప్తమగును.

34 తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।

ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥

తత్-విద్ధి-ప్రణిపాతేన-పరిప్రశ్నేన-సేవయా

ఉపదేక్ష్యంతి-తే-జ్ఞానం-జ్ఞానినః-తత్త్వదర్శినః

తత్ జ్ఞానం= ఆ జ్ఞానమును, ప్రణిపాతేన= సాష్టాంగ నమస్కారముచేతను, పరి ప్రశ్నేన = నిష్కపట భావముతో ప్రశ్నించుటచేతను, సేవయా= సేవచేతను, తత్త్వదర్శినః = తత్త్వమును దర్శించిన, జ్ఞానినః=జ్ఞానులు, తే=నీకు, ఉపదేక్ష్యంతి= ఉపదేశింపగలరు.

అట్టి జ్ఞానము, తత్త్వవేత్తలగు జ్ఞానులకు సాష్టాంగ నమస్కారమొనర్చి, సమయము చూచి, వినయముగా ప్రశ్నించి, సేవచేసియు వారివలన నెఱుంగుము. వారు తప్పక నీకుపదేశింతురు.

35 యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్ ఏవం యాస్యసి పాండవ ।

యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥

యత్-జ్ఞాత్వా-న-పునః-మోహం- ఏవం-యాస్యసి-పాండవ

యేన-భూతాని-అశేషేణ-ద్రక్ష్యసి- ఆత్మని-అథో-మయి

పాండవ=అర్జునా, యత్‌జ్ఞాత్వా= ఏదితెలిసికొని, పునః= తిరిగి, ఏవం= ఇట్లు, మోహం= మోహమును, న యాస్యసి= పొందవో, యేన= దేనిచేత, భూతాని =భూతములను, అశేషేణ= సాకల్యముగా, ఆత్మని = నీయందు, అథో= పిమ్మటను, మయి = నాయందును, ద్రక్ష్యసి= చూడగలవో.

ఓ అర్జునా ! ఈ తత్త్వజ్ఞానమునెఱింగినచో మఱల ఇట్టి వ్యామోహములో చిక్కుకొనవు. ఈ జ్ఞాన ప్రభావముతో సమస్తప్రాణులను నీలో సంపూర్ణముగా చూడగలవు.

36 అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।

సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

అపి-చేత్-అసి-పాపేభ్యః- సర్వేభ్యః-పాపకృత్తమః

సర్వం-జ్ఞానప్లవేన- ఏవ-వృజినం-సంతరిష్యసి

పాపేభ్యః సర్వేభ్యః=పాపులందరికంటెను, పాపకృత్తమః= ఎక్కువ పాపములు చేసిన వాడవు. అపి చేత్ అసి=అయినను, సర్వం వృజినం= సమస్తపాపమును, జ్ఞానప్లవేన ఏవ= జ్ఞానమనెడి తెప్పచేతనే, సంతరిష్యసి = దాటగలవు.

ఒకవేళ పాపాత్ములందఱికంటెను నీవు ఒక మహాపాపివి అయినచో, జ్ఞానమనే తెప్ప సహాయముతో పాపసముద్రమునుండి నిస్సందేహముగా పూర్తిగా దాటివేయగలవు.

37 యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున।

జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

యథా- ఏధాంసి-సమిద్ధః-అగ్నిః-భస్మసాత్-కురుతే-అర్జున

జ్ఞానాగ్నిః-సర్వకర్మాణి-భస్మసాత్-కురుతే-తథా

అర్జున-అర్జునా, సమిద్ధః=మండుచున్న , అగ్నిః= నిప్పు, యథా= ఎటుల, ఏధాంసి = కట్టెలను, భస్మసాత్ కురుతే= భస్మముగాజేయునో, తథా=అటుల, జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడి అగ్ని, సర్వకర్మాణి= సమస్తకర్మలను, భస్మసాత్ కురుతే= భస్మముగా చేయుచున్నది.

ఓ అర్జునా ! ప్రజ్వలించుచున్న అగ్ని సమిధలను భస్మముచేసినట్లు జ్ఞానమను అగ్ని కర్మలను భస్మమొనరించును.

38 న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।

తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥

న-హి-జ్ఞానేన-సదృశం-పవిత్రం- ఇహ-విద్యతే

తత్-స్వయం-యోగసంసిద్ధః-కాలేన- ఆత్మని-విందతి

జ్ఞానేన సదృశం= జ్ఞానమువలె, పవిత్రం = పావన మొనర్చునది, ఇహ= ఈ లోకమునందు, న విద్యతే హి = లేదు, కాలేన = కాలక్రమమున, యోగసంసిద్ధః= సమత్వ యోగబుద్ధి ద్వారా సిద్ధిపొందినవాడు, తత్ = ఆ జ్ఞానమును, స్వయం= స్వయముగ, ఆత్మని = ఆత్మయందే, విందతి = పొందుచున్నాడు.

ప్రపంచమున జ్ఞానముతో సమానముగ పవిత్రమైనది మరియొకటి లేనేలేదు. శుద్ధాంతఃకరణముగల సాధకుడు బహుకాలమువరకు కర్మయోగాచరణము చేసి, ఆత్మయందు అదే జ్ఞానమును తనంతటతానే పొందుచున్నాడు.

39 శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।

జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమ్ అచిరేణాధి గచ్ఛతి ॥

శ్రద్ధావాన్-లభతే-జ్ఞానం-తత్పరః-సంయతేంద్రియః

జ్ఞానం-లబ్ధ్వా-పరాం-శాంతిం-అచిరేణ-అధిగచ్ఛతి

శ్రద్ధావాన్=శ్రద్ధావంతుడును, తత్పరః=తత్పరుడైనవాడును, సంయతేంద్రియః= ఇంద్రియ నిగ్రహము గలవాడును, జ్ఞానం = ఆత్మజ్ఞానమును, లభతే = పొందుచున్నాడు, జ్ఞానం = జ్ఞానమును, లబ్ధ్వా= పొంది, పరాం= పరమైన, శాంతిం= శాంతిని, అచిరేణ = శీఘ్రముగ, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

ఇంద్రియ నిగ్రహము కలవానికి, తదేక నిష్ఠకలవానికి, శ్రద్ధాళువైన మనుజునకు ఈ భగవత్తత్త్వ జ్ఞానము లభించును. ఆ జ్ఞానము కలిగిన వెంటనే అతడు భగవత్తత్త్వ రూపమైన పరమశాంతిని పొందు చున్నాడు..

40 అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।

నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥

అజ్ఞః-చ-అశ్రద్దధానః-చ-సంశయాత్మా- వినశ్యతి

న-అయం-లోకః-అస్తి-న-పరః-న-సుఖం-సంశయాత్మనః

అజ్ఞశ్చ = జ్ఞానశూన్యుడును, అశ్రద్దధానశ్చ = శ్రద్ధలేనివాడును, సంశయాత్మా= శంకితుడును, వినశ్యతి =నశించుచున్నాడు, సంశయాత్మనః=సంశయాత్మునకు, అయం= ఈ, లోకః=లోకము, న అస్తి = లేదు, పరః= పరలోకమును, న = లేదు, సుఖం = సుఖమును, న = లేదు.

అవివేకియు, శ్రద్ధారహితుడును అయిన సంశయాత్ముడు పరమార్థ విషయమున అవశ్యము భ్రష్టుడేయగును. అట్టి సంశయచిత్తునకు ఈ లోకమునందుగాని, పరలోకమునందుగాని ఎట్టి సుఖమూ ఉండదు.

41 యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।

ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥

యోగసంన్యస్త కర్మాణం-జ్ఞానసంఛిన్న సంశయం

ఆత్మవంతం-న-కర్మాణి-నిబధ్నంతి-ధనంజయ

ధనంజయా=అర్జునా, యోగసంన్యస్త కర్మాణం= యోగముచేత విడువబడిన కర్మలు గలవానిని, జ్ఞాన సంఛిన్న సంశయం= జ్ఞానముచేత పోగొట్టబడిన సందేహములు గలవానిని, ఆత్మవంతం = ఆత్మవంతుని, కర్మాణి=కర్మములు, న నిబధ్నంతి=బంధింపవు.

ఓ ధనంజయా ! విధిపూర్వకముగ కర్మలను ఆచరించుచు, కర్మ ఫలములను అన్నింటిని భగవదర్పణము చేయుచు, వివేకముద్వారా సంశయములన్నింటిని తొలగించుకొనుచు, అంతఃకరణమును వశమునందుంచుకొనిన వానిని కర్మలు బంధింపవు.

42 తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।

ఛిత్త్వైనం సంశయం యోగమ్ ఆతిష్ఠోత్తిష్ఠ భారత ॥

తస్మాత్-అజ్ఞాన సంభూతం-హృత్స్థం-జ్ఞానాసినా- ఆత్మనః

ఛిత్త్వా- ఏనం-సంశయం-యోగం- ఆతిష్ఠ- ఉత్తిష్ఠ- భారత

భారత=అర్జునా, తస్మాత్= అందువలన, హృత్స్థం = హృదయము నందున్నట్టిదియు, అజ్ఞాన సంభూతం= అజ్ఞానమువలన పుట్టినదియునైన, ఆత్మనః= నీయొక్క, ఏనం= ఈ,సంశయం= సందేహమును. జ్ఞానాసినా= జ్ఞానమనెడి కత్తిచేత, ఛిత్త్వా=నరికి, యోగం = యోగమును, ఆతిష్ఠ= ఆచరింపుము, ఉత్తిష్ఠ= లెమ్ము.

కావున ఓ భారతా ! (అర్జునా!) నీ హృదయమునందు గల అజ్ఞానము వలన పుట్టిన ఈ సంశయమును వివేకజ్ఞానమను ఖడ్గముతో రూపుమాపి, సమత్వరూప కర్మయోగమునందు స్థితుడవై యుద్ధమునకు సన్నద్ధుడవగుము లెమ్ము.

ఓం శ్రీ పరమాత్మనే నమః

అథ చతుర్థోఽధ్యాయః - జ్ఞానకర్మసన్న్యాస యోగః

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే

జ్ఞానకర్మసన్న్యాసయోగోనామ చతుర్థోఽధ్యాయః



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ పంచమోஉధ్యాయః - కర్మసన్న్యాసయోగః

అర్జున ఉవాచ

1 సన్న్యాసం కర్మణాం కృష్ణపునర్యోగం చ శంససి ।

యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥

సంన్యాసం-కర్మణాం-కృష్ణ-పునః-యోగం-చ-శంససి

యత్-శ్రేయః- ఏతయోః- ఏకం-తత్-మే-బ్రూహి-సునిశ్చితం

కృష్ణ= కృష్ణా, కర్మణాం= కర్మలయొక్క, సంన్యాసం = సన్న్యాసమును, పునః=తిరిగి, యోగం చ= కర్మయోగమును, శంససి= చెప్పుచున్నావు, ఏతయోః= ఈ రెంటిలోను, యత్ = ఏది, శ్రేయః = శ్రేయస్కరమో, సునిశ్చితం= సునిశ్చితముగా, ఏకం తత్ = ఆ ఒక్క దానినే, మే = నాకు, బ్రూహి=చెప్పుము.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా ! ఒక్కసారి కర్మసన్న్యాసమును, మరియొకసారి కర్మయోగమును ప్రశంసించుచున్నావు. నిశ్చయముగా ఈ రెండింటిలో నాకు ఏది శ్రేయస్కరమో తెలియజేయుము.

శ్రీభగవాన్ ఉవాచ

2 సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ ।

తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥

సంన్యాసః-కర్మయోగః-చ-నిఃశ్రేయసకరౌ- ఉభౌ

తయోః-తు-కర్మసంన్యాసాత్-కర్మయోగః-విశిష్యతే

సంన్యాసః=సన్న్యాసమును, కర్మయోగః చ = కర్మయోగమును, ఉభౌ = రెండును, నిఃశ్రేయస కరౌ= మోక్షసాధనములు, తయోః తు = ఆ రెండింటిలోను, కర్మసంన్యాసాత్ = కర్మ సన్న్యాసము కంటెను, కర్మయోగః= కర్మయోగమే, విశిష్యతే= శ్రేష్టమైనది.

శ్రీ కృష్ణభగవానుడు పలికెను - కర్మసన్న్యాసము, కర్మయోగము అను ఈ రెండును మోక్షమును కలుగచేయును. కాని ఈ రెండి ఒటిలోను కర్మసన్న్యాసముకంటెను కర్మయోగమే శ్రేష్ఠమైనది.

3 జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।

నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ ప్రముచ్యతే ॥

జ్ఞేయః-సః-నిత్యసంన్యాసీ-యః-న-ద్వేష్టి-న-కాంక్షతి

నిర్ద్వన్ద్వః-హి-మహాబాహో-సుఖం-బంధాత్-ప్రముచ్యతే

మహాబాహో=అర్జునా, యః=వడు, న ద్వేష్టి= ద్వేషింపడో, న కాంక్షతి=కోరడో, సః= వాడు, నిత్యసంన్యాసీ = సదాసన్యాసిగా, జ్ఞేయః= తెలియదగినవాడు, నిర్ద్వంద్వః= ద్వంద్వములను విడిచినవాడు, సుఖం= సుఖముగా, బంధాత్= సంసారబంధమునుండి, ప్రముచ్యతే హి = విముక్తుడగును.

ఓ మహాబాహో ! ఎవ్వరినీ ద్వేషింపని, దేనినీ కాంక్షింపని కర్మయోగిని నిత్యసన్న్యాసిగా ఎఱుంగవలెను. ఏలనన రాగద్వేషాది ద్వంద్వములు లేనివాడు అవలీలగా సంసారబంధములనుండి విముక్తుడగును.

4 సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః।

ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విందతే ఫలమ్ ॥

సాంఖ్యయోగౌ-పృథక్-బాలాః-ప్రవదంతి-న-పండితాః

ఏకం-అపి- ఆస్థితః-సమ్యక్- ఉభయోః-విందతే-ఫలం

సాంఖ్యయోగౌ= జ్ఞానకర్మములు, పృథక్= వేరని, బాలాః= అవివేకులు, ప్రవదంతి= చెబుతున్నారు, పండితాః= పండితులు, న = చెప్పరు, ఏకమపి= (రెంటిలో) ఒకదానినైనను, సమ్యక్= లెస్సగాను, ఆస్థితఃథ = ఆచరించువాడు, ఉభయోః= రెండింటియొక్క, ఫలం= ప్రయోజనమును, విందతే= పొందుచున్నాడు.

సాంఖ్య, కర్మయోగములు వేర్వేఱుఫలములను ఇచ్చునని అవివేకులు పలికెదరు. పండితులట్లు పలుకరు. ఆ రెండింటిలో ఏ ఒక్కదానినైనను బాగుగా ఆచరించినవాడు ఈ రెండింటి ఫలస్వరూపమైన పరమాత్మను పొందుచున్నాడు.

5 యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।

ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥

యత్-సాంఖ్యైః-ప్రాప్యతే-స్థానం-తత్-యోగైః-అపి-గమ్యతే

ఏకం-సాంఖ్యం-చ-యోగం-చ-యః-పశ్యతి-సః-పశ్యతి

సాంఖ్యైః= జ్ఞానయోగులచేత, యత్‌స్థానం= ఏస్థానం, ప్రాప్యతే = పొందబడుచున్నదో, తత్=అది, యోగైః అపి= యోగులచేతనుగూడ, గమ్యతే = పొందబడుచున్నది, సాంఖ్యం చ = జ్ఞానయోగమును, యోగం చ=కర్మయోగమును, ఏకం= ఒక్కటిగను, యః= ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, సః=వాడు, పశ్యతి= చూచుచున్నాడు.

జ్ఞానయోగులు పొందు మోక్షమునే కర్మయోగులును పొందుదురు. జ్ఞానయోగఫలమును, కర్మయోగఫలమును ఒక్కటిగా చూచువాడే నిజమును గ్రహించినవాడగును.

6 సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।

యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥

సంన్యాసః-తు-మహాబాహో-దుఃఖం- ఆప్తుం-అయోగతః

యోగయుక్తః-మునిః-బ్రహ్మ-నచిరేణ-అధిగచ్ఛతి

మహాబాహూ=అర్జునా, సంన్యాసః తు= సన్న్యాసమన్నను, అయోగతః= యోగము లేకుండా, ఆప్తుం=పొందుట, దుఃఖం= దుఃఖముతోకూడినది, యోగయుక్తః=యోగయుక్తుడు, మునిః=మననశీలుడు, బ్రహ్మ= బ్రహ్మమును, నచిరేణ=త్వరగా, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

గొప్ప బాహువులు కల ఓ అర్జునా ! కర్మయోగమును అనుష్ఠింపకసన్న్యాసము అనగా మనస్సు, ఇంద్రియములు, శరీరములద్వారా జరుగు కర్మలన్నింటి యందును కర్తృత్వమును త్యజించుట-కష్టము. భగవత్స్వరూపమును మననముచేయు కర్మయోగి పరబ్రహ్మ పరమాత్మను శీఘ్రముగ పొందుచున్నాడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

7 యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।

సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే

యోగయుక్తః-విశుద్ధాత్మా-విజితాత్మా-జితేంద్రియః

సర్వభూతాత్మ భూతాత్మా-కుర్వన్-అపి-న-లిప్యతే

యోగయుక్తః= యోగయుక్తుడును, విశుద్ధాత్మా= పరిశుద్ధమైన అంతఃకరణ గలవాడును, విజితాత్మా= తననుతాను వశపరచుకొన్నవాడును, జితేంద్రియః= జితేంద్రియుడును, సర్వభూతాత్మ భూతాత్మా = సర్వ ఆత్మలు తన ఆత్మగా తెలుసుకొనినవాడు, కుర్వన్ అపి= కర్మలను జేసినను, న లిప్యతే= అంటబడడు.

కర్మయోగము నాచరించువాడు మనస్సును వశమునందుంచుకొనినవాడు, జితేంద్రియుడు, అంతఃకరణశుద్ధి కలవాడు, సర్వప్రాణులలో ఆత్మస్వరూపుడైన పరమాత్మను తన ఆత్మగా కలవానికి కర్మలను ఆచరించుచున్నను వాటిచేత అంటబడడు.

8. నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్

9 ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి।

ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్

న- ఏవ-కించిత్-కరోమి- ఇతి-యుక్తః- మన్యేత-తత్త్వవిత్

పశ్యన్-శృణ్వన్-స్పృశన్-జిఘ్రన్-అశ్నన్-గచ్ఛన్-స్వపన్-శ్వసన్

ప్రలపన్-విసృజన్-గృహ్ణన్- ఉన్మిషన్ -నిమిషన్-అపి

ఇంద్రియాణి- ఇంద్రియార్థేషు - వర్తంతే - ఇతి- ధారయన్

తత్త్వవిత్= తత్త్వమునెరిగిన, యుక్తః= యోగయుక్తుడు, పశ్యన్= చూచుచు, శృణ్వన్= వినుచు, స్పృశన్= తాకుచు, జిఘ్రన్= వాసన చూచుచు, అశ్నన్= తినుచు, గచ్ఛన్= నడచుచు, స్వపన్= నిద్రించుచు, శ్వసన్= శ్వాసించుచు, ప్రలపన్= పలుకుచు, విసృజన్= విడుచుచు, గృహ్ణన్= తీసికొనుచు, ఉన్మిషన్నిమిషన్నపి= కనులు తెరచుచు మూయుచున్నను, ఇంద్రియాణి = ఇంద్రియములు, ఇంద్రియార్థేషు = శబ్దాది విషయములందు, వర్తంతే ఇతి= వర్తించుచున్నవని, ధారయన్= నిశ్చయించినవాడై, కించిత్= కొంచెమును, న కరోమి ఏవ ఇతి = నేను ఏమీ చేయుటలేదని, మన్యేత = తలంచును.

పరమార్థతత్వము నెఱిగిన సాంఖ్యయోగి చూచుచు, వినుచు, స్పృశించుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడుచుచు, నిద్రించుచు, శ్వాస క్రియలను నడుపుచు, భాషించుచు, త్యజించుచు, గ్రహించుచు, కనులను తెరచుచు, మూయుచు ఉన్నను ఇంద్రియములు తమతమవిషయముల యందు వర్తించుచున్నవనియు, తానేమియు చేయుటలేదనియే తలంచును.

10 బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।

లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ।

బ్రహ్మణి- ఆధాయ-కర్మాణి-సంగం-త్యక్త్వా-కరోతి-యః

లిప్యతే-న-సః-పాపేన-పద్మపత్రం- ఇవ-అంభసా

యః = ఎవడు, కర్మాణి = కర్మలను, బ్రహ్మణి= పరబ్రహ్మమునందు, ఆధాయ= ఉంచి, సంగం = ఆసక్తిని, త్యక్త్వా = విడిచి, కరోతి = చేయుచున్నాడో , సః = వాడు, అంభసా = నీటిచేతను, పద్మపత్రం ఇవ = తామరాకువలెను, పాపేన = పాపముచేత, న లిప్యతే = అంటబడడు.

కర్మలన్నింటిని భగవదర్పణము గావించి, ఫలాసక్తిరహితముగ కర్మలనాచరించు వానిని తామరాకుపై నీటిబిందువులవలె పాపముచేత అంటబడడు.

11 కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।

యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే

కాయేన -మనసా-బుద్ధ్యా-కేవలైః- ఇంద్రియైః-అపి

యోగినః-కర్మ-కుర్వంతి-సంగం-త్యక్త్వా- ఆత్మశుద్ధయే.

కాయేన-దేహముచేతను, మనసా=మనస్సుచేతను, బుద్ధ్యా = బుద్ధిచేతను, కేవలైః= ఆసక్తిలేనట్టి, ఇంద్రియైః అపి = ఇంద్రియములచేతను, ఆత్మశుద్ధయే = చిత్తశుద్ధికొరకు, యోగినః= యోగులు, సంగం త్యక్త్వా= సంగత్వము వీడి, కర్మ = కర్మమును, కుర్వంతి = చేయుచున్నారు.

కర్మయోగులు ఫలాసక్తిరహితులై కేవలము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, శరీరములద్వారా అంతఃకరణశుద్ధికై కర్మలను ఆచరించుచున్నారు

12 యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।

అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ।

యుక్తః-కర్మఫలం-త్యక్త్వా-శాంతిం- ఆప్నోతి-నైష్ఠికీం

అయుక్తః-కామకారేణ-ఫలే-సక్తః-నిబధ్యతే

యుక్తః= ఆత్మయోగారూఢుడు, కర్మఫలం = ఫలమును, త్యక్త్వా= విడిచి, నైష్ఠికీం = భగవత్ప్రాప్తి రూపమైన, శాంతిం = శాంతిని, ఆప్నోతి = పొందుచున్నాడు, అయుక్తః= యోగయుక్తుడు కానివాడు, కామకారేణ= కామప్రేరేపణచేత, ఫలే= కర్మఫలమునందు, సక్తః = ఆసక్తుడై, నిబధ్యతే = బంధింపబడుచున్నాడు.

నిష్కామకర్మయోగి కర్మఫలములను త్యజించి, భగవత్ప్రాప్తి రూపమైన శాంతిని పొందును. కర్మఫలాసక్తుడైన వాడు ఫలేచ్ఛతో కర్మలనాచరించి బద్ధుడగు చున్నాడు.

13 సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।

నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్ న కారయన్ ।

సర్వకర్మాణి-మనసా-సంన్యస్య- ఆస్తే-సుఖం-వశీ

నవద్వారే-పురే-దేహీ-న- ఏవ-కుర్వన్-న-కారయన్

వశీ= ఇంద్రియ నిగ్రహముగలవాడు, మనసా=మనస్సుచేత, సర్వకర్మాణి = సమస్తకర్మలను, సంన్యస్య = విడిచిపెట్టి, నవద్వారే = తొమ్మిది ద్వారములుగల, పురే = పురమున, దేహీ = పురుషుడు, న ఏవ కుర్వన్= చేయనివాడై, న కారయన్ = చేయింపనివాడై, సుఖం = సుఖముగ, ఆస్తే = ఉంటున్నాడు.

ఇంద్రియ నిగ్రహముతో నవద్వారములుగల శరీరమునందు సమస్తకర్మలను మానసికముగా త్యజించి, పరమాత్మస్వరూపమున స్థితుడై, ఆనందమును అనుభవించు చున్నాడు.

14 న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।

న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ।

న-కర్తృత్వం-న-కర్మాణి-లోకస్య-సృజతి-ప్రభుః

న-కర్మఫల సంయోగం-స్వభావః-తు-ప్రవర్తతే

ప్రభుః=ప్రభువు, లోకస్య = లోకమున, కర్తృత్వం = కర్తృత్వమును, కర్మాణి = కర్మలను, కర్మఫలసంయోగం = కర్మఫల సంబంధమును, న సృజతి = సృజియింపడు, స్వభావః తు = స్వభావమే, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

భగవంతుడు జీవుల యొక్క కర్తృత్వమునుగాని, వారి కర్మలనుగాని, కర్మఫల సంయోగమును గాని సృజింపడు. ఈ యన్నింటిలో ప్రకృతియే ప్రవర్తించుచున్నది.

15 నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।

అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ।

న- ఆదత్తే - కస్యచిత్-పాపం-న-చ- ఏవ-సుకృతం-విభుః

అజ్ఞానేన- ఆవృతం-జ్ఞానం-తేన-ముహ్యంతి-జంతవః

విభుః=ప్రభువు, కస్యచిత్ = ఎవనియొక్కయు, పాపం = పాపమును, సుకృతం చ ఏవ= పుణ్యమును కూడ, న ఆదత్తే = గ్రహింపడు, అజ్ఞానేన = అజ్ఞానముచేత, జ్ఞానం = జ్ఞానము, ఆవృతం = కప్పబడెను, తేన = అట్టి అజ్ఞానముచేత, జంతవః = జంతువులు, ముహ్యంతి = మోహమును చెందుచున్నవి.

సర్వవ్యాపియైన భగవంతుడు ప్రాణుల పుణ్యాపాపకర్మలలో దేనికిని భాగస్వామి కాడు. అజ్ఞానముచే జ్ఞానముకప్పబడి యుండుటవలన ప్రాణులు భ్రమకి లోనగుచున్నారు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

16 జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।

తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ।

జ్ఞానేన-తు-తత్-అజ్ఞానం-యేషాం-నాశితం- ఆత్మనః

తేషాం- ఆదిత్యవత్-జ్ఞానం-ప్రకాశయతి-తత్పరం

ఆత్మనః= ఆత్మయొక్క, జ్ఞానేన = జ్ఞానముచేత, యేషాం = ఎవరియొక్క, తత్ అజ్ఞానం తు = ఆ అజ్ఞానము, నాశితం = నశింపజేయబడినదో, తేషాం = వారియొక్క, జ్ఞానం = జ్ఞానము, ఆదిత్యవత్ = సూర్యునివలెను, తత్పరం = ఆ పరమాత్మను, ప్రకాశయతి = ప్రకాశింప జేయుచున్నది.

అజ్ఞానము పరమాత్మతత్త్వ జ్ఞానప్రాప్తి ద్వారా తొలగిపోవును. అప్పుడు ఆ జ్ఞానము వారికి పరమాత్మను సూర్యుని వలె ప్రకాశింపజేయుచున్నది.

17 తద్బుద్ధయస్తదాత్మానః తన్నిష్ఠా స్తత్పరాయణాః ।

గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ।

తద్బుద్ధయః-తదాత్మానః-తన్నిష్ఠాః-తత్పరాయణాః

గచ్ఛంతి-అపునరావృత్తిం-జ్ఞాన నిర్ధూత కల్మషాః

తద్బుద్ధయః= ఆబ్రహ్మమునందే బుద్ధిగలవారును, తదాత్మానః = తద్రూపమైనవారును, తన్నిష్ఠాః = ఆత్మ నిష్ఠలగువారును, తత్పరాయణాః = బ్రహ్మపరాయణులును, జ్ఞాననిర్ధూతకల్మషాః = జ్ఞానముచేత పోగొట్టబడిన పాపము గలవారునై , అపునరావృత్తిం = జన్మరహితమైన మోక్షమును, గచ్ఛంతి = పొందుచున్నారు.

పరమాత్మయందే నిరంతరము ఏకీభావములో స్థితులై, తత్పరాయణులైన పురుషులు జ్ఞానసాధనతో పాపరహితులై, పునరావృత్తిరహితమైన శాశ్వత పరమగతిని పొందుచున్నారు.

18 విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।

శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ।

విద్యావినయసంపన్నే-బ్రాహ్మణే-గవి-హస్తిని

శుని-చ- ఏవ-శ్వపాకే-చ-పండితాః-సమదర్శినః

విద్యావినయసంపన్నే=విద్యయును, వినయమునుగల, బ్రాహ్మణే=బ్రాహ్మణుని యందును, గవి= గోవుయందును, హస్తిని= ఏనుగునందును, శుని చ = కుక్క యందును, శ్వపాకే చ ఏవ= చండాలుని యందును కూడ, పండితాః = పండితులు, సమదర్శినః= సమభావము గలవారు.

విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవు, ఏనుగు, కుక్క మొదలగు వానియందును, చండాలునియందును సమదృష్టిని గలవానినే జ్ఞాని అందురు.

19 ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।

నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః ।

ఇహ- ఏవ-తైః-జితః-సర్గః-యేషాం-సామ్యే-స్థితం-మనః

నిర్దోషం-హి-సమం-బ్రహ్మ-తస్మాత్-బ్రహ్మణి-తే-స్థితాః

యేషాం= ఎవరియొక్క, మనః=మనస్సు, సామ్యే= సమభావమునందు, స్థితం=స్థిరముగ నుండునో, తైః = వారిచేతను, ఇహ ఏవ = ఈ లోకమునందే, సర్గః = జన్మము, జితః = జయింపబడెను, బ్రహ్మ= బ్రహ్మము, నిర్దోషం= దోషములేనిది, సమం హి = సమస్తము నందును సమముగా నున్నదిగదా, తస్మాత్= అందువలన, తే=వారు, బ్రహ్మణి= బ్రహ్మమునందు,స్థితాః= ఉన్నవారు.

ఎవరి మనస్సు సమభావమందు స్థిరమై యున్నదో అట్టివారు ఈ జన్మయందే సంపూర్ణ జగత్తును జయించిన వారగుదురు. అనగా ప్రాపంచిక విషయాతీతస్థితికి చేరుదురు. పరమాత్మ దోషరహితుడు, సముడు, అందువలన సమభావస్థిత మనస్కులైన బ్రహ్మమునందున్న వారేయగుదురు.

20 న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।

స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ।

న-ప్రహృష్యేత్-ప్రియం-ప్రాప్య-న- ఉద్విజేత్-ప్రాప్య-చ-అప్రియం

స్థిరబుద్ధిః-అసమ్మూఢః-బ్రహ్మవిత్- బ్రహ్మణి-స్థితః

స్థిరబుద్ధిః= స్థిరబుద్ధిగలవాడును, అసమ్మూఢః= మోహరహితుడును, బ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞాని, బ్రహ్మణి స్థితః= బ్రహ్మసమాధియందున్నవాడై, ప్రియం= ఇష్టమును, ప్రాప్య చ = పొందియును, ప్రహృష్యేత్ = సంతసించుట, న = లేదు, అప్రియం = అయిష్టమును, ప్రాప్య = పొందినను, న ఉద్విజేత్ = శోకింపడు.

స్థిరమైన బుద్ధిగలవాడును, మోహవివశుడు కానివాడును అయిన బ్రహ్మవేత్త ఇష్టమైన దానిని పొందినపుడు సంతోషముగాని, అనిష్టమైన దానిని పొందినప్పుడు దుఃఖముగాని పొందడు.

21 బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।

స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ।

బాహ్యస్పర్శేషు-అసక్తాత్మా-విందతి- ఆత్మని-యత్-సుఖం

సః-బ్రహ్మ-యోగయుక్తాత్మా-సుఖం-అక్షయం-అశ్నుతే

బాహ్యస్పర్శేషు = బాహ్య విషయములందు, అసక్తాత్మా = అనాసక్తుడు, ఆత్మని= తనయందు, యత్ = ఎట్టి, సుఖం = సుఖమును, విందతి = పొందునో, సః = వాడు, బ్రహ్మ యోగయుక్తాత్మా = బ్రహ్మయోగమునందు కూడినవాడై, అక్షయం = నాశములేని, సుఖం = శాంతిని, అశ్నుతే = పొందుచున్నాడు.

ప్రాపంచిక విషయములయందు అనాసక్తమైన అంతః కరణముగల సాధకుడు ఆత్మస్థితధ్యానజనితమైన సాత్త్వికాత్మానందమును పొందును. పిదప అతడు బ్రహ్మనిష్ఠయను సమాధితో గూడు కొనినవాడై, అక్షయమగు సుఖమును పొందుచున్నాడు.

22 యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।

ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ।

యే-హి-సంస్పర్శజాః-భోగాః-దుఃఖయోనయః- ఏవ-తే

ఆద్యంతవంతః=కౌంతేయ-న-తేషు-రమతే-బుధః

కౌంతేయ=అర్జునా, సంస్పర్శజాః = విషయేంద్రియ = సంయోగమువలన కలుగు, భోగాః= భోగములు, యే = ఏవి కలవో, తే = అవి, దుఃఖయోనయః ఏవ = దుఃఖహేతువులే, ఆద్యంతవంతః = ఆద్యంతములు గలవి, తేషు = వానియందు, బుధః = జ్ఞాని, న రమతే హి = రమించడుగదా.

ఓ అర్జునా ! విషయేంద్రియసంయోగమువలన ఉత్పన్నములగు భోగములన్నియును భోగలాలసులకు సుఖములుగా భాసించినను అవి నిస్సందేహముగా దుఃఖహేతువులే. ఆద్యంతములు గలవి. అనగా అనిత్యములు. వివేకి వాటియందు ఆసక్తుడు కాడు.

23 శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।

కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ।

శక్నోతి- ఇహ- ఏవ- యః-సోఢుం-ప్రాక్-శరీరవిమోక్షణాత్

కామక్రోధోద్భవం-వేగం-సః-యుక్తః-సః-సుఖీ-నర.

యః = ఏ, నరః=నరుడు, శరీరవిమోక్షణాత్ = శరీరమును విడుచుటకంటె, ప్రాక్ = పూర్వము, ఇహ ఏవ = ఈ లోకమునందే, కామక్రోధోద్భవం = కామక్రోధము వలన బుట్టిన, వేగం = వేగమును, సోఢుం = సహించుటకు, శక్నోతి = సమర్థుడగుచున్నాడో, సః = వాడు, యుక్తః = యోగి, సః = అతడే, సుఖీ = ఆత్మానందము గలవాడు.

ఎవరు ఈ శరీరమును విడువకముందే అనగా జీవించి యుండగనే కామక్రోధాదుల ఉద్వేగములను అదుపులో నుంచుకొనునో అతడే నిజమైన ఆత్మానంద యోగి.

24 యోఽ_ంతఃసుఖోఽ_ంతరారామః తథాంతర్జ్యోతిరేవ యః।

స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽ_ధిగచ్ఛతి।

యః-అంతః-సుఖః-అంతరారామః-తథా-అంతర్జ్యోతిః- ఏవ-యః

సః-యోగీ-బ్రహ్మనిర్వాణం-బ్రహ్మభూతః-అధిగచ్ఛతి

యః = ఎవడు, అంతస్సుఖః = ఆంతరంగిక సుఖముగలవాడును, అంతరారామః- ఆత్మరతి ననుభవించువాడును, తథా = అట్లే, యః = ఎవరైతే, అంతర్జ్యోతిః ఏవ = ఆత్మ ప్రకాశము గలవాడునగు, సః = ఆ, యోగీ = యోగి, బ్రహ్మ భూతః = బ్రహ్మభూతుడై, బ్రహ్మనిర్వాణం = మోక్షమును, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

ఎవరు అంతరాత్మయందే సుఖించుచు, ఆత్మయందే రమించునో అట్టి ఆత్మజ్ఞానియైన సాంఖ్యయోగి, పరబ్రహ్మ పరమాత్మయందు ఏకీభావస్థితుడై, బ్రహ్మ సాక్షాత్కారమును పొందును.

25 లభంతే బ్రహ్మనిర్వాణమ్ ఋషయః క్షీణకల్మషాః।

ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః।

లభంతే-బ్రహ్మనిర్వాణం-ఋషయః-క్షీణకల్మషాః

ఛిన్నద్వైధాః-యతాత్మానః-సర్వభూతహితే-రతాః

క్షీణకల్మషాః = నశించిన పాపములు గలవారును, ఛిన్నద్వైధాః = ఛేదింపబడిన సంశయములు గలవారు, యతాత్మానః =నియమింపబడిన దేహేంద్రియాదులు గలవారు, సర్వభూతహితే = సకల ప్రాణులకు హితము చేయుట నందును, రతాః = ఆసక్తి గలవారునగు, ఋషయః = జ్ఞానులు, బ్రహ్మ నిర్వాణం = బ్రహ్మానందమును, లభంతే = పొందుచున్నారు.

పాపరహితులును, జ్ఞానప్రభావమున సమస్తసంశయముల నివృత్తిని సాధించినవారును, సర్వప్రాణులహితమునుగోరుఋషులు, బ్రహ్మనిర్వాణ మును పొందుచున్నారు.

26 కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।

అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ।

కామక్రోధ వియుక్తానాం-యతీనాం-యతచేతసాం

అభితః-బ్రహ్మనిర్వాణం-వర్తతే-విదితాత్మనాం

కామక్రోధవియుక్తానాం = కామక్రోధములచేత విడువబడినవారును, యతచేతసాం =నియమింపబడిన చిత్తము గలవారు, విదితాత్మనాం = తెలియబడిన ఆత్మ గలవారును అగు, యతీనాం = యతులకు, బ్రహ్మనిర్వాణం = బ్రహ్మానందము, అభితః = అంతటను, వర్తతే = ఉన్నది.

కామక్రోధములు లేనివారు, మనోనిగ్రహము కలవారును అయి, పరబ్రహ్మపరమాత్మ సాక్షాత్కారమును పొందిన జ్ఞానులకు అంతటను పరబ్రహ్మపరమాత్మయే గోచరించును.

27 స్పర్శాన్ కృతత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాంతరే భ్రువోః ।

ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ ।

28 యతేంద్రియమనోబుద్ధిః మునిర్మోక్షపరాయణః ।

విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః ।

స్పర్శాన్-కృత్వా-బహిః-బాహ్యాన్-చక్షుః-చ- ఏవ-అంతరే-భ్రువోః

ప్రాణాపానౌ-సమౌ-కృత్వా-నాసాభ్యంతర చారిణౌ

యతేంద్రియమనోబుద్ధిః-మునిః-మోక్షపరాయణః

విగతేచ్ఛాభయక్రోధః-యః-సదా-ముక్తః- ఏవ-సః

యః = ఎవడు, బాహ్యాన్ = వెలుపలివైన, స్పర్శాన్=శబ్దాది విషయములను, బహిః ఏవ = వెలుపలనే, కృత్వా = చేసి, చ =మరియు, చక్షుః = దృష్టిని, భ్రువోః= కనుబొమ్మల యొక్క, అంతరే = నడుమ, కృత్వా= నిలిపి, ప్రాణాపానౌ= ప్రాణాపానవాయువులను, సమౌ = సమానముగా, నాసాభ్యంతరచారిణౌ = ముక్కులోపల సంచరించునట్లు, యతేంద్రియ మనోబుద్ధిః= నియమింపబడిన ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, విగతేచ్ఛాభయక్రోధః= కోరికను, భయమును, క్రోధమును విడిచినవాడై, మోక్ష పరాయణః= మోక్షపరాయణుడై, మునిః = ముని అయి, (వర్తతే= ఉంటున్నాడో), సః = అతడు, సదా = ఎల్లప్పుడును, ముక్తః ఏవ = ముక్తుడే.

బాహ్య విషయభోగములను చింతనచేయక వాటిని పారద్రోలవలెను. దృష్టిని భ్రూమధ్యమునందును స్థిరముగా ఉంచవలెను. నాసికయందు ప్రసరించుచున్న ప్రాణాపాన వాయువులను సమస్థితిలో నడుపవలెను. ఈ ప్రక్రియల ప్రభావమున మనస్సు, బుద్ధి, ఇంద్రియములు సాధకుని వశములోనికి వచ్చును. ఇట్టి సాధనవలన మోక్షపరాయణుడైన సాధకుడు ఇచ్ఛాభయక్రోధరహితుడై ఎల్లప్పుడు ముక్తుడగును.

29 భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।

సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ।

భోక్తారం-యజ్ఞతపసాం-సర్వలోక మహేశ్వరం

సుహృదం-సర్వభూతానాం-జ్ఞాత్వా-మాం -శాంతిం-ఋచ్ఛతి

యజ్ఞతపసాం=యజ్ఞతపస్సులకు, భోక్తారం= భోక్తగను, సర్వలోకమహేశ్వరం = సర్వలోకములకు ప్రభువును, సర్వభూతానం = సర్వభూతములకు, సుహృదం= మిత్రునిగను, మాం = నన్ను, జ్ఞాత్వా= తెలిసికొని, శాంతిం = శాంతిని, ఋచ్ఛతి = పొందుచున్నాడు.

భగవంతుడు యజ్ఞములకును, తపస్సులకును భోక్త. సమస్తలోకము లకును లోకేశ్వరులకును అధిపతి. సమస్త ప్రాణులకును ఆత్మీయుడు. పరమ ప్రేమస్వరూపుడు. ఇట్టి భగవత్తత్త్వమును ఎఱిగిన భక్తునకు పరమశాంతి లభించును.

ఓం తత్సదితి శ్రీ మద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగోనామ

పంచమోఽధ్యాయః

శ్రీపరమాత్మనే నమః

అథ షష్ఠోऽధ్యాయః - ఆత్మసంయమయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।

స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః

అనాశ్రితః-కర్మఫలం-కార్యం-కర్మ-కరోతి-యః

సః-సంన్యాసీ-చ-యోగీ-చ-న-నిరగ్నిః-న-చ-అక్రియః

యః= ఎవ్వడు, కార్యం = చేయదగిన, కర్మ= కర్మమును, కర్మఫలం = కర్మఫలమును, అనాశ్రితః= ఆశించనివాడై, కరోతి = చేయునో, సః = అతడు, సంన్యాసీ చ = సన్యాసియును, యోగీ చ = యోగియును, నిరగ్నిః = అగ్నిహోత్రాదులు వదిలినవాడును, అక్రియః చ = కర్మలు చేయనివాడును, న = కాడు.

శ్రీభగవానుడు పలికెను - కర్మఫలమును ఆశ్రయింపక కర్తవ్యకర్మలను ఆచరించువాడే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి. కాని కేవలము అగ్ని కార్యములను త్యజించినంత మాత్రమున సన్న్యాసియుకాడు.

2 యం సన్న్యాసమితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ।

న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన

యం-సంన్యాసం- ఇతి-ప్రాహుః-యోగం-తం-విద్ధి-పాండవ

న-హి-అసంన్యస్తసంకల్పః-యోగీ-భవతి-కశ్చన

పాండవ= అర్జునా, యం = దేనిని, సంన్యాసం ఇతి = సన్యాసమని, ప్రాహుః = చెప్పుదురో, తం = దానిని, యోగం = యోగముగా, విద్ధి = తెలిసికొనుము, అసంన్యస్తసంకల్పః = విడువబడని సంకల్పములు గలవాడు, కశ్చన = ఎవడును, యోగీ = యోగి, న భవతి హి = కాడుగదా.

ఓ అర్జునా ! సన్న్యాసము అని పిలువబడునదియే యోగము అని తెలిసికొనుము. సంకల్పత్యాగము చేయనివాడెవ్వడును యోగి కానేరడు.

3. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే ॥

ఆరురుక్షో-మునేః-యోగం-కర్మ-కారణం- ఉచ్యతే
యోగారూఢస్య-తస్య- ఏవ- శమః-కారణం- ఉచ్యతే

యోగం =యోగమును, ఆరురుక్షోః = పొందదలచిన, మునేః = మునికి, కర్మ = కర్మము, కారణం = సాధనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, యోగారూఢస్య = యోగమును పొందిన, తస్య = వానికి, శమః ఏవ = శమమే, కారణం = కారణమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

యోగారూఢస్థితిని పొందగోరు మననశీలుడైన పురుషునకు నిష్కామకర్మాచరణమువలననే యోగప్రాప్తికలుగును. యోగారూఢుడైన పురుషునకు సర్వసంకల్పరాహిత్యమే మోక్షప్రాప్తికి మూలము.

4 యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ।

యదా-హి-న- ఇంద్రియార్థేషు -న-కర్మసు - అనుషజ్జతే
సర్వ సంకల్ప సంన్యాసీ -యోగారూఢః-తదా- ఉచ్యతే

యదాహి= ఎప్పుడయితే, ఇంద్రియార్థేషు =శబ్దాది విషయములందు, కర్మసు = కర్మలయందు, న అనుషజ్జతే = ఆసక్తినుంచడో, సర్వసంకల్పసంన్యాసీ = సర్వ సంకల్పములను త్యాగముచేసినవాడు, తదా = అప్పుడు, యోగారూఢః = యోగారూఢుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

ఇంద్రియభోగములయందును, కర్మలయందును ఆసక్తినుంచక సర్వసంకల్పములను త్యజించిన పురుషుడు యోగారూఢుడనబడును.

5 ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్।

ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః।

ఉద్ధరేత్- ఆత్మనా- ఆత్మానం -న- ఆత్మానం- అవసాదయేత్

ఆత్మా - ఏవ-హి- ఆత్మనః- బంధుః- ఆత్మా- ఏవ- రిపుః - ఆత్మనః

ఆత్మానం= తనను, ఆత్మనా = ఆత్మచేతను, ఉద్ధరేత్ = ఉద్ధరించుకొనవలెను, ఆత్మానం = ఆత్మను, న అవసాదయేత్ = అధోగతి కానీయకూడదు, ఆత్మన ః =తనకు, ఆత్మా ఏవ = ఆత్మయే, బంధుః హి = బంధువుగదా, ఆత్మనః = ఆత్మకు, ఆత్మా ఏవ = ఆత్మయే, రిపుః = శత్రువు గదా.

మనుజులు ఈ సంసారసాగరమునుండి తమను తామే ఉద్ధరించు కొనవలెను. తమకుతామే అధోగతిపాలుకారాదు. లోకములో వాస్తవముగ తమకు తామే మిత్రులు, తమకు తామే శత్రువులు.

6 బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః।

అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్।

బంధుః- ఆత్మా- ఆత్మనః -తస్య-యేన- ఆత్మా - ఏవ- ఆత్మనా-జితః

అనాత్మనః-తు-శత్రుత్వే-వర్తేత- ఆత్మా - ఏవ-శత్రువత్

యేన- ఎవనిచేత, ఆత్మా = ఆత్మ, ఆత్మనా ఏవ = ఆత్మచేతనే, జితః = జయింపబడినదో, ఆత్మనః = ఆత్మయోగియైన, తస్య = వానికి, ఆత్మా= ఆత్మ, బంధుః = బంధువు, అనాత్మనః తు = ఆత్మజ్ఞానము లేనివానికి, ఆత్మా ఏవ = ఆత్మయే, శత్రువత్= శత్రువువలె, శత్రుత్వే = శత్రుభావమునందు, వర్తేత = ప్రవర్తించును.

ఎవరు తన మనస్సును జయించునో అట్టి వాని మనస్సు బంధువులా ఉపకారిలా వుండును. మనస్సును జయింపనిచో అది శత్రువై అపకారము చేయును.

7 జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।

శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ।

జితాత్మనః-ప్రశాంతస్య-పరమాత్మా-సమాహితః

శీతోష్ణ సుఖదుఃఖేషు-తథా-మానాపమానయోః

శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణసుఖదుఃఖములందు, తథా = అటులే, మానాప మానయోః = మానాపమానములయందు, ప్రశాంతస్య = ప్రశాంతస్వభావము గలవానికి, జితాత్మనః = జయింపబడిన ఆత్మ గలవానికి, పరమాత్మా= పరమాత్మ, సమాహితః= సమాహితుడగు చున్నాడు.

శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు మున్నగు ద్వంద్వములయందు అంతఃకరణవృత్తులు నిశ్చలముగా ఉండి, స్వాధీనమైన ఆత్మగల పురుషుని జ్ఞానమునందు పరమాత్మ చక్కగా స్థితుడై యుండును.

8 జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।

యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ।

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా-కూటస్థః-విజితేంద్రియః

యుక్తః- ఇతి- ఉచ్యతే- యోగీ- సమలోష్టాశ్మకాంచనః

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా = జ్ఞానవిజ్ఞానములచేత తృప్తి చెందినవాడు, కూటస్థః = కూటస్థుడు, విజితేంద్రియః = జయింపబడిన ఇంద్రియములు గలవాడు, యుక్తః ఇతి = యుక్తుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు, యోగీ = అట్టి యోగి, సమలోష్టాశ్మకాంచనః = మట్టిని, రాతిని, బంగారమును సమముగా జూచువాడు.

యోగియొక్క అంతఃకరణము నందు జ్ఞానవిజ్ఞానములు నిండియుండును. అతడు వికారరహితుడు. ఇంద్రియాదులను పూర్తిగా వశపఱచుకొనిన వాడు. అతడు మట్టిని, రాతిని, బంగారమును సమానముగా చూచును.

9 సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు।

సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే।

సుహృత్-మిత్ర-అరి- ఉదాసీన-మధ్యస్థ-ద్వేష్యబంధుషు

సాధుషు-అపి-చ-పాపేషు-సమబుద్ధిః-విశిష్యతే

సుహృత్= మంచి హృదయము గలవారియందును, మిత్ర = మిత్రుల యందును, అరి = శత్రువులయందును, ఉదాసీన = తటస్థులయందును, మధ్యస్థ = మధ్యవర్తుల యందును, ద్వేష్య = అప్రియులయందును, బంధుషు = బంధువులయందును, సాధుషు = మంచివారి యందును, పాపేషు అపిచ = పాపులయందును, సమబుద్ధిః = సమభావము గలవాడు, విశిష్యతే = శ్రేష్ఠుడగుచున్నాడు.

సుహృదులయందును, మిత్రులయందును, శత్రువుల యందును, ఉదాసీనులయందును, మధ్యస్థులయందును, ద్వేషింపదగినవారియందును, బంధువులయందును, ధర్మాత్ములయందును, పాపులయందును సమబుద్ధి కలిగియుండువాడు మిక్కిలి శ్రేష్ఠుడు.

10 యోగీ యుంజీత సతతమ్ ఆత్మానం రహసి స్థితః।

ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః।

యోగీ-యుంజీత-సతతం- ఆత్మానం-రహసి-స్థితః

ఏకాకీ-యతచిత్తాత్మా-నిరాశీః-అపరిగ్రహః

యోగీ=యోగి, రహసి=రహస్య ప్రదేశమునందు, స్థితః= ఉన్నవాడై, ఏకాకీ = ఏకాంతముగ నుండువాడు, యతచిత్తాత్మా = వశీకృతమైన దేహేంద్రియాదులు గలవాడు, నిరాశీః= ఆశలేనివాడు, అపరిగ్రహః = అన్యులనుండి ఏమియు గ్రహించనివాడు, సతతం = నిరంతరము, ఆత్మానం = తనను, యుంజీత= ధ్యాననిష్ఠయందుంచవలెను.

శరీరేంద్రియమనస్సులను స్వాధీనపఱచుకొనినవాడు, ఆశారహితుడు, వ్రతుడు అయిన యోగి ఒంటరి ప్రదేశమున కూర్చొని, ఆత్మను నిరంతరము పరమాత్మయందే ఉంచవలెను.

11 శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।

నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ।

శుచౌ-దేశే-ప్రతిష్ఠాప్య-స్థిరం- ఆసనం- ఆత్మనః

న-అత్యుచ్ఛ్రితం-న-అతినీచం-చైలాజినకుశోత్తరం

శుచౌ=శుచియైన, దేశే= ప్రదేశమునందు, న అత్యుచ్ఛ్రితం = మిక్కిలి ఎత్తుగానిదియు, న అతినీచం = మిక్కిలి క్రిందిగానుండనిదియు, చేలాజీనకుశోత్తరం = వస్త్రము, చర్మము, దర్భలును ఒకదానిపై నొకటిగ గలదియు, స్థిరం= స్థిరమైనదియు, ఆత్మనః = తనయొక్క, ఆసనం = పీఠమును, ప్రతిష్ఠాప్య = నిలిపి.

పరిశుభ్రమైన ప్రదేశమున క్రమముగా ధర్భాసనమును, జింకచర్మమును, వస్త్రమును ఒకదానిపై ఒకటి పఱచి అంత ఎక్కువగాకాని, తక్కువగాకాని కాకుండ సమానమైన ఎత్తులో స్థిరమైన స్థానమును ఏర్పఱచుకొనవలెను.

12 తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।

ఉపవిశ్యసనే యుంజ్యాత్ యోగమాత్మవిశుద్ధయే ।

తత్ర- ఏకాగ్రం-మనః-కృత్వా-యతచిత్తేంద్రియక్రియః

ఉపవిశ్య- ఆసనే-యుంజ్యాత్-యోగం- ఆత్మవిశుద్ధయే

యతచిత్తేంద్రియ క్రియః= స్వాధీనమైన ఇంద్రియ, మనోవ్యాపారములు గలవాడై, మనః = మనస్సును, ఏకాగ్రం = ఏకవిషయము నందున్న దానినిగను, కృత్వా = చేసి, తత్ర = ఆ, ఆసనే = పీఠమునందు, ఉపవిశ్య = కూర్చుండి, ఆత్మవిశుద్ధయే = ఆత్మ శుద్ధికొరకు, యోగం = ఆత్మయోగమును, యుంజ్యాత్ = అభ్యాసము చేయవలెను.

ఆ ఆసనముపైకూర్చొని, చిత్తేంద్రియవ్యాపారములను వశము నందుంచుకొని, ఏకాగ్రతగల మనస్సుతో అంతః కరణశుద్ధికై యోగాభ్యాసమును సాధనచేయవలెను.

13 సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।

సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్।

సమం-కాయశిరోగ్రీవం-ధారయన్-అచలం-స్థిరః

సంప్రేక్ష్య-నాసికాగ్రం-స్వం-దిశః-చ-అనవలోకయన్

యుక్తః=యోగయుక్తుడు, కాయశిరోగ్రీవం = దేహమును, శిరమును, కంఠమును, అచలం =కదలకుండ, సమం=సమముగను, ధారయన్= ధరించుచు, స్థిరః= స్థిరుడై, దిశఃచ = దిక్కులను, అనవలోకయన్= చూడనివాడై, స్వం= తనదైన, నాసికాగ్రం = ముక్కు చివరను, సంప్రేక్ష్య = చూచుచు.

శరీరమును మెడను శిరస్సును నిటారుగ నిశ్చలముగా స్థిరముగానుంచి, దిక్కులను చూడక తననాసికాగ్రభాగమునందే దృష్టిని నిలుపవలెను.

14 ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః।

మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః।

ప్రశాంతాత్మా-విగతభీః-బ్రహ్మచారి వ్రతే-స్థితః

మనః-సంయమ్య-మచ్చిత్తః-యుక్తః- ఆసీత-మత్పరః

మనః = మనస్సును, సంయమ్య = నిగ్రహించి, ప్రశాంతాత్మా= ప్రశాంతచిత్తుడై, విగతభీః = భయము లేనివాడై, బ్రహ్మచారివ్రతే= బ్రహ్మచారివ్రతమునందు, స్థితః = ఉండి, మచ్చిత్త = నాయందే చిత్తమును నిలిపి, మత్పరః = నా భక్తుడై, ఆసీత = ఉండవలెను.

ధ్యానయోగి ప్రశాంతాత్ముడై, భయరహితుడై, బ్రహ్మచర్యవ్రతమును పాటించుచు, మనోనిగ్రహముతో నాయందు చిత్తము గలవాడై, నన్నే పరమ గతిగ నమ్మి నిశ్చలుడైయుండవలెను.

15 యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।

శాంతి నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ।

యుంజన్- ఏవం-సదా- ఆత్మానం- యోగీ-నియతమానసః

శాంతిం-నిర్వాణపరమాం-మత్సంస్థాం-అధిగచ్ఛతి

యోగీ=యోగి, నియతమానసః= నియమింపబడిన మనస్సు గలవాడై, సదా = నిరంతరము, ఏవం = ఈ రీతిగా, ఆత్మానం= తనను, యుంజన్= యోగమునందు నిలిపినవాడై, నిర్వాణపరమాం = ఉత్తమ మోక్షము, మత్సంస్థాం= నా స్థితియొక్క, శాంతిం = శాంతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

మనోనిగ్రహశాలియైన యోగి నిరంతరము పరమేశ్వరుడనైన నా స్వరూపమునందే ఆత్మను ఈ విధముగా లగ్నమొనర్చి, నాయందున్న పరమానందమునకు పరాకాష్ఠరూపమైన శాంతిని పొందుచున్నాడు.

16 నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।

న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ।

న-అతి-అశ్నతః-తు-యోగః-అస్తి-న-చ- ఏకాంతం-అనశ్నతః

న-చ-అతి-స్వప్నశీలస్య-జాగ్రతః-న- ఏవ-చ-అర్జున

అర్జున=అర్జునా, యోగః = యోగము, అతి అశ్నతః తు = విశేషముగా తినెడివానికి, న అస్తి = లేదు, ఏకాంతం =మిక్కిలి, అనశ్నతః చ = తిననివానికి, న = లేదు, అతిస్వప్నశీలస్య చ = ఎక్కువ నింద్రించువానికి, న = లేదు, జాగ్రతః ఏవ చ = మేలుకొని యుండువానికి, న = లేదు.

అర్జునా ! అతిగా భుజించువానికిని, ఏ మాత్రము భుజింపనివానికిని, అతిగా నింద్రించువానికిని, ఎల్లప్పుడు మేల్కొని యుండువానికిని ఈ యోగసిద్ధికలుగదు.

17 యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।

యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ।

యుక్తాహార విహారస్య-యుక్తచేష్టస్య - కర్మసు

యుక్తస్వప్నావబోధస్య - యోగః-భవతి -దుఃఖహా

యుక్తాహార విహారస్య = ఉచితమైన ఆహార విహారములు గలవానికి, కర్మసు = కర్మలయందు, యుక్తచేష్టస్య = ఉచితరీతిని చరించువానికి, యుక్తస్వప్నావబోధస్య = యుక్తమైన నిదుర, మెలకువ గలవానికి, యోగః = ఈ యోగము, దుఃఖహా= దుఃఖహారము, భవతి= అగుచున్నది.

మితాహారము, కర్మలందు మితమైన ప్రవర్తన గలవాడును, మితమైన నిద్రగల మనుజునకు యోగము దుఃఖములను బోగొట్టునదిగ అగుచున్నది.

18 యదా వినియతం చిత్తమ్ ఆత్మన్యేవావతిష్ఠతే ।

నిఃస్పృహః -సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ।

యదా-వినియతం-చిత్తం- ఆత్మని- ఏవ- అవతిష్ఠతే

నిఃస్పృహః-సర్వకామేభ్యః-యుక్తః- ఇతి- ఉచ్యతే-తదా

యదా= ఎప్పుడు, వినియుతం = నియమింపబడిన, చిత్తం = మనస్సు, ఆత్మని ఏవ = ఆత్మయందే, అవతిష్ఠతే = నిలిచియుండునో, తదా = అప్పుడు, సర్వకామేభ్యః = సమస్త కామములనుండి, నిఃస్పృహః = కోరికలేనివాడై, యుక్తః ఇతి = యుక్తుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

చిత్తమును పూర్తిగా వశమునందుంచుకొని, దానిని పరమాత్మయందే స్థిరముగా నిల్పినప్పుడు పురుషుడు సర్వభోగములయందును స్పృహారహితుడగును. అప్పుడతడు యోగయుక్తుడగుచున్నాడు.

19 యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।

యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ।

యథా-దీపః-నివాతస్థః-న- ఇంగతే-సా- ఉపమా-స్మృతా

యోగినః-యతచిత్తస్య-యుంజతః-యోగం- ఆత్మనః

నివాతస్థః= గాలిలేనిచోటనున్న, దీపః = దీపము, యథా = ఎటుల, న ఇంగతే = కదలకుండునో, సా = అది, ఆత్మనః = ఆత్మయొక్క, యోగం = యోగమును, యుంజతః = అభ్యసించుచున్న, యోగినః = యోగియొక్క, యతచిత్తస్య = నియమితచిత్తమునకు, ఉపమా = దృష్టాంతముగ, స్మృతా = చెప్పబడుచున్నది.

వాయుప్రసారములేనిచోట నిశ్చలముగా నుండు దీపమువలె యోగికి వశమైయున్న చిత్తము పరమాత్మధ్యానమున నిర్వికారముగా నిశ్చలముగా నుండును.

20 యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।

యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ।

యత్ర- ఉపరమతే- చిత్తం- నిరుద్ధం- యోగసేవయా

యత్ర-చ- ఏవ- ఆత్మనా- ఆత్మానం - పశ్యన్- ఆత్మని-తుష్యతి

యోగసేవయా = యోగము యొక్క సేవచే, నిరుద్ధం = నియమింపబడిన, చిత్తం = చిత్తము, యత్ర = ఎచ్చట, ఉపరమతే = శాంతిని పొందుచున్నాదో, ఆత్మని = ఆత్మయందు, ఆత్మానం = ఆత్మను, ఆత్మనా = ఆత్మచేత, పశ్యన్ = దర్శించుచు, యత్ర చ ఏవ = ఏస్థితియందుండుట వలన, తుష్యతి = ఆనందమును బొందుచున్నదో.

ధ్యానయోగసాధనచే నిగ్రహింపబడిన చిత్తము ఉపరతిని పొంది, పరమాత్మను ధ్యానించుట ద్వారా పవిత్రమైన సూక్ష్మబుద్ధితో, ఆ భగవానుని సాక్షాత్కరింపజేసికొని, యోగి ఆ పరమాత్మయందే సంతుష్టుడగుచున్నాడు.

21 సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।

వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ।

సుఖం- ఆత్యంతికం-యత్-తత్-బుద్ధిగ్రాహ్యం- అతీంద్రియం

వేత్తి-యత్ర-న-చ- ఏవ-అయం-స్థితః-చలతి-తత్త్వతః

యత్= ఏది, అతీంద్రియం= ఇంద్రియ గ్రాహ్యము కానిదియు, బుద్ధిగ్రాహ్యం = బుద్ధికే గ్రాహ్యమైనదియు, తత్= ఆ, ఆత్యంతికం = పరమమైన, సుఖం = సుఖమును, యత్ర = ఏ స్థితియందు, వేత్తి = తెలిసికొనుచున్నాడో, (తత్ర = ఆ స్థితియందు) స్థితః= ఉన్నవాడైన, అయం = ఈయోగి, తత్త్వతః = తత్త్వము నుండి, న చ చలతి ఏవ = చలింపకయే యుండును.

బ్రహ్మానందానుభవము ఇంద్రియాతీతమైనది. పవిత్రమైన సూక్ష్మబుద్ధిద్వారా మాత్రమే గ్రాహ్యమైనది. ఆ బ్రహ్మానందమును అనుభవించుచు దానియందే స్థితుడైయున్న యోగి పరమాత్మ స్వరూపమునుండి ఏ మాత్రమూ చలింపడు.

22 యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।

యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ।

యం-లబ్ధ్వా-చ-అపరం-లాభం-మన్యతే-న-అధికం-తతః

యస్మిన్-స్థితః-న-దుఃఖేన-గురుణా-అపి-విచాల్యతే

యం చ = దేనిని, లబ్ధ్వా= పొంది, తతః = అంతకంటే, అపరం= ఇతరమైన, లాభం = లాభమును, అధికం = విశేషముగ, న మన్యతే = తలంపడో, యస్మిన్ = దేనియందు, స్థితః = ఉన్నవాడై, గురుణా = గొప్పదైన, దుఃఖేన అపి = దుఃఖముచేత గూడ, న విచాల్యతే = చలింపజేయబడడో.

పరమాత్మప్రాప్తిరూపలాభమును పొందినవాడు, ఏయితర లాభమును గూడ దానికంటె అధికమైన దానినిగా తలంపడు. బ్రహ్మానందానుభవస్థితిలోనున్న యోగిని ఎట్టి బలవద్దుఃఖ ములును చలింపజేయజాలవు.

23 తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।

స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ।

తం-విద్యాత్-దుఃఖసంయోగ వియోగం-యోగసంజ్ఞితమ్

సః-నిశ్చయేన-యోక్తవ్యః-యోగః-అనిర్విణ్ణచేతసా

దుఃఖ సంయోగ వియోగం = దుఃఖ సంబంధమును దూరము చేయు, తం = దానిని, యోగ సంజ్ఞితం = యోగమనబడు దానినిగ, విద్యాత్ = తెలుసుకొనవలయును, అనిర్విణ్ణ చేతసా = విసుగులేని మనస్సుగల వానిచేత, సః = అటువంటి, యోగః = యోగము, నిశ్చయేన = నిశ్చయ బుద్ధితో, యోక్తవ్యః = అభ్యసింపదగినది.

దుఃఖరూపసంసారబంధములనుండి విముక్తిని కలిగించు ఈ భగవత్సాక్షాత్కారరూపస్థితిని యోగము అని తెలియవలెను. అట్టి యోగమును దృఢమైన, ఉత్సాహపూరిత మైన విసుగులేని చిత్తముతో నిశ్చయముగా అభ్యాసము చేయవలెను.

24 సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।

మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ।

సంకల్పప్రభవాన్-కామాన్-త్యక్త్వా-సర్వాన్-అశేషతః

మనసా- ఏవ- ఇంద్రియగ్రామం- వినియమ్య -సమంతతః

సంకల్ప ప్రభవాన్=సంకల్పము వలన బుట్టెడి, సర్వాన్= సమస్తమైన, కామాన్ = కోరికలను, అశేషతః = నిశ్శేషముగా, త్యక్త్వా=విడిచి, మనసా ఏవ = మనస్సుచేతనే, ఇంద్రియగ్రామం = ఇంద్రియ సమూహమును, సమంతతః = సమస్త విషయముల నుండియు, వినియమ్య = మరల్చి.

సంకల్పములవలనకలిగిన కోరికలన్నింటిని నిశ్శేషముగా త్యజించి ఇంద్రియ సముదాయములను అన్నివిధములుగ మనస్సుతో పూర్తిగా నిగ్రహింపవలెను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

25 శనైః శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।

ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ।

శనైః-శనైః- ఉపరమేత్-బుద్ధ్యా-ధృతిగృహీతయా

ఆత్మసంస్థం-మనః-కృత్వా-న-కించిత్-అపి-చింతయేత్

ధృతి గృహీతయా=ధైర్యముచే గ్రహింపబడిన, బుద్ధ్యా = బుద్ధిచేతను, మనః = మనస్సును, ఆత్మసంస్థం = ఆత్మ యందుండు దానినిగను, కృత్వా = చేసి, శనైః శనైః = మెలమెల్లగా, ఉపరమేత్ = బాహ్య విషయములనుండి మరలింపవలెను, కించిత్ అపి = కొంచెమైనను, న చింతయేత్ = చింతింపగూడదు.

క్రమక్రమముగా సాధనచేయుచు ఉపరతిని పొందవలెను. ధైర్యముతో బుద్ధిబలముతో మనస్సును పరమాత్మయందు స్థిరమొనర్చి, పరమాత్మనుతప్ప మఱి ఏ ఇతర విషయమును ఏ మాత్రమూ చింతనచేయరాదు.

26 యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।

తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్ ।

యతః-యతః-నిశ్చరతి-మనః-చంచలం-అస్థిరం

తతః-తతః-నియమ్య- ఏతత్- ఆత్మని- ఏవ-వశం-నయేత్

యతః యతః= ఏయే విషయములందు, చంచలం= చంచలమైనదియును, అస్థిరం = నిలకడ లేనిదియునగు, మనః= మనస్సు, నిశ్చరతి = నిరంతరము సంచరించుచున్నదో, తతః తతః = ఆయా విషయముల నుండి, ఏతత్ = ఈ మనస్సును, నియమ్య = మరలించి, ఆత్మని ఏవ = ఆత్మయందే, వశం = వశమును, నయేత్ = పొందింపవలయును.

సహజముగా నిలుకడలేని చంచలమైన మనస్సు ప్రాపంచిక విషయముల యందు విశృంఖలముగా పరిభ్రమించు చుండును. అట్టి మనస్సును ఆయా విషయములనుండి పదే పదే మఱల్చి, దానిని పరమాత్మ యందే స్థిరముగా నిలుపవలయును.

27 ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।

ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ।

ప్రశాంతమనసం-హి- ఏనం- యోగినం-సుఖం- ఉత్తమం

ఉపైతి-శాంతరజసం-బ్రహ్మభూతం-అకల్మషం

ప్రశాంత మనసం = ప్రశాంతచిత్తుడును, శాంతరజసం = శాంతినిబొందిన రజోగుణము గలవాడు, బ్రహ్మభూతం = బ్రహ్మభూతుడు, అకల్మషం = పాపరహితుడునగు, ఏనం = ఈ, యోగినం= యోగి, ఉత్తమం = శ్రేష్ఠమైన, సుఖం = సుఖము, ఉపైతి హి = పొందుచున్నది గదా.

ప్రశాంతమైనమనస్సు కలవాడును, పాపరహితుడును, రజోగుణము శాంతమైనవాడును, అనగా ప్రాపంచిక కార్యములయందు ఆసక్తి తొలగినవాడును, పరమాత్మయందు ఏకీభావమును పొందినవాడును అగు యోగి బ్రహ్మానందమును పొందుచున్నాడు.

28 యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।

సుఖేన బ్రహ్మసంస్పర్శమ్ అత్యంతం సుఖమశ్నుతే ।

యుంజన్- ఏవం-సదా - ఆత్మానం-యోగీ-విగతకల్మషః

సుఖేన-బ్రహ్మసంస్పర్శం-అత్యంతం-సుఖం-అశ్నుతే

ఏవం- ఈవిధముగ, సదా = ఎల్లప్పుడు, ఆత్మానం = తనను, యుంజన్ = ఆత్మయందు నిలుపని, విగత కల్మషః = పాపరహితమైన, యోగీ = యోగి, సుఖేన = సులభము గాను, బ్రహ్మ సంస్పర్శం = బ్రహ్మానుభవ రూపమగు, అత్యంతం= నిరతిశయమగు, సుఖం = ఆనందమును, అశ్నుతే = పొందుచున్నాడు.

పాపరహితుడైన ఆ యోగి పూర్వోక్తరీతిగా నిరంతరము ఆత్మను పరమాత్మయందే లగ్నమొనర్చుచు, పరబ్రహ్మపరమాత్మ ప్రాప్తిరూపమైన అపరిమితానందమును హాయిగా అనుభవించును.

29 సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।

ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ।

సర్వభూతస్థం - ఆత్మానం-సర్వభూతాని-చ- ఆత్మని

ఈక్షతే-యోగయుక్తాత్మా-సర్వత్ర-సమదర్శనః

యోగయుక్తాత్మా = యోగయుక్తుడు, సర్వత్ర=అంతట, సమదర్శనః= సమబుద్ధి కలిగి, ఆత్మానం = తన ఆత్మను, సర్వభూతస్థం= సకలభూతముల యందున్న వానినిగను, సర్వభూతాని = సర్వభూతములను, ఆత్మని చ = తనయందును, ఈక్షతే= దర్శించు చున్నాడు.

సర్వవ్యాప్తమైన అనంతచైతన్యమునందు ఏకీభావస్థితిరూప యోగ యుక్తమైన ఆత్మగలవాడును, అంతటను అన్నింటిని సమభావముతో చూచువాడును అగు యోగి తనయాత్మను సర్వప్రాణులయందు స్థితమైయున్నట్లుగను, ప్రాణులన్నింటిని తన ఆత్మయందు కల్పితములుగను చూచును.

30 యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।

తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ।

యః-మాం-పశ్యతి-సర్వత్ర-సర్వం-చ-మయి-పశ్యతి

తస్య-అహం-న-ప్రణశ్యామి-సః-చ-మే-న-ప్రణశ్యతి

యః= ఎవడు, మాం = నన్ను, సర్వత్ర = సర్వభూతముల యందును, పశ్యతి = గాంచుచున్నాడో, సర్వం చ = సమస్త భూతములను, మయి = నాయందు, పశ్యతి = గాంచుచున్నాడో, తస్య = వానికి, అహం = నేను, న ప్రణశ్యామి= అదృశ్యముకాను, సః చ = అతడును, మే = నాకు, న ప్రణశ్యతి = కనబడకపోడు.

ఎవరు సమస్త ప్రాణులందు నన్ను చూచునో అట్టివానికి నేను కనబడకపోను. నాకతడు కనబడకపోడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

31 సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।

సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ।

సర్వభూతస్థితం-యః-మాం-భజతి- ఏకత్వం- ఆస్థితః

సర్వథా-వర్తమానః-అపి-సః-యోగీ-మయి-వర్తతే

సర్వభూతస్థితం = సర్వభూతముల యందున్న, మాం = నన్ను, ఏకత్వం= ఏకీభావమును, ఆస్థితః =పొందినవాడై, యః = ఎవడు, భజతి = భజించుచున్నాడో, సః= ఆ, యోగీ = యోగి, సర్వథా = సర్వవిధముల, వర్తమానః అపి = వర్తించుచున్నను, మయి = నాయందు, వర్తతే = ప్రవర్తించుచున్నాడు.

భగవంతునియందు ఏకీభావస్థితుడైన పురుషుడు సర్వభూతముల యందును ఆత్మరూపముననున్న నన్ను భజించును. అట్టి యోగి సర్వాథా సర్వవ్యవహారములయందు ప్రవర్తించుచున్నను నాయందే ప్రవర్తించుచుండును.

32 ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।

సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ।

ఆత్మౌపమ్యేన-సర్వత్ర-సమం-పశ్యతి-యః-అర్జున

సుఖం-వా-యది-వా-దుఃఖం-సః-యోగీ-పరమః-మతః

అర్జున= అర్జునా, సర్వత్ర = సర్వమునందును, సుఖం వా = సుఖమునుగాని, దుఃఖం యది వా= దుఃఖమును గాని, ఆత్మౌపమ్యేన= ఆత్మసాదృశ్యము చేత, సమం= సమానముగా, యః = ఎవ్వడు, పశ్యతి = చూచుచున్నాడో, సః= ఆ, యోగీ = యోగి, పరమః మతః= శ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు.

ఓ అర్జునా ! సర్వప్రాణులను తనతో సమానముగా చూచు వాడును, సుఖమునుగాని, దుఃఖమునుగాని సమముగా సమానముగ చూచువాడును ఇతరుల సుఖ దుఃఖములను తన సుఖదుఃఖములుగా భావించువాడును అయిన యోగి పరమశ్రేష్ఠుడు అని చెప్పబడుచున్నాడు.

అర్జున ఉవాచ

33 యోऽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన।

ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్।

యః-అయం-యోగః-త్వయా-ప్రోక్తః-సామ్యేన-మధుసూదన

ఏతస్య-అహం-న-పశ్యామి-చంచలత్వాత్-స్థితిం-స్థిరాం

మధుసూదన= శ్రీకృష్ణా, సామ్యేన=సమత్వభావము చేతను, యః అయం యోగః= ఈ యోగము ఏదయితే, త్వయా= నీచేత, ప్రోక్తః= చెప్పబడినదో, ఏతస్య = ఈ యోగము యొక్క, స్థిరాం= చలింపని, స్థితిం= స్థితిని, చంచలత్వాత్ = చంచలస్వభావము వలన, అహం = నేను, న పశ్యామి = కనుగొనకున్నాను.

అర్జునుడు పలికెను - ఓ మధుసూదనా! సమభావమును గూర్చి నీవు చెప్పిన ఈ యోగముయొక్క స్థిరస్థితిని మనశ్చాంచల్యకారణమున తెలిసికొనలేకున్నాను.

34 చంచలం హి మనః కృష్ణప్రమాథి బలవద్దృఢమ్।

తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్।

చంచలం-హి-మనః-కృష్ణ-ప్రమాథి-బలవత్-దృఢం

తస్య-అహం-నిగ్రహం-మన్యే-వాయోః- ఇవ-సుదుష్కరం

కృష్ణ=కృష్ణా, మనః=మనస్సు, చంచలం= చంచలమైనదియు, ప్రమాథి= మోహమును కలిగించునదియు, బలవత్= బలముగలదియు, దృఢం= దృఢమైనదియు, హి=కదా, తస్య=అట్టి మనస్సుయొక్క, నిగ్రహం=నిగ్రహము, వాయోః ఇవ=గాలివలె, సుదుష్కరం= దుస్సాధ్యముగా, అహం=నేను, మన్యే = తలంచుచున్నాను.

ఓ కృష్ణా ! ఈ మనస్సు మిక్కిలి చంచలమైనది, బాగుగా మథించు స్వభావము గలది. దృఢమైనది. మిక్కిలి బలీయమైనది. కనుక దానిని నిగ్రహించుట గాలిని ఆపుటనువలె మిక్కిలి దుష్కరమని నాకు తోచు చున్నది.

శ్రీభగవాన్ ఉవాచ

35 అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।

అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ।

అసంశయం-మహాబాహో- మనః- దుర్నిగ్రహం-చలం

అభ్యాసేన-తు-కౌంతేయ-వైరాగ్యేణ-చ-గృహ్యతే

మహాబాహో=అర్జునా, మనః=మనస్సు, దుర్నిగ్రహం=నిగ్రహింపరానిది, చలం= చంచలమైనది, అసంశయం = సంశయము లేదు, కౌంతేయ = అర్జునా, అభ్యాసేనతు = అభ్యాసముచేత, వైరాగ్యేణ చ =వైరాగ్యముచేత, గృహ్యతే= నిగ్రహింపబడుచున్నది.

శ్రీ భగవానుడు పలికెను హే మహాబాహో! నిస్సందేహముగా మనస్సు చంచలమైనదే.దానిని వశపఱచుకొనుట మిక్కిలి కష్టము. కౌంతేయా! అభ్యాసవైరాగ్యములద్వారా మనసు నిగ్రహింపబడుచున్నది.

36 అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।

వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ।

అసంయతాత్మనా-యోగః-దుష్ప్రాపః- ఇతి-మే-మతిః

వశ్యాత్మనా-తు-యతతా-శక్యః-అవాప్తుం- ఉపాయతః

అసంయతాత్మనా=మనోనిగ్రహము లేనివానిచేత, యోగః= యోగము, దుష్ప్రాపః ఇతి= పొందశక్యము కానిది అని, మే = నాయొక్క, మతిః= అభిప్రాయము, యతతా= ప్రయత్నించునట్టి, వశ్యాత్మనా తు =స్వాధీనమైన మనస్సు గలవానిచేత, ఉపాయతః = ఉపాయము వలన, అవాప్తుం = పొందుటకు, శక్యః = సాధ్యము.

మనస్సును వశపఱచుకొనని పురుషునకు యోగసిద్ధి కలుగుట కష్టము. కాని మనస్సు వశమునందున్న ప్రయత్నశీలుడైన పురుషుడు సాధనద్వారా సహజముగా యోగసిద్ధిని పొందుట సాధ్యమే అని నా అభిప్రాయము.

అర్జున ఉవాచ

37 అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।

అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణగచ్ఛతి ।

అయతిః-శ్రద్ధయా- ఉపేతః-యోగాత్-చలితమానసః

అప్రాప్య-యోగసంసిద్ధిం-కాం-గతిం-కృష్ణ-గచ్ఛతి

కృష్ణ = కృష్ణా, అయతిః=ప్రయత్నరహితుడును, శ్రద్ధయా ఉపేతః= శ్రద్ధతో గూడినవాడు, యోగాత్= యోగమునుండి,, చలితమానసః= చలింపజేయబడిన మనస్సు గలవాడు, యోగసంసిద్ధిం=యోగసిద్ధిని, అప్రాప్య = పొందక, కాం గతిం = ఏమిగతిని, గచ్ఛతి = పొందుచున్నాడు.

అర్జునుడు పలికెను ! ఓ కృష్ణా ! యోగమునందు శ్రద్ధతో యోగసాధన చేయుచు మనస్సు వశమునందుండని కారణమున అవసానదశలో మనస్సు చలించి, ఆత్మసాక్షాత్కారమును పొందకయే మరణించిన సాధకుని గతియేమగును ?

38 కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి ।

అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ।

కచ్చిత్-న- ఉభయ విభ్రష్టః-ఛిన్నాభ్రం- ఇవ- నశ్యతి

అప్రతిష్ఠః-మహాబాహో-విమూఢః-బ్రహ్మణః-పథి

మహాబాహో=శ్రీకృష్ణా, ఉభయ విభ్రష్టః= రెంటికిని చెడినవాడై, బ్రహ్మణః పథి = బ్రహ్మజ్ఞాన మార్గమునందు, విమూఢః= మూఢుడును, అప్రతిష్ఠః= ఆధారము లేనివాడగుచు, ఛిన్నాభ్రమివ =చెదిరిన మబ్బువలె, న నశ్యతి కచ్చిత్ = చెడిపోడుకదా.

హే మహాబాహో ! శ్రీకృష్ణా !అతడు యోగభ్రష్టుడు భగవత్ప్రాప్తి మార్గమునుండి జారినవాడై, ఆశ్రయరహితుడై , ఉభయభ్రష్టుడై, ఛిన్నాభిన్నమైన మేఘమువలె నశింపడు గదా !



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

39 ఏతన్మే సంశయం కృష్ణఛేత్తుమర్హస్యశేషతః।

త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే।

ఏతత్-మే-సంశయం-కృష్ణ-ఛేత్తుం-అర్హసి-అశేషతః

త్వదన్యః-సంశయస్య-అస్య-ఛేత్తా-న-హి- ఉపపద్యతే

కృష్ణ=కృష్ణా, మే - నాయొక్క, ఏతత్ = ఈ, సంశయం=సందేహమును, అశేషతః= నిశ్శేషముగా, ఛేత్తుం = నివారించుటకు, అర్హసి=తగుదువు, అస్య = ఈ, సంశయస్య = సందేహమును, ఛేత్తా = తీర్చెడివాడు, త్వదన్యః= నిన్ను మించినవాడు, న ఉపపద్యతే హి = ఉండడుకదా.

కృష్ణా ! ఈ నా సందేహమును పూర్తిగా నివృత్తిచేయుట నీకే చెల్లును. ఈ సందేహమును తొలగించుట నీకు తప్ప మఱెవ్వరికిని శక్యము కాదు.

శ్రీభగవాన్ ఉవాచ

40 పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే।

న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి।

పార్థ-న- ఏవ- ఇహ-న-అముత్ర-వినాశః-తస్య-విద్యతే

న-హి-కల్యాణకృత్-కశ్చిత్-దుర్గతిం-తాత-గచ్ఛతి

పార్థ=అర్జునా, తస్య=వానికి, ఇహ= ఈ లోకమునందు, వినాశః= నాశము, న విద్యతే ఏవ = కలుగదు, అముత్ర = పరలోకము నందును, న = కలుగదు, తాత= వత్సా, కల్యాణకృత్= పుణ్యాత్ముడు, కశ్చిత్= ఎవడును, దుర్గతిం= చెడు గతిని, న గచ్ఛతి హి = పొందడుగదా.

శ్రీభగవానుడు పలికెను - ఓ పార్థా! అట్టి పురుషుడు ఈ లోకమున గాని, పరలోకమున గాని అధోగతిపాలుగాడు. ఆత్మోద్ధరణమునకు అనగా భగవత్ప్రాప్తికై కర్తవ్యకర్మలను ఆచరించు వాడెవ్వడును దుర్గతి పాలుగాడు గదా!

41 ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః ।

శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ।

ప్రాప్య-పుణ్యకృతాం-లోకాన్- ఉషిత్వా-శాశ్వతీః-సమాః

శుచీనాం-శ్రీమతాం-గేహే-యోగభ్రష్టః-అభిజాయతే

యోగభ్రష్టః=యోగభ్రష్టుడు, పుణ్యకృతాం= పుణ్యాత్ముల, లోకాన్= లోకములను, ప్రాప్య = పొంది, శాశ్వతీః = అనేకములైన, సమాః = ఏండ్లు, ఉషిత్వా= ఉండి, శుచీనాం = సదాచార వంతులైన, శ్రీమతాం=సంపన్నులైన, గేహే=గృహమునందు, అభిజాయతే = పుట్టుచున్నాడు.

యోగభ్రష్టుడు పుణ్యాత్ములు పొందు లోకములను అనగా స్వర్గాది - ఉత్తమ లోకములను పొంది, ఆయా లోకములలో పెక్కు సంవత్సరములు గడిపిన తర్వాత పవిత్రులైన సంపన్నుల గృహమున జన్మించును.

42 అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।

ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ।

అథవా-యోగినాం- ఏవ-కులే-భవతి-ధీమతాం

ఏతత్-హి-దుర్లభతరం-లోకే-జన్మ-యత్- ఈదృశం

అథవా=లేనిచో, ధీమతాం=జ్ఞానవంతులైన, యోగినాం=యోగులయొక్క, కులే ఏవ = కులమందే, భవతి= జన్మించుచున్నాడు, లోకే= లోకమునందు, ఈదృశం = ఇట్టి, జన్మ = పుట్టుక, యత్ = ఏదిగలదో, ఏతత్= ఇట్టిది, దుర్లభతరం హి = మిక్కిలి దుర్లభము గదా.

లేనిచో విరాగియైన పురుషుడు ఆపుణ్య లోకములకు పోకుండగనే జ్ఞానులైన యోగులకుటుంబములోనే జన్మించును. కాని లోకమునందు ఇట్టి జన్మ ప్రాప్తించుట మిక్కిలి దుర్లభము గదా.

43 తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।

యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ।

తత్ర-తం-బుద్ధిసంయోగం-లభతే-పౌర్వదైహికం

యతతే-చ-తతః-భూయః-సంసిద్ధౌ-కురునందన

కురునందన = అర్జునా, తత్ర = ఆ యోగికులమునందు, పౌర్వదైహికం= పూర్వ దేహసంబంధమైన, తం = ఆ, బుద్ధి సంయోగం = బుద్ధి సంయోగమును, లభతే = పొందుచున్నాడు, తతః = ఆ సంస్కారము వలన, భూయః = మరల, సంసిద్ధౌ= ఆత్మయోగ సిద్ధికొరకు, యతతే చ = ప్రయత్నించుచున్నాడు.

అచట యోగి కుటుంబమున పుట్టిన పిదప పూర్వదేహమున సాధించిన బుద్ధి సంయోగమును అనగా సమబుద్ధిరూపయోగ సంస్కారములను అతడు సులభముగనే పొందును. ఓ కురునందనా! ఆబుద్ధి సంయోగ ప్రభావమున అతడు మరల పరమాత్మప్రాప్తి సిద్ధించుటకై మునుపటి కంటెను అధికముగా సాధన చేయు చున్నాడు.

44 పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।

జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ।

పూర్వాభ్యాసేన - తేన- ఏవ - హ్రియతే- హి-అవశః-అపి-సః

జిజ్ఞాసుః-అపి-యోగస్య-శబ్దబ్రహ్మ-అతివర్తతే

సః=వాడు, అవశః అపి = ప్రయత్నము లేకున్నను, తేన = ఆ, పూర్వాభ్యాసేన ఏవ = పూర్వాభ్యాసము చేతనే, హ్రియతే = ఆకర్షింపబడుచున్నాడు, యోగస్య = యోగమును, జిజ్ఞాసుః అపి = ఎరుగదలచిన వాడు సైతము, శబ్దబ్రహ్మ = శబ్ద బ్రహ్మమును, అతివర్తతే హి = అతిక్రమించుచున్నాడు గదా.

శ్రీమంతుల ఇంటిలో జన్మించిన యోగభ్రష్టుడు పరాధీనుడైనను పూర్వసాధనప్రభావమున నిస్సందేహముగ భగవంతునివైపు ఆకర్షితుడగును. అట్లే సమబుద్ధిరూపయోగ జిజ్ఞాసువుగూడ వేదములలో తెల్పబడిన సకామకర్మల ఫలమును అతిక్రమించుచున్నాడుగదా !.

45 ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ ।

ప్రయత్నాత్-యతమానః-తు-యోగీ-సంశుద్ధ కిల్బిషః
అనేకజన్మ సంసిద్ధః-తతః-యాతి-పరాం-గతిం

ప్రయత్నాత్= ప్రయత్న పూర్వకముగ, యతమానః తు = యత్నించుచున్న వాడైన, యోగీ =యోగి, సంశుద్ధకిల్బిషః = పాపరహితుడై, అనేకజన్మసంసిద్ధః= అనేకజన్మల సంస్కారము వలన ప్రాప్తినొంది, తతః=తదనంతరము, పరాం = పారలౌకికమైన, గతిం = సిద్ధిని, యాతి = పొందుచున్నాడు.

కాని, ప్రయత్నపూర్వకముగ యోగసాధనచేయు యోగి అనేక జన్మలసంస్కారముల ప్రభావమున ఈ జన్మయందే సిద్ధిని పొంది, సంపూర్ణముగా పాపరహితుడై, తత్క్షణమే పరమ పదమును పొందును.

46 తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ।

తపస్విభ్యః-అధికః-యోగీ-జ్ఞానిభ్యః-అపి-మతః-అధికః
కర్మిభ్యః-చ-అధికః-యోగీ-తస్మాత్-యోగీ-భవ-అర్జున

అర్జున=అర్జునా, యోగీ=యోగి, తపస్విభ్యః= తపస్సు చేయువారి కంటెను, అధికః = అధికుడు, జ్ఞానిభ్యః అపి = జ్ఞానులకంటెను గూడ, అధికః=అధికుడుగ, మతః= పేర్కొనబడుచున్నాడు, యోగీ= యోగి, కర్మిభ్యః చ = కర్మిష్ఠులకంటెను, అధికః=అధికుడు, తస్మాత్=అందువలన, యోగీ = యోగివి, భవ = అగుము.

యోగి తాపసులకంటెను శ్రేష్ఠుడు. జ్ఞానులకంటెను శ్రేష్ఠుడు. సకామకర్మలను ఆచరించువారికంటెను శ్రేష్ఠుడని భావింపబడును. కావున ఓ అర్జునా ! నీవు యోగివి కమ్ము.

47 యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।

శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ।

యోగినాం-అపి-సర్వేషాం-మద్గతేన-అంతరాత్మనా

శ్రద్ధావాన్ -భజతే-యః-మాం-సః-మే-యుక్తతమః-మతః

సర్వేషాం= సమస్తమైన, యోగినాం అపి= యోగులలోనుగూడ, యః = ఎవడు, మద్గతేన = నన్నుపొందిన, అంతరాత్మనా = అంతఃకరణముతో, శ్రద్ధావాన్= శ్రద్ధావంతుడై, మాం = నన్ను, భజతే = సేవించుచున్నాడో, సః= అతడు, మే = నాచేత, యుక్తతమః= ఉత్తమయోగిగా, మతః= తలంపబడుచున్నాడు.

యోగులందరిలోను శ్రద్ధాళువై, అంతరాత్మను నాయందే లగ్నమొనర్చి, అనగా భక్తివిశ్వాసములతో నిశ్చలమైన, దృఢమైన అనన్య భావముతో నాయందే స్థిరమైయున్న మనోబుద్ధిరూప అంతఃకరణమును గలిగి, నిరంతరము నన్నే భజించువాడు ఉత్తముడు - అని నా యభిప్రాయము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగోనామ

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ సప్తమోఽధ్యాయః - జ్ఞానవిజ్ఞానయోగః

శ్రీ భగవాన్ ఉవాచ

1 మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః ।

అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ।

మయి- ఆసక్తమనాః-పార్థ-యోగం-యుంజన్-మదాశ్రయః

అసంశయం-సమగ్రం-మాం-యథా-జ్ఞాస్యసి-తత్-శృణు

పార్థ=అర్జునా, మయి=నాయందు, ఆసక్తమనాః= ఆసక్తి గల మనస్సు కలవాడవును, యోగం = యోగమును, యుంజన్= ఆచరించుచున్న వాడవును, మదాశ్రయః=నన్ను ఆశ్రయించినవాడవు నగుచు, అసంశయం= సందేహము లేకుండా, సమగ్రం = పూర్తిగా, మాం=నన్ను, యథా= ఎటుల, జ్ఞాస్యసి = తెలిసికొనగలవో, తత్=దానిని, శృణు=వినుము.

శ్రీ భగవానుడు పలికెను - ఓ పార్థా ! అనన్యభక్తితో నాయందే ఆసక్తమైన మనస్సు కలిగినవాడవై, అనన్య భావముతో మత్పరాయణుడవై, యోగమునందు నిమగ్నుడవై, సంపూర్ణవిభూతిబల - ఐశ్వర్యాదిగుణ యుక్తుడనై, సర్వప్రాణులకును ఆత్మస్వరూపుడను ఐన నన్ను నిస్సందేహముగా తెలిసికొనగలవో ఆ విధమును వినుము.

2 జ్ఞానం తేఽహం సవిజ్ఞానమ్ ఇదం వక్ష్యామ్యశేషతః ।

యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥

జ్ఞానం-తే-అహం-సవిజ్ఞానం- ఇదం-వక్ష్యామి-అశేషతః

యత్-జ్ఞాత్వా-న- ఇహ-భూయః-అన్యత్-జ్ఞాతవ్యం-అవశిష్యతే

యత్=దేనిని, జ్ఞాత్వా= తెలిసికొనిన పిదప, ఇహ = ఈ లోకమున, జ్ఞాతవ్యం=తెలియదగినది, భూయః=తిరిగి, అన్యత్= వేరొకటి, న అవశిష్యతే = మిగిలియుండదో, సవిజ్ఞానం= విజ్ఞానసహితమైన, ఇదం = ఈ, జ్ఞానం= జ్ఞానము, అశేషతః= నిశ్శేషముగా, అహం=నేను, తే= నీకొరకు, వక్ష్యామి= చెప్పుచున్నాను.

నేను నీకు విజ్ఞానసహితముగా తత్త్వజ్ఞానమును సంపూర్ణముగా తెలిపెదను. దీనిని ఎఱిగిన పిమ్మట ఈ జగత్తులో తెలిసికొనవలసినది ఏదియు మిగులదు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।

యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః।।

మనుష్యాణాం-సహస్రేషు-కశ్చిత్-యతతి-సిద్ధయే

యతతాం-అపి-సిద్ధానాం-కశ్చిత్-మాం-వేత్తి-తత్త్వతః

మనుష్యాణాం=మనుష్యులలో, సహస్రేషు= వేయిమందిలో, కశ్చిత్= ఒకానొకడు, సిద్ధయే=సిద్ధత్వమునకు, యతతి= యత్నించుచున్నాడు, యతతాం= యత్నించెడి, సిద్ధానాం అపి = సిద్ధులలో కూడ, కశ్చిత్= ఒకానొకడు, మాం =నన్ను, తత్త్వతః= యథార్థముగ, వేత్తి = తెలిసికొనుచున్నాడు.

వేలకొలది మనుష్యులలో ఎవడో ఒకడు మాత్రమే నన్ను గూర్చి తెలిసికొనుటకు ప్రయత్నించును. అట్లు ప్రయత్నించిన వారిలోగూడ ఒకానొకడు మాత్రమే యదార్థ తత్త్వమును ఎరుంగును.

4 భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।

అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥

భూమిః-అపః-అనలః-వాయుః-ఖం-మనః-బుద్ధిం- ఏవ-చ

అహంకారః- ఇతి- ఇయం-మే-భిన్నా-ప్రకృతిః-అష్టధా

భూమిః= భూమి, ఆపః=జలము, అనలః=అగ్ని, వాయుః=గాలి, ఖం= ఆకాశము, మనః=మనస్సు, బుద్ధిః ఏవ చ = బుద్ధియును, అహంకారః= అహంకారమును, ఇతి = ఇటుల, మే=నాయొక్క, ఇయం= ఈ , ప్రకృతిః= ప్రకృతి, అష్టధా= ఎనిమిది విధములుగ, భిన్నా = భేదమును కలిగియున్నది.

ఓ మహాబాహో ! భూమి, నీరు, అగ్ని వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని నా ప్రకృతి ఎనిమిది విధములుగా కలదు. ఎనిమిది భేదములు గల ఈ ప్రకృతిని అపరా లేక జడ ప్రకృతి అనియందురు.

5 అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।

జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

అపరా- ఇయం- ఇతః-తు-అన్యాం-ప్రకృతిం-విద్ధి-మే-పరాం

జీవభూతాం-మహాబాహో-యయా- ఇదం-ధార్యతే-జగత్

మహాబాహో= అర్జునా, ఇయం= ఈ ప్రకృతి, అపరా= నికృష్టమైనది, ఇతః తు = దీనికంటెను, అన్యాం = వేరైనది, జీవభూతాం= ప్రాణాధారమైనదియు, పరాం = ఉత్కృష్టమైనదియు, యయా= దేనిచేత, ఇదం = ఈ, జగత్= జగత్తు, ధార్యతే = ధరింపబడుచున్నదో, మే = నాయొక్క, ప్రకృతిం= అట్టి ప్రకృతిని, విద్ధి=తెలియుము.

ఇదిగాక ఈ సంపూర్ణ జగత్తును ధరించునట్టి మఱియొక ప్రకృతి కలదు. అదియే నా జీవరూప పరాప్రకృతి లేక చేతనప్రకృతి అని తెలిసికొనుము.

6 ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।

అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥

ఏతద్యోనీని-భూతాని-సర్వాణి- ఇతి- ఉపధారయ

అహం-కృత్స్నస్య-జగతః-ప్రభవః-ప్రలయః-తథా

సర్వాణి= సమస్తములై, భూతాని = ప్రాణులును, ఏతద్యోనీని ఇతి = ఈ అపరా, పరా ప్రకృతులవలన బుట్టినవని, ఉపధారయ = తెలిసికొనుము, తథా = అట్లే, కృత్స్నస్య = సమస్తమైన, జగతః= జగత్తుయొక్క, ప్రభవః= పుట్టుకకు కారకుడును, ప్రళయః= లయకారకుడును, అహం= నేనే

ఓ అర్జునా ! సమస్తప్రాణులును ఈ రెండువిధములైన ప్రకృతులనుండియే పుట్టుచున్నవి. ఈ జగత్తు యొక్క పుట్టుకయూ వినాశనము నావలననే జరుగుచున్నవి.అనగా ఈ సంపూర్ణ జగత్తునకు నేనే కారకుడను.

7 మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।

మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥

మత్తః-పరతరం-న-అన్యత్-కించిత్-అస్తి-ధనంజయ

మయి-సర్వం- ఇదం-ప్రోతం-సూత్రే-మణిగణాః- ఇవ

ధనంజయ=అర్జునా, మత్తః= నా కంటెను, పరతరం=శ్రేష్ఠమగు, అన్యత్= వేరొకటి, కించిత్ = కొంచెమైనను, న అస్తి = లేదు, సూత్రే= దారమునందు, మణిగణాః ఇవ = రత్నసమూహముల వలెనే, మయీ= నాయందు, ఇదం = ఈ , సర్వం=సమస్త ప్రపంచమును, ప్రోతం = గ్రుచ్చబడినది.

ఓ ధనంజయా ! నాకంటెను పరమమైనది ఏదియును లేదు. ఈ జగత్తునందలి వస్తువులన్నియును సూత్రమున సూత్రమణులవలె నాయందే కూర్చబడియున్నవి.

8 రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।

ప్రణవఃసర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

రసః-అహం-అప్సు-కౌంతేయ-ప్రభా-అస్మి-శశిసూర్యయోః

ప్రణవః-సర్వవేదేషు-శబ్దః-ఖే-పౌరుషం-నృషు

కౌంతేయ = అర్జునా, అప్సు= నీటియందు, రసః=ద్రవపదార్థమును, శశిసూర్యయోః= చంద్రసూర్యులయందు, ప్రభా= ప్రకాశమును, సర్వవేదేషు= సర్వవేదముల యందును, ప్రణవః = ఓంకారమును, ఖే= ఆకాశము నందు, శబ్దః= శబ్దమును, నృషు = మనుష్యులయందు, పౌరుషం = పురుష లక్షణమును, అహం= నేను, అస్మి= అయియున్నాను.

ఓ అర్జునా ! జలములో రసతన్మాత్రను నేనే. సూర్యచంద్రులలో కాంతిని నేనే. వేదములన్నింటిలోను ఓంకారమును, ఆకాశము నందు శబ్దమును, మానవులయందు పౌరుషమును నేనే అయియున్నాను.

9 పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।

జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥

పుణ్యః-గంధః-పృథివ్యాం-చ-తేజః-చ-అస్మి-విభావసౌ

జీవనం-సర్వభూతేషు-తపః-చ-అస్మి-తపస్విషు

పృథివ్యాం=భూమియందు, పుణ్యః= పవిత్రమైన, గంధః చ = వాసనయు, విభావసౌ = అగ్నియందు, తేజః చ = తేజస్సును, అస్మి = నేనే అయియున్నాను, సర్వభూతేషు = సమస్త భూతములయందు, జీవనం = ప్రాణమును, తపస్విషు = తపస్సుగలవారియందు, తపః చ = తపస్సును, అస్మి = నేనే అయియున్నాను.

పృథ్వియందు పవిత్రగంధము, అగ్నియందు తేజస్సును, సమస్త ప్రాణులలో జీవశక్తిని తాపసులలో తపస్సును నేనే.

10 బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।

బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజస్తేజస్వినామహమ్ ॥

బీజం-మాం-సర్వభూతానాం-విద్ధి-పార్థ-సనాతనం

బుద్ధిః-బుద్ధిమతాం-అస్మి-తేజః-తేజస్వినాం-అహం

పార్థ=అర్జునా, సనాతనం= నిత్యుడనగు, మాం =నన్ను, సర్వభూతానాం= సర్వభూతములకు, బీజం=మూలముగ, విద్ధి=తెలిసికొనుము, అహం=నేను, బుద్ధిమతాం= బుద్ధిమంతులయొక్క, బుద్ధిః=బుద్ధి, తేజస్వినాం= ధీరుల యొక్క, తేజః=తేజము, అస్మి= అయియున్నాను.

ఓ పార్థా ! సమస్త భూతములకును నన్ను శాశ్వత మైన బీజముగా ఎఱుంగుము. ప్రజ్ఞావంతులలో ప్రజ్ఞను, తేజోవంతులలో తేజస్సును నేనే.

11 బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।

ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥

బలం-బలవతాం-చ-అహం-కామరాగవివర్జితం

ధర్మావిరుద్ధః-భూతేషు-కామః-అస్మి-భరతర్షభ

భరతర్షభః=అర్జునా, అహం=నేను, బలవతాం= బలవంతులయొక్క, కామరాగ వివర్జితం = ఆశ, రాగము లేని, బలం = బలమును, అస్మి = అయియున్నాను, భూతేషు చ = ప్రాణులయందు, ధర్మా విరుద్ధః = ధర్మమునకు విరుద్ధముగాని, కామః=కామమును, అస్మి=అయియున్నాను.

ఓ భరతశ్రేష్ఠా ! బలవంతులలో కామరాగరహితమైన బలమును నేను, సమస్తప్రాణుల యందున ధర్మమునకు విరుద్ధముగాని విధివిహితమైన కోరికను నేనే అయియున్నాను.

12 యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే ।

మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి ॥

యే-చ- ఏవ-సాత్త్వికాః- భావాః- రాజసాః-తామసాః-చ-యే

మత్తః- ఏవ- ఇతి-తాన్-విద్ధి-న-తు-అహం- తేషు-తే-మయి

సాత్త్వికాః= సాత్వికమైన, భావాః=భావములు, యే చ = ఏవియో, రాజసాః= రజోగుణ సంబంధములైనవి, యే= ఏవియో, తామసాః చ ఏవ = తామసికమైనవి, యే = ఏవియో, తాన్ = వానిని, మత్తః ఏవ ఇతి = నా వలననే యని, విద్ధి= తెలిసికొనుము, తేషు = ఆ భావముల యందు, అహం తు = నేను, న = లేను, తే= అవి, మయి=నాయందు ఉన్నవి.

సాత్త్వి క, రాజస, తామస భావములన్నియును నా నుండియే కలుగుచున్నవని తెలిసికొనుము. కాని! యథార్థముగా వాటిలో నేను గాని, నాలో అవిగాని లేవు. అనగా నేను త్రిగుణాతీతుడను.

13 త్రిభిర్గుణమయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్ ।

మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥

త్రిభిః-గుణమయైః- భావైః- ఏభిః- సర్వం- ఇదం - జగత్

మోహితం-న-అభిజానాతి-మాం- ఏభ్యః- పరం-అవ్యయం

త్రిభిః= మూడువిధములైన, గుణమయైః = గుణవికారములైన, ఏభిః= ఈ, భావైః = భావములచేత, సర్వం = సమస్తమైన, ఇదం = ఈ, జగత్ = ప్రపంచము, మోహితం = మోహింపజేయబడినదియై, ఏభ్యః= ఈ త్రిగుణముల కంటెను, పరం = విలక్షణుడను, అవ్యయం= అవినాశియైన, మాం = నన్ను, న అభిజానాతి = తెలిసికొనలేక యున్నది.

ఈ జగత్తు అనగా ప్రాణిసముదాయము అంతయును గుణముల యొక్క కార్యరూపములైన సాత్త్వికా, రాజస, తామసములు అను త్రివిధ భావములచే మోహితమగు చున్నది. కనుక త్రిగుణములకు అతీతుడను శాశ్వతుడను ఐన నన్ను ఆ ప్రాణులు తెలిసికొనలేకున్నవి.

14 దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।

మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥

దైవీ-హి- ఏషా-గుణమయీ-మమ-మాయా-దురత్యయా

మాం- ఏవ-యే-ప్రపద్యంతే-మాయాం- ఏతాం-తరంతి-తే

దైవీ = దైవసంబంధమైనది, గుణమయీ = త్రిగుణస్వరూపమునగు, ఏషా = ఈ, మమ = నా యొక్క, మాయా = ప్రకృతి, దురత్యయా హి = దాటశక్యముకానిదియే, యే = ఎవరు, మాం ఏవ = నన్నే, ప్రపద్యంతే = శరణు పొందుచున్నారో, తే= వారు, ఏతాం = ఈ, మాయాం= మాయను, తరంతి = దాటుచున్నారు.

నా మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. కాని కేవలము నిరంతరము నన్నే భజించువారు ఈ మాయను దాటుచున్నారు.

15 న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।

మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥

న-మాం-దుష్కృతినః-మూఢాః-ప్రపద్యంతే-నరాధమాః

మాయయా-అపహృతజ్ఞానాః- ఆసురం-భాం- ఆశ్రితాః

దుష్కృతినః=దుష్టులను, మూఢాః= మూఢులను, మాయయా= మాయచేతను, అపహృత జ్ఞానాః= అపహరింపబడిన జ్ఞానము కలవారై, ఆసురం=రాక్షస సంబంధమైన, భావం= భావమును, ఆశ్రితాః= ఆశ్రయించినవారును అగు, నరాధమాః= నీచమానవులు, మాం =నన్ను, న ప్రపద్యంతే = శరణుపొందరు.

మాయలో చిక్కుపడుటవలన విపరీత జ్ఞానమునకు లోనైన వారును, రాక్షస ప్రవృత్తిగలవారును, నరాధములును, మూఢులును, దుష్కర్మలను ఆచరించువారును నన్ను భజింపరు.

16 చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున।

ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥

చతుర్విధాః-భజంతే-మాం-జనాః-సుకృతినః-అర్జున

ఆర్తః-జిజ్ఞాసుః-అర్థార్థీ-జ్ఞానీ-చ-భరతర్షభ

భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుడా, అర్జున = అర్జునా, ఆర్తః = ఆర్తుడును, జిజ్ఞాసుః = జిజ్ఞాసువును, అర్థార్థీ = ధనమును గోరువాడును, జ్ఞానీ చ = జ్ఞానియును, చతుర్విధాః= నాలుగు విధములైన, సుకృతినః = పుణ్యాత్ములగు, జనాః= జనులు, మాం = నన్ను,భజంతే = సేవించుచున్నారు.

ఓ భరతశ్రేష్ఠా ! అర్జునా! శుభకర్మలను చేయుచుచరించుచు సుఖసంపదలను కోరుకొనువారు, శారీరిక మానసిక సంతాపములకు గురియైన ఆర్తులు, ఐహిక విషయములపై ఆసక్తిని వీడి పరమాత్మతత్త్వ జ్ఞానమును పొందుటకు ఇచ్ఛగలవారు జిజ్ఞాసువులు, పరమాత్మప్రాప్తినందిన జ్ఞానులు అను చతుర్విధ భక్తులు నన్ను భజింతురు.

17 తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।

ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ మమ ప్రియః ॥

తేషాం-జ్ఞానీ-నిత్యయుక్తః- ఏకభక్తిః-విశిష్యతే

ప్రియః-హి-జ్ఞానినః-అత్యర్థం-అహం-సః-చ-మమ-ప్రియః

తేషాం = వారిలోను, నిత్యయుక్తః = నిత్యయోగియు, ఏకభక్తిః = ఏకాంత భక్తి గలవాడును అగు, జ్ఞానీ = బ్రహ్మజ్ఞాని, విశిష్యతే = శ్రేష్ఠుడుగా నున్నాడు, జ్ఞానినః = ఆత్మజ్ఞానికి, అహం = నేను, అత్యర్థం= మిక్కిలి, ప్రియః = ప్రియుడును, సః చ = వాడును, మమః= నాకు, ప్రియః హి = ప్రియుడైనవాడు గదా.

ఈ చతుర్విధభక్తులలో నిరంతరము నాయందే ఏకీభావ స్థితుడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలనన వాస్తవముగ నాతత్త్వమును తెలిసికొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు అత్యంత ప్రియుడైయున్నాడు.

18 ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।

ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥

ఉదారాః - సర్వే- ఏవ- ఏతే-జ్ఞానీ-తు- ఆత్మా- ఏవ- మే-మతం

ఆస్థితః-సః-హి-యుక్తాత్మా-మాం- ఏవ-అనుత్తమాం-గతి

ఏతే=ఈ, సర్వే = అందరును, ఉదారాః ఏవ = గొప్పవారే, జ్ఞానీ తు = జ్ఞానియున్ననో, ఆత్మా ఏవ = నేనేయని, మే = నాయొక్క, మతం = అభిప్రాయము, సః = వాడు, యుక్తాత్మా = ఆత్మయోగపరుడై, మాం ఏవ = నన్నే, అనుత్తమాం = అత్యుత్తమమైన, గతిం=గమ్యస్థానమును, ఆస్థితః హి = పొందినవాడై యున్నాడు గదా.

ఈ చతుర్విధభక్తులందఱును ఉదారులే . కాని జ్ఞానియైన వాడు నా స్వరూపమే. ఇది నా అభిప్రాయము. ఏలనన అట్టి భక్తుడు తన మనస్సును బుద్ధిని నాయందే స్థిరముగా ఉంచి నన్నే ఉన్నతగతి స్వరూపునిగా భావించును. ఈ విధముగా అతడు నాయందే స్థిరముగావున్నాడు.

19 బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।

వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥

బహూనాం-జన్మనాం-అంతే-జ్ఞానవాన్-మాం-ప్రపద్యతే

వాసుదేవః-సర్వం- ఇతి- సః-మహాత్మా-సుదుర్లభః

బహూనాం=అనేకములైన, జన్మనాం = జన్మలయొక్క, అంతే = చివర, జ్ఞానవాన్ = జ్ఞానవంతుడు, సర్వం = అంతయును, వాసుదేవః ఇతి = వాసుదేవుడేయని, మాం = నన్ను, ప్రపద్యతే = భజించుచున్నాడు , సః= అట్టి, మహాత్మా=మహాత్ముడు, సుదుర్లభః= మిక్కిలి దుర్లభము.

అనేకజన్మలపిదప భగవత్తత్త్వమును ఎఱిగినవాడు సర్వమూ వాసుదేవమయమే యని భావించి, నన్ను శరణుపొందును. అట్టి మహాత్ముడు మిక్కిలి అరుదుగ నుండును.

20 కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।

తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయాః ॥

కామైః-తైః-తైః-హృతజ్ఞానాః-ప్రపద్యంతే-అన్యదేవతాః

తం-తం-నియమం- ఆస్థాయ-ప్రకృత్యా-నియతాః-స్వయా

స్వయా=తమదైన, ప్రకృత్యా = ప్రకృతిచేత, నియతాః=నియమింపబడినవారు, తైః తైః కామైః= ఆయా విషయవాంఛలచేత, హృతజ్ఞానాః=పోయిన వివేకము గలవారై, తం తం నియమం = ఆయా కోరికలకు తగిన నియమమును, ఆస్థాయ = ఆశ్రయించి, అన్యదేవతాః= ఇతర దేవతలను, ప్రపద్యంతే = సేవించుచున్నారు.

అనేకవిధములైన భోగవాంఛలలో కూరుకొనిపోయినవారి జ్ఞానము అంతరించిపోవును. వారు తమతమస్వభావములకు అనుగుణముగా వారివారి నియమములను బట్టి ఇతర దేవతలను ఆరాధించుచుందురు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

21 యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।

తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

యః-యః-యాం-యాం-తనుం-భక్తః-శ్రద్ధయా-అర్చితుం- ఇచ్ఛతి

తస్య-తస్య-అచలాం-శ్రద్ధాం-తాం- ఏవ-విదధామి-అహం.

యః యః = ఏయే , భక్తః=భక్తుడు, యాం యాం తనుం= ఏయే దేవతారూపమును, శ్రద్ధయా = శ్రద్ధతో, అర్చితుం = ఆరాధించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తస్య తస్య= వానివానికి, అహం = నేను, తాం అచలాం=చలనములేని, శ్రద్ధాం ఏవ = శ్రద్ధారూపమునే, విదధామి = చేయుచున్నాను.

భక్తుడు ఏదేవతాస్వరూపములను భక్తిశ్రద్ధలతో పూజింప నిశ్చయించుకొనునో ఆ భక్తునకు దేవతలయందే భక్తిశ్రద్ధలను స్థిరముగా నేనే కలుగజేయుచున్నాను.

22 స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధనమీహతే।

లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥

సః-తయా-శ్రద్ధయా-యుక్తః-తస్య- ఆరాధనం- ఈహతే

లభతే-చ-తతః-కామాన్-మయా- ఏవ-విహితాన్-హి-తాన్

సః=వాడు, తయా=అట్టి, శ్రద్ధయా=శ్రద్ధతో, యుక్తః= కూడినవాడై, తస్య = ఆ దేవత యొక్క, ఆరాధనం = పూజను, ఈహతే = చేయుచున్నాడు, తతః చ = అనంతరము, మయా ఏవ = నాచేతనే, విహితాన్= నిర్ణయింపబడిన, తాన్= ఆ, కామాన్ = కోరికలను, లభతే హి = పొందుచున్నాడు.

అట్టి భక్తుడు తగిన భక్తిశ్రద్ధలతో ఆ దేవతనే ఆరాధించును. తత్ఫలితముగ నా అనుగ్రహమువలననే ఆ దేవతద్వారా ఫలములను అతడు పొందుచున్నాడు.

23 అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ।

దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి ॥

అంతవత్-తు-ఫలం-తేషాం-తత్-భవతి-అల్పమేధసాం

దేవాన్-దేవయజః-యాంతి-మద్భక్తాః-యాంతి-మాం-అపి

దేవయజః=దేవతలను పూజించువారు, దేవాన్=దేవతలను, యాంతి = పొందుచున్నారు, అల్పమేధసాం= స్వల్పబుద్ధిగల, తేషాం= వారి యొక్క, తత్ ఫలం = లభించెడి ఆ ఫలము, అంతవత్ తు = అంతము గలది, భవతి = అగుచున్నది, మద్భక్తాః అపి = నా భక్తులన్ననో, మాం = నన్ను, యాంతి = పొందుచునాన్నరు.

అల్పబుద్ధులగు భక్తులు పొందెడి ఫలములు గూడ అల్పములు. ఇతరదేవతలను పూజించువారు ఆ దేవతలనే చేరుదురు. నా భక్తులు ఏ విధముగా ఆరాధించినను చివరకు నన్నే పొందుచున్నారు.

24 అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।

పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్ ॥

అవ్యక్తం-వ్యక్తిం- ఆపన్నం-మన్యంతే-మాం-అబుద్ధయః

పరం-భావం-అజానంతః-మమ-అవ్యయం-అనుత్తమం

అవ్యయం=అవ్యయమైనదియు, అనుత్తమం=సర్వోత్తమమైనదియు, పరం= పరమైనదియు, మమ = నాయొక్క, భావం = స్వభావమును, అజానంతః= ఎరుగని, అబుద్ధయః= అవివేకులు, అవ్యక్తం = అవ్యక్తమైన, మాం = నన్ను, వ్యక్తిం = వ్యక్తిగాను, ఆపన్నం = ఆపదను బొందిన వానినిగను, మన్యంతే = తలంచుచున్నారు.

నేను శాశ్వతుడను, సర్వోత్తముడను, ఇంద్రియములకును, మనస్సునకును కనుపడనివాడను. నా పరమభావమును బుద్ధిహీనులు గ్రహింపక, ఇట్టి నన్ను సాధారణమనుష్యునిగా తలంచుచున్నారు.

25 నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః।

మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥

న-అహం-ప్రకాశః-సర్వస్య-యోగమాయా సమావృతః

మూఢః-అయం-న-అభిజానాతి-లోకః-మాం-అజం-అవ్యయం

అహం=నేను, యోగమాయా సమావృతః = యోగమాయచే ఆవరించబడి, సర్వస్య = అందరికిని, ప్రకాశః న = కనబడువాడనుకాను, మూఢః= వివేకశూన్యుడగు, అయం = ఈ, లోకః = లోకము, మాం = నన్ను, అజం = పుట్టుకలేని వానినిగను, అవ్యయం = అవ్యయునిగను, న అభిజానాతి = ఎరుగదు.

నా యోగమాయవలన నేను అందరికిని గోచరింపను. కనుక అజ్ఞానులు నన్ను జన్మరహితునిగా, శాశ్వతునిగా, పరమేశ్వరునిగా తెలుసుకొనలేరు.

26 వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।

భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥

వేద-అహం-సమతీతాని-వర్తమానాని-చ-అర్జున

భవిష్యాణి-చ-భూతాని-మాం-తు-వేద-న-కశ్చన

అర్జున=అర్జునా, అహం= నేను, సమతీతాని=నశించినవియును, వర్తమానాని చ = ప్రస్తుతము ఉన్నవియును, భవిష్యాణి చ = ఇక రాబోవునవియును అగు, భూతాని=జీవులను, వేద= ఎరుగుదును, మాం తు = మరి నన్ను, కశ్చన= ఒక్కడును, న వేద= ఎరుగడు.

ఓ అర్జునా ! గతించినకాలమునకు చెందినట్టివియు, ప్రస్తుత కాలమునందున్నట్టివియు ఐన చరాచర ప్రాణులన్నింటిని నేను ఎఱుగుదును. అంతేకాదు రాబోవు కాలమున జన్మించు ప్రాణులనుగూర్చియు నేను ఎఱుగుదును. కాని నాయందు భక్తిశ్రద్ధలుగలవారు తప్ప వేరెవ్వరును నన్ను ఎరుగరు. అయితే నాయందు శ్రద్ధలేనివాడు నన్నుఎరుంగడు.

27 ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత ।

సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥

ఇచ్ఛాద్వేష సముత్థేన-ద్వంద్వమోహేన-భారత

సర్వభూతాని-సమ్మోహం-సర్గే-యాంతి -పరంతప

భారత=అర్జునా, సర్గే=పుట్టుకయందు, ఇచ్ఛాద్వేష సముత్థేన = ఇష్టానిష్టముల వలన బుట్టిన, ద్వంద్వమోహేన = సుఖదుఃఖ స్వరూపమయిన ద్వంద్వమోహేన = సుఖదుఃఖ స్వరూపమయిన ద్వంద్వమోహములచేత, సర్వభూతాని = సర్వప్రాణులను, సమ్మోహం = సమ్మోహమును, యాంతి= పొందుచున్నవి పరంతప = అర్జునా.

భరతవంశీ ! ఓ అర్జునా! జగత్తునందు ప్రాణులన్నియును రాగద్వేషముల వలన కలిగిన సుఖదుఃఖాదిద్వంద్వముల ప్రభావమువలన అంతులేని మోహములో పడిపోవుచున్నవి.

28 యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।

తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః ॥

యేషాం-తు-అంతగతం-పాపం-జనానాం-పుణ్యకర్మణాం

తే-ద్వంద్వమోహ నిర్ముక్తాః-భజంతే-మాం-దృఢవ్రతాః

పుణ్యకర్మణాం=సత్కర్మలను జేయు, యేషాం= ఏ, జనానాం=జనులయొక్క, పాపం తు = పాపము, అంతగతం = పరిహరింపబడినదో, తే = వారు, ద్వంద్వ మోహనిర్ముక్తాః=ద్వంద్వమోహము చేత విడువబడినవారై, దృఢవ్రతాః=దృఢవ్రతులై, మాం = నన్ను, భజంతే = సేవించుచున్నారు.

కాని నిష్కామభావముతో పుణ్యకర్మలను ఆచరించు పురుషులపాపములు నశించును అట్టివారు రాగద్వేషజనితములైన సుఖదుఃఖాది రూపమోహముల నుండి విముక్తులయ్యెదరు. దృఢనిశ్చయము గల్గిన అట్టి భక్తులు అన్నివిధముల నన్నే భజింతురు.

29 జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।

తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్ అధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥

జరామరణ మోక్షాయ-మాం- ఆశ్రిత్య-యతంతి-యే

తే-బ్రహ్మ-తత్-విదుః-కృత్స్నం-అధ్యాత్మం-కర్మ-చ-అఖిలం

యే= ఎవరు, మాం=నన్ను, ఆశ్రిత్య= ఆశ్రయించి, జరామరణ మోక్షాయ= జరామరణములు పోగొట్టుకొనుటకు, యతంతి=యత్నించుచున్నారో, తే= వారు, తత్బ్రహ్మ= ఆ పరబ్రహ్మమును, కృత్స్నం= సమస్తమయిన, అధ్యాత్మం= ప్రత్యగాత్మను, అఖిలం= సమస్తమయిన, కర్మ చ = కర్మమును, విదుః= ఎరుగుదురు.

నన్ను శరణుపొంది జరామరణవిముక్తికై ప్రయత్నించు వారు ఆ పరబ్రహ్మను, సంపూర్ణ - అధ్యాత్మమును, సంపూర్ణ కర్మను తెలిసికొందురు.

30 సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।

ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥

సాధిభూతాధిదైవం-మాం-సాదియజ్ఞం-చ-యే-విదుః

ప్రయాణకాలే-అపి-చ-మాం-తే-విదుః-యుక్తచేతసః

యే= ఎవ్వరు, మాం = నన్ను, సాధిభూతాధిదైవం = అధిభూత అధిదైవతములతో గూడినవానినిగను, సాధియజ్ఞం చ = అధియజ్ఞముతో గూడినవానినిగను, విదుః= తెలిసికొనుచున్నారో, తే= వారు, ప్రయాణకాలే అపి చ = మరణకాలము నందును, యుక్తచేతసః= యోగయుక్తులై, మాం = నన్ను, విదుః= తెలియుదురు.

అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతోపాటు అందరికీ ఆత్మరూపుడనైన నన్ను అంత్యకాలమునందైనను తెలిసికొనువారు నిశ్చలబుద్ధితో నన్నే చేరుదురు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన విజ్ఞాన యోగో నామ

సప్తమోఽధ్యాయః



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ అష్టమోఽధ్యాయః - అక్షరపరబ్రహ్మయోగః

అర్జున ఉవాచ

1 కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।

అధిభూతం చ కిం ప్రోక్తమ్ అధిదైవం కిముచ్యతే ॥

కిం-తత్-బ్రహ్మ- కిం-అధ్యాత్మం-కిం-కర్మ-పురుషోత్తమ

అధిభూతం -చ-కిం-ప్రోక్తం-అధిదైవం-కిం- ఉచ్యతే

పురుషోత్తమ=కృష్ణా, తత్ = ఆ, బ్రహ్మ = బ్రహ్మము, కిం = ఏది, అధ్యాత్మం= అధ్యాత్మము, కిం= ఎట్టిది, కర్మ = కర్మము, కిం= ఎట్టిది, అధిభూతం= అధిభూతము, కిం = ఏది, ప్రోక్తం = చెప్పబడుచున్నది, అధిదైవం చ = అధిదైవముగ, కిం = దేనిని, ఉచ్యతే = అందురు.

అర్జునుడు పలికెను - ఓ పురుషోత్తమా ! బ్రహ్మ - అనగానేమి ? అధ్యాత్మము అనగానేమి ? కర్మ అనగా నేమి ? అధిభూతము అని దేనికి పేరు ? అధిదైవము అని దేనిని అందురు.

2 అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన।

ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥

అధియజ్ఞః-కథం-కః-అత్ర-దేహే-అస్మిన్-మధుసూదన

ప్రయాణకాలే-చ-కథం-జ్ఞేయః-అసి-నియతాత్మభిః

మధుసూదన=కృష్ణా, అస్మిన్ = ఈ, దేహే = దేహమునందు, అధియజ్ఞః= అధియజ్ఞుడు, కః= ఎవ్వడు, అత్ర = ఈ విషయము నందు, కథం = ఎట్లు, ప్రయాణకాలే చ = మరణకాలమునందును, నియతాత్మభిః= నియమింపబడిన ఆత్మ గలవారిచేత, కథం = ఎటుల, జ్ఞేయః=తెలియబడువాడవు, అసి = అగుచున్నావు.

ఓ మధుసూదనా ! అధియజ్ఞము అనగానేమి ? ఆ అధియజ్ఞము ఈ శరీరమునందు ఎట్లుండును ? అంత్యకాలమున మనస్సును నిగ్రహముచేసిన యోగులు నిన్నెట్లు తెలిసికొనగలరు ?

శ్రీభగవాన్ ఉవాచ

3 అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।

భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

అక్షరం-బ్రహ్మ-పరమం-స్వభావః-అధ్యాత్మం- ఉచ్యతే

భూతభావోద్భవకరః-విసర్గః-కర్మసంజ్ఞితః

బ్రహ్మ= బ్రహ్మము, పరమం = పరమమైనదియు, అక్షరం= క్షరము కానిదియు, స్వభావః= స్వభావము, అధ్యాత్మం= అధ్యాత్మము, ఉచ్యతే = చెప్పబడుచున్నది, భూత భావోద్భవకరః =భూతములకు స్వభావ జననములను చేయునట్టి, విసర్గః= విడుచుట, కర్మసంజ్ఞితః= కర్మమను పేరుగలది.

శ్రీ భగవానుడు పలికెను - బ్రహ్మమనగా సర్వశ్రేష్ఠుడు, శాశ్వతుడు, అధ్యాత్మము అనగా జీవాత్మ, పరమాత్మయందు లీనమైన సకల భూతములను బహిర్గతమొనర్చి, వాటి ఉత్పత్తి - అభ్యుదయములకు కారణమైన చేష్టను అనగా సృష్ట్యాదికర్మలను కర్మమనబడుచున్నది.

4 అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।

అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥

అధిభూతం-క్షరః-భావః-పురుషః-చ-అధిదైవతం

అధియజ్ఞః-అహం- ఏవ--అత్ర-దేవే-దేహభృతాం-వర

దేహభృతాంవర=అర్జునా, అధిభూతం= అధిభూతము, క్షరః= నశించునట్టి, భావః= భావముగలది, పురుషః చ = పురుషుడును, అధిదైవతం = అధిదైవతము, అత్ర = ఈ, దేహే = దేహమునందు, అధియజ్ఞః= అధియజ్ఞుడును, అహం ఏవ=నేనే.

ఓ అర్జునా! ఉత్పత్తి వినాశశీలములైన పదార్థములు అన్నియును అధిభూతములు అనబడును. హిరణ్మయుడైన పురుషుడు అధిదైవము - దేహధారులలో శ్రేష్ఠుడవైన ఈ శరీరములలో అంతర్యామిగా ఉన్న నేనే - వాసుదేవుడనే అధియజ్ఞమును.

5 అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్ ।

యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

అంతకాలే-చ-మాం- ఏవ-స్మరన్-ముక్త్వా-కలేవరమ్

యః-ప్రయాతి-సః-మద్భావం-యాతి-న-అస్తి-అత్ర-సంశయః

యః= ఎవడు, అంతకాలే చ = మరణ సమయమునందు, మాం ఏవ = నన్నే, స్వరన్ = స్మరించుచున్నవాడై, కలేవరం= దేహమును, ముక్త్వా= విడిచి, ప్రయాతి = వెడలుచున్నాడో, సః = వాడు, మద్భావం = నాభావమును, యాతి = పొందుచున్నాడు, అత్ర= ఈవిషయము నందు, సంశయః=సందేహము, న అస్తి = లేదు.

అంత్యకాలమునందైనను నన్నే స్మరించుచు దేహత్యాగమును చేసినవాడు నన్నే పొందును. ఇందేమాత్రము గూడ సంశయము వలదు.

6 యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్ ।

తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥

యం-యం-వా-అపి-స్మరన్-భావం-త్యజతి-అంతే-కలేవరం

తం-తం- ఏవ- ఏతి-కౌంతేయ-సదా-తద్భావభావితః

కౌంతేయ=అర్జునా, యః= ఎవడు, అంతే = అంత్యకాలమందు, యం యం భావం వా అపి = ఏయే భావమును, స్మరన్=తలచుచు, కలేవరం=దేహమును, త్యజతి = విడుచుచున్నాడో, సః=వాడు, సదా= ఎల్లప్పుడు, తత్ = ఆ, భావభావితః= భావమునే తలచినవాడై, తం తం ఏవ = ఆయాభావమునే, ఏతి = పొందుచున్నాడు.

కౌంతేయా ! మనుష్యుడు అవసానదశయందు ఏ ఏ భావములను స్మరించుచు దేహత్యాగము చేయునో అతడు మఱుజన్మలో ఆయాస్వరూపము లనే పొందుచున్నాడు.

7 తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ।

మయ్యర్పితమనోబుద్ధిః మామేవైష్యస్యసంశయః॥

తస్మాత్-సర్వేషు-కాలేషు-మాం-అనుస్మర-యుధ్య-చ

మయి-అర్పిత మనోబుద్ధిః-మాం- ఏవ- ఏష్యసి - అసంశయం

తస్మాత్=అందువలన, సర్వేషు = సమస్తమైన, కాలేషు = కాలములందును, మాం = నన్ను, అనుస్మర = అనుస్మరించుచు, యుధ్య చ = యుద్ధమును చేయుము, మయి = నాయందు, అర్పిత = ఉంచబడిన, మనోబుద్ధిః= మనోబుద్ధులు కలిగి, మాం ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు, అసంశయం= సందేహము లేదు.

కావున ఓ అర్జునా ! నీవు సర్వదా నన్నే స్మరించు చుండుము. యుద్ధమున కూడ చేయుము. నీ బుద్ధిని మనస్సును నాయందే నిల్పియున్నచో నిజముగా నన్నే పొందెదవు.

8 అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।

పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్॥

అభ్యాస యోగయుక్తేన-చేతసా-నాన్యగామినా

పరమం-పురుషం-దివ్యం-యాతి-పార్థ-అనుచింతయన్

పార్థ=అర్జునా, అభ్యాస యోగయుక్తేన = అభ్యాసమనెడి యోగముతో కూడినదియు, న అన్యగామినా = ఇతర విషయముల యందు ప్రవర్తింపనిదియు, చేతసా =మనస్సుచేత, దివ్యం = దివ్యుడు, పరమం= ఉత్తముడునైన, పురుషం = పురుషుని, అనుచింతయన్= స్మరించుచు, యాతి = (అతనినే) పొందుచున్నాడు.

మనస్సునందు వేరే ధ్యాస ఏ మాత్రమూ లేకుండ నిరంతరము పరమేశ్వరుని ధ్యానరూపయోగమునే సాధనచేయు మనుష్యుడు దివ్యపురుషుడైన పరమాత్మనే చేరును.

9 కవిం పురాణమనుశాసితారమ్

అణోరణీయాంసమనుస్మరేద్యః ।

సర్వస్య ధాతారమచింత్యరూపమ్

ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥

కవిం -పురాణం-అనుశాసితారం-అణోః-అణీయాంసం -అనుస్మరేత్-యః

సర్వస్య-ధాతారం-అచింత్యరూపం- ఆదిత్యవర్ణం-తమసః-పరస్తాత్

కవిం=సర్వజ్ఞుడు, పురాణం=శాశ్వతుడు, అనుశాసితారం=నియంతయు, అణోః= అణువుకంటెను, అణీయాంసం= సూక్ష్మడును, సర్వస్య= సమస్తమునకు, ధాతారం= ధాతయును, అచింత్యరూపం= ఊహింపశక్యముగాని రూపము గలవాడును, ఆదిత్యవర్ణం= సూర్యప్రకాశము గలవాడును, తమసః=చీకటికంటెను, పరస్తాత్ = వేరైన వాడును.

సర్వజ్ఞుడును, సనాతనుడును, అందరిని శాసించువాడును అణువు కంటెను సూక్ష్మమైనవాడును, సర్వ ప్రాణులను పోషించు వాడును, అచింత్య రూపుడును, సూర్యునివలె నిత్యచేతన ప్రకాశరూపుడును, అజ్ఞానాంధకారమును పారద్రోలువాడును ఐనపరమేశ్వరుని స్మరించువాడగు.......

10 ప్రయాణకాలే మనసాచలేన

భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।

భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్

స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥

ప్రయాణకాలే-మనసా-అచలేన-భక్త్యా-యుక్తః-యోగబలేన-చ- ఏవ

భృవోః-మధ్యే-ప్రాణం- ఆవేశ్య-సమ్యక్-సః-తం-పరం-పురుషం- ఉపైతి-దివ్యం

ప్రయాణకాలే=మరణకాలమునందు, అచలేన=చలనములేని, మనసా= మనస్సుతోడను, భక్త్యా=భక్తితోడను, యోగబలేన చ ఏవ= యోగబలముతోడను, యుక్తః= కూడినవాడై, భ్రువోః మధ్యే = భ్రూమధ్యమునందు, ప్రాణం= ప్రాణమును, సమ్యక్= నిలకడగా, ఆవేశ్య = నిలిపి, తం = ఆ పురుషుని, యః = ఎవడు, అనుస్మరేత్ = స్మరించునో, సః= అతడు, దివ్యం = దివ్యుడును, పరం= సర్వోత్తముడునగు, పురుషం= పురుషుని, ఉపైతి = పొందుచున్నాడు.

అట్టి పరమభక్తుడు అంత్యకాలమునందు యోగబలము చేత భ్రుకుటీ మధ్యమున ప్రాణములను స్థిరముగా నిల్పి, నిశ్చలమైన మనస్సుతో స్మరించుచు దివ్యస్వరూపుడును, పరమపురుషుడును ఐన పరమాత్మనే చేరును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

11 యదక్షరం వేదవిదో వదంతి

విశంతి యద్యతయో వీతరాగాః ।

యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి

తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥

యత్-అక్షరం-వేదవిదః-వదంతి

విశంతి-యత్-యతయః - వీతరాగాః

యత్- ఇచ్ఛంతః-బ్రహ్మచర్యం-చరంతి

తత్-తే-పదం-సంగ్రహేణ -ప్రవక్ష్యే

వేదవిదః=వేదవేత్తలు, యత్=దేనిని, అక్షరం= అక్షరమని, వదంతి = చెప్పుచున్నారో, వీతరాగాః=రాగమును విడిచిన, యతయః= యతులు, యత్ = దేనిని, విశంతి= చేరుచున్నారో, యత్=దేనిని, ఇచ్ఛంతః= కోరుచున్నవారై, బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యమును, చరంతి = పూనుచున్నారో, తత్ = అట్టి, పదం = స్థానమును, తే= నీకొరకు, సంగ్రహేణ= సంగ్రహమున, ప్రవక్ష్యే = వివరించి చెప్పుచున్నాను.

వేదవిదులైన విద్వాంసులు ఆ పరమాత్మను శాశ్వతుడు అని ప్రస్తుతింతురు - ఆసక్తిరహితులై యత్నశీలురైన సన్న్యాసులు ఆ పరమపదమునందే ప్రవేశింతురు. ఆ పరమపదమును కోరియే బ్రహ్మచారులు బ్రహ్మచర్యవ్రతమును ఆచరింతురు. అట్టి పరమపదమును గూర్చి సంగ్రహముగా నేను నీకు వివరింతును.

12 సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।

మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్ ఆస్థితో యోగధారణామ్ ॥

సర్వద్వారాణి-సంయమ్య-మనః-హృది-నిరుధ్య-చ

మూర్ధ్ని- ఆధాయ- ఆత్మనః-ప్రాణం- ఆస్థితః-యోగధారణాం

ఆత్మనః=తనయొక్క, సర్వద్వారాణి = సమస్త ఇంద్రియ ద్వారములను, సంయమ్య = నియమించి, మనః= మనస్సును, హృది = హృదయమునందు, నిరుధ్య చ = నిలిపి, మూర్ధ్ని = శిరస్సునందు, ప్రాణం= ప్రాణమును, ఆధాయ= ఉంచి, యోగధారణాం= యోగాభ్యాసమున, ఆస్థితః= ఉన్నవాడై.

సర్వేంద్రియములను నిగ్రహించి, మనస్సును హృదయమునందే స్థిరముగా నిలిపి, అట్లు వశమైన మనస్సుద్వారా ప్రాణములను సహస్రారమునందు స్థిరమొనర్చి, పరమాత్మధ్యానమునందే నిమగ్నుడై.

13 ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।

యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥

ఓం- ఇతి- ఏకాక్షరం-బ్రహ్మ-వ్యాహరన్- మాం - అనుస్మరన్

యః-ప్రయాతి-త్యజన్-దేహం-సః-యాతి-పరమాం-గతిం

బ్రహ్మ=పరబ్రహ్మ, ఓం ఇతి = ఓం అనెడి, ఏకాక్షరం= ఏకాక్షరమును, వ్యాహరన్= పలుకుతూ, మాం=నన్ను, అనుస్మరన్= స్మరించుచూ, దేహం=దేహమును, త్యజన్=త్యజించి, యః= ఎవడు, ప్రయాతి=పోవుచున్నాడో, సః=అతడు, పరమాం= ఉత్తమమైన, గతిం= గతిని, యాతి = పొందుచున్నాడు.

అక్షర బ్రహ్మస్వరూపమైన ఓంకారమును ఉచ్చరించుచు, ఆ ఓంకారమునకు అర్థస్వరూపుడను, నిర్గుణబ్రహ్మను ఐన నన్ను చింతించుచు దేహత్యాగ మొనర్చు వాడు మోక్షమును పొందుచున్నాడు.

14 అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః।

తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥

అనన్యచేతాః-సతతం-యః-మాం-స్మరతి-నిత్యశః

తస్య-అహం-సులభః-పార్థ-నిత్యయుక్తస్య-యోగినః

పార్థ=అర్జునా, యః= ఎవడు, అనన్యచేతాః= అనన్యచిత్తముతో, సతతం=సదా, నిత్యశః= అనుదినము, మాం = నన్ను, స్మరతి=తలంచుచున్నాడో, నిత్యయుక్తస్య=నిత్యయుక్తుడైన, తస్య యోగినః= ఆ యోగికి, అహం = నేను, సులభః= సులభుడను.

పార్థా ! నిత్యము నిరంతరము అనన్యభావముతో చిత్తమును నాయందే నిలిపి, పురుషోత్తముడనైన నన్నే స్మరించుచు, సంతతము మత్పరాయణుడైన యోగికి నేను సులభుడను. అనగా అతనికి నేను సులభముగా లభింతును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

15 మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।

నాప్నువంతి మహాత్మనః సంసిద్ధిం పరమాం గతాః ॥

మాం- ఉపేత్య-పునర్జన్మ-దుఃఖాలయం-అశాశ్వతం

న- ఆప్నువంతి-మహాత్మానః-సంసిద్ధిం-పరమాం-గతాః

పరమాం= ఉత్తమమైన, సంసిద్ధిం = మోక్షమును, గతాః= పొందిన, మహాత్మానః= మహాత్ములు, మాం = నన్ను, ఉపేత్య = పొంది, దుఃఖాలయం= దుఃఖమునకు స్థానము, అశాశ్వతం = అనిత్యమును నగు, పునర్జన్మ = పునర్జన్మమును, నాప్నువంతి = పొందరు.

పరమసిద్ధిని పొందిన మహాత్ములు నన్ను చేరిన పిదప దుఃఖములకు నిలయమైన, క్షణభంగురమైన పునర్జన్మను తిరిగి పొందరు.

16 ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।

మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥

ఆబ్రహ్మ భువనాత్-లోకాః-పునరావర్తినః-అర్జున

మాం- ఉపేత్య-తు-కౌంతేయ-పునర్జన్మ-న-విద్యతే

అర్జున=అర్జునా, ఆబ్రహ్మభువనాత్= బ్రహ్మలోకము వరకును గల, లోకాః= లోకములు, పునరావర్తినః= మరల పుట్టుకను కలిగించునవి, కౌంతేయ=అర్జునా, మాం = నన్ను, ఉపేత్య తు = పొందిన మాత్రముననే, పునర్జన్మ = పునర్జన్మము, న విద్యతే= కలుగదు.

అర్జునా ! బ్రహ్మలోకపర్యంతము ఉన్న సమస్తలోకములును పునరావృత్తములు. కౌంతేయా ! కనుక నన్ను చేరినవానికి పునర్జన్మ లేదు.

17 సహస్రయుగపర్యంతమ్ అహర్యద్బ్రహ్మణో విదుః ।

రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥

సహస్రయుగపర్యంతం-అహః-యత్-బ్రహ్మణః-విదుః

రాత్రిం-యుగ సహస్రాంతాం-తే-అహోరాత్రవిదః-జనాః

అహోరాత్రవిదః=రాత్రింబవళ్ళ పరిణామమును ఎరిగిన, తేజనాః= ఆ జనులు, బ్రహ్మణః = బ్రహ్మకు, యత్ = ఏది, అహః= పగలో, (తత్=దానిని), సహస్రయుగ పర్యంతం = వేయి యుగముల పరిమితిగల దానినిగను, రాత్రిం=రాత్రిని, యుగ సహస్రాంతాం=వేయి యుగముల పరిమితిగల దానినిగను, విదుః= తెలిసికొని యున్నారు.

వేయి చతుర్యుగముల కాలము బ్రహ్మకు ఒక పగలు అనియు, అదే కాలము ఆ బ్రహ్మకు ఒక రాత్రియనియు తెలిసిన యోగులు కాలతత్త్వమును నిజముగా ఎఱిగినవారు.

18 అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే ।

రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే ॥

అవ్యక్తాత్-వ్యక్తయః-సర్వాః-ప్రభవంతి-అహరాగమే

రాత్ర్యాగమే-ప్రలీయంతే-తత్ర- ఏవ-అవ్యక్తసంజ్ఞకే

అహరాగమే=పగటి ప్రారంభమునందు, అవ్యక్తాత్ = అవ్యక్తము నుండి, సర్వాః వ్యక్తయః= సమస్త వ్యక్తరూపములు, ప్రభవంతి=కలుగుచున్నవి, రాత్ర్యాగమే= రాత్రి కలిగినపుడు, అవ్యక్తసంజ్ఞకే = అవ్యక్తమనబడు, తత్ర ఏవ=దానియందే, ప్రలీయంతే= లీనమగుచున్నవి.

చరాచర ప్రాణులన్నియును బ్రహ్మయొక్క పగటి కాలము ప్రారంభము కాగానే అవ్యక్తమునుండి(బ్రహ్మయొక్క సూక్ష్మశరీరమునుండి) ఉత్పన్నములగును. మఱల బ్రహ్మయొక్క రాత్రికాలము ప్రారంభసమయమున అవి అదే అవ్యక్తమునందు లీనమగును.

19 భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।

రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥

భూతగ్రామః-సః- ఏవ-అయం-భూత్వా-భూత్వా-ప్రలీయతే

రాత్ర్యాగమే-అవశః-పార్థ-ప్రభవతి-అహరాగమే

పార్థ=అర్జునా, భూతగ్రామః= భూత సమూహము, స ఏవ అయం=అదియే, అవశః= వశములేక, రాత్రాగ్యమే = రాత్రి ప్రారంభమైనపుడు, భూత్వా భూత్వా= మరల మరల, ప్రలీయతే= లీనమగుచున్నది, అహరాగమే= పగలు వచ్చినపుడు, ప్రభవతి= పుట్టుచున్నది.

పార్థా! ఈ ప్రాణి సముదాయము ప్రకృతివశమున మాటిమాటి కిని ఉత్పన్నమగుచుండును. రాత్రి ప్రారంభకాలమున లీనమగుచుండును. పగటి ప్రారంభ కాలమున పుట్టుచుండును.

20 పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్ సనాతనః।

యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥

పరః-తస్మాత్-తు-భావః-అన్యః-అవ్యక్తః-అవ్యక్తాత్- సనాతనః

యః-సః-సర్వేషు-భూతేషు-నశ్యత్సు-న-వినశ్యతి

యః= ఏ, భావః తు = భావము అయితే, తస్మాత్ = ఆ, అవ్యక్తాత్ = అవ్యక్తము కంటెను, అన్యః= ఇతరమైనదియును, పరః= ఉత్తమమైనదియును, అవ్యక్తః=వ్యక్తము కానిదియును, సనాతనః= శాశ్వతమైనదియునగు, సః= ఆ, భావః=భావము, సర్వేషు భూతేషు= సమస్త భూతములు, నశ్యత్సు = నశించుచున్నను, న వినశ్యతి=నశింపదు.

ఆ అవ్యక్తముకంటెను పరమైన విలక్షణమైన సనాతనమైన అవ్యక్తభావమే ఆ పరమపదము. ప్రాణులన్నియు నశించినను ఆ పరమ పురుషుడు మాత్రము నశింపడు.

21 అవ్యక్తోஉక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్ ।

యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥

అవ్యక్తః-అక్షరః- ఇతి- ఉక్తః-తం- ఆహుః-పరమాం-గతిం

యం-ప్రాప్య-న-నివర్తంతే-తత్-ధామ-పరమం-మమ

అవ్యక్తః=అవ్యక్తుడు, అక్షరః=అవినాశి, ఇతి=అని, ఉక్తః=చెప్పబడిన, తం= ఆ పరమాత్మను, పరమాం= ఉత్తమమైన, గతిం=స్థానముగా, ఆహుః= చెప్పుచున్నారు, యం=దేనిని, ప్రాప్య=పొంది, న నివర్తంతే=తిరిగిరారో, తత్=అట్టి, మమ=నాయొక్క, ధామ=స్థానము, పరమం=శ్రేష్ఠమైనది.

ఈ అవ్యక్తమునే అక్షరము అనియు అందురు. ఇదియే పరమగతి అనియుఅందురు. ఈ సనాతన - అవ్యక్తమును అనగా నా పరంధామమును చేరినవారు మఱల తిరిగిరారు.

22 పురుషః స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।

యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥

పురుషః-సః-పరః-పార్థ-భక్త్యా-లభ్యః-తు-అనన్యయా

యస్య-అంతఃస్థాని-భూతాని-యేన-సర్వం- ఇదం-తతం

పార్థ=అర్జునా, భూతాని = భూతములు, యస్య= ఎవనియొక్క, అంతఃస్థాని=లోపలనున్నవో, యేన= ఎవనిచేత, సర్వం= సమస్తమైన, ఇదం= ఈ జగత్తు, తతం=వ్యాప్తమైనదో, సః= ఆ, పరః= ఉత్తముడైన, పురుషః= పురుషుడు, అనన్యయా = ఏకాగ్రమైన, భక్త్యా తు = భక్తి చేతనే, లభ్యః=పొందదగినవాడు.

ఓ పార్థా! సమస్త ప్రాణులు ఆపరమాత్మ యందే అంతర్గతములై యున్నవి. ఆ పరమాత్మచేతనే ఈ జగత్తంతయు వ్యాప్తమై ఉన్నది. అట్టి - సనాతన - అవ్యక్త పరమ పురుషుడు అనన్యభక్తి ద్వారా మాత్రమే లభ్యముకాగలడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

23 యత్ర కాలే త్వనావృత్తిమ్ ఆవృత్తిం చైవ యోగినః ।

ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥

యత్ర-కాలే-తు-అనావృత్తిం- ఆవృత్తిం-చ- ఏవ-యోగినః

ప్రయాతాః-యాంతి-తం-కాలం-వక్ష్యామి-భరతర్షభ

భరతర్షభ=అర్జునా, యత్ర= ఏ, కాలే తు = కాలమునందైతే, ప్రయాతాః= గతించిన, యోగినః=యోగులు, అనావృత్తిం= జన్మ రాహిత్యమును, యత్ర = ఏ, కాలే = కాలమునందు, ప్రయాతాః= గతించిన, ఆవృత్తిం చ ఏవ= పునర్జన్మమును, యాంతి= పొందుచున్నారో, తం= ఆ, కాలం=కాలమును, వక్ష్యామి= చెప్పుచున్నాను.

ఓ భరతశ్రేష్ఠా! ఏ కాలమునందు దేహత్యాగమును చేసిన యోగులు తిరిగిరాని గతిని చేరుదురో, మఱియు ఏకాలమునందు దేహత్యాగము చేసినవారు తిరిగివచ్చు గతిని పొందుదురో అటువంటి కాలములను, అనగా రెండు మార్గములను చెప్పుచున్నాను.

24 అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।

తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

అగ్నిః-జ్యోతిః-అహః-శుక్లః-షణ్మాసాః- ఉత్తరాయణం

తత్ర-ప్రయాతాః-గచ్ఛంతి-బ్రహ్మ-బ్రహ్మవిదః-జనాః

అగ్నిః=అగ్నియును, జ్యోతిః=తేజమును, అహః=పగలును, శుక్లః= శుక్లపక్షమును, షణ్మాసాః= ఆరుమాసములునుగల, ఉత్తరాయణం= ఉత్తరాయణమును, తత్ర = ఆ కాలమునందు, ప్రయాతాః= చనిపోయిన, బ్రహ్మవిదః= బ్రహ్మవేత్తలగు, జనాః= జనులు, బ్రహ్మ = బ్రహ్మమును, గచ్ఛంతి= పొందుచున్నారు.

బ్రహ్మవేత్తలైన యోగులు జ్యోతిర్మయమార్గముద్వారా బ్రహ్మపదప్రాప్తి నందుదురు. ఈ జ్యోతిర్మయ మార్గమునకు అధిదేవత అగ్ని. దేహత్యాగము చేసిన ఆ యోగులను క్రమముగా పగలు శుక్లపక్ష ఉత్తరాయణ - అభిమాన దేవతలు కొనిపోయి, పరమపదమును చేర్చుదురు.

25 ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।

తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే ॥

ధూమః-రాత్రిః-తథా-కృష్ణః-షణ్మాసాః-దక్షిణాయనం

తత్ర-చాంద్రమసం-జ్యోతిః-యోగీ-ప్రాప్య-నివర్తతే

ధూమః=ధూమము, రాత్రిః=రాత్రి, తథా= ఆ రీతిగనే, కృష్ణః=కృష్ణపక్షము, షణ్మాసాః= ఆరుమాసములుగల, దక్షిణాయనం=దక్షిణాయనమును, యోగీ=యోగి, తత్ర = ఆ మార్గమునందు, చాంద్రమసం= చంద్రసంబంధమైన, జ్యోతిః=జ్యోతిని, ప్రాప్య=పొంది, నివర్తతే= పునర్జన్మము నెత్తుచున్నాడు.

అట్లే సకామకర్మయోగులు ధూమ్రమార్గముద్వారా స్వర్గాదిలోకములను చేరుదురు. దేహత్యాగము చేసిన ఈ కర్మయోగులను క్రమముగా రాత్రి, కృష్ణపక్ష, దక్షిణాయన - అభిమానదేవతలు కొనిపోయి, స్వర్గాదిలోకము లను చేర్చుదురు. వారు అచట చాంద్రమసజ్యోతిని పొంది, అనగా తమశుభకర్మ ఫలములను అనుభవించి, తిరిగి పునర్జన్మ నెత్తుచున్నారు.

26 శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే ।

ఏకయా యాత్యనావృత్తిమ్ అన్యయావర్తతే పునః ॥

శుక్లకృష్ణే-గతీ-హి- ఏతే-జగతః-శాశ్వతే- మతే

ఏకయా-యాతి-అనావృత్తిం-అన్యయా- ఆవర్తతే-పునః

శుక్లకృష్ణే= శుక్లకృష్ణములైన, ఏతే = ఈ , గతీ హి = గతులు, జగతః=జగత్తునకు, శాశ్వతే= శాశ్వతములని, మతే = తలంపబడుచున్నవి, ఏకయా= ఒక మార్గముచే, అనావృత్తిం= జన్మరాహిత్యమును, యాతి= పొందుచున్నాడు, అన్యయా= రెండవ మార్గముచే, పునః=తిరిగి, ఆవర్తతే= జన్మించుచున్నాడు.

ఈ రెండు మార్గములకును శుక్ల, కృష్ణమార్గములనియు వ్యవహారము గలదు. ఇవి సనాతనములు, శుక్లమార్గమున వెళ్లువారు పరమగతిని పొంది తిరిగిరారు. కృష్ణమార్గమున వెళ్ళువారు తిరిగివచ్చి జననమరణచక్రములో పడుదురు.

27 నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।

తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥

న- ఏతే-సృతీ-పార్థ-జానన్-యోగీ-ముహ్యతి-కశ్చన

తస్మాత్-సర్వేషు-కాలేషు-యోగయుక్తః-భవ-అర్జున

పార్థ=అర్జునా, ఏతే= ఈ రెండైన, సృతీ= మార్గములను, జానన్=తెలిసిన, యోగీ = యోగి, కశ్చన= ఎవడును, న ముహ్యతి= మోహమునొందడు, తస్మాత్=అందువలన, సర్వేషు= సమస్తమైన, కాలేషు= కాలముల యందును, అర్జున=అర్జునా, యోగయుక్తః= యోగయుక్తుడవు, భవ=కమ్ము.

పార్థా ! ఈ విధముగా ఈ రెండు మార్గముల తత్త్వములను తెలిసికొన్నయోగి మోహమునపడడు. కావున అన్నికాలముల యందును నీవు యోగివి కమ్ము.

28 వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ

దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।

అత్యేతి తత్సర్వమిదం విదిత్వా

యోగీ పరం స్థానముపై తిచాద్యమ్ ॥

వేదేషు-యజ్ఞేషు-తపఃసు-చ- ఏవ

దానేషు-యత్-పుణ్యఫలం-ప్రదిష్టం

అత్యేతి-తత్-సర్వం- ఇదం- విదిత్వా

యోగీ-పరం-స్థానం- ఉపైతి-చ- ఆద్యం.

యోగీ=యోగి, ఇదం= దీనిని, విదిత్వా=గ్రహించి, వేదేషు= వేదముల యందును, యజ్ఞేషు = యజ్ఞములయందును, తపఃసు= తపముల యందును, దానేషు చ ఏవ= దానములయందునుగూడ, యత్= ఏ, పుణ్యఫలం= పుణ్యఫలము, ప్రదిష్టం= చెప్పబడినదో, తత్= ఆ , సర్వం= సర్వమును, అత్యేతి= అతిక్రమించుచున్నాడు, ఆద్యం మొదటిదైనదియును, పరం= ఉన్నతమైనదియునగు, స్థానం= స్థానమును, ఉపైతి చ = పొందుచున్నాడు.

ఈ తత్త్వరహస్యమును ఎఱిగిన యోగి వేదపఠనమువలనను, యజ్ఞదాన తపశ్చర్యాదుల వలనను కలుగు పుణ్యఫలమును మించి నిస్సందేహముగా ఉత్కృష్టమైన బ్రహ్మపదమును పొందుచున్నాడు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగో నామ

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ నవమోஉధ్యాయః - రాజవిద్యారాజగుహ్యాయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।

జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేஉశుభాత్॥

ఇదం-తు-తే-గుహ్యతమం-ప్రవక్ష్యామి-అనసూయవే

జ్ఞానం-విజ్ఞానసహితం-యత్-జ్ఞాత్వా-మోక్ష్యసే-అశుభాత్

యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అశుభాత్= అశుభకరమగు సంసార బంధము నుండి, మోక్ష్యసే= విడివడగలవో, గుహ్యతమం = అతి రహస్యమైన, విజ్ఞానసహితం= అనుభవ జ్ఞానముతో కూడుకొనిన, ఇదం = ఈ, జ్ఞానం= జ్ఞానమును, అనసూయవే =అసూయలేని, తే = నీకొరకు, ప్రవక్ష్యామి = చెప్పుచున్నారు.

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను - ఓ అర్జునా ! నీవు దోషదృష్టిలేని భక్తుడవు. కనుక నీవు రహస్యమైన జ్ఞానమును మఱల వివరముగా చెప్పుచున్నాను. దీనిని తెలిసికొని నీవు ఈ దుఃఖరూపసంసారమునుండి ముక్తుడవు కాగలవు.

2 రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్।

ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥

రాజవిద్యా-రాజగుహ్యం-పవిత్రం- ఇదం- ఉత్తమం

ప్రత్యక్షావగమం-ధర్మ్యం-సుసుఖం-కర్తుం-అవ్యయం

ఇదం = ఈ బ్రహ్మ జ్ఞానము, రాజవిద్యా= విద్యలలో రాజైనది, రాజగుహ్యం = రహస్యములలో అతిరహస్యమైనది, ఉత్తమం= ఉత్తమమైనది, పవిత్రం= పవిత్రమైనది, ప్రత్యక్షావగమం= ప్రత్యక్షానుభవముచే గ్రహించదగినది, ధర్మ్యం = ధర్మము తప్పనిది, కర్తుం = చేయుటకు, సుసుఖం= మిక్కిలి సులభమైనది, అవ్యయం= నాశరహితమైనది.

ఈ బ్రహ్మజ్ఞానము విద్యలకు తలమానికము. సమస్త గోప్యవిషయములకును శిరోభూషణము. అతి పవిత్రము. ఉత్తమోత్తమము. ప్రత్యక్షఫలదాయకము. ధర్మయుక్తము, సాధన చేయుటకు మిక్కిలి సులువైనది.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।

అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని ॥

అశ్రద్ధధానాః-పురుషాః-ధర్మస్య-అస్య-పరంతప

అప్రాప్య-మాం-నివర్తంతే-మృత్యుసంసారవర్త్మని

పరంతప = అర్జునా, అస్య= ఈ, ధర్మస్య = ధర్మము నందు, అశ్రద్ధధానాః= శ్రద్ధలేని, పురుషాః= పురుషులు, మాం = నన్ను, అప్రాప్య = పొందక, మృత్యుసంసారవర్త్మని = మృత్యురూపమైన సంసార మార్గమునందు, నివర్తంతే= మరలుచున్నారు.

ఓ పరంతపా ! ఈ ధర్మమార్గమునందు విశ్వాసములేని పురుషులు నన్ను పొందజాలరు. కనుక వారు మృత్యురూప సంసారచక్రమునందు మళ్ళీ మళ్ళీ పడుచున్నారు.

4 మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।

మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥

మయా-తతం- ఇదం- సర్వం-జగత్-అవ్యక్తమూర్తినా

మత్స్థాని-సర్వభూతాని-న-చ-అహం-తేషు-అవస్థితః

అవ్యక్తమూర్తినా= ఇంద్రియ గోచరము గాని, మయా= నాచేతను, ఇదం= ఈ, సర్వం= సమస్తమైన, జగత్= ప్రపంచము, తతం= వ్యాప్తమైనది, సర్వభూతాని = సర్వభూతములును, మత్స్థాని = నాయందున్నవి, తేషు = వానియందు, అహం= నేను, నచ అవస్థితః= ఉన్నవాడను కాను.

నిరాకారపరబ్రహ్మనైన నాచేతనే ఈ జగత్తంతయును వ్యాపించబడియున్నది. ప్రాణులన్నియును నాయందే యున్నవి. కాని వాస్తవముగా నేను వాటియందు లేను.

5 న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।

భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥

న-చ-మత్స్థాని-భూతాని-పశ్య-మే-యోగం- ఐశ్వరం

భూతభృత్-న-చ-భూతస్థః-మమ- ఆత్మా- భూతభావనః

భూతాని=ప్రాణులన్నియు, న చ మత్స్థాని = నాయందు లేవు, మే= నాయొక్క, ఐశ్వరం= ఈశ్వరసంబంధమైన, యోగం చ = యోగమును, పశ్య = చూడుము, మమ = నాయొక్క, ఆత్మా = ఆత్మ, భూతభృత్ = భూతములను భరించునట్టిది, భూతభావనః= భూతములను రక్షించునది, భూతస్థః న చ = భూతముల యందుండునది కాదు.

ఈ ప్రాణులన్నియును నాలో స్థిరముగా లేవు. ఈశ్వరీయమైన నా యోగశక్తిని చూడుము. ఈ భూతములన్నింటిని సృష్టించునదియు, పోషించునదియు నేనేయైనను యథార్థముగా నా ఆత్మ భూతముల యందు ఉండునది గాదు.

6 యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్।

తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥

యథా- ఆకాశస్థితః-నిత్యం-వాయుః-సర్వత్రగః-మహాన్

తథా-సర్వాణి-భూతాని-మత్స్థాని- ఇతి- ఉపధారయ

సర్వత్రగః= సర్వవ్యాపియును, మహాన్= గొప్పదియును, వాయుః= వాయువు, నిత్యం = నిత్యము, యథా= ఏరీతిని, ఆకాశస్థితః= ఆకాశము నందున్నదో, తథా = ఆ రీతిని, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, మత్స్థాని ఇతి = నాయందున్నవని, ఉపధారయ = గ్రహించుము.

ఆకాశమునుండి ఉత్పన్నమై, సర్వత్ర సంచరించుచున్న విస్తృతమైన వాయువు సర్వదా ఆకాశమునందే స్థితమై యుండును. అట్లే నా సంకల్పము ద్వారా ఉత్పన్నమైన భూతములు (ప్రాణులు) అన్నియును నాయందే ఉన్నవని గ్రహించుము.

7 సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్ ।

కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥

సర్వభూతాని-కౌంతేయ-ప్రకృతిం-యాంతి-మామికాం

కల్పక్షయే-పునః-తాని-కల్పాదౌ-విసృజామి-అహం

కౌంతేయ=అర్జునా, కల్పక్షయే=కల్పాంతము నందు, సర్వభూతాని = సకల భూతములు, మామికాం= నా సంబంధమైన, ప్రకృతిం= మాయను, యాంతి= పొందుచున్నవి, కల్పాదౌ= కల్పారంభమునందు, తాని= ఆ సర్వభూతములను, పునః=మరల, అహం= నేను, విసృజామి = సృజించుచున్నాను.

ఓ కౌంతేయా ! కల్పాంతమునందు భూతములన్నియును నా ప్రకృతినే చేరును. అనగా ప్రకృతిలో లీనమగును. సృష్టి ఆరంభమున నేను మరల వాటిని సృజించుచుందును.

8 ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః ।

భూతగ్రామమిమం కృత్స్నమ్ అవశం ప్రకృతేర్వశాత్ ॥

ప్రకృతిం-స్వాం-అవష్టభ్య-విసృజామి-పునః-పునః

భూతగ్రామం- ఇమం-కృత్స్నం-అవశం-ప్రకృతేః-వశాత్

స్వాం= స్వకీయమైన, ప్రకృతిం= ప్రకృతిని, అవష్టభ్య= అవలంబించి, అవశం=పరతంత్రమైన, ఇమం= ఈ, కృత్స్నం= సమస్తమైన, భూతగ్రామం=భూతసమూహమును, పునః పునః = మరల మరల, ప్రకృతే = ప్రకృతియొక్క, వశాత్ = వశముచే, విసృజామి = సృజించుచున్నాను.

తమతమ స్వభావవశమున పరతంత్రమైయున్న భూత సముదాయమును నాప్రకృతినాశ్రయించి మాటిమాటికి వాటి కర్మానుసారము మరల మరల పుట్టించుచున్నాను.

9 న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।
ఉదాసీనవదాసీనమ్ అసక్తం తేషు కర్మసు ॥

న-చ-మాం-తాని-కర్మాణి-నిబధ్నంతి-ధనంజయ
ఉదాసీనవత్- ఆసీనం-అసక్తం-తేషు-కర్మసు

ధనంజయా=అర్జునా, తేషు= ఆ, కర్మసు = కర్మలయందు, అసక్తం= సంగము లేనివాడను, ఉదాసీనవత్ = ఉదాసీనుడను, ఆసీనం చ = ఉన్నవాడనైన, మాం = నన్ను, తాని = ఆ, కర్మాణి = కర్మలు, న నిబధ్నంతి = బంధింపవు.

ఓ అర్జునా ! ఆ సృష్ట్యాది కర్మలయందు సంగములేక ఉదాసీనునివలెనున్న నన్ను ఆ కర్మలు బంధింపవు.

10 మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే ॥

మయా-అధ్యక్షేణ-ప్రకృతిః-సూయతే-సచరాచరం
హేతునా-అనేన-కౌంతేయ-జగత్-విపరివర్తతే

కౌంతేయ = అర్జునా, అధ్యక్షేణ=అధ్యక్షుడనైన, మయా= నాచేత, ప్రకృతిః=ప్రకృతి, సచరాచరం= చరాచరములను, సూయతే= ప్రసవించుచున్నది, అనేన= ఈ, హేతునా= కారణముచే, జగత్ = జగత్తు, విపరివర్తతే = ప్రవర్తించుచున్నది.

ఓ అర్జునా ! సాక్షిభూతుడనైన నా అధ్యక్షతన ప్రకృతి ఈ చరాచరజగత్తును సృష్టించుచున్నది. ఈ కారణము వలననే జగత్తు పరిభ్రమించుచున్నది.

11 అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।

పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥

అవజానంతి-మాం-మూఢాః-మానుషీం-తనుం- ఆశ్రితం

పరం-భావం-అజానంతః-మమ-భూతమహేశ్వరం

మమ=నాయొక్క, పరం= ఉత్తమమైన, భావం = భావమును, భూతమహేశ్వరం = భూతముల నియంతను, అజానంతః= తెలియని, మూఢాః= మూఢులు, మానుషీం= మానవ సంబంధమైన, తనుం= దేహమును, ఆశ్రితం= ఆశ్రయించిన, మాం = నన్ను, అవజానంతి = అవమానించుచున్నారు.

నా పరమభావమును ఎఱుగని మూఢులు సర్వప్రాణులకును మహేశ్వరుడను (ప్రభువును) ఐన నన్ను లోకకల్యాణమునకై అవతారములను ఎత్తిన కారణమున సామాన్య మానవునిగా భావించి, నన్ను అలక్ష్యము చేయుచున్నారు.

12 మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।

రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥

మోఘాశాః-మోఘకర్మాణః-మోఘజ్ఞానాః-విచేతసః

రాక్షసీం- ఆసురీం-చ- ఏవ-ప్రకృతిం-మోహినీం-శ్రితాః

మోఘాశాః= వ్యర్థములైన ఆశలు కలవారు, మోఘకర్మాణః= వ్యర్థములైన కర్మలు గలవారు, మోఘజ్ఞానాః= వ్యర్థములైన జ్ఞానము గలవారు, విచేతసః= అజ్ఞానులు, మోహినీం=మోహజనితమైన, రాక్షసీం= రాక్షస సంబంధమైనట్టి, ఆసురీం చ = అసుర సంబంధమైనట్టియు, ప్రకృతిం ఏవ = స్వభావమునే, శ్రితాః= ఆశ్రయించినవారగుచున్నారు.

వ్యర్థములైన ఆశలచే, కర్మలచే, విపరీత జ్ఞానముచే విక్షిప్తములైన మనస్సులుగల అజ్ఞానులు రాక్షసీ - ఆసురీ - మోహినీ స్వభావములను పొందుచున్నారు.

13 మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః ।

భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥

మహాత్మానః-తు-మాం-పార్థ-దైవీం-ప్రకృతిం- ఆశ్రితాః

భజంతి-అనన్యమనసః-జ్ఞాత్వా- భూతాదిం-అవ్యయం

పార్థ=అర్జునా, మహాత్మానః తు = మహాత్ములైతే, దైవీం= సాత్త్వికమైన, ప్రకృతిం=స్వభావమును, ఆశ్రితాః= ఆశ్రయించిన వారగుచు, భూతాదిం = జగత్తునకు కారణమైన, మాం = నన్ను, అవ్యయం= నాశము లేని వానినిగ, జ్ఞాత్వా= తెలిసికొని, అనన్యమనసః= ఏకాగ్రచిత్తులై, భజంతి = భజించుచున్నారు.

కాని ఓ పార్థా ! దైవీప్రకృతిని ఆశ్రయించిన మహాత్ములైతే నన్ను సకల ప్రాణులకు మూలకారణముగను, అవ్యయునిగను (అక్షరస్వరూపునిగను) తెలిసికొని, నిశ్చలమనస్కులై నిరంతరము నన్నే భజించుచున్నారు.

14 సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః ।

నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥

సతతం-కీర్తయంతః-మాం-యతంతః-చ-దృఢవ్రతాః

నమస్యంతః-చ-మాం-భక్త్యా-నిత్యయుక్తాః- ఉపాసతే

సతతం= ఎల్లప్పుడును, మాం = నన్ను, కీర్తయంతః చ = సంకీర్తనము చేయువారు, యతంతః= ప్రయత్నించువారు, దృఢవ్రతాః= దృఢమైన వ్రతములు చేయువారు, భక్త్యా= భక్తిచేత, నమస్యంతః చ = నమస్కరించెడి వారునునైన, నిత్యయుక్తాః= నిత్యయోగులు, మాం = నన్ను, ఉపాసతే = సేవించుచున్నారు.

ఆ దృఢవ్రతులైన భక్తులు నా నామగుణములను నిరంతరము కీర్తింతురు. నన్ను చేరుటకు యత్నింతురు. పదేపదే నాకు ప్రణమిల్లుదురు. సర్వదా నా ధ్యానమునందే నిమగ్నులయ్యెదరు. అనన్య భక్తితో నన్ను సేవించుచున్నారు.

15 జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే ।

ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥

జ్ఞానయజ్ఞేన-చ-అపి-అన్యే-యజంతః-మాం- ఉపాసతే

ఏకత్వేన-పృథక్త్వేన-బహుధా-విశ్వతోముఖం

అన్యే చ అపి= మరికొందరు, విశ్వతోముఖం= విశ్వరూపుడనైన, మాం = నన్ను, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత, ఏకత్వేన= ఏకముగను, పృథక్త్వేన= భిన్నముగను, బహుధా=అనేక విధములుగను, యజంతః= పూజించుచు, ఉపాసతే= ఉపాసించు చున్నారు.

మఱికొందరు జ్ఞానులు నిర్గుణనిరాకార బ్రహ్మనైన నన్ను జ్ఞానయజ్ఞము ద్వారా అభేదభావముతో ఉపాసించుచుందురు. మఱికొందరు అనంత రూపములతో ఒప్పెడి నా విరాట్ స్వరూపమును ద్వైత భావముతో పూజించుచున్నారు.

16 అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్ ।

మంత్రోఽహమహమేవాజ్యమ్ అహమగ్నిరహం హుతమ్ ॥

అహం-క్రతుః-అహం-యజ్ఞః-స్వధా-అహం-అహం- ఔషధం

మంత్రః-అహం-అహం- ఏవ- ఆజ్యం-అహం-అగ్నిః-అహం-హుతం

అహం=నేను, క్రతుః=క్రతువును, అహం=నేను, యజ్ఞః=యజ్ఞమును, అహం=నేను, స్వధా= పిండమును, అహం=నేను, ఔషధం= ఔషధమును, అహం=నేను, మంత్రః= మంత్రమును, అహం=నేను, ఆజ్యం= హవిస్సును, అహం= నేను, అగ్నిః= అగ్నిహోత్రమును, అహం ఏవ=నేనే, హుతం= హోమకర్మను.

నేనే క్రతువును. నేనే యజ్ఞమును, పిండమును నేనే, ఓషధులను నేనే. నేనే మంత్రమును, నేనేహవిస్సును. నేనే అగ్నిని. హోమరూప కర్మమును నేనే అయి యున్నాను.

17 పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః ।

వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ ॥

పితా-అహం-అస్య-జగతః-మాతా-ధాతా-పితామహః

వేద్యం-పవిత్రం- ఓంకారః ఋక్-సామ-యజుః- ఏవ-చ

అస్య= ఈ, జగతః= జగత్తునకు, అహం= నేను, పితా= తండ్రిని, మాతా= తల్లిని, ధాతా= సృష్టికర్తను, పితామహః= తాతను, వేద్యం= తెలిసికొనదగిన, పవిత్రం = పవిత్రమైన, ఓంకారః= ప్రణవమును, ఋక్సామ యజురేవ చ = ఋగ్వేద , సామవేద యజుర్వేదములును.

ఈ సమస్త జగత్తునకు ధాతను అనగా ధరించువాడను, అట్లే కర్మలఫలములను ఇచ్చువాడను నేనే. తల్లియును, తండ్రియును, తాతయును నేనే. తెలిసికొనదగిన వాడనూ నేనే. పవిత్రుడను, ఓంకారమును నేనే. ఋక్సామ యజుర్వేదములును నేనే.

18 గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।

ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥

గతిః-భర్తా-ప్రభుః-సాక్షీ-నివాసః-శరణం-సుహృత్

ప్రభవః-ప్రలయః-స్థానం-నిధానం-బీజం-అవ్యయం

గతిః=గతిని, భర్తా= భరించువాడను, ప్రభుః=ప్రభువును, సాక్షీ=సాక్షిని, నివాసః= నివాసమును, శరణం= ఆశ్రయమును, సుహృత్ = మిత్రుడను, ప్రభవః=సృష్టికర్తను, ప్రలయః= వినాశకరుడను, స్థానం=స్థితికర్తను, నిధానం= నిక్షేపమును, అవ్యయం= నాశములేని, బీజం=మూలకారణమును.

పరమగతియైన పరమధామమును, జగత్తును భరించి, పోషించువాడను నేనే. అందరకిని స్వామిని, అందరి శుభాశుభములను చూచువాడను నేనే, అందరికిని నివాసస్థానమును, శరణుపొందదగినవాడను నేనే. ప్రత్యుపకారమును ఆశింపక హితమొనర్చువాడను, అందటి ఉత్పత్తిప్రళయములకు హేతువును, వారి స్థితికి ఆధారమును, నిధానమును, అవ్యయ బీజమును నేనే.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

19 తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।

అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥

తపామి-అహం-అహం-వర్షం-నిగృహ్ణామి- ఉత్సృజామి-చ

అమృతం-చ- ఏవ-మృత్యుః-చ-సత్-అసత్-చ-అహం-అర్జున

అర్జున=అర్జునా, అహం= నేను, తపామి = తపింపజేయుచున్నాను, అహం= నేను, వర్షం= వర్షమును, నిగృహ్ణామి= నిలుపుచున్నాను, ఉత్సృజామి చ = కురిపించుచున్నాను, అమృతం చ = అమృతమును, మృత్యుః చ = మృత్యువును, సత్ = సత్తును, అసత్ చ = అసత్తును, అహం ఏవ= నేనే.

ఓ అర్జునా ! సూర్యరూపమున నేనే తపించుచున్నాను. సముద్రముల నుండి నీటిని గ్రహించి, వర్షరూపమున మరల వదలెదను. అమృతమును, మృత్యువును గూడ నేనే. సత్తును (శాశ్వతమైన ఆత్మను) అసత్తును (నశ్వరమైన సమస్త వస్తుజాలమును)గూడ నేనే.

20 త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।

తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్ అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్॥

త్రైవిద్యాః-మాం-సోమపాః-పూతపాపాః-యజ్ఞైః - ఇష్ట్వా-స్వర్గతిం- ప్రార్థయంతే

తే-పుణ్యం- ఆసాద్య-సురేంద్రలోకం- అశ్నన్తి-దివ్యాన్ -దివి- దేవభోగాన్

త్రైవిద్యాః= వేదాధ్యయనపరులు, యజ్ఞైః = యజ్ఞములచేతను, మాం=నన్ను, ఇష్ట్వా=పూజించి, సోమపాః=సోమపానము చేసినవారై, పూతపాపాః= శుద్ధిచేయబడిన పాపములు గలవారై, స్వర్గతిం= స్వర్గలోకస్థితిని, ప్రార్థయంతే= ప్రార్థించుచున్నారు, తే=వారు, పుణ్యం=పుణ్యప్రదమైన, సురేంద్రలోకం= దేవేంద్రలోకమును, ఆసాద్య= పొంది, దివి=స్వర్గమునందు, దివ్యాన్= దివ్యములైన, దేవభోగాన్= దేవతాభోగములను, అశ్నంతి= అనుభవించుచున్నారు.

ఋగ్యజుస్సామవేదములచే ప్రోక్తములైన సకామకర్మలను చేయువారును, సోమరసపానము చేయువారును, పాపరహితులై యజ్ఞములద్వారా నన్ను సేవించి, స్వర్గప్రాప్తిని కోరుచుందురు. అట్టి పురుషులు తమ పుణ్యఫలరూపమైన స్వర్గలోకమును పొందుదురు. అచ్చటి దివ్యములైన దేవతాభోగములను అనుభవించుచున్నారు.

21 తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి।

ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే ॥

తే-తం-భుక్త్వా-స్వర్గలోకం-విశాలం-క్షీణే-పుణ్యే-మర్త్యలోకం-విశంతి

ఏవం-త్రయీధర్మం-అనుప్రపన్నాః-గతాగతం-కామకామాః-లభంతే

తే=వారు, తం= ఆ, విశాలం= విస్తారమైన, స్వర్గలోకం= స్వర్గలోక సౌఖ్యములను, భుక్త్వా= అనుభవించి, పుణ్యే= పుణ్యము, క్షీణే= క్షీణించగా, మర్త్యలోకం= మానవ లోకమును, విశంతి= ప్రవేశించుచున్నారు, ఏవం= ఈ రీతిగాను, త్రయీధర్మం= సకామ కర్మమును, అనుప్రపన్నాః= అనుష్ఠించెడివారలు, కామకామాః= కోరికలు గలవారై, గతాగతం= జననమరణములను, లభంతే= పొందుచున్నారు.

ఆ విశాలస్వర్గమునందు భోగములను అనుభవించి, పుణ్యములు అయిపోగానే (క్షీణింపగానే) మఱల మర్త్యలోకమున ప్రవేశింతురు. ఈ విధముగ స్వర్గప్రాప్తి సాధనములైన వేదత్రయవిహితసకామకర్మలను ఆశ్రయించు వారు, భోగములను ఆసించుచూ స్వర్గమర్త్యలోకముల మధ్య రాకపోకలు సాగించుచుందురు. అనగా పుణ్య ప్రభావముచే స్వర్గమునకు పోవుదురు. పుణ్యము క్షీణింపగనే తిరిగి మానవలోకమున జన్మించు చున్నారు.

22 అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

అనన్యాః-చింతయంతః-మాం-యే-జనాః-పర్యుపాసతే

తేషాం-నిత్యాభియుక్తానాం-యోగక్షేమం-వహామి-అహం

అనన్యాః=అన్యచింతలులేక, మాం=నన్ను, యే= ఎట్టి, జనాః= జనులు, చింతయంతః= స్మరించుచున్నవారై, పర్యుపాసతే = సేవించుచున్నారో, నిత్యాభియుక్తానాం= నిత్యము నాయందు ఏకీభావము కలిగిన, తేషాం= వారలయొక్క, యోగక్షేమం= యోగక్షేమములను, అహం=నేను, వహామి= వహించుచున్నాను.

పరమేశ్వరుడనైన నన్నే నిరంతరము అనన్య భక్తితో చింతనచేయుచు, నిష్కామ భావముతో సేవించువారియోగ క్షేమములను నేనే వహించుచుందును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

23 యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।

తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥

యే-అపి-అన్యదేవతాః-భక్తాః-యజంతే-శ్రద్ధయా-అన్వితాః

తే-అపి-మాం- ఏవ-కౌంతేయ- యజంతి-అవిధిపూర్వకం

కౌంతేయ=అర్జునా, యే అపి= ఎవరయితే, అన్యదేవతాః= ఇతర దేవతల, భక్తాః= భక్తులై, శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితాః= కూడినవారై, యజంతే= ఉపాసించుచున్నారో, తే అపి= వారును, మాం ఏవ= నన్నే, అవిధిపూర్వకం= క్రమముతప్పి, యజంతి= పూజించుచున్నారు.

ఓ అర్జునా ! శ్రద్ధాన్వితులైన సకామ భక్తులు ఇతరదేవతలను పూజించినప్పటికిని వారు నన్ను పూజించినట్లే. కాని వారిపూజలు అవిధి పూర్వకములైనవి. అనగా అజ్ఞానముతో కూడినవి.

24 అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।

న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥

అహం-హి-సర్వయజ్ఞానాం-భోక్తా-చ-ప్రభుః- ఏవ-చ

న-తు-మాం-అభిజానంతి-తత్త్వేన-అతః-చ్యవంతి-తే

అహం హి=నేను, సర్వయజ్ఞానాం = సమస్త యజ్ఞములకు, భోక్తా చ = భోక్తను, ప్రభుః ఏవ చ = ప్రభువునుకూడా, తు = అయినను, తే=వారు, మాం = నన్ను, తత్త్వేన = తాత్త్వికముగ, న అభిజానంతి = ఎరుగరు, అతః= అందుచేత, చ్యవంతి= పతనమగుదురు.

ఏలనన సకల యజ్ఞములకును భోక్తను, స్వామిని గూడ నేనే. వారు నా పరమేశ్వర తత్త్వమును ఎఱుంగరు. కావున పతనమగు చున్నారు. (పునర్జన్మ పొందుచున్నారు).

25 యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః।

భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ ॥

యాంతి-దేవవ్రతాః-దేవాన్-పితౄన్-యాంతి-పితృవ్రతాః

భూతాని-యాంతి-భూతేజ్యాః-యాంతి-మద్యాజినః- అపి-మాం

దేవవ్రతాః=దేవతల నారాధించువారు, దేవాన్=దేవతలను, యాంతి= పొందుచున్నారు, పితృవ్రతాః= పితృ పూజచేయువారు, పితౄన్= పితరులను, యాంతి= పొందుచున్నారు , భూతేజ్యాః= భూతములను ఆరాధించువారు, భూతాని= భూతములను, యాంతి= పొందుచున్నారు, మద్యాజినః అపి = నన్ను పూజించెడివారు, మాం = నన్ను, యాంతి= పొందుచున్నారు.

దేవతలను పూజించువారు దేవలోకములను చేరుదురు. పితరులను సేవించువారు పితృలోకములకు వెళ్ళుదురు. భూతప్రేతములను అర్చించువారు భూతప్రేత రూపములను పొందుదురు. నన్ను ఆరాధించు భక్తులు నన్నే పొందుదురు.

26 పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।

తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥

పత్రం-పుష్పం-ఫలం-తోయం-యః-మే-భక్త్యా-ప్రయచ్ఛతి

తత్-అహం-భక్త్యుపహృతం-అశ్నామి-ప్రయతాత్మనః

యః= ఎవడు, భక్త్యా= భక్తితో, పత్రం- ఆకునో, పుష్పం= పువ్వునో, ఫలం= ఫలమునో, తోయం = ఉదకమునో, మే = నాకు, ప్రయచ్ఛతి= సమర్పించునో, ప్రయతాత్మనః= నిష్కాముడైన అట్టి భక్తునియొక్క, భక్త్యుపహృతం=భక్తి పూర్వకముగా సమర్పింప బడినటువంటి, తత్= దానిని, అహం= నేను, అశ్నామి= భుజించుచున్నాను.

నిర్మలబుద్ధితో, నిష్కామభావముతో పరమభక్తునిచే సమర్పింపబడిన పత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలముగాని జలమును గాని, నేను ప్రత్యక్షముగా ఆరగింతును.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

27 యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసి యత్।

యత్తపస్యసి కౌంతేయ తత్ కురుష్వ మదర్పణమ్॥

యత్-కరోషి-యత్-అశ్నాసి-యత్-జుహోషి-దదాసి-యత్

యత్-తపస్యసి-కౌంతేయ-తత్-కురుష్వ-మదర్పణం

కౌంతేయ=అర్జునా, యత్=దేనిని, కరోషి= చేయుచున్నావో, యత్=దేనిని, అశ్నాసి= తినుచున్నావో, యత్=దేనిని, జుహోషి= హోమము చేయుచున్నావో, యత్=దేనిని, దదాసి= దానము చేయుచున్నావో, యత్=దేనిని, తపస్యసి= తపస్సు చేయుచున్నావో, తత్= దానినంతయును, మదర్పణం= నాకర్పింపబడినదానినిగను, కురుష్వ= చేయుము

ఓ కౌంతేయా ! నీవు ఆచరించు కర్మను, భుజించెడి ఆహారమును, హోమముచేయు హవ్యమును, అర్పించుదానమును, ఆచరించు తపస్సును నాకే సమర్పింపుము.

28 శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః।

సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥

శుభాశుభఫలైః- ఏవం-మోక్ష్యసే-కర్మబంధనైః

సంన్యాసయోగయుక్తాత్మా-విముక్తః-మాం- ఉపైష్యసి

ఏవం= ఈ విధముగ, శుభాశుభఫలైః= శుభాశుభఫలములను గలుగజేసెడి, కర్మబంధనైః= కర్మబంధములచేత, మోక్ష్యసే= విముక్తుడవగుదువు, సంన్యాసయోగయుక్తాత్మా= సన్యాసయోగయుక్తుడవై, విముక్తః=విడువ బడినవాడవై, మాం = నన్ను, ఉపైష్యసి= పొందగలవు.

ఈ విధముగా సన్న్యాసయోగమునందు స్థిరచిత్తుడవై, అనగా సమస్తకర్మలను భగవంతుడనైన నాకే సమర్పించి, శుభాశుభఫలరూపకర్మ బంధములనుండి ముక్తుడవయ్యెదవు. పిదప నన్నే పొందగలవు.

29 సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।

యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥

సమః-అహం-సర్వభూతేషు-న-మే-ద్వేష్యః-అస్తి-న-ప్రియః

యే-భజంతి-తు-మాం-భక్త్యా-మయి-తే-తేషు-చ-అపి-అహం

అహం=నేను, సర్వభూతేషు= సమస్తభూతములయందును, సమః= సముడను, మే=నాకు, ద్వేష్యః= శత్రువు, న అస్తి = లేడు, ప్రియః= ఇష్టుడును, న = లేడు, యే తు= ఎవరైతే, మాం = నన్ను, భక్త్యా= భక్తితో, భజంతి= భజించుచున్నారో, తే = వారు, మయి= నాయందు, తేషు చ = వారియందు, అహం అపి= నేనును.

నేను సకలభూతముల (ప్రాణుల) యందును సమభావముతో వ్యాపించియుందును. నాకు అప్రియుడు గాని ప్రియుడు గాని ఎవ్వడును లేడు. కాని నన్ను భక్తితో భజించువారు నాయందేయుందురు. నేనును వారియందు ఉందును.

30 అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్।

సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః॥

అపి-చేత్-సుదురాచారః-భజతే-మాం-అనన్యభాక్

సాధుః- ఏవ-సః-మంతవ్యః-సమ్యక్-వ్యవసితః-హి-సః

సుదురాచారః అపి = మిక్కిలి దురాచారము గలవాడై నను, అనన్యభాక్= అన్యాశ్రయము నభిలషించనివాడై, మాం = నన్ను, భజతే చేత్=భజించునెడల, సః= వాడు, సమ్యక్= చక్కగ, వ్యవసితః హి = స్థిరమైన చిత్తము గలవాడుగాన, సః = అతడు, సాధుః ఏవ= సాధువేయని, మంతవ్యః=తలంపదగినవాడు.

మిక్కిలి దురాచారుడైనను అనన్యభక్తితో నన్ను భజించినచో అతనిని సత్పురుషునిగానే భావింపదగును. ఏలనన యథార్థముగా అతడు నిశ్చయబుద్ధి గలవాడు. అనగా అతడు సాధువే యని గ్రహింపుము.

31 క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।

కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥

క్షిప్రం-భవతి-ధర్మాత్మా-శశ్వత్-శాంతిం-నిగచ్ఛతి

కౌంతేయ-ప్రతి-జానీహి-న-మే-భక్తః-ప్రణశ్యతి

క్షిప్రం=శీఘ్రముగా, ధర్మాత్మా= ధర్మాత్ముడు, భవతి= అగుచున్నాడు, శశ్వత్= స్థిరమైన, శాంతిం= శాంతిని, నిగచ్ఛతి= పొందుచున్నాడు, కౌంతేయ= అర్జునా, మే=నాయొక్క, భక్తః= భక్తుడు, న ప్రణశ్యతి ఇతి= నాశముబొందడని, ప్రతిజానీహి = ప్రతిజ్ఞను చేయుము.

కౌంతేయా ! అతడు శీఘ్రముగా ధర్మాత్ముడగును. శాశ్వతమైన పరమశాంతిని పొందును. నా భక్తుడెన్నడును నష్టమునకు గురికాడు అను విషయమును నిశ్చయముగా ఎఱుంగుము.

32 మాం హి పార్థ వ్యపాశ్రిత్య యే ఽపి స్యుః పాపయోనయః ।

స్త్రియో వైశ్యాస్తథాశూద్రాః తేఽపి యాంతి పరాం గతిమ్ ॥

మాం-హి-పార్థ-వ్యపాశ్రిత్య-యే-అపి-స్యుః-పాపయోనయః

స్త్రియః-వైశ్యాః-తథా-శూద్రాః-తే-అపి-యాంతి-పరాం-గతి

పార్థ=అర్జునా, యే = ఎవరు, మాం = నన్ను, వ్యపాశ్రిత్య= శరణుబొంది, పాపయోనయః= పాపాత్ములు, స్త్రియః= స్త్రీలును, వైశ్యాః= వైశ్యులును, తథా= అలాగే, శూద్రాః=శూద్రులును, స్యుః అపి=అయియున్నారో, తే అపి= అట్టివారును, పరాం= ఉత్తమమైన, గతిం= గతిని, యాంతి హి = పొందుచున్నారు.

ఓ అర్జునా ! స్త్రీ, వైశ్య, శూద్రులును, అట్లే చండాలాది పాపయోనిజులును నన్నే శరణుపొంది పరమగతినే పొందుదురు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

33 కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా ।

అనిత్యమసుఖం లోకమ్ ఇమం ప్రాప్య భజస్వ మామ్ ॥

కిం-పునః-బ్రాహ్మణాః-పుణ్యాః-భక్తాః-రాజర్షయః-తథా

అనిత్యం-అసుఖం-లోకం- ఇమం-ప్రాప్య-భజస్వ-మాం

పుణ్యాః=పుణ్యాత్ములైనట్టి, భక్తాః= భక్తులైనట్టి, బ్రాహ్మణాః= బ్రాహ్మణులును, తథా= అటులే, రాజర్షయః= రాజర్షులును, కిం పునః= ఏమి చెప్పవలయును, అనిత్యం= నిత్యము కానిదియు, అసుఖం= సుఖము లేనిదియును అగు, ఇమం= ఈ , లోకం= లోకమును, ప్రాప్య= పొందినవాడవై, మాం = నన్ను, భజస్వ= భజింపుము.

ఇక పుణ్యాత్ములైన బ్రాహ్మణులును, రాజర్షులును భక్తులును నన్ను శరణుపొందినచో వారు పరమపదమును చేరుదురని చెప్పవలసిన పనియేలేదు. ఈ మానవశరీరము క్షణభంగురము. సుఖరహితము, ఐనను దుర్లభము. కనుక దీనిని పొంది నిరంతరము నన్నే భజించి ముక్తుడవగుము.

34 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।

మామేవైష్యసి యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః ॥

మన్మనా-భవ-మద్భక్తః-మద్యాజీ-మాం-నమస్కురు

మాం- ఏవ- ఏష్యసి-యుక్త్వా- ఏవం- ఆత్మానం-మత్పరాయణః

మన్మనా=నాయందే మనస్సుగలవాడవు, భవ = కమ్ము, మద్భక్తః= నాకు భక్తుడవును, మద్యాజీ= నన్నే పూజించువాడవు, (భవ=కమ్ము), మాం=నన్నే, నమస్కురు=నమస్కరింపుము, ఏవం= ఇట్లు, ఆత్మానం= ఆత్మను, యుక్త్వా=నియోగించి, మత్పరాయణః= నాయందు మనస్సుగలవాడవై, మాం ఏవ= నన్నే, ఏష్యసి = పొందగలవు.

నా యందే నీ మనస్సును లగ్నము చేయుము. నా భక్తుడవు కమ్ము. నన్నే పూజింపుము. నాకు నమస్కరింపుము. ఈ విధముగా ఆత్మను నాయందే నిలిపి, మత్పరాయణుడవైనచో నీవు నన్నే పొందగలవు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగోనామ

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ దశమో<u>ఽ</u>ధ్యాయః - విభూతియోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।

యత్తే<u>ఽ</u>హం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥

భూయః- ఏవ-మహాబాహో-శృణు-మే-పరమం-వచః

యత్-తే-అహం-ప్రీయమాణాయ-వక్ష్యామి-హితకామ్యయా

మహాబాహో=అర్జునా, ప్రీయమాణాయ= ప్రీతినొందుచున్న, తే= నీకొరకు, హిత కామ్యయా= హితమును గోరుట చేతను, అహం= నేను, యత్ = ఏ, వచః= వాక్యమును, భూయః ఏవ = మరల, వక్ష్యామి = చెప్పుదునో, తత్ = ఆ, పరమం= ఉత్తమమైన, మే=నాయొక్క, వచః= వాక్కును, శృణు= ఆలకించుము.

శ్రీ భగవానుడు పలికెను - హేమహాబాహో ! నీవు నా మీద ప్రేమ గలవాడవు. కావున నీమేలుగోరి నేను మరల చెప్పుచున్న వచనములను ఆలకింపుము.

2 న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః।

అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥

న-మే-విదుః-సురగణాః-ప్రభవం-న-మహర్షయః

అహం- ఆదిః-హి-దేవానాం-మహర్షీణాం-చ-సర్వశః

మే-నాయొక్క, ప్రభవం=పుట్టుకను, సురగణాః= దేవతాసమూహములు, న విదుః= ఎరుగరు, మహర్షయః= మహర్షులును, న = ఎరుగరు, అహం=నేను, దేవానాం= దేవతలకు, మహర్షీణాం చ = మహర్షులకును, సర్వశః= సర్వవిధముల, ఆదిః హి = మూల కారణమును గదా !

నా ఉత్పత్తిని అనగా నా లీలావతారవిశేషములను దేవతలు గాని మహర్షులుగాని తెలిసికొనజాలరు. ఏలనన నేను అన్నివిధములుగా ఆ దేవతలకును, ఈ మహర్షులకును మూలకారణమైనవాడను నేనేగదా !



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।

అసమ్మూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

యః-మాం-అజం-అనాదిం-చ-వేత్తి-లోకమహేశ్వరం

అసమ్మూఢః-సః-మర్త్యేషు-సర్వపాపైః-ప్రముచ్యతే

యః= ఎవడు, అజం=పుట్టుకలేనివానిని, అనాదిం= ఆదిలేనివానిని, లోకమహేశ్వరం చ = లోకనియంతను అగు, మాం=నన్ను , వేత్తి= తెలిసికొనుచున్నాడో, సః=వాడు, మర్త్యేషు= మానవులయందు, అసమ్మూఢః=అజ్ఞానము లేనివాడై, సర్వపాపైః= సమస్త పాపములచేత, ప్రముచ్యతే=విడువబడుచున్నాడు.

నన్ను యథార్థముగా జన్మరహితునిగను, అనాదియైన వానినిగను సకలలోక మహేశ్వరునిగను తెలిసికొనువాడు మానవులలో జ్ఞాని. అట్టివాడు సర్వపాపములనుండియు విడివడుచున్నాడు.

4 బుద్ధిః జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమః శమః ।

సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥

బుద్ధిః-జ్ఞానం-అసమ్మోహః-క్షమా-సత్యం-దమః-శమః

సుఖం-దుఃఖం-భవః-అభావః-భయం-చ-అభయం- ఏవ-చ

బుద్ధిః=నిశ్చయజ్ఞానము, జ్ఞానం=తత్త్వజ్ఞానము, అసమ్మోహః= అప్రమత్తతయు, క్షమా= సహనము, సత్యం = సత్యము, దమః=బాహ్యేంద్రియ నిగ్రహము, శమః= అంతరింద్రియ నిగ్రహము, సుఖం= సుఖము, దుఃఖం= దుఃఖము, భవః= ఉండుట, అభావః= లేకపోవుట, భయం చ= భయమును, అభయం ఏవ చ = అభయమును.

నిశ్చయాత్మకశక్తి, యథార్థజ్ఞానము, మోహరాహిత్యము, క్షమ, సత్యము, దమము, శమము , సుఖదుఃఖములు, ఉత్పత్తి ప్రళయములు, భయము, అభయము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

5 అహింసా సమతా తుష్టిః తపో దానం యశోఽయశః ।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥

అహింసా-సమతా-తుష్టిః-తపః-దానం-యశః-అయశః
భవంతి-భావాః-భూతానాం-మత్తః- ఏవ-పృథగ్విధాః

అహింసా=అహింసయు, సమతా=సమతయు, తుష్టిః= తృప్తి, తపః=తపస్సు, దానం= దానము, యశః=కీర్తి, అయశః= అపకీర్తి, భూతానాం = భూతములయొక్క, పృథగ్విధాః= వివిధములైన, భావాః=భావములు, మత్తః ఏవ= నావలననే, భవంతి= కలుగుచున్నవి.

అహింస, సమత, సంతోషము, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, అనునవి ప్రాణులకు నావలననే కలుగుచున్నవి.

6 మహర్షయః సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

మహర్షయః-సప్త-పూర్వే-చత్వారః-మనవః-తథా
మద్భావాః-మానసాః-జాతాః-యేషాం-లోకే- ఇమాః-ప్రజాః

లోకే=లోకమందలి, ఇమాః= ఈ, ప్రజాః=ప్రజలు, యేషాం= ఎవరికి, జాతాః= పుట్టినారో, తే= ఆ, సప్త= ఏడుగురైన, మహర్షయః= మహర్షులును, తథా= అటులే, పూర్వే= పూర్వులైన, చత్వారః= నలుగురు(సనకాది దేవర్షులు), మనవః= మనువులు, మద్భావాః= నా భావము గలవారై, మానసాః= మనస్సునందు, జాతాః=పుట్టిరి.

సప్తమహర్షులును, వారికంటెను పూర్వులైన సనకాది మహామునులు నలుగురును, స్వాయంభువాది చతుర్దశ మనువులును మొదలగు వీరందఱును నా భక్తులే. అందరూ నాయెడ సద్భావముగలవారే. వీరు నా సంకల్పమువలననే నా మానస పుత్రులై జన్మించిరి.

7 ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।

సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥

ఏతాం- విభూతిం-యోగం-చ-మమ-యః-వేత్తి-తత్త్వతః

సః-అవికంపేన-యోగేన-యుజ్యతే-న-అత్ర-సంశయః

మమ=నాయొక్క, ఏతాం= ఈ, విభూతిం= మహిమను, యోగం చ =యోగమును, తత్త్వతః = యథార్థముగా, యః = ఎవడు, వేత్తి= తెలిసికొనునో, సః= వాడు, అవికంపేన = చలింపని, యోగేన= యోగముచేత, యుజ్యతే= కూడినవాడగుచున్నాడు, అత్ర= ఈ విషయమునందు, సంశయః= సంశయము, న = లేదు.

ఈ నా పరమైశ్వర్యరూపవిభూతిని, యోగశక్తియొక్క తత్త్వమును తెలిసికొన్నవాడు నిశ్చలభక్తియుక్తుడగును. ఇందు ఏమాత్రమూ సందేహము లేదు.

8 అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే।

ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥

అహం-సర్వస్య-ప్రభవః-మత్తః-సర్వం-ప్రవర్తతే

ఇతి-మత్వా-భజంతే-మాం-బుధాః-భావసమన్వితాః

అహం=నేను, సర్వస్య= సమస్తమునకు, ప్రభవః= ఉత్పత్తికారకుడను, మత్తః= నావలన, సర్వం= సమస్తము, ప్రవర్తతే= ప్రవర్తించుచున్నది, ఇతి =అని, మత్వా=తలచి, భావసమన్వితాః= పరమార్థభావము గలవారై, బుధాః= జ్ఞానులు, మాం=నన్ను, భజంతే= సేవించుచున్నారు.

ఈ సమస్తజగత్తుయొక్క ఉత్పత్తికి నేనే మూలకారణము. నావలననే ఈ జగత్తంతయు నడుచుచున్నది. ఈ విషయమును బాగుగా ఎఱింగిన జ్ఞానులైన భక్తులు భక్తిశ్రద్ధలతో నిరంతరము నన్నే సేవించుచున్నారు.

9 మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

మచ్చిత్తాః-మద్గతప్రాణాః-బోధయంతః-పరస్పరం
కథయంతః-చ-మాం-నిత్యం-తుష్యంతి-చ-రమంతి-చ

మచ్చిత్తాః=నాయందే చిత్తము గలవారును, మద్గత ప్రాణాః= నన్ను పొందిన ప్రాణముగలవారును, పరస్పరం = ఒకరికొకరు, మాం= నన్నుగూర్చి, బోధయంతః= బోధించు కొనుచున్నవారు, కథయంతః చ= చెప్పుకొనువారై, నిత్యం = ఎల్లప్పుడు, తుష్యంతి చ= సంతసించుచున్నారు, రమంతి చ= రమించుచున్నారు.

నా భక్తులు నాయందే తమ మనస్సులను లగ్నమొనర్తురు. తమ ప్రాణములను, తమ కర్మలన్నింటిని, తమ సర్వస్వమును నాకే అంకిత మొనర్తురు. వారు పరస్పరచర్చలద్వారా నా మహత్త్వమును గూర్చి ఒకరికొకరు తెలుపుకొనుచు, కథలు కథలుగా చెప్పికొనుచు, నిరంతరము సంతుష్టులగు చుందురు.

10 తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥

తేషాం-సతతయుక్తానాం-భజతాం-ప్రీతిపూర్వకం
దదామి-బుద్ధియోగం-తం-యేన-మాం- ఉపయాంతి-తే

సతతయుక్తానాం=సదా నాయందు మనస్సుగలవారై, ప్రీతిపూర్వకం= ప్రీతితో, భజతాం= సేవించెడి వారైన, తేషాం= వారికి, యేన= ఏయోగముచేత, తే=వారు, మాం= నన్ను, ఉపయాంతి= పొందగలుగుదురో, తం = ఆ, బుద్ధియోగం= బుద్ధియోగమును, దదామి= ప్రసాదించుచున్నాను.

అట్లు నిరంతరము ధ్యానాదులద్వారా నాయందే లగ్నమనస్కులై భక్తిశ్రద్ధలతో నన్నే భజించువారికి నేను బుద్ధియోగమును అనగా తత్త్వజ్ఞాన రూపయోగమును అనుగ్రహించుచున్నాను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

11 తేషామేవానుకంపార్థమ్ అహమజ్ఞానజం తమః।

నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

తేషాం- ఏవ-అనుకంపార్థం-అహం-అజ్ఞానజం-తమః

నాశయామి- ఆత్మభావస్థః-జ్ఞానదీపేన-భాస్వతా

అహం=నేను, తేషాం= వారియొక్క, అనుకంపార్థం ఏవ= అనుగ్రహముకొరకే, ఆత్మభావస్థః= ఆత్మభావమునందున్న వాడనై, భాస్వతా= స్వయంప్రకాశము గల, జ్ఞానదీపేన = జ్ఞాన ప్రకాశముచేత, అజ్ఞానజం= అవివేకము వలన గలిగిన, తమః= చీకటిని, నాశయామి= నశింపజేయుచున్నాను.

ఓ అర్జునా ! వారి యంతః కరణములయందు స్థితుడనై యున్న నేను వారిని అనుగ్రహించుటకై తేజోమయమైన తత్త్వజ్ఞానరూప దీపమును (జ్యోతిని) వెలిగించి, వారి అజ్ఞానాంధకారమును పోగొట్టుచున్నాను.

అర్జున ఉవాచ

12 పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్।

పురుషం శాశ్వతం దివ్యమ్ ఆదిదేవమజం విభుమ్ ॥

పరం-బ్రహ్మ-పరం-ధామ-పవిత్రం-పరమం-భవాన్

పురుషం-శాశ్వతం-దివ్యం- ఆదిదేవం-అజం-విభుం

భవాన్=నీవు, పరం బ్రహ్మ= పరబ్రహ్మవు, పరం ధామ= పరమ తేజస్స్వరూపుడవు, పరమం పవిత్రం= పరమపవిత్రుడవు, త్వాం= నిన్ను, శాశ్వతం= నిత్యునిగను, దివ్యం= దివ్యమైన, పురుషం=పురుషునిగను, ఆదిదేవం= ఆదిదేవునిగను, అజం= పుట్టుక లేనివానినిగను, విభుం=ప్రభువుగను.

అర్జునుడు పలికెను [illegible]

13 ఆహుస్త్వామ్ ఋషయః సర్వే దేవర్షిర్నారదస్తథా ।

అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥

ఆహుః-త్వాం-ఋషయః-సర్వే-దేవర్షిః-నారదః-తథా

అసితః-దేవలః-వ్యాసః-స్వయం-చ- ఏవ-బ్రవీషి-మే

సర్వే= సమస్తమైన, ఋషయః= మహర్షులు, దేవర్షిః= దేవర్షియైన, నారదః= నారదుడు, తథా= అలాగే, అసితః= అసితుడు, దేవలః= దేవలుడు, వ్యాసః= వ్యాసుడు, ఆహుః= తెలిసియుండిరి, స్వయం చ ఏవ= స్వయముగనే, మే = నాకొరకు, బ్రవీషి= చెప్పుచున్నావు.

దేవర్షి నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసమహర్షియు, స్తుతింతురు. నీవును నాకు ఆ విధముగనే చెప్పుచుంటివి.

14 సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।

న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

సర్వం- ఏతత్-ఋతం-మన్యే-యత్-మాం-వదసి-కేశవ

న-హి-తే-భగవన్-వ్యక్తిం-విదుః-దేవాః-న-దానవాః

కేశవః=కృష్ణా, యత్ = ఏవిషయమును, మాం = నన్ను గూర్చి, వదసి=చెప్పుచునాన్నివో, ఏతత్= ఈ, సర్వం= సమస్తమును, ఋతం= సత్యమని మన్యే= తలంచుచున్నాను, భగవన్= భగవంతుడా, తే= నీయొక్క, వ్యక్తిం= స్వరూపమును, దేవాః= దేవతలు, న విదుః= ఎరుగరు, దానవాః= దానవులును, న హి విదుః= ఎరుగరుకదా.

ఓ కేశవా ! నీవు చెప్పునది అంతయును సత్యమే. హే భగవాన్ ! నీ లీలామయస్వరూపమును దేవతలు గాని దానవులు గాని తెలియలేరు.

15 స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।

భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥

స్వయం- ఏవ- ఆత్మనా- ఆత్మానం-వేత్థ-త్వం-పురుషోత్తమ

భూతభావన- భూతేశ-దేవదేవ- జగత్పతే

పురుషోత్తమ= పురుషశ్రేష్ఠుడా, భూతభావన= భూతములను కలుగజేసినవాడా, భూతేశ = భూతప్రభువా, దేవదేవ= దేవతలకు దేవుడా, జగత్పతే= జగత్ప్రభువా, త్వం = నీవు, ఆత్మానం= నిన్ను, స్వయం ఏవ= స్వయముగనే, ఆత్మనా= నీచేతనే, వేత్థ= తెలిసికొనుచున్నావు.

ఓ జగదుత్పత్తికారకా ! ఓ సర్వభూతేశా ! ఓ దేవాదిదేవా ! ఓ జగన్నాథా! ఓ పురుషోత్తమా! నీ తత్త్వమును నీవే ఎఱుగుదువు.

16 వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।

యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

వక్తుం-అర్హసి-అశేషేణ-దివ్యాః-హి- ఆత్మవిభూతయః

యాభిః-విభూతిభిః-లోకాన్- ఇమాన్- త్వం- వ్యాప్య-తిష్ఠసి

త్వం=నీవు, యాభిః= ఏ, విభూతిభిః= విభూతులచేత, ఇమాన్= ఈ, లోకాన్= లోకములను, వ్యాప్య= వ్యాపించి, తిష్ఠసి= ఉన్నావో, దివ్యాః హి= దివ్యములైన, ఆత్మవిభూతయః= ఆ ఆత్మవిభూతులను, అశేషేణ= నిశ్శేషముగా, వక్తుం= చెప్పుటకు, అర్హసి= తగుదువు.

సమస్తలోకములయందును నీ దివ్యవిభూతులద్వారా వ్యాపించి, స్థితుడవై యున్నావు. మహామహితములైన ఆ దివ్యవిభూతులను సంపూర్ణముగా తెల్పుటకు నీవే తగుదువు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

17 కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్।

కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్ మయా ॥

కథం-విద్యాం-అహం-యోగిన్-త్వాం-సదా-పరిచింతయన్

కేషు-కేషు-చ-భావేషు-చింత్యః-అసి-భగవన్-మయా

యోగిన్=యోగీశ్వరా, అహం=నేను, త్వాం=నిన్ను, సదా= ఎల్లప్పుడును, పరిచింతయన్ = ధ్యానముచేయుచు, కథం = ఎటుల, విద్యాం= తెలిసికొందును, భగవన్= భగవంతా, కేషు కేషు చ = ఏయే, భావేషు= భావములయందు, మయా= నాచేత, చింత్యః=చింతించ దగినవాడవు, అసి=అగుదువు.

ఓ యోగీశ్వరా ! నిరంతరము చింతనచేయుచూ నిన్ను ఏవిధముగా తెలిసికొనగలను ? హే భగవన్ ! ఏ యే భావములతో నాద్వారా చింతన చేయదగినవాడవు ? నిన్ను నేను ఎట్లు ధ్యానింపవలెను.

18 విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్ధన।

భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

విస్తరేణ- ఆత్మనః-యోగం-విభూతిం-చ-జనార్ధన

భూయః-కథయ-తృప్తిః-హి-శృణ్వతః-న-అస్తి-మే-అమృతం

జనార్ధన = కృష్ణా, ఆత్మనః= నీ యొక్క, యోగం = యోగమును, విభూతిం చ = విభూతిని, విస్తరేణ= విస్తారముగాను, భూయః= మరల, కథయ= చెప్పుము, అమృతం = జ్ఞానామృతమును, శృణ్వతః= వినుచున్న, మే = నాకు, తృప్తిః= సంతృప్తి, న అస్తి హి= లేదుగదా.

ఓ జనార్ధనా! నీ యోగశక్తిని గూర్చియు, నీ విభూతి వైభవములను గురించియు విస్తృతముగా ఇంకను తెలుపుము. ఏలనన నీ అమృతమయవచనములను ఎంతగా విన్నను తనివి తీరకున్నది.

శ్రీభగవాన్ ఉవాచ

19 హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।

ప్రాధాన్యతః కురుశ్రేష్ఠనాస్త్యంతో విస్తరస్య మే ॥

హంత-తే-కథయిష్యామి-దివ్యాః-హి- ఆత్మవిభూతయః

ప్రాధాన్యతః-కురుశ్రేష్ఠ-న-అస్తి-అంతః-విస్తరస్య-మే

హంత=అహో, తే=నీకొరకు, దివ్యాః=దివ్యమైన, ఆత్మవిభూతయః= నా విభూతులను, ప్రాధాన్యతః= ముఖ్యముగ, కథయిష్యామి = చెప్పుచున్నాను, కురుశ్రేష్ఠ = అర్జునా, మే= నాయొక్క, విస్తరస్య= విభూతి విస్తారమునకు, అంతః= అంతము, న అస్తి హి = లేదుగదా .

శ్రీభగవానుడు పలికెను - ఓ అర్జునా! నీవు లెస్సగా పలికితివి. నా దివ్యవిభూతుల విస్తృతికి అంతమే లేదు. వాటిలో ప్రధానమైనవాటిని కొన్నింటిని మాత్రము నీకు చెప్పెదను.

20 అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।

అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥

అహం- ఆత్మా-గుడాకేశ-సర్వభూతాశయస్థితః

అహం- ఆదిః-చ-మధ్యం-చ-భూతానాం-అంతః- ఏవ-చ

గుడాకేశ=అర్జునా, సర్వభూతాశయస్థితః= సర్వప్రాణులయొక్క అంతర్హృదయము నందున్న, ఆత్మా = ఆత్మను, అహం= నేను, భూతానాం= భూతములకు, ఆదిః చ= ఆదియును, మధ్యం చ = స్థితియును, అంతః చ= లయమును, అహం ఏవ = నేనే

ఓ అర్జునా ! సమస్తప్రాణులహృదయములయందున్న ఆత్మను నేనే. సకల భూతముల ఆదియు, మధ్యస్థితియు అంతము నేనే.

21 ఆదిత్యానామహం విష్ణుః జ్యోతిషాం రవిరంశుమాన్।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥

ఆదిత్యానాం-అహం-విష్ణుః-జ్యోతిషాం-రవిః-అంశుమాన్
మరీచిః-మరుతాం-అస్మి-నక్షత్రాణాం-అహం-శశీ

అహం=నేను, ఆదిత్యానాం=ద్వాదశాదిత్యులలో, విష్ణుః=విష్ణువును, జ్యోతిషాం= జ్యోతులలో, అంశుమాన్=కిరణములుగల, రవిః=సూర్యుడను, మరుతాం=మరుత్తులలో, మరీచిః= మరీచిని, నక్షత్రాణాం=నక్షత్రములలో, శశీ=చంద్రుడను, అహం=నేను, అస్మి= అయియున్నాను.

అదితియొక్క ద్వాదశపుత్రులైన ఆదిత్యులలో విష్ణువును నేను. జ్యోతిర్మయ స్వరూపులలో నేను సూర్యుడను. 49 మంది వాయుదేవతలలోని తేజమును నేను. తారలయందు చంద్రుడను నేను.

22 వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥

వేదానాం-సామవేదః-అస్మి-దేవానాం-అస్మి-వాసవః
ఇంద్రియాణాం-మనః-చ-అస్మి-భూతానాం-అస్మి-చేతనా

వేదానాం=వేదములలో, సామవేదః= సామవేదము, అస్మి= అయియున్నాను, దేవానాం= దేవతలలో, వాసవః= ఇంద్రుడను, అస్మి= అయియున్నాను, ఇంద్రియాణాం= ఇంద్రియములలో, మనః= మనస్సును, అస్మి= అయియున్నాను, భూతానాం= భూతములలో, చేతనా చ = చైతన్యమును, అస్మి= అయియున్నాను.

వేదములలో నేను సామవేదమును, దేవతలలో ఇంద్రుడను నేనే. ఇంద్రియములలో నేను మనస్సును. ప్రాణులలో చైతన్యమును నేనై యున్నాను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

23 రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।

వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥

రుద్రాణాం-శంకరః-చ-అస్మి-విత్తేశః-యక్షరక్షసాం

వసూనాం-పావకః-చ-అస్మి-మేరుః-శిఖరిణాం-అహం

రుద్రాణాం=రుద్రులలో, శంకరః చ = శంకరుడను, అస్మి = అగుచున్నాను, యక్షరక్షసాం= యక్షులలోను రాక్షసులలోను, విత్తేశః= కుబేరుడను, వసూనాం=వసువులలో, పావకఃచ= అగ్నిహోత్రుడను, శిఖరిణాం= శిఖరములుగల కొండలలో, మేరుః= మేరు పర్వతమును, అహం= నేను, అస్మి= అగుచున్నాను.

ఏకాదశరుద్రులలో శంకరుడను నేను. యక్షరాక్షసులలో ధనాధిపతియైన కుబేరుడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను. పర్వతములలో సుమేరు పర్వతమునై యున్నాను.

24 పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।

సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః ॥

పురోధసాం-చ-ముఖ్యం-మాం-విద్ధి-పార్థ-బృహస్పతిం

సేనానీనాం-అహం-స్కందః-సరసాం-అస్మి-సాగరః

పార్థ=అర్జునా, పురోధసాం=రాజపురోహితులలో, ముఖ్యం= ముఖ్యుడైన, బృహస్పతిం= బృహస్పతినిగ, మాం= నన్ను, విద్ధి= తెలిసికొనుము, సేనానీనాం= సైన్యాధిపతులలో, స్కందః= కుమారస్వామిని, చ = మరియు, సరసాం= సరస్సులలో, సాగరః=సాగరుడను, అహం= నేను, అస్మి= అయియున్నాను.

పార్థా ! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిని నేనే. సేనాపతులలో కుమారస్వామిని నేను. జలాశయములలో నేను సముద్రుడను.

25 మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।

యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥

మహర్షీణాం-భృగుః-అహం-గిరాం-అస్మి- ఏకం-అక్షరం

యజ్ఞానాం-జపయజ్ఞః-అస్మి-స్థావరాణాం-హిమాలయః

అహం=నేను, మహర్షీణాం=మహర్షులలో, భృగుః=భృగుమహర్షిని, గిరాం= మాటలలో, ఏకం= ఒకటేయగు, అక్షరం=అక్షరమును, అస్మి= అయియున్నాను, యజ్ఞానాం=యజ్ఞములలో, జపయజ్ఞః= జపయజ్ఞమును, స్థావరాణాం= స్థావరములలో, హిమాలయః= హిమాలయమును, అస్మి= అయియున్నాను.

మహర్షులలో భృగువును నేను. శబ్దములలో ఏకాక్షరమును అనగా ఓంకారమును నేను. యజ్ఞములయందు జపయజ్ఞమును నేను. స్థావరము లలో హిమాలయమును నేనైయున్నాను.

26 అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।

గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥

అశ్వత్థః-సర్వవృక్షాణాం-దేవర్షీణాం-చ-నారదః

గంధర్వాణాం-చిత్రరథః-సిద్ధానాం-కపిలః-మునిః

సర్వవృక్షాణాం=సర్వవృక్షములలో, అశ్వత్థః= రావిచెట్టును, దేవర్షీణాం చ = దేవర్షులలో, నారదః= నారదుడను, గంధర్వాణాం= గంధర్వులలో, చిత్రరథః= చిత్రరథుడను, సిద్ధానాం= సిద్ధులలో, కపిలః మునిః= కపిలమునిని

వృక్షములలో నేను అశ్వత్థమును. దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో నేను చిత్రరథుడను. సిద్ధులలో నేను కపిలమునిని.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

27 ఉచ్చైః శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।

ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥

ఉచ్చైఃశ్రవసం-అశ్వానాం-విద్ధి-మాం-అమృతోద్భవం

ఐరావతం-గజేంద్రాణాం-నరాణాం-చ-నరాధిపం

అశ్వానాం=గుఱ్ఱములలో, అమృతోద్భవం= అమృతముతో పుట్టిన, ఉచ్చైః శ్రవసం= ఉచ్చైః శ్రవమునుగా, గజేంద్రాణాం= ఏనుగులలో, ఐరావతం= ఐరావతముగాను, నరాణాం చ = నరులలో, నరాధిపం= రాజుగాను, మాం=నన్ను, విద్ధి= తెలుసుకో.

అశ్వములలో పాలసముద్రమునుండి అమృతముతో పుట్టిన ఉచ్చైఃశ్రవము నేను. భద్రగజములలో ఐరావతమును నేను. మనుష్యులలో నన్ను రాజుగను తెలిసికొనుము.

28 ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।

ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥

ఆయుధానాం-అహం-వజ్రం-ధేనూనాం-అస్మి-కామధుక్

ప్రజనః-చ-అస్మి-కందర్పః-సర్పాణాం-అస్మి-వాసుకిః

అహం=నేను, ఆయుధానాం= ఆయుధములలో, వజ్రం= వజ్రాయుధమును, ధేనూనాం= ఆవులలో, కామధుక్= కామధేనువును, అస్మి= అయియున్నాను, ప్రజనః చ = పుట్టించునట్టి, కందర్పః= మన్మథుడను, అస్మి=అయియున్నాను, సర్పాణాం= సర్పములలో, వాసుకిః=వాసుకిని, అస్మి= అయియున్నాను.

ఆయుధములలో వజ్రాయుధమును నేను. పాడిఆవులలో కామధేనువును నేను. శాస్త్రవిహితరీతిలో సంతానోత్పత్తికి కారణమైన మన్మథుడను నేను. సర్పములలో వాసుకిని నేనే.

29 అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।

పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్ ॥

అనంతః-చ-అస్మి-నాగానాం-వరుణః-యాదసాం-అహం

పితౄణాం-అర్యమా-చ-అస్మి-యమః-సంయమతాం-అహం

అహం=నేను,నాగానాం= నాగులలో, అనంతః చ = అనంతుడను, యాదసాం= జలచరములలో, వరుణః= వరుణుడను, అస్మి= అయియున్నాను, అహం=నేను, పితౄణాం= పితృదేవతలలో, అర్యమా చ = అర్యముడను, సంయమతాం= సంయమనము చేయువారిలో, యమః= యముడను, అస్మి= అయియున్నాను.

నాగజాతివారిలో ఆదిశేషుడను నేను. జలచరములకు అధిపతియైన వరుణుడను నేను. పితరులలో అర్యముడను నేను. శాసకులలో నేను యముడను.

30 ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।

మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

ప్రహ్లాదః-చ-అస్మి-దైత్యానాం-కాలః-కలయతాం-అహం

మృగాణాం-చ-మృగేంద్రః-అహం-వైనతేయః-చ-పక్షిణాం

అహం=నేను, దైత్యానాం=దైత్యులలో, ప్రహ్లాదః చ = ప్రహ్లాదుడను, కలయతాం=గణిత శాస్త్రజ్ఞులలో, కాలః= కాలమును, మృగాణాం చ =మృగములలో, మృగేంద్రః= సింహమును, పక్షిణాం= పక్షులలో, వైనతేయః చ = గరుత్మంతుడను, అస్మి=అయి యున్నాను.

దైత్యులలో నేను ప్రహ్లాదుడను. గణించువారిలో (గణకులలో) నేను కాలమును. మృగములలో మృగరాజు ఐన సింహమును నేను. పక్షులలో నేను గరుత్మంతుడను.

31 పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్ ।

ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥

పవనః-పవతాం-అస్మి-రామః-శస్త్రభృతాం-అహం

ఝషాణాం-మకరః-చ-అస్మి-స్రోతసాం-అస్మి-జాహ్నవీ

అహం=నేను, పవతాం=పవిత్రము చేసెడివానిలో, పవనః= వాయువును, శస్త్రభృతాం= ఆయుధధారులలో, రామః= శ్రీరాముడను, అస్మి= అయియున్నాను, ఝషాణాం= చేపలలో, మకరః= మొసలిని, అస్మి=అయియున్నాను, చ=మరియు, స్రోతసాం= నదులలో, జాహ్నవీ= గంగానదిని, అస్మి=అయియున్నాను.

పవిత్రమొనర్చు వానిలో వాయువును నేను, శస్త్రధారులలో శ్రీరామచంద్రుడను నేను. మత్స్యములలో మొసలిని నేను. నదులలో గంగానది నేనై యున్నాను.

32 సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున ।

అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥

సర్గాణాం- ఆదిః-అంతః-చ-మధ్యం-చ- ఏవ-అహం-అర్జున

అధ్యాత్మవిద్యా-విద్యానాం-వాదః-ప్రవదతాం-అహం

అర్జున=అర్జునా, సర్గాణాం=సృష్టులలో, ఆదిః= ఆదిసృష్టియు, అంతః చ = అంతమును, మధ్యం చ = స్థితియును, అహం ఏవ = నేనే, విద్యానాం= విద్యలలో, అధ్యాత్మవిద్యా= ఆత్మ విద్యయు, ప్రవదతాం= వాదించువారిలో, వాదః= వాదమును, అహం=నేనే

ఓ అర్జునా ! సృష్టికి ఆదిమధ్యాంతములు నేను. విద్యలలో అధ్యాత్మవిద్యను అనగా బ్రహ్మవిద్యను నేను. వాదించు వారిలో నేను వాదమును.

33 అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ।

అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥

అక్షరాణాం-అకారః-అస్మి-ద్వంద్వః-సామాసికస్య-చ

అహం- ఏవ-అక్షయః-కాలః-ధాతా-అహం-విశ్వతోముఖః

అక్షరాణాం= అక్షరములలో, అకారః= అకారమును, అస్మి= అగుచున్నాను, సామాసికస్య= సమాసములలో, ద్వంద్వః చ = ద్వంద్వసమాసమును, అస్మి= అయియున్నాను, అక్షయః= నశించని, కాలః=కాలము, అహం ఏవ=నేనే, విశ్వతోముఖః=సర్వత్రముఖములు గల, ధాతా=ధాతను, అహం=నేనే

అక్షరములలో అ కారమును నేను. సమాసములలో ద్వంద్వ సమాసమును నేను. అక్షయకాలము అనగా మహాకాలమును నేను. అనంత ముఖములు గల ధాతను నేనైయున్నాను.

34 మృత్యుః సర్వహరశ్చాహమ్ ఉద్భవశ్చ భవిష్యతామ్।

కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥

మృత్యుః-సర్వహరః-చ-అహం- ఉద్భవః-చ-భవిష్యతాం

కీర్తిః-శ్రీః-వాక్-చ-నారీణాం-స్మృతిః-మేధా-ధృతిః-క్షమా

అహం=నేను, సర్వహరః=సర్వసంహారకరుడైన, మృత్యుః చః= మృత్యువును, భవిష్యతాం= పుట్టగలవారి, ఉద్భవః చ = పుట్టుకయు, నారీణాం= స్త్రీలలో, కీర్తిః= కీర్తి, శ్రీః = లక్ష్మియు, వాక్ చ = వాక్కు, స్మృతిః= జ్ఞాపకశక్తి, మేధా=బుద్ధియు, ధృతిః=ధైర్యము, క్షమా= ఓర్పు.

అన్నిప్రాణములను హరించు మృత్యువును నేనే. సమస్త ప్రాణుల ఉత్పత్తి హేతువును గూడ నేనే. స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, ఓర్పును నేనే.

35 బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్ ।

మాసానాం మార్గశీర్షోఽహమ్ ఋతూనాం కుసుమాకరః ॥

బృహత్సామ-తథా-సామ్నాం-గాయత్రీ-ఛందసాం-అహం

మాసానాం-మార్గశీర్షః-అహం-ఋతూనాం-కుసుమాకరః

తథా=అలాగుననే, అహం=నేను, సామ్నాం= సామ్సుక్కులలో, బృహత్సామ= బృహత్సామ మును, ఛందసాం= ఛందస్సులలో, గాయత్రీ= గాయత్రీ ఛందస్సును, మాసానాం= మాసములలో, మార్గశీర్షః= మార్గశిరమాసమును, ఋతూనాం= ఋతువులలో, కుసుమాకరః= వసంతమును, అహం=నేను.

గానముచేయుటకు అనువైన శ్రుతులలో బృహత్సామమును నేను. ఛందస్సులలో గాయత్రీఛందస్సు ను నేను. మాసములలో మార్గశీర్షమును ఋతువులలో వసంతఋతువును నేనే.

36 ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।

జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥

ద్యూతం-ఛలయతాం-అస్మి-తేజః-తేజస్వినాం-అహం

జయః-అస్మి-వ్యవసాయః-అస్మి-సత్త్వం-సత్త్వవతాం-అహం

అహం=నేను , ఛలయతాం= మోసము చేయువారిలో, ద్యూతం=జూదమును, తేజస్వినాం= తేజశ్శాలుల యొక్క, తేజః= తేజస్సును, జయః=జయమును, అస్మి= అయియున్నాను, వ్యవసాయః= వ్యవసాయము, అస్మి=అయియున్నాను, అహం=నేను, సత్త్వవతాం= సాత్త్వికుల యొక్క, సత్త్వం= సత్త్వగుణమును, అస్మి= అయియున్నాను.

వంచకులలో జూదమును నేనే. ప్రభావశాలురలోని ప్రభావమును నేను. విజేతలలో జయమును నేను. నిశ్చయాత్మకులలో నిశ్చయమును, సాత్త్విక పురుషులలో సత్త్వగుణమును నేనే.

37 వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।

మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥

వృష్ణీనాం-వాసుదేవః-అస్మి-పాండవానాం-ధనంజయః

మునీనాం-అపి-అహం-వ్యాసః-కవీనాం- ఉశనా-కవిః

అహం=నేను, వృష్ణీనాం=యాదవులలో, వాసుదేవః= వాసుదేవుడను, పాండవానాం= పాండవులలో, ధనంజయః=ధనంజయుడను, మునీనాం=మునులలో, వ్యాసః= వ్యాసుడను, కవీనాం= కవులలో, ఉశనాకవిః అపి= శుక్రాచార్యుడను, అస్మి= అయియున్నాను.

వృష్ణి వంశజులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను నేను. అనగా నీవే నేను. మునులలో వేదవ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేనే.

38 దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।

మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥

దండః-దమయతాం-అస్మి-నీతిః-అస్మి-జిగీషతాం

మౌనం-చ- ఏవ-అస్మి-గుహ్యానాం-జ్ఞానం-జ్ఞానవతాం-అహం

అహం=నేను, దమయతాం= దండించెడివారలలో, దండః= దండమును, అస్మి= అయియున్నాను, జిగీషతాం= జయింపగోరు వారియొక్క, నీతిః=నీతిని, అస్మి= అయియున్నాను, గుహ్యానాం= రహస్యములలో, మౌనం చ ఏవ= మౌనమును, జ్ఞానవతాం= జ్ఞానముగలవారిలో, జ్ఞానం= జ్ఞానమును, అస్మి= అయియున్నాను.

శిక్షించువారిలో దండమును అనగా దమనశక్తిని నేనే. జయేచ్ఛకలవారి నీతిని నేనే. గోప్యవిషయ రక్షణమున మౌనమును నేను. జ్ఞానవంతులలో నేను జ్ఞానమునైయున్నాను.

39 యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।

న తదస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరాచరమ్ ॥

యత్-చ-అపి-సర్వభూతానాం-బీజం-తత్-అహం-అర్జున

న-తత్-అస్తి-వినా-యత్-స్యాత్-మయా-భూతం-చరాచరం

అర్జున=అర్జునా, సర్వభూతానాం= సకలభూతములకును, యత్= ఏది, బీజం= ఉత్పత్తి కారణమో, తత్ అపి చ = అదియును, అహం= నేనే, యత్ = ఏ, చరాచరం= చరాచరరూపమైన, భూతం=భూతసమూహము, మయా వినా= నేను లేకుండా, స్యాత్= అగునో, తత్=అట్టిది, న అస్తి = లేదు.

ఓ అర్జునా ! సర్వప్రాణులఉత్పత్తికి కారణమైన బీజమును నేనే. ఈ చరాచర భూత ప్రపంచమున నేను కానిది ఏదియును లేదు.

40 నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।

ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥

న-అంతః-అస్తి-మమ-దివ్యానాం-విభూతీనాం-పరంతప

ఏషః-తు- ఉద్దేశతః-ప్రోక్తః-విభూతేః-విస్తరః-మయా

పరంతప=అర్జునా, మమ= నాయొక్క, దివ్యానాం= దివ్యములైన, విభూతీనాం= విభూతులకు, అంతః= అంతము, న అస్తి = లేదు, ఏష తు = ఇది, మయా= నాచేత, విభూతేః= విభూతియొక్క, విస్తరః=వివరణము, ఉద్దేశతః= సంక్షేపముగ, ప్రోక్తః= చెప్పబడినది.

ఓ పరంతపా ! నా దివ్యవిభూతులకు అంతమే లేదు. నా విభూతులవిస్తృతిని గూర్చి నేను నీకు చాలా సంక్షిప్తముగా చెప్పబడినది.

41 యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।

తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥

యత్-యత్-విభూతిమత్-సత్త్వం-శ్రీమత్- ఊర్జితం- ఏవ-వా

తత్-తత్- ఏవ- అవగచ్ఛ-త్వం-మమ-తేజోఽంశ సంభవం

విభూతిమత్=విభూతియుక్తమైనదియు, శ్రీమత్= కాంతియుతమును, ఊర్జితం ఏవ వా= ఉత్సాహముతో గూడినదియునగు, యత్‌యత్ = ఏయే, సత్త్వం = సత్త్వము, తత్ తత్ = అది అంతయును, మమ= నా యొక్క, తేజోఽంశసంభవం ఏవ= తేజస్సు యొక్క అంశము వలన కలిగిన దానినిగనే, త్వం= నీవు,, అవగచ్ఛ = తెలిసికొనుము.

విభూతియుక్తము అనగా ఐశ్వర్యయుక్తము, కాంతియుక్తము, శక్తియుక్తము ఐన వస్తువేదైనను నా తేజస్సుయొక్క అంశమునుండియే కలిగినదని ఎరుగుము.

42 అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।

విష్టభ్యాహమిదం కృత్స్నమ్ ఏకాంశేన స్థితో జగత్ ॥

అథవా-బహునా- ఏతేన-కిం-జ్ఞాతేన-తవ-అర్జున

విష్టభ్య-అహం- ఇదం-కృత్స్నం- ఏకాంశేన-స్థితః-జగత్

అర్జున=అర్జునా, అథవా= ఇంతేగాక, బహునా= విశేషమైన, ఏతేన = ఈ, జ్ఞాతేన = తెలియుటచేత, తవ = నీవు, కిం = ఏమి లాభము, అహం= నేను, ఇదం = ఈ, కృత్స్నం = సమస్తమైన, జగత్ = జగత్తును, ఏకాంశేన= ఏకభాగముచేత, విష్టభ్య= వ్యాపించి, స్థితః= ఉన్నాను.

అథవా ! ఓ అర్జునా! ఇంతకంటెను విపులముగా తెలిసికొని ప్రయోజన మేమి ? ఈ సంపూర్ణజగత్తును కేవలము నా యోగశక్తియొక్క ఒక్క అంశతోడనే నేను వ్యాపించియున్నాను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ

దశమోఽధ్యాయః

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ ఏకాదశో௨ధ్యాయః - విశ్వరూపదర్శన యోగః

అర్జున ఉవాచ

1 మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్ ।

యత్త్వయోక్తం వచస్తేన మోహో௨యం విగతో మమ ॥

మదనుగ్రహాయ-పరమం-గుహ్యం-అధ్యాత్మసంజ్ఞితం

యత్-త్వయా- ఉక్తం-వచః-తేన-మోహః-అయం-విగతః-మమ

మదనుగ్రహాయ-నన్ను అనుగ్రహించుటకొరకు, త్వయా-నీచేతను, పరమం = ఉత్కృష్టమైన, గుహ్యం= రహస్యమైన, అధ్యాత్మసంజ్ఞితం= అధ్యాత్మమైనది యును, యత్ = ఏ, వచః= వాక్యము, ఉక్తం= చెప్పబడినదో, తేన=దానిచేత, మమ= నాయొక్క, అయం= ఈ, మోహః= మోహము, విగతః= పోయినది.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా! నన్ను అనుగ్రహింపదలచి అతిరహస్యమైన ఆధ్యాత్మికవిషయములను ఉపదేశించితివి. దానివలన నా మోహము పోయినది.

2 భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।

త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥

భవాప్యయౌ-హి-భూతానాం-శ్రుతౌ-విస్తరశః-మయా

త్వత్తః-కమలపత్రాక్ష-మాహాత్మ్యం-అపి-చ-అవ్యయం

కమలపత్రాక్ష-శ్రీకృష్ణా, త్వత్తః= నీవలన, భూతానాం= భూతములయొక్క, భవాప్యయౌ= ఉత్పత్తినాశములు, తే=నీయొక్క, అవ్యయం= నాశరహితమైన, మాహాత్మ్యం అపి చ= మహాత్మ్యముగూడ, విస్తరశః= విస్తారముగా, మయా= నాచేత, శ్రుతౌ హి= వినబడినవి గదా.

ఓ కమలపత్రాక్షా ! ఓ కృష్ణా ! సమస్తప్రాణుల ఉత్పత్తి ప్రళయములనుగూర్చి సవిస్తరముగా వింటిని. అట్లే శాశ్వతమైన నీ మహత్వమును గూర్చియు వింటిని.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 ఏవమేతద్యథాత్థ త్వమ్ ఆత్మానం పరమేశ్వర ।

ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్ ఐశ్వరం పురుషోత్తమ ॥

ఏవం- ఏతత్-యథా- ఆత్థ-త్వం- ఆత్మానం-పరమేశ్వర

ద్రష్టుం- ఇచ్ఛామి-తే-రూపం- ఐశ్వరం-పురుషోత్తమ

పరమేశ్వర=కృష్ణా, ఆత్మానం= నిన్నుగురించి, యథా= ఏ ప్రకారముగ, త్వం= నీవు, ఆత్థ= చెప్పితివో, ఏవం ఏతత్= ఇదంతయును, పురుషోత్తమ = కృష్ణా, తే = నీయొక్క, ఐశ్వరం= ఈశ్వరసంబంధమైన, రూపం= రూపమును, ద్రష్టుం= చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

ఓ పరమేశ్వరా ! నిన్ను గురించి నీవు చెప్పినదంతయు సత్యమే. అందుసందేహమునకు తావులేదు. కాని ఓ పురుషోత్తమా ! జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజోసమహితమైన నీ షడ్గుణైశ్వర్య సంపన్న రూపమును ప్రత్యక్షముగా నేనిపుడు చూడదలుచుచున్నాను.

4 మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో ।

యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్ ॥

మన్యసే-యది-తత్-శక్యం-మయా-ద్రష్టుం- ఇతి-ప్రభో

యోగేశ్వర-తతః-మే-త్వం-దర్శయ- ఆత్మానం- అవ్యయం

ప్రభో=ప్రభూ, మయా= నాచేత, తత్= ఆ స్వరూపము, ద్రష్టుం= గాంచుటకు, శక్యం ఇతి = సాధ్యమని, మన్యసే యది= తలచెదవేని, యోగేశ్వర = యోగేశ్వరుడా, తతః= అటుపిమ్మట, త్వం= నీవు, మే=నాకొరకు, అవ్యయం= నిత్యమైన, ఆత్మానం= ఆత్మస్వరూపమును, దర్శయ= చూపుము.

ఓ యోగేశ్వరా ! ఓ ప్రభూ ! నీ దివ్య రూపమును చూచుటకు నన్ను అర్హునిగా నీవు భావించినచో శాశ్వతమైన నీ విశ్వస్వరూపమును నాకు చూపుము.

శ్రీభగవాన్ ఉవాచ

5 పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥

పశ్య-మే-పార్థ-రూపాణి-శతశః-అథ-సహస్రశః
నానావిధాని-దివ్యాని-నానావర్ణాకృతీని-చ

పార్థ=అర్జునా, మే= నాయొక్క, నానావిధాని= అనేకవిధములైనవియు, నానావర్ణాకృతీని= అనేకవిధములైన రంగులు, రూపములు గలవియు, దివ్యాని చ = దివ్యములైనట్టివియు, శతశః= వందలకొలదియును, అథ = ఇంకను, సహస్రశః= వేలకొలదియును అగు, రూపాణి=రూపములను, పశ్య= చూడుము.

శ్రీభగవానుడు పలికెను - ఓ అర్జునా! అసంఖ్యాకములైన బహువిధములైన, పెక్కువర్ణములు, ఆకృతులు గల నా రూపములను గాంచుము.

6 పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥

పశ్య- ఆదిత్యాన్-వసూన్-రుద్రాన్-అశ్వినౌ-మరుతః-తథా
బహూని-అదృష్టపూర్వాణి-పశ్య- ఆశ్చర్యాణి-భారత

భారత=అర్జునా, ఆదిత్యాన్= ఆదిత్యులను, వసూన్= వసువులను, రుద్రాన్= రుద్రులను, అశ్వినౌ =అశ్వినీదేవతలను, మరుతః= మరుత్తులను, పశ్య= చూడుము, తథా= అటులే, అదృష్టపూర్వాణి = ఇంతవరకు చూడబడనట్టివియును, బహూని=అనేకములైన, ఆశ్చర్యాణి= ఆశ్చర్యములను, పశ్య= చూడుము.

ఓ అర్జునా ! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, అశ్వినీ కుమారులను, మరుద్గణములను నాయందు చూడుము. అంతేగాక ఇంకను మునుపెన్నడును చూచి యెరుగని అనేకములైన అద్భుతములను చూడుము.

7 ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।

మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥

ఇహ- ఏకస్థం- జగత్- కృత్స్నం-పశ్య-అద్య-సచరాచరం

మమ-దేహే-గుడాకేశ-యత్-చ-అన్యత్-ద్రష్టుం- ఇచ్ఛసి

గుడాకేశ= అర్జునా, యత్ = ఏ, అన్యత్= ఇతరమైన దానిని, ద్రష్టుం= చూచుటకు, ఇచ్ఛసి చ = కోరుచున్నావో, సచరాచరం= చరాచర స్వరూపమైన, కృత్స్నం= సమస్తమైన, జగత్= జగత్తును, అద్య = ఇప్పుడు, మమ= నాయొక్క, ఇహ = ఈ దేహే = దేహమునందు, ఏకస్థం= ఏకప్రదేశమునందున్న దానిని, పశ్య = చూడుము.

ఓ అర్జునా ! నా ఈ రూపమునందు ఒకేచోట స్థితమై యున్న సమస్తచరాచర జగత్తును చూడుము. అంతేగాక ఇంకను నీవు చూడదలచు కొనిన వాటినన్నింటినీ నా శరీరమునందు ఒకే చోట దర్శింపుము.

8 న తు మాం శక్యసే ద్రష్టుమ్ అనేనైవ స్వచక్షుషా ।

దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥

న-తు-మాం-శక్యసే-ద్రష్టుం-అనేన- ఏవ- స్వచక్షుషా

దివ్యం-దదామి-తే-చక్షుః-పశ్య-మే-యోగం- ఐశ్వరం

మాం=నన్ను, అనేన= ఈ, స్వచక్షుషా ఏవ = నీ కన్నులచేతనే, ద్రష్టుం= చూచుటకు, న శక్యసే తు = సాధ్యపడదు, తే= నీకొరకు, దివ్యం= దివ్యమైన, చక్షుః= దృష్టిని, దదామి= ఇచ్చుచున్నాను, మే = నాయొక్క, ఐశ్వరం= దివ్యమైన, యోగం = యోగమును, పశ్య= చూడుము.

చర్మ చక్షువులతో నా ఈ రూపమును నీవు నిస్పందేహముగా చూడజాలవు. కనుక నీకు దివ్య దృష్టిని ప్రసాదించుచున్నాను. ఈ దివ్యదృష్టితో నా ఈశ్వరీయ యోగశక్తిని దర్శింపుము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

సంజయ ఉవాచ

9 ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।

దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥

ఏవం- ఉక్త్వా- తతః-రాజన్-మహాయోగేశ్వరః-హరిః

దర్శయామాస- పార్థాయ-పరమం- రూపం- ఐశ్వర్యం

రాజన్=రాజా, ఏవం = ఈ విధముగ, ఉక్త్వా= పలికి, తతః= ఆ తరువాత, మహాయోగేశ్వరః= గొప్ప యోగేశ్వరుడైన, హరిః= శ్రీహరి, పరమం= ఉత్తమమైన, ఐశ్వరం= ఈశ్వర సంబంధమైన, రూపం= విశ్వరూపమును, పార్థాయ= పార్థునికొరకు, దర్శయామాస= చూపెను.

సంజయుడు పలికెను - ఓ రాజా ! మహాయోగేశ్వరుడును, పాపములను హరించువాడును ఐన భగవానుడు ఈ విధముగా పలికి, అనంతరము షడ్గుణైశ్వర్య సంపన్నమైన తన విశ్వరూపమును అర్జునునకు చూపెను.

10 అనేకవక్త్రనయనమ్ అనేకాద్భుతదర్శనమ్।

అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

అనేకవక్త్రనయనం-అనేకాద్భుతదర్శనం

అనేకదివ్యాభరణం-దివ్యానేకోద్యతాయుధం

అనేకవక్త్రనయనం=అనేకమైన ముఖములు కన్నులు గలదియును, అనేకాద్భుత దర్శనం= అనేకములైన అద్భుతదర్శనములు గలదియు, అనేకదివ్యాభరణం= అనేకములైన దివ్య ఆభరణములు గలదియు, దివ్యానేకోద్యతాయుధం= దివ్యములు, అనేకములునైన ఎత్తబడిన ఆయుధములు గలదియు.

11 దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్ ।

సర్వాశ్చర్యమయం దేవమ్ అనంతం విశ్వతోముఖమ్ ॥

దివ్యమాల్యాంబరధరం-దివ్యగంధానులేపనం

సర్వాశ్చర్యమయం-దేవం-అనంతం- విశ్వతోముఖం

దివ్యమాల్యాంబరధరం= దివ్యములైన హారములు, వస్త్రములు గలదియు, దివ్యగంధానులేపనం= దివ్యమైన గంధపులేపనము గలదియు, సర్వాశ్చర్యమయం = సర్వములైన ఆశ్చర్యములతో నిండినదియు, అనంతం= అనంతమైనదియు, విశ్వతోముఖం= అంతటను ముఖములు గలదియు, దేవం= స్వయం ప్రకాశమానమునైనది.

అర్జునుడు చూచిన ఆ పరమేశ్వరుని విశ్వ రూపమునందలి ముఖములు అనంతములు - నేత్రములు అసంఖ్యాకములు. అందలి దృశ్యములు అద్భుతములైనవి. ఆ రూపము అనేకదివ్యాభరణశోభితము. ఆ పరమేశ్వరుడు పెక్కు దివ్యాస్త్రములను చేపట్టియుండెను. దివ్యములగు మాలలను, వస్త్రములను ధరించియుండెను. ఆ దివ్యశరీరము నుండి దివ్యచందనపరి మళములు దశదిశల గుబాళించు చుండెను. ఆ విశ్వరూపమును అర్జునుడు దర్శించెను.

12 దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।

యది భాః సదృశీ సా స్యాత్ భాసస్తస్య మహాత్మనః ॥

దివి-సూర్యసహస్రస్య-భవేత్-యుగపత్- ఉత్థితా

యది-భాః-సదృశీ-సా-స్యాత్-భాసః-తస్య-మహాత్మనః

దివి= ఆకాశమునందు, సూర్యసహస్రస్య = వేలకొలది సూర్యులయొక్క, యుగపదుత్థితా = ఏకకాలమందు కదిలిన, భాః= కాంతి, భవేత్ యది= సంభవించేని, సా= ఆ కాంతి, తస్య= ఆ, మహాత్మనః= మహాత్ముని యొక్క, భాసః=కాంతికి, సదృశీ= సమానమైనది, స్యాత్= అగును.

ఆకాశమున వేలకొలది సూర్యులు ఒక్కుమ్మడిగా ఉదయించినచోవచ్చు కాంతి పుంజములును ఆ విరాట్ - రూపతేజస్సులకుసాటిరావు.

13 తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।

అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥

తత్ర- ఏకస్థం-జగత్-కృత్స్నం- ప్రవిభక్తం-అనేకధా

అపశ్యత్-దేవదేవస్య- శరీరే-పాండవః-తదా

తదా=అప్పుడు, పాండవః= అర్జునుడు, అనేకధా= అనేకవిధములుగ, ప్రవిభక్తం= విభజింపబడియున్న, జగత్= జగత్తును, కృత్స్నం= సర్వమును, దేవదేవస్య= దేవదేవుని యొక్క, తత్ర = ఆ, శరీరే= దేహమునందు, ఏకస్థం= ఒక్కచోట నున్నదానిగ, అపశ్యత్ = చూచెను.

ఆ సమయమున అర్జునుడు ఆ దేవాదిదేవుని శరీరమునందు అసంఖ్యాకములైన వివిధబ్రహ్మాండములు వేర్వేరుగా ఒకేచోట ఉన్నదానినిగా దర్శించెను.

14 తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।

ప్రణమ్య శిరసా దేవం కృతాంజలిరభాషత ॥

తతః-సః-విస్మయావిష్టః-హృష్టరోమా-ధనంజయః

ప్రణమ్య-శిరసా-దేవం-కృతాంజలిః-అభాషత

తతః=తరువాత, సః = ఆ, ధనంజయః= అర్జునుడు, విస్మయావిష్టః= విస్మయయుక్తుడై, హృష్టరోమా= పులకాంకితుడునై, దేవం = దేవుని గూర్చి, శిరసా= శిరస్సుచేత, ప్రణమ్య = నమస్కరించి, కృతాంజలిః= అంజలి ఘటించి, అభాషత = పలికెను.

అద్భుతమైన ఆ పరమాత్ముని విశ్వరూపమును జూచి, అర్జునుడు ఆశ్చర్యచకితుడై పులకాంకితుడై. తేజోమయమైన ఆ విరాట్ రూపమునకు శిరస్సువంచి చేతులు జోడించి నమస్కరించుచు ఇట్లనెను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

15 పశ్యామి దేవాంస్తవ దేవ దేహే

సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్।

బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్

ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

పశ్యామి-దేవాన్-తవ-దేహే-సర్వాన్-తథా-భూతవిశేషసంఘాన్

బ్రహ్మాణం- ఈశం-కమలాసనస్థం- ఋషీన్-చ-సర్వాన్- ఉరగాన్-చ-దివ్యాన్

దేవాన్=దేవా, తవ =నీయొక్క, దేహే = దేహమునందు, సర్వాన్= సమస్తమైన, దేవాన్=దేవతలను, తథా= అటులే, భూతవిశేష సంఘాన్= చరాచర భూతసమూహములను, ఈశం= ఈశుడు, కలాసనస్థం= పద్మాసనము నందున్నవాడునైన, బ్రహ్మాణం= బ్రహ్మను, సర్వాన్= సమస్తములైన, ఋషీన్ చ = ఋషులను, దివ్యాన్ = దివ్యములైన, ఉరగాన్ చ = ఉరగములను, పశ్యామి = చూచుచున్నాను.

అర్జునుడు పలికెను - ఓ దేవాదిదేవా ! నీ విరాట్ - రూపమునందు సకల దేవతలను, నానావిధప్రాణికోటిని, కమలాసనుడైన బ్రహ్మను, మహాదేవుడైన శంకరుని, సమస్త ఋషులను, దివ్యసర్పములను గాంచుచున్నాను.

16 అనేకబాహూదరవక్త్రనేత్రం

పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్ ।

నాంతం న మధ్యం న పునస్తవాదిం

పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥

అనేక బాహూదరవక్త్రనేత్రం-పశ్యామి-త్వాం-సర్వతః-అనంతరూపం

న-అంతం-న-మధ్యం-న-పునః-తవ- ఆదిం-పశ్యామి-విశ్వేశ్వర -విశ్వరూప

విశ్వేశ్వర= విశ్వేశ్వరుడా, విశ్వరూప = విశ్వరూపుడా,అనేక బాహూదరవక్త్రనేత్రం= అనేకములైన బాహువులు, పొట్టలు, ముఖములు, నేత్రములు కలిగియున్న, సర్వతః= అన్నిచోట్ల, అనంతరూపం= అనంతరూపములు గల, త్వాం= నిన్ను, పశ్యామి= చూచుచున్నాను, పునః= మరియు, తవ=నీయొక్క, ఆదిం= మొదలును, న పశ్యామి = చూడజాలకున్నాను, అంతం= అంతమును, న = చూడజాలకున్నాను, మధ్యం= మధ్యమును, న = చూడజాలకున్నాను.

ఓ విశ్వేశ్వరా ! విశ్వరూపా ! నీ బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు, అసంఖ్యాకములు. నీ అనంతరూపము సర్వతోముఖముగ విలసిల్లుచున్నది. నీవు ఆదిమధ్యాంత రహితుడవు. మహత్త్వపూర్ణమైన నీ దివ్యరూపమునకు ఆది మధ్యాంతములు గోచరింపకున్నవి.

17 కిరీటినం గదినం చక్రిణం చ

తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్ ।

పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్

దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్ ॥

కిరీటినం-గదినం-చక్రిణం-చ-తేజోరాశిం-సర్వతః-దీప్తిమంతం

పశ్యామి-త్వాం-దుర్నిరీక్ష్యం-సమంతాత్-దీప్తానలార్క ద్యుతిం- అప్రమేయం

కిరీటినం=కిరీటము గలవానినిగ, గదినం= గదాధరునిగ, చక్రిణం చ = చక్రధరునిగ, సర్వతః= అంతటను, దీప్తిమంతం= ప్రకాశించుచున్న వానినిగ, తేజోరాశిం= తేజోరాశివిగ, దుర్నిరీక్ష్యం= చూడశక్యము కాని వానినిగ, దీప్తానలార్క ద్యుతిం=ప్రజ్వలించెడి అగ్ని సూర్యుల కాంతిగల వానినిగ, అప్రమేయం=అప్రమేయునిగ, సమంతాత్= అంతటను, త్వాం=నిన్ను, పశ్యామి= చూచుచున్నాను.

హే విష్ణో! కిరీటమును, గదను, చక్రమును ధరించి, అంతటను తేజోవంతమైన కాంతులను విరజిమ్ముచున్న నిన్ను దర్శించుచున్నాను. ప్రజ్వలి తాగ్నివలెను, జ్యోతిర్మయుడైన సూర్యునివలెను వెలుగొందుచున్న నీ అప్రమేయరూపము గాంచుచున్నాను.

18 త్వమక్షరం పరమం వేదితవ్యం

త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।

త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా

సనాతనస్త్వం పురుషో మతో మే ॥

త్వం-అక్షరం-పరమం-వేదితవ్యం-త్వం-అస్య-విశ్వస్య-పరం-నిధానం

త్వం-అవ్యయః-శాశ్వత ధర్మగోప్తా-సనాతనః-త్వం-పురుషః-మతః-మే

త్వం=నీవు, అక్షరం= అవినాశివి, పరమం= పరమాత్మవు, వేదితవ్యం= తెలియదగిన వాడవు, త్వం=నీవు, అస్య= ఈ, విశ్వస్య = విశ్వమునకు, పరం= పరమైన, నిధానం = ఆశ్రయుడవు, త్వం=నీవు, శాశ్వత ధర్మగోప్తా= సనాతన ధర్మమును రక్షించెడి, అవ్యయః= నిత్యుడవు, త్వం=నీవు, సనాతనః= సనాతనుడవైన, పురుషః=పురుషుడవు, మే=నాయొక్క, మతః= అభిప్రాయము.

పరము - అక్షరస్వరూపుడవైన పరబ్రహ్మపరమాత్మవు నీవే, కనుక అందరికిని తెలిసికొనదగినవాడవు. ఈ జగత్తునకు నీవే పరమాశ్రయుడవు. సనాతన ధర్మరక్షకుడవు. నీవు అవ్యయుడవు. సనాతనపురుషుడవు, అని నా అభిప్రాయము.

19 అనాదిమధ్యాంతమనంతవీర్యమ్

అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।

పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం

స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥

అనాదిమధ్యాంతం-అనంతవీర్యం-అనంతబాహుం-శశిసూర్యనేత్రం

పశ్యామి-త్వాం-దీప్తహుతాశవక్త్రం-స్వతేజసా-విశ్వం- ఇదం-తపంతం

త్వాం=నిన్ను, అనాదిమధ్యాంతం = ఆదిమధ్యాంత రహితుడవుగను, అనంతవీర్యం= అంతములేని తేజోవంతుడుగను, అనంతబాహుం=అనంతమైన బాహువులు గలవానిగను, శశిసూర్యనేత్రం = చంద్ర సూర్యులు కన్నులుగాగల వాడవుగను, దీప్తహుతాశ వక్త్రం= ప్రజ్వలించుచున్న అగ్ని ముఖములయందు గలవాడవుగను, స్వతేజసా= స్వీయమైన తేజస్సుచేత, ఇదం= ఈ , విశ్వం= విశ్వమును, తపంతం= తపింపజేయువాడవుగను, పశ్యామి = చూచుచున్నాను.

నీవు అదిమధ్యాంతరహితుడవు. అపరిమితశక్తిశాలివి. అసంఖ్యాకములైన భుజములు గలవాడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. అగ్నివలె నీ ముఖము ప్రజ్వరిల్లుచున్నది. నీ తేజస్సుచేత ఈ జగత్తును తపింపజేయు చున్నావు. అట్టి నిన్ను నేను గాంచుచున్నాను.

20 ద్యావాపృథివ్యోరిదమంతరం హి

వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।

దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం

లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥

ద్యావాపృథివ్యోః- ఇదం-అంతరం-హి-వ్యాప్తం-త్వయా- ఏకేన-దిశః-చ-సర్వాః

దృష్ట్వా- అద్భుతం-రూపం- ఉగ్రం-తవ- ఇదం- లోకత్రయం - ప్రవ్యథితం-మహాత్మన్

మహాత్మన్= మహాత్మా, ద్యావాపృథివ్యోః= భూమ్యాకాశాల యొక్క, ఇదం = ఈ, అంతరం= మధ్యప్రదేశము, సర్వాః= సమస్తమైన, దిశః చ = దిక్కులు, ఏకేన = ఒక్కడవైన, త్వయా= నీచేత, వ్యాప్తం హి = వ్యాపింపబడి యున్నవికదా, తవ = నీయొక్క, అద్భుతం =అద్భుతమైన, ఉగ్రం= భయంకరమైన, ఇదం= ఈ , రూపం= రూపమును, దృష్ట్వా= చూచి, లోకత్రయం = మూడు లోకములు, ప్రవ్యథితం= భయపడినవి.

ఓ మహాత్మా ! దివినుండి భువివఱకుగల అంతరిక్షమునందంతటను అన్ని దిశలను నీవే పరిపూర్ణుడవై యున్నావు. అద్భుతమైన నీ భయంకర రూపమును చూచి, ముల్లోకములును మిగుల భీతిని చెందిచున్నవి.

21 అమీ హి త్వాం సురసంఘా విశంతి

కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి।

స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః

స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥

అమీ-హి-త్వాం-సురసంఘాః-విశంతి కేచిత్-భీతాః-ప్రాంజలయః-గృణంతి

స్వస్తి- ఇతి- ఉక్త్వా- మహర్షి సిద్ధ సంఘాః-స్తువంతి-త్వాం-స్తుతిభిః -పుష్కలాభిః

అమీ= ఈ, సురసంఘాః= దేవతాసమూహములు, త్వాం= నిన్ను, విశంతి=ప్రవేశించు చున్నవి, కేచిత్=కొందరు, భీతాః= భయపడినవారై, ప్రాంజలయః= చేతులు జోడించిన వారై, గృణంతి = స్తుతించుచున్నారు, మహర్షి సిద్ధసంఘాః= మహర్షుల , సిద్ధపురుషుల సమూహము, స్వస్తి ఇతి = స్వస్తియని, ఉక్త్వా= పలుకుచు, పుష్కలాభిః= అనేకములైన, స్తుతిభిః= స్తోత్రములచేత, త్వాం= నిన్ను, స్తువంతి హి = స్తుతించుచున్నారు.

ఇదిగో, ఆ దేవతలెల్లరును నీలో ప్రవేశించుచున్నారు. కొందఱు భయపడినవారై అంజలి ఘటించి, నీ నామగుణములను కీర్తించుచున్నారు. మహర్షులును, సిద్ధులును స్వస్తివచనములతోడను, ఉత్తమోత్తమ స్తోత్రముల తోడను నిన్ను ప్రార్థించుచున్నారు.

22 రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః

విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।

గంధర్వయక్షాసురసిద్ధసంఘాః

వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥

రుద్రాదిత్యాః-వసవః-యే-చ-సాధ్యాః-విశ్వే-అశ్వినౌ-మరుతః-చ- ఊష్మపాః-చ

గంధర్వయక్షాసురసిద్ధ సంఘాః-వీక్షంతే-త్వాం-విస్మితాః-చ- ఏవ-సర్వే

రుద్రాదిత్యాః= రుద్రులు, ఆదిత్యులు, వసవః= వసువులు, యే= ఎవరు, సాధ్యాః చ =సాధ్యులు, విశ్వే= విశ్వేదేవతలు, అశ్వినౌ= అశ్వినీదేవతలు, మరుతః చ = వాయుదేవతలు, ఊష్మపాః చ = పితృదేవతలు, గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః= గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మొదలగువారి సమూహములు, సర్వే=అందరును, విస్మితాః చ ఏవ = విస్మయమును పొందినవారలై, త్వాం= నిన్ను, వీక్షంతే= చూచుచున్నారు.

ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీకుమారులును, మరుద్గణములును, పితరులును అట్లే గంధర్వయక్షాసురసిద్ధ సముదాయములును సంభ్రమాశ్చర్య ములతో నిన్నే గాంచుచున్నారు.

23 రూపం మహత్తే బహువక్త్రనేత్రం

మహాబాహో బహుబాహూరుపాదమ్ ।

బహూదరం బహుదంష్ట్రాకరాళం

దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥

రూపం-మహత్-తే-బహువక్త్రనేత్రం-మహాబాహో- బహుబాహూరుపాదం

బహూదరం-బహుదంష్ట్రాకరాలం-దృష్ట్వా-లోకాః-ప్రవ్యథితాః-

తథా- అహం, మహాబాహో = కృష్ణా, బహువక్త్రనేత్రం = అనేకములైన ముఖములు, కన్నులు గలదియు, బహుబాహూరుపాదం = అనేకములైన బాహువులు, ఊరువులు, పాదములు గలదియు, బహూదరం=అనేక పొట్టలు గలదియు, బహుదంష్ట్రాకరాలం = అనేకములైన కోఱలచేత భయంకరమైనదియు, మహత్= గొప్పదియునైన, తే=నీయొక్క, రూపం= రూపమును, దృష్ట్వా=చూచి, లోకాః= లోకములు, తథా= అటులనే, అహం=నేను, ప్రవ్యథితాః= భయమును పొందినవి.

హే మహాబాహో ! అసంఖ్యాకములైన వక్త్రములను, నేత్రములను, చేతులను, తొడలను, పాదములను, ఉదరములను, కోరలను కలిగిన మిక్కిలి భయంకరమైన నీ రూపమును చూచి, అందఱును భయకంపితులగుచున్నారు. నేనుకూడ అలాగే భయపడుచున్నాను.

24 నభఃస్పృశం దీప్తమనేకవర్ణం

వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।

దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా

ధృతిం న విందామి శమం చ విష్ణో ॥

నభః స్పృశం-దీప్తం-అనేకవర్ణం-వ్యాత్తాననం-దీప్త విశాలనేత్రం

దృష్ట్వా-హి-త్వాం-ప్రవ్యథితాంతరాత్మా-ధృతిం-న-విందామి-శమం- చ- విష్ణో

విష్ణో=కృష్ణా, స్పృశం= ఆకాశమును తాకెడివాడవు, దీప్తం= ప్రకాశమానుడవు, అనేకవర్ణం= ఎన్నో రంగులు గలవాడవు, వ్యాత్తాననం= తెరచిన నోళ్ళు గలవాడవు, దీప్తవిశాల నేత్రం= ప్రజ్వలించు విశాలనేత్రములు గలవాడవు అగు, త్వాం= నిన్ను, దృష్ట్వా= చూచి, ప్రవ్యథితాంతరాత్మా = భయపడిన అంతరాత్మ గలవాడనై, ధృతిం= ధైర్యమును, శమం చ= శాంతిని, న విందామి హి=పొందజాలకున్నాను గదా.

ఏలనన హే విష్ణో ! నీ రూపము అంతరిక్షమును తాకుచున్నది. అది అనేకవర్ణములతో దేదీప్యమానమై వెలుగుచున్నది. కాంతులను విరజిమ్ముచున్న విశాలనేత్రములతో, విస్తరించిన ముఖములతో అద్భుతముగా ఒప్పుచున్నది. అట్టి నీ రూపమును చూచిన నా మనస్సు తత్తరపడుచున్నది. అందువలన నా ధైర్యము సడలినది. శాంతి పొందలేకయున్నాను.

25 దంష్ట్రాకరాళాని చ తే ముఖాని

దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।

దిశో న జానే న లభే చ శర్మ

ప్రసీద దేవేశ జగన్నివాస ॥

దంష్ట్రాకరాళాని-చ-తే-ముఖాని-దృష్ట్వా- ఏవ-కాలానల సన్నిభాని

దిశః-న-జానే-న-లభే-చ-శర్మ-ప్రసీద-దేవేశ-జగన్నివాస

దంష్ట్రాకరాళాని-కోఱలచే భయంకరమైనవియు, కాలానల సన్నిభాని = ప్రళయాగ్నిని బోలిన, తే=నీయొక్క, ముఖాని= ముఖములను, దృష్ట్వా ఏవ= చూచియే, దిశః= దిక్కులను, న జానే=తెలిసికొనజాలకున్నాను, శర్మ= సుఖమును, న లభే చ = పొందజాలకున్నాను, దేవేశ= దేవదేవా, జగన్నివాస= జగదాశ్రయా, ప్రసీద=ప్రసన్నుడవగుము.

ఓ జగన్నివాసా ! భయంకరములైన కోరలతో ఒప్పుచున్న నీ ముఖములు ప్రళయాగ్ని జ్వాలలవలె భీతిగొల్పుచున్నవి. వాటిని చూచిన నాకు దిక్కుతోచకున్నది. నెమ్మది శూన్యమైనది. ఓ దేవేశా! ప్రసన్నుడవగుము.

26 అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః

సర్వే సహైవావనిపాలసంఘైః

భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ

సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥

అమీ-చ-త్వాం-ధృతరాష్ట్రస్య-పుత్రాః-సర్వే-సహ- ఏవ-అవనిపాలసంఘైః

భీష్మః-ద్రోణః-సూతపుత్రః-తథా-అసౌ-సహ-అస్మదీయైః-అపి -యోధముఖ్యైః

అమీః= ఈ, ధృతరాష్ట్రస్య = ధృతరాష్ట్రునియొక్క, పుత్రాః=కుమారులును, అవనిపాల సంఘైః సహ ఏవ= రాజసమూహముతో గూడి, తథా=అటులే, భీష్మః= భీష్ముడు, ద్రోణః= ద్రోణుడు, అసౌ= ఈ, సూతపుత్రః= సూతపుత్రుడు, అస్మదీయైః= మనవారైన, యోధముఖ్యైః సహ అపిః= యుద్ధప్రముఖులతోకూడా, సర్వే చ = అందరును.

ఇచ్చట చేరియున్న ఈ ధృతరాష్ట్రపుత్రులు ఇతర రాజన్యులతో సహా నీలో ప్రవేశించు చున్నారు. భీష్మపితామహుడు, ద్రోణుడు, కర్ణుడు, అట్లే మన పక్షమునందలి ప్రధానయోధులు అందఱును

27 వక్త్రాణి తే త్వరమాణా విశంతి

దంష్ట్రాకరాళాని భయానకాని ।

కేచిద్విలాగ్నా దశనాంతరేషు

సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః ॥

వక్త్రాణి-తే-త్వరమాణాః-విశంతి-దంష్ట్రాకరాలాని-భయానకాని

కేచిత్-విలగ్నాః-దశనాంతరేషు-సందృశ్యంతే-చూర్ణితైః- ఉత్తమాంగైః

త్వరమాణాః = తొందరపడుచున్నవారై, త్వాం= నీలో, దంష్ట్రాకరాళాని= కోఱలతో వికారమైన, భయానకాని= భయంకరమైన, తే=నీయొక్క, వక్త్రాణి= ముఖములను, విశంతి= ప్రవేశించుచున్నారు, కేచిత్= కొందరు, దశనాంతరేషు= దంతములమధ్య, విలగ్నాః= చిక్కినవారై, చూర్ణితైః=పొడుము చేయబడినవారై, ఉత్తమాంగైః= శిరములతో, సందృశ్యంతే= కనబడుచున్నారు.

భయంకరముల్లైన కోరలతోగూడిన నీ ముఖములయందు అతివేగముగా పరుగులుదీయుచు ప్రవేశించుచున్నారు. కొందఱి తలలు కోరల మధ్యబడి నుగ్గునుగ్గైపోవుచుండగా వారు దంతములలో చిక్కుకొని కనిపించుచున్నారు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

28 యథా నదీనాం బహవోఽమ్బువేగాః

సముద్రమేవాభిముఖా ద్రవంతి।

తథా తవామీ నరలోకవీరాః

విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి॥

యథా-నదీనాం-బహవః-అంబువేగాః-సముద్రం- ఏవ- అభిముఖాః -ద్రవంతి

తథా-తవ-అమీ-నరలోక వీరాః-విశంతి-వక్త్రాణి-అభివిజ్వలంతి

నదీనాం=నదులయొక్క, బహవః= బహువిధములైన, అంబువేగాః= నీటి ప్రవాహములు, యథా = ఏ రీతిని, సముద్రం ఏవ = సముద్రమునే, అభిముఖాః= ఎదుర్కొని, ద్రవంతి= ప్రవహించుచున్నవో, తథా=అట్లే, అమీ= ఈ, నరలోకవీరాః= రాజశ్రేష్ఠులు, తవ= నీయొక్క, అభివిజ్వలంతి= ప్రజ్వలించుచున్న, వక్త్రాణి= ముఖములను, విశంతి= ప్రవేశించుచున్నారు.

అనేకములైన నదీనదములప్రవాహములన్నియును సహజముగా సముద్రమునకు అభిముఖముగా ప్రవహించుచు అందు ప్రవేశించుచున్నట్లు, ఈ శ్రేష్ఠులైన సమరయోధులు నరలోకవీరులు కూడ జ్వలించుచున్న నీ కభిముఖులై ప్రవేశించుచున్నారు.

29 యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః

విశంతి నాశాయ సమృద్ధవేగాః।

తథైవ నాశాయ విశంతి లోకాః

తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

యథా-ప్రదీప్తం-జ్వలనం-పతంగాః-విశంతి-నాశాయ-సమృద్ధవేగాః

తథా- ఏవ-నాశాయ-విశంతి-లోకాః-తవ-అపి-వక్త్రాణి-సమృద్ధవేగాః

పతంగాః= మిడుతలు, ప్రదీప్తం=మండుచున్న, జ్వలనం=అగ్నిని, సమృద్ధవేగాః= అతివేగము గలవియై, యథా= ఏ రీతి, నాశాయ= నాశము కొరకు, విశంతి=ప్రవేశించు చున్నవో, తథా ఏవ= ఆ రీతినే, లోకాః అపి= జనసమూహము లును, సమృద్ధవేగాః= అతివేగము గలవియై, తవ= నీయొక్క, వక్త్రాణి= ముఖములను, నాశాయ=నాశము కొరకు, విశంతి= ప్రవేశించుచున్నవి.

మిడుతలన్నియును మోహవశమున బాగుగా మండుచున్న అగ్నివైపు అతివేగముగా పరుగెత్తి, తమ నాశనముకొఱకు అందు ప్రవేశించి, నశించునట్లు -ఈ వీరులందఱును తమనాశమునకై అతివేగముగా పరుగెత్తి, నీ నోళ్ళయందు నాశముగోరి ప్రవేశించుచున్నారు.

30 లేలిహ్యసే గ్రసమానః సమంతాత్

లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।

తేజోభిరాపూర్య జగత్ సమగ్రం

భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో ॥

లేలిహ్యసే-గ్రసమానః-సమంతాత్-లోకాన్-సమగ్రాన్-వదనైః-జ్వలద్భిః

తేజోభిః- ఆపూర్య-జగత్-సమగ్రం-భాసః-తవ- ఉగ్రాః-ప్రతపంతి-విష్ణో

విష్ణో=విష్ణుమూర్తీ, జ్వలద్భిః=మండుచున్న, వదనైః= నోరులచేతను, సమంతాత్= అన్నివైపులనుండి, సమగ్రాన్= సమస్తమైనట్టి, లోకాన్= లోకములను, గ్రసమానః= మ్రింగుచు, లేలిహ్యసే= ఆస్వాదించుచున్నావు, తవ=నీయొక్క, ఉగ్రాః= ప్రచండమైన, భాసః= కాంతులు, సమగ్రం= సమస్తమైన, జగత్= జగత్తును, తేజోభిః= కాంతులచేత, ఆపూర్య= నింపి, ప్రతపంతి=తపింపచేయుచున్నవి.

హే విష్ణో! ప్రజ్వలించుచున్న నీ ముఖములతో సమస్త లోకములను అన్నివైపులనుండి కబళించుచు మాటిమాటికిని చప్పరించుచున్నావు. నీ ఉగ్రతేజస్సులు సమస్తమైన జగత్తును తపింపజేయు చున్నవి.

31 ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో

నమోఽస్తు తే దేవవర ప్రసీద।

విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం

న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

ఆఖ్యాహి-మే-కః-భవాన్- ఉగ్రరూపః-నమః-అస్తు-తే-దేవవర-ప్రసీద

విజ్ఞాతుం- ఇచ్ఛామి-భవంతం- ఆద్యం-న-హి-ప్రజానామి-తవ-ప్రవృత్తిం

దేవవర= దేవదేవా, ఉగ్రరూపః=భయంకర రూపుడవైన, భవాన్=నీవు, కః= ఎవరో, మే=నాకు, ఆఖ్యాహి=చెప్పుము, తే=నీకొఱకు, నమః అస్తు=వందనము అగుగాక, ప్రసీద= ప్రసన్నుడవగుము, ఆద్యం= ఆదిపురుషుడవైన, భవంతం= నిన్ను, విజ్ఞాతుం= తెలిసికొను, ఇచ్ఛామి= కోరుచున్నాను, తవ=నీయొక్క, ప్రవృత్తిం= ప్రవర్తనమును, న ప్రజానామి హి= తెలియలేకున్నాను.

ఓ పరమాత్మా ! నీకు నా నమస్కారములు - ప్రసన్నుడవు కమ్ము. ఉగ్రరూపుడవైన నీవు ఎవరో దయతో నాకు తెలుపుము. ఆదిపురుషుడవైన నిన్ను విశదముగా తెలిసికొనగోరుచున్నాను. ఏలనన నీ ప్రవృత్తి నాకు బోధపడుటలేదు.

శ్రీభగవాన్ ఉవాచ

32 కాలోஉస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో

లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।

ఋతేஉపి త్వాం న భవిష్యంతి సర్వే

యేஉవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥

కాలః-అస్మి-లోకక్షయకృత్-ప్రవృద్ధః-లోకాన్-సమాహర్తుం- ఇహ- ప్రవృత్తః

ఋతే-అపి-త్వాం-న-భవిష్యంతి-సర్వే-యే-అవస్థితాః-ప్రత్యనీకేషు -యోధాః

లోకక్షయకృత్= లోకసంహారకుడనై, ప్రవృద్ధః= వృద్ధిచెందిన, కాలః= కాలుడను, అస్మి= అయియున్నాను, ఇహ= ఇప్పుడు, లోకాన్= లోకములను, సమాహర్తుం=సంహరించుటకు, ప్రవృత్తః= ప్రవర్తించినవాడను, యే= ఏ, యోధాః= యోధులు, ప్రత్యనీకేషు=ప్రతిపక్షసైన్యములందు, అవస్థితాః= ఉండిరో, సర్వే= వారందరు, త్వాం ఋతే అపి= నీవు లేకపోయినను, న భవిష్యంతి= ఉండరు.

శ్రీ భగవానుడు పలికెను - నేను లోకములన్నింటిని తుదముట్టించుటకై విజృంభించిన మహాకాలుడను. ఇప్పుడు ఈ లోకములను రూపుమాపుటకై పూనుకొనియున్నాను. కనుక నీవు యుద్ధముచేయకున్ననూ ప్రతిపక్షముననున్న ఈ వీరులెవ్వరును జీవించియుండరు.

33 తస్మాత్ త్వముత్తిష్ఠ యశో లభస్వ

జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।

మయ్యైవైతే విహతాః పూర్వమేవ

నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

తస్మాత్-త్వం- ఉత్తిష్ఠ-యశః-లభస్వ-జిత్వా-శత్రూన్-భుంక్ష్వ-రాజ్యం- సమృద్ధం

మయా- ఏవ- ఏతే-నిహతాః-పూర్వం- ఏవ-నిమిత్తమాత్రం-భవ- సవ్యసాచిన్

తస్మాత్=అందువలన, త్వం=నీవు, ఉత్తిష్ఠ= లెమ్ము, శత్రూన్= శత్రువులను, జిత్వా= జయించి, యశః=కీర్తిని, లభస్వ=పొందుము, సమృద్ధం=సంపూర్ణమగు, రాజ్యం=రాజ్యమును, భుంక్ష్వ=అనుభవింపుము, ఏతే= ఈ, మయా ఏవ= నాచేతనే, పూర్వమే=పూర్వమే, నిహతాః= చంపబడిరి, సవ్యసాచిన్=అర్జునా, నిమిత్తమాత్రం= నిమిత్తమాత్రుడవు , భవ=కమ్ము.

కాబట్టి ఓ సవ్యసాచీ ! లెమ్ము, కీర్తి గాంచుము. శత్రువులను జయించి సర్వసంపదలతో తులతూగు రాజ్యమును అనుభవింపుము. వీరందఱును నా చేత మునుపే చంపబడియున్నారు. నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము.

34 ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ

కర్ణం తథాన్యానపి యోధవీరాన్।

మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా

యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

ద్రోణం-చ-భీష్మం-చ-జయద్రథం-చ-కర్ణం-తథా-అన్యాన్-అపి- యోధవీరాన్

మయా-హతాన్-త్వం-జహి-మా-వ్యథిష్ఠాః-యుధ్యస్వ-జేతాసి-రణే -సపత్నాన్.

మయా=నాచేత, హతాన్= చంపబడిన, ద్రోణం చ=ద్రోణుని, భీష్మం చ=భీష్ముని, జయద్రథం చ = జయద్రథుని, కర్ణం=కర్ణుని, తథా=అటులనే, అన్యాన్= ఇతరులైన, యోధవీరాన్ అపి= యోధవీరులను సైతము, త్వం=నీవు, జహి=చంపుము, మావ్యధిష్ఠాః= విచార పడకుము, యుధ్యస్వ=యుద్ధము చేయుము, రణే=యుద్ధమునందు, సపత్నాన్=శత్రువులను, జేతాసి= జయింపగలవు.

ఇదివరకే నాచే చంపబడిన భీష్మ, ద్రోణ, జయద్రథ కర్ణాది యుద్ధ వీరులందరిని నీవు సంహరింపుము. భయపడకుము. రణరంగమున శత్రువులను తప్పక జయింపగలవు. కనుక యుద్ధము చేయుము.

సంజయ ఉవాచ

35 ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య

కృతాంజలిర్వేపమానః కిరీటీ।

నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం

సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

ఏతత్-శ్రుత్వా-వచనం-కేశవస్య-కృతాంజలిః-వేపమానః-కిరీటి

నమస్కృత్వా-భూయః- ఏవ- ఆహ-కృష్ణం-సగద్గదం-భీతభీతః- ప్రణమ్య

కిరీటీ=అర్జునుడు, కేశవస్య= శ్రీకృష్ణునియొక్క, ఏతత్= ఈ, వచనం= వాక్యమును, శ్రుత్వా= విని, కృతాంజలిః= చేతులు జోడించినవాడును, వేపమానః=వణుకుచున్న వాడునై, కృష్ణం=కృష్ణుని, నమస్కృత్వా=నమస్కరించి, ప్రణమ్య=వినమ్రుడై, భీతభీతః= మిగుల భయపడుచు, సగద్గదం= గద్గద స్వరముతో, భూయః ఏవ=మరల, ఆహ= పలికెను.

సంజయుడు పలికెను - ఓ రాజా! శ్రీ కృష్ణపరమాత్మ యొక్క ఈ మాటలను విని, అర్జునుడు వణకుచు, చేతులు జోడించి నమస్కరించెను, మఱల మిక్కిలి భయముతో ప్రణమిల్లి, గద్గదస్వరముతో తడబడుచు ఇలాపలికెను.

అర్జున ఉవాచ

36 స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।

రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః।

స్థానే-హృషీకేశ-తవ-ప్రకీర్త్యా-జగత్-ప్రహృష్యతి-అనురజ్యతే-చ

రక్షాంసి-భీతాని-దిశః-ద్రవంతి-సర్వే-నమస్యంతి-చ-సిద్ధసంఘాః

హృషీకేశ=కృష్ణా, తవ=నీయొక్క, ప్రకీర్త్యా=మాహాత్మ్యముచేత, జగత్=జగత్తు, ప్రహృష్యతి=సంతసించుచున్నది, అనురజ్యతే చ = అనురాగమును పొందుచున్నది, రక్షాంసి=రాక్షసులు, భీతాని=భయపడిన వారలై, దిశః=దిక్కులనుగూర్చి, ద్రవంతి= పరుగిడుచున్నారు, సర్వే=సమస్తమైన, సిద్ధసంఘాః = సిద్ధసంఘములు, నమస్యంతి చ=నమస్కారము చేయుచున్నవి, స్థానే=తగియున్నది.

అర్జునుడు పలికెను - ఓ అంతర్యామీ ! కేశవా ! నీమహత్త్వముచేత జగత్తు హర్షాతికములతో, అనురాగముతో ఉప్పొంగిపోవుచున్నది. ఇది సముచితము. భయగ్రస్తులైన రాక్షసులు నలుదిక్కులకును పారిపోవుచున్నారు. సిద్ధగణములవారెల్లరును ప్రణమిల్లు చున్నారు.

37 కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।

అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్ తత్పరం యత్॥

కస్మాత్-చ-తే-న-నమేరన్-మహాత్మన్-గరీయసే-బ్రహ్మణః-అపి- ఆదికర్త్రే

అనంత-దేవేశ-జగన్నివాస-త్వం-అక్షరం-సత్-అసత్-తత్పరం-యత్

మహాత్మన్=మహాత్మా, అనంత=అనంతుడా, దేవేశ=దేవదేవ, జగన్నివాస=జగదంతర్యామీ, సత్=సత్తు, అసత్ చ = అసత్తును, యత్= ఏదో, తత్పరం=దానికి పరమైన, అక్షరం=అక్షరబ్రహ్మము, త్వం=నీవు, అపి=అయియున్నావు, బ్రహ్మణః అపి=బ్రహ్మకును, ఆదికర్త్రే= మూలకర్తవు, గరీయసే= గొప్పవాడవునైన, తే=నీకొరకు, కస్మాత్ = ఏల, న నమేరన్= నమస్కరింపకుందురు.

ఓ మహాత్మా ! నీవు సర్వశ్రేష్ఠుడవు. సృష్టికర్తయైన బ్రహ్మకే మూలకారకుడవు - కనుక వారు (సిద్ధాదులందరును) నీకు నమస్కరింపక ఎట్లుండగలరు ? ఓ అనంతా! ఓ దేవేశా! సత్-అసత్‌లు నీవే. వాటికంటెను పరమైన అక్షరస్వరూపుడవు అనగా పరబ్రహ్మవు నీవే. నిన్ను ఎవరు నమస్కరింపకుందురు.

38 త్వమాదిదేవః పురుషః పురాణః

త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।

వేత్తాసి వేద్యం చ పరం చ ధామ

త్వయా తతం విశ్వమనంతరూప ॥

త్వం- ఆదిదేవః-పురుషః-పురాణ-త్వం-అస్య-విశ్వస్య-పరం-నిధానం

వేత్తా-అసి-వేద్యం-చ-పరం-చ-ధామ-త్వయా-తతం-విశ్వం- అనంతరూప

అనంతరూప=అనంతరూపుడా, త్వం=నీవు, ఆదిదేవః= ఆదిదేవుడవు, పురాణః= సనాతనుడవైన, పురుషః= పురుషుడవు, త్వం=నీవు, అస్య= ఈ, విశ్వస్య= విశ్వమునకు, పరం= ఉత్తమమైన, నిధానం= ఆశ్రయానివి, వేత్తా= సర్వజ్ఞుడవు, వేద్యం చ = తెలియదగిన విషయమును, పరం చ=పొందదగిన, ధామ= ధామము, అసి= అయియున్నావు, విశ్వం= విశ్వము, త్వయా=నీచేత, తతం= వ్యాప్తమై యున్నది.

ఓ అనంతరూపా ! నీవు ఆదిదేవుడవు, సనాతనపురుషుడవు, ఈజగత్తునకు పరమాశ్రయుడవు. సర్వజ్ఞుడవు, సర్వవేద్యుడవు, పరంధాముడవు. ఈ జగత్తు అంతయును నీచేత వ్యాప్తమై యున్నది.

39 వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాంకః

ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।

నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః

పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥

వాయుః-యమః-అగ్నిః-వరుణః-శశాంకః-ప్రజాపతిః-త్వం- ప్రపితామహః-చ

నమః-నమః-తే-అస్తు-సహస్రకృత్వః-పునః-చ-భూయః-అపి- నమః-నమః-తే

త్వం=నీవు, వాయుః=వాయువవు, యమః=యముడవు, అగ్నిః=అగ్నివి, వరుణః= వరుణుడవు, శశాంకః= చంద్రుడవు, ప్రజాపతిః= ప్రజాపతివి, ప్రపితామహః చ= ముత్తాతవును, తే=నీకొరకు, సహస్రకృత్వః=వేయిసారులు, నమో నమః= నమస్కారములు, అస్తు=అగుగాక, పునః చ=మరల, భూయః అపి= మరలకూడా, తే=నీకొరకు, నమోనమః= నమస్కారములు.

నీవే వాయుదేవుడవు, యముడవు, అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతియైన బ్రహ్మవు. బ్రహ్మకును జనకుడవు. నీకువేలకొలది నమస్కారములు. మఱల మఱల నమస్కారములు. ఇంకను నమస్కారములు.

40 నమః పురస్తాదథ పృష్ఠతస్తే

నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ।

అనంతవీర్యామితవిక్రమస్త్వం

సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥

నమః-పురస్తాత్-అథ-పృష్ఠతః-తే-నమః-అస్తు-తే-సర్వతః- ఏవ-సర్వ

అనంతవీర్య-అమితవిక్రమః-త్వం-సర్వం-సమాప్నోషి-తతః-అసి-సర్వః

సర్వ=సర్వస్వరూపుడా, పురస్తాత్= ముందు, పృష్ఠతః= వెనుక, తే=నీకు, నమః=నమస్కారము, అథ=అటుపిమ్మట, సర్వతః ఏవ= అన్నివైపులను, తే=నీకొరకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక, త్వం=నీవు, అనంత=అపరిమితమైన, వీర్యామిత విక్రమః=శక్తిసామర్థ్యములు గలవాడవు, సర్వం=సర్వమును, సమాప్నోషి=వ్యాపించి యున్నావు, తతః=అందువలన, సర్వః= సర్వస్వరూపుడవు, అసి=అయియున్నావు.

అనంతసామర్థ్యముగలవాడా ! నీకు ఎదురుగా ఉండియు, వెనుక నుండియు నమస్కరించుచున్నాను. ఓ సర్వాత్మా! నీకు అన్నివైపులనుండియు నమస్కారములు. ఏలనన అనంతపరాక్రమశాలివై నీవు జగత్తంతటను వ్యాపించి యున్నవాడవు. అందుచేతనే సర్వుడనబడుచున్నావు.

41 సఖేతి మత్వా ప్రసభం యదుక్తం

హే కృష్ణ! హే యాదవ ! హే సఖేతి।

అజానతా మహిమానం తవేదం

మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి ॥

సఖా- ఇతి-మత్వా-ప్రసభం-యత్- ఉక్తం-హే-కృష్ణ-హే-యాదవ-హే- సఖే- ఇతి

అజానతా-మహిమానం-తవ- ఇదం-మయా-ప్రమాదాత్ -ప్రణయేన-వా-అపి

తవ=నీయొక్క, ఇదం= ఈ, మహిమానం= మాహాత్మ్యమును, అజానతా=తెలియక, మయా=నాచేత, ప్రమాదాత్= ఆకస్మికంగా గాని, ప్రణయేన వా అపి= ప్రేమచేతగాని, సఖా ఇతి మత్వా= స్నేహితుడని భావించి, ప్రసభం=నిర్లక్ష్యముగను, హే కృష్ణ= హే కృష్ణా, హే యాదవ = హే యాదవుడా, హేసఖే= హే మిత్రుడా, ఇతి=అని, యత్= ఏది, ఉక్తం= చెప్పబడినదో... ..

42 యచ్చావహాసార్థమసత్కృతోఽసి

విహారశయ్యాసనభోజనేషు ।

ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం

తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥

యత్-చ-అవహాసార్థం-అసత్కృతః-అసి-విహారశయ్యాసనభోజనేషు

ఏకః-అథవా-అపి-అచ్యుత-తత్సమక్షం-తత్-క్షామయే-త్వాం- అహం - అప్రమేయం

అచ్యుత= అచ్యుతుడా , విహారశయ్యాసన భోజనేషు= విహారములయందును, పడకయందును, కూర్చొనుటయందును, భోజనము లందును, అవహాసార్థం= పరిహాసమునకై, ఏకః= ఒంటరిగా నున్నపుడు, అథవా అపి= వెనుకను, తత్సమక్షం= పరులముందుగాని, అసత్కృతః అసి=అవమానింప బడితివి, యత్ చ= ఏదో, తత్= దానినంతయును, అప్రమేయం=అప్రమేయుడవైన, త్వాం= నిన్ను, అహం= నేను, క్షామయే = క్షమము గోరుచున్నాను.

నీ మహిమను ఎఱుగక నిన్ను నా సఖునిగా భావించి, చనువుచేగాని, పొరపాటువలనగాని, ఓ కృష్ణా! ఓయాదవా! ఓ మిత్రమా! అనుచు తొందరపాటుతో ఆలోచింపక, నేను నిన్ను సంబోధించి ఉంటిని. ఓ అచ్యుతా! విహారశయ్యాసన భోజనాది సమయములయందు ఏకాంతమునగాని, అన్యసఖుల సమక్షమున గాని సరసమునకై పరిహాసములాడి, నేను నిన్ను కించపఱచి యుండవచ్చును. ఓ అప్రమేయస్వరూపా! నా అపరాధముల నన్నింటిని క్షమింపుమని నిన్ను వేడుకొనుచున్నాను.

43 పితాऽసి లోకస్య చరాచరస్య

త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।

న త్వత్సమోऽస్త్య భ్యధికః కుతోऽన్యో

లోకత్రయోऽప్యప్రతిమప్రభావ ॥

పితా-అసి-లోకస్య-చరాచరస్య-త్వం-అస్య-పూజ్యః-చ-గురుః- గరీయాన్

న-త్వత్సమః-అస్తి-అభ్యధికః-కుతః-అన్యః-లోకత్రయే-అపి-అప్రతిమ ప్రభావ

అప్రతిమప్రభావ=అతిశయ ప్రభావము గల ఓ కృష్ణా, త్వం=నీవు, అస్య= ఈ, చరాచరస్య= చరాచర స్వరూపమైన, లోకస్య=లోకమునకు, పితా అసి= తండ్రివి, పూజ్యః= పూజ్యుడవు, గురుః=గురువు, గరీయాన్ చ=గొప్పవాడవును, అసి=అయియున్నావు, లోకత్రయే అపి=ముల్లోకములయందును, త్వత్సమః=నీకు సమానుడు, న అస్తి=లేడు, అభ్యదికః= అధికుడైన, అన్యః= ఇతరుడు, కుతః= ఎక్కడున్నాడు.

ఓ అనుపమప్రభావా ! ఈ సమస్త చరాచరజగత్తునకు నీవే తండ్రివి. నీవు పూజ్యుడవు. గురుడవు. సర్వశ్రేష్ఠుడవు. ఈ ముల్లోకములయందును నీతో సమానుడెవ్వడును లేడు. ఇంక నిన్ను మించిన అధికుడెట్లుండును?

44 తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

తస్మాత్-ప్రణమ్య-ప్రణిధాయ-కాయం-ప్రసాదయే-త్వాం-అహం- ఈశం- ఈడ్యం
పితా- ఇవ-పుత్రస్య-సఖా- ఇవ- సఖ్యుః- ప్రియః-ప్రియాయాః-అర్హసి- దేవ -సోఢుం

తస్మాత్=అందువలన, ఈశం= ఈశుడవు, ఈడ్యం=ప్రస్తుతింపదగిన వాడవు, త్వాం= నిన్నుగూర్చి, అహం=నేను, కాయం=శరీరమును, ప్రణిధాయ=వంచి, ప్రణమ్య=ప్రణమిల్లి, ప్రసాదయే= అనుగ్రహింప వేడుచున్నాను, దేవ=కృష్ణ, పుత్రస్య= పుత్రుని తప్పును, పితా ఇవ= తండ్రివలెను, సుఖ్యుః= సఖుని తప్పును, సఖా ఇవ= సఖుని వలెను, ప్రియాయాః=ప్రియురాలి తప్పును, ప్రియః ఇవ= ప్రియుని వలెను, సోఢుం= సహించుటకు, అర్హసి= తగియున్నావు.

కనుక ఓ ప్రభూ! నాశరీరమును నీపాదములకడనిడి, సాష్టాంగముగా ప్రణమిల్లుచున్నాను. స్తవనీయుడవు. సర్వేశ్వరుడవు ఐన నీవు నాయందు ప్రసన్నుడవగుటకై నిన్ను ప్రార్థించుచున్నాను. దేవా! కుమారుని తండ్రి క్షమించినట్లును, మిత్రుని మిత్రుడు క్షమించినట్లును, భార్యను భర్త క్షమించినట్లును, నా అపరాధములను నీవు క్షమింపుము.

45 అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా

భయేన చ ప్రవ్యథితం మనో మే ।

తదేవ మే దర్శయ దేవరూపం

ప్రసీద దేవేశ జగన్నివాస ॥

అదృష్టపూర్వం-హృషితః-అస్మి-దృష్ట్వా-భయేన -చ-ప్రవ్యథితం-మనః-మే

తత్- ఏవ-మే-దర్శయ-దేవరూపం-ప్రసీద-దేవేశ-జగన్నివాస

అదృష్టపూర్వం-పూర్వమెన్నడూ దర్శించని రూపమును, దృష్ట్వా= చూచి, హృషితః= సంతసించినవాడవు, అస్మి=అగుచున్నాను, మే=నాయొక్క, మనః= మనస్సు, భయేన= భయముచేత, ప్రవ్యథితం చ = బాధింపబడు చున్నది, దేవేశ=దేవదేవా, జగన్నివాస= జగదాశ్రయా, మే=నాకు, తత్= ఆపూర్వపు, దేవరూపం ఏవ=దివ్యరూపమునే, దర్శయ= చూపుము, ప్రసీద=కరుణింపుము.

మునుపు ఎన్నడును చూడని ఆశ్చర్యకరమైన ఈ రూపమును గాంచి, మిక్కిలి సంతసించితిని. కాని భయముచే నామనస్సు కలవరపాటు పొందినది. కనుక చతుర్భుజయుక్తుడవై విష్ణురూపముతోడనే నాకు దర్శనమిమ్ము. ఓ దేవేశా! జగన్నివాసా ! కరుణించుము.

46 కిరీటినం గదినం చక్రహస్తమ్

ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।

తేనైవ రూపేణ చతుర్భుజేన

సహస్రబాహో! భవ విశ్వమూర్తే! ।

కిరీటినం-గదినం-చక్రహస్తం- ఇచ్ఛామి-త్వా-ద్రష్టుం-అహం-తథా- ఏవ

తేన- ఏవ-రూపేణ-చతుర్భుజేన-సహస్రబాహో-భవ-విశ్వమూర్తే

విశ్వమూర్తే=విశ్వరూపా, అహం=నేను, కిరీటినం=కిరీటముగలవాడవు, గదినం= గద గలవాడవు, చక్రహస్తం= చక్రహస్తుడవు అగు, త్వాం=నిన్ను, ద్రష్టుం=గాంచుటకు, ఇచ్ఛామి= కోరుచున్నాను, తథా ఏవ=అటులనే, సహస్రబాహో= సహస్ర బాహువులు గలవాడా, చతుర్భుజేన= నాలుగు భుజములుగల, తేన = ఆ, రూపేణ ఏవ= రూపముతోనే, భవ= ఉండుము.

కిరీటమును, గదను, శంఖచక్రములను ధరించిన నీ రూపమును చూడగోరుచున్నాను. ఓ సహస్రబాహూ! విశ్వమూర్తి ! నీ చతుర్భుజరూపమును నాకు చూపుము.

శ్రీ భగవాన్ ఉవాచ

47 మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।

తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥

మయా-ప్రసన్నేన-తవ-అర్జున- ఇదం-రూపం-పరం-దర్శితం- ఆత్మయోగాత్

తేజోమయం-విశ్వం-అనంతం- ఆద్యం-యత్-మే-త్వదన్యేన-న-దృష్టపూర్వం

అర్జున=అర్జునా, మే=నాయొక్క, యత్ = ఏ, తేజోమయం=తేజోమయమును, విశ్వం= విశ్వము, అనంతం= అనంతమైనదియు, ఆద్యం= ఆదియైనదియు, త్వత్=నీకంటెను, అన్యేన= ఇతరునిచేత, న దృష్టపూర్వం= ఇంతవరకు చూడబడనిదియు, పరం=పరమైనది యునగు, ఇదం= ఈ, రూపం= రూపమును, తవ=నీకు, ప్రసన్నేన= ప్రసన్నుడనైన, మయా=నాచేత, ఆత్మయోగాత్= ఆత్మయోగమువలన, దర్శితం= చూపబడినది.

శ్రీ భగవానుడు సలికెను - ఓ అర్జునా ! నీపైగల అనుగ్రహమున నా యోగశక్తి ప్రభావముతో నీకు నా విరాట్ - రూపమును ప్రదర్శించితిని. అది మిక్కిలి తేజోమయమైనది. అనంతమైనది, ఆద్యమైనది. దీనిని నీవు తప్ప ఇంతకు ముందు మఱి యెవ్వరును దర్శించలేదు.

48 న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః

న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।

ఏవం రూపః శక్య అహం నృలోకే

ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥

న-వేదయజ్ఞాధ్యయనైః-దానైః-న-చ-క్రియాభిః-న-తపోభిః- ఉగ్రైః

ఏవం-రూపః-శక్యః-అహం-నృలోకే-ద్రష్టుం-త్వదన్యేన- కురుప్రవీర

కురుప్రవీర=అర్జునా, ఏవం రూపః= ఇటువంటి రూపము, అహం=నేను, నృలోకే= మనుష్య లోకమునందు, త్వదన్యేన= నీవుగాక ఇతరునిచేత, వేదయజ్ఞాధ్యయనైః= వేదాధ్యయనము చేతను, యజ్ఞములచేతను, దానైః=దానములచేతను, న=కాను, క్రియాభిః చ= కర్మలచేతను, న=కాను, ఉగ్రైః= తీవ్రమైన, తపోభిః= తపస్సుల చేతను, ద్రష్టుం= చూచుటకు, న శక్యః = సాధ్యమైన వాడను గాను.

ఓ అర్జునా! వేదాధ్యయనములచేగాని, యజ్ఞాచరణములచే గాని, దానములచేగాని, తీవ్రతపశ్చర్యలచేగాని, తదితర పుణ్య కర్మలచేగాని ఈ మానవలోకమున నా ఈ విశ్వరూపమును నీకు దప్ప మఱియొవ్వరికిని చూడశక్యము గాదు.

49 మా తే వ్యథా మా చ విమూఢభావో

దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।

వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం

తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥

మా-తే-వ్యథా-మా-చ-విమూఢభావః-దృష్ట్వా-రూపం-ఘోరం- ఈదృక్- మమ- ఇదం

వ్యపేతభీః-ప్రీతమనాః-పునః-త్వం-తత్- ఏవ- మే-రూపం- ఇదం- ప్రపశ్య

ఈదృక్= ఇట్టి, ఘోరం= భయంకరమైన, మమ=నాయొక్క, ఇదం= ఈ, రూపం= రూపమును, దృష్ట్వా= చూచి, తే=నీకు, వ్యథా=భయము, మా=వలదు, విమూఢభావః చ= చిత్తసంక్షోభమున్ను, మా=వలదు, త్వం=నీవు, వ్యపేతభీః=భయము పోయినవాడవు, ప్రీతమనాః= తృప్తి చెందినవాడవై, మే=నాయొక్క, తదేవ= ఆ పూర్వపు, ఇదం= ఈ, రూపం= రూపమును, పునః=మరల, ప్రపశ్య= దర్శించుము.

ఈ విధమైన నా ఈ భయంకరరూపమును చూచి, నీవు ఎట్టి వ్యథకును, మోహమునకును గురికావలదు. భయమును వీడి ప్రసన్నచిత్తుడవై శంఖచక్ర గదాపద్మములతో విలసిల్లుచున్న నా చతుర్భుజరూపమును మరల దర్శించుము.

50 ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా

స్వకం రూపం దర్శయామాస భూయః ।

ఆశ్వాసయామాస చ భీతమేనం

భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా ॥

ఇతి- అర్జునం- వాసుదేవః- తథా- ఉక్త్వా- స్వకం- రూపం- దర్శయామాస -భూయః

ఆశ్వాసయామాస- చ- భీతం- ఏనం- భూత్వా- పునః- సౌమ్యవపుః- మహాత్మా

మహాత్మా=మహాత్ముడైన, వాసుదేవః= శ్రీకృష్ణుడు, ఇతి= ఇటుల, అర్జునం= అర్జునుని గురించి, ఉక్త్వా= పలికి, తథా=అలాగుననే, స్వకం= తనదైన, రూపం=రూపమును, భూయః=మరల, దర్శయామాస=చూపెను, పునః=మరల, సౌమ్యవపుః=సౌమ్యస్వరూపుడు, భూత్వా=అయి, భీతం= భయపడిన, ఏనం=అర్జునుని, ఆశ్వాసయామాస చ= ఓదార్చెను.

సంజయుడు పలికెను - వాసుదేవుడు -ఈ విధముగా పలికి, అర్జునునకు తన చతుర్భుజరూపమున దర్శనమిచ్చెను. అనంతరము శ్రీకృష్ణపరమాత్మ సౌమ్యమూర్తియైన తన కృష్ణరూపమును స్వీకరించి, భయపడుచున్న అర్జునుని ఓదార్చెను.

అర్జున ఉవాచ

51 దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।

ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥

దృష్ట్వా- ఇదం- మానుషం- రూపం- తవ- సౌమ్యం- జనార్దన

ఇదానీం- అస్మి- సంవృత్తః- సచేతాః- ప్రకృతిం- గతః

జనార్దన= కృష్ణా, తవ=నీయొక్క, ఇదం= ఈ, మానుషం= మనుజసహజమైన, సౌమ్యం= ప్రసన్నమైన, రూపం= రూపమును, దృష్ట్వా= దర్శించి, ఇదానీం= ఇప్పుడు, సచేతాః= ప్రసన్న చిత్తము గలవాడను, ప్రకృతిం= స్వభావమును, గతః= పొందినవాడను, సంవృత్తః అస్మి= అయితిని.

అర్జునుడు పలికెను - ఓ జనార్ధనా ! మీ అతిసౌమ్యమైన మానవాకృతిని (శ్యామసుందరరూపమును) చూచి, ఇప్పుడు నా మనస్సు కుదుటబడినది. నేను నా స్వాభావిక ప్రసన్నతను పొందితిని.

శ్రీ భగవాన్ ఉవాచ

52 సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।

దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥

సుదుర్దర్శం- ఇదం-రూపం-దృష్టవాన్-అపి-యత్-మమ

దేవాః-అపి-అస్య-రూపస్య-నిత్యం-దర్శన కాంక్షిణః

మమ=నాయొక్క, యత్ = ఏదయితే, ఇదం = ఈ, సుదుర్దర్శం= చూడదుర్లభమైన, రూపం= రూపమును, దృష్టవాన్ = చూచినవాడవు, అపి= అయితివో, దేవాః అపి= దేవతలును, నిత్యం= ఎల్లప్పుడు, అస్య= ఈ, రూపస్య= రూపముయొక్క, దర్శనకాంక్షిణః= దర్శనమును కోరువారు.

శ్రీ భగవానుడు పలికెను - నీవు చూచిన నా ఈ చతుర్భుజరూపము యొక్క దర్శనభాగ్యము అన్యులకు అత్యంతదుర్లభము. దేవతలుసైతము ఈ రూపమును దర్శింపగోరుచుందురు.

53 నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।

శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

న-అహం-వేదైః-న-తపసా-న-దానేన-న-చ- ఇజ్యయా

శక్యః- ఏవంవిధః- ద్రష్టుం-దృష్టవాన్- అసి-మాం-యథా

మాం=నన్ను, యథా= ఏవిధముగా, దృష్టవాన్=చూచినవాడవు, అసి=అయితివో, ఏవం విధః= ఇట్టి స్వరూపముగల, అహం=నేను, వేదైః= వేదములచేతను, తపసా= తపస్సుచేతను, ద్రష్టుం=దర్శించుటకు, న శక్యః= శక్యుడనుగాను, దానేన= దానముచేతను, ఇజ్యయా చ= యజ్ఞము చేతను, న=కాను.

నీవు గాంచిన నా రూపమును దర్శించుటకు వేదపఠనములచేగాని, తపశ్చర్యలచేగాని, దానములచేగాని, యజ్ఞకర్మలచేగాని, దర్శింప శక్యముగాదు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

54 భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవంవిధోఽర్జున।

జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

భక్త్యా-తు-అనన్యయా-శక్యః-అహం- ఏవం-విధః-అర్జున

జ్ఞాతుం- ద్రష్టుం-చ-తత్త్వేన-ప్రవేష్టుం-చ-పరంతప

పరంతప=అర్జునా, ఏవం విధః= ఇట్టి విశ్వరూపుడనైన, అహం=నేను, అనన్యయా= అనన్యమైన, భక్త్యా తు= భక్తిచేతనే, తత్త్వేన= యథార్థముగ, జ్ఞాతుం= తెలిసికొనుటకు, ద్రష్టుం చ= చూచుటకును, ప్రవేష్టుం చ = ప్రవేశించుటకును, శక్యః= శక్యుడను, అర్జున=అర్జునా.

కాని ఓ పరంతపా ! అర్జునా! ఇట్టి నా రూపమును ప్రత్యక్షముగా చూచుటకును, తత్త్వజ్ఞానమును పొందుటకును, అందు ప్రవేశించుటకును కేవలము అనన్యభక్తి యే సాధనము.

55 మత్కర్మకృత్ మత్పరమో మద్భక్తః సంగవర్జితః।

నిర్వైరః సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥

మత్కర్మకృత్-మత్పరమః-మద్భక్తః-సంగవర్జితః

నిర్వైరః-సర్వభూతేషు-యః-సః-మాం- ఏతి-పాండవ

పాండవ=అర్జునా, మత్కర్మకృత్=నా కొరకు కర్మలు చేయువాడు, మత్పరమః= నాయందాసక్తి గలవాడు, మద్భక్తః= నాయందే భక్తి గలవాడు, సంగవర్జితః= సంగమును విడిచినవాడు, సర్వభూతేషు= సమస్త భూతము లందును, నిర్వైరః= వైరము లేనివాడును, యః= ఎవడో, సః=వాడు, మాం=నన్ను, ఏతి= పొందుచున్నాడు.

అర్జునా! కర్తవ్యకర్మలను అన్నింటిని నాకే అర్పించు వాడును, మత్పరాయణుడును, నాయందు భక్తిశ్రద్ధలు గలవాడును, ప్రాపంచిక విషయములయందు ఆసక్తిలేని వాడును, ఏ ప్రాణియందును ఏమాత్రము వైరభావము లేనివాడును ఐన పరమ భక్తుడు మాత్రమే నన్ను పొందుచున్నాడు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగో నామ

ఏకాదశోఽధ్యాయః ॥

ఓం శ్రీ పరమాత్మనే నమః

అథ ద్వాదశోఽధ్యాయః - భక్తియోగః

అర్జున ఉవాచ

1 ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।

యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥

ఏవం-సతతయుక్తాః-యే-భక్తాః-త్వాం-పర్యుపాసతే

యే-చ-అపి-అక్షరం-అవ్యక్తం-తేషాం-కే-యోగవిత్తమాః

ఏవం= ఈవిధముగా, సతతయుక్తాః= సదా నీయందే చిత్తమును ఉంచి, యే= ఎవ్వరయితే, భక్తాః= భక్తులు, త్వాం=నిన్ను, పర్యుపాసతే= ఉపాసించుచున్నారో, యే చ= ఎవరయితే,, అవ్యక్తం= వ్యక్తముగాని, అక్షరం అపి=అక్షరబ్రహ్మమును, పర్యుపాసతే= ఉపాసించుచున్నారో, తేషాం=వారలలో, కే= ఎవరు, యోగవిత్తమాః= యోగము నెరిగినవారు.

అర్జునుడు పలికెను - ఓ కృష్ణా ! అనన్యభక్తితో పూర్వోక్తరీతిగా నిరంతరము నిన్నే భజించుచు, ధ్యానించుచు, పరమేశ్వరుడవైన నీ సగుణరూపమును ఆరాధించువారును, కేవలము అక్షరుడవగు పరబ్రహ్మవైన నిన్ను అత్యంతభక్తిభావముతో సేవించువారును కలరు. ఈ రెండువిధములైన ఉపాసకులలో అత్యుత్తమ యోగులెవరు ?

శ్రీ భగవాన్ ఉవాచ

2 మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।

శ్రద్ధయా పరయోపేతాః తే మే యుక్తతమా మతాః ॥

మయి- ఆవేశ్య-మనః-యే-మాం-నిత్యయుక్తాః- ఉపాసతే

శ్రద్ధయా-పరయా- ఉపేతాః-తే-మే-యుక్తతమాః-మతాః

మయి=నాయందు, మనః=మనస్సును, ఆవేశ్య=నిలిపి, నిత్యయుక్తాః= నిత్యయుక్తులై, పరయా= ఉత్తమమైన, శ్రద్ధయా= శ్రద్ధతో, ఉపేతాః= కూడినవారై, యే= ఎవరు, మాం= నన్ను, ఉపాసతే= ఉపాసించుచున్నారో, తే=వారు, మే=నాకు, యుక్తతమాః= ఉత్తమయోగులని, మతాః= అభిప్రాయము.

శ్రీ భగవానుడు ఇట్లనెను - పరమేశ్వరుడనైన నాయందే ఏకాగ్రచిత్తులై, నిరంతరము నా భజనధ్యానాదులయందే నిమగ్నులై, అత్యంతశ్రద్ధాభక్తులతో నన్ను ఆరాధించు భక్తులే యోగశ్రేష్ఠులని నా అభిప్రాయము.

3 యే త్వక్షరమనిర్దేశ్యమ్ అవ్యక్తం పర్యుపాసతే ।

సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥

యే-తు-అక్షరం-అనిర్దేశ్యం-అవ్యక్తం-పర్యుపాసతే

సర్వత్రగం-అచింత్యం-చ-కూటస్థం-అచలం-ధ్రువం

యే తు= ఎవరయితే, అనిర్దేశ్యం=నిర్వచించుటకు వీలులేనిది, అవ్యక్తం= వ్యక్తముగాని, సర్వత్రగం=అంతటా వ్యాపించునదియు, అచింత్యం= చింతించుటకు వీలుకానిదియు, అచలం= స్థిరమైనదియు, ధ్రువం= నిత్యమైనదియు, కూటస్థం చ = కూటస్థము నైన, అక్షరం= క్షరముగాని బ్రహ్మమును, పర్యుపాసతే= ఉపాసించుచున్నారో. . .

ఎవరయితే , సర్వవ్యాప్తి ఐనవాడును, మనసుకు, బుద్ధికి అందనివాడును , నిశ్చలుడు, నిత్యుడు, అయిన పరబ్రహ్మను ఉపాసింతురో. . .

4 సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।

తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥

సంనియమ్య- ఇంద్రియగ్రామం-సర్వత్ర-సమబుద్ధయః

తే-ప్రాప్నువంతి-మాం- ఏవ- సర్వభూతహితే-రతాః

ఇంద్రియగ్రామం= సర్వేంద్రియములను, సంనియమ్య= నియమించి, సర్వత్ర= అంతటను, సమబుద్ధయః= సమబుద్ధిగలవారై, సర్వభూతహితే= సర్వభూతముల క్షేమమునందు, రతాః=రమించువారై, తే=వారు, మాం ఏవ= నన్నే, ప్రాప్నువంతి= పొందుదురు.

వారు ఇంద్రియ నిగ్రహంకల్గి సకలప్రాణులకు హితము చేయుచు నన్నే పొందుదురు.

5 క్లేశోధికతరస్తేషామ్ అవ్యక్తాసక్తచేతసామ్ ।

అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

క్లేశః-అధికతరః-తేషాం-అవ్యక్తాసక్త చేతసాం

అవ్యక్తా-హి-గతిః-దుఃఖం-దేహవద్భిః-అవాప్యతే

అవ్యక్తాసక్తచేతసాం=అవ్యక్తమునందు ఆసక్తి గల చిత్తము గల్గిన, తేషాం=వారికి, క్లేశః=కష్టము, అధికతరః=అధికము, అవ్యక్తా=అవ్యక్తవిషయమైన, గతిః=గతి, దుఃఖం= బాధగాను, దేహవద్భిః= దేహాభిమానము గలవారలచే, అవాప్యతే హి=పొందబడుచున్నది గదా.

కాని పరబ్రహ్మమునందు ఆసక్తి గల చిత్తముగల్గిన వారు తత్ప్రాప్తికై చేయు సాధన మిక్కిలి శ్రమతో గూడినది. ఏలనన దేహాభిమానులకు అవ్యక్త పరబ్రహ్మ ప్రాప్తి అతికష్టముగా పొందుబడుచున్నది.

6 యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।

అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥

యే-తు-సర్వాణి-కర్మాణి-మయి-సంన్యస్య-మత్పరాః

అనన్యేన- ఏవ-యోగేన-మాం-ధ్యాయంత- ఉపాసతే

పార్థ=అర్జునా, మత్పరాః=నేనే పరమగతియనెడి వారలు, యే తు= ఎవరైతే, సర్వాణి= సర్వములైన, కర్మాణి=కర్మలను, మయి=నాయందు, సంన్యస్య= సమర్పించి, అనన్యేన= ఏకాంతమైన, యోగేన ఏవ= యోగముచే, మాం= నన్ను, ధ్యాయంత=ధ్యానము చేయుచు, ఉపాసతే= ఉపాసించుచుందురో, మయి= నాయందు, ఆవేశిత చేతసాం = ఉంచబడిన మనస్సుగల, తేషాం= వారలను, అహం=నేను, నచిరాత్= త్వరలోనే, మృత్యుసంసార సాగరాత్= జననమరణ సంసార సాగరమునుండి, సముద్ధర్తా= ఉద్ధరించువాడను, భవామి= అగుచున్నాను.

7 తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।

భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్ ॥

తేషాం-అహం-సముద్ధర్తా-మృత్యుసంసారసాగరాత్

భవామి-నచిరాత్-పార్థ-మయి- ఆవేశిత చేతసాం

ఓ అర్జునా ! నాయందే లగ్నమనస్కులైన అట్టి పరమభక్తులను నేను శీఘ్రముగనే మృత్యురూపసంసార సాగరమునుండి ఉద్ధరింతును.

8 మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।

నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥

మయి- ఏవ-మనః- ఆధత్స్వ-మయి-బుద్ధిం-నివేశయ

నివసిష్యసి-మయి- ఏవ-అతః- ఊర్ధ్వం-న-సంశయః

మయి ఏవ= నాయందే, మనః=మనస్సును, ఆధత్స్వ= ఉంచుము, మయి=నాయందే, బుద్ధిం=బుద్ధిని, నివేశయ= ప్రవేశపెట్టుము, అతః ఊర్ధ్వం= అటుపిమ్మట, మయి ఏవ= నాయందే, నివసిష్యసి= నివసింతువు, న సంశయః= సందేహము లేదు.

నా యందే మనస్సును నిలుపుము. నా యందే బుద్ధిని లగ్నము చేయుము. పిమ్మట నా యందే స్థిరముగానుందువు. ఇందు ఏ మాత్రమూ సందేహం అవసరం లేదు.

9 అథ చిత్తం సమాధాతుం న శక్నోషిమయి స్థిరమ్ ।

అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ॥

అథ-చిత్తం-సమాధాతుం-న-శక్నోషి-మయి-స్థిరం

అభ్యాసయోగేన-తతః-మాం- ఇచ్ఛ- ఆప్తుం-ధనంజయ

ధనంజయా=అర్జునా, అథ= ఇంకను, మయి=నాయందు, స్థిరం= నిలకడగ, చిత్తం=మనస్సును, సమాధాతుం=నిలుపుటకు, న శక్నోషి=అశక్తుడవైనచో, తతః=అటుపైన, అభ్యాసయోగేన=అభ్యాసయోగముచేత, మాం=నన్ను, ఆప్తుం=పొందుటకు, ఇచ్ఛ=అభిలషింపుము.

మనస్సును సుస్థిరముగా నాయందే నిల్పుటకు సమర్థుడవు కానిచో అర్జునా ! అభ్యాసయోగము ద్వారా నన్ను పొందుటకు యత్నించు.

10 అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।

మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥

అభ్యాసే-అపి-అసమర్థః-అసి-మత్కర్మపరమః-భవ

మదర్థం-అపి-కర్మాణి-కుర్వన్-సిద్ధిం-అవాప్స్యసి

అభ్యాసే అపి=అభ్యాసయోగమునందును, అసమర్థః= అసమర్థుడవు, అసి=అయినచో, మత్కర్మ పరమః= నా నిమిత్తమైన కర్మయందు పరాయణుడవు, భవ=కమ్ము, కర్మాణి= కర్మలను, మదర్థం= నా కొరకు, కుర్వన్ అపి= చేయుచున్నను, సిద్ధిం=సిద్ధిని, అవాప్స్యసి=పొందగలవు.

అభ్యాసముచేయుటకును అశక్తుడవైనచో మత్పరాయణుడవై కర్మలను ఆచరింపుము. ఈ విధముగా నా నిమిత్తమై కర్మలను ఆచరించుటద్వారాకూడ నీవు సిద్ధిని పొందగలవు.

11 అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।

సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥

అథ- ఏతత్-అపి-అశక్తః-అసి-కర్తుం-మద్యోగం- ఆశ్రితః

సర్వకర్మఫలత్యాగం-తతః-కురు-యతాత్మవాన్

అథ= ఇంకను, ఏతత్ అపి= ఇదికూడా, కర్తుం= చేయుటకు, అశక్తః= అశక్తుడవు, అసి=అయినచో, తతః= ఆ తరువాత, మద్యోగం= నాయోగమును, ఆశ్రితః= ఆశ్రయించినవాడవై, యతాత్మవాన్= నిగ్రహవంతుడవై, సర్వకర్మఫలత్యాగం= సర్వకర్మల యొక్క ఫలత్యాగమును, కురు=చేయుము.

మత్ప్రాప్తికై వలయు యోగమునాశ్రయించి సాధన చేయుటకును నీవు అశక్తుడవైనచో మనోబుద్ధీంద్రియాదులను వశమునందు ఉంచుకొని, కర్మఫలాసక్తిని వదిలి కర్మలనాచరింపుము.

12 శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।

ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥

శ్రేయః-హి-జ్ఞానం-అభ్యాసాత్-జ్ఞానాత్-ధ్యానం-విశిష్యతే

ధ్యానాత్-కర్మఫలత్యాగః-త్యాగాత్-శాంతిః-అనంతరం

అభ్యాసాత్=అభ్యాసముకంటెను, జ్ఞానం=జ్ఞానము, శ్రేయః=శ్రేష్ఠము, జ్ఞానాత్=జ్ఞానము కంటెను, ధ్యానం=ధ్యానము, విశిష్యతే హి= విశిష్టమైనదియే, ధ్యానాత్= ధ్యానముకంటెను, కర్మఫలత్యాగః= కర్మఫలత్యాగము, త్యాగాత్= త్యాగమువలన, అనంతరం= తరువాత, శాంతిః=శాంతియును.

తత్త్వము నెఱుంగకయే చేయు అభ్యాసముకంటెను జ్ఞానము శ్రేష్ఠము. కేవలము పరోక్షజ్ఞానముకంటెను అనగా అనుభవ రహితమైన జ్ఞానముకంటెను (శాస్త్ర పాండిత్యము కంటెను) పరమేశ్వరస్వరూపధ్యానము శ్రేష్ఠము. ధ్యానము కంటెను కర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఏలనన త్యాగమువలన వెంటనే పరమశాంతి లభిస్తుంది.

13 అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।

నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥

అద్వేష్టా-సర్వభూతానాం-మైత్రంః-కరుణః- ఏవ-చ

నిర్మమః-నిరహంకారః-సమదుఃఖసుఖః-క్షమీ

సర్వభూతానం= సకలభూతములందు, అద్వేష్టా=ద్వేషము లేనివాడు, మైత్రః= మైత్రి కలవాడు, కరుణః ఏవ చ = దయగలవాడు, నిర్మమః= మమకారము లేనివాడు, నిరహంకారః=అహంకారము లేనివాడు, సమదుఃఖసుఖః= సుఖదుఃఖముల యందు సమముగ నుండెడివాడు, క్షమీ= సహనశీలుడు....

ఏ ప్రాణియందును ద్వేషభావము లేనివాడును, పైగా సర్వప్రాణుల యందును అవ్యాజమైనప్రేమ, కరుణ కలవాడును, మమత అహంకారములు లేనివాడును, సుఖము ప్రాప్తించినను, దుఃఖము ప్రాప్తించినను, సమభావము కలిగియుండు వాడును, క్షమాగుణము కలవాడును

14 సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః ॥

సంతుష్టః-సతతం-యోగీ-యతాత్మా-దృఢనిశ్చయః ।
మయి-అర్పితమనోబుద్ధిః-యః-మద్భక్తః-సః-మే-ప్రియః

సతతం= సదా, సంతుష్టః= సంతృప్తి చెందినవాడు, యోగీ=యోగయుక్తుడు, యతాత్మా= ఆత్మనిగ్రహము కలవాడు, దృఢ నిశ్చయః= దృఢసంకల్పము గలవాడు, మయి=నాయందు, అర్పిత మనోబుద్ధిః= నిలిపిన మనోబుద్ధులు గలవాడు, మద్భక్తః= నా భక్తుడు, యః= ఎవరో, సః=వాడు, మే=నాకు, ప్రియః=ప్రియుడు.

సర్వకాల సర్వావస్థలయందును సంతుష్టుడై యుండు యోగియు, శరీరేంద్రియ మనస్సులను వశము నందుంచుకొనినవాడును, నాయందు దృఢమైన నిశ్చయము గలవాడును, అయి నాయందే మనోబుద్ధులను అర్పణ చేసిన నా భక్తుడు నాకు ఇష్టుడు.

15 యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైః ముక్తోయస్స చ మే ప్రియః ॥

యస్మాత్-న- ఉద్విజతే-లోకః-లోకాత్-న- ఉద్విజతే-చ-యః
హర్షామర్షభయోద్వేగైః-ముక్తః-యః-సః-చ-మే-ప్రియః

యస్మాత్= ఎవనివలన, లోకః=లోకము, న ఉద్విజతే= భయపడదో, లోకాత్ చ = లోకము వలన, యః = ఎవడు, న ఉద్విజతే= భయపడడో, హర్షామర్షభయోద్వేగైః = సంతోషము, క్రోధము భయము, ఉద్వేగముల నుండి, ముక్తః= ముక్తుడు, యః= ఎవడో, సః చ=వాడును, మే=నాకు, ప్రియః= ప్రియుడు.

లోకమున ఎవరికిని ఉద్వేగము కలిగింపనివాడును, ఎవరివలనను తాను ఉద్వేగమునకు గురికానివాడును, హర్షము, ఈర్ష్య, భయము మున్నగు వికారములు లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు.

16 అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।

సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥

అనపేక్షః-శుచిః-దక్షః- ఉదాసీనః-గతవ్యథః

సర్వారంభ పరిత్యాగీ-యః-మద్భక్తః-సః-మే-ప్రియః

అనపేక్షః=కోరికలేనివాడు, శుచిః=పరిశుద్ధుడు, దక్షః=సమర్థుడు, ఉదాసీనః= నిర్లిప్తుడు, గతవ్యథః= అంతరించిన విచారము గలవాడు, సర్వారంభపరిత్యాగీ= సర్వకర్మల లోని కర్తృత్వము విడిచినవాడు, మద్భక్తః= నా భక్తుడు, యః= ఎవడో, సః=వాడు, మే=నాకు, ప్రియః=ప్రియుడు.

ఏ మాత్రమూ కాంక్షలేనివాడును, శరీరేంద్రియమనస్సుల యందు శుచియై యున్నవాడును, దక్షుడును, పక్షపాతరహితుడును, ఎట్టి దుఃఖములకును చలింపనివాడును, సమస్తకర్మలయందును కర్తృత్వాభిమానములు లేనివాడును అగు భక్తుడు నాకు ప్రియుడు.

17 యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।

శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥

యః-న-హృష్యతి-న-ద్వేష్టి-న-శోచతి-న-కాంక్షతి

శుభాశుభ పరిత్యాగీ-భక్తిమాన్-యః-సః-మే-ప్రియః

యః= ఎవడు, న హృష్యతి= సంతసించడో, న ద్వేష్టి= ద్వేషింపడో, న శోచతి=శోకింపడో, న కాంక్షతి= అభిలషింపడో, శుభాశుభపరిత్యాగీ = శుభాశుభ కర్మములను విడిచినవాడైన, భక్తిమాన్= భక్తుడు, యః= ఎవడో, సః=వాడు, మే=నాకు, ప్రియః= ఇష్టుడు.

ఇష్టవస్తుప్రాప్తికి పొంగిపోనివాడును, దేనియందును ద్వేషభావము లేనివాడును, దేనికినీ శోకింపనివాడును, దేనినీ ఆశింపనివాడును, శుభాశుభకర్మలను త్యజించిన వాడును, ఐన భక్తుడు నాకు ఇష్టుడు.

18 సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః।

శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥

సమః-శత్రౌ-చ-మిత్రే-చ-తథా-మానాపమానయోః

శీతోష్ణ-సుఖదుఃఖేషు-సమః-సంగవివర్జితః

శత్రౌచ= శత్రువునందును, మిత్రేచ = మిత్రునియందును, తథా=అటులే, మానాపమానయోః = మానావమానములయందును, సమః=సముడు, శీతోష్ణసుఖదుఃఖేషు సమః= శీతోష్ణముల యందును సుఖదుఃఖముల యందును సముడు, సంగవివర్జితః= సంగత్వము లేనివాడు, తుల్య నిందాస్తుతిః= నిందాస్తుతులను సమముగా నెంచువాడు, మౌనీ= మననశీలుడు, యేనకేనచిత్=దేని చేతనైనను, సంతుష్టః= తృప్తి నొందినవాడు, అనికేతః= ఇల్లు లేనివాడు, స్థిరమతిః=స్థిరబుద్ధిగలవాడు, భక్తిమాన్= భక్తిమంతుడునైన, నరః=మానవుడు, మే=నాకు, ప్రియః= ఇష్టుడు.

శత్రువులయెడను, మిత్రులయెడను సమభావముతో మెలుగువాడును, మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సమానముగా స్వీకరించువాడును, ఆసక్తిరహితుడును...

19 తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।

అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః॥

తుల్యనిందాస్తుతిః-మౌనీ-సంతుష్టః-యేన-కేనచిత్

అనికేతః-స్థిరమతిః-భక్తిమాన్-మే-ప్రియః-నరః

నిందాస్తుతులకు చలింపనివాడును, మననశీలుడును, శరీరనిర్వహణకై లభించిన దానితోడనే తృప్తిపడు వాడును, గృహాదుల యందు మమతాసక్తులు లేనివాడును, స్థిరబుద్ధి కలిగియుండు భక్తుడెవ్వడో వాడు నా కిష్టుడు.

20 యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।

శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥

యే-తు-ధర్మ్యామృతం- ఇదం-యథా- ఉక్తం-పర్యుపాసతే

శ్రద్దధానాః-మత్పరమాః-భక్తాః-తే-అతీవ-మే-ప్రియాః

యే తు= ఎవరయితే, శ్రద్దధానాః= శ్రద్ధగలవారై, మత్పరమాః= నాయందాసక్తిగలవారై, యథా ఉక్తం = పైన తెలిపిన విధముగా, ఇదం= ఈ, ధర్మ్యామృతం= ధర్మరూపమైన అమృతమును, పర్యుపాసతే= సేవించుచున్నారో, తే= ఆ, భక్తాః=భక్తులు, మే=నాకు, అతీవప్రియాః= మిగుల ఇష్టులు.

శ్రద్ధావంతులై, నన్నేపరమగతిగాభావించి, ఇంతవరకు నే తెలిపిన ఈ ధర్మస్వరూపమైన అమృతమును ఎవరు సేవిస్తున్నారో వారు నాకు అత్యంత ప్రియులు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగోనామ

ద్వాదశోఽధ్యాయః ॥

అథ త్రయోదశోఽధ్యాయః

క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।

ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

ఇదం-శరీరం-కౌంతేయ-క్షేత్రం- ఇతి- అభిధీయతే

ఏతత్-యః-వేత్తి-తం-ప్రాహుః-క్షేత్రజ్ఞః- ఇతి-తద్విదః

కౌంతేయ=అర్జునా, ఇదం= ఈ, శరీరం= శరీరము, క్షేత్రం ఇతి= క్షేత్రమని, అభిధీయతే= చెప్పబడుచున్నది, ఏతత్= క్షేత్రమును, యః= ఎవ్వడు, వేత్తి=తెలిసికొనుచున్నాడో, తం=వానిని, క్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞుడు, ఇతి=అని, తత్ విదః= తద్విదులు, ప్రాహుః=చెప్పిరి.

శ్రీ భగవానుడు పలికెను - ఓ కౌంతేయా ! ఈ శరీరమును క్షేత్రము అని పేర్కొందురు. ఈ క్షేత్రమును గూర్చి ఎఱింగినవానిని క్షేత్రజ్ఞుడు అని తత్త్వజ్ఞులు తెలిపిరి.

2 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।

క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥

క్షేత్రజ్ఞం-చ-అపి-మాం-విద్ధి-సర్వక్షేత్రేషు-భారత

క్షేత్రక్షేత్రజ్ఞయోః-జ్ఞానం-యత్-తత్-జ్ఞానం-మతం-మమ

భారత= అర్జునా, సర్వక్షేత్రేషు= సర్వక్షేత్రముల యందు, మాం చ=నన్నే, క్షేత్రజ్ఞం అపి=క్షేత్రజ్ఞునిగ, విద్ధి= ఎరుగుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః=క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, జ్ఞానం= జ్ఞానము, యత్ = ఏదో, తత్= అది, జ్ఞానము, మమ= నాయొక్క, మతం అభిప్రాయము.

ఓ అర్జునా ! అన్ని క్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుడను అనగా జీవాత్మను నేనే అని తెలిసికొనుము. క్షేత్రక్షేత్రజ్ఞులకు సంబంధించిన జ్ఞానము అనగా త్రిగుణాత్మక మైన ప్రకృతి మరియు నిర్వికారపురుషుల తత్త్వములను గూర్చి తెలిసికొనుటయే జ్ఞానము అని నా అభిప్రాయము.

3 తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।

స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥

తత్-క్షేత్రం-యత్-చ-యాదృక్-చ-యద్వికారి-యతః-చ-యత్

సః-చ-యః-యత్ప్రభావః-చ-తత్-సమాసేన-మే-శృణు

తత్= ఆ , క్షేత్రం= క్షేత్రము, యత్ చ= ఏదియో, యాదృక్ చ= ఏవిధమైనదియో, యత్ వికారి= ఎటువంటి వికారము గలదియో, యతః చ యత్= ఎచ్చటినుండి ఏదియో, సః చ= ఆ క్షేత్రజ్ఞుడు, యః= ఎవడో, యత్ ప్రభావః చ= ఎట్టిమహిమ గలవాడో, తత్= ఆ వివరమును, సమాసేన= సంక్షేపముగా, మే= నావలన, శృణు= వినుము.

క్షేత్రమనగానేమి ? అది యెట్లుండును ? దాని వికారములు ఏవి ? ఆ వికారములు దేనినుండి ఏర్పడినవి ? అట్లే క్షేత్రజ్ఞుడు అనగా ఎవరు ? అతనిప్రభావమేమి ? ఆ వివరములను అన్నింటిని సంక్షిప్తముగా చెప్పెదము వినుము.

4 ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్।

బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥

ఋషిభిః-బహుధా-గీతం-ఛందోభిః-వివిధైః-పృథక్

బ్రహ్మసూత్రపదైః-చ- ఏవ-హేతుమద్భిః-వినిశ్చితైః

ఋషిభిః=ఋషులచేత, బహుధా= అనేకవిధములుగ, పృథక్= వేరుగా, వివిధైః= అనేకములైన, ఛందోభిః= వేదములచేత, హేతుమద్భిః= సహేతుకములైనవియు, వినిశ్చితైః= నిశ్చయమైనవియునగు, బ్రహ్మసూత్రపదైః చ ఏవ= బ్రహ్మసూత్రపదముల చేత, గీతం= చెప్పబడినది.

క్షేత్ర , క్షేత్రజ్ఞులతత్త్వములనుగూర్చి ఋషులెల్లరును బహువిధములుగా చెప్పిరి, వివిధ వేదమంత్రములను వేర్వేరుగా తెల్పినవి. అట్లే బ్రహ్మసూత్ర పదములుగూడ నిశ్చయాత్మకముగ సహేతుకముగ నిర్ణయించి చెప్పినవి.

5 మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।

ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ॥

మహాభూతాని-అహంకారః-బుద్ధిః-అవ్యక్తం- ఏవ-చ

ఇంద్రియాణి-దశ- ఏకం-చ- పంచ-చ- ఇంద్రియగోచరాః

మహాభూతాని=పంచభూతములు, అహంకారః=అహంకారము, బుద్ధిః=బుద్ధి, అవ్యక్తం ఏవ చ=అవ్యక్తమును, దశ ఇంద్రియాణి= పది ఇంద్రియములు, ఏకం చ= మనస్సును, ఇంద్రియగోచరాః= ఇంద్రియ విషయములు, పంచ చ=అయిదును, ఇచ్ఛా=కోరిక, ద్వేషః= ద్వేషము, సుఖం=సుఖము, దుఃఖం= దుఃఖము, సంఘాతః= సమూహము, చేతనా=చేతనత్వము, ధృతిః= ధైర్యము, ఏతత్= ఇది, క్షేత్రం= క్షేత్రము, సమాసేన= సంక్షేపముగా, సవికారం= వికార సహితముగా, ఉదాహృతం=చెప్పబడినది.

పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, మూల ప్రకృతియు, అట్లే దశేంద్రియములు, మనస్సు, పంచేంద్రియ గ్రాహ్య విషయములు.

6 ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।

ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ ॥

ఇచ్ఛా-ద్వేషః-సుఖం-దుఃఖం-సంఘాతః-చేతనా-ధృతిః

ఏతత్-క్షేత్రం-సమాసేన-సవికారం - ఉదాహృతం

ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, స్థూలశరీరము, చైతన్యము,ధృతి అను వికారములతో గూడిన దియే క్షేత్రము.

7 అమానిత్వమదంభిత్వమ్ అహింసా క్షాంతిరార్జవమ్ ।

ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥

అమానిత్వం-అదంభిత్వం-అహింసా-క్షాంతిః- ఆర్జవం

ఆచార్యోపాసనం-శౌచం-స్థైర్యం- ఆత్మవినిగ్రహః

అమానిత్వం=అభిమానము లేకుండుట, అదంభిత్వం= దంభము లేకుండుట, అహింసా= అహింసయు, క్షాంతిః=సహనము, ఆర్జవం=ఋజుత్వము, ఆచార్యోపాసనం= ఆచార్యసేవ, శౌచం= శుభ్రత, స్థైర్యం=స్థిరత్వము, ఆత్మవినిగ్రహః = ఆత్మనిగ్రహము.

తానే శ్రేష్ఠుడనను భావము లేకుండుట, డాంబికము లేకుండుట, అహింస, క్షమించుగుణము, మనోవాక్కుల యందు సరళత్వము, శ్రద్ధాభక్తులతో గురుజనులను సేవించుట, బాహ్యాభ్యంతరశుద్ధి, అంతఃకరణస్థిరత్వము, మనశ్శరీరేంద్రియముల నిగ్రహము.

8 ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ అనహంకార ఏవ చ ।

జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥

ఇంద్రియార్థేషు-వైరాగ్యం-అనహంకారః- ఏవ-చ

జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనం

ఇంద్రియార్థేషు= ఇంద్రియ విషయములయందు, వైరాగ్యం= విరక్తి, అనహంకారః= నిరహంకారము, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనం= జననము, మరణము, ముసలితనము, వ్యాధులవలన కలిగెడి దుఃఖ దోషములను గ్రహించుట

ఇంద్రియార్థములయందు వైరాగ్యము అహంకార రాహిత్యము, జన్మ, మృత్యు, ముసలితనము రోగాదుల యందు దుఃఖదోషములను దర్శించుట.

9 అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।

నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్టానిష్టోపపత్తిషు ॥

అసక్తిః-అనభిష్వంగః-పుత్రదారగృహాదిషు

నిత్యం-చ-సమచిత్తత్వం- ఇష్టానిష్టోపపత్తిషు

పుత్రదారగృహాదిషు=పుత్రుడు, సతి, గృహాదులయందు, అసక్తిః= ఆసక్తి లేకుండుట, అనభిష్వంగః= ప్రీతిలేకుండుట, ఇష్టానిష్టోపపత్తిషు= ఇష్టానిష్టములయందు, నిత్యం = ఎల్లప్పుడును, సమచిత్త్వం చ = సమబుద్ధియును.

భార్య, పుత్రులు, ఇల్లు, సంపదలు మున్నగువానియందు మమతాసక్తులు లేకుండుట, ఇష్టానిష్ట వస్తుప్రాప్తివలన ఎట్టి మనోవికారములకును లోనుగాకుండుట, ఎల్లప్పుడును సమబుద్ధిని కలిగియుండుట మరియు

10 మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।

వివిక్తదేశసేవిత్వమ్ అరతిర్జనసంసది ॥

మయి-చ-అనన్యయోగేన-భక్తిః-అవ్యభిచారిణి

వివిక్తదేశసేవిత్వం-అరతిః-జనసంసది

మయి= నాయందు, అనన్యయోగేన= అనన్యయోగముచేత, అవ్యభిచారిణీ= మార్పులేని, భక్తిః చ = భక్తియును, వివిక్తదేశ సేవిత్వం= ఏకాంత ప్రదేశమునందుండుట, జనసంసది= ప్రజాసమూహము నందు, అరతిః= ఇష్టములేని.

పరమేశ్వరుడనైన నాయందు అనన్యయోగముద్వారా అవ్యభిచారిణీభక్తి కలిగియుండుట, ఏకాంతపవిత్రప్రదేశమున వసించు ప్రవృత్తి కలిగియుండుట, విషయాసక్తులైన జనులయెడ ప్రీతి లేకుండుట.

11 అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।

ఏతద్జ్ఞానమితి ప్రోక్తమ్ అజ్ఞానం యదతోఽన్యథా ॥

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం-తత్త్వజ్ఞానార్థదర్శనం

ఏతత్-జ్ఞానం- ఇతి-ప్రోక్తం-అజ్ఞానం-యత్-అతః-అన్యథా

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం= ఆత్మజ్ఞాన నిత్యత్వము, తత్త్వజ్ఞానార్థదర్శనం ఏవ చ= తత్త్వజ్ఞాన స్వరూపానుభవము, ఏతత్= ఇదియంతయు, జ్ఞానం= జ్ఞానము, ఇతి= అని, ప్రోక్తం= చెప్పబడినది, అతః= దీనికంటెను, అన్యథా= వేరుగా, యత్= ఏదియో, తత్=అది, అజ్ఞానం= అజ్ఞానము.

ఆధ్యాత్మికజ్ఞానమునందు నిత్యస్థితుడై యుండుట, తత్త్వజ్ఞానమునకు ప్రతిపాద్యుడు భగవంతుడేయని యెఱుంగుట - ఇవియన్నియును జ్ఞానప్రాప్తికి సాధనములు. దీనికి అన్యమైన దంతయు అజ్ఞానము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

12 జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।

అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥

జ్ఞేయం-యత్-తత్-ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-అమృతం-అశ్నుతే

అనాదిమత్-పరం-బ్రహ్మ-న-సత్-తత్-న-అసత్- ఉచ్యతే

జ్ఞేయం= తెలియదగినది, యత్ = ఏదియో, యత్=దేనిని, జ్ఞాత్వా= తెలిసికొని, అమృతం= మోక్షమును, అశ్నుతే= పొందుచున్నాడో, తత్=దానిని, ప్రవక్ష్యామి=చెప్పుచున్నాను, తత్=అది, అనాదిమత్= ఆదిలేనిది, పరంబ్రహ్మ=పరబ్రహ్మ, సత్= సత్తు, న ఉచ్యతే= చెప్పబడదు, అసత్= అసత్తని, న ఉచ్యతే= చెప్పబడదు.

అనాదియైన పరబ్రహ్మయే తెలిసికొనదగినవాడు. అతనిని తెలిసికొనుట వలన మానవుడు పరమానందమును పొందును. అతడు సదసత్తులకు అతీతుడు. ఆ పరమాత్మనుగూర్చి సమగ్రముగా నీకు చెప్పుచున్నాను.

13 సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।

సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

సర్వతః-పాణిపాదం-తత్-సర్వతః-అక్షిశిరోముఖం

సర్వతః-శ్రుతిమత్-లోకే-సర్వం- ఆవృత్య-తిష్ఠతి

తత్=అది, సర్వతః=అంతటను, పాణిపాదం=చేతులుకాళ్ళుకలది, సర్వతః= అంతటను, అక్షిశిరోముఖం = కనులు తలలు నోరులు గలది, సర్వతః=అంతటను, శ్రుతిమత్= చెవులుగలది, లోకే=లోకమునందు, సర్వం= సమస్తమును, ఆవృత్య= ఆవరించి, తిష్ఠతి= ఉన్నది.

ఆ పరమాత్మని చేతులు, పాదములు, నేత్రములు, చెవులు, శిరస్సులు, ముఖములు సర్వత్ర స్థితములై యున్నవి. అది సర్వత్రా వ్యాపించియున్నది.

14 సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।

అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥

సర్వేంద్రియగుణాభాసం-సర్వేంద్రియవివర్జితం

అసక్తం-సర్వభృత్-చ- ఏవ-నిర్గుణం-గుణభోక్తృచ

తత్=అది, సర్వేంద్రియ గుణాభాసం= సకల ఇంద్రియముల గుణములను ప్రకాశింప జేయునదియు, సర్వేంద్రియ వివర్జితం= సర్వేంద్రియరహితమును, అసక్తం= నిస్సంగమైనదియు, సర్వభృత్=అన్నిటికి ఆధారమైనదియు, నిర్గుణం ఏవ చ= త్రిగుణరహితమైకూడ, గుణభోక్తృచ = గుణములననుభవించునదియు

అతడు ఇంద్రియగ్రాహ్యవిషయములను అన్నింటిని ఎఱిగినవాడు. కాని వాస్తవముగా ఇంద్రియాదులకు అతీతుడు. ఆసక్తిరహితుడైనను సమస్తజగత్తును భరించి పోషించువాడు. అతడు గుణాతీతుడయ్యును ప్రకృతి సంబంధమువలన గుణములను అనుభవించుచున్నాడు.

15 బహిరంతశ్చ భూతానామ్ అచరం చరమేవ చ ।

సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥

బహిః-అంతః-చ-భూతానాం-అచరం-చరం- ఏవ-చ

సూక్ష్మత్వాత్-తత్-అవిజ్ఞేయం-దూరస్థం-చ-అంతికే-చ-తత్

భూతానాం =ప్రాణులకు, బహిః= బాహ్యమును, అంతః చ = లోపలను, అచరం= చరించనిదియును, చరం ఏవ చ= చరించునదియు, సూక్ష్మత్వాత్= సూక్ష్మత్వము వలనను, అవిజ్ఞేయం= తెలియబడనిదియు, దూరస్థం చ = దూరము నందున్నదియు, అంతికే చ = దగ్గర నున్నదియు, తత్= అది.

చరాచరభూతములన్నింటికిని బాహ్యాభ్యంతరములయందు పరిపూర్ణముగా ఉండువాడును, చరాచరరూపుడును అతడే. అతిసూక్ష్మ రూపుడైనందున తెలిసికొన శక్యముకానివాడు, అతిదూరముగను, దగ్గరగను యున్నది.

16 అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।

భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥

అవిభక్తం-చ-భూతేషు-విభక్తం- ఇవ-చ-స్థితం

భూతభర్తృ-చ-తత్-జ్ఞేయం-గ్రసిష్ణు-ప్రభవిష్ణు-చ

భూతేషు= భూతములయందు, అవిభక్తం చ= విభజింపబడనిదియు, విభక్తం ఇవ చ= వేరుచేయబడిన దానివలె, స్థితం= ఉన్నదియు, తత్=అది, భూతభర్తృ చ= భూతములను భరించునదియును, గ్రసిష్ణు=హరించునదియు, ప్రభవిష్ణు చ=కలిగించునదియు.

పరమాత్మ ఆకాశమువలె విభజించుటకు వీలులేని ఒకే రూపమున పరిపూర్ణుడైయున్నను, సమస్తచరాచరప్రాణుల రూపములలో వేర్వేరుగా గోచరించుచుండును. ఆ పరమాత్మయే భూతములను భరించునదియును,హరించునదియు, కలిగించునదియు అయిఉన్నది.

17 జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।

జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥

జ్యోతిషాం-అపి-తత్-జ్యోతిః-తమసః-పరం- ఉచ్యతే

జ్ఞానం-జ్ఞేయం-జ్ఞానగమ్యం-హృది-సర్వస్య-విష్ఠితం

జ్ఞేయం= తెలియదగినదియు, తత్=అది, జ్యోతిషాం అపి= జ్యోతులకు కూడా, జ్యోతిః= ప్రకాశమును, తమసః= చీకటికి, పరం= పరమైనదియు, జ్ఞానం= జ్ఞానము, జ్ఞేయం= జ్ఞేయము, జ్ఞానగమ్యం= జ్ఞానముచేత పొందదగినదియు, సర్వస్య= సమస్త భూతములయొక్క, హృది= హృదయమునందు, విష్ఠితం= ఉన్నదియు, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

ఆ పరబ్రహ్మ అన్నిజ్యోతులకును జ్యోతి మాయాతీతుడును, జ్ఞానస్వరూపు డును, తెలిసికొనదగిన వాడును, తత్త్వజ్ఞానముద్వారా ప్రాప్యుడును అతడే. సర్వప్రాణుల హృదయములయందు ప్రకాశించుచున్నది అతడే.

18 ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।

మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥

ఇతి-క్షేత్రం-తథా-జ్ఞానం-జ్ఞేయం-చ- ఉక్తం-సమాసతః

మద్భక్తః- ఏతత్-విజ్ఞాయ-మద్భావాయ- ఉపపద్యతే

ఇతి = ఈ విధముగ, క్షేత్రం= క్షేత్రము, తథా= అటులే, జ్ఞానం= జ్ఞానము, జ్ఞేయం చ= జ్ఞేయమును, సమాసతః= సంగ్రహముగ, ఉక్తం= చెప్పబడినది, మద్భక్తః= నాభక్తుడు, ఏతత్= దీనిని, విజ్ఞాయ= తెలిసికొని, మద్భావాయ= నా భావమును పొందుటకు, ఉపపద్యతే = తగిన వాడగుచున్నాడు.

ఇంతవఱకును క్షేత్రమును గూర్చియు, జ్ఞానమును గూర్చియు, జ్ఞేయమును గుఱించియు సంక్షిప్తముగా వివరించితిని. ఈ తత్త్వమును సమగ్రముగా తెలిసికొనిన నా భక్తుడు నా స్వరూపమునే పొందుటకు అర్హుడగుచున్నాడు.

19 ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి ।

వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥

ప్రకృతిం-పురుషం-చ- ఏవ-విద్ధి-అనాదీ- ఉభౌ-అపి

వికారాన్-చ-గుణాన్-చ- ఏవ-విద్ధి- ప్రకృతిసంభవాన్

ప్రకృతిం=ప్రకృతిని, పురుషం చ ఏవ= పురుషుని, ఉభౌ అపి= రెండింటిని, అనాదీ= ఆదిలేని వానినిగ, విద్ధి= గ్రహించుము, వికారాన్ చ = వికారములను, గుణాన్ చ ఏవ= గుణములను, ప్రకృతి సంభవాన్ = ప్రకృతి వలన పుట్టిన వానినిగ, విద్ధి = తెలిసికొనుము.

ప్రకృతి, పురుషుడు - అను ఈ రెండును అనాదియైన వనియు, రాగద్వేషాదివికారములును, త్రిగుణాత్మకములైన పదార్థములన్ని యును ప్రకృతినుండియే ఉత్పన్నములైనవనియు తెలిసికొనుము.

20 కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే ।

పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥

కార్యకారణకర్తృత్వే- హేతుః-ప్రకృతిః- ఉచ్యతే

పురుషః-సుఖదుఃఖానాం-భోక్తృత్వే- హేతుః- ఉచ్యతే

ప్రకృతిః= ప్రకృతి, కార్యకారణ కర్తృత్వే= కార్యకారణ కర్తృత్వములకు, హేతుః= హేతువుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది, పురుషః= పురుషుడు, సుఖదుఃఖానాం= సుఖదుఃఖములను, ఉచ్యతే = చెప్పబడుచున్నది, పురుషః= పురుషుడు, సుఖదుఃఖానాం= సుఖదుఃఖములను, భోక్తృత్వే=అనుభవించుట యందు, హేతుః= హేతువుగా, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

కార్యకారణములను ఉత్పన్నము చేయుటలో ప్రకృతియే హేతువనియు, సుఖ దుఃఖములను అనుభవించుటలో జీవాత్మయే హేతువనియు చెప్పబడినది.

21 పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।

కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥

పురుషః-ప్రకృతిస్థః-హి-భుంక్తే-ప్రకృతిజాన్-గుణాన్

కారణం-గుణసంగః-అస్య-సదసద్యోనిజన్మసు

ప్రకృతిస్థః=ప్రకృతియందున్నవాడై, పురుషః= పురుషుడు, ప్రకృతిజాన్= ప్రకృతిచే బుట్టిన, గుణాన్= గుణములను, భుంక్తే హి= అనుభవించునుగదా, అస్య = ఇతనికి, సదసద్యోని జన్మసు = సుకృత దుష్కృతములయిన యోనులందు, గుణసంగః= గుణసంగము, కారణం= కారణము.

పురుషుడు ప్రకృతిస్థుడై ప్రకృతినుండి ఉత్పన్నములైన త్రిగుణాత్మక పదార్థములను అనుభవించుచు. ఈ గుణసాంగత్యము వలన జీవాత్మయొక్క నీచోన్నత జన్మలు కలుగుచున్నవి.

22 ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।

పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥

ఉపద్రష్టా-అనుమంతా-చ-భర్తా-భోక్తా-మహేశ్వరః

పరమాత్మా- ఇతి-చ-అపి- ఉక్తః-దేహే-అస్మిన్-పురుషః-పరః

అస్మిన్= ఈ, దేహే= దేహమునందు, పరః= పరుడైన, పురుషః= పురుషుడు, ఉపద్రష్టా= సాక్షియు, అనుమంతా చ= అనుమతించు వాడు, భర్తా= భరించువాడు, భోక్తా= అనుభవించువాడు, మహేశ్వరః= మహేశ్వరుడు, పరమాత్మా ఇతి చ అపి= పరమాత్మ అని కూడా, ఉక్తః= చెప్పబడుచున్నాడు.

ఈ దేహమునందున్న ఆత్మ వాస్తవముగా పరమాత్మయే, అతడు సాక్షిభూతుడగుటవలన ఉపద్రష్ట యనియు, యథార్థసమ్మతినిచ్చువాడగుట వలన అనుమంత అనియు, అన్నింటిని ధరించి, పోషించువాడు అగుటవలన భర్త అనియు, జీవరూపములో భోక్త అనియు, బ్రహ్మాదులకును స్వామి యగుటవలన మహేశ్వరుడు అనియు, పరమాత్మ అనియు చెప్పబడుచున్నాడు.

23 య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ ।

సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥

యః- ఏవం-వేత్తి-పురుషం-ప్రకృతిం-చ-గుణైః-సహ

సర్వథా-వర్తమానః-అపి-న-సః-భూయః-అభిజాయతే

యః= ఎవడు, ఏవం= ఇటుల, పురుషం= పురుషుని, గుణైః సహ= గుణములతో గూడ, ప్రకృతిం చ = ప్రకృతిని, వేత్తి = తెలిసికొనుచున్నాడో, సః= వాడు, సర్వథా= సకల విధముల, వర్తమానః అపి= వర్తమానములో చరించుచున్నను, భూయః= తిరిగి, న అభిజాయతే= పుట్టడు.

ఈ విధముగా పురుషునితత్త్వమును, గుణసహితమైన ప్రకృతితత్త్వమును తెలిసికొనినవాడు అన్ని విధములగు కర్తవ్యకర్మలను ఆచరించుచున్నప్పటికిని తిరిగి జన్మించడు.

24 ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।

అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥

ధ్యానేన- ఆత్మని-పశ్యంతి-కేచిత్- ఆత్మానం- ఆత్మనా

అన్యే-సాంఖ్యేన-యోగేన-కర్మయోగేన-చ-అపరే

కేచిత్=కొందరు, ధ్యానేన= ధ్యానముచేత, ఆత్మని= ఆత్మయందు, ఆత్మనా= ఆత్మచేత, ఆత్మానం= ఆత్మను, పశ్యంతి= చూచుచున్నారు, అన్యే= మరికొందరు, సాంఖ్యేన= జ్ఞానసంబంధమైన, యోగేన= యోగముచేత, అపరే= ఇతరులు, కర్మయోగేన చ= కర్మయోగముచేతను, పశ్యంతి= చూచుచున్నారు.

కొందరు ఈ పరమాత్మను శుద్ధమైన సూక్ష్మబుద్ధితో ధ్యానయోగముద్వారా తమహృదయములయందు చూతురు. మఱికొందరు జ్ఞాన యోగముద్వారాను, మఱికొందరు కర్మయోగముచేతను ఆ పరమాత్మను దర్శింతురు.

25 అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।

తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥

అన్యే-తు- ఏవం-అజానంతః-శ్రుత్వా-అన్యేభ్యః- ఉపాసతే

తే-అపి-చ-అతి-తరంతి- ఏవ-మృత్యుం-శ్రుతిపరాయణాః

అన్యే తు= కొందరు, ఏవం = ఇట్లు, అజానంతః= గ్రహించలేనివారై, అన్యేభ్యః= ఇతరులవలన, శ్రుత్వా= ఆలకించి, ఉపాసతే= ఉపాసించుచున్నారు, శ్రుతిపరాయణాః= శ్రవణాసక్తులయిన, తే అపి చ = వారుకూడా, మృత్యుం= మృత్యువును, అతితరంతి ఏవ= దాటుచునే యున్నారు.

కాని ఈ సాధనమార్గములనుగూర్చి ఎఱుగని మందబుద్ధులు తత్త్వజ్ఞానముగల ఇతరులనుండి విని, తదనుసారముగ ఉపాసనలు చేయుదురు. ఆ శ్రవణపరాయణులును మృత్యువును దాటుచున్నారు.

26 యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్ ।

క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ ॥

యావత్-సంజాయతే-కించిత్-సత్త్వం-స్థావరజంగమం

క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్-తత్-విద్ధి-భరతర్షభ

భరతర్షభ=అర్జునా, స్థావరజంగమం= స్థావరజంగమ రూపమైన, సత్త్వం= వస్తువు, యావత్ కించిత్= ఏ కొంచెము, సంజాయతే= పుట్టుచున్నదో, తత్= అది, క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్= క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన, విద్ధి= ఎరుగుము.

ఓ అర్జునా ! ఆ స్థావరజంగమప్రాణులన్నియును క్షేత్ర - క్షేత్రజ్ఞ సంయోగమువలననే కలుగుచున్నవని గ్రహించుము.

27 సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।

వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥

సమం-సర్వేషు-భూతేషు-తిష్ఠంతం-పరమేశ్వరం

వినశ్యత్సు-అవినశ్యంతం-యః-పశ్యతి-సః-పశ్యతి

సర్వేషు- సమస్తములైన, భూతేషు= భూతములయందు, సమం= సమముగా, తిష్ఠంతం= ఉన్న, పరమేశ్వరం= పరమేశ్వరుని, వినశ్యత్సు= వినాశమొందుచున్నను, అవినశ్యంతం= నశింపని వానినిగా, యః= ఎవడు, పశ్యతి= గాంచుచున్నాడో, సః=వాడు, పశ్యతి= చూచుచున్నాడు.

నశ్వరములైన చరాచరభూతముల యందు సమముగా స్థితుడైయున్న పరమేశ్వరుడు నాశరహితుడు, అట్టి పరమేశ్వరుని చూచువాడే నిజముగా చూచువాడు.

28 సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।

న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥

సమం-పశ్యన్-హి-సర్వత్ర-సమవస్థితం- ఈశ్వరం

న-హినస్తి- ఆత్మనా- ఆత్మానం-తతః-యాతి-పరాం-గతిం

సర్వత్ర=అంతటను, సమం=సమముగా, సమవస్థితం= ఉన్నటువంటి, ఈశ్వరం= ఈశ్వరుని, పశ్యన్ హి= చూచుచున్నవాడై, ఆత్మానం= తనను, ఆత్మనా= ఆత్మచేత, న హినస్తి= హింసింపడో, తతః= తరువాత, పరాం= ఉత్తమమైన, గతిం= స్థానమును, యాతి= పొందుచున్నాడు.

సమస్తప్రాణులయందును సమభావముతో నుండు పరమేశ్వరుని సమత్వభావముతో చూచువాడు ఆత్మహంతకుడుకాడు - అనగా తనను తాను నాశము చేసికొనువాడు కాడు. అందువలన అతడు పరమగతిని పొందు చున్నాడు.

29 ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।

యః పశ్యతి తథాత్మానమ్ అకర్తారం స పశ్యతి ॥

ప్రకృత్యా- ఏవ-చ-కర్మాణి- క్రియమాణాని- సర్వశః

యః-పశ్యతి-తథా- ఆత్మానం- అకర్తారం-సః-పశ్యతి

సర్వశః= సర్వవిధములు, ప్రకృత్యా ఏవ చ= ప్రకృతిచేతనే, కర్మాణి= కర్మలు, క్రియమాణాని= చేయబడుచున్న వానినిగ, తథా= అటులనే, ఆత్మానం= తనను, అకర్తారం = కర్త గాని వానినిగ, యః= ఎవడు, పశ్యతి= గాంచుచున్నాడో, సః= వాడు, పశ్యతి= చూచుచున్నాడు.

సకలకర్మలు అన్నివిధములుగ ప్రకృతిద్వారానే జరుగుచున్నవనియు, ఆత్మ అకర్త అనియు ఎఱింగినవాడు నిజముగ చూచువాడు.

30 యదా భూతపృథగ్భావమ్ ఏకస్థమనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥

యదా-భూతపృథగ్భావం- ఏకస్థం- అనుపశ్యతి
తతః- ఏవ-చ-విస్తారం- బ్రహ్మ- సంపద్యతే-తదా

యదా= ఎప్పుడు, భూతపృథగ్భావం= ప్రాణుల వేర్వేరు భావమును, ఏకస్థం= ఏకస్థముగాను, తతః ఏవ చ = దానివలననే, విస్తారం= విస్తారముగాను, అనుపశ్యతి = గాంచుచున్నాడో, తదా = అప్పుడు, బ్రహ్మ= బ్రహ్మము, సంపద్యతే= అగుచున్నాడు.

వేర్వేరుగా గోచరించుచున్న ప్రాణులన్నియును ఒకే పరమాత్మయందు స్థితమై యున్నవనియు, అట్లే అవి యన్నియును ఆ పరమాత్మనుండియే విస్తరించు చున్నవనియు, ఎఱింగిన పురుషుడు ఆ క్షణముననే పరబ్రహ్మను పొందుచున్నాడు.

31 అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే ॥

అనాదిత్వాత్-నిర్గుణత్వాత్-పరమాత్మా-అయం-అవ్యయః
శరీరస్థః-అపి-కౌంతేయ-న-కరోతి-న-లిప్యతే

కౌంతేయ= అర్జునా, అనాదిత్వాత్= అనాదియైనందున, నిర్గుణత్వాత్= నిర్గుణమైనందున, అవ్యయః= అవ్యయమైనందున, అయం= ఈ , పరమాత్మా= పరమాత్మ, శరీరస్థః అపి= దేహమునందున్నను, న కరోతి=చేయడు, న లిప్యతే= అంటడు.

ఓ అర్జునా ! నాశరహితుడైన పరమాత్ముడు ప్రాణుల శరీరములందున్నప్పటి కిని అనాది అగుటవలనను, నిర్గుణుడు అగుటవలనను ఎట్టి కర్మలకును కర్తకాడు. కనుక కర్మలచే అంటబడడు.

32 యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే ।

సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే ॥

యథా-సర్వగతం-సౌక్ష్మ్యాత్- ఆకాశం-న- ఉపలిప్యతే

సర్వత్ర-అవస్థితః-దేహే-తథా- ఆత్మా-న- ఉపలిప్యతే

సర్వగతం= సర్వగతమైన, ఆకాశం= ఆకాశము, సౌక్ష్మ్యాత్= సూక్ష్మమైనందున, యథా= ఎటుల, న ఉపలిప్యతే= అంటబడదో, తథా=అటుల, దేహే= దేహమునందు, సర్వత్ర= అంతటను, అవస్థితః= ఉన్నటువంటిదైన, ఆత్మా = ఆత్మ, న ఉపలిప్యతే= అంటబడదు.

సర్వత్ర వ్యాపించుయున్న ఆకాశము సూక్ష్మ మగుట వలన వాటి గుణదోషములు దానికి అంటవు. అట్లే సకల ప్రాణుల దేహముల యందు స్థితమైయున్నను ఆత్మ నిర్గుణమగుటవలన వాటి గుణదోషములును దానికంటవు.

33 యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।

క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥

యథా-ప్రకాశయతి- ఏకః- కృత్స్నం-లోకం- ఇమం-రవిః

క్షేత్రం-క్షేత్రీ-తథా-కృత్స్నం-ప్రకాశయతి-భారత

భారత=అర్జునా, ఏకః= ఒక్కడైన, రవిః= సూర్యుడు, ఇమం= ఈ, కృత్స్నం = సమస్తమైన, లోకం = లోకమును, యథా= ఎటుల, ప్రకాశయతి= ప్రకాశింపజేయుచున్నాడో, తథా=అటుల, క్షేత్రీ=క్షేత్రజ్ఞుడు, కృత్స్నం= సమస్తమైన, క్షేత్రం=క్షేత్రమును, ప్రకాశయతి= ప్రకాశింప జేయుచున్నాడు.

అర్జునా ! ఒక్క సూర్యుడే ఈ సమస్త జగత్తును ప్రకాశిత మొనర్చుచున్నట్లు, ఒకే ఆత్మ సర్వప్రాణులయందును స్థితమై, వాటినన్నింటిని ప్రకాశింప జేయుచున్నాడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

34 క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమ్ అంతరం జ్ఞానచక్షుషా ।

భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ ॥

క్షేత్రక్షేత్రజ్ఞయోః- ఏవం-అంతరం-జ్ఞానచక్షుషా

భూతప్రకృతి మోక్షం-చ-యే-విదుః-యాంతి-తే-పరం

జ్ఞానచక్షుషా= జ్ఞానదృష్టిచే, ఏవం= ఈరీతి, క్షేత్రక్షేత్రజ్ఞయోః= క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, అంతరం= భేదమును, భూతప్రకృతిః= భూతప్రకృతిని, మోక్షం చ = మోక్షమును, యే= ఎవరు, విదుః= తెలిసికొనుచున్నారో, తే=వారు, పరం= మోక్షమును, యాంతి= పొందుచున్నారు.

ఈ విధముగా క్షేత్ర - క్షేత్రజ్ఞులమధ్యగల అంతరమును, కార్యసహిత ప్రకృతినుండి విముక్తులగుటకు ఉపాయములను జ్ఞాననేత్రముల ద్వారా ఎఱింగిన మహాత్ములు మోక్షమును పొందుచున్నారు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ

త్రయోదశోఽధ్యాయః ॥

అథ చతుర్దశోఽధ్యాయః - గుణత్రయవిభాగయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।

యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥

పరం-భూయః-ప్రవక్ష్యామి-జ్ఞానానాం-జ్ఞానం- ఉత్తమం

యత్-జ్ఞాత్వా-మునయః-సర్వే-పరాం-సిద్ధిం- ఇతః-గతాః

యత్=దేనిని, జ్ఞాత్వా=గ్రహించి, సర్వే=సమస్తమైన, మునయః=మునులు, ఇతః= ఈ సంసారమున, పరాం= ఉత్తమమైన, సిద్ధిం=సిద్ధిని, గతాః=పొందిరో, పరం= ఉత్తమమైన, జ్ఞానానాం= జ్ఞానములలో, ఉత్తమం= ఉత్తమమైనది యగు, జ్ఞానం= విద్యను, భూయః= మరల, ప్రవక్ష్యామి= చెప్పుచున్నాను.

శ్రీ భగవానుడు పలికెను - జ్ఞానములలో అత్యుత్తమమైన పరమజ్ఞానమును నీకు మరల తెల్పుచున్నాను. ఆ పరమజ్ఞానమును తెలిసికొనిన మునులు సంసార బంధములనుండి విముక్తులై పరమసిద్ధిని పొందిరి.

2 ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః ।

సర్గేఽపి నోపజాయంతే ప్రలయే న వ్యథంతి చ ॥

ఇదం-జ్ఞానం- ఉపాశ్రిత్య-మమ-సాధర్మ్యం- ఆగతాః

సర్గే-అపి-న- ఉపజాయంతే-ప్రలయే-న-వ్యథంతి-చ

ఇదం= ఈ, జ్ఞానం = జ్ఞానమును, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, మమ=నాయొక్క, సాధర్మ్యం= స్వరూపమును, ఆగతాః= పొందినవారు, సర్గే అపి= సృష్టియందు, న ఉపజాయంతే= పుట్టరు, ప్రలయే= ప్రళయ కాలమునందు, న వ్యథంతి చ = దుఃఖమును పొందరు.

ఈ జ్ఞానమును ఆశ్రయించినవారు నా స్వరూపమునే పొందుదురు. అట్టి పురుషులు సృష్టి కాలమందు మరల జన్మింపరు, ప్రళయకాలమున నశింపరు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

3 మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।

సంభవః సర్వభూతానాం తతో భవతి భారత ॥

మమ-యోనిః-మహత్-బ్రహ్మ-తస్మిన్-గర్భం-దధామి-అహం

సంభవః-సర్వభూతానాం-తతః-భవతి-భారత

భారత=అర్జునా, మహత్ బ్రహ్మ= మహత్తు లేక మాయ, మమ=నాకు, యోనిః= గర్భస్థానము, తస్మిన్= దానియందు, అహం=నేను, గర్భం= గర్భమును, దధామి= ఉంచుచున్నాను, తతః= ఆకారణముచే, సర్వభూతానాం= సర్వభూతముల యొక్క, సంభవః= ఉత్పత్తి, భవతి= అగుచున్నది.

ఓ అర్జునా ! నా మహద్బ్రహ్మరూపమైన మూలప్రకృతి సర్వప్రాణులకు జన్మ స్థానము.దానియందు చేతనసముదాయ రూపమైన బీజమును ఉంచెదను. దాని వలననే సర్వభూతముల ఉత్పతి కలుగుచున్నది.

4 సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః ।

తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥

సర్వయోనిషు-కౌంతేయ-మూర్తయః-సంభవంతి-యాః

తాసాం-బ్రహ్మ-మహత్-యోనిః-అహం-బీజప్రదః-పితా

కౌంతేయ=అర్జునా, సర్వయోనిషు- సమస్త యోనులందును, యాః= ఏ, మూర్తయః= మూర్తులు, సంభవంతి= పుట్టుచున్నవో, తాసాం= వానికి, మహత్ బ్రహ్మ= ప్రకృతి, యోనిః= కారణము, అహం=నేను, బీజప్రదః=బీజప్రదాతను అగు, పితా=తండ్రిని.

ఓ అర్జునా ! నానాయోనులయందు జన్మించు ప్రాణులను తనగర్భమున ధరించు మూలప్రకృతియే ఆ ప్రాణులకు తల్లి. బీజస్థాపనచేయు నేను వాటికి తండ్రిని. అనగా సర్వప్రాణులకును ప్రకృతియే తల్లి. నేను తండ్రిని.

5 సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।

నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥

సత్త్వం-రజః-తమః- ఇతి-గుణాః-ప్రకృతి సంభవాః

నిబధ్నంతి-మహాబాహో-దేహే-దేహినం-అవ్యయం

మహాబాహో=అర్జునా, సత్త్వం= సత్త్వము, రజః= రజస్సు, తమః=తమస్సు, ఇతి= అనెడి, ప్రకృతిసంభవాః= ప్రకృతివలన పుట్టిన, గుణాః= గుణములు, అవ్యయం= నాశరహితుడైన, దేహినం= జీవుని, దేహే= దేహమునందు, నిబధ్నంతి= బంధించుచున్నవి.

ఓ అర్జునా ! ప్రకృతినుండి ఉత్పన్నములైన సత్త్వరజస్తమోగుణములు నాశములేని జీవాత్మను శరీరమున బంధించుచున్నది.

6 తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశకమనామయమ్ ।

సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥

తత్ర-సత్త్వం-నిర్మలత్వాత్- ప్రకాశకం- అనామయం

సుఖసంగేన- బధ్నాతి-జ్ఞానసంగేన-చ-అనఘ

అనఘ=అర్జునా, తత్ర= ఆ గుణములయందు, ప్రకాశకం= ప్రకాశమును కలిగించు నదియు, అనామయం=నిర్వికారమైనదియునైన, సత్త్వం= సత్త్వగుణము, నిర్మలత్వాత్= నిర్మలమగుటవలన, సుఖసంగేన= సుఖాభిలాషచేతను, జ్ఞానసంగేన చ=జ్ఞానాభిలాషచేతను, బధ్నాతి= బంధించుచున్నది.

ఓ పాపరహితుడా! ఈ మూడింటిలో సత్త్వగుణము నిర్మలమైనది. కనుక ప్రకాశకమైనది. వికారరహితమైనది. కాని అది సుఖమందలి ఆసక్తి చేత, జ్ఞానాభిమానము వలన మనుజుని బంధించుచున్నది.

7 రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్ ।

తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥

రజః-రాగాత్మకం-విద్ధి-తృష్ణా సంగ సముద్భవం

తత్-నిబధ్నాతి-కౌంతేయ-కర్మసంగేన-దేహినం

కౌంతేయ=అర్జునా, రజః= రజోగుణము, రాగాత్మకం= రాగముతో గూడినదిగను, తృష్ణాసంగ సముద్భవం= విషయాసక్తి వలన కలిగినదిగను, విద్ధి= తెలిసికొనుము, తత్=అది, దేహినం = ఆత్మను, కర్మసంగేన= కర్మాసక్తిచేత, నిబధ్నాతి= బంధించుచున్నది.

అర్జునా ! రజోగుణము రాగాత్మకము. అది కామము, ఆసక్తుల నుండి ఉత్పన్నమగునని యెఱుంగుము. అది జీవాత్మను కర్మలయొక్కయు, కర్మఫలముల యొక్కయు ఆసక్తిని కల్పించి జీవుని బంధించును.

8 తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।

ప్రమాదాలస్యనిద్రాభిః తన్నిబధ్నాతి భారత ॥

తమః-తు-అజ్ఞానజం-విద్ధి-మోహనం-సర్వదేహినాం

ప్రమాదాలస్య నిద్రాభిః-తత్-నిబధ్నాతి-భారత

భారత=అర్జునా, అజ్ఞానజం= అజ్ఞానము వలన కలిగిన, తమః తు= తమోగుణము, సర్వదేహినాం= సర్వ ప్రాణులకు, మోహనం= మోహమును కలుగజేయునదిగా, విద్ధి= గ్రహించుము, తత్=అది, ప్రమాదాలస్య నిద్రాభిః= మరపుచేతను అలసత్వము చేతను నిద్రచేతను, దేహినం= దేహిని, నిబధ్నాతి= బంధించుచున్నది.

అర్జునా ! తమోగుణము సకలదేహాభిమానులను మోహితులనుగా చేయును. అజ్ఞానమువలన జనించును. అది జీవుని బంధించి వేయుచున్నది.

9 సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।

జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥

సత్త్వం-సుఖే-సంజయతి-రజః-కర్మణి-భారత

జ్ఞానం- ఆవృత్య-తు-తమః-ప్రమాదే-సంజయంతి- ఉత

భారత=అర్జునా, సత్త్వం=సత్త్వగుణము, సుఖే= సుఖమునందు, సంజయతి= చేర్చుచున్నది, రజః=రజోగుణము, కర్మణి=కర్మలయందు, సంజయతి= చేర్చుచున్నది, తమః తు= తమోగుణము, జ్ఞానం= జ్ఞానమును, ఆవృత్య= ఆవరించి, ప్రమాదే= ప్రమాదము నందు, సంజయతి ఉత= చేర్చుచున్నది గదా.

ఓ అర్జునా ! సత్త్వగుణము జీవుని సుఖములలో నిమగ్నము చేయును. రజోగుణము కర్మలయందు నిమగ్నునిగా చేయును. తమోగుణము జ్ఞానమును కప్పివేసి ప్రమాదాదులలో ముంచును.

10 రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।

రజఃసత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా ॥

రజః-తమః-చ-అభిభూయ-సత్త్వం-భవతి-భారత

రజః-సత్త్వం-తమః-చ- ఏవ-తమః-సత్త్వం-రజః-తథా

భారతా=అర్జునా, సత్త్వం= సత్త్వగుణము, రజః=రజోగుణము, తమః చ=తమోగుణము, అభిభూయ= తిరస్కరించి, భవతి = అగుచున్నది, రజః=రజోగుణము, సత్త్వం=సత్త్వగుణమును, తమః చ ఏవ= తమోగుణమును, తథా = అటులనే, తమః= తమోగుణము, సత్త్వం= సత్త్వగుణమును, రజః= రజోగుణమును.

ఓ అర్జునా ! రజస్తమోగుణములనణచి సత్త్వగుణము వృద్ధిచెందును. సత్త్వతమోగుణములనణచి రజోగుణము వృద్ధి చెందును. అట్లే సత్త్వరజో గుణములనణచి తమోగుణము వృద్ధియగుచుండును.

11 సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।

జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత ॥

సర్వద్వారేషు-దేహే- అస్మిన్-ప్రకాశః- ఉపజాయతే

జ్ఞానం-యదా-తదా-విద్యాత్-వివృద్ధం-సత్త్వం- ఇతి- ఉత

అస్మిన్= ఈ, దేహే= దేహమునందు, సర్వద్వారేషు= సర్వద్వారముల యందును, ప్రకాశః= ప్రకాశమగు, జ్ఞానం= జ్ఞానము, యదా= ఎప్పుడు, ఉపజాయతే= పుట్టుచున్నదో, తదా=అప్పుడు, సత్త్వం= సత్త్వగుణము, వివృద్ధం ఇతి= వృద్ధిని జెందినదని, విద్యాత్ ఉత= తెలిసికొనవలెనుగదా.

శరీరేంద్రియములయందును, అంతఃకరణమునందును చైతన్యము, వివేకశక్తి ఉత్పన్నములైనప్పుడు అతనిలో సత్త్వగుణము వృద్ధిచెందినదని గ్రహింపుము.

12 లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా।

రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ ॥

లోభః-ప్రవృత్తిః- ఆరంభః- కర్మణాం-అశమః- స్పృహా

రజసి- ఏతాని-జాయంతే-వివృద్ధే-భరతర్షభ

భరతర్షభ= అర్జునా, రజసి=రజోగుణము, వివృద్ధే= వృద్ధిని పొందునపుడు, లోభః= లోభము, ప్రవృత్తిః= ప్రవృత్తియు, కర్మణాం= కర్మలయొక్క, ఆరంభః= ఆరంభము, అశమః= అశాంతి, స్పృహా= ఆశ, ఏతాని= ఇవి, జాయంతే= కలుగుచున్నవి.

ఓ అర్జునా ! రజోగుణము వృద్ధియైనప్పుడు లోభము, ప్రవృత్తి, (ప్రాపంచిక విషయములయందు ఆసక్తి) స్వార్థబుద్ధితో సకామభావముతో కర్మాచరణము, అశాంతి, విషయభోగములయందు లాలస మొదలగు గుణములు కలుగును.

13 అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।

తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన ॥

అప్రకాశః-అప్రవృత్తిః-చ-ప్రమాదః-మోహః- ఏవ-చ

తమసి- ఏతాని- జాయంతే-వివృద్ధే-కురునందన

కురునందనా = అర్జునా, తమసి= తమోగుణము, వివృద్ధే=వృద్ధినొందినపుడు, అప్రకాశః= అజ్ఞానము, అప్రవృత్తిః చ= నిర్వ్యాపారం, ప్రమాదః= అజాగ్రత్త, మోహః ఏవ చ= మూఢభావము, ఏతాని= ఇవి, జాయంతే= కలుగుచున్నవి.

ఓ అర్జునా ! తమోగుణము అధికమైనప్పుడు అంతః కరణమునందును. ఇంద్రియములయందును వివేకశక్తి నష్టమగును. కర్తవ్యకర్మలయందు విముఖత, ప్రమాదము అనగా అంతఃకరణమును మోహములు కలుగును.

14 యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్।

తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే ॥

యదా-సత్త్వే-ప్రవృద్ధే-తు-ప్రలయం-యాతి-దేహభృత్

తదా- ఉత్తమ విదాం- లోకాన్- అమలాన్-ప్రతిపద్యతే

యతా= ఎప్పుడు, సత్త్వే= సత్త్వగుణము, ప్రవృద్ధే= వృద్ధినొందినపుడు, దేహభృత్= దేహధారి, ప్రలయం తు= ప్రళయమును, యాతి= పొందుచున్నాడు, తదా=అప్పుడు, ఉత్తమ విదాం= ఉత్తమ జ్ఞానులయొక్క, అమలాన్= నిర్మలములైన, లోకాన్= లోకములను, ప్రతిపద్యతే= పొందుచున్నాడు.

సత్త్వగుణము వృద్ధిచెందినపుడు మనుజుడు మరణించినచో అతడు ఉత్తమ కర్మలను ఆచరించువారుచేరెడి నిర్మలములైన స్వర్గాది పుణ్యలోకములను పొందును.

15 రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।

తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే ॥

రజసి-ప్రలయం-గత్వా-కర్మసంగిషు-జాయతే

తథా-ప్రలీనః-తమసి-మూఢయోనిషు-జాయతే

రజసి=రజోగుణము వృద్ధినొందినపుడు, ప్రలయం=మృతిని, గత్వా=పొంది, కర్మసంగిషు=కర్మసంగత్వము గలవారి యందు, జాయతే=పుట్టుచున్నాడు, తథా=అట్లే, తమసి= తమోగుణమునందు, ప్రలీనః= మృతి నొందినవాడు, మూఢయోనిషు= మూఢ ప్రాణులయందు, జాయతే= పుట్టుచున్నాడు.

రజోగుణము వృద్ధిచెందినపుడు మృత్యువు ప్రాప్తించినచో అతడు కర్మాసక్తులైన మానవులలో జన్మించును. అట్లే తమోగుణము వృద్ధిచెందినప్పుడు మృతిచెందిన మానవుడు పశుపక్షికీటకాది నీచయోనులలో జన్మించుచున్నాడు.

16 కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।

రజసస్తు ఫలం దుఃఖమ్ అజ్ఞానం తమసః ఫలమ్ ॥

కర్మణః-సుకృతస్య- ఆహుః-సాత్త్వికం-నిర్మలం-ఫలం

రజసః-తు-ఫలం-దుఃఖం-అజ్ఞానం-తమసః-ఫలం

సుకృతస్య= సుకృతమైన, కర్మణః= కర్మమునకు, సాత్త్వికం= సాత్త్వికమైన, నిర్మలం= నిర్మలత్వము, ఫలం= ఫలమును, రజసః తు= రజోగుణసంబంధమైన, దుఃఖం= దుఃఖము, ఫలం= ఫలము, తమసః= తమోగుణయుతమైన, అజ్ఞానం= అజ్ఞానము, ఫలం= ఫలమును అని, ఆహుః= చెప్పుదురు.

శ్రేష్ఠములైన కర్మలను ఆచరించుటవలన సాత్త్వికఫలము అనగా సుఖము, జ్ఞానము, వైరాగ్యము మొదలగు నిర్మలఫలములు కలుగును. రాజసకర్మలకు ఫలము దుఃఖము. తామసకర్మలకు అజ్ఞానము ఫలము.

17 సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।

ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥

సత్త్వాత్-సంజాయతే-జ్ఞానం-రజసః-లోభః- ఏవ-చ

ప్రమోదమోహౌ-తమసః-భవతః-అజ్ఞానం- ఏవ-చ

సత్త్వాత్= సత్త్వగుణమువలన, జ్ఞానం= జ్ఞానము, సంజాయతే= కలుగుచున్నది, రజసః= రజోగుణమువలన, లోభః ఏవ చ= లోభగుణము, సంజాయతే= కలుగుచున్నవి, తమసః= తమోగుణమువలన, ప్రమాదమోహౌ= ప్రమాదమును, అజ్ఞానం ఏవ చ= అజ్ఞానమును, భవతః= కలుగుచున్నవి.

సత్త్వగుణమువలన జ్ఞానమూ, రజోగుణమువలన లోభమూ, తమో గుణము వలన ప్రమాదమోహాదులూ, అజ్ఞానమూ తప్పక సంభవించును.

18 ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః।

జఘన్యగుణవృత్తిస్థాః అధో గచ్ఛంతి తామసాః॥

ఊర్ధ్వం-గచ్ఛంతి-సత్త్వస్థాః-మధ్యే-తిష్ఠంతి-రాజసాః

జఘన్య గుణ వృత్తిస్థాః-అధః-గచ్ఛంతి-తామసాః

సత్త్వస్థాః= సత్త్వగుణము నందున్నవారు, ఊర్ధ్వం= ఊర్ధ్వమునకు, గచ్ఛంతి= పోవుచున్నారు, రాజసాః= రజోగుణము గలవారు, మధ్యే= మధ్యను, తిష్ఠంతి= నిలుచుచున్నారు, జఘన్య గుణవృత్తిస్థాః=నికృష్టమైన గుణప్రవృత్తిగల, తామసాః= తమోగుణము కలవారు, అధః=క్రిందికి, గచ్ఛంతి=పోవుచున్నారు.

సత్త్వగుణస్థితులు స్వర్గాది - ఊర్ధ్వలోకములకు పోవుదురు. రజోగుణస్థితులైన పురుషులు మధ్య లోకమునందే ఉందురు. తమోగుణ కార్యరూపములైన నిద్రా ప్రమాదాలస్యాదులయందు స్థితులైనవారు అధోగతిని పొందుదురు.

19 నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి।

గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥

న-అన్యం-గుణేభ్యః-కర్తారం-యదా-ద్రష్టా-అనుపశ్యతి

గుణేభ్యః-చ-పరం-వేత్తి-మద్భావం-సః-అధిగచ్ఛతి

ద్రష్టా= ఆత్మదర్శి, గుణేభ్యః= గుణములకంటెను, అన్యం= ఇతరుడైన, కర్తారం= కర్తను, యదా= ఎప్పుడు, న అనుపశ్యతి = చూడడో, గుణేభ్యః= గుణములకంటెను, పరం చ = అతీతముగాను, వేత్తి= తెలిసికొనుచున్నాడో, సః= వాడు, మద్భావం= నా భావమును, అధిగచ్ఛతి= పొందుచున్నాడు.

ద్రష్టయైనవాడు గుణములే గుణములయందు వర్తించు చున్నవనియూ, త్రిగుణములుతప్ప వేఱుగా కర్తలు లేరనియూ తెలిసికొని, త్రిగుణములకు అతీతముగానున్న నా తత్త్వమును తెలిసికొనును. అప్పుడతడు నా స్వరూపమునే పొందుచున్నాడు.

20. గుణానేతానతీత్యత్రీన్

దేహీ దేహసముద్భవాన్

జన్మమృత్యుజరా దుఃఖై

ర్విముక్తో2మృతమశ్నుతే

అర్జున ఉవాచ

21 కైర్లింగైః త్రీన్ గుణానేతాన్ అతీతో భవతి ప్రభో।

కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణానతివర్తతే ॥

కైః-లింగైః-త్రీన్-గుణాన్- ఏతాన్- అతీతః-భవతి-ప్రభో

కిం- ఆచారః-కథం-చ- ఏతాన్-త్రీన్-గుణాన్-అతివర్తతే

ప్రభో-కృష్ణా, ఏతాన్= ఈ, త్రీన్= మూడైన, గుణాన్= గుణములను, అతీతః= అతిక్రమించినవాడు, కైః లింగైః= ఏ లక్షణము గలవాడు, కిమాచారః= ఎట్టి ఆచారముగలవాడు, భవతి= అగుచున్నాడు, ఏతాన్= ఈ, త్రీన్= మూడైన, గుణాన్= గుణములను, కథం చ= ఎటుల, అతివర్తతే= అతిక్రమించుచున్నాడు.

అర్జునుడు పలికెను - ఓ ప్రభూ ! ఈ మూడు గుణములకును అతీతుడైనవాని లక్షణములెవ్వి ? అతని లోకవ్యవహారరీతి యెట్లుండును ? మనుష్యుడు త్రిగుణములను ఎట్లు అతిక్రమించును ?

శ్రీభగవాన్ ఉవాచ

22 ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।

న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥

ప్రకాశం-చ-ప్రవృత్తిం-చ-మోహం- ఏవ-చ-పాండవ

న-ద్వేష్టి-సంప్రవృత్తాని-న-నివృత్తాని-కాంక్షతి

పాండవ= అర్జునా, సంప్రవృత్తాని= సంప్రాప్తములైన, ప్రకాశం చ = ప్రకాశమును, ప్రవృత్తిం చ = ప్రవృత్తిని, మోహం ఏవ చ = మోహమును, న ద్వేష్టి= ద్వేషింపడు, నివృత్తాని= విడిచిపోయిన వానిని, న కాంక్షతి= కోరడు.

శ్రీ భగవానుడు పలికెను - ఓ పాండవా ! సత్త్వగుణ కార్యరూపమైన ప్రకాశము, రజోగుణకార్యరూపమైన ప్రవృత్తి తమోగుణ కార్యరూపమైన మోహము, తమంతట తామే ఏర్పడినప్పుడు త్రిగుణాతీతుడు ద్వేషింపడు -ప్రాప్తించనపుడు ఆశించడు.

23 ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।

గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥

ఉదాసీనవత్- ఆసీనః-గుణైః-యః-న-విచాల్యతే

గుణాః-వర్తంతే- ఇతి- ఏవ-యః-అవతిష్ఠతి-న- ఇంగతే

యః= ఎవడు, ఉదాసీనవత్= తటస్థునివలె, ఆసీనః= ఉన్నవాడై, గుణైః= గుణములచేత, న విచాల్యతే= చలింపబడడో, గుణాః= గుణములు, వర్తంతే ఇతి ఏవ= ప్రవర్తించుచున్నవనియే, అవతిష్ఠతి= తలంచుచున్నాడో, న ఇంగతే= చలింపడో

త్రిగుణములకును, వాటి కార్యరూపములైన శరీరేంద్రియాంతఃకరణ వ్యాపారములకును ఏ మాత్రము చలింపక, త్రిగుణాతీతుడు, సాక్షివలె ఉండును. గుణములే గుణములయందు ప్రవర్తించుచున్నవని తలంచును. అతడు సచ్చిదానందఘనపరమాత్మ యందు ఏకీభావస్థితుడై యుండును. ఈ స్థితినుండి ఎన్నడును చలింపడు.

24 సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః ।

తుల్యప్రియాప్రియో ధీరః తుల్యనిందాత్మసంస్తుతిః ॥

సమదుఃఖసుఖః-స్వస్థః=సమలోష్టాశ్మ కాంచనః

తుల్యప్రియాప్రియః-ధీరః-తుల్యనిందాత్మసంస్తుతిః

సమదుఃఖసుఖః= సుఖదుఃఖములయందు సముడును, స్వస్థః= తనలో తానుండువాడును, సమలోష్టాశ్మకాంచనః= మట్టిగడ్డను రాతిని బంగారమును సమముగా జూచువాడును, తుల్యప్రియాప్రియః= ప్రియాప్రియములను సమముగా జూచువాడును, ధీరః= ధీరుడును, తుల్యప్రియాప్రియః= ప్రియాప్రియములను సమముగా జూచువాడును, ధీరః= ధీరుడును, తుల్యనిందాత్మ సంస్తుతిః= నిందాస్తుతుల యందు సమబుద్ధిగలవాడును.

త్రిగుణాతీతుడు స్వస్వరూపమునందే నిరంతరము స్థితుడై యుండును. సుఖదుఃఖములను సమానముగా భావించును. మట్టి, రాయి, బంగారముల యందు సమభావమునే కలిగియుండును. అనగా ఆ మూడింటియందును గ్రాహ్యత్యాజ్య భావములను కలిగియుండడు. అతడే ధీరుడైన జ్ఞాని. ప్రియా ప్రియములకు గాని, నిందాస్తుతులకు గాని లొంగడు. అనగా రెండింటి యందును సమస్థితిలోనే యుండును.

25 మానావమానయోస్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే ॥

మానాపమానయోః-తుల్యః-తుల్యః-మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ-గుణాతీతః-సః- ఉచ్యతే

మానాపమానాయోస్తుల్యః= మానావమానములను సమానముగా జూచువాడును, మిత్రారిపక్షయోఃతుల్యః= శత్రుమిత్ర పక్షములయందు తుల్యుడును, సర్వారంభపరిత్యాగీ = కర్తృత్వాభిమానమును త్యజించినవాడును, యః= ఎవడో, సః=వాడు, గుణాతీతః= గుణాతీతుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

మానావమానములయందును, మిత్రులయందును, శత్రువుల యందును సమభావముతో ప్రవర్తించువాడును, విధ్యుక్తకర్మలను ఆచరించుచు కర్తృత్వాభిమానము లేనివాడును ఐనవాడు త్రిగుణాతీతుడని చెప్పబడును.

26 మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥

మాం-చ-యః-అవ్యభిచారేణ-భక్తియోగేన- సేవతే
సః-గుణాన్-సమతీత్య- ఏతాన్-బ్రహ్మభూయాయ-కల్పతే

యః= ఎవడు, అవ్యభిచారేణ= ఏకాంతమైన, భక్తియోగేన=భక్తియోగముచేత, మాం=నన్ను, సేవతే= సేవించుచున్నాడో, సః=వాడు, ఏతాన్= ఈ, గుణాన్= గుణములను, సమతీత్య= అతిక్రమించి, బ్రహ్మభూయాయ= బ్రహ్మత్వమునకు, కల్పతే చ= కల్పింపబడుచున్నాడు.

నిర్మలమైన భక్తియోగముద్వారా నన్నే నిరంతరము భజించువాడును, ఈ మూడు గుణములకును పూర్తిగా అతీతుడైనవాడును అగు పురుషుడు పరబ్రహ్మ స్వరూపమును పొందుచున్నాడు.

27 బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమ్ అమృతస్యావ్యయస్య చ।

శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ॥

బ్రహ్మణః-హి-ప్రతిష్ఠా-అహం-అమృతస్య-అవ్యయస్య-చ

శాశ్వతస్య-చ-ధర్మస్య-సుఖస్య- ఏకాంతికస్య-చ

అహం=నేను, అమృతస్య= అమృత స్వరూపము, అవ్యయస్య చ=అవ్యయము అయిన, బ్రహ్మణః= బ్రహ్మమునకు, శాశ్వతస్య= శాశ్వతమైన, ధర్మస్య చ= ధర్మమునకు, ఏకాంతికస్య= అచంచలమైన, సుఖస్య చ = సుఖమునకును, ప్రతిష్ఠా హి= ఆశ్రయుడను గదా.

ఏలనన అట్టి శాశ్వతపరబ్రహ్మకును, అమృతత్వమునకును, సనాతన ధర్మమునకును, అఖండా నందమునకును నేనే ఆశ్రయుడను.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగయోగో నామ

చతుర్దశోఽధ్యాయః॥

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ పంచదశోఽధ్యాయః - పురుషోత్తమయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 ఊర్ధ్వమూలమధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥

ఊర్ధ్వమూలం-అధః శాఖం-అశ్వత్థం-ప్రాహుః-అవ్యయం
ఛందాంసి-యస్య-పర్ణాని-యః-తం-వేద-సః-వేదవిత్

ఊర్ధ్వమూలం= మూలము పైన గలదియు, అధః శాఖం= శాఖలు క్రింద గలదియు, అశ్వత్థం= అశ్వత్థమును, అవ్యయం= నశించని దానినిగ, ప్రాహుః= చెప్పిరి, యస్య = దేనికి, ఛందాంసి= వేదములు, పర్ణాని= ఆకులో, తం=దానిని, యః= ఎవడు, వేద గ్రహించుచున్నాడో, సః=వాడు, వేదవిత్= వేదార్థమును తెలిసినవాడు.

శ్రీ కృష్ణ భగవానుడు పలికెను - ఆదిపురుషుడైన పరమేశ్వరుడే మూలముగా, బ్రహ్మయే ముఖ్యశాఖగా , వేదములే ఆకులు గా గల ఈ సంసారరూప - అశ్వత్థవృక్షము శాశ్వతమైనది. ఈ సంసారవృక్షతత్త్వమును మూలసహితముగా తెలిసినవాడు నిజముగా వేదార్థములను తెలిసిన వాడు.

2 అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా

గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।

అధశ్చమూలాన్యనుసంతతాని

కర్మానుబంధీని మనుష్యలోకే ॥

అధః-చ- ఊర్ధ్వం-ప్రసృతాః-తస్య-శాఖాః-గుణప్రవృద్ధాః-విషయ ప్రవాలాః

అధః-చ-మూలాని-అనుసంతతాని-కర్మానుబంధీని-మనుష్యలోకే

తస్య=దానియొక్క, శాఖాః=కొమ్మలు, గుణప్రవృద్ధాః= గుణములచే వృద్ధినొందియున్నవి, విషయ ప్రవాలాః = విషయములనెడి చిగుళ్ళు గలవి, అధః చ= క్రిందికిని, ఊర్ధ్వం= మీదికిని, ప్రసృతాః= వ్యాపించియున్నవి, మూలాని = వేళ్ళు, కర్మానుబంధీని= కర్మాను బంధము గలవియై, మనుష్యలోకే= మనుష్యలోకమునందు, అధః చ= క్రిందను, అనుసంతతాని= విస్తరించియున్నవి.

ఈ సంసారవృక్షమును త్రిగుణములనెడి జలములు తడుపుచుండును. ఆ జలములచే వృద్ధిపొందు శాఖలే దేవమనుష్యతిర్యగ్యోనులలో జన్మించు ప్రాణులు, చిగుళ్లే విషయభోగములు. ఈ శాఖముల, చిగుళ్ళు సర్వత్ర వ్యాపించి యున్నవి. మనుజులను కర్మానుసారముగా బంధించు అహంకార మమకార వాసనలనెడి వేర్లు, ఊడలు అన్నిలోకములలోను క్రింద, పైన వ్యాపించి ఉన్నవి.

3 న రూపమస్యేహ తథోపలభ్యతే

నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।

అశ్వత్థమేనం సువిరూఢమూలమ్

అసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥

న-రూపం-అస్య- ఇహ-తథా- ఉపలభ్యతే-న-అంతః-న-చ- ఆదిః-న-చ-సంప్రతిష్ఠా

అశ్వత్థం-ఏనం-సువిరూఢమూలం-అసంగశస్త్రేణ-దృఢేన-ఛిత్వా

ఇహ= ఈ లోకమునందు, అస్య= ఈ అశ్వత్థ వృక్షమునకు, రూపం= స్వరూపము, న ఉపలభ్యతే= పొందశక్యము గాదు, తథా=అలాగుననే, ఆదిః నః ఆది తెలియకున్నది, అంతః చ న= అంతము తెలియకున్నది, సంప్రతిష్ఠా న చ = స్థితియును తెలియకున్నది, సువిరూఢమూలం= పాతుకొన్న వేళ్ళుగల, ఏనం= ఈ, అశ్వత్థం= అశ్వత్థమును, దృఢేన= దృఢమైన, అసంగ శస్త్రేణ= అసంగ శస్త్రముచే, ఛిత్వా= ఛేదించి,

ఈ సంసార వృక్షమును బాగుగా పరిశీలించి చూచినచో ఇందు వర్ణింపబడిన రీతిగా లభ్యము గాదు. ఇది ఆదియు, అంతము, సరియైన స్థితియు లేనిది. కనుక అహంకారమమ కారవాసనారూపములైన దృఢమైన వేర్లు, ఊడలు గల ఈ సంసారరూప - అశ్వత్థవృక్షమును సునిశితమైన వైరాగ్యమనెడి శస్త్రముతో ఖండించి...

4 తతః పదం తత్పరిమార్గితవ్యం

యస్మిన్ గతా న నివర్తంతి భూయః ।

తమేవ చాద్యం పురుషం ప్రపద్యే

యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥

తతః-పదం-తత్-పరిమార్గితవ్యం-యస్మిన్-గతాః-న-నివర్తంతి- భూయః

తం- ఏవ-చ- ఆద్యం-పురుషం-ప్రపద్యే-యతః-ప్రవృత్తిః- ప్రసృతా-పురాణీ

తతః= తరువాత, యస్మిన్= దేనియందు, గతాః= మరలినవారు, భూయః=మరల, న నివర్తంతి = మరలరో, యతః= ఎవనివలన, పురాణీ= అనాదియైన, ప్రవృత్తిః= ప్రవృత్తి, ప్రసృతా= వ్యాప్తమైనదో, ఆద్యం= ఆద్యుడైన, తం= ఆ, పురుషం ఏవ చ = పురుషుడగు నారాయణునే, ప్రపద్యే= శరణు పొందుచున్నాను, తత్= ఆ, పదం= స్థానము, పరిమార్గితవ్యం= అన్వేషించదగినది.

అనంతరము ఆ పరమపదరూపుడైన పరమేశ్వరుని సర్వతోముఖముగ అన్వేషింపవలెను. ఈ పరమపదమును చేరిన పురుషులు ఈ జగత్తునకు మరలరారు. అట్టి పరమేశ్వరునినుండియే ఈ సనాతనమైన సంసారవృక్షపరంపర విస్తరించియున్నది. అట్టి పరమాత్ముని శరణుపొంది, దృఢ నిశ్చయముతో ఆ పరమేశ్వరుని సదా మనన, నిదిధ్యాసాదులు చేయవలెను.

5 నిర్మానమోహా జితసంగదోషా

అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।

ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః

గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥

నిర్మానమోహాః-జితసంగదోషాః-అధ్యాత్మనిత్యాః-వినివృత్త కామాః

ద్వంద్వైః-విముక్తాః-సుఖదుఃఖ సంజ్ఞైః-గచ్ఛంతి-అమూఢాః-పదం- అవ్యయం- తత్

నిర్మానమోహాః= అభిమానము మోహము లేనివారును, జితసంగదోషాః= సంగత్వ దోషమును జయించినవారు, అధ్యాత్మ నిత్యాః= ఆత్మజ్ఞానము కలవారును, వినివృత్త కామాః= కామములను త్యజించినవారు, సుఖదుఃఖసంజ్ఞైః= సుఖదుఃఖరూపములైన, ద్వంద్వైః= ద్వంద్వములచేత, విముక్తాః= విముక్తులగు, అమూఢాః= జ్ఞానులు, అవ్యయం= నశించని, తత్= ఆ, పదం= పదమును, గచ్ఛంతి= పొందుచున్నారు.

దురభిమానమును, మోహమును వదిలిపెట్టినవారు, ఆసక్తియను దోషమును జయించినవారును, ప్రాపంచికవాంఛలవదిలినవారు పరమాత్మ స్వరూపము నందు నిత్యము చలించువారు, సుఖదుఃఖాదిద్వంద్వముల నుండి విముక్తులైన వారును అగు జ్ఞానులు శాశ్వతమైన ఆ పరమపదమును పొందుదురు.

6 న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।

యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥

న-తత్-భాసయతే-సూర్యః-న-శశాంకః-న-పావకః

యత్-గత్వా-న-నివర్తంతే-తత్-ధామ-పరమం-మమ

యత్=దేనిని, గత్వా= పొంది, న నివర్తంతే=తిరిగి రారో, తత్= అది, సూర్యః= సూర్యుడు, న భాసయతే= ప్రకాశింప జేయజాలడు, శశాంకః= చంద్రుడు, న భాసయతే= ప్రకాశింప జేయజాలడు, పావకః=అగ్ని, న భాసయతే= ప్రకాశింప జేయజాలడు, తత్= అది, మమ= నాయొక్క, పరమం= ఉత్తమమైన, ధామ= ధామము.

స్వయంప్రకాశస్వరూపమైన ఆ పరమాత్మను సూర్యుడు గాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయజాలరు. అట్టి పరంధామమును చేరిన పుణ్యాత్ములు మఱల ఈ జగత్తున ప్రవేశింపరు.

7 మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।

మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥

మమ- ఏవ- అంశః-జీవలోకే-జీవభూతః-సనాతనః

మనః-షష్ఠాని- ఇంద్రియాణి-ప్రకృతిస్థాని-కర్షతి

సనాతనః=శాశ్వతమైన, మమ ఏవ= కేవలం నా యొక్క, అంశః= అంశము, జీవభూతః= జీవుడై, జీవలోకే= జీవలోకము నందు, ప్రకృతి స్థాని= ప్రకృతియందున్న, మనః షష్ఠాని= మనస్సుతో కూడి ఆరుయైన, ఇంద్రియాణి= ఇంద్రియములను, కర్షతి= ఆకర్షించుచున్నది.

ఈ దేహమునందున్న సనాతనమైన జీవాత్మ నా అంశయే. అది ప్రకృతియందు స్థితములైన మనస్సు ఇంద్రియములను శబ్దాది విషయములద్వారా తనవైపు ఆకర్షించును.

8 శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।

గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥

శరీరం-యత్-అవాప్నోతి-యత్-చ-అపి- ఉత్క్రామతి- ఈశ్వరః

గృహీత్వా- ఏతాని-సంయాతి-వాయుః-గంధాన్- ఇవ- ఆశయాత్

ఈశ్వరః= ఈశ్వరుడు, యత్= ఎప్పుడు, శరీరం= శరీరమును, అవాప్నోతి= పొందుచున్నాడో, యత్ చ అపి= ఎప్పుడు, ఉత్క్రామతి = విడుచుచున్నాడో, వాయుః= గాలి, ఆశయాత్= సౌరభస్థానము నుండి, గంధాన్ ఇవ= గంధమువలె, ఏతాని= ఈ ఇంద్రియములను, గృహీత్వా= గ్రహించి, సంయాతి= వెలువడు చున్నాడు.

వాయువు వాసనలను ఒకచోటినుండి మఱియొకచోటికి తీసికొని పోయినట్లుగా దేహాదులకు స్వామియైన జీవాత్మ ఒక శరీరమును త్యజించునపుడు, మనస్సును ఇంద్రియములను గ్రహించి, వాటితో గూడ మఱొక శరీరమును పొందును.

9 శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ।

అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥

శ్రోత్రం-చక్షుః-స్పర్శనం-చ-రసనం-ఘ్రాణం- ఏవ-చ

అధిష్ఠాయ-మనః-చ-అయం-విషయాన్- ఉపసేవతే

అయం= ఈ, శ్రోత్రం= చెవిని, చక్షుః= కంటిని, స్పర్శనం చ= చర్మమును, రసనం= నాలుకను, ఘ్రాణం ఏవ చ= ముక్కును, మనః చ= మనస్సును, అధిష్ఠాయ= అధిష్ఠించి, విషయాన్= విషయములను, ఉపసేవతే= అనుభవించుచున్నాడు.

ఈ జీవాత్మ పంచేంద్రి యములను, మనస్సును ఆశ్రయించి, శబ్దాది విషయములను అనుభవించును.

10 ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్ ।

విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥

ఉత్క్రామంతం-స్థితం-వా-అపి-భుంజానం-వా-గుణాన్వితం

విమూఢాః-న-అనుపశ్యంతి-పశ్యంతి-జ్ఞానచక్షుషః

ఉత్క్రామంతం= వెడలునట్టివానినిగాని, స్థితం వా అపి= ఉన్నవానిని గాన, భుంజానం వా= అనుభవించుచున్న వానినిగాని, గుణాన్వితం= గుణములతో గూడిన వానిని, విమూఢాః= అజ్ఞానులు, న అనుపశ్యంతి= చూడజాలరు, జ్ఞానచక్షుషః= జ్ఞానదృష్టిగలవారు, పశ్యంతి= చూచుచున్నారు.

జీవాత్మ శరీరమును త్యజించునప్పుడును, శరీరమునందు స్థితుడై యున్నప్పుడును, విషయభోగములను అనుభవించు చున్నప్పుడును, త్రిగుణములతో కూడియున్నప్పుడును అజ్ఞానులు తెలిసికొనలేరు. కేవలము వివేకశీలురైన జ్ఞానులే తమ జ్ఞాననేత్రములవలన స్వస్వరూపమును తెలిసికొనుచున్నారు.

11 యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।

యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥

యతంతః-యోగినః-చ- ఏనం-పశ్యంతి- ఆత్మని-అవస్థితం

యతంతః-అపి-అకృతాత్మానః-న- ఏనం-పశ్యంతి-అచేతసః

యోగినః=యోగులు, యతంతః= సదా అభ్యాసపరులై, ఆత్మని= ఆత్మయందు, అవస్థితం= ఉన్నటువంటి, ఏనం= ఈ పరమాత్మను, పశ్యంతి= చూచుచున్నారు, అకృతాత్మానః= ఆత్మజ్ఞానము లేని, అచేతసః = అవివేకులు, యతంతః అపి= అభ్యాస పరులైనను, ఏనం= ఈ పరమాత్మను, నచ పశ్యంతి=చూడజాలరు.

అంతః కరణశుద్ధిగలయోగులు తమహృదయముల యందున్న ఈ ఆత్మతత్త్వమును ప్రయత్నించి తెలిసికొనగలరు. కాని అంతఃకరణశుద్ధిలేని అజ్ఞానులు ఎంతగా ప్రయత్నించియు, ఈ ఆత్మను తెలిసికొనజాలరు.

12 యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।

యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

యత్- ఆదిత్యగతం-తేజః-జగత్-భాసయతే-అఖిలం

యత్-చంద్రమసి-యత్-చ-అగ్నౌ-తత్-తేజః-విద్ధి- మామకం

యత్= ఏ, తేజః= తేజస్సు, ఆదిత్యగతం= సూర్యునియందు ఉన్నదియై, అఖిలం= సమస్తమైన, జగత్= జగత్తును, భాసయతే= ప్రకాశింపజేయుచున్నదో, యత్ = ఏది, చంద్రమసి= చంద్రునియందును, యత్= ఏది, అగ్నౌ చ= అగ్ని యందున్నదో, తత్= ఆ, తేజః= తేజస్సును, మామకం= నా సంబంధమైన దానినిగ, విద్ధి= తెలిసికొనుము.

సర్వజగత్తును ప్రకాశింపజేయు సూర్యునితేజస్సును, అటులనే చంద్రునితేజస్సును, అగ్నితేజస్సును నాతేజస్సేయని తెలిసికొనుము.

13 గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।

పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥

గాం- ఆవిశ్య-చ-భూతాని-ధారయామి-అహం- ఓజసా

పుష్ణామి-చ- ఓషధీః-సర్వాః-సోమః-భూత్వా-రసాత్మకః

అహం=నేను, గాం = భూమిని, ఆవిశ్య=ప్రవేశించి, భూతాని=భూతములను, ఓజసా= శక్తిచేతను, ధారయామి చ= ధరించుచున్నాను, రసాత్మకః= రస స్వరూపుడగు, సోమః= చంద్రుడను, భూత్వా= అయి, సర్వాః= సమస్తమైన, ఓషధీః చ= ఓషధులను, పుష్ణామి= పోషించుచున్నాను.

భూమియందు ప్రవేశించి, నేను నా శక్తిద్వారా సకల భూతములను ధరించి, పోషించుచున్నాను. రసస్వరూపుడనై - అనగా అమృతమయుడైన చంద్రుడనై ఓషధులకు అనగా వనస్పతులన్నింటికిని, పుష్టిని చేకూర్చుచున్నాను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

14 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।

ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

అహం-వైశ్వానరః-భూత్వా-ప్రాణినాం-దేహం- ఆశ్రితః

ప్రాణాపాన సమాయుక్తః-పచామి- అన్నం- చతుర్విధం

అహం=నేను, వైశ్వానరః=జఠరాగ్ని, భూత్వా= అయి, ప్రాణినాం= ప్రాణుల యొక్క, అహం=నేను, వైశ్వానరః= జఠరాగ్ని, భూత్వా= అయి, ప్రాణినాం= ప్రాణుల యొక్క, దేహం= దేహమును, ఆశ్రితః = ఆశ్రయించిన వాడనగుచు, ప్రాణాపాన సమాయుక్తః= ప్రాణాపానాది వాయువులతో కూడినవాడనై, చతుర్విధం= నాలుగు విధములైన, అన్నం= అన్నమును, పచామి= పచనము చేయుచున్నాను.

నేనే ప్రాణాపానసంయుక్తమైన వైశ్వానరుడు అనే అగ్ని రూపములో సర్వప్రాణుల శరీరములయందుండి నాలుగువిధములైన ఆహారములను జీర్ణము చేయుచుందును.

15 సర్వస్య చాహం హృది సన్నివిష్టో

మత్తః స్మృతిర్ జ్ఞానమపోహనం చ ।

వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో

వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ ॥

సర్వస్య-చ-అహం-హృది-సంనివిష్టః-మత్తః-స్మృతిః-జ్ఞానం-అపోహనం-చ

వేదైః-చ-సర్వైః-అహం- ఏవ-వేద్యః-వేదాంతకృత్-వేదవిత్- ఏవ-చ- అహం

అహం=నేను, సర్వస్య చ = సమస్త ప్రాణులయొక్క, హృది= హృదయమునందు, సంనివిష్టః= ఉన్నవాడను, మత్తః= నావలన, స్మృతిః= జ్ఞాపకశక్తి, జ్ఞానం= జ్ఞానము, అపోహనం చ= మరపును, అహం ఏవ = నేనే, సర్వైః= సమస్తములైన, వేదైః=వేదములచేత, వేద్యః చ = తెలియదగినవాడను, అహం ఏవః నేనే, వేదాంతకృత్ = వేదాంతకర్తను, వేదవిత్ చ = వేదవిదుడను.

అన్ని ప్రాణుల హృదయములలో అంతర్యామిగా ఉన్న వాడను నేనే. నానుండియే స్మృతి, జ్ఞానము, మరపు కలుగుచున్నవి. వేదముల ద్వారా తెలిసికొనదగిన వాడను నేనే. వేదాంతకర్తను, వేదజ్ఞుడను గూడ నేనే.

16 ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।

క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥

ద్వౌ- ఇమౌ- పురుషౌ-లోకే-క్షరః-చ-అక్షరః- ఏవ-చ

క్షరః-సర్వాణి-భూతాని-కూటస్థః-అక్షరః- ఉచ్యతే

లోకే= లోకమునందు, క్షరః చ = క్షరుడును, అక్షరః ఏవ చ= అక్షరుడును, ఇమౌ = ఈ, ద్వౌ= ఇరువురు, పురుషౌ= పురుషులు, సర్వాణి= సమస్తమైన, భూతాని= భూతములు, క్షరః= క్షరమనియు, అక్షరః= అక్షరుడగు పురుషుడు, కూటస్థః= జీవుడనియు, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

ఈ లోకమునందు క్షరుడు (నశ్వరుడు), అక్షరుడు (వినాశనము లేనివాడు) అని పురుషులు రెండు విధములుగా గలరు. సకలప్రాణులశరీరములు నశ్వరములు. జీవాత్మ నాశరహితుడు.

17 ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।

యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

ఉత్తమః-పురుషః-తు-అన్యః-పరమాత్మా- ఇతి- ఉదాహృతః

యః-లోకత్రయం- ఆవిశ్య-బిభర్తి-అవ్యయః- ఈశ్వరః

యః= ఎవడు, అవ్యయః= అవినాశియు, ఈశ్వరః= ఈశ్వరుడు, లోకత్రయం= మూడులోకములను, ఆవిశ్య= ప్రవేశించి, బిభర్తి= భరించుచున్నాడో, అన్యః తు= ఇతరుడైన, పురుషః= పురుషుడు, ఉత్తమః= ఉత్తముడు, పరమాత్మా ఇతి= పరమాత్మయని, ఉదాహృతః = చెప్పబడుచున్నాడు.

పై ఇద్దరికంటెను ఉత్తముడైన పురుషుడు వేరైనవాడొకడు కలడు. అతడే నాశరహితుడైన పరమేశ్వరుడు, పరమాత్మ. అతడు మూడులోకములయందును ప్రవేశించి, అందరిని భరించి పోషించుచున్నాడు.

18 యస్మాత్ క్షరమతీతోఽహమ్ అక్షరాదపి చోత్తమః ।

అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥

యస్మాత్-క్షరం-అతీతః-అహం-అక్షరాత్-అపి-చ- ఉత్తమః

అతః-అస్మి-లోకే-వేదే-చ-ప్రథితః-పురుషోత్తమః

అహం=నేనే, యస్మాత్= ఎందువలన, క్షరం= క్షరమునకు, అతీతః= అతీతుడనో, అక్షరాత్ అపి చ= అక్షరము కన్నను, ఉత్తమః = శ్రేష్ఠుడనో, అతః= అందువలన, లోకే= లోకమునందును, వేదే చ= వేదమునందును, పురుషోత్తమః= పురుషోత్తముడని, ప్రథితః= ప్రసిద్ధుడను, అస్మి= అయితిని.

నశ్వరమగు క్షేత్రము కంటెను నేను సర్వదా అతీతుడను. నాశరహితమైన జీవాత్మ కంటెను ఉత్తముడను. కనుక ఈజగత్తునందును, వేదముల యందును పురుషోత్తముడని ప్రసిద్ధికెక్కితిని.

19 యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।

స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥

యః-మాం- ఏవం-అసమ్మూఢః-జానాతి-పురుషోత్తమం

స-సర్వవిత్-భజతి-మాం-సర్వభావేన- భారత

భారత= అర్జునా, యః= ఎవడు, అసమ్మూఢః= జ్ఞానియై, మాం=నన్ను, ఏవం= ఇట్లు, పురుషోత్తమం= పురుషోత్తమునిగ, జానాతి= తెలిసికొనుచున్నాడో, సః=వాడు, సర్వవిత్= సర్వము తెలిసినవాడై, సర్వభావేన= సమస్త భావములచేత, మాం = నన్ను, భజతి=భజించుచున్నాడు.

ఓ అర్జునా ! జ్ఞానియైనవాడు ఈ విధముగా నన్ను తత్త్వతః పురుషోత్తమునిగా ఎఱుంగును. సర్వజ్ఞుడైన అతడు వాసుదేవుడనైన నన్నే నిరంతరము పరమేశ్వరునిగా భజించును.

20 ఇతి గుహ్యతమం శాస్త్రమ్ ఇదముక్తం మయానఘ ।

ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥

ఇతి-గుహ్యతమం-శాస్త్రం- ఇదం- ఉక్తం- మయా-అనఘ

ఏతత్-బుద్ధ్వా-బుద్ధిమాన్-స్యాత్-కృతకృత్యః-చ-భారత

అనఘ=పాపరహితుడా, భారత=అర్జునా, మయా=నాచేత, ఇదం= ఈ, గుహ్యతమం= అతిరహస్యమైనటువంటి, శాస్త్రం= యోగశాస్త్రము, ఇతి= ఇటుల, ఉక్తం= చెప్పబడినది, ఏతత్= దీనిని, బుద్ధ్వా= తెలిసికొని, బుద్ధిమాన్= బుద్ధిమంతుడును, కృతకృత్యఃచ = కృతకృత్యుడును, స్యాత్=అగును.

ఓ పుణ్యపురుషా ! ఓ అర్జునా! అత్యంతము రహస్యమైన ఈ శాస్త్రమును ఈ విధముగా నీకు తెలిపితిని. దీని తత్త్వమును తెలిసికొనిన మనుష్యుడు జ్ఞానియై కృతార్థుడు కాగలడు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమయోగోనామ

పంచదశోఽధ్యాయః ॥

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ షోడశోఽధ్యాయః - దైవాసురసంపద్విభాగయోగః

శ్రీభగవాన్ ఉవాచ

1 అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।

దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥

అభయం-సత్త్వసంశుద్ధిః-జ్ఞానయోగ వ్యవస్థితః

దానం-దమః-చ-యజ్ఞః-చ-స్వాధ్యాయః-తపః- ఆర్జవం

అభయం=భయములేకుండుట, సత్త్వ సంశుద్ధిః= త్రికరణ శుద్ధియు, జ్ఞానయోగః వ్యవస్థితః= జ్ఞానయోగ దృఢత్వము, దానం= దానము, దమః చ= ఇంద్రియ నిగ్రహము, యజ్ఞః చ= యజ్ఞమును, స్వాధ్యాయః= వేదాధ్యయనము, తపః= తపస్సు, ఆర్జవం=ఋజుత్వము

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను - నిర్భయత్వము, అంతఃకరణశుద్ధి, తత్త్వజ్ఞానప్రాప్తికై ధ్యానయోగమునందు నిరంతర దృఢస్థితి, సాత్త్వికదానము, ఇంద్రియనిగ్రహము, భగవంతుని, దేవతలను, గురుజనులను పూజించుట, అట్లే అగ్నిహోత్రాది - ఉత్తమ కర్మాచరణము, వేదశాస్త్రములపఠన, పారాయణములు మఱియు భగవంతుని నామగుణకీర్తనములు, స్వధర్మాచరణము నందలి కష్టములకు ఓర్చుకొనుట, శరీరేంద్రియాంతఃకరణముల సరళత్వము.

2 అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్ ।

దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥

అహింసా-సత్యం-అక్రోధః-త్యాగః-శాంతిః-అపైశునం

దయా-భూతేషు-అలోలుప్త్యం-మార్దవం-హ్రీః-అచాపలం

అహింసా= అహింసయు, సత్యం=సత్యము, అక్రోధః=క్రోధము లేకుండుట, త్యాగః=త్యాగము, శాంతిః= శాంత స్వభావము, అపైశునం= చాడీలు చెప్పకుండుట, భూతేషు= భూతములయందు, దయా= దయ, అలోలుప్త్వం= లోలత్వము లేకుండుట, మార్దవం= మృదుత్వము, హ్రీః= సిగ్గు, అచాపలం= చపలత్వము లేకుండుట

అహింస , సత్యము , క్రోధము , త్యాగము , శాంతి , ఎవ్వరినీ నిందింప కుండుట, దయ, మార్దవము , శాస్త్ర విరుద్ధ కార్యాచరణమునకు వెనుకాడుట, చపలత్వము లేకుండుట.

3 తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా ।

భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ।

తేజః-క్షమా-ధృతిః-శౌచం-అద్రోహః-న-అతిమానితా

భవంతి-సంపదం-దైవీం-అభిజాతస్య-భారత

తేజః= తేజము, క్షమా= ఓరిమి, ధృతిః= ధైర్యము, శౌచం= శుభ్రత, అద్రోహః= ద్రోహము లేకుండుట, న అతిమానితా= గర్వము లేకుండుట, దైవీం= దైవసంబంధమైన, సంపదం= సంపదను గురించి, అభిజాతస్య= పుట్టినవానికి, భవంతి=కలుగుచున్నవి, భారత=అర్జునా.

ఓ అర్జునా ! తేజస్సు, క్షమ, ధైర్యము, బాహ్యశుద్ధి ఎవ్వరిపైనను శత్రుభావము లేకుండుట తాను పూజ్యుడనను అభిమానము లేకుండుట మొదలగునవి యన్నియును దైవీసంపద గలవాని లక్షణములు.

4 దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।

అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥

దంభః-దర్పః-అభిమానః-చ-క్రోధః-పారుష్యం- ఏవ-చ

అజ్ఞానం-చ-అభిజాతస్య-పార్థ-సంపదం- ఆసురీం

పార్థ=అర్జునా, దంభః= కపటము, దర్పః= గర్వము, అభిమానః చ= దురభిమానము, క్రోధః= క్రోధము, పారుష్యం ఏవ చ= పౌరుషమును, అజ్ఞానం చ= అజ్ఞానము, ఆసురీం = రాక్షససంబంధమైన, సంపదం= సంపదను గూర్చి, అభిజాతస్య= పుట్టినవానికి.

ఓ పార్థా ! కపటము, దర్పము మొండితనము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము మొదలగునవి ఆసురీస్వభావముగలవాని లక్షణములు.

5 దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।

మా శుచః సంపదం దైవీమ్ అభిజాతోఽసి పాండవ ॥

దైవీ-సంపత్-విమోక్షాయ-నిబంధాయ- ఆసురీ-మతా

మా-శుచః-సంపదం-దైవీం-అభిజాతః-అసి-పాండవ

పాండవ=అర్జునా, దైవీ=దైవసంబంధమైన, సంపత్=సంపద, విమోక్షాయ = బంధనివృత్తి కొరకును, ఆసురీ= రాక్షససంబంధమైన, సంపత్= సంపద, నిబంధాయ = బంధహేతువు గను, మతా=చెప్పబడినది, దైవీం= దైవసం బంధమైన, సంపదం=సంపదను గురించి, అభిజాతః = పుట్టినవాడవు, అసి= అయి ఉన్నావు, మా శుచః= దుఃఖించకుము.

ఓ అర్జునా ! దైవీసంపద ముక్తిదాయకము. ఆసురీసంపద బంధహేతువు. నీవు దైవీసంపదతో పుట్టినవాడవు. కనుక శోకింపదగదు.

6 ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థ మే శృణు ॥

ద్వౌ-భూత సర్గౌ-లోకే-అస్మిన్-దైవః- ఆసురః- ఏవ-చ
దైవః-విస్తరశః-ప్రోక్తః- ఆసురం-పార్థ-మే-శృణు

పార్థ= అర్జునా, అస్మిన్= ఈ, లోకే = లోకమునందు, దైవః= దైవసంబంధ మనియు, ఆసురః ఏవ చ= అసుర సంబంధమనియును, భూతసర్గౌ= ప్రాణసృష్టులు, ద్వౌ= రెండు విధములు, దైవః= దైవసంబంధమైనది, విస్తరశః= విస్తారముగాను, ప్రోక్తః= చెప్పబడినది, ఆసురం= అసురమగుదానిని, మే= నావలన, శృణు= వినుము.

ఓ అర్జునా ! ఈ లోకముననున్న మానవులు రెండువిధములుగా ఉందురు. దైవలక్షణములు గలవారు కొందఱు. అసురలక్షణములు గలవారు మఱికొందఱు. దైవ లక్షణములు విస్తృతముగా తెల్పబడినవి. ఇప్పుడు ఆసురలక్షణములుగలవారిని గూర్చి వివరముగా తెల్పెదను వినుము.

7 ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥

ప్రవృత్తిం-చ-నివృత్తిం-చ-జనాః-న-విదుః- ఆసురాః
న-శౌచరం-న-అపి-చ- ఆచారః-న-సత్యం-తేషు-విద్యతే

ఆసురాః=అసుర స్వభావముగల, జనాః= జనులు, ప్రవృత్తిం చ= ప్రవృత్తిమార్గమునుగాని, నివృత్తిం చ = నివృత్తిమార్గమును గాని, న విదుః= ఎరుగరు, తేషు= వారియందు, శౌచం= శుభ్రత, న విద్యతే = ఉండదు, ఆచారః చ నః= ఆచారము లేదు, సత్యం అపి నః= సత్యము కూడా ఉండదు.

అసురస్వభావముగలవారు ప్రవృత్తినివృత్తులను ఎఱుగరు. కనుక వారిలో బాహ్యాభ్యంతర శుచిత్వముగాని, శ్రేష్ఠమైన ప్రవర్తనగాని, సత్యభాషణముగాని ఉండనే ఉండవు.

8 అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।

అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్ ॥

అసత్యం-అప్రతిష్ఠం-తే-జగత్- ఆహుః-అనీశ్వరం

అపరస్పర సంభూతం-కిం-అన్యత్-కామహైతుకం

తే=వారు, జగత్= ప్రపంచము, అసత్యం= అసత్యము, అప్రతిష్ఠం= ప్రతిష్ఠలేనిది, అనీశ్వరం= ఈశ్వరుడు లేనిది, కామహైతుకం= కామకారణమైనది, అపరస్పర సంభూతం= స్త్రీ పురుష సంయోగమువలన కలిగినది, అన్యత్ కిం= మరియేమున్నది యని, ఆహుః= చెప్పుదురు.

ఈ జగత్తునకు ఆధారమైనది ఏదియును లేదనియు, ఇది అసత్య మనియు, భగవంతుడనెడివాడు లేనేలేడనియు, కామప్రేరితులైన స్త్రీపురుషులసంయోగ కారణముగ జీవులు సహజముగనే పుట్టుచున్నారనియు, కావున సృష్టికి కామము తప్ప మఱొక కారణమే లేదనియు ఆసురలక్షణములు గలవారు భావింతురు.

9 ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।

ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥

ఏతాం-దృష్టిం-అవష్టభ్య-నష్టాత్మానః-అల్పబుద్ధయః

ప్రభవంతి- ఉగ్రకర్మాణః-క్షయాయ-జగతః-అహితాః

ఏతాం= ఈ, దృష్టిం= దృష్టిని, అవష్టభ్య= అవలంబించి, నష్టాత్మానః= చెడినమనస్సు గలవారు, అల్పబుద్ధయః= అల్పబుద్ధులు, ఉగ్రకర్మాణః= ఉగ్రకర్మలు చేయువారు, అహితాః= చెడువారును, జగతః= జగత్తుయొక్క, క్షయాయ= నశింపునకు, ప్రభవంతి= పుట్టుచున్నారు.

అసంబద్ధమైన ఇట్టి మిథ్యావాదముచేయుభౌతికవాదులు ఆత్మనుగూర్చి తలంపరు. వారు మందబుద్ధులు. వారు అందఱికిని అపకారము చేయుక్రూరులు. వారిశక్తిసామర్థ్యములు ప్రపంచ వినాశమునకే వినియోగపడుచుండును.

10 కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః।

మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥

కామం- ఆశ్రిత్య-దుష్పూరం-దంభమాన-మదాన్వితాః

మోహాత్-గృహీత్వా-అసద్గ్రాహాన్-ప్రవర్తంతే-అశుచివ్రతాః

దుష్పూరం=తృప్తిచెందని, కామం=కామమును, ఆశ్రిత్య= ఆశ్రయించి, దంభమాన మదాన్వితాః= దంభముతోను అభిమానముతోను గర్వముతోను కూడినవారలై, అశుచివ్రతాః= భ్రష్టాచారములు గలవారై, అసద్గ్రాహాన్= దురాచారములను, మోహాత్= మోహము వలన, గృహీత్వా= గ్రహించి, ప్రవర్తంతే= ప్రవర్తించుచుందురు.

దంభము, దురభిమానము, మదములతోగూడిన ఈ ఆసుర లక్షణములు గలవారు యుక్తాయుక్తములను మరచి, తమ వాంఛలను ఏదో విధముగ తీర్చుకొనుటకు సిద్ధపడుదురు. అజ్ఞానకారణముగ మిథ్యాసిద్ధాంత ములను ఆశ్రయింతురు. శాస్త్ర విరుద్ధముగా ఆచారములేక ప్రవర్తింతురు.

11 చింతామపరిమేయాం చ ప్రలయాంతాముపాశ్రితాః।

కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥

చింతాం-అపరిమేయాం-చ-ప్రలయాంతాం- ఉపాశ్రితాః

కామోపభోగ పరమాః- ఏతావత్- ఇతి- నిశ్చితాః

అపరిమేయాం=అపరిమితమైనదియు, ప్రలయాంతాం= మృత్యువేఅంతముగా గలదియు నగు, చింతాం=చింతను, ఉపాశ్రితాః= ఆశ్రయించినవారై, కామోప భోగపరమాః= విషయభోగాలే ఉత్తమమనుచు, ఏతావత్ ఇతి = ఇదియే పరమార్థమనుచు, నిశ్చితాః=నిశ్చయించినవారై . . .

మరణించువఱకును వారు అంతులేనిచింతలలోనే మునిగిపోవు చుందురు. విషయభోగానుభవముల యందే మునిగి, అదియే నిజమైన సుఖమని భావింతురు.

12 ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహంతే కామభోగార్థమ్ అన్యాయేనార్థసంచయాన్ ॥

ఆశాపాశశతైః-బద్ధాః-కామక్రోధ పరాయణాః
ఈహంతే-కామభోగార్థం-అన్యాయేన-అర్థసంచయాన్

ఆశాపాశశతైః= వందలకొలది ఆశాపాశములచేత, బద్ధాః= బంధింపబడినవారై, కామక్రోధ పరాయణాః చ= కామక్రోధములచేత కూడినవారై, కామభోగార్థం= కామానుభవమునకై, అన్యాయేన= అన్యాయముగ, అర్థసంచయాన్= ధనసంపాదనమును, ఈహంతే=కోరుచున్నారు.

వారు ఆశాపాశపరంపరలచే ఎల్లప్పుడును బంధింపబడుచుందురు. కామక్రోధపరాయణులై ప్రవర్తింతురు. విషయభోగముల నిమిత్తమై, అన్యాయ మార్గములద్వారా ధనార్జనకు పాల్పడుచుందురు.

13 ఇదమద్య మయా లబ్ధమ్ ఇమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్ ॥

ఇదం-అద్య-మయా-లబ్ధం- ఇమం-ప్రాప్స్యే-మనోరథం
ఇదం-అస్తి- ఇదం-అపి-మే-భవిష్యతి-పునః-ధనం

ఇదం= ఇది, అద్య= ఇప్పుడు, మయా=నాచేత, లబ్ధం= పొందబడినది, ఇమం= ఈ, మనోరథం = కోరికను, ప్రాప్స్యే=పొందగలను,మే=నాకు, ఇదం= ఇది, అస్తి=కలదు, పునః= మరల, ఇదం= ఈ, ధనం అపి=ధనముకూడా, భవిష్యతి=కలుగగలదు

నేను మిక్కిలి పురుషార్థినిగనుక ఈ కోరుకున్న వస్తువును పొందితిని. ఇంకను నా కోరికలన్నింటిని సాధించుకొనగలను. ఇప్పటికే నాకడ ఎంతో ధనము ఉన్నది. ముమ్ముందు ఇంకను ఎంతోధనమును సంపాదింపగలను అని వారు తలంచుచుందురు.

14 అసౌ మయా హతః శత్రుః హనిష్యే చాపరానపి ।

ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥

అసౌ-మయా-హతః-శత్రుః-హనిష్యే-చ-అపరాన్-అపి

ఈశ్వరః-అహం-అహం-భోగీ-సిద్ధః-అహం-బలవాన్-సుఖీ

అసౌ= ఈ, శత్రుః= శత్రువు, మయా=నాచేత, హతః=చంపబడెను, అపరాన్ అపి చ= ఇతరులనుకూడా, హనిష్యే= వధింతును, అహం=నేను, ఈశ్వరః= ఈశ్వరుడను, అహం= నేను, భోగీ=భోగిని, అహం=నేను, సిద్ధః= సిద్ధుడను, అహం=నేను, బలవాన్=బలవంతుడను, సుఖీ= సుఖవంతుడను

నేను ఈ శత్రువును వధించితిని. ఇతర శత్రువులనుగూడ వధింపగలను. నేనే సర్వాధిపతిని. సమస్త సుఖ భోగములను అనుభవింపగలవాడను నేనే. సిద్ధులన్నియు నా గుప్పిటనే యున్నవి. నేనే గొప్ప బలవంతుడను.

15 ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।

యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥

ఆఢ్యః-అభిజనవాన్-అస్మి-కః-అన్యః-అస్తి-సదృశః-మయా

యక్ష్యే-దాస్యామి-మోదిష్యే- ఇతి-అజ్ఞాన విమోహితా

ఆఢ్యః= ధనవంతుడను, అభిజనవాన్= గొప్ప కులమున జన్మించినవాడను, అస్మి= అయి ఉన్నాను, మయా= నాతోడ, సదృశః= సమానుడు, అన్యః= ఇతరుడు, కః= ఎవడు, అస్తి= కలడు, యక్ష్యే= యజ్ఞముచేసెదను, దాస్యామి= ఇచ్చెదను, మోదిష్యే= సంతోషించెదను, ఇతి=అని, అజ్ఞానవిమోహితాః= అజ్ఞాన మోహితులై.

నేనే గొప్ప ధనవంతుడను, మిక్కిలి పరివారము గలవాడను. నాతో సమానుడు మరియొకడులేడు. నేను యజ్ఞములను చేయగలను. దానములు ఇయ్యగలను. యథేచ్ఛగా వినోదింపగలను. - అనుచు అనేక విధములుగా అజ్ఞానమోహితులై...



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

16 అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః ।

ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేஉశుచౌ ॥

అనేక చిత్త విభ్రాంతాః-మోహజాల సమావృతాః

ప్రసక్తాః-కామభోగేషు-పతంతి-నరకే-అశుచౌ

అనేకచిత్తవిభ్రాంతాః= అనేకములైన మనోభ్రాంతులు కలవారై, మోహజాల సమావృతాః= మోహజాలముచే నావరింపబడినవారై, కామభోగేషు= కామభోగముల యందు, ప్రసక్తాః= ప్రసక్తులై, అశుచౌ= మలినపూరితమైన, నరకే= నరకమునందు, పతంతి= పడుచున్నారు.

చిత్తభ్రాంతికి లోనై మోహజాలము నందు చిక్కుకొని, ఆసురలక్షణములు గలవారు విషయ భోగములయందే మిక్కిలి ఆసక్తులై ఘోరనరకముల యందు పడిపోవుచుందురు.

17 ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితా ః।

యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥

ఆత్మసంభావితాః-స్తబ్ధాః-ధనమాన మదాన్వితాః

యజంతే-నామయజ్ఞైః-తే-దంభేన-అవిధిపూర్వకం

తే=వారు, ఆత్మసంభావితాః= ఆత్మస్తుతి గలవారునై, స్తబ్ధాః= స్తబ్ధులును, ధనమాన మదాన్వితాః= ధనాభిమానములవలన ఉన్మత్తులగుచు, దంభేన= డాంభికముగ, నామయజ్ఞైః= నామమాత్ర యజ్ఞములచేత, అవిధిపూర్వకం= విధిరహితముగా, యజంతే= యజ్ఞ మాచరించుచుందురు.

వారు తమకు తామే గొప్పవారమని భావించుకొనుచు, గర్వోన్మత్తులై ధనదురహంకారములతో కన్నుమిన్నుగానక ప్రమత్తులై, శాస్త్రవిరుద్ధముగా ఆడంబరప్రధానముగా పేరుకు మాత్రమే యజ్ఞముల నాచరించుదురు.

18 అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః॥

అహంకారం-బలం-దర్పం-కామం-క్రోధం-చ-సంశ్రితాః
మాం- ఆత్మపరదేహేషు-ప్రద్విషంతః- అభ్యసూయకాః

అహంకారం= అహంకారమును, బలం= బలమును, దర్పం= గర్వమును, కామం= కామమును, క్రోధం చ= క్రోధమును, సంశ్రితాః= ఆశ్రయించినవారై, ఆత్మపరదేహేషు= తమయందును ఇతరులయందును ఉన్న, మాం=నన్ను, అభ్యసూయకాః= అసూయతో జూచువారలై, ప్రద్విషంతః= ద్వేషించుచున్నారు.

అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధములకు వశులై, ఇతరులను నిందించుచు తమశరీరములయందును ఇతరులశరీరముల యందును, అంతర్యామిగానున్న నన్ను ద్వేషించుచుందురు.

19 తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు॥

తాన్-అహం-ద్విషతః-క్రూరాన్-సంసారేషు-నరాధమాన్
క్షిపామి-అజస్రం-అశుభాన్- ఆసురీషు- ఏవ-యోనిషు

అహం=నేను, ద్విషతః= ద్వేషించువారును, క్రూరాన్= క్రూరులును, అశుభాన్= అశుభులును అగు, తాన్= ఆ, నరాధమాన్= నరాధములను, సంసారేషు= సంసారమున, అజస్రం=సదా, ఆసురీషు= రాక్షస సంబంధములైన, యోనిషు ఏవ= గర్భములయందు, క్షిపామి= ఉంచుచున్నాను.

అట్లు ఇతరులను ద్వేషించు పాపాత్ములను, క్రూరులైన నరాధములను మాటిమాటికిని ఈ సంసారమునందు అసురీయోనులలోనే నేను పడవేయుచుందును.

20 ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।

మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్ ॥

ఆసురీం-యోనిం- ఆపన్నాః-మూఢాః-జన్మని-జన్మని

మాం-అప్రాప్య- ఏవ-కౌంతేయ-తతః-యాంతి-అధమాం-గతిం

కౌంతేయ=అర్జునా, ఆసురీం= రాక్షససంబంధమైన, యోనిం= జన్మమును, ఆపన్నాః= పొందిన, మూఢాః= మూర్ఖమానవులు, జన్మనిజన్మని = ప్రతిజన్మమందును, మాం=నన్ను, అప్రాప్య ఏవ= పొందకనే, తతః= అంతకంటెను, అధమాం= అధమమైన, గతిం= గతిని, యాంతి= పొందుచున్నారు.

ఓ అర్జునా ! ఈ రాక్షసప్రకృతిగల మూఢులు, నన్ను పొందకయే, ప్రతిజన్మయందును ఆసురీయోనులనే పొందుచు చివరకు అంతకంటెను హీనమైనగతిని పొందుదురు. అనగా ఘోరమైన నరకములయందు పడెదరు.

21 త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।

కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥

త్రివిధం-నరకస్య- ఇదం-ద్వారం-నాశనం- ఆత్మనః

కామః-క్రోధః-తథా-లోభః-తస్మాత్- ఏతత్-త్రయం-త్యజేత్

ఆత్మనః= తనకు, నాశనం= వినాశమైనదియు, నరకస్య= నరకమునకు, ద్వారం= ద్వారమైనదియునగు, ఇదం= ఇది, త్రివిధం= మూడు విధములు, కామః= కామము, క్రోధః= కోపము, తథా=అటులనే, లోభః= లోభము, తస్మాత్= అందువలన, ఏతత్= ఈ, త్రయం= మూడింటిని, త్యజేత్= విడువవలయును.

కామక్రోధలోభములు అను ఈ మూడును నరకద్వారములు. అవి ఆత్మ నాశమునకు కారణములు. మనుజుని అధోగతిపాలుచేయునవి. అనగా మరల జన్మించేలా చేయుచున్నది కనుక ఈ మూడింటిని త్యజింపవలెను.

22 ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైః త్రిభిర్నరః ।

ఆచరత్యాత్మనః శ్రేయః తతో యాతి పరాం గతిమ్ ॥

ఏతైః-విముక్తః-కౌంతేయ-తమోద్వారైః-త్రిభిః-నరః

ఆచరతి- ఆత్మనః-శ్రేయః-తతః-యాతి-పరాం-గతిం

కౌంతేయ= అర్జునా, తమోద్వారైః= అజ్ఞాన ద్వారములైన, ఏతైః= ఈ, త్రిభిః= మూడింటిచేతను, విముక్తః= విడువబడిన, నరః=నరుడు, ఆత్మనః= తనకు, శ్రేయః= శ్రేయమును, ఆచరతి= ఆచరించుకొనుచున్నాడు, తతః= తదనంతరము, పరాం= పరమమైన, గతిం= మోక్షమును, యాతి=పొందుచున్నాడు.

ఓ అర్జునా ! ఈ మూడు నరకద్వారములనుండి బయటపడినవాడు శుభకర్మలనే ఆచరించును. అందువలన అట్టివాడు పరమగతిని పొందును. అనగా నన్నే పొందును.

23 యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।

న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥

యః-శాస్త్రవిధిం- ఉత్సృజ్య-వర్తతే-కామకారతః

న- సః-సిద్ధిం-అవాప్నోతి-న-సుఖం-న-పరాం-గతిం

యః = ఎవడు, శాస్త్రవిధిం= శాస్త్రవిధిని, ఉత్సృజ్య= విడిచి, కామకారతః=కోరిక ననుసరించి, వర్తతే= వర్తించుచున్నాడో, సః= వాడు, సిద్ధిం= సిద్ధిని, న అవాప్నోతి= పొందడు, సుఖం= సుఖమును, న=పొందడు, పరాం= ఉత్తమమైన, గతిం= మోక్షమును, న=పొందడు.

శాస్త్రవిధిని త్యజించి, యథేచ్ఛగా విశృంఖలముగా ప్రవర్తించువాడు సిద్ధిని పొందజాలడు. వానికి ఇహపర లోకసుఖములు లభింపవు. పరమగతియు ప్రాప్తింపదు.

24 తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।

జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥

తస్మాత్-శాస్త్రం-ప్రమాణం-తే-కార్యాకార్యవ్యవస్థితౌ

జ్ఞాత్వా-శాస్త్రవిధానోక్తం-కర్మ-కర్తుం- ఇహ-అర్హసి

తస్మాత్= అందువలన, తే=నీకు, కార్యాకార్యవ్యవస్థితౌ= కార్యాకార్య నిర్ణయమునందు, శాస్త్రం = శాస్త్రము, ప్రమాణం=ప్రమాణము, శాస్త్రవిధానోక్తం= శాస్త్రవిధానము నిర్ణయించిన, కర్మ= కర్మమును, జ్ఞాత్వా=తెలిసికొని, ఇహ= ఇచ్చట, కర్తుం= చేయుటకు, అర్హసి= తగియున్నావు.

కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణము. కనుక శాస్త్రోక్తకర్మలను గూర్చి బాగుగా తెలిసికొని, అట్టి కర్మలను ఆచరింపుము.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంపద్విభాగయోగోనామ

షోడశోఽధ్యాయః ॥

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ సప్తదశోఽధ్యాయః - శ్రద్ధాత్రయవిభాగయోగః

అర్జున ఉవాచ

1 యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః ।

తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః ॥

యే-శాస్త్రవిధిం- ఉత్సృజ్య-యజంతే-శ్రద్ధయా-అన్వితాః

తేషాం-నిష్ఠా-తు-కా-కృష్ణ-సత్త్వం- ఆహో-రజః-తమః

కృష్ణ= కృష్ణా, యే= ఎవరు, శాస్త్రవిధిం= శాస్త్రప్రమాణమును, ఉత్సృజ్య= విస్మరించి, శ్రద్ధయా= శ్రద్ధతో, అన్వితాః= కూడినవారై, యజంతే= సేవించుచున్నారో, తేషాం= వారి యొక్క, నిష్ఠా తు= స్థితి, కా= ఎట్టిది, సత్త్వం= సత్త్వమా, ఆహో= లేక, రజః= రజస్సా, తమః= తమస్సా.

అర్జునుడు ఇట్లు పలికెను - కృష్ణా! శాస్త్రవిధిని వదిలి, భక్తిశ్రద్ధలతో యజ్ఞములనుగాని, దైవపూజలనుగాని కొందఱు చేయుచుందురు. వారినిష్ఠ సాత్త్వికమా ? రాజసమా ? తామసమా ?

శ్రీభగవాన్ ఉవాచ

2 త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।

సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥

త్రివిధా-భవతి-శ్రద్ధా-దేహినాం-సా-స్వభావజా

సాత్త్వికీ-రాజసీ-చ- ఏవ-తామసీ-చ- ఇతి-తాం-శృణు

దేహినాం=మనుష్యులకు, స్వభావజా=స్వభావముచే పుట్టిన, సా= ఆ, శ్రద్ధా=శ్రద్ధ, సాత్త్వికీ= సాత్త్వికము, రాజసీ చ ఏవ= రాజసము, తామసీ చ = తామసము, ఇతి=అని, త్రివిధా= మూడువిధములు, భవతి= అగుచున్నది, తాం=దానిని, శృణు= ఆలకించుము.

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను - శాస్త్రోక్తముగానుండక కేవలము స్వభావమును అనుసరించి ఏర్పడుచుండు మానవులశ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములుగా ఉండును. వాటిని గూర్చి వివరించెదను. వినుము.

3 సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।

శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః ॥

సత్త్వానురూపా-సర్వస్య-శ్రద్ధా-భవతి-భారత

శ్రద్ధామయః-అయం-పురుషః-యః-యత్-శ్రద్ధః-సః- ఏవ-సః

భారత=అర్జునా, సర్వస్య= సర్వులకు, సత్త్వానురూపా= అంతఃకరణకనురూపమైన, శ్రద్ధా= శ్రద్ధ, భవతి= కలుగుచున్నది, అయం= ఈ, పురుషః= పురుషుడు, శ్రద్ధామయః= శ్రద్ధామయుడు, యః= ఎవడు, యత్ శ్రద్ధః = ఎటువంటి శ్రద్ధ కలవాడో, సః= అతడు, సః ఏవ = అట్టివాడే.

అర్జునా ! సర్వప్రాణులకు వారిఅంతఃకరణరీతులకు తగినట్లు శ్రద్ధ ఉండును. ప్రతివ్యక్తికిని ఏదో ఒక శ్రద్ధ ఉండును. అతని జీవన విధానమంత యును అతని శ్రద్ధకు అనుగుణముగా కొనసాగుచుండును. దానినిబట్టి అతడెట్టి శ్రద్ధ కలిగియున్నదియు తెలిసికొనవచ్చును.

4 యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।

ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥

యజంతే-సాత్త్వికాః-దేవాన్-యక్షరక్షాంసి-రాజసాః

ప్రేతాన్-భూతగణాన్-చ-అన్యే-యజంతే-తామసాః-జనాః

సాత్త్వికాః= సాత్త్వికులు, దేవాన్= దేవతలను, రాజసాః= రజోగుణముగలవారు, యక్షరక్షాంసి= యక్షులను రాక్షసులను, యజంతే= పూజించుచున్నారు, అన్యే= ఇతరులైన, తామసాః= తామసులైన, జనాః= జనులు, ప్రేతాన్= ప్రేతములను, భూతగణాన్ చ= భూతగణములను, యజంతే= పూజించుచున్నారు.

వారిలో సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, తామసులు ప్రేతభూతగణములను పూజించుచున్నారు.

5 అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః।

దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥।

అశాస్త్రవిహితం-ఘోరం-తప్యంతే-యే-తపః-జనాః

దంభాహంకార సంయుక్తాః-కామరాగబలాన్వితాః

అశాస్త్రవిహితం=శాస్త్ర విరుద్ధమును, ఘోరం=భయంకరమునైన, తపః= తపమును, యే= ఎట్టి, జనాః=జనులు, దంభాహంకార సంయుక్తాః= దంభముతోను అహంకారము తోను కూడినవారు, కామరాగబలాన్వితాః= కామరాగబలముతో కూడినవారు...

దంభము అహంకారము గలవారు, కోరికలు ఆసక్తి కలిగియుండువారు, బలగర్వితులు ఐనవారు, శాస్త్రవిరుద్ధముగా మనఃసంకల్పితమైన ఘోరతపస్సులను చేయుదురు.

6 కర్షయంతః శరీరస్థం భూతగ్రామమచేతసః।

మాం చైవాంతఃశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥

కర్షయంతః-శరీరస్థం-భూతగ్రామం-అచేతసః

మాం-చ- ఏవ-అంతః శరీరస్థం-తాన్-విద్ధి- ఆసురనిశ్చయాన్

శరీరస్థం= శరీరము లోపలనున్న, భూతగ్రామం= ఇంద్రియములను, అంతః శరీరస్థం= అంతర్యములో ఉన్న, మాం చ ఏవ=నన్నును, కర్షయంతః= కృశింపజేయుచున్నవారై, తప్యంతే= తపస్సుచేయుచున్నారో, తాన్= అట్టి, అచేతసః= అవివేకులు, ఆసుర నిశ్చయాన్= అసురస్వభావము గలవారిగా, విద్ధి= గ్రహించుము.

శరీరములందున్న జీవులను, మరియు అంతర్యామిని అనగా పరమాత్ముడనైన నన్ను కృశింపజేయువారు అజ్ఞానులైన ఆసురస్వభావము గలవారని తెలిసికొనుము.

7 ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।

యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు॥

ఆహారః-తు-అపి-సర్వస్య-త్రివిధః-భవతి-ప్రియః

యజ్ఞః-తపః-తథా-దానం-తేషాం-భేదం- ఇమం-శృణు

సర్వస్య= సర్వులకును, ఆహారః తు అపి= ఆహారముకూడాను, త్రివిధః= మూడువిధములు, ప్రియః= ప్రియమైనది, భవతి= అగుచున్నది, తథా=అటులనే, యజ్ఞః= యజ్ఞము, తపః= తపస్సు, దానం= దానమును, తేషాం= వానియొక్క, ఇమం= ఈ, భేదం= భేదమును, శృణు= వినుము.

సర్వజనులకు వారికి ఇష్టములైన ఆహారములు గూడ మూడు విధములుగా ఉండును. అట్లే ఆయా మనుష్యులు ఆచరించు యజ్ఞములు, తపస్సులు, దానములుగూడా మూడేసివిధములుగానే ఉండును. వాటినిగూర్చి వేర్వేఱుగా తెలిసికొనుము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

8 ఆయుఃసత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనా ః।

రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాః ఆహారాః సాత్త్వికప్రియాః ॥

ఆయుః-సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః

రస్యాః-స్నిగ్ధాః-స్థిరాః-హృద్యాః- ఆహారాః-సాత్త్వికప్రియాః

ఆయుః= ఆయువును, సత్త్వః= సత్త్వమును, బలః= బలమును, ఆరోగ్యః= ఆరోగ్యమును, సుఖః= సుఖమును, ప్రీతిః= సంతోషమును, వివర్ధనాః= వృద్ధిచేయునవియు, రస్యాః= రసరూపమైనవియు, స్నిగ్ధాః= చమురుగలవియు, స్థిరాః= చిరకాలముండునవియు, హృద్యాః= మనస్సునకు ప్రియమగు, ఆహారాః= ఆహారములు, సాత్త్వికప్రియాః= సాత్త్వికులకు ప్రియములు.

ఆయువు, బుద్ధి, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి మున్నగు వానిని అభివృద్ధిపఱచునవియు, వెన్న, నెయ్యి మొదలగు స్నిగ్ధపదార్థములును, ఓజస్సును అభివృద్ధిపఱచు స్థిరపదార్థములును, సాత్త్విక స్వభావమును పెంచు హృద్య పదార్థములును సాత్త్వికులకు ప్రియములు.

9 కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।

ఆహార రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥

కటు- ఆమ్ల-లవణాత్యుష్ణ-తీక్ష్ణ-రూక్ష-విదాహినః

ఆహారాః-రాజసస్య- ఇష్టాః-దుఃఖశోకామయప్రదాః

కటు=చేదుగాను, ఆమ్ల= పులుపుగాను, లవణ = ఉప్పగాను, అత్యుష్ణ= మిక్కిలి వేడిగాను, తీక్ష్ణ=కారముగాను, రూక్ష=రసహీనముగాను, విదాహినః=దాహము కలుగజేయునవియు, దుఃఖశోకమయప్రదాః= దుఃఖమును శోకమును కలుగజేయునవియునగు, ఆహారాః= ఆహారములు, రాజసస్య = రజోగుణము గలవారికి, ఇష్టాః= ఇష్టములు.

చేదు, పులుపు, ఉప్పు, కారము రుచులకు సంబంధించినవి, మిక్కిలి వేడివస్తువులు, మాడిన పదార్థములు, దాహము కల్గించునవి, అట్లే దుఃఖము, చింత, రోగములను ఉత్పన్నము చేయు ఆహారపదార్థములు రాజసస్వభావము గలవారికి ప్రియములు.

10 యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।

ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥

యాతయామం-గతరసం-పూతి-పర్యుషితం-చ-యత్

ఉచ్ఛిష్టం-అపి-చ-అమేధ్యం-భోజనం-తామసప్రియం

యాతయామం= వండిన తరువాత ఒక జాము గడిచినది, గతరసం= రసము పోయినది, పూతి= దుర్గంధమైనది, పర్యుషితం చ= ఒకరోజు నిలువ యున్నదియు, ఉచ్ఛిష్టం అపి= తినగా మిగిలినదియు, అమేధ్యం చ = అశుద్ధ మైనదియు, యత్ = ఏ, భోజనం= భోజనము కలదో, తత్= అది, తామస ప్రియం= తామసులకు ప్రియము.

సరిగా ఉడకనివి, పండనివి రసహీనములు, చెడువాసన గలవి పాసిపోయిన పదార్థములు, ఎంగిలి వస్తువులు, అపవిత్ర పదార్థములు మొదలగునవి తామసులకు ప్రియమైనవి.

11 అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।

యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥

అఫలాకాంక్షిభిః-యజ్ఞః-విధిదృష్టః-యః- ఇజ్యతే

యష్టవ్యం- ఏవ- ఇతి-మనః-సమాధాయ-సః-సాత్త్వికః

విధిదృష్టః=శాస్త్రసమ్మతమైనదియు, యష్టవ్యం ఏవ ఇతి= యజ్ఞము చేయుటయే విధియని, మనః= మనస్సును, సమాధాయ=సమాధానపరచుకొని, అఫలాకాంక్షిభిః= ఫలాపేక్షలేనివారిచే, యః= ఏ, యజ్ఞః=యజ్ఞము, ఇజ్యతే = చేయబడుచున్నదో, సః=అది, సాత్త్వికః= సాత్త్వికమైనది.

శాస్త్రోక్తమైనదియు, ఈ యజ్ఞము నాకు కర్తవ్యము అని మనస్సున దృఢముగా నిశ్చయించుకొనబడినదియు, ప్రతిఫలాపేక్ష లేకుండ చేయబడు నదియు ఐన యజ్ఞము సాత్త్వికమనబడుచున్నది.

12 అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।

ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥

అభిసంధాయ-తు-ఫలం-దంభార్థం-అపి-చ- ఏవ-యత్

ఇజ్యతే-భరతశ్రేష్ఠ-తం-యజ్ఞ-విద్ధి-రాజసం

భరతశ్రేష్ఠ= అర్జునా, యత్= ఏది, ఫలం= ఫలమును, అభిసంధాయ తు= వాంఛించిగాని, దంభార్థం అపి చ ఏవ= దంభము కొరకుగాని, ఇజ్యతే= చేయబడు చున్నదో, తం= ఆ, యజ్ఞం= యజ్ఞము, రాజసం= రాజస యజ్ఞముగా, విద్ధి= తెలిసికొనుము.

కాని ఓ అర్జునా ! సరియైన నిష్ఠలేకుండ ఆడంబరము కొఱకు ఆచరింపబడునదియు. ప్రతిఫలాపేక్షతో చేయబడునదియు అగు యజ్ఞము రాజసయజ్ఞము అని తెలిసికొనుము.

13 విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్ ।

శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥

విధిహీనం-అసృష్టాన్నం-మంత్రహీనం-అదక్షిణం

శ్రద్ధావిరహితం-యజ్ఞం-తామసం-పరిచక్షతే

విధిహీనం= విధిరహితమైనదియు, అసృష్టాన్నం= అన్నదానములేనిదియు, మంత్రహీనం= మంత్రయుతము గానిదియు, అదక్షిణం= దక్షిణలేనిదియు, శ్రద్ధావిరహితం= శ్రద్ధ లేనిదియు, యజ్ఞం= యజ్ఞమును, తామసం= తామస మని, పరిచక్షతే= చెప్పుచున్నారు.

శాస్త్రవిధిననుసరింపనిదియు, అన్నదానరహితమైనదియు, మంత్రహీన మైనదియు, దక్షిణలు లేనిదియు, శ్రద్ధారహితమైనదియు అగు యజ్ఞము తామసయజ్ఞము అనిచెప్పుచున్నారు.

14 దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ ।

బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనం-శౌచం- ఆర్జవం

బ్రహ్మచర్యం-అహింసా-చ-శారీరం-తపః- ఉచ్యతే

దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనం= దేవతలు బ్రాహ్మణులు గురువులు పండితులునగు వారియొక్క పూజయును, శౌచం=శుభ్రతయు, ఆర్జవం= ఋజుత్వమును, బ్రహ్మ చర్యం= బ్రహ్మచర్యమును, అహింసా చ = హింస లేకుండుటయు, శారీరం= దేహసంబంధమైన, తపః= తపస్సుగ, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

దేవతలను, బ్రాహ్మణులను, గురుజనులను, జ్ఞానులను సేవించుట, నిరాడంబరత్వము, బ్రహ్మచర్యము, అహింస అనునవి శారీరక తపస్సులు అని చెప్పుచున్నారు.

15 అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।

స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయమ్ తప ఉచ్యతే ॥

అనుద్వేగకరం-వాక్యం-సత్యం-ప్రియహితం-చ-యత్

స్వాధ్యాయాభ్యసనం-చ- ఏవ-వాఙ్మయం-తపః- ఉచ్యతే

అనుద్వేగకరం=ఉద్వేగకరము గానిదియు, సత్యం= సత్యమైనదియు, ప్రియః= ప్రియమైనదియు, హితం చ = హితమైనదియును అగు, యత్ = ఏ, వాక్యం= వాక్యము, స్వాధ్యాయాభ్యసనం చ ఏవ= వేదాధ్యయనము, వాఙ్మయం= వాక్సంబంధమైన, తపః= తపస్సుగ, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

ఉద్రేకమును కలిగింపనిదియు, ప్రియమైనదియు, హితమును కలుగచేయునది, యథార్థమైనదియు అగు భాషణము, అట్లే వేదశాస్త్రపఠనము, మొదలగునవి యన్నియును వాచిక తపస్సుగ చెప్పబడుచున్నవి.

16 మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః ।

భావసంశుద్ధిరిత్యేతత్ తపో మానసముచ్యతే ॥

మనఃప్రసాదః-సౌమ్యత్వం-మౌనం- ఆత్మవినిగ్రహః

భావసంశుద్ధిః- ఇతి- ఏతత్- తపః-మానసం- ఉచ్యతే

మనఃప్రసాదః= మనస్సు ప్రశాంతత నొందుట, సౌమ్యత్వం= శాంత భావము, మౌనం= మౌనము, ఆత్మవినిగ్రహః= ఆత్మనిగ్రహము, భావసంశుద్ధిః= అంతఃకరణశుద్ధి, ఇతి ఏతత్= అనునది, మానసం= మనః సంబంధమైన, తపః= తపస్సుగను, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

మానసిక ప్రసన్నత, శాంతస్వభావము, భగవచ్చింతన, మనోనిగ్రహము, అంతఃకరణశుద్ధి మొదలగునవి యన్నియును మానసికతపస్సులుగా చెప్పబడుచున్నవి.

17 శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః ।

అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥

శ్రద్ధయా-పరయా-తప్తం-తపః-తత్-త్రివిధం-నరైః

అఫలాకాంక్షిభిః-యుక్తైః-సాత్త్వికం-పరిచక్షతే

అఫలాకాంక్షిభిః=ఫలమును కోరనివారు, యుక్తైః= యోగులును అయిన, నరైః= నరులచేత, పరయా= ఉత్తమమైన, శ్రద్ధయా= శ్రద్ధతో, తప్తం= ఆచరించబడిన, తత్= ఆ, త్రివిధం= మూడువిధములైన, తపః= తపస్సును, సాత్త్వికం- సాత్త్వికముగ, పరిచక్షతే= చెప్పుచున్నారు.

శారీరిక, వాచిక, మానసిక తపస్సులను ఫలాకాంక్షలేని యోగులు మిక్కిలి శ్రద్ధతో ఆచరించినప్పుడు వాటిని సాత్త్విక తపస్సులు అని చెప్పబడుచున్నవి.

18 సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్ ।

క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్ ॥

సత్కారమాన పూజార్థం-తపః-దంభేన-చ- ఏవ-యత్

క్రియతే-తత్- ఇహ-ప్రోక్తం-రాజసం-చలం-అధ్రువం

సత్కార= సత్కారము కొరకును, మాన= గౌరవము కొరకును, పూజార్థం= పూజకొరకును, దంభేన చ ఏవ= కేవలము డంబముచేతను, యత్ = ఏ, తపః= తపస్సు, క్రియతే= చేయబడుచున్నదో, తత్= అది, ఇహ= ఈ లోకమందు, చలం= నిలకడలేనిదిగా, అధ్రువం= అస్థిరమైనదిగా, రాజసం= రజోగుణ సంబంధమైనదిగా, ప్రోక్తం= చెప్పబడినది.

ఇతరులనుండి సత్కారములను, గౌరవములను, పూజలను అందు కొనుటకును, స్వార్థప్రయోజనముల కొఱకును, దంభముతో చేయబడున వియు, అనిశ్చి తఫలములనుగాని, క్షణికఫలములను గాని ఇచ్చునవియు ఐన తపస్సులను రాజసతపస్సులు అని అందురు.

19 మూఢగ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః ।

పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్ ॥

మూఢగ్రాహేణ- ఆత్మనః-యత్-పీడయా-క్రియతే-తపః

పరస్య- ఉత్సాదనార్థం-వా-తత్-తామసం- ఉదాహృతం

మూఢగ్రాహేణ= మూర్ఖపు పట్టుదలతో, ఆత్మనః= ఆత్మయొక్క, పీడయా= పీడచేగాని, పరస్య= ఇతరులయొక్క, ఉత్సాదనార్థం వా= నాశనముకొరకుగాని, యత్ = ఏ, తపః= తపస్సు, క్రియతే= చేయబడుచున్నదో, తత్= అది, తామసం= తామస తపస్సని, ఉదాహృతం = చెప్పబడుచున్నది.

మొండిపట్టుదలతో మనోవాక్కాయములకు బాధకలిగించునవియు, ఇతరులకు కీడు కల్గించుటకై చేయబడునవియు, ఐన తపస్సులను తామసమనిఅందురు.

20 దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥

దాతవ్యం- ఇతి-యత్-దానం-దీయతే-అనుపకారిణే
దేశే-కాలే-చ-పాత్రే-చ-తత్-దానం-సాత్త్వికం-స్మృతం

దేశే=దేశమునందును, కాలే చ= కాలమునందును, పాత్రే చ= అవసరమున్న వాజానికి, అనుపకారిణే= ప్రత్యుపకారము చేయలేనివానికొరకు, దాతవ్యం ఇతి= ఇవ్వదగినదే యని, యత్ = ఏ, దానం=దానము, దీయతే= ఇవ్వబడుచున్నదో, తత్= ఆ, దానం= దానము, సాత్త్వికం=సాత్త్వికమని, స్మృతం=తలపబడినది.

దానము చేయుటయే కర్తవ్యము అను భావముతో తగిన ప్రదేశముల యందును, దుర్భిక్షాదికాలముల యందును, ఆకలిదప్పులతో బాధపడువారు, అంగవైకల్యము గలవారు, రోగులు మొదలగువారికిని, బ్రాహ్మణులు, పండితులు, బ్రహ్మచారులు, వానప్రస్థులు మొదలగు పాత్రులైనవారికిని ప్రత్యుపకారమును ఆశింపక నిస్వార్థభావముతో చేయబడు దానము సాత్త్వికమనబడుచున్నది.

21 యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥

యత్-తు-ప్రత్యుపకారార్థం-ఫలం- ఉద్దిశ్య-వా-పునః
దీయతే-చ-పరిక్లిష్టం-తత్-దానం-రాజసం-స్మృతం

ప్రత్యుపకారార్థం=ప్రత్యుపకారము కొరకుగాని, పునః=మరల, ఫలం= ఫలమును, ఉద్దిశ్య వా= ఉద్దేశించికాని, పరిక్లిష్టం= అతికష్టముతో, యత్ = ఏది, దీయతే చ = ఈయబడుచున్నదో, తత్ = ఆ, దానం తు= దానము, రాజసం= రాజసమని, స్మృతం= చెప్పబడుచున్నది.

ప్రత్యుపకారము కొరకుగాని, ప్రతిఫలాపేక్షతో గాని వివిధములగు ఒత్తిడులకు లోనైగాని బాధపడుచు విధిలేక ఇచ్చు దానమును రాజసదానము అనిచెప్పబడుచున్నది.

22 అదేశకాలే యద్దానమ్ అపాత్రేభ్యశ్చ దీయతే ।

అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ ॥

అదేశకాలే-యత్-దానం-అపాత్రేభ్యః-చ-దీయతే

అసత్కృతం-అవజ్ఞాతం-తత్-తామసం- ఉదాహృతం

అదేశకాలే= అనుచితదేశకాలములందు, అపాత్రేభ్యః చ= అపాత్రులకొరకు, అసత్కృతం = అసత్కార్యముగ, అవజ్ఞాతం= నిర్లక్ష్యముతో, యత్ = ఏ, దానం = దానము, దీయతే= ఇవ్వబడుచున్నదో, తత్= అది, తామసం= తామసదానమని, ఉదాహృతం= చెప్పబడినది.

సద్భావములేకుండా, దానము పుచ్చుకొనువారియెడల గౌరవాదరములనుచూపక, తృణీకారభావములతో ఛీకొట్టుచు, అయోగ్యులకును, అపాత్రులకును చేయబడు దానమూ, దేశకాలోచితముకాని దానమూ, తామసదానము అని చెప్పబడును.

23 ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః ।

బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥

ఓం-తత్-సత్- ఇతి- నిర్దేశః-బ్రహ్మణః-త్రివిధః-స్మృతః

బ్రాహ్మణాః-తేన-వేదాః-చ-యజ్ఞాః-చ-విహితాః-పురా

బ్రహ్మణః= బ్రహ్మముయొక్క, నిర్దేశః= నిర్దేశము, ఓం ఇతి = ఓం అని, తత్ ఇతి= తత్ అని, సత్ ఇతి = సత్ అని, త్రివిధః= మూడు విధములుగ, స్మృతః= చెప్పబడినది, తేన= దానిచేత, బ్రాహ్మణాః= బ్రాహ్మణులు, వేదాఃచ = వేదములు, యజ్ఞాః చ= యజ్ఞములు, పురా= పూర్వము, విహితాః= నిర్మింపబడినవి.

ఓమ్, తత్, సత్ అని మూడువిధములగు పేర్లు పరబ్రహ్మకు నిర్దేశించబడినవి. ఆ పరమాత్మ నుండియే సృష్ట్యాదియందు బ్రాహ్మణులు, వేదములు,యజ్ఞములు నిర్మింపబడినటుల చెప్పబడినది.

24 తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।

ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥

తస్మాత్- ఓం- ఇతి- ఉదాహృత్య- యజ్ఞదానతపఃక్రియాః

ప్రవర్తంతే- విధానోక్తాః- సతతం-బ్రహ్మవాదినాం

తస్మాత్= అందువలన, బ్రహ్మవాదినాం= బ్రహ్మవాదులయొక్క, విధానోక్తాః= శాస్త్రోక్తములైన, యజ్ఞఃదానతపఃక్రియాః= యజ్ఞములును దానములును తపస్సులును కర్మలును, ఓం ఇతి = ఓం అని, ఉదాహృత్య= చెప్పి, సతతం= సదా, ప్రవర్తంతే= ప్రవర్తించు చున్నవి.

కనుక వేదమంత్రములను పఠించువారు శాస్త్రవిహితములైన యజ్ఞదాన తపశ్చర్యలను సర్వదా ఓమ్ అని పలికి ప్రారంభింతురు.

25 తదిత్యనభిసంధాయ ఫలంయజ్ఞతపఃక్రియాః ।

దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః ॥

తత్- ఇతి-అనభిసంధాయ-ఫలం-యజ్ఞ తపః క్రియాః

దానక్రియాః-చ- వివిధాః-క్రియంతే-మోక్షకాంక్షిభిః

మోక్షకాంక్షిభిః= మోక్షాపేక్షగలవారిచేత, తత్ ఇతి= తత్ అని, ఫలం= ఫలమును, అనభిసంధాయ= అభిలషించక, వివిధాః= వివిధములైన, యజ్ఞతపః క్రియాః = యజ్ఞతపః కర్మలు, దానక్రియాః చ= దానక్రియలును, క్రియంతే= ఆచరించబడుచున్నవి.

మోక్షకాంక్షగలవారు స్వలాభాపేక్ష లేశమాత్రమైనను లేకుండ లోకహితార్థమై యజ్ఞదానతపశ్చర్యలను ఇదియంతయును పరమాత్మదే అను భావముతో తత్ అను నామమును ఉచ్చరించుచు ఆచరించెదరు.

26 సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే ।

ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥

సద్భావే-సాధుభావే-చ-సత్- ఇతి- ఏతత్- ప్రయుజ్యతే

ప్రశస్తే-కర్మణి-తథా-సత్-శబ్దః-పార్థ-యుజ్యతే

పార్థ=అర్జునా, సద్భావే= సత్తుయనెడి భావమునందు, సాధుభావే చ= మంచిది యనెడి భావమునందు, సత్ ఇతి= సత్ అనెడి, ఏతత్= ఇది, ప్రయుజ్యతే = వాడబడుచున్నది, తథా=అటులనే, ప్రశస్తే= ప్రశస్తమైన, కర్మణి= కర్మమందును, సత్ శబ్దః= సత్ అను శబ్దము, యుజ్యతే= వాడబడుచున్నది.

అర్జునా! సత్ అను పరమాత్మనామము సత్యభావమునందును, శ్రేష్ఠభావమునందును అనగా పరమాత్ముడు నిత్యుడు, శ్రేష్ఠుడు అను భావము నందును ప్రయోగింపబడుచుండును. ఉత్తమకర్మాచరణమునందును సత్ అను శబ్దము వాడబడుచున్నది.

27 యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।

కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥

యజ్ఞ-తపసి-దానే-చ-స్థితిః-సత్- ఇతి-చ- ఉచ్యతే

కర్మ-చ- ఏవ-తదర్థీయం-సత్- ఇతి- ఏవ- అభిధీయతే

యజ్ఞే=యజ్ఞమునందును, తపసి= తపస్సునందును, దానే చ= దానము నందును, స్థితిః చ= ఉనికియును, సత్ ఇతి = సత్ అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తదర్థీయం= బ్రహ్మోద్దేశ్యమైన, కర్మ ఏవ చ= కర్మయును, సత్ ఇతి ఏవ= సత్ అనియే, అభిధీయతే= చెప్పబడుచున్నది.

యజ్ఞదానతపఃస్సులకు సంబంధించిన నిష్ఠ, ఆస్తిక భావమును సత్ అనియందురు. పరమాత్మను ఉద్దేశించి, చేయబడు నిశ్చయాత్మకకర్మలనుగూడ సత్ అని పిలువబడుచున్నవి.

28 అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।

అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥

అశ్రద్ధయా-హుతం-దత్తం-తపః-తప్తం-కృతం-చ-యత్

అసత్- ఇతి- ఉచ్యతే- పార్థ-న-చ-తత్-ప్రేత్య-నో- ఇహ

పార్థ=అర్జునా, అశ్రద్ధయా= శ్రద్ధలేకుండా, హుతం= హోమము చేయబడినదియు, దత్తం= దానము చేయబడినదియు, తప్తం= చేయబడిన, తపః= తపస్సును, కృతం చ= చేయబడినదియు, యత్= ఏది కలదో, తత్ = అది, అసత్ ఇతి= అసత్తు అని, ఉచ్యతే= చెప్పబడుచున్నది, ప్రేత్య= పరలోకమునందును, నో = ఫలమునివ్వదు, ఇహ చ= ఈ లోకమునందును, న=ఫలితము నివ్వదు.

అర్జునా ! శ్రద్ధ లేకుండ చేయబడుహోమము, ఇయ్యబడు దానము, ఆచరింపబడు తపస్సు, ఇంకను జరుపబడు ఇతరశుభకర్మలన్నియును, అసత్ అని చెప్పబడును. దానివలన జీవించియుండగా గాని మరణించిన పిదపగాని ఏ విధమైన ప్రయోజనముండదు.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగోనామ

సప్తదశోఽధ్యాయః ॥

ఓం శ్రీపరమాత్మనే నమః

అథ అష్టాదశోఽధ్యాయః - మోక్షసన్న్యాస యోగః

అర్జున ఉవాచ

1 సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।

త్యాగస్య చ హృషీకేశ పృథక్ కేశినిషూదన ॥

సంన్యాసస్య- మహాబాహో-తత్త్వం- ఇచ్ఛామి-వేదితుం

త్యాగస్య-చ-హృషీకేశ-పృథక్-కేశినషూదన

మహాబాహో= గొప్పబాహువులు గలవాడా, హృషీకేశ=కృష్ణా, కేశినిషూదన= కేశియను రాక్షసుని సంహరించినవాడా, సంన్యాసస్య = సన్యాసము యొక్క, త్యాగస్య చ = త్యాగము యొక్క, తత్త్వం= తత్త్వమును, పృథక్= వేర్వేరుగ, వేదితుం= తెలిసికొనుటకు, ఇచ్ఛామి= కోరుచున్నాను.

అర్జునుడు పలికెను - కృష్ణా! అంతర్యామీ ! వాసుదేవా ! సన్న్యాసతత్త్వ మును, త్యాగతత్త్వమును వేర్వేఱుగా తెలిసికొనగోరుచున్నాను.

శ్రీభగవాన్ ఉవాచ

2 కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।

సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥

కామ్యానాం-కర్మణాం-న్యాసం-సంన్యాసం-కవయః-విదుః

సర్వకర్మఫలత్యాగం-ప్రాహుః-త్యాగం-విచక్షణా

కవయః= జ్ఞానులు, కామ్యానాం= కామ్యమైన, కర్మాణాం= కర్మలయొక్క, న్యాసం= విడచుటను, సంన్యాసం= సన్యాసమని, విదుః= తెలిసికొనియున్నారు, విచక్షణాః= వివేకవంతులు, సర్వకర్మఫలత్యాగం= సకల కర్మలయొక్క ఫలమును త్యజించుటకు, త్యాగం= త్యాగము అని, ప్రాహుః= తెలిపిరి.

శ్రీభగవానుడు పలికెను - కామ్యకర్మల త్యాగమునే సన్న్యాసమని కొందఱు పండితులు చెప్పిరి. కాని విచక్షణాశీలురైన మఱికొందరు మాత్రము సర్వకర్మఫలములను త్యజించుటను త్యాగమని అంటారు.

3 త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః ।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥

త్యాజ్యం-దోషవత్- ఇతి- ఏకే-కర్మ-ప్రాహుః-మనీషిణః
యజ్ఞదానతపఃకర్మ-న-త్యాజ్యం- ఇతి-చ-అపరే

ఏకే=కొందరు, మనీషిణః= వివేకవంతులు, కర్మ= కర్మను, దోషవత్= దోషమువలెను, త్యాజ్యం ఇతి= విడువదగినదనియు, అపరే= మరికొందరు, యజ్ఞదానతపఃకర్మ = యజ్ఞము, దానము,

కొందరు విద్వాంసులు కర్మలన్నియును దోషయుక్తములే గావున వాటిని త్యజింపవలెనని యందురు. కాని యజ్ఞదాన తపశ్చర్యాది కర్మలు త్యజింపదగవు.

4 నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥

నిశ్చయం-శృణు-మే-తత్ర-త్యాగే-భరతసత్తమ
త్యాగః-హి-పురుషవ్యాఘ్ర-త్రివిధః-సంప్రకీర్తితః

భరతసత్తమ = అర్జునా, తత్ర= ఆ, త్యాగే= త్యాగ విషయమునందు, మే=నా యొక్క, నిశ్చయం= నిర్ణయమును, శృణు= వినుము, పురుషవ్యాఘ్ర = అర్జునా, త్యాగః= త్యాగము, త్రివిధః= మూడు విధములుగ, సంప్రకీర్తితః హి= చెప్పబడుచున్నది.

ఓ పురుషశ్రేష్ఠా! అర్జునా! సన్న్యాసము, త్యాగము అను రెండు విషయములలో మొదట త్యాగమునుగూర్చి నా నిశ్చయమును వినుము. త్యాగము సాత్త్వికము, రాజసము, తామసము అని మూడువిధములుగా ఉన్నాయి.

5 యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।

యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥

యజ్ఞదానతపఃకర్మ-న-త్యాజ్యం-కార్యం- ఏవ-తత్

యజ్ఞః- దానం-తపః-చ- ఏవ-పావనాని-మనీషిణాం

యజ్ఞదానతపఃకర్మ= యజ్ఞము, దానము, తపస్సు యనెడి కర్మ, న త్యాజ్యం= విడువదగినదికాదు, తత్= అది, కార్యం ఏవ =చేయదగినదియే, యజ్ఞః= యజ్ఞము, దానం= దానము, తపః చ ఏవ= తపస్సు, మనీషిణాం= వివేకవంతులకు, పావనాని= పవిత్రతను గలుగజేయును.

యజ్ఞదానతపశ్చర్యాది కర్మలు త్యజింపదగవు, అవి విధిగా ఆచరింపదగినవి. విడువదగినవికావు.

6 ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ ।

కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥

ఏతాని-అపి-తు-కర్మాణి-సంగం-త్యక్త్వా-ఫలాని-చ

కర్తవ్యాని- ఇతి-మే-పార్థ-నిశ్చితం-మతం- ఉత్తమం

పార్థ=అర్జునా, ఏతాని= ఈ, కర్మాణి అపి తు=కర్మలను కూడ, సంగం= ఆసక్తిని, ఫలాని చ = ఫలమును, త్యక్త్వా= విడిచి, కర్తవ్యాని ఇతి= చేయదగినపనియని, మే=నాయొక్క, నిశ్చితం= నిర్ణయింపబడిన, ఉత్తమం= ఉత్తమమైన, మతం= అభిప్రాయము.

కావున ఓ పార్థా! ఈ యజ్ఞదాన తపోరూపకర్మలను మరియు కర్తవ్యకర్మలను అన్నింటి ఫలాసక్తులను వదలి, అవశ్యమాచరించవలెను అనునది ఉత్తమమైన నా నిశ్చిత ఉత్తమాభిప్రాయము.

7 నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।

మోహాత్ తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః ॥

నియతస్య-తు-సంన్యాసః-కర్మణః-న- ఉపపద్యతే

మోహాత్-తస్య-పరిత్యాగః- తామసః-పరికీర్తితః

నియతస్య తు= విధియుక్తమైన, కర్మణః= కర్మయొక్క, సంన్యాసః= సన్యాసమున, న ఉపపద్యతే = తగదు, మోహాత్ = మోహమువలన, తస్య=దానియొక్క, పరిత్యాగః= విడుచుట, తామసః= తమోగుణ సంబంధమైనదియని, పరికీర్తితః= చెప్పబడినది.

శాస్త్రవిహితకర్మలు వదలుట సరిగాదు. కావున మోహవశమున దానిని త్యజించుట తామస త్యాగము అని చెప్పబడుతోంది.

8 దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ ।

స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥

దుఃఖం- ఇతి- ఏవ- యత్- కర్మ- కాయక్లేశభయాత్- త్యజేత్

సః-కృత్వా-రాజసం-త్యాగం-న- ఏవ- త్యాగఫలం-లభేత్

కాయక్లేశభయాత్=శరీరాయాస భీతివలన, దుఃఖం ఇతి ఏవ= శోకదాయ కమ్మైనదేయని, యత్ = ఏ, కర్మ= కర్మమును, త్యజేత్= త్యజించుచున్నాడో, సః= వాడు, రాజసం= రజోగుణసంబంధమైన, త్యాగం= త్యాగమును, కృత్వా= ఆచరించి, త్యాగఫలం= త్యాగఫలమును, న లభేత్ ఏవ= పొందనేపొందడు.

కర్మలన్నియును దుఃఖాన్నిచ్చేవే యని భావించి, శారీరికక్లేశమునకు భయపడి, కర్తవ్యకర్మలను త్యజించుటను రాజసత్యాగము అని అంటారు. రాజసత్యాగము చేయువాడు త్యాగ ఫలమును పొందలేడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

9 కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।

సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః ॥

కార్యం- ఇతి- ఏవ- యత్-కర్మ-నియతం-క్రియతే-అర్జున

సంగం-త్యక్త్వా-ఫలం-చ- ఏవ-సః-త్యాగః- సాత్త్వికః-మతః

అర్జున= అర్జునా, నియతం= నియమింపబడిన, యత్ = ఏ, కర్మ= కర్మము, కార్యం ఇతి ఏవ= చేయవలసినదియే యని, సంగం= అభిమానమును, ఫలం ఏవ చ= ఫలమును కూడా, త్యక్త్వా = విడిచి, క్రియతే= ఆచరించబడుచున్నదో, సః= అట్టి, త్యాగః= త్యాగము, సాత్త్వికః= సాత్త్వికమైనదియని, మతః= నిర్ణయము.

అర్జునా ! శాస్త్రయుక్తమైన విధులు కర్తవ్యములుగా భావించి వాటియందలి ఫలాసక్తులను త్యజించి, చేయుటయే సాత్త్వికత్యాగము అని చెప్పబడినది.

10 న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।

త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥

న-ద్వేష్టి- అకుశలం-కర్మ-కుశలే-న-అనుషజ్జతే

త్యాగీ-సత్త్వసమావిష్టః-మేధావీ-ఛిన్నసంశయః

సత్త్వ సమావిష్టః= సత్త్వగుణ సమేతుడును, మేధావీ= జ్ఞానవంతుడును, ఛిన్న సంశయః= సంశయరహితుడును, త్యాగీ= త్యాగశీలుడు, అకుశలం= శోకమయమైన, కర్మ = కర్మమును, న ద్వేష్టి= ద్వేషింపడు, కుశలే= సుఖమయ కర్మయందు, న అనుషజ్జతే = ఆసక్తి పొందడు.

కర్మలను ద్వేషింపనివాడు, కుశలకర్మలయందు ఆసక్తి చూపడు, శుద్ధసత్త్వగుణయుక్తుడు, సంశయలేనివాడు, బుద్ధిమంతుడు ఐనవాడు నిజమైన త్యాగి.

11 న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।

యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥

న-హి-దేహభృతా-శక్యం-త్యక్తుం-కర్మాణి-అశేషతః

యః-తు-కర్మఫలత్యాగీ-సః-త్యాగీ- ఇతి-అభిధీయతే

దేహభృతా= దేహాభిమానము గలవానికి, అశేషతః= సంపూర్ణముగ, కర్మాణి= కర్మలను, త్యక్తుం= విడుచుటకు, న శక్యం హి= సాధ్యముగాదు, యః తు = ఎవడు, కర్మఫల త్యాగీ= కర్మఫలములను విడుచుచున్నాడో, సః=వాడు, త్యాగీ ఇతి= త్యాగియని, అభిధీయతే= చెప్పబడుచున్నాడు.

ప్రతి శరీరధారికిని కర్మలను సంపూర్ణముగ త్యజించుట సాధ్యముకాదు. కావున కర్మలను గాక కర్మఫలములను త్యజించినవాడే నిజమైన త్యాగి అని చెప్పబడుచున్నాడు.

12 అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।

భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥

అనిష్టం- ఇష్టం-మిశ్రం-చ- త్రివిధం- కర్మణః-ఫలం

భవతి-అత్యాగినాం-ప్రేత్య-న-తు-సంన్యాసినాం-క్వచిత్

అనిష్టం= ఇష్టము కానిదియు, ఇష్టం= ఇష్టమైనదియు, మిశ్రం చ = మిశ్రమమైనదియు, త్రివిధం= మూడు విధములుగ, కర్మణః= కర్మలయొక్క, ఫలం= ఫలము, అత్యాగినాం= త్యాగులుగాని వారలకు, ప్రేత్య= మరణానంతరము, భవతి= కలుగుచున్నది, సంన్యాసినాం తు= సన్యాసులకు, క్వచిత్= ఎప్పుడును, న భవతి= కలుగదు.

కర్మఫలత్యాగము చేయని మనుష్యుల కర్మలకైతే మంచి, చెడు, మిశ్రము అని మూడు విరకముల ఫలములుండును. మరణానంతరము వారు వాటిని తప్పక అనుభవించవలసి వుండును. కాని కర్మఫలత్యాగమొనర్చిన కర్మయొగులు తమ కర్మలఫలములను ఏ కాలమునందైనను, ఏ విధముగను అనుభవింపవలసిన పనికలుగదు.

13 పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।

సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥

పంచ–ఏతాని– మహాబాహో–కారణాని–నిబోధ–మే

సాంఖ్యే–కృతాంతే–ప్రోక్తాని–సిద్ధయే–సర్వకర్మణాం

మహాబాహూ= అర్జునా, సర్వకర్మణాం= సర్వకర్మలయొక్క, సిద్ధయే= సిద్ధి కొరకు, కృతాంతే= సిద్ధాంతమును తెలుపు, సాంఖ్యే= సాంఖ్యమునందు, ప్రోక్తాని= చెప్పబడిన, ఏతాని = ఈ, పంచ= అయిదు, కారణాని= కారణములను, మే=నావలన, నిబోధ= తెలిసికొనుము.

అర్జునా ! సర్వకర్మలసిద్ధికి ఐదు కారణములు గలవని కర్మలను అంతముచేయు ఉపాయములను తెలుపు సాంఖ్యశాస్త్రమునందు పేర్కొంది. వాటిని నావలన వినుము.

14 అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।

వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥

అధిష్ఠానం-తథా-కర్తా-కరణం-చ-పృథగ్విధం

వివిధాః-చ-పృథక్-చేష్టాః-దైవం-చ- ఏవ- అత్ర-పంచమం

అధిష్టానం= దేహమును, తథా=అటులనే, కర్తా= కర్తయును, పృథగ్విధం= వివిధములైన, కరణం చ = ఇంద్రియములను, వివిధాః= నానావిధములైన, పృథక్ = వేర్వేరైన, చేష్టాః చ= క్రియలును, అత్ర=వీనియందు, దైవం చ ఏవ= దైవమును, పంచమం= అయిదవ కారణము.

కర్మల సిద్ధియందు అధిష్ఠానము, కర్త, వివిధములైన కరణములు నానావిధ చేష్టలు, దైవము అను ఐదును కారణములు.

15 శరీరవాఙ్మనోభిర్యత్ కర్మ ప్రారభతే నరః ।

న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥

శరీరవ్యాఙ్మనోభిః- యత్-కర్మ-ప్రారభతే-నరః

న్యాయ్యం-వా-విపరీతం-వా-పంచ- ఏతే-తస్య-హేతవః

న్యాయ్యం వా= న్యాయబద్ధముగగాని, విపరీతం వా= అన్యాయముగగాని, శరీర వాఙ్మనోభిః= శరీరము, వాక్కు, మనస్సులచేత, యత్ = ఏ, కర్మ = కర్మను, నరః= నరుడు, ప్రారభతే = ప్రారంభించుచున్నాడో, తస్య= ఆ కర్మమునకు, ఏతే= ఈ , పంచ= అయిదును, హేతవః= కారణములు.

మానవుడు మనో వాక్కాయములచే ఆచరించు శాస్త్రానుకూలమైన లేక విపరీతమైన యేకర్మలైనను ఈ యైదు కారణములై యున్నవి.

16 తత్రైవం సతి కర్తారమ్ ఆత్మానం కేవలం తు యః ।

పశ్యత్యకృతబుద్ధిత్వాత్ న స పశ్యతి దుర్మతిః ॥

తత్ర- ఏవం-సతి-కర్తారం- ఆత్మానం-కేవలం-తు-యః

పశ్యతి-అకృత బుద్ధిత్వాత్-న-సః-పశ్యతి-దుర్మతిః

తత్ర=అందు, ఏవం సతి= ఇలావుండగ, కేవలం= కేవలము, ఆత్మానం తు= ఆత్మనే, కర్తారం= కర్తగను, అకృతబుద్ధిత్వాత్ = అశుద్ధ బుద్ధిగలవాడగుటచేత, యః= ఎవడు, పశ్యతి = గాంచుచున్నాడో, సః= ఆ, దుర్మతిః=అజ్ఞాని, న పశ్యతి= చూడలేకున్నాడు.

అట్లైనప్పటికిని విపరీతబుద్ధికారణమున ఏ మనుష్యుడు కేవలుడు, శుద్ధస్వరూపుడైన ఆత్మను సమస్తకర్మలకు కర్తగా భావించునో, అట్టి మలినబుద్ధిగల అజ్ఞాని సత్యమును తెలుసుకొనలేకున్నాడు.

17 యస్య నాహంకృతో భావో బుద్ధిరస్య న లిప్యతే ।

హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే ॥

యస్య-న-అహంకృతః-భావః-బుద్ధిః-యస్య-న-లిప్యతే

హత్వా-అపి-సః- ఇమాన్-లోకాన్-న-హంతి-న-నిబధ్యతే

యస్య= ఎవనికి, అహంకృతః= నేనే కర్తయనెడి, భావః= భావము, న=లేదో, యస్య= ఎవనియొక్క, బుద్ధిః= బుద్ధి, న లిప్యతే= అంటదో, సః=వాడు, ఇమాన్= ఈ, లోకాన్= ప్రాణులను, హత్వా అపి= వధించినను, న హంతి= చంపినవాడుకాడు, న నిబధ్యతే= బద్ధుడును కాడు.

అంతఃకరణమునందు కర్తృత్వభావము లేనివానిబుద్ధి ప్రాపంచిక విషయములందు, కర్మలయందును అంటుకొనదు. అట్టి పురుషుడు ఈ లోకములను అన్నింటిని హతమార్చినను వాస్తవముగా చంపినవాడు కాడు. అతడు ఎట్టి కర్మలచేత బంధింపబడడు.

18 జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।

కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥

జ్ఞానం-జ్ఞేయం-పరిజ్ఞాతా- త్రివిధా-కర్మచోదనా

కరణం-కర్మ-కర్తా- ఇతి- త్రివిధః- కర్మసంగ్రహః

కర్మచోదనా= కర్మచోదనము, జ్ఞానం= జ్ఞానము, జ్ఞేయం= జ్ఞేయము, పరిజ్ఞాతా= గ్రహించువాడు, ఇతి= అని, త్రివిధా = మూడువిధములు, కర్మసంగ్రహః= కర్మ సంగ్రహము, కరణం= సాధనము, కర్మ= కార్యము, కర్తా= చేయువాడును, ఇతి= అని, త్రివిధః= మూడు విధములు.

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనునవి మూడును కర్మప్రవృత్తికి కారణములు. కర్మప్రేరణములు. కర్త, కర్మ, క్రియ అని కర్మసంగ్రహములు మూడును ఆధారములు.

19 జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।

ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥

జ్ఞానం-కర్మ-చ-కర్తా-చ-త్రిధా- ఏవ-గుణభేదతః

ప్రోచ్యతే-గుణసంఖ్యానే-యథావత్-శృణు-తాని-అపి

గుణసంఖ్యానే= సాంఖ్యశాస్త్రమునందు, జ్ఞానం= జ్ఞానమును, కర్మ చ= కర్మమును, కర్తా చ= కర్తయును, గుణభేదతః= గుణభేదము ననుసరించి, త్రిధా ఏవ= మూడు విధములుగనే, ప్రోచ్యతే= చెప్పబడుచున్నది, తాని అపి= వానినికూడా, యథావత్= యథార్థముగ, శృణు= ఆలకింపుము.

గుణముల సంఖ్యను వివరించు సాంఖ్యశాస్త్రమునందు జ్ఞానము, కర్మ, కర్త అనునవి గుణభేదములతో మూడేసి విధములుగా చెప్పబడినవి. వానిని గూర్చి వివరించెదను వినుము.

20 సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।

అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥

సర్వభూతేషు-యేన- ఏకం-భావం-అవ్యయం- ఈక్షతే

అవిభక్తం-విభక్తేషు-తత్-జ్ఞానం-విద్ధి-సాత్త్వికం

విభక్తేషు=విభక్తములైన, సర్వభూతేషు= సర్వభూతములయందును, అవిభక్తం= విభక్తము గానట్టియు, అవ్యయం = నశించనట్టియు, ఏకం= ఏకమైన, భావం= భావమును, యేన= ఏ జ్ఞానముచేత, ఈక్షతే= గాంచుచున్నాడో, తత్ = ఆ, జ్ఞానం = జ్ఞానము, సాత్త్వికం= సాత్త్విక జ్ఞానమని, విద్ధి=తెలిసికొనుము.

వేర్వేరుగా కన్పించు సమస్త ప్రాణులయందును శాశ్వతుడైన పరమాత్మయే విభాగరహితుడుగా సమభావముతో స్థితుడై యున్నట్లు జ్ఞానియైనవాడు చూచును. అట్టి పురుషుని జ్ఞానమును సాత్త్విక జ్ఞానము అని చెప్పబడుతోంది.

21 పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।

వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥

పృథక్త్వేన-తు-యత్-జ్ఞానం-నానాభావాన్-పృథగ్విధాన్

వేత్తి-సర్వేషు-భూతేషు-తత్-జ్ఞానం-విద్ధి-రాజసం

సర్వేషు= సమస్తమైన, భూతేషు= భూతములయందు, పృథగ్విధాన్= వేరు వేరు విధములు గానున్న, నానాభావాన్ = వివిధ భావములు గల వానిని, యత్ = ఏ, జ్ఞానం= జ్ఞానము, పృథక్త్వేన తు = వేర్వేరుగా నుండు వానినిగ, వేత్తి= తెలిసికొనుచున్నాడో, తత్= ఆ, జ్ఞానం= జ్ఞానమును, రాజసం= రాజస జ్ఞానముగ, విద్ధి= తెలిసికొనుము.

సమస్త ప్రాణులయందును నానావిధములైన వివిధ భావములను వేర్వేరుగా భావించువారిజ్ఞానము రాజసము .

22 యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।

అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్ ॥

యత్-తు-కృత్స్నవత్- ఏకస్మిన్-కార్యే-సక్తం-అహైతుకం

అతత్త్వార్థవత్-అల్పం-చ-తత్-తామసం- ఉదాహృతం

యత్ తు = ఏదైతే, ఏకస్మిన్= ఏకమైన, కార్యే= కార్యమునందు, కృత్స్నవత్= సంపూర్ణము నందువలె, సక్తం= ఆసక్తమైనదియు, అహైతుకం = హేతువు గానిదియు, అతత్త్వార్థవత్= తత్త్వార్థరహితమైనదియు, అల్పం చ= స్వల్పమైనదియు, తత్=అది, తామసం= తామస జ్ఞానముగ, ఉదాహృతం= చెప్పబడినది.

ప్రకృతికార్యమైన శరీరమునే సమస్తముగా భావించి, దానియందే ఆసక్తిని కల్గించునట్టిదియు, తాత్త్వికముగా అర్థరహితమైనదియు, హేతుబద్ధము కానిదియు, తుచ్ఛమైనదియు అగు విపరీత జ్ఞానమును తామసము అని చెప్పబడుతోంది.

23 నియతంసంగరహితమ్ అరాగద్వేషతః కృతమ్ ।

అఫలప్రేప్సునా కర్మ యత్తత్ సాత్త్వికముచ్యతే ॥

నియతం-సంగరహితం-అరాగద్వేషతః-కృతం

అఫలప్రేప్సునా-కర్మ-యత్-తత్-సాత్త్వికం- ఉచ్యతే

యత్= ఏ, కర్మ= కర్మము, సంగరహితం= సంగత్వము లేనిదియు, నియతం= నియమిత మైనదియు, అరాగద్వేషతః= రాగద్వేషములు లేకుండునదియు, అఫల ప్రేప్సునా= ఫలాపేక్ష లేనివానిచేత, కృతం= చేయబడినదో, తత్= అది, సాత్త్వికం= సాత్త్వికమని, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

కర్తృత్వాభిమానము గాని, ఫలాపేక్షగాని లేని పురుషుని చేత రాగద్వేష రహితముగా చేయబడు శాస్త్రవిహితమ్మైన కర్మ సాత్త్వికకర్మ అనబడుతోంది.

24 యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।

క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్ ॥

యత్-తు-కామేప్సునా-కర్మ-సాహంకారేణ-వా-పునః

క్రియతే-బహులాయాసం-తత్-రాజసం- ఉదాహృతం

యత్ = ఏ, కర్మ తు= కర్మము, కామేప్సునా= కోరికలుగలవాని చేత, సాహంకారేణ వా పునః= అహంకారముగల వానిచేత గాని, బహులాయాసం= విశేష ప్రయాసతో, క్రియతే= చేయబడుచున్నదో, తత్= ఆ కర్మము, రాజసం= రాజసకర్మముగ, ఉదాహృతం= చెప్పబడినది.

భోగలాలసుడైన పురుషునిచేతను, అహంకారిచేతను చేయబడు మిక్కిలి ఆయసంతో కూడిన కర్మ రాజసకర్మ అనబడుతోంది.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

25 అనుబంధం క్షయం హింసామ్ అనవేక్ష్య చ పౌరుషమ్ ।

మోహాదారభ్యతే కర్మ యత్తత్ తామసముచ్యతే ॥

అనుబంధం-క్షయం-హింసాం-అనవేక్ష్య-చ-పౌరుషం

మోహాత్- ఆరభ్యతే-కర్మ-యత్-తత్-తామసం- ఉచ్యతే

అనుబంధం=పరిణామము, క్షయం= హానియును, హింసాం= హింసయును, పౌరుషం చ = సామర్థ్యమును, అనవేక్ష్య= గ్రహించక, మోహాత్= అవివేకమువలన, యత్ = ఏ, కర్మ= కర్మము, ఆరభ్యతే= ఆరంభింపబడు చున్నదో, తత్ = అది, తామసం= తామస కర్మమని, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

పరిణామము హాని, హింస, సామర్థ్యములను చూచుకొనక కేవలము అజ్ఞానముచే మొదలుపెట్టి కర్మలు తామసకర్మలు అని చెప్పబడుచున్నాయి.

26 ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।

సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥

ముక్తసంగః-అనహంవాదీ-ధృత్యుత్సాహ సమన్వితః

సిద్ధ్యసిద్ధ్యోః-నిర్వికారః-కర్తా-సాత్త్వికః- ఉచ్యతే

ముక్తసంగః= సంగత్వమునుండి విడివడినవాడు, అనహంవాదీ= అహంకార రహితుడు, ధృత్యుత్సాహ సమన్వితః= ధైర్యముతోను ఉత్సాహముతోను గూడినవాడు, సిద్ధ్యసిద్ధ్యోః= కార్యముసిద్ధించినను సిద్ధించక పోయినను, నిర్వికారః= వికారము చెందనివాడు నగు, కర్తా= కర్త, సాత్త్వికః= సత్త్వగుణము గలవాడుగ, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

ఆసక్తిని త్యజించినవాడు, అహంకారరహితముగా మాట్లాడువాడు, ధైర్యోత్సాహములుగలవాడును సిద్ధి – అసిద్ధుల యెడ హర్షశోకాదివికారములకు లోనుకానివాడును అగు పురుషుడు సాత్త్వికకర్త యని చెప్పబడుచున్నాడు.

27 రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।

హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥

రాగీ-కర్మఫలప్రేప్సుః-లుబ్ధః-హింసాత్మకః- అశుచిః

హర్షశోకాన్వితః-కర్తా-రాజసః-పరికీర్తితః

రాగీ=అనురాగము గలవాడు, కర్మఫలప్రేప్సుః= కర్మఫలము నాశించెడివాడు, లుబ్ధః= లుబ్ధుడును, హింసాత్మకః= హింసా స్వభావము గలవాడు, అశుచిః= శుచిత్వము లేనివాడు, హర్షశోకాన్వితః= హర్షశోకములతో గూడినవాడునగు, కర్తా = కర్త, రాజసః= రాజసుడని, పరికీర్తితః= చెప్పబడినాడు.

ఆసక్తియుతుడు, కర్మఫలములకై ఆరాటపడువాడు, లోభి, ఇతరులను కష్టపెట్టు స్వభావము గలవాడు, అపవిత్ర ప్రవర్తన గలవాడు, హర్ష శోకములకు లోనగువాడు రాజసకర్త అని చెప్పబడ్డాడు.

28 అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।

విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥

అయుక్తః-ప్రాకృతః-స్తబ్ధః-శఠః-నైష్కృతికః-అలసః

విషాదీ-దీర్ఘసూత్రీ-చ-కర్తా-తామసః- ఉచ్యతే

అయుక్తః=యుక్తుడు కానివాడు, ప్రాకృతః= పామరుడు, స్తబ్ధః= జడుడు, శఠః=వంచకుడు, నైష్కృతికః= ఇతరులను మోసగించి నష్టపరచువాడు, అలసః=సోమరియు, విషాదీ= దుఃఖ స్వభావము గలవాడు, దీర్ఘసూత్రీ చ = కాలయాపన చేయువాడు నగు, కర్తా=కర్త, తామసః= తామసుడని, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

జితేంద్రియుడు కానివాడు, సుశిక్షితుడు కానివాడు, మూర్ఖుడు మొండివాడు, ధూర్తుడు, అకారణముగ ఇతరులవృత్తులకు విఘాతము కల్గించువాడు, సదా చింతాగ్రస్తుడు, సోమరి, కార్యాచరణమునందు ఉపేక్షతో కాలము గడుపుచుండువాడు అను (దీర్ఘసూత్రి) - లక్షణములను గలవానిని తామసకర్త అని చెప్పబడ్డాడు.

29 బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు ।

ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥

బుద్ధేః-భేదం-ధృతేః-చ- ఏవ-గుణతః-త్రివిధం-శృణు

ప్రోచ్యమానం-అశేషేణ-పృథక్త్వేన-ధనంజయ

ధనంజయ= అర్జునా, గుణతః= గుణములనుబట్టి, బుద్ధేః= బుద్ధియొక్కయు, ధృతేః చ ఏవ= ధైర్యము యొక్కయు, పృథక్త్వేన= వేరువేరుగా, అశేషేణ= సంపూర్ణముగ, ప్రోచ్యమానం=చెప్పబడుచున్న, త్రివిధం= మూడువిధములైన , భేదం= భేదమును, శృణు= వినుము.

ఓ ధనంజయా ! ఇప్పుడు నీవు బుద్ధి, ధృతులను గూడ గుణభేదముల ననుసరించి మూడు విధములుగా, విభాగ పూర్వకముగా ఆ విషయము వినుము.

30 ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।

బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ ॥

ప్రవృత్తిం-చ-నివృత్తిం-చ-కార్యాకార్యే-భయాభయే

బంధం-మోక్షం-చ-యా-వేత్తి-బుద్ధిః-సా-పార్థ-సాత్త్వికీ

పార్థ= అర్జునా, యా= ఏ, బుద్ధిః= బుద్ధి, ప్రవృత్తిం చ= ప్రవృత్తి విషయమును, నివృత్తిం చ= నివృత్తివిషయమును, కార్యా కార్యే= కార్యమును, అకార్యమును, భయాభయే= భయమును అభయమును, బంధం= బంధమును, మోక్షం చ= మోక్షమును, వేత్తి= గ్రహించుచున్నదో, సా= ఆ, బుద్ధిః= బుద్ధి, సాత్త్వికీ= సాత్త్వికమైనది.

ప్రవృత్తిమార్గమును, నివృత్తిమార్గమును, కర్తవ్యమును, అకర్తవ్యమును, భయమును, అభయమును, అట్లే బంధమును, మోక్షమును యథార్థముగా తెలిసికొను బుద్ధి సాత్త్వికమైనది.

31 యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।

అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥

యయా-ధర్మం-అధర్మం-చ-కార్యం-చ-అకార్యం- ఏవ-చ

అయథావత్- ప్రజానాతి-బుద్ధిః-సా-పార్థ-రాజసీ

పార్థ=అర్జునా, యయా= ఏ బుద్ధిచేత, ధర్మం= ధర్మమును, అధర్మం= అధర్మమును, కార్యం చ= కార్యమును, అకార్యం ఏవ చ = అకార్యమును, అయథావత్= యథార్థము కానట్లు, ప్రజానాతి= తెలిసికొనుచున్నదో, సా= ఆ, బుద్ధిః= బుద్ధి, రాజసీ= రాజసికమైనది.

ఓ పార్థా! ధర్మాధర్మములయొక్కయు, కార్యాకార్యముల యొక్కయు , యథార్థ తత్త్వములను తెలియజాలని బుద్ధిని రాజసబుద్ధి యనబడుతోంది.

32 అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।

సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥

అధర్మం-ధర్మం- ఇతి-యా-మన్యతే-తమసా- ఆవృతా

సర్వార్థాన్-విపరీతాన్-చ-బుద్ధిః-సా-పార్థ-తామసీ

పార్థ= అర్జునా, యా= ఏ, బుద్ధిః= బుద్ధి, తమసా= అజ్ఞానముచేత, ఆవృతా= ఆవరింపబడినదియై, అధర్మం= అధర్మమును, ధర్మం ఇతి= ధర్మమనియు, సర్వార్థాన్= సర్వవిషయములను, విపరీతాన్ చ= విపరీతభావము గలవానినిగను, మన్యతే= తలంచుచున్నదో, సా బుద్ధిః= ఆ బుద్ధి, తామసీ= తామసికమైనది.

ఓ అర్జునా! తమోగుణావృతమైనందున అధర్మమును ధర్మముగను, అట్లే ఇతర విషయములను తద్విపరీతముగను భావించు బుద్ధిని తామస బుద్ధి అంటారు.

33 ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః।

యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥

ధృత్యా-యయా-ధారయతే-మనః-ప్రాణేంద్రియక్రియాః

యోగేన-అవ్యభిచారిణ్యా-ధృతిః-సా-పార్థ-సాత్త్వికీ

పార్థ= అర్జునా, యయా= ఏ, ధృత్యా= ధృతిచేతను, మనః ప్రాణేంద్రియక్రియాః= మనస్సు, ప్రాణము, ఇంద్రియముల చేష్టలు, అవ్యభిచారిణ్యా= చెదరనటువంటి, యోగేన = యోగముచేత, ధారయతే= ధరింపబడుచున్నవో, సా= ఆ, ధృతిః= ధైర్యము, సాత్త్వికీ= సత్త్వగుణ ప్రధానమైనది.

అర్జునా! ఇటునటు చలింపని ధారణాశక్తితో మనుష్యుడు ధ్యానయోగము ద్వారా మనఃప్రాణేంద్రియ క్రియలను ధారణచేయు శక్తిని సాత్త్వికధృతి అంటారు.

34 యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।

ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥

యయా-తు-ధర్మకామార్థాన్-ధృత్యా-ధారయతే-అర్జున

ప్రసంగేన-ఫలాకాంక్షీ-ధృతిః-సా-పార్థ-రాజసీ

పార్థ=అర్జునా, అర్జున= అర్జునా, యయా= ఏ, ధృత్యా తు= ధృతిచేతను, ఫలాకాంక్షీ= ఫలమునాశించువాడు, ప్రసంగేన= కోరికతో, ధర్మకామార్థాన్= ధర్మకామములను, ధారయతే= ధరించు చున్నాడో, సా= ఆ, ధృతిః= ధృతి, రాజసీ= రాజసికమైనది.

కాని, ఓపార్థా! అర్జునా! కర్మఫలేచ్ఛగల మనుజుడు మిక్కిలి ఆసక్తితో ధర్మార్థకామవిషయములను ధారణచేయు శక్తిని రాజసధృతి అంటారు.

35 యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।

న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥

యయా-స్వప్నం-భయం-శోకం-విషాదం-మదం- ఏవ-చ

న-విముంచతి-దుర్మేధాః-ధృతిః-సా-పార్థ-తామసీ

పార్థ=అర్జునా, దుర్మేధాః= దుర్బుద్ధిగలవాడు, యయా= దేనిచే, స్వప్నం= స్వప్నమును, భయం= భయమును, శోకం= శోకమును, విషాదం= విషాదమును, మదం ఏవ చ= మదమును, న విముంచతి = విడువకున్నాడో, సా= ఆ, ధృతిః= ధృతి, తామసీ= తామసికమైనది.

అర్జునా! నిద్ర, భయము, చింతాశోకములు, ఉతన్మత్తతలను విడువక, దుర్మతియైన మనుష్యుడు వాటినే సంతతము ధారణ చేయు చుండును. అటి ధృతిని, తామసధృతి అటారు.

36 సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।

అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥

సుఖం –తు– ఇదానీం–త్రివిధం–శృణు–మే–భరతర్షభ

భ్యాసాత్–రమతే–యత్ర–దుఃఖాంతం–చ–నిగచ్ఛతి

భరతర్షభ=అర్జునా, యత్ర= ఎచ్చట, అభ్యాసాత్=అభ్యాసమువలన, రమతే= రమించు చున్నాడో, దుఃఖాంతం చ = దుఃఖనాశమును కూడ, నిగచ్ఛతి= పొందుచున్నాడో, మే= నాచేత, ఇదానీం= ఇప్పుడు, త్రివిధం= మూడు విధములైన, సుఖం తు= సుఖమును, శృణు= వినుము.

ఓ భరతశ్రేష్ఠా! మూడు విధములగు సుఖములను గూర్చియు నేను చెప్పెదను వినుము. ఏ సుఖమునందు సాధకుడు భజనధ్యానసేవాదుల నొనర్చి ఆనందించునో, దుఃఖములను అతిక్రమించునో. . .

37 యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।

తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమ్ ఆత్మబుద్ధిప్రసాదజమ్ ॥

యత్-తత్-అగ్రే-విషం- ఇవ-పరిణామే-అమృతోపమం

తత్-సుఖం-సాత్త్వికం-ప్రోక్తం- ఆత్మబుద్ధిప్రసాదజం

యత్ తత్ = ఏది, అగ్రే= ప్రారంభమున, విషం ఇవ= విషమువలెను, పరిణామే= అంతమునందు, అమృతోపమం= అమృతమును బోలినదియునై, ఆత్మబుద్ధిప్రసాదజం= తనయొక్క బుద్ధిప్రసన్నత కల్పించుచున్నదో, తత్= ఆ, సుఖం= సుఖము, సాత్త్వికం= సాత్త్వికమని, ప్రోక్తం= చెప్పబడినది.

ఓ భరతశ్రేష్ఠా! మూడు విధములగు సుఖములను గూర్చియు నేను చెప్పెదను వినుము. ఏ సుఖమునందు సాధకుడు భజనధ్యానసేవాదుల నొనర్చి ఆనందించునో, దుఃఖములను అతిక్రమించునో, ప్రారంభమునందు విషతుల్యముగా గోచరించినప్పటికిని పరిణామమున అమృతతుల్యమై పరమాత్మకు సంబంధించిన విషయములలో నిమగ్నమగునో, అట్టి సుఖమును సాత్త్విక సుఖము అంటారు.

38 విషయేంద్రియసంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్ ।

పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

విషయేంద్రియ సంయోగాత్-యత్-తత్-అగ్రే-అమృతోపమం

పరిణామే-విషయం- ఇవ- తత్-సుఖం-రాజసం-స్మృతం

యత్ తత్= ఏది, విషయేంద్రియ సంయోగాత్= విషయేంద్రియసంయోగము వలన, అగ్రే = ఆరంభమున, అమృతోపమం= అమృత తుల్యముగను, పరిణామే= అనంతరము, విషం ఇవ= విషము వలెను, తత్ = ఆ, సుఖం= సుఖము, రాజసం= రాజసికమైనదిగ, స్మృతం= చెప్పబడినది.

విషయేంద్రియసంయోగమువలన కలుగు సుఖము మొదట భోగానుభవ సమయమునందు అమృతతుల్యముగ అనిపించినను పరిణామమున అది విషతుల్యమగును. అట్టి సుఖమును రాజససుఖము అంటారు.

39 యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।

నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥

యత్-అగ్రే-చ-అనుబంధే-చ-సుఖం-మోహనం- ఆత్మనః

నిద్రాలస్య ప్రమాదోత్థం-తత్-తామసం- ఉదాహృతం

యత్ = ఏది, అగ్రే చ = ఆరంభమునందు, అనుబంధే చ= అంతమునందును, ఆత్మనః= తనకు, మోహనం= మోహమును, గలుగజేయునదియు, నిద్రాలస్యప్రమాదోత్థం= నిద్ర, అలసత్వము, ప్రమాదము వీటివలన జనించినదియైన, తత్= ఆ, సుఖం= సుఖము, తామసం= తామసమని, ఉదాహృతం= చెప్పబడినది.

నిద్ర, సోమరితనము, మోహముల వలన ఉత్పన్నమగు సుఖమును తామససుఖము అనబడుచున్నది. ఇట్టి సుఖము భోగసమయము నందును, పరిణామమునందును ఆత్మను మోహింపజేస్తుంది.

40 న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।

సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్ త్రిభిర్గుణైః ।।

న-తత్-అస్తి-పృథివ్యాం-వా-దివి-దేవేషు-వా-పునః

సత్త్వం-ప్రకృతిజైః-ముక్తం-యత్- ఏభిః-స్యాత్-త్రిభిః-గుణైః

ప్రకృతిజైః= ప్రకృతివలన జనించిన, ఏభిః= ఈ, త్రిభిః= మూడైన, గుణైః= గుణముల చేత, ముక్తం=విడువబడిన, సత్త్వం= సత్త్వము, యత్= ఏది, స్యాత్= కలదో, తత్= అది, పృథివ్యాం వా= భూలోకమునందుగాని, దివి= స్వర్గలోకమునందుగాని, పునః= మరల, దేవేషు వా= దేవతలయందుగాని, న అస్తి = లేదు.

పృథివియందు గాని, ఆకాశమునందుగాని, దేవతలయందుగాని, మరేయితర లోకములయందుగాని, ప్రకృతినుండి ఉత్పన్నములైన ఈ మూడు గుణములు లేకుండ ఏ ప్రాణియు కనబడదు.

41 బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప ।

కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥

బ్రాహ్మణ-క్షత్రియవిశాం-శూద్రాణాం-చ-పరంతప

కర్మాణి-ప్రవిభక్తాని-స్వభావ-ప్రభవైః-గుణైః

పరంతప=అర్జునా, బ్రాహ్మణక్షత్రియవిశాం= బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు, శూద్రాణాం చ = శూద్రులకును, స్వభావ ప్రభవైః= స్వభావముచే గలిగిన, గుణైః= గుణముల చేత, కర్మాణి= కర్మములు, ప్రవిభక్తాని= వేర్వేరుగ విభజింపబడినవి.

ఓ పరంతపా ! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కర్మలును, శూద్రుల కర్మలును వారివారి స్వాభావికములైన గుణములనుబట్టి ప్రత్యేకించబడ్డాయి.

42 శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ ।

జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజమ్ ॥

శమః-దమః-తపః-శౌచం-క్షాంతిః- ఆర్జవం- ఏవ-చ

జ్ఞానం-విజ్ఞానం- ఆస్తిక్యం-బ్రహ్మకర్మ- స్వభావజం

శమః= అంతఃకరణ నిగ్రహము, దమః= ఇంద్రియ నిగ్రహము, తపః=తపస్సు, శౌచం= శుచిత్వము, క్షాంతిః= సహనము, ఆర్జవం ఏవ చ = ఋజుత్వము, జ్ఞానం= శాస్త్రవిషయక జ్ఞానము, విజ్ఞానం= అనుభవ జ్ఞానము, ఆస్తిక్యం= ఆస్తిక బుద్ధి, స్వభావజం= స్వభావము వలన కలిగిన, బ్రహ్మకర్మ= బ్రాహ్మణుల కర్మము.

అంతఃకరణనిగ్రహము ఇంద్రియములను వశమునందుంచుకొనుట, ధర్మములను పాటించుటలో ఎదురగు కష్టములను సహించుట, బాహ్యాభ్యంతరముల శుచిత్వము, ఇతరుల అపరాధములను క్షమించుట, మనశ్శరీరేంద్రియముల సరళత్వము వేదశాస్త్రములయందును ఈశ్వరునియం దును పరలోకాదులయందును, విశ్వాసమును కలిగియుండుట, వేదశాస్త్రముల అధ్యయనము, అధ్యాపనము, పరతత్త్వానుభవము - ఇవి యన్నియును బ్రాహ్మణుల నియమిత కర్మమైయున్నది.

43 శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥

శౌర్యం-తేజః-ధృతిః-దాక్ష్యం-యుద్ధే-చ-అపి-అపలాయనం
దానం- ఈశ్వరభావః-చ-క్షాత్రం-కర్మ-స్వభావజం

శౌర్యం=శౌర్యము, తేజః=తేజస్సు, ధృతిః= ధీరత్వము, దాక్ష్యం= దక్షత్వము, యుద్ధే= యుద్ధమునందు, అపలాయనం అపి చ= పారిపోకుండుట, దానం=దానగుణము, ఈశ్వరభావః చ= స్వామి భావము, స్వభావజం= స్వభావ సిద్ధమైన, క్షాత్రం= క్షత్రియ నియమితమైన, కర్మ= కర్మము.

శౌర్యము, తేజస్సు, ధైర్యము, దక్షత, యుద్ధమునందు వెన్నుచూప కుండుట, దానములనిచ్చుట, స్వామిభావముతో ప్రజలను ధర్మపరాయ ణులనుగా చేయుచు పరిపాలించుట మొదలగునవి యన్నియును క్షత్రియులకు నియమితమైన కర్మము.

44 కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యంకర్మస్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

కృషిగౌరక్ష్య వాణిజ్యం-వైశ్యకర్మ-స్వభావజం
పరిచర్యాత్మకం-కర్మ-శూద్రస్య-అపి-స్వభావజం

కృషిగౌరక్ష్య వాణిజ్యం=వ్యవసాయం, పశుపాలనము, వ్యాపారము, స్వభావజం= స్వభావ జనితమైన, వైశ్యకర్మ= వైశ్యోచితమైన కర్మము, శూద్రస్య అపి= శూద్రునకును, పరిచర్యాత్మకం= పరిచర్య రూపమైన, కర్మ= కర్మము, స్వభావజం= స్వభావసిద్ధమైనది.

వ్యవసాయము, గోరక్షణము, క్రయవిక్రయరూప సత్యవ్యవహారము ఇవి యన్నియును వైశ్యులస్వాభావిక కర్మలు, అట్లే అన్ని వర్ణములవారిని సేవించుట శూద్రునకు స్వభావమైన కర్మయై యున్నది.

45 స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।

స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥

స్వే-స్వే-కర్మణి-అభిరతః-సంసిద్ధిం-లభతే-నరః

స్వకర్మనిరతః-సిద్ధిం-యథా-విందతి-తత్-శృణు

నరః=నరుడు, స్వే స్వే = తమతమ, కర్మణి= కర్మమునందు, అభిరతః= శ్రద్ధగలవాడై, సంసిద్ధిం= సిద్ధిని, లభతే= పొందుచున్నాడు, స్వకర్మనిరతః= తన కర్మమందు నిరతుడైనవాడు, సిద్ధిం= సిద్ధిని, యథా= ఎటుల, విందతి= పొందుచున్నాడో, తత్= దానిని, శృణు= వినుము.

మనుజుడు తనదియైన కర్మమునందు పరమసిద్ధిని నిస్సందేహముగా పొందుదురు. స్వకర్మనిరతులైన మానవులు పరమసిద్ధిని పొందుటకు ఆచరింపవలసిన విధులను తెలుపుచున్నాను.

46 యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥

యతః-ప్రవృత్తిః-భూతానాం-యేన-సర్వం- ఇదం-తతం

స్వకర్మణా-తం-అభ్యర్చ్య-సిద్ధిం-విందతి-మానవః

భూతానాం= ప్రాణులయొక్క, ప్రవృత్తిః= ఉత్పత్త్యాదులు, యతః= ఎవనివలన కలిగినవో, యేన= ఎవనిచేత, ఇదం= ఈ, సర్వం= సర్వమును, తతం= వ్యాపింపబడి యున్నదో, తం= వానిని, మానవః= మానవుడు, స్వకర్మణా= తన కర్మచేతను, అభ్యర్చ్య= ఆరాధించి, సిద్ధిం= సిద్ధిని, విందతి= పొందుచున్నాడు.

సమస్త ప్రాణుల పుట్టుక పరమేశ్వరునినుండియే జరిగినది. సమస్త జగత్తునందును అతడు వ్యాపించియున్నాడు. అట్టి పరమేశ్వరుని తన స్వాభావికకర్మలద్వారా పూజించి, మానవుడు సిద్ధిని పొందుచున్నాడు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

47 శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।

స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

శ్రేయాన్-స్వధర్మః-విగుణః-పరధర్మాత్-స్వనుష్ఠితాత్

స్వభావ నియతం-కర్మ-కుర్వన్-న- ఆప్నోతి-కిల్బిషం

స్వధర్మః=స్వధర్మము, విగుణః= గుణ హీనమైనను, స్వనుష్ఠితాత్= చక్కగా ఆచరించబడిన, పరధర్మాత్= పరధర్మము కంటెను, శ్రేయాన్= శ్రేయస్కరము, స్వభావ నియతం= స్వభావసిద్ధమైన, కర్మ= కర్మమును, కుర్వన్= చేయువాడు, కిల్బిషం= పాపమును, న ఆప్నోతి= పొందడు.

బాగుగా ఆచరింపబడిన పరధర్మముకంటెను గుణరహితమైన స్వధర్మాచరణమే శ్రేష్టమైనది. స్వభావమును అనుసరించి కర్మలను ఆచరించు మనుజుడు ఎట్టి పాపము నొందడు.

48 సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్।

సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥

సహజం-కర్మ-కౌంతేయ-సదోషం-అపి-న-త్యజేత్

సర్వారంభాః-హి-దోషేణ-ధూమేన-అగ్నిః- ఇవ- ఆవృతాః

కౌంతేయ= అర్జునా, సహజం=సహజమైన, కర్మ= కర్మము, సదోషం అపి= దోషయుతమైనను, న త్యజేత్= విడువరాదు, అగ్నిః= అగ్ని, ధూమేన ఇవ= పొగచేతను వలె, సర్వారంభాః= సకలకర్మలును, దోషేణ= దోషముచేతను, ఆవృతాః హి= ఆవరింపబడియున్నవి గదా !

అర్జునా ! దోషయుక్తమైనను సహజమైన కర్మను వీడరాదు. అగ్ని పొగచే కప్పబడినట్లు కర్మలన్నియును ఏదేని ఒక దోషముతో కూడియే యుండును.

49 అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః।

నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥

అసక్తబుద్ధిః-సర్వత్ర-జితాత్మా-విగతస్పృహః

నైష్కర్మ్యసిద్ధిం-పరమాం-సంన్యాసేన-అధిగచ్ఛతి

సర్వత్ర= సర్వవిషయములందును, అసక్తబుద్ధిః= ఆసక్తిలేనివాడై, జితాత్మా= మనస్సును జయించినవాడై, విగతస్పృహః= కోరికలు లేనివాడై, సంన్యాసేన= సన్యాసముచేత, పరమాం= ఉత్తమమైన, నైష్కర్మ్యసిద్ధిం= నిష్కామకర్మ సిద్ధిని, అధిగచ్ఛతి= పొందుచున్నాడు.

ఓ అర్జునా! ప్రాపంచిక పదార్థములందు ఆసక్తి లేనివాడును, స్పృహారహితుడును, అంతఃకరణమును జయించినవాడునులగు పురుషుడు సాంఖ్యయోగముద్వారా పరమశ్రేష్ఠమైన నైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాడు.

50 సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే।

సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా।

సిద్ధిం-ప్రాప్తః-యథా-బ్రహ్మ-తథా- ఆప్నోతి-నిబోధ-మే

సమాసేన- ఏవ-కౌంతేయ-నిష్ఠా-జ్ఞానస్య-యా-పరా

కౌంతేయ= అర్జునా, సిద్ధిం= సిద్ధిని, ప్రాప్తః= పొందినవాడు, యథా= ఎటుల, బ్రహ్మ= బ్రహ్మమును, ఆప్నోతి= పొందుచున్నాడో, తథా=అటులనే, జ్ఞానస్య= జ్ఞానముయొక్క, పరా= ఉత్తమమైన, నిష్ఠా = నిష్ఠ, యా = ఏదియో, సమాసేన ఏవ = సంక్షిప్తముగా, మే=నా వలన, నిబోధ= తెలిసికొనుము.

అర్జునా! జ్ఞానయోగము యొక్క పరానిష్ఠయైన నైష్కర్మ్య సిద్ధిని పొందు విధమును, తద్ద్వారా మనుష్యుడు బ్రహ్మప్రాప్తి నందు రీతిని సంగ్రహముగా వినుము.

51 బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ।

శబ్దాదీన్ విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥

బుద్ధ్యా-విశుద్ధయా-యుక్తః-ధృత్యా- ఆత్మానం-నియమ్య-చ

శబ్దాదీన్-విషయాన్-త్యక్త్వా-రాగద్వేషౌ-వ్యుదస్య-చ

విశుద్ధయా= విశుద్ధమైన, బుద్ధ్యా= బుద్ధితో, యుక్తః= కూడినవాడును, ధృత్యా= ధైర్యముతో, ఆత్మానం= తనను, నియమ్య చ = నియమించియును, శబ్దాదీన్= శబ్దాదులైన, విషయాన్= విషయములను, త్యక్త్వా= విడచి, రాగద్వేషౌ= రాగద్వేషములను, వ్యుదస్య చ= విడచి.

విశుద్ధమైన బుద్ధితో, ధైర్యముతో ఆత్మనిగ్రహముతో శబ్దాది విషయములను విడచి, రాగద్వేషాదులకు అతీతంగా...........

52 వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।

ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

వివిక్తసేవీ-లఘ్వాశీ-యతవాక్కాయమానసః

ధ్యానయోగపరః-నిత్యం-వైరాగ్యం-సముపాశ్రితః

వివిక్తసేవీ= ఏకాంతవాసియు, లఘ్వాశీ= మితాహారియు, యతవాక్కాయ మానసః= స్వాధీనమైన మనోవాక్కాయములు కలవాడు, నిత్యం= ఎల్లప్పుడు, ధ్యానయోగపరః= ధ్యానయోగ పరాయణుడై యుండువాడు, వైరాగ్యం= వైరాగ్యమును, సముపాశ్రితః= చక్కగా ఆశ్రయించినవాడు.

పరిశుభ్రమైన ప్రదేశమున ఏకాంతముగా నివసించువాడు, సాత్త్వికధారణా శక్తిద్వారా అంతఃకరణేంద్రియముల సంయమము కలిగి, మనోవాక్కాయ ములను అదుపులో ఉంచుకొనినవాడు, రాగద్వేషములను అన్ని వేళలా త్యజించి, దృఢమైన వైరాగ్యమును సంపూర్ణముగా ఆశ్రయించినవాడు.

53 అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।

విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥

అహంకారం-బలం-దర్పం-కామం-క్రోధం-పరిగ్రహం

విముచ్య-నిర్మమః-శాంతః-బ్రహ్మభూయాయ-కల్పతే

అహంకారం= అహంకారమును, బలం= బలమును, దర్పం= దర్పమును, కామం=కామమును, క్రోధం=క్రోధమును, పరిగ్రహం= సంగ్రహమును, విముచ్య= విడచి, నిర్మమః= మమకార రహితుడు, శాంతః= శాంతుడు, బ్రహ్మభూయాయ= బ్రహ్మత్వమును పొందుటకు, కల్పతే= కల్పింపబడు చున్నాడు.

అహంకారమును, బలమును దర్పమును, కామక్రోధములను, పరిగ్రహమును వదలి, ఎల్లప్పుడు ధ్యానయోగ పరాయణుడై యుండువాడు, మమతా రహితుడు, శాంతియుతుడు ఐన పురుషుడు పరబ్రహ్మమునందు అభిన్నభావముతో స్థితుడగుటకు సమర్థుడగుచున్నాడు.

54 బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।

సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥

బ్రహ్మభూతః-ప్రసన్నాత్మా-న-శోచతి-న-కాంక్షతి

సమః-సర్వేషు-భూతేషు-మద్భక్తిం-లభతే-పరాం

బ్రహ్మభూతః=బ్రహ్మభావమును పొందినవాడు, ప్రసన్నాత్మా=ప్రసన్నచిత్తుడైనవాడు, న శోచతి= దుఃఖించడు, న కాంక్షతి= ఆశించడు, సర్వేషు= సమస్త , భూతేషు= ప్రాణుల యందును, సమః= సమబుద్ధికలిగి, పరాం= ఉత్తమమైన, మద్భక్తిం= నా భక్తిని, లభతే= పొందుచున్నాడు.

పరబ్రహ్మయందు ఏకీభావస్థితుడై ప్రసన్నమనస్కుడైన యోగి దేనికిని శోకింపడు, దేనినీ కాంక్షింపడు. సమస్తప్రాణులయందును సమభావము గల అట్టి యోగి నా పరాభక్తిని పొందుచున్నాడు.

55 భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥

భక్త్యా-మాం-అభిజానాతి-యావాన్-యః-చ-అస్మి-తత్త్వతః
తతః-మాం-తత్త్వతః-జ్ఞాత్వా-విశతే-తదనంతరం

భక్త్యా= భక్తిచేతను, మాం=నన్ను, తత్త్వతః= యథార్థముగ, యావాన్= ఎంతటి ప్రభావము గలవాడనో, యః చ అస్మి= ఎట్టివాడనయితినో, అభిజానాతి= గ్రహించు చున్నాడు, తతః= ఆ తరువాత, మాం=నన్ను, తత్త్వతః= యథార్థముగ, జ్ఞాత్వా= తెలిసికొని, తదనంతరం= అటుపిమ్మట, విశతే=ప్రశ్నించుచున్నాడు.

బ్రహ్మభూతుడైనయోగి ఈ పరాభక్తిద్వారా నేనెవరినో ? ఎంతటి వాడనో? యథాతథముగ నా తత్త్వమును తెలిసికొనును. అట్లు భక్తితో నా తత్త్వమును గ్రహించిన వెంటనే అతడు నా యందే లీనమగుచు న్నాడు.

56 సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ ॥

సర్వకర్మాణి-అపి-సదా-కుర్వాణః-మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాత్-అవాప్నోతి-శాశ్వతం-పదం-అవ్యయం

సర్వకర్మాణి= సర్వకర్మలను, సదా= ఎల్లప్పుడును, కుర్వాణః అపి= చేయుచున్న వాడైనను, మద్వ్యపాశ్రయః= నన్నే శరణు పొందినవాడు, మత్ప్రసాదాత్= నా అనుగ్రహము వలన, అవ్యయం= నాశరహితమైన, శాశ్వతం= శాశ్వతమైన, పదం= పదమును, అవాప్నోతి= పొందుచున్నాడు.

సమస్తకర్మలయందును కర్తృత్వభావమును వదలి, ఆయాకర్మల ఫలరూపమైన సమస్తభోగములను త్యజించి, నన్నే ఆశ్రయించిన కర్మయోగి కర్మలను అన్నింటిని సర్వదాచేయుచును నాకృప సనాతనమైన శాశ్వతమైన మోక్షమును పొందుచున్నాడు.

57 చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।

బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥

చేతసా-సర్వకర్మాణి-మయి-సంన్యస్య-మత్పరః

బుద్ధియోగం- ఉపాశ్రిత్య-మచ్చిత్తః-సతతం-భవ

చేతసా=మనస్సుచేత, సర్వకర్మాణి= సర్వకర్మలను, మయి= నాయందు, సంన్యస్య= ఉంచి, మత్పరః= మత్పరాయణుడై, బుద్ధియోగం= బుద్ధియోగమును, ఉపాశ్రిత్య= అవలంబించి, సతతం= ఎల్లప్పుడును, మచ్చిత్తః= నాయందు చిత్తము గలవాడవు, భవ= కమ్ము.

సర్వకర్మలను మనసా, వాచా, కర్మణా నాకే అర్పించి, సమబుద్ధి రూపయోగమును అవలంబించి, మత్పరాయణుడవై సంతతము చిత్తమును నాయందే గలవాడవు కమ్ము.

58 మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి ।

అథ చేత్ త్వమహంకారాత్ న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥

మచ్చిత్తః-సర్వదుర్గాణి-మత్ప్రసాదాత్-తరిష్యసి

అథ-చేత్-త్వం-అహంకారాత్-న-శ్రోష్యసి-వినఙ్క్ష్యసి

మచ్చిత్తః=నాయందు చిత్తముగలవాడవై, మత్ప్రసాదాత్= నా అనుగ్రహమువలన, సర్వదుర్గాణి= సర్వసంకటములను, తరిష్యసి= దాటగలవు, అథ= ఒకవేళ, త్వం= నీవు, అహంకారాత్= అహంకారమువలన, న శ్రోష్యసి చేత్= వినజాలనిచో, వినఙ్క్ష్యసి= నశించిపోయెదవు.

పైన తెలుపబడిన విధముగా నాయందు చిత్తమును నిల్పినచో, నా కృపవలన సమస్త కష్టముల నుండియు సునాయాసముగా బయట పడగలవు. ఒకవేళ అహంకార కారణమున నా వచనములను పెడచెవిన బెట్టినచో చెడిపోవుదువు.

59 యదహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।

మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి ॥

యత్-అహంకారం- ఆశ్రిత్య-న-యోత్స్యే- ఇతి-మన్యసే

మిథ్యా- ఏషః-వ్యవసాయః-తే-ప్రకృతిః-త్వాం- నియోక్ష్యతి

యత్ అహంకారం= ఏ అహంకారమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, న యోత్స్యే ఇతి = యుద్ధము చేయనని, మన్యసే= తలచుచున్నావో, తే= నీయొక్క, ఏషః= ఈ, వ్యవసాయః= ప్రయత్నము, మిథ్యా= వ్యర్థము, త్వాం= నిన్ను, ప్రకృతిః= స్వభావము, నియోక్ష్యతి = నియోగింపగలదు.

అహంకారంతో నేను ఈ యుద్ధమును చేయను అని నీవు నిశ్చయించు కొనుట వృథా, నీ స్వభావమే

60 స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా ।

కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యస్యవశోఽపి తత్ ॥

స్వభావజేన-కౌంతేయ-నిబద్ధః-స్వేన-కర్మణా

కర్తుం-న- ఇచ్ఛసి-యత్-మోహాత్-కరిష్యసి-అవశః-అపి-తత్

కౌంతేయ= అర్జునా, యత్=దేనిని, కర్తుం= చేయుటకు, మోహాత్= మోహము వలన, న ఇచ్ఛసి= ఇచ్ఛగింపవో, తత్= దానిని, స్వభావజేన= స్వభావసిద్ధమైన, స్వేన=నీదైన, కర్మణా= కర్మచేత, నిబద్ధః= బంధింపబడినవాడవై, అవశః అపి= పరవశుడవై కూడా, కరిష్యసి= చేయుదువు.

ఓ కౌంతేయా! మోహము వలన నీవు చేయుటకు ఇష్టపడని కర్మను గూడ నీ పురాకృత స్వాభావిక కర్మలచే బంధింపబడి, తత్స్వభావమున నీవు పరవశుడవై చేస్తావు.

61 ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

ఈశ్వరః-సర్వభూతానాం-హృద్దేశే-అర్జున-తిష్ఠతి

భ్రామయన్-సర్వభూతాని-యంత్రారూఢాని-మాయయా

అర్జున=అర్జునా, ఈశ్వరః= ఈశ్వరుడు, యంత్రారూఢాని= యంత్రము నధిష్ఠించిన వారివలె, సర్వభూతాని= సమస్త ప్రాణులను, మాయయా= మాయాశక్తిచేత, భ్రామయన్= త్రిప్పుచు, సర్వభూతానాం= సమస్తప్రాణుల యొక్క, హృద్దేశే=హృదయ ప్రదేశమునందు, తిష్ఠతి= ఉన్నాడు.

అర్జునా! శరీరరూపయంత్రములను అధిరోహించిన సర్వప్రాణుల హృదయములయందు అంతర్యామిగానున్న పరమేశ్వరుడు తన మాయచేత వారి వారి కర్మలను అనుసరించి, వారి హృదయములలో వెలుగుచున్నాడు.

62 తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।

తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

తం- ఏవ- శరణం-గచ్ఛ-సర్వభావేన- భారత

తత్ప్రసాదాత్-పరాం-శాంతిం-స్థానం-ప్రాప్స్యసి-శాశ్వతం

భారత= అర్జునా, సర్వభావేన= సర్వభావములచేత, తం ఏవ = అట్టి పరమేశ్వరునే, శరణం= శరణు, గచ్ఛ= పొందుము, తత్ప్రసాదాత్= అతని అనుగ్రహము వలన, పరాం= ఉత్తమమైన, శాంతిః= శాంతిని, శాశ్వతం= శాశ్వతమైన, స్థానం= మోక్షమును, ప్రాప్స్యసి= పొందగలవు.

అర్జునా ! అన్ని విధములుగా ఆ పరమేశ్వరునే శరణుకోరుము. అతని కృపచేతనే పరమశాంతిని, శాశ్వతమైన మోక్షమును పొందగలవు.

63 ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।

విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥

ఇతి-తే-జ్ఞానం- ఆఖ్యాతం-గుహ్యాత్- గుహ్యతరం-మయా

విమృశ్య- ఏతత్-అశేషేణ-యథా- ఇచ్ఛసి-తథా-కురు

ఇతి= ఇట్లు, గుహ్యాత్ = గుహ్యమైన దానికంటెను, గుహ్యతరం= రహస్యమైన, జ్ఞానం= జ్ఞానము, మయా= నా చేత, తే= నీ కొరకు, ఆఖ్యాతం= చెప్పబడినది, ఏతత్= దీనిని, అశేషేణ = పూర్తిగ, విమృశ్య= విచారణచేసి, యథా= ఏ విధముగ, ఇచ్ఛసి= అభిలషింతువో, తథా= అలాగున, కురు= చేయుము.

ఈ మాదిరిగా అతి రహస్యమైన జ్ఞానమును నేను నీకు తెలియజేసితిని. ఇప్పుడు నీవు ఈ పరమ గోప్యమైన జ్ఞానమును పూర్తిగా గ్రహించి, నీకు తోచినటుల చేయుము.

64 సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।

ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥

సర్వగుహ్యతమం-భూయః-శృణు-మే-పరమం-వచః

ఇష్టః-అసి-మే-దృఢం- ఇతి-తతః-వక్ష్యామి-తే-హితం

భూయః= మరల, సర్వగుహ్యతమం= పరమ రహస్యమైనదియు, పరమం= ఉత్తమమైనదియు నగు, మే= నాయొక్క, వచః= వాక్కును, శృణు= వినుము, మే=నాకు, దృఢం= నిశ్చయముగ, ఇష్టః= ఇష్టుడవు, అసి ఇతి = అయి యున్నావని, తతః= అందువలన, తే= నీ కొరకు, హితం= హితమును, వక్ష్యామి= చెప్పుచున్నాను.

సమస్త గోప్య విషయములయందును పరమరహస్యమైన నావచనములను మఱొక్కసారి వినుము. నీవు నాకు అత్యంతప్రీతిపాత్రుడవు అగుటవలన నీ మేలు కోరి చెప్పుచున్నాను.

65 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।

మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ।।

మన్మనాః-భవ-మద్భక్తః-మద్యాజీ-మాం-నమస్కురు

మాం-ఏవ- ఏష్యసి-సత్యం-తే-ప్రతిజానే-ప్రియః-అసి-మే

మన్మనాః=నాయందుమనస్సు కలవాడవు, మద్భక్తః= నాయందు భక్తి కలవాడవు, మద్యాజీ = నన్ను అర్చించువాడవు, భవ= కమ్ము, మాం=నన్ను, నమస్కురు = నమస్కరింపుము, మాం ఏవ = నన్నే, ఏష్యసి= పొందగలవు, మే= నాకు, ప్రియః= ఇష్టుడవు, అసి= అయియున్నావు, తే=నీకు, సత్యం= సత్యమును, ప్రతిజానే= ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను.

ఓ అర్జునా ! నీవు నాయందే మనస్సునుంచుము. నా భక్తుడవు కమ్ము. నన్నే సేవింపుము. నాకు ప్రణమిల్లుము. ఇట్లు చేయుటవలన నన్నే పొందగలవు. అది ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

66 సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

సర్వధర్మాణ పరిత్యజ్య-మాం- ఏకం- శరణం-వ్రజ

అహం-త్వా-సర్వపాపేభ్యః-మోక్షయిష్యామి-మా-శుచః

సర్వధర్మాన్=సమస్తధర్మములను, పరిత్యజ్య= విడిచిపెట్టి, మాం= నన్ను, ఏకం= ఒక్కనినే, శరణం= శరణమును, వ్రజ= పొందుము, అహం=నేను, త్వా=నిన్ను, సర్వపాపేభ్యః= సకలపాపములనుండి, మోక్షయిష్యామి= విడిపించెదను, మా శుచః= శోకింపకుము.

సర్వధర్మములను అనగా సమస్తకర్తవ్యకర్మలను నాకు సమర్పింపుము. సర్వశక్తిమంతుడను, సర్వాధారుడను పరమేశ్వరుడను ఐన నన్నే శరణుజొచ్చుము. అన్ని పాపములనుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపవలదు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

67 ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।

న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

ఇదం-తే-న-అతపస్కాయ-న-అభక్తాయ-కదాచన

న-చ-అశుశ్రూషవే-వాచ్యం-న-చ-మాం-యః-అభ్యసూయతి

తే=నీకొరకు, ఇదం= ఈ బోధ, కదాచన= ఒకప్పుడును, అతపస్కాయ= తపస్విగానివానికి, న వాచ్యం= ఉపదేశింపదగదు, అభక్తాయ= భక్తుడుగాని వానికి, అశుశ్రూషవే చ= శుశ్రూషచేయనివానికి, న వాచ్యం= చెప్పదగదు, యః= ఎవడు, మాం=నన్ను, అభ్యసూయతి చ=ద్వేషించుచున్నాడో, న వాచ్యం= చెప్పగూడదు.

తపస్సంపన్నుడు కానివానికిని, భక్తిరహితునకును, నన్ను ద్వేషించువానికి నీవు ఈ గీతారూప రహస్యోపదేశమును ఎన్నడునూ చెప్పరాదు.

68 య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।

భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

యః- ఇమం-పరమం-గుహ్యం-మద్భక్తేషు-అభిధాస్యతి

భక్తిం-మయి-పరాం-కృత్వా-మాం- ఏవ- ఏష్యతి-అసంశయః

యః= ఎవడు, పరమం= పరమమైన, గుహ్యం= గుహ్యమైనటువంటి, ఇమం= దీనిని, మద్భక్తేషు= నా భక్తులయందు, అభిధాస్యతి= చెప్పునో, సః=వాడు, మయి= నాయందు, పరాం= ఉత్తమమైన, భక్తిం= భక్తిని, కృత్వా= చేసి, అసంశయః= సంశయరహితుడై, మాం ఏవ= నన్నే, ఏష్యతి= పొందగలడు.

నా యందు పరమభక్తి గలిగి, ఈ పరమగోప్యమైన గీతోపదేశమును అనగా గీతాశాస్త్రమును నా భక్తుల మదిలో పదిలపఱచువాడు నన్నే పొందగలడు. ఇందేమాత్రమూ సందేహము లేదు.

69 న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।

భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి ॥

న-చ-తస్మాత్-మనుష్యేషు-కశ్చిత్-మే-ప్రియకృత్తమః

భవితా-న-చ-మే-తస్మాత్-అన్యః-ప్రియతరః-భువి

మనుష్యేషు= మనుష్యులయందు, తస్మాత్ = వానికంటెను,మే = నాకు, ప్రియకృత్తమః= మిక్కిలి ఇష్టమొనర్చువాడు, కశ్చిత్= ఒకడును, న చ=లేడు, మే=నాకు, తస్మాత్= వానికంటె, అన్యః= ఇతరుడు, ప్రియతరః= మిగుల ప్రియమైనవాడు, భువి= భూమి యందు, న చ భవితాః= ఉండబోడు.

మనుష్యులలో అతనిని మించిన భక్తుడెవ్వడును లేడు. అంతేగాక అతనివలె గాని, అతనిని మించిగాని నాకు ప్రియమైనవాడు భూమండలమున మరియొకడు భవిష్యత్తులోను ఉండబోడు.

70 అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః ।

జ్ఞానయజ్ఞేన తేనాహమ్ ఇష్టః స్యామితి మే మతిః ॥

అధ్యేష్యతే-చ-యః- ఇమం-ధర్మ్యం-సంవాదం- ఆవయోః

జ్ఞానయజ్ఞేన-తేన-అహం- ఇష్టః-స్యాం- ఇతి-మే-మతిః

ఆవయోః=మనయొక్క, ధర్మ్యం= ధర్మప్రయోజనమైన, ఇమం= ఈ, సంవాదం= సంవాదమును, యః= ఎవడు, అధ్యేష్యతే చ = చదువ బోవుచున్నాడో, తేన= వానిచేత, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞము చేతను, అహం=నేను, ఇష్టః= పూజితుడను, స్యాం= అగుదును, ఇతి=అని, మే=నాయొక్క, మతిః= నిశ్చయము.

ధర్మయుక్తమైన మనసంవాదరూపమైన ఈ గీతాశాస్త్రమును పఠించువాడు జ్ఞానయజ్ఞముద్వారా నన్ను పూజించువాడని నా ఉద్దేశ్యము.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

71 శ్రద్ధా వాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।

సోऽపి ముక్తః శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్॥

శ్రద్ధావాన్-అనసూయః-చ-శృణుయాత్-అపి-యః-నరః

సః-అపి-ముక్తః-శుభాన్-లోకాన్-ప్రాప్నుయాత్-పుణ్యకర్మణాం

యః= ఏ, నరః=నరుడు, శ్రద్ధావాన్=శ్రద్ధావంతుడును, అనసూయః చ= అసూయ లేనివాడునునై, శృణుయాత్ అపి= ఆలకించునో, సః అపి= వాడును, ముక్తః= ముక్తుడై, పుణ్యకర్మణాం= పుణ్యకర్మల యొక్క, శుభాన్= శుభకరమైన, లోకాన్= లోకములను, ప్రాప్నుయాత్= పొందును.

శ్రద్ధాదరములుగలవాడును, దోషదృష్టి లేనివాడును ఐన మనుష్యుడు గీతాజ్ఞానమును వినుటవలన గూడ పాపవిముక్తుడై, పుణ్యకర్మలను ఆచరించువారుపొందు ఉత్తమలోకములనుపొందుచున్నాడు.

72 కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।

కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ ॥

కచ్చిత్- ఏతత్-శ్రుతం-పార్థ-త్వయా- ఏకాగ్రేణ-చేతసా

కచ్చిత్-అజ్ఞానసమ్మోహః-ప్రనష్టః-తే-ధనంజయ

పార్థ =అర్జునా, ఏతత్ = ఇది, త్వయా= నీచేత, ఏకాగ్రేణ = నిశ్చలమైన, చేతసా= మనస్సుతో, శ్రుతం కచ్చిత్= శ్రవణము చేయబడినది గదా, ధనంజయ= అర్జునా, తే=నీయొక్క, అజ్ఞానసమ్మోహః= అజ్ఞానమువలన కలిగిన మోహము, ప్రనష్టః కచ్చిత్= పోయినదిగదా.

అర్జునా ! ఈ గీతాశాస్త్రమును నీవు ఏకాగ్రచిత్తముతోవింటివా ? ఓ ధనంజయా ! అజ్ఞానజనితమైన నీ మోహము నశించినదా ?

అర్జున ఉవాచ

73 నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత ।

స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥

నష్టః-మోహః-స్మృతిః-లబ్ధాః-త్వత్ప్రసాదాత్-మయా-అచ్యుత

స్థితః-అస్మి-గతసందేహః-కరిష్యే-వచనం-తవ

అచ్యుత=కృష్ణా, త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, మోహః= మోహము, నష్టః= నశించినది, మయా=నా చేత, స్మృతిః= స్మృతి, లబ్ధా= పొందబడినది, గతసందేహః= సందేహములు తొలగి, స్థితః= ఉన్నవాడను, అస్మి= అగుచున్నాను, తవ= నీయొక్క, వచనం= ఆజ్ఞను, కరిష్యే= ఆచరింతును.

అర్జునుడు పలికెను - ఓ అచ్యుతా ! నీ కృపచే నా మోహము పూర్తిగా తొలగినది. జ్ఞానము పొందితిని. ఇప్పుడు సంశయ రహితుడనైతిని. కనుక నీ ఆజ్ఞను ఆచరించెదను.

సంజయ ఉవాచ

74 ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।

సంవాదమిమమశ్రౌషమ్ అద్భుతం రోమహర్షణమ్ ॥

ఇతి-అహం-వాసుదేవస్య-పార్థస్య-చ-మహాత్మనః

సంవాదం- ఇమం-అశ్రౌషం-అద్భుతం-రోమహర్షణం

అహం=నేను, ఇతి= ఇట్లు, వాసుదేవస్య= శ్రీకృష్ణుని యొక్కయు, మహాత్మనః= మహాత్ముడగు, పార్థస్య చ= పార్థునియొక్కయు, అద్భుతం= అద్భుతమైనదియు, రోమహర్షణం= గగుర్పాటును కలిగించునదియు నగు, ఇమం= ఈ, సంవాదం= సంవాదమును , అశ్రౌషం= వింటిని.

సంజయుడు పలికెను - ఈ విధముగా శ్రీ వాసుదేవునకును మహాత్ముడైన అర్జునకును మధ్య జరిగిన సంవాదమును వింటిని. అది ఆశ్చర్యకరమైనది. తనువు జలదరిస్తోంది.

75 వ్యాసప్రసాదాచ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్ కథయతః స్వయమ్ ॥

వ్యాసప్రసాదాత్-శ్రుతవాన్- ఏతత్-గుహ్యం-అహం-పరం
యోగం-యోగేశ్వరాత్-కృష్ణాత్-సాక్షాత్-కథయతః-స్వయం

వ్యాసప్రసాదాత్= వ్యాసభగవానుని అనుగ్రహమువలన, గుహ్యం= గుహ్యమైనదియు, పరం= ఉత్తమమైనదియునగు, ఏతత్= ఈ, యోగం= యోగమును, స్వయం= స్వయముగ, కథయతః= చెప్పునటువంటి, యోగేశ్వరాత్= యోగేశ్వరుడైనట్టి, కృష్ణాత్= శ్రీకృష్ణునివలన, అహం= నేను, సాక్షాత్= ప్రత్యక్షముగ, శ్రుతవాన్= వినినాడనైతిని.

వేదవ్యాసునికృపవలన దివ్యదృష్టిని పొందినవాడనై, పరమరహస్యమైన ఈ యోగమును యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు చెప్పుచుండగా నేను ప్రత్యక్షముగా వినగలిగాను.

76 రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమ్ ఇమమద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥

రాజన్-సంస్మృత్య-సంస్మృత్య-సంవాదం- ఇమం-అద్భుతం
కేశవార్జునయోః-పుణ్యం-హృష్యామి-చ-ముహుర్ముహుః

రాజన్=రాజా, పుణ్యం= పుణ్యకరమైన, ఇమం= ఈ, అద్భుతం= ఆశ్చర్యకరమైన, కేశవార్జునయోః= కృష్ణార్జునులయొక్క, సంవాదం= సంవాదమును, సంస్మృత్య సంస్మృత్య= తలచితలచి, ముహుర్ముహుః= మాటిమాటికిని, హృష్యామి చ= సంతసించుచున్నాము.

ఓ రాజా ! శ్రీ కృష్ణభగవానునకును అర్జునునకును మధ్య జరిగిన రహస్యమైన ఈ సంవాదము అతి పుణ్యప్రదమైనది. అత్యద్భుతమైన ఈ సంవాదమును అనుక్షణము పదేపదే స్మరించుచు నేను పరవశించిపోతు న్నాను.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770

77 తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః ।

విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ॥

తత్-చ-సంస్మృత్య-సంస్మృత్య-రూపం-అతి-అద్భుతం-హరేః

విస్మయః-మే-మహాన్-రాజన్-హృష్యామి-చ-పునః-పునః

రాజన్=రాజా, హరేః= శ్రీకృష్ణునియొక్క, అత్యద్భుతం= మిక్కిలి అద్భుతమైన, తత్= ఆ, రూపం చ = రూపమును, సంస్మృత్య= తలచి తలచి, మే=నాకు, మహాన్= గొప్ప, విస్మయః= ఆశ్చర్యము కలుగుచున్నది, పునః పునః చ= మరల మరల, హృష్యామి చ= సంతసించుచున్నాను.

ఓ రాజా !అత్యంత విలక్షణము, పరమాద్భుతము, అపూర్వము ఐన ఆ శ్రీహరిరూపమును పదేపదే స్మరించుచు, నేను పొందుచున్న సంభ్రమాశ్చర్య ములకు హద్దు లేదు. తత్ప్రభావమున మఱలమఱల సంతోషము కలుగుతోంది.

78 యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।

తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ ॥

యత్ర-యోగేశ్వరః-కృష్ణ-యత్ర-పార్థః-ధనుర్ధరః

తత్ర-శ్రీః-విజయః-భూతిః-ధ్రువా-నీతిః-మతిః-మమ

యత్ర= ఎచ్చట, యోగేశ్వరః= యోగేశ్వరుడగు, కృష్ణః= శ్రీకృష్ణుడు, యత్ర= ఎచ్చట, ధనుర్ధరః= ధనుస్సును ధరించిన, పార్థః= అర్జునుడు, తత్ర= అచ్చట, శ్రీః= లక్ష్మియు, విజయః= విజయము, భూతిః= ఐశ్వర్యము, ధ్రువా= స్థిరమగు, నీతిః= నీతియు, ఇతి=అని, మమ=నాయొక్క, మతిః= అభిప్రాయము.

ఎక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడును, గాండీవధనుర్ధారియైన అర్జునుడును ఉండునో అక్కడ సంపదలును, సర్వవిజయములును, సకలైశ్వర్యములును, సుస్థిరమైన నీతియు ఉండును.

ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు

బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే

మోక్షసన్న్యాసయోగోనామ అష్టాదశోఽధ్యాయః ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



Email : care@srichalapathirao.com Ph : +91 9886265225 / +91 8008539770